మీరు ఏం చదివినా
మీకు ఎంత తెలిసినా
మీలో ఎంతటి నైపుణ్యం ఉన్నా
మీ స్థాయి ఏదైనా
మీ ప్రతిభను ఎవరు గుర్తించాలన్నా
మీ వ్యక్తిగత వివరాలైనా
మరే విషయ విశ్లేషణ అయినా...
మీకు మీరుగా చెప్పుకోవాలి!
ఇంప్రెసివ్‌గా ఉండాలి!
ఇంట్రెస్టింగా చెప్పాలి!
ఇక్కడే ఆంగ్లపరిజ్ఞానం అవసరం!
అందుకు స్పోకెన్ ఇంగ్లిష్
సరైన ఆయుధం!

మీ లక్ష్యసాధనలో మీకు తోడ్పడేందుకే 'ఈనాడు-ప్రతిభ' రోజు విడిచి రోజు సులభశైలిలో స్పోకెన్ ఇంగ్లిష్ వ్యాసాలను అందిస్తోంది.







# చిన్న చిన్నవి తెలియకే చిక్కులు!

**Spoken Englishనే Conversational English అని కూడా అంటారు. మంచి Career కోరుకునే విద్యార్థులందరికీ అవసరమైన Communications Skillsలో ముఖ్యమైన భాగం Spoken English. మంచి ఉద్యోగాల్లో, కోర్సుల్లో ప్రవేశానికి నిర్వహించే Interviews, group discussions, presentations, self sketches లో విజయం సాధించాలంటే Spoken English మీద పట్టు అవసరం.**

### I

**Kavita :** How did you do in yesterday's exam?
(నిన్న పరీక్షలు ఎలా రాశావ్?)

**Suji :** Well, I think. How did you do ?
(బాగానే రాశాననుకుంటున్నాను. నువ్వెలా రాశావ్?)

**Kavita:** Not bad. I could have done better.
(పర్వాలేదు. ఇంకాస్త బాగా రాసి ఉండవచ్చు)

**Suji:** What group are going to study in Inter?
(ఇంటర్‌లో ఏ గ్రూప్ తీసుకుంటున్నావ్?)

**Kavita :** MPC. What about you ?
(ఎంపీసీ. నువ్వు...!)

**Suji :** Not sure yet, though dad wants me to do MPC.
(ఇంకా ఏమీ అనుకోలేదు. మా నాన్న ఎంపీసీ అనే అంటున్నారు)

**Kavita :** Which college? (ఏ కాలేజీ?)

**Suji :** No idea as yet. What's going to be your college?
(ఏమీ అనుకోలేదు... నువ్వు!)

**Kavita :** Same here. Not decided yet.
(నేను అంతే. ఇంకా ఏం అనుకోలేదు.)

### II

**Supriya :** Hi, Suneetha, What a relief! The final degree exams are over. But What next for you?
(అమ్మయ్య! పరీక్షలైపోయాయ్ సునీతా. తర్వాత ఏం చేస్తావ్)

**Suneetha :** Not yet decided. What are your plans?
(ఇంకా ఏం అనుకోలేదు. నీ సంగతేంటి?)

**Supriya :** Well, You know I've taken the CAT for joining in IIM. Waiting for the results. If I make it, I'll join one of the IIMs. Hope I shall be fortunate.
(ఐఐఎమ్‌లో జాయిన్ కావడానికి క్యాట్ రాశాను కదా! ఫలితాల కోసం చూస్తున్నా. వస్తుందనే అనుకుంటున్నా)

**Suneetha :** I wish I had appeared for CAT too. It's too late now. I think I'll do MCA. I am preparing for the entrance tests of all MCA courses. I may also take PG entrance tests and do MSc Computers or Electronics.
(నేనూ రాసి ఉంటే బాగుండేది. అయితే ఇప్పుడు అనుకొని ఏం లాభం? నేను ఎంసిఎ చేస్తాను. పిజి ప్రవేశ పరీక్షలు కూడా రాయాలని ఉంది. ఎమ్మెస్సీ కంప్యూటర్స్ లేదా ఎలక్ట్రానిక్స్ కానీ చేస్తా)

ఈ సంభాషణలన్నీ గమనించారు కదా...!

Spoken Englishలో Grammar బాగా తెలుసుకోవడం అవసరం. అయితే Grammar తెలిసినంత మాత్రాన English బాగా మాట్లాడడం వస్తుందనుకోవడం పొరపాటు. అవసరమైన కనీస grammar తెలుసుకోవాలి. ముందుగా...

## VOCABULARY

Vocabulary అంటే భాషలో ఉండే మాటలన్నీనూ. Spoken Englishలో అవసరమైన మాటలు సామాన్యంగా దైనందిన జీవితానికి, కనీస అవసరాలకు, ఇతరులతో ఉన్న సంబంధాలకు, కోరుకునేవాటికీ, పొందేవాటికీ సంబంధించినవై ఉంటాయి. చాలా మందికి ఇంగ్లిష్‌లో పెద్దపెద్ద మాటలు తెలుస్తాయి. కానీ చిన్నచిన్న విషయాలకు ఇంగ్లిష్ మాటలు, వాటి వాడుక తెలియదు. అలాగే Listening. ఇతరులు మాట్లాడే English అర్థం చేసుకోగలగడం. దీనికి కూడా daily lifeలో సాధారణంగా వాడే మాటలు, వాటి Pronunciation కూడా తెలుసుకోవాలి.
ఈ వాక్యాలు పరిశీలించండి.

**1.** Vijayawada is on the banks of the Krishna
(విజయవాడ కృష్ణ ఒడ్డున ఉంది)

**2.** They do not speak English
(వాళ్లు ఇంగ్లిష్ మాట్లాడరు)

**3.** Where is Ramesh?
(రమేష్ ఎక్కడ?)

**4.** How beautiful the Taj is!
(తాజ్‌మహల్ ఎంత అందంగా ఉంది)


M. SURESAN

పై Sentencesలో ప్రతిదీ ఏదో ఒక విషయాన్ని గురించి చెబుతోంది. మొదటి Sentence 'Vijayawada'ను, రెండోది 'They'ను, మూడోది 'Ramesh'ను, నాలుగోది 'Taj'ను గురించి చెబుతున్నాయి. ఇలా Sentence చెప్పే విషయాన్ని దాని 'Subject' అంటాం. కాబట్టి మొదటి Sentence Subject Vijayawada, రెండో వాక్యం Subject They, మూడో వాక్యం Subject Ramesh, నాలుగో వాక్యం Subject The Taj.




అలాగే ప్రతి Sentenceలోనూ 'Subject'ను గురించి చెప్పే భాగం ఒకటి ఉంటుందని గమనించే ఉంటారు. పైన 1st sentenceలో'.... is on the banks of the Krishna' ఆ Sentence subject విజయవాడ గురించి చెబుతోంది.

### 'She sings well'

ఈ Sentenceలో 'She' Subject. 'Sings well' అనేది Subject She గురించి చెప్పే భాగం. 'sings well'లో 'sings' లేకపోతే sentence లేదు. (She well - అంటే అర్థం లేదు. Sentence లేదు). అంటే 'She sings well' - ఈ sentenceలో Subject 'She' తర్వాత 'Sings' అనే మాట Sentenceకు చాలా ముఖ్యం. అలాంటి మాటనే 'VERB' అంటారు. Subject, Verb తెలుసుకోవడం చాలాముఖ్యం.
మొట్టమొదట ఇచ్చిన నాలుగు Sentencesలో Verbs చూద్దాం.

Sentence-1లో verb is, Sentence-2 లో verb 'do speak', Sentence-3, 4 లలో 'is'.

Spoken Englishలో ఒక Sentence Subject, Verb గుర్తించగలగడం చాలా అవసరం. వాటిని గుర్తిస్తే మిగతావన్నీ చాలా సులభం.

**a)** Andhra Pradesh is the biggest state in South India

**b)** The Eenadu was published first from Vizag.

ఈ రెండు Sentences ఒక విషయాన్ని చెప్పేవి. అంటే Statements అన్నమాట.

**c)** Is AP the biggest state in South India?

**d)** Was the Eenadu first published from Vizag?

(c), (d)లు Questions కదా. (a), (b) లకూ (c), (d) లకూ తేడా చూద్దాం.

Englishలో (a), (b)లలాంటి Statementsకు, (c), (d)లలాంటి Questionsకు ప్రధానంగా తేడా వాక్యనిర్మాణం (sentence structure)లో ఉంటుంది. (sentence structure అంటే ఏ మాట ముందు, ఏ మాట తర్వాత అనే అమరిక.)

**Statement :** _AP_ _is_ the biggest state in south India.
(దీని Structure ) Subject + Verb

**Question :** _Is_ _AP_ the biggest state in South India!
Verb + Subject

Statementలో Subject ముందు, Verb తర్వాత వస్తోంది. Questionలో దీనికి వ్యతిరేకంగా verb ముందు subject తర్వాత వస్తున్నాయి. ఇది English లో చాలా ప్రధానమైన తేడా.

**Statement :** _The Eenadu_ _was published_ first from Vizag.
*structure :* Subject + Verb

**Question :** _Was_ _the Eenadu_ published first from Vizag?
*structure :* Verb + Subject (Verb)

ఈ కింది Statements ను quesitons గా మార్చి practice చేయండి.

| Statements | Questions |
|---|---|
| a) (Yes), They are students | -----? |
| b) (Yes), Rani is the leader | -----? |
| c) (No), I am not happy | -----? |
| d) (Yes), He was here last night | -----? |
| e) (No), She is not hungry ? | -----? |

**మనం రోజూ మాట్లాడే ఆంగ్లం సరైనదే అనిపించినా, కూలంకషంగా చూస్తే తప్పులు బయటపడతాయి. విన్నదో, సరైనదని భావించో సంభాషణల్లో ఉపయోగిస్తాం. కరెక్టా కాదా అని ఆలోచించి మాట్లాడం. కానీ నలుగుర్లో మాట్లాడేటప్పుడు సాధ్యమైనంత మంచి భాష అవసరం. మనకు తెలిసిందే కరెక్ట్ అనుకుంటే తెలుసుకోవడానికి ఫుల్‌స్టాప్ పడినట్టే.**




# పలుకులో R గల్లంతు!

## PRONUNCIATION GUIDE

❒ English pronunciation confusion కు కారణం ఒకే అక్షరం రెండు వేర్వేరు శబ్దాలకు సంకేతంగా ఉండడం.
**ఉదా:** Car లో c-క, centre లో c-స

❒ ఒకే శబ్దానికి రెండు వేర్వేరు అక్షరాలు వాడడం.
**ఉదా:** centre - c ఇక్కడ స, sentry - s ఇక్కడ స).

### ఎలా పలకాలి?

English మాటల్లో ఎక్కువ హలంతాలు. అంటే చివరపొల్లుతో ఉండే శబ్దాలు ఎక్కువ. Pen - పెన్; Book- బుక్, Watch - వాచ్; Phone - ఫోన్; Take - టేయ్‌క్. ఇలాంటి మాటల్లో చివరి పొల్లును పొల్లుగా పలికితే బాగుంటుంది. పెన్ను, బుక్కు, వాచీ, ఫోను, టేకు అనం. Englishలో మాట్లాడేటప్పుడు పొల్లు చివర ఉండే మాటలు పొల్లుగా పలికితేనే అందం.

### ఇది ముఖ్యం!

ఇంగ్లిష్ మాటల్లో చివరి 'r'ను పలకం. ఉదాహరణ Doctor (డాక్ట), car (కా), for (ఫో), paper (పెయ్‌ప).

ఏ మాట చివర 'r' ఉన్నా దాన్ని పలకకుండా వదిలేస్తాం. అక్కడ'r' silent. ఏ మాటల మధ్యలో అయినా a, e, i, o, uలలో దేని తర్వాత 'r' వచ్చినా అది silent. దాన్ని పలకం. దాని తర్వాత a, e, i, o, u, లలో ఏదైనా వస్తే తప్ప.

**ఉదా:** form (ఫాం); Card (కాడ్); Fur (ఫ); sir (స), her (హ); information (ఇన్‌ఫమెయ్‌షన్).

### ఇవీ అవసరమే!

వీటితోపాటు Conversationలో అవసరమైన కొన్ని మాటలు తెలుసుకుందాం. మొదట parts of the human body- శరీర భాగాలకు ఇంగ్లిష్ మాటలు చూద్దాం. head, face, eyes, ears, neck, shoulder, hand, legs, fingers లాంటి మాటల అర్థాలు అందరికీ తెలుసు. thumb (బొటనవేలు), forefinger (చూపుడువేలు), middle finger (మధ్యవేలు), ring finger (ఉంగరం వేలు), little finger (చిటికెన వేలు). toe (కాలివేలు), big toe (కాలి బొటనవేలు), nail (గోరు), waist (నడుం), wrist (మణికట్టు), arm (మణికట్టు నుంచి భుజం వరకు), forearm (మణికట్టు నుంచి మోచేయి (elbow) వరకు), back arm (elbow నుంచి భుజం వరకు), buttocks (పిరుదులు), Knee (మోకాలు). Knee నుంచి పాదం వరకు కాలి ముందర భాగం shin, కాలివెనక భాగం calf (కాఫ్), కాలికీ పాదానికి మధ్య joint (కీలు)- ankle, పాదం అడుగు-Sole, పిడికిలి- fist, అరచేయి- Palm, కనుబొమలు- eyebrows, నుదురు - forehead. cheeks - చెక్కిళ్లు, pupil - కంటిపాప, eyelid- కనురెప్ప, nostril- ముక్కు రంధ్రం, gums - పంటిచిగుళ్లు, skull-పుర్రె, scalp- జుట్టు కింది తలపైభాగం.



## VERBS

**Kranthi:** Was anything special in the sunday Eenadu?
(ఆదివారం 'ఈనాడు'లో ఏదైనా ప్రత్యేకత ఉందా? )

**Karuna:** Yes. There was the first lesson in Spoken English.
(అవును. స్పోకెన్ ఇంగ్లిష్ మొదటి పాఠం ఉంది.)

**Kranthi:** Was anything important in it?
(అందులో ఏమైనా ప్రత్యేకత ఉందా? )

**Karuna:** Yes. Very important point was there- the difference between the statement structure and question structure.
(అవును. చాలా ముఖ్యమైన విషయం... స్టేట్‌మెంట్ స్ట్రక్చర్‌కి కొశ్చెన్ స్ట్రక్చర్‌కి తేడా చెప్పారు.)

**Kranthi:** Is it so important?
(అది అంత ముఖ్యమా? )

**Karuna:** Very. The statement has the subject first, and the verb next. The question has verb first and the subject next.
(చాలా... స్టేట్‌మెంట్లో మొదట సబ్జెక్టు తర్వాత వెర్బ్ ఉంటాయి. కానీ కొశ్చెన్‌లో ముందు వెర్బ్ తర్వాత సబ్జెక్టు ఉంటాయి.)

ఈ సంభాషణ చూశారు కదా! ఇందులో క్రాంతివన్నీ ప్రశ్నలు. కరుణవన్నీ స్టేట్‌మెంట్లు.

ఈ వాక్యాలు గమనించండి...
I am here- verb: 'am'
You are in class- verb: 'are'
My pen is in my pocket- verb: 'is'

పై sentencesలో ఉన్న Verbs 'am', 'is', 'are. వీటి అర్థం 'ఉండడం' అనే దానికి సంబంధించినవి. ఈ కింది తెలుగు ప్రశ్నలు, Statements Englishలో practice చేయండి.

1. (ఇప్పుడు) మీరు ఎక్కడ ఉన్నారు?
**English:** Where <u>are</u> you?

2. (ఇప్పుడు) నేను క్లాసులో ఉన్నాను.
------------------------------------

3. (ఇప్పుడు) వాళ్లు సంతోషంగా ఉన్నారు.
------------------------------------

4. (ఇప్పుడు) మీరు సంతోషంగా ఉన్నారా?
------------------------------------

5. (ఇప్పుడు) మీరు ఇక్కడ ఎందుకున్నారు?
------------------------------------

6. (ఇప్పుడు) వాళ్లు మా చుట్టాలు.
------------------------------------

**Answers:**
**2.** I am in class
**3.** They are happy
**4.** Are you happy?
**5.** Why are you here?
**6.** They are our relatives

am, is, are ఇప్పుడు (now) అంటే ప్రస్తుతం (present) ఉండడాన్ని తెలియజేస్తాయి. అంతే కాదు- am, is, are regular గా ఉండడాన్ని తెలియజేయడానికి ఉపయోగిస్తారు. అంటే ఏదైనా ఎక్కడైనా క్రమం తప్పకుండా ఉండడాన్ని కూడా am, is, are తెలుపుతాయి. కింది sentencesను practice చేయండి.

మీ క్లాసులెప్పుడు? (ప్రతి రోజూ - ఇది regular)

When <u>are</u> your classes every day?

ఇక్కడ 'are' ఎందుకు వాడుతున్నాం? ఇది ప్రతి రోజూ క్రమం తప్పని విషయం కాబట్టి.

మళ్లీ చూడండి.
1st show ఎప్పుడు?
1st show ఎప్పుడూ ఒకే టైమ్‌కు ఉంటుంది కదా? అంటే regularగా ఉండడం. కాబట్టి is వాడడం కరెక్ట్.




When is the first show?

మీరెప్పుడుంటారు Collegeలో (ప్రతి రోజు)

ఇది కూడా 'regular' కాబట్టి,

When <u>are</u> you at college (every day)?

ఇక్కడ every day లేకపోయినా ఫరవాలేదు. ఎందుకంటే 'are' అంటే regularగా ఉండడం కాబట్టి. అలాగే 'నేను సాయంత్రాలు ఇంట్లోనే ఉంటాను' అనడం ఎలా?

'I am at home in the evenings'.

Evenings అంటే ప్రతి evening- regular. కాబట్టి regular states of being (క్రమం తప్పకుండా ఉండడం) చెప్పడానికి am, is, are వాడడం కరెక్ట్. ఈ కింది వాటికి English చెప్పండి. practice చేయండి.

1. ఈ టైమ్‌లో ఎప్పుడూ మీరెందుకుంటారిక్కడ? (Regular కదా? )

**Answer:** Why <u>are</u> you here at this time every day?

2. మీ నాన్నగారు ఆఫీసులో ఎప్పుడుంటారు?
------------------------------------

3. వాడి పెన్ ఎప్పుడూ వాడి జేబులో ఉంటుంది.
------------------------------------

4. రోజూ మీ తరగతులు ఎప్పుడు?
------------------------------------

5. మా తరగతులు రోజూ 10 నుంచి 4 వరకు
------------------------------------

6. మీరు రోజూ కాలేజీలో ఎప్పుడుంటారు?
------------------------------------

7. మేం కాలేజీలో 10 నుంచి 4 వరకు ఉంటాం?
------------------------------------

**Answers:**
**2.** When <u>is</u> your father at office?
**3.** His pen <u>is</u> always in his pocket.
**4.** When <u>are</u> your classes (every day)?
**5.** Our classes <u>are</u> from 10 a.m. to 4 p.m.
**6.** When <u>are</u> you at college (every day)?
**7.** We <u>are</u> at college from 10 to 4 (every day)?

6, 7వాక్యాల్లో every day అవసరం లేదు. (are అంటేనే రెగ్యులర్‌గా ఉండడం.)




## VOCABULARY

సామాన్యమైన అనారోగ్యాలు, వాటికి సంబంధించిన మాటలు తెలుసుకుందాం-

1. జలుబు- Cold. 2. దగ్గు Cough (కాఫ్). 3. తుమ్ము- Sneeze (స్నీజ్- 'జ్' sizeలో చివరి శబ్దంలాగా పలకాలి.) 4. చీదడం- blow the nose. 5. కారే ముక్కు - running nose. 6. నొప్పి - ache (ఎయ్‌ఖ్), బాధ - pain, suffering;

**దేహ భాగాల నొప్పులు:** కడుపునొప్పి, తలనొప్పి, నడుంనొప్పి వీటికి ఆ భాగాల పేరు తర్వాత 'ache' వాడుతాం. pain వాడం.
stomach ache- stomach pain కాదు.
head ache, back ache etc.

జ్వరం (fever) వచ్చేట్లు, వచ్చినట్లు 'feel' అయితే 'feeling feverish'.

దురద itch (ఇచ్) గోకటం scratch (స్క్రాచ్), గొంతు నొప్పి - sore throat; బాధతో అరవడం groan; ఆవులించడం yawn, వాపు - swelling, కందినవాపు - inflammation. ఇవన్నీ practice చేసి మాట్లాడేటప్పుడు వాడండి.
నాకు తలనొప్పిగా ఉంది.
I have a head ache.
మా అమ్మకు జలుబు.
My mother has a cold.
ఇలాంటివి మరికొన్ని practice చేయండి.

## PRONUNCIATION GUIDE

ఇంగ్లిష్ Consonant ending శబ్దాలు ఎక్కువగా ఉన్న భాష. అంటే పొల్లులు చివర ఉండే శబ్దాలు ఎక్కువ. చివర పొల్లులను పొల్లులుగానే పలకాలి.
**ఉదా:** book, బుక్, బుక్కు కాదు.

పెన్, పెన్ను కాదు. Tub - టబ్, టబ్బు కాదు. Hotel- హొటేల్ ('టే' నొక్కండి). magazine- ఇలా చివర 'ine', 'ile' ఉంటే ఈన్, ఈల్‌లా పలకాలి. Magazine - మేగజీన్ (జీ, ఇక్కడ easyలో చివరి శబ్దం లాంటిది) Automobile- ఆటొమొబీల్, intestine (పేగు) ఇంటెస్టిన్ etc.

**మీరూ రాయండి!**
స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను **స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82** చిరునామాకు పంపించవచ్చు.
**email:** pratibha@ eenadu.net

ఏ పదం ఎక్కడ ఎప్పుడు ఎలా పలకాలో అలా పలికితేనే భాష సొగసుగా ఉంటుంది. తెలిసీ తెలియని ప్రయోగాలు ఎదుటి వారిని అయోమయంలోకి నెట్టేయవచ్చు లేదా విసుగు కలిగించవచ్చు. మాతృభాష ఉచ్చారణతోనే ఆంగ్లాన్ని పలకడం కూడా కొంత కృతకంగా ఉంటుంది. అందుకే మనం నేర్చుకునే భాషలోని సహజమైన పద్ధతులను అనుసరించడం అవసరం.




# the- ఎక్కడ 'ది', ఎప్పుడు 'ద'?

## WAS, WERE

**Ram:** Were you there yesterday?
(నిన్న నువ్వు అక్కడ ఉన్నావా? )

**Raghav:** I was there, of course.
(అవును అక్కడ ఉన్నాను)

**Ram:** When were you there?
(ఎప్పుడున్నావ్? )

**Raghav:** I was there exactly at 6 when the function began.
(సరిగ్గా ఫంక్షన్ మొదలైన 6 గంటలకు అక్కడే ఉన్నాను)

**Ram:** Who else was there yesterday?
(నిన్న ఇంకా ఎవరున్నారు? )

**Raghav:** Anil, and Sunil were also there.
(అనిల్, సునీల్ కూడా అక్కడ ఉన్నారు)

ఈ సంభాషణ గమనించండి. Ram, Raghav నిన్న అంటే గతంలో ఉండడాన్ని was, wereలో చెప్తున్నారు. English లో టైంనుబట్టి Verb forms మారుతూ ఉంటాయి. ఇప్పుడు, ఎప్పుడు, తరచుగా ఉండడాన్ని am, is, areలో చెబుతాం. అలాగే గతంలో ఉన్న వాటిని ఎప్పుడూ was, wereలలో చెబుతాం.

was- singular
were- plural

1. ఇప్పుడు నేనిక్కడ ఉన్నాను.
I am here
2. నిన్న ఇక్కడ ఉన్నాను.
I was here yesterday
3. మీరు నిన్న ఇక్కడ ఉన్నారా? ఇది Question. కాబట్టి verb ముందు రావాలి
Were you here yesterday?
4. నిన్న వాడెక్కడున్నాడు? (Question)
Where was he yesterday?
5. భారతదేశం బ్రిటిష్ పాలనలో ఉండేది.
India was under British rule.
6. 1947 వరకు మన పాలకులు (rulers) ఎవరు?
Who were our rulers till 1947?

ఇంగ్లిష్‌లో టైమ్ తెలియజేసే మాటలు అంటే తేదీ, సంవత్సరం, నెల, టైమ్ ఎప్పుడూ sentence చివరనే ఉండాలి.

7. నిన్న నువ్వు ఇక్కడ ఎందుకున్నావు?
Why were you here yesterday?
8. మా స్నేహితుడు గత ఆదివారం ఇక్కడ ఉన్నాడు.
My friend was here last Sunday.

కాబట్టి గతం (past)లో ఉండే విషయాలను ఎప్పుడూ was, wereలలో చెబుతాం.

కింది sentencesను englishలో practice చేయండి.

1. Praveen: మీరు నిన్న ఇంట్లో ఉన్నారా?
2. Pranav: అవును, ఇంట్లోనే ఉన్నాను.
3. Praveen: మీ అన్న కూడా ఇంట్లోనే ఉన్నాడా?
4. Pranav: లేదు.
5. Praveen: నిన్న మీరు ఎక్కడున్నారు?
6. Pranav: నేను కాలేజీలో ఉన్నాను.




7. Praveen: ప్రతి రోజూ ఈ టైమ్‌లో కాలేజీలో ఉంటారా? (Regular)
8. Pranav: అవును.
9. Praveen: మీరు మామూలుగా ఇంట్లో ఎప్పుడుంటారు?
10. Pranav: సాయంత్రాలు ఇంట్లోనే ఉంటాను. నిన్న సాయంత్రం మాత్రం ఇంట్లో లేను.
11. Praveen: మరెక్కడున్నారు?
12. Pranav: మీటింగ్‌లో

**Answers:**

1. Were you at home yesterday?
2. Yes, I was at home.
3. Was your brother too/also at home?
4. No, he was not at home.
(సంభాషణలో No, he wasn't. అని ఆపేస్తారు)
(wasn't = was not)
5. Where were you?
6. I was at College.
7. Are you at college at this time every day?
8. Yes, I am (at college... every day - conversationలో ఈ భాగం వదిలేయవచ్చు.)
9. When are you at home usually? (మామూలుగా కాబట్టి 'are')
10. I am at home in the evenings (Regular, therefore, am) but I was not (wasn't) at home last evening.
(నిన్న సాయంత్రం, నిన్న రాత్రి - last evening, last night).
11. Where else were you? (నిన్న కాబట్టి)
12. I was at a meeting.

➠ ఈ సంభాషణను మీరు, మీ friendతోగానీ, మీ ఇంట్లో ఎవరితోగానీ practice చేయండి.

➠ మొదట మీరు practice చేసి తర్వాతే answers చూసుకోండి.

➠ ఇప్పుడు చూశారా? ఒక్క am, is, are, was, wereలతోనే ఎంత English మాట్లాడవచ్చో?

## PRONUNCIATION GUIDE

ఇంగ్లిష్‌లో pure sounds లేవంటారు. అంటే ఎక్కడైనా 'a' అక్షరం-

➠ bake, cake, case, date, face, game, hate, lane లాంటి మాటల్లో వచ్చినప్పుడు దాన్ని 'ఎయ్'గా పలకాలి.


M. SURESAN

bake- బెయ్‌క్
cake- కెయ్‌క్
case- కెయ్‌స్
face- ఫెయ్‌స్
game- గెయ్‌మ్
hate- హెయ్‌ట్
lane- లెయ్‌న్
date- డెయ్‌ట్
(I hate you- అయ్ హెయ్‌ట్ యూ).

అలాగే మిగతా మాటలలో కూడా-
tale, tail pronunciation ఒక్కటే - టెయ్‌ల్.

➠ ఎప్పుడు 'a', ఎప్పుడు 'an' అనేది పెద్ద ప్రశ్నే.
'a, e, i o, uలతో ప్రారంభం అయ్యే మాటల ముందు, 'an' అని, మిగతా వాటి ముందు 'a' అని అంటుంటారు. కానీ అది ఎప్పుడూ కరెక్ట్ కాదు. a university, a European అంటుంటాం. అదే కరెక్ట్.

### 'the' ని 'ది' అని ఎప్పుడు, 'ద' అని ఎప్పుడు పలకాలి?

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ- ఈ తెలుగు శబ్దాలతో ప్రారంభం అయ్యే English మాటల ముందు 'an' వాడాలి. ఈ శబ్దాల ముందు వచ్చే 'the'ని 'ది'గా పలకాలి. మిగతా శబ్దాలతో ప్రారంభమయ్యే మాటల ముందు 'a' వాడాలి.

అలాగే 'the'ని 'ద'గా పలకాలి.

a University ('యూ'తో ప్రారంభం కాబట్టి 'a')
an example ('ఎ'తో ప్రారంభం, కాబట్టి 'an')
the egg (ఇక్కడ 'ది', egg, 'a'తో ప్రారంభం కాబట్టి)
the tree ('ద' ట్రీ. ఇక్కడ 'అ' నుంచి 'ఔ' వరకు ఉండే శబ్దాలతో ప్రారంభం కాలేదు కాబట్టి).

➠ Communications/informationకు సంబంధించిన ఈ మాటలు చూడండి.

ఫోన్ చేయడం- phone, ringup, give a ring, call- వీటన్నిటిలో ఇప్పుడు బాగా వాడుకలో ఉన్న మాట, 'call', phone to a person, phone a person పూర్తిగా పాతబడిపోయాయి. ring up, give a ring ఇంకా వాడుకలో ఉన్నాయి.

1) మీరు నాకోసారి ఫోన్ చేయండి.
Please call me.
Please give me a ring.
Please ring me up.
తప్పకుండా చేస్తాను.
I will certainly call you.
Sure, I will call you.
మళ్లీ మీకు ఫోన్ చేస్తాను.
I will get back to you.

2) నాకా విషయం ఇ-మెయిల్ చేయండి.
Please mail me the matter.
Please mail the matter to me at yours@yahoo.com

3) కొరియర్ ద్వారా పంపండి.
Send it by courier.

4) మామూలు పోస్ట్ ద్వారా పంపండి.
Post it.
Send it by ordinary post.
Sent it by snail mail.
'snail mail' అంటే నత్తలాగా చాలా ఆలస్యంగా వెళ్లే post అని అర్థం.

### మరిన్ని మాటలు!

chew (ఛ్యూ) - నమలడం
swallow (స్వాలో)- మింగడం
swallow in a gulp - ఒక గుక్కలో మింగటం
trim (ట్రిమ్)(mustache, beard) - (మీసం, గడ్డం) కత్తిరించి సరిచేయడం
clench (క్లెన్‌చ్)- బిగించటం (పిడికిలి - fist)
injure (ఇన్‌జర్) - గాయపడడం
injury (ఇన్‌జరీ)- గాయం
twist (ట్విస్ట్)the arm - చేయి మెలితిప్పడం
snap the fingers - చిటిక వేయడం
shatter (షేటర్)- బద్దలు కొట్టడం
swelling (స్వెలింగ్)- వాపు
inflammation (ఇన్‌ఫ్లమేషన్)- కందిన వాపు
fracture(ఫ్రాక్చ)- ఎముక విరగడం
sprain(స్ప్రెయిన్)- బెణుకు
itch(ఇచ్)- దురద, scratch(స్క్రాచ్)- గోకడం
abscess (ఆబ్‌సెస్)- కురుపు (చీముతో)
boil (బాయ్‌ల్)- గడ్డ
pimple (పింపుల్)- మొటిమ
scar (స్కా)- గాయం వల్ల మచ్చ
pus (పస్)- చీము blister (బ్లిస్ట)-పుండు

**మళ్లీ Verbs:** ప్రస్తుతం, ఎప్పుడూ ఉండడాన్ని చెప్పేవి- am, is, are. గతంలో ఉండడాన్ని చెప్పేవి- was, were. భవిష్యత్తులో ఉండడాన్ని చెప్పేవి- shall be, will be

రేపు నేనక్కడ ఉంటాను.
I shall be/will be there tomorrow.
మేం ఆదివారం వైజాగ్‌లో ఉంటాం.
We shall be/we will be in Vizag on Sunday.
అతడిని చూడడం నాకు సంతోషం.
I shall be happy to see him.
రేపు అతను ఇక్కడ ఉంటాడు.
He will be here tomorrow.




**ప్రశ్న:** Had, would రెండింటి short forms అయిన I had/would - I'd ఐడ్. We had/would -We'd వీడ్, ఒకేలా ఉన్నాయి. I'd లేదా We'd ను చూసి సబ్జెక్టు తర్వాత had ఉందా, would ఉందా ఎలా తెలుసుకోవాలి?

– దేవన్ల అనిత, హనుమకొండ

**జవాబు:** 'd ను మీరన్నట్లు had కు వాడతారు. would కూ వాడతారు. అయితే ఎక్కడ had ఎక్కడ would అనేది సందర్భాన్ని బట్టి మాత్రమే తెల్సుకోగలం.

A) He'd gone before I saw him.
ఇక్కడ He'd = He had
ఎందుకంటే 'gone' లాంటి past participles ముందు would ఎప్పుడూ రాదు. had మాత్రమే వస్తుంది.

B) I thought he'd do it.
ఇక్కడ 'd తరవాత past participle లేదు కాబట్టి would అనే అర్థం చేసుకోవాలి. ఒక విషయం గుర్తుపెట్టుకోవాలి. Past participles ముందు, 'been' తర్వాత ing form వచ్చినప్పుడు, వీటి ముందు 'd ఎప్పుడూ had అవుతుంది. Do, go, come లాంటి verb forms ముందు, be + ing ముందు 'd ఎప్పుడూ would అవుతుంది.

Example: They'd done it.
(done past participle కాబట్టి 'd = had)
They'd been doing it. (ఇక్కడ been + ing ముందు కాబట్టి 'd = had).
She'd marry him. 'd తర్వాత marry అని వచ్చింది కాబట్టి 'd = would
She'd be going. ఇక్కడ be + ing form ముందు కాబట్టి 'd = would.
Have been + ing ముందు కూడా 'd = would.



**మీరూ రాయండి!**

స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82 చిరునామాకు పంపించవచ్చు.
**email:** pratibha@ eenadu.net

తెలుగు వాక్య నిర్మాణాన్ని యథాతథంగా అన్వయిస్తూ ఆంగ్లం మాట్లాడడం సాధ్యం కాదు. రెండింటి వ్యాకరణాలూ పూర్తిగా వేరువేరు. రెండు భాషలకూ మౌలికంగా ఉన్న తేడాలు తెలుసుకుంటే తెలుగుతో సమానంగా ఇంగ్లిష్‌ని సంభాషించడం పెద్ద కష్టమైన పని కూడా కాదు. ఇందులో ముఖ్యంగా కాలం గురించి చూస్తే ఆంగ్లంలో కాలానికి సంబంధించిన పదాలు చివర్న వస్తాయి.




# వాక్యం చివరే కాలం!

## SHALL BE, WILL BE

**Kiran:** Will you be here tomorrow?
రేపు నువ్వు ఇక్కడ ఉంటున్నావా?

**Kranthi:** What for?
ఎందుకు?

**Kiran:** All our friends will be here tomorrow. Will you not be (won't you be).
మన స్నేహితులందరూ రేపు అక్కడుంటున్నారు. మరి నువ్వుండవా?

**Kranti:** I shall be very happy to be with all of you. What will be the programme?
మీ అందరితోనూ ఉండడం నాకూ సంతోషమే. ప్రోగ్రామ్ ఏంటి?

**Kiran:** Let's decide when we meet.
మనం కలిశాక నిర్ణయిద్దాం.

ఈ సంభాషణ గమనించారు కదా! రేపు ఉండే విషయాన్ని గురించి మాట్లాడుకుంటున్నారు. will be, shall be వాడారు కదా!

I shall be there tomorrow.
(రేపు నేనక్కడ ఉంటాను.)

He will be a graduate soon.
(త్వరలో అతడు గ్రాడ్యుయేట్ అవుతాడు.)

The train will be here in five minutes.
(ఇంకో అయిదు నిమిషాల్లో రైలు ఇక్కడికి వస్తుంది.)

How long will you be here?
(నువ్వు ఇక్కడ ఎంత సేపు ఉంటావు?)

shall be, will be అంటే భవిష్యత్తులో ఉండడం (A future state of being)

తెలుగుకు వ్యతిరేకంగా 'Time words' అంటే కాలాన్ని తెలియజేసే మాటలు Englishలో sentence చివర ఉంటాయి.

**eg:** He will be here tomorrow.
They were here yesterday.
The meeting will begin at 6 this evening.

**Order:** time, day, date, month, year

**eg:** The meeting will be at 6 PM (Time) on Monday (day), the 28th (date) May (month) 2005 (year)

ఇది Englishలో చాలా ముఖ్యం.

(మళ్లీ Question order గుర్తుంచుకోండి- Vb+Sub/1st Word of the Verb+Sub+the other words of the verb.)

ఈ కింది వాటిని Englishలో practice చేయండి.

1. అతను ఇక్కడ ఎప్పుడుంటాడు?
2. మీరు హైదరాబాద్‌లో ఎన్నిరోజులుంటారు?
3. ఆ పుస్తకం రేపు మీ దగ్గరుంటుందా?
4. నేనిక్కడ ఎక్కువసేపు ఉండను.
5. మేమందరం రేపు హైదరాబాద్‌లో ఉంటాం.
6. ఈ వేడి ఇంకా రెండు రోజులుంటుంది.
7. పది నిమిషాలకు నేను థియేటర్‌లో ఉంటాను.
8. నీ తర్వాతి చర్య ఏమిటి? (next step)
9. రేపు ఇక్కడ ఎవరూ ఉండరు.
10. ఆమె ఇక్కడ ఎంతసేపుంటుంది?




**Answers:**

1. When will he be here?
2. How long will you be in Hyderabad?
3. Will the book be with you tomorrow?
4. I shall not be here for long?




5. We shall all be in Hyderabad tomorrow.
6. It will be hot for another two days.
7. I will be in the theatre in another 10 minutes.
8. What will be your next step?
9. Nobody will be here tomorrow.
10. How long will she be here?

## VOCABULARY

పాత్ర- dish (డిష్), bowl (బౌల్)
ఇంట్లో పాత్రలు - Vessels (వెసల్స్), utensils (యుటెన్సిల్స్)
చెంబు - ewer (యువ్)
గ్లాసు - tumbler (టమ్లర్)
మూత - lid (లిడ్)
పెనం- pan (పాన్)
గంగాళం - cauldron (కాల్‌డ్రన్)
మరిగించడం- boil (బోయిల్)
వేపుడు- fry (ఫ్రై)
కాల్చడం (తినేందుకు) = bake (బెయిక్)

ఇప్పుడు ఇంకా కొన్ని 'be' forms (అంటే ఉండడాన్ని తెలిపే Verbs):
can be - ఉండగలగడం (ఇప్పుడు, భవిష్యత్తులో)
could be - ఉండగలగడం (గతంలో)
may be - ఉండవచ్చు (ఇప్పుడు, భవిష్యత్తులో)
might be - ఉండవచ్చు (గతంలో)
should be, must be = ఉండాలి

1. He can be here in five minutes.
అతడు ఇక్కడ అయిదు నిమిషాల్లో ఉండగలడు.
2. She could be the Prime Minister.
ఆమె ప్రధానిగా ఉండగలిగింది.
3. She may be there now.
ఆమె ఇపుడు అక్కడ ఉండవచ్చు (ఉందేమో?).
4. They might be happy.
వాళ్లు సంతోషంగా ఉండి ఉండవచ్చు (గతంలో).
5. You should be here at 10 a.m.
నువ్వు ఉదయం పదింటికి ఇక్కడ ఉండాలి.
6. Ravi must be in office from 10 a.m. to 5 p.m.
రవి ఉదయం 10 నుంచి సాయంత్రం 5 వరకు ఆఫీసులో ఉండాలి.

M. SURESAN

ఇంతవరకు ఈ 'be' forms (ఉండడాన్ని తెలిపే 'verb-s'ను చూశాం.

ఈ కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో practice చేయండి.

1. నువ్విక్కడ ఎంత సేపు ఉండగలవు?
2. నిన్న వాళ్లు ఇక్కడ ఎప్పుడు ఉన్నారు?
3. రేపు అక్కడ కొంత ఇబ్బంది ఉండవచ్చు.
4. కాస్త ఓర్పుతో ఉండలేవా?
5. అక్కడ మేం ఎన్నింటికి ఉండాలి?
6. అతడు నిన్ననే ఇక్కడ ఉండగలిగాడు.
7. ఎన్.టి. రామారావు ముఖ్యమంత్రిగా ఉండగలిగారు ఎందుకంటే ఆయన నటుడు కాబట్టి.
8. ఇక్కడ సుఖంగా ఉంటే, నేను ఎంతసేపైనా ఉండగలను.
9. నిన్న చాలా చల్లగా ఉంది.
10. మీరు ఇక్కడ ఎంతసేపు ఉండవచ్చు?

**Answers:**

ఇంగ్లిష్‌లో ఎంతసేపు- How long?
ఎంత దూరం - How far? ఎన్నిసార్లు - How often?

1. How long can you be here?
2. When could they be here yesterday?
3. There may be some trouble there tomorrow.
4. Can't you be patient? (Can you not = Can't you)
5. When should we be there?
6. He could be here yesterday itself (నిన్ననే).
7. NT Ramarao could be the CM because he was an actor.
8. If it is comfortable here, I can be here for as long as possible.
9. It was very cool yesterday.
Yesterday was very cool.
10. How long can you be here?

'Be' forms (అంటే am, is, are, was, were, shall be, should be లో 'be' చివర ఉండే పదాలు, 'been' చివర వచ్చేవి - have been, has been, had been, should have been లాంటివి) ఉండడం అనే అర్థం వచ్చే Verbs. ఇవి కాకుండా పనిని తెలిపే మాటలు కూడా Verbs. కింద A లో ఇచ్చిన వాటిని B లో ఇచ్చిన వాటితో పోల్చండి.

**A**
I am a teacher (ఉన్నాను).
She is a player (playerగా ఉంది).
They are singers.

**B**
I teach (చేస్తాను).
She plays (ఆడుతుంది).
They sing (పాడతారు).




**ప్రశ్న:** The machine is out of service.
The machine has out of service.
పై వాటిలో సరైనది ఏది? వాక్యంలో has వస్తే అర్థం ఎలా వస్తుంది? has రాకపోతే ఎలా వస్తుంది?
India won the match.
India has won the match.
ఇలా has చేరిస్తే అర్థం ఎలా వస్తుంది. తీసేస్తే ఎలాంటి అర్థం వస్తుంది?
**– ఆయేషా, హైదరాబాద్**

**జవాబు :**
The machine is out of service. అనే వాక్యం correct.
The machine has out of service అనేది English కాదు.
Has తరవాత ఎప్పుడు out లాంటి prepositions రావు.
India won the match. ఈ సందర్భంలో సరి కాదు. ఎందుకంటే గెలిచిన రోజుగానీ, తేదీగానీ చెప్పట్లేదు కాబట్టి. India has won correct.
India won the match last week. ఇది కరెక్ట్. ఎందుకంటే last week అని టైమ్ చెబుతున్నాం కాబట్టి.
India గెలిచిందని, ఎప్పుడు గెలిచిందో టైమ్ చెప్పకుండా వదిలేస్తే India has won the match అనేది correct. ఈ కింది వాక్యాలు చూడండి.

**A.** He has gone out.
ఎప్పుడు వెళ్లిందీ టైమ్ చెప్పడంలేదు. కాబట్టి has + past participle correct.

**B.** He went out this morning.
ఇక్కడ ఎప్పుడు బయటికి వెళ్లిందీ, this morning అని టైమ్ చెబుతున్నాం. కాబట్టి past simple tense correct.

**C.** She has bought a car.
has + past participle (టైమ్ చెప్పడం లేదు కాబట్టి).

**D.** She bought it yesterday.
(bought - past simple- yesterday అని టైమ్ చెబుతున్నాం కాబట్టి).



**మీరూ రాయండి!**
స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను **స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82** చిరునామాకు పంపించవచ్చు.
**email:** pratibha@ eenadu.net

పదాల వాడుకలో సున్నితమైన తేడా తెలియక పోవడం వల్ల ఒక్కోసారి మన సంభాషణ అర్థం మారే ప్రమాదం ఉంది. దీనికి మాతృభాష ప్రభావం కూడా కారణం కావచ్చు. ఒకే పదాన్ని ఒక్కోచోట ఒక్కో విధంగా వాడాల్సి ఉంటుంది. ఏది ఎక్కడ ఎలా ప్రయోగించాలో తెలుసుకుంటే మనం మాట్లాడే భాష ఎదుటివారిని ఆకట్టుకుంటుంది.




# అర్థం ఒకటే కానీ...!

**Ram:** Where <u>is</u> your brother?
మీ సోదరుడు ఎక్కడ ఉన్నాడు?

**Raghav:** He <u>is watching</u> the t.v. at home
అతను ఇంట్లో టీవీ చూస్తున్నాడు.

**Ram:** Where <u>does</u> he <u>study</u>?
అతను ఎక్కడ చదువుతున్నాడు?

**Raghav:** He <u>is</u> a student of Learn well school
అతను లెర్న్‌వెల్ స్కూల్ విద్యార్థి

**Ram:** Which class is he in?
అతను ప్రస్తుతం ఎన్నో తరగతి చదువుతున్నాడు?

**Raghav:** He <u>is doing</u> the 8th class
ఎనిమిదో తరగతి చదువుతున్నాడు.

**Ram:** What games <u>does</u> he <u>play</u>?
అతను ఏయే ఆటలు ఆడతాడు?

**Raghav:** He <u>plays</u> cricket and hockey.
క్రికెట్, హాకీ ఆడతాడు.

పై సంభాషణను గమనించండి.

is verb అన్ని చోట్లా ఉండడాన్ని చెబుతుంది. is watching, does study ( = studies), is doing, (does play = plays) plays ఇవన్నీ కూడా చేతలను (actions) తెలిపే Verbs.

**A**

The teacher <u>is</u> in class.
(టీచర్ క్లాస్‌లో ఉంది)

He <u>was</u> on the playground.
(Play groundలో ఉన్నాడు గతంలో)

**B**

The teacher <u>is teaching</u> (Verb)
(బోధిస్తోంది)

He <u>was playing</u>
(ఆడుతున్నాడు గతంలో)

B కింద verbs అన్నీ చేతలను (Actions) తెలిపే Verbs.

A కింది verbs ఉండటాన్ని తెలుపుతాయి. ఈ చేతలను చెప్పే verbs, action words.

**eg:** go, come, eat, talk, run, sleep, read, dance.

1. The boys <u>are playing</u>
2. The girl <u>is reading</u>
3. These students <u>talk</u> in class
4. The cheetah <u>runs</u> fast
5. A dog <u>barks</u>

తెలుగుకూ, English కూ ఉన్న తేడా ఇంకోటి గమనించండి.

ఆ పుస్తకం టేబుల్ మీద ఉంది
The book is on the table.

మనం, 'మీద' టేబుల్ తర్వాత వాడతాం. ఇంగ్లిష్‌లో మీద అనే అర్థంతో, on 'table' ముందు వాడతాం. అన్ని విషయాలలోనూ అంతే.

<u>from</u> school - స్కూలు నుంచి
<u>at</u> home - ఇంటిలో
<u>In</u> the bag - సంచిలో
<u>to</u> Guntur - గుంటూరుకు.

ఈ విషయంలో మనం ఇంగ్లిష్‌లో మాట్లాడేటప్పుడు జాగ్రత్తపడాలి. కింది verbs ఓసారి చూడండి.

| A | B |
|---|---|
| come | comes |
| go | goes |
| write | writes |
| take | takes |
| sing | sings |
| teach | teaches |
| speak | speaks |




A కింది వాటికీ, B కింది వాటికీ అర్థం ఒకటే. కానీ I, We, You, They తో A కింది వాటిని ఉపయోగిస్తాం.




He, she, it తో B కింది వాటిని వాడతాం.

I/We/You/Andhras (they) <u>speak</u> Telugu

My father (he)
My Mother (she) } <u>speaks</u> Telugu
This class (it)

I/We/you/these trains (they) <u>go</u> there

My mother (she)
My friend (he/she) } <u>goes</u> there every day
This train

Fans (they) <u>give</u> air
A Fan (it) <u>gives</u> air
Dogs (they) bark
A dog (it) barks

ఇవి మీరు పూర్తిచేస్తూ practice చేయండి (Bracketsలో ఉన్న verbతో పూర్తి చేయండి)

1) Wrist watches --- the time
A Wrist watch --- the time (show)

2) A doctor --- patients
Doctors --- patients (treat)

3) A lawyer --- cases
Lawyers --- cases (argue)

4) Pens ---
A pen --- (Write)

5) A cricketer --- cricket
Cricketers --- cricket (Play)


M. SURESAN

**Answers:**

1) Wrist watches (They) <u>show</u> the time
A Wrist Watch (It) <u>shows</u> the time

2) A doctor (He/She) <u>treats</u> patients
Doctors (They) <u>treat</u> patients

3) A lawyer (He/She) <u>argues</u> cases
Lawyers (They) <u>argue</u> cases

4) Pens (They) <u>write</u>
A pen (It) <u>writes</u>

5) A cricketer (He/She) <u>plays</u> cricket
Cricketers (They) <u>play</u> cricket

ఈ రూపంలో ఉండే verbs, క్రమం తప్పకుండా జరిగే పనులకు వాడతాం. అంటే regular actionsకు. ఎప్పుడూ జరిగే పనులకు కూడా వీటిని ఉపయోగిస్తాం.

I <u>go</u> to college at 10 AM (ప్రతిరోజూ)
My mother cooks for me (ఎప్పుడూ)

ఇలా మీరు మరికొన్ని sentences రాయండి.

మళ్ళీ ఒక్కసారి చూడండి:
(I) am; (he, she, it) is; they (are).

ఇక్కడ am, is, are అంటే ఇప్పుడు ఉండటం, ఎప్పుడూ ఉండటం. అలాగే was, were- గతంలో ఉండటం; shall be / will be futureలో ఉండటం

**I.** I am in class
(ఇప్పుడు క్లాస్‌లో ఉన్నాను)
My friend (he/she) is in the next room
(మా friend, పక్క గదిలో ఉన్నాడు/ఉంది -ఇప్పుడు)
My parents (they- వాళ్ళు) are at home
(ఇంట్లో ఉన్నారు- ఇప్పుడు)

కాబట్టి am, is, are అంటే ఇప్పుడు ఉండటం

**II.** I was/he was here yesterday.
(ఇక్కడ ఉన్నాను- ఉన్నాడు - నిన్న)
My friends were in Hyderabad last week
(నా స్నేహితులు హైదరాబాద్‌లో ఉన్నారు, గతవారం) -was, were, గతంలో ఉండటం

**III.** Shall be/will be- future (భవిష్యత్‌లో ఉండటం)

1. India will be a great country by <u>2010</u>
(2010 సంవత్సరానికి భారత్ గొప్ప దేశంగా ఉంటుంది)
2. Anil will be here <u>next week</u>
(వచ్చే వారం అనిల్ ఇక్కడ ఉంటాడు)




**ప్రశ్న:** have పక్కన had ను ఒక వాక్యంలో ఉపయోగించవచ్చా? అలా రాస్తే ఆ వాక్యం అర్థం ఏమిటి? అది ఏ tense అవుతుంది? అలాగే వాక్యంలో had తర్వాత పక్కనే మళ్లీ had వస్తుందా? దాని అర్థం ఏమిటి?

*– తత్తరి రమేష్, హన్మకొండ*

**జవాబు:** 'have' పక్కన 'had'___ have had_ ఇది present perfect tense of have. present perfect లో verbform: have/has + past participle (pp);
**eg:** have seen, have gone etc.

Present perfect tense ముఖ్యంగా తెలిపేది ఇప్పటి వరకు జరిగిన పని. దీనికి for the past, for the last, since వస్తాయి.

a) I <u>have studied</u> (have+ pp of study) here for the past two years- నేనిక్కడ ఇప్పటివరకు రెండేళ్లు చదివాను.

b) He <u>has worked</u> (has + pp of work) here since 2004 = 2004 నుంచి ఇప్పటివరకు ఆయన ఇక్కడ పనిచేశాడు.

ఇప్పుడు నాకు కారు ఉంది అని చెప్పాలంటే- I <u>have</u> a car అంటాం. రెండేళ్లుగా నాకు ఈ కారు ఉంది అని అనాలంటే, 'have' కు present perfect tense, అంటే have + past participle of have (=had) వాడాలి కదా! అప్పుడేమంటాం?

I <u>have had</u> this car for the past two years అంటాం. have + had (pp of 'have'_ కలిగి ఉన్నాను) అని. <u>She has had</u> (has + pp of 'have') this job for the last one year.
(సంవత్సరంగా ఆవిడకి ఉద్యోగం ఉంది)

They <u>have had</u> two cups of coffee so far.
(ఇప్పటివరకూ రెండు కప్పుల కాఫీ తాగారు)

Present perfect tense గతంలో జరిగిన పని, ఎప్పుడు (ఏ రోజు, ఏ తేదీ, ఏ టైం) జరిగిందీ చెప్పకపోతే వాడతాం.

I <u>have had</u> my lunch. (నా భోజనం అయిపోయింది)

★ had had- ఇది past perfect tense of 'have'. Past perfect లో verb form: had + past participle

Past perfect ముఖ్యంగా తెలిపేది: గతంలో జరిగిన రెండు పనుల్లో మొదటిపనిని.

He told me that he <u>had passed</u>
(had + pp of pass)
పాసయ్యానని నాతో చెప్పాడు.

pass అవటం, చెప్పటం, రెండూ గతంలో పనులే. pass అవటం ముందు, చెప్పటం తర్వాత. ముందు, 'pass' అవటం కాబట్టి had passed అని past perfect వాడతాం.

ఈ కారు కొనక ముందు అతనికి స్కూటర్ ఉండేది. ఇక్కడ రెండూ past actions. స్కూటర్ ఉండటం ముందరి past action. 'స్కూటర్ ఉండటం' అంటే '<u>have</u> a scooter.' కాబట్టి past perfect of have = had + past partciple of have (=had) = had had.

He <u>had had</u> a scooter before he <u>bought</u> the car.
(కారు కొనే ముందు, అతనికి స్కూటర్ ఉండేది)

★ He <u>had had</u> his breakfast when his friend came in.
(వాళ్ల ఫ్రెండ్ వచ్చేటప్పటికి అతని breakfast అయిపోయింది)

★ She <u>had had</u> the information before I told her of it.
(నేను చెప్పే ముందే ఆమె దగ్గర ఆ సమాచారం ఉంది)



**మీరూ రాయండి!**
స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను **స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82** చిరునామాకు పంపించవచ్చు.
**email:** pratibha@ eenadu.net

# ప్రతిభ

# ఆనాటి నుంచీ... ఈనాటి దాకా..!

**Pooja:** Are you happy?
(సంతోషంగా ఉన్నావా? )
**Durga:** Certainly I am.
(అవును)
**Pooja:** Why are you happy?
(ఎందుకు సంతోషంగా ఉన్నావు? )
**Durga:** My cousin Saraswathi is here for vacation. We shall be happy in each other's company.
(మా కజిన్ సరస్వతి సెలవులకి ఇక్కడికి వచ్చింది. మేం కలవడం ఇద్దరికీ ఎంతో ఆనందంగా ఉంటుంది.)
**Pooja:** What will be your plan?
(నీ ప్లాన్ ఏమిటి? )
**Druga:** Come home tomorrow. You will know.
(రేపు ఇంటికి రా. నీకే తెలుస్తుంది.)

ఈ సంభాషణ చూశారు కదా-
am, is, are; was, were; shall be, will be తర్వాత happy, plan లాంటి ఏ మాటలైనా వాడవచ్చు. ఈ కింది వాటిని మాట్లాడుతూ practice చేయండి. Blanks ను Brackets లో ఇచ్చిన మాటలతో నింపండి.

I am ________
(మీ పేరు చెప్పండి. ఉదా: I am Pavan)
I am _____
He is _______
They are ________
My friends will be ______

పైన ఇచ్చినవి sampleగా మాత్రమే.
స్టూడెంట్, స్టూడెంట్స్, పొడుగు, పొట్టి, లావు, సన్నం సంతోషంగా/దుఃఖంగా, దయగల, క్రూరమైన, మంచి, చెడు, సోమరి, చురుకు, కోపం గల, ఓర్పుగల, తెలివైన, తెలివిలేని, వాగుడు, ముభావం గల, నిజాయతీ గల,

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 6

నిజాయతీ లేని, నమ్మదగ్గ, నమ్మలేని- ఈ పదాలకు, ఇంకా మీరు చెప్పగల పదాలకు సరైన English మాటలను రాయండి. am, is, are; was, were; shall be, will be పక్కన వాటిని చేర్చి మాట్లాడండి.
పై మాటలకు ఇంగ్లిష్ మాటలు-
tall, short, fat, slim, happy, sad/sorrowful, kind, cruel, good, bad, lazy, active, patient, clever/intelligent/wise, foolish, talkative, reserved, honest, dishonest, reliable, unreliable

**ఇంకో అంశం...**

లెక్కపెట్టేవాటిని English లో countables అంటారు.
**ఉదా:** man, book, student, pen, town, village etc.
వీటికి singular, plural ఉంటాయి. అయితే వీటి singular ముందు ఎప్పుడూ 'a' కానీ, 'an' కానీ రావాలనేది గుర్తుంచుకోవాలి.
I am a student.
He is an engineer.
She is a doctor.
She is an eye surgeon.
He is an uncle of mine.
It is an ox. etc.

ఈ ఇంగ్లీషు మాటలతో Questions కూడా practice చేయండి.
**eg:** Is he happy?
Are they clever? etc.
పైన చెప్పిన మాటలన్నింటికి English మాటలలో question practice చేయండి.
Question structure గుర్తుంది కదా?
**a)** vb+Sub [Are (verb) you (sub) happy?]
**b)** first word of the verb + sub + other words of the verb.
[Has (first word of the verb) he (sub) been helping (other words of the verb) you?]

1. అతడు బాగా పొడుగా?
2. ఆమె అందంగా ఉంటుందా?
3. ఆమె సంతోషంగా ఉంటుందా? (futureలో)
4. వాళ్ళు నిజాయతీగా ఉండే వాళ్లా? (past)
5. వాళ్లిప్పుడు ఇక్కడ ఉంటారు? ?
6. రేపు మీరెక్కడ ఉంటారు?
7. వాడు నిజాయతీ గలవాడని మీకు నమ్మకం ఉందా?
8. అతడు జాగ్రత్తగా ఉంటాడా? (futureలో)?
9. మీరు సంతోషంగా ఉండేవాళ్లా?
10. ఒకప్పుడు ఆమె లావుగా ఉండేదా?

**Answers:**
1) Is he very tall?
2) Is she beautiful?
3) Will she be happy?
4) Were they honest?
5) Where are they now?
6) Where will you be tomorrow?
7) Are you sure that he is honest?
8) Will he be careful?
9) Were you happy?
10) Was she fat once?

ఇంగ్లిష్‌లో గతంలో ఉంటే, was, were. ఇప్పుడు ఉంటే am, is, are గతం నుంచి ఇప్పటి వరకు కానీ, ఇంకా కానీ ఉండడాన్ని చెప్పడానికి have been, has been వాడతాం.
I, we, you, they అయితే have; he, she, it అయితే has వాడతాం.

1. అతడు నాలుగేళ్ల క్రితం ఇక్కడ ఉన్నాడు.
He was here four years ago.
2. అతడు ఇప్పుడిక్కడ ఉన్నాడు.
He is here.
3. అతడు నాలుగేళ్లుగా ఇక్కడే ఉన్నాడు.
He has been here for the past four years.
4. రెండు రోజులుగా బాగా ఎండగా ఉంది.
It has been very hot for the past two days.
5. భారత్ 1947 నుంచి స్వతంత్రంగా ఉంది.
India has been independent since 1947 (for the past 57 years)
6. మేం పదేళ్లుగా హైదరాబాద్‌లో ఉన్నాం.
We have been in Hyderabad for the past ten years (since 1995)
7. ఇంత సేపూ ఎక్కడున్నావు?
Where have you been all this time?
8. మీరు ఎంతకాలంగా ఇక్కడున్నారు?
How long have you been here?
9. పూజ ఇంతకాలం ఎక్కడుంది?
Where has Pooja been all these days?

ఇంగ్లిష్‌లో have been / has been కు చాలా ప్రాముఖ్యం ఉంది. గతంలో ఒకప్పటి నుంచి ఇప్పటి వరకు గానీ, ఇంకాగానీ ఏదైనా ఉంటే ఆ ఉండడాన్ని I, We, you and theyతో అయితే 'have been'తో గానీ he, she, it తో అయితే 'has been' తోగానీ సూచిస్తాం.


M. SURESAN

ఇంకోవిషయం...
గత కొన్ని రోజులుగా/ కొన్ని గంటలుగా/ కొన్ని నెలలుగా/ కొన్ని సంవత్సరాలుగా అంటే for the past (The last)... days/ ... hours/ ... months / ... years (ఖాళీల్లో రోజులు, గంటలు, నెలలు, సంవత్సరాల సంఖ్య.)
**eg:** for the past (The last) 2 days / 2 hours/ 2 months / 2 years
లేదా for 2 days / hours / months / years now అంటాం.
ఫలానా రోజు/ గంట/ నెల/ సంవత్సరం నుంచి అనడానికి since అంటాం.

★ I have been here for the past (last) two years.
I have been here since 2003
★ She has been here for the (last) past two months.
She has been here since February end.




★ India has been independent for the past (last) 57 years.
India has been independent since 1947.

ఈ for the past (last)కు, since కు తేడా చాలా ముఖ్యం. ఈ కింది వాక్యాలు చూడండి.
దుర్గ నిన్న ఇక్కడ ఉంది.
Durga was here yesterday.
దుర్గ ఇప్పుడు ఇక్కడ ఉంది.
Durga is here.
దుర్గ నిన్నటి నుంచి ఇక్కడే ఉంది.
Durga has been here since yesterday.
వాళ్లు మొన్న ఎక్కడున్నారు?
Where were they the day before?
వాళ్ళు ఇప్పుడెక్కడున్నారు?
Where are they?
వాళ్ళు మొన్నటి నుంచి ఎక్కడున్నారు?
Where have they been since the day before?

కింది వాక్యాలకు వీటికి English practice చేయండి.
1. మీరెంత కాలంగా ఇక్కడున్నారు?
2. టెండూల్కర్ ఎంతకాలంగా క్రికెటర్‌గా ఉన్నాడు?
3. ఆయన 2001 నుంచి కలెక్టర్‌గా ఉన్నాడు. (since, for the past రెండూ ఉపయోగించి చెప్పండి.)
4. ఆయన 2001 నుంచి 2003 వరకు ఇక్కడ టీచర్‌గా ఉన్నాడు.
5. చాలాకాలంగా ఢిల్లీ ఇండియాకు రాజధానిగా ఉంది.
6. రెండు రోజులుగా ఆయన నీరసంగా ఉన్నాడు. (నీరసం- Weak)
7. మీరు వారం రోజులుగా బిజీగా ఉన్నారా?
8. ఆయన ఎంత కాలంగా జబ్బుతో ఉన్నారు? (జబ్బు- ill/sick)
9. ఎంత కాలంగా వైఎస్ ముఖ్యమంత్రిగా ఉన్నారు?
10. మీరు చాలా కాలంగా ఇక్కడున్నారా?

**Answers:**
**1.** How long have you been here?
**2.** How long has Tendulkar been a cricketer?
**3.** He has been a collector since 2001/ for the past (last) 4 Years.
**4.** He was a teacher here from 2001 to 2003.
**5.** Delhi has been the capital of India for a long time.
**6.** He has been weak for two days now (for the past/ for the last two days)
**7.** Have you been busy for the past (last) one week?
**8.** How long has he been ill?
**9.** How long has YS been the Chief Minister?
**10.** Have you been here for long?

పై Sentencesలో have been/ has been వాడకం గమనించండి. కొంతకాలం క్రితం నుంచి ఇప్పటి వరకు గానీ, ఇంకాగానీ ఉండడాన్ని have been/ has been తెలియజేస్తాయి. Question structure ఎప్పుడూ verb + subject గానీ, verb లో రెండు మూడు మాటలుంటే, Ist word of the verb + Subject + other words of the verb గానీ ఉంటుంది.




**ప్రశ్న:** జనరల్‌గా 'అమ్మబడును' - 'చేయబడును' - 'నేర్పించబడును' అనే సందర్భాల్లో verb v3 ని ఎందుకు ఉపయోగిస్తారు? ఉదాహరణకు- Milk 'sold' here; Job work 'done' here; 'Spoken' English Institute - ఇలా verb ను v1 కాకుండా v3 ని ఎందుకు ఉపయోగిస్తున్నారో వివరించగలరు.
– రేష్మా, బెల్లంపల్లి

**జవాబు :**
1. verb v3 అంటే past participle: done, spoken, seen etc.
passive form లో verb ఎప్పుడూ, 'be' form + past participle.
'Milk sold here' అనేది, 'Milk is sold here' కు short form.
ఇక్కడ verb 'is (be form) + sold (past participle of sell)' కు అర్థం- అమ్మబడుతుంది.
అలాగే 'Job work done here' అంటే 'Job work is done here' అని అర్థం. is done, (passive) అంటే చేయబడును అని. (is - be form + done - past participle).
2. past participle (p.p.) కు ఇంకో అర్థం 'బడిన', 'బడే' అని.
**eg:** The man seen here every day - ఇక్కడ చూడబడే వ్యక్తి. torn paper - చింపబడిన కాగితం. అలాగే spoken english అంటే మాట్లాడబడే ఇంగ్లిష్ అని అర్థం.
ముఖ్యంగా మనం రోజూ మాట్లాడే తెలుగులో passive voice వాడం.
'అమ్మా, అన్నం వండబడిందా?' అనం కదా! అలాగే 'చింపబడ్డ కాగితం' అని కూడా అనం. 'చినిగిన కాగితం' అంటాం.

**మీరూ రాయండి!**
స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను
**స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82**
చిరునామాకు పంపించవచ్చు.
**email:** pratibha@ eenadu.net




# A, AN... ఎందుకు గందరగోళం?

**Sudha:** I meet Padmaja here everyday. I miss her today.
(రోజూ ఇక్కడ పద్మజను కలుస్తాను. ఈ రోజు కనిపించలేదు.)

**Valli:** Yes. She comes here everyday. I too see that.
(ఆమె రోజూ ఇక్కడకు వస్తుంది. నేను కూడా చూశాను (ప్రతిరోజు))

**Sudha:** I remember now. Today is Sunday. She does not come here on sunday.
(నాకు గుర్తొస్తోంది. ఈ రోజు ఆదివారం. ఆమె ఆదివారాలు ఇక్కడకు రాదు.)

**Valli:** I do not know that.
(నాకు తెలియదు.)

**Sudha:** She goes to her aunt's place every sunday. I too visit my cousin every sunday evening.
(ఆమె ఆదివారాలు వాళ్ల అత్తయ్య ఇంటికి వెళుతుంది. నేను కూడా ఆదివారం సాయంత్రం మా కజిన్ ఇంటికి వెళతాను.)

be forms లాగా ఉండడాన్ని తెలపడం కాకుండా పై వాక్యాల్లోని meet, comes, remember, does come, goes, visit పదాలు పనులను తెలియజేస్తాయి.




పనులను తెలిపే ఈ కింది మాటలు చూడండి.

| I Regular Doing Words A | II Regular Doing Words B |
|---|---|
| eat | eats (eat+s) |
| take | takes (take+s) |
| give | gives (give+s) |
| wash | washes (Wash+es) |
| like | likes (like+s) |
| sing | sings (Sing+s) |
| dance | dances (dance+s) |
| go | goes (go+es) |

'A' కింది మాటలను I Regular Doing Words, B కింది మాటలను II Regular Doing Words అంటాం. I Regular Doing Words కు (A కింది మాటలకు) 's' కానీ 'es' కానీ చేరిస్తే II Regular doing words వస్తాయి.

A కింది మాటలు [I Regular Doing Words (I RDWs)], I, We, you and they తో వాడతాం. B కింది మాటలను [II Regular Doing Words (II RDWs)] He, She, itతో వాడతాం.

I / We / You / My parents (They) } like milk

My father (he) / My mother (she) / The Cat (it) } likes milk

పైన చూపిన విధంగా A group కు పది Verbs, B group కు పది verbs చెప్పండి.

**eg:** తాగడం

I / We / You / They } drink coffee

He / She / It } drinks coffee

అలాగే ఈ కింది అర్థాలు వచ్చే విధంగా మాటలు చెప్పండి.

రాయడం, ఆడడం, నడవడం, పరుగెత్తడం, వండడం, ప్రేమించడం, నిద్రించడం, వృథా చేయడం, ఉపయోగించడం, గుర్తుంచుకోవడం, మరచిపోవడం- ఇంకా మీరు ఎన్ని పనుల మాటలు చెప్పగలిగితే అన్నిటితో practice చేయండి.

**Answers :**

I / We / You / The boys (They) } write, play, walk, run, cook, love, sleep, waste, use, remember, forget

Hemant (he) / Sarala (she) / It (అర్థం సరిపోయేట్లుగా) } writes, plays, walks, runs, cooks, loves, sleeps, wastes, uses, remembers, forgets

వీటిని పరిశీలించండి.

**a)** Pens (They) write.
A pen (It) writes.

**b)** Wrist watches (They) show the time.
A wrist watch (It) shows the time.

**c)** Doctors (They) treat patients.
A doctor (He/She) treats patients.

**d)** Fans (They) give air.
A fan gives air.

**e)** Teachers (They) teach.
A Teacher (He/She) teaches. ఇలా అన్ని verbs కు practice చేయండి.


M. SURESAN

## COUNTABLES, UNCOUNTABLES

**a)** countables అంటే లెక్క పెట్టేవి.
book, pen, teacher, boy, dog etc.

**b)** uncountables అంటే లెక్కపెట్టలేనివి.
milk, sugar, rice, water etc.

**c)** countables కు మాత్రమే singular (ఒకటి), plural (ఒకటి కంటే ఎక్కువ) ఉంటాయి.

| | |
|---|---|
| book (singular) | books (plural) |
| pen (singular) | pens (plural) |
| teacher (singular) | teachers (plural) |
| boy (singular) | boys (plural) |

**d)** uncountables కు plural ఉండదు. milks, sugars, rices అనం.

**e)** *Very Important:* countable singulars (అంటే లెక్కపెట్టేవి- ఒకదాన్ని, ఒకరిని గురించి చెప్పేటప్పుడు) ముందు ఎప్పుడూ 'a' కానీ 'an' కానీ రావాల్సిందే.

**eg:**

1) A doctor treats patients (doctor - countable, singular).
2) I have an idea (idea - countable, singular).
3) An umbrella is useful in rain (umbrella- countable, singular).
4) A pen is for writing (pen- countable, singular)

'a' ఎప్పుడు? 'an' ఎప్పుడు?

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఒ, ఓ, ఔ- ఈ తెలుగు శబ్దాలతో ప్రారంభమయ్యే వాటి ముందు 'an' వాడాలి. మిగతా మాటల ముందు 'a' ఉపయోగించాలి.

an umbrella (అంబ్రెలా - కాబట్టి an)
an hour (అవర్ - an)
an honour (ఆనర్ - an)
an idea (ఐడియా - an)
an owl (ఔల్ -an)
an egg (ఎగ్ - an)

ఈ సూత్రం పాటిస్తే a, an విషయంలోconfusion ఉండదు.

మిగతా శబ్దాల ముందంతా a వాడండి.

countable singular ఎక్కడ వచ్చినా దాని ముందు a కానీ an కానీ ఉండాల్సిందే.

Mother loves her child (wrong)
A Mother (countable singular) loves her child.

**f)** Uncountable ముందు a కానీ an కానీ ఎప్పుడూ రాదు.

మళ్లీ ఒకసారి 1st RDW (1st Regular doing word అంటే come, go, walk), 2nd RDW (2nd Regular doing word అంటే comes, goes, walks) లను పరిశీలిద్దాం.

I, We, you, they అయితే 1st RDW;
he, she, it అయితే 2nd RDW వాడాలి.

ఈ రెండు Regular doing words క్రమం తప్పకుండా, నిత్యం జరిగే పనులకు వాడతాం- అంటే Regular actions కు. ఎప్పుడూ జరిగే పనులకు కూడా వీటినే వాడతాం.

1) నేను రోజూ ఆరింటికి నిద్రలేస్తాను.
ఇది regular action. కాబట్టి I get up at 6 a.m. ఇక్కడ every day అని చెప్పినా, చెప్పకపోయినా ఒకటే. get అనే 1st RDW లోనే regular అనేది అర్థమవుతుంది.

2) మేం తొమ్మిదింటికి కళాశాలకు బయలుదేరతాం.
We start for college at 9 a.m.
(Regular action - start - 1st RDW)

3) మా స్నేహితులు బాగా ఆడతారు.
ఇది regular action.
Our friends (They) play well.

4) మీరెప్పుడూ ఆలస్యంగా వస్తారు.
(ఎప్పుడూ జరిగేపని).
You always come late.

5) మా నాన్నగారు ఉదయం 9కి ఆఫీస్‌కు బయలుదేరతారు (Regular- ప్రతిరోజూ).
My father (He) starts for office at 9 a.m. (everyday అని చెప్పాల్సిన అవసరం లేదు. starts అంటేనే regular)

6) మా అమ్మ వండుతుంది (ఎప్పుడూ).
My mother (She) cooks for us.

7) 1st show ఆరుంబావుకు ప్రారంభం అవుతుంది (రోజూ కదా).
The 1st show (It) starts at 6.15 p.m.

**మీరూ రాయండి!**
స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను
**స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82**
చిరునామాకు పంపించవచ్చు.
**email:** pratibha@ eenadu.net

కింది regular actions ను English లో చెప్పండి.

1. ఆమెకు ఈ డ్రెస్ చాలా ఇష్టం. (like వాడండి)
2. నేను రోజూ 'ఈనాడు' చదువుతాను.
3. మా తరగతులు ఉదయం పదిగంటలకు ప్రారంభం అవుతాయి.
4. మా అమ్మ టీవీ సీరియల్స్ చూస్తుంది.
(watch - సీరియల్స్, సినిమాలు చూడడం)
5. మా నాన్నగారు రోజు ఆరింటికి ఇంటికి తిరిగివస్తారు. (return, come back; ఇంటికి- 'home')



6. ప్రతిరోజూ ఉదయం గంట సేపు చదువుతాను.
(study; for an hour, every morning)
7. మా అమ్మ కాఫీ తాగుతుంది.
(ప్రతిరోజూ - అలవాటు - regular)

**Answers:**

1. She likes this dress.
2. I read the Eenadu (every day).
3. Our classes (They) begin / start at 10 a.m.
4. My mother (She) watches TV serials.
5. My father (He) returns / comes back home at 6 a.m.
6. I study for an hour every morning.
7. My mother (She) takes coffee (every day).




**ప్రశ్న:** Oxford advanced dictionary లో word పక్కన ఇస్తున్న pronunciationలో letters కొన్ని అడ్డంగా, కొన్ని తలకిందులుగా ఉంటాయెందుకు? వీటిని ఎలా ఉచ్చరించాలి? అందుకేమైనా నియమాలుంటాయా? Dictionary page bottom line కింద కూడా ఇలాగే ఉంటాయి. వీటి గురించి తెలియజేయండి.

*– రమాదేవ్, హైదరాబాద్.*

**జవాబు :** ఇంగ్లిష్‌లోని అక్షరాలు (alphabet), ఇంగ్లిష్ ఉచ్చారణలో వచ్చే శబ్దాలన్నింటికీ సరిపోవు. అందువల్లే pronunciationలో అంత confusion. ఉన్న అక్షరాలు అన్ని శబ్దాలను సూచించడానికి సరిపోవు. కాబట్టి తలకిందులుగా, అడ్డంగా ఉన్న అక్షరాలను కొన్ని శబ్దాల కోసం వాడతారు. అలా ఉండే అక్షరాలు కొన్ని శబ్దాలకు గుర్తులు.

'v'ని veryలో 'వె' శబ్దానికి వాడతారు. తలకిందులుగా ఉన్న v = 'ʌ' ని but, shut, cut లాంటి మాటల్లో వచ్చే 'అ' శబ్దానికి వాడతారు. but- దీని pronunciation, dictionary లో ఇలా ఉంటుంది. b^t; cut = k^t etc. డిక్షనరీలో key to Pronunciation లో చూస్తే ఏ గుర్తు ఏ శబ్దానికి అనేది వివరంగా ఉంటుంది. వాటితోబాటు pronunciation casettes, CDs ఉపయోగపడతాయి.

**ప్రశ్న:** 'ఎప్పుడైనా మోసేవారి మీదనే ఇంకాస్త భారం పడుతుంది' అని చెప్పడానికి ఇంగ్లిష్‌లో సమానమైన proverb ఉంటే తెలియజేయండి.

*– ఎం. మోహన్‌రావు, హన్మకొండ.*

**జవాబు :** మీరన్నదానికి సమానమైన proverb ఏదీ Englishలో లేదు.




# పట్టు తెలిపే పదాలు!




**Ramu:** Do you know Mr. venu?
(నీకు వేణు తెలుసా? )
**Vasu:** Of course, I know him.
(అవును నాకు తెలుసు)
**Ramu:** How do you know him?
(అతను నీకు ఎలా తెలుసు? )
**Vasu:** We work in the same department. But he works in another section.
(మేం ఒకే డిపార్టుమెంట్లో వర్క్ చేస్తున్నాం. కానీ అతను వేరే సెక్షన్లో పనిచేస్తాడు)
**Ramu:** Which section does he work in?
(అతను ఏ సెక్షన్లో పని చేస్తాడు? )
**Vasu:** Why do you want to know all this?
(నువ్వు ఈ వివరాలు ఎందుకు తెలుసుకోవాలనుకుంటున్నావు? )

పై సంభాషణ గమనించండి. Question లలో do, does వస్తున్నాయి. వీటి వాడకం తెలుసుకోవడం Englishలో చాలా ముఖ్యం.

Regular doing words (1st RDW, 2nd RDW) - come, comes; go, goes- ఇలాంటివి not లో, question లో వాడేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. మనకి ఇంగ్లిష్‌పై పట్టు ఉందా లేదా అనే విషయం ఇలాంటి మాటల్లో తెలుస్తుంది.

నేను కళాశాలకు ప్రతి రోజూ ఉదయం తొమ్మిదింటికి వెళతాను.
I go to college at 9 AM.
నేను ఉదయం తొమ్మిదింటికి వెళ్లను- అనాలంటే
I do not (don't) go to college at 9 AM.
ప్రతి రోజూ వాళ్లు నన్ను కలుసుకుంటారు.
They meet me every day.
వాళ్లు కలుసుకోరు.
They do not meet me every day.

'not' వాడినప్పుడు (వ్యతిరేకంగా చెప్పడానికి), question అడిగేటప్పుడు 1st RDW (come, go లాంటివి)తో 'do' వస్తుంది.

M. SURESAN

కొన్ని ఇలాంటి వాక్యాలు–

1) I go there every Sunday.
   a) I do not go there every Sunday.
   b) Do I go there every Sunday?
2) They speak Telugu.
   a) They do not speak Telugu.
   b) Do they speak Telugu?

(1) లో go not తో వాడినప్పుడు 1 (a) లో do go అవుతుంది. Question 1 (b)లో కూడా do go అవుతోంది.

అలాగే (2)లో Speak notతో వాడినప్పుడు 2(a)లో, questionగా 2(b)లో do speak అవుతోంది.

3) We like mangoes
   a) We do not like mangoes
   b) Do we like mangoes?

ఇక్కడ కూడా like notతో కానీ questionలో కానీ వాడినప్పుడు do like అవడం గమనించండి.

కాబట్టి 1 RDW + not/?= do + 1st RDW.

అంటే1st Regular Doing Words (come, go లాంటివి)ని not తో questionలో వాడినపుడు do + 1st RDW అవుతుంది.

ఈ కిందివాటికి not తో వ్యతిరేకాలు, questions practice చేయండి. కొన్ని ఉదాహరణలు...

1. వాళ్లకు ఇంగ్లిష్ తెలుసు.
   They know English.
   వాళ్లకు ఇంగ్లిష్ తెలియదు.
   They do not know English.
   వాళ్లకు ఇంగ్లిష్ తెలుసా?
   Do they know English?
   (Question Structure గుర్తుంది కదా - 'verb' ఎప్పుడూ ముందు)
2. నువ్వెపుడూ ఆలస్యంగా వస్తావు.
   You always come late.
   నువ్వెప్పుడూ ఆలస్యంగా రావు. (not)
   You do not come late.
   నువ్వెపుడూ ఆలస్యంగా వస్తావా?
   Do you always come late?
3. అతడి స్నేహితులు అతడికి సాయం చేస్తారు.
   His friends help him.
   అతడి స్నేహితులు అతడికి సాయం చేయరు.
   His friends do not help him.
   అతడి స్నేహితులు అతడికి సాయం చేస్తారా?
   Do his friends help him?

know = do know
come = do come
help = do help

అవడం పై వాక్యాల్లో గమనించండి.

ఈ కింది తెలుగు వాక్యాలను Englishలో practice చేయండి.

1. వాళ్లిక్కడికి రోజూ వస్తారు.
   వాళ్లిక్కడికి రోజూ రారు.
   వాళ్లిక్కడికి రోజూ వస్తారా?
2. నువ్వు వాడిని రోజూ కలుసుకుంటావు.
   నువ్వు వాడిని రోజూ కలుసుకోవు.
   నువ్వు వాడిని రోజూ కలుసుకుంటావా?
3. మేం బాగా పాడతాం.
   మేం బాగా పాడం.
   మేం బాగా పాడతామా?
4. నాకు ఇంగ్లిష్ తెలుసు.
   నాకు ఇంగ్లిష్ తెలియదు.
   మీకు ఇంగ్లిష్ తెలుసా?
5. ఈ టీచర్లు బాగా బోధిస్తారు.
   ఈ టీచర్లు బాగా బోధించరు.
   ఈ టీచర్లు బాగా బోధిస్తారా?
6. మేం ఇంగ్లిష్ సినిమాలు చూస్తాం.
   మేం ఇంగ్లిష్ సినిమాలు చూడం.
   మీరు ఇంగ్లిష్ సినిమాలు చూస్తారా?
7. ఇక్కడ డాక్టర్లు బాగా వైద్యం చేస్తారు.
   (వైద్యం చేయడం = treat)
   ఇక్కడ డాక్టర్లు బాగా వైద్యం చేయరు.
   ఇక్కడ డాక్టర్లు బాగా వైద్యం చేస్తారా?
8. వాళ్లు బాగా నటిస్తారు.
   వాళ్లు బాగా నటించరు.
   వాళ్లు బాగా నటిస్తారా?

**Answers:**

**1.** They come here daily.
   They do not come here daily.
   Do they come here daily?
**2.** You meet him every day.
   You do not meet him every day.
   Do you meet him everyday?
**3.** We sing well.
   We do not sing well.
   Do we sing well?
**4.** I know English.
   I do not know English.
   Do you know English?
**5.** These teachers teach well.
   These teachers do not teach well.
   Do these teachers teach well?
**6.** We watch English movies.
   We do not watch English movies.
   Do you watch English movies?
**7.** The doctors here treat well.
   The doctors here do not treat well.
   Do the doctors here treat well?
**8.** They act well.
   They do not act well.
   Do they act well?

Englishలో what, where, when, which, whose, whom and whyతో కూడా questions అడుగుతాం కదా? వీటిని 'wh' words అంటారు. వీటితో అడిగే questions 'wh' questions. ఈ 'wh' మాటలతో అంటే 'wh' questionsకు కూడా 1 st RDWతో do + 1 st RDW వస్తుంది.

1. మీకేం తెలుసు?
   What do you know?
2. మీరెక్కడుంటారు?
   Where do you live?
3. వాళ్లెలా పాడతారు?
   How do they sing? (How = ఎలా? )
   **Ans:** బాగా పాడతారు.
   They sing well
4. మీరెందుకు ఎప్పుడూ ఆలస్యంగా వస్తారు?
   Why do you always come late?
   **Ans:** I miss the bus.
5. మీరు కళాశాలకు ఎప్పుడు బయల్దేరతారు? (రోజూ)
   When do you start for college? (every day)
   **Ans:** I start at 9 AM.
6. ఎందుకు టైం వేస్ట్ చేస్తావు?
   Why do you waste time?
   **Ans:** నేనేం వేస్ట్ చేయడంలేదు.
   I do not waste time.

ఈ కింది questions English లో practice చేయండి.

1. వాళ్లు రోజూ ఇక్కడికి ఎందుకు వస్తారు?
2. మీరు అన్ని సినిమాలెందుకు చూస్తారు?
3. మీరు మామూలుగా పుస్తకాలెక్కడ కొంటారు?
4. వాళ్లు ఏ పత్రిక చదువుతారు?
5. ఎప్పటి నుంచి మీ సెలవులు?
6. మీరెంత సంపాదిస్తారు?
7. వాళ్లు రోజూ ఇక్కడికి ఎప్పుడొస్తారు?
8. ప్రతి ఆదివారం నువ్వెవరిని కలుసుకుంటావు?
9. ఎలాంటి సినిమాలు నీకిష్టం?
10. మీరు పచారీ సరుకులు మామూలుగా ఎక్కడ కొంటారు?

పై questions కు ప్రతిదానికీ సమాధానాలు కూడా రాయండి.

**Answers:**

**1.** Why do they come here every day?
   **Ans:** They come here to see me.
**2.** Why do you watch so many movies?
   **Ans:** I watch them because I like them.
**3.** Where do you buy books usually?
   **Ans:** I buy them at that stall.
**4.** What newspaper do they read?
   **Ans:** They read the Eenadu.
**5.** When do your holidays begin?
   **Ans:** They usually begin in April 3rd week.
**6.** How much do you earn?
   **Ans:** Why do you want to know?
   (మీరెందుకు తెలుసుకోవాలనుకుంటున్నారు? )
**7.** When do they come here every day?
   **Ans:** They come here at 7 PM
**8.** Whom do you meet every sunday?
   **Ans:** I meet my friend.
**9.** What kind of movies do you like?
   **Ans:** I like suspense movies.
**10.** Where do you buy provisions usually?
   **Ans:** I buy them at that shop.

## మీరూ రాయండి!

స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను **స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82** చిరునామాకు పంపించవచ్చు.

**email:** pratibha@ eenadu.net

## Q A

**ప్రశ్న:** standard డిక్షనరీని ఎలా రిఫర్ చేయాలి? ఏదైనా ఒక Word ను త్వరగా వెతికిపెట్టే శాస్త్రీయపద్ధతి తెలియజేయండి. అలాగే Key to dictionary entries అంటే ఏమిటి?

*– శైలజ, కరీంనగర్*

**జవాబు:** ఏ Standard dictionary లో అయినా ఒక Word ను వెతికిపెట్టే పద్ధతి ఒకటే. అదే Alphabetical order లో refer చేయడం. తేలిగ్గా refer చేయాలంటే ఈ కింది అంశాలను తెలుసుకోవాలి.

- English alphabetలో అక్షర క్రమం a-z వరకు తెలియాలి.
- వెతికే పదం Spelling కూడా కచ్చితంగా తెలిసి ఉండాలి. ఒకవేళ మన స్పెల్లింగ్ తప్పయితే పదం దొరకదు. అలాంటప్పుడు ప్రత్యామ్నాయ Spellings ను ఊహించుకొని వెతకాలి. existence అనే పదం spelling ను మనం పొరపాటుగా existance అనుకుని వెతికితే ఈ పదం Dictionary లో దొరకదు. అలాంటప్పుడు a బదులు e ప్రత్యామ్నాయంతో వెతకడం తరువాతి దశ.
- Word ను వెతికిపెట్టే శాస్త్రీయ పద్ధతి ఉంది. మనకు అక్షరక్రమం గుర్తుండేదాన్ని బట్టి త్వరగా పదం దొరకడం ఆధారపడి ఉంటుంది.
- మొదట ప్రతి పేజీపైన ఉన్న Lead Word చూసుకోవాలి.
- ఇకSpelling ను బట్టి వెతకాలి.

**Key to dictionary entries** అంటే అర్థం డిక్షనరీలో ఇచ్చే మాటకు సంబంధించిన వివరాలు. అవి-

★ ఆ మాట Pronunciation
★ parts of speech
★ ఏయే parts of speech లో, ఏయే రకమైన Print లో, అక్షరాల Type లో ఉంది.
★ ఒకవేళ Parts of speech Noun, Verb లు అయితే వాటిలో ఏ రకాన్ని ఎలా సూచిస్తోంది.
★ అదే మాటతో వచ్చే Idiomకు ఇచ్చే గుర్తు, వాటికిSynonyms, antonyms ఎలా తెలిపారు.

...తదితరాలు. వీటిని Key to dictionary entries వివరిస్తాయి.

ఈ విధానం డిక్షనరీ వినియోగాన్ని అత్యంత సరళతరం చేస్తుంది.




# Does ఎప్పుడొస్తుంది?

**Raghu:** Does your friend meet you regularly?
(మీ ఫ్రెండ్ నిన్ను రెగ్యులర్‌గా కలుస్తాడా?)

**Ramu:** Which friend? (ఏ ఫ్రెండ్?)

**Raghu:** Seshu (శేషు)

**Ramu:** Yes, he meets me regularly. But he does not meet me on sundays.
(అవును. రెగ్యులర్‌గా కలుస్తాడు కానీ ఆదివారం మాత్రం కలవడు.)

**Raghu:** Why does he not (doesn't he) meet you on sundays?
(ఆదివారాలు ఎందుకు కలవడు?)

**Ramu:** He does not move out of home on sunday.
(అతను ఆదివారం ఇల్లు కదలడు.)




పై సంభాషణ చూశారు కదా! 2nd RDW meets question లో not తో does meet అవుతోంది. అలాగే does move అంటే moves (not తో వచ్చినప్పుడు).

Come, go, Walk లాంటి 1st RDWs (Regular Doing Words)ను notతో, questionsలో వాడినప్పుడు do వస్తుందని తెలుసుకున్నాం.

**eg:**

1) They come here everyday.
a) they do not come here every day.
b) Do they come here every day?

2) You come here often.
a) You do not come here often.
b) Do you come here often?

ఇలాగే ఇప్పుడు 2nd Regular Doing Words- comes, goes, walks, talks లాంటి verbs ను not తోకానీ, question లోకానీ వాడినప్పుడు 'does' వస్తుంది. 2nd RDWs- he, she, it తోనే వాడతాం. కాబట్టి 'does' కూడా he, she, itతోనే ఉపయోగించాలి.

1) Sunita (She) sings well.
2nd RDW
a) Sunita does not sing well.
2nd RDW
ఇక్కడ verb 'does sing' - not తో.
b) Does Sunita sing well?
ఇక్కడ కూడా verb 'does sing' - question లో.
అంటే ఇక్కడ sings + not/? = does sing
sings ను not తో కానీ, question లో కానీ వాడినప్పుడు 'does sing' అవుతోంది.

M. SURESAN

2) Kumar (he) knows English.
a) Kumar does not know English.
b) Does Kumar know English?
(గమనించారు కదా! knows + not/? = does know)

3) Hari likes music.
a) Hari does not like music.
b) Does Hari like music?

ఇలా 'not' తో questionsలో మరికొన్ని 2nd RDWs రూపాలు చూడండి.

1) works (+ not) = does not work;
Q: Does (he) work?
2) takes (+ not) = does not take;
Q: Does (she) take?
3) finds (+ not) = does not find;
Q: Does (Sunil) find?
4) goes (+ not) = does not go;
Q: Does (Sita) go?

ఇలా గుర్తుంచుకోండి.
takes = does take (with not/?)
comes = does come (with not/?)
writes = does write (with not/?)

ఇప్పుడు ఈ కింది వాటిని practice చేయండి. ఇవి 1st RDW, 2nd RDW రెండింటికీ సంబంధించినవి. అంటే కొన్ని సందర్భాల్లో 'do', మరి కొన్ని సందర్భాల్లో 'does' వాడాల్సి ఉంటుంది. జాగ్రత్తగా




గమనించి practice చేయండి.

**eg:**

1. a) నేను 11 పి.ఎం. కి పడుకుంటాను.
I go to bed at 11 PM.
b) నేను 11 పి.ఎం. కి పడుకోను.
I do not go to bed at 11 PM.
c) మీరెన్నింటికి పడుకుంటారు?
When do you go to bed?

2. a) ఉష బాగా ఆడుతుంది.
Usha plays well.
b) ఉష బాగా ఆడదు.
Usha does not play well.
c) ఉష బాగా ఆడుతుందా?
Does Usha play well?

ఈ కింది వాక్యాలను ప్రాక్టీస్ చేయండి.

1. a) ఆనందరావు బాగా బోధిస్తారు.
b) ఆనందరావు బాగా బోధించరు.
c) ఆనందరావు బాగా బోధిస్తారా?

2. a) వాళ్లు ఇతరులకు సహాయం చేస్తారు.
b) వాళ్లు ఇతరులకు సహాయం చేయరు.
c) వాళ్లు ఇతరులకు సహాయం చేస్తారా?

3. a) రావుగారు ఇక్కడికి రోజూ వస్తారు.
b) రావుగారు ఇక్కడికి రోజూ రారు.
c) రావుగారు ఇక్కడికి రోజూ వస్తారా?

4. a) మేం ఉదయం ఒక గంట టీవీ చూస్తాం.
b) మేం ఉదయం ఒక గంట టీవీ చూడం.
c) మీరు రోజూ టీవీ ఎప్పుడు చూస్తారు?

5. a) రోజూ ఉదయం 6 గంటలకు పేపర్ వస్తుంది.
b) రోజూ ఉదయం 6 గంటలకు పేపర్ రాదు.
c) రోజూ ఎన్నింటికి పేపర్ వస్తుంది?

6. a) వాళ్లకు ఆయన బోధన బాగా అర్థమవుతుంది.
b) వాళ్లకు ఆయన బోధన బాగా అర్థం కాదు.
c) వాళ్లకు ఆయన బోధన ఎంత బాగా అర్థమవుతుంది?

7. a) మీరు రోజూ పేపర్ చదువుతారు.
b) మీరు రోజూ పేపర్ చదవరు.
c) మీరు రోజూ ఏ పేపర్ చదువుతారు?

8. a) ఆమె ఆదివారాలు వాళ్ల ఫ్రెండ్స్ ఇంటికి వెళుతుంది.
b) ఆమె ఆదివారాలు వాళ్ల ఫ్రెండ్స్ ఇంటికి వెళ్లదు.
c) ఆమె వాళ్ల ఫ్రెండ్స్ ఇంటికి ఎంత తరచుగా వెళుతుంది?

9. a) ఆమెకు అతనంటే ఇష్టం.
b) ఆమెకు అతనంటే ఇష్టం లేదు.
c) ఆమెకు అతనంటే ఎందుకంత ఇష్టం?

10. a) అతను ప్రతివారం వైజాగ్ వెళతాడు.
b) అతను ప్రతివారం వైజాగ్ వెళ్లడు.
c) అతను ప్రతివారం వైజాగ్ ఎందుకు వెళతాడు?

11. a) మేం కాఫీ తీసుకుంటాం.
b) మేం కాఫీ తీసుకోం.
c) మీరేం తీసుకుంటారు, కాఫీయా టీయా?

**ANSWERS:**

1. a) Mr Ananda Rao teaches well.
b) Mr Ananda Rao does not teach well.
c) How does Mr Ananda Rao teach?

2. a) They help others.
b) They do not help others.
c) Do they help others?

3. a) Mr Rao comes here every day.
b) Mr Rao does not come here every day.
c) Does Mr Rao come here every day?

4. a) We watch the TV for an hour every morning.
b) We do not watch TV for an hour every morning.
c) When do you watch the TV every day?

5. a) The paper comes every day at 6 AM.
b) The paper does not come here at 6 AM.
c) When does the paper come?

5. a) We get the paper at 6 AM
b) We do not get the paper at 6 AM
c) When do you get the paper?

6. a) They understand his teaching well.
b) They do not understand his teaching well.
c) How well do they understand his teaching?

7. a) You read the paper every day.
b) You do not read the paper everyday.
c) What paper do you read everyday?

8. a) She goes to her friends' on Sundays.
b) She does not go to her friends' on Sundays.
c) How often does she go to her friends'?

9. a) She likes him.
b) She does not like him.
c) Why does she like him so much?

10. a) He goes to Vizag every week.
b) He does not go to Vizag every week.
c) Why does he go to Vizag every week?

11. a) We take coffee.
b) We do not take coffee.
c) What do you take, coffee or tea?

## మీరూ రాయండి!



స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను **స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82** చిరునామాకు పంపించవచ్చు.
**email:** pratibha@ eenadu.net




**ప్రశ్న:** మిక్స్‌డ్ టెన్స్ వాడాల్సి వచ్చినప్పుడు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి.

1. I know you've stolen my book.
ఇదే వాక్యాన్ని ఇలా రాయవచ్చా?
2. I knew you had stolen my book.
3. I Knew you stole my book
4. I have just Know (that) you've stolen my book.
5. I know (that) you stolen my book yesterday.
6. I knew that you had stolen my book yesterday.

పై వాక్యాలు ఏ సందర్భంలో వాడాలి. ఈ వాక్యాలు సరైనవా కావా? simple present కు present perfect combination సరైనదేనా? అలాగే simple past కి past perfect సరైనదేనా? simple pastకి simple past సరైనదా? just వంటి recent actionsకి present perfect + present perfect సరైనదా వివరించగలరు.

– యం. ఆకాంక్ష, తెర్నేకల్, కర్నూలు

**జవాబు:** I know you have stolen my book
దీని అర్థం- నువ్వు నా పుస్తకం దొంగిలించావని నాకు తెలుసు.
ఇందులో దొంగిలించింది గతంలో అయినా తెలిసింది ఇప్పుడు.
I knew you had stolen my book.
నీవు నా పుస్తకం దొంగిలించావని నాకు తెలుసు.
ఇక్కడ దొంగిలించడమూ గతమే. తెలియడమూ గతమే.
I Knew you stole my book.
ఏదో ఒక సందర్భాన్ని బట్టి దీనికి అర్థం రావచ్చేమో కానీ మామూలుగా అయితే ఈ వాక్యం తప్పు. ఈ వాక్యాన్ని ఇలా రాయవచ్చు-
I knew you had stolen my book.
ఇక్కడ రెండు పనులూ past లో ఒకటి ముందు, ఇంకోటి తర్వాత జరిగాయి కాబట్టి knew, had stolen వాడాలి.
Simple Present, Present perfect combination సరైనదే. మీరు రాసిన మొదటి వాక్యం అదే.
I Know (simple present) you've stolen (present perfect).
simple past, past perfect combination ఉన్న రెండు, అయిదు వాక్యాలు కరెక్ట్.
నాలుగో వాక్యం కూడా సరైనదే.

**eg:**
I have just noticed that he has not attended class for the past two days.
have noticed, have attended రెండూ present perfect లే కదా! ఇలా రెండూ వాడొచ్చు.




# అచేతనాలకు of




M. SURESAN

క్రమం తప్పకుండా జరిగే, చేసే పనులకు 1st RDW (Regular Doing Words- come, go) లాంటివి, 2nd RDW (Regular Doing Words- comes, goes) లాంటివి వాడతాం. 1st RDW ను 'not' తో గాని, questionలో గానీ వాడితే 'do', 2nd RDW ను 'not' తోగాని, question లోగాని వాడితే 'does' వస్తుంది అని తెలుసుకున్నాం.

**Ravi:** Hello Ramana when did you return from Vizag?
(రమణ, వైజాగ్ నుంచి ఎప్పుడు తిరిగొచ్చారు?)

**Ramana:** I returned yesterday.
(నిన్న తిరిగొచ్చాను.)

**Ravi:** Why did you go to Vizag?
(వైజాగ్ ఎందుకు వెళ్లారు?)

**Ramana:** I went there to attend a marriage the day before.
(ఒక పెళ్లికి హాజరయ్యేందుకు మొన్న అక్కడికి వెళ్లాను.)

**Ravi:** How did the marriage go off?
(పెళ్లి ఎలా జరిగింది?)

**Ramana:** Oh, it went off very well.
(పెళ్లి చాలా బాగా జరిగింది.)

పై సంభాషణ గమనించండి. return (yesterday), went (day before), went (also day before) ఇవన్నీ కూడా గతంలో జరిగిన పనులు. ఎప్పుడు (yesterday, day before) జరిగాయో కూడా మనకు తెలుసు.

past actions కు (గతంలో జరిగిపోయిన పనులకు ఏ రోజు, ఏ నెల, ఏ సంవత్సరం అని కచ్చితంగా తెలిసినప్పుడు) వాడే verb - past doing word. ఈ కింది వాక్యాలు చూడండి.

**A**

1) He comes here every day.
(ప్రతిరోజూ) regular action

2) I go to movies every sunday.
ఇది regular కాబట్టి 'go'

**B**

1) He came here yesterday.
(అతను నిన్న వచ్చాడు)
(past action కదా, నిన్న అంటే? నిన్న అని టైమ్ కూడా చెబుతున్నాం కాబట్టి came)

2) He went to a movie last night.
ఇది నిన్న రాత్రి అంటే గతంలో ఓ ఫలానా టైమ్‌లో జరిగిందని చెబుతున్నాం కాబట్టి went.

ఈ కింది పట్టిక చూడండి.

**Regular actions**
(క్రమం తప్పకుండా జరిగేవి)
Regular Doing Words

| I RDW (I, We, You & they) | II RDW (He, She & It) |
|---|---|
| go | goes |
| see | sees |
| come | comes |
| know | knows |
| tell | tells |
| teach | teaches |
| write | writes |
| sing | sings |
| keep | keeps |
| learn | learns |
| walk | walks |

**Past actions, Time stated**
(గతంలో ఓ టైమ్‌లో జరిగినవి)
Past Doing Words

| | |
|---|---|
| went | saw |
| came | knew |
| told | taught |
| wrote | sang |
| kept | learnt |
| walked | |

ఇలాగే ఈ కింది అర్థాలు వచ్చే English verbs కి, Regular Doing Words, Past Doing Words practice చేయండి.

**eg:** తినడం - eat (I RDW), eats (II RDW), ate (Past Doing Word- PDW).

కూర్చోవడం, నిలబడడం, నిద్రించడం, కలగనడం, అర్థం చేసుకోవడం, కొనడం, తేవడం, సిద్ధపడడం, మెచ్చుకోవడం, నాట్యం చేయడం, నటించడం, ఆడడం, విశ్రాంతి తీసుకోవడం, పనిచేయడం, వృథా చేయడం, వాడడం, పాడు చేయడం, కట్టడం, నివసించడం, బతకడం.

### ఏం తెలుసుకున్నాం?

Let's go over what we've learnt so far.
ఇంతవరకూ నేర్చుకున్నది ఓసారి చూద్దాం.

am, is, are; was, were; have/has been; shall be/will be;1st Regular Doing Words (go, come, walk లాంటి verbs), 2nd Regular Doing Words (goes, comes, walks లాంటి verbs) వీటితో 'not' తో, question లో do, does వాడడం తెలుసుకున్నాం.

ఇప్పుడు వీటిని గమనించండి.

ఎవరి/ఎవరిది = whose
ఎవరిని/ఎవరికి = whom

a) Whose book is this?
ఇది ఎవరి పుస్తకం?

b) Whose is this book?
ఈ పుస్తకం ఎవరిది?

c) నువ్వు ఎవరిని ఎక్కువ ఇష్టపడతావు? A నా, B నా?
Whom do you like more, A or B?

d) నువ్వు ఎవరికి సహాయపడతావు?
Whom do you help?

e) ఆమెకు ఎవరు తెలుసు?
Whom does she know?

ఇంకా- my- నా; mine- నాది.

a) ఇది నా కలం.
This is my pen.

b) ఈ కలం నాది.
This pen is mine.

our - మా; ours - మాది
your- నీ/మీ
yours- నీది/మీది

This is my book; Where is yours?
(ఇది నా పుస్తకం; నీదెక్కడ?)

his- అతని/అతనిది;
her- ఆమె యొక్క
hers- ఆమెది
her అంటే ఆమెను అని కూడా అర్థం ఉంది.

This is Ramesh's shirt.
ఇది రమేష్ చొక్కా. అంటే రమేష్‌ది, రమేష్‌కు చెందిన అని తెలియజేయడానికి 's (Apostrophe- s) వాడతాం.

మా నాన్న గారి దుస్తులు.
My father's cloths.

మా అమ్మ నగలు
My mother's jewels

ఒకరి అని గాని, ఒకరికి చెందిన అని గానీ చెప్పడానికి English లో 's (apostrophe- s) వాడతాం. అయితే ప్రాణం లేని అచేతనమైన వాటికి 'చెందిన' అనడానికి 's వాడం. దాని బదులు 'of' వాడతాం.

ఆ పుస్తకం పేజీలు.
The pages of the book (book's- వాడకూడదు)

టేబుల్ కాళ్లు.
legs of the table (table's తప్పు)

ఇంటి తలుపులు- Doors of the house.
కారుచక్రాలు- Wheels of the car.

ఇప్పుడు ఈ సంభాషణ చూడండి.

**Ramu:** I went to my uncle's place last evening.
(నిన్న సాయంత్రం మా మామయ్య ఇంటికి వెళ్లాను.)

**Raghu:** What was the matter?
(ఎందుకు?)

**Ramu:** My cousin returned from the states the day before. He wanted to see me.
(మొన్ననే వాళ్లబ్బాయి అమెరికా నుంచి తిరిగొచ్చాడు. అతను నన్ను కలవాలనుకున్నాడు.)

**Raghu:** I tried to get you over phone this morning; but your people told me you were out.
(ఈ రోజు పొద్దున కూడా మీ కోసం ఫోన్ చేశాను. కానీ మీ వాళ్లు లేరని చెప్పారు.)

**Ramu:** Yes, I spent the whole of last night at my uncle's.
(అవును. నిన్న రాత్రంతా మా మామయ్య వాళ్లతోనే ఉన్నాను.)

ఈ సంభాషణ పరిశీలిస్తే గతంలో వారికి తెలిసిన సమయంలో జరిగిన సంఘటనలను గురించి మాట్లాడినట్టు తెలుస్తోంది. ఆ verbs: went (last evening), returned (the day before), wanted (after he came), tried (this morning), told (this morning). went, returned, wanted, tried, told - వీటిని మామూలుగా past tense అంటాం. ఇలాంటి past verbs- ను మనం Past Doing Words అందాం. వీటిని ముఖ్యంగా గతంలో జరిగిన పనులు, ఏ రోజు, ఏ సంవత్సరం, ఏ టైమ్‌లో అని తెలిసినప్పుడు వాడతాం.

I met him yesterday.
(నిన్న నేను అతడిని కలుసుకున్నాను)

They lost a lot of money last year.
(పోయిన సంవత్సరం వాళ్లు చాలా డబ్బు పోగొట్టుకున్నారు)

అంటే టైమ్ తెలిసిన past actions ను (గతంలో జరిగిన పనులను) past doing words లో (past simple లో) తెలియజేయాలి. past doing words (past simple) ఉదాహరణలు-

| | | |
|---|---|---|
| go | - | went |
| see | - | saw |
| write | - | wrote |
| come | - | came |
| like | - | liked |
| talk | - | talked |
| smell | - | smelt |
| kill | - | killed |

etc.

వీటిని టైమ్ తెలిసిన past actions కు వాడతాం.
ఇప్పుడు చూడండి.

1) He comes on time everyday, but he came late yesterday.
(ప్రతిరోజూ టైమ్‌కు వస్తాడు, నిన్న ఆలస్యంగా వచ్చాడు - yesterday - came)

2) My mother goes to bed early (regular- goes). She went late to bed yesterday
(yesterday అని టైమ్ చెబుతున్నాం కాబట్టి - went).

3) India became independent in 1947.
(భారత్ 1947లో స్వతంత్ర దేశం అయ్యింది.)

4) The movie flopped on the first day of its release last week (flopped - last week).

5) She passed Intermediate 2 years ago.

ఈ కింద ఇచ్చిన I & II Regular Doing Words కి past forms చెప్పండి.

**eg:** buy/buys (regular) - bought (past- కొనటం జరిగిపోయింది)
sing/sings (regular) - sang (past- పాడడం అయిపోయింది)

వీటిని ప్రాక్టీస్ చేయండి.

తినడం (Regular), కొనడం, నడవడం, నేర్చుకోవడం, రాయడం, మాట్లాడడం, అరవడం, ఏడవడం, కట్టడం, తాగడం, కదలడం, మారడం

**Answers:**

| | | |
|---|---|---|
| eat/eats | - | ate; |
| buy/buys | - | bought; |
| walk/walks | - | walked; |
| learn/ learns | - | learnt; |
| write/writes | - | wrote; |
| talk/talks | - | talked; |
| shout/shouts | - | shouted; |
| weep/weeps | - | wept; |
| build/builds | - | built; |
| drink/drinks | - | drank; |
| move/moves | - | moved; |
| change/changes | - | changed. |

## Q&A

**ప్రశ్న:** present tense, past tense, future tense లను ఏ విధంగా, ఏయే కాలాల్లో ఉపయోగించాలో వివరించగలరు.

– సి. బాబు, ముద్దనూరు

**జవాబు:** ఇంగ్లిష్ మాట్లాడేందుకు tenses పేర్లు తెలుసుకోవాల్సిన అవసరం లేదు. Time of action (పని జరిగే కాలం) బట్టి వాడాల్సిన verb రూపం (verb form) తెలుసుకుంటే చాలు. ఇప్పటివరకు ఈ శీర్షికలో వచ్చిన అంశాలన్నీ tense కు సంబంధించినవే. వాటిని ప్రాక్టీస్ చేయండి.

**నోట్:** మంగళవారం (జూన్ 28న) Q&A లో ప్రచురించిన ప్రశ్నలోని నాలుగో వాక్యం సరైనది కాదు. ఆ వాక్యం ఇలా ఉండాలి-
I have known (that) you've stolen my book.




# Do you? తో పదాలు ఆడా!

**Sridhar:** Where were you last Evening?
(నిన్న సాయంతం ఎక్కడున్నావు?)

**Srikanth:** I was at Sankar's. We spent the evening together.
(నేను శంకర్ వాళ్లింట్లో ఉన్నాను. సాయంత్రం ఇద్దరం కలిసే ఉన్నాం.)

**Sridhar:** Do you see him everyday?
(రోజూ నువ్వు అతన్ని కలుసుకుంటావా?)

**Srikanth:** No. He is out some evenings. He attends music classes two or three evenings a week.
(లేదు కొన్నిరోజులు అతను సాయంత్రం ఇంట్లో ఉండడు. వారానికి రెండు, మూడు సాయంత్రాలు సంగీతం నేర్చుకుంటాడు.)

**Sridhar:** When did he start learning?
(నేర్చుకోవడం ఎప్పుడు మొదలు పెట్టాడు?)

**Srikanth:** I don't know. I think he has been at, is for at least 6 to 7 months now.
(నాకు తెలియదు. కానీ ఆరేడు నెలలుగా దాని మీదే ఉన్నాడనుకుంటా.)

**Sridhar:** How about a movie tomorrow? Will you be free?
(రేపు సినిమాకి వెళదామా? రేపు నువ్వు ఖాళీయేనా?)

**Srikanth:** I will be away tomorrow. I will be free the day after tomorrow.
(రేపు నేనుండను. ఎల్లుండి ఖాళీగా ఉంటాను.)

పై సంభాషణ గమనించండి.

Timeను బట్టి వాడిన verb forms చూశారు గదా? ఈ కింది సంభాషణ మీ friends తో కానీ, మీతో సహ కరించే వాళ్లెవరితోనైనా practice చేయండి. ఇప్పటివ రకు ఈ Spoken English Columns లో ఇచ్చిన వివరాలు మీరు follow అయి ఉంటే, ఈ సంభాషణ మీకు చాలా సులభం. (ఈ కింది పేర్లకు బదులు మీమీ friends పేర్లతో practice చేయండి.)

**Ramesh:** హాయ్ నరేష్ ఎలా ఉన్నావు?

**Naresh:** బాగానే ఉన్నా, థ్యాంక్యూ. నువ్వు ఎలా ఉన్నావు?

**Ramesh:** నేను బాగానే ఉన్నా. థ్యాంక్యూ. ఏంటి ఇప్పుడు ఇక్కడున్నావ్?

**Naresh:** ఈ పుస్తకాల షాపులో పొద్దున కొన్ని పుస్త కాలు కొన్నాను. వాటిలో ఒకటి సరిగా లేదు. దాన్ని తిరిగి ఇచ్చేయాలని అనుకుం టున్నా.

**Ramesh:** ఏంటి ఆ పుస్తకంలో లోపం?

**Naresh:** కొన్ని పేజీలు లేవు.

**Ramesh:** ఉదయం కొన్నపుడు గమనించలేదా?

**Naresh:** కొద్దిగా తొందరలో ఉన్నా!

**Ramesh:** నీకు పుస్తకాలు చదివే అలవాటుందా?

**Naresh:** చాలా ఎక్కువ చదువుతాను. చదవటం నాకు ఆసక్తి.

**Ramesh:** సినిమాలు చూడవా?

**Naresh:** నువ్వు బాగా చూస్తావా?

**Ramesh:** ఆ. కనీసం వారానికోసారి.

**Naresh:** రేపు మాకు సెలవు (tomorrowతో begin చేయండి.) మా కజిన్ జగదీష్ కూడా ఇక్క డుంటాడు. నువ్వెక్కడుంటావు?

**Ramesh:** ఏమో నాకు తెలీదు. ఎందుకు తెల్సుకోవా లనుకుంటున్నావు?

**Naresh:** నిన్ను మా ఇంటికి పిలవాలని (want to వాడండి).

***Answer:***

**Ramesh:** Hi Naresh? How are you?
(ఈ పలకరింపులు బాగా practice చేయండి)

**Naresh:** Fine. Thank you. How are you?

**Ramesh:** Fine too. Thank you. Why are you here?

(How is it you are here?/What brings you here?/How do I see you here now?- వీటన్నిటి అర్థం ఒకటే. ఈ వాక్యాలను బాగా practice చేయండి.)

**Naresh:** I bought some books in this shop here this morning. One of them is not in a good condition / is in a bad condition. I want to return it.

**Ramesh:** What's (=What is) wrong with the book?

(What's wrong- ఇది ఇంగ్లిష్‌లో సర్వసాధారణంగా వాడతారు- అర్థం: ఏంటి పొరపాటు?, తేడా ఏంటి?, తప్పేమన్నానా?)

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 11

**Naresh:** Some pages are missing.

**Ramesh:** Didn't you (did you not) notice it this morning when you bought it?

సామాన్యంగా చాలామంది కొనడం అనే పదానికి, purchase(s) past doing word 'purchased' వాడు తుంటారు- ఇది పాండిత్యం. మామూలు సంభాషణలో గాని, రచనలో, buy, buys, bought etc. కరెక్ట్. కొను గోలు అనేందుకు purchase వాడవచ్చు.

I have a few purchases to make.

కొన్ని వస్తువులు కొనుగోలు చేయాలి.

వీలైనంతవరకు buy, buys, boughtనే వాడండి. సహ జంగా ఉంటుంది.

**Naresh:** I was in a little hurry

ఈ మాట కూడా బాగా వాడండి

**Ramesh:** Do you read a lot?

(Have you/do you have the habit of reading?)

**Naresh:** Yes, I read a lot. Reading interests me/ I am interested in reading.

**Ramesh:** Don't you (Do you not) watch movies?

(ఇక్కడ గమనించండి. చూస్తావా? Do you watch? చూడవా - Do you not watch / Don't you watch?

**Naresh:** Do you?

ఇక్కడ Do you watch movies అని పూర్తిగా అనాల్సిన అవసరం లేదు. / Do you sea a lot?

**Ramesh:** Oh, yes. I watch at least one movie a week. / I watch movies at least once a week.


M. SURESAN

ఇక్కడ కూడా మీరు అలవాటు చేసుకోగలిగితే- Oh, yes, I do. At least once a weak.

అని clipped sentences (కుదించిన వాక్యాలు) వాడ వచ్చు. అంటే I do= I watch.

**Naresh:** Tomorrow is/will be a holiday for us. My cousin Jagadish also will be here tomorrow. Where will you be?

**Ramesh:** I don't (do not) know. Why do you want to know?

**Naresh:** I wish to/want to invite you to my place.

చూశారా. మనం ఇంతవరకు Spoken English లో తెలుసుకున్న కొద్ది అంశాలతోనే ఎంత సంభాషించగ లమో. అంతా మన practice మీదే ఉంది.

## VOCABULARY

Sentence structures ఇంకా బాగా practice చేయాలంటే vocabulary (పదాలు అంటే ఇంకొన్ని మాటలు) తెలుసుకోవాలి.

climb up = ఎక్కడం

climb down = దిగడం

rush = త్వరత్వరగా వెళ్లడం/ హడావిడిగా వెళ్లడం/ urgentగా దేనినైనా పంపడం.

Hurry up, please = త్వరగా కానీయ్.

Why are you in a hurry?

ఎందుకంత తొందర నీకు? /తొందర పడుతున్నావ్?

hurry(హరి) = తొందర

Crawl (క్రాల్) = పాకడం

ముఖ్యంగా కాళ్లు లేని జంతువులు, మరీ ఎక్కువ కాళ్లున్న జెర్రులు, తేళ్లూ లాంటివి, ఇంకా నడవలేని వాళ్లు బోర్లాపడి పాకడం, పిల్లలు, నాలుగు కాళ్ల జంతువులు పాకడాన్ని creep (క్రీప్-క్రెప్ట్, క్రెప్ట్) అంటారు. అయితే రెండు మాటలకు పోలిక చాలా నిదానంగా కదలడం. Creep-రహస్యంగా, దొంగతనంగా కదలడం అనే అర్థం కూడా ఉంది.

కలత = worry (వరి);

తాపీగా నడవడం =amble (ఆంబుల్)

(campలో am లాగా 'ఆం' పలకాలి)

తొందరపాటు = haste (హెయ్స్ట్)

## PRONUNCIATION GUIDE

1) Englishలో hitting, betting, selling, humming, cunning లాంటి మాటలలో వచ్చే రెండక్ష రాలూ కాకుండా ఒక అక్షరమే పలకాలి.
hitting = హిటింగ్
betting = బెటింగ్
selling = సెలింగ్
humming = హమింగ్
cunning = కనింగ్,
(హిట్టింగ్, బెట్టింగ్, సెల్లింగ్ etc అనకూడదు)

2) Looked, booked, talked, pressed, jumped - ఇటువంటి మాటల్లో చివరి 'ed'ని t గా పలకాలి. Looked= Lookt; talked=talkt etc.

**మీరూ రాయండి!**

స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను **స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82** చిరునామాకు పంపించవచ్చు.

**email:** pratibha@ eenadu.net




**ప్రశ్న:** 'She has had this job for the last one year', 'She has been this job for the last one year' ఈ రెండు వాక్యాలకు తేడా ఏమిటి?
*– విజయలక్ష్మి, విజయవాడ*

**జవాబు:** 'She has had this job for the last one year' అన్నా, She has been in this job for the last one year' అన్నా అర్థం ఒకటే. ఆమెకు ఈ ఉద్యోగం ఒక సంవత్సరంగా ఉందని మొదటి వాక్యానికి అర్థం. రెండో వాక్యానికి అర్థం- ఆమె ఈ ఉద్యోగంలో సంవత్సరం నుంచీ ఉంది. 'She has been this job for the last one year అనే వాక్యం కరెక్ట్ కాదు. She has been in this job అనాలి (in ఉండాలి).

**ప్రశ్న:** Simple present tenseలో subject's singularలో ఉన్నప్పుడు verbకు 's' గాని, 'es'గాని చేరుస్తారు. Subject - 'I' ఉన్న ప్పుడు verbకు 's', 'es' చేర్చ రెందుకు?
*– ఎం. భానుచందర్, మద్దివానిపాలెం*

**జవాబు:** Simple presentలో Singular subjects అన్నింటికి Verbకు 's' / 'es'చేర్చం. III Person singular subjects- He, She, It కు మాత్రమే's' / 'es' చేరుస్తాం.

**ప్రశ్న:** 'నేను ఆ పని చేయిస్తాను'. దీనిని ఇంగ్లిష్‌లో ఎలా అంటారు?
*– జె.కె ప్రసాద్, కడప*

**జవాబు:** I will make him / her / them / you do it.

**ప్రశ్న:** I got married, I was married ఈ రెండు వాక్యాలు సరైనవేనా? ఏ సంద ర్భంలో ఎలాంటి వాక్యాన్ని ఉపయోగిం చాలి?
*– ఎల్. నాగేశ్వరరావు, గుడివాడ*

**జవాబు:** I got married, I was married రెండూ కరెక్టే. అర్థంలో మాత్రం కొద్దిగా తేడా ఉంటుంది. I got married = నాకు పెళ్లయింది ( ఏ రోజు, ఏ సంవత్సరం తదితర వివరాలు సందర్భాన్ని బట్టి clearగా ఉంటే).

**Ex:** I got married (on Monday last/ last year / in 2004 / 22nd June etc.)

I was married = దీని అర్థం అప్పటికే నాకు పెళ్లయిపోయిందని.

Q: Were you married (at the time)?

A: yes, I was married.

**Pranav:** How is everybody, Praveen?
(ప్రవీణ్! అందరూ ఎలా ఉన్నారు, కుశలమా? )

**Praveen:** Not bad, I suppose. How is it with you?
(బాగానే ఉన్నామనుకుంటున్నా. నువ్వెలా ఉన్నావ్)

**Pranav:** Fine. Thank you.
(బాగానే ఉన్నా)

పైవన్నీ కూడా పలకరింపు మాటలే. మీ ఫ్రెండ్స్‌ను, సన్నిహితులను కలుసుకున్నప్పుడు ఇలా పలకరింపు మాటలు వాడుతుండండి.

**Praveen:** How about practising the following exercise? (How about అనే మాట సంభాషణ ప్రారంభానికి Englishలో తరచు వాడతారు. అంటే ఈ exerciseను practice చేద్దామా? అని అర్థం)

**Pranav:** It suits me fine.
ఇది కూడా తరచు మన సమ్మతిని తెలియ జేయడానికి వాడతాం.
Let's (= let us) see what it is.
(ఏంటో చూద్దాం/చూడనీ)

**Exercise -1:**

ఈ కింది వాక్యాల్లోని subjectను, He/she/It గా మార్చి, అందుకు తగిన మార్పులు మిగతా sentenceలో చేసి practice చేయండి.

**eg:**

I know the subject well.
(నాకు ఆ సబ్జెక్ట్ తెలుసు)

ఇక్కడి subject 'I'. I కి బదులు, He/She (ఇక్కడ it పెడితే సరైన అర్థం రాదు కాబట్టి వదిలేయండి.) లేకపోతే ఏ పేరైనా Shravan అనో, Anjali అనో వాడామనుకోండి. అప్పుడు I know the subject well అనే వాక్యం He/She/Shravan/Anjali knows the subject well. గా మారుతుంది.

**eg2:**

These books give a lot of information.
(ఈ పుస్తకాలు చాలా సమాచారాన్ని ఇస్తాయి.)

ఈ sentenceలో subject 'These books'. 'These books' కు బదులు He/She/ఎవరి పేరైనా(Ramu/Sita) / this book/it, subject గా వాడితే

These books give a lot of information అనే వాక్యం

He/She/Ram/Sita/This book/ It gives a lot of information గా మారుతుంది.

ఇప్పుడు ఇక్కడ ఇచ్చిన కొన్ని sentenceలోని subject ను He/She/It/Any name (ఏ వ్యక్తి పేరయినా, ఏ వస్తువు పేరయినా) పెట్టి practice చేయండి.

**సూచన:** 'pron' -అంటే pronunciation అని.

1. I think I am right.
(నేను రైట్ అనుకుంటున్నాను).
2. They help their father quite often.
(వాళ్లు వాళ్ల నాన్నకు తరచు సహాయపడతారు.)
**pron:** often ఆఫన్/ఆఫ్టన్
3. My dogs often trouble my neighbours.
(నా కుక్కలు మా పొరుగు వాళ్లను తరచు ఇబ్బంది పెడుతుంటాయి.)

ఇక్కడ subject 'My dogs' - దీన్ని మీరు His/Her/any name పెట్టి చెప్పండి. 'My dog'తో కూడా చెప్పండి.

4. I go to temple on fridays.
5. Good children always obey their parents.
(బుద్ధిమంతులైన పిల్లలు వాళ్ల parents కు విధేయంగా ఉంటారు.)

**pron:** obey ఒబెయ్ = అణకువగా ఉండడం, మాట వినడం, విధేయత కలిగి ఉండడం.

children (plural) - child (singular)
child కు బదులు మామూలుగా he/she కాకుండా It అంటాం.

6. Do snakes lay eggs?
(పాములు గుడ్లు పెడతాయా? )
**pron:** lay : (లెయ్) = గుడ్లులాంటివి పెట్టడం
7. These hotels do good business.
do good business = వ్యాపారం బాగా ఉండడం
8. Why do students waste time?
(విద్యార్థులు సమయం ఎందుకు వృథా చేస్తారు? )
9. How well they swim!
(వాళ్లు ఎంత బాగా ఈదుతారో!)
ఇది ఆశ్చర్యార్థకం (exclamation )!. question కాదు.
10. Do I look ill?
(నేను అనారోగ్యంగా కనిపిస్తున్నానా? )
11. Where do they work?
(వాళ్లు ఎక్కడ పనిచేస్తారు? / వాళ్ల ఉద్యోగం ఎక్కడ? )
12. Do you go to movies often?
(మీరు తరచు సినిమాలకెళ్తారా? )
13. What do they think of this plan?
(వాళ్లు ఈ పథకం గురించి ఏమనుకుంటున్నారు? )
14. What do they do in the evenings?




(వాళ్లు సాయంత్రాలు ఏం చేస్తారు? )

15. Do you like tea? What do they prefer, coffee or tea?
(నీకు టీ ఇష్టమా? వాళ్లకు ఏది ఎక్కువ ఇష్టం, టీనా కాఫీనా? )

**Answers:**

1. He/She/any name thinks he/she is right.
2. He/She/any name helps their/his/her father quite often.
3. My dog/It/He/She often troubles my/ his/ her neighbours.
4. He/ She/any name goes to temple on fridays.
5. He/ She/ A good child/ It/ any name obeys his/her/its/ any name's parent.
6. Does a snake/It lay eggs?
7. This hotel/It does good business.
8. Why does a student waste his/her/any name's time?
9. How well he/she /any name/ It (జంతువు అయితే)swims?
10. Does he/she/any name look ill?
11. Where does he/she/any name work?
12. Does he/she/any name go to movies often?
13. What does he/she/any name think of this plan?
14. What does he/she/any name do in the evenings?
15. Does he/she/any name like tea? What does he/she prefer?




# మాట ఒకటే అర్థాలు వేరువేరు!

★ ★ ★

**Pranav:** Well, how was that exercise?
(ఎలా ఉందా exercise?)

**Praveen:** Which exercise do you mean?
(ఏ ఎక్సర్‌సైజ్ గురించి నువ్వు మాట్లాడు తున్నావు? )

**Pranav:** The last exercise about rewriting sentences after changing the subject?
(ఇంతకు ముందరిది. sentences లో subject మార్చి రాయడం)

**Praveen:** It helps us to know when to use the 1st RDW- Regular Doing Words (come, go లాంటివి), 2nd RDW (comes, goes లాంటివి), do, does.
(ఇవి 1st RDW, 2nd RDW, do, does లాంటివి తెలుసుకో డానికి ఉపయోగడతాయి)

M. SURESAN

**ఈ కింది మాటలు ప్రాక్టీస్ చేయండి.**

సంభాషణల్లో వాడుతూ ఉండండి.

turn on the tap/turn the tap on= పంపు వదలడం
turn off the tap/turn the tap off= పంపు కట్టేయడం

**Ram:** Turn on the tap please, I need some water.
(కాస్త పంపు తిప్పండి. నాకు నీళ్లు కావాలి.)

**Shyam:** As soon as you draw enough water, please turn it off. Don't waste water.
(మీకు కావాల్సినన్ని నీళ్లు తీసుకున్న తరవాత పంపు ఆపేయండి. నీళ్లు వృథా చేయకండి.)

ఇక్కడ draw అనే మాట చూడండి.

**draw:**

1) నీళ్లు లాంటివి తోడడం, చేదడం
We draw water from the tap/ the well/ the river etc.,

2) draw కు రెండో అర్థం మనందరికీ తెలుసు. బొమ్మలు వేయడం.
Bapu draws beautiful pictures
(బాపు అందమైన బొమ్మలు గీస్తారు)

1st RDW= draw, 2nd RDW = draws, Past Doing Word = drew.

ఈ కింది సంభాషణ Englishలో ప్రాక్టీస్ చేయండి.

**రఘు:** ఆ బొమ్మ గీసిందెవరు?
**రాము:** లత
**రఘు:** ఆమె అంత బాగా గీస్తుందా?
**రాము:** ఆమె చాలా బాగా గీస్తుంది. గతవారం బహుమతి కూడా తెచ్చుకుంది. (get వాడండి.)
**రఘు:** గీయడం ఎక్కడ నేర్చుకుంది?
**రాము:** సొంతంగానే నేర్చుకుంది.

**Answer:**

**Raghu:** Who drew that picture?
**Ramu:** Lata
**Raghu:** Does she draw so well?
**Ramu:** She draws very well. She got even a prize last week.
(even a prize= బహుమతి కూడా)
**Raghu:** Where did she learn it?
**Ramu:** She learnt it on her own.

(on her own = సొంతంగా, on my own = నా అంతట నేనే, on their own = వాళ్లంతట వాళ్లే, on his own = అతనంతట అతనే)

మళ్లీ draw అనే మాటను తీసుకుందాం.
దీనికి రెండు అర్థాలు తెలుసుకున్నాం కదా.

3) draw = ఏదైనా ఎక్కడైనా regular గా supply పొందడం.
నేను ఈ బూత్‌లోనే పాలు తీసుకుంటాను.
I draw milk from this booth.
People of this area draw milk from this booth.

4) draw= bank లోంచి సొమ్ము తీసుకోవడం.
He drew Rs. 5000 from the bank.
withdraw అని కూడా అనవచ్చు.

5) draw= పొందడం
Freedom fighters drew inspiration from Gandhi.
స్వాతంత్ర్య సమరయోధులు గాంధీ నుంచి స్ఫూర్తి పొందారు.

**pron:** Inspiration ఇన్‌స్పిరెయిషన్ = స్ఫూర్తి

6) సమాచారం పొందడం = draw information
The police were unable to draw information from the accused.
(పోలీసులు నిందితుడి నుంచి సమాచారం పొందలేక/ రాబట్టలేకపోయారు.)

accused (అక్యూస్డ్) = నిందితుడు (చట్ట పరిభాష).




**ప్రశ్న:** జూన్ 24 'ప్రతిభ' స్పోకెన్ ఇంగ్లిష్ Q&A శీర్షికలో ఎం. మోహన్‌రావు, హన్మకొండ నుంచి 'ఎప్పుడైనా మోసేవారి మీదే ఇంకా భారం పడుతుంది' అనే వాక్యానికి సమానమైన english proverb ఉంటే చెప్పమని అడిగారు. దానికి సరైన proverb దీని చెప్పారు. కానీ అదే అర్థంలో ఒక saying ఉంది కదా?
**'All lay loads on a willing horse'**
**– జె. వెనితా డేవిడ్, కర్నూలు**

**జవాబు:** అవును. Thank you very much వెనితా డేవిడ్. One is never too old to learn (ఎంత వయసు వారైనా తెలుసుకోవాల్సినవి ఉంటాయి) అనేది ఎప్పుడూ కరెక్ట్.

**మీరూ రాయండి!**

స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను **స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82.** చిరునామాకు పంపించవచ్చు.
**email:** pratibha@ eenadu.net




# పూర్తిగా.... చెప్పక్కర్లేదు!

**Ajitha:** Hi Naresh, how goes Life?
(చాల పలకరింపు మాటల్లో ఇది కూడా ఒకటి. Practice చేసి వాడండి. దీనర్థం, ఎలా ఉన్నావు అని)

**Naresh:** No regrets. Getting on.
(బాధలేమీ లేవు. ఏదో జరిగిపోతోంది.)

**Ajitha:** Did you go through the Eenadu this morning?
(ఈ రోజు పొద్దున 'ఈనాడు' చదివావా?)

**Naresh:** No, I didn't. What's new?
(లేదు. ఏమైనా విశేషం ఉందా?)

**Ajitha:** Don't you (Do not you/Do you not) read the newspaper?
(న్యూస్‌పేపర్ చదవవా?)

**Naresh:** I do, of course. But this morning I was in a hurry. I just ran through the headlines. My sister reads the paper in detail.
(చదువుతాను. కానీ పొద్దున హడావిడిలో హెడ్‌లైన్స్ మాత్రం చదివా. మా చెల్లెలు పేపర్ మొత్తం చదువుతుంది.)

**Ajitha:** Does she?
(అవునా?)

ఈ సంభాషణలో 'do, does, did' ఎలా వాడారో చూశారు కదా. ఇంతకు ముందు కూడా వీటిని వివరించాం. మళ్లీ మరచిపోకుండా ఉండేందుకు ఈ కింది వాక్యాలు ఇంగ్లిష్‌లో ప్రాక్టీస్ చేయండి.

**eg:**

**1)**

**Pavan:** నిన్న మీ కారుకేమయింది?
(అవడం- happen. what, who తర్వాత కొన్ని సందర్భాల్లో questionsలో 'do', 'does', 'did' రావు. eg: మీకెవరిచ్చారు ఆ పుస్తకం? Who gave you the book?)
(What happened to your car yesterday?)

**Prakash:** అది దారిలో ఆగిపోయింది.
(It broke down yesterday.)
(కారు, యంత్రాలు పనిచేయకపోవడం- break down)

**Pavan:** అది తరచూ ఆగిపోతుంటుందా?
(Does it break down frequently?)

**Prakash:** తరచూ జరగదు. నిన్న మాత్రం ఉన్నట్లుండి ఆగిపోయింది.
(No, it doesn't (does not)).

No తో కూడా ఆగిపోవచ్చు. కొంచెం clear గా అయితే, No, it doesn't అంటే చాలు.
No it doesn't breakdown frequently అని పూర్తిగా చెప్పాల్సిన పనిలేదు.

**2)**

**Pradeep:** Sreenivas sings well.
(శ్రీనివాస్ బాగా పాడతాడు).

**Prasanth:** Does he?
(అవునా? /పాడతాడా?)

ఇక్కడ కూడా does he sing so well అని పూర్తిగా అనాల్సిన పనిలేదు.

**3)**

**Vinai:** She scored the highest marks in last week's exam.
(గత వారం పరీక్షలో ఆమెకు అందరి కన్నా ఎక్కువ మార్కులు వచ్చాయి.)

**Varun:** Did she?
(ఇక్కడ కూడా Did she score... అని పూర్తిగా అనాల్సిన అవసరం లేదు.)

అలాగే అవును, కాదు పదాలకు కూడా do, does, did వాడవచ్చు.

**eg:**

**1)**

**Laxman:** Did you meet Ram yesterday?

**Bharat:** Yes, I did.

మామూలుగా అయితే, Yes I met him అంటాం. Conversational గా అయితే 'Yes I did' చాలు.

**2)**

**Divya:** Does she sing well?

**Deepika:** She does, very well.

conversational గా She does అంటే చాలు. మామూలుగా అయితే, Yes, she sings very well అంటాం.

**3)**

**Champa:** Do you practice the game regularly?

**Charan:** Oh, yes, I do.

I practice the game regularly అని మొత్తం అనకుండా, 'I do' అంటే సహజంగా ఉంటుంది.

**4)**

**Prameela:** Does Kranthi meet you often?

**Prasanthi:** No, she doesn't (= does not)

ఇక్కడ answer, 'no' కాబట్టి she doesn't అంటాం. No, she does not meet me often అని పూర్తిగా అనక్కరలేదు.

**5)**

**Sekhar:** Did you talk to Kalyan yesterday?

**Chandra:** No, I didn't (= did not)

పూర్తిగా No, I did not talk to him. అనాల్సిన పని లేదు.

**6)**

**Mallik:** Do you like cricket?




**Madhav:** No, I don't (= do not)

I don't like cricket అని పూర్తిగా అనక్కరలేదు.

ఈ కింది conversation పరిశీలించండి. Do, does did లాగానే am, is, are, was, were లతో క్లుప్తంగా responses ఇవ్వవచ్చు.

**1)**

**Padma:** Are you a teacher?
(మీరు టీచరా?)

**Prakash:** Yes I am. (అవును)
Yes, I am a teacher అనక్కరలేదు.

**2)**

**Sita:** Is Uma a good singer?

**Alivelu:** No, she isn't (= is not)
(ఆమె కాదు)

**3)**

**Ramesh:** Are you students?

**Jagan & Naresh:** No, we aren't/yes, we are

(పై జవాబుల్లో 2 లో No, she is not a good singer అని కాని, 3 లో No, we are not students అని కానీ పూర్తిగా అనక్కరలేదు)
కొంచెం హేళనగా జవాబివ్వడానికి కూడా ఈ clipped responses- కుదించిన స్పందనలు- వాడుతుంటాం. ఈ కింది సంభాషణ చూడండి.

**Govind:** I play better than Sachin.
(నేను సచిన్ కంటే బాగా ఆడతాను.)

**Govardhan:** Oh, do you? People don't know that, unfortunately
(ఓహో, అలాగా? ప్రజలకది తెలియదు, దురదృష్టం - ఇది హేళన)

మీరిప్పుడు do, does, did, am, is, are etc... వాడుతూ ఈ కింది conversation English లో మీ friends తో practice చేయండి:

కింది ఉదాహరణలు చూడండి.

**Krishna:** మీకు హిందీ తెలుసా?
(Do you know Hindi?)

**Srinivas:** తెలీదు
(No, I don't)/
తెలుసు (yes, I do).


M. SURESAN

**1)**

**Pratima:** మీరు తమిళం మాట్లాడతారా?

**Pratibha:** మాట్లాడుతాను/ మాట్లాడను.

**2)**

**Janaki:** వేణుకు టెనిస్ ఇష్టమా? (like వాడండి)

**Jayanthi:** ఇష్టమే/కాదు

**3)**

**Shyam:** నేను ముఖ్యమంత్రిని కావాలనుకొంటున్నాను.

**Sundar:** ఓహో అలాగా? అది చాలా?

**4)**

**Prabhat:** నిన్న కమల్ ముంబాయ్ వెళ్లాడు (go / leave వాడండి)

**Praveen:** అలాగా? ఎందుకు?

**5)**

**Sukumar:** మా ఊరు ఆంధ్రప్రదేశ్ మొత్తంలో గొప్పది (best వాడండి)

**Suman:** అలాగా? ఏ ఊరండీ అది?

**Sukumar:** విజయవాడ

**Suman:** అది గొప్పదో కాదో నాకు తెలీదు, కాని one of the hottest అని మాత్రం తెలుసు.

**6)**

**Madan:** నువ్వు చాలా మంచివాడిలా కనిపిస్తున్నావు. (seem; a good fellow వాడండి)

**Manoj:** అవునా? అది నీ మంచితనం వల్ల

**7)**

**Mukund:** వాళ్లు భారతీయులా?

**Murari:** కారు/ అవును.

**8)**

**Nelson:** ఈ పుస్తకాలు మీవా?

**Neeraj:** అవును. అవన్నీ నావే/కావు.

**9)**

**Taruni:** మీరు టీవీ సీరియల్స్ చూస్తారా?

**Sania:** అవును చూస్తాను/చూడను.

**Taruni:** అవి ఆసక్తిగా ఉంటాయా.

**Sania:** అవును/కాదు ('are' వాడండి)

**10)**

**Bhaskar:** వాళ్లిక్కడ ఉండేవాళ్లా? (were వాడండి)

**Bhanu:** అవును/కాదు (were వాడాలి)

**11)**

**Teacher:** ఈ ప్రశ్న కష్టమా?

**Pupil:** అవును/కాదు (is రావాలి)

## Answers:

**1)**

**Pratima:** Do you speak Tamil?

**Pratibha:** Yes, I do / No, I don't.

**2)**

**Janaki:** Does Venu like Tennis?

**Jayanthi:** Yes, he does / No, he doesn't.

**3)**

**Shyam:** I want to become the CM

**Sundar:** Oh, do you? Is that enough?

**4)**

**Prabhat:** Kamal left for/went to Mumbai yesterday

**Praveen:** Did he? Why?

**5)**

**Sukumar:** Our city is the best in A.P.

**Suman:** Oh, is it? which city is it?

**Sukumar:** Vijayawada

**Suman:** I don't know whether it is the best, but I know it is one of the hottest places.

**6)**

**Madan:** You seem/appear to be a good fellow

**Manoj:** Do I? That's because of your goodness.

**7)**

**Mukund:** Are they Indians?

**Murari:** No, they aren't / yes, they are

**8)**

**Nelson:** Are these books your's?

**Neeraj:** Yes, they are all mine / No,they aren't. (= are not)

**9)**

**Taruni:** Do you watch TV serials?

**Sania:** Yes, I do / No, I don't (=do not)

**Taruni:** Are they interesting?

**Sania:** Yes, they are / No, they aren't

**10)**

**Bhaskar:** Were they here?

**Bhanu:** Yes, they were / No, they weren't

**11)**

**Teacher:** Is this question difficult?

**Pupil:** Yes, it is / No it isn't




**ప్రశ్న:** 'Best' కు ముందు First, second, next అనే పదాలు ఉపయోగించవచ్చా?
– జి.వి.శ్రీదేవి, ఆముదాలవలస

**జవాబు:** 'First best' అని అనం. ఎందుకంటే, 'best' లోనే first అనే భావం ఉంది. next best, second best, third best... అనవచ్చు.

**ప్రశ్న:** Interrogative sentences లో helping verbsను ఉపయోగించేటప్పుడు was లేదా did ఏయే సందర్భాల్లో వాడాలి? కింది వాక్యాల్లో ఏది సరైనదో తెలపండి.
1) What was he do?
2) What did he do?
–ఎస్.వై.కె., లక్సెట్టిపేట

**జవాబు:** మొదటి వాక్యం కరెక్ట్ కాదు. was తర్వాత, అంటే ఏ 'be' form తర్వాత కూడా, do, go, come, walk లాంటి 1st RDW (1st Regular Doing Words) రావు. ఇక్కడ was do అనేది English కాదు. రెండో వాక్యం 'What did he do?' కరెక్ట్. ఇక్కడ verb: did do = did. Answer: He played / sang; He did not do anything లాగా రావచ్చు.

**ప్రశ్న:** This stone was laid by somebody అనే వాక్యంలో 'laid' గురించి వివరించగలరు. అలాగే lying అనే, lie అనే verbs కు, laid అనే verb కు present, past, past participle తెలపండి.
– శ్రీను, భద్రాచలం

**జవాబు:** This stone was laid by somebody ఇక్కడ stone అంటే పునాదిరాయి. అంటే, Dams, బిల్డింగ్స్‌లాంటి నిర్మాణాలు ప్రారంభించేటప్పుడు VIPలు పునాదిరాయి వేయడం / శంకుస్థాపన చేయడం.
The CM laid the foundation stone for the bridge.
(ముఖ్యమంత్రి వంతెనకు పునాదిరాయి వేశారు / శంకుస్థాపన చేశారు.)
lie (present tense) (అబద్ధం చెప్పడం), lied (past tense), lied (past participle).
lie (present) (పడుకోవడం, విశ్రాంతి తీసుకోవడం...), lay (past), laim (past participle).
lay (present) (ఉంచడం, గుడ్డు పెట్టడం, శంకుస్థాపన చేయడం), laid (past), laid (past participle).

# ప్రతిభ



Let's go to a movie




# రానీ...రానీ... వస్తే రానీ!!

**Venkat:** Someone wants to see you.
(ఎవరో మిమ్మల్ని చూడాలనుకుంటున్నారు.)
**Venu:** Let him come in. (లోపలికి రమ్మనండి.)
**Venkat:** He wants to talk you sir.
(ఆయన మీతో మాట్లాడాలనుకుంటున్నారు.)
**Venu:** Ok, what does he want to talk to me?
(సరే, ఆయన నాతో ఏం మాట్లాడాలనుకుంటున్నారు?)
**Venkat:** I do not know.
(నాకు తెలియదు.)
**Venu:** Ok, let him talk. First of all let him come in.
(సరే, అతడిని మాట్లాడనీయండి. ముందు లోపలికి రానీయండి.)

పై సంభాషణలో let వాడుక గమనించండి. దీన్ని మన సంభాషణలో సర్వసాధారణంగా వాడుతుంటాం.

English లో I RDW (Regular Doing Words- go, come లాంటి verbs)ను notతో questions లో వాడినపుడు 'do'; II RDW (goes, comes లాంటి verbs) కు questionsలో 'not' తో వాడినపుడు 'does'; Past Doing Words (PDW- went, came లాంటి verbs) కు 'not' తో questions లో వాడినపుడు 'did' వస్తుందని తెలుసుకున్నాం. అయితే కొన్ని సందర్భాల్లో what, who తర్వాత do, does, did అనేవి రావని గమనించాలి.

**eg:**
**1)** What gives light and heat to the world?
(ప్రపంచానికి వెలుగును, వేడిని ఇచ్చేది ఏది?)
**2)** What happened yesterday?
(నిన్న ఏం జరిగింది?)

ఈ రెండు వాక్యాల్లో what తర్వాత does give అని కాని, did happen అని కానీ అనం. అలాగే, 'who' తర్వాత కూడా.

**eg:**
**1)** Who knows the answer?
(సమాధానం ఎవరికి తెలుసు? 'Who does know?' అనం.)
**2)** Who gave you the book last night?
(నిన్న రాత్రి నీకు ఆ పుస్తకం ఎవరిచ్చారు? - Who did give you? అనం.)

ఈ సంభాషణ practice చేయండి.
**Ram:** నిన్న ఏం జరిగింది?
**Rahim:** నా కారు పాడైపోయి ఆగిపోయింది
(break down వాడండి.)
(break down అంటే కారు, లారీ, బస్, ఏదైనా యంత్రం చెడిపోయి ఆగిపోవడం)
**Ram:** తరచూ చెడిపోయి ఆగిపోతుందా?
**Rahim:** లేదు, లేదు. నిన్న మాత్రమే జరిగింది.
**Ram:** దాన్ని ఎవరు రిపేరు చేశారు?
**Rahim:** దగ్గర్లోనే ఉన్న మెకానిక్.
(nearby= దగ్గరున్న)
**Ram:** నువ్వు డ్రైవ్ చేస్తావా?
**Rahim:** చేస్తాను.
**Ram:** నీకు డ్రైవరున్నాడా? నువ్వే డ్రైవ్ చేస్తావా?
**Rahim:** డ్రైవర్ లేదు. నేనే డ్రైవ్ చేస్తా.
**Ram:** నువ్వు బాగా డ్రైవ్ చేస్తావా? (Good at driving/well రెండూ వాడండి)
**Rahim:** నువ్వు చూస్తావా ఎలా చేస్తానో? రా, కాస్త దూరం వెళ్దాం.
(కారు, బస్ లాంటి వాటిల్లో వెళ్లడం - ride)

**Answer:**
**Ram:** What happened yesterday?
**Rahim:** My car broke down.
**Ram:** Does it breakdown often?
**Rahim:** No. It doesn't usually. Only yesterday.
**Ram:** Who repaired it?
**Rahim:** A nearby mechanic.
**Ram:** Do you drive?
**Rahim:** Oh, Yes, I do.
**Ram:** Have you/ Do you have a driver, or do you drive it yourself?
**Rahim:** I don't have a driver. I drive it myself.
**Ram:** Do you drive well? / Are you good at driving?
**Rahim:** (Do you) Want to see how I drive? Come, let's have a ride.

ఇక్కడ 'let' ఉపయోగించి చూడండి.
ఇలాంటి సందర్భాల్లో 'let' అంటే ఏదైనా పని చేద్దాం అని సూచించడం.

**eg:**
**1)** సినిమాకెళదాం పద.
Let's (= Let us) go to a movie
**2)** కాస్త కాఫీ తాగుదాం
Let's have Coffee
**3)** ఇంటికి వెళదాం పద.
Let's go home
**4)** ఇంగ్లిష్‌లో మాట్లాడుకుందాం
Let us (Let's) converse in English
**5)** ఇంగ్లిష్ నేర్చుకుందాం
Let's (Let us) learn English.

**II.**
'Let' అంటే ఇంకో అర్థం చేయనివ్వు, తిననివ్వు, చూడనివ్వులాంటి భావం (= సమ్మతించడం)
**1)** వాడిని ఇక్కడికి రానీయండి.
Let him come here
**2)** వాళ్లను వెళ్లనీయండి.
Let them go
**3)** నన్ను మాట్లాడనీయండి.
Let me talk
**4)** ఆవిడను పాడనీయండి.
Let her sing
**5)** నన్ను విననీయండి.
Let me hear



M. SURESAN

**III.**
Let అంటే ఇంకో అర్థం సమ్మతించడం (allow)
**1)** మళ్లీ వాడిని ఇక్కడికి రానీయను
I don't let him come here again.
**2)** వాడిని టైమ్ వేస్ట్ చేయనివ్వకు
Don't let him waste time/ Let him not waste time.
**3)** దీన్ని వాడికి తెలియనివ్వకు
Don't let him know it / Let him not know it.
**4)** ఆవిడతో వాడిని మాట్లాడనివ్వకు
Don't let him talk to her.
**5)** వాడిని ఇక్కడ ఉండనివ్వకు
Don't let him stay here/ Let him not stay here.
**6)** మేం పిల్లలను మాట్లాడనివ్వం.
We don't let children talk.

ఈ వాక్యాలన్నింటిలో let అంటే allow అని తెలుస్తోంది కదా.



**ప్రశ్న:** Being ను సాధారణంగా passive voiceలో వాడతాం. కానీ He is being difficult వాక్యంలో being ను ఏవిధంగా వాడారో తెలియజేయగలరు. Actually being తర్వాత verb past participle లో ఉండాలి కదా! being ను ఏ సందర్భంలో వాడతారో తెలియజేయగలరు.

*– యం. సర్ఫరాజ్ నవాజ్, కర్నూలు*

**జవాబు:** He is being difficult- అంటే అతను ఇప్పుడు సమస్యగా ఉన్నాడు అని అర్థం. ఇక్కడ 'is being' అంటే ఇప్పుడు ఉండడం (continuous), is being తర్వాత past participle ఉంటే అది passive voice అవుతుంది.
The letter is being written (రాయబడుతూ ఉంది I am/We are writing the letter కు passive). is being పక్కన difficult లాంటి గుణాలను తెలిపే మాటలుంటే అవి ఉండే వాళ్లుగా ఉన్నారని అర్థం.
I am being good to you.
నీ పట్ల నేను మంచిగా ఉంటున్నాను (ఇప్పుడు).
He is being harsh.
అతడు చాలా కఠినంగా ఉన్నాడు అని అర్థం.

**ప్రశ్న:** వ్యాకరణ సూత్రాలను అనుసరించి
What will you be?
Where will you be?
What will your plan be?
How will your plan be?
అని ప్రశ్న వాక్యాలు ఉండాలి. ప్రశ్నలో సబ్జెక్టు ముందు will be/ shall be/ can be/ may be రాకూడదు కదా! కానీ ఇటీవల మీరు స్పోకెన్ ఇంగ్లిష్ ఆరో భాగంలో రాసిన సంభాషణలో What will be your plan? అని రాశారు అది తప్పు కదా! ఒప్పు అయితే గ్రామర్ సూత్రం తెలియజేయగలరు.

*– అల్లంరాజు కృష్ణగీతార్జున, నిడదవోలు*

**జవాబు:** What will be your plan? కరెక్టే. అయితే మీ సందేహం కూడా సరైనదే. what తో ప్రారంభించే ప్రశ్నలకు కొన్ని సందర్భాల్లో will be, shall be లు కలిసే వస్తాయి. ఇవి 'what questions' కు మాత్రమే. అయితే What will your plan be? అనడం కూడా కరెక్టే. ఎక్కువగా What will be your plan? అంటాం.

**ప్రశ్న:** having ను ఏయే సందర్భాల్లో వాడతారు? ఈ పదం వచ్చినప్పుడు verb కూడా past participle లోనే వాడాలా? ఉదాహరణలతో వివరించండి.

*– కారె రవికుమార్, భోగాపురం*

**జవాబు:** I, We, You, They అయితే have అంటాం. He, She, It అయితే has అంటాం.
**a)** I/We/You/My friends (they) have the book.
**b)** My friend (He/She) has the book.
**c)** The fan (It) has three blades.

have/has రెండు అర్థాలు:
1. ఏదైనా ఒకరికి ఉండడం (కలిగి ఉండడం). పై వాక్యాల్లో have అర్థం ఇదే.
2. తినడం, తాగడం (ఆహారం)
**a)** I have coffee in the mornings.
(నేను ఉదయం కాఫీ తీసుకుంటాను.)
**b)** My mother has breakfast at 8 AM.
(అమ్మ ఉదయం ఎనిమిదింటికి బ్రేక్‌ఫాస్ట్ చేస్తుంది.)

am having, is having, are having అనేవి తినడం, తీసుకోవడం అనే అర్థానికే వాడతారు. కలిగి ఉండడం అనే అర్థంతో వాడరు.
I am having a car అంటే నేను కారును తింటున్నాననే విపరీతార్థం వస్తుంది.
నాకు కారుంది- అనడానికి I have a car.
నా స్నేహితుడికి ఒక కొడుకు, ఒక కూతురు ఉన్నారు.
My friend has a son and a daughter.
My friend is having a son and a daughter.
అంటే వచ్చే విపరీతార్థం- ఆయన వాళ్లను తింటున్నారని కదా!
కాబట్టి ఇటువంటిచోట్ల am having / is having / are having వాడం.
I am having tea, because coffee is not available. ఇక్కడ am having correct.
(కాఫీ లేదు కాబట్టి టీ తాగుతున్నాను)
She is having a beautiful necklace.
ఇది రైటో కాదో చూడండి. కాదుకదా. ఆమె నెక్లెస్‌ను తినదు. కాబట్టి she has a beautiful necklace అనాలి. having కు సంబంధించి మరిన్ని విషయాలు రాబోయే వ్యాసాల్లో చర్చిద్దాం.




# జరిగినవీ... జరగనివీ!

**Murali:** Hi Sravanthi, keeping well?
(స్రవంతీ, బాగున్నావా? )
ఇది కూడా పలకరింపే. మీ conversation లో వాడండి.

**Sravanthi:** I am, of course. How about you?
(నేనుకులాసానే. నీ సంగతి? )
(How about you?= నీ సంగతి)

**Murali:** I am OK. I saw you at the park last evening.
(బాగానే ఉన్నాను. నిన్న సాయంత్రం నేను నిన్ను పార్క్‌లో చూశాను.)

**Sravanthi:** But I didn't (= did not) see you. Why didn't you (= did you not) talk to me.
(నేను నిన్ను చూడలేదు. మరెందుకు నాతో మాట్లాడలేదు? )


*How about you?*

**Murali:** I had a call from home. My mother wanted me immediately. So I rushed home.
(నాకు ఇంటి నుంచి ఫోన్ వచ్చింది. అమ్మ నన్ను వెంటనే రమ్మంది. హడావుడిగా ఇంటికెళ్లాను.)

**Sravanthi:** I stayed at with my friend Sudha till 7 PM.
(నా స్నేహితురాలు సుధతో రాత్రి 7 గంటల వరకు పార్క్‌లోనే ఉన్నాను.)

ఈ conversation లో verbs- saw, had, wanted, rushed and stayed. అవే Questions లో వచ్చినప్పుడు did see, did talk అవడం గమనించండి. ఈ verbs ను Past Doing Words అంటాం. ఇవి గతంలో మనకు తెలిసిన సమయంలో (ఏ రోజు, ఏ సంవత్సరం, ఏ సమయం, ఏ నెల తదితర వివరాలు) జరిగిన సంఘటనలను గురించి చెబుతాయి. వాటిని మళ్లీ ఒకసారి గుర్తుతెచ్చుకుందాం.

Past doing Words కు మరికొన్ని ఉదాహరణలు చూడండి.

| Regular Doing Words | | Past Doing Words |
|---|---|---|
| Come, | Comes | Came |
| Sing, | Sings | Sang |
| Like, | Likes | Liked |
| Talk, | Talks | Talked |
| Smell, | Smells | Smelt |

Regular Doing Words కు not తో questions లో do, does వస్తాయి.
come - not తో/ question లో do come
comes - not తో/ question లో does come
Walk - not తో/ question లో do walk
Walks - not తో/ question లో does walk
(For Regular actions)

అలాగే Past Doing Words (came, walked, talked, sang, stood లాంటి verbs) కు not తో, questionలో 'did' వస్తుంది. (మళ్లీ గుర్తుంచుకోండి. టైమ్ తెలిసిన past action కు Past Doing Word వాడతాం.)

He sang well yesterday.
(నిన్న బాగా పాడాడు)
నిన్న బాగా పాడలేదు (అంటే not తో)
He did not sing well yesterday.
'did' not తో రావడం గమనించండి.
నిన్న బాగా పాడాడా? (ఇది question)
Did he sing well yesterday?
ఇక్కడ question లో కూడా 'did' రావడం గమనించండి.
నిన్న ఎలా పాడాడు?
How did he sing?
ఎప్పుడు పాడాడు?
When did he sing?

కాబట్టి గుర్తుంచుకోవాల్సిన విషయం-
Past Doing Word ను (past simple form) not తో గాని, question లో గానీ వాడితే did + 1st Regular Doing Word అవుతుంది.

He sang well yesterday.
a) He did not sing well yesterday.
b) Did he sing well yesterday?
sang + not/? = did sing

ఈ కింది వాక్యాలు ఇంగ్లిష్‌లో practice చేయండి.
eg: అతను నిన్న ఇక్కడికి వచ్చాడు.
He came here yesterday.




అతను నిన్న ఇక్కడికి రాలేదు.
He did not come here yesterday.
అతను నిన్న ఇక్కడికి వచ్చాడా?
Did he come here yesterday?

1. **a)** ఆమె గత వారం అమెరికా వెళ్లింది.
   **b)** ఆమె గతవారం అమెరికా వెళ్లలేదు.
   **c)** ఆమె అమెరికా వెళ్లిందా?
2. **a)** అతను గత సంవత్సరం డిగ్రీ పూర్తిచేశాడు.
   **b)** అతను గత సంవత్సరం డిగ్రీ పూర్తి చేయలేదు.
   **c)** అతను డిగ్రీ ఎప్పుడు పూర్తిచేశాడు?
3. **a)** తరగతులు ఉదయం పదింటికి ప్రారంభమయ్యాయి.
   **b)** తరగతులు ఉదయం పదింటికి ప్రారంభం కాలేదు.
   **c)** తరగతులు ఉదయం పదింటికి ప్రారంభమయ్యాయా?
4. **a)** నిన్న నువ్వు అతడిని కలుసుకున్నావు.
   **b)** నిన్న నువ్వు అతడిని కలుసుకోలేదు.
   **c)** నిన్న నువ్వు అతడిని ఎందుకు కలుసుకున్నావు?
5. **a)** గత వారం వాళ్లు ఇక్కడికి వచ్చారు.
   **b)** గత వారం వాళ్లు ఇక్కడికి రాలేదు.
   **c)** గత వారం వాళ్లు ఇక్కడికి ఎప్పుడు వచ్చారు?
   **d)** గత వారం వాళ్లు ఇక్కడికి ఎందుకు వచ్చారు?
   **e)** గత వారం వాళ్లు ఇక్కడికి ఎందుకు రాలేదు?
6. **a)** నేనామెను మొదట నాలుగేళ్ల క్రితం (ago) కలుసుకున్నాను.
   **b)** నేనామెను మొదట నాలుగేళ్ల క్రితం కలుసుకోలేదు.
   **c)** నువ్వు ఆమెను ఎప్పుడు కలుసుకున్నావు?
   **d)** అప్పుడు ఆమె నీతో ఏం చెప్పింది?
   **e)** అప్పుడు ఆమె నీతో ఏమన్నా చెప్పిందా?
7. **a)** మేం నిన్నటికే ఇవన్నీ సిద్ధం చేశాం.
   **b)** మేం నిన్నటికే ఇవన్నీ సిద్ధం చేయలేదు.
   **c)** మీరు నిన్నటికే ఇవన్నీ సిద్ధం చేశారా?
   **d)** మీరు నిన్నటికే ఇవన్నీ ఎందుకు సిద్ధం చేయలేదు?
   **e)** మీరు నిన్నటికే ఇవన్నీ ఎందుకు సిద్ధం చేశారు?
8. **a)** నేను గత సంవత్సరం నెల్లూరులో చదివాను.
   **b)** నేను గత సంవత్సరం నెల్లూరులో చదవలేదు.
   **c)** నువ్వు ఎక్కడ చదివావు?
   **d)** నువ్వు నెల్లూరులో చదివావా?
9. **a)** నిన్న నేను సినిమాకు వెళ్లాను.
   **b)** నిన్న నేను సినిమాకు వెళ్లలేదు.
   **c)** నువ్వు నిన్న సినిమాకు వెళ్లావా?
   **d)** నిన్న నేను సినిమా కెళ్లానా?
   **e)** నిన్న నువ్వు సినిమాకు ఎందుకెళ్లావు?
   **f)** నిన్న నేను ఏ సినిమాకు వెళ్లాను?
10. **a)** హేమంత్ గత వారం కారు కొన్నాడు.
    **b)** హేమంత్ గత వారం కారు కొనలేదు.
    **c)** హేమంత్ గత వారం కారు కొన్నాడా?
    **d)** హేమంత్ గత వారం ఏ కారు కొన్నాడు?

**Answers:**

1. **a)** She went to / left for the US last Week.
   **b)** She did not go to / leave for the US last Week.
   **c)** Did she go to / leave for the US?
2. **a)** He completed (his) degree last year.
   **b)** He did not complete (his) degree last year.
   **c)** When did he complete (his) degree?
   ఇక్కడ 'Complete' బదులు, 'take', 'pass' వాడి practice చేయండి.
3. **a)** The classes began at 10 AM.
   **b)** The classes did not begin at 10 AM.
   **c)** Did the classes begin at 10 AM.?
4. **a)** You met him yesterday.
   **b)** You did not meet him yesterday.
   **c)** Why did you meet him yesterday?
5. **a)** They came here last week.
   **b)** They did not come here last week.
   **c)** When did they come here last week?
   **d)** Why did they come here last week?
   **e)** Why didn't they come here last week?
   (didn't they = did they not / did not they)
6. **a)** I met her first (for the first time) four years ago (back కాదు).
   **b)** I did not meet her four years ago.
   **c)** When did you meet her?
   **d)** What did she tell you / say to you then?
   **e)** Did she tell you / say anything to you?
7. **a)** We made all these ready yesterday.
   **b)** We did not make all these ready yesterday.
   **c)** Did you make all these ready yesterday?
   **d)** Why didn't you (did you not / did not you) make all these ready yesterday?
   **e)** Why did you make all these ready yesterday?


M. SURESAN

8. **a)** I studied in Nellore last year.
   **b)** I did not study in Nellore last year.
   **c)** Where did you study?
   **d)** Did you study in Nellore?
9. **a)** I went to a movie yesterday.
   **b)** I did not go to a movie yesterday.
   **c)** Did you go to a movie yesterday?
   **d)** Did I go to a movie yesterday?
   **e)** Why did you go to a movie yesterday?
   **f)** Which movie did I go to, yesterday?
10. **a)** Hemant bought a car last week.
    **b)** Hemant did not buy a car last week.
    **c)** Did Hemant buy a car last week?
    **d)** Which car did Hemant buy (last week)?

కాబట్టి past actions, time stated (టైమ్ తెలిసి, గతంలో జరిగిన) వాటికి Past Doing Word (came, sang, wrote లాంటివి) వాడతాం. జరగని వాటికి questions తో did + 1st Regular Doing Word వాడతాం.




**ప్రశ్న:** Standard English ప్రకారం ఇతరుల ఫోన్ నెంబర్ మన అడ్రస్‌గా ఇస్తే ఏమని పిలవాలి.
– శ్రీధర్, తిరుపతి

**జవాబు:** pp number అనడం సరి కాదు. పాతరోజుల్లో ఫోన్లు చాలా అరుదుగా ఉండి, STD లేకుండా Trunk booking ఉన్నప్పుడు ఫోన్ నెంబరు ఇచ్చి ఫలానా వ్యక్తికి (Particular Person -PP) call అని చెబితే ఆ వ్యక్తే వచ్చి మాట్లాడే వరకు ఆగేవారు. ఇతరుల ఫోన్‌నెంబర్ మనని పిలవడానికి వాడితే అది CONTACT NUMBER- అంటే ఆ నంబర్ మీద దొరుకుతాను అని అర్థం.





Students go to college to study

# మూడు అర్థాలతో infinitive

**Prasanthi:** Hi Preethi, where were you yesterday?
(ప్రీతి, నిన్న నువ్వు ఎక్కడున్నావు? )

**Preethi:** I went to Ameerpet to see my cousin Prema.
(మా cousin Premaను చూడడానికి Ameerpet వెళ్లాను.)

**Prasanthi:** I called you yesterday to ask you for some books. Why is Prema in Hyderabad now?
(కొన్ని పుస్తకాలు అడగడానికి నిన్న నీకు ఫోన్ చేశాను. ప్రేమ హైదరాబాద్‌లో ఎందుకుంది? )

**Preethi:** To join a software institute here.
(ఇక్కడ software institute లో చేరడానికి)

**Prasanthi:** Which institute does she want to study in?
(ఏ ఇన్‌స్టిట్యూట్‌లో చదవాలనుకుంటోంది? )

**Preethi:** I don't know. To learn software in some good place is all that she wants.
(తెలీదు. ఆమెకు కావాల్సిందల్లా ఏదో ఒక మంచి institute లో software నేర్చుకోవడం)

పై సంభాషణలో to see, to ask, to join, to learn అన్న మాటలు గమనించండి.
ఇవన్నీ ఏ రూపంలో ఉన్నాయి?
To తర్వాత 1st Regular Doing Words (see, ask, join, learn) వస్తున్నాయి కదా. వీటిని infinitives అంటాం.
Englishలో infinitive కు చాలా ప్రాముఖ్యం ఉంది.
Infinitive కు మరికొన్ని ఉదాహరణలు-
- to eat
- to smoke
- to buy
- to sell etc.

Infinitive ను మూడు అర్థాలతో వాడతాం. పై సంభాషణలో మీరు గమనించే ఉంటారు.

➡ ఉద్దేశం (purpose) తెలియజేయడం.
**a)** Students go to college to study.
(చదవడానికి)
**b)** Suseela came here to join a college.
(college లో చేరడానికి)
**c)** He went out an hour ago to buy vegetables. (కొనడానికి)

➡ Want, wish, hope, expect, desire లాంటి కోరికలు తెలిపే verbs పక్కన infinitive వస్తే 'చేయాలని' అనే అర్థం వస్తుంది.
**a)** She wants to sing.
(పాడాలని అనుకుంటోంది.)
**b)** He wishes to go home.
(ఇంటికి వెళ్లాలని అనుకుంటున్నాడు.)




**c)** They hope to pass.
(pass అవ్వాలని/అవుతామని ఆశిస్తున్నారు.)
**d)** Kamala expects to get a prize.
(ప్రైజ్ పొందుతానని అనుకుంటోంది.)

➡ రాయడం, (to write), తినడం (to eat) etc అనే పనులను infinitive తెలియజేస్తుంది.
**a)** To sit in the class for five hours a day is not a joke.
(అయిదు గంటలు క్లాస్‌లో కూర్చోవడం తమాషా కాదు.)
**b)** To drive a car in such traffic is difficult.
(ఇలాంటి traffic లో car drive చేయడం చాలా కష్టం.)
**c)** To smoke is bad for health.
(పొగ పీల్చడం ఆరోగ్యానికి హానికరం.)

ఈ మూడో అర్థం (రాయడం, తినడం లాగా) వచ్చినప్పుడు infinitive బదులు 'ing' from (eating, smoking, etc) వాడవచ్చు. అర్థం మారదు.
**a)** To sit in the class for five hours is not a joke.
Sitting in the class for five hours is not a joke (to sit - sitting).
**b)** To drive a car is difficult.
Driving a car is difficult
**c)** To smoke is bad for health.
Smoking is bad for health.

ఈ కింది వాక్యాలను Englishలో practice చేయండి.
1) నేను వెళ్లాలనుకుంటున్నాను.
2) ఆమె పాడాలని అనుకుంటోంది.
3) ప్రతి విద్యార్థి best college లోనే చేరాలనుకుంటాడు.
4) ఒక రోగిని చూడడానికి నిన్న ఆసుపత్రికి వెళ్లాను.
5) వేణు చదరంగం ఆడడానికి రోజూ సుబ్బారావు ఇంటికి వెళతాడు.
6) ఈ గ్రూప్ చదవడం ప్రేమ్‌కి ఇష్టం లేదు.
7) అంతదూరం నడవడం సులభం కాదు.
8) వాడు నిన్న సర్టిఫికెట్లు తెచ్చుకోడానికి college కి వెళ్లలేదు.
9) ఆమె ఆ చీరకొనాలని అనుకుంటోందా?
10) నీకు చదవడం ఇష్టం లేదా? (like వాడండి)
11) ఆ ఉద్యోగం వస్తుందని ప్రమీల ఆశిస్తోందా? (hope, get) వాడండి.
12) పుస్తకం కొనడానికి నిన్న ఎక్కడికి వెళ్లావు?
13) రాఘవకి చదవాలని లేదు.

M. SURESAN

**Answers:**
**1)** I want to go.
**2)** She wishes to sing.
**3)** Every student wants to join the best college.
**4)** I went to the hospital yesterday to see a patient.
**5)** Venu goes to Subbarao's everyday to play chess.
**6)** Prem does not like to study this group.
**7)** To walk/walking such a distance is not easy.
**8)** He did not go to college yesterday to get the certificates.
**9)** Does she want/wish to buy the sari?
**10)** Don't you like (Do you not like) to study?
**11)** Does Pramila hope to get that job?
**12)** Where did you go yesterday to buy the book?
**13)** Raghava does not want to study.

*ఈ మాటలు గమనించండి*
Scold, chide, reprimand = కోప్పడడం, మందలించడం, కేకలేయడం
crush = నలపడం, పిండడం, నలిగిపోవడం
Squeeze = (రసం కోసం) పిండడం
Squeeze tooth paste/shaving cream on the brush.
(బ్రష్ మీద paste వేయడం).
Squeeze dry = దుస్తులు పొడిగా అయ్యేంత వరకు పిండడం.
ఇదే అర్థంతో ఇంకో మాట wring.
twist = వంచడం, మెలిపెట్టడం
twist the arm = చేయి మెలిపెట్టడం
fold = మడత, మడత పెట్టడం
ఈ కింది పేర్లు తెలుసుకోండి.
lizard - బల్లి
(Dinosaurs లాంటి వాటిని giant lizards అంటారు)
giant - భారీ శరీరంగలవాడు
(WWE లో wrestlers లాగా). giant, gigantic (జయంట్, జైగాంటిక్) అన్నా చాలపెద్ద size అని.
His is a gigantic figure.
(భారీ ఆకారం); Giant wheel తెలుసుకదా.
తాబేలు - tortoise (టాటిస్).
ఊసరవెల్లి - chameleon (కమీలియన్)
పావురం - dove/pigeon
చిలుక - parrot
ఇళ్లల్లో పెంచుకొనే కోళ్లు లాంటివి - domestic fowl.




**ప్రశ్న:** స్పోకెన్ ఇంగ్లిష్ పదకొండో భాగంలో రమేశ్, నరేశ్‌ల సంభాషణ ఆ రోజు జరిగినదే. ఉదయం పూర్తయిన పనులకు సంబంధించిన సంభాషణ present perfect tense లో ఉండాలి కదా. మీరు past tense లో ఇచ్చారేమిటి? నిన్న లేదా గతంలో ఎప్పుడైనా జరిగిన విషయాలకు past tense వాడాలి కదా. ముఖ్యంగా bought, didn't you లకు బదులుగా have bought, haven't you లాంటి present perfect ఉపయోగించ వచ్చు కదా వివరించగలరు.
– సి.హెచ్. రామచంద్రమూర్తి, కాకినాడ

**జవాబు:** Past actions, time known గతంలో జరిగినవి ఏ టైమ్‌లో ఏ నెలలో, ఏ రోజు అని కచ్చితంగా చెప్పగలిగితే అప్పుడు మనం past simple మాత్రమే వాడతాం. గతంలో జరిగిన పని ఎప్పుడు, ఏ నెల, ఏ రోజు, ఏ టైమ్‌లో అని చెప్పనప్పుడు (అంతకు ముందు టైమ్ సందర్భానుసారంగా తెలిసినప్పుడు తప్ప) present perfect వాడతాం.
**a)** He has brought a car.
(టైమ్ తెలియజేయడం లేదు)
**b)** He bought the car this morning.
(టైమ్ చెబుతున్నాం)

## VOCABULARY

ఈ కింది Vocabulary items మీ సంభాషణల్లో వాడండి
**1)** ఈర్ష్యపడడం- envy
she envies her sister.
(సోదరి మీద ఆమె ఈర్ష్యపడుతోంది)
**2)** jealousy- అసూయ
jealous - అసూయతో ఉండడం
ఇతరులకున్నవి మనకు లేనప్పుడు మనకు కలిగే బాధ- ఈర్ష్య (envy).
మనకున్నది ఇతరులకు కూడా ఉండి మన ప్రాముఖ్యం తగ్గిందనుకుంటే అది అసూయ (jealousy).
A poor man may envy a rich man.
(ధనవంతుడిని చూస్తే పేద వాడికి ఈర్ష్య కలగవచ్చు)
She is jealous of her neighbour because she bought the same necklace as hers.
(తనకున్న నెక్లెస్ లాంటిదే పక్కింటావిడ కొన్నందుకు ఆమెకు అసూయ)
**3)** gratitude - (గ్రాటిట్యూడ్) కృతజ్ఞత.
He has gratitude.
He has no gratitude.
**4)** grateful - (గ్రేట్‌ఫుల్) కృతజ్ఞత కలిగిన
I am grateful to you for your help.
(మీ సహాయానికి కృతజ్ఞుడిని)
**5)** దేవుడి పట్ల కృతజ్ఞతగల - thankful
I am thankful that I have such parents.
(అలాంటి తల్లిదండ్రులున్నందుకు దేవుడికి కృతజ్ఞుడిని)
(grateful - మనిషి పట్ల కృతజ్ఞతగల,
thankful - దేవుడి పట్ల కృతజ్ఞత గల)




# ఇప్పుడు... ఈ క్షణం!!

**Bhaskar:** Hi, Bhanu. What <u>are</u> you <u>doing</u>?
(భాను ఏం చేస్తున్నావు)
**Bhanu:** Don't you see? I <u>am preparing</u> for an exam.
(చూడడం లేదా? పరీక్షకు ప్రిపేరవుతున్నాను)
**Bhaskar:** Oh, are you? Where is your brother?
(అలాగా, మీ బ్రదర్ ఎక్కడ?)
**Bhanu:** He <u>is getting</u> ready to go to college
(కళాశాలకు వెళ్లడానికి సిద్ధమవుతున్నాడు)
**Bhaskar:** And What about your parents?
(మరి మీ తల్లిదండ్రుల సంగతేంటి?)
**Bhanu:** They <u>are watching</u> the T.V.
(వాళ్లు టీవీ చూస్తున్నారు.)

'What about', 'How about' లను 'సంగతేంటి?' అనేందుకు వాడుతుంటాం. practice చేయండి.

**a)** How about my money?
నా డబ్బు సంగతేంటి?
**b)** What about that book?
ఆ పుస్తకం సంగతేంటి?
**c)** How about a movie this evening?
ఈ సాయంత్రం సినిమాకెళదామా?
**d)** What about the dinner you promised me?
నాకిస్తానన్న డిన్నర్ విషయం ఏం చేశావ్?

పై సంభాషణలో are doing, am preparing, is getting, are watching - ఈ verbs గమనించండి. వీటి రూపం: am + ... ing, is + ... ing, are + ...ing. ఈ formలో మరికొన్ని verbs.

<u>am</u> study<u>ing</u> / <u>is</u> study<u>ing</u> / <u>are</u> study<u>ing</u>
<u>am</u> walk<u>ing</u> / <u>is</u> walk<u>ing</u> / <u>are</u> walk<u>ing</u>
<u>am</u> sing<u>ing</u> / <u>is</u> sing<u>ing</u> / <u>are</u> sing<u>ing</u>
<u>am</u> work<u>ing</u> / <u>is</u> work<u>ing</u> / <u>are</u> work<u>ing</u>

ఈ am + ing, is + ing, are + ing verb forms (present continuous / present progressive tense అంటారు) ఇప్పుడు ఈ క్షణంలో జరుగుతున్న పనులను తెలియజేస్తాయి.

★ 'I' తో am + ing,
★ he, she (ఏ పేరైనా singular లో), it (ఏ వస్తువైనా, జంతువైనా- singular లో) అయితే is + ing,
★ plural subjects అన్నిటితో, you తో అయితే are + ing వస్తాయి.

M. SURESAN

**a)** I <u>am watching</u> the T.V.
నేను టీవీ చూస్తున్నాను (ఇప్పుడు).
**b)** My mother <u>is cooking</u>.
మా అమ్మ వంట చేస్తోంది (ఇప్పుడు).
**c)** Kumar <u>is</u> not <u>studying</u>.
కుమార్ చదవడం లేదు (ఇప్పుడు).
**d)** What <u>is</u> your father <u>doing</u>?
మీ నాన్నగారేం చేస్తున్నారు (ఇప్పుడు).
**e)** Where <u>is</u> he <u>going</u>?
వాడెక్కడికి వెళుతున్నాడు (ఇప్పుడు).
**f)** <u>Are</u> you <u>threatening</u> me?
నన్ను బెదిరిస్తున్నావా? (ఇప్పుడు).
**g)** She <u>is</u> not <u>dancing</u> well.
ఆమె నాట్యం బాగా చేయడం లేదు (ఇప్పుడు).
**h)** <u>Am</u> I <u>troubling</u> you?
నేను మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నానా? (ఇప్పుడు).
**i)** Why aren't they (are they not) coming?
వాళ్లెందుకు రావడంలేదు (ఇప్పుడు).
**j)** You <u>are wasting</u> time.
నువ్వు టైమ్ వృథా చేస్తున్నావు (ఇప్పుడు).

am + ing, is + ing, are + ing verbs ను ఇప్పుడు జరుగుతున్న పనులకు వాడతాం. ఈ కింది వాటిని English లో బిగ్గరగా practice చేయండి.

**Aruna:** హాయ్ అమల! ఏం చేస్తున్నావు?
**Amala:** ఈ ప్రశ్నలకు జవాబులు రాస్తున్నాను.
**Aruna:** నేను నిన్ను disturb చేస్తున్నానా?
**Amala:** అదేం లేదు. TV నన్ను disturb చేస్తోంది.
**Aruna:** ఎవరు చూస్తున్నారు?
**Amala:** అమ్మ చూస్తోందనుకుంటా.
**Aruna:** మీ brother కూడా చూస్తున్నాడు.
**Amala:** వాడా చూస్తున్నాడా?
**Aruna:** అవును. మీ అమ్మ ఇప్పుడు వంటగదికి వెళుతోంది.
**Amala:** మనకు టీ పెట్టడానికి వెళుతోందనుకుంటా. (I think తో begin చేయండి) మా brother english movie చూస్తున్నాడనుకుంటా.
**Aruna:** కాదు. english movie చూడడం లేదు. తెలుగు serial చూస్తున్నాడు.

### Answers:

**Aruna:** Hi, Amala, what <u>are</u> you <u>doing</u>?
**Amala:** I <u>am writing</u> answers to these questions.
**Aruna:** <u>Am</u> I <u>disturbing</u> you?
**Amala:** Not at all. (ఈ expression practice చేసి మీ సంభాషణల్లో వాడండి. 'అదేం లేదు, కానే కాదు, లేనేలేదు అని అర్థం) The TV <u>is disturbing</u> me.
**Aruna:** Who <u>is watching</u> the TV?
**Amala:** I think my mother <u>is watching</u> the TV
**Aruna:** Your brother <u>is</u> also <u>watching.</u>
**Amala:** Is he also watching?
**Aruna:** Yes, but your mother <u>is going</u> into the kitchen.
**Amala:** I think she is going to make tea for us. I think my brother <u>is watching</u> an English movie.
**Aruna:** No. He <u>is watching</u> a Telugu serial.

**చాలా ముఖ్యమైన విషయం**

**1.** am + ing, is + ing, are + ing - ఈ verbs ఇప్పుడు జరుగుతున్న పనులకు మాత్రమే వాడతాం. క్రమం తప్పని, ఎప్పుడూ జరిగే పనులకు, మీకు తెలుసుకదా, Regular Doing Words (go, goes, come, comes, sing, sings లాంటి verbs) మాత్రమే వాడతాం. Every day, very often, frequent, rarely, never, once, twice, three times etc., a day, a week, a month etc. (అంటే regularity ని సూచించే మాటలతో వాడడం అన్నమాట.)

**2.** am + ing, is + ing, are + ing, టైమ్ తెలిస్తే




అంటే ఏ టైమ్, ఏ రోజు, ఏ నెల, ఏ సంవత్సరం, ఎన్ని రోజులు, ఎంతసేపు అనే వివరాలు తెలిస్తే జరగబోయే పనులకూ వాడవచ్చు.

**a)** నేను రేపు హైదరాబాద్ వెళుతున్నాను
(I am leaving for Hyderabad <u>tomorrow</u>. ఇక్కడ tomorrow అని చెప్పడం వల్ల future action కు వాడుతున్నాం. tomorrow లేకపోతే 'I am leaving for Hyderabad' అంటే ఇప్పుడు వెళుతున్నా అని అర్థం.)

**b)** మా అక్క వచ్చే వారం ఇక్కడికి వస్తోంది.
My sister <u>is coming</u> here next week.
**c)** వాళ్లు రెండు మూడు రోజుల్లో కారు కొంటారు.
They <u>are buying</u> a car <u>in two or three days</u>.
**d)** సుమంత్ వచ్చేనెల అమెరికా వెళుతున్నాడు.
Sumanth <u>is leaving</u> for the US next month.

(futureకు will, shall వాడవచ్చు. అయితే టైమ్ కచ్చితంగా తెలిసినప్పుడు, జరిగేపని కచ్చితమైనప్పుడు, am + ing/ is + ing/ are + ing ఎక్కువ వాడుతుంటారు.)

ఈ కింది వాటిని English లో practice చేయండి.

**a)** అతడు రేపు ఇక్కడికి వస్తున్నాడు.
**b)** మేము అరగంటలో బయల్దేరుతున్నాం.
**c)** వచ్చేవారం పాకిస్థాన్ జట్టు ఇక్కడ రెండు మ్యాచ్‌లు ఆడుతుంది.
**d)** వచ్చేవారం ఎవరు వస్తున్నారు?
**e)** డాక్టర్‌ని ఎప్పుడు కన్సల్ట్ చేస్తున్నావు?
**f)** వచ్చేవారం నేనక్కడికి వెళ్లడం లేదు. ఆపై వారం వెళతాను. (ఆపై వారం = week after the next).
**g)** మంత్రి బ్రిడ్జిని రేపు ప్రారంభిస్తారు (inauguration).
**h)** యూనివర్సిటీ పది రోజుల్లో ఫలితాలను విడుదల చేస్తుంది (విడుదల = release).
**i)** వాళ్లు వారంలో తిరిగి వస్తారు.
**j)** రేపు నేను సిఎమ్‌ను కలుసుకుంటా.

### Answers:

**a)** He <u>is coming</u> here tomorrow.
**b)** We <u>are starting/leaving</u> in half an hour.
**c)** The Pak team <u>is playing</u> two matches here next week.
**d)** Who <u>is coming</u> next week?
**e)** When <u>are</u> you <u>consulting</u> the doctor?
**f)** I <u>am</u> not <u>going</u> there next week. I <u>am going</u> there the week after next.
**g)** The minister <u>is inaugurating</u> the bridge tomorrow.
**h)** The University <u>is releasing</u> the results in ten days.
**i)** They <u>are returning</u> within a week.
**j)** I <u>am meeting</u> the CM tomorrow.

---

Q A

**ప్రశ్న:** All India Radio News వింటున్నప్పుడు కొన్ని సందేహాలు కలిగాయి. ఈ కింది వాక్యాలపై నా సందేహాలు తీర్చగలరు.

1. The Nationalist Congress party headed by Mr. Sarad Pawar complained that the congress <u>is not consulting</u> its constituent parties on important issues.
2. The BJP president Mr. Venkaiah Naidu has said that <u>BJP will not support</u> Congress at the centre.
3. However, Miss Umabharati contradicted the rumour that she <u>is disobeying</u> the party rules.
4. The PM Vajpayee said only NDA <u>can provide</u> stability to the country.
5. The TDP supremo Chandrababu Naidu said that only secular parties <u>will play</u> a major role in the elections.
6. The Municipal Commissioner Mr. Raghu Rami reddy said immediate measures are being taken up to provide drinking water to the residents of Kurnool.

నా సందేహమేమిటంటే News reader చదువుతున్న సమాచారం అంతా జరిగిపోయినదే. కాబట్టి ఇది Indirect Speech.

మొదటి వాక్యంలో is not consulting బదులు was not consulting అని, రెండో వాక్యంలో will not support బదులు would not support అని, ఆరో వాక్యంలో measures are being taken up బదులు measure were being taken up అని ఉండాలి కదా. అలా News reader ఎందుకు చదవలేదు? మన గ్రామర్ పుస్తకాల్లో Indirect Speech నియమాల ప్రకారం present continuous ను past continuousగా, will + present verb ను would + present verb గా మార్చాలి కదా! కానీ News లో అలా ఎందుకు మార్చి చదవలేదో అర్థం కాలేదు. దయచేసి నా సందేహాలను తీర్చగలరు.

*– హనుమంతు, ప్రియాంక (గార్లదిన్నె)*

**జవాబు:** మీరు రాసిన sentences లో మొదటిది '...<u>complained</u> that... <u>is</u> not <u>consulting</u>' కరెక్ట్ కాదు. మీకు వచ్చిన సందేహం సరైనదే. ఇక్కడ 'is' బదులు, 'was' ఉండాలి. అయితే complain చేసినప్పుడే కాకుండా ఆ తర్వాత కూడా consult చేయకపోవడం జరుగుతూ ఉంటే అప్పుడు ఎలా అనే సందేహం రావచ్చు. మార్గాంతరం 'complained' బదులు 'has complained' అని రాస్తే, 'is not consulting' తో కరెక్టయిన అర్థం వస్తుంది. ఈ కారణం వల్ల మీరు రాసిన Sentence No (2) కరెక్ట్. ఇక్కడ reporting verb, '<u>has said</u>' present perfect tense కాబట్టి, will కరెక్ట్. అదే '...Naidu said' అని ప్రారంభిస్తే అప్పుడు 'would' correct.

Sentence No. 3: '... contradicted... disobeying' కరెక్ట్ కాదు. 'was obeying' అని ఉండాలి. లేకపోతే Uma Bharathi <u>has contradicted</u> అని present perfect tense లో ఉంటే 'is disobeying' correct.

Sentence 4: '... only NDA could' అని ఉండాలి. ఇక్కడ '... only NDA can' తప్పు.

Sentence 5: '... Naidu said that only secular parties will play' తప్పు. 'Would play' correct.

Sentence 6: '... Reddy said, ... are being taken up' సరికాదు. 'were being taken up' correct. ఇక్కడ కూడా '...<u>Reddy has said</u>' అని మారిస్తే (said కు బదులు), అప్పుడు 'are being taken up' కరెక్ట్.

ఒక విషయం- Direct speech లో inverted commas వెలుపల ఉండే verbs- say, tell, ask, question లాంటి వాటిని Reporting verbs అంటాం. Inverted commas లోపల ఉండే verbs ను Reported verbs అంటాం. Reporting verbs present tense లో ఉంటే Indirect speech కు మార్చినప్పుడు, Reported verbs tense మార్చకూడదు.

a) "They play well," <u>says</u> Ram to Rahim. ఇక్కడ Quotations బయట ఉన్న reporting verb 'says' present tense. కాబట్టి Quotations లోపల ఉన్న reported verb 'play' tense మార్చకూడదు. దీనికి Indirect speech-
Ram says to (tells) Rahim that they <u>play</u> well.

అలాకాకుండా "They play well," <u>said</u> Ram to Rahim అన్న sentence లో Reporting verb 'said' past tense. ఇప్పుడు quotations లో ఉన్న play అనే reported verb ను past tense లోకి తప్పనిసరిగా మార్చాలి. దీనికి Indirect speech-
Ram told Rahim that they <u>played</u> well.




# ఇప్పుడే జరుగుతున్నా...

**Mohan:** Hi, Manoj, How are you getting along?
(హాయ్ మనోజ్, ఎలా ఉన్నావ్? )
ఇది కూడా పలకరింపే. practice చేసి వాడండి మీ సంభాషణల్లో

**Manoj:** Fine. Thank you. How are you?
(బాగానే ఉన్నాను. నువ్వు ఎలా ఉన్నావు? )

**Mohan:** Ok too. I am going to a movie. Why don't you come along?
(నేను సినిమాకెళుతున్నాను. నువ్వు కూడా రావచ్చు కదా!)

**Manoj:** Like to. But I am going for a walk now.



*I am taking Coffee*

This is the time when I go for walk every day.
(రావాలనే ఉంది. కానీ ఇప్పుడు వాకింగ్‌కి వెళుతున్నా. రోజూ ఈ టైమ్‌కి నేను వాకింగ్‌కి వెళతా)

**Mohan:** Do you walk everyday along this road?
(రోజు ఈ రోడ్‌లోనే వాకింగ్ చేస్తావా? )

**Manoj:** No. Usually I walk along the college road, but now I am walking along this road because that road is under repair.
(కాదు. సాధారణంగా నేను కళాశాల రోడ్‌లో వెళతాను. ఆ రోడ్‌కి మరమ్మతులు చేస్తున్నారు.)

**Mohan:** So long (అంటే bye లాగా వీడ్కోలు మాట) see you. (మళ్లీ కలుసుకుందాం)

**Manoj:** Bye (బై)

ఈ సంభాషణలో am going, go; walk, am walking తేడాలు గమనించండి. మనకు తెలుసు - 1st Regular Doing words (1st RDWs- go, walk లాంటి verbs), 2nd Regular Doing Words (2nd RDWs- goes, walks లాంటి verbs) క్రమం తప్పకుండా జరిగే వాటికి వాడతాం. am+ing/ is+ing/ are+ing ఇప్పుడు జరుగుతున్న పనులకు వాడతాం.

**a)** I take coffee (take 1st RDW).
(నేను కాఫీ తీసుకుంటాను- Regular- ప్రతిరోజు అది అలవాటు)

**b)** I am taking coffee.
(am + ing - ఇప్పుడు నేను coffee తీసుకుంటున్నాను.)

**c)** She goes to college at 10 AM.
(goes- 2nd RDW- ఆమె ఉదయం 10 గంటలకు కళాశాలకు వెళుతుంది- రోజూ)

**d)** She is going to college.
(is going - is+ing - ఇప్పుడు ఆమె కళాశాలకు వెళుతోంది.)

**e)** They come here on sundays.
(come - 1st RDW ఇది ప్రతి ఆదివారం - Regular గా జరిగేది- ఆదివారాలు వాళ్లు ఇక్కడికి వస్తారు.)

**f)** They are coming.
(are + ing - వాళ్లు ఇప్పుడు వస్తున్నారు.)

ఈ తేడా English లో చాలా ముఖ్యం. Regular actions కు am + ing, is + ing, are + ing verbs (present continuous tense) ఎప్పుడూ రావు. వస్తే అది తప్పు.
ఒకటే గుర్తుంచుకోవాలి.
Regular actions కు Regular Doing Words (come, comes, take, takes లాంటివి) వస్తాయి.
నేనిప్పుడు టీ తీసుకుంటున్నాను ఇక్కడ coffee బాగుండదు కాబట్టి.

**a)** Mr. Sen teaches English.
(ఆయనెప్పుడూ English బోధిస్తాడు. అంటే ఆయన English lecturer/teacher అయి ఉండాలి/అవ్వచ్చు)




**b)** Mr. Sen is teaching English
(ఆయన ఇప్పుడు English చెబుతున్నాడు.)
ఈ తేడా English లో చాలా ముఖ్యం.

**c)** Dogs bark.
(కుక్కలు ఎప్పుడూ మొరుగుతాయి- అది వాటి నైజం.)

**d)** Dogs are barking.
(కుక్కలు ఇప్పుడు మొరుగుతున్నాయి- కొత్తవాళ్లో, దొంగలో వచ్చి ఉండాలి)

ఈ కింది వాక్యాలను English లో బిగ్గరగా practice చేయండి.

**a)** ఆయన ఎప్పుడూ punctual గా వస్తాడు. ఈ రోజు మాత్రం కాస్త ఆలస్యంగా వస్తున్నాడు.

**b)** మామూలుగా వాళ్లు ఇండియాటుడే చదువుతారు. ఈ రోజు మాత్రం ఇంకో మ్యాగజీన్ (some other magazine వాడండి) చదువుతున్నారు.

**c)** నువ్వెందుకు టైమ్ waste చేస్తావు? ఇప్పుడెందుకు చేస్తున్నావు?

**d)** ప్రతి రోజు ఈ టైమ్‌కి నువ్వు ఎక్కడికెళతావు? ఎక్కడికి వెళుతున్నావు?

**e)** ఏ న్యూస్ పేపర్ చదువుతావు? ఇప్పుడు ఏ న్యూస్ పేపర్ చదువుతున్నావు?

**f)** మామూలుగా రాత్రి చపాతీ తింటావు కదా? ఈరోజు అన్నం (rice) తింటున్నావేం?

**g)** అతడు ఆదివారాలు ఫ్రెండ్స్‌ని కలుసుకోడు. ఈరోజు కలుసుకుంటున్నాడు.

**h)** ఆమె ఎప్పుడు తెలుగు పాటలే పాడుతుంది. ఇప్పుడు మాత్రం హిందీ పాట పాడుతోంది.

**i)** అతను కాఫీ తాగడు. ఇప్పుడు తాగుతున్నాడు ('take' వాడండి).

**j)** మామూలుగా అతను ఆమెతో మాట్లాడడు. ఇప్పుడు మాట్లాడుతున్నాడు.

**Answers:**

**a)** He comes punctually (always/usually). He is coming late only today.

**b)** They usually read India Today, but now they are reading some other magazine.



M. SURESAN

**c)** Why do you waste time? Why are you wasting time?

**d)** Where do you go at this time every day? Where are you going?

**e)** What news paper do you read? What news paper are you reading?

**f)** You usually take chapathis at night. Why are you taking rice (now)?

**g)** He does not meet his friends on sundays, but he is meeting them today.

**h)** She always sings Telugu songs, but she is now singing a Hindi song.

**i)** He doesn't take (does not take) coffee. He is taking it now.

**j)** He doesn't (does not) usually talk to her, but he is talking to her.

### ముఖ్య సూచన

కొన్ని verbs ను am + ing/ is + ing/ are + ing రూపంలో వాడం. am + ing/ are + ing/ is + ing - verb ఈ రూపంలో ఉన్నప్పుడు ఇప్పుడు జరుగుతున్న పనులకు వాడతాం. అయితే కొన్ని verbs విషయంలో ఆ verbs చెప్పేపని ఇప్పుడు జరుగుతున్నా వాటిని am + ing/ is + ing/ are + ing forms లో వాడం. అందుకు బదులు Regular Doing Words (love, loves, etc.) form లోనే చెబుతాం.

am + ing/ is + ing/ are + ing from లో వాడని verbs మన మనసుకు సంబంధించిన విషయాలను తెలిపే verbs-

**1)** like (ఇష్టపడడం) -am liking, is liking, are liking వాడం. ఇవి వాడాల్సినచోట like, likes వాడతాం.

Kumar likes that shirt very much అంటాం. అతను ఇష్టపడడం ఇప్పుడైనా Kumar is liking that shirt అనం.

**2)** dislike (ఇష్టంలేకపోవడం)
They dislike his class.

వాళ్లకు ఆయన క్లాసు ఇప్పుడు ఇష్టం లేకపోయినా ఇలాగే చెబుతాం. are disliking, is disliking, am disliking అన్న forms రావు. అవితప్పు. వాటి బదులు dislike, dislikes అని అంటాం.

ఇలాంటివి ఇంకొన్ని verbs, (am + ing, is + ing, are + ing) లో వాడనివి.

**3)** love - love, loves, (am/ is/ are loving బదులు)
**4)** hate - hate, hates (am/ is/ are hating బదులు)
**5)** hope - hope, hopes (am/ is/ are hoping బదులు)
**6)** want - want, wants (am/ is/ are wanting బదులు)
**7)** wish - wish, wishes (am/ is/ are wishing బదులు)
**8)** desire - desire, desires (am/ is/ are desiring బదులు)
**9)** envy - envy, envies(am/ is/ are envying బదులు)
**10)** feel (కొన్ని సందర్భాల్లో) feel, feels, (am/ is/ are feeling బదులు).

---

**Q A**

**ప్రశ్న:** అతను నిన్న వచ్చి ఉండలేదు- అనడానికి He was not come yesterday అనవచ్చా? నేను వెళ్లినప్పుడు అతను ఇంటి వద్ద లేకుండెను- అనడానికి ఇంగ్లిష్‌లో He was not at home, when I went for him అని అంటాం. అలాగే నేను అడిగినప్పుడు అతడు పనిని పూర్తి చేసి ఉండలేదు- అని చెప్పడానికి He was not completed the work yet when I ask him అని చెప్పవచ్చా? ఆమె తిని ఉండలేదు. ఆమె వచ్చి ఉండలేదు (నేను చూసినప్పుడు).
అతను ఆ పని పూర్తి చేసి ఉండలేదు (నేను వెళ్లినప్పుడు).
ఇలాంటి భావాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి.

*– ఎస్. దానకిశోర్, కర్నూలు*

**జవాబు:** He was not come yesterday కరెక్ట్ కాదు. ఇంగ్లిష్‌లో ఎప్పుడూ 'be' forms (am, is , are , was, were, etc.) తర్వాత come, go,లాంటి 1st Regular Doing Words రావు. కాబట్టి He was not come తప్పు. He did not come అనాలి.
ఆమె తిని ఉండలేదు, ఆమె వచ్చి ఉండలేదు (నేను చూసినప్పుడు).
ఇక్కడ నేను చూసినప్పుడు When I looked for him/her అనుకుంటే She had not eaten; She had not come అనవచ్చు. అయితే had eaten, had come అనే had + pp forms వాడేటప్పుడు సందర్భాన్ని జాగ్రత్తగా గమనించాలి.
When I went for him, he was not at home- కరెక్ట్. అయితే He was not completed the work అన్న sentence కరెక్ట్ కాదు. దానికి అర్థం లేదు. He had not completed అనాలి. అలాగే She had not completed అనాలి. తర్వాత వ్యాసాల్లో దీని గురించి మరింత వివరణ ఉంటుంది.

**ప్రశ్న:** Leave letter రాసేటప్పుడు As I am suffering from fever వాక్యంలో as కి బదులు since వాడవచ్చా?

*– కవీందర్, మడికొండ, వరంగల్*

**జవాబు:** 'since' ను 'as' బదులు వాడవచ్చు. ఈ రెంటిండికీ తోడు because కూడా వాడవచ్చు. మూడింటికి ఈ సందర్భంలో 'అందువల్ల/ ఎందుకంటే' అని అర్థం.

**ప్రశ్న:** How long- అంటే ఎంతసేపు, How far- అంటే ఎంత దూరం లాగానే ఒక వ్యక్తి ఎన్నో వాడు అనే అర్థం వచ్చేలాగా ఎలా రాయాలి?
**ఉదా:** భారతదేశ ప్రధాన మంత్రుల్లో మన్మోహన్‌సింగ్ ఎన్నోవాడు?

*– డి. కుమారస్వామి, నల్లగొండ*

**జవాబు:** ఈ ప్రశ్నకు సరైన వాక్యం అంటే- ఎన్నో అన్న ప్రశ్నకు సరైన మాట English లో లేదు.




# ing అన్నిచోట్లా రాదు!!

**Durga:** Look at Leela's dress. Isn't it (= Is it not) really wonderful?
(లీల డ్రెస్ చూడు, చాలా బాగుంది కదా!)

**Valli:** Ok I like it really. In fact, I wish now to buy one such dress for myself.
(నాకు చాలా నచ్చింది. ఇప్పుడే అలాంటి డ్రెస్ కొనేయాలని ఉంది.)

**Durga:** Renuka too likes it. I desire one like that too. I feel like buying it, but I haven't (= do not have) the money.
(రేణుక కూడా ఆ డ్రెస్ అంటే ఇష్టపడుతోంది. నాకూ కొనాలని ఉంది. ఇప్పుడే కొనేయాలనిపిస్తోంది. కానీ డబ్బు లేదు.) feel like +...ing = ఏదైనా చేయాలనిపించడం. feel like going to bed = నిద్ర పోవాలనిపిస్తోంది)

**Valli:** I really envy Leela for the dress.
(నాకు లీల డ్రెస్ అంటే ఈర్ష్యగా ఉంది. Envy = ఈర్ష్య/ఈర్ష్య పడడం)

ఈ సంభాషణలో like, wish, desire, have, envy, feel - ఈ verbs అన్నీ ఇప్పుడు జరుగుతున్న విషయాలనే చెబుతున్నాయి. ఇప్పుడు జరిగే విషయాలను తెలిపే verbs ఎప్పుడూ am + ing, is + ing, are + ing form (present continuous) లో ఉండాలని తెలుసుకున్నాం. అయినప్పటికీ పై సంభాషణలోని verbs- like, wish లాంటివి మనసుకు, భావాలకు సంబంధించిన verbs లో కొన్ని కాబట్టి, అలాంటి verbs ను am + ing/ is + ing/ are + ing రూపంలో వాడం. అలాంటి సందర్భాల్లో Regular Doing Words (like, likes, wish, wishes, desire, desires, envy, envies) గానే వాడతాం. ఇలాంటి verbs మరికొన్ని-
dislike, love, hate, hope, want, appreciate (హర్షించడం), admire (మెచ్చుకోవడం) కొన్ని సందర్భాల్లో feel, (feel అంటే ఓ అనుభూతిని, స్పర్శను తెలియజేసినప్పుడు) prefer -
వీటినెప్పుడూ మనం am + ing, is + ing, are + ing లో వాడం అనే విషయం కచ్చితంగా గుర్తుపెట్టుకోవాలి.

a) ఆమె అతడిని ప్రేమిస్తోంది.
She loves him.
(She is loving him కాదు. ప్రేమించడం ఇప్పుడు జరుగుతున్నా సరే.)

b) వాళ్లు పాసవుతామని ఆశిస్తున్నారు.
They hope to pass.
(They are hoping to pass కాదు. వాళ్లు ఆశించడం ఇప్పుడే అయినా)

పై list లో మిగతా verbs కు కూడా ఇదే rule.
Actions of the mind (ఆలోచనలకు, బుద్ధికి సంబంధించిన చర్యలను) తెలిపే verbs కు కూడా am + ing, is + ing, are + ing form లేదు. అవి-

1) know = తెలియడం
2) understand = అర్థం చేసుకోవడం
3) remember = జ్ఞాపకం చేసుకోవడం
4) forget = మరచిపోవడం
5) decide = నిర్ణయించడం
6) doubt = సందేహించడం
7) think = ఆలోచించడం
8) suppose = అనుకోవడం
9) believe = నమ్మడం
10) imagine = ఊహించడం (చాలామటుకు am/ is/ are రాదు)

అంటే ఈ verbs లో దేన్నీ am + ing, is + ing, are + ing form లో వాడం.
వాళ్లు నా మాటలు అర్థం చేసుకుంటున్నారు.
They understand my words. (They are understanding my words కాదు)
am/ is/ are understanding రాదు.
అతడికి ఇంకా నా పేరు గుర్తుంది.
He still remembers my name. (He is still remembering my name అనం కదా)
అలాగే పై list లో ఉన్న మిగతా verbs ను కూడా am + ing, is + ing, are + ing form లో వాడం.


M. SURESAN

a) నా శీలాన్నే సందేహిస్తున్నావా?
దీన్ని English లో ఎలా చెబుతాం? ఇక్కడ 'doubt' వాడాలి కదా. am doubting/ is doubting/ are doubting అనం. 'doubt' question లో వాడాలి. అంటే do రావాలి. కాబట్టి sentence-




Do you doubt my character ?
(Are you doubting my character కాదు.)

b) మీకు హిందీ తెలుసా?
Do you know Hindi? (Are you knowing కాదు.)

c) వాడు నన్నర్థం చేసుకోవడం లేదు.
He is not understanding me అనకూడదు. ఎందుకంటే am/ is/ are + understanding English కాదు కాబట్టి. మరేమంటాం? He does not understand (= understand + not) me.

d) నువ్వేమనుకుంటున్నావు?
What do you think?
(What are you thinking అనం.)

### ముఖ్య విషయం

పైన చెప్పిన verbs విషయంలో liking, loving, thinking, understanding etc. 'ing' forms ను సందర్భాన్ని బట్టి వాడవచ్చు.

**వాడకూడనిది:** ఈ 'ing' forms ముందు, am, is, are చేర్చడం. knowing - సందర్భాన్ని బట్టి వాడవచ్చు. Am/ is/ are + knowing వాడం. అలాగే am/ is/ are understanding ఎప్పుడూ రాదు.
ఇలాగే మిగతావాటి విషయంలో.
am + ing, is + ing, are + ing forms లో వాడని మరికొన్ని verbs ఉన్నాయి. అవి తెలుసుకొనే ముందు, ఈ కింది వాక్యాలను English లో బిగ్గరగా practice చేయండి.

1. అతను పాఠాన్ని చక్కగా అర్థం చేసుకుంటున్నాడు.
2. వాడి గురించి వాడు ఏమనుకుంటున్నాడు? (think వాడండి)
3. నువ్వు ఈ రెస్టారెంట్‌లో కాఫీ ఇష్టపడుతున్నావా?
4. అతడి పేరు నాకు గుర్తు రావడం లేదు. (remember) వాడండి.
5. ఏంటిలా అన్ని విషయాలు మర్చిపోతున్నావు? (why తో ప్రారంభించండి)
6. అతడిని నువ్వు ఎందుకు అనుమానిస్తున్నావు?
7. నాకు ఇక్కడ చదవాలనిపించడం లేదు. (feel like = అనిపించడం)
8. వాడు నన్ను సరిగా అర్థం చేసుకోవడం లేదు.
9. ఆమె ఇప్పుడు ఇంటికి వెళ్లాలని అనుకుంటోందా? (think వాడండి).
10. అతనందరికంటే గొప్పవాడిని అనుకుంటున్నాడా? (suppose ఉపయోగించండి.)
11. నీ ప్రవర్తన అతడికి నచ్చడం లేదు. (dislike వాడండి.)
12. నా మాటలు నువ్వు నమ్మడం లేదా? (believe/ doubt) వాడండి)
13. నువ్వు టీ కన్నా కాఫీనే ఎందుకిష్టపడుతున్నావు? (prefer వాడండి)
14. నీకు నీ పరిస్థితి తెలియడం లేదు (know ఉపయోగించండి.)
15. ఇరాకీలు అమెరికన్లను ద్వేషిస్తున్నారా?

**Answers:**

1. He understands the lesson well.
2. What does he think of himself? ( is thinking రాదు కదా!)
3. Do you like (are you liking అనం) the coffee in this restaurant?
4. I don't (= do not) remember (am not + remembering తప్పు) his name.
5. Why do you forget (are you forgetting కాదు) things like this?
6. Why do you doubt him?
7. I do not feel like studying here.
8. He does not understand me properly.
9. Does she think of going home now?
10. Does he suppose that he is the greatest of all?
11. He doesn't (= does not) like your behaviour.
12. Don't you (Do you not/ Do not you) believe my words/ Do you doubt my words?
13. Why do you prefer coffee to tea? (prefer తర్వాత 'to' వస్తుంది).
14. You do not know your position.
15. Do Iraquis hate Americans?

### VOCABULARY

**Shopping కు సంబంధించిన మాటలు:**
buy, sell తెలిసిన మాటలే.
sale = అమ్మకం
bargain = బేరం, బేరం చేయడం
(A good bargain, a bad bargain best bargain etc.)
good/ bad at bargaining = బాగా బేరం చేయగలగడం/ బాగా బేరం చేయలేకపోవడం
bargain- pronunciation - బాగన్)


*Look at Leela's dress. Isn't it really wonderful?*

purchase = కొనడం
(ఈ అర్థంతో purchase అనడం కన్నా 'buy' అనడం సహజంగా ఉంటుంది).
purchase = కొన్న వస్తువు
My important purchase this week is the TV. (ఈ వారం నేను కొన్న ముఖ్యమైన వస్తువు TV)
return = కొన్న వస్తువు తిరిగి ఇవ్వడం
exchange = కొన్న వస్తువు షాప్‌లో మార్చుకోవడం
replace = కొన్న వస్తువులో దోషం ఉంటే దానికి బదులు షాపు వాళ్లు ఇంకొకటి మనకు ఇవ్వడం
refund = షాపు వాళ్లు డబ్బు వాపస్ ఇవ్వడం
durable = (వస్తువుకు) మన్నిక ఉన్న, మన్నికగల
allow a discount = తగ్గించి అమ్మడం;
expensive = ఖరీదైన
cheap = చౌక అయిన
moderate (price) = సరసమైన (ధర)
cost = ఖరీదు, ఖరీదవడం




**ప్రశ్న:** Simple present tense లో noun పక్కన verb కు s ఉండాలి కదా.
ఉదా: Rama sells mangoes.
God bless you అంటారు, God blesses you అనాలి కదా!
– నామా సంతోష్‌లాల్, అడ్వకేట్, విజయవాడ

**జవాబు:** simple present లో verb కు 's' చేర్చాలి. కరెక్ట్. అయితే "God bless you" అనే sentence statement కాదు. అది 'May God bless you' అనే దీవెన. అలా దీవించేటప్పుడు 'May God bless you' లో 'May' వదిలేసి 'God bless you' అంటుంటాం. అందువల్ల ఇక్కడ 'blesses' రాదు.

**ప్రశ్న:** Not bad అంటే very good అని చదివాం. మీరు not bad అంటే పరవాలేదు అని రాశారు. ఈ రెండింటిలో ఏది కరెక్ట్.
– డి.ఆర్., జగిత్యాల

**జవాబు:** 'Not bad' అంటే పరవాలేదు అని అర్థం కాదు. Very good అనే.

**ప్రశ్న:** The ని ఎలా ఉచ్చరించాలి. చాలా మంది 'ద' అని పలుకుతారు. 'ది' అనకూడదా?
– కె.వి. రమణ, జయపురం, ఒరిస్సా

**జవాబు:** ఇంతకుముందు దీని గురించి జూన్ 16న ప్రచురించిన మూడో భాగంలో వివరించాం. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ- ఈ తెలుగు శబ్దాలతో ప్రారంభం అయ్యే English మాటల ముందు 'the' ని 'ది' గా పలుకుతాం. మిగతా మాటల ముందు 'ద' అంటాం.
The (ది) apple, ant, egg, air, owl, umbrella etc.
The (ద) tree, book, shop, college etc.



**Ravi:** Hi Pavan, what do I see in that glass there? It appears to be some juice.
(పవన్ ఆ గ్లాస్‌లో కనిపిస్తున్నదేమిటి? ఏదో జ్యూస్‌లా ఉంది.)

**Pavan:** Yea. The glass contains fresh lemon juice.
(అవును అందులో తాజా నిమ్మరసం ఉంది.)

contain = ఒక దాన్లో ఏదైనా ఉండడం

the jug contains milk = ఆ జగ్‌లో పాలు ఉన్నాయి

**Ravi:** A new bike is parked outside. Whose is it?
(బయట ఓ కొత్త బైక్ పార్క్ చేసి ఉంది. ఎవరిదది?)

**Pavan:** It belongs to Mahesh. He bought it the day before.
(అది మహేష్‌ది. నిన్నకొన్నాడు.)

Belong = చెందడం

The house belongs to my uncle.

ఆ ఇల్లు మా మామయ్యది (ఆయనకు చెందింది).

**Ravi:** What's that fat book on the table?
(ఆ టేబుల్ మీద ఉన్న ఆ పెద్ద పుస్తకం ఏమిటి?)



*By the way, where does Ganesh live?*

**Pavan:** It contains a lot of information about the latest versions in computers. It comprises ten chapters.
(కంప్యూటర్స్‌కి సంబంధించిన తాజా వెర్షన్ల అత్యాధునిక సమాచారం అందులో ఉంది. అందులో పది అధ్యాయాలు ఉన్నాయి.)

comprises = include = చేరి ఉండడం

**Ravi:** Coming to the bike, does Mahesh really need a bike now? He does not go about much.
(బైక్ విషయానికొద్దాం. మహేష్‌కిప్పుడు బైక్ నిజంగా అవసరమా? ఎక్కువ తిరగడు గదా?)

**Pavan:** Yes, he needs it very much now. He has a new job. Marketing. He has to move about a lot.
(ఇప్పుడు అతడికి బైక్ చాలా అవసరం. మార్కెటింగ్‌లో కొత్త ఉద్యోగం వచ్చింది. చాలా తిరగాల్సి ఉంటుంది.)

**Ravi:** The bike seems very stylish, doesn't it?
(బైక్ చాలా ఆకర్షణీయంగా ఉంది కదా!)

**Pavan:** It comes with a package. The package consists of a CD Player and a set of CDs.
(ఆ బైక్ కొంటే ఒక ప్యాకేజ్ వస్తుంది. అందులో ఒక సిడి ప్లేయర్, కొన్ని సీడీలు ఉంటాయి.)

consists of = కలిగిఉండడం

The fan consists of three blades and a motor.
(ఫ్యాన్‌కు మూడు బ్లేడ్‌లు, ఒక మోటార్ ఉంటాయి.)

**Ravi:** By the way, where does Ganesh live?
(మరి గణేష్ ఎక్కడ ఉంటాడు?)

(By the way - ఈ మాటను topic మార్చడానికి సంభాషణలో వాడతాం. తెలుగులో మరి, అవును అని సంభాషణలో topic మార్చేముందు వాడే విధంగా.)

**Pavan:** He lives quite nearby.
(ఇక్కడికి దగ్గర్లోనే ఉంటాడు.)

ఈ సంభాషణలో verbs- see, appears, contains, belongs, comprises, needs, seems, consists of, live - వీటిని కూడా ఇంతకు ముందు మనం చూసిన verbs లాగా am + ing/ is + ing/ are + ing form లో వాడం (అవి తెలియజేసే పనులు జరుగుతున్నది ఇప్పుడైనా). పై సంభాషణ మరోసారి శ్రద్ధగా practice చేయండి.

### ఏం తెలుసుకున్నాం?

★ మనసుకు సంబంధించిన విషయాలను తెలియజేసే verbs (verbs expressing feelings and emotions).

★ మన బుద్ధికి, ఆలోచనలకు సంబంధించిన విషయాలు తెలిపే verbs (verbs expressing actions of the mind) ఎప్పుడూ am + ing, is + ing, are + ing forms లో రావు. వాటిని అలా వాడాల్సిన పుడు, Regular Doing Words (like, likes, think, thinks) form లోనే వాడతాం.

★ రెండు రకాల verbs తో పాటు పైన చెప్పిన verbs (appear, belong, comprise, consist of, contain, live, need, seem) కూడా am + ing/ is + ing/ are + ing form లో రావు. అలా వాడాల్సి వచ్చినప్పుడు Regular Doing Words గానే వాడతాం. ఈ కింది sentences లో వాటి వాడకాన్ని గమనించండి. 'not' కానీ, question కానీ అయితే do, does వస్తాయని తెలుసు కదా?

ఇంతవరకు మూడురకాల verbs, am + ing/ is + ing/ are + ing లో వాడనివి చూశాం. మరికొన్ని verbs కూడా ఉన్నాయి. అవి తెలుసుకొనే ముందు ఈ కింది sentences ను english లో బిగ్గరగా practice చేయండి.

1) ప్రతివాళ్లూ ఆ సినిమాను ఇష్టపడుతున్నారు.
2) వాడికి ఈ క్లాసులంటే ఇష్టం ఉండడంలేదు (dislike వాడండి).
3) అతడిని ఆమె ప్రేమిస్తోందా?
అది నాకు తెలియడం లేదు. అతడు మాత్రం ఆమెను ప్రేమిస్తున్నాడు.
ఆమెకు ఆ విషయం తెలుసా?

**Answers:**
**1)** Every one likes that movie (is liking కాదు).
**2)** He does not like these classes (is not liking కాదు).
**3)** Does she love him?
I don't (do not) know that. But he loves her.
Does she know that?
Who knows?
**4)** What do you say?/ What are you saying?
Why don't you (do you not) understand me?

# ... అలా అనం కదా !

**1)** వాడు మంచివాడిలా కనిపిస్తున్నాడు.
He appears (is appearing కాదు) to be a good fellow.

**2)** ఈ బిల్డింగ్స్ వాళ్లవి కావు (= వాళ్లకు చెందినవి కావు).
These buildings do not belong to them (are not belonging to them కాదు).

**3)** ఆ గ్లాస్‌లో ఏముంది?
What does the glass contain? (What is the glass containing అనం కదా?)

**4)** బాల్‌పెన్‌లో ఏముంటుంది?



What does a ball pen consist of? (What is a ball pen consisting of అనం కదా).

**5)** ఆ కమిటీలో నలుగురు సభ్యులున్నారు.
The committee comprises four members/Four members comprise the committee. (The committee is comprising...; Four members are comprising... అనం. తెలుసు కదా?)

**6)** అతను ఎక్కడ ఉంటాడు? (నివసిస్తాడు అనే అర్థంతో).
Where does he live? (Where is he living కాదు).

**7)** వాళ్లిప్పుడు ఇక్కడ ఉంటున్నారు (నివసిస్తున్నారు).
They live here (They are living here కాదు).

**8)** వాళ్లిప్పుడు ఇక్కడ ఉండడంలేదు.
They do not live here any more (They are not living అనం).

**9)** నాకు ఇప్పుడు నీ సహాయం అవసరం.
I need your help now (am needing కాదు).

**10)** వాళ్లకిప్పుడు ఇది అవసరం లేదు.
They do not need it now (They are not needing కాదు).

**11)** అది ఆమెకు ఇప్పుడు ఎందుకు అవసరం?
Why does she need it now? (Why is she needing it కాదు).

**12)** వాడు దుర్మార్గుడిలా కనిపిస్తున్నాడు.
He seems (is seeming రాదు) to be a bad fellow.

**13)** అతడు దాంట్లో ఆసక్తిగా లేడు.
He does not seem to be interested in it (is not seeming రాదు).

ఎవరికి తెలుసు?

**4)** ఏం చెబుతున్నావ్ నువ్వు?
నువ్వు నన్నెందుకు అర్థం చేసుకోవడం లేదు?
నేను నిన్ను బాగానే అర్థం చేసుకుంటున్నా. నేను నీకు ఫూల్‌లాగా కనిపిస్తున్నానా? (appear వాడండి).
నువ్వు నా పాయింట్ అర్థం చేసుకుంటున్నట్లు కనిపించడం లేదు (seem వాడండి).
అలాగ ఎందుకనుకుంటున్నావు? (think...so వాడండి. so= అలాగ)



M. SURESAN

నాకలా అనిపిస్తోంది (feel వాడండి)
నువ్వు నన్ను అపార్థం చేసుకుంటున్నావు. నీ మాటలు నేను శ్రద్ధగా వింటున్నాను (అపార్థం= misunderstand). నీ మీద నా గౌరవాన్ని శంకిస్తున్నావా? (doubt....my respect for you వాడండి).

**5)** వాళ్లు ఎక్కడుంటున్నారు? (live వాడండి).
వాళ్లు టౌన్‌హాల్ దగ్గర ఉంటారు (live వాడండి).
వాళ్లు మీ ఇంటి దగ్గర ఉండడంలేదా?
వాళ్లెప్పుడో అక్కడికి మారిపోయారు (ఎప్పుడో= long ago, ఇల్లు మారడం= move).
ఇప్పుడున్న ఇల్లు వాళ్లదేనా? (అంటే సొంతమా? అనే అర్థంతో-own/ belong వాడండి).

**6)** నాకు కొంత డబ్బుకావాలి (need/want వాడండి).
ఎంత కావాలి? (How much తో ప్రారంభించండి).
కనీసం వెయ్యి రూపాయలు కావాలి. (పూర్తి వాక్యం చెప్పండి).
అంతెందుకు కావాలి నీకు?
నీకివ్వాలని ఉందా, లేదా? (want వాడండి).
అంత పెద్దమొత్తం నాకివ్వాలని లేదు. (అంత పెద్ద మొత్తం- such a big amount/ sum/ that kind of money).

**7)** ఆ పుస్తకం ఎప్పుడు కొన్నావు?
కొనలేదు. నిన్న మహేష్ దగ్గర నుంచి తెచ్చుకున్నాను (పుస్తకం, డబ్బు, ఇంకొకరి దగ్గర తెచ్చుకోటం- borrow from).
నువ్విప్పుడు దాన్ని చదువుతున్నావా?
ఎందుకు అడుగుతున్నావు ఆ ప్రశ్న?
నేను చదవాలనుకుంటున్నాను.
కానీ నేను నీకు ఇవ్వాలనుకోవడం లేదు (పుస్తకాన్ని ఇవ్వడం= lend).
ఎందుకు అలా అనుకుంటున్నావు?
నువ్వు పుస్తకాలు నాకివ్వవు కాబట్టి.

I understand you well. Do I appear (to be) a fool to you?'
You don't (do not) seem to understand my point.
Why do you think so?
I feel so.
You misunderstand me. I am listening to you carefully. Do you doubt my respect for you?

**5)** Where do they live?
They live near the townhall.
Don't they (do they not) live near your place?
They moved long ago.
Do they own the house?/ Does the house belong to them?
(am/ is/ are owning కాదు).

**6)** I want/ need some money.
How much do you need?
I need at at least a thousand rupees.
Why do you need such a big amount/ so much/ such a big sum/ that kind of money?
Do you want to give or not?
I don't want to give/ feel like giving such a big amount.

**7)** When did you buy the book?
No, I didn't (did not) buy it. I borrowed it from Mahesh yesterday.
Are you reading it (now)?
Why are you asking that question?
I want to read it.
But I don't want to give/ lend it to you.
Why do you feel so/ think so?
Because you don't give books to me.



**ప్రశ్న:** ఒక సంభాషణలో He wants to talk you, Sir. అని చదివాను. కానీ He wants to talk to you, Sir అని ఉండాలి కదా!
– రేష్మా రాజ్, విశాఖపట్నం

**జవాబు:** 'talk' తర్వాత 'to' కానీ 'with' కానీ తప్పక ఉండాలి. 'talk you, Sir' తప్పు. talk to you, Sir కరెక్ట్.




# కనిపించేవి... ప్రయత్నించి చూసేవి...



*I really don't see how he is able to stand still for so long?*

**Sudha:** What are you looking at so steadily?
(ఏమిటీ, తదేకంగా అటు చూస్తున్నావు? )

**Madhuri:** I <u>see</u> an interesting sight over there.
(అక్కడో ఆసక్తికరమైన దృశ్యం కనిపిస్తోంది.)

**Sudha:** What is it you see there? I do not see any thing. Saritha, do you see any thing?
(ఏం కనిపిస్తోందక్కడ? నాకేం కనిపించడం లేదు. సరితా, నీకేమైనా కనిపిస్తోందా? )

**Saritha:** No. Nothing <u>unusual.</u>
(లేదు. అంతా మామూలుగానే ఉంది.)

unusual = మామూలు కానిది, కొత్త విషయం

**Sudha:** <u>Do</u> you <u>hear</u> Madhuri? Saritha <u>sees</u> nothing unusual. Come on, What attracts you there?
(మాధురీ వినిపించిందా? సరితకు కూడా కొత్తదేమీ కనిపించడం లేదు. అక్కడ ఏం ఆకర్షించింది నిన్ను.)

**Madhuri:** Don't you <u>observe</u> that man there? All made up like Gandhi, and standing still like a statue?
(అక్కడ ఆ మనిషిని గమనించడం లేదా నువ్వు? గాంధీలా మేకప్ వేసుకొని, విగ్రహంలాగా నిలబడి ఉన్నాడు.)

Made up = నాటకాల్లో మేకప్ చేసుకోవడం
still = చలనం లేని

**Sudha and Saritha:** Yes, We <u>see</u> now Saritha. I really don't <u>see</u> how he is able to stand still for so long?
(అంతసేపు కదలిక లేకుండా ఎలా నిలబడి ఉండగలుగుతున్నాడో అర్థం కాకుండా ఉంది.)

See = understand.

అప్పుడప్పుడు, ఎవరన్నా ఏదన్నా చెబితే "I see" అంటాం. దానర్థం 'అర్థమవుతోంది' అని.

**Sudha:** But don't you <u>hear</u> some thing too?
(మీకు ఏమీ వినిపించడం లేదా? )

**Madhuri & Saritha:** What is it?
(ఏమిటి అది? )

**Sudha:** The gibber of the monkey there. It's performing to the boy's commands.
(ఆ అబ్బాయి ఆడిస్తున్న ఆ కోతి కిచకిచలు వినిపించడం లేదా? )

gibber - pronunciation : జిబ
performing = చేయడం, ప్రదర్శించడం

**Madhuri and Saritha:** What's new about it?
(ఏంటమ్మా అందులో వింత? )

ఈ సంభాషణలో see, hear, observe వాడకం గమనించండి. ఇక్కడ see, hear, observe ఈ verb ను ఇప్పుడు కనిపించడం, ఇప్పుడు వినిపించడం, ఇప్పుడు గమనించడం అనే అర్థాలతో వాడినప్పటికీ am/ is/ are seeing; am/ is/ are hearing, am/ is/ are observing అనడం లేదు. am/ is/ are seeing, am/ is/ are hearing, am/ is/ are observing కు బదులు see, hear, observe అనే అంటున్నారు కదా మాధురి, సుధ, సరిత. అలాగే ఇప్పుడు కనిపించడం లేదు/ ఇప్పుడు వినిపించడం లేదు/ ఇప్పుడు గమనించడం లేదు అనేందుకు am not/ is not/ are not seeing/ hearing/ observing అని అనడం లేదు చూశారా?

Do not see/ does not see; do not hear/ does not hear, do not observe/ does not observe అంటున్నారు. కాబట్టి మనం అర్థం చేసుకోవాల్సింది- ఇప్పటివరకు మనం చూసిన am/ is/ are + ing forms లో వాడని verbs తోపాటు, see, hear, observe లాంటి verbs ను కూడా am/ is/ are + ing forms లో ఉపయోగించం. అలా వాడాల్సినపుడు see, sees, hear, hears, observe, observes అని, not తో question లో అయితే do/ does see, do/ does hear, do/ does observe అని వాడతాం.

**a)** I <u>see</u> a picture on the wall.
ఆ గోడ మీది బొమ్మ నాకు కనిపిస్తోంది.

**b)** She <u>sees</u> what he is doing.
వాడు చేస్తున్నది ఆమెకు కనిపిస్తోంది.

**c)** They are standing on the balcony. They see the Sunrise.
వాళ్ళు బాల్కనీలో నిలబడ్డారు. సూర్యోదయం వాళ్ళకు కనిపిస్తోంది.

am seeing/ is seeing/ are seeing కు బదులు, <u>am looking</u> at/ <u>is looking</u> at/ <u>are looking</u> at వాడవచ్చు. కానీ see కి <u>look at</u> కు అర్థంలో తేడా ఉంది.

see = మనకు కనిపించడం
look at = మనం (ప్రయత్నం చేసి) చూడడం

I see the picture on the wall.
గోడ మీద బొమ్మ కనిపిస్తోంది.
I <u>am looking</u> at the picture on the wall.
గోడ మీద బొమ్మను చూస్తున్నాను.
<u>Look</u> at the sky, you <u>see</u> the stars.




ఆకాశం వైపు చూడండి (look). నక్షత్రాలు కనిపిస్తాయి (see).
When you <u>look up</u>, you see the blue sky.
పైకి చూస్తే నీలాకాశం కనిపిస్తుంది.
అతడు ఆమెను చూస్తున్నాడు.
He <u>is looking</u> at her.
(He <u>is seeing</u> her అనం కదా? )
టీచర్ నిన్ను గమనిస్తోంది.
The teacher <u>is watching</u> you.
(am/ is/ are observing అనం కాబట్టి.)

అయితే, 'చూడు' అనడానికి 'see' వాడతారు. 'See if any one is there?' కాబట్టి see కు, look కు తేడా ఉంది.

### ఇది ముఖ్యం!

see అంటే కలుసుకోవడం (meet) అనే అర్థం కూడా ఉంది. ఆ అర్థంతో am seeing/ is seeing/ are seeing వాడడం కరెక్టే.

కలుసుకోవడం ఇప్పుడు జరుగుతున్నట్లయితే-
She <u>is seeing</u> the CM today.
ఆమె సిఎమ్‌ని కలుసుకుంటోంది.
I <u>am</u> not <u>seeing</u> the Governor today.
(నేను ఈ రోజు గవర్నర్‌ను కలుసుకోవడం లేదు.)

Am hearing/ is hearing/ are hearing లేదు కదా. అయితే 'see' కి బదులు 'look' am + ing/ is + ing/ are + ing form లో వాడినట్లే, am <u>hearing</u>/ is <u>hearing</u>/ are <u>hearing</u> కు బదులు, am <u>listening</u> to/ <u>is listening</u> to/ <u>are listening</u> to వాడవచ్చు.


M. SURESAN

see కి, look at కీ తేడా ఉన్నట్లే, hear కు listen to కు అర్థం తేడా ఉంది.

'hear' అంటే మనకు వినపడేది.
'listen to' అంటే మనం (ప్రయత్నం) చేసి వినడం.

Listen carefully. You hear footsteps.
జాగ్రత్తగా విను. అడుగుల చప్పుడు వినిపిస్తుంది (నీకు).
మనం క్లాస్‌లో ఏం చేస్తాం?
Do we hear the teacher or Do we listen to the teacher? మీకు తెలుసు కదా మంచి students ఎప్పుడూ listen to the teacher. (అంటే టీచరు చెప్పేది వాళ్లు శ్రద్ధ పెట్టివింటారు).

### కింది వాక్యాలు చూడండి

**a)** As we walk along the road, we <u>hear</u> the noise of the traffic.
రోడ్డు మీద నడుస్తున్నప్పుడు ట్రాఫిక్ మోత వినిపిస్తుంది.

**b)** We switch on the CD player/ the two-in-one to <u>listen to</u> music.
(మనం సంగీతం వినడానికి సిడి ప్లేయర్/ టుఇన్ వన్ ఆన్ చేస్తాం)

**c)** నేను చెప్పేది నీకు వినిపిస్తోందా?
<u>Do</u> you <u>hear</u> me?
నేను చెప్పేది నువ్వు వింటున్నావా?
<u>Are</u> you <u>listening</u>?

ఈ కింది వాటిని English లో బిగ్గరగా practice చేయండి.

1) ఆ రెండు బొమ్మలు చూడండి. ఏమైనా తేడా కనిపిస్తోందా?
2) అక్కడ చూడండి. ఒక జింక కనిపించడం లేదూ? (deer - జింక)
3) అక్కడ నీకు ఏం కనిపిస్తోంది? ఆ చెట్టు వైపే చూస్తున్నావు.
4) ఇప్పుడే చూడకు. నీ కోసం ఎవరో రావడం కనిపిస్తోంది నాకు (నేను చూస్తున్నాను).
5) ఎవరక్కడ నాకు కనిపిస్తోంది? (whom...see వాడండి). మైకేల్‌జాక్సన్ కాదు కదా?
6) ఎక్కడినుంచో మధురమైన సంగీతం వినిపిస్తోంది (we తో ప్రారంభించి, some where వాడండి).
7) వాడెప్పుడూ మంచి సలహాలు వినడు. వాడికి ఇష్టం లేదు.
8) హలో, ఫోన్లో ఏవో శబ్దాలు వినిపిస్తున్నాయి. నేను చెప్పేది నీకు వినిపిస్తోందా? నువ్వు చెప్పేది నాకేం వినిపించడం లేదు.
9) మనకేదో కొన్ని వింత (strange) దృశ్యాలు కనిపిస్తున్నాయి. కొన్ని వింత శబ్దాలు వినిపిస్తున్నాయి.
10) మనకేదో కొన్ని వింత దృశ్యాలు కనిపించడం లేదూ, కొన్ని వింత శబ్దాలు వినిపించడం లేదూ?

**Answers:**

**1)** <u>Look</u> at those two pictures. Do you <u>see</u> any difference (between the two) (Are you <u>seeing</u> అనం కదా? ).

**2)** Look there! <u>Don't</u> (= do not) you see a deer?
జింక కనిపిస్తోందా?
Do you see a deer?
జింక కనపడడం లేదా?
<u>Don't</u> (Do not) you see a deer?
Are you not seeing? బదులు, Don't you see?

**3)** What <u>do</u> you <u>see</u> there?
(What <u>are</u> you <u>seeing</u> రాదు)
You <u>are looking</u> so much at the tree.

**4)** Don't <u>look</u> now. I <u>see</u> someone coming for you.

**5)** Whom <u>do</u> I <u>see</u> there?
(Whom am I seeing? రాదు)
Isn't (is it not) Michael Jackson?
(Michael Jackson కదా = It is Michael Jackson)

**6)** We <u>hear</u> some sweet music from some where.

**7)** He never <u>listens</u> to good advice. He doesn't (does not) like advice.
never= ఎన్నటికీ కాదు/లేదు.
Advice కు plural లేదు. ఎప్పుడూ singular. Advice ముందు a/an వాడం.

**8)** Hello! I <u>hear</u> some noises over the phone. Do you hear me What I say ? I don't (do not)/am not able to hear what you say.

**9)** We <u>see</u> some strange sights and we <u>hear</u> some strange sounds.

**10)** Don't (do not) we see some strange sights and hear some strange sounds?




**ప్రశ్న:** Housewife బదులు Homemaker అని వాడవచ్చా? My mother is housewife అనడం కంటే My mother is homemaker అంటే బాగుంటుంది కదా?

**– ఆర్. కృష్ణారావు, కిడిమి, శ్రీకాకుళంజిల్లా**

**జవాబు:** 'Housewife' అనే మాట పాతబడిపోయింది. Homemaker అనేది బాగా వాడుకలోకి వస్తోంది. ఈ రెండింటికంటే ఇప్పుడిప్పుడే వాడుకలోకి వస్తున్నమాట (ముఖ్యంగా అమెరికాలో) Houseworker. అది మనకు అంత నచ్చకపోవచ్చు గానీ వాళ్లు ఈ పదాన్నే ఎక్కువ ఉపయోగిస్తున్నారు.



# కొన్నిచోట్ల కొన్ని ఓకే!

**Lakshmi:** Hi, Ajitha, how are you?
(హాయ్ అజిత, ఎలా ఉన్నావ్?)

**Ajitha:** Fine, thank you. How are you?
(బాగున్నా, నువ్వెలా ఉన్నావు?)

**Lakshmi:** OK. thank you. Do I smell something sweet?
(బాగానే ఉన్నా, ఏదో సువాసన వస్తున్నట్లుంది కదూ?)

**Ajitha:** That's right. You smell the jasmine spray I use.
(నిజమే! నేను వాడిన జాస్మిన్ స్ప్రే వాసన అది.)

**Lakshmi:** Well, why have you brought me here?
(ఇక్కడికి నన్నెందుకు తీసుకొచ్చావు?)

**Ajitha:** The coffee here tastes fine and fresh.


*Well, why have you brought me here?*

(ఇక్కడ కాఫీ చాలా బాగుంటుంది.)

**Lakshmi:** O, thank you (After a sip) I am tasting real good coffee for the first time in weeks. ((కొంచెం కాఫీ తాగి) కొన్ని వారాల తర్వాత మొదటిసారిగా మంచి కాఫీ రుచి చూస్తున్నాను.)

**Ajitha:** Wait a minute. I feel some thing creeping up my arm. (ఉండు. ఏదో నా చేతి మీద పాకుతున్నట్టు అనిపిస్తోంది.)

**Lakshmi:** Don't worry. It is only an ant.
(భయపడకు... అది చీమేలే!)

ఈ సంభాషణలో smell, taste, feel- verbs వాడకం గమనించండి. see, hear, smell, taste, feel - ఇవన్నీ బాహ్యేంద్రియాలకు సంబంధించినవి. Hear and see- ఈ రెండు verbs ను am + ing/ is + ing/ are + ing forms లో వాడం. అలాగే కొన్ని సందర్భాల్లో smell, taste, feel కూడా am + ing/ are + ing form లో వాడం.

**a)** smell అంటే ఒక వస్తువు ఇస్తున్న వాసన అనే అర్థంతో వాడినప్పుడు am smelling/ is smelling/ are smelling form లో వాడం.
The rose smells sweet.
(గులాబి సువాసనను ఇస్తుంది.)
The rose is smelling sweet అనం.
అదే మనం దేన్నైనా ఇప్పుడు వాసన చూస్తున్న విషయం చెప్పాలంటే am smelling/ is smelling/ are smelling వాడతాం.




She is smelling the flower in her hand.
(ఆమె చేతిలోని పువ్వును వాసన చూస్తోంది.)
ఇది ఇక్కడ కరెక్టే. కాబట్టి ఒక వస్తువు ఒక వాసన ఇస్తుంది అనే అర్థంతో అయితే is smelling/ are smelling రాదు.
The spray smells fine.
ఆ spray మంచి వాసన ఇస్తుంది అనే అర్థంతో అయితే. The spray is smelling fine కాదు.
They are smelling the spray.
వాళ్ళు ఆ స్ప్రేను వాసన చూస్తున్నారు.
ఇది కరెక్టే - ఎందుకంటే మనం వాసన చూడడం కాబట్టి.

**b)** 'taste' విషయం కూడా అంతే. ఒక వస్తువు ఈ విధమైన రుచిని ఇస్తుంది అనే అర్థంతో అయితే taste, tastes అనే అంటాం. am tasting/ is tasting/are tasting అని అనం.
Biriyani serves here tastes fine.
(ఇక్కడ బిర్యానీ మంచి రుచి నిస్తోంది - The biriyani is tasting fine కాదు.)
అదే మనం దేన్నైనా రుచి చూస్తున్నప్పుడు- am tasting, is tasting, are tasting కరెక్టే.


M. SURESAN

I am tasting the biriyani.
(నేను బిర్యానీని రుచి చూస్తున్నాను.)
ఇక్కడ am tasting కరెక్టే.
She is tasting the dish to see how good it is.
(ఆ వంటకం ఎంత బాగుందో తెలుసుకోడానికి దాన్ని ఆమె రుచి చూస్తోంది).

**c)** 'feel' విషయం కూడా అంతే. మనకు అనుభూతి, భావం ఏదైనా కలిగినపుడు feel/ feels మాత్రమే. am feeling/ is feeling/ are feeling అనం.
**i)** I feel the cold wind blowing on my face.
(నా మొహమ్మీదికి వీస్తున్న చల్లని గాలిని అనుభవిస్తున్నాను.)
**ii)** She feels (is feeling కాదు) strange in this new place.
(ఈ కొత్త ప్రదేశంలో ఆమెకు ఏదో వింతగా అనిపిస్తోంది.)
**iii)** They feel quite at home in the new place.
(They are feeling కాదు)
(ఈ కొత్త ప్రదేశం వాళ్లకు ఏమీ కొత్తగా అనిపించడం లేదు.)
అయితే How are you feeling? అనేది వాడుకలో ఉంది- ఎలా ఉన్నావు? అనే అర్థంతో.

**బాహ్యేంద్రియాల విషయంలో గమనించాల్సిన ముఖ్యాంశాలు**

**i)** am seeing/ is seeing/ are seeing వాడం (కనిపించడం అనే అర్థంతో)
am hearing/ is hearing/ are hearing లేదు. ఈ రెండింటి విషయంలో am/ is/ are looking/ listening వాడతాం.
**ii)** ఒక వస్తువు ఇస్తున్న వాసన అయితే is smelling/ are smeling లేదు. smell/ smells మాత్రమే. మనం వాసన చూస్తున్నప్పుడైతే am smelling/ is smelling/ are smelling correct.
**iii)** ఒక వస్తువు ఇచ్చే రుచి అయితే taste/ tastes అంటాం. is/ are tasting అనం.
**iv)** 'feel' విషయంలో- అనుభవం, అనుభూతి అర్థంతో అయితే feel/ feels కరెక్ట్. am/ is/ are feeling లేదు.
తడిమి చూడడం- అర్థంతో అయితే am/ is/ are feeling వాడవచ్చు.




**ప్రశ్న:** Give అంటే ఇవ్వడం. Given అంటే ఇవ్వబడడం. I have given అంటే 'నాకు ఇచ్చారు' అని అర్థం కదా (నేను ఇవ్వబడ్డాను అని). కానీ చాలా చోట్ల ఇతరుల గురించి చెప్పేటప్పుడు 'He has given' అని 'అతను ఇచ్చాడు' అనే అర్థంతో వాడుతున్నారు. ఇది తప్పు కదా? 'అతను ఇవ్వబడ్డాడు' అని కదా అర్థం?

*-రాధాకృష్ణ, హైదరాబాద్*

**జవాబు:** English కు, తెలుగుకు ఉన్న తేడాల వల్ల, `given' లాంటి past participles మనకు కొంచెం confusing గానే ఉంటాయి. `Given' అనేది past participle. అంటే దానర్థం 'ఇవ్వబడిన' అని. ('ఇవ్వబడడం' కాదు)
**a)** The book given to him.
అతడికి ఇవ్వబడిన పుస్తకం.
**b)** The man seen near the school.
(ఇక్కడ seen past participle అర్థం school దగ్గర చూడబడిన వ్యక్తి అని. Past participleకు అర్థం '...బడిన' అని అసంపూర్తిగా ఉంటుంది.)
**c)** The book torn by the child.
(ఆ బిడ్డ చేత చింపబడిన పుస్తకం)
**d)** The movie released yesterday.
(నిన్న విడుదల చేయబడిన సినిమా)
అయితే తెలుగులో అలా అనం.
**a)** అతనికి ఇచ్చిన పుస్తకం.
**b)** school దగ్గర చూసిన/ కనిపించిన వ్యక్తి.
**c)** బిడ్డ చింపిన పుస్తకం.
**d)** నిన్న విడుదల చేసిన సినిమా అంటాం.

Past participles ముందు had given, have/ has/ had వస్తే వివిధ సందర్భాల్లో- ఇచ్చాను, ఇచ్చాము, ఇచ్చారు, ఇచ్చాడు, ఇచ్చావు అనే అర్థం వస్తుంది. have/has+ participle- గతంలో జరిగిన పని ఏ టైమ్‌లో జరిగింది తెలియజేయకపోతే వస్తుంది.
I have given the book.
నేను పుస్తకం ఇచ్చాను.
(past- ఎప్పుడు, ఏ రోజు, ఏటైమ్‌లో ఇచ్చింది చెప్పడం లేదు- ఇవ్వడం మాత్రం జరిగింది.)
I, we you, they - have given.
he, she, it - has given.
He has given.
అతను ఇచ్చాడు (ఇవ్వడం అయిపోయింది - past, టైమ్ తెలియజేయడం లేదు).
'given' లాంటి past participles ముందు 'be' forms- (am, is, are, was, were, shall be, will be, have been, has been - చివర be, been వచ్చే verbs అన్నీ be- forms.) వస్తే అప్పుడు మాత్రమే చేయబడింది, ఇవ్వబడ్డాడు, etc. passive voice forms వస్తాయి. తెలుగు సంభాషణలో passive voice చాలా అరుదు.
He is seen here every day.
ప్రతిరోజు ఇక్కడ చూడబడతాడు.
He is given salary on the first of every month.
అతను ప్రతి నెలా మొదటి తేదీ జీతం ఇవ్వబడతాడు.
He has given a lecture.
అతను ఉపన్యాసం ఇచ్చాడు.
He is given Rs. 10000 every month. అతను ప్రతి నెలా రూ. 10000 ఇవ్వబడతాడు (అతడికి ఇస్తారు).
They are given. వాళ్ళు ఇవ్వబడతారు.
Children are given milk everyday. రోజూ పిల్లలు పాలివ్వబడతారు.

**ప్రశ్న:** I give more prefer coffee than tea అనాలి. కానీ I give more prefer coffee to tea అని ఎందుకు అంటారు?
I am suffering from fever అంటారు ఎందుకు? I am suffering with fever అన కూడదా?

*- కె మోహన్, కృష్ణ, గన్నవరం*

**జవాబు:** I give more prefer coffee... ఈ sentence సరికాదు.
I prefer coffee to tea అనాలి లేదా I give preference to coffee over tea అనాలి.
1) prefer తర్వాత ఎప్పుడూ 'to' వస్తుంది. 'than' రాదు.
2) 'more preference' అనే వాడుక లేదు. ఎందుకంటే preference లోనే 'more' అనే భావం ఉంది.
'Suffering from' correct తెలుగు, English వాడుకలు పోల్చకూడదు. వేరే భాషలు కదా. తెలుగులో ఒకరి మీద కోపం వస్తుంది. Englishలో angry with (a person) అంటాం. ఇటువంటి విషయాల్లో వాడుకను బట్టి పోవాలి. అది ఎంత ఎక్కువ English చదివితే అంత బాగా వస్తుంది.

**ప్రశ్న:** I am going to go కి I am going కి తేడా ఏమిటి?

*- మనోరంజని, విజయవాడ*

**జవాబు:** 'I am going to go' అంటే వెళ్లబోతున్నాను అని, 'I am going' అంటే వెళుతున్నాను అని.
ఏదైన పనిచేయబోతున్నప్పుడు going to do/ sing/ teach etc. వాడతాం.

**ప్రశ్న:** 1. నేను ఫొటో తీయించుకోవాలి/ తీయించుకున్నాను
2. ఫలానా ఎంట్రీ నా సర్వీస్ పుస్తకంలో రాయించాలి (లేదా ఎంటర్ చేయించాలి/ రాయించాను).
ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి.

*- కె. రాకేశ్‌చంద్, జంగారెడ్డిగూడెం*

**జవాబు:**
**1.** I should/ have to get/ have myself photographed./ I got/ had myself photographed.
**2.** I have to get the entry made/ recorded in my service register (I got the entry made/ recorded in my service register).




# ‘నేను స్కూటర్‌ని తింటున్నాను’

**Raghu:** Hi Pavan, you look dull. What's the matter?
(హాయ్ పవన్, ఏంటి డల్‌గా ఉన్నావు? )

**Pavan:** I <u>have</u> a headache. I don't <u>have</u> (<u>do</u> not <u>have</u>) at home the tablets I usually take.
(తలనొప్పిగా ఉంది. మామూలుగా నేను వేసుకునే మాత్రలు ఇంట్లో లేవు.)

**Raghu:** Sorry to know that. <u>Do</u> you <u>have</u> that novel with you? I mean the novel you bought last week.
(సారీ, కిందటివారం నువ్వు కొన్న నవల నీ దగ్గరుందా? )

**Pavan:** Sorry. I <u>do</u>n't <u>have</u> it. Prakash took it from me yesterday. He <u>has</u> it now.
(సారీ, అది నా దగ్గర లేదు. ప్రకాష్ నిన్న తీసుకున్నాడు. అది అతడి దగ్గరే ఉంది.)

**Raghu:** I <u>have</u> no work today. So I want to spend time reading the book.
(నాకు ఈ రోజేం పనిలేదు. పుస్తకం చదువుతూ గడిపేద్దాం అనుకుంటున్నాను.)

**Pavan:** Go ahead. My brother <u>has</u> another book with him. Take it.
(అయితే కానియ్. మా బ్రదర్ దగ్గర ఇంకో పుస్తకం ఉంది. అది తీసుకో.)

**Raghu:** Where is he?
(అతను ఎక్కడ? )

**Pavan:** He is <u>having</u> breakfast. Wait for a few minutes.
(వాడు బ్రేక్‌ఫాస్ట్ చేస్తున్నాడు. కాసేపు ఆగు)

**Raghu:** <u>Are</u>n't (Are you not) <u>having</u> any?
(నువ్వు ఏమీ తినవా? )

**Pavan:** I don't feel like, with this head ache.
(ఈ తలనొప్పి వల్ల తినాలని లేదు)

ఈ సంభాషణలో మనం గమనించేదేమిటి? కొన్నిచోట్ల ఇప్పుడు జరిగే పనికైనా have/ has వాడడం, కొన్నిచోట్ల am having/ is having/ are having వాడడం. 'am + ing/ is + ing/ are + ing' form లో వాడని verbs లో have కూడా ఉంది. అయితే am having/ is having/ are having form కొన్ని సందర్భాల్లో అర్థాన్నిబట్టి వాడతాం.

**1.** have/ has కు ఉన్న ముఖ్యమైన అర్థం- కలిగి ఉండడం.
I, we, you, they అయితే have.
He, she, it అయితే 'has'.
I <u>have</u> a scooter.
నాకు స్కూటర్ ఉంది.
She <u>has</u> a lot of jewellry.
ఆమెకు చాలా నగలు ఉన్నాయి.
My friends (they) have bikes.
మా ఫ్రెండ్స్‌కు బైక్స్ ఉన్నాయి.
కలిగి ఉండడం అనే అర్థంతో am having/ is having/ are having రావు.

**a)** వాళ్లకు అందమైన ఇల్లుంది.
They <u>have</u> a beautiful house.
(They are having a beautiful house కాదు)

**b)** This coffee <u>has</u> a fine taste.
ఈ కాఫీకి మంచి రుచి ఉంది. (<u>is having</u> కాదు)

**c)** ఈ నగరంలో వెడల్పయిన రోడ్లున్నాయి.
This city has wide roads.
(This city is having... కాదు)

**2.** మనుషులకు, జంతువులకు ఉన్న గుణాలు చెప్పేటప్పుడు am/ is/ are having రాదు. Have/ has మాత్రమే వస్తుంది.

**a)** She <u>has</u> patience.
(ఆమెకు ఓర్పు ఉంది.) is having కాదు.

**b)** The wife and husband <u>have</u> (are having కాదు) a good understanding for each other.
(ఆ భార్యాభర్తల మధ్య మంచి అవగాహన ఉంది.)

**3.** మనకున్న పని గురించి చెప్పేందుకు am/ is/ are having వాడం.

**a)** నాకు చాలా పనుంది.
I have (<u>am having</u> కాదు) a lot of work.

**b)** కుమార్‌కు ఇక్కడ ఉదయం 8 నుంచి సాయంత్రం 6 వరకు డ్యూటీ ఉంది.
Kumar has (is having కాదు) duty here from 8 AM - 6 PM.

**4.** భావాలు, అనుభూతులు చెప్పేటప్పుడు am/ is/ are having రాదు.

**a)** ఆమెకు అతనంటే గాఢమైన ప్రేమ.
She has (is having కాదు) deep love for him.

**b)** సెలెక్ట్ అవుతాననే ఆశ నాకు ఉంది.
I <u>have</u> (am having కాదు) the hope I will be selected.

**5.** మనకు ఉన్న రుగ్మతల్లాంటి వాటిని తెలియజేసేటప్పుడు am/ is/ are having రాదు. have/ has మాత్రమే వస్తుంది.

**a)** నాకు తలనొప్పిగా ఉంది.
I <u>have</u> a headache (am having కాదు.)

**b)** ఆమెకు కామెర్లు.
She <u>has</u> jaundice (is having కాదు).

**c)** అతనికి బాగా జలుబు చేసింది.
He has (is having కాదు) a bad cold.

ఇకపోతే am having/ is having/ are having వాడదగిన సందర్భాలు ముఖ్యంగా-

★ తినడం, తాగడం లాంటివి-

1) నేనిప్పుడు కాఫీ తీసుకుంటున్నాను (తాగుతున్నాను).
I <u>am having</u> coffee.

2) వాళ్లిప్పుడు భోజనం చేస్తున్నారు.
They <u>are having</u> meals now.

3) అతను సిగరెట్ తాగుతున్నాడు.
He is having a smoke.
(He is smoking బదులు)

★ am having/ is having/ are having- `bath'కు వాడవచ్చు.


*She has a lot of jewellry*

**a)** మా నాన్నగారు స్నానం చేస్తున్నారు. కాస్త ఆగండి.
My father is having a bath. Please wait.

**b)** ఆమె షవర్ బాత్ చేస్తోంది.
She <u>is having</u> a shower.

గమనించండి- am/ is/ are having from ముఖ్యంగా తినడం, తాగడం అనే అర్థాలకే పరిమితం. అందుకని am having/ is having/ are having మిగతా సందర్భాల్లో వాడితే విపరీతార్థం వస్తుంది. **eg:**

**a)** I <u>am having</u> a scooter.
(ఈ sentence ప్రకారం వచ్చే అర్థం, 'నేను స్కూటర్‌ని తింటున్నాను' అని కదా. అంతశక్తి మానవుడికింకా రాలేదు, కాబట్టి ఇక్కడ చెప్పాల్సింది- I <u>have</u> a scooter.)

**b)** My friend <u>is having</u> a son and a daughter.
(అంటే- ఆ ఫ్రెండ్ తన కొడుకును, కూతురిని తింటున్నాడనా? అది కాదు కదా? - My friend has a son and a daughter.)

**c)** Saritha <u>is having</u> a wonderful pair of ear rings.
(అంటే - సరిత చాలా అందమైన చెవి ఆభరణాలు తింటోందనా? కాదు కాబట్టి She <u>has</u> a wonderful pair of ear rings.)

ఈ కింది వాక్యాలను practice చేయండి. (అన్నింటికీ have- correct form వాడండి).

1) నా దగ్గర కూడా ఆ పుస్తకం ఉంది. నీ దగ్గరుందా?
2) నీకు ఇప్పుడేమైనా క్లాస్ ఉందా?
3) ఎందుకు కాఫీ తీసుకుంటున్నావు. మామూలుగా నువ్వు టీ తాగుతావు కదా?
4) (ఫోన్లో) 'ఓ నువ్వా? నేను లంచ్ తీసుకుంటున్నా! కాస్త వెయిట్‌చెయ్'
'నాకు మహేష్ ఫోన్ నెంబర్ కావాలి. నీ దగ్గర ఉందా? '
'నా దగ్గర లేదు. రమేష్ దగ్గర ఉంది.'
'నా దగ్గర రమేష్ ఫోన్ నెంబర్ కూడా లేదు.'
5) 'ఆ చీర చాలా బాగుంది కదా? '
'అయితే తీస్కో'
'నా దగ్గర ఇప్పుడు డబ్బులేదు.'
'నా దగ్గర డబ్బు ఉంది కానీ, నాకు ఆ చీర నచ్చలేదు.
6) మామూలుగా పొద్దున బ్రేక్‌ఫాస్ట్ ఏం తీసుకుంటావు? '




'ఎక్కువగా ఇడ్లీ తీసుకుంటా'
'మరి ఇప్పుడెందుకు దోశ తింటున్నావు? '
'ఈ రెస్టారెంట్‌లో ఇడ్లీలు బాగుండవు. దోశలు బాగుంటాయి.'
'నాకు ఇక్కడి రెస్టారెంట్స్ గురించి అంతగా తెలియదు.'
'ఇప్పుడు నువ్వు కూడా దోశ తింటున్నావు కదా. ఎలా ఉంది? '

7) **రాము:** అక్కడున్న కుక్కపిల్ల ఎలా ఉంది?
(కుక్కపిల్ల= Pup)
**రఘు:** నాకు ఇంట్లో కుక్కపిల్ల ఉంది. అది దీని కన్నా పెద్దది.
**రాము:** దానికి పేరుందా?
**రఘు:** దానికి అందమైన పేరుంది. రూబీ. నువ్వు ఇంట్లో ఏ జంతువునైనా పెంచుతున్నావా?
**రాము:** లేదు.

8) **సునీల్:** ఈ భవనానికి చాలా అందమైన appearance ఉంది కదా?
**సుకుమార్:** ఆ విషయంలో నాకేం సందేహం లేదు.
**సునీల్:** దానికి ఒక అందమైన పోర్టికో, బాల్కనీ, పెద్ద కిటికీలు, ఒక పెద్ద హాలు ఉన్నాయి.
**సుకుమార్:** నా దగ్గర డబ్బు ఉంటే, ఈ ఇల్లు కొనాలని ఉంది. (have, wish వాడండి).

9) **షాలిని:** సునీత ఎక్కడ?
**శాంతి:** స్నానం చేస్తోంది
**షాలిని:** సునీతకు రైల్వే బుకింగ్‌లో ఫ్రెండ్స్ ఎవరైనా ఉన్నారా?
**శాంతి:** ఉన్నారు. ఎందుకు?
**షాలిని:** నాకు ఎల్లుండి బెంగుళూరులో ఇంటర్వ్యూ ఉంది. రిజర్వేషన్ కష్టంగా/సమస్యగా ఉంది.

## Answers:

**1.** I also have that book. Have you?/Do you have it.

**2.** Have you/Do you have any class now.

**3.** Why are you having coffee now? You usually have tea.

**4.** (Over phone) Is it you? I am having lunch. Please wait.
I want Mahesh's phone no. Do you have it?
I don't (do not) have it. Ramesh has it.
I don't (do not) have Ramesh's phone number either.
(not ఉన్న sentenceలో 'also' రాదు. అందుకని 'either.')

**5.** Isn't that sari nice/beautiful?
Then have it.
I do not (don't) have/I haven't (have not) the money now.
I have the money but I don't (do not) like that sari.


M. SURESAN

**6.** What do you have for breakfast usually.
I have mostly idles.
Why are you having dosa now?
This restaurant doesn't (does not) have a good name for idles. It has a good name for dosas.
I don't have (do not have)/ haven't (have not) much knowledge of the restaurants here.
You are having a dosa now. How is it?

**7. Ramu:** How is that pup there?
**Raghu:** I have a pup at home. That's bigger than this.
**Ramu:** Has it/Does it have a name?
**Raghu:** Yes. It has a beautiful name. Ruby. Have you/Do you have any pets at home?
**Ramu:** No.

**8. Suneel:** Hasn't (has not) this building/ Doesn't (does not) this building have a beautiful/ grand appearance.
**Sukumar:** I don't have/I haven't any doubt about it.
**Suneel:** It has a beautiful portico, a balcony, big windows and a large/spacious hall.
**Sukumar:** If I have the money, I wish to buy this house.

**9) Shalini:** Where is Suneeta?
**Santhi:** She is having a bath.
**Shalini:** Has Suneeta/ Does Suneeta have any friends in railway booking?
**Santhi:** She has, but why?
**Shalini:** I have an interview in Bangalore the day after tomorrow. I am having a problem/difficulty about reservation.

problem, difficulty లాంటి వాటితో am having/is having/ are having వాడవచ్చు.




# అసలు సంగతి ఆ ఆరింటిలోనే!

**Krishna:** Hi Nikhila, How are you?
(హాయ్ నిఖిల, ఎలా ఉన్నావ్? )

**Nikhila:** Fine, thank you, How go your studies?
(బాగున్నాను. నువ్వు ఎలా చదువుతున్నావు? )

**Krishna:** Studying well. My brother was come yesterday.

**Nikhila:** Was come? Look here, Krishna, we never use verb forms like was come. That isn't English.
(was come క్రియ రూపాన్ని మనం ఉపయోగించం. అది ఇంగ్లిష్ కాదు.)

**Krishna:** దాన్లో తప్పేముంది?

**Nikhila:** మీ బ్రదర్ నిన్న వచ్చాడని కదా- నువ్వంటున్నావు. ఇక్కడ was come అని verb వాడావు. అది తప్పు. English లో verb కు ఆరు రూపాలు ఉన్నాయి. ఆరు రూపాల్లో ఏదో ఒక రూపంలో verb లేకపోతే, అది English కాదు.

**(చాలా మంది పాఠకులు, was come, has going, లాంటి verbs కరెక్టా, కాదా అని అని అడుగుతున్న ప్రశ్నలన్నిటికీ ఈ lesson ఉపయోగపడుతుంది. జాగ్రత్తగా చదవండి, గుర్తుంచుకోండి, practice చేయండి, మీ సంభాషణలో వాడండి.)**

మనకు Spoken English కష్టమనిపించేది, తప్పులు చేసేదీ verb విషయంలోనే.

verb అంటే తెలుసు కదా? subject ఉండే స్థితిని



*Fine, thank you, How go your studies?*

(state of being అంటే ఉండడం) కానీ, subject చేసే పనిని (action) కానీ తెలియజేస్తుంది.

**Eg:** He is here.
అతనిక్కడ ఉన్నాడు.

ఇక్కడ verb 'is' ఉండడాన్ని తెలుపుతుంది.

Sunitha works hard.
సునీత కష్టపడి పనిచేస్తుంది.

ఇక్కడ verb 'works' పనిని (action) తెలుపుతోంది కదా!

English లో verb కు ఆరు కచ్చితమైన రూపాలు ఉన్నాయి. గుర్తుంచుకోండి. మీరు మీ sentence లో వాడే verb మనం చూడబోయే ఆరు రూపాల్లో (six forms) లో ఏదో ఒక రూపంలో ఉండకపోతే మీ sentence correct కాదు. ఇక చూడండి.

## I form of the verb (verb మొదటి రూపం)

**'be' forms**

am, is, are, was, were, shall be, should be, will be, would be, can be, could be, may be, might be, must be, ought be, dare be, need be

ఈ be forms అన్నింటికీ చివర 'be' రావడం గమనించండి.

have been, has been, had been, shall have been, should have been, will have been, would have been, may have been, might have been, can have been, could have been, must have been, need have been, ought have been, dare have been

ఈ be forms చివరలన్నింటికీ been రావడం గమనించండి.

పైవన్నీ 'be' forms. వీటన్నిటికీ అర్థం 'ఉండడం' అనే దానికి సంబంధించి ఉంటుంది. వీటిల్లో కొన్నిటి వాడకం మనం చూశాం. పై వాటినన్నింటినీ మనం చెప్పాలనుకునే అర్థాన్ని బట్టి independent గా వాడవచ్చు.

He is here.
They could be here yesterday itself.
She might be dangerous, etc.

## II form (verb రెండో రూపం)

'be' form+ ...ing form అంటే verb, ఏదైనా 'be' form తర్వాత ఏదైనా '...ing' form (going, coming, singing, dancing etc., లాంటివి)తో వస్తుంది.

Kumar is writing.
**verb:** is (be form) + writing (ing form)]

She has been singing for the past one hour.
ఇక్కడ verb- has been singing
has been ('be' form) + singing (ing)form

verb పైsentences లో, 'be' form + ing form రూపంలో ఉంది కదా. అలాగే-

They could be going there.
could be (be form) + going (ing form).




## III form (verb మూడో రూపం)

Doing Words వీటిని మనం తెలుసుకొని ఉన్నాం కదా.

| 1st Regular Doing word | 2nd Regular Doing word | Past Doing Word |
|---|---|---|
| come | comes | came |
| sing | sings | sang |
| do | does | did |
| talk | talks | talked |
| like | likes | liked |
| smell | smells | smelt |

### గుర్తు చేసుకుందాం!

Regular actions- క్రమం తప్పకుండా జరిగే పనులకు I, we, you, they అయితే 1st Regular Doing word (1st RDW); He, She, It అయితే 2nd RDW వాడతాం. వీటితో not కానీ, Questions లో గానీ అయితే 1st RDW తో 'do', 2nd RDW తో 'does' వాడతాం. ఇవి మనకు తెలుసు కదా. అలాగే Past Doing Word ను గతంలో ఏ టైమ్‌లో జరిగిందో తెలిసి ఉంటే అటువంటి actions కు వాడతాం. Past Doing Word ని notతో కానీ, Questionsతో కానీ వాడితే did వస్తుంది. ఇది కూడా మీకు తెలుసు.

## IV form (verb నాలుగో రూపం)

shall, will, should, would, can, could, may, might, must, need, ought, dare } + 1st RDW

I shall go there tomorrow.
ఇక్కడ verb- shall go. దీని రూపం-
shall + go (1st Regular Doing Word)

Srinu will help me.
**verb:** will help- will + help (1st RDW)

They can sing.
can sing- verb - can + sing (1st RDW)

అలా వీటిల్లో దేని పక్కనైనా 1st RDW వాడితే verb అవుతుంది.

గమనిక: 'shall, will, should, would, etc 'be' forms కావు. shall, should, will, would, etc., పక్కన 'be' ఉన్నప్పుడే అవి 'be' forms అన్న విషయం గుర్తుంచుకోవాలి.

## V form (verb అయిదో రూపం)

have, has, had, shall have, should have, will have, would have, can have, could have, may have, might have, must have, ought have, dare have, need have } + past participle

ఇవి కూడా be forms కావు. వీటిల్లో దేని పక్కనైనా 'been' ఉన్నప్పుడే అది 'be' form అవుతుంది.

shall have been - ఇది 'be' form.
shall have - ఇది 'be' form కాదు.

Past Participle (PP) అంటే తెలుసు కదా?

| | | (PP) |
|---|---|---|
| go | went | gone |
| see | saw | seen |
| do | did | done |
| like | liked | liked |
| talk | talked | talked |

verb, V form లో పైన చూపించిన have, has, had, shall have, should have, etc., లాంటి వాటి పక్కన past participle చేరిస్తే ఆ combination- verb అవుతుంది.

**eg:** He has seen me.
**verb:** has seen - has + past participle (PP)

She will have gone by then.
**verb:** will have gone- will have + gone (PP)

They should have done it.
should have done - should have + done (PP)

ఇలా మిగతా వాటితో కూడా.

## VI form (verb ఆరో రూపం)

'be' form + past participle

ఏదో ఒక 'be' form పక్కన ఏదైనాpast participle (PP) వస్తే అది verb అవుతుంది.

**a)** He was seen there yesterday.
**verb:** was seen- was (be form) + seen (PP).

**b)** The snake has been killed.
**verb:** has been killed, has been (be form) + killed (PP).

**c)** It can be done.
**verb:** can be done- can be (be form) + done (PP)

**d)** He had been killed before he was thrown on the railway track.
**verbs:** had been killed - had been (be form) + killed (PP);
was thrown- was (be form) + thrown (PP).

ఈ VI form of verb కు ఒక ప్రత్యేకత ఉంది. ఈ verb form- 'be form + past participle'. ఈ రూపంలో ఉన్న verb ఎప్పుడూ PASSIVE VOICE లో ఉంటుంది. verb- English లో passive voice లో ఉన్నప్పుడు తెలుగులో 'బడు' అని అర్థం వస్తుంది.

**a)** He was seen here yesterday.
(అతను ఇక్కడ నిన్న చూడబడ్డాడు).

**b)** All kinds of books are sold here.
(verb - passive ఇక్కడ అన్ని రకాల పుస్తకాలు అమ్మబడతాయి).

**c)** The film will be released next week.
(verb- passive సినిమా వచ్చేవారం విడుదల చేయబడుతుంది).

ఒక్క VI form of the verb మాత్రమే passive. మిగతా forms అన్నీ active voice. తెలుగులో మనం passive voice దాదాపు వాడం కదా! అంటే మనం ఇంట్లో 'అమ్మా' అన్నం వండబడిందా అనం. కొట్టుకు వెళ్లి ఈ పుస్తకం ఇక్కడ అమ్మబడుతుందా అనం. spoken telugu లో passive voice వాడం. English లో కూడా ఎంత తక్కువగా వాడితే మన భాష అంత simple గా సహజంగా ఉంటుంది. conversational ease ఉంటుంది.

చూశారు కదా English verb ఎప్పుడూ పై singular forms లో ఏదో ఒక రూపంలో ఉండాలి. లేకపోతే మీరు మాట్లాడేది sentence కాదు. అలా మాట్లాడితే తప్పు. ఇప్పుడు చూడండి-

He was come.
ఇక్కడ verb ఏమవ్వాలి?
was come - (was (be form) + come (1st RDW)
be form + 1st RDW-
six forms of verb లో, ఈ form లేదు. కాబట్టి He was come- sentence కాదు.

was come = was (be form) + come (past participle)
be form + past participle




ఇది passive voice verb అవచ్చు కదా అనే సందేహం మీకు రావచ్చు. ఇక్కడ ముఖ్యమైన విషయం come, go, walk, sit లాంటి verbs కు passive voice ఉండదు.

verb కు ఎవరిని, దేనిని అని ప్రశ్నవేయండి Answer వస్తే passive ఉంటుంది. Answer రాకపోతే passive ఉండదు.

They came yesterday.
verb ఇక్కడ came. దీని అర్థం- 'వచ్చారు' అని. ఎవరిని వచ్చారు? దేనిని వచ్చారు? అనే ప్రశ్నలకు 'Answer' రాదు. కాబట్టి వీటికి passive ఉండదు. అదే He writes books లో 'writes' verb. అంటే అర్థం 'రాస్తాడు' అని. దేనిని రాస్తాడు? అంటే 'పుస్తకాలు' అనే answer వస్తుంది. దీనికి passive తప్పక ఉంటుంది. Books are written by him అని passive చెప్పవచ్చు.




**ప్రశ్న:** Were you there then yesterday?
నిన్న మీరు అప్పుడు అక్కడ ఉన్నారా? ఇలా రాయవచ్చా?
– వి. నారాయణరెడ్డి, గిద్దలూరు

**జవాబు:** రాయవచ్చు.

**ప్రశ్న:** ఒక వార్తాపత్రికలో మహిళాగేయ రచయితని poet అని సంబోధించారు. poetess అనాలి కదా.
– కె. నాగచైతన్య, పాయకరావుపేట

**జవాబు:** English లో రానూ రానూ gender difference (లింగభేదం) పాటించడం తగ్గిపోతోంది. poet కవయిత్రులకూ వాడడం సాధారణమవుతోంది. తప్పు లేదు అంటున్నారు.



# అర్థం అంతా అందులోనే!

**Sasank:** Where is your brother, Radha?
(రాధా, మీ బ్రదర్ ఎక్కడ?)

**Radha:** He coming slowly. I seen him a few minutes ago.
(అతను నిదానంగా వస్తున్నాడు. కొద్ది నిమిషాల కిందట అతడిని చూశా)

**Sasank:** Look here, Radha. Your words, 'He coming slowly', and 'I seen him a few minutes ago' are not sentences because there are no verbs in them, they don't have complete meaning.
(నీ మాటల్లో 'he coming slowly', 'I seen him a few minutes ago' వాక్యాలు కావు. వాటిల్లో verbs లేవు. వాటికి అర్థం పూర్తి కాలేదు కదా)

**Radha:** But 'coming' and 'seen' are verbs. Why to doubt that?
(coming, seen verbs కదా?, అను మానం దేనికి?)

**Sasank:** 'coming' is only an 'ing' form, and 'seen' is just a past participle. In our last article, we have seen the six forms of verbs.

a) 'be' form + ing form is a verb
b) 'be' form/ have/ has/ will have/ shall have etc + past participle is a verb.
(coming అనేది కేవలం 'ing' form, + seen అనేది past participle- ing formముందు 'be' form ఉంటే verbఅవుతుంది. + past participle ముందు 'be' form కానీ have/ has/ had/ shall have వంటివి ఉంటే verb అవుతుంది. ఇవన్నీ మనం కిందటి వ్యాసంలో చూశాం.)

**Radha:** So, you say a sentence in English must have a verb- one of the six forms we saw in last article.
(అంటే English sentence correct గా ఉండాలంటే గత వ్యాసంలో వివరించినట్లుగా verb ఆరురూపాల్లో ఒకటిగా ఉండాలి.)

**Sasank:** That's right
(అవును)

కిందివాటిల్లో correct verbs ను గుర్తించండి. verb correct అయితే brackets లో (c) రాయండి. తప్పయితే (w) పెట్టండి. verb form correct కాకపోతే, correct verb formరాయండి. verb correct అయితే అది ఏ form verb అవుతుందో రాయండి.

**eg:**
1) He was do it (W)
He was doing it (C)
He did it.
2) She looking at it (W)
She is/was/any be form looking at it. (C)
3) They have seen me (C)
(have + past participle)

**Exercise:**
1. They know me.
2. She seen him.
3. They are take coffee.
4. She will help him.
5. The snake been killed.
6. The book stolen.
7. The class going on.
8. We known him.
9. They saw him yesterday.
10. The snake has been killed.

**Answers:**
1. (C) I Regular Doing Word.
2. (W) Correct form: She has/ will have/ would have + seen him
3. (W) Correct form: They are taking coffee.
4. (C)
5. (W) Correct form: The snake has been/had been/will have been (any such 'be' form) + killed.
6. (W) Correct form: The book is/ was/ has/ been (any be form) + stolen
7. (W) Correct form: The class is/ was/ will be going on.
8. (W) Correct form: We have/ had/ will have etc. + known him
9. (C) - Past Doing Word
10. (C) - has been + killed (PP) - Passive voice

verbs కరెక్ట్‌గా form చేసినప్పుడే మన sentences కరెక్టవుతాయి కదా. ఇంతవరకూ మనం నేర్చుకున్నదేంటి?

a) subject - sentence దేనిని గురించి చెబుతోందో అది.
b) Verb - sentence లో subject తర్వాత ఏ మాట/మాటలు లేకపోతే sentence ఉండదో అది/అవి verb.
c) English verb six forms లో ఏదో ఒక form లో ఉండాలి.
d) English లో statement కు (ఏదో ఒక విషయం చెప్పే sentence), question కు order of words లో చాలా తేడా ఉంటుంది.
i) Statement structure: subject + verb
ii) Question structure:
1) verb + subject




2) 1st word of the verb + subject + other words of the verb. (verbలో రెండు మూడు మాటలుంటే...)

**Questions రెండు రకాలు:**
1) 'Wh' questions- what, when, etc.,తో ప్రారంభమయ్యేవి.
2) Non 'wh' questions- what, when etc లేనివి. ఏ రకమైనా subject ముందు verbకాని, verb మొదటిమాట కానీ ఉండి తర్వాత subject, ఆ తర్వాత verb మిగతా మాటలు వస్తాయి.

e) verbs లో ఉండడాన్ని చెప్పే verbs ను 'be' forms అంటాం.
I) am, is, are - ప్రస్తుతం ఉండడాన్ని కాని, క్రమంతప్పకుండా ఉండడాన్ని కానీ చెబుతాయి. am- I తో; he, she, it- is తో; you, we, they- are తో వస్తాయి.
II) was, were గతంలో ఉండడాన్ని చెబుతాయి.
III) shall be, will be భవిష్యత్తులో ఉండడాన్ని చెబుతాయి.
IV) have been (I, We, You, Theyతో), has been (he, she, itతో) గతంలో ఎప్పటి నుంచో, ఇప్పటివరకుగాని, ఇంకాగానీ ఉండడాన్ని చెబుతాయి.
పైవన్నీ ఉండడాన్ని చెప్పే 'be' forms.

f) subject చేసే పనులను తెలియజేసే వాటిని action words అంటాం. వీటిల్లో 1st Regular Doing Words (come, go, take, sit లాంటి verbs - I, we, you, they తో వాడతాం), 2nd Regular Doing Words (comes, goes, takes, sits లాంటి verbs - వీటిని He, She, It తో వాడతాం) క్రమం తప్పకుండా జరిగే Regular Actions కు ఉపయోగిస్తాం.
i) 1st Regular Doing Word ను Question లో గాని, not తోగానీ వాడితే do వస్తుంది.
ii) 2nd Regular Doing Word ను Question లోగాని, not తోగానీ వాడితే does వస్తుంది.

M. SURESAN

g) Past Doing Words (came, went, took, sat లాంటి verbs) గతంలో ఏటైమ్‌లో జరిగిందీ తెలిస్తే అటువంటి పనులకు వాడతాం.
Past Doing Word ను not తోగాని, Question తోగానీ వాడితే did వస్తుంది.
h) am + ing/ is + ing/ are + ing form (be form + ing form) verbs ఇప్పుడు జరుగుతున్న పనులకు వాడతాం.
అయితే ఇప్పుడు జరుగుతున్న పనులను చెప్పడానికైనా, కొన్ని రకాల verbs ను am + ing/ is + ing/ are + ing form లో వాడం. అవి-
I) verbs expressing feelings and emotions.
(భావాలను, మనసుకు సంబంధించిన విషయాలను తెలిపే verbs - like, love etc.)
II) verbs expressing actions of the mind.
(మన బుద్ధికి, ఆలోచనలకు సంబంధించిన verbs - know, understand etc.)
III) certain other verbs like appear, belong etc.


*There are no verbs in your sentences*

IV) verbs of sense perception.
(బాహ్యేంద్రియాల పనులకు సంబంధించి am/ is/ are ing ఉండవు. am/ is/ are looking, listening వాడవచ్చు.)
V) have కు తినడం/ తాగడం అర్థం అయితే am having/ is having/ are having వాడవచ్చు. మిగతా అర్థాలతో am/ is/ are having వాడం. Bath కు am/ is/ are having వాడతాం.

i) English verbs six forms లో ఉంటాయి. ఆ six forms లో లేని వాటిని verbs అనం.

పైన చెప్పినవే కాకుండా కొన్ని vocabulary items కూడా తెలుసుకున్నాం. మనం దైనందిన జీవితంలో వాడే వస్తువులకు, మన ఇంటికి, దినచర్యలకు, మనకు మామూలుగా వచ్చే జబ్బులకు, ఇతర బాధలకు, మన కదలికలకు English మాటలు తెలుసుకున్నాం.

దీనితోబాటు కొన్ని principles of pronunciation (English ఉచ్చారణ సూత్రాలు) కూడా తెలుసుకున్నాం.

---

**Q&A**

**ప్రశ్న:** 1) The match is to start.
2) The match is going to start.
3) The match is about to start.
వీటి మధ్య తేడా ఏమిటి? వీటిని తెలుగులో ఎలా చెప్పాలి.
**– కొప్పుల రవికుమార్, వరంగల్**

**జవాబు:**
1) The match is to start- దీని అర్థం match ప్రారంభంకావాలి/ అవుతుంది కాస్సేపట్లో అని. ఇంతవరకు అవలేదు అని.
2) The match is about to start- కొద్ది క్షణాల్లో match ప్రారంభమవుతోంది అని.
3) The match is going to start- match ప్రారంభం కానుంది.
రెండోవాక్యం about to start లో వ్యవధి చాలా తక్కువ.
మూడోవాక్యంలో ప్రారంభం కాబోతోంది. రెండో వాక్యంలో మూడో వాక్యంలో కంటే ప్రారంభమయ్యే వ్యవధి తక్కువ.

**ప్రశ్న:** One word substitutions అంటే ఏమిటి? వీటిని ఎలా ఉపయోగిస్తారో తెలియజేయగలరు. might ని ఎన్ని సందర్భాల్లో ఉపయోగిస్తారు?
**– డి. రవీందర్ రెడ్డి, జనగాం**

**జవాబు:** కొన్ని మాటల కూర్పు ఇచ్చే అర్థాన్ని తెలియజేసే ఒక మాటను one word substitute (one word substitution కాదు) అంటాం.
**eg:** one who does not believe that god exists. (దేవుడున్నాడని నమ్మని వాడు - నాస్తికుడు) ఈ మాటల మొత్తం అర్థాన్ని తెలిపే ఒకే మాట - atheist (ఎయ్‌థియిస్ట్). కాబట్టి ఇక్కడ 'atheist' అనేది one word substitute.

a) ప్రస్తుతంలో మాత్రమే ఉంటూ భవిష్యత్‌లో లేని సందేహాన్ని వ్యక్తపరిచేందుకు 'might' వాడతాం.
**eg:** Hari might help you.
(హరి నీకు సహాయం చేయవచ్చు/ చేస్తాడేమో- సందేహం)
They might leave tomorrow.
(వాళ్లు రేపు వెళ్తారేమో/ వెళ్లవచ్చు - సందేహం).
Past లో సందేహాన్ని వ్యక్తపరచడానికి, 'might' వాడతాం. ఈ కింది వాటిని పోల్చండి-
a) I think he may help me.
(వాడు నాకు సహాయం చేస్తాడేమోనని/ చెయ్యవచ్చని నేననుకుంటున్నా.)
b) I thought he might help me.
(వాడు నాకు సహాయం చేస్తాడేమోనని/ చెయ్యొచ్చని అనుకున్నా past).




# ఇప్పుడు కూడా...!





M. SURESAN

**Hari:** Hi Hema, What's new?
(హాయ్ హేమ, ఏంటి విశేషాలు? )

**Hema:** Every thing OK. Thank you. How is the world with you?
(అంతా బాగానే ఉంది. నువ్వెలా ఉన్నావ్? )

**Hari:** Good so far, Thanks.
(ఇప్పటి వరకు బాగానే ఉంది.)

**Hema:** I've (I have) been waiting here for the bus for the past twenty minutes. It hasn't turned up. By the way, Where are you coming from?
(బస్ కోసం 20 నిమిషాలుగా ఎదురు చూస్తున్నాను. అది ఇప్పటివరకు రాలేదు. సరేకానీ, నువ్వెక్కడి నుంచి వస్తున్నావు? )
turn up = రావడం, హాజరవడం
by the way- topic మార్చడానికి వాడే మాట

**Hari:** From college. I have been going round the college for my certificates for the past three days. They haven't (have not) made them ready yet. The clerk hasn't (has not) been attending college since the college reopened last week.
(మూడు రోజులుగా సర్టిఫికెట్ల కోసం కళాశాల చుట్టూ తిరుగుతున్నా. వాళ్లింతవరకు వాటిని రెడీ చేయలేదు. కిందటి వారం కళాశాల తెరిచినప్పటి నుంచి ఆ క్లర్క్ రావడం లేదు)

**Hema:** I understand your trouble.

పై సంభాషణలో have been waiting, have been going, has been attending అనే verbs గమనించారు కదా. వీటి form- have been + ing/ has been + ing. మీకు తెలిసిందే కదా?

I, We, You and They అయితే have been+ ing; He, She, It అయితే has been + ing వాడతాం. ఈ formలో verb ను present perfect continuous tense అంటాం.

(కిందటి lesson లో మనం చూసిన verb form- have + PP/has + PP - Present Perfect tense) have been + ing/has been + ing తో మరికొన్ని sentences పరిశీలించండి. వాటితోపాటు ఇచ్చిన have + PP, has + PP తో ఉన్న వాక్యాలను సరిపోల్చండి.



*Tendulkar has been playing cricket ...*

**1. a)** Tendulkar has been playing cricket for the past fifteen years. (since 1989/1990)

**b)** Tendulkar has played cricket for the past fifteen years (since 1989/1990).

**2. a)** She has been working here since the opening of the office.

**b)** She has worked here since the opening of the office.

1 (b), 2 (b) అర్థం మీకు తెలుసు-

1(b) టెండూల్కర్ గత పదిహేనేళ్లుగా (for) / 1989-90 నుంచి (since) క్రికెట్ ఆడాడు (ఇప్పటివరకు).

ఈ sentence లో verb- has+ PP.

దీనిని 1(a) తో పోల్చండి.

1(a) Tendulkar has been playing cricket for the past fifteen years/ since 1989-90

1(a) లో verb- has been + playing (has been + ing). దీని అర్థం టెండూల్కర్ గత పదిహేనేళ్లుగా (1989-90 నుంచి) cricket ఆడుతున్నాడు (ఇంకా).

has played (has + past participle) = ఇప్పటి వరకు ఆడాడు.

has been playing (has been + ing) = ఇంకా ఆడుతున్నాడు.

అలాగే 2(a) She has been working here since the opening of the office.

ఇక్కడ verb- has been working = (has been + ing) ఇక్కడ ఆఫీస్ ప్రారంభించినప్పటి నుంచీ ఇక్కడ పనిచేస్తోంది.

(అప్పటి నుంచి ఇప్పటివరకే కాకుండా ఇంకా కూడా).

అదే 2 (b) అయితే verb has + pp - ఇంతవరకు పని చేసింది అని.

### for కు, since కు తేడా

**a)** ఇన్ని గంటలుగా, ఇన్ని రోజులుగా, ఇన్నేళ్లుగా అయితే for the past (so many) hours/ days/ years అంటాం.

**b)** ఫలానా టైం నుంచి, ఫలానా రోజు నుంచి, ఫలానా సంవత్సరం నుంచి అయితే since అంటాం.
(since = గతంలో ఓ సమయం నుంచి)

He has worked/ has been working here for the past 2 years/ since 2003 (2005-2=2003)

for the past 50 years - since 1955 (2005-50=1955)

ఈ కింది సంభాషణ గమనించండి.

**Shyam:** What have you been doing since this morning?
(పొద్దుటినుంచి ఏం చేస్తున్నావు? - ఇప్పుడు కూడా)

**Ramu:** I have been studying for exam tomorrow.
(రేపటి పరీక్ష కోసం చదువుతున్నాను - ఇప్పుడు కూడా)

**Shyam:** How many chapters have you covered?
(ఇప్పటివరకు ఎన్ని చాప్టర్లు పూర్తిచేశావు? )

**Ramu:** I have finished nine chapters so far.
(ఇంతవరకు తొమ్మిది చాప్టర్లు పూర్తిచేశాను)

**Shyam:** How long have you been using your scooter?
(నువ్వు ఎంతకాలంగా నీ స్కూటర్‌ను ఉపయోగిస్తున్నావు? )

**Ramu:** It has been serving me well for the last two years. It hasn't given me any trouble.
(రెండేళ్లుగా అది నాకు ఉపయోగపడుతోంది. ఇంతవరకు ఏం ట్రబుల్ ఇవ్వలేదు.)

... గమనించారు కదా!

1) have + pp/ has + pp - కొంతకాలం క్రితం నుంచి ఇప్పటివరకు జరిగిన పనులకు వాడతాం.

2) have been + ing/ has been + ing - కొంత కాలం క్రితం నుంచి ఇంకా జరుగుతున్న పనులకు వాడతాం.

3) సామాన్యంగా so far, for the past, for the last, since లను have + pp/has + pp; have been + ing/ has been + ing- verb లతో వాడుతుంటాం. వీటితోపాటు have + pp/has + pp తో already (ఇప్పటికే), yet (ఇంకా... లేదు) అనే మాటలు కూడా వస్తుంటాయి.

కింది వాక్యాలను English లో practice చేయండి.

1) ఎంతకాలంగా మీరు ఇక్కడ పని చేస్తున్నారు?

2) ఇప్పటివరకు మీరు ఈ నెలలో ఎన్ని సినిమాలు చూశారు?

3) నేను పదేళ్లుగా ఈ పేపర్ చదువుతున్నాను/ ఈ పేపర్ పాఠకుడిగా ఉన్నాను (reader వాడండి).

4) రమణ: అశోక్ వచ్చాడా?
రవి: ఇంకా రాలేదు. అతని కోసం అరగంటగా చూస్తున్నాను (wait వాడండి).
రమణ: నువ్వు అతడికి ఫోన్ చేశావా?
రవి: అతడికి ఫోన్ చేయడానికి అరగంటగా ప్రయత్నిస్తున్నాను. వాళ్లింట్లో ఎవరూ ఫోన్ తీయలేదు.
(ఫోన్ చేయడానికి= to call; ఫోన్ తీయడం= lift)
రమణ: బహుశా వాళ్లందరూ ఎక్కడికైనా వెళ్లారేమో?
(బహుశా= perhaps)

5) ప్రసాద్: ఫణి అరగంటగా ఆ పని చేస్తున్నాడు. ఇంకా పూర్తి చేయలేదు.
ప్రకాష్: రెండ్రోజులుగా అతడితో ఓ విషయం మాట్లాడ్డానికి ప్రయత్నిస్తున్నాను. ఇంతవరకు టైం దొరకలేదు.
ప్రసాద్: ఈ పనే అతడిని శనివారం నుంచి బిజీగా ఉంచుతోంది. డాక్టర్‌ను కలవడానికి కూడా అతనికి టైం దొరకలేదు.
(టైం దొరకకపోవడం = not find the time; కూడా= even)
ప్రకాష్: ఏమిటి అతడి సమస్య?
ప్రసాద్: అతడికి వారంగా జలుబుగా, తలనొప్పిగా ఉంది.

6) జయంత్: ఈ రోజు పేపర్ చదివావా?
జయకర్: ఇంతవరకు మాకు పేపర్ రాలేదు. ఈ మధ్య మాకు పేపర్ చాలా ఆలస్యంగా వస్తోంది (get వాడండి).
జయంత్: ఏజెంట్‌కు complain చేయలేదా?
జయకర్: ఆదివారం నుంచి complain చేస్తున్నా. కానీ అతడు పట్టించుకోవడం లేదు. ఆ రోజు నుంచి మాకు పేపర్ ఏడున్నరకు వస్తోంది. ఏమిటి పేపర్లో విశేషం?
(పట్టించుకోకపోవడం = not care).
జయంత్: కాశ్మీర్లో ఒక టెర్రరిస్టు దాడి గురించి పేపర్ రిపోర్ట్ చేసింది.
జయకర్: ఎంతమంది చనిపోయారేమిటి?
జయంత్: ఎనిమిదిమంది. ప్రభుత్వాసుపత్రిని టెర్రరిస్టులు తగలబెట్టారు.
(తగలబెట్టడం = set fire)

### Answers:

1) How long have you been working here?

2) How many movies have you seen so far this month?

3) I have been reading/ I have been a reader of this paper for the past ten years.

4) **Ramana:** Has Ashok come?
**Ravi:** No. I've (have) been waiting for him for the past half an hour.
**Ramana:** Have you phoned him?/ Have you called him?
**Ravi:** I have been trying to phone him/ ring him up/ call him for the past half an hour. No one in his place has lifted the phone.
**Ramana:** Perhaps they have all gone somewhere.

5) **Prasad:** Phani has been doing that work for the past half an hour. He hasn't (has not) yet completed it.
**Prakash:** I've (I have) been trying to talk to/ discuss with him something. I haven't (have not) found the time.
**Prasad:** This work has been keeping him busy since saturday. He hasn't found the time even to see the doctor.
**Prakash:** What's (What is) his problem?
**Prasad:** For the past (one) week he has been having a bad cold and headache.

6) **Jayanth:** Have you read (gone through) today's paper?
**Jayakar:** We haven't received/ got the paper yet/ so far. Of late we have been getting the paper late.
(of late = lately = ఈ మధ్య)
**Jayanth:** Haven't you (have you not) complained to the agent?
**Jayakar:** I have been complaining since sunday. He hasn't cared. Since sunday we've (have) been getting the paper at 7:30 AM. What's the news in the paper?
**Jayanth:** The paper has reported a terrorist attack in Kashmir
**Jayakar:** How many have died?
**Jayanth:** Eight. The terrorists have set fire the Government Hospital.




**ప్రశ్న:** How do you do? అంటే అర్థం ఏమిటి? దీనికి సమాధానం ఎలా చెప్పాలి?
**– సాధుల ప్రభాకర్, కరీంనగర్**

**జవాబు:** How do you do? అంటే కుశలమా? /బాగున్నారా? /ఎలాఉన్నారు? అయితే ఈ expressionను మనకు ఎవర్నయినా మొట్టమొదటిసారి పరిచయం చేసినప్పుడు అంటాం. వాళ్లను మనకు పరిచయం చేయగానే 'How do you do?' అని పలకరిస్తాం. అందుకు అవతలి వాళ్ల స్పందన కూడా How do you do?నే. తర్వాతి నుంచి How are you ఇతర మాటలు వాడతాం.

**ప్రశ్న:** I have finished my work.
Have I finished my work.
I haven't finished my work.
దీనికి interrogative- have In't finished my work? ఇది సరైనదా కాదా?
**– ఎ. రఘుపతి, నాయుడు పేట**

**జవాబు:** 'Haven't I finished my work? అనేది 'నేనుఇంకా పని పూర్తి చేయలేదా? ' (అంటే- నేను పని పూర్తి చేశాను గదా? ) అనే అర్థంతో అయితే కరెక్టే. అలాగే I haven't finished my work అనేది, Have you finished your work? అనే question కు answerగా కరెక్ట్. పై వ్యాసంలో present perfect continuous tenseను గురించి వివరణ ఉంది. చూడండి.



# వెళ్లారా... వెళ్లి వచ్చారా?

**Sukumar:** My bike has been giving trouble since monday. I haven't been able to find a good mechanic.
(సోమవారం నుంచి నా బైక్ ట్రబుల్ ఇస్తోంది. మంచి మెకానిక్ ఎవరూ దొరక ట్లేదు)

**Sudheer:** Why don't you try my mechanic? He has been attending to my bike for a long time now, and he has done a good job of it so far.
(నా మెకానిక్‌కు ఎందుకు చూపించకూడదు? నా బైక్ అతనే చూస్తుంటాడు. ఇప్పటివరకు బాగానే చూశాడు).

**Sukumar:** I haven't thought of it. Thank you. Let's take my bike to him.
(నేనా విషయం ఇంతవరకు ఆలోచించలేదు. నా బైక్ అక్కడికి తీసుకెళదాం.)

**Sudheer:** He hasn't opened shop yet. 10 o' clock will be OK.
(అతనింకా షాప్ తెరవలేదు. 10 గంటలకు వెళితే సరిపోతుంది).

**Sukumar:** OK then. I haven't (have not) had my bath and breakfast yet. I will be at your place by 9.30.
(నేను ఇంకా స్నానం చేయలేదు. బ్రేక్‌ఫాస్ట్ ఇంకా అవలేదు. మీ ఇంటికి నేను 9.30 కల్లా వస్తా).

**Sudheer:** OK (సరే)

have + pp/ has + pp, have been + ing/ has been + ing ఉపయోగాలను ఇంతవరకు మనం చూశాం.

| | | | |
|---|---|---|---|
| I, we, you, they | have+pp / have been+ing | He, She, It | has+pp / has been+ ing |

**have + pp/ has + pp ఉపయోగించే సందర్భాలు**

1) (మామూలుగా) టైం తెలియని past actions.
2) అప్పటినుంచి ఇప్పటివరకు (అప్పుడప్పుడు) ఇంకా జరుగుతున్న పనులకు (actions from then till now/ (sometimes) even now;
3) just లాంటివి వాడినప్పుడు ఇప్పుడే అయిపోయిన పనులకు (actions just completed).

**Have been + ing/ has been + ing:** గతంలో ఎప్పటినుంచైనా ప్రారంభమై, ఇంకా జరుగుతున్న పనులకు.

**Ram:** How long have you been waiting here?
(నువ్వు ఇక్కడ ఎప్పటినుంచి వెయిట్ చేస్తున్నావు?)

**Raghu:** I have been waiting for you for ten minutes now.
(పది నిమిషాలుగా నీ కోసం వెయిట్ చేస్తున్నా).

ఇక్కడి situation గమనించండి.

'I have been waiting for you for the past ten minutes (for ten minutes now) అని రఘు ఎవరితో అంటున్నాడు? రామ్‌తో. ఎప్పుడు? రామ్ వచ్చిన తర్వాత... అంటే రామ్ వచ్చి ఉన్నాడు కాబట్టి waiting పూర్తయినట్లే కదా. అయినా have been waiting అని రఘు అంటున్నాడు.

I have waited for you for ten minutes now అనలేదు.

ఇక్కడ have been waiting/ have waited రెండూ కరెక్టే. అంటే ఈ రెండింటికీ మామూలు వాడకలో పెద్ద తేడా లేదు. అయితే ఇంకా continue అవుతోంది అని continuity కి ప్రాముఖ్యం ఇవ్వాల్సి వస్తే have been + ing/ has been + ing better.

a) వాళ్లు బయటికి వెళ్లారు.
They have gone out.
b) మా తల్లిదండ్రులు హైదరాబాద్ వెళ్లారు.
My parents have gone to Hyderabad.

ఇక్కడ గమనించండి.

a) They have gone అంటే వాళ్లు వెళ్లారని కదా. అంటే వాళ్లు ఇంకా తిరిగి రాలేదు. వెళ్లే దారిలో అయినా ఉండొచ్చు, లేదా వెళ్లాలనుకున్న చోటులో అయినా ఉండొచ్చు అని. అలాగే-
b) My parents have gone to Hyderabad అంటే వాళ్లు హైదరాబాద్ వెళ్లేదారిలో అయినా ఉండాలి, లేక పోతే హైదరాబాద్ చేరి అయినా ఉండాలి అని. ఇప్పుడు ఇది చూడండి-

I have gone to Hyderabad.

దీనర్థం- నేను హైదరాబాద్ వెళ్లాను అని అనుకుంటే నేను హైదరాబాద్ వెళ్లే దారిలోగానీ (on the way to Hyderabad) , హైదరాబాద్ చేరిగానీ ఉండాలి అని కదా.

అలా అని నేను ఎవరితో చెప్పగలను? తోటి ప్రయాణికుడి (fellow passenger) తో అనలేను కదా. హైదరాబాద్ చేరిన తర్వాత I have gone to Hyderabad అని అనలేను. ఇక్కడ ఒకే పరిస్థితి. నేను హైదరాబాద్ నుంచి తిరిగి వచ్చిన తర్వాత హైదరాబాద్ వెళ్లివచ్చానని చెప్పగలగడం. కాబట్టి English లో ఇది చెప్పడానికి I have gone to Hyderabad సరికాదు కదా. We (మేం)తో కూడా ఇదే సమస్య.

**ముఖ్యమైన అంశం**

I/ We తో 'have gone' verb రాదు. ఎందుకంటే నేను కానీ మేం కానీ ఎక్కడికైనా వెళ్లి వచ్చిన తర్వాతే అక్కడికి వెళ్లాం అనగలం. దానికి English- 'have gone' కాదు.

**Saritha:** Sudha, where have you been?
(సుధా, ఎక్కడున్నావు ఇంతసేపూ?)

**Sudha:** I have been to college.
(నేను కళాశాలకు వెళ్లి వచ్చాను).

ఇక్కడ I have gone to college అంటే అర్థం ఏం వస్తుంది? నేను కళాశాలకు వెళ్లాను (అక్కడే ఉన్నాను) అని. అక్కడే ఉంటే సరితతో మాట్లాడే అవకాశం లేదు.

నేను/ మేం మైసూర్ వెళ్లివచ్చాను/వెళ్లివచ్చాం.
I/ We have been to Mysore.

అంటే ఇక్కడ అర్థం, నేను ఆ వూరికి వెళ్లాననే కాకుండా ఆ ఊరి గురించి నాకు తెలుసు అని కూడా.

**a) Smitha:** Do you know Mumbai well?
(నీకు ముంబాయి బాగా తెలుసా?)

**b) Sridhar:** Oh, Yes. I have been there a number of times.
(ఆ ఊరు నాకు బాగా తెలుసు. నేనక్కడికి చాలాసార్లు వెళ్లాను.)

ఈ 'తెలుసు' అనే అర్థంతో మిగతా subjects కూడా వాడవచ్చు.

**Mithun:** How familiar is he with Chennai?
(ఆయనకు చెన్నై ఎంత బాగా తెలుసు? familiar= తెలిసి ఉండడం/ పరిచయం ఉండడం)

**Mittal:** He has been there a number of times.
(ఆయన అక్కడికి చాలాసార్లు వెళ్లాడు- అంటే ఆయనకు ఆ ఊరు గురించి బాగా తెలుసు అని)

**Mithun:** Have you ever been to Chennai?
(నువ్వెప్పుడైనా చెన్నై వెళ్లావా? - ఇక్కడ కూడా Have you gone కంటే Have you been వాడడం మంచిది.)

**Mittal:** I haven't (have not) been there so far.
(నేను అక్కడికి ఇంతవరకు వెళ్లలేదు.)

'have gone'/ 'has gone'- వెళ్లిపోయారు అనే అర్థం మాత్రమే వస్తుంది. వెళ్లి తిరిగివచ్చిన పరిస్థితి గురించి చెప్పదు.

**Suneel:** I returned from Delhi the day before.
(నేను ఢిల్లీ నుంచి మొన్న తిరిగి వచ్చాను.)

**Sumanth:** Why did you go there at all? When did you go there?
(అసలు అక్కడికి ఎందుకు వెళ్లావు? ఎప్పుడెళ్లావు?) (at all = అసలు)

**Suneel:** I went there last saturday.
(పోయిన శనివారం వెళ్లాను - I/we తో went వాడవచ్చు.)

నేను ముంబాయి వెళ్లి వచ్చాను.
I have been to Mumbai
(I have gone to Mumbai కాదు).
మేం చెన్నై వెళ్లాం (అని తిరిగి వచ్చిన తర్వాత చెబితే).
We have been to Chennai.
(We have gone to Chennai కాదు)
I, We తో 'have gone' వాడం. మిగతా subjects తో వాడవచ్చు.

**కింది వాక్యాలు చూడండి**

a) వాళ్లు అమెరికా వెళ్లారు.
They have gone to the US/ They have left for the US.
b) మా అన్నయ్య ఢిల్లీ వెళ్లాడు.
My brother has left for/ My brother has gone to Delhi.
c) మేం హైదరాబాద్ వెళ్లి వచ్చాం.
We have been to Hyderabad.
d) నేను బెంగుళూరు వెళ్లివచ్చాను.
I have been to Bangalore.





*Sudha, where have you been?*

M. SURESAN

ఈ sentences English లో practice చేయండి.

1) కరీం: రవీ, నిన్న సాయంత్రం నువ్వింట్లో లేవు. ఎక్కడికెళ్లావు?
రవి: నిన్న మా అక్కయ్య పుట్టిన రోజు. వాళ్లింటికి వెళ్లాను.
కరీం: నువ్వు ఈ మధ్య జయకుమార్‌ను ఏమైనా కలుసుకున్నావా?
రవి: లేదు. వాడిప్పుడు ముంబాయిలో ఉన్నాడు.
కరీం: నువ్వెప్పుడయినా ముంబాయి వెళ్లావా?
రవి: చాలాసార్లు వెళ్లాను. మరి నువ్వు?
కరీం: ఇంతవరకు వెళ్లలేదు. అసలు నేను హైదరాబాదే వెళ్లలేదు.

2) సుమంత్: మీ నాన్నగారెక్కడ?
సునీల్: బయటికెళ్లారు.
సుమంత్: ఎక్కడికెళ్లారు?
సునీల్: వాళ్ల ఫ్రెండ్ ఇంటికి.
సుమంత్: ఎంతసేపయింది బయటికెళ్లి? (has been మాత్రమే వాడండి)
సునీల్: అరగంట

**Answers:**

**1) Karim:** Ravi, you were not at home yesterday. Where did you go?
**Ravi:** Yesterday was my sister's birthday. I went to her place.
**Karim:** Have you met Jayakumar, of late?
**Ravi:** No. He is in Mumbai
**Karim:** Have you ever been to Mumbai? (ever = ఎప్పుడైనా)
**Ravi:** I have been there a number of times. What about you?
**Karim:** I haven't (have not) been there so far. I haven't been even to Hyderabad. (even= కూడా)

**2) Sumanth:** Where's (where is) your father?
**Sunil:** He has gone out.
**Sumanth:** Where did he go?
**Sunil:** He went to his friend's.
(friend's= ఫ్రెండ్ ఇంటికి. friend's house అనం. friend's home ఫర్వాలేదు. friend's అంటే best)
**Sumanth:** How long has he been out?
**Sunil:** He has been out for half an hour now.

## Q&A

**ప్రశ్న:**
1) Will she have played?
Will she has played?
2) He never uses pencil.
He never use pencil.
3) Which is your native place?
What is your native place?
4) At what time does Bangalore express reach Bangalore?
At what time Bangalore express reaches Bangalore?
ఈ వాక్యాల్లో ఏవి సరైనవి?
5) 'God' third person కదా! మరి 'God blesses you' అనాలి కానీ 'God bless you' అని అంటారు ఎందుకు?
6) 'నీకు తెలుసా?' అనే వాక్యాన్ని ఇంగ్లిష్‌లో 'Do you know?' అని రాస్తాం. 'నీకు తెలియదా?' అనే వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?

– ఆర్. శివ, రైల్వేకోడూరు

**జవాబు:** మీరు రాసిన వాక్యాల్లో ఈ కిందివి Correct.
1) Will she have played?
2) He never uses pencil
3) What is your native place?
4) At what time does the Bangalore express reach Bangalore?
5) 'God bless you' పూర్తిరూపం 'May God bless you' అనే ఆశీస్సు. 'May' వదిలేసి 'God bless you' అంటుంటాం.
6) Don't you (Do you not) konw? (నీకు తెలీదా?)




# ఎక్కడ will, ఎప్పుడు shall?

**Gowtham:** Hi Jagadeesh, it's you! How long have you been here?
(జగదీష్, నువ్వా? ఎంతకాలంగా ఇక్కడ ఉన్నావు? - ఇది కూడా పలకరింపే. ముఖ్యంగా అనుకోకుండా మనకు మనవాళ్లెవరైనా కనిపించినప్పుడు ఉప యోగించవచ్చు.)

**Jagadeesh:** I've (have) been here since the day before. I joined an I-CET coaching centre here yesterday.
(మొన్నటి నుంచి ఇక్కడే ఉన్నా. ఇక్కడ నేను ఐ-సెట్ కోచింగ్ సెంటర్‌లో చేరాను.)

**Gowtham:** How long will your course last?
(మీ కోర్స్ ఎంతకాలం ఉంటుంది? last = ఉండడం)

**Jagadeesh:** It's a forty day course, so it will continue for another forty days.
(అది నలభై రోజుల కోర్సు. ఇంకో 40 రోజులు కంటిన్యూ అవుతుంది.)

**Gowtham:** Shall we meet this evening?
(ఈ రోజు సాయంత్రం కలుద్దామా?)

**Jagadeesh:** Certainly. Where shall we meet?
(తప్పకుండా. ఎక్కడ కలుద్దాం?)

**Gowtham:** I will return home at 5 PM. We will meet then at my home.
(నేను అయిదు గంటలకు ఇంటికి వస్తా. అప్పుడు మా ఇంట్లో కలుద్దాం.)


*When will you be free?*

**Jagadeesh:** I will make it then. Bye.
(నేను తప్పకుండా వస్తా. బై)

పై సంభాషణలోని verbs ను గమనించండి.

have been - కొంతకాలంగా ఉండడాన్ని తెలియజే స్తోంది. (since = ఫలానాటైం నుంచి- గతంలో)

joined (yesterday) - Past Doing Word - past action time known కు వాడాం.

ఇవన్నీ మనకు తెలిసినవే. ఈ సంభాషణలో కొత్త verbs:

1) will last (will + last - 1st Regular Doing Word)
2) will continue (will + continue - 1st Regular Doing Word)
3) shall meet (shall + meet - 1st Regular Doing Word)
4) will return (will + return - 1st Regular Doing Word)
5) will make (will + make - 1st Regular Doing Word)
6) will meet (will + meet - 1st Regular Doing Word)

అంటే ఇవన్నీ shall/ will + 1st Regular Doing Word (I RDW) form లో, అంటే మనం చూసిన six forms of verb లో ఇవి V form కదా.

(shall be/ will be- 'be' forms. అంటే ఇవి రెండూ future (భవిష్యత్తు)లో ఉండడాన్ని చెబుతాయి కదా)

**Sumant:** Where will you be at 7 this evening?
(సాయంత్రం ఏడు గంటలకు ఎక్కడ ఉంటావు?)

**Sumeet:** I will be at home. (ఇంట్లో ఉంటా)

**Sumant:** I shall be a little late. Please wait for me.
(నేను కాస్త ఆలస్యంగా వస్తా. నా కోసం వెయిట్ చెయ్యి.)

**Sumeet:** I'll (I will) be there till 7.30. Don't worry.
(నేను 7.30 వరకు ఉంటా. వర్రీ అవకు.)

పై సంభాషణలో 'shall be', 'will be'- be forms కాబట్టి ఉండడాన్ని చెబుతాయి.

అదే shall + 1st RDW/will + 1st RDW - shall come, will go, shall see, will meet - ఇలాంటి verbs భవిష్యత్తులో జరగబోయే పనులను చెబుతాయి.

a) I shall be there tomorrow.
నేను రేపు అక్కడ ఉంటాను.

b) I shall go (shall + 1st RDW) there tomorrow.
నేను రేపు అక్కడికి వెళతాను. (shall go = action)

**కింది వాక్యాలను పరిశీలించండి.**

a) వాళ్లు రేపు ఇక్కడ ఉంటారు.
They will be here tomorrow.

b) వాళ్లు రేపు ఇక్కడికి వస్తారు (action).
They will come here tomorrow (will + come - action)

c) మేం మళ్లీ రేపు ఇక్కడ ఉంటాం.
We shall be here again tomorrow.

d) మేం రేపు ఇక్కడికి తిరిగివస్తాం.
We shall return here tomorrow.

shall be, will be- భవిష్యత్తులో ఉండడం

shall + 1st RDW/ will + 1st Regular Doing Word (RDW) = భవిష్యత్తులో పనిఅవడం(action)

అయితే **shall** ఎప్పుడు, **will** ఎప్పుడు? అవి వాడే సందర్భాలేవి? జాగ్రత్తగా గమనించండి.

**Pradeep:** I shall buy a car soon.
(నేను త్వరలో కారు కొంటాను)

**Pratap:** When will you buy it?
(ఎప్పుడు కొంటావు?)




**Pradeep:** Depends. I expect some money next week. Once I get it, I will buy it.
(వచ్చేవారం కొంత డబ్బు రావాలి. అది అందితే కొంటా.)

Depends = మనం ఏదైనా మన కంట్రోల్‌లో లేని ఇతర విషయాల మీద ఆధారపడిన అంశాలను గురించి చెప్పేటప్పుడు It all depends/ depends అంటాం. ఇది conversational bit. Practice చేసి మీ సంభా షణలో వాడండి.

మరో ఉదాహరణ:

**Prameela:** Will you help me with a little money?
(నాకు కొద్దిగా డబ్బు సాయం చేస్తావా?)

**Pramoda:** It all depends, I expect some money tomorrow. If I get it, I will give it.

(It all depends/ depends = ఇప్పుడేం చెప్పలేను. నాకు రేపు డబ్బు వస్తే నీకిస్తాను. నేనివ్వడం, నాకు రావాల్సిన డబ్బుపై ఆధారపడి ఉంది)




ప్రదీప్ మొదట, 'I shall buy' అని, తర్వాత 'I will buy' అంటున్నాడు. ప్రతాప్ '...will you buy it?' అని అడుగుతున్నాడు కదా? ఈ కింది తేడాలు గమనించండి.

I and we + shall (I, We తో shall); you, he, she, it, they + will (you, he, she, it, they తో will) వాడితే అంతగా కచ్చితంకాని భవిష్యత్తును తెలియజే స్తాయి. Future లో కచ్చితమా, కాదా అనే దాన్ని బట్టి shall, will వాడతాం.

I, We తో shall వాడితే future లో ఉండడంగాని, పని జరగడంగానీ అంత కచ్చితం కాదు (indefinite).

1. I/We shall be there tomorrow.
(నేను/మేం రేపు అక్కడ ఉంటాను/ఉంటాం. ఉండడం (indefinite) అంత కచ్చితంకాదు)

2. I/We shall meet you there.
(నేను/మేం నిన్ను అక్కడ కలుసుకుంటా/ కలుసు కుంటాం- కచ్చితంకాదు జరిగితే జరుగుతుంది లేకపోతే లేదు.)

కాబట్టి I/ We తో shall వస్తే future లో అంత కచ్చితంకాని state of being (ఉండడం)గాని, పని (action) గాని అవుతుంది.

అలాగే you, he, she, it and they తో will వాడితే, అదికూడా కచ్చితంకాని (indefinite) భవిష్యత్తును తెలి యజేస్తుంది. ఉండడం అయినా సరే, పని అయినా సరే.

3. My friends (they) will be here next week.
మా ఫ్రెండ్స్ వచ్చేవారం ఇక్కడ ఉంటారు. (ఉండడం కచ్చితంకాదు)

4. She will help you.
ఆమె నీకు సహాయం చేస్తుంది (indefinite = కచ్చితంకాదు)

5. You will know it soon.
(నీకది త్వరలోనే తెలుస్తుంది- indefinite)

6. It will happen.
(అది జరుగుతుంది- Indefinite)

7. Kiran (He) will return soon.
(కిరణ్ త్వరలోనే తిరిగివస్తాడు- Indefinite)

8. Kamala (She) will shop for saris tomorrow.
(కమల రేపు చీరలు కొంటుంది- Indefinite)

అయితే సామాన్యంగా Questions అడిగేటప్పుడు I and we తో will గాని, you, he, she, it and they తో shall గాని రావు. Questions లో దాదాపు ఎప్పుడూ I and we తోshall; you, he, she, it and they తో will మాత్రమే వాడతాం.

**Preethi:** I want to see you about those books. When shall I see you?
(ఆ పుస్తకాల విషయంలో నిన్ను కలుసుకో వాలనుకుంటున్నా. ఎప్పుడు కలవను?)

**Prema:** When will you be free?
(నీకెప్పుడు తీరిక?)

**Preethi:** When will you be free? Shall I see you tomorrow?
(నీకు తీరికెప్పుడు? నిన్ను రేపు కలు సుకోనా?)

**Prema:** That's OK. (సరే)

**Preethi:** Will the books (they) be with you tomorrow?
(రేపు ఆ పుస్తకాలు నీ దగ్గరుంటాయా?)

**Prema:** Will your father (he) get new books this evening?
(మీ నాన్నగారు కొత్త పుస్తకాలు ఈ సాయంత్రం తెస్తారా?)

పై సంభాషణలో questions అన్నింటిలో I/we అయితే shall; you, he, she, it, they అయితే will రావడం చూశారు కదా.

ఇప్పుడు కింది వాక్యాలను English లో practice చేయండి.

1) మళ్లీ మనం రేపు కలుసుకుందాం.
2) రేపు కళాశాలకు ఎప్పుడు బయలుదేరతావు? (start for వాడండి)
3) రేపు నేను ముంబాయి వెళతాను. అక్కడ పది రోజులు ఉంటాను. నెలాఖరుకు తిరిగి వస్తాను.
4) **జయంత్:** మీరెప్పుడొస్తారు?
**జస్వంత్:** వచ్చేవారం వస్తాను. (పూర్తి వాక్యం practice చేయండి)
**జయంత్:** ఆ సర్టిఫికెట్స్ అన్నీ తెస్తారా?
**జస్వంత్:** అన్నీ తీసుకురాను. ముఖ్యమైనవే తెస్తా.
**జయంత్:** మీ డిగ్రీ సర్టిఫికెట్ తెస్తారా?
**జస్వంత్:** అది అవసరమా? (necessary వాడండి)
**జయంత్:** వచ్చేవారం ఎప్పుడు వస్తారు?
**జస్వంత్:** వచ్చే గురువారం వస్తాను.

**Answers:**

1) We shall meet again tomorrow.
2) When will you start for college tomorrow?
3) I shall go to Mumbai tomorrow. I shall be there for 10 days. I shall return by the month end.
4) **Jayanth:** When will you come?
**Jaswanth:** I shall come next week.
**Jayanth:** Will you bring all the certificates?
**Jaswanth:** I shall not bring all of them. I shall bring only the important ones.
**Jayanth:** Will you bring the degree certificate?
**Jaswanth:** Is it necessary/ Will it be necessary?
**Jayanth:** When will you come next week?
**Jaswanth:** I shall come next Thursday.




**ప్రశ్న:** They cut forests- లోcut ను V1 గా భావిం చాలా? V2 గా భావించాలా? ఈ వాక్యానికి passive form- Forests are cut by them/ Forests were cut by them ఈ రెండింటిలో ఏది కరెక్ట్?
**– రాళ్లబండి సంగంనాయుడు, నెల్లిమర్ల**

**జవాబు:** They cut forests- ఇక్కడ 'cut' V1 (అంటే past simple). V2 ఎప్పుడూ verb కాదు. ఎప్పుడైనా V2 (Past Participle) ముందు 'be' form కానీ, have, has, had etc కానీ వచ్చినప్పుడే verb. సందర్భాన్ని బట్టి forests are cut, forests were cut రెండూ కరెక్టే.

**ప్రశ్న:** ఒక పదానికి ing form చేర్చడం వల్ల అది noun అవుతుందా? verb అవుతుందా? తెలు సుకోవడం ఎలా? walking, eating, giving వంటి పదాలు verb forms అవుతాయా? noun forms అవుతాయా?
**– గుర్రం శంకర్, కోళవపట్నం**

**జవాబు:** 'ing' form చేరిస్తే noun అవుతుంది. 'ing' form ముందు 'be' form ఉంటేనే verb అవుతుందని ఇంతకుముందు ఒకసారి తెలియజేశాం.

**ప్రశ్న:** He is Ravi అనే వాక్యంలో subject ఏది? He అన్నా, Ravi అన్నా ఒకటే కదా!
**– గంగాధర్, గజపతినగరం**

**జవాబు:** He is Ravi వాక్యంలో subject he. Sentence- 'He'ని గురించి చెబుతోంది కాబట్టి అదే subject.




# మాట ఇవ్వాలంటే...!





M. SURESAN

**Pranav:** Mom, I will go to the first show today.
(అమ్మా, నేను ఈరోజు ఫస్ట్‌షోకు వెళతాను.)

**Narmada:** You shall finish your home work first.
(నువ్వు మొదట హోంవర్క్ పూర్తిచేయాలి.)

**Pranav:** Tapan, my friend, will be here in a few minutes. We will finish our homework together.
(నా ఫ్రెండ్ తపన్ కొద్ది నిమిషాల్లో ఇక్కడికొస్తాడు. మేం ఇద్దరం కలిసి హోంవర్క్ చేసుకుంటాం)

**Narmada:** Look here, Pranav, You shall see the next movie only a month later. I will not allow you to waste your time.
(మళ్లీ నెల వరకు నువ్వు సినిమా విషయం ఎత్తకూడదు. నేను నిన్ను వెళ్లనివ్వను.)

**Pranav:** But if my friends invite?
(మా ఫ్రెండ్స్ పిలిస్తే?)

**Narmada:** I will tell them they shall not invite. You shall study well, and get good marks. Dad and I will allow you to watch movies only then.
(నిన్ను పిలవొద్దని నేను వాళ్లతో చెబుతా. నువ్వు బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకోవాలి. అప్పుడే నువ్వు సినిమాలు చూడడానికి నేను, నాన్న అనుమతిస్తాం.)

పై సంభాషణలో verbs ఎలా ఉన్నాయో గమనించండి. కిందటి lessonలో మనం చూసినవాటికి భిన్నంగా I, and We తో will; you, he, she, it and they తో shall వచ్చాయి కదా.

ఒకసారి గుర్తుతెచ్చుకుందాం.

I/Weతో shall; you, he, she, it and they తో will కచ్చితంకాని భవిష్యత్తును తెలియజేస్తాయి. shall be, will be అయితే భవిష్యత్తులో ఉండడాన్ని, shall + 1st Regular Doing Word (1st RDW), will + 1st RDW అయితే భవిష్యత్తులో పనులను తెలియజేస్తాయి.

ఇప్పుడు I/Weతో will; you, he, she, it and theyతో shall దేనిని తెలియజేస్తాయో చూద్దాం.

1) I/We తో will మాట్లాడుతున్నవాళ్ల నిర్ణయాన్ని తెలియజేస్తుంది.
I will buy a car soon.
నేను కచ్చితంగా త్వరలో కారు కొంటాను- ఇది నిర్ణయం. అదే
I shall buy a car soon.
అంటే మనం తెలుసుకున్నాం- నేను కారుకొనడం- అంత కచ్చితం కాదు.

a) **Teacher:** You will get a prize only if you score more than 90% marks.
(90 శాతం కన్నా ఎక్కువ మార్కులు తెచ్చుకొంటేనే నీకు ప్రైజ్ వస్తుంది).

**Ramana:** OK Teacher, I will work hard. I will do my best to get the more than 90%
(నేను కష్టపడి చదువుతాను. 90% కన్నా ఎక్కువ తెచ్చుకోడానికి ప్రయత్నిస్తాను- I will - నిర్ణయం)

**Teacher:** Will you and Mohan come to me tomorrow? I will clear your doubts.
(రేపు నువ్వు, మోహన్ నా దగ్గరికి వస్తారా? సందేహాలేమైనా ఉంటే తీరుస్తాను- I will - నిర్ణయం)

b) **Rahim:** Will you buy that car?
(ఆ కారు కొంటావా?)

**Rasheed:** I will buy it whatever the price.
(ఎంత ఖరీదైనా కొంటాను. I will - నిర్ణయం)

c) **Teacher:** Will you all come for the picnic on sunday?
(మీరంతా ఆదివారం పిక్నిక్‌కు వస్తారా?)

**Pupils:** We will come, teacher.
(వస్తాం టీచర్- we will - నిర్ణయం)

d) **Kumar:** Won't you see that movie?
(ఆ సినిమా చూడవా? Won't you= will you not)

**Peter and John:** We will see it, of course.
(కచ్చితంగా చూస్తాం. సందేహం లేదు)

కాబట్టి I/We + will నిర్ణయాన్ని తెలియజేస్తుంది.

2) I/We తో will మాట్లాడేవారి ఉద్దేశాన్ని (intention) తెలియజేస్తుంది.

a) **SriRam:** What do you want to Shravan?
**Shravan:** I will be (will become) a doctor.
(నేను డాక్టరుగా ఉంటా/ డాక్టరునవుతా (ఉద్దేశం) - will be/ become ఉద్దేశం (intention)).

b) **Praneetha:** My friend Pratibha will be here in a few minutes.
**Prasanna:** We will take her home, then.
(అయితే ఆమెను మనం ఇంటికి తీసుకెళదాం - ఉద్దేశం (intention))
**Praneetha:** Later, I will take you and her to a movie. We will have some time together.
(తర్వాత నిన్ను, ఆమెను సినిమాకు తీసుకెళతాను. మనం కొంత టైం కలిసుందాం - we will have (intention))

3) I/we తో will వాడితే మనం మాట ఇచ్చినట్టు (Promise).

a) **Surekha:** Teacher, I have some doubts in English.
(టీచర్, ఇంగ్లిష్‌లో నాకు కొన్ని సందేహాలు ఉన్నాయి.)
**Teacher:** I will clear all your doubts. Don't worry.
(నీ సందేహాలన్నీ నేను తీరుస్తాను- ఇది teacher's promise)

b) **Prasanth:** Dad, the course costs Rs. 20,000/- a year.
**Dad:** Don't you worry son. I will give you all the money you want. Just study well and come out with success.
(నీకు కావాల్సినంత డబ్బు నేనిస్తా - I will give; Iతో will - promise - మాట ఇవ్వడం)

c) **Vijay:** I want to contest in the coming municipal elections.
(వచ్చే మున్సిపల్ ఎన్నికల్లో పోటీచేయాలనుకుంటున్నా.)
**Vinai and Vikram:** Go ahead. We will support you.
(అలాగే. మేం నిన్ను సపోర్ట్ చేస్తాం - We will support - promise)
**Vijay:** I will file my nomination then.
(అయితే నామినేషన్ వేస్తా - నిర్ణయం)
**Vinai and Vikram:** We will help you with money also.
(డబ్బు సాయం కూడా చేస్తాం - Promise)

కింది వాక్యాలను English లో practice చేయండి.

1) నేను రేపు కచ్చితంగా చెన్నై వెళతాను.
2) వాళ్లను ఇక్కడికి రానివ్వం.
3) నేను నీకు ఏ పుస్తకం కావాల్సినా ఇస్తాను.
4) మేం రేపు తప్పకుండా సిఎమ్‌ను కలుస్తాం.
5) ఇలాంటివి మేం జరగనివ్వం (such things, allow వాడండి).
6) **భరత్:** నేనిప్పుడు వెళ్లనా?
**భార్గవ్:** ఎక్కడికి వెళతావు?
**భరత్:** కళాశాలకు వెళతాను.
**భార్గవ్:** మీ ఫ్రెండ్స్ ఎప్పుడొస్తారు?
**భరత్:** రేపు మేం వెళ్లే పిక్నిక్‌కు నువ్వు రావా?
7) **విష్ణు:** నేను ముంబాయి చాలాసార్లు వెళ్లాను.
**ఈశ్వర్:** నేను ఒకసారి మాత్రమే వెళ్లాను.
**విష్ణు:** బ్రహ్మం కూడా ముంబాయి వెళ్లాడా?
**ఈశ్వర్:** అతను కూడా ఏదో ఒకటి రెండుసార్లు వెళ్లాడు.
8) **ప్రశాంతి:** నువ్వు మా ఇంటికి రావా? (won't you వాడండి.)
**శాంతిశ్రీ:** నువ్వు రేపు ఇంట్లో ఎప్పుడు ఉంటావు?
**ప్రశాంతి:** రేపంతా ఇంట్లోనే ఉంటా.
**శాంతిశ్రీ:** మరిరేపు నేను గుంటూరు వెళతా.
**ప్రశాంతి:** మళ్లీ ఎప్పుడొస్తావు?
**శాంతిశ్రీ:** వారం తర్వాత చెన్నై వెళ్లి అక్కడి నుంచి తిరిగి వస్తా.
**ప్రశాంతి:** నేను రేపు సెల్‌ఫోన్ కొంటాను.
**శాంతిశ్రీ:** అయితే రేపటి నుంచి నాతో టచ్‌లో ఉంటావా?
9) **తరుణ్:** హాయ్ వరుణ్, కులాసానా?
**వరుణ్:** ఆ, కులాసానే... నువ్వెలా ఉన్నావు?
**తరుణ్:** బాగానే ఉన్నాను. ఎంబిఎలో చేరావా?
**వరుణ్:** ఇంకా ఏం నిర్ణయించుకోలేదు.
**తరుణ్:** నేను ఎంసిఎలో చేరాను. నిన్ననే ఇన్‌స్టిట్యూట్‌లో చేరాను.
**వరుణ్:** మా నాన్నగారు నాలుగు రోజులుగా ఊళ్లో లేరు. నేను ఆయన కోసం చూస్తున్నాను. ఆయన వచ్చిన తర్వాత నిర్ణయం తీసుకుంటాం.

**Answers:**

1) I will go to Chennai tomorrow.
2) We will not let them come here.
3) I will give you whatever book you want.
4) We will meet the CM tomorrow.
5) We will not allow such things.

6) **Bharat:** Shall I go now?
**Bhargav:** Where will you go?
**Bharat:** To college
**Bhargav:** When will your friends come?
**Bharat:** Won't you (will you not) join us for the picnic tomorrow?

7) **Vishnu:** I have been to Mumbai quite a number of times.
**Eshwar:** I have been there too; just once.
**Vishnu:** Has Brahmam too been to Mumbai?
**Eshwar:** He has been to Mumbai just once or twice.

8) **Prasanthi:** Won't you come home to me?/ Won't you come to our place?
**Santhisri:** When will you be at home tomorrow?
**Prasanthi:** I am/ shall be at home all the day tomorrow.
**Santhisri:** But I shall go to Guntur tomorrow.
**Prasanthi:** When will be back?/ When will you return?
**Santhisri:** I shall go to Chennai in a week and from there return.
**Prasanthi:** I shall buy a cell phone tomorrow.
**Santhisri:** Will you be in touch with me from tomorrow ?

9) **Tarun:** Hi Varun, How are you?
**Varun:** Fine. Thank you. How are you?
**Tarun:** Fine. Have you joined MBA?
**Varun:** I haven't (have not) decided yet.
**Tarun:** I have joined MCA. I joined the institute yesterday.
**Varun:** My father has been out of town for the past four days. I am waiting for him. Decision is possible only after he comes back.




**ప్రశ్న:** a) The meeting will be held on tomorrow evening అనే sentence ఏ tense కి చెందుతుంది? ఈ tense voice ఏమిటి?
b) Definite article 'the'ని ఎక్కడ ఉపయోగించాలి. The French, The whip అని రాయవచ్చా?
– టి.ఎల్. ప్రియాంక, విశాఖపట్నం

**జవాబు:** a) 'will be held tomorrow evening' (on tomorrow evening సరికాదు). ఇక్కడ verb- will be held.
**Tense:** future simple/ indefinite.
**Voice:** passive.
b) The French అంటే ఫ్రాన్స్ దేశస్థులు. French అంటే french భాష.
'The' వాడకం మొత్తం వివరణ త్వరలో వస్తుంది.

**ప్రశ్న:** పెరుగు అనే పదాన్ని curd అనాలా? curds అనాలా?
– కె. మేఘమాల, అల్వాపురం

**జవాబు:** 'Curd', 'curds' రెండూ కరెక్టే. అయితే curd తర్వాత singular verb, curds తర్వాత plural verb రావాలి. The curd is tasty.
The curds are tasty.

**ప్రశ్న:** 'Obey the parents' అనే వాక్యానికి passive ఏమిటి?
– ఎం. శంకర్, అల్వాపురం

**జవాబు:** Let the parents be obeyed.
ఇలాంటి sentences కి passive చాలా కృతకంగా ఉంటుంది.




# చేయాలి... తప్పదు!




**Sumathi:** Hi, Vimala, well met. When shall we sit to plan our holiday?
(హాయ్ విమల! మనం కలుసుకోవడం మంచిదైంది. హాలీడే ప్లాన్ చేయడానికి ఎప్పుడు కూర్చుందాం?)

Holiday = మామూలు అర్థం సెలవు. ఇంకో అర్థం మనం ఎక్కడికైనా సరదాగా వెళ్లి గడిపే రోజులు అని.

**Vimala:** Why not this evening? I shall be away from tomorrow onwards.
(ఈ సాయంత్రం ఎందుకు కూర్చోకూడదు? నేను రేపటి నుంచి బిజీగా ఉంటా.)
why not = ఎందుకు కూడదు?

**Sumathi:** It shall be this evening then. You shall be here at 7 PM.
(అయితే ఈరోజు సాయంత్రమే కూర్చుందాం. ఏడింటికి నువ్వు ఇక్కడ ఉండాలి.)

**Vimala:** How about Sourabha? Won't she (will not she) join us?
(సౌరభ సంగతేంటి? ఆమె మనతో రాదా?)

**Sumathi:** She shall come, ofcourse. She has promised me.
(ఆమె తప్పక వస్తుంది. వస్తానని మాట ఇచ్చింది.)

**Vimala:** What about Sudhakar, Your cousin?
(మీ కజిన్ సుధాకర్ సంగతేంటి?)

**Sumathi:** He shall join us too.
(అతనూ తప్పకుండా వస్తాడు.)

**Vimala:** Won't Neeraj and Kalyan come?
(నీరజ్, కళ్యాణ్ రావడం లేదా?)

**Sumathi:** Why they? They shall not. I don't like them.
(వాళ్లెందుకు? వాళ్లు రాకూడదు. నాకిష్టం లేదు)

ఈ సంభాషణలో you, he, she, it and theyతో shall రావడం గమనించండి.

It shall be;
She shall come;
He shall join;
They shall (not);
You shall be

ఇంతవరకు మనం తెలుసుకుంది ఒకసారి గుర్తుచేసుకుందాం.

1) I/We తో shall; you, he, she, it and they తో will కచ్చితంకాని భవిష్యత్తు (Indefinite future) ను తెలియజేస్తాయి.
2) I/We తో will మన నిర్ణయాలను (decisions), ఉద్దేశాలను (intentions) తెలియజేస్తాయి.
3) I/We తో will మనం promise చేయడానికి వాడతాం.

మనం గమనించిన విషయాలు సంగ్రహంగా-
★ I/Weతో shall - Indefinite future
★ I/Weతో will - determination (నిర్ణయం)
★ You, he, she, it and theyతో will - Indefinite (కచ్చితంకాని) future.

ఇప్పుడు పై సంభాషణలో you, he, she, it and theyతో shall వాడే సందర్భాలు-
మొదట ఇచ్చిన సంభాషణలో
1) కచ్చితంగా future లో జరుగుతాయనుకున్న విషయాలు.

a) It shall be this evening.
ఈ సాయంత్రం అది కచ్చితంగా ఉంటుంది/అవుతుంది, ఉండాలి/అవ్వాలి.
b) She shall come.
ఆమె తప్పకుండా వస్తుంది/రావాలి.
c) He shall join.
తప్పకుండా మనతో వస్తాడు/రావాలి.
d) They shall not.
వాళ్లు రాకూడదు/రారు
e) You shall be here.
నువ్విక్కడ ఉండాలి.

**Manoj:** How long am I to be here, Sir?
(నేనెంతసేపు ఇక్కడ ఉండాలండీ?)

**Officer:** You shall be here till 7 in the evening.
(నువ్వు ఇక్కడ సాయంత్రం ఏడింటివరకు ఉండాలి- ఆజ్ఞ)

**Manoj:** Why so long, Sir?
(అంతసేపు ఎందుకండీ?)

**Officer:** You shall finish all this work and then only go.
(నువ్వు ఈ పని పూర్తి చేసి వెళ్లాలి.)

**Manoj:** I want leave on Friday Sir.
(శుక్రవారం నాకు సెలవు కావాలి.)

**Officer:** You shall not go on leave till Monday. You shall stay here as long as I want you to.
(సోమవారం వరకు సెలవు పెట్టకూడదు. నేను ఎంతసేపు కావాలంటే అంతసేపు నువ్విక్కడ ఉండాల్సిందే.)


M. SURESAN

**Manoj:** What about the others Sir?
(మిగతా సిబ్బంది సంగతేంటండీ?)

**Officer:** They shall stay too. They shall not apply for leave either, till Monday. My steno shall stay longer than all of you. I have a lot of letters to dictate, and she shall take out their print outs before tomorrow morning. For two more days the office shall work till 7PM.
(వాళ్లూ తప్పకుండా ఉంటారు. సోమవారం వరకు వాళ్లు కూడా లీవ్ అడగకూడదు. నా స్టెనో మీ అందరికంటే ఎక్కువసేపు ఉంటుంది. నేను చాలా లెటర్లు డిక్టేట్ చేయాలి. రేపు ఉదయానికల్లా ఆమె తప్పని సరిగా వాటి ప్రింటవుట్లు తీసుకోవాలి. ఇంకో రెండు లేదా ఎక్కువ రోజులు సాయంత్రం ఏడింటి వరకు ఆఫీస్ పనిచేయాలి.)

ఈ సంభాషణలో Officer, you, he, she it and they తో shall వాడడం గమనించండి. అలా వాడడం ఆయన ఆజ్ఞలు (commands) ఇవ్వడానికి. అంటే you, he, she, it and they తో shall ఆజ్ఞలను (commands) తెలియజేస్తుంది.

a) You shall be here.
నువ్విక్కడ ఉండాలి (ఆజ్ఞ- command)
b) You shall finish.
నువ్వు పూర్తి చేయాలి (ఆజ్ఞ- command)
c) You shall not go on leave.
నువ్వు సెలవు పెట్టకూడదు (ఆజ్ఞ- command)
d) You shall stay.
నువ్వు ఉండాలి (ఆజ్ఞ- command)
e) They shall stay too.
వాళ్లూ ఇక్కడ ఉండాలి. (ఆజ్ఞ- command)
f) My steno shall stay.
నా స్టెనో ఇక్కడ ఉండాలి (ఆజ్ఞ- command)
g) She shall take print outs.
ఆమె ప్రింటవుట్లు తప్పకుండా తీయాలి (ఆజ్ఞ- command)
h) The office (it) shall work.
ఆఫీస్ పనిచేయాలి (ఆజ్ఞ- command)

- తెలుస్తోంది కదా you, he, she, it and they తో shall వాడి ఆజ్ఞలు (Commands/ orders) ఇవ్వొచ్చు. ఇంకా చూడండి.

i) You shall not smoke here.
నువ్వు ఇక్కడ స్మోక్ చేయకూడదు.
j) మీ public, university exams answer books లో instructions అన్నీ shall వాడకంతో ఉంటాయి.
i) No candidate (he/she) shall bring any slips of paper into the exam hall.
(పరీక్ష హాల్‌లోకి ఎవరూ కాగితం స్లిప్పులు తీసుకు రాకూడదు. - order)
ii) Absolute silence shall be observed.
(పూర్తి నిశ్శబ్దం పాటించాలి- order)

ప్రభుత్వ పత్రాలు, నిబంధనలు అన్నిట్లో you, he, she, it, they తో shall ఆజ్ఞలకు వాడడం మీరు గమనించవచ్చు. Court orders లో కూడా అంతే. orders జారీ చేయడానికి you, he, she, it and they తో అధికారికంగా (official) అయినా, అనధికారికంగా (unofficial) అయినా 'shall' వాడతారు.

కింది వాక్యాలు English లో practice చేయండి. సందర్భాన్ని బట్టి shall, will రెండూ వాడండి.

1) అటువంటిదేమీ నువ్వు చేయకూడదు (such= అటువంటి).
2) నువ్వు రేపు ఇక్కడికి ఏడింటికి రా (order).
3) రేపు సాయంత్రానికల్లా పని పూర్తిచేయాలి.
4) **Ram:** మళ్లీ నేను ఎప్పుడురాను ఇక్కడికి?
**Raghu:** నువ్వు మళ్లీ ఇక్కడికి రాకూడదు.
**Ram:** నువ్వలా మాట్లాడకూడదు.
**Raghu:** నువ్వు పని పూర్తిచేయాలి. ఆ తర్వాతే నన్ను కలుసుకోవాలి.
**Ram:** నేను ఈ సాయంత్రమే కచ్చితంగా పని పూర్తిచేస్తాను.
**Raghu:** అయితే సాయంత్రానికి నువ్వు పని పూర్తిచేయాలి.

**Answers:**
1) You shall do no such thing/ You shall not do any such thing.
2) You shall be/ shall come here at 7 tomorrow.
3) You/He/She/They shall finish/ complete the work by tomorrow.
4) **Ram:** When shall I come here again?
**Raghu:** You shall not (shan't) come here again.
**Ram:** You shall not (shan't) talk like that.
**Raghu:** You shall finish the work. Then only you shall see/ meet me.
**Ram:** I'll (I will) finish the work by this evening.
**Raghu:** You shall (finish), then.

**ప్రశ్న:** a) Infinitives అంటే ఏమిటి?
b) 'to + have +V3' అంటే అర్థం ఏమిటి?
c) to పక్కన being లేదా be వాడితే దాని అర్థం ఏమిటి?
– వి. ఈశ్వరరావు, గుంటూరు

**జవాబు:** a) Infinitives ను గురించి ఇంతకు ముందు వచ్చిన పాఠాల్లో వివరించాం అది చూడండి.
b) to have + V3 - V3 అంటే past participle. To have + V3 కి ఉదాహరణలు:
to have gone, to have killed, to have done etc.
i) He seems to have done it.
(ఆ పని అతడు చేసినట్టే ఉంది (pastలో ఏదైనా జరిగినట్టు అనిపించింది).
ii) They appear to have killed the tiger.
(Tiger చనిపోయింది -past లో వాళ్లా పని చేసినట్టే ఇప్పుడు కనిపిస్తున్నారు.)
iii) I like to have gone with them.
(వాళ్లతో వెళ్లి ఉండడానికి ఇష్టపడుతున్నాను- అంటే వాళ్లు వెళ్లిపోయారు. నేను ఇప్పుడు మాట్లాడుతున్నాను.)
She likes to sing.
(ఆమె పాడాలనుకుంటోంది)
She likes to have sung
(ఆమె గతంలో- పాడి ఉండాలని అనుకుంటోంది)
c) To పక్కన be గానీ being వాడతారు తప్పు లేదు.
i) I like to be here for sometime.
(నేను ఇక్కడ కాసేపు ఉండాలని అనుకుంటున్నాను.)
ii) I object to being treated as a stranger.
(నన్ను కొత్తవాడిగా చూడడానికి నేను అభ్యంతరం చెబుతున్నాను.)

**ప్రశ్న:** మీరు ఆంగ్లభాషణ మూడోభాగంలో ఇచ్చిన I was there exactly at 6 when the function began అనే వాక్యాన్ని 'I had been there exactly at 6 when the function began' అని రాయవచ్చా?
– చిన్ను, నెల్లూరు

**జవాబు:** a) I was there exactly at 6 when the function began. దీని అర్థం function begin అయినప్పుడు నేనక్కడ కరెక్ట్‌గా ఆరింటికి ఉన్నాను అని. Function begin అవడం ఆరింటికే, నేనక్కడ ఉన్నది కూడా ఆరింటికే అని.
b) I had been there exactly at 6 when the function began- ఇది అంత సరికాదు. దీన్ని 'I had been there when the function began exactly at 6', అని మారిస్తే sentenceకు సరైన అర్థం వస్తుంది. అయితే దీనికి పైన sentence (a)కి అర్థంలో తేడా వస్తుంది. (b) వాక్యానికి అర్థం function కరెక్ట్‌గా ఆరింటికి ప్రారంభమైంది. అంతకు ముందు నుంచే నేను అక్కడ ఉన్నాను అని.

**ప్రశ్న:** a) Would ని ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారు?
b) Let you write అంటే తప్పా? ఒప్పా? ఎందుకు?
– బండి శివప్రసాద్, కట్కూర్

**జవాబు:**
a) 'would' ఉపయోగాన్ని త్వరలోనే వివరిస్తాం.
b) Let you write - ఇది తప్పు. Let ఉపయోగం ఇంతకు ముందు వ్యాసాల్లో వివరించాం. సామాన్యంగా Letను 'you'తో వాడడం ఉండదు. ఒక్కోసారి వాడవచ్చు.
You let yourself into the room, when he opens the door.
(అతను తలుపు తెరవగానే, నువ్వు ప్రవేశించు- అని అర్థం. అయితే ఇక్కడ yourself అనే reflexive వాడకం గమనించండి)
Let you write అర్థం- నువ్వు రాయి. అయితే 'write' అంటే సరిపోతుంది కదా.



# shall, will కథ ఎంతో ఉంది!

**Bhaskar:** Good morning, sir. Will you give me the books I've asked you for, sir?
(గుడ్‌మార్నింగ్ సర్. నేనడిగిన పుస్తకాలు ఇస్తారా? )

**Teacher:** Yes, Bhaskar, they shall be with you this afternoon. Don't worry.
(అవి ఈ మధ్యాహ్నం నీ దగ్గరుంటాయి, సరేనా? )

**Bhaskar:** Moreover, I need your notes too, sir, for the next week's exam.
(అంతేకాకుండా, వచ్చేవారం examకు మీ నోట్స్ కూడా కావాలి. Moreover=ఇంకా; notes- plural; note- singular)

**Teacher:** You shall have them, what more?
(notes నీకిస్తాను. ఇంకేం కావాలి? )

**Bhaskar:** My sister wants you to help her out with some of the lessons.
(మా sisterకు కొన్ని lessons విషయంలో మీ సహాయం కావాలి.)

**Teacher:** She shall have my help. Let her not worry, but she shall see me only in forenoon. I am busy the next of the day.
(ఆమెకు నా సహాయం ఉంటుంది. కానీ నన్ను పొద్దున్నే కలవాలి. మిగతా సమయంలో నేను busy)

**Bhaskar:** She shall see you in the forenoon only, sir, I assure you.
(మా sister మిమ్మల్ని పొద్దునపూటే కలుస్తుంది, sir)

**Teacher:** One of the books is rare. It shall not be lost or damaged.
(వాటిల్లో ఒక పుస్తకం చాల అరుదైంది, అది పోకుండా,చిరిగిపోకుండా చూడాలి.

**Bhaskar:** It shall not be, Sir.

పై సంభాషణలో 'shall' వాడకం పరిశీలించండి. ఇప్పటివరకు మనం తెలుసుకున్న will, shall ఉపయోగాలు గుర్తుకు తెచ్చుకుందాం.

**i)** I/Weతో shall- you, he, she, it and theyతో will- indefinite future (అనిశ్చిత భవిష్యత్తు)ను తెలుపుతాయి.

**ii)** I/ Weతో will తెలిపేది:
- **a)** Determination (నిర్ణయం)
- **b)** Intention (ఉద్దేశం)
- **c)** Promise (మాట ఇవ్వటం)

**iii)** You, he, she, it and theyతో shall తెలిపేది.
- **a)** commands/orders (ఆజ్ఞలు)
- **b)** Definite future (భవిష్యత్తులో కచ్చితంగా జరగబోయేవి)

ఇప్పుడు Bhaskar, teacher మధ్య conversation గమనించండి:

Shall వాడిన వాక్యాలు:

You, he, she, it and theyతో shall వాడకం ఇంకా:

**1)** They shall be with you this afternoon =
అవి ఈ మధ్యాహ్నానికి నీ దగ్గర ఉంటాయి. నేను వాటిని మధ్యాహ్నానికి నీకు ఇస్తాను/ పంపుతాను) - ఇది హామీ (Assurance)

**2)** She shall have my help=
నా సహాయం ఆమెకు తప్పక ఉంటుంది. ఇది కూడా హామీ (Assurance)

**3)** She shall see me only in the forenoons =
పొద్దునపూట మాత్రమే ఆమె నన్ను కలుసుకోవాలి. (ఆజ్ఞ)

**4)** She shall see you only in the forenoons =
ఆమె పొద్దునపూట మిమ్మల్ని కలుసుకుంటుంది. (Assurance)

**5)** It shall not be lost or damaged.
(అది పోకూడదు, చినగకూడదు- Warning - హెచ్చరిక)

**6)** It shall not be, sir =
అలా అవదండి. (Assurance)

పై six sentencesలో shall ను you, he, she, it, they తో హామీలివ్వడానికి, హెచ్చరిక ఇవ్వడానికి కూడా వాడాం.

**Father:** You have wasted a lot of money, already. you shall not waste any more money, understand.
ఇప్పటికే చాలా డబ్బు వృధాచేశావు. ఇంక చేయకు. అర్థమయిందా?
ఇది హెచ్చరిక (Warning)

**Son:** I do, dad. It shall not happen again.
(అర్థమయింది. అది మళ్లీ జరగదు నాన్నగారూ - ఇది హామీ Assurance)

**Father:** You shall keep an account of every paise you spend.
(నువ్వు ఖర్చుపెట్టే ప్రతి పైసా లెక్కరాయాలి)

**Son:** I will, dad.

(I తో will-నిర్ణయం -ఇక్కడ Assurance)

కాబట్టి you, he, she, it and theyతో shall
1) Orders/ commands 2) Warnings
3) Assurances ను తెలుపుతుంది.

**Prem:** I am going to contest in the next elections
(నేను వచ్చే ఎన్నికల్లో పోటీ చేయాలనుకుంటున్నా)

**Ram and Swaroop:** Go ahead. You shall have our total support.
(అలాగేకానీ, మా support నీకు పూర్తిగా ఉంటుంది)
You shall have even our financial support.
(మా financial support కూడా నీకు తప్పక ఉంటుంది)

ఇక్కడ you shall have our support అనేది మామూలు హామీకన్నా ఇంకా గట్టిగా చెప్పడం - అంటే Promise కచ్చితమైన మాట ఇవ్వడం)




మీకు గుర్తుందికదా. I/Weతో will వాడి మాట ఇస్తాం. (Promise)
అలాగే you, he, she it and theyతో shall వాడి promise చేయవచ్చు.

**Parvathi:** Dad, I want to take coaching of CAT. I need some money.
(నాన్నా, నేను CAT examకు coaching తీసుకోవాలనుకుంటున్నా. డబ్బు కావాలి)

**Father:** You shall have the money. How much do you want?
(ఆ డబ్బు నీకు వస్తుంది. (నేను నీకు ఆ డబ్బు ఇస్తాను= I will give you the money. You shall have - ఇది promise) ఎంత కావాలి? )

**Parvathi:** About Rs 10000/-
(దాదాపు పదివేలు)

**Father:** You shall have more than that. Don't worry.
అంతకన్నా ఎక్కువే ఇస్తా. Worry అవద్దు.

☛ You, he, she and theyతో shall కిందివాటికి వాడతాం.
1)Orders/commands
2)Warnings
3)Assurances
4)Promise


M. SURESAN

కింది వ్యాఖ్యలను Englishలో practice చేయండి. (సందర్భాన్ని బట్టి will, shall రెండూ వాడండి. మిగతా verb forms ఇప్పటివరకూ మనం తెలుసుకున్నవి కూడా వాడాల్సి రావచ్చు).

**1)** మేం తప్పకుండా functionకు వస్తాం. (attend వాడండి)

**2) Gopi:** ఓ గంటసేపు నీ bike తీసుకోనా?
**Govind:** తీసుకోవద్దు. (పూర్తి sentence రాయండి.)
**Gopi:** అది మళ్లీ నీ దగ్గర గంటలో తప్పకుండా ఉంటుంది.
(Itతో begin చేయండి, back కూడా వాడండి)
**Govind:** నేనివ్వను. నన్ను ట్రబుల్ చెయ్యొద్దు. (will/shall మాత్రమే వాడండి)

**3) Samuel:** ఇలాంటి మంచి novels ఎక్కడ దొరుకుతాయి? (Available వాడండి)
**Samson:** Read well book storesలో. (లో=at). అక్కడ మీకు ఏ బుక్ కావాల్సినా దొరుకుతుంది (get, whatever book వాడండి)
**Samuel:** ఎప్పుడు వెళదాం అక్కడికి?
**Samson:** Saturday సాయంత్రం నువ్వు తప్పకుండా మా ఇంటికి రా. నేను నిన్ను తప్పకుండా అక్కడికి తీసుకెళతా.

## Answers:

**1)** We will attend the function.

**2) Gopi:** Shall I take/ have/ borrow your bike for an hour?
**Govind:** You shall not.
**Gopi:** It shall be back with you in just an hour.
**Govind:** I will not give it (I won't give it). You shall not trouble me any more.

**3) Samuel:** Where are such good novels available?/ Where do we get such good novels?
**Samson:** At Readwell Book Stores. You shall get there whatever book you want.
(you get అని కూడా అనవచ్చు)
**Samuel:** When shall we go there?
**Samson:** You come home to me/ come to my place on Saturday evening. I will take you to the shop.

---

Q A

**ప్రశ్న: 1)** మీరు The Egg (ది ఎగ్) అనాలని చెప్పారు. an egg అని ఎందుకు వాడకూడదు?
**2)** The ని ఎప్పుడు వాడాలో, ఎప్పుడు వాడకూడదో విపులంగా తెలుపగలరు.
**3)** I had been watching the TVకి, I have been watching the TVకి తేడా వివరించగలరు.

**– సరస్వతి, ఫీల్‌ఖానా**

**జవాబు: 1)** 'an egg' వాడాలా, 'the egg' వాడాలా అనేది సందర్భాన్నిబట్టి ఉంటుంది. మామూలుగా ఒక egg, ఏదో ఒక egg అనే అర్థంలో అయితే 'an egg' అంటాం. eg: There is an egg on the plate. (Plateలో (ఓ) గుడ్డు ఉంది. ఇక్కడ ఏదో ఒక గుడ్డు అనే అర్థంతో వాడుతున్నాం కాబట్టి an egg.
ఫలాన గుడ్డు అని చెప్పినప్పుడు the egg అంటాం. He ate the egg on the plate. ఇక్కడ plateలోని egg ను (ఏ egg? అనే question‌కు - the egg on the plate అనే answer వస్తుంది కాబట్టి) the egg అంటాం. The egg on the plate is for Ramesh. (Plateలోని egg రమేష్‌కు). eg: An umbrella is useful in rain (గొడుగు - ఏదైనాసరే సరే వర్షంలో ఉపయోగపడుతుంది. The umbrella in that corner is mine ఇక్కడ ఫలాన గొడుగు (ఆ మూల ఉన్న గొడుగు) అంటున్నాం కాబట్టి 'The umbrella' అంటాం. (ఏ గొడుగు? ఏ పుస్తకం? అని ప్రశ్న వేసుకుని సమాధానం వస్తే, The వాడతాం)

**2)** 'The' ఉపయోగం గురించి త్వరలో విపులంగా తెలుసుకుంటాం.

**3)** ఇంతకుముందు lessonలో have beenను గురించి వివరించాం చూడండి. I have been watching the TV అంటే కొంతసేపటినుంచి ఇప్పటివరకూ/ ఇంకా టీవీ చూస్తున్నాను, అని. కొంతసేపుగా TV చూస్తున్నాను అని.
I had been watching the TV అంటే గతం (past)లో రెండు పనులలో ఒక పని ముందరే ప్రారంభం అయి రెండోపనివరకు జరిగి ఉంటే అప్పుడుhad been + ingవాడతాం.
I had been watching the TV when he came in =అతను వచ్చేప్పటికి నేనుTV చూస్తూ ఉన్నాను. అంటే అతను వచ్చే ముందు నేను టీవీ చూడటం ప్రారంభించి అతను వచ్చేవరకు చూస్తూనే ఉన్నా అని. సామాన్యంగా రెండో పనిని గురించి చెప్పినప్పుడు had been watching (had been + ing) verb fromను వాడం.

# ప్రతిభ

# ఇంగ్లీష్ కాదు... ఇంగ్లిష్!

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 33

### PRONUNCIATION GUIDE

★ Countable singulars ముందు తప్పక article 'a' వాడాలి.
a book, a pen, etc.

ఇక్కడ 'a' pronunciation- 'ఎ' కాదు. ఎ బుక్, ఎ పెన్ - ఇక్కడ సరికాదు. ఇక్కడ article 'a'ను pronounce చేయాల్సిన విధం తెలియజేసే గుర్తు 'ə'. ఇది దాదాపు తెలుగు 'అ' తో సమానమవుతుంది. కాబట్టి 'a book' = అ బుక్
'a pen' = అ పెన్ etc.

అలాగే about, above - దాదాపు ab- combinations తో వచ్చే మాటలన్నిటిలో 'a' ని 'ə' (తెలుగు- అ) శబ్దంతో పలుకుతారు.
about = అబౌట్ (బౌ- నొక్కి పలకాలి) ఎబోట్- కాదు.
above = అబొవ్ (బొ- నొక్కి పలకాలి) ఎబో- కాదు.

*What shall we discuss at the meeting?*

★ ఒకమాటలో ఉండే శబ్దాలను syllables అంటారు. sentence అనే పదంలో'sen' ఒక syllable, tence మరో syllable అవుతుంది. అంటే sentence అనేది two syllables కలయిక అన్నమాట.

English (ఇంగ్లిష్- ఇంగ్లీష్ కాదు) భాషలో తెలుగు లోలాగా కాకుండా ఒక మాట పలికేటపుడు ఆ మాట లోని ఒక syllableను మిగతా syllables కంటే ఎక్కువగా నొక్కిపలుకుతారు. ఈ పలకడాన్ని stress అంటారు. దీన్ని dictionaryలో ' గుర్తు ద్వారా చూపి స్తారు.

**eg.** English- ˈEnglish - అంటే 'ఇ' శబ్దాన్ని నొక్కి పల్కకాలన్నమాట.
aˈbove - ఇక్కడ b తో ఉండే syllable ను ఎక్కువ stress చేసి దాన్ని నొక్కి పలకాలి.

**కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో practice చేయండి.**

**1) Chandra:** నేను రేపు ఇక్కడ (తప్పక) ఉంటాను. మా బ్రదర్‌కూడా (తప్పక) ఉంటాడు.
**Tara:** అయితే రేపు నిన్నెప్పుడు కలవగలను?
**Chandra:** నీకెంత త్వరగా వీలయితే అంత త్వరగా రావాలి. మీ అన్న కూడా రావాలి. నువ్వు ఆలస్యం చేయకూడదు.
**Tara:** ఆలస్యం కాకుండా ఉండడానికి ప్రయత్నిస్తాను.
**Chandra:** నువ్వెప్పుడూ ఆలస్యమే. రేపు అయినా సమయానికి రా.
**Tara:** నేను రేపు ఆలస్యంగా రానేరాను. మనం ఇక్కడ నుంచి ఎప్పుడు బయలుదేరతాం?
**Chandra:** ఉదయం పదింటికి (తప్పకుండా) బయలుదేరతాం.

**2) Basheer:** షారూక్ ఇక్కడ ఎప్పుడుంటాడు?
**Roshan:** ఉదయం పదీపదికి తప్పకుండా ఇక్కడ ఉంటాడు.
**Basheer:** షూటింగ్ ఉదయం పదకొండింటి కల్లా ప్రారంభం కావాలి.
**Roshan:** తప్పకుండా ప్రారంభమవుతుంది.
**Basheer:** నేను రేపు కాస్త ఆలస్యంగా వస్తానేమో. నువ్వు మాత్రం ఉదయం 10.30 కి అంతా సిద్ధం చేయాలి.
**Roshan:** అయితే వచ్చేవాళ్లకు రిఫ్రెష్‌మెంట్స్ (టిఫిన్) సంగతేంటి?
**Basheer:** వాటి విషయం ఆమీర్ చూసుకుంటాడు. (take care వాడండి)

**3) Karim:** నువ్వు శుక్రవారం నమాజ్‌కు రావాలి.
**Kowser:** నేనీ ఊరికి కొత్త. ఏ మసీద్‌కి వెళతాం? (మసీద్=Masjid or Mosque)
**Karim:** ఇక్కడికి దగ్గరలోనే ఒక మసీద్ ఉంది. దానికెళతాం. మధ్యాహ్నం 12.30కి నువ్విక్కడికి రావాలి. ఆలస్యం చేయకూడదు.
**Kowser:** నేను ఆలస్యం చేయను. నా ఫ్రెండ్‌ను కూడా తీసుకు రానా?
**Karim:** ఆ మాత్రం తెలీదా? ఖురాన్ ప్రకారం ఎంత మందిని వీలయితే అంత మందిని తీసుకు రావాలి.
(ఖురాన్ ప్రకారం = According to the Koran)

M. SURESAN

**4) ప్రియ:** మనం మీటింగ్‌లో ఏం చర్చిద్దాం?
(చర్చించడం = discuss, meeting లో = at the meeting)
**జనని:** వచ్చే వారం college day ఏర్పాట్లు చర్చిద్దాం.
(college day ఏర్పాట్లు = arrangement for the college day)
**ప్రియ:** నన్ను రమ్మంటావా?
**జనని:** నువ్వు తప్పక రావాలి. అదీ ఆలస్యం కాకుండా. (అదీ = That too)
**ప్రియ:** నువ్వు తప్పదంటే నేను కచ్చితంగా వస్తాను. మీటింగ్ టైమ్‌కి ప్రారంభమవుతుందా?
(నువ్వు తప్పదంటే = if you insist, insist = ఒక విషయం మీద పట్టుదలగా ఉండడం. ఇప్పుడే వెళ్లాలని పట్టుబడుతున్నాడు - He insists on going now)
**జనని:** సాయంత్రం 4.15కి ప్రారంభం కావాలి.
**ప్రియ:** సరే.

### Answers:

**1) Chandra:** I will be (I'll be) here tomorrow. My brother shall also be here.
**Tara:** When shall I see you (meet you) tomorrow, then?
**Chandra:** You shall come as early as possible. Your brother shall come too. You shall not be late.
**Tara:** I'll (I will) try my best not to be late.
**Chandra:** You are always late. Come early tomorrow at least.
**Tara:** I will not be (won't be) late, I assure you. When shall we start from here?
**Chandra:** We will start at 10 AM.

**2) Basheer:** When will Sharook be here?
**Roshan:** He shall be here at 10.10AM.
**Basheer:** The shooting shall begin at 11 AM.
**Roshan:** It shall (begin).
**Basheer:** I shall be a little late. But you shall make every thing ready by 10.30 AM
(ఇక్కడ సందేహం - indefinite - కాబట్టి I shall be)
**Roshan:** What about refreshments for them?
**Basheer:** Ameer shall take care of them.

**3) Karim:** You shall attend Namaz on Friday.
**Kowser:** I am new to this place/I am a stranger here. Which Masjid (Mosque) shall we go to?
**Karim:** There is one nearby. We shall go to it. You shall come here at 12.30 PM. You shall not be late.
**Kowser:** I won't (will not) be late. Shall I bring along my friend?
**Karim:** Don't you know that much? According to the Koran you shall bring to prayer as many as possible.

**4) Priya:** What shall we discuss at the meeting?
**Janani:** We shall/ We will/ Let us discuss the arrangements for the college day next week.
**Priya:** Do you want me to come?/ Shall I come?
**Janani:** You shall come. That too, on time/ without being late.
**Priya:** If you insist, I will come. Will the meeting being on time.
**Janani:** It shall at 4.15 PM.
**Priya:** OK.

**మీరూ రాయండి!**
స్పోకెన్ ఇంగ్లిష్‌లో మీ సందేహాలను
**స్పోకెన్ ఇంగ్లిష్, ప్రతిభడెస్క్, ఈనాడు, సోమాజిగూడ, హైదరాబాద్-82**
చిరునామాకు పంపించవచ్చు.
**email:** pratibha@ eenadu.net

## Q&A

**ప్రశ్న:** తెలుగు-ఇంగ్లిష్ డిక్షనరీలు వాడాల్సిన అవసరం ఏమిటి?
– *మంజుల, ఆదోని*

**జవాబు:** English-Telugu dictionary ఎంత ఉపయోగకరమో Telugu-English dictionary కూడా అంతే ఉపయోగకరం. ఆవాలు, మిరియాలు లాంటి మాటలకు English కావాలంటే తేలిగ్గా దొరుకుతాయి. English మాట్లాడేటప్పుడు సహాయపడుతుంది.

**ప్రశ్న:** You, He, She అనేవి singular forms. Singulars ను తెలియజేసే ముందు verb singularలో ఉండాలి. కానీ మనం రోజూ మాట్లాడే భాషలో How are you, Are you fine? అంటాం. వీటిలో are ఎందుకు వాడతారు?
– *రవి, విజయనగరం*

**జవాబు:** Englishలో singular form of the verb వాడాల్సింది అన్ని singular subjects కు కాదు. III person- singular subjectsకు మాత్రమే singular verbs వాడతాం. రెండో విషయం English లో you, singular (నువ్వు), plural (మీరు). అయితే verb విషయంలో you తర్వాత ఎప్పుడూ plural verb మాత్రమే వాడాలి. 'How are you?' అంటే (you కు ఎప్పుడూ plural verb) జవాబు- 'I am fine' అనడం వాడుకే. అయితే మీరు కుశలమా అనడానికి 'Are you fine?' అనం. 'How are you?', 'Are you OK?' వంటి మాటలు వాడతాం.

**ప్రశ్న:** Present Perfect Tense రాసేటప్పుడు నిర్దిష్టంగా time/ period చెప్పరు కదా! మీరు
I have coffee in the morning.
My mother has breakfast at 8 AM.
అని రాశారు కరెక్టేనా?
– *జి. శ్వేత, ఆదిలాబాద్*

**జవాబు:** I have coffee in the morning.
My mother has breakfast at 8 AM.
ఈ sentences లో మనం past actions (గతంలో జరిగిన పనులను) గురించి కాదుకదా మాట్లాడుతోంది. Regular actions (క్రమం తప్పకుండా జరిగే పనులను) గురించి చెబుతున్న sentences ఇవి. Past actions కు టైమ్ చెబితే అప్పుడు Past Doing Word వస్తుంది. పై వాక్యాలు Regular actions కాబట్టి verb forms కరెక్టే.

**ప్రశ్న:** See, Watch ల మధ్య తేడా ఏమిటి?
I see movie.
I watch movie
- అంటాం. ఏది కరెక్ట్? Eg. అంటే అర్థం ఏమిటి? Eg., Ex. లలో ఏది కరెక్ట్.
– *ఒక పాఠకుడు, మాచర్ల*

**జవాబు:** I see movies, I watch movies రెండూ కరెక్టే. అయితే am seeing/ is seeing/ are seeing వాడం కాబట్టి, దాని బదులు am watching/ is watching/ are watching వాడాలి.
e.g.- ఇది for example (ఉదాహరణకు) అనేదానికి abbreviation.
e.g.- అనేది కరెక్ట్. ex కరెక్ట్ కాదు. అది exercise కి abbreviation.

**ప్రశ్న:** I wish I had joined the Army.
I wish I joined Army.
పై రెండు వాక్యాల్లో ఏది ఏ సందర్భంలో వాడాలి? రెండింటి మధ్య తేడా ఏమిటి?
– *గపూర్, లక్సెట్టిపేట*

**జవాబు:** 'I wish I joined the army' అంటే ఇప్పుడు నేను Armyలో చేరితే ఎంత బాగుంటుంది- అని.
'I wish I had joined the army! అంటే గతంలో నేను Army లో చేరి ఉంటే ఎంత బాగుండేది- అని.

**ప్రశ్న:** Have been, has been, had been అనే పదాలను వాక్యంలో ఎలాంటి సందర్భాల్లో ఉపయోగిస్తారు? Have, has, had లను ఏ tenseల్లో వాడతారు?
– *ఎం. ఆంజనేయులు, కె. నాగేశ్వరరావు, మొలగవల్లి*

**జవాబు:** స్పోకెన్ ఇంగ్లిష్ గత Lessons లో have been, has been, have, has ఉపయోగాలు వివరించాం. చూడండి.




# We shall be disappointed





M. SURESAN

**Prasad:** Pranav, When shall I see you again?
(ప్రణవ్, మళ్లీ నిన్నెప్పుడు కలుసుకోను? )

**Pranav:** Will you meet me tomorrow at 4?
(రేపు నాలుగింటికి కలుసుకుంటావా? )

**Prasad:** Where shall I meet you ?
(ఎక్కడ కలుసుకోను? )

**Pranav:** Will you come to LB Park? I will meet you there.
(LB Park కు వస్తావా ? అక్కడ నిన్ను నేను కలుసుకుంటాను.)

**Prasad:** Will Pratap come with you too
(ప్రతాప్ కూడా నీతో వస్తాడా? )

**Pranav :** Of course, will you bring along your friends too?
(వస్తాడు, మీ friends ను కూడా తీసుకొస్తావా)
(bring along = తీసుకురావడం)

I shall be happy to meet them.
(వాళ్లను కలుసుకోవడం నాకిష్టం).
Will they come? Will your sister come too?
(వాళ్లు వస్తారా? మీ sister కూడా వస్తున్నారా)

**Prasad:** Of course. I'll (I will) bring them along.
(తప్పకుండా, వాళ్లను నేను తీసుకువస్తా).

పై సంభాషణలో గమనించారు కదా Questionsలో shall and will వాడకం. Questionsలో ఎప్పుడూ I/Weతో shall; you, he, she, it and they తో will మాత్రమే వస్తాయి. (అంటే I/ We తో will గానీ, you, he, she, it and they తో shall గానీ రావు).

**eg: a)** When shall I see you?
**b)** Will you meet me?
**c)** Where shall I meet you?
**d)** Will you come?
**e)** Will Pratap (he) come?
**f)** Will they come?
**g)** Will your sister (she) come?

☛ సామాన్యంగా భావాలు, మనోస్థితిని తెలిపేటప్పుడు I / We తో shall; you, he, she, it and they తో will వాడతాం.

**Dad:** Sumanth, this time I expect you to score better than last time.
(ఈసారి ఇంతకుముందుకంటే ఎక్కువ మార్కులు స్కోర్ చేస్తావనుకుంటున్నా)

**Sumanth:** Sure, dad. I will do my best to get 100%
(తప్పకుండా. వందశాతం మార్కులు వచ్చేందుకు నా శాయశక్తులా కృషిచేస్తా.)

**Dad:** I shall be happy to see you get it.
(నువ్వలా తెచ్చుకుంటే సంతోషమే)

**Sumanth:** Why you alone dad? Mother (she) will be happy too.
(మీరొక్కరేకాదు నాన్నగారూ, అమ్మ కూడా సంతోషపడుతుంది)

**Dad:** We (your mother and I) shall be disappointed if you don't get a seat in medicine.
(నీకు medicine లో seat రాకపోతే మేం నిరాశపడతాం)

**Sumanth:** My teachers (they) will be sad too if I don't make it to medicine .
(నేను medicineలో చేరలేకపోతే మా teachers కూడా బాధపడతారు)

**Dad:** You will be happy to know that I am going to buy a bike for you.
(నీకొక bike కొంటున్నానని తెలిస్తే నువ్వు సంతోషపడతావు)

**Sumanth:** Really, dad? I shall be grateful to you for this.
(నిజంగానా? నేను చాలా కృతజ్ఞుడిని)

పైన చూడండి: Happy, sad, disappointed, grateful - ఇలాంటి feelings వ్యక్తపరచాలంటే, I/Weతో shall; you, he, she, it, and, they తో will వాడతాం. (అంటే I/We తో Will గానీ, you, he, she, it and they తో shall గానీ, భావాలు, అనుభూతులు, మనోస్థితులు చెప్పటానికి వాడం)

**కింది పట్టిక చూడండి:**

(will and shall ఉపయోగాలు ఇంకా కొన్ని ఉన్నాయి. ముఖ్యంగా formal, informal spoken English లో ముఖ్యమైనవి. అవి తర్వాత తెలుసుకుందాం.)

| Subjects | Shall | Will |
|---|---|---|
| I, We | 1. Indefinite future (అనిశ్చిత భవిష్యత్తు)<br>2. Feelings & emotions (భావాలూ, అనుభూతులు, మనోస్థితులు)<br>3. Questions (ప్రశ్నలు) | 1. Determination (నిర్ణయం)<br>2. Intention (ఉద్దేశం)<br>3. Promise (మాట ఇవ్వడం) |
| You, he, she, it and they<br><br>Speaker (మాట్లాడేవారు ఇచ్చే) | 1. Definite happens (కచ్చితంగా అవుతుందనుకునే విషయాలు)<br>2. Orders & Commands (ఆజ్ఞలు)<br>3. Warnings (హెచ్చరికలు)<br>4. Assurances (హామీలు)<br>5. Promises (మాట ఇవ్వడం) | 1. Indefinite future (అనిశ్చిత భవిష్యత్తు)<br>2. Feelings & emotions (భావాలూ, అనుభూతులు మనోస్థితులు)<br>3. Questions (ప్రశ్నలు) |

ఇప్పుడు కిందివాటిని English లో practice చేయండి. వీలైనంతవరకు shall/ will వాడండి.

**1) Anjali:** సాయంత్రం సినిమాకు వెళదామా?
**Ankita:** అయితే నా assignment ఎప్పుడు complete చేయను నేను?
**Anjali:** నువ్వు వస్తావా? రావా?
**Ankita:** అయితే నా assignment complete చేయటానికి నువ్వు సాయపడతావా?
**Anjali:** తప్పకుండా. నీకు నా సాయం ఉంటుంది. (you తో begin చేయండి) నన్నేం చేయమంటావో చెప్పు.
**Ankita:** నువ్వుఈ బొమ్మలు గీయాలి. గీస్తావా? (you వాడండి. బొమ్మ గీయడం = draw)
**Anjali:** ఎప్పుడు గీయను?
**Ankita:** మనం 12 గంటలకు ప్రారంభిద్దామా?
**Anjali:** అయితే lunch ఎప్పుడు చేద్దాం?
**Ankita:** మామూలుగా నీ lunch ఎప్పుడు? మధ్యాహ్నం 2 అయితే మరీ late అవుతుందా? (మరీ late = too late )

**2) Sukumar:** ఇంకో రెండు రోజులుండవా ఇక్కడ?
**Sunil:** ఏం చేస్తానిక్కడ రెండు రోజులు?
**Sukumar:** ఇక్కడి వింతలు చూస్తాం. (ఓ ప్రదేశంలో వింతలు, దృశ్యాలూ చూడటం = sight seeing, go sight-seeing అని కూడా అంటారు.)
**Sunil:** నాకన్నీ ఇప్పటికే చూపించావు కదా!
**Sukumar:** నువ్వు చూడాల్సినవింకా రెండు మూడు ప్రదేశాలున్నాయి. అక్కడికి వెళదాం.
**Sunil:** ఒకరోజు చాలదా?
**Sukumar:** అయితే ఇంకోరోజన్నా ఉంటావా?

**3) Bhanu:** నేను రేపిక్కడ ఎప్పుడుండను?
**Bhaskar:** నువ్వు రేపిక్కడ పదింటికల్లా ఉండాలి. late అవకూడదు.
**Bhanu:** 10 మరీ ముందర కాదా?
**Bhaskar:** Meeting పదకొండింటికల్లా begin కావాలి. దానికి arrangements అంతా బాలు, బాబు చేయాలి. నువ్వు వాళ్లను supervise చేయాలి.

**Answers:**

**1) Anjali:** Shall we go to a movie this evening?
**Ankita:** When shall I complete my assignment?
**Anjali:** Will you come, or won't you?
**Ankita:** Then will you help me to complete my assignment?
**Anjali:** Certainly, you shall have my help. What do you want me to do? / What shall I do for you?
**Ankita:** You shall draw these pictures. Will you?
**Anjali:** When shall I draw them?
**Ankita:** Shall we begin at 12 noon?
**Anjali:** When shall we have lunch, then?
**Ankita:** When is your lunch, usually? will 2 O' clock be too late for you?

**2) Sukumar:** Won't you (will you not) stay here for another two days?
**Sunil:** What shall I do here for two more days?
**Sukumar:** We shall/ will go sightseeing here.
**Sunil:** You have already shown me all the sights here.
**Sukumar:** There are still two or three more places to be seen. We shall go there.
**Sunil:** Won't one day (will not one day) be enough?
**Sukumar:** Will you then stay here for atleast oneday?

**3) Bhanu:** When shall I be here tomorrow?
**Bhaskar:** You shall be here at 10. You shall not be late.
**Bhanu:** Won't 10 be (will not 10 be) too early?
**Bhaskar:** The meeting shall begin at 11 AM Sharp. (Sharp= కరెక్ట్‌గా) Balu and Babu shall make all arrangements. You shall supervise them.



**ప్రశ్న:** 1) All the glitters is not gold అంటున్నారు. నిజానికి All the glitters are not gold అనాలి కదా?
2) Sweet are the uses of adversity. దీనిలో Sweet is the uses of adversity అని ఉండాలి కదా.
3) Taking a stick, he beat the dog.
Having taken a stick he beat the dog.
పై రెండు వాక్యాలకు తేడా ఏమిటి?
4) పౌరోహిత్యం అనే వృత్తిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?
5) He has been appointed by DEO
He is appointed by DEO
ఈ రెండు వాక్యాలకు తేడా ఏమిటో చెప్పగలరు.

– వి.ఎస్.రావు, పిఠాపురం

**జవాబు:**
1) మనం sentenceలో వాడే verb subject ను బట్టి కదా ఉంటుంది? Sentence No.1 లో 'all' అంటే everything, every one of - ప్రతిదీ అనే అర్థం కదా? Everyone, subject అయినప్పుడు అది singular కదా. అందుకని verb కూడా singular గా ఉండాలి. అందువల్ల All that glitters is not gold లో is కరెక్ట్.

2) Sweet are the uses of the adversity- ఈ sentence కరెక్ట్. Word orderలో 'The uses of adversity are sweet' అవుతుంది. (Sweet are these fruits అని poetic గా కవిత్వంలో అంటాం. మామూలు prose order/ conversation లో అయితే, These fruits are sweet అంటాం కదా). అలాగే The uses of adversities are sweet అన్నప్పుడు subject ఏది? The uses కదా? అది plural, అందుకని verb are.

3) Taking a stick, he beat the dog - కర్ర తీసుకొని కుక్కను కొట్టాడు అని. Having taken a stick, he beat the dog అంటే అర్థం- కర్రపుచ్చుకున్న తర్వాత కూడా, కుక్కను కొట్టాడు- అంటే ఈ sentence అంత కరెక్ట్ కాదు. సరైన అర్థం రాదు (పోల్చండి: Having gone to Hyderabad, he could not meet the CM. హైదరాబాద్ వెళ్లి కూడా CMను చూడలేకపోయాడు).

4) 'పౌరోహిత్యం' అనే మాటకు priesthood అనవచ్చు అయితే పౌరోహిత్యం, priesthood పూర్తిగా ఒకే అర్థాన్ని ఇవ్వవు. పౌరోహిత్యం బాధ్యతలూ, priesthood బాధ్యతలూ ఒకటి కావు కాబట్టి.

5)a) He has been appointed by the DEO- DEO చేత అతను నియమించబడ్డాడు- అంటే DEO అతడిని appoint చేయడం అయిపోయింది. ఇక్కడ has been appointed జరిగిపోయిన పనిని తెలియజేస్తుంది.

b) He is appointed by the DEO- ఇక్కడ verb, 'is appointed' - ఇది regular action, passive voice లో - అతడిని (అంటే ఆ Job లో పనిచేసే అతడిని) DEO appoint చేస్తాడు. మామూలుగా అని /ఎప్పుడు అని. (పోల్చండి: A lecturer is appointed by the committee అంటే lecturer ను committee వాళ్లు appoint చేస్తారు- మామూలుగా అని/ఎప్పుడూ అని.




# A, An రావాల్సిందే!

**Namitha:** Hi Namrata, What brings you here?
(హాయ్ నమ్రతా, ఏంటి ఇలా వచ్చావ్)
ఇది పలకరింపు- మీ conversationలో వాడండి

**Namratha:** I want a book from you, and advice from your father
(నాకు నీ దగ్గరనుంచి ఓ పుస్తకం కావాలి. మీ నాన్నగారి సలహా కావాలి)

**Namitha:** What book?

**Namratha:** The book, 'How to face Interviews'. I am attending an interview the day after.
(How to face Interviews అనే పుస్తకం కావాలి నాకు. ఎల్లుండి నేనో Interview attend అవ్వాలి)

**Namitha:** And what do you want my dad's advice?
(మా నాన్నగారి సలహా ఎందుకు? )

**Namratha:** I have got interview calls for admission in MBA in two colleges- Potti Sreeramulu College, and Prakasam School of Management. I want to know from your dad which is the better
(MBA లో చేరడానికి నాకు రెండు colleges నుంచి interview letters వచ్చాయి. ఏది మంచిదో మీ నాన్నగారిని అడిగి తెలుసుకుందామని).

**Namitha:** Congrats. All the best. But my dad is out on business. He's (=He has) gone out to call on a friend.
(మా నాన్నగారు పనిమీద బయటకు వెళ్ళారు, ఆయన friend ను కలవడానికి).
(call on= ఒక వ్యక్తిని కలవటం- The PM called on the President yesterday).

**Namratha:** When will he be back?
(ఎప్పుడు తిరిగొస్తారు? )

**Namitha:** In an hour perhaps.
(బహుశ ఓ గంటకు)

**Namratha:** I have work at home. Will he be at home this evening?
(నాకింట్లో పనుంది. సాయంత్రం ఆయన ఇంట్లో ఉంటారా? )

**Namitha:** He has a meeting to attend.
(ఆయనకు meeting ఉంది).

**Namratha:** Then I will see him tomorrow morning
(అయితే నేనాయన్ని రేపు ఉదయం కలుస్తా).

పై సంభాషణలో underlined words చూశారు కదా? వాటిల్లో కొన్నింటిముందు 'a' or 'an' ఉన్నాయి. మరికొన్నింటిముందు లేవుకదా.

| a/an ఉన్నవి | a/an లేనివి |
|---|---|
| a book | advice |
| an interview | business |
| a friend | work |
| an hour | |
| a meeting | |

ఇక్కడ a/an వాడిన మాటలు- book, interview, friends, hour, meeting- వీటిని countables అంటాం. అంటే మనం ఒకటి, రెండు, మూడు, 10, 20 అని లెక్కపెట్టగలిగినవి.

book - one book, three books etc.
friend - one friend, two friends etc.
hour - one hour, three hours etc.
meeting - one meeting, two meetings, etc. పైవన్నీ countables.

ఇక uncountables. అంటే లెక్కపెట్టలేనివి.

**eg:** Water - one water, two waters - అనం కదా. అలాగే, sugar, rice, milk, etc. ఇవన్నీ మనం numbers లో చెప్పం. కాబట్టి ఇవి uncountables.




కిందివాటిని చాలా జాగ్రత్తగా follow అవండి.

1) Englishలో countables కు మాత్రమే plurals ఉంటాయి.
(ఒకటి మాత్రమే అయితే - singular, ఒకటి కంటే ఎక్కువ అయితే plural)

| Singular | Plural |
|---|---|
| book | books |
| pen | pens |
| man | men |
| child | children |
| sheep (గొర్రె) | sheep (గొర్రెలు) |

2) uncountables -లెక్కపెట్టలేనివి. వీటికి plural ఉండదు.
(milks, golds, silvers అనం కదా. అంటే milk, gold, silver ఇవి uncountables కాబట్టి వీటికి plural ఉండదు.

3) **Very very important:** Englishలో countable singular ఎక్కడ వాడినా దానిముందు కచ్చితంగా 'a' కానీ 'an' కానీ రావాలి.

a) A cow (cow - countable singular) gives milk (ఆవు పాలు ఇస్తుంది)

b) An umbrella (umbrella- countable singular) is in that corner ( ఆ మూల ఓ గొడుగు ఉంది)

c) A watch (watch - countable singular) shows the time
(Watch Time ను చూపిస్తుంది)
చూశారా, ఎక్కడ Countable singular వచ్చినా దానిముందు తప్పక 'a' 'an' రావలసిందే. రాకపోతే తప్పు.

d) A doctor treats patients
(డాక్టర్ రోగులకు వైద్యం చేస్తాడు Treat - వైద్యం చేయడం Treatment - వైద్యం)

A / an అంటే తెలుగులో 'ఒక' అని కదా అర్థం. అయితే English లో A / an వాడిన చోటల్లా తెలుగులో వాడం కదా. English లో A cow gives milk అంటేనే కరెక్ట్.

దాన్నే తెలుగులో మనం, 'ఆవుపాలిస్తుంది' అంటాం కానీ, 'ఒక ఆవు పాలిస్తుంది' అనం కదా. అలా అంటే మిగతా ఆవులివ్వవనా?

'గొడుగు వర్షంలో ఉపయోగపడుతుంది' అంటాం కానీ, ఒక గొడుగు వర్షంలో ఉపయోగపడుతుంది అనం కదా. మనం English మాట్లాడేటప్పుడు Countable Singulars కు ముందు a / an omit చేస్తుంటాం. ఇది సరికాదు.

మళ్ళీ గుర్తుంచుకోండి. English లో Countable Singulars కు ముందు a / an వాడతాం. వాడాలి. వాడకపోతే తప్పు

4) 'A' ఎప్పుడు? 'An' ఎప్పుడు?
ఇంతకుముందు Lesson లో వివరించినట్లుగా అ, ఆ ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ శబ్దాలతో ప్రారంభం అయ్యే English మాటలముందు 'An' వాడతాం. మిగతా శబ్దాలతో ప్రారంభం అయ్యే మాటల ముందు 'a' వాడతాం. ఇంకా Ant (ఇక్కడ 'a' సూచించే శబ్దం ముందు కూడా 'an')

a) An Ant, An abode (అ);
an arm, an egg(ఎ);
An Indian (ఇం);
An ox, an idea (ఐ) etc.
an honour (ఆ);
an hour (అ) etc

b) a Tree, a Book etc
University - (యూ) - కాబట్టి a University
European - (యూ) కాబట్టి a European

M. SURESAN

ఇంకో విషయం: A వాడాలా, An వాడాలా అనేది Countable Singular ముందు వచ్చే మాటను బట్టి కూడా ఉంటుంది.

**eg:** a question - an important question
a story - an uninteresting story
an idea - a useless idea
a boy - an honest boy

5) Uncountables ముందు A/an ఎప్పుడూ వాడం.
a Water, a milk అనం కదా!

మనం అర్థం చేసుకొని English మాట్లాడేటప్పుడు గుర్తుంచుకోవాల్సిన విషయాలు:

a) countables కు మాత్రమే singular, plural ఉంటాయి
b) countable singular ముందు A/ an రావాల్సిందే
c) Uncountables కు Plural ఉండదు
d) Uncountable కు ముందు A/ an రాదు.
అంటే మనం అర్థం చేసుకోవాల్సిన important points:

ఒక మాట Uncountable అయితే, దానికి plural ఉండదు, దానిముందు A/ an రాదు.

(Dictionary లో వెతుకుతున్న మాట పక్కన (C) కానీ, (U) కానీ ఉంటుంది. (C) అంటే countable, (U) అంటే uncountable. దాన్నిబట్టి మనం నిర్ణయించుకోవాలి. ఆ మాటముందు 'A/ an' వస్తుందా, రాదా అని)

కింది వాక్యాలను Englishలో practice చేయండి.

**eg:**
**Ram:** Fan ఏం చేస్తుంది?
(What does a fan do?)
**Ramana:** గాలినిస్తుంది.
(It gives air)
**Ram:** అయితే ఇక్కడొక fan పెట్టండి.
(Please fix a fan here).

**1. Suman:** నేనో మంచి doctor ను చూడాలనుకొంటున్నాను.
**Suresh:** ఇక్కడొక మంచి doctor నాకు తెలుసు.
**Suman:** బాగా ఎక్కువ fees తీసుకుంటాడా?
(fees లాంటివి తీసుకోవడం = charge)
**Suresh:** అవును ఎక్కువే తీసుకుంటాడు.
**Suman:** ఎంత తీసుకుంటాడు?
**Suresh:** వందరూపాయలు మొదటిసారి.
**Suman:** చాలు. నేను బాగానే ఉన్నా. నాకు doctor అవసరం లేదు.

**2. Anil:** మీ ఇంట్లో TV ఉందా?
**Amar:** అదేం ప్రశ్న? ఈ రోజుల్లో TV లేని ఇల్లంటూ ఉందా?
(ఈ రోజుల్లో - nowadays)
**Anil:** ప్రజలందరికీ TV ఉంటుందంటావా?
(... you mean వాడండి)
**Amar:** నా ఉద్దేశం అదికాదు. మధ్యతరగతి వాళ్లందరికి TV ఉంటుంది.

**3. Kumar:** ఇక్కడికి దగ్గరలో ఏదైనా school ఉందా?
**Karim:** ఇక్కడ రెండు schools ఉన్నాయి.
**Kumar:** మా అబ్బాయి కోసం ఓ మంచి school కావాలి.
**Karim:** రెండు schools కూడా మంచివే.
**Kumar:** మీరు ఏ school suggest (సూచించడం) చేస్తారు?

## Answers:

**1. Suman:** I want to see a good doctor.
**Suresh:** I know a good doctor (around) here.
(here అని అనడం కరెక్టే. Around here అంటే ఇక్కడికి దగ్గరలో - ఇది conversational. సంభాషణల్లో వాడండి.)
**Suman:** Does he charge high?/ Does he charge a high fee?/ Does he charge high fees?/ Are his fees high?/ Is his fee high?/ Is he expensive?
**Suresh:** Yes. He does.
(He charges high)
**Suman:** How much does he charge?
**Suresh:** A hundred rupees the first time.
(hundred, thousand, lakh, crore, million, etc - ఇవన్నీ కూడా countable singulars. కాబట్టి వీటిముందు తప్పకుండా 'a' రావాలి.
132 = A hundred and thirty two.
1500= A thousand and five hundred. అయితే bank notes లో మాత్రం 'A' బదులు one రాస్తాం)
**Suman:** OK. That's enough. I am all right. I don't need a doctor now/ any more.

**2) Anil:** Have you a TV at home?
**Amar:** What a question! Is there a home without a TV nowadays?
**Anil:** Do you mean that all people have TVs?
(Do you mean, - ఇది వాడటం practice చేయండి. అర్థం- నీ ఉద్దేశమా? / అర్థమా? అని. What do you mean? - నీ అర్థం, నీ ఉద్దేశం ఏమిటి? )
**Amar:** I do not mean that. All middle class people have TVs.

**3) Kumar:** Is there a school near/ around here?
**Karim:** There are two schools.
**Kumar:** I want a good school for my son?
**Karim:** Both the schools are equally good.
**Kumar:** Which school do you suggest?

---

**ప్రశ్న:** Weak verbs, Strong verbs అంటే ఏమిటి? వీటిని నేర్చుకోవడం తప్పనిసరా? ఉపయోగాలను ఉదాహరణలతో వివరించగలరు.
– కావ్య, అనూష్య, హన్మకొండ

**జవాబు:** '-ed', '-d', '-t' చేర్చడం వల్ల past tense, past participle ఏర్పడే verbsను weak verbs అంటాం. వీటినే Regular verbs అని కూడా అంటాం.

eg: Present - Past - Past Participle
1. talk - talked - talked
2. love - loved - loved
3. smell - smelt - smelt

తెలిసింది కదా పై verbsలాంటి verbs అన్నింటిని అంటే '-ed', '-d' or '-t' చేర్చడం ద్వారా past tense, past participle form అయితే అవి weak/ regular verbs.

Strong verbsను irregular verbs అని కూడా అంటారు. ఇవి past tense, past participle, weak verbs లాగా కాకుండా, verb formలోనే మార్పుతో ఏర్పడతాయి.

eg: Present - Past - Past Participle
1. Sing - sang - sung
2. Know - knew - known
3. do - did - done

ఇలాంటి verbs strong verbs.




# a lot of.. some





M. SURESAN

(ఇంతవరకు మనం తెలుసుకుంది: Countable Singulars కు ముందు A/ an వాడతాం. Uncountablesకు plural ఉండదు. వాటిముందు A/an రాదు).

**Gowtham:** Hi Gowri, What news?

**Gowri:** Certainly I have news for you (నీకో వార్త చెప్పాలి)

**Gowtham:** Out with it please (అయితే చెప్పు)

Out with it. అదేదో చెప్పేయ్. ఇది మీ conversations లో practice చేయండి

**Gowri:** I have information. Tomorrow's exam has been put off until next Thursday)

(రేపటి exam వచ్చే గురువారం వరకు వాయిదా పడినట్లు నాకు సమాచారం అందింది)

Put off = వాయిదా వేయడం.

**Gowtham:** That's good news. Thank you (అది మంచి వార్త).

**Gowri:** That's from the horse's mouth, you know

[అది (ఈ వార్త) అసలువాళ్ల దగ్గరనుంచి వచ్చింది. Horse's mouth = సమాచారంలాంటిది చెప్పగలిగిన వాళ్లు చెప్తే. Municipal polls date ముఖ్యమంత్రి ప్రకటిస్తే అది, from the horse's mouth; collegeకి సెలవు Principal ప్రకటిస్తే అది from horse's mouth].

**Gowtham:** OK. I have work. I am off. (సరే నాకు పనుంది. నేవెస్తా.)

I'm (I am) off= నేవెళ్తున్నా.

Conversationలో వాడండి.

ఇక్కడ చూశారు కదా. news, information, work ముందు A/ An లేకపోవడం, అంటే news, information, workలాంటివి Englishలో uncountables. అంటే వీటికి plurals ఉండవు. వీటిముందు A/ An రాదు.

కాస్త ఆలోచించండి: తెలుగులో మనం పై వాటిని countablesగా వాడతాం కదా- news (వార్త/ వార్తలు) information (సమాచారాలు అంటుంటాం); work (పని/ పనులు). గుర్తుంచుకోండి. News, information, work- uncountables. వాటిముందు A/ An వాడకండి. వాటికి plurals వాడకండి. ఇలాగే ఇంకొన్ని uncountables... advice, bread, business, furniture, luggage, paper, soap.

News, information, workతోపాటు ఇవన్నీ కూడా uncountables- అంటే వాటిముందు A/ An రాదు. వీటికి pluralsలేవు. మరి conversationsలో వీటిని uncountablesగా వాడడం అలవాటు చేసుకోవాలి.

a) నీకో శుభవార్త = good news for you/ I have good news for you (A good news/ I have a good news for you కాదు)

b) ఆ letterలో చాల ముఖ్యమైన సమాచారం ఉంది. = The letters has important information. (... has an important information కాదు)

c) నాకు ముఖ్యమైన పని ఉంది = I have urgent work. (I have an urgent work కాదు).

కిందివాటిని Englishలో practice చేయండి.

**1) Purnima :** నాకు సలహా కావాలి.

**Preethi :** దేని గురించి?

**Purnima:** నేనో వ్యాపారం చేయాలనుకుంటున్నా.

**Preethi:** ఏం వ్యాపారం?

**2) Krishna:** నాకు స్నానం చేయాలని ఉంది. సబ్బు కావాలి.

**Kesav:** నువ్వు బయటకు వెళుతున్నావా?

**Krishna:** అవును. నీకేమన్నా కావాలా?

**Kesav:** పేపర్ కావాలి. ఒక దస్తా (Quire)

**Krishna:** తెస్తాలే.

**3) Brahmam:** ఆ ముసలావిడ చాలా సామగ్రి తీసుకెళుతోంది. ఆవిడకు సాయం చేద్దాం పద.

**Vishnu:** OK త్వరగా పోదాం పద. అవతల నాకు urgent పనులు రెండు మూడు ఉన్నాయి.

**ANSWERS:**

**1) Purnima:** I want/ need advice (an adviceకాదు).

**Preethi:** What about? (దేని గురించి, దేని విషయం? )

'What about' కూడా spoken Englishలో ఉపయోగపడే expression. అలవాటు చేసుకోండి.

**Purnima:** I want to do business (a business కాదు).

**Preethi:** What business?

**2) Krishna:** I want to have a bath/ I feel like having a bath. I want soap. (a soap కాదు కదా? )

**Kesav:** Are you going out?

**Krishna:** Yes, Do you want anything?

**Kesav:** I want paper. A Quire (Papers అనం కదా? )

**Krishna:** I'll (= I will) get it.

**3) Brahmam:** That old woman is carrying a lot of luggage. Let us help her.

(a Luggage/ many luggages లేవు).

**Vishnu:** OK. Let's hurry up. I have two or three urgent jobs attend to.

(a work/ works వాడం కదా? )

గమనించారు కదా. పైవాటికి వేటికీ Plural రాలేదు. A/ An వాడలేదు. ఎందుకంటే English usageలో అవన్నీ కూడా uncountables.

Uncountables లో ఇంకోటి- hair (జుట్టు). hairs అనే పదం (వెంట్రుకలు అనే అర్థంతో) English లో లేదు

ఆమెకు మంచి జుట్టు ఉంది.

She has fine dark / luxuriant hair.

ఆమె జుట్టు నల్లగా పొడుగ్గా నునుపుగా ఉంటుంది.

She has black smooth hair.

(A Hair/ Hairs అనం)

ఇప్పటివరకు కొన్ని Uncountables చూశాంకదా. వాటిలో కొన్నింటికి కొంత Specific గా (ఇన్ని అని) చెప్పే అవకాశాలున్నాయి.

**a) Advice.** a piece of advice అనవచ్చు. A few pieces of advice అనికూడా అనవచ్చు.

**Eg: 1)** Let me give you advice/ Let me give you a piece of advice.

**2)** I want a piece of advice from you.

**3)** He had two or three pieces of advice for students in his speech.

**b) bread.** ఇది ఎప్పుడూ Uncountable. అంటే 'breads' అని plural లేదు. మనం bakery లో కొనేది. loaf of bread. (A loaf of bread or three loaves of bread. milk లాగా - a litre/ 2 or 3 litres of milk) bread ను slices లో తింటాం

**Govind:** What did you have for break-fast? (Break Fast ఏం తిన్నావు)

**Gopal:** I had two slices of bread and omlet

**c) Business** - రెండుఅర్థాలు- 1) పని 2) వ్యాపారం, రెండు అర్థాల్లోనూ Business uncountable. (అంటే A business/ businesses లేదు)

**Seenu:** Hi, long since we met. what are you and where are you? (హాయ్ శీను, చూసి చాలాకాలమయింది. ఏం చేస్తున్నావు (ఉద్యోగం)? ఎక్కడ ఉన్నావు? )

**Srikanth:** I am doing business (వ్యాపారం చేస్తున్నా)

**Seenu:** What Business? (ఏం వ్యాపారం? )

**Srikanth:** I have two or three lines (రెండు మూడు వ్యాపారాలు అంటే Business ను సంఖ్యగా చెప్పాలంటే, lines of business అంటాం. అంతేకానీ Businesses అనం)

Tatas కు చాలా వ్యాపారాలున్నాయి.

The Tatas have a number of lines of business.

మీదేం వ్యాపారం?

= What's your business? what is your line?

అయితే business కు shop/ company అనే అర్థం కూడా ఉంది. అప్పుడది countable.

**a)** అతడికి stationary shop ఉంది.

He has a stationary business.

**b)** వాళ్లకు బట్టల కంపెనీ ఉంది.

They have a cloth business.

(**very important:** పైన చెప్పినవన్నీ spoken Englishలో ముఖ్యమైన అంతర్భాగాలు. పై మాటలను వాడే తీరునుబట్టి మనకు Englishవచ్చా రాదా అనేది తేల్చవచ్చు).

పైన చెప్పిన uncountable అన్నింటికీ, బాగా ఎక్కువగా అని చెప్పడానికి a lot of, కొంత అనడానికి some అనవచ్చు.

A lot of/ some advice, bread, business, information, news etc.

Now practice the following conversation in English:

**a) Sandhya:** నీ జుట్టు ఎంత అందంగా ఉందో! నాకు చాలా ఈర్ష్యగా ఉంది. (ఈర్ష్యపడడం=envy)

**Swathi:** నేను soap వాడను. 'Darksilk' shampoo వాడతాను. అది నాకు మంచి జుట్టు పెరగడానికి సాయపడుతుంది.

**Sandhya:** నేను అన్ని సబ్బులూ వాడి చూశాను. ఫలితం లేదు.

**Swathi:** సబ్బులు దండగ

**b) Pramod:** Hi Prasanth, వార్తలేమయినా ఉన్నాయా?

**Prasanth:** నేను వ్యాపారం ప్రారంభించబోతున్నాను.

**Pramod:** ఏం వ్యాపారం? (Line వాడండి)

**Prasanth:** ఇంకా ఏ వ్యాపారమో నిర్ణయించుకోలేదు.

**C) Vikram:** Breakfast ఏం తీసుకున్నావు?

**Vikranth:** బ్రెడ్, గుడ్లు

**Vikram:** బ్రెడ్ ఎంత తీసుకున్నావు?

**Vikranth:** రెండు slices, జాం.

## Advice, advise .. ఏది కరెక్ట్?

Advice, advise లో ఏది కరెక్ట్ అనే ప్రశ్న చాలామంది అడుగుతున్నారు.
Advice అంటే సలహా. He gives advice - ఆయన మంచి సలహా ఇస్తారు.
Her advice is always good - ఆమె సలహా ఎప్పుడూ బాగుంటుంది.
Advise= అంటే సలహా ఇవ్వడం - ఇది verb
విశ్రాంతి తీసుకోవాలని నేను నీకు సలహా ఇస్తున్నాను= I advise you to take rest.
డాక్టర్లు ఆమెను విశ్రాంతి తీసుకోవాల్సిందిగా సలహా ఇస్తున్నారు = Doctors advise her to take rest.
దీనికి English చెప్పండి: నేను ఎవరికీ సలహా ఇవ్వను
**Ans:** a) I don't give advice to anybody b) I don't advise anybody
పై రెండింటిని పోల్చండి మొదటి వాక్యం a) లో advice= సలహా
రెండో వాక్యం b) లో advise = సలహా ఇవ్వడం.
**Advise:** present tense - advise; past tense and past participle = advised.
He, She it subjects తో advises.




**ప్రశ్న:** Princess అనే పదానికి Apostrophe 's' ని చేర్చాలంటే ఏ విధంగా రాయాలి? Princess's ring అని రాయవచ్చా? గ్రామర్ రూల్స్‌ని వివరంగా తెలియజేయగలరు.

– ఎం.అనిరుధ్, అశ్వాపురం, ఖమ్మం జిల్లా.

**జవాబు:** Princessకి Apostrophe s = Princess's. Princess's ring కరెక్టే. ఇంతకుముందు lessonలో తెలిపాం. 'యొక్క' అనే అర్థంతో Apostrophe s ప్రాణం ఉన్న వాటికి, భావాలకు మాత్రమే వాడతాం. ప్రాణంలేని అచేతనమైన వాటికి వాడం. వాటిముందు of పెడతాం. Eg: The Pages of the book.




# a piece of/ pieces..

**Vinod:** When did you get the letter? What's the news?
(లెటర్ ఎపుడొచ్చింది? ఏంటి సంగతులు?)

**Vijai:** Important news. My uncle is moving into his new home by the month end. He has given me an important job to do.
(ముఖ్యమైన వార్తే. మా బాబాయి ఈ నెలాఖరికి కొత్త ఇంటికి మారుతున్నాడు. నాకో ముఖ్యమైన పని అప్పజెప్పాడు.)

**Vinod:** What is it? (ఏంటది?)

**Vijai:** I have to buy furniture here and send it to him.
(ఇక్కడ ఫర్నీచర్ కొని ఆయనకు పంపించాలి.)

**Vinod:** How much?
(ఎంత? - furniture uncountable)

**Vijai:** It's a tall order. At least 8 to 9 items.
(చాలా ఎక్కువే. కనీసం ఎనిమిది, తొమ్మిది వస్తువులు)

(tall order= ఎక్కువ. ఎవరైనా మనకు పురమాయించిన పని ఎక్కువే అనడానికి a tall order అంటాం. మీ conversation లో దీన్ని practice చేయండి.)

ఈ సంభాషణను గమనించండి. furniture uncountable అని ఇంతకు ముందే తెలుసుకున్నాం గదా? అయితే furniture ను specificగా సంఖ్యలో చెప్పేందుకు an item/ items of; a piece/ pieces of furniture అనవచ్చు. An item/ items of furniture అనేది shops లో, official language లో వాడతాం. మామూలు మన వాడుక భాషలో conversational గా అయితే a piece of/ pieces of furniture అంటాం.

**Customer:** I want some furniture.

**Shop keeper:** What are the items, Sir, and how many?

**Customer:** Just a few items

ఇక్కడ business language కాబట్టి item (= వస్తువు) వాడుతున్నాం.

**Ramana:** Look at that sofa there and the dining table.
(ఆ సోఫా, డైనింగ్ టేబుల్ చూడు)

**Raghav:** Yes, what about them?
(చూశాను, ఏమిటి?)

**Ramana:** Those two pieces of furniture have been with us for the past twenty years.
(ఆ రెండూ మా దగ్గర 20 ఏళ్లుగా ఉన్నాయి.)

ఈ సంభాషణ business/ official కాకుండా informal కాబట్టి అందులో a piece of / pieces of furniture అంటాం.

మొదటి సంభాషణలో Vijai ఏమన్నాడు?

He has given me an important job to do అని కదా. 'work' uncountable. అందుకని తెలుగులో లాగా పని/ పనులు అని చెప్పడానికి job/ jobs వాడవచ్చు. (Job అంటే మామూలు అర్థం ఉద్యోగం. job అంటే పని = work అనే అర్థం కూడా ఉంది. 'work' uncountable; 'job' countable.)

**Vittal:** Why are you in such a hurry?
(ఏంటంత హడావుడి?)

**Vikram:** I have two or three urgent jobs to do before 3 in the afternoon.
(నేను మధ్యాహ్నం మూడులోగా రెండు మూడు పనులు చేయాల్సి ఉంది.)

**Vittal:** I have a job to do too. Mom wants me to take her shopping.
(నాకు ఒక పని ఉంది. మా అమ్మ షాపింగ్‌కి తీసుకెళ్లమంటోంది.)

Soap కూడా uncountable. అయితే దాన్ని కూడా సంఖ్యలో చెప్పేందుకు మార్గాలున్నాయి.

**Kiran:** How much soap do you use a month?
(నెలకు మీరు ఎంత సబ్బు వాడతారు?)

**Kashyap:** Depends. In summer at least 5 to 6 cakes of soap. In winter, two or three.
(వేసవిలో అయిదారు సబ్బు బిళ్లలు, శీతాకాలం రెండుమూడు.)




అంటే మనం shop లో కొనేది.
a cake/ cakes of soap

ఇంట్లో నాకు సోప్ కావాలి అనడానికి- let me have soap/ a piece of soap/ some soap అంటాం. (pronunciation- cake = కెయ్క్)

ఇక news, information విషయం.
a piece of good/ bad news;
a piece of information/ some pieces of information వాడుకలో ఉంది.

a) He has leaked out an important piece of information.
(ముఖ్యమైన సమాచారం బయటపెట్టాడు.)

b) A piece of news is missing in this letter.
(ఈ లెటర్‌లో ఒక సమాచారం లేదు.)

**Hari:** I want paper. Have you any?
(నాకు పేపర్ కావాలి. నీ దగ్గరుందా?)

**Hemanth:** I have only two sheets.
(నా దగ్గర రెండు షీట్లు మాత్రమే ఉన్నాయి.)

**Hari:** One sheet will do for me.
(నాకు ఒక షీట్ చాలు.)

will do = చాలు. ఇది కూడా conversational. మీ spoken English లో 'చాలు' అనేందుకు వాడండి.


M. SURESAN

**Hemanth:** You waste a lot of paper.
(నువ్వు పేపర్ బాగా వృథా చేస్తావు.)

**Hari:** Let me have just one sheet. I am in a hurry
(ఆ షీట్ ఇవ్వు. నేను తొందరలో ఉన్నా.)

రాయడానికి, printing కు వాడే paper ఎప్పుడూ uncountable. అంటే ఈ అర్థంలో papers అనిగానీ, a paper అనిగానీ అనం. సంఖ్యావాచకంతో అనాలనుకుంటే- a sheet of/ sheets of paper;
a slip of/ slips of paper;
a piece of paper/ pieces of paper అంటాం.

ఇవన్నీ Spoken English లో జాగ్రత్తపడాల్సిన చిన్నచిన్న అంశాలు.

వాడు ఇప్పటికే నాలుగు కాగితాలు వృథా చేశాడు.
He has already wasted four sheets of paper.

వాడు తన అడ్రస్ ఒక కాగితం ముక్క మీద రాసిచ్చాడు.
He has written his address on a slip of paper and given it to me.

నేల చాలా శుభ్రంగా ఉంది. ఒక్క కాగితం ముక్క కూడా లేదు.
The floor is clean, not a piece of paper anywhere.

నేను నీకు వందరూపాయలిస్తున్నాను, అది చాలా?
I am giving you a hundred rupees. Will that do?
అది చాలదు. నాకు అంతకంటే ఎక్కువే కావాలి.
That will not (won't) do. I need more than that.

**Practice the following aloud in English:**

1) **Madan:** నాకు సబ్బు కావాలమ్మా? (Momవాడండి)
**Mother:** రెండ్రోజుల కిందే కొత్త సబ్బు తీసుకున్నావు. అది వాడేశావా?
**Madan:** అదయిపోయింది. ఇప్పుడు నాకు సబ్బు కావాలి.
**Mother:** సబ్బు మరీ ఎక్కువ వాడుతున్నావు. చర్మం పొడిగా అవుతుంది జాగ్రత్త!
**Madan:** నేను చాలా తక్కువ సబ్బు వాడతాను.
**Mother:** తెలుస్తూనే ఉంది. నాలుగు రోజుల్లో ఒక సబ్బు అవగొట్టేశావు.

2) **Prasanth:** నువ్వు మామూలుగా ఎన్నింటికి పడుకుంటావు? (when ... go to bed వాడండి).
**Pramod:** మామూలుగా రాత్రి 10కి. కానీ ఈ రోజు ఆలస్యం అవుతుందనుకుంటున్నా. నాకు రెండు మూడు ముఖ్యమైన పనులున్నాయి. అవి చేసిన తర్వాతే పడుకుంటా.
**Prasanth:** అయితే నేవెళ్లనా? నాకూ ఇంట్లో ముఖ్యమైన పని ఉంది? నేను కొంత పేపర్ తీసుకెళుతున్నా. ఎసైన్‌మెంట్ ఒకటి రాయాలి. ఒక నాలుగు కాగితాలు తీసుకెళుతున్నా.
**Pramod:** అవి చాలా?

**Answers:**

1) **Madan:** I want soap/ some soap, mom.
**Mother:** You took a new cake of soap just two days ago. Have you done with it?
(have done with = ఒక వస్తువును వాడేయడం - ఇది conversational. 'Have you used it up?' అనవచ్చు. కానీ అది కొంచెం bookish. వ్యావహారికంగా 'Have you used it up?' అనే దానికి spoken form- Have you done with it?/ Are you done with it.
**Madan:** Yes, mom. I am done with it. I want soap now.
**Mother:** You are using too much of soap, boy. It dries up your skin, be careful.
**Madan:** I use very little soap.
**Mother:** I know. That's why you have used up a whole cake in just four days.

2) **Prasanth:** When do you go to bed usually?
(go to bed = నిద్రకు ఉపక్రమించడం, sleep = నిద్రించడం - రెండూ ఒకటి కాదు కదా!)
**Pramod:** Usually at 10. I shall be late today. I have two or three jobs to do. I will go to bed only after finishing them.
**Prasanth:** Shall I go then? I have important work at home too. Shall I take some paper? I have an assignment to do. I am taking four sheets.
**Pramod:** Will that (they) do?




**ప్రశ్న:** 1) Suneetha is like her sister అనడం తప్పు కదా? Suneetha looks like her sister అనాలి కదా!
2) Ramu and his brother alike in appearance ఈ వాక్యం కూడా తప్పే కదా! Ramu and his brother are alike in appearance అని రాయాలి కదా?
– ఎన్. భాస్కరరావు, ఆచంట

**జవాబు:** 1) Suneetha is like her sister,
Suneetha looks like her sister - వేర్వేరు అర్థాలతో ఈ రెండూ correct.
Suneetha is like her sister.
సునీత ఆమె సిస్టర్‌లాగే ఉంది- అంటే పోలికలో, గుణాల్లో, నడవడిలో అని.
Suneetha looks like her sister.
దీనర్థం ఒక్క పోలికలో మాత్రమే (చూడడానికి).
2) Ramu and his brother are alike in their appearance కరెక్ట్. are లేకపోతే verb లేదు. కాబట్టి కరెక్ట్ కాదు.

**ప్రశ్న:** He went out an hour ago.
ఇక్కడ సమయం తెలియజేశారు కాబట్టి మీరు went ని use చేయాలని గతంలో చెప్పారు. Went (Past doing word) కాబట్టి. మరి-
She has gone out just a minute ago.
ఈ వాక్యంలోనూ సమయం తెలియజేశారు. కానీ has gone అని మీరే (Past Participle) use చేశారు. అలా చేయవచ్చా?
– ఎం. శ్రీకాంత్, హైదరాబాద్

**జవాబు:** She has gone out just a minute ago. ఇక్కడ just a minute ago అంటే ఇప్పుడే అనే అర్థం తీసుకోవాలేగానీ, టైం చెప్పినట్లు కాదు. just వాడడం వల్ల ఆ అర్థం వస్తుంది. అయితే American usage లో ఇప్పుడిప్పుడే complete అయిన పనులకు కూడా Past Doing Word (past simple) వాడతారు.
He has gone out just a minute ago.
ఇక్కడ just కు ప్రాముఖ్యం కాబట్టి has gone out- better, British usage ప్రకారం.
ఒకటిమాత్రం గుర్తుంచుకోవాలి. time చెప్పిన past actionకు ఎప్పుడూ Past Doing Word వాడడమే correct.

**ప్రశ్న:** ఇంగ్లిష్‌లో 'could'ని 'కుడ్' అని, 'mould'ని 'మౌల్డ్' అని ఎందుకు పలుకుతారు? ఇది ఇంగ్లిష్‌లో లోపమా?
– టి. సతీష్‌రెడ్డి, వికారాబాద్

**జవాబు:** English pronunciation system లో ఉన్న దోషం వల్ల ఇలాంటి సందేహాలు వస్తాయి. English లో ఒక మాట pronunciation దాని origin ను బట్టి ఉంటుంది. అంటే దాని మూలాన్నిబట్టి. అది అచ్చం English మాటా, లేకుంటే వేరే భాషనుంచి వచ్చిన మాటా అనే దాన్ని బట్టి ఉంటుంది. కాబట్టి Dictionary ని వాడి pronunciation తెలుసుకోవడం ఒకటే మార్గం. ఎందుకిలా? అనే ప్రశ్నకు సమాధానం దొరకదు.




# You were out





M. SURESAN

**Jagadeesh:** I came for you yesterday. You were out.
(నిన్న నేను నీకోసం వచ్చాను. నువ్వింట్లో లేవు)

You were out = నువ్వు ఇంట్లో లేవు.

Were you in? = నువ్వింట్లో ఉన్నావా?

చూడండి. ఈ in, out, be forms లాంటి చిన్న మాటలతోనే ఎంతో conversation నడపవచ్చు. చిన్న చిన్న సరళమైన మాటలతో spoken english మాట్లాడితేనే అది సహజంగా అనిపిస్తుంది. చిన్న మాటలకుండే అన్ని భావాలను తెలుసుకోవడం conversation కు చాలా ముఖ్యం.

**Jayanth:** I was at Sekhar's. I was playing chess with him.
(నేను శేఖర్ వాళ్లింట్లో ఉన్నాను. శేఖర్‌తో చెస్ ఆడుతున్నాను)

Sekhar's అంటే చాలు; Sekhar's home, Sekhar's place అనాల్సిన పనిలేదు

**Jagadeesh:** On my way home I saw your father and his friend. They were taking a walk.
(నేను ఇంటికెళ్లే దారిలో మీ నాన్నగారు, ఆయన స్నేహితుడ్నీ చూశాను. వాళ్లు నడుస్తున్నారు)

**Jayanth:** Why did you come for me?
(నాకోసం ఎందుకొచ్చావు? )

**Jagadeesh:** I was just going this way. I thought of seeing you. Nothing special.
(ఈ దారినే వెళ్తున్నాను. నిన్ను చూద్దామనుకున్నా. ఏ ప్రత్యేకమైన ఉద్దేశంతో కాదు)

**Jayanth:** Weren't (were not) my brother and sister at home when you called?
(నువ్వు వచ్చినప్పుడు మా brother, sister ఇంట్లో లేరా? )

call = పిలవడం, call at = ఒకచోటికి వెళ్లడం. నేను నిన్న మీ ఇంటికొచ్చా = I called at your place yesterday.

ఇది కూడా spoken english expression. practiceచేయండి.

He often calls at his uncle's =అతను తరచూ వాళ్ల uncle ఇంటికి వెళతాడు

**Jagadeesh:** They were, of course. They were watching the T.V.

**పై సంభాషణలో verbs గమనించండి.**

| Verbs | Forms |
|---|---|
| **1.** Was playing | was +...ing |
| **2.** Were taking | were+... ing |
| **3.** Was going | was+... ing |
| **4.** Were watching | were+...ing |

అంటే verbsకు verb form: was + ing / Were + ing.

Singular subjects (I, he, she, it, they)లకు was + ing వాడతాం. Plural subjects (we, you, they) అయితే were + ing అవుతుంది.

(English లో you = నువ్వు / మీరు; ఏ అర్థంలో అయినా అది plural verb తోనే వాడతాం)

Was + ing / were + ing formలో verb, past continuous tense లో ఉంటుంది.

కింది sentences చూడండి.

**a)** అతను లోపలికి వచ్చినప్పుడు నేను పుస్తకం చదువుతున్నా = I was reading a book when he came in.

**b)** మేము బయటకు వచ్చినప్పుడు ఎండగానే ఉంది = The sun was shining when we went out.

**c)** Warden లోపలికొచ్చినప్పుడు పిల్లలు (pupils) చదువుకుంటున్నారు = The pupils were studying when the Warden came in.

**d)** నిన్నంతా వర్షం కురుస్తూనే ఉంది = It was raining the whole of yesterday.

**e)** పెద్ద శబ్దం వినిపించినప్పుడు నేను భోంచేస్తున్నా = I was having my meal when I heard that noise.

గమనించండి- పై వాక్యాల్లో గతంలో జరుగుతూ ఉన్న పనులను (Continuous actions in the past-actions over a duration in the past) was + ing / were + ing formలో చెప్తాం.

పై వాటిల్లో-

a) అతను లోపలికి వచ్చినప్పుడు నేను పుస్తకం చదువుతూండడం continuing past action కాబట్టి was reading (was + ing)

b) మేము బయటకు వచ్చినప్పుడు ఎండగా ఉండడం continuing action in the past, కాబట్టి was shining (was + ing)

c) warden లోపలికొచ్చినప్పుడు పిల్లలు (pupils) చదువుతూండడం - a continuous past action - కాబట్టి were studying (were + ing)

d) వర్షం కురవడం నిన్నంతా కొనసాగుతూనే ఉంది - a continuing past action కాబట్టి - was raining (was +ing)

e) నేను భోంచేస్తుండడం a continuing past action కాబట్టి was having (was + ing)

ఇదికూడా చూడండి.

Teacher పాఠం చెప్తున్నప్పుడు పిల్లలు మాట్లాడుకుంటున్నారు

While the teacher was teaching the pupils were talking

ఈ వాక్యంలో teacher teach చేయడం, పిల్లలు మాట్లాడుతూ ఉండడం- రెండు Continuous past actions కదా! అందుకని was + ing / were + ing.

ఇటువంటిచోట్ల ఎప్పుడూ 'while' వాడతాం.

She was singing while her students were dancing
(ఆమె పాడుతున్నప్పుడు ఆమె విద్యార్థులు dance చేస్తున్నారు)

What were you doing when he knocked at the door?
(వాడు తలుపు తట్టినప్పుడు నువ్వేం చేస్తున్నావు? )

ఇక్కడ చేస్తున్నావు అనడం continuous past action కదా - కాబట్టి 'were you doing?'

The boy jumped from the bus while it was moving
(బస్సు వెళుతున్నప్పుడు వాడు దూకేశాడు)

**Now, Practice the following in English**
(సందర్భాన్ని బట్టి అన్ని verb forms వాడండి)

**a)** ఆమె బయటకు వెళుతున్నప్పుడు నేనామెను చూశాను.

**b)** వాడు చదువుకుంటుంటే ఆమె వంట చేస్తోంది.

**c) Venkat:** ఇదంతా జరిగినప్పుడు నువ్వేం చేస్తున్నావు?
**Vinai:** నేను news paper చదువుతున్నాను.
**Venkat:** Table మీదున్న watch ని గమనించలేదా?
**Vinai:** చెప్పాను కదా నేను news paper చదువుతున్నాను
**Venkat:** నువ్వు news paper చదువుతున్నప్పుడు వాడు watch దొంగిలించాడు.
(దొంగిలించడం = steal)

**d) Pradeep:** నేను చదువుకుంటునప్పుడు వాళ్లు ఆడుకుంటున్నారు.
**Pratap:** మీ అమ్మగారేం చేస్తున్నారు?
**Pradeep:** ఆమె TV చూస్తోంది.
**Pratap:** అతను వస్తున్నాడని మీకెవరికీ తెలియదా?
**Pradeep:** అతను వస్తున్నాడని తెలుసు. కానీ అతనితోపాటు డబ్బు తీసుకొస్తున్నట్లు మాకు తెలియదు.

**ANSWERS:**

**a)** I saw her when she was going out.
**b)** He was studying while she was cooking.
**c) Venkat:** What were you doing when all this happen?
**Vinai:** I was reading the newspaper.
**Venkat:** Didn't you (Did you not) observe the watch on the table?
**Vinai:** I've (I have) told you/ I told you, I was reading the newspaper.
**Venkat:** He stole the watch while you were reading the newspaper.
**d) Pradeep:** I was studying while they were playing
**Pratap:** What was your mother doing?
**Pradeep:** She was watching the TV
**Pratap:** Didn't (Did not) any of you know that he was coming?
**Pradeep:** We knew that he was coming, but we didn't know he was bringing money.

***Important:*** సామాన్యంగా ఈ కింది verbsను was + ing/ were + ing formలో వాడడం అరుదు. అంటే ఈ కింది verbs దాదాపు వాడం. Was seeing/ were seeing; was noticing/ were noticing; (వస్తువుల వాసన గురించి)was smelling/ were smelling; was believing/ were believing; was knowing/ were knowing; was understanding/ were understanding; was wanting/ were wanting; was loving/ were loving; was hating/ were hating; was containing/ were containing; was consisting/ were consisting; was possessing/ were possessing etc. వీటన్నింటి బదులు వాటివాటి past doing wordsవాడతాం.

**eg:** He loved her.
(He was loving her కాదు)
She understood his point.
(She was understanding his point కాదు) మిగతావాటికి కూడా అంతే.



**ప్రశ్న:** **1)** I am having lunch
**2)** They are having juice
**3)** She is having a bath
**4)** He is having a lesson
వీటిలో ఏవి కరెక్ట్, ఏవి కాదు. వివరించగలరు.

*– టి.వి.రమణకుమార్, జమ్మలమడుగు, కడప జిల్లా*

**జవాబు:** మీరు రాసిన మొదటి మూడు వాక్యాలలో am having lunch, are having juice, is having a bath కరెక్ట్. 'He is having a lesson' లో is having a lesson కరెక్ట్ కాదు. 'He has a lesson' అనడం better.

**ప్రశ్న:** Present perfect tense, present perfect continuous tense ల మధ్య తేడా ఏమిటి? They have been living here for 10 years, They have lived here for 10 years. తేడా వివరించగలరు.

*– రాళ్లబండి సంగంనాయుడు, జరజాపు పేట, విజయనగరం జిల్లా*

**జవాబు:** **a)** Present Perfect tense ను కొంతకాలం కింద ప్రారంభమైనప్పటివరకు జరిగిన పనులకు వాడతాం. Present Perfect Continuous Tense ను కొంతకాలం కింద ప్రారంభమై ఇంకా జరుగుతున్న పనులకు వాడతాం.

(తేడా సూక్ష్మంగా Present perfect - ఇప్పటివరకు, Present perfect continuous - ఎప్పట్నుంచో ఇంకా). అయితే వీటి రెంటికి చాలామటుకు ఎక్కువ తేడాలేదనే చెప్పవచ్చు. ఇంతకు ముందు lessonsలో వీటి గురించి చర్చించుకున్నాం.

**b)** They have been living here for 10 years - 10 ఏళ్లుగా ఇక్కడ ఉంటున్నారు - ఇప్పటికీ ఇంకా ఇక్కడే ఉన్నారు

They have lived here for 10 years - 10 ఏళ్లుగా వాళ్లు ఇక్కడ ఉన్నారు. ఇప్పటివరకూ ఉన్నారు. ఇప్పుడున్నారా, లేదా అనే విషయం ఈ Sentence చెప్పదు.




# Whose is it?




M. SURESAN

**Bharat:** You were reading a book yesterday. Whose book was that?
(నిన్న నువ్వో పుస్తకం చదువుతున్నావు. అది ఎవరి పుస్తకం?)

**Bhargav:** My book of course. I lent you a book last week. I want it back this evening. If your assignment is complete, let me have it. It is not mine.
(నా పుస్తకమే. వారంకిందట నీకో పుస్తకం ఇచ్చాను. ఈ సాయంత్రం నాకది కావాలి. దానితో నీ పని అయిపోతే ఇచ్చెయ్. అది నాది కాదు)

(Lent - Lend కు Past doing word. Lend- అరువివ్వడం)

**Bharat:** Not yours? Whose is it then?
(నీది కాదా? ఐతే మరెవరిది?)

**Bhargav:** I got it from Ramu. It is his book. This note book is his too.
(నేనది రాము దగ్గర నుంచి తీసుకున్నాను. అది అతని పుస్తకమే. ఈ note book కూడా అతనిదే)

**Bharat:** I attended your sister's dance programme the other day. It was really good. Who is her dance teacher?
(ఆరోజు మీ sister నాట్య ప్రదర్శన చూశాను. చాలా బాగుంది. ఆమె dance teacher ఎవరు?)

**Bhargav:** Our family friend Mrs. Nrityasri. The Choreography was completely hers. The Singer is also a friend of ours.
(ఆవిడ మా family friend. ఆ నృత్య దర్శకత్వం (Choreography) (Pronunciation కొరియోగ్రఫీ) కూడా ఆవిడదే. పాడినావిడ కూడా మా friend)

**Bharat:** Does Mrs. Nrityasri run a school?
(ఆమె స్కూలు నడుపుతోందా?)

run నడపడం/నిర్వహించడం

**Bhargav:** Yes, She and her husband. Their school is famous. Some of great movie dancers were students of theirs.
(అవును. ఆమె, ఆమె భర్త నడుపుతున్నారు. పేరున్న school. సినిమాల్లోని గొప్ప dancers లో కొంతమంది వాళ్ల విద్యార్థులే)

famous - ఫేమస్ = పేరున్న, ప్రసిద్ధిగల
dancers - డాన్సర్స్

పై సంభాషణలో underline చేసిన మాటలను గమనించండి.

| మాట | అర్థం |
|---|---|
| **1.** Whose (book)? | ఎవరి (పుస్తకం)? / ఎవరిది? |
| **2.** My (book) | నా (పుస్తకం) |
| **3.** Mine | నాది |
| **4.** Your (book) | మీ / నీ (పుస్తకం) |
| **5.** Yours | మీది / నీది |
| **6.** his (book) | అతడి (పుస్తకం) |
| **7.** his | అతడిది |
| **8.** her | ఆమె (యొక్క dance teacher) |
| **9.** hers | ఆమెది |
| **10.** our | మా (family friend) |
| **11.** ours | మాది |
| **12.** their | వారి, వాళ్ల |
| **13.** theirs | వారిది, వాళ్లది, వారివి, వాళ్లవి |

పై మాటలన్నీ కూడా ఒకరికి చెందినవాటిని (Possessions) తెలుపుతాయి. మన English ముఖ్యంగా spoken english simple గా, సహజంగా ఉండడానికి వీటి వాడుక తెలుసుకోవడం చాలా ముఖ్యం.

**Prakash:** Whose idea is this?
(ఇది ఎవరి idea?)

**Prasad:** My idea. Why? Is it not so good as your idea?
(నా idea. ఏం? నీ idea అంత బాగా లేదా?)

**Prakash:** It is certainly better than my idea. Only, I thought it was your dad's (his) idea.
(లేదు. నా idea కన్నా అదే బాగుంది. అయితే నేనది మీ నాన్నగారి idea అనుకున్నా)

**Prakash:** No. My mom thinks better than my dad. It is her idea.
(కాదు. మా నాన్నకంటే మా అమ్మ బాగా ఆలోచిస్తుంది. ఇది ఆమె idea)

**Prasad:** Any way, it is for our good. Their interest is our success.
(ఏదేమయినా, అది మన మంచి కోసమే. వాళ్లక్కావలసింది మన విజయమే)

**Prakash:** OK, then. When shall we begin?
(అయితే, ఎప్పుడు ప్రారంభిద్దాం?)

**Prasad:** Depends on money. Its availability is everything.
(అంతా డబ్బు మీదే ఆధారపడి ఉంది. దాని availability (లభ్యం)యే అంతా)

పై సంభాషణలోని possessives ను కింది వాటిలో చూపిన possessives తో పోల్చండి.

1. Whose? (ఎవరి?) - Whose? (ఎవరిది? / ఎవరివి?)
2. my (నా) - mine (నాది / నావి)
3. your (నీ / మీ) - yours (నీది, మీది / నీవి, మీవి)
4. his (అతడి) - his (అతడిది / అతడివి)
5. her ఆమె (యొక్క) - hers (ఆమెది / ఆమెవి)
6. our (మా / మన) - ours (మనది / మనవి, మాది / మావి)
7. their (వాళ్ల, వాటి) theirs (వాళ్లవి, వాటిది / వాళ్లవి, వాటివి)
8. its (దాని) - its (దానిది / దానివి)

**a)** ఇది ఎవరి పుస్తకం? = whose book is this?
ఇదే ఇంకోవిధంగా,
ఈ పుస్తకం ఎవరిది? = Whose is this book?

**b) I)** అది నా పుస్తకం= That is my book
**ii)** ఆ పుస్తకం నాది = That book is mine

**c) i)** ఇది నీ సలహా = This is your advice
**ii)** ఈ సలహా నీదా? = Is this advice yours?

**d) i)** ఇది ఆమె (యొక్క) చీర? = Is this her sari?
**ii)** ఈ చీర ఆమెది కాదు = This sari is not hers

**e) i)** ఆమె మా teacher = She is our teacher
**ii)** ఈ తప్పు మాది ఎలా అవుతుంది? = How is this fault ours?

**f) i)** ఇది అతడి watch = This is his watch
**ii)** ఈ watch అతడిది కాదా? = Isn't (Is not) this watch his?

**g) i)** ఇది వాళ్ల ఆస్తి = This is their property
**ii)** ఇది వాళ్ల ఆస్తి ఎలా అవుతుంది? = How is this property theirs?

**h) i)** ఆ ఇల్లు.. ఆ పరిసరాలు నాకిష్టం = I like the house and its surroundings
**ii)** ఈ చక్రాలు దానివి =The wheels are its.

**Very important:** దాని, దానిని అనడాన్ని its అంటాం. ఇక్కడ S ముందు apostrophe (') వాడం. Apostrophe తో It's అంటే It is అని. Apostrophe (') ఒక మాటలో ఒక శబ్దం లోపించడాన్ని చూపిస్తుంది)

**Eg:** 1) This car and its wheels= కారూ, దాని చక్రాలు.
2) It's my car = It is my car. (అది నా కారు)

**Now practice the following aloud in English:** (సరైన possessive ను వాడండి)

**1)** ఈ కారు నీదేనా? దాని తాళాలేవి?

**2) Kasim:** నిన్న వచ్చిందెవరు?
**Krishna:** నా స్నేహితుడు (my, mine రెండూ వాడండి)
**Kasim:** అతడు నీ bike తీసుకెళ్లాడా?
**Krishna:** అది నాది కాదు. అది అతడి bike. నాదీ, వాడిదీ ఒకేలా ఉంటాయి. అయితే నాది కొంత పాతది.

**3) Avinash:** ఎందుకు ఇల్లు ఖాళీ చేస్తున్నావు? ఇది మీది కాదా?
**Alankar:** మాది కాదు.
**Avinash:** అయితే ఎవరిది?
**Alankar:** మా Uncle ది
**Avinash:** ఎంతకాలంగా ఇది వాళ్లది?
**Alankar:** వాళ్ల Grand father's time నుంచి వాళ్లదే.

**4) Prameela:** నిన్న ఎవరి necklace పోయింది? మీ చుట్టాలు వచ్చారుకదా? వాళ్లదా? (చుట్టాలు: relatives)
**Laxmi:** అది వాళ్లదికాదు. వాళ్ల నగలన్నీ భద్రంగా ఉన్నాయి.

**ANSWERS:**

**1)** Is this your car? / Is this car yours? where are its keys?

**2) Kasim:** Who came yesterday? / Who was it that came yesterday?
**Krishna:** My friend / A friend of mine
(ఈ రెండో expression conversationలో ఎక్కువ వాడతారు)
**Kasim:** Did he take your bike?
**Krishna:** That was not mine. That was his bike. Mine and his look the same / look alike only, mine is slightly older than his.
ఇక్కడ 'only' వాడకం గమనించండి- ఇది the only things అనే దానికి short farm- దీని అర్థం- 'ఒక్క విషయం ఏమిటంటే / ఒకటేమిటంటే'- simpleగా 'అయితే' అని. slightly= కొద్దిగా.
ఈ రెండూ కూడా conversational bits.

**3) Avinash:** Why are you vacating the house? Is it not yours? / Don't you own it?
(Vacate pronunciation: వకెయిట్ / వెయ్‌కెయిట్ - కె నొక్కి పలకాలి- అర్థం- ఖాళీ చేయడం (ఇల్లు లాంటివి)
**Alankar:** No, it's (it is) not ours.
**Avinash:** Whose is it, then?
**Alankar:** Our uncle's
**Avinash:** How long has it been theirs?
**Alankar:** (It has been theirs) since their grandfather's time.

**4) Prameela:** Whose necklace was lost / was missing yesterday? You had relatives yesterday, was it theirs?
**Laxmi:** No, not theirs; their ornaments / jewels are all safe.




**ప్రశ్న:** నేను ఈమధ్య *spoken english* నేర్చుకుంటున్నాను. ఇందులో *tenses* ముఖ్యమా? *spoken english* బాగా రావాలంటే ఏం చేయాలి?

**– కె.సి.ఉమేష్‌చంద్ర, కర్నూలు**

**జవాబు:** Tenses నేర్చుకోవడం చాలా ముఖ్యం. వాటితోబాటు vocabulary (మాటలూ, వాటి అర్థాలు, అవి ఎలా వాడాలో కూడా తెలుసుకోవడం అవసరం). రోజూ English Newspaper అర్థం అయినా, కాకపోయినా చదవండి. అలా ప్రాక్టీసు చేయడంవల్ల ఫలితం ఉంటుంది. ఈ మధ్య lessonsలో simple present, మిగతా tenseను విశదంగా వివరించాం. చదవండి.

**ప్రశ్న:** *కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా అనాలో తెలియజేయగలరు.*

1. *మీ నల్లా బంద్ అయిందా?*
2. *అతడిని కాలేజీలో చేర్పించాను*
3. *ఉపాధ్యాయులు పిల్లలతో గదులు ఊడిపిస్తున్నారు*
4. *నేను నిన్ను సినిమాకు తీసుకుపోతాను*
5. *అతడికి సైకిల్ తొక్కడం నేర్పించాను*
6. *అతడిని పడుకోబెట్టాను*
7. *నన్ను ఇతరులతో పోల్చొద్దు*
8. *Sir, Madam అని నిరక్షరాస్యులను కూడా పిలవొచ్చా?*
9. *S.C., S.T. లను షార్ట్‌ఫామ్‌లో ఎలా రాయాలి?*

**– జి. విశాల్, మెట్‌పల్లి**

**జవాబు:**
1. Is your tap off? / Have you turned off your tap? / Has your tap been turned off?
2. I have admitted him in college
3. The teachers are making the students sweep the class rooms / The teachers are getting the students to sweep the rooms / The teachers have the students sweep the rooms.
4. I will take you to the movie
5. I taught him cycling
6. I put him to bed
7. Don't compare me with others / Don't compare me to others- సందర్భాన్నిబట్టి
8. ఎవరినైనా Sir / Madam అని పిలవొచ్చు
9. S.C.s and S.T.s




# అర్థాలు తెలిస్తే...




**Srilekha:** Did you meet them yesterday?
(నిన్న నువ్వు వాళ్లను కలుసుకున్నావా? )

**Surekha:** Whom do you mean?
(నువ్వనేది ఎవరి గురించి? )

**Srilekha:** Savithri and her husband
(సావిత్రి, ఆమె భర్త గురించి)

**Surekha:** I met her, but not him
(ఆమెను కలుసుకున్నాను, కాని అతడిని కలుసుకోలేదు)

**Srilekha:** Did you show her the letter?
(ఆమెకు letter చూపించావా? )

**Surekha:** Yes, I Showed it to her. She will show it to him today.
(నేనామెకు చూపించాను. ఆమె ఇవాళ అతడికి చూపిస్తుంది)

**Srilekha:** Did she enquire about me?
(ఆమె నా గురించి అడిగిందా? )

**Surekha:** She wishes to see you. She asked me to give you her best wishes. She wants us to visit her soon. She likes to give us a dinner.
(ఆమె నిన్ను చూడాలనుకుంటోంది. నిన్నడిగినట్లు చెప్పమంది. మనల్ని వాళ్లింటికోసారి రమ్మంది. మనకు dinner ఇవ్వాలనుకుంటోంది.)

**Srilekha:** That's fine. Let's go to them tomorrow in my car. I will show them my new car.
(బాగుంది. మనం రేపు నా కారులో వాళ్ల దగ్గరకు వెళదాం. నా కొత్త కారును వాళ్లకు చూపిస్తాను.)

ఈ సంభాషణలో them, whom, her, him, you, us, me మాటలు గమనించండి.

మన English conversation natural గా, simple గా సాగాలనుకుంటే వీటి అర్థం, వీటిని ఎన్ని రకాలుగా ఏ సందర్భాల్లో వాడేది తెలుసుకోవడం ఎంతో ముఖ్యం. చిన్నచిన్న మాటలకు ఉన్న వాడుకలోని అర్థాలన్నీ ఎంతగా తెలుసుకుంటే అంత simple గా conversation ఎంతసేపయినా నడపవచ్చు. ఈ lesson లో మనం వాడే మాటల గురించి తెలుసుకుందాం.

I = నేను
me = నన్ను; నాకు
we = మేము
us = మమ్ములను, మాకు/ మనలను, మనకు
you = నువ్వు / మీరు
you = నిన్ను, మిమ్ములను / నీకు, మీకు
he = అతడు
him = అతడిని, అతడికి
she = ఆమె
her = ఆమెను, ఆమెకు (ఆమె యొక్క)
it = అది
it = దానిని, దానికి
they = వాళ్లు, అవి
them = వాళ్లను, వాటిని/ వాళ్లకు, వాటికి
who = ఎవరు
whom = ఎవరిని/ ఎవరికి.

ఈ అర్థాలను మనసులో పెట్టుకుని మొదట ఇచ్చిన Surekha, Srilekha dialogue బిగ్గరగా మరోసారి చదవండి.

**Practice the following aloud in English.**

**Suchithra:** మా brother నాకు బాగా సాయం చేస్తాడు. నన్ను చాలా ఇష్టపడతాడు.
(like వాడండి)

**Supriya:** నువ్వు కూడా అతడికి సాయపడుతుంటావా? అతడిని నువ్వు ఇష్టపడతావా?

**Suchithra:** మీకూ బ్రదర్ ఉన్నాడుకదా! అతడిని ఇష్టపడవా?
(అతడంటే నీకిష్టమా అంటాం కదా మామూలుగా)

**Supriya:** Brother, sister ఒకరినొకరు ఇష్టపడడంలో వింతేం లేదు

**Suchithra:** ఐతే మా బ్రదర్‌కు చదువుమీద శ్రద్ధ లేదు. అదే నన్ను worry చేస్తోంది.
(neglect వాడండి)

**Supriya:** మా బ్రదర్ నాకు అటువంటి trouble ఇవ్వడు. మా అమ్మకూ నాన్నకు సాయపడుతుంటాడు. వాళ్లను చాలా జాగ్రత్తగా చూసుకుంటాడు. మాకు ఏది కావాలన్నా తీసుకొస్తాడు. జోక్స్‌తో మమ్మల్ని బాగా నవ్విస్తాడు.

**Suchithra:** మా brother కూడా మాకు బాగా సాయపడతాడు. నిన్న మా అమ్మకు జ్వరంగా ఉంటే ఆమెను doctor దగ్గరకు తీసుకెళ్లాడు. మా నాన్నకు మా బ్రదర్ అంటే చాలా ఇష్టం. వాడికేది కావాలన్నా ఇస్తారు. బాగా చదవాలని మాత్రం అంటుంటారు.

**Supriya:** అదిసరే, నిన్న టీచర్ మనకో assignment ఇచ్చారు కదా. ఎపుడు పూర్తిచేయమన్నారు మనల్ని?

**Suchithra:** వచ్చే శనివారం అనుకుంటా. అయితే మనకారోజు సెలవు కదా?

**Supriya:** ఎవరు చెప్పారు అలా అని? ఎవర్నడిగావు నువ్వు?

**Answers:**

**Suchithra:** My brother helps me a lot (నాకు) He likes me very much

**Supriya:** Do you help him too? Do you like him too?

(అతడికి; అతడిని: Do you also help him? కన్నా Do you help him too- ఎక్కువగా వాడతారు Spoken Englishలో)

**Suchithra:** You have a brother too.
(ఇంతకుముందు చెప్పినట్లు also కన్నా too better.)
Don't you (=Do you not) like him? (అతడ్ని)

**Supriya:** Nothing surprising a brother and a sister liking each other.

**Suchithra:** But my brother neglects studies. That worries me. (నన్ను)

**Supriya:** My brother doesn't (does not) give me that kind of trouble/ such trouble. (such=that kind=అలాంటి)
He helps my parents too a lot. He takes good care of them. (Them=వాళ్లను)
He gets us what we want (మాకు).
He makes us laugh with his jokes (మమ్మల్ని)

**Suchithra:** My brother helps us too. My mother had a fever yesterday and he took her to doctor.
(Englishలో fever, countable, కాబట్టి 'a fever', her=ఆమెను)
My father likes my brother very much. He gives him (వాడికి) whatever he wants. only, he asks him to study well (him=వాడిని)

**Supriya:** By the by, our teacher gave us an assignment yesterday.

(ఇంతకుముందు తెలుసుకున్నాం కదా- conversation లో topic మార్చేటపుడు 'by the by'- తెలుగులో 'అదిసరే' అంటుంటాం. us = మనకు). When did he ask us (మనల్ని) to complete it.?


M. SURESAN

**Suchithra:** The coming Saturday, I think. But isn't it (= is it not) a holiday for us? (us = మనకు)

**Supriya:** Who told you so?/ Who told you that? Whom did you ask?

*****

**a)** నువ్వు నిన్న ఎవరిని కలుసుకున్నావు? = Whom did you meet yesterday? అనాలి. ఎందుకంటే ఎవర్ని = whom. అయితే రానురాను spoken English లో whom బదులు who వాడేస్తున్నారు. అది వాడటం కరెక్ట్ spoken English.
Who did you meet yesterday?
ఇది పాండిత్యం- formal written English (రాతలో అంత తప్పు కాదు).
Who did you meet yesterday?
ఇది spoken form, conversational.

**b)** నువ్వు నిన్న ఎవరితో మాట్లాడుతున్నావ్?
(Spoken) Who (Whom కాదు)
Were you talking to yesterday?
(రచనలో, చాలా formal గా అయితే, To whom were you talking yesterday? అని రాయండి.)

ఇక్కడ గమనించాల్సిన విషయం: Preposition 'to'- sentence కు ముందర రావడం. మనం sentence ను 'to' తో begin చేస్తే whom వాడాలి.
(to whom were you talking?)

అయితే అది writingలో, అదీ formal writingలోనే అలా రాస్తాం.

Spoken form లో మాత్రం, 'to' - sentence చివర వస్తుంది. sentence ను 'whom'తో బదులు, who తో ప్రారంభిస్తాం. 'who' తో (whom వాడాల్సిన చోటల్లా) questions ప్రారంభించడమే spoken English లో కరెక్ట్.

ఎవర్ని చూడాలనుకుంటున్నారు?
Who (whom కాదు) do you want to see?
ఎవరికి ఉత్తరాలు రాస్తున్నావు?
Who are you writing (letters) to ?

**c)** ఎవరిని గురించి మాట్లాడుతున్నావు?
Who are you talking about? (whom కాదు)

**d)** ఎవరితో వాడు పోట్లాడింది?
Who did he quarrel with?

**e)** ఎవరిని చూశావు నిన్న?
Who (Whom కాదు) did you see yesterday.

**f)** ఆమె ఎవర్ని పెళ్లి చేసుకుందో నాకు తెలీదు
I do not know who she married
(ఇలాంటి sentences లో కూడా whom వాడడం లేదు. Who వాడడం చాలా common, spoken Englishలో)

ఇప్పుడు ఈ సంభాషణ చూడండి

**Hari:** (over phone) Hello, who is it please? (ఎవరు? )

**Hemanth:** It's (it is) me, Hemanth (నేనే, హేమంత్‌ను)

**Hari:** That's nice, hearing your voice... after a long time.
(చాలా సంతోషం, చాలా కాలం తర్వాత నీ గొంతు వినడం)

**Hemanth:** Was that your brother who appeared in the TV serial yesterday?
(నిన్న TV serial లో కనిపించింది మీ brother కదా? )

**Hari:** Yes, it's (= it is) him (అవును, వాడే) and the little girl he was walking with... do you know who she is? (వాడితో నడుస్తున్న చిన్నపాప ఎవరో నీకు తెలుసా? )

**Hemanth:** Wasn't it (was it not) your youngest sister?

**Hari:** Yes, it's her.

పై సంభాషణలో గమనించండి: It's me, it's him, It's her. మామూలుగా అయితే, It is I, It is he, It is she అనాలని అనుకుంటాం. కానీ spoken Englishలో It's me, It's her, It's him అనడమే కరెక్ట్.




**ప్రశ్న:** *1. Shop closed ఈ వాక్యం Negative.*
*2. Shop n't closed సరిఅయినదా?*
*3. Not shop closed అంటే అర్థం?*
*4. School going children. దీనిని Negativeగా ఏ విధానంలో చేయాలి?*
*5. World's largest selling Newspaper. దీనిని Negative ఎలా చేయాలో తెలుపగలరు.*

**– వి. బాలు, హైదరాబాద్**

**జవాబు:** 1, 2, 3 Shop closed - దీనికి shop not closed. Shopn't closed - n't form ఇటువంటి చోట్ల వాడం. an, is, are... వాటికి మాత్రమే వాడుతాం. Not shop closed సరైన English కాదు. ఇక్కడ shop not closed అనే బదులు 'shop open' అంటే better కదా. 4. Non school going children అనేది school going childrenకు negative. 5. The world's largest selling News paper కు negative - not the world's largest selling newspaper అనవచ్చు



# టైం తెలుసా తెలియదా..?

**Radha:** Hi Roja, how are you? long since we met.
(హాయ్ రోజా ఎలా ఉన్నావ్? మనం కలిసి చాలా రోజులైంది.)

**Roja:** Fine thank you. How are you?
(నేను బాగానే ఉన్నాను. నువ్వెలా ఉన్నావు?)

**Radha:** Fine to. Thanks. How about going to the movie Black?
(బాగున్నా! బ్లాక్ సినిమాకి వెళదామా?)

**Roja:** I've (I have) seen it. Think of some other movie.
(నేనది చూశాను. ఇంకో సినిమా ఏదైనా చెప్పు)

**Radha:** I haven't (I have not) seen it so far.
(ఇప్పటివరకు నేనది చూడలేదు. so far= ఇప్పటివరకు)

**Roja:** That's surprising. It has run for three weeks now, and you haven't seen it!
(ఆశ్చర్యంగా ఉందే! అది మూడు వారాలుగా ఆడుతోంది. నువ్వు చూడలేదా?)

**Radha:** How about some coffee before going to a movie?
(సినిమాకెళ్లే ముందు కాస్త కాఫీ తాగుదామా?)

**Roja:** I have just had coffee. I don't feel like drink any more.
(ఇప్పుడే తాగాను. మళ్లీ తాగాలని లేదు.)

ఈ సంభాషణలో గమనించాల్సిన విషయం-

have + past participle (have + pp) / has + pp ఉపయోగం. I, We, You and They అయితే have + pp వాడతాం. He, She, It అయితే has + pp వాడతాం. దీన్నిpresent perfect tense అంటాం. ఈ form verb కు మరికొన్ని ఉదాహరణలు-

**a)** My father (he) has gone out.
(మా నాన్నగారు బయటకు వెళ్లారు)

**b)** My mother has bought a saree for my sister.
(మా అమ్మ మా సిస్టర్‌కు చీర కొన్నది.)

**c)** My friends (they) have left for Hyderabad.
(మా ఫ్రెండ్స్ హైదరాబాద్ వెళ్లారు.)

**d)** Tendulkar has scored thirty five centuries so far.
(టెండూల్కర్ ఇంతవరకు 35 సెంచరీలు కొట్టాడు.)

**e)** The class has just begun.
(క్లాస్ ఇప్పుడే ప్రారంభమైంది)

**f)** We haven't (have not) read the report yet.
(మేం ఇప్పటివరకు రిపోర్ట్ చదవలేదు)

ఇప్పుడు జాగ్రత్తగా గమనించండి-

**I)** ఇంతకుముందు తెలుసుకున్నాం past actions, time stated (గతంలో జరిగి, టైం తెలిపే పనులకు) Past Doing Words (came, sang, liked, knew లాంటి verbs) వాడతాం.

1) గతంలో జరిగి టైం తెలియని, తెలియజేయని పనులకు have + past participle (pp)/ has + past participle (pp) వాడతాం.

**a)** అతడిని నేను కలుసుకున్నాను.
I have met (have + pp) him.

ఇక్కడ గతంలో, ఏ టైంలో (ఏ రోజు, నెల, వారం, etc.) కలుసుకున్నదీ తెలియజేయకపోవడం వల్ల have met- have + pp వాడుతున్నాం.

**b)** I met him yesterday.
ఇక్కడ yesterday అని టైం తెలియజేయడం వల్ల Past Doing Word వాడుతున్నాం)

**c)** He has gone out.
time తెలియజేయడం లేదు. కాబట్టి has gone - has + pp

**d)** He went out an hour ago.
(గంట క్రితం అని టైం తెలియజేయడం వల్ల went- Past Doing Word)

**e)** She has bought a car.
(ఆమె కారు కొన్నది.)

**f)** She bought it last week.
(ఆమె దానిని కిందటి వారం కొన్నది)

గమనించారు కదా-

మామూలుగా టైం తెలియజేయని Past Actions (గతంలో పనులు)ను have/ has + pp లో చెబుతాం. గతంలో జరిగి టైం తెలిపే Past Actions కు Past Doing Words వాడతాం.

కాబట్టి have + pp/ has + pp మొట్టమొదటి ఉపయోగం - Past actions, time not stated (టైం తెలియజేయని, గతంలో జరిగిన) పనులకు వాడతాం.

**eg:** 1) నువ్వా సినిమా చూశావా?
Have you seen the movie?

2) వాడు వచ్చాడా?
Has he come?

3) నీకు పిలుపు వచ్చిందా?
Have you received the invitation?




4) ఆమె ఎక్కడికి వెళ్లింది?
Where has she gone?

5) అతను ఇప్పటికే రెండు కార్లు మార్చాడు.
He has already (ఇప్పటికే) changed two cars.

**II)** have + pp/ has + pp రెండో ఉపయోగం- గతంలో ప్రారంభమై ఇప్పటివరకు జరిగిన/ ఇంకా జరుగుతున్న పనులకు (అప్పుడప్పుడూ) have + pp/ has + pp వాడతాం.

1) నేను ఇక్కడ పదేళ్లుగా ఉన్నాను.
I have lived here for the past/ for the last ten years.

(for the past / for the last ten years = గత పదేళ్లుగా అంటే పదేళ్ల క్రితం నుంచి ఇప్పటివరకు)

2) ఆయన నాలుగేళ్లుగా ఇంగ్లిష్ బోధించారు. (ఇప్పటివరకు)
He has taught English for the past/ for the last four years.

3) ఆమె ఇప్పటివరకు 100 చిత్రాల్లో నటించింది.
She has acted in 100 movies so far.

4) అతను ఇంకా రాలేదు.
He has not come yet/ so far.
(ఇప్పటివరకు అతను రాలేదు- రాకపోవడం ఇప్పటి వరకు జరిగింది).
(yet = ఇంకా; so far = ఇప్పటివరకు)

ఇక్కడ ఒకటి గమనించండి.

have been/ has been- ఇవి forms. ఇంతకు ముందు తెలుసుకున్నాం. అప్పటి నుంచి ఇప్పటివరకు ఉండడాన్ని 'have been/ has been'లో తెలియజేస్తాం.


M. SURESAN

**కింది వాక్యాలను పరిశీలించండి.**

**a)** He has been a teacher of English for the past two years.
(ఆయన రెండేళ్లుగా ఇంగ్లిష్ టీచర్‌గా ఉన్నాడు.)

**b)** He has taught English for the past two years.
(ఆయన రెండేళ్లుగా ఇంగ్లిష్ బోధించారు- ఇప్పటి వరకు.)

**c)** He has been an English teacher.
ఇది టీచర్‌గా ఉండడం.

**d)** He has taught (ఇది action) English for the past two years.

పైరెండు sentences ఒకే భావాన్ని రెండు విధాలుగా-
state of being (ఉండడం)గా,
action (పని)గా తెలియజేస్తున్నాయి.

**III)** have + pp/ has + pp, just, just now ఇప్పుడిప్పుడే పూర్తయిన పనులకు వాడతాం.

**a)** క్లాస్ ఇప్పుడే ప్రారంభమైంది.
The class has just begun.

**b)** వాళ్లిప్పుడే వచ్చారు.
They have just arrived.



*How about going to the movie Black?*

**c)** ఆమె నిమిషం క్రితమే బయటకు వెళ్లింది.
She has gone out just a minute ago.

ఈ sentences లో just లేదనుకోండి. అప్పుడు past action time not stated అవుతుంది.
They have just gone.
వాళ్లిప్పుడే వెళ్లారు.
They have gone.
వాళ్లు వెళ్లారు.

కింది వాక్యాలను English లో బిగ్గరగా practice చేయండి.

1) టెండూల్కర్ గత 15 సంవత్సరాలుగా క్రికెట్ ఆడాడు.
2) వాళ్లిక్కడ ఎంత కాలంగా పనిచేశారు? ( How long వాడండి)
3) ఆమె ఇప్పటివరకు టీ తాగలేదు.
4) వాళ్లు నాలుగు నెలలుగా నాకు ఉత్తరం రాయలేదు.
5) సినిమా ఇప్పుడే ప్రారంభమైంది.
6) వాళ్లు ఆ పుస్తకం చదివారా?
7) నువ్వెప్పుడన్నా నాకు సహాయం చేశావా?
8) మేం మా స్కూలు రోజుల నుంచి కలిసి చదువుకున్నాం. (since our school days వాడండి).
9) ఎంతకాలం ఇక్కడ పని చేశావు?
10) వాళ్లింతవరకు రాలేదు.

**Answers:**

1) Tendulkar has played cricket for the past fifteen years.
2) How long have they worked here?
3) She has not taken/ has not had tea so far.
4) They haven't (have not) written a letter to me for the past four months.
5) The movie has just begun.
6) Have they read the book?
7) Have you ever helped me?
8) We have studied together since our school days (since = నుంచి).
9) How long have you worked here?
10) They have not come so far.

**Q & A**

**ప్రశ్న:** గత వ్యాసాల్లో 'అతడు 2001 నుంచి 2003 వరకు ఇక్కడ టీచర్‌గా ఉన్నాడు' అనే వాక్యాన్ని ఇంగ్లిష్‌లో 'He was a teacher here from 2001 to 2003' అని రాశారు. తెలుగులో verb- present tense, English లో past tense ఇది కరెక్టేనా వివరించండి.
ఒక వ్యక్తి బతికి ఉండగా అతడి వృత్తి గురించి చెప్పేటప్పుడు ఏ కాలంలో అయినా be form verb ఎలా ఉపయోగించాలి? Question tag లో Am I/ Are I, Amn't I/ Aren't I లలో ఏది ఉపయోగించాలి?

– శ్రీమతి రత్నప్రసాదరావు, కలశపాడు

**జవాబు:** తెలుగులో ఎప్పుడు ఉన్నా- ఉన్నాడు, ఉంది అంటాం. అది past కాని, present కాని. అయితే English లో మాత్రం ఇప్పుడు ఉండడం, ఎప్పుడూ ఉండడాన్ని చెప్పడానికి am, is, are; గతంలో ఉన్నట్లు చెప్పడానికి- was, were ఉపయోగిస్తాం.
2001 నుంచి 2003 వరకు గతం (past) కాబట్టి, He was a teacher here from 2001 to 2003 కరెక్ట్.

ఇకపోతే ఒక వ్యక్తి బతికి ఉన్నప్పుడు అతడి వృత్తి past అయితే was, present అయితే is, future లో అయితే will be/ shall be ఉపయోగించాలి.

Manmohan Singh was a Finance Minister (గతంలో)
Manmohan Singh is Prime Minister (ప్రస్తుతం)
Manmohan Singh will be the PM for some time to come (future)

Am I- not తో అయితే Aren't I వాడాలి.

**ప్రశ్న:** స్పోకెన్ ఇంగ్లిష్‌లో active voice కి passive voice కి తేడా ఏమిటి?

– ఎ. పెంచలయ్య, రాజంపేట

**జవాబు:** verb 'be' form + past participte (PP) అయితే అది passive voice. మిగతా forms లో అది active. Passive voice లో verb ఉంటే 'బడు' అనే అర్థం తెలుగులో వస్తుంది.
Shops are closed on sundays.
**(verb- are closed- are (beform) + closed (PP), verb- passive) -**
ఆదివారాలు shops మూయబడతాయి.
తెలుగులో passive దాదాపు వాడం. English లో కూడా ఎంత తక్కువ వాడితే మన భాష అంత simple గా సహజంగా ఉంటుంది.




# Shift కాదు.. move





M. SURESAN

**Sukanya:** Hi Sumithra? I saw you at Sell All Super Market yesterday. Busy buying things?

(నిన్ను నేను నిన్న Sell All Super Market దగ్గర చూశాను. ఏం చాలా కొనేశావా? )

**Sumithra:** Mom was inside. She was buying provisions. I was waiting outside. By the by, you know we have moved. We now live in Gandhi Nagar.

(అమ్మలోపలుంది కిరాణా సరకులు కొంటూ. నేను బయట wait చేస్తున్నా. ఆ... అన్నట్టు, మేం ఇల్లు మారాం. ఇప్పుడు గాంధీనగర్‌లో ఉంటున్నాం.)

మామూలుగా ఇల్లు, ఊరు మారడాన్ని shift అంటుంటాం. move అనడం కరెక్ట్.

మేం రేపు ఇల్లు మారుతున్నాం

We are moving to a new house tomorrow

**Sukanya:** My uncle is in Gandhi Nagar too. Where exactly is your home there?

(మా uncle వాళ్లు కూడా గాంధీనగర్‌లోనే ఉంటారు. మీ ఇల్లు correct గా ఎక్కడ? )

**Sumithra:** At 12-14-16 on Nehru Street. It is to the right of make Money Bank Ltd., if you stand in front of it. We live on the ground floor.

(Nehru Street లో Door No. 12-14-16 లో. Make Money Bank ముందు నిలుచుంటే దాని కుడివైపు).

**Sukanya:** Hei, your place is just under my uncle's. He lives on the first floor.

(మీరుండేది మా uncle వాళ్ల ఇంటి కిందే. మీది ground floor, వాళ్లది I floor).

**Sumithra:** Happy to know that they are on the 1st floor just above us. Just across the road is an ice cream shop. I think it was your uncle's son sitting at the back of the shop and enjoying an ice cream.

(వాళ్లక్కడ మా పై పోర్షన్‌లో ఉండడం సంతోషంగా ఉంది. రోడ్ అవతలదేదో ice cream shop ఉంది. మీ uncle గారి అబ్బాయే అనుకుంటా, ice cream shop వెనుక కూర్చొని ice cream తింటున్నాడు)

ఇక్కడ prepositions ను గమనించండి: కొన్నిసార్లు ఓ preposition లో రెండు, మూడు మాటలు కూడా ఉంటాయి. **Eg:** at the back of.

ఇంతవరకు conversation లో prepositions: at, inside, outside, in, to the right of, on, under, above, across, at the back of.

వీటిని position (అంటే ఓ వస్తువు/ మనిషి ఉండే చోటు) తెలపడానికి వాడతామని ఇదివరలో తెలుసుకున్నాం. ఇప్పుడు మరికొన్ని వివరాలు:

at: కరెక్ట్‌గా ఒక చోట. in = ఒక చోటిలో

**1.** I saw you at the Super Market

Super Market దగ్గర-

అంటే కరెక్ట్‌గా Super Market దగ్గర (లో).

In the Super Market = Super Market లో

I was at the Super Market from 5 p.m. to 6 p.m.

The goods in the Super Market are expensive.

పై వాక్యాల్లో at కు, in కు తేడా గమనించండి.

నేను 5 నుంచి 6 వరకు Super Market లో ఉన్నా, వస్తువులు కొంటూ.

Goods in the Super Market

Super Market లోని వస్తువులు.

పిల్లలు School లో ఉన్నారు

The children are at school.

పిల్లలు వాళ్ల Class లో ఉన్నారు

The children are in class.

There are four hundred pupils in the school

ఆ school లో నాలుగువందల మంది పిల్లలున్నారు.

**2.** inside అన్నా in అన్నా దాదాపు ఒకటే. అయితే inside అంటే ఒక ప్రదేశంలోపల అనే అర్థం వస్తుంది. in అంటే లో అని అర్థం.

**Pranav:** Where are your friends?

**Prabhat:** They are in the car. Look inside and you will see them. They were outside the car till ten minutes ago.

(Car లో ఉన్నారు. లోపల చూడు, వాళ్లు కనిపిస్తారు.పది నిమిషాల కిందటివరకు వాళ్లు కారు బయట ఉన్నారు)

**3.** above = పైన.

The government has the duty to see that every person has a roof above their head.

ప్రతివారిపైనా ఒక కప్పు ఉండేట్లు చూడటం ప్రభుత్వం విధి

(ప్రతివారికి నివాసం కల్పించడం)

The fan is just above you

Fan correct గా నీ పైనే ఉంది.

'above' అంటే ఓ వస్తువుకు/ మనిషి పైన. fan above your head అంటే తలకు, fan కు కొంత ఖాళీ ఉందని. ఒకదానిపై కొంత ఖాళీ ఉంటే అది 'above'. అలాకాకుండా ఒకదానిపై ఒకటి ఆనుకుని ఉంటే, అది 'on'.

Pen, table మీద ఉంది

the pen is on the table.

Table మీద lamp ఉంది

There is a lamp above the table.

(అంటే table మీద light పడేట్టుగా lamp table పైన ఉంది).

'On' గురించి ముఖ్యమైన విషయం. మనం తెలుగులో స్థూలంగా పైన, మీద అనే వాటన్నింటికి 'on' వాడతాం. లో, లోపల అనే అర్థంతో 'in' వాడుతుంటాం. అయితే English వాడుకలో- లో, లోపల అని తెలుగులో అనే సందర్భాల్లో 'on' వస్తుంది.

**eg:**

**a)** నేను మొట్టమొదట అతన్ని train లో కలుసుకున్నాను

I first met him on a train. (In a train కాదు)

**b)** జాబితాలో అతడిపేరు లేదు

His name is not on the list.

**c)** వాడు team లో ఉన్నాడా? Is he on the team?

**d)** ఆ ఇల్లు మంటల్లో ఉంది The house is on fire.

**e)** Plane లో 50 మంది ప్రయాణికులున్నారు

There are fifty passengers on the plane.

**f)** అతడి పేరు హాజరు పట్టీలో లేదు =

His name is not on the row.

ఇవి spoken English లో జాగ్రత్త పడాల్సినవి.

సామాన్యంగా పైన కప్పున్న వాహనాల్లో అనడానికి, 'by' వాడతాం.

**a)** మీరు కార్లో వచ్చారా?

Did you come by car?

**b)** వాడు bus లో వచ్చాడు. He came by bus

అలాగే by train, by plane, by ship

**c)** సరకులు లారీలో వచ్చాయి

The goods came by lorry.

Top (కప్పు) లేని వాహనాల ముందు 'on' వస్తుంది.

on cycle, on scooter, on bike, on camel, on elephant on horse-back.

**4.** under, below:

ఈ రెండింటి అర్థంలో కొంత తేడా ఉంది.

వాళ్లు చెట్టు కింద కూర్చున్నారు

They sat under a tree.

(అంటే చెట్టు కొమ్మలు వాళ్లపైకి ఉన్నాయి)

From the helicopter, the minister saw below him the areas under water

Helicopter నుంచి మంత్రి కిందకు చూస్తే నీళ్లకింది ప్రదేశాలు కనిపించాయి.

Correct గా ఒక దానికింద ఇంకొకటి ఉంటే under. ఒకదాని కింద ఇంకెక్కడయినా ఉంటే below.

From the window of the II Floor, he saw below a man or the road.

Road లో నిలుచున్న ఆయన Correct గా కిటికీ కింద ఉండడు కదా. కిటికీకి తక్కువ level లో కాస్త దూరంగా ఉంటాడు.

ఇది చూడండి:

The ground floor is under the first floor.

(ground floor మొదటి అంతస్తు కింద ఉంటుంది)

**5.** Across = అవతలివేపు.

My home is across the road from the bank

Bank నుంచి road కు అవతలివేపు మా ఇల్లు.

నదికి అవతలి వైపు = across the river.

ఆకాశంలో ఒకవైపు నుంచి ఇంకోవైపు = across the sky.

The plane flew at great speed across the sky

plane ఆకాశంలో చాలా వేగంగా ఒకవైపు నుంచి ఇంకోవైపు వెళ్లింది.

**6.** at the back of = వెనకవైపు

(back side కాదు, backside కు అర్థం పిరుదులు, అని)

అతనెప్పుడూ class లో వెనకవైపు కూర్చుంటాడు

He always sits at the back of the class.

Bus వెనకభాగంలో కూర్చున్న ప్రయాణికులు క్షేమంగా ఉన్నారు.

The passenger at the back of the bus were safe.

at the back of the room = గదిలో వెనక

behind the room = గదికి వెనక

some one at the back of the hall was shouting

Hall లో వెనక ఎవరో అరుస్తున్నారు.

There is a tap behind the hall

Hall వెనక ఓ పంపు ఉంది. (అంటే Hall బయట)

**Practice the following aloud in English.**

**a) Stella:** మీరు నిన్న రేషన్ Card తీసుకోలేదా?

**Nikhila:** నిన్న నేను ఊళ్లో లేను. హైదరాబాద్‌లో ఉన్నాను.

**Stella:** మీరెక్కడుంటారు?

**Nikhila:** గవర్నర్‌పేటలో, ఆలీబేగ్ వీధిలో.

**Stella:** మీ ఇంటికి ఎదురుగా road కు అవతలివైపు School ఉందికదా?

**Nikhila:** అవును. దాని ఎదురుగానే మా ఇల్లు.

**Stella:** అయితే మీరు ఈ application మీద సంతకం పెట్టండి. Yours faithfully అనే దానికింద. Application కుడివైపు.

**ANSWERS:**

**Stella:** Didn't you (Did you not) take your ration card yesterday?

**Nikhila:** I was out of town yesterday (Out of station కాదు). I was in Hyderabad.

**Stella:** Where do you live?

**Nikhila:** In Governorpeta; in / on Alibaig Street

(Road ముందు, Street ముందు in, on ఏదైనా)

**Stella:** Isn't there a School across the road from your place?

**Nikhila:** Yes. My home is just opposite the school.

**Stella:** Please sign on this application, below the 'yours faithfully' line. on the right side.



**ప్రశ్న:** *Have కి ing form ఉంది కదా. Has కి ing form ఎందుకు లేదు?*

*– డాక్టర్ పరుచూరి గోపాలకృష్ణ, హైదరాబాద్*

**జవాబు:** Has అనేది He, She, It తో వాడతాం (కలిగిఉండడం, తినడం, తాగడం అనే అర్థంతో). Have అనేది Verb form. దానికి మాత్రమే ing వస్తుంది. Has కి రాదు. ఎందుకంటే He, She, It తో Speak అనే verb – speaks అవుతుంది. అప్పుడు ing form speak కి మాత్రమే వాడతాం. Speaks కి వాడి speaking అనం కదా. అలాగే Have కి బదులు He, She, It తో has వాడతాం. Speaks కి ing చేర్చనట్టు has కు కూడా ing చేర్చం. అలాగే talk. Talk- He, She, It తో talks అవుతుంది. ing form talk కి చేరుస్తాంగానీ talks కి చేర్చం కదా.

**ప్రశ్న:** *'Over', 'above' ల మధ్య తేడా ఏమిటి? ఏ సందర్భంలో ఏది వాడాలి?*

*– ఎస్.టి.హెచ్ ప్రసాద్, సిద్ధాంతం, పశ్చిమగోదావరి జిల్లా*

**జవాబు:** Prepositions గా Over, above - ఈ రెంటినీ పైన అనే అర్థంతో వాడవచ్చు

1) Our class room is above / over your class room.

b) My father wants to have two roomed portion above / over the first floor.

ఇటువంటిచోట్ల above, over లో ఏదైనా వాడవచ్చు

ii) He is over 35 years of age but looks younger.

(ఆయన వయస్సు 35 ఏళ్లకంటే ఎక్కువయినా, చిన్నగా కనిపిస్తాడు.)

ఇక్కడ over మాత్రమే వాడతాం. Above కాదు.

iii) కదలికలో పైకి అన్నప్పుడు కూడా Over అంటాం.

He jumped over the wall. (గోడ మీదికి గెంతాడు. ఇక్కడ above రాదు)

iv) సంఖ్యలు, డబ్బు, time కూడా కొంతకన్నా ఎక్కువ అని చెప్పడానికి over వాడతాం.

The book costs over Rs. 300 = ఆ పుస్తకం ఖరీదు రూ. 300కన్నా ఎక్కువ.

He waited over three hours = మూడుగంటలకన్నా ఎక్కువే wait చేశాడు.

There are over 30 students = 30 students కన్నా ఎక్కువే ఉన్నారు.



# AM, PM ఎప్పుడు?..




M. SURESAN

**Rama Rao:** What are your College hours?
(మీ College పనివేళలు ఏంటి? )

**Prakash:** Our College works from 9 to 3.30. We go for lunch between 12.30 and 1.30
(మా College 9 నుంచి 3.30 వరకు పనిచేస్తుంది. మేము 12.30, 1.30 మధ్య భోంచేస్తాం)

**Rama Rao:** When do you usually start for college?
(మీరు ఇంటి నుంచి college కు ఎప్పుడు బయలుదేరతారు? )

**Prakash:** Because our Classes begin at 9.00 in the morning, I usually start about 8.30, as it takes around half an hour for me to reach college. I am at college by 8.55. But why are you asking me all the these questions?
(Classes 9 కు ప్రారంభం అవుతాయి కాబట్టి, నేను మామూలుగా 8.30 ప్రాంతంలో బయలుదేరతాను. College చేరడానికి దగ్గర దగ్గర అరగంట పడుతుంది. ఏదేమైనా నేను 8.55 కల్లాcollege లో ఉంటాను. ఐనా ఈ ప్రశ్నలన్నీ ఎందుకు అడుగుతున్నారు? )

**Rama Rao:** I am from the RTC. We are gathering information to plan our bus services to suit students needs. When does the college usually reopen after summer vacation?
(నేను RTC నుంచి వస్తున్నాను. విద్యార్థుల అవసరాలకు అనుగుణంగా Bus services నడపడానికి ఈ సమాచారం సేకరిస్తున్నాం. వేసవి సెలవుల తర్వాతCollege కాలేజ్ ఎప్పుడు తెరుస్తారు?

**Prabhakar:** Usually in June, on the 3rd Monday
(మామూలుగా June లో, మూడో సోమవారం)

**Rama Rao:** For howmany days does the college work in a year?
(ఓ సంవత్సరంలో, College ఎన్ని రోజులు పనిచేస్తుంది? )

**Paul:** For about 180 days, without counting exam days
(exams రోజులు లేకుండా అయితే దాదాపు 180 రోజులు)

పై సంభాషణలోని Prepositions గమనించండి. from, to, between, about, around, by, at after, in, on, for.

మీరు గమనించే ఉంటారు పై Prepositions అన్నీ కూడా Time (సమయానికి) సంబంధించిన Prepositions అని. పైవన్నీ కూడాTime - సమయం, రోజు, నెల, సంవత్సరం, వ్యవధి - తెలిపే మాటల ముందు వస్తున్నాయి కదా!

at (9.00 in the morning), about (8.30), around (half an hour), after (summer vacation), in (June), on (the 3rd Monday), in (a year), for (howmany days) - ఇక్కడ brackets లో ఉన్నవి time expressions కదా! అందుకని వీటన్నింటిని prepositions of place and position - అంటే ప్రదేశాలను మనిషి/ వస్తువులు ఉన్నచోట్లను తెలిపేవి అంటాం.

మరికొన్ని prepositions of time చూద్దాం.

**Naresh:** what is the last date for the submission of application?
(Application submit చేయాల్సిన చివరి తేది ఏది? )

**Narayana:** On or before the 15th of next month. we issue applications upto the 28th of this month. Applications will be available even after that date till the 30th of this month, but we charge a late fee of Rs 5 per day. We have been selling applications since the 5th. Our Office is open from 10 AM to 5 PM, and applications are issued during that time.

ఈ సంభాషణలోని Prepositions of time - before (the 15th), upto (the 28th of this month), till (the 30th), Since (the 5th), during (that time).

ఇప్పుడు ఈ Prepositions of time ఉపయోగం చూద్దామా?

1. **at:** Our classes begin at 9
(9కు మా classes ప్రారంభమవుతాయి) కచ్చితంగా ఫలాన టైం అని చెబుతున్నప్పుడు ఆ time ముందు at వస్తుంది.
Our College closes for the day at 4
(నాలుగింటికి college అయిపోతుంది.)

ఇక్కడ గమనించండి. పొద్దున, సాయంత్రం ఫలాన time అని సూచించడానికి spoken English, మామూలు Conversation లో AM, PM వాడం.

మామూలు conversation లో in the morning, in the evening etc., అంటాం. Purely official spoken/ written form లో మాత్రమే AM, PMవాడతాం.

At 4 PM, at 9.30, at half past ten (10.30), etc.

2. **on:** On ఎప్పుడూ, days (వారాల పేర్లు, ఫలాన రోజు) ముందు, dates (తేదీల) ముందూ వాడతాం.

**Suseela:** When are you leaving for Hyderabad?
**Suguna:** On Sunday, that is, on the 4th.
**Suseela:** When is the interview?
**Suguna:** On Monday. I will be back here on the 6th, that is, on Tuesday

3. **in:** Months (నెలలు), years (సంవత్సరాలు), వ్యవధి (duration) ముందు IN వస్తుంది.

**Pranav:** I will be in Kashmir in June.
(Juneలోkashmirలో ఉంటా)
**Paul:** For how long?
(ఎంతకాలం, ఎన్నిరోజులు? )
**Pranav:** My friend will join me there in July. Together we will return in August.
(మా friend అక్కడికి Julyలో వస్తాడు. ఇద్దరం కలిసి Augustలో తిరిగివస్తాం)

There are 30/ 31 days in a month.
(నెలలో 30/ 31 రోజులుంటాయి)
There are only 28/ 29 days in February.
(February లో 28/ 29 రోజులు ఉంటాయి.)

My sister was born in 1999. (1999లో)
The Government came to power in 2004. (2004లో)
There are 12 months in a year
(సంవత్సరంలో 12 నెలలుంటాయి)
వ్యవధి(Period of time) సూచించడానికి 'in' వాడతాం.
The police were able to catch the killer in a day
(నేరస్తుడిని పోలీసులు ఒక్కరోజులో పట్టుకోగలిగారు.)
The teacher finished the whole chapter in just a week
(Teacher మొత్తం chapter ను వారంలో పూర్తిచేశారు)

వ్యవధినే మరో విధంగా, అంటే కొంతకాలం లోపల జరిగే సంఘటనగా పేర్కొనే సందర్భాల్లో-

**Manoj:** Why are you so happy, Mohan?
(ఏంటి, అంత సంతోషంగా ఉన్నావు మోహన్? )
**Mohan:** Why not? I got the first mark in last week's exam. The first time I scored so high in a year.
(నిజంగానే. last week exam లో first mark వచ్చింది. ఈ ఏడాది ఇన్నెక్కువ మార్కులు రావడం ఇదే మొదటిసారి)

ఒక వ్యవధి పూర్తయ్యేవరకు అనే అర్థంతో IN వాడతాం.

**Kumar:** (Over to phone) Where are you Krishna? I am waiting for you
**Krishna:** Sorry, I'll be with you in five minutes.
(sorry, ఐదు నిమిషాలకు, అంటే ఐదు నిమిషాలు దాటిన తర్వాత నీ దగ్గరుంటా)
He came back in ten minutes.
వాడు 10 నిమిషాలకు (పది నిమిషాలలో కాదు) తిరిగి వచ్చాడు.
It'll be ready in a week's time.
అది వారానికి (వారం రోజులు పడుతుంది) తయారై ఉంటుంది.

**Important:** every, next, last, that, this ముందు in కానీ, on కానీ వాడం.

Shops are closed every Sunday
(on every Sunday కాదు)
He comes here next Monday
(on next Mondayకాదు)
He was here last Saturday
(on last Saturday కాదు)
I'll begin it this Monday
(On this Monday కాదు)
He didn't see her that day (on that day కాదు)
అలాగే in కూడా రాదు.
The tournaments will begin next June
(in next June కాదు)
She met him last December
(in last December కాదు)
They go to Kashmir every May
(in every May కాదు)

ఈ కింది Vocabulary చూడండి.
ఇవన్నీ గుణాలను తెలిపేవి. (Pronunciation)

1) Charming = చామింగ్ = ఆకర్షణీయమైన
ఇది ఆకారంలో కావచ్చు, ప్రవర్తనలో కావచ్చు; మనిషికి, వస్తువుకు వాడవచ్చు.
a) She is very Charming in that dress.
(ఆమె ఆ dressలో చాల ఆకర్షణీయంగా ఉంది)
b) He was Charming towards us
(అతడు మాతో చాలా ఆహ్లాదకరంగా ఉన్నాడు)

2) Chase (చెయ్జ్) = వెంటబడి తరమడం.
a) The tiger chased the deer.
(పులి జింక వెంటబడింది)
b) The police were chasing the thief.
(పోలీసులు దొంగవెంబడి పడ్డారు)

3) Drag (డ్రాగ్ - ఇక్కడ 'డ్రా', Bankలో ba లాగా పలకాలి)= లాగడం
i) He dragged the boy into the room
(గదిలోకి లాగాడు)
ii) She dragged him into the quarrel
ఆమె అతడిని పోట్లాటలోకి లాగింది.
iii) The movie dragged on
ఆ సినిమా సాగదీశారు

---

**ప్రశ్న:** *what does he think of himself?* అని ఇచ్చారు. *what does he think about himself* అనకూడదా? *preposition* గురించి వివరించగలరు
*– వి.పవన్‌కుమార్ రాజు, హైదరాబాద్*

**జవాబు:**
i) చాలా సందర్భాల్లో of, about ఒకదాని బదులు ఒకటి వాడవచ్చు. Think of, think about రెండూ correct.
ii) Prepositions గురించి వివరిస్తున్నాం.
iii) agree with = వ్యక్తితో ఏకీభవించడం.
agree to = దేనికైనా ఒప్పుకోవడం
He agreed to stay for another day
ఇంకో రోజుండడానికి ఒప్పుకొన్నాడు.
She agreed to the proposal
ఆ ప్రతిపాదనకామె ఒప్పుకొంది.
I agree with you that he is the best player
అతడు best player అని అంగీకరిస్తున్నాను/ నీతో ఏకీభవిస్తున్నాను.
iv) Join a college/ a group/ a course - ఇటువంటి సందర్భాల్లో join తర్వాత ఏ preposition రాదు.
v) attend = హాజరవడం - attend college/ class/ marriage etc.
attend to = ఏదైనా బాధ్యతగా చేయడం.
My Father is attending to the repairs of our house.
(ఆయన ఆ పని చూసుకుంటున్నారు)
attend on = రోగులకు, అతిథులకు సపర్యలు చేయడం
a) Please attend on the guests
(Gusets ను చూసుకోండి)
b) When I was ill my sister attend on me.
(నాకు బాగాలేనప్పుడు మా sister చూసుకుంది)

**ప్రశ్న:** *Letter writing*లో చివర *"Thanking you"* అంటారు. అది రైటేనా, లేక *Thank you* అనాలా- వివరించగలరు.
*– వి.కృష్ణమూర్తి, విజయవాడ*

**జవాబు:** సరైన correspondence లో, letter చివర thanking you/ Thank you అనవసరం. కాని చాలామంది ఇలా రాస్తుండడంతో అది వాడుకగా మారిపోయింది. British correspondenceలో Thanking you అరుదు.




# రోజుల ముందు in.. on




M. SURESAN

**Ravi:** Hi Rahul, going somewhere?
(హాయ్ రాహుల్, ఎక్కడికైనా వెళుతున్నావా? )

**Rahul:** I am on my way to class.
(Class కు వెళుతున్నాను)

**Ravi:** So early?
(ఇంత పొద్దున్నేనా? )

**Rahul:** Yes. Our Classes are in the morning from 7.
(మా Classes ఉదయం ఏడింటికి)

**Ravi:** But I saw you at the temple on the morning of the 15th.
(15వ తారీఖు పొద్దున నిన్ను గుడిలో చూశాను మరి)

**Rahul:** Yes. The 15th was a Saturday. We did not have classes on the morning of Saturday.
(15వ తేదీ శనివారం. ఆరోజు పొద్దున మాకు classes లేవు)

**Ravi:** You were planning to go home, when are you leaving?
(ఇంటికి వెళ్లాలనుకున్నావు కదా, ఎప్పుడు వెళుతున్నావు? )

**Rahul:** Yes, on the evening of the 25th
(అవును, 25 సాయంత్రం)

**Ravi:** How do you spend your evenings?
(నీవు సాయంత్రాలు ఏం చేస్తుంటావు? )

**Rahul:** Usually I go for a long walk in the evening
(సాయంత్రం సామాన్యంగా వాకింగ్‌కు వెళుతుంటాను)

ఇక్కడి Prepositions గమనించండి. in (the morning), on (the morning of saturday), in (the evening), on the (the evening of the 25th) etc.

కిందటి lesson లో మనం చూసింది Prepositions of time. ఇంతవరకు మనం తెలుసుకున్నది.. 1) at, కచ్చితంగా ఫలానా time అని తెలిపే మాటల ముందు; 2) on, days and dates ముందు, 3) in, months and years ముందు అని. 4) in, వ్యవధి (a period of time) ను తెలిపే మాటలముందు వాడతాం.

'In' పూటల (Parts of the day) ముందు కూడా వాడతాం.

In the morning, in the evening, in the after noon, in the night or at night.

**Krishna:** When do you get up?
(నీవు ఎప్పుడు నిద్ర లేస్తావు? )

**Kesav:** At 5 in the morning
(ఉదయం ఐదింటికి)

**Krishna:** When do you usually have lunch?
(Lunch ఎప్పుడు చేస్తావు? )

**Kesav:** In the afternoon between 1.00 and 1.30
(మధ్యాహ్నం 1, 1.30కు మధ్య)

గమనించండి. పూటల (Parts of the day) ముందు in వాడడమే కాకుండా, morning, evening etc., ముందు 'the' తప్పక వస్తుంది. (In the morning, in the evening etc.)

ఈ lesson లో conversation గమనించండి.

**a)** In the morning; On the morning of Saturday

**b)** In the evening; on the evening of the 25th. అంటే, morning, evening అనే parts of the day ముందు in వస్తుంది. అయితే ఫలానా రోజు morning, ఫలానా తేదీ evening అన్నప్పుడు వాటి ముందు on వస్తుంది.

**a)** We have classes in the morning everyday except on the morning of Sunday.

**b)** The accident took place in the evening, it was on the evening of last Saturday, the 29th.

**Kumar:** How do I go to Learnwell College from here?
(ఇక్కడినుంచి Learnwell College కి ఎలా వెళ్లాలి?

**Kamala:** You have been here for the past 15 days. Strange that you don't know the way yet.
(నువ్వు 15 రోజులుగా ఇక్కడున్నావు కదా? దారి తెలియకపోవడం విచిత్రమే)

**Kumar:** No, not 15 days. I have been here only since last Sunday. Only 5 days.
(అదేంకాదు. నేను ఇక్కడ పోయిన ఆదివారం నుంచే కదా ఉన్నది. అంటే 5 రోజులే)

**Kamala:** And what have you been doing during the 5 days?
(మరి ఈ ఐదురోజుల్లో నువ్వు చేసిందేమిటి? )

**Kumar:** During these five days I have been busy buying books, clothes etc.

ఈ సంభాషణలో prepositions of time: for, since, during.

for the past 15 days - 15 రోజులుగా
Since last Sunday - last sunday నుంచి
During these 5 days - ఈ ఐదు రోజుల్లో

'for' ఒక period of time ముందు వస్తుంది. for an hour, for a day, for 10 days (పది రోజులుగా). అదే since అంటే గతంలో ఓ సమయం నుంచి అని.
since 1999 (1999 నుంచి)
since he last saw me
(వాడు నన్ను చూసినప్పటినుంచి).

**a)** India has been independent for the past 58 years.

**b)** India has been independent since 1947

a) b) వాక్యాలకు అర్థం ఒకటే. అయితే-

a) భారత్ ఎన్నేళ్లుగా స్వతంత్రదేశంగా ఉన్నదో చెబుతోంది.

b) భారత్ ఎప్పటినుంచి స్వతంత్రంగా ఉన్నదో చెబుతోంది కదా.

Period of time కు ముందు 'for',
point of time (ఫలానా గంట నుంచి/ రోజు నుంచి/ సంవత్సరం నుంచి) అన్నప్పుడు 'since' వాడాలి.
Since the vedic times (వేదాల కాలం నుంచి)
for the past last five thousand years
(5000 ఏళ్లుగా)
I met him last in 2000 Jan
(నేను అతడిని చివరగా 2000 జనవరిలో కలుసుకున్నాను.)

**a)** I have not met him for the past/ the last four years and ten months
నాలుగేళ్ల పదినెలలుగా నేను అతడిని కలుసుకోలేదు.

**b)** I have not met him since January 2000
January 2000 నుంచి నేనతడిని కలుసుకోలేదు.

**c)** During this period he has changed a lot
(ఈ నాలుగేళ్లలో అతడు చాలా మారిపోయాడు)

**Officer:** When did you take your degree?
(మీరు డిగ్రీ ఎప్పుడు తీసుకున్నారు? )

**Candidate:** In April 2000 (April 2000లో)

**Officer:** What have you been doing since then?
(అప్పటి నుంచి- Since then - మీరేం చేస్తున్నారు? )

**Candidate:** I was a teacher for two years upto 2002.
Since then I have been a Software Programmer.
(2002 వరకు రెండేళ్లపాటు teacher గా ఉన్నాను. అప్పటినుంచి Software Programmer గా ఉన్నాను (ఇప్పటి వరకు/ ఇంకా)

**Officer:** During your period as Software Programmer what computer skills have you used?
(Software Programmer గా ఉన్న కాలంలో, ఏ computer skills మీరు వాడారు? )

ఇలా for, since, during అనే prepositions of time ను వాడతారు. ముఖ్యంగా since వాడినప్పుడు దాదాపు ఎప్పుడూ కూడా verb, have been/ has been; have + past participle/ has + Past participle form లోనే ఉంటాయి. ఎందుకంటే ఫలానా టైం నుంచి ఇప్పటివరకుగానీ, ఇంకా అనిగానీ అర్థం కాబట్టి.

**a)** Delhi has been the capital of India since the time of the Pandavas
(పాండవుల కాలం నుంచి భారత్‌కు ఢిల్లీ రాజధానిగా ఉంది- అంటే ఇంకా అని కూడా.)

**b)** India was under the British rule during the 18th, 19th and part of the 20th Centuries
(18, 19 శతాబ్దాలు, 20వ శతాబ్దంలో కొంతవరకు భారత్ British పాలనలో ఉంది.

ఇకపోతే about, around, prepositions of time గా వాడుకలో ఉన్నాయి.

**Kushal:** When did the meeting begin?
(Meeting ఎప్పుడు begin అయింది? )

**Koushik:** (At) about 6.30 in the evening
(సాయంత్రం 6.30, ఆ ప్రాంతంలో)

**Kushal:** When did it end?
(ఎప్పుడు ముగిసింది? )

**Koushik:** Around 8. (8, ఆ ప్రాంతంలో)

About, Around, అనే ఈ prepositions of time, దాదాపు, అనే అర్థంతో time ను తెలిపే మాటల ముందు వాడతాం.

**a)** నేను అక్కడ దాదాపు అరగంట ఉన్నాను
I was there for about half an hour.

**b)** ఆమె 2002 వరకు దాదాపు రెండేళ్లు teacher గా పనిచేసింది.
She worked as a teacher for about/ around two years till 2002.

**c)** We reached home (at) about 1.30
మేము దాదాపు 1.30 కి ఇంటికి చేరాం.

టైం expression- 6 O' Clock, 5.30, 2.00 (AM/ PM)- వీటిముందు దాదాపు ఆ time కు అని చెప్పడానికి at about అంటారు. లేకుంటే at వదిలేసి కేవలం about కూడా వాడుతుంటాం.

ఓ period of time ముందు 'over' వస్తే పైగా అని అర్థం.

**Bhaskar:** How long were you there yesterday?
(నిన్న నువ్వు అక్కడ ఎంతసేపున్నావు? )

**Bhavan:** For over an hour (= for more than an hour = గంటకుపైగా).

**Bhaskar:** When did he come?
(అతడు ఎప్పుడొచ్చాడు? )

**Bhavan:** It was over five when he came.
(అతడు వచ్చేసరికి 5 దాటింది.)

**Corrections:**

Spoken English 43 (6.9.2005 సంచిక)లో:

- మొదటి Column చివర, చివరి line లో "వీటన్నింటినీ prepositions of place and position- అంటే ప్రదేశాలను మనిషి/ వస్తువులు ఉన్న చోట్లను తెలిపేవి అంటాం" అని వచ్చింది. అందుకు బదులు "వీటన్నింటిని Prepositions of time" అని చదువుకోవాలి.
- Last Column 5వ లైన్‌లో- Kumar: (Over to Phone) బదులు (Over Phone) అని ఉండాలి.
- ఈ కింది Vocabulary చూడండి అన్న Line కింద "ఇవన్నీ గుణాలను తెలిపేవి" అనే బదులు "వీటిలో No. 1) గుణాన్ని, No. 2) and 3) పనులను తెలిపేవి" అని చదువుకోవాలి.




**ప్రశ్న:** నాకు Active Voice, Passive కి సంబంధించి ఒక doubt ఉంది. I shall do my home work కు passive రూపం ఉంటుంది. కాని I shall go to market.. లాంటి వాక్యాలకు Passive voice ఉండదు. కారణం ఏమిటి? వివరించండి.
– వి.గౌతమి, తాటిపల్లి, కరీంనగర్ జిల్లా

**జవాబు:** I shall go to market- ఇలాంటి verbs (go - ఇక్కడ shall go) కు passive ఉండదు. verb కు ఎవరిని, దేనిని అని ప్రశ్న వేసుకుంటే సమాధానం వచ్చే సందర్భాలలో మాత్రమే passive ఉంటుంది.
Shall go- ఇక్కడ go అంటే వెళ్లడం- ఎవరిని వెళ్లడం, దేనిని వెళ్లడం అని ప్రశ్న వేసుకుంటే సమాధానం రాదు. కాబట్టి passive ఉండదు.
'do' అంటే దేనిని చేయడం అంటే సమాధానం ఉంది - కాబట్టి దానికి passive ఉంటుంది.

**ప్రశ్న:** ఇంగ్లిష్‌లో టైమ్ చెప్పేటప్పుడు O' clock అని ఎందుకు అంటారు. వట్టి Clock మాత్రమే అనవచ్చుకదా!
– సీహెచ్.మల్లేశం, సిద్ధిపేట

**జవాబు:** O' Clock అంటే of the clock. Of the clock ని కుదించి చెప్పడం, రాయడమే O' clock. ఇక్కడి apostrophe (') వదిలేసే శబ్దాన్ని సూచిస్తుంది. వట్టి clock అంటే ఆ అర్థం రాదు. పూర్తయిన గంటలకు ముందు మాత్రమే O' clock వాడతాం. 7.25 O' clock అనం.



# till.. until..

**Subhash:** Hi pranav, How are you getting along?

**Pranav:** O fine. How is it with you?

**Subhash:** Fine too, thanks. Where in the work have you been? Ages since we met.
(ఇంతకాలం ఎక్కడున్నావు. మనం కలుసుకొని యుగాలయినట్టుంది).

ఇవన్నీ కూడా కుశల ప్రశ్నలు.

**Pranav:** I was in Bangalore for a month from Aug. 1st to/ till Aug 31st, and then in Chennai from Sept. 1st to/ till Sept 6 th, and since then here. (Bangalore లో ఒకనెల, Chennai లో Sept. 6 th వరకు. అప్పటినుంచి ఇక్కడ)

**Subhash:** Happy you are back, and in a good shape too. You remember my cousin Harsha? He is here now. He has been here since the last Saturday. He will be here upto the end of this month.
(నువ్వు ఆరోగ్యంతో తిరిగి వచ్చినందుకు సంతోషం. మా కజిన్ హర్ష గుర్తున్నాడా? అతనిప్పుడు ఇక్కడే ఉన్నాడు పోయిన శనివారం నుంచి. ఈ నెలాఖరు వరకు ఉంటాడు)

**Pranav:** What does he do here until then?
(అంతవరకు ఇక్కడతనేం చేస్తాడు? )

**Subhash:** He is attending coaching classes for ICET.
(ఇక్కడ అతడు ICET Coaching తీసుకుంటున్నాడు)

ఈ Conversation లోని prepositions: of, from, to, since, till, until, upto.

మనందరికీ తెలుసు- from అంటే 'నుంచి'- ఫలాన సమయం నుంచి అనీ, to అంటే ఫలాన సమయం వరకూ అని.

'from-to' జతగా వస్తుంటాయికదా- ఈ జతకు అర్థం: ఫలాన సమయం/ రోజు/ వారం/ నెల/ సంవత్సరం నుంచి (from) ఫలాన సమయం/ రోజు/ వారం/ నెల/ సంవత్సరం వరకు (to) అని.

**Sukanya:** What are your college hours?
(మీ College వేళలేమిటి? )

**Ramakanth:** Our College works from 9 am to 4 pm.
(మా College 9 నుంచి 4 వరకూ పనిచేస్తుంది)

**Sukanya:** Do you have classes upto?
(మీకు నాలుగువరకు Classes ఉంటాయా? )

**Ramakanth:** Except on Saturdays when the College works until 2 pm.
(ఒక్క శనివారంతప్ప - ఆరోజు 2వరకే)

చూశారుకదా: from అంటే ఫలాన time/ day/ week/ years etc., నుంచి అని. To అంటే ఫలాన time/ day/ week/ years etc., వరకు అని.

అప్పుడప్పుడు to కు బదులు, till కూడా వాడుతుంటాం, వరకు అనే అర్థంతో.

**Pratibha:** When is he here everyday?

**Prabha:** He is here from morning 9 till evening 5.

**Pratibha:** Is he here upto 5?
(5 వరకు ఉంటాడా? )

**Prabha:** He is here until 5 everyday.
(ప్రతిరోజూ 5 వరకు ఉంటాడిక్కడ)

'వరకు' అనే అర్థంతో to, upto, till, until అన్నీ ఒకటే. అయితే spoken English లో to, till వాడకం ఎక్కువ.

**Sriram:** Raghu, for how long has your sister been here?

**Raghu:** for the past five days, since the 4th of this month.

from కు, since కూ తేడా: 'from' సామాన్యంగా ఫలాన సమయం నుంచి ఫలాన సమయం వరకు, అనే expressions లో భాగంగా వాడతాం. అయితే since




అలాకాదు. గతంలో ఫలాన సమయం/ తారీఖు/ వారం/ నెల/ సంవత్సరం నుంచి ఇప్పటివరకు, ఇంకా అనే అర్థంతోనే వాడతాం. గతంలో ఓ సమయం నుంచి గతంలోనే ఇంకో సమయం వరకు అయినా, గతంలో ఓ సమయం నుంచి present (ప్రస్తుతం)లో ఓ సమయం వరకయినా, గతంలో ఓ సమయం నుంచి future లో ఓ సమయం వరకైనా, future లో ఓ సమయం నుంచి ఇంకో సమయం వరకైనా from మాత్రమే వాడతాం to తో.

a) ఆయన 2003నుంచి 2004వరకు ఇక్కడ teacher గా ఉన్నారు.
He was teacher here from 2003 to 2004 (రెండూ past)

b) ఆమె ఇక్కడ ఉండాల్సిన period 2004 నుంచి 2006 వరకు.
Her period/ tenure here is from 2004 to 2006.
(from the past to the future)

c) Cricket matches 2005 December నుంచి 2006 January వరకు.
The Cricket matches are from Dec 2005 to January 2006. (Both future)

**Since:** Pastలో ఓ time నుంచి (from some time in the past) ఇప్పటివరకు అనడానికి వాడాల్సింది Since మాత్రమే. from వాడం.

My sister has been here since 2004 February.
(2004 February నుంచి మా sister ఇక్కడే ఉంది)
మామూలుగా She has been here from 2004 అనం.

మనం ఇప్పటివరకు prepositions of place, position and time తెలుసుకున్నాం.

**Now practice the following sentences/ conversation aloud in English.**

a) మా Office రెండో అంతస్తులో ఉంది. అది మొదటి అంతస్తులోని fancy shop పైన ఉంది.

b) **Sunil:** ఆ పుస్తకం ఎక్కడుంది?
**Anil:** ఆ shelf లో
**Sunil:** నేను ఆ పెట్టెలో ఉందనుకున్నా. లోపలంతా వెతికా.
**Anil:** ఆ shelf లో నీ note book మీద ఉంది.
**Sunil:** నేను నిన్నటినుంచి దానికోసం వెతికా.

M. SURESAN

c) **Prabhat:** ఆ match ఎక్కడ జరిగింది?
**Prakash:** మా college play grounds లో
**Prabhat:** ఎప్పుడు జరిగింది?
**Prakash:** నిన్న పొద్దున ఏడింటికి మొదలై తొమ్మిదింటికి అయిపోయింది.
**Prabhat:** Sunday morning కూడా Match ఉండిందా?
**Prakash:** Matches అన్నీ mornings జరిగాయి. Sunday morning జరిగిన match చాల interesting గా ఉంది.

d) **Suseela:** నేనిక్కడ 2003 నుంచి ఉన్నా. ఒక్కసారి మాత్రమే Charminar పైకి వెళ్లాను. కిందకు దిగి వచ్చేటప్పుడు దాదాపు పడిపోయాను.
**Sucharita:** నీ వెనుకా, నీ ముందూ ఎవరూ లేరా నిన్నాపడానికి?
**Suseela:** సుప్రియ ఎక్కడో పైన ఉంది. Sulekha నాకంటే చాల కింద ఉంది. నేనే ఎలాగో control చేసుకున్నా.
**Sucharita:** ఇదెప్పుడు జరిగింది?
**Suseela:** ఓ January సాయంత్రం. ఓ ఆదివారం.

**ANSWERS:**

a) Our office is on the 2nd floor. It is just above the fancy shop on the first floor.

b) **Sunil:** Where is the book?
**Anil:** In the shelf.
**Sunil:** I thought it was in the box. I searched inside the box.
(search for = వెదకటం)
I looked for it inside the box.
**Anil:** It is on the notebook in the shelf.
**Sunil:** I have searched for it since yesterday.

c) **Prabhat:** Where did the match take place?
(take place = జరగడం)
**Prakash:** On our college playgrounds.
**Prabhat:** When?
**Prakash:** It began at 7 in the morning yesterday and was over by 9
**Prabhat:** Was there a match on Sunday morning too?
**Prakash:** All matches were in the morning. But the match on Sunday morning was very interesting.

d) **Suseela:** I have been here since 2003 but I have been up the Charminar only once. While coming down I almost fell.
(almost = దాదాపు)
**Sucharita:** Was there none before you and behind you to stop you?
**Suseela:** Supriya was far above me, and sulekha far below me. I controlled myself somehow.
(far = (ఇక్కడ) చాల)
**Sucharita:** When did this happen?
**Suseela:** On a January evening, on a Sunday.

**ప్రశ్న:** 1. *మీరు A, An గురించి ఇచ్చిన వివరణ పూర్తిగా లేదు. ఎందుకంటే కొన్ని సందర్భాల్లో capital letters వచ్చినప్పటికీ a వాడతాం. ఉదా: A Union, A European, A One-way traffic etc.,*

2. *'Mother loves her child' wrong అన్నారు. కాని widest sense లో article రాదు. ఉదా: Rose is beautiful అన్నప్పుడు All Roses అని అర్థం. A rose అంటే ఒకే rose అవుతుంది కదా! అప్పుడు అన్ని Roses అందమైనవి అని అర్థంరాదు. దీని గురించి పూర్తి వివరణ ఇవ్వగలరు.*

3. *Water uncountable కనుక plural - 's' రాదు అన్నారు. కాని వస్తుంది. Deep waters, Troubled waters అని అంటాం కదా! వివరించండి.*

4. *I get up at 6 a.m. అన్నప్పుడు Everyday అని రాయక్కరలేదు. అది habitual కనుక everyday అని రాయకూడదు. వివరించగలరు.*

– వి.వి.ఆర్.కె.రావు, విశాఖపట్నం

**జవాబు:** 1. A, An గురించి వివరించిన సందర్భంలో ఎక్కడా Capital letters ముందు a/ an వాడకూడదనిగానీ, వాడం అనిగానీ లేదుకదా.

2. countable, singular ఎక్కడ ఉన్నా దానిముందు a/ anకానీ, సందర్భాన్ని బట్టి 'The' కానీ వాడవలసిందే. Mother loves her Child తప్పేకదా. 'mother' countable singular కనుక. A/ anకు 'ఒక' అనే అర్థమే కాకుండా, 'any' అని, 'all' అనీ కూడా అర్థాలున్నాయి కదా. Generalise చేసేటప్పుడు A mother loves her child అంటాం. దాని అర్థం every mother అని, లేదా 'any mother' అని. అంతేకానీ ఒక mother అని కాదు. 'A dog is a faithful animal' అన్నప్పుడు A dog = all animals of the species (ఆ జాతికి అర్థం వస్తుంది). మీరన్నట్టు, Countable singular, Widest sence లో A/ an రానిది ఒక్క 'Man' విషయంలోనే. eg: Man is mortal: Man proposes, God disposes. మిగతాచోట్ల కచ్చితంగా ఏదో ఒక article రావాల్సిందే కదా. 'Rose' is beautiful అనడం తప్పే. A rose (any rose/ every rose) is beautiful అనడం correct. 'A/ an' కాకపోతే, The rose (all flowers of the rose species) is beautiful అనైనా అనాలి. 'Rose' is beautiful కరెక్ట్ కాదు Rose అనేది అమ్మాయి పేరైతే తప్ప. (చూడండి. Oxford/ longman's/ Collins Dictionary/ any standard grammar book.

3. Waters అనే plural form కు అర్థం ఒక నది/ సముద్రంలోని నీళ్ళు అని. (Eg: The waters of the Krishna (river). మామూలు నీళ్ళ గురించి మాట్లాడేటప్పుడు Water అనే అంటాం. Water dissolves salt. ఇలాంటప్పుడు Waters అనం కదా. అది అప్పుడు uncountable.

4. I get up at 6 AM అన్నప్పుడు every day అనక్కరలేదు. కరెక్ట్. కానీ అనడం తప్పు కాదు. 'How often do you go there?' అన్న ప్రశ్నకు ప్రతిరోజూ వెళ్తాను అని సమాధానం.
I go there every day. ఇక్కడ everyday తప్పు కాదు.
I go to bed at 10 every night. ఇక్కడ every night అనవసరమేకాని, తప్పుకాదు.




# take off your...




**Janaki:** Jamuna, Who are you looking at?
(జమునా, ఎవరిని/ ఎవరివైపు చూస్తున్నావు? )

**Jamuna:** The man walking across the road and turning towards the bank building. He is going into the bank now.
(Road దాటుతూ bank building వైపు నడుస్తున్న అతడిని. అతనిప్పుడు bank లోకి వెళ్తున్నాడు)

**Janaki:** He is turning to the left in the bank now. Is that the man? Why are you interested in him?
(ఇప్పుడతడు బ్యాంకులో ఎడమవైపు తిరుగుతున్నాడు. అతడేనా? అతడి గురించి ఎందుకంత ఆసక్తి? )

**Jamuna:** Don't you remember? The other day he jumped into the river to save my drowning cousin, that five year old Ramesh
(గుర్తులేదా? ఆరోజు నా cousin, ఐదేళ్ల కుర్రాడు రమేశ్ మునిగిపోతుంటే నదిలోకి దూకి రక్షించాడు)

**Janaki:** Yes, I remember. Really brave
(ఆ గుర్తొచ్చింది. నిజంగా ధైర్యస్థుడే)

**Jamuna:** I wish to go to him and thank him
(అతడి దగ్గరకెళ్ళి thanks చెప్పాలనుంది)

**Janaki:** He is out of the bank now and walking away very fast.
(అతడు bank బయటకొచ్చి, చాలా త్వరగా వెళ్తున్నాడు)

**Janaki:** He is already past the 'tiffin centre'. We shall not be able to reach him. It is too late. And walking through this crowd will delay us.
(ఇప్పటికే టిఫిన్ centre దాటి వెళ్లిపోయాడు. అతడిని మనం చేరుకోవడం కష్టం. ఇప్పటికే ఆలస్యం అయింది. ఈ జనంలోంచి నడవడం ఇంకా ఆలస్యం అవుతుంది)

ఈ సంభాషణలోని prepositions: at, across, towards, into, to, outof, past, through

ఈ prepositions అన్నింటినీ prepositions of direction అంటాం. అంటే వీటిని directions (దిక్కులు) చూపించేందుకు వాడతాం.

**1. across:**

ఇంతకుముందు lessons లో across the road లాంటి సందర్భాల్లో 'across' అంటే అవతల, అవతలి వైపు అని తెలుసుకున్నాం. ఇక్కడ across అంటే (walking across అన్నప్పుడు) అడ్డంగా అని.

రోడ్డును దాటుతూ ఉంటే, అతడిని లారీ ఢీకొంది

While he was walking across the road, a lorry knocked him down

(while crossing the road అని కూడా అనవచ్చు)

Sailing across the sea in a rudderless boat is foolish

(చుక్కాని లేని నావలో సముద్రాన్ని దాటడం అవివేకం) (rudder = చుక్కాని)

**2. Towards/ to:**

ఆ police నావైపే వస్తున్నాడు, నాకేదో భయంగా ఉంది

The policeman is coming towards to me. I'm (I am) afraid

ఇక్కడ to = towards = ఒకరి/ ఒక ప్రదేశం వైపు

Walk across the sands towards the shore, you will find the blue water of the sea

ఇసక దాటి తీరంవైపు వెళితే నీకు సముద్రంలోని నీలినీళ్లు కనిపిస్తాయి.

The arrow points to the north

ఆ బాణం గుర్తు ఉత్తరం దిక్కుకు చూపిస్తోంది.

**3. Into: Into -** అంటే లోనికి.

అతడు Bank లోకి వెళ్తున్నాడు

He is walking into the bank.

నదిలోకి దూకడం = Jumping into the river

Walk into my place at midnight and I shall be happy to invite you with a cup of coffee or tea

నువ్వు అర్ధరాత్రయినా మా ఇంటికిరా. ఓ కప్పు కాఫీతో గానీ టీతోగానీ నీకు స్వాగతం పలుకుతా!

ఎవరినైనా మనం హృదయపూర్వకంగా "నీవు మా ఇంటికెపుడయినా నిస్సంకోచంగా రావచ్చు" అనడానికి ఇలా అంటాం.

Into - ఏదైనా రంగంలో పనిచేయడాన్ని కూడా సూచిస్తుంది. ఇది ఈమధ్య బాగా వాడుకలోకి వస్తోంది.

He is into business

అతనేదో వ్యాపారం చేస్తున్నాడు

ఆమె software (computers)లో పనిచేస్తోంది

She is into software.

కిందటి సంవత్సరం అతడు పాల వ్యాపారం ప్రారంభించాడు. ఇప్పుడేం చేస్తున్నాడో తెలియదు

He was into dairy last year. No idea what he is now.

**4. Out of:** ఇది into కు opposite. దేనిలోనుంచయినా బయటకు రావడం.

**Ramesh:** Have you seen Manyam?
(మణ్యం ఏమన్నా కనిపించాడా నీకు? )

**Naresh:** I saw him coming out of the home and getting into an auto. Perhaps he has gone to the doctor. (అతడు ఇంటి నుంచి బయటకు వచ్చి Auto లో వెళ్లడం చూశాను. బహుశ doctor దగ్గరకు వెళ్లాడేమో?

**Ramesh:** Why doctor?
(Doctor దగ్గరకు ఎందుకు? )

**Naresh:** Don't you know? He isn't (is not) yet out of his fever. Add to that his boss is troubling him a lot.
(మీకు తెలియదా? అతడింకా జ్వరం నుంచి బయటపడలేదు. దానికితోడు (Add to that) వాళ్ల boss అతడిని చాలా ఇబ్బంది పెడుతున్నాడు)

**Ramesh:** Why doesn't he get out of the job?
(ఆ job నుంచి బయటపడకూడదూ/ వదిలిపెట్టకూడదూ? )

ఇవి 'out of' అర్థం, ఉపయోగమూను.

**5. Past -** దాటి వెళ్లడం.

**Anwar:** I saw you hurrying past our shop this morning. Where were you going?
(నువ్వు పొద్దున హడావిడిగా మా షాప్ ముందు నుంచి /shop దాటి వెళ్లడం చూశాను. ఎక్కడికి వెళ్తున్నావు? )

**Aswin:** My uncle was coming by the 7 AM train- I was rushing to the station to receive him.
(మా uncle 7 AM train లో వస్తున్నాడు. ఆయన్ను receive చేసుకోడానికి station కు హడావిడిగా వెళ్ళాను)

**Anwar:** Is he here now?
(ఆయన ఇప్పుడిక్కడున్నారా? )

**Aswin:** No, he got off the train, and drove to the college. He is delivering a lecture there.
(ఆయన train దిగి ఇక్కడి college కి వెళ్ళిపోయారు. అక్కడాయన ఏదో lecture ఇస్తున్నాడు)

**Anwar:** You are still on your bike. Get off it and have some tea with me.
(నువ్వు ఇంకా bike మీదనే ఉన్నావు. దిగి నాతో కాస్త tea తాగు)

ఇక్కడ past, off అనే prepositions వాడాంకదా. past అంటే ఒక వ్యక్తినిగాని, ఒక ప్రదేశాన్నిగాని దాటి వెళ్లడం, లేకుంటే పక్కనుంచి/ అటువైపు నుంచి వెళ్లడం.

అతడు post office దాటి వెళ్లాడు

He is now past the post office.

అతడు ఇప్పుడే నా పక్కనుంచి/ నన్ను దాటి వెళ్లాడు

He has just walked past me.

('నా ముందునుంచి' అనే అర్థం కూడా ఉంది)

By the time he joined us, we were past our school

వాడు మాతో కలిసేటప్పటికి మా school దాటి వెళ్ళిపోయాం.

M. SURESAN

**6. Off:** ఈ preposition అర్థం ఒకచోటి నుంచి కదిలి వెళ్ళిపోవడం.

**Sankar:** (On the bus = busలో) Hi Sanjeev, where are you going?

**Sanjeev:** To Nampalli station, where are you going?

**Sankar:** I am getting off the bus at Abids. I am going my aunt's, half a kilometre off Tilak Road.
(నేను ఆబిడ్స్‌లో దిగిపోతున్నా. అక్కడి నుంచి Tilak Road కు అరకిలోమీటర్ దూరంలో ఉన్న మా Aunt ఇంటికి వెళ్తున్నా.)
(off అంటే ఇక్కడ away from అని).

**Sanjeev:** Your top shirt button has come off your shirt.
(నీ shirt button, shirt నుంచి ఊడి వచ్చేసింది)

Off uses ఇంకా చూడండి.

a) Take off your feet from on the table
Table మీదనుంచి నీ పాదాలు (కాళ్లు) తీసేయి.

b) Police అతడి driving license తీసేసుకున్నారు
The police have taken off his driving license.

c) టెండూల్కర్ ఇప్పుడు team లో లేడు
Tendulkar is off the team.

d) సినిమాల్లో అతడు villain పాత్రలు వేసినా, బయట చాలా మంచివాడు
Though he acts the roles of villain on the screen, he is a fine gentleman off the screen

e) బయట ఆమె ఏమంత అందంగా ఉండదు
Off the screen she is not so glamourous, I mean off her make up (Make up లేకుండా)

ఇటువంటి చోట్లంతా off = away from (ఒక చోట నుంచి దూరంగా) అని.

**7. Through:** తెలుగు అర్థం 'గుండా'

**a) Bhaskar:** Where is the manager's room, please?

**Receptionist:** Please pass through the door on the left and then turn left
(ఎడమవేపు ద్వారం గుండా వెళ్లి మళ్లీ left తిరగండి)

**b)** As the train went through the tunnel, it became suddenly dark
Train సొరంగం గుండా/లోంచి వెళ్లేప్పుడు, అంతా ఒక్కసారిగా చీకటైపోయింది.

**c) Chandan:** Did you get your favourite hero's autograph yesterday?
(నిన్న మీ అభిమాన నటుడి autograph తీసుకున్నావా? )

**Chandra:** No, It was impossible to push my way through the crowd to get to him
(జనంలోంచి తోసుకుని ఆయన దగ్గరకు వెళ్లడం సాధ్యం కాలేదు)

**d)** Please pass the thread through the eye of the needle.
(ఆ సూదిలోకి దారం ఎక్కించండి.
Eye of the needle= సూది కంత)

**e) Bhagavan:** When am I getting the money?
(నాకు డబ్బెప్పుడు వస్తుంది? )

**Brahman:** Tomorrow. I will send it through Vishnu.
(రేపు విష్ణు ద్వారా పంపిస్తాను)

**Bhagwan:** Why through Vishnu? You yourself give if to me.
(విష్ణు ద్వారా/ తో ఎందుకు? నువ్వే ఇవ్వు)

**Now practice the following in English:**

**Prabhakar:** ఎక్కడ్నించి వస్తున్నావు?

**Pramod:** ఇప్పుడే train దిగాను. Chennai నుంచి వస్తున్నాను.

**Prabhakar:** ప్రయాణం ఎలా ఉంది?

**Pramod:** రాత్రంతా వానలోనే ప్రయాణం. ప్రయాణంలో అంతా నిద్రపోయాననుకో. నిద్ర లేచేసరికి train తెనాలి దాటింది.

**Answers:**

**Prabhakar:** Where are you coming from?

**Pramod:** I have got off the train just now; from Chennai.

**Prabhakar:** How was the journey?

**Pramod:** The Journey the whole night was through rain. I slept through the journey. The train was past Tenali When I got up.




**ప్రశ్న:** *Says Rakhi, designer, "since I was walking on footpath the offender could not get too close to me. So he caught hold of my duppatta and almost choked me. The incident left an ugly scar on my neck.*

*ఈ వార్త eve teasers గురించి English daily లో వచ్చింది. ఇందులో since వాడకం అర్థం, ఉపయోగం చెప్పండి. అలాగే ఒక example sentence ఇవ్వండి.*

***– ఎస్.రాజేశ్, భువనగిరి, నల్గొండ జిల్లా***

**జవాబు:**

i) ఇక్కడ since అంటే because (అందువల్ల). since I was walking on the foot path - నేను foot path మీద నడుస్తున్నందువల్ల అని. (Since it is raining, I want an umbrella- వర్షం వస్తున్నందువల్ల నాకు గొడుగు కావాలి.)

ii) Road కు ఇరువైపుల ఉండేవి foot path, platform కాదు. అది సరైన English కాదు. Road కు ఇరువైపులా ఉండేవి Pavements. American English లో sidewalk.

iii) Eve teasers అనేమాట కూడా English లో లేదు.




# He left school at..




M. SURESAN

**Murali:** Hi! Manoj, what brings you to this office again?
(హాయ్ మనోజ్, ఏంటి మళ్లీ office కు వచ్చావు? )

**Manoj:** I've (I have) come for my service certificate.
(నా service certificate కోసం వచ్చా )

**Murali:** How long did you work here?
(నువ్వెంతకాలం పనిచేశావిక్కడ? )

**Manoj:** I joined here at the age of 20 and left at the age of 23. That means 3 years. To be exact it is a little over three years.
(నేనిక్కడ 20వ ఏట చేరాను. 23వ ఏట వెళ్ళిపోయాను. అంటే మూడేళ్లు. correct గా అయితే మూడేళ్లకు కొద్దిగా పైనే)

**Murali:** Murthy has also left us. isn't he (is he not) the same age as you?
(మూర్తి కూడా ఈ office వదిలి వెళ్లిపోయాడు. అతను కూడా నీ వయసే కదా? )

**Manoj:** No, I am 23 now, and he is above 24. He is atleast a year older than I. What about you?
(కాదు. నాకు ఇరవైమూడేళ్లు. అతడికి ఇరవై నాలుగేళ్ల కంటే ఎక్కువే. నీ సంగతేమిటి? )

**Murali:** I am under twenty one. I am slightly, that is, just a few months over 20.
(ఇరవైఒక్కేళ్లకంటే కొంచెం తక్కువ. 20 ఏళ్ల కంటే కొన్ని నెలలు ఎక్కువ)

ఇక్కడి prepositions చూడండి: at (the age of), above (24), under (20), over (20) గమనించారు కదా. ఈ prepositions అన్నీకూడా వయస్సుకు సంబంధించిన సందర్భాల్లో వాడాం. కాబట్టి వీటిని prepositions of Age అందాం.

**1. at** (the age of)
ఫలాన వయస్సుకు/ ఫలాన వయసప్పుడు/ ఇన్నోఏట/ ఇన్నేళ్లప్పుడు - వీటిలో ఏది చెప్పాలన్నా వాటి ముందు at వాడతాం.

**a)** వాడు 16 ఏళ్లకు school వదిలిపెట్టాడు.
He left school at 16/ at the age of 16/ at 16 years of age.

**b)** ఆమెకు 22వ ఏట పెళ్ళయింది.
she got married at 22/ at the age of 22

**c)** చిన్న/ పెద్ద/ సరైన వయసులో
at a young age/ at an old age/ at the proper age

**2.** ఒక వయసుకు పైబడి ఉంటే = above

**a)** 60 ఏళ్ల పైబడిన వాళ్లు senior citizens
people above 60 years of age are senior citizens.

**b)** అతడు 40 ఏళ్లకంటే పెద్దవాడుగా కనిపించడం లేదూ?
Doesn't he (does he not) appear to be above 40?

**c)** 35 ఏళ్ల కంటే పెద్దవాళ్లు Government jobs కు అర్హులుకారు
Those above 35 years of age are not qualified for govt. jobs
ఇటువంటిచోట్ల above బదులు over కూడా వాడవచ్చు
Those above 35 = Those over 35

**3.** ఒక వయసుకు తక్కువ అయితే = below

i) రెండేళ్లకంటే తక్కువ వయసున్న పిల్లలకు మాత్రమే ఈ మందు ఇస్తాం
We give this medicine only to children below the age two.

ii) అతడి వయస్సు 20 ఏళ్లకంటే తక్కువే
He is below 20

iii) అతడి వయస్సు business ప్రారంభించినప్పుడు 20 ఏళ్లలోపే
He was below twenty (years of age) when he started his business.

iv) 15 ఏళ్లలోపు పిల్లలకు కాదీ సినిమా
This movie is not for those below 15
ఇక్కడ below బదులు under వాడవచ్చు
(below = under ఇక్కడ)

v) 14 ఏళ్లకంటే తక్కువ వయసు పిల్లలను పనుల్లో పెట్టుకోకూడదు.
Nobody shall appoint for any work boys or girls under 14

**4.** రెండు వయసుల మధ్య = between

**Parent:** Will you let my daughter participate in the competition
(పోటీలో మా అమ్మాయిని పాల్గొననిస్తారా? )

**Teacher:** How old is she? which class is she in?
(వయసెంత? ఏ class లో ఉంది? )

**Parent:** She is ten plus. she is in VI class.
(పదేళ్లకన్నా ఎక్కువ. ఆరో తరగతి చదువుతోంది)
(above ten/ over ten/ ten plus)

**Teacher:** I'm sorry. This competition is for children between five and nine years of age, that is, for pupils of I class to V class.
(Sorry, ఈ పోటీ ఐదు, తొమ్మిదేళ్ల వయస్సుండి, I Class నుంచి V Class చదివే వాళ్లకు మాత్రమే)

చూశారు కదా! Prepositions of age:

**a)** at the age of/ at a young age/ at an old age/ at the proper age
ఫలాన వయస్సులో/ కు, చిన్న/ పెద్ద/ సరైన వయసులో.

**b)** above/ over a certain age
ఫలాన వయస్సుకు పైబడి (ఇటువంటిచోట్ల more than so many years అనవచ్చు).

**c)** below/ under ఒక వయసుకు లోబడి.
(Less than/ lower than కాదు)

**d)** between = రెండు వయస్సుల మధ్య.

**NOW PRACTICE THE FOLLOWING:**

**a) Pavan:** నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావు (ఇందాక)
**Ravikanth:** మా మామయ్యతో
**Pavan:** మీ మామయ్యా? 25 ఏళ్లలోపు వాడిలా కనిపిస్తున్నాడు. నీకంటే రెండు మూడేళ్లేనా పెద్ద?
**Ravikanth:** పిచ్చిపిచ్చిగా మాట్లాడకు. నాకేమో ఇరవై. ఆయనకు 35 కంటే ఎక్కువే.
**Pavan:** అంతవయసున్నట్లు కనపడడే.
**Ravikanth:** చిన్నవయసులోనే ఆయన foreign వెళ్లాడు. Last week తిరిగొచ్చాడు.

**b) Jagdeesh:** నీకీ పోటీలో పాల్గొనే అర్హత ఉందా?
(అర్హత ఉండటం = eligible,
పాల్గొనటం = participate/ take part,
పోటీ = competition/ contest)
**Suma:** 20, 30 ఏళ్ల మధ్య వాళ్లకు మాత్రమే అది.
**Jagadeesh:** అయితే నీకు అర్హత ఉంది కదా?
**Suma:** నాకు 30 ఏళ్లు దాటిందని చెప్పించాలని అనుకుంటున్నారా?
**Jagadeesh:** Sorry, నీవు 30 ఏళ్లలోపే అనుకున్నా.

**c) Naresh:** Hi, Ajitha, అందరూ కులాసానా?
**Ajitha:** వారం కింద మా తాతగారు పోయారు.
**Naresh:** అయ్యో! ఆయన వయస్సెంత?
**Ajitha:** పెద్దవయసులోనే చనిపోయాడు. అయితే ఆయన లేని లోటు లోటే. ఆయనకు 78 ఏళ్లు. నేను పుట్టినప్పటికే ఆయనకు 55 ఏళ్లపైనే. మా అమ్మమ్మకు 50 లోపు.
**Naresh:** అంత వయసులోనూ ఆయన చాలా కులాసాగానే ఉన్నాడు కదా!

**ANSWERS**

**a) Pavan:** Who were you talking to?
**Ravikanth:** To my uncle.
**Pavan:** Your uncle? He appears to be below 25 years. Is he older than you by two or three years only?
**Ravikanth:** Don't be silly. I am 20 years Old. He is above 35.
**Pavan:** He doesn't (does not) look his age
**Ravikanth:** He went abroad at a very young age. He returned only last week.

**b) Jagadeesh:** Are you eligible to participate in the competition?
**Suma:** It is only for those between 20 and 30 (years of age)
**Jagadeesh:** Then you are eligible
**Suma:** Do you want to make me say that I am above 30
**Jagadeesh:** Sorry, I thought you were under thirty.

**c) Naresh:** Hi Ajitha, how is every body?
**Ajitha:** My grandfather died a week ago (Week back కాదు)
**Naresh:** Sorry to hear that. What was his age? / How old was he?
**Ajitha:** He died at an old age. We do miss him, of course. He was 78. When I was born he was above/ over 55. Grand mother was below/ under 50.
**Naresh:** Even at such an age he was healthy.




**ప్రశ్న:** *1) I' asked him not to అంటే ఏమిటి? Sentence చివర not to ఏ సందర్భంలో వాడతారు?*
*2) What the postman must do is provide the address- అంటే అర్థమేమిటి?*
*do తరువాత is ఏ సందర్భంలో వస్తుంది?*

***– బి.రాజేందర్, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా***

**జవాబు:** 1) 'I asked him not to' అంటే ఎవరైనా ఏదైనా చేస్తామని అంటే, వద్దు అని అర్థం.
A: He said he would complain to the police.
B: I asked him/ told him not to.
(అంటే Police complaint ఇవ్వవద్దని చెప్పాను, అని)
2) What the postman must do is అంటే Postman ఏం చేయాలంటే అని అర్థం. What the Postman must do is provide the address = Postman చేయాల్సిందేంటంటే address ఇవ్వడం. ఇదీ దీనర్థం. ఈ కింది సందర్భంలో do is వస్తుంది.
What you must do (now) is, study well and get good marks
నువ్విప్పుడు చేయాల్సిందల్లా బాగా చదివి marks తెచ్చుకోవడం.

**ప్రశ్న:** *I Know her (A.V.)*
*She is Known by me (P.V.) or*
*She is known to me (P.V.)*
*పై వాక్యంలో A.V.ని P.V.లోకి మారిస్తే ఏ వాక్యం Correct? ఎందుకు? వివరించగలరు.*
*అదే విధంగా -*
*The Water fills the tank (A.V.)*
*The tank is filled by the water (P.V.)*
*(or)*
*The tank is filled with the water (P.V.)*
*P.V.లో ఏ వాక్యం Correct?*

***– దమ్ము వెంకట అప్పారావు, మునగపాక, విశాఖపట్నం జిల్లా***

**జవాబు:** Passive లో, know విషయంలోనూ, fill విషయంలోనూ by రాదు. is known to, is filled with అని వస్తుంది.
'fill' విషయంలో ఎవరు fill చేశారు అని చెప్పడానికి by వస్తుంది.
The tank is filled with water by Ram.




# The pen is mine







**Kranthi:** Hi Karuna, How are you?
**Karuna:** Fine. Thank you. How are you?
**Kranthi:** Fine too. How is your new job?
(నీ కొత్త job ఎలా ఉంది? )
**Karuna:** Absolutely no complaints. None above me. I am the boss.
(బాధలేం లేవు. పూర్తిగా బాగుంది. నాపైన ఎవరూ లేరు. boss ను నేనే.)
absolute = పూర్తిగా
**Kranthi:** How many are there in all?
(మీ office లో మొత్తం ఎంతమంది? )
(in all = మొత్తం)
**Karuna:** There are five under me. My position is below that of the Area Manager.
(నా కింద ఐదుగురు పనిచేస్తున్నారు. నేను Area Manager తర్వాత స్థాయిలో ఉన్నాను)
**Kranthi:** How many branches has your Company?
**Karuna:** Between 12 and 14.
(12, 14 మధ్య. branches – సంఖ్య)
**Kranthi:** Is the work heavy?
(చాలా పనుంటుందా)
heavy- ఎక్కువగా (ఇక్కడ)
**Karuna:** No. Not above 15 files a day. On Saturday it is even below 7 or 8.
(రోజుకు 15 files కంటే ఉండవు. Saturday అయితే 7, 8 కన్నా తక్కువే)
**Kranthi:** How Hours at office?
(రోజుకు ఎన్ని గంటలు? )
**Karuna:** Not so rigid. We are there between 10 AM and 6 PM for above six to six and a half hours.
(అంటే కచ్చితమైన సమయాలు లేవు. పదింటికి ఆరింటికి మధ్య 6, 6 1/2 గంటల పాటు ఉంటాం)

ఈ సంభాషణలోని prepositions గమనించారు కదా: above, below, under, between.

**1.** 'Above' కు ఉన్న కొన్ని ఉపయోగాలు ఇంతకు ముందు lessonలో తెలుసుకున్నాం. ఇక్కడ 'above' ఉపయోగం చూద్దాం.

**Karuna:** None above me. I am the boss.
అంటే మా officeలో నాపైన ఎవరూ లేరు. నేనే అధికారిని.

అధికారంలో, హోదాలో ఒకరిపైన ఇంకొకరు ఉండటాన్ని 'above' అంటాం. అలాగే 'there are five under me' – ఇక్కడ under అంటే అధికారంలో, హోదాలో కింద ఉండటం.

Home Minister హోదా Chief Minister హోదా కన్నా తక్కువ
The rank of the Home Minister is below that of the Chief minister. The Home Minister under the Chief Minister in power and rank.
(ఇక్కడ గమనించాల్సిన అంశం. ఒక హోదా కన్నా తక్కువ/ ఒకరి కింద= below. ఒకరి కింద= under అంటాం. అయితే 'Officers below/ under the rank of the district collector - ఇలాంటి sentences లో below, under రెండూ వాడవచ్చు)

**a)** VEO హోదా పైన ఉన్న officers కు మాత్రమే jeep ఉపయోగించే అర్హత ఉంటుంది. Those / officers above the rank of the VEO are eligible for jeeps. (eligible= అర్హత కలిగిన)

**b)** Collector హోదాకు తక్కువ అధికారులకు ఈ అధికారం లేదు
Those below/ under the rank/ position of the Collector do not have this power.

**c)** ప్రతి పదిమందిపైన ఓ Supervisor ఉంటాడు ఈ Officeలో
There is a supervisor over/ above every ten workers.

ఇటువంటిచోట్ల rank కు బదులు, position, level, designation అనికూడా అనవచ్చు. 'హోదా' అర్థంలో.

**2. Between:** రెండు హోదాల మధ్య

**a)** MROకు Collectorకు మధ్యలో Sub-collector ఉంటారు.
The Sub collector is between the MRO and the collector in rank and power.

ఈ prepositions గురించి సంగ్రహంగా:

**a)** above/ over= పైన/ ఎక్కువయిన/ మించిన - హోదాలో/ సంఖ్యలో
**b)** below/ under = కింద/ తక్కువయిన / తగ్గిన - హోదాలో/ సంఖ్యలో
**c)** between = మధ్య (హోదాలో/ సంఖ్యలో)

**NOW PRACTICE THE FOLLOWING:**

**1) Bharani:** Hi Dharani, ఎలా ఉన్నావు?
**Dharani:** కులాసానే, ఇంతకీ మొన్న నీ birthday party కి ఎంతమంది వచ్చారు?
**Bharani:** నేను కరెక్ట్‌గా లెక్కపెట్టలేదు. 35, 40 మధ్య వచ్చినట్టున్నారు.
**Dharani:** కొంత మంది Officers కూడా వచ్చిన ట్టున్నారా?
**Bharani:** వాళ్ల మానాన్న Colleagues (సహోద్యోగులు). వాళ్లలో ఇద్దరు ముగ్గురు Marketing Manager కంటే పై వాళ్లు.
**Dharani:** మీ నాన్నగారి కంటే పైవాళ్లా?
**Bharani:** చాలామంది మానాన్నగారికంటే కింది వాళ్లే. ఒకరిద్దరు మానాన్నకంటే ఎక్కువ హోదాలో ఉన్నవాళ్లు.

**2) Chandra:** Hi Surya, come in. నిన్న ఎక్కడు న్నావు?
**Surya:** నేనూ, నా Classmates Picnic కు వెళ్లాం. దాదాపు పదిమందిమి.
**Chandra:** బాగా గడిపారా?
**Surya:** ఆ, నిన్న చాలా ఆహ్లాదకరంగా ఉంది. ఉష్ణోగ్రత 25 డిగ్రీల కన్నా తక్కువే. చల్లగా హాయిగా ఉంది. మేమక్కడ ఆరుగంటల పైనే గడిపాము. మాలో ఒకరు ఒక Cake తెచ్చారు. రెండు కిలోల కన్నా ఎక్కువ బరువుంది.
**Chandra:** ఒక్కొక్కరికి ఎంత ఖర్చయింది?
**Surya:** 250, 300 రూపాయల మధ్య.

**ANSWERS**

**1) Bharani:** Hi Dharani, how are you?
**Dharani:** Fine, By the by, how many attended your birthday party the day before (yesterday)?
**Bharani:** I didn't count exactly. There were between 35 and 40
(The people present were between 35 and 40)
**Dharani:** Some Officers were also there, I think.
**Bharani:** They are all my dad's colleagues. Two or three of them are above the rank of marketing Managers.
**Dharani:** Are they above your dad?
**Bharani:** Most of them are below/ under my dad. one or two of them are above my dad.

**2) Chandra:** Hi, Surya, come in. Where were you yesterday.
**Surya :** My classmates and I went for a picnic. We were about ten.
**Chandra:** Did you enjoy yourselves?/ Did you enjoy the day (Picnic)? / Had a good time?
**Surya:** Yesterday was very pleasant. The temperature was below 20 degrees. cool and pleasant. We were there for over six hours. one of us brought a Cake. It was above 2 Kgs.
**Chandra:** How much did each spend?
**Surya:** Between Rs 250 and 300 each.

♦ ♦ ♦ ♦

**Dharmendra:** We are all going on a Picnic. Won't you join us?
(మేమంతా Picnic వెళ్తున్నాం. నువ్వు రాకూడదూ? )
**Damodar:** When is the Picnic?
(Picnic ఎప్పుడూ? )
**Dharmendra:** On Sunday. It is a nice spot.
(Sunday వెళ్తున్నాం. ఆ పిక్నిక్ వెళ్లే ప్రదేశం కూడా బాగుంటుంది.)
**Damodar:** Where is the spot?
(ఆ చోటు ఎక్కడ? )
**Dharmendra:** It is on the riverside. Far off from the town. A lonely spot. It is an ideal spot for a picnic.
(నది ఒడ్డున ఊరికి దూరంగా. చాలా అందమైన చోటు. Picnic కు అను వైన చోటు).

ఇందులో a, an, the ఉపయోగం పరిశీలిద్దాం. ఇది వరలో a/ an ఉపయోగం తెలుసుకున్నాం కదా.

**1)** Countable singulars (లెక్కపెట్టే వాటిలో ఒక దాన్ని మాత్రమే చెప్పినప్పుడు) ముందు A/ An వస్తుంది. (తెలుగు శబ్దాలు, అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ లతో ప్రారంభం అయ్యే English మాటలముందు An, మిగతా వాటిముందు A అని చూశాం కదా.)

**2)** Uncountables (లెక్కపెట్టని వాటిముందు A/ An రాదు. ఇప్పుడు 'The' వాడకం చూద్దాం.

**A)** మొదట 'The' pronunciation: తెలుగు శబ్దాలు 'అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఐ., ఒ, ఓ, ఔ' తో ప్రారంభం అయ్యే English మాటల ముందు, 'ది' వాడతాం.
The order (ది ఆడ), The egg (ది ఎగ్), The industry (ది ఇండస్ట్రీ), The Owl (ది ఔల్), The honour (ది ఆన) etc. a ను bank, ant లో లాగా పలికినప్పుడు కూడా 'ది' అంటాం. The ant (ది ant), the (ది) hour, etc. మిగతా శబ్దాలకు ముందు, 'ద' పలుకుతాం. The (ద) book, the (ద) tree, the (ద) University etc.

**B)** Countables, uncountables, singulars, plurals- వీటిని గురించి ఫలానా అని ప్రత్యేకంగా చెప్పినప్పుడు 'The' వాడతాం.
A book is there. (అక్కడో పుస్తకం ఉంది).
The book is my borther's
(అది మా brotherది).

ఇక్కడ A, the వాడకం పోల్చండి. మొదట ఏదో/ ఓ అనే అర్థంతో 'A' వాడాం. రెండో sentence లో ఆ (అంటే ఫలానా) అనే అర్థంతో 'The' వాడాం. కాబట్టి ఫలానా అనే భావంతో countables (singular & plural), uncountables (singular and plural) ముందు the వాడతాం, వాడాలి.

**(ముఖ్యమైన అంశం:** కొన్నిచోట్ల తప్పు సందర్భాన్ని, అర్థాన్నిబట్టి Englishలో A కానీ, An కానీ, the కానీ nouns లో కొన్ని తెగల ముందు వాడాల్సిందే)

మళ్లీ గుర్తుంచుకోండి: ఒకటి/ ఏదో అనే అర్థంతో అయితే A/ An వాడతాం. ఫలానా అయితే 'The' వాడతాం.

**a)** A pen is for writing (pen రాయడానికి)
(తెలుగులో A/ Anకు తగ్గట్టు వాడకం లేదు కదా.)

**b)** The pen in your pocket is mine.
(నీ జేబులో ఉన్న pen నాది).

ఇక్కడ The వాడటానికి ఒక rule. ఏది? అని ప్రశ్న వేసుకుంటే సమాధానం రాకపోతే, A/ An వాడతాం. సమాధానం వస్తే 'The' వాడతాం.

---

**ప్రశ్న:** *1) Where did you go?*
*Where have you went?*
*2) It is time we left*
*It is high time we left.*
*వీటిమధ్య తేడా వివరించగలరు.*
*3) No, ifs and buts, young man, you must speak out your mind.*
*ఈ వాక్యానికి తెలుగు అర్థం ఏమిటి?*
*4) I want to ask him for help*
*నేను అతడిని సహాయం అడగాలని అనుకుంటున్నాను.*
*నేను అతడిని సహాయం అడగాలని అనుకునేవాడ్ని (గతంలో).*
*దీనిని English లో ఎలా అనాలి?*

**– జె.రమేశ్, జె.అనిల్, వడ్లమూరు, తూర్పుగోదావరి జిల్లా.**

**జవాబు: 1)** Where did you go? అంటే - నువ్వెక్కడికెళ్లావు? అని.
Where did you went? Correct కాదు.
Did తర్వాత go వస్తుంది; went రాదు.

**2)** It is time we left. It is high time we left-
వీటి రెంటికీ అర్థం ఒకటే - మనం ఎప్పుడో వెళ్ళుండాల్సింది, అని.
అంటే మనం వెళ్ళాల్సిన Time దాటిపోయిందని.

**3)** ఈ వాక్యానికి అర్థం - అయితే, గియితే అని ఊహించుకోవడం వద్దు, నీ మనసులో ఏముందో చెప్పు - అని. మనం జీవితంలో చాలాసార్లు అదే జరిగి ఉంటే/జరిగి ఉండ కపోతే ఏమయ్యేదో అని ఊహించుకుంటుంటాం. అలాగే అలా జరిగితే/ జరక్కపోతే ఏమవుతుందని ఊహించుకుంటుంటాం. అలాంటి సందర్భాలను 'ifs and buts' అంటాం. If అంటే- అయితే; but అంటే- అయినప్పటికి.
If Gandhi had been alive... గాంధీ బతికి ఉంటే...
but he is not... అయితే, ఆయన లేడుగా...
no ifs and buts అంటే ఇలాంటివి ఊహించుకోవడం నిరర్థకం అని.

**4)** I used to think of asking him for help
అతడిని నేను సహాయం అడగాలని అనుకునేవాడ్ని.
(I used to feel like asking him for help)



1) మనం last lessonలో 'The' ని గురించి తెలుసుకున్నది: ఒక మాటముందు 'The' వాడాలా, వద్దా అని తెలుసుకునేందుకు- ఆ మాటకు ముందు 'ఏ? '/ which? అన్న question వేసుకుని దానికి సమాధానం వస్తే The వాడాలి.

**a)** He bought a book yesterday.
నిన్నఅతడు పుస్తకం కొన్నాడు. ఏ పుస్తకం- which book? (కొన్నాడు) అనే question కు, no answer. So 'a book' in the sentence.

**b)** The book there is mine.
అక్కడున్న పుస్తకం నాది. 'ఏ పుస్తకం/ which book?' అనే question కు, The book there – అక్కడున్న పుస్తకం అని answer వస్తుంది కాబట్టి.

**2)** ఇద్దరు ముగ్గురు మాట్లాడుకుంటున్నపుడు వాళ్లందరికీ తెలిసిన విషయం ముందు The వస్తుంది. పై సంభాషణలో చూడండి. The bank by your home, the bike, the owner, the bank manager. ఇక్కడ వీటన్నింటిముందు 'The' వస్తోంది. ఎందుకనీ? ఇవన్నీ కూడా మాట్లాడుకుంటున్న Gowtham, Gambhir ఇద్దరికీ తెలుసు కాబట్టి. Bank, bike, owner, bank manager ప్రస్తావనంతా కూడా వాళ్లకు తెలిసిన విషయాలే- అందుకని.

**Pavan:** Where are the books?
(ఆ పుస్తకాలెక్కడ? )
**Ravi:** Can't you see? They are on the table.
(కనిపించడం లేదూ? ఆ table మీదున్నాయి.)
**Pavan:** And where's (where is) the pen?
**Ravi:** There too. On the table.
(అక్కడే. ఆ table మీదే)
**Pavan:** Where is the paper for me to write
(రాయడానికి paper ఏది? )
**Ravi:** You find a lot of paper in the shelf there.
(ఆ shelf లో కావలసినంత paper ఉంది)

ఇక్కడ The books, The table, The pen, The shelf అంటున్నాం. ఎందుకంటే Ravi, Pavan ప్రస్తావిస్తున్న books, table, pen, shelf వాళ్లిద్దరికీ తెలిసినవే. అందుకని ఇక్కడంతా 'The' వాడుతున్నాం.

**Gowtham:** Hi Gambhir, I saw a bike in front of the bank by your home.
(మీ ఇంటి పక్క bank ముందు ఓ bikeను చూశాను)
**Gambhir:** Wasn't it (was it not) yesterday? I saw the bike too. Really stunning.
(నిన్న కదా? నేనూ చూశాను bike ను. చాలా బాగుంది.
Stunning = ఆశ్చర్యం గొలిపే (అందం)
**Gowtham:** (Do you) know the owner?
(అదెవరిదో తెలుసా? )
conversations లో అంటే spoken form లో (Do you) లాంటివి వదిలేసి know him? లాంటి questions వేస్తే బాగుంటుంది. Practice చేయండి.
**Gambhir:** Yes. It is the bank manager's
(తెలుసు. అది ఆ bank manager ది)
**Gowtham:** Perhaps you have an account with the bank. A big account,
(ఆ bank లో నీకు account ఉందను కుంటా. పెద్ద మొత్తమేనా? )

**3) Robert:** Where is Vijayawada?
(విజయవాడ ఎక్కడుంది)
**Guide:** About 300 kms to the South East of Hyderabad. On the banks of the Krishna.
(Hyderabad కు నైరుతి దిశలో, దాదాపు 300 kms దూరంలో కృష్ణ ఒడ్డున ఉంది)
**Robert:** I have heard of Rajahmundry. Where is it?
(రాజమండ్రి గురించి విన్నాను. అదెక్కడ ఉంటుంది? )
**Guide:** A little distance from Vijayawada. It is on the Godavari. Where are you coming from?
(విజయవాడకు కొంతదూరంలో. గోదావరి ఒడ్డున. మీరెక్కడినుంచి వస్తున్నారు? )
**Robert:** From Goa. The beaches of the Arabian sea are really grand. How far is Vijayawada from the Bay of Bengal?


M. SURESAN

(గోవా నుంచి. అక్కడి అరేబియా సముద్ర తీరాలు ఎంతో అందంగా ఉన్నాయి. విజయవాడ Bay of Bengal నుంచి ఎంతదూరం? )
**Guide:** About 40 kms

ఈ సంభాషణలో 'The' ఉపయోగాలు చూడండి:
To the Southeast, The Krishna, The Godavari, The Arabia Sea, The Bay of Bengal. అంటే నదుల పేర్లముందు, సముద్రాల పేర్ల ముందు కచ్చితంగా the వాడాల్సిందే. అలాగే దిక్కులను సూచించడానికి కూడా (to the southeast) వాడతాం.

**NOW PRACTICE THE FOLLOWING:**

**1) Ram:** ఇక్కడ library ఎక్కడ?
**Raghu:** కొద్దిగా ఉత్తరం వైపు వెళ్ళి, ఎడమవైపు తిరగండి. library కనిపిస్తుంది.
**Ram:** ఆ library పెద్దదేనా? (Is తో begin చేయాలి)
**Raghu:** బిల్డింగ్ చిన్నదే. పుస్తకాలు మాత్రం బోలెడున్నాయి.

**2) Pranav:** విజయవాడ ఎక్కడ?
**Prakash:** సముద్రతీరానికి దాదాపు 40 km దూరాన ఉంది.
**Pranav:** కృష్ణ పెద్ద నదేనా?
**Prakash:** చాలా పెద్ద నది. భారత్‌లోని 12 పెద్ద నదుల్లో అది ఒకటి.

**ANSWERS:**

**1) Ram:** Where is the library here?
**Raghu:** Walk a little to the north and turn (to the) left. You see the library.
**Ram:** Is the library big/ a big one?
**Raghu:** The building is small, but the books are many.

**2) Pranav:** Where is Vijayawada?
**Prakash:** About 40 kms off the sea coast.
(ఇక్కడ about = దాదాపు, off = దూరాన అనే prepositions వాడకం గూడా గమనించండి)
**Pranav:** Is the Krishna a big river?
**Prakash:** Yes. It is a very big river. One of the twelve major rivers in India.

♦ ♦ ♦ ♦ ♦

# rate.. at, price.. for




**Khalid:** The mangoes are good. How much did you buy them for?
(ఈ మామిడిపండ్లు బాగున్నాయి. ఎలా కొన్నావ్? )
**Kesav:** At Rs. 80 a dozen. I bought all these for Rs. 160/-. There was a better variety, but the price I felt was too high. I was not prepared to buy them at that price.
(Dozen 80 రూపాయల చొప్పున కొన్నా. వీటికి 160 రూపాయలయింది. ఇంతకన్నా మంచిరకం ఉంది. కానీ నాకు ధర మరీ ఎక్కువ అనిపించింది. అంత ధరకు కొనేందుకు నేను సిద్ధంగా లేను)

ఇక్కడ 'at' 'for' prepositions ఉపయోగం చూద్దాం. Rate ముందు ఓ dozen ధరో, ఓ కిలో ధరో, ఓ మీటరు ధరో అయితే at వాడతాం.

1) ఈ బియ్యం కిలో 20 రూ. చొప్పున కొన్నా
I bought this rice at Rs 20 a Kg.
2) She bought her dress material at Rs. 300 a metre.
(ఆమె డ్రెస్ మెటీరియల్ మీటర్ 300 రూ. చొప్పున కొన్నది)

When we say we bought mangoes at Rs.80 a dozen, (మనం dozen 80రూ. ప్రకారం కొన్నాం) అంటే, అది Rate. కాబట్టి దానిముందు at. ఈ విషయం చెప్పినపుడు మొత్తం ఎన్ని పళ్లు కొన్నాం, మొత్తం ధర ఎంత అయిందీ తెలియదు.

He bought these mangoes for Rs.200
ఈ పండ్లు మొత్తం రూ.200 పెట్టికొన్నాను.
(ఇది price; rate కాదు, కాబట్టి for)
ఈ బస్తా బియ్యం 1600 రూపాయలయింది
I bought this bag of rice for Rs. 1600/-
(ఇది కూడా price, rate కాదు. Rate ఎప్పుడూ ఒక unit యూనిట్ ధర మాత్రమే.)

**PRACTICE THE FOLLOWING:**

**Vinai:** ఈ ఇల్లు మీ సొంతమేనా?
(Do తో begin చేయండి)
**Vijai:** అవును. మా నాన్నగారు రెండేళ్ల కిందట 11 లక్షలకు కొన్నారు.
**Vinai:** ఇంట్లో curtains అన్నీ బాగున్నాయి. ఆ curtain గుడ్డ ఎంతకు కొన్నారు? అన్నీ ఒక గుడ్డ ముక్కలేనా?
**Vijai:** అవును. మీటరు రూ.320 ప్రకారం కొన్నాం. మొత్తం దాదాపు 4500 రూపాయలు అయింది.
**Vinai:** ఈ chairs ?
**Vijai:** ఈ chairs, ఆ sofa, ఆ table అన్నీకలిపి 12000 రూపాయలు అయింది.

**ANSWER:**

**Vinai:** Do you own this house ?
**Vijai:** Yes. My father bought it for Rs.11 lakh two years ago.
**Vinai:** The curtains are really nice. How much did you buy the curtain cloth for? Are all of them the pieces of the same cloth?
**Vijai:** Yes. We bought it at Rs.320 a metre. We bought the whole cloth for about Rs.4500 (The whole thing cost us about Rs.4500)
**Vinai:** What about these chairs?
**Vijai:** These (the) chairs, that (the) sofa, that (the) table - we bought all of them together for Rs.12000/- (All these cost us Rs.12000/-)

ఇప్పుడు ఈ Vocabulary items చూడండి.

1) సినిమాకెళ్ళడం = go to a movie/ film/ picture.
2) భోజనంలాంటివి వడ్డించడం
serve a meal/ food/ lunch/ dinner
3) టీలు, కాఫీలలాంటివి ఇంటికి వచ్చిన వాళ్లకివ్వడం
offer tea/ coffee/ a drink/ a seat
(కూచోమని చెప్పడం)
4) అతను coffee ఇచ్చాడు కాని నేను తీసుకోలేదు
He offered me coffee but I didn't take it.
5) నేనతనికి coffee ఇచ్చినా నా మీద కోపం వల్ల తీసుకోలేదు
I offered him coffee, but because he was angry with me, he refused it/ to take it.
refuse= తిరస్కరించడం, ఒప్పుకోకపోవడం
6) స్వీకరించడం = accept
నేనిచ్చిన కానుక అతను తీసుకోలేదు
He did not accept my gift
మామూలుగా అతను కానుకలు స్వీకరించడు (తీసుకోడు)
He doesn't (does not) accept gifts.
not accept = reject
He rejected my gift =
He did not accept my gift.



**ప్రశ్న:** *1) మీరు Q&A శీర్షికలో ఓ ప్రశ్నకు సమాధానమిస్తూ... "regular గా లేదా మామూలుగా జరిగే actions ను present passive లో చెప్తారన్నారు. అందుకు ఉదాహరణగా "A lecturer is appointed by the committee" అనే వాక్యాన్ని చూపించారు. కానీ ఒక text bookలో regular గా లేదా సాధారణంగా జరిగే actions ను present passive లో గాక simple future passive లో ఉపయోగించారు. ఉదా: "In every business enterprise, the accounts will be classified on the basis of one key factor. That key factor is debit and credit. చూశారుగా వాక్యాన్ని. "ఖాతాలను Debit, Credit అంశాల ఆధారంగానే వర్గీకరిస్తారు". ఇది ఎప్పుడూ జరిగే పనే కదా. accounts are classified అని ఎందుకు రాయలేదు? సందేహం తీర్చగలరు.*

*2) కింది situation లో వాక్యాన్ని present passive లో ఉపయోగించాలా, perfect passive లో ఉపయోగించాలా? ఏది కరెక్ట్?*
*Input:- "A computer accepts data which is provided by means of a input device like mouse, or key board" (Input device లైన కీబోర్డు, మౌస్‌లతో కంప్యూటర్ దత్తాంశాన్ని స్వీకరించడాన్ని "input" అంటారు). తెలుగు ప్రకారం వాక్యంలోని అర్థం చూస్తే "కంప్యూటర్ మీకు 'data' ను అందించిన తర్వాతే కదా అది స్వీకరించేది. కాబట్టి వాటిలో "A computer accepts data which has been provided by means of input device like a mouse or key board" అని చెప్పవచ్చా?*

**– ఆర్.ఎస్.మహేష్, అనంతపురం**

**జవాబు:** 1) ఇక్కడ The accounts are classified అనడమే correct, will be classified అనేది future లో జరిగే పనిని సూచిస్తుంది.
2) Which is provided అనేది correct. ఎందుకంటే ఎప్పుడూ జరిగేదేంటి..? Mouse, keyboard లాంటి input devices data ను అందిస్తాయి. దానిని computer తీసుకుంటుంది. మీరిచ్చిన sentence ను రెండుగా విడగొట్టండి. అపుడేమవుతుందో?
1) An input device like a mouse or keyboard provides the data.
2) The computer accepts it. ఇపుడు sentence no.1 passive గా మార్చి రెండింటిని కలిపితే is provides కరెక్ట్ అని తెలుస్తోంది కదా. ఒక మాట. data, మామూలుగా plural. Computer పరిభాషలో మాత్రం singular గానే వాడతారు.




# of... from... out of




**Ganesh:** Hi Harish, pleasure seeing you here. Welcome. Do come in.
(హాయ్, హరీష్! నిన్ను ఇక్కడ చూడడం/ నువ్వు ఇక్కడికి రావడం చాలా సంతోషంగా ఉంది. లోపలికి రా!) Do come in = లోపలికి రా అని గట్టిగా చెప్పడం.
మీ conversation లో practise చేయండి.

**Harish:** Pleasure is equally mine/ Pleasure is mine too. So this is your new home. Really splendid. The furniture is elegant too.
(నాకు కూడా సంతోషంగా ఉంది. ఇదన్న మాట మీ కొత్త ఇల్లు. చాలా బాగుంది. మీ ఫర్నిచర్ కూడా చాలా నాజూకుగా ఉంది.)
ఈ 'pleasure' -expressions అన్నీ conversational bits. మీ conversationలో వాడుతూ ఉండండి.
Splendid = excellent
Elegant = నాజూకైన


*Your drink is good. How did you make it?*

**Ganesh:** Thank you. The furniture is all made of teak. Dad got the wood specially from Bhadrachalam forests. How about having this sweet? It's vilakand. Mom's (Mom has) made it.
(ఫర్నిచర్ అంతా టేకుతో చేసిందే. మా నాన్నగారు భద్రాచలం అడవుల నుంచి తెప్పించారు. ఈ స్వీట్ తీసుకో. అది విలాకండ్. అమ్మ చేసింది.)

**Harish:** (After taking a bite) It's delicious! What's the stuff it is made of?
((కొంత తిని) చాలా రుచిగా ఉంది. దేనితో చేస్తారు దీన్ని?)
stuff = పదార్థం

**Ganesh:** It's a new variety. It is made from a mix of rice and wheat flour, milk, ghee etc.
(బియ్యప్పిండి, గోధుమపిండి, పాలు, నెయ్యి కలిపి చేస్తారు.)

నోట్: విలాకండ్ స్వీట్ సంభాషణ కోసం కల్పించినది మాత్రమే. తయారుచేసేందుకు ప్రయత్నించకండి.
(flour = పిండి, pronunciation- ఫ్లవ, flour, flower - రెండింటికీ ఒకే pronunciation)

**Harish:** That flower vase stand over there, that particularly attracts me. Is it very expensive?
(అక్కడి ఫ్లవ వాజ్ స్టాండ్ చాలా బాగుంది. అది చాలా ఖరీదా?)
flower vase= పూలుంచే గాజు/ మెటల్‌పాత్ర
vase- pronunciation- British - వాజ్, American - వెయ్‌స్/వెయ్‌జ్)

**Ganesh:** No. Our carpenter made it out of the wooden pieces left over.
(లేదు. మిగిలిపోయిన చెక్కముక్కలతో మా వడ్రంగి దాన్ని చేశాడు.)
left over = మిగిలిపోయింది.

**eg.** She gave the left overs to the beggar.
(ఆమె మిగిలిపోయిన వాటిని బిచ్చగాడికి ఇచ్చింది.)

పై సంభాషణలో made (make) తో వచ్చిన prepositions గమనించండి- made of, made from, made out of.

**1)** All the furniture is made of teak.
ఫర్నిచర్ అంతా టేకుతో చేశారు.
ఒక వస్తువు దేనితో అయినా చేయడాన్ని made of అంటాం. `of' ఇక్కడ తప్పనిసరి.
We make tables of wood.
(మనం tables (టెయ్‌బుల్స్)ను చెక్కతో చేస్తాం.)

**a)** ఈ రోజుల్లో మనం నిర్మాణావసరాలకు ఇనుము, ఉక్కుతో చేసిన పైపులకు బదులు గట్టి ప్లాస్టిక్‌తో చేసిన పైపులనే వాడుతున్నాం.
Nowadays we are using pipes made of (pipes of) hard plastic instead of pipes made of iron and steel for construction purposes.

తయారైన వస్తువు (finished product) దేనితో తయారైనదో కనిపిస్తూ ఉంటే అప్పుడు made of అంటాం.
This Table is made of wood- అన్నప్పుడు చెక్క కనిపిస్తూనే ఉంటుంది. కాబట్టి made of.

**2)** The sweet is made from flour and milk.
(ఆ స్వీట్ పిండి, పాలతో చేస్తారు (చేయబడుతుంది)).
ఇక్కడ made తర్వాత from వస్తోంది కదా! పిండి, పాలతో(from flour and milk) అన్నప్పుడు ఇక్కడ తయారైన వస్తువు (finished product) ఏ పదార్థాలతో (raw material - ముడిసరుకు/ సరుకులు) తయారైందో కనిపించదు. కాబట్టి made from.
Made of కు, made from కు తేడా గమనించండి.
అంతేకాకుండా రెండు, మూడు వస్తువుల కలయికతో తయారైనప్పుడు కూడా from ఉపయోగించాలి.

**a)** కాగితాన్ని చెత్తతో (నుంచి) తయారు చేస్తారు.
Paper is made from waste material.
Paper లో చెత్త కనిపించదు కాబట్టి `from'.

**b)** డాక్టర్ ఈ మందు కొన్ని మూలికలతో చేశారు.
The doctor made this medicine from some herbs.
(మూలికలు=herbs)

**3)** Our carpenter made it out of the wooden pieces.
(మా వడ్రంగి దీన్ని మిగిలిపోయిన చెక్కముక్కలతో తయారుచేశాడు.)
ఇక్కడ out of వాడుతున్నాం. కొన్ని వస్తువులను- ఎక్కువగా ఒకే రకానివి అయినప్పుడు `make out of' అంటాం.

**a)** She made the curtain out of the sari pieces.
(ఆమె చీరల ముక్కలతో ఆ curtain చేసింది.)

**b)** She made a beautiful figure out of the pieces of coloured paper.
(ఆమె రంగు కాగితాల ముక్కలతో బొమ్మ తయారు చేసింది).
ఇదీ made of, made from, made out of మధ్య తేడా.

Now practise the following aloud in English.

**1) Raghu:** ఏం కావాలండీ మీకు?
**Ram:** బల్లలు, కుర్చీలు మంచివేమన్నా ఉన్నాయేమో చూస్తున్నా.
**Raghu:** ఈ బల్లలు, కుర్చీలు చూడండి.
**Ram:** అవి ప్లాస్టిక్‌తో చేసినవి కదా. నాకు మంచి టేకుతో చేసినవి కావాలి.
**Raghu:** అవి అక్కడున్నాయి. మంచి టేకుతో, వివిధ రకాలడిజైన్లలో.
**Ram:** ఇవి బాగానే ఉన్నాయి. నాకు కొన్ని పరుపులు, దిండ్లు కావాలి.
**Raghu:** ఇక్కడున్నాయి చూడండి. వేసవిలో ఇబ్బంది లేకుండా ఉంటాయి. ఉత్త స్పాంజ్‌తో కాకుండా sponge, rubberized పీచుతో తయారైనవి.
(పీచు= coir)
**Ram:** అది సరే. ధరలు ఎట్లా ఉన్నాయి?


M. SURESAN

**2) Suguna:** నువ్విచ్చిన డ్రింక్ చాలా బాగుంది. ఎలా చేశావు?
**Suseela:** ద్రాక్షరసం, కమలారసం, కొద్దిగా అల్లం రసం, దాంతోపాటు పంచదార, మిరియాలపొడి కలిపిన మిశ్రమంతో.
(గమనిక: ఇది ఈ వ్యాసం కోసం రాసిందే. ప్రయత్నం చేయకండి.)
**Suguna:** చాలా బాగుంది. ఇదేంటి ఈ డ్రెస్?
**Suseela:** మొత్తం పట్టుతో తయారు చేసింది బాగుందా?
**Suguna:** ఇంత ఎండలో పట్టు డ్రెస్ ఎలా వేసుకుంటావు? చెమట పట్టడంలేదా?
sweat- చెమట - స్వెట్
**Suseela:** లేదు. నేను ఎక్కువసేపు మా ఏసి ఆఫీస్‌లోనే ఉంటాగా?

### Answers:

**1. Raghu:** What do you want, sir?
**Ram:** I am looking for good tables and chairs.
**Raghu:** How about these tables and chairs, sir?
**Ram:** They are made of plastic. I want tables and chairs made of good teak.
**Raghu:** There they are sir. Of good teak and in a variety of designs.
**Ram:** They're (they are) OK. I need some mattresses and pillows too.
mattress = పరుపు
bed = పరుపుతో ఉన్న మంచం
**Raghu:** Here are they sir. Made from Sponge, rubberized coir- no problem in summer as they are not made only of sponge.
**Ram:** That's OK. How much are they?

**2) Suguna:** Your drink is good. How did you make it?
**Suseela:** From a mix of grape juice, orange juice, ginger extract, sugar, and a little pepper powder.
(ginger = అల్లం, extract = తీసిన రసం)
**Suguna:** Really fine. How about this dress of yours?
**Suseela:** It is made of pure silk. Is it good?
**Suguna:** How are you able to wear it in such hot sun? Don't you sweat?
**Suseela:** No. I am most of the time in our air conditioned office.



**ప్రశ్న:** An awareness programme will be held at kurnool on saturday. ఈ వాక్యం future tense లో ఉందని తెలుసు. అయితే ఈ వాక్యం చూడండి.
**a)** An amount of Rs. 104 crores would be paid in Rajampet constituency of Cuddapah district on Saturday.
రెండో వాక్యం Indirect Speech లో ఉందా? లేదా కేవలం past tense ను refer చేస్తుందా? నేను పేపర్లో సమాచారం చూసేనాటికి డబ్బు పంపిణీ జరిగినట్లా లేదా జరగనట్లా?
**b)** 'Dr YSR is sure that availability of funds would not be a hindrance'- ఈ వాక్యం Indirect Speech అనుకుంటే YSR was sure అని ఉండాలి కదా! కానీ ఎందుకు News paper లో is sure అని వాడారు? ఒకవేళ is sure అని వాడాల్సి వస్తే will be hindrance అని ఉండాలి కదా! వివరించగలరు.
– ఎన్‌వి నీలిమ, బొల్లవరం

**జవాబు: a)** An amount of Rs. 104 crores would be paid in Rajampet constituency of Cuddapah district on Saturday- ఈ వాక్యం Indirect Speech లో ఉందా లేదా అనేది, అంతకు ముందు వాక్యాన్ని బట్టి మాత్రమే చెప్పగలం. అంతకు ముందు వాక్యం ఇలా ఉందనుకోండి- The Minister said that money would be disbursed to the deserving (అర్హులైన వారికి డబ్బు ఇవ్వబడుతుంది.) ఈ sentence ఉందనుకుంటే అప్పుడు మీ sentence దీనికి continuation అయితే కరెక్టే. అలా కాకుండా an amount of Rs. 104 Crore would be paid... అనేది independent sentence అయితే ఇక్కడ would be paid కరెక్ట్ కాదు. ఇక్కడ ఉండాల్సిన verb will be paid. అదే కరెక్ట్. మీరు పేపర్ చదివేనాటికి పంపిణీ జరగనట్లే. Future లో జరుగుతుంది అని అర్థం.
**b)** Dr YSR is sure that the availability of funds would not be a hindrance- మనం ఎప్పుడు main clause verbను బట్టి sub-ordinate clause verbను సవరించాలి. ఇక్కడ Dr YSR is sure అని report చేస్తున్నప్పుడు will not be అనే రావాలి. అదే ఈ sentence కు correct form. ఒక వేళ Dr YSR was sure అని report చేస్తే (ఎందుకంటే YSR గతంలో ఉన్న స్థితిని ఇప్పుడు report చేస్తున్నాం కాబట్టి was) would not be- correct.




**Radhika:** Hi Rama, (are you) in a hurry?
తొందరలో ఉన్నావా?

**Rama:** You bet I am. I am on my way to class. I'm afraid I shall be late. It's already 7.50 and the class is at 8 (O' clock)
కచ్చితంగా. (you bet I am - నేను తొందరలో ఉన్నానని నువ్వు bet కాయ వచ్చు అంటే కచ్చితంగా అని కదా.) class కు వెళ్తున్నా. Late అవుతానేమో. ఇప్పటికే 7.50 అయింది. క్లాసు 8 కి)

**Radhika:** Shall I see you in the evening then?
అయితే నిన్ను సాయంత్రం కలుసుకోనా?

**Rama:** I'm afraid it's a bit early. Make it quarter past five. Past that will be too late again.




అది కొంచెం తొందర అవుతుందేమో. (ఇక్కడ I'm afraid = I am afraid అంటే సందేహాన్ని తెలపడం; దేన్నైనా మర్యాదగా లేదనడం.

British Englishలో Quarter past, half past etc., ఎక్కువగా వాడతారు. మిగతా సమయాలు కూడా ఇలా చెప్పవచ్చు.

02.10- Ten minutes past two
(మామూలుగా Two ten),
02.50- Ten (minutes) to three
(మామూలుగా Two fifty)

పై expressions లో past అర్థం: 'దాటి' అని. (Past - pronunciation = పాస్ట్)

ఇంతకుముందు lessons లో చూశాం, స్థలాన్ని దాటి వెళ్ళడంకూడా past. He is past the building.
ఒక వయసు దాటడం = Past the age.
Kapil Dev is past the age of playing cricket.
cricket ఆడే వయసు దాటిపోయింది.

♦ ♦ ♦ ♦ ♦

**Saikiran:** Hi Lakshman, where are you coming from?

**Lakshman:** (I am) returning from a party.

**Saikiran:** Where?

**Lakshman:** At the wine n' dine Hotel.

**Saikiran:** Where is it?

**Lakshman:** Don't you know? It's near the the Krishna Studio.

**Saikiran:** A nice place, isn't it? What about the Shelton Hotel near the Charminar?

# India.. The US..

**eg:** I'm afraid it is not possible for me to give it = అది ఇవ్వలేనేమో - ఇవ్వను అని మర్యాదగా చెప్పడం.) 5-15 కు రా. (Make it వాడుక గమనించండి. 5.15కు వచ్చేట్టు చూడాలని) అది దాటితే మళ్లీ ఆలస్యమవుతుంది.

**Radhika:** That suits me fine.
(అంటే నాకు ok నే అని)

ఇది కూడా conversation లో వాడండి

ఇప్పటివరకు ఈ lessons లో వాడిన dialogues అన్నీ కూడా వివిధ సందర్భాల్లో వాడే Spoken English forms. వీటిని ఇద్దరు ముగ్గురు కలిసి ఎంత practise చేస్తే అంత బాగా మాట్లాడగలరు. మీ conversation ఇతరులను ఆకట్టుకుంటుంది

పై సంభాషణలోని time expressions ను గమనించండి. 7.50, 8 (O' clock), half past five, quarter past 5, past that.

ఇదివరలో తెలుసుకున్నాం కదా: ఫలానా టైంకు అని కచ్చితంగా చెప్పగలిగినప్పుడు at వాడతాం. సమయం ముందు At 3 pm, at 4.15 etc.

English లో మామూలు conversation లో AM, PM (AM = Ante Meridian, PM = Post Meridian) దాదాపు వాడం. రాసేటప్పుడుగానీ, formal గా ప్రకటన ఇచ్చేటప్పుడుగానీ వాడతాం. మనం conversation చేస్తున్నప్పుడు సందర్భాన్నిబట్టి పొద్దునా, మధ్యాహ్నమా అనేది తెలుస్తూనే ఉంటుంది కదా. అంతగా కచ్చితంగా తెలపాల్సి వస్తే అప్పుడు కూడా in the morning, in the evening etc అంటాం.

పూర్తయిన గంటలకు మాత్రమే O' clock అంటాం. O' clock = of the clock. ఇందులో f the omit చేస్తాం కాబట్టి O పక్కన apostrophe (') పెడతాం. మిగతా సమయాన్ని తెలిపే విధం:

10.00 AM/ PM - 10 O' clock - Ten O' Clock
10.40 AM/ PM - Ten forty
04.20 - four twenty

ఒక గంటలో 15వ నిమిషం, 30వ నిమిషం, 45వ నిమిషం రెండు విధాలుగా తెలుపుతాం.

02.15 - Two fifteen/ Quarter past two
(Quarter = 1/4 hour)
02.30 - Two thirty/ Half past two
02.45 - Two forty five/ Quarter to three

చాలా బాగుంటుంది కదా?
Charminar దగ్గర Shelton Hotel ఎలా ఉంటుంది?

**Laxman:** Don't know much about it. By the by I am leaving for Delhi tonight. I am going to stop for two days at Agra to see my uncle
దాని గురించి నాకు అంతగా తెలియదు. అది సరే కానీ, ఈవాళ రాత్రి ఢిల్లీ వెళుతున్నా. దారిలో రెండ్రోజులు ఆగ్రాలో మా uncle ఇంట్లో ఉంటా

**Saikiran:** You will sure see the Taj, Won't you?
తాజ్‌మహల్ తప్పక చూస్తావు గదా?

**Laxman:** And also the Rashtrapathi Bhavan in New Delhi.
ఢిల్లీలో రాష్ట్రపతి భవన్ కూడా చూస్తా.

పై సంభాషణలో 'The' వాడకం గమనించండి:
The Wine n' Dine Hotel, The Krishna Studio, The Charminar, The Taj, The Rashtrapathi Bhavan. కొండ గుర్తులుగా చెప్పే ప్రసిద్ధ భవనాల ముందు, గొప్ప గొప్ప hotels ముందు, చారిత్రక కట్టడాలు జ్ఞాపక చిహ్నాల (monuments/ memorials) ముందు The వాడతాం. అయితే Hotel తో ప్రారంభం అయ్యే Hotels పేర్ల ముందు The రాదు- At the Centurian, at the Krishna Oberoi అంటాం. కానీ at the Hotel Sheraton అనం. At the Sheraton Hotel కరెక్ట్.

ఇప్పటివరకు మనం తెలుసుకున్నది.
The వాడే సందర్భాలు.

1) ఫలానా అని తెలిసిన వాటిముందు ( ఏ? / which అనే questions కు answer వచ్చే చోట్ల)
2) మాట్లాడుకుంటున్న వాళ్లందరికి తెలిసిన విషయాల ముందు
3) నదులు, సరస్సులు, సముద్రాలు, మహా సముద్రాల పేర్ల ముందు
4) పర్వత పంక్తుల (mountain ranges) పేర్ల ముందు, (ఒకే పర్వతం ముందు The రాదు)
5) Before the names of groups of islands (దీవుల సమూహాల పేర్ల ముందు) but not before the name of a single island (ఒకే ద్వీపం పేరు ముందు The రాదు)
6) Before 'of' phrases, if 'of' comes after a plural (plural form తర్వాత of phrases వస్తే ఆ plural form ముందు The వాడతాం).
7) Before the names of famous buildings, of historical buildings, of big hotels, of monuments, etc.

**Pavithra:** Hi, Puneetha, did you see the professor?
ప్రొఫెసర్‌ను చూశావా?

**Puneetha:** No, she left for the US yesterday. No idea when she will be back. On her way back she is going to spend a week in the UK. She will return home by the UAE.

**Pavithra:** I think she is the first in her department to be invited to so many countries.

పై సంభాషణలో: The Professor, The US, The UK, The UAE. అంటే ప్రదేశాలు, హోదాలు (designations), పదవుల ముందు 'The' వస్తుంది. The District Collector, The Prime Minister of India, etc.

(a) The Prime Minister of India, Mr Manmohan Singh
(b) Mr Manmohan Singh, Prime Minister of India.


M. SURESAN

పేరు ముందు హోదా, పదవి వస్తే ఆ హోదా/ పదవి ముందు 'The' వస్తుంది (a) లో వలె. ముందు వ్యక్తి పేరూ, తర్వాత హోదా/ పదవివస్తే దానిముందు 'The' రాదు (b) లో వలె. ఇది చాలా ముఖ్యం. సామాన్యంగా హోదా, పదవి (designation, office - office అంటే ఇక్కడ కార్యాలయం కాదు, పదవి అని అర్థం) ముందు The వాడతారు.

కొన్ని రాష్ట్రాల కలయికతో ఏర్పడ్డ దేశాల ముందు కూడా 'the' వాడతాం. చూశారుకదా: The US (The United states of America - ఇది కొన్ని రాష్ట్రాల కలయిక), the UK (The United Kingdom - England, Scotland, Wales and Northern Ireland కలిసి ఏర్పడ్డ సమాఖ్య), The UAE (The United Arab Emirates - మనం మామూలుగా Gulf countries అనీ, Dubai అనీ, Abudabhi, Sharja అని అంటుంటాం). భారతదేశంలో కూడా రాష్ట్రాలే కదా, మరి The India అనం. మనం ఒకే దేశంగా ఉన్న దాన్ని రాష్ట్రాలుగా విభజించాం. అదే The US, The UK విషయాల్లో, ఆయా రాష్ట్రాలూ, ప్రదేశాలూ ఒకే దేశంగా ఏర్పడ్డాయి. India విషయంలో కూడా, Indian Union అని వ్యవహరించినప్పుడు The Indian Union అంటాం.

**Prabhat:** What movie did you go to, Yesterday?

**Prakash:** The Ten Commandments. An Old one

**Prabhat:** Isn't it an episode from the Bible?
అది Bible లోని Episode కదా

**Prakash:** Yes. From the old testament in the Bible.
Bible లోని old testament లోనిది

**Prabhat:** Just as Maya Bazar is an episode from the Mahabharatam
మహాభారతంలోని ఓ భాగాన్ని మాయా బజార్ సినిమా తీసినట్లు

**Prakash:** But I Doubt if Maya Bazar is from the Original Mahabharatam
అయితే మహాభారతం మూలంలో మాయా బజార్ ఉందా అని నా అనుమానం.

చూశారుకదా, గొప్ప గొప్ప గ్రంథాల, పవిత్ర గ్రంథాల పేర్ల ముందు 'the' తప్పక వాడతారు.
This is the Telugu translation of the koran.
ఇది కురాన్ తెలుగు అనువాదం.
అలాగే the Grandhsahib etc. అయితే రచయితల పేర్ల తర్వాత గ్రంథాల పేర్లు చెపితే 'the' రాదు.
Valmiki's Ramayanam, Vyasa's Maha bharatam etc.

**Practise the following aloud in English.**

**Karuna:** Hi Kranthi, ఇవాళ్టి ఈనాడు చూశావా? నిరుద్యోగులకు ముఖ్యమంత్రి కొత్త పథకాన్ని ప్రకటించారు.

**Kranthi:** ఏంటా పథకం?

**Karuna:** 22నుంచి 32మధ్య వయస్కులందరికి నిరుద్యోగ భృతి ఇస్తారు
(కల్పితం - ఇది కేవలం ఉదాహరణకే)

**Kranthi:** అలాగా? అమెరికా (US) లో, Britain (UK) లో ఈ పథకం చాలాకాలంగా అమల్లో ఉంది కదా?

**Karuna:** అవును. మనవాళ్లు చాలామంది ఇక్కడ ఉద్యోగావకాశాలు లేక UAE, US, UK లకు వెళ్లి పోతున్నారు. భారత రాష్ట్రపతి అబ్దుల్ కలాం ఈ మేధావివలస (brain drain) గురించి మొన్న ఓ ఉపన్యాసంలో చాలా ఆందోళన వ్యక్తపరిచారు కదా.

**Kranthi:** మా అన్నయ్య కూడా Maldives లో Lecturer Post కు Apply చేశాడు. వస్తే వెళ్లిపోతాడు. ఆ Job వస్తే హిమాలయాలు ఎక్కినంత సంతోషం అంటున్నాడు.

**Answer:**

**Karuna:** Did you see/ go through the Eenadu Today ? The Chief Minister has announced a new scheme for the benefit of the unemployed people.

**Kranthi:** What's (What is) the scheme?

**Karuna:** All the unemployed persons between the age of 22 and 32 will get unemployment allowance

**Kranthi:** Is it so? This has been in force in the US and the UK
(in force - అమల్లో)

**Karuna:** Yes. A good number of our people are leaving for the UAE, the US and the UK. All because of there are no employment opportunities. The President of India, Mr Abdul Kalam expressed concern over this brain drain in his speech the day before yesterday.

**Kranthi:** My brother too has applied for a lecturer's job in the maldives. If he gets it he will go. He says getting a job will make him as happy as if he had climbed up the Himalayas.




# I am with you..

**Deepak:** Hi Dheeraj, do come in.

**Dheeraj:** You had a book with you yesterday. What was it?
(నిన్న నీ దగ్గర ఓ పుస్తకం ఉంది కదా. ఏం పుస్తకం అది? )

**Deepak:** You mean the book with the green cover?
(Green cover తో ఉన్న book ను గురించా నీవడిగేది? )

**Dheeraj:** Yes, Isn't it a novel?
(అది novel కదా? )

**Deepak:** Yes, it is. (Do) you want it?
(అవును. నీకు కావాలా? )

**Dheeraj:** Yes, I am leaving this afternoon for Mumbai. I want to take it with me, to read it during the journey.
(అవును. ఈ మధ్యాహ్నం నేను ముంబాయికి వెళుతున్నాను. నాతో తీసుకెళ్ళాలనుకుంటున్నాను. ప్రయాణంలో చదువుకోవాలని)

**Deepak:** First let's have some hot idlis (మొదట ఇడ్లీ తిందాం రా.) Here are they and here's the spoon to eat them with (ఇవిగో ఇడ్లీలు. వాటిని తినేందుకు spoon). Have some ghee also. Ghees goes well with idlis, doesn't it? (కాస్త నెయ్యి వేస్కో. ఇడ్లీలతో నెయ్యి బాగుంటుంది కదా.) (go well with = suit అవడం)

పై సంభాషణలో Preposition- 'with' వాడకం గమనించండి. with కు తెలుగులో 'తో' సరిపోతుంది. The book with you = నీతో ఉన్న పుస్తకం - నీ దగ్గరున్న పుస్తకం; the book with the green cover = green cover తో ఉన్న పుస్తకం. with me = నాతో; a spoon to eat with = తినేందుకు spoon. goes well with = ఒకదానితో ఇంకోటి కలిసి బాగుంటే. కాబట్టి with అంటే 'తో' అని.

**Pavan:** Who was the boy with you yesterday?

**Ravi:** The boy with a bundle of books?
(పుస్తకాల కట్టతో ఉన్నతనేనా? )

**Pavan:** Yes, he had also with him a cell phone. (అతనితో (దగ్గర) ఓ Cell phone కూడా ఉంది)

**Ravi:** That's my cousin Raghu. He has come down with his mother to spend a few days with us.
(కొద్దిరోజులు మాతో గడపడానికి అతడు వాళ్లమ్మతో వచ్చాడు)

ఇక్కడ కూడా with ను 'తో' అనే అర్థంతోనే వాడాం.




**Bhaskar:** Here is a mango. Very tempting.
(ఇక్కడ మామిడిపండు ఉంది. నోరూరిస్తోంది)

**Bhanu:** Let's eat it. Cut it with this knife.
(ఈ చాకుతో కొయ్యి)

**Bhaskar:** Let's have some forks also to eat it with.
(కొన్ని forks- ముళ్లచెంచాలు -కూడా పట్రా)

**Bhanu:** I bought these mangoes with the money my uncle had given me.
(మా uncle ఇచ్చిన డబ్బుల్తో కొన్నా)

అంటే 'with' ను instruments, tools, weapons ముందు వాడతాం. with a knife, with a pen, with a gun, etc.

1) అతడు పామును కర్రతో కొట్టాడు
He beat the snake with a stick

2) నా అడ్రస్ అతని Pen తో రాసుకున్నాడు
He wrote/ noted down my address with his pen.

3) The killer killed the girl with a gun
gun తో చంపాడు

4) Post office ను Naxals bomb తో పేల్చేశారు
They blasted the post office with a bomb.

With అంటే ఆసరా:
నీ troubles లో నీకు ఆసరాగా ఉన్నాను
I am with you in your troubles.
She is competing with her sister
ఆమె sister తో పోటీ పడుతోంది.

**Practise the following:**

**a) Ramya:** Hi Ravali, ఏంటసలు కనిపించడమే లేదు?
**Ravali:** Exams తో busy గా ఉన్నా.
**Ramya:** నువ్వొక్కదానివే చదువుతున్నావా? ఇంకెవరితోనయినా కలిసి చదువుతున్నావా?
**Ravali:** నేను ఒక్కదాన్నే చదువుకుంటున్నా.
**Ramya:** నీ dress చాలా బాగుంది. ఎక్కడ కొన్నావు?
**Ravali:** Wear n' See shop లో. దీంతోపాటు ఓ hot pack free.

**b) Krishna:** ఏంటి? దొంగలను పోలీసులు అంత సులభంగా పట్టుకున్నారా?
**Karim:** వాళ్ల వాళ్ల కుక్కల సాయంతో పట్టుకున్నారు
**Krishna:** దొంగలతోపాటు, వాళ్లు దొంగిలించిన డబ్బు కూడా పట్టుకున్నారా?
**Karim:** లేదు. వాళ్లలో ఒకడు ఆ డబ్బుతో తప్పించుకున్నాడు.

**ANSWERS:**

**a) Ramya:** Hi, Ravali, not to be seen at all (these days)?
**Ravali:** I am busy with the exams.
**Ramya:** Are you studying alone, or with some one else?
**Ravali:** Alone.
**Ramya:** Your dress is nice. Where did you buy it?
**Ravali:** At Wear n' See. A hot pack is free with it.

**b) Krishna:** How were the police able to catch the thieves so quickly?
**Karim:** With the help of their sniffer dogs (sniffer dogs- పసిగట్టగల కుక్కలు. sniff- పసిగట్టడం).
**Krishna:** Were they able to find the stolen money with the thieves?
**Karim:** No. One of them escaped with the hot stuff.
(hot stuff = దొంగసొత్తు)

● ● ● ● ●

**Manoj:** Hi Mallesh, how goes life?

**Mallesh:** Getting on, Thanks; What's new?

**Manoj:** (Do you) know this, Chandra's selection as the best cadet of the country? (చంద్ర best cadet (NCC) గా ఎంపికవడం తెలుసా? )

M. SURESAN

**Mallesh:** That's the happiest news I've had in a month.
(ఈ నెలలో నేను విన్న happiest news అది.)

**Manoj:** Some thing more for you. Ours is the first college in the state to win this kind of award. (ఇంకోటి తెలుసా? రాష్ట్రం మొత్తంలో ఇటువంటి పురస్కారం తెచ్చుకున్న మొదటి College మనది)

ఇక్కడ 'The' వాడకం గమనించండి. The (best), the (happiest), the (first) etc. అంటే superlative degree of the adjective ముందరంతా 'the' వాడతాం; అలాగే, first, second, third, etc., లాంటి ordinals ముందరంతా రావాలి.

Superlative degree అంటే తెలుసుకదా: ఉదా: Largest, greatest, richest, tallest, most beautiful etc. అంటే adjective చివర + est లేదా + st గానీ, adjective ముందు most అనిగానీ వస్తే అది superlative degree. (Adjective - ఒక వస్తువు/ మనిషి గుణాలను తెలిపే మాటలు; tall boy - ఎలాంటి boy అనే question కు tall అనే answer వస్తుంది కాబట్టి, tall ఇక్కడ adjective). తెలుగులో అర్థం 'అత్యంత' అని.

Superlative degree of the adjective ముందు 'the' వాడతాం.

**a)** భారత్ ప్రపంచంలోని ప్రజాస్వామ్యాలన్నింటిలోనూ అతి పెద్దది
India is the largest democracy in the world. (largest - superlative)

**b)** దక్షిణాది రాష్ట్రాల్లో AP అతి పెద్దది
Andhra Pradesh is the biggest state in the South India.

**c)** ప్రపంచంలో అత్యున్నత పర్వతశిఖరం Mt Everest. Mt Everest (Mt= mount = పర్వతం) is the highest peak (శిఖరం) in the world.

Superlatives ముందు ఎప్పుడూ 'the' వాడటం అవసరం. అలాగే first, second, third, fourth, etc. - వీటిని ordinals అంటారు, వీటిముందు'the' వాడతాం.

1) Class లో first mark అతనిదే
His is the first mark in the class.

2) He is the fourth Prime Minister of India
ఆయన భారత్‌కు నాలుగో ప్రధాని
(మీ నాన్నగారికి నువ్వు ఎన్నవ కుమారుడివి? , Dr మన్మోహన్‌సింగ్ భారతదేశానికి ఎన్నవ ప్రధాని, లాంటి వాక్యాల్లో 'ఎన్నవ' అనే మాటకు English లో సరైన మాట లేదు. కొంతమంది What is the ordinal of Dr Manmohan Singh as PM? అనే expression సరిపోతుందంటారు. ఆ మాట అందరికీ అర్థమవ్వాలి కదా? )
తర్వాత ఇది చూడండి.

**Pranav:** Who is that friend of yours that was with you yesterday.

**Prakash:** He was my school mate. He was one of my best friends at school. We used to compete with each other in the exams, and we have always on top at school.

**Pranav:** Of you two, who was not better

ఇక్కడ better అనేది comparative degree. సామాన్యంగా +er, 'r' చివర వచ్చే adjectives కానీ, more ముందరవచ్చే adjectives కానీ comparative degree లో ఉంటాయి. **Eg:** Taller (tall+er), braver (brave+r), more beautiful (more + beautiful).

మామూలుగా comparative తర్వాత than వస్తుంది.
He is taller than his brother.
అతని brother కంటే అతను పొడవు.

Comparative లో than వస్తే, comparative ముందు the రాదు. అయితే comparative తర్వాత than రాకపోతే, comparative ముందు 'the' తప్పక వస్తుంది.

**a)** Suman is taller than Suseel
(సుశీల్ కన్నా Suman పొడుగు)

**b)** Of Suman and Suseel, Suman is the taller.

a) లో చూడండి - Comparative, taller తర్వాత than ఉంది. కాబట్టి Comparative ముందు 'the' లేదు. b)లో, Comparative తర్వాత అంటే taller తర్వాత than లేదు, కాబట్టి, Comparative taller ముందు 'the' వస్తోంది.




**ప్రశ్న:** *a) If I have money, I wish to buy this car.*
*b) If I had money. I would have spent It.*
ఇక్కడ had, have ఒకే అర్థం వచ్చేలా ఉన్నాయి. వీటి మధ్య తేడా ఏమిటో వివరంగా తెలియజేయగలరు.

**– వి.ఎ.స్వామి, విజయనగరం**

**జవాబు:** have అంటే ఇప్పుడు మనకు ఏదైనా ఉండడం.
I have a Car
(ఇప్పుడు) నాకు Car ఉంది.
had అంటే గతంలో మనకేదైనా ఉండడం
I had a car. ఒకప్పుడు నాకు Car ఉండేది.

If I had money. I would have spent it - ఈ sentence correct కాదు.

a) If I had money, I would spend it అనాలి, లేదా (b) If I had had money, I would have spent it అనాలి. అయితే రెండింటికి అర్థంలో తేడా ఉంది.

a) కి అర్థం, నా దగ్గర ఇప్పుడు డబ్బులేదు, ఉంటే ఖర్చు పెడతాను. లేదు కాబట్టి ఖర్చు పెట్టను. (ఇది present situation) ఇది జరగదు.

b) కి అర్థం గతంలో నా దగ్గర డబ్బు ఉండి ఉంటే, ఖర్చుపెట్టి ఉండేవాడినే. అప్పుడు నా దగ్గర డబ్బూ లేదు, ఖర్చు పెట్టనూ లేదు.

c) If he studied well, he would pass. ఇప్పటి సంగతి ఇది. వాడు చదవడు; చదవడమంటూ జరిగితే పాసవుతాడు.
(ఈ రెండూ present లో జరగనివి.)

d) If he had studied well, he would have passed
వాడు బాగా చదివి ఉంటే (గతంలో), వాడు pass అయి ఉండేవాడు (చదవలేదు, fail అయ్యాడు).




# By nine points..

**Ram:** Raghu, how tall are you?
(రఘు, నువ్వెంత పొడుగు?)
**Raghu:** I am 5'9". (నేను 5'9")
**Ram:** Does it mean you are taller than me by an inch?
(అంటే = (Does it mean) నువ్వు నాకన్నా ఒక inch పొడవా?)
**Raghu:** of course, and I weigh less than you by 5 Kgs -
(కచ్చితంగా. మళ్లీ నీకన్నా నేను 5 Kg ల బరువు తక్కువ)
**Ram:** But the length of my shirt is more than yours by atleast 4 Cms.
(అయితే నా shirt నీ shirt కంటే 4 Cms పొడవెక్కువ)




**Raghu:** That's because you are fatter than me by 3 Cms
(నువ్వు నాకన్నా 3 Cms లావుకాబట్టి)

పై సంభాషణలో 'by' వాడకం గమనించారు కదా. రెండింటికి మధ్య ఏ మేరకు తేడా ఉంది అనేది by ద్వారా తెలుపుతాం.

**a)** you are taller than (I)/ me by an inch
ఒక అంగుళం తేడా
**b)** I weigh less than you by 5 kgs
నీకన్నా నేను 5 Kg తక్కువ బరువు
**c)** by atleast 4 cms
కనీసం 4 Cms మేరకు ఎక్కువ
**d)** fatter than I/ me by 3 cms = 3 Cmsల తేడా.

**Prakash:** Congrats, Lakshman. That was a marvellous game you played yesterday (Lakshman, congrats నిన్న చాలా బాగా ఆడావు). How many points did you win the match by? (ఎన్ని పాయింట్ల తేడాతో గెలిచావు?). I know you were winning and left before the end of the match (నువ్వు గెలుస్తావని తెలిసి ముందే వెళ్లిపోయాను).
**Lakshman:** By nine points (9 points తేడా/ ఆధిక్యతతో)
**Prakash:** At the half time itself you were leading by 4 points. (Half time అప్పుడే నువ్వు 4 points ఆధిక్యతతో/ తేడాతో ముందున్నావు) That's a good lead. (మంచి ఆధిక్యత)

ఇక్కడ కూడా ఏ మేరకు తేడా/ఆధిక్యత అనేది 'by'తో చూపిస్తున్నాం కదా.

**a)** ఆమె ఆమె చెల్లికంటే రెండేళ్లు పెద్దది
She is her sister's elder/ older than her sister by two years.
**b)** ఈ necklace కంటే ఆ necklace రెండువేల రూపాయలెక్కువ.
This necklace is costlier than that by Rs. 2000/-

**Salesperson:** What do you want, please?
**Customer:** How much is this wrist watch? (ఈ watch ఖరీదెంత?)
**Salesperson:** It's Rs. 2000/- (రెండు వేల రూపాయలు)
**Customer:** But it was Rs 1700/- last week. (గతవారం 1700 అనే అన్నారు)
**Salesperson:** The price has gone up by Rs. 3000/-
(ధర మూడువేల రూపాయలు పెరిగింది. ఏ మేరకు - by Rs. 3000/-)

**Practise the following in English:**

**1.**
**Priya:** నాకంటే నువ్వు పెద్దవాడివా?
**Sekhar:** అవును. కనీసం రెండేళ్లు (by వాడండి).
**Priya:** అందుకనా నిన్ను ముందు పిలిచారు Interview కి.
**Sekhar:** ఎంతముందేమిటి? 10 నిమిషాలేగా.
**Priya:** Sreekanth ఎప్పుడొచ్చాడిక్కడికి?
**Sekhar:** నా కంటే అరగంట ముందు.
**Priya:** అయితే అతన్ని నీకంటే పావుగంట late గా పిలిచారు కదా.

**2.**
**Santosh:** వాటి ధరల్లో తేడా కనీసం 50 రూపాయలు.
**Sunil:** వాటి రెండిట్లో ఏది ఎక్కువ బరువు? ఎన్ని కిలోలు?
**Santosh:** ఆ పెద్దది, చిన్నదానికన్నా 4 Kgలు బరువెక్కువ.
**Sunil:** ఇది దానికంటే 50 రూపాయలు తక్కువ.

**ANSWERS**

**1.**
**Priya:** Are you older than I/ me?
**Sekhar:** Yes, atleast by 2 years.
**Priya:** Is that why they called you earlier for the interview?
**Sekhar:** How much earlier? Just by 10 minutes.
**Priya:** When did Sreekanth come here?
**Sekhar:** Half an hour earlier than I/ me (Earlier than I by half an hour)
**Priya:** But they called him later than you by just 15 minutes.

**2.**
**Santosh:** They differ in their prices by Rs 50/-
**Sunil:** Which of the two is the heavier, and by how many kgs?
**Santosh:** The bigger one is heavier than the smaller by 4 kgs.
**Sunil:** It costs less than that by Rs 50/-



**Anjan:** Hi Arun, which is your most favourite wild animal?
(అడవి మృగాలలో నీకెక్కువ ఇష్టమైనదేది?)
**Arun:** The tiger, of course (పులి)
**Anjan:** Doesn't the lion look more majestic than the tiger? (పులికన్నా సింహంలో ఎక్కువ రాజసం కనిపిస్తుంటుంది కదా?)
**Amar:** The elephant is my favourite (నా favourite ఏనుగు). It looks grand and is not at all ferocious like the tiger or the lion. (చాలా grand గా కనిపిస్తుంది. పులి, సింహంలాగా క్రూరమైంది కాదు)

ఇక్కడ, 'the' వాడకం చూడండి. The ని ఇక్కడ countable singulars... lion, tiger, elephant ముందు వాడాం. The tiger, the lion, the elephant.

The tiger is my favourite
ఇక్కడ the tiger అంటే ఆ జాతికి చెందిన జంతువులన్నీ అని. అలాగే the lion, the elephant = సింహాలు, ఏనుగులూ అని.

The dog is a faithful animal
కుక్క (అన్ని కుక్కలూ) విశ్వాసంకల జంతువు(లు)

ఒక జాతిని మొత్తం గురించి చెప్పేందుకు countable singular ముందు the వాడితే సరిపోతుంది.

The Indian is not so hardworking as the Japanese.
భారతీయులు (the Indians) జపాన్ వాళ్లంత (the Japanese) కష్టపడి పనిచేయరు.
The cheetah ( all cheetahs - చిరుతపులి) is the fastest of all animals.
(చిరుతపులులు అన్ని జంతువులకన్నా వేగం కలవి)
The lotus is a lovely flower
తామర పువ్వు అందంగా ఉంటుంది (అన్ని తామర పూవులు అని).
ఒంటె ఎడారిలో ఓడ లాంటిది
The camel is the ship of the desert.

**Kuntala:** Your friend Kamala has failed again (మీ friend కమల మళ్లీ fail అయింది)
**Karuna:** She is lazy. The lazy never succeed (ఆమె సోమరి. సోమర్లు విజయం పొందరు). She is rich of course, so she does not care. (వాళ్లకు బాగా డబ్బుంది, అందుకని పెద్దగా పట్టించుకోదు)


M. SURESAN

**Kuntala:** But not all the rich are like that. (అందరు ధనవంతులూ అలా ఉండరు కదా)
**Karuna:** That's right. Among the hardworking, there are many who are rich. (అది నిజమే. కష్టపడి పనిచేసే వాళ్లలో, చాలామంది ధనికులు ఉన్నారు)

ఇక్కడ చూడండి: The rich, the lazy, the hardworking. rich (డబ్బున్న, ధనికులైన), lazy (సోమరి అయిన), hardworking (industrious) = కష్టపడే - వీటన్నింటినీ adjectives అంటాం - అంటే గుణాలను తెలిపే పదాలన్న మాట. వాటిముందు the వాడితే ఆ గుణం గలవాళ్లు అనే అర్థం వస్తుంది. అయితే అది plural. Tall = పొడవైన, the tall = పొడగర్లు (plural); Fat = లావైన, the fat = లావుగా ఉండేవాళ్లు; poor = బీద, the poor = బీదవాళ్లు.

**1)** పొడగర్లు పొట్టివాళ్ల కంటే బాగా ఆడతారు
The tall play better than the short.
**2)** ధనికులు బీదవాళ్లకు సాయం చేయాలి.
The rich should help the poor.
**3)** ధనికులు ఎక్కువ ధనికులవుతున్నారు. బీదవాళ్లు ఇంకా బీదవాళ్లవుతున్నారు
The rich are getting richer, the poor are getting poorer.
**4)** సోమర్లు పైకిరారు
The lazy never prosper

**Practise the following in English:**

**1.**
**Sasikanth:** Assignment పూర్తిచేశావా?
**Sreekanth:** లేదు. రాత్రి ప్రారంభిస్తా.
**Sasikanth:** సోమర్లెప్పుడూ వాయిదా వేస్తుంటారు.
**Sreekanth:** కష్టపడేవాళ్లందరూ విజయం పొందుతుంటారా?
**Sasikanth:** గమ్యాన్ని దృష్టిలో ఉంచుకొని కష్టపడే వాళ్లకు విజయం తథ్యం

**2.**
**Pramod:** జింక చాలా వేగంగా పరిగెడుతుంది కదా?
**Prasad:** చిరుతపులి (Cheetah) జింక కంటే వేగం.
**Pramod:** ప్రకృతిలో సాధు ప్రాణులకే ఎక్కువ హాని జరుగుతుంటుంది (సాధు ప్రాణులు = Meek creatures). దేవుడు సాధు ప్రాణులను రక్షించడేంటో?

**ANSWERS**

**Sasikanth:** Have you finished the assignment?
**Srikanth:** No. I will begin it in the evening.
**Sasikanth:** The lazy always postpone
**Srikanth:** Do the industrious always succeed?
**Sasikanth:** The industrious with a clear idea of their goals always succeed.

**2.**
**Pramod:** Doesn't (Does not) the deer run very fast?
**Prasad:** The cheetah is faster than the deer.
**Pramod:** The meek always are harmed/ always suffer in nature. Wonder why God doesn't protect the meek (Wonder = I wonder - అర్థం కావడంలేదని/ సందేహాన్ని తెలపడం) from the ferocious.



గమనిక: Comparative degree లో adjective ఉంటే than తర్వాత me or I? him or he? her or she? them or they? - ఏది వాడాలనే సందేహం వస్తుంటుంది కదా.

Suman is taller than me/ taller than I.

ఈ రెండింట్లో ఏది correct? Grammatical గా taller than I అనేదే correct. అయితే modern usage ప్రకారం taller/ stronger/ cleverer than me/ him/ her/ them/ us బాగా వాడుకలోకి వచ్చేసింది. ఇదే వాడడం better. taller than I లాంటిది కాస్త గ్రాంధికం. ఇప్పుడు అంతగా వాడుకలో లేదు. అయితే ఈ కింది వాక్యాలు చూడండి.

**a)** My friend likes the mango better than I
**b)** My friend likes the mango better than me.

ఇక్కడ రెండూ Correct, వేర్వేరు అర్థాలతో.
a) కు అర్థం. నాకు mango ఇష్టం. ఆమెకూ ఇష్టం. నాకంటే mango అంటే ఆమెకు ఎక్కువ ఇష్టం.
b) కు అర్థం. ఆమెకు నేనంటే ఇష్టం. అయితే ఆమెకు mango పట్ల ఉన్నంత ఇష్టం నాపట్ల లేదు- అని.
ఇది clear గా తెలిపేందుకు (a) లో My friend likes the mango better than I do అని do పదాన్ని extra గా చేరుస్తారు.




**ప్రశ్న:** *Did not he play cricket? ఈ వాక్యంలో Interrogative negative లో 'not' he కు ముందు వచ్చింది. కాని కొన్ని సందర్భాల్లో పత్రికల్లో, బుక్స్‌లో 'not' he కు తర్వాత వస్తుంది. తేడా తెలుపగలరు.*
*ఉదా: Did he not speak the truth?*

**– ఎం.సురేంద్రనాథ్, ధవళేశ్వరం**

**జవాబు:** (a) Did not he play cricket? అన్నా, (b) Did he not play Cricket? అన్నా ఒకటే. (b) ఎక్కువగా వాడుకలో ఉంది. అయితే, contracted form వాడినప్పుడు, (a) వస్తుంది. Didn't (Did not he) he play cricket? ఇది spoken english లో ఎక్కువగా వాడతారు.




# కుడి ఎడమైతే పొరపాటే!




M. SURESAN

**Bhaskar:** What are you looking at, Bhanu?
(దేన్ని చూస్తున్నావ్ భానూ? )

**Bhanu:** At the little boy there; He is sitting on the arms of the chair. He may fall down any moment.
(ఆ చిన్నపిల్లాడ్ని. వాడు కుర్చీ చేతులమీద కూర్చుని ఉన్నాడు. ఏ క్షణాన్నైనా కిందపడవచ్చు)

**Bhaskar:** He is in real trouble. let's go to him and put him down.
(వాడు నిజంగా ఇబ్బందిలో ఉన్నాడు. వాడి దగ్గరకు వెళ్లి కిందకు దించుదాం పద)

**Bhanu:** That will save him from trouble.
(వాడిని ఇబ్బంది నుంచి కాపాడుతుంది.)

**Bhaskar:** Surprising, no body to take care of the child
(ఆ బిడ్డను జాగ్రత్తగా చూసుకునే వాళ్లిక్కడ లేకపోవడం ఆశ్చర్యంగానే ఉంది)

పై సంభాషణలో మాటలను గమనించండి. అవి... at, on, of, in, to, from. మనలో చాలామందికి తెలుసు ఇలాంటి మాటలను prepositions అంటాం. English లో prepositions కు ఉన్న ప్రాధాన్యం చాలా ఎక్కువ. ఈ prepositions సంగతి, ముఖ్యంగా వాటి వాడకం చాలా వింతగా ఉంటుంది. preposition కు తెలుగులో సమానమైనవి విభక్తి ప్రత్యయాలు.

Prepositions వాడకంలో సమస్యలకు కారణం, దానికి ఓ హేతుబద్ధమైన వివరణ లేకపోవడం. ఏ మాట ముందు ఏ preposition, తర్వాత ఏ preposition ఎందుకు రావాలి అనే ప్రశ్నకు సమాధానం లేదు. అందుకే వాటివాడకం English మాతృభాష కానివాళ్లకు తలనొప్పి. English బాగా చదివితేనే కానీ అవి అలవాటుకావు. వాడుక తెలుసుకోవడం ద్వారా కొంత అవగాహన ఏర్పరచుకోవచ్చు.

English లో prepositions ను మనం విభక్తి ప్రత్యయాలనుకుంటే, తెలుగులో మాట తర్వాత వచ్చే ప్రత్యయాలన్నీ English లో మాటకు ముందువస్తాయి.

**Sundar:** He has come from Vijayawada.
(ఆయన విజయవాడ నుంచి వచ్చాడు)
చూశారా, మనం విజయవాడ నుంచి అంటాం. English లో from Vijayawada అని ఉంటుంది.
He will be here till 5'o clock.
(till 5'o clock = 5 వరకు)

**Sukumar:** When will he go back to Vijayawada?
(విజయవాడకు = to Vijayawada)

**Sundar:** He hasn't (has not) yet told me of it.
(of it = దాని గురించి నాకింకా చెప్పలేదు)

కాబట్టి prepositions ఉపయోగం తెలుగు, English లలో కుడి, ఎడమగా ఉంటాయి. కుడి ఎడమైతే ఇక్కడ పొరపాటే.

prepositions ఉపయోగించడం గురించి కొన్ని general principles తెలుసుకోవడం చాలాముఖ్యం. Spoken English Correct గా ఉండాలంటే అవి ఎంతో అవసరం.

1) **Pavan:** I wrote a letter to my sister yesterday
(మా sister కు నిన్న letter రాశా)

**Ravikanth:** Did you tell her about the book exhibition here?
(ఇక్కడి పుస్తక ప్రదర్శన గురించి ఆమెకు చెప్పావా? )

**Pavan:** Yes, I did. I wrote to her to start by the 9 AM train which arrives here at 5 PM.
(చెప్పాను. తొమ్మిది గంటల train లో బయల్దేరాల్సిందిగా రాశాను. ఇక్కడికది 5 గంటలకు చేరుతుంది)

ఈ సంభాషణలో to my sister, about the book exhibition, by the 9 AM train, arrives here at 5 PM - ఈ expressions లో to, about, by, here అనే prepositions అన్నీకూడా sentence లో ఉన్న మాటల సంబంధాన్ని తెలుపుతున్నాయి కదా.

తెలుగులో మా sister కు (to my sister), పుస్తక ప్రదర్శన గురించి (about the book exhibition), 9 గంటల train లో (by the 9 AM train), 5 గంటలకు (at 5 PM) అన్నీ మన విభక్తి ప్రత్యయాలు చేసే పనే చేస్తున్నాయి కదా. ఇది prepositions కు ఉన్న ముఖ్యమైన పాత్ర. Sentence లో మాటకూ మాటకు మధ్య సంబంధం చూపడం.

ఎవరికి? to my sister;
దేని గురించి? : about the book exhibition;
ఏ train లో? : by 9 AM train;
ఎన్నింటికి : at 5 PM.

ఇవన్నీ మనం English విస్తృతంగా చదవడం, వినడం వల్ల అలవాటవుతాయి.

***Prepositions సామాన్యంగా ఎక్కడ ఉంటాయి?***

2) **Ramana:** These flowers are nice. Are they from your garden?
(ఈ పూలు చాలా బాగున్నాయి. మీ తోటలోవా? )

గమనించండి - from- garden కు ముందు. అదే తెలుగులోనైతే 'తోటలో' అంటాం. 'లో'- తోట తర్వాత వచ్చేది.

**Rahul:** No. They were in the basket on the table. I took them from the basket.
(కాదు, Table మీదున్న బుట్టలో ఉన్నాయి. నేను దాన్లోంచి తీసుకున్నా)

ఇక్కడ గమనించారు కదా? from, in, on ఈ prepositions వాటికి సంబంధించిన మాటల ముందు రావడం.

3) **Prathibha:** Where are the flowers?
(ఆ పూలు ఎక్కడ ఉన్నాయి? )

**Prabha:** They are in the basket. The basket is on the table. I bought the flowers at the flower stall, beside my uncle's place near the Post office.

(in the basket= బుట్టలో, on the table= table మీద; at the flower stall= పూలకొట్టులో; beside my uncle's place= మా మామవాళ్లింటి పక్కన; near the Post office= Post office దగ్గర)

ఇవన్నీకూడా- in, on, at, beside, near- ప్రదేశాన్ని తెలిపే prepositions. ఫలానాచోట అని చెప్పడానికి వీటిని వాడాం కదా? positions తెలిపే ఇంకొన్ని prepositions చూద్దాం.

**Suneetha:** Is your home the one behind the post office?
(మీ ఇల్లు Post office వెనకనా? )

**Supriya:** No, it is by the Post office.
(కాదు. పక్కన)
It is between the Post office and the Income Tax office
(Post office, Income Tax office మధ్య)

పైన చెప్పిన prepositions అన్నికూడా, ప్రదేశాలను సూచించేవిగానో, positions తెలిపేవిగానో ఉన్నాయి కదా?

***Practice the following aloud in English:***

**a) Karim:** ఈ దగ్గరలో ఎక్కడయినా Book shop ఉందా?
**Kamesh:** ఈ వీధి చివర ఓ మందుల షాపు ఉంది. దానిని ఆనుకునే ఓ book shop ఉంది. ఆ book shop లో ఏం పుస్తకాలు కొనాలనుకుంటున్నావు?
**Karim:** నాకు కొన్ని computer books కావాలి. అవి మా ఊళ్లో దొరకడంలేదు.
**Kamesh:** అయితే, నీకు కావాల్సిన బుక్స్ ఆ cinema hall వెనక ఉన్న book stall లో దొరుకుతాయి. దాని దగ్గరే ఇంకో book stall ఉంది. అక్కడ కూడా దొరుకుతాయి.

**b) Pranav:** నిన్న నువ్వెక్కడున్నావు?
**Pratap:** మా friend తరుణ్ ఇంట్లో
**Pranav:** అతడి ఇల్లెక్కడ?
**Pratap:** మా ఇంటికి చాలా దగ్గర. వాళ్లింటికి మా ఇంటికి మధ్య మూడు buildings మాత్రమే ఉన్నాయి. వాళ్లింటి ముందో పెద్ద చెట్టు కూడా ఉంది.
**Pranav:** అతడింటి పక్కన ఓ bank ఉంది కదా?
**Pratap:** అవును.

**c) Sravanthi:** నా పుస్తకం నిన్న ఆ table మీద ఉంది. ఇవాళ నీ bag లో ఉందేంటి?
**Swarna:** అవును. నేను తీసుకున్నా. అందులో కొంత సమాచారం నాకు కావాల్సి వచ్చింది.
**Sravanthi:** నీ bag ను table కింద పెట్టావెందుకు?
**Swarna:** Table మీద చోటులేదు కాబట్టి

## ANSWERS:

**(a) Karim:** Is there a book shop anywhere near here?
**Kamesh:** At the end of the street there is a medical shop. Just by the side of it (beside it/ by it/ near to it) there is a book shop. What books do you want to buy at the shop?
**Karim:** I want some Computer books. They are not available in our town.
**Kamesh:** Then you get the books you want at the book stall behind the theatre. Near that there is another book stall too. You get there the books you want.

**(b) Pranav:** Where were you yesterday?
**Pratap:** At my friend Tarun's
**Pranav:** Where is his home?
**Pratap:** Very near mine. Only three buildings are there between mine and his. There is a big tree in front of it.
**Pranav:** Isn't there a bank beside his home?
**Pratap:** Yes.

**(c) Sravanthi:** My book was on the table yesterday. Why / How is it in your bag today?
**Swarna:** Yes, I took it. I wanted some information in it.
**Sravanthi:** Why did you keep your bag under the table?
**Swarna:** Because there was no room on the table.

(English లో చోటు అనడానికి ఇటువంటి సందర్భంలో place/ space సరైన మాటకాదు. Room వాడాలి.

Busలో ముప్పై మందికి మాత్రమే చోటుంది. There is room in the bus only for 30 passengers)

ఇప్పటివరకు position ను తెలిపే preposition కొన్నింటిని తెలుసుకున్నాం. ఎక్కడ? అని ప్రశ్నవేస్తే ఇవ్వాల్సిన సమాధానానికి ఈ prepositions వాడతాం. positions ను తెలిపే మరికొన్ని prepositions:

**Sukumar:** Why has the train stopped?
(Train ఎందుకు ఆగింది)

**Suman:** There is flood water over the bridge
(Bridge మీద వరద నీరు ఉంది)
The whole area on either side of the track is under water.
(Bridge కు రెండువైపుల ఉన్న ప్రదేశమంతా మునిగిపోయింది= under water =నీళ్ల కింద)

**Sukumar:** Thank God, All the passengers in the train are safe
(పోనీలే train లోని ప్రయాణికులంతా క్షేమంగా ఉన్నారు)

Above, below, inside, outside, beyond - ఇవి కూడా positions తెలిపే prepositions. వీటిని మీ వాక్యాల్లో వాడి చూడండి.

**ప్రశ్న:**

1. *Discuss* తర్వాత *About* రాదా? *Explain* చేయగలరు
2. ఆయన నీకు ఏమవుతాడు? (Eg: మామ, అల్లుడు) దీనిని ఇంగ్లిష్‌లో తెలుపగలరు
3. 'నేను మీకు ఒక పాట వినిపిస్తాను' - దీనిని ఇంగ్లిష్‌లో ఎలా అనాలి?
4. *'Just'* అనే పదం *usage* లో దాని మార్పులు తెలుపగలరు.
5. 'అతడు ఈ మధ్య నన్ను డబ్బులు అడగడానికి సంకోచిస్తున్నాడు' - దీనిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**– జి.వెంకటేశ్వర్లు, కన్నూర్, కరీంనగర్ జిల్లా**

**జవాబు:**

1. Discuss, describe, mention, explain, state, remark- వీటి తర్వాత about రాదు.
2. What is he to you?/ How is he related to you?
3. I will give you a song/ Let me sing a song to you.
4. Just= ఇప్పుడే, just= only, మాత్రమే
5. Of late he has been hesitating to ask me for money.




# talking about..





M. SURESAN

**Ram:** Hi Shyam and Prem, well met (కలుసుకోవడం శుభం). You are talking about the college day perhaps. (మీరు College Day ను గురించి మాట్లాడుతున్నట్టున్నారు? - well met = కలుసుకోవడం మంచిదయింది. conversation లో practise చేయండి)

**Shyam:** Yea, about the item we want to present. (అవును. ఆరోజు మేం ప్రదర్శించబోయే అంశం గురించి)

**Ram:** And what's that going to be? (ఏం ప్రదర్శించబోతున్నారు? )

**Prem:** We are yet to take a decision about it. (దాని గురించి ఇంకా నిర్ణయం తీసుకోవాల్సి ఉంది)

**Ram:** OK. O, that reminds me. There will be a talk on 'Decision Making' by Prof. Nischai tomorrow at 6 at college. Are you coming? (ఆ, నాకు గుర్తొచ్చింది. - reminds me = గుర్తొచ్చి మాట్లాడేటప్పుడు అంటుంటాంకదా - 'అన్నట్టు గుర్తొచ్చింది', అని - దానికిది English. మీ conversation లో వాడండి. రేపు ఆరింటికి 'నిర్ణయక్రమం' అంశం గురించి Prof. నిశ్చయ్ మాట్లాడబోతున్నారు college లో. మీరు వస్తున్నారా? )

**Shyam and Prem:** Oh, sure. No missing it. Prof. Nischai is very good at giving such talks. We will certainly make it. (అదెలా miss అవుతాం. అటువంటి విషయంమీద చాలా బాగా మాట్లాడతాడు)

**Ram:** Just as our Principal is good at picking such experts. (అలాంటి నిపుణులను ఎంపిక చేయడంలో మన Principal లాగ)

**Shyam:** That's true.

**Prem:** You are right.

పై సంభాషణలో prepositions– about, on, at గమనించారు కదా. మనలో చాలామందికి తెలుసు, about అంటే గురించి అని. About the book = ఆ పుస్తకాన్ని గురించి.

**a)** మేం నిన్న అతడి గురించి paper లో చదివాం
We read about him in the paper.

**b)** వాళ్లు వాళ్ల school days గురించి మాట్లాడుకున్నారు
They talked about their school days.

**c)** దాని గురించి నాకేం గుర్తులేదు
I do not remember any thing about it.

**on:** కొంచెం పెద్ద, ముఖ్య విషయాలను గురించి అనేటప్పుడు on వాడతాం.
He is going to talk on decision making
నిర్ణయ ప్రక్రియ గురించి.

**a)** మన ప్రజాస్వామ్యాన్ని గురించి రాసిన వ్యాసం అది
It is essay on our democracy.

**b)** రైతుల ఆత్మహత్యల గురించి నివేదిక అది
It is a report on farmers suicides.

**at:** 'at' ఉపయోగాలు ఇంతకు ముందు చాలా తెలుసుకున్నాంగదా. ఇప్పుడిది చూద్దాం.

**Sekhar:** How good are you at Telugu? (మీకు తెలుగు ఎంత బాగా వచ్చు? )

**Sanjeev:** Just give me some time. I will be as good at it as you are. (నాక్కాస్త time ఇవ్వు. నేను కూడా నీ అంత బాగా మాట్లాడతాను)

**Sekhar:** I am poor at Hindi (నాకు హిందీ రాదు)

**Sanjeev:** I am quick at picking up languages (భాషలు నాకు త్వరగా వస్తాయి)

మనం మొదటి సంభాషణలో చూశాంకదా.

**a)** He is good at giving such talks.

**b)** Our Principal is good at picking such experts.

good at – ఏదైనా ఒక విషయం బాగా తెలియడం.
Poor at Maths – Maths రాదు.
Quick at understanding
త్వరగా అర్థం చేసుకోగలగడం. ఇలాంటి చోట్లంతా ఆ గుణాలు, చర్యల తర్వాత 'at' వాడతాం.

**a)** అతడు పనులుచేసే విషయంలో జాప్యం చేస్తాడు
He is slow at doing things.

**b)** అతడు Maths కు అసలు పనికిరాడు
He is hopeless at Maths.

**c)** అతడికి grammar రాదు
He is bad at grammar.

**d)** ఆమె పాటలో మా అందరిలో దిట్ట
She is the best of all of us at singing.

**Now practise the following aloud in English:**

**Sushma:** Hi, Sumana, ఏంటిలా వచ్చావు?

**Sumana:** నువ్వెంత busy గా ఉన్నావిప్పుడు?

**Sushma:** ఫర్వాలేదు. ఖాళీగానే ఉన్నా, ఏం కావాలి చెప్పు?

**Sumana:** నీకు English బాగావచ్చు కదా. ఈ lesson కాస్త explain చేయి.

**Sushma:** నాకు English బాగానే వచ్చు కాని Explain చేయడంలో నేనంత గొప్పకాదు.

**Sumana:** అర్థం చేసుకోవడంలో నేను కాస్త slow. మా teacher చాలా fast గా చెప్తుంది. మా classmates చాలామంది త్వరగా నేర్చుకోగలరు.

**Sushma:** OK. నేను ప్రయత్నిస్తా. చూద్దాం నేనెంత బాగా చేయగలనో.

**b) Pavan:** ఆ మూవీ గురించి నీకేం తెలుసు?

**Prakash:** ఏ movie గురించి నువ్వడగడం?

**Pavan:** నవరంగ్‌లో ఇప్పుడు ఆడుతున్న movie గురించి

**Prakash:** అది రాజకీయాలలో అవినీతిని గురించి అనుకుంటా.

**Pavan:** ఆ ఇప్పుడు గుర్తొచ్చింది. నిన్న paper లో ఈ అంశాన్ని గురించి నేనో పెద్ద వ్యాసం చదివా. అందులో కొన్ని lines ఈ చిత్రాన్ని గురించి కూడా ఉన్నాయి.

**Prakash:** నేనూ చదివా ఆ వ్యాసం. దాని రచయిత ఇటువంటి విశ్లేషణలో చాలా తెలివిగలవాడు. (విశ్లేషణ - analysis)

**Pavan:** వ్యాసాల విషయానికొస్తే, ఆ పత్రిక centre page articles అన్నీ బాగానే ఉంటాయి. అయితే అన్నీ రాజకీయాలను గురించే ఉంటాయి.

**Answers**

**Sushma:** Hi Sumana, What brings you here? (ఇది conversational expression. ఇది మీ conversation లో వాడండి)

**Sumana:** How busy are you now?

**Sushma:** Doesn't matter. (ఇదీ మీ conversations లో వాడుతూండండి) I am at leisure. (at leisure – ఖాళీ; pronunciation: లెజ. జ - measure లో లాగా, pleasure లో లాగా). What do you want?

**Sumana:** You are good at English, Please explain this lesson.

**Sushma:** I am good at English, but I am not so good at explaining.

**Sumana:** I am a little slow at understanding things. Our teacher is fast. Many of my classmates are quick at learning.

**Sushma:** OK I'll try. Let us see how good I am at it.

**b) Pavan:** What do you know about the movie?

**Prakash:** What movie are you talking about?

**Pavan:** The one showing at Navrang. (Showing – ఆడడం. The movie is now showing at the theatre. ఒక సినిమా ఆడడం 'run' అని కూడా అంటాం. The movie ran for a hundred days)

**Prakash:** I think it's (it is) a movie about corruption in politics.

**Pavan:** Yes, that reminds me. I read an article in the paper on the same topic yesterday. (పత్రికలలో, magazines లో వ్యాసాలను articles అంటారు) There were some lines in it about this movie.

**Prakash:** I read it too. The writer is very clever at this kind of analysis.

**Pavan:** Talking about articles, (విషయానికొస్తే - talking about/ coming to) all the centre page articles in the paper are good. The trouble is, all of them are on politics.

♦ ♦ ♦ ♦ ♦

**Amar:** Dad, I am starting for college. When will you be there? (నేను college కి వెళ్తున్నా. మీరెప్పుడుంటారు అక్కడ? )

**Dad:** You mean, at the college? (నువ్వనడం, college లోనా? ) You know, mother is going to hospital. I am taking her there; after coming back from the hospital I will see you at the college. (అమ్మ hospital కు వెళుతోంది కదా. నేను తీసుకెళుతున్నాను. Hospital నుంచి వచ్చిన తర్వాత college కువస్తాను.) Where is Arun? (అరుణ్ ఎక్కడ? )

**Amar:** He has gone to temple. You know today is friday. Every friday he goes to temple. His engineer friend is at the temple supervising some repairs. (వాడు గుడికి వెళ్ళాడు. ఈ రోజు శుక్రవారం కదా. ప్రతి శుక్రవారం వెళ్తాడు. వాళ్ల Engineer friend కూడా అక్కడే ఉన్నాడు.)

**Dad:** Your mother needs some medicines. Perhaps the shop is open now. (అమ్మకు మందులు కావాలి. Shop తెరిచే ఉంటుందేమో? )

**Amar:** That shop is my friend's. He opens shop quite early. I think it is open now. (ఆ shop మా friend ది. వాడు త్వరగానే తీస్తాడు. ఇప్పుడు తెరిచే ఉంటుందనుకుంటా)

పై సంభాషణలో మనం గమనించింది- ఒకే మాట ముందు, ఒక సందర్భంలో 'the' వాడడం, ఇంకో సందర్భంలో 'the' వాడకపోవడం. ఈ పరిస్థితి ముఖ్యంగా ప్రదేశాల ముందు వస్తుంది.

కొన్ని ప్రదేశాలు ప్రత్యేకంగా కొన్ని ఉపయోగాలకే పరిమితంగా ఉంటాయి. School, college, institution లాంటివి విద్యాభ్యాసానికి, విద్యా బోధనకు (learning and teaching) పరిమితం, ప్రత్యేకం. అలాగే hospital, clinic, nursing home లాంటివి వైద్యం పొందడానికి, వైద్యం చేయడానికి ప్రత్యేకం. ఇక temples, churches, mosques (masjids) లాంటివి పూజలకూ, ఆరాధనకు, ప్రార్థనలకు ప్రత్యేక ప్రదేశాలు. ఈ ప్రదేశాలు/ స్థలాల ప్రత్యేక ఉపయోగాలు ప్రస్తావిస్తున్నప్పుడు 'the' రాదు.

| I A | | B |
|---|---|---|
| Students/ lecturers/ professors... | go to are at | school, college, university etc. |

A కింద చెప్పిన వాళ్లందరూ B కింద చెప్పిన చోట్లకు వాటి ప్రత్యేక ఉపయోగం కోసం వెళ్తారు కాబట్టి, school, college, etc ముందు 'the' రాదు. మిగతా వాళ్లు, అంటే schools, colleges, etc ఉపయోగంతో సంబంధంలేనివాళ్లు, go to/ are at the school/ college etc.

A student goes to college/ their parents go to the college.
(to meet the principal, pay the fees, etc)

**II** భక్తులు (devotees), పూజారులు ప్రార్థన స్థలాలకు వెళతారు. They go to temple/ to church/ to mosque, etc.

ఇందాకటి సంభాషణలో, the engineer is at the temple to supervise some repairs అన్నాం. (అక్కడ ఆయన పూజకోసం వెళ్ళడం లేదు కదా)

**III** Doctors, nurses, patients go to hospital. వీళ్లందరికి hospital తో పని కాబట్టి, hospital ముందు 'the' రాదు. ఇందాకటి సంభాషణలో Amar's father, after returning from the hospital అన్నాడు కదా. అంటే ఆయన అక్కడికి patient గానో, doctor గానో వెళ్ళడంలేదు అని కదా.

A patient is at hospital. Their friends and relatives go to the hospital to see.

ఇలాగే business persons విషయంలో open shop, close shop, are at shop. ఇతరులైతే go to the shop, are at the shop.

**Karun:** What's your brother, Kesav? (మీ brother ఏం చేస్తుంటాడు కేశవ్? )

**Keshav:** He goes to college. (అంటే- అతడు college student అన్న మాట. దీనినే 'He goes to college' అని ఇంకో విధంగా చెప్పడం).



**ప్రశ్న:** *Direct నుంచి Indirect speech లోకి మార్చేటప్పుడు Interoggative sentence లలో if లేదా whether వస్తుంది. కాని if ఎప్పుడు వాడాలి? whether ఎప్పుడు వాడాలో తెలియజేయగలరు. Synthesis of sentences (so-that/ neither nor, not only but also) ఉపయోగించే పద్ధతులు వివరించగలరు.*

*– ఎల్.దుర్గాప్రసాద్, విజయవాడ*

**జవాబు:** Direct నుంచి Indirect speech లోకి మార్చినప్పుడు, (Interrogative sentences లో) if అయినా, whether అయినా ఒకటే. Synthesis of sentences గురించి వివరిస్తాం.

**Aravind:** When are you starting for college? (College కు ఎప్పుడు బయల్దేరుతున్నావు? )

**Bhanu:** Why, as usual at 9. (ఏం? మామూలుగానే తొమ్మిదింటికి)

**Aravind:** But yesterday you left even at 8. (కాని నిన్న నువ్వు ఎనిమిదింటికే బయల్దేరావు కదా. Even at 8= at 8 itself = ఎనిమిదింటికే)

**Bhanu:** No, I started at 8, but it was not for college. I went to Suman's and from there, we two set out for college at 8.45. (ఎనిమిదింటికి బయల్దేరింది, college కి కాదు. సుమన్ ఇంటికి. అక్కడ్నించి కలిసి college కి బయల్దేరాం) set out= బయల్దేరడం- conversation లో వాడండి.

**Aravind:** Have you sent for Bharat yet? (భరత్ కోసం/ భరత్‌కు కబురు పెట్టావా? )

# What for?..

**Bhanu :** What for? (ఎందుకు? - సామాన్యంగా for what అని అనరు)

**Aravind :** Have you forgotten? We have got to practise for the match next week. (మరచిపోయావా? వచ్చేవారం Match కి practise చేసుకోవాలి కదా? )

**Bhanu :** He is in Chennai for his cousin's wedding. I'll (I will) call him today and tell him that we should prepare for the match. (వాళ్ల cousin పెళ్ళికి చెన్నై వెళ్ళాడు. ఈవాళ phone చేసి match కి ready అవాల్సి ఉందని చెప్తా)

**Aravind:** Tell him to start early. He is known for his game but notorious for his lack of time sense. (త్వరగా రమ్మను. Game బాగా ఆడతాడని పేరుంది. అలాగే Time sense = punctuality = సమయపాలన లేదనీ పేరుంది.)

Notorious=నొటోరియస్- టొ నొక్కిపలకాలి = చెడు పన్లకు, చెడు గుణాలకు పేరు పొందడం. a notorious murderer= పేరు పొందిన హంతకుడు. Famous actor = ప్రసిద్ధ నటుడు)

పై సంభాషణలో for వాడకం చూడండి.

1) ఇంతకు ముందు చూశాం- ఒక వ్యవధి (period of time) ముందు for వస్తుంది- for 10 minutes (10 నిమిషాలుగా), for an hour (గంటగా), for 3 years (మూడేళ్లుగా) etc.

2) 'for' ముఖ్యంగా వాడడం- కోసం, ఉద్దేశించిన అనే అర్థాలతో.

పై సంభాషణలో
- a) Send for Bharat = భరత్‌కు /భరత్ కోసం
- b) what for? = ఎందుకు / ఎందుకోసం
- c) for the match = match కోసం/match కి (ఉద్దేశం)
- d) for his cousin's marriage = cousin పెళ్లికోసం/ పెళ్లికి
- e) మా నాన్న ఈ డ్రెస్ నాకు Delhi లో కొన్నారు = Dad bought this dress for me in Delhi. (నా కోసం/ నాకు ఉద్దేశించిన)
- f) ఈ పుస్తకం రమేష్‌కు = This book is for Ramesh.
- g) **Praphul:** some one has come for you. (నీ కోసం ఎవరో వచ్చారు.)

**Prasanth:** for me? at this hour? (నాకోసమా? ఈ టైంలోనా? )

**Praphul:** Too many visitors for you (నీకోసం వచ్చేవాళ్లు మరీ ఎక్కువ)

3) For బయల్దేరడం, వెళ్లడం, తయారవడం (prepare), తయారుగా ఉండడం (ready) లాంటి వాటిని తెలిపే verbs పక్కన వస్తుంది. పై సంభాషణలో-
- a) start for, leave for, set out for (అన్నిటికీ అర్థం బయల్దేరడం అనే) Delhi కి బయల్దేరడం / వెళ్లడం leave for Delhi (setout for Delhi)
- b) prepare for the match; be ready for the match; practise for the match

4) Famous, well known, known, (పేరుపొందిన/ ప్రసిద్ధిచెందిన, etc) తర్వాత కూడా 'for' వస్తుంది. Notorious for.

**Practise the following:**

**Subha:** (over phone) Hi Sobha, చాలా thanks

**Sobha:** ఎందుకు (for వాడండి)

**Subha:** నువ్వు మామిడి పండ్లు పంపినందుకు. ఎక్కడినుంచి అవి?




**Sobha:** విజయవాడ నుంచి. విజయవాడ ప్రసిద్ధికదా రసాలూ, బంగినపల్లి రకాలకు (రకాలు - varieties)

**Subha:** అయితే హైదరాబాద్‌కు ఎప్పుడు బయలుదేరుతున్నావు? (Start వాడండి.)

**Sobha:** హైదరాబాద్? ఎందుకు?

**Subha:** నాతో రెండ్రోజులుండడానికి.

**Sobha:** మానాన్న ఈ రాత్రి ముంబయి వెళ్తున్నారు. ఆయన తిరిగొచ్చింతర్వాతే హైదరాబాద్ సంగతి ఆలోచిస్తాను. (Leave వాడండి). అమ్మ ఒంటరిగా ఉంటుంది కదా.

**Subha:** నువ్వు గనక వస్తే కనీసం వారం రోజులు ఉండాలని నా కోరిక.

**Sobha:** OK.

**Answer:**

**Shubha:** (over phone) Hi Sobha, Thanks a lot.

**Sobha:** What for?

**Shubha:** For sending me mangoes. Where are they from?

**Sobha:** From Vijayawada. You know Vijayawada is famous for the two varieties. Rasaalu and Banginapalli.

**Shubha:** Then when are you starting for Hyderabad?

**Sobha:** Hyderabad, what for?

**Subha:** To spend a few days with me/ for spending a few days with me.

**Sobha:** Dad is leaving for Mumbai tonight. Only after he returns, do I think of Hyderabad.

**Subha:** If you come I want you to be here for a week.

**Sobha:** Ok.

♦ ♦ ♦ ♦ ♦ ♦

ఇప్పటివరకు కొన్ని lessons లో 'the' వాడకం గురించి నేర్చుకున్న విషయాలు సంగ్రహంగా:

We use 'the' before
- a) The names of great and holy books (The Ramayanam, etc.)




- b) The names of things unique of their kind (Unique = ఏకైక - ఒక జాతికి చెందిన వస్తువు ఒకటే ఒకటయితే)
- c) The names of rivers, seas, oceans, ranges of mountains, groups of islands, countries formed by groups of states. [Imp: No 'the' before the name of a single mountain/ single island]
- d) Designations and offices (No 'the' before designations and offices if you mention thereafter the name of the person)


M. SURESAN

- e) before a countable singular, to talk of the whole class
- f) the superlative degree of the adjective,
- g) the comparative degree, when it is not followed by 'then'.

ఇప్పుడు చూడండి:

**Manohar:** Good morning Mahesh, why are you up so early? (ఏంటంత త్వరగా నిద్ర లేచావు? Up ఇక్కడ నిద్రలేవడం. చూడండి ఎంత simpleగా ఉందో. Conversation లో వాడండి).

**Mahesh:** I get up (am up) by this time every day. I go for a morning walk (నేనెప్పుడు ఈ timeకే లేచి నడుస్తాను).

**Manohar:** Walking is good. The longer you walk the stronger you are. (ఎంత దూరం నడిస్తే అంత బలం)

**Mahesh:** That's true. But my classmate Sudheer walks 6 kms every morning. And really he is the Amitab of our College. (మా classmate Sudheer రోజూ 6 Kms నడుస్తాడు. అతడు మా College అమితాబ్)

**Manohar:** Why so? (ఎందుకని? )

**Mahesh:** He is as tall as Amitab (అమితాబ్ అంత పొడుగు)

**Manohar:** And who is the Sharook Khan of your class? (మీ class Sharook Khan ఎవరు? )

**Mahesh:** I haven't (have not) thought of it (దాని గురించి నేనాలోచించలేదు)

ఈ సంభాషణలో కొన్నిచోట్ల 'The' వాడాం కదా! The longer you walk, The stronger you are. The Amitab of the College; The Sharook Khan.

**No. 1:** ఎంత చేస్తే అంత మంచిది. ఇలాంటి తెలుగు వాక్యాలను English లో చెప్పేప్పుడు Comparatives వాడతాం. వాటి ముందు 'the' తప్పక రావాలి.

- a) ఆ సినిమా నీకు చూసిన కొద్దీ చూడాలనిపిస్తుంది. The more you see it, the more you wish to see it.
- b) తిన్నకొద్దీ లావెక్కుతాం = The more we eat, the fatter we become.
- c) నడిచినకొద్దీ చురుగ్గా ఉంటావు = The more you walk, the more active you are.
- d) ఎత్తు ఎక్కినకొద్దీ చలి ఎక్కువ = The higher you climb, the colder it.

**No.2:** వ్యక్తుల పేర్ల ముందు, ఫలానా వస్తువు, ఫలానా చోట, పేర్ల (proper nouns) ముందు, the రాదు. అయితే ఇక్కడ The Amitab, The Sharook Khan ఎందుకన్నాం - వాళ్లలోని ముఖ్యమైన గుణాలు ఇంకొకరిలో ఉంటే, వాళ్లకు ఆ పేర్లిచ్చి, దాని ముందు 'the' పెడతాం.

1) ఈయన 21వ శతాబ్దపు గాంధీ - He is the Gandhi of the 20th C. (అంటే గాంధీగారి గుణాల్లో ఈయనకు చాలా ఉన్నాయి. గాంధీని తలపింపజేస్తాడు అని)

2) He is the Bhima of class - వాడు ఆ class భీముడు.

**Now Practise the Following:**

**a) Krishna:** Hi Kumar ఇప్పటివరకుఎక్కడున్నావు?

**Kumar:** భారత్‌కు Hollywood లాంటిచోట.

**Krishna:** అంటే Mumbai లోనా?

**Kumar:** అవును. అక్కడ ఉన్నకొద్దీ ఇంకా ఉండాలనిపించింది. ఎంత బాగుందో Mumbai.

**Krishna:** ప్రకృతి సౌందర్యం (Beauty of Nature) కావాలంటే కాశ్మీరే. అది భారత్‌కు Switzerland లాంటిది. అక్కడ Dal సరస్సులో Boat trip చాలా బాగుంటుంది. అక్కడ కూడా ఎంతసేపున్నా ఇంకా ఉండాలనిపిస్తుంది.

**b) Prabhat:** Hi Prakash, ఏంటి అలా దిగులుగా ఉన్నావు?

**Prakash:** మా మామయ్య వచ్చాడు. మా familyలో ఆయన శకుని లాంటివాడు.

**Prabhat:** ఏం అంత దుర్మార్గుడా?

**Prakash:** అలాంటి వాళ్లను గురించి ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది.

**ANSWERS:**

**a) krishna:** Hi Kumar, Where have you been?

**Kumar:** I was in the Hollywood of india

**Krishna:** You mean Mumbai?

**Kumar:** Yes, the more I stayed there, the more/ the longer I wanted to stay. How beautiful Mumbai is.

**Krishna:** If you talk of the beauty of nature, nothing to beat Kashmir (Kashmir ను కొట్టింది లేదు. Nothing to beat Kashmir). That is the Switzerland of India. The boat trip in the Dal lake is very pleasant. There too the more you stay, the more you want to stay.

**b) Prabhat:** Hi Prakash, you look sad

**Prakash:** My Uncle has come he is the Sakuni of our Family

**Prabhat:** Is he so bad?

**Prakash:** The less we talk about such people, the better for us.




# on the campus..





M. SURESAN

**Charan:** Hi Chandra, how are you?
**Chandra:** Fine Thanks, how are you?
**Charan:** Same here. Thanks. Congrats. (Congrats = Congratulations కంగ్రాట్యులేషన్స్ - లెయ్ నొక్కి పలకండి = అభినందనలు)
**Chandra:** What on? (ఎందుకు? )
**Charan:** On your fine performance in the play yesterday. (నువ్వు నిన్న నాటకంలో చాలా బాగా చేసినందుకు - నటించినందుకు) Performance - పర్ఫామన్స్ - ఫా నొక్కి పలుకుతాం = ఏ పనైనా, ముఖ్యంగా కొంచెం ముఖ్యమైన విషయాన్ని చేయడం Performance in a play/ movie/ game/ as a leader = నాటకంలో/ సినిమాలో/ నాయకుడిగా ఒకరి performance వారి నిర్వహణ/ పనితీరు. play= ప్లెయ్ = ఆడడం మామూలుగా; నాటకం అనే అర్థం కూడా ఉంది.
**Chandra:** Thank you.
**Charan:** Every one was commenting on your action only. They were all praise for you
**Chandra:** Oh, that's (that was nothing). Thanks any way. How's your practice of cricket going? Hope you will be on the college team for the finals. (అంతేంలేదులే. కాని thanks. నీ cricket practice ఎలా ఉంది? College finals team లో నువ్వుంటావని ఆశిస్తున్నా)
**Charan:** Not so bad. Every thing depends on my game in the first two matches.
**Chandra:** And what are you going to do during the vacation? (సెలవుల్లో ఏం చేయబోతున్నావు? )
**Charan:** (I am going to) spend some time on bowling practice. (I) need to improve my bowling. (కొంత bowling practice చేయాలి. నా bowling మెరుగుపరచుకోవాల్సిన అవసరం ఉంది)
**Chandra:** Ok, then. Good luck, bye. (సరే, నీ అదృష్టం బాగుండాలని కోరిక, వస్తామరి)
**Charan:** Bye

పై సంభాషణలో preposition– 'on' వాడకం గమనించండి.

**1)** చరణ్ Congratulations చెప్పినప్పుడు, చంద్ర: What on?
చరణ్: On your fine performance.
**2)** commenting on
**3)** on the college team
**4)** depends on
**5)** spend time on

ఇవీ preposition 'on' వాడే కొన్ని సందర్భాలు.

**1)** Congratulations (Congrats అని కూడా అంటారు) తర్వాత ఎప్పుడూ On.

**a)** నీవు మంచి మార్కులు తెచ్చుకున్నందుకు అభినందనలు = congratulations/ congrats on your good marks.

Congratulations = ఎవరైనా ఏదైనా సాధించినప్పుడు చెప్పేది. దానికి బదులుగా thanks చెప్తాం.

**b)** నువ్వు ఎన్నికైనందుకు Congrats
Congrats on your election.

**c)** చాలా బాగా నటించినందుకు congrats
Congrats on your excellent action/ performance.

**d)** Congress చాలా బాగా గెలిచినందుకు congrats. Congrats to congress on its excellent performance in the elections. (Performance వాడకం గమనించండి)

**2)** Comment on: Comment అంటే వ్యాఖ్యలు చేయడం/అభిప్రాయాలు వెలిబుచ్చడం. Comment తర్వాత కూడా 'on'.

**a)** ఎప్పుడూ ఇతరులను గురించి ఏదో ఒకటి అంటుంటాడు= He always on comments on others. make comments/ pass comments అని కూడా వాడతాం వ్యాఖ్యలు చేయడం అనే అర్థంతో.

**b)** అతనెప్పుడూ ఇతరులను గురించి వ్యాఖ్యానించడు
He never comments/ makes comments/ passes comments on others.

**c)** ఇతరుల performance గురించి వ్యాఖ్యలు చేయడం సులభమే. కాని అదే మనం ఆ పని ఎంత వరకు చేస్తాం అనేది ప్రశ్న.
It's (It is) easy to comment/ pass comments/ make comments on others' performance but how well we do a thing is the question.

**3)** On the team. team లో. ఇంతకుముందు తెలుసుకున్నాం. తెలుగులో 'లో' (in అర్థంతో) వాడే చాలాచోట్ల English లో on వస్తుంది. జాబితాలో = on the list; హాజరు పట్టీలో = on the rolls, ఆవరణలో= on the premises; విద్యాలయ ఆవరణలో = on the campus, etc.

**a)** నిన్ను team లో చేర్చుకోం
We do not take you on the team.

**b)** జాబితాలో అతడి పేరు మొదటిది
His name is first on the list.

**c)** నా ఆవరణలో నేనిలాంటివి సమ్మతించను
I do not allow such things on my premises.

**d)** అది College ఆవరణలో జరగలేదు
It did not happen on the campus.

**4)** Depend on = ఇది చాలా common. చాలా మందికి తెలుసు depend = ఆధారపడడం. తెలుగులో కూడా ఒకదాని/ ఒకరిమీద ఆధారపడడం అంటాం కదా. English లోనూ అంతే. Depend తర్వాత ఎప్పుడూ 'on'.

**a)** వాడు ప్రతిదానికీ వాళ్ల అక్క మీద ఆధారపడతాడు
He depends on his sister for every thing.

**b)** పంటలు వర్షాన్ని బట్టి ఉంటాయి
Crops depend on rains.

**c)** అన్నీ డబ్బునుబట్టే కదా?
Everything depends on money.

**d)** విజయం శ్రమను బట్టి ఉంటుంది
Success depends on hard work.

**5)** Spend on: ఇది చాలా ముఖ్యం.
Spend = ఖర్చుపెట్టడం. గడపడం (రోజులూ, సమయం అయితే)

**a)** వాడా ఇంటిమీద చాలా ఖర్చు పెట్టాడు
He has spent a lot (of money) on the house.

**b)** నేను రోజూ రెండుగంటలు వ్యాయామం చేస్తాను
I spend two hours (every day) on exercise.

**c)** పోయినవారం అంతా practice లోనే గడిపాడు
He spent the whole of last week on practice.

**d)** అనిల్ ఎప్పుడూ బట్టలకు ఎక్కువ ఖర్చు పెడతాడు
Anil spends a lot (of money) on clothes.

Spend తర్వాత on లాగానే, waste తర్వాత కూడా on.

**e)** TV చూస్తూ time వృథా చేస్తాడు
He wastes time on the TV/watching the TV.

**f)** చాలాసేపు friends తో time వృథా చేస్తాడు
He wastes time/ a lot of time on friends.

**Now practise the following in English:**

**a) Girija:** నువ్వు ఆ dress ఎంత పెట్టి కొన్నావ్? (Spend వాడండి)
**Sailaja:** 2500 రూపాయలు. అదంత చేస్తుంది కదా?
**Girija:** కనీసం 400 రూపాయలు దాని మీద వృథా అనుకుంటా. నేనయితే 2000 రూపాయల కంటే పెట్టను.
**Sailaja:** కనీసం రెండు గంటలు పట్టింది selection కు. (spend, I తో వాడండి)
**Mohan:** మామూలుగా ఆడవాళ్లు బట్టల మీద ఎక్కువ డబ్బు, ఇంకా ఎక్కువ time వృథా చేస్తుంటారు. అంతకంటే ఎక్కువ time అలంకరణలో.
**Girija and Sailaja:** నువ్వు మా మీద comments చేస్తున్నట్టు.
**b) Lakshman:** ఎప్పుడు బయల్దేరుదాం?
**Madhu:** అంతా నీ మీద ఆధారపడి ఉంది. నువ్వెప్పుడు ready అయితే అప్పుడే.
**Lakshman:** కొంత late అయినా ఫర్వాలేదులే. మన పేర్లు జాబితాలో చివర కదా ఉన్నాయి. మన పేర్లు పిలిచేటప్పటికి మనం చేరుకుంటాం.
**Madhu:** మనం కాక ఇంకా టీంలో చేరడానికి ఎవరొస్తున్నారు?
**Lakshman:** నీ ఎంపిక కచ్చితం. దానికి congrats. మరి నా సంగతింకా తెలీదు.
**Lakshmi:** ఈ selections ఎక్కడ జరగనున్నాయి?
**Lakshman:** మా College campus లోనే.

**Answers:**

**a) Girija:** How much did you spend on the dress?
**Sailaja:** I spent Rs. 2500/- on it. Isn't (is not) it worth so much?
(worth = విలువ; is worth = విలువ ఉండడం తెలుగులో అంత విలువ చేయడం / చేయకపోవడం = Worth/ not worth. The movie is not worth half the price of the ticket = ఆ సినిమా ticket కు పెట్టిన డబ్బులో సగమంత కూడా చేయదు. Waste.
**Girija:** I think you wasted at least Rs. 400. I won't (will not) spend more than Rs. 2000/- on it.
**Sailaja:** I spent at least two hours on that selection.
**Mohan:** Generally women waste a lot (of money), a lot more of time, on dresses, and still more on make up (still = ఇంకా).
**Girija and Sailaja:** Just as you are commenting on us.
**b) Lakshman:** When shall we start?
**Madhu:** (Everything) depends on you, whenever you are ready.
**Lakshman:** Doesn't matter if we are late.
Doesn't (does not) matter = ఫర్వాలేదు. Conversationలో practise చేయండి.
Our names are the last on the list. We shall be able to reach by the time our turn comes.
**Madhu:** Who else (ఇంకెవరు) is coming to be on the team?
**Lakshman:** Your selection is definite (కచ్చితం). Congrats on that. I don't know about my position (position = పరిస్థితి/ సంగతి)
**Lakshmi:** Where are the selections?
**Lakshman:** On our college campus.

## Home, house - ఏమిటి తేడా?



**ప్రశ్న:** *Home, House, Residence - ఈ మూడు పదాల అర్థాల్లో భేదాలేమిటి? వీటిని ఎప్పుడెప్పుడు ఎలా ఉపయోగించాలో వివరించగలరు.*

**– చలవాది సుబ్రహ్మణ్యం, మచిలీపట్నం**

**జవాబు: I.** Home- మనం, మన కుటుంబసభ్యులతో నివసించే ఇల్లు home. ఎవరైనా వారి తల్లిదండ్రులతో, అన్నదమ్ములతో, అక్కచెల్లెళ్లతో ఉండేది- home. సామాన్యంగా home ముందు చాలా సందర్భాల్లో my, your, his, her, etc. వాడనక్కరలేదు.

I am going home
ఇంటికెళ్తున్నాను. (to my home అనం)
He went home an hour ago
గంట క్రితం ఇంటికెళ్లాడు. (His home అనక్కరలేదు)

ఎవరి ఇంటిని గురించి మాట్లాడుతున్నామో వాళ్ల ఇల్లు, home.

Home అంటే స్వస్థలం అనే అర్థం కూడా ఉంది.
My home is Nellore. మా స్వస్థలం నెల్లూరు.
He left his books at home
వాడు వాడి books ను (వాడి) ఇంట్లో వదిలేశాడు.
3) Home = దేశం. His home is England.
4) Home = దేశీయ. Minister for home affairs. (దేశీయ- అంతర్గత వ్యవహారాల మంత్రి)
5) at home and abroad = స్వదేశంలో, విదేశాల్లో.
6) Old age Home, Home for the blind- ఇలాంటి చోట్ల 'ఆశ్రయం'.

**II.** House = ఏ ఇంటినైనా house అంటాం.
He bought a house last year
గత సంవత్సరం ఇల్లు కొన్నాడు.

She has two houses in Hyderabad, and one in Vijayawada = ఆమెకు హైదరాబాద్‌లో రెండిళ్లు, విజయవాడలో ఒక ఇల్లు ఉన్నాయి. But She lives in Guntur. Her home there is very close to the station = ఆమె ఉండేది మాత్రం Gunturలో. ఆమె ఇల్లు (నివాసం) గుంటూర్లో. House ను, business house, The House of Tatas- లాంటి సందర్భాల్లో వ్యాపార నిలయం అనే అర్థంతో వాడతాం.

**III.** Residence: ఇది కొంచెం formal. Phone numbers, address లు మన ఇంటివి చెప్పేటప్పుడు వాడతాం. Residence phone no; Residential address (office phone no; office address కు భిన్నంగా). ఇక్కడకూడా home phone no.,/ address అనవచ్చు.

కొంచెం హోదాగల వ్యక్తుల నివాసాలనే Residence అనడం సబబు- The Prime Minister's residence, The governor's residence, etc.



# Have you a pen?

**Sheriff:** Peter, Who are you waiting for?
ఎవరి కోసం చూస్తున్నావు?

**Peter:** For sagar. I've (I have) asked him for some information and a few books.
సాగర్ కోసం. వాడ్ని నేను ఏదో సమాచారం, కొన్ని పుస్తకాలు అడిగాను.

**Sheriff:** You have waited for an hour now. He hasn't even phoned you.
నువ్వు అతని కోసం గంటగా చూస్తున్నావు కదా. నీకు Phone కూడా చేయలేదు మరి.

**Peter:** I am sure he will come. Any way, let's hope for the best. I need the books badly.
వాడు వస్తాడనే నా నమ్మకం. ఏదేమైనా మంచే ఆశిద్దాం. నాకా పుస్తకాలు చాలా అవసరం.
(need badly = చాలా అవసరం)

**Sheriff:** How long more are you going to wait? It's already time for dinner.
ఇంకెంతసేపు చూస్తావు? ఇప్పటికే భోజన సమయం అయింది కదా?

**Peter:** I told him to be here for dinner. So I'm sure he will come in a few minutes. Ah, look, here he comes. Hi, Sagar, why the delay?
భోజనానికి రమ్మన్నాను వాడిని. కాబట్టి కాస్సేపటిలో వచ్చేస్తాడనే నమ్మకం నాకుంది. అదిగో మాటల్లోనే వచ్చేశాడు. ఏంటి సాగర్, ఎందుకాలస్యం?

**Sagar:** Looking for an auto took all my time.
ఆటో కోసం చూస్తున్నందువల్ల ఆలస్యమైంది.

పై సంభాషణలో preposition 'for' వాడకం గమనించండి. 1) Waiting for 2) asked for 3) hope for 4) time for 5) look for. ఇదివరలో for కు ఉన్న అర్థాలూ, ఉపయోగాలూ కొన్ని చూశాం.

English ఎక్కువ వాడకం ఉన్న prepositions లో for ఒకటి. అందుకని దాని ఉపయోగాలు సరిగా తెలుసుకుని conversation లో వాడితే మన conversation effective గా ఉంటుంది.

**1. Wait for:** ఒకరి కోసం, ఒక వస్తువు, సంఘటన కోసం వేచి చూడడం.
Wait for me, please
కాస్త నాకోసం చూడవా?

**a)** Train కోసం చూస్తున్నాం
We are waiting for the train

**b)** Exams అయిపోయే వరకు చూద్దాం
Let's wait for the exams to be over
(Let's wait till the exams are over)

**c)** వాడి తల్లిదండ్రులు వాళ్ళమ్మాయి పెళ్లి కోసం కాచుకొని ఉన్నారు. అయిపోతే వాడికి చేసేస్తారు.
His parents are waiting for their daughter's marriage. Once that is over, they will marry him off.

**d)** నాకు ఆకలేస్తోంది. ఇంకెంతసేపో భోజనానికి wait చేయలేను.
I'm (I am) very hungry. I am not able to wait for the meal any more.

Wait for = await. అయితే await కొంచెం గ్రాంథికం. conversation లో wait for మెరుగు.

**2) Ask for:** ఎవరినైనా ఏదైనా అడగడం

**a)** వాడ్ని సహాయం అడిగాను. వాడు చేయలేదు.
I asked (him) for his help. But he did not help me.

**b)** అతడ్ని ఆమె కొన్ని పుస్తకాలు అడిగింది
She asked him for some books.





M. SURESAN

అయితే ప్రశ్నలు అడగడం అనే అర్థంతో, ఒక పని చేయమనే అర్థంతో ask తర్వాత for రాదు.
ఉదా: I asked him a few questions
కొన్ని ప్రశ్నలు అడిగాను.
She asked her friend to wait
కాసేపు ఉండమని అడిగింది.
They asked me why I was there
నేనక్కడ ఎందుకున్నానని వాళ్లు నన్నడిగారు.
పై సందర్భాల్లో ask తర్వాత for రాదు.

**3) hope for:** దేనినైనా ఆశించడం. hope తర్వాత for అవసరం.

**a)** మంచి జరుగుతుందనే ఆశిద్దాం. let's (let us) hope for the best.

**b)** They hope for an early appointment.
త్వరలో ఓ ఉద్యోగం వస్తుందని ఆశిస్తున్నారు.

అయితే hope తర్వాత 'that' తో begin అయ్యే మాటలు వస్తే for రాదు.

**c)** He hopes that he will get the job

**4) time for:** దేనికైనా time వచ్చేసింది/అయింది అనడానికి time for అంటాం. ఇది చాలా Common.

**a)** It's time for dinner (Dinner time అయింది)

**b)** Time has come for us to leave
మనం బయల్దేరాల్సిన time అయింది
అలాగే time for breakfast, for dinner, etc.

**5) Look for:** వెదకడం

**a)** I am looking for a good book on Spoken English
Spoken English మీద మంచి పుస్తకం కోసం చూస్తున్నాను. వెదుకుతున్నాను.

**b)** What are you looking for?
దేనికోసం చూస్తున్నావ్/ వెదుకుతున్నావ్?

**c)** అతడికోసం ఇక్కడ చూడడం నిరుపయోగం. ఇది అతడు College కు వెళ్లే time
No use looking for him here. It's the time for his college.

**Practise the following:**

**Suman:** ఎవరికోసం చూస్తున్నావు?
**Suresh:** College bus కోసం.
**Suman:** నేను విష్ణు కోసం చూస్తున్నాను. అతడు నన్నుకొంత డబ్బు అడిగాడు.
**Suresh:** వాడిక్కడ ఉండాల్సిన time అయింది. వస్తాడేమో రెండు మూడు నిమిషాలకు.
**Suman:** వాళ్ల నాన్న రెండు మూడు రోజుల్లో పంపే డబ్బు కోసం చూస్తున్నాడు. (Wait వాడండి)
**Suresh:** వాడేదో job కు apply చేసినట్టున్నాడు. Next week orders వస్తాయని ఆశిస్తున్నాడు.

**Answer:**

**Suman:** Who are you waiting for?
**Suresh:** For the college bus.
**Suman:** I am waiting for Vishnu. He has asked me for some money.
**Suresh:** (It is) time for him to be here. Perhaps he will be here in a few minutes.
**Suman:** He is waiting for the money his dad will send him in two or three days.
**Suresh:** He has applied for a job. He hopes for the orders next week.

**2)** ఈ కిందివి a/ an, the కి సంబంధించినవి. Practise చేయండి.

**a) Sarat:** ఆ table మీద ఉన్న పుస్తకం చదివావా?
**Samrat:** దేనికి సంబంధించిన పుస్తకం అది?
**Sarat:** రెండో ప్రపంచ యుద్ధంలోని ఓ ముఖ్యమైన సంఘటన గురించి. ఆ అంశం మీద పుస్తకాలలో ఇది best.
**Samrat:** రచయిత ఎవరు?
(రచయిత = author/ writer)
**Sarat:** అతడు కూడా ఓ సైనికుడే. అతడి పేరు John stall.
**Samrat:** నిజంగా అంత గొప్ప పుస్తకమా?
**Sarat:** నీకది చదివినకొద్దీ చదవాలనిపిస్తుంది. దాన్ని చదవడం ఓ అరుదైన అనుభవం (అరుదైన = rare)

**b) Chakri:** నీ దగ్గర pen ఉందా?
**Charan:** ఉంది. నీకు కావాలా?
**Chakri:** నా pen refill అయిపోయింది. Assignment complete చేయలేదు నేను.
**Charan:** Assignment?
**Chakri:** అవును. Physics లో ఓ chapter మీద.
**Charan:** నాక్కూడా pen అవసరం. ఇక్కడ ఏ shop లో నైనా refill తెచ్చుకోవచ్చు/ దొరుకుతుంది.
**Chakri:** ఆ సలహాకు thanks.

**Answers:**

**a) Sarat:** Have you read the book on the table?
**Samrat:** What's the book on?
**Sarat:** It's (It is) on an important event/ episode in World War II. This is one of the best books on the subject.
**Samrat:** Who is the Writer?
**Sarat:** He was also a soldier. Name, John stall.
**Samrat:** Is it such a great book?
**Sarat:** The more you read it, the more you feel like reading it. Reading it is a rare experience.

**b) Chakri:** Have you a pen?
**Charan:** I have. Do you want it?
**Chakri:** My refill is/ has gone dry (has run out of ink - is dry/ has gone dry - దాన్లో ink అయిపోయింది = run out of ink). I have not (haven't) completed my assignment.
**Charan:** Assignment?
**Chakri:** Yes. It's on a chapter in Physics.
**Charan:** I need the pen too. You get a refill in any of the shops here. (Refills are available in any of the shops here.)
**Chakri:** Thank you for the advice.



**ప్రశ్న:** *Below, beneath ల సరియైన అర్థాలను తెలిపి, వాటిని వాడే సందర్భాలను; అలాగే Famous, Popular ల సరియైన అర్థాలను తెలిపి, వాటిని వాడే సందర్భాలను వివరించండి.*

*– కె.వంశీకృష్ణ, పరకాల, వరంగల్ జిల్లా*

**జవాబు:** Below, beneath ల తేడా త్వరలో వివరిస్తాం.

Famous అంటే ప్రసిద్ధికెక్కిన, ప్రఖ్యాతి చెందిన. అంటే ప్రజానీకంలో చాలామందికి తెలిసిన, చాలామంది విని ఉన్న అని.

Abdul Kalam is a famous scientist = ఆయన ప్రసిద్ధి చెందిన శాస్త్రవేత్త - చాలామందికి, శాస్త్రంతో సంబంధంలేని వాళ్లకు కూడా ఆయన గురించి తెలుసు- ఆయన గురించి విని ఉన్నారు అని.

## Famous.. Popular.. అంటే?

popular అంటే ప్రజాభిమానం కల అని. famous అన్నపుడు తెలిసి, విని ఉండటానికి ప్రాధాన్యం తక్కువ. 'popular' లో ఒక రంగంలో రాణించినవారిని ఆ వర్గానికి సంబంధించిన ప్రజలు అభిమానించడం, ఇష్టపడడం. ప్రసిద్ధికెక్కిన వాళ్లు/ వాటి పట్ల మనకు ఇష్టానికంటే, మెప్పు, గౌరవం ఎక్కువ. Popular అయిన వ్యక్తులను మనం ఇష్టపడతాం, వాళ్లను గురించి ఇతర రంగాల వాళ్లకు తెలియకపోవచ్చు-

A famous movie star - ప్రసిద్ధికెక్కిన సినిమాతార- సినిమాలను గురించి అంతగా తెలియని/ interest లేని వాళ్లకు అతడి/ ఆమె గురించి తెలుసు.

A popular movie star- ప్రజాభిమానం పొందిన తార- సినిమాలను గురించి తెలిసినవాళ్లూ, సినిమాలు బాగా చూసే వాళ్లు ఇష్టపడే తారలు.

ఓ cinema star, famous, popular రెండూ కావచ్చు. పరభాషా చిత్రాల గొప్ప actor లను గురించి మనకు తెలిస్తే వాళ్లు famous. మన భాషా చిత్రాల గొప్పతారలు, మనం అభిమానించేవాళ్లు popular stars.

A famous song - అందరూ మెచ్చుకొనే పాట.

A popular song- అందరూ అభిమానించే, అంటే కొద్దిగా 'mass' song అని.

Tendulkar is a famous cricketer- ఇక్కడ popular అనం కదా.




# He had been an actor




**Anil:** Hi, Trishal, where were you last evening?
(నిన్న సాయంత్రం ఎక్కడున్నావు? )

**Trishal:** Most of the time at home.
(నిన్న ఎక్కువసేపు ఇంట్లోనే ఉన్నా)
Why, what's the matter?
(ఏంటి విషయం? )

**Anil:** But Sunil told me he had seen you going somewhere
(అయితే నువ్వెక్కడికో వెళ్తుండడం చూశానని Sunil చెప్పాడు)

**Trishal:** He seen me on my way to the station to receive my uncle. But by the time I reached the station the train had left. My uncle too had waited for me for 10 minutes. Seeing that I had not come, he started for home on his own.
(నేను మా uncle కోసం station కు వెళ్తున్నప్పుడు చూశాడు. అయితే నేను station కు వెళ్ళేసరికే train వచ్చి వెళ్ళిపోయింది. మా uncle కూడా నా కోసం 10 నిమిషాలు చూసి ఇంటికి బయల్దేరాడు)
But why did you want to see me?
(అయితే నువ్వు నన్నెందుకు కలవాలనుకున్నావు? )

**Anil:** I wanted that book on computers from you.
(నీ దగ్గర నుంచి ఆ computer book తీసుకోవాలనుకున్నా)

**Trishal:** I am sorry, I don't have it. I had kept it for only two days till the day before when I returned it to the library.
(నా దగ్గర లేదిప్పుడు, రెండ్రోజులు ఉంచుకుని మొన్ననే library లో ఇచ్చేశా. )

పై సంభాషణలోని verbs: had seen, had left, had waited, had come, had kept ఇవన్నీ కూడా had + past participle form లో ఉన్నాయి కదా. ఇంతవరకు ఈ form of verb ను మనం ఈ lessons లో చూడలేదు. ఈ verb form: had + past participle. దీన్నే past perfect tense అంటారు. దీని ఉపయోగం చూద్దాం:

**a)** Sunil told me he had seen you. ఇక్కడ two past actions (గతంలో జరిగిన రెండు పనులు- ఒకటి Sunil నిన్ను చూడడం, ఆ విషయం నాతో చెప్పడం) ఉన్నాయి. ఆందులో ఒకటి ముందు, ఇంకోటి తర్వాతకదా. Sunil, Trishal ను చూడడం ముందు, ఆ విషయం Anil తో చెప్పడం తర్వాత కదా. ఇక్కడ ముందు జరిగిన పని Sunil, Trishal ను చూడడం, had seen – had + past participle form లో ఉండడం గమనించాలి మనం. అంటే రెండు past actions లో ఒకటి ముందు, ఇంకోటి తర్వాత జరిగితే, ముందు జరిగిన past action ఎప్పుడూ had + past participle form లో ఉంటుంది.

ఇంకా చూడండి:

**b)** By the time I reached the station, the train had left. నేను station చేరేసరికి, train వెళ్ళిపోయింది. Train వెళ్ళిపోవడం ముందూ, నేను station చేరడం తర్వాత, కాబట్టి the train had left.

**c)** My uncle too had waited for me for ten minutes - నా కోసం 10 నిమిషాలు చూసి, తర్వాత ఇంటికి బయల్దేరాడు, had waited - had + pp

**d)** Seeing that I had not come– నేను రాలేదని చూసి, he started for home. నేను రాకపోవడం, earlier past action, కాబట్టి had come - had + past participle.

**e)** I had kept it for two days... when I returned it to the library. ఇక్కడ కూడా had kept – had + past participle (pp) ముందర జరిగిన past action ను తెలియజేస్తోంది కదా.

ఇక్కడ మనం తెలుసుకున్న ముఖ్య విషయం:
had + past participle always expresses the earlier of two past actions.

**a)** వాడు pass అయ్యాడని నాతో చెప్పాడు.
He told me that he had passed. (pass అవడం ముందూ, చెప్పడం తర్వాత కదా. కాబట్టి ముందరి past action, had + passed (had + pp)

**b)** ఆమె పెళ్ళికి ముందు teacher గా పనిచేసింది.
She had worked as teacher before she got married.

had + pp కి సంబంధించిన 'be' form had been. మనకు తెలుసుకదా, 'be' form ఎప్పుడూ ఉండడాన్ని తెలుపుతుంది.

ఈ కింది రెండూ పోల్చండి:

**a)** NTR had acted in movies before he entered politics (politics లో ప్రవేశించే ముందు, సినిమాల్లో నటించాడు. నటించడం - ఇది action (చర్య). ముందు జరిగిన past action కాబట్టి, had acted - had + past participle)

**b)** NTR had been an actor before he was a CM (CM గా ఉండే ముందు, actor గా ఉన్నాడు).

ఇక్కడ verbs – had been, was. ఈ రెండూ కూడా 'be' forms దా. అందుకనే, he was a CM - (ఒకప్పుడు) CM గా ఉండేవారు (ఇప్పుడు లేరు). అంతకుముందు actor - కాబట్టి had been an actor.

ఈ కింది రెండూ పోల్చండి:

**a)** The Moghuls had ruled India before the British ruled it (British వారికంటే ముందు మొగలులు భారత్‌ను పాలించారు. had ruled, ruled).

**b)** India had been under Moghul rule before it was under British rule (British పాలనలో ఉండే ముందు, Moghul పాలనలో ఉండేది).

ఇంతవరకూ, ఈ lesson లో మనం తెలుసుకున్న verbs: had been (be form - గతంలో ఉన్న రెండు విషయాలలో ముందర ఉన్న విషయాన్ని చెప్తుంది), had + pp (action - గతంలో జరిగిన రెండు పనుల్లో మొదటి పనిని తెలిపేందుకు వాడతాం)


M. SURESAN

**a)** వ్యాపారం ప్రారంభించేముందు ఆయన teacher గా ఉండేవాడు = He had been a teacher before he started business.

**b)** Lawyer గా practice ప్రారంభించే ముందు railways లో పనిచేశారు = He had worked/ He had been (ఉన్నారు) in the railways before he started practising as a lawyer.

**c)** వాళ్ల sisters పెళ్ళి అయ్యేంతవరకు unmarried గానే ఉన్నాడు = He had been unmarried until his sisters got married.

**Now practise the following in English.**

**a) Lakshmi:** Hi Ajitha ఎప్పుడు తిరిగొచ్చావు? మీ ఇంటికి నేను నిన్న phone చేస్తే మీ అమ్మ నువ్వింకా రాలేదని చెప్పింది.

**Ajitha:** అవును. నువ్వు phone చేసిన అరగంట తర్వాత నేను ఇంటికి చేరాను. ఏంటి విషయం?

**Lakshmi:** లీల ముంబై నుంచి కొన్ని చీరలు తెచ్చానని చెప్పింది నిన్న. మనం వెళ్ళి చూద్దామా?

**Ajitha:** ఇప్పటికే చాలా ఇచ్చేశానని మొన్ననే చెప్పింది నాతో.

**Lakshmi:** ఇంకా కొన్ని ఉన్నాయి. మనం వెళ్ళి చూద్దాం పద.

**b) Pratap:** Hi Pramod, నువ్వు bike కొన్నావని Prasanth చెప్పాడు నాతో, మొన్నను కుంటా.

**Pramod:** ఇంకా కొనలేదు. కొనాలని అనుకుంటున్నా.

**Pratap:** మీ cousin bike కొంటున్నావా?

**Pramod:** లేదు. నిన్ననే తెలిసింది, వాడది అమ్మేశాడని.

**Pratap:** ఎవరికి?

**Pramod:** వాడి పాత bike ను కొత్త bike తో exchange చేసుకున్నానని చెప్పాడు.

**Answers:**

**a) Lakshmi:** Hi Ajitha, when did you return? When I phoned yesterday your mother told me you had not returned yet.

**Ajitha:** That's right. I arrived half an hour after you had phone. What's the matter?

**Lakshmi:** Leela told me yesterday she had brought some sarees from Mumbai. How about seeing them?

**Ajitha:** She told me the day before she had given away most of them.

**Lakshmi:** Still some more are there. Let's go and see.

**b) Pratap:** Prasanth told me that you had bought a bike. I think, the day before (yesterday).

**Pramod:** Not yet. I think of buying one.

**Pratap:** (Are you) buying your cousin's bike?

**Pramod:** No. Only yesterday I came to know he had sold it off.

**Pratap:** Who to?

**Pramod:** He told me he had exchanged his old bike for a new one.

*ప్రశ్న: 1) Would you come please?*
*Could you come please?*
*ఈ రెండింటికి తేడా ఏమిటి? would - past tense of will కదా. ఇక్కడ would, could ఎందుకు ఉపయోగించారు?*
*2) Sell this vehicle off (Active Voice),*
*What does she want (Active Voice). వీటిని Passive Voice లో ఏ విధంగా రాయాలో వివరించగలరు.*
*3) The function went off well అంటే అర్థం తెలియజేస్తూ, went off లాంటి వాటికి అర్థాలు ఎక్కడ, ఎలాంటి పుస్తకాల్లో ఉంటాయో తెలియజేయగలరు.*

*– అంతటి పెంచలయ్య, రాజంపేట.*

**జవాబు:**

1) would, should, could గురించి త్వరలో తెలుసుకుంటారు. could you come please? అనేది, 'would you come please' కన్నా ఎక్కువ మర్యాద సూచించే request. అయితే would you come,




please? అనేది more formal (ఎక్కువ లాంఛనప్రాయం, could కంటే). అంటే మనకంతగా పరిచయం లేని, మనం గౌరవించే వ్యక్తులను చేసే request.

2) sell this vehicle off. దీనికి passive voice – Let this vehicle be sold off.
What does she want కు passive – what is wanted by her.
కొన్ని సందర్భాల్లోనే తప్ప ఇటువంటి sentences active లో ఉంటేనే natural గా ఉంటుంది.

3) went off well - అంటే బాగా జరిగింది అని. ఇటువంటి phrases కు అర్థం oxford/ longman's లాంటి మంచి dictionaries లో, 'go' కింద చూడండి.

*ప్రశ్న: English Newspapers లో Headlines అన్నీ simple present tense లో రాస్తారెందుకని? అవన్నీ జరిగిపోయిన విషయాలు కదా!*
*2) Could కి would కి difference ఏమిటి? వాటిని ఏయే సందర్భాల్లో use చేయవచ్చు?*

*– వి.గణేశ్, కాకినాడ.*

**జవాబు:**

1) చాలా మంచి question. English కు ఉన్న ప్రత్యేక లక్షణం, historic present. అంటే గతంలో జరిగినవాటికి కూడా present tense (simple) వాడడం. ఇది newspaper headlines లో ఎక్కువ.

Prime Minister Inaugurates the conference.

ఇక్కడ Inaugurates అంటే చేస్తున్నారనీ కాదూ, చేయబోతున్నారనీ కాదు. చేసేశారని. ఇది English లో తప్పుకాదు.

Here <u>was</u> I already late to the station. Just then my brother <u>comes</u> with the news that I have forgotten my ticket. ఇక్కడ comes తప్పుకాదు. effect కోసం వాడతారు.

2) could, would గురించి సవివరంగా తెలుసుకుంటారు.







# They had gone for..

**Sivaram:** Hi Unni, what's new?
(పలకరింపు మాట ఇది. Practice it in your conversation)

**Unni:** Have you seen Kiran of late?
కిరణ్‌ను ఈ మధ్య ఏమన్నా చూశావా?
(of late = lately = ఈ మధ్య)

**Sivaram:** No, yesterday I did go to Kiran's. But by the time I reached there, he had gone out. I missed him by minutes.
లేదు. నిన్న వాళ్ళింటికే వెళ్ళాను. కానీ నేను వెళ్ళేటప్పటికి అతడు బయటికి వెళ్ళిపోయాడు. అతడిని కొన్ని నిమిషాల తేడాతో miss అయ్యాను.

**Unni:** Why did you want to see him?
ఎందుకెళ్ళావు వాళ్ళింటికి?

**Sivaram:** He had promised to lend me the CDs of some latest movies. So I went to him to get them.
నాక్కొన్ని సినిమాల CDs ఇస్తానన్నాడు. అవి తెచ్చుకుందామని వెళ్లాను.

**Unni:** Let's go now and get them now.
ఇప్పుడెళ్ళి తెచ్చుకుందామా వాటిని?

**Sivaram:** No chance. His mom told me yesterday that some one had stolen the suit case with the CDs in it. It was to the police that he had gone when I went there. He wanted to report it to the police.
ఆ అవకాశం లేదు. ఆ CDs ఉన్న suit case ఎవరో దొంగిలించారని నిన్న వాళ్లమ్మ నాతో చెప్పింది. నేన్నిన్న అక్కడికి వెళ్ళినప్పుడు వాడు వెళ్ళింది police report ఇవ్వడానికే.

**Unni:** Does he hope to get them back?
అవి దొరుకుతాయనే ఆశ ఇంకా ఉందా అతడికి?

**Sivaram:** I don't know. His mother was however sure that they had gone for good.
ఏమో మరి. వాళ్ళమ్మ మాత్రం ఇంక దొరకదనే నమ్మకంలో ఉంది.
(For good = permanently = పూర్తిగా/శాశ్వతంగా. Practise it in your conversation)

**Unni:** Really unfortunate.
నిజంగా దురదృష్టకరం.

పై సంభాషణలో ఉపయోగించిన verbs sets చూడండి: a) reached- had gone out; b) had promised- went; c) told- had stolen; d) had gone, went; d) was- had gone.

పై verbs ప్రతి జంటలో కిందటి lessonలో మనం చూసిన had + participle form లో ఉన్న verbs ఉన్నాయి కదా. a) had gone out, b) had promised, c) had stolen, d) had gone.

మనం కిందటిసారి చూశాం కదా- had + past participle (PP) form లో ఉన్న verb ఎప్పుడూ, the earlier of two past actions (గతంలో జరిగిన రెండు పనుల్లో ముందు జరిగిన దాన్ని) చెప్తుందని.

ఇప్పుడు పై సంభాషణలో మరికొన్ని ఉదాహరణలు:

**a)** By the time I reached his place he had gone out.
నేను అక్కడికి చేరేసరికి అతడు వెళ్ళిపోయాడు.

**b)** He had promised the CDs and I went there to get them.
CDలు ఇస్తాననడం ముందు, నేను వెళ్ళడం తర్వాత- కాబట్టి had promised.

**c)** His mother told me that some one had stolen them.
దొంగిలించడం ముందు, చెప్పడం తర్వాత- కాబట్టి had stolen (had + pp)

**d)** She was sure that they had gone for good.
అవి పోవడమేగానీ ఇంక దొరకడమంటూ ఉండదని ఆమె నమ్మకంగా ఉంది. పోవడం ముందు, కాబట్టి had gone (had + pp)

had + pp విషయంలో గమనించాల్సిన ముఖ్యమైన విషయాలు రెండున్నాయి.

a) had + pp వాడే అవకాశం, అవసరం - గతంలో రెండు పనులు జరిగి, వాటిల్లో ఒకటి ముందు, ఇంకోటి తర్వాత జరిగినప్పుడు మాత్రమే.

b) గతంలో జరిగిన ఒకే పనిని ప్రస్తావించేటప్పుడు had + pp అవసరం ఉండదు.

**Anil:** I saw the movie, 'Nenodda Neeku?' on the TV last night. (నిన్న రాత్రి TVలో, 'నేనొద్దా నీకు?' సినిమా చూశా)

**Krishna:** I have seen it too. What a bore!
(నేనూ చూశాన్లే. ఎంత విసుగో!)
I saw it last Saturday, I think.

Anil ఆ సినిమా చూశాడు నిన్నరాత్రి - ఇది past action, time known - అందుకని saw (past doing word)


M. SURESAN

Krishna కూడా ఆ సినిమా చూశానన్నాడు - ఇది past action, time not known - అందుకని ఇక్కడ have + pp. మళ్ళీ last Saturday అని time చెప్తున్నాడు కాబట్టి saw.

చూడండి- ఈ independent, single past actions కు వేటిని కూడా, had+pp లో చెప్పడం లేదు. టైం తెలిసిన past actions - past doing word; time చెప్పని past action have+ pp/ has + pp.

అయితే సందర్భాన్ని బట్టి రెండు related past actions, రెండు విడి sentences లో చెప్తే అప్పుడు had + pp వాడవచ్చు.

I went there at 4 PM. He had already gone.
నేనక్కడికి సాయంత్రం నాలుగు గంటలకు వెళ్ళాను. అప్పటికే అతడు వెళ్ళిపోయాడు.

**Practise the following aloud in English:**

**a) Krishna:** నిన్న నువ్వక్కడికి వెళ్ళేటప్పటికే ఎవరైనా ఉన్నారా?

**Gopal:** ఎవ్వరూ లేరు. అంతకుముందే అందరూ వెళ్ళిపోయారు.

**Krishna:** అక్కడ watchman లేడా?

**Gopal:** అతడే చెప్పాడు Principal మధ్యాహ్నం classes అన్నీ cancel చేశారనీ, అందుకనే అందరూ వెళ్ళిపోయారని.

**Krishna:** నువ్వు TC (Transfer certificate) కి apply చేసిందెప్పుడు?

**Gopal:** Apply చేయమని నువ్వు చెప్పడానికి ముందే చేశాను.

**Krishna:** అంటే నువ్వు last saturday నే apply చేశావన్నమాట.

**b) Sarat:** ఎవరికోసం వెదుకుతున్నారు police వాళ్లు?

**Karim:** Chit Company director కోసం.

**Sarat:** ఏం జరిగింది?

**Karim:** అందరి దగ్గర డబ్బు తీసుకొని పారిపోయాడు (పారిపోయాడు= disappeared/ left town)

**Sarat:** అతడు పారిపోయాడని ఎప్పుడు తెలిసింది?

**Karim:** నిన్ననే. పారిపోయేటప్పటికి company రెండేళ్ళు నడిపాడు. అప్పటికే రెండు కోట్ల రూపాయలు collect చేశాడు.
(Collect= వసూలు)

**Sarat:** ఎప్పుడు గుణపాఠం నేర్చుకుంటారు జనం? దీనికి ముందు చాలా Chit Fund Companies మూతపడ్డాయి కదా.

**ANSWERS:**

**a) Krishna:** Was there any one/ Was any one there when you went there?

**Gopal:** None. People (Every one) had left the place.

**Krishna:** Wasn't (was not) the watchman there?

**Gopal:** He told me that the principal had cancelled all afternoon classes. That was why all of them had gone away.

**Krishna:** When did you apply for the TC?

**Gopal:** I had applied for it before you told me to.

**Krishna:** That means you applied for it last Saturday

**b) Sarat:** Who are the police searching for?
(Police వాళ్లు (Plural). ఒక Police = a Police man. Plural గా Policemen/ Police persons కూడా వాడొచ్చు)

**Karim:** For the chitfund company director

**Sarat:** What happened?

**Karim:** He had collected money from all and disappeared/ left town

**Sarat:** When did people know he had disappeared?

**Karim:** Just Yesterday. He had run the company for two years when he ran away. He had collected by then Rs. 2 crore.

**Sarat:** When do people learn? A number of chitfund companies had closed shops even before this (happened).

**Practise the following also:**

**Prasad:** ఇప్పుడా బండి ఎక్కడుంది?
(బండి= Vehicle)

**Kumar:** కిరణ్ దాన్ని ఇంటికి తీసుకెళ్ళాడు.

**Prasad:** Mechanic దాన్ని ఎప్పుడు పూర్తిగా repair చేశాడు?

**Kumar:** నిన్న repairs పూర్తి చేశాడు. ఇప్పుడు మంచి condition లోనే ఉంది.

**Prasad:** ఎవరు వాడుతున్నారు దాన్నిప్పుడు?

**Kumar:** కిరణ్ వాళ్లన్న. అతడికి మొన్ననే salesman గా ఉద్యోగం వచ్చింది.

**Prasad:** ఆయన అంతకుముందు ఏం చేసేవాడు?

**Kumar:** Student. అతడికి job వచ్చే time కు చదువు పూర్తవలేదు.

**Answer:**

**Prasad:** Where is the vehicle (now)?

**Kumar:** Kiran has taken it home.

**Prasad:** When did the mechanic complete the repairs?

**Kumar:** Yesterday. It is now in good condition.

**Prasad:** Who is using it now?

**Kumar:** Kiran's elder brother. He got the job of a salesman just the day before (yesterday).

**Prasad:** What was he before that?

**Kumar:** He was a student. But he had not completed his studies when he got the job.

---



*ప్రశ్న: "General" - దీని pronunciation జనరల్ కదా! సాధారణంగా "G" తరువాత "e" అనే అక్షరం వస్తే దానిని "జ" గానే పలకాలంటారు. మరి "Get" pronunciation ను అలాగాక "గెట్" అంటారు ఎందుకు?*

***– పి. సుధాకర్, చిన్నమల్లారెడ్డి, హైదరాబాద్***

**జవాబు:** 'g' తర్వాత 'e' వస్తే 'జ'గా పలకాలని rule ఏమీ లేదు. English Pronunciation లో ఎప్పుడూ పాటించగల rules చాలా తక్కువ. G తర్వాత e వస్తే 'జ' గా పలకాలా, 'గ' గా పలకాలా అనేది, ఆ మాట ఏ భాషనుంచి Englishలోకి వచ్చిందనే దాన్ని బట్టి ఉంటుంది. Dictionaryలో ఇచ్చిన Phonetic symbols ను బట్టి, TV English News Caste ను చూసి, విని తెలుసుకోవలసిందే.

*ప్రశ్న: 1) "Would" ను Present లో, Past లో Future లోనూ వాడతారట కదా. ఈ మూడు కాలాలకు సంబంధించి usage ను పూర్తిగా తెలుపగలరు.*

*2) ఆప్యాయత, అనురాగం, అనుబంధం- ఈ మూడు పదాలను ఇంగ్లిష్‌లో ఏమంటారు? "రాణించటం" అనే పదానికి సరియైన ఇంగ్లిష్ పదం ఏది?*

***– కె.సుబ్రమణ్యం, మునగాలపాడు***

**జవాబు:**
1) Would ఉపయోగం త్వరలోనే తెలుసుకుంటారు.
2) ఆప్యాయత - Warmth/ affection; అనురాగం- affection; అనుబంధం- attachment. రాణించటం - make a mark / distinguish (oneself).

*ప్రశ్న: 1) She goes to her friend's on sundays*
*2) She goes her friends on sundays.*
*ఈ రెండింటిలో ఏది సరైనది?*
*ప్రశ్నల సందర్భాల్లో When, Why, What, How లను ఉపయోగించడమెలా?*

***– మనోజ్, మావల్ల***

**జవాబు:**
ఈ రెండు వాక్యాల్లో 1) Correct; 2) Wrong.
Englishలో రెండురకాలQuestions: i) 'Wh' words (What, When, Where, etc.,)తో మొదలయ్యే ప్రశ్నలూ, ii) అవి లేని ప్రశ్నలు. 'Wh' తో మొదలయ్యే ప్రశ్నల్లో 'Wh' word ముందు రావాలి.




# I can speak..




**Pavan:** How long can we be here?
మనం ఎంతసేపిక్కడ ఉండగలం?

**Ravi:** Why? There's no hurry. We can be here as long as we like. What's the matter?
ఏం? మనం ఎంతసేపు కావాలనుకుంటే అంతసేపు ఉండగలం. ఏంటి విషయం?

**Pavan:** Then let's listen to this man. He is saying some thing in Tamil. Can you understand what he says?
అయితే ఇతను చెప్పున్నది విందాం. తమిళంలో ఏదో చెప్తున్నాడు. అతను చెప్పేది నువ్వు అర్థం చేసుకోగలవా?

**Ravi:** I can, but only a little. He says he is a palmist. He can read our palms and tell us of our future.
ఏదో కొంత (అర్థం చేసుకోగలను). అతను Palmist - హస్తసాముద్రికం- చేయి చూసి జోస్యం చెప్పేవాడు. మన హస్తరేఖలు చూసి మన భవిష్యత్ చెప్పగలనంటున్నాడు.
(Read the palm – రేఖలు చూడటం- హస్తరేఖలు)

**Pavan:** But how can we understand him? He can't (can not) speak Telugu and we can't follow his Tamil.
అతడి మాటలు ఎలా అర్థం చేసుకునేది? అతడేమో తెలుగులో మాట్లాడలేడు. మనం అతని Tamil అర్థం చేసుకోలేం. ఎలాగా?

**Ravi:** Ah, here comes Mohan. He can speak Tamil.
Mohan వస్తున్నాడు. అతడు Tamil మాట్లాడగలడు.

**Mohan:** What's going on? (ఏం జరుగుతోంది? )

**Ravi:** Here's a Tamil Palmist. Can you translate his tamil for us?
ఇతను Tamil palmist. ఈయన Tamil లో చెప్పేది మాకు తెలుగులో చెప్పగలవా?

**Mohan:** That's OK. Go on then.
(The Palmist studies Ravi's palm and says some thing in Tamil - అతను Tamilలో ఏదో చెప్తాడు)

**Mohan:** He says you will soon be a minister

**Ravi:** I, A minister!! It's sheer nonsense. How can I be a Minister
నేను మంత్రినా!! అంతకంటే అర్థం లేని విషయం ఇంకోటి ఉండదు.

పై సంభాషణలో look at the expressions- can be, can understand, can read, can't (Cannot) speak, cannot follow, can translate etc.
ఇవన్నీ కూడా can తో కూడిన verbs కదా. ఇవి two forms (రెండు రూపాల)లో ఉన్నాయి కదా?

1) can be- ఇది be form - ఉండడాన్ని తెలుపుతుంది.
2) can understand, can read, can speak, etc. ఇవన్నీ can + 1st Regular Doing Word (1st RDW) form.

ఇవి పనులను (Actions) సూచిస్తాయి.

**1. Can:** ఇది సామర్థ్యాన్ని (ability) తెలిపే verb. ప్రస్తుతం (present)లో కానీ, భవిష్యత్ (Future)లో కానీ ఉండగలగడం, చేయగలగడం అని చెప్పేందుకు can వాడతాం.

a) He can be here in ten minutes.
అతను 10 నిమిషాల్లో ఇక్కడ ఉండగలడు.
(can be - be form కదా - ఉండగలగడం తెలుపుతుంది)

b) నీకెంతసేపు కావాలంటే అంతసేపు నేనిక్కడ ఉండగలను
I can be here as long as you like/ want.

c) వాడిక్కడ గంటకంటే ఉండలేడు
He cannot be (can't be) here for more than an hour.

d) భారతీయ పౌరుడెవరయినా President గా ఉండగలడు
Any Indian citizen can be the president. (ఉండేందుకు అర్హుడు)

e) నీ జన్మలో నువ్వు CMగా ఉండలేవు
You cannot (can't) be a CM for your life

ఇవన్నీ కూడా (can be) be forms- ఉండగలగడాన్ని తెలియజేస్తాయి.

**2.** can + 1st RDW - action.

a) నేను హిందీ బాగా మాట్లాడగలను
I can speak Hindi well.

b) అతను Tendulkar లా ఆడగలడా?
Can he play like Tendulkar?

c) మీరే subjects బోధించగలరు?
What subjects can you teach?

d) మీరెంత బాగా English మాట్లాడగలరు?
How well can you speak English?

e) ఆమె ఇక్కడికిప్పుడు రాలేదు
She can't (cannot) come here now.

f) ఇంత చిన్న విషయం అర్థం చేసుకోలేవా?
Can't you (can you not) understand this simple thing?

**Practise the following in English:**

**Prabha:** నేను CM ను కాగలిగితే... (become వాడండి)

**Prasanthi:** ఆగాగు. నువ్వు CM ఎలా అవగలవు?

**Prabha:** నేను అవలేననా నీ నమ్మకం?


M. SURESAN

**Prasanthi:** నువ్వు CM కాగలవో, లేదో కానీ, nonsense మాత్రం చాలా మాట్లాడగలవు.

**Prabha:** నువ్వు నా విషయంలో అంత కఠినంగా ఎలా ఉండగలవే? (harsh/ unkind - కఠినమైన)

**Prasanthi:** అయితే నువ్వంత nonsense ఎలా మాట్లాడగలవ్?

**Answer:**

**Prabha:** If I can become the C.M..

**Prasanthi:** Wait. How can you become the CM?

**Prabha:** Are you sure (that) I can't (cannot) be the CM?

**Prasanthi:** I don't (do not) know if you can become the CM or not; but you can certainly talk a lot of nonsense.

**Prabha:** Come, Prasanthi, how can you be so harsh/ unkind to me?

**Prasanthi:** How can you talk so much nonsense?

ఈ కింది day to day situations లో వాడే vocabulary/ expressions practise చేయండి: (Prn: Pronunciation)

**1.** get up - నిద్రలేవడం
(wakeup అనొచ్చు - కానీ అది కాస్త పాండిత్యం)

**2.** have/ take a bath - స్నానం చేయడం.
(bathe - స్నానం చేయడం, సముద్ర స్నానం - ఈ మాట ఉన్నప్పటికీ దీన్నెవరూ ఇప్పుడు వాడడం లేదు. పాతబడిన వాడుక - సముద్రస్నానం - a swim in the sea)

**3.** have/ take breakfast (Prn: బ్రెక్‌ఫస్ట్) - పొద్దుటి ఫలాహారం.

**4.** boil: (prn: బాయ్‌ల్) మరిగించడం/మరగడం

**5.** fry: వేయించడం, వేపుడు కూర

**6.** bake: (prn: బెయ్‌క్) నూనెలాంటివి లేకుండా నిప్పుల మీద కాల్చడం. Bread అలాగే చేస్తారు కాబట్టి Bread చేసే చోటు: Bakery (బెయ్‌కరి)
Snacks/ refreshments/ eats - మనం మామూలుగా అనే టిఫిన్‌కు correct English మాటలు. టిఫిన్ English మాట కాదు.

**7.** pastime: కాలక్షేపానికి వినోదం.

**8.** lunch: పగటి/ మధ్యాహ్నం భోజనం.

**9.** Dinner: (మనకు) రాత్రి భోజనం. (prn: డిన- 'డి' ని నొక్కిపలుకుతాం.) ఒక రోజులో మనం చేసే ముఖ్యమైన భోజనం. మన దేశ సందర్భంలో Dinner రాత్రి భోజనమే అవుతుంది. చలిదేశాల్లో మధ్యాహ్న భోజనం కావచ్చు

**10.** Supper: (prn: సప- స నొక్కి పలుకుతాం) - రోజులో చివరి భోజనం - ప్రతిరోజూ ఉండాలని లేదు. అంత ముఖ్యం కాదు.

◆breakfast, lunch, dinner, supper - మనం రోజూ చేసేవైతే వీటి ముందు, A/ An, The రావు.

---

***ప్రశ్న:*** *Infinitive తో, modal verbs తో కొన్ని రకాల వాక్యాలు తికమక పెడుతున్నాయి. ఈ వాక్యాల్లో తేడాలు వివరించగలరు.*

*1) a) They have to have gone there*
*b) They should have gone there*
*2) a) They have to have been there*
*b) They should have been there*
*3) a) The book was to have been sent to Madras*
*b) The book should been sent to Madras*
*4) a) You have to have your car painted green*
*b) You should have painted your car green*
*5) a) She was to have taken that bus*
*b) She must/ should have taken that bus .*

*– ఎస్.రాజశేఖర్, కర్నూలు*

**జవాబు:**

**1 a)** They have to have gone there
వాళ్లక్కడికి వెళ్లి ఉండాల్సింది, వెళ్లారో లేదో తెలియదు.

**b)** They should have gone there
వాళ్లక్కడికి వెళ్లాల్సింది, కానీ వెళ్లలేదు.

Sentence 1) a అంత మంచి construction కాదు. have to have gone లాంటి expressions, usage లో చాలా అరుదు. దాని బదులు They had to go there అంటే simple గా అదే అర్థంతో సరిపోతుంది.

**2 a)** దీనికీ 1a) సమాధానమే సరిపోతుంది. ఇక్కడ కూడా ఈ sentence బదులు They had to be there, అంటే simpler గా direct గా ఉంటుంది. ఈ sentence అర్థం వాళ్లిక్కడ ఉండాల్సింది (గతంలో). (కానీ ఉన్నారో లేదో తెలియదు). దీన్ని ఈ sentence clear గా చెప్పదు.

**b)** దీనర్థం: వాళ్లిక్కడ ఉండాల్సింది, కానీ లేరు.

**3 a)** Book, Madras కు పంపించాల్సింది.
(కానీ పంపించారో లేదోతెలియదు)
ఇది clear గా తెలియదు ఈ sentence లో.

**b)** లో should been sent బదులు, should have been sent అయితేనే correct. అప్పుడు అర్థం. పుస్తకం పంపబడాల్సిందే కానీ పంపబడలేదు.

**4 a)** మీ car ను green గా paint చేయించి ఉండాల్సింది.
(అలా చేయించారో లేదో, ఈ sentence clear గా తెలపదు)

**b)** మీ car ను green గా paint చేసి ఉండాల్సింది.
(అలా చేయలేదు, మీరు. ఇంకో colour తో paint చేశారు)




**5 a)** ఆమె ఆ bus ఎక్కి ఉండాల్సింది.
(ఎక్కిందో లేదో, ఈ sentence వల్ల clear గా తెలియదు)

**b)** She must have taken that bus.
ఆమె కచ్చితంగా ఆ bus నే ఎక్కి ఉంటుంది.
(సందేహం లేదు, ఎక్కింది)
She should have taken that bus.
ఆమె ఆ bus ఎక్కాల్సి ఉండింది, కానీ ఎక్కలేదు.
(ఇంకేదో bus ఎక్కింది).

***ప్రశ్న:*** *ఇంగ్లిష్‌లో commands, orders తెలపడానికి (లేదా) Conditions విధించడానికి Should లేదా must లను వాడతాం కదా. కానీ నేనొక text book లో చూస్తే be forms అయిన is, are లను వాడారు. ఎందుకలా?*

*1) ఒక ఆదాయం వ్యవసాయ ఆదాయం. అది భూమి నుంచి ఉండాలి - అనే షరతులను text book లో To be an agricultural income... The revenue is derived from land అని షరతుగా పేర్కొన్నారు. అలాకాక The revenue should be derived.. అని వాడొచ్చు కదా.*

*2) అలాగే ఒక ట్రస్టు ఆదాయం పన్ను నుంచి మినహాయింపు పొందాలంటే అది ఇన్‌కంటాక్సు కమిషనర్‌చే నమోదై ఉండాలి అనే షరతును; ఒక text book లో The trust should be registered with the commissioner of I.T అని వాడగా, మరొక text లో The trust is registered with commissioner of I.T as per the provision of 12A అని ఉంది. మరి ఇక్కడ is registered కి should be registered కి మధ్య గల తేడా ఏంటి? రెండింటిలో ఏ వాక్యం ఎటువంటి అర్థాన్ని ఇస్తుంది? లేదా రెండు వాక్యాలు ఒకటేనా?*

*–షేక్ అఫ్జల్ ఖాన్, ముంచెమునగాలపాడు*

**జవాబు:**

**1)** 'The revenue should be derived' అంటేనే correct, మీరంటున్నట్లు.

**2)** ఇది కూడా, The trust should be registered అంటేనే correct.
మీరు అర్థం చేసుకున్నట్లుగా, is derived, is registered అంటే మామూలుగా జరిగేది ఇదే అని. అలా కాకుండా ఒక rule గా చెప్పాలంటే should be derived, should be registered అనేవే correct.

# ప్రతిభ

**Mahesh:** Hi Ramesh, you can sing, can't you?
రమేష్, నువ్వు పాడగలవు కదా?

**Ramesh:** Of course I can. Why, what's the matter?
అవును. ఎందుకడుగుతున్నావు?

**Mahesh:** You can participate in the singing competition at college next week.
వచ్చేవారం పాటల పోటీలో పాల్గొనవచ్చు

**Ramesh:** Oh, no. I can sing but not in a competition.
అంత లేదు. ఏదో పాడగలను కానీ పోటీల్లో మాత్రం కాదు.

**Mahesh:** O come Ramesh. Tell yourself you can, and you will.
రమేష్, నా మాట విను. నువ్వు పాడగలవని నీకు నువ్వే చెప్పుకో, పాడేయగలవు.

**Ramesh:** I am not so sure. (అంత నమ్మకం నాకు లేదు)

**Mahesh:** You can try at least, Keep telling yourself you can, and you will be able to do it.
నేను పాడగలను, పాడగలను, అని చెప్పుకుంటూ (అనుకుంటూ) ఉండు. నువ్వు పాడగలుగుతావు.
(keep telling - చెప్తూ ఉండడం - continue telling. keep doing something / continue to do some thing - ఒక పని చేస్తూ ఉండటం)

**Ramesh:** Ok, I'll try. ప్రయత్నిస్తాను.

పై సంభాషణలో canతో ఉన్న verbsను గమనించారు కదా. మనం కిందటి lessonలో తెలుసుకున్న అర్థంతోనే ఇక్కడ can ను వాడాం. అంటే 'గల' అనే అర్థంతో - సామర్థ్యం (ability) తెలియపరచేందుకు can వాడాం. ఈ response (reply) చూడండి. Ramesh: Of course, I can. conversation లో can you do something? అనే question కు చేయగలను అనే సమాధానం ఇవ్వడానికి I can do it, అని పూర్తిగా అనకుండా, I can అంటే సరిపోతుంది. చేయలేకపోతే I can't (cannot) అంటాం. పూర్తి sentence అనం.

**Bhaskar:** I can play cricket very well. In fact I can play better than some of the players in the Indian team.

**Bhavan:** Oh, can you? (అలాగా? )

**Bhaskar:** You think I can't (cannot) ?

**Bhavan:** (Do) You mean the selectors don't know your greatness?
అంటే selectors కు నీ గొప్పతనం తెలియదంటావా?

**Bhaskar:** They can't. Moreover, I can, but I don't play.
వాళ్ళర్థం చేసుకోలేదు. నేను ఆడగలను, కాని ఆడను.

చూశారు కదా? Spoken English లో can, can't (can not) తో ఒకరి ability (సామర్థ్యం) గురించి ఎంతసేపయినా సంభాషణ జరపవచ్చు.

**Now, Practise the following aloud in English.**

**a) Kumar:** Hi Kishore, ఏంటి విశేషాలు?

**Kishore:** ఈ వారాంతం picnic కు వస్తావా? ఈ weekend ఓ పదిమందిమి వెళ్తున్నాం.

**Kumar:** ఈ వారాంతమా? రాలేనేమో.

**Kishore:** ఏంటి problem?

**Kumar:** మా cousins ఈ weekend ఇక్కడ ఉంటారు.

**Kishore:** వాళ్లను కూడా మనతో రమ్మను.

**Kumar:** వాళ్లు రాలేరు. వాళ్లిక్కడికి ఓ interview కోసం వస్తున్నారు. వాళ్లకావేళ interview ఉంది.

**Kishore:** నువ్వు లేకుండా నేనా picnic enjoy చేయలేను. నువ్వెలాగైనా రావడానికి ప్రయత్నించు.

**Kumar:** మా cousins ఇక్కడున్నప్పుడు ఎలా రాగలను? చూద్దాం. వాళ్లు రేపో, ఎల్లుండో phone చేస్తారు. correctగా ఎప్పుడొస్తారో? దాన్నిబట్టి నీకు చెప్తాను.

**Kishore:** నువ్వు నన్ను నిరాశపరచవనే (disappoint) అనుకుంటున్నాను. నువ్వు అనుకుంటే తప్పక రాగలవు. మనసుంటే మార్గం ఉంటుంది కదా.

**Kumar:** పోనీ picnic postpone చేసుకోలేవా? Picnic miss అవడం నాకసలు ఇష్టం లేదు.




**Answers:**

**a) Kumar:** Hi Kishore, What news?

**Kishore:** How about coming for a picnic / joining a picnic this weekend? will you come for/ will you join a picnic this weekend? Ten of us are going.

**Kumar:** This weekend? I'm (I am) afraid I can't (cannot) come.

**Kishore:** What's (What is) the problem?

**Kumar:** My cousins will be here this weekend.

**Kishore:** Ask them to join us too.

**b) Bhavan:** Hi Bhaskar, Congrats.

**Bhaskar:** What on?

**Bhavan:** Sekhar told me yesterday (that) you had got/ won a prize.

**Bhaskar:** O, That's nothing. I got that prize for the best essay in the essay writing competition.

**Bhavan:** I Know you can write very well/ I know you are very / quiet good at writing. But I didn't know that you had got/ won the prize until sekhar told me. let me tell you. I can't (cannot) write so well as you. congrats again.

**Bhaskar:** O, You're praising me too much/ that's praising too much. How is your cricket practice?/ How is your cricket practice going on?
(That's praising too much- spoken English లో ఎక్కువ)

**Bhavan:** We have been practising for the past one week. only four days are left (మిగిలి ఉన్నాయి) for the tournament. My Fielding needs some improvement. I am sure our team will make it/ reach the finals.
(make it - (ఏదైనా) చేయగలగడం)

**Bhaskar:** Isn't' (Is not) the tourney (tournament కు ఇంకోమాట) in Hyderabad?/ the tourney is in hyderabad, isn't it? when will you be there for the first match?

**Bhavan:** On the 22nd. Our first match is with the khammam team/ the team from khammam.

**Bhaskar:** Ok It's time for me to leave. All the best.

**Bhavan:** Thank you.

# How can we..

**Kishore:** అన్ని ఏర్పాట్లు చేసేశాం. ఇంక ఎలా postpone చేయమంటావు?

**Kumar:** Ok. ఒక్కరోజు ఆగు. రేపు చెప్తా ఏ విషయం.

**Kishore:** నువ్వు తప్పకుండా వస్తున్నావు.

**b) Bhavan:** Hi, congrats Bhaskar.

**Bhaskar:** దేనికి?

**Bhavan:** నీకేదో prize వచ్చిందని శేఖర్ నిన్న నాతో అన్నాడు.

**Bhaskar:** అదా. అదేమంత పెద్ద విషయం కాదు. మా college పోటీల్లో అత్యుత్తమ వ్యాసానికి prize వచ్చింది.

**Bhavan:** నువ్వెంత బాగా రాయగలవని నాకు బాగా తెలుసు. అయితే నీకు prize వచ్చిన విషయం శేఖర్ చెప్పేవరకు తెలియలేదు. చెప్తున్నా కదా. నేను నీ అంత బాగా రాయలేను. మరోసారి అభినందనలు.

**Bhaskar:** నువ్వు నన్ను మరీ పొగిడేస్తున్నావు. Thank you. నీ cricket practice ఎలా ఉంది?

**Bhavan:** గత వారం రోజులుగా practice చేస్తున్నాం. ఇక tournaments కు నాలుగు రోజులేగా ఉంది. నా fielding కొంత మెరుగుపడాల్సిన అవసరం ఉంది. మా team finals దాకా రాగలదనే నమ్మకం నాకుంది.

**Bhaskar:** హైద్రాబాద్‌లో కదా ఈ tournaments. మీరెప్పుడుంటారు అక్కడ 1st matchకి?

**Bhavan:** 22వ తారీఖున. మా 1st match ఖమ్మం team తో.

**Bhaskar:** OK. మరి నాకు time అయింది. వెళ్ళాలి. All the best.

**Bhavan:** Thank you.




**Kumar:** They can't (can not). They are coming here for an interview. They have an interview that day.

**Kishore:** I can't (can not) enjoy the picnic without you. Do try to come/ try to come. (Do try - గట్టిగా చెప్పడానికి అలా అంటాం)

**Kumar:** How can I come when my cousins are here? Let's (let us) see. They will phone/ call / ring me tomorrow or the day after, when they will be/ will come here exactly. Depending on that I'll (I will) let you know.

**Kishore:** I'm (I am) sure you will not disappoint me. If you want you can come. Where there is a will there is a way, you know. (you know - కదా)

**Kumar:** Why don't you postpone your picnic?

**Kishore:** We have made all arrangements. How can we postpone it?

**Kumar:** Wait for a day I'll let you know tomorrow.

**Kishore:** You are coming definitely.
(Definitely) certainly - కచ్చితంగా).

**Vocabulary / Expressions:**

**(Prn- Pronunciation)**

**1. Attend** (Prn: అటెండ్- టెం నొక్కిపలుకుతాం) - హాజరవడం- attend/ school/ college/ place of work (మనం వృత్తి/ విధి నిర్వహించే చోట్లకు వెళ్ళడం/ హాజరవడం)/ Marriage/ meeting/ dinner/ party/ celebrations etc. వీటన్నిటికి కూడా హాజరవడం, రావడం, వెళ్ళడం అనే అర్థాలతో come, go, be present బదులు attend ఎక్కువ వాడతాం.

**a)** నిన్నవాడు School కు రాలేదు.
He didn't (did not) attend school yesterday.

**b)** మీరు పెళ్ళికెందుకు రాలేదు?
Why didn't you (did you not) attend the marriage?

**c)** సభకు చాలామంది వచ్చారు.
A large number (of people) attended the meeting.

**d)** రేపు dinner కొస్తున్నారా?
Will you/ are you going to, attend the dinner tomorrow? / Are you attending the dinner tomorrow?




**ప్రశ్న:** *1) Rajani has to work along with Ravi*
*Rajani is to work along with Ravi*
*2) They have to hold the programme*
*They are to hold the programme*
*3) The SP, Naveen Chand who was to attend as a chief guest in this programme was not / had not/ did not come yesterday.*

*పై వాక్యాల్లోని is/ has to, how to/ are to, was/ had not ఉపయోగాలు కరెక్టేనా? వివరించగలరు.*

***– అబ్దుల్ మునాఫ్, నందికొట్కూరు***

**జవాబు:**

1) Rajani has to work along with Ravi అంటే - రజని రవితో పనిచేయాలి/పని చేయాల్సి ఉంటుంది. ఇక్కడ Rajani has to – పని చేయాలి. ఎవరితో? - ఆమెకిచ్చిన ఆజ్ఞవల్ల/ ఆమెకున్న అవసరంవల్ల/ పరిస్థితుల ప్రోద్బలంవల్ల- ఈ కారణాలలో దేనివల్లనైనా ఆమె రవితో పనిచేయాలి/ చేయాల్సి వస్తుంది అని. has to ను he, she, it తో వాడతాం. have to ను I, We, You and they తో వాడతాం.

We have to start now to meet him - అతడిని కలుసుకోవడానికి మనం ఇప్పుడు బయలుదేరాలి- ఇది మన అవసరాన్ని/ పరిస్థితుల ఒత్తిడిని సూచిస్తుంది.
She has to stay at office from 10 to 4.
ఆమె Office లో 10 నుంచి 4 వరకు ఉండాలి- విధి.
She has to take care of her child, so she is unable to come.
ఆమె పరిస్థితి (బిడ్డను చూసుకోవడం) ఆమెను రానివ్వదు.
You have to be here at 10 – మీరిక్కడ 10కి ఉండాలి- ఇది ఆజ్ఞ.

2) Rajani is to work along with Ravi – Rajani Ravi తో కలిసి పనిచేయాలి/ చేయబోతుంది/ చేస్తుంది- ఇక్కడ ఇది జరగబోయేదాన్ని గురించి చెబుతుంది. ఇది జరిగే అవకాశం దాదాపు కచ్చితం. అంటే అంతకుముందు చేసుకున్న ఏర్పాటువల్లకానీ, ఆ Rajani, Ravi లకు వచ్చిన ఆజ్ఞవల్లకాని వాళ్ళు కలిసి పనిచేయబోతున్నారు/ చేస్తారు అని. have to/ has to అంటే చేయాలి- చేస్తారో, లేదో తెలియదు. am to/ is to/ are to/ was to/ were to విషయంలో అయితే చేయాలి, చేసే అవకాశం చాలా ఎక్కువ, చేయడం జరుగుతుంది.

3) ముఖ్యఅతిథి నవీన్‌చంద్ రావలసింది/ రావాల్సినవాడు, కానీ ఆయన రాలేదు, అని దీని భావం. ఈ అర్థం correct గా వచ్చేటట్లు చెప్పే sentence- The SP, Navin Chand who was to have attended as the chief guest did not come yesterday. was not come- సరైన English కాదు. had not come ఇక్కడ సరికాదు.






# You can talk now

**Sridhar:** Hi Neeraj, just how busy are you?
నీరజ్, నువ్వు busy నా? / ఎంత busy గా ఉన్నావు?
(ఇక్కడ just = అసలు. conversation లో తెలుగులో 'మరి' లాగా just వాడుతుంటారు.)

**Tarun:** Not at all. What's the matter?
అదేం లేదు. ఏంటి విషయం?

**Sridhar:** I am in a hurry to get home. Can you drive me home on your bike?
ఇంటికి త్వరగా వెళ్లాలి. నీ bike మీద నన్ను ఇంటికి తీసుకెళతావా?

**Tarun:** Drive you home? O no. You can take my bike if you want. I am tired of driving for the day.
నిన్నింటికి తీసుకెళ్లడమా? నావల్ల కాదు. అలసిపోయాను. కావాలంటే నా bike తీసుకో.

**Sridhar:** How long can I have it?
ఎంతసేపుంచుకోను?

**Tarun:** Will three hours do?
మూడు గంటలసేపు చాలా?
(will do = చాలు. An income of Rs 10000/- a day will do for me. I don't want more. రోజుకు పదివేల రూపాయల ఆదాయం చాలు నాకు. అంతకంటే వద్దు)

**Sridhar:** O that's fine. Thank you.

**Tarun:** You can keep the bike till 5 o'clock. Go by the other road. The traffic along this road at this hour can be heavy. Driving in such traffic can be dangerous.
కావాలంటే 5 గంటల దాకా ఉంచుకో. ఆ రోడ్డు గుండా వెళ్ళు. ఈ road వద్దు. ఈ time లో ఈ road లో traffic రద్దీ ఎక్కువగా ఉండొచ్చు. Driving ఈ సమయంలో కొంచెం ప్రమాదకరమే అవచ్చు

పై సంభాషణలో can తో ఉన్న verbs చూడండి.

1) Can you drive me home?
ఇంటికి తీసుకెళ్ళగలవా?
2) You can take my bike – నా bike తీసుకెళ్ళు.
3) How long can I have it?
ఎంతసేపుంచుకోమంటావు?
4) You can keep the bike till 5'o clock.
5) The traffic at this hour can be heavy.
6) Driving in such traffic can be dangerous.

can గురించి మనం ఇంతవరకు తెలుసుకున్నవి: can ability (సామర్థ్యాన్ని) తెలుపుతుందని కదా. అంటే- 'గల' - ఉండగలగడం, చేయగలగడం లాంటి అర్థాలతో. ఈ సంభాషణలో can కు ఉన్న మరికొన్ని అర్థాలు, ఉపయోగాలు చూద్దాం:

1. Can you drive me home? ఇక్కడ can drive, ability కాదు గదా! ఇక్కడ Tarun ను request చేయడానికి Sudheer can వాడుతున్నాడు కదా (ఇంటికి తీసుకెళ్తేదా? అనే అర్థంతో). అంటే can ను request (విజ్ఞప్తి) చేయడానికి వాడవచ్చు. question form లో.
 1) కాస్త నీ pen ఇస్తావా?
 Can you give me your pen? / Can I have your pen?
 2) మీతో రెండు నిమిషాలు మాట్లాడవచ్చా?
 Can I speak to you/ see you for a few minutes?
 3) Can you lend me some money?
 కాస్త అప్పిస్తారా?
 ఇక్కడ can ను question form లో requests కు ఉపయోగించినట్లు తెలుస్తోంది కదా! అంటే can ను question form లో ముఖ్యంగా you తో, I/ we తో requests కు వాడవచ్చు

2. How long can I have it?
ఎంతసేపు నేను నీ bike ఉంచుకోవచ్చు?
ఇక్కడ can ను question form లో, permission అడగడానికి (అనుమతి పొందడానికి) వాడుతున్నాం.
 a) మళ్ళీ ఎప్పుడు కలవమంటారు మిమ్మల్ని?
 When can I see you again?
 (asking for permission)
 b) నేనిక వెళ్లనా?
 Can I go now? (asking for permission)
 c) Can I use your pen?
 మీ pen వాడుకోనా? (permission)

3. Question form లో permission అడగడానికి వాడినట్లే, can ను statement form లో permission ఇవ్వడానికి వాడతాం.
 a) You can keep the bike till 5'o clock.
 నువ్వు bike ను అయిదింటిదాకా ఉంచుకోవచ్చు
 (giving permission)
 b) You can take my bike.
 నా bike తీసుకోవచ్చు/ తీసుకో.
 (giving permission)
 c) నువ్వింక వెళ్ళొచ్చు
 You can go now. (giving permission)
 d) నువ్వు వందరూపాయలకంటే ఎక్కువ ఖర్చు పెట్టడానికి వీల్లేదు.
 you cannot spend more than Rs. 100/-.
 (you can spend = you have permission to spend upto Rs. 100/-)

4. సుధీర్:
 a) Driving in such traffic can be dangerous.
 ఇలాంటి traffic లో drive చేయడం ప్రమాదకరం కావచ్చు/ గా ఉంటుంది.
 ఇక్కడ can, possibility (సాధ్యమేమో అనుకునే దానిని) తెలుపుతుంది కదా. అది can కు ఇంకో ఉపయోగం.
 b) చీకట్లో వెళ్ళొద్దు. పాములుంటాయి.
 Don't go out in the dark. There can be snakes. (possibility)
 c) ఆ ప్రయాణం చాలా అలసట కలిగించవచ్చు (అవకాశం ఉంది)
 The journey can be very tiresome/ tiring.
 d) He can give you trouble. Be careful.
 జాగ్రత్త. వాడు నీకు trouble ఇస్తాడేమో/ ఇవ్వగలడు (possibility / ability).

ఇవీ can కు ఉన్న ఇతర uses. సంగ్రహంగా 'can' ను-
a) Question form లో ముఖ్యంగా, I/ we తో REQUESTS కు వాడతాం.
b) Question form లో I/ we తో permission అడగడానికి వాడతాం.
c) Statement form లో request, permission ఇవ్వడానికి వాడతాం.
d) Statement form లో possibility కి (సాధ్యమే అవుతుందనుకున్న విషయానికి) వాడతాం.

**Practise the following aloud in English:**

**Kareem:** నేను మీతో కాసేపు (a few minutes) మాట్లాడవచ్చా? (see/ speak వాడండి)
**Kasyap:** దేని విషయం?


M. SURESAN

**Kareem:** కాస్త ముఖ్యమైన విషయం.
**Kasyap:** ఇప్పుడు మాట్లాడండి. నేను తీరిగ్గానే ఉన్నాను.
**Kareem:** మీ friend company లో typist jobs ఖాళీగా ఉన్నాయి. నేను కూడా apply చేశాను. మా నాన్నగారు మీతో మాట్లాడమన్నారు. నాకా job వచ్చేందుకు మీరు సాయపడతారా?
**Kasyap:** మీ నాన్నగారెవరు?
**Kareem:** Syed Mustafa.
**Kasyap:** నాకాయన బాగాతెలుసు. నా friend మీ నాన్నగారికి కూడా తెలుసు. ఆయనే మాట్లాడవచ్చు కదా.
**Kareem:** మీరయితే ఎక్కువ influence చేయగలరని.
**Kasyap:** రేపు నువ్విక్కడికి రాగలవా?
**Kareem:** తప్పకుండా. రేపెప్పుడు రాను?
**Kasyap:** సాయంత్రం ఈ టైంకు రా.

**Answer:**

**Kareem:** Can I see you/ speak to you for a few minutes?
**kasyap:** What about?
**Kareem:** It's a bit important.
**kasyap:** You can talk now. I am at leisure.
**Kareem:** There are a few vacancies for typists jobs in your friend's company. I've (have) applied for one of them. Can you help me to get the job? My father told me to talk to you.
**Kasyap:** Who is your father?
**Kareem:** Syed Mustafa.
**kasyap:** O, I know him well. Your father knows my friend too. Your father can talk to him.
**Kareem:** You can influence him better.
**Kasyap:** Can you come here tomorrow?
**Kareem:** Certainly- when shall I come?
**Kasyap:** (At) this time tomorrow.

**Vocabulary/ Expressions**
**(prn=pronunciation)**

- nap = కాసేపు నిద్ర/ నిద్రపోవడం; ముఖ్యంగా మధ్యాహ్న భోజనం తర్వాత (After lunch, he usually has a nap)
- Cut it out = ఇక ఆపు. అదంతా కట్టిపెట్టు (ఎవరైనా అనవసర విషయాలతో విసిగిస్తే cut it out, come to the point అంటాం)
- Class ఎగ్గొట్టడం = bunk;
- జబ్బు నటించి, class, పని ఎగ్గొట్టడం = malinger (prn: మలింగ; 'లిం' నొక్కి పలుకుతాం),
 బడి దొంగ = malingerer.
- ఆటో/ రిక్షా/ టాక్సీ లాంటివి చేసుకోవడం (ఎక్కడం, వెళ్ళడం) = take an auto/ rickshaw/ taxi, etc.
 You take bus no.7 to go to the station.
 (7వ number bus ఎక్కండి)
- మురికి బట్టలు = soiled clothes
 అతని బట్టలు మురికయ్యాయి-His clothes are soiled.
- rags = పీలికలు. The beggar is in rags
 ఆ ముష్టివాడు చిరిగిన గుడ్డల్లో ఉన్నాడు.



***ప్రశ్న:*** *మీరు Spoken English శీర్షికలో "వాక్యాలను Practice చేయండి" అని noun form వాడుతున్నారు. అలాకాకుండా "practise చేయండి" అని verb form ఉపయోగించడం సరైనది కదా!*
***– పోతుల శ్రీనివాసు, వేగాయమ్మ పేట, తూ.గో.జిల్లా***

**జవాబు:** Practice, Practise కు ఉండే తేడా advice కు, advise కు ఉండే తేడా ఒకటే. Practice అభ్యాసం; practise- అభ్యసించడం.
 a) I have the practice - నాకు అభ్యాసం/ అలవాటు ఉంది. Practice makes us perfect - అభ్యాసం వల్ల పరిపూర్ణత వస్తుంది.
 b) We practise the game everyday - మేం రోజూ ఆటను అభ్యసిస్తాం (ఆడతాం). అందుకని ఇక్కడ practise అభ్యాసం చేయండి అనే అర్థం రావాలంటే practice చేయండి అనాలి కదా.

***ప్రశ్న:*** *1) Seventh class English Reader (Mother tongue) page No 52 'Trees' Poem లో When evening changes into night, and when a moon floats on the sky. They hum a drowsy lullaby. ఇక్కడ the moon ఉండాలి కదా. a moon ఎందుకు వాడారో తెలియజేయగలరు.*
*2) Are you studying in Seventh Class? దీనికి జవాబెలా చెప్పవచ్చు?*
***–గుర్రం శంకర్, కేశవపట్నం***

**జవాబు:** 1) 'a moon' ఈ line లో అచ్చు తప్పు (printer's error). The moon అనే చదువుకోవాలి.
2) Yes, I am.

***ప్రశ్న:*** How about you? What about you ఈ రెండింటి అర్థం ఒకటే అయితే ఈ రెండూ ఉపయోగించడంలో తేడా ఏమిటి? మనం ఉపయోగించాలనుకున్నప్పుడు ఈ రెండింటిలో ఏదైనా వాడవచ్చా? దయచేసి తెలుపగలరు. I haven't money / I have no money అర్థం ఒకటేనా, కానట్లయితే వాటిని ఎలా ఉపయోగించాలి? తెలుపగలరు.
***– వంశీ, హైదరాబాద్***

**జవాబు:** 1) What about you? అనేది దాదాపు How about you? తో సమానమే. పెద్ద తేడా లేదు. ఏది వాడాలి అనేది ఎప్పుడైనా సందర్భాన్ని బట్టి మీకే తెలుస్తుంది.
2) I haven't money అని సామాన్యంగా అనం. I haven't any money అనిగానీ, I haven't the money అనిగాని అంటాం. I have no money కి కరెక్ట్‌గా సమానమైనది I haven't any money.
I haven't the money కి అర్థం, దానికి (ఏదో ఫలానాదానికి) కావలసిన డబ్బు నా దగ్గర లేదు అని.
'Are you buying a car?/ Why don't you buy a car?'
'I'd like to, but I haven't the money/ but I don't have the money.' (the money = car కొనేందుకు డబ్బు)

***ప్రశ్న:*** *May కు బదులు can వాడుతున్నారు. May I help you కి బదులుగా can I help you అని రాస్తున్నారు. Can అనేది Natural ability కి సంబంధించి దయతో may బదులు can ఎందుకు use చేయాలి? can ని Natural ability లో కాకుండా ఇంకా ఎన్ని విధాలుగా use చేయవచ్చు*
***– వి.గణేశ్, కాకినాడ***

**జవాబు:** Can, natural ability ని తెలియజేస్తుంది, correct గా 'గల' అనే అర్థంతో. He can do it, అంటే వాడు అది చేయగలడు. అయితే can కు ఉన్న మరికొన్ని ఉపయోగాలలో offer ఒకటి. అంటే ఇంకొకరు అడక్కుండా మనం వాళ్లకు ఏదైనా ఇవ్వడం/చేయడం. దానికి can question form లో వాడతాం, may లాగా.
May I help you? = మీకు నా సాయం కావాలా? / నేనేమన్నా మీకు సాయపడగలనా? - ఇది offer. అయితే ఇది కొంచెం formal - అంటే అంత పరిచయం లేని వాళ్లకు మన offer.
Can I help you? దీనర్థం కూడా మీకు/ నీకు నా సాయం కావాలా? / మీకు/ నీకు నేనే విధంగా అయినా సాయం చేయగలనా? అని informal గా, అంటే మనకు బాగా పరిచయం ఉన్న వాళ్లకు చేసే offer. May I help you? - formal offer. Can I help you? - less formal/ informal offer.

**Pooja:** Hi Raasi, what a surprise! you, here!
ఏంటి రాశీ, నువ్విక్కడ! ఏంటీ వింత?

**Raasi:** I am on my way to the spoken English Institution near here. You know it. The 4th building from your place.
ఇక్కడ దగ్గర్లో spoken English Institution కు వెళ్తున్నాను. నీకు తెలుసుగా. మీ ఇంటినుంచి నాలుగో building.
(I am on my way to – నేనక్కడికి వెళ్తున్నాను. On the way – దారిలో)

**Pooja:** Come, Raasi, you go there everyday, and you can't find the time to drop in at my place.
రోజూ అక్కడి వెళ్తున్నావు, మా ఇంటికి రావడానికి మాత్రం తీరిక చేసుకోలేకపోతున్నావు కదా!

**Raasi:** I joined there only a week ago. I had been thinking of seeing you and we met. Can you do me a favour?
నేనక్కడ చేరి వారమే అయింది. మీ ఇంటికి రావాలనుకుంటున్నాను, మనం కలుసుకున్నాం. ఓ చిన్న సాయం చేసి పెట్టగలవా నాకు?
(Do a favour – సాయం చేయడం)

**Pooja:** Doing you a favour! That will be a real pleasure for me. What's it?
నీకు సాయం చేయడం నాకు నిజంగా సంతోషమే. ఏంటి చెప్పు.

**Raasi:** Can you let me spend the lunch break in your home? We have two sessions with a break of an hour in between. I can neither go home nor stay at the institution.
నేను lunch break మీ ఇంట్లో గడపొచ్చా, మాకు classes మధ్యలో ఓ గంట break ఉంటుంది. ఇంటికీ వెళ్లనూ లేను, అంతసేపక్కడ ఉండనూ లేను.

**Pooja:** You can, by all means. Only I can't be there at the time. I am sorry I can't give you company. I go for my dance classes at the time. Don't worry. You can have my sister Pallavi's company.
తప్పకుండా, అయితే, ఆ time లో నాకింట్లో ఉండడం కుదరదు. నీకు company ఇవ్వలేను. అదే time లో నేను dance క్లాసులకెళ్తాను. ఫరవాలేదులే. మా చెల్లి పల్లవి నీకు తోడుండగలదు. నీకామె company ఉంటుంది.
(By all means – తప్పకుండా, అన్నివిధాలా)

**Raasi:** Thank you.

పై సంభాషణలో గమనించే ఉంటారు, canతో వచ్చే verbs ఉపయోగం. ఇంతవరకు మనంచూసినవే కదా.

1. You can't (cannot) find the time
నీవు తీరిక చేసుకోలేకుండా ఉన్నావు. (ability)
2. Can you do me a favour?
ఓ సాయం చేయగలవా? (Can - request)
3. Can you let me spend...
మీ ఇంట్లో నేనుండనా? (Permission/ request)
4. I can neither go home...
నేనింటికి వెళ్లనూ లేను, ఉండనూ లేను (ability)
5. You can, by all means– నువ్వుండొచ్చు, తప్పకుండా (can – permission/ request)
6. I can't (cannot) give – ఇవ్వలేను. (ability)







# I can't give..

7. You can have– ఉంటుంది. Possibility– అవకాశం.
ఇవన్నీకూడా ఇప్పటివరకు మనం తెలుసుకున్న 'can' ఉపయోగాలు.

**Now Practise the following aloud in English. (Use all that you have learnt so far)**

**a) Bhavani:** రేపు నా birthday. మీరిద్దరూ తప్పక వస్తారు కదా?
**Sucharitha:** మీ ఇంట్లో ఎప్పుడుండమంటావు మమ్మల్ని?
**Chandra:** Cake ఎప్పుడు కోస్తావు?
**Bhavani:** Correct గా సాయంత్రం 5.30కి.
**Sucharitha:** ఏం ఫరవాలేదు, ఐదింటికే నేనక్కడ ఉంటా.
**Chandra:** నాకు రేపు 5 వరకు class ఉంది. 5.30కి నేరాలేను. ఒక అరగంట late గా వస్తా.
**Bhavani:** తప్పకుండారా.

**b) Prakash:** Sekhar ను గురించి నీ అభిప్రాయం ఏమిటి?
**Vinai:** ఎందుకడుగుతున్నావు?
**Prakash:** అతను మంచి player అయితే మన team లోకి తీసుకుందామని.
**Vinai:** అతను చాలా బాగా ఆడగలడు. నిలకడగా Concentration తో ఆడతాడు.
**Prakash:** అయితే మనం అతన్ని తీసుకోవచ్చు కదా.


M. SURESAN

**Vinai:** అయితే నేను అతనికీ విషయం చెప్పనా? మన match ఎప్పుడు కరెక్ట్‌గా?
**Prakash:** నీకు తెలీదా. వచ్చే Sunday నే కదా? అవతలి team లో చాలామంచి players ఉన్నారు. వాళ్లందరు బాగా ఆడగలిగిన వాళ్లే.
**Vinai:** నాకు తెలుసు. ఇంతకు ముందు వాళ్లతో రెండు matches ఆడాం. ఒకటి మనం, ఇంకోటి వాళ్లు గెలిచారు.

**c) Manoj:** దేని గురించి చర్చిస్తున్నారు మీరు?
**Rajeev:** రమేష్ మనకు సహాయపడగలడా, లేడా అని. (Whether తో begin చేయండి)
**Manoj:** ఏంటసలు విషయం?
**Raghav:** హైదరాబాద్‌లో Cricket Match కి tickets కావాలి మాకు. రమేష్‌కు cricket board లో ఇద్దరు ముగ్గురు తెలుసు. అందుకని అతనే మన్నా తెప్పించగలడేమోనని.
**Manoj:** వాడు చేయగలడు కానీ చేయడు. అతనెప్పుడూ ఎవరికి సాయం చేయడు. నాకింతవరకూ ఏ సహాయం కూడా చేయలేదతను.
**Rajeev:** ఇది చాలా నిరాశ కలిగించే విషయం.
**Raghav:** ఏం worry అవకు. నేను తెప్పించగలనులే ఎలాగో ఒకలా.

**d) Nagaraj:** నువ్విప్పటికే నా time చాలా waste చేశావు నన్ను వెళ్ళనీ.
**Prahlad:** మళ్ళీ నేనెప్పుడు కలుసుకోను. నిన్ను?
**Nagaraj:** రేపు ఏ time లోనైనా.
**Prahlad:** రేపు కలుసుకోలేను. నాకు examఉంది. ఆ విషయం నీకు తెలుసుకదా.
**Nagaraj:** ఎల్లుండి మా ఇంటికి రాగలవా?
**Prahlad:** తప్పకుండా.

**ప్రశ్న:** *"ఆ చీర చాలా బాగుంది కదా?" అనే వాక్యాన్ని మీరు ఇంగ్లిష్‌లో "Isn't that sari nice/ beautiful"? అన్నారు. తెలుగువాక్యంలో నెగెటివ్ సెన్స్ లేదు కాని ఇంగ్లిష్ వచ్చేసరికి నెగెటివ్ సెన్స్‌లో ఉంది. ఆ తెలుగు వాక్యాన్ని "Is that sari nice/ beautiful?" అనకూడదా?*
**– షేక్ నజీరున్నీసా, అమృతలూరు**

**జవాబు:** A very good question. తెలుగులో negative sense తెలిపే మాట లేకున్నప్పటికీ, 'కదా' అనే మాటలో negative tone వస్తుంది కదా. Is that sari beautiful అంటే అర్థమేమిటి? ఆ చీర బాగుందా? అని కదా. 'ఆ చీర బాగుందా?' అనడానికి, 'ఆ చీర బాగుంది కదా?' అనడానికి తేడా English లో చెప్పాలంటే, 'Isn't that sari beautiful?' అనికానీ, 'That sari is beautiful, isn't it?' అనికానీ అంటే తప్ప, తెలుగులోని బాగుంది కదా? అనే అర్థం రాదు. గమనించండి.

**ప్రశ్న:** *ఈ మూడు వాక్యాలకు English Translation చెప్పగలరు.*
1. *నేను రేపు ఎక్కడికి వెళ్తానని మీరు అనుకొంటున్నారు?*
2. *ఆమె నా గురించి ఏమనుకొంటోందని మీరు అనుకొంటున్నారు?*
3. *అతను నన్ను విసుక్కుంటున్నాడు.*

**– శ్రీనివాస్, తిరుపతి**

**జవాబు:** 1. Where, do you think, I am going/ I will go tomorrow?
2. What do you think she thinks of me?
3. He feels vexed with me.

**ప్రశ్న:** *1. క్రికెట్‌లో Man of the match ఇచ్చేటప్పుడు "to be given" అని అంటారు. అలాగే పెళ్లి కార్డులలో "to be solemnised by (some body)" అని రాస్తారు. నా సందేహం- to be బదులు will be అని వాడొచ్చు కదా! To be + PP ఎప్పుడు వాడతారు?*
*2. "I could have found the way all right". ఈ వాక్యం అర్థం ఏమిటి? ఇది ఏ టెన్స్‌లో ఉంది?*
**– ఎస్.జోషి, ఒంగోలు**

**జవాబు:** To be given, to be seen లాంటివి passive infinitives.
1) To be given అంటే ఇవ్వబడటం/ ఇవ్వబడటానికి/ ఇవ్వబడేందుకు- మామూలు తెలుగులో అయితే ఇవ్వడం, ఇవ్వడానికి, ఇచ్చేందుకు అంటాం కదా. Man of the match award to be given to అంటే Man of the match పురస్కారం x చేత y కి ఇవ్వబడబోతుంది అనే అర్థం వస్తుంది;




మామూలు తెలుగులో x, y కి ఇవ్వనున్నారని అర్థం వస్తుంది. Will be given అని కూడా అనవచ్చు. అయితే వాడుకలో Man of the match award to be given ఎక్కువ.
(wedding) to be solemnized by x అనుకుందాం. ఇక్కడ కూడా పవిత్ర కార్యం నిర్వహింపబడబోతున్నది (by somebody), అంటే మామూలు తెలుగులో somebody (x), to solemnize the wedding (ఈ పవిత్ర కార్యాన్ని నిర్వహించనున్నారు అని). To be solemnized correct గా అయితే is to be solemnized అని అనాలి. is, omit చేసి to be solemnized అనేది వాడుక. Will be solemnized అని కూడా అనవచ్చు వాక్య నిర్మాణాన్ని బట్టి.
b) To be + past participle ముఖ్యంగా passive construction. He is to do it (active) - It is to be done by him.
(చూశారు కదా - to be done - to be + pp)
I am to take them home (active) - They are to be taken (to be + pp) home by me.
2) I could have found the way all right - నేను దారి తెలుసుకోగలిగే వాడిని (కాని, తెలుసుకోలేదు) - Past tense.

**ప్రశ్న:** *Parts of speech లో Preposition ను ఎక్కడ ఎలా వాడాలో, The ను కూడా ఎక్కడ వాడాలో తెలియజేయండి. వీటితోపాటు Tenses, direct & indirect speech గురించి వివరించగలరు.*
**– టి.సంతోష్‌కుమార్, యారాడ**

**జవాబు:** Parts of speech లో prepositions ను గురించి lessons లో వివరిస్తున్నాం. అలాగే tenses గురించి ఇంతకుముందు వివరించాం, అయితే tenses పేర్లు చెప్పకుండా. English బాగా మాట్లాడేందుకు tenses + పేర్లు తెలుసుకోవాల్సిన అవసరంలేదు. verb form ముఖ్యం- అది వివరించాం. పాత papers చూడండి.

**ప్రశ్న:** *I saw a devil, I happend to see a devil – ఈ రెండింటికి తెలుగు అర్థం, దయ్యాన్ని చూశాను. కాని verbs లో ఆ మార్పు ఎందుకు వచ్చింది. Model auxiliary verbs పక్కన have been వస్తే తెలుగు అర్థం ఏమని వస్తుంది? అలాగే could be ని ఎన్ని రకాల అర్థాలు వచ్చేటట్లు ఉపయోగించవచ్చు దయచేసి తెలుపగలరు.*
**– శ్రీనివాసరావు, మార్టూరు**

**జవాబు:** I saw a devil- నేను devil ను చూశాను/devil కనబడింది. I happend to see a devil- నేను devil ను చూడటం తటస్థించింది/ devil నాకు కనపడటం తటస్థించింది. I happened to - అనుకోకుండా/ ఎదురుచూడని సంఘటనను గురించి ఇలా చెప్తాం. I bought it in that shop – నేనది ఆ shop లో కొన్నాను. I happened to buy it in that shop – నేనది ఆ shop లో కొనటం జరిగింది (ఆ shop లో కొంటానని అనుకోలేదు కానీ అక్కడే కొన్నాను).

**ప్రశ్న:** *ఏకకాలంలో జరుగుతున్న రెండు చర్యలను ఇలా చెప్పొచ్చా? He is thinking by walking (నడుస్తూ ఆలోచిస్తున్నాడు). Gita is singing by working (పాడుతూ పనిచేసుకుంటోంది).*
**– పోతుల శ్రీనివాసు, వేగాయమ్మపేట, తూ.గో.జిల్లా.**

**జవాబు:** మీరు రాసిన రెండూ సరైనవి కావు. Ist sentence: దీనిలో రెండూ ఏకకాల చర్యలు- ఇప్పుడు జరుగుతున్నవనుకోండి. అప్పుడు (is thinking correct కాదు). He thinks as he is walking/ He thinks and is walking at the same time, అనవచ్చు. అయితే ఈ రెండు కూడా కాస్త ఎబ్బెట్టుగా కన్పిస్తున్నాయి కాబట్టి, He thinks as he walks అనడం better. ఒక్కోసారి I/ II regular doing word ను ఇప్పుడు జరిగే పనులకు కూడా వాడతాం కాబట్టి. He thinks as he walks అనే sentence కు వాడెప్పుడూ చేసే పని అది (వాడెప్పుడూ నడుస్తూ ఆలోచిస్తాడు/ ఆలోచించేటప్పుడు నడుస్తాడు) అనే అర్థం కూడా వస్తుంది.
2nd sentence: Gita is singing and working at the same time అంటే సరిపోతుంది కదా (ఆమె ఆ పనులు చేస్తున్నది ఇప్పుడయితే). ఆమె పని చేసేటప్పుడంతా పాడుతుంది అనాలనుకుంటే Gita sings as/while she works అనవచ్చు కదా.




SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 64

# He is going to..

**Kalyan:** Hi Sasikanth, good to see you though after a long time. Where are you and what are you?

చాలరోజుల తర్వాతయినా చూడడం చాల సంతోషం. ఎక్కడున్నావు? ఏంచేస్తున్నావు?

Good to see you – పలకరింపు మాట; (practise చేయండి conversationలో)

**Sasikanth:** Equally glad to see you. I am here very much. I am with a tyre company now. I have had a better offer from one of the leading telecom company. I am leaving this company.

నాకూ సంతోషంగానే ఉంది. నేనిక్కడే ఉన్నాను. ఓ టైర్ల company లో పనిచేస్తు న్నాను. పేరున్న telecom company లో నాకింతకన్నా మంచి అవకాశం వచ్చింది. ఈ job వదిలేస్తున్నా.

**Kalyan:** When are you going to resign this Job?

**Sasikanth:** In a week's time at the most. The Telecom company is going to open its branch here and I am going to be the first branch manager.

**Kalyan:** Glad to hear that. Congrats. Is your salary going to be any the better?

సంతోషం. congrats. జీతం ఏమన్నా ఎక్కువగా ఉంటుందా?

**Sasikanth:** There's going to be a difference of atleast Rs. 2000/-

కనీసం 2000 రూపాయల తేడా ఉంటుంది.

**Kalyan:** Very glad then. Hope you will call me before you join. By the by, I am going to buy a flat soon, that too, in a week. I will move in soon after. Here's the new address.

కొత్త కంపెనీలో చేరేముందు నాకు Phone చేస్తావని ఆశిస్తున్నా. అన్నట్లు చెప్పటం మరిచా (by the by) కొత్త flat కొనబో తున్నా, ఓ వారంలోనే. వెంటనే చేరుతున్నా నందులో. ఇదీ కొత్త address.

ఈ సంభాషణలో am going to, is going to, are going to లతో వాడిన expressions చూడండి:

1) When are you going to resign?
2) The company is going to open its branch here.
3) I am going to be the first branch manager.
4) Is your salary going to be any the better?
5) There's going to be a difference.
6) I am going to buy a flat.

మనం ఏదైనా పనిని, చేయబోతున్న పనిని am going to, is going to, are going to లాంటి expressions లో తెలుపుతుంటాం.

1) When are you going to resign?
ఎప్పుడు రాజీనామా చేయబోతున్నావు?

2) The company is going to open its branch here.
ఆ Company తన శాఖను ఇక్కడ ప్రారంభించ బోతున్నది.

3) I am going to be the first branch manager.
ఆ శాఖకు నేను first manager గా ఉండబోతున్నాను.

4) Is your salary going to be any the better?
నీ జీతం మెరుగ్గా ఉండబోతోందా?

5) There's going to be a difference.
ఏదో కొంత తేడా ఉండబోతోంది.

6) I am going to buy a flat.
నేను flat కొనబోతున్నాను.

future లో జరగబోతున్న పనులు, మనం ముందరే అనుకుని కచ్చితంగా చేయబోయే పనులకు am going to/ is going to/ are going to + 1st regular doing word వాడతాం.

a) She is going to buy a new dress.
ఆమె కొత్త dress కొనబోతోంది. (కొనేందుకు నిశ్చ యించుకుంది. ఇక కొనడమే తరువాయి)

b) వాడిక్కడ వారంపాటు classes attend అవబోతు న్నాడు.
He is going to attend classes here for a week.

c) ఈ bank లోంచి మొత్తం డబ్బును తీసేయబోతున్నారు.
They are going to withdraw all the money from this bank.


M. SURESAN

a) I will buy a car soon.
నేను త్వరలో car కొంటాను. (నిశ్చయించుకున్నాను)

b) I am going to a buy a car.
నేను car కొనబోతున్నా (వీలయినంత త్వరలో). (ఇది పైదానికన్నా ఎక్కువ కచ్చితం)

c) He will join duty soon.
వాడు త్వరలోనే duty లో చేరబోతున్నాడు.

d) He is going to join duty soon.
వాడు త్వరలో duty లో చేరుతున్నాడు
(ఇది will join కన్నా ఎక్కువ కచ్చితం)

అది త్వరలో జరగబోతుంది. నువ్వేం దిగులుపడకు.
It is going to happen. Don't you worry.
(చాలాసార్లు 'you don't worry' కి బదులు 'Don't you worry' వాడుతుంటారు).

ఇప్పటివరకు మనం తెలుసుకున్న విషయం: will/ shall కన్నా am going to/ is going to/ are going to + 1st

d) నేను కొత్త ఉద్యోగంలో చేరబోతున్నా.
I am going to take a new job.

అయితే ఇక్కడ will/ shall కూడా future కదా? అవి వాడకూడదా? వాడవచ్చు తప్పులేదు. అయితే, will/ shall కంటే కూడా am/ is/ are going to అన్నప్పుడు, పని జర గబోవడం కచ్చితం, దానిని గురించి నిర్ణయించుకోవడం అయిపోయిందీ, ఇక జరగడమే తరువాయి అనే అర్థం వస్తుంది. am/ is/ are going to అన్నప్పుడు అది కాస్త త్వరగా జరిగే సూచనలు ఎక్కువ.

regular word (am going to/ is going to/ are going to sing, talk, etc) ఎక్కువ కచ్చితంగా, జరగబోయే పనులను తెలుపుతాయి.

నేను CM ను ఇవాళే కలుసుకుంటాను/ కలుసుకో బోతున్నాను-
I am going to meet the CM today.

ఆమె party లో పాడనుంది -
She is going to sing at the party.

వాళ్ల debate లో పాల్గొననున్నారు -
They are going to participate in the debate.

**Now practise the following aloud in English:**

**Sasikanth:** ఏంటి అంత హడావిడిగా వెళ్తున్నావు? (Hurry వాడండి)

**Ravikanth:** పవన్ bike కొనబోతున్నాడు. నన్ను Selection కు రమ్మన్నాడు.

**Sasikanth:** ఇవాళే కొనబోతున్నాడా?

**Ravikanth:** అవును. వాళ్ల నాన్న దగ్గర నుంచి వాడికి DD రాబోతుంది. అది తీసుకుని shop దగ్గరకు వస్తాడు. నేనతన్ని shop లో కలుసుకోబోతున్నా.

**Sasikanth:** నువ్వెప్పుడు కొనబోతున్నావు bike ను?

**Ravikanth:** Bike నా status కు మరీ తక్కువ. Helicopter కొనబోతున్నా.

**Answer:**

**Sasikanth:** Why are you in a hurry?

**Ravikanth:** Pavan is going to buy a bike. He wanted me to help him in the selection.

**Sasikanth:** Is he going to buy it today?

**Ravikanth:** Yes. He is going to get the DD from his dad today. He will take it and come to the shop. I am going to meet him at the shop.

**Sasikanth:** When are you going to buy a bike?

**Ravikanth:** A bike is too low for my status. I am going to buy a helicopter.



**ప్రశ్న:** *1) House అంటే అద్దెకున్న ఇల్లు, Home అంటే సొంతం ఇల్లుకదా!*
*2) అటువంటపుడు House wife అని ఎందుకు వాడాలి. అసలు Home wife అని ఎందుకు చెప్పరు? నేను ఈ సందేహాన్ని ఓ ఇంగ్లిష్ లెక్చరర్ దృష్టికి తీసుకెళితే అసలు Homewife అన్నపదం లేదు అన్నారు. Homewife అని పిలవకపోవడానికి కారణం ఏమిటి? House wife అనే ఎందుకు పిలుస్తున్నారు. తెలియజేయగలరు.*
*3) Communication skills పెంచుకోవడా నికి ఉపయోగకరమైన ఓ మంచి పుస్తకం పేరు చెప్పండి.*

*– ఎం.ఎల్.ఎస్.రాయుడు, కర్నూలు*

**జవాబు:** House అంటే అద్దె ఇల్లు కాదు. ఏ ఇంటినైనా, అందునా మనుషులు నివసించగల దానిని (any building for people to live in) house అంటాం, సొంత, అద్దె అనే ప్రసక్తి లేకుండా. Home అంటే సొంత ఇల్లు కానక్కరలేదు. అద్దె ఇల్లయినా, మన కుటుంబసభ్యులతో మనం ఉండే ఇల్లు, home. మీకు హైదరాబాద్‌లో సొంత ఇల్లు ఉండి, కర్నూల్లో అద్దె ఇంట్లో మీరిపుడు నివాసం ఉంటుంటే, కర్నూల్లో మీరుంటున్నది ఇల్లు, మీ home. Hyderabad లో సొంత ఇల్లున్నప్పటికీ, మీరక్కడ నివాసం ఉండడంలేదు కాబట్టి you have a house in Hyderabad. Your home కర్నూల్లో, మీరుంటున్న ఇల్లు సొంతదైనా, అద్దెదైనా.

2) Homewife అనే మాట వాడుకలో లేదు. Housewife అనేదే correct. లేకుంటే Housewife అనే అర్థంతో home maker కొత్తగా వాడుకలోకి వస్తున్నమాట. దీనికంటే ఇంకా కొత్త మాట ముఖ్యంగా American usageలో, houseworker (=housewife/ home maker).

3) Communication skills పెంచుకోడానికి మంచి English newspaper ప్రతిరోజూ ఓ గంటపాటు చదవండి. TV newscasts వినండి. English story books చిన్నచిన్న వాటితో ప్రారంభించి పెద్దవి చదవండి.

**ప్రశ్న:** *Present Continuous tense లో- This land belongs to him (Correct). కాని This land is belonging to him అని ఎందుకు రాయకూడదు? కారణం తెలుపగలరు.*

*– కందగట్ల రాకేష్‌కుమార్, ఎర్రవెల్లిగూడెం*

**జవాబు:** కొన్ని verbs, am+ing, is+ing, are+ing forms లో రావు. వాటిల్లో belong ఒకటి. ఎందుకు am belonging/ is belonging/ are belonging రాదు అంటే అందుకు rule ఏం లేదు. అది English భాష లక్షణం. ఇలాంటి verbs ను గురించి చాలా వివరంగా ఇంతకుముందరి lessons లో చర్చించాం. చూడండి.

**ప్రశ్న:** *Having ను ఉపయోగిస్తూ A.Voice, P.Voice లో కొన్ని ఉదాహరణ లివ్వండి. Having ను ఏ సందర్భంలో ఉపయోగిస్తాం? to have ను ఉపయోగిస్తూ కొన్ని ఉదాహరణలివ్వగలరు.* *– ఎ.శ్రీనివాస్, మార్టూరు*

**జవాబు:** Having AV లోనే వస్తుంది. Passive లో రాదుకదా. Passive లో ఎప్పుడూ past participle, దానిముందు 'be' form వస్తాయి. Having రాదు. Active voice లో having తో ఎన్నైనా sentences వస్తాయి. I am having coffee; My father is having a bath,etc. To have తో- eg: I am happy to have a car. To have a car like this makes me happy. ఇలా ఎన్నైనా వస్తాయి.

**ప్రశ్న:** *1) I <u>have to</u> attend meeting*
*2) I <u>must</u> leave this place*
*3) I <u>ought</u> to obey the order*
*The underlined words give same meaning. So kindly explain, is there any difference in meaning? In what context those words are to used?*

*– డి.సుబ్బారావు, కాజులూరు, తూ.గో. జిల్లా*

**జవాబు:** 1) I have to attend the meeting నేను meeting కు వెళ్ళాలి - ఇక్కడ వెళ్ళడంలో నా అవసరం ఎక్కువ. ఇతరుల order వల్ల కావచ్చు- కానీ నా అవసరానికి ఎక్కువ ప్రాముఖ్యం - వెళ్ళకపోతే నాకు నష్టం.

2) I must leave the place - ఇక్కడ ఇతరుల order వల్ల నేను వెళ్ళిపోవాల్సి ఉంది అనే భావం, నా అవసరం వల్ల నేను వెళ్ళిపోవాలి అనే భావం కన్నా ఎక్కువ స్ఫురిస్తుంది.
I must do this. నేనిది చేయాలి, order వల్ల కావచ్చు, నా అవసరం కావచ్చు - చేయకపోతే నాకు కష్టం కావచ్చు must అనేది have to/ has to కన్నా కాస్త ఎక్కువ powerful.

3) I ought to obey the order: ఆజ్ఞ పాటించడం నావిధి.
Ought to అన్నా కూడా ఒక పనిచేయాలి అనే అర్థం వస్తుంది. అయితే ముఖ్యంగా దీన్ని నీతి ప్రకారం, నైతిక బాధ్యతను గురించి తెలియజేసేందుకు వాడతారు.
You ought to respect elders – పెద్దవాళ్లను గౌరవించాలి. పెద్దవాళ్లను గౌరవించడం అనేది ఓ నిబంధనో, చట్టమో, ఆజ్ఞో కాదుగదా. నైతికంగా, నీతి ప్రకారం మనం గౌరవించాలి. ఇలాంటిచోట్ల ought to అంటాం.
a) She ought not to speak so rudely.
అంత దురుసుగా మాట్లాడగూడదు.
b) You ought not to waste money.
అంత డబ్బు వృధా చేయకూడదు.
ఇవన్నీ నడవడికి సంబంధించినవి, చట్టాలతో సంబంధం లేనివి.
You ought to have helped her
ఆమెకు సహాయం చేసి ఉండాల్సింది.
ఇలాంటి చోట్ల should, must, have to/ has to రావు.

**Bhavan:** I am going to apply for the job. What about you?
నేను job కు apply చేయబోతున్నాను. నీ మాటేంటి?

**Chalam:** I have filled in the application. I will post it as soon as I get my certificates.
Application పూర్తి చేశాను. నా certificates ready అవగానే post చేస్తాను.

**Bhavan:** Haven't you got them yet?
వాటినింకా తెచ్చుకోలేదా?

**Chalam:** I am going to collect them from college tomorrow. Nagaraj is going to apply too.
రేపు నేను college నుంచి certificates తెచ్చుకోబోతున్నా. Nagaraj కూడా apply చేయబోతున్నాడు.

**Bhavan:** Why? Isn't he happy with his present job?
ఎందుకు? ఇప్పుడున్న job అతనికిష్టం లేదా?

**Chalam:** They are going to transfer him to Tamilnadu. His father is against it. So once he gets this job he will resign the present job. But if he doesn't get the transfer he will continue in it.

పై సంభాషణంతా future actions ను గురించే సాగింది కదా? కొన్నిసందర్భాల్లో future తెలపడానికి will/ shall మరికొన్నిచోట్ల am going to/ is going to/ are going to + 1st Regular doing word వాడాంకదా?

Shall/ Will, am going to/ is going to/ are going to forms రెండింటినీ future తెలపడానికే వాడతాం. అయితే వాటికి తేడా ఉంది. ఆ తేడా తెలుసుకోవడం చాలా ముఖ్యం. కిందటి lesson లో మనం చూశాం కదా. shall, will మన control లో లేని future తెలుపుతాయి. Am going to/ is going to/ are going to forms ఇందుకు కొంచెం తేడాగా మన నిర్ణయం మీద ఆధారపడి మనం చేయబోయే పనులను తెలుపుతాయి. చూడండి

**a)** I am going to apply for the job;
job కు apply చేయబోతున్నాను. చేయడం దాదాపు కచ్చితం. నిర్ణయం తీసుకోవడం జరిగింది.

**b)** I will post it as soon as I get my certificates.
certificates రాగానే నేను post చేస్తాను. ఇక్కడ application ను post చేయడం certificates తెచ్చుకో వడం మీద ఆధారపడి ఉంది. Certificates రావడం నేను apply చేయడానికి condition కాబట్టి ఇక్కడ will post అంటున్నాం. ఇలాంటిచోట్ల I am going to post అనం.

**c)** I am going to collect them from college tomorrow. నేను రేపు వాటిని college నుంచి తెచ్చు కుంటాను. వెళ్ళి తెచ్చుకోవడమే తరువాయి. ఇది జరుగు తుంది. దీనికి conditions ఏమీలేవు కాబట్టి am going to collect. will collect వాడవచ్చుగానీ ఈ అర్థం రాదు కదా.

**d)** Nagaraj is going to apply too. నాగరాజ్ కూడా apply చేయబోతున్నాడు. చేస్తాడు. He will apply too కు ఈ force లేదు. will apply అనేది is going to apply అంత కచ్చితంకాదు.

**e)** They are going to transfer him.
వాళ్లతన్ని transfer చేయబోతున్నారు. నిర్ణయం తీసుకున్నారు. చేస్తారు. ఇక్కడ will transfer కు are going to transfer అంత కచ్చితంలేదు.

**f)** Once he gets this job, he will resign the present job. ఈ job రాగానే, ఇప్పటి job మానేస్తాడు. ఇక్కడ 'will' ఉపయోగం గమనించండి; అతడు resign చేయడమనేది మరో job రావడం మీద ఆధారపడి ఉంది. పూర్తిగా అతడి చేతుల్లో లేదు. అందుకని ఇక్కడ will.

**g)** If he doesn't get the transfer he will continue.
అతడు కొనసాగడమా లేదా అనేది transfer అవడం, కాకపోవడాన్ని బట్టి ఉంటుంది కదా- అందుకని will.

ఇవీ will/ shall కూ am going to/ is going to/ are going to + 1st RDW కూ ఉన్న తేడా. ఈ తేడా గమనించి మాట్లాడడం spoken english లో చాలా ముఖ్యం. సామాన్యంగా If, unless, suppose, in case ఉన్న sentences లో am going to/ is going to/ are going to రాదు. (If = in case = suppose = అయితే, ఆ పరిస్థితుల్లో; unless– అయితే తప్ప.) when = అలాంటప్పుడు అనే అర్థంతో వాడినప్పుడు కూడా, am/ is/ are going to రావు.







**Venkat:** రేపు మంచిరోజని మా అమ్మ చెప్పింది. రేపు చేస్తా. పాస్‌పోర్టుకు application, D.D. అన్నీ రేపు తీసుకుంటా. కాస్త procedure ఏమిటో చెప్తావా? (మంచిరోజు = Auspicious day)

**Akhil:** తప్పకుండా. అయితే ఓ అరగంటలో మా friend ఒకడు నన్ను కలవబోతున్నాడు. అతడిని నేను doctor దగ్గరకు తీసుకెళతాను. అదయింతర్వాత మనం తీరిగ్గా కూర్చుని మాట్లాడుకోవచ్చు

**Venkat:** అయితే ఎప్పుడు free గా ఉంటావు? సాయంత్రం నాలుగింటికి రానా?
(ఈ రెండు exercises లో Shall/ Will కూ am/ is/ are going to కు తేడాలు గమనించండి.)

**Sankar:** We will, if we get a good price.
**Tarun:** How long are you going to keep it vacant?
**Sankar:** We are not in a hurry. We are going to let it out. Whenever we get a good price we will sell it (off)/ dispose it of.
**Tarun:** I will ask my father if he is interested. The other day he was talking of buying a house.
**Sankar:** No hurry at all. Find out from your father if he is interested. We will reduce the price if it is for you.
**Tarun:** I will let you know tomorrow.

# When will you be free?

**Now practise the following aloud in English:**

**1) Sankar:** మేము రేపు కొత్త ఇంట్లోకి మారబోతున్నాం.
**Tarun:** ఇప్పుడున్న ఇల్లు అమ్మేస్తున్నారా?
**Sankar:** మంచిధర వస్తే అమ్మేస్తానంటున్నాడు మా నాన్న.
**Tarun:** ఎంతకాలం ఆ ఇంటిని ఖాళీగా ఉంచబోతున్నారు? (ఖాళీ = vacant)
**Sankar:** మాకేం అంత తొందర లేదు. ఇప్పుడు దాన్ని అద్దెకివ్వబోతున్నాం. ఎప్పుడు మంచి ధర వస్తే అప్పుడమ్మేస్తాం.
(అద్దెకివ్వడం- let out. తొందర - in a hurry)
**Tarun:** మా నాన్నను అడుగుతాను, ఆయనకేమన్నా ఆసక్తి ఉందేమోనని. మొన్నెప్పుడో ఇల్లు కొనడం గురించి మాట్లాడారు.
**Sankar:** తొందరేంలేదు. మీ నాన్నగారికేమన్నా Interest ఉందేమో కనుక్కో. మీకే అమ్ముతాం. కొంత ధర కూడా తగ్గిస్తాం.
**Tarun:** రేపు చెప్తానే విషయం.

**2) Akhil:** Hi Venkat, ఏంటిలావచ్చావు?
**Venkat:** Passport కు apply చేయబోతున్నా. కాస్త నీ సహాయం కావాలి.
**Akhil:** ఎప్పుడు apply చేయబోతున్నావు?
**Akhil:** ఓ అలాగే.

**3) Manoj:** Hi Fareed, ఎక్కడినుంచి వస్తున్నావు?
**Fareed:** నా bike కాస్త trouble ఇస్తే, mechanic కు ఇచ్చి ఇంటికెళ్తున్నా.
**Manoj:** నీ bike తరచుగా trouble ఇస్తుందేంటి?
**Fareed:** II hand bike కొనడం నేను చేసిన పొరపాటు.
**Manoj:** ఎంతకాలంగా వాడుతున్నావు దాన్ని?
**Fareed:** రెండేళ్లుగా. ఈ రెండేళ్లలో repairs కే దాదాపు రెండువేల రూపాయలు పెట్టా.
**Manoj:** ఎవరి దగ్గర కొన్నావు దాన్ని?
**Fareed:** మా దూరపు చుట్టం నుంచి. ఆయనదేం తప్పు లేదు. ఆ bike కొనవద్దనీ చెప్పాడు. నేనే foolish గా కొన్నా, తక్కువ ధరకొస్తుంది కదా అని.
**Manoj:** అమ్మేయొచ్చు కదా?

**Answers:**

**Sankar:** We are moving into the new home tomorrow.
**Tarun:** Are you selling away/ going to sell the house you are in?

**2) Akhil:** Hi Venkat, What brings you here?
**Venkat:** I am going to apply for a passport. I need your help.
**Akhil:** When are you going to apply?
**Venkat:** Mom says/ has said that tomorrow is an auspicious day. I will take the pass port application, DD, etc., tomorrow. won't you (will you not) let me know the procedure?
**Akhil:** Sure. But in half an hour my friend/ a friend of mine is going to meet me. I am going to take him to doctor. Once that's over we can sit over your passport business at leisure.
**Venkat:** When will you be free then? Shall I see you at 4 this evening?
**Akhil:** That's OK

**3) Manoj:** Hi Fareed, where are you coming from?
**Fareed:** My bike has had/ had some trouble. I have left it at the mechanic's and am on my way home/ am going home.
**Manoj:** Why does your bike give trouble so often?
**Fareed:** Buying a used bike (modern word for II hand) is the mistake I made/ I made a mistake - buying a used bike.
**Manoj:** How long have you been using it?
**Fareed:** For two years now/ For the past two years. I have spent Rs 2000/- on repairs so far.
**Manoj:** Who did you buy it from?
**Fareed:** From a distant relative of ours. I can't (cannot) blame him. He told me not to buy it/ He advised me/ warned me against buying it. I bought it foolishly because I got it cheap.
**Manoj:** Why don't you sell it (off)?

M. SURESAN

**ప్రశ్న:** *Contrary sense & positive sense* అంటే ఏమిటో వివరంగా తెలుపగలరు.
*Contrary sense* లో ఉన్న ఈ వాక్యాలు తప్పు అని కొన్ని గ్రామర్ పుస్తకాల్లో పేర్కొన్నారు. ఇవి ఎంతవరకు కరెక్టో తెలుపగలరు.
***1.** He should not have gone* - ఈ ప్రయోగం లేదు అని రాశారు.
***2.** He might not have gone* - ఈ ప్రయోగం లేదు.
***3.** He must not have gone* - ఈ ప్రయోగం లేదు.
*Mood and model verbs, subjunctive* గురించి వివరంగా తెలుపగలరు.
*subjunctive usage, perfect subjunctive verbs* గురించి తెలియజేయగలరు.

– కె.నర్సింహారెడ్డి, హైదరాబాద్




**జవాబు:** Positive sense అంటే - 'లేదు, కాదు' అని అర్థం రాకుండా ఉండడం.
Contrary sense - వ్యతిరేకార్థం రావడం
**1)** He should not have gone.
అతను వెళ్ళి ఉండకూడదు
(వెళ్ళుండాల్సింది కాదు) - కానీ వెళ్ళాడు.
ఇక్కడ 'He should not have gone' అనేదానికి 'వెళ్ళాడు' అని వ్యతిరేకార్థం వస్తోంది, కాబట్టి ఇది contrary sense - ఇది తప్పు కాదు. మీరు ఇది ఏ grammar bookలో చూశారో రాయలేదు.
They should not have talked like that.
అలా మాట్లాడాల్సింది కాదు (కానీ అలా మాట్లాడారు) - contrary sense.
They should have done that.
వాళ్లది చేసుండాల్సింది (కానీ చేయలేదు) - contrary sense.

**2)** He might not have gone -వెళ్ళుండకపోవచ్చు (వెళ్ళుండవచ్చు కూడా)
ఇక్కడ contrary sense లేదు - సందేహం.
They might have seen you - నిన్ను వాళ్లు చూసుండొచ్చు (చూడకపోయి ఉండొచ్చు) - No contrary sense - doubt.
**3)** He must not have gone - ఇదంతగా వాడరు. ఇక్కడ contrary sense రావడం కోసం, ఈ sentence తప్పు. (దీనర్థం- వెళ్ళి ఉండడు- కచ్చితం- వెళ్ళలేదు)
ఇక్కడ ఈ రెండూ పోల్చండి.
**a)** He should not have gone - వెళ్ళాడు (contrary sense) - correct
**b)** He must not have gone - కచ్చితంగా వెళ్ళి ఉండడు - వెళ్ళలేదు (ఇది contrary sense - వ్యతిరేకార్థం రాదు) - positive sense వస్తుంది.
మరో రెండు వాక్యాలను పోల్చి చూడండి:
**a)** He should have gone - వెళ్ళుండాల్సింది - వెళ్ళలేదు - contrary sense.
**b)** He must have gone - వెళ్ళే ఉంటాడు తప్పకుండా - వెళ్ళాడు Positive sense.

మరో ఉదాహరణ:
He must have passed the exam. Otherwise he would not have applied for the job.
అతడు కచ్చితంగా pass అయి ఉంటాడు. (pass అయ్యాడు- positive sense) లేకుంటే job కు apply చేసి ఉండడు (చేశాడు- contrary sense).
Subjunctive usage, etc., త్వరలో వివరిస్తాం.





# What did he say?

**Kapil:** Hi Subhash, Well met. Any idea of how many of us are going on the picnic next weekend?
కలుసుకోవడం మంచిదయింది(well met). వచ్చే వారం picnic కు ఎంతమందిమి వెళుతున్నాం?

**Suhas:** About 15 of us. ఓ పదిహేనుమందవచ్చు

**Kapil:** Does Rahul know about it?
రాహుల్‌కు తెలుసా?

**Suhas:** He does. I told him of it yesterday.
తెలుసు. నేను నిన్న అతడికి చెప్పాను.

**Kapil:** What did he say? Is he joining us?
ఏమన్నాడు. వస్తున్నాడా?

**Suhas:** He said that he was not sure.
రావడం కొంత సందేహమే అన్నాడు.

**Kapil:** Didn't he (Did not he) tell you why he was doubtful? Has he any other programme that day?
రావడం ఎందుకు సందేహమో నీతో చెప్పలేదా? ఆరోజు వేరే పనేమైనా ఉందా?

**Suhas:** I don't know. All that he said was he was doubtful about coming. I was in a hurry. I had no time to ask him.
నాకు తెలియదు. తను చెప్పిందల్లా తను రావడం సందేహమని. నేను కొంచెం తొందరలో ఉన్నా. అందుకని అతన్నింకేమీ అడగలేదు.

**Kapil:** OK. I'll call him and tell him to come without fail. Without him the picnic can't be fun.
సరేలే! నేను Phone చేసి తప్పక రమ్మంటాను. అతను లేకపోతే picnic కు వెళ్ళినట్లే ఉండదు.

**Suhas:** That's true. Tell him not to disappoint us. He makes jokes and tell stories too. He is good at these. You had better call him now itself.
Correct. మనల్ని నిరాశపర్చవద్దని చెప్పు. వాడు Jokes వేయగలడు, కథలు చెప్పగలడు. నువ్వు వాడికిప్పుడే ఫోన్ చేయడం మంచిది.
{Had better do (some thing) = చేయడం మంచిది. ఇక్కడ had ఉన్నప్పటికీ ఇది Present విషయాన్నే చెప్తుంది. You have better buy that book = నువ్వా పుస్తకం కొనడం మంచిది}

ఈ సంభాషణలో say, tell వాడకం గమనించండి.
(Say - past tense and past participle - said; tell - past tense and past participle - told)

మనందరికీ తెలిసిన విషయం - say కి, tell కీ చాలా సందర్భాల్లో అర్థం ఒకటే - చెప్పడం, అనడం అని. అయితే వీటి ఉపయోగంలో చాలా తేడా ఉంది. పై సంభాషణలోనే చూద్దాం.

**A (tell)**

**i)** I told him of it

**B (say)**

**i)** What did he say?
**ii)** He said that he was not sure.
**iii)** All that he said was ...

**tell** కు సంబంధించిన మరికొన్ని...
**ii)** Didn't he tell you Why he was doubtful?
**iii)** ... tell him to come
**iv)** ... tell him not to disappoint us.
**v)** tell stories

A కింద tell తో sentences ను, B కింద say తో ఉన్న sentences ను పోల్చండి. ఇప్పటికే గమనించి ఉంటారు.

**1)** tell తర్వాత ఎవరితో చెప్పింది అనేది కచ్చితంగా వస్తోంది కదా (Sentence V లో తప్ప) - అదే 'say' పక్కన ఎవరితో చెప్పిందీ రావడంలేదు. మొదటి తేడా, tell కూ, say కూ. tell తర్వాత ఎవరితో చెప్పిందీ కచ్చితంగా రావాల్సిందే. say తర్వాత అక్కరలేదు. say తర్వాత ఎవరితో చెప్పిందీ తెలపాలంటే to వాడతాం.
**a)** He told her that he was busy,
**b)** He said to her that he was busy.
అయితే ఈ రెండింటిలో (b) కన్నా (a) ఎక్కువగా వాడుతుంటాం. అంటే మనం చెప్పింది ఎవరితో అని చెప్పన్నప్పుడల్లా 'tell' better.

**2)** ఒకరు చెప్పిన మాటలను వాళ్లు చెప్పినట్లుగా, repeat చేసినప్పుడూ, లేకుంటే వాళ్ల మాటలను report చేసినప్పుడు, say వాడతాం.
**a)** 'sit down', said the teacher/ the teacher said.
**b)** He said that he was happy. గమనించండి: పై sentences లో ఎవరితో చెప్పిందీ తెలియడం లేదు.
**c)** 'sit down', said the teacher to the pupils. 'Note down the points'. ఇది teacher మాటలను యథాతథంగా repeat చేస్తున్నాం. ఇక్కడ said బదులు told రాదు. అదే ఈ మాటలను report చేయాలనుకోండి. అప్పుడు-
The teacher told the students to sit down and to note down the points.
ఇలాంటి చోట్ల say రాదు కదా. (The teacher said to the pupils to sit down కాదు.)

**d)** say తర్వాత thanks, good bye, hello, sorry, a few words, a little/ little (about something/ some one) అని వాడవచ్చు. ఇలాంటిచోట్ల tell రాదు.

**e)** Tell వెంబడే to వాడం. He told to me to go/ He told to her that he liked cricket లాంటి sentences వాడం. ఎందుకంటే ఇక్కడ tell పక్కనే to రాదు కాబట్టి.


M. SURESAN

**f)** ఇవి చూడండి: a) He told me why he was happy. b) He said to me why he was happy. ఇక్కడ sentence (a) మాత్రమే correct. (b) లో లాగ said ఎప్పుడూ వాడం. అంటే 'wh' words తో begin అయ్యే clause (verbతో ఉన్న మాటల సమూహం) Tell తర్వాత మాత్రమే వస్తుంది. అది కూడా ఎవరితో చెప్పిందీ తెలియపరిస్తేనే. (a) మళ్లీ చూడండి:
He told me why he was... (me ముందు, ఆ తర్వాత why తో ప్రారంభమయ్యే clause వస్తుంది).

**Pranav:** Did he attend class yesterday?
**Praveen:** No, he didn't.
**Pranav:** Why?
**Praveen:** He did not tell me why he was absent yesterday.
ఇక్కడ He did not say to me why... రాదు.
He never tells me where he goes, what he does, when he studies or how he studies. (ఇక్కడ కూడా మామూలుగా say రాదు).

Tell me why you have done it. (say to me why you have done it కాదు).

**g)** ఎవరికిచెప్పిందీతెలుపకుండా Tellను Storyకి వాడతాం. Please tell a story. అయితే ఇది old fashioned.
ఇవీ Tell, Say కు సంబంధించిన వివరాలు. ఇవన్నీ కూడా Practice తో, చదవడం వల్ల తెలుసుకోవచ్చు.

**Practise the following aloud in English:**

**a) Raghu:** రవి నీతో ఎందుకు రావడంలేదో చెప్పాడా?
**Ram:** లేదు
**Raghu:** నన్ను కలుసుకోవడంగురించి ఏమన్నా చెప్పాడా?
**Ram:** అదీ చెప్పలేదు.
**Raghu:** నేనిక్కడున్నానని చెప్పావా?
**Ram:** చెప్పాను. వాడ్నిక్కడికి రమ్మన్నాను కూడా. సరే అన్నాడు. వాడొచ్చే time నాతో చెప్పలేదు.
**Raghu:** నన్నెందుకు avoid చేస్తున్నాడో నువ్వేమయినా చెప్పగలవా?

**b) Pavan:** Hi Ravi, నిన్నెక్కడున్నావు నువ్వు?
**Ravi:** నేనా విషయం ఇప్పుడు చెప్పలేను
**Pavan:** ఏంటంత రహస్యం?
**Ravi:** తర్వాత చెప్తా ఏంటి అంత రహస్యం అని
**Pavan:** మీనాన్నగారేమన్నా చెప్పారా నీతో?
**Ravi:** దేన్నిగూర్చి?
**Pavan:** నేనది చెప్పను నీకు. నువ్వు ముందు నీ రహస్యం చెప్పు. తర్వాత నేం చెప్తా

**Answers:**

**Raghu:** Has Ravi told you why he is not coming?
**Ram:** No.
**Raghu:** Did he say anything about meeting me?
**Ram:** Not that either.
**Raghu:** Have you told him (that) I am here?
**Ram:** I did. I told him to come here too. He said yes. He did not tell me the time of his coming here
**Raghu:** Can you say why he is avoiding me?

**b) Pavan:** Hi Ravi, Where were you yesterday?
**Ravi:** I cannot tell you now about it. / I Can't say anything about it now.
**Pavan:** What is so secret about it?
**Ravi:** I'll tell you later what the secret about it is.
**Pavan:** Did your father tell you anything?
**Ravi:** What about?
**Pavan:** I will not tell you that. First you tell me of your secret. Then I will tell you of mine.

---

Q&A

**ప్రశ్న:** నాకు *Indirect Speech* గురించి కొంత అస్పష్టత ఉంది. ఈ వాక్యాలు పరిశీలించి సందేహాలు తీర్చగలరు.

**1)** *"An amount of Rs.104 Crores would be paid in Rajampet constituency of Cuddappah District on Saturday.* ఈ వాక్యాన్ని నేను పేపరులో చూశా. ఈ వాక్యం *Indirect Speech* లో ఉందా? (లేదా) *news paper* వారు కేవలం ఆ *Fact* ను *(will be paid* ను *would paid* గా) చెప్తుతున్నారా? ఇంతకీ నేను పేపరు చూసిననాటికి ఆ డబ్బు పంపిణీ/ చెల్లింపు జరిగినట్లా? లేదా?

**2)** *As the Offense was not cognisable a Magistrate would carry out a investigation.* ఈ సంఘటన ఒకరోజు జరిగితే ఆ మరుసటిరోజు పేపరులో వచ్చింది. ఈ వాక్యంలో *would carry out* అని ఉంది. ఆ ప్రకారం దర్యాప్తు జరిగిపోయినట్లా? జరగవలసి ఉందా?

– ఎన్. నీలిమ, బొల్లవరం

**జవాబు:** Sentence No 1 - ఇది indirect speechలో ఉందా లేదా అనేది దాని ముందర వాక్యాన్ని బట్టి తెలుస్తుంది. అది Mr x said అని ఉండి, ఈ sentence దాని continuation అయితే, అది indirect speech అయితే, would correct. ఈ sentence ను independent గా తీసుకుంటే ఇక్కడ would తప్పు; will correct అవుతుంది.
Sentence No 2 - ఇక్కడ కూడా పై rule వర్తిస్తుంది. Independent sentence గా తీసుకుంటే will carry out, better. అయితే indirect speech అనుకుంటే would carry out అన్నప్పుడు దర్యాప్తు జరగవలసి ఉన్నట్లే.

**ప్రశ్న:** *Please clarify the difference between simple present and present perfect tenses used in these sentences.*
*1) We are inside. We have been inside. What's the difference?*
*2) We are behind them. We have been behind them.*
*3) She is in town. She has been in town.*
*4) I am uneasy about the situation. I have been uneasy about the situation.* వీటి అర్థంలో తేడా వివరించగలరు.
*As per tense rule, I know the difference of above each sentence which are in simple present as well as in present perfect tense. But, what is/ may the meaning of above sentences whether they are used in simple present or present perfect? Please explain it in detail.*

– షేక్ మొహినుద్దీన్, కర్నూలు

**జవాబు: 1)** We are inside = we are inside NOW.
ఇపుడు మేం లోపల ఉన్నాం.
We have been inside.
కాసేపటినుంచి ఇప్పటివరకు మేం లోపల ఉన్నాం.
we were here some time ago, say 10 minutes ago/ an hour ago, and since then, we have continued to be here till now/ we are here even now.
మేం ఇక్కడ ఉండటం గతంలో ప్రారంభమయి, ఇప్పటివరకు జరిగింది/ ఇంకా జరుగుతోంది, అని.
Abdul Kalam is our President (ఆయన మన president - జరుగుతున్న విషయం)
Abdul Kalam has been our president for the past two and a half years= రెండున్నరేళ్లుగా ఆయన మన presidentగా ఉన్నారు. (రెండున్నరేళ్ల క్రితం నుంచి ఇప్పటి వరకు/ఇంకా)
అలాగే మిగతా sentences కూడా:

**2) i)** We are behind them = వాళ్ల వెనుక మేం ఉన్నాం (ఇపుడు)
**ii)** We have been behind them.
కొంతకాలంగా వాళ్ల వెనుక మేం ఉన్నాం.

**3)** She is in town = ఆమె ఊళ్లో ఉంది (ఇపుడు)
She has been in town = కొంతకాలంగా ఆమె ఊళ్లో ఉంటోంది.

**4)** I am uneasy about the situation.
పరిస్థితి నాకు ఇబ్బందిగా ఉంది ఇప్పుడు.
I have been uneasy about the situation.
కొంతకాలంగా పరిస్థితి ఇబ్బందిగా ఉంటోంది.
Please refer to the earlier lessons on 'be' forms for more information.



# Have you any?

**Preethi:** Mom, can I have some more milk?
అమ్మా, ఇంకాస్త పాలు కావాలి నాకు.

**Laxmi:** Sorry child. You can't have anymore. There is some milk left, of course, but we need it for the payasam this evening.
ఇంకలేవమ్మా. కొన్ని పాలున్నాయిగానీ, అవి సాయంత్రం పాయసానికి కావాలి.

**Preethi:** Can I have something to eat? I am hungry.
తినేందుకేమైనా ఉందా? నాకు ఆకలిగా ఉంది.

**Laxmi:** There are plenty of biscuits in the fridge. Have as many as you want. There is bread too. Eat it if you like.
Fridge లో కావలసినన్ని / చాలా biscuits ఉన్నాయి. నీక్కావలసినన్ని తిను. bread కూడా ఉంది. ఇష్టం ఉంటే తిను.

**Preethi:** I'll (I will) have bread then. Can I have some jam or butter go with it?
అయితే bread తింటాన్లే. దానికి jam కానీ వెన్నకానీ ఏమైనా ఉందా?

(go with= ఒక ఆహార పదార్థం ఇంకో ఆహార పదార్థంతో సరిపోవడం. Idli goes well with sambar ఇడ్లీతో సాంబారు బాగుంటుంది. We have only chapathis, no kurma to go with it. చపాతీలు మాత్రం ఉన్నాయి. దానితో సరిపోయే కుర్మా లేదు)

**Laxmi:** No butter any more for you. You put on weight. Have jam.
Butter ఏం వద్దు. లావెక్కుతావు.

**Preethi:** What about you? You haven't had anything since morning. Why don't you have something to eat?
మరి మీ సంగతేమిటి? పొద్దున్నుంచి ఏం తిన లేదు. ఏదైనా తినకూడదా?

**Laxmi:** We are fasting today. You know today is Karthika Somavaram.
మేమీరోజు ఉపవాసం. కార్తీక సోమవారం కదా.

(fast = ఉపవాసం/ ఆరోగ్య కారణంగా తిండి మానేయడం, starve = తిండికి లేక పస్తుండడం. బాగా ఆకలేస్తోందని హాస్యంగా చెప్పడం- I am starving. Let me have something to eat)

**Preethi:** Don't you eat anything then?
మీరేం తినరా మరి?

**Laxmi:** Not until after the pooja after sunset.
చీకటిపడ్డ తర్వాత పూజయ్యేంతవరకు ఏం తినం.

**Preethi:** Why do people fast on Kartheeka Somavaram?
కార్తీక సోమవారం ఎందుకు ఉపవాసం ఉంటారు?

**Laxmi:** Good question. But I haven't the time now to tell you.
మంచి ప్రశ్న. కానీ నాకిప్పుడు చెప్పడానికి time లేదు.

పై సంభాషణలో some, any ఉపయోగాలు గమనించండి. వీటి అర్థాలు మనకు తెలుసు కదా? Some= కొంత, కొన్ని. అంటే some ను Countables తోనూ వాడవచ్చు, uncountablesతోనూ వాడవచ్చు. Some milk = కొద్దిపాలు, Some books = కొన్ని పుస్తకాలు. Any = ఏదైనా, ఏవైనా. దీన్ని కూడా Countables తో, Uncountables తో రెండింటితోనూ వాడవచ్చు. Any book = ఏ పుస్తకమైనా; any milk = ఏవైనా పాలు. Some, any ఉపయోగం English లో చాలా ఎక్కువ. ఎంత కరెక్ట్‌గా వాడితే conversation అంత బాగుంటుంది. అలాగే plenty = ఎక్కువ - countables, uncountables తో రెండింటితో వాడవచ్చు. Plenty of milk = సమృద్ధిగా పాలు; plenty of time; plenty of money, etc. Plenty of books = చాలా పుస్తకాలు; plenty of runs - చాలా పరుగులు; plenty of eggs, plenty of biscuits etc.

పై సంభాషణలో expressions చూడండి

1) You can't have any more.
2) There's some milk left.
3) Can I have something to eat?
4) Can I have some jam or butter...?
5) No butter any more.



6) You haven't had anything since the morning.
7) Don't you eat anything then?

ఈ మాటల్లో ఏం తెలుస్తోంది?

i) not వచ్చినప్పుడల్లా any వస్తోంది. Not లేనప్పుడు some వస్తోంది కదా? ఇది important point.

ii) Questions లో కూడా అంతే. లేదు (not) అనే answer ను repeat చేసినప్పుడు కూడా question లో any వస్తుంది.

a) He has some money.
కొంత ఉంది (ఇక్కడ 'not' లేదు)

b) He hasn't any money.
(అసలు) లేదు (ఇక్కడ not తో)

He hasn't any money = He has no money. అయితే conversation లో He hasn't any money అనేది more common. అది ఎక్కువగా వాడుతుంటారు. అంతేకాకుండా Have you any money అన్నప్పుడు answer గా No, I haven't any అని అంటారు money వదిలేసి (repeat చేయకుండా). లేకుంటే, No, I haven't అని కూడా అనవచ్చు. Questions లో కూడా 'not' ఉన్నప్పుడు, some రాదు, any మాత్రమే వస్తుంది. Not లేకపోతే some, any రెండూ రావచ్చు.

**Pranav:** Can you lend me some money? లేదా Can you lend me any money?
కొంచెం అప్పివ్వగలవా? (ఇక్కడ not లేదు)

**Prakash:** I'm afraid, I haven't any. నా దగ్గర లేదు.
(I am afraid - విచారం వ్యక్తం చేయడం)

**Pranav:** Haven't you any. really?
నిజంగా లేదా?
(ఇక్కడ not ఉంది కాబట్టి any)

**Prakash:** I Have some money of course, but I need it for paying fees. I shan't (shall not) have any left after that.
కొంత ఉంది. కానీ అది fees కట్టడానికి కావాలి. అది కట్టేసిన తర్వాత ఏం మిగలదు.

Not లేనిచోట some వస్తోంది. Not ఉన్నప్పుడు any వస్తోంది కదా. ఇది జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి.

2) No any అని ఎప్పుడూ అనం.
No అనైనా అంటాం. not any, contracted form- n't any అనైనాఅంటాం. అంతేకానీ no any రాదు.

3) **Suseela:** I have nothing to do today. (I haven't any thing to do today). Have you any novel that I can read?
ఈరోజేం పనిలేదు. నీ దగ్గరేమన్నా నవల ఉంటే ఇవ్వవా?

**Chandana:** There are some here. Take any of them.
ఇక్కడ కొన్ని ఉన్నాయి. ఏదైనా తీసుకో.

**Suseela:** Let me have some novel that I can finish in a day.
ఒక్కరోజులో పూర్తిచేయగల novel ఏదైనా ఉంటే ఇవ్వు.

**Chandana:** I'm afraid that there aren't any such. All of them are lengthy.
అలాంటివేమీ లేవు. అన్నీ పెద్ద నవలలే.

**Suseela:** Any by Chase?
Chase నవల్లేమన్నా ఉన్నాయా?

ఇక్కడ any పూర్తిగా ఏదైనా అనే అర్థంతోనే వాడాం. కాబట్టి ఇక్కడ not లేకున్నా any వస్తుంది.

i) Any novel = ఏ novel అయినా/ఏదైనా novel.
ii) Any by Chase = Chase రాసిన నవలేదైనా?
iii) Some novel = ఏదైనా novel.

సహాయం చేసే వాళ్లెవరైనా ఉన్నారా?
Any one/ anybody who can help me?

గమనించండి: Some ఏదో ఒక / ఎవరో ఒక అనే అర్థంతో వాడుతుంటాం.

Some book was lying on the table.
table మీద ఏదో పుస్తకం ఉంది / పడి ఉంది.

I came here with the hope that some teacher will help me.
ఎవరో ఒక / ఏ teacher అయినా సహాయం చేస్తారనే ఆశతో వచ్చా.

**Now practise the following aloud in English:**

1) **Ratnakar:** నీకేమన్నా news వచ్చిందా Suman నుంచి?
**Venkat:** లేదు. దేనిగురించి?
**Ratnakar:** గుర్తులేదా? అతన్ని మనం ఒక్క job గురించి కొంత సమాచారం అడిగాం కదా.
**Venkat:** అతని దగ్గర నుంచి ఇప్పటివరకూ ఏ phone call రాలేదు. మనకు సమాచారం చెప్పేవాళ్లు ఇంకెవరూ లేరా?
**Ratnakar:** ఎవరూ లేరు. నీకు ఇంకెవరన్నా తెలుసా?
**Venkat:** ఒకాయన ఉన్నాడు. అయితే ఆయన ఊళ్లో లేరు.
**Ratnakar:** Suman‌కు ఆ కంపెనీలో ఎవరో friend ఉన్నాడు. అతను Suman కు ఏ information అయినా ఇవ్వగలడు.

2) **Manoj:** నాకు Botany మీద మంచి పుస్తకాలు కావాలి. మీ దగ్గరేమన్నా ఉన్నాయా?
**Shopkeeper:** మా దగ్గర కొన్ని మంచి పుస్తకాలున్నాయి. Botany మీద ఏ మంచి పుస్తకమన్నా చెప్పండి. అది మా దగ్గర ఉంటుంది.
**Manoj:** మీ దగ్గరున్న వాటిల్లో కొన్నింటిని చెప్పండి.
**Shopkeeper:** కొన్నే ఎందుకు? ఈ list చూడండి. అన్ని పుస్తకాల పేర్లూ అందులో ఉన్నాయి. అక్కడున్న వాటిల్లో ఏదైనా మంచి పుస్తకమే.
**Manoj:** Thank you.


M. SURESAN

**Answers:**

1) **Ratnakar:** Have you / Have You had / Do you have any news from suman?
**Venkat:** No. (I don't have / haven't had any.) What about?
**Ratnakar:** Don't you remember? We asked him for some information about a job.
**Venkat:** I haven't had any phone call from him (No Phone call from him so far). Isn't there anyone else who can give us this information? (Anyone= ఎవరన్నా, Anyone else= ఇంకెవరన్నా)
**Ratnakar:** None. (Do) you know anyone?
**Venkat:** I know some one, but he is not in town/ out of town (out of station కాదు)
**Ratnakar:** Suman has some friend in the company. He can give suman any information he wants.

2) **Manoj:** I want some good books on Botany. Do you have/ Have you any?
**Shopkeeper:** We do have some good books. Name any good book on botany, and we have them.
**Manoj:** Please let me know some of the good books you have.
**Shopkeeper:** Why only some? Please see go through this list. It has all the titles. Any book on the list is a good book (go through= చదవడం titles = పుస్తకాల పేర్లు - ఇక్కడ)
**Manoj:** Thank you.



**ప్రశ్న: 1)** నేను నిన్న నా హెయిర్ కటింగ్ చేయించుకున్నాను.
*I got/ had my hair cut yesterday.*
**2)** నేను రేపు నా హెయిర్ కటింగ్ చేసుకుంటాను.
*I will get my hair cut tomorrow*
**3)** మేము నిన్న మా ఇంటికి సున్నం వేయించాం.
*we had/ got our house white wash yesterday*
**4)** మేము రేపు మా ఇంటికి సున్నం వేయిస్తాం
*we will get our house white wash tomorrow.*
*had* అర్థాన్ని వివరిస్తూ, కరెక్టో కాదో తెలుపగలరు.
**– ఎస్.వంశీకృష్ణ, హైదరాబాద్**

**జవాబు:** Hair-cut (ఒకేమాట) = క్షవరం
I have a hair-cut once a month-
నేను నెలకోసారి క్షవరానికి వెళ్తాను.
He had a hair-cut (ఒకేమాట) yesterday
నిన్న అతను క్షవరానికి వెళ్లాడు.

1) I got/ had my hair cut yesterday.
ఇక్కడ hair వేరే మాటా, cut వేరే మాట.
నిన్న నేను (barber చేత) క్షవరం చేయించుకున్నాను.
Got, had- ఇంకొకరిచే అనే అర్థం వస్తుంది.

2) I will get my hair cut tomorrow
రేపు నేను క్షవరం (Barber చేత) చేయించుకుంటాను. (hair వేరే, cut వేరే)- దీనర్థం మీరనుకున్నట్టు చేసుకున్నాను కాదు.

3) We had/ got our house white washed (white wash ఇక్కడ correct కాదు)
మేం ఇంటికి సున్నం వేయించాము.

4) We will have/ get our house white washed. (White wash కాదు) tomorrow.
రేపు ఇంటికి వెల్ల వేయిస్తాం.
తేడా గమనించండి.
I will wash my clothes tomorrow.
రేపు నేను ఉతుక్కుంటాను.
I will have/ get my clothes washed tomorrow. నా బట్టలు రేపు ఉతికిస్తాను.
have/ get తర్వాత ఎపుడూ past participle వస్తుంది.







# He would buy me a...

M. SURESAN

**Prabha:** Hi Vineela, how was the movie yesterday? I am sure you enjoyed it.
వినీలా, నిన్న movie ఎలా ఉంది? బాగా enjoy చేశావనుకుంటా.

**Vineela:** What a bore! I thought it would be fun watching the movie, but it was thoroughly disappointing.
అబ్బ చాలా bore. ఎంతో వినోదంగా ఉంటుం దనుకున్నాను. కానీ చాలా నిరాశపరిచింది.

**Prabha:** Thank god, I didn't go with you. I thought I would, but fortunately my music class came in the way.
బతికిపోయాను. నీతో రాకపోవడం మంచిద య్యింది. అదృష్టవశాత్తూ నా music class అడ్డొచ్చింది.
(Thank God - ఏదైనా ప్రమాదం లాంటిది తప్పిపోతే 'Thank God' అంటాం. తెలుగులో 'బతికిపోయాను' అనుకోవచ్చు)

**Vineela:** You are right. When you told me you would not come I felt sorry you were going to miss a lot. But now I know I am wrong.
నువ్వు right. నువ్వు రానన్నప్పుడు నువ్వు మంచి సినిమా miss అవుతావని బాధపడ్డా. కాని పొరపాటని ఇప్పుడు తెలుస్తోంది.

**Prabha:** Did Smitha accompany you?
స్మిత నీతో వచ్చిందా?
(accompany = కలిసి వెళ్ళడం- ఎవరితోనైనా)

**Vineela:** No. Smitha said she would accompany me to the movie if her cousin came along.
రాలేదు. వాళ్ల cousin వస్తేనే తను వస్తానని చెప్పింది నాతో.

**Prabha:** By the way, what is your programme this evening?

**Vineela:** My dad told me that he would buy me a new dress for my birthday next week. So I will go shopping.
Next week నా birthday కి నాన్న కొత్త dress కొనిస్తానన్నాడు. కాబట్టి ఈ సాయంత్రం shopping వెళ్తున్నా.

**Prabha:** All the best then. Bye.

ఈ సంభాషణలో would తో వచ్చిన verbs గమనించండి.

1) I thought (that) it would be fun.
2) I thought (that) I would
3) You told me you would not come
4) Smitha said (that) she would accompany me.
5) Dad told me (that) he would buy me a new dress.

1) ఈ నెల November. November- ప్రస్తుతం- present. December - future (భవిష్యత్తు) కదా. జాగ్రత్తగా గమనించండి:
November నుంచి, అంటే present నుంచి, December future. ఇలాంటి future ను చెప్పేందుకు will, shall వాడతాం. [will, shall లను future చెప్ప డానికి ఎలా ఉపయోగిస్తామో ఇంతకుముందు lessons లో చాలా వివరంగా తెలుసుకున్నాం]

2) August 2005 - ఇది గతం - Past.
September 2005 - ఇది కూడా గతం - past.
అయితే August 2005 నుంచి September 2005 ఏమవుతుంది? Future (భవిష్యత్తు) కదా? అయితే ఎప్పటినుంచి - August (past) నుంచి September 2005 future. అంటే August 2005 నుంచి, అంటే past నుంచి September 2005 future అవుతుంది.
కాబట్టి - మనం ఇప్పుడు తెలుసుకుంది:
a) November 2005 నుంచి December 2005 - Present నుంచి future.
b) August 2005 నుంచి September 2005 - past నుంచి future.

అంటే English usage ప్రకారం, there are two kinds of future:
a) Future from the present
b) Future from the past

1. **Important:**
i) will, shall ఎప్పుడూ future from the present ను చెప్తాయి.
ii) WOULD, SHOULD ఎప్పుడూ future from the past ను చెప్తాయి.

2. Future from the present కు will వాడేచోట, future from the past కు would, future from the present కు shall వాడేచోట future from the past కు should వాడతాం. ఇప్పుడు పై సంభాషణలోని would తో ఉన్న verbs గమనించండి. అంతకుముందు ఈ కింది sentences పోల్చండి.

3. a) He says (that) he will buy the book this evening.
ఈ సాయంత్రం పుస్తకం కొంటానంటున్నాడు- ఇది ఇప్పుడు. ఇప్పుడు - present లో అంటున్నాడు... సాయంత్రం - future లో కొంటానని. ఇది present నుంచి future కాబట్టి will buy.
b) He told me yesterday that he would buy the book soon.
ఇది- past - told - నిన్న చెప్పాడు - త్వరలో - future - కొంటానని - కాబట్టి would buy - అంటే ఇక్కడి future, past నుంచి future కాబట్టి would buy.

4. మళ్ళీ పోల్చండి:
a) I think (that) he will help me.
b) I thought (that) he would help me.
[(a) అర్థం - వాడు సాయం చేస్తాడని నేననుకుంటు న్నాను. (b) అర్థం - వాడు సాయం చేస్తాడని నేనను కున్నాను]

ఇపుడు మొదటి సంభాషణలో ఉన్న would తోటి verbs గమనించండి: ప్రభ, వినీలా నిన్నటి విషయం గురించి మాట్లాడుతున్నారని గుర్తుంచుకోండి.

1) I thought (that) it would be fun: వినోదంగా ఉంటుందని అనుకున్నా. (అనుకోవడం సినిమాకు వెళ్ళే ముందు - past లో - చూడబోయే సినిమా గురించి - future)
would be - 'be' form - ఉండడం
2) I thought (that) I would (go to the movie)
would go - వెళ్దామని - (future from the past)
3) You told me you would not come -
నువ్వు రాబోవడం లేదని అన్నావు.
4) Smitha said that she would accompany me.
Sunitha నాతో వస్తానని అంది.
5) Dad told me that he would buy a new dress.
నాకు కొత్త dress కొంటానని మా నాన్న చెప్పారు.

ఇదీ 'would' ఉపయోగం. అంటే past నుంచి future చెప్పడానికి వాడతాం.
a) would be - be form - ఉండడం
b) would + 1st Regular Doing Word (would go, would come, would see, etc) - action (పనిని తెలుపుతుంది)

a i) వాడక్కడ ఉంటాడని నేననుకుంటున్నా-
I think he will be there
ii) వాడక్కడ ఉంటాడని నేననుకున్నా -
I thought he would be there.
b i) నాకు I Class వస్తుందని నేననుకుంటున్నా -
I think I will get a first class.
ii) నాకు I Class వస్తుందని అనుకున్నా -
I thought that I would get a I class.

**Now practise the following aloud in english:**

1) **Krishna:** అయితే నువ్వు Rajkot కు వెళ్ళలేదా, Cricket match చూడటానికి?
**Kumar:** వెళ్దామనే అనుకున్నా, కాని మానుకున్నా. ప్రత్యక్షంగా చూడడంకన్నా, TV లో చూస్తేనే బాగా enjoy చేయగలం కదా అని.
**Krishna:** నేను చెప్పాను కదా - TV లో లాగా replays, slow motion view ఉండవు అని, నువ్వు వినలేదు.
**Kumar:** నువ్వు right. Train tickets నిన్న సాయంత్రమే cancel చేస్తానన్నాడు, మా తమ్ముడు.
**Krishna:** నాకు అప్పుడే తెలుసు నువ్వు వెళ్లబోవని, tickets cancel చేస్తావని, డబ్బు నష్టపోతావనీను.
**Kumar:** Rajkot లో మా మామయ్య ఉన్నాడు కాబట్టి వెళ్దామనుకున్నా. అయితే match విషయం ఏమనుకుంటున్నావు?
**Krishna:** Indians గెలుస్తారని తెలుసుకానీ, Sri Lanka అన్ని వికెట్ల తేడాతో ఓడిపోతుందనుకోలేదు.
**Kumar:** Tendulkar మరో Century కొడతాడని కచ్చితంగా అనుకున్నా. (sure వాడండి)
**Krishna:** Sri Lanka ది చాలా low score. గంభీర్, టెండూల్కర్ ఇద్దరూ కలిసి (together) ఆ score సాధిస్తారనుకున్నా.
**Kumar:** నాకు విశ్వాసంగానే ఉండింది - ఒక్క Wicket పోకుండా గెలుస్తారని.
**Krishna:** Yuvraj అంతబాగా ఆడతాడని నువ్వనుకున్నావా?
**Kumar:** Yuvraj కంటే Kaif ఎక్కువ runs కొడతాడనుకున్నా. R.P. Singh అంత బాగా bowl చేస్తాడనుకోలేదు.

2) **Dayakar:** నిన్న మీ ఇంటికొచ్చాన్నేను. నువ్వింట్లో ఉంటావనుకున్నా.
**Prabhakar:** నువ్వు వస్తావని నాకు తెలియదు. నువ్వెందుకు Phone చేయలేదు.
**Dayakar:** నువ్వా time లో బయటకు వెళ్తావనుకో లేదు. మామూలుగా ఆ time లో ఇంట్లోనే ఉంటావుగా?
**Prabhakar:** నిజమేననుకో. కాని నిన్న మా అమ్మ తనను doctor దగ్గరకి తీసుకెళ్మమంది. ఆ time లో నువ్వు వస్తావని నేననుకోలేదు. Sorry.
**Dayakar:** సరేకానీ, సుమంతేమన్నా bike కొంటానని చెప్పాడా నీతో?
**Prabhakar:** ఏం చెప్పలేదు. కొంటున్నాడా?
**Dayakar:** ఈ వారంలో కొంటానని చెప్పాడు. వాళ్ల నాన్న డబ్బు పంపిస్తానని చెప్పాడట.
**Prabhakar:** నిజంగా అదృష్టవంతుడే. మా నాన్న మాత్రం చెప్పేశాడు నిన్న కచ్చితంగా, ఇంకో సంవత్సరందాకా నాకు bike కొనననిr.

**Answers:**

1) **Krishna:** Didn't you (Did you not) go to Rajkot to see the cricket match?
**Kumar:** I thought I would, but dropped the idea. We would enjoy it better viewing it on the TV than watching it live.
(ఇక్కడ live = లైవ్ - ప్రత్యక్షంగా)
**Krishna:** I told you, there wouldn't (would not) be the replays, the slow motion views.
**Kumar:** You are right. My brother told me that he would cancel the train tickets yesterday itself.
**Krishna:** I knew that you wouldn't be going, that you would cancel the tickets and that you would lose money.
**Kumar:** You know my uncle is in Rajkot. So I thought I would go. So what do you think of the match?
**Krishna:** I knew India would win but didn't think/ never thought that Sri Lanka would lose by so many wickets.
**Kumar:** I was sure that Tendulkar would score another century.
**Krishna:** Sri Lanka's was a low score. I thought Gambhir and Tendulkar together would score all the runs needed for the victory.
**Kumar:** I was confident too that they would win without losing a single wicket.
**Krishna:** Did you think Yuvraj would play so well?
**Kumar:** I thought Kaif would score more runs than Yuvraj. I didn't think that RP Singh would bowl so well/ I didn't expect RP Singh to bowl so well.

2) **Dayakar:** I came to your place / for you yesterday.
**Prabhakar:** I didn't know you would come. Why didn't you call me before coming?
**Dayakar:** I didn't think you would go out at that time/ I didn't expect you to be out at that time. Aren't you usually at home at that time?
**Prabhakar:** That's true. But my mother wanted me to take her to the doctor. I didn't think you would come. / I didn't expect you at that time. sorry.
**Dayakar:** That's Ok. Did Sumanth tell you that he would buy a bike?
**Prabhakar:** No. Is he buying one?
**Dayakar:** Yes. He said that he would be buying it this week. His father told him that he would send the money shortly.
**Prabhakar:** Luck fellow. Dad told me yesterday very strongly / Dad made it clear yesterday that he would not buy me a bike for another year.




**ప్రశ్న:** *To be* అనే *Phrase* ను ఉపయోగిస్తూ ఈ ఫ్రేజ్ ఎన్ని విధాలుగా అర్థం వస్తుందో తెలియజేయగలరు. *happened + to + verb$_1$; sub+V$_2$* రూపాల్లోనూ కొన్ని వాక్యాలు తెలుపగలరు.
**– రాజ్‌కుమార్, దర్శి**

**జవాబు:** To be phrase రెండు విధాలు:
1) to be + ing form;
2) To be + Past participle.
వీటితో ఎన్ని వాక్యాలయినా చేయవచ్చు
**1) to be + ing form లో..**
a) We expect him to be studying now
b) We found to be sleeping soundly, etc.
**2) to be + pp లో..**
a) We ordered the work to be finished in an hour
b) He wanted them to be seen there.
ఈ 'to be...' phrases ను subject గా sentences రాయండి.
a) I wanted to see him (sub + vb2)
b) She tried to meet him (sub + v2)
c) They wished to succeed (sub + v2)

**Spken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి...**

**URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# కాస్త... కాఫీ తీసుకుంటారా?

**Dinesh:** Hi Saleem, Welcom. Good to see you though after a long time. Have a seat. How about some Coffee?
(హాయ్ సలీమ్! చాలారోజులైంది కలిసి. కాస్త కాఫీ తీసుకుంటావా? )

**Saleem:** No Coffee for me, Dinesh. Thanks all the same.
(కాఫీ వద్దు థాంక్స్.)

all the same = అయినప్పటికీ (అంటే కాఫీ తీసుకోక పోయినప్పటికీ).

**Dinesh:** Would you fancy tea then?
(అయితే టీ తీసుకుంటావా? )



*Would you care for some coffee?*

fancy = ఇష్టపడడం. ఇక్కడ fancy బదులు, like/ prefer వాడవచ్చు.

ఇంటికి వచ్చిన వాళ్లను 'కాఫీ తీసుకుంటారా, టీ తీసుకుంటారా?' అని అడగడం, మన పద్ధతుల ప్రకారం సరిగా మర్యాద చేయడం కాదుకదా? కాఫీ, టీ తీసు కొచ్చి వచ్చినవాళ్లను తీసుకోమంటాం. అయితే English పద్ధతుల ప్రకారం Coffee/Tea తీసుకుం టారా అని అడగడం తప్పుకాదు. అతిథులు కూడా మన లాగా బిడియపడకుండా 'తీసుకురా' అని లేదా 'ఉంటే కావాలి' అని అడిగి తీసుకుంటారు.

**Saleem:** I don't mind tea.
(టీ నాకు అభ్యంతరం లేదు.)

Mind = అభ్యంతరం.

**Dinesh:** Would you mind/ Mind waiting for a while? I'll make the tea in no time.
(కాసేపు ఆగుతావు కదా? చిటికెలో చేస్తా.)

In no time = క్షణంలో/ చిటికెలో

**Saleem:** Take your (own) time. No hurry.
(తీరిగ్గా చెయ్యి. తొందరేంలేదు.)

take your (own) time = నీ ఇష్టం వచ్చినంతసేపు తీసుకో.

**Dinesh:** Would you move aside a little? The tea tin is in the shelf behind you.
(కాస్త పక్కకు జరుగుతావా? టీ డబ్బా నీవె నుక ఉన్న షెల్ఫ్‌లో ఉంది.)

**Saleem:** Not at all.
(ఏం పర్వాలేదు.)

**Dinesh:** So you like tea more than coffee.
(నీకు కాఫీకంటే టీ ఇష్టం అన్నమాట)

**Saleem:** That's right. I think I got it from my grandad. He would drink a lot of tea, my dad often says.
(అవును. మాతాతగారి నుంచి నాకొచ్చిందది. మా తాత చాలా టీ తాగేవారని మానాన్న అంటుంటారెప్పుడూ.)

**Dinesh:** My dad would never drink tea. He would always prefer coffee. He would have the coffee ground fresh, and make coffee for himself.
(మా నాన్న ఎప్పుడూ టీ తాగరు. కాఫీ తాగుతారు. ఆయనే కాఫీ గింజలు పట్టించి, పొడి చేయించి కాఫీ ఆయనే చేసుకునేవారు.)

Ground - ఇది grindకి past tense.

grind = పొడి/ పిండి చేయడం. grinder= పిండి/ పొడి machine అది grind చేస్తుంది.

ground coffee = పొడి చేయడం.

Coffee seeds/ Coffee beans =కాఫీ గింజలు.

fresh = తాజా.

పై సంభాషణలో wouldతో వచ్చిన verbs గమనిం చండి.

**1.** Would you fancy?
**2.** Would you mind waiting for a while?
**3.** Would you move aside a little?
**4.** He would drink.
**5.** My dad would never drink.
**6.** He would have the coffee ground.

కిందటి lessons లో తెలుసుకున్న 'would' use- would expresses future from the past అని, అంటే past నుంచి future చెప్పేందుకు would వాడతాం.

**Ramana:** He wrote to me that he would see me last weekend. But he did not turn up.
(గత వారం కలుసుకుంటానని లెటర్ రాశాడు. కానీ రాలేదు.)




Write = లెటర్ రాయడం.

turn up = రావడం/ హాజరవడం.

**Kesav:** He called me yesterday to tell me that he would be very busy till next week, so he wouldn't be able to come until after next week.
(వచ్చేవారందాకా బిజీగా ఉంటానని నాకు నిన్న ఫోన్ చేశాడు. అందువల్ల వచ్చే వారం తర్వాతగానీ రాలేనన్నాడు.)

ఇక్కడ చూడండి. would ను past నుంచి future కు వాడుతున్నాం కదా. అంటే past నుంచి, ఇక ముందు జరిగే future కు కూడా would వాడతాం.

ఇప్పుడు ప్రారంభంలోని సంభాషణలో would కు ఉన్న మరి కొన్ని ఉపయోగాలు చూద్దాం.

Would you fancy = నీకు ఇష్టమేనా?

నువ్వు కాఫీ తీసుకుంటావా? దీన్నే వేరే విధంగా-

Would you mind/ Would you like/ Would you like to take/ Would you take/ Would you care for some coffee?

అన్నింటికీ ఒకే అర్థం. మీరు కాస్త కాఫీ తీసుకుంటారా/ కాఫీ తీసుకోండి అని.

అంటే would ను you తో question form లో offerకు (ఇంటికి వచ్చిన వాళ్లకు, friends కు ఏదైనా coffee లాంటివి offer చేయడానికి) వాడతాం.

Would you like a little tea?

How about a little tea?

What about some tea?

ఇవన్నీ కూడా offer చేయడం. అంటే would కు రెండో ఉపయోగం offer (presentలో).

ఇటువంటి offer కు responses చూద్దాం. అంటే కాఫీ/ టీ లాంటివి ఎవరైనా offer చేస్తే, కావాలి- వద్దు అనడానికి వాడే మాటలు.

**a)** Offer వద్దు అనాలంటే-
i) No, thanks
ii) Not now, please. Thanks all the same.
(ఇప్పుడేమీ తీసుకోలేను. థాంక్స్.)
iii) I have had some just now. No more please. Thanks.
(ఇప్పుడే తాగాను. ఇకవద్దు. థాంక్స్.)

**b)** ఇచ్చిన offer, accept చేసేట్టయితే-

English వాళ్ల పద్ధతి ప్రకారం ఇచ్చిన offer ను తీసుకో వాలని ఉన్నప్పుడు, మొహమాటపడేటప్పుడు responses-

**i)** I don't mind (a little coffee/ tea), thanks.
(ఆ... ఇవ్వండి పర్వాలేదు.)
**ii)** That'd (that would) be welcome, thanks.
**iii)** That'd (that would) certainly be a pleasure, thank you.
**iv)** That's kind of you, thanks.

ఇలాంటి సందర్భాల్లో would ఉపయోగం offers.

★ Would ను Present లో requests కు కూడా వాడతాం.


M. SURESAN

**Kumar:** Can I see your father?

**Bhaskar:** Please come in. Have a seat. Would you mind waiting some time?/ Would you wait for some time?

**Kumar:** Not at all. I don't mind waiting.

ఇక్కడ చూడండి 'would' ను question from లో ముఖ్యంగా you తో request కు వాడడం-

**a)** మీరు కాస్త నాతోవస్తారా!
Would you accompany me?

**b)** ఇక్కడ కాసేపు కూర్చోవచ్చా!
Would you let me sit here for a while? ఇది would కు ఇంకో ఉపయోగం.

**Mind:** Mind కు అర్థాలు రెండు-

**1)** Mind అంటే అభ్యంతరం పెట్టడం, ముఖ్యంగా questions లో వాడతాం.

**a)** Do you mind waiting for some time?
(కాసేపు wait చేయడం మీకేమన్నా అభ్యంతరమా? కాసేపు wait చేస్తారా? అని request.)

ఇక్కడ Do you mind అన్నా Would you mind? అన్నా ఒకటే. అయితే would you mind? అనేది ఎక్కువ polite and formal - అంటే అంత పరిచయం లేని వాళ్లతో.

**b)** (Would you/ Do you) mind my sitting here?

త్వరగా మాట్లాడే conversation లో Do you/ Would you వదిలేస్తుంటాం. ఇదీ బాగానే ఉంటుంది.

**c)** Mind my using your pen/ Mind if I use your pen?
(మీ pen వాడొచ్చా.)

**mind వాడే తీరు:** mind తర్వాత 'ing' form గానీ/ mind if కానీ వస్తుంది.

**d)** Mind of I accompany you?
(మీతో నేను రావచ్చా? )

Mind my accompanying you?

Mind ఇలా conversation లో practice చేయండి.

**2)** Mind కు రెండో అర్థం manage చేయడం, ఏదైనా వ్యవహారాన్ని చూసుకోవడం.

**a)** Who minds the office here?
(ఈ ఆఫీస్ చూసేదెవరు?

**b)** My brother minds the office when my father is away.
(మా నాన్నగారు లేనప్పుడు మా బ్రదర్ చూసుకుంటాడు.

**c)** Mind your (own) business.
(నీ పని నువ్వు చూసుకో.)

Don't poke your nose in others' affairs.
(ఇతరుల వ్యవహారంలో తలదూర్చకు.)

మనం తలదూరుస్తుంటాం. English వాళ్లు ముక్కు దూరుస్తారన్నమాట.

**d)** Mind you. Don't make any mistake.
(జాగ్రత్త పొరపాట్లు చేయకు.)

**Now practise the following in English.**

**Kishore:** హాయ్ స్వరూప్, నువ్వు రెడీనా? టైమ్ అయ్యింది కదా!

**Swaroop:** కాసేపు వెయిట్ చేస్తావా? నేను మొహం కడుక్కొని వస్తాను.

**Kishore:** నీ ఫోన్ కాస్త వాడుకోనిస్తావా? కుమార్‌కు ఫోన్ చేసి వాడిని కూడా రమ్మంటా.

**Swaroop:** త్వరగా కానీ. వాడిని రెడీగా ఉండమను. దారిలో వాడిని పికప్ చేసుకుందాం.

**Kishore:** అలాగే.

**Answer**

**Kishore:** Hi Swaroop, Are you ready? It's time.

**Swaroop:** Would you wait for minutes? I will wash my face and come.

**Kishore:** Mind my using your phone? I would call Kumar and ask him to come.

**Swaroop:** Be quick. Tell him to be ready. We can pick him up on our way.

**Kishore:** Ok

## Q&A

**ప్రశ్న:** tell, say... వీటిని ఏయే సందర్భాల్లో ఉప యోగించాలి? c అక్షరాన్ని కొన్నిసార్లు సి అని కొన్నిసార్లు కె అని ఉపయోగిస్తాం కదా. ఎలాంటి సందర్భంలో ఏ అక్షరాన్ని ఉచ్చరిం చాలి?

**– రవికుమార్, కాకినాడ**

**జవాబు:** Usually when the letter 'c' is followed by 'e', or i, it is pronounced as s, as certificate, or as in cinema. In most other cases it is pronounced as k. So rule about it. only the dictionary can help us.

**ప్రశ్న:** I don't think you should buy it అంటే అర్థం ఏమిటి?
'నేను మా అమ్మాయిని మీ పాఠశాలకు పంప లేను' అనాలంటే ఇంగ్లిష్‌లో ఏమనాలి?

**– కవీందర్, వరంగల్**

**జవాబు:** మొదటి వాక్యానికి అర్థం- మీరు దాన్ని కొనా లని లేదు/ మీరు దాన్ని కొనాలని నేను అనుకోడం లేదు. రెండో వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఇలా అనవచ్చు- I cannot send my daughter to your school.







# Wouldn't you sing?

**Anand:** Janaki, how about giving us a song?
జానకీ, ఓ పాట పాడవా?
(give a song = పాట పాడటం)

**Janaki:** Me? giving a song? Are you Joking?
నేనా? పాడటమా? Joke చేస్తున్నావా?

**Bhanu:** Oh. Can Janaki sing? This is news to me.
అంటే, జానకి పాడగలదా? ఇది నాకు కొత్త విషయం.
(news to me = ఇంతకుముందు తెలియని విషయం ఇప్పుడు తెలిస్తే, This is news to me అంటాం. conversation లో వాడండి)

**Anand:** O, She would sing for hours when we were at school. That too very well.
మేము School లో ఉన్నప్పుడు గంటల తరబడి పాడేది, అదీ చాలా బాగా.
(That too = అది కూడా)

**Bhanu:** Janaki, wouldn't you sing for us now? just one song.
జానకీ, మాకోసం పాట పాడవా? ఒక్కసారి.

**Janaki:** Would you stop bothering me, please?
కాస్త నన్ను trouble చేయటం ఆపుతారా?

**Anand:** She would sing on. I mean, at school even if none were there to listen to her. My English teacher would, when she had the time make it a point to listen to her sweet songs.
వినేవాళ్లెవరూ లేకపోయినా అలాగే పాడుతుండేది. అప్పుడప్పుడు మా English Teacher పనిగట్టుకుని Janaki పాట వినేది.

**Janaki:** Ok. I am going to sing just to please you.
అలాగే మీ సంతోషంకోసం పాడబోతున్నా.

ఇక్కడ would తో వచ్చిన verbs గురించి తెలుసుకునే ముందు, would ను గురించి ఇంతవరకు తెలుసుకున్న విషయాలు చూద్దాం.

**1)** 'I thought he would help me' -
నాకు వాడు సహాయం చేస్తాడనుకున్నా.
ఇక్కడ 'would help' - future from the past ను తెలుపుతోంది.

**2)** Would you like some tea?
కాస్త tea తీసుకుంటారా?
ఇలాంటిచోట్ల 'would' offer కు వాడతాం- you తో question form లో.

**3)** Would you wait for a while?
కాసేపు wait చేస్తారా?
ఇక్కడ ముఖ్యంగా you తో question form లో request కు వాడతాం.

ఇప్పుడు ఈ lesson ప్రారంభంలోని సంభాషణలో 'would' ఉపయోగం చూద్దాం.

**a)** She would sing for hours when we were at School.
మా School రోజుల్లో గంటల తరబడి పాడేది.

**b)** She would sing on = అలాగే పాడుతుండేది.

**c)** My English teacher would, when she had the time, make it a point...
మా teacher time ఉన్నప్పుడల్లా పనిగట్టుకుని వినేది.

ఈ మూడు సందర్భాల్లో 'would' ఓ past habit/ habitual action in the past ను తెలుపుతోంది కదా? అంటే గతంలో ఏదైనా క్రమంతప్పని పని కి కూడా would వాడతాం.

**d)** వాడు చిన్నప్పుడు రాత్రిపూట తెగ ఏడ్చేవాడు.
As a child he would cry a lot at night.

**e)** చాలాదూరం నడిచేవాడు.
He would walk for long distances.

ఇవీ 'would' మరికొన్ని ఉపయోగాలు. వ్యావహారికంగా English వాడకంలో Would చాలా తరచుగా వస్తుంటుంది. Do తో begin అయ్యే చాలా questions ని would తో కూడా begin చేయటం వాడుకే. అయితే would అలాంటి సందర్భాల్లో కొంచెం formal. మరికొన్ని విషయాలు తర్వాత చూద్దాం!

**Now Practise the following aloud in English:**
(వీలయినన్నిచోట్ల 'would' వాడండి)

**a) Jayanthi:** Function కు వెళుతున్నా. నీ Necklace కాస్త ఇస్తావా?
(lend = అరువివ్వటం)

**Suguna:** అది మా అమ్మది. మా అమ్మ ఒప్పుకోదు. కావాలంటే నీకు నా chain ఇస్తా. ఇష్టమేనా?

**Jayanthi:** అదీ బాగానే ఉంటుంది. Thanks. ఎప్పుడు తీస్కోను?

**Suguna:** ఎప్పుడు function? ఎల్లుండి కదా? రేపు సాయంత్రం మా ఇంటికొస్తావా? నీకివ్వటం నాకు నిజంగా సంతోషమే. ఆ chain లో నువ్వు చాలా అందంగా ఉంటావు.

**Jayanthi:** నిజంగా తీస్కోటం ఇష్టంలేదే. నా నగలన్నీ మా bank locker లో ఉన్నాయి. మా నాన్న ఎల్లుండికిగాని రారు. locker తాళాలు ఆయన దగ్గరున్నాయి. ఒక్క నగ కూడా ఇంట్లో ఉండటానికి ఒప్పుకోరు నాన్న.

**Suguna:** ఇక ఆపుతావా? ఇన్ని మాటలవసరమా? నేను ఇష్టంగానే ఇస్తున్నా కదా. రేపు రా.

**Jayanthi:** Thank you.

**b) Brahmam:** Sekhar మీటింగ్‌కు ఉంటున్నాడా?
(ఉంటున్నాడా = Stay on)

**Damodar:** నీతో ఏం చెప్పాడు? గంటలో meeting begin అవుతుంది. కాస్త ఆ chairs ను ఈ stage మీద పెడతావా?
(పెట్టడం= put/ place/ keep)

**Brahmam:** నేను వాడ్నడిగాను కాని వాడేం చెప్పలేదు.

**Damodar:** నాతో అన్నాడే తప్పకుండా ఉంటానని. ఈ table కాస్త stage మీద పెట్టడానికి సాయం చేస్తావా?

**Brahmam:** సంతోషంగా. అయితే శేఖర్ విషయం కాస్త clear గా చెప్పవా? వాడితో నాక్కాస్తపని ఉంది.

**Damodar:** వాడంతగా మాట్లాడడని తెలుసుకదా నీకు? చిన్నప్పుడు కూడా అంతే వాడు. ఎక్కువ మాట్లాడేవాడు కాదు. ఎప్పుడూ ఒంటరిగా కూర్చుని ఏదో ఆలోచిస్తూ ఉండేవాడు. ఇతరులతో ఆటల్లో కలిసేవాడుకాదు.

**Brahmam:** వాడి చరిత్ర చెప్పటం ఆపుతావా? పోనీ వాడెక్కడున్నాడో చెప్తావా?

**Damodar:** Sorry, నాకు తెలీదు.

**Answers:**

**a) Jayanthi:** I am attending a function. Would you lend me your necklace?

**Suguna:** It is my mother's. She wouldn't (would not) let me lend it. If you want I can lend you my chain. Would you like it? / Do you like it?

**Jayanthi:** That'd be (That would be) fine. Thank you. When shall I take it?

**Suguna:** When is the function? Isn't it the day after (tomorrow)? I'd very much like to give you the chain. You look beautiful/ splendid/ gorgeous with it around your neck.

**Jayanthi:** Really I don't / wouldn't like to borrow it. All my Jewels are in the bank locker. The keys are with my father. He'll be back only the day after (tomorrow). He wouldn't/ doesn't allow us to keep even a single ornament at home.


M. SURESAN

**Suguna:** Would you stop it? No more words please. I am giving it to you willingly. Come tomorrow and take it.

**Jayanthi:** Thank you.

**b) Brahmam:** Is Sekhar staying on for the meeting? / Would Sekhar stay on for the meeting?
(Is Sekhar staying on...? better, would Sekhar? కంటే)

**Damodar:** What did he tell you? The meeting will begin in an hour. Would you put those chairs on the stage / dais?

**Brahmam:** I asked him but he wouldn't say anything / didn't say anything. (Wouldn't అంటే ఇష్టం లేదు అనే భావన వస్తుంది- చెప్పటానికి ఇష్టంలేక చెప్పలేదని)

**Damodar:** He told me he would stay on. Would you help me place the table on the stage?

**Brahmam:** With pleasure / that'd be a pleasure. Would you mind telling me more clearly about Sekhar? I have some work with him.

**Damodar:** You know he doesn't talk much. Even as a boy he was like that. He wouldn't talk much. He would always sit alone and think of something. He would not join others at play.

**Brahmam:** Would you stop telling me of his history? Would you atleast tell me where he is?

**Damodar:** I don't know.

**Practise the following:**

**Mounika:** ఎన్నాళ్లుగా పనిచేస్తున్నావిక్కడ?

**Sarika:** ఐదేళ్లుగా.

**Mounika:** అంటే నువ్వు ఈ company ప్రారంభం నుంచి ఇక్కడే ఉన్నావా?
(Do you mean/ Does it mean వాడండి)

**Sarika:** ప్రారంభంనుంచి కాదు. ప్రారంభం అయిన కొన్ని రోజులనుంచి. ఆ.. దాదాపు ప్రారంభం నుంచే అనవచ్చు అయితే ఇవన్నీ మీరెందుకు అడుగుతున్నారు?

**Mounika:** నా friend నవ్య కొన్నిరోజులిక్కడ పని చేసింది. నీకేమన్నా తెలుసేమోనని.

**Sarika:** నవ్యా? నాకు చాలా బాగా తెలుసు.

**Mounika:** ఇప్పుడెక్కడుంది? తనను కలుసుకొని దాదాపు మూడేళ్లయింది.

**Sarika:** తనకు పెళ్లయిందని మీకు తెలియదా? Last September లో. ఇప్పుడు India లో లేదు. వాళ్ల husband తో states కు వెళ్ళిపోయింది.

**Mounika:** నేను వచ్చే నెల వెళ్తున్నా. మీ దగ్గర ఆమె address గానీ, phone number గానీ ఉందా. ఉంటే కాస్త ఇస్తారా?

**Sarika:** సంతోషంగా.

**Answer:**

**Mounika:** How long have you worked/ have you been working here?

**Sarika:** For the past five years/ for the last five years/ for five years now.

**Mounika:** (Do) you mean/ Does it mean that you have been here since the beginning of the company?

**Sarika:** Not right from the beginning. A few days after the beginning. You can say, almost from the beginning. But why do you ask? / Why are you asking all this? (Almost = దాదాపు)

**Mounika:** My friend Navya worked here for some time. I was wondering if you knew her. (ఇక్కడ wondering అంటే ఆశ్చర్యం కాదు. వాడుకలో 'I was wondering' అంటే ఏదైనా జరిగిందేమో అని సందేహంగా అనుకోవటం)

**Sarika:** (Do) you mean Navya? I know her very well, of course.

**Mounika:** Where is she now? It is three years since I met her/ I met her last three years ago.
(తనను మూడేళ్లక్రితం కలుసుకున్నా)

**Sarika:** Don't you know she has been / is married? She got married last September. She has with her husband for the states.

**Mounika:** I am going to the states too, next month. Do you have / have you her address or phone no.? would you mind giving them to me if you have them?

**Sarika:** With pleasure.

**ప్రశ్న:** నేను ఇంగ్లిష్‌లో *Grammatical mistakes* లేకుండా మాట్లాడలేను. *Spoken English, Grammar* నేర్పే *Institutes* ఎక్కడున్నాయి? బుక్స్ లేదా సీడీలు, క్యాసెట్లు అందుబాటులో ఉన్నాయా?

– ఎం.అపూర్వ, వల్లూరు

**జవాబు:** Spoken English Institutes చాలా ఉంటున్నాయి ప్రతి పెద్దఊర్లో. ఎక్కడ ఎంత బాగా చెప్తారనేది తెలుసుకోవాలి. CD, Casettes - Spoken English కు సంబంధించినవి చాలానే ఉన్నాయి. CIEFL- Central Institute of English and Foreign Languages వారి casettes, CDs పెద్ద ఊళ్లలో దొరుకుతాయి. వీటన్నిటికంటే మీరు TV English news channels regular గా watch చేయండి. మీ చెవికి అలవాటు చేసుకోండి.

**ప్రశ్న:** *'Do'* ని వినియోగిస్తున్నప్పుడు *1st person example* గా *I know English, We watch English movies* అని ఇచ్చారు. కాని *questions* లో మాత్రం *2nd person (you)* వాడారు. అంటే *1st person* తనను తాను ప్రశ్నించుకోకూడదా? *For example: Do I know English? Do we watch English movies* అనకూడదా? మీరే కొన్నిచోట్ల *Do I go there every sunday?, Do we sing well?* అని చెప్పారు. ఏది కరెక్టో తెలుపగలరు.

– మోహన్‌కుమార్, శ్రీకాకుళం

**జవాబు:** అలా Ist person లో ఒకరు తమను తాము ప్రశ్నించుకోవచ్చు అయితే English లో మాట్లాడుతూనే 'Do I know English?' అని అడగటం ఎంత సహజం? Do we watch English movies? అనటం తప్పుకానేకాదు. అయితే మేం English movies చూస్తామా? అని అడిగినప్పుడు మనం expect చేసే Answer ఏమిటి? అహా, చూడరు అని, కదా. సందర్భాన్నిబట్టి నిర్ణయించుకోవచ్చు

JTO మోడల్ క్వొశ్చన్స్ జనరల్ ఎబిలిటీ జవాబులు

1.c 2.a 3.c 4.a 5.a 6.b 7.d 8.a 9.b 10.c 11.b 12.d 13.b 14.b 15.b 16.a 17.d 18.a 19.c 20.a 21.c 22.d 23.c 24.a 25.a 26.b 27.c 28.c 29.b 30.b 31.d 32.a 33.b 34.c 35.b 36.a 37.c 38.a 39.a 40.b 41.d 42.c 43.a 44.a 45.b 46.c 47.a 48.a 49.d 50.b 51.c 52.b 53.b 54.d 55.a 56.d 57.c 58.d 59.b 60.c 61.a 62.b 63.b 64.c 65.d.



SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 71

# It doesn't matter

**Sukumar:** Hi Bhaskar, am I late?
భాస్కర్, నేనేమన్నా ఆలస్యంగా వచ్చానా?

**Bhaskar:** You are, of Course. But (that/ it) doesn't matter. The function hasn't yet begun.
నువ్వు late కానీ ఫర్వాలేదులే, ఇంకా function ప్రారంభం అవలేదుకదా.

**Sukumar:** Where is Shekhar? He always claims that he is punctual.
శేఖర్ ఏడీ? తనెప్పుడూ punctual అని అంటుంటాడు.
(punctual = time కు సరిగా రావటం)

**Shekhar:** I am here. I was here exactly at 4.30
ఇక్కడున్నాను. సరిగ్గా 4.30 కల్లా వచ్చేశాను.

**Sukumar:** I am just a few minutes late. A few minutes' delay makes no difference.
నేను కొద్ది నిమిషాలే ఆలస్యమయ్యాను. కొద్ది నిమిషాల ఆలస్యం ఏం ఫరవాలేదు.

**Bhaskar:** It makes little difference whether you are a few minutes late or half an hour late. You are late. That's the point.
నువ్వు కొద్ది నిమిషాలు ఆలస్యమా, అరగంట ఆలస్యమా అనేది కాదు ముఖ్యం. నువ్వు ఆలస్యం అనేదే అంశం.

**Shekhar:** Let's not talk any more of it. What are there for the dinner after the function?
ఆ విషయం వదిలేయండి. Function తర్వాత dinner కు ఏమున్నాయి?

**Sukumar:** As for me so long as things are good to eat, it makes no difference to me what I eat.
తినడానికి రుచిగా ఉంటే ఏం ఉన్నాయి తినడానికి అనేది అంత ముఖ్యంకాదు నాకు.

**Bhaskar:** So long as the things are tasty, I never mind what I eat.
తినడానికి రుచిగా ఉంటే నాకేదైనా ఫర్వాలేదు

**Shekhar:** I'd have none of the hot stuff.
నాకు కారం వస్తువులు ఇష్టంలేదు/ తీసుకోను

**Bhaskar:** Never mind. You have a variety of things to eat.
ఏం ఫర్వాలేదులే. రకరకాల వస్తువులున్నాయి తినేందుకు.

ఈ సంభాషణలోని ఈ expressions గమనించండి.

1. Doesn't (Does not matter)
2. Makes no difference
3. Makes little difference
4. Never mind.

English Conversation లో ఇవన్నీ కూడా తరచుగా వాడే expressions. పైవాటన్నిటికీ దాదాపు అర్థం, మనం మామూలు Conversation లో వాడే 'ఫరవాలేదులే/ ఏం ఫరవాలేదు/ పెద్ద పోయిందేంలేదు' అనే మాటలకు సమానం. మనం ఏదన్నా పెద్దగా పట్టించుకోకపోతే Doesn't matter = It does'nt matter అంటాం.

**a) Bhavan:** Did he come here or did you go to him?
వాడిక్కడికి వచ్చాడా, నువ్వక్కడికి వెళ్లావా?

**Sumanth:** What does it matter? We met. That's important.
(It doesn't matter/ Doesn't matter whether he came here or I went to him. we met)
అది ముఖ్యమా ఇప్పుడు? / వాడిక్కడికి రావటమా, నేనక్కడికి వెళ్లటమా అనేది కాదు, ముఖ్యం. మేం కలుసుకున్నాం. అదీ ముఖ్యం.

**b) Santan:** Have you the money?
(నీ దగ్గర డబ్బుందా? )

**Krishna:** Yes. I have it. (ఉంది)

**Santan:** How did you get it? (ఎలా వచ్చింది? )

**Krishna:** Never mind how I got it. I have it.
(ఎలా వచ్చిందో అనవసరం. నా దగ్గరిప్పుడు డబ్బుంది. అదీ ముఖ్యం)

c) It makes little difference/ It makes no difference whether you come at 10.30 or 11.00 when you do not come at 10.
(నువ్వు పదింటికి రానప్పుడు, ఆ తర్వాత ఎప్పుడొచ్చినా ఫర్వాలేదు/ పదిన్నరకొచ్చినా ఒకటే, పదకొండుకొచ్చినా ఒకటే.)

గమనించారా? ఇవన్నీ..

a) What does it matter?
b) It matters little/ It matters nothing/ It doesn't matter much
c) What difference does it make?/ It doesn't make any difference/ It makes no/ Little difference
d) Never mind అనే expressions కు అర్థం, ఉపయోగాలూను. వీటిని Conversation లో వాడండి. చాలా natural గా effective గా ఉంటుంది.

**Now practise the following aloud in English:**

**1) Mukund:** నేను రానా వద్దా Station కు?

**Shankar:** ఏదైనా ఫర్వాలేదులే. నువ్వు వచ్చేట్టయితే Phone చెయ్.

**Mukund:** Phone చేయటం నాకభ్యంతరం లేదుకానీ మర్చిపోతానని.

**Shankar:** పోనీలే. నేను వెళ్లి ఆనందును receive చేసుకుంటా. నువ్వు వాడిని తర్వాత కలుసుకో వచ్చు

**Mukund:** దీనికి నన్ను అపార్థం చేసుకోవద్దని వాడికి చెప్పు. వాడిని నేను తర్వాత తప్పక కలుసుకుంటా.

**Shankar:** ఏం ఫర్వాలేదులే. నేను వాడికి చెప్తా నువ్వెందుకు రాలేదని.

**2) Shriya:** Hi Rekha, ఎక్కడ కొన్నావు నీ dress? ఎంత బాగుందో?

**Rekha:** ఎక్కడ కొన్నాననే విషయం అటుంచు. నిజంగా బాగుందా?

**Shriya:** ఎంతయ్యిందే?

**Rekha:** ధర విషయం ముఖ్యం కాదు. చెప్పు, బాగుందా, లేదా?

**Shriya:** నిజంగా చాలా బాగుంది. నేను కూడా కొనుక్కుంటా. ఎక్కడ కొన్నావు?

**Rekha:** వస్త్రసాగర్‌లో. నీకు gift కూడా ఇస్తారు, రూ. 200/- విలువ చేసేది.

**3) Jagan:** రేపు నువ్వీ time లో ఇంట్లో ఉంటావా?

**Suman:** ఏంటి విషయం?

**Jagan:** నాకు Physics లో కొన్ని doubts ఉన్నాయి. వాటినేమన్నా Clear చేయగలవేమోనని?

**Suman:** నేను నీకు చెప్పగలనని నువ్వెందుకనుకుంటున్నా వబ్బా?

**Jagan:** నువ్వు Physics లో నాకంటే మెరుగని.

**Suman:** సరే, ప్రయత్నిస్తా. చెప్పలేకపోతే మాత్రం నువ్వు disappoint అవకు.

**Jagan:** నాకు disappoint అవననే నమ్మకం ఉంది.

**Suman:** అలా అయితే OK. Best of luck.

**4) Pramod:** Hi Venkat, ఇంతకీ College లో చేరావా?

**Venkat:** ఇంకాలేదు. మానాన్న ఊళ్లో లేరు. ఆయన రేపొస్తారు. ఏ College లో చేరాలో ఆయనతో మాట్లాడి చేర్తాను.

**Pramod:** ఏ group తీసుకుంటున్నావు?

**Venkat:** నేనేమో MPC చేయాలనుకుంటున్నా. మా నాన్నకు మాత్రం నేను BiPC చేయాలని ఉంది. మా family లో ఇంతవరకూ doctors లేరు. మా నాన్నకు నేను మొట్టమొదటి doctor అవాలని ఉంది.

**Pramod:** ఆ పనే చెయ్యిమరి.

**Venkat:** కానీ నాకు అంత interest లేదు. Biology లో చాలా పేర్లు జ్ఞాపకం ఉంచుకోవాలి. బట్టీపట్టటం నాకు చేతకాదు.

**Pramod:** అది కరెక్ట్. Biology కి మంచి జ్ఞాపకశక్తి అవసరం. అయితే మీ నాన్నకు ఎలా నచ్చచెప్పగలవు?

**Venkat:** ఎలా నచ్చచెప్పగలను? అదే ఆలోచిస్తున్నా.

**5) Mohan:** నాకో రెండ్రోజులా పుస్తకం ఇవ్వగలవా?

**John:** తప్పకుండా, తీసుకో. శనివారానికి తిరిగివ్వటం మర్చిపోకు.

**Mohan:** అంతకుముందే ఇచ్చేస్తాన్లే. అయితే ఒక విషయం అడగనా నిన్ను? నువ్వేమనుకోకపోతే.

**John:** ఏంటది?

**Mohan:** నువ్వు ప్రతి పుస్తకం కొంటావు. వాటిల్లో ఎన్ని పోగొట్టుకుంటావు?

**John:** అదవసరమా ఇప్పుడు? పుస్తకం కావాలా వద్దా నీకు?

**Answers:**

**1) Mukund:** Shall I go to the station with you or not?

**Shankar:** It makes no difference/ Little difference (Whether you go with me or not). If you are coming just call me.

**Mukund:** I don't mind giving a call. But I'm afraid I will forget.

**Shankar:** Doesn't matter. I will receive Anand at the station. You can meet him later.

**Mukund:** Tell him not to misunderstand me. I will meet him later, certainly.

**Shankar:** Never mind. I will tell him why you aren't able to come.

**2) Shriya:** Hi Rekha, where did you buy your (the/ this) dress. It's really fine/ fantastic/ gorgeous.

**Rekha:** Never mind where I bought it. Is it really good?

**Shriya:** How much is it?

**Rekha:** It doesn't matter how much it is. Is it good or not?

**Shriya:** It is really marvellous. I want to buy it (one like that) too. Where did you buy it?

**Rekha:** At Vasthra Sagar. You can also get a gift worth Rs. 200/-

**3) Jagan:** Will you be at home tomorrow at this time?

**Suman:** What's the matter?

**Jagan:** I have some doubts in Physics. I feel you can clear them.

**Suman:** Just what makes you think I can clear them?

**Jagan:** Because you are better at Physics than me (Than I కూడా correct)

**Suman:** OK. I'll try. But don't be/ get disappointed if I cannot.

**Jagan:** I am sure I shan't (shall not) be disappointed.

**Suman:** Then it's OK. Best of luck.



M. SURESAN

**4) Pramod:** Hi Venkat, have you joined any college?

**Venkat:** Not yet. Dad is not in town. He will come back tomorrow. I will talk to dad what college I am going to join.

**Pramod:** What group are you going to take?

**Venkat:** I want to do MPC. But dad wants me to do BiPC. There hasn't been a doctor in our family so far (No doctor so far in my family). Dad wants me to be the first doctor in the family.

**Pramod:** Go ahead then.

**Venkat:** But I am not so interested. A lot of names to remember in biology. I am poor at mugging.
(mugging = బట్టీ పట్టటం)

**Pramod:** That's right. Biology needs good memory. Then how can you convince your dad? (convince = నచ్చచెప్పటం)

**Venkat:** Yes, how can I? That's what I think of.

**5) Mohan:** Can you/ would you lend me the book for two days?

**John:** Certainly. Take it. Don't forget to return it by saturday.

**Mohan:** I will return it even before that. Shall I ask you one thing if you don't mind?
(don't mind = ఏమనుకోకపోతే)

**John:** What is it?

**Mohan:** You buy every book. How many of them do you lose?

**John:** Is that important now? Do you want the book or not?

## Q&A

**ప్రశ్న:** 1) How to express the Telugu word "ఊతపదం" in English.
2) What can I do to get 'American Accent'
3) Why do we use the word 'spoken' in "spoken English"?

*– రాజేశ్ సీహెచ్, నాగాయలంక*

**జవాబు:** 1) ఊతపదం = catch word.

2) You can get American accent by listening to CNN news channels and also with the help of Webster's dictionary. Other English dictionaries also give American spelling, pronunciation and accent. Watching Hollywood movies will help.

3) ఇక్కడ 'spoken' is past participle and not past tense. Past participle కు ఎప్పుడూ 'బడుతున్న,' 'బడిన' అనే అర్థాలు వస్తాయి. spoken english అంటే మాట్లాడబడే/ బడుతున్న English అని అర్థం. తెలుగులో అయితే మాట్లాడే English అంటాం.
'The boy bitten by the snake,' అంటే - పాముచేత కరవబడ్డ అబ్బాయి. తెలుగులో ఇలా అనం కదా. పాము కరిచిన అబ్బాయి అంటాం.







# He said that..

**Sandhya:** Where are you going so early, Shyam?
ఎక్కడికింత త్వరగా వెళ్తున్నావు శ్యాం?

**Shyam:** Mom, I told you yesterday (that) I would go to Ram's today. I have some difficulty with Physics, and he said (that) he would help me.
నిన్న చెప్పాకదమ్మా, రాం వాళ్ళింటికి వెళ్తానని. నాకు Physics కొంత కష్టంగా ఉంది. వాడు సాయంచేస్తానని చెప్పాడు.

**Sandhya:** But Dad said (that) he would take you to the eye specialist today. You were complaining of frequent headaches.
నాన్న నిన్ను doctor దగ్గరకు తీసుకెళ్తానన్నారు కదా. నువ్వు మాటి, మాటికి తలనొప్పంటుంటావు.

**Shyam:** Not today. I have the Physics exam tomorrow. I told dad (that) I would not be able to go to the doctor today.
ఈవాళ కాదులే. రేపు నాకు physics exam ఉంది కదా. నాన్నతో చెప్పాలే ఈరోజు డాక్టరు దగ్గరకు వెళ్ళలేనని.

**Sandhya:** That's OK. Would you promise me (that) you would go tomorrow? No more postponement, understand? I warn you (that) it will worsen if you neglect.
సరే. రేపు వెళ్తానని మాటిస్తావా? ఇంక వాయిదా వేయకు. నువ్వు దాన్ని ఉపేక్షిస్తే చినకొద్దీ ఎక్కువవుతుంది.
(worsen- క్షీణించటం)

పైసంభాషణలో that వాడకం గమనించండి:

1) I told you yesterday that I would go...
2) he said that he would...
3) I told Dad that I wouldn't be...
4) Would you promise me that you would...
5) I warn you that it will worsen.

ఈ sentences లో that కు అర్థం 'అని' అని. ఓ విషయం ఎవరన్నా చెప్తే, ఆ విషయం ముందు 'that' వస్తుంది.
He told me that he would go.
వాడు వెళ్తానని నాతో చెప్పాడు/ అన్నాడు.

a) I told you yesterday that I would go
అక్కడికి వెళ్తానని నిన్న నీతో అన్నా.
b) He said that he would help me
సాయం చేస్తానని అన్నాడు.
c) I told dad that I wouldn't be... (would not be)
నేను వెళ్ళలేనని నాన్నతో చెప్పా.
d) Would you promise me that you would go tomorrow? రేపు వెళ్తానని మాటిస్తావా?
e) I warn you that it would worsen
హెచ్చరిస్తున్నా- అది ఎక్కువవుతుందని.

కాబట్టి పై sentences అన్నింటిలో that అంటే 'అని'. అయితే మామూలు conversations లో, writing లో కూడా 'that' వదిలేయటం సర్వసాధారణం. వాడుక. తప్పుకాదు.

పై sentenses that లేకుండా అనండి- అర్థంలో తేడా ఏం ఉండదు.
I told you I would go.
I told you that I would go.
He said he would help me.
He said (that) he would help me.
She says she can't sing any more.
she says that she can't sing any more.
ఇక పాడలేనని అంటోంది.
I hope I'll (I will) get a class.
I hope that I will get a class.

మనం మొట్టమొదటి lessons లో చూశాం- English లో Question structure కూ, statement structure కూ ఉన్న తేడా:
Statement లో ఎప్పుడూ subject మొదట, దాని తర్వాత verb వస్తుంది.
వాడు వచ్చాడు = He has come (sub + verb)
అదే question అయితే:
1) verb + subject
Is he here?
2) అయితే verb లో రెండు మూడు మాటలుంటే, అప్పుడు question structure:
1st word of the verb + subject + other word(s) of the verb
Is he coming?
(ఇక్కడి verb, Is coming- ఇందులో రెండు మాటలు కదా? )
3) 'wh' words తో begin అయ్యే questions లో అయితే 'wh' word + verb + sub.
where is he?
4) 'wh' question అయి, verb లో రెండు మూడు మాటలుంటే:
'wh' word + 1st word of the verb + subject + other words of the verb.
where is he going?

ఈపై విషయాలు మీకు గుర్తున్నాయికదా. ఇప్పుడు ఈ sentence చూడండి:
I know where he is
వాడెక్కడున్నాడో నాకు తెలుసు.
ఈ sentence statement. Question కాదు. 'where' అనే 'wh' మాట ఉండటంవల్ల ఈ sentence question ఏమో అని అనిపించవచ్చు. కానీ కాదు. ఇది మొత్తం statement. అందుకని statement structure (subject ముందు, verb తర్వాత వస్తాయి) మాత్రమే ఉంటుంది. ఇలాంటి sentences లో.


M. SURESAN

నిన్న ఎందుకు రాలేదని వాడిని అడిగాను
I asked him why he was absent yesterday.
(why was he absent కాదుకదా? )
a) Where can I get some good tea?
(మంచి tea ఎక్కడ దొరుకుతుంది? )
b) Tell me where I can get some good tea.
(మంచి tea ఎక్కడ దొరుకుతుందో చెప్పు)
sentence (a) question, అందుకని దాన్లో can I get అంటాం.
sentence (b) statement; question కాదు- అందుకని where I can get అంటాం.
c) where does he go every evening?
(ప్రతి సాయంత్రం ఎక్కడికి వెళ్తాడు? )
d) Ask him where he goes every evening.
(ప్రతి సాయంత్రం ఎక్కడికెళ్తాడో వాడినడుగు)
sentence (c) question కాబట్టి where does he go?
sentence (d) statement కాబట్టి where he goes. ఇది English లో చాలా ముఖ్యమైన తేడా.
e) వాడెక్కడ కొన్నాడు ఆ పుస్తకం?
Where did he buy the book?
f) He did not tell me where he had bought the book
ఆ పుస్తకం ఎక్కడ కొన్నాడో నాతో చెప్పలేదు.
(పుస్తకం కొనటం ముందు, చెప్పటం తర్వాత - కాబట్టి had bought)
g) వాడెక్కడికెళ్ళాడు? = Where has he gone?
(Question - So, has he gone?)
h) No one knows where he has gone
వాడెక్కడికెళ్ళాడో ఎవరికీ తెలియదు.
(Statement; so - he has gone.
i) వాడెక్కడుంటాడు? = Where does he live?
వాడెక్కడుంటాడో నీకు తెలుసా?
Do you know where he lives?
(ఇక్కడ మొదటి Do you know మాత్రమే question - రెండో భాగం, వాడెక్కడుంటాడో question కాదు - statement)

**Now practise the following aloud in English:**

1) **Naresh:** Hi Ajitha, మీ నాన్నగారు ఎక్కడ?
**Ajitha:** ఆయన బయటికెళ్ళారు.
**Naresh:** ఎక్కడికెళ్ళారు?
**Ajitha:** ఆయనెక్కడికెళ్ళేది నాతో చెప్పరు. ఎప్పుడు తిరిగొస్తారో నాకు తెలియదు.
**Naresh:** నేను నిన్న ఆయన కోసం వచ్చానని చెప్పావా?
**Ajitha:** ఆ. చెప్పాను. మీరెందుకొచ్చారో అడిగి తెలుసుకోమన్నారు.
**Naresh:** నీతో చెప్పలేనులే, రేపొస్తాను.

2) **Omkar:** Hi Srikar, నువ్వు ఎప్పుడు బయలు దేరుతున్నావు?
**Srikar:** నేనెప్పుడు బయలుదేరుతానో నాకే తెలియదు. అంతా Venkat వచ్చేదానిమీద ఆధారపడి ఉంది.
**Omkar:** వాడెప్పుడొచ్చేది నీకు phone చేయలేదా?
**Srikar:** ఏం జరిగిందో తెలియదు. వాడెందుకు phone చేయలేదో కూడా తెలియటం లేదు.
**Omkar:** వాడికి మీ train time తెలియదా?
**Srikar:** తెలుసు. నేను కూడా చెప్పాను.
**Omkar:** అదిగో వస్తున్నాడు. Worry అవకు.
**Srikar:** ఏమయింది వెంకట్? ఇంత late ఏంటి?
**Venkat:** Traffic చాలా ఎక్కువగా ఉంది. నా auto మధ్యలో ఆగిపోయింది.
**Srikar:** అక్కడ దగ్గరెక్కడా phone లేదా?
**Venkat:** నాకేం కనిపించలేదు. ఆ auto వాడికి కూడా phone ఎక్కడుందో తెలియలేదు.

**Answers:**

1) **Naresh:** Hi Ajitha, where is your father?
**Ajitha:** He has gone out.
**Naresh:** Where has he gone?
**Ajitha:** He doesn't tell me / He never tells me where he goes. I do not know when he will return / he will be back.
**Naresh:** Did you tell him / Have you told him that I came for him yesterday?
**Ajitha:** I did / I have. He told me / wanted me to find out why you had come.
**Naresh:** I can't tell you (of it). I'll (will) come tomorrow.

2) **Omkar:** Hi Srikar, when are you starting?
**Srikar:** I myself (నాకే) do not know when I am going to start. (It) depends on when Venkat comes here. / On venkat's coming here.
**Omkar:** Has'nt he phoned you when he is coming.
**Srikar:** I don't know what has happened. I don't know either (not తో కూడా = either) why he has'nt phoned.
**Omkar:** Doesn't he know the time of your train.
**Srikar:** He does / He knows. I told him too.
**Omkar:** There he is. Don't worry.
**Srikar:** What happened / What has happened Venkat? Why are you so late?
**Venkat:** The traffic was very heavy and the auto broke down on the way.
**Srikar:** Didn't you find a phone any where there?
**Venkat:** I didn't. Even the auto driver did not know where a phone was.

---

**ఈ మాటలు చూడండి:**

1) **amuse** = (అమ్యూజ్ - మ్యూ నొక్కి పలుకుతాం, జ్ size లో z లాగా) నవ్వు పుట్టించటం, వినోదం కలిగించటం.
He amuses us with his jokes.
(Jokes తో నవ్విస్తాడు)
The boy in the girl's dress amused us.
అమ్మాయి dress లో అబ్బాయి మాకు నవ్వు తెప్పించాడు.
An amusing movie/ situation - వినోదం కలిగించే/ హాస్యకరమైన సినిమా/ పరిస్థితి.

2) **annoy** = (అనాయ్ - 'నా' నొక్కిపలకండి) విసిగించటం; కోపం తెప్పించటం.
a) The way he talks annoys me
వాడు మాట్లాడే తీరు నాకు కోపం కలిగిస్తుంది.
b) His silly jokes annoys us
వాడి silly jokes మమ్మల్ని విసిగిస్తాయి.
c) Don't be annoyed = కోప్పడకు/ కోప్పడకండి.

3) **bitter**= (బిట - 'బి' నొక్కి పలుకుతాం) చేదు
Coffee/ Tea without milk and sugar is bitter.
పాలు, పంచదార కలపని కాఫీ/ టీ చేదు.
కోపం: He is bitter that he did not get the promotion.
Promotion రాలేదనే బాధతో కోపంగా ఉన్నాడు.
**bitter pill** = చేదుమాత్ర.

4) **Chair** (ఛేఅ) - మామూలు అర్థం కుర్చీ. కానీ I want him to chair the meeting అనే sentence లో chair అంటే అధ్యక్షత వహించటం (ఆయన సభకు అధ్యక్షత వహించాలని నా కోరిక/ అనుకుంటున్నాను)

5) **Chase** = ఛెయ్స్ - వెంటబడి తరమటం.
The tiger chased the deer - పులి జింక వెంట బడింది. - వేట, వేటాడటం అనే అర్థం కూడా ఉంది.




**ప్రశ్న:** *I am poor at spellings. Please, give information about pronunciation casettes and CDs.*
**– టి.జోసెఫ్‌రెడ్డి, వరంగల్**

**జవాబు:** A Number of Pronunciation casettes and CDs are available in leading Book Shops. Pronunciation and spelling casettes and CDs prepared by Central Institute of English and Foreign Languages are also available in Hyderabad. A number of foreign books on Conversation, pronunciation and spelling carry casettes and CDs with them. Enquire for them in the market.

**ప్రశ్న:** నేను అశోకా ట్యూషన్ సెంటర్ పెట్టాలనుకుంటున్నాను. చాలామంది *Tutorials, tution centre, tuition centre* అని రాస్తున్నారు. ఏది కరెక్టు? నేను *Asoka's tutorials, Asoka tutorial's* - ఏది రాయాలి?
**– ఎం.వి.జయకుమార్, నర్సీపట్నం**

**జవాబు:** Tuition అనేది Correct spelling. Asoka Tutorials correct. ఈ రెండు పదాల్లో దేనికీ Apostrope (') s ('s) రాదు.

**spoken english పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి..**
**URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# He has a fever

**Raghav:** Good morning Doctor
**Doctor:** Good morning. Come in. Name and other things please.
**Raghav:** I am Raghav, aged 19, doing my 3rd year degree.
నా పేరు రాఘవ్, 19 ఏళ్లు, 3rd year degree చేస్తున్నాను.
**Doctor:** Your complaint? (నీ బాధేమిటి? )
**Raghav:** I have had a fever since yesterday and a headache since last night. I feel rather weak too.
నిన్నటి నుంచి జ్వరం, రాత్రి నుంచి తలనొప్పిగా ఉంది. కొంత నీరసంగా కూడా ఉంది.
(rather - కాస్త ఎక్కువగా)
**Doctor:** You have a temperature of above 100. Well, take these tablets and have complete rest. Avoid solids today. Only liquids. That's my prescription.
100 డిగ్రీలపైగా temperature ఉంది. ఈరోజు solids - ఘనపదార్థాలు - అన్నం లాంటివి వద్దు. ద్రవ పదార్థాలే తీసుకో.
( temperature - pronunciation - టెంప్రఛ- 'టెం' నొక్కి పలుకుతాం.
Prescription - Doctor రాసిచ్చే మందులు)
**Raghav:** What's the dosage doctor?
ఏ మాత్రలు ఎన్నెన్ని ఎప్పుడు వేసుకోవాలి?
**Doctor:** The first one, three times a day, after taking in something. The second one at bed time. See me again tomorrow evening.
మొదటివి రోజుకు మూడు - ఏదైనా ఆహారం తీసుకున్న తర్వాతే. రెండోది రాత్రి పడుకో బోయేముందు ఒకటి. రేపు సాయంత్రం మళ్లీ రండి.
**Raghav:** Hope it isn't any thing serious, doctor?
ఏం serious కాదు కదా, Doctor?
**Doctor:** I don't think so. Don't Worry. It's just an ordinary fever. If it doesn't come down by tomorrow, let's have some tests done. Nothing to worry about. Take complete rest.
నేననుకోవటంలేదు. Worry అవకండి. మామూలు జ్వరం అనుకుంటున్నా. రేపటికి తగ్గకపోతే కొన్ని పరీక్షలు చేయిద్దాం. ఏం పర్వాలేదు.
(జ్వరం, temperature లాంటివి తగ్గటం = come down)

పై సంభాషణలో- జబ్బులకు, patients కు, doctors కు సంబంధించిన expressions గమనించండి.

1) Complaint = Patient (రోగి) బాధ, సమస్య.
2) Englishలో fever, headache, temperature అన్నీ countables. అంటే వాటికి singular, plural numbers ఉంటాయి. Singular ముందు a/ an వస్తాయి. అందుకే a fever, a temperature, a headache.
3) Weak = (అందరికీ తెలుసు) నీరసంగా ఉండటం. నీరసం కాస్త ఎక్కువ రోజులుండి బలహీనతగా ఉంటే = debility (నిస్సత్తువ)
4) Doctor నిర్వహించే పరీక్ష (patient కు): examination. A doctor examines a patient.
5) రోగమేంటో తెలుసుకోవడానికి చేసే పరీక్షలు.
Tests: Blood test, urine (మూత్ర) test, motion (మల) test, sputum (కళ్లె) test, etc.
6) Diagnosis (డయగ్నోసిస్) - 'గ్నో' నొక్కిపలుకుదాం = రోగ నిర్ణయం = వ్యాధి ఫలానాది అని నిర్ణయించడం.
7) పైన చెప్పిన tests అన్నీ కూడా diagnostic tests. (అంటే వ్యాధి ఏమిటో నిర్ణయించేందుకుచేసే పరీక్షలు)
8) Prescription - Doctor మందులు రాసిచ్చే కాగితం. (pronunciation - ప్రిస్క్రిప్షన్ 'స్క్రి' నొక్కాలి)
9) Prescribe: Doctor ఈ మందులు, ఈ వైద్యం తీసుకోండని చెప్పటం. Doctor మందులు రాసివ్వటం. (Prescribe - ప్రిస్క్రైబ్ - 'స్క్రై' నొక్కి పలుకుతాం)
10) treat - వైద్యం చేయటం/ చికిత్స చేయటం
11) treatment - వైద్యం/ చికిత్స
12) A course of tablets/ injections - మాత్రల, injections సంఖ్య - Doctor నిర్దేశానుసారం.
13) వైద్యం పొందుతుండటం = to be under treatment, to undergo treatment, to take treatment.
14) diet: ఆహారం/ పథ్యం
15) symptoms = వ్యాధి లక్షణాలు




**Look at the following :**
**(Read it aloud two or three times)**

a) He had had a fever and (a) headache since yesterday. The doctor examined him this morning and prescribed some tablets. He took the prescription to the medical shop and bought the medicines. The doctor advised him complete rest. The doctor put him on a liquid diet. (Put this passage in Telugu)

**Practise the following:**

1 a) This doctor is treating my friend/ the patient
ఈ doctor నా friend/ రోగికి వైద్యం చేస్తున్నాడు.
b) My friend/ the patient is taking treatment from this doctor
మా friend/ రోగి ఈ doctor దగ్గర చికిత్స పొందుతున్నాడు.
c) My friend/ the patient is under this doctor's treatment
My friend/ the patient is undergoing treatment. వీటన్నిటికీ ఒకే అర్థం.
My friend, patient బదులు I, we, you, he, she, they, any name, any relationship (brother, cousin, uncle, etc) ను వాడి పై sentences ను మిగతా times of action లో (గతంలో, ఇంతవరకు, future లో) practice చేయండి (అంటే different tenses లో).

**Just one example:**
Ramesh took/ has taken/ has been taking/ will take treatment from this doctor- ఇలా పైన చెప్పిన అన్నిరకాల sentences ను practice చేయండి.

2) We take treatment from a doctor for a disease.
a) He is taking treatment from Dr. Sankar for Jaundice (Jaundice=కామెర్లు)
b) She is undergoing treatment for typhoid (Typhoidకు వైద్యం చేయించుకొంటోంది)
c) He has been under treatment for a week now. (వారంగా ఆయన చికిత్స పొందుతున్నాడు)

3 a) ప్రకాష్ పథ్యం తీసుకుంటున్నాడు
Prakash is on diet.
b) నేను నిన్నటివరకు పథ్యపు ఆహారం తీసుకున్నాను
I was on diet till yesterday.
c) ఉత్తపాలు, bread మాత్రమే తీసుకుంటున్నాడు
He has been on diet of milk and bread for the past four days/
He has been taking only bread and milk for the past four days.

ఇవీ doctors కూ, medicines కూ, patients కూ సంబంధించిన conversational expressions. ఇది కూడా గమనించండి:

4) He is suffering from a fever-
ఇది common గా వాడుతుంటాం. ఇది కొంచెం పాండిత్యం. conversational గా (spoken form) అయితే-
a) He has a fever/ He is down with a fever.
b) She has been down with 'flu for the past 2 days.
రెండ్రోజులుగా ఆమెకు 'flu గా ఉంది.

5) Doctor పూర్తి విశ్రాంతి తీసుకోమంటే-
The doctor's (the doctor has) advised her complete rest (for a week/ ten days, etc.)
6) జబ్బు = illness/ ailment/ disease. ఈ మూడూ కూడా countables. వీటికి plurals – illnesses, ailments, diseases వాడుకలో ఉన్నాయి. వీటిని singular గా వాడితే a/ an తప్పక ఉపయోగిస్తాం.
a) He is very weak because of an illness/ an ailment/ a disease.
ఆయన ఏదో జబ్బువల్ల నీరసంగా ఉన్నాడు.
b) The doctor is unable to diagnose their diseases
వాళ్ల వ్యాధులేమిటో ఆయన నిర్ధారించలేకున్నాడు.
c) He has serious ailments
ఆయనకు తీవ్రమైన జబ్బులు ఉన్నాయి.
7) వ్యాధి నివారణ = cure = నయం చేయటం
a) Doctor అతని జబ్బును నయం చేశాడు
The doctor has cured his disease/ cured him.
b) The medicine is a good cure
ఈ మందు మంచిది.
c) The medicine has cured him of his illness
అతని జబ్బును ఆ మందు నయం చేసింది.
8) జబ్బుగా ఉండటం = ill.
అతనికి జబ్బుగా ఉంది/ అతను జబ్బుపడ్డాడు
He is ill. ఇది చాలా simple expression.
He has been ill for a week
అతడు వారంగా జబ్బుతో ఉన్నాడు
He has been ailing for a week.
These are symptoms of Malaria
మలేరియా లక్షణాలు.

**Now Practise the following in English.**

1) **Doctor:** ఈ జ్వరం నీకెంత కాలంగా ఉంది?
**Ramesh:** గత రెండ్రోజులుగా
**Doctor:** ముందే ఎందుకు రాలేదు?
**Ramesh:** నేనే ఏదో మందువాడాను, temperature తగ్గేందుకు.
**Doctor:** నీకు దానివల్ల నయమయిందా?
**Ramesh:** లేదు. అందుకే మీ దగ్గరకొచ్చాను.
**Doctor:** సరే, మీబాధలేంటో చెప్పండి. (complaint)
**Ramesh:** Temperature, headache, ఒళ్లు నొప్పులు.
**Doctor:** జలుబుందా?
**Ramesh:** ఆ. చలిగా కూడా ఉంది.
**Doctor:** O.K. ఈ మందులు తీసుకోండి. అవి నయం చేస్తాయి.
**Ramesh:** పథ్యం ఏమన్నా పాటించాలా doctor?
**Doctor:** పాలు, bread మాత్రమే. Barley తీసుకోండి.

2) **Ramana:** Hi Ravi, ఏంటి విశేషాలు?
**Ravi:** కొంచెంbad news. లక్ష్మణ్‌కేం బాగాలేదు.
**Ramana:** అరె. నిజంగా బాధగా ఉంది. ఎన్ని రోజులుగా బాధపడుతున్నాడు?
**Ravi:** నాలుగు రోజులుగా temperature ఉండింది. ఈరోజు Doctor చెప్పాడు typhoid లక్షణాలని. 3 వారాలు వైద్యం, rest తీసుకోమన్నాడు.
**Ramana:** త్వరగా కోలుకోవాలని కోరుకుందాం. (కోలుకోవటం = recover)

**Answers:**

1) **Doctor:** How long have you had this fever?
**Ramesh:** For the past/ last two days.
**Doctor:** Why didn't you come earlier? (early = ముందు, earlier = అంత కంటే/ ఇంతకు ముందు)


M. SURESAN

**Ramesh:** I took some medicine to bring down the temperature.
**Doctor:** Did it cure you?
**Ramesh:** No. That's why I am here/ I came to you.
**Doctor:** O.K. What are your complaints?
**Ramesh:** Temperature, headache and body ache/ pains all over the body.
**Doctor:** Have you/ Do you have a cold too?
(Cold = జలుబు - countable)
**Ramesh:** Yes. And I fell very cold.
(feel cold - చలిగా ఉండటం)
**Doctor:** O.K. Take these medicines. They will cure you.
**Ramesh:** What about the diet?
**Doctor:** Just bread and milk. You can take barley.

2) **Ramana:** Hi Ravi, what news?
**Ravi:** A bit of bad news. Lakshman isn't well/ Lakshman is ailing.
**Ramana:** I'm (I am) really sorry. How long has he been suffering?/ How long has he been down?
**Ravi:** He has had a temperature for the past four days. The doctor told him that it is typhoid. He advised him rest and treatment for three weeks.
**Ramana:** Let's wish him a speedy recovery.

---

**ప్రశ్న:** 1) *Cheer (n&v), cheerful (adj) and yacht (n) ల pronunciation తెలుపగలరు.*
2) *2X5 = 10. దీన్ని two, five 'జ్వా' ten అని చదవాలంటారు. నిజమేనా?*
3) *Retired కు Retd. లేదా Rtd.లలో సరైన abbreviation ఏది?*
*– టి.శివ, నందికొట్కూరు*

**జవాబు:**
1) Cheer- ఛియ (రియల్‌లో రియలాగ). cheerful: ఛియఫ్‌ల్; yacht=యట్/యాట్. (యట్ అన్నప్పుడయితే, పెదవులను గుండ్రంగా తిప్పి నాలుక కొంచెం లోపలికి పోనివ్వండి; యాట్ అన్నపుడు నాలుక flat గా పెట్టండి)
2) 2×5=10ను two five 'జ్వా' ten అనటం తప్పు. దీన్ని చదవాల్సింది, Two fives are ten అని.
Pronunciation: టు ఫైవ్జాటెన్ అని; ఇక్కడ 'జ' వత్తు size లో z లాగ పలకండి. Are ని 'ఆ' గా పలకండి; చివరి 'r' silent. (Tu faivza : ten) - ఇది English pronunciation.
3) Retd అనేది correct.







# How was your journey?

**Bhaskar:** Hi Krishna, When are you leaving for Delhi?
కృష్ణా, Delhi ఎప్పుడెళ్తున్నావు?

**Charan:** On Sunday, by the AP Express.
వచ్చే ఆదివారం, AP Express లో.

**గమనించండి:** Next Sunday ముందు 'The' వాడం; అయితే Sunday next అన్నప్పుడు sunday ముందు The వాడతాం. Trains పేర్ల ముందు 'The వస్తుంది.

**Bhaskar:** Have you booked the ticket? / reserve your ticket?
నీ ticket reserve చేసుకున్నావా?
(Ticket = టికెట్ - 'టి' నొక్కి పలుకుతాం)

**Charan:** yes, yesterday. I am travelling II sleeper class. There was no accommodation in the AC classes.
II sleeper లో నా ప్రయాణం. AC Classes లో చోటులేదు.
(Accommodation = అకామడేయ్షన్ - 'డెయ్' నొక్కి పలుకుతాం. ముందున్న 'అ' దాదాపు పలకం. అర్థం = చోటు, వసతి)

**Bhaskar:** Why didn't you go earlier?
(ముందే ఎందుకు వెళ్ళలేదు? )

**Charan:** The booking clerk told me that by last sunday itself the AC classes were full. If I wanted AC, I would be 34 on the wait list.
అదేంలేదు. కిందటి sunday కే AC classes అన్నీ నిండిపోయాయని clerk చెప్పాడు. కావాలంటే wait (waiting list) లో 34 దొరుకుతుందన్నాడు.

**Bhaskar:** That's risky. You can't be sure of accommodation when you are so low on the wait(ing) list.
Waiting list లో 34 అయితే సీటు దొరకటం కష్టమే.

**Charan:** That's why I preferred II sleeper. And I got the berth of my choice.
అందుకే II Sleeper ఎంచుకున్నా. నాక్కావలసిన berth దొరికింది.
(berth pronunciation 'ber', 'bird' లో 'bir' లాగా 'r' silent.
(of my choice = నాక్కావలసిన. of your choice = నీక్కావలసిన)

**Bhaskar:** What about your food on the journey? I suggest you take it from home. The food on the train is expensive and not so good.
ప్రయాణంలో ఆహారం సంగతేంటి? నువ్వు ఇంటి నుంచి తీసుకెళ్ళటమే మంచిది. అది నా సలహా. Train లో అమ్మేది ధరెక్కువే కాకుండా అంత బాగుండదు.

**Charan:** Mom is not in town. I am going to make do with the food on the train. I've (I have) heard that the catering service on the AP Express isn't so bad.
మా అమ్మ ఊళ్లోలేదు. Train లో తిండితోనే సరిపెట్టుకోవాలి. AP Express వాళ్ల ఆహారం ఫర్వాలేదనే విన్నా.

**Bhaskar:** I wish to see you off at the station. What are its times of arrival and departure? When do you reach Delhi?
నేను నీకు వీడ్కోలు ఇవ్వటానికి Station కు వస్తా. Train రాకపోకల times ఏంటి? Delhi ఎప్పుడు చేర్తావు?
(see off = send off = వీడ్కోలు/వీడ్కోలు ఇవ్వటం)

**Charan:** It arrives at 10 and departs at 10.10. It reaches the destination next morning at 9.
10 కి వస్తుంది, 10-10కి బయల్దేర్తుంది. Destination (= గమ్యం/ చేరవలసిన చోటు, ఇక్కడ Delhi) తర్వాతి పొద్దున్న 9 గంటలకు చేర్తుంది.

**Bhaskar:** Have you booked your return journey?
తిరుగు ప్రయాణానికి Reserve చేసుకున్నావా?

**Charan:** I am not sure when I return. Depends on what my uncle says.
ఎప్పుడు తిరిగొస్తానో కచ్చితంగా తెలియదు. మా uncle చెప్పే దాన్ని బట్టి ఉంటుంది.

**Bhaskar:** OK then, see you tomorrow at station.
రేపు Station లో కలుద్దాం.

**Charan:** Bye!

ఈ సంభాషణలో వచ్చిన ప్రయాణానికి సంబంధించిన మాటలు చూద్దాం.

**1)** Leaving - leave = బయల్దేరటం. వెళ్లటం.
I leave for college at 9 every day.
(leave - left - left) ఒక చోటికి వెళ్లటం/ బయల్దేరటం leave for a place.
**a)** ఆయన చెన్నై నుంచి Delhi కి నిన్న వెళ్లాడు
He left Chennai for Delhi yesterday.
**b)** ఆమె నిన్న ఇక్కడ నుంచి వెళ్లింది. ఎక్కడికో తెలియదు.
She left here yesterday. No idea where for.
(No Idea ఇలావాడటం practice చేయండి)

**2)** Train లో /bus లో /plane లో = by train, by bus, by plane.
AP express లో = By the AP express

**3)** Tickets reserve చేసుకోవటం/ కొనుక్కోవటం = book tickets. (book journey. buy tickets అనవచ్చు Reservation అయితే buy tickets in advance)
Advance booking (ముందుగా కొని ఉంచుకోవటం)
current booking (ఎప్పటికప్పుడు కొనుక్కోవటం)
[current = జరుగుతున్న/ ప్రస్తుత]

**4)** ఓ class లో ప్రయాణించటం = travel a class.
**a)** అతను ఎప్పుడూ II sleeperలో ప్రయాణం చేస్తాడు
He always travels II class sleeper
**b)** ఆమె I classలో ప్రయాణిస్తోంది
She is travelling I class
(by/ on/ in first class కాదు)

**5)** Accommodation = వసతి. Train లో అయితే చోటు (seat/ berth)

**6)** Wait (ing) list = Berths/ seats కోసం wait చేసే ప్రయాణికుల జాబితా. ఎవరైనా ప్రయాణం మానుకుంటే వాళ్ల సీట్లు వరుస క్రమంలో wait(ing) listలో ఉన్న వాళ్లకు ఇస్తారు.

**7)** Wait(ing) listలో ఉన్న వాళ్లకు seat/ berth ఖాయమవటం - confirmed.
My tickets/ accommodation has been confirmed.
నాకు చోటు కచ్చితంగా - berth/ seat - ఉంది - ఖాయమయ్యింది.

High on the waitlist (wait listలో ముందుండటం)
low on the wait list (wait listలో కింద ఉండటం)

**8)** Make do with = సరిపుచ్చుకోవటం/ సర్దుకుపోవటం.
**a)** నీకు నేను వంద రూపాయలు మాత్రమే ఇవ్వగలను. దాంతో సర్దుకో.
I can give you only Rs 100/-. Make do with it.
**b)** నువ్విచ్చేదాంతో సర్దుకుంటాను.
I'll make do with whatever you give.

**9)** Catering service (కెయ్‌టరింగ్ సర్విస్) = వంట, వడ్డన.
Cater = వండి వడ్డించటం, ముఖ్యంగా parties కూ, పెళ్లిళ్లు వగైరాలకు (cater = కెయ్‌టర్)
catering = కెయ్‌టరింగ్ - ఈ అన్ని పదాలలో 'కె' నొక్కి పలకాలి.
caterers = కెయ్‌టరర్జ్ = వండి, వడ్డించేవాళ్లు (company/ restaurant, etc)


M. SURESAN

**10)** See off = send off = వీడ్కోలు/వీడ్కోలు ఇవ్వటం
**a)** నేను మా friend ను పంపించటానికి (వీడ్కోలు ఇవ్వటానికి - ఇది తెలుగులో కొంచెం పాండిత్యం, మామూలు మాటల్లో వాడం కదా? ) station కు వెళ్తున్నా
I am going to the station to see my friend off (to Delhi)/ to send off my friend (to Delhi)
**b)** నేను stationకు రానా నువ్వెళ్లేటప్పుడు?
shall I see you off at the station.
**c)** ఆయన విద్యార్థులు చాలామంది ఆయనకు వీడ్కోలిచ్చారు (station లో)
A numbers of his students saw him off at the station.

**11)** See off X receive
Receive అంటే ఎవర్నైనా తీసుకురావటం station కు గాని, bus stand కు గానీ వెళ్లి.
**a)** She has gone to the station to receive her father
వాళ్ల నాన్నను తీసుకురావటానికి station కు వెళ్లింది.
**b)** There was none to receive him at the station
ఆయన కోసం ఎవరూ రాలేదు.

**12)** arrival = చేరిక; Departure = బయల్దేరటం. మరో రకంగా - రాక (arrival), పోక (departure)

**13)** Destination = గమ్యం, చేరే/ చేరవలసిన చోటు.
The destination of the AP express from Hyderabad is New Delhi.
హైదరాబాద్ నుంచి బయల్దేరే AP Express గమ్యం New Delhi.

**14)** On the train/ on board the train = train లో, on the journey = ప్రయాణంలో (during the journey అని కూడా అంటాం)
on travel = while on travel = ప్రయాణంలో
travel = ప్రయాణం, ప్రయాణించటం (ట్రావల్);
Comfort = సుఖం/ సౌకర్యం
Travel in comfort with less luggage
తక్కువ luggage తో సుఖంగా ప్రయాణించండి.

**Now practise the following in English.**

**Gowtham:** మీ ప్రయాణం ఎలా జరిగింది?
**Sekhar:** చాలా సుఖంగానే జరిగింది.
**Gowtham:** ఇక్కడికి ఎప్పుడు చేరారు?
**Sekhar:** train చేరాల్సిన time 10.35 కాని 15 నిమిషాలు ఆలస్యమయింది.
**Gowtham:** మా ఇంటికి ఎప్పుడొస్తారు?
**Sekhar:** రేపు, ఎల్లుండీ నేను busy. ఆ తర్వాత రోజు university లో పనుంది. ఆ రోజు time ఉంటే వస్తా. లేకుంటే చెప్పటం కష్టమే.
**Gowtham:** ఆ తర్వాత రోజు రావచ్చు కదా?
**Sekhar:** ఆరోజు నేను తిరిగి వెళ్లిపోతున్నా.
**Gowtham:** ఆ రోజు మీ train ఎప్పుడు? సాయంత్రం కదా, మా ఇంట్లో lunch కు రండి.
**Sekhar:** ఆరోజు మా ఆవిడ shopping వెళ్లాలంటోంది.
**Gowtham:** ఆరోజు మీ tickets book అయ్యాయా? లేకుంటే తర్వాతి రోజు వెళ్లండి.
**Sekhar:** ఆ. అయ్యాయి. తర్వాత మూడు రోజుల వరకు ఏ train లో ఖాళీ లేదు. వీలయినంత వరకూ ఆ రోజు మీ ఇంటికి రావటానికి ప్రయత్నిస్తాను. రాకపోతే ఏమనుకోవద్దు. ఈసారి వచ్చినప్పుడు మీ ఇంటికి వస్తాను.
**Gowtham:** నన్ను నిరాశ పరుస్తున్నారు. (disappoint) OK. అయితే నేను ఆరోజు station కు వస్తాను మీకు వీడ్కోలివ్వటానికి. మీకు train లో తినేందుకు food కూడా తీసుకొస్తాను.
**Sekhar:** Station కు రండి. కాని food వద్దు. train లో food తో గడిపేస్తాం లెండి.
**Gowtham:** నన్ను తీసుకురానివ్వండి. నాకదో సంతోషం.
**Sekhar:** OK.

**ప్రశ్న:** *1. Key words అంటే ఏమిటి? వీటిని పేరాగ్రాఫులో ఏ విధంగా గుర్తించాలి?*
*2. 'Phrasal verbs' గురించి తెలియజేయగలరు. i) Transitive, ii) intransitive verbs ను ఎలా గుర్తించాలి?*
*3. She will be awarded. దీనిని She will be award అనొచ్చా?*
**– అంకం సుధాకర్, పెద్దమల్లారెడ్డి, భిక్నూర్**



**జవాబు: 1.** Key words అంటే ఒక passage ఏ విషయం గురించి చర్చిస్తుందో తెలిపే మాటలు. Paragraph/ Passage ను చదివేప్పుడు తెలుస్తుంది. వాటిని గుర్తించేందుకు ప్రత్యేకమైన పద్ధతంటూ ఏదీలేదు. ఇది చూడండి.
The important task before any government is to provide the people with the minimum level of education. ఈ sentence లో key word - 'education' అని తెలుస్తోంది కదా. అంటే ఈ sentence ఉండే Passage ఈ విషయాన్నే చర్చిస్తుందన్నమాట.
**2.** Phrasal verbs - verb లాగ వాడగలిగిన మాటల కూర్పును Phrasal verb అంటాం. రెండు మూడు మాటలతో ఉండి, verb లాగా పనిని తెలిపే expression, phrasal verb. He put out the light - ఇక్కడ put out అనేది Phrasal verb, ఆర్పేశాడు అనే అర్థంతో. take care of - ఇది కూడా phrasal verb.
**i)** Transitive verb - object ఉన్న verb. 'Buy' (కొనటం) - దీనికి object ఉంది - (ఎవర్ని), దేన్ని కొనటం అంటే - ఏదో ఒకదాన్ని కొనటం అనే answer వస్తుంది- కాబట్టి ఇది transitive. అలాగే 'see' (చూడటం) ఎవర్ని (దేనిని చూడటం అంటే, ఒకర్ని/ ఒక వస్తువును చూడటం అనే answer వస్తుంది కాబట్టి అది transitive verb.
**ii)** Intransitive verb: ఎవర్ని, దేనిని అని ప్రశ్న వేసుకుంటే answer లేనిది. He goes to Hyderabad every week. go = వెళ్లటం - ఎవర్ని/ దేనిని వెళ్లటం అంటే answer లేదు కాబట్టి, ఇది intransitive.
**3.** She will be award - అర్థం లేదు. ఇక్కడ be form తర్వాత రావలసింది past participle – awarded. It will be seen అంటాం కానీ, It will be see అనం కదా. ప్రతిభ lessons లో six forms of the verb మరోమారు చూడండి.

**spoken english పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 75

# home బదులు place

**Prahlad:** Hi Nagaraj, where were you yesterday? you didn't turn up for the meeting.(నిన్న ఎక్కడున్నావు? meeting కు రాలేదేం? ) turn up హాజరవడం; turn up is always followed by 'for'

**Nagaraj:** I was home all the day. I was busy tidying up the place. I had thought it doing two days before, but didn't find the time (రోజంతా ఇంట్లోనే ఉన్నా. ఇల్లు సర్దుతున్నా. రెండు రోజుల కింద సర్దుదామనుకున్నా. కానీ time దొరకలేదు.)

**Prahlad:** Why? was it so untidy?
(అంత చిందరవందరగా ఉందా? )

**Nagaraj:** It was. The whole place was in a mess. I had neglected for two weeks. Nothing was in its proper place
(ఇల్లంతా గందరగోళంగా ఉంది. రెండు వారాలు కొంచం ఉపేక్షించా...అంతే ఏదీ ఉండాల్సిన చోట లేదు)

**Prahlad:** I'm afraid you are too worried about tidiness (నువ్వు ఇల్లు అమరిక గురించి మరీ పట్టించుకుంటావనుకుంటా)

**Nagaraj:** No. My table was untidy, with a lot of paper and books piled up or lying all over. The front room was a chatter of furniture. The TV stand-well, let me not talk about all that. Now that I tided up every thing I feel relieved. (పుస్తకాలు, కాగితాలతో నా టేబుల్ అంతా చిందరవందరగా ఉంది. Piled up = దొంతరగా ఉండటం Chatter = furniture లాంటిది చిందర వందరగా ఉండటం.

**Prahlad:** Was there none else at home to help you?
(ఇంట్లో సాయం చేసేందుకెవరూ లేరా? )

**Nagaraj:** Mom and sister are out of town. Dad is too old. I gave the toilet a good wash. I cleaned up the cupboards and reset all things. (అమ్మ, చెల్లి ఊళ్లోలేరు. నాన్న పెద్దాయన. Toilet బాగా కడిగి, cupboards లో వస్తువులన్నీ సర్దేశాను)

**Prahlad:** What a job! (ఎంత పనిచేశావు!)

**Nagaraj:** That wasn't all. I cleaned the cobwebs. I cleaned the kitchen, I made up the beds. I washed the dishes. (అంతేకాదు. బూజు దులిపి వంటిల్లంతా శుభ్రం చేసి పాత్రలన్నీ కడిగాను. పక్కలన్నీ సర్దాను)

**Prahlad:** My elder sister takes care of all these things at home. (మా ఇంట్లో మా అక్కయ్య చూసుకుంటుందీ విషయాలన్నీ)

**Nagaraj:** I like the work. I can't bear to see a thing out of place. I want the home (ఉండాల్సిన చోట వస్తువు లేకపోతే నాకు తోచదు. bear to see = (చూస్తూ) భరించడం.) I didn't leave out even the attics (అటకలు కూడా వదల్లేదు) What a lot of dust! (ఎంత దుమ్మో) I had to throw away a number of useless things. (ఉపయోగం లేని వస్తువులు పారేశా) I bundled up all the newspapers. I will dispose them of today.
(పాత news papers అన్నీ కట్టలు కట్టాను. వాటినీ ఈ రోజు అమ్మేస్తాను. Bundle = కట్ట; కట్టడం. dispose of = అమ్మేయడం)

**Prahlad:** You appear to be a stickler for cleanliness (శుభ్రత అంటే చాలా పట్టింపుగా ఉన్నట్టుంది, నీకు. stickler= ఏదైనా విషయాన్ని గట్టిగా పట్టించుకునే వారు stickler for punctuality = సమయపాలన పట్టింపుండే వాడు)

**Nagaraj:** You can say that. By the time I was through it was 6 in the evening you know mom will be pleasantly surprised to see the glittering stove, and the utensils. మా అమ్మ తళతళ మెరిసే stoveలను పాత్రలనూ చూసి సంతోషంతో ఆశ్చర్యపడుతుంది. utensils = vessels = dishes = పాత్రలు - వంటకు వడ్డనకు వాడేవి
glitter = తళతళ లాడటం)

పై సంభాషణలో ఇంటికి సంబంధించిన మాటలు ఉన్నాయి కదా. ఇప్పుడు వాటిని చర్చిద్దాం.

1) Home = మనం మన వాళ్ళతో (members of our family) ఉండే ఇల్లు అద్దెదైనా కావచ్చు, సొంతమైనా అవచ్చు). మన ఇంటికివచ్చిన guest తో ఏమంటాం? = Please feel at home. (మీ ఇల్లే అనుకోండి అంటాం.)

2) Place = కొన్ని సందర్భాల్లో home (మనం ఉంటున్న ఇల్లు) బదులు place అంటాం. అయితే సామాన్యంగా my home/our home అని, I am going to my/our home /it is at my/our home అని అనం. అప్పుడు my place. మా ఇంటికి రండి = come (down) to my place: come to my home అని సామాన్యంగా అనరు.

3) tidy = (ఇల్లు, గది, Office, etc) ఉండాల్సిన చోట వస్తువులు అమరికగా ఉండటం.
His home is very tidy = ఇల్లు చాలా అమరికగా ఉంటుంది. Tidy x untidy.

4) untidy = వస్తువులన్నీ ఓ order లో లేకుండా చిందరవందరగా ఉండడం.
The place is untidy= ఆ ప్రదేశం / ఇల్లు చాలా చిందరవందరగా ఉంది.
(చిందరవందరగా ఉన్న జుట్టు =untidy hair
గజిబిజిగా ఉన్న రాత = untidy writing)
He has a tidy appearance =neat గా కనిపిస్తున్నాడు.

5) tidy = అమరికగా ఇల్లులాంటివి సర్దడం = ఎక్కడ ఉండాల్సిన వస్తువు అక్కడ neat గా ఉంచటం.
a) Let me tidy up the home first = మొదట ఇల్లు సర్దనీ.
b) He tidied up the room yesterday = నిన్న గదంతా సర్దాడు.
c) We must keep our homes neat and tidy = ఇళ్లను శుభ్రంగా (tidy) ఉంచుకోవాలి.

6) Feel relived = బరువు దిగినట్టనుకోవడం when I heard that I had passed I felt relieved = pass అయ్యానని వినగానే విముక్తి లాంటి భావన కలిగింది.
Once the exams are over, students feel relived = It is a great relief = Exams అయిపోవడం వాళ్లకు విముక్తి.

7) chatter = చిందరవందర (furniture - chairs, sofas లాంటివి చిందరవందరగా ఉంటే.)

8) give a good wash = బాగా కడగడం
9) reset = ఉండాల్సిన చోట మళ్లీ పెట్టడం
10) cobwebs = సాలెగూళ్లు, బూజు
11) make up bed = పక్క సర్దడం
12) dirt = మురికి, dust = దుమ్ము
13) attic = అటిక్ = అటక
14) I was through = పని పూర్తి చేశాను.
a) He is through with his homework = Homework పూర్తి చేశాడు.
b) Are you through? = నీ పని పూర్తయిందా?
15) Vessels = dishes = utensils = వంట, వడ్డనకు వాడే పాత్రలు
16) pan/ frying pan = పెనం/ మూకుడు
17) ewer (ఈవ) = చెంబు
18) front room = ఇంట్లో ముందు గది - అతిథులను, visitors ను కూర్చోబెట్టే room అదే అయితే అది drawing room అవుతుంది.


M. SURESAN

19) Portico = పెద్ద ఇళ్లల్లో, బంగ్లాల్లో సింహద్వారం ముందున్న Covered area
20) Balcony = మేడ మీద నుంచి చూడటానికుండే ఖాళీ స్థలం
21) Ceiling = ఇంటిలోపలి కప్పు, roof =పైకప్పు.
22) Tiles = పెంకు; (Mosaic/ Floor tile)
23) bolt = తలుపు గడియ, గడియపెట్టడం. (latch అని కూడా అంటారు)
24) Cupboard = చెక్కతలుపుల అల్మారా.
25) Oven = (అవన్) పొయ్యి. oven fresh = అప్పుడప్పుడే తయారైన వంట (oven fresh Dosa)
26) Stale= స్టెయిల్- నిల్వ ఉండి చెడిపోయిన (ఆహార పదార్థాల్లాంటివి) Stale food, Stale bread. (Stale joke కూడా)

**Now practise the following:**

**Koumudi:** Hi Priya, ఏంటీ కనపడడం లేదు?

**Priya :** మొన్ననే కదా మనం కలుసుకున్నాం. నిన్న నేను మా మామయ్య ఇంటికెళ్లా. వాళ్లంతా ఇల్లు సర్దుకుంటుంటే నేనూ సాయం చేశాను.

**Koumudi :** వస్తువులు అమర్చడంలో నువ్వు నిజంగా గొప్ప దానివే. హాయిగా interior Decoration (ఇళ్ల లోపలి అలంకరణ) course చెయ్యి. బాగా సంపాదించుకోవచ్చు

**Priya :** అసలు నాకనిపిస్తుంది... ఇల్లంతా చిందరవందరగా ఎలా ఉంచుకుంటారో అని. మా ఇంట్లో ఓ కుర్చీ కొంచెం కదిలినా నాకు చికాగ్గా ఉంటుంది. (చికాకు - upset)

**Koumudi :** నాకూ tidy గా ఉంచుకోవడం ఇష్టమేకాని, అంత పట్టింపు లేదు. నువ్వు మరీ ఎక్కువలే!

**Priya :** ఏమన్నా అనుకో. ఒక దుమ్ముకణం కూడా నాకు కోపం తెప్పిస్తుంది. Speck of dust = దుమ్ము కణం)

**Koumudi :** నీది కొంత అసాధారణ మనస్తత్వమే.

**Priya:** నువ్వలా అనుకున్నా నాకేం బాధలేదు.

**Koumudi:** మరీ మీ పని పిల్ల జుట్టు చిందరవందరగా ఉన్నా భరిస్తున్నావేం?

**Priya:** ఆ అమ్మాయికి నన్ను రోజూ జడేయమంటావా? అప్పుడమ్మాయికి నేను servant అవుతా.



**ప్రశ్న:** ఆంగ్లభాషణ-7లో ఆమెకు ఈ డ్రెస్ చాలా ఇష్టం. అనేవాక్యాన్ని... She likes this dress అని అన్నారు. ఇందులో చాలా ఇష్టం అనే భావం స్ఫురించడం లేదు కదా! అలాగే ఆంగ్లభాషణ -8లో నువ్వెప్పుడూ ఆలస్యంగా రావు అనే వాక్యాన్ని You do not come late అని ఇచ్చారు. ఇందులో ఎప్పుడూ అనేభావం స్పష్టంగా లేదు. వివరించగలరు.
- కె.ఆర్. ప్రియదర్శిని, కాకినాడ

**జవాబు:** She likes this dress అనే వాక్యం బదులుగా She likes this dress a lot \very much అని ఉండాలి. You do not come late బదులుగాYou never come late అని ఉండాల్సింది. మీరు ఇంత జాగ్రత్తగా గమనించినందుకు ధన్యవాదాలు. We appreciate it. Keep it up.

**Answers:**

**Koumudi:** Hi Priya, You are not to be seen.

**Priya:** We met just the day (before). I went to my uncle's yesterday. They were tidying up their home. I lent a hand.
(lend a hand = సాయపడడం)

**Koumudi:** You are good at tidying up and keeping things neat. You had better do a course in interior decoration. You can earn a lot (of money).

**Priya:** I just wonder how people can keep their places untidy. Even a chair out of place at home upsets me.

**Koumudi:** I like tidiness, but I am not very particular about it ( be particular = పట్టింపుగా ఉండడం) You overdo things.

**Priya:** Call it what you like\ say whatever you like. I am upset when I see even a speck of dust.

**Koumudi:** Yours appears to be abnormal psychology.

**Priya:** I don't mind your saying so. (I don't mind = నాకు పర్వాలేదు)

**Koumudi:** How are you able to tolerate your servant girl's untidy hair?

**Priya:** (Do) you want me to comb her hair (into-plait= జడ). Then I shall be her servant.

ఆదివారం ఆంగ్లభాషణ–74లో
ఇచ్చిన తెలుగు సంభాషణకు ఇంగ్లిష్ వెర్షన్

**Gowtham:** How was your journey?

**Sekhar:** Very comfortable/quite comfortable

**Gowtham:** When did you arrive here?

**Sekhar:** The arrival times / time of arrival of the train is 10.35. But it was late by 15 minutes.

**Gowtham:** when are you visiting me?/ when are you calling at my place?/ when are you coming to my place?/ when can I have the pleasure of your visit? (చివరిది formal.)

**Sekhar:** I am busy with my work tomorrow and the day after, the next day I have some work at the university. If I have any time left that day, I will go to your place. Otherwise, it is difficult to say (If I can visit you or not)

**Gowtham:** You can come the day after that.

**Sekhar:** That's the day of my return (journey)

**Gowtham:** What is the time of departure of your train that day? isn't it in the evening? you can have lunch with us.

**Sekhar:** My wife wants to go shopping/ do some shopping that day

**Gowtham:** Have you booked tickets for that day?

**Sekhar:** Yes. All trains are full the next three days. I'll try my best to go to your place that day. If I am not able to, don't misunderstand me. When I come here next, I will certainly come to your place.

**Gowtham:** You disappoint me / that's very disappointing. I will come to the station that day to see you off. I'll get you some food to eat on the train.

**Sekhar:** Do come to the station, but don't bother about the food. I'll manage (make do) with the food on the train.

**Gowtham:** Let me get it. It is my pleasure.

**Sekhar:** OK

**Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి...**

**URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# ఘోరం జరిగిపోయింది...!

**Bhanu:** Ravi, you are late. But what's the matter? You appear to be in a shock.
(రవి, నువ్వు ఆలస్యంగా వచ్చావు. ఏంటి సంగతి? ఏదో షాక్‌లో ఉన్నట్టున్నావ్!)

**Ravi:** You can say that. Some thing terrible happened.
(అవును. ఘోరం జరిగిపోయింది.)
terrible = భయంకరమైన, ఘోరమైన

**Bhanu:** But what happened Ravi?
(ఏం జరిగింది? )

**Ravi:** Just wait. Let me recover.
(కాస్త ఆగు. నన్ను తేరుకోనీ)
recover = తేరుకోవడం, కోలుకోవడం
Recover from fever.
జ్వరం నుంచి కోలుకోవడం.
recovery = స్వస్థత
Wish you a speedy recovery.
(నువ్వు/ మీరు త్వరగా కోలుకోవాలని నా/ మా కోరిక)

**Bhanu:** OK OK. Take your time. Calm down.
(సరే. తీరిగ్గానే చెప్పు. ముందు కుదుటపడు.)

**Ravi:** (After a few minutes) I was on my way here on my bike. Just as I took the turn at the last cross roads, I heard a loud noise. I stopped and turned round to see what it was. Oh, God! a lorry had hit a boy on his cycle. Believe me, the boy and his cycle flew into the air and landed on the road. The boy hit the ground head on. Blood spilled all over. In no time a large crowd gathered. The boy in no more. Spot dead, I am sure.
(నా బైక్ మీద ఇక్కడ కొస్తున్నా. ఆ క్రాస్‌రోడ్స్ దగ్గర మలుపు తిరుగుతున్నా. పెద్ద శబ్దం. ఆగి తిరిగి చూశా. సైకిల్ మీద ఉన్న కుర్రాడిని లారీ ఢీకొంది. నమ్ము... నమ్మకపో సైకిల్‌తో సహా ఆ కుర్రాడు పైకి ఎగిరి కిందపడ్డాడు తల రోడ్డుకి తగిలేలా. అంతా రక్తం చిందింది. జనం అంతా పోగయ్యారు. కుర్రాడు అక్కడికక్కడే చని పోయాడు.)
spill = చిందడం/ ఒలకడం.
All over = ఆ చుట్టూ
In no time= క్షణంలో
No more = చనిపోవడం
spot dead = అక్కడికక్కడే, అప్పటికప్పుడే
spot= చోటు
flew= ఎగిరాడు (past tense of fly)
Head on= తల తగిలే విధంగా (ఎదురెదురుగా - ఇతర సందర్భాల్లో)

**Bhanu:** How shocking!
(ఎంత భయంకరం!)

**Ravi:** The body is lying there in a pool of blood. I was unable to bear the sight any longer. I came away. Poor boy.
(అతడి దేహం రక్తం మడుగులో పడి ఉంది. నేను చూడలేక వచ్చేశా. పాపం!)
pool = మడుగు (మామూలుగా అయితే నీళ్ల గుంటలు)
bear = భరించడం
any longer = ఇంక ఏమాత్రం.

**Bhanu:** Let's go and see. Where exactly is it?
(వెళ్లి చూద్దాం పద. ఎక్కడ జరిగింది? )

**Ravi:** I told you. At the cross roads. You go. I am still in a shock. I can't bear to see it again.
(చెప్పాను కదా. ఆ క్రాస్‌రోడ్స్‌లో. నువ్వెళ్లు. నేనింకా షాక్‌లోనే ఉన్నా. మళ్లీ చూడలేను)

ఇక్కడి సంభాషణ traffic, traffic accidents గురించే కదా. వాటికి సంబంధించిన మాటలు, వాటి ఉపయోగం చూద్దాం.

**Traffic accident కు సంబంధించిన మాటలు**

1) ఢీకొనడం = hit, crash into, ram
  a) The lorry hit the cyclist.
  (లారీ సైకిలిస్టును ఢీకొంది.)
  b) The truck crashed into the bus.
  (ట్రక్ ఎదురుగా వస్తున్న/ ఉన్న బస్సును ఢీకొంది.)
  crash కు ముఖ్యంగా ఎదురుగా వస్తున్న వాహనాన్ని ఢీకొనడం అని అర్థం.
  c) The truck rammed the bus.
  (బస్సును ట్రక్ చాలా గట్టిగా ఢీకొంది.)
  d) The truck ran into the bus from behind/ rammed the bus from behind.
  (బస్సును ట్రక్ వెనుక నుంచి ఢీకొంది.)
  e) The car crashed into a tree.
  (కారు చెట్టుకు ఢీకొంది.)
  f) The vehicle ran over the boy.
  (ఆ వాహనం కుర్రాడి మీద నుంచి వెళ్లింది.)



*Oh, God! a lorry had hit a boy on his cycle*

  run over = మీద నుంచి వెళ్లడం (passiveలో ఎక్కువగా వాడతారు).
  The man was ran over by the car.
  (అతడి మీద నుంచి కారు వెళ్లింది.)
  g) knock down కూడా వాడతారు.
  The lorry knocked down the man.
  (లారీ అతడిని కొట్టేసింది.)

2) die in an accident = ప్రమాదంలో చనిపోవడం

3) fatal = మరణానికి కారణమయ్యే
  fatal accident = మరణానికి దారితీసే ప్రమాదం
  A fatal road accident- three died in a fatal road accident.
  (మరణానికి కారణమైన ప్రమాదం - ఘోరప్రమాదంలో ముగ్గురు చనిపోయారు.)
  fatal - ఫెయిటల్ ('ఫెయ్' నొక్కి పలకాలి)

4) injury (ఇంజరి - 'ఇం' నొక్కి పలకాలి) = గాయం

5) injure (ఇంజ - 'ఇం' నొక్కిపలకాలి) = గాయపరచడం
  a) People have/ suffer/ sustain injuries in an accident.
  (ప్రమాదంలో ప్రజలు గాయపడతారు)
  b) The accident killed one and injured at least five.
  (ప్రమాదంలో ఒకరు చనిపోయారు, కనీసం అయిదుగురు గాయపడ్డారు.)
  c) severe (సివియ)/serious injury = తీవ్రమైన గాయం
  d) With severe injuries he joined a hospital.
  (తీవ్రమైన గాయాలతో ఆస్పత్రిలో చేరాడు.)
  e) severe injury = major injury (major - మెయ్‌జ)x minor injury.

6) die of an injury = గాయం వల్ల చనిపోవడం

7) spilling of blood = రక్తం చిందడం

8) bleed = రక్తం కారడం

bleeding injuries = రక్తం కారుతున్న గాయాలు
uncontrollable bleeding = ఆపలేని రక్తస్రావం
Bleed- bled (past)- bled (past participle)
They admitted him into hospital with bleeding injuries.
(గాయాలతో రక్తం కారుతున్న అతడిని వాళ్లు ఆస్పత్రిలో చేర్పించారు.)
Hospitalise = ఆస్పత్రిలో చేర్పించడం



M. SURESAN





9) peak traffic = అత్యంత రద్దీగా ఉన్న ట్రాఫిక్

10) cross roads = నాలుగు వీధుల కూడలి

11) overtake = ముందున్న వాహనాన్ని దాటివెళ్లడం

12) cross = వాహనానికి ఎదురువెళ్లడం
  overtake x cross (opposites)

**Now practise the following in English**

1) **Kiran:** ఈ లారీ, ఆటో డ్రైవర్లు ఎప్పటికీ తెలుసుకోరు!
**Venu:** ఏంటి సంగతి?
**Kiran:** ఈ న్యూస్ పేపర్ చూడు. రెండు ప్రమాదాలు. ఒకదాంట్లో ఎదురుగా వస్తున్న బస్‌ని ఢీకొన్న లారీ. పదిమంది గాయపడ్డారు. ఇంకో ప్రమాదంలో మనిషి మీద నుంచి లారీ వెళ్లింది. గాయపడిన అతడిని ఆస్పత్రికి తీసుకెళుతుంటే మధ్యలోనే చనిపోయాడు.
**Venu:** మొన్న ఆటో ఢీ కొనడంతో ఒకరికి తీవ్రంగా గాయాలై రక్తం కారడం చూశా. అతడు ట్రాఫిక్ ఎక్కువగా ఉన్నప్పుడు రోడ్ దాటుతుంటే ఆటో ఢీకొంది.
**Kiran:** చనిపోయాడా?
**Venu:** నాకు తెలీదు. కానీ అతడి గాయాలు మాత్రం చాలా తీవ్రమైనవే. తలకి కూడా గాయమైంది. అంతపెద్ద దెబ్బలతో బతకడం కష్టమే.
**Kiran:** ట్రాఫిక్ ప్రమాదాల్లో చనిపోయేవారి సంఖ్య చాలా దేశాల్లో కంటే మనదేశంలో ఎక్కువే.

**Answers**

1) **Kiran:** These lorry, auto drivers never learn.
**Venu:** What is the matter?
**Kiran:** See this newspaper. Two accidents. In one of the accidents, a lorry hit/ crashed. In another accident a lorry ran over a man, while they were taking him to hospital, with severe injuries, he died on the way.
**Venu:** The other day I saw a man bleeding from injuries. An auto hit him. While he was crossing the road in peak traffic, the auto knocked him down.
**Kiran:** Did he die? (Hope he did not die)
**Venu:** I don't know. But his injuries were serious. It is difficult for any one to survive such injuries.
(survive = దేని నుంచి అయినా బయట పడి బతకడం)
**Kiran:** The number of people dying in traffic accidents is more in our country than in many other countries.





**ప్రశ్న:**
1. Where do we keep Quotation marks at the end of the sentence? (after full stop or before full stop)
2. Kindly give a 'Pronunciation Guide' for all the typical words which we use in regular English.
3. Tatas and Birlas are tycoons. Is this correct to say the above sentence as" Both the Tatas and Birlas are Tycoons."
4. Kindly give some examples with the operators must, need, dare, used to, ought to (Positive statement, Negative, Yes-No Q, wh-Q)
5. Is it correct to say passive forms for present perfect continuous, future continuous and future perfect continuous tenses.

– ఎస్. రాజీ, తుని

**జవాబు:**
1. If the whole sentence is to be placed in quotations, they are placed after the full stop\ question mark\ exclamation.
She said, "I am no longer interested in it ."
He said, 'How can you do that?'
The tourist said, 'How beautiful the Taj is !'
If a word or group of words is to be placed in quotation the full stop comes after the question.
The Minister wants this to be, "Indiraraj".
2. We will do it, in fact we are doing it.
3. Correct sentences:
  a) The Tatas and the Birlas are tycoons.
  b) Both the Tatas and the Birlas are tycoons.
  (a) is better than (b) 'Both' is unnecessary here as even without it the meaning is clear.
4. We are going to discuss all these in the coming lessons. please wait.
5. It is bookish. The best thing is to avoid them totally.







# you could make it


M. SURESAN

**Ramu:** Hi Raghu, how was the debate yesterday?
నిన్న debate (డిబేయట్- జెయ్ నొక్కి పలుకుతాం) ఎలా సాగింది?

**Raghu:** Very exciting. We missed you very much. Why didn't you come?
చాలా ఉత్సాహంగా సాగింది. నువ్వు లేకపోవడమే మాకు వెలితిగా అనిపించింది. నువ్వెందుకు రాలేదు?

**Ramu:** I had important work, but thought I could finish it and be in time for the debate. But there was some delay and I couldn't be free until late in the evening.
చాలా ముఖ్యమైన పని, అయినా అది పూర్తి చేసుకుని debate ప్రారంభమయ్యేలోగా రాగలననుకున్నా. కానీ ఆలస్యమయింది. అంత వరకు free కాలేకపోయా.

**Raghu:** We know that you had work, but thought you could make it. We knew too you could understand the importance of the debate.
నీకు పని ఉందని తెలుసు, అయితే మేమంతా నువ్వు రాగలుగుతావనే అనుకున్నాం. దాని ప్రాముఖ్యం కూడా నువ్వు అర్థం చేసుకోగలుగుతావనే అనుకున్నాం.

**Ramu:** It was some thing I couldn't help. I feel sorry that I could not have the benefit of such a good debate.
ఆ విషయంలో నేను నిస్సహాయుడినైపోయాను. అలాంటి debate పోగొట్టుకున్నందుకు నాకు బాధగా ఉంది.

**ప్రశ్న:** *వాక్యంలో might have been able to + p.v., must have been able to + p.v., have been able to + p.v. construction ఉన్నప్పుడు వాటికి తెలుగు అర్థం ఎలా ఊహించుకోవచ్చు?*
*1) I have been able to get their permission*
*2) Haseena must have been able to persuade him*



*3) Miss Savithri might have been able to solve Mr. Uma Rao's problem. ఈ మూడువాక్యాలను ఎలాంటి సందర్భంలో ఎలాంటి అర్థం తెలిపేందుకు వాడొచ్చు?*
***– పాఠకుడు, కర్నూలు జిల్లా***

**జవాబు:**
Have been able to + p.v., might have been able to + p.v., must have been able to + p.v. అంటున్నారు కానీ, అలారాదు. have been able to/ might have been able to/ must have been to + 1st RDW (go, solve, persuade etc.) వస్తాయి. Have been able to/ might have been able to/ must have been able to తర్వాత passive voice ఎలా వస్తుంది? వాటి తర్వాత go, solve etc., plain infinitives వస్తాయి. వాటికి అర్థం:
1) I have been able to get their permission
వాళ్ల అనుమతి తెచ్చుకోగలిగాను.
2) Haseena must have been able to persuade him = హసీనా అతడిని ఒప్పించగలిగి ఉండాలి (గతంలో) - అంటే ఒప్పించగలిగింది అని.
3) Miss Savithri might have been able to solve Mr. Uma Rao's problem
సావిత్రిగారు ఉమారావుగారి సమస్యను పరిష్కరించగలిగేవారేమో. (సందేహం- పరిష్కరించి ఉండొచ్చు/ ఉండకపోయుండచ్చు).

**Raghav:** The first two prizes went to the teams from other colleges. Our college was able to get the III prize. The speech of one of the judges at the end of the debate was interesting. It seems he could debate and win prizes even as a school boy.
మొదటి రెండు prizes ఇతర colleges కు వెళ్లాయి. మన college III prize మాత్రమే తెచ్చుకోగలిగింది. Debate చివర judge speech చాలా interesting. చిన్న వయసులోనే ఆయన debates లో పాల్గొని prizes తెచ్చుకోగలిగేవాడట.

పై సంభాషణలో could తో ఉన్న verbs గమనిద్దాం.
1) could finish 2) couldn't be free 3) could make it 4) could understand 5) couldnot have (the benefit of) 6) could debate.

ఇంతకుముందు మనం 'can' అర్థం, ఉపయోగాలు తెలుసుకున్నాం కదా? can గురించి మనకు తెలిసింది. 1) can అంటే 'గల' అని సామర్థ్యాన్ని తెలుపుతుంది - in the present or in the future. 2) permissions 3) requests 4) possibilities కూ వాడతాం - ఇవి కూడా in the present or in the future.

**1)** 'could' is the past form of can. అంటే 'could' ను గతంలో సామర్థ్యాన్ని తెలపటానికి వాడతాం.
**a)** I can walk 6 kmph: నేను గంటకు 6 km నడవగలను (present or future)
I could walk 6 kmph: నేను గంటకు 6 km నడవగలిగేవాడిని (in the past - గతంలో)

Compare A and B below:
A) I can play cricket
నేను cricket ఆడగలను - now
B) My father could play cricket when he was a boy
మా నాన్న చిన్నప్పుడు cricket ఆడగలిగేవాడు- past
A) She can do any job
ఆమె ఏ పనైనా చేయగలదు- now or in the future
B) She could do any job
ఆమె ఏ పనైనా చేయగలిగేది - in the past కదా?
A) She can be here in an hour
ఆమె ఓ గంటలోగా ఇక్కడ ఉండగలదు.
an hour ఒక గంటకు - future కదా?
B) She could be here in
ఇక్కడ ఉండగలిగింది - past

చూశాం కదా - can, could - రెండూ కూడా సామర్థ్యాన్ని (ability) తెలుపుతాయి. అయితే can, ability in the present or in the future తెలిపితే could ability in the past ను తెలుపుతుంది.
could - 'be' form - ఉండగలగడం (past)
could + 1st RDW - could do, could sing, etc,.
action - పని చేయగలగటం.

Compare a) and b)
**a)** I can be the CM if I want
నేను అనుకుంటే Chief Minister కాగలను. (now/ in the future)
**b)** I could be the CM if I wanted
నేను అనుకుని ఉంటే chief minister అయ్యి ఉండేవాడిని. (past)
పైరెండూ (can be, could be) 'be' form. కాబట్టి 'ఉండగల' అని అర్థం.
**a)** I can sing better than any movie singer
నేను ఏ movie singer కన్నా బాగా పాడగలను - Now / in the future
**b)** I could sing better than Ghantasala
నేను ఘంటసాల కంటే బాగా పాడగలిగేవాడిని. (past)
ఇదీ 1st use of could - అంటే past ability తెలియపరచటం.

మొదట ఇచ్చిన సంభాషణలో 'could verbs' చూద్దాం.
**1)** I thought I could finish it
నేను పూర్తి చేయగలనని అనుకున్నా (past)
**2)** I couldn't (could not) be free
ఖాళీ అవలేకపోయాను.
She could do it = ఆమె చేయగలిగేది - past,
She couldn't (She could not) do it
ఆమె చేయలేకపోయింది - past
**3)** I thought you could make it
నువ్వు రాగలుగుతావని అనుకున్నా - past
**4)** You could understand its importance
దాని ప్రాముఖ్యం నువ్వు అర్థంచేసుకోగలిగేవాడివి- past
**5)** Could not have = పొందలేకపోయాను. (past)
**6)** Could debate = debate లో మాట్లాడగలిగేవాడు.

★ భారత్ cricket series గెలవలేకపోయింది
India could not win the series.
★ Sachin could not play well
సచిన్ బాగా ఆడలేకపోయాడు.
★ నేను boyhood (బాల్యం)లో బాగా ఆడగలిగేవాడిని
I could play well in my boyhood.
★ ఆమెకు అవకాశం ఉంటే చేయగలిగేదే.
She could do it if she had the chance.
★ I could understand Hindi well those days, but now I cannot. I have forgotten it
ఆరోజుల్లో హిందీ బాగా అర్థం చేసుకోగలిగేవాడినే, కానీ ఇప్పుడుకాదు. మరచిపోయా.

**Now practise the following in English:**

**1) Teacher:** నీ text book ఎక్కడ, Sudheer?
**Sudheer:** తేలేదు, Sir, తేవటం గుర్తుంచుకోలేకపోయాను.
**Teacher:** నీ home work మరి? అదైనా చేశావా?
**Sudheer:** చేయలేకపోయాను, Sir, నిన్నంతా నా కుడి చేయి నొప్పి.
**Teacher:** అన్నమైనా తినగలిగావా?
**Sudheer:** అది మాత్రం చేయగలిగానండి.
**Teacher:** అది చేయగలిగినప్పుడు, ఇదెలా చేయలేకపోయావు?
**Sudheer:** తింటే నొప్పి తగ్గి, homework చేయగలుగుతాననుకున్నా.
**Teacher:** తినగలిగావు, కానీ చదవలేకపోయావు. చిత్రమే. రేపు ఇలాంటి సాకులు చెప్పకు. కూర్చో

**2) Pramod:** Cricket ఆడగలవా? Pradeep?
**Pradeep:** ఆడగలిగేవాడిని, ఇప్పుడుకాదు.
**Pramod:** ఇప్పుడు ఆడలేవా?
**Pradeep:** No, అప్పుడయితే regular గా practice చేయగలిగేవాడిని. ఇప్పుడు చేయలేకపోతున్నా, Office లో పొద్దున 8 నుంచి సాయంత్రం 5 వరకు busy కాబట్టి.
**Pramod:** ఏదైనా పెద్ద matches లో ఆడగలిగావా?
**Pradeep:** ఎందుకాడలేదు? మా college team లో, అంతకుముందు school team లో చాలా సార్లు ఆడగలిగాను.
**Pramod:** నీ job మార్చుకోలేవా? Practice కు టైం కుదిరేటట్టుండే job చూసుకో లేవా?
**Pradeep:** ఇప్పుడు కాదు. బహుశ, వచ్చే సంవత్సరం.

**Answers:**

**1) Teacher:** Where is your text book, Sudheer?
**Sudheer:** (I) didn't get/ bring it, sir. I could not (couldn't) remember to get it.
**Teacher:** What about your home work? Did you do atleast that?
**Sudheer:** I couldn't (could not) do it, Sir, My right hand ached the whole of yesterday.
**Teacher:** Could you eat atleast?
**Sudheer:** I could (eat), sir.
**Teacher:** When you could eat, Why couldn't you (could you not) do your home work?
**Sudheer:** I thought if I ate I would have less pain and then I could do the home work.
**Teacher:** You could eat, but couldn't study. Strange. Don't give me these excuses tomorrow. Sit down (సాకు= excuse).

**2) Pramod:** Pradeep, Can you play cricket?
**Pradeep:** I could (play cricket), but no longer (conversationలో I could అంటే చాలు, I could play cricket అనక్కరలేదు. No longer = ఇక/ఇప్పుడు లేదు).
**Pramod:** Can't you play (now)?
**Pradeep:** Not any more (ఇది కూడా Conversational. ఇప్పుడు/ ఇక లేదు). Those days I could practise regularly. Now I cannot/ am not able to, because I am busy in office from 8 morning to 5 evening/morning 8 to evening 5.
**Pramod:** Could you play in any big matches?
**Pradeep:** Why not? I could for my college team and before that for my school team a number of times.
**Pramod:** Why can't you (can you not) change your job. Why can't you look for a job which gives you time for practice.
**Pradeep:** Not now. Next year perhaps.

## సివిల్ సర్వీసెస్ 2006

యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ మే 14, 2006న సివిల్ సర్వీసెస్ (ప్రిలిమినరీ) పరీక్షను నిర్వహించనుంది.

**అర్హతలు:**
ఆగస్టు 1, 2006 నాటికి వయస్సు 21 సంవత్సరాలకు తక్కువ ఉండకూడదు. 30 ఏళ్ల దాటకూడదు. ఎస్సీ, ఎస్టీ, ఇతరులకు నిబంధనలమేర మినహాయింపు ఉంటుంది.
డిగ్రీ లేదా తత్సమాన కోర్సు చేసినవారు అర్హులు.
అప్లికేషన్ ఫారంను రూ.20 చెల్లించి నిర్దేశిత పోస్టాఫీసుల నుంచి పొందవచ్చు
రూ.50 ఫీజును సెంట్రల్ రిక్రూట్‌మెంట్ ఫీ స్టాంపు ద్వారా చెల్లించాలి.
అప్లికేషన్లు చేరాల్సిన చివరి తేదీ: జనవరి 2, 2006.
చిరునామా:
Secretary,
Union Public Service Commission,
Dholpur House, Shahjahan Road,
New Delhi 110069
సిలబస్, పరీక్ష విధానం, కేంద్రాలు, మార్గదర్శకాలు, ఇతర పూర్తి వివరాల కోసం డిసెంబరు మూడో తేదీ నాటి ఎంప్లాయిమెంట్ న్యూస్ లేదా రోజ్‌గార్ సమాచార్ చూడండి. website: http://www.upsc.gov.in

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# Could you call tomorrow?




**Snehitha:** Hi Aneesha, when did you reach home last night?
నిన్న ఎన్నింటికి చేరావింటికి?

**Aneesha:** I couldn't reach home (could not reach home) till 10
10వరకు ఇంటికి చేరుకోలేకపోయాను

**Snehitha:** O my! Aneesha, never be out so late at night. It could be very dangerous for girls to be out to be alone so late out. Any thing could happen.
అమ్మో! అంతసేపు రాత్రిపూట ఒంటరిగా ఉండకు. ఆడపిల్లలంతసేపు బయట ఉండటం చాలా ప్రమాదం.

**Aneesha:** But I have a cell, you know. So I was in touch with home. My brother met me half way on my way home. A cell could be helpful that way.
కాని నా దగ్గర Cell ఉందిగా. ఇంటికి Phone చేస్తూనే ఉన్నా. మా బ్రదర్ సగం దూరం వచ్చి కలుసుకున్నాడు. Cell ఆ విధంగా సహాయపడుతుంది.

could - గతంలో సామర్థ్యాన్ని తెలుపుతుందని కిందటి lesson లో తెలుసుకున్నాం.

**a)** He could walk very fast when he was twenty five years old.
అతడు 25 ఏళ్లప్పుడు చాలా వేగంగా నడవగలిగేవాడు
(Compare: He can walk fast)

**b)** She could sing better than most other singers of her day.
ఆమె తన సాటి గాయకుల్లో చాలామందికంటే బాగా పాడగలిగేది
(She can sing-)

**c)** When could you reach home?
నిన్న ఎన్నింటికి ఇంటికి చేరగలిగావు?
(When can you reach home?)

**d)** Couldn't you get better marks than that. Can you get-

కాబట్టి could వాడకంలో ముఖ్యమైనది - గతంలో సామర్థ్యాన్ని తెలపటం. పై సంభాషణలో అదే చూశాం.

**1)** I couldn't reach home
నేను ఇల్లు చేరుకోలేకపోయాను.

**2)** When could you reach home last night?
నీవు రాత్రి ఎప్పుడు ఇల్లు చేరుకోగలిగావు?

ఇవన్నీ ability in the past
ఇప్పుడు Could కు ఉన్న రెండో ఉపయోగం చూద్దాం. పై సంభాషణలో ఈ sentence గమనించండి.

**1)** It could be dangerous for girls
ఆడపిల్లలకు అది ప్రమాదకరం కాగలదు.

**2)** A cell could be helpful that way
Cell ఆ విధంగా ఉపయోగపడగలదు.

పై రెండు sentences లో 'could' కు ఓ విషయం సాధ్యం, అవగలదు అనే అర్థం వస్తోంది కదా. అంటే Possibility కానీ Probability కానీ తెలుపుతుంది. జరగకపోయినా జరిగే అవకాశం ఉంది అని చెప్తుంది - Present లో

**1)** మళ్లీ వరదలు రావచ్చు, లోతట్టు ప్రాంతాలు మునిగిపోవచ్చు
There could be floods again, and the low lying areas could be submerged.
(low lying areas =లోతట్టు ప్రాంతాలు, Submerge = మునిగిపోవటం) - Present or future.

**2)** He could help you
అతడు నీకు సహాయం చేయగలడు - సహాయం చేసే అవకాశం ఉంది. (కానీ సహాయం చేయకపోవచ్చు- ఎందుకంటే నీ పరిస్థితి అతడికి తెలియాలి. ఇది కూడా Present)

**3)** ఆ పని పూర్తవటానికి వారాలు పడుతుందేమో?
It could take weeks for the work to be finished.

ఇలాంటి సందర్భాల్లో 'can' కూడా వాడతామని ఇంతకు ముందు lesson లో చూశాం కదా!

**1)** ఆ పిల్లి దగ్గరకు వెళ్లకు. అది భయపడుతుందేమో.
Don't go near the cat. It can get frightened/ it could get frightened.

**2)** మనకు డబ్బు వచ్చేసరికి నెలలు పట్టవచ్చు
It can take/ could take months for us to get the money.

**3)** వాళ్లతో పరిచయాలు లాభదాయకంగా ఉండగలవు.
Some connections can be / could be useful.

ఈ sentences లో can, could రెండూ వస్తున్నాయి కదా. అంటే Possibility (జరిగే అవకాశం ఉంది - జరుగుతుందా, లేదా అన్న విషయంతో సంబంధం లేకుండా) తెలిపేందుకు can, could, రెండూ వాడుతున్నాం. అయితే కొద్దిగా తేడా ఉంది. could కన్నా కూడా can కు Possibility – అంటే జరిగే అవకాశం ఉంది.

**a)** It can be dangerous to go out in such weather
ఇటువంటి వాతావరణంలో బయటకు వెళ్లటం ప్రమాదం కావచ్చు

**b)** It could be dangerous to go out in such weather
- దీని అర్థం, (a) అర్థం ఒకటే. అయితే Sentence (a) can, could కన్నా ఎక్కువ Possibility అంటే జరిగే అవకాశం ఎక్కువ అని సూచిస్తుంది.

ఇప్పటివరకు could కు రెండు ఉపయోగాలు చూశాం.

**1)** Ability in the Past, as the past form of can

**2)** Possibility or probability

ఇప్పుడు చూడండి.

**Udai:** Just how busy are you Mr.Vinai?
మీరెంత busy ఇప్పుడు?

**Vinai:** Why, What's the matter? (ఏంటి విషయం? )

**Udai:** I want a favour from you, Mr.Vinai.
(మీరు నాకో సహాయం చేయాలి)

**Vinai:** What's it, Mr Udai? (ఏంటో చెప్పండి)

**Udai:** Could you have a look at the plan of the house I want to built? You are an expert in these matters and I want your suggestions and advice.
నేను కట్టబోతున్న ఇల్లు Plan ఓసారి చూడగలరా. ఇటువంటివి మీకు చాలా బాగా తెలుసుకదా. మీ సూచనలు, సలహాలు నాకు కావాలి.

{expert (ఎక్స్‌పర్ట్ - పర్ట్, bird లో ir లాగా పలకాలి, 'ఎ' నొక్కి పలకాలి) = ఒక విషయంలో ప్రావీణ్యం ఉన్న వాళ్లు.
Site = ఇల్లు కట్టటనే స్థలం / House site}

**Vinai:** Certainly. But today I am busy. I can do it tomorrow. I am free.

**Udai:** Could you also visit the site, please?
ఇంటి స్థలాన్ని కూడా ఓసారి చూడగలరా?

**Vinai:** No Problem. Could you call me tomorrow morning at 8? I'll let you know when we can see the plan and also the site.
మీరొక్కసారి రేపు ఉదయం 8కి phone చేయండి. Plan, site రెండూ ఎప్పుడు చూడగలనో చెప్తాను.

**Udai:** Could you make it at 10?

**Vinai:** That Shouldn't be a problem. Please do call me at 8, and we can fix at.
సమస్యేం ఉండకపోవచ్చు. ఎనిమిదింటికి Phone చేయండి. మనం ఏర్పాటు చేసుకోవచ్చు

ఈ సంభాషణలో మీరు గమనించే ఉంటారు- could అన్నిచోట్లా question form లో రావటం.

**a)** Could you have a look at the plan...?
**b)** Could you also visit...?
**c)** Could you call tomorrow?
**d)** Could you make it at 10?

పై సందర్భాల్లో అన్నిట్లో కూడా, could, you తో questions form లో వస్తోంది కదా? ఇలా could ను present లో formal, polite requests కు, అంటే చాలా మర్యాదకరంగా, మనం చనువు తీసుకోలేని వాళ్లతో (formal) ఏదైనా request చేయాలనుకుంటే వాడతాం.

(make it = ఏదైనా పని చేయటం)
He made it to the top
అత్యున్నత స్థాయికి చేరుకున్నాడు.

Formal గా కాకపోయినా, చాలా polite (మర్యాద)గా request చేయటానికి could తప్పనిసరి.

**Compare:**
**a)** Can you lend me your bike?
**b)** Will you lend me your bike?
**c)** Would you lend me your bike?
**d)** Could you lend me your bike?

Sentences (a), (b), (c) మూడూ ఇంతకుముందు lessons లో చూశాం - అవన్నీ కూడా requests. Sentence (d) 'Could' తో కూడా - request నే తెలుపుతోంది కదా. అయితే the interesting thing is, ఈ నాలుగింటిలో ప్రతిదానికీ, మిగతావాటికీ తేడాలున్నాయి. అవి చాలా సున్నితమైన తేడాలు - subtle (distinctions)

**a)** Can you lend me your bike?
ఈ request మిగతా అన్నింటికంటే తక్కువ polite, informal. అంటే మనకు బాగా తెలిసి చనువు తీసుకోగలిగిన వాళ్లతో వాడే form of request.
**1)** Can you buy the tickets for me?
నాకు tickets కొంటావా?
**2)** Can you give me a lift?

**b)** Will తో question form లో చేసే request, can కన్నా కొంచెం ఎక్కువ polite, కాస్త formal. మనం అంతగా చొరవ తీసుకోలేని, కొంచెం తెలిసినవాళ్లతో చేసే request.
**1)** Will you help me in the matter?
ఈ విషయంలో కాస్త సాయం చేస్తారా?
**2)** Will you drop me at college on your way?
దారిలో college దగ్గర నన్ను drop చేస్తారా?

**c)** 'would' తో చేసే request పూర్తిగా formal. మనకంటే పై స్థాయిలో ఉన్నవాళ్లు, మనం అసలు చనువు తీసుకోని వాళ్లతో చేసే request - would.
**1)** Would you visit me once?
ఓసారి మా ఇంటికొస్తారా?
**2)** Would you give us the pleasure of a song?
మీ పాట వినే అవకాశమిస్తారా?

**d)** Could తో చేసే requests అన్ని forms లో అత్యంత మర్యాదకరమైనది (Politest form of request), కొంత formal కూడా. మర్యాదకు ప్రాముఖ్యం ఎక్కువ.

Uday, Vinai పై సంభాషణలో ఒకర్నొకరు Mr. అని సంబోధించుకుంటున్నారు కదా. అంటే వాళ్ల సంబంధం కొంచెం formal. అంతేకాకుండా Vinai అంత తీరికలేని expert. అలాంటి సందర్భాల్లో could ను request కు వాడటం చాలా polite గా ఉంటుంది. ఇది present లోనే.

**a)** Could you have a look at the plan?
(చాలా మర్యాదగా) ప్లాన్ ఓసారి చూస్తారా?

**b)** Could you also visit?
ఓసారి (site కు) రాగలరా?
(రండి, please అని)

**c)** Could you call tomorrow?
రేపోసారి phone చేస్తారా?
(చేయండి. అని request)

**d)** Could you make it at 10?
పదింటికి రాగలరా?

**1)** Could you help me get a seat, (please)
seat విషయంలో కాస్త సాయం చేస్తారా?

**2)** Could you recommend my case to the CM?
CM గారితో నా విషయం చెప్తారా?

ఇదీ could రెండో ఉపయోగం.

తరతమ భేదాలతో, can, will, would, could ఉపయోగాలు చూడండి.

| | | | could |
|---|---|---|---|
| | | would | politest and formal |
| | will | veryformal and polite | |
| can | slightly formal and polite | | |
| least formal least polite | | | |

సందర్భాన్నిబట్టి ఇవి వాడితే మీ communication effective గా ఉంటుంది.

M. SURESAN

**Now practise the following:**

**Amar:** మీరు నాకో సాయం చేయగలరా?

**Bhanu:** ఏంటది?

**Amar:** రెండురోజులు మీ రూంలో నన్నుండ నీయరా?

**Bhanu:** నేను నా roommate ను అడుగుతా. అతనికేం అభ్యంతరం ఉండదనే అనుకుంటున్నా. ఏంటసలు సమస్య?

**Amar:** మా రూం చుట్టూ ఉన్న mechanic sheds/ garages వల్ల చాలా గొడవగా ఉంది. Room మార్చాలనుకుంటున్నా.

**Bhanu:** Ok. అయితే ఈ సాయంత్రం ఓసారి నన్ను కలుసుకుంటారా? మా రూంలో అంత చోటేం లేదు. సామాన్లు కొన్ని తగ్గించుకొని రాగలరా?

**Amar:** నాకు ఎక్కువ సామాన్లేం లేవు. Books, clothes and bed తప్ప

**Bhanu:** రేపుదయం దాకా wait చేయగలరా? మీరు వచ్చేలోపల Room కొంత సర్దుతా.

**Answer:**

**Amar:** Could you help me? / Could you do me a favour?

**Bhanu:** What is it?

**Amar:** Could you let me stay in your room for two days?

**Bhanu:** I will talk to my room mate. I don't think he will have any objection. What's the matter?

**Amar:** The garages around my room make a lot of noise. I want to move.

**Bhanu:** OK. Could you meet me this evening? Not much room in our place. Could you make do with less luggage?

**Amar:** I don't have much luggage except my books, clothes and bed.

**Bhanu:** Could you wait till tomorrow morning? I'll tidy up the room before you move in.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# When could I see you?

**Charan:** Could I speak to you for a few minutes?
మీతో రెండు నిమిషాలు మాట్లాడవచ్చా?

**Damodar:** What about? Go ahead.
దేని గురించి? మాట్లాడండి.

(Go ahead = కానివ్వండి - permission ఇవ్వటానికి వాడే expression; encourage చేయటానికి, అంటే ప్రోత్సహించటానికి కూడా వాడతాం)

**Charan:** A few of us want to have a short meeting this evening. Could we have it on your terrace?
మేం కొందరం ఓ చిన్న meeting పెట్టు కోవాలనుకుంటున్నాం. మీ డాబా మీద పెట్టుకోవచ్చా?

(Terrace - pronunciation - టెరస్; 'టె' నొక్కి పలుకుతాం; డాబాగాని, ఇంటిని ఆనుకొన్న ఆరు బయట ప్రదేశంగాని. coffee లాంటివి తాగుతూ, కుర్చుని తీరిగ్గా కబుర్లు చెప్పుకోడానికి ఇలాంటి ప్రదేశాలను ఉపయోగిస్తుంటారు. India లో అయితే ఎక్కువ డాబా అనే అర్థంతో వాడతాం)

**Damodar:** Oh, no problem. When exactly is it?
పెట్టుకోండి. కరెక్ట్‌గా ఎప్పుడు?




3) Could we be disturbing you?
(మీకేమన్నా disturbance అవుతుందా? / మేం మిమ్మల్ని disturb చేయడంలేదు కదా? )

4) Could I know? (తెలుసుకోవచ్చా? )

5) Could we go ahead then?
(అయితే మేం పెట్టుకోవచ్చు కదండీ (meeting?)

మీరు గమనించే ఉంటారు పై సందర్భాల్లో అంతా could, I/ We తో question form లో ఉండటం. ఇలా could I/ We తో question form లో వస్తే చాలా polite గా అడిగే permissions/ (అనుమతి) అవుతుంది.

పైవన్నీ కూడా చూడండి- polite గా permission అడుగుతున్న వాక్యాలే.

a) మళ్లీ మిమ్మల్నెప్పుడు కలుసుకోమంటారు?
When could I see you again?

b) Could we wait for you here, in case you are coming back?
మీరు తిరిగి వచ్చేట్టయితే మమ్మల్ని ఇక్కడ wait చేయ మంటారా? / మేం ఇక్కడ wait చేయమా?

c) ఆ order copy తీసుకోవచ్చా?
Could I take a copy of the order with me?/ Could I take a copy of the order?
(ముఖ్యంగా superior status లో ఉన్నవాళ్ల permission అడిగేటప్పుడు)

d) Could you let me sit here for a while
నన్నిక్కడ కాస్త కూర్చోనిస్తారా? / నేనిక్కడ కూర్చోనా?

సంగ్రహంగా **uses of could in conversation:**

1. As the past form of can, to express a past ability.
2. To express a possibility in the present.
3. Expressing the politest form of request in the present.
4. To ask for permissions in a very polite and a very formal manner.

**Compare sentences (a) and (b) below:**

**(a)** I could play very well when I was young.
**(b)** I was able to play well when I was young.

**Meaning of (a):** నేను young గా ఉన్నప్పుడు బాగా ఆడగలిగేవాడిని. (ఆడగలిగిన సామర్థ్యం ఉండేది, ఆడాను అని కచ్చితంగా తెలియదు)

**Meaning of (b):** నేను young గా ఉన్నప్పుడు బాగా ఆడగలిగాను. (ఆడగలిగిన సామర్థ్యం ఉండేది, ఆడాను కూడా)

**Charan:** About 5. Could we be disturbing you? It won't be for more than hour.
(5, ఆ ప్రాంతంలో. మీకేం disturbance ఉండదు కదా? )

**Damodar:** No disturbance at all. Could I know how many are attending the meeting? Just to tell my servant to place chairs there and keep some drinking water ready.
అదేం పరవాలేదు. ఎంతమంది వస్తున్నారు meeting కు? ఎందుకంటే మా పని కుర్రాడితో చెప్పి కొన్ని chairs వేయించి, తాగ టానికి నీళ్ల ఏర్పాటు చేద్దామని.

**Charan:** Thank you, but don't bother. We will arrange all those things ourselves. Could we go ahead then?
అవేం అక్కర్లేదులెండి. మేం చూసుకుంటాం. మేం meeting అయితే పెట్టుకోవచ్చు కదా.

(Don't bother = ఆ విషయం వదిలేయండి - పట్టించుకోకండి. bother = బాధ = ఒకరిని విసిగించటం. ఇక్కడ don't bother, don't bother (your self) అని. అంటే పట్టించుకోవద్దని)

**Damodar:** Please do.
(కానివ్వండి. అభ్యంతరం లేదు)

**Charan:** Thanks a lot.

**Damodar:** You are welcome.

ఇంతవరకు మనం **'could'**ను గురించి తెలుసుకున్నవి:

1) 'Could' is the past form of can, and expresses ability in the past. (గతంలో సామర్థ్యం తెలుపుతుంది)
canకు past form గా express = వ్యక్తపరచటం, తెలియపరచటం)

2) 'Could' expresses a possibility in the present (ప్రస్తుతం ఒకపని / పరిస్థితి సాధ్యతను - జరిగే అవకాశాన్ని తెలియపరుస్తుంది)

3) 'Could' with you in the question form express a very polite and formal request. (youతో could question formలో వాడితే చాలా మర్యాదగా చేసే request ను తెలుపుతుంది)

ఇప్పుడు **observe the use of could in the opening conversation:**

1) Could I speak to you for a few minutes?
(కాసేపు మీతో మాట్లాడవచ్చా? )

2) Could we have it on your terrace?
(మీ terrace మీద పెట్టుకోవచ్చా? )

చూశారు కదా, could, I/ We తో question form లో వస్తే చాలా polite గా permission అడగటానికి వాడతాం.

ఇంతకుముందు చూశాం, can, shall ను కూడా I/ We తో question form లో permission అడగటానికి వాడతాం అని. అయితే can, shall, could, I/ We లతో question form లో permission కు వాడినప్పుడు వీటిల్లో ప్రతిదానికి మిగతావాటికి చాలా సున్నితమైన (subtle) తేడాలు ఉన్నాయి.

**Look at the following diagram:**

For permission in the question form with I/ We:

| can | shall | could |
|---|---|---|
| Informal and casual | Formal and polite | very polite and very formal |

అంటే (a) సామర్థ్యాన్ని మాత్రం తెలుపుతుంది; ఆ సామర్థ్యంతో పని జరిగిందో లేదో తెలియదు.


M. SURESAN

(b) ఆ సామర్థ్యంతో పని సాధించటం - జరిగింది.

అయితే ఈ could కూ, was able to కు ఉన్న తేడా రాను, రానూ సమసిపోతోంది.

ముఖ్యంగా 'not' తో, 'question' లో ఈ తేడా అసలు కనిపించదు.

1) He could not play well
He was not able to play well.
ఈ రెండింటి అర్థంలో ఏ విధమైన తేడా లేదు, అలాగే-

2) She could not sing well
She was not able to sing well.
ఆమె పాడలేకపోయింది. రెండు forms ఒకటే.
Questions లో కూడా దాదాపు అంతే.

3) How could he get the prize?
How was he able to get the prize?
అతడు prize ఎలా పొందగలిగాడు?

Question లో could, was/ were able కన్నా ఎక్కువ common. How could he come so early? అనేదే, How was he able to come so early కన్నా ఎక్కువ వాడుతుంటారూ, ఎక్కువ వినపడుతుంది కూడా.

4 (a) Could they win the match?
(b) Were they able to win the match?
(Match గెలవగలిగారా? )

ఇటువంటి చోట్ల కూడా, (b) కంటే (a) more common. ఇవీ could కు ఉన్న అర్థాలూ, ఉపయోగాలూ.

**Now practice the following in English.**

**Ramarao:** పుస్తకం ఓసారి చూడనిస్తారా?

**Govind:** కాసేపు wait చేస్తారా? పూర్తవటానికి ఇంకో రెండు పేజీలున్నాయి.

**Ramarao:** మీ phone ఓసారి వాడుకోనా? ఓ important call చేయాలి.

**Govind:** నిరభ్యంతరంగా. కానీ కాస్త low voice లో మాట్లాడతారా?

**Ramarao:** మిమ్మల్ని disturb చేయనులెండి.

**Govind:** నేనిప్పుడే పుస్తకం మీకిస్తే, మళ్లీ నాకు రేపొ ఇచ్చేస్తుందాండి?

**Ramarao:** ఇంకొక్కరోజు wait చేయగలరా? అంటే నేను ఎల్లుండికివ్వగలను.

**Govind:** OK.

__Answers:__

**Ramarao:** Could you let me have a look at the book?

**Govind:** Could you wait a little? Two more pages and I shall be through.

**Ramarao:** Could I use your phone once? I have important call.

**Govind:** Go ahead, But could you speak low?

**Ramarao:** Oh sure, I won't disturb you/ No disturbing you.

**Govind:** If/ suppose I give you the book now When could I have it back? Could I have it back tomorrow?

**Ramarao:** Could you wait for one more day, that is till the day after (tomorrow)?

**Govind:** OK.

**ప్రశ్న:** *Cast తో కింది phrasal verbs ఎలా వాడాలో తెలుపగలరు.*
*1) cast in eye - కొంచెం మెల్ల*
*(ఆమెకు కొంచెం మెల్ల. అతడికి మెల్ల కన్నుంది)*
*2) cast of features - ఆకార స్వరూపం. రీతి, లక్షణం.*
*3) cast of mind - మానసిక ధోరణి.*

**– ఎన్.వరప్రసాద్, నెల్లూరు**

**జవాబు:** 1) cast in the eye - మెల్ల అనే అర్థంలో correct. కానీ ఈ మాట Old Fashion. ఇప్పుడు వాడుకలో లేదు. దాని బదులు మెల్లకన్ను అనడానికి ఇప్పుడు వాడుతున్న మాట - squint.

అయితే cast in the eye వాడాలనుకుంటే మామూలుగానే,
She/ he has a cast in the/ her eye.
దీనికి modern - She has a squint/ She is squint eye.
He is born with a squint.




2) Cast of feautres- - ఆకార స్వరూపం - కన్ను, ముక్కుతీరు -
a) She has a wondeful/ beautiful/ fine cast of features -
b) Her cast of features is attractive/ Charming.
పై రెంటికీ అర్థం ఆమె మంచి అందం కలది/ అందమైనది - ఆమె కన్ను ముక్కుతీరు అందంగా ఉంటుంది.

3) Cast of mind - మానసిక ధోరణి -
He has a gentle cast of mind - నెమ్మదస్తుడు.
ఇటువంటి అర్థాలు కొన్ని మిగతా Parts of the body కి కూడా వస్తాయి.
a) I like the beautiful cast of her nose - ఆమె ముక్కు ఆకారం నాకిష్టం. అంత బాగుంటుంది. (Cast of the mouth/ eyes etc.)

4) Cast (noun) - The group of actors in a drama or in a movie - నాటకం/ సినిమా తారాగణం.
The cast of the movie includes several great actors.
(చాలామంది గొప్ప నటులున్నారు ఆ సినిమాలో)

5) Cast (noun) - మూస, అచ్చు (Mould).
వినాయకచవితి రోజు బంకమట్టితో మూసలో పోసిన వినాయకుడి బొమ్మకు పూజ చేస్తాం. దాన్నేమనొచ్చు?
A clay cast of Lord Vinayaka. Cast - ఆ పోతలో పోసే అచ్చు.
Plaster of Paris cast: ఎముకలు, కీళ్లు విరిగితే (fracture అయితే), వాటికి వేసే bandage.
He is moving about with a plaster of paris cast around his elbow. మోచేతి చుట్టూ Pop cast వేస్కొని తిరుగుతున్నాడు.

6) Cast of a net. చేపల వల విసురుడు -
A Single cast brought in a hundreds of fish -
ఒకసారి విసిరిన వలలో వందలాది చేపలు పడ్డాయి.
Cast of an eye - చూపు విసరటం
A cast of her evil eye would make many shiver in fear - ఆమె ఒక్క చెడుచూపుతో ప్రజలు భయంతో వణికిపోతారు.
Cast (verb) = విసరటం - transitive - దేన్నైనా విసరటం
Cast a look = చూపు విసరటం
Cast an eye over/ some thing = దేనివైపన్నా చూడటం
Cast a spell = మంత్రముగ్ధుల్ని చేయడం

Cast a vote = ఓటు వేయటం. Cast light = వెలుగు ప్రసరింపచేయటం. (ఎక్కువగా) అర్థంకాని విషయాన్ని వివరించటం... ఇంకా Cast తో ఇలాంటి Phrasal verbs చాలా ఉన్నాయి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

**Govind:** Hi Venkat, when did you return from Tirupati?
(తిరుపతి నుంచి ఎప్పుడు తిరిగొచ్చావ్?)

**Venkat:** How do you know I had been to Tirupati?
(నేను తిరుపతికెళ్లానని నీకెలా తెలుసు?)

**Govind:** You can't hide your tonsured head, can you?
(నీ గుండు తల దాచుకోలేవు కదా?)
(Tonsured = 'టాన్‌షడ్' ('టా' నొక్కి పలుకుతాం)

**Venkat:** You are right. I returned last night.
(నువ్వు correct. నిన్న రాత్రే తిరిగొచ్చాను)

**Govind:** How was the pilgrimage?
(నీ యాత్ర ఎలా సాగింది? Pilgrimage = తీర్థయాత్ర)

**Venkat:** Not so bad, we had the help of a temple official, so we didn't wait long to have the darshanam.

**Govind:** How was the rush of pilgrims? Was the crowd very big?
(యాత్రికుల తాకిడెలా ఉంది? జనం ఎక్కువగానే ఉన్నారా?)

**Venkat:** O it was certainly a big crowd. Some had to wait for 72 hours to get the darshanam. But I told you, thanks to a temple official, we had it easy.
(జనం బాగా ఎక్కువే. కొంతమందయితే 72 గంటలు వేచి ఉండాల్సి వచ్చింది దర్శనానికి. చెప్పాను కదా. Temple అధికారి సహాయంతో మాకంతా సులభంగా అయ్యింది)

**Govind:** Did you have a dip in the Pushkarini
(పుష్కరిణిలో స్నానం చేశావా? Dip = పవిత్ర నదుల్లో మునగటం)

**Venkat:** I very much wished to, but that day no one was allowed to have the dip.
(అనే అనుకున్నాను కానీ ఆరోజు ఎవరినీ అనుమతించలేదు)

**Govind:** So it all went off very well.
(అయితే అన్నీ బాగానే జరిగాయన్నమాట)

**Venkat:** Yea. We finished our ablutions the temple by 9 and were out by 11. Again thanks to the temple official.
(స్నానాదికాలన్నీ ఎనిమిదింటికయిపోయాయి. గుడిలోకి తొమ్మిదింటికి వెళ్లాం. పదకొండింటి కంతా బయటికొచ్చేశాం, ఆ temple అధికారి దయవల్ల)

**Govind:** Did you go to any other place on the way or way back?
వెళ్లేప్పుడుగానీ, వచ్చేప్పుడుగానీ ఇంకెక్కడికయినా వెళ్లారా?

**Venkat:** We visited Srikalahasti. We had the rare opportunity of watching Mahabhishekam to lord Shiva. We watched too offerings being made to the god.
(శ్రీకాళహస్తికెళ్లాం. మహాభిషేకం చూసే అరుదైన అవకాశం కలిగింది. దేవుడికి నైవేద్యం పెట్టటం కూడా చూశాం)

**Govind:** Didn't you go to Tiruchanur to have a darsanam of goddess Padmavathi, Lord Venkateswara's consort?
(వెంకటేశ్వరస్వామి భార్య పద్మావతి అమ్మవారిని చూడటానికి తిరుచానూరు వెళ్లలేదా?)

**Venkat:** We did, of course. I forgot to tell you of it. (వెళ్లాం. చెప్పటం మరిచా)

పై సంభాషణ అంతా యాత్రలకు పుణ్యస్థలాలకు సంబంధించి అని తెలుస్తూనే ఉంది కదా. మన మామూలు conversationలో ఇవన్నీ కూడా పుణ్యస్థలాలకు యాత్రలకు సంబంధించిన vocabulary; మనం తరచువాడే, వాడగల మాటలు. ఇవి తెలుసుకుంటే తడుముకోకుండా మనం English లో యాత్రల గురించి చెప్పవచ్చు.




---

**ప్రశ్న:** *How did the marriage go off* అంటే- marriage ఎలా జరిగింది- అని మీరు రాశారు. కానీ ఓ పుస్తకంలో *The gun went off by itself* అని ఉంది. అర్థం మరోలా వస్తుంది. *Go off* ఎలాంటి సందర్భాల్లో వాడాలో తెలుపగలరు.
– నరేశ్, సిరిసిల్ల



**జవాబు:**
1) Go off = ఎలా జరిగింది - ఇది ఒక అర్థం - How did the marriage go off? లో లాగా.
2) Go off = explode (పేలటం) అనేది ఇంకో అర్థం.
The gun went off by itself.
దానంతట అదే పేలింది.

**ప్రశ్న:** వాడు మంచివాడిలా కనిపిస్తున్నాడు అనే మాటకు మీరు *He appears to be a good fellow* అని ఇచ్చారు. కానీ *He is appears to be a good fellow* అని ఎందుకు వాడకూడదు?
– ఎన్.అనిల్, వెలుగోడు

**జవాబు:**
Thank you very much for your appreciation. He is appears to be a good fellow. ఈ sentence లో is appears, verb అనుకుంటే అలాంటి verb form లేదుకదా. అంటే English లో ఇలాంటి verb ఉండదు. spoken English old lessons లో 6 forms of the English verb గురించి వివరాలున్నాయి. చూడండి. అందులో is appears form ఉండదు. is + appears = 'be' form + II Regular doing word – ఇలాంటి verb ఉండదు కదా.

# How was the pilgrimage?

**1.** Pilgrimage (pron: పిల్గ్రిమిజ్- పి నొక్కి పలుకుతాం) పుణ్యస్థలాలకు దైవదర్శనార్థం చేసే యాత్ర. తీర్థయాత్ర.

a) నా కాశీయాత్ర చాలా సంతృప్తి కలిగించింది/ ఫలప్రదమైంది.
My pilgrimage to Kasi was very fulfilling.
(తీర్థయాత్ర మనం అనుకున్నట్లు మనకు తృప్తిగా జరిగితే = fulfilling)

b) పాతరోజుల్లో కాశీయాత్ర కాలినడకన జరిగేది.
A pilgrimage to Kasi in the older days used to be on foot.

c) శబరిమల/ తిరుపతి యాత్ర
Pilgrimage to Sabarimala/ Tirupati.
తీర్థయాత్రలకు వెళ్లేవాళ్లను wish చేయటం =
Wish you a very fulfilling pilgrimage.

d) He makes a pilgrimage to Kasi every year
ఆయన ప్రతి సంవత్సరం కాశీ వెళ్తాడు.

**2.** Pilgrim = యాత్రికుడు (పుణ్యస్థలాలకు)

a) శబరిమల యాత్రికులు నల్లబట్టలు వేసుకుంటారు.
Pilgrims to Sabarimala wear black clothes.

b) Pilgrims returning from Haj are called 'Hajis'. హజ్ నుంచి తిరిగి వచ్చే యాత్రికులను 'హజీ'లంటారు.

**'pilgrimage' వాడే తీరు:**

c) A pilgrim is one who makes a pilgrimage/ who is on a pilgrimage
తీర్థయాత్రలు చేసేవారు యాత్రికులు.

d) My father is on a pilgrimage.
మా నాన్న తీర్థయాత్రలో ఉన్నారు.
He is making a pilgrimage.

e) On my pilgrimage to Sabarimala, I visited Guruvayuru.
నేను శబరిమల యాత్రలో గురువాయూరు వెళ్లాను.

**3.** Rush of pilgrims = యాత్రికుల రద్దీ/ తాకిడి.

a) The rush of pilgrims at Tirupati makes it impossible to see the lord even for a few seconds
యాత్రికుల తాకిడి వల్ల కొన్ని సెకన్ల కన్నా ఎక్కువ సేపు దర్శనం అసంభవం.

b) There is always a huge rush of pilgrims at Tirupati for the Brahmotsavams.
బ్రహ్మోత్సవాలకు తిరుపతిలో యాత్రికుల రద్దీ ఎక్కువగా ఉంటుంది.

**4.** పుణ్యక్షేత్రం = pilgrim centre.

**5.** పుణ్యక్షేత్రంలోని దేవుడు/ దేవత
Deity/ Presiding Deity.
Goddess Kanaka Durga is the presiding deity of Vijayawada.
విజయవాడలోని దేవత/ అమ్మవారు కనకదుర్గ.
Aiyyappa is the deity at Sabarimala.
Aiyyappa is the god at Sabarimala.
God: దేవుడు ఒక్కడే అన్న భావంతో దేవుడి గురించి మాట్లాడుతున్నప్పుడు, రాస్తున్నప్పుడు, God అంటాం. (Capital G; no 'a/ the' before God.)
అలా కాకుండా వివిధ దేవుళ్లు, దేవతలను గురించి మాట్లాడుతున్నప్పుడు సందర్భాన్ని బట్టి A/ the god, A/ the goddess అంటాం - ఇలాంటపుడు 'g' - small 'g' నే, capital 'G' కాదు.

a) The goddess at Basara is Saraswathi.
The deity at Basara is Saraswathi.

b) The god at Srikalahasti is Lord Shiva.

c) Lord Subrahmanya is a god in Hindu Mythology.
(హిందూ పురాణాలలో Subrahmanya Swamy ఒక దేవుడు)
(Mythology = మిథాలజి, 'థా' నొక్కి పలుకుతాం)

d) Lakshmi is also a goddess. (ఒక దేవత)

e) Saraswathi is the goddess of knowledge.
(సరస్వతి చదువుల దేవత)

**Compare (a) and (b)**

(a) She felt that God was unkind to her.
దేవుడు తనపట్ల చిన్నచూపు చూశాడని అనిపించుకుంది. (ఇక్కడ దేవుడొక్కడే అనే భావం)

(b) She felt that all gods were against her.
(దేవుళ్లందరూ ఆమెకు వ్యతిరేకంగా ఉన్నారనుకుంది. ఇక్కడ వివిధ దేవతలనే అర్థంతో కాబట్టి 'gods')

**6.** consort = wife of a god/ husband of a goddess. (గొప్పవాళ్ల అంటే రాజుల, రాణుల, దేవుళ్ల, దేవతల భార్యలను, భర్తలను English లో wife and husband అనరు. consort అంటారు.)

a) Padmavati is the consort of Lord Venkateswara.

b) Mallikarjuna is the consort of Bhramaramba.

**7.** Dip/ bath = పుణ్య నదుల్లో స్నానం.

a) గంగా స్నానంతో పాపాలు పోతాయి
A dip in the Ganga washes away all our sins.

b) A dip in the Krishna is an important part of a pilgrimage to Kanakadurga.
దుర్గాయాత్రలో కృష్ణా స్నానం ముఖ్యమైంది.

c) స్నానం చేయటం = have a dip/ take a dip.

d) He has a dip in the Ganga once a year
సంవత్సరానికోసారి ఆయన గంగాస్నానం చేస్తాడు.

**8.** Ablutions = స్నానాదికాలు, కాలకృత్యాలు - ముఖ్యంగా స్నానం (రోజూచేసే పూజ చేస్తాం)

**9.** Worship = ఆరాధన; ఆరాధించటం;
పూజ, పూజించటం.

a) We worship God/
PILGRIMS to Sabarimala take a dip in the Pamba before worshipping lord Aiyyappa.

b) I begin any work only after my worship.
పూజ తర్వాతనే ఏదైనా.

c) He believes his worship of SriSai gives him peace of mind.
శ్రీసాయి ఆరాధన మనశ్శాంతినిస్తుందని ఆయన నమ్మకం.

**10.** విగ్రహం=Idol/ Image (Idol: ఐడల్; 'ఐ' నొక్కుతాం. Image = ఇమిజ్ -'ఇ' నొక్కి పలుకుతాం)

a) The temple has a gold idol (image of Vishnu).
గుడిలో బంగారు విగ్రహం (విష్ణుమూర్తిది) ఉంది.

**11.** Idol worship = విగ్రహారాధన = Idolatry
Christianity and Islam are against idol worship.
క్రిస్టియానిటీ, ఇస్లాంలలో విగ్రహారాధన నిషిద్ధం.
Idolatry is prohibited in christianity and Islam
(ఈ రెండు మతాల్లో విగ్రహారాధన కూడదు)
Idolatry = (ఐడాలట్రి - డా నొక్కి పలుకుతాం)

M. SURESAN

**12.** ఆరాధించటం = worship = offer worship.
(The CM offered worship at the temple, and inaugurated the Mandapam)

**13.** Tonsure = తల గుండు చేయటం.
(టాన్షర్- టా మీద stress - నొక్కి పలుకుతాం)

a) The barbers at kalyanakatta at Tirumala tonsure us.
కల్యాణకట్టలో క్షురకులు మనకు గుండు చేస్తారు.

b) He had himself/ his head tonsured.
అతను గుండు చేయించుకున్నాడు.

c) With tonsured heads pilgrims enter the temple. యాత్రికులు గుండుతో గుళ్లోకి వెళ్తారు.

Tonsured head బదులు clean shaven head అని కూడా అనవచ్చు

The pilgrims with the shaven heads = The pilgrims with the tonsured heads

**Now practice the following aloud in English:**

**Sudheer:** మీ నాన్న ఉన్నారా?

**Eshwar:** లేరండీ. నిన్ననే కాశీయాత్రకు బయల్దేరి వెళ్లారు.

**Sudheer:** ఎప్పుడొస్తారు మళ్లీ.

**Eshwar:** అంత కచ్చితంగా తెలియదు. హరిద్వార్, రుషీకేశ్‌లలో కూడా గంగా స్నానం చేసి, తిరిగి వస్తామన్నారు.

**Sudheer:** కిందటి సంవత్సరం కూడా వెళ్లారు కదా?

**Eshwar:** రిటైరయ్యారు కదండి. కావలసినంత తీరిక. యాత్రలలో time గడపాలనుకున్నారు.

**Sudheer:** కిందటి సంవత్సరం కాళహస్తిలో కూడా ఏదో పూజలు చేశారు కదా?

**Eshwar:** అవును. అక్కడ యాత్రికుల తాకిడిలో ఆయన అవస్థపడ్డారు కూడా. కాశీ నుంచి తిరిగొచ్చాక, మధురకు వెళ్తానంటున్నారు. మీనాక్షి అమ్మవారి విగ్రహం ముఖ్యంగా చూడాలనుకుంటున్నారు.

**Sudheer:** తిరుపతికేమన్నా వెళ్లారా ఈ మధ్య?

**Eshwar:** వెళ్లొచ్చారుగా. అయితే గుండు చేసుకోలేదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# She is very devout

**Venu:** Hello Ratan, how is it I see you daily at this time here?
(ఏంటి ప్రతిరోజూ నువ్వు ఈ time కు ఇక్కడ కనిపిస్తున్నావు? )

**Ratan:** It just happens that way. I am here at this time on my way to the temple near here and you come out in the evening at this time.
(అదలా జరుగుతోంది. నేను ఈ time కు ఇక్కడ దగ్గర్లో ఉన్న గుడికి రావటం, నువ్వేదే time లో ఇంటినుంచి బయటికి రావడం.)

**Venu:** Why this piety all of a sudden? It is only a week since I have been meeting you on your way to temple.
(ఏంటింత sudden గా ఈ భక్తి? నిన్నో వారం రోజులుగా నేనిక్కడ చూస్తున్నా)

**Ratan:** It's all mother's doing. She's a devotee of Sri Sai. Her devotion has impressed me too.
(అంతా మా అమ్మ వల్ల. ఆమె సాయిభక్తురాలు. ఆమె భక్తి నాపై ప్రభావం చూపింది.)

**Venu:** That's very good indeed. Do you do pooja at home?
(బాగానే ఉంది. ఇంట్లో పూజ చేస్తావా? )

**Ratan:** No, mother does it. She is very devout. Sun or rain she has a cold bath early in the morning and sits for pooja.
(మా అమ్మ చేస్తుంది. ఆమె చాలా భక్తికలది. ఎండైనా వానైనా పొద్దున్నే చన్నీళ్ల స్నానం చేసి పూజకు కూర్చుంటుంది)

**Venu:** What about your father?
(మీ నాన్నగారి సంగతి? )

**Ratan:** He is not particular. He is devoted to his job. His devotion to duty doesn't let him devote any time to worship.
(ఆయనకంత పట్టింపు లేదు. ఆయనెప్పుడూ విధి నిర్వహణపట్లే శ్రద్ధా సమయం వెచ్చిస్తారు. అందు వల్ల ఆయనకు అర్చనకు, ఆరాధనకూ time ఉండదు.)

**Venu:** Do you go to the Sai temple near our college too?
(మన college దగ్గర గుడికి కూడా వెళ్తావా? )

**Ratan:** Rarely, devotees prefer this to that.
(అరుదుగా. భక్తులందరు, ఆ గుడి కంటే ఈ గుడినే ఇష్టపడతారు)

కిందటి lesson continuation గా పై సంభాషణ కూడా భక్తికి, పూజా పునస్కారాలకు సంబంధించిందని తెలుస్తోంది కదా. ఈ మాటలు మనం conversation లో తరచు వాడుతుంటాం. Practice చేయండి.

1) Piety = పయటి ('ప' నొక్కిపలుకుతాం) = భక్తి = devotion (డివోషన్) - 'డి' నొక్కిపలుకుతాం.
a) My mother is a woman of piety.
మా అమ్మ భక్తికలది.
b) మీరా కృష్ణుడిపట్ల చాలా భక్తికలది
Meera had great piety for Lord Krishna.

2) pious = పయస్ = భక్తిగల
a) She is a pious woman = ఆమె భక్తి కలది.
b) He is not so pious as his wife.
ఆయనకు తన భార్యంత భక్తి లేదు.
'భక్తి' అంటే 'devotion' అని కూడా.
c) Thyagaraja and Bhaktha Ramadas had great devotion to Lord Rama.
రాముడిపట్ల వాళ్లిద్దరికి చాలా భక్తి ఉండేది.
ఒక్క విషయం pious అంటే భక్తిగల అనే అర్థం.
devotional = భక్తిగొలిపే, భక్తికి సంబంధించిన.
devotional songs = భక్తిగీతాలు/ దేవుడి పాటలు.
అయితే pious అంటే నిజంగా భక్తిలేని, భక్తి నటించే అని అర్థం కూడా ఉంది.
Don't believe his pious talk
భక్తిగా వినపడే అతని మాటలు నమ్మొద్దు. అది నటనే.
Devout = భక్తిగల

3) Devotion = భక్తి. ఈ అర్థం ఇంతకుముందే చూశాం. దీనికి ఇంకో అర్థం - ఒకరిపట్లగాని, ఒక విషయంపట్ల గాని శ్రద్ధ, ప్రేమలాంటివి కలిగి ఉండటం.
Devotion to duty = విధి/ విధి నిర్వహణ పట్ల శ్రద్ధ
a) His devotion to duty leaves him little time for his family.
విధి పట్ల అతడికున్న శ్రద్ధ వల్ల తన కుటుంబానికి time కేటాయించలేకపోతున్నాడు.
కుటుంబ విషయాలకు తీరికుండటం లేదు.
b) Her devotion to the service of the poor is really great.
పేదల పట్ల ఆమెకున్న శ్రద్ధ, ప్రేమ చాలా గొప్పవి.
c) Gandhi's devotion to the cause of Indian independence.
భారత స్వాతంత్ర్యం పట్ల గాంధీజీ శ్రద్ధ.

4) Devote: మన శక్తి, శ్రద్ధ, కాలం ఒక విషయం పట్ల చూపించటం.
a) The doctor devotes most of his time to his patients.
రోగుల కోసమే ఎక్కువ సమయం కేటాయిస్తాడు.
b) Though very busy, he devotes a lot of time to his family.
తీరిక లేకున్నా కూడా కుటుంబంతో చాలాసేపు గడుపుతాడు.
c) Freedom fighters devoted their whole life to the cause of freedom.
స్వాతంత్ర్యం కోసం జీవితమంతా గడిపేశారు.

5) Devotee = భక్తుడు/ భక్తురాలు
a) శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తులు.
devotees of Sri Venkateshwara.
b) Devotees can offer worship from 6 a.m. - 12.00 noon and from 4 p.m. - 8 p.m. = భక్తులు ఉదయం 6 నుంచి 12 వరకు, సాయంత్రం 4 నుంచి 8 వరకు దర్శనం చేసుకోవచ్చు/ ఆరాధించవచ్చు

6) Devout = pious = భక్తిగల
మీరు చాలా భక్తిగలవాళ్లయితే you are very devout.
The devout old man spends most of his time in the temple.
భక్తిగల ఆ పెద్దాయన ఎక్కువసేపు గుడిలోనే ఉంటాడు.

7) నైవేద్యం పెట్టడం = offer, నైవేద్యం = offering.

8) కర్పూరం = Camphor (కాంఫ - కాం, Cat లో 'క' లాగా)

9) సాంబ్రాణి = Incense
(Incense అంటే కోపం కలిగించటం అని కూడా).

10) అగరువత్తులు = Incense sticks.

11) (మంత్రాలు, వేదాలు etc.) పఠించటం/ వల్లించటం = Chant - chanting of mantras, vedas, etc.

12) ప్రమిద = Censer ('సెన్స' - 'సె' నొక్కి పలుకుతాం), Censer అంటే సాంబ్రాణి ధూపం వేసే భరిణ అని కూడా.

13) వత్తి = Wick.

14) halo = పటాల్లో, బొమ్మల్లో దేవుళ్ల, మహాత్ముల శిరస్సుల చుట్టూ ఉండే కాంతి వలయం.

15) hallowed = పునీతమైన.
Tirumala is the hallowed place of Lord Venkateshwara.
వెంకటేశ్వరస్వామి వల్ల తిరుమల పునీతమైంది.

16) Sanctity = పవిత్రత.
a) Smoking and alcohol are banned in holy places to preserve their sanctity.
పుణ్యస్థలాల పవిత్రతను కాపాడేందుకు అక్కడ పొగతాగడం, మద్యం నిషేధిస్తారు.
(Preserve = చెడిపోకుండా, పాడవకుండా ఉంచటం)
b) The Hindus attach great sanctity to the Ganga
హిందువులు గంగానదిని చాలా పవిత్రమైందిగా భావిస్తారు.

**Practise the following:**


M. SURESAN

**Sukumar:** Hello, prasad, మళ్లీ శబరిమలకా? మళ్లీ నల్లబట్టల్లో, మెడలో మాలతో కనిపిస్తున్నావు.
**Prasad:** అవును.
**Sukumar:** మీరెన్నిసార్లు వెళ్లారింతవరకు? కాలినడకనా, Bus లోనా?
**Prasad:** ఇది 5వ సారి, కాలినడకనే.
**Sukumar:** నాకూ రావాలనేఉంది. వచ్చేసారితీసుకెళ్తావా?
**Prasad:** సంతోషంగా. ఇప్పుడే రావచ్చు కదా?
**Sukumar:** ఇప్పుడు కాదు. నువ్వు చాలా భక్తిగలవాడ వనుకుంటా.
**Prasad:** నువ్వు కూడా కదా? చాలాసార్లు షిర్డీ యాత్ర చేస్తావు. సాయిబాబాను కొలుస్తుంటావు. ప్రతి శుక్రవారం కృష్ణా నదిలో స్నానం చేస్తావు. రెండుసార్లు గంగలో మునిగొచ్చినట్టున్నావుకూడా కదా.

**Answer:**
**Sukumar:** Hello, Prasad, Sabarimala (Going to Sabarimala) again. I see you once more/ once again in black clothes and with a string of beads/ beads around your neck.
(string = మామూలు అర్థం = దారం. Beads = పూసలు. String of beads= పూసల మాల. Beads అన్నా కూడా పూసలమాల అనే అర్థం వస్తుంది. counting beads = పూసలదండతో జపం చేయడం)
**Prasad:** Yes,
**Sukumar:** Howmany times have you been there so far? By bus or on foot?
**Prasad:** This is my fifth time. Walking.
**Sukumar:** I feel like coming too. How about taking me/ will you take me next time?
**Prasad:** With pleasure. Why not now?
**Sukumar:** Not now. I Think you are very pious/ devout.
**Prasad:** So are you. You make frequent pilgrimages to Shirdi. Every friday you have a dip in the Krishna. You have been to the Ganga twice I think, and taken a dip there.

**కిందటి సంచికలో అభ్యాసానికి సమాధానం:**

**Sudheer:** Is your father in? / at home?
**Eshwar:** No, He left yesterday on a pilgrimage for/ to Kasi.
**Sudheer:** When will he be back?/ When will he return?/ When is he returning?/ When will he come back?
**Eshwar:** (I am) not sure. He said he would have a dip in the Ganga at Haridwar and Rishikesh and return.
**Sudheer:** Didn't he go last year too?/ He went last year too, didn't he?
**Eshwar:** He is now retired you know. He has plenty of/ a lot of leisure. He wants to spend the rest of his life on pilgrimages.
**Sudheer:** I think even last year he offered worship/ performed pooja at Srikalahasti.
**Eshwar:** Yes. He had trouble because of the rush of pilgrims there. After returning from Kasi, he wants to go to Madhurai. He is particular about the image / idol of goddess Meenakshi.
**Sudheer:** Has be been to Tirupathi of late?
**Eshwar:** Yes last month. But he didn't have his head tonsured/ he didn't have a tonsure.



**ప్రశ్న:** *తెలుగులో 'ఎన్నవ' లేదా 'ఎన్నో' అనే పదానికి ఇంగ్లిష్‌లో సరైన పదం ఏమిటి? వివరంగా తెలియజేయగలరు.*
**– మేరీకుమారి, విజయవాడ**

**జవాబు:** ఈ ప్రశ్న చాలా కాలంగా చాలామంది అడుగుతున్నారు. 'ఎన్నవ' అనే మాటకు English లో సరైన పదం లేదు. 'మీ అన్నదమ్ముల్లో మీరెన్నోవారు?' అనే ప్రశ్నకు English కు దగ్గరగా 'where do you come among your brothers and sisters?' అని అనవచ్చు ఇది కూడా సందర్భాన్నిబట్టి మాత్రమే, మీరెన్నోవారు? అనే అర్థం వస్తుంది.
a) Where is Dr. Manmohan Singh among/ on the list of the PMs of India? - ఇది 'ఎన్నవ' అనే దానికి అతి దగ్గర.
b) What is the ordinal of Dr. Manmohan Singh among the PMs of Inida?' అని అనవచ్చు, కాని ఇది పాండిత్యం. (ordinal= 1st, 2nd, 3rd etc) - (a) కూడా సందర్భాన్నిబట్టి మన భావాన్ని తెలుపుతుంది. (b) ని అర్థం చేసుకోగలిగేవాళ్లు తక్కువ.

**ప్రశ్న:** *One and half year అంటే కరెక్టా? లేక one and half years అనాలా? ఇది singular గా ఉపయోగించాలా? లేక plural గా ఉపయోగించాలా?*
**– కె.ఆర్.ప్రియదర్శిని, కాకినాడ**

**జవాబు:** One and a half years అనటం correct. దీని వెంట వచ్చే verb మాత్రం singular. One and a half years is a long period.

**ప్రశ్న:** *కింది వాక్యాల్లో ఏది కరెక్టో తెలియజేయగలరు?*
*Today all trains are running lately.*
*Today all trains are running by late.*
*Today all trains are running as late.*
**– రొంకంకి సుశ్రుత, కోటబొమ్మాళి**

**జవాబు:** మీ మూడు sentences లో ఏదీ కరెక్ట్ కాదు. Correct sentence: Today all trains are running late.
1) Lately కి, late కు అర్థంలో ఎక్కడా సంబంధం లేదు.
a) Lately అంటే recently/ of late అంటే ఈ మధ్య.
I haven't seen him lately/ of late
ఈ మధ్య నేను వాడిని చూడలేదు.
b) late – అంటే ఆలస్యంగా, ఆలస్యమైన అని.
He has come late = ఆలస్యంగా వచ్చాడు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# ...WHO KNOWS?

**Sekhar:** Hello Mahesh... any idea where Jagadish is.
(హలో మహేశ్, జగదీశ్ ఎక్కడున్నాడో తెలుసా? )

**Mahesh:** He <u>may be</u> at home.
(ఇంట్లో ఉండొచ్చు)

**Sekhar:** <u>May we</u> expect him on time?
(సమయానికి సరిగ్గా వస్తాడని అనుకోవచ్చా? )

**Mahesh:** I don't know. He said he would come, but when, exactly, he was not clear.
(తెలియదు. వస్తానన్నాడు, కానీ ఎప్పుడో కచ్చితంగా చెప్పలేదు.)

**Sekhar:** Until he comes we cannot start our work.
(అతడు వచ్చే వరకు మనం పని ప్రారంభించలేం మరి.)

**Mahesh:** How many charts are we going to make for the exhibition?
(మనం ఎగ్జిబిషన్‌కు ఎన్ని పట్టికలు చేస్తున్నాం? )

**Sekhar:** Jagadish knows. They <u>may be</u> six or seven.
(జగదీశ్‌కు తెలుసు. బహుశా ఆరో ఏడో ఉండవచ్చు.)

**Mahesh:** So many? Then we had better begin. We do not have much time. We <u>may have</u> at the most three or four days.
(చాలా ఉన్నాయే! అయితే మనకు టైమ్ ఎక్కువ లేదు. మూడు, నాలుగు రోజుల కంటే ఎక్కువ ఉండకపోవచ్చు.)

**Sekhar:** He knows it. He <u>may</u> not delay. Yes. Here is he calling. He says he <u>may be</u> here in 15 minutes.
(అతడు ఆలస్యం చేయకపోవచ్చు ఆ... ఇదిగో అతడి నుంచి ఫోన్. పదిహేను నిమిషాల్లో ఇక్కడ ఉండొచ్చు అంటున్నాడు.)

**Mahesh:** OK then. He <u>may</u> also bring the necessary material.
(అతడు అవసరమైన సామగ్రి కూడా తేవచ్చు).

గమనించారు కదా. ఇక్కడ underline చేసిన verbs అన్నీ mayతో వస్తున్నాయి.

- may be
- may we expect him?
- may have
- may not delay
- may bring

మనలో చాలామందికి తెలుసు- 'may', present లోగాని, future లో గాని ఏదైనా ఉండే/ జరిగే అవకాశాన్ని తెలియజేస్తుంది- అంటే probability in the present, or in the future.

**1)** May be - 'be' form- expresses a probable state of being in the present or in the future.
ఇప్పుడుగానీ భవిష్యత్తులోగానీ ఉండే అవకాశాన్ని తెలియజేస్తుంది. పది నిమిషాల్లో వాళ్లిక్కడ ఉండవచ్చు
They may be here in ten minutes.

**2)** May + 1st Regular Doing Word (May go, May come, May play etc.)- expresses a probable/ likely action in the present or in the future. అంటే May + 1st RDW, ఇప్పుడు కానీ, ఇకముందు కానీ జరగవచ్చు (కచ్చితం కాదు) అనుకునే పనిని (జరగక పోవచ్చు కూడా) తెలియజేస్తుంది.

తెలుగులో 'May be' అంటే ఉండవచ్చు, బహుశా ఉంటారు/ ఉంటుంది, ఉంటాడు- ఇప్పుడు కానీ ఇక ముందు కాని అనే అర్థంలో. అలాగే May + 1st RDW - May go - వెళ్లవచ్చు - బహుశా వెళ్తారు/ వెళ్తుంది/వెళ్తాడు అనే అర్థంతో.

**Kousik:** When may you be here again?
(మీరు మళ్లీ ఇక్కడ ఎప్పుడు ఉండవచ్చు/ మీరు మళ్లీ ఇక్కడ ఉండే అవకాశం ఎప్పుడు? )

**Mohan:** I may come here again this weekend.
(నేను ఈ వారాంతానికి ఇక్కడికి రావచ్చు.)

**Kousik:** We may not meet each other then, because this weekend I may leave for Chennai. My sister is going abroad. She may need my help in packing, etc.
(అయితే మనం కలుసుకోకపోవచ్చు. ఎందుకంటే నేను ఈ వారాంతంలో చెన్నై వెళ్లవచ్చు. మా సిస్టర్ ఫారిన్ వెళుతోంది. ఆమెకు ప్యాకింగ్‌లో నా సాయం అవసరం కావచ్చు.)

అన్నీ అవచ్చు, కావచ్చు, అవకపోవచ్చు అని అర్థాలు వస్తున్నాయి కదా. మన జీవితంలో ఏది జరుగుతుంది, జరగకపోవచ్చు అని చెప్పలేం కాబట్టి, అంటే because life is full of uncertainties కాబట్టి, may, may not వాడకం చాలా ఎక్కువగా ఉంటుంది. మళ్లీ చూడండి.

**Prasanth:** How much money may you need?
(ఎంత డబ్బు అవసరం కావచ్చు? )




**Dasarath:** Just 5000 rupees a day. I may not need more than that.
(రోజుకు అయిదు వేల రూపాయలే. అంత కంటే అవసరం లేకపోవచ్చు.)

కాబట్టి 'May' expresses probability in the present or in the future. It expresses doubt too- అంటే సందేహాన్ని కూడా తెలియజేస్తుంది.

**Mahendra:** Will he come this evening?
(సాయంకాలం అతడు వస్తున్నాడా? )

**Sasank:** He may come, I am not sure.
(రావచ్చు. నేను కచ్చితంగా చెప్పలేను).

**Mahendra:** Why do you doubt it?
(ఎందుకు అనుమానం? )

**Sasank:** He was talking about going to his sister's place.
(వాళ్లక్కయ్య ఇంటికి వెళతానని అంటున్నాడు.)

**Mahendra:** Then let's start. If we do not start now the teacher may go away.
(అయితే మనం బయల్దేరాం. ఇప్పుడు బయల్దేరకపోతే టీచర్ వెళ్లిపోవచ్చు)

పై సంభాషణలో may సందేహాన్ని సూచిస్తోంది.

గమనిక: **1)** 'May' అంటేనే probably కాబట్టి, may, probably పక్కపక్కన వాడం. అలాంటి చోట్ల will వాడవచ్చు

**a)** He may help you.
He will probably help you.

**b)** She may get the prize.
She will probably get the prize.

**c)** She may not like this.
She will probably not like this.
(ఆమె దాన్ని ఇష్టపడకపోవచ్చు)

**2)** అలాగే may బదులు perhaps + will వాడవచ్చు

**a)** వాడొస్తాడేమో!
He may come.
Perhaps he will come.
He will come perhaps.
He will perhaps come. (perhaps = బహుశా)

**b)** She may know this.
She perhaps knows this.

**c)** Suguna may buy this.
Suguna will buy this perhaps.
(ఆమె కొనవచ్చు)

**3)** may బదులు ఒక్కోసారి may be వాడవచ్చు

**a)** It may succeed.
May be it will succeed.
(అది విజయవంతం కావచ్చు)

**b)** Sachin may score another century in this series.
(సచిన్ ఈ సిరీస్‌లో నే ఇంకో సెంచరీ చేయవచ్చు)
May be Sachin will score another century in this series.

**c)** He may be coming.
Perhaps he is coming.
May be he is coming.
అతడు వస్తూ ఉండవచ్చు.
Probably he is coming. ఇటువంటిచోట్ల 'Who Knows?' (ఎవరికి తెలుసు/ ఎవరు చెప్పగలరు? )

**d)** It may happen; Who knows?
May be it will happen; Who knows?
Perhaps it will happen; Who knows?

Now practise the following:

**Gowtham:** కారు కొంటున్నారు కదా? ఎప్పుడు కొంటున్నారు?

**Sunil:** ఒకటి రెండు వారాల్లో. మీరెప్పుడు కొంటున్నారు.

**Gowtham:** నేనిప్పుడు కొనకపోవచ్చు. ఆ ఆలోచన లేదు నాకు.

**Sunil:** పెట్రోలు, డీజిల్ ధరలు పెరగవచ్చేమో అనేది ఒక్కటే ఆందోళన నాకు.

**Gowtham:** మీరు ఆలస్యం చేసే కొద్దీ ధరలు పెరుగుతూనే ఉంటాయి. మీరు కారు కొనేటప్పటికి ఇంకా ఎక్కువ ధర పెరగవచ్చు

**Sunil:** మీరు చెప్పిందీ నిజమే. ఈరోజే కారు లోన్‌కు అప్లై చేస్తా. ఇప్పుడు చేస్తే వాళ్లు శాంక్షన్ చేసే సరికి వారం పట్టవచ్చు

**Gowtham:** అంత పట్టకపోవచ్చు లెండి. ఇప్పుడు చాలా త్వరగా చేసేస్తున్నారు. రెండు మూడు రోజుల్లో మీకు loan రావచ్చు


M. SURESAN

**ANSWERS:**

**Gowtham:** You said you would be buying car. When may you buy it?

**Sunil:** May be in a week or two. when may you buy? What about you?

**Gowtham:** I may not buy at all. I have no plans as yet

**Sunil:** I have just one worry. I am afraid petrol and diesel prices may go up.

**Gowtham:** If you go on delaying /if you delay further, you may not use a car at low petrol prices. By the time you buy the car, you may drive it at higher prices.

**Sunil:** You are right. Today itself I will apply for a Car loan. If I do it now, it may be a week before they process it and sanction the loan./ they may take a week to process it and sanction the loan.

**Gowtham:** They may not take so long. Now a days they are very quick. You may get the loan in two or three days.

---

**Q & A**

1. He has worked in Chennai since 1990 (present perfect) అంటే 1990 నుంచి ఇప్పటి వరకు చేశాడు అని వస్తుందా? లేదా ఇంకా continue అవుతుందా?
2. ఆయన రోజు ఇక్కడికి వస్తున్నాడు అనడాన్ని He is coming here daily లేదా He comes here daily ఇందులో ఏది కరెక్ట్?
3. a) you shall finish all this work and then only go
b) you must finish all this work and then go
ఇందులో ఏది కరెక్ట్?

– కె. శ్రీనివాస్ రావు, వెదుళ్లపల్లి.

**జవాబు-** He has worked in Chennai since 1990 అన్నప్పుడు ఇంతవరకూ చేశాడు అనే అర్థానికే ఎక్కువ ప్రాధాన్యం. అయితే సందర్భాన్ని బట్టి ఇంకా చేస్తున్నాడనే అర్థం కూడా వస్తుంది. 'I have worked in this company since 2000' ఇది ఎవరన్నా అదే companyలో చేస్తున్నవ్యక్తితో అన్నప్పుడు, ఇంకా అక్కడే continue అవుతున్నాననే కదా? have worked కూ, have been workingకూ తేడా చాలా తక్కువ.అయితే continuity కి ప్రాధాన్యం ఇవ్వవలసి వస్తే have been + ing better

2. a) He is coming here daily - correct
b) He comes here daily - correct
a) ఈ sentence modern English Usage లో మెల్ల మెల్లగా accept చేస్తున్నారు -రోజూ ఇక్కడకు వస్తున్నాడనే అర్థంతో
b) ఈ sentence -అతను క్రమం తప్పకుండా ప్రతిరోజు ఇక్కడకు వస్తాడని. కరెక్ట్‌గా చెప్పాలంటే sentence (b) is better than sentence (a)

3. రెండూ దాదాపు ఒకటే. అయితే shall,order ను సూచిస్తుంది. Must Shall కంటే ఎక్కువ force తో order మాత్రమే కాకుండా, కొంత అవసరాన్ని కూడా సూచిస్తుంది. you must have money if you want to buy a Car -ఇక్కడ must, అవసరాన్ని (order కాదు) సూచిస్తోంది కదా! నువ్వు వెళ్లటానికి ముందు పని పూర్తి చేయాల్సిన అవసరం ఉంది అనే అర్థం కూడా sentence (b) కు ఉంది. sentence (a) పని పూర్తి చేయాలి అనే order ను తెలుపుతుంది. అయితే ఈ తేడా అంతగా పట్టించుకోనక్కరలేదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

8 ఈనాడు హైదరాబాద్ శనివారం 17 డిసెంబరు 2005

**Ganesh:** Hi Vasanth, Come in, Come in I see that the rain has drenched you completely. Here, have this towel and wipe yourself dry.
(లోపలికిరా, రా. వాన నిన్ను పూర్తిగా తడిపేసింది. ఇదిగో ఈ towel తో తుడుచుకో)

**Vasanth:** Thank you oh, my! what a downpour!
(అబ్బో ఏం వానో! oh, my! = అబ్బో)

**Ganesh:** Why did you leave home in such a downpour?
(అంత జడివానలో ఎందుకు బయటికొచ్చావు? Downpour = జడివాన)

**Vasanth:** It had been only drizzling when I left home. It had been so since morning. I needed a book urgently. So I started. But midway there has been this cloudburst. It has soaked me to the bone.

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 83

ఈ సంభాషణ అంతా వర్షాన్ని గురించే కదా! ఈ మధ్య రాష్ట్రం అంతా వర్షంతో జలమయమయ్యింది కదా! రాష్ట్రం 'నువ్వొస్తానంటే నేవద్దంటానా' అనే పరిస్థితి నుంచి 'బాబోయ్, ఇకచాలు' అనే పరిస్థితికి వచ్చింది. అందుకని ఈ lesson లో వర్షానికి సంబంధించిన మాటలు తెలుసుకుందాం.

ముందుగా ఈ సంభాషణలోని మాటలు చూద్దాం.

has drenched; wipe; dry; downpour; drizzling; cloud burst; soaked; dripping; warm; season; floods.

◆ వర్షం = rain - సామాన్యంగా rain ముందు a/ an రాదు, rain uncountable కాబట్టి, The rains = వర్షాకాలం/ వర్ష రుతువు. ఈ అర్థంతో తప్ప, rains అని plural వాడం.

ఇప్పుడు వర్షం వస్తోంది = It is raining
(The rain is coming/ the rain is falling సరైన English కాదు. Rain కు come రాదు)

నిన్నంతా వర్షం కురుస్తూనే ఉంది
It was raining the whole of yesterday.

రేపు వర్షం రావచ్చు = It may rains tomorrow.




అతని బట్టలు తడిసిపోవటం వల్ల నీళ్లుకారుతున్నాయి

**c)** When you are wet, you dry yourself with a towel
(dry = పొడిగా అయ్యేంతవరకు తుడుచుకోటం = wipe)

**d)** wipe = తుడవటం (వైప్)

**e)** rain X drought (డ్రౌట్) = వర్షాలు లేకపోవటం

**f)** floods = వరదలు, నదికి వరదలు = The river is in floods.
floods = spate, the river is in spate.

# It has been raining

(నేనిల్లు వదిలినప్పుడు సన్న తుంపర మాత్రమే పడుతోంది. పొద్దున్నించి అలాగే ఉంది కదా. నాకో పుస్తకం urgent గా కావాల్సివచ్చింది. అందుకని బయల్దేరా. మధ్యలో ఉన్నట్టుండి ఈ జడివాన నన్ను పూర్తిగా తడిపేసింది.)

drizzle = తుంపర= light rain; cloudburst = ఉన్నట్టుండి కురిసే జడివాన; soak = తడిపేయటం)

**Ganesh:** Your clothes are still dripping. How about some warm clothing? Here, take this lungi. Let's have some warm Coffee.
(నీ బట్టలనించి ఇంకా నీళ్లు చుక్కలుచుక్కలుగా కారుతున్నాయి. పొడి బట్టలు వేసుకో. ఈ లుంగీకట్టుకో. కాస్త coffee తీసుకుందాం.)
మొదటి warm = పొడి; రెండో warm = వెచ్చటి.

**Vasanth:** A cup of Coffee would be really welcome thank you. It has been raining since the day before (yesterday) in some parts of AP.
(ఇప్పుడు coffee తాగాలనే అనిపిస్తోంది. AP లో కొన్నిచోట్ల మొన్నటి నుంచి వర్షాలు కురుస్తూనే ఉన్నాయి)

**Ganesh:** It has rained a lot this season. There have been showers all through the state for the past two days. Some rivers are in floods. The railway track in many places have been washed away. Hope it would stop raining before more danger is done.
(ఈ సంవత్సరం వానలు ఎక్కువగానే ఉన్నాయి. రాష్ట్రమంతా జల్లుగానే ఉంది రెండ్రోజులుగా నదులకు వరదలొచ్చాయి. కొన్నిచోట్ల రైలు పట్టాలు కొట్టుకుపోయాయి. ఇంకా నష్టం జరక్కముందే ఈ వాన ఆగుతుందనుకుంటున్నా.)
season = రుతువు/ ఏటా ఒక కాలంలోని శీతోష్ణస్థితి. Rainy season = వానాకాలం; damage = నష్టం/ వినాశం)

**Vasanth:** Thank you for the coffee.

**Ganesh:** Let's watch the TV until the rain stops.
(వర్షం ఆగేవరకు TV చూద్దాం.)

◆ Heavy rain (పెద్ద వర్షం) × light rain/ drizzle/ Shower = చిన్న వర్షం, జల్లు. drizzle = ముసురు. (Shower= షవ - 'ష' నొక్కి పలుకుతాం drizzle = డ్రిజ్‌ల్ - 'డ్రి' నొక్కి పలుకుతాం, 'జ్' size లో 'జ్' లాగా.)

◆ Down pour (డౌన్‌పోఅ) పెద్ద వర్షం

◆ It is raining cats and dogs
కుండపోతగా వర్షం కురుస్తోంది.

**kumar:** Is it raining heavily?
(పెద్ద వర్షమేనా? heavily = భారీగా)

**Pramod:** No, it is just drizzling. (లేదు. ఉత్తజల్లే)

**kumar:** Just a shower, isn't it?
(ఉత్త తుంపరే కదా?)

**pramod:** But it's been cloudy since Yesterday.
(నిన్నటి నుంచి మబ్బుగానే ఉంది)

**kumar:** Heavy rain is forecast for tomorrow too.
(రేపు కూడా భారీ వర్షసూచన ఉంది.)
forecast = జరగబోయేది ముందే చెప్పటం.

◆ cloudburst = ఉన్నట్టుండి కురిసే జడివాన.

**a)** The cloudburst has drenched me completely.
ఈ జడివాన నన్ను పూర్తిగా తడిపేసింది.
drench = డ్రెంచ్, drenched = డ్రెంచ్ట్

**b)** We are sure to get drenched in the rain = మనం ఈ వానలో తప్పకుండా తడిసిపోతాం.

**c)** They have been drenched and are sure to catch a cold = వాళ్లు వానలో పూర్తిగా తడిసి పోయారు. వాళ్లకు తప్పకుండా జలుబు చేస్తుంది.
drench = soak.
soak అన్నా కూడా తడిపేయడమే.
They are soaked (drenched) in rain = They are wet because of rain.
Soak = బట్టలు నానపెట్టటం అనికూడా అర్థం.

◆ **a)** wet = watery. When you get drenched/ soaked in rain, you are wet.

**b)** When you are drenched/ soaked/ wet, your clothes drip
(మీరు వర్షంలో తడిసినప్పుడు, మీ బట్టలు నీళ్లు కారతాయి.)
drip = నీళ్ల బొట్టు, బొట్లుగా పడటం.
His clothes are dripping

**Now practise the following in English:**


M. SURESAN

**1) Sankar:** Hi Nelson, పొద్దున వస్తానన్నావు. ఇప్పుడొచ్చావేంటి?

**Nelson:** ఏం చేయను? నీకు తెలుసుగదా? పొద్దున్నించి కుండపోతగా వర్షం కురుస్తూనే ఉంది కదా. ఇప్పుడే కదా కాస్త తగ్గింది.

**Sankar:** అది నిజమే అనుకో, నేను పొద్దున Auto లో అమీర్‌పేటదాక వెళ్లేసరికి తడిసి ముద్దయిపోయా. బట్టలంతా తడిసిపోయాయి.

**Nelson:** ఇప్పుడే విన్నాను భారీ వర్షాల వల్ల పాతబస్తీలో రెండు మూడు పాత buildings కూలిపోయాయని.

**Sankar:** నిన్నంతా ముసురుగానే ఉంది కదా? ఈ రోజేమో పెద్దవాన. అందువల్ల అది జరిగి ఉండొచ్చు ప్రాణనష్టం లేదుకదా?

**Nelson:** ఓ ఐదుగురు గాయపడ్డారట. వాళ్లను ఆస్పత్రిలో చేర్పించారు.

**Sankar:** మొన్నంతా మబ్బుగా ఉండింది కానీ వర్షం లేదు. రేపు కూడా వర్షం రావచ్చని అంచనా.

**2) Bhavani:** Hi Sarala, వర్షం లేదని బాధపడుతున్నాం కదా? ఇప్పుడు చూడు కావాల్సినంత వర్షం.

**Sarala:** ఇప్పటికే కొన్ని నదులు పొంగుతున్నాయి. పంటలకు నష్టం అని కూడా అంటున్నారు. మనకేంటో అన్నీ విపరీతాలు. వస్తే ఇలా భారీ వర్షాలతో నష్టం, లేకుంటే వర్షాభావం వల్ల నష్టం.

**Bhavani:** పోయిన సంవత్సరం అంతా వర్షాభావమే కదా. అసలు వానలు లేవు.

**Sarala:** నిన్న మా నాన్న వర్షంలో పూర్తిగా తడిసిపోయి, నీళ్లు కారుతున్న బట్టల్తో ఇంటికొచ్చారు. ఇవాళ జలుబు, కాస్త temperature తో బాధపడుతున్నారు.

**Bhavani:** ఈ వర్షంలో College కి వెళ్లటం కూడా కష్టమే. క్లాసులు లేకుంటే బాగుంటుంది.

**Answers:**

**1) Sankar:** Hi Nelson, you said you would come in the morning itself. How is it you come now?

**Nelson:** What could I do? you know it has been raining cats and dogs since this morning. It is only a few moments ago... it stopped raining you know!

**Sankar:** That's true. In the morning I was totally drenched by the time I reached Ameerpet, though in an auto. My clothes were all wet.

**Nelson:** I have just heard that became of the heavy rains, two or three buildings in the old town have collapsed.

**Sankar:** It was drizzling the whole of yesterday. Perhaps that caused the collapse. Hope there was no loss of life.
(loss of life = ప్రాణనష్టం)

**Nelson:** Five were injured. They were admitted to the hospital.

**Sankar:** The day before (yesterday) was cloudy, but it did not rain. The forecast is that it may rain tomorrow too.

**2) Bhavani:** Hi Sarala, we had been worried that there was no rain. Now you see we have enough of it.

**Sarala:** Some rivers are in spate/ floods. They say that it might damage crops. We have only extremes (విపరీతాలు). We have either heavy rains causing damage or drought.

**Bhavani:** There was drought the whole of last year. No rain at all.

**Sarala:** Yesterday my father came home drenched, water dripping from his clothes/ his clothes dripping. Today he was a cold and slight temperature.

**Bhavani:** It is different to go to college in this rain. Hope there will be no classes today (I wish there were no classes today).

***ప్రశ్న:*** *తెలుగుభాషవలె ఆంగ్లభాషలో ఒత్తులు ఉంటాయా? Ass (గాడిద) ముందు A, ఉంచాలా, An ఉంచాలా, ఆంగ్ల భాషలో తెలుగు భాషవలె గుణింతాలుంటాయా? How to speak English confidently, fluently?*

**– మధుకర్, గుంటూరు**



**జవాబు:** తెలుగులో ఒత్తులను సంయుక్తాక్షరాలంటాం. అంటే రెండు మూడు శబ్దాల కలయికను తెలిపే అక్షరాలు. English లో అని అక్షరాల కలయికతో వస్తాయి. Construction- ఇందులో రెండో Syllable స్ట్రక్‌లో స్ట్ర సంయుక్తాక్షరమే (ఒత్తులుండే శబ్దం) కదా - ఇది ఇక్కడ 's, t, r' combination తో వస్తుంది.

You can speak English confidently and fluently if you practise speaking it; speak boldly without being afraid of making mistakes. Just speak on. 'The best way to learn alanguage is to speak it'. Read English newspapers and magazines and watch TV English newscasts.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Surekha:** Hi Deepthi, come in. What a sight you are! What's (what has) happened? Why those mud splashes on your dress?

దీప్తి, రా, ఏంటిదంతా, ఇలా ఉన్నావు? (What a sight you are) ఎలా కనిపిస్తున్నావో, ఏం జరిగింది? నీ dress మీదంతా ఆ బురద నీళ్లేంటి?

**Deepthi:** Sure, I'm in a terrible mess. I was walking down the road. A car driving over a puddle splashed the mud on me. I felt terribly embarrassed with the mud on my dress. Took an auto immediately and came down here. This is the nearest I could think of.

నిజమే నేను భయంకరమైన/ దారుణమైన పరిస్థితిలో ఉన్నాను. నేను road వెంబడి నడుస్తుంటే వానగుంటమీద car వెళ్లటంతో ఆ బురద నీళ్లంతా నామీద చిమ్మాయి. వెంటనే auto తీసుకుని ఇక్కడికివచ్చా, అక్కడికి ఇది అతి దగ్గర కాబట్టి)

(Terrible = భయంకరమైన (పరిస్థితి)

mess = గందరగోళం, చిందరవందర, ఇక్కడ trouble.

Puddle = Road మీద ఉండే వాన నీళ్లగుంట.

splash = నీళ్లలాంటివి చిమ్మటం.. అలా చిమ్మినప్పుడు పడే నీళ్లు.

embarrass = ఎంబారస్. బా నొక్కిపలుకుతాం, సిగ్గుపడేట్లు ఇబ్బంది కల్గించటం,

embarrassed = ఇబ్బందిగా feel అవటం.

బురదనీళ్ల మరకలున్న dress తో కనపడటం Deepthi కి ఇబ్బంది (embarrassing గా ఉంటుంది) కదా!

The Son-in-law's behaviour embarrassed the minister.

అల్లుడి ప్రవర్తన మంత్రికి కాస్త ఇబ్బంది కలిగించింది. ఇరుకున పడేసింది.

embarrassing = ఎంబారసింగ్ - 'బా' bank లో ba లాగా)

**Surekha:** Sorry dear, come. Wash your face and have a change of clothes. Here you are. Take this dress of mine. I'll have yours washed and sent home to you in the evening.

చాలా బాధగా ఉంది. మొహం కడుక్కుని బట్టలు మార్చుకో. ఇదిగో (ఇది) తీసుకో = Here you are. నేను నీ dress ను ఉతికించి సాయంత్రం మీ ఇంటికి పంపుతాను.

**Deepthi:** Thank you.

**Surekha:** But why were you out so early in the morning? It is not even 7 now.

అయినా అంత పొద్దున్నే బయటికెందుకొచ్చావు? ఇప్పుడింకా 7 కూడా కాలేదు.

**Deepthi:** I had been on my daily morning walk when this happened.

నేను morning walk చేస్తున్నప్పుడు ఇది జరిగింది.

**Surekha:** But why a walk at all? It rained all through the night.

అసలు రాత్రంతా వర్షం కురిస్తే ఇప్పుడు నడవటం దేనికి?

**Deepthi:** It's quite sultry. Please turn on the fan.

ఉక్కపోతగా ఉంది. కాస్త fan వేయవా?

**Surekha:** It is sultry - that means it is going to rain again.

నిజంగానే చమటగా ఉంది. అంటే మళ్ళీ వానొస్తుందన్నమాట.

వర్షానికీ వాతావరణానికి సంబంధించిన మాటలు మరికొన్ని చూద్దాం.




# ప్రతిభ

★ sweat = స్వెట్ = చమట, చమటపట్టటం.

a) we are sweating a lot here; let's sit out.

ఇక్కడ చాలా చమటపోస్తుంది, బయట కూర్చుందాం.

b) He is sweating all over

అతనికి ఒళ్లంతా చమట పోస్తోంది.

★ చమటోడ్చి సంపాదించటం = sweat it out

a) Chiranjeevi has sweated it out to become a top star కష్టపడి (చమటోడ్చి) ఉత్తమ నటుడయ్యాడు. (sweat తర్వాత it గమనించండి)

b) He sweated it out to educate his daughter

కూతుర్ని కష్టపడి చదివించాడు.

**Suman:** పెద్ద వర్షమే వచ్చేట్లుంది. ఇంకా 24 గంటలు వర్ష సూచన ఉన్నట్లుంది కదా?

**Kalyan:** కరెక్టేననుకోండి. అయితే గొడుగు మరచిపోతానేమోనని. ఇప్పటికే రెండు గొడుగులు పోగొట్టుకున్నా.

**Suman:** నిన్నంతా వర్షం వస్తుందనుకున్నా. T.V. లో కూడా చెప్పారు. కాని నిన్నంతా చాలా ఉక్కపోతగా ఉంది. దానితోపాటు కొంతసేపు కరెంటు కూడా లేదు. ఒళ్లంతా ఒకటే చమట.

**Kalyan:** చమటగానే ఉంది. అయితే ఆకాశం అంతా మబ్బేసే ఉంది.

# I feel very sultry

★ puddle = roads మీద ఉండే వర్షపు నీళ్లగుంట

puddle water = అలాంటి నీళ్లు

★ mud = బురద, muddy = బురదగా ఉన్న

★ splash = నీళ్ల (ఏ ద్రవపదార్థమైనా) చిందటం

a) He splashed water over my face

నా మొహం మీద నీళ్లు కొట్టాడు.

b) splash of water = చిమ్మిన నీళ్లు

c) a splash of water made him conscious

నీళ్లు కొట్టగానే తెలివి వచ్చిందతనికి

d) Blood splashed all over the place as the lorry hit him.

లారీ ఢీ కొనటంతో అక్కడంతా రక్తం చిమ్మింది.

★ Sultry = (వాతావరణం) ఉక్కపోతగా/ చెమటగా ఉండటం

a) I feel very sultry; could you turn on the fan?

చాలా చమటగా ఉంది. కాస్త fan వెయ్యరా?

sultry = stuffy. (అయితే stuffy ఒక ప్రదేశానికి వాడతాం.

b) The room is very stuffy. Please open the windows.

రూం చాల వేడిగా ఉంది. (గాలి తక్కువగా ఉంది) కిటికీ తలుపులు తీయండి.

When the room is stuffy, you sweat

room లో గాలాడకుండా ఉంటే చమటపోస్తుంది.

c) How can you get any thing free? you sweat for it

ఉచితంగా ఏదైనా ఎలా వస్తుంది? దేనికైనా కష్టపడాలి.

★ sweat = భయంతో చమటపోయటం.

a) The sight of the police made him sweat.

police లను చూడగానే అతనికి చెమటపట్టింది.

b) She sweats and shivers at his sight.

అతన్ని చూడగానే ఆమె చమటపట్టి వణికిపోయింది.

(shiver = షివ = వణకటం)

**Vighnesh:** Have you heard the news? We are in for another cyclone.

విన్నావా, మళ్లీ తుపానును ఎదుర్కోవాల్సివస్తోంది. (We are in = అనుభవించబోవటం. He is in for trouble = అతనికి trouble రాబోతోంది.)

**Mahesh:** Yea. Cyclone is forecast for another 24 hours.

రాగల 24 గంటల్లో cyclone వచ్చే సూచన/ అవకాశం. (forecast = ముందు జరిగే సంఘటనల అంచనా)

**Now, practise the following aloud in English:**

**Suman:** గొడుగు తీస్కెళ్లండి. వర్షంవస్తోంది.

**Kalyan:** తుంపరే కదా. గొడుగక్కర్లేదులెండి.




**Suman:** పోయిన వారమంతా వానే కదా. నదులంతా పొంగిపొరలుతున్నాయి. పాపం రైతులకు పంటంతా నష్టమే.

**Kalyan:** అయితే కొన్నిచోట్ల మాత్రం రైతులు సంతోషంగానే ఉన్నారు. అందుకనే ఒకరికి ఖేదం, ఒకరికి మోదం అన్నారు.

**Answer:**

**Suman:** Take/ Carry an umbrella. It is raining.

**Kalyan:** It's only a drizzle/ It is just drizzling. An umbrella is not necessary.

**Suman:** It looks like heavy rain./ It appears to rain heavily./ Heavy rain appears likely./ It may rain heavily. Rain is forecast for another 24 hours.

**Kalyan:** You may be right, but I may forget the umbrella somewhere. I have already lost two umbrellas.

**Suman:** The whole of yesterday I expected rain/ I thought it would rain the whole of yesterday. Even TV forecast it. But it was sultry/ The whole day was sultry. further/ Besides there was no power for some time. we were sweating a lot.

**Kalyan:** It was sultry/ stuffy; true. But the sky was cloudy.

**Suman:** We had rain all through last week. All the rivers are in floods/ spate. (All the rivers are flooded.) Poor farmers! It has caused damage to crops.

**Kalyan:** But the farmers in some areas are happy. That's why they say, 'One man's meat is another man's poison'. (ఒకరికి ఖేదం, ఒకరికి మోదం అనేందుకు English proverb.)

The whole day బదులు All day, All through the day అనటం practise చేయండి.

---

**ప్రశ్న:** *1) Thanks చెప్పినప్పుడు ఏ వయస్సు వారికి ఎలా తిరిగి జవాబివ్వాలి?*

*2) అలాగే "sorry" చెప్పినప్పుడు కూడా తిరిగి ఏ విధంగా సమాధానమివ్వాలి (పెద్దలకు, పిల్లలకు, సమవయస్కులకు)?*

*3) Good heavens, Adit! You must have your shoes polished.*

*Good heavens, Adit! You must have polished your shoes.*

*ఇవి ఏ విధంగా రెండు వేర వేరు అర్థాలనిస్తాయి. ఇలాంటి వాక్యాలను ఎలా అర్థం చేసుకోవాలి? phonetics గురించీ వివరించగలరు.*

**– ఎం.ఎల్.పరమేశ్వరరావు, బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా**

**జవాబు:** 1) ఏ వయస్సువారు thanks చెప్పినా తిరిగి ఇచ్చే జవాబు ఒకటే, you are welcome/ welcome. కాస్త పెద్దవాళ్లయితే, sir చేరుస్తాం.

2) Sorry కి కూడా అంతే- It's all right, doesn't matter, అంటాం. పెద్దవాళ్లయితే sir, చేరుస్తాం.

3) a) Good heavens, Adit! you must have your shoes polished = బాబోయ్! నీ shoes polish చేయించాలి నువ్వు. (అంటే, నీ shoes కు పాలిష్ లేక dirty గా ఉన్నాయని)

b) Good heavens, Adit! you must have polished your shoes

నీ shoes బాగా polish చేసి ఉండాలి నువ్వు

(అంటే బాగా polish చేశావు. నిగనిగలాడుతున్నాయి)

అయితే ఇక్కడ 'good heavens' సరికాదు.

Hi, అనో, It's great అనో అంటాం కదా. 'Good heavens' ఏదైనా చెడు జరిగినపుడు. వచ్చే కొన్ని సంచికల్లో phonetics వివరణ ఉంటుంది.

**ప్రశ్న:** *Accused అనే మాటను అక్యూస్ట్ అని Pro. చేయాలన్నారు. Dictionaries లో accuse అనే మాట అక్యూజ్‌గా Pro. అయ్యింది. అందువల్ల accused అనే మాట అక్యూజ్డ్‌గా pronounce కాదా? similarly, "learned" అనే మాట లర్నిడ్ (l3:nid) గా pronounce అయింది. లర్నిట్‌గా అవలేదు. 'ed' తో end అయ్యే verb లు- (for e.g., looked లుక్ట్‌గా, booked బుక్ట్‌గా pronoce అయినపుడు)- 't' తో end అవుతాయనే సూత్రం అన్నిచోట్లా apply కాదా?*

**– ఎం.సుబ్బారావు, ఏలూరు**

**జవాబు:** Past tense form కోసం '-ed' చేరిస్తే అది p, k, s (z sound తో) ల తర్వాత మాత్రమే 't' అవుతుంది. looked (lookt), peeped (peept), chased (chaset) etc. అన్ని చోట్లా అది apply కాదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Anil:** Hi Hari, we couldn't meet each other the whole of yesterday.
నిన్న మనం కలవలేకపోయాం.

**Hari:** Meet? In such a downpour? I didn't feel like going out in such rain. No let up at all till late in the night.
కలుసుకోటమా? అంత వానలోనా? బయటికి వెళ్లా లనిపించలేదు. రాత్రి బాగా పొద్దుపోయేవరకు తగ్గనే లేదు.

Downpour అంటే గుర్తుంది కదా- ఉన్నట్టుండి ప్రారంభమై చాలాసేపు కురిసే జోరువాన.
feel like గుర్తుంది కదా? అంటే అనిపించటం.
I feel like going to a movie = సినిమాకెళ్లాలనిపిస్తోంది.
I don't feel like tea now = టీ తాగాలనిపించటంలేదిప్పుడు.
Let up = తగ్గటం, తగ్గుముఖం పట్టటం; ఏదైనా ప్రయత్నం తగ్గించటం. ఇది తరచుగా conversation లో practice చేయండి.
There is no let up in her fever = ఆమె జ్వరం తగ్గటంలేదు.
We are not going to let up our efforts మా ప్రయత్నాలూ, శ్రమ తగ్గించే పనేలేదు.




ఈ సంభాషణ కూడా weather (వాతావరణం) కు సంబంధించిన మాటలతో ఉంది కదా. అన్నిటినీ ఒకసారి చూద్దాం.
Downpour; let up; knee-deep; drains; wade wind; blew off; hoardings; looks like rain; drought; withered; on and off.

- Down pour - చాల పెద్దవాన.
- knee deep - మోకాలిలోతు. wade; drain.

**a) Areena:** Why don't you get me some chips to eat? (కాస్త chips తెచ్చిపెట్టవూ? )
**Amar:** (Do you) want me go out in this downpour for your chips? I'll get drenched. (ఇంత వానలో నన్ను బయటికెళ్లమనా నీ అర్థం. తడిసిపోతాను). The roads are under kneedeep water. (Roads పై మోకాళ్లోతున నీళ్లున్నాయి). I don't want to wade through the water mixed with the water from the drains. (మురికి కాలవల నీళ్లు కలిసిన ఆ నీళ్లలో నడవటం నాకిష్టం లేదు).

బాగా పని ఎక్కువగా వుండి, చాలసేపు పట్టేట్టయితే దాన్ని కూడా wade through అంటాం.

**b)** The officer wades through a lot of files
ఆ officer రోజూ చాలా files చూస్తారు, ఎంతకూ అవదు.




**b)** నేను రాను. వర్షం వచ్చేట్టుంది. జలుబు చేస్తే నేను తట్టుకోలేను.
I won't come. It looks like rain. I cannot withstand a cold
(withstand = తట్టుకోవటం, భరించటం)

**c)** Though it is just 3 o' clock in the afternoon, it is dark. The sky is cloudy. It is very likely to rain.
మధ్యాహ్నం మూడే అయినా, చీకటిగా ఉంది. ఆకాశం మబ్బేసింది. వర్షం వచ్చేట్లే ఉంది. (వచ్చే సూచనలు ఎక్కువగా ఉన్నాయి).

- drought: వర్షాభావం, అనావృష్టి - వర్షాలు లేకపోవటం

wither = (చెట్లు లాంటివి) ఎండిపోవటం
When there is a drought the crops wither.
వర్షాలు లేనప్పుడు పంటలు ఎండిపోతాయి.

# There was no let up

**Anil:** Even in such rain, I went out for some medicine for dad. My god! there was knee-deep water on most roads, and I waded through. The drains were overflowing.
అంత వానలోనూ మా నాన్నకు మందుకోసం బయటకు వెళ్లాను. అబ్బో! చాలా roads లో మోకాలి లోతు నీళ్లు. ఆ నీళ్లలో కాళ్లీడ్చుకుంటూ నడిచాను.

Knee deep = మోకాలిలోతు. knee = మోకాలు.
kneecap = మోకాలిచిప్ప. wade = నీళ్లలో కాళ్లీడ్చుకుంటూ నడవటం.

**Hari:** Yes, it was that heavy.
అవును అంతపెద్ద వానే.

**Anil:** The wind was strong too. It blew off two or three hoardings and the roof tops of some sheds. I saw atleast two of the hoardings lying in the water on the road.
గాలి కూడా చాలా బలంగా వీచింది. రెండు మూడు hoardings, కొన్ని sheds కప్పులూ, లేచిపోయాయి ఆ గాలికి. నేను కనీసం రెండు hoardings road మీద నీళ్లలో పడి ఉండటం చూశా.

Blew off= (గాలి) లేపేసింది.
Hoardings = shops మీద, road sides లో ఉండే ప్రకటన (advertisement) boards.
Rooftops = కప్పు పైభాగాలు.

**Lakshmi:** It's seven now cloudy, and a cot wind is blowing. It looks like rain again any moment.
ఇంకా మబ్బేసే ఉంది, చలి గాలి వీస్తోంది. ఏ క్షణాన్నైనా మళ్లీ వర్షం వచ్చేట్టుంది.

Looks like rain = It may rain = వర్షం రావచ్చు

**Anil:** We had severe drought last season. The crops withered. This season we have too much of rain on and off. The crops are under water and the low lying areas are all flooded.
కిందటి సంవత్సరం అనావృష్టి/ వర్షాభావం వల్ల పంటలన్నీ ఎండిపోయాయి. ఈ సంవత్సరం అతి వృష్టి. పంటలన్నీ జలమయం. లోతట్టు ప్రాంతాలన్నీ నీళ్లతో నిండిపోయాయి.

Drought = వర్షాభావం;
on and off = తరచు = often/ frequently.
low lying areas = లోతట్టు ప్రాంతాలు.

**Lakshmi:** Hope this would end with today.
ఈ రోజుతో ఇది ఆగుతుందని ఆశిస్తున్నా.

**c)** We waded through a lot of portion for the last week's examination.
Last week exam కు మేం చాలా portion చదివాం. (ఎంత time పట్టిందో అని)

- blow: గాలి వీయటం, blow (present)- blew (past) blown (past participle)

**a)** Strong winds blew as it rained cats and dogs
కుండపోత వర్షం, దానితోబాటు బలమైన గాలులు వీచాయి.

**b)** Though it isn't raining much, the wind is blowing strongly.
వర్షం అంతలేకపోయినా, గాలి మాత్రం చాలా బలంగా వీస్తోంది.

blow off = గాలివల్ల ఏదైనా లేచిపోవటం. ఎగిరిపోవటం, కిందకి పడిపోవటం, (దీపం లాంటివి) ఆరిపోవటం, వాటిని ఆర్పేయటం.

**c)** The wind blew off several trees
చాలా చెట్లను గాలి లేపేసింది
(గాలికి చెట్లు కూలిపోయాయి)

**d)** The wind blew off the lamp
గాలి దీపాన్నార్పేసింది.

**e)** The lamp blew off. దీపం ఆరిపోయింది.

**f)** The wind blew off the wooden structure.
గాలి ఆ చెక్క కూర్పును కూల్చేసింది.

**g)** blew off the board = board గాల్లో ఎగిరిపోయింది.

- let up తగ్గటం/తగ్గించటం.

**a)** ఆ గాలి ఏం తగ్గలేదు
There was no let up in the wind.

**b)** నీ ప్రయత్నాల తీవ్రత తగ్గించకు
Don't let up the seriousness of your attempts.

**c)** There has been no let up in the government's relief efforts, said the CM
ప్రభుత్వ సహాయక చర్యల్లో ఎలాంటి లోపం ఉండదని ముఖ్యమంత్రి అన్నారు.

- వర్షం వచ్చేట్టుంది = It looks like rain = It may rain = It is very likely to rain.

**a)** As we started out it looked like rain
మేం బయల్దేరేటప్పుడు వర్షం వచ్చేటట్టుంది.


M. SURESAN

**a)** వానలు లేకపోవటం వల్ల పంటలు ఎండిపోతున్నాయి.
The crops are withering because of drought/ The crops are withering because it hasn't rained.

**b)** ఈ వర్షాభావం మరో వారం వరకు ఉంటే పంటలెండిపోవటం తథ్యం.
If the drought continues for/ lasts one more week, the crops are sure to wither/ will surely wither.

**c)** On and off = తరచుగా = మాటిమాటికి.

**a)** అతను నా సహాయంకోసం తరచూ వస్తుంటాడు.
He comes to me on and off for help.

**b)** Don't trouble me on and off.
మాటిమాటికి నన్ను trouble చేయకు/విసిగించకు.

**c)** The CM calls for my advice on and off.
CM తరచూ నా సలహా కోసం పిలుస్తుంటారు/ phone చేస్తారు.

**Now practise the following aloud in English:**

**Sathya:** ఈ వాన తగ్గదా? (let up వాడండి)
**Vijaya:** వారంరోజులుగా తరచూ వర్షం పడుతూనే ఉంది. అదీ భారీగా, గత 3, 4 ఏళ్లలో ఇంత వాన నేనెప్పుడూ చూడలేదు.
**Sathya:** ఇప్పటికే లోతట్టు ప్రాంతాలన్నీ జలమయమయ్యాయి. TVలో చూశా మనుషులు మోకాలి లోతు నీళ్లలో కాళ్లీడ్చుకుంటూ నడవడం. వాన నీళ్ళు ఇళ్ళలోకి కూడా వచ్చేశాయి.
**Vijaya:** ప్రభుత్వం చాలా మందిని సురక్షిత ప్రదేశాలకు తరలించింది. సహాయక చర్యలు కూడా చేపట్టింది.
**Sathya:** మొన్న రాత్రి వీచిన బలమైన గాలికి చాలా చెట్లు కూలిపోయాయి. మా ఇంటికి కొంచెం దూరాన ఉన్న పాత Shed కప్పు ఎగిరిపోయింది.
**Vijaya:** ఎవరికైనా గాయాలయ్యాయా?
**Sathya:** లేదు, అదృష్టవశాత్తు.

**Answer:**

**Sathya:** Will there be no let up in the rain?
**Vijaya:** It has been raining off and on since last week/ during the past week/ for a week now. I haven't seen such rain in the last 3 or 4 years.
**Sathya:** Already the low lying areas are under water. I saw on the TV, people wading through kneedeep water. The rain water has entered houses too.
**Vijaya:** The government has moved a large number of people to safe places/ safety. It has taken up relief measures too.
**Sathya:** The strong winds the day before (yesterday) blew off/ down/ uprooted a number of trees; They blews off as well the roof of an old shed some distance from my home.
**Vijaya:** Was anyone injured?
**Sathya:** No, fortunately.

**ప్రశ్న:** *1) Pending అనే క్రియను వివరించండి. ఈ verb simple, past, past participle రూపాలు తెలపండి. 2) Who wrote Ramayana? Who did write Ramayana? రెండు వాక్యాల గురించి వివరించండి.*

**– న్యాలపల్లి పెంటయ్య, అలియాబాదు**

**జవాబు:** 1) Pending - ఇది verb కాదు. కాబట్టి దానికి, past, past participle ఉండే ప్రశ్నలేదు. Pending, preposition అయినా అవుతుంది- ఏదైనా పూర్తవకుండా ఉన్నప్పుడు అనే అర్థంతో, లేకపోతే adjective అయినా అవుతుంది- ఏదైనా పూర్తవడానికి మనం wait చేస్తున్న- అనే అర్థంతో.

**a)** Preposition: He is suspended pending enquiry.
విచారణ పూర్తి కానందున (విచారణ ఇంకా జరుగుతోంది కాబట్టి) ఆయనను suspend చేశారు. ఇక్కడ pending preposition.

**b)** Adjective: An enquiry is pending against him.
అతని మీద విచారణ పూర్తవలేదు.
పూర్తవటానికి wait చేస్తున్నాం.
ఇక్కడ 'pending' adjective.

2) a) Who wrote Ramayana?
b) Who did write Ramayana?

1) Ramayanam లాంటి మహాకావ్యాల ముందు 'The' కచ్చితంగా రావాలి.
2) The Ramayanam అని ఉంటే, sentence (a) correct, sentence (b) wrong.

Question form అయినప్పటికీ, not లేకపోతే who తర్వాత 'do' 'does', 'did' రావు. ఇది ఒక్క who విషయంలోనే, అదీ 'ఎవరు?' అనే అర్థంతో. ఎవరిని అన్న అర్థంతో కూడా 'who' వాడుతుంటాం. 'Who did he meet?' లాంటి sentences లో. అప్పుడు who పక్కన do, does, did వస్తాయి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






# They swallowed public money

**Kavitha:** Hi Lakshmi, (It's) rather a cold evening. How about munching something to keep ourselves warm?

సాయంత్రం చాలా చలిగా ఉంది. ఏదైనా కాస్త నమిలితే వెచ్చగా ఉంటుందేమో.

**Lakshmi:** That's right. Let's have some hot chips and then hot coffee. That's make us comfy.

Hot chips, hot coffee తీసుకుందాం. దాంతో హాయిగా ఉంటుంది.

(comfy = comfortable అనే పదానికి ఇది కుదింపు. అర్థం = హాయిగా ఉంటున్న)

**Kavitha:** Nothing like sipping a hot cup of coffee on a cold evening like this.

ఇలాంటి చలి సాయంత్రం వేళ వేడి కాఫీ తాగటం వంటి సుఖం ఇంకోటి ఉండదు.

**Lakshmi:** Ok, then; here you are. Here's the snack you are after.

అలాగే. ఇదిగో నువ్వు కావాలనుకున్న తినుబండారం.

(snack = తినుబండారం! మనం మామూలుగా టిఫిన్ అంటుంటాం. You are after = నువ్వు కావాలనుకున్న/ కోరుకున్న)

**Kavitha:** Oh, these chips are crisp and crunchy.

ఈ chips కరకరలాడుతున్నాయి

**Lakshmi:** So do I find them too. Let's buy one more packet.

అవును, నాకూ బాగున్నాయి. ఇంకో packet కొందాం.

**Kavitha:** The other day Trishal bought some mirchi bajjis for us. They were terribly hot. We had to gulp down glasses of water because of it.

మొన్న ఓ రోజు త్రిషాల్ మిరపకాయ బజ్జీలు తెచ్చాడు. అవి ఎంతకారంగా ఉన్నాయో! దాంతో బోలెడు మంచినీళ్ళు తాగాల్సి వచ్చింది.

**Lakshmi:** I was there that day. Don't you remember? Thank God, we had some chocolates near by to snack and feel relieved.

ఆ రోజక్కడ నేనూ ఉన్నా, గుర్తులేదా. అక్కడ chocolates చప్పరించి ఆ కారం తగ్గించుకున్నాం.

(Thank God బతికిపోయాం)

**Kavitha:** Trishal kept chewing something get rid of the heat of the chilly, later he had a stomach trouble too. He swallowed some tablets to be relieved of it.

Trishal అయితే ఆ కారం తగ్గటానికి ఏదో నములుతూనే ఉన్నాడు. తర్వాత అతనికి కడుపులో ఏదో trouble కూడా ఉండింది. ఏవో మాత్రలు మింగాడు.

**Lakshmi:** I am not going to have even a bite of the bujji from that place.

ఇంక మళ్లీ ఆ బజ్జీ అంటూ తినను.

ఈ సంభాషణ అంతా తినటం, తాగటానికి సంబంధించిందని తెలుస్తూనే ఉంది కదా! ఇక్కడి మాటలు చూద్దాం. Munching; have; sipping; snack; crisp and crunchy; hot; gulp & suck; chewing; swallowed; have a bite.

♦ తినటం తాగటం: మామూలు daily situation లోని conversation లో ఏదైనా తినటం అని కానీ, తాగటం అని కానీ అనే అర్థంతో ఎక్కువగా వాడే మాటలు, have, take, eat. Have అన్నిటికంటే ఎక్కువగా వాడతాం.

**Anil:** What do you usually have for breakfast? Breakfast కు నువ్వేం తీసుకుంటావు/ తింటావు మామూలుగా?

**Unni:** Most of the days we have idli at home.

ఎక్కువగా మా ఇంట్లో ఇడ్లీ తీసుకుంటాం/ తింటాం.

**Anil:** We take idlis only one day a week. Each day we take something different. I don't like to eat idli everyday. I like to eat dosa very much. I have coffee every morning and tea every evening.

మేము వారంలో ఒకరోజు మాత్రమే ఇడ్లీ తీసుకుంటాం. ప్రతిరోజు వేర్వేరు తింటుంటాం. రోజూ ఇడ్లీ తినటం ఇష్టంలేదు. దోశ తినటం ఇష్టం. పొద్దున కాఫీ, సాయంత్రం tea తీసుకుంటాం.

చూశారుకదా? ఎక్కువగా have, take, eat, తినటం తాగటం అనే అర్థంతో వాడతాం. Drink తాగటం అనే అర్థం ఉన్నప్పటికీ, దాని బదులు have/ take ఎక్కువగా వాడతాం. Eat, drink ఈ రెండు పదాలూ, తినటం, తాగటం అనే ప్రక్రియలకు ఎక్కువ.

**a)** Eating too much is bad ఎక్కువ తినటం, మంచిది కాదు.

ఇక్కడ eating బదులు having అదే అర్థాన్ని ఇవ్వదు కదా.

**b)** Drinking coffee so often upsets your health

అంత తరచుగా coffee తాగటం ఆరోగ్యాన్ని పాడుచేస్తుంది.

ఇక్కడ having, taking వాడవచ్చు, కానీ drinking వాడటం వల్ల ఎక్కువ clarity ఉంటుంది.

ఇలాంటివోట్ల తప్ప మామూలుగా అయితే have/ take ఎక్కువ వాడతారు.

**Karim:** Here is coffee please have it.

ఇదిగో, కాఫీ తీసుకో

**Ravi:** I have had two cups of coffee already. I don't wish to have any more.

ఇప్పటికే రెండు కప్పులు కాఫీ తాగాను. ఇక తాగటం ఇష్టం లేదు.

**Karim:** Have some milk then. (పాలు తీసుకో)

**Ravi:** I never take milk. (నేను పాలసలు తాగను).

ఇక్కడ take బదులు drink వాడవచ్చు. Have రాదు కదా?

I never have milk అంటే నా దగ్గర ఎప్పుడూ పాలుండవు అనే అర్థం కూడా వస్తుంది కాబట్టి.

So, have, take, eat and drink - వీటిని మామూలుగా తినటం, తాగటం అనే అర్థంతో ఎక్కువగా వాడుతుంటాం.

**2)** అయితే తినటం, తాగటంలో కూడా రకాలున్నాయి కదా. వాటి విషయం చూద్దాం.

**Jeevan:** I find you chewing killis all the time. It is bad for your health and teeth.

ఏంటి, ఎప్పుడూ కిళ్లీ నములుతూ కనిపిస్తావు. అది ఆరోగ్యానికీ, పళ్లకూ మంచిది కాదు.

**Jagadish:** I know that to chewing killis is not good. I will try to give it up.

మంచిదికాదని తెలుసు, మానటానికి ప్రయత్నిస్తా.

♦ chew = నమలటం, నములుతూ తినటం. (చ్యూ)

**a)** Doctors tell us to chew food well

ఆహారాన్ని బాగా నమిలి తినాలనిdoctors చెప్తారు.

**b)** The dog is trying to bite and chew the bone

ఆ కుక్క ఆ ఎముకను కొరికి నమలాలని ప్రయత్నిస్తోంది.

**c)** He is chewing gum.

అతను (chewing) gum నములుతున్నాడు.

**3) Prakash:** Why don't you eat slowly? You are swallowing food in a hurry.

నీవు నెమ్మదిగా తినవెందుకు? తొందరలో మింగేస్తున్నావు.

**Pranav:** I am in a hurry. No time to chew and swallow.

నమిలి మింగటానికి time లేదు. నేను చాలా తొందరలో ఉన్నా.

Swallow = మింగటం.

**a)** Lord Siva swallowed poison, so his throat is black.

శివుడు గరళాన్ని మింగాడు. అందుకని ఆయన కంఠం నలుపు.

**b)** The Tablets are bitter, so I swallow them.

ఆ tablets చేదు. అందుకని వాటిని మింగేస్తాను.

**c)** He swallowed a lot of water

చాలా నీళ్ల మింగాడు.

**d)** The minister swallowed a lot of public money

మంత్రి చాలా ప్రజాధనాన్ని మింగేశాడు.

**4) srikanth:** I am very thirsty. Can I have some water, Ramesh?

చాలా దాహంగా ఉంది. మంచి నీళ్లిస్తావా?

**Ramesh:** It's quite hot, isn't it? Here, take it.

చాలా వేడిగా/ ఎండగా ఉంది కదా. ఇదిగో తీసుకో.

**Srikanth:** One glass won't do (will not do). I can gulp down a whole jug of water.

ఓ glass నీళ్లు చాలవు. ఒక jug నీళ్లు తాగేయగలనిప్పుడు. అంత దాహంగా ఉంది.

(won't do = will not do = చాలదు; will do = చాలు. Rs 20000/- a day will do for me.

రోజుకు రూ 20000/- చాలు నాకు.

♦ gulp = గుక్క, gulp down = గుక్కలో మింగేయటం.

**a)** He drank it in one gulp

ఒక్క గుక్కలో తాగేశాడు.

**b)** When the medicine is bitter we gulp it down our throat

మందు చేదుగా ఉన్నప్పుడు, గొంతులో పోసుకుని ఒక్క గుక్కలో మింగేస్తాం.

**5) Sita:** How about some hot Coffee, Poorna?

**Poorna:** Nothing like sipping hot coffee on a cold evening like this.

ఇంత చలిగా ఉన్న సాయంత్రం coffee చప్పరిస్తూ తాగడానికి కన్నా ఏముంది?

♦ sip = చప్పరిస్తూ, మెల్లమెల్లగా తాగటం.

**a)** It's very hot. Let's sip some soft drink?

చాలా ఎండగా/ వేడిగా ఉంది. ఏదైనా soft drink sip చేద్దామా?

Soft drink = మామూలుగా మనం cool drink అనే దాన్ని కరెక్ట్‌గా soft drink అనాలి.

Hard drinks, అంటే alcoholic drinks (beer, whisky, etc)

**b)** They are sipping coffee sitting in their garden.

తోటలో కూర్చుని కాఫీ sip చేస్తున్నారు.

M. SURESAN

**Now practise the following aloud in english:**

**Namrata:** అమ్మా, ఓ cup coffee ఇవ్వకూడదా నాకు?

**Leela:** ఇప్పటికే రెండు cups తాగావు కదా? ఇంకెంత కావాలి నీకు?

**Namrata:** నాకు చాలా నిద్రొస్తోంది. రేపేమో exam. కాస్త కాఫీ తాగితే మెలకువగా ఉంటుందని.

**Leela:** అయితే టీ తాగు.

**Namrata:** ఏదైనా తినేందుకివ్వవా?

**Leela:** జంతికలివ్వనా? (జంతికలకు english లేదు. అలాగే అనండి)

**Namrata:** ఇంతవరకు జంతికలే కదా నమిలాను

**Leela:** Coffee అంటావు, tea అంటావు. ఆ టాబ్లెట్స్ వేసుకుంటున్నావా నువ్వు?

**Namrata:** నేనన్ని tablets మింగలేను. నా వల్ల కాదు.

**Leela:** పోనీ, ఆ మందయినా తాగు.

**Namrata:** అదీ చేదే. ఏదో ఓ గుక్కలో తాగేస్తా. ఒద్దులే ఆ tablets వేసుకుంటా. వాటిని మింగటం సులభం.

**Answer:**

**Namrata:** Mom, why don't you give me a cup of coffee?

**Leela:** You have already had two cups of coffee. How much more do you want?

**Namrata:** I feel very sleepy. A little coffee will keep me awake.

**Leela:** Then take tea.

**Namrata:** Won't you give me something to eat?

**Leela:** Shall I give you Jantikalu?

**Namrata:** I have been chewing/ munching only jantikalu till now.

**Leela:** You talk of coffee and tea, but are you taking the tablets?

**Namrata:** I cannot swallow so many tablets.

**Leela:** Atleast take the medicine/ syrup (తాగే మందును syrup అంటారు - సిరప్)

**Namrata:** That's bitter too. I just gulp it down/ take it in a gulp. No, I'll take the tablets. Swallowing them is easier than taking the syrup.



**ప్రశ్న:** *Wedding card, marriage day అంటారెందుకు? తేడా ఉందా?*

**– సయ్యద్ జుల్ఫికర్ అలీ, కలువాయి**

**జవాబు:**

**a)** Wedding కు, marriage కు కొద్దిగా తేడా ఉంది. మత సంప్రదాయాల ప్రకారం జరిగే పెళ్లి అయితే wedding. Marriage అంటే ఏ రకమైన పెళ్లయినా - అంటే Registered marriage లాంటివి కావచ్చు.

Indiaలో సంప్రదాయం ప్రకారం జరిగే పెళ్లిని కూడా marriage అంటాం. అయితే America, Britain లో wedding ఎక్కువ వాడతారు, మత సాంప్రదాయాల ప్రకారం జరిగితే.

**b)** Wedding అంటే పెళ్లికి మాత్రం పరిమితం. Marriage అంటే పెళ్లేకాకుండా, పెళ్లి తరువాతి వైవాహిక జీవితం కూడా. గమనించండి:

**i)** It was a happy wedding

పెళ్లి సంతోషంగా జరిగింది.

**ii)** Theirs has been a happy marriage

వాళ్ల పెళ్లి/ వైవాహిక జీవితం సంతోషంగా సాగుతోంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Sravanthi:** Come Pratibha, just munching zantikalu isn't going to help us. Let's think of solving the problem.

(జంతికలు నమలటం వల్ల ప్రయోజనం ఉండదు కదా. సమస్యకు పరిష్కారం ఆలోచిద్దాం)

**Pratibha:** (I) can't help it Sravanthi. They are so crunchy and delicious. You have them too. Here help yourself to some.

(నేనేం చేయను- అవంత కరకరలాడుతూ రుచిగా ఉంటే? నువ్వూ తిను. రా. కాస్త తీసుకో)

I can't help it = ఆ విషయంలో నేనేం చేయలేను. (తప్పదు)

Help yourself = (తినేది/ తాగేదైనా) తీస్కోండి.

**Sravanthi:** I'd rather have crisp potato chips than those zantikalu.

(ఈ జంతికల కంటే కరకరలాడే potato chips తినాలనుంది)

**Pratibha:** Here are some but they have gone soft.

(ఇక్కడ కొన్ని ఉన్నాయి, కాని అవి మెత్తబడి పోయాయి)

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 87

**Chandra:** I enjoy it. Why don't you munch some too.

(నాకెంతో బాగుంది ఇలా నమలటం. నువ్వు కూడా కాసిన్ని నములు)

**Bhaskar:** Go on. Munch till your teeth ache. You don't know how you irritate me. Munch on and become fat.

(తినూ, తినూ, నీ పళ్లు నొప్పి పుట్టేంత వరకూ నములు. నీ నమలటం నాకెంత చికాకుగా ఉందో! బాగా లావయ్యే వరకు నములుతూ ఉండు)

irritate = ఇరిటేయ్‌ట్ - 'ఇ' నొక్కి పలుకుతాం = చికాకు, కోపం తెప్పించటం.

ఇపుడు అర్థం అయింది కదా - munch అంటే నమలటం. అయితే chew అన్నా కూడా నమలటం మాత్రమే. Chew అంటే కొరికి (పక్క, ముందర పళ్లతో) నమలటం, అందులో రుచి అనుభవించటం.

a) వాడు చెరకు ముక్క నములుతున్నాడు
He is chewing a bit/ piece of cane.

b) ఆమె toffee ని నములుతోంది.
She is chewing a toffee.
(toffee = పిప్పరమెంటు బిళ్లలాంటిది)
Munch లో ఉత్త నమలటమే.

♦ lick = నాకటం

a) He is licking a cone of ice cream
అతను ice cream cone ను నాకుతున్నాడు.



b) She committed suicide by consuming poison.
ఆమె విషం తాగి ఆత్మహత్య చేసుకుంది.

c) Bhima consumed all the food that was meant for Bakasura.
బకాసురుడి కోసం తెచ్చిన ఆహారం అంతా భీముడు తినేశాడు.

d) He consumed a kilo of cake in 10 minutes
ఓ కిలో cake (కెయ్‌క్) 10 నిమిషాల్లో తినేశాడు.

అయితే consume మామూలు conversation లో చాలా అరుదుగా వాడతాం. ఇది కొంచెం పాండిత్యం. అంతేకాకుండా చట్ట, వైద్య (legal and medical) పరిభాషలోనే ఎక్కువ వాడతారు.

a) Doctors advised him against consuming fatty substance

**Vamsi:** అలాంటివి ఎన్నైనా తింటాను. జామకాయలు- ముఖ్యంగా దోరగా ఉండేవి నా favourites.

**Dinesh:** Doctors కూడా జామకాయ తినటం మంచి దంటారు. అందులో C Vitamin ఎక్కువ.

**Vamsi:** ఈ రోజు సాయంత్రం మా ఇంటికి రా. మాంచి కరకరలాడే potato chips తినొచ్చు. దానికి ముందు పసందైన గులాబ్‌జాం తినొచ్చు. మా అమ్మ చేస్తోందిపుడు.

**Dinesh:** మొదట మా ఇంటికెళ్దాం పద. మా మామయ్య పొద్దున అమెరికా నుంచి biscuits (American English- cookies) పట్టుకొచ్చాడు. ఎంత కరకరలాడుతున్నాయో! కాస్త Ice cream కూడా తినొచ్చు

**Vamsi:** Chewing gum కూడా తెచ్చాడా?

**Dinesh:** చాలా. అవి ఎంతసేపు నమిలినా, ఇంకా నమలాలనిపిస్తుంది.

**Vamsi:** సెలవు రోజున మంచి పనే చేస్తున్నాం. పద.

# She is biting a crisp apple

**Sravanthi:** In that case I'd (I would) like to have an ice cream or some soft drink.

(అలా అయితే ice cream తినాలనుంది లేకుంటే ఏదో soft drink)

soft drink = cola, orange లాంటి bottled drinks - మనం మామూలుగా తప్పుగా cool drink అంటుంటాం, వాటికి correct name soft drink; అంటే hard drink (beer, whisky లాంటివి) కు వ్యతిరేకం.

**Pratibha:** Don't you remember the warning against consuming soft drinks? They contain pesticides.

(వాటిని తాగకూడదన్న హెచ్చరిక మరిచిపోయావా? వాటిలో పురుగుల మందుంటుంది.)

**Sravanthi:** But who cares? Moreover, haven't you seen the recent ads that they are safe?

(ఆ.. ఎవరు పట్టించుకుంటున్నారు? అవి ప్రమాదమేమీ కాదని ఈ మధ్య ప్రకటనలు చూడలేదా నువ్వు? )

(recent = ఈమధ్య, ad = advertisement = ప్రకటన)

**Pratibha:** OK then. No drinks now. Have the ice cream and enjoy licking it.

(సరేలే. ఇప్పుడు drinks లేవు. Ice cream enjoy చెయ్యి.) licking = నాకటం.

కిందటి lesson continuation గా ఈ lesson లో కూడా తినటం, తాగటంలో రకాలను గురించి తెలుసుకుందాం. Last lesson లో- have/ take (తీసుకోవటం)/ eat (తినటం)/ drink (తాగటం); chew = నమలటం; swallow = మింగటం (డబ్బులు కూడా), gulp = గుక్క, sip = చప్పరిస్తూ తాగటం- గురించి తెలుసుకున్నాం.

ఇప్పుడు పై సంభాషణలో మాటలు: Munch; crunch; delicious; crisp; consume; lick.

♦ Munch: మంచ్- ('మం' నొక్కి పలుకుతాం) = నమలటం. అంటే కొంచెం శబ్దం వచ్చేట్లుగా.

**Bhaskar:** Could you stop munching those ground nuts? If you like to, keep the noise low.

(ఆ వేరుశనగలు నమలటం ఆపుతావా? నమలాలనుకుంటే ఆ శబ్దం తగ్గించు)

b) The cow is licking its calf
ఆవు దూడను నాకుతోంది (calf = దూడ) (కాఫ్)

ఇవీ తినటంలో, తాగటాల్లో రకాలు.

ఇప్పుడు పై సంభాషణలో మిగతా మాటలు చూద్దాం.

♦ Crunchy (క్రంచి - 'క' నొక్కి పలుకుతాం)

crisp = కరకరలాడుతూ fresh (తాజా)గా ఉన్న.

crunchy/ crisp biscuits = కరకరలాడుతూ తాజాగా ఉన్న biscuits.

వడియాలు, అప్పడాలు మనం తినాలని ఇష్టపడే దెప్పుడు? అవి crunchy గానో crisp గానో ఉన్నప్పుడు కదా? crunchy/ crisp appadalu or vadiyalu. (వీటికి English మాటలు లేవు)

Currency notes లాంటివి కొత్తగా ఉండి, చేతికి కరకరలాడుతూ తగిలితే అవి కూడా crisp.

Potato chips కు ఇంకో మాట crisps.

Apple లాంటి పళ్లు తాజాగా, juicy గా (రసం బాగా ఉండటం) ఉంటే, అవి కూడా crisp.

● Sudha is biting a crisp apple
సుధ తాజాగా ఉన్న apple ను కొరుకుతోంది.

● Here is a crisp guava; have a bite
దోర జామ పండిదిగో, కొరికి చూడు.
Guava = గ్వావ, గ్వా నొక్కి పలుకుతాం, జామ కాయ/ పండు

♦ delicious= రుచిగా ఉన్న, పసందైన.

a) మామిడి పండు చాలా రుచిగా ఉంటుంది.
The Mango is very delicious.

b) ఆ హోటల్లో మంచి రుచికరమైన భోజనం వడ్డిస్తారు.
The restaurant serves a very delicious food.

c) మా అమ్మ చాలా రుచిగా వండుతుంది.
My mother cooks very deliciously.

delicious- డిలిషస్ (లి నొక్కి పలుకుతాం).

♦ consume = (కన్‌స్యూమ్- స్యూ నొక్కి పలుకుతాం) (అసలు అర్థం - వినియోగించటం- మనం మామూలుగా వింటూంటం- consumer's court- వినియోగదారుల కోర్టు)

అయితే consume అంటే తినటం, తాగటం అని అర్థం కూడా ఉంది.

a) He consumes a lot of alcohol
అతను తెగతాగుతాడు.


M. SURESAN

కొవ్వు పదార్థాలు వాడవద్దని డాక్టర్లు సలహా ఇచ్చారు.

b) The post mortem showed that the deceased had consumed alcohol
చనిపోయినతను మత్తు పానీయాలను తాగినట్లు శవపరీక్షలో తేలింది.
(Post mortem - పోస్ట్ మాటమ్ = శవపరీక్ష.)

c) People who consume tobacco may get cancer
(పొగాకు తినేవాళ్లకు cancer రావచ్చు)

ఇదే మామూలు భాషలో అయితే, people who chew tobacco అంటాం.

ఈ మాటలు సందర్భాన్నిబట్టి మీ conversation లో వాడండి. చాలా effective గా ఉంటుంది.

**Now practise the following aloud in English:**

**Dinesh:** ఇదిగో, ఈ జామకాయ బాగా దోరగా ఉంది. తింటావా? (bite వాడండి)

**Answers:**

**Dinesh:** This guava is crisp. How about a bite?/ Why don't you have/ take a bite?

**Vamsi:** I will eat any number of them (any number=ఎన్నైనా). Guavas, especially the crisp ones/ crisp guavas are my favourites.

**Dinesh:** Even doctors recommend consuming/ eating of guavas, They contain a lot of Vitamin C.

**Vamsi:** You come to my home this evening. You can eat crisp/ crunchy potato chips. Before that you can have/ enjoy delicious gulab jam. My mother is making them now.

**Dinesh:** Let's go to my place first. My uncle brought biscuits/ cookies from America this morning. How crunchy/ crisp they are! You can also eat/ lick some ice-cream.

**Vamsi:** Did he bring/ get chewing gum too?

**Dinesh:** A lot of it. The more you chew it, the more you feel like chewing it.

**Vamsi:** That's a good way of spending a holiday. Let's go.



**ప్రశ్న: a)** *'Shopping' అనే పదం ఎలా ఆవిర్భవించింది?*

*b) Miss, Mister, Mrs. పదాలకు plural చెప్పండి.*

*c) Come, Come on పదాల అర్థంలో తేడా ఏమిటి?*

*ఈ మాటలకు ఇంగ్లిష్‌లో పదాలు చెప్పండి. 1.వరద బాధితులు, 2. పౌర్ణమి, 3.అమావాస్య, 4.హుండి, 5.హిందూ పూజారి, 6.ఎంగిలి, 7.పంచభూతాలు, 8.సమయస్ఫూర్తి.*

*- జి.ప్రశాంత్, నాగార్జునసాగర్*

**జవాబు: a)** Shopping. English లో ఏదైనా పదానికి '-ing' చేరిస్తే ఆ చర్య అని అర్థం వస్తుంది. ఇది కేవలం 'shop' పదానికే ప్రత్యేకం కాదు. House, housing; book, booking, etc., లాగానే ఇది కూడా.

**b)** Miss కు plural, misses, mister కు plural messrs, Mrs కు plural లేదు. వీటిని గురించి మరిన్ని వివరాలు రానున్న lessons లో చూడండి.

**c)** Come అంటే రమ్మని, come on అంటే కూడా రమ్మనే, అయితే కొంచెం గట్టిగా పిలవటం.

**పదాలు: 1)** వరదబాధితులు = flood victims **2)** పౌర్ణమి = fool moon; **3)** అమావాస్య = new moon **4)** English లేదు - Coin box అనవచ్చు **5)** హిందూపూజారి - Correct English మాట లేదు. priest/ purohit వాడవచ్చు కానీ సరైన అర్థంరాదు. **6)** ఎంగిలి = ఉమ్ము అయితే spittle; ఎవరైనా తిన్న ఎంగిలి అయితే left over. **7)** పంచ భూతాలు: మనకు అవి ఐదు, English వాళ్లకు నాలుగే= The (four) elements (earth, air, fire and water) **8)** సమయస్ఫూర్తి = resourcefulness.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Ganesh:** Would you have another idli?
(ఇంకో ఇడ్లీ కావాలా? )

**Harish:** No, I am full.
(ఇక తినలేను. కడుపు నిండింది)

**Ganesh:** Just two idlis and you say you've (you have) had enough.
(తిన్నవి రెండే ఇడ్లీలు. అప్పుడే చాలంటున్నావు)

**Harish:** You are wrong. I've taken four idlis, that too with sambar. I can't eat another thing.
(నువ్వు చెప్పేది తప్పు. నేను నాలుగు ఇడ్లీలు, అదీ సాంబారుతో తిన్నా. ఇంకేం తినలేను.)
(That too = అది కూడా)

**Ganesh:** Perhaps you are afraid you may put on weight. Idlis or no idlis you gain weight if you don't have any exercise. I do eat a lot, but you can't say I am fat.
(నువ్వు లావెక్కుతానని భయపడుతున్నావు. సరైన exercise లేకపోతే ఇడ్లీలు తిన్నా తినకపోయినా, లావెక్కుతావు. నేను ఎక్కువగానే తింటా, కాని నన్ను లావని అనలేవు)
(put on weight = బరువు పెరగటం = లావవటం)

**Harish:** O stop lecturing. I don't want to eat any more only because I am on a full stomach.
(ఇక ఆ ఉపన్యాసం ఆపు. కడుపు నిండింది కాబట్టి నేను ఇంకేం తినలేను)

**Ganesh:** If only Jayaram were here he would finish off atleast 6 to 7 idlis. You are a poor eater. I enjoy seeing Jayaram eat.
(జయరామే ఇక్కడుంటే ఇప్పటికి ఆరేడు ఇడ్లీలు లాగించేసేవాడు. నువ్వు లాభం లేదు. జయరాం తింటుంటే చూడటం నాకు ముచ్చటేస్తుంది)

**Harish:** You are not a big eater either. You have eaten only four like me.
(నువ్వు కూడా ఎంత పెద్ద తినేవాడివేం కాదు. నువ్వూ నాలాగే నాలుగు ఇడ్లీలే కదా తిన్నది)

ఈ సంభాషణ కూడా ఇంతకుముందు lessons లో లాగానే తిండికి, తినడానికి సంబంధించిందని తెలుస్తూనే ఉంది కదా. మనలో కొంతమంది బాగా తినే వాళ్లుంటారు, కొంతమంది అసలేం తినని వాళ్లుంటారు కదా. ఈసారి తినే అలవాట్లకు సంబంధించిన expressions కొన్ని తెలుసుకుందాం.
1. I am full; 2. I have had enough;
3. Can't eat another thing.
ఈ expressions అన్నీ కూడా కడుపు నిండిపోయి, ఇక ఏ మాత్రం తినలేని పరిస్థితుల్లో ఉన్నప్పుడు వాడతాం.

**Krishna:** Fancy some more upma/ another dosa?
(ఇంకాస్త ఉప్మా/ ఇంకో దోశ తీసుకుంటారా? )

**Laxman:** Sorry. I am full.
(ఇంకేం తినలేను. కడుపు నిండింది)

**Manoj:** Don't force us when we are full please.
(మమ్మల్ని బలవంతం చేయకు, మా కడుపులు నిండిపోయాయి)

చూడండి conversation లో full లాంటి simple word తో ఎంత మాట్లాడవచ్చో

**Krishna:** Atleast some more tea? (కాస్త టీ? )

**Laxman:** Why the hell don't you listen? We have had enough.
(వినవేంటి? మేం తిన్నది చాలు. ఇక తినలేం)
(why the hell = విసుగులో, కోపంలో వాడేమాట. పెద్దవాళ్లతో, మర్యాదగా మాటాడాల్సిన వాళ్లతో వాడకూడదు)







వీటితో పాటు, లావుకు మనకు తెలిసిన మాటలు; fat, stout, plump.

**d)** ఆ తార బాగా లావయింది.
She has became very fat.

**e)** అతడు లావు = He is stout.
Fat అంటే లావు మాత్రమే, stout అంటే లావుతో పాటు కాస్త పొట్టి కూడా.

**f)** ఆమె అంత లావు కాదు, కాస్త బొద్దుగా ఉంటుంది.
She is not so fat; She is plump ]

మళ్లీ ఆహారం విషయానికొద్దాం.
కడుపు నిండి ఆకల్లేనప్పుడు వాడే మాటలు చూశాం కదా.

♦ A big eater = భోజనం లాంటివి ఇష్టంగా తినేవాడు
♦ A poor eater = సరిగా భోంచేయలేనివాడు.

**a)** Bhima was a big eater.
భీముడు భోజన ప్రియుడు (తిండిపోతే కాకపోవచ్చు)

**b)** Perhaps because of his fever he eats only a little now. Even otherwise he is a poor eater.
(జ్వరంవల్ల చాలా తక్కువ తింటున్నాడు. జ్వరం లేకపోయినా అతను పెద్దగా తినేవాడు కాదు)

**Now practise the following aloud in English:**

**Ravikanth:** నాకు బాగా ఆకలేస్తోంది. Hotel కెళ్లి ఏదైనా తిందామా?

**Prashanth:** నాకేం తినాలనిపించటం లేదు. పొద్దున

# She is plump

**Krishna:** I am on a full stomach too. I can't eat another thing.
(నాకూ కడుపు నిండింది. ఇంకేమాత్రం తినలేను)

ఇవన్నీ కూడా 'కడుపు నిండిన వాళ్లు' వాడే మాటలు. మీరు ఈ చిన్న చిన్న expressions conversation లో practise చేయండి.

♦ When you are on a full stomach, you nibble.
(మీకు కడుపు నిండిపోతే nibble చేస్తారు. అంటే పైపైన కొద్దికొద్దిగా కొరుకుతూ ఎక్కువ తినకుండా ఉంటారు)

♦ You nibble when you are not hungry.
ఆకలి లేనప్పుడు nibble చేస్తారు. అంటే ఏదో ఎంగిలి పడతారు. కాబట్టి nibble = అయిష్టంగా తినటం/ ఎంగిలి పడటం.

[Suppose you eat too much, you may put on weight = ఎక్కువ తిన్నారనుకోండి, మీరు లావవచ్చు suppose = అనుకోండి.

**a)** కొవ్వు పదార్థాలు తిని లావవటం ఇష్టం లేదు నాకు.
I don't like to eat fatty substances and gain/ put on weight.

**b)** ఈ మధ్య అతడు చాలా లావయ్యాడు.
of late he has put on a lot of weight.

**c)** అతడు లావు = He is over weight.

ఇప్పుడు బాగా ఆకలిగా ఉన్నప్పుడు వాడే మాటలు చూద్దాం.

♦ ఆకలి = hunger, ఆకలిగా ఉన్న = hungry.
ఈ మాటలు మనందరికీ తెలుసు.

**a)** అతడికి చాలా ఆకలిగా ఉంది
He is very hungry (He is hunger అని అనం.)

**b)** నాకు చాలా ఆకలిగా ఉంది = I am starving.
Starve అంటే అసలు అర్థం = తిండికి లేక పస్తుండటం అని, అయితే బాగా ఆకలిగా ఉంది అనే అర్థంతో కూడా Starve వాడతాం, Conversation లో.

**a)** పిల్లలు ఆకలితో ఉన్నారు. ముందు నేను వాళ్లకు వండాలి.
The Children are starving. I must cook some thing for them first.
(ఇక్కడ - పిల్లలు చాలా ఆకలిగా ఉన్నారని అర్థం. పస్తున్నారని కాదు)

**b)** అమ్మా, చాలా ఆకలేస్తోంది నాకు. అన్నంపెట్టు.
Mom, I am starving. Serve the food/ let me have the food/ Give me something to eat.

**c)** ఏదైనా తినాలనిపిస్తోంది.
I feel like eating some thing.
కాస్త ఏదైనా పెట్టు .
Let me have some thing to eat.




Heavy breakfast తిన్నా.

**Ravikanth:** పొద్దున్నించి ఏం తినలేదు నేను. ఏదో ఒకపని. తీరిక లేకపోయింది.

**Prashanth:** నీతో Hotel కు రావటానికేం అభ్యంతరం లేదు కాని నా కడుపు నిండింది. నేనేం తినలేనింక.

**Ravikanth:** నీ company ఇవ్వు, చాలు. తినటం నేను చూసుకుంటా.

**Prashanth:** ఏంటీ, చాలా ఆకలిగా ఉన్నట్టుంది నీకు?

**Ravikanth:** చెప్పానుగా. పొద్దున్నించి కడుపు ఖాళీ.
(సూచన: ఇంతకుముందు తెలుసుకున్నాం. Hotel- (హోటెల్- టె నొక్కి పలుకుతాం) అంటే lodge సౌకర్యాలతో ఆహారం అమ్మే చోటు. lodge సౌకర్యం లేకుండా కేవలం ఆహారపదార్థాలు, పానీయాలు లభించేచోటు Restaurant - రెస్టొరెంట్ - రె నొక్కి పలుకుతాం.)

**Answer:**

**Ravikanth:** I am very hungry/ am starving. How about eating something in a restaurant?
(ఈ మధ్య restaurants ను eateries/ fast food joints అని కూడా అంటున్నారు)

**Prashanth:** I don't feel like eating anything/ I am full/ I am on a full stomach. (I) had a heavy breakfast this morning.

**Ravikanth:** I haven't had anything to eat since morning/ I have been on an empty stomach since morning. Something or the other kept me busy.

**Prashanth:** I don't mind going to the restaurant with you. But I cannot eat a thing.

**Ravikanth:** Just give your company. I'll take care of the eating part.

**Prashanth:** You appear to be starving.

**Ravikanth:** I told you. (I have) been on an empty stomach since morning.

**ప్రశ్న:** కొన్ని *verbs* తర్వాత *off, away, up* వంటి పదాలు ఎందుకుండాలి? ఉదా: *go* అంటే వెళ్ళు అని అర్థం. ఆమె వెళ్ళింది అనటానికి *she went* అంటే సరిపోతుంది కదా. అలాకాక *she went away* అని ఎందుకు వాడాలి? అలాగే *peel* అంటే తీసివేయటం, తొలగించటం అని అర్థం కదా. కానీ ఈ *verbs* తర్వాత *off* అనే పదం ఎందుకు వాడాల్సి వస్తుంది? *"I will peel off you, if you do it again. Be careful"* - వాక్యంలో *peel verb* తర్వాత *'off'* వాడటం తప్పనిసరా? అలాగే *'flung' verb* తర్వాత *away* అనే పదం ఎందుకు? వెళ్ళింది అనటానికి *went,* ఒలుస్తాను అనటానికి *will peel* అని, పారేసింది అనటానికి *flung* అనే పదాలు తెలుగు అర్థాన్ని దృష్టిలో పెట్టుకుంటే కరెక్టేకదా? అలాంటి *verbs* తర్వాత *off, up, away* వంటి పదాల వాడకం ఎందుకో వివరించగలరు.

– కె.దివ్య, బనవాసి

**జవాబు:** చాలా మంచి ప్రశ్న. మనం ఒక విషయం గుర్తుంచుకోవాలి. ఎప్పుడూ, ఏ భాషలోనైనా మాటలకుండే అర్థం ఒక రకంగా ఉంటుంది. వాటి వాడుక కొంచెం తేడాగా ఉంటుంది.

♦ She went అన్నప్పుడు 'ఆమె వెళ్ళింది' అనే అర్థం clear గానే వస్తుంది. అయితే వాడుకలో (usage) she went away అన్నప్పుడు కొంచెం force ఎక్కువ.

♦ మీరన్నట్టు peel అంటే వలవటం (చర్మం లాంటివి). అయితే ఇక్కడ కూడా peel off అంటే వలిచేయటం (దీనికీ, వలవటం అనే దానికి తేడా గమనించండి: వలిచేయటం అంటే ఇంకొంచెం గట్టిగా చెప్పడం అని తెలుస్తుంది కదా.)

♦ వాడుక (usage) అనేది Dictionary అర్థానికన్నా, grammar rules కన్నా కూడా ఎక్కువ శక్తిమంతం. మనం పదాలను మామూలుగా వాడివాడి, మనం అనుకున్నంత force దానిలో ఉండదనే భావంతో went away, peel off, flung away (flung- విసిరేశారు, flung away- విసిరిపారేశారు- తేడా తెలుస్తోంది కదా.) లాంటి మాటలను verbs చివర చేరుస్తాం. ఇవి వాడుకవల్ల ప్రామాణికం (standard) అయిపోయి, అవి వాడకపోవటం వింతగా కనిపిస్తుంది.

♦ కొన్ని సందర్భాలలో up, away లాంటివి చేర్చటంవల్ల, అర్థమే మారిపోతుంది.
He has gone. He has gone up - తేడా తెలుస్తోంది కదా.

♦ తెలుగులో కూడా- ఆమె వెళ్లింది - అనడానికి, ఆమె వెళ్లిపోయింది అనడానికి తేడా ఉంది. అతడిని చితక్కొట్టారు, అతడిని చితక్కొట్టేశారు- వీటికి తేడా ఉంది. చితక్కొట్టేశారు- అంటే కొంచెం force ఎక్కువ - భావంలో. English కూడా అంతే.
They beat him. (వాళ్లు అతడిని కొట్టారు)
They beat him up. (వాళ్లు అతడిని కొట్టేశారు).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# You like coffee, don't you?

**Naresh:** Hi Ajitha, have you finished reading the book?
(పుస్తకం చదవటం పూర్తిచేశావా? )

**Ajitha:** Yes, here it is.
(ఆ... చదివేశా. ఇదిగో, తీసుకో)

**Naresh:** (It's) interesting, isn't it?
(Interesting గా ఉందికదా? )

**Ajitha:** Quite. You buy such books quite often, don't you?
(పూర్తిగా. అలాంటి books తరచుగా కొంటుం టావు కదా? )

Quite = పూర్తిగా. Conversation లో ఇలాంటి one word responses, అంటే మొత్తం sentence తో కాకుండా ఒక మాటతో reply ఇవ్వటం చాలా సహజంగా ఉంటుంది. అలాంటివి practice చేయండి.

**Naresh:** That's right. I find them a good source of general knowledge. You found this book so, didn't you?
(కరెక్టే. అవి General Knowledge ఇచ్చే విగా ఉంటాయి. ఈ పుస్తకం కూడా అలా ఉండటం చూశావు, కదా? )

source, ఏదైనా దొరికే చోటు




**Ajitha:** Sure. It gives a lot of information. You don't usually lend your books to others, do you?
(Correct. ఇందులో చాలా information ఉంది. మామూలుగా నీ పుస్తకాలు ఇతరులెవ్వరికీ ఇవ్వవు, కదా? )

**Naresh:** I don't. I gave one to you because I know you are prompt in returning. Once you lend a book you are not sure whether you get it back, are you?
(ఇవ్వను. నువ్వు చెప్పిన time కు తిరిగిస్తావు కాబట్టి నీకు మాత్రం ఇచ్చాను. ఒకసారి పుస్తకం ఇస్తే అది తిరిగి వస్తుందనే నమ్మకం లేదు, కదా? )

prompt = time కు సరిగ్గా

**Ajitha:** You haven't lost books by lending, have you?
(నువ్వు ఇచ్చిన పుస్తకాలింతవరకు పోగొట్టుకోలేదు, కదా? )

**Naresh:** I make sure that I get them back, if at all I lend.
(తిరిగొచ్చేట్టు చూసుకుంటాను, ఇవ్వటం అంటూ జరిగితే. )

If at all = ఏదైనా జరగటం అంటూ ఉంటే - జరక్కపోయే అవకాశం ఎక్కువ.

If at all I go = నేవెళ్లటం అంటూ జరిగితే.

conversation లో practice చేయండి.

**Ajitha:** You appear to be busy. I am not keeping you from your work, am I?
(నువ్వేదో busy గా ఉన్నట్టున్నావు. నేను మీ పనేం ఆపటం లేదు కదా? )

♦చూడండి, పై సంభాషణంతా చిన్న, చిన్న ప్రశ్నలతో అంతమయ్యే sentence తో ఉండటం గమనించే ఉంటారు. వాటికి తెలుగు వాక్యాల చివరలో 'కదా' అని ప్రశ్న రావటం గమనించారు కదా?

♦ఇలా 'కదా?' 'కాదా?' 'ఔనా!' 'లేదా?' అని చిన్న ప్రశ్నలు మన conversation లో, తెలుగు కానివ్వండి, english కానివ్వండి, రావటం సహజం, సాధారణం.

♦తెలుగులో ఇలాంటి ప్రశ్నల విషయంలో సమస్యే లేదు. ఎందుకంటే ఏ వాక్యానికైనా వచ్చే ప్రశ్న కదా? కాదా? ఔనా? లేదా? అనే వాటిలో ఏదో ఒకటివస్తుంది. ఏదొచ్చినా ఫరవాలేదు. కానీ english లో ఇది కొంచెం సమస్యే.

♦sentence చివర వచ్చే ఈ చిన్న చిన్న Questions ను Question tags అంటాం - ఇది మనలో చాలా మందికి తెలుసు. ఈ question tags వాడే అవకాశం చాలా frequent మాత్రమే కాకుండా, అత్యంత సహజమైన ముగింపునిస్తుంది.

♦English లో Question tags correct గా form చేస్తే conversation కు చాలా సహజత్వం వస్తుంది.

♦Question కూ Question tag కూ తేడా: Question అంటే అది మొత్తం ఓ sentence గా ఉంటుంది.

**Eg:** Are you very busy?
(మీరు చాల busy గా ఉన్నారా? )
- చూశారా ఇది మొత్తం ఒక sentence.

♦Question tag అంటే, ఒక sentence చివర వచ్చే sentence భాగం మాత్రమే. Sentence లో మిగతా భాగం లేకుండా, question tag కు అర్థం ఉండదు.

**Eg:** You are busy, aren't you?
(మీరు busy గా ఉన్నారు, కదా? )
ఇక్కడ Aren't you? Question tag. మిగతా sentence లేకుండా question tag అయిన Aren't you? కు అర్థం ఉండదు కదా?

♦ Question tag form చేయటం ఎలా?
తెలుగులోలా కాకుండా (కదా? కదాని ఔనా? లేదా? వీటిల్లో ఏదైనా ఫరవాలేదు) english లో Question tag, ప్రతి sentence కూ దాని verb ను బట్టి మారుతూంటుంది. అది form చేయటం నేర్చుకునే ముందు, కొన్ని question tags examples చూద్దాం.

a) India is a large democracy, isn't it?
(ఇండియా పెద్ద ప్రజాస్వామ్య దేశం, కదా? )

b) English isn't difficult to learn, is it?
English నేర్చుకోవటం కష్టం కాదు, కదా/ ఔనా? )

c) He knows English, doesn't he?
(అతనికి English తెలుసు, కదా? )

d) She didn't sing well yesterday, did she?
(ఆమె నిన్న సరిగా పాడలేదు, కదా? )

e) You like coffee, don't you?
(నీకు కాఫీ ఇష్టం కదా? )

f) I can bat as well as Tendulkar, Can't I?
(నేను టెండూల్కర్‌లా bat చేయగలను కదా? )

♦పై examples గమనించారు కదా? తెలుగులో అన్నిటికీ కదా? అని వస్తే, English లో ప్రతి Sentence చివర question tag తేడా, తేడాగా...

a) ... isn't it? b) ... is it? c) ... doesn't he? d) ... did she? e) ... don't you? f) ... can't I? వస్తున్నాయి కదా. ఇది మనం ఎప్పుడూ గుర్తుపెట్టుకోవాలి. మనలో చాలామంది ఏ sentence కయినా... is it? అనే question tag చేరుస్తుంటాం. అది సరికాదని ఇప్పుడు తెలుసుకున్నాం కదా?

♦ఇప్పుడు question tag form చేయటం ఎలానో చూద్దాం:
మనం question tag form చేయాల్సిన వాక్యం, Hyderabad is a beautiful city - అనుకుందాం.
ఈ భాగాన్ని stem అంటాం.

దీనిని question tag form రూపంలో రాయాలంటే...

1) Add a comma at the end of the stem:
Hyderabad is a beautiful city,

2) Note the verb.
ఇక్కడ verb, 'is' కదా? దాన్ని comma తర్వాత రాస్తాం:
Hyderabad is a beautiful city, is


M. SURESAN

3) ఈ Sentence లో stem భాగంలో not ఉందో లేదో గమనించటం చాలా ముఖ్యం:
ఎందుకంటే stemలో not ఉంటే, question tag లో not రాదు, stem భాగంలో not లేకపోతే tag లో not కచ్చితంగా contracted form (కుదించిన రూపం)లో అంటే n't గా వస్తుంది.
Hyderabad is a beautiful city. ఇందులో not లేదు కాబట్టి,
Hyderabad is a beautiful city, is n't గా రాస్తాం.

4) చివరిగా Hyderabad బదులు 'it' అనేది చేర్చాలి. దాని తర్వాత question mark పెట్టాలి. అప్పుడు పూర్తి Sentence:
Hyderabad is a beautiful city, isn't it?
(హైదరాబాద్ అందమైన నగరం, కదా? )

♦ Hyderabad is not bigger than Mumbai.
ఈ stem కు Question tag ఎలా చేరుస్తాం?

1) Stem (Hyderabad is not bigger than Mumbai) చివర, comma పెడతాం:
Hyderabad is not bigger than Mumbai,

2) Verb, stem లో is కాబట్టి, దాన్ని comma తర్వాత రాస్తాం:
Hyderabad is not bigger than Mumbai, is

3) Stem లో not ఉంది కాబట్టి, tag లో not రాదు.

4) చివరిగా tag తర్వాత question mark పెడతాం. అప్పుడు మొత్తం Sentence:
Hyderabad is not bigger than Mumbai, is it? అవుతుంది.
(హైదరాబాద్ ముంబయి కంటే పెద్దది కాదు, కదా? )

**Now practise the following aloud in English:**

**Sankar:** టెండూల్కర్ గొప్ప batsman, కదా?
**Tarun:** కాని Dravid అంత steady కాదు, కదా?
**Sankar:** చాలా చిన్నవయసులోనే test player గా ఉన్నాడు కదా?
**Tarun:** అతనిలాంటివాడు Bharat team లో ఉండటం, గర్వకారణమే కదా?
**Sankar:** ఇంకో విషయం. Tests లో highest number of centuries కొట్టిన వాళ్లలో మొదటి ఇద్దరు Indians, కదా?
**Tarun:** Kapil Dev and Srinath కూడా గొప్ప bowlers గా ఉండేవాళ్లు కదా. శ్రీనాథ్ అంత గొప్ప batsman కాదు కదా? కపిల్‌దేవ్ కూడా bowler గా కంటే batsman గా అంతగొప్ప కాదు, కదా?

**Answer:**
**Sankar:** Tendulkar is a great batsman, isn't he?
**Tarun:** But he is not as steady as Dravid is he?
**Sankar:** He was a test player at a very young age, wasn't he?
**Tarun:** A Player like him on the Indian team is a matter of pride for India, isn't it?
**Sankar:** One more thing. The first two among those who have scored the highest number of test centuries are Indians, aren't they?
**Tarun:** KapilDev and Srinath were great bowlers, weren't they? Srinath wasn't a great batsman, was he? Even Kapil Dev wasn't as great a batsman as he was a bowler, was he?

---




**ప్రశ్న:** a) నేను 11 పి.ఎం.కి పడుకుంటాను.
I sleep at 11 PM
b) నేను 11 పి.ఎం.కి పడుకోను
I do not sleep at 11 PM
c) మీరెన్నింటికి పడుకుంటారు?
When do you sleep?
పై వాక్యాలు సరైనవా, కావా?

– కె.సత్యం, హైదరాబాద్

**జవాబు:** పడుకోవటం (నిద్రకు) = go to bed
a) I go to bed at 11 PM = 11 కు పడుకుంటాను.
b) I do not go to bed at 11 PM.
c) When/ At what time do you go to bed?
ఇంతకుముందోసారి go to bed కు, sleep కు తేడా వివరించాం.
Englishలో sleep అంటే నిద్రించటం అని. English లో sleep తో ఎప్పుడూ point of time అంటే ఫలానా సమయానికి నిద్రకు ఉపక్రమించటం, ఫలానా సమయానికి నిద్రలేవటం అనిరాదు.
నిద్రించే period కు మాత్రమే sleep.
a) Sleep for 7 hours a day.
నేను 7 గంటలు నిద్రిస్తాను = నిద్రలో ఉంటాను.
నిద్రించటానికి పడుకోవటం sleep.
అది go to bed.
నిద్రలేవటం = get up (from bed)
b) I go to bed at 11 and get up at 6.
(ఇక్కడ I sleep at 11 రాదు. I sleep from 11 PM to 6 AM అనొచ్చు)

**ప్రశ్న:** *'Nothing but'- 'of course'- 'ofcourse not'* - వీటి అర్థాలు ఏమిటి? వీటిని వాక్యాలలో ఎలా ఉపయోగించాలి? వివరించగలరు.

– ముకరం, షాహిద్, హైదరాబాద్

**జవాబు:**
1) Nothing but = అది తప్ప ఇంకేమీకాదు.
This is nothing but cheating.
ఇది మోసం తప్ప ఇంకేమీకాదు.
2) Ofcourse అర్థం కచ్చితంగా అని. అంటే ఎవరైనా అన్న విషయాన్ని మనం అంగీకరిస్తున్నప్పుడు వాడతాం.
'Isn't the movie good?' (సినిమా బాగుంది కదా.)
'Ofcourse it is' (బాగానే ఉంది/ అవును)
3) 'Ofcourse not' - అంటే 'అది కాదు' అని.
A: Is India a rich country?
(భారత్ ధనిక దేశమా? )
B: 'Ofcourse not. It is infact a developing country.
(అలాగేం కాదు. అభివృద్ధి చెందుతున్న దేశం)
Of Course not - అలాంటిదేంలేదు.
(అంటే మీకిది తెలిసే ఉండాలే అన్నట్టుగా).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# You are ready, are n't you?




**Varun:** Hi Anand, you are ready, aren't you?
(నువ్వు సిద్ధంగానే ఉన్నావు, కదా? )

**Anand:** I am ready, but you are not in a hurry, are you?
(నేను ready నే. కాని నువ్వేం అంత తొందరలో లేవు, కదా? )
(hurry= తొందర)

**Varun:** Not that I am in a hurry, but (I am) just making sure we can start at any time. Not that I want to trouble you, but can you get me a ticket for the match
(నేను తొందరలో ఉన్నానని కాదు. మనం ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు బయల్దేరగలం అని అర్థం. నిన్ను ట్రబుల్ చేయాలని కాదు. కాస్త మ్యాచ్‌కి నాకో ticket తెచ్చిపెడతావా? )
Not that = అలా అని కాదు. ఇది తరచూ తెలుగులో కూడా వాడుతుంటాం కదా.

**Anand:** Once we start here we can reach there in twenty minutes, Can't we?
(మనం ఇక్కడ బయల్దేరిన 20 నిమిషాలకక్కడ చేరుకోగలం కదా? )

**Varun:** Even earlier than that. But where is Arun? He said he would be coming too, didn't he?
(అంతకుముందే చేరుకోగలం. కానీ Arun ఏడీ? తను కూడా వస్తానని చెప్పాడు, కదా? )

**Anand:** He did of course. But we need not wait for him, need we?
(అన్నాడనుకో. కానీ అతనికోసం మనం wait చేయక్కర్లేదు, కదా? )

**Varun:** Let's go then, shall we?
(అయితే మనం వెళ్దామా? )

ఈ సంభాషణ కిందటి సంచికలో మనం చూసిన Question tags తో కూడిన సంభాషణే కదా? Question tag ఎలా form చేయాలనేది మరోసారి గుర్తుచేసుకుందాం.

1) They are here, are n't they?
(వాళ్లిక్కడున్నారు, కదా? )
పై Sentence లో 'They are here'- ఈ భాగాన్ని stem అంటాం; aren't they? (= కదా? ) అనే భాగాన్ని Question tag అంటాం.
2) Question tag form చేసేప్పుడు, stem పక్కన comma పెడతాం.
3) Stem లో Verb ఏదో గమనించి, దాన్ని comma పక్కన రాస్తాం.
4) Stem లో not లేకపోతే, tag లో Verb కు n't కలుపుతాం. ఉంటే n't రాదు.
5) Stem లో Subject బదులు వచ్చేమాట -I/ we/ you/ he/ she/ it/ they చివర పెడతాం;
6) Question mark (?) చేరుస్తాం.

**Example.**
They were here last night, - ఇది stem అయితే దీనికి Question tag:
1) Comma: They were here,
2) Comma తర్వాత Verb- ఇక్కడ stem లో Verb, 'were' - They were here, were
3) Stem, 'they were here'లో not లేదు కాబట్టి, tag లో verb కు n't (not) కలుపుతాం.
They were here weren't
4) Stem లో Subject, ఇక్కడ 'they' tag చివర పెడతాం: they were here, weren't they
5) Question mark చేరుస్తాం: అపుడు Question tag తో Sentence ఇలా ఉంటుంది కదా:

They were here last night, weren't they?
మొదట ఇచ్చిన సంభాషణలో Question tag తో ఉన్న Sentences ను రెండింటిని చూద్దాం.

1) You are ready, are n't you?
(Comma + Verb (are) + n't (no not in stem) + subject (you) + question mark)
2) You are not in a hurry, are you?
(Comma+Verb (are) (no n't in the tag here because there is 'not' in the stem) + Subject (you) + Question Mark)

✪ Stemలో Verbs ను బట్టి Question tags మారుతుంటాయి. కింది stem కు Question tag చూద్దాం. David is coming. ఇక్కడ Verb 'is coming' - ఇలా am, is, are, was, were, will, would, shall, should, can, could, may, might, must, need, ought, have, has, had combinations తో ఉన్న Verbs వస్తే వీటిని మాత్రమే tag లోకి తీసుకుంటాం. వీటి తర్వాత వచ్చే మాట/ మాటలు tag లో రావు.

a) Madhu cannot ( = can't) sing, can he?
b) Bhaskar will not (= won't) come, will he?
c) Sheela shall not (=shan't) sing, shall she?

✪ Stem లో I regular doing words (come, go, sing, etc), II regular doing words (come, go, sing etc.), past doing words (came, went, song etc.) question tags చాలా జాగ్రత్తగా form చేయాలి.

[మనం Ist lessons spoken english లో నేర్చుకున్నది ఇపుడు గుర్తుకు తెచ్చుకుందాం.
a) Ist regular doing word ను not తో కానీ question లో కానీ వాడితే, do + I regular doing word అవుతుంది. go (+ not / ?) = do (not) go
b) 2nd Regular Doing word ను not తో కానీ Question లో కానీ వాడితే, does + 1st Regular Doing Word అవుతుంది. goes (+ not \ ?) = does (not) go.
c) Past doing word ను not తో కానీ question లో కానీ వాడితే did + Ist regular doing word అవుతుంది. went (+ not / ?) = did (not) go]

Chitra sings well, doesn't she?
Stem లో not ఉందనుకోండి. అప్పుడు does she అని మాత్రమే వస్తుంది.
Chitra does not act, does she?

**Now practise the following aloud in English.**

**Ravi:** సౌరభ్ గంగూలి next test లో ఆడుతున్నాడు, కదా?
**Aswini:** చివరకు ఎలాగో స్థానం పొందాడు మరి.
**Ravi:** అందువల్ల Kaif ను తీసేశారు కదా?
(తీసేయటం = drop. remove అని కూడా అనవచ్చు)
**Aswini:** Kaif కూడా చాలా బాగా ఆడాడు. అతన్ని తీసేయటం అన్యాయం కదా?

David is coming - ఇక్కడ verb is coming. (Is Combination తో ఉన్న verb ఇది. tag లో is మాత్రమే వస్తుంది.)
a) David is coming, is n't he? (David బదులు 'he')
b) Geetha and sita are playing. ఈ stem లో verb: are coming: tag లో are మాత్రమే వస్తుంది కదా? కాబట్టి question tag.
Geetha and Sita are playing, aren't they?
(Geetha and Sita (వాళ్లు) బదులు they)

✪ పై సంభాషణలోని sentence:
We can reach there in twenty minutes, can't we? (cannot కు బదులు, can't) ఇక్కడ verb can reach, so tag లో మాత్రమే వస్తుంది.
ఇది చూడండి:
Many heroes cannot sing.
ఇది question tag తో-
Many heroes cannot sing, can they?
(stem లో not ఉంది, tag లో not రాదు. Verb can sing - tag లో can మాత్రమే వస్తుంది)

✪ ఇంకా గమనించాల్సినవి.
Stem లో will + ఉండి, not లేకపోతే, question tag లో won't (will + not) వస్తుంది. (వోన్ట్)
a) Ganguly will play in Pak series, won't he?
b) Tarun will come with us, won't he?
(పై sentences లో లాగే ఎక్కడైనా will తో not వాడాల్సి వస్తే won't అవుతుంది)
అలాగే shall తో not రావాల్సి వస్తే, shan't అవుతుంది, (షాన్ట్)

✪ can, will, shall తో stem లో not ఉంటే tag లో can, will, shall not లేకుండా వస్తాయి.

1) Sehwag and Dravid play well.
ఇక్కడ verb play (1st regular doing word).
ఇది not తో/question లో do play అవుతుంది కదా. Sehwag and Dravid play well లో play = do play. కాబట్టి question tag లో, do వస్తుంది. దానికి n't కలిపి, don't వాడతాం, దాని తర్వాత Sehwag and Dravid బదులు, they అంటాం. కాబట్టి మొత్తం sentence ఇలా ఉంటుంది కదా?
Sehwag and Dravid play well, don't they?
Stem లో not వచ్చిందనుకోండి, అప్పుడు tag లో do they మాత్రమే వస్తుంది.
Laxman and Dravid don't (do not) bowl, do they?

✪ అలాగే II regular doing word (comes, goes, sleeps లాంటివి) వచ్చినప్పుడు does వస్తుంది కదా? Stem లో not లేకపోతే does కు n't కలిపి doesn't అంటాం. అంతేకదా?

a) Chitra sings well. ఇక్కడ verb... sings (2nd regular doing word). ఇది not తో/ question లో does sing అవుతుంది కదా. దానికి n't కలిపి does-n't (డజన్ట్- జ size లో జ్ లాగ) వాడతాం, దాని తర్వాత Chitra బదులు, she అంటాం. అప్పుడు మొత్తం sentence ఇలా ఉంటుంది కదా?


M. SURESAN

**Ravi:** మరి Laxman సంగతి గతంలో?
**Aswini:** అవును. Selection committee Laxman ను కూడా చాలా bad గా treat చేసింది కదా?
**Ravi:** Selectors merit కు ప్రాముఖ్యం ఇవ్వరు కదా?

**Answer:**
**Ravi:** Sourabh is playing in the next test, isn't he?
**Aswini:** Finally (at last) he has got a place on the team.
**Ravi:** Because of that they have dropped Kaif, haven't they?
**Aswini:** Kaif plays well too, doesn't he? Removing/ dropping him is unjust, isn't it?
**Ravi:** What about Laxman in the past?
**Aswini:** Yes, the selection committee has treat Laxman badly, hasn't it?
(verb- has treated, కాబట్టి has మాత్రమే వస్తుంది, tagలో)
**Ravi:** The selection do not give importance to merit, do they?

---

Q&A

**ప్రశ్న:** *Continuous tense ను passive voice లోకి మార్చేటప్పుడు మాత్రమే being ఉపయోగిస్తారని తెలుసు. కాని ఆంగ్లపత్రికల్లో పలు రకాలుగా ఉపయోగిస్తున్నారు. Being ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారో తెలుపగలరు.*
– శ్రీనివాసరావు, మార్టూరు

**జవాబు:** Active Voice లోని verb 'ing' form లో ఉంటే passive voice లో being + past participle వస్తుంది.

eg: **Active Voice:** am/ is/ are + ing form తో verb (ఇప్పుడు జరుగుతున్న పనిని తెలిపేవి)

| | | |
|---|---|---|
| I am<br>He/ She is<br>They are | teaching | a lesson/<br>lessons |

**Passive Voice:**

| | | |
|---|---|---|
| A lesson is<br>Lessons are | being taught by | me<br>him/<br>her/<br>them |

**Active Voice:**

| | | |
|---|---|---|
| I/he/she was<br>We/you/they were | teaching | a lesson |

వీటి అర్థం:

| | | |
|---|---|---|
| ఇప్పుడు | నేను ....... బోధిస్తున్నాను<br>అతడు ..... బోధిస్తున్నాడు<br>ఆమె ....... బోధిస్తోంది<br>నువ్వు ...... బోధిస్తున్నావు<br>మీరు, వాళ్లు ..... బోధిస్తున్నారు<br>మేము/మనం .... బోధిస్తున్నాం | పాఠాన్ని<br>పాఠాలను |

వీటికి **Passive:** ఇక్కడ being + past participle రావటం గమనించండి.

| | | |
|---|---|---|
| A lesson is<br>Lessons are | being taught by | me<br>him/ her/<br>you/ us/ them |

అర్థం:

| | | | |
|---|---|---|---|
| పాఠం<br>పాఠాలు | నా<br>అతడి/ఆమె<br>నీ/మీ/మా/వాళ్ల | చే | బోధించబడుతున్నాయి. |

(తెలుగులో ఇలాంటి passive ప్రయోగాలు భరించలేం కదా)

◆ అలాగే was teaching, were teaching లాంటి active forms కు was being/ were being + taught వస్తాయి.

| | | |
|---|---|---|
| I/ he/ she was<br>We/ you/ they were | teaching | a lesson<br>lessons |

| | |
|---|---|
| నేను - గతంలో - బోధిస్తున్నాను<br>వాడు - గతంలో - బోధిస్తున్నాడు<br>ఆమె - గతంలో - బోధిస్తూండింది<br>నువ్వు - గతంలో - బోధిస్తున్నావు<br>మీరు/ వాళ్లు - గతంలో- బోధిస్తున్నారు<br>మేము/ మనం - గతంలో- బోధిస్తున్నాం | పాఠాన్ని<br>పాఠాలను |

వీటికి **passive:**

| | | |
|---|---|---|
| A lesson was<br>Lessons were | being taught by | me/ us/<br>him/ her/<br>you/ them |

= నాచే/ మాచే/ మమ్ములచే/ అతడి/ ఆమె/ మీ/ వాళ్లచే పాఠం బోధించబడుతూండింది/ పాఠాలు బోధించబడుతున్నాయి (గతంలో)
ఇలాంటి చోట్ల being + PP form వస్తుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Anu:** Hi Suma, Wish a very Happy New Year of better communication.
(నువ్వు ఈ సంవత్సరంలో బాగా English మాట్లాడగలవని నేను కోరుకుంటున్నా).

**Suma:** Same to you, Anu. We are going to have a party on the occasion, aren't we?
(మనం ఈ సందర్భంలో party చేసుకోబో తున్నాం కదా? )

**Anu:** Pavani said so yesterday, didn't she?
(పావని నిన్న అలా అంది. కదా?

**Suma:** I am giving the party, aren't I?
(నేను కదా party ఇవ్వబోతున్నది? )

**Anu:** Yes, it is your turn this time.
(అవును ఈసారి నీవంతు... turn= వంతు)

**Suma:** I am giving the party alright, but I am not making the arrangements, am I?
(నేను party ఇస్తున్నాను. ఏర్పాట్లు నేను చేయటం లేదు కదా? )




ఇపుడు ఈ lesson ప్రారంభంలోని సంభాషణలో... question tags ఉన్న sentences గమనిద్దాం.
1. aren't we? 2. didn't she? 3. aren't I? 4. am I? 5. aren't you? 6. doesn't it, etc.
వీటిల్లో aren't we? didn't she? aren't you? etc., ఈ question tags మనకు కొత్తేమీకాదు. ఇవి ఎలా form చేయాలో మనకు తెలుసు. ఇపుడు మనకు కొత్తగా వచ్చిన question tags....
1. aren't I? 2. am I? ఇవి ఉన్న sentences:

**1)** I am giving the party, aren't I?
మనం ఇంతకుముందు తెలుసుకున్న rule ప్రకారం ఇక్కడ stem 'I am giving the party' లో verb, am giving కాబట్టి, question tag లో am, దాని తర్వాత n't (stem లో not లేదు కాబట్టి), దాని తర్వాత I వచ్చి, మొత్తం question tag, amn't I? అవాలి కదా.
కాని ఇక్కడ aren't I (ఆన్ట్I?) అని వస్తోంది. ఇది చాలా ముఖ్యమైన విషయం. I తో begin అయ్యే sentence లో verb, am+గా ఉండి, not లేకపోతే, question tag ఎప్పుడూ aren't I? గానే ఉంటుంది. amn't I? అనే question tag English లో లేదు. అదే stemలో not ఉంటే, అపుడు question tag మళ్లీ am I?
( I am not making the arrangements, am I? ఇక్కడ stem లో not ఉంది)




f) might..., - mightn't? (మైటెన్ట్) - చాల అరుదు.
g) have..., - haven't...? has..., hasn't...?
h) had..., - hadn't...? i) need..., needn't...? (pron: నీన్ట్) j) should..., shouldn't ...? (షున్ట్...?) k) would..., wouldn't...? (వున్ట్?)

◆ stemలో not ఉంటే సమస్యే లేదు కదా? verbsలో మొదటి మాట చెప్పి, subject చెప్తాం.
example చూద్దాం.
1) a) Sachin could play well, couldn't he?
b) Sachin could not play well, could he?
2) a) Ramesh will help you, won't he?
b) Sudha will not / won't help you, will she?

**2) Santhi:** మీరు నా మీద jokes వేస్తున్నారు, కదా?
**Revathi:** నేనసలు మాట్లాడటం లేదు కదా, Jyothi?
**Jyothi:** నేనేమో ఈ నవల చదువుతున్నాను. ఔనా?
**Santhi:** నేనే పొరపడ్డాను, కదా? మీరు మంచివాళ్లు పాపం.
**Revathi:** నేనే serious type కదా? నాకసలు jokes నచ్చవు.
**Jyothi:** నేను studies లోనే interested, కదా? నాకసలు joke చేయటం రాదు, కదా?
**Santhi:** మీరసలు ఇతరుల మీద jokes వెయ్యరు, కదా?
**Revathi:** Jyothi విషయం నాకు తెలియదు. నేను మాత్రం ఎప్పుడూ serious.

# do you, don't you?

**Anu:** Ah here comes Bhargavi. Hi Bhargavi, We are talking about the party. You are making all the arrangements, aren't you?
(ఇదిగో భార్గవి. భార్గవీ, మేం party గురించి అనుకుంటున్నాం. ఏర్పాట్లన్నీ నువ్వు చేస్తున్నావు కదా? )

**Bhargavi:** I am. I am getting the money from Suma, aren't I?
(చేస్తున్నాను. suma దగ్గర డబ్బులు తీసుకో వాలి కదా? )

**Suma:** I am ready. Thank you for making all the arrangements. You are taking trouble. aren't you?
(నేనివ్వటానికి సిద్ధం. కానీ నువ్వు trouble తీసుకుంటున్నావు కదా? )

**Bhargavi:** That doesn't matter as long as I don't spend.
(నేను డబ్బు ఖర్చు పెట్టనంతవరకు పరవా లేదులే)

as long as- so long as = అది జరిగేవరకు, ఆ పద్ధతిలో. so long as మామూలుగా 'not' ఉన్నప్పుడు వాడతాం. As long as ఎప్పుడైనా వాడవచ్చు.

**Suma & Anu:** Thank you.

ఈ సంభాషణ గతంలో వచ్చిన రెండు lessons లో (question tags పై వచ్చింది) లాగానే ఉంది కదా. ఒక్కసారి మళ్లీ, don't, doesn't, didn'tతో వచ్చే question tag విషయం చూద్దాం.

**Bhushan:** You get up quite early, don't you?
(నువ్వు చాలా పెందలాడే నిద్రలేస్తావు, కదా)

**Dhiraj:** That's right, do you, don't you?
(నువ్వు కూడా అంతే కదా? )

**Bhushan:** Your college begins at 10, doesn't it? so you can get up late, can't you?
(మీ college 10కి కదా, నువ్వు ఆలస్యంగా నిద్రలేవచ్చు, కదా? )

**Dhiraj:** But our school started at 7.30, didn't it? so I got used to getting up early.
(మన school 7.30కుండేది కదా? అందు కని అలవాటయిపోయింది.)

Get used to = అలవాటుపడటం. I have got used to the hot weather here = (ఇక్కడి వేడికి నేనలవాటు పడిపోయాను). మళ్లీ గుర్తుచేసుకుందాం 1) 'Get up' అనే Regular doing word verb అయి not లేదు కాబట్టి. Question tag, 'don't you?' 2) 'Begins' అనే second regular doing word verb అయి not లేదు కాబట్టి, question tag, 'doesn't it?' 3) 'started' అనే past doing word verb అయి, not లేదు కాబట్టి, question tag, 'didn't it?' (Didn't pronunciation - డిన్ట్)

మరికొన్ని examples చూద్దాం.
a) I am Andhra, aren't I? (stemలో not లేదు)
b) I am not an American, am I? (stemలో not ఉంది)

**2)** a) I am getting good marks, aren't I? (No not in the stem)
b) I am not troubling you, am I? (Not in the stem)

**3)** a) I am an Indian like you, aren't I?
నేనూ మీలాగ భారతీయుడినే కదా?
(No not in the stem)
b) I am not a fool, am I?
(నేనేం మూర్ఖుణ్ని కాదు, కదా? (not in the stem)

కాబట్టి 'I' విషయంలో గుర్తుంచుకోవాల్సింది-
a) Stemలో not లేకుంటే, question tag aren't I? (verb, 'am+' అయితే)
b) stem లో not ఉండి, verb 'am+' అయితే question tag, 'am I?'

మళ్లీ కొన్ని ఇతర verb farms కొచ్చే question tags ఇక్కడ ఇస్తున్నాం. గుర్తుంచుకోండి. ఇవన్నీ కూడా stemలో not ఉన్నప్పుడు.
a) Shall..., - shan't...? b) will.., - won't..?
c) can..., _can't...? d) could..., couldn't...? (couldn't - pronunciation - (కున్ట్)
e) may..., - mayn't? (మెయన్ట్? )

3) a) Ameet has scored good marks, hasn't he?
b) Ameet hasn't (has not) passed, has he?


M. SURESAN

ఇలా మిగతావి బాగా practice చేస్తేనే question tags కరెక్టుగా form చేయగలం. Question tags లేని సంభాషణ చాలా నిర్జీవంగా ఉంటుంది.

**Now practice the following in English:**

**1) Ganesh:** Hi Mahesh, నిన్న రాత్రి నువ్వు సినిమాకు వెళ్ళావు కదా?
**Mahesh:** అవును, వెళ్తానని చెప్పాను. ఔనా?
**Ganesh:** చెప్పావులే. కానీ నువ్వు వెళ్తావనుకోలేదు.
**Mahesh:** నేనేదయినా చెబితే serious గానే ఉంటాను, కదా?
**Ganesh:** cinema విషయంలో నేను మాత్రం serious కాను, కదా?
**Mahesh:** నేను నా friends తో సినిమాకెళ్తే సంతోషిస్తాను కదా? నిన్న నువ్వు నాతో రాలేదేం?
**Ganesh:** నిన్న చాలా busy గా ఉన్నా. నువ్వు వెళ్లిన cinema hero fan కదా నేను? నేను రాలేదని బాధపడుతున్నా.

**Answers:**

**1) Ganesh:** Hi, Mahesh, you went to a movie last night, didn't you.
**Mahesh:** I told you (that) I would (go), didn't I?
**Ganesh:** You told me, yes. But I didn't think you'd go.
**Mahesh:** When I say something, I am serious, aren't I?
**Ganesh:** But I am not serious about movie matters, am I?
**Mahesh:** I feel happy when I go to a movie with my friends, don't I ? Why didn't you come?
**Ganesh:** I was very busy yesterday. I am the fan of the hero of the movie. Yesterday aren't I? I am sorry I missed the movie.

**2) Santhi:** Hey, you are joking at me, aren't you?
**Revathi:** I am not at all talking, am I, Jyothi?
**Jyothi:** I am reading the novel, aren't I?
**Santhi:** I am mistaken, aren't I? You are good people.
**Revathi:** I am the serious type, aren't I ? I don't like jokes at all.
**Jyothi:** I am interested only in studies, aren't I ? I don't know how to joke, do I?
**Santhi:** You never joke at others? do you?
**Revathi:** I don't know about Jyothi, but I am always serious.

---

**ప్రశ్న:** *Spoken English కు సంబంధించి మంచి books తెలియజేయగలరు.*
*– శిరీష, జంగారెడ్డిగూడెం*

**జవాబు:** Spoken English books market లో చాలా ఉన్నాయి. వాటిల్లో కొంచెం మంచివి. English conversation by Grant Taylor; Spoken English for you by G.Radhakrishna Pillai and K.Rajeevan.

**ప్రశ్న:** *1) సాధారణంగా లోదుస్తులను ఇంగ్లిష్‌లో Underwear (అండర్‌వేర్) అంటారు. Innerwear (ఇన్నర్‌వేర్) అని ఎందుకనరు?*
*2) బస్సు ఎక్కేటప్పుడు, సినిమాహాళ్ల దగ్గర టిక్కెట్లకు వరసక్రమంలో రావడానికి 'Q' 'పద్ధతి పాటించండి అని బోర్డులుంటాయి. కేవలం Q అక్షరం మాత్రమే పేర్కొంటారు. వరసక్రమానికి, ఈ ఇంగ్లిష్ అక్షరానికి సంబంధం ఏమిటి?*
*– శ్రీనివాస్, మిర్యాలగూడ*

**జవాబు:**
**1)** Underwear - (Underware కాదు)- లోదుస్తులు- మనం బయటికి కనపడే దుస్తుల కింద ధరించే దుస్తులు కాబట్టి Underwear అంటారు.




ఈమధ్య innerwear అనే word కూడా వాడుకలోకి వస్తోంది. Innerwear correct అయినప్పటికీ (usage లోకి వస్తోంది), చాలామందికి అర్థంకాకపో వచ్చు ఎక్కువమందికి అర్థం అయ్యేమాట underwear.

**2)** వరసక్రమంలో నిలబడి ఉండటానికి English అక్షరం Q కాదు - Q ఊరికనే అలా వాడతారు, Thank you లో You కు బదులు Thank U వాడినట్లు. వరసక్రమంలో అర్థం వచ్చే English word Queue. Please queue up అనే బదులు, Please Q up అంటారు, fancy గా.
People queued for the tickets.

**ప్రశ్న:** *1) Spoken english కు, written english కు తేడాలను వివరించగలరు.*
*2) having been ఏ సందర్భంలో వస్తుంది?*
*3) Spelling mistakes సరిచేసుకోవడానికి సలహా ఇవ్వగలరు.*
*– వి.ఎన్.నరేశ్, పరిగి*

**జవాబు:**
**1)** Spoken English చాలా simple గా, అర్థమవడానికి కారణం సులభంగా, సహజంగా ఉండడం. పూర్తి sentences ఉండకపోవచ్చు. Written English ఇంకొంచెం పద్ధతిగా, పూర్తిగా grammatical గా, కొద్దిగా క్లిష్టమైన మాటలు, వాక్యాలతో ఉండొచ్చు.
**2)** Having been = అయి ఉన్నందువల్ల
Having been deceived by him once, I don't trust him any more
ఒకసారి నేనతనిచేత మోసగించబడి ఉన్నందువల్ల అతన్ని నేను మళ్లీ నమ్మను.
Having been selected he is happy
select అయి ఉన్నందువల్ల అతను సంతోషంగా ఉన్నాడు.
**3)** Spelling mistakes తగ్గాలంటే మాటలను syllables గా విభజించి spelling ఆలోచించండి. తగ్గుతాయి. Syllable అంటే అచ్చుతో ఉన్న పదభాగం. Construction. దీన్లో con, struc, tion అనే మూడు syllables ఉన్నాయి. ఇలా devide చేసుకుని spelling ఆలోచించండి. తప్పులు తగ్గుతాయి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# అవునా... అలాగా!?

**Sunil:** Hi Ramesh, the Megastar phoned me last night and asked for a few tips on acting.
(హాయ్ రమేశ్ నిన్నరాత్రి మెగాస్టార్ నాకు ఫోన్ చేసి నటన గురించి కొన్ని సూచనలు అడిగాడు.)

**Ramesh:** Oh, did he?
(అలాగా? )

**Sunil:** And what is more, he wanted to see me about a future movie of his. Unfortunately I am very busy you know. So I couldn't give him an appointment.
(ఇంకా ఏంటో తెలుసా, అతడు నటించబోతున్న కొత్త సినిమా గురించి నన్ను కలుసుకోవాలనుకుంటున్నానని అన్నాడు. కానీ దురదృష్టవశాత్తు నేను చాలా బిజీ కదా? ఆయనకు నేను అపాయింట్‌మెంట్ ఇవ్వలేకపోయాను.)

Appointment మామూలు అర్థం ఉద్యోగం. కానీ appointment కు ఇక్కడ వాడిన విధంగా అర్థం = కలుసుకోడానికి సమయం, చోటు నిర్ణయించడం.

**Ramesh:** Oh! Is that so? I didn't know (I haven't known) that you are so great.
(అలాగా, నువ్వంత గొప్పవాడివని నాకు ఇంత వరకు తెలియదు).

**Sunil:** Only the megastar knows my greatness.
(మెగాస్టార్‌కే నా గొప్పదనం తెలుసు)

**Ramesh:** Does he? That's news to me. But I have a doubt, my dear Sunil.
(అలాగా? ఇది నాకు కొత్త విషయం. అయితే నాకో సందేహం ఉంది.)

'That's news to me = అది నాకింత వరకు తెలియని విషయం.
conversation లో practice చేయండి.

**Sunil:** What's it?
(ఏంటది? )

**Ramesh:** Are you mentally sound?
(నీకు మతిస్థిమితంగా ఉందా అని.)

mentally sound = మతిస్థిమితంతో ఉండడం
mentally unsound = పిచ్చి

**Sunil:** Is that your doubt? Call the Megastar and ask him himself.
(అదా నీ సందేహం. అయితే మెగాస్టార్‌కే ఫోన్ చేసి కనుక్కో)

**Ramesh:** Should I? (Do) you want me to be another fool like you? Come on. Cut all that stuff about his calling you and taking your suggestions. You look a real fool.
(అలాగా? నీలాగే నేను కూడా మూర్ఖుడనిపించుకోమంటావా? ఇక ఆపు. మెగాస్టార్ నీకు ఫోన్ చేయడం, నీ సూచనలు తీసుకోడంలాంటి పిచ్చి వాగుడు కట్టిపెట్టు. నువ్వు నిజంగా ఫూల్‌లాగే ఉన్నావు.)

Cut = ఆపు, కట్టిపెట్టు , stuff = సోది, వాగుడు.

**Sunil:** Do I? (అలాగా? )

పై సంభాషణలో మొదటి భాగంలో Sunil మాటలకు Ramesh responses గమనించండి.

- ★ Did he?
- ★ Is that so? I didn't know (I haven't known)
- ★ Does he?
- ★ Should I?

ఇంతవరకు మనం question tags ఎలా form చేయాలి, conversation లో వాటి పాత్ర గురించి తెలుసుకున్నాం. Conversation lively గా, effective గా ఉండాలనుకుంటే question tags వాడకం చాలా అవసరం. అలాగే question tags కాకుండా, ఈ lesson లోని Ramesh responses లోని short questions - వీటిని response questions అంటాం. ఇలాంటివి కూడా conversation కు సహజత్వాన్నిస్తాయి. Question tags లాగే ఇవికూడా అంతకుముందు sentenceను బట్టి వస్తుంటాయి. వాటినిబట్టే వీటికి అర్థం వస్తుంటుంది. అయితే తెలుగులో వీటన్నిటికీ ఒకే అర్థం- అలాగా? అని. ఇవి ఎక్కువగా ఒకరు చెప్పిన విషయం మనం నమ్మలేనిదిగా ఉన్నప్పుడుగాని, మనకు ఆశ్చర్యం/ఆసక్తి కలిగించే విషయమైనప్పుడుగాని వాడతాం.

పై సంభాషణలో Ramesh వేసే response questions అన్నీ అతను నమ్మలేని విషయాలను తెలియజేస్తున్నాయి కదా! Sunil కు Megastar phone చేయడం, సూచనలడగడం లాంటివి. ఇలాంటి responses మీరూ practice చేయండి. అయితే ఈ responses అంతకుముందు sentence లోని verb ను బట్టి, subject ను బట్టి form చేస్తాం.

**Pramod:** Two or three ministers consult me whenever they have problems.
(ఇద్దరు లేదా ముగ్గురు మంత్రులు సమస్యలేవైనా వస్తే నన్ను సంప్రదిస్తారు.)



**Prasad:** O, do they?
(అవునా, అలాగా? - నమ్మశక్యం కాకపోతే మనం ఇచ్చే response)

Pramod sentence లోని verb 'consult'. ఇది 1st Regular Doing Word- కాబట్టి responseలో 'do' వస్తుంది (Ministersకు బదులు 'they'తో). ఇక్కడ question tags లోలాగా not ఉంటే tag లో not రావకపోవడంలాంటిది ఏమీ ఉండదు.




**Pramod:** Most ministers are my friends.
(మంత్రుల్లో చాలామంది నా స్నేహితులు.)

ఇక్కడ verb 'are'. కాబట్టి ministers బదులు they .

**Prasad:** O, are they?
(అలాగా- ఆశ్చర్యకరమైన విషయం అయినా response ఇలానే వస్తుంది.)

**Suraj:** In the US, a cup of coffee <u>costs</u> a dollar, that is, about Rs. 50/-
(అమెరికాలో కప్పు కాఫీ ఒక డాలర్. అంటే దాదాపు 50 రూపాయలు.)

**Preethi:** Does it?
(అవునా? )

ఇక్కడ costs II Regular Doing Word కాబట్టి response 'does', coffee అంటే 'it' అందుకని 'Does it?'

**Prema:** Though she is not healthy, her husband does not help her.
(ఆమెకు ఆరోగ్యం బాగోలేకపోయినా ఆమె భర్త ఏం సహాయం చేయడు.)

**Sujana:** O, Doesn't he? (చేయడా? )

verb does (not) help - కాబట్టి response లో 'does.

**Kumar:** The actor who played Samson fought with a real lion, you know?
(శ్యామ్‌సన్ పాత్ర వేసిన నటుడు నిజమైన సింహంతో పోట్లాడాడు, తెలుసా)

**Sudheer:** Did he? (అవునా? )

పై sentence లో verb 'fought'. ఇది Past Doing word కాబట్టి, did వస్తుంది. Subject 'actor' బదులు 'he' వస్తుంది.

ఇలాగే Am, is, are, was, were, shall, will, can, could, may, might, must, have, has, had etc. combinations తో వచ్చే verbsకు responses అన్నింటిలో ఇవే ఉంటాయి.




**Charan:** I can bat better than Tendulkar.
(టెండూల్కర్ కన్నా బాగా బ్యాటింగ్ చేయగలను.)

**Sravan:** O, can you? Can't you bowl better than Pathan?
(అలాగా? మరి పఠాన్ కన్నా బాగా బౌల్ చేయలేవా? )

ఇలాంటి responses బాగా practice చేయండి. కొంచెం శ్రద్ధగా గమనిస్తే ఈ responses question tags లాగా చాలా సులభం. కొంచెం practice తో మీరు సులభంగా form చేయగలరు. ప్రయత్నించండి.

**Now practise the following in English**

**Tarun:** నిన్నంతా హైదరాబాద్‌లో చాలా చలిగా ఉంది.
**Kumar:** అలాగా? ఇక్కడంత లేదే.
**Tarun:** నిన్నంతా స్వెటర్ వేసుకునే తిరిగా.
**Kumar:** అలాగా? ఇక్కడ ఒక మోస్తరు చలిగా ఉంది కానీ అంతలేదు.
**Tarun:** అంత చలిలోనూ చన్నీళ్లతో స్నానం చేశా.
**Kumar:** అలాగా? ఎందుకని?
**Tarun:** నా రూంలో గ్యాస్ అయిపోయింది. ఫోన్ చేస్తే రెండురోజులు పడుతుందన్నారు.
**Kumar:** నీ రూంలో గీజర్ లేదా?
**Tarun:** నీకుందా?
**Kumar:** ఇది అంత చలిప్రదేశం కాదు కదా? అందుకని గీజర్ అవసరం లేదు.
**Tarun:** అన్ని ఆధునిక వసతులతో ఉన్న ఫ్లాట్‌ను నేను త్వరలో కొనబోతున్నాను.
**Kumar:** అవునా? ధర ఎంత ఉండొచ్చు.
**Tarun:** దాదాపు 20 లక్షల రూపాయలు.

## Answers:

**Tarun:** It was very cold the whole of yesterday in Hyderabad./ Hyderabad was very cold the whole of yesterday.
**Kumar:** <u>Was it</u>? It wasn't so cold here.
**Tarun:** I went about in sweater the whole day.
**Kumar:** <u>Did you</u>? It was cold here too, but it wasn't so bad.
**Tarun:** Even in such cold,/ Though it was so cold, I had a cold water bath/ a cold bath.
**Kumar:** Did you?/ Had you? But why?
**Tarun:** I ran out of gas/ The cylinder was empty/ The gas was exhausted. When I called the gas company, they said it would take two days/ I had to wait for two days.
**Kumar:** Don't you have a geiger?
**Tarun:** <u>Do you</u>?/ <u>Have you</u>?
**Kumar:** This place is not so cold./ It is not so cold here, is it? So we don't need a geiger, <u>do we</u>?
**Tarun:** I am going to buy a flat soon. A modern construction with all amenities.
**Kumar:** Are you? What's the price?/ What is the price likely to be?
**Tarun:** Around Rs. 20 lac.

Q&A

**ప్రశ్న:** It is not కి short form it's not/ it isn't. వాటి pronunciation ఇట్స్‌నాట్/ ఇట్ ఈజెన్ట్‌గా పలకవచ్చా? ఇట్ ఈజ్ నాట్ గానే పలకాలా? Short forms writing లోనే కాకుండా spelling కి కూడా వర్తిస్తాయా? ఒకవేళ spellingకి కూడా వర్తిస్తే I would- short form I'd. He has - He's, I have - I've మొదలైనవాటిని ఎలా ఉచ్చరించాలి?

*– వివేక్, నల్గొండ*

**జవాబు:** It's not = ఇట్స్ not;
It isn't = ఇట్ ఈజన్ట్- ఇలాగే పలకాలి. ఇలా పలుకుతాం కాబట్టే writingలో వాటినలా రాస్తారు. మిగతా contracted forms (short forms) విషయంలోనూ ఇలాగే ఉచ్చరిస్తారు.
I'd = ఐడ్; He has = he's =హిజ్
I've = ఐవ్. అన్ని contractions మొదట spoken forms కాబట్టి writing లో అలా అవుతుంది.

**Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి...**

**URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# When may I know the result?

**Laxman:** Hi Ramu, may the new year bring you all happiness.
(కొత్త సంవత్సరం నీకు సంతోషం తెచ్చిపెట్టాలని కోరుకుంటున్నాను.)

**Ramu:** So may it to you, Laxman.
(నీకూ అలాగే జరగాలని నా కోరిక)

**Laxman:** Thank you.

ఇంతకుముందు Lessons లో May ఉపయోగాలు కొన్నింటిని తెలుసుకున్నాం కదా. ఈ పై Sentences లో May ఉపయోగం చూడండి. ఇవి Wishes కూ, Greetings (అభినందనలు) కూ వాడతాం. ఇందులో చూస్తున్నారు కదా, Laxman, Ramu ను wish చేసేటప్పుడు, Ramu, Laxman ను wish చేసేటప్పుడు May వాడుతున్నారు. అయితే ఇలాంటి సందర్భాల్లో May ఎప్పుడూ Sentence ముందుంటుంది, అంటే Sentence May తో ప్రారంభం అవుతుంది. May తో ప్రారంభం అయ్యే ఇలాంటి sentences, blessings కు కూడా, అంటే ఆశీర్వచనాలకు కూడా వాడతాం.

**Keshav:** Hi Jagan, when are you starting for Delhi?
(Delhi కి ఎపుడు బయల్దేరుతున్నావు?)

**Jagan:** In a few hours from now. The train is at 3.30
(ఇక కొద్ది గంటలకు. Train 3.30 కి)

**Keshav:** I am going home now. I may not be able to come to station to see you off. May you have a very happy journey!
(నేనింటికి వెళ్తున్నానిప్పుడు. నీకు వీడ్కోలివ్వటానికి station కు రాలేకపోవచ్చు. నీ ప్రయాణం సంతోషంగా సాగాలని నా కోరిక.)

**Jagan:** May you have a happy time in your new course! When do your classes begins?
(నీ కొత్త course లో నువ్వు సంతోషంగా ఉండాలి. మీ classes ఎప్పుడు మొదలవుతాయి.)

**Keshav:** They begin the day after tomorrow.
(ఎల్లుండి)

ఈ సంభాషణలో 'May' తో ప్రారంభం అయ్యే sentences అన్నీ wishes ను తెలపటం గమనించారు కదా. ఇవి చూడండి..

- May you live long!
  మీరు చాలాకాలం జీవించాలని.
  (చిరంజీవ! అనే తెలుగు ఆశీస్సుకు సమానం)
- May your business prosper!
  మీ వ్యాపారం అభివృద్ధి చెందాలి! (కోరిక, ఆశీస్సు)
- May you celebrate many more birth days like this!
  ఇలాంటి పుట్టిన రోజులు చాలా చాలా చేసుకోవాలని!
- May you live to be a hundred.
  వందేళ్లు జీవించాలి.
- May God bless you!
  దేవుడు నిన్ను ఆశీర్వదించుగాక!

F 'May' రెండో ఉపయోగం ఇది. ఇంతకుముందు Lessons లో మనం తెలుసుకున్నది. May, probability ని తెలుపుతుంది, సందేహాన్ని వ్యక్తపరుస్తుందని కదా! అంటే అవచ్చు, అవకపోవచ్చు అనే అర్థంతో.

- 'May' మూడో ఉపయోగం ఇప్పుడు చూద్దాం.

**Srinath:** May I come in? (నేను లోనికి రావచ్చా?)

**Ravi:** Please do.

**Srinath:** May I have a few minutes of your time?
(మీ సమయం కాస్త తీసుకోవచ్చా)

**Ravi:** Please go ahead. What is the matter?
(ఏంటో చెప్పండి)

ఈ సంభాషణలో 'May' అనుమతి - Permission అడగటానికి వాడుతున్నాం కదా. మనకంటే పైస్థాయి వాళ్ల permission గానీ, మనం చాలా గౌరవించే వాళ్ల permission గానీ అడగాలనుకున్నప్పుడు, May, question form లో I/ we తో వాడతాం.

1) May I sit here?
(నేనిక్కడ కూర్చోవచ్చా?) permission
2) May I use your phone?
(మీ phone వాడుకోవచ్చా?) permission
3) May I know your name? / May I know who you are?
(మీ పేరేంటో/ మీరెవరో తెలుసుకోవచ్చా?)
ఇది పూర్తిగా అపరిచితులతో.
4) How long may I keep this book?
(నేనీ పుస్తకం ఎన్ని రోజులుంచుకోవచ్చు?)

May official/ formal గా permission ఇవ్వడానికి statement form లో (you తో ముఖ్యంగా) వాడతాం. Superior status లో ఉన్నవాళ్లు కింది వాళ్లతో మాట్లాడటం పూర్తయిన తర్వాత, మీరిక వెళ్ల వచ్చు అనే అర్థంతో May వాడతారు.

1) You may go now.
మీరిక వెళ్లవచ్చు (permission ఇవ్వటం)
2) You may use my phone if you want.
(మీరు, కావలిస్తే నా phone వాడుకోవచ్చు) permission ఇవ్వటం.

అలాగే కొంచెం మర్యాదగా (అంత నిష్కర్షగా కాకుండా) orders ఇవ్వటానికి కూడా statement form లో May వాడతాం.

1) You may not leave office before 5
(ఐదుగంటలకు ముందు మీరు ఆఫీసునుంచి వెళ్లొద్దు) order
2) You may not smoke here
(మీరిక్కడ smoke చేయకూడదు) - order.
3) You may leave office only after five.
(మీరు ఐదు తర్వాతే బయటికి వెళ్లవచ్చు) - order (అంటే అంతకుముందు వెళ్లకూడదని order).

**ఇవన్నీ May ఉపయోగాలు: ఒకసారి సంగ్రహంగా చూద్దాం.**

1) 'May' expresses probability (జరిగే అవకాశం)
2) 'May' expresses doubt (సందేహం)
3) May in the question form, especially with I/ We is used for asking for permission in a very formal and polite manner.
'May' for permission is used to ask for permission in a more polite and formal manner than 'can' and 'shall', with I/ We, and 'will', and 'would' with you (in the question form)
4) 'May' in statement forms some times is used in place of 'shall' to express orders in a polite and formal way.
5) May in the beginning of a statement is used for expressing wishes and blessings.

**Now practice the following in English.**

**a) Anil:** Good morning, Sir. మీరు మాకు high school లో teacher, Sir. మిమ్మల్ని ఒకసారి కలుసుకోడానికి వచ్చాను.

**Murthy:** నువ్వు నాకు గుర్తున్నావు అనిల్. చాలాకాలం తర్వాత నిన్ను కలుసుకోవటం సంతోషం. ఇప్పుడేం చేస్తున్నావు?


M. SURESAN

**Anil:** పై చదువులకు అమెరికా వెళ్తున్నాను, Sir. మొన్ననే visa వచ్చింది. మీ ఆశీస్సుల కోసం వచ్చాను.

**Murthy:** నీకు నా ఆశీస్సులెప్పుడూ ఉంటాయి. నీ ప్రయాణం సుఖంగా జరిగి, నువ్వక్కడ బాగా చదివి పైకి రావాలని నా ఆశీస్సులు (May వాడండి).

**Anil:** ఈరోజు నా birthday కూడా. Sir.

**Murthy:** చాలా సంతోషం. నువ్వు చాలాకాలం ఆయురారోగ్యాలతో ఉండాలని కోరుకుంటున్నా. (May వాడండి).

**Anil:** చాలా thanks, Sir.

**Murthy:** మంచిది.

**b) Sravan:** నేను లోపలికి రావచ్చాండీ?

**Bhavan:** రండి. కూర్చోండి.

**Sravan:** నేనిక్కడికి interview attend అవడానికి వచ్చాను. నా పేరు Sravan. నాకు interview ఎప్పుడుండొచ్చు?

**Bhavan:** చెప్తానుండండి. ఆ... మీకు మధ్యాహ్నం రెండు గంటలకు interview ఉంటుంది.

**Sravan:** ఇప్పుడే ఒంటి గంటన్నర అయింది కదండి. నా interview ఇప్పుడే ఉండొచ్చా? (May వాడండి).

**Bhavan:** బహుశా ఉండొచ్చు నేను మళ్లీ పిలుస్తాను. అంతవరకు బయట wait చేయవచ్చు మీరు. మీరు front room లో కూర్చోండి. Interview అయింతర్వాత కూడా మీరు ఐదుగంటల వరకు వెళ్లకూడదు.

**Sravan:** result ఎపుడు తెలియవచ్చు?

**Bhavan:** రేపు సాయంత్రం వరకు మీరు expect చేయకండి.

**Answers:**

**Anil:** Good morning sir. You were our teacher in the high school. I have come to see you.

**Murthy:** I remember you, Anil. (I am) happy to see/ meet you, though after a long time. What are you (now)?

**Anil:** (I am) going to the states for higher studies. I got the visa the day before (yesterday). I've come for your blessings.

**Murthy:** You have my blessings always. May you have a happy journey and may you study well and prosper (పైకి రావటం) there!

**Anil:** Today is my birthday too, sir.

**Murthy:** I am very happy. May you live long in health and happiness!

**Anil:** Thank You, sir.

**Murthy:** You are welcome.
(May you have a happy journey = Wish you a happy journey; may you live long = Wish you a long and healthy life)

**b) Sravan:** May I come in (sir)?

**Bhavan:** Please do/ do come in. Have a seat/ Please sit down.

**Sravan:** I have come to attend an interview here. I am Sravan. When may I have the interview?/ When may be my interview?

**Bhavan:** Wait a minute. Let me see... Yes. Your interview is at 2 in the afternoon.

**Sravan:** It's already (ఇప్పుడే) 1.30 sir. May I have the interview now itself ?

**Bhavan:** That may be possible. I'll call you again. Till then you may wait outside. You may sit in the front room. You may not leave here till 5, even after the interview.

**Sravan:** When may I know the result?

**Bhavan:** Well, you may not expect it before tomorrow evening.

---



**ప్రశ్న:** *తీగ వంగింది, కాలు విరిగింది, చీమ మునిగింది, పుస్తకం చిరిగింది.. ఇలాంటి వాటిని యథాతథంగా (వంచబడింది, మునగబడింది, అని కాకుండా) ఆంగ్లంలోకి ఎలా అనువదించాలో తెలియజేయగలరు.*

**– రాఘవ, మార్కాపురం**

**జవాబు:**

i) తీగ వంగింది = the wire bent
ii) కాలు విరిగింది = the leg broke
iii) చీమ మునిగింది = The ant drowned.
iv) పుస్తకం చిరిగింది = The book got torn.

**ప్రశ్న:** *Idioms, usage గురించి వివరించగలరు.*

**– రహనాబేగం, కల్లూరు**

**జవాబు:**

Idioms అన్నా usage అన్నా దాదాపు ఒకటే. వాడుకలో ఉన్న మాటల కూర్పు, ఆ మాటల కూర్పు మొత్తానికి ఉన్న అర్థానికీ, ఆ మాటల కూర్పులో ఉన్న ఒక్కొక్క మాట అర్థానికి సంబంధం ఉండకపోతే, ఆ మాటల కూర్పు idiom అవుతుంది. అదే వాడుకలోకి వస్తుంది కాబట్టి అది usage అవుతుంది. use అంటే వాడకం. అంటే ఒక word ను sentence లో use చేయటం. మీరు vocabulary, idioms, improve చేసుకోవాలంటే Vocabulary మీద books (Norman Lewis's Word Power Made Easy లాంటివి) కొంతవరకే ఉపయోగపడతాయి. Idioms మీ active use లోకి రావాలంటే ఉత్తమమార్గం English Newspapers, The Hindu లాంటివి, చిన్న చిన్న story books తో ప్రారంభించి పెద్ద novels చదవటం, ముఖ్యంగా English news magazines చదవటం. Vocab books లాంటి వాటి వల్ల words, their meanings తెలుస్తాయి, but we don't know how to use them. So read, read and read- that's the best way to improve. అంతా చదవింతర్వాత అప్రయత్నంగా మీకు గుర్తున్న idioms, words మీ language లో వాడేస్తారు. చదివేసింతర్వాత అర్థంకాని మాటలేవన్నా ఉంటే అప్పుడు dictionary చూడండి. Commercials/ Ads కూడా బాగా చదవండి- Modern expression వస్తుంది. వీలున్నప్పుడల్లా English లో మాట్లాడండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# You might call the helpline




**Brahmam:** Hi Vishnu, any idea where Siva might be?
(శివ ఎక్కడుండొచ్చో ఏమైనా తెలుసా?)

**Vishnu:** Not in the least. You call Ganesh. He might know.
(అసలు తెలియదు. Ganesh కు phone చేయి. అతనికి తెలియవచ్చు.)

Not in the least= అసలు లేదు.

**Brahmam:** Has he a cell? Let me have the number
(అతనికి cell ఉందా. Number ఇవ్వు)

**Vishnu:** He hasn't a cell/ He has no cell. He fears it might affect his heart if he carries it in his pocket, and his ear, if he hears from it- because of radiation.
(లేదు. అది జేబులో పెట్టుకుంటే heart కు, దాన్నివింటే చెవికి దెబ్బ అని అతని భయం)

**Brahmam:** So how do I get at him now?
(మరి అతన్ని పట్టుకోవటం ఎలా? )

Get at = చేరుకోవటం/ పట్టుకోవటం

**Vishnu:** He might be at office now Ringup his office. You might be able to contact him.
(అతనిప్పుడు office లో ఉండవచ్చు. అక్కడికి Phone చెయ్. నువ్వతన్ని అక్కడ పట్టుకోవచ్చు).

Contact: సంబంధం/ ఒకరితో communication ఉండటం

**Brahmam:** Any idea who else might know Siva's whereabouts now? I want him urgently.
(పోనీ Siva ఇపుడెక్కడున్నాడో చెప్పగల వాళ్లు ఇంకెవరన్నా ఉన్నారా? అతన్ని కలుసుకోవటం చాలా అవసరం).

**Vishnu:** Try his home. Here's the number. But they might all be out.
(వాళ్లింటికి phone చెయ్. ఇదిగో నంబర్. అయితే వాళ్లెవరూ ఇంట్లో లేకపోవచ్చు).

(Try= ప్రయత్నించి చూడు. తెలుసు కదా: out: ఇంట్లో లేకపోవటం; In = ఇంట్లో ఉండటం)

ఇవన్నీ might combination తో ఉన్న verbs ఉన్న sentences కదా. I mean, పై సంభాషణలోనివి. Might combination తో verbs English లో తరచుగా వాడుతుంటాం. అందుకని might combination తో వచ్చే verbs ను గురించి తెలుసుకోవటం ముఖ్యం/ ఉపయోగకరం.

**Might Combination Verbs:**

**a)** Might be ('be' form);
**b)** Might+ 1st Regular doing word - might know, might come, might like, etc.

**1)** Might, present లోకానీ, future లోకానీ, అంటే ఇపుడుకానీ, ఇకముందుకానీ, expresses doubt (సందేహం) and uncertainty (సందిగ్ధత). అంటే తెలుగులో ఉండవచ్చు, రావచ్చు అని 'వచ్చు' పదాలకు సమానం.

**a)** Might be - ఇది 'be' form; అర్థం: ఉండవచ్చు

**b)** Might + 1st Regular doing word (see, go, come, etc) Might see = చూడవచ్చు (సందేహం), Might go = వెళ్లవచ్చు. Might come = రావచ్చు. మన సంభాషణలో sentence ఒకసారి చూద్దాం.

**a)** Any idea where Siva might be?
శివ ఎక్కడుండొచ్చో ఏమన్నా తెలుసా?

**b)** You call Ganesh. He might know
గణేష్‌కు phone చెయ్. అతనికి తెలియవచ్చు

**c)** He fears it might affect his heart...
గుండె దెబ్బ తినవచ్చని... అతని భయం.

**d)** You might be able to contact him there
నీకతను అక్కడ దొరకవచ్చు/ తగలొచ్చు

**e)** But they might all be out
అందరూ బయటికి వెళ్లుండొచ్చు

కాబట్టి చూశారు కదా, might, present లో, future లో అంత కచ్చితంకాని విషయాన్ని తెలుపుతుందని- Might be/ Might + 1st RDW (Regular Doing Word) సాధ్యమై, జరగకపోవచ్చనే విషయాన్ని తెలుపుతుంది.

ఈ అర్థంతో Might కూ, ఇంతకుముందు తెలుసుకున్న May కు చాలా పోలిక ఉన్నట్టు తెలుస్తోంది కదా. Might, may కన్నా ఎక్కువ సందేహాన్ని వ్యక్తపరుస్తుంది. అంటే May వాడినపుడు ఎక్కువ సాధ్యమయ్యే అవకాశం ఉంటుందన్నమాట.

**1 a)** Sunil may come this evening
ఈ సాయంత్రం సునీల్ రావచ్చు.

**b)** Sunil might come this evening
ఈ సాయంత్రం Sunil రావచ్చేమో.

Sentence (a) లోకన్నా (b) లో సందేహం ఎక్కువ. Sunil may come అన్నపుడు సునీల్ వచ్చే సూచనలు ఎక్కువ, Sunil might come అన్నప్పటికన్నా.

**2 a)** It may rain (వర్షం రావచ్చు) - doubtful
**b)** It might rain (Highly doubtful)

♦మనం ఇంతవరకు తెలుసుకున్న might మొదటి ఉపయోగం. It expresses possibility/ uncertainty/ doubt in the present or in the future.

**(A)** India might win the coming cricket series with Pakistan, atleast Inzamam says so
జరగనున్న cricket series భారత్ గెలవొచ్చు. ఇంజమామ్ అలా అంటున్నాడు.

India may win అంటే భారత్ గెలిచే chances ఇంకాస్త ఎక్కువ అన్నమాట.

♦ Might కు మరో ఉపయోగం:

**a)** You might try his office phone number if you are unable to get his home.
అతనింటి Phone దొరక్కపోతే, Office phone try చేయండి.

**b)** You might call the helpline in case of trouble.
మీకేమన్నా trouble, ఉంటే, help line కు phone చేయండి.

In case of= అయితే, helpline= ఒక సంస్థ వల్ల సహాయం పొందటానికి చేయాల్సిన phone)

ఈ రెండు Sentences లో లాగా might ను సూచనలు/ సలహాలు ఇవ్వటానికి కూడా వాడతాం- ముఖ్యంగా మనకంటే పెద్దవాళ్లకు, మనకంటే పైస్థాయి వాళ్లకు సూచనలివ్వటానికి చాలా మర్యాదకరంగా.

**Rajasekhar (Senior Manager):**
Manmohan, the power bills are going up. Can't we make do with two air conditioners instead of four?
(Manmohan, కరెంట్ bills బాగా ఎక్కువయిపోతున్నాయి. 3 AC machines బదులు రెండింటితో సర్దుకోవచ్చు కదా?

**Manmohan (Manager):**
That might not be much use, sir. Power bills may be less, but the staff might not work so efficiently.
(అదంత ఉపయోగకరం కాకపోవచ్చు. దానివల్ల current ఖర్చు తగ్గుతుందేమో కాని, సిబ్బంది అంత సమర్థంగా పనిచేయకపోవచ్చు, sir)

గమనించారు కదా. Manager, Sr Manager కిచ్చే మర్యాదకరమైన సూచన - Might వాడి.

'What do you think of this method?'
(ఈ పద్ధతి గురించి మీరేమనుకుంటున్నారు? )

'It might not increase our profits, sir'
(అది మన లాభాలను పెంచకపోవచ్చు).

**Now practise the following in English:**

**a)**

**Prabhu:** మనం ఈరోజు match ఆడుతున్నాం, కదా?
**Varma:** అవును. అయితే వర్షం వస్తుందేమో?
**Prabhu:** వర్షం వస్తే ఎప్పుడు ఆడొచ్చు మనం?
**Varma:** ఈ వారాంతం అవచ్చు
**Prabhu:** మనం గెలిచే అవకాశాలేంటో?
**Varma:** మనం... గెలవచ్చేమో?
**Prabhu:** ఏంటి సందేహం?
**Varma:** Pitch మన Players కు help చేయకపోవచ్చేమోనని!
**Prabhu:** మన bowlers లో Gopala Rao ను మీరు try చేయవచ్చు. అతనికి pitch అనుకూలించవచ్చు

**b)**

**Manager:** ఈ పాత furniture అంతా తీసేసి కొత్త furniture అమర్చాలనుకుంటున్నా.
**Superintendent:** అది మంచి idea, sir. మన Office కు కూడా మంచి రూపం వస్తుంది. ఇంకా, sir, మన గోడలన్నింటికీ paint వేయించటం కూడా మంచిదేమో, sir.
**Manager:** నేనూ అదే అనుకుంటున్నా, అయితే చాలా ఖర్చు అవచ్చు కదా అని అనుకుంటున్నా.
**Supdt.:** కాని, మీరేమనుకోకపోతే, మనకు దానివల్ల business ఎక్కువవుతుంది, sir. ఎక్కువ customers వచ్చే అవకాశం ఉంటుంది కదా, sir.
**Manager:** ఈ సంవత్సరం budget లో adjust చేయవచ్చంటారా?
**Supdt.:** నేను budget prepare చేసేశాను. మీరొక్కసారి అది చూసి నిర్ణయం తీసుకోవచ్చు sir.

**Answers:**

**a)**

**Prabhu:** We are playing the match today, aren't we?
**Varma:** Yes. But (I'm afraid) it might rain.
**Prabhu:** In case/ If it rains when might the match we?
**Varma:** (It) might be this weekend.
**Prabhu:** What might be our chances of winning?
**Varma:** Ah... we might win...
**Prabhu:** What's the doubt?/ Why the doubt?
**Varma:** The pitch might not help our players.
**Prabhu:** You might try Gopala Rao among our bowlers. The pitch might favour him.


M. SURESAN

**b)**

**Manager:** I want to get rid of all the furniture in the office and get a new set in its place./ I want to replace all the old furniture by a new set.
(రెండోది simple, better.)
**Superintendent:** That might be a good idea. It might be good to have the walls painted too, sir.
(That might not be a bad idea, after all. ఈ sentence ఎక్కువ వ్యావహారికం- ముఖ్యంగా కొంచెం పెద్దవాళ్లతో మాట్లేటపుడు, గుర్తుంది కదా: not bad= very good.)
**Manager:** That's what I think too. But it might cost a lot.
**Supdt.:** If I might say so, (మీరేమీ అనుకోకపోతే నండీ) We shall have more business, sir. We might have more customers, sir.
**Manager:** Can we adjust this in this year's budget?/ You feel we can adjust it in this year's budget?
**Supdt.:** I've prepared the budget, sir. You might just look at it and decide.



**ప్రశ్న:** ఇంగ్లిష్‌లో బాగా మాట్లాడాలంటే ఏం చేయాలో సలహా ఇవ్వగలరు.
– ఎం.వెంకటేశ్వర్‌రెడ్డి, చీరాల

**జవాబు:** ప్రతిభలో ఇస్తున్న Spoken English exercises regular గా practice చేయండి. English paper చదవటం continue చేయండి. చిన్న చిన్న English story books కూడా చదవండి. తప్పక మాట్లాడగలరు- ధైర్యంగా మాట్లాడటం ప్రారంభిస్తే.

**ప్రశ్న:** *i) ఇంగ్లిష్‌లో... consist, collapse, cultivation... వీటిని ఎలా పలకాలి?*
*ii) A. How do you go to home?*
*B. I go home by rickshaw. కరెక్టేనా?*
*iii) Seminar సందర్భాల్లో how can we introduce ourselves?*
– ఎస్.తక్షియా, మచిలీపట్నం

**జవాబు:**
i) consist = కన్‌సిస్ట్ - సి నొక్కి పలుకుతాం
collapse = క లాప్స్ - లా నొక్కి పలుకుతాం
cultivation = కల్టివెయ్‌షన్ - వెయ్ నొక్కి పలుకుతాం
ii) A. How do you go to home సరికాదు-
How do you go home? - correct.
Home ముందు సామాన్యంగా 'to' రాదు.
B. I go home by rickshaw, ...
iii) Good morning, every body, I am... (name) presenting this paper on... (subject). లేకపోతే My name is..., presenting this paper on...

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# Might I come in?

**Charan:** Hi Dheeraj, long time, no see. How's every body?
(చాలాకాలమయింది, చూసి. ఎలా ఉన్నారందరూ? )

**Dheeraj:** Fine. Thank you. How's life?
(కులాసానే. నువ్వెలా ఉన్నావు? )

**Charan:** Getting along. (ఏదో జరిగిపోతోంది.) Well, what brings you here? (ఏంటిలా వచ్చావు? )

ఈ Question English లో చాలా common. bad manners కాదు.

**Dheeraj:** I thought I might see you at the book fair yesterday, but I didn't
(నిన్న book fair- పుస్తక ప్రదర్శనలో నువ్వు కనపడవచ్చనుకున్నా. కానీ రాలేదు)

**Charan:** I was out of town yesterday. In fact I had been away for 3 days. I returned only this morning.
(నిన్న ఊళ్లో లేను. అసలు మూడురోజులుగా లేను. ఇవాళ ఉదయమే తిరిగొచ్చా )

**Dheeraj:** I bought some books at the fair yesterday. Look. Here they are. I thought you might be interested in them.
(నిన్న కొన్ని పుస్తకాలు కొన్నా. ఇవే. నీకు వాటిలో interest ఉండవచ్చని తీసుకొచ్చా)

**Charan:** When is the fair closing?
(ఎప్పుడు ముగుస్తోంది? )

**Dheeraj:** It closed yesterday.
(నిన్న అయిపోయింది)

**Charan:** I expected it might go on for a few more days.
(ఇంకొన్ని రోజులయినా ఉంటుందని ఆశించాను.)

**Dheeraj:** So did I.
(నేనూ అలాగే అనుకున్నా)

**Charan:** One of the salesmen told me that it might go on for a few days after the date.
(మరికొన్ని రోజులు పొడిగించవచ్చని ఒక salesman నాతో అన్నాడు)

**Dheeraj:** I thought of visiting it the first day itself. But feared that there might be too much of crowd. Yesterday there was no crowd, and not many books either.
(మొదటిరోజే వెళ్దామనుకున్నా కానీ జనం ఎక్కువగా ఉంటారని భయపడ్డాను. నిన్న జనం లేరూ, ఎక్కువ పుస్తకాలూ లేవు)

పై సంభాషణలో might combination తో ఉన్న Verbs గమనించండి. మనం ఇప్పటివరకు Might ఉపయోగం గురించి తెలుసుకున్నది - Might, Present లోగానీ, future లోగానీ uncertainty ని/ doubt ని తెలియజేస్తుందని.

a) He might pass = వాడు pass అవచ్చు (Doubt)

b) They might agree to it = వాళ్ళు ఒప్పుకోవచ్చు
ఈ రెండు వాక్యాలు future.

c) She might be at college now
ఆమె ఇప్పుడు college లో ఉండవచ్చు - Present.

ఇప్పుడు పై సంభాషణలో might combination లో ఉన్న sentences చూద్దాం.

1) I thought (that) I might see you at the fair.
fair లో నువ్వు కనపడవచ్చని అనుకున్నా - Past

2) I thought (that) you might be interested in them.
వాటిలో నీకు ఆసక్తి ఉండవచ్చని అనుకున్నా - Past

3) I expected (that) it might go on -
ఇంకా కొనసాగుతుందని ఆశించా. Past

అంటే might past ను కూడా తెలుపుతుంది - ఏదైనా Past లో ఉండొచ్చనీ, జరగొచ్చనీ అర్థంతో.

ఈ అర్థంతో, Might, may కి past form. Compare.

a) I think he may help me
(అతడు నాకు సహాయం చేస్తాడని నేననుకుంటున్నా- Present/ Future)

b) I thought he might help me
(అతడు నాకు సహాయం చేస్తాడేమోనని అనుకున్నా- Past)

a) లో I think అని present విషయం చెప్తున్నప్పుడు may వస్తుంది.

b) లో I thought అని past విషయం తెలిపేటప్పుడు might అని past form (May కు) వస్తోందికదా.

c) అతడిక్కడికొస్తాడేమోనని భయపడ్డా.
I feared/ was afraid that he might come here.
ఇది might 2nd use. It is used as the past form of May.

a) I went there because you told me that he might be there.
నువ్వు అతడక్కడ ఉండొచ్చని చెప్పినందువల్ల నేనక్కడికి వెళ్లాను. (Past)

b) He feared that they might reveal his secret
తన రహస్యాన్ని వాళ్లు బయటపెడతారేమోనని అతను భయపడ్డాడు (Past)

3) May లాగానే, Might కూడా చాలా మర్యాదగా, formal గా permission అడగటానికి వాడతారు.
Might I come in?
(More formal than 'May I come in?')
'May I come in?' - ఇదే చాలా formal గా, Polite గా permission అడగటానికి వాడతాంకదా?
'Might I come in?' - ఇది ఇంకా ఎక్కువ formal గా, polite గా ఉంటుంది, permission అడగటానికి.
'Might I use your phone?'
మీ phone ఒకసారి వాడవచ్చా?
'Might I come a little late tomorrow?'
రేపు నేను కాస్త late గా రావచ్చా?
అయితే permission అడగటానికి చాలా అరుదుగా వాడతారు. ఎక్కువ May దగ్గరే ఆగిపోతాం.

మనం ఇంతకుముందు తెలుసుకున్నాంగదా? Can, Shall, May, are used with I/ We in the question form for asking for permission. ఇప్పుడు తెలుసుకున్నాం- 'Might' too is used with I/ we in the question form for asking for permission. But there are differences among them.

Can, shall, may ల మధ్య ఈ విషయంలో ఉన్న తేడాలను ఇంతకుముందు వివరించాం. ఇప్పుడు మళ్లీ వివరిస్తున్నాం. Might తో కలిపి. గమనించండి, గుర్తుంచుకోండి.

**For asking for permission with I/ we in the question form.**

| Can | Shall | May | Might (అరుదు) |
|---|---|---|---|
| least formal & least polite | slightly formal & polite | very formal & polite | Most formal & very polite |

RARELY USED

**<u>Now practise the following in English:</u>**

**Mallesh:** నీవెన్నాళ్లుండొచ్చిక్కడ?

**Jagan:** నా Course 15 రోజులుండవచ్చు. నేను ఇంకో రెండు మూడు రోజులుంటానేమో ఆ తర్వాత.


M. SURESAN

**Mallesh:** అప్పుడు నువ్వు మా ఇంట్లో రెండ్రోజులుండవచ్చు కదా! మా అన్నయ్య కూడా ఇంకొద్దిరోజుల్లో వస్తాడేమో.

**Jagan:** అదంతా course అయింతర్వాతే సాధ్యమవుతుందనుకుంటాను. Course period లో training center లోనే ఉండమనవచ్చు మా directors.

**Mallesh:** రోజూ classes అయింతర్వాత ఏం చేస్తావు?

**Jagan:** అసలు programme ఏంటో course begin అయింతర్వాతనే తెలుస్తుంది. అపుడయితే నేను నీకు clear గా చెప్పవచ్చు

**Mallesh:** OK. అంతవరకు phone లో touch లో ఉందాం.

**Jagan:** మీ అన్నయ్య ఎప్పుడు రావచ్చు?

**Mallesh:** నేను నిన్ననే వస్తాడేమో అనుకున్నా. కానీ phone చేసి చెప్పాడు. ఇంకా రెండ్రోజులదాకా రానేమోనని.

**Jagan:** నేను చాలా expect చేశా, మీ ఇద్దరిని ఈ రోజు కలవచ్చని.

b)

**Namrata:** నిన్న నువ్వు నన్ను movie కి తీస్కెళ్తావేమో నని అనుకున్నా.

**Priya:** ఆ movie నీకిష్టం ఉండదేమోనని అనుకున్నా. ఆ hero, heroine లు నీ favourites కారు.

**Namrata:** నేను నీ phone కోసం wait చేస్తున్నా, మా చెల్లెలు నువ్వు phone చేయకపోవచ్చని చెప్పినా కూడా.

**Priya:** అంత బాధపడకు. అదేమంత బాగాలేదు. నాకే bore కొట్టింది.

**<u>Answers:</u>**

**Mallesh:** How long might you be here?

**Jagan:** My course may last/ may go on for 15 days. I might stay for two or three days more after that.

**Mallesh:** Then you might stay at our place for two days. My brother might come in a few days.

**Jagan:** It might be possible only after the course. Our directors might ask us to stay in the Training Center during the course.

**Mallesh:** What will you do/ are you going to do after classes every day?

**Jagan:** We shall know the exact programme only after classes begin. I might then be able to tell you clearly about it.

**Mallesh:** OK. Till then let's be in touch over phone.

**Jagan:** When might your brother come?

**Mallesh:** I thought he might come yesterday itself. But he called to say that he might not come for another two days.

**Jagan:** I expected very much that I might meet both of you.

b)

**Namrata:** I thought you might take me to the movie yesterday.

**Priya:** I thought that you might not like the movie. The hero and the heroine are not your favourites.

**Namrata:** I was expecting your call though my sister told me you might not call.

**Priya:** Don't worry. The movie wasn't good. It bored even me.



**ప్రశ్న:** *Get, got అంటే గురించి వివరించండి.*
*Rama has come to Guntur. ఈ వాక్యం ఏ tense?*
*Bus is come అంటే అర్థం ఏమిటి? has come అని కదా!*
*I shall have written a letter అంటే I shall write a letter అ ని కదా! ఇలాంటప్పుడు టైం గురించి చెప్పాల్సిందేనా?*
*I shall be going అంటే ఏమిటి?*

*– ఎం.వేణు, తెనాలి*

**జవాబు:** ♦ get అంటే పొందటం, తెచ్చుకోవటం, ఒకచోటికి వెళ్లటం, కొనటం, తేవటం, etc. got, get కు past tense and past participle.

♦ He got going - ఇలాంటిచోట్ల get సహాయక క్రియ అవచ్చు (అయినా English మాట్లాడటానికీ, రాయటానికి ఏది ఏ రకమైన క్రియ అని తెలియాల్సిన అవసరంలేదు కదా.)

♦ Rama has come. Has come ఇక్కడ present tense. అయితే ఇలాంటి వాక్యాల్లో అది past action, time not stated (గతంలో జరిగి, ఏ time, day, year తెలుపకపోతే) ను సూచిస్తుంది.

♦ The bus is come = Bus వచ్చి ఉంది అని; కానీ దీనికన్నా better, the bus has come. The bus is come తప్పు కాదు.

♦ I shall have written a letter = (Future లో ఏదో time కు గానీ అంతకుముందు గానీ) letter రాసేసి ఉంటానని.
I shall write a letter = (Future లో; ఎప్పుడో తెలియదు) letter రాస్తాను.
రెండింటి మధ్య చాలా తేడా ఉందని తెలుస్తోంది కదా.

♦ Shall be doing it = Future లో చేస్తూ ఉంటాను(ము)/ వాళ్లు, మీరు, అతను/ ఆమె చేస్తూ ఉండాలి.

**ప్రశ్న:** *I want to see a doctor, He wants to meet a doctor, It is better to consult a doctor- వీటి అర్థం ఏమిటి?*

*– డి.సుబ్బారావు, శీలాకాజులూరు*

**జవాబు:**

♦ It is better to consult a doctor = Doctor ను సంప్రదించటం మేలు.
Consult = సంప్రదించటం

♦ I want to see a doctor = నేను Doctor ను కలవాలనుకుంటున్నాను.

♦ He wants to meet a doctor = అతను doctor ను కలవాలనుకుంటున్నాడు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# How do I get there ?




**Ramana:** Excuse me, how do I go from here Livewell Hospital?
(ఇక్కడ్నించి Livewell Hospital కు ఎలా వెళ్లాలండీ? )

Strangers అంటే కొత్త వాళ్లను పలకరించేటప్పుడు, Excuse me అనడం good manners మాత్రమే కాకుండా వాళ్ల దృష్టిని ఆకర్షించటానికి కూడా ఉపయోగం.

'Excuse me' వాడే ఇతర సందర్భాలు: అడ్డంగా ఉన్న వాళ్లను కాస్త తప్పుకోమనేటప్పుడు, కొత్త వాళ్ల పక్కన restaurants లో, ఇంకెక్కడైనా కూర్చోవాల్సి వచ్చినప్పుడు, etc.)

**Manohar:** Are you a stranger here?
(మీరిక్కడికి కొత్తవాళ్లా? )

stranger = కొత్తవాడు

**Ramana:** I am totally new to this place.
(నేనిక్కడికి పూర్తిగా కొత్త)

**Manohar:** Where exactly do you want to go?
(మీరు కరెక్ట్‌గా ఎక్కడికెళ్లాలి? )

**Ramana:** To Vantage Company somewhere around the Hospital.
(ఆ Hospital కు దగ్గర ఉన్న Vantage Company కి)

**Manohar:** Don't worry. A number of buses go to thatway: 125K, 15M, 62, etc. Take 15M; that takes you directly to the Hospital. Facing the hospital is this Vantage Company.
(ఏం ఫరవాలేదు. అటు వైపు వెళ్లే bus లు చాలానే ఉన్నాయి. 125K, 15M, 62.. 15M ఎక్కండి. అది తిన్నగా Hospital కు వెళుతుంది. Hospital ఎదురుగానే Vantage Company).

**Ramana:** (Do) you suggest I take an auto.
(Auto తీసుకోమంటారా? (ఆటోలో వెళ్లమంటారా? )

**Manohar:** That'd be very expensive. Don't worry. Buses on this route, especially 15M is very frequent.
(అది చాలా ఎక్కువవుతుంది. ఏం ఫరవాలేదు. ఈ route లో buses frequency ఎక్కువే.)

frequency = తరచు, ఎన్నిసార్లు రావటం అనేది

**Ramana:** OK. Thank you. I see 15M coming. I'll take it.
(15M వస్తోంది. నేనదెక్కుతాను).

ఈ సంభాషణంతా మనకు కొత్త ప్రదేశంలో దారి తెలుసుకోవటం, తెలియనివారికి దారిచెప్పటం గురించి అని తెలుస్తూనే ఉంది కదా? ఆ expressions చూద్దాం ఇప్పుడు.

1) How do I go to Livewell Hospital?
2) somewhere around
3) buses go that way
4) Take the bus 15M
5) facing the Hospital
6) take an auto.

ఫలానా చోటికెలా వెళ్లాలి అనేందుకు simplest expression: How do I go?

ఇది అత్యంత సహజమైన, simplest question.

ఇది కాకపోతే, could you let me know/ please tell me how to go/ how to get there?

వీటి అర్థం అక్కడికెలా వెళ్లాలో కాస్త చెబుతారా? అని మర్యాదగా అడగటం.

How do I go there/ get there please? అని కూడా అనవచ్చు

Can you/ Could you direct me/ guide me.. ఇదంతా కొంచెం పాండిత్యం, మామూలు conversation లో రాదు.

a) మేం Nizam college కు ఎలా వెళ్లాలండీ?
How do we go to/ get to Nizam College, please?/
Could you tell us/ let us know how to go to/ to get to/ We can go to Nizam college, please?

b) What's the best way to get to Nizam college, please? అని కూడా అనవచ్చు, రెండు మూడు దారులు ఉండవచ్చని భావించినప్పుడు.

c) Bus ఎక్కడం. Get into the bus,
bus దిగడం = get down from/ get off the bus.

d) ఇక్కడ్నించి bus/ auto లో వెళ్లండి.
Take a bus/ an auto.
ఫలానా number bus లో/ఆటోలో వెళ్లండి/ Auto తీసుకోండి.
Take/ Get into bus no./ Take an auto.
Train లో వెళ్లండి = Take a train.

ఇంకా ఇలా కూడా అనవచ్చు go by bus/ go by auto/ go by train (Bus లో/ auto లో/ train లో వెళ్లండి అనేందుకు.)

అయితే అన్నింట్లోకి simplest: Take.

11.30 train లో వెళ్లండి. రేపు ఉదయం ఆరు గంటలకల్లా అక్కడ ఉంటారు
take the 11.30 train; you will be there by 6 tomorrow morning.

(at 6= ఆరింటికి; by 6 = ఆరింటికల్లా = ఆరింటికి గానీ ఆలోపలేగానీ)

catch అని కూడా అనవచ్చు- వెళ్లు/ వెళ్లండి అనే అర్థంతో, కానీ అన్నింటికంటే take అనేది best.

**Raghu:** Is Ramesh's very far off/ a long way off from here?
(రమేష్ వాళ్ల ఇల్లు ఇక్కడికి చాలా దూరమా? )

**Subash:** (Do) you want to see him today?
(ఇవాళ కలుసుకోవాలనుకుంటున్నావా అతన్ని? )

**Raghu:** Yea, because I am leaving tomorrow.
(అవును. నేను రేపు వెళ్లిపోతున్నాను కదా? )

**Subash:** Sorry I can't take you there today. Let's go tomorrow.
(ఇవాళ నిన్నక్కడికి తీసుకెళ్లలేను. రేపు వెళదాం)

**Raghu:** I'll be busy tomorrow. Just tell me how to get/ go there. I can go on my own.
(రేపు నేను చాలా busy గా ఉంటాను. ఎలా వెళ్లాలో చెప్పు. నేను వెళ్లగలను. on my own = నా అంతట నేనే)

**Subash:** OK. Walk down the street. Turn to the left and wait for Bus No. 4. It's quite frequent. Get off at Head Post Office stop. Walk along in the direction as the bus goes, turn to the right and then left. The fourth house on the right is Ramesh's. You can't miss it. Just opposite the place is Golconda super market.

(ఈ street వెంబడే నడూ. ఎడమ వైపు తిరుగు. నాలుగో నంబర్ Bus ఎక్కు. Post Office stop దగ్గర దిగు. Bus వెళ్లే వైపే కాస్త దూరం నడిచి, కుడి వైపు తిరిగి మళ్లీ ఎడమవైపు తిరుగు. ఆ road లో కుడివైపు నాలుగో ఇల్లే రమేష్‌ది. you can't miss it = అది కనపడకపోవటం అంటూ ఉండదు. ఎదురుగా గోల్కొండ super market ఉంటుంది.

**Raghu:** I can manage. Thank you. I'll be back in an hour and a half or two. Where can I find you?
(నేను వెళ్లగలనులే. Manage = ఏ పనైనా చేసుకోగలగటం. నేను గంటన్నర, రెండు గంటలకల్లా వచ్చేస్తాను. నేను నిన్నెక్కడ కలుసుకోగలను (అప్పటికి నీవెక్కడుంటావని? )

**Subash:** Let's meet for lunch at Eatwell's. Food is good there. Take bus no. 22A, get down at Samir plaza stop. Walk along for a few yards and there you find the eatery. I'll be waiting for you there.
(మనం lunch కి కలుసుకుందాం, eatwell restaurant లో. అక్కడ food బాగుంటుంది. 22 A bus ఎక్కు, samir plaza stop దగ్గర దిగి కొద్ది దూరం నడిస్తే ఈ eatery (restaurant) కనిపిస్తుంది.)

ఇదంతా directions ఇవ్వటం గురించి కదా. అంటే దారి చెప్పటం. expressions వాడినవి చూడండి; మీరూ వాడి practice చేయండి:

1 a) walk down/ walk along/ walk up the road = Road వెంబడే నడవండి.

b) ఎడమ వైపు/ కుడివైపు తిరగండి= Turn to the left/ to the right. లేకపోతే take a turn to the left/ to the right.
అదీ కాకపోతే turn left/ turn right.

c) తిన్నగా వెళ్లండి= go straight/ walk straight

d) ఆ post office దాకా నడవండి: walk on upto the post office.

e) Walk on upto the post office and then turn left. Post office దాకా నడిచి ఎడమవైపు తిరగండి.

2. దిక్కుల పేర్లు సందర్భాల్లో..

a) తూర్పుగా వెళ్లండి. Go east/ Walk to (towards) the east.

b) ఏ దిక్కువైపన్నా, తిరగటం= Turn (to the) South/ north, etc. గమనించండి. Turn to the South = turn South.

c) Road దక్షిణం వైపు తిరుగుతుంది= The road turns (to the) South

d) Road మలుపు తిరుగుతుంది= The road takes a bend.

e) Road మలుపు దగ్గరే ఆ building=
The building is at the bend of the road=
You find the building (నీకా building కనిపిస్తుంది) at the point where the road takes a bend.

f) Road లో ఉన్న ఒకచోటు= a point.

g) ఈ చోటినుంచి అక్కడికి 2 కి.మీ.
It is 2 km from the point.
మనం directions చెప్పేటప్పుడు వాడే కొండ గుర్తులు= land marks .

a) అక్కడికి దగ్గరి కొండ గుర్తు
the nearest land mark to the place.

b) Hyderabad central is a famous land mark
'Hyderabd Central' అందరికీ తెలిసిన కొండ గుర్తు.

c) How do I find your home? Any land mark?
మీ ఇల్లు తెలుసుకోనేదెలా? ఏదైనా కొండ గుర్తుందా?

To the left/ right; on the left/ on the right.
Turn/ go లాంటి verbs పక్కన అయితే to the left/ to the right అంటాం.
ఒక వ్యక్తి, ఇల్లు లాంటివి ఉండటం అయితే on the right/ on the left అంటాం.
He is on my right.
(నా కుడి వైపున్నాడు).
The school is on the left of the shop.
(Shop ఎడమ వైపు School ఉంది)
ఇవి దారి చెప్పటానికి వాడే మాటలు. బాగా practice చేయండి.

**Practise the following in English:**

**Tej:** మల్లిక్ ఇంటికి ఎలా వెళ్లటం? ఇక్కడ్నించి ఎంత దూరం?

**Nikhil:** అబ్బో చాలా దూరం. నువ్వు రెండు bus లు మారి మళ్లీ కాస్త దూరం నడవాలి.

**Tej:** నువ్వు తీసుకెళ్లగలవా?


M. SURESAN

**Nikhil:** ఈరోజు నేను చాలా busy గా ఉన్నా. దూరమేగాని ఇల్లు కనుక్కోవటం తేలికే.

**Tej:** కొన్ని కొండగుర్తులు చెప్పు. నేను కనుక్కుంటా.

**Nikhil:** దక్షిణం వైపు నడిస్తే Bus stop వస్తుంది, కదా? 13 వ number bus ఎక్కు. ఇక్కడికి 6 వ stop లో దిగు. దానిని Gulab Restaurant Stop అంటారు. అక్కడ 27 bus ఎక్కు. Urdu School stop దగ్గర దిగు. Urdu School దాకా నడిచి, అంటే తూర్పు వైపు, అక్కడ్నించి దక్షిణం వైపు తిరుగు. అక్కడ నీకు కొండ గుర్తు- హనుమాన్ ఆలయం. ఆ ఆలయం నుంచి మూడో ఇల్లే మనవాడిది.

**Tej:** ఎంతసేపు పడుతుంది?

**Nikhil:** కనీసం 45 నిమిషాలు.

**Answer:**

**Tej:** How to go to/ how do I go to Malliks?/ Malliks place?

**Nikhil:** O, it's a long way off. You need to walk some distance after changing two buses.

**Tej:** Can you take me there?

**Nikhil:** I am very busy today. The place is distant but is easy to find.

**Tej:** Give me/ Let me have some land marks. I'll manage.

**Nikhil:** Walk South and you get the bus stop, don't you? Take bus no. 13. Get off / get down at the 6th stop from here. That is the Gulab Restaurant stop. Catch Bus no. 27 there. Get off at Urdu School stop. Walk up to Urdu School, that is, walk (to the) east, and then turn South. There you have a land mark- Hanuman Temple. The third from the temple is our friend's.

**Tej:** How long will it take?

**Nikhil:** At least 45 minutes.

---



**ప్రశ్న:** My brother was come- అనే వాక్యం తప్పు అన్నారు. కాని VIth form of verb లో beform+pp అని చెప్పారు. ఆ ప్రకారం ఈ వాక్యం కరెక్టే కదా!

– ఎన్.పృథ్వీ, రాజుపాలెం

**జవాబు:**
My brother was come- ఇక్కడ was come ను was + past participle అని తీసుకుంటే అప్పుడు passive voice అవుతుంది- అర్థం - అతడు రాబడ్డాడు- దీనికి అర్థం లేదు, కాబట్టి అది sentence అవదు కదా? అదీ కాకుండా beform + pp - verb form, subject ఉండే verbs (అంటే ఎవరిని, దేనిని అని ప్రశ్న వేసుకుంటే జవాబు వచ్చే verbs) కు మాత్రమే ఉంటుంది- ఇది ఇంతకుముందు Lessons లో explain చేశాం- చూడండి. అయితే He is come/ He is gone- ఈ sentences correct, కానీ అంతగా వాడరు.

---

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Ranjan:** Hi Sajjan, what brings you here so early in the day?
(ఏంటి, ఇంత పెందరాళే ఇలా వచ్చావు?)

**Sajjan:** Just to see you, Ranjan, long since we met you know.
(ఆ, నిన్ను చూడటానికే, మనం కలుసుకుని చాలా రోజులయిందికదా?)

**Ranjan:** That's right/ so it is, of course. What's (what has) happened to you all these days? You forgot me. Didn't you?
(కరెక్టేలే. ఇన్నిరోజులేమయ్యావు నువ్వు? / ఏమయింది నీకు? నన్ను మర్చిపోయావు, కదా?)

**Sajjan:** I could say the same about you, couldn't I?
(నిన్ను గురించి కూడా నేనదే అనవచ్చు కదా?)

**Ranjan:** Ok, Ok, let's not quarrel. Happy we've met atleast now, aren't we?
(సర్లే, గొడవొద్దు. ఇప్పటికైనా కలుసుకున్నందుకు సంతోషం కదా?)



**Ranjan:** Ok, I'll give you another route. Drive along, take the 3rd right, proceed till you see a Ganesh temple with a large neem tree behind it. Go on further along. Then turn left. You find the sales Tax Office there. You can't miss it because in front of it there is an STD booth. The 2nd house from it is Bhushan's. So, distant perhaps, but easy to locate, isn't it?
(ఇంకో route చెప్తా. ఇలా వెళ్ళు, మూడో కుడి road వైపు తిరుగు. అలాగే వెళ్ళ గణేశాలయం వరకు. ఆలయం వెనుక పెద్ద వేప చెట్టుంటుంది. ఇంకాస్త దూరంవెళ్ళు, ఎడమ వైపు తిరుగు. అక్కడ sales tax office ఉంటుంది. అది miss అవలేవు నువ్వు. ఎందుకంటే దాని ముందే ఓ STD booth ఉంది. అక్కడినించి రెండో ఇల్లే Bhushan ది.)

కిందటి lesson లో లాగే ఈ సంభాషణ కూడా దారి అడగటానికీ, దారి చెప్పటానికి సంబంధించిన సంభాషణే కదా?
ఇక్కడ మాటలు చూద్దాం: cross roads, behind, in front of, proceed, go further along.

5) Close by = near by = close to = near = (అక్కడికి) దగ్గరలో, ఆ దరిదాపుల్లో
a) You know the collectorate, don't you? The electricity office is close by/ nearby/ close to it/ near it = నీకు collectorate తెలుసుకదా? (Collector, Director, Commissioner లాంటి పదాలకు ' - ate' చేరిస్తే వారి కార్యాలయాలనే అర్థం వస్తుంది.) ఆ electricity office దానికి దగ్గరే.

6) Proceed = అలాగే వెళ్లటం/ వెళ్లటం.
a) ఈ road వెంబటే తిన్నగా వెళ్లండి
proceed straight along this road.
b) Proceed to the east = తూర్పు వైపు వెళ్లండి
c) If you proceed for a KM, you will see the place = అలాగే ఓ కిలోమీటరు దూరం వెళ్తే ఆ చోటు మీకు కనిపిస్తుంది.

# Need not walk further

**Sajjan:** You can very well say that. How about disturbing Bhushan now?
(నువ్వనేది correct. Bhushan వాళ్లింటికి వెళ్దామా?)
you can say that/ you can very well say that = నువ్వనేది correct.
Disturbing Bhushan అంటే - వాళ్లింటికి వెళ్దామా? అనే కానీ అతన్ని trouble చేయటానికని కాదు)

**Ranjan:** (I) Like to, but I'm not for going so far off now?
(ఇష్టమే కాని, ఇప్పుడు అంతదూరం వచ్చే పరిస్థితిలో లేను)

**Sajjan:** far off? His place is/ He lives close by, doesn't he?
(దూరం అంటున్నావేంటి? ఇక్కడికి దగ్గరే కదా వాళ్లిల్లు? /ఇక్కడికి దగ్గరలోనే ఉంటాడు కదా?)

**Ranjan:** That was till 2 months ago. He moved to surendranagar.
(అది రెండునెలల కిందటి సంగతి. వాడు Surendra nagar కు ఇల్లు మారాడు.)
ఇల్లు మారటం= move; shift అంత సరికాదు. అలాగే 2 months ago, correct, 2 months back సరికాదు)

**Sajjan:** That's news. The fellow didn't even call to tell me of it. I wish to see him urgently about something important. How do I go to him?
(అది నాకు తెలియదు. వాడు ఆ విషయం phone చేసయినా చెప్పలేదు. వాణ్నిప్పుడు ముఖ్యమైన విషయం గురించి కలుసుకోవాలి. ఎలా?)

**Ranjan:** I'll tell you. Listen carefully. You have a bike, haven't you. Drive straight along the road. At the next cross roads, turn left. Take the third right turn again.
(చెప్పేది జాగ్రత్తగా విను. నీ bike ఉంది, కదా? ఈ road వెంబడే వెళ్ళు. (Drive = Motor వాహనంలో వెళ్లటం.) ఆ తర్వాత వచ్చే Centre లో ఎడమవైపు తిరుగు. మళ్లీ మూడో కుడి వైపు తీసుకో)

**Sajjan:** You are confusing me. Why don't you come along too.
(నువ్వు నన్ను confuse చేస్తున్నావు. నువ్వూ రాకూడదా?)

1) Cross Roads/ road junction = నాలుగు రోడ్ల కూడలి = దీన్ని X roads అని కూడా రాస్తారు. ఎక్కువగా center అనీ, చౌక్ అనీ అంటుంటాం. chowk హిందీ మాట. center సరికాదు.

2) behind = వెనక. దీని బదులు సామాన్యంగా చాలా మంది backside/ at the back side అంటుంటారు. కాని english లో backside = buttocks (పిరుదులు). అంతగా back వాడాలనుకుంటే, at the back of అంటే సరిపోతుంది.
a) The car is behind/ at back of the bus.
(At the backside of the bus కాదు.)

3) In front of = ముందు అని (space సందర్భంలో). ఇది behind/ at the back of కు opposite. దీని బదులు కూడా before ఎక్కువ వాడుతుంటాం. Before అంటే 'ముందు' అనే అర్థం, కాని అది Time లో ముందు అని space లో కాదు. అయితే The School comes before the cloth shop - ఇక్కడ Correct, ఏ అర్థంతో? ఆ cloth shop కు ఇవతలే అనే అర్థంతో అంతేకానీ ఒక building కు ముందర అని కాదు.
a) మా ఇంటిముందు ఓ కొబ్బరిచెట్టుంది. There is a Coconut tree in front of our home.
b) వాళ్ల ఇల్లు Post Office ఇవతలే = Their place is/ comes before the post office.

4) Beside = పక్కన - The Collectorate is beside the swaraj Maidan. (స్వరాజ్ మైదాన్ పక్కనే Collectorate = Collector's office. Collector, director, Commissioner, etc, కు 'ate' చేరిస్తే వాళ్ల కార్యాలయాలనే అర్థం వస్తుంది).
a) The Cloth shop is beside the Post Office - అయితే beside కంటే కూడా 'next to' better, ఎక్కువ.
b) The cloth shop is next to the jewellery on the left of/ on the right of it = ఆ నగల shop పక్కనే ఆ బట్టల shop, కుడి వైపు/ఎడమ వైపు
(Beside, besides. beside = by the side of = పక్కన- మనం ఇంతవరకు పక్కన అనే అర్థంతో వాడినమాట.
Besides = also, కూడా, దానితోపాటు అనే అర్థంతో. I lost my pen besides my book. Book తో పాటు pen కూడా పోగొట్టుకున్నా)

7) farther, further: farther, far కు Comparative; far: దూరం.
i) farther: ఎక్కువ దూరం. Mumbai is farther from Vijayawada, than from Hyderabad.
ముంబై హైదరాబాద్ కంటే విజయవాడ నుంచి ఎక్కువ దూరం.


M. SURESAN

ii) further: ఇంకా. I can't walk any further: ఇంకెక్కువ దూరం (ఇంక) నేను నడవలేను.
(ఇక్కడ farther= further కదా?)
b) Don't talk any further: ఇంకేం మాట్లాడకు.
c) Walk further (farther) along: అలాగే ఇంకా నడవండి.
d) Go further down the street: ఆ road వెంబడి ఇంకాదూరం నడవండి.
e) You need not walk further than the statue ఆ విగ్రహం దాటి నడవక్కరలేదు.

Lesson No 96 మాటలూ, ఈ Lesson మాటలూ, దారి తెలుసుకోవటంలో, ఇతరులకు దారి చెప్పటంలో వాడటం సర్వసాధారణం. మీ conversation లో Practice చేయండి.

**Now Practise the following aloud in English:**

**Pavan:** Arjun, మీ ఇంటికి ఆనుకున్న Building ఏంటి?
**Arjun:** Net Centre సంగతా నువ్వడిగేది?
**Pavan:** Net Centre మీ ఇంటికి కుడివైపు. నేనడిగేది ఎడమ వైపు Building సంగతి.
**Arjun:** అది Telephone Engineering Company వాళ్లది. వాళ్లకు ఎప్పుడూ బయట పని ఎక్కువ. అందుకని దాదాపు ఎప్పుడూ మూసే ఉంటుంది.
**Pavan:** ఆ ఓనర్ ఎక్కడుంటాడు?
**Arjun:** ఆయనుండేది శ్రీరాంనగర్‌లో. నువ్విక్కడ్నించి వెళ్లాలంటే తొమ్మిదోనంబర్ Bus ఎక్కు.
**Pavan:** నాకు bike ఉంది.
**Arjun:** ఈ రోడ్ వెంబడే వెళ్లి, కుడివైపు తిరిగితే కొంత దూరం తర్వాత పాల booth కనిపిస్తుంది. దాని వెనకనే ఆయనిల్లు. ఆయనింటి పక్క building ను అద్దాల మేడ అంటారు. అక్కడికి దగ్గరే మన Maths lecturer ఇల్లు.
**Pavan:** OK Thank you.

**Answer:**

**Pavan:** Arjun, What's in the building beside/ next to yours?
**Arjun:** Are you talking of the Net Centre?
**Pavan:** The Net Centre is on the right of your place. I am asking you about the building on the left of your place.
**Arjun:** That belongs to a Telephone Engineering Company. Most of their work is outdoors (బయట). That's why it is almost (దాదాపు) always closed.
**Pavan:** Where does the owner live? Do you know?
**Arjun:** He lives in Sriram Nagar. If you are going from here take bus No.9
**Pavan:** I have my bike.
**Arjun:** Drive along this road, turn right and go on for some distance; you find a milk booth. The house behind it is his. The building next to his is called Addala meda. Our Maths lecturer's place is closeby.
**Pavan:** OK. Thank you.

**ప్రశ్న:** *Main verbs (tell, drinks), వాటికి ముందువచ్చే helping verbs (do, did) లు వేర్వేరు tenses లో ఉన్నప్పటికీ (present tense, past tense) రెండింటి అర్థం ఒక్కటేనా?*
***eg.** I didn't tell, I never told*
*I might tell, I might have told*
*I did not tell, I have not told.*
*– కె.తిరుపతి, రామాయంపేట*

**జవాబు:**
Helping verbs వాడేచోట్ల, helping verb తర్వాతి main verbs tense, helping verb tense నుబట్టే ఉంటుంది.
**eg:** He does not know this:
ఇక్కడ 'does' present tense కాబట్టి, verb 'does know' present tense.
I did not tell him - 'did' past tense; so verb did tell- past tense.
I didn't tell him= నేనతనికి చెప్పలేదు
I never told him =
నేనతనికెప్పుడూ చెప్పలేదు.
(never = ఎప్పుడూ లేదు/ కాదు)
I might tell him:
నేనతనికి చెప్పవచ్చు (చెప్తానేమో)- (future)
I might have told him =
నేనతనికి చెప్పి ఉండవచ్చు (చెప్పానేమో- past)
చూడండి: 'tell' తర్వాత ఎవరితో చెప్పింది కూడా చెప్పాలి. 'say' and 'tell' కు తేడా ఇదివరలో వివరించాం.
I did not tell him =
నేనతనికి చెప్పలేదు (గతంలో, time, అంటే ఎప్పుడు అని చెప్పడం జరిగితే- ఒక time, date, year, week, etc)
I have not told him = నేనింతవరకు చెప్పలేదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# I am taking the exams




**Varun:** Hi Tarun, Congrats on scoring a hundred percent in Maths.
(నూటికి నూరు మార్కులు Maths లో వచ్చినందుకు congratulations. Cent percent ఇప్పుడు పాతబడి పోయింది. A / One hundred percent అనేది ఇప్పటి వాడుక.)

**Tarun:** Thank you. Congrats to you too. You scored the highest in English, didn't you?
(నీకూ Congrats. నీకు English లో అందరి కంటే ఎక్కువ మార్కులు వచ్చాయి కదా?)

**Varun:** I am happy about it. My marks in Maths aren't bad either, though didn't get a hundred percent. When I joined the course a few months I was not that confident about Maths. My hard work has paid off. The marks in this exam have given me confidence.
(నాకు సంతోషంగానే ఉంది. Maths లో కూడా నాకు మంచి Marks వచ్చాయి నూటికి నూరు కాపోయినా. course లో join అయినప్పుడు అంత నమ్మకం లేదు Maths విషయంలో. ఈ exam లో marks నాలో నమ్మకం కలిగించాయి.

Aren't bad either = అది కూడా చెడేం కాదు బాగానే వచ్చింది. English లో not తో also రాదు. either వస్తుంది. Confidence = నమ్మకం; paid off= మంచి చేసింది/ లాభం కలిగించింది.

**Tarun:** How come you joined this college, when you have so many colleges in your place?
మీ ఊళ్లో ఎన్నో College లు ఉండగా, ఇక్కడ ఎందుకు join అయ్యావు?

How come= ఎందుకు, purely conversational expression. మీ conversation లో తరచుగా వాడండి:
How come you are here? = ఏంటిక్కడున్నావ్?
How come you don't know this?
నీకిది తెలియకపోవటం ఏంటి?

**Varun:** Dad wasn't happy with any of those colleges, so he admitted me into / to this college.
(మా నాన్నకవేమీ నచ్చలేదు. అందుకని ఇక్కడ చేర్పించారు.)

**Tarun:** Where did you do your schooling?
(నువ్వు ఏ School లో చదువుకున్నావు?)

**Varun:** Upto the 7th Class in Teachwell School and from the 8h to the 10th in Learnwell School.
(7వ class వరకు Teachwell School లో, 8th నుంచి 10th వరకు Learnwell School లో)

**Tarun:** How do you like being a hosteller?
(Hostel లో ఉండటం ఎలా ఉంది నీకు?)
Hosteller = resident = Hostel లో ఉండి చదువుకునేవాడు. Being= ఉండటం, Being a hosteller = Hosteller గా ఉండటం.

**Varun:** O, I do like it. That's a kind of experience. Valuable in its own way. The only problem is food. Where did you do Intermediate?
(నాకిష్టమే. అదో అనుభవం- దాని విలువ దానికుంది. (valuable= విలువైన) ఆహారం ఒకటే సమస్య. నువ్వు ఇంటర్ ఎక్కడ చదివావు?)

**Tarun:** Here itself. Why didn't you go for Engineering after Inter?
(ఇక్కడే. నువ్వెందుకు Engineering చేరలేదు?)
ఇక్కడే అనటానికి Here only అని అంటుంటాం - ఇదంత సరికాదు- Here itself సరైన expression.

**Varun:** I am not interested. Moreover I want to be an MBA. Why didn't you?
(నాకు interest లేదు. అంతేకాకుండా నాకు MBA అవాలని ఉంది. మరి నువ్వెందుకు Engineering చేరలేదు?)

**Tarun:** I want to do a PG course in IISC, Bangalore.
(ఇదైంతర్వాత Bangalore లో IISC చేరాలని)
PG course= Post graduate. (MA, M.Sc లాంటి Master courses ను PG courses అంటారు. BA, B.Sc, లాంటి B తో Courses= Bachelor/ degree/ graduate courses అంటాం. Post = తర్వాత. Post graduate = graduate తర్వాత.

**Varun:** That's a good idea. You are good at Sciences.
(నీకు Sciences బాగా వస్తుంది కాబట్టి అది మంచి idea నే.)

**Tarun:** I think the time has come for us to apply for the entrance exams of these courses which are usually in December every year.
(మనం ఈ entrance exams - ప్రవేశపరీక్షలకు apply చేయాల్సిన time వచ్చిందనుకుంటా. సాధారణంగా ఈ entrance exams అన్నీ కూడా December లో ఉంటాయి.)

**Varun:** Yesterday's papers carried the ads about the entrance exams. The last date for sending in the filled in applications is the 12th of next month.
(నిన్నటి papers లో ఈ ప్రవేశ పరీక్షల ads వచ్చాయి. పూర్తిచేసిన applications పంపాల్సిన చివరితేది వచ్చే నెల 12)

**Tarun:** Then we had better get ready. Ok, then, see you.
(అయితే మనం ready అవటం మంచిది. మళ్లీ కలుసుకుందాం)

**Varun:** Bye.

Students, Studies, courses కు సంబంధించిన సంభాషణ కదా ఇది? కొన్ని expressions పరిశీలిద్దాం.

students అనగానే marks, pass, fail, score ఇలాంటి మాటలు, fees, study, లాంటి మాటలు గుర్తొస్తాయికదా? చాలా simple గా, సహజంగా ఉండే మాటల తీరు ఇలా ఉంటుంది.

**1 a)** నువ్వెక్కడ చదువుతున్నావు?
Where are you studying?/ Which School/ College are you studying in?/ Which School/ College are you a student of?

**b)** నీవే class? = what class are you in?/ Which class are you studying? what class are you doing?
వీటికి సమాధానాలు. Iam studying in... School/ College. I am in the I year Inter/ II year degree, etc. Studying బదులు, doing ఎక్కువ వ్యావహారికం.

**a)** నేను I year Engineering చదువుతున్నాను
I am doing my I year Engineering.

**b)** Which year of medicine are you in? are you studying/ which year?
(ఇది ఇంతకుముందే medicine అని తెలిస్తే)/
Which year are you doing?
Medicine ఏ సంవత్సరం చదువుతున్నావు?

**Shankar:** May I Know what you are?
(మీరేం చేస్తుంటారో తెలుసుకోవచ్చా? / మీరేం చేస్తుంటారు?)

**Dinakar:** I am a student

**Shankar:** Studying...?
(ఏం చదువుతున్నారు)

**Dinakar:** I am doing my II year Inter/ I am at college in the degree course/ I am in the 10th Class/ I am doing my X class.

**2 a)** School/ College లో చేరటం= Join a School/ college - join in కాదు.

**b)** ఒక course చదవటం = studying a course. ఒక్కోప్పుడు taking a course.

**c)** She is taking a course in Software
Software course చదువుతోంది.

**b)** నేను ఈ ఏడాది చివర Inter exams రాయబోతున్నాను
(I am taking/ will take the Inter exams at the end of this year/ I am sitting the Inter exams at the end of this year/ I sit the exam.

Appear for an exam - ఈ expression ఇప్పుడంత వాడటంలేదు.

గమనించండి: పరీక్ష రాయటం అనే అర్థంతో a) give an exam, b) write an exam అని చాలా మంది అంటుంటారు - వీటిల్లో ఏదికూడా correct కాదు. (say either, 'Take an exam' or 'sit an exam'.)

అలాగే am appearing/ is appearing/ are appearing for an exam కూడా తప్పే. ఇలాంటి చోట్లంతా taking వాడితే సరిపోతుంది.

ఇంకా Do an exam అని కూడా అనవచ్చు
She is going her final year B.Tech exam at the end of this year.

**3 a)** She is taking lessons in music/ dance, etc: Music, dance లో శిక్షణ పొందుతోంది/ నేర్చుకొంటోంది = She is learning music/ dance = She is doing taking a course in music/ dance.
అది గతంలో అయితే took, learned, etc వాడతాం.

**b)** I want to take this software course
నేనీ software course చదవాలనుకుంటున్నా.

**4 i)** బాగా చదవటం=
study well/ do well at studies.

**a)** 'How is he studying?/ Is he good at studies? 'O, he is doing very well at studies/ He is studying very well; he is hardworking.'
(కష్టపడి చదవటం)

**ii)** బాగా చదవటం = be good at studies, clever/ bright at studies (బాగా, తెలివిగా చదువుతారు.)

**b)** She is good at maths, but rather poor at Physics = ఆ అమ్మాయికి లెక్కలు బాగానే వచ్చు కానీ Physics లో కాస్త poor.

**5** Class కు హాజరవటం/ college కి హాజరవటం attend class (es)/ attend college.

**6** Poor at studies = dull at studies.

**7** పరీక్ష = exam (examination ముఖ్యంగా రాతలోనే వాడతారు. మాట్లాడేటప్పుడు exam వాడటం సబబు); exam కూ, test కూ తేడా:

**a)** exam: ఒక విద్యార్హత (qualification) - X class Inter, B.Tech, Msc లాంటి certificates కానీ, degrees కానీ పొందటానికి అవసరమైన ముఖ్యమైన పరీక్ష.

**b)** Test: ఓ exam కు బదులుగాగానీ, అదనంగాగానీ విద్యార్థులు ఏ subject ఎంతవరకు అర్థం చేసుకున్నారు, ఎంతవరకు వాళ్లకా subject వచ్చు అని నిర్ణయించటానికి నిర్వహించే పరీక్ష test. Test సమయం, exam సమయం కంటే తక్కువే ఉండవచ్చు. సందర్భాన్ని బట్టి test లో marks కు విద్యార్థులో అంత ముఖ్యంగా గుర్తింపు ఉండకపోవచ్చు

**8** పరీక్ష రాయటం: Take an exam/ sit an exam.

**a)** నేను రేపు పరీక్ష రాయబోతున్నాను
I am taking an exam tomorrow.


M. SURESAN

ఆమె ఈ సంవత్సరంలో B.tech చివరి సంవత్సరం పరీక్ష రాస్తుంది.

**8** పరీక్షల్లో మార్కులు తెచ్చుకోవటం get/ score/ secure. వీటిల్లో secure కొద్దిగా పాండిత్యం - వాడకపోవటం మంచిది.

**Rama Rao:** How much/ How many marks did you get/ score in last week's exam?
(కిందటివారం పరీక్షలో ఎంత/ ఎన్ని మార్కులు తెచ్చుకున్నావు? / వచ్చాయి నీకు?)

**Bharadwaj:** Dad, I can't say I got/ scored very high marks.
(మార్కులు బాగా తెచ్చుకున్నట్టు/ వచ్చినట్టు చెప్పలేను)

**Rama Rao:** Why isn't your score high? Why aren't your marks high?
(ఎక్కువ marks ఎందుకు తెచ్చుకోలేదు/ రాలేదు?)

OR

Why Couldn't you score high? Why couldn't you get high marks?
(ఎందుకు ఎక్కువగా తెచ్చుకోలేకపోయావ్?)

OR

Why did you score low? Why did you get such low marks.
(అంత తక్కువెందుకు తెచ్చుకున్నావు/ అంత తక్కువ Marks ఎలా వచ్చాయ్?)
ఇంతకంటే మెరుగైన Marks తెచ్చుకోలేకపోయావేం?
Why could n't you score better?/ Why couldn't you get better marks than this?.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






# How did you do in the exam?

**Neeraj:** Hi Suraj, ages since we met; what's wrong?
(మనం కలుసుకుని చాలా రోజులయింది. ఏంటి కారణం? )

**Suraj:** I was very busy till yesterday with my exams. Thank God, its all over. What a relief! No more exam nerves
(నిన్నటివరకు exams వల్ల చాలా busy గా ఉన్నా. అమ్మయ్య అయిపోయాయి. ఎంత హాయిగా ఉందో! పరీక్షల బెదురు ఇకలేదు.)
Relief = (పెద్ద బరువు నెత్తి మీద నుంచి దించినట్టు) విడుదల. exam nerves పరీక్షలంటే బెదురు)

**Neeraj:** Happy to hear that. How did you do in the exams?
(సంతోషం! ఎలా రాశావు exams?)

**Suraj:** Well, I hope (బాగానే అని ఆశిస్తున్నాను)

**Neeraj:** What were your marks in the earlier exams?
(అంతకుముందు exams లో marks ఎలా వచ్చాయి? )

b) exams రాస్తూండటం వల్ల తీరిక లేకపోటం - busy taking/ attending exams (Busy writing exams మాత్రంకాదు, english లో writing an exam/ exams అనే మాట లేదు - కిందటి lesson లో తెలుసుకున్నాం గదా? )

c) exams వచ్చేస్తున్నాయి = exams are fast approaching = exams సమీపిస్తున్నాయి = (Approach - అప్రోచ్ - ప్రో నొక్కి పలుకుతాం = సమీపించటం = దగ్గరకు రావడం/ వెళ్లడం)

★ exam nerves = పరీక్షలంటే కొంతమందికి ఉండే బెదురు, కంగారు, పరీక్షల భయం.
పరీక్షల భయం నుంచి బయటబడటం- get over exam nerves, get over = అధిగమించటం.

★ How did you do in the exam?
exam ఎలా రాశావు? - ఇది ముఖ్యంగా గమనించాలి మనం - english లో ఎలా రాశావు exam అనడానికి 'write' దాని ఇతర forms రానేరావు. చాలా తరచుగా వాడే మాట, 'do' దాని ఇతర forms

**a)** నేను నిన్న పరీక్షలు బాగా రాశాను
I did well in the exam yesterday.

**b)** నేనంతసరిగా రాయలేదు
I didn't do so well/ I haven't done so well (సందర్భాన్ని బట్టి)

**c)** నేననుకున్న దానికన్నా బాగా రాశాను
I did much better than I had expected.

**Vinod:** You know, Vikas topped the school with his one hundred percent each in Maths and Science.
(స్కూల్లో అందరికన్నా ఎక్కువ మార్కులు Maths Science లో 100%)

**Pramod:** That's brilliant/ really brilliant.
(చాలా గొప్పగా/ నిజంగా గొప్పగా ఉంది, అతడు పరీక్ష రాసిన తీరు)

**Vinod:** Every teacher likes him for his performance in the exams.
(పరీక్షల్లో అతడి తీరువల్ల teachers అందరికీ అతనంటే ఇష్టం.)

ఒక విషయం: do, fare, perform - ఈ మూడింటిని కేవలం పరీక్షల విషయంలోనే కాకుండా ఒకరి సామర్థ్యం బయటపడే విషయాలన్నింటిలోనూ వాడతాం.

**Meghana:** I'm surprised. She usually does very well. She never scored below 85% in the previous exams.
(నిజంగా ఆశ్చర్యంగా ఉందే, పాపం. మును పటి (previous - ప్రివియస్) పరీక్షల్లో ఎప్పుడూ 85%కు తగ్గలేదు.)
ఇలాంటిచోట్ల less than 85% అంటూ సాధారణంగా వాడేది- అంతసరికాదు)
Exam fail అవటం, pass అవటం = He/ she failed the exam/ passed the exam.
ఇవీ exams కూ, marks కు సంబంధించిన మాటలు:

**Suraj:** In most of them just above sixty percent. In one or two others I scored quite high - above 90%
(చాలావాటిల్లో 60% కంటే కొద్దిగా ఎక్కువ. ఒకటి రెండు papers లో మాత్రం 90% కంటే ఎక్కువ మార్కులు వచ్చాయి.)

**Neeraj:** Why just above 60% in most of the papers? Weren't you saying you had done well in all the exams?
(చాలావాటిల్లో 60% కంటే ఎక్కువ మాత్రమే ఎందుకొచ్చింది? చాలా బాగా రాశానని అంటుం డేవాడివి కదా? )

**Suraj:** I thought so, but when I saw the marks I understood I had fared badly in them. One can never be sure in these matters, you know?
(నేనూ అలానే అనుకున్నా, marks చూసినప్పుడే సరిగా రాయలేదని అర్థమయింది. అయినా ఇటు వంటి విషయాల్లో ఎవరూ ఏదీ గట్టిగా చెప్పలేరు, కదా)

**Neeraj:** What about your performance this time?
(ఈసారి ఎలా రాశావు? /మరి ఈసారి సంగతి? )

**Suraj:** I think I fared very well. I am satisfied with my performance.
(బాగా రాశాననే అనుకుంటున్నాను. నాకు తృప్తి గానే ఉంది)

**Neeraj:** Well, wish you all the best. How about a movie this evening then?
(సాయంత్రం సినిమాకెళ్దామా? )

**Suraj:** That's a real pleasure.
(ఓ, సంతోషంగా)

ఈ సంభాషణలో వాడిన expressions గమనించండి. ఇవన్నీ కూడా exams కూ, studies కూ సంబంధించినవే - వీటిలో మనం వాడాల్సిన సందర్భాలు చాలా ఎక్కువగా ఉంటాయి. కాబట్టి, అవకాశం వచ్చినప్పుడల్లా వాడి, practice చేయండి.
★ Busy with exams ★ exam nerves ★ How did you do in the exam? ★ I did well ★ What were your marks? ★ above 60% above 90% ★ you had done well ★ I had fared badly ★ ..your performance this time?

★a)Busy with exams, busy preparing for exams, busy studying for exams - వీటన్నిటికీ అర్థం, exams తో తలమునకలుగా (తీరిక లేకుండా) ఉండటం - ముఖ్యంగా exams కు చదువుతూ.

**d)** అతనేం బాగా రాయలేదు
He didn't do well at all.

**e)** అతను paper చెడిపేశాడు
(బాగా రాయనేలేదు అనే అర్థంతో)
He did poorly/ very poorly in the exam.
He did badly in the exam.

ఇలా మామూలుగా అయితే do వాడతాం, పరీక్ష రాయటం అనే భావానికి. ఇదే మీరు పై సంభాషణలో గమనించవలసిన అంశం. 'రాయటం' వచ్చిన చోటల్లా 'do' దాని ఇతర రూపాలు గమనించే ఉంటారు. ఇది బాగా practice చెయ్యండి.
అయితే అప్పుడప్పుడు, పరీక్ష రాయటం అనే అర్థంతో fare కూడా వాడతాం.
...I had fared badly... I had done badly
బాగా రాయలేదు. చెత్తగా రాశాను.

**a)** ఎలారాశావు నిన్నటి exam?
How did you fare in the exam yesterday?

**b)** బాగానే రాశాను = I fared well

**Prakash:** How did you fare in the exams?
(ఎలా రాశావు? )

**Akash:** Well, I think. I got 97%

**Prakash:** Oh, you didn't fare badly after all. Congrats.
(బ్రహ్మాండం, చాలా బాగానే రాశావన్నమాట. గుర్తు తెచ్చుకోండి = not bad = very good)

**c)** Hold the exam any time you like, he is sure to fare well
మీ ఇష్టం వచ్చినప్పుడు పెట్టుకోండి పరీక్ష, వాడు కచ్చితంగా బాగా రాస్తాడు.
పరీక్ష పెట్టడం = Hold an exam/ exams
ఇది చూడండి:

**i)** what about your performance this time

**ii)** I am satisfied with my performance.

అప్పుడప్పుడు, పరీక్ష రాయటం అనే అర్థంతో performance కూడా వాడతాం. అయితే ఇది కాస్త పాండిత్యం.

**a)** ఎలా రాశారు నిన్నటి exam?
How was your exam yesterday?

**b)** His performance in exams is usually brilliant
exams లో సాధారణంగా అతను చాలా బాగా రాస్తాడు. brilliant = ప్రకాశవంతమైన, కాంతిమంత మైన (బ్రిల్యంట్ - 'బ్రి' నొక్కిపలుకుతాం)


M. SURESAN

**a)** How is YSR doing/ faring/ performing as the CM?
CM గా YSR ఎలా ఉన్నారు? (సమర్థంగానా కాదా? )

**b)** The Sri Lankans did/ fared/ performed very badly/ poorly in the last cricket series.
Sri Lankans చాలా poor గా ఆడారు.

**c)** Her performance in the movie was disappointing
ఆ చిత్రంలో ఆమె నటన నిరాశపరిచింది.

**d)** He did/ fared/ performed well in the movie
అతను ఆ చిత్రంలో బాగా నటించాడు.

**e)** He is doing very well as a teacher
Teacher గా అతను చాలా బాగా చేస్తున్నాడు.

Do/ fare/ perform - వీటిల్లో అత్యంత సహజంగా, ఎక్కువగా వాడేమాట, 'do'

**f)** I hope to do well in the exam
నేను exam బాగా రాస్తాననే ఆశిస్తున్నాను.

ఇప్పుడు ఇంకొన్ని expressions.

**a)** మీ Marks ఏంటి? /ఎన్ని?
What are your marks?/ What marks did you get? What is your score?/ How many marks did you get/ score?

**b)** నీ marks ఏం తృప్తికరంగా లేవు
Your score is/ your marks are, not satisfactory.

**c)** With such a low score/ such low marks, you can't get a seat in that college.
అంత తక్కువ మార్కులతో నీకా college లో seat రాదు.

**Meghana:** Congrats Sumana, on your high Score in Physics.
(Physics లో నీకు మంచి marks వచ్చినందుకు congrats.)

**Sumana:** You didn't fare badly either. You got just one mark below mine. So my congrats to you. Poor Jamuna! she got below 50%.
(నీకూ ఏం తక్కువ రాలేదు కదా. ఒక్క Mark మాత్రమే కదా నాకంటే తక్కువ. ఈ సందర్భంలో నీకు నా అభినందనలు. పాపం జమున - 50శాతం కంటే తక్కువ వచ్చాయి)
(Above - ఎక్కువ/హెచ్చుగా; below=తక్కువ)

**Now practise the following in English:**

**Subodh:** Hi Pranav, exams కు ఎలా prepare అవుతున్నావు?

**Pranav:** పరీక్షలంటే నాకెప్పుడూ బెదురే, అయిపోయేంత వరకు.

**Subodh:** కానీ నీకెప్పుడూ మంచి marks వస్తాయి కదా?

**Pranav:** నాకు మంచి marks వస్తాయి, కానీ ఇంకా ఎక్కువ marks తెచ్చుకోవాలని నా కోరిక.

**Subodh:** ఎవరికుండదు ఆ కోరిక?

**Pranav:** మీ class వాళ్లకు పరీక్షలెప్పుడు?

**Subodh:** నిన్ననే అయిపోయాయి.

**Pranav:** ఎలా రాశావు నువ్వు?

**Subodh:** బాగానే రాశాను, కానీ ఒక Chemistry paper మాత్రమే చెడగొట్టాను. మిగతా papers లో 80 కి పైనేరావచ్చు. Chemistry లో మాత్రం 60 దాకా రావచ్చు

**Pranav:** మీ cousin Sucharita ఎలా రాసింది?

**Subodh:** బాగానే రాసిందనుకుంటా. ఇంతకుముందు exams లో ఆమె చాలా బాగా రాసింది. అన్నిట్లో 100 కు ఒకటి, రెండు మార్కులు మాత్రమే తక్కువ.

**Pranav:** కానీ గొప్ప performance. Girls, మనకంటే బాగా చదువుతారనుకుంటా.

**Subodh:** చెప్పలేంలే.

**Answer:**

**Subodh:** Hi Pranav, how are you preparing for the exams?

**Pranav:** I always have/ suffer from exam nerves, until they are over.

**Subodh:** But you always get good marks/ score high.

**Pranav:** I do, but I wish to score even better marks. (Even = ఇంకా)

**Subodh:** Who doesn't wish it?/ Who doesn't have the wish?

**Pranav:** When are the exams for your class?/ When are you people taking the exams?

**Subodh:** They were over yesterday./ Yesterday was the last of them.

**Pranav:** How did you do?

**Subodh:** (I) did very well, but I did poorly/ fared badly in chemistry. In the other papers I may get/ score above 80%. In chemistry I may get about 60.

**Pranav:** How did your cousin Sucharita do?

**Subodh:** (I) think she did well. In the earlier exams, however, her performance was very good. In all the papers, she got just one or two marks below 100.

**Pranav:** That's good performance. I suppose girls study better than we, boys.

**Subodh:** We can't say./ Difficult to say.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# SPOKEN ENGLISH 100
ఆంగ్లభాషణ






# I am happy today

**Anand:** I am happy today.
(నేనీరోజు సంతోషంగా ఉన్నా)

**Santosh:** Why?/ Why are you happy?
(ఎందుకు? )

**Anand:** Because this is the hundredth lesson in spoken English. You are happy too, aren't you?
(ఇది spoken English లో 100 వ lesson కాబట్టి. నీకూ సంతోషంగా ఉంది, కదా? )

**Santosh:** Ofcourse I am, but I am not satisfied. There's a lot more english to learn.
(నాకు సంతోషమే, అయితే తృప్తిగా లేదు. నేర్చుకోవాల్సింది ఇంకా చాలా ఉంది)

**Anand:** I too am anxious to learn more.
(నాకూ ఇంకా నేర్చుకోవాలనే ఆతృతగా ఉంది)

**Santosh:** My sister appears very serious about learning more English, and so is my cousin Harsha.
(మా sister english నేర్చుకోవాలని చాలా serious గా ఉంది, మా cousin హర్ష కూడా)

**Anand:** Deepti and Divya were my school mates. They were eager to learn English. They would be ever ready to read English newspapers and books, speak english, listen to others speak english, and so on. They are fluent in English now. Whenever they had an opportunity, they used to speak English.
(దీప్తి, దివ్య నా schoolmates. వాళ్లు English నేర్చుకోవాలని ఎంతో ఆతృతతో ఉండేవాళ్లు. ఎప్పుడూ English newspaper, books చదవటం, English మాట్లాడటం, ఇతరులు English మాట్లాడేప్పుడు వినటంలాంటివి చేయటానికెప్పుడూ సిద్ధం. అందుకే వాళ్లు ఇప్పుడు English ధారాళంగా మాట్లాడగలరు. అవకాశం దొరికినప్పుడల్లా English మాట్లాడేవాళ్లు)

**Santosh:** To tell you frankly, I am not at all pleased with my English. I shall be happy if I am able to speak and write better.
(నిజంగా చెప్పాలంటే నాకొచ్చిన English నాకే సంతోషంగా లేదు. ఇంతకంటే బాగా మాట్లాడగలిగి, రాయగలిగితే నాకు చాలా సంతోషంగా ఉంటుంది.

**Anand:** We can be good speakers of English if we have regular practice.
(Regular practice ఉంటే బాగా English మాట్లాడేవాళ్లం అవుతాం)

**Santosh:** Yes, we frequently read so in these Spoken English lessons.
(ఈ English lessons లో అదే తరచుగా చూస్తూంటాం/ చదువుతుంటాం)

ఇది 100 వ lesson కదా. ఈ సందర్భంగా for a change (చిన్నమార్పుగా/ కాస్త తేడాగా) ఓ చిన్న Language game ఆడదాం. పై సంభాషణలోని sentences చూడండి:

**I a)** I am happy; I am not satisfied; I too am anxious to learn more; I am not at all pleased; I am able to speak; I shall be happy.

**b)** Why are you happy? You are happy too; So is my cousin Harsha; They are fluent.

**c)** Deepti and Divya were my school mates; They were eager to learn English.

**d)** They would be ever ready to...

**e)** We can be

ఈ sentences లో మనం గమనించే విషయం - వీటిల్లో verbs అన్నీ కూడా 'be' forms మాత్రమే కదా? చూడండి, కేవలం 'be' forms తో ఎంత సంభాషణ సాగిందో?

ఇప్పుడు మన game.

ఇక్కడి sentences లో 'be' forms (am, is, are, were, shall be, can be, would be, etc,) పక్కన ఉన్న 'happy' లాంటి మాటల బదులు మీరు వాడగలిగిన మాటలన్నింటిని వాడి sentences practice చేయండి. ఒక statements మాత్రమే కాకుండా questions, exclamations కూడా practice చేయండి. Not, never (ఎప్పుడూ కాదు/ లేదు) తో కూడా practice చేయండి.

ఉదాహరణ చూడండి.

I am happy- ఇక్కడ ఉన్న 'be' form 'am' పక్కన ఉన్న happy బదులు, సరైన అర్థం వచ్చేట్టుగా మీకు తెలిసిన మాటలు వాడండి.

ఉదాహరణకు, happy బదులు, a) sad, sorry, proud, tall, short లాంటి భావాలనూ లక్షణాలను గుణాలను తెలిపే మాటలు (అర్థవంతంగా) ఎన్నైనా వాడవచ్చు.

ఇంకా b) ఏదైనా వృత్తులు, పనులు లాంటివి చేసేవాళ్లనే అర్థం వచ్చేట్టుగా ఉండే మాటలూ వాడవచ్చు కదా? -

I am a teacher/ an actor/ a cricketer/ an employee/ a landlord/ a doctor, etc.

మళ్లీ వీటిల్లో not/ never కూడా కలిపి వాడవచ్చు కదా?

I am not happy; I am not a teacher, etc లాగా.

ఇంతేకాకుండా వీటిని question form లో కూడా, not తోనూ, not లేకుండానూ కూడా అనవచ్చు కదా?

eg: Am I a doctor? Am I not a teacher? etc.

ఇలాగే మిగతా 'be' forms తో ఎన్ని sentences, statements మాత్రమే కాకుండా, questions కూడా, not లేకుండా, not తో అనగలరో చూడండి.

బిగ్గరగా మీ friend తోనో, మీతో cooperate చేసే వాళ్లతోనో అనండి.

Questions లో కూడా, రెండు రకాల questions.

**1)** 'Wh' words (what, when, who, etc.,)తో వచ్చేవి.

**eg.** Why are you happy? What is your brother? When was he a teacher? లాంటివి.

**2)** 'Wh' words లేని questions.

**eg.** Are you happy? Is she your sister? Can he be a leader? లాంటివి.

మళ్లీ వీటిని not తో, **eg:** Are you not happy? Were they not students? లాంటివి.

ఇలాంటివి ఎన్ని sentences మీరు అనగలరో లెక్కించుకోండి. ఎక్కడ మీరు questions వేసుకుంటే అక్కడ వాటికి Answers కూడా చెప్పుకోండి. ఇద్దరు ముగ్గురు కలిసి ఈ game ఆడుకోండి. మీరు ఎన్ని sentences చేయగలిగారో చూసుకోండి. మీకే ఆశ్చర్యం వేస్తుంది. 'మనం ఇన్ని sentences అనగలిగామే' అని.

M. SURESAN

**మీ సహాయం కోసం: 'be' forms పక్కన వాడగలిగే మాటలు ఈ కింది రకాలుగా ఉంటాయి.**

**1)** గుణాలు, (proud, good, bad, wicked) తెలిపే మాటలు.

**2)** భావాలు (feelings) తెలిపే మాటలు (happy, sad, jealous, etc).

**3)** లక్షణాలు (tall, short, fat, etc,) తెలిపే మాటలు.

**4)** Past participle forms (satisfied, pleased, trained)

**5)** ఒక వృత్తో, పనో చేసేవాళ్లు అనే అర్థంతో వచ్చే మాటలు (Actor, doctor, teacher, cook, lawyer, speaker, etc). ఈ రకం మాటలు వాడినప్పుడు, singular ముందర a/ an రావాలని మనకు తెలుసు. ఎందుకంటే countable singular ముందు ఎప్పుడూ 'a/ an' రావాలి కదా.

**6)** '-ing' forms (going, singing, walking)

పై రకాల మాటలన్నీ వాడండి. వాటికి అర్థం మీరనుకున్నట్లు సరిగా వస్తోందో, లేదో చూసుకోండి. అప్పుడు మీకే తెలుస్తుంది మీరెంత English మాట్లాడగలరో. మనం English మాట్లాడలేమనే అపోహ ఉండదు.

**II** An extension of the game, ఈ game కాస్త పెంచవచ్చు- ఈ sentences మరికొన్ని మాటలు కలిపి:

**eg:** He is happy. ఈ sentence ను ఇలా పొడిగించవచ్చు కదా?

**a)** He is happy to meet me
(To meet me - ఎందుకతను happy అనేది తెలుపుతుంది కదా)

**b)** They were not satisfied with their salaries.
(with their salaries - వాళ్ల జీతాలతో అనేది వాళ్లు ఎందువల్ల not satisfied అనేది తెలుపుతుంది)

**c)** Will they be pleased if I give them the books?
(If I give them the books - నేను వాళ్లకు పుస్తకాలిస్తే - అనేది వాళ్లు ఎలా సంతోషపడ్తారనేది తెలుపుతుంది కదా)

ఇలా మీరు 'be' forms తో వచ్చే sentences ను పొడిగించుకుంటూ వెళ్లవచ్చు అయితే అర్థం మాత్రం correct గా వచ్చేట్లు చూసుకోవటం చాలా ముఖ్యం.

**III** ఇక ఈ game లో మూడోభాగం:

ఇంతవరకు మీరు practice చేసిన sentences అన్నింటిలో verb, 'be' form కదా. ఈ 'be' form బదులు 'action words' ఎక్కడెక్కడ meanings మారకుండా వాడగలరో చూడండి, ఉదాహరణలు:

**a)** They were all happy. ఇక్కడ 'be' form 'were' బదులు feel వాడవచ్చు కదా. అయితే, 'be' form గతాన్ని తెలిపే మాట కాబట్టి, feel కు కూడా గతాన్ని తెలిపే మాటే వాడాలి కదా. కాబట్టి, felt వస్తుంది. అప్పుడు,

They all felt happy (They were all happy)

**b)** She can be here in 10 minutes.
ఇక్కడ 'can be' అనే 'be' form తో వచ్చే అర్థం - ఆమె ఇక్కడ 10 నిమిషాలకు ఉండగలదు అని కదా. అంటే అర్థం ఆమె ఇక్కడికి 10 నిమిషాలకు చేరగలదు అని - అప్పుడు మనం చెప్పగల sentence ఇదే అర్థంతో-

She can reach here in ten minutes.

**c)** They shall be here for an hour.
వాళ్లిక్కడ ఓ గంటసేపు ఉండాలి. ఇదే అర్థంతో 'shall be' అనే 'be form బదులు, మనం 'shall stay' అని కానీ, shall remain అని కానీ అంటే అర్థం మారదు. అప్పుడు sentence– They shall stay/ remain here for an hour.

**d)** He could be helpful for us: ఇక్కడ be form could be అర్థం- అతడు మనకు సహాయకారిగా ఉండగలడేమో. Could be అనే 'be' form బదులు action word వాడాలనుకుంటే help వాడొచ్చు కదా. దాంతో sentence ఇలా మార్చవచ్చుగదా? -

He could help us.

ఇలా మీరు ఎన్ని sentences చేయగలరో చూడండి అవకాశం వచ్చినప్పుడల్లా. అవకాశం రాకపోతే కల్పించుకొని ఇలాంటి sentences frame చేయండి- మరిచిపోకండి - statements మాత్రమే కాకుండా, questions (రెండు రకాలు - 'wh' questions, non 'wh' questions కూడా), Negatives (not, never) సహా practice చేయండి.

§







# I have to prepare

**Damodar:** Hi, Krupakar, I couldn't see you the whole of yesterday. What were you doing?
(కృపాకర్, నిన్నంతా నువ్వు కనిపించలేదు, ఏం చేస్తున్నావు? )

**Krupakar:** Busy playing the game - making as many sentences as we could - with my sister and prabhakar.
(మా Sister, prabhakar తో కలిసి Game ఆడుతూ ఎన్ని Sentences వీలయితే అన్ని Form చేస్తూ Busy గా ఉండిపోయా)

**Damodar:** What game was that? (ఏం Game?)

**Krupakar:** You find the game in the hundredth lesson of spoken english. It's a simple game - forming sentences, as many as we can by adding suitable words after 'be' forms and action words - sentences to be not only statements but also questions, both types, 'wh' and 'non wh' questions, with not and never too...
(చాలా Simple game అది. sub + verb- verb 'be' form అవచ్చు, action word అవచ్చు, దాని తర్వాత మాటలు చేర్చుకుంటూ పోవటం- Sentences statements మాత్రమే కాకుండా, Questions, Exclamations కూడా. Questions రెండు రకాల Questions – 'wh' words తో 'non wh' words తో కూడా. అంతేకాకుండా, not తో never తో కూడా)

**Damodar:** Was that so? O I missed the game. How many sentences were you able to frame?
(అలాగా? అయితే నేను game miss అయ్యాను. మీరెన్ని Sentences చేయగలిగారు? )

**Krupakar:** We didn't count, but we were able to make a good number. We have understood that we can improve our english by this kind of practice more than by reading books on spoken english.
(లెక్కపెట్టలేదు కానీ చాలానే చేశాం. Spoken english మీద books చదవటం కంటే ఇలాంటి practice ద్వారానే English బాగా మాట్లాడటం వస్తుందని అర్థమైంది)

పై సంభాషణలో అనుకుంటున్నట్లు, practice వల్ల confidence పెరగటమే కాకుండా, English సహజంగా మాట్లాడటం అలవాటవుతుంది. ప్రతిరోజూ Friends తో ఈ game practice చేయండి.

ఈ Lesson లో కొద్దిగా తేడాతో ఇలాంటి game ఇంకోటి చూద్దాం.

మీకు తెలుసు- verbs లో రెండురకాలు. మొదటిది 'love' లాంటివి. వీటికి ఎవరిని, దేనిని ప్రశ్న వేసుకుంటే వాళ్లను అనో, దానిని అనో సమాధానం వస్తుంది. రెండో రకానివి - walk (నడవటం) లాంటివి. ఎవరిని నడవటం, దేనిని నడవటం అంటే సమాధానం రాదు కదా. ఈసారి game లో మొదటి రకం verbs తో sentences చేయండి. statements మాత్రమే కాకుండా, questions, exclamations తో సహా, Not/ never తో కూడా మీకు తెలిసినన్ని verbs తో ఎన్నయితే అన్ని.

**eg:**
**1)** Vineet bought a book
**2)** When did Naresh meet you?
**3)** She doesnot like me (at all)
**4)** How well Rupa sings that song!
**5)** The teacher never made a joke

ఇలా ఎన్ని Sentences చేయగలరో చూడండి. తర్వాత సరైన మాటలు చేర్చి Sentences extend చేయండి.

**eg: 1)** Vineet bought a book at the college stores.
**2)** When did Naresh meet you to give you the book.
**3)** She does not like me because I do not like her.
**4)** How well Rupa sings that song from the movie, nuvvu naaku nachau.
**5)** The teacher never made a joke while teaching.

ఇలాంటి sentences మీరు మీ friends etc., తో practice చేయండి. I, We, You, he, she, it and they తో కూడా sentences చేయండి.

u u u

**Renuka:** Urmila, why don't you lend me the book. I have to prepare for the exam the day after tomorrow.
(ఆ పుస్తకం కాస్త ఇస్తావా? ఎల్లుండి exam కు prepare అవాల్సి ఉంది.)

**Urmila:** Sorry Renuka, Bhoomika has taken it away. She has to prepare for the exam as well. You are a little late.
(Sorry, భూమిక ఆ పుస్తకం తీసుకెళ్ళింది. తను కూడా exam కు prepare అవ్వాలని.)

**Renuka:** I thought of buying the book yesterday, but I had to take mom to hospital, so I didn't find the time. I must get the book somehow. Otherwise I'll be doing very badly in the exam.
(నిన్ననే book కొనాలని అనుకున్నాను, కాని మా అమ్మను hospital కు తీసుకెళ్ళాల్సి వచ్చింది. కొనలేకపోయా. ఎలాగో ఒకలాగా ఆ పుస్తకం తెచ్చుకోవాలి నేను. లేకపోతే ఎల్లుండి exam బాగా రాయలేకపోతాను.)

**Urmila:** I must pay the fees today. Today is the last date. I should go to the bank and get the money.
(ఇవాళ fees కట్టాలి నేను. ఇవాళే చివరి రోజు. Bank కు వెళ్లాలి, డబ్బు తెచ్చుకోవాలి.)

**Renuka:** That's true. We must submit exam applications by tomorrow. That's the rule.
(నిజమే. Exam applications రేపటి లోపల submit చెయ్యాలి. అదే rule.)

**Urmila:** The applications should have the signature of the parent or the guardian, shouldn't it?
(Applicationలో parent/ guardian సంతకం ఉండాలి, కదా? )

**Renuka:** Yes, that's the rule. Further we must mention the amount paid, and enclose the fee receipt.
(అంతేకాకుండా, ఎంత డబ్బు కట్టిందీ clear గా తెలపాలి, fee receipt దానితో జతపరచాలి.)

**Urmila:** OK then. Bye. I must hurry.
(వస్తా అయితే. నేను త్వరపడాలి.)

ఈ సంభాషణలోని sentences ను గమనించండి.

1) I have to prepare 2) She has to prepare 3) I had to take 4) I must get 5) I must pay 6) We must submit 7) The application should have the signature 8) We must mention.

పై sentences లోని verbs: have to + 1st RDW; has to + 1st RDW; had to + 1st RDW; must + 1st RDW; should + 1st RDW.

Have to/ has to, had to, must, should ఇవన్నీ కూడా విధిగా, rule ప్రకారం, తప్పనిసరిగా చేయాల్సిన పనులను తెలుపుతాయి.


M. SURESAN

**Suman:** Hari too has to be at home in ten minutes. He doesn't like to miss the serial. Isn't it so, Hari?
(హరి కూడా 10 నిమిషాలకు ఇంట్లో ఉండాలి. అతడికి serial miss అవటం ఇష్టంలేదు. అంతే కదా హరి? )

**Hari:** That's right. I have to hurry now. Bye.
(నిజమే. నేను త్వరపడాలి)

**Suman:** Don't forget tomorrow's exam time. You have to be at the centre by 9.45
(రేపు exam time మరచిపోకండి. మీరక్కడ 9.45 కల్లా ఉండాలి)

ఇక్కడ చూశాం కదా. Present లోగానీ, future లోగానీ 'ఉండాలి' అనే అర్థంతో have to be/ has to be వాడాం. ఒక Order / Command వల్ల, విధి వల్ల (అంటే Duty), లేకపోతే అవసరం (Necessity) వల్ల ఉండాల్సివస్తే, అప్పుడు Have to be/ has to be వాడతాం.

**a)** మీరు 10కల్లా office లో ఉండాలి.
You have to be at office by 10 (Command)

**b)** ప్రతి ఉద్యోగి 10 నుంచి 5వరకు Office లో ఉండాలి
Every employee has to be in the office from 10 to 5 (Command)

**c)** I have to be at office by 10.
నేను 10కల్లా office లో ఉండాలి. (Duty = విధి)

**d)** She has to be at office for a minimum of Six hours.
(ఆమె కనీసం 6 గంటలసేపైనా Office లో ఉండాలి = Duty/ విధి)

**e)** I have to be at the station at 2 or I shall miss the train.
నేను station లో రెండింటికి ఉండాలి. లేకుంటే train miss అవుతాను. (ఇది necessity, అంటే అవసరం కదా)

**f)** He has to be here atleast by tomorrow. Otherwise he will miss the chance.
(కనీసం రేపటికైనా అతడు అక్కడుండాలి. లేకుంటే అవకాశం కోల్పోతాడు. - necessity.)

వీటి 'be' forms. Have to be, has to be, must be, should be.

(Have to be/ has to be - I, we, you and they subjects తో have to be వస్తుంది. He, she and it subjects తో has to be వస్తుంది.) వీటన్నింటికి అర్థం - ఉండాలి - అని. అది ఒకరి ఆజ్ఞ (command) కావచ్చు, విధి (duty) కావచ్చు, necessity (అవసరం) కావచ్చు.

Have to be, has to be, should be, must be = ఉండాలి, present లోగానీ, future లోగానీ.

**Vinod:** Let me go. I have to be at home in ten minutes. Dad will be angry if I am late.
(నన్ను వెళ్లనీ. నేను 10 నిమిషాల్లో ఇంట్లో ఉండాలి. లేకుంటే మా నాన్నకు కోపం వస్తుంది)

ఇది కూడా గమనించండి.

**Pramod:** I am happy to have got the job, Sir. When have I to be here to report for duty, Sir?
(Job వచ్చినందుకు సంతోషంగా ఉంది. Report చేయడానికి/ Dutyలో Join అవటానికి ఎప్పుడు రావాలండీ ఇక్కడికి? )
(Have to be ఇక్కడ duty ని తెలుపుతుంది.)

**Prasanth:** You have to be here by 9.30 everyday. (9.30 కల్లా ఇక్కడుండాలి నువ్వు. You have to be here till 5.30 in the evening. (5.30 వరకూ ఉండాలి- ఈ రెండూ commands.) Your colleague too, has to be here at the same time. (నీ సహోద్యోగి కూడా అంతే. has to be ఇక్కడ command.)

**Pramod:** I will start work now itself sir, because I have to be thorough with my job. (నేను ఇప్పుడే ప్రారంభిస్తాను. ఎందుకంటే నా పని నేను క్షుణ్ణంగా తెలుసుకోవాలి కదా (ఇక్కడ have to be - necessity). I understand I have to be at office for atleast 6 hours. (కనీసం 6 గంటలసేపయినా office లో ఉండాలని నాకు తెలుసు. ఇక్కడ have to be విధిని తెలుపుతోంది కదా.)

**Now practice the following in English:**

**Kranthi:** నువ్వు కనీసం మధ్యాహ్నం రెండు గంటల వరకైనా ఇక్కడుండాలి, అర్థమయిందా?

**Shanthi:** Yes, Madam. ఈరోజేకాదు, రేపు కూడా ఇదే వేళల్లో ఇక్కడుండాలని తెలుసు madam.

**Kranthi:** Watchman తో చెప్పు, అతనింకాస్త జాగ్రత్తగా ఉండాలి అని; pass ఉన్నవాళ్లు మాత్రమే లోపల ఉండాలనీ.

**Shanthi:** Ok, Madam. అతనిక్కడ 8 గంటలవరకూ ఉండాలని కూడా చెప్తాను.

**Kranthi:** OK. జాగ్రత్త. నాకు meeting ఉంది. అక్కడ నేను 1.30 కంతా ఉండాలి. నేనొచ్చే సరికి files అన్నీ ready అయిఉండాలి. తెలిసిందా?

**Shanthi:** Readyగా ఉంటాయి, madam.

**Answer:**

**Kranthi:** You have to be here till atleast 2 in the afternoon, understand?

**Shanthi:** Yes, Madam. I Understand too, that not only today, but also tomorrow I have to be here during the same time.

**Kranthi:** Tell the watchman that he has to be a little more careful, that only those who have passes have to be here.

**Shanthi:** Ok, Madam. I will tell him too that he has to be here till 8 o'clock.

**Kranthi:** Ok. Be careful. I have a meeting. I have to be there by 1.30. By the time I return all the files must be ready.

**Shanthi:** They shall be, madam.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Hitesh:** Hi Mallesh, I coludn't see you the whole of yesterday. What happened?
(నిన్నంతా కనిపించలేదు. ఏం జరిగింది?)

**Mallesh:** (I was) Busy at home. I had to be at home attending to some repairs for the house. Dad was out of town.
(ఇంట్లో busy గా ఉన్నా. ఇంటి repairs చూసుకోవటానికి ఇంట్లోనే ఉండాల్సి వచ్చింది. నాన్న ఊళ్లో లేరు.)

**a)** Attend = College/ School/ Class లాంటి వాటికి, functions/ meetings/ marriages లాంటి వాటికి హాజరవటం.
**b)** attend to = ఒక పని చేపట్టటం / బాధ్యతగా చేయటం; 'I am attending to the repairs'.
**c)** Attend on = అతిథులకు, రోగులకు సపర్యలు చేయటం,
When I was ill, my sister, attended on me.

**Hitesh:** You remember we have to go to Naresh's for his birthday party. It's already 5. Shall we start?
(Naresh birthday party కెళ్లాలని గుర్తుంది కదా? ఇప్పటికే 5 అయిపోయింది. బయలు దేరదామా?)

**Mallesh:** But we should buy some gift for him.
(ఏదో gift కొనాలికదా?)

**Hitesh:** We must hurry then. We shouldn't be late.
(త్వరపడాలి మరి. late అవకూడదు.)

**Mallesh:** What, do you think, is Naresh's age now?
(ఇంతకీ నరేష్ వయస్సు ఎంతుండొచ్చంటావు? ఇది అతని ఎన్నో birthday?- దీనికి English లేదు.)

**Hitesh:** He must be 18 now. I think it is his 18th birth anniversary.
(18 ఏళ్లుండాలి. ఇది అతని 18వ birthday అనుకుంటా. Anniversary- వార్షికోత్సవం)

**Mallesh:** We are all the same age then, give or take a few months.
(అయితే మనమంతా నెలల తేడాతో ఒకే వయస్సులో ఉన్నామన్నమాట.)

**Hitesh:** Ok. Let's start.

**Mallesh:** We must get back home early. Don't forget our exams from the day after tomorrow. Because of the change in the exam hours, we must be at college 10 minutes before nine.
(మనం త్వరగా ఇంటికి తిరిగి వచ్చేయాలి. ఎల్లుండి నుంచి మనకు exams అని మరచి పోకు. మారిన వేళల ప్రకారం College లో 10 నిమిషాలు తక్కువ 9 కల్లా ఉండాలి.)

కిందటి lesson లో have to be/ has to be ఉపయోగం చూశాం కదా? ఒకసారి గుర్తుకు తెచ్చుకుందాం.
**a)** I, We, You, They subjects అయితే have to.
**b)** He, She, It అయితే has to.
**c)** be form: have to be/ has to be (ఉండాలి అనే అర్థంతో).



**ప్రశ్న:**
**1)** *వాహనాల వెనక రాసే 'please sound horn' అర్థం వివరించండి.*
**2)** *మొహమాటానికి సమాన అర్థం వచ్చే ఇంగ్లిష్ పదం ఏమైనా ఉందా?*

*– జిలాని, కాకినాడ*

**జవాబు:**
**1)** Please sound horn అంటే horn మోగించండి అని అర్థం. ఒక వాహనం వెనకవున్న వాహనం, ముందరి వాహనాన్ని దాటి ముందుకు వెళ్లాలనుకుంటే, horn మోగిస్తే, ముందరి వాహనం, వెనక వాహనానికి దారిస్తుందని చెప్పటానికి అలా రాస్తారు.
**2)** 'మొహమాటం' అన్నమాటకు దాదాపు దగ్గరగా అనగలిగింది 'unassertive'. 'assertive' అంటే నిర్మొహమాటంగా ఉండటం, కాబట్టి, 'unassertive' అంటే మొహమాటం గల అనే అర్థంతో వాడవచ్చు.

**d)** Action word: have to + 1st Regular Doing Word, has to + 1st Regular Doing Word. (Have to go, have to do, has to go, has to do etc, వెళ్లాలి, చేయాలి అనే అర్థంతో)

ఇంకా మనం తెలుసుకున్నది-

**a) మనం ఏదైనా పరిస్థితుల వల్ల ఉండవలసినపుడు, చేయవలసినపుడు- have to be/ has to be; have to + 1st RDW/ has to + 1st RDW.**

**eg:**
**1)** I have to be at home by 8.
నేను 8 కల్లా ఇంట్లో ఉండాలి. (లేకుంటే మా నాన్న కోప్పడతారు)
**2)** He has to be here by 10. Otherwise we can't start.
(అతనిక్కడ 10కల్లా ఉండాలి. లేకుంటే బయల్దేరలేం)
**3)** They have to see the doctor today. The appointment is for today.
(ఇవాళ వాళ్లు doctor దగ్గరకెళ్లాలి. ఆయన ఈ రోజుకు appointment ఇచ్చాడు)- ఇక్కడ 'have to' (అంటే has to కూడా) మనం ముందు నిర్ణయిం చుకున్న పనికి వాడుతున్నాం. అలాగే-







**b) గతంలో ఇతరుల బలవంతంవల్లగానీ, నిబంధనల వల్లగానీ మనం ఏదైనా చేయాల్సినపుడు/ ఉండాల్సినపుడు కూడా had to వాడతాం.**
**1)** Lord Rama had to go to forests to honour his father's word.
వాళ్లనాన్న మాట నిలబెట్టటానికి శ్రీరాముడు అడవులకు వెళ్లాల్సి వచ్చింది.
**2)** He had to live in the forest for 12 years
పన్నెండేళ్ల వనవాసం చేయాల్సి వచ్చింది.
**3)** He had to pay a fine of Rs. 250/- for driving the wrong way.
(అతను wrong direction లో drive చేసినందుకు 250 రూపాయల జరిమానా కట్టాల్సి వచ్చింది.)
**4)** Pramila had to submit the application the day before yesterday. She submitted it yesterday, so she had to pay a late fee of Rs. 10/-.

**c)** Before you build a house, you should submit the plan for approval.
(ఇల్లు కట్టే ముందు, ఇంటి plan ఆమోదానికి submit చేయాలి)
Should కు కూడా past form 'had to' నే, have to/ has to లకు లాగా. ఈ కింది sentences ను పోల్చండి.
**a)** The Players should be at the field by 9 AM
తొమ్మిదింటికల్లా క్రీడాకారులు field లో ఉండాలి.
ఇది present/ future అవచ్చు.
**b)** The players had to be at the field by 9 AM.
Players 9 కి field లో ఉండాల్సి వచ్చింది-
ఇది Past.

**ముఖ్యగమనిక: నిబంధనలు, అవసరాలకు have to/ has to, should వాడినపుడు, should కంటే have to/ has to ఎక్కువ powerful.**

# You have to do it

**4)** He has to return my book today. He said he would.
(అతను నాకు ఈరోజు పుస్తకం ఇచ్చేయాలి. ఇస్తానన్నాడు.)

**b) ఇతరుల బలవంతంవల్లగానీ, ఏదైనా నిబంధనల వల్లగానీ (Rules) మనం చేయాల్సినపుడు/ ఉండాల్సినపుడు have to/ has to వాడతాం.**
**1)** You have to show the ticket on demand. Keep it safe until the journey is over.
[అడిగినపుడు Ticket (టికెట్- టి నొక్కి పలుకుతాం) చూపాలి. ప్రయాణం పూర్తయ్యేవరకు జాగ్రత్తగా ఉంచు. On demand = అడిగినపుడు]
**2)** Kumar has to pay the fees tomorrow.
(kumar రేపు fees కట్టాలి.)
**3)** The boss has asked us to be at office half an hour earlier than usual. We have to be at office at 9.
(Boss మనల్ని ఓ అరగంట ముందు office కు రమ్మన్నారు కదా. మనం 9 కల్లా office లో ఉండాలి.)

Have to/ has to ఎప్పుడూ present/ future situations కు వర్తిస్తాయి. అదే past లో మనం చెప్పాలనుకుంటే had to వాడతాం. lesson ప్రారంభ సంభాషణలో Mallesh ఏమన్నాడు? I had to be at home (Yesterday - past) అని. అంటే నేనింట్లో ఉండాల్సి వచ్చింది. కాబట్టి గతంలో- **a) ఏదైనా పరిస్థితులవల్లగాని, నిబంధనలవల్లగాని, ఇతరుల బలవంతంవల్లగాని ఎక్కడైనా ఉండాల్సి వస్తే, had to be, ఏదైనా చేయాల్సివస్తే had to + 1st Regular Doing Word (RDW) వాడతాం.**

**1.** He had to be at station by 8, as his friend was coming.
(Station లో అతను 8 కి ఉండాల్సి వచ్చింది, వాళ్ల friend ఎవరో వస్తున్నారు కాబట్టి)
**2.** Santhi had to go to Vijayawada last Sunday to attend a marriage.
(కిందటి ఆదివారం శాంతి విజయవాడ, పెళ్లికి వెళ్లాల్సి వచ్చింది.)
**3.** Vishal had to pay the fees yesterday; he had no money, so I had to lend him the amount.
(విశాల్ నిన్న fees చెల్లించాల్సి వచ్చింది. అతని దగ్గర డబ్బులేదు. అందుకని నేను అరువు ఇవ్వాల్సి వచ్చింది.)

(ప్రమీల మొన్ననే application submit చేయాల్సింది - కానీ నిన్న చేసింది, అందుకని 10 రూపాయలు late fee చెల్లించాల్సి వచ్చింది.)

మళ్లీ lesson మొదట్లో ఉన్న సంభాషణ ఓసారి చూడండి:
**Mallesh:** We should buy some gift for him.
**Hitesh:** .... We shouldn't (should not) be late.

ఇక్కడ 'should' ఉపయోగం చూద్దాం. ఇది కూడా have to/ has to కు చాలా దగ్గరగా ఉంటుంది. దీనికి 'be' form should be = ఉండాలి అనే అర్థంతో; Action word, should + 1st RDW (should go, should know, should do, etc.) = వెళ్లాలి, తెలియాలి/ తెలుసుకోవాలి, చేయాలి, etc. అర్థాలతో)

should ఎప్పుడూ మనం ఉండాల్సిన సరైన తీరును గురించి, సరిగా చేయాల్సిన పనిని గురించి తెలుపుతుంది.
**a)** You should be here at 10 everyday.
నువ్వు రోజూ పదింటికి ఇక్కడ ఉండాలి.
**b)** He should understand that we are his well wishers.
మనం అతని శ్రేయోభిలాషులమనే విషయం అతను అర్థం చేసుకోవాలి.
**c)** You should refer to the dictionary when you are in doubt.
నీకేదైనా సందేహం ఉన్నపుడు Dictionary చూడాలి. (చూడటం సరైన పని)

నిబంధనల ప్రకారం సరైనదీ, కానిదీ తెలిపేందుకు కూడా **should** వాడవచ్చు.
**a)** You should not drive at more than 20 kmph along this road.
(ఈ road లో మీరు 20 కిలోమీటర్ల వేగాన్ని మించి నడపరాదు.)
(Kmph = KPH = Kilometres per hour)
**b)** Passengers should be at the airport half an hour before the flight departure.
(విమానం బయల్దేరటానికి అరగంట ముందు ప్రయాణికులు airport లో ఉండాలి.)
flight = విమానయానం/ పక్షి ఎగరటం,
Departure = బయల్దేరటం


M. SURESAN

You have to do it = మీరది చేయాలి = You should do it. ఇక్కడ you have to do it కు, you should do it కన్నా force ఎక్కువ, అంటే ఇంకొంచెం గట్టిగా చెప్పటం.

**Now practise the following in English:**

**Prema:** మనం ఎప్పుడు బయలుదేరాలి?
**Preethi:** ఇంకో గంటలో/ 9 గంటలకల్లా మనం airport లో ఉండాలి. Passport, visa, ఇతర documents అంతా ready గా ఉంచుకోవాలి. వాళ్లు అడగంగానే చూపించగలగాలి.
**Prema:** మూడు నాలుగు వందల చిల్లర కూడా ఉంచుకోవాలి కదా. ఏదైనా అవసరం రావచ్చు
**Preethi:** Airport entrance ticket కొనుక్కోవాలని మీ friends తో చెప్పాలి నువ్వు. వాళ్లు lounge లోనే కూర్చోవాలి.
**Prema:** OK.

**Answer:**

**Prema:** When have we to start? / When should we start?
**Preethi:** In an hour from now. We have to be at the airport by 9. We have to have our passport, visa and other documents ready. We should be able to show them when they ask for it.
**Prema:** We have to have / should have three hundred to four hundred rupees in change in case of need.
**Preethi:** You should tell your friends that they have to buy the airport entrance ticket. They have to sit all the time in the lounge.
**Prema:** OK.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






# You must finish the work

**Vipula:** Hi Klupta, what's new?
(ఏంటి విశేషాలు? - ఇది ఇప్పుడు బాగా వాడుకలోకి వస్తున్న పలకరింపు మాట)

**Klupta:** O nothing. Just getting on.
(ఏం లేవు. ఏదో అలా జరిగిపోతోంది)

**Vipula:** Is your application for the job ready?
(job కు పంపాల్సిన Application సిద్ధం చేశావా? / ready గా ఉందా? )

**Klupta:** What's the hurry, Vipula? We have plenty of time, haven't we?
(ఏంటి తొందర? కావాల్సినంత time ఉంది, కదా? Plenty of = చాలా)

**Vipula:** What are you talking? Only four days are left, you know. You must hurry.
(ఏంటి మాట్లాడుతున్నావు? ఇక నాలుగు రోజులేగా ఉంది? త్వరపడాలి)
left = మిగిలింది

**Klupta:** Dad's going to fill it in tonight and it will be ready by tomorrow afternoon.
(మా నాన్న ఇవాళ రాత్రి application పూర్తి చేస్తారు. రేపు మధ్యాహ్నానికల్లా ready గా ఉంటుంది.)

**Vipula:** Klupta, don't talk like a child. Don't you know that the application must be in the candidate's own hand writing? It must be complete in with all particulars. No column must be blank. If a column does not apply to us, we must write in it, Does not apply / Not applicable' No dashes either.
(చిన్నపిల్లలా మాట్లాడకు. మీ నాన్న fill చేయటం (నింపటం) ఏమిటి? Application అభ్యర్థి స్వదస్తూరితో ఉండాలి. అన్ని వివరాలతో పూర్తిగా ఉండాలి. ఏ column కూడా ఖాళీగా ఉండకూడదు. మనకు వర్తించని column ఏదైనా ఉంటే Does not apply/ Not applicable అని రాయాలి. Dash లు లాంటివి కూడా ఉండకూడదు.)

Candidate (క్యాన్‌డియెట్ - క్యా, bank లో b లాగా క్యా నొక్కి పలుకుతాం) = అభ్యర్థి particulars (పటిక్యులజ్ టి నొక్కి పలుకుతాం, r silent, చివరి జ్, size లో z లాగ) = వివరాలు. blank = ఖాళీ. Does not apply/ Not applicable = వర్తించదు. No... either = 'no' తో కానీ, not తో కానీ also వాడకూడదు. అలాంటప్పుడు, No/ not either అంటాం. Column = కాలం = Application లో అడిగే అంశాలు - అందుకు మనం రాయటానికి ఉద్దేశించిన ఖాళీ స్థలం)

**Klupta:** I don't know how to fill in properly.
(మరి నాకు సరిగా నింపటం రాదు.
Properly = [ప్రాపలి = సరిగ్గా)

**Vipula:** Take your dad's help. Remember too that you must enclose all the certificates. The application must reach the office on or before the 31st January.
(మీ నాన్న సాయంతో fill చెయ్. అన్ని certificates జతపర్చాలి. Application, ఆ office కు, 31st Jan లేదా అంతకుముందుగానీ చేరాలి. Certificate - సటిఫికెయెట్ - కె నొక్కి పలుకుతాం)

**Klupta:** I must hurry up. (అయితే నేను త్వరపడాలి)

పై సంభాషణలో must వాడిన సందర్భాలు చూడండి

1) The application must be in the candidate's own handwriting = స్వదస్తూరిలో ఉండాలి
2) No column must be blank = ఖాళీగా ఉండకూడదు.
3) We must write = మనం రాయాలి.
4) You must enclose = జతపర్చాలి.
5) must reach = చేరాలి.

మనలో చాలా మందికి తెలుసు - must అంటే తప్పనిసరిఅని.
Must be - be form = ఉండాలి;
Must + 1st RDW - Action word (Must go, must write, etc,) = వెళ్లాలి, రాయాలి, etc.)
కిందటి Lesson లో have to/ has to, should కు must కూ చాలా దగ్గర సంబంధం ఉంది - అర్థంలో, ఉపయోగంలో. పై సంభాషణలో విపుల must ను నిబంధనలు, అంటే తప్పనిసరిగా ఉండాల్సినవి (must be) / చేయాల్సినవి (must + 1st RDW) వాడటం గమనించారు కదా. కిందివి కూడా చూడండి.

a) Voters must show their ID cards to the polling Officers =
Voters polling officers కు తమ గుర్తింపు cards (ID cards = Identity cards) చూపాలి. (నిబంధన)
b) Students must get their own geometry box to the exam = పరీక్షకు విద్యార్థులు వాళ్ల సొంత Geometry box తెచ్చుకోవాలి. (నిబంధన)


M. SURESAN

**Varun:** When will you be back, Kuber?
(కుబేర్, ఎప్పుడు తిరిగొస్తావ్? )

**Kuber:** Only after 5. Till then I must be at office. I must close the accounts before I leave office.
(5 గంటల తర్వాతే. అంతవరకు office లోనే ఉండాలి. Office వదిలేముందు, accounts కూడా close చేయాలి)

ఈ సంభాషణలో kuber, must ను తన duties చెప్పేందుకు వాడుతున్నాడు కదా? (office లో ఉండాల్సిన సమయం, చేయాల్సిన పనులు - ఇలాంటి విధులు/ duties) ఇవి must కు ఉన్న రెండో ఉపయోగం - Must expresses duties.

**Udaya:** May I go now Madam? (వెళ్లొచ్చాండీ? )

**Sandhya:** No. You must stay here for another hour; understand? You must finish the work I have given you and then only leave.
(లేదు. ఇంకో గంట ఉండాలి నువ్విక్కడ. నేనిచ్చిన పని పూర్తిచేసిన తర్వాతే వెళ్లాలి నువ్వు. తెలిసిందా? )

ఇక్కడ Sandhya మాటలన్నీ commands/ orders = ఆజ్ఞలు. అంటే ఆజ్ఞలివ్వటానికి కూడా must వాడతాం.
ఇప్పటివరకు మనం తెలుసుకున్న must uses:
1) Rules (నిబంధనలకు) 2) duties (విధులకు)
3) commands/ orders (ఆజ్ఞలకు)

**Now practice the following in English:**

a)
**Karthik:** నువ్వు ready నా? బయల్దేరుదామా?
**Sravan:** కాస్త ఆగు. నేను ఈరోజు ఫీజుకట్టాలి. అందుకని డబ్బు తెచ్చుకుంటాను.
**Karthik:** రేపు కట్టకూడదూ?
**Sravan:** రేపటినుంచి రోజుకు Rs 10/- జరిమాన కట్టాల్సి ఉంటుంది.
**Karthik:** మనం lab లో 9 కల్లా ఉండాలి. ఏమిటి ఆలస్యం? డబ్బు ready గానే ఉందికదా?
**Sravan:** ఇంట్లో ఎవరూలేరు. మా అమ్మ వచ్చేదాకా ఆగాలి నేను. తను వచ్చేదాకా ఉండమని మరీ గట్టిగా చెప్పింది.
**Karthik:** మనం 9 కల్లా lab లో ఉండాలి, కచ్చితంగా. నేను వెళ్లనా?
**Sravan:** అంత కంగారెందుకు? పక్కనే ఉన్నాడుగా అశ్విని. వాడి bike మీద వెళ్దాం.

b)
**police officer:** ఇప్పుడు time ఎంత?
**Shopkeeper:** 10.30 దాటింది.
**Police officer:** 10.30 కల్లా shop మూసెయ్యాలని తెలియదా? మూసెయ్యాలి మీరిప్పుడు.
**Shopkeeper:** బయట showcase ఉంది. దాన్ని లోపలపెట్టాలి.
**Police officer:** నేను మళ్లీ మీ shop 10.30 తర్వాత తెరచి ఉండటం చూడకూడదు, తెలిసిందా?
**Shopkeeper:** ఇంకో police officer ఏవో కొనడానికి వచ్చారు. అది కొనటం పూర్తయ్యేదాకా shop తెరచి ఉంచమని ఆజ్ఞ ఇచ్చారు, sir.
**Police officer:** Governor వచ్చినా రాత్రి 10.30కు shop కట్టెయ్యాలి. మర్చిపోకు.

**Answers:**

**a) Karthik:** Are you ready? Shall we start?
**Sravan:** Wait I must pay the fees today. Let me get the money.
**Karthik:** Why can't you pay tomorrow?
**Sravan:** From tomorrow, we must pay a fine of Rs.10/- per day.
**Karthik:** We must be at the lab by 9. What's the delay? You have the money.
**Sravan:** No one is at home. I must/ have to wait till mother comes back. She has told me that I must wait till she is back.
**Karthik:** We must be at the lab at 9. Shall I go?
**Sravan:** Why are you so worried? Aswini is here. We can go on his bike.

**b) Police officer:** What is the time now?
**Shopkeeper:** Past 10.30
**Police officer:** Don't you know that you must close shop by 10.30? you must close it now.
**Shopkeeper:** The showcase is outside. I must keep it in.
**Police officer:** I must not see the shop open after 10.30 again; understand?
**Shopkeeper:** Some other Police Officer came here to buy something. He ordered me to keep the shop open until his purchases are complete, sir.
(Purchases = కొనుగోలు)
**Police Officer:** Even if the Governor comes, you must close shop by 10.30. Don't forget.

ఇప్పుడు ఈ చిన్న game practice చేయండి. Infinitive అంటే తెలుసుకదా- ఇంతకుముందు lessons లో వివరించాం- to + Ist Regular Doing Word. eg: to go, to come, to know, etc, వీటిని మూడు విధాలుగా వాడతాం.

1) వెళ్లటం, రావటం, తెలియటం/ తెలుసుకోవటం, అనే అర్థంతో.
To go now will be the right thing
ఇప్పుడు వెళ్లటం సరైందిగా ఉంటుంది.
2) వెళ్లాలని, రావాలని, తెలుసుకోవాలని అనే అర్థంతో
I want to go = వెళ్లాలని అనుకుంటున్నాను.
3) వెళ్లటానికి, రావటానికి, తెలియటానికి అనే అర్థంతో
a) He is getting ready to go
వెళ్లటానికి తయారవుతున్నాడు
she is going out to buy a book
పుస్తకం కొనటానికి వెళ్తోంది.

ఇప్పుడు game. ఇలాంటి infinitives ఉపయోగించి sentences form చేయటం - ఎన్ని చేయగలిగితే అన్ని, ఎన్ని varieties అయితే అన్ని - statements & questions, negative sentences (no/ not/ never తో, వీలయితే dialogue form లో.
eg:
1) She wants to sing పాడాలని అనుకుంటోంది
2) To smoke is not good for health.
( smoke చేయటం ఆరోగ్యానికి మంచిదికాదు)
3) She has came to borrow a book from me
(నా దగ్గర పుస్తకం తీసుకోవటానికి వచ్చింది)
4) Where do you want to go now?
ఇప్పుడు ఎక్కడికి వెళ్లాలని అనుకుంటున్నావు?
5) **Vasanth:** Which college do you want to join?
**Hemanth:** I have come to consult you.
**Vasanth:** To join our college will be the best.
**Hemanth:** But to join your college will be expensive, won't it?

ఇలాంటివి ఈ game లో practice చేయండి.



**ప్రశ్న:** నువ్వు మరచిపోతావేమోనని గుర్తు చేశాను. 'Lest you should forget that I have reminded you' ఈ వాక్యం సరైనదేనా? Lest వస్తే should రావాలి కదా?
i) వాడితో నేను చెప్పాని చెప్పు నీకు ఆ పనిచేసి పెడతాడు.
ii) నువ్వు అలా అనుకుంటావని నాకు ముందే తెలుసు.
వీటిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?
iii) old boy అంటే close friend అనే అర్థం కరెక్టేనా?
**– రాజ్‌కుమార్, దర్శి**

**జవాబు:** 1. నువ్వు మర్చిపోతావేమోనని గుర్తు చేశాను - దీనికి correct English - I have reminded you lest you (should) forget.
'That I have reminded you; తప్పు
2. Start early lest you should be late
ఆలస్యం కాకుండా ఉండేందుకు త్వరగా బయల్దేరు.
3. He carried an umbrella lest he (should) get drenched
తడిసిపోకుండా ఉండేందుకు గొడుగు తీసికెళ్లాడు.
No 1, No 3 sentences లో should omit చేయవచ్చు. No. 2 లో కూడా should తీసేసి, lest you be late అనవచ్చు. Lest = so that not.
i) Tell him it is from me. He will do it.
(It is from me = నేను చెప్పానని చెప్పు)
ii) I knew that you would think so.
iii) Close friend ను, old boy అనటం correct, సర్వసాధారణం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# We must be careful

**Subodh:** Pramod, we must travel by some morning train to avoid hot sun. So let's have our tickets booked by an early morning train.
(మనం ఉదయంపూట train లో వెళ్లాలి, ఎండ తగలకుండా ఉండేందుకు. అందుకని మనం పొద్దునపూట train కు tickets book చేయించుకుందాం.)

**Pramod:** And as it's going to be a long journey, we must carry enough cash with us as well. We must be careful about spending too, not at every place can we find an ATM of our bank.
(చాలా దూర ప్రయాణం కాబట్టి తగినంత డబ్బు కూడా తీసుకువెళ్లాలి. అది కూడా జాగ్రత్తగా ఖర్చు పెట్టాలి. అన్నిచోట్లా మన bank ATM ఉండకపోవచ్చు)
(ATM = Automatic Teller Machine - Bank card తో డబ్బు పొందగల ఏర్పాటు)

**Subodh:** We must carry food too. The food on the train is very expensive and not at all good.
(మనం తినడానికి కూడా ఏమైనా తీసుకెళ్లాలి. Train లో ఆహారం ఖరీదే కాకుండా బాగుండదు కూడా)

ఈ సంభాషణలో must తో వచ్చిన expressions చూద్దాం.
Must travel, must carry, must be careful.
ఇప్పటివరకు మనం తెలుసుకున్న must ఉపయోగాలు.

**1)** Must expresses rules. (నిబంధనలు తెలుపుతుంది)
Candidates must report for the interview at 9 AM on 2nd Feb 2006.
(2nd Feb 2006 రోజు అభ్యర్థులు interview కు హాజరు కావాలి)

**2)** Must expresses commands (ఆజ్ఞలివ్వటానికి must వాడతాం)
You must not do it again.
(మీరిది మళ్లీ చేయకూడదు)

**3)** Must expresses duty.
I must be at office until 5.
(ఐదింటివరకు నేను office లో ఉండాలి)

మళ్లీ పై సంభాషణ చదివి must ఉన్న expressions గమనించండి.

**a)** We must carry enough cash.
చాలినంత cash తీసుకెళ్లాలి మనం

**b)** We must travel by some morning train.
మనం పొద్దున train లో వెళ్లాలి.

**c)** We must be careful.
మనం జాగ్రత్తగా ఉండాలి.

పై మూడు వాక్యాల్లో must, necessity (అవసరాన్ని) తెలుపుతుంది కదా? అంటే మనం ఇబ్బంది పడకుండా, మనకు చెడు జరగకుండా మన అవసరాన్ని తెలిపేందుకు must వాడతాం.

**a)** We must hurry or we'll miss the beginning of the movie.
మనం త్వరగా వెళ్లాలి, లేకుంటే movie beginning miss అవుతాం.

**b)** We must carry enough cash.
చాలినంత cash తీసుకువెళ్లాలి మనం, (లేకుంటే ఇబ్బంది పడతాం)

**c)** If I want to avoid the queue, I must be there atleast by 8.
(Q లో నిలవకుండా ఉండాలనుకుంటే, నేనక్కడ 8 కల్లా ఉండాలి)

**d)** I must check up with him and see that every thing is ready.
(అన్నీ సిద్ధంగా ఉన్నాయో లేదో వాడితో మాట్లాడి తెలుసుకోవాలి)

పై వాక్యాలన్నింట్లో కూడా must, necessity (అవసరాన్ని - అంటే పరిస్థితుల ప్రోద్బలంవల్ల మనకు కావలసిన విషయాలను, మనం చేయవలసినవి) తెలుపుతుంది.

ముఖ్యంగా గమనించాల్సింది:
Have to/ has to, should, must-
ఈ మూడు కూడా అర్థం, ఉపయోగాల్లో చాలా దగ్గరగా ఉన్నాయి కదా.
ఈ మూడింటినీ కూడా మనం, Rules, duty, commands, necessity లను express చేయటానికి వాడతాం.

అయితే should వీటన్నింటిలో mild (తక్కువ force). should ముఖ్యంగా ఏది చేస్తే సరి, ఏది కాదు అనటానికి ఎక్కువ వాడతాం.

**a)** You should be punctual
(నువ్వు punctual గా ఉండాలి- ఉండటం మంచిది).

**b)** He should not talk like that
(అతనలా మాట్లాడకూడదు- అలా మాట్లాడకుండా ఉంటే మంచిది)

should కన్నా, have to/ has to, force ఎక్కువ. కొంచెం గట్టిగా command ఇవ్వటానికి, విధాయకం అని చెప్పటానికీ, నిబంధనలు కొంచెం force తో తెలపటానికి have to/ has to వాడతాం.

**a)** I have to take my sister to the hospital
తీసుకువెళ్లాలి. చాలా అవసరం (more powerful than, 'I should take')...

**b)** He has to do whatever I want him to do
నేనేది వాడ్ని చెయ్యమంటానో వాడది చెయ్యాల్సిందే.

**c)** They have to finish the work by the evening
(సాయంత్రానికల్లా వాళ్లా పని పూర్తిచేయాల్సిందే).
b), c) లో should వాడవచ్చు have to/ has to కు బదులు. అయితే have to/ has to అంత force రాదు.

**d)** He has made mistakes and has to face the consequences.
(తప్పులు చేశాడు కాబట్టి ఫలితం అనుభవించాల్సిందే).

కాబట్టి have to/ has to expresses command, duty, necessity, etc., more powerfully than should.
Must ఈ మూడింట్లో అన్నిటికంటే ఎక్కువ గట్టిగా చెప్తుంది, commands కానీ, duty కానీ, necessity కానీ, rules కానీ.
'Must' is stronger than have to/ has to or should.
I should go-
నేను వెళ్లాలి;
దీన్నే ఇంకొంచెం గట్టిగా చెప్పాలంటే- I have to go-
ఇంకా గట్టిగా చెప్పాలంటే- I must go.
ఇవీ should, have to/ has to, must కు ఉండే తేడాలు.

**For commands, duties, necessity and rules.**

| should | have to/ has to | must |
|---|---|---|
| least | stronger | strongest |
| strong | than | form |
| | should | |

(ముఖ్యమైన విషయం: Commands, rules లాంటివి చెప్పటానికి must ఎంత తక్కువగా వాడితే అంత మంచిది. Must మరీ గట్టిగా ఆజ్ఞాపించటం, మందలించటం అవుతుంది. అది మనం ఏదో మన ఆధిక్యతను, అధికారాన్ని చూపించుకున్నట్టు అవుతుంది. సామాన్యంగా ఆజ్ఞాపించటం, నిబంధనలు తెలియపరచటం అయితే shall, should లతో ఆగిపోవటం good manners. Must, manners తెలిసినవాళ్లు ఆజ్ఞలకు చాలా అరుదుగా వాడతారు. Duty, necessity తెలపటానికి సందర్భాన్ని బట్టి ఏదైనా వాడవచ్చు).

Should, must-
ఈ రెండింటినీ మనం కచ్చితం అనుకునే విషయాన్ని తెలపడానికి కూడా వాడతాం. అంటే ఇవి perhaps (బహుశ) కు opposite.

**Pramod:** Any idea where Praful is?
(ప్రఫుల్ ఎక్కడున్నాడో ఏమైనా తెలుసా? )

**Manoj:** He must be at home. He is expecting some guests.
(ఇంట్లోనే ఉండాలి మరి. ఎవరో guests కోసం ఎదురుచూస్తున్నాడు)

**Pramod:** Who are the guests? (ఎవరు guests?)

**Manoj:** His cousins from the states on a short visit to India.
(అమెరికాలో ఉన్న అతని cousins - India కు వచ్చారు. కొద్ది రోజులుంటారు)

**Pramod:** That should keep him busy for another two days then.
(అందువల్ల అతడు రెండు మూడు రోజులు కచ్చితంగా busy గా ఉంటాడు)

ఇక్కడ must be at home, should keep him busy- ఇవన్నీ కూడా మనం కచ్చితంగా జరుగుతుంది/ ఉంటుంది అనుకునే విషయాలకు. తప్పనిసరి అనుకునే విషయాలకు must, should వాడతాం.

**1)** See her always with a lot of jewellry on. She must be quite rich.
ఎప్పుడూ చాలా నగలతో కనిపిస్తుందామె. బాగా ఉన్న వాళ్లై ఉండాలి.

**2)** I see prasanth's name on the book. It should be his.
ఆ బుక్ మీద ప్రశాంత్ పేరుంది. అది అతనిదై ఉండాలి.

**practice the following in English**

**Kesav:** కుమార్‌ని వెంటనే నేను కలవాలి. అతడితో మాట్లాడాల్సిన ముఖ్యమైన విషయం ఒకటుంది.

**Gangadhar:** ఇంట్లో ఉండాలిప్పుడతను మరి. అరగంట కిందటే నేను phone చేస్తే చెప్పాడు తనెక్కడికీ వెళ్లటం లేదని

**Kesav:** అయితే నేను వెంటనే వెళ్లాలి. నువ్వూ వస్తావా?

**Gangadhar:** మా ఆవిడ తనను ఎక్కడికో తీసుకెళ్లమంది. నేవెళ్లాలి వెంటనే. ఆవిడ నాకోసం wait చేస్తూ ఉంటుంది తప్పకుండా.

**Kesav:** అయితే వెంటనే వెళ్లు. భార్యల విషయాల్లో జాగ్రత్తగా ఉండాలి మనం.

**Gangadhar:** నువ్వు అనుభవంతో చెబుతుండాలి

**Kesav:** Ok. Ok. నేను వెళ్తున్నా.

**Answer:**

**Kesav:** I must / have to meet kumar urgently. There is an important matter I have to talk to him about./ I have to talk to him about something important.

**Gangadhar:** He must be at home now. A short-while ago I called him and he told me he wouldn't be going anywhere.

**Kesav:** Then I must rush. Are you coming with me?

**Gangadhar:** My wife wanted me to take her somewhere. I must go home at once, she must be waiting for me.

**Kesav:** Then go. We must be careful about things connected with them.

**Gangadhar:** You must be speaking from experience.

**Kesav:** Ok. Ok. I'm going.

ఈసారి ఈ game practice చేయండి. కిందటిసారి ఇచ్చిన game లో infinitive practice చేశారుగదా. ఈసారి sentence లో verb కు, infinitive కూ మధ్య me, us, you, him, her, it, them పెట్టి practice చేయండి.
eg: a) I want you to go;
b) She wants him to sing
c) What do you want me to do?
d) Dad doesn't want me to waste time.
ఇలాంటివి practice చేసి ఎన్ని sentences చేయగలరో చూడండి.

M. SURESAN



**ప్రశ్న:** *Learn కు past రూపాలు రెండు learned, learnt అని ఉన్నాయి. అలాగే past participles కూడా. అయితే she learnt english అనాలా? She learned english అనాలా? అలాగే passive voice లో English was learned అనవచ్చా? English was learnt అనే అనాలా? అలాగే burnt, burned, dreamt, dreamed ల గురించీ వివరించగలరు.*

– ఎ. కృష్ణగీతార్జున, నిడదవోలు

**జవాబు:** Learned, learnt- past tense కయినా, past participle కయినా వీటి రెండిట్లో ఏదైనా వాడవచ్చు - అన్నీ ఒకటే, passive లో కూడా. అదే విధంగా, burned, burnt, dreamt, dreamed విషయంలో ఏదైనా, ఏ voice లోనైనా వాడవచ్చు. అయితే learned ని బాగా తెలిసిన (ఏదైనా subject) అనే అర్థంలో వాడినపుడు, learned (pronunciation - లెనిడ్ - లె నొక్కి పలుకుతాం) మాత్రమే వాడతాం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# Tendulkar is an all time great

**Sravan:** Hi Pavan, how was the movie yesterday?
(నిన్న movie ఎలా ఉంది? )
**Pavan:** Not very good, but not so bad either.
(అంత బాగాలేదు, అంత చెడుగా లేదు)
**Sravan:** (Do) you suggest that I see it?
(చూడమంటావా? suggest = సూచించటం)
**Pavan:** I leave it to you.
(అది నీ ఇష్టం leave it to you = నీకొదిలేస్తున్నా. నీ ఇష్టం)
**Sravan:** The other day, I happened to watch an old English movie. 'The ten commandments' on the TV. A real good movie - one of the all time greats.
(మొన్నెప్పుడో ఒక రోజున TVలో పాత English movie, 'The ten commandments చూశాను. నిజంగా గొప్ప movie. ఎప్పటికీ గొప్పవే అనుకునే వాటిల్లో అదొకటి. (All time great - ఎప్పుడూ గొప్ప)
**Pavan:** Why didn't you tell me?
(నాకెందుకు చెప్పలేదు? )
**Sravan:** I didn't know myself that it was showing. I just turned on HBO channel and there it was.
(నాకు తెలీదు అది వస్తోందని ఊరికే HBO channel తిప్పాను. ఈ movie కనిపించింది)
**Pavan:** Was it very good?
(చాలా బాగుందా? )
**Sravan:** You can say that again and again.
(మళ్లీమళ్లీ చెప్పొచ్చు ఆ మాట.)
It ran to packed houses for weeks together those days
(ఆ రోజుల్లో వారాల తరబడి Houseful గా నడిచింది)
**Pavan:** Who were the cast?
(తారలెవరు? )
**Sravan:** The movie features Charlton Heston as Moses and Yul Brynner as the Pharaoh.
(Moses గా Charlton Heston, Pharaoh గా Yul Brynner నటించారు. Moses- మోజేస్; Pharaoh - ఫారో Egyptian-చక్రవర్తి)
**Pavan:** Any special feature of it?
(ఆ movieలో ఏంటి ప్రత్యేకత? )
**Sravan:** The cleavage of the sea. It's a grand shot. I have yet to see such a shot in any movie. It looked as though the sea really parted by a path. That's the highlight of the movie.
(సముద్రం చీలటం - అలాంటి Shot ను నేను ఇంతవరకు ఏ సినిమాలోనూ చూడలేదు. నిజంగానే సముద్రం రెండుపాయల మధ్య దారేర్పడినట్టు చూపించారు. ఆ movieలో ప్రధాన ఆకర్షణ అదే.)
**Pavan:** can we get a CD of it?
(దాని CD దొరుకుతుందా? )
**Sravan:** Definitely (తప్పకుండా)

ఈ సంభాషణలంతా సినిమా గురించే కదా. ఈ lessonలో movie కు సంబంధించిన vocabulary (పదజాలం) తెలుసుకుందామా ? ముందు ఈ మాటలు చూడండి; movie, TVకి సంబంధించినవి.

1. Movie 2. Watch a movie on the TV
3. One of all time greats 4. Was showing
5. turned on 6. ran to packed houses
7. cast 8. featured 9. shot 10. highlight

మామూలుగా చలనచిత్రం అంటే English లో movie. Cinema అంటే Englishలో cinema hall, ఆ hallలో ఆడే చిత్రం కాదు. The cinema అంటే చలనచిత్రపరిశ్రమ. చలనచిత్రాన్ని Englishలో film అని కూడా అనవచ్చు. That cinema is good అంటే ఆ సినిమా hall బాగుందనే కానీ, అందులో ఆడుతున్న చిత్రం బాగుందని కాదు.

See / watch a movie = movie చూడటం.
(అయితే am seeing / is seeing / are seeing a movie అనం. Am+ing / is+ing / are + ing వాడాల్సి వస్తే am watching / is watching / are watching a movie అనటం correct)
TVలో = on the TV. We are watching an interesting programme on the TV. (in the TV కాదు)

One of all time greats: All time great - ఈ మాట ఎప్పుడూ గొప్పవాళ్లుగా / గొప్పవిగా పరిగణించే వాళ్లు/ పరిగణించేవి అని అర్థం.
a) Sankarabharanam is an all time great.
b) Tendulkar is an all time great.
అదీ all time great meaning and use.
**Was showing:** చిత్రం ఒక hall లో ఆడుతూంది (గతంలో)
**Kranthi:** The movie is excellent. You must see it. I feel like seeing it a second time.
**Prasanth:** Where is it showing?
(అది ఎక్కడ ఆడుతోంది? )
**Kranthi:** It is showing in Chitramahal.
(అది చిత్రమహల్‌లో ఆడుతోంది)
చిత్రం ఒక theatreలో ఆడటం = showing
Last week it was showing in Chitradarsini. I don't know where it is showing now. Some other movie is showing in Chitradarsini.
(గత వారం అది చిత్రదర్శినిలో ఆడింది.ఇపుడు ఎక్కడ ఆడుతుందో తెలీదు. చిత్రదర్శినిలో ఇంకేదో movie ఆడుతోందిప్పుడు)

**Ran to packed houses:** Houseful గా ఆడింది.
Packed house = houseful
Run to packed houses = housefulగా నడవడం.
✓ movie ఆడటాన్ని run అని కూడా అంటాం.
✓ ఆ movie ఇప్పటివరకు 4 వారాలు ఆడింది.
The movie has run for the past four weeks.
✓ కచ్చితంగా 100 రోజులు ఆడుతుంది = It will certainly run for a hundred days.
✓ movie అందర్నీ ఆకర్షించేదయితే- It's a big draw.
a) This movie will be a big draw
(ఈ movie అందరూ ఇష్టపడ్తారు/ అది అందర్నీ ఆకర్షిస్తుంది.)
(It will run to packed houses)
b) చిత్రంలో ఏదైనా ఓ సన్నివేశం చాలా గొప్పదయితే, అది కూడా big draw నే.
The chariot race in Benhur is a big draw
(Benhur లో రథాల పందెం సన్నివేశం ముఖ్య ఆకర్షణ.)
✓ Movieలో సన్నివేశం = sequence (సీక్వెన్స్) Big draw, high light దాదాపు ఒకే అర్థం కలవి = ముఖ్య ఆకర్షణ.
✓ caste = తారాగణం, movie / dramaలో.
a) 'Danaveera Sura karna' casts Rama Rao in the roles of Duryodhana, Krishna and Karna.
(దానవీరశూరకర్ణలో రామారావు దుర్యోధన, కృష్ణ, కర్ణుడిగా మూడు పాత్రల్లో నటించాడు)
b) He is cast as a villain in the movie
(ఆ movieలో అతనిది villain (విలన్) పాత్ర)
c) The cast of the movie has chitrakumar as hero and chitrasri as the heroine
(ఆ చిత్రంలో చిత్రకుమార్ హీరోగా, చిత్రశ్రీ హీరోయిన్‌గా నటించారు)
d) Feature అన్నా కూడా దాదాపు అదే.
a) The movie, Ninnu Nenu Pelladanu features Natesh and Abhinetri in the lead roles
('నిన్ను నేను పెళ్లాడాను' చిత్రంలో నటేష్, అభినేత్రి ప్రధాన పాత్రధారులు. Lead role = ప్రధానపాత్ర, movieలో కానీ నాటకంలో కానీ.)
b) The movie features all great actors
(ఆ చిత్రంలో తారలందరూ గొప్పవాళ్లే.)
c) The movie features him in a minor role
(అతను ఆ movie లో ఓ చిన్నపాత్రలో కన్పిస్తాడు.)
✓ Shot = చిత్రంలో సన్నివేశం = sequence.
a) That's the best shot in the movie=That's the best sequence in the movie .
(ఆ చిత్రంలో అది ఉత్తమ సన్నివేశం)
b) Most of the shots in the movie were shot in Kashmir
(ఆ చిత్రంలో చాలా సన్నివేశాలు కాశ్మీర్‌లో తీశారు
✓ Role= పాత్ర = part.
a) SV Rangarao could act any role with ease
(SV రంగారావు ఏ పాత్రనైనా సునాయాసంగా (with ease) నటించలిగేవాడు)
b) His is the most important role in the movie
(ఆ చిత్రంలో అతనిది అతి ముఖ్యమైన పాత్ర)
act a role = do a role = take on a role
(ఒక పాత్రలో నటించటం)
a) Nageswara Rao acted the role of Narada in Bhukailas \ Nageswara Rao did the role of Narada .
(నాగేశ్వరరావు నారదుడి పాత్ర వేశారు)

b) He acted the role well
(ఆ పాత్రలో ఆయన బాగా నటించాడు)
✓ Live a role = పాత్రలో జీవించటం
✓ Do justice to a role = పాత్రకు న్యాయం చేకూర్చటం
✓ Comic role = హాస్యపాత్ర,
✓ Tragic role = దుఃఖపాత్ర
✓ Perform = నిర్వహించడం
✓ He performed well = ఆయన బాగా నటించాడు. His performance as Sri Rama deserves all praise.
(శ్రీరాముడిగా ఆయన నటన మెచ్చుకోతగ్గది.)
✓ (Deserve = అర్హత కలిగి ఉండటం.
He deserves an award
(ఆయన బహుమతికి అర్హుడు)
✓ Comedy = సుఖాంతమైన/హాస్యప్రధానమైన కథ / movie / నాటకం
✓ Tragedy = దుఃఖాంతమైన నాటకం/చిత్రం/కథ
a) Missamma is a comedy
b) Devadasu is a tragedy
Comic role = హాస్య పాత్ర;
Tragic role = దుఃఖపూరి పాత్ర
a) Brahmanandam is known for his comic roles
(హాస్యపాత్రలకు బ్రహ్మానందం ప్రసిద్ధిపొందాడు)
b) Some artists are suitable for tragic roles
(కొందరు నటులు దుఃఖపాత్రలు బాగా చేస్తారు.)
హాస్యనటుడు = comedian
(కమీడియన్-'మీ'నొక్కి పలుకుతాం
Relangi was a great comedian
హాస్యనటి = comedienne (కమిడీయన్),
డీ, మీ కంటే ఎక్కువ నొక్కిపలకాలి.

**Practice the following in English.**
**Sruthi:** Hi Laya, నువ్వు నిన్న సాయంత్రం ఇంట్లో లేవా?
**Laya** = లేను. ఏంచేయాలో తోచక Movie కెళ్లాను
**Sruthi:** ఏ movie, ఎక్కడాడుతోంది?
**Laya:** ప్రేమకు కళ్లు లేవు. చిత్రజ్యోతిలో.
**Sruthi:** బాగుందా?
**Laya:** My God, ఎంత bore కొట్టిందో?
**Sruthi:** నటులెవరు?
**Laya:** గొప్పనటులే ఉన్నారు. కానీ movie ఏం బాగా లేదు.
**Sruthi:** వాళ్లెలా చేశారు?
**Laya:** వాళ్లు ఏమంత గొప్పగా నటించలేకపోయారు.
**Sruthi:** అయితే నేను చూడక్కరలేదన్నమాట.

**Answers:**
**Sruthi:** Hi Laya, weren't you (were you not) at home yesterday?
**Laya:** No, I went to a movie. I had not going better to do. (I went to a movie, having - nothing better to do.)
**Sruthi:** Which movie, and where is it showing?
**Laya:** Premaku Kallu Levu. At Chitrajyothi.
**Sruthi:** Was it good?
**Laya:** My God! What a bore (it was)!
**Sruthi:** Who were the actors? \ What was the cast?
**Laya:** The movie featured a big cast./ The actors were all great./ The cast included all great actors.
**Sruthi:** How did they act?/ How did they do?/ How did they perform?/ How was their performance?
**Laya:** They couldn't act well./They didn't do well.
**Sruthi:** So I need not see it.


M. SURESAN

ఈసారి ఈ **game ఆడండి.**
I know what to do.
(నేనేం చేయాలో నాకు తెలుసు) ఇక్కడ మీరు చేయాల్సిందల్లా ఇదే నమూనాలో మీరు చెప్పగల్గినన్ని sentences చెప్పగల్గడం. Variety కూడా ఉండాలి. అంటే, no తోనూ, questions, dialogue form కూడా రావాలి. అర్థం correct గా ఉండాలి.
**eg:** a) Hema forgot how to open the box
(box ఎలా తెరవాలో హేమ మర్చిపోయింది)
b) She did not know where to sit
(ఎక్కడ కూర్చోవాలో ఆమెకు తెలీలేదు)
c) Do you know when to start?
(ఎప్పుడు బయల్దేరాలో తెలుసా? )
ఈ **sentence pattern** గమనించండి:
Sub. తర్వాత verb, ఆ తర్వాత 'Wh' Word, ఆ తర్వాత infinitive కదా. ఈ dialogue కూడా చూడండి.
**Prem:** Do you remember when to start?
(ఎప్పుడు బయల్దేరాలో జ్ఞాపకం ఉందా? )
**Syam:** I do, but you did not tell me where to go.
(తెలుసు. కానీ ఎక్కడికెళ్లాలో నువ్వు చెప్పలేదు.)
ఇలా ఈ game practice చేసి ఎన్ని sentences రాయగలరో చూడండి.



ప్రశ్న: కరెన్సీ నోట్లమీద 'I PROMiSE TO PAY THE BEARER THE SUM OF TWENTY RUPEES' అని ఉంటుంది. దీని అర్థం ఏమిటి?
ఎస్.ఎమ్.డి. ఇర్ఫాన్, నంద్యాల
జవాబు. Currency notes మీద ఆ sentence లేకపోతే అది ఏ విలువలేని మామూలు కాగితమే అవుతుంది. Currency notes జారీచేసేది Reserve Bank of India. దాని అధికారి Governor of Reserve Bank of India. ఆ అధికారి మనకిచ్చే హామీయే ఆ sentence - ఈ కాగితం ఉన్న ఎవరికైనా (bearer) నేను రూ. 20/- (లేకపోతే ఇంకెంతయినా) చెల్లిస్తానని.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**





# He made his debut in..


M. SURESAN

**Priya:** Hi Divya, We really enjoyed the movie yesterday, didn't we?
(నిన్న movie నిజంగా enjoy చేశాం, కదా? )

**Divya:** Certainly. Chitrasri's performance as the heroine was really superb.
(నిజంగానే Heroine గా చిత్రశ్రీ నటన అద్భుతం)
Heroine హెరోయిన్- హె నొక్కిపలుకుతాం
Superb: స్యూపబ్ - ప నొక్కి పలుకుతాం.

**Priya:** The movie will be a runaway success.
(ఈ చిత్రం బాగా విజయవంతం అవుతుంది)

**Divya:** It can't be otherwise with that kind of story line, brilliant action and clever direction
(అలాంటి కథ, మంచి నటన, తెలివైన దర్శకత్వంతో అది ఇంకో విధంగా ఉండటానికి లేదు)

**Priya:** The main characters brought out the talent of the lead pair.
(ముఖ్యమైన పాత్రలు ప్రధాన జంట ప్రతిభను వెలికితెచ్చాయి)
Character: క్యారక్ట - కా నొక్కి పలుకుతాం;
కా, బ్యాంక్‌లో బ్యా లాగా = మామూలు అర్థం - శీలం/ గుణగణాలు/ స్వభావం. కానీ ఇక్కడ అర్థం- ఓ కథలో, నాటకంలో సినిమాలో పాత్ర.
Lead Pair = ప్రముఖ జంట - సామాన్యంగా కథలో/ నాటకంలో/ చిత్రంలో నాయకానాయికలు.

**Divya:** They have been a hit pair - chitrakumar and chitrasri. Their combination has been successful.
(వాళ్ళిద్దరి - చిత్రకుమార్, చిత్రశ్రీ జంట - hero, heroine గా పెద్ద hit. వాళ్ళది విజయవంతమైన జంట ఇంతవరకు)

**Priya:** They are teaming up again in the next movie 'premikulugane vundam'
(రాబోతున్న చిత్రం 'ప్రేమికులుగానే ఉందాం'లో కూడా వాళ్ళ కలిసి నటిస్తున్నారు)

**Divya:** They show themselves at their best when they are cast opposite each other
(వాళ్ళ జంటగా / నాయకానాయికలుగా నటిస్తే వాళ్ల ప్రతిభ చాలా బాగా చూపిస్తారు)

**Priya:** I think she made her debut in nee kosame. She hasn't had a failure in her career
(ఆమె సినీరంగం ప్రవేశం నీకోసమే చిత్రంతోనే అనుకుంటా, ఇంతవరకు ఏ చిత్రం కూడా విఫలమవ్వలేదు)
Her action in "Aunantara, Kadantara?" is really memorable
(ఔనంటారా, కాదంటారా? చిత్రంలో ఆమె నటన మరపురానిది)

**Divya:** Ok. I must be going Priya. Meet you tomorrow. Bye
(నే వెళ్లాలి. రేపు కలుస్తాను. Bye)

**Priya:** Bye

కిందటి Lesson లో చలనచిత్రాలకు సంబంధించిన మాటలు చాలా చూశాం కదా? ఇప్పుడు మరికొన్ని చూద్దాం. ఇవన్నీ మనం మాట్లాడుతున్నప్పుడు వాడుతూంటే Conversational English చాలా బాగుంటుంది. ఇవి చూడండి.

1. Superb 2. A runaway success 3. storyline 4. characters 5. lead pair 6. hit pair 7. teaming up 8. cast opposite 9. debut

**1) superb**= అద్భుతం/ అమోఘం = ఏదైనాసరే - Movie కావచ్చు ఓ గొప్ప పుస్తకం కావచ్చు, ఒకరి నటన/ క్రీడ/ ఒకరు సాధించింది - ఇవేవైనా సరే అద్భుతంగా ఉంటే Superb అంటాం.

a) It is a superb hattrick by Irfan Pathan = ఇర్ఫాన్ పఠాన్‌ది అద్భుతమైన hattrick. Hattrick అంటే తెలుసుకదా - మూడుసార్లు వరసగా విజయం సాధిస్తే, ముఖ్యంగా క్రీడల్లో, అదీ ఒకే Player అయితే, hat-trick అంటాం.

b) The movie is superb=
ఆ చిత్రం చాలా గొప్పగా ఉంది.

c) Tendulkar's was a superb century
అతడి Century అద్భుతం.

**2) A runaway success**
త్వరితమైన విజయం

a) The movie was a runaway success.
ఆ చిత్రం విడుదలైన వెంటనే విజయవంతమైంది.

b) Missamma was a runaway success.
మిస్సమ్మ అతి త్వరగా విజయవంతమైంది ఊహించని రీతిలో.

c) No one has the formula to make a movie a runaway success -
ఓ చిత్రాన్ని అనూహ్యరీతిలో అతి త్వరగా విజయవంతం చేయగల సూత్రాలు ఎవరివద్దా లేవు.

Formula సూత్రం. Flop, Runaway success కు వ్యతిరేకం.

**3) Story line**
కథా సంవిధానం - ఓ చిత్రం కథను దర్శకుడు చూపించే తీరు. దీనికే ఇంకోమాట Plot

a) His movies have the same basic story but the story line differs
అతడి చిత్రాల మూలకథ ఒకటే, కానీ కథా సంవిధానమే తేడా

b) The movie failed because of its weak story line
కథలో/ కథా సంవిధానంలో పట్టులేకపోవడం వల్లే అది విఫలమైంది.

c) Weak story line is the cause of most failures
చాలా చిత్రాలు పట్టులేని కథ వల్ల దెబ్బతింటున్నాయి.

d) The movie flopped/ flopped at the box office/ The movie was a flop, because of its thin story line
దాని బలహీన కథ/ కథా సంవిధానం వల్ల ఆ చిత్రం దెబ్బతింది. Thin కు ఇక్కడ అర్థం weak అని. దాని అసలు అర్థం- సన్నని/ పల్చని.

**4) Character**: కథలో/ నాటకంలో/ చిత్రంలో పాత్ర. దీన్నే మనం role అనిగానీ part అనిగానీ అనవచ్చు

a) NTR played the character/ role/ part of Karna in the drama
ఆ నాటకంలో NTR కర్ణుడి పాత్ర వేశాడు/ నటించాడు.

b) One of the main characters in the movie is Lord Venkateshwara played by Suman
ఆ చిత్రంలో ముఖ్యమైన పాత్రల్లో ఒకటి Suman నటించిన వేంకటేశ్వరస్వామి పాత్ర.

c) He played his part well
అతడి పాత్రను అతడు బాగా నటించాడు.

Play మామూలుగా అయితే ఆడటం, ఇక్కడ నటించడం.

**5) lead pair**= ముఖ్యజంట- నాయకా నాయికలు. (the hero and the heroine)

a) NTR and Anjali Devi are the lead pair in Lavakusa
లవకుశ చిత్రంలో వాళ్లిద్దరిదీ ముఖ్యమైన జంట (Hero, heroine).

b) The lead pair in the movie is Rajanikanth and Jyothika
రజనీకాంత్, జ్యోతిక ఆ చిత్రంలో ప్రధాన పాత్రధారులు, జంటగా.

c) They have proved a hit pair
విజయవంతమైన జంట.

**6) Hit pair**
చిత్రానికి విజయం చేకూర్చే/ విజయవంతమైన/ ప్రేక్షకుల అభిమానం పొందిన జంట (మామూలుగా hero, heroine పాత్రల్లో)

a) They make a hit pair
వాళ్లిద్దరిదీ విజయవంతమైన జంట. అంటే వాళ్లు నటించిన చిత్రాలన్నీ hits అని.

**7) Teaming up**
జత కలవటం, జంటగా నటించడం- సామాన్యంగా hero, heroine.

a) They are teaming up again in the next movie
రానున్న చిత్రంలో మళ్లీ వాళ్లిద్దరు కలిసి నటిస్తున్నారు.

b) They have teamed up again
మళ్లీ వాళ్లే కలిసి నటిస్తున్నారు.

**Team up:** ఒక movie విషయంలోనే కాకుండా, ఏ పని చేయటానికైనా కొంతమంది కలిస్తే, They team up.

The three boys teamed up to decorate the room
ఆ గదిని అలంకరించడానికి వాళ్లు ముగ్గురు ఒక జట్టుగా ఏర్పడ్డారు.

**8) Cast opposite**: ఒక నటి (సామాన్యంగా heroine) ఒక నటుడి (hero) సరసన నటిస్తే అప్పుడు they are cast opposite each other అంటాం.

a) Vikram is cast opposite Sada/ Sada is cast opposite Vikram/ Vikram and Sada are cast opposite each other in Aparichitudu
అపరిచితుడిలో Vikram, సదా సరసన/ సదా, విక్రమ్ సరసన / విక్రమ్, సదా ఒకరి సరసన ఒకరు నటించారు.

b) Surya and Asin are cast opposite each other
వాళ్ళు ఒకరి సరసన ఒకరు నటిస్తున్నారు.

**9) Debut**: మొట్టమొదటి సారిగా సభికుల ముందు నాట్యం చేయడం/ మొదటి సారిగా చిత్రాల్లో నటించటం/ మొదటిసారిగా రంగప్రవేశం (శాస్త్రీయ నృత్య సంప్రదాయంలో దీన్ని ఆరంగేట్రం అంటాం)

Debut- pronunciation - డెయ్‌బ్యూ - డె నొక్కి పలుకుతాం.

♦ మొదటిసారిగా రంగప్రవేశం చేయటం
Make a debut/ Have a debut.

**a)** She made her debut in this movie.
ఇది ఆమె తొలిచిత్రం. ఈ చిత్రంలో ఆమె మొదటి సారిగా నటించింది.

**b)** His debut wasn't very successful
అతడి మొదటి నటన అంత విజయవంతం కాలేదు.

♦ Debut ముఖ్యంగా నాట్యం, నాటకం లాంటి కళల విషయంలోనే ఎక్కువగా వాడతారు. ఒక్కోసారి మిగతా రంగాలకు కూడా వాడతారు.

♦ He made his debut in politics in 1999
1999లో ఆయన రాజకీయరంగ ప్రవేశం చేశారు.

**Now Practise the following in English:**

**a) Yasvanth:** Hi Srikanth, నీ favourite hero, heroine ల జంట ఈసారి అంత విజయవంతం కాలేదేం?

**Srikanth:** ఆ కథలో పట్టులేదు. వాళ్లు బాగానే నటించారు కదా?

**Yasvanth:** నువ్వు వాళ్ల అభిమానివి కదా. అంతకంటే ఏమంటావు?

**Srikanth:** నువ్వేమైనా చెప్పు, వాళ్ళిద్దరు కలిసి నటించారు కాబట్టి ఆ మాత్రమైనా ఉంది ఆ చిత్రం. లేకుంటే పూర్తిగా దెబ్బతినేదే.

**Yasvanth:** వాళ్ల నటన వల్లే చిత్రం దెబ్బతిందని అంటున్నారు.

**Srikanth:** నేనొప్పుకోను. వాళ్లది విజయవంతమైన జంట. వాళ్ల గత చిత్రం అనూహ్యమైన విజయం సాధించిందికదా? ఆ hero రంగప్రవేశం చేసినప్పటినుంచి flop అనేది లేదు కదా?

**Yasvanth:** ఇది ఆయన మొదటి flop ఏమో? అతడికి ఇచ్చిన పాత్రకు అతడు suit అవడని నా అభిప్రాయం.

**Srikanth:** ఆయన ఏ పాత్రకైనా సరిపోతాడు, ఏ పాత్రయినా సునాయాసంగా చేయగలడు.

**b) Vinitha:** Hi Sunitha, నిన్న నేను TVలో 'ఏమిటీ విచిత్రం' చూశాను. ఎంత బాగుందో!

**Sunitha:** నేనది ఎప్పుడో చూశాను. పోయిన నెల అనుకుంటా, వైజాగ్‌లో.

**Vinitha:** చాలా బాగుంది కదా. అందులో hero, heroine ల పేర్లేంటి? వాళ్లిద్దరికీ మొదటి చిత్రం అనుకుంటా.

**Sunitha:** అవును. వాళ్ల మొదటి అవకాశంలోనే మంచి ప్రతిభ కనబరచారు.

**Vinitha:** ఇప్పుడు వాళ్లిద్దరూ రెండు మూడు చిత్రాల్లో ముఖ్య జంటగా నటిస్తున్నారు.

**Sunitha:** ముఖ్యంగా ఆ heroine మంచి నటిగా గుర్తింపు తెచ్చుకుంది.

**Answers:**

**a) Yasvanth:** Your favourite lead pair has not been very successful this time, has it?

**Srikanth:** The movie has a weak story line. They have acted well.

**Yasvanth:** You are their fan. What else can you say?

**Srikanth:** Whatever you say- the movie is atleast that good because they have acted in it. Otherwise it would have been an utter flop.
(utter = పూర్తి)

**Yasvanth:** The movie is a flop because of their action. That's what people say.

**Srikanth:** I don't agree. They are a hit pair. Their last movie was a runaway success. The hero hasn't had a failure since his debut.

**Yasvanth:** This might be his first flop. I feel that he doesn't suit the role/ the character.

**Srikanth:** He suits any role. He can do any role with ease.

**b) Vinitha:** Hi Sunitha, yesterday I watched the movie, 'Emitivichitram' on the TV. What a movie it is! / How good it is!

**Sunitha:** I saw it long ago. I think it was last month, in Vizag.

**Vinitha:** Isn't it good? What are the names of the lead pair, I think they made their debut in the movie.

**Sunitha:** Yes. Even in their debut they displayed their talent.
(Display = ప్రదర్శించటం)

**Vinitha:** They are acting as the lead pair in two or three movies.

**Sunitha:** The heroine especially has won recognition as a good actor/actress.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 107

# Have a happy time...

M. SURESAN

**Hemanth:** Hi Vasanth, I didn't see you the whole of yesterday. What was wrong?
ఏంటి నిన్నంతా నువ్వు కనపడలేదు. ఏంటి విషయం?

**Vasanth:** The Deepavali effect you know. We enjoyed the festival the day before Yesterday. We were so tired yesterday. We were resting almost the whole of yesterday.Fortunately yesterday was a Sunday.
ఇదంతా దీపావళి ప్రభావం. మొన్నంతా పండగ జరుపుకొనేసరికి నిన్నంతా అలిసి పోయాం. దాదాపు నిన్నంతా పడుకునే ఉన్నాం. అదృష్టవశాత్తూ నిన్న ఆదివారం.

**Hemanth:** So you celebrated it with all enthusiasm. We did too, but we were off the fireworks by about 10. We were in bed by 10.30pm
అంత ఉత్సాహంగా జరుపుకున్నారన్నమాట. మేమూ జరుపుకున్నాం. కానీ టపాకాయలు కాల్చడం 10 గంటలకే ఆపేశాం. 10.30 కల్లా పడుకున్నాం.

Enthusiasm - ఇన్‌థ్యూసియాజమ్.
థ్యూ నొక్కి పలుకుతాం.
చివర 'జ' size లో zలాగా, = ఉత్సాహం.
fireworks = బాణసంచా/ టపాకాయలు

**Vasanth:** We were enjoying the fireworks till almost eleven. Dad was liberal this time. We let off Rs. 800/-work of crackers sparklers this time.
11 వరకూ కాలుస్తూనే ఉన్నాం. మా నాన్న ఈసారి డబ్బులు బాగానే ఇచ్చారు. 800 రూపా యల బాణసంచా కాల్చాం

worth - వర్త్ (bird లాగా)= విలువ ఉన్న.
crackers = క్రాకర్జ్
= పేలే టపాకాయలు, sparklers = స్పార్క్లర్జ్ = వెలిగేవి (మతాబులు, కాకర పువ్వొత్తులు etc) let off = టపాకాయలు కాల్చటం = Let off fire works)

**Hemanth:** So it was a grand affair after all. Some how I feel spending so much on fire works is a waste
మొత్తంమీద చాలా సరదాగా గడుపుకున్నారు
. affair, అఫె-ఫె నొక్కుతాం = విషయం.

**Vasanth:** It's just once a year. A few hundred rupees shouldn't matter much.
సంవత్సరానికి ఒకసారి కదా. ఓ రెండు మూడొందలు అంత సమస్య కూడా కాదే)

**Hemanth:** Opinions differ. Well what about the other things?
ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి. మిగతా విష యాల సంగతి ఏంటి?

Opinion- అభిప్రాయం.
differ - భేదిస్తాయి.

**Vasanth:** Well, we all had new clothes. Told you, dad was quite liberal this time. He was in a mood to celebrate. He let us buy whatever clothes we liked, and sister had the greatest luck. She had a pair of ear rings.
అందరం కొత్త బట్టలు కొనుక్కున్నాం. చెప్పా నుగా మానాన్న చాలా ఉదారంగా ఉన్నారు. మేం ఇష్టపడిన బట్టలన్నీ తీసుకొచ్చారు. పండగ mood లో ఉన్నారు. అందరికంటే మా చెల్లి అదృష్టవంతురాలు. కమ్మల జత వచ్చింది తనకు.

**Hemanth:** We had new clothes too and of course the feast too. Mom prepared wonderful dishes and delicious sweets.
మేమూ కొత్త బట్టలు తెచ్చుకున్నాం. పండగ భోజనానికి మా అమ్మ మంచి వంటకాలు, రుచికరమైన స్వీట్స్ కూడా చేసింది.
Feast పండగ భోజనం/ విందు.
dishes = డిషిజ్ (జ్-size లో z లా)

**Vasanth:** That's good.

ఈ సంభాషణ పండగ గురించి కదా. పండగల సంద ర్భంగా వాడే expressions కొన్ని తెలుసుకుందాం ఈసారి.

Festival = పండగ, పండగ జరుపుకోవటం = celebrate a festival.

We celebrate Deepavali every year in the month of Kartheekam.
ప్రతి సంవత్సరం కార్తీకమాసంలో దీపావళి జరుపుకుంటాం.
Festivalను enjoy కూడా చేస్తాం - We enjoy a festival.

**Charlie (over phone from the US):** Hello Sampath, this is Charlie from the states. How are you?
(హలో సంపత్ , నేను అమెరికా నుంచి ఛాలీ మాట్లా డుతున్నా. ఎలా ఉన్నావు? )

**Sampath:** Fine, Charlie, thank you, how are you?
(బాగున్నాను ఛాలీ. ధన్యవాదాలు. నీవు ఎలా ఉన్నావు? )

**Charlie:** Same here, thank you. Can we have a chat over the net ? Matter of 20 to 30 minutes
(ఇంటర్‌నెట్‌లో మనం మాట్లాడుకుం దామా? 20, 30 నిమిషాలు పట్టవచ్చు.)

**Sampath:** Sorry, Charlie. It is morning here you know. I am very busy celebrating Sri Ramanavami.
(సారీ.. శ్రీరామనవమి సెలబ్రేట్ చేసుకుంటూ నేను చాలా బిజీగా ఉన్నా ఇప్పుడిక్కడ ఉదయం.)

**Charlie:** What's Sri Ramanavami, sampy? What's its significance?
(శ్రీరామనవమి అంటే ఏమిటి? దాని ప్రాము ఖ్యం ఏమిటి? )

**Sampath:** It's an important festival for us in India. We celebrate the birth of lord SriRama on the occasion.
(ఇండియాలో ఇది చాలా ముఖ్యమైన పండగ. శ్రీరాముడి పుట్టిన రోజును పండగగా జరుపుకుంటాం)

Occasion = అకేయ్‌జన్-కే నొక్కిపలకాలి.
జ, vision లో జన్‌లాగ = సందర్భం.

**Charlie:** How do you celebrate it?
ఎలా జరుపుతారు?

**Sampath:** We offer worship to Lord Sri Rama by performing Pooja. We do it at home and in temples too. We do it special pandals put up at street corners as well.Then we eat a good feast too with special dishes. Greengram soaked in water and jaggery water are the offerings to Lord Rama.
పూజ చేసి శ్రీరాముణ్ని కొలుస్తాం. ఇళ్లల్లో, గుళ్లల్లో, వీధులకూడళ్లల్లో కూడా. ప్రత్యేక వం టకాలతో భోజనం చేస్తాం. వడపప్పు, పానకం శ్రీరాముడికి నైవేద్యం పెడతాం.

Pandal = పందిరి
putup = ఏర్పాటు చేయటం/నిర్మించటం
as well = కూడా
(Green gram = పెసలు/పెసరపప్పు (వడపప్పు)
jaggery = బెల్లం
offering = నైవేద్యం
feast = విందు / పండగ భోజనం

**Charlie:** Well, have a happy time, then call you later.
(అయితే సంతోషంగా గడుపు. మళ్లీ ఫోన్ చేస్తా.)

పై సంభాషణంతా పండగల గురించే కదా. దీనికి సంబం ధించిన కొన్ని expressions గురించి తెలుసుకుందాం.

పండగ = festival

Deepavali, Vinayaka Chavithi, Ramzon, Christmas -ఇవన్నీ festivals.

పండగ జరుపుకోవటం = celebrate a festival.

We enjoy a festival=మనం పండగను సంతోషంగా జరుపు కుంటాం.

బాణసంచా=fireworks.
పేలే టపాకాయలు = crackers;
వెలిగే టపాకాయలు= sparklers

In a mood to celebrate = in a celebration mood =వేడుకగా జరిపే మనస్థితి.

Pakistan was in a mood to celebrate = Pakistan was in a celebration mood
పాకిస్తాన్ వేడుక (వాళ్ల విజయాన్ని) జరుపుకునే moodలో ఉంది.

❏ Let's not stop him. He is in a celebration mood
అతడు సంబరంలో ఉన్నాడు. వాడిని ఆపొద్దు.

Sparklers, crackers పేల్చటం = Let off fireworks
టపాకాయల వత్తి = fuse
( Light the fuse = వత్తి వెలిగించటం)
పేలటం = explode / blow/ go of =
(with a loud sound/noise)

Explode పెద్దపెద్ద పేలుళ్లకు వాడతాం.
blow = పేలుళ్ల వల్ల అయ్యే ధ్వంసం.
'go off' = టపాకాయలకు సరిపోతుంది.
Feast = విందు (సామూహికంగా) పండగ విందు
Dishes = వంటకాలు/ పాత్రలు
Chat over the net = నెట్ సంభాషణ
ప్రాముఖ్యం = significance = సిగ్నిఫికెన్స్
Significance of a festival = పండగ ప్రాముఖ్యం.
పండగ సంబరాలు = festivities

a) The festivities of Dasara last for 9 days
దసరా సంబరాలు 9 రోజులు జరుగుతాయి.

b) The Festivities are keeping us busy
పండగ వేడుకలు మనల్ని బిజీగా ఉంచుతాయి.

పండగ ఉత్సాహం = The enthusiasm for a festival

❏ We celebrated Deepavali with enthusiasm
మేం దీపావళి ఉత్సాహంతో గడుపుకున్నాం.

❏ పండగ ఒక రోజురావడం
The festival is / falls on a day.

**a)** This year the festival falls on a Sunday/ is on a Sunday.
ఈ సంవత్సరం పండగ ఆదివాం అవుతుంది/ఆదివారం రోజున.

**b)** Last year it fell on a Wednesday
గత ఏడాది అది బుధవారం వచ్చింది.

**Now Practise the following:**

**a)**

**Sunil:** ఎక్కడ్నించి వస్తున్నావు, అనిల్?
**Anil:** శ్రీరామనవమి పందిరి నుంచి. అక్కడ దేవుడి అలకరణ చాల బాగుంది.
**Sunil:** అయితే నేను కూడా వెళ్ళి చూడనా?
**Anil:** ఇంతవరకు ఏం చేస్తున్నావు?
**Sunil:** ఇంట్లో పూజ ఇపుడే అయింది. కాస్త వడపప్పు, పానకం తీస్కుందువు రా.
**Anil:** సరే. ఆ తర్వాత నువ్వు పందిరి నుంచి ఇంటి కెళ్లేపుడు మా ఇంటికిరా.
**Sunil:** ఒకే.

**b)**

**Prem:** ఏంటి? నీ చెయ్యికేమయింది?
**Syam:** నిన్న టపాకాయలు పేల్చేటపుడు ఒకటి నా చేతి లోనే పేలింది. దాని వత్తి చాల పొట్టిగా ఉంది.
**Prem:** చేయి బాగా కాలిందా?
**Syam:** అరచేయి, రెండు వేళ్ల బాగా కాలాయి. డాక్టర్ దగ్గరకెళ్తే కట్టు కట్టాడు.
**Prem:** బాగా బాధగా ఉందా?
**Syam:** అంతగా లేదు.
**Prem:** కుడి చేయి కదా. పండగ విందు ఎలా తిన్నావు?
**Syam:** ఆ బాధలో అవన్నీ మర్చిపోయా. ఇంటికొచ్చేసరికి రాత్రి 12 అయింది.

**Answers:**

**a)**

**Sunil:** Where are you coming from Anil?
**Anil:** From the Sri Ramanavami pandal. The decorations are really beautiful.
**Sunil:** Shall I go and see too.
**Anil:** What have you been doing so far?
**Sunil:** We have just finished the puja at home, come in and have some vadapappu and panakam.
**Anil:** Ok. On your way back from the pandal come to my home.
**Sunil:** Ok

**b)**

**Prem:** Hi Syam, What is wrong with your hand?
**Syam:** While letting off crackers yesterday, one of them went off in my hand. It had a short fuse.
**Prem:** Are the burns very bad? (burns = కాలిన గాయాలు)
**Syam:** The palm and two fingures. Doctor bandaged / dressed the injuries.
**Prem:** Is it paining a lot?
**Syam:** Not so bad now.
**Prem:** It's your right hand. How could you eat?
**Syam:** I forgot all that in the pain by the time I came back home it was 12 midnight.

స్పోకెన్ ఇంగ్లిష్ పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Navya:** Hi Sreya, any idea when we are starting for the picnic spot tomorrow?
(రేపు మన Picnic చోటుకెప్పుడు బయల్దేరాలో ఏమన్నా idea ఉందా? )

Spot = చోటు

**Sreya:** None, dear. Divya must be able to tell us. She is making the arrangements.
(తెలియదు. దివ్య మనకు చెప్పగలదు. తనే ఏర్పాట్లు చేస్తోంది కదా)

**Navya:** I called her home. Her mom told me she was out. Must be busy with arrangements.
(వాళ్ళ ఇంటికి Phone చేశాను. బయటికెళ్ళిందని వాళ్ళమ్మ చెప్పింది. బాగా busyగా ఉండుండాలి మరి)

**Sreya:** Let's ring up Kavya. Divya is taking kavya's help. So Kavya should be knowing about Divya. She should be able to tell us where Divya is. (మనం కావ్యకు Phone చేద్దాం. దివ్య, కావ్య సహాయం తీసుకుంటోంది. కాబట్టి దివ్య గురించి కావ్యకు తెలిసుండొచ్చు. దివ్య గురించి కావ్యే చెప్పగలగాలి.)

**Navya:** Kavya should know at least the time of starting.
(Start అయ్యే time అయినా కావ్యకు తెలిసుండాలి)

**Sreya:** That's right. Let's ring her up.
(కరెక్టే Phone చేద్దాం ఉండు)

**Navya:** Let's wait. They will call us and tell us. We must be there for the picnic after all.
(కాస్త ఆగుదాం. వాళ్ళే మనకు Phone చేసి చెప్తారు. picnic జరిగేందుకు మనం ఉండాలి కదా.)

**Sreya:** OK. I must be going. Bye.
(నే వెళ్ళాలి మరి. Bye)

**Navya:** Bye

గత కొన్ని lessons లో must, should అర్థాలు, ఉపయోగాలు తెలుసుకున్నాంగదా. వాటిని ఓసారి సంగ్రహంగా గమనిద్దాం.

Must, have to/ has to, should-

1) ఈ మూడు కూడా అర్థంలో వాడుకలో చాలా దగ్గరగా ఉంటాయి.
2) మూడు కూడా commands (ఆజ్ఞలు), duty (విధి), necessity (అవసరం), Obligation ను తెలుపుతాయి. warnings (హెచ్చరిక)లను కూడా తెలుపుతాయి.
3) Must, should మనం కచ్చితం అనుకుంటున్న, అనుకునే విషయాలను చెప్పటానికి వాడతాం.

**Bhavan:** Hi Sravan, When are you leaving for Kashmir?
(నీవెప్పుడు కాశ్మీరుకు బయలుదేరుతున్నావు? )

**Sravan:** The coming Friday.
(వచ్చే శుక్రవారం)

**Bhavan:** That's just two days off. You must be busy making arrangements because you are going to be there for a few weeks. Kashmir must be quite cold now. Carry enough warm clothing. Pavan is also joining you, isn't he?
(ఇంక రెండురోజులే. ఏర్పాట్లతో చాలా busyగా ఉండుంటావు కచ్చితంగా; కొన్ని వారాలుండబోతున్నావు. కాశ్మీరు బాగా చలిగా ఉండాలిప్పుడు. Pavan కూడా నీతో వస్తున్నాడు కదా? )
(Carry enough warm clothing = చాలినన్ని వెచ్చటి బట్టలు తీసుకెళ్ళు.)

**Sravan:** Yes, He should be on the way because he has to be here this evening.
(అవును. ఈ సాయంత్రానికల్లా ఇక్కడుండాలి కాబట్టి అతడు దారిలో ఉండుండాలి.)

ఈ సంభాషణలో Must be, should be తో Expressions గమనించండి.

1) You must be busy = నువ్వు busyగా ఉండాలి.
(Bhavan కచ్చితం అనుకునే విషయం)
2) Kashmir must be quite cold now
ఇప్పుడు కాశ్మీర్ బాగా చలిగా ఉండాలి. (ఇది కూడా Bhavan కచ్చితం అనుకునే విషయం)
3) He should be on the way
అతడు దారిలో ఉండాలి. (ఇది కచ్చితం అనుకునే విషయం.)

ఇలాంటి సందర్భాల్లో must, should వాడతాం. ఈ సందర్భాల్లో have to/ has to వాడం.

ఇప్పుడు ఈ lesson లోని మొట్టమొదటి dialogue మరోసారి చూడండి. అందులో must తో, should తో ఉన్న expressions.

1) Divya must be able to tell us.
2) Must be busy with arrangements.
3) Should be knowing.
4) Should be able to tell us.

వీటిల్లో (1), (2) మనం కచ్చితం అనుకునే విషయాలను తెలుపుతున్నాయి.

(3), (4) ఒకరుండే పరిస్థితుల్లో వాళ్ల నుంచి మనం ఆశించే విషయాలను తెలుపుతున్నాయి కదా. ఇదీ must కు,should కు ఇంకో ఉపయోగం.




# We ought to respect elders

**a) Bharat:** Why did India lose the match?
(India ఎందుకు ఓడిపోయింది? )

**Lakshman:** Ask Dravid about it. He is the captain. He must know.
(ఆ విషయం ద్రావిడ్‌ను అడుగు. ఆయన captain కదా. ఆయనకే తెలియాలి.)

అంటే Dravid, captain కాబట్టి, ఓటమికి కారణాలు ఆయన్నుంచి ఆశించడం

**Kumar:** How is the financial position of India?
(భారత్ financial position = ఆర్థిక పరిస్థితి ఎలా ఉందంటావు? )

**Saradhi:** How do I know? The finance minister should be able to tell you.
(నాకేం తెలుసు. నీకు ఆ విషయం Finance Minister చెప్పగలడు)

ఇలాంటి uses have to/ has to కు లేవు.

**Maithri:** Hi Meghana, what brings you here?
(ఏంటిలావచ్చావు? )

**Meghana:** I need your help. (నీ సాయం కావాలి.)

**Maithri:** Regarding? (దేని విషయం)

**Meghana:** I wasn't very polite to our lecturer yesterday. I am sure my words hurt him
(నిన్న మన lecturer పట్ల మర్యాదగా ప్రవర్తించలేదు. నా మాటలు ఆయన్ని కచ్చితంగా గాయపరిచాయనుకుంటున్నా.

hurt = గాయపరచటం.

**Maithri:** Meghana, not the first time for you to be rude to elders.
(పెద్దవాళ్ళపట్ల అమర్యాదగా ఉండటం నీకిదేం మొదటిసారి కాదు కదా.)
You ought to know manners. (నీకు manners తెలియాలి/ నువ్వు manners తెలుసుకోవాలి.)

**Meghana:** Yes, I ought to be careful how I talk to elders. I ought to respect elders.
(అవును. పెద్దవాళ్ళతో మాట్లాడేటప్పుడు నేను జాగ్రత్తగా ఉండాలి. పెద్దవాళ్లను గౌరవించాలి.)

**Maithri:** We ought to remember who we talk to when we talk to elders. So what do you want me to do now?
(పెద్దవాళ్ళతో మాట్లాడేటప్పుడు ఎవరితో మాట్లాడుతున్నామో గుర్తుంచుకోవాలి. అయితే ఇప్పుడు నన్నేంచేయమంటావు? )

**Meghana:** I want to apologize to him. Won't you come with me?
(నేనాయనకు క్షమాపణ చెప్పాలనుకుంటున్నాను. నువ్వు నాతో రావా?

Apologize = అపాలజైజ్- పొ నొక్కి పలుకుతాం. చివర 'జ్' size లో Z లాగ - అర్థం- క్షమాపణ కోరటం Apology = అపాలజి = క్షమాపణ)

**Maithri:** Let's hurry then. I ought to be back soon. None to attend on my sick mother.
(త్వరగా వెళ్దాం పద. నేను మళ్లీ వెంటనే వెనక్కి రావాలి, మా అమ్మను చూసుకునేందుకు- ఆమె ఒంట్లో బాగా లేదు.)


M. SURESAN

ఈ సంభాషణలో ought to వాడాంకదా. Ought to అన్నా కూడా, must, should లాగానే, ఉండాలి, చేయాలి అనే అర్థం వస్తోంది కదా. అయితే కొంత తేడా- చాలా ముఖ్యమైన తేడా ఉంది. ముందు అర్థం చూద్దాం-

a) ought to be ('be' form) = ఉండాలి
b) ought to go, ought to respect, ought to know- ought to + 1st RDW- action word= వెళ్లాలి, గౌరవించాలి, తెలుసుకోవాలి, etc.

ఈ అర్థంతో must, should, have to/ has to లకు ought to సమానమే. అయితే ought to అన్నప్పుడు ఆజ్ఞలు, నిబంధనలు, విధులు, అవసరాలవల్ల కాకుండా మనం నీతి ప్రకారం ఉండవలసిన స్థితి, చేయవలసిన పనులు తెలుపుతాయి. అంటే నైతిక బాధ్యతలు (Moral obligations).

పై సంభాషణలో ought to ఉపయోగించి చూడండి:

1) You ought to know manners
నువ్వు manners తెలుసుకోవాలి.
(తెలియకపోతే మనల్నెవరూ శిక్షించరు- కానీ తెలుసుకోవటం మన నైతిక బాధ్యత.)

2) I ought to be careful how I talk to elders
పెద్దవాళ్లతో మాట్లాడేటప్పుడు నేను జాగ్రత్తగా ఉండాలి. (ప్రవర్తనా బాధ్యత)

3) We ought to remember who we are talking to
ఎవరితో మాట్లాడుతున్నామో గుర్తుంచుకోవాలి. (ప్రవర్తనా బాధ్యత)

4) I ought to be back early to attend on my sick mother
జబ్బుతో ఉన్న మా అమ్మను చూసుకోవటానికి త్వరగా తిరిగి రావాలి. (నా నైతిక విధి/ బాధ్యత)

ఇది ought to కు సంబంధించిన విషయం, మళ్లీ చూడండి.

a) పెద్దవాళ్లను గౌరవించాలి
You ought to respect elders.

b) అమాయకులను సానుభూతితో చూడాలి.
You ought to sympathize with innocent people.)

(Sympathy = సింపతి. 'సిం' నొక్కి పలుకుతాం = సానుభూతి. Sympathize with = సింపథైజ్- జ్ size లో Z లాగ. సానుభూతి చూపటం. innocent = ఇనసంట్- ఇ నొక్కి పలుకుతాం = అమాయకులైన).

c) You ought not to talk to your father like that
మీ నాన్నతో అలా మాట్లాడకూడదు నువ్వు (సరైన ప్రవర్తన కాదు)

**NOW PRACTISE THE FOLLOWING IN ENGLISH:**

**Prabha:** Hi Subha, file no. 10 ఎక్కడుంది?

**Subha:** శేఖర్నడుగు. అతడికి తెలియాలి. నిన్న సాయంత్రం అది ఆయన table మీద ఉంది.

**Prabha:** శేఖర్ ఎక్కడ?

**Subha:** 5 నిమిషాల క్రితం Manager గదిలోకి వెళ్లాడు. అక్కడే ఉండాలి మరి.

**Prabha:** దాన్లో పోయినవారం అమ్మకాల వివరాలున్నాయి కదా?

**Subha:** నీకు తెలియాలి అది. అమ్మకాల విషయాలు చూసేది నువ్వే కదా?

**Prabha:** ఏంటి అంత నీరసంగా ఉన్నావు?

**Subha:** Office పనీ, ఇంటి పనీ బాగా అలసట కలిగిస్తున్నాయి.

**Prabha:** చాలా Weak గా కనిపిస్తున్నావు. వెంటనే doctor ని చూడాలి నువ్వు. నీ ఆరోగ్యం విషయంలో జాగ్రత్త తీసుకోవాలి కదా? మీ ఆయన ఇంటి పనిలో కొంత సాయం చేయాలి కదా?

**Subha:** ఆయనకు office పనే సరిపోతుంది.

**Prabha:** Doctor దగ్గరకయినా తీసుకెళ్లాలి కదా?

**Subha:** ఇవాళ తీసుకెళ్తానన్నారు.

**ANSWER:**

**Prabha:** Hi Subha, any idea where file no. 10 is?/ Do you know where file no. 10 is?/ Where is file no 10?

**Subha:** Ask Sekhar about it. He should know / must know. The file was on his table last evening.

**Prabha:** Where is Sekhar?

**Subha:** He went to the manager's room 5 minutes ago. He must be there now.

**Prabha:** Why are you so weak?

**Subha:** The work at office and at home is very tiring/ is tiring me.

**Prabha:** You look very weak/ run down. You ought to see a doctor immediately. You ought to take care of your health. Your husband ought to help you in the work at home.

**Subha:** His office work takes his whole time.

**Prabha:** He ought to take you atleast to the doctor.

**Subha:** He said he would take me today.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# You need not spend so much

**Dinakar:** Where did you buy those fruits yesterday? They were quite fresh and sweet.
(నిన్న ఆ పండ్లు ఎక్కడ కొన్నావు? చాలా తాజాగా తీయగా ఉన్నాయి అవి)

Fresh - తాజా. (Opp: Stale/ rotten stale. నిల్వ ఉన్న (ముఖ్యంగా వండినవి); rotten - మురిగిపోయిన, కుళ్లిపోయిన. stale - స్టెయిల్, rotten - రాటన్ - తిట్టుపదం కూడా. These rotten movies (చెత్త movies)/ rotten fellow మనిషిని తిట్టడం, వినివిని విసిగిపోయిన jokes - stale jokes.

**Madhukar:** Why are you asking? Do you need fruits now?
(ఎందుకడుగుతున్నావు? ఇప్పుడేమన్నా పండ్లు అవసరమా నీకు?)

**Dinakar:** Yea. I need some to present to my uncle. You bought them at Sarvam Super Market, didn't you?
(అవును. మా uncle కు పండ్లు present చేద్దామనుకుంటున్నా. అవి నువ్వు 'సర్వం' Super Market లో కొన్నావు కదా?

**Madhukar:** No. That's very far off. You need not go that far. If fruits are what you need, there's a good fruit shop nearby. I bought them there.

**Dinakar:** How costly are they? Perhaps you bought them at Rs.70 a dozen.
(వాటి ఖరీదెంత? dozen 70 రూపాయల ప్రకారం కొన్నావేమో కదా? )

**Madhukar:** No. You need not spend so much. They are quite cheap there.
(అంత పెట్టనవసరంలేదు. అవి చాలా చవక ఆ shop లో)

**Dinakar:** Will you show me the shop?
(ఆ shop చూపిస్తావా? )

**Madhukar:** You don't need my help, old boy. Walk along this way and turn right. You find 'Sufala' fruit shop. That's it.
(నా సాయం అక్కరలేదు. ఇటువైపు వెళ్లి కుడిపక్కకు తిరుగు. ఆ shop కనపడుతుంది)

**Dinakar:** OK, bye

**Madhukar:** OK.

ఈ సంభాషణలో అంతా need తో ఉన్న expressions ఎక్కువ ఉన్నాయి కదా. Need అర్థాలూ, వాడకం తెలుసుకుందాం ఈ lesson లో.

1. Do you need fruits now?
2. I need some
3. You need not go that far.
4. You need not spend so much
5. You don't need my help

మనందరికీ తెలుసు. need అంటే అవసరం అని, కావాలి అనే అర్థం వచ్చే అవసరం అని.

1. Do you need fruits now?
నీకిప్పుడు పండ్లు అవసరమా? (కావాలా? )
2. I need some
నాకు కొన్ని అవసరం/ కావాలి
3. You don't need my help
నా సాయం నీకవసరంలేదు/ అక్కరలేదు

పై సందర్భాలన్నింటిలో need అంటే అవసరం/ కావాలి, అంటే 'అక్కరలేదు'కు వ్యతిరేకంగా

a) I need your help
నీ సాయం నాకవసరం (కావాలి)

b) She doesn't need any body's help
ఆమెకెవరి సాయం అక్కర్లేదు
X She needs every body's help
ఆమెకందరి (ప్రతివారి) సాయం అవసరం (కావాలి)

c) Animals need oxygen
జంతువులకు oxyzen అవసరం.

d) He doesn't (does not) need any more money
అతనికంతకంటే డబ్బు అక్కరలేదు.

e) ఆమెకేం అవసరం (ఏం కావాలి? )
What does she need?

f) వాడికి Rs.100/- కంటే ఎక్కువ అవసరం లేదు.
He doesnot need more than Rs. 100/-

వీటన్నిటిలో verb, need/ needs కదా?

ఈ sentences లో need ఉపయోగానికి, పై conversation లోంచి తీసిన sentences (3) and (4) లో need వాడకానికి తేడా చూద్దాం.

3) You need not go that far
అంత దూరం వెళ్లక్కర్లేదు.

4) You need not spend so much
అంత ఖర్చు పెట్టక్కర్లేదు.


M. SURESAN

3) లో verb need go - need + 1st regular doing word

4) లో verb need spend - need + 1st regular doing word

Need + 1st regular DW (మామూలుగా not తోనే వస్తుంది) verb అయితే, I RDW ను బట్టి అర్థం ఉంటుంది. (Need not go = వెళ్లక్కర్లేదు)

Need not spend = ఖర్చు పెట్టక్కర్లేదు

You need not be here
(ఇక్కడ verb - need be - ఇది be form - ఉండక్కరలేదు (not తో)

ఇది need కు రెండో ఉపయోగం.

మొదటిది - need ను independent గా వాడొచ్చు

రెండోది- need + 1st RDW (మామూలుగా not తో).

[ You need not go =
You don't need to go అనవచ్చు

[ She need not sing =
She does not need to sing అనవచ్చు

ఇంకో విషయం:

**Karuna:** Must you go now?
(నువ్వు వెళ్ళాలా? ఇప్పుడు? )

**Aruna:** I need not go. It's enough if I call
(నేను వెళ్ళక్కరలేదు. Phone చేస్తే చాలు.

**Karuna:** You should go tomorrow at least
(కనీసం రేపైనా వెళ్లాలి నువ్వు)

**Sumana:** No, she need not go tomorrow either
(రేపు కూడా వెళ్లనక్కరలేదు)

**Karuna:** She has to be there at least the day after (tomorrow)

**Sumana:** No, I tell you, she need not be there on any day.
(ఎప్పుడూ అక్కడ ఉండక్కర్లేదు)

ఈ conversation లో must/ should/ has to ఈ మూడింటికి అర్థం- ఏదైనా చేయాలి/ ఉండాలి అని. Need not be అన్నప్పుడు opposite meaning వస్తోందికదా చేయనక్కర్లేదు అనే అర్థంతో. ఇది ముఖ్యం.

a) She has to be there X She need not be there

b) I must know it X You need not know it
(నేనది తెలుసుకోవాలి) X నువ్వు తెలుసుకోనవసరంలేదు

c) Have I to go? X You need not go
(వెళ్లాలా X అక్కర్లేదు)

[a) You must go - నువ్వు వెళ్లాలి.
b) You must not go - నువ్వు వెళ్లకూడదు
c) You need not go - వెళ్ళనవసరంలేదు

b) కి, c) కి తేడా చూడండి. అదే విధంగా should కూ, have to/ has to కూ కూడా వస్తుంది.]

Need గురించి మనం తెలుసుకున్న points.

1) Need ను independent గా ఒక్కటిగా వాడితే కావాలి అనే అర్థంతో అవసరం అనే భావం వస్తుంది.

2) Need + 1 st RDW (మామూలుగా not తో)- ఆ I RDW తో చెప్పేపని చేయక్కర్లేదు అని అర్థం.

3) She need not go లాంటి sentences లో need not go బదులు - don't/ doesn't need to go వాడవచ్చు

4) Need + 1 st RDW (not తో) must/ should/ have to/ has to కు వ్యతిరేకం

Need + infinitive (to + 1 st RDW) కూడా వాడతాం.

a) You don't need to go now
ఇప్పుడు వెళ్ళాల్సిన అవసరం లేదు.

b) She needs to be there at least for an hour
కనీసం ఓ గంటైనా ఆమె అక్కడ ఉండటం అవసరం.

c) I need to go home now
నేను వెళ్లాల్సిన అవసరం ఉంది.

**NOW PRACTISE THE FOLLOWING IN ENGLISH:**

**a) Padma:** Hi Kamala, కాస్త Karuna Phone Number ఇస్తావా? తనతో urgent గా మాట్లాడాల్సిన అవసరం ఉంది నాకు.

**Kamala:** దేని గురించి?

**Padma:** నువ్వు తెలుసుకోనవసరం లేదులే

**Kamala:** నీకెందుకవసరం తన number?

**Padma:** తన దగ్గర నుంచి ఓ ముఖ్యమైన సమాచారం అవసరం (కావాలి) నాకు. చెప్పు, తనకు నేను Phone చేయాల్సిన అవసరం ఉంది.

**Kamala:** నువ్వు worry కానవసరం లేదు. తన Phone number కూడా అవసరం లేదు, ఆమె పక్క గదిలోనే ఉంది. వెళ్లి మాట్లాడు.

**b) Krupakar:** వాడిప్పుడు బయల్దేరాలి మరి.

**Dayakar:** వాడసలు వెళ్లక్కర్లేదు

**Krupakar:** ఎందుకని?

**Dayakar:** నేను వాడ్ని కొన్ని పుస్తకాలు తెమ్మన్నాను. ఆ పుస్తకాలిక్కడ ఉన్నాయ్. అవి కూడా ఇప్పుడంత అవసరం లేదు నాకు.

**Krupakar:** అవి నాకు అవసరం. చూపించు. వాటిని నేను చూడాలి.

**Dayakar:** నువ్వేం చూడక్కరలేదిప్పుడు. రేపు చూడు.

**ANSWERS:**

**a) Padma:** Hi Kamala, let me have Karuna's phone number. I must/ I need to talk to her urgently.

**Kamala:** What about?

**Padma:** You need not know it./ You don't need to know it.

**Kamala:** Why do you need her number?

**Padma:** I need some important information from her. Tell me (her number). I need to phone to her.

**Kamala:** You needn't worry. You don't need her phone number either, she is in the next room. Go talk to her.

**b) Krupakar:** He must start now, mustn't he?

**Dayakar:** He need not go.

**Krupakar:** Why?

**Dayakar:** I told him to get some books. They are (available) here. I don't need them even now either.

**Krupakar:** I need them. Let me see them. I must see them.

**Dayakar:** You need not see them now. See them tomorrow.

**ప్రశ్న:**

*Rama could have done that work*
*Rama could haven't done that work*
ఈ రెండింటికీ ఎన్ని అర్థాలున్నాయో తెలపండి. *Would, could* ఉపయోగాలు అన్నీ రాయండి.
*He might have done the work* – అంటే ఏమీ చెయ్యలేదనా? చేసి ఉండకపోవచ్చనా?
*He may have done* కి *might / would* కి *may* స్థానంలో ఏ అర్థాలున్నాయో తెలపండి.

**– ఎస్. రాము, తెనాలి**



**జవాబు:**

**1.** Rama could have done that work
Rama ఆ పనిని చేసిఉండగలిగేవాడే కానీ చేయలేదు.

**2.** Rama could haven't done that work
దీనికి correct form, Rama couldn't have done that work. దీని అర్థం, Rama ఆ పనిని చేసి ఉండగలిగేవాడు కాదు. కాని చేశాడు అని.

ఇవే వీటికి ఉన్న అర్థాలన్నీ.

**1)** రాముడు ఆ పనిని చేసి ఉండవచ్చు
Rama might have done that work.
§ రాముడు ఆ పని చేసి ఉండాల్సింది (కాని చేయలేదు)
Rama should have done that work.
§ రాముడు ఆ పని చేశాడు
Rama has done that work.

**2)** చేసి ఉండడు, (కానీ చేశాడు)
Rama wouldn't have done it.
§ చేసి ఉండాల్సింది కాదు, కానీ చేశాడు
He shouldn't have done it.
§ చేయలేకపోయాడు
Rama could not do it.
§ He may have/ might have done
చేసి ఉండవచ్చు

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# Need I go there now?

**Ranjit:** Sanjai, we need to be careful.
(మనం జాగ్రత్తగా ఉండాల్సిన అవసరం ఉంది.)

**Sanjai:** What about?
(దేని గురించి?)

**Ranjit:** About the way we are spending money.
(మనం డబ్బు ఖర్చు చేస్తున్న విషయం.)
We have to manage with this money till the month end.
(ఈ డబ్బుతో నెలాఖరు వరకూ గడపాలి.)
We need an extra Rs. 500/- for the book I need.
(నా కవసరమైన పుస్తకానికి అదనంగా Rs. 500 అవసరం).

**Sanjai:** That's true. But you need not worry. I called Dad yesterday and told him to send us Rs. 1000. He is sending it. We'll get it in a day or two.
(నిజమే, కాని నువ్వు worry అవనక్కరలేదు. నిన్ననే నాన్నకు phone చేసి ఓ వెయ్యి రూపాయలు పంపమన్నా. ఒకటి రెండు రోజుల్లో (డబ్బు) వస్తుంది.)

**Ranjit:** I have to pay for the tuition I am taking.
(నేను తీసుకుంటున్న tuition కు కూడా fees కట్టాలి కదా?)

**Sanjai:** Do you need (to) continue the tuition?
(Tuition continue చేయటం అవసరమా?)

**Ranjit:** I need not continue.
(అవసరం లేదు)

**Sanjai:** Then stop it. You need to understand that if you continue to attend tuitions, you don't have the time to study.
(అయితే ఆపెయ్యి. ఇలా tuitions కు వెళ్తూ ఉంటే నీకు చదవటానికి time ఉండదని అర్థం చేసుకోవాలి (చేసుకోవాల్సిన అవసరం ఉంది).
You don't need it any more.
(నీకదింక అవసరం లేదు.)

ఈ సంభాషణ need గురించే కదా? మనం కిందటి lessons లో need ఉపయోగాలు కొన్ని తెలుసు కున్నాం. మరికొన్ని చూద్దాం.

Need ను independent గా వాడతాం; ఇతర verbs తో కలిపీ వాడతాం.

**I.** Need ను independent గా వాడితే, అవసరం ఉండటం, అవసరమవటం అనే అర్థం వస్తుంది, కదా?

**1)** We need an extra Rs. 500/-
మనకు అదనంగా 500 రూపాయలు అవసరమవుతాయి (కావాలి)

**2)** You do not need it any more.
నీకు అదింక అవసరంలేదు.

**c)** They will need it when they are there.
వాళ్ళక్కడున్నపుడు వాళ్ళకది అవసరం అవుతుంది.

**d)** Kumar needed some money yesterday.
Kumar కు నిన్న కొంత డబ్బు అవసరమైంది.

ఈ sentences అన్నింటిలో need ను ఇతర verbs combination లేకుండా independent గా వాడాం.


M. SURESAN

**II.** Need ను మనం ఇతర verbs తో కలిపి కూడా వాడతాం. అపుడు ఆ verbs తెలిపే పనిచేయనవసరంలేదని అర్థం. ఈ use ఎక్కువ not తో వస్తుంది, లేదా question form లో ఉంటుంది.

**a)** I need not be there now
అక్కడ ఇప్పుడు నేనుండనవసరంలేదు.
(verb - need + be)

**b)** She need not come
ఆమె రానవసరంలేదు.
(verb - need come)

**c)** Need I go there now?
నేనక్కడికి ఇప్పుడు వెళ్లటం అవసరమా?

**look at the following sentences:**

**a)** I need your help
నీ సహాయం నాకవసరం

**b)** She needs some dresses.
ఆమెకు కొన్ని dresses అవసరం

ఇప్పుడు ఈ sentences ను చూడండి:

**a)** You need not go now.
(verb: need go; = నువ్వు వెళ్లనవసరంలేదు.)

**b)** She need not send any money now.
(verb: need send; ఆమె ఇప్పుడేం డబ్బు పంపాల్సిన అవసరం లేదు.)

**c)** I need not take advice from him
(verb: need take- నేను అతడి సలహా తీసుకోనవసరంలేదు)

ఈ sentences లో need ఇతర verbs తో combination తో వస్తోంది, ముఖ్యంగా not తో. Questions కూడా వస్తాయి.

**a)** Need I go there now?
(ఇప్పుడు నేను వెళ్లాల్సిన అవసరం ఉందా? verb - need go.)

**b)** Need you take so much trouble?
నువ్వంత trouble తీసుకోవాల్సిన అవసరం ఉందా?
- verb- need take.)

**III.** Need not అనటం, must, should, have to/ has to కు opposite అని కూడా తెలుసుకున్నాం.

ఏదైనా నిబంధనగా, ఆజ్ఞానుసారం, విధిగా, చేయటం మంచిది అని చేయాల్సి వస్తే/ ఉండాల్సి వస్తే, must/ should, have to/ has to వాడతాం కదా. దీనికి వ్యతిరేకంగా చేయనక్కరలేదు/ ఉండనక్కరలేదు అన్నప్పుడు, need not వాడతాం.

**a)** You must do it
(నువ్వు అది చేయాలి)
You need not do it.
(నువ్వు అది చేయనక్కరలేదు)

**b)** She has to be here at 10.
(10కి ఆమె ఇక్కడ ఉండాలి)
She need not be here
(ఆమె ఇక్కడ ఉండనక్కరలేదు.)

**ఇది గమనించండి.**

**a)** You must make Coffee for us
నువ్వు మాకు Coffee చేయాలి.

**b)** You must not make Coffee for us
నువ్వు మాకు Coffee చేయకూడదు.

**c)** You need not make Coffee for us.
నువ్వు మాకు Coffee చేయనక్కరలేదు.

b) కి c) కి తేడా చూడండి: b) కూడా, a) లాగా Command. c) Command కు opposite కదా. ఇదే should కు కూడా వర్తిస్తుంది.

**a)** He should do it
**b)** He should not do it
**c)** He need not do it

తెలుస్తోంది కదా, (a), (b) Commands. (c) opposite of (a). అయితే have to/ has to విషయంలో కాస్త తేడా. Have to/ has to కు not చేరిస్తే need not meaning వస్తుంది.

She has to be here
ఆమె ఇక్కడ ఉండాలి.
She doesn't have to be here
She need not be here
ఆమె ఇక్కడ ఉండనక్కరలేదు.

**(1) Tarun:** Varun, ఏంటి విశేషాలు?
**Varun:** నేను మల్లిక్‌ను వెంటనే కలుసుకోవాల్సిన అవసరం ఉంది.
**Tarun:** ఎందుకు?
**Varun:** అతడి దగ్గర నుంచి కొంత information అవసరం నాకు.
**Tarun:** దేని గురించి?
**Varun:** మేం వచ్చేవారం తిరుపతి వెళ్తున్నాం. అక్కడ దర్శనం విషయంలో అతడి help కావాలి.
**Tarun:** దానికైతే నువ్వు మల్లిక్ దగ్గరకెళ్లక్కరలేదులే. మా బాబాయి అక్కడ పనిచేస్తుంటారు. నేను నీకు సాయం చేయగలను.
**Varun:** ఆయన్ను ఎలా కలుసుకోవాలి నేను?
**Tarun:** నువ్వేం worry కానక్కరలేదు. అక్కడ ఆయన నీకు అవసరమైన సహాయం అంతా చేస్తారు.
**Varun:** అయితే మల్లిక్ దగ్గరనుంచి నేనేం Introduction letter తీసుకెళ్లనక్కరలేదు కదా?
**Tarun:** అవసరంలేదు. అక్కడికెళ్లిన్తర్వాత ఆయన నిన్ను ఎక్కడికి ఎప్పుడు రమ్మంటే అక్కడకు వెళ్లాలి నువ్వు. ఆయన కొద్దిగా కోపిష్టి.
**Varun:** అదేం పరవాలేదులే. అలాగే.

**(2) Sumanth:** Hi Sudheer, నీ సలహా అవసరం నాకు. నీకోసం వెతుకుతున్నా. నువ్వే కనిపించావు.
**Sudheer:** దేని గురించి? నా సలహా నీకు నిజంగా అవసరమైతే, తప్పకుండా ఇస్తా.
**Sumanth:** నేను bike కొనుక్కోవాలనుకుంటున్నా. Bike నాకు చాలా అవసరం ఇప్పుడు. second hand కొనుక్కోనా, కొత్తది కొనుక్కోనా?
**Sudheer:** అది నీ దగ్గరున్న డబ్బునుబట్టి ఉంటుంది కదా? నువ్వు భరించగలిగితే, కొత్తదే better కదా.
**Sumanth:** నాకు bank loan అవసరం, కొత్తది కొనాలంటే. Loan తెచ్చుకొనేందుకు కూడా నీ సాయం అవసరం.

## PRACTISE THE FOLLOWING IN ENGLISH

**Sudheer:** Worry అవనవసరం లేదులే. నేను కనుక్కొని ఈ సాయంత్రమే చెప్తా. నేను Phone చేస్తాలే.
**Sumanth:** నీవు చేయక్కర్లేదులే. నేనే చేస్తా.

**ANSWERS:**

**1) Tarun:** Hi Varun, What news?
**Varun:** I need to meet Mallik immediately.
(immediately = వెంటనే)
**Tarun:** Why?
**Varun:** I need some information from him.
**Tarun:** What about?
**Varun:** We are going to Tirupathi next week. We need his help in the matter of darsanam.
**Tarun:** If it is for that you need not go to Mallik. My uncle works there. I can help you.
**Varun:** How do I meet him?
**Tarun:** You need not worry at all. He will give you all help you need.
**Varun:** So I need not take any introduction letter from Mallik.
**Tarun:** No need. Once you go there you should be and you should go wherever and whenever he wants you to. He is a bit short tempered.
(Short tempered = త్వరగా కోప్పడే స్వభావం)
**Varun:** Don't you worry. OK.

**2) Sumanth:** Sudheer, I need your advice. I have been looking for you, I see you here now.
**Sudheer:** What's it about? If you really need my advice, you have it/ I will give it.
**Sumanth:** I want to buy a bike. I need a bike very badly now.
(need badly = చాలా అవసరం).
Shall I buy a second hand one or a new one?
**Sudheer:** Depends on the money you have. If you can afford it, have a new one.
(afford = అఫర్డ్ = పెట్టుకోగలగడం/ స్తోమత)
**Sumanth:** If I want to buy a new one, I have to take a bank loan. I need your help for that too.
**Sudheer:** Don't worry/ No need to worry. I will find out and call you this evening.
**Sumanth:** You need not. I'll call you.

### ఈసారి ఈ game practice చేయండి:

**He gave me advice -**

ఈ sentence నమూనాగా చేసుకుని ఎన్ని sentences, different subjects తో, different verbs తో, not తో, question form లో, dialogue form లో ఎన్ని frame చేయగలిగితే అన్ని చేయండి.

**eg: a)** Saritha showed me her chain.
**b)** Sunil did not give me the book
**c)** Why did they offer him the job?
**d) Mukesh:** Are you paying me the money now?
**Ganesh:** I am not promising you anything. I will try.
**Mukesh:** Send me the money tomorrow atleast.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# She used to sing well

**Harihar:** Hi Subhakar, do you know Murthy?
(నీకు మూర్తి తెలుసా? )

**Subhakar:** Of course. We Went to school together. We were the same class. We used to sit on the same bench too. We were together for three years at school.
(తెలియకపోవటమేంటి? మేం ఒకే school లో చదువుకున్నాం. Classmates. ఒకే bench మీద కూచునేవాళ్లం కూడా)

**Harihar:** I happened to meet him on train. He told me about you.
(నేనతడిని train లో కలుసుకున్నా. నీ గురించి చెప్పాడు.)

**Subhakar:** We are still in touch with each other. He joined a college in Hyderabad, and I stayed on here.
(ఇప్పుడు కూడా మేం ఒకరికొకరం touch లో ఉన్నాం. వాడేమో Hyderabad college లో చేరాడు, నేనిక్కడే ఉండిపోయా)

**Harihar:** Quite a nice fellow, isn't he?
(చాలా మంచి వాడు, కదా? )

**Subhakar:** Certainly. We used to be close. He used to help me in studies, especially in maths. He used to be very good at studies
(నిజమే. మేం చాలా సన్నిహితంగా ఉండే వాళ్లం. నాకు చదువులో ముఖ్యంగా maths లో సాయం చేసేవాడు. బాగా చదివేవాడు)

**Harihar:** He told me you used to play cricket very well. It seems you used to be the opener for your school team
(నువ్వు cricket చాలా బాగా ఆడేవాడివని చెప్పాడు. మీ school team కు నువ్వు opener గా ఉండేవాడివట కదా? )

**Subhakar:** Yes. I used to play, but not as well as Murthy has told you.
(నిజమే, నేనాడేవాడ్నే, అయితే మూర్తి చెప్పినంత బాగా కాదు)

**Harihar:** Why aren't you playing now?
(ఇప్పుడు ఎందుకాడటం లేదు? )

**Subhakar:** I used to find a lot of time to play at school. Now my concentration is on EAMCET. No time for games now.
(school లో చాలా time ఉండేది నాకు. ఇప్పుడు నేను EAMCET మీద concentrate చేస్తున్నా. Games కు time దొరకటం లేదు)

**Harihar:** I used to play shuttle regularly, but I gave it up after I joined college. Dad wont' let me play any game now.
(నేను shuttle ఆడేవాడిని. కానీ మానేశా, college లో చేరిన తర్వాత మా నాన్న ఒప్పుకోవటం లేదు)

**Subhakar:** That's right too. We cant' do two things at the same time. We have to choose between the two.
(అదీ నిజమే. ఒకేసారి రెండు పనులు చేయలేం కదా. ఏదో ఒకటి ఎన్నుకోవాలి.)

**Harihar:** Bye then. Time for me to go for my Physics tuition class.
(Physics tuition వెళ్లాలి నేను, వస్తా.)

**Subhakar:** Bye

ఈ dialogue లో ఈ expressions చూడండి.

1) We used to sit on the same bench.
2) We used to be close
3) He used to help me
4) He used to be very good at studies.
5) You used to be the opener
6) I used to play




ఇలాంటి భావాలను తెలపడానికి - used to వాడతాం. పై dialogue లో కూడా ఇలాంటి వాటికే used to వాడటం గమనించండి.

1) He used to help me
అతడు నాకు సాయం చేసేవాడు
2) We used to be close
మేం సన్నిహితంగా ఉండేవాళ్లం
3) He used to be good at studies
చదువులో బాగా ఉండేవాడు (బాగా చదివేవాడు - ఇదే ఇంకో విధంగా - He used to study well )
4) You used to be the opener
నువ్వు opener గా ఉండేవాడివి.
5) I used to play
నేను ఆడేవాడిని

Used to పై conversation లో question లో not తో, never తో వాడటం చూడండి. ఇలా కూడా మీరు used to వాడవచ్చు. మరికొన్ని చూడండి.

a) అతడెప్పుడూ punctual గా ఉండేవాడు కాదు
He never used to be punctual?
b) అతడి సాయం నువ్వు తరచుగా తీసుకునేవాడివా?
Did you use to take his help often?

(మిగతా verbs కు లాగానే used to question తో కానీ not తో కానీ వాడితే did use అవుతుంది. అతడు నాకు పెద్ద సాయం ఏమీ చేసేవాడు కాదు
He didn't use to help me much.
[Used to present/ future actions కూ states of being కూ రాదు]

7) I used to find a lot of time.

ఈ expressions అన్నీ కూడా used to కు సంబంధించినవే కదా. ఇప్పుడు used to ఉపయోగం తెలుసుకుందాం.

used to కు be form used to be;
Action word: used to + 1st Regular Doing word

**e.g:** used to play, used to sing, etc.,

Used to గతంలో అలవాటుగా, క్రమం తప్పకుండా ఉన్న స్థితిని కానీ, చర్య (action)ను కానీ తెలుపుతుంది. ఈ used to కు, ఉపయోగం అనే అర్థంతో వాడే use కు సంబంధం లేదు.

Subhakar మాట we used to sit on the same bench
ఒకే bench మీద కూచునే వాళ్లం (A regular action of the past)
తెలుగులో: అపుడలా జరుగుతుండేది
(It used to be so);
వాడు రోజూ ఆడేవాడు
(He used to play every day);
ఆమె బాగా పాడేది
(she used to sing well);
They used to quarrel with each other.
(వాళ్లు ఒకరితో ఒకరు మాట్లాడుకోనేవాళ్లు)-

6) I used to find a lot of time
నాకు చాలా time దొరికేది కాబట్టి 'used to' expresses a habitual state of being or action.


M. SURESAN

**Pramod:** Your teacher at school was at our place this afternoon. She's dad's cousin
( మీ School teacher మా ఇంటికి వచ్చింది మధ్యాహ్నం. ఆవిడ మా నాన్న cousin.
Cousin కజిన్ - 'క' నొక్కి పలుకుతాం, జి size లో z లాగా.
అర్థం = రక్త సంబంధం లేని దగ్గర చుట్టాలందరు Englishలో cousins. Children of your parents brothers and sisters are all your cousins.
అంటే మీ మామయ్య కొడుకులూ, కూతుళ్లు అందరూ మీ cousins - cousin sister, cousin brother అనే మాటలు English లో లేవు. అవి వాడం)

**Prasanth:** She used to like me a lot she was a very good teacher.
(నేనంటే ఆమె బాగా ఇష్టపడేది/ అభిమానం ఆవిడ చాలా మంచి teacher)

**Pramod:** Though I was n't her student, I used to go to her for tuition.
(నేనామె student అవకపోయినా, ఆమె దగ్గరకి tuition వెళ్లేవాడిని.)

**Prasanth:** Didn't she use to say, 'understand?' at the end of her every sentence?
(ప్రతి sentence చివరా (ఆమె teach చేసేటప్పుడు, 'understand?' అనేదికదా? )

**Pramod:** That she used to. I observed too. Most teachers, I think say that.
(అవును అలా అంటుండేది. నేనూ గమనించాను. Teachers చాలామంది అలా అంటారనుకుంటా.)

**Prasanth:** I never used to find our Maths teacher say that. He used to say, 'Isn't it?' quite often.
(మా Maths teacher అలా అనటం నేనెప్పుడూ వినేవాడిని కాను. ఆయన ఎప్పుడూ, 'Isn't it?' అనేవాడు.

**NOW PRACTISE THE FOLLOWING IN ENGLISH**

**Ananth:** Hi Sumanth, ఇవాళేంటి ఇంత త్వరగా నిద్రలేచావు?

**Sumanth:** ఈ మధ్య నేను త్వరగానే లేస్తున్నాను. మూడు నెలల కిందటి వరకు late గా లేచే వాడిని - college hours ఎనిమిది నుంచి ఒంటిగంట వరకు మార్చేవరకు

**Ananth:** ఎందుకంత ఆలస్యంగా లేచేవాడివి?

**Sumanth:** రాత్రి చాలాసేపు చదివే వాడిని. ఆలస్యంగా పడుకునే వాడిని. అందుకని ఆలస్యంగా లేచే వాడిని.

**Ananth:** మధ్య లేచేటప్పటికెంత time అయ్యేది

**Sumanth:** దగ్గర దగ్గర 8 అయ్యేది. ఎంత హాయిగా ఉండేదో

**Ananth:** నేను మాత్రం ఆరుకే లేచేవాడిని. ఇప్పుడు ఐదింటికే లేస్తున్నా.

**Sumanth:** ఏదైనా ఆలస్యంగా లేవటమే నాకిష్టం.

**ANSWER:**

**Ananth:** Hi Sumanth, why are you up so early?
How is it you are up so early?
How is it you got up so early?
How is it = ఏంటి? get up = నిద్రలేవటం = be up. 'be up' అన్నిటికంటే simple, natural)

**Sumanth:** Of late I have been getting up early. I used to get up late till 3 months ago- till the college hours were changed from 8 AM to 1 PM

**Ananth:** Why did you use to get up so late?

**Sumanth:** I used to study till late in the night. So I used to get up/to be up late.

**Ananth:** what used to be the time when you got up/when you were up?

**Sumanth:** It used to be nearly 8. How happy I was!/ How I enjoyed it!

**Ananth:** I used to get up at 6. Now I get up at 5 itself.

**Sumanth:** What ever you may say. I like getting up late.



**ప్రశ్న:** 1) మొదటిరోజు Office కు వెళుతున్నాడు అనడాన్ని *'He is going to office for the first time'* అని చదివాను. అది correct అవుతుందా? దీన్ని మరో విధంగా ఎలా రాస్తారు?
2 ) *"Phonetics"* నేర్చుకునేందుకు ఒక మంచి పుస్తకం సూచించగలరు.

**– ఎ. వేణుగోపాల్, అల్లీపూర్**

**జవాబు:** 1) He is going to office for the first time = మొదటిసారిగా (రోజు కాదు) office కు వెళ్తున్నాడు. ఇదే అర్థం వచ్చేట్టు, This is the first time he is going to office అనవచ్చు
2) Oxford, longman's Dictionaries చాలు.

**ప్రశ్న:** ఆంగ్లభాషణ పూర్తిగా నేర్చుకోవడానికి సుమారు *275* వాక్య నమూనాలు *(patterns or structures)* చాలని ఇంగ్లిష్ వ్యాకరణ పండితుల అభిప్రాయం. ఆ *275* వాక్యాలను తెలుగు ట్రాన్స్‌లేషన్ సహా తెలియజేయగలరు.

**– కె.రామారావు, విజయవాడ**

**జవాబు:** మీరన్నది correct. అయితే ముందుగా fundamentals బాగా తెలిస్తే అప్పుడు మీరు చెప్పిన వాక్య నమూనాలు (sentence patterns) practice చేయవచ్చు. అందుకు తగిన vocabulary కూడా పెంచుకోవాలి కదా, slots fill చేసేందుకు. Thanks for the suggestion.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**





# She used to be beautiful

**Himakar:** Who do I see here? Dinakar? Oh what a surprise! When did you come?
(ఏయ్, ఎవరూ? దినకరా? ఆశ్చర్యంగా ఉంది! ఎప్పుడొచ్చావు? )

**Dinakar:** Yesterday. The first thing I thought I would do was see you and here I am
(నిన్న, రాగానే మొట్టమొదట నిన్ను చూడాలనుకున్నా. వచ్చేశా)

**Himakar:** Real pleasure seeing you. So how's Bangalore?
(నిన్ను చూడటం నిజంగా సంతోషంగా ఉంది. Bangalore ఎలా ఉంది? )

**Dinakar:** A beautiful city. I went there in the winter. I used to find the cold difficult to bear, but now I am used to it.
(అందమైన నగరం. నేనక్కడికి చలికాలంలో వెళ్లా. ఆ చలి తట్టుకోవడం కష్టంగా ఉండేది. కానీ ఇప్పుడు అలవాటుపడిపోయా)

**Himakar:** What about the food?
(ఆహారం మాటేంటి? )

**Dinakar:** No trouble now. I cook for myself. I used to eat out in the beginning but I could not get used to the food. I started cooking, and I am happy now.
(ఇప్పుడేం ఇబ్బంది లేదు. నేనే వండుకుంటు న్నాను. మొదట్లో హోటల్లో తినేవాడిని. కానీ అలవాటు చేసుకోలేకపోయా. వండుకోటం మొదలుపెట్టా. ఇప్పుడే ఇబ్బందీ లేదు.
(Eat out = Restaurants లో తినటం)

**Himakar:** You know our friend Bhaskar, don't you? He works in a Call Centre there.
(నీకు భాస్కర్ తెలుసుగా. వాడక్కడ Call Centre లో పనిచేస్తున్నాడు)

**Dinakar:** How is he? He used to be quite active here
(ఎలా ఉన్నాడు? ఇక్కడ అతను చాలా చురుగ్గా ఉండేవాడు)

**Himakar:** He is OK. except for his odd hours of duty. He has to work late night shifts. It's troubling him a bit.
(ఆడ్యూటీ వేళలు తప్ప బాగానే ఉన్నాడు. రాత్రి వేళల్లో పనిచేయడం అతన్ని ఇబ్బంది పెడుతోంది)

**Dinakar:** He was used to keeping awake late at night here. He used to get up quite late here. what's the problem?
(ఇక్కడ ఎప్పుడూ రాత్రి చాలాసేపు మేల్కోవటం అలవాటే కదా అతనికి. ఆలస్యంగానే నిద్రలేచేవాడు కదా? )

**Himakar:** But there he has to get off duty too late, after 12 mid night, and so he can get up only after 9 or 10 in the morning. This is his problem. He hopes he will be used to it in a course of time
(కానీ అక్కడ మరీ ఆలస్యం.రాత్రి 12 తర్వాతే duty అయి నిద్రపోవటం, అందువల్ల ఉదయం 9, 10 తర్వాతే నిద్ర లేవటం, ఇదీ అతని సమస్య. కాలక్రమేణా అలవాటు పడతానని ఆశిస్తున్నాడు)

**Dinakar:** Best of luck for him

*ఈ conversation లో కింది expressions గమనించండి.*

1. I used to find ...
2. I used to eat out
3. He used to be quite active here.
4. He used to get up quite late
5. I am used to it.
6. I could not get used to the food
7. He was used to keeping awake late
8. He will be used to it.

కిందటి lessonలో మనం used to ఉపయోగాలు చూశాం కదా. గతంలో క్రమం తప్పకుండా అలవాటు పడ్డ స్థితులకూ, చర్యలకూ (Habitual status of being/habitual actions in the past) వాడతాం అని పైన expressions from 1 to 4 దానికి ఉదాహరణలు కదా.

1. I used to find the cold difficult to bear
   ఆ చలి తట్టుకోటం కష్టంగా అనిపించేది.
2. I used to eat out
   బయట తినేవాడ్ని.

3. He used to be quite active here
   ఇక్కడ చాలా చురుగ్గా ఉండేవాడు.
4. He used to get up quite late
   బాగా ఆలస్యంగా లేచేవాడు.

**Used to**

1) Past లో క్రమం తప్పకుండా ఉన్న స్థితులకూ, జరిగిన పనులకూ మాత్రమే వాడతాం. Present, futureకు ఎప్పుడూ వాడం.

2) Used to తర్వాత 'be' కానీ, Ist Regular Doing Words (used to + go / Walk) Sleep, etc) కానీ వస్తాయి. ఇది మనం last lessonలో తెలుసుకున్నాం. మళ్లీ చూడండి.

1) మాకప్పుడు వారానికి 5 రోజులే ఉండేది
We used to have school only for 5 days a week.

2) తరచూ నా దగ్గరికి వస్తుండేవాడు.
He used to visit me frequently

3) ఆమె అతన్నెప్పుడూ ఇష్టపడేది కాదు
She never used to like him

4) నిన్నెప్పుడైనా ఇబ్బంది పెట్టేవాడినా నేను?
Did I ever used to trouble you?

5) వాడు పగలంతా ఇక్కడే గడిపేవాడు
He used to spend the whole of day being here.

6) వాడు నాకు సహాయంగా ఉండేవాడు
He used to be very helpful to me

6) ఆమె అందంగా ఉండేది
She used to be beautiful

used to వాడకం తెలుసుకున్నాం కదా? ఇప్పుడు పై *conversation నుంచి తీసిన expressions...*

No. 5 to 8 చూడండి. మొదట 5, 7 and 8 చూడండి

5. I am used to it
7. He was used to keeping awake late
8. He will be used to it

5, 7 and 8 expressions లో used to ముందు be forms (am, was, will be) ఉండటం గమనించండి. అంతేకాకుండా, used to తర్వాత 'be' form కానీ, Regular doing word కానీ రాకపోవటం చూడండి. Used to, తర్వాత, It కానీ, ing form కానీ వస్తున్నాయి కదా. అంటే 5, 7 and 8లో మనం వాడింది.

'be' form (am/was/willbe) + it/...ing form (Expressions 1, 2, 3, 4లో వాడింది. (Used to + be / Ist Regular Doing Word)

Used to + be/1st RDW
*గతంలో క్రమం తప్పకుండా ఉన్న స్థితి/ జరిగిన పని. ఇదీ ఇప్పటివరకు మనం చూసింది.*


M. SURESAN

ఇపుడు 'be' form + used + it/ ...ing form (expressions, 5, 7 and 8 లో ఉంది) -

ఇది ఒక విషయానికి అలవాటు పడటం -any time - past, present or future ను తెలియ జేస్తుంది.

(గుర్తుంది కదా, used to + be/ 1st RDW - past కే పరిమితం)

a) **Kesav:** How do you find Delhi in Summer?
(వేసవిలో Delhi ఎలా ఉంది? )
**Eswar:** Quite hot. But I have been used to the heat for past three years.
(ఎండగానే ఉంటుంది. కానీ గత మూడేళ్లుగా నేనా ఎండకి అలవాటు పడ్డా. ఇప్పుడు అది సమస్య కాదు).

(have been (be form) + used + to the heat (noun)

(దేనికైనా మనం ఇచ్చే పేరు noun. దాని బదులు it / that / this etc. లాంటివి వాడవచ్చు)

b) అతడికి night shifts (రాత్రివేళలు - duties) అలవాటే - He is used to night shifts.

c) ఇలాంటి శ్రమ అతడికి కొత్త. కొంత కాలానికి అలవాటు పడతాడు
This kind of hard work is new to him, but he will be used to the work in course of time.

d) వాడి boss అవమానాలు అతడికి అలవాటే
He is used to the insults from his boss.

e) **Pratap:** How are you able to carry such a load?
(అంత బరువెలా మోయగల్గుతున్నావు? )
**Sekhar:** What a question? Weren't we (were we not) used to carrying heavier loads of books at school?
(ఏం ప్రశ్న అది? Schoolలో మనకు ఇంత కన్నా బరువున్న పుస్తకాలు మోయటం అలవాటే కదా? )

కాబట్టి be used to అంటే అలవాటు ఉండటం, కొత్త కాకపోవటం. be used to తర్వాత noun form (this food, the heat, the insults etc) కానీ, '... ing' form కానీ వస్తుంది. be used to సందర్భాన్ని బట్టి, present, future, pastలో దేనికైనా వాడవచ్చు

a) I am used to coffee in the morning
(Coffee - noun)
(నాకు పొద్దున coffee అలవాటు)
I am used to taking coffee in the morning
నాకు పొద్దునే coffee తీస్కోవటం అలవాటు.
(ఇక్కడ am used to తర్వాత, taking, ... ing form రావటం గమనించండి)

b) He is used to long walks / taking long walks in the morning
(నడక, నడవటం అతడికి అలవాటు.)

c) **Ram:** Your boss seems to be an angry man.
(మీ boss కోపిష్టిలా కన్పిస్తున్నాడు? )
**Rahim:** I just don't bother. I am used to his anger.
(నేనేం లెక్కచేయను. అలవాటుపడిపోయా ఆయన కోపానికి.)(am used to - his anger)

d) **Bhavan:** His wife appears to be the - nagging type.
(నసపెట్టే రకంలా ఉంది వాడి భార్య .)
**Sravan:** He is so used to her nagging that without it he feels he misses something.
(ఆ నస లేకపోతే ఏదో వెలితిగా ఉన్నట్టు బాధ పడతాడు వాడు. ఆ నసకంత అలవాటు పడ్డాడు)
(is used to -nagging)

**Now practise the following:-**

**Sekhar:** నువ్వు చిన్నప్పుడు బాగా పరిగెత్తేవాడివి కదా? ఇప్పుడేంటి అసలు కొంత దూరం కూడా నడవలే కపోతున్నావు?
**Pramod:** ఈ officeలో join అయినతర్వాత నాకు వాహనం ఉంది కదా. చిన్న చిన్న దూరాలకు కూడా bike మీద వెళ్లటం అలవాటైపోవడం వల్ల, నడక తగ్గింది.
**Sekhar:** అప్పుడు బాగా slim గా ఉండే వాడివి కూడా.
**Pramod:** ఈ విధమైన జీవితానికలవాటుపడటం వల్ల weight కూడా పెరిగింది. నిజమే.
**Sekhar:** Bike వాడటం మానేసి urgent కాని పనులకు నడు.
**Pramod:** నడవాలనిపించదు నాకు. కానీ ప్రయత్నించాలి. ఏముందిలే, రెండు మూడు రోజులు నడిస్తే అల వాటు పడిపోతాను. అవునూ, నువ్వు Delhi లో ఉంటున్నావు కదా? అక్కడ తిండి నీకు పడు తోందా?
**Sekhar:** సమస్యే లేదు. అలవాటుపడ్డాను.

b) **Dushyant:** Hi Bharat, ఏంటి మరీ Sundays కూడా busy గా ఉంటున్నావు?
**Bharat:** ఏం చేయమంటావు? Busy life కలవాటుప డ్డాను. ఇప్పుడు పనిలేకపోతే ఏం తోచదు.
**Dishyant:** రేపు promotion వస్తే బాగా తీరిక ఉంటుంది కదా? అప్పుడేం చేస్తావు?
**Bharat:** అప్పుడు దానికి అలవాటు పడతాను. ఏదైనా మార్పు కొన్ని రోజులే సమస్య. ఆ తర్వాత దానికి అలవాటుపడతాం.
**Dushyant:** అవును. Correct మా అన్నను మా అమ్మా, నాన్న చాలా సుఖంగా పెంచారు. ఇప్పుడు చూడు. businessలో రోజూ 8 గంటలకంటే ఎక్కువ పనిచేస్తాడు.



ప్రశ్న: కింది పదాలకు సరైన **Pronunciation** తెలపగలరు?
Bear, Owl, yacht, Menace, Cheer (v), Cheers (n), Cop, Cheerful (adj), tyrant, martyr, Chaos, Career

–టి. శివ, నందికొట్కూరు.

జవాబు: 1) Bear=బెఅ; 2) Owl=ఔల్ (అఉల్), 3) yacht=యాట్ 4) Menace=మెనస్ ('మె'నొక్కి పలుకుతాం) 5) Cheer=ఛియ; Cheers=ఛియజ్.('జ్' sizeలో జ) 6) Cop=కాప్ (కా-పెదవులు గుండ్రంగా తిప్పి, నాలుక వంకరపెట్టండి) 8) Cheerful='ఛియఫ్‌ల్ - 'ఛి నొక్కి పలుకుతాం. 9) tyrant=టైరన్‌ట్ ('టై నొక్కి పలుకుతాం) 1) 10) martyr=మాట ('మా' నొక్కిపలుకుతాం)11) Chaos=కెయస్ ('కె' నొక్కి పలుకుతాం) 12) Career=కరియ ('రి'నొక్కి పలుకుతాం)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






# I got used to it

**Balaram:** Hi Damodar, how's your new bike?
(నీ కొత్త bike ఎలా ఉంది? )

**Damodar:** I have used it for just a few days. I feel it is heavy for a man my size. So I find it a bit difficult to handle it.
(కొద్దిరోజులుగానే కదా నే వాడుతున్నా దాన్ని. నా Size కది కొంచెం బరువే అన్పిస్తోంది. అందుకని దాన్ని handle చెయ్యటం కాస్త కష్టంగా ఉంది)

**Balaram:** Could it be a wrong choice?
(నీ ఎంపిక (selection) అంత సరైంది కాదేమో అనుకుంటావా? )

**Damodar:** (I) Can't say anything now. I think I will get used to it as days pass.
(ఇప్పుడేం చెప్పలేను. రోజులు గడిచేకొద్దీ అలవాటుపడగలననుకుంటున్నా)

**Balaram:** I think so too.
(నేనూ అలాగే అనుకుంటున్నా)

**Damodar:** Once it begins to move I feel very comfortable riding it. Only when I have to stand it do I feel the weight
(కదలటం మొదలైతే చాలా హాయిగా ఉంటుంది. దాన్ని Stand వేయాల్సి వచ్చినప్పుడే బరువనిపిస్తుంది).
But I enjoy the ride.
(అయితే దానిమీద సవారీ చాలా సరదాగా ఉంటుంది)

**Balaram:** Don't worry. You will get used to handling it. Look at Arjun. He is Shorter than you and his bike heavier than yours. I See him handling it with ease. He has got used to holding its weight.
(ఏం ఫరవాలేదు. నువ్వు త్వరగానే దాని బరువుకు అలవాటు పడతావు. అర్జున్‌ను చూడు వాడు నీ కంటే పొట్టి, వాడి bike నీ దాని కంటే బరువు. కాని దాన్ని వాడు చాలా సులువుగా handle చేస్తాడు. వాడు అలవాటు పడ్డాడు)

**Damodar:** Yes That was my Experience of my cycle too, when I had my First Cycle, I Was just 7 or 8 years old and the cycle felt heavy , but I got used to it.
(అవును నా Cycle తో అనుభవం కూడా అదే. నేను మొదటిసారిగా Cycle కొన్నప్పుడు, నాకు ఏడేళ్లో ఎనిమిదేళ్లో అప్పుడు నాకు Cycle బరువనిపించేది. కానీ అలవాటు పడ్డా దాని బరువుకి.

**Balaram:** I ride a bike well, but I have yet to get used to the traffic of Hyderabad. I think it will be a few more weeks before I can drive comfortably in such traffic.
(నాకింకా ఈ హైదరాబాద్ Trafficలో drive చేయటం అలవాటు పడలేదు. ఇంకొన్ని వారాలకుగాని సుఖంగా drive చేయలేననుకుంటా)
OK. I must be going. Bye
(Oh, నేనిక వెళ్లాలి Bye)

**Damodar:** Bye

ఈ Conversations లో Get used to తో ఉన్న expressions గమనించండి. ఇంతకుముందు Lessons లో అంతా be used to కు సంబంధించిన వివరాలు తెలుసుకున్నాం. ఈ సంభాషణలో Get used to రావటం గమనించండి:

**1)** I will get used to
**2)** You will get used to handling it
**3)** He has got used to holding its weight
**4)** I got used to it

ఇంతకుముందు Lessons లో be used to వాడాం కదా. మనకు తెలుసు be used to అంటే అలవాటు పడటం అని, be used to తర్వాత ఎప్పుడూ noun కానీ, '...ing' form కానీ వస్తుందని.

**1)** She is used to the rudeness of her mother-in-law.
ఆమె అత్తగారి దురుసుతనానికి అలవాటు పడిపోయింది.
(ఇక్కడ rudeness, noun)

**2)** They are used to working for low wages.
తక్కువ జీతాలకు పనిచేయటం వాళ్లకలవాటే.
(అంటే కొత్తేమీ కాదు. వాళ్లందులో కొత్తగా బాధపడాల్సిందేమీ లేదు)

**3)** This street boy is used to the cold of the winter.
ఈ వీధిబాలుడు శీతాకాలపు చలికలవాటుపడ్డవాడే.


M. SURESAN

ఒక్కోసారి, noun బదులు, is కూడా వస్తుంది.

పై conversation లో get used to కు, ఇంతవరకూ మనం చూసిన be used to కు అర్థంలో, ఉపయోగంలో ఎంతో తేడా లేదు. 'be used to' కు బదులు సందర్భాన్నిబట్టి సరైన tense form తో get used to వాడొచ్చు:

**a)** In the beginning I could not adjust to the hostel food, but I got used to it as time went on/but I am now used to it
మొదట hostel food పడేది కాదు, కానీ రోజులు గడిచేకొద్దీ అలవాటైపోయింది; ఇపుడు నేను దానికి అలవాటుపడ్డాను.

**b)** How long did it take for you to get used to the climate of Kashmir?
కాశ్మీర్ వాతావరణానికి అలవాటుపడటానికెంత time పట్టింది నీకు?

**c)** I think he hasn't yet got used to working for long hours here unlike in his previous job
ఇక్కడ ఎక్కువసేపు పనిచేయటానికి వాడింకా అలవాటుపడలేదనుకుంటా, వాడింతకుముందున్న job లోలా కాకుండా.

**d)** People in government jobs find it difficult to get used to working in private organisations.
ప్రభుత్వ కార్యాలయాల్లో పనిచేసే వాళ్లకు private సంస్థల్లో పనిచేయడానికి అలవాటు పడటం కష్టంగా ఉంటుంది.

పై (b), (c), (d) ల్లో `be used to' కూడా వాడవచ్చు

**b)** How long did it take for you to get used to...?
= How long did take for you to be used to....?

**c)** I think he hasn't yet got used to working
= I think he hasn't been used to working

**d)** People in government jobs find it difficult to get used to working- People in government jobs find it difficult to be used to working in...

- be used to, get used to వాడే చోట్ల become used to కూడా వాడొచ్చు

**a)** I've got used/ I've become used to/ I've been used to this kind of treatment from the Boss
Boss నన్నిలా చూడటం (treatment= వైద్యం, మామూలు అర్థం. ఇక్కడ అర్థం ఒకరు ఇంకొకర్ని చూడటం, అంటే గౌరవించటం, చులకనగా చూడటం, ద్వేషం ఉండటం, లెక్కచేయకపోవటం లాంటివి: ఈ విధంగా boss నన్ను చూడటం (treat చేయటం) నాకు కొత్తేమీ కాదు.

**b)** Having been poor till now, he is yet to be used/ yet to get used to/ yet to become used to, the comforts of rich life
ఇంతవరకు బీదవాడుగా ఉండటంవల్ల, ధనిక జీవిత సుఖాలకింకా అలవాటు పడలేదతను/ అవి అతనికింకా కొత్త/ అతనికి అవి ఇబ్బందిగా ఉన్నాయి.

ఇవీ be used to, got used to, became used to అర్థాలూ, ఉపయోగాలూ. మళ్లీ సంగ్రహంగా...

**1)** be (get/ become) used to తర్వాత noun కానీ, ...ing form కానీ వస్తాయి. Ist RDW రాదు. అర్థం - అలవాటవటం, కొత్తకాకపోవటం, ఇబ్బంది కలగకపోవటం.

**2)** be (get/ become) used to ఏ tense లోనైనా వాడవచ్చు ఉండటం, చర్య జరిగే కాలాన్నిబట్టి.

**PRACTISE THE FOLLOWING IN ENGLISH:**

**Sneha:** Hi మైత్రీ, ఎలా ఉంది ఇక్కడి కొత్త జీవితం?
**Maithri:** నాకేం కొత్త అనిపించటంలేదు. అలవాటైపోయింది. చుట్టూ నీలాంటి friends ఉండటంవల్ల
**Sneha:** మరి మీ ఆయన సంగతి?
**Maithri:** ఆయనకే కాస్త సమస్యగా ఉంది. ఆయనది marketing job కదా? ఇక్కడి market తీరు తెన్నులకింకా అలవాటు పడలేదాయన. ఇక్కడి market ఆయనకు పూర్తిగా కొత్త.
**Sneha:** అందులో భాష కూడా తేడా కదా? కాస్త time పట్టవచ్చు అలవాటు పడటానికి.
**Maithri:** ఇంగ్లీష్ తెలిసినచోట్ల ఆయనకేమీ ఫర్వాలేదు. ఆయనకు ఇంగ్లీష్‌లో సంభాషణ అలవాటే. స్థానిక భాష అయితేనే సమస్య.
**Sneha:** మహా అయితే ఇంకో నెల పట్టవచ్చులే. ఆ తర్వాత అలవాటై పోతుంది.

**ANSWER:**

**Sneha:** How is the new life here, Maithri?
**Maithri:** I don't find it new/ different any more; especially with friends like you around.
**Sneha:** What about your husband/ hubby?
**Maithri:** He finds it a little problem/ He has some trouble. Hence a marketing job, isn't it? He hasn't yet got used to/ He has yet to get used to the trends of the market here. The market here is entirely/ completely/ totally new to him.
**Sneha:** Moreover the language here is different, so he may take (some) time to get used to it.
**Maithri:** Where English is known/ Where people know English, he hasn't any problem. He is used to communicating in English. The problem is with the local language.
**Sneha:** At the most he may take a month to get used to the circumstances/ situation here. That's all.

**మంగళవారంనాటి అభ్యాసాల సమాధానాలు:**

**a) Sekhar:** You used to be good at running/used to run well/used to be a good runner when you were young. Why aren't you able to walk even a short distance?
**Pramod:** After I joined this office, I got a vehicle. I am used to going on the bike even for short distances. So I walk less now.
**Sekhar:** You used to be very slim.
**Pramod:** True. Because I am used to this kind of life and my weight has increased too/ has gone up too/ I have put on weight.
**Sekhar:** Stop using the bike. Walk for things not urgent.
**Pramod:** I don't feel like. But I must try. That's nothing, of course. If I walk for 2 or 3 days, I will be used to walking you are in Delhi now. Are you used to the food there?
**Sekhar:** No problem. I am used to it. / I have got used to it.

**b) Dushyant:** Hi Bharat, you are busy on Sundays too/ even on Sundays, what's the matter?
**Bharat:** What can I do. I am used to this busy life. I feel bad/ out of sorts if I don't have enough work.
**Dushyant:** If you get promotion, you will have a lot of leisure. What will you do then?
**Bharat:** I will be used to it then change a problem for only a few days. After that we are used to it.
**Dushyant:** Yes, that's right. My parents brought up my brother in all comfort. But look now. In his business, he now works for more than eight hours.

---

*ప్రశ్న: 1. Leave letter రాస్తున్నప్పుడు, (Head masters ను address చేస్తూ Teachers) Kindly grant me, అని రాయడం తప్పా, may I request you అని రాయడం correct అవుతుందా, తెలపండి.*
*2. Respected ఉపయోగించవచ్చా, Yours sincerely / Yours faithfully ఏది ఉపయోగించాలి?*
**- బి.శ్రీనివాస్, కొవ్వూరు**

**జవాబు: 1.** రెండూ correct. May I request you అనేది కాస్త formal.
**2.** Respected Sir, అనటం correct కాదు. Sir, అని సంబోధిస్తే చాలు. Respected sir సరైన English కాదు. Leave letter మనకంటే పై అధికారికి address చేసినప్పుడు yours faithfully, తప్పనిసరి. Yours sincerely సరికాదు.

*ప్రశ్న: Am, is, are + $V_3$ = జరగబడి ఉండటం లేదా జరగబడడం (లేదా) రెండు రకాలుగా సందర్భాను సారంగా అర్థం చేసుకోవాలా? ఎలా వాడాలి?*
**- ఎస్.దుర్గారావు, కాకినాడ**

**జవాబు:** am/ is / are + $v_3$ (past participle) ఈ combination లో ఉన్న verb passive voice లో ఉంటుంది. అర్థం 'బడు' అని వస్తుంది.
**1)** The poem is written by John = John చేత ఆ poem రాయబడింది అని అర్థం చేసుకోవాలి.
The poem has been written/ was written by John అనేది ఇంతకంటే better form.
am/ is/ are + pp (past participle - $v_3$) - ఇది habitual action కు మాత్రమే వాడాలి. అయిపోయిన action అయితే, has been + pp/ was/ were + pp వాడటం మెరుగు, time state చేశామా, లేదా అనేదాన్ని బట్టి.
**2)** He is gone వాడుకలో ఉంది- He has gone అనే అర్థంతో. ఇందులో తప్పులేదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






# Do you meet him frequently?

**Jagan:** Mohan, when did you last meet kumar?
(కుమార్‌ను ఎప్పుడు కలుసుకున్నావు, వివరగా? )

**Mohan:** Just yesterday. He was going home from office.
(నిన్ననే. వాడు office నుంచి ఇంటికి వెళ్తున్నప్పుడు)

**Jagan:** Do you meet frequently?
(మీరు తరచూ కలుసుకుంటారా? )

**Mohan:** We used to. Of late, however, we haven't been seeing each other that frequently. His writing stories for the magazine keeps him busy.
(గతంలో కలుసుకునేవాళ్లం. ఈ మధ్య అంత తరచుగా కలవటం లేదు. పత్రికకు కథలు రాయటంలో అతడు busy గా ఉంటాడు)

Of late = lately = ఈ మధ్య = recently.
of late/ lately కి, late కు అర్థంలో సంబంధం లేదు - late = ఆలస్యం

**Jagan:** I have read some of his stories. They are quite good.
(నేను అతడి కథలు కొన్ని చదివా. బాగానే ఉన్నాయి)

**Mohan:** He writes well. He has written about 40 stories and short stories so far.
(అతడు బాగానే రాస్తాడు. ఇప్పటివరకు దాదాపు 40 కథలూ, కథానికలు రాశాడు)

**Jagan:** Has he been writing for long?
(అతను చాలాకాలంగా రాస్తున్నాడా? )

**Mohan:** He started writing at the age of 18 itself. He had written for the school and college magazines before he took to serious writing
(18 ఏళ్లకే రాయటం ప్రారంభించాడతను. రాయటం serious గా తీసుకునేముందు school, college magazines కు రాశాడు)

**Jagan:** Any idea of bring out a collection of all his stories?
(అన్ని కథలు ఒక సంపుటిగా తెచ్చే ఆలోచ నేమన్నా ఉందా? )

Bringing out = ప్రచురించటం, collection = (రచన విషయంలో) సంపుటి

**Mohan:** A publishing company will soon publish it. It will be out this June, I think.
(ఓ ప్రచురణాలయం త్వరలోనే ఆ సంపుటిని ప్రచురిస్తుంది. ఈ June లో ప్రచురిస్తారనుకుంటా)

**Jagan:** I see him the other day when he was talking to someone.
(మొన్నెప్పుడో అతడు ఎవరితోనో మాట్లాడుతుంటే నేనతన్ని చూశా)

**Mohan:** He has a number of admirers.
(అతడిని అభిమానించేవాళ్లు చాలామంది ఉన్నారు.)

admirers = అభిమానించేవాళ్లు = fans.
Admire = ఒకరి ప్రతిభను మెచ్చుకోవటం

**Jagan:** He deserves
(అతడు దానికి అర్హుడే)

deserve = అర్హత కలిగి ఉండటం

**Mohan:** He will be completing his fiftieth novel next year
తన 50వ నవలను ఆయన వచ్చే సంవత్సరం పూర్తి చేస్తాడనుకుంటా.

**Jagan:** My best wishes to him.

(చాలామంది పాఠకులు tenses గురించి మళ్లీ మళ్లీ అడుగుతుండటంతో ఈ lesson లో tenses revise చేస్తున్నాం, గమనించండి)

Do you meet him frequently? -
ఇక్కడ verb - do meet. do meet అన్నా ఒకటే, meet అన్నా ఒక్కటే.

| | |
|---|---|
| meet, | meets, |
| sing | sings |
| write | writes |
| come | comes |
| watch | watches |

ఇలాంటి verb forms ను present simple/ present indefinite tense అంటారు. ఈ verbs లో మొదటి column లో ఉన్న verbs ను I, we, you and they తో, రెండో column లోని verbs- sings, writes, etc ను he, she, it తో వాడతాం. Question లో, not తో 1st column లో ఉండే verbs కు 'do' వస్తుంది. II column లో ఉండే verbs కు does వస్తుంది.

ఈ verbs క్రమం తప్పకుండా జరిగే పనులకు- including habits, facts of science, universal truths కు వాడతాం. 1st column లో verbs ను I RDW, II column లో verbs ను II Regular Doing Words అంటాం.

1) వాడిక్కడికి రోజూ వస్తాడు
He comes here everyday.

2) వాళ్లు ఎప్పుడొస్తారు రోజూ ఇక్కడికి?
When do they come here everyday?


M. SURESAN

3) అతడు smoke చేస్తాడు.
He smokes (Habit)

4) The sun rises in the east - universal truth.
ఇలా ఎలాంటి Regular actions కైనా Regular Doing Words వాడతాం. ఇది present simple Tense. ఇంకా చూడండి

5) Writing for the magazine keeps him busy.

**II.** am + ...ing / is + ...ing / are + ...ing for actions taking place now. This tense is present continuous tense.
ఇప్పుడు జరుగుతున్న పనులకు ఈ tense వాడతాం.

**a)** I am reading the paper - ఇప్పుడు
**b)** She is singing - ఇప్పుడు
**c)** They are walking - ఇప్పుడు

**III.** have (for, I, we, you and they) + past participle/ has (for, he, she, it) - ఇది present perfect tense. దీనిని-

1) for past actions, time not stated
(గతంలో జరిగి, time తెలియని పనులకు)

2) for action going on from then till now,
(అప్పటినుంచి - ఇప్పటివరకు జరిగిన పనులకు)

3) for actions just completed.
(ఇప్పుడే పూర్తయిన పనులకు, just, just now అనే మాటలను వాడతాం)

**a)** I have read some of his novels,
(చదివాను - Time చెప్పటం లేదు)

**b)** He has studied here for the past one year
(ఒక సంవత్సరంగా ఆయన ఇక్కడ చదివాడు)

**c)** They have just gone out -
వాళ్లు ఇప్పుడే బయటికెళ్లారు.

**IV** He has been writing for long.
have been + ing / has been + ing. దీనిని present perfect continuous tense అంటాం- గతంలో ప్రారంభమై ఇంకా జరుగుతున్న పనులకు వాడతాం.

Congress has been ruling AP for the past year and a half
ఏడాదిన్నరగా AP ని కాంగ్రెస్ పాలిస్తోంది.

**PRACTICE THE FOLLOWING IN ENGLISH:**

**Prabha:** సుజన నన్ను తరచు disturb చేస్తుంది.
**Subha:** నన్నెప్పుడు disturb చేయదు.
**Prabha:** ఇంతవరకు నాకు నాలుగుసార్లు phone చేసింది.
**Subha:** నాకింతవరకు చేయలేదు.
**Prabha:** ఆమేదో కారుకొనిందట. ఆ విషయం ఇప్పటికి నాకు పదిసార్లు phone చేసింది.

**ANSWER:**

**Prabha:** Sujana disturbs me often.
**Subha:** She never disturbs me.
**Prabha:** She has phoned four times so far today.
**Subha:** She hasn't called me so far.
**Prabha:** She has bought a car. She has phoned about it to me 10 times.

---

ప్రశ్న: *ఇంగ్లిష్‌లో Being, Been పదాలు passive voice లో కాకుండా ఇంకా ఏ విధంగా ఉపయోగపడతాయో తెలపగలరు. ఉదా: కింది వాక్యాల్లో భావాన్ని తెలపటానికి నేను ఉపయోగించిన Been, Being పదాల ప్రయోగం సరిగ్గా ఉందో, లేదో తెలపండి.*

1. *Being their faithful servant, finally he cheated them.*
2. *Being she is very intelligent, she succeeded in dealing the situation.*
3. *Being it is one of the finest products of Wipro, today it is known to every customer/ consumer.*
4. *Being she was disgraceful in public by him, she has decided not to talk Ravi from now on.*
5. *Been/ Being beaten by his master Ravi didnot come to class today.*
6. *Been our companion for 6 months, she is not coming to us as she has became a famous TV anchor today.*
7. *Miss Savithri Been practising the violin since 6 months, now she has improved.*
8. *Been/ Being it was very hot sunny they didnot attend the meeting yesterday.*

*- శ్రావణి, నంద్యాల*



**జవాబు: i) a)** Being అన్నా having been అన్నా అర్థం- ఉండటం, ఉండటం వల్ల, ఉండినందువల్ల (గతంలో, ముఖ్యంగా having been అన్నప్పుడు). ఉత్త been రాదు.

**b)** being/ having been తర్వాత verb తో ఉన్న group of words రావు.

**i) Being :** We don't like his being here
అతడిక్కడ ఉండటం మాకిష్టంలేదు. (being = ఉండటం)

**ii) Having been:** His having been a collector was helpful to us.
(అతడు collector గా ఉండటం మాకు మేలయ్యింది- గతంలో) ఈ రెండు sentences లో being అంటే ఇప్పుడు ఉండటం, Having been అంటే గతంలో ఉండటం అని తెలుస్తుంది కదా?

**Being / Having been** = ఉన్నందువల్ల / అయినందువల్ల

**a)** Being weak, he is unable to walk
బలహీనంగా ఉన్నందువల్ల, నడవలేకపోతున్నాడు.

**b)** Having been weak, he was unable to walk
బలహీనంగా ఉన్నందువల్ల నడవలేకపోయాడు (గతం).

ఇక మీ sentences- వాటికి corrections.

1) Being their faithful servant, he cheated them - ఇది తప్పు. అర్థం లేదు. నమ్మకమైన సేవకుడవటం వల్ల మోసం చేశాడు- ఇది తప్పు కదా. నమ్మకమైన servant గా ఉంటూనే - అంటే అప్పుడు, Inspite of being their faithful servant.... అంటే సరైన అర్థం వస్తుంది.

2) Being she is very intelligent - ఇది Wrong construction. Being తో verb ఉండే group of words రావు. (ఈ group లో is అనే verb ఉంది కదా) - ఇక్కడ correction-
Being very intelligent, she succeeded....

3) ఇక్కడ కూడా, పై sentence లో లాగానే,
Being one of the finest products of Wipro, it is known today....

4) Being disgraced in public by him, she has decided not to talk to him.

5) Having been beaten by his master, Ravi did not come to class today. ఇక్కడ action past కాబట్టి, having been వస్తుంది. Being beaten రాదు.

6) ఇక్కడ కూడా, though / inspite of వాడాలి.
Inspite of having been our companian for 6 months, she .... today. (ఉత్త 'been' రాదు)

7) Having been practising the violin for the past six months,...

8) It being a hot / sunny day.....

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Sravan:** Hi Bhavan, when do you start for your class?
(మీ class కు నువ్వు ఎప్పుడు బయల్దేరతావు? )
**Bhavan:** Usually at 10. Today I am a little late.
(మామూలుగా 10 కి. ఇవాళ కాస్త ఆలస్యం అయ్యా)
**Sravan:** And when does the class begin?
(Class మామూలుగా ఎప్పుడు ప్రారంభమవుతుంది? )
**Bhavan:** Usually at 10.30.
(మామూలుగా 10.30 కి)
**Sravan:** Perhaps you donot have the class on Sundays.
(Sunday classes లేవేమో కదా? )
**Bhavan:** That's true. The teacher does not hold classes on Saturday either.
(నిజమే. మా teacher శనివారాలు కూడా classes పెట్టరు)
**Sravan:** Does he teach only for five days a week?

II (b) లో కూడా The boys (they) are coming లో verb - are + coming - are + ...ing. దీనర్థం వాళ్లు ఇపుడు వస్తున్నారు అని ఇప్పుడు జరుగుతున్న action ను తెలుపుతుంది.
అలాగే Hemanth is playing cricket - దీన్లో verb is playing - is + ...ing ఇప్పుడు ఆడుతున్నాడు, అని ఇప్పుడు జరుగుతున్న action ను తెలుపుతోంది.
కాబట్టి am + ing/ is + ing/ are + ing - they talk about actions going on now.
ఈ am + ing/ is + ing/ are + ing forms of verb - present continuous tense.
Are you coming? - verb, are coming - నువ్వు వస్తున్నావా (ఇప్పుడు)?







**a)** I am leaving for Guntur tomorrow
నేను రేపు గుంటూరు వెళ్తున్నాను.
(Tomorrow, future (ముందు జరగబోతోందని) తెలుపుతోంది కదా? )
**b)** My sister is coming here next week
ఇక్కడ next week అని time చెప్పటం వల్ల, is coming కూడా future action ను తెలుపుతోంది.
**c)** My Parents (they) are starting for Kasi tomorrow

# When does the class begin?


M. SURESAN

(అంటే ఆయన వారానికి 5 రోజు లేనా class చెప్పేది? )
**Bhavan:** Yes, we like it that way too.
(మాకూ అదే ఇష్టం)
Look at the following sentences from the dialogue above.
**1)** When do you start for college?
**2)** When does the class begin?
**3)** You do not have classes on Sundays.
**4)** The teacher does not hold classes.
**5)** Does he teach only for 5 days a week?
కిందటి lesson లో మనం- I Regular Doing Words (come, go, sing లాంటివి, I, we, you and they తో వాడేవి), II Regular Doing Words (comes, goes, sings లాంటివి, he, she, it తో వాడేవి) గురించి తెలుసుకున్నాం. వీటిని regular actions- క్రమం తప్పకుండా జరిగే పనులకు వాడతాం. ఇంకా వీటినిnot తో, question లో వాడినప్పుడు I Regular Doing Word (I RDW) - do + Ist RDW అవుతుంది, II Regular Doing Word (II RDW) - does + Ist RDW అవుతుంది.
ఇవే పై conversation లో pick up చేసిన sentences లో ఉన్నాయి చూడండి:
**1)** When do you start? - verb - do start (Question కాబట్టి) = start (in a statement)
**2)** When does the class begin? - verb - does begin (in a question) = begins (statement లో)
**3)** You do not have classes on Sundays - verb - do have (not తో) = have (not లేకపోతే)
**4)** The teacher does not hold classes - verb - does hold (not తో) = holds (not లేకుండా)
**5)** Does he teach only for ... ? - verb - does teach (question కాబట్టి) = teaches (statement లో)
II Compare the following pairs of sentences: (compare = పోల్చండి, pairs = జతలు)
**I (a)** I go to college at 10
**b)** I am going to college
**II (a)** The boys come here in the evenings
**b)** The boys are coming.
**III (a)** Hemanth plays cricket
**b)** Hemanth is playing
పై sentences లో (I (a), II (a), III (a)) verbs, I RDW and II RDW కదా? అంటే అవి regular actions ను చెప్తాయి.
I (b)లో verb - am going - am + ...ing - ఇది college కు వెళ్తున్నాను, అని ఇప్పుడు జరుగుతున్న action ను తెలుపుతుంది.

Who is singing? - verb, is singing - ఎవరు పాడుతున్నారు (ఇప్పుడు)?
Am I talking toomuch - verb - am talking - am + ing - ఎక్కువ మాట్లాడుతున్నానా (ఇప్పుడు)?
u am + ing/ is + ing/ are + ing, future (ముందు జరగబోయే) actions కు కూడా వాడతాం, time గనక చెప్తే.
అంటే Past action, time known (గతంలో జరిగి ఏ timeలో - ఫలానా రోజూ, సంవత్సరం, సమయం తెలిస్తే అప్పుడు మనం అలాంటి actionsకు) Past doing word వాడతాం
**a)** He has gone out (has gone- has + pp; బయటి కెళ్లాడు- No time mentioned)
**b)** He went out an hour ago (గంట కిందట అని time చెప్తున్నాం కాబట్టి - went - past doing word.
**a)** I have bought the book
**b)** I bought it yesterday
[ (a) లో time లేదు - కాబట్టి have bought - have + PP. (b) లో yesterday అని time చెప్తున్నాం, కాబట్టి - bought - past doing word]
Past doing word - came, went, walked, cooked, liked, loved లాంటివి not తో కానీ, question లో కాని did + 1st Regular Doing Word అవుతాయి కదా?
**a)** He came yesterday X He did not come yesterday (Not ఉంది కాబట్టి did come)
**Question:** Did he come yesterday? (Question- did come)

Tomorrow అని time చెప్పటం, are coming కూడా future action ను తెలుపుతోందని అర్థమవుతుంది.
u కొన్ని verbs ను am + ing/ is + ing/ are + ing form లో వాడం కదా: అవి a) మనసుకు సంబంధించిన love, hate, like, dislike, feel లాంటివి b) మన mind కు సంబంధించిన know, understand, remember, forget, think లాంటివి; c) appear, belong, comprise, contain, consist of, need, seem లాంటివి. వీటిల్లో వేటికి కూడా am + ing/ is + ing/ are + ing forms లేవు.
u have + past participle/ has + participle form- దీన్ని present perfect అంటాం.
దీనికి ఒక ఉపయోగం, past action, time not statedకదా?
**a)** They have seen the movie (verb - have seen - have + pp వాళ్లు movie చూశారు- ఎప్పుడనేది తెలియటం లేదు)
They saw the movie yesterday
(వాళ్లు నిన్న చూశారు- verb saw - ఇది past doing word. ఈ వాక్యాన్ని simple past tense అంటాం)
**b)** I saw him last night X I did not see him last night (not ఉంది కాబట్టి did see)
**c)** They bought a car a year ago X They did not buy a car a year ago. (not ఉంది కాబట్టి did buy)
Questions లో కూడా did + 1st RDW:
Did you see him last night?
Did they buy a car a year ago?

## PRACTISE THE FOLLOWING

**Pavan:** నువ్వీ మధ్య శంతన్‌నేమన్నా కలిశావా?
**Suman:** ఎప్పుడో వారంకింద కనిపించాడు.
**Pavan:** వాడు అమెరికా వెళ్లే విషయం నీతో ఏమన్నా చెప్పాడా ఆరోజు?
**Suman:** వాడు next monday బయల్దేరుతున్నాడు.
**Pavan:** వాడు నాకు కొన్ని పుస్తకాలిచ్చాడు. వాటిని తిరిగిచ్చేయాలనుకుంటున్నా. వాడు నన్ను వారంగా కలవలేదు.
**Suman:** అతను నిన్నీరోజు కలుసుకుంటాడనుకుంటా.
**Pavan:** నీకెలా తెలుసు?
**Suman:** వారం కింద కలిశాను కదా. అప్పుడు నాతో అన్నాడు.

## ANSWER

**Pavan:** Have you met Santhan recently/ of late?
**Suman:** I saw him about a week ago
**Pavan:** Did he tell you/ talk to you that day about his going to the US
**Suman:** He is leaving next monday.
**Pavan:** He has given me some books. I want to return them. He hasn't (has not) met me for a week.
**Suman:** I think he is meeting/ is seeing/ will see you today.
**Pavan:** How do you know?
**Suman:** I met him a week ago, didn't I? He told me then.

### ఈ game practice చేయండి

**Suneetha gave the book to me.**
(సునీత నాకు పుస్తకం ఇచ్చింది)
ఇలాంటి sentences వేరే subjects, వేరే verbs తో question లో, not తో, dialogue form లో ఎన్ని రాయగలుగుతారో చూడండి.
**eg: a)** They distribute sweets to children
**b)** Harish did not show his book to me
**c)** Does he tell his secrets to you?
**Raghu:** Has he written any letter to you?
**Ramana:** I wrote one to him yesterday.
**Raghu:** He made a call to me yesterday. He gave his address to me. Do you want it?
**Ramana:** Give it to me.




**ప్రశ్న:** *Where we have to use 'to'*
*1. I) Naveen told Ramana. II) Naveen told to Ramana. Which is correct ?*
*2. I) After the meeting, please come to me.*
*II) After the meeting, please come me.*
*3. I) If you have two pens please give me.*
*II) If you have two pens please give to me. Which is correct?*
*Please tell me proper usage of 'to'. Generally we use 'off' as switch off, Turn off, power off like that in order to stop some thing. In your article you had told that 'how did the marriage go off'. Tell me the usage of 'off' also.*
*- రమణ, యానాం*
**జవాబు:** 1) Naveen told Ramana is correct. 'Tell' is not followed by to.
2) Please come to me - is correct, come is followed by to before a place/ person.
3) None of the sentences is correct. The correct sentence is:
If you have two pens, please give me one/ please give one to me.
**The uses of to:** It has a number of uses. We use 'to' before a place, a person, after a number of verbs. Please refer to the earlier lessons of spoken English on prepositions, for the correct uses of to, off, etc.
'How did the marriage go off?' In this sentence 'go off' is a phrasal verb, and 'off' is a part of it. 'Go off'- the set of words here, as a whole means, 'take place'.

**ప్రశ్న:** నేను తెలుగు మీడియం విద్యార్థిని. కాల్ సెంటర్ ఉద్యోగం చేయాలనుకుంటున్నాను. కరెక్ట్‌గా *English spell* చేయటానికి *Pronunciation Audio Casettes , Foreign Accent* కు సంబంధించి ఉపయోగపడే *cassettes* గురించి తెలియజేయండి. బుక్స్ ఏమైనా మార్కెట్లో ఉంటాయా?
**- కె.మయూరి, కాజీపేట**
**జవాబు:**
1) Pronunciation Audio Casettes, CIEFL (Central Institute of English and Foreign Languages) వాళ్ల Casettes మీకుపయోగపడతాయి. పెద్ద book shops లో దొరుకుతాయి. BBC, ముఖ్యంగా CNN TV Channels Newscasts వినండి.
2) Books విషయానికొస్తే Oxford/ Langman's Dictionary pronunciation follow అవండి- వాటిల్లో British/ American- రెండు రకాల Pronunciation ఇస్తారు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Dinesh:** Hi Ramesh, I hear (that) you have bought a new bike.
(నువ్వు కొత్త bike కొన్నావని విన్నాను/ తెలిసింది)

**Ramesh:** Yes, I bought it the day before yesterday. I took it to the temple yesterday, and had the pooja done.
(అవును, మొన్న కొన్నాను. నిన్న గుడికి తీసుకెళ్ళి పూజ చేయించాను)

Had the pooja done = పూజ చేయించాను

**Dinesh:** Wish you a happy ride on the new bike

ride = (మామూలుగా) స్కూటర్, bike, scooter లాంటి వాహనాల మీద వెళ్లటం కూడా ride

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 116

**Ramesh:** My brother hasn't seen my new bike yet. He has been away in Chennai for the past four days. We expect him tomorrow.
(మా brother ఇంకా నా new bike చూళ్లేదు. ఆయన నాలుగురోజులుగా చెన్నైలో ఉన్నాడు. రేపొస్తాడనుకుంటున్నాం.)

**Dinesh:** Have you shown it to our friend Kapil?
(కపిల్‌కు చూపించావా? )

**Ramesh:** Yes. I showed it to him yesterday itself. He liked the colour very much.
(నిన్ననే చూపించాను. రంగు అతనికి చాలా నచ్చింది).

**Dinesh:** Do come down this evening. Let me have a ride on it.
(సాయంత్రం మా ఇంటికి రా. ఓసారి నన్ను నడపనీ దాన్ని.)

**Ramesh:** Oh, certainly. (తప్పకుండా).



**a)** I bought it the day before yesterday.
(మొన్న కొన్నాను - కాబట్టి bought - past doing word)

**b)** I took it to temple yesterday and had the pooja done
నిన్న గుడికి తీసుకెళ్ళి పూజ చేయించా

**c)** I called your home three times yesterday
నేను మీ ఇంటికి నిన్న మూడుసార్లు Phone చేశా

u have + pp/ has + ppను ఎప్పుడో ప్రారంభమై ఇప్పటివరకూ జరిగిన actions కూ వాడతాం. పై conversation లో ఈ sentences చూడండి.

**a)** I have used my bike for only two years
(రెండేళ్లుగా- అంటే రెండేళ్ల కిందటి నుంచి ఇప్పటివరకు- నా bike వాడాను. అంటే action from then. అప్పటి నుంచి ఇప్పటివరకు జరిగిన పని.)

**b)** I haven't had (have not had) any trouble with it so far
(దానివల్ల నాకిప్పటివరకు ఏం trouble లేదు) ఇక్కడ కూడా ఇప్పటివరకు (Till now) జరిగిన action కు have + not + pp (haven't had) వాడాం.

**c)** My brother hasn't seen my new bike yet.
(yet= ఇంతవరకు మా brother నా కొత్త bike చూడలేదు. verb - has + not + seen)

**d)** Have you shown your bike to Kapil?
(నీ bike కపిల్‌కు చూపావా (ఇంతవరకు- Have shown)

**e)** He has been away in Chennai for the past four days
(నాలుగు రోజులుగా- నాలుగు రోజుల కిందటి నుంచి ఇప్పటివరకు ఆయన చెన్నైలో ఉన్నాడు. has been - 'be' form - state of being -ఉన్నాడు - అనే అర్థంతో)

u So, have + pp/ has + pp- ఈ verb formను కింది సందర్భాల్లో వాడతాం.

**1)** Past action, time not stated (గతంలో జరిగి, time చెప్పని పనికి)

**2)** Action from then till now (అప్పటినుంచి ఇప్పటివరకు జరిగిన పనికి)

u have + pp/ has + pp (pp- అంటే past participle)- just, just now, అనే మాటలు వాడితే ఇప్పుడే పూర్తయిన పనులకు వాడవచ్చు

**a)** వాడిప్పుడే బయటకు వెళ్లాడు=
He has just gone out

**b)** Train ఇప్పుడే వచ్చింది=
The train has just arrived.

**c)** వాళ్లిప్పుడే భోంచేశారు=
They have just had their meals.

# I haven't had any trouble

**Ramesh:** Thank you. I have called your home three times yesterday, but there was no response. I wanted to show the bike to you.
(మీ ఇంటికి నిన్న మూడుసార్లు phone చేశాను, కాని ఎవరూ ఎత్తలేదు. నీకు bike చూపిద్దామనుకున్నాను.)

Response = స్పందన. Phone లాంటివి ఎవరైనా చేస్తే పలకడం response

**Dinesh:** We were at my cousin's to attend a function
(మా cousin ఇంట్లో function కు వెళ్లాం)

**Ramesh:** Any idea of buying a new bike?
(నువ్వేమన్నా కొత్త bike కొందామనుకుంటున్నావా? )

**Dinesh:** I have used my bike for only two years. I haven't had any trouble with it, so I don't find a reason to change it.
(నా bike ను రెండేళ్లే వాడానిప్పటివరకు. ఇంతవరకు అది నాకేం trouble ఇవ్వలేదు. మార్చటానికి నాకేం కారణం కనిపించటం లేదు)

**Dinesh:** Bye then, see you this evening.
(అలాగే, సాయంత్రం కలుద్దాం).


M. SURESAN

కిందటి lesson లో చూశాం మనం- have + past participle/ has + past participle (PP)_ (దీన్ని present perfect tense అంటాం)- past action time not stated కు వాడతాం. ఈ సంభాషణలో కూడా అలాంటి వాడకం చూడండి.

You have bought a new bike = నువ్వు కొత్త bike కొన్నావు. కొనటం past, అయితే ఎప్పుడనేది చెప్పటం లేదు. Verb: have bought = have + PP అదీ past action, time stated (గతంలో జరిగి, ఎప్పుడు జరిగిందీ time తెలిపామనుకోండి)- అప్పుడు past indefinite / past simple tense వాడతాం. అంటే Past doing word (came, went, sang, danced లాంటి verbs వాడతాం). ఈ సంభాషణలో దాని ఉదాహరణ చూడండి.

పై మూడు సందర్భాల్లోనూ time తెలిసిన Past actions కాబట్టి bought, took, called అనే past doings words వాడాం.

**a)** I have seen the movie; I saw it yesterday.
మొదట time చెప్పటం లేదు ఎప్పుడు చూసింది. అందువల్ల have seen (have + pp). రెండో భాగంలో yesterday అని చెప్పటంవల్ల, saw - past doing word.

**b)** We have finished our breakfast; We finished it an hour ago.
(మొదటి భాగంలో time చెప్పటంలేదు, కాబట్టి have finished. రెండో భాగంలో 'an hour ago', అని time చెప్తున్నాం, కాబట్టి finished.

**c)** The police have arrested him; They arrested him last week.
(ఇక్కడ కూడా have arrested (time not stated); arrested (past doing word because time is stated)

ఈ difference English లో very important. So మనం have + pp/ has + pp కు, Past doing కూ ఉన్న తేడా చాలా careful గా గుర్తుపెట్టుకోవాలి.

PRACTISE THE FOLLOW-

**Interviewer:** మీ విద్యార్హతలు ఏమిటి?
**Candidate (అభ్యర్థి):** నేను B.Tech చేశాను.
**Interviewer:** మీరు B.Tech degree ఎప్పుడు తీసుకున్నారు?
**Candidate:** నేను B.Tech exam June 2004 లో రాశాను. Result Aug 2004 లో వచ్చింది.
**Interviewer:** అప్పటినుంచి ఇంతవరకు మీరేం చేశారు?
**Candidate:** నేను ఓ software company లో Programmer గా ఉన్నాను.
**Interviewer:** ఇప్పటికి మీకు ఎన్నేళ్ల experience?
**Candidate:** దాదాపు సంవత్సరంన్నర.
**Interviewer:** చూడండి, మీరెందుకు కంపెనీ మారాలనుకుంటున్నారు?
**Candidate:** మీ కంపెనీలో job చేయాలనే కోరిక నాకు చాలాకాలంగా ఉంది.
**Interviewer:** That's OK. మీ certificates తెచ్చారా?
**Candidate:** తెచ్చాను.
**Interviewer:** నన్ను చూడనివ్వండి.

**ANSWER:**

**Interviewer:** What are your qualifications?
**Candidate:** I have done B.Tech.
**Interviewer:** When did you take the B.Tech Degree?
**Candidate:** I took the B.Tech exam in June 2004. The result came in Aug 2004.
**Interviewer:** What have you done since then?
**Candidate:** I have been a programmer in a software company.
**Interviewer:** Howmany years of experience have you had so far?
**Candidate:** About a year and a half.
**Interviewer:** Look here, Why do you want to change your company?
**Candidate:** I have had the wish/ desire of doing a job in your company.
**Interviewer:** That's OK. Have you brought your certificates?
**Candidate:** Yes, I have.
**Interviewer:** Let me see them.

## ఈ game ఆడండి

**I know that he has gone.**
అతడు వెళ్లాడని నాకు తెలుసు.
That he has gone= వెళ్లాడని
(that కు ఇక్కడ అర్థం = అని.)
That he has passed = అతడు pass అయ్యాడు
ఇలా English లో that తో begin అయ్యే మాటల్లో verb (6 forms of verb గుర్తున్నాయి కదా? ) ఉంటే దాన్ని 'that clause' అంటాం.
ఇక్కడ ... that he has gone- that తో begin అయ్యే ఈ మాటల్లో has gone అనే verb ఉంది. కాబట్టి, ఇది, 'that clause'.

ఇప్పుడు మీరు చేయాల్సింది.
**I know that he has gone**- ఈ sentence model గా తీసుకుని ఎన్ని sentences అయితే అన్ని అనటం
Model: sub + Vb + that clause
I Know that he has gone
మరికొన్ని examples:
She says that she knows Telugu.
He does (not) know that it is mine.
వీటిల్లో a) questions b) dialogues కూడా practice చేయవచ్చు
**a)** Does she think that I am a fool?
**b) Kumar:** Do you know that Ganesh is here?
**Kesav:** I don't. How do you Know that he is here.
**Kumar:** Your sister has said that he is here.

**ప్రశ్న:** *He is a student of learn well school* అని మీరు రాశారు. *He is a student at learn well school* అని ఉండాలి కదా. వివరించగలరు.

*- ధన, హైదరాబాద్*

**జవాబు:** A Student of, Student at- ఈ రెండూ correct. అయితే A Student at Learn well School కొంచెం formal. వ్యావహారికంగా student of a School/ College/ University అనేదే ఎక్కువ వాడుకలో ఉంది.



**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Gunavanth:** Where have you been since the morning?
(ఉదయం నుంచి ఎక్కడున్నావు? )

**Yashwanth:** I have been working on the computer in the next room.
(పక్క గదిలో computer పై వర్క్ చేసు కుంటున్నా.)

**Gunavanth:** I have been trying to get you since the morning.
(పొద్దుటి నుంచి నీతో మాట్లాడాలని ప్రయత్నిస్తున్నా.)

**Yashwanth:** Why didn't you call my cell?
(నా cell కెందుకు phone చేయలేదు? )

**Gunavanth:** That's what I did. But I've been getting the response, 'switched off'
(అదే నేను చేసింది. ఎన్నిసార్లు చేసినా 'switched off' అనే వస్తోంది.)

**Yashwanth:** Well, what's so urgent?
(ఏంటంత అవసరం? )

(Let us ring him up = phone చేద్దాం. Let's go = వెళ్దాం పద. Let అంటే ఒకరు ఒక పని చేయనీ అని అర్థం కూడా ఉంది.
Let him come = అతడిని రానీ.
Let me go = నన్ను వెళ్లనీ... ఇలాగ.)

పై Conversation లో ఈ sentences చూడండి:

**a)** I have been working on the computer since the morning.
**b)** I have been trying to get you since the morning.
**c)** I have been getting the response...
**d)** He has been staying at his cousin's.
**e)** I have been thinking of meeting him.







గమనించండి జాగ్రత్తగా, ఇక్కడి 3rd use- (Action starting in the past and going on till now) కూ have been + ing/ has been + ing use- Action starting in the past and going on even now కూ చాలా పోలిక ఉంది కదా? అది correct.

**a)** గతం నుంచి ఇప్పటివరకు అయితే: have + PP / has + PP

Have + PP/ has + PP ఇప్పటివరకు జరిగిన action ను చెబుతుంది. ఇప్పుడింకా జరుగుతోందా, లేదా అనే విషయాలు దానివల్ల తెలియవు.

**b)** Tendulkar has been playing cricket since his 19th year.

ఇక్కడి verb, has been + ...ing అంటే 19వ ఏటి నుంచి ఇంకా ఆడుతూనే ఉన్నాడని. Continue అవుతోంది.

కాబట్టి 1) have + PP/ has + PP - ఇప్పటివరకు

**ii)** have been + ...ing/ has been + ...ing - ఇంకా (అయితే ఓ ముఖ్య విషయం. ఈ తేడా ఉన్నప్పటికీ, మామూలు usage లో Spoken/ Written form లో వీటి రెంటికీ ఈ తేడా పెద్దగా పాటించరు. ఇంకా నొక్కి చెప్పాల్సినప్పుడు have been + ...ing/ has been + ...ing, better)

**a)** I have worked here for ten years now.
**b)** I have been working here for ten years now.

**a), b)** దాదాపు ఒకే అర్థం కలవి. అయితే b)లో ఎక్కువ continuity కి ప్రాధాన్యం.

# I have been enquiring

**Gunavanth:** Ravi is in town for some course in software. He has been staying at his cousin's for the past two days. He wants to meet us.
(రవి ఊళ్లో ఉన్నాడు. ఏదో software course కు. రెండ్రోజులుగా వాళ్ల cousin ఇంట్లో బస చేస్తున్నాడు. మనల్నిద్దర్నీ కలుసుకోవాలనుకుంటున్నాడు.)

**Yashwanth:** In fact I've been thinking of meeting him. I want some books from him.
(నేనే అతడిని కలుసుకోవాలనుకుంటున్నాను. వాడి దగ్గర్నుంచి నాకు కొన్ని పుస్తకాలు కావాలి.)

**Gunavanth:** Why do you need them?
(అవి నీకెందుక్కావాలి? )

**Yashwanth:** You know, I've been doing a special course in computers for the past two weeks. The course has almost come to an end. I've to take an exam in it next week. That's why I need them.
(నీకు తెలుసు కదా, రెండు వారాలుగా computers లో నేనో special course చేస్తున్నట్లు. అది దాదాపు అయిపోయింది. వచ్చే వారం పరీక్ష. అందుకే పుస్తకాలు కావాలి.)

**Gunavanth:** Perhaps that's why he has wanted to meet us
(బహుశ అందుకనే అతడు మనల్ని కలుసుకోవాలనుకుంటున్నాడేమో.)

**Yashwanth:** I have been enquiring all book shops here for the books. They aren't available.
(ఆ పుస్తకాలకోసం నేనిక్కడ అన్ని book shops లో వెతుకుతున్నా. అవి దొరకటం లేదు.)

**Gunavanth:** Are you sure Ravi has them?
(రవి దగ్గర అవి ఉన్నాయని కచ్చితంగా తెలుసా? )

**Yashwanth:** I bought them here a year ago and sent them to him.
(ఏడాది కింద నేనే వాటిని కొని అతడికి పంపా.)

**Gunavanth:** That's O.K. Then let's ring him up and ask him to see us.
(సరే- అతడికి మనం phone చేసి కలుసుకోమందాం.)

**f)** I have been doing a special course in computers.
**g)** I have been enquiring.


M. SURESAN

వీటన్నిట్లో verb have been + ... ing/ has been + ... ing form లో ఉంది కదా.

Have been + ... ing/ has been + ... ing form లో verb ఉంటే అది Present Perfect Continuous Tense అవుతుంది.

I have been trying to get you since the morning.
పొద్దుటినుంచి నీ కోసం ప్రయత్నిస్తున్నా (Phone లో).
ఈ sentence లో చూడండి.
గతంలో ప్రారంభమై, ఇంకా కొనసాగుతుండే action కు have been + ing వాడుతున్నాం. (పొద్దుటి నుంచి, ఇంకా).

మీకు తెలుసు, I, we, you and they అయితే, have been + ... ing అంటాం, He, she, it అయితే has been + ... ing అంటాం. (This is for an action starting in the past and continuing even now.)

The congress party has been ruling AP for the year and a half (AP ని సంవత్సరంన్నరగా పాలిస్తోంది. ఏడాదిన్నర కిందట, past లో ప్రారంభమై ఇంకా కొనసాగుతోంది పాలన.)

పై conversation లోంచి తీసిన sentences లో Present Perfect Continuous ఉపయోగం గమనించండి.

**c)** I have been getting the response...
(... అనే response కొంత కాలం నుంచి, (పొద్దున్నించి ఇంకా) వస్తోంది.)

**d)** He has been staying at his cousin's.
(వాళ్ల cousin ఇంట్లో బస చేస్తున్నాడు- Past లో ప్రారంభమై, ఇంకా.)

**e)** I have been thinking of meeting him
(అతడిని కలుసుకోవాలనుకుంటున్నాను - ఇంకా)

**f)** I have been enquiring
(విచారిస్తూ ఉన్నాను - ఎప్పటినుంచో... ఇంకా)
(కిందట lesson లో have + PP (Past Participle)/ has + PP use చూశాం కదా? అది దేనికి వాడతాం?

**1)** Past action, time not stated.
**2)** Action just completed.
**3)** Action starting in the past and going on till now.

**b)** గతం నుంచి ఇంకా అయితే have been + ...ing/ has been + ...ing.

**a)** Tendulkar has played cricket for since his nineteenth year
(19వ ఏటి నుంచి ఇప్పటివరకూ ఆడాడు). ఆడటం అయిపోయిందా? - తెలియదు. ఈ sentence ప్రకారం ఆడటం కొనసాగుతోందా? - అదీ తెలియదు.

## PRACTISE THE FOLLOWING

**Govind:** నువ్వెక్కడ చదువుతున్నావు?
**Krishna:** సువిద్యా కాలేజీలో
**Govind:** ఎంతకాలంగా చదువుతున్నావక్కడ?
**Krishna:** గత రెండేళ్లగా
**Govind:** నీ marks ఎలా ఉన్నాయి?
**Krishna:** అన్ని subjects లో 80% కంటే ఎక్కువే score చేస్తున్నాను ఇంతవరకు. Maths లో అయితే నేనింతవరకు 90%కు తగ్గలేదు.
**Govind:** ఇక్కడ నువ్వు మీ తల్లిదండ్రులతో ఉంటున్నావా?
**Krishna:** లేదు. మొదట్నించి hostel లోనే ఉంటున్నా. (Stay వాడండి)
**Govind:** నా friend Ravi కూడా ఓ సంవత్సరంగా hostel లోనే ఉంటున్నాడు. అతడు నీకు తెలుసా?
**Krishna:** తెలుసు. మేము రెండు నెలలుగా ఒకే teacher దగ్గరికి tuition కు వెళుతున్నాం.
**Govind:** నేనతడిని కలవటానికి అతడు చేరినప్పటి నుంచి వస్తున్నాను. నన్నెప్పుడూ చూడలేదా?
**Krishna:** లేదు. మేం వేర్వేరు blocks లో ఉంటాం.

### ANSWER

**Govind:** Where are you studying?
**Krishna:** In Suvidya College
**Govind:** How long have you been studying there?
**Krishna:** For the past/ last two years/ for two years now.
**Govind:** How are your marks?
**Krishna:** I have been scoring more than 80% in all subjects. In Maths, I haven't scored less than 90% so far.
**Govind:** Do you live with your parents here?
**Krishna:** No. From the beginning I have been staying in the hostel.
**Govind:** My friend Ravi too has been staying in the hostel for the past one year. Do you now him?
**Krishna:** Yes. I know him (I do). We have been going to the same teacher for tuition
**Govind:** I have been visiting him frequently since he joined there. Haven't you ever seen me? (ever - ఎప్పుడైనా)
**Krishna:** No. We live in different blocks.




**ప్రశ్న:** Pronunciation కు సంబంధించిన అంశాలను స్పోకెన్ ఇంగ్లిష్‌లో భాగంగా అందించగలరు. భాష నేర్చుకోవడంలో ముందుగా ఉచ్చారణ ముఖ్యం. ఏ పదాన్ని ఏ విధంగా పలకాలో తెలుస్తుంది. స్పోకెన్ ఇంగ్లిష్‌కు సంబంధించిన సీడీలుగానీ, క్యాసెట్లుగానీ దొరికే అడ్రస్‌లను తెలియజేయగలరు.

**- కె.ఎస్.కృష్ణ, మెట్‌పల్లి**

**జవాబు:** 1) కొత్త మాట ఏదైనా వాడినప్పుడు దాని pronunciation సూచిస్తూనే ఉన్నాం కదా. ముందుముందు lessons లో వివరణ కొంత ఎక్కువగా ఉంటుంది.

2) Spoken English కు సంబంధించిన CDs, Casettes పెద్ద పెద్ద book-shops లో దొరుకుతాయి. Central Institute of English and Foreign Languages (CIEFL) వాళ్ల Pronunciation Casettes, CDs వినండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Kasturi:** Hi Mayuri what's new?
(ఏంటి విశేషాలు)

**Mayuri:** I met Charitha yesterday. She had a piece of good news. She told me she had bought a new apartment.
(నిన్న నేను చరితను కలుసుకున్నా. ఓ సంతోష కరమైన విషయం చెప్పింది. కొత్త apartment కొన్నానంది.)

News - uncountable. A news అనం. అయితే News ఎప్పుడు singular గానే వాడతాం. A good/ a bad news సరికాదు. Good news/ bad news అంటాం. లేకుంటే a piece of good news/ a piece of bad news అనవచ్చు

**Kasturi:** That's good really.

**Mayuri:** She told me (that) she had got bank loan for buying the apartment. The bank released the loan three days ago.
(తనకు ఇల్లు కొనడానికి bank రుణం ఇచ్చిందని చెప్పింది. రెండ్రోజుల కిందటే రుణం విడుదల చేశారు.)

**Kasturi:** Where are you coming from now?
(నువ్వు ఇప్పుడు ఎక్కడినుంచి వస్తున్నావు?)

**Mayuri:** I went to the station to book tickets to Tirupati. But by the time I reached the reservation counter, they had closed. I was late by only five minutes.
నేను తిరుపతికి tickets reserve చేసుకుందామని station కు వెళ్లాను. కాని వెళ్లేసరికి, reservation counter మూసేశారు. 5 నిమిషాలే ఆలస్యంగా వెళ్లాను.

**Kasturi:** Why didn't you start early enough?
(కొంచెం ముందే ఎందుకు బయల్దేరలేదు?)

**Mayuri:** I had some work, and when I finally went there it was 2 o' clock. You know that on sundays reservation closes by 2.30. I started on my scooter, but on the way I found it had run out of petrol. I had it filled and then went to the station. That delayed me.
ఏదో పనుండింది. ఆ తర్వాత బయల్దేరేసరికి టైం రెండైంది. నీకు తెలుసుకదా. ఆదివారాలు, Reservations 2.30కే కట్టేస్తారని. Scooter మీద బయల్దేరా. దారిలో దాంట్లో petrol అయిపోయిందని చూశా. Petrol పోయించి వెళ్లేసరికి ఆలస్యం అయిపోయింది.

Run out of (petrol/ money etc.) = అయిపోవటం. Have it filled = పోయించటం, ఇక్కడ

**Kasturi:** A similar thing happened to me yesterday. The train had left before I reached the station. So I called my office and told them I was not coming. My delay was due to traffic jam.
(నిన్న నాకూ అలాంటిదే జరిగింది. నేను station కు చేరేలోపే train వెళ్లిపోయింది. మా office కు Phone చేసి నేను రావటంలేదని చెప్పాను. నాకు traffic jam వల్ల ఆలస్యం అయింది.)

**Mayuri:** You know what happened to me yesterday? I went home from Charitha, and by then my husband had left for office. He had not taken the lunch box. He had forgotten it in his hurry.
(నిన్న నాకేం జరిగిందో తెలుసా? నేను చరిత దగ్గరినుంచి ఇంటికెళ్లాను. అప్పటికే మా ఆయన Office కు వెళ్లిపోయాడు. Lunch box తీసుకు వెళ్లలేదు. తొందరలో మరచిపోయాడు.)

Look at these sentences picked up from the conversation above:

a) She told me she had bought a new apartment

b) She told me she had got a bank loan







There are two past actions in sentence (a):

1) She told me (నాతో చెప్పింది)

2) That she had bought an apartment (apartment కొన్నదని).

ఈ రెండూ past actions. అయితే కొనటం ముందు, (కొన్నానని) చెప్పటం తర్వాత జరిగాయి. ముందు జరిగిన action had bought (had + PP form) లో ఉండటం గమనించండి.

అంటే had + PP form, రెండు past actionsలో ముందర జరిగిన past action కు వాడతాం.

మనం తెలుసుకున్నది: Had + PP is always used for the earlier of two past actions-

అంటే గతంలో జరిగిన రెండు పనుల్లో, మొదటి/ ముందరి పనికి had + PP వాడతాం.

a) The teacher knew that he had not done the home work

అతడు home work చేయలేదని teacher కు తెలిసింది. (చేయకపోవటం- earlier/ first past action)

b) Where had you worked before you joined here?

# I had had some work

c) By the time I reached the reservation counter they had closed.

d) I had had some work and when I finally...

e) I found it had run out of petrol.

f) The train had left before I reached the station.

g) ... by then my husband had left for office

h) ... he had not taken the lunch box

i) He had forgotten it.

**In all the sentences above look at the verbs:**

a) had bought (had + Past participle (PP) of buy)

b) had got (had + PP of get)

c) had closed (had+ PP of close)

d) had had (had + PP of have)

e) had run (had + PP of run)

f) had left (had + PP of leave)

g) had left ( had + PP of leave )

h) had (not) taken (had + PP)

i) had forgotten (had + PP)

పై verb form గమనించారు కదా: had + Past Participle (had + PP)-verb- ఈ form లో ఉంటే అది past perfect tense అవుతుంది. ఇప్పుడు దీని ఉపయోగం చూద్దాం.

a) She told me (yesterday) that she had bought a new apartment

కొత్త apartment కొన్నానని చెప్పింది నిన్న. జాగ్రత్తగా గమనించండి:


M. SURESAN

అలాగే sentence (b)లో కూడా. She told me (that) she had got a bank loan - loan వచ్చిందని చెప్పింది. loan రావటం ముందరి past action కాబట్టి had got.

Sentence c) By the time I reached the reservation counter, they had closed. (నేను చేరేటప్పటికే వాళ్లు మూసేశారు). మూసేయటం ముందు కాబట్టి had closed.

d) I had had some work and when I finally went there it was 2 o' clock.

ఇక్కడ కూడా పని ఉండింది ముందర, వెళ్లటం తర్వాత కాబట్టి had had (had + PP)

e) I found it had run out of petrol

Petrol అయిపోయి ఉండటం (ముందరి action) చూశాను - కాబట్టి had run (had + PP)

f) నేను platform చేరుకొనేసరికి train వెళ్ళిపోయింది. - ఇది ముందు, కాబట్టి had left (had + PP)

g) ఇందులో కూడా 'నేనింటికెళ్ళేసరికి, ఆయన వెళ్లిపోయాడు. (Had left- ఇది ముందు)

h) He had not taken the lunch box - Lunch box తీస్కెళ్లలేదు - ఇది ముందు - కాబట్టి had (not) taken

i) He had forgotten - ఇది కూడా ముందరి past action కాబట్టి had forgotten - had + PP

(ఇక్కడ చేరేముందు మీరెక్కడ పనిచేశారు.)

ఇక్కడ చేరటం - past - అంతకు ముందు సంగతి కాబట్టి had worked)

c) I had not known him till you introduced him to me.

మీరు పరిచయం చేసేవరకు ఆయన నాకు తెలియదు.

In English, had + PP is very important. అది వాడకపోతే confusion కలిగి, communication సరిగా ఉండదు. Look at the following.

1) He gave me yesterday what I asked for

2) He gave me yesterday what I had asked for.

Sentence 1 అర్థం: నేనడిగింది అతడిచ్చాడు. ఇక్కడ నేనడగటం, అతడు ఇవ్వటం వెంట వెంటనే, దాదాపు ఒకేసారి జరిగినట్టు అర్థం వస్తుంది. రెండూ నిన్ననే.

Sentence 2 అర్థం: నేనంతకు ముందెప్పుడో అడిగింది అతడు నాకు నిన్న ఇచ్చాడు. (ఇవ్వటమే నిన్న, అడగటం అంతకు ముందెప్పుడో)

Sentence (1) కూ, (2) కూ ఎంత తేడానో గమనించారు కదా. అదీ had + PP ఉపయోగం.

మరికొన్ని examples చూడండి.

a) He had not slept for two days. When I know that I felt pity for him

రెండు రోజులుగా అతడు నిద్రపోలేదు. అది తెలిసిన నేను జాలిపడ్డాను.

b) Who had opened this before I saw it?

నేను చూసేముందే ఎవరు తెరిచారు దీన్ని?

**ప్రశ్న:** 5-15 సంవత్సరాల వయస్సున్న పిల్లలకు *'Spoken English'లో పట్టు సాధించేందుకు ఏయే areas లో focus చేయాలి. దానికి సంబంధించిన Books, Cassettes, C.D.s ఎక్కడ దొరుకుతాయి?*

**- సి.ఎం.ఎస్.రాజు, రైల్వేకోడూరు**

**జవాబు:** NCERT వాళ్ల (Central schools/ central syllabus follow అయ్యే schools లో వాడే) books చాలా ఉపయోగకరం. 5 - 15 ఏళ్లలోపువాళ్లు concentrate చేయాల్సిన areas: spellings, sentence structures, Conversational Skills. ఇవన్నీ కూడా NCERT books లో ఉంటాయి.

## PRACTISE THE FOLLOWING

**Vaali:** అతడు ఎందుకు వెళ్లలేదు?

**Angad:** అతడు wait చేస్తున్న Phone call రాలేదట.

**Vaali:** OK. నేవెళ్లాలి. వస్తా.

**Angad:** Bye.

**Angad:** Hi Vaali. అతడు Chennai వెళ్లాడని నువ్వు నిన్న నాతో ఎందుకు అబద్ధం చెప్పావు? (అబద్ధం - lie వాడండి)

**Vaali:** లేదు. నేను అబద్ధం చెప్పలేదు. అతడు వెళతానని నాతో చెప్పాడు. నీతో మాట్లాడింతర్వాత అతడు వెళ్లలేదని తెలిసింది. అతడు programme మార్చుకున్నానని చెప్పాడు.

**Angad:** నేనేమో అతడు వెళ్లాడని అనుకున్నా. అందుకని అతడికా పుస్తకం తర్వాత ఇవ్వచ్చులే అనుకున్నా. నేనాపుస్తకం ఇవ్వలేదని నామీద చాలా కోప్పడ్డాడు.

**Vaali:** I am sorry. అతడు నీతో Programme మార్చుకున్న విషయం చెప్తాడనుకున్నా. కాబట్టి నీకు Phone చేయలేదు నేను.

**Angad:** అతడు వెళ్లడని నాకు ముందే తెలుసు.

**ANSWER**

**Angad:** Hi. Vaali, why did you lie to me that he had left for Chennai yesterday?

**Vaali:** No. I didn't lie. He had told me that he would go. I knew that he had not gone only after I had talked to you. He told me that he had changed his programme.

**Angad:** I thought that he had gone. So I thought I could give him the book later. He was/ felt angry that I had not returned his book.

**Vaali:** I am sorry. I thought he would tell you about his change of programme. Because I had thought so, I didn't call you (So - అలా)

**Angad:** I had known that he would not go.

**Vaali:** Why didn't he go? (Why did he not go?)

**Angad:** He didn't get the phone call he had waited for.

**Vaali:** OK. I must be going. Bye.

**Angad:** Bye.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# We had been studying...


M. SURESAN

**Soundarya:** Hi What a fine dress you've bought? Where did you buy it and how much did it cost you?
(అబ్బో చాలా బాగుంది నీ డ్రస్ ఎక్కడకొన్నావు? ఎంత? )

**Aiswarya:** Thank you for the compliment. I bought it at Vastraloka for Rs. 3000/-
(థ్యాంక్స్ మూడు వేల రూపాలయలు పెట్టి వస్త్రలోకలో కొన్నా.)

**Soundarya:** Certainly worth it. I wish I had one like it.
(కచ్చితంగా అంత చేస్తుంది. నాక్కూడా అలాంటిది ఉంటే ఎంత బాగుంటుందని పిస్తోంది.)

I wish I had one like that. మనం మాట్లాడుతున్నప్పుడు తీరని కోరికలకు ఇలా అంటాం. She wishes she had a car
(తనకు కారుంటే ఎంత బాగుండునో అనుకుంటోంది.) ఇక్కడ had, past అయినప్పటికి ఇప్పటి కోరికను తెలుపుతుంది.

**Aiswarya:** Time you bought one, Soundarya.
(ఇప్పటికే కొనాల్సింది నువ్వు)

ఇక్కడ కూడా bought - past form
Time you bought = ఎప్పుడో కొని ఉండాల్సింది.
Time you learnt manners .
(నువ్వు manners నేర్చుకోవాలి)
(ఇంకా నీకు manners తెలియదు; ఎప్పుడో నేర్చుకోవాల్సింది.)

**Soundarya:** When did you buy it?
(ఎప్పుడు కొన్నావు? )

**Aiswarya:** Yesterday. I had been thinking of buying it for a long time. I had the opportunity yesterday when dad gave me the money. I got it for my birthday the day after tomorrow.

**Soundarya:** Who is the other dress for?
(ఆ ఇంకో డ్రస్ ఎవరికి? )

**Aiswarya:** That's for my cousin Sowjanya. I am going to present it to her.
(అది మా కజిన్ సౌజన్యకు. నేనామెకు అది కానుకగా ఇవ్వబోతున్నాను.)

**Soundarya:** Has she returned from the states?
( స్టేట్స్ నుంచి తిరిగొచ్చిందా? )

**Aiswarya:** Yes, last weekend.
(అవును. గత వారాంతంలో)

**Soundarya:** Wasn't she a teacher here?
(ఇక్కడ ఆమె టీచర్‌గా ఉండేది కదా? )

**Aiswarya:** Yes. She had been working as a teacher when she got married. She then joined her husband in the U.S.
(పెళ్లయ్యేప్పటికి ఆమె ఇక్కడ టీచర్ గా పని చేస్తుండేది. ఆ తర్వాత వాళ్లాయన దగ్గరకు వెళ్లిపోయింది.)

**Soundarya:** We had been studying in the same college until we completed the degree. Later she took a job and I went for M.Sc.
(మేం ఇద్దరం డిగ్రీ పూర్తి అయ్యేవరకు ఒకే కాలేజ్‌లో చదువుకునేవాళ్లం. తర్వాత ఆమె ఉద్యోగంలో చేరింది. నేను ఎం.ఎస్.సి.కి వెళ్లిపోయాను.

**Aiswarya:** She had been staying with us until, she got the job. Her father who had been working else where, had a transfer here, and she went back home.
( ఉద్యోగం వచ్చే వరకు మా దగ్గరే ఉంది. అంతవరకు ఇంకెక్కడో పని చేస్తున్న వాళ్ల నాన్నకు ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ అయ్యే సరికి వాళ్లింటికి వెళ్లిపోయింది.)

**Soundarya:** She is quite nice.
(తను మంచి అమ్మాయి)

పై సంభాషణలో had been combinations తో ఉన్న ఈ verbs sentenceses ను చూడండి.

1) I had been thinking of buying it for a longtime. I had the opportunity yesterday.
2) She had been working as a teacher when she got married.
3) We had been studying in the same college until we completed the degree.
4) She had been staying with us until she got the job.

Last two lessons లో మనం had + past participle ( past perfect tense ) uses తెలుసుకున్నాం కదా!

**Let us recall it once again.**

✔ Had Past participle is used for the earlier of two past actions.
(గతంలో జరిగిన రెండు పనుల్లో, మొదటి దాన్నెప్పుడూ had + PP form లో తెలుపుతాం.)

**e.g.**

a) He was unhappy that his friend had gone.
(వాళ్ల ఫ్రెండ్ వెళ్లిపోయాడని అతను బాధపడ్డాడు)
b) She had worked as a teacher before she got married.
(పెళ్లికి ముందు టీచర్‌గా పని చేసింది)
c) We know that he had passed.
(పాస్ అయ్యాడని మాకు తెలిసింది)

ఇవీ Had + PP ఉపయోగానికి ఉదాహరణలు. ఇప్పుడు మొదటి సంభాషణలోని had been + ing (అంటే Past Perfect Continuous tense) ఉపయోగం చూద్దాం.

✔ గతంలో జరిగిన రెండు పనుల్లో ఒకటి ముందు ప్రారంభమై రెండో పని జరిగేదాకా continue అయితే అప్పుడు మొదటి విషయాన్ని had been + ing form లో చెప్తాం.

**Compare the following sentences.**

a) She had worked as a teacher before she got married.
(పెళ్లికి ముందు ఆమె టీచర్‌గా పని చేసింది.) ఇక్కడ verb- had + PP
b) She had been working as a teacher until- when she got married.
(పెళ్లయే వరకూ/ పెళ్లయ్యేటప్పటికి ఆమె టీచర్‌గా పనిచేస్తూ ఉంది.) ఇక్కడ verb had been+ing.
(a) లో గతంలో జరిగిన పనుల్లో ఒకటి ముందు, రెండోది తర్వాత, కదా? - (had + pp)
(b) లో గతంలో ఒక పని ప్రారంభమై రెండో పని వరకు continue అయ్యింది కాబట్టి had been + ing.

a) He had been driving at 100 kmph when he hit a lorry.
(అతడు లారీని ఢీకొట్టేప్పటికి 100 కి.మీ. వేగంతో డ్రైవ్ చేస్తున్నాడు.)
b) The British had been ruling India for over two centuries until it became independent in 1947
(1947 లో స్వాతంత్ర్యం పొందేవరకు బ్రిటీషర్లు భారత్‌ను రెండు శతాబ్దాల నుంచి పాలిస్తున్నారు.)

**Doctor:** What's your complaint?

**Subash:** I have a pain in the side, doctor. I have had the pain since this morning. I had been taking my morning walk when I suddenly felt it.
(పొద్దుటి నుంచి డొక్కలో నొప్పిగా ఉంది. నేను పొద్దున నడుస్తున్నప్పుడు నొప్పి వచ్చింది)

**Doctor:** I remember that you came to me last month with a similar complaint.
(మీరు గత నెల ఇదే కంప్లయింట్‌తో వచ్చినట్టు నాకు గుర్తు)

**Subash:** Yes, doctor. You gave me some tablets and I felt all right after two days. Since then I hadn't been having any problem till this morning.

(అవును. అప్పుడు మీరేమో మాత్రలు ఇచ్చారు. రెండ్రోజుల తర్వాత తగ్గిపోయింది. అప్పటి నుంచి ఈరోజు ఉదయం వరకు నాకే సమస్యా లేదు )

**ఇక్కడ కూడా ....**

a) had been walking... felt the pain.
b) hadn't been having any pain till this morning.
a) నాకు నొప్పి కలిగినపుడు నడుస్తూ ఉన్నాను.
b) పొద్దున వరకు నాకు నొప్పి అనేదేలేదు.

కాబట్టి had been + ing ఎప్పుడూ కూడా గతంలో ప్రారంభమైన two actions లో first action, 2nd action వరకు continue అయితే దాన్ని had been + ing తో చెపుతాం.

ఇది 'be' form లో చూడండి. (అంటే గతంలో రెండో పని జరిగే వరకు ఉన్న విషయాన్ని పేర్కొనడం)

a) He had been here till his father called him.
(వాళ్ల నాన్న పిలిచే వరకు అతనిక్కడే ఉన్నాడు.)
(ఉండటం had been - గతంలో, తర్వాత his father called- పిలవటం)
b) Abdul Kalam had been a space scientist until he took over as President
(రాష్ట్రపతిగా బాధ్యతలు స్వీకరించే వరకు కలాం స్పేస్ సైంటిస్ట్‌గా (ఉన్నారు)
c) I thought till this morning that he had been here.
(పొద్దున వరకు అతనిక్కడే ఉన్నాడని అనుకున్నా)

ఇదీ had been, had been + ing వాడాల్సిన తీరు. తెలుగులోలా కాకుండా, English లో time of action, time of state of being ను బట్టి మనం వాడే verb forms కచ్చితంగా మారుతుంటాయి. అలా correct గా అయిన verb forms ను వాడకపోతే పెడర్థాలకు, తికమకలకు దారి తీస్తాయి.

**Tarun:** వరుణ్ , చాలాకాలమైంది నిన్ను చూసి, ఎక్కడున్నావు? ఏం చేస్తున్నావు?
**Varun:** ప్రస్తుతం నేను ముంబయిలో ఉన్నా. ముంబయి లో అవకాశం వచ్చేప్పటికి హైదరాబాద్‌లో పనిచేస్తున్నా.
**Tarun:** ముంబయికి మారేవరకు హైదరాబాద్ లో ఎంత కాలం పనిచేశావు.
**Varun:** ప్రోగ్రామర్‌గా పనిచేస్తూ ఈ అవకాశం పొందాను.
**Tarun:** హైదరాబాద్‌కు ముందెక్కడో ఉన్నావు కదా?
**Varun:** అవును. చెన్నైలో ఉన్నా 6 నెలలు.
**Tarun:** ఇప్పుడెక్కడికి?
**Varun:** నేను నా ఫ్రెండ్‌తో, ( గత నెల అనుకుంటా) మాట్లాడుతుంటే, అతడి ఫ్రెండ్ వచ్చాడు. ఓ గంట మాట్లాడుకునేటప్పటికి ఈ రెండో ఫ్రెండ్‌కు ఒక ఆలోచన వచ్చింది. మేం ముగ్గురం కలిసి హైదరాబాద్‌లో ఓ సాఫ్ట్‌వేర్ కంపెనీ పెట్టాలని.
**Tarun:** బాగానే ఉంది. ఎప్పుడు ప్రారంభిస్తున్నారు.
**Varun:** రెండు మూడు నెలల్లో.

## PRACTISE THE FOLLOWING

**Tarun:** Best of Luck.

**| Answers |**

**Tarun:** Hi Varun, long since I saw you. Where are you and what are you?
**Varun:** I am at present in Mumbai. I had been working in Hyderabad when I got the opportunity in Mumbai.
**Tarun:** How long had you been working in Hyderabad when you got the opportunity in Mumbai?
**Varun:** I had been working as a programmer when I got the opportunity.
**Tarun:** Hadn't you (had you not) been some where before you were in Hyderabad?
**Varun:** Yes. In Chennai for six months.
**Tarun:** Where now?
**Varun:** When I was talking to my friend, I think it was last month, his friend came. As we had been talking for an hour, this friend got an idea that we start a software company in Hyderabad.
**Tarun:** It's good. When are you starting it?
**Varun:** In two or three months.
**Tarun:** Best of luck.

ఈ game ఆడండి. ఈ కింది sentence నమూనాలో వీలైనన్ని sentences రాయండి. రాసి బిగ్గరగా చదవండి, Not తోనూ, Question గానూ, Dialogue form లోనూ రాయండి.

They laughed at him ఇక్కడ నమూనా.
sub verb Preposition Noun or pronoun

a) She looked at me.
b) They did not come for him
c) Why do you stare at her?
(Stare- అదే పనిగా చూడడం)

a) **Prem:** Why do you look at your watch (so often)?
**Karim:** I must talk to my uncle immediately
**Prem:** You wait for a few minutes.
**Karim:** I have waited for half an hour already

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# By the evening train

**Pramod:** Hi Prasanth, when are you starting for Bangalore?
(ఎప్పుడు బయల్దేరుతున్నావు? )

**Prasanth:** Tomorrow by the evening train.It arrives here at 6 and leaves at 6.10
(సాయంత్రం Trainలో. అదిక్కడికి ఆరింటికి వచ్చి, 6.10కి బయల్దేరుతుంది.)

**Pramod:** I'll be at the station even before 6 to see you off.
(నీకు వీడ్కోలివ్వటానికి ఆరింటికి ముందే station లో ఉంటా)

See off= వీడ్కోలివ్వటం

**Prasanth:** O that's good of you. Thank you.
(చాలా బాగుంది. థాంక్ యూ. ఎవరైనా మనకు మంచిగానీ, సంతోషం కలిగించేదిగానీ చేస్తే, that's (that is) good of you, That's Kind of you అంటాం. good/ Kind ముందు very చేర్చవచ్చు)

**Pramod:** You remember our friend vinod is there too. He is into software.
(మన ఫ్రెండ్ వినోద్ కూడా అక్కడే ఉన్నాడు. అతడు కూడా సాఫ్ట్‌వేర్ (కంప్యూటర్స్)లో ఉన్నాడు. 'into' ఈ మధ్య ఈ అర్థంతో ఎక్కువ వాడుతున్నారు.

He was into business for some time
అతడు కొంతకాలం వ్యాపారంలో ఉన్నాడు/ వ్యాపారం చేశాడు)




**Pramod:** It's for him and for his dad to settle. Meet you at the station tomorrow. Bye.
(అది వాడూ, వాళ్ల నాన్న తేల్చుకోవాల్సిన విషయం. రేపు నిన్ను station లో కలుస్తా. వస్తామరి)

**Prasanth:** Bye.

ఈ Conversation లో, look at the following expressions.

1) starting for Bangalore
2) by the evening train
3) arrives here at 6 and leaves at 6.10
4) before six
5) good of you
6) into software
7) close to
8) talked to him over phone
9) the day before sivarathri
10) his father is angry with him at his postponing his marriage.
11) differs with his father over who he should marry.
12) Particular about
13) Outside the family circle
14) The reason for
15) It's for him and for his dad to settle.
16) At the station

Words like for, by, at, before, of, into, to, over, with, about, outside etc. are prepositions.

prepositions గురించి ఇంతకుముందు lessons లో కొంత తెలుసుకున్నాం.

At home, at college, at school, at that place, at the village, at 6.00 pm, at 12 noon, at a stage/ a certain stage/ at that stage, (stage = దశ)

at the theatre, at the station etc.

**2)** to = ఒకచోటికి, ఒకరికి, ఒకవోటువైపు - to Hyderabad, to Vijayawada, to Tirupathi to my father, to the CM, etc.

**3)** ఒకరినుంచి, ఒక ప్రదేశంనుంచి = from. from Hyderabad, order from the CM, etc.

**4)** By- కప్పు ఉన్న వాహనాలయితే - by bus, by car, by train, by ship, by lorry, etc - దీనర్థం ఈ వాహనాల్లో అని.

**a)** I go to school by bus =
School కు bus లో వెళ్తాను.

**b)** Goods arrived by lorry =
సామాన్లు లారీలో వచ్చాయి.

**c)** He travelled by train =
Train లో ప్రయాణం చేశాడు.

**5)** Top లేని (scooter, bike, cycle, horse) లాంటి వయితే on.

**a)** He goes to college on bike.

**Prasanth:** Yea. My office in Bangalore is close to his. I talked to him over phone this morning, He said he would be at the station to receive me' (Bangalore లో నా office అతడి ఆఫీస్‌కు దగ్గరే. నేనతడితో ఈరోజు Phone లో మాట్లాడాను. నాకోసం station కు వస్తానన్నాడు.)

**Pramod:** He was here the day before sivarathri it seems his father is angry with him at his postponing his marriage.
(మొన్న శివరాత్రికి ముందురోజు ఇక్కడు న్నాడు. అతడు పెళ్లివాయిదా వేస్తున్నాడని వాళ్ల నాన్నకు కోపంగా ఉన్నట్టుంది)

It seems- అలా అనిపించటం/ కనిపించటం

**Prasanth:** He differs with his father over who he should marry. His father insists that he marry his uncle's daughter. He is particular about marrying a girl outside the family circle. That's the reason for his coming rarely.
(అతడికి, వాళ్ల నాన్నకు, అతడెవరిని పెళ్లి చేసుకోవాలనే విషయంలో అభిప్రాయభేదాలు న్నాయి. వాళ్ల నాన్నేమో అతడి మామయ్య కూతురిని పెళ్లి చేసుకోవాలని పట్టుబడుతు న్నాడు. ఇతడేమో దగ్గర చుట్టాలవాళ్లెవరిని చేసుకోనని పట్టుదలగా ఉన్నాడు. వాడిక్కడికి రావటం అందుకే అరుదు)


M. SURESAN

సామాన్యంగా prepositions మనుషుల, వస్తువుల, జంతువుల పేర్ల ముందు స్థలం, స్థితి, time, పద్ధతి తెలిపేందుకు వాడతాం అని ఇదివరకటి lessons లో చూశాం. ఒక్కోసారి మాటల తర్వాత కూడా prepositions వస్తాయి.

చాలా ముఖ్యమైన విషయం. ఏ preposition ఎక్కడ వాడాలనే rule ఏమీలేదు. మాట్లాడటం, చదవటం వల్లే అలవాటవుతుంది.

The correct use of prepositions is just a matter of practice.

English మాట్లాడుతున్నకొద్దీ, చదువుతున్నకొద్దీ prepositions అలవాటవుతాయి. ఉదాహరణకు మనం తెలుగులో అంటాం: వాడి మీద నాకు కోపం. ఇక్కడ కోపం ముందు 'మీద' ఎందుకు వాడాలి అనే ప్రశ్నకు జవాబుండదు కదా. ఆ భాష లక్షణం, వాడుక అంతే. English లో preposition వాడుక కూడా అంతే. ఏ మాటముందు ఏ preposition, తర్వాత ఏ preposition అనేది కొంచెం కంఠస్థం చేయటం కూడా మంచిదే. ఒకేమాట తర్వాత వాడే preposition లో తేడావస్తే అర్థంకూడా మారిపోతుంది. అందుకని prepositions విషయంలో చాలా జాగ్రత్త అవసరం. అయితే కొన్నిచోట్ల అంత confusion రాదు. గుర్తుంచుకోవాల్సిన విషయం: తెలుగులో, English లో, ముందు వెనుక అవుతుంటాయి.

Eg: To Mumbai = ముంబైకి

**1)** ఒకచోట, ఒక ప్రదేశంలో, ఒక time కూ, ఒక దశలో - ఇలాంటి అర్థాలు వచ్చే preposition, at.

**b)** She moves about on a scooter -
ఆమె scooter మీద తిరుగుతుంటుంది.

**c)** Travel was on horseback in the olden days =
పాత రోజుల్లో ప్రయాణాలు గుర్రాల మీద.

**6)** ఒక చోటికి వెళ్లటం = go to a place;
అయితే ఒకచోటికి బయల్దేరటం = leave for a place, depart for a place; be bound for a place.

**a)** He is going to Delhi tonight.

**b)** She has left for Kolkata

**c)** This train is bound for Chennai
(చెన్నై వెళుతుంది)

**d)** The train is ready to depart for Lucknow.

**7)** ఒకరికోసం, ఒక విషయంకోసం = for

**a)** This book is for Ramesh =
ఈ పుస్తకం రమేష్ కోసం.

**b)** I am taking a lot of trouble for you =
మీ కోసం నేనింత trouble తీసుకుంటున్నాను.

**8)** **a)** Angry with = ఒక వ్యక్తి మీద కోపం
**b)** Angry at/about = ఒక విషయానికి కోపం.

**i)** My father is angry with me = నా మీద కోపం.

**ii)** My father is angry at/about my low marks.
(నాకొచ్చిన తక్కువ మార్కులకు ఆయనకు కోపంగా ఉంది)

**9)** Particular about = ఒక విషయంలో పట్టుదలగా ఉండటం.

Many members of TRS are particular about KCR's resignation =
KCR రాజీనామా విషయంలో చాలా మంది TRS సభ్యులు పట్టుబడుతున్నారు.

ఇలాంటివి చదివేటప్పుడు గమనిస్తూ చదవండి.

## PRACTISE THE FOLLOWING

**Subha:** ఏంటి శోభా, Vizag నుంచి ఎప్పుడు తిరిగొచ్చావు?

**Sobha:** నిన్న, పొద్దుటి train లో

**Subha:** వెళ్లేటప్పుడు car లో వెళ్లావుగదా, కార్లోనే వస్తావనుకున్నాను.

**Sobha:** Car repair లో ఉంది. నేనిక్కడికి వెంటనే రావాల్సి వచ్చేశాను.

**Subha:** నీ మీద నాకు చాలా కోపంగా ఉంది.

**Sobha:** ఎందుకు?

**Subha:** నిన్నటినుంచి ఇంట్లో ఉండి ఒక్కసారి కూడా phone చేయనందుకు

**Sobha:** నేను వచ్చేసరికి ఇల్లంతా మురికి. ఇల్లంతా clean చేస్తూ busy గా ఉన్నా. Sorry.

**ANSWER**

**Subha:** Hi Sobha, when did you come back?

**Sobha:** Yesterday, by the morning train.

**Subha:** While going you went by car. I thought you would return by car again.

**Sobha:** The car was under repair. I came back because I had to come back urgently.

**Subha:** I am very angry with you

**Sobha:** What for?

**Subha:** You have been at home and haven't called me even once.

**Sobha:** By the time I came back, the house was dirty. I was busy cleaning it. Sorry.




***ప్రశ్న:* *Spoken English, Grammar నేర్చుకోవడానికి తెలుగులో, తక్కువ ధర ఉండే పుస్తకాల వివరాలు చెప్పగలరు.***

*– జి. కేశవులు, పాముకుంట*

**జవాబు:** మీరు ఉన్నది చిన్న పల్లెటూరయినందువల్ల మీకు English వచ్చే అవకాశాలు తక్కువ అనే భయం అక్కరలేదు. చిన్న పల్లెటూర్లనుంచి వచ్చేవాళ్లు కూడా బ్రహ్మాండంగా English మాట్లాడగలుగుతున్నారు, మీరు కూడా మాట్లాడగలరు సరైన serious practice చేస్తే. తెలుగులో వివరణ ఉండే spoken English books లో Rapidex, English in 30 days లాంటి పుస్తకాలు చూడండి. మెల్లగా English news paper చదవటం ప్రారంభించండి. అర్థం అయినా కాకపోయినా, interest ఉన్నా లేకపోయినా చదవండి. మంచి dictionary (English to Telugu) దగ్గర ఉంచుకొని ఏదైనా పదం మీకు అర్థం కాకుంటే తెలుసుకోండి. చిన్న చిన్న story books, చిన్న classes English nondetailed books చదవండి. అర్థం అయినా కాకపోయినా TV English news వినండి. మీకు తోచినవి రాసి కాస్త English తెలిసిన వాళ్లకు చూపించండి. వీటితోపాటు మా Spoken English చదవటం practice చేయటం వల్ల మీకు ఓ నెల రోజుల్లో చాలా తేడా కనిపిస్తుంది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






# I will be there by 6.30

**Yamini:** Hi Salini, when exactly do you expect Malini?

(మాలిని కచ్చితంగా ఎప్పుడు వస్తుందనుకుంటు న్నావు? )

expect = ఇక్స్పెక్ట్- 'క్స్పె' నొక్కి పలుకుతాం = ఆశించటం/ ఎదురుచూడటం/ అనుకోవటం

**Salini:** At 11.30. I am sure she will be here atleast by 12.30

(11.30 కి. కనీసం 12.30 కల్లా ఇక్కడుంటుం దని కచ్చితంగా అనుకుంటున్నా)

sure = ష్యూఅ = కచ్చితంగా

**Yamini:** So she is returning from the US. When did she actually leave for the states?

(అంటే ఆమె US నుంచి తిరిగొస్తుందన్నమాట. అసలెప్పుడెళ్లింది అమెరికాకు? )

**Salini:** She left at the age of twenty two, two years ago. By then she had completed her software training here.

(ఆమెకు 22 ఏళ్లప్పుడు, రెండేళ్ల కిందట. అప్పటి కామె ఇక్కడ తన software training పూర్తిచే సింది).

**Yamini:** I was at breakfast when you called to tell me that she wanted to see me. I am surprised that Malini still remembers me and told you to phone me.

(ఆమె నన్ను చూడాలనుకుంటున్న విషయం చెప్పడానికి నీవు నాకు ఫోన్ చేసినప్పుడు నేను బ్రేక్‌ఫాస్ట్ చేస్తున్నాను. మాలిని ఇప్పటికీ నన్ను గుర్తుపెట్టుకున్నందుకు, నాకు ఫోన్ చేయాలని నీకు చెప్పినందుకు ఆశ్చర్యంగా ఉంది)

**Salini:** She is that type. She never loses friendship.

(తనలాంటిదే. friendship వదులుకోదు).

**Yamini:** We met only once, that too by chance, a year ago. After that we have met just once or twice. Good of her to remember me.

(ఎప్పుడో సంవత్సరం కింద అనుకోకుండా కలుసుకున్నాం మొదటిసారి. ఆ తర్వాత ఒకటి రెండుసార్లకంటే ఎక్కువ కలుసుకోలేదు. నిజంగా మంచిదే- నన్ను కలవాలనుకోవటం)

**Salini:** What's the time by your watch?

(నీ watch time ఎంత? )

**Yamini:** It is 11.15

**Salini:** Mine shows 11.20. My watch is fast by five minutes or your watch is slow by 5 minutes. Doesn't matter. She will be here in a short time.

(నా watch 11.20 చూపిస్తోంది. నా watch 5 నిమిషాలు ముందైనా నడుస్తుండాలి, లేదా నీ watch 5 నిమిషాలు ఆలస్యంగా నడుస్తుండాలి. ఫరవాలేదులే. కొద్దిసేపట్లో తనిక్కడుంటుంది.)

**Yamini:** How is she coming?

**Salini:** She is driving. When she last called me she was at a distance of 80 Kms. Suppose she is driving at 50 to 60 KMPH, she will be here by 11.45 at the most.

(ఆమె Car లో వస్తోంది. ఆమె నాకు Phone చేసినప్పుడు 80 Kms దూరంలో ఉంది. గంటకు 50/ 60 Km వేగంతో వస్తోందనుకో. 11.45కల్లా ఇక్కడ ఉంటుంది.)

**Yamini:** You are good at calculations.

మనం last lesson లో prepositions discuss (చర్చించటం) చేశాం కదా. Let's (let us) know something more. (మరికొంత తెలుసుకుందాం).

పై Conversation లో We have used the two prepositions 'at' and 'by'. Let's look where we have used them:

**I** a) at 11.30
b) at the age of 22
c) at breakfast
d) at a distance of
e) at 50 to 60 KMPH
f) good at calculations

**II** a) by 12.30
b) by then
c) by chance
d) by your watch
e) fast by/ slow by 5 min.
f) by 11.45

ఈ సంభాషణలోని ఇతర prepositions:

a) from the US b) leave for
c) age of d) in a short time

**I) At** ఎక్కడెక్కడ వాడామో చూడండి.

**a)** at 11.30. కచ్చితంగా ఫలానా time కు అనే అర్థంతో at వాడతాం.

i) I show 6.15 కు మొదలవుతుంది.
The first show begins at 6.15

ii) మా classes 4.30 కి అయిపోతాయి.
Our classes end/ close at 4.30

iii) ఆ time కు నాకీ సంగతి తెలియదు
I did not know this at that time.

iv) వాడెప్పుడు వస్తాడనుకుంటున్నావు?
At what time do you expect him?
(అయితే ఇక్కడ At what time బదులు, when, better)


M. SURESAN

**b) at the age of**

ఒకరికి ఫలానా వయసప్పుడు-

i) Children in India are put to school at the age of 3.
భారత్‌లో పిల్లల్ని మూడో ఏటనే School కు పంపుతారు.

ii) అతడు 11వ ఏటనే Chess grand master అయ్యాడు
He became a Chess grand master even at the age of 11/ even at 11

**c) at break fast** = breakfast చేస్తున్నప్పుడు. ఇలాగే at lunch; at dinner; at bath, etc... ఆయా సమయాల్లో అని.

i) వాళ్లు భోంచేస్తున్నప్పుడు jokes వేసుకున్నారు.
They had jokes at their meals/ lunch/ dinner etc...

ii) అతడు స్నానం చేస్తున్నప్పుడు phone మోగింది.
He heard the phone ringing when he was at bath.

ఇలాగే - at that height = ఆ ఎత్తులో అని కూడా అంటాం.

**d) at a distance of** = ... దూరంలో

i) విజయవాడ హైదరాబాద్‌కు 300 Km దూరంలో ఉంది
Vijayawada is at a distance of 300 Km from Hyderabad.

ii) అంతదూరంలో ఉండటంవల్ల అతనిక్కడికి తరచూ రాలేడు
Being at such a distance (= so far off) he cannot come here frequently.

**e) at 50 to 60 KMPH**

50/ 60 Km వేగంతో. వేగం గంటకో, నిమిషానికో చెప్పేటప్పుడు at వాడతాం.

i) గంటకు 70 Km = at 70 KMPH; Second కు 1230 అడుగుల వేగంతో = at 1230 feet per second etc.

ii) Planes ఈ రోజుల్లో గంటకు 700 మైళ్లు దాటి ప్రయాణం చేయగలవు.
Planes today can travel/ fly at more than 700 miles per hour.

**f) Good at calculations**

లెక్కలు బాగా తెలిసి ఉండటం

i) Maths బాగా చేయగలగటం=
good at/ clever at/ bright at Maths

ii) English బాగా రాకపోవటం=
poor at/ bad at English

iii) నేర్చుకోవటం ఆలస్యంగా/ నిదానంగా=
slow at learning-

iv) త్వరగా నేర్చుకోవటం=
quick at learning.

**II)** Now let us look at **by**

**a) By 12.30**= 12.30 కల్లా= 12.30 దాటకుండా= 12.30కు గానీ, అంతకుముందుగాని. ఇది time కే కాకుండా, date కు, month కూ year కూ ఏ time లో అయినా వర్తిస్తుంది.

i) నేను 6.30 కల్లా అక్కడ ఉంటాను=
I will be there by 6.30 (I will be there at 6.30= 6.30 కు correctగా, by 6.30= 6.30 కు గానీ, అంతకుముందుగానీ)

ii) 20 ఏళ్లకే Tendulkar tests ఆడటం ప్రారంభించాడు=
Tendulkar began playing tests by his twentieth year

iii) 2003 కు అతను లక్షాధికారి అయిపోయాడు=
He became a lakhier by 2003.

**b) By then**= అప్పటికే

i) I went there at 11.30. By then the match had begun=
నేనక్కడికి 11.30కు వెళ్లాను. అప్పటికే match ప్రారంభమైంది.

ii) నేను వెళ్లేసరికి అతన్ని వాళ్లు తీసుకెళ్ళారు=
By the time I reach there, they had taken him away.

**c) By chance**= అనుకోకుండా= by accident.

i) మేము అనుకోకుండా కలుసుకున్నాం= We met by chance/ by accident (accidentally).

అలాగే by mistake= పొరపాటున.

ii) By mistake I posted the letter to him instead of to his sister=
పొరపాటున వాళ్ల చెల్లెలికి బదులు, ఆ ఉత్తరం అతడికి post చేశాను.

iii) అతడు ఏదో పొరపాటు వల్ల అది చేశాడు=
He did it by mistake.

**d) By your watch**= మీ watch ప్రకారం.

i) నా watch లో time 8 అయింది.
It's 8 by my watch.

ii) మీ watch లో time ఎంత? =
What's the time by your watch?

**e) Fast/ slow by**= ఇటువంటిచోట్ల by 'ఎంతమేరకు' అనే విషయాన్ని తెలుపుతుంది.

i) మా అన్న నాకన్నా రెండేళ్లు పెద్ద=
My brother is my elder by two years.

ii) మా ఇంటికన్నా మా పక్కిల్లు 10 అడుగులు ఎత్తు=
Our next building is taller than ours by 10 feet.

iii) దానికి దీనికి తేడా 10 రూపాయలు=
This differs from that by Rs 10/- (This is costlier than that by Rs 10/-)

iv) He is taller than his brother by 4 cms
వాళ్ల brother కన్నా అతడు 4 cms పొడవు.

ఇవీ at, by ల ఉపయోగాలు. ఇప్పుడు-

**1) From:** దీనిని- 'నుంచి' అనే అర్థంతో వాడతాం.

**Kumar:** Srikanth is coming from Chennai today

**Kesav:** How do you know? (నీకెలా తెలుసు)

**Kumar:** I had it from his brother. (ఈ వార్త నాకు అతడి brother నుంచి తెలిసింది)

**Kesav:** You know, Srikanth and I are from Nellore.

(నీకు తెలుసా, శ్రీకాంత్, నేనూ ఇద్దరం నెల్లూరు వాళ్లమే). ఇక్కడ From ను ఏ ఊరికి చెందిన అనే అర్థంతో వాడతాం.

**Sankar:** Where are you from? (మీదే ఊరు? )

**Sukumar:** I am from Vizag (మాది Vizag)

ఇక్కడ Sentence లో from అర్థం చూడండి. మీదే ఊరు? అని అర్థం= ఈ అర్థంతోనే Where do you come from? అంటాం- అంటే మీరెక్కడ్నించి వస్తున్నారు అని కాదు, మీదేవూరు అని. I come from Hyderabad అంటే మాది Hyderabad అని. (అయితే సందర్భాన్నిబట్టి ఒక్కోసారి- మీరెక్కడ్నించి వస్తారు ప్రతి రోజూ - అనేందుకు, where do you come from? అనవచ్చు. Where are you coming from అంటే మాత్రం, మీరు ఇప్పుడు ఎక్కడ్నించి వస్తున్నారు? అని.)

**PRACTISE THE FOLLOWING IN ENGLISH:**

**Sasikanth:** మామూలుగా నువ్వెప్పుడుంటావిక్కడ?

**Ravikanth:** 9.30 కల్లా ఇక్కడుంటాను. ఇంట్లో correct గా 8.45 కు బయల్దేరుతాను.

**Sasikanth:** 8.45కు నేను breakfast లో ఉంటాను.

**Ravikanth:** ఆ time కు నేను స్నానం, breakfast అంతా పూర్తి చేస్తా.

**Sasikanth:** ఎలా వస్తావు నువ్వు?

**Ravikanth:** Busలో, మా Office మా ఇంటికి 10 కి.మీ దూరం. అందుకని 45ని. ముందు బయల్దేరుతా.

**Sasikanth:** నేను bike లో వస్తా. Traffic jam లేకపోతే 40-50 kmph వేగంతో వస్తే నేనిక్కడికి correct గా 9.30కి చేరుకుంటా.

**Ravikanth:** నిన్న అనుకోకుండా శ్రీకాంత్ కలిశాడు. అతను lift ఇచ్చాడు. మామూలుకన్నా 10 నిమిషాలు ముందరున్నా.

**Sasikanth:** శ్రీకాంత్ బాగా drive చేస్తాడు.

**ANSWER**

**Sasikanth:** When/ At what time are you here usually?

**Ravikanth:** By 9.30. I start at home at 8.45

**Sasikanth:** I am at breakfast at 8.45

**Ravikanth:** By then I finish my both, breakfast, etc.

**Sasikanth:** How do you come?

**Ravikanth:** By bus. My home is at a distance of 10 km from office. So I start 45 minutes earlier.

**Sasikanth:** I come on bike. If there is no traffic jam, I reach here exactly at 9.30, driving at 40 to 50 kmph.

**Ravikanth:** I met Srikanth by chance yesterday. He gave me a lift on his bike. So I was here earlier than usual by 10 minutes.

**Sasikanth:** He is good at driving.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# During the training period...

**Vighnesh:** Hi Manikanth you appear very happy today.
(ఈ రోజు నువ్వు చాలా సంతోషంగా కనిపిస్తున్నావు)

**Manikanth:** You are right. Dad called home this morning. He is coming on the 10th, that is, the day after tomorrow.
(పొద్దున మా నాన్న ఫోన్ చేశారు. ఎల్లుండి అంటే 10వ తేదిన వస్తున్నారు)

**Vighnesh:** So he will be here on saturday. That's good. Will he go back to the states again?
(అంటే శనివారం ఇక్కడికి వస్తారన్నమాట. మళ్లీ states కు వెళ్తారా? )

**Manikanth:** Yes, he will be leaving again in a month. He has to be back there in April.
(అవును. ఒక నెల తర్వాత వెళ్లిపోతారు. ఏప్రిల్ లో ఆయన అక్కడ ఉండాలి.)

**Vighnesh:** Will he settle down there?
(అక్కడే స్థిరపడతారా? )

**Manikanth:** No, but he will be there for quite a longtime.
(కాదు. అయితే కొన్నాళ్లపాటు అక్కడే ఉంటారు)

**Vighnesh:** When will you people join him?
(మీరందరూ ఆయన దగ్గరకెప్పుడు వెళ్తారు? )

**Manikanth:** I have told you my sister is getting married on the 4th of April. The bridegroom is a software engineer there. So she will be leaving on the 10th or so of April. Dad will leave a week after that.Mother and I will join him next year, after I finish my studies.
(మా అక్క పెళ్లి ఏప్రిల్ 4న అని చెప్పాను కదా. పెళ్లికొడుకు అక్కడ సాఫ్ట్‌వేర్ ఇంజినీర్. ఆమె 10న వెళ్లిపోతుంది. తర్వాత వారం రోజులకు నాన్నగారు వెళ్తారు.నేను, అమ్మ వచ్చే సంవత్సరం నా చదువు పూర్తయిన తర్వాత వెళ్తాం.)

**Vighnesh:** I have my visa interview on 18th March. I have got admission into MBA in one of the universities in the US. The course will begin on the 7th May. I propose to leave in the 4th week of April.
(నాకు వీసా ఇంటర్వ్యూ మార్చి 18న ఉంది. అమెరికాలోని యూనివర్సిటీలో ఎం.బి.ఏ. సీట్ వచ్చింది. కోర్సు మే 7న ప్రారంభమవుతుంది. నేను ఏప్రిల్ నాల్గో వారంలో వెళతాను.)

**Manikanth:** Best of luck for you. During your stay there you can meet dad. He will be happy to be of help to you. (Best of luck)
(నువ్వక్కడ ఉన్నపుడు మా నాన్న గార్ని కలుసుకోవచ్చు. ఆయన నీకు సంతోషంగా ఏ సాయం అయినా చేస్తారు.)

**Vighnesh:** Thank you. As soon as I go there, I shall get in touch with him.
(థాంక్యూ. అక్కడకి వెళ్లగానే ఆయనతో touch లో ఉంటాను.)

✓ At, by time కు సంబంధించిన prepositions. అలాగే in, on, during, for, from, to/till, since కూడా timeకు అంటే సమయానికి సంబంధించిన preps. (prepositions)

**Look at the following expressions from the conversation at the beginning of this lesson:**

**a)** This morning **b)** on the 10th **c)** on saturday **d)** in a month **e)** for quite a longtime **f)** on the 4th of April **g)** on the 10th of April **h)** on 18th March /the 7 th May **i)** in the 4th week **j)** during your stay Days (sunday, monday,etc.) dates (the 10th, the 18th April) కు ముందు, on రావడాన్ని గమనించి ఉంటారు. అలాగే months and years ముందు in వస్తోంది కదా?

a) India became independent on the 15th August 1947.

b) The college closed preparation holidays on the 2nd March.

c) India became a republic on Jan 26th 1950.

పై Sentence లో date చెప్పేటప్పుడు month (January) ముందు చెప్పి తర్వాత తేది చెప్తాం కదా. అందుకనే on Jan 26th అన్నాం. Months (నెలలు), సంవత్సరాల (years) ముందంతా in.

**a) Ramu:** When did Saran come here?

**Raghu:** He came here in February.
(February లో వచ్చాడు)

**Ramu:** When is he going to complete his research project?
(అతడు తన రీసెర్చ్ ప్రాజెక్ట్‌ను ఎప్పుడు పూర్తి చేయబోతున్నాడు? )

**Raghu:** I think in another year; that is in 2007.
(ఇంకో సంవత్సరానికనుకుంటా, అంటే 2007లో)

**Ramu:** When did he begin it?

**Raghu:** In 2005

**b)** There are only 28 days in February, except once in four years.
(నాలుగేళ్లకు ఒకసారి తప్ప Februaryలో 28 రోజులే ఉంటాయి.)




[every October / November కాబట్టి on రాదు]

c) The child was born in August 2005.
(బిడ్డ August 2005 లో పుట్టింది - in August)

d) The child was born last August
(పోయిన Augustలో పుట్టింది-last ఉంది కాబట్టి in లేదు)

✓ అలాగే Last year, next year, that year, this year, every year ముందు in రాదు

a) We had heavy rains last year
(గత ఏడాది వర్షాలు బాగా పడ్డాయి.)
✓ Last yearముందు in లేదు.

b) There was an earthquake that year
(ఆ సంవత్సరం భూకంపం వచ్చింది.)
✓ That year ముందు - in లేదు)

c) He will return next year
(వాడు వచ్చే సంవత్సరం తిరిగొస్తాడు)
✓ next year ముందు in లేదు)

d) He goes to Ooty every year

✓ **Since** = దీని అర్థం గతంలో ఒక time నుంచి అని. అంటే ఫలాన time నుంచి, ఫలాన రోజు నుంచి, ఫలాని నెల /సంవత్సరం / సంఘటన నుంచి అనేందుకు since వాడతాం.

i) India has been independent since 1947
(1947 నుంచి)

ii) I have not met him since last January
(గత January నుంచి నేనతన్ని కల్వుకోలేదు)

**Compare the following:**

a) India has been a republic since 1950.

b) India has been a republic for the past/ for the last 55 years.

✓ a) లో 1950 నుంచి Republic గా ఉంది అంటున్నాం. అంటే since, point of time ముందు వాడుతున్నాం.

✓ b) లో 55 ఏళ్లుగా (Period of time) అని వ్యవధి కాబట్టి for వాడుతున్నాం.

a) He has not seen a movie since January

b) He has not seen a movie for the past / for the last two months.

M. SURESAN

c) There are 12 months in a year. (సంవత్సరంలో 12 నెలలుంటాయి)

d) He was born on 10th September 1984.
(వాడు 10th September 1984లో పుట్టాడు.)

**Imp...**

i) On – before dates and days;
in – before months and years.

✓ తేదీలకు ముందెప్పుడు 'the' రావాలి.

On the 10th June; on the 15th of August, etc.

✓ అయితే dates, days, months, years కు ముందు Next (వచ్చే), last (పోయిన), every (ప్రతి) this (ఈ), that (ఆ) అనివస్తే అప్పుడు dates and days కు ముందు on కానీ, months and years ముందు in కానీ రావు.

**1. a)** He will be here on Sunday. (అతను ఆదివారం ఇక్కడ ఉంటాడు.) Sunday ముందు on రావడాన్ని గమనించండి)

**b)** He will be here next Sunday (వచ్చే) (next) Sunday వాడిక్కడ వుంటాడు - next Sunday కాబట్టి on వాడం]

**2. a)** I met him on the 26th Feb.
(నేను అతడ్ని ఫిబ్రవరి 26న కలుసుకున్నా). తేదిల ముందు On రావడాన్ని గమనించండి.

b) I met him last 26th. (పోయిన 26న కల్సుకున్నా) last ఉండటం వల్ల 'on' రాదు)

c) Salaries are paid on the first of every month. [on the first - గమనించండి on]

d) Salaries are paid every 1st.
(ప్రతి నెలా మొదటి తేదిన జీతాలు చెల్లిస్తారు) ఇక్కడ every 1st కాబట్టి on లేదు.

**3. a)** Deepavali comes in October or November.
(దీపావళి Octoberలో కానీ Novemberలో కానీ వస్తుంది). ఇక్కడ month ముందు in రావడాన్ని గమనించండి.

b) Deepavali comes every October/November.
(ప్రతి సంవత్సరం అతడు ఊటికి వెళతాడు)

✓ (Every year ముందు in లేదు.

✓ అలాగే This week, that week, next week, every week, last week ముందు in రాదు. (Week ముందు ఎప్పుడూ in)

a) I saw him here three times last week
(పోయిన వారం నేనతన్నిక్కడ మూడుసార్లు చూశా)
(Last week ముందు in లేదు)

e) For quite a long time:

**For ఉపయోగం...** (for అంటే ఇంతకాలంగా అని.)

i) (He was here for a week.)
(వాడిక్కడ వారం ఉన్నాడు.)

ii) (I waited for two hours for you yesterday.)
నిన్న నీకోసం రెండు గంటలు చూశా

iii) Any degree course is for three years
(ఏ degree Course అయినా మూడేళ్లపాటు ఉంటుంది.)

✓ కాలవ్యవధి (Period of time) ముందు for వాడతాం.

a) He has been here for the past two days
(రెండ్రోజులుగా ఆయనిక్కడ ఉంటున్నాడు)

b) The train stops here only for 5 minutes
( రైలు ఇక్కడ 5 నిమిషాలు మాత్రమే ఆగుతుంది.

f) During your stay = (నువ్వు ఉన్న కాలంలో)

✓ ఒక వ్యవధి లోపల అనే అర్థం వచ్చేట్టుగా అయితే during వాడతాం.

i) During his visit here, he did not meet me
(అతను తన పర్యటనలో నన్ను కల్వుకోలేదు.)

ii) During the training period, you do not get any salary
(శిక్షణా కాలంలో నీకు జీతం రాదు)

iii) During the show there was some disturbance
(ఆ ప్రదర్శన timeలో ఏదో అంతరాయం కలిగింది.)

iv) During his tenure as President, he visited many foreign countries.
(అధ్యక్షుడిగా ఆయన పదవీకాలంలో చాలా విదేశాలు చూశాడు. Tenure - టెన్యూఅ = పదవీ కాలం)

a) లో January నుంచి b) లో రెండు నెలలుగా

**Now practise the following**

**Dheeraj:** నేన్నీకన్నా పెద్దవాడినని ఎందుకనుకుంటున్నావు?

**Neeraj:** నువ్వు Julyలో పుట్టావు, నేను Septemberలో పుట్టాను కాబట్టి.

**Dheeraj:** కానీ మన ఇద్దరం schoolలో June 12 న చేరాం.

**Neeraj:** పోయినవారం దాకా మనిద్దరం ఒకే వయసనుకున్నా నేను. నీ date of birth ఎక్కడో చూశా. అప్పుడు తెలిసింది.

**Dheeraj:** ఈ నెల 12 నా పుట్టిన రోజు నువ్వు తప్పక రా. 2002 నుంచి నా పుట్టిన రోజుకెప్పుడూ వస్తున్నావు కదా. ఈసారి కూడా రా.

**Neeraj:** ఈ సారి నేను రాలేనేమో. నా కోసం ఊళ్లో నాలుగు రోజులుగా మా అక్కయ్య ఎదురుచూస్తోంది. మళ్లీ నేను వచ్చే సోమవారమే రాగలను.

**ANSWERS**

**Dheeraj:** Why do you think I am older than you?

**Neeraj:** You were born in July and I was born in September.

**Dheeraj:** But we joined school on 12th June.

**Neeraj:** Till last week I had thought we were the same age. I then saw your date of birth some where I knew it then.

**Dheeraj:** My birth day is on the 12th this month. Do attend it. You have been attending (coming for) my birth day since 2002. Don't fail this time.

**Neeraj:** I'm afraid I may not come/ I doubt if I can come - My sister has been waiting for me for the past four days at my village. I can come back only next Monday.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







**Viswanath:** When does the temple near your place open?

(మీ ఇంటి దగ్గర temple ఎప్పుడు తెరుస్తారు? )

**Lokanath:** In the morning or in the evening?

(పొద్దున్నా, సాయంత్రమా? )

**Viswanath:** In the morning.

(పొద్దున్నే)

**Lokanath:** It opens at 5 in the morning and closes at 12 noon.

(పొద్దున 5 గంటలకు తెరుస్తారు. మధ్యాహ్నం 12కు మూస్తారు.)

**Viswanath:** In the evening?

(సాయంత్రం? )

**Lokanath:** The temple is open from 4 in the evening till 8 in the evening.

(సాయంత్రం నాలుగు నుంచి 8 వరకు తెరిచే ఉంటుంది.)

**Viswanath:** I thought it opened from three in the afternoon.

(మధ్యాహ్నం మూడింటి నుంచి తెరిచి ఉంటుందనుకున్నా.)

**Viswanath:** A few days ago our friend Trinath met me. You know he had been away for long. He said he would meet me the next evening, but he did not come.

(మన ఫ్రెండ్ త్రినాథ్, కొద్దిరోజులకింద కలుసుకున్నాడు. మరుసటిరోజు కలుసుకుంటా నన్నాడు. కాని రాలేదు. అతడు చాలా కాలం నుంచి ఇక్కడ లేడు.)

**Lokanath:** Trinath is unreliable.

(త్రినాథ్ అంత మాట నిలుపుకోనేవాడు కాదు. Unreliable = ఆధారపడదగని)

**Viswanath:** Well then. Meet you again.

(మంచిది. మళ్లీ కలుసుకుంటా.)

**Lokanath:** Bye.

మనం timeకు సంబంధించిన prepositions చర్చిస్తున్నాం కదా కొన్ని lessons నుంచి. This lesson too deals with prepositions of time.

# She is very busy in the mornings

**Lokanath:** On festive days it is open till 2 in the afternoon. For example it was open at one on the afternoon of Sivarathri and closed late at night.

(పండగ రోజుల్లో మధ్యాహ్నం రెండు వరకు తెరిచే ఉంటుంది. ఉదాహరణకు శివరాత్రి రోజు మధ్యాహ్నం ఒంటిగంటకు కూడా తెరిచి ఉంచి, రాత్రి చాలా ఆలస్యంగా మూశారు.)

**Viswanath:** I visited the temple on the morning of Saturday. I went to your place too. You were out.

(నేను గుడికి శనివారం ఉదయం వెళ్లాను. అలాగే మీ ఇంటికి వచ్చాను. నువ్వు బయటికి వెళ్లావు.)

**Lokanath:** On the morning of Saturday? Yea, I went to my sister's. She was planing to go to Delhi on the evening of Sunday. I was there to help her in packing.

(శనివారం పొద్దున్నా? అవును. మా అక్కయ్య ఇంటికి వెళ్లాను. ఆదివారం సాయంత్రం ఆమె ఢిల్లీకి వెళుతుండటంతో సామాన్లు సర్దటంలో సహాయపడాలని వెళ్లాను.)

**Viswanath:** Do you go to your sister's frequently?

(మీ అక్కయ్య వాళ్లింటికి తరచూ వెళ్తావా? )

**Lokanath:** Almost every evening. They live very close to our place.

(దాదాపు ప్రతి సాయంత్రం.)

**Viswanath:** But I saw you at home last evening.

(అయితే నిన్న సాయంత్రం నువ్వింట్లో ఉండటం చూశాను.)

**Lokanath:** Yea, I was at home last evening. My sister was away shopping.

(నిన్న నేను ఇంట్లోనే ఉన్నా, సాయంత్రం మా అక్కయ్య shopping కు వెళ్లింది.)


M. SURESAN

deal with = చర్చించటం/ ఒక విషయం చూసుకోటం etc.

**Look at the following expressions in the conversation above:**

a) In the morning or in the evening.
b) at 12 noon
c) till 8 in the evening
d) in the afternoon
e) on the afternoon of Sivarathri
f) at night
g) on the morning of Saturday
h) every evening
i) last evening
j) the next evening

ఇక్కడ చూస్తున్నాం కదా: అంతా morning, evening, night, noon లాంటి వాటిని ఎక్కువగా వాడాం. ఇవన్నీ పూటలు (parts of the day)

ఫలానపూట - morning, evening etc.

జరిగిన విషయం గురించి చెప్పాలంటే, ఆ పూట (part of the day) ముందు, the పెట్టి, దాని ముందెప్పుడూ 'in' వాడతాం.

కాలేజ్ పొద్దున 8కి మొదలవుతుంది
The college starts at 8 in the morning.
కాలేజ్ మధ్యాహ్నం రెండింటికి అయిపోతుంది.
The college closes at 2 in the afternoon

**a) In the morning, in the evening, in the afternoon**

**i)** My mother gets up at 5 in the morning
మా అమ్మ ఉదయం అయిదింటికి లేస్తుంది.

**ii)** I saw him in the park at 8 in the evening.
నేను వాడిని నిన్న సాయంత్రం ఎనిమిదింటికి చూశాను.

**గమనిక:** English లో దాదాపు రాత్రి పడుకునేవరకు, సామాన్యంగా evening అనే అంటారు. దాదాపు 9 వరకు evening అనే అంటాం.

**iii)** She is very busy in the mornings.
పొద్దునపూట ఆమెకు అసలు తీరికుండదు.

**iv)** She is at leisure in the evenings
సాయంత్రాలు ఆమె తీరికగా ఉంటుంది.
(leisure = లెజర్ - measure లో su లాగ - 'లె' నొక్కి పలుకుతాం)

**b) at noon:** సరిగ్గా మధ్యాహ్నం 12 గంటలు noon. దీనికి అంటే noon కు ముందు మాత్రం at noon, the రాదు.

**i)** మధ్యాహ్నం 12కు సూర్యుడు మన నెత్తి మీద ఉంటాడు
The Sun is exactly above our heads at noon.

**ii)** మధ్యాహ్నం పన్నెండింటికి అతను బయటికి వెళ్లాడు
He went out at 12 noon/at noon.

**c) In the night or at night -**
ఈ రెండింటిలో ఏదైనా అనవచ్చు. అయితే, in తర్వాత the రావటం గమనించండి.

**i)** అతడు రాత్రి ఆలస్యంగా నిద్రపోతాడు
He goes to bed late in the night/late at night.

**ii)** రాత్రి అంతసేపు మేల్కొని ఉండటం కష్టం
It's difficult to be awake/keep awake so late in the night/so late at night.

**iii)** అతడు రాత్రి చాలా పొద్దుపోయాక ఇంటికి వచ్చాడు.
He came home very late at night/in the night.
సామాన్యంగా in the night కన్నా at night వాడుక ఎక్కువ.

**d) in the day** = పగటిపూట.

**i)** రాత్రికన్నా పగటిపూట చదవటం మేలు
It is better to study in/ during the day than at night. (during = ఆ వ్యవధిలో)

**ii)** We move about more during/ in the day than at night
పగటిపూట ఎక్కువ తిరుగుతాం రాత్రికంటే.

**iii)** He worked day and night to educate his children
తన పిల్లలను చదివించటానికి రాత్రింబవళ్లు/ రాత్రనక పగలనక పనిచేశాడు.

ఇక్కడ day and night ముందు ఏ preposition వాడం.

**e) At midnight** = రాత్రి 12 గంటలకు.

**i)** You can wake me up even at midnight if you want my help = నా సాయం కోసం మధ్యరాత్రయినా నన్ను లేపవచ్చు

**ii)** The train arrive here at midnight
Train ఇక్కడికి రాత్రి 12కు వస్తుంది.

The morning, the evening, the afternoon, the night ముందు in వస్తుంది; అలాగే noon, mid day, night, mid night ముందు at వస్తుంది.

**Bhanu:** You come here in the mornings; why?

(ఇక్కడికి పొద్దున్నే ఎందుకొస్తావు? )

**Ramana:** You see me on my morning walk up to the river bank

(నది ఒడ్డు దాకా పొద్దున నడిచేటప్పుడు నేను నీకు కనిపిస్తాను.

**Bhanu:** But I didn't see you on the morning of Saturday.

**Ramana:** Well, let me see; that is the 4th Feb, isn't it? That's right. On the morning of the 4th Feb I left for Guntur. So I didn't take the walk that morning.

(అంటే... ఆరోజు నాలుగో తేదీ కదా. కరెక్టే. నాలుగో తేది ఉదయం నేను గుంటూరు వెళ్లా.)

**Bhanu:** When did you return?

(ఎప్పుడు తిరిగొచ్చావు)

**Ramana:** I returned on the evening of the 5th

(అయిదో తేదీ సాయంత్రం).

The morning, the evening, the afternoon ముందు in వస్తుంది. అయితే పై conversation లో లాగా ఫలానరోజు, ఫలాన తేది morning, afternoon, evening అయితే on రావటం గమనించండి.

**1)** on the morning of the 4th
**2)** on the evening of the 5th
**3)** on the after noon of Sunday.

We met him on a Sunday afternoon

ఈరోజు ఉదయం, ఈరోజు మధ్యాహ్నం, ఈరోజు సాయంత్రం

This morning, this afternoon, this evening. (today morning/ today afternoon, today evening అనం).

ఈరోజు రాత్రి = tonight
(this night, today night అనం)

**i)** నేనీరోజు రాత్రి విజయవాడ వెళ్తున్నా
I am leaving for Vijayawada tonight

**2)** Programme ఈరోజు పొద్దున మొదలైంది
The programme began this morning.
(Today morning కాదు.)

**3)** ఈరోజు మధ్యాహ్నమే నేనతన్ని కలుసుకున్నా
I met him only this afternoon
(Today afternoon కాదు)

**4)** ఈరోజు సాయంత్రం వాళ్లొస్తారు
They will come this evening
(Today evening కాదు)

అలాగే, నిన్నరాత్రి = last night, నిన్న సాయంత్రం = last evening. (yesterday night, yesterday evening అనం).

That, this, every, last, next వీటిల్లో ఏవైనా morning, evening, afternoon, night ముందరవాడితే in, on ఏవీరావు.

**1)** He came to me that morning (on రాదు)
**2)** I sent it to him that afternoon (on రాదు)
**3)** The doctor checks him up every morning
(ప్రతిరోజు ఉదయం doctor అతడిని పరీక్షిస్తాడు.)
(on/in రాదు)
**4)** He left for Bangalore that night (on రాదు)
**5)** He goes out 9 every night and comes back at 11.
(ప్రతిరాత్రి తొమ్మిదింటికి బయటికివెళ్లి 11 గంటలకు తిరిగొస్తాడు) (In/ on/ at ఏవీరావు)
**6)** I wanted to meet him the next morning but I was busy.
(On the next morning కాదు)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# If you happen to see him

**Karthik:** Kousik, have you seen Mallik?
(మల్లిక్‌ను చూశావా? )

**Kousik:** I haven't met him since the day before yesterday. Well, What's the matter?
(మొన్నటినుంచి కలవలేదు. ఏంటి విషయం? )

**Karthik:** If you happen to see him, tell him to call me or meet me. I need to see him urgently.
(వాడిని నువ్వు చూస్తే నన్ను కలవమనైనా చెప్పు. లేకుంటే ఫోన్ అయినా చేయమను. వాడిని నేను వెంటనే కలవాల్సిన అవసరం ఉంది)

**Kousik:** What is so urgent about it?
(ఏంటంత అవసరం? )

**Karthik:** He has two books of mine with him. I need the books for my assignment. If I don't submit the assignment tomorrow, I lose marks.
(నా పుస్తకాలు రెండు వాడి దగ్గరున్నాయి. నా assignment కు అవి అవసరం. రేపటి లోపల submit చేయకపోతే, మార్కులు పోతాయి.)

**Kousik:** Phone him or go to his place.
(వాడికి phone అయినా చెయ్యి, లేదంటే వాళ్లింటికి వెళ్ళు)

**Karthik:** I've called his home twice already. He is out. He will be back in an hour, his mother told me. I have to go home now urgently to take mother to hospital. If I do not go now, mother will be in trouble.
(రెండుసార్లు ఫోన్ చేశా. వాడు బయటికె ళ్లాడు. గంటతర్వాత తిరిగి వస్తాడని వాళ్లమ్మ చెప్పింది. నేనింటికి త్వరగా వెళ్లాలి. మా అమ్మను hospital కు తీసుకెళ్లడానికి. ఇప్పుడు నేను వెళ్లకపోతే అమ్మ ఇబ్బంది పడుతుంది.)

**Kousik:** If see him I'll definitely tell him about the books.
(వాడిని చూస్తే books విషయం చెప్తా)

**Karthik:** If you go to his place, you can see him.
(నువ్వు వాడింటికి వెళ్తే వాడిని నువ్వు కలవగలవు)

**Kousik:** If I go now, how can I meet him? He will be back only an hour later.
(ఇప్పుడు వెళ్తే ఎలా కలవగలను వాడు గంట సేపటి తర్వాతే కదా తిరిగొస్తాడు)

**Karthik:** That's what I mean too. If you wait for another 45 minutes, and go to his place, you will find him. If he sends me the books, I shall be happy.
(నేననేదీ అదే. ఇంకో ముప్పావు గంట చూసి, వాడింటికెళ్లావంటే వాడిని కలుసుకోవచ్చు. వాడు books పంపిస్తే నాకు సంతోషం)

**Kousik:** Don't you worry. You will get them.
(బాధపడకు నీకు పుస్తకాలు అందుతాయి)

**Look at the following expressions from the conversation above.**

1) If you happen to see him
2) If I don't submit it tomorrow
3) If I do not go now
4) If I see him
5) If I go to his place
6) If I go now
7) If he sends me the books

పై expressions అన్నీ కూడా groups of words (మాటల కూర్పులు) కదా. పై groups of words ప్రతి వాటిల్లో verb ఉండటం గమనించండి.

**1)** If you happen to see him -ఇక్కడ verb, happen (To see = to+1st Regular doing word- దీన్ని infinitive అంటాం. ఇది verb కాదు. గుర్తుంది కదా) - అర్థం, అతడిని నువ్వు చూస్తే. (If - అయినట్లయితే).

**2)** If I don't submit it tomorrow - verb, do submit (= submit) = రేపు నేను submit చేయకపోతే.

**3)** If I do not go now - Verb, do go (=go) ఇప్పుడు నేను వెళ్లకపోతే.

**4)** If I see him - verb, see = నేను అతడిని చూస్తే/కలిస్తే

**5)** If I go to his place - verb, go= నేను వాళ్లింటికి వెళితే

**6)** If I go now - verb - go, ఇప్పుడు నేను వెళ్తే

**7)** If he sends me the books- verb, sends - వాడు నాకు books పంపితే

IMP: ఇలాంటి verb ఉన్న group of words ను clause అంటాం. (ఇది చాలా ముఖ్యం. గుర్తుంచు కోండి. ఇక్కడినుంచి మనం clauses తో deal చేస్తుంటాం)

So a CLAUSE is a group of words with a verb.

Some more examples of clauses (Clauses మరికొన్ని ఉదాహరణలు)

**7)** If he sends me the books - పుస్తకాలు వాడు నాకు పంపితే,
I shall be happy - నేను సంతోషపడ్తా

**7)** లో చూడండి. నేను సంతోషపడేదెప్పుడు- If he sends me the books, అంటే వాడు పుస్తకాలు పంపితే - కాబట్టి నా సంతోషానికి షరతు (condition) వాడు పుస్తకాలు పంపటం. If clauses ఎప్పుడూ ఇలాంటి conditions ను తెలుపుతాయి. ఇలా conditions ను తెలిపే clauses ను conditional clauses అంటాం. మొదటి conversation లోని clauses (1) to (7) అన్నీ కూడా conditional clauses. ఇక్కడి conditional clauses అన్నీ కూడా 'if' తో begin అవుతున్నాయికదా. conditional clauses, if తోనే కాకుండా, కొన్ని ఇతర మాటలతోనూ ప్రారంభం కావచ్చు

**d)** You get the books when you pay the money
(డబ్బు చెల్లించినప్పుడే నీకు పుస్తకాలొస్తాయి. డబ్బు చెల్లించినప్పుడు - when you pay the money - conditional clause)

ఇలాంటివేవయినా సరే, conditions ను తెలిపే clauses - conditional clauses.

If I see him - ఈ conditional clause - నేనతడిని కలిస్తే - ఇంకా కలవలేదు. కలవాలి - అంటే ఇది future (భవిష్యత్తు)ను తెలిపే clause. అయితే ఇందులో verb - 'see' future tense కాదు. Present tense అనేది గమనించండి. అంటే ఏంటి? Conditional Clause Future ను తెలిపేదైనా, అందులోని verb future tense లో ఉండదు.

అంటే conditional clause లో shall/ will రావు.

**1)** Though she likes music (verb - likes, though - అయినప్పటికీ)

**2)** When he was here (verb- was)

**3)** He knows that... (verb- knows)

**4)** After he had done it.. (verb - had done)

ఇలా verb ఉన్న group of words అన్నింటిని clauses అంటాం.

ఇలా మనం conversation (at the beginning of this lesson) లోంచి తీసిన clauses ను పరిశీలిద్దాం.

**1)** ఈ Clauses అన్నీ కూడా if తో begin అవుతున్నాయి కదా- ఇలా if తో begin అయ్యే clauses ను, if clauses అంటాం.

**2)** If అంటే 'అయినట్లయితే' అని అర్థం కదా.

**3)** పైన మనం చూసిన 7 clauses కూడా if clauses.

If clauses ఎప్పుడూ షరతును తెలియజేస్తాయి. అంటే Condition ను.

**1)** If you happen to see him -
నువ్వు వాడిని చూడటం జరిగితే
Tell him to call me -
నాకు Phone చేయాలని చెప్పు


M. SURESAN

**a)** Unless he pays the money, I will not give him the book
(వాడు డబ్బు చెల్లిస్తే తప్ప, నేను వాడికి పుస్తకం ఇవ్వను.

Unless - అయితే తప్ప, Unless you study well = నువ్వు బాగా చదివితే తప్ప... conditional clause

**b)** Before you pay the money, you cannot get admission
(డబ్బు చెల్లించకముందు నీకు ప్రవేశం రాదు. డబ్బు చెల్లించకముందు - డబ్బు చెల్లించకుంటే - Before you pay the money - conditional clause)

**c)** You come here, - only after you get the permission
(Permission - అనుమతి పొందిన తర్వాతే నా దగ్గరకు రా. అనుమతి పొందిన తర్వాతనే - Only after you get the permission - conditional clause)

మళ్ళీ చెప్తున్నాం. conditional clause, future విషయాన్ని చెప్పినా కూడా, అందులో verb future tense ఉండదు. అంటే conditional clause లో shall/ will రావు. పైన చెప్పిన లాంటి conditions లో present tense verbs మాత్రమే వస్తాయి.

**a)** Doctor నిన్ను పరీక్షించిన తర్వాత మందులిస్తాడు - The doctor will give you medicines, after he examines you (will examine రాదు)

**b)** ఇంటికి వెళ్ళిన తర్వాత విశ్రాంతి తీసుకుంటాను = I will take rest after I go home (I will go home కాదు)

**c)** వాడికిది తెలిస్తే సంతోషపడతాడు - If he knows this, (if he will know this కాదు), he will be happy.

**d)** నాకు prize వస్తే, సంతోషపడతాను = If I get the prize (If I will get the prize కాదు కదా? ) I shall be glad.

Imp: ఈ will/ shall రాకపోవటం conditional clauses కే, sentences లో మిగతా clauses కు వర్తించదు.

## PRACTISE THE FOLLOWING ALOUD IN ENGLISH

**Vidur:** Hi Sasir, ఆ పుస్తకం ఎక్కడ కొన్నావు నువ్వు? నేను చాలా shops వెతికాను. నాకు దొరకలేదు.

**Sasir:** నేనిది Books 'n Books లో కొన్నాను. అక్కడ కూడా ఎక్కువ copies లేవు. వెంటనే వెళితే కొనగలవు.

**Vidur:** నువ్వు నాకు అప్పిస్తే వెంటనే వెళ్తా. నేనింటికి వెళ్ళి డబ్బు తెచ్చుకొనేసరికి ఆలస్యం అవ్వొచ్చు

**Sasir:** నేను డబ్బిచ్చే ముందు ఒక విషయం చెప్తు. నా దగ్గరున్నదంతా Rs. 200/-. నువ్వు సాయంత్రం తిరిగిచ్చేట్లయితే ఇప్పుడు నీకిస్తా.

**Vidur:** Book కొనుక్కుని ఇంటికి వెళ్లగానే, మా నాన్నను అడిగి తీసుకొచ్చి నీకిస్తా.

**Sasir:** పుస్తకం కొనేటప్పుడు, దాంతో పాటు ఇచ్చే gift coupon మర్చిపోకు.

**Vidur:** Gift Coupon తీసుకోకపోతే ఏమవుతుంది?

**Sasir:** నువ్వా gift coupon తీసుకుంటే తప్ప నీకు II Part of the book రాదు free గా.

**Vidur:** Thank you.

**Sasir:** ఇదిగో డబ్బు. త్వరగా వెళ్లు. నువ్విప్పుడు వెళ్లకపోతే, నీకు పుస్తకం దొరక్కపోవచ్చు

**Vidur:** Bye.

### ANSWER

**Vidur:** Hi Sasir, where did you buy the book? I have searched/ enquired at a number of shops, but I could not get/ find it.

**Sasir:** I bought it at Books 'n Books. There aren't (are not) many copies either. If you go now/ at once/ immediately you can buy it.

**Vidur:** If you lend me the money, I will buy it. If I go home now, get the money and go, it might be too late. (By the time I go home, take the money and go to the shop, it might be too late)

**Sasir:** Before I give/ lend you the money, let me tell you one thing. All the money I have is Rs.200/- If you (can) return it by the evening, I will give it to you.

**Vidur:** As soon as I buy the book, I will go home, take the money from dad and repay you.

**Sasir:** When you buy the book, don't forget to take/ collect the gift coupon.

**Vidur:** What happens if I don't take the gift coupon?

**Sasir:** Unless you take the gift coupon, you cannot get the II part of the book free.

**Vidur:** Thank you.

**Sasir:** Here is the money. Hurry up. If you don't go now/ unless you go now, you may not get the book.

**Vidur:** Bye.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# If you work hard, you will pass

**Neeraj:** Shall we start? Unless we start now, we cannot reach college on time.
(మనం బయలుదేరదామా? ఇప్పుడు బయలు దేరితేతప్ప college కి time కు చేరుకోలేం)

**Suraj:** Have you taken the money? Before you pay the fees they won't allow you to attend classes.
(డబ్బు తీసుకున్నావా? డబ్బు చెల్లించకముందు నిన్ను classes కు వెళ్లనీయరు)

**Neeraj:** I have the money ready.
(డబ్బు ready)

**Suraj:** Have you all your certificates? They will grant you admission after they check up your certificates.
(certificates అన్నీ ఉన్నాయా? నీ certificates అన్నీ పరిశీలించిన తర్వాతనే వాళ్లు admission ఇస్తారు)

**Neeraj:** The certificates are all ready, but I have yet to fill in some columns in the application.




(certificates సిద్ధం. కానీ application లో కొన్ని columns కాలంజ్ - జ size లో z లాగా, ఇంకా పూర్తి చేయాల్సి ఉంది)

**Suraj:** They will accept the application after you fill it completely.
(నువ్వు పూర్తిగా నింపిన తర్వాతే నీ application తీసుకుంటారు)

**Neeraj:** I will complete it if you help me.
(నువ్వు సాయంచేస్తే పూర్తిచేస్తా)

**Suraj:** Fill it yourself. If I go on helping you, your dependence on me will increase. You will never be independent.
(నువ్వే fill చెయ్యి. నేను నీకు సాయంచేస్తూ ఉంటే, నా మీద ఆధారపడటం ఎక్కువవుతుంది. నువ్వు స్వతంత్రంగా ఉండలేవు.)

go on doing something = ఒక పని చేస్తూ ఉండటం = continue

**Neeraj:** I may make mistake if I do it on my own. That's my fear.
(సొంతంగా చేస్తే తప్పులు చేయొచ్చు నేను, అదే నా భయం)

**Suraj:** Don't worry. Complete the application and show it to me. Hurry up.
(ఏం ఫరవాలేదు. Application పూర్తిచేసి నాకు చూపించు. త్వరగా కానీ)

In the last lesson, మనం conditional clauses గురించి తెలుసుకున్నది-

**1)** A group of words with a verb is a clause. (Verb ఉన్న మాటల కూర్పు clause)

**2)** A clause stating a condition is a CONDITIONAL CLAUSE: షరతును తెలిపే clause, conditional clause.

**3)** Conditional clauses begin with if, unless, before, after, when, where, provided, etc.
(Conditional clauses పై మాటలతో ప్రారంభించవచ్చు)

Provided = if = అయితే

I will pay the advance provided you begin the work
నువ్వు పని ప్రారంభిస్తేనే నేను advance ఇస్తా.

**If, unless సంబంధం**

**If = unless... not; unless = if ... not**

అంటే if ఉన్న clause ను, unless clause గా మార్చవచ్చు. ఎలా? If ఉన్న sentence లో not పెట్టి.

**eg. a)** If you work hard, you will pass
(కష్టపడి చదివితే, నువ్వు పాసవుతావు)

**b)** Unless you work hard, you will not pass
(నువ్వు కష్టపడి చదివితే తప్ప pass కావు)

**a)** లో if clause ఉన్న sentence లో not లేదు.

**b)** లో అదే అర్థం, unless clause ఉన్న sentence not వల్ల వస్తోంది కదా?

అలాగే unless clause ఉన్న sentence లో not లేకపోతే, అదే అర్థం వచ్చేట్లుగా if clause ఉన్న sentence లో not omit చేసి చెప్పొచ్చు

**a)** Unless we start now, we cannot catch the train = మనం ఇప్పుడు బయలుదేరితే తప్ప train అందుకోలేం.

**b)** If we start now we can catch the train
మనం ఇపుడు బయలుదేరితే, train అందుకోగలం.

ఇలాంటి if, sentences if, unless ఒకదాన్ని ఒకటిగా మార్చి practice చేయండి.


M. SURESAN

**4)** Conditional clauses లో shall/ will రావు. (అంటే future tense ఉండదు conditional clause future తెలుపుతున్నప్పటికీ.)

ఇవీ conditional clauses గురించి మనం last lesson లో తెలుసుకున్నది.

**Very Important:**

Main clause: అర్థంపూర్తయిన clause.

Subordinate clause = అర్థం పూర్తికాని clause, Conditional clause. ఇంతవరకు మనం చూసినవన్నీ subordinate clauses కదా? ఎందుకంటే వాటికి అర్థం complete కాదు కాబట్టి.

If he comes - వాడు వస్తే - (conditional clause) అర్థం పూర్తవలేదు. కాబట్టి ఇది subordinate clause.

**Look at the following sentences from the conversation above:**

**i)** Unless we start now, we cannot reach college on time.

ఇందులో ఎన్ని clauses ఉన్నాయి? గుర్తుంచుకోండి. ఒక sentence లో the number of clauses = The number of verbs in it. అంటే sentence లో ఎన్ని verbs ఉంటే అన్ని clauses.

In the sentence above, there are two verbs.

1) Start 2) Can reach.

So there are two clauses.

1) Unless we start now = మనం ఇపుడు బయలుదేరితే కాని - conditional clause, so subordinate clause.

2) We cannot reach college = మనం college చేరుకోలేం - ఈ clause కు meaning పూర్తయింది కదా. కాబట్టి ఇది main clause.

**ii)** Before you pay the fees, they won't allow (will not allow) you to attend classes.

Here again, there are two verbs = pay, will allow. కాబట్టి ఈ sentences లో కూడా two clauses ఉంటాయి. (to attend - infinitive; verb కాదు)

I Clause:

Before you pay the fees = Fees చెల్లించేముందు; అర్థం పూర్తికాలేదు, కాబట్టి ఇది subordinate clause.

II Clause:

They will not allow you to attend classes = నిన్ను classes కు రానివ్వరు - దీనికి అర్థం పూర్తయింది, కాబట్టి ఇది main clause.

**Exercise 1**

Now, మొదటి conversation లోని కింది sentences లో main clauses, subordinate clauses గుర్తించండి.

**1)** They will grant you admission after they check up your certificates.

**2)** They will accept the application after you fill it completely.

**3)** I will complete it if you help me.

**4)** If I go on helping you, your dependence on me will increase.

**5)** I may make mistakes if I do it on my own.

**Answer:**

| Main clause (complete meaning) | Sub clause (incomplete meaning) |
|---|---|
| 1. They will grant you admission. verb, will grant.(వాళ్లు నీకు admission ఇస్తారు). | after they checkup your certificates... Verb - checkup (నీ certificates పరిశీలించిన తర్వాత..) |
| 2. They will accept the application. verb - will accept. (వాళ్లు application తీసుకుంటారు). | after you fill it completely... Verb - fill (పూర్తి చేసిన తర్వాత..) |
| 3. I will complete it. verb - will complete. (నేను పూర్తి చేస్తాను). | if you help me... verb - help (నువ్వు సహాయం చేస్తే...) |
| 4. your dependence on me increases. verb - increase; (నామీద ఆధారపడటం ఎక్కువవుతుంది). | If I go on helping you ... verb - go (helping - కేవలం 'ing' from - verb కాదు) (నీకు సాయం చేస్తూ ఉంటే...) |
| 5. I may make mistakes. verb - may make. (నేను తప్పులు చేయవచ్చు). | If I do it on my own... verb - do. (నా అంతట నేను చేస్తే...) |

**గమనిక:** పైన వచ్చిన subordinates అన్నీ conditional clauses. ఇతర రకాల subordinates clauses కూడా చాలా ఉన్నాయి. ఒకే clause ఉండే sentences కూడా ఉంటాయి.

I saw him yesterday . This sentence has only one verb - saw. So it is a sentence with just one clause, and it is the main clause and it is the sentence.

ఇతర రకాల subordinate clauses కింది sentences లో చూడండి:

**1)** He was an LIC agent when I last met him.
ఇక్కడ Subordinate clause - when I last met him.
అతడిని నేను చివరిగా కలుసుకున్నప్పుడు... (meaning not complete).
He was an LIC agent.
అతను LIC agent గా ఉన్నాడు. Main clause (complete meaning)

**2)** I know where he is hiding.
subordinate clause - where he is hiding
అతనెక్కడ దాక్కొని ఉన్నాడో, (incomplete meaning)
Main clause - I know
నాకు తెలుసు - complete meaning.

**Exercise 2**

**PRACTISE THE FOLLOWING IN ENGLISH**

**Sriram:** నువ్వు Kumar ను చివరిగా ఎప్పుడు చూశావు?
**Raghu:** ఒక వారం కిందట.
**Sriram:** వాడేమన్నా నన్ను కలుసుకుంటానని చెప్పాడా?
**Raghu:** రెండ్రోజులు ఊళ్లో ఉండనని చెప్పాడు. అంతకంటే ఇంకేం చెప్పలేదు.
**Sriram:** వాడు త్వరగా వస్తాడని ఆశిస్తున్నా.
**Raghu:** ఏంటి సంగతి?
**Sriram:** మన film hero దగ్గరికి తీసుకెళతానన్నాడు. మేం ఇద్దరం ఆయన fans గదా?
**Raghu:** దానికంత తొందరేంటి?
**Sriram:** next month నుంచి ఆయన busy, ఇప్పుడు కలవలేకపోతే తర్వాత ఆయన్ని కలవలేం.

**Answer:**

**Sriram:** When did you see Kumar last?
**Raghu:** A week ago. (a week back కాదు)
**Sriram:** Did he tell you (that) he would meet me?
**Raghu:** He just told me (that) he would be out of town for 2 days. He didn't tell me anything more.
**Sriram:** I hope (that) he will come soon.
**Raghu:** What's the matter?
**Sriram:** He said (that) he would take me to our hero. We two are his fans, you know.
**Raghu:** What's the hurry?
**Sriram:** He will be busy from next month. If we can't (can not) see him now, we cannot see him afterwards.



**ప్రశ్న:** Not only did He..... But also .... subject కు ముందు verb వస్తే ప్రశ్న అవుతుంది కదా?

– న్యాలపల్లి పెంటయ్య, అలియాబాద్

**జవాబు:** Sentence not only లాంటి వాటితో ప్రారంభిస్తే, question కాకపోయినా verb ముందర రావాలి.

a) Not only did he insult me, but also hit me.

b) Not once has he helped me.
ఒకసారి కూడా వాడు నాకు సాయం చేయలేదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# అనుకున్నా.. ఆశించినా.. అనుమానించినా..!




**Prabodh:** Hi Subodh, (do) you know where we can get good mangoes?
(హాయ్ సుబోధ్! మంచి మామిడి పళ్లు ఎక్కడ దొరుకుతాయో తెలుసా?)

**Subodh:** Where else? At rythu bazaar. Every one says that the quality is good, and the prices moderate.
(ఇంకెక్కడ? రైతు బజార్లో. నాణ్యత బాగుంటుందని, ధరలు సరసంగా ఉంటాయని ప్రతి వాళ్లు అంటారు.)

else = ఇంక (ఏ ఇతర అనే అర్థంతో).
where else = ఇంకెక్కడ
who else = ఇంకెవరు?
when else = ఇంకెప్పుడు
how else = ఇంకేవిధంగా/ ఇంకెలా?)

**Prabodh:** How about Sakala Supermarket?
(మరి సకల సూపర్ మార్కెట్లో?)

**Subodh:** The quality may be good there, but the prices are prohibitive. I am sure (that) it is not the place if you want reasonable prices.


Why? What's the matter?

(అక్కడ పండ్ల నాణ్యత బాగుండొచ్చు కానీ ధరలు మాత్రం మనం భరించలేనివి. సరైన ధరలు కావాలంటే అది సరైన చోటుకాదని కచ్చితంగా చెప్పగలను.)

prohibitive = (ధరలు) అడ్డుకునే.
prohibitive = కొనడానికి అడ్డుపడేంత ధరలు.

**Prabodh:** Perhaps you are right. I expect some guests tomorrow. I thought (that) I would serve them mangoes.
(అయ్యుండొచ్చు. రేపు మా ఇంటికి అతిథులు వస్తారనుకుంటున్నా. వాళ్లకు మామిడి పండ్లు పెడదామని అనుకున్నా.)

**Subodh:** Go ahead. They will know that you are a good host.
(కానీ మరి. నువ్వు మంచి ఆతిథ్యం ఇచ్చేవాడివని తెలుసుకుంటారు.)

host = ఆతిథ్యం ఇచ్చేవాడు

**Prabodh:** It just gives me a pretext to enjoy mangoes. Otherwise my wife wouldn't let me. She fears that I may put on weight if I eat mangoes.
(నేను మామిడి పళ్లు తినేందుకు అతిథులు ఒక సాకు మాత్రమే. లేకపోతే మా ఆవిడ నన్ను మామిడి పళ్లు తిననీయదు. నేను లావైపోతానని ఆవిడ భయం.)

pretext = ప్రిటెక్స్ట్-'టె' నొక్కిపలుకుతాం = సాకు
put on weight = బరువెక్కడం/ లావవడం

**Subodh:** Tell your wife that you are not a diabetie. Let her know that eating mangoes within limits wouldn't harm you.
(నువ్వు మధుమేహవ్యాధి పీడితుడివి కావని మీ ఆవిడతో చెప్పు. పరిమితంగా మామిడి పండ్లు తినడం వల్ల ప్రమాదమేమీ లేదని చెప్పు).

Diabetie = a person suffering from diabetes/sugar complaint
harm = హాని

**Prabodh:** I keep telling her that but she doesn't listen.
(నేను చెబుతూనే ఉంటా. కానీ ఆమె వినదు.)

**Subodh:** Wish you a sweet time with the mangoes. Bye.
(నువ్వు తియ్యటి మామిడిపండ్లు తినాలని కోరుకుంటున్నా. బై)

ఇప్పటి నుంచి కాస్త advanced level conversation practice చేద్దాం. జాగ్రత్తగా follow అవండి. Last lesson లో the things we have learnt.

★ A clause is a group of words with a verb.
★ A main clause has complete meaning.
★ A subordinate clause doesn't have complete meaning.
★ The number of clauses in a sentence = The number of verbs in it.
★ That తో begin అయ్యే clauses- that clauses. ఇలాంటి that clauses లోthat కు meaning 'అని' అని. Conversation లో ఎక్కువ వాడే clauses లో that clause ఒకటి అని అర్థం అవుతూనే ఉంది కదా. ఒకరేదో అలా/ ఇలా అని చెబుతారు/ చెప్పారు/చెబుతున్నారు అని మనం అన్నప్పుడల్లా, ఒకరు/ నేను/ మేము etc. అలా/ ఇలా అని అనుకున్నా, ఆశించినా, అనుమానించినా, తెలిసినా, మనం వాడాల్సింది that clause మాత్రమే కదా.

**a)** అతడు వస్తాడు అని, నాకు తెలుసు.
I know that he will come.
ఇక్కడ చూడండి. వాడువస్తాడు = he will come
వాడు వస్తాడని =that he will come.
నాకు తెలుసు =I know.

**b)** మామిడి పండు ఆమెకిష్టమని అంటోంది.
మామిడి పండు ఆమెకిష్టం/ఆమె ఇష్టపడుతోంది.
She likes the mango.
మామిడి పండు ఆమె ఇష్టపడుతోందని that she likes the mango.
అంటోంది = she says/ is saying.
She says that she likes the mango.

**c)** వాడనుకుంటాడు వాడు గొప్ప అని.
వాడుగొప్ప = he is great;
వాడు గొప్ప అని = that he is great.
He thinks that he is great.
అయితే conversation లో that వదిలేయవచ్చు.
He thinks that he is great.
He thinks he is great.

**d)** అతడు ఉద్యోగం వస్తుందని ఆశించడంలేదు.
He does not hope (that) he will get the job.

**e)** అతడికి మా సాయం కావాలని మేం అనుకోవడం లేదు.
We do not think (that) he needs our help.

**f)** నువ్వు తెలివిగల వాడినని అనుకుంటున్నావా?
Do you think (that) you are clever?

ఇప్పుడు look at the table - subordinate clauses in the conversation at the beginning of the lesson-

| | MAIN CLAUSE | SUBORDINATE CLAUSE |
|---|---|---|
| 1) | Do you know (నీకు తెలుసా?) | Where we can get good mangoes. (మంచి మామిడి పండ్లెక్కడ దొరుకుతాయో?) |
| 2) | Every one says (ప్రతివాళ్లూ అంటారు) | a) That the quality is good. (నాణ్యత బాగుంటుదని) b) (that) the prices are moderate. (ధరలు సరసంగా ఉంటాయని) |
| 3) | I am sure (నాకు తెలుసు) | a) That is not the place. (అది సరైన చోటు కాదని) b) if you want reasonable prices. (నీకు సరైన ధరలు కావాలంటే) |
| 4) | I thought (అనుకున్నాను) | That I would serve them mangoes. (వాళ్లకు మామిడిపండ్లు పెట్టాలని) |
| 5) | They will know (వాళ్లు తెలుసుకుంటారు) | That you are a good host. (నువ్వు బాగా ఆతిథ్యం ఇచ్చేవాడివని) |
| 6) | She fears (ఆమె భయపడుతోంది) | That I may put on weight. (నేను లావవుతానని) |
| 7) | Tell your wife (మీ ఆవిడతో చెప్పు) | That you are not a diabetie (నువ్వు మధుమేహవ్యాధి పీడితుడివి కాదని) |
| 8) | Let her know (ఆమెను అర్థం చేసుకోని) | That eating mangoes within limits wouldn't harm you. (పరిమితంగా మామిడిపండ్లు తినటం హాని చేయదని) |

మీరు టేబుల్‌లో గమనించే ఉంటారు. ఒక sentenceలో రెండు మూడు sub. clauses ఉండడం. అలాగే main clauses ఎన్నైనా ఉండొచ్చు.

పై sentences అన్నింటిలో main clause ముందు, subordinate clause తర్వాత వచ్చాయి. అలా రావాలని rule లేదు. ఏది ముందు, ఏది వెనకైనా పర్వాలేదు.

Every body knows that he plays well.
That he plays well, every body knows.

మనం daily conversation లో ఒకరు చెప్పే, అనుకునే, ఆశించే, ఆలోచించే, కచ్చితంగా ఉండే (be sure) విషయాలు ఇలా/ అలా అని అంటుంటాం కదా. situation conversationలో ఇది తరచుగా వస్తుంటుంది. అందుకని say, know, think, hope, expect, suspect, doubt, (be) sure, assure, admit, deny, allow, agree (ఇవి కొన్ని. ఇలాంటివి చాలా ఉన్నాయి.)తో వచ్చే Main Clausesకు That clauses join చేయడం practice చేయండి.

**Now practise the following in English:**

**Vimal:** సుకుమార్‌ను ఇవాళేమన్నా కలుస్తావా నువ్వు?
**Kamal:** ఏం? ఎందుకు?
**Vimal:** వాడితో చెప్పు, వచ్చేవారం మ్యాచ్ ఉందని.
**Kamal:** వచ్చే వారం మ్యాచ్ ఉందని నువ్వు వాడితో చెప్పలేదా?
**Vimal:** నాకు నిన్ననే తేదీ తెలిసింది. రేపటి నుంచి మనం ప్రాక్టీస్ చేయాలని కూడా చెప్పు.
**Kamal:** వాడికి తెలుసని నేననుకుంటున్నా. నిన్న రెండుమూడు సార్లు దాని గురించే మాట్లాడాడు. మనం గెలిచే అవకాశాలు బాగానే ఉన్నాయని అనుకుంటున్నాడు.
**Vimal:** వాడలా అనుకోవడం నాకు సంతోషంగా ఉంది. నేను కూడా మనం గెలుస్తామని గట్టిగా ఆశిస్తున్నా.
**Kamal:** హేమంత్ సమయానికి ఊరికి తిరిగొస్తాడంటావా?
**Vimal:** వాడు రేపే వచ్చేస్తానన్నాడు నాతో.
**Kamal:** వాడు ఉంటే మనం కచ్చితంగా గెలుస్తామనుకోవచ్చు. వస్తా!

M. SURESAN

**Answer:**

**Vimal:** Are you meeting/ Will you meet Sukumar today?
**Kamal:** Why? What's the matter?
**Vimal:** Tell him (that) we have the match next week/ That the match is next week.
**Kamal:** Have n't you (= Have you not) told him (that) the match is next week?
**Vimal:** I knew the date, only yesterday you tell him too (that) we have to practise from tomorrow.
**Kamal:** I think he knows the date. He referred to it/ talked about it two or three times yesterday. He thinks (that) we have good chances of winning.
(refer = (ఇక్కడ) ప్రస్తావించడం)
**Vimal:** I am glad (that) he thinks. I strongly hope too that we will win.
**Kamal:** Do you say (that) Hemanth will return in time for the match?
**Vimal:** He has told me (that) he will come back tomorrow itself.
**Kamal:** If he is there we can be sure (that) we will win the match. Bye.

**Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి...**

**URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# Whether he is coming or not

**Brahmam:** (Do) you know when the train arrives here?
(Train ఇక్కడికెప్పుడు వస్తుందో తెలుసా? )

**Vishnu:** I do not know exactly when, but I am sure that it arrives between 8.30 and 9.00 in the morning.
(కచ్చితంగా ఎప్పుడో తెలియదు, కాని పొద్దున 8.30, 9.00 మధ్య వస్తుందనేది మాత్రం కచ్చితం)

**Brahmam:** That suits us fine then. Find out where Eswar is. Ask him whether he is coming with us or not. Tell him we have to reserve tickets.
(అది మనకు బాగా సౌకర్యం. ఈశ్వర్ ఎక్కడున్నాడో చూడు. వాడు మనతో వస్తున్నాడో లేదో కనుక్కో. మనం tickets reserve చేసుకోవాలని చెప్పు.)

**Vishnu:** (I have) no idea how I can meet him. I called his home twice but there was no response. He hasn't/he doesn't have a cell phone.
(అతన్నెలా కలుసుకోవాలో తెలియటం లేదు. రెండుసార్లు వాళ్ల ఇంటికి phone చేశా, కాని ఎవరూ ఎత్తటంలేదు. వాడికి cell phone లేదు.)

**Brahmam:** How can we know how many berths we have to reserve?

**Vishnu:** Hi... I remember. He and his people are away in Eluru. They will be back tomorrow.
(ఆ... ఇప్పుడు గుర్తొచ్చింది. అతను, వాళ్ల వాళ్లు ఏలూరు వెళ్లారు. రేపు తిరిగొస్తారు.)

**Brahmam:** I now understand why he hasn't met us.
(వాడు మనల్నెందుకు కలుసుకోలేదో ఇప్పుడు నాకర్థం అవుతోంది).
I think I have his cell number in my pocket book. Let met see.
(అతని cell no. నా pocket book లో ఉందనుకొంటా. చూడనీ.)

**Vishnu:** I am telling you he doesn't have a cell.
(వాడికి cell లేదని చెబుతున్నాను కదా? )

**Brahmam:** Then whose is this cell no. here?
(అయితే ఇక్కడ ఈ cell no. ఎవరిది? )

**Vishnu:** I do not know whose number it is, but I am sure he has no cell.
(అది ఎవరి నంబరో నాకు తెలియదు, కాని వాడికి cell లేదనేది మాత్రం కచ్చితం)

In our earlier lesson we have seen the uses of that clauses. There are some more subordinate clauses. వాటిని మనం daily conversation లో frequent గా వాడుతుంటాం. Real life situations లో వీటి వాడకం చాలా ఎక్కువే. వాటిని main clauses తో join చేసి ఎలా వాడాలనేది ఇప్పుడు చూద్దాం:

Let us look at the subordinate clauses in the conversation between Brahmam and Vishnu:

1. When the train arrives (Train ఎప్పుడొస్తుందో).
2. Where Eswar is (Eswar ఎక్కడున్నాడో.)
3. Whether he is coming or not (అతను వస్తున్నాడో లేదో).
4. How I can meet him (నేనతన్ని ఎలా కలుసుకోగలనో).
5. (that) We have to reserve tickets (మనం tickets reserve చేసుకోవాలని).
6. How many berths we have to reserve (మనం ఎన్ని berths reserve చేయాలో).
7. Why he hasn't met us (మనల్ని ఎందుకు కలుసుకోలేదో).
8. (that) He doesn't have a cell (వాడికి cell లేదని).
9. Whose number it is (అది ఎవరి నంబరో).
10. (that) he has no cell (వాడికి cell లేదని).

వీటిల్లో subordinate clauses no. 1, 2, 4, 6, 7 and 9 చూడండి. ఇవన్నీ 'Wh' words (When, Where, How, How many, Why and Whose)తో begin అవుతున్నాయి కదా? ఇవన్నీ When, Where, How లాంటి 'Wh' wordsతో begin అయినప్పటికీ, questions కావు. మన మొదటి lessons లో నేర్చుకున్నది గుర్తుందికదా. Question అయితే 'Wh' word తర్వాత verb ముందూ, తర్వాత subject వస్తాయి. Clauses No. 1, 2, 4, 6, 7 and 9లో 'Wh' word తర్వాత subject ముందూ, verb తర్వాతా వస్తున్నాయి. అందుకని ఇవన్నీ (sub + verb) form లో ఉండే subordinate clauses. వాటి అర్థాలు కూడా చూడండి: questions లాగా రావటం లేదు కదా.




a) వాడెక్కడ చదువుతున్నాడో నాకు తెలియదు =
I do not know where he studies.

b) వాడెందుకు time waste చేస్తాడో నాకర్థంకావటంలేదు
I do not understand why he wastes time

c) వాడికంత డబ్బు ఎలా వస్తోందో ఎవరికీ తెలియదు -
No body knows how he gets/ is getting all that money.

d) వాడెప్పుడొస్తాడో మాకు చెప్పండి.
Please tell us when he will come/ comes/ is coming.

e) function ఎవరు ప్రారంభిస్తారో వాళ్లకు తెలియదు =
They do not know who will inaugurate the function.

ఇక lesson beginning లోని conversation లో clauses 5, 8 and 10 that clauses. వాటి గురించి ఇంతకుముందే తెలుసుకున్నాంగదా.

**EXERCISE:**

**NOW PRACTISE THE FOLLOWING IN ENGLISH.**

**Vani:** Hi Durga, Lakshmi ఎక్కడికి వెళ్లిందో తెలుసా?
**Durga:** తనతో నీకు అవసరమేంటో చెప్పు, ముందు.
**Vani:** తన నుంచి నాకు డబ్బు అవసరమని చెప్పాను కదా?
**Durga:** ఆమె దగ్గర డబ్బుందో లేదో తెలుసా నీకు?
**Vani:** లక్ష్మి దగ్గర డబ్బు లేకపోతే ఇంకెవరి దగ్గరుంటుంది? నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలియటంలేదు.
**Durga:** ఆమె దగ్గర డబ్బుండొచ్చు కానీ నీకిస్తుందో లేదో నీకెలా తెలుసు?
**Vani:** నేను తనని కలుసుకున్నప్పుడు నిన్న అనుకుంటా- ఇస్తానని promise చేసింది.
**Durga:** నీకెంత కావాలో చెప్పావా ఆమెకు?
**Vani:** నీకీ వివరాలన్నీ ఎందుకో నేను తెలుసుకోవచ్చా?
**Durga:** Sorry. నాకు ఎక్కడికి వెళ్లిందీ తెలియదు. ఎక్కడుందో తెలియదు. ఎప్పుడింటికి వస్తుందో తెలియదు.
**Vani:** తను తిరిగొస్తే నాకు చెప్తావా?
**Durga:** OK.

**Look at the difference between 'wh' subordinate clauses and 'wh' questions.**

| Subordinate Clause (With Wh words) | Question (With Wh words) |
|---|---|
| 1) ... when the train arrives (train ఎప్పుడొస్తుందో... sub clause No. 1) Not a question. | 1) When does the train arrive? (Train ఎప్పుడొస్తుంది? )- question |
| 2) ... Where Eswar is- (ఈశ్వర్ ఎక్కడున్నాడో- subordinate clause No. 2) - not a question. | 2) Where is Eswar? (ఈశ్వర్ ఎక్కడున్నాడు? )- question |
| 3) ... How I can meet him- (అతన్నెలా కలుసుకోగలనో) - subordinate clause No. 4 | 3) How can I meet him? (నేనతన్ని ఎలా కలుసుకోగలను? )- question |
| 4) ... how many berths we have to reserve (మనం ఎన్ని berths reserve చేయాలో) - subordinate clause no.6 | 4) ... how many berths have we to reserve (మనం ఎన్ని berths reserve చేయాలి? )- Question |
| 5) Why he hasn't met us (మనల్నెందుకు కలుసుకోలేదో)- Subordinate Clause No.7 | 5) Why hasn't he met us? (మనల్నెందుకు కలుసుకోలేదు? )- Question |
| 6) Whose number it is (అది ఎవరి నంబరో) - Subordinate clause No. 9. | 6) Whose number is it? (అది ఎవరి నంబర్? - Question |

ఇదీ wh words తో begin అయ్యే subordinate clause కూ, wh word తో begin అయ్యే Question కూ ఉండే తేడా. ఈ తేడా తెలియకుండా మాట్లాడితే మనకు English సరిగా రాదనుకుంటారు. రానట్లే కూడా. ఈ wh word subordinate clause ను main clause లో join చేస్తే మనకు sentence form అవుతుంది.
ఇంకా చూడండి.


M. SURESAN

f) అతనిదేఊరో అతను వాళ్లకు చెప్పలేదు =
He hasn't told them where he is from.

g) అది మేమెలా చేయాలో మాకు teacher explain చేయలేదు =
Our teacher hasn't explained to us how we should do have to do it.

h) అది ఎవరిల్లో ఎవరికీ తెలియదు -
Whose house it is no one knows.

గమనిక: ఇక్కడ where, when తో begin అయ్యే clauses conditional clauses కావు కదా- అవేం condition ను తెలపటంలేదు. అందుకని will/ shall సందర్భాన్ని బట్టి వాడతాం.

ఇలాంటి clauses మీ conversation లో బాగా practice చేయటం చాలా ముఖ్యం.

ఇప్పుడు ఈ lesson beginning లోని clauses ని చూడండి - Whether he is coming or not = అతను వస్తున్నాడో లేదో.. ask him - అతన్ని అడుగు. మనకొక విషయం అవునో కాదో స్పష్టంగా తెలియకపోతే, అప్పుడు whether కానీ, if కానీ వాడతాం. if అంటే ఇక్కడ conditional clause if (అయితే అనే అర్థం) కాదు.

a) అతను వెళ్లాడో లేదో ఆమెకు తెలియదు =
She does not know whether/ if he has gone or not.

b) ఆమె fees కట్టిందో లేదో మనకు తెలియదు -
We do not know whether/ if she has paid the fees (or not)

c) Chief Guest అసలు వచ్చాడా లేదా అనేది ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు =
No one is able to say whether/ if the Chief guest has arrived (or not)

d) అది ఖరీదైనదా, చవకైనదా అనేది నీకు తెలుసా? -
Do you know whether/ if it is expensive or cheap?

ఇది whether/ if వాడాల్సిన తీరు. ఇది కూడా real life situations లో మనకు conversation లో చాలా అవసరం కదా. Practice చేయండి.

**ANSWER:**

**Vani:** Hi Durga, (Do) you know where Lakshmi has gone?
**Durga:** Tell me first why do you need her?
**Vani:** I've told you that I need money from her.
**Durga:** Do you know whether/ if she has money or not?
**Vani:** If Lakshmi doesn't have/ has no money, who else has? You do not understand what you are talking.
**Durga:** She may have money, but how do you know/ how are you sure whether she will give it to you or not?
**Vani:** When I met her- I think it was yesterday, she promised to give it.
**Durga:** Did you tell her how much you need?
**Vani:** May I know why you need all these details?
**Durga:** Sorry. I do not know where she has gone, where she is and when she will return home/ will be back home.
**Vani:** Will you let me know when she returns?
**Durga:** OK

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# Although Ganguly scored a century...

**Sridhar:** Who do I see here? Giridhar! what a surprise! (I have) been thinking you are still in Dubai. What brings you here so suddenly?

(ఎవరూ? గిరిధరా ఆశ్చర్యంగా ఉందే! నువ్వింకా దుబాయ్‌లో ఉన్నావనుకుంటున్నా. ఉన్నట్లుండి ఇలా ఊడిపడటానికి కారణమేంటి? )

**Giridhar:** Because dad wanted me here urgently for my sisters wedding engagement. Though he wanted me yesterday morning itself, I could be here only last night. I tried my best, but I could not get the ticket for the earlier flight.

(మా sister నిశ్చితార్థానికి మా నాన్న నన్ను వెంటనే రమ్మన్నాడు. ఆయన నన్ను నిన్న పొద్దున్నే ఇక్కడుండమన్నప్పటికీ, నిన్న రాత్రికి మాత్రమే ఇక్కడుండగలిగాను. అంతకుముందు flight కు ఎంత ప్రయత్నించినా ticket దొరకలేదు.

**Giridhar:** You and I have known him since our College days. He was our junior at college by two years. He is Eswar. He is a software man in the US. As he has to be back in the states by the month end, he is in a hurry.

**Sridhar:** It is Eswar. Is it? A good choice. A nice young man.

**Giridhar:** Since my sister too a B.Tech, he hasn't demanded any dowry. yet the marriage is going to cost us a lot, as they want the marriage to be a grand affair,

(మా sister కూడా B.Tech కాబట్టి, కట్నం ఏం అడగలేదు. కాని పెళ్లికి మాకు బాగానే ఖర్చవబోతుంది, వాళ్లు పెళ్లి ఘనంగా చేయాలన్నారు కాబట్టి)

A Grand affair = గొప్ప విషయం/ ఘనంగా జరిగే విషయం. Affair: అఫేఅ - ఫే నొక్కి పలుకుతాం = విషయం.

**Sridhar:** When is the marriage?

**Giridhar:** The 17th this month. only 12 days left.

(ఈ నెల 17న. 12 రోజులే మిగిలున్నాయి)

Last Lesson లో wh words తో మొదలయ్యే subordinate clause చూశాం కదా. ఇతర రకాల subordinate clauses ఇప్పుడు చూద్దాం.

గమనిక: Because dad wanted... engagement - ఇది sentence కాదు కదా, clause మాత్రమే conversationలో ఇటువంటి clause వాడవచ్చు, writing లో because తో clause begin చేసి, main clause లేకుండా వాడం.

Wedding engagement = పెళ్లి నిశ్చితార్థం/ తాంబూలాలు పుచ్చుకోవటం. flight = విమానం. (పక్షి ఎగరటం కూడా)

**Sridhar:** When is the engagement?

(Engagement ఎప్పుడు? )

**Giridhar:** The day after tomorrow. Dad has none to help him, so he asked me here urgently.

(ఎల్లుండి నాన్నకు సహాయం చేయడానికి ఎవరూ లేరు, అందుకని నన్నిక్కడికి వెంటనే రమ్మన్నారు)

**Sridhar:** Happy to hear that she is getting engaged. Congrats to her. But why this hurry?

మీ sister నిశ్చితార్థం జరుగుతున్నందుకు చాలా సంతోషంగా ఉంది. ఆమెకు నా శుభాకాంక్షలు. అయితే ఇంత హడావిడేంటి? )

And you haven't told me who the bride groom is, what he is, where he is from, and whether he is in India or abroad

(పెళ్లికొడుకెవరో, ఏం చేస్తుంటాడో, ఏ ఊరో, India లో ఉంటాడా, విదేశాల్లో ఉంటాడా నువ్వు ఇంతవరకేం చెప్పలేదు )

**Giridhar:** O you are too impatient. It is not even minutes since we met, you shoot question after question. Will you let me talk?

(నీకు ఓర్పులేదు. మనం కలుసుకుని నిమిషాలయినా అవలేదు. ప్రశ్నల వెంట ప్రశ్న కురిపించేస్తున్నావు. నన్ను మాట్లాడనిస్తావా? )

**Sridhar:** Ok, Go ahead.

(సరే...కానీ)


M. SURESAN

**Study the following subordinate clauses from the conversation above:**

1) Because dad wanted me here urgently
2) Though he wanted me here yesterday itself.
3) What he is, where he is from and whether he is in India or abroad

(ఇవి మూడు clauses; మొదటి రెండూ wh subordinate clauses, చివరిది whether clause. వీటిని గురించి last lessonలో తెలుసుకున్నాం కదా)

4) since we met
5) as he has to be back in the states by the month end.
6) since my sister too is a B.Tech
7) as they want the marriage to be a grand affair.

ఈ subordinate clauses అన్నీ కూడా daily real life situation లో అవసరమే కదా. ఇవి జరగటం వల్ల, అదలా అయినప్పటికీ, ఫలాన విషయం/సంఘటన జరిగినప్పటి నుంచి, అదలా అయినా కూడా ఇలాంటి భావాలతో ఉన్న ఈ clauses ను మనం నిత్యం conversation లో వాడాల్సిన పరిస్థితులు ఎన్నో. అందుకని practice them well and fill your conversation with ideas.

Look at the clauses No 1, 5, 6 and 7 Observe that they begin with because, as, and since.

ఇలాంటి clauses - అంటే, because/ as/ since clausesలో because = as = since = అయినందువల్ల.

**Clause 1:** Because dad wanted me here urgently

నాన్న నన్ను urgentగా ఇక్కడ కావాలన్నందువల్ల.

**Clause 5:** as he has to be back in the states by the month end.

అతను states (America) లో నెలాఖరుకి తిరిగి ఉండాల్సినందువల్ల

**Clause 6:** Since my sister too is a B.Tech

మా sister కూడా B.Tech కాబట్టి.

**Clause 7:** as they want the marriage to be a grand affair

వాళ్లు పెళ్లి ఘనంగా జరపాలన్నారు కాబట్టి.

మీరు గమనించే ఉంటారు. ఇవన్నీ కారణాలు తెలిపే clauses కదా. వీటన్నింటిని, because/ as/ since తో వేటితోనైనా ప్రారంభించవచ్చు. వీటన్నిటి అర్థం అయినందువల్ల/ఎందుచేతనంటే/కాబట్టి అని.

1) ఎండగా ఉండటం వల్ల బయటికి వెళ్లలేదు.

I haven't gone out because it is hot (as it is hot/ since it is hot)

2) As he did not start on time, he missed the bus

Time కు బయల్దేరలేదు కాబట్టి bus అందుకోలేదు. (ఇక్కడ, as బదులు, because/ since వాడవచ్చు)

3) Since/ as/ because he knows English well he is successful

English బాగా తెలుసు కాబట్టి, అతను విజయం పొందుతున్నాడు.

Now look at clause 2:

Though he wanted me here yesterday itself

నిన్న నేనిక్కడ ఉండాలని ఆయన అనుకున్నప్పటికీ.

Though = although = even though అయినప్పటికీ, ఇది కూడా conversationలో common.

a) అతడు ఆలస్యంగా పడుకున్నప్పటికీ త్వరగా నిద్రలేస్తాడు

Though/ although/ even though he goes to bed late, he gets up early.

b) అతడు పరుగెత్తినప్పటికీ, bus అందుకోలేకపోయాడు

Though he ran, he could not catch the bus.

c) Although/ though/ even though Ganguly scored a century, his team lost the match

గంగూలీ century కొట్టినప్పటికీ, ఆయన team ఓడిపోయింది.

Look at clause no. 4 now.

Since we met - ఈ since కు అర్థం as/ because అని కాదు. ఇక్కడ since కు అర్థం, గతంలో ఓ సంఘటన జరిగినప్పటి నుంచి, గతంలో ఫలానా time నుంచి అని.

Since we met = మనం కలుసుకున్నప్పటినుంచి

a) If not even minute since we met (Giridhar అనటం)

మనం కలుసుకున్నప్పటినుంచి/ కలుసుకుని నిమిషాలన్నా అవలేదు.

b) Since India became independent 58 years have passed

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి 58 ఏళ్లు గడిచాయి.

c) Hi Arun, it is ages since we met

(పలకరింపు మాట)

మనం కలుసుకున్నప్పట్నించి/ కలుసుకుని యుగాలు (ages) అయ్యాయి.

d) Since the time he came here, he has been troubling me

వాడిక్కడికి వచ్చినప్పటి నుంచీ నాకు ఇబ్బంది కలిగిస్తున్నాడు.

అయితే since అంటే because/ as అర్థంతో కూడా వాడటం వల్ల confusion ఉంటుంది కాబట్టి, since (అప్పటి నుంచి అనే అర్థంతో) ever since అని కూడా అంటారు.

Since/ Ever since he came here, he has been good to me.

ఇవీ because/ as/ since clauses, since clauses గురించిన విషయం. Practice them thoroughly.

**PRACTICE THE FOLLOWING IN ENGLISH**

**Vasanth:** ఏంటి నువ్వు నిన్న రాలేదు?

**Hemanth:** రావాలని ప్రయత్నించినప్పటికీ రాలేకపోయాను. మా మామయ్యావాళ్లు వస్తుండటం వల్ల ఇంట్లోనే ఉండిపోవాల్సి వచ్చింది.

**Vasanth:** Phone చేసి రావటం లేదని చెప్పలేదేం?

**Hemanth:** నేను చేశాను, కానీ నువ్వెత్తలేదు. నువ్వెందుకు చేయలేదు?

**Vasanth:** నా cell out of order అయినందువల్ల చేయలేకపోయా. నిన్న పొద్దున కింద పడినప్పటి నుంచి అది సరిగా పని చేయట్లేదు.

**Hemanth:** Land phone నుంచి ఎందుకు చేయలేదు?

**Vasanth:** మేం bill చెల్లించనందువల్ల అది disconnect అయింది.

**Hemanth:** ఉదయం మసాల దోసె తిన్నప్పట్నించి, నాకు మత్తుగా ఉంది. ఇంటికెళ్లి నిద్రపోతా. Bye.

**ANSWER**

**Vasanth:** Why didn't you come yesterday?

**Hemanth:** Though I tried to come, I could not (come).

I had to be/ to stay at home since / as/ because my uncle was coming.

**Vasanth:** Why didn't you phone me (that) you were not coming?

**Hemanth:** I called you, but you didn't respond. Why didn't you phone?

**Vasanth:** Because/ as/ since my phone is out of order. Ever since/ since it fell down yesterday morning it hasn't been working well.

**Hemanth:** Why didn't you phone from/ use your land phone?

**Vasanth:** As/ since/ because we had not paid the bill they disconnected it.

**Hemanth:** Since/ Ever since I ate masala dosa in the morning I've been drowsy. I'd go home and sleep. Bye.

**ప్రశ్న:** 1) మీరు ఒక Lesson లో The Wife and husband have a good understanding for each other అన్నారు. కానీ grammatical గా Man and Wife అనాలికదా!

2) లెటర్‌లో చివర Yours faithfully అని రాస్తాంకదా! దీని అర్థం వివరించండి.

–వెన్నా విఠ్ఠబ్బాయి, కాకినాడ

**జవాబు:**

1) Husband and wife/ wife and husband అనటం, accepted usage - ఇందులో తప్పేంలేదు. Man and wife కూడా correct, అయితే ఇది కొంచెం formal. ఎక్కువ వాడుకలో ఉన్నది husband and wife.

2) Yours faithfully; ఈ expression, formal letters పేరుతో కాకుండా, (Dear) Sir/ Madam అని సంబోధించే చాలా formal letters లో ముగింపుగా వాడతాం కదా. దీనికి పాత రూపం: I am/ I remain. Your faithful servant xxx. ప్రజాస్వామ్య ప్రభావం వల్ల, servant అనేది పోయి, faithfully yours, మీ విశ్వాసపాత్రుడైన/ మీకు అన్ని విషయాలు (faithful) ఉన్నదున్నట్లుగా తెల్పుతుంటున్న మీవాడు- అనే అర్థంతో ఉండేది. ఇపుడు faithfully yours, yours faithfully గా మారింది. కొంతమంది faithfully yours వాడుతుంటారు. ఇక్కడ faithfully అనటం రాసినవి నిజమే అని తెలిపేందుకు.







# Let's go to his place...

**Shantan:** Hi Vineet, Sunil was here yesterday. He suggested we see a movie but dropped the idea. He suddenly remembered he had to take his mother to temple.
(సునీల్ నిన్న ఇక్కడ ఉన్నాడు. మనం సినిమాకెళ్దామన్నాడు కానీ ఆ ఆలోచన మానుకున్నాడు. వాళ్ళమ్మను గుడికి తీస్కెళ్లాలని వాడికి ఉన్నట్టుండి గుర్తొచ్చింది)

**Vineet:** Though I wanted to see you both, I could not come. My bike had troubled, so I took it to the mechanic. He took an hour to repair it.
(నిన్న మిమ్మల్ని కలుసుకోవాలనుకున్నా కానీ రాలేకపోయాను. నా బైక్‌కు ఏదో సమస్య వచ్చింది. అందుకని మెకానిక్ దగ్గరకు తీసుకెళ్లా. రిపేర్ చేయడానికి అతడు గంట సమయం తీసుకున్నాడు)

**Shantan:** How much did it cost you?
(ఎంతయింది)

**Vineet:** He billed me Rs.200/- But I offered him only Rs. 150/-. He accepted it.
(వాడు రూ.200 అడిగాడు/రెండొందలు రూపాయల బిల్ వేశాడు. నేను నూట యాభై ఇచ్చాను. తీస్కున్నాడు)

**Shantan:** These mechanics are smart guys . They demand more than What is right because we bargain for less.
(వీళ్లు చాలా తెలివైనవాళ్లు. సరైన దానికంటే ఎక్కువడుగుతారు. మనం ఎలాగూ తక్కువకు బేరం చేస్తాం కాబట్టి)

Smart = తెలివైన/ మంచి బట్టలతో చక్కగా కనిపించే

bargain = బాగన్= బేరం/ బేరం చేయటం

**Vineet:** That's true, but my mechanic is n't that type.
(కరెక్టే. కానీ మా మెకానిక్ అలాంటివాడు కాదు)

**Shantan:** Every one thinks so about their mechanics
(ప్రతి వాడు తన మెకానిక్ గురించి అలాగే అనుకుంటాడు)

**Vineet:** OK. Will Sunil be coming here today?
(సరే. సునీల్ ఈవాళ వస్తాడా)

**Shantan:** He hasn't even called me since he left me yesterday. I don't know if he will come. As I am going back to College tomorrow, how about a movie this evening?
(నిన్న నన్నొదిలి వెళ్లినప్పటి నుంచి నాకు ఫోన్ కూడా చేయలేదు. వాడొస్తాడో లేదో తెలీదు. రేపు నేను కాలేజ్‌కు వెళ్ళిపోతున్నాను కాబట్టి ఈ సాయంత్రం సినిమాకెళ్దామా? )

**Vineet:** That's a good idea. When are you starting for your Engineering College in Anantapur?
(బాగానే ఉంది. అనంతపూర్‌లోని Engineering College కెప్పుడెళ్తున్నావు)

**Shantan:** Tomorrow After noon
(రేపు మధ్యాహ్నం వెళుతున్నాను)

**Vineet:** Let's call Sunil then
(Sunil కు ఫోన్ చేద్దాం)

**Shantan:** Let's go to his place -
(వాడింటికెళ్దాం)

**Vineet:** OK

మనం ఇప్పటివరకు తెలుసుకున్న **Subordinate Clauses.**

1) That clauses
(He says that he saw you yesterday)
(అని అనే అర్థంతో)

2) Wh clauses
(ఎప్పుడు జరిగిందో, ఏమనుకుంటున్నారో, మొదలైనటువంటి అర్థంతో),
He has agreed to what I have said.

3) Whether / if clauses
(అవునా/కాదా అనే అర్థంతో)
I don't know whether/ if he has come
(వాడొచ్చాడో లేదో నాకు తెలీదు)

4) Because/ as/ since clauses (అందువల్ల/కాబట్టి అనే అర్థంతో)
As the book is expensive, I cannot buy it.
(పుస్తకం ఖరీదైనది అవటం వల్ల నేను కొనలేను)

5) though/although/even though clauses
Though it is raining he has gone out
(వర్షం కురుస్తున్నప్పటికీ, బయటికెళ్లాడు)

6) Since / ever since clauses
(అప్పటినుంచి అనే అర్థంతో)
Ever since he came here, he has had health problems
(ఇక్కడికి వచ్చినప్పటి నుంచీ వాడు కులాసాగా లేదు)

ఇవన్నీ గుర్తున్నాయ్ కదా. వీటిని సందర్భాన్ని బట్టి straight గా main clause తో join చేస్తే మీ conversation చాలా బాగుంటుంది.

**Practise చేయండి.**

**Now look at the following clauses from the conversation at the beginning of this lesson.**

1) ... but (he) dropped the idea.
(ఆ ఆలోచన విరమించుకున్నాడు)
2) ... So I took it to the mechanic.
3) ... but I offered him only Rs.150.
4) ... because we bargain for less.
5) ... but my mechanic isn't that type.
6) ... Since he left me yesterday.
7) As I am going back to college tomorrow.

( 4, 6 , 7 మనకు తెలిసిన clauses కదా.

✓ Clause No.4 కారణాన్ని తెల్పేది.
✓ clause No. 6 ఫలానా సంఘటన నుంచి అని చెప్పేది.
✓ Clause No. 7 కూడా కారణాన్ని తెల్పేది

ఇప్పుడు look at Clause NO. 1
... but (he) dropped the idea

ఈ Clauseలో భాగంగా ఉన్న వాక్యాన్ని పరిశీలిద్దాం

- He suggested that we see a movie but dropped the idea.
దీన్లో but తీసేసి though వాడవచ్చు కదా. (ఎందుకంటే though (అయినప్పటికీ), but రెండింటి అర్థం ఒకటే అయినప్పటికీ, sentence structure మారుతుంది)
- Though / Although / Even though he suggested the movie he dropped the idea.
- Though / Although / Even though He is weak, he works hard
(or)
- He is Weak, but works hard.
(బలహీనంగా ఉన్నా కష్టపడి పనిచేస్తాడు.)


M. SURESAN

- Though he is rich, he is not proud
(or)
- He is rich, but he is not proud
(అతడు ధనవంతుడైనప్పటికీ, అతడికి గర్వం లేదు)

✓ Clause No.3 లో కూడా but బదులు though / although / even though తో practice చేయండి.

✓ Clause No.2, ... so, I took it to the mechanic

ఈ clause లో భాగంగా ఉన్న వాక్యాన్ని పరిశీలిద్దాం

- My bike had trouble, so, I took it to the mechanic.
ఇక్కడ 'so బదులు because / as / since వాడవచ్చు కదా.
- Because / Since / as my bike had trouble I took it to the mechanic.
- My bike had trouble. So I took it to the mechanic.

✓ Clauses 4, 7 లో కూడా as / since / because బదులు so వాడి చూద్దామా?

**Clause 4:**

✓ They demand what is more than right <u>because</u> we bargain for less.
✓ We bargain for less, <u>so</u> they demand what is more than right.

**Clause 7:**

As I am going back to College tomorrow.

ఈ clause లో భాగంగా ఉన్న వాక్యాన్ని పరిశీలిద్దాం...

- As I am going... tomorrow, how about a movie this evening?
- I am going back to college tomorrow, So how about a movie tonight.

✓ ఇలా Though / Although / Even though Clauses ను But Clause, But Clausesను Though Clause గా మార్చవచ్చు.

✓ అలాగే, Because / As / Since Clauses ను 'So' Clauses ,So Clause ను Because Clause గా మార్చవచ్చు కదా.

మీరు గమనించే ఉంటారు.

✓ Though Clause ను But Clause గా మార్చేటప్పుడు though లేని clause కు but పెడతాం.
✓ Because / as / since clauses ను, so clause గా మార్చేటప్పుడు because / as /since లేని clause ముందు so వస్తుంది.

Though she is beautiful, she is not proud
(or)
She is beautiful but she is not proud
(ఆమె అందంగా ఉన్నప్పటికీ ఆమెకు గర్వం లేదు)
(Though, but ఉన్న Clause గమనించండి.)

Because She is good, every one likes her
(or)
She is good, so every one likes her.
(ఆమె మంచి వ్యక్తి కాబట్టి అందరూ ఆమెను అభిమానిస్తారు)

........................................................................

**Sailesh:** రమేష్, నేను బాగానే రాసినా పరీక్షల్లో నాకు మార్కులు సరిగా రాలేదేంటి?

**Ramesh:** నీ చేతిరాత బాగుండకపోవడం వల్లనే నీకు మార్కులు సరిగా రావటంలేదు.

**Sailesh:** నేను స్కూల్‌లో జాయిన్ అయినప్పటి నుంచి నా చేతిరాత ఇలాగే ఉంటోంది. స్కూల్ లో నాకు మార్కులు బాగానే వచ్చాయి. మరి కాలేజ్‌లో రావటంలేదేంటి?

**Ramesh:** నువ్వు లెక్చరర్స్‌తో ఓసారి మాట్లాడకూడదా?

**Sailesh:** ఆ పని చేస్తా. మ్యాథ్స్ లెక్చరర్‌ను కలుసుకోవాలని ప్రయత్నించాను నిన్న, కానీ ఆయన దొరకలేదు.

**Ramesh:** ఆయన tuitionsతో ఎప్పుడూ busy. అందుకని ఆయన్ను కలుసుకోవటం కష్టం.

**Sailesh:** ఆయన మన Answer books తిరిగి ఇచ్చినప్పటి నుంచి ఆయన్ను కలుసుకోవాలని ప్రయత్నించినా కుదరటంలేదు.

**PRACTISE THE FOLLOWING**

**Ramesh:** Don't worry. ఆయనంత busy అయినప్పటికీ, ఆయన్ని కలుసుకోగల మార్గం నీకు చెప్తా.

**Sailesh:** Thank you

**Answers:**

**Sailesh:** Ramesh, I did well in the exam. But I got low marks. Why?

**Ramesh:** You are not getting good marks because your hand writing is bad.

**Sailesh:** My handwriting has been like this since I joined School.. But I got/used to get good marks at school. How is it I don't get such marks in College?

**Ramesh:** Why don't you talk to the lecturers once?

**Sailesh:** I will do that. I tried to meet the Maths Lecturer Yesterday. But he was not available.

**Ramesh:** He is always busy with tuitions. So it is difficult to meet him.

**Sailesh:** Ever since he returned our answer books, I have been trying to meet him, but could not.

**Ramesh:** Don't worry. Though he is busy, I will tell you a way to meet him.

**Sailesh:** Thank you.

(In the sentence above, change but into although/though/even though, and as/since/because into so, and vice versa.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Anand:** Before you start, check up your luggage.
(బయల్దేరే ముందు సామాను సరిచూసుకో)

**Achyut:** I will do that after I complete packing.
(నేనది సర్దుకోవడం పూర్తయిన తర్వాత చేస్తా)

**Anand:** OK, then, I am leaving. I will collect from the shop on my way those books you need. I will be at the station twenty minutes before the train arrives. I will have the lunch packed for you at the station.



3) Whether/ If clauses -
అవునో, కాదో అనే సందేహాన్ని, ప్రశ్నార్థకాన్ని తెలిపేవి.

4) Because/ as/ since clauses -
కారణాల clauses- వీటిని so clauses గా మార్చవచ్చు.

5) Though / although / even though clauses-
అయినప్పటికీ అనే అర్థం తెలిపే clauses - వీటిని but, yet, still clauses గా మార్చవచ్చు
(But = yet = still = కానీ/ అయినప్పటికీ)

6) Since (ఫలాన సమయం/ సంఘటన నుంచి అని తెలిపే clauses. Since బదులు ever since వాడవచ్చు from the time అని కూడా వాడవచ్చు
ఇవేకాకుండా అంతకుముందు తెలుసుకున్న conditional clauses. (if/ unless/ before etc. తో ప్రారంభమై will/ shall వాడనివి)



3) ... before the train arrives
train వచ్చే ముందు
ఇవి మనం conversation లో తరచూ వాడే clauses కదా.

a) India was under British before it became independent
స్వాతంత్ర్యం పొందకముందు భారత్ బ్రిటిష్ పాలనలో ఉంది.

# As soon as he saw the police..

(నే వెళ్తున్నా. దారిలో నీక్కావాల్సిన పుస్తకాలు Shopలో తీసుకుంటా. Train రావడానికి ఇరవై నిమిషాల ముందు Station కొస్తా. నీకు lunch కూడా pack చేయిస్తా.

**Achyut:** Thank you. Call me as soon as you reach the station. I think by then I shall be on my way to the station. My packing is almost complete. I will be starting in ten minutes.

**Anand:** You must hurry for there isn't much time left?
(త్వరగా తెమలాలి నువ్వు. time ఎక్కువ లేదు)

**Achyut:** Bye. See you at the station
(వస్తా. స్టేషన్‌లో కలుసుకుందాం)

**Anand:** Bye

ఇప్పటివరకు మనం తెలుసుకున్న subordinate clauses, వాటి స్వభావం క్లుప్తంగా...

1) That clause : 'అని' అని తెలిపేది

2) 'Wh' clause: What, When, Where, Who, Whom, Which, Why and how తో ప్రారంభ మయ్యేవి- ఓ వ్యక్తి, సంఘటనను గురించిన వివరాలు తెలిపేవి.


M. SURESAN

**Now look at the following clauses used in the conversation at the beginning of this lesson.**

1) Before you start
2) after I complete packing
3) ... before the train arrives
4) .... as soon as you reach the station
5) ... by then I shall be on my way to the station
6) ... for there isn't much time left.

Take clauses 1, 2 and 3. ఈ మూడూ కూడా before, after తో మొదలవుతున్నాయి కదా. వీటిని before, after clauses అందాం. ఇవేంటీ? ఒకటి time కూ, సంఘటనకూ, ముందు, వెనకా జరిగే వాటిని తెలుపుతాయి. ఈ విషయం మీకు తెలుస్తూనే ఉంది కదా.

1) Before you start -
నువ్వు బయల్దేరే ముందు

2) After I complete packing
సర్దుకోవటం పూర్తయ్యాక

b) నేను station కు వెళ్లిన తర్వాత train వచ్చింది
The train arrived after I (had) reached the station

c) వర్షం ఆగిన తర్వాత వాళ్లు ఆట మళ్లీ మొదలుపెట్టారు
They resumed the game after the rain (had) stopped (resumed - మళ్లీ ప్రారంభించారు)

d) వాడు ఇక్కడికి రాకముందు వాడికేం Job లేదు
He had no job/ He was jobless before he came here.

e) మీరేం చేసేవారు. Lecturer కాకముందు? (అంటే ఏం ఉద్యోగమని)
What were you, before you became a lecturer?
What were you (గతంలో) మీ ఉద్యోగం ఏమిటి?
ఇవీ before, after clauses. ఈ before, after clauses ను చాలా జాగ్రత్తగా practice చేయండి.

4) As soon as clauses
దీని అర్థం వెంటనే అని.

a) Call me as soon as you reach the station
station చేరిన వెంటనే/ చేరగానే నాకు Phone చెయ్యి.

b) వాడు రాగానే మనం ప్రారంభిద్దాం
We will begin as soon as he comes.

c) ఆయన class కు రాగానే పాఠం మొదలు పెడతాడు. ఊపిరి పీల్చుకునే సమయం కూడా ఇవ్వడు
He begins the lesson as soon as he enters class; he doesn't give us even the time to breathe.
(even = అందుకు కూడా)

d) As soon as he saw the police, he ran away
పోలీసులను చూడగానే అతను పారిపోయాడు.

5) By then I shall be on my way to the station
అప్పటికి / ఆ సమయానికి / అప్పటికి నేను station కు వెళ్లేదారిలో ఉంటా.

a) By then he had finished his lunch
అప్పటికి అతడు lunch పూర్తిచేశాడు/ తినేశాడు.

b) By then he had gone
ఆ సమయానికి అతడు వెళ్లిపోయాడు.

c) for clause:
ఇక్కడ for కు అర్థం అందువల్ల, కాబట్టి అని- because/ since/ as లాగా.
You must hurry for there isn't much time left
time ఎక్కువ లేనందువల్ల నువ్వు త్వరపడాలి.

a) He can play well for he is tall
అతను పొడుగ్గా ఉండటంవల్ల బాగా ఆడ గలడు.

b) Let's stand in the shade of the tree for it is very hot here
ఇక్కడ బాగా ఎండగా ఉన్నందువల్ల మనం చెట్టు నీడన నిల్చుందాం.

c) I need water for I am thirsty
నాకు దాహంగా ఉంది కాబట్టి నీళ్లు కావాలి.

## PRACTISE THE FOLLOWING

**Eswar:** Hi Govind, నువ్వు బయల్దేరేముందు Sriram ను ఏమన్నా కలుసుకున్నావా?

**Govind:** లేదు. నేను బయల్దేరిన తర్వాత వాడు నాకు ఫోన్‌చేశాడు.

**Eswar:** వాడిని నేను వెంటనే కలవాలి, వాడి నుంచి నాకు కొంత సమాచారం urgent గా కావాలి.

**Govind:** వాడిక్కడికే వస్తున్నానన్నాడు కానీ ఎప్పుడొ స్తాడో చెప్పలేదు.

**Eswar:** Sekhar కూడా ఇక్కడికొస్తున్నాడు. వాడు వచ్చేముందే నేను Sriram తో మాట్లాడాలి.

**Govind:** శేఖర్, శ్రీరాం కంటే ముందువస్తే నేనతన్ని బయటకు తీసుకెళ్తాను. అప్పుడు నువ్వు శ్రీరాంతో మాట్లాడవచ్చు.

**Eswar:** నీకూ తెలివితేటలున్నాయి, అందుకు మెచ్చు కుంటున్నా.

**Govind:** నీ friendship వల్లే నాకీ తెలివితేటలు వచ్చాయి.

### ANSWER

**Eswar:** Hi Govind, did you meet Sriram before you started?

**Govind:** No. He called me after I (had) started.

**Eswar:** I have to meet him. I need some information urgently from him.

**Govind:** He told me (that) he would be coming here, but when exactly, he did not say.

**Eswar:** Sekhar too is coming here. I have to take to Sriram before Sekhar comes here.

**Govind:** If Sekhar comes here before Sriram comes I will take him away. You can then talk to Sriram.

**Eswar:** I appreciate you for you too are smart/ clever.

**Govind:** That's because of my friendship with you.

**మీరు next lesson సరిగ్గా సులభంగా అర్థం చేసుకునేందుకు కింది table బాగా study చేసి గుర్తుంచుకోండి.**

| TENSE | VERB FORMS | | | |
|---|---|---|---|---|
| PRESENT | a) am, is, are<br>b) am, is, are తో వచ్చేవన్నీ | I RDW<br>II RDW<br>do<br>does | a) have, has<br>b) have తో, has తో వచ్చేవన్నీ | may<br>can |
| PAST | a) was, were<br>b) was, were తో వచ్చేవన్నీ | a) Past doing word<br>b) did | a) had<br>b) had తో వచ్చేవన్నీ | might<br>could<br>మామూలుగా |
| FUTURE | a) Shall/ Will<br>b) Shall/ Will తో వచ్చేవన్నీ | | | |

I RDW = Ist Regular Doing Word (come, go, eat, etc)
II RDW = IInd Regular Doing Word (comes, goes, eats, etc)
Past Doing Word = came, ate, went, etc.

**ఈ Table లో చూపిన verbs ఆ tenses లో ఉంటాయి. ఇది మీరు correct గా గుర్తుంచుకుంటే అన్నీ సులభం. లేకుంటే ప్రతిదీ confusing గా ఉంటుంది.**

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Sugandhi:** I thought (that) you were not in town.
(నువ్వు ఊళ్లో లేవనుకున్నా)

**Supushpa:** True; I phoned you yesterday that we were going to our village, but we dropped the idea because we had relatives coming suddenly.
(నిజమే. నిన్న నీకు ఫోన్ చేసిన మాట వాస్తవమే- మేం మా ఊరికి వెళ్తున్నామని, కానీ మానేయాల్సి వచ్చింది, sudden గా మా చుట్టాలు రావటం వల్ల).

**Sugandhi:** In fact surekha was about to start for your place yesterday. I told her (that) you were away and she stopped. She said (that) she did not know about your plan to go to your village.
(అసలు నిన్న సురేఖ మీ ఇంటికే బయల్దేరింది. మీరు లేరని నేను చెబితే ఆగిపోయింది. మీరు ఊరు వెళ్తున్న సంగతి తనకూ తెలియదంది).

**Supushpa:** We were sorry (that) we missed a few days of quiet at our village.
(ప్రయాణం ఆగిపోయేసరికి, కొద్దిరోజుల పల్లెటూరి ప్రశాంతత కోల్పోయామని బాధపడ్డాం.)
(quiet = ప్రశాంతత)

**Sugandhi:** Why didn't you tell your relatives that you would be away?
(మీరుండరని మీ బంధువులతో ఎందుకు చెప్పలేదు? )

**Supushpa:** They were coming with an alliance for my elder sister. The boy is a bank officer.
(వాళ్లు మా అక్కకోసం సంబంధం తీసుకొస్తున్నారు. ఆ అబ్బాయి బ్యాంక్ ఆఫీసర్)
Alliance = అలయన్స్ = (marriage alliance) = పెళ్లి సంబంధం;
political alliance = రాజకీయ కూటమి/సంబంధం.
Eg: UPA (ప్రస్తుతం కేంద్రంలో అధికారంలో ఉన్న కూటమి) = (United People's Alliance.)

**Sugandhi:** Then of course you must welcome them.
(అలా అయితే వాళ్లను స్వాగతించాల్సిందే)

**Supushpa:** Father told them that he would talk to the boy's father and took their address.
(మా నాన్న వాళ్ల address తీసుకుని అబ్బాయి నాన్నతో మాట్లాడతామన్నారు).

**Sugandhi:** That's good news (శుభవార్త)

✪ Last lesson చివర ఇచ్చిన tense table గుర్తుంది కదా. మరోసారి గుర్తు చేసుకుందాం.

**PRESENT TENSE**

| | | |
|---|---|---|
| a) am is are | b) am is are తో combinations | c) I RDW II RDW |
| d) have, has | e) have, has combinations | f) can could |

**PAST TENSE**

| | | |
|---|---|---|
| a) was were | b) was were తో combinations | c) past doing word |
| d) had | e) had తో combinations | f) could would |

**FUTURE TENSE**

shall, will forms అన్నీ

Main clause, subordinate clauses గుర్తున్నాయి కదా. (Main clause - meaning complete; subordinate clause - meaning incomplete).

Now look at the clauses in the conversation at the beginning of the lesson.

| Subordinate clause | Main clause |
|---|---|
| 1. (that) you were not in town (నువ్వు ఊళ్లోలేవని) | I thought (నేననుకున్నా) |
| 2. (that) We were going to our village (మేం మా ఊరెళ్తున్నామని) | I phoned you నీకు phone చేశాను. |
| 3. because we had relatives coming. చుట్టాలొస్తున్నందువల్ల | But we dropped the idea. ఆ ఆలోచన మానుకున్నాం |
| 4. (that) you were away మీరు ఊళ్లో లేరని | I told her నేను ఆమెతో చెప్పాను |
| 5. (that) you would be away మీరుండరని | Why didn't you tell them? వాళ్లతో ఎందుకు చెప్పలేదు? |
| 6. (that) he would talk to the boy's father అబ్బాయి తండ్రితో మాట్లాడతానని | Father told them నాన్న వాళ్లతో అన్నారు. |



**III. a)** నువ్వు ఇండియా గెలవగలదని అనుకుంటున్నావా?
Do you think (that) India can win the match ? కింద (b) చూడండి.
**b)** నువ్వు India గెలవగలుగుతుందనుకున్నావా?
Did you think (that) India could win the match?

**IV. a)** అతడు నాకు సాయంచేయకపోవచ్చని అనుకుంటున్నా
I think (that) he may not help me.
**b)** అతడు నాకు సాయం చేయకపోవచ్చని అనుకున్నా.




ఇవీ మాట్లాడేటప్పుడు గుర్తుంచుకోవలసిన విషయాలు. మన practice ను బట్టి అలవాటవుతాయి.

**PRACTISE THE FOLLOWING**

**Ravikanth:** నీకర్థం అవుతోందా అతనేం అన్నాడో?
**Sreekanth:** తెలుస్తూనే ఉంది. తను నిన్న ఇక్కడికి రాలేదని అతడు చెప్పాడు.
**Ravikanth:** అయితే నువ్వనేది అతనిక్కడ నిన్న ఉన్నాడనా?
**Sreekanth:** అతడిని నిన్న ఇక్కడ చూసినట్టుగా నాకు బాగా గుర్తు.
**Ravikanth:** మనం ఇతరులకు కూడా చెప్దాం. వాళ్లకూ తెలుస్తుంది అతను నిన్న ఇక్కడ ఉన్నాడని. కాని అతను మాత్రం గంట కిందట అన్నాడు తనిక్కడికి రాలేదని.
**Sreekanth:** O.K. అయితే ఎవరు నమ్ముతారు?

# He knows (that) she has come

ఇప్పుడు చాలా ముఖ్యమైన విషయం: పై sentences లో Main Clause Verb, Subordinate Clause Verb గమనించండి. Main Clause Verb past tense అయితే, subordinate Clause Verb కూడా past tense కదా. చూడండి:

| Main Clause | Verb | Sub Clause Verb |
|---|---|---|
| Sentence 1 | Thought - Past tense | were - past tense |
| Sentence 2 | Phoned - Past tense | were going - past tense |
| Sentence 3 | dropped - Past tense | had - past tense |
| Sentence 4 | told - Past tense | were - past tense |
| Sentence 5 | did tell (told) - Past tense | would be -Past (future from the past) |
| Sentence 6 | told - Past tense | would talk - Past (future from the past) |

చూశారు కదా: In all the sentences above, the main clause verb is in the past tense, so the subordinate clause verb too is in the past tense. That is the rule we have to follow in conversation. If the main clause verb is in the past tense, the subordinate clause verb too must be in the past tense.

2) Main clause లో past tense verb వాడామనుకోండి: అప్పుడు subordinate clauseలో will, shall, can, may కు బదులు would, should, could, might వరసగా వస్తాయి. ఇది conversation లో పాటించాల్సిన అంశం.

**I. a)** అతడు మరుసటిరోజు వస్తానన్నాడు
He said (that) he would come the next day.
దీన్ని కింద (b)తో పోల్చండి:
**b)** అతను రేపొస్తానంటున్నాడు
He says (that) he will come tomorrow.

**II. a)** వాళ్లొస్తారని అతనికిప్పుడు తెలుసా?
Does he know (that) they will come
ఇప్పుడు (b)తో పోల్చండి:
**b)** వాళ్లొస్తారని అతనికింతకుముందే తెలుసా?
Did he know (that) they would come.

I thought (that) he might not help me.

**V. a)** వాడు పాసైతే నేను సంతోషిస్తానంటున్నా
I say (that) I shall be happy if he passes
**b)** వాడు పాసైతే నేను సంతోషిస్తానని అన్నాను
I said (that) I should be happy if he passed.

చూశారు కదా? Main Clause లో said, knew, thought లాంటి past tense verbs వచ్చినప్పుడు subordinate clause లో would, should, could, might రావటం.

అలాగే Main clause verb past tense ఉన్న చోటల్లా subordinate clause verb కూడా past tense లోనే ఉంటుంది.

**I a)** ఆమె వచ్చిందని అతడికి తెలుసు (గతంలో)
He knew (that) she had come.
**b)** ఆమె వచ్చిందని అతడికి తెలుసు ఇప్పుడు
He knows (that) she has come.

**II a)** ఆమె అందగత్తె అని అనుకొంటోంది
She thinks (that) she is beautiful
**b)** ఆమె అందగత్తె అని అనుకొనేది (గతంలో)
She thought (that) she was beautiful.

**III a)** వాడికీ విషయం తెలియదని ఆశించాను =
I hope (that) he doesn't know about it.
**b)** వాడికీ విషయం తెలియదని ఆశించాను.
I hoped (that) he did not know about it.

**So, remember:** If the main clause verb is in past tense, the subordinate clause verb is also in the past tense. Main clause verb present tenseగానీ future tenseగానీ అయితే, subordinate clause (అర్థం చెడకుండా) ఏ tense అయినా ఉండొచ్చు.

**a)** అతడు నిన్న వచ్చాడని నాకు తెలుసు =
I know that he came yesterday
**b)** మీరు నిన్న కొత్త కారు కొన్నారని అతనంటున్నాడు =
He says that you bought a new car yesterday.
**c)** నిన్న నువ్వు absent అని మీ నాన్నతో చెప్తాను
I will tell your father that you were absent yesterday.

చూడండి a) లో, b) లో Main clause - present, subordinate clause - past c) లో Main clause - future, subordinate clause - past.

M. SURESAN

**ANSWER**

**Ravikanth:** Do you understand what he has said?
**Sreekanth:** It is clear - he says that he did not come here yesterday.
**Ravikanth:** (Do) you mean he was here yesterday.
**Sreekanth:** I remember well that I saw him here yesterday.
**Ravikanth:** Let us tell others too. They will know that he was here yesterday. But he told me an hour ago that he had not come here yesterday.
**Sreekanth:** OK, but who will believe it?

**ప్రశ్న: 1.** ఆమెకు ఎవరు తెలుసు? ఆమె ఎవరికి తెలుసు?, నీవు ఎవరి వద్దకు వెళతావు?, ఆమె నీ వద్దకు వస్తుందా?, ఆమె ఎవరి దగ్గరకు వస్తుంది?, ఆమె ఎవరి పక్కన నిలుచుంది?, అతడు నిన్ను ఎందుకు వెళ్లవద్దని అన్నాడు? - వీటిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?



*2. I alone can do it. I can do it alone.*
ఈ రెంటికీ మధ్య తేడా ఏమిటి?
*3. She was tired with riding.*
*She was tired of riding.* తేడా తెలపండి.

**- జి. సూర్యతేజ, రామచంద్రాపురం**

1. ఆమెకు ఎవరు తెలుసు? = Who (whom) does she know? (whom ఇప్పుడు అంతగా వాడటం లేదు). ఆమె ఎవరికి తెలుసు = Who knows her? నీవు ఎవరి వద్దకు వెళ్తావు? = Who do you go to?/ Who will you go to? (ఇలాంటిచోట్ల కూడా conversational English లో whom వాడకం తగ్గిపోతోంది). Does/ Will she come to you? (does మామూలుగా/ will future లో). Who does/ will she come to? Who did she stand by?/ Stand next to?/ Whose side did she stand by?/ Who did she stand beside? Why did he tell you not to go?
2. I alone can do it = నేను మాత్రమే చేయగలను. (ఇంకెవరూ చేయలేరు) I can do it alone = నేనది ఒంటరిగా (ఇతరుల సహాయం లేకుండా) చేయగలను.
3. She was tired of riding, correct.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






# I called ..., but you were out

**Madhav:** Hi Mahesh, come in. Have a seat. I called your home twice yesterday, but you were out.
(రా కూర్చో నిన్న రెండుసార్లు మీ ఇంటికి ఫోన్ చేశా, నువ్వు లేవు)

**Mahesh:** I was away at college to apply for my certificates.
(Certificates కు apply చేసేందుకు కాలేజ్ కు వెళ్లా.)

**Madhav:** When are you going to get them.
(ఎప్పుడొస్తాయి? )

**Mahesh:** The clerk told me that they would be ready in two days.
(రెండురోజుల్లో ready గా ఉంటాయని గుమాస్తా చెప్పారు.)

Clerk - Pron. క్లాక్ (bird లో 'బ'లా)

**Madhav:** And when is your interview?
ఇంటర్వ్యూ ఎప్పుడు?

**Mahesh:** On the 22nd. I received the call letter yesterday.
(22న. నిన్ననే Call letter వచ్చింది. Call letter - Interview, exam లాంటి వాటికి వచ్చే పిలుపు)

**Madhav:** I met Madhu yesterday. I told him about your interview. He knows about the company. He says it is a good company and pays its staff well.
(నిన్న నాకు మధు కనిపించాడు. నీ ఇంటర్వ్యూ సంగతి చెప్పాను. అతనికా కంపెనీ గురించి తెలుసు. అది మంచి Company అని, మంచి జీతాలిస్తారని అంటాడు)

**Mahesh:** Happy to hear that. Dad doesn't bother what pay I will get. He first wants me to join the company, as experience in the company will be of great value for my career.
(సంతోషం. జీతం ఎంతనే విషయం మా నాన్న పెద్దగా పట్టించుకోవటంలేదు). ఆ Company లో experience అనేది నా భవిష్యత్తుకు చాలా విలువైంది కాబట్టి దాంట్లో ఉద్యోగం వస్తే చాలు.)

**Madhav:** You will certainly be lucky if you get the job. People do talk lot about the company. Wish you all luck.
(నీకా ఉద్యోగం వస్తే అదృష్టవంతుడివే. ఆ company గొప్పదనే అంటారు.)

**Mahesh:** Thank you. Any tips you wish to give me?
(నీవిచ్చే సలహాలు/ సూచనలూ (interview) కు ఏమైనా ఉన్నాయా? )

**Madhav:** Let's meet this evening, when I am at leisure
(సాయంత్రం కలుద్దాం. అప్పుడు నాకు తీరిక)

**Mahesh:** Bye.

**In the last few lessons we have been discussing clauses. We have seen the following.**

1. If the main clause verb is in the past tense, the subordinate clause verb should also be in the past.
2. If the main clause verb is in the present or the future tense, the subordinate clause verb can be in any tense.

Last lesson లో పై rules ను తెలుసుకున్నాం కదా. ఇంకా ఇది కూడా చూశాం.
Main clause verb past tense లో ఉంటే subordinate clause లో will, shall, can, may రావు. వాటిబదులు వరసగా would, should, could, might వస్తాయి.
పై points అన్నీ conversation లో చాలా జాగ్రత్తగా పాటించాలి. (ఇలా గుర్తుంచుకుని practice చేసినకొద్దీ అలవాటయిపోయి మన ప్రయత్నం లేకుండానే correct గా మాట్లాడే స్థితికి చేరుకుంటాం)

**Look at the following sentence in the conversation at the beginning of the lesson.**

1) I called your home twice yesterday, but you were out. (Called, were - రెండూ past tense)

2) a) The clerk told me that they would be ready in 2 days. (Main clause లో told past tense కదా, కాబట్టి sub-ordinate clause లో verb-would be) - sentence ను కింది sentence తో పోల్చండి.

b) The clerk tells me that they will be ready in 2 days


M. SURESAN

చూశారా- b) లో main clause verb, tells- present tense కదా- అందుకని sub clause లో verb will be

a) అర్థం- రెండ్రోజులకు ready అవుతుందని clerk చెప్పాడు. ఇది past (గతం)

b) అర్థం - రెండ్రోజులకు ready అవుతుందని clerk అంటున్నాడు- ఇది ఇప్పుడు (present)

2) He says that it is a good company, and pays its staff well.
ఇక్కడ main clause verb, says- present tenses, subordinate clause verbs, 1) is 2) pays. (Company మంచిదనీ, సిబ్బందికి జీతాలు బాగా ఇస్తారని అంటున్నాడు- ఇప్పుడు- present లో)

3) Dad doesn't bother about what pay I will get
Main clause- Dad doesn't bother about. Verb does bother- present time, so subordinate clause - will get.
పై sentenceలోని verb in the Main clause, past tenseకు (అంటే didn't bother అని మార్చా మనుకోండి) అప్పుడు sentence ఏమవుతుంది?
Dad didn't bother about what pay I would get. - didn't (main clause), would get - subordinate clause.

¶ Main clause verb past tense అయినప్పుడు sub ordinate clauseలో will, shall, can, may రావు- వాటికి మారుగా would, should, could, mightతో sentences practice చేయండి.

¶ Main clause verb past tense అయితే, subordinate clause లో-
1) am, is వాడం, వాటి బదులు was వాడతాం
2) are వాడం, దాని బదులు were వాడతాం
3) have, has వాడం, వాటి బయలు had వాడతాం
4) do, does వాడం వాటిబదులు did వాడతాం.

a) నిన్న వాడక్కడున్నాడని నాకు తెలుసు
I knew that he was there yesterday.

b) నువ్వెక్కడున్నావో నాకెవరూ చెప్పలేదు
No one told me where you were.

c) She was proud that she had so much of gold
(తనకు చాలా బంగారం ఉండేదని ఆమె గర్వపడేది)

d) అతడు ప్రతిరోజు వ్యాయామం చేసేవాడని వాళ్లన్నారు
They said that he did exercise everyday.

e) ఆ రోజు నేనక్కడున్నందుకు వాడు సంతోషపడలేదు
He was not happy that I was there yesterday.

కాబట్టి English మాట్లాడేప్పుడు జాగ్రత్తగా గుర్తుపెట్టుకోవాల్సిన విషయాలు.

| Main clause verb past tense అయితే, sub ordinate clause లో వాడనివి. will, shall, may , can, Ist RDW, IInd RDW, have, has, do and does. వీటి బదులు వాడేవి: Would, should, might, could, past doing word, had and did. |
|---|

a) He tells me that he sees her here everyday.
- Main clause verb tells - present tense;
Sub clause verb sees - present tense.
అర్థం: ఆమెనిక్కడ ప్రతిరోజూ చూస్తానని అంటున్నాడు.

b) He tells me that he saw her here yesterday
Main Clause Verb - Tells- Present tense
Subordinate clause Verb - Saw- past tense
అర్థం: ఆమెనిక్కడ నిన్న చూశానని అతనంటున్నాడు.

చూశారు కదా. మనం చెప్పాలనుకునే విషయాన్ని బట్టి MC (Main Clause) లో Present tense ఉంటే, SC (Subordinate Clause) లో ఏ tense అయినా ఉండ వచ్చు. అలాగే, future tense కు కూడా.

I will tell him that you are present
(నువ్వు వచ్చావని అతనితో చెప్తాను.
MC Verb - will tell - future tense,
SC verb - are - present tense.)

I will tell him that you were here yesterday
(నువ్వు నిన్న ఇక్కడ ఉన్నావని అతనితో చెప్తాను.
MC Verb - will tell - future; SC Verb - were - past tense)

ఇలా ఈ వాడకాన్ని గుర్తు పెట్టుకుని మీ conversation లో practice చేయండి.

¶ Main clause present tense, future tenseలో ఉంటే sub ordinate clause ఏ tenseలో అయినా ఉండవచ్చు- అర్థం చెడకుండా, అర్థాన్నిబట్టి.

## PRACTISE THE FOLLOWING

**Subhash:** Vinod, నేను కనుక్కుంటాను. నిన్న వాడిక్కడికి వచ్చాడా, లేదా అని.
**Vinod:** నాకు కచ్చితంగా తెలుసు. నిన్న వాడిక్కడ ఉన్నాడని.
**Subhash:** అయితే నన్నెందుకు కలవలేదో నాకు అర్థం కావటంలేదు.
**Vinod:** నిన్ను ఈ రోజో రేపో కలుసుకుంటానని అన్నాడు.
**Subhash:** నేను వారం కిందటే అన్నాను వాడితో. సాయంత్రం 5-7 మధ్య నన్నెప్పుడన్నా కలుసుకోవచ్చని.
**Vinod:** నిన్ను కలుసుకునే ప్రయత్నంలోనే ఉన్నానని, నీకివ్వాల్సిన పుస్తకాలు ఇవ్వాలని ప్రయత్నిస్తున్నట్లు కూడా చెప్పాడు నాతో.
**Subhash:** Phone చేద్దామంటే ఇక్కడ అతనికి Phone లేదు.
**Vinod:** నేను ఇప్పటికే రెండుసార్లు చెప్పానతడితో నువ్వు అతడిని కలవాలనుకుంటున్నావని.
**Subhash:** రేపయినా కలుసుకుంటాడని ఆశిద్దాం.

### ANSWER:

**Subhash:** Vinod, I will find out whether he came here yesterday or not.
**Vinod:** I know surely that he was here yesterday.
**Subhash:** Then I do not understand why he did not meet me.
**Vinod:** He said he would meet you today or tomorrow.
**Subhash:** I told him a week ago that he could meet me (on) any day between 5 and 7 in the evening.
**Vinod:** He told me too, that he was trying to meet you and give you the books he had to give you.
**Subhash:** He doesn't have a phone, even if I want to phone him.
**Vinod:** I have already told him twice that you have been wishing to see him
**Subhash:** Let's hope we will meet him atleast tomorrow.



**ప్రశ్న:** *1) Inurn - ఎలా పలకాలి?*
*2) To be Form ఏ tense లో ఉపయోగించాలి?*
*3) As = want, As = intentioned అనే అర్థాలు శంకరనారాయణ డిక్షనరీలో ఉన్నాయి. I as apple అనొచ్చా? As ని ఎన్ని విధాలుగా ఉపయోగించవచ్చు?*
***– కె. అనిల్‌కుమార్, పంచలవరం***

**జవాబు:** 1) 'Inurn' అనే మాట నాకు తెలిసి లేదు. కాబట్టి దాని ఉచ్చారణ విషయం out of the question.

2) 'To be Form' అనేది form of the verb. 'to be'/ 'be' forms am, is, are, was, were, shall be etc., లాగా చాలా ఉన్నాయి. ఏ 'be' form, am, is, are లాంటి వాటిల్లో ఏదీ అనేదాన్ని బట్టి 'Tense' ఉంటుంది. 'Be forms' ను Spoken English మొదటి lessons లో explain చేశాం. చూడండి. కేవలం 'to be' అయితే infinitive. దీనికి tense అంటూ ఉంటే present అవుతుంది. ఒక్కోసారి Past కూడా అవుతుంది. To be = ఉండటం.

3) As కు ఉన్న అర్థాల్లో want, intentioned అనేవి లేవు. మీరు శంకరనారాయణ Dictionary లో సరిగా చూసుండరు. As కు ఉన్న అర్థాలు:

1. వలె, లాగా:
a) He works as hard as his father (father లా కష్టపడి పని చేస్తాడు.)
b) talks as his father does.
(వాళ్ల నాన్నలాగానే మాట్లాడతాడు)

2. as అంటే because/ since (కాబట్టి)
a) As he is tall he can bowl well =
అతను పొడుగ్గా ఉండటంవల్ల బాగా bowl చేయగలడు.
b) As it is hot, I don't want to go out = ఎండగా ఉంది కాబట్టి, బయటకు వెళ్లాలనుకోవటం లేదు.

3. As అంటే 'గా' -
a) As a doctor, I advise you to eat less - Doctor గా నిన్ను నేను తగ్గించి తినమంటున్నాను.
b) As a player, Ram has no equal = క్రీడాకారుడిగా, Ram కు సమానులు లేరు.

4. As అంటే అంత:
1) He is not as good as you think =
అతను నువ్వనుకున్నంత మంచివాడు కాదు.
ఈ అర్థాలు మాత్రమే ఉన్నాయి 'As' కు. దీన్నిబట్టి మిగతావి follow అవుతాయి. I as pen, I as apple- అర్థం లేదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Jagan:** I met our schoolmate Prasad yesterday.

(నిన్న, మన స్కూల్‌మేట్ ప్రసాద్ ను కలుసుకున్నా.)

**Sekhar:** Did you? Long since we saw him. How is he? What did he say?

(అవునా? చాలకాలమైంది అతడిని చూసి. ఎలా ఉన్నాడు? ఏమన్నాడు? )

**Jagan:** He said he is doing Engineering in Hyderabad.

(హైదరాబాద్‌లో ఇంజినీరింగ్ చేస్తున్నానని చెప్పాడు.)

**Sekhar:** I think he is in his second year.

(సెకండ్ ఇయర్ అనుకుంటా.)

**Jagan:** No. He said he is in his 3rd year.

(కాదు. అతనే చెప్పాడు, థర్డ్ ఇయర్ అని)

**Sekhar:** Remember? At school the teacher once said that truth wins, he then picked up an argument with her. He told her that was correct in the olden days, and that truth had no place in the modern world.

(గుర్తుందా? స్కూల్‌లో మన టీచర్ సత్యమే గెలుస్తుందని చెప్పినప్పుడు వాడామెతో వాదానికి



దిగాడు. సత్యం గెలవటం పాత రోజుల్లో అని, ప్రస్తుత ప్రపంచంలో సత్యానికి తావు లేదని.)

**Jagan:** Yes, I do. I remember too his drinking only boiled cooled water from the day he read that boiled water is free from bacteria.

(అవును. అంతే కాకుండా కాచి చల్లార్చిన నీళ్లలో బ్యాక్టీరియా ఉండదని చదివినప్పటి నుంచి అవే తాగటం కూడా నాకు గుర్తే.)

**Sekhar:** He is a peculiar type, isn't he?

(విచిత్రమైన రకం కదా అతడు? )

(Peculiar = పెక్యూలియ - 'క్యూ' నొక్కి పలుకుతాం = మామూలుకంటే భిన్నంగా ఉన్న)

**Jagan:** Yes. He doesn't believe others easily.

(అతడు ఇతరులను సులభంగా నమ్మడు.)

మనం ఇంతవరకు తెలుసుకున్నది- Main Clause (MC), Subordinate Clause (SC)లను గురించి:

1) MC verb, past tense అయితే, SC verb కూడా past tense

2) MC verb, present or future tense అయితే, SC verb, any tense.

అయితే పైన చెప్పిన rule no. 1, MC - past tense, SC also past tense అనే rule కొన్ని కొన్ని సందర్భాల్లో వర్తించదు. అవేమిటో ఇప్పుడు చూద్దాం:

**Look at the following sentences from the dialogue above:**

**1)** He said (that) he is doing Engineering.

**2)** He said (that) he is in his 3rd year.

**3)** The teacher once said that truth wins.

**4)** ..... from the day he read that boiled water is free from bacteria.

**Look at sentence 1.**

He said (that) he is doing Engineering.

ఇక్కడ Main Clause, He said; verb - said - past tense. (ఇది yesterday జరిగిన సంభాషణ)

(that) he is doing Engineering - ఇది Subordinate Clause - Verb - is doing - present tense.

So, in this sentence the Main Clause verb is in the past tense and the Subordinate Clause is in the present tense.

Rule ప్రకారం ఇలా ఉండకూడదు కదా. కానీ ఇక్కడ rule వర్తించదు. ఎందుకంటే ఇప్పుడింకా జరుగుతున్న (presentలో జరుగుతున్న) విషయాన్ని నిన్న ప్రసాద్ జగన్‌కు చెప్పాడు. చెప్పింది past. కాని విషయం ఇంకా జరుగుతోంది- అందుకని MC verb past అయినప్పటికీ SC verb ఇలాంటి చోట్ల present tense లోనే ఉంటుంది.




3rd year' అనేదే correct.

కాబట్టి ఇలాంటి చోట్ల, అర్థం కరెక్ట్‌గా వచ్చేందుకు MC verb past tense అయినప్పటికీ, SC verb present tense లో ఉంటుంది.

MC verb past tense లో ఉంటే SC verb కూడా past tenseలోనే ఉండాలనే rule వర్తించని సందర్భాలు మరి కొన్ని ఉన్నాయి.

**Sentence No. 3** చూడండి:

The teacher once said that truth wins.

(ఒకసారి teacher చెప్పింది సత్యం జయిస్తుందని). ఇందులో

MC verb - said - past tense

# can't achieve anything without hardwork

SC verb - wins - present tense


M. SURESAN

Rule ప్రకారం SC verb కూడా past tense (won) రావాలి. అలా మార్చామనుకోండి- The teacher once said that truth won అవుతుంది- అర్థం: నిజం గతంలో గెలిచేది (అంటే ఇప్పుడు గెలవటంలేదని) అనే అర్థం వస్తుంది. ఇది కాదు కదా భావం? అసలు భావం సత్యం ఎప్పుడూ గెలుస్తుందని. అలా అర్థం రావాలంటే Truth wins అని present tense లోనే వాడతాం. కాబట్టి ఇక్కడ SC verb present tense లోనే ఉంది. MC Verb past అయినప్పటికీ

'Truth wins', 'Goodness is rewarded'

(మంచికి ఫలితం ఉంటుంది), Justice prevails (న్యాయానిదే పైచేయి - ఇలాంటి వాక్యాలను generalisations అంటాం.

విషయంలో, MC verb past tense అయినప్పటికీ, SC Verb prsent tense లోనే ఉంటుంది.

MC Verb past అయినప్పటికీ, SC verb present tense లో ఉండే సందర్భాలు మరికొన్ని.

**Sentence No. 4** చూడండి.

He read that boiled water is free from bacteria.

MC- He read - read (రెడ్) - past tense

SC - that boiled water is free from bacteria

Verb is present tense.

ఇందులో SC verb present tense లో ఉండటం, (MC verb past tense లో ఉన్నప్పుడు) తప్పు కాదు- సరైనదే. ఎందుకంటే అతడు చదివినప్పుడే కాకుండా ఎప్పుడైనా సరే మరిగిన నీళ్లలో క్రిములుండవు. ఇది fact of science. అంటే శాస్త్ర ప్రమాణమైన సత్యం. అందుకని ఇక్కడ కూడా MC verb past tense అయినప్పటికీ SC verb present tense లోనే ఉంటుంది.

నిత్యసత్యాల (universal truths) విషయంలో కూడా. MC verb, past tense అయినప్పటికీ, SC Verb present tense లోనే ఉంటుంది.

**eg:** Galileo discovered that the earth goes round the sun.

(భూమి, సూర్యుడి చుట్టూ తిరుగుతుందని గెలీలియో కనిపెట్టాడు) Subordinate clause- universal truth తెలుపుతోంది కాబట్టి, MC verb past tense అయినప్పటికీ. SC verb present tense.

MC verb past tense అయితే, SC verb కూడా past tense ఉండాలనే rule వర్తించని చోట్లు:

If the subordinate cluase states

**1)** a universal truth (నిత్య సత్యం)

**2)** a fact of science (శాస్త్ర ప్రకారం తెలిసిన విషయం)

**3)** a generalisation (Truth wins, etc) and

**4)** a regular/repeated action continuing into the future

ఈ నాలుగు కూడా ఈ rule కు మినహాయింపులు.

(Rule ప్రకారం SC Verb past tense లో ఉంచామనుకోండి; He said he was doing Engineering అని sentence అవుతుంది- అర్థం? అతను Engineering చేస్తున్నానని was doing = గతంలో అనే అర్థం వస్తుంది, అంటే ఇప్పుడు కాదని కదా? కానీ అతడు ఇప్పుడు కూడా Engineering చేస్తున్నాడని కదా భావం! అందుకని verb present tense

**Sentence No. 2** కూడా అంతే:

He said (yesterday) that he is in his 3rd year.

MC Verb - said, Past tense; SC verb - is present tense.

ఇక్కడ కూడా MC verb past tense కాబట్టి, SC verb కూడా past tense లో ఉండాలనే rule వర్తించదు. ఎందుకంటే rule ప్రకారం sentence ను మార్చామనుకోండి: అప్పుడు sentence:

He said (yesterday) that he was in his 3rd year అవుతుంది. అంటే అర్థం, అతను 3rd year లో ఉండటం, గతంలో (was), కానీ, ఇప్పుడు కాదనే వస్తుంది. కానీ చెప్పినప్పుడే (నిన్న) కాకుండా ఇప్పుడు కూడా III year కదా. అందుకని ఇక్కడ 'he is in his

## Practise the following in English

**Sasikanth:** నీకు తెలుసా. వినయ్ ఇప్పుడో పెద్ద bank officer అని?

**Yaswanth:** నాకెప్పుడో తెలుసు. నేనే కదా నీకు చెప్పింది. పోయినవారం, వాడు ఆ బ్యాంక్‌లో మంచి పొజిషన్‌లో Mumbai లో ఉన్నాడని?

**Sasikanth:** అవును. గుర్తొచ్చింది. నేను నిన్న పేపర్‌లో కూడా చదివా. అతడా bank కు వైస్ ప్రెసిడెంట్ అని.

**Yaswanth:** వాడీ రోజు ఆ పొజిషన్ position లో ఉండటానికి వాడు చాలా శ్రమపడ్డాడు. ఎప్పుడూ అంటూండేవాడు. కష్టపడనిదే ఏదీ సాధించలేమని. చాలా కష్టపడి పరీక్షలు పాస్ అయ్యాడు. పైకొచ్చాడు.

**Sasikanth:** అవును. అంతేకాకుండా, ఏది చదివినా అర్థం చేసుకోవటానికి చదివేవాడు. ఒకసారి అన్ని వస్తువులూ భూమ్మీదకి ఒకే వేగంతో పడతాయని అర్థం చేసుకోవటానికి ఒక బుక్, పెన్ కింద పడేశాడు.

**Yashwant:** ఇంకా పైకొస్తాడు వాడు.

**Answer:**

**Sasikanth:** Do you know, Vinai now is a big officer in a bank?

**Yashwant:** I knew it long ago. Isn't it I who told you last week that he is in a good position in a bank?

**Sasikanth:** Yes, it is you; I remember. I read in the papers too, Yesterday, that he is the vice president of the bank.

**Yashwant:** You know that he worked very hard to be in that position now. He always used to say that we can't achieve anything without hardwork. He worked hard and passed exams, and he came up that way.

**Sasikanth:** That's right. Moreover, he always studied things to understand them. Once, to understand all objects fall to the ground at the same speed, he let fall a book and a pen on the ground.

**Yashwant:** He will come up further.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

# Cricket...does not interest me




**Akhilesh:** (Do) you know when the matches begin?
(Matches ఎప్పుడో తెలుసా? )

**Avinash:** Hemanth is the man who can give the information.
(నీకా సమాచారం ఇవ్వగలిగింది Hemanth)

**Akhilesh:** I wish to know the date of the match which they play here.
(ఇక్కడ ఆడే match date తెలుసుకోవాలని ఉంది). I am not interested in the matches at the other venues. (ఇతర చోట్ల matches లో నాకు interest లేదు)

**Avinash:** Hemanth is out of town now.
(హేమంత్ ఇప్పుడు ఊళ్లో లేడు)

**Akhilesh:** Who is the person that can tell us about it?
(మనకు దాన్ని గురించి చెప్పగలిగేవారెవరు?

**Avinash:** Here is the phone number which you can call for the information
(నీక్కావలసిన సమాచారం కోసం ఫోన్ చెయ్యాల్సిన number ఇదిగో)

**Akhilesh:** Why don't you call?
(నువ్వెందుకు చేయకూడదు? )

**Avinash:** Cricket is a game which does not interest me
(నన్ను interest చేయని (ఆసక్తి కలిగించని) game cricket = నాకు cricket లో interest లేదు)

**Akhilesh:** You seem to be the only one who is not interested in it.
(అందులో interest లేనివాడివి నువ్వొక్కడి లాగే ఉన్నావు).

**Avinash:** When I see people who show interest in cricket, I think they are mad.
(cricket లో interest ఉన్నవాళ్లను చూసినప్పుడు వాళ్లు నాకు పిచ్చోళ్లనిపిస్తుంది)

**Akhilesh:** OK, OK. Tastes differ.
(సరే, సరే, ఒక్కొక్కరికి ఒక్కో అభిరుచి). Let's not argue about it. (దానిగురించి వాదించొద్దు మనం).

మనం ఇంతవరకు చాలా రకాల sub ordinate clauses గురించి తెలుసుకున్నాం కదా. ఈ conversation లో వాడిన subordinate clauses చూడండి. ఈ conversation లో ఉన్న sub ordinate clauses వాడకుండా we can carry on conversation. వీలయినంతవరకు ఈ sub ordinate clauses ను వాడకుంటే మంచిది. అయితే ఇది బాగా తెలుసుకోవటం అవసరం, అవతలివాళ్లు వీటిని వాడినపుడు మనకర్థమవ్వాలి కదా. అందుకని వీటిని తెలుసుకుందాం. అత్యంత అవసరమైనప్పుడే వాడదాం. బాగా study చేద్దాం:

Look at these following SCs (Subordinate clauses) in the conversation:

1) ... the man who can give the information
2) ... the match which they play here
3) ... the person that can give the information
4) The phone number which you can call
5) ... a game which doesn't interest me.
6) .... the only one who is not interested in it
7) .... people who show interest in cricket.

పై SCs అన్నింటిలో who, which, that వస్తున్నాయి కదా. వీటిని చూడండి.

8) a) She is the one whose voice is good.
b) He is the hero whom I like.

a), b)లో SCs a) the one whose voice is good
b) ... the hero whom I like

whose, whom తో కూడా, who, which, that ఉన్న SCs (Subordinate Clauses) ను చేయవచ్చు కదా?


M. SURESAN

ఇదీ ఈ రకం Subordinate Clauses నూ, అవి కలిసి ఉండే Main Clauses నూ అర్థం చేసుకోవాల్సిన విధానం.

(ఇలాంటి Clauses కు అర్థం ఏమిటని చాలా మంది పాఠకులు మాకు రాసిన questions అన్నింటికీ సమాధానం ఇదే).

మళ్లీ గుర్తుచుకుందాం: వీలయినంతవరకూ ఇలాంటి SCs ను మన conversation లో వాడకుండా ఉంటే మన conversation, simple గా, direct గా, interesting గా ఉంటుంది. కాని వీటిని బాగా తెలుసుకోవటం అవసరం - ఇతరుల conversation correct గా అర్థం చేసుకోవటానికి.

ఇవి వాడకుండా, ఇదే అర్థం వచ్చే చిన్న చిన్న sentences వాడటం ఇలా:

1) Hemanth is the man who can give you the information =
Hemanth can give you the information.
2) I wish to know the date of the match they play here =
I wish to know the date of the match here.
3) Who is the person that can tell us about it? =
Who can tell us about it?
4) Here is the phone number which you can call for the information =
You can call this phone number for the information.
5) Cricket is a game which does not interest me =
Cricket/ The game cricket does not interest me.
6) You seem to be the only one who is not interested =
You seem to be the only one not interested = You alone seem to be not interested/ uninterested (alone = only = మాత్రమే. అయినప్పటికీ ఇక్కడ you only కంటే you alone, better.)
7) People who show interest in cricket = People interested in cricket.
8) She is the one whose voice is good =
Her voice is good.
9) He is the hero whom I like =
I like that hero.

చూశారు కదా? Who, Whom, Whose, Which, that clauses ను ఎలా సరళం (simple) గా, direct గా చేయవచ్చో మన conversation ఎప్పుడూ simple గా, direct గా ఉంటే natural (సహజం) గా ఉంటుంది.

Let us now study the SCs having who, whom, which, whose and that, and the MCs (Main Clauses) they are joined to.

కింది ప్రతి SC ని దాన్ని join చేసిన MC తో కలిపి చదవండి- అవి ఉన్న sentences అర్థం easy గా అర్థం చేసుకునేందుకు. (చాలా సందర్భాల్లో English లో MC, SC, order, తెలుగులో reverse (వ్యతిరేకం) అవుతుంది- ముందుది వెనక, వెనకది ముందుగా..)

| SUBORDINATE CLAUSE | MAIN CLAUSE |
|---|---|
| 1 ..... the man who can give you the imformation. = .... నీకా సమాచారం ఇవ్వగల వ్యక్తి | Hemanth is హేమంత్ |
| 2 ..... the date of the match which they play here = వాళ్లిక్కడ ఆడే match తేది | I wish to know నేను తెలుసుకోవాలనుకుంటున్నా. |
| 3 ..... the person that can tell us about it = ..... దాని గురించి చెప్పగలవ్యక్తి | Who is? ఎవరు? |
| 4 ..the phone number which you can call for the information = నీక్కావలసిన సమాచారం కోసం phone చేయాల్సిన నంబరు | Here is. ఇదిగో |
| 5 ... a game which does not interest me = నాకు ఆసక్తి కలిగించని game | Cricket is Cricket |
| 6 ... the only one who is not interested in it = అందులో ఆసక్తిలేని ఒకే వ్యక్తి | You seem to be నువ్వొక్కడిలాగే ఉన్నావు |
| 7 ... people who show interest in cricket = Cricket లో ఆసక్తి చూపించేవాళ్లను | I think = నాకనిపిస్తుంది |
| ... When I see = నేను చూసినప్పుడు | |
| ... (that) they are mad = వాళ్లు పిచ్చివాళ్లని | |
| (3 SCS ఉండటం గమనించండి) | |
| 8. a) ... the one whose voice is good = గొంతు బాగా ఉన్న ఒకరు | She is = ఆమె |
| b) ... the hero whom I like నేను ఇష్టపడే hero | He is = అతను |

**NOW SIMPLIFY THE FOLLOWING:**

(కిందివాటిలో who, whom, which, etc., తో వచ్చే clauses ను మామూలుగా simple గా మాట్లాడండి.)

**eg:** The book which I bought yesterday is here = I bought this book yesterday.

1) He is the man who tore the book.
2) They are the people whose houses look beautiful.
3) We are the students whom they admitted.
4) These are the books which are interesting but expensive.
5) Those who play cricket think they are great.
6) This is a problem which is easy enough to solve.
7) Can you show me a man who dislikes cricket?
8) This is a question to which no one knows the answer.
9) A man who is poor should not waste money.
10) These are all sentences which we can simplify.

**ANSWERS:**

1) He took the book.
2) Their houses look beautiful.
3) They admitted us (ఇది conversation లో మాత్రమే)
4) Those books are interesting but expensive.
5) Cricket players/ cricketers think they are great.
6) This problem is enough to solve.
7) Can you show me a hater of cricket? (hater = ద్వేషి- ఒకప్పుడు- చాలా అరుదుగా ఇచ్చిన 'who' clause sentence వాడటం తప్పనిసరి అవచ్చు. కానీ వీలయినంతవరకూ వాడకపోవటం మంచిది.)
8) No one knows the answer to this question.
9) A poor man should not waste money.
10) We can simplify all these sentences.



**ప్రశ్న:** ought be, dare be, need be లను ఏ విధంగా ఉపయోగించాలి?
**– కె.నర్సింహారెడ్డి, హైదరాబాద్.**

**జవాబు: 1) Ought be** - ought be implies an obligation - it more or less means, 'must be'. But 'ought' always expresses a moral obligation - some thing a person is expected to do as a moral obligation. **eg:**
a) you ought to be respectful to elders. (Morals require that you should be respectful)
b) Humans ought to be kind to animals
c) A youngster like you ought not talk like that to elders.

**2) Dare:** Meaning and use no.1. Be brave enough to do something. He doesn't dare (to) talk to another woman in his wife's presence = He isn't brave enough to do it. In this sense, 'dare' is usually used with 'not'. He dare not do it = He doesn't dare to do it. 'He dare not do it' is more common.

Meaning and use no.2. Used to warn some one against doing some thing/ tell someone strongly not to do something. **Eg: a)** Don't you dare talk to me like that again! (= I warn you not to talk to me like that again.) **b)** How dare you to talk like that to me?

Meaning and use no.3: To persuade someone to do some thing. **Eg:** They dared him to climb up the mountain = They persuaded him to climb up the mountain.

**Imp:** 'Dare' is used mostly with 'not' if it is used with the meaning of 'be brave enough'

**3) Need be:** 1) 'Need' is used as a 'main' verb, as well as a 'model'.

**eg: a)** I need some money - here 'need' with the meaning of 'being in need' is a main verb.
**b)** He needs her help - needs is a main verb.

2) Followed by not, it is used in the following manner.
a) You need not go now. (It is not necessary)
b) He need not come here again (It is not necessary)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# People who work hard achieve success

**Susanth:** Here's good news for you. Vishal has achieved what he set out to achieve. He has got the 5th rank in the entrance exam
(నీకో శుభవార్త. విశాల్ అనుకున్నది సాధించాడు. ఎంట్రన్స్ ఎగ్జామ్‌లో 5th rank తెచ్చుకున్నాడు)

**Prasanth:** That's news to me. I haven't known it. Vishal's is an achievement indeed. I am eager to see him and congratulate him.
(నాకు తెలియదు. ఇప్పుడు నువ్వు చెబితే తెలిసింది. విశాల్‌ది గొప్ప విజయమే. వాడిని కలుసుకొని congrats చెప్పాలని ఆతృతగా ఉంది)

**Susanth:** I met him accidentally this morning. He told me of it then. He was accompanying his dad to some place. His dad was very happy.
(ఈరోజు ఉదయం నేను అతడిని అనుకోకుండా కలుసుకున్నా. అప్పుడు చెప్పాడతను. వాళ్ల నాన్నతో కలిసి ఎక్కడికో వెళ్తున్నాడు. ఆయన కూడా చాలా సంతోషంగా ఉన్నాడు)



**Prasanth:** Which father won't be? I admire the way Vishal worked hard to get such a good rank.
(ఏ తండ్రి సంతోషంగా ఉండడు? విశాల్ అలాంటి rank తెచ్చుకోవటానికి పడ్డ శ్రమను నేను మెచ్చుకుంటున్నాను)

**Susanth:** Vishal himself wasn't happy. He was a bit ashamed of not getting one of the 1st three ranks.
(Vishal మాత్రం అంత సంతోషంగా లేడు. మొదటి మూడు ర్యాంకుల్లో ఏదీ రాలేదని సిగ్గుపడ్డాడు)

**Prasanth:** What about you then? You are going to take the exam next year, aren't you? What is your target?
(నీ సంగతేంటి మరి? వచ్చే సంవత్సరం నువ్వు కూడా ఎంట్రన్స్ ఎగ్జామ్ రాయబోతున్నావు కదా! నీ లక్ష్యం ఏంటి? )

**Susanth:** My target is one of the first ten ranks. But I am not sure. Our college isn't as good as Vishal's
(మొదటి 10 ర్యాంకుల్లో ఉండాలనేది నా లక్ష్యం. కానీ అంత నమ్మకం లేదు. మా కాలేజ్ విశాల్ వాళ్ల కాలేజ్‌లా అంత మంచిది కాదు)

**Prasanth:** Why didn't you join that college, then?
(మరి ఆ కాలేజ్‌లో ఎందుకు చేరలేదు? )

**Susanth:** The fees there are too high. I can't afford that.
(అక్కడ fees చాలా ఎక్కువ. నేను అంత భరించలేను)

**Prasanth:** I understand. Do try your best. You will get it.
(అర్థం అయ్యింది. నీ శక్తికొద్దీ ప్రయత్నించు. ర్యాంక్ తెచ్చుకుంటావు)

**Susanth:** Thanks for the encouragement. I am on my way to college. See you.
(నీ ప్రోత్సాహానికి థ్యాంక్స్. నేను కాలేజ్ కెళ్తున్నా, మళ్లీ కలుద్దాం)

పై సంభాషణలోని ఈ మాటలు గమనించండి.

1) Vishal has achieved
2) Vishal's is an achievement indeed
3) I am eager to see him
4) I met him accidentally
5) He was accompanying his father
6) I admire the way he worked hard.
7) He was a bit ashamed
8) What's your target.
9) I can't afford it.

English conversation లో high frequency words (అతి తరచుగా వాడే మాటల్లో) ఇవి కొన్ని. వీటి అర్థం, ఉపయోగం చూద్దాం.

**1) achieve** - అ'చీవ్', 'చీ' నొక్కి పలుకుతాం.
అర్థం: సాధించటం - దీనికి past tense, past participle - achieved.

a) Our freedom fighters achieved Independence for us:
మన స్వాతంత్ర్యయోధులు మనకు స్వాతంత్ర్యాన్ని సాధించారు.

b) People who work hard achieve success
కష్టపడి పనిచేసేవాళ్లు విజయం సాధిస్తారు.

c) Tendulkar achieved the highest number of test centuries
Tendulkar అందరికంటే ఎక్కువ test centuries సాధించాడు.


M. SURESAN

**2) Achievement:** ఎవరైనా సాధించిన విషయం.

a) అతడు సాధించింది గొప్ప విషయమే
His achievement is really great.

b) Anand's achievement makes India proud
ఆనంద్ (Chess లో) సాధించిన ఘనత మనకు గర్వం కలిగిస్తుంది.

**ii) Indeed:** ఇన్‌డీడ్- 'డీ' నొక్కి పలుకుతాం. దీని అర్థం- నిజంగానే అని: అయితే ఒక భావాన్ని తెలుపుతున్నప్పుడు, దాన్ని ఇంకా నొక్కిచెప్పటానికి indeed వాడతాం. ఇది conversation లో చాలా సహజంగా ఉంటుంది.

**Bhavan:** Do you like it?
(నీకది నచ్చిందా? )

**Sravan:** (I like it) verymuch indeed
(చాలా నచ్చింది- అని నొక్కి చెప్పటం.
I like it వదిలేసి చెప్తుంటారు సామాన్యంగా.)

Indeed ఇంకో వాడకం, మనం నమ్మలేనిదేదైనా ఎవరైనా చెప్పినప్పుడు, నమ్మలేకపోవటాన్ని తెలియచెప్పటం (నిజంగానా? అవునా? లాంటి మాటలతో మన అపనమ్మకం తెలియజేసే అర్థంతో Indeed వాడతాం)

**Praveen:** I met the CM today and talked to him for an hour.
(నేను ఈరోజు ముఖ్యమంత్రిని కలుసుకుని గంటసేపు మాట్లాడాను)

**Prakash:** Indeed?
(నిజంగానా? )-
అపనమ్మకం (disbelief) వ్యక్తపరచటం.

**3) Eager:** ఆతృత (ఆత్రంగా ఉండటం)

**Kiran:** I am not coming to college today.
(నేనీరోజు కాలేజ్‌కు రావటంలేదు.)

**Kishore:** Why?

**Kiran:** The great cricketer is coming to town. I am eager to see him and take his autograph.
గొప్ప క్రికెటర్ ఊళ్లోకొస్తున్నాడు. అతడిని చూసి, ఆటోగ్రాఫ్ తీసుకోవాలని ఆతృతగా ఉంది.

**4) accidentally = by accident** = అనుకోకుండా

a) Newton discovered the law of gravitation accidentally/ by accident =
న్యూటన్ అనుకోకుండా భూమ్యాకర్షణ సిద్ధాంతం కనిపెట్టాడు.

b) As I raised my hand, it hit him accidentally =
నేను చెయ్యెత్తేసరికి, అనుకోకుండా అది అతడికి తగిలింది.

c) I stepped on his shoes accidentally =
అనుకోకుండా అతడి షూస్ మీద నేనడుగు పెట్టాను.

అనుకోకుండా, మనం ఎదురుచూడకుండా జరిగేవి కాబట్టే Road ప్రమాదాలు, పడటం లాంటి ప్రమాదాలను accident అంటాం.

**5) Accompany** = ఎవరితోనైనా కలిసివెళ్లటం.
(past tense, past participle - accompanied)

a) The President's wife accompanied him on the tour =
అధ్యక్షుడి పర్యటనకు ఆయన భార్య ఆయనతో వెళ్లింది.

b) His dog always accompanies him =
అతడి కుక్క ఎప్పుడూ అతడితో వెళ్తుంది.

c) The client accompanied the lawyer to the court =
lawyer తో client court కు వెళ్లాడు.

ఒక సంగీతవాద్యం, ఇంకో సంగీతవాద్యం కలిపి వాయించినా, ఒకరు పాడుతున్నప్పుడు, ఓ వాద్యం అనుసరించినా, అది accompany అవుతుంది.
The fluit accompanied him =
అతని పాటకు వేణువు తోడయింది.

**6) admire** = మెచ్చుకోవటం. (ఒకరి గొప్పదనాన్ని, achievement ను, అభిమానంతో మెచ్చుకోవటం)

a) I admire MS Subbulakshmi's voice
MS Subbulakshmi గొంతును నేను మెచ్చుకుంటాను.

b) Everyone admires Tendulkar's great achievement =
Tendulkar సాధించిన ఘనతను అందరూ మెచ్చుకుంటారు.

**7) ashamed** = సిగ్గుపడటం.

a) He is ashamed of his low marks
తన తక్కువ మార్కులకు అతనెంతో సిగ్గుపడుతున్నాడు.

b) The father is ashamed of his son's behaviour
కొడుకు ప్రవర్తనకు తండ్రి సిగ్గుపడుతున్నాడు.

To be Ashamed of అంటే సిగ్గుపడటం కదా? దీనికి వ్యతిరేకం- గర్వించటం- to be proud of.

**8) Target** = లక్ష్యం. (Pronunciation= టాగిట్)

a) The company has set a target of 20% increase in sales =
ఆ company లక్ష్యం అమ్మకాలలో 20% పెరుగుదల)

b) My target is to be a computer professional
నా లక్ష్యం computer professional అవటం.

లక్ష్యం నిర్దేశించుకోవటం = Set a target
లక్ష్యం సాధించటం = achieve the target/ clear the target/ hit the target.
మనం గురిచూసే లక్ష్యం కూడా target (shooting లో)

**9) Afford** = ఏదైనా కొనగల/ పొందగల స్తోమత.

a) I cannot afford a car = కారుకొనే స్తోమత నాకు లేదు.

b) He can afford a number of such buildings =
అలాంటి ఇళ్లు ఎన్నైనా కొనగల స్తోమత అతడికుంది.

c) With the exam tomorrow you can't afford to go to bed so early =
రేపు పరీక్షపెట్టుకొని అంత త్వరగా నిద్రపోయే అవకాశం నీకు లేదు.

ఇవీ ఈ మాటల వివరాలు. మన daily conversation లో వీటిని వాడే అవకాశాలు ఎక్కువ. Practice చేయండి.

## EXERCISE

**Ram:** Hi Shyam, కారు ఎప్పుడు కొంటున్నావు?
**Shyam:** Bike కొనే స్తోమతే లేదు. ఇంక కారెక్కడ కొనను?
**Ram:** అలాగా? / నిజంగానా? మీ నాన్న పెద్ద Shopping Complex owner కదా?
**Shyam:** అది ఆయన complex. నాది కాదు కదా? నేను సంపాదించగలిగిందే నా డబ్బు. దాంతో car కొనటమే నా లక్ష్యం.
**Ram:** మీ నాన్న డబ్బుతో కొనవచ్చుకదా?
**Shyam:** అది నేను సాధించింది కాదు కదా? మా నాన్న సాధించింది.
**Ram:** నిన్న నేను అనుకోకుండా Venu ను కలుసుకున్నాను. వాడి నాన్న వాడికి bike కొనిచ్చాడని చెప్పాడు.
**Shyam:** మా నాన్న డబ్బులతో వచ్చే car ను అనుభవించాలనే ఆతృత నాకు లేదు.
**Ram:** నీ పద్ధతి మెచ్చుకుంటున్నాను.

## ANSWER

**Ram:** Hi shyam, when are you buying a car?
**Shyam:** I can't afford even a bike. How can I buy a car?
**Ram:** Indeed? Isn't your father the owner of a big shopping complex?/ Doesn't he own a big shopping complex?
**Shyam:** That is/ belong to dad. What I earn is my money. My target is to buy a car with my money.
**Ram:** You can buy it with your father's money, can't you?
**Shyam:** That is not what I have achieved. It's dad's achievement.
**Ram:** I met Venu Yesterday by accident/ accidentally. He told me his father had bought him a bike.
**Shyam:** I am not eager to enjoy a car bought with dad's money.
**Ram:** I admire your policy.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# You would have missed me




**Ramesh:** Hi Naresh, you are late by half an hour. I have been waiting and waiting.
(నువ్వు అరగంట ఆలస్యంగా వచ్చావు. నీకోసం కాచుకొని ఉన్నాను)

**Naresh:** I would have been here on time, but my train was late.
(నేనిక్కడికి టైమ్‌కు ఉండేవాడినే, కాని నా train ఆలస్యం అయింది)

**Ramesh:** I would have gone away, but I thought I would wait for another half an hour. That's why I am here. Otherwise you would have missed me.
(నేను వెళ్లిపోయేవాడినే. కానీ ఇంకో అరగంట చూద్దామనుకున్నా. అందుకనే ఇక్కడ ఉన్నా. లేకుంటే నువ్వు నన్ను కలుసుకొని ఉండేవాడివి కాదు)

**Naresh:** That's good of you. Thank you. I wouldn't have been late but for the train.
అది మంచి పనే. Thank you. Train వల్లేతప్ప నేనాలస్యం అయ్యేవాడినికాను)

**Ramesh:** Where is Jagadish?
(జగదీష్ ఎక్కడ? )

**Naresh:** I would have brought him along, but he was busy.
(వాడిని తీసుకువచ్చేవాడినే కానీ వాడు busy గా ఉన్నాడు)

**Ramesh:** OK. By the way what happened to the cricket match?
(అది సరే. Cricket match ఏమైంది? )

(by the way = సంభాషణలో విషయం మార్చేందుకు వాడే మాట)

**Naresh:** Don't you know? India won the match by four wickets. It would not have won the match but for Suresh Raina and Dhoni.
(తెలియదా. 4 వికెట్ల తేడాతో ఇండియా గెలిచింది. Suresh Raina, Dhoni లేకపోతే India గెలిచేది కాదు)

**Ramesh:** Happy to hear that. I would have watched the match yesterday, but I had important work.
(సంతోషం. నిన్న నేను match చూసేవాడినే కానీ చాలా ముఖ్యమైన పని ఉండింది)

**Now, look at the following sentences from the conversation above:**

1) I would have been here on time.
2) I would have gone away.
3) You would have missed me
4) I wouldn't (would not) have been late
5) I would have brought him along.
6) It wouldn't have won the match.
7) I would have watched the match.

**The verbs in the sentences above are:**

1. Would have been
2. Would have gone
3. Would have missed
4. Would have been
5. Would have brought
6. Would have won
7. Would have watched

Verbs no. 1 and 4 are would have been. ఇది 'be' form. మిగతా verbs form చూడండి.

2. Would have gone - would have + past participle (of go)
3. Would have missed - would have + past participle (of miss)
5. Would have brought - would have + past participle (of bring)
6. Would have won - would have + past participle (of win)
7. Would have watched - would have + past participle (of watch)

verbs 1 and 4 - be forms. అంటే ఇవి ఉండటాన్ని (state of being) ను తెలిపేవి కదా.

Verbs 2, 3, 5, 6, 7 అన్నీ కూడా ఏ form లో ఉన్నాయి? Would have + past participle.

ఇవి action words కదా. అంటే ఇవి పనులను తెలిపే verbs.


M. SURESAN

ఇలాంటి verbs చాలా జాగ్రత్తగా గమనించి అర్థం చేసుకోవాలి. ఎందుకంటే ఈ verbs 1) would have been, 2) would have + pp (past participle) conversation లో తరచూ వాడుతుంటాం.

రోజు చాలాసార్లు మనం అనుకుంటుంటాం. ఒక విషయం అలా ఉండి ఉండేది, కానీ లేదు. (గతంలో) ఒక విషయం అలా ఉండేది కాదు, కాని ఉండింది, ఒక విషయం అలా జరిగి ఉండేది, కాని జరగలేదు, ఒక విషయం అలా జరిగి ఉండేది కాదు, కానీ జరిగింది అనే ఇలాంటి భావాలతో మనం రోజూ ఎన్నోసార్లు అనుకుంటుంటాం, మాట్లాడుతుంటాం. అలాంటి భావాలను తెలిపేవే ఈ would have been, would have + pp verbs.

**Look at sentence No. 1:**

I would have been on time
నేను time కు సరిగ్గా ఉండేవాడినే. (కాని లేను)

**Sentence No. 4:**

I wouldn't (would not) have been late
నేను ఆలస్యం అయ్యేవాడినికాను (కాని అయ్యాను)

మరో example: సోనియాగాంధీ prime minister గా ఉండేది (కాని లేదు కదా)
Sonia Gandhi would have been the prime minister.

చూశారా, would have been కు అర్థం - ఉండేదీ/ ఉండేవాడే కాని లేదు/ లేదు (ఇది గత విషయం)

Wouldn't (would not) have been = ఉండేది కాదు/ ఉండేవాడు కాదు (కాని ఉన్నాడు) - గతంలో

She wouldn't have been here
ఆమె ఇక్కడ ఉండేది కాదు (కానీ ఉంది)

He would have been the CM
అతడు CM గా ఉండేవాడే (కానీ లేదు)

ఇదీ would have been/ wouldn't have been అర్థం, ఉపయోగం.

**Next, would have + past participle**

- I would have gone =
వెళ్లుండేవాడినే (కానీ వెళ్లలేదు)
- India would have last the match=
India ఓడిపోయేదే (కానీ ఓడిపోలేదు, గెలిచింది)
- She would not have attended the marriage=
ఆమె పెళ్లికి వచ్చి ఉండేదికాదు. (కానీ వచ్చింది)
- He wouldn't have seen me=
అతడు నన్ను చూసుండేవాడు కాదు. (కానీ చూశాడు)
- They would have won=
వాళ్లు గెలిచి ఉండేవాళ్లే (కాని గెలవలేదు).
- నేనక్కడ రెండింటికే ఉండేవాడిని=
I would have been there at 2. (కానీ లేను)
- But for = అందువల్ల కాకుంటే
- But for my help, he would not have passed=నా సహాయంవల్ల కాకుంటే, వాడు pass అయ్యేవాడు కాదు. (నా సహాయం ఉండిందీ, వాడు pass అయ్యాడు.)
- British పాలనలేకుంటే, India ఎంతో పురోభివృద్ధి చెంది ఉండేది=
But for the British rule, India would have progressed a lot.

ఇలాంటి sentences లోని సందర్భాలను imaginary past (ఊహించుకునే - నిజంకాని గతం) అంటాం. ఇది ఊహించుకోవటమే కదా - అలా జరిగి ఉండదు, ఇలా జరిగి ఉండేది కాదు, అలా ఉండి ఉండేది, ఇలా ఉండేది కాదు... ఇలా అనుకోవటం.

### గుర్తుంచుకుందాం

**I a)** Would have been - ఉండేదే కానీ ఉండలేదు.
**b)** Would not have been - ఉండేదికాదు కాని ఉంది.
**II) a)** would have + pp - ఒక పని జరిగి ఉండేదే కాని జరగలేదు.
(He would have gone= వెళ్లుండేవాడే, వెళ్లలేదు).
**b)** wouldn't have + pp= ఒక పని జరిగేదికాదు కానీ జరిగింది.
He wouldn't have gone= అతడు వెళ్లేవాడు కాదు, కానీ వెళ్లాడు.

ఇవీ imaginary past forms. నిత్య జీవితంలో ఇవి వాడే సందర్భాలు చాలా ఎక్కువ కదా. అందుకని బాగా practice చేద్దాం.

### ఈ Vocabulary practice చేయండి

**affect:** అఫెక్ట్ - ఫె నొక్కి పలుకుతాం. అర్థం- ప్రభావం కలిగించటం, ప్రభావం కలిగి ఉండటం.

a) Rain or the lack of it affects crops=
వర్షం, అదిలేకపోవటం పంటల మీద ప్రభావం కలిగి ఉంటుంది.

b) Climate affects our health
వాతావరణం మన ఆరోగ్యం మీద ప్రభావం చూపిస్తుంది.

c) Our parent's opinion affects our decisions=
మన తల్లిదండ్రుల అభిప్రాయాలు మన నిర్ణయాల మీద ప్రభావం చూపుతాయి.

d) మనం మాట్లాడేతీరు మనమీద ఇతరులకున్న అభిప్రాయాలను ప్రభావితం చేస్తుంది=
The way we talk affects other's opinion of us.

Affect అంటే ప్రభావితం చేయగలగటం - అంటే simple గా మార్పు తేవటం, మార్చగలగటం అని.
మన ఆహారపుటలవాట్లు మన ఆరోగ్యాన్ని మార్చగలవు.
Our food habits can affect our health.

### EXERCISE

**Damodar:** Hi Sudhakar, ఇంతసేపూ ఎక్కడున్నావు?

**Sudhakar:** College నుంచి వస్తున్నా. అరగంట కిందట వచ్చేవాడినే. కానీ మన Maths lecturer కనిపించేసరికి ఆయనతో మాట్లాడుతూ ఉండిపోయా.

**Damodar:** ఆయన తమ్ముడు, మన ఫ్రెండ్ ఎక్కడున్నాడిప్పుడు?

**Sudhakar:** ఇక్కడే ఉన్నాడు. US కు వెళ్లిపోయేవాడే. కానీ Visa రాలేదు. Visa ఎందుకు రాలేదని అడిగుండేవాడిని కానీ ఇంతలోనే ఆయన topic మార్చాడు.

**Damodar:** ఆయన చాలా మంచి lecturer. ఆయన లేకుంటే Maths paper అంత బాగా answer చేసేవాడినికాదు.

**Sudhakar:** ఆయన సహాయం లేకుంటే ఆయన తమ్ముడు కూడా అంతమంచి మార్కులు తెచ్చుకునేవాడు కాదు.

**Damodar:** నువ్వు కాస్త ముందొస్తావనుకున్నా. మనం సినిమాకెళ్లుండేవాళ్లం.

**Sudhakar:** ఇప్పుడు time అయిపోయింది కదా. II show కు వెళదాం.

### ANSWER

**Damodar:** Hi Sudhakar, where have you been all along?

**Sudhakar:** I'm returning from college. I would have come half an hour ago, but I met our Maths lecturer. I was talking to him.

**Damodar:** Where is his brother, our friend?

**Sudhakar:** He is here. He would have left for/ gone to the US. But he hasn't got his visa. I would have asked him why he hasn't got the visa, but he changed the topic.

**Damodar:** He is a great lecturer. But for him I wouldn't have answered the Maths paper so well.

**Sudhakar:** But for his help his brother wouldn't have got such high marks either.

**Damodar:** I thought you would come a little earlier. We would have gone to a movie.

**Sudhakar:** It is too late now, isn't it? Let's go the 2nd show.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






# If you had told me earlier..

**Karuna:** Sumana, where were you yesterday? I couldn't see you anywhere.
(సుమనా, నిన్న ఎక్కడ ఉన్నావు? ఎక్కడా కనిపించలేదు)

**Sumana:** I was at Valli's. You would have met me if you had come there.
(నేను వల్లి వాళ్ళింట్లో ఉన్నా. నువ్వక్కడికి వచ్చుంటే నన్ను కలుసుకునేదానివి)

**Karuna:** I would have taken you to a movie if we had met.
(మనం కలుసుకునుంటే నిన్ను సినిమాకు తీసుకెళ్ళేదాన్ని)

**Sumana:** So I have missed a movie. If you had told me earlier I would have waited for you at home.
(అంటే movie chance పోగొట్టుకున్నానన్న మాట. నువ్వు ముందే చెప్పి ఉంటే నీ కోసం ఇంట్లో ఎదురుచూసేదాన్ని.)

**Karuna:** If I had thought of it earlier, I would have called you. I got the idea about 5 in the evening. I had nothing else to do. So I felt like seeing a movie. If I had got you over the phone, we would have seen the movie.
(ముందే అనుకుని ఉంటే నీకు Phone చేసేదాన్నే. నాకు సినిమా idea ఐదింటికి వచ్చింది. పనేంలేదు. సినిమా చూడాలనిపించింది. నువ్వు Phone లో దొరికుంటే సినిమా కెళ్ళేవాళ్ళమే.

**Sumana:** Which movie did you think of?
(ఏ movie కి వెళ్లాలనుకున్నావింతకూ? )

**Karuna:** Neetone Unta
(నీతోనే ఉంటా)

**Sumana:** Don't worry. We didn't miss much.
(ఫర్వాలేదులే. మనం పెద్ద miss అయిందేం లేదు) Suguna has seen it and says it is awful.
(సుగుణ చూసింది. అది దారుణంగా ఉందని చెప్పింది.)

awful = దారుణం/ భయంకరం

**Karuna:** That's OK, Then.

కిందటి lesson లో మనం 1) Would have been, 2) Would have + Past Participle (Would have gone, Would have seen, etc) అనే verbs గురించి తెలుసుకున్నాం కదా?

**1) a)** Would have been = ఇది 'be' form ఉండేదే/ ఉండేవాడే (కాని లేదు/ లేడు)

**i)** He would have been here = వాడిక్కడ ఉండేవాడే (కానీ ఉండలేదు)
(గతంలో ఉండేవాడే కాని అప్పుడు లేడు)

**ii)** She would have been here yesterday = ఆమె నిన్న ఇక్కడ ఉండేదే (కానీ లేదు)

**iii)** He would not have been the Prime Minister (అతను PM గా ఉండేవాడు కాదు - కానీ ఉన్నాడు)

**b)** Would have + Past Participle (PP) - దీని అర్థం - గతంలో ఓ పని జరిగేదే కాని జరగలేదని; దీంతో not వస్తే - ఒక పని జరిగేది కాదు, కానీ జరిగింది అని.

**i)** I would have met him = నేనతన్ని కలుసుకునేవాడినే; కానీ కలుసుకోలేదు.

**ii)** He wouldn't (would not) have passed Pass అయ్యేవాడు కాదు, కానీ అయ్యాడు.

పై ఉపయోగాలు- would have been, would have + PP, verbs కు last lessons లో తెలుసుకున్నాం కదా.

ఈ lesson ప్రారంభంలోని conversation లో ఈ sentences గమనించండి:

**1)** You would have met me, if you had come there.
**2)** I would have taken you to a movie, if we had met
**3)** If you had told me earlier, I would have waited for you.
**4)** If I had thought of it earlier, I would have called you.
**5)** If I had got you over the phone, we would have seen the movie.

జాగ్రత్తగా గమనించండి: పై sentences అన్నింటిలో, 1) Would have + PP Verb ఉండే main clause, 2) if clause ఉన్నాయి. would have + PP సంగతి మనకు తెలుసు. In all the sentences above, observe the form of the verb in the 'if' clause:

**Sentence 1:** ... if you had come.
verb - had come (had + PP)


M. SURESAN

**2.** ... if we had met. verb - had met (had + PP)
**3.** If you had told me. verb - had told (had + PP)
**4.** If I had thought of it. verb - had thought (had + PP)
**5.** If I had got you over phone. verb - had got (had + PP)

పై 'If clauses' అన్నింటిలో, verb form చూశారు కదా: had + PP కాబట్టి ఇక్కడ would have been/ would have + PP main clause గా ఉంటే, if clause లో had + PP verb వస్తోంది కదా. ఇది ఎప్పుడూ గుర్తుంచుకోవాల్సిన విషయం: అప్పుడు అర్థం ఇలా ఉంటుంది.

If clause లో చెప్పింది జరిగి ఉన్నట్లయితే, Main clause లో విషయం జరిగి ఉండేది అని. (Main clause, if clause ఏ order లో అయినా రావచ్చు ఒకటి ముందూ, ఒకటి తర్వాత)

| If clause (had been/ had + pp) | If clause (had been/ had + pp) |
|---|---|
| **1.** If you had come there [నువ్వక్కడికి వచ్చుంటే (నువ్వు రాలేదు)] | you would have met me. [నన్ను కలుసుకునేదానివి (కలుసుకోలేదు)]. |
| **2.** If we had met = [మనం కలుసుకుని ఉంటే (కానీ కలుసుకోలేదు)] | I would have taken you to a movie. [నిన్ను moive కి తీసుకెళ్ళేదాన్ని (కానీ తీసుకెళ్లలేదు)] |
| **3.** If you had told me earlier [ నువ్వు ముందే చెప్పి ఉంటే (కానీ చెప్పలేదు)] | I would have waited [నేను ఎదురుచూసేదాన్ని (కానీ అలా చేయలేదు)] |
| **4.** If I had thought of it earlier [ముందే అనుకుని ఉంటే (కానీ అనుకోలేదు)]. | I would have called you. [phone చేసేదాన్ని (కాని చేయలేదు)] |
| **5.** If I had got you over phone [phone లో నువ్వు దొరికుంటే (కానీ దొరకలేదు)]. | We would have seen the movie. [మనం సినిమా చూసేవాళ్ళమే (కాని చూడలేదు)]. |

వీటిని చూడండి: If clause లో విషయం జరిగి ఉంటే Main clause లో విషయం జరిగి ఉండేది. అంటే If clause విషయం జరగలేదు. అందుకని main clause విషయం కూడా జరగలేదు, అని.

**Important:** If clause లో verb- had been/ had + pp, Main clause లో verb- would have been/ would have + pp ఈ combination మారకూడదు - అప్పుడే sentence right అవుతుంది.

**Some more examples:**

**1)** నేనక్కడ ఉండుంటే, అది జరగనిచ్చేవాడినికాదు.
If I had been there, I would not allowed it.
(నేనక్కడలేను, అది జరిగింది)
(If clause verb - had been; main clause verb - would have + pp).

**2)** If he had participated, he would have got the prize
వాడు పాల్గొని ఉంటే, వాడికి prize వచ్చేదే.
(అంటే పాల్గొనలేదు, prize రాలేదు).

(If clause verb - had + pp; main clause verb - would have + pp)

**3)** వాడక్కడికి వెళ్లకుండా ఉంటే, వాళ్ల friend ను కలుసుకునేవాడుకాదు.
If he had not gone there, he would not have met his friend
(అక్కడికి వెళ్లాడు, friend ను కలుసుకున్నాడు.)
(If clause verb - had + pp; main clause verb - would have + pp).

ఇలాంటి సందర్భాలన్నింటిలో కూడా, If clause verb: had been/ had + pp, main clause verb: would have been/ would have + pp. ఇది చాలా ముఖ్యం. ఇలాంటి సందర్భాల్లో ఈ combination of verbs మారదు.

## PRACTISE THE FOLLOWING

**Yamuna:** ఈ chain ఎప్పుడు కొన్నావు?
**Kanchana:** కొని చాలా రోజులయింది.
**Yamuna:** అయితే ఇంతకుముందెప్పుడూ చూడలేదు నేను.
**Kanchana:** ఇంతకుముందెప్పుడయినా నేను వేసుకొనుంటే నువ్వు చూసేదానివి. ఇదే మొదటిసారి వేసుకోవటం.
**Yamuna:** నెల కింద నగల show room లో ఇలాంటి chain నే చూశా. డబ్బుంటే కొనేసేదాన్నే. వెంటనే వేసుకొనేదాన్ని.
**Kanchana:** నేను కొన్నప్పుడే వేసుకొనేదాన్ని, నా birthday కోసం ఆగకపోయుంటే.
**Yamuna:** అయితే ఇవాళ నీ birthday అన్నమాట. Many happy returns of the day. ఈ సంగతి ముందే తెలిసుంటే ఏదో కానుక తెచ్చేదాన్నిగదే.
**Kanchana:** అందుకనే చెప్పలేదు. నాకు కానుకలు తీసుకోవటం ఇష్టంలేదే.
**Yamuna:** అయితే party అయినా ఇస్తావా?
**Kanchana:** కచ్చితంగా. అందుకే పిలవటానికొచ్చా

## ANSWER

**Yamuna:** When did you buy this chain?
**Kanchana:** Long since I bought it.
**Yamuna:** I haven't seen it before.
**Kanchana:** If I had worn it earlier, you would have seen it. I am wearing it for the first time now.
**Yamuna:** I saw a chain like this a month ago in a jewellry show room. If I had had / If I had got the money, I would have bought it. I would have worn it immediately.
**Kanchana:** If I had not waited till my birthday, I would have worn it too when I bought it/ soon after I bought it.
**Yamuna:** Oh, today is your birthday. Many happy returns of the day. If I had known it, I would have brought you a present.
**Kanchana:** That's why I didn't tell you. I don't like gifts.
**Yamuna:** Would you give/ throw at least a party?
**Kanchana:** Sure. I came to invite you.

**ప్రశ్న:** ఒక sentence లో వచ్చే పదాలు (words) ఏ parts of speech కు చెందాయో గుర్తించడమెలా? (sentence meaning తో సంబంధం లేకుండా)



ఉదా: Beauty (root word)
Parts of Speech
beautiful (adj), beauteous (adj), beautifully (adv), beautify (vt), beautification (abs.n) beautician (n).
ఏ పదానికైనా చివర ly వస్తే అది adverb అవుతుందా? part of speech మాత్రమే కాకుండా మిగతావాటిని గుర్తుపట్టాలంటే ఏవైనా పద్ధతులున్నాయా?

– పి.కృష్ణారెడ్డి, వెన్నే కొత్తపల్లి (అనంతపురం జిల్లా)

**జవాబు:** చాలా పదాల parts of speech అర్థాన్ని బట్టి తెలుసుకోవచ్చు అలా తెలుస్తుంది కూడా. అయితే మీరన్నట్లు word endings ను బట్టి, suffixes ను బట్టికూడా parts of speech తెలుస్తుంది.

మీరిచ్చిన ఉదాహరణల్లోనే, ful తో అంతమయ్యే మాటలన్నీ కూడా adjectives; - ious, eous, చివర వచ్చేవి కూడా adjectives; '-ly' చివర వచ్చే పదాలు 90 శాతం adverbs, costly లాంటి మినహాయింపులతో. '-fy', '-ise' లాంటి suffices (చివర వచ్చే శబ్దాలు) అన్నీ verbs. '-sion', '-ssion', '-tion', '-ation', '-ment', '-ness', '-ty', '-th' చివర వచ్చే వన్నీ nouns. ఏ మంచి grammar పుస్తకంలోనైనా ఈ వివరాలుంటాయి. English fluent గా మాట్లాడగలగటానికి parts of speech అంత thorough గా తెలియనక్కరలేదు కదా? అవసరమైనపుడు ఈ lessons లో parts of speech గుర్తుపట్టే పద్ధతి వివరిస్తాం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# He would have done it

**Gagan:** Why was your little daughter crying so long this morning?
(మీ అమ్మాయి పొద్దున అంతసేపు ఏడుస్తోం దేంటి? )

**Jagan:** Her mother did not give her the sweet it wanted.
(అది అడిగిన sweet వాళ్లమ్మ ఇవ్వలేదు)

**Gagan:** She should have given it. Then you should not have let the child cry so long.
(అయితే ఇచ్చుండాల్సింది. అంతసేపు ఆ పాపను ఏడిపించాల్సింది కాదు.)

**Jagan:** If the doctor had not advised us against it, we would have given it.
(Doctor ఇవ్వొద్దని సలహా ఇవ్వకుండా ఉంటే, ఇచ్చేవాళ్లమే)

**Gagan:** Why, has she been ill?
(ఏంటి, పాపకు జబ్బుగా ఉందా? )

**Jagan:** Yea, she has been ill for a few days now. Only yesterday I took her to doctor.
(కొద్దిరోజులుగా ఒంట్లో బాగాలేదు. నిన్ననే doctor దగ్గరకు తీసుకెళ్లా.)

**Gagan:** You should have been more careful. You should have taken her to the doctor as soon as she fell ill. You should not have neglected it.
(జబ్బుపడ్డ వెంటనే మీరు doctor దగ్గరకు తీసుకెళ్లాల్సింది. ఉపేక్షించాల్సింది కాదు)

**Jagan:** True, but she has improved. Today she is much better than she was yesterday.
(నిజమే అనుకో. కాని పాప పరిస్థితి మెరుగయింది. నిన్నటికన్నా ఈరోజు బాగుంది)

**Gagan:** If the doctor had seen her earlier, she would have recovered earlier.
(ముందే doctor చూసుంటే, ముందే కోలుకొనేది కదా)

**Jagan:** That's true. (నిజమే)

**Gagan:** Wish her a speedy recovery.
(త్వరగా కోలుకోవాలని కోరుకుంటున్నాను.)

Spoken English 137 లో, అంతకుముందూ, ఈ విషయాలు తెలుసుకున్నాం:

**a)** Would have been అంటే ఒక వ్యక్తి, ఒక విషయం గతంలో ఉండేవాడు/ ఉండేదే కానీ లేదు/ లేదు అని.
Wouldn't (would not) have been అంటే గతంలో ఒక వ్యక్తి/ ఒక విషయం ఉండేవాడు కాదు/ ఉండేది కాదు కాని ఉన్నాడు/ ఉంది అని.

**b)** Would have + past participle (PP) అంటే గతంలో ఒక విషయం జరిగేదే కాని జరగలేదు అని. wouldn't (would not) have + past participle (PP) అంటే ఒక విషయం జరిగేది కాదు, కాని జరిగింది అని.

**2)** ఈ would have been/ would have + PP అనే main clause కు combination, If clause లో had been/ had + Past Participle verbs రావటం.

**a)** If she had been here, I would have consulted her
ఆమె ఇక్కడ ఉండి ఉంటే, నేనామెను సంప్రదించేవాడినే. (ఆమె ఇక్కడ లేదు- నేనామెను సంప్రదించలేదు)

**b)** If he had answered one more question, he would have got 100%
ఇంకొక్క question answer చేసి ఉంటే, వాడికి 100% వచ్చేదే. (ఆ question వదిలేశాడు, వాడికి 100% రాలేదు)

**c)** If he had not been careful, he would have lost the money
జాగ్రత్తగా ఉండకపోయుంటే, డబ్బు పోగొట్టుకునేవాడే. (జాగ్రత్తగా ఉన్నాడు, డబ్బు పోలేదు)

**d)** If he had not met her at the party, he would not have fallen in love with her.
(ఆ party లో ఆమెను కలుసుకోకపోయుంటే, ఆమెను ప్రేమించేవాడుకాదు- కలుసుకున్నాడు- ప్రేమించాడు)

**Very important:**
**If clause:** had been / had + pp
**Main Clause:** would have been / would have + pp
ఈ combination చాలా ముఖ్యంగా గుర్తుంచుకోవాలి.

**Now, look at these sentences in the conversation at the beginning of the lesson:**

**1)** Then she should have given it.
**2)** You should have seen the doctor much earlier.




**3)** You should have taken her to the doctor as soon as she fell ill.
**4)** You should not have neglected it.
**5)** You should have been more careful.

ఈ sentences లో verbs చూద్దాం.

**1)** should have given [should have + past participle (of give)]
**2)** should have seen [should have + past participle (of see)]
**3)** should have taken [should have + past participle (of take)]
**4)** have neglected [should have + past participle (of neglect)]
**5)** should have been.

ఈసారి, verb forms పైన చూపినట్లు,
**a)** should have been **b)** should have + pp.
**a)** should have been అనేది 'be' form కదా.
దీని అర్థం:
**i)** ఉండవలసిన వ్యక్తి/ విషయం లేదు/ లేదు అని.
**ii)** not (should not have been) అయితే, ఉండకూడని వ్యక్తి/ విషయం ఉందని.
**i)** అరగంట కిందటే నువ్విక్కడ ఉండాల్సింది (కానీ లేవు)
you should have been here half an hour ago.
**ii)** వాళ్లు నిన్న అక్కడ ఉండాల్సిన వాళ్లుకారు (కానీ ఉన్నారు)
They should not have been there yesterday.
**iii)** I should have been there at that time, I would have taught him a lesson
ఆ time కు నేనక్కడ ఉండాల్సింది; వాడికి బుద్ధి చెప్పేవాడిని.

ఇప్పుడు sentence (a), sentence (b) పోల్చండి:
**a)** She should have been more careful
ఆమె ఇంకా ఎక్కువ జాగ్రత్తగా ఉండాల్సింది (కానీలేదు).
**b)** She would have been more careful
ఆమె ఇంకా ఎక్కువ జాగ్రత్తగా ఉండేదే (కానీలేదు).

**Should have been, would have been తేడా గమనించండి.**

**1)** should have been = ఉండాల్సింది (కానీ లేదు)
**2)** would have been = ఉండేదే (కానీలేదు)
**3)** should not have been = ఉండాల్సింది కాదు (కాని ఉంది).
**4)** would not have been = ఉండేదికాదు (కాని ఉంది)

ఈ conversation లో మిగతా verbs should have + pp, should not have + pp form లో ఉన్నాయి కదా.
**1)** She should have given it
ఆమె ఇచ్చి ఉండాల్సింది/ ఇవ్వాల్సింది (గతంలో) (కానీ ఇవ్వలేదు)
**2)** You should have seen the doctor much earlier
Doctor ను ముందే చూడాల్సింది. (చూడలేదు)

M. SURESAN

**3)** You should have taken her to doctor
doctor దగ్గరకు తీసుకెళ్ళాల్సింది (తీసుకెళ్లలేదు).
**4)** You should not have neglected it
ఉపేక్షించాల్సింది కాదు (ఉపేక్షించావు).

ఇది కూడా చూడండి:

**1) Karuna:** నువ్వీ నిర్ణయం తీసుకునేముందు, మీ నాన్నతో మాట్లాడాల్సింది.
(Before taking the decision, you should have consulted your father)

**Kavya:** మా నాన్న ఊళ్లో ఉంటే మాట్లాడేదాన్నే.
(I would have consulted him, if he had been in town).

**Karuna:** ఆయన తిరిగొచ్చిందాకా ఆగుండాల్సింది.
(You should have waited until he returned.)

**Kavya:** నేను wait చేసేదాన్నే, కాని అప్పటికే మరీ late అయిపోయేది.
(I would have waited, but it would have been too late by then.)

**2)** అతడు ఆ car కొనుండాల్సింది కాదు
He should not have bought the car.
**a)** చేయవలసిన ఓ పని చేయకపోతే=
You should have done it.
**b)** చేయకూడని పనిచేస్తే=
you should not have done it.

**Would have been, would have + pp కీ, should have been, should have + pp కీ తేడా చూద్దాం.**

**1)** He would have done it =
అతడు చేసేవాడే (చేయలేదు)
He should have done it = అతడు చేయాల్సింది (విధిగా/ అవసరమై, ఇతరుల ఆజ్ఞ పాటించే సందర్భాల్లో) (చేయలేదు).
**2)** She would have bought the sari =
చీరకొనేదే, కొనలేదు.
She should have bought the sari =
చీరకొనుండాల్సింది, కొనలేదు. (మంచి అవకాశం పోయింది.)

ఇవీ should have been, should have + pp వివరాలు.

## PRACTISE THE FOLLOWING

**Hiranya:** Hi Rajitha, నువ్వు నిన్న మాతో సినిమాకు వచ్చుండాల్సింది. నిజంగా మంచి సినిమా miss అయ్యావు.

**Rajitha:** వచ్చేదాన్నే, మా cousin రాకపోయుంటే. ఆమెతో మాట్లాడుతూ కూర్చున్నా.

**Hiranya:** ఆమెను కూడా తీసుకురావాల్సింది.

**Rajitha:** అది వెళ్లాలి, వెళ్లాలి అని తొందరపడకపోయుంటే, ఇద్దరం కలిసి వచ్చేవాళ్లమే.

**Hiranya:** నువ్వొంటే ఇంకా బాగా enjoy చేసే వాళ్లమే. అయితే నిన్న holiday కాకుంటే వెళ్లేవాళ్లం కాదు. మీ cousin వెళ్ళిపోయిందా?

**Rajitha:** నిన్ననే వెళ్లిపోయింది. తనింకో రెండు రోజులుండాల్సింది. మిమ్మల్ని అంతా పరిచయం చేసేదాన్ని. సరే. నేను వస్తా. Time అయింది.

**Hiranya:** Bye.

## ANSWERS

**Hiranya:** Hi Rajitha, you should have come with us to the movie. Really you missed a good movie.

**Rajitha:** If my cousin had not visited me (come), I would have definitely (కచ్చితంగా) come. I spent time talking to her.

**Hiranya:** You should have brought her along.

**Rajitha:** If she had not been in a hurry, I would have brought her along.

**Hiranya:** If you had come we would have enjoyed still more. But if yesterday had not been a holiday we would not have gone to the movie. Has your cousin gone/ left ?

**Rajitha:** She left yesterday itself. She should have been here/ should have stayed here for another two days. I would have introduced her to you all. OK. Time is up. I must be going, bye.

**Hiranya:** Bye.

Spoken English 137 లో రెండో Column లోని Table లో - మొదటి column (అంటే ఎడమవైపు column) heading మాత్రమే If clause (had been/ had + PP). రెండో column (కుడి column) heading– Main clause (would have been/ would have + PP) అని ఉండాలి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# I would have been happy

**Surendra:** We missed you at the picnic last weekend.
(పోయిన వారాంతం picnic లో నువ్వు లేని లోటు కనిపించింది మాకు)

**Mahendra:** So did I miss the fun too. I now feel I should have joined you. I shouldn't (should not) have stayed back for the meeting. What a bore it was! But for the dinner at the end of the meeting, it would have been unbearable.
(నేను కూడా ఆ సరదా పోగొట్టుకున్నాను. మీతో వచ్చుండాల్సిందని ఇప్పుడనుకుం టున్నా. Meeting కోసం ఇక్కడ ఉండి పోవాల్సిందికాదు. అబ్బో ఎంత bore కొట్టిందో! Meeting తర్వాత dinner లేక పోయుంటే, దాన్ని భరించతరమయ్యేది కాదు.)

fun (ఇక్కడ) = సరదా; But for అంటే- అదే లేక పోతే. unbearable = భరింపశక్యం కాని.

**Surendra:** I thought of pressing you. But I thought that it was an important meeting. So I didn't force you.
(నిన్ను బలవంతపెడదామనుకున్నాను, కానీ అదేదో ముఖ్యమైన meeting అనుకు న్నాను. అందుకని బలవంతం చేయలేదు.)

press = ఒత్తిడి తేవటం, బలవంతపెట్టడం = force

**Mahendra:** But you should have told me earlier. The time you gave me was short. If you told me earlier of it, I would have thought of an excuse to skip the meeting. I would have been happy.
(నువ్వు (picnic గురించి) కాస్త ముందు చెప్పాల్సింది. నువ్వు నాకు మరీ తక్కువ time ఇచ్చావు. కాస్త ముందుగా చెప్పి ఉంటే, meeting ఎగ్గొట్టడానికి ఏదో సాకు ఆలోచించేవాడిని. నేను సంతోషంగా ఉండే వాడిని)

Excuse = సాకు. Lame excuse = కుంటిసాకు. Lame = కుంటి

**Surendra:** You were out of town for me to tell you earlier. So I couldn't.

**Mahendra:** OK. That's past. How about a movie this evening?
(OK, అది అయిపోయింది గదా. ఇవ్వాళ సాయంత్రం సినిమాకెళ్దామా?)

**Surendra:** I am game for it.
(నేను ready నే.)

game for = సిద్ధం

∂ ∂ ∂

**Look at the following clauses in the conversation above:**

1. ... I should have joined you
2. I shouldn't have stayed back
3. ... it would have been unbearable
4. But you should have told me earlier.
5. I would have thought of an excuse
6. I would have been happy.

**Look at the verbs in the clauses above:**

1. Should have joined
2. Shouldn't have stayed back
3. Would have been (unbearable)
4. Should have told
5. Would have thought
6. Would have been.

ఈ Verbs అన్నీ కూడా Imaginary past situations లో వాడేవని మనకు తెలుసు. గత 4, 5 lessons వీటి గురించే కదా. ఇవి conversation లో సర్వ సాధారణమైనప్పటికి మాట్లాడేటప్పుడు correct గా వాడగలగటం కొంచెం కష్టమే. ఎంత ఎక్కువ Practice చేస్తే అంత బాగా అలవాటై, correct గా వాడగలం. అందుకని ఈ lesson కూడా Imaginary past forms ను గురించే..

**ఇంతవరకు మనం తెలుసుకున్న Imaginary past forms:**

**I a)** Would have been
(ఉండేవాడే/ ఉండేదే కాని లేదు/ లేదు)

**b)** Would have + Past participle (PP)
eg: Would have gone, Would have seen, etc)
(ఓ పని జరిగేదే కానీ జరగలేదు అని. Not తో అయితే జరిగేది కాదు, కాని జరిగింది అని)

**II a)** Should have been= ఉండాల్సింది/ ఉండాల్సిన వాడు- కానీ లేదు/ లేదు)

**b)** Should have + Past Participle (PP)
(eg: should have gone, should have seen, etc.)
(ఓ పని) చేసుండాల్సింది కానీ చేయలేదు.
Not తో- (ఓ పని) చేయకపోయుండాల్సింది, కానీ చేశావు/ చేశాను/ చేశారు)




**All clauses beginning with**

**a)** who, whom, whose, where, when, which, why and how.
**b)** 'that' clauses.
**c)** before.., after.., soon after, as soon as, since, because, though, although, even though లాంటి వాటితో begin అయ్యే clauses.
**d)** If clauses.

**Rules:**

**1)** Main clause verb - past tense, subordinate clause verb - also past tense.


M. SURESAN

## EXERCISE

**Govind:** Sir, నాకు మరో రెండ్రోజులు time ఇవ్వండి, assignment submit చేసేందుకు.
**Lecturer:** రెండ్రోజులా? నువ్వు మొన్ననే submit చేయా ల్సింది. ఈ సాయంత్రంలోగా submit చేయి.
**Govind:** మొన్న నాకు జ్వరం రాకపోతే నిన్ననే చేసే వాడిని, Sir,
**Lecturer:** నువ్వు నిన్న submit చేసుంటే, marks list ఈపాటికి నేను office లో ఇచ్చేసేవాడిని. అసలు marks lists అన్నీ మొన్ననే submit చేయాల్సింది నేను. నీ ఒక్కడి వల్ల అంతా ఆలస్యమయింది.
**Govind:** నాకు ఒక్కరోజు time ఇవ్వండి sir.
**Lecturer:** రేపే time కు submit చేయి.

**Let's look at the verbs of imaginary past situations above.**

1. should have joined -
కలవాల్సింది (నువ్వు). కాని కలవలేదు.
2. I shouldn't have stayed back -
ఇక్కడ ఉండిపోవాల్సిందికాదు - కానీ ఉన్నాను
3. Would have been unbearable -
భరింపశక్యం కాకుండా ఉండేది - కాని శక్యమయింది (Dinner వల్ల)
4. You should have told me -
చెప్పాల్సింది - చెప్పలేదు
5. would have thought -
ఆలోచించేవాడినే కానీ ఆలోచించలేదు.
6. would have been happy -
సంతోషంగా ఉండే వాడినే కానీ లేను.

**Reminding you - (మీకు గుర్తుచేస్తున్నాం):**

**Main clause verbs-** would have been, would have + pp అయితే subordinate clause verbs- had been, had + pp.

If you had told me earlier of it, I would have thought of some excuse to skip the meeting.

**Main clause:** I would have thought of some excuse to skip the meeting (meeting ఎగ్గొట్టడానికి సాకు ఆలోచించే వాడిని. verb: would have thought - would have + pp)

**Sub. clause:** If you had told me of it earlier. (నువ్వు దాని గురించి ముందే చెప్పుంటే - verb- had told - had + pp)

This lesson is a revision of the points of the earlier lessons: బాగా చూసుకుని practice చేయండి. గత 5, 6 lessons లో ఇచ్చిన విషయాలు కాస్త కష్టం కాబట్టి కింది విషయాలు మీకు మళ్లీ గుర్తు చేస్తున్నాం.

### IMPORTANT POINTS TO REMEMBER

µ Clause - A group of words with a verb
µ Main clause has complete meaning.
µ Subordinate clause has no complete meaning.

**Examples of subordinate clauses.**

**Exceptions:** (మినహాయింపులు - పై rule కు)

subordinate clause లో universal truths, facts of science, generalisations, repeated actions of the present continuing into future- వీటి విషయంలో main clause verb past tense అయినప్పటికి sub clause verb, present tense లో ఉండాలి.

**2)** Main clause verb, present/ future tense, sub clause verb - any tense.

పై points అన్నీ ఎప్పుడు గుర్తుంచుకుంటే మీ conversation and communication, perfect గా ఉంటుంది. Practise, practise and practise.

## ANSWER

**Govind:** Sir, please give me two days time to submit the assignment.
**Lecturer:** Two more days? You should have submitted it the day before (yesterday). Submit it by the evening.
**Govind:** If I had not had a fever/ had not been down with a fever, I would have submitted it yesterday itself.
**Lecturer:** If you had submitted it yesterday, I would have given the marks lists to the office yesterday. I should have submitted them the day before (yesterday). The whole delay is because of you.
**Govind:** Give me just a day's time, sir.
**Lecturer:** Submit tomorrow by this time.

**ప్రశ్న:** *Past tense లో sentence రాస్తే, అదీకూడా regular verbs ఉపయోగిస్తే మనకు ఏది 2nd form అయిన simple past అవుతుంది, అలాగే 3rd form అయిన past participle అని తెలుస్తుంది? అలాగే regular verbs ఉపయోగిం చేటప్పుడు ముఖ్యంగా simple past tense లో అయితే, మనకున్న 3 forms of verb లలో past form, P.P. form confusion గా ఉన్నాయి. చాలా పుస్తకాల్లో P.P form అయితే Past modification, pre-modification లో passive voice గా ఏర్పడతాయి అని రాశారు. ఇవి కొంచెం వివరంగా తెలపండి.*

**– జి.వి.సత్యం, విశాఖపట్నం**

**జవాబు:** Regular verbs past tense, past participle, ఒకేలా ఉంటాయి. అయితే ఎప్పుడది past tense, ఎప్పుడు past participle అని తెలియటానికి, ఆ verb form కు, ఎవరిని, దేనిని అని question వేస్కోండి. Answer వస్తే అది past simple. Answer లేకపోతే అది past participle. eg: 'like' తీసుకుందాం. దీనికి past tense, past participle - liked. She liked the sari. ఇక్కడ liked what? (దేనిని like చేసింది?) అంటే answer sari అని వస్తుంది కాబట్టి ఇక్కడ liked, past simple.

The teacher liked all over the college, ఇక్కడ liked what (దేనిని like చేసింది?)/ liked whom? (ఎవరిని like చేసింది?) అంటే answer రావటం లేదు కదా? అందుకని ఇక్కడ liked past participle.

'The teacher liked all over the college' అంటే అర్థం, college మొత్తంచే అభిమానించబడుతున్న teacher... అని అర్థం. కానీ పూర్తి అర్థం రావటం లేదు కాబట్టి ఇది sentence కాదు.

ఇంకో example: a) He repaired the car.
b) The car repaired yesterday..

a) లో repaired- దేన్ని repair చేశాడు? Car ను.
b) The car repaired... - car దేన్ని repair చేసింది? అంటే answer రాదు కదా. కాబట్టి 'The car repaired yesterday...' అంటే అర్థం, నిన్న repair చేయబ డిన car, ...అనే అర్థంతో అసంపూర్తిగా ఉండటం వల్ల sentence అవదు. గుర్తుం చుకోండి. Past participle కు ఎప్పుడూ 'బడే' అని అర్థం వస్తుంది.

The paper bought by millions = లక్షలాది ప్రజలచేత కొనబడే పత్రిక - (తెలుగులో లక్షల ప్రజలు కొనే పత్రిక అంటాం.)

The book read by millions = లక్షలాది ప్రజలచే చద వబడే పుస్తకం (లక్షల మంది చదివే పుస్తకం)

ఏదైనా 'be' form పక్కన past participle వస్తే అపుడు verb, passive.

The book is liked by all- verb, is (be form) + liked (pp) - పుస్తకం అభిమానించబడుతుంది. (బడుతూంది). ఎప్పుడూ 'be' form పక్కన past simple రాదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 140

# He would have deposited...

**Rama Rao:** Why do you keep so much money at home, son? It isn't safe.
(అంత డబ్బు ఎందుకింట్లో ఉంచటం? అదంత క్షేమం కాదు కదా?)

**Kumar:** I know it isn't safe, dad, but I haven't found the time to put it in the bank. Moreover such a lot of money in my account in the bank... That's worrying me.
(నాకు తెలుసు నాన్న అది క్షేమం కాదని. కాని డబ్బు bank లో వేయటానికి టైమ్ దొరకటం లేదు. అంతేకాకుండా నా ఒక్కడి ఖాతాలో... అదీ నా worry).

**Rama Rao:** I have the time, so let me deposit it then. I'll (I will) open an account, and let's have an account opened in mother's name too. Then you can put the money in three different accounts. That'll solve your problem.
(నాకు time ఉంది కదా, నేను జమ చేస్తాను bank లో- నా పేరుతో ఒక account open చేస్తాను, అమ్మ పేర కూడా ఒక account ప్రారంభిద్దాం. అప్పుడా డబ్బు మూడు accounts లో కొంత కొంతవేయొచ్చు. నీ సమస్య తీరిపోతుంది.)

**Kumar:** That's an idea. You apply for the ATM cards too. You need not go to the bank every time you want to withdraw money.
(బాగానే ఉంది ఈ idea. మీరు ATM Cards కు కూడా apply చేయండి. అప్పుడు డబ్బు తీసుకోవాలనుకున్నప్పుడల్లా bank కు వెళ్ళక్కరలేదు.

**Rama Rao:** But we have to use cheques till we get the cards.
(Cards వచ్చేంతవరకు cheques వాడదాం.)

**Kumar:** Credit some of the money into my account. Open SB accounts in your name and mother's name. I'll sign as the introducer. Let's go.
(కొంత డబ్బు నా ఖాతాలో జమచెయ్యి. నీ పేర, అమ్మ పేర SB Accounts ప్రారంభిద్దాం. నేను పరిచయం చేసేందుకు సంతకం పెడతా. వెళ్దాం పద.)

**Rama Rao:** What about the Rs. 45000/- brother Ramu wants for the bike? We'll take a D.D. and send it to him.
(Bike కొనుక్కోవటానికి తమ్ముడు రాము అడుగుతున్న రూ. 45000/- మాటేమిటి. ఆ మొత్తానికి D.D. తీసి పంపిద్దాం.)

**Kumar:** D.D. means delay. We have to send it by post and even then he can't have it immediately. Our bank has online transfer facility. Let us send it that way.
(DD అంటే ఆలస్యమే. మనం post లో పంపాలి. అప్పటికీ వెంటనే వాడు తీసుకోలేడు. మన bank లో online transfer సౌకర్యం ఉంది. మనం online లో పంపిద్దాం. facility = సౌకర్యం)

**Rama Rao:** Let's put a part of the money in term deposit. That gets us a higher interest.
(కొంత డబ్బు term depositలో వేద్దాం. ఎక్కువ వడ్డీ వస్తుంది.)

**Kumar:** How about investing in shares?
(Shares లో పెడదామా?
invest = పెట్టుబడి పెట్టటం)

**Rama Rao:** I am not for it. It is risky.
(నాకిష్టం లేదు. Risk ఉంది దాన్లో.)

**Kumar:** O.K. Dad, as you say.
(సరే.. నీ ఇష్టం)

You see the whole conversation above is about money and banks. Most words used are banking words.

పై సంభాషణలోని మాటలు చాలామటుకు bank కు సంబంధించినవి కదా. వాటిని గురించి వివరంగా తెలుసుకుందాం.

1) Bank లో ఖాతా తెరవటం/ప్రారంభించటం = Open an account. Accountను A/c అని రాస్తుంటారు కూడా.

2) Bank లో డబ్బు వేయటం/జమచేయటం/నిల్వచేయటం = put money in/credit money into/deposit money in, the bank.

3) Bank లో మన నిల్వ = deposit
He is quite rich. He has a lot of bank deposits.
అతడు ధనికుడు. బాగా Bank నిల్వలున్నాయి.


M. SURESAN

4) వేయటం, తీయటం తర్వాత, Account లో ఉన్న నిల్వ = balance.

5) Bank లో డబ్బు తీసుకోవటం = withdraw
He withdrew Rs. 10,000/- yesterday=
నిన్న రూ. 10,000 తీశాడు.

☛ You credit money into the bank and withdraw money from the bank.

☛ ఒక్కోసారి withdraw బదులు draw అనికుడా అంటాం.
I don't draw money on Fridays and Tuesdays.
(శుక్రవారం, మంగళవారం డబ్బులు తీయను.)

☛ SB Account = Savings bank A/c = వ్యాపార సంస్థల, ప్రభుత్వం నిమిత్తం లేకుండా వ్యక్తిగతంగా డబ్బు దాచుకునే ఖాతా.
Bank transactions = Bank లావాదేవీలు. (డబ్బు తీసుకోవటం/వేయటం లాంటివి)

☛ డబ్బు withdraw/draw చేయటానికి నింపేపత్రం = withdrawal form

☛ డబ్బు జమచేయడానికి వాడే పత్రం = credit challan.

☛ డబ్బు withdraw చేయటానికి cheque కూడా వాడతాం. మన A/c మీద మనకు cheque book ఉంటే, pay self అని రాసి మనం డబ్బు withdraw చేసుకోవచ్చు

☛ ఒకరు ఇంకొకరికి ఇవ్వాల్సిన డబ్బును cheque రాసి వాళ్లకిస్తే, వాళ్లు ఆ cheque ను వాళ్ల A/c కు credit చేసుకుంటారు. cheque ఆ bank మీద కాకపోతే cheque డబ్బు credit అవటానికి ఆలస్యం అవుతుంది. అందుకని వేరే bank మీది cheques ను వ్యక్తిగత లావాదేవీలకు గానీ, పరిచయంలేని వాళ్ల దగ్గర నుంచి తీసుకోరు. రొక్కం ఇవ్వమంటారు.

☛ **ATM= Automatic Teller Machine =** Bankకు మనం వెళ్లనవసరం లేకుండా, Bank business hours తో సంబంధం లేకుండా, Bank Card ద్వారా, డబ్బు పొందే సదుపాయం. ఈ Cards రెండు రకాలు.

1) **Debit Card:** మన Account లో ఉన్న balance మేరకు మనం తీసుకొనేందుకు వాడేది.

2) **Credit Card:** మన balance తో సంబంధం లేకుండా, కొంత పరిమితి మేరకు డబ్బు పొందటానికి Advance గా ఉపయోగపడేది. దీనికి కొంత శాతం నెలనెలా వడ్డీ, service charges పడవచ్చు

**DD= Demand Draft**= మనం ఇతరులకివ్వాల్సిన పైకం, bank లో కట్టి ఆ మొత్తానికి DD తీసుకుంటాం, ఆ DD ని మనం ఎవరికి డబ్బు కట్టాలో వాళ్లకు పంపితే, వాళ్లక్కడ ఆ bank శాఖలో డబ్బుగా తీసుకోవచ్చు DD ని వాళ్ల A/c లో credit చేసుకోవచ్చు

(Cheques, DDs, crossed, uncrossed అని రెండు విధాలు- Cheque/DD కి ఎడమవైపున పైన రెండు గీతలు గీసినా Account Payee అని రాసినా అది crossed cheque / crossed DD - Crossed అయితే నగదు చెల్లించరు- Cheque / DD పొందినవాళ్ల A/c లో జమ చేస్తారు. uncrossed అయితే నగదు చెల్లింపు ఉంటుంది.)

On line transfer = DD/Cheque వల్ల కలిగే ఆలస్యం, అసౌకర్యం లేకుండా, computer, electronics యుగంలో మనకున్న పెద్ద సౌకర్యం. దేశం మొత్తంలో ఎక్కడికైనా ఎవరికైనా, ఎంతమొత్తమైనా (కొన్ని ఆంక్షలతో) క్షణాల్లో అందేట్లు పంపగల సౌకర్యం. డబ్బు పొందేవాళ్ల A/c number లో మనం ఎక్కడ జమచేసినా, క్షణాల్లో అది వాళ్ల A/c లో వాళ్లుండేచోట ఆ bank branch లో జమ అవుతుంది. వాళ్లు వెంటనే withdraw చేసుకోవచ్చు అయితే ఈ సౌకర్యం అన్ని bank ల్లో, అన్ని శాఖల్లో లేదు.

**Term deposit/Fixed deposit:** ఎప్పుడు కావాలంటేఅప్పుడు కాకుండా, ఒక నిర్ణీత కాలం (fixed term) (మూడు నెల నుంచి ఎన్ని సంవత్సరాలైనా) bank లో డబ్బు ఉంచేయటం - withdraw చేయకుండా- దీనికి bank ఇచ్చే వడ్డీ, SB A/c మీద వడ్డీ కన్నా ఎక్కువ. కాలం పెరిగిన కొద్దీ వడ్డీ ఎక్కువవుతుంది.

**Current Account:** వ్యాపార సంస్థలకు ఉపయోగం రోజుకు ఎన్నిసార్లయిన తీసేందుకు వీలుగా ఉంటుంది. - వడ్డీ ఉండకపోవచ్చు

**Interest** = వడ్డీ

**Payee** = డబ్బు పొందేవాడు

**Debit** = మనం withdraw చేసే డబ్బు, మనం Cheque/DD ద్వారా ఇచ్చే డబ్బును, మన Account లో ఖర్చు రాయటం (తీసేయటం)

The Cheque amount has been debited = మీరిచ్చిన cheque మొత్తం మీ balance లో తీసేయటం జరిగింది.

మనకెవరైనా ఇచ్చిన cheque ను మనం credit చేస్తే గానీ, అది uncrossed cheque అయి, సొమ్ము తీసుకోవటానికి ఆ bank లో ఇవ్వటం presenting the cehque.

ఒకరి Account లో ఉన్న Balance కన్నా ఎక్కువ మొత్తానికి ఇంకొకరికి cheque రాసిస్తే, ఆ cheque ను bank వాళ్లు తగినంత balance లేదని, return చేస్తే అప్పుడు Cheque bounce అవుతుంది. Cheque bounce అయితే అది cheque రాసిచ్చిన వాళ్లనేరం. అలా రాసిచ్చిన వాళ్ల మీద case పెట్టొచ్చు శిక్ష ఎక్కువే.

Bounce అయిన cheque ను, dishonour అయింది అంటారు.

ఇవీ మనం సామాన్యంగా bank transactions లో వాడే మాటలు.

## Now practise the following:

**Siva:** హాయ్ వాసు ఏంటి సంగతి?

**Vasu:** నిన్న మా పక్కింట్లో దొంగతనం జరిగింది. వాళ్ళింట్లో లేనప్పుడు దొంగలు జొరబడి డబ్బు ఎత్తుకెళ్లారు.

**Siva:** ఎంతేమిటి?

**Vasu:** లక్ష

**Siva:** దాన్ని ఆయన బ్యాంక్ లో వేసి ఉండాల్సింది.

**Vasu:** పాపం వేసేవాడే. నిన్న sudden గా ఎక్కడికో వెళ్లాల్సి వచ్చి బ్యాంక్ కు వెళ్లలేదు.

**Siva:** బాగా ఉన్నవాడేనా?

**Vasu:** ఆ మొన్ననే ఎవరికో చెల్లించాల్సి వచ్చి ఓ లక్ష రూపాయల DD తీశాడు. లేకపోతే అది కూడా పోయేదే. ఎప్పుడూ bank లో డబ్బు వేయటమే కానీ తీయటం ఉండదు.

**Siva:** అయితే ఇప్పుడేం చేయబోతున్నాడు?

**Vasu:** మొన్ననే ఎవరికో cheque ఇచ్చాడు. అది అతడు bank లో వేసే లోపల ఈ డబ్బు కట్టేస్తే, cheque కు తగిన సొమ్ముంటుందనీ, తిరిగి పంపరని ఈ రోజు జమ చేయాలనుకున్నాడు. ఇప్పుడు balance లేదుకదా, అది తిరిగి పంపుతారు.

**Siva:** నువ్వు సాయం చేయలేవా? నీ bank నిల్వల్లోంచి తీసి ఆయనకివ్వు.

**Vasu:** నేనా! నేనేం కుబేరుడనుకుంటావా? నాకున్న కొద్ది డబ్బు అన్నీ term deposits లో ఉన్నాయి. నువ్వు ఇవ్వు. నేనుగ్యారంటీ ఉంటా.

**Siva:** నేనేదో సరదాకి అన్నానులే.

**Answer**

**Siva:** Hi Vasu, What's new?

**Vasu:** There was a theft/burglary in my neighbour's. When they were out, thieves entered the house and took away cash
(theft = మామూలు దొంగతనం. burglary = తాళాలు లాంటివి పగులగొట్టి, కన్నాలు వేసి ఇంట్లో జొరబడి దొంగతనం చేయటం. Burglar - అలాంటి దొంగతనం చేసేవాడు)

**Siva:** How much?

**Vasu:** One lakh

**Siva:** Why didn't he put/deposit it in the bank.

**Vasu:** He would have deposited but they had to go suddenly somewhere, and could not go to bank.

**Siva:** Is he rich/well to do?
(well to do = బాగా డబ్బున్నవాడు)

**Vasu:** Yea. He bought a DD the other day, for a lakh rupees to make some payment/to pay someone. Otherwise he would have lost it/that amount too. He always deposits money into the banks and never withdraws.

**Siva:** What's he going to do?

**Vasu:** He gave/issued a cheque to some one. He wanted to credit this amount into bank, so that even if he presented the cheque there would be enough balance, and the cheque would not be returned/dishonoured/bounce. Now there isn't enough balance. So he is worried that the bank might dishonour/return the cheque.

**Siva:** Can't you help him? you draw from your deposits and give him the money.

**Vasu:** Me? (Do) you think I am Kubera. The little money I have is in term deposits you give him; I'll stand guarantee.

**Siva:** I just joked. Don't worry.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Praveen:** Congrats on your high score. Keep it up.
ఎక్కువ మార్కులు సాధించినందుకు కంగ్రాట్స్.

**Naveen:** Thank you. But I left out two questions. If had answered them, I could have scored still higher.
రెండు questions వదిలేశాను. వాటిని answer చేసుంటే, నేనింకా ఎక్కువ మార్కులు తెచ్చుకోగలిగేవాడిని.

**Praveen:** Don't worry. Your marks are high enough. Better luck next time.
Worry అవకు. నీ మార్కులు ఇప్పుడు ఎక్కువగానే ఉన్నాయి కదా. వచ్చేసారి నీ అదృష్టం బాగుండాలి అని నాకోరిక.

**Naveen:** Thank you. But for your help I couldn't (could not) have scored so high. Thank you for all your help.
థ్యాంక్స్. నీ సహాయం లేకుంటే నేనంత ఎక్కువ మార్కులు తెచ్చుకోగలిగేవాడిని కాను.

Score = marks. Score high = ఎక్కువ marks తెచ్చుకోవటం. High score = ఎక్కువ మార్కులు

**Praveen:** You are welcome. It is your hard work more than my help that got you these marks.
నా సహాయంకన్నా నీ కృషే నీకన్ని మార్కులు తెచ్చిపెట్టింది.

**Naveen:** The college is a good college too. The teaching is good. Had it not been for the teachers, many could not have passed.
College కూడా మంచిదే. Teaching బాగుంటుంది. Teachers ఇక్కడ గొప్పవాళ్ళు కాకపోతే చాలామంది pass అయ్యేవాళ్ళు కాదు.

**Praveen:** True. The college can be proud of its Lecturers. The college wouldn't have become so famous without them.
నిజమే. ఈ college కి Lecturers గర్వకారణం. వాళ్ళవల్ల కాకపోతే, College కు అంత fame ఉండేది కాదు (కానీ ఉంది)

**Naveen:** If I had not advised your father, he would have put you in some other college and you would have faced problems.
నేను మీ నాన్నకు సలహా ఇచ్చుండకపోతే మీ నాన్న నిన్నింకో College లో చేర్పేవారు. అప్పుడు నువ్వు కష్టాలెదుర్కోవాల్సొచ్చేది.

**Praveen:** O.K. I must be leaving. I should have been at college by 10 for the certificates. I am late. Bye.
నేను వెళ్లాలి. College లో certificates తీసుకోవడానికి 10 గంటలకు ఉండాల్సింది. ఆలస్యమైంది. వస్తా.

**Naveen:** Bye.

µ **In the last few lessons we studied the uses of Would have been, Would have + Past Participle, should have been, should have + pp.**

**a)** would have been = ఉండే వాడే/ ఉండేదే (లేదు)
would have + pp = జరిగేదే కానీ జరగలేదు.
wouldn't (would not) have been = ఉండేది కాదు (కానీ ఉంది)/ ఉండేవాడుకాదు (కానీ ఉన్నాడు)
Wouldn't have + pp = (ఓ పని) జరిగేది కాదు (కానీ జరిగింది)

**b)** should have been = ఉండాల్సింది (విధిగా)/ ఉండాల్సిన వాడు (విధిగా) కాని లేదు/లేదు
shouldn't (should not) have been = ఉండాల్సింది కాదు (కానీ ఉంది) / ఉండాల్సినవాడు కాదు (కాని ఉన్నాడు)
should have done = చేయాల్సింది (విధిగా) కానీ చేయలేదు.
should n't (should not have done) చేయాల్సింది కాదు కానీ చేశారు.

ఇదీ సంగ్రహంగా మనం imaginary past forms ను గురించి తెలుసుకున్న విషయాలు.

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson:**

1) I could have scored still higher marks.
2) I couldn't (could not) have scored so high
3) Many couldn't have passed
4) The college wouldn't have become so famous
5) He would have put you in some other college
6) You would have faced problems
7) I should have been at college by 10

**Look at the underline verbs in the sentences above:**

1) Could have scored 2) couldn't have scored, 3) couldn't have passed 4) wouldn't have become 5) would have put 6) would have faced 7) should have been.

We know the uses of verbs No. 4, 5, 6 and 7.
Now let's look at verbs No. 1, 2, and 3.
We see that the verb form is could have + past participle.
Could have been / could have + PP are two more imaginary past forms.




2) I couldn't have scored so high
అంత ఎక్కువ marks తెచ్చుకోలేకపోయేవాడిని (కానీ తెచ్చుకోగలిగాను/ తెచ్చుకున్నాను.)

3) Many couldn't have passed
చాలామంది pass కాలేకపోయేవారే (కాని అయ్యారు) ఇంకా చూడండి.

But for my help, he couldn't have got the job.
నా సహాయమే లేకుంటే అతడా ఉద్యోగం పొందలేక పోయేవాడే. (నా సహాయం వల్ల పొందగలిగాడు).

But for the timely rains, we couldn't have had such a harvest=
సకాలంలో వర్షాలు లేకుంటే మనమింత మంచి పంటలు పొందలేకపోయేవాళ్లం
(సకాల వర్షాల వల్ల - పంట బాగా పొందగలిగాం)
(Harvest = హార్వెస్ట్ = పంట కోత/ పంట)

If he had been there, he could have got a share. (If clause verb - had been; Main clause verb could have got)=
వాడక్కడ ఉన్నట్లయితే, వాడో భాగం పొందగలిగేవాడే. (లేదు, పొందలేదు)

**a)** నువ్వొక్క నిమిషం ముందు వచ్చుంటే, నీకు రూ. 1000 కాదు, రూ. 10000 ఇవ్వగలిగేవాడినే =
If you had come a minute earlier, I could have given you not just Rs 1000, but even Rs 10000. (నువ్వొక్క నిమిషం ఆలస్యం అయ్యావు, నేనేమీ ఇవ్వలేకపోయాను.)

**b)** British పాలన లేకుంటే భారత్ చాలా అభివృద్ధి చెందగలిగేదే-
India could have progressed a lot if the British had not ruled it.

**c)** నన్నయ చనిపోకుండా ఉంటే భారతాన్ని పూర్తి చేయగలిగేవాడే=

# She could have been the PM

could have been = ఉండగలిగేది/ ఉండగలిగేవాడే (కాని లేదు/ లేదు)

**a)** She could have been the Prime Minister=
ఆవిడ ప్రధానమంత్రిగా ఉండగలిగేదే (కాని లేదు)
[could అంటే past ability ని తెలుపుతుంది కదా- అంటే గతంలో ఉండగలగటం/ చేయగలగటాన్ని తెలుపుతుంది- గుర్తుంది కదా]

**b)** Mrs Sonia Gandhi could have been the PM if she had wanted =
ఆమె అనుకున్నట్లయితే, PM గా ఉండగలిగేదే. (అనుకోలేదు, PM గా లేదు)

**c)** I could have been there even at 10-
అక్కడ నేను పదింటికే ఉండగలిగేవాడినే, if the train hadn't been late.
train ఆలస్యం అవకుండాఉంటే. (Train వల్ల - లేను)

**d)** How could she have been here?=
ఆమె ఇక్కడ ఎలా ఉండగలిగేది? (అంటే లేదని కదా)

**Krishna:** She should have been here at 10.
(ఆమె ఇక్కడ 10కి ఉండాల్సింది) (కానీ లేదు)

**Vishnu:** How could she have been here when she had a class.
(ఆమెకు class ఉంటే, ఎలా ఉండగలిగేది? ) (అందుకని లేదు)

**e)** If I had not given her a lift, she couldn't have been here on time =
నేను lift ఇవ్వకపోయుంటే ఆమె ఇక్కడ time కు ఉండగలిగేది కాదు- lift ఇచ్చాను, ఆమె ఉండగలిగింది, ఉంది)

**f)** సోనియా PM గా ఉండటానికి అంగీకరించుంటే, Manmohan Singh, PM గా ఉండగలిగేవాడుకాదు.
If Sonia Gandhi had agreed to be the PM, Manmohan Singh couldn't have been the PM.

పైవన్నీ could have been/ couldn't have been వాడిన sentences.
ఇప్పుడు conversation లోని could have తో ఉన్న ఇతర verbs చూద్దాం.

1) I could have scored still higher marks=
ఇంకా ఎక్కువ మార్కులు తెచ్చుకోగలిగేవాడినే (తెచ్చుకోలేకపోయా)

అంటే could have + past participle అర్థం, ఒక పని ఎవరైనా చేయగలిగేవాళ్లే, అయితే చేయలేక పోయారు అని.
అలాగే couldn't (could not) have + past participle అంటే అర్థం- (ఎవరైనా) ఒక పనిచేయలేక పోయేవారే కాని చేయగలిగారు అని.


M. SURESAN

If I had answered two more questions, I could have got 100%=
ఇంకో రెండు ప్రశ్నలకు జవాబులు రాసుంటే నూటికి నూరు తెచ్చుకోగలిగేవాడినే. (Two questions వదిలేశాను- 100 కు 100 తెచ్చుకోలేకపోయా.)

పై sentence లో If clause verb had answered -had + PP

Would have been/ would have + PP, main clause verb అయితే if clause verb, had been/ had + PP ఉండాలని ఇంతకుముందు తెలుసుకున్నాం, గుర్తుంది కదా. Could have been/ could have + PP, main clause verb అయితే కూడా దానికి combination, If clause verb - had been/ had + PP నే.

If Nannaya had not died he could have completed the Mahabharatam.

**d)** వాళ్లు car లో వెళ్లకుంటే దర్శనం చేసుకోగలిగేవాళ్లు కారు=
If they had not taken the car, they could not have had the darsanam. (Could not have + pp of have - had)

**e)** వంట క్షణంలో పూర్తి చేయగలిగేదాన్నే gas చాలినంత ఉంటే=
I could have completed cooking in a jiffy, if there had been enough gas
in a jiffy = క్షణంలో

ఇదీ could have been/ could have + pp, meaning and use
**a)** would have been, would have + pp
**b)** should have been, should have + pp
**c)** could have been, could have + pp
పై verbs తేడా తెలుసుకుని వాడటం చాలా ముఖ్యం.

**IMAGINARY PAST FORMS**

| VERB FORMS | | MAIN CLAUSE | IF CLAUSE (verb-forms) |
|---|---|---|---|
| Would have | been | ఉండేదే/ ఉండేవాళ్లే కానీ లేదు/ లేరు. not తో ఉండేది కాదు/ ఉండేవాళ్లు కారు కానీ ఉంది/ ఉన్నారు | Had been<br>Had + pp |
| | Past participle | ఒక పని జరిగేది/ ఒకరు ఒక పనిచేసేవారు కానీ జరగలేదు/ చేయలేదు. Not తో ఒక పని జరిగేదికాదు/ ఒకరు ఒక పని చేసేవారుకాదు కాని జరిగింది/ చేశారు. | |
| Should have (విధిగా) | been | ఉండాల్సింది కానీ లేదు/ లేదు Not తో ఉండాల్సింది కాదు, కానీ ఉండింది/ ఉన్నారు | - |
| | Past participle | ఒక పని జరగాల్సింది/ ఒకరు ఒక పని చేయాల్సింది కాని జరగలేదు/ చేయలేదు Not తో జరగకూడనిది/ చేయకూడనిది జరిగింది/ చేశారు. | |
| Could have (Ability) | been | ఉండగలిగేదే/ ఉండగలిగేవాడే కానీ లేదు/ లేదు not తో ఉండగలిగేది కాదు/ ఉండగలిగేవాడుకాదు, కాని ఉండగలిగింది/ ఉండగలిగారు | Had been<br>Had + pp |
| | Past participle | అవగలిగేదే/ చేయగలిగేవాళ్లే, కానిఅవలేదు/చేయలేదు Not తో అవగలిగేదికాదు/ చేయగలిగేవాళ్లుకాదు/ కానీ అయింది/ చేయగలిగారు. | |

**Pramod:** Prakash didn't attend our party yesterday. What might have been the reason?

(ప్రకాశ్ నిన్న మన పార్టీకి రాలేదు. కారణమేమై ఉండొచ్చు? )

**Prabhat:** He might have been out of town or he might have forgotten. When did you last tell him of the party?

(అతడు ఊళ్లో లేకపోయి ఉండొచ్చు లేకపోతే పార్టీ విషయం మరిచిపోయుండొచ్చు అతడికి నువ్వు పార్టీ విషయం చివరిగా ఎప్పుడు చెప్పావు? )

**Pramod:** I think last saturday

(పోయిన శనివారం అనుకుంటా)

**Prabhat:** That's it. He is very busy. You should have reminded him of it after that. So, he might have forgotten.

(అదీ సంగతి. ఆ తర్వాత నువ్వతడికి గుర్తు చేయాల్సింది. అందుకని అతడు మర్చిపోయి ఉంటాడు.)




**Prabhat:** Wait for an hour. The bank might not have been open by now. It is only 9.

(గంటాగు. Bank ఇప్పుడే తెరిచుండకపోవచ్చు Time ఇప్పుడు తొమ్మిదే.)

**Pramod:** O.K.

We have seen so far the three imaginary past forms:

1) would have been/ would have + past participle (PP),
2) should have been/ should have + pp, and
3) could have been / could have + pp.

Would have been = ఉండేదే / ఉండేవాడే కానీ లేదు/ లేడు.

Would have + pp = జరిగేదే / చేసేవాడే కానీ జరగలేదు/ చేయలేదు.

Should have been = ఉండాల్సింది కానీ లేదు

Should have + pp = చేయాల్సింది (చేయలేదు)

Could have been = ఉండగలిగేది/ ఉండగలిగేవాడు (లేకపోయింది/ లేకపోయాడు)

Could have + pp = చేయగలిగేవాడే/ చేయలేక పోయాడు.

పై వాటికి not చేరిస్తే, దానికి opposite అర్థం వస్తుందని గత మూడు, నాలుగు lessons లో తెలుసుకున్నాం కదా.




Might have been = ఉండుండొచ్చు/ ఉండేదేమో- సందేహం. ఉండనూవచ్చు/ లేకపోనూవచ్చు - సందేహం.

Might have + pp = (ఒక విషయం) జరిగి ఉండొచ్చు/ జరగకపోయుండొచ్చు- సందేహం.

**ఈ తేడాలు చూడండి.**

1) He would have gone
వెళ్లేవాడే (కానీ వెళ్లలేదు)

2) He should have gone
అతడు వెళ్లాల్సిందీ (కానీ వెళ్లలేదు)

3) He could have gone =
వెళ్లగలిగేవాడే (కాని వెళ్లలేకపోయాడు)

4) He might have gone = వెళ్లిపోయుండొచ్చు - అంటే అంత కచ్చితంగా తెలియటంలేదు - వెళ్లాడా, లేదా అని.

d) If it had not been money, what might have stopped him from coming
డబ్బువల్ల కాకపోయుంటే, దేనివల్ల రాకపోయుంటాడతను?
ఇదీ, might have been, might have + PP వివరాలు.

**Now Practise the following, using all the four imaginary past forms you have learnt so far.**

**Rahul:** నువ్వు నిన్న హైదరాబాద్ వెళ్లుంటే, శేఖర్‌ను కలుసుకోగలిగేవాడివి.

**Kousik:** నాకు సందేహమే. నిన్న అక్కడికి వెళ్లినా అతడిని కలుసుకోకపోయుండొచ్చు

**Rahul:** ఎందుకనుకుంటున్నావలా?

**Kousik:** అతడు హైదరాబాద్‌లోనే ఉంటే నాకు ఫోన్ చేసేవాడే. నాకేం ఫోన్‌రాలేదతడినుంచి.

**Rahul:** నువ్వు ఫోన్ చేసుండాల్సిందతడికి.

**Kousik:** అతనక్కడ కచ్చితంగా ఉన్నాడని తెలిస్తే చేసేవాడ్ని. అతను హైదరాబాద్‌కు బాగా పొద్దుపోయాక చేరుండొచ్చని నా అభిప్రాయం.

**Rahul:** ఒకవేళ ఫోన్ చేసుంటే ఏం పోయేది నీకు? వాడున్నాడా లేదా అని తెలుసుకోగలిగేవాడివి.

**Kousik:** నన్నతడు కలుసుకునే సమయం కూడా ఉండుండదేమో?

**Rahul:** మళ్లీ ఎప్పుడు కలుసుకోవచ్చనే విషయమైనా తెలిసుండేది కదా?

**Kousik:** అది నిజమే. అయితే మా cousin వెళ్లుండొచ్చు. ఫోన్‌చేసి కనుక్కుంటా.

**Rahul:** అదంతా ఎందుకు? నువ్వే sekhar కు phone చెయ్యి.

**Kousik:** Ok.

# He might have gone

**Pramod:** I myself have been very busy this week. Otherwise I might have reminded him.

(నేను కూడా ఈ వారమంతా busy గా ఉన్నా. లేకుంటే గుర్తుచేసేవాడిని.)

**Prabhat:** He was talking to me of going to Mumbai. So my other doubt is he might have left for Mumbai.

(నాతో ఏదో ముంబాయి వెళ్లటం గురించి మాట్లాడాడు. కాబట్టి నాకో సందేహం ముంబాయి వెళ్లుండొచ్చని.)

**Pramod:** I now feel that we might not have missed him if we had reminded him of it.

(మనం ఒకసారి వాడికి గుర్తుచేసుంటే మనం వాడిని miss అయ్యేవాళ్లం కామేమో అని ఇప్పుడు నాకనిపిస్తోంది.)

**Prabhat:** Any way, past is past. What do people say about the party?

(అయిపోయిందేదో అయిపోయింది. మన party గురించి అందరూ ఏమనుకుంటున్నారు? )

**Pramod:** They are all happy. A good number still feel that the party might have been a greater success if Prasad had been there to entertain us with his jokes.

(అందరూ సంతోషపడ్డారు. అయితే తన jokes తో మనకు వినోదం కలిగించటానికి Prasad కూడా ఉండుంటే party ఇంకా విజయవంతమై ఉండేదేమో అని చాలామంది భావిస్తున్నారు.)

**Prabhat:** What about the expenses?

(ఖర్చుల సంగతేమిటి? )

**Pramod:** We have yet to get the bill. It might have come to around Rs. 10,000/-. We have paid an advance of Rs. 5000/-. It might have cost us more if it had been any other hotel.

**Prabhat:** True. It might have gone beyond our estimation.

(నిజమే మన అంచనాలకు మించిపోయుండొచ్చు)

**Pramod:** Let's settle the bill at once.

**In this lesson we are going to study the fourth imaginary past form:**


M. SURESAN

Might have been; Might have + past participle (PP)

Would / Should / Could } have been, have + pp - వీటన్నింటికి అవి సూచించే states of being కూ, actions కూ వ్యతిరేకార్థం వస్తుంది.

కానీ might have been, might have + pp కు అలా రాదు. ఇది సందేహాన్ని తెలుపుతుంది. పై సంభాషణలో might have been, might have + pp verbs ఉన్న sentences ఒకసారి చూద్దాం.

1) What might have been the reason?
(కారణం ఏమై ఉండుండొచ్చు? )

2) He might have been out of town
(ఊళ్లో లేకపోయుండొచ్చు).

3) So he might have forgotten
అతడు మర్చిపోయుండొచ్చు

4) I might have reminded him =
నేను అతడికి గుర్తుచేసుండొచ్చు

5) He might have left for Mumbai =
అతడు ముంబాయి వెళ్లి ఉండొచ్చు

6) We might not have missed him =
అతడిని మనం miss అయ్యుండే వాళ్లం కామేమో.

7) ... the party might have been a greater success =
Party ఇంకా విజయవంతం అయి ఉండేదేమో/ అయ్యుండొచ్చు

8) It might have come to around Rs 10000/-
దాదాపు రూ. 10000 అయ్యుండొచ్చు

9) It might have cost us more =
మనకింకా ఎక్కువ ఖర్చు అయ్యుండొచ్చు

10) It might have gone beyond our estimation
మన అంచనాలను మించిపోయుండొచ్చు

11) The Bank might not have opened by now =
Bank తెరిచుండకపోవచ్చు

చూడండి, పై sentences from No 1 to No 11 అన్నీ కూడా సందేహాన్నే తెలుపుతున్నాయి కదా, 1) ఉండుండొచ్చు 2) లేకపోయుండొచ్చు 3) మర్చిపోయుండొచ్చు 4) గుర్తుచేసుండొచ్చు 5) వెళ్లుండొచ్చు 6) Miss అవకపోయుండొచ్చు 7) ఇంకా విజయవంతమై ఉండొచ్చు 8) అయ్యుండొచ్చు 9) ఎక్కువ ఖర్చయి ఉండొచ్చు 10) అంచనాలను మించుండొచ్చు 11) తెరిచుండకపోవచ్చు

కాబట్టి గతంలో ఉన్న/ జరిగిన విషయాలు (ఉండి ఉండొచ్చేమో/ జరిగిందేమో లాంటి అర్థంతో) సందేహాస్పదమై గతంలో ఉందో, లేదో, జరిగిందో, జరగలేదో స్పష్టంగా తెలియనప్పుడు వాడే verb forms - might have been, might have + past participle.

1) నిన్న హైదరాబాద్‌లో చాలా ఎండగా ఉంది, విజయవాడలో కూడా చాలా ఎండగా ఉండుండొచ్చు (ఉండేమో)
It was very hot in Hyderabad; so might it have been in Vijayawada (Vijayawada too might have been hot)

2) అతడు నీకు సాయం చేసుండొచ్చు (అతడిని నువ్వడిగి ఉంటే)=He might have helped you (if you had asked him) (చేసేవాడేమో).

3) She might have become the PM
ఆమె PM అయ్యుండొచ్చేమో.

4) They might not have seen him
వాళ్లతడిని చూసుండకపోవచ్చు

**Imp:** Might have been, Might have + pp, main clause verbs అయితే, దీని 'if clause' combination verbs - had been, had + pp.

a) If you had taken his book, he might have been very angry
నువ్వే అతడి పుస్తకం తీసుకునుంటే అతడు చాలా కోప్పడుండొచ్చు

b) He might have made her very happy if she had married him
ఆమె అతడిని పెళ్లాడుంటే, అతడు చాలా సంతోషపెట్టుండొచ్చు (పెట్టేవాడేమో).

c) If the mob had not become violent the police might not have opened fire =
జనం దౌర్జన్యం చేయకపోయుంటే, police కాల్పులు జరిపి ఉండకపోవచ్చు (సందేహం - దౌర్జన్యం కాకపోయినా కాల్పులు జరిగి ఉండొచ్చు)

**ANSWER**

**Rahul:** If you had gone to Hyderabad yesterday, you could have met Sekhar.

**Kousik:** I doubt. Even if I had gone there I might not have met him.

(Even = అయినా)

**Rahul:** Why do you think so?

**Kousik:** If he had been in Hyderabad, he would have called me. I didn't have any call from him.

**Rahul:** You should have phoned.

**Kousik:** If I had known definitely that he was there, I would have phoned him. But my opinion is that he might have reached Hyderabad late in the night.

**Rahul:** What might you have lost, If you had phoned? You could have known if he was there or not.

**Kousik:** He might not have had the time to meet me.

**Rahul:** At least you would have known/ found out when you might meet him again.

**Kousik:** That's true. But my cousin might have gone. I'll ring up and find out.

**Rahul:** Why all that? you call sekhar

**Kousik:** Ok.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# He would have escaped...




**Mrinal:** Hi Kripal, how did you do in the exam yesterday?
(నిన్న exam ఎలా రాశావు? )

**Kripal:** Well, Of course, but I could have done better.
(బాగానే రాశాను. కానీ ఇంకా బాగా రాయగలిగేవాడినే.)

**Mrinal:** Why? What was wrong?
(ఏమైంది? )

**Kripal:** The noise from a workshop nearby the exam centre disturbed me a lot. I couldn't concentrate.
(exam centre దగ్గరున్న workshop గొడవ నన్ను బాగా disturb చేసింది. concentrate చేయలేకపోయా.)

**Mrinal:** Sorry to hear that. Sorry that you couldn't get a better centre.
(అంతకంటే మంచి centre ను నువ్వు పొందలేకపోయినందుకు విచారిస్తున్నా)

**Kripal:** If I had chosen some other town, I would have got a better centre. I could have done certainly much better.
(ఇంకే ఊరైనా నేను ఎంపిక చేసుకుని ఉంటే ఇంతకంటే మంచి centre వచ్చేదే. అప్పుడు నేను ఇంతకంటే బాగా రాయగలిగే వాడిని)

**Mrinal:** You should have thought of it before indicating the centre.
(పరీక్షా కేంద్రాన్ని ఎంపిక చేసుకునే ముందు, ఈ విషయం ఆలోచించాల్సింది)
(indicate= ఇండికేయిట్ - 'ఇ' నొక్కి పలుకుతాం = సూచించటం)

**Kripal:** That's true. I chose the place because my uncle advised it.
(అది నిజమే. మా మామయ్య సలహా మేరకు ఈ కేంద్రాన్ని ఎంపిక చేసుకున్నా.)

**Mrinal:** What about your cousin? She took the exam too, didn't she?
(మీ cousin మాటేమిటి? తను కూడా ఈ exam రాసింది కదా? )

**Kripal:** She is very good at the subject. She did very well and is sure of selection. If I had taken help, I could have prepared much better.
(ఆమెకు subject బాగా వచ్చు. చాలా బాగా రాసింది, కచ్చితంగా select అవుతుంది. నేను ఆమె సాయం తీసుకుని ఉంటే ఇంకా బాగా prepare అయ్యేవాడినే.)

**Mrinal:** OK. All the best then. Don't worry. You'll get the Job
(నీకు Job వస్తుంది. Worry అవకు).

**Kripal:** OK. Hope so. Thank you.
(అలాగే ఆశిద్దాం. Thanks)

Would have been/would have + past participle (PP)కు, could have been / could have + PP కు ఉన్న తేడాను వివరించమని చాలా మంది పాఠకులు కోరడంతో మళ్లీ ఇస్తున్నాం. జాగ్రత్తగా గమనించండి.

**Look the following sentences from the conversation above.**

**1)** I could have done better
**2)** I would have got a better centre
**3)** I could have done certainly much better
**4)** You should have thought of it
**5)** I could have prepared much better.

**Look at the verbs in the sentences above:**

**1)** Could have done .. Could have + past participle ( PP)
**2)** Would have got (would have + PP)
**3)** Could have done (could have + PP)
**4)** Should have thought (should have + PP)
**5)** Could have prepared (could have + pp)

**1)** I could have done better.
బాగా రాయగలిగేవాడినే, కాని రాయలేకపోయాను. could అనేది ఎక్కువగా past ability (గతంలో సామర్థ్యం)ను తెలుపుతుంది. అలాగే,

**2)** Could have prepared better.
ఇంకా బాగా prepare అయ్యేవాడినే, కాలేకపోయా. ఇక్కడ కూడా prepare అవగలిగి (సామర్థ్యం ఉండి) కూడా prepare కాలేకపోయాను.

జాగ్రత్తగా గమనించండి. Could have been/could have + PP వాడినప్పుడు, ఉండగలిగే లేదా చేయగలిగే సామర్థ్యానికి (ability) ప్రాధాన్యం ఉంటుంది. అదే I would have got a better centre అన్నప్పుడు... అంటే would have + pp వాడినప్పుడు సామర్థ్యాని (ability)కి ప్రాముఖ్యం ఉండదు. ఒక విషయం జరిగిందా లేదా అనేదానికే ఇక్కడ ప్రాధాన్యం.

**1 a)** He would have become the PM.
ఇక్కడ verb, would have + pp
అర్థం - PM అయ్యేవాడే కాని కాలేదు.
(ability ప్రసక్తి లేదిక్కడ)

**b)** The train would have run over the boy.
(ఆ కుర్రాడి మీదుగా train వెళ్లిపోయేదే, కానీ వెళ్లలేదు. ఇక్కడ Could have+ pp ను వాడితే, సరైన meaning రాదు. ఎందుకంటే ability ప్రసక్తి ఇక్కడ లేదు కాబట్టి.

**2 a)** He would have escaped.
తప్పించుకునే వాడే (సంఘటనకు ప్రాముఖ్యం- తప్పించుకోలేదు- పట్టుబడ్డాడు)

**b)** He could have escaped -
తప్పించుకోగలిగేవాడే, తప్పించుకోలేకపోయాడు, పట్టుబడ్డాడు- ability ఉండి కూడా చిక్కిపోయాడు.

✓ would have been/would have + PPకు, could have been/could have + PP కు ఫలితం ఒక్కటే. అది అనుకున్నది జరగకపోవటం. notతో అయితే అనుకోనిది జరగటం.

✓ would have been/would have + pp వాడినప్పుడు ability ప్రసక్తి లేదు. Could have been/could have + PP వాడినప్పుడు abilityకు ప్రాధాన్యం.

**ఇంకా చూడండి!**

✓ He couldn't have done it without my help.
(నా సహాయం లేకపోతే అతడు చేయగలిగేవాడు కాదు. అంటే నా సహాయం వల్ల)

✓ He was able to do it.
ఇక్కడ wouldn't have done it అంటే...నా సహాయం లేకపోతే చేసేవాడు కాదు అంటే అర్థం సరిగా రాదు కదా.

**a)** Without the boss's orders he wouldn't have done it .
(Boss orders లేకుంటే వాడది చేసేవాడు కాదు. ఇక్కడ ability ప్రసక్తి లేదు.) కాబట్టి could have+ pp వాడితే అర్థం ఉండదు.

**b)** without my recommendation, he couldn't have got the job.
(నా recommendation లేకుంటే అతడు Job పొందగలిగేవాడు కాదు. (పొందగలిగిన ability నా వల్ల).

ఇక్కడ wouldn't have got కూడా వాడవచ్చు. అయితే అర్థం కొద్దిగా మారుతుంది. పొందేవాడు కాదు, పొందాడు అని. ఇక్కడ జరిగిన సంఘటనకు ప్రాధాన్యం.

మీరు regular గా English మాట్లాడటం, రాయటం చేస్తూ ఉంటే మీకే అర్థమైపోతుంది. ఏ సందర్భంలో could have been / could have + PP, should have been/should have+PP వాడాలో తెలుస్తుంది. పోనుపోనూ, correct గా వాడటం, ఆలోచించకుండానే అలవాటై పోతుంది. కాబట్టి వీలైనన్ని sentences practice చేయండి. సమస్య ఉండదు.


M. SURESAN

## practise the following

**Lasya:** Hi Kavya, మళ్లీ వార్తల్లోకి వచ్చావు. Congrats.

**Kavya:** అదేమంత గొప్పని నేననుకోవటం లేదు. నా ప్రత్యర్థిపైన ఇంకొంచెం ఎక్కువ తేడాతో గెలిచుంటే ఇంకా సంతోషపడేదాన్ని.

**Lasya:** నువ్వు ఇంకాస్త జాగ్రత్తగా ఆడి ఉంటే, ఎక్కువ తేడాతో గెలవగలిగేదానివే. చివరి నిమిషాల్లో ఇంకాస్త జాగ్రత్తగా ఆడి ఉండాల్సింది.

**Kavya:** నా కాలికండరం పట్టుకుని ఉండకపోతే, సరిగ్గా ఆడగలిగేదాన్నే. కానీ ఒకటే నొప్పి. అందువల్ల ఆట దెబ్బతింది.

**Lasya:** నువ్వు ముందే చెప్పిఉంటే Coach నీకు సాయం చేసేదేకదా.

**Kavya:** ఎవరనుకున్నారది వస్తుందని?

**Lasya:** అవున్లే. అది ఎదురుచూడంది కదా.

**Kavya:** ఇంకా కొంచెం ఎక్కువ తేడాతో గెల్చుంటే మా coach సంతోషించేదే.

**Lasya:** అందరూనూ. నువ్వెప్పుడో Car ను prize గా పొందగలిగేదానివి.

**Kavya:** సరే. better luck next time

**Answer:**

**Lasya:** Hi kavya, you are again in the news, congrats.

**Kavya:** I don't think much of it/I don't think it's a great achievement. If I had won/defeated my rival with a greater margin (If I had had greater lead over my rival) I would have been happier. (Rival = ప్రత్యర్థి)

**Lasya:** If You had played more carefully you could have won by a greater margin/lead.

**Kavya:** If I hadn't had a pulled muscle in my leg, I could have played well. Oh my! It pained me a lot. That affected my game.
(affect = ప్రభావం చూపడం pulled muscle = కండరాలు పట్టుకోవటం/బిగుసుకుపోవటం)

**Lasya:** If you had told the coach of it earlier, she would have helped you.

**Kavya:** Who expected it?

**Lasya:** True, It is unexpected.

**Kavya:** If I had won by a wider margin, my coach would have been happy.

**Lasya:** Every one, of course you could have then won a car too as a prize.

**Kavya:** O.K.Hope for better luck next time

**Q & A**

ప్రశ్న: అతడు నిన్న రాలేదు అనడానికి He did not come here yesterday అంటాం. అలాగే అతడు నిన్న వచ్చి ఉండలేదు అనడానికి He was not come here yesterday అనొచ్చా?

**– ఎస్.దానకిశోర్, లక్ష్మీపురం**

He was not come yesterday - ఈ sentence లో verb: Was come - ఇది ఈ కింది రెండు రకాల్లో ఏదో ఒకటిగా ఉండాలి.

i) was ('be' form) + 'come' (1st Regular Doing word). - ఇది తప్పు - ఇలాంటి verb form English లో లేదు, ఎందుకంటే 'be' form పక్కన, 1st Regular Doing word ఎప్పుడూ రాదు.

ii) was ('be' form)+ 'come' (Past Participle of 'come') అంటే ఈ verb, beform + Past participle గా తీసుకుంటే, verb form correct. దీని వాడకం చాల అరుదు. అందులో was/were లాంటి past forms లో చాలా అరుదు. ఎందుకంటే సందర్భాన్ని బట్టి గాని దానికి సరైన అర్థం రాదు. ఇక వీటికి not చేర్చి was not come/were not come అనేది మరీ అరుదు. అర్థం సరిగా రాదు. ఇలాంటి చోట్ల, had come వాడటం better, clarity కూడా బాగా ఉంటుంది. Had come వాడటం correct కూడాను.

I went there at 3 yesterday. He had not come by then. నేనక్కడికి మూడింటికి వెళ్లాను. అప్పటికితనురాలేదు (వచ్చి ఉండలేదు) was come/were come; am/is/are come లాంటి verbs వాడకుండా ఉండటమే మంచిది. అర్థం clear గా ఉండదు కాబట్టి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Pranav:** Hi Prabhat, you look quite smart in your clothes today. Are they new?
(ప్రభాత్, ఈ బట్టల్లో నీవు చాలా అందంగా ఉన్నావు. అవి కొత్తవా?)

**Prabhat:** They are, of course. But I'm afraid I don't look smarter than you, in spite of my new clothes. Any way, I thank you for the compliment.
(అవి కొత్తవే. అయినప్పటికీ, నీకంటే నేనేం smarter అందంగా/ ఆకర్షణీయంగా కనిపించడం లేదులే. ఏదైతేనేం, నీవు మెచ్చుకుంటున్నందుకు thanks.)

**Pranav:** Mine are sincere compliments, prabhat. They aren't mere flattery.
(నేను నిజంగానే మనస్ఫూర్తిగానే నిన్ను మెచ్చుకుంటున్నా, అవేం మెరమెచ్చు మాటలు/ పొగడ్త కాదు)

**Prabhat:** I have no doubt about that. But really I don't like these clothes very much. Dad bought me them from Hyderabad. I wear them because I don't want to offend him.
(ఆ విషయంలో నాకు సందేహం లేదు. నిజంగా ఈ బట్టలు నాకంత ఇష్టంలేదు. మా నాన్న వీటిని హైదరాబాదు నుంచి తెచ్చారు నాకు. ఆయన బాధపడతారేమోనని వేసుకోవడమే)




ఒక భాషలో ఉండే మాటలన్నిటినీ ఆ భాష vocabulary అంటాం. ఇప్పుడు పై sentences లోని Underline చేసిన మాటలన్నీ మన appearance (కనిపించే తీరు) కూ, మన బట్టలకూ (ముఖ్యంగా మగవాళ్ల బట్టలకు) సంబంధించినవని తెలుస్తూనే ఉంది కదా? ఈ మాటలన్నీ కూడా మన daily life situation లో spoken english లో వాడే మాటలే కాబట్టి practice చేయండి.

1) You look quite smart in your clothes. Look అంటే మనందరికీ తెలుసు - కనిపించటం/ అగుపించటం. smart = ఆకర్షణీయంగా, అందంగా ఉండటం/ కనిపించటం. మనం వేసుకున్న బట్టలు మనకు బాగా suit అయితే అప్పుడు మనం smart. tip top గా ఉండటం అన్నా smart.

a) The army officer is really smart in his uniform. ఆ Army officer, ఆ Uniform లో చాలా ఆకర్షణీయంగా ఉన్నాడు.

b) The students were all smartly dressed for the college anniversary = College వార్షికోత్సవం సందర్భంగా విద్యార్థులందరూ ఆకర్షణీయమైన దుస్తుల్లో ఉన్నారు.

Dress and clothes: Dress వేసుకునేది ఆడవాళ్లే. మగవాళ్ల వేసుకునేవి clothes. అంటే మగవాళ్ల బట్టలను dress/ dresses అనం. అయితే He is always dressed in good clothes లాంటి sentences లో dress అంటే బట్టలు అని కాకుండా బట్టలు వేసుకోవటం అనే అర్థంతో వాడతాం. అది తప్పుకాదు.

మనం వేసుకున్న బట్టలు చాలా Neat గా అమరికగా ఉంటే అప్పుడు మనం smart.

c) She smarted up for the interview
Interview కు ఆమె చక్కగా ముస్తాబయింది.




b) **Sulochana:** Are you coming for the picnic?
(నువ్వొస్తున్నావా Picnic కు?)
**Sunayana:** I'am afraid I can't because dad isn't well
(నాన్నకు ఒంట్లో బాగులేదు కాబట్టి నేను రాలేనని, బాధగా చెప్పటం)

I'm afraid/ we're afraid లాంటి expressions మీ conversation లో తరచు వాడండి.

3) **In spite of:** అయినప్పటికీ. (though/ although/ even though/ but/ yet తో సమానం. అయితే వాడకలో వీటికొకదానికొకటికి చాలా తేడా ఉంది. అందుకని జాగ్రత్తగా practice చేయాలి.

a) In spite of her greatness, she is not conceited (ఆమెకు గొప్పతనం ఉన్నప్పటికీ, ఆమెకు గర్వం లేదు. Conceit= గర్వం)
= Though/ Although/ Even though she is great, she is not conceited (ఆమె గొప్పదయినా, గర్వం లేదు)
= She is great, but/ yet she is not conceited = ఆమె గొప్పది, కాని ఆమెకు గర్వం లేదు/ గర్విష్ఠి కాదు)

b) Inspite of his fever, he is able to walk= జ్వరం ఉన్నప్పటికీ (జ్వరంతో కూడా) అతడు నడవగలుగుతున్నాడు.

7) Offend= (మనస్సు, భావాలు) నొప్పించటం.

a) I don't want to offend him=
ఆయన్ను నొప్పించటం నాకిష్టంలేదు.

b) The book has been banned because it offends the sentiments of the minority community = మైనారిటీ వర్గాల భావాలను నొప్పించేదిగా ఉంది కాబట్టి ఆ పుస్తకాన్ని నిషేధించారు.

c) You offend me if you talk badly about my favourite hero= నా అభిమాన నటుడ్ని గురించి చెడుగా మాట్లాడితే నన్ను నొప్పించినట్లే.

8) tire= మామూలు అర్థం, అలసట కలిగించటం/ అలసిపోవటం. అయితే, bore కొట్టటం/ విసిగించటం అనే అర్థం కూడా ఉంది. ఇది ఇప్పుడు ఎక్కువ వాడుకలో ఉంది.

a) The movie is tiring= ఆ సినిమా విసుగనిపించింది.

b) I don't want to go to him. He tires me by talking of his greatness = వాడి దగ్గరకు వెళ్ళటం నాకిష్టం లేదు. వాడి గొప్పతనం గురించి మాట్లాడి విసిగిస్తాడు.

### Now practise the following in English

**Nimisha:** Hi Lipta, ఏంటి కొత్తబట్టలా? ఎంత ఆకర్షణీయంగా ఉన్నావో! ఎక్కడకొన్నావు? ఎంత?

**Lipta:** నీమెప్పుకు thanks. నిజంగా బావుందా ఈ combination?

**Nimisha:** మనస్పూర్తిగా చెప్తున్నానే. నమ్మవా?

**Lipta:** ఏదో పొగడ్తనుకున్నానులే.

**Nimisha:** అయితే ఎక్కడ, ఎంతక్కొన్నావో చెప్పలేదు.

**Lipta:** కొనలేదే. అదెలాగో వచ్చింది నాకు. అదంతా చెప్పి నిన్ను విసిగించటం ఇష్టంలేదు.

**Nimisha:** అంటే నేను కూడా కొనుక్కుంటానని అసూయా?

**Lipta:** ఎందుకే ఆ మాటలు? నన్నెంత నొప్పిస్తున్నావో నీకు తెలియదు. నాకదేదో gift గా వచ్చింది అనుకోకుండా.

**Nimisha:** అదే చెప్పొచ్చుగా. అందులో విసిగించేదేముంది?

**Lipta:** O.K.

**ANSWER**

**Nimisha:** Hi Lipta, new dress? How smart you look in the dress! Where did you buy it and how much is it?

**Lipta:** Thank you for your compliment. Is the combination really good?

**Nimisha:** I am sincere in my compliments. Don't you believe me?

**Lipta:** I thought you were flattering me/ I thought it was flattery/ I took it for flattery.

**Nimisha:** But you haven't told me where and how much you bought it for.

**Lipta:** I didn't buy it. I got it some how. I don't want to tire you by telling you of it.

**Nimisha:** (Are) you jealous that I too will buy it?

**Lipta:** Why such words? You don't know how much you offend me. I got it as a gift unexpectedly.

**Nimisha:** You could have told me so. What is there in to tire me?

**Lipta:** That's OK.

# I don't want to offend him

**Pranav:** I don't see why you think they aren't good. They really suit you well.
(అవి బాగాలేవని నువ్వు ఎందుకనుకుంటున్నావో నాకర్థంకావటంలేదు. అవి నీకు చాలా బాగా నప్పాయి.)

**Prabhat:** Do they, really? Then I am happy.
(నిజంగానా. అయితే నాకు సంతోషమే)

**Pranav:** You are always well dressed. I don't have the patience to choose what clothes I wear.
(నీవెప్పుడూ బట్టలు బాగా వేసుకుంటావు. బట్టల ఎంపికకంత ఓపికలేదు నాకు)

**Prabhat:** Still you look stylish. There is some charm about you that makes your appearance attractive.
(అయినా నువ్వు కాస్త stylish గానే కనిపిస్తావు. నీలో ఏదో ఆకర్షణ ఉంది. అది నిన్ను ఆకర్షణీయంగా చేస్తుంది)

**Pranav:** Enough. You are tiring. Let's talk of something else.
(ఇక చాలు. విసిగిస్తున్నావు. ఇంకే విషయమైనా మాట్లాడదాం)

v v v v v

**Look at the following sentences from the dialogue above.**

1) you look quite smart in your clothes
2) .... I'm afraid I don't look smarter than you, in spite of my new clothes
3) Anyway I thank you for the compliment.
4) Mine are sincere compliments. They aren't mere flattery
5) ... because I don't want to offend him.
6) I don't see why you think...
7) ... you are always well dressed
8) still you look stylish
9) Enough. You are tiring.

In the lesson, lets learn a few items of vocabulary. Vocabulary అంటే గుర్తుంది కదా. simple గా దానర్థం మాటలు పదాలు అని కదా?


M. SURESAN

Smart కు సమానమైన ఇతర పదాలు; Stylish, trendy. అయితే ఈ రెండు మాటల్లో కొద్దిగా fashion ప్రభావం ఎక్కువ. బట్టలు neat గా, అమరికగా ఉండటంతో పాటు, కాస్త fashionable గా ఉంటే అప్పుడవి, stylish, trendy.

Smart అంటే ఇంకో అర్థం తెలివైన, చురుకైన.

a) The boy is smart. You can't cheat him=
ఆ కుర్రాడు తెలివైనవాడు (Clever). నువ్వు వాడ్ని మోసం చేయలేవు.

b) It was smart of her to give such an answer
ఆ సమాధానం ఆమె తెలివిగానే ఇచ్చింది.
ఇలాంటి సందర్భాల్లో smart అంటే చాలా తెలివిగా త్వరగా ఆలోచించగల శక్తి ఉన్న అనే అర్థం వస్తుంది.

c) Don't try to be smart with me=
నా దగ్గర నీ తెలివి చూపకు.
A smart restaurant = a fashionable restaurant=
Food prices are high at this smart restaurant. (ఈ fashionable హోటల్లో తినుబండారాల ధర ఎక్కువ).

2) I'm afraid= I am afraid. Afraid కు మామూలు అర్థం మనందరకు తెలుసు- భయపడటం/ భయంతో ఉండటం. కానీ ఈ సందర్భంలో I'm afraid అంటే నేను చింతిస్తున్నాననే అర్థంతో వాడతాం.
I'm afraid I am not smarter than you=
నీకన్నా నేను smart గా లేనేమోనని చింతిస్తున్నా.
అంటే మనకిష్టంలేని విషయం కాస్త బాధతో చెప్పటానికి I'm afraid అని వాడతాం/ I'm afraid తో ప్రారంభిస్తాం.

a) **Nishant:** Has Prashanth passed?
(ప్రశాంత్ pass అయ్యాడా?)
**Susanth:** I'm afraid, no.
(ప్రశాంత్ Pass అవలేదని బాధగా/ అయిష్టంగా చెప్పటం)

= Though/ Although/ Even though he has a fever, he is able to walk.
= He has a fever, but/ yet he is able to walk.

4) Compliment = మెప్పుమాట, అభినందన/ మెచ్చుకోవటం, అభినందించటం.
ఎవరినైనా మనం మెచ్చుకొనే మాటలుగానీ, ఎవరికైనా మనం తెలిపే అభినందనలుగానీ compliments. ఎవరినైనా మెచ్చుకోవటం, అభినందించటం, to compliment.

a) My compliments to you on your high marks in the exam=
పరీక్షలో నీవు తెచ్చుకున్న గొప్ప marks కు నా అభినందనలు.
compliment తర్వాత on వస్తుంది.

b) He sent his compliments to the actor on his action in the movie= ఆ నటుడి గొప్ప నటనకు ఆయన తన అభినందనలు పంపాడు.

c) Everyone complimented Dhoni on his wonderful play = ధోని ఆటను ప్రతివాళ్లూ మెచ్చుకున్నారు.

d) He complimented her on her taste in the choice of her dress = Dress ఎంపికలో ఆమె అభిరుచిని అతడు కొనియాడాడు.

5) Compliment కు కాస్త సంబంధం ఉన్న మరోమాట flattery. Flattery అన్నా కూడా మెప్పే, కాని flattery అంటే ఇతరులచే పనిచేయించుకోవటానికో, వాళ్లవల్ల ఏదైనా ప్రయోజనం పొందటానికో చేసే పొగడ్త. పొగడ్తలు flattery.

a) He flatters the minister to get his help.
మంత్రి సహాయం కోసం, ఆయన్ని పొగడుతుంటాడు.

b) Everyone in the world falls for flattery =
ప్రపంచంలో ప్రతివాళ్లూ పొగడ్తకు లొంగేవాళ్లే.

6) sincere= మనస్ఫూర్తియైన, చిత్తశుద్ధిగల.

a) I am sincere in my wish to help you =
నీకు నేను నిజంగానే (మనస్ఫూర్తితో) సహాయం చేయాలనుకుంటున్నా.

b) No politician is sincere about servicing people. = politicians కు ప్రజాసేవలో చిత్తశుద్ధిలేదు.

c) She is sincere student= ఆమె చిత్తశుద్ధిగల విద్యార్థిని

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Devanath:** I bought this shirt for Rs 350/-. A good bargain, isn't it?

(ఈ shirt నేను 350 రూపాయలకు కొన్నా. మంచి బేరమే కదా?)

**Raghunath:** I'm afraid that it is too much for it. I have a similar shirt. It cost me just around Rs 250/-

(నువ్వు మరీ ఎక్కువ పెట్టావనుకుంటా. నాకిలాంటి shirt ఉంది. దాన్ని నేను 250 రూపాయలకు కొన్నా.)

**Devanath:** You mean I have been cheated?

(అంటే నేను మోసపోయాననా?)

Cheat = మోసం చేయటం/ మోసగాడు

Cheater అనే మాట లేదు

**Raghunath:** If its price is Rs 350/-, you were charged Rs 100 more. Where did you buy it?

(నువ్వన్నట్లు అది 350 రూపాయలైతే, 100 రూపాయలు ఎక్కువ పెట్టావు. ఎక్కడ కొన్నావు?)

**Devanath:** At the Fitwell readymade shop.

**Raghunath:** It is often called the cheatwell shop. Didn't you know that?

(దాన్ని cheatwell shop అంటారందరూ. నీకు తెలియదా?)

**Devanath:** You should have told me of it earlier. Then I wouldn't have been cheated.

(నువ్వు నాకు ముందే చెప్పుండాల్సింది. మోస పోయేవాడ్ని కాదు.)

**Raghunath:** I would have, if I had been asked, and if I had known that you were going to that shop. Can't it be returned or exchanged now?

(నన్నడిగుంటే, నువ్వా shop కు వెళ్లావని తెలిస్తే నేను చెప్పేవాడినే. దాన్నిప్పుడు తిరిగి ఇవ్వటానికిగానీ మార్చుకునేందుకుగానీ లేదా?)

**Devanath:** How can it be, after it has been used?

(ఎలా మార్చుకోవటం, వాడేశాను కదా?)

**Raghunath:** Then stop worrying about it. Be careful in future.

(అయితే ఇంకదాన్ని గురించి బాధపడకు. Future లో జాగ్రత్తగా ఉండు)

**Devanath:** The shop fellow should be taught a lesson.

(ఆ shop వాడికి బాగా బుద్ధి చెప్పాలి.)

**Raghunath:** In that attempt, don't be cheated once more.

(ఆ ప్రయత్నంలో మళ్లీ మోసపోకు)

**Devanath:** No; I will take you this time. You act smart in these matters.

(ఈసారి నిన్ను తీసుకెళ్తా. నువ్వీ విషయాల్లో తెలివిగలవాడివి)

**Raghunath:** It will be taken care of, don't worry.

(నేను చూసుకుంటాలే. బాధపడకు)

**Observe the use of passive forms in the conversation above:**

1) You mean I have been cheated?
2) You were charged Rs 100/- more
3) It is often called the cheatwell shop.
4) I wouldn't have been cheated.
5) ... if I had been asked.
6) How can it be (returned/ exchanged) after it has been used.
7) The shop fellow should be taught a lesson
8) ... don't be cheated once more
9) It will be taken care of

ఈ Sentences లోని passive verb forms ఇప్పటి వరకు చూసిన verb forms (passive) కు అదనం.

1) ... I have been cheated = మోసగింపబడ్డాను = మోసపోయాను.
2) Were charged = వసూలు చేయబడ్డావు = నీ దగ్గర నుంచి వసూలు చేశారు.
3) is called = పిలవబడుతుంది/ పిలుస్తారు.
4) Wouldn't have been cheated = మోసగింపబడే వాడ్ని కాదు = మోసపోయేవాడ్ని కాదు
5) ... had been asked = అడగబడి ఉంటే/ నన్నడిగి ఉంటే.
6) a) can be returned/ exchanged = తిరిగి ఇవ్వబడగల/ మార్చబడగల = తిరిగి ఇచ్చేయ/ మార్చుకోగల
   b) has been used = వాడబడింది/ వాడాం.
7) should be taught a lesson = పాఠం నేర్పబడాలి = పాఠం నేర్పాలి.
8) don't be cheated = మోసగింపబడకు/ మోసపోకు
9) will be taken care of = జాగ్రత్త తీసుకోబడుతుంది/ జాగ్రత్త తీసుకుంటా.







4) I wouldn't have been cheated = నేను మోసగింపబడేవాడ్నికాదు. ఈ verb, ఇదే list లో పైన verb No 1 ఒకే class కదా- have/ has/ had/ would have, etc + PP - Passive, దీనికి active ఎలా ఉంటుంది? మధ్యలో been తీసేయండి.

I wouldn't have been cheated = He/ they (the shop fellow/ the shop fellows) would not have cheated me.

ఈ form of the verb ఇంతకుముందు మనం చూసిన Imaginary past form కదా.

5) If I had been asked - ఇది కూడా verb No 4, verb No 1 లాగే ఉంది, passive లో. దీనికి active- had been asked లో, మధ్య been తీసేయటమే. If I had been asked (by you) = (Passive) = If you had asked me (Active)

6) Verb b) చూడండి: has been used. ఇది కూడా verb No. 1, verb No. 4 లాగానే, Passive లో ఉంది. ఇది active కావాలంటే has been used లో been తీసేయటమే. It has been used (by me)= I have used it (active)

by whom (ఎవరి చేత) అనేది ఇక్కడ తెలియటం లేదు. సందర్భాన్ని బట్టి మనకేం తెలుస్తోంది- నీచేత = by you అని. కాబట్టి Active- You తో begin అయ్యి, If you had asked me అవుతుంది.

ఇలాగే passive లో by whom/ by what (ఎవరి చేత/ దేని చేత) అనేది మనం ఊహించుకోవాలి. Passive సరిగా వాడినచోట్ల, by so and so, ఫలానా వాళ్ల చేత అనేది omit చేస్తుంటాం. ఇది గమనించి practice చేస్తే, passive లో కూడా మన conversation effective గా ఉంటుంది.

**Practise the following in English. Express the passive equivalents of the following:**

a) శ్రీకాళహస్తిని దక్షిణ కాశీగా పిలుస్తారు.
b) దీపావళి రోజున buildings ను దీపాలతో అలంకరిస్తారు.
c) మనం చిన్న పిల్లలను సులభంగా సంతోషపెట్టగలం. (passive లో చెప్పాలి).
d) ఈ road సగమే repair చేశారింతవరకు.

# ... I have been cheated?

(పై అనువాదంలో మొదటిది passive translation తెలుగులో, దాని పక్కన ఉన్నది normal (మామూలు) తెలుగులో)

All the verbs above, you notice, are in the be form + past participle (pp), so they are all in the passive voice.

గుర్తుంది కదా? ఇంతకుముందు passive voice lessons లో చెప్పిన ఈ points:

have/ has/ had/ shall have/ etc + past participle, form లో ఉన్న active voice verbs కు Passive form: have/ has/ had/ shall have, etc కు, దాని తర్వాత వచ్చే past participle కు మధ్యలో been పెట్టడమే.

1) (Do) you mean I have been cheated. ఇది passive. దీనికి active- have/ has cheated అవుతుంది కదా? =

(Do) you mean that the shop fellow has cheated me?

అదే shop people (షాపువాళ్లు) అనుకుంటే, అప్పుడు (Do) you mean the shop fellows have cheated me?

2) you were charged Rs 100/- more: ఇక్కడ passive, were + pp. దీనికి active- past doing word కదా? అప్పుడు sentence, active లో ఏమవుతుంది?

The shop fellow charged you Rs 100/- more.

3) It is often called the cheatwell shop =

దాన్ని cheatwell shop అంటారు (ప్రజలు). ఇక్కడ Passive- is called, కాబట్టి దీనికి Active, I RDW/ II RDW కదా? (Past lessons లోని tables చూడండి) ఇప్పుడు దీనికి active - people call it the cheatwell shop.




7) Verbs no 6 (a) can be returned, No. 7 should be taught, No. 9 will be taken. ఇవి మూడు కూడా shall/ should/ can/ could/ may/ might/ must etc + 1st RDW కు passive form కదా.

Verb No. 6 (a) can be returned/ exchanged (by me)/ Passive - I can return/ exchange it (Active)

Verb No. 7: Should be taught (by us) - ఇది passive - We should teach him (the shop fellow)- Active.

Verb No.9: Will be taken care of (by me) - Passive - I will take care of it (Active)

∂ ∂ ∂

In the case of the verbs above, we have seen the active equivalents of passive forms. ఈ విషయం జాగ్రత్తగా గమనించండి. Passive sentences లో, పైన మనం చూసిన sentences లో 'ఒక పని ఎవరిచేత చేయబడింది?' అనేది తెలియటం లేదు కదా? eg: I have been cheated (మోసపోయాను) ఎవరిచేత అనేది clear గా తెలియటం లేదు. అలాంటిచోట్ల మనం సందర్భాన్ని బట్టి ఊహించుకోవాలి. ఈ సందర్భాల్లో, Shop fellow అని ఊహించుకోవచ్చు. అప్పుడు, Passive నుంచి active కు మార్చుకోవాలంటే shop fellow తో sentence begin చేస్తాం. అలా చేశాం కదా ఇక్కడ?

అలాగే If I had been asked - passive లో ఉంది.

e) నేను select అయి ఉండేవాడ్ని కాను, time కు సరిగా నా application వాళ్లకు వెళ్లకుండా ఉంటే.
f) ఆ పుస్తకం X Class కు text book గా prescribe కావచ్చు
g) ఇది వెంటనే చేయాలి.
h) అతడు select కావాల్సింది
i) ఈ road ఎప్పుడో వేయాల్సింది.
j) ఇది చాలా సులభంగా చేయవచ్చు

**ANSWERS**

a) Srikalahasti is called Dakshina Kasi/ The Kasi of the south.
b) Buildings are decorated with lamps on the day of Deepavali/ on the Deepavali day/ on the occasion of Deepavali.
c) Children can be made happy easily
d) Only half of the road has been repaired.
e) I would not have been selected, if my application had not reached in time. (This is imaginary past, isn't it?)
f) The book may be prescribed as a text book for X class.
g) This should be/ must be/ has to be done at once.
h) He should have been selected (Imaginary past)
i) This road should have been laid long ago (Imaginary past)
j) This can be done easily.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# What a relief! I'm off

**Spandana:** Oh, Chandana, what a relief? I'm off. I'll be seeing you only after 10 days.

(Chandana, ఎంత relief గా ఉందో! నేను వెళుతున్నా. మళ్లీ 10 రోజుల తర్వాత నిన్ను కలుసుకుంటా.)

relief= విముక్తి / నెత్తిమీదనుంచి పెద్ద బరువు దించినట్లుండటం

**Chandana:** What are you so <u>excited</u> about? (Are you) on a holiday or what?

(దేని గురించి అంత ఉత్సాహంగా ఉన్నావు? సెలవుమీద వెళ్తున్నావా ఏమన్నా?)

<u>On a holiday</u>= సెలవుమీద వెళ్లటం

**Spandana:** Happy that I am (on a holiday). I am going home, sweet home. All these days I <u>have been dying</u> to be back home, and I've the chance now. I'<u>ve packed</u> up and am leaving.

(సెలవులకు వెళ్తున్నానని సంతోషంగా ఉంది. ఇంటికెళ్తున్నా. ఇంటికెప్పుడెప్పుడు వెళ్దామా అనుకుంటుంటే, ఇప్పుడొచ్చిందా అవకాశం. సామాన్లన్నీ సర్దుకున్నాను, వెళ్తున్నాను.)




**Chandana:** I am <u>eager</u> to go home too, but I can't get leave until next month. How I <u>envy</u> you!

(నాకూ ఇంటికెళ్లాలని ఆతృతగా ఉందే, కాని వచ్చే నెలదాకా సెలవు దొరకదు. నిన్నుచూస్తే ఎంత ఈర్ష్యగా ఉందో!)

**Spandana:** I called mom and told her. She is <u>anxious</u> to see me back. So is dad. Still two hours for the train and I feel it's too long. I <u>can't wait</u> any longer.

(అమ్మకు phone చేసి చెప్పా. ఆమెకు కూడా నన్ను చూడాలని ఆతృతగా ఉంది. నాన్నకు కూడా అంతే. Train రావటానికి ఇంకా రెండు గంటలుంది. ఎంతసేపో!)

**Chandana:** I see how <u>impatient</u> you are! So would anyone be when they have a chance. How are you going to spend the days?

(ఎంత తొందరపడుతున్నావో అర్థం చేసుకోగలను. ఎవరైనా అంతేలే అవకాశం వస్తే. ఏం చేయబోతున్నావు ఈ 10 రోజులూ? / ఎలా గడపబోతున్నావు?)

**Spandana:** Just <u>laze</u> about. I don't want to do anything. This <u>nine month grind</u> has <u>taken the life out of me</u>. No leisure. I am <u>fed up with</u> work. Just eat, sleep, watch the TV and go to movies. That's what I am going to do.

(ఏమీ చేయను. చేయాలని అనుకోవటంలేదు. ఈ తొమ్మిది నెలల పని నా ప్రాణాల్ని తోడేసింది. విశ్రాంతి అనేది లేకుండా. విసిగిపోయాను. తినటం, నిద్రపోవటం, TV చూడటం, సినిమాలకెళ్లటం- ఇదీ నేను చేయబోయేది.)

**Chandana:** Next month I am likely to get my break. I'll <u>get even with you then</u>. Bye then. See you.

(వచ్చే నెల నాకూ వస్తుంది break. అప్పుడు నీతో సమానమవుతా. వెళ్లిరా అయితే)

**Look at the following words and expressions from the dialogue between Spandana and Chandana.**

1) What a relief! I'm off; 2) excited; 3) <u>on</u> a holiday; 4) I'<u>ve been dying</u> to be back home; 5) I've packed up; 6) I am eager; 7) envy; 8) anxious; 9) can't wait; 10) how impatient you are!; 11) laze about; 12) the nine month grind; 13) get even with you.

**Learn and practise these expressions when you speak. Your English will be very effective.**

**1)** relief: దీని అర్థం మనలో చాలామందికి తెలుసు- (బాధ నుంచి అయితే) ఉపశమనం. (బాధ్యతలు, బరువుల నుంచి అయితే) విడుదల, అందువల్ల వచ్చే హాయి. What a relief!. అబ్బ, ఎంత హాయిగా ఉందో! ఒక కష్టమైన పని పూర్తయితే, ఒక బాధ్యత నుంచి విముక్తి పొందితే, మనకనిపించే హాయి, relief. (Also, relief from headache, fever, etc.)

I'm off= I am off= I am going= నేను వెళ్లిపోతున్నాను- వెళ్తున్నప్పుడూ, వెళ్లబోతున్నప్పుడు వాడేమాట- క్లుప్తంగా ఎక్కువ అర్థాన్ని చెప్తుంది.

<u>He's off</u>. If you want to tell him anything, hurry up= వాడు వెళ్లిపోతున్నాడు. ఏదన్నా చెప్పాలనుకుంటే వెంటనే చెప్పు.

**2)** excited= you are excited when some thing good happens to you/ when you are very happy about something.

మంచి జరుగుతున్నప్పుడు, జరగబోతున్నప్పుడు మనకు కలిగే సంతోషం, ఉత్సాహం.


M. SURESAN

a) They were excited when their favourite hero talked to them= వాళ్ల అభిమాన hero వాళ్లను పలకరించినప్పుడు వాళ్లు చాలా సంతోషపడ్డారు.

b) He felt <u>excited</u> when he got the prize= వాడికి prize వచ్చినప్పుడు చాలా ఉత్సాహంగా సంతోషంగా ఉన్నాడు.

c) The movie is exciting/ It's an exciting movie= చాలా ఆసక్తిని సంతోషాన్ని కలిగించే movie.

d) Nothing exciting about the movie. It's dull= ఆ movie లో ఉత్సాహకరమైందేదీలేదు. చాలా అనాసక్తికరంగా ఉంది. (Dull= unexciting)

e) Exciting news= ఆసక్తికర విషయం.

**3)** On a holiday= You are on a holiday, if you have break from your work for a few days.

చేసే పని నుంచి కొన్ని రోజులపాటు విశ్రాంతిగా, వినోదంగా గడిపితే, You are on a holiday.

Holiday= సెలవు, Holidays= సెలవులు- ముఖ్యంగా విద్యార్థుల విషయంలో

a) They are on a holiday/ they have gone on a holiday= (కొన్నిరోజులపాటు) పని నుంచి విరామం/ విశ్రాంతి పొందటం. ఊళ్లు తిరుగుతూ వినోదంగా గడపటం.

b) I haven't been <u>on a holiday</u> for the past one year= ఏడాదిగా విశ్రాంతి/ విరామం ఎరగను.

Expression No 4: I've been dying, No. 6: I am eager, No.8: Anxious, No. 9: Can't wait, and No. 10: How impatient you are. వీటన్నిటికి అర్థాలు <u>దాదాపు</u> ఒకటే - ఆతృత పడటం, ఆతృతతో ఎదురు చూడటం, తహతహలాడటం, త్వరపడటం.

Dying= ఈ సందర్భంలో Dying కూ, దాని మామూలు అర్థం- మరణానికి సంబంధం లేదు. ఇక్కడ dying అంటే తహతహలాడటం.

He is dying to become a minister= మంత్రి కావాలని తహతహలాడుతున్నాడు

He is <u>very eager</u> to become a minister= He is <u>anxious</u> to become a minister= He <u>can't wait</u> to become a minister= He is <u>impatient</u> to become a minister. ఇవన్నీ ఒకే అర్థాన్నిస్తాయి. ఆయన మంత్రవటానికి ఎంతో ఆతృతగా ఉన్నాడని/ తహతహలాడుతున్నాడని.

**ఈ మాటలకు ఇతర సందర్భాల్లో అర్థాలు చూద్దాం.**

**i)** Dying - ఇదందరికీ తెలుసు - చావబోతున్న దశలో ఉండటం.

Dying to do something= తహతహలాడటం.

The child <u>is dying to see</u> its mother= తల్లిని చూడటానికి బిడ్డ తహతహలాడుతోంది.

**ii)** eager= ఆతృతగా ఉండటం= anxious.

a) The hero is eager to see/ anxious to see his son also as an actor= ఆ hero కు తన కొడుకును కూడా actor గా చూడాలని ఆతృతగా ఉంది.

b) The patient is eager/ anxious to see the doctor= రోగి doctor ను చూడటానికి ఆతృత పడుతోంది.

అయితే eager కు లేని అర్థం, anxious కు ఉన్న ఇంకో అర్థం- మానసికంగా ఆందోళనచెందటం.

c) The mother is <u>anxious</u> about the child's condition

ఆ తల్లి తన బిడ్డ పరిస్థితి (ఆరోగ్యం) గురించి ఆందోళనచెందుతోంది.

ఇక్కడ anxious కు బదులు eager వాడం. అర్థం ఒకటే అవదు. anxious కు, worried వాడొచ్చు

d) The MD (Managing Director) is <u>anxious</u> about the loss in the profits of the company.

Company లాభాల తగ్గుదల గురించి MD ఆందోళన చెందుతున్నాడు= ఆదుర్దా పడుతున్నాడు.

Anxiety= ఆందోళన (మానసికం)

e) She wants to see a psychiatrist about her anxiety= తన మానసిక ఆందోళన విషయం గురించి ఆమె మానసిక వైద్యుడ్ని సంప్రదించాలనుకుంటోంది.

**iii)** Can't wait= వేచి చూసే ఓర్పు లేకపోవటం.

(wait మామూలర్థం ఎదురుచూడటం)

a) He can't wait to go to the US= అమెరికాకు ఎప్పుడెప్పుడు వెళ్దామా అనుకుంటున్నాడు.

b) He can't wait to meet his lover= తన ప్రియురాల్ని ఎప్పుడెప్పుడు కలుసుకుందామా అని ఉన్నాడు.

**iv)** impatient= మామూలు అర్థం, ఓర్పు లేకపోవటం, అసహనంగా ఉండటం (opposite of patient)

a) He doesn't want to wait. He is impatient to go= అతడు ఆగటంలేదు/ ఆగాలని లేదతడికి - వెళ్లిపోవాలని తొందరపడుతున్నాడు.

b) He was impatient at my replies= నా సమాధానాలకతడు ఓర్పు కోల్పోయాడు/ అసహనం ప్రదర్శించాడు.

ఇవీ ఈ నాలుగు expressions వివిధ అర్థాలు, వాడుక. వీటిని మీ conversation లో practice చేయండి. అర్థవంతంగా ఉంటుంది. ఇక మిగతా మాటల సంగతి చూద్దాం.

**5)** I've packed up= సామాన్లు సర్దుకోవటం- ప్రయాణానికి, ఇల్లు మారటానికి, etc.

a) Pack up and get out= సామాన్లు సర్దుకొని వెళ్లిపో.

b) He was packed up and is about to leave= సామాన్లు సర్దుకుని వెళ్లటానికి సిద్ధంగా ఉన్నాడు.

c) Time for us to pack up= మూటాముల్లె సర్దుకోనే time వచ్చింది.

**7)** envy= ఎన్వీ- 'ఎ' నొక్కి పలుకుతాం= ఈర్ష్య, ఒకరికున్న వస్తువు మనకు లేకపోతే వచ్చే బాధ- పక్కవాళ్లకు కారుంది, మనకు లేదు- అప్పుడు We <u>envy</u> them. (వాళ్లంటే మనకు ఈర్ష్య).

a) She envies her sister because she has more jewellery= ఆమె sister కు ఎక్కువ నగలుండటం ఆమెకు ఈర్ష్యగా ఉంది.

b) I envy your health= నీకు ఆరోగ్యం ఉంది, నాకు లేదు- అందువల్ల ఈర్ష్య.

**11)** Laze (about)= ఏ పనీ చేయకుండా lazy (సోమరి)గా ఉండటం.

a) I like to laze about on the weekend= వారాంతం పనిచేయకుండా సోమరిగా గడపటం నాకిష్టం.

b) He wastes money and time. He Lazes about: Time, డబ్బు వృథా చేస్తాడు. సోమరిగా ఉంటాడు.

c) Don't laze about. Do some work = సోమరిగా ఉండకు, ఏదో పనిచెయ్.

**12)** The nine month grind: grind అంటే- పిండిచేయటం అనేది మామూలు అర్థం.

a) We <u>grind</u> wheat into fine powder (flour) for making chapathis = గోధుమను మనం చపాతీల కోసం పిండి చేస్తాం. grind కు past tense, past participle- ground.

b) He ground the wheat into flour = గోధుమలను పిండి చేశాడు (మరలో)

flour = flower లా pronounce చేయాలి- ఫ్లఅ= పిండి. wheat flour = గోధుమ పిండి.

కాని ఇక్కడ grind కు అర్థం - శ్రమ, కృషి.

Nine month grind - తొమ్మిది నెలల శ్రమ

c) I need at least a week's break after this grind ఇంత శ్రమపడింతర్వాత నాకు కనీసం వారం విశ్రాంతి అవసరం.

d) Put him through the grind = వాడ్ని కష్టపడి పనిచేయనీ.

e) Every trainee has to go through daily grind of six hour = ప్రతి trainee (శిక్షణ పొందేవాడు) రోజుకు ఆరు గంటల శ్రమ చేయాల్సి ఉంటుంది.

**13)** get even = పగ తీర్చుకోవటం/ సరిసమానమవటం.

a) In most Indian movies the hero gets even with the villain = చాలా Indian movies లో చివరకు hero, villain మీద పగ తీర్చుకుంటాడు.

b) In the 1st match India defeated Pak; but in the next match, Pak got <u>even with</u> India. మొదటి match లో ఓడిన Pak, రెండో match లో India తో సమానమైంది.

c) Next month when I go on a holiday, I get even with you = వచ్చే నెల నాకు holiday వచ్చినప్పుడు నీతో సరిసమానమవుతాను.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# Who knows what he has in his mind?




**Vikranth:** Any idea when Vijai is coming?
(విజయ్ ఎప్పుడొస్తున్నాడో తెలుసా? )

**Prasanth:** Not in the least. I don't know where he is now.
(అసలు తెలీదు. అతడెక్కడున్నాడో కూడా తెలియదు)

**Vikranth:** I do not know what he wants from me. He suddenly rang up yesterday to tell me he was coming. He didn't make clear why he would see me.
వాడికి నానుంచి ఏం కావాలో నాకు తెలియడంలేదు. ఉన్నట్టుండి నిన్న Phone చేసి వస్తున్నానని చెప్పాడు. నన్నెందుకు కలుసుకోవాలనుకుంటున్నాడో స్పష్టంగా చెప్పలేదు

**Prasanth:** I don't see why you didn't ask him when exactly he wanted to come. We have work now. We don't know whether to wait for him here or to go about our work.
(తను correct గా ఎప్పుడొస్తాడో నువ్వెందుకు అడగలేదో నాకర్థం కావటం లేదు. మనకేమో పనుంది. వాడి కోసం మనమిక్కడ wait చేయాలో మన పని మీద వెళ్లాలో తెలీడం లేదు)

**Vikranth:** I insisted that he tell me the purpose of his meeting, but he wouldn't. I don't know why.

**Prasanth:** Did you atleast ask him how he would becoming?
(కనీసం ఎలా వస్తాడో అడిగావా? )

**Vikranth:** No.

**Prasanth:** I don't see how you could be so indifferent. you could have fixed a time for his meeting us.
(అంత నిర్లక్ష్యంగా ఎలా ఉండగలిగావో అర్థం కావటం లేదు. అతడు మనల్ని కలుసుకోనే time అయినా నిర్ణయించి ఉండొచ్చు కదా? )

**Vikranth:** Look here, Prasanth. Not that I could not ask him all that. I was about to. But then he disconnected.
(అదంతా అడగలేకేం కాదు. అడగబోయే లోగా Phone పెట్టేశాడు.)

**Prasanth:** Why didn't you call him again?
(మళ్లీ నువ్వెందుకు Phone చేయలేదు? )

**Vikranth:** I didn't know which Phone he was calling from. I saw the number on my cell and called. He called from a public Phone.
(ఏ Phone లోంచి మాట్లాడుతున్నాడో నాకు తెలియలేదు. Cell లో ఆ number చూసి phone చేశాను. అది Public Phone)

**Prasanth:** I am not able to say whose fault it is.
(అది ఎవరి పొరపాటో నేను చెప్పలేకుండా ఉన్నాను)
We are unable to decide what we have to do now.
(ఇప్పుడు మనం ఏం చేయాలో తేల్చుకోలేకుండా ఉన్నాం)

**Vikranth:** Ah here he is! He has come.
(ఆ.. వచ్చాడ్లే)

**Prasanth:** What a relief!
(అబ్బ వచ్చాడు కదా!)
ఈసారి నుంచి కాస్త advanced level of conversational skills చూద్దాం. అందు కని చాలా జాగ్రత్తగా గమనించండి.

**Now look at the following sentences from the conversation above.**

1) Any idea when Vijai is coming?
2) Not in the least. I don't know where he is now.
3) I do not know what he wants from me.
4) He didn't make clear why he would see me.
5) I don't see why you didn't ask him when exactly he wanted to come.
6) We do not know whether to wait for him here or go about our work.
7) I insisted that he tell me the purpose of his meeting.
8) I don't know why
9) Did you at least ask him how he would be coming.
10) I don't see how you could be so indifferent
11) I didn't know which phone he was calling from.
12) I am not able to say whose fault it is.

మనం ఇంతకు ముందు clauses ను గురించి తెలుసుకున్నాం కదా. మరోసారి గుర్తు చేసుకుందాం.
A clause is a group of words with a verb. (verb ఉండే group of words ను clause అంటాం కదా.)
In most sentences above, they are clauses beginning with 'wh' words (why, what, when, where, which, who, whom, whose, and how)
ఈ 'wh' clauses మన daily conversation లో very common. తెలుగులో మనం మాట్లాడేటప్పుడు ఎందుకు, ఎవరితో, ఎంతో, ఎవరిదో, ఎలాగో, అనే వాటిని sentences లో వాడుతుంటాం కదా. అది English లో మాట్లాడేటప్పుడూ ఉంటుంది. ఉదాహరణకు పై వాటిల్లో I don't know where he is now అనేది తీసుకుందాం = వాడెక్కడున్నాడో నాకు తెలీదు. Where he is అతనెక్కడ ఉన్నాడో.

**let us take the clauses which begin with 'wh' words in the other sentences:**

1) Any idea when vijai is coming =
విజయ్ ఎప్పుడొస్తాడో నీకేమన్నా idea ఉందా?
3) I do not know what he wants from me =
వాడికి నానుంచి ఏం కావాలో నాకు తెలియడం లేదు.
4) He didn't make clear why he would see me
వాడు నన్నెందుకు చూడాలనుకుంటున్నాడో స్పష్టం చేయలేదు.
5) a) I don't see why you didn't ask him =
నువ్వెందుకు అడగలేదో నాకర్థం కావటం లేదు.
(see = చూడటం, కలుసుకోవటం, అర్థం చేసుకోవటం)
b).... when exactly he wanted to come =
ఎప్పుడు correct గా రావాలనుకున్నాడో
6) We do not know whether to wait him for or to go about our work =
మనం అతడి కోసం చూడాలో లేదా మన పనిమీద వెళ్లాలో తెలియడం లేదు.
(Whether మిగతా 'wh' words లాంటిది కాదు choice express చేయటానికి వాడే మాట)
8) I don't know why =
ఎందుకో తెలీదు
9) Did you atleast ask him how he would be coming =
ఎలా వస్తాడో అనైనా అడిగావా?
10) I don't see how you could be so indifferent =
అంత నిర్లక్ష్యంగా ఎలా ఉండగలిగావో నాకర్థం కావడంలేదు
11) I didn't know which phone he was calling from =
ఏ phone నుంచి చేస్తున్నాడో నాకు తెలీలేదు.
12) I am not able to say whose fault it is =
అది ఎవరి తప్పో నేను చెప్పలేకపోతున్నాను.


M. SURESAN

పైన underline చేసిన clause లన్నీ కూడా 'wh' word clauses. అయితే ఒక ముఖ్య విషయం ఇవి 'wh' words తో ప్రారంభమవుతున్నా, questions కావు అని గమనించాలి. అందుకనే అవి question structure (wh+verb+subject/wh word + Helping verb + Sub +Main verb) లో లేవు, ఉండకూడదు. ఇవి 'wh' word తో ప్రారంభమైనప్పటికీ, statement లో భాగాలే కదా అందుకని statement structure. statement లో ఎప్పుడూ ముందుగా subject తరవాత verb వస్తాయి. అందుకని ఇక్కడ కూడా wh word తో వచ్చే clauses అన్నింటిలో wh word తరవాత sub+verb structure లో ఉండాలి.

**eg:** అతడు ఇప్పుడెక్కడున్నాడో నాకు తెలీదు.
మీకిపాటికి తెలిసే ఉంటుంది. englishలో word order పదాల అమరిక sentenceలో తెలుగు word order కు చాలావరకు oppositeగా ఉంటుంది. కుడి ఎడమ అవుతుంది. కాబట్టి పై sentence ఎలా begin చేస్తాం? I dont know తో
I dont know when he will be here. (when will he be here కాదు కదా?) ఇంకా చూడండి.
a) ఎవరిని పిలుస్తాడనేది వాడికి సంబంధించిన విషయం = who he is going to invite (whom - old fashioned) is his business.
b) వాడి మనసులో ఏముందో ఎవరికి తెలుసు?
who knows what he has in his mind?
(ఇక్కడ who knows భాగం question. అందుకని question mark.)
c) ఆ పుస్తకం ఎక్కడుందో నీకు తెలుసా? =
Do you know where the book is?
(మళ్లీ గమనించండి where the book is = పుస్తకం ఎక్కడ ఉంది? అని కాదు అర్థం. 'పుస్తకం ఎక్కడ ఉందో' అని
d) అతనెప్పుడొస్తున్నాడో నీకెవరన్నా చెప్పారా? =
Has any one told you when he will be coming?
అలాగే ఈ కింది 2 sentenceకూ తేడా చూడండి:
1 a) why did he go there? I want to know
ఈ రెండు sentencesనూ కలిపి అనండి:
b) I want to know why he went there.
a) లోని మొదటి sentence question కాబట్టి why did he go? అంటాం.
b) రెండు sentences కలిపి అంటున్నాం కాబట్టి I want to know why he went there అంటాం.
2 a) where did he buy it?
I wish to know
ఈ రెండు sentenceనూ కలిపి ఒక sentenceగా అంటే ఎప్పుడేమవుతుంది? I wish to know where he brought it అంటాం.
ఇలాంటిది బాగా practice చేయాలి మన conversation బాగా freeగా, fluentగా ఉండాలంటే ముఖ్యంగా ఇలాంటి సందర్భాల్లో అర్థం చేసుకోవాల్సింది 'wh' words తో ప్రారంభమయ్యేవి ఎప్పుడూ questions అవనక్కరలేదనీ, wh word తో ప్రారంభమయ్యే clauses statement structureలో కూడా ఉంటాయని.

**exercise: practise the following in English**

**Vilas:** నువ్వెప్పుడు తిరిగొస్తావో నాకు correctగా చెప్పలేదు.
**Kailas:** ఎప్పుడొస్తానో నాకే correct idea లేదు
**Vilas:** kumar నీతో చెప్పలేదా ఆపనికి ఎంత time పడుతుందో అని?
**Kailas:** వాడికి phone చేయాలనుకుంటున్నా. వాడెక్కడున్నాడో నాకు తెలీదు. వాడే నాకు phone చేస్తానన్నాడు. ఇంతవరకు ఎందుకు phone చేయలేదో అర్థం కావటంలేదు.
**Vilas:** సరే. వాడికి phone చేసి మళ్లీ నువ్వెప్పుడు రాగలవో నాతో చెప్పు. మనం ఎప్పుడు బయల్దేరాలో నిర్ణయించావా?
**Kailas:** నేనెలా నిర్ణయించగలను నేనెప్పుడొస్తానో నాకే తెలియకపోతే?
**Vilas:** అయితే kumar కు వెంటనే phone చేసి decide చెయ్యి.

**Answer:**
**Vilas:** you haven't (have not) told me correctly when you will return.
**Kailas:** I dont my self/ I myself (నాకే) have a correct idea when I will return
**Vilas:** Hasn't kumar told you how much time it will take?
**Kailas:** I want to call him. I don't know where he is. He said he would call me. I don't see why he hasn't phoned me.
**Vilas:** OK. Phone him and tell me when you can come back again. Have you decided when we should return.
**Kailas:** when I don't know myself when I will return
**Vilas:** Then phone kumar and decide.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Saran:** Congrats Varun. I really felt very happy when I heard that our team had won the match yesterday. I shall be delighted if I hear more such news.
(మన team నిన్న గెలిచిందని వినగానే, చాలా సంతోషపడ్డాను. ఇలాంటి వార్తలు ఇంకా వింటే నేను సంతోషిస్తాను.)

**Varun:** Thank you, sir. We are glad that we always have your encouragement.
(మీ ప్రోత్సాహం మాకుండటం మాకెప్పుడూ సంతోషమే)

**Saran:** Boys, I was telling you all along that you should not lose confidence.
(మీకు నేను చెబుతూనే ఉన్నాను కదా, ఆత్మ విశ్వాసం కోల్పోకూడదని.)

**Varun:** Thank you again sir. In fact we didn't expect that we would win. But we played to our capacity. The other team's mistakes helped us.
(మళ్లీ thanks. అసలు మేం గెలుస్తామనుకో లేదు. అయితే మా శక్తికొద్దీ ఆడాం, అవతలి team పొరపాట్లు మాకు సహాయం చేశాయి.)




Clause అంటే- Verb ఉన్న group of words. మనం మాట్లాడేటప్పుడు మన sentences లో వీలైనంతవరకూ clauses తగ్గించుకుంటే sentences సరళంగా అందరికీ అర్థం అయ్యేట్లుంటాయి. అయితే క్లాజులు ఎలా వదిలించుకోవటం? Infinitives వాడి. Infinitive అంటే? ఇంతకుముందు రెండు, మూడు సార్లు వివరించాం కదా? మళ్లీ గుర్తుచేస్తున్నాం.

గమనించండి: Infinitive అంటే, to + Ist RDW (Regular Doing Word)- to go, to come, to walk, to learn, etc. ఇవన్నీ infinitives.

Infinitive కు అర్థం-
1) ఫలాన పనిచెయ్యాలని (to go = వెళ్లాలని)
2) ఫలాన పనిచేయటం (to go = వెళ్లటం)
3) ఫలాన పనిచేయటానికి (to go = వెళ్లటానికి)

**a)** I want to go =
నాకు వెళ్లాలని ఉంది.

**b)** To go now is not safe =
ఇప్పుడు వెళ్లటం క్షేమం కాదు.

**c)** He stood up to go -
వెళ్లటానికి లేచి నిలుచున్నాడు.

చాలా సందర్భాల్లో పెద్దపెద్ద clause లకు బదులు, Infinitive వాడి సంభాషణ సరళం చేయవచ్చు.
How we can do it is the matter of this lesson.

**Let's now look at the following sentences from the conversation above.**




**2)** I shall be delighted if I hear more such news = (delighted = సంతోషంగా ఉండటం)

**3)** We are glad that we always have your encouragement =
We are glad to have your encouragement

**4)** I was telling you all along that you should not lose confidence =
I was telling you not to lose confidence

**5)** We didn't expect that we would win the match =
... expect to win

**6)** I warned you that you shouldn't take things lightly and that you should be aggressive =
I warned not to take things lightly and to be aggressive.

**7)** We.. that we have such encouragement and advice from you =

**4)** ఇలాంటి శిల్పం చూసినందుకు నాకు పులకింతగా ఉంది.
I am thrilled that I have seen such a beautiful statue =
I am really thrilled to have seen...
ఇలాంటి examples ను మీరూ practice చేయండి. Infinitive వల్లనే కాకుండా, దాంతోపాటు ఇంకే విధంగానైనా sentences ను సరళం చేయటాన్ని practice చేయండి.

# We are glad to have your..

**Saran:** I warned you too that you should not take things lightly, and you should be aggressive.
(మిమ్మల్ని హెచ్చరించాను కూడా, దేన్నీ తేలికగా తీసుకోకూడదనీ, దూకుడుగా ఉండాలనీ.)
aggressive= దూకుడుగా, చొరవగా ఉండటం

**Varun:** True sir. We are delighted that we have such encouragement and advice from you. We are thrilled that we have won this difficult match.
(నిజమండి. అలాంటి ప్రోత్సాహం, సలహా మీరు మాకిస్తున్నందుకు చాలా సంతోషంగా ఉంది. ఇంత కష్టమైన match గెలిచామని పులకింతగా ఉంది.)

**Saran:** My only desire is that I should not hear about the defeat of our college team in any match.

**Varun:** You can be sure that we will always do our best sir.
(శాయశక్తులా మేం ప్రయత్నం చేస్తామని మీరు నమ్మొచ్చు)

**Saran:** I was a bit hurt when I heard some of the lecturers talking low of our team.
(మన lecturers లో కొందరు మన team గురించి తక్కువ చేసి మాట్లాడారని బాధ పడ్డాను).

**Varun:** Let them sir. They will be surprised when they hear our team too can win matches.
(మాట్లాడనివ్వండి, sir, మన team కూడా matches గెలవగలదని తెలుసుకున్నప్పుడు ఆశ్చర్యపోతారు).

**Saran:** OK boy, keep it up. (అలాగేకానీ).

English conversation, simple గా, direct గా ఉంటే చాలా సహజంగా ఉంటుందని మొదటినుంచి చెప్తూనే ఉన్నాం. ఈ lesson లో ఇది మరోసారి చూద్దాం.


M. SURESAN

**1)** I really felt happy when I heard that our team had won the match.

**2)** I shall be delighted if I hear more such news.

**3)** We are glad that we always have your encouragement.

**4)** I was telling you all along that you should not lose confidence.

**5)** ...We didn't expect that we would win the match.

**6)** I warned you that you should not take things lightly and that you should be aggressive

**7)** ... We are delighted that we have such encouragement and advice from you

**8)** We are thrilled that we have won this difficult match

**9)** My only desire is that I should not hear about the defeat of our college team

**10)** I was a bit hurt when I heard some of the lecturers talking low...

**11)** They will be surprised when they hear our team too can win matches.

**All the parts of sentences underlined above are clauses, aren't they? We are now going to simplify them by using infinitives in their places.**

**clauses స్థానంలో infinitives వాడి sentences ను ఇలా సరళం చేయండి.**

**1)** I really felt happy when I heard our team had won the match.
I really felt happy to hear that our team had won the match... to hear about our team's success.
చూడండి ఎంత simple అయిపోయిందో to hear తో infinitive వల్ల.

We are delighted to have such encouragement and advice from you =
...to have your encouragement and advice.

**8)** We are thrilled that we have won this difficult match =
We are thrilled to have won this difficult match

**9)** My only desire is that I should not hear about the defeat of our college team =
My only desire is not to hear the ... of our college teams

**10)** I was a bit hurt when I heard some of our lecturers talking low ... to hear some of our lecturers ...

**11)** They will be surprised when they hear our team... = They will be surprised to hear...

**So, you have seen how an infinitive can make your speech shorter, simpler and direct.**

పైన మనం infinitive తో replace చేసిన వాటిల్లో ఎక్కువ that clauses. (that తో begin అయ్యే clauses కదా) వీటిని ముఖ్యంగా infinitive తో replace చేసి, short చేయవచ్చు
ఇంకా చూడండి.

**1)** నువ్వు exam లో fail అయ్యావని వింటే నేను బాధ పడతాను =
I shall be sorry if I hear that you have failed the exam =
I shall be sorry to hear that you have...

**2)** అంత త్వరగా వెళ్లాల్సి వచ్చినందుకు నేను చాలా బాధ పడ్డాను =
I was sorry that I had to leave so early =
I was sorry to leave so early

**3)** ఇలాంటి ప్రశాంత ప్రదేశంలో నాకో ఇల్లుంటే సంతోష పడతాను =
I'd (I would) love it if I had a house in such a peaceful place = I'd (I would) love to have a house in...

## EXERCISE

**Practise the following aloud in English. Use only infinitives.**

**Komal:** నువ్వు foreign వెళుతున్నావని విని నాకు చాలా ఆనందంగా ఉంది.

**Syamal:** నువ్వు కూడా త్వరలోనే అక్కడికొస్తున్నావని తెలిసి నేను సంతోషిస్తున్నాను.

**Komal:** నేనా ప్రయత్నం మీద ఉన్నానని తెలిస్తే మా అమ్మా, నాన్నా నిజంగా బాధపడతారు. వాళ్లకు నేను లేకుండా ఉండటం కష్టంగా ఉంటుంది.

**Syamal:** నన్ను వెళ్లనివ్వటం మా అమ్మకు ఇష్టం లేదు. కానీ నేనే నచ్చజెప్పాను.

**Komal:** మా అమ్మ వాళ్లకు నేను త్వరగా తిరిగి వచ్చేస్తానని మాట ఇస్తా. వాళ్లకు త్వరలో అది అలవాటై పోతుంది.

**Syamal:** అయితే మా నాన్న మాత్రం చాలా ఉప్పొంగిపోయాడు నాకీ అవకాశం వచ్చిందని వినటానికి.

**Komal:** నేనూ ప్రయత్నిస్తా.

## ANSWER

**Komal:** I am very happy to hear that you are going abroad/ about your travel abroad.

**Syamal:** I am happy too that to know that you too are coming.

**Komal:** Mom and dad will be sorry to know about my trials. It will be difficult for them to be without me.

**Syamal:** Mom didn't like to hear it first, but I convinced her.

**Komal:** I will promise to mom and dad to return early. Soon they will get used to it.

( get used = be used = అలవాటుపడటం)

**Syamal:** Dad was happy to hear that I got this opportunity.

**Komal:** I'll try too.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






# Who do you know here?

**Sampurna:** Here is the book you asked for yesterday
(నిన్న నువ్వడిగిన పుస్తకం ఇదిగో)

**Prapurna:** Happy it's here. Where did you find it?
(సంతోషం. నీకు ఎక్కడ కనిపించింది? )

**Sampurna:** It was among the books you kept in the shelf.
(shelf - అల్మారాలో నువ్వు పెట్టిన పుస్తకాల్లో ఉంది.)

**Prapurna:** Oh I forgot to look for it there. Nirmala wanted it.
(అక్కడ వెదకటం మరచిపోయా. నిర్మలకు అది కావాల్సి వచ్చింది.)

**Sampurna:** Which Nirmala?

**Prapurna:** The girl I introduced to you, the other day, on our way to the shop.
(మనం మొన్నోరోజున shop కెళ్తున్నప్పుడు నీకు నేను పరిచయం చేసిన అమ్మాయి.)

The other day = మొన్నోరోజున

**Sampurna:** Isn't that the girl you call the college beauty?
(నువ్వు college beauty అనేది ఆ అమ్మాయే కదా? )

**Prapurna:** That she is. But that's also one you find to be very simple and humble too.
(అవును. అయితే అదే అమ్మాయి చాలా simple, నిగర్వి కూడా.)

humble= గర్వం లేకుండా ఉండటం

**Sampurna:** She is the one who all like, you said.
(అందరూ మెచ్చుకొనేది ఆ అమ్మాయినే అన్నావు కదా నువ్వు? )

**Prapurna:** She is getting married. Who do you think she is going to marry?
(త్వరలోనే పెళ్లి చేసుకోబోతోంది. ఎవరిని అనుకుంటున్నావు? )

**Sampurna:** Who do you take me for? Am I an astrologer? How do I know unless you tell me?
(నేనెవర్ననుకుంటున్నావు? జోస్యుడినా ఏమిటి? నువ్వు చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది? )

**Prapurna:** My cousin Sravan.

**Sampurna:** Do I know him?
(అతడు నాకు తెలుసా? )

**Prapurna:** Yea. You met him last summer. Software engineer in the US. He is the guy we sent pickles to, last month. Don't you remember?
(తెలుసు. పోయిన summer నువ్వతడిని చూశావు. గుర్తుందా, కిందటినెల అతడికి మనం pickles = ఊరగాయలు పంపాం)

**Sampurna:** I remember him.

English conversation లో whom, which ఉపయోగాలు చాలా interesting గా ఉంటాయి. ముఖ్యంగా questions. వీటితో questions అడిగే విషయంలో చాలా మార్పొచ్చింది. మన conversation, modern గా ఉండాలంటే వీటిని ఎక్కడ వాడకూడదో తెలుసుకోవటం చాలా ముఖ్యం.

**I. Whom** = ఎవరిని, ఎవరికి (to తో) - ఇది మనందరికీ తెలుసు.

1. Whom do you want to meet here? = మీరిక్కడ ఎవరిని కలవాలనుకుంటున్నారు?
2. Whom do you know here? = మీకిక్కడ ఎవరు తెలుసు?
3. Whom did she consult? = ఆమె ఎవరిని సంప్రదించింది?

పై questions లో మనకేం విచిత్రం అనిపించడం లేదుకదా? అవన్నీ questions. ఎవరిని అనడానికి English లో whom వాడతాం. అయితే పై విధంగా whom తో questions అడగటం/ begin చేయటం పూర్తిగా old fashioned. English సరిగ్గా మాట్లాడుతున్నవారెవరూ అలాంటి questions అడగరు. ఎవరైనా అలాంటి questions అడిగితే వింతగా వినిపిస్తుంది speakers of modern English కు.

ఇప్పటి (present day) వాడకం (usage) లో whom వాడాల్సినచోట who వాడేస్తున్నారు.

Who? = ఎవరు? ; whom? = ఎవరిని?

**a)** Who did this? = ఇది ఎవరు చేశారు?
**b)** Who sees such movies? = అలాంటి సినిమాలు ఎవరు చూస్తారు?
**c)** Whom do you know? = మీకెవరు తెలుసు?
**d)** With whom did you come?= నువ్వు ఎవరితో వచ్చావు?

So we know the difference between who and whom, don't we?

Modern English లో ఎవరు? ఎవరిని? అనే రెండు అర్థాలతోనూ who వాడేస్తున్నారు. అదే correct కూడా.

Study (పరిశీలించండి) the following:

**1.** మీరిక్కడ ఎవరిని కలవాలనుకుంటున్నారు?
a) Whom do you want to meet here?
(Old fashioned and incorrect. పాత వాడుక - తప్పు)
b) Who do you want to meet here?
(Modern usage and correct. ఇప్పటివాడుక - right).

**2.** మీకిక్కడ ఎవరు తెలుసు? =
a) Whom do you know here. (old fashioned and wrong)
b) Who do you know here? (Modern and correct)

**3.** ఆమె ఎవరిని సంప్రదించింది?
a) Whom did she consult? (Old fashioned and wrong)
b) Who did she consult? (Modern and correct)

**Now observe the following:**

**1.** మీరు సినిమాకు ఎవరితో వెళ్లారు?
Who did you go to the movie with?
(Old form and incorrect with whom did you go to the movie?)

**2.** మీకు ఆ సమాచారం ఎవరి నుంచి వచ్చింది?
Who did you get the information from?
(From whom did you get the information? wrong -old usage)

**3.** నువ్వు ఎవరిని గురించి మాట్లాడుతున్నావ్?
Who are you talking about?
(Old form and incorrect: About whom are you talking?/ Whom are you talking about?)

ఇది చాలా జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి English conversation లో. ఎవరిని అని questions అడిగేటప్పుడు whom లేనట్లే. దాని బదులు who వాడటం correct.

**a)** నిన్న నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావు?
Who were you talking to yesterday?
(with/ to whom were you talking కాదు)

**b)** అతడు ఎవరిని పెళ్లి చేసుకుంటున్నాడు?
Who is he marrying?
(Whom is he marrying? కాదు)

**c)** నువ్వెవరికి సహాయం చేస్తున్నావు?
Who are you helping?
(Whom are you helping కాదు)

**II. Who, whose, whom and which-** వీటిని questions అడగటానికే కాకుండా, రెండు మూడు sentences ను ఒక sentence గా కలపటానికి కూడా వాడతాం.

**a)** I saw a man. He was taller than six feet.
నేనొక మనిషిని చూశాను. అతడు ఆరడుగులకంటే ఎత్తు (గా ఉన్నాడు). ఈ రెండు sentences ను ఒకటిగా చేద్దాం.
I saw a man who was taller than six feet
(ఆరడుగులకన్నా ఎక్కువ ఎత్తయిన మనిషిని నేను చూశాను)

**b)** He is a doctor. He charges high fees.
ఆయనో వైద్యుడు. అతడు ఎక్కువ fees తీసుకుంటాడు. కలపండి:
He is a doctor who charges high fees.

**c)** She is a great doctor. Everyone likes her.
ఆమె గొప్ప doctor. ప్రతివాళ్లూ ఆమెని ఇష్టపడతారు. కలపండి:
She is a great doctor whom everyone likes.
ఇక్కడ 'whom' ఒకప్పుడు correct, ఇప్పుడు whom బదులు who వాడతాం.
She is a great doctor who everyone likes.

**d)** He is the person who I consult before taking a decision. నిర్ణయం తీసుకునేముందు నేను consult చేసేది ఆయన్నే. (ఇక్కడ whom పాతబడిపోయింది. who correct.)

అయితే ఓ ముఖ్యమైన విషయం: ఇలాంటిచోట్ల whom వాడటంలేదు. దాని బదులు who వాడుతున్నారు. ఇప్పుడు రెండింటిలో ఏదీ వాడకుండా మాట్లాడటం ఆమోదయోగ్యం.


M. SURESAN

**a)** ప్రతివాళ్లూ ఇష్టపడే doctor ఆమె.
She is a doctor everyone likes.
చూశారా? ఇక్కడ everyone ముందు who/ whom లేకపోవటం. ఇదీ present usage.

**b)** నిర్ణయం తీసుకునేముందు నేను సంప్రదించే వ్యక్తి ఆయన.
He is the person I consult before taking a decision. (the person who/ whom I consult అనటంలేదిప్పుడు. who వాడితే తప్పులేదు)

**c)** Secretary గా వాళ్లెన్నుకున్నది ఆ student నే.
He is the student they have elected secretary (student who/ whom కాదు) who వాడొచ్చు

**d)** నేను అభిమానించే teacher ఆయన
He is the teacher I admire.
(who/ whom కాదు. who వాడవచ్చు)

**III. Which** విషయం కూడా ఇంతే. Which కూడా రెండు మూడు sentences ఒకటిగా కలపడానికి వాడతాం.

**eg:** He bought a car. It is blue.
ఆయన car కొన్నాడు. అది blue
The car which he bought is blue.

**b)** I gave you a book. It is my sister's.
(నీకో పుస్తకం ఇచ్చాను. అది మా sister ది)
The book which I gave you is my sister's.

Modern conversation లో పై sentences లాంటి వాటిల్లో whom లాగా, which కూడా పూర్తిగా వదిలేస్తున్నారు.

**a)** The car which he bought is blue =
The car he bought is blue.

**b)** The book I gave you is my sister's

ఇలాంటి sentences నే ఈ lesson ప్రారంభంలో సంపూర్ణకు, ప్రపూర్ణకు జరిగిన సంభాషణలో చూడండి.

**1)** Here is the book you asked for yesterday (The book which you asked for - old usage) = నువ్వు నిన్నడిగిన పుస్తకం ఇదిగో.

**2)** It was among the books you kept in the shelf. (The books which you kept - old usage) = నువ్వు shelf లో పెట్టిన పుస్తకాల్లో ఉందది.

**3)** The girl I introduced to you
నేను నీకు పరిచయం చేసిన అమ్మాయి
(The girl whom (wrong)/ Who (right) I introduced to you)

**4)** ... the girl you call college beauty? =
నువ్వు college beauty అనే అమ్మాయి
(the girl whom (wrong) / who (right) you call college beauty?)

**5)** ... but that (she) is also one you find to be very simple and humble =
simple గా నిగర్విగా కనిపించే అమ్మాయి కూడా తనే
(she is also the girl whom (wrong)/ who (right) you find simple and humble)

**6)** She is the one who all like =
అందరూ ఇష్టపడే అమ్మాయి =
She is the one all like (who అక్కరలేదు, whom తప్పు)

**7)** Who, do you think, she is going to marry? =
ఆమె ఎవరిని పెళ్లి చేసుకోబోతోందనుకుంటున్నావు?
(ఎవరిని అన్నా కూడా whom రాదు)

**8)** Who do you take me for? =
నేనెవర్నని అనుకుంటున్నావు?
(whom రాదు - 'ఎవర్ని' అన్నప్పటికీ)

**9)** He is the one we sent pickles to =
మనం ఊరగాయలు పంపినతను. (to whom రాదు)

## EXERCISE

**Practise the following aloud in English**

**Vasanth:** నిన్న నువ్వు మాట్లాడుతున్నదెవరితో?
**Hemanth:** నువ్వు మొన్న chess ఆడిన శశిర్‌తో
**Vasanth:** మంచి game ఆడతాడు. నేను మెచ్చుకొనే వాళ్లలో అతనొకడు.
**Hemanth:** చాలా చురుకు. అతను ఆడే game అర్థం చేసుకోవటం చాలా కష్టం. అలాంటి game ఆడతాడతను.
**Vasanth:** నువ్వు చాలా నేర్చుకోగల వాళ్లలో అతనొకడు. నేను చాలా ఇష్టపడేవాళ్లలో అతనొకడు.
**Hemanth:** అతని దగ్గరకు రేపెళ్దామా?
**Vasanth:** అతని మామ అందరూ మెచ్చుకునే గొప్ప lawyer. ఆయన రేపొస్తున్నాడు. మనం ఎల్లుండి వెళ్దాం.

## ANSWER

**Vasanth:** Who were you talking to, yesterday?
**Hemanth:** Sasir, you played chess with the day before.
**Vasanth:** He plays a good game. He is among those I admire.
**Hemanth:** Quite smart/ sharp. Difficult to understand the game he plays. He plays such a game.
**Vasanth:** He is one you can learn a lot from, and I like a lot.
**Hemanth:** Shall we go to him tomorrow?
**Vasanth:** His uncle is a lawyer everyone praises. He is coming tomorrow. We will go the day after.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Tarun:** No bus is coming. No auto (is) in sight. So what are we going to do?
(Bus ఏదీ రావటం లేదు. Auto అయినా కనిపించటం లేదు. ఏం చేద్దామంటావు? )

**Kiran:** Let's start walking. If we chance upon an auto on the way we'll take it, or else I don't mind walking the whole distance.
(అయితే నడుద్దాం. మధ్యలో Auto దొరికితే దానిలో వెళ్దాం. లేకుంటే మొత్తం దూరం నడవటానికీ నాకభ్యంతరం లేదు.)

On the way = దారిలో

Chance upon = అనుకోకుండా కనిపించడం

**Tarun:** You talking of walking! That's surprising since when did you start liking walking, buddy?
(నువ్వు నడుద్దామంటున్నావా! ఆశ్చర్యమే! ఎప్పటి నుంచి నడక మీద ఇష్టం కలిగింది నీకు? )

buddy = ప్రియ మిత్రుడిని సంబోధించే విధానం (American)

**Kiran:** Stop it. I've always liked walking. I avoid walking only in hot sun or when I don't have the time.




**eg. a)** To walk (నడవటం) is good for health (ఆరోగ్యకరం) = walking (నడవటం) is good for health

**b)** To get up so early is not easy = getting up so early is not easy =
అంత త్వరగా నిద్రలేవటం సులభం కాదు.

**c)** I hate to get up late =
ఆలస్యంగా నిద్రలేవటం నేనిష్టపడను =
I hate getting up late.

**d)** He likes to swim in cold water =
చన్నీళ్లలో ఈదటం అతనికిష్టం =
He likes swimming in cold water.

గమనించాం కదా - Infinitive వాడే చోట్ల '-ing'.

పై sentences లో ఒక విషయం ముఖ్యంగా గమనిస్తాం. sentences a), b) ల్లో Infinitive నూ, '-ing' form నూ independent గా అంటే sentence కు subject గా వాడాం.

అదే, c), d) ల్లో Infinitive నూ, '-ing' form నూ hate, like లాంటి verbs తర్వాత వాడాం కదా.

a), b) ల్లో లాగా independent గా వాడేటప్పుడు infinitive ను '-ing' form నూ ఒకదాని బదులు ఇంకొకటి ఎప్పుడైనా వాడొచ్చు.

**a)** To waste time/ wasting time is never good

**b)** To walk alone/ walking alone at midnight is not always safe =




**2)** I don't mind walking - verb mind దాని తర్వాత walking, '-ing' form. Mind అంటే అభ్యంతరం చెప్పటం.
I don't mind walking =
నడవటం నాకభ్యంతరంలేదు.
Mind తర్వాత ఎప్పుడూ '-ing' form వస్తుంది.
లేకపోతే noun వస్తుంది.

**eg:** I don't mind the expenditure =
ఆ ఖర్చు నాకభ్యంతరంలేదు / ఖర్చు విషయం నేను పట్టించుకోను. Expenditure, noun కదా.
'-ing' form తో: I don't mind spending the money =
ఆ డబ్బు ఖర్చుపెట్టటం నాకేం బాధకాదు.
Mind పక్కన 'if' clause వస్తుంది.
He doesn't mind if I use his bike =
అతడి bike నేను వాడుకుంటే అతనేం అనుకోడు.

**6)** I shall appreciate your walking =
నువ్వు నడవటం నేను సంతోషిస్తాను/ మెచ్చుకుంటాను.
appreciate + your walking ('-ing' form)
She will appreciate your help =
నీ సహాయాన్ని ఆమె హర్షిస్తుంది.
appreciate + help (noun)
Appreciate తర్వాత 'If' clause కూడా వాడతాం.
**a)** I shall appreciate if you walk
**b)** I shall appreciate if you help me.
a), b) ల్లో appreciate + 'if' clause.

**7)** I hate backing out -
వెనకడుగు వేయటం నాకిష్టంలేదు =
I hate to back out (hate + infinitive). hate తర్వాత రెండూ, అంటే Infinitive, '-ing' form వాడవచ్చు.

**8)** You waste time talking - ఇక్కడ కూడా waste తర్వాత ఏది waste చేస్తామో దాన్ని చెప్పి, ఆ తర్వాత 'ing' form వస్తుంది.
**a)** He wastes time talking about others =
ఇతరులను గురించి మాట్లాడుతూ time waste చేస్తాడు.
**b)** He wastes money indulging in luxuries =
విలాసాల్లో పాల్గొంటూ ధనం వృథా చేస్తాడు.
ఇక్కడ infinitive రాదు.

# She likes dancing

(ఇక ఆపు. నాకు నడకంటే ఎప్పుడూ ఇష్టమే. బాగా ఎండగా ఉన్నప్పుడు, నాకు time లేనపుడు మాత్రమే నడక మానతాను.)

Avoid = మానటం!/ చేయకుండా ఉండటం

**Tarun:** Ok. Let's stop arguing. Come, let's enjoy walking. As you said I shall appreciate your walking the whole distance.
(సర్లే. మనం వాదించడం ఆపి నడకను enjoy చేద్దాం. నువ్వన్నట్టు అంత దూరమూ నడిస్తే నాకు సంతోషమే/ నిన్ను మెచ్చుకుంటా.)

Appreciate = సంతోషించటం/ మెచ్చుకోవటం

**Kiran:** Come on. Let's start. I hate backing out.
(పద, బయల్దేరదాం. వెనక్కి తగ్గటం అంటే నాకు ఇష్టం ఉండదు.)

**Tarun:** You waste time talking. Show it in action. Start walking
(మాటలతో time వృథా చేస్తున్నావు. చర్యలో చూపించు. నడక ప్రారంభించు)

**Kiran:** Ok. I am off. Whoever first stops walking shall stand the other a drink, ok?
(ఇదిగో బయల్దేరాను. నడక ఎవరు ఆపుతారో వాళ్లు అవతలివారికి drink ఇప్పించాలి, సరేనా? )

stand a drink/ a dinner/ party, etc. = drink, dinner, party, etc ఇప్పించడం)

**Tarun:** I am game for it.
(నేనందుకు సిద్ధమే.)

J J J

English లో అన్ని verbs వాడకం ఒకేలా ఉండదు. కిందటి lesson లో చూశాం కదా- Infinitive వాడి clauses ను వదిలించుకుంటే మన conversation చాలా simple గా, natural గా ఉంటుందని. అలాగే కొన్ని కొన్ని verbs తర్వాత '-ing' form వాడితే conversation, bookish (గ్రాంథికం)గా కాకుండా వ్యావహారికంగా వినసొంపుగా ఉంటుంది.

కొన్ని కొన్ని సందర్భాల్లో infinitive బదులు '-ing form (going, coming, walking లాంటివి) వాడతారు. ఇవి కూడా sentence పొట్టి చేయటానికి ఉపయోగపడతాయి. Infinitive (to + 1st RDW) కు ఉన్న అర్థాల్లో ఒకటి రాయటం, తినటం, నేర్చుకోవటం (to write, to eat, to learn) కదా. ఇదే అర్థంతో '-ing' form వాడొచ్చు.

అర్ధరాత్రిపూట ఒంటరిగా నడవటం క్షేమం కాదు.


M. SURESAN

అయితే (c), (d) ల లాంటి sentences లో కొన్ని verbs పక్కనే infinitive, '-ing' form మార్చి వాడగలం. కొన్ని ఇతర verbs, expressions పక్కన Infinitive ను మాత్రమే కానీ, '-ing' form ను మాత్రమే కాని వాడగలం. కింది verbs పక్కన రెండూ వాడగలం.

**1) Start 2) begin 3) like 4) dislike 5) love 6) hate 7) remember 8) forget 9) propose, etc.**

**1)** He started to sing/ started singing
పాడటం మొదలుపెట్టాడు

**2)** She began to run = she began running =
పరుగు మొదలెట్టింది

**3)** She likes to dance = She likes dancing =
నాట్యం చేయటం ఆమెకిష్టం

**4)** She loves to cook = She loves cooking =
వంట చేయటం ఆమెకు చాలా ఇష్టం

అలాగే మిగతావాటితో కూడా అంటే **4)** dislike **6)** hate **7)** remember **8)** forget and **9)** propose (ప్రతిపాదించటం). ఆ verbs పక్కన infinitive, '-ing' form రెండూ వస్తాయేమో చూడండి.

**Now look at the following sentences from the conversation between Tarun and Kiran at the beginning of the lesson.**

**1)** Let's start walking.
**2)** I don't mind walking...
**3)** I avoid walking
**4)** Let's stop arguing
**5)** Let's enjoy walking
**6)** ... I shall appreciate your walking
**7)** I hate backing out
**8)** You waste time talking

Look at sentence No 1. The verb 'start' has 'ing' after it.

'start' తర్వాత infinitive అయినా, '-ing' form అయినా వాడొచ్చు అని చూశాం కదా.

కాబట్టి 'mind' పక్కన '-ing' form / noun/ 'if' clause వస్తాయి. infinitive మాత్రం రాదు.

**Sentence No 3** లో 'avoid' తర్వాత కూడా 'ing' form కానీ, noun కానీ వస్తుంది. infinitive రాదు. [avoid = (ఏదైనా పని) చేయకుండా ఉండటం]

**a)** I avoid walking ('-ing' form) =
నేను నడవటం మానుకుంటా.

**b)** He avoids Govind because he owes him money.
(అతడు Govind కు అప్పున్నాడు కాబట్టి చూడకుండా తప్పించుకు తిరుగుతున్నాడు)
ఇక్కడ avoid = ఒకరిని చూడకుండా / కలుసుకోకుండా ఉండటం.
Why are you avoiding me? =
ఎందుకు నన్ను చూడకుండా ఉన్నావు?
ఇక్కడ avoid తర్వాత Govind అనేది noun కదా.
Avoid తర్వాత '-ing form'/ noun వస్తాయి. infinitive వాడం.

**c)** she always avoids classes (noun) in the after noon =
ఆమె మధ్యాహ్నం తరగతులకు ఎప్పుడూ రాదు.

**Sentence 4)** Stop arguing - stop తర్వాత కూడా noun/ ing form మాత్రమే వస్తాయి. infinitive రాదు.

**a)** He stopped singing - పాడటం ఆపేశాడు
stopped + singing ('-ing' form)

**b)** He stopped the song in the middle =
పాట మధ్యలో ఆపేశాడు
stopped + the song (noun)
ఇక్కడ కూడా 'stop' తర్వాత infinitive రాదు.

**Sentence No. 5**

'Enjoy' too is followed either by the '-ing' form or a noun, but not by the infinitive.
Let's enjoy walking - enjoy + walking ('-ing' form)

**a)** I enjoy music = నేను సంగీతాన్ని enjoy చేస్తాను
enjoy + music (noun)

**b)** She enjoys reading books =
పుస్తకాలు చదవటం ఆమెకిష్టం
enjoy + reading ('-ing' form). enjoy తర్వాత infinitive రాదు.

## Practise the following aloud in English

**Laxman:** Hi Arjun, ఏంటి విశేషాలు?
**Arjun:** ఏదో అలా జరిగిపోతోంది. నీ చేతిలో ఆ పుస్తకం ఏంటి?
**Laxman:** ఏదో detective novel. అటువంటివి చదవటం నీకిష్టంలేదుకదా?
**Arjun:** Correct. నువ్వెందుకు అలాంటివి చదువుతూ time waste చేసుకుంటావు? వాటికంటే మంచి novels చాలా ఉన్నాయి కదా?
**Laxman:** నిజమే. కానీ వీటిని చదవటానికే నేను ఎక్కువ ఇష్టపడతాను. Serious novels చదవటం నేను avoid చేస్తాను. అంత concentrate చేయలేను నేను.
**Arjun:** అంతా అలవాటును బట్టి ఉంటుంది. చదవటం ప్రారంభించు. వాటిని ఇష్టపడటం మొదలవుతుంది.
**Laxman:** అదీ ప్రయత్నించాను. కాని ఇష్టపడలేకపోయాను.
**Arjun:** మళ్ళీ ప్రయత్నించు.

### ANSWER

**Laxman:** Hi Arjun, what news? / what's new?
**Arjun:** Just getting on. What's that book in your hand?
**Laxman:** Some detective novel. (Some= ఏదో). You don't like reading such books, do you? / You don't like to read such books, do you?
**Arjun:** Correct. Why do you waste time reading them? Aren't there better books than they?
**Laxman:** True. But I love reading / I love to read these. I avoid reading serious novels. I cannot concentrate so much.
**Arjun:** It's all a matter of habit. Begin reading them/ Begin to read them. You begin liking them./ You begin to like them.
**Laxman:** I tried but I could not like them.
**Arjun:** Try once again.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# Let me recollect where I..




**Raghav:** Hi Madhav, how are you? You appear much better than last week. There is surely some improvement in your health.
(ఎలా ఉన్నావు? గత వారం కంటే మెరుగ్గా కనిపిస్తున్నావు. కచ్చితంగా నీ ఆరోగ్యం పుంజుకున్నట్టుంది)

**Madhav:** You can say that. I feel much better now.
(నిజమే. ఇప్పుడు చాలా బాగున్నాను, ఇంతకు ముందుకంటే)

You can say that = అలా నువ్వు చెప్పొచ్చు = నువ్వు కరక్టే

**Raghav:** What's that due to? I don't recollect seeing you earlier as fit as you are today.
(ఏంటి కారణం? ఇవాళ కన్పడుతున్నంత ఆరోగ్యంగా ఇంతకుముందెప్పుడూ చూసినట్లు గుర్తులేదు.)

recollect = గుర్తు తెచ్చుకోవటం. fit = ఆరోగ్యంగా ఉండటం

**Madhav:** Thanks to my doctor. He insisted on my giving up smoking, and I gave up smoking, though I found it difficult in the beginning.
(అంతా మా డాక్టర్ వల్ల. నేను smoking మానేయాలని పట్టుబట్టాడు. మొదట్లో కొంచెం కష్టమైనప్పటికీ మానేశా.)

Thanks to my doctor = మా doctor వల్ల. 'వల్ల' అనే అర్థంతో Thanks to వాడొచ్చు, మంచి జరిగినా, చెడు జరిగినా. He died, thanks to the doctor's negligence - వాడు చనిపోయాడు, doctor నిర్లక్ష్యం వల్ల

**Raghav:** So (do) you deny smoking anymore?
(అయితే, నువ్వు smoking చేయటం లేదంటున్నావా?)

deny - కాదనటం/ లేదనటం

**Madhav:** Do you think I'm a fool to go on doing something that costs my life?
(నా ప్రాణానికే హాని కలిగించే పని చేస్తూండటానికి నేనేమన్నా మూర్ఖుడినా?) I don't fear death but I don't like dying of cancer. (నేను చావుకు భయపడను, కాని cancer తో చావటం నాకిష్టం లేదు)

**Raghav:** Happy to hear that. Whenever I saw lighting a cigarette I couldn't help feeling you were burning out your life
(సంతోషం. నువ్వు ఎప్పుడు cigarette ముట్టించడం చూసినా, నువ్వు నీ ప్రాణాల్ని తగలబెట్టుకుంటున్నావనే భావం నాలో తప్పేదికాదు)

**Madhav:** I now practise swimming too. Every morning I go swimming.
(ఇప్పుడు ఈత కూడా practise చేస్తున్నా. రోజూ ఈతకెళ్తున్నా)

**Raghav:** Good. Though late you've given up smoking. Better late than never.
(బాగుంది. ఆలస్యంగానైనా smoking మానుకున్నావు. అసలు మానకుండా ఉండటం కన్నా ఆలస్యంగా మానటం నయం కదా.)

Better late than never = ఇది Englishలో సాధారణంగా అంటుంటారు. అర్థం: ఒక పని అసలు చేయకుండా ఉండేకన్నా ఆలస్యంగా చేయటం మంచిది కదా అని.

* * *

గత రెండు మూడు lessons లో మనం infinitives, '-ing' forms గురించి చర్చిస్తున్నాం కదా. We have seen how certain verbs are always followed by an Infinitive/ -ing form /noun/ an if clause, or just by an '-ing' form.

**Now let's see some more verbs followed by the '-ing' form/ noun.**

**Look at these following sentences from the conversation between Raghav and Madhav.**

1) I don't recollect seeing you earlier as fit as you are now.
2) ... and I gave up smoking.
3) So (do) you deny smoking any more?
4) Do you think I am a fool to go on doing some thing...
5) ... I couldn't help feeling...
6) I now practise swimming too.

మీరు గమనించారు కదా. పై sentences లోని verbs అన్నింటి పక్కనా '-ing' form రావటం. ఇది conversation లో రకరకాల భావాలను simple గా express చేయటానికి ఉపయోగపడుతుంది. మీ conversation లో practice చేయండి.

1) I don't recollect seeing you = నిన్నలా చూడటం నాకు గుర్తుకు రావటం లేదు. (Remember = మనకు గుర్తుకు రావటం. Recollect/ recall = మనం ప్రయత్నించి గుర్తుకు తెచ్చుకోవటం.)

a) I remember seeing him somewhere = అతడిని నేనెక్కడో చూసినట్లు గుర్తొస్తోంది. (మన ప్రయత్నం లేదు)

b) Let me recollect where I saw him = ఎక్కడ చూశానో గుర్తు తెచ్చుకోనీ (మన ప్రయత్నం).

c) He recalled later that she owed him money = తనకామె బాకీ ఉన్నట్లు ఆయన గుర్తు తెచ్చుకున్నాడు (ఆయన ప్రయత్నం)

అయితే 'Try to remember' అనటం వాడుక, గుర్తు తెచ్చుకొనేందుకు ప్రయత్నించు, అనే అర్థంలో అప్పుడప్పుడు మనం కూడా ఇది వాడుతుంటాం కదా? Try as I might, I am unable to remember if he came here that day = ఎంత ప్రయత్నించినా జ్ఞాపకం తెచ్చుకోలేకపోతున్నా, అతనారోజు ఇక్కడికొచ్చాడా, లేదా అని.

Recollect తర్వాత noun కూడా వాడతాం. '-ing' form మాత్రమే కాకుండా.

I recollected the events of the day = ఆ రోజు సంఘటనలు నేను గుర్తుకు తెచ్చుకున్నా. events = సంఘటనలు - Noun.

2) ... and I gave up smoking = నేను smoking మానుకున్నా.

give up = మానేయటం/ వదలుకోవటం (పదవులు, అలవాట్లలాంటి వాటిని)

give up తర్వాత కూడా '-ing' form కానీ, noun కానీ వాడతాం. (noun అంటే మళ్లీ గుర్తు తెచ్చుకుందాం.. ఏ పేరైనా noun.)

a) I gave up smoking = smoking మానుకున్నాను.
smoking '-ing' form

b) I gave up cigarettes = cigarettes మానుకున్నా. - cigarettes - noun.

c) Harischandra gave up his throne for the sake of truth : హరిశ్చంద్రుడు సత్యం కోసం సింహాసనాన్ని వదిలేశాడు.
Throne = సింహాసనం - Noun.

d) He was a fool to give up the job = ఆ job వదులుకున్నాడతను - మూర్ఖుడు. Job - noun.

3) (Do) you deny smoking anymore?
= నువ్వు ఇక smoke చేయటం లేదంటావా?
deny + smoking. '-ing' form.
deny = కాదనటం/ లేదనటం. దీని తర్వాత కూడా '-ing' form కానీ, noun కానీ వస్తుంది. That clause కూడా వస్తుంది.

a) He denied stealing the pen = తను ఆ pen దొంగిలించలేదన్నాడు.
denied + stealing - stealing '-ing' form.

b) Dushyanta denied seeing Sakuntala or loving her = దుష్యంతుడు శకుంతలను చూడటం కానీ, ప్రేమించటం కానీ చేయలేదన్నాడు.
denied + seeing or loving - '-ing' forms.

c) She denied the truth in his statement = ఆమె అతని మాటల్లో నిజం లేదంది.
denied + truth - noun.

d) The minister denies his statement = మంత్రి తన మాటలను కాదంటున్నారు (అనలేదంటున్నారు).

e) The minister denies the media reports = మీడియా వార్తలను మంత్రి కాదంటున్నారు.
denied + the reports (noun)

4) Do you think I am a fool to go on doing something... = అది చేస్తూ ఉండటానికి నేను మూర్ఖుడ్నను కుంటున్నావా?
to go on = (ఓ పని) చేస్తూ ఉండటం. go on తర్వాత కూడా, చేస్తూ ఉండటం అనే అర్థంతో '-ing form' మాత్రమే వస్తుంది.

a) Though defeated, he goes on arguing ఓడిపోయినా, వాదిస్తూనే ఉంటాడాయన.


M. SURESAN

b) In spite of the doctor's advice, he goes on smoking = Doctor వద్దన్నా, అతను smoke చేస్తూనే ఉన్నాడు.

c) He goes on talking, whether others listen to him or not = అతను చెప్పేది ఇతరులు వింటున్నా వినకపోయినా, మాట్లాడుతూనే ఉంటాడు.

a) goes on + arguing ('-ing' form)
b) goes on + smoking ('-ing' form)
c) goes on + talking ('-ing' form)

d) They went on shouting and throwing stones at the police = వాళ్లు అరుస్తూనే ఉన్నారు, Police ల మీద రాళ్లు రువ్వుతూనే ఉన్నారు. (Past)
Went on (past of go on) + shouting and throwing ('-ing' forms)
అయితే go on తర్వాత 'with' వాడితే noun వస్తుంది.

a) She went on with her studies in spite of disturbances = Disturbances ఉన్నప్పటికీ తన చదువు కొనసాగించింది.

b) They go on with their work whatever the trouble = ఏ trouble ఉన్నా వాళ్ల పని వాళ్లు చేసుకుపోతారు.

a) Went on with + studies (noun)
b) go on with their work [with + work (n)]

5) I could not help feeling... = అనుకోవటం తప్పలేదు. ఈ expression కాస్త జాగ్రత్తగా గమనించండి.
I cannot help going now = ఇప్పుడు నాకు వెళ్లక తప్పదు. (ఇక్కడ వాడిన help కు, సహాయం అనే అర్థానికి సంబంధం లేదు- ఇక్కడ cannot help కలిపి వాడతాం- అర్థం - 'తప్పదు' అని).
I could not help feeling = అనుకోవటం తప్పలేదు.
ఈ cannot help పక్కన కూడా '-ing' form కానీ, noun కానీ వస్తుంది.

a) She cannot help the expenditure if she wants to learn music = సంగీతం నేర్చుకోవాలంటే ఆమెకి ఖర్చు తప్పదు. (expenditure = ఖర్చు - noun).

b) She cannot help spending this money, if she wants to learn music = ఆమె సంగీతం నేర్చుకోవాలంటే ఖర్చుపెట్టడం తప్పదు. (Spending ఖర్చు పెట్టడం - '-ing' form).

c) They cannot help the trip if they want to have a darsanam = దర్శనం కావాలంటే వాళ్లకి ప్రయాణం తప్పదు. (cannot help + the trip (noun))

d) They cannot help going on the trip if they want a darsanam = దర్శనం కావాలంటే ప్రయాణం చేయటం తప్పదు. (cannot help + going on the trip (-ing form))

6) Practise కూడా అంతే: Practise అంటే అభ్యసించటం. దీని తర్వాతకూడా noun/ '... ing' form వస్తుంది.
I practise swimming = ఈత practise చేస్తాను.
(practise + swimming - '-ing' form)

a) She practises running everyday = ఆమె రోజూ పరుగు practise చేస్తుంది.
(practises + running - '-ing' form)

b) She practises music = సంగీతం అభ్యసిస్తుంది.
(practises + music - noun)
So, ఇలాంటి verbs జాగ్రత్తగా practice చేయండి.

## EXERCISE

**Practise the following aloud in English:**

**Mithun:** అతనితో ఎందుకు మాట్లాడతావు? అతను ఎవరు చెప్పినా వినడు.

**Sachin:** నాకు తప్పదు. వాడి దగ్గర నా books ఉన్నాయి. అవి వచ్చేవరకు వాడితో friendly గానే ఉండాలి.

**Mithun:** అలాంటివాడని తెలిసి కూడా నువ్వు వాడికి పుస్తకాలెందుకిస్తూ ఉంటావు?

**Sachin:** పుస్తకాలు తీసుకుంటే తిరిగివ్వడనే మాట కాదనటం లేదు. కానీ వాళ్లన్న నాకు మంచి friend.

**Mithun:** నువ్వు వాడితో మాట్లాడటం మానుకుంటే పుస్తకాలివ్వక్కరలేదుగా. (give up వాడండి)

**Sachin:** వాళ్లన్న తీసుకున్న పుస్తకాలివ్వటంలో ఇంత ఆలస్యం చేయటం నాకు గుర్తులేదు.

**Mithun:** ఇద్దరికీ పోలికేలేదు.

### ANSWER

**Mithun:** Why do you talk to him? He never listen to anyone.

**Sachin:** I can't help talking to him. He has my books. Until I get them back, I have to be friendly with him.

**Mithun:** Why do you go on giving him books, when you know that he is that type?

**Sachin:** I don't deny his not returning the books he takes, but his brother is a good friend of mine. (I don't deny that he does not return the books he takes...)

**Mithun:** If you give up talking to him you need not lend him books.

**Sachin:** I don't remember his brother delaying the return of books.

**Mithun:** They are very unlike each other.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Pranuthi:** Hi Sumathi, (it's a) pleasure seeing you, though after a long time. How's everybody?
(చాలాకాలం తర్వాతయినా నిన్ను కలుసుకున్నందుకు సంతోషం. అంతా కుశలమేనా?)

**Sumathi:** Everybody is OK. (It's) nice seeing you too.
(అంతా క్షేమం. నిన్ను చూడటం కూడా నాకు ఆనందంగా ఉంది)

**Pranuthi:** What's (What has) kept you away so long?
(నువ్విన్నిరోజులు ఎందుకు నన్ను కలవలేదు/ చూడలేదు/ ఏమైందిన్ని రోజులు?)

**Sumathi:** You know I'd been very busy preparing for the civils. I sat the last exam the day before (yesterday). It's off my mind now. Oh, what a relief!
(నీకు తెలుసుగా నేను civils (= IAS, IPS, etc., exams) తో తీరిక లేకుండా ఉన్నాను. మొన్న చివరి exam రాశాను. అయిపోయింది. ఎంత హాయిగా ఉందో!)

**Pranuthi:** I think you delayed taking the exams. You should have attempted them last year itself.
(నువ్వు ఆలస్యం చేశావు. నువ్వు పోయిన సంవత్సరమే రాసుండాల్సింది.)
(last year itself = గత సంవత్సరమే)




We have been discussing the use of the '-ing' form for some time now, haven't we? We have seen so far the verbs which are followed by the '-ing' forms.

ఒక verbs మాత్రమే కాకుండా, కొన్ని ఇతర expressions తర్వాత కూడా '-ing' forms వాడుతుంటారు. ఇది మన conversations సంక్షిప్తంగా ఉండటానికి సాయపడుతుంది.

ఆ expressions కొన్ని తెలుసుకుందాం.

Now, Look at the following sentences from the dialogue between Pranuthi and Sumathi above.

1. (It's a) pleasure seeing you, though after a long time.
2. (It's) nice seeing you too
3. I've been very busy preparing for the civils
4. I think you delayed taking the exams
5. It's not easy preparing for the exam
6. ... there is no knowing what happens..
7. Civils are always worth trying
8. ... candidates have difficulty making it to the top.
9. Sometimes the results are long coming.

1. It's a pleasure seeing you, though after a long time.
2. It's nice seeing you too. ఇక్కడ pleasure/ nice పక్కన '-ing' form వాడకం గమనించండి. మీకు తెలుసుగదా, pleasure meeting you, nice meeting you పలకరింపు మాటలని.


M. SURESAN

a) He delayed taking a decision = నిర్ణయం తీసుకోవటంలో జాప్యం చేశాడు. taking - '-ing' form

b) They delayed coming to an agreement = ఒప్పందం కుదుర్చుకోవటంలో జాప్యం చేశారు.
గతంలో చూశాం, delay తర్వాత noun కూడా వాడొచ్చని.

c) The government delayed the project = ప్రభుత్వం project ను ఆలస్యం చేసింది.

d) They delayed the completion of the bridge = Bridge పూర్తిచేయటాన్ని వాళ్లు ఆలస్యం చేశారు.
(c), (d) లలో delayed తర్వాత, project, completion, రెండూ nouns కదా.

5. It's not easy preparing for the civils = civils కు prepare అవటం సులభం కాదు. Preparing- 'ing' form)

a) It is easy convincing mother = అమ్మకు నచ్చచెప్పటం సులభం= It is easy to convince mother అంటే easy తర్వాత '-ing' form అయినా వాడొచ్చు infinitive అయినా వాడొచ్చు

b) It wasn't easy operating the machine = ఆ machine ను నడపటం సులభం అనిపించలేదు = It wasn't easy to operate the machine.

b) She had a lot of difficulty understanding what he had said = అతను చెప్పింది అర్థం చేసుకోవటం ఆమెకు చాలా కష్టమయింది.
ఇలా difficulty తర్వాత '-ing' form వస్తుంది.
(ఒక్కొక్కప్పుడు difficulty + in + ing form కూడా వస్తుంది. కానీ ఇప్పుడిది అరుదు, 'in' వదిలేస్తున్నారు)

9) ... the results are long coming =
long + coming ('-ing' form) = ఆలస్యమవుతాయి.

a) He was long/ He took long buying a house = ఇల్లు కొనటం జాప్యం చేశాడు.

b) I won't be long coming = నేను రావటం ఆలస్యం చేయను. (long + coming -ing form)

c) He took long deciding what to do ఏం చేయాలో నిర్ణయించుకోవటానికి చాలా time తీసుకున్నాడు.
ఇది modern English conversation లో చాలా common.

d) She wasn't long/ didn't take long marrying the young man she loved. తను ప్రేమించినతడిని పెళ్లి చేసుకోవటంలో ఆమె ఆలస్యం చేయలేదు.
ఈ expressions అన్నింటి పక్కన '-ing' form వాడటం ఇప్పటి వాడుక. బాగా practice చేయండి.

# It's a pleasure seeing you

**Sumathi:** True. But I felt I needed time. It's not easy preparing for that kind of exams, is it?
(నిజమే. కానీ ఇంకాస్త time కావాలనిపించింది నాకు. / కానీ time చాలదనిపించింది. అలాంటి exams కు prepare కావటం అంత సులభం కాదుకదా.)

**Pranuthi:** So how did you in the exams?

**Sumathi:** To my satisfaction of course. But then there is no knowing what happens until the results are out.
(నా తృప్తి మేరకు రాశాను. అయినా ఫలితాలు వెలువడేవరకు ఏమీ తెలియదు/ చెప్పలేం)

**Pranuthi:** Happy that you leave fared well. Civils are always worth trying.
(నువ్వు బాగా రాసినందుకు సంతోషం. civils ఎప్పుడూ ప్రయత్నించదగ్గవే.)
(worth trying = ప్రయత్నించదగిన)

**Sumathi:** They are, undoubtedly. But they are quite tough. Even brilliant candidates have difficulty making it to the top ranks.
(కచ్చితంగా. అయితే ఈ exams చాలా కష్టం. చాలా తెలివిగల అభ్యర్థులు కూడా పై ranks తెచ్చుకోవటానికి కష్టపడుతుంటారు.)
tough = కష్టం (exams విషయం.)
quite = పూర్తిగా/ బాగా.
brilliant = చాలా తెలివైన. (అసలు అర్థం = చాలా ప్రకాశవంతమైన)

**Pranuthi:** Still there is nothing wrong in hoping for the best, you see. Sometimes the results are long coming.
(అయినా మంచిని ఆశించటంలో తప్పేంలేదు. ఒక్కొక్కప్పుడు results రావటానికి time పడుతుంది)

J J J J

ఇలా పలకరింపు సందర్భాల్లో pleasure, nice లాంటి మాటల తర్వాతే కాకుండా glad తర్వాత కూడా '-ing' form వాడటం గమనించే ఉంటారు.

Glad meeting/ seeing you. (పరిచయమైనప్పుడు, అంటే introduction అప్పుడు)

Glad knowing you - (ఇదికూడా introduction అప్పుడు వాడే expression.

(అయితే ఈ మాటలన్నిటి తర్వాత, పలకరింపు, పరిచయ సందర్భంలో '-ing' form బదులు, infinitive కూడా వాడవచ్చు

Pleasure/ nice/ glad seeing you/ knowing you/ meeting you = pleasure/ nice/ glad to see/ to know/ to meet you.

3) I'd been busy preparing for the civils =
నేను civils కు prepare అవుతూ busy గా ఉన్నా/ తీరికలేకుండా ఉన్నా.
ఇక్కడ busy పక్కన, ఏ కారణం వల్ల busy అన్నప్పుడు అది '-ing' form లో వాడతాం.

a) She is busy making arrangements for the dinner =
ఆమె dinner ఏర్పాట్లతో తీరికలేకుండా ఉంది.

b) They are busy inviting people to their daughter's marriage =
వాళ్లమ్మాయి పెళ్లిపిలుపులతో వాళ్లు busy గా ఉన్నారు.

c) I was busy the whole of last week moving to our new home. గత వారం అంతా ఇల్లు మారటంతో తీరికలేకుండా ఉన్నా/ ఇల్లు మారటంతో సరిపోయింది.
అయితే busy with తర్వాత noun వస్తుంది.

a) I was busy with the arrangements for the meeting. (meeting ఏర్పాట్లతో busy గా ఉన్నా- arrangements - noun.)

b) She is busy with the exams = పరీక్షలతో తీరిక లేకుండా ఉంది. [busy with + the exams (noun)]

4. delayed taking the exams. Exams కు కూర్చోవటం ఆలస్యం చేశావు.

c) It's always easy cheating an innocent man = అమాయకుడ్ని మోసం చేయటం ఎప్పుడూ సులభమే. ఇక్కడ కూడా cheating బదులు, to cheat వాడొచ్చు

6. There's no knowing what happens.
ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు/ తెలిసే వీలులేదు.
There is no knowing-
ఇది English conversation లో చాలా frequent గా వాడుతుంటారు. There is no knowing = No one knows/ No one can know.

a) That will happen, no doubt, but there is no knowing when = అది జరుగుతుంది, సందేహం లేదు. కాని ఎప్పుడనేది ఎవరూ చెప్పలేరు.

b) There was no knowing why he did it at all = అసలు వాడది ఎందుకు చేశాడనేది ఎవరికీ తెలియదు.

c) **Ram:** When is Laxman coming?
**Syam:** There's no knowing when he will come. (తెలియదు)

7. Civils are worth trying= civils ప్రయత్నించదగ్గవే.
worth = చేయదగిన/ విలువగల/ విలువ చేయటం.
worth తర్వాత '-ing' form కానీ, noun కానీ వస్తుంది.

a) The movie is worth watching =
సినిమా చూడదగ్గదే (watching - ing form)

b) It is not worth spending so much time =
అంత time వెచ్చించేంత విషయం కాదది.

c) This second hand car is not worth Rs. 1 lakh ఈ second hand car లక్ష రూపాయల విలువ చేయదు. (Rs 1 lakh = Noun)

d) The book is worth its weight in gold =
ఆ పుస్తకం దాని బరువంత బంగారం విలువగలది. (worth its weight - noun)

8. Candidates have difficulty making it to the top
తెలివైన అభ్యర్థులు కూడా ఉన్నత rank లు పొందటానికి కష్టపడతారు.
difficulty + making ('-ing' form)

a) I had difficulty finding the address =
ఆ address తెలుసుకోవటానికి నాకు కష్టమయింది.

## EXERCISE

**Pranav:** Hi Ramana, ఎప్పుడూ ఏదో చేస్తూ తీరిక లేకుండా ఉంటావు

**Ramana:** ఏం చేయను? మా ఇంటికి రోజూ ఎవరో ఒకరు అతిథులుగా వస్తారు. వాళ్ళక్కావాల్సిన ఏర్పాట్లతో నా time అంతా అయిపోతోంది.

**Pranav:** అయితే చదువుకోవటానికి time ఎప్పుడు దొరుకుతుందో?

**Ramana:** అదే నా సమస్య. చదువుకోవటానికి ఒక్క నిమిషం time దొరకటం కష్టంగా ఉంటోంది.

**Pranav:** ఇవాల్టి guests ఎప్పుడెళ్తారు? .

**Ramana:** అది ఎవరికీ తెలియదు- వాళ్లెప్పుడెళ్తారో?

**Pranav:** Exams వస్తున్నాయి కదా. వాటికి prepare అవటం అంత సులభం కాదుకదా?

**Ramana:** కాస్త ఇంటికి దూరంగా room తీసుకుంటా. అప్పుడే గొడవ లేకుండా చదవొచ్చు

**Pranav:** మంచి idea. అది చేయదగ్గదే.

**Ramana:** మా నాన్న ఊరినుంచి తిరిగి రాగానే ఆ పని చేస్తా. మా నాన్న ఆలస్యం చేయకుండా తిరిగొస్తాడనే ఆశిస్తున్నా.

## ANSWER

**Pranav:** Hi Ramana, you appear busy doing something or the other.

**Ramana:** What can I do? We have some guests or the other everyday. I spend the whole time attending on them. I am busy arranging for their stay.

**Pranav:** When do you find the time for study?

**Ramana:** That's my problem. I have difficulty finding a minute's time for study.

**Pranav:** When do today's guests go away?

**Ramana:** There's no knowing when they go away.

**Pranav:** Exams are fast approaching. It's not easy preparing for them.

**Ramana:** I want to take room some distance from home. I'll then be free from the disturbance.

**Pranav:** A good idea. worth trying.

**Ramana:** I'll do that after my father comes back. Hope he won't be/ take long coming.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Chandan:** Have you seen Pradhan, by any chance?

(నువ్వేమన్నా Pradhan ను చూశావా?

By any chance = ఏమైనా/ ఏమన్నా చూడటం తటస్థించిందా అనే అర్థంతో.

**Nandan:** I think yes. I saw him driving some where an hour ago. I could have stopped him, but I didn't like to.

(అవుననుకుంటా. గంట కిందట car లో ఎక్కడికో వెళ్లటం చూశాను. అతడిని ఆపి ఉండొచ్చు కానీ ఇష్టం లేకపోయింది.)

(driving = car లో వెళ్లటం)

**Chandan:** Is that so? He said he would see me today.

(అలాగా? నన్నీరోజు కలుసుకుంటానన్నాడు.)

**Nandan:** Not just today. In fact I see him drive down our road everyday at that time.

(ఈ రోజే కాదు. అసలు ప్రతిరోజూ అదే time కు car లో అదే వైపు వెళ్తూ కనిపిస్తాడు నాకు/ car లో వెళ్లడం చూస్తాను నేను.)

**Chandan:** You are right. I heard Pradhan say that he would go at that time every-day to attend yoga classes.

(నువ్వు చెప్పింది నిజమే. ప్రతిరోజూ ఆ time కు యోగా తరగతులకు వెళతానని అతడు చెప్పగా విన్నాను.)

**Nandan:** O... perhaps that's why I find him becoming more and more active nowadays.

(అదీ సంగతి. అందుకనే అతడు ఈ మధ్య active కావటం గమనిస్తున్నా.)

**Chandan:** He observed his nephew losing weight after attending the yoga classes. So he thought, 'why should-n't I as well?' and joined the classes. But I notice him gaining weight. He is more active as you have said, but has he lost any weight?

(అతడి nephew (= son of a brother or a sister) yoga classes కు వెళ్లటం తర్వాత బరువు తగ్గటం గమనించాడు. అతనను కున్నాడు, 'నేనూ ఎందుకు తగ్గకూడదూ?' అని. Yoga classes లో చేరాడు. కానీ నేను గమనించిందతను బరువు పెరగటం. నువ్వన్నట్టు చురుగ్గా అయితే అయ్యాడు కానీ, బరువేమన్నా తగ్గాడంటావా?)

**Nandan:** Come now Chandan; Yoga might not have slimmed down, but he has-n't certainly put on weight. Be fair to him.

(Chandan, ఇక ఆపు. యోగా అతడిని తగ్గించలేదేమో కానీ, లావు మాత్రం పెరగలేదు. అతడి విషయంలో కాస్త న్యాయంగా ఉండు.)

come now = Informal conversation లో come now= ఇక ఆపు.

fair= ఒకరిపట్ల న్యాయంగా ఉండటం

**Chandan:** Do you mean he hasn't put on weight?

(అయితే వాడు లావవలేదంటావా?)

put on weight= లావు/ బరువెక్కటం

**Nandan:** No, certainly not. I have noticed you having a dig at him whenever you find a chance.

(ఏమాత్రం లేదు. అవకాశం దొరికినప్పుడల్లా అతడిని ఆటపట్టిస్తావని నేనెప్పుడో గమనించాను.)

have a dig at= ఆట పట్టించడం/ గేలి చేయటం

**Chandan:** Nothing of the sort. I like him a lot.

(అదేం లేదు. వాడంటే నాకు చాలా ఇష్టం.)

Nothing of the sort = అదేం లేదు

'-ing' forms వాడాల్సిన ముఖ్యమైన సందర్భాల్లో, మరికొన్ని verbs ఉన్నాయి. ఈ verbs పక్కన ఎప్పుడూ '-ing' forms కానీ, 1st RDW (go, come, walk, etc) కానీ వస్తాయి.

**Now look at the following sentences from the conversation between Chandan and Nandan:**

1) I saw him driving an hour ago =
గంట కిందట అతడు car లో వెళ్లటం నేను చూశాను.

2) In fact I see him drive down the road at this time every day=
అసలు ప్రతి రోజూ ఇదే time కు ఈ రోడ్లో car లో వెళ్లటం నేను చూస్తాను.

3) I heard Pradhan say that he would go at that time every day... =
తను అదే time కు అలా వెళ్తానని Pradhan చెప్పగా విన్నాను.

4) ... that's why. I find Pradhan becoming more and more active nowadays=
అదీ. ఇప్పుడు ప్రధాన్ active గా ఉండటం గమనిస్తున్నాను.

5) He observed his nephew losing weight...
(అతడి nephew బరువు తగ్గటం అతడు గమనించాడు)

6) I have noticed you having a dig at him=
నువ్వతడిని ఆట పట్టించడం నేను గమనించాను.

**Look at the verbs in the sentences above: 1 & 2. saw 3. heard 4. find 5. observed 6. have noticed.**

**గమనించండి: పైన verbs అన్నీ కూడా చూడటం/ కనిపించటం, వినటం, గమనించటం, పరిశీలించటం అనే అర్థంతో ఉన్నాయి కదా.**







**4) find:**

a) The teacher found him working hard =
అతడు కష్టపడి పనిచేయటం (చదవటం) teacher చూశాడు.

b) We always find him sleeping =
మేం ఎప్పుడూ అతడు నిద్రపోతుండగా చూస్తాం.

c) The engineer has found the machine going out of order often=
తరచూ ఆ machine చెడిపోవటం ఆ engineer చూశాడు.

ఈ find పక్కన 1st RDW రాదు. That clause రావచ్చు

**5) observe:**

a) The invigilator has observed the student taking/ take a slip out of his pocket=
అతడు జేబులోంచి slip బయటకు తీయడం invigilator గమనించాడు.


M. SURESAN

ఇలా ఈ see, hear, find, observe, notice, watch లాంటి verbs పక్కనల్లా '-ing' form/ 1st RDW/ that clauses (కొన్నిచోట్ల) వస్తాయి. అయితే వీటి తర్వాత సామాన్యంగా 'that' clause వాడకుండా ఉండటం better. '-ing form'/ I RDW effective గా ఉంటుంది.

## NOW PRACTISE THE FOLLOWING ALOUD IN ENGLISH:

**Namratha:** సునీతెప్పుడూ ఒకేరకం బట్టలు వేసుకోవడం నేను చూస్తాను. తన బట్టల fashion లో మార్పేం ఉండదు.

**Charitha:** అదేం లేదు. తను తేడాగా ఉండే బట్టలు వేసుకోవడం నేను ఒకటి రెండుసార్లు గమనించాను.

**Namratha:** OK, తన విషయం ఎందుకులే. నువ్వెపుడన్నా సుప్రియ పాడగా విన్నావా?

**Charitha:** ఎందుకడుగుతున్నావు?

# I noticed her humming

అంటే ఇవన్నీ కళ్లు, చెవులు లాంటి జ్ఞానేంద్రియాలకు సంబంధించినవి.

వీటి తర్వాత ఎప్పుడూ '-ing' form కానీ, 1st Regular doing word (go, come, etc) కానీ, that clause కానీ వస్తుంది. ఏదో పనిచేస్తుండటం/ చేస్తుండగా చూడడం, గమనించడం, పరిశీలించడం జరిగిందనో, ఏదో అంటుండగా/ అంటుండటం వినటం జరిగిందనో అర్థం వస్తుంది.

(ఈ see, hear, find, observe, notice- వీటన్నింటిని verbs of sense perception అంటాం.)

(మన జ్ఞానేంద్రియాలు- sense organs- eyes, nose, ear, tongue, skin – వీటికి సంబంధించినవి.)

**1&2) saw: a)** I see him always watching / watch the TV / I see that he always watch the TV =
అతనెప్పుడూ TV చూడటం/ చూస్తుండగా చూస్తాన్నేను/ అతనెప్పుడూ TV చూస్తూ కనిపించేవాడు నాకు.

b) అతడు 11 గంటల సమయంలో బయటికి రావటం/ police లు చాలాసార్లు చూశారు/ అతడు 11 గంటల సమయంలో బయటకి వస్తూ కనిపించాడు police లకు=
The police saw him coming out/ come out at 11 a number of times. A number of times the police saw that he was coming out at 11.

c) ఆ restaurant అంటే అతనికిష్టంగా ఉన్నట్లుంది. అక్కడ తినటం చాలాసార్లు చూశాను=
He seems to like the restaurant a lot. I saw him eat/ eating there quite often.

అలాగే hear తర్వాత కూడా '-ing' form / I RDW వస్తాయి. ఒక్కొక్కప్పుడు that clause రావచ్చు

**3) heard: a)** I heard her sing / singing =
ఆమె పాడుతుండటం నేను విన్నాను.

b) We heard them quarrelling / quarrel about something-
వాళ్లు దేని విషయమో పోట్లాడుకోవటం మేం విన్నాం.

c) She heard him say / saying that he was going to buy a house = ఇల్లు కొనబోతున్నానని చెప్తుండటం / చెప్తుండగా ఆమె విన్నది.

(Invigilator= పరీక్ష rooms లో కాపీలాంటివి జరగకుండా చూసే teachers)

Observe తర్వాత 'that' clause వస్తుంది=
The invigilator observed that the student was taking out a slip from his pocket.

b) I have observed him bunk/ bunking classes quite often:
తరచూ అతడు classes ఎగ్గొట్టడం నేను గమనించాను.

c) She observed him looking/look at her =
అతడు తనవైపు చూడటం ఆమె గమనించింది.

**6) notice:** గమనించడం/ దృష్టిలో పడటం

a) Suddenly I noticed them going/ go out together=
వాళ్లు కలిసి బయటికి వెళ్లటం నా కంట పడింది.

b) I often notice her talking / talk to him=
ఆమె అతడితో మాట్లాడటం నేను తరచూ గమనిస్తాను./ ఆమె తరచూ అతనితో మాట్లాడుతూ నా కంట పడింది.

c) The police have noticed him visiting/ visit one house in the old town at midnight=
ఆ వ్యక్తి అర్ధరాత్రివేళ old town లో ఒక ఇంటికి వెళ్లటం గమనించారు/ వాళ్ల కంటపడింది.

ఇలాంటి verb ఇంకోటి 'watch' (గమనించటం)

a) She watched him water / watering the garden patiently =
అతడు ఓపిగ్గా తోటకు నీరుపెట్టడం ఆమె గమనించింది.

b) They have watched her dancing/ dance for an hour=
ఆమె గంటసేపు నాట్యం చేయటం వాళ్లు తిలకించారు.

c) The thief watched the inmates of the house going out/ go out, waited for some time, broke the lock and entered the house =
ఆ దొంగ ఇంట్లోవాళ్లు (inmates) బయటకు వెళ్లటం గమనించాడు. కాసేపాగి తాళం బద్దలుకొట్టి లోనికి ప్రవేశించాడు.

**Namratha:** చాలా బాగా పాడుతుంది. గత శనివారం cinema music director ఆమె పాడటం గమనించాడు. ఆమెకు సినిమాల్లో పాడే అవకాశం రావచ్చు

**Charitha:** తను కూనిరాగాలు పాడటం నేను గమనించాను. కానీ అంత గొప్ప గాయకురాలనుకోలేదు.

**Namratha:** ఆమె సినిమాలకు పాడటం త్వరలోనే వింటాం.

**Charitha:** తను శాస్త్రీయ సంగీతం CD లు వినటం నేను గమనించాను. (watch వాడండి)

**Namratha:** తనకు అదృష్టం కలిసి రావాలని ఆశిద్దాం.

## ANSWER

**Namratha:** I see Sunitha wear/ wearing the same style of dress/ dress of the same cut always. No change in the fashion of her clothes.

**Charitha:** No. I have observed her wear dress-es of different style once or twice.

**Namratha:** OK. Why talk of her now?/ Let's not talk of her now. Have you ever heard Sunitha sing/ singing?

**Charitha:** Why do you ask?

**Namratha:** She sings very well. A film music director observed her sing/ singing. Very soon she may get an opportu-nity to sing for movies.

**Charitha:** I noticed her hum/ humming (కూనిరాగాలు/ తనలోతనే పాడుకోటం) but I didn't think that she was a good singer.

**Namratha:** We can soon hear her sing/ singing for movies.

**Charitha:** I've watched her listening/ listen to classical music CD's.

**Namratha:** Let's wish her best of luck.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# If I could, I would




**Pranai:** Are you going to meet Sekhar today?
(నువ్వు ఈ రోజు శేఖర్‌ను కలుసుకోబోతున్నావా?)

**Vinai:** If he is in town, I will meet him.
(అతడు ఊళ్లో ఉంటే, నేను కలుసుకుంటాను)

**Pranai:** He is in town, ofcourse. He has been here since yesterday.
(అతడు ఊళ్లోనే ఉన్నాడు. నిన్నటి నుంచి ఇక్కడే ఉన్నాడు)

**Vinai:** If I had known it, I would have met him yesterday itself.
(అది నాకు తెలిసుంటే నిన్ననే కలుసుకునేవాడిని)

**Pranai:** If you want to go, I will tell him you want to see him.
(నువ్వు వెళ్లాలనుకుంటే, అతడితో నువ్వు కలుసుకోవాలనుకుంటున్నావని చెబుతా.)

**Vinai:** If you do that, I will be happy.
(నువ్వది చేస్తే నేను సంతోషిస్తాను)

**Pranai:** I'll ofcourse. But if I were you, I wouldn't try to meet him.
(నేనాపని చేస్తాను. కానీ నీ స్థానంలో నేనుంటే అతడిని కలుసుకోవటానికి ప్రయత్నించను.)

**Vinai:** Why wouldn't you? (ఎందుకు?)

**Pranai:** You are very hopeful of his help, but I am afraid he is not the helping type.
(అతడి సహాయం కోసం నువ్వు చాలా ఆశతో ఉన్నావు, కానీ అతడు సహాయం చేసే రకం కాదు)

**Vinai:** If I had his power, I would help every-one that came to me.
(నాకతడికున్నంత శక్తి ఉంటే నా దగ్గరకొచ్చే ప్రతి వాళ్లకూ నేను సహాయం చేస్తాను.)

**Pranai:** If I didn't know him so well, I wouldn't tell you all this.
(అతడి గురించి నాకు బాగా తెలియకపోతే, నీకిదంతా చెప్పను)

**Vinai:** Thank you. Then I won't go to him. But unfortunately he is the only man who can help me.
(అయితే నేనతడి దగ్గరకు వెళ్లను. దురదృష్టవశాత్తు నాకు సాయంచేయగలవాడు తనొక్కడే.)

**Pranai:** I know another friend of mine who can help you. If only today were a holiday, I would take you to him. Can't you wait till tomorrow.
(నాకింకో స్నేహితుడున్నాడు. నీకు సాయం చేయగలవాడు. ఇవ్వాళ సెలవు రోజయితే నిన్ను నేనతడి దగ్గరకు తీసుకెళ్లేవాడినే. రేపటివరకు ఆగలేవా?)

**Vinai:** If I could, I would, but the matter is urgent. If you take me to him today, I shall be grateful.
(ఆగే పరిస్థితే ఉంటే/ ఆగగలిగితే ఆగుతాను. కానీ చాలా urgent. నువ్వీరోజు నన్నతడి దగ్గరకు తీసుకువెళితే, నేను నీకు కృతజ్ఞుడిగా ఉంటా.)

**Pranai:** Ok. Let me see. If my boss grants me leave, I will take you.
(అయితే చూస్తా. మా boss నాకు leave ఇస్తే, నిన్ను తీసుకువెళతా.)

కొంతకాలం కిందట మనం Conditional Clauses చర్చించాం, గుర్తుంది కదా. ఏదైనా షరతును తెలిపే clause conditional clause కదా. మనం ఇంతకుముందు రెండు రకాల conditional clauses చూశాం. వాటి examples.

a) If he comes here, they will discuss the matter with him.
(అతనిక్కడికి వస్తే, వాళ్లావిషయం అతడితో చర్చిస్తారు.)

ఇక్కడి రెండు clauses:
1) If he comes here= అతనిక్కడికివస్తే (If clause)
2) They will discuss the matter with him = ఆ విషయం వాళ్లతడితో చర్చిస్తారు. (Main clause)

b) If he walks fast, he will reach on time.
(అతడు త్వరగా నడిస్తే, సమయానికి చేరుకుంటాడు)
ఇందులోని రెండు clauses.
1) If he walks fast అతడు త్వరగా నడిస్తే - ('If' clause)
2) He will reach on time = సమయానికి చేరుకుంటాడు - (main clause)

పై రెండు sentences లోనూ, main clause verbs: will discuss, will reach - అంటే ఇవి future tense. 'If clause verbs - comes, walks - present tense.

ఇలాంటి verb combination ఉన్న sentence చెప్పే విషయం జరిగే అవకాశం ఉంది. (probable)

Sentence No.1 లో అతడు వచ్చే అవకాశం ఉందీ, వాళ్లతడితో చర్చించే అవకాశమూ ఉంది.

Sentence No. 2 లో అతడు త్వరగా నడవనూ వచ్చు, సకాలానికి చేరుకోనూవచ్చు.


M. SURESAN

ఇలా జరిగేది సంభవం (probable) కాబట్టి పై రెండు sentences లోని situation, probable present అంటాం. ఇది ఇంతకుముందు lessons లో తెలుసుకున్నాం.

ఇలా చెప్పే sentences లో verb combination.
If clause - Present tense,
Main clause - will/ shall/ can/ may
ఇది ప్రస్తుతం సంభవం అవచ్చు కాబట్టి దీనిని probable present అంటాం.

**Look at the following:**

a) If he had studied well, he would have passed.
b) If he had come here, I would have told him of it

a) అర్థం: వాడు బాగా చదివి ఉంటే, (చదవలేదు), pass అయ్యేవాడే (pass అవలేదు)
ఈ situation, గతానిది (past) జరిగింది. జరిగిపోయింది. అది ఇంక మారదు, మనం ఊరికే అనుకుంటాం- అలా అయి ఉంటే, ఇలా అయి ఉంటుందని.

b) అర్థం: అతనిక్కడికి వచ్చి ఉంటే, నేనీ విషయం అతడికి చెప్పేవాడిని (అతడు రాలేదు, నేను చెప్పలేదు)- ఇది కూడా past. మనం మార్చలేనిది.
ఈ రెండు situations, మనం ఊహించుకునే గతం- Imaginary past అంటాం.

ఈ రెండు (probable present, imaginary past) situations తెలిపే sentences ను ఇంతకుముందు lessons లో విశదంగా వివరించాం కదా.

**Now look at the following sentences from the dialogue between Pranai and Vinai:**

1) If he is in town, I will meet him. (Probable present)
2) If I had known it, I would have met him yesterday itself
(అది తెలిసుంటే, నిన్ననే కలుసుకునేవాడ్ని- Imaginary past)
3) If you want to go, I will tell him you want to see him.
(నువ్వు వెళ్లాలనుకుంటే, ఆ విషయం అతడితో చెప్తా- Probable present)
4) If I were you, I wouldn't try to meet him.
(నేను నువ్వయితే, అతడిని కలుసుకునేందుకు ప్రయత్నించను)
5) If I had his power, I would help every one.
6) If only today were a holiday, I would take you to him.
7) If I could, I would. (చేయగలిగితే, చేస్తాను = చేయలేను, చేయను)
8) If you take me to him, I shall be grateful.
(నువ్వతడి దగ్గరకు నన్ను తీసుకువెళితే, నేను కృతజ్ఞుడిని)
9) If my boss grants me leave, I will take you.
(మా boss నాకు leave ఇస్తే, నిన్ను తీసుకువెళతా)

ఇక్కడ Sentences No 1, 3, 8 and 9 ఇవన్నీ కూడా మనం ఇంతకుముందు చూసిన 'probable present' situations- అంటే ఆ sentences తెలిపే విషయాలు జరిగే అవకాశం ఉంది.

Sentence No 2 లో situation, Imaginary past - దీన్ని కూడా మనం ఇంతకుముందు చూశాం. ఇది అయిపోయిన విషయం, మార్చలేం, ఊరికే అనుకుంటాం. ఇలాంటి sentences కూడా మనం ఇంతకు ముందు చూసి ఉన్నాం.

**Now, look at the sentences No 4, 5, 6 and 7 and notice the verbs in the 'if' clauses and the main clauses in them.**

4) If I were you, I wouldn't try to meet him. (నేనే నువ్వయితే, అతడిని కలుసుకునే ప్రయత్నం చేయను)
5) If I had his power, I would help every one.
అతడి శక్తి నాకుంటే, నేనందరికీ సాయం చేస్తాను.
6) If only today were a holiday, I would take you to him. (ఇవ్వాళ సెలవు రోజయితే, నేను నిన్నతడి దగ్గరకు తీసుకెళ్లేవాడినే)
7) If I could, I would- చేయగలిగితే, చేస్తాను.

పై నాలుగు sentences కూడా ప్రస్తుతం జరగని పనులను తెలుపుతాయి. అందుకని ఈ sentences లోని situation ను, improbable present (జరగని ప్రస్తుతం) అంటాం. ఇది తెలుగులో అరుదు. అందుకని త్వరగా English conversation లోకి రాదు. కానీ English లో చాలా frequent గా వాడతారు. అందుకని Spoken English కిది చాలా ముఖ్యం.

మళ్లీ గుర్తుంచుకోండి. ఈ sentences లో విషయాలు ఇప్పుడు (present లో) జరగనివి.

**Sentence 4:** If I were you = నేను నువ్వయితే (ఇప్పుడు)- నేను నువ్వవడం జరగదుగదా- నేను నువ్వయిన పరిస్థితిలో, I wouldn't try to meet him = అతడిని కలుసుకునే ప్రయత్నం చేయను.

1) ఇది present situation అయినప్పటికీ 'If' clause లో were రావటం గమనించండి.
2) 'I' singular అయినప్పటికీ, plural verb were వాడటం గమనించండి. (మిగతా సందర్భాల్లో I was అంటాం)

ప్రస్తుతం జరగని పనిని చెప్పేటప్పుడు ఎప్పుడూ, 'If' clauseలో, were కానీ, past doing word (came, went, sang, tried లాంటి verbs) వస్తాయి.

**eg:** a) If I were CM = నేనిప్పుడు CM అయితే, (నేనిప్పుడు CM అయ్యే అవకాశమే లేదు)
b) If she were here. (ఆమె ఇప్పుడిక్కడ లేదు/ ఉండే వీల్లేదు)
c) If I bought a car = (నేనిప్పుడు car కొంటే- కొనే పరిస్థితి కాదు.)

మళ్లీ గుర్తుంచుకోండి. ఇలాంటి situations లో- విషయం ప్రస్తుతం (present) అయినా, If clause లో, past doing వాడతాం/ subject, singular అయినా కూడా, were వాడతాం.

Verb Combination: If clause - were/ past doing word.
Main clause, would/ should/ could/ might.

a) If I were the CM, I would make you the Finance Minister.
(నేను ఇప్పుడు CM అయితే, (కాను) నిన్ను Finance Minister చేస్తాను. (చేసే అవకాశం లేదు)
b) If he were here, I would consult him.
వాడిక్కడ ఇప్పుడు లేడు, ఉంటే consult చేస్తాను.
(చేసే అవకాశం లేదు)

**Look at sentence No 5:**

If I had his power, I would help every one
(అతడి శక్తి నాకు ఉంటే - ఇప్పుడు - నాకు లేదు; ఉంటే, అందరికీ సాయం చేస్తా. If clause verb - had - past tense, main clause verb - would help.)

eg: If he consulted me, I could advise him
(అతడు నన్నిప్పుడు సంప్రదించడం అంటూ జరిగితే (-అది జరగదు) నేనతడికి సలహా ఇవ్వగలను. = అతను నన్ను సంప్రదించడూ, నేను సలహా ఇవ్వనూ లేను.)

**Sentence No 6**

If today were a holiday - ఇవ్వాళ సెలవు రోజయితే (కాని ఇవ్వాళ సెలవు కాదు.) I would take you to him (అతడి దగ్గరకు తీసుకువెళతా.) = ఇవ్వాళ సెలవూ కాదు, నేను నిన్నతడి దగ్గరకు తీసుకు వెళ్లే అవకాశమూ లేదు.

**Sentence No 7**

If I could, I would. నేను చేయగలిగితే (కానీ చేయలేను), I would (చేస్తాను- కాని చేయలేను కాబట్టి చేసే అవకాశం లేదు)

ఇక్కడ కూడా ఇప్పటి పరిస్థితి (present situation) గురించి మాట్లాడుతున్నప్పటికీ, 'if' clause లో 'could' వాడకం గమనించండి.

అలాగే main clause లో would రావటం గమనించండి.

ఇప్పుడు ఇది చూడండి:

Improbable Present:
'If' clause - verb - were/ Past Doing Word,
Main clause verb - would/ should/ could/ might.

**Now Practise the following aloud in English**

**Raghu:** లక్ష్మణే గనక ఇప్పుడిక్కడ ఉంటే మనం అతడిని సంప్రదిస్తాం.
**Ram:** అవును. ఈ విషయం అతడికి తెలిస్తే వెంటనే వస్తాడిక్కడికి.
**Raghu:** అతడికి నీ cellతో phone చెయ్యి.
**Ram:** నాకు cell ఉంటే, నీ దగ్గరకు రానుకదా?
**Raghu:** నీ cell ఏమైంది?
**Ram:** అది పోయింది.
**Raghu:** ఇది మూడో cell నువ్వు పోగొట్టుకోవటం. నువ్వు జాగ్రత్తగా ఉంటే, cells పోవు కదా?
**Ram:** ప్రయత్నిస్తాను.

## Answer

**Raghu:** If Laxman were here, we would consult him.
**Ram:** If he knew about this, he would immediately come here.
**Raghu:** Call him over your cell then.
**Ram:** If I had my cell, I wouldn't come to you.
**Raghu:** What's happened to your cell?
**Ram:** I have lost it.
**Raghu:** This is the third cell you have lost. If you were careful, you wouldn't lose them.
**Ram:** I will try.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# If you were the CM...

SPOKEN ENGLISH ఆంగ్లభాష 166

**Ramesh:** Look at the car parked there. How nice the car is, but how poorly kept! (అక్కడాపిన car చూడు. ఎంత మంచి car, కాని ఎంత అసహ్యంగా ఉంచుకుంటున్నారో! poorly kept = badly maintained = సరిగా ఉంచుకోవటంలేదు)

**Naresh:** That's right. It's a very expensive car. The owner doesn't seen to care a bit about its upkeep. (అవును. చాలా ఖరీదయిన car. దాని owner కొంచెం కూడా car ను గురించి పట్టించుకున్నట్లు లేదు)

**Jagdeesh:** If I were the owner, I would keep it cleaner than I would keep my own home. You wouldn't see even a speck of dust on it. (నేనే ఆ car యజమానినైతే, దాన్ని నా ఇంటికంటే శుభ్రంగా ఉంచుకుంటా. ఒక దుమ్ము కణం కూడా దానిమీద కనిపించదు మీకు) (speck of dust = దుమ్ముకణం)

**Ramesh:** If I had enough money, I would first buy such a car. (నాకే చాలినంత డబ్బుంటే, మొదట అలాంటి car కొంటా)

**Jagdeesh:** Who wouldn't buy such a car, if they had the money? (డబ్బుంటే అలాంటి car ఎవరు కొనరు? )

**Naresh:** OK. Leave the car alone. Are you attending Mahesh's birthday party this weekend? (సరే car విషయం అటుంచు. ఈ వారాంతం Mahesh birthday party కి మీరొస్తున్నారా? leave alone = ఆ సంగతి అటుంచండి)

**Ramesh:** I hear it's going to be a grand affair. But I'm afraid I can't make it. I am taking mom to Hyderabad that day. (చాలా grand గా ఉండబోతుందని విన్నాను. కానీ నేను రాలేను. ఆరోజు మా అమ్మను హైదరాబాద్‌కు తీసుకెళ్తున్నాను)

**Naresh:** What about you, Jagdeesh?

**Jagdeesh:** If I didn't attend, he would be disappointed. (నేను వెళ్లకపోతే అతను నిరాశపడతాడు)

**Ramesh:** If he had told me earlier, I would have postponed mother's journey. (నాకు ముందే చెప్పి ఉంటే నేను మా అమ్మ ప్రయాణాన్ని వాయిదా వేసేవాడ్ని.) What are you going to do Naresh? (నువ్వేం చేయబోతున్నావు, నరేష్)

**Naresh:** No idea as yet. If I have my interview on saturday, I will come to the party on sunday. (ఇంకా ఏం చెప్పలేను. నాకు శనివారం interview ఉంటే, నేను ఆదివారం వస్తాను)

**Jagdeesh:** If we present him something, he will be happy. Let's buy the present now. (మనం ఏదైనా కానుకిస్తే అతను సంతోషపడతాడు. ఇప్పుడే ఏదైనా కొనేద్దాం.)

**Naresh:** That's right. Let's go. If we start now, we will be able to finish off before it gets late in the evening. (అవును. వెళ్దాం పదండి. మనం ఇప్పుడు బయలుదేరితే రాత్రి ఆలస్యం అయ్యే లోపల పని ముగించుకోవచ్చు)

**Ramesh:** If you had told me earlier, I would have brought enough money. I don't have the money now. (మీరు ముందే చెప్పుంటే డబ్బు తెచ్చేవాడిని.. ఇప్పుడు నా దగ్గర డబ్బు లేదు.)

**Jagdeesh:** Don't worry. We have enough. You can pay later. (ఫర్వాలేదులే. మా దగ్గరున్నాయి. నువ్వు తర్వాత ఇవ్వొచ్చు.)

**All:** Ok. Let's go. (వెళ్దాం పదండి)

కిందటి lesson లో Improbable present అంటే ప్రస్తుతం జరగని విషయాలను చెప్పే clauses లో verbs ఎలా ఉంటాయో చూశాం కదా. Improbable present situation తెలిపే sentences If clause, main clause verb combinations ఉండే విధం last lesson లో చూశాం. మళ్ళీ ఒకసారి గుర్తు చేసుకుందాం.

Main clause verb: would/ should/ could/ might.

'If' clause verb: were/ past doing word (went, sung, took, gave, etc.)

ఇక్కడ ముఖ్యంగా గమనించాల్సిన విషయాలు రెండు:

1. Subject singular అయితే, verb, were
2. Sentence మాట్లాడేది ఇప్పటి విషయమైనా, verb, 'if' clause లో past doing word.

ఈ రెండు points, ఎప్పుడూ గుర్తుంచుకోవాలి. అంతే కాకుండా, main clause లో would, should, could, might.

ఇంకో విషయం: ప్రస్తుతం జరగని విషయాలనే ఇది చెప్తుంది. (తెలుగులో మనకీ వాడుక లేదు. అందుకని ఇన్ని జాగ్రత్తలు)

**a)** If you ate that kind of food, you would ask for it again and again = నువ్వలాంటి భోజనం ఇప్పుడు తినటం అంటూ జరిగితే (తినే అవకాశం లేదు), మళ్లీ మళ్లీ అదే కావాలంటావు. (నువ్వు తినటమూ జరగదు - మళ్లీ మళ్లీ కావాలనటమూ జరగదు)

ఈ sentence లో 'if clause' verb 'ate' past tense అయినప్పటికీ ఇప్పటి విషయాన్నే చెప్తుంది.

**b)** If I were a mouse, the cat would eat me. = నేను ఎలుకనైతే ఇప్పుడు (నేనెలుక అవను గదా? ) పిల్లి నన్ను తింటుంది. (Note the use of were with the singular subject 'I')

**c)** If he were here, I could consult him. అతనిప్పుడు ఇక్కడ ఉంటే, నేనతన్ని సంప్రదించగలను/ వచ్చు (అతనిక్కడ ఇప్పుడు లేడు)

**Now look at the following sentences from the dialogue between Ramesh, Naresh and Jagdeesh:**

**1)** If I were the owner, I would keep it cleaner than ..., you wouldn't see a speck of dust on it. (నేనిప్పుడు దాని ownerనైతే, దాన్ని మా ఇంటికంటే శుభ్రంగా ఉంచుతా- నువ్వు దానిమీద ఒక దుమ్ము కణంకూడా చూడవు. కానీ నేను దాని owner ను కాను.)

**2)** If I had enough money, I would buy such a car = నా దగ్గర ఇప్పుడు చాలినంత డబ్బుంటే (కాని నా దగ్గరలేదు), నేను మొదటి అలాంటి car కొంటా.

**3)** Who wouldn't buy such a car, if they had enough money? = అంత డబ్బు ఉంటే (ఇప్పుడు లేదు) ఎవరలాంటి car కొనరు?

**4)** If I didn't attend, he would be unhappy = నేను వెళ్లకపోతే (వెళ్తాను) అతను నిరాశపడ్తాడు.

(గమనించండి - ఇది future - అయినా, if clause verb - did attend = past tense)

ఈ పై sentences అన్నీ కూడా improbable present situations - అంటే వాటిల్లోని 'if' clauses లో చెప్పిన విషయాలేవీ కూడా ప్రస్తుతం (In the present) జరిగే అవకాశం లేదు. If clause విషయాలు జరిగితే, కలిగే పర్యవసానమే, Main clause లో విషయాలు.

మరికొన్ని examples చూడండి.

**a)** If wishes were horses, beggars would ride = కోరికలే గుర్రాలైతే, ముష్టివాళ్లు స్వారీ చేస్తారు - కోరికలు గుర్రాలయ్యే అవకాశం లేదు. (were.. would ride)

**b)** వాడు చదవటం అంటూ జరిగితే (కాని చదవడు), కచ్చితంగా pass అవుతాడు = If he studied well, he would pass. (studied.. would pass)

**c)** అందరూ పన్నులు సక్రమంగా చెల్లిస్తే (జరగదు కదా? ) భారతదేశం సంపన్నంగా ఉండగలదు.

If everyone paid taxes properly, India could be rich (paid.. could be)

**d)** What would your father think, if he saw you here? = ఇప్పుడు మీ నాన్న ఇక్కడ నిన్ను చూడటం అంటూ జరిగితే, ఆయన ఏమనుకుంటాడు? - (ఆయన చూసే అవకాశంలేదు) (saw.. would)

**e)** నువ్విప్పుడు ముఖ్యమంత్రిగా ఉంటే, మొట్టమొదట ఏం చేస్తావు? = If you were the CM, what would you do first?

**f)** Thank God he isn't here. If he were here, he would know our secret = వాడిక్కడ లేకపోవటం మంచిదయింది, ఉంటే మన రహస్యం వాడికి తెలుస్తుంది. (were.. would know)

If I were you - నేనే నువ్వయితే - ఇది చాలా common గా వాడే expression - మీరు ఇతరుల conversation లో గమనించే ఉంటారు.



M. SURESAN

ఇవీ, improbable present express చేసే sentences. మిగతారెండు i) probable present, ii) imaginary past.

వీటిని గురించి ఇంతకుముందు విశదంగా తెలుసుకున్నాం కదా. అయినా మరొక్కసారి చూద్దాం.

Probable present: ప్రస్తుతం జరిగే అవకాశం ఉన్న సందర్భాలను చెపుతుంది.

**Look at the following sentences from the dialogue at the beginning of the lesson.**

**1)** If I have my interview on saturday, I will come. (నా interview గనుక శనివారం అయితే నేను party కి వస్తాను.)

ఇది జరిగే అవకాశం ఉంది. Interview శనివారం ఉండవచ్చు, అప్పుడు నేను sunday party కి రావచ్చు

**2)** If we present him something, he will be happy మనం కానుకేదైనా ఇస్తే వాడు సంతోషిస్తాడు. ఇది సాధ్యమే కావచ్చు

ఈ 2 sentences talk of a situation probable (జరగవచ్చు) in the present or in the near future.

**a)** If he knows this, he will feel happy = ఇది అతడికి తెలిస్తే, అతను సంతోషిస్తాడు.

**b)** If you walk a little faster, you can catch the train = కాస్త త్వరగా నడిస్తే train అందుకోగలవు. (probable = జరగవచ్చు)

In the sentences above, Main clause verb - will/ shall/ can/ may. If clause verb - am/ is/ are/ RDWs (go, goes, etc) and other present forms.

**a)** If he talks to us, we shall be happy

**b)** If she comes here, I can help her

**c)** If they write to him, they may get some information = అతనికి రాస్తే (ఉత్తరం) వాళ్లేకేదైనా సమాచారం రావచ్చు

ఇవన్నీ probable present.

**II.** ఇప్పుడు Imaginary past తెలిపే ఈ sentences from the dialogue చూడండి.

**1)** If he had told me earlier, I would have postponed my journey = అతను ముందే చెప్పి ఉంటే ప్రయాణం వాయిదా వేసుకునేవాడినే. (రెండూ జరగలేదు - past లో)

**2)** If you had told me earlier, I would have brought enough money = మీరు ముందే చెప్పి ఉంటే, చాలినంత డబ్బు తెచ్చేవాడినే. (రెండూ జరగలేదు - గతంలో).

ఈ situation ఎప్పుడూ past.

ఇందులో verb combination చూడండి. Main clause - would have been/ should have been/ could have been/ might have been

OR

would have + pp (past participle)/ should have + pp/ could have + pp/ might have + pp

**a)** If she had been here yesterday, he would have talked to her = ఆమె నిన్నిక్కడ ఉన్నట్లయితే, అతను ఆమెతో మాట్లాడేవాడే (రెండూ గతంలో జరగలేదు)

**b)** If they had taken him to the doctor, he would have been alive.

(వాళ్లతన్ని doctor దగ్గరకు తీసికెళ్లినట్లయితే, అతను బతికి ఉండేవాడు)

ఇవీ ఈ మూడు situations.

**a)** If he studies well, he will pass = బాగా చదివితే pass అవుతాడు (జరిగే అవకాశం ఉంది) కాబట్టి Probable present.

**b)** If he studied well, he would pass = వాడు ఇప్పుడు చదవటం అంటూ జరిగితే, pass అవుతాడు. (రెండూ ఇప్పుడు జరగవు కాబట్టి) Improbable present.

**c)** If he had studied well, he would have passed (గతంలో) వాడు బాగా చదివుంటే, pass అయ్యుండే వాడు. (రెండూ గతంలోజరగలేదు) కాబట్టి Imaginary past.

**PRACTISE THE FOLLOWING ALOUD IN ENGLISH**

**రమ:** Hi Suma, నిన్న నేను సినిమాకెళ్లా. నువ్వు ఇంట్లో ఉండుంటే నిన్ను తీసుకెళ్లేదాన్నే.

**సుమ:** నిన్న నేను అమ్మతో shopping కు వెళ్లాను. వెళ్లకపోతే, నేను మీ ఇంటికి వచ్చి నిన్ను తీసుకెళ్లేదాన్ని. ఇంతకీ ఎవరితో వెళ్లావు?

**రమ:** మా అన్నతో. నువ్వు వస్తే ఈ శనివారం నేనా సినిమా మళ్లీ చూస్తా.

**సుమ:** నాకు పరీక్షలున్నాయి. పరీక్షలు లేకుంటే రావటానికి సిద్ధమే.

**రమ:** అయితే ఏ విషయమూ phone చెయ్యి.

**సుమ:** Phone నాకుంటేగా చేయటానికి. నా cell పోయింది. మా land phone out of order.

**రమ:** అయితే నేను నిన్ను కలుసుకుంటాలే.

**ANSWER**

**Rama:** I went to a movie yesterday. If you had been at home I would have taken you.

**Suma:** I went shopping with mom. If I had not gone, I would have come to your place and taken you to the movie. Who did you go with?

**Rama:** With my brother. If you are coming, I will see it again this saturday.

**Suma:** I have exams. If I had no exams, I would be ready to come.

**Rama:** Phone me and let me know.

**Suma:** If I were on Phone, I would call you. I've lost my cell. Our land phone is out of order

**Rama:** I will meet you then.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# ఈరోజు సెలవైతే ఎంతబాగుండేది!

**Pratap:** The top hero on the telugu screen and our favourite is in town for the celebration to honour him and we have this rotten class to attend. I wish I were at the theatre.

(తన సత్కారోత్సవంలో పాల్గొనడానికి తెలుగు తెర ఉత్తమనటుడు, మన అభిమాననటుడూ ఊళ్లో ఉన్నాడు. మనమేమో ఇప్పుడు ఈ పనికి మాలిన క్లాస్‌కి వెళ్లాలి. నాకేమో ఆ థియేటర్‌లో ఉండాలనిపిస్తోంది.)

Rotten = మురిగిపోయిన

ఈ పదాన్ని ఎప్పుడూ తిట్టడానికి ఉపయోగిస్తారు.

**Sundeep:** I wish too, we didn't have this class now. I'd rather we were in his presence than in this boring class.

(నాకు కూడా ఈ క్లాస్ ఇప్పుడు లేకపోతే బాగుంటుందనిపిస్తోంది. ఈ విసుగు పుట్టించే క్లాస్ కన్నా ఆ హీరో దగ్గర ఉంటే ఎంత బాగుంటుందో?)

**Pratap:** This is the second time for us to miss the chance of meeting him. When he came here last october for the silver jubilee of his movie we had exams. How I wish we hadn't had those exams. We could have seen him at least then.

(అతన్ని చూసే అవకాశం కోల్పోవడం మనకు ఇది రెండోసారి. గత అక్టోబర్‌లో ఆయన చిత్రం రజతోత్సవం జరిగినప్పుడు మనకు పరీక్షలు. పరీక్షలు లేకపోతే బాగుండేది. అప్పుడు కూడా ఆయనను చూడలేకపోయాం.)

**Sundeep:** All this because of this college. It's very strict about exams and attendance. We can't cut even a single class. I wish I hadn't joined this college. But for my father, I wouldn't have joined here.

(అంతా ఈ కాలేజీ వల్లే! పరీక్షలు, హాజరులాంటి విషయాల్లో వీళ్లు చాలా కఠినంగా ఉంటారు. ఒక్క క్లాస్ ఎగ్గొట్టడానికి లేదు. ఇక్కడ చేరకుండా ఉంటే ఎంత బాగుండేదో! మా నాన్న గురించి కాకపోతే నేను ఇక్కడ చేరేవాడిని కాదు.)

**Pratap:** How I wish today were a holiday! Too few holidays in this college. Lecturers rarely go on leave here. No class is let free.

(ఈరోజు సెలవైతే ఎంతబాగుండేది. ఈ కాలేజీలో సెలవులు మరీ తక్కువ. లెక్చరర్లు చాలా అరుదుగా సెలవు పెడతారు. ఒక్క క్లాస్ కూడా వదలరు.)

**Sundeep:** We should have thought of all this before joining this college.

(ఇవన్నీ మనం కాలేజీలో చేరక ముందే ఆలోచించాలి.)

**Pratap:** OK. OK. Now let's hope that our hero will be here in the evening. I only wish his programme were delayed. We could then see him towards the end of his celebrations.

(మన హీరో సాయంత్రం వరకు ఉంటాడని ఆశిద్దాం. కార్యక్రమం ఆలస్యం అయితే బాగుండు. చివర్లో అయినా ఆయన్ని చూసే అవకాశం ఉంటుంది.)

**Sundeep:** Let's hope so. I wish I were rather at the function than here. But there is no helping being in the class.

(అలాగే ఆశిద్దాం. ఇక్కడికన్నా ఆ ఫంక్షన్‌లో ఉంటే బాగుంటుంది. కానీ క్లాస్‌లో ఉండక తప్పదు.)

No helping = తప్పదు

గత రెండు lessons లో 'If clauses'లో were (Singular Subjectsతో కూడా)/ Past Doing Words (came, gave, took, etc) వాడే సందర్భాలు చూశాం- అప్పుడు మనం ఏం తెలుసుకున్నామంటే-

★ 'If clauses' లో were/ Past Doing Words వాడితే ప్రస్తుతం జరగని (అసంభవం) విషయాలను తెలియజేస్తాయి.

మన conversation correct గా ఉండడానికి ఇది చాలా ముఖ్యం. e.g.-

1) If he were here, he wouldn't allow this.

అతనే ఇక్కడ ఉంటే (అతనిక్కడ ఇప్పుడు లేడు) ఇది జరగనివ్వడు (అతనిక్కడ ఇప్పుడు లేడు కాబట్టి ఇది జరుగుతోంది). - 'If Clause'లో he- singular, verb- were- plural.

2) If I were the Chief Minister, I would appoint you the finance minister.

నేనే ఇప్పుడు ముఖ్యమంత్రిగా (ఇప్పుడు ముఖ్యమంత్రి కాదు) ఉంటే, నిన్ను ఆర్థిక మంత్రిగా నియమిస్తాను.

3) If he came here now, his mother would be happy.

వాడు ఇప్పుడు ఇక్కడికి వస్తే (వాడు ఇప్పుడు ఇక్కడకు రాడు), వాళ్లమ్మ సంతోషిస్తుంది. (వాడురాడు- వాళ్లమ్మ సంతోషంగా లేదు).

4) If she were here I could tell her of this.

ఆమే ఇక్కడ ఉంటే (ఆమె ఇప్పుడు ఇక్కడ లేదు), నేనీ విషయం ఆమెకు చెప్పి ఉండవచ్చు (ఆమె లేదు, ఆమెకు నేను చెప్పలేను).



*Have you seen Suma's dress today?*

ఇప్పుడు ఇలా 'If clause' లో were (singular subjects తో కూడా)/ Past Doing Words వాడటం ప్రస్తుతం సంభవం కాని (present improbable) విషయాలను తెలియజేస్తాయి.

ఈ were (singular subjects తో)/ Past Doing Words (gave, wrote etc) ను మరికొన్ని సందర్భాల్లో కూడా వాడతాం. ఆ సందర్భాల్లో (If clause లేకుండా కూడా) అవి ప్రస్తుతం జరగని విషయాలను తెలియజేస్తాయి. వీటిని చూడండి:

a) I wish to be in the US.

(నేను అమెరికాలో ఉండాలనుకుంటున్నాను/ కోరుకుంటున్నాను.)

b) He wishes to be a collector.

(అతను కలెక్టర్‌గా ఉండాలనుకుంటున్నాడు/ కోరుకుంటున్నాడు.)

Compare the sentences above with the following:

c) I wish (that) I were in the US.

d) He wishes (that) he were a collector.

sentences (c), (d) లలో I, he, singular అయినప్పటికీ 'were' రావటం గమనించండి- ఈ సందర్భంలో ఇది తప్పు కాదు.

1) Compare sentences (a) and (c):

a) I wish to be in the US.

నేను అమెరికాలో ఉండాలని కోరిక. (ఇది నా కోరిక - ఇది జరగవచ్చు)- ఇక్కడ wishes తర్వాత 'to be'.

c) I wish (that) I were in the US.

నేను ఇప్పటికిప్పుడు (ఈ క్షణంలో) అమెరికాలో ఉంటే ఎంత బాగుంటుంది. (ఇప్పటికిప్పుడు 'నేను' అమెరికాలో ఉండడం అసంభవం కదా)

- ఇక్కడ wish తర్వాత 'I were'.

2) Compare sentences (b) and (d).

b) He wishes to be a collector.

అతడు కలెక్టర్‌గా ఉండాలి/ అవ్వాలని కోరుకుంటున్నాడు. జరిగే అవకాశం ఉంది (జరుగుతుందని చెప్పలేం).

- ఇక్కడ wishes తర్వాత 'to be'.

d) He wishes (that) he were a collector.




అతడు ఇప్పటికిప్పుడు, ఈ క్షణంలో కలెక్టర్‌గా ఉంటే ఎంత బాగుంటుందో (ఏ టీచర్‌గానో, ఇంకో ఏ పదవిలోనో కాకుండా). ఇప్పటికిప్పుడు అతడు కలెక్టర్ అవడం అసంభవం.

- ఇక్కడ wishes తర్వాత he were.

(c), (d) ల్లో were వాడడం మన తీరని కోరిక తెలియజేసేట్లుగా ఉంది కదా.

**Jayaram:** What a beautiful building this is! Who lives in it?

(ఎంత అందంగా ఉందో ఈ బిల్డింగ్! ఎవరుంటారు ఇందులో?)

**Janakiram:** The forest officer.

(అటవీశాఖ అధికారి)

**Jayaram:** How I wish I were a forest officer!

(నేను అటవీశాఖ అధికారి అయితే ఎంత బాగుంటుందో- అప్పుడు నేనూ ఇలాంటి భవంతిలో ఉంటాను కదా అనే అర్థంతో- ఇప్పుడు జయరామ్ అటవీశాఖ అధికారి అవడు కదా!)

ఇదీ Singulars తో 'were' వాడే ఇంకో సందర్భం. ఇలాంటి సందర్భంలోనే Past Doing Word కూడా వాడతాం.

a) I wish to travel in such a car.

అలాంటి కారులో ప్రయాణం చేయాలని నా కోరిక.

- ఇక్కడ wish తర్వాత to travel.

b) I wish (that) I travelled is such a car.

- travelled (Past Doing Word)

(ఇప్పటికిప్పుడు) నేనలాంటి కారులో ప్రయాణం చేస్తుండాలని నా కోరిక/ ప్రయాణం చేస్తే ఎంత బాగుంటుంది! (అసంభవం).

c) He wishes (that) he owned such a house.

అలాంటి ఇల్లు తనకే ఉంటే (ఇప్పటికిప్పుడు) ఎంత బాగుంటుంది- అని అనుకుంటున్నాడు.

d) They wish (that) that they had a holiday today.

వాళ్లు ఈ రోజు సెలవైతే బాగుంటుంది అనుకుంటున్నారు.

They wish (that) today were a holiday.

అప్పుడప్పుడు I wish బదులు, 'Oh'తో కూడా begin చేయవచ్చు.

I wish I were at home now!

Oh, I were at home now!

ఇప్పుడు నేను ఇంట్లో ఉండాల్సింది/ ఇంట్లో ఉంటే బాగుంటుంది. (ఇప్పుడు ఇంకెక్కడో ఉన్నాను. అక్కడుండడం ఇష్టం లేదు)

Now look at the following sentences from the dialogue at the beginning of the lesson.

1) I wish I were at the theatre.

నేను ఇప్పుడు థియేటర్‌లో ఉంటే హాయిగా ఉంటుంది (క్లాస్‌లో కాకుండా).

2) I wish we didn't have (past tense) the class now.

ఈ క్లాస్ ఇప్పుడు లేకపోతే బాగుండేది (మనం థియేటర్‌కు వెళ్లేవాళ్లం)

3) I wish we hadn't had the exams.

మనకు అప్పుడు (in the past) పరీక్షలు లేకుండా ఉంటే బాగుండేది- ఇది గతంలో ఇప్పుడు కాదు. అయిపోయిన విషయం- అందుకని had + past participle.

M. SURESAN

4) How I wish today were a holiday.

ఈరోజు సెలవు అయితే ఎంత బాగుంటుంది!

5) I only wish his programme were delayed.

అతడి కార్యక్రమం ఆలస్యమైతే బాగుంటుంది (క్లాస్ అయిన తర్వాత మనం వెళ్లొచ్చు).

6) I wish I were rather at the function than here.

ఇక్కడ కన్నా ఆ ఫంక్షన్‌లో ఉండడం ఇష్టం నాకు.

**Very important:**

ఈ క్షణంలో తీరని కోరికను తెలియజేయడానికి ఇలా అంటుంటాం:

a) I/we/you/they wish I/we/you/they were... OR I/we/you/they + Past Doing Word (went, came, etc).

b) He/She wishes he/she were... OR He/she + Past Doing Word.

(ఇక్కడ అన్ని చోట్లా wish బదులు 'oh'... అని ప్రారంభించవచ్చు.)

**Practise the following aloud in English**

**Prema:** ఈరోజు సుమ డ్రెస్ చూశావా? నాకూ అలాంటిది ఉంటే ఎంతబాగుండునో! ...!

**Hema:** అలాంటిది మొన్న నేనొక షాప్‌లో చూశా. నాకు అది అంతగా నచ్చలేదు.

**Prema:** నా డ్రెస్‌లన్నీ మా అమ్మే సెలెక్ట్ చేస్తుంది. నాకు కాస్త స్వతంత్రం ఇస్తే బాగుంటుంది.

**Hema:** నువ్వది ఒప్పుకోకుండా ఉంటే బాగుంటుంది.

**Prema:** మా అమ్మకది అర్థమైతే బాగుంటుంది. నన్ను సెలెక్ట్ చేసుకోనిస్తే ఎక్కువ డబ్బులు పెడతానని ఆమె భయం.

**Answer:**

**Prema:** Have you seen Suma's dress today? How nice it is/ I wish/ How I wish/ Oh, I had a dress like that!

**Hema:** I saw the same kind of dress in some shop. I didn't like it much.

**Prema:** The trouble is mom selects all my dresses. How I wish/ I wish/ Oh, she gave me the freedom to select my dresses.

**Hema:** I wish you didn't agree to it.

**Prema:** I wish my mother understood it. Her fear is that if I selected my dresses I would spend more money.

**Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి...**

**URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# She bought such a necklace

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 168


M. SURESAN

**Sharmila:** I bought this book on Physics Yesterday.
(నిన్న నేను ఈ Physics book కొన్నాను.)

**Urmila:** Oh, this one! I wish you hadn't bought it.
(ఇదా? నువ్వది కొనకుండా ఉంటే బాగుండేది)

**Sharmila:** Why? (ఏం?)

**Urmila:** I have bought it too and I find it utterly useless. It is very badly written.
(ఆ పుస్తకాన్ని నేనూ కొన్నాను. అదేం బాగ లేదు. బాగరాయలేదు.)
utterly = totally, పూర్తిగా

**Sharmila:** Oh, I wish you had told me earlier of it. I wouldn't have bought it.
(నువ్వు నాకు ముందే చెప్పి ఉంటే బాగుండేది కదా/ ముందే ఎందుకు చెప్పలేదు. నేను పుస్తకాన్ని కొనుండే దాన్ని కాదు.)

**Urmila:** When I showed it to our lecturer she said I had made a mistake in buying this book. I wish I had known you were going to buy it. I would have told you not to. Can you return it and get the money back?
(నేను దీన్ని మన lecturer కు చూపించాను. ఈ పుస్తకం కొని నేను పొరపాటు చేశానని ఆమె అంది. నువ్వు కొనబోతున్నావని తెలిస్తే బాగుండేది. కొనొద్దని చెప్పేదాన్ని. అది తిరిగిచ్చేసి డబ్బు తెచ్చుకోగలవా?)

**Sharmila:** I wish I could. But no shop would agree. At the most they may agree to an exchange.
(అలా పుస్తకం తిరిగిచ్చి డబ్బు తెచ్చుకోగలిగితే సంతోషమే. కానీ ఏ shop అందుకు ఒప్పుకోదు కదా? మహా అయితే ఆ పుస్తకం బదులు ఇంకేదైనా పుస్తకం ఇవ్వటానికి ఒప్పుకోవచ్చు)
(At the most = మహా అయితే)

**Urmila:** The author doesn't appear to know how to write a book useful for the students. I think the poor sales would make him wish that he had not written the book.
(విద్యార్థులకు ఉపయోగపడేలా పుస్తకం రాయటం ఆ రచయితకు తెలిసినట్లు లేదు. అమ్మకాలు తక్కువగా ఉంటే... పుస్తకం రాయకుండా ఉంటే బాగుండేదెమో అని అతడికి అనిపిస్తుంది)

**Sharmila:** So what do I do now?
(అయితే నేను ఏం చేయను?)

**Urmila:** Exchange it for Prof Bhoutik's Manual of Physics.
( దీన్ని ఇచ్చేసి Prof Bhoutik రాసిన Manual of Physics తెచ్చుకో)

- ఇప్పుడు జరగని విషయాలు కోరుకోవటానికి 'If clause' లో were/ past doing word ఎలా వాడతామో మనం తెలుసుకున్నాం కదా (గత రెండు మూడు lessons లో).

**1)** I wish I were not here =
(నేనిప్పుడు ఇక్కడ ఉండకూడదనిపిస్తోంది/ ఉండకపోతే బాగుంటుంది)
✓ ఇప్పుడిక్కడ ఉన్నాను

**2)** He wishes he were consulted =
(తనను ఇప్పుడు వాళ్లు సంప్రదిస్తే బాగుంటుందని కోరుకుంటున్నాడు / సంప్రదిస్తే బాగుంటుందని అనుకుంటున్నాడు.)
✓ తనను ఇప్పుడు వాళ్లు సంప్రదించటం లేదు

**3)** She wishes she bought such a necklace=
(తను ఇప్పుడలాంటి necklace కొనుక్కుంటే బాగుంటుందనుకొంటోంది)
✓ ఇప్పుడు కొనుక్కోవడం జరగదు

**కింది వాటి తేడా గమనించండి.**

She wishes to buy such a necklace
(అలాంటి necklace కొనుక్కోవాలనుకుంటోంది)
✓ కొనుక్కోవచ్చు - అవకాశం ఉంది

She wishes she bought such a necklace =
(ఆమెకు అలాంటి necklace కొనుక్కుంటే బాగుంటుందనిపిస్తోంది.)
✓ కానీ కొనే పరిస్థితి లేదు/ ఆ అవకాశం ఇప్పుడు లేదు.

**a)** She wishes to have such a necklace
(అలాంటి necklace తనకుండాలని కోరకుంటోంది- ఆమె కొనుక్కునే అవకాశం ఉంది)

**b)** She wishes she had such a necklace -
(తనకా necklace ఉంటే ఎంత బాగుంటుందో అనుకొంటోంది- ఇప్పుడామెకలాంటి necklace లేదు.)

- (ఇది ఇన్నిసార్లు repeat చేయటానికి కారణం... I wish I were, She wishes she were లాంటి expression correct meaning and use పాఠకులకు తెలిసేందుకు.)

ఇప్పుడు మరో కొత్త విషయం తెలుసుకుందాం.

**Observe carefully.**

**Compare the sentences (a) and (b) below**:

**a)** He is buying car. I wish he took an expert's advice.
(కారు కొంటున్నాడు. ఎవరైనా నిపుణిడి (expert) సలహా తీసుకుంటే మంచిది)
సలహా తీసుకోవటం లేదు.

**b)** He has bought a car and it is giving him trouble. He wishes he had taken an experts advice.
(అతను కారు కొనుక్కున్నాడు, అది trouble ఇస్తోంది. ఎవరైనా నిపుణుడి సలహా తీసుకుని ఉంటే బాగుండేదని అనుకుంటున్నాడు).
✓ కొన్నప్పుడు తీసుకోలేదు.

| Sentence (a) | Sentence (b) |
|---|---|
| 1) He is buying (కొంటున్నాడు) | He has bought (కొన్నాడు-past) |
| 2) He took ఇప్పుడు సలహా తీసుకుంటే (ఇప్పుడు తీసుకోవటం లేదు) | He had taken కొన్నప్పుడు సలహా తీసుకునుంటే (past)) |

- ఇంత వరకు మనం ఇప్పుడు చేయని/ జరగని పనులను గురించి చెప్పాలంటే were/ past doing word వాడాలని తెలుసుకున్నాం. Sentence (a)
- అదే గతంలో జరగని పనులు జరిగి ఉంటే/ జరిగిన పనులు జరగకుండా ఉంటే అని చెప్పాలంటే had been/ had + PP (Sentence (b) ) వాడతాం.

**Study the following:**

| | |
|---|---|
| 1) The mother wishes that her son were here. (తన కొడుకు ఇప్పుడు ఇక్కడ ఉంటే బాగుంటుందని తల్లి అనుకుంటోంది.) (ఇప్పుడు ఇక్కడ లేడు) | The mother wishes that her son had been present at the function last night. ( గతరాత్రి జరిగిన function లో తన కొడుకు ఉండి ఉంటే బాగుండేదనుకొంటోంది అతని తల్లి - past) |
| 2) He wishes that he were selected- (ఇప్పుడు అతడు ఎంపికై ఉంటే బాగుండేదని అనుకుంటున్నాడు/ ఎంపికైతే బాగుంటుందని అతని కోరిక.) | He wishes that he had been selected - ( తను (గతంలో) ఎంపికై ఉంటే బాగుండేదనుకుంటున్నాడు) (had been selected) |
| 3) She wishes she did not see him. (అతనక్కడ కనపడకుండా ఉండాలని ఆమె అనుకుంటోంది. ఇప్పుడు- కనపడుతున్నాడు) | She wishes she had not seen him last monday. (గత సోమవారం అతడు కనపడకపోయి ఉంటే బాగుంటుందని / కనపడకుండా ఉండాల్సిందని అనుకొంటోంది) |

**That's the difference between the use of were/ the past doing word, and the use of had been / had + past participle-**

**a)** were/past doing word (came, went, etc) - present

**b)** had been / had + past participle - past

**Now look at the use of had been, and had + past participle in the dialogue between Sharmila and Urmila.**

1) I wish you hadn't bought it - verb had+past participle (PP) - past - (నువ్వు కొనకుండా ఉంటే బాగుండేది/కొనుండాల్సింది కాదనుకుంటున్నా) .

2) I wish you had told me of it earlier - had+pp- past- ఇంతకు ముందే చెప్పుండాల్సింది.

3) I wish I had known you were going to buy it - had known - had+pp- (ముందే (past లో) తెలిసుంటే బాగుండేది - వద్దని చెప్పే దాన్ని.

4) I wish I could - తిరిగి ఇచ్చేయగలిగితే (ఇప్పుడు) బాగుంటుంది... (past లో అయితే could have +pp)

5)... poor sales would make him wish he had not written the book =
(అంత తక్కువ అమ్మకాలు అతనా పుస్తకం రాయకపోయింటే బాగుండేమో అనిపిస్తాయి)

పైవన్నీ past కు సంబంధించినవి కాబట్టి, had + past participle form.

దీన్నిఅంటే, I/ we / you / they wish /He / she / it wishes + were/past doing word - present కూ, had been/had+past participle - past కూ.

వీటిని బాగా practice చేసి మీ conversation లో వాడండి. ఇవి వాడే సందర్భాలు చాలా ఉంటాయి.

**Prabha:** ఈవాళ సెలవైతే బాగుంటుంది?

**Subha:** ఈ పాడు college లో holidays ఉండవు. నేనిక్కడ student గా ఉండకపోతే బాగుంటుంది.

**Prabha:** నీ వల్లే నేనీ college లో చేరాను. నిన్ను అనుసరించకుండా ఉంటే బాగుండేది.

**Subha:** నువ్వు మానాన్నను సలహా అడగకుండా ఉంటే బాగుండేది.

**Prabha:** college విషయం పక్కనపెట్టు. నాకీ hostel లో ఉండాలనిపించటం లేదు. Hosteller గా ఉండకూడదని నా కోరిక.

**Subha:** సినిమాలు చూడటానికి free గా ఉండాలని కోరిక. ఇప్పటికే చాలా సినిమాలు miss అయ్యాం. అవన్నీ చూసుండాల్సిందని కోరుకుంటున్నా.

**Prabha:** ఇది మనకు తప్పదు. ఇంకో రెండేళ్లు ఇక్కడే ఉండాలి.

## Practise the following aloud in English

**Answer:**

**Prabha:** (How) I wish today were a holiday

**Subha:** No holidays at all in this rotten college - rotten = మురిగిపోయిన, తిట్టుకు ఎక్కువగా వాడతారు). I wish I were not a student here.

**Prabha:** I joined this college because of you. I wish I hadn't (had not) followed you (ఇది past కాబట్టి - had+pp)

**Subha:** I wish you hadn't asked for my dad's advice. (ఇది past కాబట్టి had+pp)

**Prabha:** Let alone this College. I don't feel like being in the hostel. (feel like = అనిపించటం) Oh, I were not a hosteller!

**Subha:** I wish to be free to see movies. We have already missed a number of movies. I only wish we had seen all of them.

**Prabha:** (There is) no helping it (తప్పదు) we have to be here for two years more.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# కోపం ఎక్కువైనకొద్దీ తక్కువ ఆలోచిస్తాం!

**Nandan:** Santan, I'm afraid that something is seriously wrong with me. I'm unable to concentrate on studies.
(నాకేదో అవుతున్నట్లనిపిస్తోంది. చదువు మీద దృష్టి పెట్టలేకపోతున్నాను. నాకు బాధగా ఉంది. (I'm afraid.) (ఇక్కడ భయం అని అర్థం కాదు.)
concentrate = కేంద్రీకరించటం/శ్రద్ధచూపటం.

**Santan:** I've observed that. Of late you haven't been as serious about studies as you were in the past. Your scores too have been low. Something wrong with your health, perhaps.
(నేను గమనించాను అది. చదువు మీద నీకు ఇంతకు ముందున్న శ్రద్ధ ఈ మధ్య కనిపించటం లేదు. మార్కులు కూడా తగ్గాయి. నీ ఆరోగ్యం ఏమన్నా బాగలేదేమో.)
Of late = lately = ఈ మధ్య.
వీటికి late = 'ఆలస్యమైన'కు ఏం సంబంధం లేదు.

**Nandan:** My health is OK. I eat well and sleep well. No illness at all. Had there been anything wrong, I would have know.
(నా ఆరోగ్యానికేం.. బాగానే ఉంది. బాగా తింటున్నా, నిద్రపోతున్నా, జబ్బేంలేదు. ఏదైనా ఉంటే నాకు తెలిసేది కదా?)

**Santan:** Still we can't say. It's time (that) you <u>saw</u> a doctor.
(అయినా మనం ఏం చెప్పలేం. నువ్వింతకు ముందే డాక్టర్‌ను సంప్రదించాల్సింది.)

**Nandan:** Shall I do that then?
(అయితే అలా చేయనా?)

**Santan:** You had better. Exams are round the corner, time we started serious preparation.




(అదే మంచిది. పరీక్షలు దగ్గరకొచ్చేస్తున్నాయి. మనం ప్రిపరేషన్ ఎప్పుడో మొదలు పెట్టాల్సింది.)

**Nandan:** It is time my father were here. He told me a week ago that he would come here in two or three days. If he were here now, he could take me to a doc.
(మానాన్న ఇప్పటికీ లేడిక్కడ, ఎప్పుడో ఉండాల్సినాయన. రెండు మూడు రోజులకు వస్తానని వారం కిందట చెప్పాడు. ఆయనిపుడు ఉండి ఉంటే నన్ను డాక్టర్ దగ్గరకు తీసుకెళ్లేవాడు.)
Doc = present day English లో short form for <u>doctor</u>.)

**Santan:** Call him and tell him of your problem. Time you were free from all worries to prepare for the exams.
(ఈ కలతల నుంచి ఎప్పుడో బయటపడి పరీక్షలకు ప్రిపేర్ అవుతూ ఉండాల్సింది నువ్వు)

**Nandan:** I'll do it immediately then.
(వెంటనే చేస్తాను.)

**Santan:** The earlier, the better.
(ఎంత త్వరగా చేస్తే అంత మంచిది.)

Look at the sentences (a) and (b) below.

a) It's time for him to start for college. The time has come for him to start for college.
అతడు college కి బయల్దేరాల్సిన time ఇది./వచ్చింది.

b) It's (high) time (that) he started for college = Time he <u>started</u> for college
(It's, high, that ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే)
College కి ఎప్పుడో బయల్దేరాల్సిందతను.
(ఇంకా బయల్దేరలేదు అని అర్థం)
He should have started for college before now = అతను college కెళ్లే time దాటిపోయింది.

*Sentences (a) (b) లకు ఎంత తేడా ఉందో గమనించండి.*

c) It's time/the time has come for him to be at home.
ఇంట్లో ఉండాల్సిన టైమ్ ఇది./ఇంట్లో ఉండాల్సిన టైమ్ వచ్చింది.

d) (It's) time (that) he <u>were</u> at home.
= అతను ఇంట్లో ఇంతకుముందే/ఎప్పుడో ఉండాల్సింది, ఇంకాలేదు.

*Sentences (b), (d)లలో verbs గమనించండి.*

Verb in sentence (b) = started - past doing word
Verb in sentence (d) = were - plural verb, though the subject 'he' is singular.
ఇదీ ఇలాంటి sentences లో ప్రత్యేకత - were, past doing word వాడకం.

**ఇంకా చూడండి.**

e) అతను ఎప్పుడో పెళ్లి చేసుకొని ఉండాల్సింది.
(It's) (high) time he <u>got</u> married/he <u>were</u> married (అంటే ఇంకా చేసుకోలేదేంటి అని)
He should have been married before now.

f) Time he <u>learnt</u> manners.
ఇంకా అతను manners నేర్చుకోలేదు/ఇంతపెద్ద వాడైనప్పటికీ అతడికి manners తెలీదు.

g) Time (It's high time that) he consulted a doctor.
ఎప్పుడో డాక్టర్‌ను సంప్రదించాల్సింది, ఇంత వరకు చేయలేదు.
He should have consulted a doctor much earlier.

**Now look at the following sentences from the conversation between Nandan and Santan**

1) It's time you <u>saw</u> a doctor.
నువ్వు ఇంతకు ముందే డాక్టర్‌ను సంప్రదించాల్సింది/ఆలస్యం చేశావు.
(Verb - saw - past doing word)

2) <u>Time</u> we <u>started</u> serious preparation.
పరీక్షలకు సీరియస్‌గా ప్రిపేర్ కావటం ఇంతకు ముందెప్పుడో ఆరంభించాల్సింది/ఆలస్యం అయింది.
(Verb - started - past doing word)

3) It's time my father <u>were</u> here.
మా నాన్న ఎప్పుడో ఇక్కడుండాల్సింది/ఆలస్యం అయింది
(Verb - <u>were</u>)

4) Time you <u>were</u> free from all worries to prepare for the exams.
(నువ్వు పరీక్షలకు బాగా తయారవటానికి ఈ కలతల నుంచి ఎప్పుడో బయటపడి ఉండాల్సింది.)
(verb - <u>were</u>)

ఈ sentences లోని ఈ construction బాగా practice చేయండి. మీ Spoken English, natural గా ఉంటుంది.

**Exercise: Practise the following aloud in English**

**Prabhas:** ఏంటి చాలా బిజీగా ఉన్నావు?
**Subhash:** ఏం చేయను. అమ్మకు ఒంట్లో బాగా లేదు.
**Prabhas:** నువ్వు డాక్టర్‌కి ఎప్పుడో చూపించాల్సింది. ఆలస్యం చేశావు.
**Subhash:** ఆ పని మీదే బిజీగా ఉన్నా. ఆ ఆసుపత్రిలో ఛార్జీలు మరీ ఎక్కువ. డబ్బు కోసం చూస్తున్నా.
**Prabhas:** చూడు Subhash.. ఇక్కడ నీకు సహాయం చేయగల స్నేహితుడు ఉన్నాడని ఎప్పుడో తెలుసుకునుండాల్సింది నువ్వు. నేనున్నానుగా. ఎంత కావాలి?
**Subhash:** వద్దులే. ఎలాగో తెచ్చుకుంటా.
**Prabhas:** నా దగ్గర దాచటం ఆపాల్సిన టైమ్ వచ్చింది. ఆలస్యం చేయకు. చెప్పు ఎంత కావాలో?
**Subhash:** నేనింతకు ముందు నీ దగ్గర తీసుకున్న డబ్బే ఎప్పుడో తిరిగివ్వాల్సింది. మళ్లీ ఎలా తీసుకోను?
**Prabhas:** నాకు కోపం తెప్పించకు. ఎంత కావాలో చెప్పొచ్చు కదా?
**Subhash:** పదివేల రూపాయలు
**Prabhas:** తీస్కో.. రా మా ఇంటికి.

**ANSWER:**

**Prabhas:** What makes you so busy?
**Subhash:** What shall I do? Mom is not at all well.
**Prabhas:** <u>Time you took her to a doctor</u>.
**Subhash:** That's what I am busy doing. The charges in the hospital are high. I am looking for money.
**Prabhas:** Look here, Subhash. <u>Time you knew you have a friend who can help you.</u>
**Subhash:** Just don't worry. I will get it some how.
**Prabhas:** <u>Time you stopped hiding things from me.</u>
**Subhash:** <u>Time I repaid</u> the money. I borrowed from you already. How can I borrow again?
**Prabhas:** Don't make me angry. Tell me how much you want.
**Subhash:** Rs. 10000/-
**Prabhas:** Have it. come home to me.




*Nandan, Varun conversation లోని ఈ sentences ను గమనించండి.*

'Shall I do that then?' (shall I see the doctor then?)
'<u>You had better do it</u>!
(అది చేయటం better.)
నువ్వది చేయటం మంచిది అనే అర్థంతో you had better do it అంటుంటాం.
It is better for you to do that అని కూడా అనవచ్చు కానీ you had better do it అనేదే better.
He <u>had better</u> not go there now.
అతనక్కడికి వెళ్ళక పోవటం మంచిది.
ఈ sentences కూడా చూడండి.

**Nandan:** I'll do it immediately then.
**Santan:** <u>The earlier, the better</u>.

The earlier, the better= ఎంత త్వరగా చేస్తే అంత మంచిది.

*ఈ type of sentences కూడా practice చేయండి.*

ఎంత పొడుగయితే, అంత బాగా bowl చేయగలరు.
= The <u>taller</u> a person is, the <u>better</u> can they bowl.

ఇలాంటి సందర్భాల్లో మనం గమనించాల్సింది.

1) The use of the comparative.
2) The inversion of the verb.

a) The <u>more</u> angry you are, the <u>less</u> do you think .
కోపం ఎక్కువైనకొద్దీ, తక్కువ ఆలోచిస్తాం.

b) The <u>hotter</u> the sun is, the <u>more tired</u> one is.
ఎండ ఎక్కువైన కొద్దీ, అలసట ఎక్కువవుతుంది/ ఎక్కువ అలసిపోతారు.

ఈ కింది sentences Englishలో practice చేయండి.

1) పెద్ద వాళ్లయినకొద్దీ, అనుభవం పెరుగుతుంది.
2) ఎంత ఆ డ్రింక్ తాగితే, అంత ఇంకా తాగాలనిపిస్తుంది.

**ANSWERS:**

1) The <u>older</u> you are/ you grow, the <u>more</u> is your experience.
2) The <u>more</u> you drink it, the <u>more</u> you feel like drinking it.




ప్రశ్న: What is the difference between "found" and "discovery"?

**– అనుమూలశెట్టి కిషోర్, రావినూతల**

జవాబు: 'Found' means to establish (స్థాపించటం). NTR founded the TDP. (NTR TDP ని స్థాపించారు.)
2) Found is the past tense of 'find'. తెలుసుకోవటం, గమనించటం, చూడటం అనే అర్థంతో. I found him working very hard = అతడు కష్టపడి పనిచేయటం గమనించాను.
3) Discovery - the act of finding or learning about something for the <u>first time</u> అంటే ఏ విషయాన్నైనా మొదటిసారిగా తెలుసుకోవటం, అర్థం చేసుకోవటం, అని. Newton's <u>discovery</u> of the laws of gravitation changed out understanding of nature. న్యూటన్ గురుత్వాకర్షణ శక్తిని కనుక్కోవటం (అందరికన్నా ముందు తెలుసుకోవటం /అర్థం చేసుకోవటం) ప్రకృతిని గురించి మన అవగాహనలో మార్పు తెచ్చింది. Find <u>out</u> అంటే discover అనే అర్థంవస్తుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి..**
**URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# May I come in? - Please do.

**I. Prasad:** Your clothes look nice. Are they new?
(నీ బట్టలు బాగున్నాయి. అవి కొత్తవా?)

**Pramod:** Yes. They are. (అవును)

**Prasad:** Perhaps they cost you a lot.
(అవి బాగా ఖరీదైనవనుకుంటా)

**Pramod:** Yes. They did.

**Prasad:** You look quite smart in them.
(నువ్వా బట్టల్లో ఆకర్షణీయంగా కనిపిస్తున్నావు)

**Pramod:** Do I? Thanks for the compliment.
(అవునా? నీ పొగడ్తకు thanks)

**Prasad:** Then shall we start?

**Pramod:** We shall.

☯ ☯ ☯

**II. Srikanth:** Have you met suman?

**Ravinder:** Yes. I have.

**Srikanth:** Do you know where he is?

**Ravinder:** No, I don't.

**Srikanth:** Will you meet him again?

**Ravinder:** No, I won't. I've important work.

**Srikanth:** Do you expect him here today?
(ఈరోజు వస్తాడనుకుంటున్నావా?)

**Ravinder:** I'm afraid no. (రాడనుకుంటా)

☯ ☯ ☯

**III. Naresh:** The shop hasn't yet opened today.
(ఈరోజు shop ఇంకా తెరవలేదు)

**Mahesh:** Yes, it hasn't. It is usually open by this time.
(మామూలుగా ఈ time కు తెరిచుంటుంది)

**Naresh:** So it is. But I don't know what's happened today.
(అవును. ఈరోజు ఏమైందో తెలియటం లేదు)

**Mahesh:** There they are coming to open. But I think it will be some time before they start selling. I can't wait.
(అదిగో వాళ్లు తెరవటానికి వస్తున్నారు. అమ్మటం ప్రారంభించటానికి కొంత time పడుతుంది. నేను wait చేయలేను.)

☯ ☯ ☯

**IV. Bhaskar:** Why did you come so late yesterday?
(నిన్న ఎందుకు ఆలస్యంగా వచ్చావ్?)

**Bhavani:** Did I? I was here on time.
(నేనా? నేనిక్కడ time కు ఉన్నాను.)

**Bhaskar:** But you weren't. I noted the time. It was 8.15.

**Bhavani:** But it wasn't 8.15. It was only 8.05.
(అప్పుడు 8.15 కాదు. 8.05 మాత్రమే)

**Bhaskar:** Even that makes you late.
(అప్పుడయినా నువ్వు ఆలస్యమేకదా?)

**Bhavani:** So it does. (అవునలెండి)

☯ ☯ ☯

**V. Chetan:** Madan, we have been here before.
(మదన్, మనం ఇక్కడికి ఇంతకు ముందొచ్చాం.)

**Madan:** But we haven't. You are mistaken.
(మనం రాలేదు. నువ్వేదో పొరబడుతున్నావు)

**Chetan:** But I'm not. Some how the place seems familiar to me.
(నేనేం పొరబడటంలేదు. ఎందుకనో ఈ ప్రదేశం ఇంతకుముందు చూసినట్టు అనిపిస్తోంది)

**Madan:** But it doesn't to me.
(నాకలా ఏమీ అనిపించటంలేదు)

☯ ☯ ☯

**VI. Balu:** I must start at once, or I'll be late for office. (నేను వెంటనే బయల్దేరాలి. లేకపోతే office కు ఆలస్యమవుతుంది.)

**Giri:** So must I. I've to reserve tickets for my journey. (నేనూ వెళ్లాలి. ప్రయాణానికి tickets reserve చేసుకోవాలి)

**Balu:** Have you the key to lock the room?

**Giri:** I have.

**Balu:** Will you lock the room then?

**Giri:** I will. Don't worry.

☯ ☯ ☯ ☯

పై short conversations చూశారు కదా? వాటిలో మీరు గమనించే ఉంటారు. సామాన్యంగా daily conversation లో informal situations లో మనం వేసే questions, అందుకు వచ్చే answers పైవన్నీనూ. Carefully observe the questions and the replies in the dialogues above. you find the responses (replies) very brief and expressed in a word or two.

(పై passage లోని జవాబులన్నీ కూడా చాలా క్లుప్తంగా ఒకటి రెండు మాటల కంటే ఎక్కువ లేకపోవటం గమనించండి.)





M. SURESAN

ఇలాంటి short responses English conversation/ spoken English కు సహజత్వాన్నిస్తాయి.

Spoken English లో questions కు, ముఖ్యంగా non 'wh' word questions (అంటే what, when, why, where, who, whose లాంటి మాటలతో ప్రారంభం కాని questions) కు responses చాలా క్లుప్తంగా ఉంటాయి.

పై conversation passages ఒక్కొక్కటి మూడు, నాలుగుసార్లు బిగ్గరగా చదివి practice చేయండి. short responses ఎలా ఉంటాయో మీకు అర్థమవుతుంది. Look at the following exchanges.

**I. Balaram:** May I come in?

**Rajaram:** Please do. (Have a seat)

ఇక్కడ come in అని కానీ, please come in అని కానీ reply లో రాకపోవటం గమనించండి.

**II. Ramana:** Australians play well.

**Kamala:** Yes, they do/ No, they don't.

ఇక్కడ కూడా yes, they play well/ No, they don't' play well అని, play వాడకపోవడం గమనించండి. ఇదీ English లో natural practice.

**III. Teacher:** Can you sing, Radha?

**Radha:** Yes, I can, Maam/ No I can't/ I'm afraid I can't.

ఈ dialogue లోని response లో కూడా sing repeat కాకపోవటం గమనించారు కదా.

(I'm afraid; ఇక్కడ afraid కు అర్థం భయం అని కాదు. ఏ విషయమైనా చెప్పటానికి బాధపడ్డా/ ఇష్టం లేకపోయినా I'm afraid అంటాం.)

ఇలాంటి short responses మాత్రమే మన spoken English కు సహజత్వాన్నివ్వగలవు. ఇలాంటి short responses లేని conversation bookish గా, అతికించినట్లు ఉంటుంది.

మీ English speech అమరినట్లుండాలంటే ఇవి బాగా practice చేసి తడుముకోకుండా వాడగలిగి ఉండాలి. ఇవి ఎలా చేయాలో తెలుసుకుందాం:

మొదటగా study the short responses in the short conversations at the beginning of this lesson.

**1. Prasad:** ... Are they new?

**Pramod:** Yes, they are.

(ఇక్కడి response, చాలామంది అనేట్లు, yes, అనికాని, yes, they are new అనికానీ అనరు. correct conversation లో సరైన response: Yes, they are. Answer కాదు అయితే, No, they aren't. ఇక్కడ కూడా, No తో ఆపటంకానీ, No, they are not new అని పూర్తిగా ఆపటం జరగదు, standard spoken English లో. అలాగే-

**Prasad:** Perhaps they cost you a lot.

**Pramod:** Yes, they did. (Yes తో ఆపటం కానీ, Yes, they cost me a lot కానీ కాదు)

**Prasad:** Shall we start?

**Pramod:** We shall. (short response) (We shall start కాదు)

Passage II లో short responses గమనించండి.

**a)** Yes, I have (met లేదు) **b)** No. I don't (Know లేదు) **c)** No I won't (meet లేదు) **d)** I'm afraid no (ఇక్కడ expect ప్రస్తావనే లేదు)

**Passage III: a)** Yes, it hasn't. (opened లేదు) **b)** So it is. (open లేదు) **c)** Nor can I (wait లేదు)

**Passage IV: a)** Did I? (Did I come late లేదు కదా?) **b)** But you weren't (here లేదు) **c)** So, it does (So it makes me late కాదు)

**Passage V: a)** But we haven't (been చేర్చలేదు) **b)** But I'm not. (mistaken చేర్చలేదు) **c)** But it doesn't seem, to me (familiar repeat అవటం లేదు)

**Passage VI: a)** So must I ('Start' repeat కావటం లేదు) **b)** I have ('the key' repeat కావటం లేదు) **c)** I will (lock it అనటం లేదు)

పై passages అన్నీ బిగ్గరగా 3, 4 సార్లు practice చేయండి. Short responses అలవాటవుతాయి.

Short responses వెంట వెంటనే అందించటానికి అది form చేయటం అర్థం చేసుకుందాం. ఆ సూత్రాలివి:

**a)** Are they students? దీనికి short response - వాళ్లు students అయితే, Yes, they are students అని పూర్తిగా అనే బదులు, yes, they are తో ఆపేస్తాం. కాకపోతే, No, they aren't (are not) అంటాం. ఇక్కడ easy short response ఇచ్చేటప్పుడు మొదట sentence లో verb చూసుకోవాలి. దాన్నిబట్టి మన response ఉంటుంది. sentence లో 'Are' ఉంది కాబట్టి, So they are అని response.

**b)** Ramarao: Are you a student?
Balaram: Yes, I am/ No I'm not. Sentence లోని verb, Are, response లోని verb 'am' ఒకే tense లో ఉండాలి.

**c)** Sentence లో 1st Regular Doing Word (go, come, sing..), 2nd Regular Doing Word (goes, comes, sings..) and 3rd Regular Doing Word (went, came, sang..) వచ్చినప్పుడు, వాటికి సంబంధించిన do, does and did వాడతాం.

**1) Ramu:** Do you take coffee?

**Somu:** Yes, I do/ No, I don't (do not)

**2) John:** Does she sing well?

**Eddy:** Yes, she does/ No, she doesn't (does not)

**3) Sarala:** Did he meet you yesterday?

**Vanaja:** Yes, he did/ No he didn't (did not)

అలాగే sentence లో shall, will, can, could, may, might, need వస్తే, responses లో కూడా అవే repeat అవుతాయి, Yes, అయితే not లేకుండా, No అయితే, not చేర్చి

**a) Kavya:** Will you buy the book?

**Navya:** Yes, I will/ No, I won't (will not)

**b) Kiran:** Can he walk?

**Shyam:** Yes, he can/ No, he can't.

**c) Ram:** could you understand that?

**Das:** Yes, I could/ No, I couldn't.

**4)** Have, has, had sentences లో వస్తే responses లో కూడా అవే వస్తాయి.

**a) Venu:** Have you understood it?

**Ramu:** Yes, I have/ No, I haven't/ I'm afraid I haven't.

**b) Balu:** Has he come?

**Somu:** Yes, he has/ No, he hasn't/ I'm afraid he hasn't.

**5) Kesav:** He had seen me before he went out.

**Kumar:** Yes, he had/ No, he hadn't.

**EXERCISE**

**Now practise short responses for the following aloud.**

**Srinath:** నిన్న నువ్వు వాడిని కలుసుకున్నావా?

**Srikar:** (బాధగా) లేదు.

**Srinath:** ఈరోజైనా కలుసుకుంటావా?

**Srikar:** కలుసుకోను, నాకు పనుంది.

**Srinath:** వాడికి phone అయినా చేస్తావా?

**Srikar:** చేస్తాను. కానీ వాడు ఊళ్లో ఉన్నాడా అనేది అనుమానం నాకు.

**Srinath:** నువ్వు వాడిని last time కలుసుకున్నప్పుడు నువ్వీ విషయం చెప్పావనుకుంటున్నా.

**Srikar:** చెప్పాను. ఆ విషయం నీకు చెప్పాను కదా, గుర్తుందనుకుంటా.

**Srinath:** గుర్తుంది. ఒకసారి దాన్ని మళ్లీ చెప్పటం నీకేం అభ్యంతరం లేదు కదా?

**Srikar:** అదేంలేదు. తప్పకుండా చెప్తా.

**ANSWER**

**Srinath:** Did you meet him yesterday?

**Srikar:** No, I didn't/ I'm afraid I didn't.

**Srinath:** Will you meet him at least today?

**Srikar:** I won't. I have work.

**Srinath:** Will you at least call him?

**Srikar:** I will, of course. But I doubt if he is in town.

**Srinath:** When you met him last, I think you told him of it.

**Srikar:** I did. I told you that I had told him of it too. Hope you remember it.

**Srinath:** I do. But would you mind repeating it?

**Srikar:** No, certainly not.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# She wasn't here, was she?

**Bhanu:** Hi Sarat, how do you feel now?
(శరత్, ఇప్పుడెలా ఉంది? )

**Sarat:** Certainly much better, though not all-right.
(కచ్చితంగా మెరుగ్గా ఉంది, పూర్తిగా కోలుకోక పోయినప్పటికీ)

**Bhanu:** You still feel week, don't you?
(ఇంకా నీరసంగా ఉంది, కదా? )

**Sarat:** Yes, I do. I look week, don't I?
(నేను నీరసంగా కనిపిస్తున్నాను, కదా? )

**Bhanu:** That you do. The Doctor has treated you well, hasn't he?
(అవును. Doctor నిన్ను బాగానే చూశాడు కదా? )

**Sarat:** Yes, he has, certainly. Otherwise I couldn't have recovered so quickly, could I?
(కచ్చితంగా. లేకుంటే నేనింత త్వరగా కోలుకో గలిగుండేవాడిని కాను కదా? )

**Bhanu:** You will resume duty next Monday, won't you?
(నువ్వు వచ్చే సోమవారం మళ్లీ office కొస్తావు కదా? )

(resume = మళ్లీ ప్రారంభించటం. Resume - pronunciation రెజ్యూమ్ (జ్యూ - size లో z లాగ). అదే spelling తో రెజ్యుమె (జ్యు - size లో z లాగ) అని pronounce చేస్తే biodata/ cv అని అర్థం. Job applications తో జతపరిచేది)

**Sarat:** I hope I well (అలానే ఆశిస్తున్నా)

**Bhanu:** Get well soon. I'll make a move then. You don't need anything more, do you?
(త్వరగా కోలుకో. (Get well soon - ఇది జబ్బుపడ్డవాళ్లను కోలుకోవాలని ఇతరులు కోరేది.) అయితే నే వెళతాను. నీకింకేం అవసరం లేదు కదా? )

**Sarat:** No. Thank you. You are going straight to office, aren't you?

**Bhanu:** Yes, I am.

**Sarat:** Bye, then.

**Bhanu:** Bye.



కిందటి lesson లో English లో సర్వసాధారణంగా వాడే short responses చూశాం కదా. ఈ short responses గురించి మరికొంత తెలుసుకునేముందు Question Tags గురించి తెలుసుకోవాలి. ఇదివరలో తెలుసుకున్నదాన్ని మరోసారి గుర్తుచేసుకుందాం.

మనం తెలుగులో ఒక విషయం చెప్పి, దాని చివర, కదా, కాదా, ఔనా, లేదా అంటుంటాం కదా? అలా English లో అనే మాటలనే question tags అంటాం.

**eg:** He is a great actor, <u>isn't he?</u>
= అతను గొప్ప నటుడు, <u>కదా?</u>

Sentence చివర ఉన్న 'isn't he?' నే question tag అంటాం.

తెలుగులో ఏ sentence చివరైనా, మనం వాడే question tag, కదా? కాదా? ఔనా? లేదా? - ఈ నాలుగింటిలో ఏదైనా వాడతాం. తప్పులేదు. అయితే English లో question tag, sentence subject ను బట్టి, verb ను బట్టి sentence, sentence కూ మారిపోతుంటుంది.

**eg: 1)** she <u>is</u> here, <u>isn't she?</u>
(ఆమె ఇక్కడ ఉంది కదా? )

**2)** He <u>comes</u> here, <u>doesn't he?</u>
(అతనిక్కడికొస్తాడు కదా? )

చూడండి: Sentence 1 లో, subject - she. verb - is. Question tag: isn't she?

Sentence 2 లో subject - He, verb - comes. Question tag - doesn't he? (ఇక్కడ verb comes, II RDW కాబట్టి question tag లో 'does' వస్తుంది)

ఇప్పుడు **Question tags** ఎలా **form** చేయాలో చూద్దాం.

**She was here.** దీనికి **Question tag form** చేయాలి.

**1)** మొదట verb రాయాలి sentence చివర (she was here, was ...)

**2)** sentence లో not లేదు. కాబట్టి verb తర్వాత not ను verb తో కలిపి n't గా రాయాలి.
She was here, wasn't ...?

**3)** తర్వాత sentence subject, 'she' చేర్చాలి. తర్వాత Question mark పెట్టాలి. అప్పుడు question tag మొత్తం ... wasn't she?
sentence మొత్తం, question tag తో - she was here, wasn't she?





M. SURESAN

(Sentence లోపల not ఉంటే tag లో not (n't) రాదు.

**eg:** She <u>wasn't</u> here, <u>was she?</u> sentence లో not ఉండటం వల్ల, tag లో not లేదు.)

Sentence లోని verb, 1st Regular doing word (come, go, sing, etc), 2nd Regular doing word (comes, goes, sings, etc), Past doing word (came, went, sang, etc) అయితే, question tag లో do (I RDW కు), does (II RDW కు) did (Past doing word) వస్తాయి.

**a)** They <u>study</u> (I RDW) well, <u>don't they?</u>
(They do <u>not</u> study well, <u>do they?</u>)

**b)** She <u>sings</u> (II RDW) well, <u>doesn't she?</u>)
(She <u>does not sing</u> well, <u>does she?</u>)

**c)** They <u>came</u> (PDW) yesterday, <u>didn't they?</u>
(They <u>did not come</u> yesterday, <u>did they?</u>)

ఈ regular doing words, (I RDW, II RDW) past doing words కు మాత్రమే ఇలా వేరేగా do, does, did Question tags లో వస్తాయి. ఇవి కొంచెం ఊహతో practice చేయాలి. మిగతా verbs అంటే will, would, shall, should, can, could, may might, must కు అవే verbs question tags లో repeat అవుతాయి.

**a)** She <u>will come</u>, <u>won't</u> she? (won't = will not)

**b)** They <u>would help</u> me, <u>wouldn't</u> they?

**c)** I <u>shall go</u>, <u>shan't</u> I? (shan't = shall not)

**d)** He <u>should</u> know this, <u>shouldn't</u> he?

**e)** She <u>can sing</u>, <u>can't</u> she? (can't = cannot)

**f)** He <u>could</u> pass, <u>couldn't</u> he?

**g)** They <u>may help</u> you, <u>mayn't</u> they? (very rare)

**h)** The people <u>might like</u> it, <u>mightn't</u> they? (very rare)

**i)** He <u>must go</u>, <u>mustn't</u> he?

**Study the following:**

**Pramada:** Can you speak English?

**Narmada:** I <u>can</u>, of course. (మాట్లాడగలను)

**Pramada:** <u>Is</u> your knowledge of English good?

**Narmada:** Yes, it <u>is</u> (అవును)

**Pramada:** So you haven't forgotten what you learnt at school. (నువ్వు school లో నేర్చుకున్నది మరిచిపోలేదన్నమాట)

**Narmada:** No, I haven't (లేదు)

చూడండి: ఈ responses లో ఎక్కడా కూడా yes, no లతో ఆపకుండా, yes, I can; yes, it is; No, I haven't అని sentences లో ఉన్న helping verbs ను repeat చేయటం గమనించే ఉంటారు.

**Now observe the following short responses from the conversation at the beginning of the lesson.**

**1) Bhanu:** You still <u>feel</u> week, don't you?
**Sarat:** Yes, <u>I do</u>.

**2) Bhanu:** The doctor <u>has treated</u> you well, hasn't he?
**Sarat:** <u>Yes, he has</u>, certainly

**3) Bhanu:** You <u>will resume</u> duty next week, <u>won't you?</u>
**Sarat:** I hope I will

**4) Sarat:** You <u>are going</u> straight to office, <u>aren't you?</u>
**Bhanu:** Yes, I am

ఏ sentence కయినా వచ్చే short response, ఆ sentence లోని verb form నూ, tense నూ బట్టి ఉంది అని గమనించారు కదా! ఈ Short responses లో, I'm afraid ..., I wonder ..., of course ..., certainly, I doubt whether ..., అని కూడా అనొచ్చు. ఒక్క I తోనే కాకుండా, we, you, they, he, she, it కూడా రావచ్చు. Look at the following:

**Kesav:** Did you have enough money to buy the book? (ఆ పుస్తకం కొనేందుకు చాలినంత డబ్బుండిందా? )

**Kedar:** <u>Of course</u>, I had.

**Kesav:** You seen to have got it cheap. (నీకది చౌకగా వచ్చినట్లుంది)

**Kedar:** No, <u>certainly</u> not. (కానేకాదు)

**Kesav:** Why? Did it cost you a lot?
(చాలా ఖరీదయిందా,)

**Kedar:** Of course, it did. (సందేహమేం లేదు)

**Kesav:** You should have bargained. (బేరం చేయాల్సింది) You would have got it for a lower price. (నీకంతకన్నా తక్కువ ధరకు వచ్చేది)

**Kedar:** <u>I did</u>. But I doubt whether I could have got it for a lower price.

**Kesav:** I need two copies of the book, one for me and another for my cousin. Can I get them? (నాకు ఆ పుస్తకం copies రెండు కావాలి- ఒకటి నాకు, ఇంకోటి మా cousin కు. దొరుకుతాయా? )

**Kedar:** <u>I wonder</u>. (సందేహమే)

**Kesav:** <u>You mean</u> you got the last copy?
(అంటే నువ్వనటం, నువ్వు తెచ్చుకున్నది, అక్కడి చివరి copy అనా? )

**Kedar:** I'm afraid <u>so</u> ... at least in that shop.
(అనే అనుకుంటున్నా (చెప్పటానికి బాధపడటం- I'm afraid.) కనీసం ఆ shop లో)

**Kesav:** Then have I to go without such an important book?
(అయితే నేనీ ముఖ్యమైన పుస్తకం లేకుండానే సర్దుకోవాలా? )

**Kedar:** You <u>have to</u>, ... at least for the present.
(అవును, అంతే. ప్రస్తుతానికంతే)

చూశారు కదా? మన ఊహాశక్తిని బట్టి అర్థవంతంగా ఎన్ని Short responses ఇవ్వవచ్చో మనం ఎంత ఎక్కువగా Short responses తో సంభాషణ చేయగలిగితే English మీద అంతపట్టున్నట్లు.

**EXERCISE**

**Madhukar:** నేను పిలిస్తేవాడు రాడంటావా?
**Subhakar:** నాకు సందేహమే.
**Madhukar:** నేనంటే వాడికి గౌరవం ఉంది కదా?
**Subhakar:** దానికి సందేహం లేదు.
**Madhukar:** అయితే వాడు రావటం సందేహమని ఎందు కంటున్నావు? వాడి విషయం నీకు బాగా తెలుసా?
**Subhakar:** అవును.
**Madhukar:** వాడికి నువ్వు నచ్చచెప్పలేవా?
**Subhakar:** చెప్పగలను. కానీ ... నువ్వు అతనితో మాట్లాడవలసిందేనా?
**Madhukar:** అవును
**Subhakar:** నువ్వే అతని దగ్గర కెళ్లొచ్చుకదా?
**Madhukar:** వెళ్లలేను.
**Subhakar:** నీ మర్యాదకు తక్కువనుకుంటున్నావా?
**Madhukar:** కాదు. అక్కడ వాళ్లన్న ఉంటాడు.
**Subhakar:** అతనంటే నీకిష్టం లేదా?
**Madhukar:** అంతే. ఒకసారి ప్రయత్నం చెయ్యి.
**Subhakar:** OK. అలాగే.

**ANSWER**

**Madhukar:** Do you think he wouldn't come if I called him?
**Subhakar:** I doubt/ I'm afraid, so.
**Madhukar:** He respects me, <u>doesn't he?</u>
**Subhakar:** Ofcourse, he does.
**Madhukar:** Then why do you doubt his coming? Do you know him well?
**Subhakar:** Yes, I do.
**Madhukar:** Can't you persuade him?
**Subhakar:** Yes, I can, but must you talk to him?
**Madhukar:** Yes, I must
**Subhakar:** Then you can as well go to him.
**Madhukar:** No. I can't.
**Subhakar:** You feel it lowering yourself, don't you?
**Madhukar:** No. I don't. But his brother will be there.
**Subhakar:** Don't you like him?
**Madhukar:** No. I don't. Just try once to get him here.
**Subhakar:** OK. So I will.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# I am not going - Nor am I

**Gowtham:** How was the movie yesterday?
(నిన్న సినిమా ఎలా ఉంది?)

**Uttham:** I didn't like it one bit at all. You saw it the day before. How did you find it?
(అసలు (ఒక్క పిసరైనా) నచ్చలేదు నాకు. నువ్వు మొన్న చూశావు. నీకెలా అనిపించింది?)

**Gowtham:** I didn't like it either. It had too much of violence and sex. (నాకూ నచ్చలేదు. దాంట్లో మితిమీరిన హింస, శృంగారం ఉంది.)

**Uttham:** So have most movies nowadays. But unfortunately there are people who see them. No wonder that only such movies are produced. (అన్నింట్లో అంతే. దురదృష్టమేమిటంటే అలాంటి సినిమాలను చూసేవాళ్లు ఉన్నారు. అందుకని అలాంటి సినిమాలు రావటం (నిర్మించడం)లో ఆశ్చర్యమేం లేదు.

**Gowtham:** The story line is very thin and dances and fights are a plenty in all of them. (వాటన్నింట్లో కథ చాలా తక్కువ, dances, fights ఎక్కువ)

**Uttham:** So they are.

**Gowtham:** Our heroes and heroines just dance in the movies. They act little. (మన heroes and heroines సినిమాల్లో dance చేస్తారంతే. వాళ్లు నటించటం అనేది దాదాపు లేదు)

**Uttham:** So they do! The weak story line offers them no scope for action. (అవును వాళ్లు చేసేదదే. కథల్లో బలం లేకపోవడంతో వాళ్లు తమ నటన చూపించే అస్కారమే లేదు)

**Gowtham:** No it doesn't. Nor do most of the audiences seem to expect anything other than that. (అవును ఆ కథలంతే. ప్రేక్షకుల్లో చాలామంది అంతకంటే ఏం కోరుకునేట్లు లేరు)

**Uttham:** What do you think of Hindi movies?
(హిందీ సినిమాలెలా ఉన్నాయంటావు?)

**Gowtham:** (Do) you think they are better? All Indian movies are alike. Perhaps the music in them is better. (అవేమన్న మెరుగనుకుంటున్నావా? భారతీయ చిత్రాలన్నీ ఒకేతీరు. బహుశా హిందీ సినిమాల్లో సంగీతం కాస్త బాగుంటుందేమో?)

**Uttham:** We don't hear people saying that a hero's action in a movie is good. All that we hear them say is that the hero has danced well in the movie and that his steps are good. (సినిమాలో hero action బాగుందని ప్రేక్షకులనటం మనం వినం. మనం వినేదంతా ఆ hero బాగా dance చేశాడనీ, ఆయన 'steps' బాగున్నాయని.)

**Gowtham:** That's true. All that they care about is the hero's ability to dance. (నిజమే వాళ్లు చూసేదంతా dance లో hero ప్రతిభ మాత్రమే)

**Uttham:** So they do! OK. Let's hope for better days for our movies. (అంతే వాళ్లుచేసేది. మన చిత్రాలకు మంచి రోజులొస్తాయని ఆశిద్దాం.)

మనం కిందటి రెండు lessons లోనూ short responses ఎలా ఇవ్వాలో తెలుసుకున్నాం గదా. ఈ lesson లో కూడా ఒకరు చెప్పిన మాటకు మనం ఔను (yes) అనేందుకూ, కాదు (no) అనేందుకూ, spoken form ఎలా ఉంటుందో తెలుసుకుందాం.

**a) Prakash:** He appears to be worried.
**Vikas:** Yes, he does.

ఇక్కడ 1st sentence లో verb <u>appears</u> కాబట్టి, Vikas's response, 'yes, he does' అని వస్తుంది - ఎందుకంటే, appears (2nd RDW) = does + appear. అందుకని ఇక్కడ, he does అంటాం, 'yes' తర్వాత.

**b) Sunil:** You see movies quite often, don't you?
**Kiran:** Yes, I do.

ఇక్కడ Sunil మాటల్లో verb, see. see (1st RDW) = do + see. అందుకని response, Yes, I do. అదే negative response అనుకోండి. అప్పుడు, Kiran's response ఎలా ఉంటుంది? No, I don't. (do + not)

**c) Ganesh:** You went to a movie yesterday, <u>didn't you?</u> (నువ్వు నిన్న సినిమా కెళ్లావు, కదా?)
**Mahesh:** Yes, I did/ No, I didn't. (అవును, వెళ్లాను/ లేదు, వెళ్లలేదు)

Ganesh's sentence లో verb, went (Past doing word) = <u>did</u> + go. అందుకని response, yes అయితే, Yes, I did. no అయితే No, I didn't.


M. SURESAN

Sentences (b), (c) లలో question tags ఉన్నాయి, (Don't you? and didn't you). అందుకని ఇక్కడ response ఇవ్వటానికి, వాటిల్లోనే మనకు కావలసిన helping verbs (do, did) ఉన్నాయి.

Verbs 1st Regular Doing Word (come, go, sing, etc), 2nd Regular Doing Word (comes, goes, sings, etc), Past Doing Word (came, went, sang, etc) అయితే, responses లో do, does and did వరసగా వస్తాయి. ఇది మనం జాగ్రత్తగా గుర్తుపెట్టుకోవాలి.

ఇక మిగతా verbs విషయంలో (will, shall, would, could, etc ...) అవి కనిపిస్తూనే ఉంటాయి. కాబట్టి, short responses లో వాటినే వాడతాం.

**Now look at the following.**

**d) Srikanth:** The milk is too hot to drink.
**Vikranth:** Yes, it is.

Yes, it is అనేది ఇక్కడ మామూలుగా వచ్చే short response. అయితే ఆ milk మనకు ఆశ్చర్యం కలిగించే అంత వేడి (అవునే, వేడిగా ఉందే! అనే అర్థం వచ్చేట్లు) అయితే, అప్పుడు response: Yes, so it is!

**e) Vinai:** Isn't he more than 6 feet tall?
**Vijai:** Yes, so he is!/ ofcourse he is!
(ofcourse = తెలుస్తూనే ఉంది కదా)

**f) Jayanth:** Is he paying us today?
(ఈరోజు అతడు డబ్బు చెల్లిస్తున్నాడా?)
**Ananth:** No, I'm afraid he isn't.

**g) Ram:** Must I take the exam?
(నేను exam రాయాల్సిందేనా?)
**Raghu:** Yes, you must./ Oh no, you needn't.

Must, should, have to/ has to విషయంలో కాస్త జాగ్రత్త అవసరం. Response, 'yes' అయితే సమస్యలేదు. ఎందుకంటే అప్పుడు మనం, Yes/ ofcourse you must/ should/ have to అంటాం.

He/ she/ it అయితే Yes/ ofcourse, he/ she/ it must/ should/ has to అంటాం. No అని response అయితే, response లో needn't.

(గుర్తుంచుకోండి- must/ should/ have to/ has to కు opposite- needn't (needn't = need not) - you must do it (నువ్వుచేయాలి) × you need not (needn't) do it (నువ్వది చేయనక్కరలేదు)

**Ramesh:** Has he to start the work now?
(అతనిప్పుడే పని ప్రారంభించాలా?)

**Naresh:** Yes, he has to/ yes, I'm afraid he has to/ ofcourse, he has to/ so, he has to (OR) Oh, no, he <u>needn't</u>.

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson:**

1) I didn't like it either!
2) So have most movies nowadays!
3) So they are!
4) So they do!
5) No, it doesn't.

Spoken English లో also (కూడా) అనే అర్థంతో అరుదుగా వాడతారనీ, దాని బదులు too/ as well వాడతారనీ, not తో అసలు వాడరని ఇంతకుముందు lessons లో మనం తెలుసుకున్నాం.

**eg: a)** He knows English; he knows Telugu <u>too</u>/ he knows Telugu <u>as well</u>. (ఇక్కడ He also ..., spoken form లో అరుదు.) అదే not తో also వాడాల్సి వస్తే, not either (n't either) వాడతాం.

He <u>doesn't</u> know Telugu; he doesn't know Tamil <u>either</u>.
(అతడికి తెలుగు రాదు, Tamil <u>కూడా</u> రాదు)

I didn't like it అని Gowtham అంటే,Uttam కూడా నాకూ నచ్చలేదు, అనే అర్థంతో - <u>I didn't like it either</u> అనడం గమనించండి.

మిగతావన్నీ కూడా: So have most movies nowadays! so they are! So they do! No, it doesn't కూడా అంతే.

**2)** So have most movies nowadays.
(అవును, <u>అదే</u>, ఈ రోజుల్లో చాలా సినిమాల్లో <u>అంతే</u> అని ఒప్పుకోవటం)

**3)** So they are (నేను కూడా)
(ఇది yes, so are they కి బదులు) ఇది కూడా (అవును, అంతే- అదే నేనూ అనుకుంటున్నాను, అనే అర్థంతో)

**4)** So they do (yes, so do they) - so they do అంటే మనం ఇంకా బాగా ఒప్పుకొంటున్నట్లు - అవును, అదే నాకనిపించేదీనూ - అనే అర్థం వచ్చేట్లు.

**5)** No, it doesn't - ఇది మామూలుగా ఇంతకుముందు మనం తెలుసుకున్న short response.

t t t t

**Now look at the following.**

**I a) Santhi:** I am happy about the results. (ఫలితాల విషయంలో చాలా సంతోషంగా ఉన్నా)
**Klupta:** So am I.

**b) Prabhat:** Mine is an imported watch.
(నాది imported/ foreign watch).

**Prakash:** So what? So is mine.
(అయితే ఏంటి? నాది కూడా foreign watch)

పై రెండు dialogues చూడండి. Dialogue (a) లో మామూలుగా అయితే, Klupta response, I am also happy అని అంటుంటారు. అలాగే dialogue (b) లో Mine is also a foreign watch అని అంటుంటారు. కానీ spoken form లో అలారాదు. So తోనే response ఆరంభం అవుతుంది - <u>also రానేరాదు.</u>

**a)** అతడు బాగా చదువుతాడు, అతడి అన్న కూడా బాగా చదువుతాడు=
He studies well, so does his brother.
(His brother too studies well అనరు - His brother studies well too అనొచ్చు అయితే అంత common కాదు)

**b)** వాడు ఆ school లో చేరాడు, వాళ్ల అక్కయ్య అదే School లో చేరింది.
He joined that school, and <u>so did</u> his sister.

**II a) Akash:** Sunil <u>does</u>n't <u>study</u> well.
(సునీల్ సరిగా చదవడు)
**Eswar:** Nor <u>does</u> his brother/ Neither <u>does</u> his brother/ His brother <u>doesn't either</u>.
(అతడి brother కూడా సరిగ్గా చదవడు)

ఇలాంటి Negative Sentences కు negative response పై విధంగా ఉంటుంది. మళ్లీ చూడండి.

**b) Sasi:** 'The mother <u>did</u>n't <u>come</u>' (ఆ తల్లి రాలేదు)
**Anil:** (పిల్లలు కూడా రాలేదు)
Nor did the children/ neither did the children/ The children didn't either. (The children <u>also</u> did <u>not</u> come అనం. Notతో also రానేరాదు).

**III a) Ramana:** I <u>did</u>n't <u>like</u> the movie.
(నాకాసినిమా నచ్చలేదు)
**Sumana:** <u>But</u> I did. (కానీ నాకు నచ్చింది)

**b) Raghav:** He has passed. (అతడు pass అయ్యాడు)
**Sekhar:** <u>But</u> I'm afraid his brother hasn't.
(కానీ అతడి brother pass అవలేదు)

చూశారు కదా. ఒక sentence లో చెప్పిందానికి వ్యతిరేకమైన response ఇవ్వాలంటే 'But' తో begin చేస్తాం.

ఈ three types of response మరోసారి చూద్దాం.

**I. Both positive**
**Prem:** My watch <u>shows</u> the correct time.
(నా watch correct time చూపిస్తుంది)
**Syam:** So does mine. (నాది కూడా)

**II. Both negative:**
**Radha:** I am not going (నేవెళ్లడం లేదు)
**Sneha:** Nor am I/ neither am I/ I'm not either.

**III. Statement & response opposite each other.**
**Hitesh:** He is quite happy.
(అతను సంతోషంగానే ఉన్నాడు)
**Nitesh:** <u>But</u> his brother isn't.

మనం ఇక్కడ గమనించాల్సింది So, nor, neither, తో ప్రారంభమయ్యే responses లో verb ముందూ, subject తర్వాత రావటం.

**eg:** So <u>do</u> <u>I</u>, nor <u>do</u> <u>I</u>, neither <u>do</u> <u>I</u>. ఇది ముఖ్యం. ఈ order మారితే response సరికాదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




**Archana:** You were late to class yesterday.
**Rachana:** But I wasn't
**Archana:** The day before?
**Rachana:** The day before? yes, I was. But so were you too.
(మొన్ననా? అవును ఆలస్యమైంది. అయితే నీక్కూడా కదా!)
**Archana:** I am not usually late. You are rarely on time.
(నేను మామూలుగా ఆలస్యంగా రాను. నువ్వు అరుదుగా సమయానికొస్తావు)
**Rachana:** So would you be if you had to come from a long way off and depend on city busses.
( మీ ఇల్లు దూరంగా ఉండి city bus మీద ఆధారపడాల్సివస్తే నువ్వూ అంతేలేమ్మా)
**Archana:** But I wouldn't. I would start early enough to avoid being late.
(అదేం కాదు. ఆలస్యం కాకుండా ఉండేందుకు ముందే బయల్దేరతాను)
**Rachana:** You can't do it (నువ్వు చేయలేవు)
**Archana:** But I can (చేయగలను)
**Rachana:** You often tell me that you don't get




(yes, it is అని కూడా అంటారు)
**b) Sailaja:** Bhramara's necklace must have cost her a lot.
(భ్రమర necklace చాలా ఖరీదై ఉండాలి/ ఖరీదైందిగా ఉంది.)
**Viraja:** Yes it must have/ So it must have
(అవును, చాలా ఖరీదై ఉండాలి)
**C) Rahul:** One of your shirt buttons has come off.
**Sasir:** Yes, it has/so it has.
**a)** లో Jalaja's response: yes it is/ so it is
**b)** లో Viraja's response: yes, it musthave/ so it must have
**c)** లో sasir's response: yes, it has/ so it has
వీటన్నిటిలో yes తో begin అయ్యే response ఒకటీ, so తో begin అయ్యే response ఒకటీ వస్తున్నాయి కదా! రెండూ correct అయితే, so తో bigin అయ్యే responses, ( so it must have/so it is), yes తో begin అయ్యే responses కంటే ఎక్కువ కచ్చితం, కొంత ఆశ్చర్యాన్ని కూడా వ్యక్తపరుస్తాయి. (అవునే, కరెక్టేనే అనే అర్థం ధ్వనించేట్టు) కాబట్టి ఒప్పుకోవటం ఎక్కువ అయినప్పుడు so తో begin అయ్యే response better.
Passages a), b) and c) (పైన ఇచ్చినవి) లో ఒకరు చెప్పినదానికి, 'అవును' అనే responses చూశాం. మరికొన్ని ఉదాహరణలు చూడండి.
**d) Lasya:** Divya speaks English well.
(దివ్య English బాగా మాట్లాడుతుంది)
**Priya:** Yes, she does/ so she does.

రాలేదు)
**Vinod:** But I've been.
(నేనొచ్చాను)
ఇలా opposite responses 'but' తో ప్రారంభిస్తాం. ఇవి గుర్తుంచుకోండి.
ఇప్పుడు opposite responses లో, neither, nor, n't either (not either) కూడా వాడుతుంటారు.
( English లో not వస్తే also అదే sentence లో రాదని కిందటి lesson లో చూశాం -- (Not only, but also ఇందుకు మినహాయింపు)
**a) Lakshmi:** Snakes don't fly
(పాములు ఎగరవు)
**Lalasa:** Neither do cats/Nor do cats/cats don't (do not) either. (పిల్లులూ ఎగరవు)
**b) Manasa:** Suseela wasn't late
(సుశీల ఆలస్యంగా రాలేదు)
**Rajita:** Nor was I/ Neither was I/ I wasn't either. (నేనూ late కాదే)

# Yes, it has/so it has

up before 6 in the morning. Its possible for you to start early?
(నాతో ఎప్పుడూ అంటుంటావు, ఆరింటికంటే ముందే లేవనని, ఎలా సాధ్యం నీకు తొందరగా బయల్దేరటం)
**Archana:** But I would, if I had to start early
(ముందే బయల్దేరాల్సి వస్తే త్వరగా లేస్తాను)
**Rachana:** You sleep like a log, and you want me to believe that you'd get up early.
(నువ్వు దుక్కలాగా నిద్రపోతావు. నన్ను నమ్ము మంటావు... నువ్వు త్వరగా లేస్తానంటే)
**Archana:** My policy is sleep while you sleep, work while you work.
(నిద్రపోవాల్సినపుడు నిద్రపోవటం, పనిచేయాల్సినపుడు పనిచేయటం, నా పద్ధతి)
**Rachana:** You can say all this, but action is different.
(ఇవన్నీ మాటలే, పనిచేయాల్సినప్పుడు పనికి రావు)
ఇంతకు ముందు lessons లో questions కూ, question tag ఉన్న sentences కూ మనం short responses తెలుసుకున్నాం కదా, అదేంటి?
a) Answer, yes అయితే, short response,
**i)** yes,I/ we/ you/ they do/ did/ have/ can/ could/ may, etc.
**ii)** yes, he/ she/ it does/ did/ has/ can/ could/ may, etc
**b)** Answer, no అయితే short response,
**i)** No, I/ we/ you/ they don't/ didn't/ haven't/ can't/ could't/ may it etc.
**ii)** No, he/ she/ it doesn't/ didn't/ hasn't/ can't/ couldn't/ mayn't etc.
ఇప్పుడు మనం practise చేసి, conversation లో వాడబోతున్న short responses, ఒకరు చెప్పిన దానికి (Question కాకుండా) అవుననటం/కాదనటం ఎలా అని. ఇది కిందటి lessons లో కూడా చూశాం. ఇప్పుడు మరికొంత వివరంగా చూద్దాం.
**a) Vanaja:** Sujana's dress is good.
**Jalaja:** So it is

**Lasya:** In fact she speaks better than most of us
(అసలు మనలో ఎక్కువమంది కంటే బాగా మాట్లాడుతుంది.)
**Priya:** Yes/of course she does/so she does
(అవును, సందేహమేంటి? )
**e) Prem:** Australia has the best cricket team in the world.
(ప్రపంచంలో Australia కు ఉత్తమ cricket team ఉంది)
**Syam:** Yes, it has/so it has (అవును)
పై dialogues లో responses అన్నీఒకరు చెప్పింది అంగీకరించే responses. ఒకరు చెప్పింది కాదనటానికి అంటే negative responses ఎలా ఉంటాయో చూద్దాం.
**a) Bhanu:** You know Tamil well. Can you explain this?
(నీకు Tamil తెలుసు కదా. ఇది వివరించు)
**Suman:** But I don't.
(కానీ నాకు తెలియదు)
**b) Kesav:** You go there everyday. Why don't you take me there today?
(నువ్వు రోజూ అక్కడికెళ్తావు. ఇవ్వాళ నన్నెందుకు తీసుకెళ్లకూడదూ? )
**Kedar:** But I don't
నేను (రోజూ) వెళ్లనే. (అంటే ఈ రోజునేను వెళ్లకపోవచ్చు)
Dialogues **a), b)** లలో responses ఒకరు చెప్పినదాన్ని ఇంకొకరు కాదనటం. ఇక్కడ negative response, 'but' తో ప్రారంభం అవటం మీరు గమనించే ఉంటారు.
**c) Madhav:** You can't understand this, I'm sure.
(నువ్విది అర్థం చేసుకోలేవని నా నమ్మకం)
**Mahesh:** But I can/But I'm sure I can.
(కానీ నేనర్థం చేసుకోగలను/ కానీ నేనర్థం చేసుకోగలననే నమ్మకం నాకుంది)
**d) Anand:** I haven't been here before.
(ఇంతకు ముందు నేనెప్పుడూ ఇక్కడికి

ఇది మనం last lesson లో చూశాం.
చాలా ముఖ్యంగా గుర్తుంచుకోవాల్సిన విషయం- not తో also రాదు.
Summary: ఇప్పటి వరకు the points we have learnt
**a)** Questions కాకుండా మామూలు statements ను మనం ఒప్పుకునేటట్లయితే
Yes, it is/so it is.


M. SURESAN

(ఇక్కడ is కు బదులు subject నుబట్టి, time of action of the verb ను బట్టీ verb మారుతుందనే విషయం మీకు తెలుసు.
So it is, అనే response, yes, it is కన్నా కూడా కొంచెం stress ఎక్కువ (నొక్కిచెప్పటం/కొంత ఆశ్చర్యం వ్యక్తపరచటం - అవునే! అన్నట్లు)
**b)** ఒకరు చెప్పిందానికి మనం negative response ఇస్తున్నట్లయితే మనం అది 'but' తో begin చేస్తాం.
**a) Keval:** She appears fat
**Kesav:** But she doesn't
**b) Kumar:** She is not beautiful
**Krishna:** But she is
**c)** ఒకరు చెప్పే negative statements కు మన negative responses లో Neither, nor, n't either వాడదాం.
**Anand:** I'm not hungry.
**Vikram:** Neither am I / Nor am I/ I'm not either.
(Neither, nor తో begin చేస్తున్నప్పుడు, verb ముందు, subject తర్వాత రావటం గమనించండి.
**Exercise: Now, practise the following aloud in English, using short responses**
Translate each statement into English, and give the response, both positive and negative.
**Example:** ఈ ఉదాహరణ ప్రకారం చేయండి.
**Ramesh:** ఈ Table చాలా పెద్దది. దీనికి మొదట English చెప్పండి.
This table is very big.

**Suresh:** a) అవును/అవునే చాలా పెద్దదే.
Yes, it is/so it is!
b) అదేం పెద్దది కాదు But it isn't
**Do the following examples:**
1) ఈ పుస్తకం చాలా bore
a) అవును/అవునే, bore! b) అదేం కాదు
2) అతడు బాగా ఆడతాడు.
a) అవును/అవును, నిజంగానే ఆడతాడు.
b) ఏం ఆడడు.
3) నేను చాలా అలసటగా feel అవుతున్నాను.
a) అవును అలాగే కనిపిస్తున్నావు/ అవునే, అలాగే కనిపిస్తున్నావు.
b) అదేం లేదు, నువ్వు fresh గా కనిపిస్తున్నావు
4) వాడు చాలా కోపంగా కనిపిస్తున్నాడు.
a) అవును/అవునే, అలాగే కనిపిస్తున్నాడు.
b) అదేం లేదు
5) నీకు Coffee ఇష్టంలేదని నాకు తెలుసు.
a) అవును, ఇష్టం లేదు.
b) నాకిష్టమే.
6) నిన్న నేను నిన్ను చూడలేదు.
a) నేను చూశాను.
b) నేనూ నిన్ను చూడలేదు.
7) నిన్న నువ్వు ఎందుకు ఆలస్యంగా వచ్చావు.
a) అవును, ఆలస్యంగానే వచ్చాను.
b) నేనేం ఆలస్యంగా రాలేదు.
8) వనజ పుస్తకం కొంది.
a) అవును కొనింది. b) నేనూ కొన్నాను.
c) నేను కొనలేదు.
9) వాళ్లకు teacher అంటే భయం లేదు.
a) నాకుంది. b) నాకూ లేదు.
10) నేను నీకన్నా చాలా ముందుగా ఇక్కడ ఉన్నా.
a) అవును. b) ఏం కాదు.
**Answers:**
**1)** This book is a big bore
a) Yes it is/so it is, b) But it isn't
**2)** He plays well
a) Yes, he does/so he does, b) But he doesn't
**3)** I feel very tired
a) Yes, you look so/you do look so
b) But you don't look so/But you look fresh
**4)** He looks very angry
a) Yes, he does/so he does
b) But he doesn't
**5)** I know you don't like coffee:
a) Yes, I don't/so I don't, b) But I like coffee
**6)** I didn't see you yesterday
a) But I did
b) Neither did I see you/Nor did I see you/ I didn't see you either
**7)** Why did you come late yesterday?
a) Yes I did/So I did, b) But I didn't
**8)** Vanaja has bought the book
a) Yes, she has/so she has.
b) So have I
c) But I haven't
**9)** They are not afraid of the teacher
a) But I am
b) Neither am I/nor am I/I'm not either
**10)** I have been here long before you
a) Yes, you have/so you have
b) But you haven't

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# He works harder than...

**Himesh:** Hi Mahesh, congrats.

**Mahesh:** What on? (ఎందుకు?)

**Himesh:** I hear that your score is better than all the others' scores in the class. (class లో అందరికంటే నీవెక్కువ score చేశావని విన్నాను)

**Mahesh:** Thanks a lot. But I feel happy that I've got very good marks, and not because my score is better than the others. I don't like comparisons. (చాలా thanks. అయితే నాకు మంచి marks వచ్చినందుకే సంతోషపడుతున్నాగానీ, ఇతరుల కంటే ఎక్కువ వచ్చినందుకు కాదు. నాకు పోలికలు ఇష్టం ఉండవు).

(Comparison = పోలిక, compare పోల్చటం)

**Himesh:** They say you are the cleverest in the class. Doesn't it make you happy? (అందరూ నిన్ను class లో అత్యంత తెలివైన వాడంటారు. అది నిన్ను సంతోషపరచదా?)

**Mahesh:** I am certainly happy to get a high score, even a higher score than I've got this time. But I don't care whether my marks are better than those or others or not. (నాకు మంచి marks రావటం సంతోషమే. ఇప్పుడొచ్చిన marks కంటే ఇంకా ఎక్కువ రావటం కూడా సంతోషమే. అయితే ఇతరుల కన్నా ఎక్కువా, తక్కువా అనేది నాకు అనవసరం).

**Himesh:** But Mahesh, comparisons are quite common, aren't they? When we talk of two or more things or people having same similarity we compare them. Comparisons are only natural. (అయితే, మహేష్, పోల్చటం అనేది సర్వసాధారణమైన విషయమే కదా? రెండు మూడు వస్తువుల్లో గానీ, వ్యక్తుల్లోగానీ ఏదైనా సారూప్యం కనపడితే పోల్చటం సహజమే కదా?)

**Mahesh:** So they are. But I don't see why I should feel happy when my marks are higher than the others' marks. I am happy If I get marks that I deserve. I don't like to be compared with others. (నిజమే. అయితే ఇతరులకంటే నాకెక్కువ marks వస్తే నేనెందుకు సంతోషపడాలో నాకర్థం కాదు. నాకు అర్హత ఉన్న marks వస్తేనే నాకు సంతోషం)

**Himesh:** Then why do we have competitive exams? Why ranking in exams? Isn't the purpose of competitive exams, choosing the best candidates? What is it if not comparison? (మరి competitive exams– పోటీ పరీక్షలు ఎందుకున్నట్లు? అభ్యర్థుల్లో ఉత్తములను ఎంపిక చేసుకునేందుకు కాదా? అది పోల్చటం కాకపోతే మరేంటి?)

**Mahesh:** Oh, Himesh, you are talking about some thing entirely different. All that I say is my marks make me happy and not my being better than others. (నువ్వేంటో మాట్లాడుతున్నావు. నేననేదేమిటంటే, నాకు సంతోషాన్నిచ్చేవి నా marks మాత్రమేకానీ, ఇతరులకన్నా నేను మెరుగ్గా ఉన్నాననే విషయం కాదు)

**Himesh:** But you said you were against comparisons. How can you escape comparisons? When you buy something, for example, a shirt, don't you compare a number of shirts, their quality, their price etc. before you settle for the 'cheapest and the best'? (పోలికలకు వ్యతిరేకమని నువ్వే అన్నావుగా. పోల్చటం నుంచి తప్పించుకోగలమా జీవితంలో? ఏదైనా వస్తువు కొనేటప్పుడు, ఓ shirt అనుకుందాం, two shirts ను, వాటి నాణ్యతను, వాటి ధరలను పోల్చేకదా, 'అతి చవగ్గా అతి మంచి' shirt కొనటానికి సిద్ధపడతావు?

(settle for = ఏదైనా వస్తువు కొనేందుకు సిద్ధపడటం/ ఎంపిక చేసుకోవటం)

**Mahesh:** OK. OK. We've had enough argument. Let's talk of something different. (సరే, సరే, ఇక ఈ వాదం చాల్లే. మరేదాని గురించైనా మాట్లాడదాం)

వస్తువులనూ, మనుషులనూ, ప్రదేశాలను, జంతువులను పోల్చి వాటిల్లో/ వాళ్లల్లో తరతమ భేదాలు చూడటం మనకు చాలా సహజమైన ధోరణి కదా!

The minute we see two or more things/ people of the same nature, we compare them. Comparisons are very common.

We usually compare the qualities of people and things. అంటే మనుషుల, వస్తువుల గుణాలను, లక్షణాలనూ పోలుస్తాం. మనందరికీ తెలుసు - గుణాలను, లక్షణాలనూ తెలిపే మాటలు 'Adjectives' అని. సామాన్యంగా అయిన, అయినటువంటి, కల, కలిగినటువంటి అని అర్థం వచ్చే మాటలు, adjectives. Comparison ఈ adjectives కే ఉంటాయి. సామాన్యంగా 'ఎలాంటి', 'ఎటువంటి?' అనే ప్రశ్నలకు జవాబు వచ్చే పదం, adjective.

**a)** Kumar is tall = కుమార్ పొడుగు.
కుమార్ ఎలాంటివాడు? -
Answer: పొడవైనవాడు (tall) కాబట్టి, tall, adjective.

**b)** Tendulkar is a great cricketer = టెండూల్కర్ గొప్ప cricketer.
ఎటువంటి cricketer? అనే ప్రశ్నకు, great cricketer అని answer కాబట్టి, 'great' ఇక్కడ adjective.




**c)** It is a foreign car. అదెలాంటి car? Answer: foreign car - కాబట్టి 'foreign' అనేది adjective.

**d)** Dravid is the Captain of the Indian team = Dravid భారత (భారతీయ) జట్టుకు Captain. Indian - adjective.

**e)** A dark room = (చీకటి గది). ఎటువంటి room? Answer: dark room; so dark - adjective.

**f)** A clever student: ఎలాంటి student?
Answer- clever, so clever - adjective.

పైవన్నీ - tall, great, foreign, Indian, dark, clever - adjectives (గుణాలను, లక్షణాలను తెలిపే మాటలు). అలాగే verb పనులను తెలుపుతుంది కదా- ఆ పనులు ఎలా జరిగాయి/ జరుగుతాయి అని తెలిపే మాట ADVERB.

**a)** He walks slowly - verb - walks = నడుస్తాడు.
ఎలా నడుస్తాడు - Answer - slowly.
కాబట్టి - slowly, adverb.

**b)** She sings well - verb: sings = పాడుతుంది.
ఎలా పాడుతుంది? Answer - well (బాగా) -
so, well - adverb.

ఈ adjectives తెలిపే గుణగణాలనూ, adverbs తెలిపే పని విధానాలనూ పోలుస్తుంటాం.

**a)** Kumar is taller than Kesav= కేశవ్ కంటే కుమార్ పొడుగు. ఇక్కడ కేశవ్, కుమార్‌ల పొడుగు పోలుస్తున్నాం - ఇది Comparison of an adjective (గుణం పోలిక).

**b)** He works harder than Karim = కరీం కంటే వాడు ఎక్కువ కష్టపడతాడు - ఇది వాళ్లిద్దరూ చేసే పని పోలిక - అంటే comparison of an adverb.

మన daily conversation లో comparison (పోల్చి చూడటం) చాలా తరచుగా జరుగుతుంది. కాబట్టి degrees of comparison (గుణగణాల్లో, పనులు జరిగే విధంలో తరతమ భేదాలు) వాడటం తప్పదు. వాటిని correct గా వాడగలిగామంటే అప్పుడు మన conversation కు precision (కచ్చితత్వం) ఉండి మనం చెప్పాలనుకున్న భావం correct గా చెప్పగలం.

Degrees of comparison ఓ grammar exercise గా practice చేయటంవల్ల ప్రయోజనం ఉండదు. వాటి విషయం అర్థం చేసుకుని అవసరమైనప్పుడు, precision (కచ్చితత్వం) కోసం సందర్భానికి తగినట్లు వాడటానికి మాత్రమే నేర్చుకుందాం.

**ముఖ్యమైన విషయాలు:**

**1)** మామూలుగా ఏ adjective అయినా positive degree లో ఉంటుంది. tall (పొడుగు), short (పొట్టి) high (ఎత్తైన), large (పెద్దదైన), etc. ఇలాంటివన్నీ positive degree. ఈ positive degree ఒక వస్తువు/ మనిషి గుణాన్ని తెలుపుతుంది. దీనిని పోలిక ఉన్నా, లేకపోయినా వాడతాం.

**a)** Chandra is tall (positive degree - పోల్చటంలేదు)

**b)** Surya is not so/ as tall as Chandra (positive degree - పోలుస్తున్నాం - చంద్రను, సూర్యను)

Positive degree లోని adjectives కు, + er/ + r చేర్చటంవల్ల, లేకుంటే వాటిముందు more చేర్చటంవల్ల అవి comparative degree అవుతాయి (ఇతరుల కంటే ఎక్కువ అనే అర్థంలో).

**2)** Your score is better than all the others' scores = నీ marks ఇతరులందరి marks కంటే బాగున్నాయి. (Better - good కు comparative. Best, - good కు superlative)

**3)** I am happy to get a higher score.
(higher - comparative)

**4)** ... whether my marks are better than those of others
(ఇతరుల marks కంటే నావి మెరుగా, కాదా అనేది...)

**5)** ... my marks are higher than others' marks (ఇతరుల marks కంటే నావి ఎక్కువ. higher - comparative)

ఒకే భావాన్ని positive, comparative, superlative degrees లో ఎలా చెప్పొచ్చో చూద్దాం.

AP is the biggest state in South India. ఇది superlative. దక్షిణ భారతంలో AP అత్యంత పెద్ద రాష్ట్రం. (The biggest - superlative ముందు 'The').

AP is bigger than any other state/ all other states in South India - bigger - comparative. దక్షిణ భారతంలోని ఏ ఇతర రాష్ట్రం/ అన్ని ఇతర రాష్ట్రాల కంటే పెద్దది.


M. SURESAN

**a)** Chandra is taller than Surya (Surya కంటే Chandra పొడుగు) (tall + er - comparative degree of tall)

**b)** Surya is braver than Chandra (చంద్ర కంటే సూర్య ధైర్యస్తుడు - brave + r - comparative degree of brave = ధైర్యంగల)

**c)** Kashmir is more beautiful than any other state in India.
(ఏ ఇతర రాష్ట్రంకన్నా కాశ్మీర్ అందమైంది)
(more + beautiful - comparative of beautiful)

అలాగే adjective చివర + est/ st చేర్చినా, దానిముందు most చేర్చినా superlative degree అవుతుంది.

**a)** Chandra is the tallest in the class.
(Class లో Chandra అందరికన్నా పొడుగు-
tall + est - superlative of tall)

**b)** Surya is the bravest in the class.
(Class లో సూర్య అత్యంత ధైర్యస్తుడు -
brave + st - superlative of brave)

**c)** Kashmir is the most beautiful state in India (Kashmir అత్యంత సుందరమైన రాష్ట్రం.
most + beautiful - superlative of beautiful)

మనం వస్తువులను పోలుస్తున్నప్పుడు/ మనుషులను పోలుస్తున్నప్పుడూ సందర్భాన్నిబట్టి ఒక భావాన్ని, positive, comparative, superlative degree ల్లో దేనిలోనైనా చెప్పవచ్చు.

**Look at these sentences from the conversation between Himesh and Mahesh.**

**1)** ... you are the cleverest boy in the class. cleverest - ఇక్కడి adjective. దీని చివర + est ఉంది కాబట్టి ఇది superlative degree. ఎప్పుడూ గుర్తుంచుకోవాల్సిన విషయం - superlative ముందు, the తప్పకుండా ఉండాలి.

The Eenadu is the largest circulated Telugu Daily. (The + Largest - superlative)

Comparative లో చెప్పాల్సినప్పుడు గమనించాల్సిన విషయం - Comparative తర్వాత than any other + singular/ than all other + plural రావటం.

ఇదే భావాన్ని Positive, అంటే, 'big' వాడి చెప్పవచ్చు.

No other state in South India is as/ so big as AP. (దక్షిణ భారత్‌లో ఏ ఇతర రాష్ట్రం కూడా AP అంత పెద్దది కాదు.)

Positive లో గమనించాల్సిన విషయం: 1) No other తో ప్రారంభిస్తాం. Positive degree big ముందు, so కానీ, as కానీ, దాని తర్వాత, as రావటం గమనించాలి.

μ సుమంత్ class లో అందరిలో పొడుగు - ఇది Superlative degree లో చెబుదాం. పొడుగుకు superlative - tallest. దానిముందు 'the' రావాలి కదా. Sumanth is the tallest (boy) in the class.

μ పక్షుల్లో నెమలి అందమైంది. ఇది Comparative లో చెబుదాం. అందమైన - comparative - more beautiful. Comparative తర్వాతెప్పుడూ than, any other singular/ all other plural రావాలి కదా- (than any other bird/ than all other birds). The peacock is more beautiful than any other bird (singular)/ than all other birds (plural).

μ ఏ ఇతర Dictionary కూడా ఈ dictionary అంత ఉపయోగకరంగా లేదు. దీన్ని positive లో చెబుదాం. అప్పుడేం చేయాలి? No other dictionary తో begin చేయాలి. Positive degree 'useful' ముందూ, వెనుక, so/ as ... as రావాలి. అప్పుడు sentence, No other dictionary is so/ as useful as this.

**సంగ్రహంగా:**

**1)** Superlative degree ముందు, the.

**2)** Comparative degree తర్వాత than any other + singular/ than all other + plural.

**3)** Positive degree: ప్రారంభం - no other తో. Positive degree ముందు, so/ as, తర్వాత as.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Pavan:** Why all this excitement about football? What's there in it?
(ఈ football గురించి ఇంత ఉత్సాహ మెందుకు? ఇందులో ఏముంది?)

**Suman:** You know, it's the most popular game in the world. Yes, people watch this game more than any other game.
(ప్రపంచంలో చాలా ఎక్కువమంది అభిమానించే క్రీడ ఇదే. మిగతా ఆటలకన్నా ఈ ఆటనే ఎక్కువ మంది చూస్తారు)

**Pavan:** But we don't see many playing the game in India. I often see more people playing cricket than football in India.
(భారత్‌లో ఎక్కువమంది football కంటే cricket ఆడటమే తరచుగా కనిపిస్తుంది.)

**Suman:** That's true. No other game is played so much as cricket in India. But it is surprising that in a poor country like India people are more interested in cricket than in football. Cricket is a costlier game than football. Football is much cheaper than cricket. All that it needs is a football. It is not so expensive as cricket- cricket equipment costs a lot more than football.




(నిజమే భారత్‌లో cricket ఆడినంతగా మిగతా ఏ game ఆడరు. వింతేమిటంటే భారత్‌లాంటి పేదదేశంలో ప్రజలు football కంటే cricket లో ఎక్కువ ఆసక్తి చూపించటం. Football కన్నా cricket ఖరీదైన క్రీడ. Football, cricket కంటే ఖర్చు తక్కువ game. కావాల్సిందల్లా ఓ football. దీనికి cricket అంత ఖర్చుకాదు. Cricket సరంజామా football కంటే ఖరీదు చేస్తుంది)

**Suman:** I wish there were more encouragement for football. The world cup football is a mega event and India is no where in it. With such a vast population India is not able to have eleven players.
(football కు కొంచెం ఎక్కువ ప్రోత్సాహం ఉంటే బాగుంటుంది. ఇంత బ్రహ్మాండమైన world cup matches జరుగుతుంటే, భారతదేశానికి స్థానం లేకుండా పోయింది. ఇంత జనాభా ఉన్న మనకు పదకొండుమంది ఆటగాళ్లు కర వయ్యారు.)

**Pavan:** OK. Let's watch this evening's match. Bye.
(ఈవాళ సాయంత్రం match చూద్దాం. Bye)

కిందటి lesson లో degrees of comparison గురించి కొంత తెలుసుకున్నాం కదా? మరికొన్ని నేర్చుకునేముందు అవి మరోసారి సంక్షిప్తంగా:

1) Three degrees: positive, comparative and superlative.

2) Degrees of comparison - adjectives, adverbs కూ ఉంటాయి.

a) formation of comparative: By adding + er/ er to, or more + before the adjective

b) formation of superlative: By adding, + est / + st to the adjective/ adverb or most + before the adjective/ adverb


M. SURESAN

**Some irregular formations:**

Good, well } better best

bad, ill } worse worst




g) Cricket equipment costs a lot <u>more</u> than a football. cricket సరంజామా ఒక football కన్నా ఖరీదెక్కువ - comparative degree.

h) There are <u>more</u> football fans than cricket fans in Bengal =
బెంగాల్లో cricket అభిమానులకన్నా football అభిమానులెక్కువ - comparative degree

i) Cricketers are <u>the richest</u> sportsmen in India
క్రీడాకారుల్లో అత్యంత ధనవంతులు క్రికెటర్లు.
- superlative degree

j) Indian cricket control board is <u>the richest</u> in the world =
భారత క్రికెట్ కంట్రోల్ బోర్డ్ ప్రపంచంలో అత్యంత ధనికమైంది - superlative degree

k) ... but they are not so highly paid (as cricketers are) =
Hockey players కు అంత (cricketers కు చెల్లించేంత) చెల్లించరు.

చూశారు కదా? సందర్భాన్ని బట్టి ఏ degree వాడాలనేది, practice వల్ల అదే మనకు వస్తుంది. చెప్పాలన్న భావాన్ని బట్టి, మనం degree select చేసుకుంటాం.

English లో రెండింటికన్నా, ఇద్దరికన్నా ఎక్కువ వాటిని/ మందిని పోల్చినపుడు sentence constructions కూ, రెండింటిని/ ఇద్దరినీ మాత్రమే పోల్చినప్పుడు sentence construction కూ తేడా ఉంటుంది.

**ముఖ్యమైన అంశం:** రెండింటిని/ ఇద్దరిని మాత్రమే పోల్చినప్పుడు, superlative ఉండదు.

**Now look at the following sentences:**

a) Suman is <u>not so/ as tall as</u> Pavan.
ఇక్కడ కూడా ఇద్దరినే పోలుస్తున్నాం. అయితే ఈ sentence లో adjective 'tall' - positive degree లో ఉండటం గమనించండి.
Positive degree లో sentence:
A is not so/ as (adjective... tall, short, etc.,) as B.

b) India is not <u>as/ so rich as</u> America- Positive
(America is richer than India)- comparative
(భారత్, America అంత సంపన్నం కాదు- positive/ భారత్ కంటే America సంపన్నమైంది)

c) Kedar does not play <u>as (so) well as</u> Kesav
(Kedar, కేశవ్ అంత బాగా ఆడడు)

d) Bhavan is <u>as tall as</u> Sravan-
(భవన్ శ్రవణ్ అంత పొడుగు)- Positive degree.

e) Sravan is not taller than Bhavan
(Sravan భవన్ కంటే పొడుగు కాదు)
ఇంకో రకం comparative చూడండి.
(రెండు విషయాల పోలిక).
Of Bangalore and Hyderabad, Bangalore is the cooler.
(Bangalore, Hyderabad ల్లో Bangalore ఎక్కువ చల్లగా ఉంటుంది)
(Imp: పై sentence లో comparative తర్వాత than లేదు కదా? అలాంటప్పుడు, comparative ముందు 'the' రావటం గమనించండి.)
Of the two, this is <u>the better</u>. comparative.
(ఆ రెండింటిల్లో ఇది మెరుగు)
ఇలాంటి వాక్యాలు మీ conversation ను చాలా effective గా ఉండేట్లు చేస్తాయి.
అలాగే This is good, but not so (as) <u>good as the other</u>. (Positive)- ఇది బాగానే ఉంది, కానీ దానంత బాగాలేదు.
This is the <u>best of the lot</u>- superlative.
(comparison of more than 2 ఉన్న వాటిల్లో ఇది అత్యుత్తమం)
ఇలాంటి sentences నేర్చుకొని practice చేయండి.

# Cricket is a costlier game than football

**Pavan:** In Bengal football is more popular than cricket. Most of our great footballers are from Bengal, particularly Kolkata. There are more football fans than cricket fans in Bengal.
(బెంగాల్‌లో cricket కంటే football అంటేనే అభిమానం ఎక్కువ. మన గొప్ప football క్రీడా కారులందరూ బెంగాలీలే, ముఖ్యంగా కోల్‌కతా వాళ్లు. Bengal లో cricket అభిమానులకంటే football అభిమానులెక్కువ.)

fan = అభిమాని

**Suman:** Cricketers are the richest of Indian sportsmen. The players of other games do not earn as much. And our cricket control board is the richest in the world.
(భారత క్రీడాకారుల్లో cricketers అత్యంత ధనికులు. ఇతర క్రీడాకారులు అంత సంపాదించడం లేదు. భారత cricket control board ప్రపంచంలోని అన్ని cricket boards కంటే ధనికమైంది.)

**Pavan:** That's true. Hockey is our national game, but hockey players are not so highly paid, unfortunately.
(అవును. మన జాతీయక్రీడ hockey. కానీ దురదృష్టవశాత్తు వాళ్లకంత డబ్బు చెల్లించరు.)

3) a) Superlative degree ముందు, 'the' కచ్చితంగా వాడాలి

b) comparative తర్వాత than any other + singular/ than all other + plural రావాలి.

c) positive, no other తో begin అవుతుంది.

4) సందర్భాన్నిబట్టి ఏ degree వాడాలో నిర్ణయించుకుంటాం. అంతేకానీ అదేపనిగా ఒక degree నుంచి ఇంకో degree మార్చే exercise అనవసరం.

**Now, look at the following sentences from the conversation at the beginning of the lesson:**

a) It's <u>the most popular game</u> in the world.
ప్రపంచంలో అత్యధిక ప్రజాభిమానం ఉన్న క్రీడ.
(superlative degree)

b) People watch this game more than any other game - comparative degree

c) I often see more people playing cricket than football.

d) No other game is played so <u>much</u> as cricket in India - <u>much</u> - positive degree

e) ... people are <u>more interested</u> in cricket than in football - comparative degree.

f) Cricket is a <u>costlier</u> game than football =
football కంటే cricket ఖరీదైన ఆట
Football is much <u>cheaper</u> than cricket.
Comparative degree.

Look at sentences (c), (e), (f), (g) and (h). వీటిల్లో comparison రెండు విషయాలకు మాత్రమే- cricket, football. అందుకని వీటికి superlative ఉండదు.

c) I often see more people playing cricket than football =
football ఆడేవాళ్లకంటే cricket ఆడేవాళ్లే ఎక్కువ కనిపిస్తారు.

e) People are <u>more interested</u> in cricket than in football.

f) Cricket is a <u>costlier</u> game than football.

g) Cricket equipment costs a lot <u>more</u> than football.

h) There are <u>more</u> cricket fans than football fans in India
రెండు విషయాలను పోల్చినప్పుడు superlative ఉండదు. పై వాక్యాలన్నీ కూడా comparativeలో ఉండటం గమనించండి.
Cricket is more popular <u>than</u> football in India.
రెండు విషయాలనే పోల్చినప్పుడు, comparative తర్వాత than, దాని తర్వాత రెండో విషయం (foot ball) రావటం, గమనించండి. (... than any other/ all other రాదు.)
మిగతా sentences లో కూడా (రెండు విషయాలను పోల్చినప్పుడు) than తర్వాత రెండో విషయం రావటం చూడండి (than any other/ all other కాకుండా).

**<u>Practise the following aloud in English</u>**

**Pravav:** ఏంటి! ఆ రెండు పుస్తకాలను అంతగా చూస్తున్నావ్?
**Vinai:** ఆ రెండింటిలో ఏది మెరుగా అని ఆలోచిస్తున్నా.
**Pranav:** ఎర్ర coverతో ఉన్న ఆ పుస్తకం చూడు. అది, ఆ కోవకు చెందిన పుస్తకాలన్నింటిలోనూ ఉత్తమం.
**Vinai:** నీ దగ్గరున్న పుస్తకం అంత గొప్పదా?
**Pranav:** చెప్పానుగా. అన్నింటిలో ఇది గొప్పదని.
**Vinai:** నేను మన lecturer ను అడుగుతా.
**Pranav:** అంటే నా కంటే ఆయన్నెక్కువ నమ్ముతావా?
**Vinai:** అంతే మరి.

**<u>Answer</u>**

**Pranav:** Why are you looking at those two books?
**Vinai:** I am just wandering which of the two is the better.
**Pranav:** Look at that book... the one with the red cover; that is the best of all/ the best of the books in its class/ category.
**Vinai:** Is it as good as the one you have?
**Pranav:** I told you. That's the best of the lot.
**Vinai:** I'll consult our lecturer.
**Pranav:** (Do) you trust him more than me?
**Vinai:** Ofcourse.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# He was junior to me...

**Rupa:** Hi Hema, did you meet your classmate yesterday?
(హాయ్ హేమా, నిన్న నువ్వు మీ classmate ను కలిశావా?)

**Hema:** I did. We met yesterday after nearly five years. She looked a little older than she is.
(కలుసుకున్నాను. అయిదేళ్ల తర్వాత నిన్ననే మేం కలుసుకోవటం. తను వయసు కన్నా పెద్దదిలా కనిపించింది.)

**Rupa:** Are you the same age?
(మీరిద్దరిదీ ఒకే వయసా?)

**Hema:** No, I am slightly older than her (she). But now she looks older than me (I).
(నేనే కొంచెం పెద్ద. అయితే ఇప్పుడు తనే నాకంటే పెద్దగా కనిపిస్తుంది.)

**Rupa:** What is she?
(ఆమె ఉద్యోగం ఏమన్నా చేస్తోందా?)

**Hema:** She is a government officer.

**Rupa:** That's it. She looks older than you because of her responsibilities.
(అదీ సంగతి. ఆమె బాధ్యతల వల్ల (Officer గా) నీకంటే కాస్త పెద్దదిగా కనిపిస్తుంది)

**Hema:** I have responsibilities as well, as the President of the local women's club.
(స్థానిక women's club president గా నాకూ బాధ్యతలున్నాయి.)




**Rupa:** But your responsibilities are not as serious, are they?
(అయితే నీ బాధ్యతలు ఆమె బాధ్యతలంత తీవ్ర మైనవి కావు కదా?)

**Hema:** I wish I were in such a position.
(తనున్న స్థితిలో నేనుంటే ఎంత బాగుండును అనిపిస్తోంది)

**Rupa:** Why so?

**Hema:** A government officer's position is certainly superior to that of a home maker, isn't it?
(మామూలు గృహిణి position కన్నా government officer position గొప్పది కదా.)

**Rupa:** But I prefer being a home maker to being a job holder. A home maker is in no way inferior to an officer.
(కాని నాకు మాత్రం ఉద్యోగిగా ఉండటం కంటే గృహిణిగా ఉండటమే ఇష్టం. గృహిణి officer కన్నా ఏం తక్కువ కాదు.)

**Hema:** Let's not talk of superior and inferior any more. Everyone is great in their own way.
(ఎక్కువ తక్కువల గురించి మాట్లాడటం ఆపేద్దాం. ఎవరి గొప్ప వాళ్లదే.)

**Rupa:** Ramu is coming this evening.
(రాము ఈ సాయంత్రం వస్తున్నాడు.)

**Hema:** Who? Your brother?

**Rupa:** Yes. He returned from the states a few days ago. He is coming to stay with me for a few days.
(States నుంచి రెండు మూడు రోజుల కిందట తిరిగొచ్చాడు. రెండ్రోజులు నాతో ఉండటానికి వస్తున్నాడు.)

**Hema:** I've often wondered is he older or younger than you?
(నాకు తెలియని విషయం- రాము నీకంటే చిన్నా, పెద్దా?)

**Rupa:** He is my elder. Doesn't he look so?
(అతను నాకన్నా పెద్ద/ మా అన్న. అలా కనిపించడా?)

**Hema:** Long since I saw him.
(చూసి చాలా రోజులయింది)

**Rupa:** Perhaps you saw him prior to his leaving for the states.
(బహుశ నువ్వతన్ని states కు వెళ్లేముందు చూశావేమో?)

**Hema:** Yes.

రెండు, మూడు lessons లో మనం degrees of comparison వివరాలు తెలుసుకుంటున్నాం కదా. ఈ lesson లో మరికొన్ని వివరాలు చూద్దాం.

కొన్ని కొన్ని సార్లు comparative, positive degrees లో I, we, he, she, they వాడాలా, me, us, him, her, them వాడాలా అనే confusion వస్తూ ఉంటుంది. Look at the following:

**a)** అతను నాకంటే పొడుగు (Comparative):
He is taller than I/ me (?)

**b)** ఆమెకంటే అతను చిన్న =
He is younger than she/ her (?)

**c)** వాళ్లు మనకంటే clever కాదు =
They aren't cleverer than us/ we (?)

**d)** ఆమెకంటే అతను పెద్ద =
He is older than she/ her (?)

In the sentences above, sentence చివర్లలో మనకొచ్చే సందేహాలు: (a) లో I వాడాలా, me వాడాలా, (b) లో she వాడాలా, her వాడాలా, (c) లో us వాడాలా, we వాడాలా, (d) లో she వాడాలా, her వాడాలా అని.

Correct గా అయితే sentence అర్థం ప్రకారం, (a) taller than I, (b) లో younger than she, (c) cleverer than we, and (d) లో older than she అనే రావాలి.

**a)** He is taller than I (am) = (నేను పొడుగ్గా ఉన్నదాని కంటే అతనున్న పొడుగెక్కువ అని అర్థం వస్తుంది English లో.) అలాగే (b), (c), (d) లలో కూడా:

**b)** He is younger than she (is)

**c)** They aren't cleverer than we (are)


M. SURESAN

**d)** He is older than she (is)- ఇలా వస్తాయి. సామాన్యంగా brackets లో ఉండే verbs (a)- am, (b)- is, (c)- are, (d)- is ను omit చేస్తుంటాం.

అయితే spoken English లో ఇలాంటి sentences లో comparative లో than తర్వాత me, us, him, her, them వాడటం ఇప్పుడు సర్వసాధారణమైపోయింది. ఇది పెద్ద తప్పుగా పరిగణించడం లేదు. ముఖ్యంగా, comparative లో than తర్వాత both, all లాంటివి వాడినప్పుడు, we, they లకు బదులు us, them ఎక్కువగా వినిపిస్తుంటాయి.

**a)** He is cleverer than all of us/ all of them.

**b)** He is cleverer than both of us/ both of them.
ఇలాంటిచోట్ల they, we కుదరదుగదా?

Positive degree లో కూడా as తర్వాత, I, we, he, she, they బదులు me, us, him, her, them- ఇవే ఎక్కువ వినిపిస్తున్నాయి. వీటిని ఎవరూ తప్పుగా పరిగణించడం లేదు.

**a)** He is as tall as I am/
He is as tall as me (both are correct)

**b)** She is as old as he/
She is as old as him. (both are correct)

**c)** They are as clever as we/ they are as clever as us.
(ఇక్కడ మాత్రం as clever as us కొంత అరుదే)

అయితే కొన్ని కొన్ని చోట్ల than I/ we/ he/ she/ they కు, than me/ us/ him/ her/ them కు అర్థాలు తేడాగా ఉంటాయి. అప్పుడు సందర్భాన్నిబట్టి ఏది వాడాలో తెల్సుకోవాలి.

**a)** My sister likes my younger brother more than I.
మా తమ్ముడంటే నేనిష్టపడే దానికన్నా మా sister ఎక్కువ ఇష్టపడుతుంది (మా తమ్ముడంటే నాకంటే మా sister కు ఎక్కువ ఇష్టం).

**b)** My sister likes my younger more than me =
మా sister కు నాకంటే కూడా మా తమ్ముడంటే ఎక్కువ ఇష్టం.

**c)** He likes the mango more than she =
ఇద్దరికీ mango అంటే ఇష్టం. కానీ ఆమెకంటే అతనికి ఎక్కువ ఇష్టం.

**d)** He likes the mango more than her =
ఆమెకంటే కూడా, మామిడి పండంటేనే అతనికిష్టం.

కాబట్టి ఇలాంటప్పుడు కాస్త జాగ్రత్త అవసరం. Positiveలో కూడా అంతే.

**a)** I don't like my brother as much as she =
ఆమె ఇష్టపడ్డంతగా నేను మా brother ను ఇష్టపడను.

**b)** I don't like my brother as much as I like her.
మా brother కంటే కూడా ఆమె అంటేనే నాకిష్టం.

| Positive | Comparative | Superlative |
|---|---|---|
| Old | Older | Oldest |
| | Elder | Eldest |

చూశారు కదా: Old has two comparatives and two superlatives

Old కు రెండర్థాలు కదా? వయసెక్కువయిన/ పాతదయిన. కాబట్టి Older, Oldest వయసెక్కువ అనే అర్థంతో మనుషులకూ, పాత అనే అర్థంతో వస్తువులకూ వాడతాం.

**1) a)** Janaki is older than Lalitha
(Lalitha కన్నా జానకి పెద్దది)

**b)** Rama Rao is the oldest man in the village.
(ఆ గ్రామంలో రామారావు అందరిలో పెద్ద)
పై రెండు మనుషులను గురించి)

**c)** This house is older than yours =
నీ ఇంటి కన్నా ఈ ఇల్లు పాతది

**d)** This is the oldest building in the town -
ఈ ఊర్లోని buildings అన్నింటిలో ఇది పాతది.
(c), (d) వస్తువులను గురించి

**2.** Old కు ఇంకో Comparative, Elder; ఇంకో Superlative eldest. వీటి అర్థం వయసులో పెద్ద అని మాత్రమే. అంటే రెండు మాటలనూ, మనుషులకు (అప్పుడప్పుడు జంతువులకు) మాత్రమే వాడతాం. అది కూడా ఒక కుటుంబానికి చెందిన వాళ్లకు మాత్రమే వాడతాం.

**a)** Sri Rama was the eldest of the sons of Dasaratha. దశరథుని కొడుకుల్లో శ్రీ రాముడందరిలో పెద్ద - Same family అనేది చూడండి.

**b)** Dharmaraja was the eldest of the Pandavas.
పాండవులందరిలో ధర్మరాజు పెద్ద

Elder వాడకం: Important: Elder తర్వాత than కానీ, to కానీ వాడం. Comparative అయినప్పటికీ కింది విధంగా వాడతాం.

**a)** శ్రీరాముడు లక్ష్మణుడి కన్నా పెద్ద -
Sri Rama was Lakshmana's elder.
(Elder than/ to Lakshmana కాదు)

**b)** My uncle is my mother's elder -
మా మామ మా అమ్మ కంటే పెద్ద.

**c)** My brother is my elder by two years
మా brother (అన్న) నా కన్నా రెండేళ్లు పెద్ద.
ఇదీ elder వాడే విధం.

మరికొన్ని comparatives ఉన్నాయి. వాటి తర్వాత than రాదు. to వస్తుంది. అలాంటి comparatives, Superior (గొప్ప), Inferior (తక్కువ), Senior (వయసులో, అనుభవంలో పెద్ద), Junior (వయసులో అనుభవంలో చిన్న), Prior (time లో ముందు) వీటన్నిటి తర్వాత 'to' మాత్రమే వాడతాం. than వాడం.

**a)** Imported cars are superior to Indian cars
భారత కార్ల కన్నా విదేశీ కార్లు మెరుగు

**b)** A Collector is inferior to a Chief Secretary
ముఖ్య కార్యదర్శి కన్నా Collector తక్కువ (హోదాలో)

**c)** He is senior to the others in the group
ఆ బృందంలో అతను వయస్సులో/ అనుభవంలో పెద్ద.

**d)** He was junior to me at College =
College లో అతను నా కింది Class లో ఉండేవాడు.

**e)** Even prior to his marriage he knew the girl.
(అతనికి పెళ్ళికి పూర్వమే ఆ అమ్మాయి తెలుసు)
ఈ విషయాలే conversation at the beginning of the lesson లో కూడా ఉండటం గమనించండి.

**a)** I am slightly older than She/ her

**b)** A government officer's position is certainly superior to that of a home maker.

**c)** A home maker is no way inferior to an official

**d)** He is my elder
ఒక విషయం: American English లో elder brother బదులు older brother తరచుగా వాడుతుంటారు.

**EXERCISE**

**Pratibha:** మీ ఇద్దరిలో ఎవరు పొడుగంటావు, నువ్వా అనితా?

**Pratima:** అసలయితే అనితే పొడుగు నాకంటే. కానీ తను నా కంటే లావవటం వల్ల నేను తనకంటే పొడుగ్గా కనిపిస్తా.

**Pratibha:** మనిద్దరిలో ఎవరు పొడుగంటావు?

**Pratima:** అదేం question? నువ్వు నాకంటే పొడుగు కదా!

**Pratibha:** అనిత ఏదో Slimming machine కొన్నట్లుంది చూశావా?

**Pratima:** చూశాను. కానీ అదంత బాగాలేదు. సునీత దగ్గరున్న machine దానికంటే మెరుగైంది.

**Pratibha:** నువ్వూ సునీత చాలా సన్నిహితంగా ఉంటారు. మీరు classmates అనుకుంటా.

**Pratima:** కాదు. నేను దానికన్నా ఒక class ఎక్కువ. వయస్సులో కూడా ఒక సంవత్సరం పెద్ద నేను.

**Pratibha:** అలాగా. అయితే ఈ ఊరు నీకంటే తనకు బాగా తెలుసు మరి.

**Pratima:** నేను రాకముందే తనిక్కడికి వచ్చింది.

**ANSWER**

**Pratibha:** Who is the taller of you two? You or Anitha?

**Pratima:** Actually she is taller than me (I), but because she is fatter than me, I look taller than her (she).

**Pratibha:** Who is the taller of us two?

**Pratima:** What question is that? You certainly are taller than me (I)

**Pratibha:** Anita seems to have bought a slimming machine. Have you seen it?

**Pratima:** Yes, I have. But it isn't that good. Sunita's machine is superior to it.

**Pratibha:** You and Sunitha are close. Were you classmates at College.

**Pratima:** No. I was senior to her by a year. I am senior to her in age too by a year.

**Pratibha:** She knows this place better than you.

**Pratima:** She came here prior to my coming here.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# I am not with you there

**Sekhar:** You are up so early. What's the matter?
(ఏంటంత త్వరగా లేచావ్?)
(be up = మేల్కోవటం/ లేవటం)

**Venkat:** Yes, I am. Infact I got up earlier than you by half an hour.
(అవును, లేచాను. నీకంటే అరగంట ముందు లేచానివాళ)

**Sekhar:** But, why? (ఎందుకు?)

**Venkat:** Our lecturer is holding a special class today. He insisted that everyone of us turned up for the class.
(ఇవాళ మా lecturer special class పెడుతున్నాడు. ప్రతి ఒక్కరూ తప్పక రావాలని గట్టిగా చెప్పాడు.)
Insist = ఇన్సిస్ట్ - 'స్సి' నొక్కి పలుకుతాం = పట్టుబట్టడం/ ఓ విషయంలో గట్టిగా ఉండటం

**Sekhar:** I don't know about you. But I am fedup with these extra classes.
(నీ సంగతి నాకు తెలియదుగానీ, నాకు మాత్రం ఈ extra classes అంటే విసుగు పుడుతోంది.)
be fed up = విసుగనిపించటం

**Venkat:** Why so?

**Sekhar:** They rob us of our leisure.
(అవి మనకు తీరిక లేకుండా చేస్తాయి.)

**Venkat:** I am not with you there. They are useful. I like them.
(నేను ఆ విషయం అంగీకరించను. అవి చాలా ఉపయోగం. నాకిష్టం.)

**Sekhar:** Not me, any way. Why don't these lecturers leave us alone?
(ఏదేమైనా నాకు మాత్రం ఇష్టంలేదు. మన మానాన మనల్ని ఒదలొచ్చుగా.)

**Venkat:** Who is forcing you? I find our lecturer's classes interesting. Infact everyone does. They feel the classes worth attending.
(నిన్నెవరు బలవంతపెడుతున్నారు? మా lecturer classes నాకు చాలా ఆసక్తికరంగా ఉంటాయి. నాకేకాదు, మా క్లాస్‌లో అందరికీ ఉపయోగకరం అనిపిస్తుంది.)

**Sekhar:** When you attend special classes like this, you are left with little time to study.
(ఇలా నువ్వు special classes కు వెళ్తుంటే నీకు చదువుకోవటానికి time మిగలదు)

**Venkat:** You talk as though you didn't waste time at all.
(నువ్వేదో time waste చేయనట్లు మాట్లాడతావేంటి?)

**Sekhar:** Don't talk as if you were a sincere student.
(నువ్వేదో బుద్ధిగా చదువుకునే విద్యార్థిలా మాట్లాడకు.)

**Venkat:** Far from that. All I wish to say is we lose nothing if we attend extra classes.
(అలా అని నేనేం అనటంలేదు. నేను చెప్పేదల్లా extra classes కు వెళ్లటం వల్ల మనం పోగొట్టుకొనేదేంలేదని.)

**Sekhar:** OK. OK. Have a good time in your class. Do by all means attend all classes and get good marks. I shall be happy.
(సరే. సరే. సంతోషంగా వెళ్ళిరా class కు. అన్ని classes కూ చక్కగా వెళ్లి మంచి మార్కులు తెచ్చుకో. నేను సంతోషిస్తా.)

**Venkat:** Don't be cross with me, buddy, I just like to attend the class, and you don't. That's all.
(కోప్పడకు మిత్రమా; నాకేమో class కు వెళ్లటం ఇష్టం, నీకిష్టం లేదు. అంతే.)
(buddy = friend)

**Sekhar:** OK.

**Venkat:** I am off (నే వెళ్తున్నా), Bye.

Clause అంటే తెలుసుకదా- a group of words with a verb. (verb ఉన్న మాటల సమూహం). దీన్ని గురించి ఇంతకుముందు మనం చాలా తెలుసుకున్నాం. ఇప్పుడు verb లేని group of words గురించి తెలుసుకుందాం.

A group of words without a verb is a PHRASE.

ఈ సందర్భంలో మనం గుర్తుంచుకోవాల్సిన విషయాలు: ఈ కిందివి verbs కావు.

**i)** Infinitive (to + 1st RDW - to go, to come, to sing, to walk, etc)

**ii)** '-ing form' (walking, singing, going, coming, etc.) (- ing form ముందు 'be' form ఉంటే, be form + ing form కలిసి verb అవుతుంది. am coming, was going, will be dancing, etc.)

**iii)** past participle (done, sung, seen, etc.) ఇవి కూడా verbs కావు. అయితే be form + past participle combination, verb (passive voice) అవుతుంది. అలాగే have/ has/ had/ will have/ shall have + past participle కూడా verb అవుతుంది.

English లో చాలా phrasal verbs, verbs తర్వాత prepositions చేర్చటం వల్ల ఏర్పడతాయి: sit on a chair, get into a bus; put on shirt, put off an event, etc.




ఇలాంటి phrasal verbs రెండు రకాలు:

**1)** Phrasal verbs లో ఉన్న verb, దాని తర్వాత preposition మారకుండా ఉండేవి. (sit on a chair, jump over the wall etc.)

**2)** verb + preposition వల్ల ఏర్పడిన phrasal verb అర్థానికీ, అందులోని verb, preposition అర్థానికీ ఎక్కడా సంబంధం లేకుండా ఉండేవి.

eg: He put off his trip.
(అతడు తన ప్రయాణాన్ని వాయిదా వేసుకున్నాడు.)
ఇక్కడి phrasal verb - put off. చూడండి. put అర్థానికీ, off అర్థానికీ, వాటిని కలిపి put off అని వాడినపుడు దాని అర్థానికి (వాయిదా వేయటం) ఎక్కడా సంబంధం లేదు. ఇలాంటి phrasal verbs అర్థాలు practice వల్ల, అంటే భాషతో బాగా పరిచయం పెంచుకోవటం వల్లనే తెలుస్తాయి. అవి మనం spoken English లో వాడినపుడు భాష చాలా సహజంగా ఉంటుంది. వాటిలో కొన్ని చూద్దాం.

**Now look at the following expressions from the conversation at the beginning of the lesson.**

**1)** I <u>got up</u> earlier than you
**2)** You <u>are up</u> so early
**3)** I <u>am fed up with</u> these extra classes
**4)** They <u>rob us of</u> our leisure
**5)** I <u>am</u> not <u>with you</u>
**6)** Why don't these lecturers <u>leave us alone</u>?
**7)** You <u>are left with</u> little time
**8)** I <u>am off</u>

**The word groups underlined are all phrasal verbs:**

**1)** I got up earlier than you = నీకంటే నేను ముందు లేచాను. get up చాలా తరచుగా నిద్రలేవటం అనే అర్థంలో వాడుతుంటాం. get up మేల్కోవటం అనే అర్థంతో, wake up కంటే కూడా ఎక్కువ వాడతాం. When do you wake up everyday కంటే, When do you get up everyday ఎక్కువ వాడతాం.

**5)** I am not with you there = ఆ విషయంలో నేను నీతో ఏకీభవించను.

ఇది చాలా simple and useful expression.

be with some one = ఒకరు చెప్పినదానితో ఏకీభవించటం/ ఒకర్ని సమర్థించటం. (ఒకరు చెప్పింది అర్థం చేసుకోవటం కూడా)

**a)** I am with the government in ending child marriages = బాల్య వివాహాలను అరికట్టే విషయంలో నేను ప్రభుత్వాన్ని సమర్థిస్తాను.

**b)** He is totally with his friend on that issue = ఆ విషయంలో అతను పూర్తిగా అతని స్నేహితుడితో ఏకీభవిస్తాడు.

**c)** He is with her upto the point of marrying her, but not without his parents consent
ఆమెను పెళ్లిచేసుకునే విషయంవరకు ఒప్పుకొంటున్నాడు కాని, అతని తల్లిదండ్రుల సమ్మతి లేకుండా మాత్రం కాదు.

**6)** Why don't these lecturers leave us alone?

Leave alone అనేది English conversation లో తరచుగా వినిపించే మాట. అర్థం = వదిలేయటం, disturb చేయకుండా ఉండటం, ఎవరి మానాన వాళ్లను వదిలేయటం అని.

**a)** Please leave me alone. I am studying. = నన్నొదిలెయ్. నేను చదువుకుంటున్నా. (Don't disturb me.)


M. SURESAN

**b)** Leave movies alone. Get going with your studies
సినిమాల విషయం వదిలెయ్ (ఎప్పుడూ అదేనా?) చదువు సంగతి చూసుకో.

**c)** Leave alone which party is good.
Let's talk of something else - ఏ పార్టీ మంచిదనే విషయం వదిలెయ్. ఇంకే విషయమైనా మాట్లాడదాం.

**7)** be left with/ leave with: మిగలటం (time, money, food, etc. లాంటివి)

a) There is a little milk left in the glass = glass లో కాస్త పాలు మిగిలాయి.

b) His work at office leaves him (with) little time for his family
అతని office పని కుటుంబంతో గడపటానికి కాస్త time కూడా మిగల్చదు.

c) Hurry up. We are left with just an hour to finish this whole work = త్వరగా కానీ. మొత్తం పని పూర్తిచేయటానికి ఒక గంట మాత్రమే మిగిలింది.

d) That leaves you with the only option of going = వెళ్ళే ఒకే నిర్ణయమే నీకు మిగిలింది.

**8)** I am off = నేను వెళ్ళిపోతున్నా.

Phrase= to be off.

మనం వెళ్లటం కచ్చితమైనప్పుడు, ఇంక వెళ్లబోతున్నప్పుడు అంటుంటాం. I am off. నేను దాదాపు వెళ్ళిపోయాను అనే అర్థంతో వాడతాం.

ఇవన్నీ conversation లో daily life లో తరచూ వినిపించే expressions. ఇవి బాగా practice చేసి వీలయినప్పుడల్లా వాడండి. ఇవి చాలా simple expressions. కష్టం కాకూడదు. It shouldn't be difficult.

There are some other expressions in the conversation between Sekhar and Venkat. They are not phrasal verbs, but useful expressions. Learn them as well.

**1)** Insist = పట్టుబట్టడం - Know how to use it.

Insist తర్వాత on వస్తే, దాని తర్వాత noun కానీ '...ing' form కానీ వస్తుంది.

**a)** The teacher insists on silence in the class
క్లాసులో నిశ్శబ్దం విషయంలో teacher పట్టుదలగా ఉన్నాడు. (Insist + on + silence (n)

**b)** I insist on starting immediately
వెంటనే బయలుదేరాలనేదే నా పట్టుదల
(Insist + on + starting (ing form)
Insist వాడటంలో పై రెండూ (Nouns/ ...ing) form కాకపోతే, that clause వాడొచ్చు

**c)** The teacher insists that the students remain silent. Students silent గా ఉండాలని ఆయన పట్టుదల. (... that the students remain silent - that clause కదా?)

**d)** He insists that we follow his orders.
He insists on our following his orders. అతని ఆజ్ఞలు మనం పాటించాలని పట్టుబడుతున్నాడు. (He insists + that clause = He insists on + ing form గమనించండి)

**2)** As though/ as if =
దీని అర్థం, అయినట్లు, కానీ కాదు.

You talk as if you didn't waste time at all = నువ్వేదో అసలు time waste చేయనట్లే మాట్లాడతావేంటి? (నువ్వు time waste చేస్తావు)

ఇక్కడ 'as if' clause లో verb గమనించండి. - did waste (didn't waste) - past tense కదా. అదీ important. ఇదిప్పుడు జరగటంలేదు కాబట్టి, past tense వస్తుంది. singular subject తో కూడా were వస్తుంది.

**a)** He feels as if I were responsible for his troubles - అతని కష్టాలకు నేనేదో కారణమైనట్లు (కానీ కాదు) అనుకుంటున్నాడు.

**b)** He behaves as though he could not get on without servants
servants లేకపోతే బతకలేనన్నట్లు ప్రవర్తిస్తాడు.

**c)** She talks as though she were born rich = పుట్టడమే ధనికురాలిగా పుట్టినట్లు మాట్లాడుతుంది.

**3)** Far from it: ఇది కూడా చాలా common expression. దీని అర్థం, ఇంకొకరు చెప్పేది correct కాదని.

**Pranav:** Is he a good player?
(అతడు మంచి ఆటగాడా?)

**Prabhat:** Far from it. (కానే కాదు)
(అంటే ఒకరు చెప్పన్నది, కానే కాదు అనటానికి far from it అంటాం.

'Is Vijayawada a cool place?
(విజయవాడ చల్లటి ప్రదేశమా?)
far from it. (కానే కాదు)

ఈ expressions బాగా practice చేసి మీ conversation లో తరచుగా వాడండి. చాలా simple గా effective గా ఉంటుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# The food here doesn't agree with me

**Navya:** I'm afraid I can't stay here any longer.
(నేనింక ఇక్కడ ఉండలేననిపిస్తోంది.)

**Divya:** Why? What happened?
(ఎందుకు? ఏమైంది?)

**Navya:** The food here doesn't agree with me.
(ఇక్కడి ఆహారం నాకు సరిపడటం లేదు)

**Divya:** Anything again?
(మళ్లీ ఏమన్నా అయ్యిందా?)

**Navya:** Yea. Last night as I reached our rooms, I threw up all the food I had eaten. The food in the restaurant upset me.
(అవును. నిన్నరాత్రి మన room కు తిరిగి రాగానే, ఆ restaurant లో తిన్నదంతా వాంతయిపోయింది. అక్కడి తిండి నాకు కడుపు తిప్పేసింది)

**Divya:** So you want to pack up
(కాబట్టి వెళ్లిపోతానంటావా?)

**Navya:** Yes. I can't get on any more with this kind of food. I am afraid of permanent damage to my health.
(అవును. ఇలాంటి food తో నేను గడపటం కష్టం. నా ఆరోగ్యం శాశ్వతంగా దెబ్బతింటుందేమోనని భయంగా ఉంది.)

**Divya:** Does it mean you want to give up your job, just because the food here is not to your liking? Come now, Navya, you can't be so silly as to throw a good job up as yours and go away.
(ఇక్కడి తిండి సరిపడనంత మాత్రాన మంచి ఉద్యోగం వదిలేసి వెళ్లిపోతానంటావా? నీకున్న అంతమంచి ఉద్యోగం వదిలేసి వెళ్లిపోయేంత తెలివితక్కువ పనిచేయకు)

**Navya:** There's no use your keeping as telling me to adjust with the food here. I've had enough of it. I have to go.
(ఇక్కడి తిండితో సర్దుకుపో అని నువ్వు మాటిమాటికీ అనటం వల్ల ప్రయోజనం లేదు. ఇక చాలు. నేవెళ్లిపోవాల్సిందే)

**Divya:** I still don't understand why you wish to leave.
(నువ్వు వెళ్లిపోవాలని ఎందుకనుకుంటున్నావో ఇంకా నాకర్థం కావటంలేదు)

**Navya:** If only you went through, what I have been through, you wouldn't be here for a minute, job or no job.
(నా అనుభవమే నీకుంటే నువ్వొక్కక్షణం కూడా ఇక్కడ ఉండవు)

**Divya:** So you have made up your mind to leave.
(అయితే వెళ్ళడానికే నిశ్చయించుకున్నావన్న మాట)

**Navya:** That's it. (అంతే)

**Divya:** You can cook for yourself and avoid eating out.
(నువ్వు వండుకోవచ్చుకదా. అప్పుడు బయట తినటం మానేయొచ్చు)

**Navya:** That's impossible for me. (నా వల్ల కాదు)

**Divya:** Ok

మనం phrasal verbs గురించి తెలుసుకుంటున్నాం కదా. ఇప్పుడు మరికొన్ని చూద్దాం. గుర్తుంది కదా ఈ Phrasal verbs అర్థం, వాడకం practice వల్లా, చదవటం వల్లా వస్తుంది. లేకుంటే ఏదైనా మంచి dictionary లో ఏదైనా మాటకు/ ముఖ్యంగా verb కు అర్థం చూసినప్పుడు దానికింద ఆ verb, దాని తర్వాత వచ్చే preposition కు అర్థం తెలుస్తుంది.

**Now look at the following phrasal verbs in the conversation between Divya and Navya.**

**1)** The food here doesn't agree with me.
**2)** I threw up all the food I had eaten.
**3)** So you want to pack up.
**4)** I can't get on any more.
**5)** Does it mean you want to give up your job?
**6)** You can't be so silly as to throw a good job up ...
**7)** There's no use keep on telling me.
**8)** If only you went through what I have been through.
**9)** You have made up your mind.

పైన underline చేసిన వన్నీ phrasal verbs. Let's now know their meanings and uses.

**1) The food here doesn't agree with me.**
The phrasal verb here is agree with. we know the usual meaning of 'agree with'. దీనర్థం, ఒకరితో ఏకీభవించటం/ అంగీకరించటం.
(The father doesn't agree with his son on the type of house they want to buy - ఎలాంటి ఇల్లు కొనాలనే విషయంలో వాళ్లకు ఏకాభిప్రాయం లేదు)
అయితే, ఇక్కడి expression: The food doesn't agree with me - ఇక్కడ agree with కు అర్థం 'సరిపడటం లేదు' (does not suit) అని.
**a)** The climate here doesn't agree with me - ఇక్కడి వాతావరణం నాకు పడటంలేదు.
**b)** Hot stuff doesn't agree with her ఎక్కువ కారపు వస్తువులు ఆమెకు పడవు.


M. SURESAN

పై expressions అన్నింటిలో not agree with రావటం గమనించండి. పడదు అనే అర్థంతోనే ఇవి ఎక్కువ వాడతాం.

**2) I threw up all the food I had eaten =**
తిన్నదంతా వాంతి చేసుకున్నా.
ఇక్కడి phrasal verb: throw up = వాంతి చేసుకోవటం = vomit. అయితే vomit కన్నా throw up అనేది better, vomit కాస్త పాండిత్యం. throw up అనేది వ్యావహారికం. Spoken English లో throw up అనేదే మెరుగు.
**a)** She was sick after eating the cake. she threw up = cake తినగానే ఆమెకు వెగటు పుట్టింది. వెంటనే వాంతి చేసుకుంది.
(sick = 'జబ్బు' అని మామూలు అర్థం. Sick అంటే వెగటు/ వాంతి కలిగే feeling అని కూడా చాలా తరచుగా వాడతాం)
**b)** The child is throwing up the milk=
పాలను కక్కేస్తోంది.

**3) So you want to pack up** = ఇక్కడి phrasal verb, to pack up. దీనర్థం ప్రయాణానికి/ వెళ్లిపోవటానికి సిద్ధపడటం. (పెట్టె బేడా సర్దుకోవటం)
**a)** He has packed up =
వెళ్లిపోయేందుకు సిద్ధంగా ఉన్నాడు.
**b)** When are you packing up? =
నువ్వు ఎప్పుడెళ్తున్నావు?
**c)** We are waiting for him to pack up =
అతనెప్పుడెప్పుడు వెళ్తాడా అని చూస్తున్నాం.

**4) I can't get on any more** =
phrasal verb- to get on = సాగిపోవటం/ కొనసాగటం/ సర్దుకుపోవటం/ జరిగిపోవటం - ఇలాంటి అర్థాలతో సందర్భాన్నిబట్టి 'get on' వాడుతుంటాం.
I can't get on any more =
ఇంక ఇలా కొనసాగలేకపోతున్నా.
**a) Pranav:** How is your new job?
(నీ కొత్త ఉద్యోగం ఎలా ఉంది?)

**Prakash:** (I'm) getting on well. No problem. (బాగానే ఉంది, సమస్యలేం లేవు/ ఉద్యోగం బాగానే చేసుకోగలుగుతున్నా.)

**b) Sudheer:** How are you, Sumant? Long time since we met.
(ఎలా ఉన్నావు? కలుసుకుని చాలా రోజులయింది)

**Sumant:** Just getting on
(ఏదో అలా జరిగిపోతోంది.)

**c)** Stop talking and get on with the work.
మాటలాపి పని కొనసాగించండి.

**5) Does it mean you want to give up your job.**
Phrasal verb - give up = మానేయటం, వదిలేయటం, వదులుకోవటం, ఆపేయటం.
**a)** She wants to give up her job and start business =
ఉద్యోగం వదిలేసి వ్యాపారం చేయాలనుకొంటోంది.
**b)** He hasn't given up smoking in spite of his doctor's advice =
Doctor వద్దన్నప్పటికీ అతను smoking మానలేదు.
**c)** He gave up his rights to the property =
ఆస్తిపై తన హక్కులు వదులుకొన్నాడు.
**d)** He gave up his attempts =
ప్రయత్నాలు ఆపేశాడు.

**6) You want to throw a good job up** - ఇక్కడ phrasal verb - throw a job up = job వదులుకోవటం. (ఇందాక throw up అంటే వాంతి చేసుకోవటం అనే అర్థం తెలుసుకున్నాం కదా. ఉద్యోగం/ అవకాశం లాంటివి వదులుకోవటం కూడా throw up.)
**a)** Who will throw up such a good job? =
అంత మంచి ఉద్యోగం ఎవరు మానుకుంటారు?/ వదులుకుంటారు?
**b)** He threw up a good job and a good family and took to drinking. =
మంచి ఉద్యోగం, సంసారం అన్నీ వదులుకుని తాగుడు మొదలుపెట్టాడు.

**7) There's no use keeping on telling me to adjust with the food** =
దొరుకుతున్న తిండితో సర్దుకుపొమ్మని చెబుతూ ఉండటం వల్ల ప్రయోజనం లేదు.
Keep on doing something =
ఒక పనిని అదేపనిగా చేస్తూ ఉండటం.
**a)** He keeps on smoking though his health is bad =
ఆరోగ్యం బాగాలేకపోయినా, smoke చేస్తూనే ఉంటాడు.
**b)** Though the teacher punished him, he keeps on talking =
Teacher వాడిని శిక్షించినా, మాట్లాడుతూనే ఉంటాడు.
అయితే present day English లో keep తర్వాత on అంతగా వాడటంలేదు. He keeps on talking (= He continues to talk) = He keeps talking.
**c)** Don't keep asking me silly questions =
పిచ్చి పిచ్చి ప్రశ్నలు అడుగుతూ ఉండకు

**8) If only you went through, what I have been through.** దీనర్థం, నేనను భవించిన కష్టాలు, నువ్వనుభవిస్తే అని. ఇక్కడ, phrasal verbs, 1) to go through, 2) to be through.
**a) Pratap:** I had a lot of difficulty getting the MRO's certificate.
(MRO దగ్గర certificate తెచ్చుకోవటం నాకు చాలా కష్టమయింది.)

**Pramod:** I have been through all that/ I have gone through all that =
నేనవన్నీ అనుభవించాను.

I know how difficult it is =
అది ఎంత కష్టమో నాకు తెలుసు.
**b)** He is going through a difficult period in his life =
అతను చాలా కష్ట సమయం అనుభవిస్తున్నాడు.
**c)** I don't want my son to go through the difficult I have gone through =
నేననుభవించిన కష్టాలు మా అబ్బాయి అనుభవించటం నాకిష్టంలేదు.
అయితే go through అంటే చదవటం అని కూడా ఉంది.
**a)** Did you go through the paper today?
ఇవాళ్టి paper చదివావా?
**b)** The CM has to go through the committee's report.
కమిటీ report CM ఇంకా చదవాల్సి ఉంది.

**9) You have made up your mind.**
నువ్వు నిర్ణయించుకున్నావు. ఇక్కడ verb - make up ones mind - నిర్ణయించుకోవటం
**a)** Please make up your mind whether to go or not = వెళ్తాలో వద్దో నిర్ణయించుకోండి.
**b)** I have made up my mind to buy that car =
ఆ car కొనేందుకే నిర్ణయించుకున్నా.

కిందటి lesson లో ఇచ్చిన phrasal verbs, ఈ lesson లో ఇచ్చిన phrasal verbs, spoken English లో చాలా common గా వినిపించేవే. వీటిని బాగా practice చేయండి. అందువల్ల చిన్నచిన్న sentences తో మీ conversation అందంగా, అర్థవంతంగా ఉంటుంది.

**EXERCISE**

**Practise the following aloud in English.**

**Mahesh:** నేను wash basin దగ్గరకెళ్లేసరికి, పాపం అతను వాంతి చేసుకుంటున్నాడు.

**Naresh:** ఎవరు?

**Mahesh:** ఇంకెవరు, Ramesh. నిన్నటి నుంచి నాకీ తిండిపడటంలేదు అని complain చేస్తూనే ఉన్నాడుగదా?

**Naresh:** మనం బాగానే సర్దుకుపోగలుగుతున్నాం కదా?

**Mahesh:** అతను ఎక్కువ coffee తాగుతాడు. అందువల్ల కొంచెం ఎక్కువ తిన్నా వెగటనిపిస్తుంది.

**Naresh:** అదేంటో ఆ కాఫీ అలా తాగుతూనే ఉంటాడు. అది ఆపేదాకా, అతని పరిస్థితింతే.

**ANSWER**

**Mahesh:** When I went to the wash basin the poor fellow (పాపం అతను అనే భావంతో) was throwing up.

**Naresh:** Who?

**Mahesh:** Who else? Ramesh. He has been complaining since yesterday that this food doesn't agree with him.

**Naresh:** But we are able to get on with the food.

**Mahesh:** He takes too much of coffee. That's why even if he eats a little too much, he feels sick.

**Naresh:** He keeps as drinking coffee. Until he gives it up, his condition will be like this.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# This is the pen I like a lot



**Rajita:** Hi Likhita, the bakery we buy our cakes from is closed. What shall we do now.
(మనం మామూలుగా cakes కొనే bakery మూసి ఉంది. ఏం చేద్దాం? )

**Likhita:** I'm afraid. We have to make do with the cakes we have at home.
(మనం ఇంట్లో ఉన్న cakes తో సర్దుకోవాల్సిందే)

**Rajita:** But are they enough for all the friends we are going to have for the party?
(కానీ party కొచ్చే friends అందరికీ అవి సరిపోతాయా? )

**Likhita:** Let's see if the bakery at the other end of the street is open.
(వీధికి ఈ చివర ఉన్న bakery తెరిచి ఉందేమో చూద్దాం)

**Rajita:** The time I told our friends to come at is 5.30. It's already 4.30. The time we are left with is rather short. Let's hurry.
(మన friends ను నేను రమ్మన్న time 5.30 ఇప్పటికే 4.30 అయిపోయింది. మనకు మిగిలిన time ఎక్కువ లేదు. త్వరగా పద)

**Likhita:** Two of the guests we've invited have called to tell me they aren't coming.
(మనం పిలిచిన వాళ్లలో ఇద్దరు రావటంలేదని Phone చేశారు.)

**Rajita:** Who are they? (వాళ్లెవరు)

**Likhita:** Hasya and Lasya, the two girls you like so much. One is down with a fever and the other doesn't like to come alone.
(నువ్వు బాగా ఇష్టపడే ఇద్దరమ్మాయిలు హాస్య, లాస్య. ఒకరికేమో జ్వరం, ఇంకొకరికేమో ఒంటరిగా రావటం ఇష్టం లేదు)

**Rajita:** That's disappointing. How much more cake do we need?
(అది నిరాశాకరం. మనకింకెంత cake కావాలి? )

**Likhita:** (It) depends on the number of guests we expect. My estimate is atleast 40. That means we need at least a Kg more.
(అది మనం వస్తారనుకొనే ఆహ్వానితుల సంఖ్యను బట్టి ఉంటుంది. నా అంచనా కనీసం 40, అంటే ఇంకో కిలో కావాలి)

**Rajita:** Ah... here we are. Thank god. This bakery is open.
(ఆ... అమ్మయ్యా. ఈ bakery తెరిచే ఉంది.)
Thank god = బతికిపోయాం = దేవుడికి ధన్యవాదాలు

**Likhita:** They aren't good at making cakes here. (ఇక్కడి వాళ్లు cakes సరిగ్గా చేయరు)

**Rajita:** We have to buy here for now. No helping it. (ఇక్కడ ఇవాళ్టికి కొనాల్సిందే. తప్పదు)

గత కొన్ని lessons గా who (whom బదులుగా) which తో short sentence కలపటం practice చేస్తున్నాం కదా.

ఇంకో విషయం. చాలా సందర్భాల్లో who (whom బదులు) & which తో sentences join చేసేటప్పుడు who (whom) and which ని వదిలేసి కూడా join చెయ్యొచ్చని చూశాం- గుర్తుంది కదా? ఇది మనసులో ఉంచుకొని పై conversation లో ఈ sentences ను study చేయండి.

1) The bakery we buy our cakes from is closed
(మనం cakes కొనే bakery మూసేసి ఉంది)

2) ... We have to make do with the cakes we have at home.
(మన ఇంట్లో ఉన్న cakes తో సర్దుకోవాల్సిందే)

3) ... are they enough for all the friends we are going to have for the party? =
మన party కి రాబోతున్న friends అందరికీ అవి సరిపోతాయా?

4) The time I told our friends to come at is 5.30
నేను మన friends ను రమ్మన్న time 5.30

5) The time we are left with is rather short
(మనకు మిగిలిన time చాలా తక్కువ)

6) Two of the guests we have invited have called...
మనం పిలిచిన guests లో ఇద్దరు phone చేశారు.

7) ... The two girls you like so much.
(నువ్వెంతో ఇష్టపడే ఇద్దరమ్మాయిలు)

చూడండి, పై sentences అన్నింటిలో మొదటి భాగం/ clause (English లో చివరి clause) అర్థం ఎలా వస్తుందో:

1) మనం cakes కొనే bakery = (మనం ఏ bakery లో cakes కొంటామో అది అనే అర్థంతో) =
The bakery we buy cakes from = (the bakery from which we buy cakes అని అసలు clause - కానీ modern English spoken form లో ఇలా అనడం లేదు.) ఇలాంటి చోట్ల from which లాంటి expressions మానేశారు.)

2) మన ఇంట్లో ఉన్న cakes తో =
With the cakes we have at home
(modern for with the cakes which we have at home - which present day English లో వాడటం లేదు/ వినిపించదు)

3) ... The friends we are going to have =
మనకు రాబోతున్న friends అందరికీ (modern for 'the friends who/ that (whom = బదులు) we are going to have - ఇప్పటి Spoken English లో who/ that drop చేయటం పరిపాటి. whom అసలు వినిపించడం లేదు)

4) నేను మన friends ను రమ్మన్న time =
The time I told our friends to come at (the time at which I told them to come - at which లాంటి expressions old fashioned - కాబట్టి అలా అనం. The time I told our friends to come at అనే అంటాం.)

5) Two of the guests we have invited have called =
మనం పిలిచిన guests లో ఇద్దరు phone చేశారు.
(Two of the guests who/ that (whom బదులు) we invited have called - who/ that ఇక్కడ old fashioned - ఇప్పుడు వాడటం లేదు)

7) ... నువ్వు అంత ఇష్టపడే ఆ ఇద్దరమ్మాయిలు
= The two girls you like so much (The two girls who/ that (whom బదులు) you like so much- old fashioned. Who/ that ఇపుడు drop చేసేస్తున్నారు.)

పైన మనం గమనించిన విషయం - రెండు మూడు short sentences ను ఒకటిగా చేర్చి మాట్లాడేటప్పుడు modern spoken form లో whom కు స్థానం లేదు. అది తప్పక వాడాల్సివస్తే who/ that వాడతాం.

a) Police అనుమానించేది అతడిని=
He is the man who/ that the police suspect.
అయితే ఇలా అనడం ఇంకా better.
He is the man the police suspect. (who/ that కూడా drop చేసేస్తున్నాం). ఇలాగే which కూడా.

b) నేను ఎక్కువగా ఇష్టపడే pen ఇది=
This is the pen which I like a lot (old fashioned). Which ఇప్పుడు ముఖ్యంగా spoken English లో వాడటం లేదు.
= This is the pen I like a lot (which లేకుండా)

c) ఈ Channel లోనే నేనా programme చూసింది=
This is the channel on which I saw the programme. (old fashioned). On which వాడకుండా-
This is the channel I watched the programme on. అయితే ఇక్కడ గమనించదగ్గ విషయం, preposition 'on' వదిలేయకూడదు.

d) ఈ room లోనే అతడు హత్యకు గురైంది. =
This is the room in which he was murdered (in which- old fashioned)
Modern: This is the room he was murdered in. ('In' sentence చివర రావటం గమనించండి)

e) నువ్వు పళ్లు కోసిన కత్తి పదునైంది=
The knife with which you cut the fruits is sharp. (with which - old fashioned)
Modern: The knife you cut the fruits with is sharp. ('with' fruits తర్వాత రావటం గమనించండి).


M. SURESAN

ఇలా వీలైనన్ని సందర్భాల్లో, మనం English మాట్లాడేటప్పుడు, whom వాడకం పూర్తిగా మానేశారు. అందుకు బదులు ఎవరిని అనే అర్థంతో కూడా 'who' 'that' వాడుతున్నారు. అలాగే which కూడా drop చేసేస్తున్నారు.

Whom బదులు who, that కూడా వాడటం లేదిప్పుడు. అలాగే which కూడా లేదు. ఇవి లేకుండానే, we can join two/ more sentences into one అని పై examples లో చూశాం కదా.

a) ప్రతి వాళ్లూ మెచ్చుకునే నాయకుడతను=
He is the leader every one admires.
(Who everyone admires కాదు).

b) ప్రతివాళ్లూ చూడదగ్గ చిత్రమది=
That is a movie every one must see.
(Which every one must see కాదు)

c) అతడు ప్రయాణించే car చాలా ఖరీదైంది=
The car he travels by is expensive.
(The car by which he travels,- old fashioned) అయితే ఇక్కడ 'by' అనే preposition వదలకూడదు. అందుకనే, the car he travels by అని by వాడతాం.

**EXERCISE**

**Practise the following aloud in English**

**Praneeth:** నిన్న నేను తిన్న fish అంత రుచిగా లేదు.
**Vineeth:** ఎక్కడ తిన్నావు.
**Praneeth:** నువ్వు తరచుగా వెళ్లే, నువ్వు ఎప్పుడు మాట్లాడే restaurant లో.
**Vineeth:** అక్కడ complain చేయటానికి నాకేం కన్పించలేదే?
**Praneeth:** నేను పొరపాటు చేశాను. నిన్న నేను నిన్నుకూడా తీసుకు వెళ్లాల్సింది. అపుడు నువ్వు తెలుసుకునుండేవాడివి వాళ్లు వడ్డించే ఆహారం గొప్ప.
**Vineeth:** ఈరోజు తీస్కెళ్లు. చూద్దాం.
**Praneeth:** ఇవాళ నా దగ్గరున్న డబ్బు చాలదు. అయినా ఎవరి డబ్బునువాడి నువ్వు రుజువు చేయాలనుకుంటున్నావు.
**Vineeth:** నువ్వేగదా complain చేసింది.
**Praneeth:** అందుకు బదులు ఆ restaurant కు వెళ్లటం మానేస్తాను.

**ANSWER**

**Praneeth:** The fish I ate yesterday wasn't tasty.
**Vineeth:** Where did you eat?
**Praneeth:** The restaurant you frequently go to, and talk so much about.
**Vineeth:** I haven't found anything to complain about there.
**Praneeth:** I made a mistake. I should have taken you there yesterday. You would then have known the quality of food they serve.
**Vineeth:** Take me today and let's see.
**Praneeth:** The money I have today isn't enough. Whose money do you wish to use to prove your point.
**Vineeth:** It's you who complained.
**Praneeth:** I'd rather stop going to the restaurant.

**ప్రశ్న:** *i) The uses of adversity are sweet.*
*ii) ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.*
*ఈ రెండు వాక్యాలకు subject, object, verb తెలపగలరు. (తెలుగు, ఇంగ్లిష్‌ల్లో)*
*iii) simple, complex, compound గురించి మరింత సమాచారం అందించగలరు.*
*– రమేష్‌బాబు, కుమరదేవరం*

**జవాబు:**
i) The uses of adversity are sweet.
ఇందులో subject - the uses of adversity. verb - are ఈ sentence లో object లేదు.
Verb, 'be', form అయితే object ఉండదు - 'are', 'be' form.
ii) Einstein propounded the theory of relativity
a) subject - Einstein b) verb- propounded
c) object - the theory of relativity
తెలుగు - subject - Einstein, verb - ప్రతిపాదించాడు, object - సాపేక్ష సిద్ధాంతం.
iii) Simple, compound, complex sentence ను ఆ పేర్లు వాడకుండా వివరిస్తూనే ఉన్నాం, clause లో వివరించినప్పుడల్లా - వాటిని చూడండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# He can be a handful

**Sharath:** Hi Vasanth, I look forward to the study tour we are going on, this weekend.
(ఈవారం చివర మనం వెళ్లబోతున్న study tour ఎప్పుడెప్పుడా అని ఎదురుచూస్తున్నా.)

**Vasanth:** So do I, but am a bit worried about mother. She has taken ill suddenly. Dad is away on camp and will be back only this weekend.
(నాకూ సరదాగానే ఉంది. కాని మా అమ్మకు ఉన్నట్టుండి జబ్బు చేసింది. మా నాన్న camp నుంచి వారాంతమే తిరిగొస్తారు)

**Sharath:** So you are worried who will look after her if we start before your father comes, aren't you?
(మనం మీ father రావడానికి ముందే బయలుదేరితే మీ అమ్మను చూసుకునేందుకు ఎవరూ ఉండరని కదా నీ బాధ?)

**Vasanth:** Exactly. But I've called my elder sister and told her of the situation. I told her to come here two days before our departure.
(అవును. మా అక్కకు Phone చేసి చెప్పాను. మనం బయలుదేరటానికి రెండు రోజులు ముందురమ్మని.)

**Sharath:** That's a good idea. (బాగానే ఉంది)

**Vasanth:** I called dad and he came up with the idea.
(మా నాన్నకు నేను phone చేస్తే ఆయనకొచ్చిందీ idea)

**Sharath:** I am happy you are making it, after all. I was afraid you might not come.
(పోనీలే, ఏదేమైనా నువ్వొస్తున్నావు సంతోషం. నువ్వు రావేమోనని బాధపడ్డా)

**Vasanth:** I am coming, of course. But the trouble is my sister's son. He goes to school. He can be a handful.
(నేను వస్తున్నాన్లే. అయితే మా అక్క కొడుకే సమస్య. వాడు చదువుకుంటున్నాడు. కొంచెం అల్లరెక్కువ.)

**Sharath:** I've seen him. He takes after your sister, doesn't he?
(నేను వాణ్ని చూశాన్లే. అచ్చం మీ అక్క పోలికే కదా?)

**Vasanth:** Only in features. In traits he takes after his dad. Quite mischievous.
(ఆకారం, రూపు రేఖల్లోనే. లక్షణాలన్నీ వాళ్ల నాన్నవే. అల్లరెక్కువ.)

features = ముఖ కవళికలు, రూపు రేఖలు.
traits = లక్షణాలు, గుణాలు

**Sharath:** By the way, you know, Vinod showed up suddenly yesterday. He is preparing for the civils exam this year. He has been in Hyderabad for six months now.
(అన్నట్టు నిన్న ఉన్నట్టుండి Vinod కనిపించాడు. వాడు civils కు prepare అవుతున్నాడు. ఆరునెలలుగా Hyderabad లోనే ఉన్నాడు)

**Vasanth:** Yea. I know. I met him when I went to Hyderabad. He put up at his uncle's for a few days. He said he would be taking rooms, and moving into them.)
(అవును. నాకు తెలుసు. నేను హైదరాబాద్‌కు వెళ్లినప్పుడు కలుసుకున్నాను. అతనప్పుడు కొన్ని రోజులు వాళ్ల మామయ్య ఇంట్లో ఉన్నాడు. త్వరలో rooms చూసుకుని మారతానన్నాడు)

**Sharath:** So he did. My cousin and he are room mates.
(అవును మా cousin, అతను room mates.)

**In this lesson too, we continue our study of phrasal verbs. We have in the last two lessons seen some of them commonly used in conversation. Let us now look at some more of them.**

**Now look at the following expressions at the beginning of the lesson between Sharath and Vasanth.**

1) I look forward to the study tour.
2) She has taken ill suddenly.
3) ... who will look after her if we ...
4) I called dad and he came up with the idea.
5) I am happy you are making it after all.
6) He can be a handful.
7 a) He takes after your sister, doesn't he?
b) In traits he takes after his dad.
8) Vinod showed up suddenly yesterday.
9) He put up at his uncle's place.




**1) I look forward to the study tour.**

Look forward to= సంతోషంతో/ ఆతృతతో ఎదురుచూడటం. Look forward to తర్వాత noun కానీ, ...ing form కానీ వస్తుంది.

M. SURESAN

a) He is looking forward to the match=
అతను match ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్నాడు. Match - noun.

b) He is looking forward to participating in the match.
Match లో ఎప్పుడెప్పుడు పాల్గొందామా అని ఎదురుచూస్తున్నాడు. Participating- 'ing' form.
(Look forward to తర్వాత 1st RDW రాదు. He is looking forward to meet you - తప్పు)

**2) She has taken ill suddenly.**

To take ill= to fall ill= జబ్బుపడటం
(ఆమె అనుకోకుండా జబ్బు పడింది)

a) He took ill after eating the food on the train=
రైల్లో ఆహారం తిన్నందువల్ల అతనికి జబ్బు చేసింది.

b) If you go out in the cold you may take ill=
చలిలో తిరిగితే జబ్బు చేయవచ్చు

**3) Who will look after her ...?**

To look after= to take care of= to care for=
(రోగులకు, పిల్లలకు, అతిథులకు etc) సపర్యలు చేయటం/ చూసుకోవటం

a) When I fell ill, my sister looked after me=
నాకు సుస్తీగా ఉన్నప్పుడు మా sister చూసుకుంది. (సపర్యలు చేసింది)

b) There is none to look after the child=
బిడ్డను చూసుకోవటానికి ఎవరూలేరు.

c) He is an important guest. Look after him well=
అతడు చాలా ముఖ్యమైన అతిథి, జాగ్రత్తగా చూసుకో.

**4) I called dad and he came up with the idea.**

To come up with= ఎవరైనా ఏదైనా ఆలోచన ఇవ్వటం.

He came up with the idea that we could get the accommodation by bribing the TC=
TC చేతిలో ఏదైనా పెడితే seats దొరకవచ్చుననే ఆలోచన అతనిచ్చాడు.

Accommodation= 1) Train/ bus లలో seats, berths; 2) వసతి.

**5) I am happy you are making it after all.**

(నువ్వు రాగలుగుతున్నందుకు సంతోషం)

To make it to= ఈ expression చాలా సాధారణమైనది. అర్థం ఏ పనైనా చేయగలగటం.

a) He made it to the IAS=
IAS లో చేరగలిగాడు/ చేరాడు.

b) The team made it to the finals, after all=
ఏదైతేనేం, team finals కు చేరుకోగలిగింది/ చేరుకుంది.

c) I doubt if he can make it to the place on time=
వాడు time కు అక్కడ చేరుకోగలగడం నాకనుమానమే.

d) Election లో గెలవగలిగాడు=
He made it to the seat.

**6) He can be a handful** = అతను సమస్య కాగలడు.

To be a handful= ఎవరైనా, ముఖ్యంగా పిల్లలు తల్లిదండ్రులకు సమస్య అయితే, he/ she is a handful అంటాం. Handful గా ఉన్న పిల్లలను తల్లిదండ్రుల అదుపాజ్ఞల్లో ఉంచటం కష్టం.

a) **Purnima:** Can't your sister lend a hand with the cooking?
మీ sister నీకు వంటలో సాయం చేయలేదా?
(lend a hand = సాయం చేయటం.
He lent me a hand with tidying up the home=
ఇల్లు సర్ది అమర్చటంలో అతడు నాకు సాయం చేశాడు.)

**Chitra:** She can't. Her two children are a handful for her.
చేయలేదు. ఆమె ఇద్దరు పిల్లలతో వేగలేకపోతోంది

b) The boy is a handful for the teacher =
ఆ teacher కు ఆ పిల్లాడు పెద్ద సమస్య. ఆవిడకు వాడితో వేగటం కష్టం.

[Handful = 1) కొన్ని మాత్రమే/ కొద్దిమంది మాత్రమే.
2) చేతినిండా - ఈ రెండు అర్థాలున్నాయి.

a) Only a handful of students were present =
కొద్దిమంది students మాత్రమే వచ్చారు.

b) He has a handful of grapes =
వాడి చేతినిండా ద్రాక్ష పండ్లున్నాయి.]

**7 a) He takes after your sister, doesn't he?**
మీ అక్కయ్య పోలిక కదా, వాళ్లబ్బాయి?

**b) In traits he takes after his dad**
లక్షణాల్లో వాళ్ల నాన్న పోలిక.

To take after = to resemble = పోలి ఉండటం

a) Children usually take after their parents =
పిల్లలు మామూలుగా తల్లిదండ్రులను పోలి ఉంటారు.

b) In features she takes after her mother, but in traits she takes after her father. =
ఆ అమ్మాయి రూపంలో తల్లిని, గుణాల్లో తండ్రిని పోలి ఉంది.

c) In being tall, he takes after his grand father
పొడుగులో, వాళ్ల తాతను పోలి ఉన్నాడు/ పొడుగులో వాళ్ల తాతే అతడు.

**8) Vinod showed up suddenly yesterday.**

వినోద్ ఉన్నట్టుండి నిన్న ప్రత్యక్షమయ్యాడు/ కనిపించాడు.

a) After weeks of absence, she showed up yesterday=
వారాల తర్వాత, నిన్న కనిపించిందామె.

b) Kumar shows up at the least expected moment =
మనకు కనపడతాడని అనుకోని సమయంలో కుమార్ ప్రత్యక్షమవుతాడు.

c) Sekhar promised to be here last sunday, but he hasn't showed up so far =
కిందటి ఆదివారం ఇక్కడ ఉంటానన్న Sekhar, ఇప్పటివరకు మళ్లీ కనిపించలేదు/ అంతులేదు.

d) He hasn't showed up for the class.
అతను class కు రాలేదు.

**9) He put up at his uncle's place** (for a few days).

వాళ్ల uncle ఇంట్లో తాత్కాలికంగా ఉన్నాడు.

To put up = (ఏ కొద్ది రోజులకో) బస చేయటం, Hotel, lodge లాంటి వాటిల్లో.

a) They put up at the nearest lodge, after getting off the train =
Train దిగగానే, station కు అతి దగ్గరగా ఉన్న lodge లో బసచేశారు/ దిగారు.

b) As she had nobody known to her in the city, she put up at a hotel.
నగరంలో తెలిసినవాళ్లెవరూ లేకపోవటంతో ఆమె hotelలో దిగింది.

గమనించండి:
ఒకరికి వసతి చూపించటం = put some one up:

a) I put my friend up in our spare bed room =
మా friend కు మా ఇంట్లో ఖాళీగా ఉన్న bedroom లో వసతి ఇచ్చాను.

b) He put me up in his uncle's place =
నాకు వాళ్ల uncle ఇంట్లో వసతి కల్పించాడు.

ఇవి చాలా common phrasal verbs conversationలో. బాగా practice చేయండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# I don't see eye to eye with ..

**Bhagat:** Hi Jagat, why are you putting on a new shirt and a new pair of trousers?
(ఏంటి జగత్, కొత్త shirt, కొత్త pants వేసుకుంటున్నావు. ఏంటి విశేషం? )

**Jagat:** Today is my birthday.
(ఇవాళ నా పుట్టినరోజు).

**Bhagat:** Many happy returns of the day. But why not a word of it to me earlier? I'd have had the pleasure of presenting you something.
(నువ్వీ పుట్టినరోజు చాలాసార్లు జరుపుకోవాలని నా కోరిక. కానీ నువ్వీ విషయం నాతో ఒక్క మాట కూడా అనలేదు. నీకేదైనా కానుకిచ్చి సంతోషపడేవాణ్ని కదా? )

**Jagat:** That's precisely why I've put off telling you of it until now. I am against receiving birth day gifts. First of all, I am not for celebrating my birthday.
(కచ్చితంగా అందువల్లే నీకు ఇంతవరకు చెప్పటం వాయిదావేశాను. పుట్టినరోజు కానుకలు స్వీకరించటం నాకంత ఇష్టం లేదు. అసలు పుట్టిన రోజును పండగగా జరుపుకోవటం ఇష్టం లేదు నాకు.)

**Bhagat:** That's rather odd. I've come across very few that don't celebrate their birthdays.
(ఇది కాస్త వింతే. పుట్టినరోజు జరుపుకోని వాళ్లను కొద్దిమందినే చూశా.)

**Jagat:** Well, I don't mind your taking me as one of those few.
(పోనీలే. అలాంటి కొద్దిమందిలో నేనొకణ్ణని నువ్వనుకుంటే నాకేం అభ్యంతరంలేదు.)

**Bhagat:** I don't see eye to eye with you on this. What's wrong in enjoying yourself on the day you entered the world?
(ఈ విషయంలో నేన్నీతో ఏకీభవించటంలేదు. మనం ప్రపంచంలోకి అడుగుపెట్టిన రోజు సంతోషంగా గడుపుకోవడంలో తప్పేంటి? )

**Jagat:** Is it any achievement of yours if a year rolls on? Time passes and it can't be credited to anyone. I am all for a person celebrating an achievement, but not for the passage of time.
(ఓ సంవత్సరం గడవటం అనేది మనం సాధించేదేంకాదుకదా. కాలం గడిచిపోతుంది. అది ఎవరి గొప్పతనమూ కాదు. (నా జీవితంలో ఒక సంవత్సరం నా గొప్ప అనుకోలేను అనే భావం.) ఏదైనా మనం సాధించింది ఉంటే దాన్ని సంతోషంగా గడపటం నాకు పూర్తిగా ఇష్టమే, కాని కాలం గడిచిందానికి మన ఘనత ఏం లేదు.)

**Bhagat:** Then why did you put on the new clothes?
(అయితే కొత్త బట్టలెందుకు వేసుకున్నావు? )

**Jagat:** Mom was particular and sent me them. So I put them on- just to please her.
(అమ్మ పట్టుబట్టింది. ఆ బట్టలు పంపింది. అమ్మను సంతోషపెట్టడానికి వేసుకున్నా.)

**Bhagat:** OK. OK. At least are you going to give us a treat? (కనీసం విందన్నా ఇస్తావా? )

**Jagat:** We'll have it, don't worry. (అలాగే).

**Bhagat:** What about a movie after that?
(ఆ తర్వాత సినిమా? )

**Jagat:** Not certainly. I can't sit through the two and half hours of loud songs, dance, sex and violence that an Indian movie is.
(అది మాత్రం లేదు. భారతీయ సినిమా అనే రెండున్నర గంటల గొడవ పాటలు, నాట్యాలు, శృంగారం, హింస చూస్తూ కూచోవటం నావల్ల కాదు.)

**Bhagat:** But so many watch them.
(కానీ చాలామంది వాటిని చూస్తారు.)

**Jagat:** Sorry. Anything but that. I can't put up with the boredom.
(అదితప్ప ఇంకేదన్నా ఫరవాలేదు. ఆ విసుగును నేను భరించలేను.)

**Bhagat:** OK. Thanks for the treat at least.
(కనీసం dinner అయినా ఇస్తున్నావు. Thanks)

**Let's continue our study of phrasal verbs. Look at the following expressions from the conversation above:**

1) ... Why are you putting on a new shirt and a new pair of trousers?
2) ... Why I have put off telling you of it.
3) ... I am against; I am for/ I am not for/ I am all for.
4) I've come across very few that don't celebrate their birthdays.
5) I don't see eye to eye with.
6) ... and it can't be credited to anyone.
7) Are you going to give us a treat?
8) I can't sit through the loud songs, dances, sex and violence.
9) I can't put up with the boredom.

ఈ expressions meanings, use తెలుసుకునే ముందు మనం ఇంకొన్ని పదాల అర్థాలు కూడా తెలుసుకుందాం.

1) **Precisely** = కచ్చితంగా (బంగారంలాంటివి తూచేటప్పుడు, గొప్ప గొప్ప (Olympic క్రీడల్లాంటి) పరుగు పందాల్లో time చాలా కచ్చితంగా, సెకన్ల తేడా కూడా లేకుండా ఉండటంలాంటిది precise.)

2) **Odd** = వింతైన. మామూలుకంటే భిన్నంగా ఉన్న.
He doesn't like curd. That's odd. (చాలామందికి ఇష్టమైన పెరుగు అతనికి ఇష్టంలేదు. అది వింత.)

3) **Mind:** మామూలు అర్థం తెలుసు కదా- మనం ఆలోచించే, మన తెలివికి నిలయమైన బుర్ర.
ఇక్కడ Mind అంటే అభ్యంతరం ఉండటం.
Do you mind waiting for a few minutes? = కాస్త wait చేయటానికి మీకేమన్నా అభ్యంతరమా?
I don't mind it at all = నాకేం అభ్యంతరం లేదు.
Never mind = దాని గురించి పట్టించుకోవద్దు.
(ఎవరైనా sorry అలాంటివి అంటే మనం never mind అంటాం.)

4) **Achievement** = సాధించే విషయం - ఘనత.
Achieve = సాధించటం.
- a) A score of a century in cricket is an achievement =
Century కొట్టడం ఘనత (సాధించిన విషయం).
- b) Getting a good rank is an achievement = మంచి rank సాధించటం ఒక ఘనత.

5) **Time rolling** = కాలం దొర్లటం

6) **be particular about** =
పట్టుదలగా ఉండటం (ఒక విషయంలో)
- a) I am particular about vegetarian food = నాకు శాకాహారమే కావాలి (పట్టుబట్టడం)
- b) She is particular about this sari = ఆమె ఈ చీరే కావాలంటోంది/ ఈ చీర కోసమే పట్టుబడుతోంది. ఇప్పుడు phrasal verbs విషయానికొద్దాం:

**1) Why are you putting on a new shirt and a new pair of trousers?**
To put on = (బట్టలు) వేసుకోవటం/ తొడుక్కోవటం. ధరించటం అంటే wear. ఇప్పటికిప్పుడు బట్టలు వేసుకోవటం/ తొడుక్కోవటం మాత్రమే to put on. మామూలుగా ధరించటం = to wear.
- a) If you are going to the marriage, put on the new clothes =
పెళ్లికి వెళ్తున్నట్లయితే కొత్త బట్టలు వేసుకో.
- b) He is putting on a sweater because he is going out in the cold weather = చలిలో బయటికి వెళ్తున్నాడు కాబట్టి sweater వేసుకుంటున్నాడు.

Wear = ధరించటం. He wears expensive clothes = ఖరీదైన బట్టలు ధరిస్తాడతను.


M. SURESAN

**2) Why I've put off telling you of it.**
To put off = to postpone (వాయిదా వేయటం)
- a) I shall be happy if the exams are put off until the next week = వచ్చేవారం దాకా పరీక్షలు వాయిదాపడితే నాకు సంతోషం.
- b) Don't put off till tomorrow what you can do today = ఈ రోజు చేయగలిగిందాన్ని రేపటి వరకు వాయిదా వేయొద్దు.

Put off తర్వాత till కానీ, until కానీ వాడతాం.

**3) I am for/ I am all for/ I am against.**
To be for/ to be all for = ఒక విషయంపట్ల సుముఖంగా/ పూర్తిగా సుముఖంగా ఉండటం/ ఒక విషయం సమర్థించటం.
- a) I am for/ I am all for starting early =
త్వరగా బయల్దేరటానికే నేను సుముఖంగా ఉన్నాను. అదే నాకిష్టం.
- b) She is for attending the function =
ఆమె function కు వెళ్లడానికే సుముఖంగా ఉంది.
- c) He was not for his son joining politics =
ఆయన కొడుకు రాజకీయాల్లో చేరడం ఆయనకిష్టం లేదు.

Against = వ్యతిరేకం.

**4) I've come across very few that don't celebrate their birthdays.**
To come across = చూడటం, అనుభవించటం, తారసపడటం.
- a) We come across camels only in deserts = ఒంటెలను ఎడారుల్లోనే చూస్తాం - ఎడారుల్లోనే అవి మనకు కనిపిస్తాయి.
- b) The doctor says he hasn't come across such a case so far in his practice =
తన practice లో ఇంతవరకు ఇలాంటి case చూడలేదంటున్నాడు doctor.
- c) You come across the likes of Gandhi rarely
గాంధీలాంటివాళ్లు మనకు అరుదుగా కనిపిస్తారు.

**5) I don't see eye to eye with you.**
to see eye to eye with = ఏకీభవించటం.
ముఖ్యంగా ఈ expression ను ఏకీభవించకపోవటానికే వాడతారు- not see eye to eye with అని. (ఒకరు చెప్పింది ఇంకొకరు ఒప్పుకోకపోవటానికే ఎక్కువ వాడతారు.)
- a) The father and the son don't see eye to eye with each other on the matter of the son's marriage = కొడుకు పెళ్లి విషయంలో తండ్రి కొడుకులకు భేదాభిప్రాయాలున్నాయి.
- b) He doesn't see eye to eye with his wife on many matters =
చాలా విషయాల్లో భార్యాభర్తలకు అంగీకారం లేదు.

**6) ... and it can't be credited to anyone** =
దానికెవరూ ఘనత వహించలేరు (ఆ గొప్పతనం ఎవరిదీకాదు)
- a) Indian independence is credited to Mahatma Gandhi = భారత స్వాతంత్ర్యం తెచ్చిన ఘనత/ గొప్పతనం గాంధీది.
- b) The profits of the company are credited to the General Manager = ఆ company లాభాలకు General Manager దే ఘనత.

**7) ... are you going to give us a treat?**
treat = సంతోషకరమైన/ ఆహ్లాదకరమైన విషయం ఏదైనా treat.
- a) The movie is a real treat after a long period of bad movies = చాలా పనికిరాని చిత్రాల తర్వాత వచ్చిన ఈ సినిమా నిజంగా చాలా బాగుంది. ఆహ్లాదకరంగా ఉంది.
- b) To give a treat = విందు ఇవ్వటం.
He gave us a treat on his birthday = పుట్టినరోజు సందర్భంగా అతను విందిచ్చాడు.
- c) The treat he gave us on his wedding anniversary was grand = పెళ్లి వార్షికోత్సవం సందర్భంగా అతనిచ్చిన విందు గొప్పగా ఉంది.

**8) I can't sit through the loud songs, dances, ..**
To sit through = (ఓపిగ్గా) చివరిదాకా కూర్చోవటం.
- a) He can't teach well. I can't sit through his class = ఆయన సరిగ్గా బోధించలేడు. ఆయన class చివరిదాకా నేను కూర్చోలేను.
- b) (Do) you want to sit through the discussion? I don't have the patience.
(ఆ చర్చల చివరిదాకా నన్ను కూర్చోమంటావా? నాకా ఓపిక లేదు.)
Sit through, సామాన్యంగా not తోనే వాడతారు. (కూర్చోలేను అనే అర్థంతో).

**9) I can't put up with the boredom** =
ఆ విసుగు భరించలేను.
To put up with = సహించటం/ భరించటం
- a) Sita was a great woman. She put up with a lot of hardship =
సీత గొప్ప స్త్రీ. చాలా కష్టాలను భరించింది.
- b) I cannot put up with the noise =
ఆ గొడవ భరించలేను.
- c) She has put up with all the trouble her husband gave her =
భర్తపెట్టిన బాధలన్నిటినీ ఆమె భరించింది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# They are cut out for each other


M. SURESAN

**Badari:** Shall we go for lunch? Don't you think it is time?
(Lunch కి వెళ్దామా? Time అయింది కదా? )

**Kedar:** It is only 11.30. I feel its too early.
(ఇప్పుడు 11.30 మాత్రమే అయింది. చాలా త్వరగా వెళ్ళినట్లవుతుంది.)

**Badari:** Hei, Both of us have forgotten. Hasn't Amareswar asked us to lunch today at his home?
(ఏయ్, మనం ఇద్దరం మరచిపోయాం. ఇవాళ అమరేశ్వర్ మనల్ని భోజనానికి పిలవలేదూ? )

**Kedar:** That's right. So he has. This is the third or fourth sunday this year he has asked us to eat at his place. He seems to keep open house on Sundays.
(అవును నిజమే. అతను పిలిచాడు. ఈ సంవత్సరంలో ఇది మూడో ఆదివారమో, నాలుగో ఆదివారమో అతను మనల్ని భోజనానికి పిలవడం. అతనెప్పుడూ ఆదివారాలు ఎవరో ఒకరిని పిలిచేలా ఉంది)

**Badari:** That's correct. You remember what happened last time. He kept us too long after dinner. There was no bus at that hour. No auto was in sight. So we had to foot our way back.
(అవును. నీకు పోయినసారేమయిందో గుర్తుంది కదా? భోజనం అయిన తర్వాత చాలాసేపు కూర్చోబెట్టాడు. ఆ time కు bus లేమీలేవు. ఎక్కడా auto కనిపించలేదు. మనం వెనక్కు నడిచి రావలసి వచ్చింది)

**Kedar:** Of course I remember. But that was a good dinner that he gave us that day. What if we had to walk back? That dinner was worth the walk.
(నాకు గుర్తుండకేం? కాని ఆరోజు అక్కడి భోజనం చాలా బాగుంది. నడిస్తే ఏమయిందిలే? ఆ భోజనంతో చూసుకుంటే నడకేం పెద్ద శ్రమకాదు.)
(worth కు అర్థం, use ఇంతకుముందు చూశాం.)

**Badari:** The wonder is his wife is as hospitable as he.
(ఆశ్చర్యం ఏమిటంటే అతని భార్య ఆతిథ్యం ఇవ్వటంలో అతనితో సరిసమానం.)

**Kedar:** In that respect they are cut out for each other.
(ఆ విషయంలో వాళ్లు ఒకరికొకరు సరిగ్గా సరిపోతారు)

**Badari:** So they are. The way they serve us makes us feel at home.

**Kedar:** I think I hear him calling. Shall I tell him we are starting?
(అతనే phone చేస్తున్నాడనుకుంటా/ అతని phone అనుకుంటా వినిపిస్తోంది. బయలు దేరుతున్నామని చెప్పనా? )

**Badari:** Do. (చెప్పు)

Here are some more phrasal verbs we hear frequently in daily conversation. Like the phrasal verbs we have seen in the earlier lessons, they can make your conversation very effective.

Now let's study them.

**Look at the following sentences from the conversation between Badari and Kedar.**

**1)** He seems to keep open house on Sundays
**2)** We had to foot our way back home
**3)** In that respect they are cut out for each other
**4)** ... They make us feel at home
**5)** That dinner was worth it

వీటిని గురించి చర్చించేముందు, మనం మరికొన్ని మాటల అర్థం, use తెలుసుకుందాం.

He asked us to lunch today:
అతడు ఇవాళ మనల్ని lunchకు పిలిచాడు/ ఆహ్వానించాడు.

మామూలుగా ఆహ్వానించటం అంటే invite అని మనకు తెలుసు. Conversational గా అయితే ఇంకా simple గా invite బదులు ask వాడటం చాలా సాధారణం.

He has invited me to dinner =
He has asked me to dinner =
నన్ను భోజనానికి పిలిచాడు/ ఆహ్వానించాడు (తెలుగులో కూడా వ్యావహారికంగా ఆహ్వానించాడు అనడం కంటే పిలిచాడు అనడం ఎక్కువ కదా? )

No auto was in sight
ఎక్కడా Auto కనిపించలేదు.
(in sight = దృష్టిలో/ కనిపిస్తూ)
ఎక్కువగా not తో కనపడలేదు అనేందుకే వాడతాం.
Not a policeman was in sight.
ఒక్క police man కూడా కనిపించలేదు.
ఇలాంటివన్నీ బాగా practice చేయండి.

**Now let's look at the following.**

**1) He seems to keep open house =**
అతను ఎప్పుడూ అతిథులను పిలిచేట్లున్నాడు. (ఆతిథ్యం ఇవ్వటానికి అతనెప్పుడూ సిద్ధంగా కనపడతాడు).

ఇక్కడి phrasal verb: to keep open house =
అతిథులకెప్పుడూ ఇల్లు తెరిచే ఉండటం/ ఆతిథ్యం ఇవ్వటానికి ఎప్పుడూ సిద్ధమే.

**a)** Come Sunday, they keep open house =
ఆదివారం వస్తేసరి, వాళ్లింట్లో అతిథులుండాల్సిందే.

**b)** We keep open house. You can drop in at any time
అతిథులకెప్పుడూ మా ఇల్లు తెరిచే ఉంటుంది. నువ్వెప్పుడనుకుంటే అప్పుడు రావచ్చు

They keep open house on sundays. You are always sure to see there some guest or the other
ఆదివారాలు వాళ్లింట్లో ఆతిథ్యం ఎప్పుడూ ఉంటుంది. ఎవరో ఒక అతిథి అక్కడ మనకు కనపడటం తథ్యం.

**2) We had to foot our way back home =**
మనం ఇంటికి నడిచి రావాల్సి వచ్చింది.
foot one's way = నడవటం/ walk.

**a)** As his vehicle broke down, he left it there and footed his way to office =
వాహనం చెడిపోవటంతో, అతను దాన్నక్కడ వదిలి, office కు నడిచి వెళ్లాడు.

**b)** Foot your way as much as possible and you will be healthy =
వీలయినంతవరకు నడిస్తే మన ఆరోగ్యం బాగుంటుంది.

(you అంటే నువ్వు, మీరు, నీకు, మీకు అనే అర్థాలు మాత్రమే కాకుండా, general గా ఎవరైనా, ఎవరికైనా అనే అర్థంతోనూ వాడతారు.)

Foot your way as much as possible అనే sentence లో 'నువ్వు/ మీరు' ఎంతదూరం నడిస్తే అనే కాకుండా, ఎవరైనా/ మనం, ఎంతదూరం నడిస్తే అంత ఆరోగ్యం బాగుంటుంది అని అర్థం. ఇంకా చూడండి:

You cannot extract oil from sand =
ఇసకలోంచి నూనె తీయలేం. ఇక్కడ you అంటే నువ్వు/ మీరు అనే అర్థానికి పరిమితం కాదు.

**c)** I can't foot my walk for such a long distance = అంత దూరం నేను నడవలేను.

**3) In that respect they are cut out for each other.** ఆ విషయంలో ఒకరికొకరు సరిపోతారు.

be cut out for (something)/ be cut out to be (something) - ఇక్కడ be అంటే ఏ 'be' form (am, is, are, was, were etc) వాడవచ్చు.

ఇది చాలా మంచి expression. అర్థం- ఒకరు ఒక పని చేయటానికి తగిన సామర్థ్యం, గుణగణాలు కలిగి ఉండటం.

**a)** Are you sure you are cut out for the army?
సైన్యంలో చేరడానికి తగిన సామర్థ్యం నీకుందని నమ్ముతున్నావా?

**b)** He is cut out to be a teacher =
His teaching is excellent = teacher కు తగిన సామర్థ్యం అతనిలో ఉంది. అతని బోధన చాలా బాగుంటుంది.

**c)** She is cut out to be a doctor. No doubt about it =
ఆమె Doctor అవటానికే పుట్టినట్టుందా అనిపిస్తుంది. Doctor అవటానికి సరిగ్గా సరిపోతుంది. నిస్సందేహం.

**4) They make us feel at home =**
మన ఇంట్లోనే ఉన్నామనే భావన కలిగిస్తారు వాళ్లు. (అంటే అతిథుల్ని అంత బాగా చూసుకుంటారన్నమాట)

To make your guest feel at home=
అతిథిని ఏ విధంగానూ మొహమాటపడకుండా చూడటం

**a)** He treats his guests well. He makes them feel absolutely at home =
అతిథులను ఆయన బాగా చూస్తాడు. వాళ్లలో సొంత ఇంట్లోనే ఉన్న భావన కలిగిస్తాడు

**b)** Don't be hesitant. Feel at home. Ask for whatever you want=
మొహమాటపడొద్దు. మీ ఇల్లే అనుకోండి. ఏం కావాలో అడిగి తీసుకోండి. (అతిథితో ఇలా అంటుంటాం)

**5) That dinner was worth it =**
ఆ dinner తో పోలిస్తే మనం నడవాల్సి రావటం పెద్ద బాధేమీకాదు.

| EXERCISE 1 | ANSWER |
|---|---|
| **Syamala:** ఏంటివాళ చీర కట్టుకున్నావు? | **Syamala:** Why have you put on a sari? |
| **Nirmala:** మా classmate birthday సందర్భంగా విందు ఇస్తోంది. | **Nirmala:** Our classmate is giving us a treat on the occasion of her birthday. |
| **Syamala:** అంతసేపూ చీరతో ఉండటం కష్టం కాదూ? | **Syamala:** Can you be in the sari all the time? |
| **Nirmala:** నాకు అవంటే ఇష్టం. చీరతో ఎంతసేపయినా ఉండగలను. | **Nirmala:** I like saris. So I can put with it for any time. |
| **Syamala:** అక్కడే మనిద్దరికీ తేడా. నాకు చీరంటే అంతిష్టంలేదు. | **Syamala:** That's where we don't see eye to eye with each other. I don't like saris much. |
| **Nirmala:** ఏవైనా ప్రత్యేక సందర్భాలుంటేనే నాకు చీర ఇష్టం. | **Nirmala:** I am for saris only for special occasions. |
| **Syamala:** అవునూ, పుట్టినరోజు నిన్నన్నావు? | **Syamala:** But didn't you say the birthday was yesterday? |
| **Nirmala:** నిన్ననే, కాని dinner మాత్రం ఇవాళ్టికి వాయిదావేసింది. | **Nirmala:** Yes, it was, but she put off the dinner till today. |
| **Syamala:** Wish you a good time. | **Syamala:** Wish you a good time. |

| EXERCISE 2 | ANSWER |
|---|---|
| **Ganesh:** Hi Karthik, ఏంటి అంత నీరసంగా అలసిపోయినట్లు కనిపిస్తున్నావు? | **Ganesh:** Hi Karthik, you look so tired and weak, why? |
| **Karthik:** నా bike మధ్యలో చెడిపోయింది. దాన్ని నడిపించుకుంటూ వచ్చి mechanic కు ఇచ్చి అక్కడినుంచి రెండు కిలోమీటర్ల దూరం నడిచి వచ్చాను. | **Karthik:** My bike broke down on the way. I walked it up to my mechanic, gave it to him for repair and footed my way for 2 kms here. |
| **Ganesh:** నాకు phone చేసుంటే నేను వచ్చి lift ఇచ్చేవాడిని కదా? | **Ganesh:** If you had phone me, I would have given you a lift. |
| **Karthik:** నువ్వు సహాయం చేసేవాడివేనని నాకు తెలుసు. అందువల్లే నా rooms కు వెళ్లకుండా నీ rooms కు వచ్చాను. ఈ రాత్రికి నేనిక్కడ ఉండొచ్చా? | **Karthik:** I know you are the helping type. That's why I came straight to your rooms without going to my place. can I stay here for the night? |
| **Ganesh:** అంతకన్నానా? ఇది నీ ఇల్లే అనుకో. | **Ganesh:** By all means/ you are welcome. Feel absolutely at home. |
| **Karthik:** Thank you. ఏంటి maths చేస్తున్నావా? అన్నట్టు, మీ కొత్త maths lecturer ఎలా ఉన్నాడు? | **Karthik:** Thank you. You seem to be doing maths. By the way how is your new maths lecturer? |
| **Ganesh:** చాలా గొప్ప lecturer. అందుకోసమే పుట్టాడా అన్నట్లు maths lecturer గా సరిగ్గా సరిపోతాడు. | **Ganesh:** Excellent. He is cut out for the job. |
| **Karthik:** అయితే సంతోషం. | **Karthik:** Happy to hear it. |

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Akhila:** How is your mother? Is she improving?
(మీ అమ్మెలా ఉంది? కోలుకుంటోందా? )

**Nikhila:** She is, but she is too weak to move about.
(కోలుకుంటోంది కాని కదల్లేనంత నీరసంగా/ బలహీనంగా ఉంది)

**Akhila:** She is taking too many drugs perhaps. May be that's why she is so weak.
(మందులు మరీ ఎక్కువ తీసుకుంటోందేమో. అందువల్ల అంత నీరసంగా ఉండొచ్చు)

**Nikhila:** On the contrary she avoids even the medicines she has to take. She hates them too much to take them regularly. Hence her slow recovery.
(అదేం లేదు. అందుకామె వ్యతిరేకం. తీసుకోవాల్సిన మందులే సరిగా తీసుకోదు. మందులను క్రమబద్ధంగా తీసుకోవాలంటే ఎంతో ద్వేషం)




**Akhila:** Who is treating her?
(ఎవరు/ ఏ doctor చూస్తున్నారు? )


M. SURESAN

**Nikhila:** We put her in Readycure Hospital.
(Readycure Hospital లో చేర్చాం)

**Akhila:** If only she takes medicines properly ...
(మందులు సరిగా తీసుకోవటం అంటూ ఉంటే ...)

**Nikhila:** Oh, my! It's already 7.30. I have stayed here too long. I'm afraid I'll be late for the hospital. I must hurry. Bye.
(అమ్మో! అప్పుడే 7.30 అయిపోయింది. మరీ ఎక్కువసేపున్నానిక్కడ. ఆసుపత్రికి ఆలస్యమైపోతోంది. నేను త్వరగా వెళ్లాలి. Bye.)

◆ ◆ ◆

Too ఉపయోగం తెలుసుకుందాం ఈసారి.

**1)** Too మనం సామాన్యంగా 'also' (కూడా) అనే అర్థంతో వాడతాం కదా?

**Ramya:** Has she come? (ఆమె వచ్చిందా? )
**Priya:** She has. (ఆ. వచ్చింది.)
**Ramya:** Has her husband come too?
(ఆమె భర్త కూడా వచ్చాడా? )
**Priya:** Yes. He has come too.
(అవును. ఆయన కూడా వచ్చాడు)

Spoken English లో 'కూడా' అనే అర్థంతో also చాలా అరుదుగా వాడతారు. ఎక్కువగా 'too' వాడతారు. 'Too' ఎప్పుడూ verb తర్వాత వాడటం better. She too has come కన్నా She has come too, better. ఇంతకుముందు చాలాసార్లు చూశాం - Not తో also అసలురాదు.

**2)** Too కు ఇంకో ఉపయోగం చూద్దాం - ఈ lesson లో వాడిన విధంగా-

Too అంటే మరీ/ అతి అని తెలుగులో అర్థం చెప్పుకోవచ్చు




**Varun:** It's OK, but it is too big.
(బాగానే ఉంది. కానీ అందులో ఉండేవాళ్ల సంఖ్యేమో తక్కువ- ఇల్లేమో ఇంకా ఎక్కువ మందికి సరిపోయేంత పెద్దది- అందువల్ల సౌకర్యం కంటే ఇబ్బందే ఎక్కువ అనే అర్థంతో.)

**3)** Too అంటే మామూలుగా సాధ్యమయ్యే దానికన్నా ఎక్కువ అనే అర్థం కూడా ఉంది.

**a)** He is too clever for a boy his age =
అతడి వయస్సు పిల్లలకంటే అతడు చాలా తెలివిగలవాడు.
(అతడికి వయసుకు మించిన తెలివితేటలున్నాయి.)

**b)** She is too tall for a girl her age =
ఆ వయసు అమ్మాయిల కంటే మరీ పొడుగుండా అమ్మాయి.

**c)** She is too red for an Asian =
మామూలుగా ఆసియా వాసులు ఉండనంత ఎర్రగా ఉందామె.

**4)** Too ను కొద్దిగా అర్థం తేడాతో ఇలా కూడా వాడతాం:

**a)** She is too young for marriage =
మామూలు పెళ్లి వయసుకు ఆమె వయసు మరీ తక్కువ.
పెళ్లిడుకు చాలా తక్కువ = She is too young to be married/ to get married.

**Now look at the following sentences from the conversation between Akhila and Nikhila at the beginning of the lesson:**

1) She is too weak to move about.
2) She is taking too many drugs perhaps.
3) She hates them too much to take them regularly.
4) But isn't it too expensive and too far off a place?
5) Mom is too impatient.
6) She feels it too long.
7) I've stayed here too long.

◆ ◆ ◆ ◆ ◆

**1) She is too weak to move about =**
ఆమె కదలలేనంత నీరసంగా ఉంది =
She is so weak that she cannot move about.

**2) She is taking too many drugs perhaps =**
బహుశా మందులు మరీ ఎక్కువ (చెడు జరిగేంత) తీసుకుంటోందేమో
ఈ అర్థంతో ఇలా కూడా too వాడతాం.

**a)** You are a minute too late =
నువ్వు ఒక్క నిమిషం ఆలస్యమయ్యావు. (ఒక్క నిమిషం ముందువచ్చుంటే నీపని అయ్యేది)

**b)** This passenger is one too many for the bus. Bus is full. It can't take even one more.
(ఈ ఒక్క ప్రయాణికుడే ఎక్కువ. బస్సంతా నిండిపోయింది. ఇంక ఒక్కరికి కూడా చోటులేదు)

# She is too weak to move ..

**Akhila:** But isn't it too expensive and too far off a place?
(కాని, అది మరీ ఖరీదు, దూరం కాదా? )

**Nikhila:** It is. But mom's cousin is a doctor there. So we admitted her there.
(నిజమే. కాని మా అమ్మ cousin అక్కడ doctor. అందుకనక్కడ చేర్చాం)

**Akhila:** You must be spending a lot on transport to and fro. You must have spent quite a lot already.
(తిరగటానికే చాలా ఖర్చు పెట్టుండాలి మీరు. ఇప్పటికే చాలా ఖర్చయి ఉండాలి.)

**Nikhila:** You can say that again the tests they have prescribed as alone have cost us a lot. The medicines are expensive too.
(ఆమాట నువ్వు మళ్లీ మళ్లీ అనొచ్చు వాళ్లు చేయించిన పరీక్షలకే చాలా ఖర్చయ్యింది. మందులు కూడా చాలా ఖరీదే)

**Akhila:** These days medicare has become too costly. Only the rich can afford it. The Poor have to make do with substandard treatment.
(ఈ రోజుల్లో వైద్యం చాలా ఖరీదైపోయింది. ఉన్నవాళ్లకే అది అందుబాటులో ఉంది. లేనివాళ్లు తక్కువ రకం వైద్యంతో సరిపెట్టుకోవాల్సిందే.)

make do = సర్దుకోవటం/ సరిపెట్టుకోవటం

**Nikhila:** Mom is too impatient. She wants to get out as soon as possible. The doctors however insist that she stay there for at least four more days. She feels it too long.
(అమ్మ మరీ అసహనంగా ఉంది. వీలయినంత త్వరగా ఆసుపత్రి నుంచి బయటపడాలనుకుంటోంది. కానీ doctors మాత్రం కనీసం ఇంకా నాలుగు రోజులుండాలంటున్నారు. ఆమెకు మాత్రం అది మరీ ఎక్కువకాలం అనిపిస్తోంది)

**Look at the following.**

**a)** He is tall = అతడు పొడుగు - మంచిదే.

**b)** He is very tall = అతడు చాలా పొడుగు - మంచిదే.

**c)** He is too tall = అతడు మరీ పొడుగు - అంటే ఇక్కడ పొడుగు వల్ల ఏదో ఇబ్బంది ఉండవచ్చు
(మరీ పొడుగవటం వల్ల, నిటారుగా నిలుచోలేకపోవటమో, ఏ గదిలోకైనా వెళ్లేటప్పుడు ద్వారం తగలటమో, మరీ వంగి ప్రవేశించాల్సి రావటమో లాంటి ఇబ్బందులు ఉండొచ్చు- లేకుంటే అతడి ఎత్తుకు తగిన భార్య దొరక్కపోవచ్చు)

Too అంటే అతి అనే అర్థంతో ఎక్కువగా వాడటం వల్ల, దాని ప్రయోజనాలు మంచివిగా ఉండకపోవచ్చు

**a)** He drives too fast =
అతడు మరీ వేగంగా drive చేస్తాడు. అందువల్ల ప్రమాదం సంభవించవచ్చు

**b)** She talks too much.
అవసరమైన దానికంటే ఎక్కువ మాట్లాడుతుంది.

**c)** It is too costly =
అది మరీ ఖరీదు. (అందువల్ల కొనకపోవచ్చు) దీన్ని కిందివాటితో పోల్చండి.

**i)** It is costly = అది ఖరీదు (కొనొచ్చు)
**ii)** It is very costly =
అది బాగా ఖరీదు (అయినప్పటికీ కొనొచ్చు)
**iii)** It is too costly = అది అతి/ మరీ ఖరీదు
(నేను కొనను - కొనే అవకాశం లేకపోవచ్చు)

**d) Sarat:** You liked the suitcase. Why didn't you buy it?
(ఆ suitcase అంటే ఇష్టపడ్డావు. మరెందుకు కొనలేదు? )
**Bharat:** Oh, it's too heavy.
అది మరీ బరువుగా ఉంది. (నేను మోయలేనంత బరువు. అందువల్ల కొనలేదు.)

**e) Kiran:** How do you find your new home?
(మీరు కొత్తగా చేరిన ఇల్లెలా ఉంది? )

**b)** He is too fat to walk fast-
ఇటువంటి sentences లో వ్యతిరేకార్థం వస్తుంది. ఈ వాక్యానికి అర్థం=
అతను త్వరగా నడవలేనంత లావు.

**c)** She is too young to understand all this =
ఇవి అర్థం చేసుకోలేనంత చిన్న పిల్ల ఆ అమ్మాయి.

**d)** In the past children were married off when they were too young to understand what marriage was =
గతంలో పెళ్లంటే ఏమిటో అర్థంకాని చిన్న వయసులోనే పిల్లలకు పెళ్లిళ్లు చేసేవాళ్లు.

**5)** ఒక్కోసారి too ను positive meaning తో కింది sentences లో లాగా వాడతాం.

**a) Pavan:** Are you ready for this job?
ఈ ఉద్యోగానికి నువ్వు సిద్ధమేనా?
**Vinod:** I shall be only too glad to accept it.
దాన్ని స్వీకరించటం నాకు చాలా సంతోషం/ సంతోషంగా

**b)** He will be only too pleased to assist you=
నీకు సహాయపడటం అతడికి చాలా సంతోషం.

**c)** She'll be too ready to leave the place =
ఇక్కడినుంచి సంతోషంగా వెళ్లిపోతుంది/ వెళ్లటానికి ఎప్పుడూ సిద్ధమే.

**6)** Too ను ఎక్కువగా కింది అర్థంతో వాడతారు.

**a)** It is too much for him =
అది అతడు చేయలేనంత కష్టం/ భరించలేనంత శ్రమ/ బాధ.

**b)** Working for such long hours is too much for the boys =
అన్ని గంటలు పనిచేయటం వాళ్లు చేయలేని/ భరించలేని శ్రమ- (పిల్లలు కాబట్టి.)

**c)** This question is too much for the little girl.
ఆ చిన్నపిల్లకు జవాబు చెప్పలేనంత కష్టమైన ప్రశ్న ఇది.

**3) She hates them too much to take them regularly =**
ఆమెకు ఆ మందులను క్రమంతప్పకుండా వేసుకోవడమంటే అనిష్టం./ ఆ అనిష్టంవల్ల అవసరమైనా ఆ మందులు తీసుకోదు. ఇది sentence no.1 లాగానే ఉంది చూడండి.

**4) But isn't it too expensive and too far off a place? =**
అది మనం భరించలేనంత ఖరీదైందీ, వెళ్లలేనంత దూరమూ కాదా?
It's too expensive =
మరీ ఖరీదెక్కువ (నేను భరించలేను)
It's too far off (మరీ దూరం ఎక్కువ, నేను వెళ్లలేను)

**5) Mom is too impatient =**
మా అమ్మ మరీ అసహనంగా ఉంది. (అక్కడ ఉండలేకపోతోంది)

**6) She feels it too long =**
మరీ ఎక్కువకాలమని అనుకుంటోంది. (ఉండలేకపోయేంత)

**7) I have stayed here too long =**
అవతల పనుండి కూడా చాలా ఎక్కువసేపున్నా- ఉండకూడనంత సేపున్నా.

**కింది ఉపయోగాలు కూడా చూడండి:**

**a)** The box is too heavy for me =
the box is so heavy that I cannot lift it =
నేను ఎత్తలేనంత బరువుగా ఉందా పెట్టె.

**b)** The TV is too costly for me =
The TV is so costly that I can't buy it.
నేను కొనలేనంత ఖరీదయిందా టీవీ.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# Swarna is telling ...


M. SURESAN

**Swarna:** Hi Rajitha, get dressed and get ready to go out.
(బట్టలు మార్చుకో, బయటికెళ్లటానికి తయారవ్వు)

**Kamala:** What is Swarna saying, Rajitha?
(స్వర్ణ ఏమంటోందీ?)

**Rajitha:** She is telling me to get dressed and get ready to go.
(బట్టలు మార్చుకుని బయటకెళ్లటానికి తయారవమని స్వర్ణ నాతో చెప్తోంది)

**Swarna:** Go to the market and get some vegetables. There aren't any left.
(Market కు వెళ్ళి కూరగాయలు తీసుకురా. ఇంట్లో ఏం లేవు.)

**Kamala:** Don't you hear, Rajitha? Swarna is telling you to go to the market and get vegetables
(వినిపించలేదా, రజితా? Market కు వెళ్ళి కూరలు తెమ్మని చెప్తోంది కదా?)

**Rajitha:** What do you mean? (ఏంటంటున్నావ్?)

**Kamala:** You have heard what Swarna has said. So do what she says.
(విన్నావు కదా స్వర్ణ చెప్పింది. తను చెప్పినట్లు చెయ్యి.)

**Rajitha:** Are you both telling me to go to the market and get vegetables? Kamala, are you telling me to do what she says?
(ఇద్దరూ నన్ను market కెళ్లి కూరలు తెమ్మంటారా? కమలా, తనేం చేయమంటుందో అది చేయమంటావా?)

**Swarna:** And cook too. (వంట కూడా చెయ్యి)

**Kamala:** Don't stand there. Get going. Swarna has told you to cook too.
(అలా నిల్చోకు. పని కానీ. స్వర్ణ వంట కూడా చెయ్యమంటోంది.)

Get going= బయల్దేరు/ పనికానీ, etc.

**Swarna:** Why are you still here? Kamala is telling you not to stand there but get going.
(ఏంటింకా ఇక్కడున్నావ్? Kamala చెప్పింది కదా, అలా నిల్చోవద్దనీ, బయల్దేరమనీ.)

**Rajitha:** Stop it. Don't think I am your servant. Don't order me about, you stupids.
(ఆపండి. నేను మీ servant అనుకోకండి. నాకు ఆజ్ఞలివ్వకండి, మూర్ఖుల్లారా?)

**Swarna:** Look, Kamala, she is telling us to stop it and not to think she is our servant. She is telling us further not to order her about.
(కమలా చూడూ, ఇదంతా ఆపమని, తనను servant గా అనుకోవద్దనీ, ఆజ్ఞలు జారీ చేయొద్దనీ అంటోంది.)

**Kamala:** Come now, Rajitha. Don't be angry. We have just been joking. Please don't think we are serious.
(Rajitha, కోప్పడకు. ఊరికనే joke చేస్తున్నాం. మేం serious గా అన్నామని అనుకోకు. ఊరికే నిన్నాటపట్టించామంతే)

**Rajitha:** You've carried the joke too far.
(మీ joke అతిగా ఉంది)

**Swarna:** Come, come, don't be angry. Take a joke. Enjoy it, girl.
(కోప్పడకూ. Joke గా తీసుకో. నువ్వు కూడా సంతోషపడు.)

**Kamala:** You still look angry. Swarna has told you to take joke and not to be angry but enjoy it. Come laugh it off.
(ఇంకా కోపంగా కనిపిస్తున్నావు. స్వర్ణ చెప్పింది కదా అంతా joke గా తీసుకోమనీ, కోప్పడొద్దనీ, నువ్వు కూడా enjoy చెయ్యమని. నవ్వేసి ఊరుకో)

**Rajitha:** OK. I excuse you. I will have my turn too.
(అలాగే. మిమ్మల్ని క్షమిస్తున్నాను. నాకూ వస్తుంది అవకాశం. అప్పుడు చెప్తా.)

☺ ☺ ☺ ☺ ☺

**Compare the following pair of sentences from the conversation above:**

a) **Swarna:** Rajitha, get dressed and get ready to start.
(బట్టలు మార్చుకో, బయటికెళ్లటానికి తయారవ్వు)

b) **Rajitha:** She (Swarna) is telling me to get dressed and get ready to start.
(బట్టలు మార్చుకుని బయటకెళ్లటానికి తయారవమని స్వర్ణ నాతో చెప్తోంది)

sentence (a) లో మనం చూసేది: స్వర్ణ, రజితను ఉద్దేశించి నేరు (direct) గా, ముఖతః రజితతో చెప్పే విషయం.

sentence (b) లో మనం చూసేది: రజిత, స్వర్ణ తనతో అన్నమాటలను, తన మాటల్లో కమలకు చెప్పటం/ report చేయటం.

sentence (a) direct గా స్వర్ణ రజితతో అన్న మాటలు. కాబట్టి అది Direct speech.

sentence (b) రజిత, తన మాటల్లో స్వర్ణ మాటలను కమలకు report చేయటం కాబట్టి అది Reported (Indirect) speech.

(మనల్నిదంతా ఆపమనీ, తను మన servant అను కోవద్దనీ, ఇష్టం వచ్చినట్లు ఆజ్ఞలివ్వద్దనీ రజిత అంటోంది Indirect speech)

5 a) **Swarna to Rajitha:** Don't be angry. Take a joke. enjoy it, girl
(కోప్పడకు. Joke ను ఆనందించు- Direct speech)

b) **Kamala:** Swarna has told you not to be angry, to take a joke and enjoy it
(Swarna చెప్పింది కదా కోప్పడొద్దనీ, joke ను ఆనందించమనీ- Reported speech)

పై sentences లో 1 (a) 2 (a), 2 (b) , 3 (a) 4 (a), 5 (a) - ఇవన్నీ direct speech లో ఉన్నాయి. Sentences 1 (b), 3 (b), 4 (b) and 5 (b) - ఇవన్నీ reported (Indirect) speech లో ఉన్నాయి.

3 a) **Kamala (to Rajitha):** Don't stand there. Get going (Direct speech- నిల్చోకలా, బయల్దేరు) ఆజ్ఞలా ఉంది కాబట్టి imperative sentence.

3 b) చూడండి - ఇది Kamala, స్వర్ణ మాటల్ని reported speech లో చెప్పటం: Kamala is telling you not to stand there but get going. ఇక్కడ కూడా Kamala, స్వర్ణ మాటలముందు, to వాడింది - to stand there... అయితే ఇక్కడ direct speech లో Don't (do not) అని not ఉంది కాబట్టి, reported speech లో, not to అని వస్తుంది.

a) **Suseel:** Make good use of your time, Sumant. (Sumant, నీ సమయాన్ని సద్వినియోగం చేసుకో Direct speech కదా.)

Indirect, Suseel is telling Sumant to make good use of his time.

**Look at the following too:**

1 **Swarna (to Rajitha):** Go to the market and get some vegetables
(Market కెళ్లి కూరలు పట్రా- Direct speech కదా?)

**Kamala:** Swarna is telling you to go to the market and get some vegetables
(Market కెళ్లి కూరలు తెమ్మని స్వర్ణ అంటోంది నీతో)
(ఇది Kamala report చేస్తోంది కాబట్టి reported speech)

2. a) **Kamala (to Rajitha)** ... Do what she (Swarna) Says.
(స్వర్ణ చెప్పింది చెయ్యి- Direct speech కదా?)

b) **Rajitha (To Swarna and Kamala)**
Are you both telling me to go to market and get vegetables? Kamala, Are you telling me to do what she says? (Direct speech)
(నన్ను Market కెళ్లి కూరలు తెమ్మంటున్నారా? కమలా, స్వర్ణ చెప్పింది చేయమంటావా నన్ను?)

3 a) **Kamala (To Rajitha):** Don't stand there. Get going. (Direct speech) అలా నిల్చోకు, బయల్దేరు)
Swarna is telling you to cook too
(Reported speech - స్వర్ణ నిన్ను వంట కూడా చేయమంటోంది)

b) **Swarna:** Kamala is telling you not to stand there but get going.
(అలా నిల్చోవద్దనీ, బయల్దేరమని కమల చెప్తోంది నీతో - Reported speech)

4 a) **Rajitha (to Swarna & Kamala):** Stop it. Don't think I am your servant. Don't order me about (Direct speech)
(ఆపండి, నేను మీ servant అనుకోకండి. మీ ఇష్టం వచ్చినట్లు ఆజ్ఞలు ఇవ్వకండి - Direct speech)

b) **Swarna:** She is telling us to stop it and not to think she is our servant. She is further telling us not to order her about. (Indirect speech)

1) **Swarna:** Hi Rajitha, get dressed and get ready to go out.
ఇది Direct speech లో ఉంది కదా. 'Get dressed and get ready to go out - ఈ మాటలు Imperative sentence - అంటే ఒకరిని ఆజ్ఞాపించే/ అభ్యర్థించే (request)/ ఒక పని చేయమని అడిగే sentence ను imperative sentence అంటాం. Swarna, రజితను బట్టలు మార్చుకో, బయటికెళ్లటానికి సిద్ధంగా ఉండూ అని అడుగుతోంది/ దాదాపు ఆజ్ఞాపిస్తోంది. కాబట్టి 'Get dressed and go out', imperative sentence అవుతుంది. Imperative sentence ను direct నుంచి reported (indirect) కు మార్చాలంటే, ఆ imperative ముందు, to చేర్చటమే. అంటే,

**Swarna:** Hi Rajitha, get dressed and get ready to go out -

దీనికి reported speech:
Swarna is telling/ asking (tells/ asks) Rajitha to get dressed and get ready to go out. గమనించారు కదా get dressed and get ready to go out ముందు, to పెట్టాం. అంతేకదా. So, imperative sentence indirect speech కి మార్చాలంటే, దానిముందు 'to' పెట్టేస్తాం.

ఇంతకుముందు తెలుసుకున్నాం - say తర్వాత infinitive ( to go, to come, to sing లాంటి మాటలు) రాదని. Tell/ ask పక్కన infinitive వస్తుంది. అందుకని reported speech లో tell (somebody)/ Ask (somebody) + Infinitive వస్తుంది, Imperative ను Reported speech కు మార్చి నపుడు.

**Look at the other pairs of sentences from the conversation.**

1 a) **Swarna (to Rajitha):** Go to the market and get some vegetables (market కెళ్లి కూరలు తీసుకురా - ఇది Imperative sentence)
దీనికి Reported speech, దీనికిందనే కమల మాటల్లో 1 (b) చూడండి.
Swarna is telling you to go to the market and get some vegetables
చూశారు కదా, Kamala, Swarna మాటల్ని reported speech లో చెప్పటం- ఆ మాటల ముందు 'to' వచ్చేసింది- She is telling you to go to the market...

b) **Suseel:** Don't waste your time, Sumant (Direct speech - Imperative - Don't = do not తో ఉంది)
Reported speech: Suseel is telling sumant not to waste his time.

4 a) **Rajitha (To Swarna and Kamala):** Stop it. Don't think I am your servant.
Don't order me about. (Direct speech-imperative with don't = do not)

b) ఇవే మాటలను Swarna reported speech లో Kamala కు: She is telling us to stop it, not to think she is our servant and not to order her about. (Reported speech beginning with 'not to', because of don't in Direct speech)

చూశారు కదా: Orders, requests, asking తెలిపే imperative sentence, direct speech లో ఉంటే, దాన్ని report చేసేటప్పుడు, to తో ప్రారంభిస్తాం, don't ఉంటే not to తో ప్రారంభిస్తాం.

a) **Kamal:** Krishna have something to eat. Direct speech - imperative.
Kamal is asking Krishna to have something to eat - Reported speech

b) **Teacher:** Don't read such books. (Direct speech- Begins with don't)
Teacher is telling (the students) not to read such books.

ఈ పై examples లో ఏ సంభాషణలు ఎప్పుడు జరుగుతున్నాయో correct గా తెలియటంలేదు కాబట్టి మనం Indirect (reported) speech లో ఏ tense అయినా వాడవచ్చు

పై రెండు examples లో, Reported speech లో, is asking/ is telling బదులు has asked/ asked/ has told/ told కూడా వాడవచ్చు

That is how we change imperative into indirect speech.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# She requested him to ..




M. SURESAN

**I. Naveen:** Leave your book with me. You take my book and return it tomorrow.
(నీ పుస్తకాన్నిక్కడ ఉంచు. నువ్వు నా పుస్తకాన్ని తీసుకుని రేపు తిరిగివ్వు)

**Ramani:** Please let me have both the books.
(రెండింటినీ తీసుకోనివ్వు)

**Naveen:** OK. Take both of them but make sure that you return them the day after.
(సరే, రెండూ తీసుకో, అయితే ఎల్లుండికి కచ్చితంగా తిరిగిచ్చేయ్)

**Ramani:** Please allow me to keep them for at least three days.
(కనీసం మూడు రోజులన్నా ఉంచుకోనివ్వు)

**Teacher:** Stop talking, both of you.
(మీరిద్దరూ మాట్లాడకండి)

**Naveen and Ramani:** Don't be angry, sir. Excuse us this once.
(కోప్పడకుండా మమ్మల్ని ఈ ఒక్కసారికి క్షమించండి సార్)

**Teacher:** Concentrate on the lesson. Keep your mouths shut or get out of the class.
(పాఠం మీద దృష్టి పెట్టండి. నోరు మూసుకోండి లేదా బయటికెళ్లిపోండి)

**Naveen:** Please, don't be cross, sir.
(దయచేసి కోప్పడకండి సార్)

**Teacher:** Be silent, then (అయితే నిశ్శబ్దంగా ఉండండి)

**Naveen:** OK. Sir. (అలాగే సార్)

**II. Mahesh:** Why was the teacher angry with Naveen and Ramani?
(Naveen, Ramani మీద teacher కు ఎందుకు కోపం వచ్చింది?)

**Mahesh:** Then both of them requested the teacher not to be angry and to excuse them that once.
(వాళ్ళప్పుడు కోప్పడవద్దని, ఈసారికి క్షమించమని teacher ను అభ్యర్థించారు)

**Rakesh:** The teacher was still angry. He ordered them to concentrate on the lesson, to keep their mouths shut or to get out.
(Teacher ఇంకా కోపంగా ఉన్నాడు, వాళ్లను lesson మీద దృష్టి పెట్టమనీ, నోరుమూసుకోమని లేదా బయటికెళ్ళమనీ అన్నాడు.)
Naveen then requested/ pleaded with the teacher again not to be cross.

**Observe: I) The conversation between Naveen and Ramani, and II) Mahesh and Rakesh reporting the conversation between Naveen and Ramani.**

మీరు గమనించే ఉంటారు- Part I లో నవీన్, రమణి సంభాషణను, Part II లో Mahesh, Rakesh reported (indirect) speech లో చెప్పుకోవటం.

ఇది కూడా గమనించండి. Part II లో, మహేష్ రాకేష్‌ను అడిగిన మొదటి ప్రశ్న: Why was the teacher angry with Naveen and Ramani? అంటే, ఇందులో was వల్ల మనకు తెలుస్తున్న విషయం: నవీన్, రమణిల సంభాషణ గతంలో జరిగిందని, ఆ విషయాన్నిప్పుడు Mahesh, Rakesh ప్రస్తావిస్తున్నారని.

ఇలా గతంలో జరిగిన సంభాషణను reported speech కు మార్చాలంటే, told, requested, ordered అని Past doing word తో ప్రారంభిస్తాం.

కిందటి lesson లో మనం 1st sample of direct speech and reported speech చూశాం. Direct and reported speech అనగానే మనకు గుర్తొచ్చేది, Quotations/ Inverted commas (" "), వాటి లోపల ఉన్న sentence భాగం, అందులో verb/ verbs quotations బయట ఉన్న verb లాంటివి. అయితే మనం ఇక్కడ గుర్తుంచుకోవాల్సింది, ఈ columns లో మనం చేస్తుంది Spoken English practice. అంటే English మాట్లాడటం. మాట్లాడేటప్పుడు quotations, అందులోభాగం, దాని బయటిభాగం లాంటివి ఉండవు కదా. Spoken English లో మనం గుర్తుంచుకోవాల్సిందల్లా, మొదటి వ్యక్తి రెండో వ్యక్తితో చెప్పే మాటలు direct speech. మొదటి వ్యక్తి చెప్పిన విషయాన్ని రెండో వ్యక్తి తన మాటల్లో ఇంకో వ్యక్తికి చెప్పటం/ report చేయటం, reported speech. Conversation/ Spoken English practice చేసేటప్పుడు ఈ విషయం గుర్తుంచుకోవాలి. Quotations, reported verb లాంటి వాటికోసం వెతకం. Reporting verb అంటే reported speech ప్రారంభించేముందు వాడే tell, ask, request, order, advise, hope లాంటి వాటిని సందర్భాన్ని బట్టి మనమే ఎంపిక చేసుకుంటాం. English మాట్లాడేటప్పుడు వాడేది reported speech కాబట్టి, మనం తెలుసుకోవాల్సిందల్లా ఒక వ్యక్తి అన్న విషయాన్ని ఇంకొకరికి స్పష్టంగా ఎలా వినిపించాలి అనేది మాత్రమే. ఇదేకదా, మనం కిందటి lesson లో Swarna, Rajitha and Kamala conversation లో చూసింది. అలాగే practice చేద్దాం. ఇక చదవండి.

**Rakesh:** They were talking. Naveen told Ramani to leave her book with him, and to take his book and return it the next day.
(వాళ్లు మాట్లాడుకుంటున్నారు. ఆమె పుస్తకాన్ని తనకిచ్చి, తన పుస్తకాన్ని తీసుకుని, మరుసటి రోజివ్వమని నవీన్ రమణితో అన్నాడు.)

**Mahesh:** I heard Ramani's words. She requested him to let her have both the books.
(రమణి మాటలు నేను విన్నాను. రెండు పుస్తకాలూ తీసుకెళ్లనివ్వమని అభ్యర్థించింది)

**Rakesh:** Naveen then told her to take both of them but to make sure she returned them the day after next.
(అప్పుడు రెండు పుస్తకాలూ తీస్కెళ్ళమనీ, కచ్చితంగా ఎల్లుండి (రెండ్రోజుల తర్వాత) తిరిగివ్వమనీ, Naveen రమణితో అన్నాడు.)

**Mahesh:** I was sitting next to Ramani. So I heard her. She requested him to allow her to keep them for at least three days.
(రమణి పక్కనే కూచున్నా. ఆమె చెప్పింది నేను విన్నా, కనీసం మూడు రోజులన్నా ఉంచుకోనివ్వమని రమణి అడిగింది.)

**Rakesh:** Then the teacher ordered them both to stop talking.
(Teacher వాళ్ళని మాట్లాడటం ఆపమని ఆజ్ఞాపించాడు.)

అలాకాకుండా కిందటి lesson లో లాగా ఎప్పుడు జరిగిన సంభాషణను అప్పుడే report చేస్తే tell/ ask/ request/ order/ wish లాంటి verbsను I Regular doing word/ II Regular doing word/ am+ing, is+ing, are+ing/ have+pp/ has+pp (past participle) form లో begin చేస్తాం.)

పైన నవీన్‌కూ రమణికీ గతంలో జరిగిన సంభాషణను మహేష్, రమేష్ reported speech లో చెప్పున్నారు. Direct speech నుంచి reported కు మార్చేటప్పుడు, సందర్భాన్ని బట్టి కింది మార్పులు కూడా చేస్తాం.

| DIRECT SPEECH | REPORTED SPEECH |
|---|---|
| I, You (నేను, నువ్వు) | He, She |
| We, You (మేము, మనం, మీరు) | They |
| Me, You (నాకు, నన్ను, నీకు, నిన్ను) | Him, her |
| Us (మనల్ని, మనకు/ మమ్మల్ని, మాకు) | Them |
| You (మీకు) | Them |
| My, Your (నా, నీ) | His/ Her |
| Our, Your (మా, మన, మీ) | Their |
| Mine, Yours (నాది, నీది) | His/ Her |
| Ours, Yours (మాది, మీది) | Theirs |
| This (ఇది) | That |
| These (ఇవి) | Those |
| Today, Yesterday, Tomorrow | That day, The day before, The next day వరసగా |
| Now | Then |

**Important:** పై మార్పులన్నీ సందర్భాన్నిబట్టి చేయాల్సిన మార్పులే. అదే పనిగా చేయాల్సిన అవసరం లేదు. ముఖ్యంగా English మాట్లాడుతున్నప్పుడు. ఇప్పుడు మీరింకో విషయం గమనించండి:
నవీన్, రమణి సంభాషణంతా, imperative (ఆజ్ఞలు, అభ్యర్థనలూ, అడగటాలూ తెలిపే sentences- కాబట్టి reported speech, to + 1st Regular doing word తో ప్రారంభిస్తాం- కిందటి lesson లో చూసినట్టు.)
నవీన్‌కు, రమణికి జరిగిన సంభాషణను, direct speech లో, indirect speech లో కింద పట్టికలో చూడండి.

| DIRECT SPEECH | REPORTED SPEECH |
|---|---|
| 1. **Naveen (to Ramani):** Leave your books with me. You take the other book and return it tomorrow. | Naveen told Ramani (ఇది గతం కాబట్టి) to leave her book with him and take his book and return it the next day. |
| 2. **Ramani (to Naveen):** Please let me have both the books. | She (Ramani) requested him to let her have both the books. |
| 3. **Naveen (to Ramani):** Take both of them and make sure that you return them the day after. | Naveen then told her to take both of them but to make sure she returned them the day after. |
| 4. **Ramani (to Naveen):** Please allow me to keep them for at least three days. | She (Ramani) requested him to allow her to keep them for at least three days. |
| 5. **Teacher (to Ramani & Naveen):** Stop talking both of you. | The teacher ordered them both to stop talking. |
| 6. **Naveen & Ramani (to teacher):** Don't be angry, sir. Excuse us this once. | Both of them (Naveen and Ramani) requested the teacher not to be angry and excuse them that once. |
| 7. **Teacher (to Naveen and Ramani):** Concentrate on the lesson. Keep your mouths shut or get out of the class | He (the teacher) ordered them to concentrate on the lesson, to keep their mouths shut or get out of the class. |
| 8. **Naveen (to Teacher):** Please, sir, don't be cross with us. | Naveen then requested/ pleaded with the teacher not to be cross with them. |

**ఈ passage ను Report చేయండి (English లో విగ్గరగా).**

**Kowmudi:** నీ birthday సందర్భంగా వచ్చే వారం నన్ను సినిమాకు తీసుకెళ్లి dinner ఇవ్వు.

**Kavitha:** నువ్వు punctual గా మా ఇంటికి మధ్యాహ్నం 2:30 కు రా.

**Kowmudi:** నాకు సరిగ్గా ఆరోజు రెండింటికి గుర్తుచేయి, నేను రాకుండా ఉంటే చూడు.

**Kavitha:** వచ్చేటప్పుడు మీ చెల్లెల్ని కూడా తీసుకురా!

**Kowmudi:** మా చెల్లెలి విషయం పట్టించుకోకు. లేదంటే నువ్వే ఫోన్ చేసి దాన్ని పిలువు.

**Kavitha:** ఆ విషయం నాకొదిలెయ్. నువ్వొరికే తనతో చెప్పు.

**Kowmudi:** అలాగే.

**ANSWER**

- Kowmudi asks/ asked Kavitha to take her to a movie and give her a dinner on her birthday next week.
- Kavitha asks/ asked Kowmudi to go home to Kavitha exactly at 2.30
- Kowmudi then tells/ told Kavitha to remind her at 2 that day and see if she (Kowmudi) doesn't'/ wouldn't come.
- Kavitha asks/ asked Kowmudi to bring her sister along.
- Kowmudi then tells/ told Kavitha to leave her sister alone or call her herself.
- Kavitha then tells/ told her to leave the matter to her, and just to tell her sister of it.
- Kowmudi said OK.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Pridhvi:** Hi Akash, I am very happy today.

**Akash:** Are you, really? Why so? (అవునా? ఎందుకో?)

**Pridhvi:** My exam results are out and I have passed with a very high score. (నా exam results వచ్చాయి. నేను చాలా మంచిమార్కులతో pass అయ్యాను)

**Akash:** Congrats. That makes me really happy. You owe me and Varun a treat. (Congrats. అది నన్ను చాలా సంతోషపరుస్తోంది. నువ్వు నాకు, వరుణ్‌కు విందివ్వాలి.)

Treat- విందు; Owe- బాకీ ఉండటం.

He owes me Rs.100 = అతడు నాకు రూ.100 బాకీ

He owes his greatness to his father = (అతడి గొప్పతనానికి వాళ్ల నాన్నే కారణం)




**Pridhvi:** Who is coming here? Oh, it is Varun. (ఎవరు వస్తున్నారు? ఓ... వరుణ్.)

**Varun:** I heard you both talking about results and treat. What is it? (మీరిద్దరూ ఏదో results, treat గురించి మాట్లాడుకుంటున్నారు. ఏంటది?)

**Akash:** Pridhvi has just told me that his exam results are out and that he has passed with a high score (తన exam results వచ్చాయనీ, తను మంచి marks తో pass అయ్యాననీ ఇప్పుడే నాతో Pridhvi చెప్పాడు.)

**Varun:** That's great. Congrats Pridhvi. How about a treat then? (చాలా గొప్ప విషయం. Congrats. మరి treat ( dinner) మాటేమిటి?)

**Pridhvi:** Akash has said that it really makes him happy and that I owe you and him a treat. I am ready. Just fix the date and time. (అది వాడిని చాలా సంతోషపెడుతోందనీ, నేను తనకూ, నీకూ ఓ treat (dinner) ఇవ్వాలనీ ఆకాష్ ఇంతకుముందే అన్నాడు. నేను ready. Date, time మీరు నిర్ణయించండి)

**Akash:** Varun, you have heard what Pridhvi has said. He is telling us that he is ready, and to fix the date and time for the dinner. (వరుణ్, విన్నావుగా. పృధ్వి ఏం చెప్పాడో. వాడిచ్చే treat కు మనల్ని date, time నిర్ణయించమన్నాడు)

**Pridhvi:** Mom's calling me. I'll be back in a minute. You decide and let me know where to go and when to go and I will take you there and then. Don't bother about the expenses. (మా అమ్మ పిలుస్తోంది. చిటికెలో తిరిగొస్తా. ఎప్పుడు, ఎక్కడికి వెళ్లాలో మీరు నిర్ణయించి నాకు చెప్పండి. అక్కడికి తీసుకువెళతా. ఖర్చుల గురించి పట్టించుకోకండి)

**Varun:** Have you heard what he has said? He has told us to decide and let him know where to go and when to go and he will take us there. He has told us too not to bother about expenses. How generous he is! (వాడేమన్నాడో విన్నావా? ఎప్పుడు ఎక్కడికెళ్లాలో మనం నిర్ణయించి వాడితో చెబితే వాడు మనల్ని అక్కడికి తీసుకువెళతానని అన్నాడు. ఖర్చుల విషయం పట్టించుకోవద్దని కూడా అన్నాడు. గొప్ప ఉదారుడే!)

**Akash:** He is back. Pridhvi it will be tomorrow. We will to go the matinee show of Chilipi and then have a dinner at Shadrasa restaurant. (పృధ్వి వచ్చేశాడు. పృధ్వి, రేపు మనం చిలిపి మ్యాట్నీ షో కు వెళ్లి, షడ్రస restaurant లో dinner చేద్దాం)

**Pridhvi:** That's OK, then.

**Now look at the part of the conversation between Pridhvi and Akash at the beginning of the lesson.**


M. SURESAN

**Pridhvi (to Akash):** My exam results are out and I have passed with a very high score.

పృధ్వి ఆకాష్‌తో అన్న direct speech లోని పై sentence, statement form లో ఉంది; statement అంటే ఒక విషయాన్ని చెప్పే sentence. (మనం కిందటి lesson లో report చేయటం నేర్చుకున్నది - imperative (ఆజ్ఞలూ, అభ్యర్థనలూ, etc. తెలిపే) sentence)

ఇప్పుడు ఒకరు చెప్పిన statement ను report చేసేటప్పుడు (Reported speech కు మార్చేటప్పుడు), that తో ప్రారంభిస్తాం.

పైన పృధ్వీ ఆకాష్‌తో అన్న మాటలను, ఆకాష్, వరుణ్‌తో report చేయటం చూడండి.

**(Akash to Varun):** Pridhvi has just told me that his exam results are out and that he has passed with a very high score




ఇంతవరకూ మనం Imperative sentences ను, statements నూ Reported (Indirect) speech లోకి మార్చటం (Report చేయటం) తెలుసుకున్నాం. మరికొన్ని examples చూద్దాం:

| DIRECT | INDIRECT (REPORTED) |
|---|---|
| 1. **Rama Rao:** Wait here till I come back. (నేను తిరిగొచ్చేవరకు ఇక్కడే ఉండు.) (Imperative) **Vinai:** Please come back early, dad. I am hungry. (త్వరగా రా నాన్నా, నాకు ఆకలిగా ఉంది.) (Imperative + statement) | Rama Rao asks his son to wait there till he comes back. Vinai asks/ requests his father to come back early. He says that he is hungry. (తను తిరిగొచ్చేవరకు అక్కడే ఉండమని కొడుకుతో రామారావు అంటున్నాడు. వినయ్ వాళ్ల నాన్నను త్వరగా రమ్మని అడుగుతున్నాడు, తనకు ఆకలిగా ఉందని అంటున్నాడు.) |
| 2. **Patient:** Doctor, I have a temperature and a severe cold. (డాక్టర్ , ఒళ్లు వేడిగా ఉంది. బాగా జలుబు చేసింది.) (statement) **Doctor:** Take these tablets and you will be cured by the evening. (ఈ టాబ్లెట్స్ తీసుకోండి. సాయంత్రానికల్లా మీకు నయమవుతుంది) (Imperative + statement) | The patient has complained to the doctor that she has a temperature and a severe cold. The doctor advises her to take those tablets and says that she will be cured by the evening. (Patient తనకు temperature, జలుబుగా ఉందని doctor తో చెప్పింది. Doctor ఆ tablets తీసుకోమని సలహా ఇచ్చి, సాయంత్రానికల్లా నయమవుతుందని అన్నాడు) |
| 3. **Doctor** (To patient): Take a cold shower before breakfast if you want to keep fit. (ఆరోగ్యంగా ఉండాలంటే breakfast ముందు చన్నీళ్ల స్నానం చెయ్) - Imperative | The doctor tells the patient to take a cold shower before breakfast if he/ she wants to be fit. (ఆరోగ్యంగా ఉండాలంటే breakfast ముందు చన్నీళ్ల స్నానం చేయమని doctor, రోగితో అంటున్నాడు) |
| 4. **Sumathi (To Sumanth):** You've wasted your time and money and that's why you are in trouble now. (నువ్వు time, డబ్బు, వృథా చేశావు. అందు వల్లే నువ్వు కష్టాల్లో ఉన్నావు)- statement | Sumathi is telling Sumanth that he has wasted his time and money and that's why he is in trouble now. (Sumanth తన డబ్బూ, time వృథా చేశాడనీ, అందు వల్లే కష్టాల్లో ఉన్నాడనీ Sumathi అంటోంది.) |
| 5. **Teacher (To students):** Imitate my pronunciation if you want to speak well. (మీరు బాగా మాట్లాడాలంటే నా ఉచ్చారణ అనుకరించండి) - Imperative | The teacher is telling/ is asking the students to imitate her if they want to speak well. (బాగా మాట్లాడాలంటే తనను అనుకరించమని విద్యార్థులతో teacher అంటోంది.) |

# He says that he is ..

గమనించండి: Akash వరుణ్‌తో చెప్పటం (పృధ్వి అన్న విషయాన్ని) that తో begin అవటం; మిగతా మార్పులన్నీ మామూలే కదా.

**Look at the following table.**

కిందివన్నీ కూడా statements, imperatives.

| DIRECT SPEECH | INDIRECT SPEECH |
|---|---|
| 1. **Akash (To Pridhvi):** That makes me really happy. You owe me and Varun a treat | Pridhvi reporting Akash's words to Varun: Akash has said that it really makes him happy and that I owe you and Akash a treat |
| 2. **Pridhvi (To Varun & Akash):** I am ready. Just fix the date and time. - I am ready - ఇది statement. Just fix the date and time - ఇది imperative | Akash reporting Pridhvi's words to Varun: He is telling us that he is ready, and to fix the date and time. 'he is ready' - statement కాబట్టి that తో, 'fix the date and time' imperative కాబట్టి, to తో begin అవుతాయి. |
| 3. **Pridhvi (To Akash & Varun):** You decide and let me to know where to go and when to go and I will take you there and then. "You decide and let me know......to go..." ఇది imperative. I will take you there- ఇది statement. | Varun reporting Pridhvi's words to Akash: He has told us to decide and let him know where to go and when to go and that he will take us there. ఇక్కడ, 'He has told.. to go' వరకూ imperative కాబట్టి to తో, 'he will take us there' statement కాబట్టి that తో begin చేస్తాం. |

**EXERCISE**

Put the following first in English and then report it (change it into reported speech. Use reporting verbs only in present tense. is telling/ tells/ has told/ is asking/ asks/ has asked etc.)

**Sujani:** రజనీ, నువ్వు market కు వెళ్లేట్లయితే నాకో dozen మామిడిపండ్లు తీసుకురా please.

**Rajani:** తెస్తాను. నన్నెంత పెట్టమంటావో చెప్పు

**Sujani:** Dozen వంద రూపాయలకంటే వద్దు. అంతకంటే ఎక్కువైతే కొనొద్దు.

**Rajani:** నేను త్వరగా తిరిగొస్తానని అనుకోవద్దు.

**Sujani:** నువ్వెప్పుడొచ్చినా ఫరవాలేదు. ఇదిగో ఈ వంద తీసుకో...

**Rajani:** తెచ్చిన తర్వాత ఇవ్వు.

| DIRECT | REPORTED |
|---|---|
| **Sujani:** Rajani, If you are going to the market, get me a dozen mangoes, please. | Sujani is asking Rajani to get her a dozen mangoes if she is going to the market. |
| **Rajani:** I will, but tell me how much you want me to spend. | Rajani says she will, but is asking Sujani to tell her how much she wants her to spend. |
| **Sujani:** Not more than Rs. 100 a dozen. Don't buy if it is more than that. | Sujani tells Rajani not to spend more than Rs.100. |
| **Rajani:** Don't expect me back early. | Rajani tells Sujani not to expect her back early |
| **Sujani:** Doesn't matter when you come back. Take this hundred rupees. | Sujani replies that it doesn't matter when Rajani comes back and asks her to take Rs.100. |
| **Rajani:** Give it to me after I return. | Rajani tells Sujani to give to her after she returned. |

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

**Kavitha:** Vinitha, don't make a noise. Be quiet.
(వినీతా, గొడవ చేయకు, నిశ్శబ్దంగా ఉండు.)

**Vinitha:** Give me those sweets then, mom.
(అయితే నాకు ఆ స్వీట్లు ఇవ్వమ్మా.)

**Kavitha:** You've already had a quite a lot. Be a good child.
(ఇప్పటికే చాలినంత తిన్నావు/ తిన్నది చాలు. మంచి అమ్మాయివి కదా)

**Vinitha:** Let me have just one more piece of Kalakand. I will not ask for more.




(ఒక్క కలాకండ్ ఇవ్వు.నేను మళ్లీ అడగను)

**Kavitha:** That'll be one too many, child. No. Do your home work first. If you eat any more, you will fall ill.
(ఇంకొక్కటి ఎక్కువైనా ఎక్కువైనట్లే. లేదు. ముందు హోమ్‌వర్క్ చెయ్యి. ఇంకా తింటే, ఒంటికి అనారోగ్యం చేస్తుంది.)

**Vinitha:** Then give it after I do my homework.
(అయితే హోమ్‌వర్క్ చేసిన తర్వాత ఇవ్వు.)

**Kavitha:** You are not getting any more for today. I'm going to tell dad you are asking for too many sweets.
(ఇక ఈ రోజుకింతే / ఇక ఈరోజు స్వీట్స్ ఏం లేవు. నువ్వు మరీ ఎక్కువ స్వీట్స్ అడుగుతున్నావని నాన్నతో చెబుతానుండు.)

**Vinitha:** I will tell dad too that you aren't giving me any sweets.
(నువ్వసలు స్వీట్స్ ఇవ్వటం లేదని నాన్నతో నేనూ చెప్తా)

**Kavitha:** Come on. Get your books and start doing the home work. You are talking too much.
(హోమ్‌వర్క్ కానీ. పుస్తకాలు తెచ్చుకుని మొదలు పెట్టు. నువ్వు మరీ ఎక్కువ మాట్లాడుతున్నావు)

**Vinitha:** Please... mom. Let me watch the TV for some time. I will do the home work later.
(అమ్మా.. అమ్మా... కాసేపు టీవీ చూడనివ్వా? ఆ తర్వాత హోమ్‌వర్క్ చేస్తాను.)

**Kavitha:** OK. Go on then.
(సరే, అలాగే కానివ్)

You must have observed that the conversation between the mother and her daughter has only imperatives (ఆజ్ఞలు, అభ్యర్థనలూ, అడగటాలు) and statements. (ఒక విషయాన్ని తెలిపే sentences)

ఇంతవరకు మనం Imperative sentences నూ, statements నూ reported speech లోకి మార్చేటప్పుడు Reporting Verb, present tense లో ఇలా వాడాం .

tell/ tells/ is, am, are telling/ have, has told/ ask/ asks/ is, am, are asking/ have, has asked.

ఇప్పుడు mother and daughter conversation ను మనం past tense reported verb తో report (Indirect) speech లో చెప్పవచ్చు. (అంటే told/ asked/ ordered/ said లాంటి verbs తో) మొన్నె ప్పుడో జరిగిన సంభాషణ ఈవాళ రిపోర్ట్ చేశామనుకోండి.

అప్పుడు ఎవరో Past లో చెప్పింది, ఇప్పుడు మన మాటల్లో మనం ఎలా ప్రారంభిస్తాం...

He/ she/ they, told/ asked/ said/ ordered అని past tense లో ప్రారంభిస్తాం కదా. అప్పుడు కాస్త జాగ్రత్త అవసరం.

మనం రిపోర్ట్ చేస్తున్న వాళ్ల మాటల్లోని Verbs అన్నీ Past tense forms లోకి మార్చేస్తాం.

**Look at the following**

| Direct Speech | Reported (Indirect) Speech |
|---|---|
| **1. Suketh:** Come in Subodh. My idea is to take you to a movie this evening (రా సుబోధ్, ఈ సాయంత్రం నిన్ను సినిమాకు తీసుకువెళదామని నా ఆలోచన.) | Suketh told Subodh to come in and said that his idea was to take him to a movie that evening (సుకేత్ సుబోధ్‌ను లోపలికి రమ్మని అతడిని ఆ సాయంత్రం సినిమాకు తీసుకెళ్లే ఆలోచన ఉందని చెప్పాడు) |
| **2. Subodh:** Put it off to tomorrow. I have some important work in the evening. (రేపటికి వాయిదా వేస్కో. సాయంత్రం నాకు ముఖ్యమైన పని ఉంది) | Subodh told Suketh to put it off to the next day and added/said that he had some important work in the evening (దాన్ని మరుసటిరోజుకు వాయిదా వేసుకోమని, తనకు ఆ సాయంత్రం ముఖ్యమైనపని ఉందనీ అన్నాడు) |

చూశారు కదా. Suketh, Subodh మాటలను మనం report చేసేప్పుడు reporting verb, told, said లాంటి past forms వాడాలి. అందుకని Suketh, Subodh ల మాటల్లోని Present tense verbs is, have లాంటి వాటిని was, had లాంటి past forms కు మార్చాం.

**అయితే ముఖ్యమైన విషయం**

Direct నుంచి reported కు మార్చేటప్పుడు, Imperative Sentences లోని Verb tenses మాత్రం మార్చం.

**a) Teacher:** Ram, show me your home work - Direct speech.

The teacher asked Ram to show her, his home work. Direct speech లోని 'show' మనం reported speech లో to show అని infinitive గా మారుస్తాం. - (Imperative sentence కాబట్టి)

**b) Ram:** Come in Shyam and have a seat.

Ram told Shyam to come in and have a seat. (Imperative, direct లోని come ను మనం report చేసేటప్పుడు to come in అని infinitive గా మారుస్తాం.

మిగతా types of sentences ను report చేసేటపుడు, Reporting verb told/ asked లా past tense లో ఉంటే, report చేసే మాటల్లోని verbs అన్నీ Verbs, past tense లోకి మార్చాలి; కింది విధంగా:

| Direct | Reported |
|---|---|
| am, is, are | was, were |
| was, were | had been |
| 1st RDW (come, go etc)<br>2nd RDW (comes, goes etc) | Past Doing Word<br>(came, went etc) |
| PDW (came, went etc) | had + past participle (had come, had gone etc) |
| shall | should |
| will | would |
| can | could |
| may | might |
| should<br>must<br>have to<br>has to | had to |

మాట్లాడిన వారి మాటల్లోని verb tenses పై విధంగా మారుస్తాం.

| Direct | Reported |
|---|---|
| **Kavitha:** Vinitha, don't make a noise. Be quiet (గొడవ చేయకు, నిశ్శబ్దంగా ఉండు) | Kavitha asked (Past tense) Vinitha not to make a noise and be quiet. (కవిత, వినీతను గొడవ చెయ్యొద్దని, నిశ్శబ్దంగా ఉండమని చెప్పింది) - రెండూ Imperative కాబట్టి, to make and be quiet అనేవి infinitives. |
| **Vinitha:** Give me those sweets then, mom (అయితే నాకు ఆ స్వీట్స్ ఇవ్వు) | Vinitha asked her mom to give her those sweets (తనకు ఆ స్వీట్స్ ఇమ్మని వినీత వాళ్లమ్మనడిగింది) Imperative- to give - infinitive. |
| **Kavitha:** You have already had enough. Be a good child and don't eat any more. (ఇప్పటికే చాలినంత తిన్నావు. మంచి అమ్మాయివి కదా. ఇంక తినకు.) | Kavitha told Vinitha that she had already had enough. She told Vinitha to be a good child and not to eat any more. 'You have already had...' ఇది statement. కాబట్టి, that you had already had అవుతుంది. |
| **Vinitha:** Let me just one more piece of Kalakand. I will not ask for more. (ఇంకో ముక్క కలాకండ్ ఇవ్వు. నేనింక మళ్లీ అడగను.) | Vinitha asked her mother to let her have one more piece of kalakand and said that she would not ask for more.<br>'I will not... more'- statement కాబట్టి, మనం report చేసేటప్పుడు that తో begin చేస్తాం. will ను would గా మార్చాం గదా. |

Let us now try to report the conversation at the begining of the lesson between the mother and her daughter. *(See above table )*

M. SURESAN

**Exercise:**

Kavitha, her daughter conversation (at the beginning of the lesson) మిగతా భాగాన్ని ఇలా పట్టిక గీసి, report చేయండి. Reported/Indirect Speech లోకి మార్చి, బిగ్గరగా ప్రాక్టీస్ చేయండి.

# మంచి అమ్మాయివి కదా!

ప్రశ్న: Mean while, However, So that, In order to, By way of పదాలకు అర్థాలు, వాడుక తెలియచేయండి.

– కె. వెంకటేశ్వరరావు, పాదిలి.

జవాబు: **Mean while**

1) ప్రస్తుతానికీ, భవిష్యత్ సంఘటనకు మధ్యలో (ఈ లోగా)

a) The guests will be here in an hour. Meanwhile let us prepare a good meal for them =
అతిథులు గంటలో వచ్చేస్తారు. ఈ లోగా మనం మంచి భోజనం తయారుచేద్దాం.

b) I will be leaving in 10 minutes. Meanwhile I want to call my friend =
నేను 10 నిమిషాల్లో వెళ్లిపోతున్నా. ఈలోగా మా ఫ్రెండ్‌కి ఒకసారి ఫోన్ చేయాలనుకుంటున్నా.

2) రెండు గత సంఘటనలకు మధ్య..

a) We agreed to meet the next week. Meanwhile I had to leave for Mumbai on urgent business =
మేం తర్వాత వారం కలుసుకోవాలనుకున్నాం. ఇంతలో (ఆలోగా)నేను అర్జంట్ పనిమీద ముంబై వెళ్లాల్సొచ్చింది.

b) I met him five years later. Meanwhile he had got married =
అతడిని నేను ఐదేళ్ల తర్వాత కలుసుకున్నా. ఈ లోగా అతడు పెళ్లి చేసుకున్నాడు.

**However**

However కు ఒక అర్థం but (కానీ, అయితే). సామాన్యంగా but తో sentence ఆరంభించం. అయితే however తో sentence ఆరంభించవచ్చు (ముందు చెప్పిన విషయానికి భిన్నంగా, వ్యతిరేకంగా ఏదైనా విషయం చెప్పాల్సివస్తే, ఆ విషయాన్ని however తో చెప్తాం)

However– sentence మధ్యలో కూడా వాడవచ్చు

a) The book gives very valuable information. However it is very expensive =
ఆ పుస్తకం చాలా విలువైన సమాచారం ఇస్తుంది. కానీ/ అయితే ధర చాలా ఎక్కువ.

b) I lent him my book, which, however, he never returned =
వాడికి నా పుస్తకం ఇచ్చాను. కాని వాడు మళ్లీ నాకు తిరిగివ్వలేదు.

**So that**

So that అంటే అందుకోసం అని అర్థం.

a) He worked very hard so that he might get a rank =
మంచి rank వస్తుందనే ఉద్దేశంతో కష్టపడి చదివాడు.

b) She started early so that she might not miss the train =
రైలు తప్పిపోకూడదనే ఉద్దేశంతో త్వరగా బయల్దేరింది.

a) Inorder to: In order to pass you must study well = పాస్ అయ్యేందుకు బాగా చదవాలి.

b) In order to qualify for IIT entrance test you should pass Inter in the first attempt
IIT entrance exam కు అర్హత పొందటానికి ఇంటర్ మొదటి ప్రయత్నంలోనే పాస్ అవ్వాలి.

అయితే, In order to వాడే ప్రతి చోటా to వాడొచ్చు ఇది simple, In order to కొంచెం పాండిత్యం. వాడకుండా ఉండటం మంచిది. to చాలు. In order to అక్కర్లేదు.

**By way of** (ఆ రూపంలో)

He received Rs.10 lac by way of dowry =
అతడు కట్నం రూపంలో 10 లక్షల రూపాయలు తీసుకున్నాడు.

b) Drona demanded Ekalavya's thumb by way of 'gurudakshina'.
ద్రోణుడు గురుదక్షిణగా ఏకలవ్యుడి బొటనవేలు అడిగాడు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి..**

**URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Manasa:** Hi Lalasa, come in. Have a seat.
(రా, కూర్చో)

**Lalasa:** Thank you. I am dead tired.
(చాలా అలసిపోయా)

**Manasa:** Have some coffee then. It won't take more than a minute for me to make it.
(అయితే కాస్త coffee తీస్కో. క్షణాల్లో చేస్తా)

**Lalasa:** Sure, that'd be most welcome.
(తప్పకుండా)

**Manasa:** It's brewing now. Tell me why you are so tired.
(coffee అవుతోంది. ఇప్పుడు చెప్పు, నువ్వు ఎందుకలసిపోయావో)

(brew = coffee లాంటివి చేయటం. మరిగించే ప్రక్రియను brew అంటారు)

**Lalasa:** My boss is an evening walker. She wanted me to walk with her to her home for company.
(మా boss evenings నడుస్తుంది. తనతో పాటు వాళ్ళింటికి నన్నూ నడవమంది)

**Manasa:** So you walked. How far?
(అందుకని నువ్వు నడిచావు. ఎంతదూరం?)

**Lalasa:** Oh, my! It is nearly four kilometers.
(అబ్బో, నాలుగు కిలోమీటర్లు). On the way back I dropped in here. (తిరిగి వచ్చేటప్పుడు ఇక్కడ ఆగాను)




**Manasa:** Don't regret. You have had a good exercise
(చింతించకులే, అదో మంచి exercise)

**Lalasa:** Try it yourself now. You will then know what it means to walk four kms.
(నువ్వు నడిచి చూడు. అప్పుడు తెలుస్తుంది నాలుగు కిలోమీటర్లు నడవటం అంటే ఏమిటో?)

**Manasa:** Don't be angry. I said it just for fun. Here's the coffee. Have it and relax.
(కోప్పడకు, నేనేదో తమాషాకన్నానులే. ఇదిగో కాఫీ. తాగి కాస్త విశ్రాంతి తీసుకో)

**Lalasa:** Thank you. You make very good coffee.
(Thank you. నువ్వు కాఫీ చాలా బాగా చేస్తావు)

**Manasa:** Choose good coffee powder. Have fresh milk about. That's the recipe for good coffee.
(మంచి coffee పొడి ఎంపిక చేసుకో. తాజా పాలు తెచ్చుకో. మంచి coffee కి అది సూత్రం.)

recipe రెసిపె = వంటకానికి సూత్రం

**Lalasa:** Thanks once again.

కిందటి lesson వరకు మనం తెలుసుకున్నది, imperative (ఆజ్ఞలు, అభ్యర్థనలూ, అడగటాలు తెలిపే) sentences ను, statements (ఒక విషయం తెలిపే sentences) ను report చేయటం.

మనం తెలుసుకున్న ఇంకొన్ని ముఖ్య విషయాలు:

1) Report చేస్తున్నప్పుడు says/ am, is, are saying/ has/ have said, tells/ is telling/ are telling/ have told/ has told/ ask etc లాంటి present tense reported verbs ను వాడినప్పుడు మనం report చేస్తున్నవాళ్ల మాటల్లోని verbs tenses మార్చాల్సిన పని లేదు.

2) Reporting verb past tense అయితే (అంటే said/ was, were saying/ told/ was/ were telling/ ordered/ was, were ordered/ etc అయితే) కిందటి lesson లో చూపినట్లుగా మనం report చేస్తున్నవాళ్ల మాటల్లోని verbs అన్నింటిని past tense forms కు మార్చేస్తాం.

3) Imperative sentences ను report చేసేటప్పుడు వాటిలోని verbs ముందు 'to' పెట్టి infinitive చేస్తాం. కాబట్టి వీటిల్లో tense మార్పు ప్రసక్తిరాదు. **Eg: See the table.**




| DIRECT | REPORTED SPEECH |
|---|---|
| **1. Kanya:** Stop talking, you, Sirisha. (Imperative) | **1. a)** Kanya is asking (present tense) Sirisha to stop talking.<br>**b)** Kanya asked (past tense) Sirisha to stop talking. |
| **2. Kavya:** Sravya, I am going to town with sister. Please come with us. | **2. a)** (Present tense reporting verb) Kavya is telling Sravya that she (Kavya) is going to town with sister and requests Sravya to go with them<br>**b)** (Reporting verb - Past) Kavya told Sravya that she (Kavya) was going to town with sister and requested her to go with them. |
| **3. Suman:** Hi Kiran, take the book and read the lines underlined on page 23. You will find what you need. | **3. a)** (Reporting verb - present) Suman is asking/ asks Kiran to take the book and read the lines underlined on page 23 and says that he will find what he need.<br>**b)** (Reporting verb - Past) Suman asked Kiran to take the book and read the lines underlined on page 23 and said that he would find what he needed. |

ఇప్పుడు imperative combination లేకుండా కేవలం statements ను మాత్రం ఎలా report చేయాలో చూద్దాం.

**Mallesh:** Our friends will be here soon. We are going to have a jolly time with them.
(మన friends కొద్దిసేపట్లో ఇక్కడుంటారు. మనం కాసేపు సరదాగా గడపొచ్చు)

jolly= సరదా.

A jolly fellow= సరదాగా ఉండేవాడు

**Kamesh:** I hope they will have their dinner with us. We can go to a movie after that.
(వాళ్లు మనతో భోజనం చేస్తారని ఆశిస్తున్నాను. ఆ తర్వాత మనం సినిమాకెళ్ళొచ్చు)

ఈ సంభాషణంతా statements (ఒక విషయాన్ని తెలిపే sentences) కదా.

# That'd be most welcome


M. SURESAN

పోల్చి చూడండి. Reporting verb present tense లో ఉన్నప్పుడు, reported part లో verb tenses మారదు. అదే reporting verb past tense లో ఉంటే, reported part verb tenses అన్నీ past అయిపోతాయి.

ఇప్పుడు మనం చూసింది reported part (ఒకరు తమ మాటల్లో ఇతరులు చెప్పింది report చేయటం) imperative sentences, and statements. ఇప్పుడు at the beginning of the lesson conversation report చేద్దాం.

| DIRECT | INDIRECT | |
|---|---|---|
| | Reporting verb present tense | Reporting verb past tense |
| **1. Manasa:** Lalasa, come in, have a seat. | **1.** Manasa asks Lalasa to come in and have a seat | **1.** Manasa asked Lalasa ... (No change, because the reported part is imperative) |
| **2. Lalasa:** Thank you. I'm dead tired. | **2.** Lalasa thanks Manasa and says that she is dead tired | **2.** Lalasa thanked Manasa and said that she was dead tired. |
| **3. Manasa:** Take, some coffee. It won't take more than a minute to make it. | **3.** Manasa asks (offers) Lalasa some coffee and adds (says) that it won't take more than a minute to make it. | **3.** Manasa asked (offered) Lalasa to take some coffee and added (said) that it wouldn't take more than a minute to make it. |
| **4. Lalasa:** Sure, that's most welcome. | **4.** Lalasa assures Manasa that it is most welcome | **4.** Lalasa assured Manasa that it was most welcome |
| | (Oh, sure! direct speech లో ఉంటే అది report చేసేటప్పుడు assures/ assured అంటాం) | |
| **5. Manasa:** It's brewing now. Tell me why you are so tired. | **5.** Manasa tells Lalasa that it is brewing and asks Lalasa to tell her why she is so tired | **5.** Manasa told Lalasa that it was brewing and asked Lalasa to tell her why she was so tired. |
| **6. Lalasa:** My boss is an evening walker. She wanted me to walk with her to her home for company. | **6.** Lalasa tells Manasa that her boss is an evening walker and that she wanted her to walk with her to her home for company. | **6.** Lalasa told Manasa that her boss was an evening walker and that she had wanted her to walk with her to home for company. |

పై table బాగా study చేసి practice చేయండి. ఇంకో గమనిక: to come, to go, to see- ఇలాంటి వాటిని infinitives అంటాం. Infinitives ను report చేసేటప్పుడు infinitives గానే ఉంచుతాం. వాటికి tense ఉండదు. కాబట్టి tense మార్చటం ఉండదు. ఇంతవరకు మనం Imperative sentences నూ, statements నూ report చేయటం (Indirect speech లోకి మార్చటం) చూశాం.

a) Imperative sentences report చేయటానికి, వాటిల్లోని verbs ముందు to పెట్టి వాటిని infinitives గా report చేస్తాం. Don't అని ఉంటే, not + infinitive చేస్తాం.

b) Statements ను report చేసేందుకు, report చేసే part ను that తో ప్రారంభిస్తాం. వీటి గురించి ఇదివరలో తెలుసుకున్నాం.

రెండు మూడు statements ను కలిపి report చేయాల్సి వచ్చినప్పుడు, ఒక statement కూ ఇంకో statement కు మధ్య and that పెడతాం. Table లో ఇలా ఉండటం గమనించండి. రెండు statements కంటె ఎక్కువున్నప్పుడు మూడో statements కు, he/ she etc, added/ said further అంటాం. ఇప్పుడు Mallesh, Kamesh conversation report చేద్దాం. Reported verb, past tense వాడదాం.

Mallesh told Kamesh that their friends would be there soon and that they were going to have a jolly time with them.

Kamesh said that he hoped they would have their dinner with them and that they could all go to a movie after that. పైన చూశారు కదా: Mallesh, Kamesh అన్న రెండు statements ను and that తో కలిపాం.

**Another point:**

**Kamesh:** I hope they will have their dinner with us -

దీనిని report చేయాల్సినప్పుడు,

Kamesh said that he hoped అన్నాం కదా. ఇలా సూత్రప్రకారంగా అనే బదులు,

Kamesh hoped that అనవచ్చు. ఇది simpler, natural.

ఇప్పుడు more than two statements ఎలా report చెయ్యవచ్చో చూద్దాం:

**Suresh:** Hi Manish, I am happy that I finally got the book. I searched the whole of the market finally I found it in a small shop. This was the only copy available.

ఇక్కడ four statements ఉండటం గమనించండి. వీటిని report (Indirect speech) చేద్దాం. past tense, reported verb ఉపయోగిద్దాం.

Suresh told Manish that he was happy that he had finally got the book, and that he had searched the whole of the market. He added that finally he had found it in a small shop and that that was the only copy available.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






# Are you happy?


M. SURESAN

**Bhavan:** I called your home twice last evening, but there wasn't any response.
(నేను నిన్న సాయంత్రం మీ ఇంటికి రెండుసార్లు Phone చేశాను, కాని ఎవరూ తీయలేదు)

**Mohan:** We were all out at the exhibition.
(మేమంతా exhibition కు వెళ్ళాం)

**Bhavan:** I called you to know the details of the match. When is the match?
(మ్యాచ్ వివరాల కోసం ఫోన్ చేశాను. ఎప్పుడా మ్యాచ్?)

**Mohan:** There are two matches. What match are you talking of?
(రెండు matches ఉన్నాయి. ఏ మ్యాచ్ గురించి మాట్లాడుతున్నావ్?)

**Bhavan:** Which of the two is this weekend?
(ఈ వారాంతంలో ఉండేది ఏ మ్యాచ్?)

**Mohan:** It's the match with the team of 'The Nedu' group of publications.
(అయితే అది 'నేడు' ప్రచురణల team తో)

**Bhavan:** Where are we going to play the match?
(ఈ match ఎక్కడ ఆడబోతున్నాం?)

**Mohan:** At the stadium grounds.
(స్టేడియం గ్రౌండ్స్‌లో)

**Bhavan:** Who are our bowlers?
(మన bowlers ఎవరు?)

**Mohan:** I don't have the list.
(ఆ జాబితా నా దగ్గర లేదు)

**Bhavan:** Then who is the list with?
(అయితే ఆ list ఎవరి దగ్గరుంది?)

**Mohan:** It is with our captain Arya and the coach Guruprasad.
(మన captain Arya దగ్గర, coach దగ్గర ఉన్నాయి)

**Bhavan:** I want to see it.
(నేను చూడాలనుకుంటున్నా)

**Mohan:** Why do you want to see it?
(ఎందుకు చూడాలనుకుంటున్నావు?)

**Bhavan:** I want to be sure that Manoj is on the team.
(మనోజ్ ఉన్నాడా లేదా అని నిర్ధరించుకునేందుకు.)

**Mohan:** Don't worry. He is on the team.
(ఉన్నాడు. బాధపడకు)

**Bhavan:** OK.

మనం ఇంతవరకు, imperative sentences నూ, statements నూ ఎలా report చేయాలో (indirect speech లో చెప్పాలో) చూశాం కదా.

a) Imperative sentences (ఆజ్ఞలూ, అభ్యర్థనలూ, అడగటం తెలిపే sentences)
eg: i) Get out (order)
ii) Please come in (request)
iii) Sit down (asking)

ఇలాంటి sentences (imperative) ను report చేసేటప్పుడు ఈ verbs ముందు to పెట్టి infinitives గా మారుస్తాం.

b) Statements (ఒక విషయాన్ని తెలిపే sentences)
i) He attends classes regularly
ii) They do not come here often
iii) I had a tiresome journey

Statements report సందర్భాల్లో 'that' తో ప్రారంభించి మిగతా మార్పులు చేస్తాం.

ఇవన్నీ ఇదివరకటి lessons లో చూశాం.

**Now observe the conversation between Bhavan and Mohan at the beginning of this lesson.**

You see that there are a number of <u>questions</u> in the conversation. Bhavan puts a number of <u>questions</u> to Mohan.

We are now going to see how to report questions. (Questions ను indirect speech లోకి ఎలా మార్చాలో ఈ lesson లో చూద్దాం):

You know there are two types of questions:

1) **'Wh' questions** - questions beginning with 'Wh' words what, when, where, why, who, whom, whose and how. వీటితో begin అయ్యే questions ను 'Wh' questions అంటాం.
eg: What is your name?
Where is he?

2) **Non 'Wh' questions:** 'Wh' words తో ప్రారంభంకాని questions.
eg: a) Is he your friend?
b) Are you happy? etc.

ఈసారి మనం 'Wh' questions ను ఎలా report చేయాలో (indirect speech లోకి మార్చాలో) చూద్దాం:

Direct speech లో ఉన్న questions report చేసేటప్పుడు, కొన్ని మార్పులు కూడా చేయాలి (do, does and did విషయంలో). See the table.

| DIRECT | REPORTED SPEECH | |
|---|---|---|
| | Reporting verb present tense | Reporting verb past tense |
| 1. Do + 1st Regular Doing Word: do come, do know, do take etc. | Come, know, take etc. (I RDW) | Came, knew, took etc. (Past Doing Word) |
| 2. Does + 1st Regular Doing Word: does come, does know, does take, etc | comes, knows, takes, etc (II Regular Doing Word) | came, knew, took, etc. |
| 3. Did + 1st Regular Doing Word: did come, did know, did take, etc. | came, knew, took, etc. | had come, had known, had taken, etc. (had + past participle) |

Direct speech లో ఉన్న question ను report చేసేటప్పుడు దాన్ని statement structure (sub + verb) కు మార్చేస్తాం. గుర్తుంది కదా: Question లో ఎప్పుడూ verb ముందూ దాని తర్వాత subject వస్తుంది. లేదా helping verb, main verb ల మధ్య subject వస్తుంది.

1) Where is he? [Where + is (verb) + he (subject)?]
2) What is he doing? [What + is (helping verb) + he (subject) + doing (main verb)]

ఇప్పుడు ఇలాంటి questions ను report చేసేటప్పుడు 'Wh' word తర్వాత statement word order కు మార్చేస్తాం. అంటే verb + subject/ helping verb + subject + main verb order ను, sub + verb గా మారుస్తాం.

**Kesav:** Where is Shyam?
**Karuna:** I do not know

Let us report the conversation above:

| Reporting verb present tense | Reporting verb past tense |
|---|---|
| Kesav <u>asks</u>/ is <u>asking</u> Karuna where Shyam is. | Kesav <u>asked</u> Karuna where <u>Shyam was</u>. |
| గమనించండి: Direct speech లోని Where <u>is</u> <u>Shyam</u>, report చేసేటప్పుడు, where Shyam is గా మారుతుంది. | ఇక్కడ reporting verb past కాబట్టి, where Shyam is బదులు where Shyam was అంటాం. |
| Karuna <u>replies</u> that she <u>does</u> not know (ఇది statement) | Karuna <u>replied</u> that she <u>did</u> not know. |

ఈ మార్పులు చేయటం చాలా ముఖ్యం. ఇప్పుడు మనం Bhavan, Mohan conversation report చేద్దామా? అందులో 'Wh' questions, statements కలిసి ఉన్నాయికదా? Direct speech లోని questions, reported speech లో statements గా మారతాయని గుర్తుంచుకోండి (అంటే sub + verb word order అవుతుంది).

| DIRECT SPEECH | REPORTED | |
|---|---|---|
| | Reporting verb (present) | Reporting verb (past) |
| 1. Bhavan (to Mohan) I called your home twice last evening, but there wasn't any response. (Statement) | Bhavan <u>tells</u> Mohan that <u>he</u> <u>called</u> his home twice the day before but there <u>wasn't</u> any response. | Bhavan <u>told</u> Mohan that he <u>had called</u> his home twice the day before but there <u>hadn't been</u> any response. |
| 2. Mohan (to Bhavan): We were all out at the exhibition. (Statement) | Mohan <u>tells</u> Bhavan that <u>they</u> <u>were</u> all out at the exhibition. | Mohan <u>told</u> Bhavan that they <u>had been</u> all out at the exhibition. |
| 3. Bhavan (to Mohan): I called you to know the details of the match. <u>When is the Match?</u> (Statement + 'Wh' question) | Bhavan <u>says</u> he called Mohan to know the details of the match and <u>asks</u> him <u>when the match is.</u> | Bhavan <u>said</u> he <u>had called</u> Mohan to know the details of the match and <u>asked</u> him when the <u>match was.</u> |
| 4. Mohan (to Bhavan): There are two matches. Which match <u>are you talking of?</u> (Statement + 'Wh' question) | Mohan <u>says</u> to Bhavan that there <u>are</u> two matches and <u>asks</u> him which match <u>he is talking of.</u> | Mohan <u>told</u> Bhavan that there <u>were</u> two matches and <u>asked</u> him which match <u>he was talking of.</u> |
| 5. Bhavan (to Mohan): Which of the two is this weekend? ('Wh' question) | Bhavan <u>asks</u> Mohan which of the two <u>is</u> this weekend? | Bhavan <u>asked</u> Mohan which of the two <u>was</u> that weekend. |
| 6. Mohan (to Bhavan): It is with the team of 'Nedu' group of publications (Statement) | Mohan <u>tells</u> Bhavan that it is with the Nedu group of Publications. | Mohan <u>told</u> Bhavan that it <u>was</u> with the Nedu group of publications. |
| 7. Bhavan (to Mohan): Where are we going to play the match? ('Wh' question) | Bhavan <u>asks</u> Mohan where <u>they are going to</u> play the match. | Bhavan <u>asked</u> Mohan where <u>they were going</u> to play the match. |

పైన గమనించారు కదా Statements, 'Wh' questions ను కలిపి ఎలా report చేయాలో, కేవలం 'Wh' questions ను ఎలా report చేయాలో. Questions అన్నింటిని reported speech లో statement word order కు మార్చడం కూడా గమనించండి.

**Exercise:** Conversation at the beginning of this lesson మిగతా భాగాన్ని పైన చూపించినట్లు, reporting verb, present tense, past tense రెండింటిలో report చేయండి.

సంభాషణల్లో అన్నీ మనం మాట్లాడే మాటలే అయి ఉండాల్సిన అవసరం లేదు. ఎవరో చెప్పిన మాటల్ని కూడా, వాళ్లు చెప్పినట్లుగా మార్చి చెప్పాల్సి వస్తుంది. ఈ రెండు సందర్భాల్లోనూ రెండు పద్ధతుల్ని ఉపయోగిస్తాం. ఒకటి ప్రత్యక్షంగా చెప్పేది, ఇంకోటి పరోక్షంలో ఫలానా వ్యక్తి ఫలానా మాటలన్నాడని చెప్పేది. ఆంగ్లభాషణలో సొగసు కావాలంటే ఈ అంశాన్ని బాగా నేర్చుకోవాలి. వాక్యాన్ని ఒక పద్ధతి నుంచి మరో పద్ధతిలోకి మార్చడానికి వ్యాకరణం సూత్రాలను నిర్దేశించింది.




# ఆయన ఎంత తీసుకుంటారు?

**Visala:** Where are you starting off so early?
(ఎక్కడికి అంత తొందరగా బయలుదేరుతున్నావు?)

**Vinod:** To our maths lecturer's.
(మా మ్యాథ్స్ లెక్చరర్ ఇంటికి.)

To our maths lecturer's - ఇలా lecturer's లోలాగా 's వాడితే 'to' ముందర ఉంచి - వాళ్లింటికి అనే అర్థం వస్తుంది.

To my friend's = మా friend ఇంటికి


*Which maths lecturer do you want to go to?*

**Visala:** What do you want from him?
(ఆయన దగ్గర నుంచి ఏం కావాలి?/ఎందుకు?)

**Vinod:** I want to have tuition from him.
(ఆయన దగ్గర నేను ట్యూషన్‌కు చేరాలనుకుంటున్నా.)

**Visala:** Which maths lecturer do you want to go to?
(ఏ మ్యాథ్స్ లెక్చరర్ దగ్గరకు వెళ్లాలనుకుంటున్నావు?)

**Vinod:** Mr. Ganak. He is the best in the town.
(గణక్ సార్. ఊళ్లో ఆయనే గొప్పవాడు.)

**Visala:** Who suggested him to you?
(ఆయన గురించి నీకెవరు చెప్పారు?)

**Vinod:** Most of my friends go to him, so I am going to him too.
(మా స్నేహితుల్లో చాలామంది ఆయన దగ్గరకే వెళతారు, అందుకని నేను కూడా అక్కడికే వెళుతున్నా.)

**Visala:** How much does he charge?
(ఆయన ఎంత తీసుకుంటారు?)

**Vinod:** I have to find out. That's what I am going for.
(నేను కనుక్కోవాలి. అందుకనే ఇప్పుడు వెళుతున్నా.)

**Visala:** When do you think you can come back?
(ఎప్పుడు తిరిగి రాగలనుకుంటున్నావు?)

**Vinod:** Why do you want to know?
(నువ్వెందుకు తెలుసుకోవాలనుకుంటున్నావు?)

**Visala:** Vikram has invited us to lunch. We have to start here at least by 10.
(విక్రమ్ మనల్ని లంచ్‌కి పిలిచాడు. పదింటికల్లా మనం బయల్దేరాలి.)

**Vinod:** OK. I'll be back in time.
(సరైన సమయానికే తిరిగొస్తాలే.)

Study carefully the conversation above. You find a number of 'wh' questions in it. కిందటి lesson లో మనం తెలుసుకుంది:




'wh' questions ను report చేయడం, (indirect speech లోకి మార్చడం) మనం చూసింది 'wh' questions ను రిపోర్ట్ చేసేటప్పుడు question ను statement form లోకి మార్చేస్తాం.

**Question:**

**a)** Where is he?

ఈ question లో word order (మాటల అమరిక) Where (wh word) + is (verb)+ he (subject)

**b)** Where is he going?

ఈ question word order:

Where (wh word) + is (helping verb) + he (subject) + going (main verb)?

Questions (a), (b)లను report చేసేటప్పుడు మిగతా మార్పులు చేస్తూ question లోని wh word ను అలా ఉంచేసి, మిగతా question part ను statement word order (verb + subject) లోకి మార్చేయాలి. ఇక్కడ 'that' రాదు.

టేబుల్ - 1 చూడండి.


M. SURESAN

ఆ రెండు సంభాషణల్లో కూడా Question word order ను report చేసేటప్పుడు Wh word పెట్టి మిగతా Part ను statement word order లోకి మార్చేయడం గమనించండి.

Let us now try to report the conversation between Visala and Vinod at the beginning of the lesson. Note that we have to report both statements and 'wh' Question (table -2).

టేబుల్ -2లో చూశారు కదా- Question structure ను statement structure గా మార్చటం ఎలాగో.

**Exercise:** ఈ Lesson లోని మిగతా conversation between Visala and Vinod ను report చేయండి- Reporting verb, present tense, past tense లో కూడా. మీరు practice చేయటం అంటే రాయటం మాత్రమే కాదు. మీరు రాసింది, మీ friends ఎవరితోనైనా బిగ్గరగా రెండు మూడు సార్లు మామూలుగా మాట్లాడుతున్నట్లు practice చేయండి.

**Table 1**

| Direct Speech | Reporting Speech | |
|---|---|---|
| | Reporting Verb (Present) | Reporting Verb (Past) |
| **1. Krishna:** Where is your father? (మీ నాన్నగారెక్కడ?) | Krishna is asking/ asks Sathya where her father is. | Krishna asked Sathya where her father was. |
| **Sathya:** Why do you want to know? (ఎందుకు తెలుసుకోవాలనుకుంటున్నావు?) | Sathya asks in reply why he wants to know. | Sathya asked in reply why he wanted to know. |
| **2. Madhavi:** What are your goals? | Madhavi asks Prasanth what his goals are. | Madhavi asked Prasanth what his goals were. |
| **Prasanth:** What do you advise? | Prasanth questions her what she advises. | Prasanth questioned her what she advised. |

**Table 2**

| Direct Speech | Reporting Speech | |
|---|---|---|
| | Reporting Verb (Present) | Reporting Verb (Past) |
| **1. Visala:** (to Vinod) Where are you starting off so early? | Visala asks Vinod where he is starting off so early. | Visala asked Vinod where he was starting off so early. |
| **Vinod:** To our maths lecturer's | Vinod replies that it is to their maths lecturer's. | Vinod replied that it was to their maths lecturer's. |
| **2. Visala:** What do you want from him? | Visala asks Vinod what he wants from him. | Visala asked Vinod what he wanted from him. |
| **Vinod:** I want to have tuition from him. | Vinod tells her he wants to have tuition from him. | Vinod told her he wanted to have his tuition from him. |
| **3. Visala:** Which maths lecturer do you want to go to. | Visala asks Vinod which maths lecturer he wants to go to. | Visala asked Vinod which maths lecturer he wanted to go to. |
| **Vinod:** Mr. Ganak. He is the best in the town. | Vinod says/ replies that he wants to go Mr. Ganak (and adds that) he is the best in the town. | Vinod replied that he wanted to go to Mr. Ganak (and added that) he is the best in the town. |



**ప్రశ్న:** **1.** They have been able to keep their promise
Structure: have been above to + P.V.

**2.** He might have been able to do the job
**structure:** might have been able to + P.V.

**3.** She must have been able to persuade him to marry her.
**structure:** must have been able to + P.V. పై వాక్యాల పూర్తి అర్థాన్ని, ఉపయోగాన్ని వివరించగలరు.

– ఎస్. మొహినుద్దీన్, కర్నూలు

**జవాబు:** **1.** They have been able to keep their promise = They have kept their promise.
(వాళ్లు తమ మాటను నిలబెట్టుకోగలిగారు- నిలబెట్టుకున్నారు)

**2.** He might have been able to do the job = Perhaps (బహుశా)he did the job/ did not do the job.
(అతడు ఆపని చేయగలిగి ఉండవచ్చు, గతంలో చేసి ఉండవచ్చు లేదా చేయకపోయి ఉండవచ్చు కూడా.)

**3.** She must have been able to persuade him to marry her.
(తనను పెళ్లిచేసుకోమని ఆమె అతడికి నచ్చజెప్పి ఉండాలి- అందుకే అతడామెను పెళ్లి చేసుకున్నాడు)

**Compare:** The roads are wet. It must have rained during the night.
(రోడ్లన్నీ తడిగా ఉన్నాయి. రాత్రి వర్షం కురిసి ఉండాలి- కురిసింది).

**ప్రశ్న:** **1.** Gup అర్థం ఏమిటో వివరించి, దానిని ఏ విధంగా ఉపయోగిస్తారో తెలియజేయండి.

**2.** Past participle (V3) వివరించి, ఉదాహరణలు తెలియజేయండి.

– సాహితీ విద్యామందిర్, ఫత్తేపురం

**జవాబు:** **1.** Gup అనే మాట నాకు తెలిసినంతవరకూ లేదు. Guppy అనేది ఒక రకమైన చేప.

**2.** Past participle: Object ఉన్న Verb Past participle కు 'బడిన' అని అర్థం వస్తుంది.

**a)** The man seen here yesterday.
(నిన్న ఇక్కడ చూడబడిన వ్యక్తి - సరైన తెలుగులో నిన్న ఇక్కడ మీరు/ మేం/ వాళ్లు చూసిన వ్యక్తి.)

**b)** The money stolen from the bank.
(బ్యాంక్ నుంచి దొంగిలించబడిన డబ్బు.)

Past participle, verb కాదు. Be form (am, is, are, was, shall be, have been, etc.,) + Past participle అయితే verb అవుతుంది. అప్పుడు verb, passive voice.

**a)** Salaries were paid yesterday.
(జీతాలు నిన్న ఇవ్వబడ్డాయి/ చెల్లించబడ్డాయి.)

**b)** The college will be closed from tomorrow onwards.
(కాలేజీ రేపటి నుంచి మూయబడుతుంది.)

Past participle ను adjective గా వాడతాం. అంటే దేన్నైనా వర్ణించడానికి వాడతాం.

**a)** The murdered man was related to her.
(చంపబడిన వ్యక్తి ఆమెకు చుట్టం.)

**b)** The ruined fort = శిథిలమైన కోట

Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి...
URL: http://www.eenadu.net/spoken/spoken.htm



EdCET 2006

జువాలజీ

సి. హరికృష్ణ

1) నిజకేంద్రక కణాల్లోని ఏ కణాంగాల్లో 70S రైబోజోములు ఉంటాయి?
ఎ) మైటోకాండ్రియా, గాల్జీ సంక్లిష్టం
బి) హరితరేణువులు, అంతర్జీవ ద్రవ్యజాలకం
సి) మైటోకాండ్రియా, హరితరేణువులు
డి) గాల్జీ సంక్లిష్టం, అంతర్జీవ ద్రవ్యజాలకం

2) బ్యాక్టీరియాలోని కణకవచం ఏ రసాయన పదార్థంతో ఏర్పడుతుంది?
ఎ) సెల్యులోజ్ బి) పెప్టిడోగ్లైకాన్
సి) గ్లైకోప్రోటీను డి) కైటిన్

3) మైటోకాండ్రియా అనే పదాన్ని ప్రతిపాదించిన శాస్త్రవేత్త ఎవరు?
ఎ) ఆల్ట్‌మ్యాన్ బి) పోర్టర్
సి) గార్నియర్ డి) బెండా

4) ఒక పాలీపెప్టైడ్ శృంఖలానికి సమాచారం ఉన్న డిఎన్ఎ భాగాన్ని ఏమంటారు?
ఎ) రెకాన్ బి) మ్యుటాన్
సి) సిస్ట్రాన్ డి) ఒపెరాన్

5) మియాసిస్-I (క్షయకరణ-I) విభజనలో ప్రథమ దశలోని ఏ ఉపదశలో సమజాతీయ క్రోమోజోముల మధ్య వినిమయం జరుగుతుంది?
ఎ) లెప్టోటీన్ బి) జైగోటీన్
సి) పాకిటీన్ డి) డిప్లోటీన్

6) నిజకేంద్రక కణకేంద్రంలో ఉండే క్రొమాటిన్ నిర్మాణంలోని ప్రమాణాన్ని ఏమంటారు?
ఎ) న్యూక్లియోసోమ్ బి) న్యూక్లియోటైడ్
సి) న్యూక్లియోసైడ్ డి) న్యూక్లియోలస్

7) కణచక్రంలోని ఏ దశలో డిఎన్ఎ ప్రతికృతి జరుగుతుంది?
ఎ) S బి) $G_1$
సి) $G_2$ డి) M

8) ఉభయచరాలు, చేపలు, సరీసృపాల వంటి సకశేరుకాల స్త్రీబీజకణ మాతృకల్లో కనిపించే ప్రత్యేకమైన క్రోమోజోములు ఏవి?
ఎ) పాలిటీన్ క్రోమోజోములు
బి) కుంచె క్రోమోజోములు
సి) అనుబంధ క్రోమోజోములు
డి) పైవన్నీ

9) డిఎన్ఎపై మొట్టమొదటి ఎక్స్-రే క్రిస్టలోగ్రఫీ పరిశోధనను నిర్వహించిన శాస్త్రవేత్తలు-
ఎ) వాట్సన్, క్రిక్
బి) రొజాలిండ్ ఫ్రాంక్లిన్, విల్కిన్స్
సి) ఇర్విన్ చార్గాఫ్
డి) ఫ్రెడరిక్ మీషర్

10) అత్యధికంగా కుండలీకరణ చెందిన క్రోమోజోములు కణవిభజనలోని ఏ దశలో కనిపిస్తాయి?
ఎ) ప్రథమ దశ బి) మధ్యస్థ దశ
సి) చలన దశ డి) అంత్య దశ

11) డైటరా క్రమానికి చెందిన డ్రోసోఫిలా లాంటి కీటకాల లాలాజలగ్రంథులు, మాల్పీజియన్ నాళిక కణాల్లో ఉండే ప్రత్యేకమైన పాలిటీన్ క్రోమోజోములను మొట్టమొదట గుర్తించిన శాస్త్రవేత్త ఎవరు?
ఎ) రూకార్ట్ బి) బాల్బియానీ
సి) ఫ్లెమింగ్ డి) ముల్లర్

12) డిఎన్ఎ వ్యాసం ఎంత?
ఎ) 2 nm బి) 20nm
సి) 200nm డి) 200A°

13) ఒక పిరమిడిన్‌కు బదులు మరో పిరమిడిన్‌ను లేదా ఒక ప్యూరైన్‌కు బదులు ఇంకో ప్యూరైన్ చేర్పగలిగే ఉత్పరివర్తనాన్ని ఏమంటారు?
ఎ) ట్రాన్స్‌వెర్షన్ బి) ట్రాన్సిషన్
సి) ట్రాన్స్‌డక్షన్ డి) పరిత్యాజ్యం

14) బ్యాక్టీరియా కణద్రవ్యంలో ఉండే క్రోమోజోమేతర డిఎన్ఎ ముక్కలను ఏమంటారు?
ఎ) ప్లాస్మాన్ బి) న్యూక్లియాయిడ్
సి) ప్లాస్మిడ్‌లు డి) ఏదీకాదు.

15) కణంలోని ఏ భాగంలో రైబోజోమల్ ఆర్ఎన్ఎ (rRNA) సంశ్లేషణ, రైబోజోము ఉపప్రమాణాల నిర్మాణం జరుగుతుంది?
ఎ) గాల్జీ సంక్లిష్టం బి) కణద్రవ్యం
సి) మైటోకాండ్రియా డి) కేంద్రకాంశం

16) డిఎన్ఎలో అడినైన్, థైమిన్ న్యూక్లియోటైడ్ల మధ్య ఏర్పడే హైడ్రోజన్ బంధాల సంఖ్య ఎంత?
ఎ) 1 బి) 2 సి) 3 డి) 4

17) శుక్రకణాల అగ్రభాగంలో ఉండే ఆక్రోజోమును ఏర్పరిచే కణభాగం-
ఎ) పెరాక్సీజోము బి) రైబోజోము
సి) సెంట్రోజోము డి) గాల్జీ సంక్లిష్టం

18) కేంద్రకామ్లాల్లో న్యూక్లియోటైడ్ల మధ్య ఏర్పడే బంధాలను ఏమంటారు?
ఎ) పెప్టైడ్ బంధాలు
బి) గ్లైకోసిడిక్ బంధాలు
సి) ఫాస్ఫోడైఎస్టర్ బంధాలు
డి) ఎస్టర్ బంధాలు

19) స్టీరాయిడ్ సంశ్లేషణ, విషనిర్మూలనలో పాల్గొనే కణభాగం-
ఎ) నునుపు అంతర్జీవ ద్రవ్యజాలకం
బి) గరుకు అంతర్జీవ ద్రవ్యజాలకం
సి) కేంద్రకాంశం
డి) ఏదీకాదు

20) శైలికలు, కశాభాల్లో సూక్ష్మనాళికల అమరిక 9+2 లాగా ఉంటే సెంట్రియోల్ (తారవత్ కేంద్రాలు)లో ఎలా ఉంటుంది?
ఎ) 9+2 బి) 9+0
సి) 9+3 డి) 3+9

21) డిఎన్ఎ న్యూక్లియోటైడ్లలో ఉండే చక్కెర ఏ రకానికి చెందినది?
ఎ) గ్లూకోజ్ బి) రైబోజ్
సి) డీఆక్సీరైబోజ్ డి) ఫ్రక్టోజ్

22) సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫ్రెష్ వాటర్ ఆక్వాకల్చర్ ఏ నగరంలో ఉంది?
ఎ) కోల్‌కతా బి) ముంబాయి
సి) కోచి డి) భువనేశ్వర్

23) నేషనల్ బ్యూరో ఆఫ్ ఏనిమల్ జెనిటిక్ రిసోర్సెస్ ఏ నగరంలో ఉంది?
ఎ) కర్నాల్ బి) పుణే
సి) న్యూఢిల్లీ
డి) తిరువనంతపురం

24) ఇండియన్ ల్యాక్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ ఎక్కడ ఉంది?
ఎ) భోపాల్ బి) డెహ్రాడూన్
సి) చెన్నై డి) రాంచీ

25) ఇంటర్నేషనల్ సెంటర్ ఫర్ జెనిటింగ్ ఇంజనీరింగ్ అండ్ బయోటెక్నాలజీ (ICGEB) ఎక్కడ ఉంది?
ఎ) న్యూఢిల్లీ బి) న్యూయార్క్
సి) బెంగుళూరు డి) చెన్నై

26) పిండాభివృద్ధిలో సంభవించే వైపరీత్యాల అధ్యయనాన్ని ఏమంటారు?
ఎ) రైనాలజీ బి) టెరటాలజీ
సి) ట్రామటాలజీ డి) టార్పిడాలజీ

27) మంచినీటి ఆవరణ వ్యవస్థలు, వాటిలో నివసించే జీవుల అధ్యయనాన్ని ఏమంటారు?
ఎ) ఎకాలజీ బి) ఆటెకాలజీ
సి) సినెకాలజీ డి) లిమ్నాలజీ

28) టిక్‌ల, మైట్‌ల అధ్యయనాన్ని ఏమంటారు?
ఎ) ఎంటమాలజీ బి) ఏరినాలజీ
సి) అకరాలజీ డి) మాలకాలజీ

29) తిమింగలాల అధ్యయనం-
ఎ) సెటాలజీ బి) కైరోటెరాలజీ
సి) హెర్పటాలజీ డి) ఇక్థియాలజీ

30) బహురూపకత (polymorphism)ను ప్రదర్శించే కణాంగాలు ఏవి?
ఎ) రైబోజోములు బి) సెంట్రోజోములు
సి) లైసోజోములు డి) డిక్టియోజోములు

31) ఈ కింది వాటిలో ద్వితీయ లైసోజోములుగా వేటిని పరిగణిస్తారు?
ఎ) శేషపదార్థ నిర్మాణాలు
బి) స్వయం భక్షక ఫాగోసోమ్‌లు
సి) జీర్ణరిక్తికలు
డి) పైవన్నీ

32) పెరాక్సీజోములు ఎక్కడ కనిపిస్తాయి?
ఎ) బ్యాక్టీరియా కణాల్లో మాత్రమే
బి) మొక్క కణాల్లో మాత్రమే
సి) జంతు కణాల్లో మాత్రమే
డి) మొక్క, జంతు కణాల్లో మాత్రమే

33) శ్వాసక్రియలో పాల్గొనే కణభాగం-
ఎ) హరితరేణువులు బి) మైటోకాండ్రియా
సి) గాల్జీ సంక్లిష్టం డి) అంతర్జీవ ద్రవ్యజాలకం

34) బ్యాక్టీరియాను మొట్టమొదట గుర్తించిన శాస్త్రవేత్త-
ఎ) రాబర్ట్‌హుక్ బి) జాన్ రే
సి) ష్లీడెన్, ష్వాన్ డి) లీవన్‌హుక్

35) రెండు నెలల వయసులోపు శిశువుల అధ్యయనాన్ని ఏమంటారు?
ఎ) జెనియాలజీ బి) నియోనాటాలజీ
సి) ఇటియాలజీ డి) పెడియాట్రిక్స్

36) పర్యావరణ స్థితిగతులను అభివృద్ధిచేసి మానవజాతి మనుగడను మెరుగుపరిచే శాస్త్రం-
ఎ) యూజెనిక్స్ బి) యూథెనిక్స్
సి) యూఫెనిక్స్ డి) ఏదీకాదు

37) పక్షుల, చేపల వలస లాంటి జీవుల చర్యలపై వాతావరణ రుతుక్రమాల ప్రభావాన్ని అధ్యయనం చేసే శాస్త్రం-
ఎ) ఫ్రెనాలజీ బి) ఏథాలజీ
సి) ఫినాలజీ డి) ఆటెకాలజీ

38) రెండు లేదా అంతకంటే ఎక్కువ పాలీపెప్టైడ్లు సంలీనం చెంది ఏర్పడే సంక్లిష్ట నిర్మాణాన్ని ఏమంటారు?
ఎ) ప్రాథమిక నిర్మాణం
బి) ద్వితీయ నిర్మాణం
సి) తృతీయ నిర్మాణం
డి) క్వాటర్నరీ నిర్మాణం

39) అమైనో ఆమ్లాల్లో ఇమినో ఆమ్లాలు ఏవి?
ఎ) మిథియోనిన్, సిస్టైన్
బి) ల్యూసిన్, గ్లైసిన్
సి) ప్రొలైన్, హైడ్రాక్సీప్రొలైన్
డి) అలనిన్, ఫినైల్ అలనిన్

40) కేంద్రకపూర్వ కణాల్లోని ప్రధాన జన్యుపదార్థాన్ని ఏమంటారు?
ఎ) జీనోఫోర్
బి) న్యూక్లియాయిడ్
సి) బ్యాక్టీరియల్ క్రోమోజోమ్
డి) పైవన్నీ

41) మెలనిన్ వర్ణకం, థైరాక్సిన్ హార్మోన్ ఏ అమైనో ఆమ్లం నుంచి ఏర్పడతాయి?
ఎ) టైరోసిన్ బి) హిస్టిడిన్
సి) ఆర్జినిన్ డి) థ్రియోనైన్

42) ఈ కింది డిఎన్ఎ రూపాల్లో ఎడమ వైపు మెలిక తిరిగి ఉండేది ఏది?
ఎ) B-డిఎన్ఎ బి) Z-డిఎన్ఎ
సి) A-డిఎన్ఎ డి) ఏదీ కాదు

43) బ్యాక్టీరియా కశాభాలు ఏ ప్రొటీన్‌తో ఏర్పడతాయి?
ఎ) పిలిన్ బి) ఫింబ్రిన్
సి) ఆక్టిన్ డి) ఫ్లాజెల్లిన్

44) ఉత్పరివర్తనం చెందగల అతిచిన్న డిఎన్ఎ భాగాన్ని ఏమంటారు?
ఎ) రెకాన్ బి) సిస్ట్రాన్
సి) మ్యుటాన్ డి) ఒపెరాన్

45) ప్రొటీన్ మాత్రమే ఉండి మ్యాడ్‌కౌ, స్క్రేపీ లాంటి వ్యాధులను కలిగించే 'Protein Infectious Particles' ను ఏమంటారు?
ఎ) విరియన్లు బి) విరియాడ్లు
సి) ఎపిజోమ్‌లు డి) ప్రియాన్లు

46) బయోటెక్నాలజీ ఆవిర్భవానికి మూలకారణమైన రిస్ట్రిక్షన్ ఎండో న్యూక్లియేజ్ ఎంజైములను కనుగొన్నదెవరు?
ఎ) నాథన్స్ బి) ఆర్బర్
సి) స్మిత్ డి) అందరూ

47) నిజకేంద్రక కణ జన్యువుల్లో ప్రొటీన్‌కు సమాచారం లేని నాన్‌కోడింగ్ డిఎన్ఎ భాగాలను ఏమంటారు?
ఎ) ఎగ్జాన్లు బి) ఇంట్రాన్లు
సి) ట్రాన్స్‌పోజాన్లు డి) ఏదీకాదు

48) గ్రామ్ స్టెయినింగ్ ప్రయోగంలో బ్యాక్టీరియాపై ఉపయోగించే రంగు (Dye) ఏది?
ఎ) అసిటోకార్మైన్
బి) జానస్‌గ్రీన్‌బి
సి) క్రిస్టల్ వైలెట్- అయోడిన్
డి) లైకోపీన్

49) మనిషిలోని ఒక అయిదో క్రోమోజోము చిన్నబాహువులోని కొద్ది భాగం పరిత్యాజ్యం (Deletion) చెందడం ద్వారా వచ్చే వ్యాధి-
ఎ) టర్నర్స్ సిండ్రోమ్
బి) ఎడ్వర్డ్స్ సిండ్రోమ్
సి) డౌన్స్ సిండ్రోమ్
డి) క్రీ-డూ-చాట్ లేదా క్యాట్ క్రై సిండ్రోమ్

50) పురుషుల్లో వచ్చే క్లైన్ ఫెల్టర్ సిండ్రోమ్ అనే క్రోమోజోము వైపరీత్యానికి కారణం-
ఎ) 23వ జతలో త్రయస్థితికం
బి) 21వ జతలో త్రయస్థితికం
సి) 18వ జతలో త్రయస్థితికం
డి) 23వ జతలో ఏకస్థితికం

51) గ్రామ్ నెగెటివ్ బ్యాక్టీరియా కణాల వెలుపల ఆవరించి ఉండే బాహ్యపొర (outer membrane) దేంతో తయారై ఉంటుంది?
ఎ) లిపో ప్రొటీన్లు బి) పెప్టిడో గ్లైకాన్
సి) లిపోపాలీశాకరైడ్ డి) సెల్యులోజ్

52) శరీరంలోని ఒక భాగం నుంచి రక్తం, శోషరసం ద్వారా క్యాన్సర్ కణాలు ఇతర భాగాలకు వ్యాప్తి చెందే విధానాన్ని ఏమంటారు?
ఎ) ట్రాన్స్‌ఫర్మేషన్ బి) మెటాస్టాసిస్
సి) మెటామార్ఫోసిస్ డి) ట్రాన్స్‌డక్షన్

53) క్షార ప్రొటీన్లు అయిన హిస్టోన్‌లలో అధికంగా ఉండే క్షార అమైనో ఆమ్లాలు ఏవి?
ఎ) లైసీన్, ఆర్జినీన్
బి) వాలైన్, ఐసోల్యూసీన్
సి) ఆస్పర్టిక్ ఆమ్లం, గ్లైసిన్
డి) ట్రిప్టోఫాన్, సిస్టీన్

54) 60S రైబోజోము ఉపప్రమాణంలో ఉండే rRNA ప్రొటీన్ల సంఘటనం ఏది?
ఎ) 16S rRNA+21 ప్రొటీన్లు
బి) 18S rRNA+30 ప్రొటీన్లు
సి) 23S rRNA+ 5SrRNA+31 ప్రొటీన్లు
డి) 28S+5.8S+5S rRNA+50 ప్రొటీన్లు

55) ఇండియన్ క్యాన్సర్ రిసెర్చ్ సెంటర్ ఎక్కడ ఉంది?
ఎ) ముంబాయి బి) నాగ్‌పూర్
సి) ఇండోర్ డి) మైసూర్

56) ఇండియన్ వెటర్నరీ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ ఎక్కడ ఉంది?
ఎ) కోయంబత్తూర్ బి) ఇజత్‌నగర్
సి) కాన్పూర్ డి) ముంబాయి

57) సెంట్రల్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ డ్రైలాండ్ అగ్రికల్చర్ (CRIDA) ఎక్కడ ఉంది?
ఎ) న్యూఢిల్లీ బి) బెంగుళూరు
సి) హైదరాబాద్ డి) చెన్నై

58) ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైజీన్ అండ్ పబ్లిక్ హెల్త్ ఎక్కడ ఉంది?
ఎ) కోల్‌కతా బి) ఘజియాబాద్
సి) అహ్మదాబాద్ డి) లక్నో

59) ఇండస్ట్రియల్ టాక్సికాలజీ రిసెర్చ్ సెంటర్ ఎక్కడ ఉంది?
ఎ) చండీఘర్ బి) దుర్గాపూర్
సి) లక్నో డి) గుల్బర్గ్

60) టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసెర్చ్ (TIFR) ఎక్కడ ఉంది?
ఎ) న్యూఢిల్లీ బి) బెంగుళూరు
సి) చెన్నై డి) ముంబాయి

KEY

1) సి 2) బి 3) డి 4) సి 5) సి 6) ఎ 7) ఎ 8) బి 9) బి 10) బి 11) బి 12) ఎ 13) బి 14) సి 15) డి 16) బి 17) డి 18) సి 19) ఎ 20) బి 21) సి 22) డి 23) ఎ 24) డి 25) ఎ 26) బి 27) డి 28) సి 29) ఎ 30) సి 31) డి 32) డి 33) బి 34) డి 35) బి 36) బి 37) సి 38) డి 39) సి 40) డి 41) ఎ 42) బి 43) డి 44) సి 45) డి 46) డి 47) బి 48) సి 49) డి 50) ఎ 51) సి 52) బి 53) ఎ 54) బి 55) ఎ 56) బి 57) సి 58) ఎ 59) సి 60) డి.

(రచయిత హైదరాబాద్‌లోని అంబేద్కర్ స్టడీసర్కిల్ ఫ్యాకల్టీ సభ్యులు)

# ప్రతిభ

**SPOKEN ENGLISH**
ఆంగ్లభాషణ 205

# that's more than its worth

**Nagesh:** Hi Mangesh, what are you doing in this Travel kit shop? (Are you) buying a bag?
(ఈ ట్రావెల్ కిట్ షాప్‌లో ఏం చేస్తున్నావు? బ్యాగ్ ఏమన్నా కొంటున్నావా? )

**Mangesh:** That's right
(అవును)

**Nagesh:** You've bags and suitcases of all sizes, shapes and colours here. (Is) none to your liking?
(ఇక్కడ అన్ని సైజులూ, ఆకారాలు, రంగులూ ఉన్న బ్యాగులు, సూట్‌కేసులు ఉన్నాయి కదా. నీకేవీ నచ్చలేదా? )
(To your liking = నీకు నచ్చింది)
Look at this one = ఇది చూడు

**Mangesh:** This is bigger than the one I want. I want a smaller bag than this.
(నాక్కావాల్సిన బ్యాగ్ కన్నా ఇది పెద్దది. నాకు ఇంతకంటే చిన్నది కావాలి )

**Nagesh:** That One may be the size you want.
(అది నీక్కావాల్సిన సైజ్ అవ్వొచ్చు)

**Mangesh:** No that's smaller than the one I want.
(లేదు. అది నాక్కావాల్సిన దానికంటే చిన్నది)

**Nagesh:** See if this suits you?
( ఇది సరిపోతుందేమో చూడు)

**Mangesh:** Yes. That's exactly what I want.
(అవును. నాకు కచ్చితంగా కావాల్సిందదే.)

**Nagesh:** This looks fine, but look at the price tag here. It says it is Rs. 500/-
(చాల బాగుందిది కానీ ధర చూడు 500 రూపాయలు)

**Mangesh:** Oh, my! that's more than its worth.
(అబ్బో! ఇదంత చేయదు.)
(More than its worth = దాని విలువ అంత చేయదు.)

**Nagesh:** Let's look for something less expensive.
(అంతకంటే తక్కువ ధరున్నదేమన్నా ఉందేమో చూద్దాం.)

**Mangesh:** This is the least expensive of all the bags this size here. Let's bargain. See if we can get it for Rs 400. It is not worth more than that.
(ఇక్కడున్న ఆ సైజ్ బ్యాగ్‌ల్లో ఇదే అత్యంత తక్కువ. 400 రూపాయలకు వస్తుందేమో చూద్దాం. అంతకంటే ఎక్కువ చేయదు)

**Nagesh:** You are right. Let's ask if for Rs 400.
(నువ్వన్నది బాగుంది. 400 రూపాయలకిస్తాడేమో అడుగుదాం)

**Mangesh:** Let's try
(ప్రయత్నం చేద్దాం.)

M. SURESAN

గత lesson లో adjectives of comparison గురించి కొన్ని విషయాలు తెలుసుకున్నాం కదా? వస్తువులను, వ్యక్తులనూ పోల్చి మెరుగు తరుగులు నిర్ణయించటం దాదాపు ప్రతిక్షణం జీవితంలో చేస్తూనే ఉంటాం. దానికి మన conversation (Spoken English) లో ప్రాధాన్యం చాలా ఎక్కువ. అందుకని మనం చెప్పాలనుకున్న భావాన్ని correct గా చెప్పటానికి, 3 degrees of comparison లో వాక్యనిర్మాణం ఎలా ఉంటుందో గత lesson లో చూశాం. దాన్ని మరో సారి క్లుప్తంగా చూద్దాం:

**a) Superlative:**

The Elephant is the largest land animal.
భూచర జంతువుల్లో ఏనుగు అతిపెద్దది.
ఇది superlative. ఇందులో word order (మాటల అమరిక) చాలా simple.
The elephant (sub)+is(verb)+the+superlative adjective+...

b) The elephant is larger than any other land animal / all other land animals.
(భూచర జంతువుల్లో ఏనుగు మిగతా ఏ జంతువుల కంటే / అన్ని ఇతర జంతువుల కంటే పెద్దది).
The elephant (sub)+is(verb)+comparative adjective (larger)+than any other (singular) / than all other (plural)+...

c) Positive: No other land animal is so (as) large as the elephant
(ఏ ఇతర భూచర జంతువూ ఏనుగంత పెద్దది కాదు)
Word order: No other+Subject (animal) +verb +so/as + positive adjective+as+the (subject)

ఇవీ మనం తెలుసుకున్నది. అయితే మనం చేసే పోలికలు ఎప్పుడు కూడా ఇంత simple (సరళం)గా, direct గా ఉండకపోవచ్చు ఇంకా సంక్లిష్ట (complex ) మైన పోలికలు కూడా చేస్తుంటాం. ఉదాహరణకు ఈ lesson మొదట్లో Nagesh, Mangesh conversation చూద్దాం.

**a) Mangesh:** This is bigger than the one I want.
(ఇది నాక్కావల్సిన దానికంటే పెద్దది)

అంటే మీరు గమనించే ఉంటారు. ఇక్కడ Mangesh పోలుస్తున్నది రెండు వస్తువులను మాత్రమే అవి తనక్కావలసిన bag, తను చూస్తున్న bag.

**b) Mangesh:** That's smaller than the one I want.
(నాక్కావాల్సిన దానికంటే అది చిన్నది)

ఇక్కడ కూడా అంతే కదా? రెంటి మధ్య మాత్రమే పోలిక. తనక్కావల్సింది. తనకు అక్కడ దొరుకుతున్నది.

**c) Mangesh:** Oh, my! That's more than its worth.
ఇక్కడ కూడా bag ధరకు, దాని విలువకు అంటే రెంటి మధ్యే పోలిక.

**d) Mangesh:** It is not worth more than that.
ఇది కూడా ధరకూ, bag విలువకు మధ్య ఉన్న పోలిక తెలిపే వాక్యం.

**e) Nagesh:** Let's look for something less expensive.
ఇక్కడ కూడా ఈ bag కూ అంతకంటే తక్కువ ధరకూ పోలిక.

ఇలా మనం రెండు వస్తువులనూ, ఇద్దరు వ్యక్తులనూ పోలుస్తుంటాం. అటువంటప్పుడు degree of comparison ను బట్టి word order (మాటల అమరిక) కూడా మారుతుంటుంది. అంతే కాకుండా, రెంటి కన్నా ఎక్కువ పోల్చినప్పుడు ఉండే sentence word order కూ, రెంటిని మాత్రమే compare చేసినప్పుడు ఉండే sentence word order కూ చాలా తేడా ఉంటుంది.

1) రెంటికన్నా ఎక్కువ వాటిని పోల్చినప్పుడు superlative degree లోని adjective ముందు the కచ్చితంగా రావాలి.

**eg:** a) The elephant is the biggest of all land animals / the biggest land animal.
b) Hyderabad is the largest city in A.P.
(A.P. లో హైదరాబాద్ అతిపెద్ద నగరం)
C) He is the most popular actor on the Telugu screen.
(తెలుగు తెర మీద అతడు అత్యంత ప్రజాభిమానం ఉన్న నటుడు)

కాబట్టి superlative adjective ముందు ఎప్పుడూ the తప్పనిసరి.

2) అలాగే రెంటికన్నా ఎక్కువ వాటిని పోల్చినపుడు comparative adjective తరవాత than any other / than all other తప్పకుండా రావాలి. than any other అయితే ఆ తరవాత subject, singular number; Than all other అయితే ఆ తరవాత subject, plural number అవుతాయి.

a) The Prime Minister is more powerful than any other minister / all other ministers.
(ఇతర మంత్రులందరి కంటే కూడా ప్రధానమంత్రికి అధికారం ఎక్కువ)

b) The Pacific is deeper than any other ocean / all other oceans in the world.
(ఇతర మహాసముద్రాల కంటే Pacific లోతైనది)

c) He is older than any other members / all other members of the family.
(కుటుంబ సభ్యులందరిలోనూ అతడు వయసులో పెద్ద)

**Positive:** Positive degree లో మాట్లాడేటప్పుడు No other తో ప్రారంభిస్తాం. ఆ తరవాత Positive adjective ముందు so/as కానీ, positive adjective తరవాత as వస్తాయి.

a) No other tree here is so (as) tall as the coconut tree there.
(ఇక్కడున్న ఏ చెట్టు కూడా ఆ కొబ్బరిచెట్టంత పొడుగు కాదు)

b) No other metal is so (as) bright as gold.
(ఏ ఇతర లోహమూ బంగారమంత ప్రకాశవంతం కాదు)

c) No other student in the class is as (so) good at the subject as Janaki
(class లో ఇతర విద్యార్థులెవరూ ఆ subject లో జానకంత బాగా తెలిసినవాళ్లు కాదు.)

ఈ patterns (వాక్యాల నమూనాలు) ఈ మూడు degrees లో పైన చూపినట్లే ఉండాలి. ఇలా రెండిటికంటే ఎక్కువ వస్తువులను పోల్చినప్పుడు మీరు గమనించాల్సిన ఇంకో విషయం- superlative, comparative. ఈ రెండు degrees లో sentences లో not రాదు. positive degree లో sentence – no other తో ప్రారంభమవుతుంది.

(అయితే, అన్నిటికన్నా... కాదు, అనే superlative ఉంటుంది. దాని సంగతి త్వరలోనే చూస్తాం.)

ఇప్పుడు in the conversation at the beginning of the lesson లా రెంటినీ పోల్దాం అనుకోండి. అప్పుడు చాల ముఖ్యమైన అంశం. రెంటినే/ఇద్దరు వ్యక్తులనే పోల్చినపుడు superlative degree ఉండదు. Positive, Comparative మాత్రమే ఉంటాయి.

1) This is bigger than the one I want.
(నాక్కావల్సిన దానికంటే ఇది పెద్దది)
- Comparative (bigger)
దీనికి positive degree: The one I want is not as (so) big as this.
దీనికి superlative ఉండదు. ఈ విషయం వచ్చే lesson లో చూద్దాం.

**Exercise:** Practise the following aloud. Make sentences using the following words, using the degree given in brackets.

**eg:** Mt Everest - high peak in the world. (comparative) (Mt-Mount- పర్వతాల పేర్లముందు వాడతాం) (Peak- శిఖరం)

**Ans:** Mt Everest is higher than any other peak in the world.

1) This diamond necklace - costly jewel in the shop - (superlative)
2) Kashmir - cold - state in India (Positive)
3) This - good song - the movie (superlative)
4) Rentachintala - hot place- A.P. (comparative)
5) December - cold month. (Positive)
6) Andhra Pradesh- big state South India (comparative)

**Answers:**

1) This diamond necklace is the costliest jewel in the shop.
(ఈ షాప్‌లో ఈ వజ్రాల necklace అత్యంత ఖరీదైనది) (Superlative degree)
2) No other state in India is as (so) cold as Kashmir.
(భారత్‌లో ఏ ఇతర రాష్ట్రం కాశ్మీర్ అంత చలిగా ఉండదు) (positive degree)
3) This is the best song in the movie.
(ఆ చిత్రంలో ఇది అత్యంత గొప్ప పాట- superlative degree.)
4) Rentachintala is hotter than any other place / all other places in A.P.
(ఆంధ్రప్రదేశ్‌లో రెంటచింతల ఇతర ఏ ప్రదేశానికంటే/ ఇతర ప్రదేశాలకన్నా వేడి ప్రదేశం)
5) No other month is so (as) cold as December.
(ఏ (ఇతర) నెలా December అంత చలికాదు)
6) Andhra Pradesh is bigger than any other state/ all other states in South India.
(దక్షిణ భారతంలో ఇతర ఏ రాష్ట్రం/ఇతర రాష్ట్రాలకంటే ఆంధ్రప్రదేశ్ పెద్దది)

**Q A**

1. How to pronounce the words? Is there any rule please.
b) Occasion, situation - what is the difference between these words? ( give some examples). **టి. వెంకటేశ్వరరావు, రేపల్లె**

i) Any good English - English dictionary will give you the symbols of pronunciation - refer to it.

ii) Situation = పరిస్థితి. ఒక ప్రదేశంలో ఒక సమయంలో ఉన్న /జరుగుతున్న సంఘటనల కలయిక.

A difficult situation = క్లిష్ట పరిస్థితి; financial situation = ఆర్థిక పరిస్థితి political situation = రాజకీయ పరిస్థితి.

Occasion = సందర్భం - ఇక్కడ సంఘటనలు, పరిస్థితుల కంటే సమయానికి ప్రాముఖ్యం ఎక్కువ. పైన situation వాడిన చోటల్లా occasion వాడటం కుదరదు కదా.

I have met him on two or three occasions = అతన్ని నేను రెండు మూడు సందర్భాల్లో కలుసుకున్నాను.

a) On the last occasion that I met him, he was in a difficult situation = అతన్ని నేను ఇంతకుముందు కలుసుకున్నప్పుడు అతను చాలా క్లిష్ట పరిస్థితిలో ఉన్నాడు.

b) She was able to manage the situation = ఆ పరిస్థితిని ఆమె బాగా చక్కదిద్దగలుగుతుంది.

**Laxman:** Hi Suman, do you know Bhavan is in town?
(భవన్ ఊళ్లోకొచ్చాడు (ఉన్నాడు) తెలుసా? )

**Suman:** Oh, is he? when did he come?
(అవునా? ఎప్పుడొచ్చాడు? )

**Laxman:** Yesterday. He won the first round of the badminton match.
(నిన్న బ్యాడ్మింటన్ మ్యాచ్‌లో మొదటి రౌండ్ గెలిచాడు.)

**Suman:** That's no surprise to me. I knew he would win. He is certainly a better player than his rival in this round.
(అదేం నాకు పెద్ద ఆశ్చర్యం కాదు. వాడు గెలుస్తాడని నాకు తెలుసు. ఈ రౌండ్‌లో తన ప్రత్యర్థికంటే అతడు కచ్చితంగా మెరుగైన ఆటగాడు)
(rival=రైవల్= ప్రత్యర్థి, పోటీదారు)

**Laxman:** I was sure of that too. Mind you, Bhavan is taller than Sravan, that rival of his. That certainly is an advantage in badminton
(నేనూ అలానే అనుకున్నా. ఇంకోటి గుర్తుంచుకో. భవన్, తన ప్రత్యర్థి శ్రవణ్ కంటే పొడవు. బ్యాడ్మింటన్‌లో అది (పొడవు) ఉపయోగపడే విషయం.)

Advantage = అడ్వాన్టిజ్-'డ్వా' నొక్కి పలుకుతాం= సహాయకారి. మనకు మేలు కలిగించేది.

Mind you = గుర్తు తెచ్చుకో/ తెలుసుకో, (జాగ్రత్త అని కూడా)

**Suman:** Moreover, Bhavan's movements are quicker than Sravan's.
(అంతే కాకుండా, Sravan కదలికల కంటే Bhavan కదలికలు చాలా వేగంగా ఉంటాయి.)

**Laxman:** Let's see how he is going to fare in the next match. (తర్వాత మ్యాచ్‌లో ఎలా చేస్తాడో చూద్దాం.)

fare = చేయటం/ఆడటం లాంటివి.

How did you fare in the exam yesterday?
(నిన్న నువ్వు exam ఎలా రాశావు? )

How did he fare in the debate contest last week?
(అతను debate (వక్తృత్వ) పోటీలో ఎలా చేశాడు? )

**Suman:** He has good chances of winning that too.
(అది కూడా గెలిచే అవకాశాలు బాగానే ఉన్నాయి.)

**Laxman:** OK. When are you taking your mom to Delhi?
(మీ అమ్మను ఢిల్లీ ఎప్పుడు తీసుకెళ్తున్నావు? )

**Suman:** This Wednesday.
(ఈ బుధవారం)

**Laxman:** Have you booked the tickets?
(టికెట్లు బుక్ చేసుకున్నావా? )

**Suman:** Yes, by the AP Express.
(అవును. ఏపీ ఎక్స్‌ప్రెస్ లో)

**Laxman:** That's good. That's faster than the special train you thought of going by.
(మంచి పనిచేశావు. నువ్వు వెళ్లాలనుకున్న స్పెషల్ ట్రెయిన్ కంటే ఇది వేగంగా వెళుతుంది.)

**Suman:** It is. This is more comfortable than that too.
(ఇది దాని కంటే ఎక్కువ సుఖంగా ఉంటుంది)

**Laxman:** This is certainly better than that in every respect. When are you returning?
(ఏ విధంగా చూసినా, ఆ స్పెషల్ ట్రెయిన్ కంటే ఏపీ ఎక్స్‌ప్రెస్ మంచిది. ఎప్పుడు తిరిగొస్తున్నావు? )

**Suman:** I will return in a week. My mother's stay there will be longer.
(నేను వారానికల్లా తిరిగొస్తాను. అమ్మ అక్కడ ఎక్కువ రోజులుంటుంది.)

**Laxman:** OK. A happy time in Delhi to you and your mom.
(నువ్వు, మీ అమ్మా అక్కడ సరదాగా గడపాలని నా కోరుకుంటున్నా.)

**Suman:** Thank you.

కిందటి Lesson లో చూశాం. రెండింటికంటే ఎక్కువ వస్తువులనూ, వ్యక్తులనూ పోల్చినప్పుడు మూడు degrees (positive, comparative and superlative) ఉంటాయి. ఆ degrees లోని sentences లో, Word order ఎలా ఉంటుందో చూశాం కదా? అంతే కాకుండా, రెండింటిని మాత్రమే పోల్చినప్పుడు superlative ఉండదు అని కూడా తెలుసుకున్నాం కదా.

Now look at the following sentences from the conversation between Laxman and Suman at the beginning of the lesson:

1) He is certainly a better player than his rival.
(అతడి ప్రత్యర్థి కంటే అతడు మెరుగు)
(better- comparative degree of good- ఇక్కడ పోలిక ఇద్దరి మధ్య మాత్రమే- Bhavan, Sravan మధ్య)
(Better- comparative degree)

2) Bhavan is taller than Sravan =
శ్రవణ్ కంటే భవన్ పొడవు.
(comparison only between two) (taller- comparative degree)

3) Bhavan's movements are quicker than Sravan's.
(శ్రవణ్ కదలికల కంటే భవన్ కదలికలు వేగంగా ఉంటాయి) (quicker - comparative)

4) That (AP Express) is faster than the special train. (special train కంటే AP Express వేగవంతమైంది- comparison only between two) (faster- comparative)

5) This is certainly better than that = ఇది దాని కంటే మెరుగు (comparison only between two)

6) Mother's stay will be longer than mine.
(నాకంటే, మా అమ్మ ఎక్కువ రోజులుంటుంది- comparison only between two.
Longer - comparative)

M. SURESAN

రెండింటి కంటే ఎక్కువ విషయాలను పోల్చినప్పుడు, superlative, comparative, positive లో word order (మాటల అమరిక) ఎలా ఉంటుందో మనం తెలుసుకున్నాం.

అలా కాకుండా పై sentences అన్నింటిలో పోలిక రెండింటి మధ్యనే.

1) పోలిక రెండు విషయాల మధ్యనే అయినప్పుడు, superlative degree ఉండదు.
2) రెండు విషయాలనే పోల్చినప్పుడు comparative degree, positive degree word order కూ రెండింటికంటే ఎక్కువ విషయాలను పోల్చినప్పుడు comparative, superlative word order కూ చాలాతేడా ఉంటుంది.

ఆనంద్, అమర్ అనే ఇద్దరిని పోల్చామనుకోండి.
1) అప్పుడు superlative ఉండదు.
2) Comparative లో sentence కు ముందు ఆనంద్, sentence కు చివర అమర్ వస్తే, positive degree లో ఈ వరస మారి అమర్ sentenceకు ముందు, ఆనంద్ sentence కు చివర వస్తాయి.
3) Comparative లో not లేకపోతే, positive లో not వస్తుంది. comparative లో not ఉంటే positive లో not రాదు.

**Comparative:**
Anand is shorter than Amar.
(అమర్ కంటే ఆనంద్ పొట్టి)

**Positive:**
Amar is not so (as) short as Anand.
(అమర్, ఆనంద్ అంత పొట్టికాదు.)

comparative లో, positive లో Amar, Anand position మారటం, comparative లో లేని not – positive లో రావటం చూశారు కదా. positive లో మామూలుగా ముందు so (as), తర్వాత as వస్తాయి. గమనించండి ఇంకా:

Hema is taller than Kshema. (క్షేమ కంటే హేమ పొడవు) (Taller - comparative degree) - ఇక్కడ పోలిక ఇద్దరి మధ్యనే, ఇలాంటి సందర్భంలో superlative ఉండదు. దీనికి positive degree: Kshema is not so (as) tall as Hema.
(Kshema, హేమ అంత పొడవు కాదు) comparison only between two (రెండు విషయాల మధ్య మాత్రమే పోలిక):

**Comparative:**
Sunder is cleverer than Sukumar
(సుకుమార్ కంటే సుందర్ తెలివైనవాడు)

**Positive:**
Sukumar is not so (as) clever as Sundar
(సుకుమార్, సుందరంత తెలివైనవాడు కాదు.)

**ఇక్కడ రెండు ముఖ్య విషయాలు గమనించండి:**
1) Comparative లో, Sundar ముందు, Sukumar చివరా ఉన్నాయి. అదే positiveలో, వాటి స్థానాలు తారుమారై, Sukumar ముందూ, Sundar చివర వస్తున్నాయి కదా.
2) Comparative లో not లేదు, positive లో not ఉంది కదా.

ఇంకో example చూద్దాం:

**Comparative:**
Vijayawada is hotter than Hyderabad .
(హైదరాబాద్ కంటే, విజయవాడ వేడెక్కువ)
(విజయవాడ ముందూ, హైదరాబాద్ చివర. Not లేదు)

**Positive:**
Hyderabad is not so (as) hot as Vijayawada.
(హైదరాబాద్ విజయవాడంత వేడికాదు)
(హైదరాబాద్ ముందు, విజయవాడ చివర; Not ఉంది)




SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 206

# హైదరాబాద్ విజయవాడంత వేడికాదు

Let's now try to change the comparative degree statements in the conversion between Laxman and Suman, at the beginning of this lesson into positive degree statements:

**Exercise:**
Practise the following aloud in English:

**Sankar:** మన question papers అన్నిట్లో ఇది అతి కష్టంగా ఉంది కదా?
(కష్టం = tough) - superlative వాడండి)

**Omkar:** కాదు ఇది పోయినసారి paper అంత కష్టం కాదు.
(పోయినసారి paper=the paper last time/ the last exam paper.)

**Sankar:** అయినా కిందటిసారి నా marks కంటే నీ marks ఎక్కువ . (కిందటిసారి-last time )

**Omkar:** అయినా, ఈసారి నా marks , గతసారి అంత బాగా ఉంటాయన్న నమ్మకం నాకులేదు. (నమ్మకం నాకులేదు =I am not sure).

**Sankar:** ఈ college మొత్తం లెక్చరర్స్‌లో మీ లెక్చరర్ గొప్ప.

**Omkar:** మీ లెక్చరర్ కూడా గొప్పే, కానీ నువ్వన్నట్టు మా లెక్చరర్ అంత గొప్పకాదు.

**Sankar:** నేను Tuition తీసుకోవాలనుకుంటున్నాను. ఎవరి దగ్గరకెళ్లమంటావు?

**Omkar:** మీ lecturer దగ్గరకే వెళ్లు.

**Answer:**

**Sankar:** Isn't this the toughest of all our question papers?

**Omkar:** No. This is not as (so) tough as the paper last time.

**Sankar:** But your marks were higher than mine last time.

**Omkar:** But I am not sure that my marks this time will be as good as my marks last time.

**Sankar:** Your lecturer is the best/greatest (of all) in the college.

**Omkar:** Your lecturer is good too, but not so (as) good as our lecturer.

**Sankar:** I want to take tution. who do you want me/to go to/suggest that I go to?

**Omkar:** Go to your lecturer.

| COMPARATIVE | POSITIVE |
| --- | --- |
| 1) He is certainly a better player than his rival. | His rival is not so (as) good a player as he (is) |
| 2) Bhavan is taller than Sravan. | Sravan is not so (as) tall as Bhavan |
| 3) Bhavan's movements are quicker than Sravan's. | Sravan's movements are not so (as) quick as Bhavan's |
| 4) AP Express is faster than the special train. | The special train is not so (as) fast as the AP Express. |
| 5) This certainly is better than that. | That certainly is not so (as) good as this. |
| 6) Mother's stay will be longer than mine. | Mine (నాది) will not be so (as) long as mother's stay. |







# I appreciate your confidence

**Vasanth:** Hi Hemanth, how was the match yesterday?
(నిన్నటి మ్యాచ్ ఏమైంది? )

**Hemanth:** We did play well. We did win too, but our game was not better than last sunday's game.
(మేం బాగానే ఆడాం, గెలిచాం కూడా. అయితే నిన్న మా ఆట పోయిన ఆదివారం ఆటకంటే మెరుగ్గా లేదు.)

ఇంతకు ముందు ఒకసారి చెప్పాం. మళ్లీ చెప్తున్నాం. గమనించండి. Not లేనప్పుడూ, question కానప్పుడూ కూడా, did వాడతాం, పైవాక్యాల్లోలా. అలా వాడితే విషయాన్ని కాస్త గట్టిగా చెప్పినట్లవుతుంది.

I did meet him yesterday =
నేను నిన్న అతడిని కలుసుకున్నా.
(ఇలాంటి expressions మీ conversation లో practice చేయండి.)

**Vasanth:** Why do you say so?
(ఎందుకలా అంటున్నావు? )

**Hemanth:** Our score this time were not more than that last time. Moreover the wickets we took are not more than those we took last time.
(కిందటిసారి స్కోర్ కంటే ఈసారి మా స్కోర్ ఎక్కువ కాదు. ఈసారి మేం తీసుకున్న వికెట్లు కిందటిసారి వికెట్ల కంటే ఎక్కువ కాదు)

**Vasanth:** Why so?
(ఎందువల్ల అలా? )

**Hemanth:** We made a few changes in the team. We had Kiran and Charan in place of Mahesh and Satish, but they were no greater than Mahesh and Satish.
(మేం టీం లో కొన్ని మార్పులు చేశాం. మహేష్, సతీష్ బదులు, కిరణ్, చరణ్ లను తీసుకున్నాం. వాళ్లకంటే వీళ్లు గొప్పగా లేరు)

M. SURESAN

**Vasanth:** What about the pitch?
(పిచ్ ఎలా ఉంది? )

(Pitch= రెండు వైపులా వికెట్ల మధ్య పచ్చిక అంతగా లేని భాగం)

**Hemanth:** The pitch this time was not faster than the pitch last time. That's why we took a spinner in place of a pace bowler.
(పిచ్ ఈసారి fast bowling కు అంత అనుగుణంగా లేదు. అందుకే మేం, ఓ fast bowler బదులు. ఓ spin bowler ను తీసుకున్నాం)

(pace bowler = fast bowler.
In place of = బదులుగా/స్థానంలో.
In place of Suresh we have Harish = సురేష్ స్థానంలో హరీష్ ఉన్నాడు)

**Vasanth:** What about the next match?
(తర్వాత ఆట సంగతేంటి? )

**Hemanth:** We may play the team from Warangal, but we take it easy. The Warangal team is no more a problem for us than yesterday's team.
(వచ్చేసారి మేం వరంగల్ టీం తో ఆడొచ్చు అయితే మేం దాన్ని తేలిగ్గానే తీసుకుంటున్నాం. నిన్నటి టీం కంటే వరంగల్ టీం పెద్ద సమస్యేం కాదు.)

**Vasanth:** I appreciate your confidence.
(నీ విశ్వాసాన్ని అభినందిస్తున్నా.)

**Hemanth:** Our Captain is more confident than I (am)=
(నాకంటే మా captain ఇంకా విశ్వాసంతో ఉన్నాడు.)

**Vasanth:** Best of luck then. Bye.

కిందటిసారి మనం రెండు విషయాలనే (మూడు విషయాలు కాకుండా) పోల్చటం ఎలాగో చూశాం కదా. రెండు విషయాలనే పోల్చినప్పుడు

1) Superlative ఉండదు.
2) Comparative లో not లేకుంటే positive లో not వస్తుంది.
3) compare చేస్తున్న వస్తువుల positions ముందుకూ వెనకకూ తారుమారవుతాయి. ఈ విషయాలు last lesson లో చూశాం కదా!

ఇప్పుడు చూడండి:

**a)** Ooty is not cooler than Kodaikanal.
(ఊటీ, కొడైకెనాల్ కంటే చల్లని ప్రదేశం కాదు)

ఇక్కడ 1) adjective cooler - degree - comparative.
2) comparison (పోలిక) రెండింటికి మాత్రమే. కాబట్టి superlative ఉండదు.

అయితే గత lessons లోని examples లా కాకుండా, పై sentences లో comparative ముందు not రావటం గమనించండి. అంటే, ఈ భావాన్ని, positive లో చెప్పేటప్పుడు not రాదు కదా.

positive చూద్దాం.
Kodaikanal is at least as cool as Ooty =
కొడైకెనాల్ కనీసం (at least) ఊటీ అంత చల్లగా ఉంటుంది.

Study this:

**Comparative**
ఊటీ, కొడైకెనాల్ కంటే చల్లనిది కాదు.

**Positive**
కొడైకెనాల్ (కనీసం) ఊటీ అంత చల్లగా ఉంటుంది.

A, B కంటే ఎక్కువ కాదు, అంటే B (కనీసం) A తో సమానమే కదా? - ఇలా comparative నుంచి positive కి మారుతుంది. ఇక్కడ comparative లో not ఉంది, కాబట్టి positive లో not రాదు.

**b) Comparative:**
Chandra is not taller than Tara =
తార కంటే చంద్ర పొడవుకాదు.

**Positive:**
Tara is (at least) as tall as Chandra.

At least చాలా సార్లు వదిలేస్తుంటాం- తప్పుకాదు.

ముఖ్యమైన విషయం: Positive degree adjective ముందు so/as, positive degree తర్వాత as రావటం తెలుసుగదా?

అయితే, positive degree లో not ఉన్నప్పుడే, దాని ముందు so కాని./ as కాని వాడతాం. positive degree లో not లేకపోతే దాని ముందు, as మాత్రమే వాడతాం. So వాడం.

**a)** He is not so/as tall as his brother-
ఇది positive degree. ఇందులో not ఉంది. కాబట్టి tall ముందు, so కానీ as కానీ వాడతాం.

**b)** He is as clever as his brother-
ఇదీ positive degree. అయితే ఇందులో not కానీ, no కానీ లేదు. అందువల్ల clever ముందు as మాత్రమే వాడుతున్నాం, so వాడటం లేదు. ఇది చాలా ముఖ్యమైన విషయం.

**Now let us study the following sentences from the conversation between Vasanth and Hemanth at the beginning of this lesson.**

**1)** Hemanth: Our game yesterday was no better than last sunday's
(కిందటి ఆదివారం మా ఆట కంటే నిన్న మా ఆటేం మెరుగ్గాలేదు.)
(no better - no + comparative)

**Positive:** Last Sunday's game was (at least) as good as our game yesterday =
కిందటి ఆదివారం మా ఆట కూడా నిన్న మా ఆటంత బాగా ఉంది (కనీసం)

**2)** Our score this time was not higher than that last time.
(not + comparative - ఈ సారి మా స్కోర్ కిందటి మా స్కోర్ కంటే ఎక్కువేం కాదు)

**Positive:** Our score last time was (at least) as high as our score this time.
(కిందటిసారి మా స్కోర్, ఈసారి మా స్కోర్ అంతే.)

**3)** The wickets we took this time were not more than the wickets we took last time.
(not more - not + more (comparative))
ఈసారి మేం తీసుకున్న వికెట్లు కిందటిసారి వికెట్ల కంటే ఎక్కువేం కావు.

Many (positive) - more (comparative) - most (superlative)

**Positive:** The wickets we took last time were (at least) as many as we took this time.
(మేం కిందటిసారి తీసుకున్న వికెట్లు, కిందటిసారి తీసుకున్నన్నే - ఎక్కువేంకాదు.)

4) They were no greater than Kiran and Charan.
(వాళ్లు - మేం కొత్తగా తీసుకున్నవాళ్లు, కిరణ్, చరణ్ కంటే గొప్ప ఆటగాళ్లేం కారు).

ఇక్కడ ఒక సందేహం రావచ్చు - మహేష్, సతీష్, కిరణ్, చరణ్ - ఇంత మందిని చెప్పేటప్పుడు, ఇది రెండు విషయాల మధ్య పోలిక ఎలా అవుతుందని.

అయితే మనం అర్థం చేసుకోవాల్సింది- ఇక్కడ ఏ ఒక్కరినో, మిగతా వాళ్లందరితో పోల్చటం లేదు. మహేష్, సతీష్ - వీళ్లిద్దరు 1st set. కిరణ్, చరణ్ - వీళ్లిద్దరూ 2nd set. ఇక్కడ comparison ఈ రెండు sets of players కు. కాబట్టి, దీన్ని రెండు విషయాల మధ్య పోలికగానే తీసుకోవాలి.

**Positive:** Kiran and Charan were (atleast) as great as they.
(కిరణ్, చరణ్‌లు కనీసం వాళ్లంత గొప్పవాళ్లే)

5) The pitch this time was not faster than the pitch last time (not faster - not + comparative)

**Positive:** The pitch last time was (at least) as fast as the pitch this time
(కిందటిసారి పిచ్ కూడా ఈసారి పిచ్ అంత వేగమైందే)

6) The Warangal team is no more a problem for us than yesterday's team.
(no more a problem - no + comparative)

Much (positive) - more (comparative) - most (superlative) (మాకు వరంగల్ టీం నిన్నటి టీం కంటే ఎక్కువ సమస్య కాదు)

**Positive:** Yesterday's team was (at least) as much a problem for us as the warangal team
(నిన్నటి టీం, వరంగల్ టీం అంత సమస్యే మాకు = తక్కువేం కాదు) - అంటే వరంగల్ ఎక్కువేం కాదు అని.

7) Our captain is more confident than I (am) - నాకంటే మా captain ఎక్కువ విశ్వాసంతో ఉన్నాడు - comparative, not లేకుండా, కాబట్టి Positive లో not వస్తుంది.

**Positive:** I am not so (as) confident as our captain.
(నేను మా captain అంత విశ్వాసంగాలేను.)

**Exercise: Practise the following aloud in English**

**Pramada:** నీ డ్రెస్ ఎంత బావుందో!
**Vasudha:** నీ డ్రెస్ కంటే పెద్ద ఏం బాగాలేదులే.
**Pramada:** కచ్చితంగా నా డ్రెస్ నీ డ్రెస్ అంత ఆకర్షణీయంగా లేదు. నా సెలక్షన్ నీ సెలక్షన్ అంతసరిగ్గా (proper) లేదు. కాని నా డ్రెస్ నీ దాని కంటే ఖరీదెక్కువ. అందుకే బాధపడుతున్నా.
**Vasudha:** అలాంటివి జరుగుతాయిలే. బాధపడకు. అయితే, ఇక్కడున్న వాళ్లందరి డ్రెసుల్లో నీదే చాలా అందంగా ఉందని నేనిప్పటికీ అనుకుంటున్నా.
**Pramada:** వినటానికి సంతోషంగా ఉంది. కాని అది నిజం కాదు.
**Vasudha:** ఇంత నిజాయితీగా నేనెప్పుడూ లేను.

**Answer:**

**Pramada:** How beautiful your dress is!
**Vasudha:** (It is) not more beautiful than yours.
**Pramada:** Certainly my dress is not as/so attractive as yours. My selection is not so as proper as yours, but my dress is more expensive than yours. That makes me sad.
**Vasudha:** Such things happen. Don't worry. But I still feel that yours is the best of the dresses of all those/ the people here.
**Pramada:** Good to hear that, but it is not true.
**Vasudha:** I have never been so (as) truthful / honest as I am now.

ప్రశ్న. 'సింటెక్స్' అంటే తెలుగులో అలంకారాలేనా? వాటి గురించి తెలియజేయండి. ఏమైనా ప్రత్యేక పుస్తకాలున్నాయా? క్షుణ్నంగా, సులభంగా ఉండే పుస్తకాలు తెలియజేయండి.

– ఎస్. రాజ్‌కుమార్, హైదరాబాద్.

Syntax అంటే అలంకారాలు కాదు. Syntax అంటే English లోని వాక్యాల్లోని మాటల అమరిక (order of words - ఏ మాట ముందు, ఏ మాట తర్వాత రావాలి)ను గురించిన నిబంధనలు. ఇప్పటి వరకూ ఇన్ని lessons లోనూ తెలిసింది ఇదేకదా? వీటిని గురించి English story books, Magazines తో ప్రారంభించి, Newspapers (English), పెద్ద నవలలు లాంటివి చదవటం వల్ల English బాగా వస్తుంది.




# What do you think?




**Dhananjai:** So, which school did you put your son in, finally?
(చివరకు మీ వాడిని ఏ school లో చేర్పించావు? )

**Lokeswar:** In the Ambit Public School.

**Dhananjai:** Congrats. How could you ever get him admission in that school? It is one of the best schools in the state.
(ఆ స్కూల్లో అడ్మిషన్ ఎలా సంపాదించావు? రాష్ట్రంలో ఉన్న ఉత్తమ పాఠశాలల్లో అదొకటి.)

**Lokeswar:** And one of the most expensive too. My son has been selected in the selection test. Very few admission tests he has taken are as tough as this.
(అవును. అత్యంత ఖరీదైన పాఠశాలల్లో కూడా అదొకటి. మావాడు ప్రవేశపరీక్షలో ఎంపికయ్యాడు. వాడు రాసిన పరీక్షల్లో కొన్ని మాత్రమే ఇంత కష్టమైనవి.)

**Dhananjai:** (Do) you mean he has taken as number of admission tests?
(అంటే మీ అబ్బాయి చాలా ప్రవేశపరీక్షలు రాశాడనా నీ ఉద్దేశ్యం? )

**Lokeswar:** What do you think? I have had five transfers in the past nine years. With every transfer he had to be put in a new school, and that meant an admission test.
(ఏమనుకుంటున్నావు? ఈ తొమ్మిదేళ్లలో నాకు అయిదు సార్లు బదిలీ అయింది. ప్రతిసారీ కొత్త పాఠశాలలో చేర్చాల్సి వచ్చేది. అంటే ప్రతిసారీ ఓ ప్రవేశపరీక్ష రాసేవాడు)

**Dhananjai:** How good is he at studies?
(మీ వాడు ఎలా చదువుతాడు? )

**Lokeswar:** Quite bright, I must say. Certainly brighter than most other students his age or class. He has had no difficulty getting admission in the best schools.
(తెలివిగలవాడనే అనాలి. వాడి తరగతి, వాడి వయస్సు వాళ్లలో చాలా మందికంటే తెలివైనవాడే. ఈ కారణంగా అత్యుత్తమ పాఠశాలల్లో సులువుగా ప్రవేశం పొందగలిగాడు)

**Dhananjai:** I see that. That he got a seat in Ambit school shows that. Wish him all the best.
(అర్థం అవుతూనే ఉంది. ఆ పాఠశాలలో సీటు రావటమే అతనేంటో తెలుస్తోంది).

**Lokeswar:** Tomorrow is his birthday. How about attending it?
( రేపు వాడి పుట్టినరోజు వస్తావు కదా.)

**Dhananjai:** Tomorrow? I should very much like to, but tomorrow is a friday. On fridays, I am busier than most other days. I'll try to come, but don't look for me. Anyway, many happy returns of the day.
(నాకు రావాలనే ఉంది, కానీ రేపు శుక్రవారం. మిగిలిన రోజులతో పోలిస్తే నేను శుక్రవారాలు చాలా బిజీ. అయినా రావటానికి ప్రయత్నిస్తాను. కానీ నాకోసం ఎదురు చూడొద్దు. ఇలాంటి పుట్టినరోజులు చాలా జరుపుకోవాలని కోరుకుంటున్నాను)

**Lokeswar:** Thank you.

Table- 1

| I Type | II Type |
|---|---|
| **Superlative:** Kolkata is the largest city in India. | Bangalore is one of the largest cities in India. |
| **Comparative:** Kolkata is larger than any other city / all other cities in India. | Bangalore is larger than most other cities in India. |
| **Positive:** No other city in India is so (as) large as Kolkata. | Very few cities in India are as large as Bangalore. |
| **Superlative:** కోల్‌కతా అన్ని నగరాల్లో పెద్దది | అత్యంత పెద్ద నగరాల్లో బెంగళూరు ఒకటి |
| **Comparative:** మిగతా నగరాల కంటే కోల్‌కతా పెద్దది (వ్యవహారిక తెలుగులో) | చాలా నగరాల కంటే బెంగళూరు పెద్దది |
| **Positive:** ఏ ఇతర నగరం కూడా కోల్‌కతా అంత పెద్దది కాదు. | ఏ కొద్ది నగరాలో బెంగళూరంత పెద్దవి (వ్యవహారిక తెలుగులో) |

**Compare sentences (a) and (b) below:**

a) Kolkata is the largest city in India
( భారత్‌లో అత్యంత పెద్దనగరం కోల్‌కతా)
**- superlative degree.**

b) Bangalore is one of the largest cities in India.
(భారత్‌లో అత్యంత పెద్ద నగరాల్లో బెంగళూరు ఒకటి)
**- superlative.**

a), b) రెండూ కూడా superlative లో ఉన్నాయి. అయితే (a) లో the largest అంటున్నాం - అంటే కోల్‌కతా అన్ని నగరాల్లో పెద్దది అని అర్థం.

(b) లో Bangalore is one of the largest అంటున్నాం - అంటే భారత్‌లోని (అత్యంత) పెద్దనగరాల్లో బెంగళూరు ఒకటి అంటున్నాం.

✓ The best, the largest, the tallest, etc. ఇలాంటివాటికి comparatives, positive ఎలా వస్తాయో మనకు తెలుసు.

One of the best (అత్యంత మేలైనవాటిలో ఒకటి), One of the largest (అత్యంత పెద్దవాటిలో ఒకటి), అన్నప్పుడు వాటికి Positive, Comparative ఎలా ఉంటాయో ఇప్పుడు మనం చూద్దాం. కానీ ఒక ముఖ్య విషయం-

✓ పోలికలు పరిశీలించటం, చెప్పటం (వస్తువులూ, వ్యక్తుల తరతమ భేదాలు) ఇంగ్లిషులో సంక్లిష్టం (Complex)గా ఉంటుంది. తెలుగులో అలా ఉండదు. మనం మామూలుగా మాట్లాడే, రాసే తెలుగులో Superlative, Comparatives కు వేర్వేరు పదాలు లేవు కదా.

ఉదా: ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న నగరాల్లో హైదరాబాద్ పెద్దది (Superlative), మిగతా నగరాల కంటే హైదరాబాద్ పెద్దది (Comparative), ఏ నగరం కూడా హైదరాబాద్ అంత పెద్దది కాదు. అని మామూలు తెలుగులో అంటాం. చూశారు కదా.

✓ Three degrees లో కూడా మనం 'పెద్దది' అనే మాటనే అంటున్నాం. ఇంగ్లిషులోలా, big, bigger, biggest అని ఒకే మాటకు degree ని బట్టి మూడు రూపాలు తెలుగులో ఉండవు కదా. అత్యంత పెద్దది, అతి పెద్ద అనే మాటల వాడుక తెలుగులో అంత సాధారణం కాదు. అదీ కాకుండా తెలుగులో ఎన్ని రకాల పోలికలున్నా, సందర్భాన్ని బట్టి ఏదో మాట కచ్చితంగా వాడుతాం. కానీ వాక్యం ఇలా ఉండాలి అనే నిబంధనలు తెలుగులో లేవు. ఈ విషయంలో ఆంగ్లభాషలో చాలా నిబంధనలు ఉన్నాయి. అందుకని ఏ రకం పోలికను ఏ degree లో ఎలా చెప్పాలనే విషయంలో జాగ్రత్త అవసరం.


M. SURESAN

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson**

1) It is one of the best schools in the state.
(రాష్ట్రంలోని ఉత్తమ పాఠశాలల్లో ఇది ఒకటి)- superlative

2) And one of the most expensive too.
(అత్యంత ఖరీదైన పాఠశాలల్లో కూడా ఒకటి)

3) Very few admission tests... are as tough as this (positive)

4) He is certainly brighter than most other students of his class or age (comparative)

5) ... I am busier tomorrow than on most other days. (comparative).

ఇప్పుడు రెండు రకాల పోలికల మధ్య తేడా పరిశీలిద్దాం:
(టేబుల్ 1 చూడండి)

ఇప్పుడు మన సంభాషణలోని degrees transformation to other degrees చూద్దాం.

| Positive | Comparative | Superlative |
|---|---|---|
| 1) Very few schools in the state are as good as this. | It is better than most other schools in the state. | It is one of the best schools in the state. (lesson లో ఇచ్చిన sentence) |
| 2) Very few schools are as expensive as this. | ... and more expensive than most other schools. | ... and one of the most expensive too. (lesson లో ఇచ్చిన sentence) |
| 3) Very few admission tests are as tough as this. (lesson లోని sentence) | This is tougher than most other tests. | This is one of the toughest tests. |
| 4) Very few students are as bright as he (is). | He is certainly brighter than most other students. (lesson లోని sentence) | He is certainly one of the brightest students. |
| 5) On very few days am I as busy as I am tomorrow. | I am busier tomorrow than on most other days. (lesson లోని sentence) | Tomorrow is one of the days I am the busiest on. |

ఇప్పుడు మనం తెలుసుకున్నది...

a) The + superlative అని వస్తే దానికి comparative లో than any other / all other వస్తుంది. Positive లో No other తో ప్రారంభమవుతుంది.

b) One of the + superlative వస్తే దానికి comparative లో than most other వస్తుంది. Very few తో Positive ప్రారంభమవుతుంది. very few తో ప్రారంభమయ్యే positive లో as + positive + as మాత్రమే వస్తుంది. so + positive + as రాదు.

**Carefully observe the following conversation between Satish and Naresh**

**Satish:** This is one of the greatest movies I've seen recently.

**Naresh:** I agree. Very few recent movies are as great as this.

**Satish:** The photography in the movie is better than that in most other recent movies.

**Naresh:** But the songs in the movie are not sweeter than the songs in 'Kalalu'.

**Satish:** (Do) you mean that songs in 'Kalalu' are sweeter than the songs in the movie.

**Naresh:** I Don't mean that. The songs in 'Kalalu' are as sweet as the songs in this.

**Satish:** You are one of the best singers in our College. I do not have the knowledge of music you have / my knowledge of music is not so (as) good as yours.

**Naresh:** Very few songs are as good as 'Vasantaragam' in 'Kalalu' It is a moving song.

**Satish:** True. I like it too.



ప్రశ్న: This diversity is seen not only among the plants belonging to different groups but also those belonging to the same group.
పై వాక్యంలో is తర్వాత seen ఉపయోగించారు. present continuous లో verb మూడోరూపాన్ని ఉపయోగించవచ్చా? తెలపగలరు?

ఎం. దాలినాయుడు, శ్రీకాకుళం

**జవాబు:** ఇక్కడ seen అనేది present continuous tense కాదు. present simple / present indefinite. present continuous tense లో verb form- am seeing / is seeing / are seeing.
is seen-ఇది present simple, passive voice-చూడబడుతోంది అనే అర్థంలో.
This diversity is seen = ఈ వైవిధ్యం చూడబడుతుంది (అంటే మనం చూస్తాం అని)
is seen- is (be form) + seen ( verb మూడోరూపం అంటే past participle) - voice, passive.







M. SURESAN

# It is cheaper than before

**Tarun:** Hi Saran, you are not the earliest to class, are you?
(అందరికంటే class కు ముందు వచ్చింది నువ్వు కాదుగదా? )

**Saran:** Sarika and some others were earlier than me. I was not later than they (were)/them by more than ten minutes.
(సారిక, ఇంకొందరు నాకంటే ముందు వచ్చారు. వాళ్లకంటే నేను పది నిమిషాల కన్నా ఎక్కువ ఆలస్యం కాదు.)

**Tarun:** Sarika isn't always the earliest to come?
(ఎప్పుడూ ముందర వచ్చే వాళ్లలో సారిక ఉంటుందికదా? )

**Saran:** No, she isn't. In fact, she is not among those who are the earliest.
(కాదు. త్వరగా వచ్చేవాళ్లల్లో అసలామె ఉండదు.)

**Tarun:** You were thinking of buying a bike. You had better buy now. It is on sale at a discount and is cheaper than before.
(నువ్వేదో bike కొనాలనుకుంటున్నావు కదా. ఇప్పుడే కొనటం మంచిది. Discount లో అమ్ముతున్నారు. ఇంతకుముందుకంటే ఇప్పుడు చవక.)

**Saran:** It is not the cheapest now. It is going to be cheaper still. I'll wait for another month.
(ఇప్పుడు అంత తక్కువేంకాదు. ఇంకా చవకవబోతోంది. ఇంకో నెలాగుతా.)

**Tarun:** Yes. Some other brands will then be as cheap as this or even cheaper.
(అవున్లే. మరికొన్ని company ల bikes ఇంత చవగ్గానూ ఉంటాయి, ఇంకా చవగ్గానూ ఉంటాయి.)

**Saran:** Moreover some other matters are more important for me than the bike now.
(అంతేకాకుండా bike కంటే ముఖ్యమైన విషయాలు మరికొన్ని ఉన్నాయి నాకు.)

**Tarun:** (So) you mean a bike has the least priority now.
(అంటే నీ ప్రాముఖ్యాంశాల్లో bike చివరిదంటావా? )

**Saran:** There are other more important matters.
(అని కాదు. కాని అంతకంటే ముఖ్యమైనవి మరికొన్ని ఉన్నాయి.)

**Tarun:** When you decide to buy just let me know. I know the dealer. We can get some concession.
(నువ్వు కొనాలని నిర్ణయించుకున్నప్పుడు నాకు తెలియజేయి. నాకో dealer తెలుసు. మనకు కాస్త తగ్గింపు ధరకొస్తుంది.)

**Saran:** Thank you.

You observe that the conversation above has mostly negative sentences. There are, among them, superlatives, comparatives and positives too. Now before we study them look at the following sentences.

**a)** Madanapalle is not the coolest place in A.P = Adjective - the coolest - degree superlative - అయితే ఈ sentence లో superlative ముందు not గమనించండి. ఈ sentence అర్థం: ఆంధ్రప్రదేశ్‌లో మదనపల్లె అత్యంత చల్లని ప్రదేశం కాదు అని కదా.
అంటే, మదనపల్లె కొన్ని ఇతర ప్రదేశాలకన్నా చల్లనిది కాదు అని- ఇది comparative.
Madanapalle is not cooler than some other places in A.P.
దీనికి positive:
Some other places in A.P. are as cool as Madanpalle = ఎ.పి.లో కొన్నిచోట్లు మదనపల్లె అంత చల్లనివి.

**b)** That is not the tallest tree in the garden.
(ఆ తోటలోని అన్ని చెట్లలో అది ఎక్కువ పొడవైంది కాదు)
- not the tallest (not + superlative)
☆ The tree is not taller than some other trees in the garden.
(ఆ తోటలో మిగతా కొన్ని చెట్లకన్నా ఇది పొడవైంది కాదు)
not taller than some other - comparative.
☆ Some other trees in the garden are as tall as the tree.
(తోటలోని కొన్ని చెట్లు, ఆ చెట్టంత పొడవున్నాయి.)

**c)** Some other novels are as good as 'You only live Twice'
(కొన్ని ఇతర novels, 'you only live Twice' అంత బాగుంటాయి)
As good as - degree - positive
దీనికి comparative
"you only live Twice" is not better than some other novels ('You only live Twice' కొన్ని ఇతర novels కంటే అంత బాగేం ఉండదు).
superlative
'You only live Twice' is not the best novels.
(You only live Twice' అన్నిటిలో ఉత్తమమైన novel కాదు)

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson.**

1) You are not the earliest to the class.
2) Sarika and some others were earlier than me.
3) It is cheaper than before.
4) Sarika is not always the earliest to come.
5) It is not the cheapest now.
6) Some other brands are going to be as cheap as this or even cheaper.
7) Moreover some other matters are more important for me than the bike now.
8) ... the bike has the least priority now?
9) there are other more important matters.

All the sentences above are more or less the same pattern. అంటే ఇంతకుముందు మనం చూసిన not the best/ greatest, etc కు సంబంధించినవి. వీటికి other degrees చూద్దాం.

| positive | comparative | superlative |
|---|---|---|
| 1. Some others are as early to class as you. | You are not earlier than some others to class. | You are not the earliest to class. (ఇచ్చిన sentence) |
| 2. I was not early as Sarika and some others. | Sarika and some others were earlier than me. (ఇచ్చిన sentence) | I was not the earliest. |
| 3. It was not as cheap before as it is now. | It is cheaper than before (ఇచ్చిన sentence) | No superlative. |
| 4. Some others are always as early as Sarika. | Sarika is not always earlier than some others. | Sarika is not always the earliest. (ఇచ్చిన sentence) |
| 5. It is not as cheap as it was earlier. | It is not cheaper now than before. | It is not the cheapest now. (ఇచ్చిన sentence) |
| 6. Some other brands are going to be as cheap as this. (ఇచ్చిన sentence) | This is not going to be cheaper than some other brands. | This is not going to be the cheapest of brands. |
| 7. The bike is not as important for me as some other matters. | Some other matters are more important for me than the bike now. (ఇచ్చిన sentence) | The bike is not among/ not one of the most important matters for me. |
| 8. No other matter has as little priority as the bike. | The bike has less priority than any other matter | The bike has the least priority now. (ఇచ్చిన sentence) |
| [little (positive) - less (comparative) - least (superlative)] | | |
| 9. Some other matters are as important as this. | There are other more important matters than this. (ఇచ్చిన sentence) | This is not the most important matter. |

ఒక ముఖ్యవిషయం గుర్తుంచుకోండి: ఇలా ఒక degree నుంచి ఇంకో degree కి మార్చటం ఓ exercise గా practice చేయటం వల్ల confusion తప్ప Spoken English improve కాదు. మీరు regular గా అవకాశం దొరికినప్పుడల్లా English మాట్లాడుతున్నారనుకోండి, అప్పుడు మీరు చెప్పాలనుకున్న భావాన్ని, సందర్భాన్నిబట్టి, ఏ degree లో ఎలా చెప్పాలో మీకు తెలుస్తుంది. English అవకాశం వచ్చినప్పుడల్లా మాట్లాడటం ముఖ్యం. ఇవన్నీ వాటంతట అవే తెలిసిపోతాయి. చదవటం వల్ల కూడా ఇంగ్లిష్ వస్తుంది.

**Now study the following conversation:**

**Sindhu:** Congrats Rahul, your team won the match yesterday. You played the best of all. You scored more runs than any other member of your team.
(నిన్న మీ team గెలిచింది. అందరిలో నువ్వు బాగా ఆడావు. మిగతావాళ్లకన్నా నువ్వెక్కువ పరుగులు తీశావు.)

**Rahul:** Unfortunately, I could not bowl as well as Ganesh. He took more wickets than I did.
(దురదృష్టవశాత్తూ Ganesh అంత బాగా bowl చేయలేకపోయాను. నాకంటే అతనెక్కువ wickets తీసుకున్నాడు)

**Sindhu:** Your captain played the worst of all. His single digit score shows that.
(అందర్లో అధ్వానంగా ఆడింది మీ కెప్టెనే. అతని ఒక అంకె score దానికి తార్కాణం)

**Rahul:** He hasn't been in form of late. Otherwise he plays better than most of us.
(అతనీమధ్య అంత form లో లేడు. లేకుంటే మాలో చాలామంది కంటే అతను బాగా ఆడతాడు.)

**Sindhu:** But he didn't play so well in the earlier match either.
(కానీ అతను అంతకుముందు match లోనూ అంత బాగా ఆడలేదు కదా)

**Rahul:** That's true. But once he regains form, very few of us can play as well as he.
(నిజమే. కాని మళ్లీ form లో కొచ్చాడంటే మాత్రం మాలో ఏ కొద్దిమందో అతనంత బాగా ఆడగలం)

**Sindhu:** Wish him the best.

**Look at the following sentences from the conversation above:**

1) You played the best of all.
2) You scored more runs than any other member of your team.
3) ... I could not bowl as well as Ganesh.
4) He took more wickets than I did.
5) Your captain played the worst of all.
6) ... he plays better than most of us.
7) But he didn't play so well in the earlier match either.
8) ... very few of us can play as well as he.

పై sentences అన్నింటిలో కూడా పోలికలున్నాయి కదా- అన్నీ తరతమ భేదాలను గురించే. అయితే ఈ sentences లో వస్తువుల/ వ్యక్తుల గుణగణాలనూ, సామర్థ్యాలనూ కాక వ్యక్తుల పనితీరును పోలుస్తున్నామని గమనించే ఉంటారు. ఒకే పనిని ఇద్దరు, అంతకంటే ఎక్కువ వ్యక్తులు, ఒకరికంటే ఇంకొకరు బాగా చేశారా, తక్కువ చేశారా అనేది పోలుస్తున్నాం. అంటే ఇది comparison of adverbs, comparison of adjectives కాదు. అంటే degrees of comparison, adjectives కే కాకుండా, adverbs కు కూడా ఉంటుందన్నమాట. ఇప్పటివరకూ మనం study చేసింది comparison of adjectives.ఇక ముందు మనం పరిశీలించేది, degrees of comparison of adverbs.

(adverb అంటే, verb తెలిపే పని ఎలా జరిగింది అని తెలిపే పదం)

You played the best of all - ఇక్కడ verb, played = ఆడావు. ఆ ఆడటం ఎలా జరిగింది? Answer: the best. కాబట్టి best అనేది ఇక్కడ adverb.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Komal:** Visal, doesn't Ramana speak English the best of all of us in the class?
(Class లో మనందరిలో English బాగా మాట్లాడేది Ramana కదా)

**Vishal:** Yes; he does. (అవును)

**Komal:** Why so? (ఎందుకని? )

Why so = ఎందుకలా? ; Why not? = ఎందుకు కాదు? ఈ expressions conversation లో చాలా common. మీరూ తరచుగా వాడండి.

**Vishal:** From the beginning he has studied in English medium, that too, in very good schools. Moreover, he reads more than any one of us.
(మొదటినుంచి అతడు చదివింది English medium లో, అదీ మంచి English medium schools లో, అంతేకాకుండా మనకంటే అతడు ఎక్కువగా చదువుతాడు.)

That too = అది కూడా.




**Komal:** What does he read? How much does he read?
(ఏం చదువుతాడు? ఎంత చదువుతాడంటావు? )


M. SURESAN

**Komal:** He certainly works harder than any of us. At the same time he plays games better than us too. Remember he scored higher than any other member of our team in the last match.
(కచ్చితంగా అతడు మనకంటే ఎక్కువ శ్రమ పడతాడు. అలాగే games లో కూడా మన కంటే అతడు మెరుగే. కిందటి match లో మన team లో ఇతర players కంటే బాగా score చేశాడు).

**Vishal:** Here he is. Let's spend some time with him.
(ఇదిగో వస్తున్నాడు. కాసేపు అతడితో గడుపుదాం)

☺ ☺ ☺ ☺

గత lesson లో మనం తెలుసుకున్నది, degrees of comparison ఒక్క adjectives కే కాదు, adverbs కు కూడా ఉందని. Adverbs అంటే కూడా తెలుసు కున్నాం. verb, subject చేసే పనిని తెలుపుతుంది. ఆ verb చేసే పని ఎలా జరిగింది లాంటి వివరాలను తెలిపేమాట adverb.

He plays well. ఇక్కడ verb - plays. ఎలా ఆడతాడు? అనే verb (తెలిపే పని)కి ప్రశ్న వేస్తే, సమాధానం well కదా? అందుకని well, adverb అవుతుంది. ఒక sentence లో ఒక మాట చేసే పనిని బట్టి, అది noun/ adjective/ adverb etc., వీటిల్లో ఏది అని నిర్ణయించాల్సి ఉంటుంది.

This is a fast train.
ఇక్కడ ఎలాంటి train? అనే ప్రశ్నకు, fast train అనేది జవాబు. కాబట్టి fast, adjective.




Adjective అయినా, adverb అయినా, ఒక degree నుంచి ఇంకో degree కి మార్చే పద్ధతి ఒకటే.

| positive | comparative | superlative |
|---|---|---|
| **1. Adjective** No other team in the world is so/ as good as Australia. | Australia is better than any (all) other team (teams) in the world. | Australia is the best team in the world. |
| **Adverb** No other team in the world plays so/ as well as Australia. | Australia plays better than any other team/ all other teams in the world. | Australia plays best of all teams in the world. |
| **2. Adjective** Very few teams in the world are as good as Australia. | Australia is better than most other teams in the world. | Australia is one of the best teams in the world. |
| **Adverb** Very few teams in the world play as well as Australia. | Australia plays better than most other teams in the world. | No proper superlative. |

# Why so?

**Vishal:** For one thing, he reads the English news paper daily. He reads too, a lot of fiction in English. He reads quite often English news magazines too.
(ఒకటేమిటంటే రోజూ English newspaper చదువుతాడు. ఇంకా English నవలలు, కథానికలూ చదువుతాడు. తరచూ English news magazines కూడా చదువుతాడు.)

fiction = ఫిక్షన్ - 'ఫి' నొక్కి పలుకుతాం. అర్థం - కల్పన- కల్పించిన కథలు - novels (నవలలు), short stories (కథానికలు) లాంటివి.

**Komal:** (Do) you mean he speaks English so well because of his reading?
(అంటే నువ్వనేది అలా చదవటం వల్లనే English అలా మాట్లాడుతున్నాడంటావా? )

**Vishal:** Exactly. Reading English helps you more than a thorough study of grammar.
(కచ్చితంగా. ఇంగ్లిష్ మాట్లాడేందుకు గ్రామర్ క్షుణ్నంగా అభ్యసించటం కంటే, చదవటం ఎక్కువగా సహాయపడుతుంది.)

thorough = థరో = క్షుణ్నమైన

**Komal:** The language of the English newspapers is difficult to understand, isn't it? How then does it help?
(English newspapers English అర్థం చేసుకోవటానికి కష్టంగా ఉంటుంది. అలాంటప్పుడు అదెలా ఉపయోగపడుతుంది? )

**Vishal:** Ramana says he began with short news items, and then went on to news stories.
(మొట్టమొదట చిన్న వార్తాంశాలతో ప్రారంభించి, ఆ తర్వాత పెద్ద పెద్ద వార్తల reports చదివానని రమణ అన్నాడు)

A Cheetah runs fast.
(చిరుతపులి వేగంగా పరుగెత్తుతుంది. ఇక్కడ runs, verb. How does it run? అనే question కు fast, answer కాబట్టి fast అనేది adverb. అంటే -

1) ఎలాంటి, ఎలాంటిది (ఒక వస్తువు/ మనిషి) అనే ప్రశ్నకు సమాధానంగా వచ్చేమాట Adjective.
2) పని ఎలా జరిగింది అనే ప్రశ్నకు answer గా వచ్చే మాట Adverb.

ఈ రెండు విషయాలు జాగ్రత్తగా గుర్తుంచుకుంటే degrees of comparison ఎప్పుడు Adjectives కూ, ఎప్పుడు adverbs కూ అనేది సులభంగా తెలుస్తుంది.

a) Australia plays best of all teams in the world.
(ప్రపంచంలోని అన్ని జట్లలో ఆస్ట్రేలియా జట్టు అత్యంత బాగా ఆడుతుంది.)
గమనించండి- ఇక్కడ 'best'- adverb, ఎందుకంటే, plays అనే verb పనిని ఎలాగో వివరిస్తోంది కాబట్టి.
(Note: Superlative degree of the adjective ముందు the కచ్చితంగా ఉండాలని తెలుసుకున్నాం. అయితే superlative degree of the adverb ముందు the అంత పట్టింపులేదు. వాడితే మంచిదే, వాడకపోయినా పర్వాలేదు.)
పై sentence లో adverb, superlative degree లో ఉంది కదా? ఇది superlative of 'well'. ఇపుడు ఇది చూడండి.

b) Tendulkar plays better than any other/ all other players = టెండూల్కర్ ఏ ఇతర player/ మిగతా players కంటే మెరుగ్గా ఆడతాడు.
ఇక్కడ better, comparative degree of well

c) No other player hits the ball so/ as well as Dhoni= ఇంకే ఇతర player కూడా ధోని అంత బాగా ball ను కొట్టడు. ఇక్కడ adverb, well- positive.

| | |
|---|---|
| good= మంచి (adjective) | better (comparative) |
| well= బాగా (adverb) | best (superlative) |

చూశారు కదా మార్చే పద్ధతి Adjective అయినా ఒకటే, adverb అయినా ఒకటే.

1) Tendulkar bats better than Sehwag.
(ఇది ఇద్దరి మధ్యనే పోలిక - ఇక్కడ not లేదు- ఇది comparative degree) దీనికి superlative ఉండదుకదా. Positive లోకి మార్చేటప్పుడు, Tendulkar, Sehwag పేర్లు తారుమారవుతాయి; not వస్తుంది.
Sehwag does not bat (bats + not = does not bat) so (as) well as Tendulkar

2) Bret Lee does not bowl faster than Shoaib Akthar- comparative degree. (Bret Lee, Shoaib Akthar అంత వేగంగా bowl చేయడు) - పోలిక ఇద్దరి మధ్యే, not ఉంది. దీనికి superlative లేదు కదా. Positive లో not రాదు, subjects Lee, Akthar ల positions తారుమారవుతాయి.
**Positive:** Shoaib Akthar bowls (at least) as fast as Bret Lee. (Shoaib Akthar కనీసం Bret Lee అంత వేగంగా bowl చేస్తాడు)

Adverb degree వచ్చేటప్పుడు, do, does, did ల ఉపయోగం గుర్తుపెట్టుకోవాలి.

**Eg: 1)** Steve played more matches than Mark.
(Mark కంటే Steve ఎక్కువ matches ఆడాడు)
- ఇది comparative. verb - played. దీన్ని positive లో చెప్పాలంటే, played + not = did not play అవుతుంది. అప్పుడు positive.
Mark did not play as/ so many games as Steve. (Steve ఆడినన్ని games Mark ఆడలేదు)

2) Krishna reads faster than Ravi
(రవి కంటే కృష్ణ వేగంగా చదువుతాడు)
- ఇది Comparative. verb - reads. దీన్ని positive కు మారిస్తే, not రావాలి. అప్పుడు గుర్తుంచుకోవాల్సిన విషయం - reads + not = does not read.
Positive degree: Ravi does not read so/ as fast as Krishna. (Krishna అంత వేగంగా రవి చదవడు)

3) Kites fly faster than crows.
(కాకుల కంటే గద్దలు వేగంగా ఎగురుతాయి)
Comparative. verb - fly. Comparative లో not లేదు. Positive లో వస్తుంది. verb - fly. fly + not = do not fly.
**Positive:** Crows do not fly so/ as fast as kites.

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson.**

1) Doesn't Ramana speak English the best of all of us in the class? (superlative degree of the adverb)
2) He reads more than any of us. (comparative degree)
3) Reading English helps you more than a study of grammar (comparative)
4) He certainly works harder than any of us. (comparative)
5) At the same time, he plays games better than us too. (comparative)
6) He scored higher than any other member of our team. (comparative)

**Exercise:** వీటికి ఇతర degrees practise చేయండి.
**Answer:** ↓

| superlative | comparative | positive |
|---|---|---|
| 1. Doesn't Ramana speak English the best of all of us? (ఇచ్చిన sentence) | Doesn't Ramana speak English better than any of us? | Does any of us speak English so well as Ramana? |
| 2. Of all of us he reads the most. | He reads more than any of us. (ఇచ్చిన sentence) | None of us reads as much as he (reads/ does) |
| 3. No superlative. | Reading helps us more than a study of grammar. (ఇచ్చిన sentence) | A study of grammar doesn't help us so much as/ as much as reading. |
| 4. He certainly works hardest of all of us. | He certainly works harder than any of us. (ఇచ్చిన sentence) | None of us work as/ so hard as he, certainly. |
| 5. Of all of us, he plays games best. | He plays games better than us too. (ఇచ్చిన sentence) | We don't play games so well as/ as well as he. |
| 6. He scored highest of all of us. | He scored higher than any other member of our team. | No other member of our team scored so/ as high as he. |

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# He is as good as ..

**Chandan:** Of the two who do you find the better- Sekhar or Srikar?
(ఆ ఇద్దరిలో, అంటే శేఖర్, శ్రీకర్‌లో ఎవరు మెరుగంటావు? / ఎవరు మెరుగని పిస్తున్నారు? )

**Santhan:** Difficult to say. Each has his virtues and defects. Srikar is the more intelligent but Sekhar is the more industrious.
(చెప్పటం కష్టం. ఇద్దరిలో కొన్ని మంచి గుణాలూ ఉన్నాయి, కొన్ని దోషాలూ ఉన్నాయి.)

Virtue = వర్చ్యూ- 'వ' bird లో 'బ' లా నొక్కి పలుకుతాం- అర్థం - సుగుణం. Gandhi was a man of virtue = గాంధీ సుగుణాలు కలిగిన వ్యక్తి.

**Chandan:** And who is the more suitable for this job then?
(అయితే ఇప్పుడు మనకు కావాల్సిన పనికి ఎవరు తగినవారు? )

**Santhan:** Certainly Sekhar. He doesn't complain about the work.
(శేఖరే. పని విషయంలో complain చేయడు.)

**Chandan:** Has he to be trained?
(అతనికేమన్నా శిక్షణ ఇవ్వాలా? )

**Santhan:** I don't think so. He has two years' experience in the field.
(అవసరం అనుకోను. ఈ రంగంలో అతనికి రెండేళ్ల అనుభవం ఉంది.)

M. SURESAN

**Chandan:** How good is he at the job?
(ఈ ఉద్యోగం ఎంత బాగా చేయగలడు? )

**Santhan:** He is as good as or even better than any employee we have.
(ఇప్పుడు మన దగ్గరున్న ఉద్యోగులంతకానీ, అంతకంటే ఎక్కువకానీ సామర్థ్యం ఉన్నవాడు.)

Good = మంచి - ఇదసలు అర్థం. కానీ తెలుగులో 'మంచి'లాగానే, 'good' కూడా చాలా సందర్భాల్లో ఏదయినా ఓ విషయంలో గొప్ప/ సమర్థులైన/ సామర్థ్యమున్న అనే అర్థంతో వాడతాం.

good actor = మంచి నటుడు- దీని అర్థం గొప్ప నటుడని. అంతేగానీ మంచి గుణంగల నటుడు అని కాదు కదా.

good at something = ఏదైనా బాగా చేయగల/ బాగా తెలిసిన.

He is good at maths = అతనికి maths బాగా వచ్చు.

**Chandan:** Then let's appoint him. The sooner, the better. We've a lot of pending work.
(అయితే అతడ్నే నియమిద్దాం. ఎంత త్వరగా అయితే, అంత మంచిది. పని బాగా పేరుకుపోయింది.)

pending = పూర్తికాని/ పూర్తిచేయాల్సిన

**Santhan:** What about the pay?
(మరి జీతం సంగతి? )

**Chandan:** Let's pay him more than what he gets now in his present job?
(ఇప్పుడు అతని job లో పొందుతున్న దానికంటే ఎక్కువిద్దాం).

**Santhan:** How much more? (ఎంతెక్కువ? )

**Chandan:** Say Rs. 200/- (రెండువందలిద్దాం.)

Say = చెప్పటం - మామూలు అర్థం.

ఇక్కడ Say అంటే - అనుకుందాం.

**Santhan:** We're going to appoint him. Better sooner than later. I'll send the appointment order today itself.
(అతన్ని appoint చేస్తున్నాం. ఆ చేసేదేదో త్వరగా చేస్తే నయం. ఈరోజే appointment order పంపుతా)

**Chandan:** O.K. Go ahead. (సరే, కానీ.)

Go ahead = కానీ/ కానివ్వు/ సమ్మతించటం.

**Ram:** I want to tell you something.
(నీకు నేనోవిషయం చెప్పాలనుకుంటున్నా)

**Sam:** Go ahead. (కానీ/ చెప్పుయితే).

ఇది English లో common. మీరూ practice చేయండి.

☯ ☯ ☯

Comparative degree (adjective/ adverb) సందర్భానికి తగినట్లు జాగ్రత్తగా వాడితే మన conversation చాలా అందంగా, effective (ప్రభావం కలుగజేసేది)గా ఉంటుంది. కాబట్టి Comparative degree వాడటంలో మెళకువలు తెలుసుకొని మన Spoken English లో వాడదాం:




**a)** The Giraffe is taller than any other land animal. ఇతర భూచర జంతువుల కంటే Giraffe పొడుగు.

Giraffe = 'జ'రాఫ్ - 'జ' నొక్కి పలుకుతాం.

ఇక్కడ పోలిక రెండింటికన్నా ఎక్కువ వాటి మధ్య. taller - comparative. taller తర్వాత <u>than any other</u> (singular)/ than all other (plural) కాని వస్తుంది కదా.

**b)** The Giraffe is taller than the Elephant = ఏనుగు కంటే Giraffe పొడుగు. ఇక్కడ కూడా taller (comparative) తర్వాత <u>than</u> వస్తుంది. ఇది కూడా comparative. అయితే పోలిక రెండింటి మధ్యే. పై sentences (a), (b) లలో i) comparative తర్వాత than వస్తోంది. ii) comparative ముందు <u>the</u> లేదు.

**Now compare sentences (A) and (B) below:**

| Sentence A | Sentence B |
|---|---|
| The Giraffe is <u>taller than</u> the Elephant = ఏనుగు కన్నా Giraffe పొడుగు. | Of (between) the Giraffe and the Elephant, the Giraffe is <u>the taller</u> = Giraffe, ఏనుగు, ఈ రెండింటిలో Giraffe పొడుగు. |
| i) రెండు sentences లోనూ, degree, comparative | |
| ii) రెండు sentences భావం ఒకటే, చెప్పే విధం తేడా, అంతే. | |
| iii) Sentence A లో comparative తర్వాత <u>than</u> ఉంది. | Sentence B లో comparative తర్వాత than లేదు. |
| iv) Comparative ముందు the లేదు. | Comparative ముందు <u>'the'</u> ఉంది. |
| v) Sentence subject, Giraffe తో begin అయింది. | Sentence, Of (between) తో begin అయింది. |

Comparative ను sentence B లో లాగా conversation లో చాలా వాడుతుంటాం. Practice చేయండి. మరికొన్ని examples చూడండి:

**1)** Of the two girls, the one in the red dress is <u>the more beautiful</u> = ఆ ఇద్దరమ్మాయిల్లో, red dress లో ఉన్న అమ్మాయి ఎక్కువ అందంగా ఉంది. (Comparative తర్వాత <u>than</u> లేదు. కాబట్టి comparative ముందు, <u>the</u>.)

**2)** Between Bangalore and Hyderabad, Bangalore is <u>the</u> cooler = Bangalore is cooler <u>than</u> Hyderabad.

**3)** Of (between) his two sons, the elder is <u>the stronger</u> = అతని కొడుకులిద్దర్లో పెద్దవాడు బలవంతుడు. (The elder is <u>the stronger</u> of his two sons అని కూడా అనొచ్చు).

**4) Pranav:** How does he compare with his father?
అతని తండ్రితో అతన్నెంతవరకూ పోల్చవచ్చు? (అంటే అతను తన తండ్రంత గొప్పవాడా? అనే అర్థంతో.)

**Sourav:** The father is certainly the better.
(కచ్చితంగా, తండ్రి కొడుక్కంటే మెరుగు. (ఇక్కడ - better - comparative. Better తర్వాత than లేనందున better ముందు <u>the</u>.)

ఇక్కడ <u>compare</u> వాడిన తీరు గమనించండి.

How does this car <u>compare with</u> imported cars? = విదేశీ cars తో దీన్నెంతవరకు పోల్చవచ్చు? అంత గొప్పదా? అనే అర్థంతో. Compare ఇలా వాడటం practice చేయండి.

How does this CM <u>compare with</u> his predecessor? = ఈ ముఖ్యమంత్రిని తనకు ముందున్న ముఖ్యమంత్రితో ఎంతవరకు పోల్చవచ్చు?

predecessor (ప్రీడసెస/ ప్రెడిసెస. 'ప్రీ'ని/ 'ప్రె'ని నొక్కిపలుకుతాం) = ఒక పదవి/ స్థానంలో ఒకరికి ముందున్న వాళ్లను predecessor అంటాం.

**eg:** Chandrababu Naidu was the <u>predecessor</u> of Rajasekhara Reddy = రాజశేఖర్‌రెడ్డి <u>ముందరి</u> ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు.

Predecessor X Successor (తర్వాత వచ్చిన వాళ్లు - పదవిలో/ స్థానంలో)

**eg:** YSR is the <u>successor</u> of Chandrababu Naidu

**5) Janaki:** Is Rekha as good at dancing as Suma?
(Rekha, Suma అంత బాగా dance చేస్తుందా? )

**Devaki:** No, Suma certainly dances the better.
(కాదు, సుమే, రేఖ కంటే బాగా చేస్తుంది)

ఇక్కడ కూడా better (comparative) ముందు, <u>the</u> వస్తుంది.

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson:**

**1)** Of the two, who do you find <u>the better</u>, Sekhar or Srikar?
(Whom do you find the better? అనాలని కొందరంటారు. కానీ whom ఇలాంటిచోట్ల old fashioned - ఇప్పుడు వాడట్లేదు)
better - comparative తర్వాత than లేదు - కాబట్టి, better ముందు <u>the</u>.
అలాగే conversation లోని కింది sentences లో comparative ముందు <u>the</u> చూడండి- comparative తర్వాత than లేనందువల్ల.

**2)** Who is <u>the more</u> suitable for this job?

**3)** <u>The</u> sooner, <u>the</u> better =
ఎంత త్వరగా అయితే అంత మంచిది.
ఇప్పుడు sentence 3) లాంటి comparative sentences చూద్దాం: ఇక్కడ, రెండు comparatives పక్కనే వాడుతున్నాం కదా. రెండింటి ముందూ <u>the</u> రావటం చూడండి.

**a)** <u>The taller</u> a player is, <u>the better</u> can he play =
క్రీడాకారుడు ఎంత పొడుగైతే అంత బాగా ఆడగలడు.
ఇలాంటి sentences, conversation లో practice చేయండి.

**b) Prasad:** How did our team play yesterday?
(నిన్న మన team ఎలా ఆడింది? )

**Pramod:** <u>The less</u> we talk about it, <u>the better</u>.
(దాని గురించి ఎంత తక్కువగా మాట్లాడితే అంతమంచిది - less - comparative of little)

**c)** <u>The higher</u> a place, <u>the colder</u> it is =
ఒక ప్రదేశం ఎంత ఎత్తైనదైతే (సముద్రమట్టం నుంచి) అంత చల్లగా ఉంటుంది.

**d)** The longer you walk, the healthier you become =
నువ్వు ఎంత ఎక్కువగా నడిస్తే, అంత ఆరోగ్యవంతుడివవుతావు. =
నడిచినకొద్దీ ఆరోగ్యం ఎక్కువ.

ఈ English proverbs (సామెతలు) చూడండి:

**a)** The nearer the temple, the farther from god.
గుడికి దగ్గరయిన కొద్దీ, దేవుడికి దూరం. అంటే గుడికి దగ్గరగా ఉండేవాళ్లు, ఎప్పుడైనా వెళ్లొచ్చులే అని అసలు వెళ్లకపోవచ్చు, అంత భక్తి లేకపోవచ్చు అని.
farther - comparative of far.
far = దూరమైన

**b)** <u>The more</u> you eat, <u>the less</u> you wish to eat; the <u>more you earn</u>, the <u>more you wish to earn</u> =
ఎక్కువ తిన్నకొద్దీ తక్కువ తినాలనిపిస్తుంది, ఎక్కువ సంపాదించినకొద్దీ, ఇంకా ఎక్కువ సంపాదించాలనిపిస్తుంది. (అంతే కదా! కడుపు నిండిన తర్వాత తినలేం. అదే డబ్బు వస్తూ ఉందనుకోండి, ఆ, చాల్లే అనుకుంటామా? ఇంకా కావాలనుకుంటాం)

**c)** The more, the merrier =
ఎంత మందయితే, అంత సరదా.
(పై మూడు English proverbs; మీ conversation లో వాడండి.)
ఇవీ comparative uses.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# ఏ సందర్భంలో ఏ డిగ్రీ?

**Prakash:** What's wrong with you, Chum? You appear run down nowadays.
(ఏంటి విషయం? ఈ మధ్య నువ్వు నీరసంగా కళతప్పి కనిపిస్తున్నావు.)

Chum= నేస్తం. మనకు చాలా సన్నిహితుడైన స్నేహితుడు.

They are chums= వాళ్లు చాలా ప్రియమిత్రులు.

Chummy= చాలా స్నేహంగల.

He is chummy with the CM=
ఆయనకు ముఖ్యమంత్రితో చాలా సాన్నిహిత్యం/ స్నేహం ఉంది.

be run down= నీరసించటం.

He is run down= అతడు నీరసంగా, నిస్తేజంగా ఉన్నాడు.

ఇవన్నీ conversation లో తరచూ వచ్చే మాటలు. బాగా ఎక్కువగా మీ Spoken English లో వాడండి.

**Prasad:** Certainly I am not in the best of health. I wish to see a doctor. Who do you suggest? Is Dr Kushalam OK?
(నిజమే. నేనంత ఆరోగ్యంగా లేను. Doctor ను కలవాలనుకుంటున్నాను. ఏ Doctor ను కలవాలంటావు? Dr కుశలం మంచి వైద్యుడేనా?)

**Prakash:** He is certainly OK. He is among the better doctors in the town. I know him well. Shall I take you to him?
(ఆ డాక్టర్ మంచివాడే. మన ఊళ్లో మెరుగైన డాక్టర్లలో అతనొక్కడు. అతడు నాకు బాగా తెలుసు. నేను నిన్ను తీసుకు వెళ్ళనా?)

**Prasad:** When shall we see him then? This evening?
(అయితే ఎప్పుడు కలుద్దాం ఆయనను? ఈ సాయంత్రం కలుద్దామా?)

**Prakash:** Why not? This evening is as good as any other time.
(ఎందుకు కాదు? ఎప్పుడైనా ఫరవాలేదు.)

గమనించండి.

This evening is as good as any other time=
ఈ సాయంత్రం, ఇతర సమయాల్లాగే మంచిదే. అంటే ఈ సాయంత్రమైనా మంచిదే/ ఈ సాయంత్రం వెళ్దాం/ ఈ సాయంత్రమే వెళ్దాం- ఇది మీ conversation లో practice చేయండి.

దేన్నీ వాయిదావేయొద్దు అనటానికిలా అనండి=
Now is as good as any other time=
ఎప్పుడో బదులు, ఇప్పుడే చేసేయొచ్చుగా! అని

**Prasad:** He appears to have good practice.
(ఆయనకు చాలా మంచి practice ఉన్నట్లుంది)

**Prakash:** What do you think? He has more practice than any M.S. or M.D. He is better at diagnosist than many MDs.
(M.S, M.D. ఉన్న doctors కంటే ఆయనకు ఎక్కువ practice ఉంది. చాలా మంది MDs కన్నా ఆయన రోగ నిర్ధారణలో చాలా మెరుగు)

M.S. M.D. అంటే తెలుసు కదా? MBBS తర్వాత Surgery/ Medicine Degrees.

Diagnosis= రోగ నిర్ధారణ

Diagnosists - రోగ నిర్ధారణ చేసేవాళ్లు

**Prasad:** Then let's see him this evening. When is the best time?
అయితే ఈ సాయంత్రం ఆయనను కలుద్దాం. ఎపుడు సరైన సమయం?

best time= సరైన సమయం= right time.

**Prakash:** We start at my place at 5. We can see him at 6.
(మా ఇంటి నుంచి అయిదు గంటలకు వెళదాం. ఆరు గంటలకు ఆయనను కలుద్దాం.)

**Prasad:** That's OK. Then I will be here at 5.
(సరే. అయితే నేను ఐదింటికి ఇక్కడుంటా)

☆ ☆ ☆ ☆

Degrees of comparison, ఒక grammar exercise గా కాకుండా, అంటే ఒకే sentence ను మూడు degrees లో practice చేయటం కాకుండా సందర్భాన్ని బట్టి ఏ degree, మిగతా రెండు degrees తో సంబంధం లేకుండా ఎలా వాడాలో, పై conversation లో study చేయండి. Lesson No. 210 లో కూడా ఇదే practice చేశాం కదా. మనం express చేయాలను కున్న idea మనకు స్పష్టంగా ఉంటే ఏ సందర్భంలో ఏ degree వాడాలి అనేది మనకే తడుతుంది. అందుకని మన భావం స్పష్టంగా ఉంటే మనం చెప్పే విధం కూడా స్పష్టంగా ఉంటుంది. అలా ఉన్నప్పుడు ఏ degree వాడా లనేది, ఆలోచించకుండానే మనకు తడుతుంది. ఈ lesson లో వాడిన comparisons చూడండి.





M. SURESAN

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson.**

**1)** I am not in the best of health, certainly.
(English లో ఇలాంటి expressions చాలా తమాషా అర్థాన్నిస్తాయి. వాటిని వినగానే మనకు స్ఫురించే అర్థం ఒకటి, usage లో వాటికుండే అర్థం వేరు.) ఈ sentence నే తీసుకోండి. ఇది వినగానే మనకు స్ఫురించే అర్థం: నా ఆరోగ్యం అత్యుత్తమంగా లేదు కానీ, ఫరవాలేదు అని. అయితే దీని అసలు అర్థం, usage లో 'నా ఆరోగ్యం ఏం బాగాలేదు' అని. ఓ విషయం పట్ల మనకున్న వ్యతిరేకతను ఇలా తెలియ జేస్తాం. అంతేకాకుండా ఇలాంటి sentences లో కాస్త వ్యంగ్యం కూడా స్ఫురిస్తుంది. మరికొన్ని sentences ఇలాంటివే చూద్దాం.

**a) Suraj:** What do you think of our hockey team?
(మన హాకీ టీం గురించి నీ అభిప్రాయం ఏమిటి?)

**Neeraj:** Well, it is not the greatest team in the world.
(ఈ sentence విన్నప్పుడు మనకు స్ఫురించే అర్థం- అత్యుత్తమ జట్లలో ఒకటి కాకపోయినా, ఫరవాలేదు, అని. అసలు అర్థం: మంచి జట్టేం కాదని, దాదాపు పనికిరానిదని.)

**b)** She is not the most beautiful girl here, is she?
ఆమె పెద్ద అందగత్తేం కాదు కదా? - ఇదీ అసలర్థం. కానీ మనకు స్ఫురించే అర్థం అందర్లో అందగత్తె కాదు, కానీ అందగత్తే, అని- ఇది సరికాదు.

**2)** He is among the better doctors in the town.
ఈ పట్టణంలోని మెరుగైన doctors లో అతనొకడు. అంటే ఇతడు best doctor కాకపోవచ్చు. కాని అంత తీసిపారెయ్యదగ్గవాడేం కాదు (అంటే ఈ పట్టణంలోని doctors ను, మంచి, పనికిరాని అని రెండు తెగలుగా విభజిస్తే, ఇతడు మంచి తెగలోకే చేరతాడు అని)

**a)** AP is among the bigger states in the country.
దేశంలో పెద్దవి అనదగ్గ రాష్ట్రాల్లో ఏ.పి. ఒకటని.

**b)** He is among the more popular actors on the Telugu screen -
తెలుగు తెరమీద ఎక్కువ ప్రజాభిమానమున్న నటుడు = ఫర్వాలేదు, మంచి నటుడే అని.

**3)** He has more practice than any MS or MD =
ఏ MS/ MD కన్నా అతనికెక్కువ practice ఉంది.

More practice - ఇది comparative degree. సామాన్యంగా comparative తర్వాత than any other కానీ than all other కానీ రావాలి, రెండింటి కన్నా ఎక్కువ వాటిని పోల్చినప్పుడు. కానీ ఈ పై sentence లో than any MS or MD అంటున్నాం - any తర్వాత other లేదు. ఇది కూడా చూడండి:

Though, he is in the 7th class, he can speak English better than any 10th class student =
అతడు 7th class అయినా, 10th class వాళ్లకంటే English బాగా మాట్లాడతాడు.

దీంట్లో కూడా other లేదు. Any other/ all other, ఒకే తెగకు చెందిన విషయాలను పోల్చేటప్పుడే వాడతాం.

పై sentence లో 7th class student ను, 10th class student తో= అంటే వేర్వేరు రకాల విషయా లను పోలుస్తున్నాం. అందుకని other రాదు. అలాగే, He has more practice than any MS/ MD అంటే, అతడు MS/ MD కాదు అని, ఉత్త MBBS అని అర్థం.

**a)** Dr. Kushalam has more practice than any MS/ MD = MS, MD ఉన్న doctors కంటే Dr. Kushalam కు ఎక్కువ practice ఉంది. (అంటే Dr. Kushalam MS/ MD కాదు అని.)

**b)** Dr. Kushalam has more practice than any other MS/ MD = ఇతర MS/ MD ల కంటే అతడి practice ఎక్కువ. (అంటే Dr. Kushalam కూడా MS/ MD అని అర్థం.)

**c)** A Chief Minister is more influential than any Union Minister -
ఏ కేంద్రమంత్రికంటే కూడా Chief Minister ఎక్కువ పలుకుబడి ఉన్నవాడు.
(Chief Minister, Union Minister ఒకే తెగ కాదు. అందుకని any తర్వాత, other లేదు.)

**d)** The Home Minister is more powerful than any other minister = ఇతర మంత్రులకంటే Home Minister శక్తిమంతుడు. Home Minister, ఇతర మంత్రులూ ఒకే తెగ - అందుకని any other.

**e)** Shoiab Akthar is faster than any Australian bowler. any other లేదు కాబట్టి, Shoiab Akthar Australian కాడు.

**f)** Bret Lee is faster than any other Australian bowler=
ఇతర Australians కంటే Bret Lee, Fast. Any other అన్నాం కాబట్టి, Bret Lee కూడా Australian.

**g)** No Australian plays like Laxman.

**h)** No other Australian plays like Ponting.
గమనించండి: Laxman, Australian కాడు, కాబట్టి no other అనం, no అని అంటాం. Ponting (sentence h) Australian. అందుకని, no other అంటాం.

**i)** అతడు వృత్తిపరమైన నటుల కంటే బాగా నటించ గలడు (అంటే వృత్తిపరంగా అతను నటుడు కాడు)= He acts better than any professional actor. (Any other కాదు, ఎందుకంటే అతను వృత్తిపరమైన నటుడు కాడు). ఇదీ Any/ no తర్వాత other వాడకపోతే వచ్చే అర్థం.
మీరు మాట్లాడేటప్పుడు ఎపుడూ ఒకే తెగ వాళ్లను/ వాటిని పోల్చరు కదా? అలాంటప్పుడు any/ no తర్వాత other, వాడకండి.

**4)** Now is as good as any other time=
ఎప్పుడో చేసే బదులు ఇప్పుడే చేయొచ్చు కదా అని. (మిగతా సమయాలు ఎంత మంచివో, ఇప్పుడు కూడా అంత మంచిదే అని.) ఇదే భావాన్ని కిందివిధంగా చెప్పొచ్చు
Now is the best time/ Now is better than any other time/ no other time is so (as) good as now.
ఈ lesson లో మనం వాడిన expressions అన్నీ daily conversation లో వాడదగినవే. Practice చేయండి.

**Practise the following aloud in English.**

**Pratiksha:** నిన్న match లో ప్రత్యూష చాలా బాగా ఆడింది కదా?

**Niriksha:** తను regular player కాకపోయినా, regular players కంటే చాలా బాగా ఆడింది.

**Pratiksha:** అవతలి team captain గురించి నీ అభిప్రాయం ఏమిటి?

**Niriksha:** తను మంచి player అని నేనెప్పుడూ అనుకోలేదు.
(not/ neverతో superlative వాడండి)

**Pratiksha:** ఆమెను మరీ తక్కువచేసి మాట్లాడకు. మెరుగైన players లో ఆమె ఒకరు.

**Niriksha:** ఏదేమైనా తనంత గొప్ప captain ఏం కాదు కదా?

**Pratiksha:** అలా అనకు. ఆమె captaincy లో వాళ్లు గెలిచిన games తక్కువేం కాదు.

**Niriksha:** OK. ఒకసారి మనం ఆమెను కలుసుకుందామా?

**Pratiksha:** ఇప్పుడే కదా ఆమె మంచి player కాదని అన్నావు.

**Niriksha:** ఏదో తమాషాకన్నానులే. ఆమె అంటే నాకిష్టమే.

**Pratiksha:** ఎప్పుడో ఎందుకు, ఇప్పుడే వెళ్దాం.

**Answer**

**Pratiksha:** Pratyusha played very well in the match yesterday. Didn't she?

**Niriksha:** She is not a regular player, but she played better than any regular player.

**Pratiksha:** What's your opinion of the captain of the opposite team?

**Niriksha:** I never thought her the best of players.

**Pratiksha:** Don't undermine her so much. She is certainly among the better players.

**Niriksha:** Whatever it is, she is certainly not the greatest of captains, is she?

**Pratiksha:** Don't say that. The games the team has won under her captaincy are not a few.

**Niriksha:** OK. Shall we meet her once?

**Pratiksha:** You've just said she isn't a great player.

**Niriksha:** I was just joking. I do like her.

**Pratiksha:** Why any other time? Let's meet her now. Now is as good as any other time.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Bharat:** Sarat, Vasanth has yet to come. He is late most of the days.
(శరత్, వసంత్ ఇంకా రాలేదు. వాడు ఎక్కువ రోజులు ఆలస్యంగానే వస్తున్నాడు)

**Sarat:** Yesterday he was even later than the day before.
(మొన్నటి కంటే కూడా నిన్న ఇంకా ఆలస్యమయింది)

**Bharat:** Isn't he the last to come to class most of the days?
(ఎక్కువ రోజులు అందరిలో ఆలస్యంగా (చివరగా) వచ్చేదతనేకదా? )

**Sarat:** That he is. I don't know what his problem is.
(అతనంతే. అతని సమస్యేంటో తెలియడం లేదు)

(That he is = అవును, అతనంతే. That he is - అనేది కూడా conversational)

**Bharat:** I think his mother is ill most of the time and delays packing his lunch.
(వాళ్ళమ్మకు ఒంట్లో బాగుండదనుకుంటా. అతడికి carrier తయారుచేయటం ఆలస్యమవుతుందనుకుంటా)

**Sarat:** Hasn't he a sister? She can help his mother.
(అతడికి sister ఉంది కదా? ఆమె వాళ్ళమ్మకు సహాయపడవచ్చు.)

**Bharat:** Is she his elder or younger? I think she is younger than he and she goes to school too.
(ఆమె అతడి అక్కా, చెల్లెలా? చెల్లెలనుకుంటా, తను కూడా స్కూలుకు వెళుతోంది)

**Sarat:** That's a pity.

**Bharat:** To add to all this, his dad is most of the time on camp. His poor mom has to take care of everything.
(వీటన్నిటికి తోడు, వాళ్ల నాన్న ఎక్కువ సమయం camps లో ఉంటాడు. వాళ్ళమ్మే అన్ని విషయాలూ చూసుకోవాల్సి వస్తుంది.)

To add to all this = వీటికి తోడు/ వీటన్నిటికి తోడు

**Sarat:** What's her present condition?
(ఆమె ప్రస్తుత పరిస్థితేంటి? )

**Bharat:** He told me yesterday she was much better than before.
(ముందుకంటే మెరుగని నిన్ననే నాతో అన్నాడు)

**Sarat:** That's something. (అదికొంత నయమే)

**Bharat:** She is under the treatment of the foremost doctor of the town Dr.Vaidyanath. Still she isn't all right.
(నగరంలో అతి గొప్ప doctor వైద్యనాథ్ ఆమెకు వైద్యం చేస్తున్నాడు. అయితే ఆమెకు బాగవటం లేదు)

**Sarat:** Yea, I have heard about him. Is he expensive?
(అవును. ఆయన గురించి విన్నాను. చాలా ఖరీదైన డాక్టరా? )

**Bharat:** No, not at all. He doesn't charge more than the lesser doctors in the city.
(ఏం కాదు. అంత గొప్పకాని (మామూలు) doctors కంటే ఆయన fees ఎక్కువేం కాదు.)

**Sarat:** Let's hope she will recover completely soon.
(త్వరలోనే ఆమె పూర్తిగా కోలుకుంటుందని ఆశిద్దాం.)

☯ ☯ ☯ ☯

మనం comparatives, superlatives గురించి గత lesson లో తెలుసుకున్న points క్లుప్తంగా.

1) Among + comparative degree - కాస్త మెరుగైన కాస్త ఎక్కువైన, etc విషయం అనే అర్థం.
eg: She is among the clever students of the class =
class లో మెరుగైన students లో ఆ అమ్మాయి ఉంది - అని అర్థం.

2) not the + superlative = అంత గొప్పేంకాదు.
a) Hari is not the best in our team, is he?
మన team లో హరి అంత గొప్ప player కాదు.
b) certainly Sudhakar is not the worst of our friends.
మన స్నేహితుల్లో సుధాకర్ చాలా మంచివాడు అనే అర్థం.

3) Comparative + than + any కీ, comparative + than + any other కీ తేడా:
మనం పోలుస్తున్న విషయాలు ఒకే తెగకు చెందినవైతే than any other, వేర్వేరు తెగలకు చెందితే than any అంటాం అని తెలుసుకున్నాం.

1) Sunayana is cleverer than any other girl in her class.
(సునయన తన class లో మిగతా అమ్మాయిల కంటే తెలివి గలది)
(సునయన, ఇతర అమ్మాయిలూ ఒకే class వాళ్లు)

2) A Cheetah is faster than any tiger.
(ఏ పెద్దపులి కంటే కూడా చిరుతపులి వేగం కలది - ఇక్కడ Cheetah, tiger వేర్వేరు తెగలవి - అందుకని than any అంటాం)







తేడా గమనించండి-

**a)** old news (పాతది, అందరికీ తెలిసిన వార్త)

**b)** late news (తాజా వార్త - అంటే కొత్తగా తెలిసిన వార్త)

**c)** later reports contradict the earlier reports of the incident = ఆ ఘటన గురించి వచ్చిన ఇప్పటి వార్తలు, అందుకుముందు వచ్చిన వార్తలకు వ్యతిరేకంగా (విరుద్ధంగా) ఉన్నాయి.
contradict (కాంట్రడిక్ట్. 'కాం' తక్కువగా 'డి'ని ఎక్కువగా నొక్కి పలుకుతాం) = వ్యతిరేకించటం.
incident = ఘటన

**d)** later, comparative కదా - ఇప్పుడు చూడండి.
My shirt is of later cut than yours = నీ shirt కంటే నా shirt fashion తర్వాతది. (అంటే నా shirt fashion కొత్తది, నీ shirt కంటే. cut = fashion)

**Older, elder** - ఇవి రెండూ, old కు comparatives. వీటి విషయంలో జాగ్రత్త అవసరం.

Old - ముసలి, పాతబడిన. ముసలి అనే అర్థంతో మనుషులకు, జంతువులకూ, చెట్లకూ; పాత అనే అర్థంతో వస్తువులకూ వాడతాం.

Older - ఇది కూడా, పోలికల విషయంలో ముసలి అనే/ ఎక్కువ వయసున్న అనే అర్థంతో మనుషులకూ, జంతువులకూ, చెట్లకూ; పాత అనే అర్థంతో వస్తువులకు వాడతాం.

Elder - ఎక్కువగా మనుషులకే వాడతాం, అప్పుడప్పుడూ జంతువులకూ వాడతాం.

**1) Older** - ఒకే కుటుంబానికి చెందనివారి వయస్సులు పోల్చడానికి వాడతాం.

a) Mahatma Gandhi was older than Nehru
(మహాత్మాగాంధీ, నెహ్రూ కంటే పెద్ద - ఒకే కుటుంబం కాదు)

# Bhima was Arjuna's elder

ఇదీ మనం spoken English కు ఉపయోగపడే విధంగా degrees of comparison గురించి తెలుసుకుంది.

**Now look at the following sentences.**

**a)** The train arrived late this morning =
ఈరోజు ఉదయం ట్రైన్ ఆలస్యంగా వచ్చింది.

**b)** The match began later than the time fixed = మ్యాచ్ నిర్ణీత సమయం కంటే ఆలస్యంగా ప్రారంభమైంది.

**c)** He was the last to come to class yesterday= అతడు నిన్న క్లాస్ కు అందరిలో ఆలస్యం (చివర)గా వచ్చాడు

**Late (positive), later (comparative)** - ఈ రెండూ కూడా మనం అనుకున్న time/ ఓ నిర్ణీత సమయం దాటిన అనే అర్థంతో ఆలస్యమైన విషయాల గురించి చెబుతాయి కదా.
(late = ఆలస్యమైన/ ఆలస్యంగా = అనుకున్న సమయం దాటిన;
later = (పోలికలో) దాటిన సమయాని కంటే ఎక్కువ ఆలస్యమైన/ ఆలస్యంగా)

ఇప్పుడిది జాగ్రత్తగా చూడండి. గతంలో ఏదైనా ఆలస్యం అవడం అంటే, అది ప్రస్తుతానికి దగ్గరయినట్లే కదా? మొన్న జరగాల్సింది నిన్న జరిగిందంటే, అది ఈ రోజుకు (అంటే ప్రస్తుతానికి) దగ్గరగా జరిగినట్లే కదా.

I got the news late =
ఆ వార్త నాకు ఆలస్యంగా తెలిసింది.
(అందువల్ల నష్టం, అసౌకర్యం కలిగి ఉండొచ్చు)

The news came late =
వార్త ఆలస్యంగా వచ్చింది.
ఫలితం, నష్టం, అసౌకర్యం కావొచ్చు
అయితే ఇది చూడండి.

**a)** Late news = ఆలస్యంగా అందిన వార్త అని. అంటే తాజా వార్త. అలాగే,

**b)** My information is later than his =
అతడి వద్ద ఉన్న సమాచారం కంటే నా వద్ద ఉన్నది ఆలస్యమైంది - అంటే ప్రస్తుతానికి కొంచెం ముందే జరిగినట్లు - అంటే తాజా సమాచారం.

మనం ఏ news paper ను ఎక్కువ ఇష్టపడతాం? late news ఇచ్చే newspaper ను కదా - అంటే తాజా సమాచారం ఇచ్చే news paper ను.

latest - ఇది late కు superlative. అంటే, ఇప్పటివరకు (Till now) వచ్చిన వాటిలో చివరిది - అంటే అత్యంత తాజా, అధునాతన అని. మనం మామూలుగా వాడే మాటే కదా.

latest fashion - ఈ మధ్యే వచ్చిన fashion - దీని తర్వాత ఇంకా ఏదీ రాలేదు.

latest news కడపటి వార్త (వార్తలు - తెలుగులో)

latest score (cricket) లో కడపటి score - అంటే ఇప్పటివరకు ఒక జట్టు చేసిన పరుగులూ, కోల్పోయిన wickets.

latest developments ఇప్పటివరకు జరిగిన పరిణామాల్లో కడపటిది- అంటే కొత్త పరిణామం.

latest techniques = (ఇప్పటివరకు కడపటి) కొత్త పద్ధతి

ఇప్పుడు last విషయం చూద్దాం. latest, ఇప్పటివరకు జరిగిన time లో చివరి అయితే, last, ఒక వస్తువుల క్రమంలో/ మనుషుల క్రమంలో చివరిది/ చివరివారు

**a)** Kumar is the last to come =
అందరిలో చివర వచ్చినవాడు కుమార్.
గమనించండి - ఇక్కడ time కు కాదు ప్రాధాన్యం, వచ్చిన వాళ్ల వరసకు ప్రాధాన్యం.

**b)** This is the last book written by the author=
ఆ రచయిత చివరి పుస్తకం ఇది.
పట్టిక చూడండి.


M. SURESAN

b) He is older than any other person in the village =
ఆ గ్రామంలోని మిగతావాళ్ల కంటే అతను పెద్ద. (ఒకే కుటుంబం కాదు)

**2) elder** - ఇది ఒకే కుటుంబానికి చెందినవారి వయస్సులు పోల్చటానికి వాడతాం.

a) Sri Rama was Laxmana's elder.
(రాముడు, లక్ష్మణుడి కంటే పెద్ద - ఒకే కుటుంబం)

అయితే elder వాడే తీరు ముఖ్యం.
elder than కానీ, elder to కానీ అనం

b) Bhima was Arjuna's elder - ఇలా వాడాలి elder ను.

c) My uncle is my mother's elder -
మా అమ్మకన్నా మా మామపెద్ద.
(My uncle is elder than my mother.
My uncle is elder to my mother -
ఈ రెండూ సరికాదు)

అయితే American English లో He is my older brother, She is my older sister అనటం సర్వసాధారణం. తప్పుకాదు.

| Last | Latest |
|---|---|
| 1) This is the last book of the author (ఆ రచయితచివరి పుస్తకం ఇది - దీని తర్వాత ఆయన పుస్తకాలు రాయలేదు) | This is the latest book of the author. (ఆ రచయిత ఇప్పటివరకు రాసిన వాటిలో చివరిదిది/ దీని తర్వాత ఇంకా రాయవచ్చు) |
| 2) This is the last of the series (ఆ వరస క్రమంలో ఇది చివరిది - దీని తర్వాత ఇంకేదీ లేదు) | This is the latest in the series (ఆ వరసక్రమంలో ఇది కొత్తది) |
| 3) The last wicket fall at 313. (చివరి ఆటగాడు 313 పరుగుల దగ్గర అవుటయ్యాడు- Innings ముగిసింది) (అయితే, last అంటే పోయిన అనే అర్థం కూడా ఉంది కదా- last week/ last year లోలా. గుర్తుంచుకోవాలి) | The latest wicket to fall is that of Sehwag. (ఇప్పటివరకు జరిగిన ఆటలో కొత్తగా out అయింది Sehwag (ఇంకా ఆడాల్సినవాళ్లున్నారు) |

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# I have few friends here

**Sampath:** Why are people so crazy about imported stuff? They are proud of possessing them.

(Imported వస్తువులంటే అంత మోజేంటి జనానికి అవి ఉన్నవాళ్లు చాలా గర్వంగా ఉంటారు.)

imported ఇంపోర్టెడ్ - దిగుమతైన, అంటే విదేశీ (foreign). crazy క్రేయ్‌జి - పిచ్చిమోజు.

**Sanath:** (Do) you mean imported TVs, imported cars, imported watches etc.

(నువ్వనేది విదేశీకార్లు, టీవీలు, వాచ్‌లు వగైరా గురించా?)

**Sampath:** Yea. I am sure our country goods are as good as the so called imported ones. Moreover, I think, the so called imported goods are not suitable for Indian conditions.

(మన స్వదేశీ సరకు, విదేశీ సరకంత మంచిదే అని నా నమ్మకం. అంతేకాకుండా, ఈ విదేశీ సరకులు మనదేశ పరిస్థితులకు అనుగుణంగా ఉండవు.)

So called = అనే (అనబడే)

The so called honest man = నిజాయతీకల వాడిగా అనబడేవాడు - అంటే అతని నిజాయతీ మనం నమ్మడం లేదు.

**Sanath:** No, no. They are definitely superior to Indian goods. Our technology is inferior to theirs, and naturally the quality is inferior too.

(అదేంకాదు. విదేశీ వస్తువులు మన వస్తువుల కంటే కచ్చితంగా మెరుగైనవే. మన సాంకేతిక నైపుణ్యం, వాళ్ల దానికంటే తక్కువ రకం, అందుకని సహజంగానే మన వస్తువు నాణ్యత విదేశీ వస్తువుల నాణ్యత కంటే కూడా తక్కువే)

**Sampath:** Whether a thing is inferior or superior depends on its adaptability to the situation of its use, doesn't it? If that's the case, Indians goods are as good as, even better than foreign ones.

(ఒక వస్తువు గొప్పదా, తక్కువదా అనేది దాన్ని మనం వాడే పరిస్థితులకు అనుగుణమైందా కాదా అనేదాన్ని బట్టి కదా ఉంటుంది? అలా తీసుకుంటే భారత్‌లో తయారయ్యే వస్తువులు, విదేశీ వస్తువులకేం తీసిపోవు, ఇంకా మేలైనవి కూడా.)

adaptibility పరిస్థితులకు అనుగుణంగా ఉండే స్వభావం.

**Sanath:** Look here. I have been a dealer in electronic goods and appliances for far longer than you. I am senior to you in the field. Our goods are not half as durable as imported ones.

(చూడు ఈ electronic వస్తువుల, పరికరాల విక్రేతగా నేను నీకంటే చాలా ఎక్కువ కాలంగా ఉన్నాను. నేను నీకంటే ఈ రంగంలో ఎక్కువ అనుభవం ఉన్నవాడిని. విదేశీ వస్తువుల మన్నికలో మన వస్తువుల మన్నిక సగం కూడా ఉండదు.)

Appliances = అప్లయన్సిజ్ - 'ప' నొక్కి పలుకుతాం = పరికరాలు (సామాన్యంగా) గృహోపయోగ వస్తువులు. Durability = మన్నిక

**Sampath:** I do admit I am your junior, but I still feel that the prices of imported goods are unreasonable.

(నీకంటే ఈ రంగంలో తక్కువ అనుభవం ఉన్న వాడినని అంగీకరిస్తా. కానీ విదేశీ వస్తువుల ధరలు మరీ ఎక్కువ.)

unreasonable = సబబుకానంత ఎక్కువ

**Sanath:** You pay for quality; that's all. But I think wrist watches are among the lesser imported items.

(నాణ్యతకు ఖర్చు పెడతావు. అంతే కదా. అయితే నేననుకోవటం, తక్కువకు దిగుమతయ్యే వస్తువుల్లో wrist watches ఒకటని)

☯ ☯ ☯ ☯

Our study of comparative in spoken English continues. కొన్ని కొన్ని comparatives usage మామూలు కంటే భిన్నంగా ఉంటాయి. అలాంటి వాటిల్లో ఒకటి elder, older - వీటి విషయం మనం కిందటి lesson లో చూశాం కదా. ఇప్పుడు అలాంటివి మరికొన్ని comparatives ఉన్నాయి. అవి superior inferior, senior and junior. వీటర్థాలు మనందరకూ తెలిసినవే కదా; అయితే ఇవి comparatives అయినప్పటికీ వీటి తర్వాత than రాదు. To మాత్రమే వస్తుంది.




**Now look at the following sentences from the conversation:**

1) They are definitely superior to Indian goods.
2) Our technology is inferior to theirs and naturally the quality is inferior too.
3) I am senior to you in the field.
4) I do admit I am junior to you.

పై sentences అన్నింట్లో, superior, inferior, senior, junior - ఈ comparatives తర్వాత than కాకుండా to రావటం గమనించండి.

| positive | comparative | superlative |
|---|---|---|
| little | less | least |
| few | fewer | fewest |

Little, uncountables తోనే వాడతాం కాబట్టి, దానికి comparative అయిన less, superlative అయిన least ను కూడా uncountables తోనే వాడాలి.

a) The milk in this glass is less than the milk in that glass =

ఆ glass లో పాలు ఈ glass లో పాలకంటే తక్కువ.

**Superior:** నాణ్యతలో, స్వభావంలో ఇంకేదైనా మంచి గుణంలో మిగతావాటికంటే/ మిగతా వాళ్లకంటే గొప్పది/ గొప్ప అని.

a) This camera is superior to that because of its extra features =

ఈ camera కన్న అదనపు సౌకర్యాల వల్ల, ఆ camera కంటే ఇది గొప్పది.

b) The camera work in Hollywood movies is superior to that in Indian movies =

హాలీవుడ్ చిత్రాల్లో ఛాయాగ్రహణం భారతీయ చిత్రాల్లో కంటే మేలుగా ఉంటుంది.

**Inferior** = తక్కువ రకం

a) Indian bowling strength is inferior to Australian bowling strength =

Australian bowling పటిమకంటే భారత bowling పటిమ తక్కువ.

b) In speed and mileage Indian cars are inferior to japanese cars =

వేగం, mileage విషయాల్లో Japanese cars కంటే భారత్ cars తీసికట్టే.

**senior** = వయసులో, అనుభవంలో (ఏ రంగంలోనైన) పెద్ద/ ఎక్కువ.

a) He was senior to me/ my senior at school by a year =

school లో అతడు నాకంటే పై class లో ఉండే వాడు.

b) She is senior to me in age by a year =

ఆమె నాకంటే ఒక సంవత్సరం పెద్ద (వయసులో)

c) NT Rama Rao was senior to Jaggaiah as a movie actor =

నటుడిగా NTR కు జగ్గయ్య కంటే ఎక్కువ అనుభవం.

**Junior.** Senior కు వ్యతిరేకం - వయసులో చిన్న, అనుభవం తక్కువ.

a) Sehwag is junior to Kumble =

కుంబ్లే కంటే Sehwag cricket అనుభవం తక్కువ

b) Though we are classmates, he is junior to me in age.

(మేం ఒకే class అయినప్పటికీ, వయసులో అతను చిన్న.)

ఇంతకుముందు ఈ columns లో కూడా little, few లను గురించి చర్చించాం కదా. వాటి comparatives అంతకుముందు చర్చించాం, ఒక్కసారి గుర్తుకు తెచ్చుకుందాం.

| LITTLE | FEW |
|---|---|
| ఎప్పుడూ uncountables (లెక్కపెట్టని వాటి)తో వాడతాం. (little rice/ sugar/ milk, etc) | ఎప్పుడూ countables (లెక్కపెట్టేవాటి)తో వాడతాం. (few books/ friends/ boys) |
| **Little** = దాదాపు లేదు<br>There is little milk in the glass =<br>glassలో పాలు లేవు (దాదాపు) | **Few** = దాదాపు లేవు/ లేరు<br>I have few friends here = ఇక్కడ నాకు స్నేహితులు లేరు (దాదాపు) |
| **A little** = ఏదో కొంత/ స్వల్పం<br>The Patient had a little milk in the morning = రోగిపొద్దున కొన్ని పాలు తాగాడు | **A few** = ఏవో కొన్ని/ కొంతమంది<br>A few friends of mine are coming today = నా friends లో ఇద్దరు ముగ్గురొస్తున్నారీరోజు. |
| **Very little** = చాలా కొద్ది. The patient had very little food yesterday = రోగి నిన్న చాలా తక్కువ ఆహారం తీసుకున్నారు. | **Very few** = చాలా కొన్ని/ కొద్దిమంది<br>Very few know this secret = చాలా కొద్ది మందికే ఈ రహస్యం తెలుసు. |
| **The little** = ఉన్న ఆ కొద్ది =<br>The patient threw up the little food she had taken =<br>రోగి తీసుకున్న ఆ కొద్ది ఆహారాన్ని వాంతి చేసుకుంది. | **The few** = ఉన్న ఆ కొన్ని / కొద్ది మంది.<br>The few that passed got very low marks =<br>pass అయిన ఆ కొద్ది మంది తక్కువ మార్కులు తెచ్చుకున్నారు. |


M. SURESAN

b) Of the three glasses, this glass has the least milk =

ఆ మూడు glasses లో, ఈ glass లో అన్నిటికంటే తక్కువ పాలున్నాయి.

Less, countables తో కూడా, ముఖ్యంగా 'no' తో, తక్కువకాకుండా/ తక్కువకాని అనే అర్థంతో వాడుతుంటారు.

a) The book has been translated into no less than twenty languages =

ఆ పుస్తకం 20 కంటే తక్కువకాని భాషల్లోకి అనువాదమైంది.

(దాదాపు 20 భాషల్లోకి)

b) The movie has been released in no less than thirty theatres =

ఆ చిత్రం 30కి తక్కువకాని సినిమాహాళ్లలో విడుదలైంది.

(దాదాపు 30 సినిమాహాళ్లలో)

Little కు comparative, less. Little ను uncountables తోనే వాడతాం కాబట్టి less ను countables తో వాడకూడదు, fewer మాత్రమే వాడాలని కొందరంటారు.

eg: I tried to contact him no fewer than ten times

(ఏ పదిసార్లో/ పదిసార్లకు తక్కువ కాకుండా అతనితో మాట్లాడాలని ప్రయత్నించాను.)

అయితే మామూలు spoken English లో countables కు కూడా less, fewer పెద్ద తేడా లేకుండా వాడేస్తున్నారు.

I gave him no less than a hundred books/ no fewer than a hundred books.

అతడికి నేను ఏ వంద పుస్తకాలో/ వందకు తక్కువ కాకుండా పుస్తకాలు ఇచ్చాను అనే అర్థంతో less, fewer కి తేడా లేకుండా వాడటం మామూలైంది. less వాడటం పెద్ద తప్పుకాదు. (అయితే fewer మాత్రం uncountables కు వాడం).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# That'll be too late




**Jayanth:** Hi Anant, good to see you though after such a long time. How goes life? (హాయ్ అనంత్, చాలాకాలం తర్వాత యినా నిన్ను చూడటం సంతోషంగా ఉంది. ఏంటి విశేషాలు? ఎలా ఉన్నావు?)

**Ananth:** Getting on. How is it with you? (ఏదో అలా జరిగిపోతోంది. నీ సంగతేంటి?)

**Jayanth:** As usual. (మామూలే)

**Ananth:** How is Vasanth? Long since I met him. (వసంత్ ఎలా ఉన్నాడు? చూసి చాలాకాలమైంది.)

**Jayanth:** Not in the best of circumstances, I must say. (అతడి పరిస్థితి అంతేం బాగాలేదనే చెప్పాలి)

**Ananth:** Why? what is wrong? (ఏంటి విషయం)

**Jayanth:** He has had losses in business. His partners have cheated him. But he is facing all this very bravely. A lesser man than he would have gone mad. (వ్యాపారంలో నష్టాలు వచ్చాయి. అతడి భాగస్వాములతడిని ముంచారు. కాని ఇంత జరిగినా ధైర్యంగానే ఉన్నాడు. అతడి కంటే తక్కువ స్థైర్యం ఉన్నవాళ్లయితే, ఈపా టికి పిచ్చివాళ్లయిపోయేవారు.)

**Ananth:** That'll be too late for me to see him. I think I'll wait and see him today. Won't you come with me? (అప్పటికి మరీ ఆలస్యమైపోతుంది. ఈరోజు ఆగి, వాడిని చూద్దామనుకుంటున్నా. నువ్వు నాతోరావా?)

**Jayanth:** I will, of course. (తప్పకుండా వస్తా)

**Ananth:** OK. Let's in the meantime watch the TV. (సరే. ఈమధ్య కాసేపు టి.వి. చూద్దాం.)

మనం కిందటిసారి చూసింది - little కు ఇతర degrees - little (positive), less (comparative), least (superlative). అయితే little కు రెండో, (ఇంకో) comparative కూడా ఉంది. అది lesser. Less, lesser - ఈ రెండూ little కు comparatives అయినా, వాటి అర్థం, use లో చాలా తేడా ఉంది.

Less అంటే ఇంతకుముందు తెలుసుకున్నాం. ఇంకో దానితో పోలిస్తే తక్కువైన అనే అర్థంలో less వాడతాం.

**a)** She has less jewellery than her sister (has) = ఆమెకున్న నగలు, ఆమె సోదరి నగల కంటే తక్కువ.

**b)** He gets less income from his job than from his rents= అతడికి అద్దెల వల్ల వచ్చే ఆదాయానికంటే, ఉద్యోగం వల్ల వచ్చే ఆదాయం తక్కువ.


M. SURESAN

Lesser అర్థం, ఇంకోదానికంటే తక్కువ అని అయినప్పటికీ less వాడే చోటల్లా lesser వాడం. సామాన్యంగా ఇంకొకరికంటే తక్కువ బలం/ప్రతిభ/శక్తి, మొదలైన అనే అర్థంతో వాడతాం.

**Ananth:** Sorry to hear that. But one thing. He is too trusting and too risking. That sometimes lands him in trouble. (వినటానికి బాధగా ఉంది. అయితే ఒకటి. అతడు ఇతరులను అతిగా నమ్ముతాడు; అతిగా తెగిస్తాడు. అదతన్ని చిక్కుల్లో పడేస్తుంది.)

Trusting= నమ్మే స్వభావంకల;
risking= తెగించటం, రిస్క్ తీసుకోవటం.
Land somebody in trouble= చిక్కుల్లో పడేయటం

**Jayanth:** I agree with you there. (ఆ విషయం నేనంగీకరిస్తా.)

**Ananth:** I wish to see him. (వాడిని చూడాలనుకుంటున్నా)

**Jayanth:** It is too early. You wait for an hour. He will then have returned from his morning walk. (ఇప్పుడు మరీ పెందలాడే అవుతుంది. ఓ గంట ఆగు. అప్పటికి మార్నింగ్ వాక్ నుంచి తిరిగొస్తాడు.)

**Ananth:** Does he still continue his morning walk? (ఇంకా మార్నింగ్ వాక్‌కు వెళుతూనే ఉన్నాడా?)

**Jayanth:** He does. That keeps him healthy. (అవును. అది వాడిని ఆరోగ్యంగా ఉంచుతోంది.)

**Ananth:** (Do) you suggest that I wait for another hour to see him. I'm afraid that's too long. I have work at 9.30. I think I'll see him tomorrow. (వాడిని చూసేందుకు నన్ను మరో గంట వేచిచూడమంటావా? అది మరీ ఎక్కువ సమయమవుతుందేమో అనిపిస్తోంది. నాకు తొమ్మిదిన్నరకు పనుంది. రేపు చూడాలను కుంటున్నా.)

**Jayanth:** I leave it to you, but I'm not sure of his programme tomorrow. He may be out of town, and return only on friday. (నీ ఇష్టం మరి. కాని రేపతని ప్రోగ్రామ్ ఏమిటో నాకు తెలీదు. రేపు ఊళ్లో ఉండకపోవచ్చు ఒకవేళ ఊళ్లో లేకపోతే శుక్రవారం వరకూ రాకపోవచ్చు)

**Look at the following.**

**a)** The pen can't be Rs 15/- It'd be much less= ఆ pen 15 రూపాయలుండదు. బాగా తక్కువే ఉంటుంది. ఇంకోదానికంటే తక్కువ అనే అర్థం less, lesser రెండింటికీ ఉన్నప్పటికీ less వాడినంత తరచుగా lesser వాడం.

**b)** They originally demanded Rs. 50,000/- but finally settled for a lesser sum= వాళ్లు మొదట 50,000 రూపాయలడిగినా, చివరకు తక్కువ మొత్తానికి అంగీకరించారు.

ఇదే భావం, less వాడితే ఇలా చెబుతాం.

**c)** They originally ... , accepted a sum less than that.

(b) లో a lesser sum = (c) లో a sum less than ... తేడా గమనించే ఉంటారు, lesser తర్వాత sum అనే noun రావటం - ఇలా lesser తర్వాత ఎక్కువగా noun వస్తుంది. Eg: A lesser player, A lesser degree (ఇంకోదానికంటే కాస్త తక్కువ మేరకు), A lesser offense (అంతకంటే తక్కువ నేరం), etc.

A lesser player than Tendulkar could not have scored so many centuries= Tendulkar కంటే తక్కువ ప్రతిభ కలిగిన cricketer, అన్ని centuries చేయగలిగేవాడు కాదు.

అంటే lesser ను మామూలుగా ఒక noun (పేర్లు తెలిపే పదం) ముందు ఇంకోదానికంటే తక్కువ మొత్తం (amount), ప్రాముఖ్యం (importance), పరిమాణం (size) ఉన్న అనే అర్థం తెలుపుతుంది.

**a)** The growing pollution, and, to a lesser degree, the scarcity of drinking water, are the cause of the trouble= పెరుగుతున్న కాలుష్యం, దానికంటే కాస్త తక్కువ మేరకు, మంచినీటి కొరత, బాధలకు కారణాలు.

**b)** Though a city of lesser size and population than Kolkata, Mumbai has greater prominence= కోల్‌కతా కంటే తక్కువ జనాభా, పరిమాణంకల నగరమైనప్పటికీ, ముంబై ప్రాముఖ్యం ఎక్కువ.

**c)** A lesser leader than Gandhi would have yielded to the British= గాంధీకంటే తక్కువ గొప్ప నాయకుడు British వాళ్లకు లొంగేవాడు.

**d)** He is involved in the crime to a lesser or greater extent= ఆ నేరంలో కొద్దో, గొప్పో వీడి పాత్ర కూడా ఉంది.

extent= వరకు/ మేరకు= degree.

**e)** This is the lesser of the two evils = రెండూ చెడే, అయితే ఇది రెండింటిలో తక్కువ చెడు.

**f)** He is among the lesser known actors of Bollywood= అంతగా పేరుపొందని బాలీవుడ్ నటుల్లో అతనొకడు.

**g)** A lesser man than he would have gone mad = అతడికంటే తక్కువ (స్థైర్యం, etc) వాళ్లయితే, పిచ్చి వాళ్లయిపోయేవాళ్లే.

ఇదీ lesser ఉపయోగం. మీ conversation లో practice చేయండి.

☆ ☆ ☆ ☆

**Look at the following sentence from the conversation at the beginning of the lesson.**

1) He is too trusting and too risking

2) It is too early

3) I'm afraid that's too long

4) That'll be too late

Look at the use of too in the sentences above.

too అంటే అర్థం, అతి/ అతిగా అని. అతిగా అంటే అవసరమైన దానికంటే ఎక్కువగా, మోతాదుకు మించి అని కదా. అందువల్ల చెడు ఫలితాలు కలగవచ్చని.

**1)** He is too trusting and risking = అతడు (ఇతరులను) అతిగా నమ్ముతాడు. దానివల్ల దుష్ఫలితం - అతని partners అతన్ని ముంచేయటం. అంతేకాకుండా too risking = మరీ ఎక్కువ తెగింపు - ప్రమాదంతో కూడుకున్న విషయాన్ని (risk ను) కూడా తెగించి చేయటం. - ఇతను ఇది మరీ చేస్తాడు - ఫలితం, నష్టం

**2)** It is too early = మరీ పెందలాడె - అందువల్ల పని జరగదు.

**Prem:** I want to go to bank urgently. I am starting. (Bank కు వెళ్లాలి. బయల్దేరుతున్నా)

**Syam:** It is too early - (మరీ త్వరగా వెళ్తున్నావు - Bank తెరిచి ఉండదు/ నువ్వు ఎక్కువ సేపు వేచి ఉండాల్సి వస్తుంది.)

**a)** Reaching the station at 3.30 for a train that arrives at 5.00 is too early = 5 గంటలకు వచ్చే train కోసం, 3.30కే station కు చేరుకోవటం మరీ ముందరే వెళ్లటం అవుతుంది.

**b)** If 3.30 is too early, 5.30 is too late. 3.30 కి మరీ త్వరగా వెళ్ళటం అయితే, 5.30 కి వచ్చే బండికోసం 5.30 కు వెళ్ళటం అత్యాలస్యం (బండి తప్పిపోతుంది- ప్రయాణం చేయలేం.)

**3)** I'm afraid that it is too long = అది మరీ ఎక్కువసేపేమో అనిపిస్తోందినాకు. (పరిస్థితులు విషమించేంతసేపు)

**a)** He stayed here too long = అతనిక్కడ మరీ ఎక్కువసేపున్నాడు. (అంతసేపుండటం వల్ల ఫలితాలు చెడు. అతని ఉద్దేశమూ చెడుకావచ్చు/ అతనికి, ఇతరులకు ఏదైనా చెడు కలిగింది)

Very, too- ఈ రెండూ ఒకటికావు - అర్థంలో కానీ, use లో కానీ.

Very అంటే చాలా/ ఎక్కువ అని మనందరికీ తెలుసు. అందువల్ల అంత చెడు/ నష్టం లేదు.

Too అంటే మరీ/ అతి అని.

**a)** The train is very late = Train చాలా నిదానంగా/ నెమ్మదిగా పోతోంది. మనం గమ్యం చేరటం (చాలా) ఆలస్యం కావచ్చు ఫలితం దక్కవచ్చు

**b)** Train is too slow = Train మరీ/ అతి నిదానంగా వెళ్తోంది. మనం చేరేటప్పటికి, ప్రయాణ ఫలితం దక్కదు.

**c)** The doctor was called in very late = Doctor ను చాలా ఆలస్యంగా పిలిచారు. (మించిపోలేదు. కష్టయినా ప్రయోజనం లభించింది)

**d)** The doctor was called in too late = Doctor ను మరీ ఆలస్యంగా పిలిచారు. (అప్పటికే మించిపోయింది. ప్రయోజనం లేకపోయింది. Doctor చేతులు కూడా దాటిపోయింది.)

| EXERCISE | ANSWER |
|---|---|
| **Sumithra:** ఈ చీర ఎలా ఉంది? నిన్ననే కొన్నా. | **Sumithra:** How is this sari? I bought it yesterday. |
| **Suchithra:** ఈ చీర పట్టు (silk) నువ్వు అంతకు ముందు కొన్న చీర పట్టుకంటే ఎక్కువ నాణ్యమైంది. అయితే దాని జరీకి దీనంత నాణ్యతలేదు. (జరీ = brocade - బ్రొకెయ్‌డ్ - 'కెయ్' నొక్కి పలుకుతాం) | **Suchithra:** The silk/ texture (నేత) of this sari is superior to that of the sari you bought earlier, but its brocade is inferior to that of the earlier sari. |
| **Sumithra:** అయితే ఇది దానికంటే ఖరీదైంది. | **Sumithra:** But this is costlier than that. |
| **Suchithra:** ఈ రెండు సంవత్సరాల్లో నువ్వు ఎనిమిది పట్టు చీరలకంటే తక్కువ కొనుండవుకదా? | **Suchithra:** You must have bought not less than/ no fewer than eight saris in the last two years. Isn't that so? |
| **Sumithra:** అనుకుంటా. | **Sumithra:** I think so. |
| **Suchithra:** ఎంపిక నీదేనా, వేరెవరి సహాయమైనా తీసుకుంటావా? | **Suchithra:** Is the selection yours, or do you take any one's help? |
| **Sumithra:** మా వదినను తీసుకువెళతా. ఆమెకు ఈ విషయంలో నాకంటే ఎక్కువ అనుభవముంది. | **Sumithra:** I take my sister-in-law's help. She is senior to me in these matters. |
| **Suchithra:** Selection చాలా బాగుంటుంది. | **Suchithra:** The selection is really good. |
| **Sumithra:** ధన్యవాదాలు. | **Sumithra:** Thank you. |

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# He is more smart than good

**Govind:** Aravind, where did you get the information from?
(అరవింద్, నీకు సమాచారం ఎక్కడినుంచి వచ్చింది?)

**Aravind:** Which information (do) you mean?
(ఏ సమాచారం గురించి అంటున్నావు?)

**Govind:** That there will be a hike in the allowances to employees.
(ఉద్యోగుల భత్యాల్లో పెంపుదల ఉంటుందని)

**Aravind:** I had it from Gopal. You know he is in a key position in the finance ministry
(గోపాల్ చెప్పాడు నాకు. నీకు తెలుసుగా, అతను finance ministry లో కీలక పదవిలో ఉన్నాడని.)

Key = కీలకమైన; position = మామూలు అర్థం చోటు. ఇక్కడ అర్థం పదవి.

**Govind:** Yea, I know. He is really in a good position in the IAS. I think of all of us he enjoys the highest official status.
(అవును, తెలుసు. IAS లో అతను మంచి పదవిలో ఉన్నాడు. మనందరిలో అత్యున్నత అధికారిక స్థితిలో ఉన్నాడతను.)

**Aravind:** He hasn't earned much, though. He is too honest for that. Others in similar or even in lower positions are much richer than he.
(అయినా అతనేం సంపాదించుకోలేదు, మరి. అతనిలాంటి పదవుల్లో, అతనికన్నా తక్కువ పదవుల్లో ఉన్నవాళ్లు అతనికంటే ధనికులుగా ఉన్నారు.)

He hasn't earned much, though - ఈ ప్రయోగం గమనించండి. Though he is in a good position, he hasn't earned much = He is in a good position, he hasn't earned much, though. Though, ఇక్కడ చివర రావటం చూడండి. మంచి position లో ఉన్నాడు, అయినా ఏం సంపాదించలేదు, అని. ఇది మంచి conversational expression. మీ conversation లో practice చేయండి.

**Govind:** He has more power than money.
(అతనికి డబ్బుకంటే, అధికారం, పలుకుబడి ఎక్కువ.)

**Aravind:** That way Mukund is the best of the lot. He is very wealthy but has little else. Unfortunately he is more wealthy than healthy.
(ఆ విధంగా చూస్తే ముకుందే అందరిలో మంచి స్థితిలో ఉన్నాడు. అతను సంపన్నుడే కాని డబ్బు తప్ప అతనికింకేంలేదు. దురదృష్టవశాత్తు అతనికి ఆరోగ్యంకంటే డబ్బెక్కువ.)

**Govind:** Life's like that. It isn't an unmixed blessing for any. Look at koteswar. He has more fame than happiness or money.
(జీవితం అంతే. అందరికి అన్నీ ఉండవు. కోటేశ్వర్ విషయం చూడు. వాడికి సంతోషం, డబ్బు కంటే ఖ్యాతి ఎక్కువ.)

Life's like that = జీవితం అంతే. (అదే జీవితం - మనం అనుకున్నట్టు జరగదు.)

unmixed blessing - ఇది జీవితాన్ని గురించి చెప్పే విషయం - జీవితంలో పూర్తిగా మనకు సంతోషాన్నిచ్చే విషయం ఉండదు. మనం అనుకున్నట్టు ఏదీ పూర్తిగా అమరదు.

**Aravind:** You and I just get on. We are not starving. That's enough for us, isn't it? Sekhar is all the time busy making money. God knows when he finds the time to enjoy what he gets. I'd rather do with less money than put myself to such trouble.
(నువ్వూ నేనూ అలా నెట్టుకొస్తున్నాం. పేదవాళ్లం కాము. అది చాలు కదా? Sekhar ఎప్పుడూ డబ్బు సంపాదనలో గడుపుతుంటాడు. సంపాదించిన డబ్బు అనుభవించటానికి తీరికలేదతనికి. అంత trouble పడటం కంటే తక్కువ డబ్బుతో ఉండటానికే ఇష్టపడతాను నేను)

get on = అలా గడిపేస్తాం. we are not starving = మనం పస్తులుండటం లేదు - అంటే పేదలం కాము అని. ధనికుడిని కాకపోయినా నేనేం బీదవాడినికాను, అని గట్టిగా అనటానికి, English లో I am not starving అంటాం. ఇది మీ conversation లో practice చేయండి. starve = పస్తుండటం; fast = ఒకపొద్దు/ ఉపవాసం ఉండటం.

I'd do = I would be satisfied

**Govind:** Yes, That's true.

☯ ☯ ☯ ☯




eg: The elephant is stronger than any other land animal. ఇతర భూచర జంతువులకంటే ఏనుగు బలమైంది. ఇక్కడ చాలా జంతువులకున్న ఒకే గుణాన్ని - strong - పోలుస్తున్నాం - కాబట్టి stronger.

2) ఒకే వ్యక్తికి/ ఒకదానికే ఉన్న రెండు గుణాలు పోలిస్తే, అప్పుడు more వాడతాం, regular comparative forms ఉన్న వాటికి కూడా.

eg: The elephant is more strong than fast. ఏనుగుకు (ఒకే జంతువుకు) ఉన్న రెండు లక్షణాలను పోలుస్తున్నాం - కాబట్టి, more strong అంటున్నాం.

**a)** I'd rather die than tell a lie
(అబద్ధం చెప్పడంకంటే చావటమే నాకిష్టం)

**b)** Our Indian movie heroes rather dance in the movies than act = మన సినిమాల్లో హీరోలు నటించటం కంటే dance ఎక్కువ చేస్తారు.

**c)** It is better to call them dancers rather than actors = వాళ్లను actors అనటంకంటే dancers అనటం నయం. (ఇలాంటిచోట్ల than బదులు rather than ఎక్కువ వాడతాం.)

**Look at the following sentences:**

**a)** Gopal is richer than Gokul (Gokul కంటే Gopal ధనవంతుడు)

**b)** Gopal is more rich than handsome - (Gopal ధనికుడైనంత, అందగాడు కాడు = గోపాల్‌కు అందంకంటే డబ్బెక్కువ)

(a) లో rich కి comparative గా richer వాడాం.
(b) లో more rich అన్నాం.
(a) లో ఇద్దరికున్న ఒకే గుణాన్ని (rich) పోల్చాం. అక్కడ richer అని regular comparative వాడాం.
(b) లో ఒకరికే ఉన్న రెండు గుణాలు పోల్చాం కదా.
(b) లోలా ఒకరికే ఉన్న రెండు మూడు గుణాలను పోల్చినప్పుడు, ఎక్కువగా ఉన్న గుణంముందు more వాడతాం - అక్కడ regular comparative రాదు.

**i)** She is more clever than beautiful = ఆమెకు అందంకంటే తెలివెక్కువ. (ఒకరికే ఉన్న రెండు గుణాలను పోలుస్తున్నాం. అందుకని more clever అంటాం, cleverer అని అనం.)

**ii)** Kumar is more good than intelligent = Kumar కు తెలివికంటే మంచితనం ఎక్కువ. (ఒకరికే ఉన్న రెండు గుణాలను పోలుస్తున్నాం - అందుకని better వాడం; more good అంటాం.)

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson.**

**1)** He has more power than money = అతనికి డబ్బుకంటే హోదావల్ల అధికారం ఎక్కువ

**2)** He (Mukund) is more wealthy than healthy = ముకుంద్‌కు ఆరోగ్యం కంటే సంపద ఎక్కువ.
(గమనించండి: wealthier వాడటం లేదు. more wealthy అంటున్నాం. ఎందుకని? ఒకే వ్యక్తికున్న రెండు లక్షణాలు పోలుస్తున్నాం- అందుకని wealthy, healthy కున్న regular comparatives - wealthier, healthier రావు.)

**3)** He has more fame than happiness or money. అతనికి సంతోషం, డబ్బుకంటే ఖ్యాతి ఎక్కువ. ఒకరికే ఉన్న ఒక గుణం మిగతా గుణాల కంటే ఎక్కువ అని చెప్పటం - కాబట్టి more fame than అంటాం

ఇప్పుడు మనం తెలుసుకున్న విషయం.

**1)** చాలామందికున్న ఒకే గుణాన్ని పోలిస్తే regular comparative form వాడతాం.


M. SURESAN

So that is the difference between the regular comparative form, and more + adjective form. Some more examples.

**a)** This building is more strong than beautiful = ఈ మేడ అందంగా కంటే బలంగా ఉంది. (stronger కాదు)

**b)** He is more smart than good = అతనికి మంచితనం కంటే తెలివి ఎక్కువ. (smarter కాదు.)

**Now study this sentence from the conversation:**

I'd (I would) rather do with less money than put myself to such a trouble = అంత శ్రమపడేకంటే తక్కువ డబ్బుతో గడుపుతాను నేను.

ఈ sentence లో rather ... than కూడా ఒక రకంగా పోలికను తెలుపుతోంది కదా. ఇక్కడ rather ... than మన ఎంపిక (choice) ను తెలపడానికి వాడతాం.

**d)** Rather than get into a crowded bus, why not walk?/ why don't you walk? = అంత జనం ఉన్న bus ఎక్కడం కంటే నడవటం మేలు కదా?

**e)** I decided to be jobless rather than do such a job = అలాంటి ఉద్యోగం చేయడంకంటే ఉద్యోగం లేకుండా ఉండటానికే నిర్ణయించుకున్నా. (నిరుద్యోగిగా ఉండాలని నిర్ణయించుకున్నా.)

ఇలా rather than మనం ఒక రకమైన comparative గా వాడవచ్చు ముఖ్యంగా ఏ సంబంధం లేని రెండు విషయాలను పోల్చేటప్పుడు rather than వాడతాం.

**f)** Rather than talk all the time, why don't you do some work? = అంతసేపూ మాట్లాడే కంటే ఏదైనా చేయకూడదూ? (మాటలాపి పని చెయ్యి అని).

## EXERCISE

**Practise the following aloud in English:**

**Gandharv:** ఇంతసేపు మేల్కొన్నావేంటి? రాత్రి 12 గంటలయింది.
**Kinnera:** నాకు రేపు Exam ఉంది.
**Gandharv:** ఇలా నిద్రపోగొట్టుకుని రాత్రంతా మేల్కొనే బదులు పగలు time waste చేయకుండా చదవొచ్చుకదా?
**Kinnera:** అది నిజమే. కానీ ఏం చేయను? నేను అప్సరలాగా కాను. తను శ్రమపడకపోయినా ఫరవాలేదు. తన స్వభావం, (by nature) కష్టపడి పనిచేసేకంటే clever గా ఉండటం.
**Gandharv:** నేననేదేంటంటే, నువ్వు రాత్రి బదులు పగలు చదవొచ్చుకదా అని.
**Kinnera:** నాకు పగలుకంటే రాత్రి చదవటమే ఇష్టం.
**Gandharv:** నాకో friend ఉన్నాడు. వాడూ clever student. అయితే పాపం ఉన్నవాడేం కాదు.
**Kinnera:** అంటే అతనికి తెలివున్నంత డబ్బులేదు.
**Gandharv:** అవును.
**Kinnera:** జీవితం అలానే ఉంటుంది.

## ANSWER

**Gandharv:** Why are you awake so late at night? It is 12 midnight.
**Kinnera:** I have an exam tomorrow.
**Gandharv:** Rather than lose sleep by keeping awake late at night, you can study during the day without wasting time.
**Kinnera:** That's true. But what can I do? I am not like Apsara. It doesn't matter even if she doesn't work. By nature she is more clever than hard working.
**Gandharv:** What I mean is rather than study at night, you can study during the day.
**Kinnera:** I'd rather study at night than during the day.
**Gandharv:** I have a friend. He is clever too. But he is not rich.
**Kinnera:** That means he is more clever than rich.
**Gandharv:** Yea.
**Kinnera:** Life's like that.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Pramod:** Vinod, this book doesn't give all the information about the tourist spots in A.P.
(ఈ పుస్తకం ఆంధ్రప్రదేశ్‌లోని పర్యటక స్థలాల పూర్తి సమాచారం ఇవ్వటం లేదు.)
(Tourist = పర్యటకులు. Spot= చోటు)

**Vinod:** This booklet appears to better. In fewer pages, it gives complete information about the matter.
(ఈ చిన్నపుస్తకం దానికంటే మెరుగ్గా కనిపిస్తోంది. తక్కువ పేజీల్లో పూర్తి సమాచారం ఇస్తోంది) (Booklet= చిన్న పుస్తకం)

**Pramod:** Let me have a look at it. My sister is returning from the states. She wants full details of all the tourist spots in the state. She wants to make full use of this trip to see all the spots.
(నన్నోసారి చూడనీ. మా సిస్టర్ స్టేట్స్ నుంచి తిరిగొస్తోంది. ఈ పర్యటక స్థలాల వివరాలు మొత్తం తనకు కావాలంటోంది. ఈసారి వచ్చిన

2) She wants full details of all the tourist spots in the state.
3) She wants to make full use of this trip to see all the places.
4) They can help your sister plan a perfect holiday.
5) She said I was free to plan it any way I liked.
6) The road from here to it is straight.
7) I will go direct from here.

ఇంగ్లిష్ లో కొన్ని adjectives కు degrees of comparison ఉండవు. పైన అండర్‌లైన్ చేసిన మాటలన్నీ అలాంటివే. వాటికి comparative, superlatives ఉండవు. అంటే వాటిని comparative, superlative లలో వాడం. కారణాలు చూద్దాం.

**1) It gives complete information:**




woman = పరిపూర్ణమైన ( ఏ విధమైన దోషం లేని) స్త్రీ. (ఇక్కడ she was more perfect than other women అనం. she was perfect; some other women were perfect too, others were not perfect.)

**5) She said I was free to plan it anyway I liked:**

Free = స్వతంత్రం/ స్వేచ్ఛ ఉన్న

పైన చెప్పిన మిగతా మాటల్లా free కు, freer, freest అని degrees of comparison వాడం. ఎవరికైనా స్వేచ్ఛ ఉంటే వాళ్లు free. లేకుంటే వాళ్లు free కారు. అంటే వాళ్లకు స్వేచ్ఛ లేదు. అంటే స్వేచ్ఛకు కొన్ని

అంతే. అంటే Circle (వృత్తం), Square (చతురస్రం), Rectangle (దీర్ఘ చతురస్రం), Triangle (త్రిభుజం), etc.

గుండ్రం (circular/round) గా ఉండేదే circle. గుండ్రంగా లేనిది circle కాదు. కాబట్టి This Circle is more round than that Circle = ఈ వృత్తం, ఆ వృత్తం కంటే గుండ్రంగా ఉంది. Circle గుండ్రంగా ఉండకపోతే ఇంకెలా ఉంటుంది? అలాగే మిగతా geometric figures విషయంలో కూడా. వీటిలో వేటికీ degrees of comparison ఉండవు.

◆

# It gives complete information

ప్పుడు, వాటినన్నిటిని చూడటానికి తన ప్రయాణాన్ని పూర్తిగా ఉపయోగించుకోవాలనుకొంటోంది.)

**Vinod:** Why don't you consult a travel agency? They can help your sister plan a perfect holiday.
(నువ్వో ట్రావెల్ ఏజెన్సీని సంప్రదించకూడదూ? వాళ్లయితే మీ సిస్టర్ సెలవు పరిపూర్ణంగా ప్లాన్ చేయటంలో తోడ్పడగలరు.)
Holiday- మామూలు అర్థం- సెలవు.
ఇలాంటి సందర్భాల్లో అర్థం- సెలవుల్లో మన విహారాలు, సరదాలు.

**Pramod:** That's a good idea. She said I was free to plan it any way I liked. I will approach the Vihar Travel Agency. They are known to give correct information.
(అది మంచి ఆలోచనే, నా ఇష్టం వచ్చినట్లు ప్లాన్ చేయటానికి నాకు స్వేచ్ఛ ఉందని చెప్పింది. నేను విహార్ ట్రావెల్ ఏజెన్సీ వాళ్ల దగ్గరకెళ్తాను. సరైన సమాచారం ఇస్తారనే పేరు వాళ్లకుంది.)
approach (అ'ప్రోచ్ - ప్రొ'నౌన్స్ పలుకుతాం) = దగ్గరకెళ్లటం/సమీపించటం/సహాయం కోరటం.

**Vinod:** Where is this Vihar Travel Agency?
(ఎక్కడుందీ ట్రావెల్ ఏజన్సీ?)

**Pramod:** It is in the round building next to Chitramahal
(చిత్రమహల్ పక్కన గుండ్రటి మేడలో ఉంది)

**Vinod:** Are you going now?
(ఇప్పుడు వెళుతున్నావా? )

**Pramod:** Yea, I am.

**Vinod:** The road from here to it is straight.
(ఇక్కడి నుంచి అక్కడికి రోడ్ తిన్నగా ఉంది)

**Pramod:** I Will go direct from here.
(ఇక్కడినుంచి తిన్నగా అక్కడికి వెళ్తున్నా)



గత కొన్ని lessons నుంచి degrees of comparison చూస్తున్నాం గదా? ఇప్పుడు మరికొన్ని ఆసక్తికర విషయాలను చూద్దాం:

Look at the following sentences from the conversation at the beginning of the lesson:
1) It gives Complete information.

ఇక్కడ complete అంటే పూర్తి. ఏదైనా ఒక విషయం పూర్తిగా ఉంటుంది. లేకుంటే ఉండదు. అంతేకానీ ఒక విషయం, ఇంకో విషయం కంటే పూర్తిగా ఉండటం అనే పరిస్థితి ఉండదు.

This glass is more complete than that glass- ఇది అర్థం లేని విషయం కదా. ఉంటే

a) రెండూ పూర్తిగా నిండి ఉంటాయి. (లేకుంటే)

b) ఒకటి నిండి ఉండటం, ఇంకోటి నిండకపోవటం అవొచ్చు అంతేకాని ఒక glass ఇంకో glass కంటే పూర్తిగా ఉండటం అర్థరహితం.

a) కాబట్టి - Both the glasses are complete అంటాం.

b) అయితే- This glass is complete but that glass isn't అంటాం. so, complete has no degrees of comparison.

**2) she wants full details of.....:**

Complete లాగే full కు కూడా degrees of comparison ఉండవు కదా. full అంటే నిండిపోయిన, అని కదా. ఉంటే, నిండి ఉంటుంది, లేకుంటే నిండినట్లు కాదు అంతే. (fuller, fullest, లాంటి మాటలు వాడం) అప్పుడప్పుడు అక్కడక్కడ చదువుతుంటాం, వింటుంటాం;

I promise you my fullest cooperation/ You shall have my fullest cooperation= మీకు నా పూర్తి సహకారం ఉంటుంది. ఇక్కడ fullest సరికాదు. full అంటే చాలు కదా. పూర్తిగా ఉంటుంది. లేకుంటే పూర్తికాదు. అంతేకాని ఎక్కువ పూర్తిగా ఉంది/తక్కువ పూర్తిగా ఉంది అనం.

**4) They can help you plan a perfect holiday:**

అన్నివిధాల బాగున్న/ ఏ దోషమూ లేని విహారాలు ప్లాన్ చేసుకోవటంలో తోడ్పడగలరు.

Perfect= పరిపూర్ణమైన; ఏ దోషమూ లేని (fault-less, good in every way)

Perfect కు కూడా more perfect, most perfect లాంటి degrees ఉండవని మీరు ఊహించుకోగలరు.

ఏదైనా వస్తువు/ ఎవరైనా ఉంటే perfect గా ఉంటారు, ఏ దోషాలు లేకుండా, పరిపూర్ణతతో. దోషం అంటూ ఉంటే వాళ్లు/ అవీ imperfect (దోషమున్న) అంతే కానీ ఒకరు ఇంకొకరి కంటే ఎక్కువో, తక్కువో ఉండలేరు కదా.

Sita, Lord Sri Rama's wife, was a perfect



M. SURESAN

పరిమితులుండొచ్చు అందుకని కింది విధంగా చెప్పవచ్చు.

Kumar is free to a greater degree than Kesav. కేశవ్ కంటే కుమార్‌కు ఎక్కువ మేరకు స్వేచ్ఛ ఉంది. (అప్పుడప్పుడు Kumar has more freedom in these matter than Kesav- ఇలా చెప్పటం వాడుకలో ఉంది. కాబట్టి అదంత తప్పుకాదు. కాని freer, freest మాత్రం మామూలుగా spoken English లో వినిపించవు.

**6) Straight:**

ఇది కూడా పైమాటల్లాగానే. అంటే దీనికి కూడా degrees ఉండవు.

straight= తిన్నగా/నేరుగా. ఉంటే straight (తిన్న)గా ఉంటుంది, లేకపోతే ఉండదు. అంతేకానీ, ఒకదానికంటే ఇంకోటి తిన్నగా, నేరుగా ఉండే అవకాశం లేదు కదా. కాబట్టి straighter/ more straight, straightest/ most straight లాంటి expressions ఉండవు.

**7) Direct:**

ఇది కూడా అంతే. Give me a direct answer= తిన్నని/ ఉన్నది ఉన్నట్టు (డొంక తిరుగుడు లేని) సమాధానం ఇవ్వు. ఉంటే direct, లేకుంటే indirect అంతే. More direct, most direct ఉండవు.

**8) Correct (సరైన):**

A thing is correct or incorrect. ఒక్కటి సరి అవుతుంది, లేకుంటే తప్పవుతుంది అంతే. More correct, most correct ఉండవు కదా.

His answer is more correct than yours... అతడి జవాబు నీ ఆన్సర్ కంటే కరెక్ట్. ఇలా చెప్పటం ఎంతవరకు సబబు? అతడి జవాబు correct అయితే, నీ ఆన్సర్ అదే కానప్పుడు, అది తప్పు (Wrong/incorrect) అవుతుంది, కానీ నీ ఆన్సర్ తక్కువ correct, అతడి జవాబు ఎక్కువ correct అవదు.

పైన చెప్పినవన్నీ కూడా degrees of comparison లేని మాటలు. ఎందుకంటే ఆ గుణాలు, ఉండటం అంటూ జరిగితే ఉంటాయి, లేకుంటే ఉండవు అంతే. వాటిలో ఎక్కువ, తక్కువలుండవు. Geometrical figures విషయంలోనూ

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి..**

**URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

## Q&A

ప్రశ్న:

I ఇంగ్లిష్ నేర్చుకోవడానికి ఉపయోగపడే పుస్తకాలను తెలపగలరు.

II కిందివాటికి తెలుగులో అర్థం వివరించండి?

1. I'm enjoying my new job.
2. Diana said that she was enjoying her new job.
3. My father isn't very well.
4. She said that her father wasn't very well.
5. I have to go early.
6. Peter said that he had to go early.

**వి. శ్రీరామచంద్రమూర్తి, తల్లంపూడి (తూ.గో.జిల్లా)**

**జవాబు:**

i) ఇంగ్లిష్ రావటానికి ఉపయోగపడే పుస్తకాలు:
a) Living English structure: By stannard Allen
b) NCERT ప్రచురించిన Let's Learn English, series లో series No.5 - 11

ii) 1) I'm (= I am) enjoying my new job= నా కొత్త ఉద్యోగం నాకు సంతోషంగా ఉంది (నేను చక్కగా అనుభవిస్తున్నాను)
2) తన ఉద్యోగం తను చక్కగా అనుభవిస్తున్నానని (తనకు కొత్త ఉద్యోగం సంతోషంగా ఉందని) డయానా చెప్పింది.
3) మా నాన్న అంత కులాసాగా లేరు.
4) వాళ్ల నాన్న అంత కులాసాగా లేరని ఆమె చెప్పింది.
5) నేను త్వరగా వెళ్లాలి
6) తను త్వరగా వెళ్లాలి అని పీటర్ చెప్పాడు.

ప్రశ్న:

1. vis - a - vis - అర్థం వివరించండి.
2. ఇంతకు ముందు పనిచేసిన అధికారి చేసిన తప్పిదం.
3. ఇకపై అలాంటి పొరపాటు మళ్లీ చేయను.

2, 3 ప్రశ్నలను ఇంగ్లిష్ లో ఏవిధంగా చెబుతారు?

**– కె. ఆనందకుమార్, గాదరాడ (తూ.గో.జిల్లా)**

**జవాబు:**

1) vis - a - vis (వీజావీ/ విజవి-జ, size లో z లాగ) = దానితో పోలిస్తే, దాని సంబంధంగా.
a) What are your job opportunities vis-a-vis the reservation policy-
ఈ reservation ల సందర్భం/ నేపథ్యంలో, నీ ఉద్యోగావకాశాలెలా ఉన్నాయి?
b) India is not vis - a - vis the US= అమెరికాతో పోలిస్తే భారత్ సంపన్నదేశం కాదు.

ii) This the mistake made by/ the lapse of the previous official/ incumbent.
(Incumbent = పదవిలో ఉన్నవారు)
Incumbent: Pronunciation- ఇన్‌కంబంట్

iii) I will not repeat this mistake.




# The car is too expensive

**Kavitha:** You've been out too long. Where have you been?
(నీవు చాలాసేపు బయటున్నావు. ఎక్కడున్నావింతసేపు? )

**Sabitha:** I am returning from the Cinema. I have been there to book tickets for us.
(సినిమాహాల్‌కెళ్లాను. టిక్కెట్లు బుక్ చేయడానికి)

**Kavitha:** Have you got them? For what show on what day?
(దొరికాయా/ తెచ్చావా? ఏ show ఏ రోజు? )

**Sabitha:** Of course I have. With great difficulty I was able to get two seats for the matinee the day after tomorrow. The queue was too long.
(తేకపోవటమేంటి? అతి కష్టంమీద ఎల్లుండి matinee కి రెండు tickets దొరికాయి. Queue మరీ పొడుగ్గా ఉంది)

**Kavitha:** For the matinee? In these dog days? I think it'll be too hot for us to go out. The sun could scorch us.
(matinee కా? ఈ మండు వేసవిలోనా? అంత ఎండలో మనం వెళ్లలేం అనుకుంటున్నానే. ఎండ మనల్ని మాడ్చేయొచ్చు)

Scorch (స్కార్చ్) = మాడ్చేయడం.
In the scorching sun = మాడ్చే ఎండలో

**Sabitha:** I thought so too, but ...
(నేనూ అలానే అనుకున్నా, కానీ ...)

**Kavitha:** Why didn't you think of the first show? We shall have had a pleasant time.
(నువ్వు first show గురించి ఎందుకాలోచించలేదు? చాలా హాయిగా ఉండేది కదా?

Pleasant = ఆహ్లాదకరమైన

**Sabitha:** It's such a lengthy movie, you know. If it is the first show, it will be too late in the night for us to return home safely.
(అది చాలా పెద్ద సినిమా. First show అయితే ఇంటికి తిరిగిరావడం ఆలస్యమవుతుంది. అది మనకు మంచిది (క్షేమకరం) కాదు)

**Kavitha:** We can't bear the heat. How about giving away the tickets to others?
(ఆ ఎండ భరించలేం. ఆ tickets ఇంకెవరికన్నా ఇచ్చేస్తే? )

**Sabitha:** That'd be foolish. I've taken a lot of trouble to get the tickets. Don't worry. It's an AC hall.
(అది పిచ్చిపని. ఆ tickets తేవడానికి చాలా శ్రమపడ్డాను. ఏం ఫరవాలేదులే. ఆ hall, AC hall)

**Kavitha:** OK. It's too good a movie to miss.
(అలాగే. మనం వదులుకోలేనంత మంచి సినిమా అది)

Very, too కు ఉన్న తేడా ఇంతకుముందు తెలుసుకున్నాం కదా. very అంటే ఎక్కువ, చాలా- అందువల్ల చెడు కలగకపోవచ్చు. Too అంటే అతి, అందువల్ల చెడే జరుగుతుంది.

**a)** Ramana is too good - రమణ అతి మంచి. (అందువల్ల అతనికి కలిగేది కీడే)

**b) Aruna:** Son, how about the girl you saw the other day? Is she to your liking?
మనం మొన్న చూసిన అమ్మాయి విషయం ఏంటి? నీకు నచ్చిందా?

**Pranav:** Mom, don't you think she is too tall for me?
మరీ పొడుగనిపించలేదా నీకు? (అంటే- నా ఎత్తుకు తగినంత/ నా అంతన్నా/ నాకంటే ఎత్తన్నా కావచ్చు)

**c)** The car is very expensive -
బాగా ఖరీదైంది. (అయినా మనం కొనవచ్చు)

**d)** The car is too expensive -
car మరీ ఖరీదైంది.
(అందువల్ల కొనం/ కొనలేనంత ధర)

ఇది too కు ఉన్న అర్థాల్లో, వాడుకల్లో ఒకటి.

**Look at the following sentences.**

**a)** The patient is too weak to walk -
రోగి నడవలేనంత బలహీనంగా ఉంది.

**b)** The amount with him is too little to buy a car -
అతని దగ్గరున్న డబ్బు కారు కొనలేనంత తక్కువ.

**c)** He is walking too slow to catch the train -
Train అందుకోలేనంత నిదానంగా నడుస్తున్నాడు.

**d)** He is driving too carelessly to be safe.
క్షేమంకానంత నిర్లక్ష్యంగా నడిపిస్తున్నాడు.




పై sentences లో too వాడకం గమనించండి.

... too + adjective (sentences a & b) / adverb (sentences c & d) + infinitive

**[a)** Adjective అంటే గుర్తుంది కదా. గుణాల్ని తెలిపే మాటలు.

**b)** Adverbs అంటే adjectives తెలిపే గుణాలు ఏ మేరకు ఎలా ఉన్నాయి అని; verb తెలిపే పనులు ఎలా, ఎప్పుడు జరిగాయి అని తెలిపే మాటలు.

**c)** Infinitive అంటే to & 1st regular doing word. eg: to go, to see, to sit, etc - అంటే వెళ్లేందుకు/ వెళ్లటానికి/ వెళ్లటం; చూసేందుకు/ చూడటానికి/ చూడటం; కూర్చునేందుకు/ కూర్చోవడానికి/ కూర్చోవడం, etc.**]**

పైన ఇచ్చిన ప్రతి sentence లో ప్రతిదానికీ, తెలుగులో- లేనంత, కానంత - అని negative వస్తోందికదా. అది too ప్రత్యేకత.

too + adjective/ adverb + infinitive= ఆ adjective/ adverb వల్ల కావాల్సిన పని జరగదనో, నష్టం ఉంటుందనో అర్థం.

**i)** He is too poor to continue studies.
వాడు చదువు కొనసాగించలేనంత పేదవాడు.

**ii)** She is too proud to listen to advice.
ఆమె ఇతరుల సలహాను విననంత గర్వి.

**iii)** She cooks too badly to eat.
తినలేనంత దారుణంగా వండుతుందామె.

**iv)** She knows too little to teach others.
ఇతరులకు బోధించలేనంత తక్కువ తెలుసామెకు.

**Now study the following sentences from the conversation at the beginning of the lesson.**

**1)** The Queue was too long.
క్యూ మరీ పొడుగ్గా ఉంది. (నేను త్వరగా రాలేనంత)

**2)** I think it will be too hot (for us) to go out.

**3)** It will be too late in the night (for us) to return home safely.

**4)** It is too good a movie to miss.

Sentence No (2): ... it will be too hot for us to go out.
మనం బయటికి వెళ్లలేనంత ఎండగా ఉంటుంది.

Sentence No (3): It will be too late in the night for us to return home safely.
మనం క్షేమంగా ఇంటికి తిరిగి రాలేనంత ఆలస్యం కావచ్చు రాత్రిపూట.

ఇంతకుముందు మనం చూసిన sentences కూ, sentences (2) and (3) కి తేడా: - for us అనేది extra.

**i)** He is too foolish to understand this.
ఇది అర్థం చేసుకోలేనంత అవివేకి వాడు.

**ii)** He is too clever for us to cheat.
మనం మోసం చేయలేనంత తెలివిగలవాడతడు.

Sentence (i) లో infinitive ముందు for ... లేకపోవటం చూడండి. Sentence (ii) లో infinitive ముందు for us ఉంది.

**iii)** Hari is too fat to walk fast.
వేగంగా నడవలేనంత లావు. (Infinitive ముందు for ... లేదు)

**iv)** Hari is too fat for us to carry.
మనం మోయలేనంత లావతను.
(Infinitive ముందు for ... ఉంది)

**v)** మనం తీర్చలేనంత సమస్య అది
It is too difficult a problem for us to solve/ The problem is too difficult for us to solve.

**vi)** మనం చూడలేనంత చీకటిగా ఉంది
It is too dark for us to see.

**vii)** నేను కొనలేనంత ధర.
The car is too expensive for me to buy.

**viii)** ఆమె కంఠం వినలేనంత తక్కువ స్థాయిలో ఉంది
Her voice is too low for him to hear.

**ix)** పిల్లలు అర్థం చేసుకోలేనంత కష్టమైన విషయం
This is too difficult for children to understand.

**x)** ఈ dress ఆమె వేసుకోలేనంత పాతది
This dress is too old for her to wear.

**xi)** ఇది ఆ వృద్ధుడు మోయలేనంత బరువు
This is too heavy for the old man to carry.

ఈ విషయం ఇంకో రకంగా అర్థం చేసుకోవచ్చు తెలుగులో- ఇది నేను మోయలేనంత బరువు అంటే = ఇది చాలా బరువు, నేను మోయలేను- అని కదా. English లో కూడా అంతే.

**a)** It is very heavy; I cannot carry it.
It is too heavy for me to carry.

**b)** The movie is very good; We cannot miss it.
The movie is good for us to miss.

**c)** The chapter is very important; Nobody can ignore it.
ఈ chapter చాలా ముఖ్యం. ఎవరుకూడా దాన్ని ఉపేక్షించలేరు.
The chapter is too important for anybody to ignore it.

**d)** The problem is very serious; We cannot neglect it.
సమస్య చాలా తీవ్రంగా ఉంది; మనం పట్టించుకోకుండా ఉండలేం.
The problem is too serious for us to neglect.

**e)** The room is very big; The table is very small.
గదేమో చాలా పెద్దది, table మాత్రం చాలా చిన్నది.
(అంత పెద్ద గదికి తగనంత చిన్నది)

The table is too small for the big room/ The room is too big for the small table.

**f) Prakash:** Are you attending the party tomorrow?
నువ్వు రేపు party కి వెళుతున్నావా?

**Subhash:** I am too busy.
నేను చాలా తీరికలేకుండా ఉన్నా - పార్టీకి వెళ్లలేనంత

ఇక్కడ Subhash's reply గమనించండి. I am too busy అని మాత్రమే అంటున్నాడు - అంటే, I am too busy to attend అని. ఈ too ను పై dialogue లోలా వాడతాం. ఇది కూడా చూడండి.




**g) Sankar:** I'll carry this box and you carry that.
నేనీ పెట్టె తీసుకుంటాను. నువ్వది తీసుకో.

**Vishnu:** Oh, that's too heavy.
అది మరీ బరువు - అంటే నేను మోయలేనంత అని.

Vishnu's response కు అర్థం- That's too heavy for me to carry అని.

**h) Prabhakar:** Why don't you send Ganesh for talks?
చర్చలకు గణేష్‌నెందుకు పంపకూడదు?

**Sudhakar:** He is too innocent.
అతడు మరీ అమాయకుడు - చర్చలు కొనసాగించలేనంత.

ఇంకా విడమరచి చెప్పాలంటే, He is too innocent to participate in talks/ to handle talks
అతడు తెలివిగా మాట్లాడలేనంత/ సమాళించుకోలేనంత అమాయకుడు.

**i) Gowtham:** How do I look in this shirt?
నేనీ shirt లో ఎలా కనిపిస్తున్నాను? / ఈ shirt ఎలా ఉంది? )

**Viswam:** Isn't that too big for you?
అది నీకు మరీ పెద్దదిగా/ వదులుగా లేదా?

ఇలా 'too' - question form లో కూడా వాడతాం.

**j) Bhaskar:** Is the curry too hot?
ఈ కూర మరీ కారంగా ఉందా?

hot - మామూలు అర్థం, వేడి. ఇక్కడ అర్థం, ఇంకోటి - కారం - తినలేం.

**Bhavan:** So it is, and the sambar is too salty.
అవును - సాంబార్లో ఉప్పు మరీ ఎక్కువ - తినలేం

ఇవీ too ఉపయోగాలు. ఇలా 'too' వాడకంతో మనం చెప్పాలనుకున్న విషయాలు చాలా short sentences లో simple గా చెప్పవచ్చు. conversation అందంగా ఉంటుంది.




**Praful:** Are you telling me that you are doing all this just for me?
(ఇదంతా నాకోసం చేస్తున్నానంటావా? )

**Mohan:** What then? Why should I go about places to get your papers moved?
(మరింకేంటి? నీ కాగితాలు కదపటానికి అన్నిచోట్లు ఎందుకు తిరగాలి నేను? )

**Praful:** Come now, Mohan. You are too clever not to have any self interest.
(మోహన్ చూడు. ఏదో స్వార్థం ఉంటేనే చేసే తెలివిగలవాడివి నువ్వు)

**Mohan:** You are right. Let me be frank. I do take this opportunity to meet officers and get their acquaintance.
(నువ్వనేది నిజమే. ఉన్నదున్నట్లు చెప్పనీ. Officers ను కలుసుకోటానికీ, వాళ్లతో పరిచయానికీ దీనిని నేనో అవకాశంగా తీసుకుంటున్నాను)




కిందటి lesson లో we discussed the meaning and use of 'too'. Let's know something more about 'too'. Look at the following sentences:

He is too strong not to beat his opponent
అతడి ప్రత్యర్థిని ఓడించగలిగేంత బలవంతుడతను

మనం కిందటి lesson లో చూసింది:
too + adjective/ adverb + infinitive ఉన్న sentences లో అర్థం, infinitive కు వ్యతిరేకంగా వస్తుంది కదా.

**a)** He is too weak to walk - ఇక్కడ అర్థం, ఈ sentence లో ఉన్న infinitive 'to walk' కు వ్యతిరేకంగా ఇలా వస్తుంది - నడవలేనంత బల హీనంగా ఉన్నాడని.

**b)** She is too slow to understand things. ఇక్కడ కూడా అర్థం infinitive, to understand కు వ్యతిరేకంగా, అర్థం చేసుకోలేనంత (నిదానం ఆమె) అని వస్తోంది కదా. ఇది మనం last lesson లో తెలుసుకున్నాం.

ఇప్పుడు ఈ sentence చూడండి.

**c)** He is too clever not to understand this. ఈ sentence లో infinitive ముందు not ఉండటం గమనించండి.

**Sentence No.1:** Not to have any self-interest కు వ్యతిరేకంగా, స్వార్థం నీకుండేంత అని వస్తుంది. స్వార్థంతో చేసేంత తెలివిగలవాడివే నువ్వు. ఇలా కూడా అర్థం వస్తుంది. స్వార్థం ఏం లేకుండా చేసేంత తెలివిలేనివాడివి కాదు నువ్వు.

**No. 2:** You are too smart not to miss the point either = not to miss the point కు వ్యతిరేకం - అంశం గమనించేంత తెలివి ఉంది నీకు/ అంశం గమనించకపోయేంత తెలివిలేనివాడివి కావు.

# We aren't too unlucky

frank = మనసులో ఉన్నది బయటపెట్టే/ మనసులో ఏదీ దాచుకోకుండా ఉన్నది ఉన్నట్టు చెప్పేయటం.

To tell you frankly/ To be frank I don't like you
నా మనసులో ఉన్నది చెప్పాలంటే/ ఉన్నది దాచుకోకుండా చెబుతున్నా - నువ్వంటే నాకిష్టం లేదు.

Acquaintance (అక్వెయింటన్స్. 'క్వ' నొక్కి పలుకుతాం)= పరిచయం మాత్రమే/ ముఖ పరిచయం (స్నేహం కాకుండా)/ పరిచయస్తుడు

I have acquaintance with him =
అతడితో నాకు పరిచయం ఉంది.

He is an acquaintance of mine =
అతడు నాకు పరిచయస్తుడు

**Praful:** I appreciate your frankness.
(నీవు మనస్సులోనే పెట్టుకోకుండా బయటికి చెప్పినందుకు మెచ్చుకుంటున్నా.)

appreciate అప్రీషియేట్ - 'ప్రీ' నొక్కి పలుకుతాం = మంచితనం/ ఉపయోగం లాంటివి అర్థం చేసుకోగలగటం/ మెచ్చుకోవటం. ఒక సమస్యను అర్థం చేసుకోవటం.

He doesn't appreciate the seriousness of the situation =
పరిస్థితి తీవ్రతను అతడు అర్థం చేసుకోవట్లేదు

**Mohan:** You are too smart not to miss the point either. You know I alone can get things done for you.
(ఆ అంశం అర్థం చేసుకునేంత తెలివి నీది. నీకు తెలుసు పని నా వల్లే అవుతుందని)

**Praful:** The dependence is mutual
(ఈ ఆధారపడటం అనేది పరస్పరం.)

Mutual (మ్యూచువల్)- మ్యూ నొక్కి పలుకుతాం = పరస్పరం ఒకరికొకరు.

The husband and wife have mutual understand =
ఆ భార్యాభర్తల్లో పరస్పర అవగాహన ఉంది

**Mohan:** So what now? (అయితే ఇప్పుడేంటింకా? )

**Praful:** The officer is too efficient not to speed up matters.
(విషయాలను త్వరితంగా కానిచ్చే సామర్థ్యం ఉన్న ఆఫీసర్ ఆయన, అంటే విషయాలు త్వరగా అవుతాయని)

**Mohan:** We aren't too unlucky there.
(ఆ విషయంలో మనం మరీ దురదృష్ట వంతులం కాదు)


M. SURESAN

ఇలా infinitive ముందు not వాడితే, sentence కు అర్థం, not infinitive కు వ్యతిరేకంగా ఉంటుంది. అంటే infinitive చెప్పేది జరుగుతుంది అని. ఇప్పుడు sentence (c) కి అర్థం ఇలా వస్తుంది కదా. అతడు ఇది అర్థం చేసుకోగల తెలివి ఉన్నవాడే. అంటే not to understand (అర్థం చేసుకోని/ చేసుకోలేని) కు వ్యతిరేకం - అర్థం చేసుకునే/ అర్థం చేసుకోగల అని వస్తుంది.

He is too clever not to understand the point
ఈ విషయం అర్థం చేసుకోగల (not to understand కు వ్యతిరేకార్థం) తెలివిగలవాడు. (అర్థం చేసుకోలేనంత తెలివిలేనివాడేం కాదు)

**a)** She has had too much of practice not to play well =
బాగా ఆడగలిగేంత practice ఉన్నదామెకు.
(not to play well కు వ్యతిరేకం బాగా ఆడగలిగేంత)

**Compare the following.**

**i)** He is too lazy to pass =
పాస్ అవలేనంత (to pass కు వ్యతిరేకం) బద్ధకస్తుడువాడు.

**ii)** He is too hard working not to pass.
pass అయ్యేంత (not to pass కు వ్యతిరేకం) గా శ్రమపడేవాడతను.

**ఇవి కూడా పోల్చి చూడండి.**

**i)** She is too careless to observe this = ఇది గమనించలేనంత (to observe కు వ్యతిరేకం) అజాగ్రత్త మనిషి ఆమె.

**ii)** She is too keen not to observe this = ఇది గమనించేంత (not to observe కు వ్యతిరేకం) చురుకైంది ఆమె.

**Now, take the sentences from the conversation at the beginning of the Lesson:**

**1)** You are too clever not to have any self interest

**2)** You are too smart not to miss the point either

**3)** The officer is too efficient not to speed up matters

**4)** We aren't too unlucky there

**No. 3:** Not to speed up things కు వ్యతిరేకంగా త్వరితంగా చేసేంత అని అర్థం వస్తుంది. ఆ officer పనులు త్వరితంగా చేయగల సామర్థ్యం ఉన్నవాడు.
(త్వరితంగా చేయలేనంత అసమర్థుడు కాదు)

**No.4:** We aren't too unlucky there = మనం మరీ అంత దురదృష్టంగా (పనికానంత) లేం

'Too' ను ఎన్ని విధాలుగా వాడొచ్చో చూశారు కదా! ఇప్పుడిది చూడండి.

**a)** The Australian team was too strong for India
= The Australian bowling was too much for India =
భారత్ తట్టుకోలేనంత బలమైన టీం ఆస్ట్రేలియా.
ఆస్ట్రేలియా బౌలింగ్ భారత్ తట్టుకోలేనంతది.

**b)** The boy is too clever for a boy his age = ఆ కుర్రాడు అతని వయసుకు మించిన తెలివిగలవాడు.

**c)** The old man is too strong for his age = ఆ ముసలాయనకు ఆయన వయసుకు మించిన బలం ఉంది.

ఇవే కాకుండా, ఈ columns లోనే also (కూడా) అనే అర్థంతో too వాడకం చర్చించాం. అదికూడా ఓసారి గుర్తుచేసుకుందాం.

Spoken English (British or American) లో also కంటే అదే అర్థం (కూడా)తో, too ఎక్కువ వినిపిస్తుంది. Also వాడకం కొంచెం formal. అంటే serious speech/ book language లో ఎక్కువ. మామూలుగా మాట్లాడేటప్పుడు too, కాకుంటే, as well, వాడతారు. ఇవెప్పుడూ sentence చివర వస్తాయి.

**1)** నేను వాడిని కలుసుకున్నాను. వాడి తమ్ముడినీ కలుసుకున్నాను=
I met him, and his brother too/ I met him and his brother as well. (I met his brother also - ఇది ఒక విధంగా తప్పే - also, sentence చివర వాడటం.)

**2)** నువ్వు ఆ కుర్చీ కావాలంటే తీసుకో, దాంతో పాటు టేబుల్ కూడా కావాలంటే కుదరదు =
You take the chair, but you can't take the table too./ You can't have the table as well
Also వాడితే, దాన్ని verb ముందుగానీ, 'be' form ముందుగానీ వచ్చేట్లు వాడతాం.
I went to Delhi last month; I also stayed there for a week.
(నేను పోయిన నెల Delhi వెళ్లి అక్కడ ఓ వారం కూడా ఉన్నాను)- also, verb- stayed ముందు రావటం గమనించండి.

**3)** The British ruled us for centuries and robbed us too/ robbed us as well =
బ్రిటిష్ వాళ్లు మనల్ని పాలించి, దోచుకున్నారు కూడా.
ఇదీ spoken Englishలో too (as well) కు ఉన్న ప్రాముఖ్యం.

Not తో అయితే అసలు also రానేరాదు. అది తప్పే (ఒక్క not only ... but also sentences లో తప్ప). అలాంటప్పుడు either వాడతాం.

**1)** అతడూ రాలేదు, అతడి తమ్ముడూ రాలేదు.
He hasn't come, his brother hasn't either.
(his brother hasn't come too- అని sentence చివర రావచ్చు/ as well కూడా వాడవచ్చు)

**2)** ఆమె రాలేదు, రావట్లేదని ఫోన్ కూడా చేయలేదు = She hasn't come; She hasn't phoned either she won't come.

**EXERCISE**

**Mohan:** నువ్వెందుకు బయటికి రావటానికి ఇష్టపడటం లేదు?
**Madan:** మరీ చలిగా లేదూ?
**Mohan:** నిజమే. నువ్వు sweater వేసుకున్నావుకదా?
**Madan:** అయినా కూడా తట్టుకోలేనంత చలి అనిపిస్తోంది నాకు.
**Mohan:** నీకు తట్టుకునే శక్తి (resistance) మరీ తక్కువగా ఉన్నట్టుంది.
**Madan:** అవును. నాకు typhoid వచ్చినప్పట్నుంచీ resistance తక్కువగా ఉంది.
**Mohan:** Doctor ను కలుసుకోమళ్ళీ
**Madan:** ఇప్పటికే చాలా ఎక్కువసార్లు కలిశాను. చాలా fees ఇచ్చుకున్నాను. వైద్య ఖర్చులు మరీ ఎక్కువయ్యాయి నాకు.
**Mohan:** నేనది అర్థం చేసుకోగలను. అయినా నువ్వు doctor ను చూడటం మంచిది. ఇప్పటికే బాగా ఆలస్యమైంది.
**Madan:** నువ్వన్నది correct. ఈ సాయంత్రం చూస్తాను.

**ANSWER**

**Mohan:** Why are you unwilling to go out?
**Madan:** Isn't it too cold?
**Mohan:** That's true. But you are wearing a sweater.
**Madan:** Still I feel it is too cold for me to bear.
**Mohan:** You seen to have too little resistance.
**Madan:** Yes, since I had the typhoid my resistance has been too low.
**Mohan:** See your doctor again.
**Madan:** I have seen him too often already. I have spent too much on medicine, already.
**Mohan:** I can understand all that. Still you had better see the doctor. You have delayed too much already.
**Madan:** What you say is correct. I'll see him this evening.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# Enough is enough

**Prabha:** Hi Subha, how goes the world with you?
(ఎలా ఉన్నావు? )

**Subha:** Well, I can't complain. How is it with you?
(బాధలేం లేవు. నువ్వెలా ఉన్నావు? )
(ఈ response English లో వాడుతుంటారు. మీరూ practice చేయండి)

**Prabha:** How did you spend the week in your cousin's place in Hyderabad?
(హైదరాబాద్‌లో మీ కజిన్ ఇంట్లో ఎలా గడిపావు? )

**Subha:** Happily enough to remember the days there for a long time.
(ఎంతోకాలం గుర్తుండేంత సంతోషంగా)

**Prabha:** What was so enjoyable about it?
(ఏమిటంత సరదా కలిగించే విషయం అక్కడ? )

**Subha:** My cousin. Namrata is jovial enough to make your time pass very quickly.
(టైమ్ చాలాత్వరగా గడిచిపోయేందుకు చాలినంత/ తగినంత హాస్యం కలది మా కజిన్ నమ్రత)

**Prabha:** Yea. She was here last summer, wasn't she? I remember her jokes well enough to make me laugh whenever I remember them.
(కిందటి వేసవిలో ఇక్కడుంది కదా. ఎప్పుడు గుర్తొచ్చినా నవ్వొచ్చేట్టు చేయగల ఆమె జోక్స్ నాకు గుర్తున్నాయి)

**Subha:** I asked her over here for the Dasara holidays, but she has enough assignments to keep her home.
(దసరా సెలవులకు ఇక్కడికి రమ్మన్నా. కానీ ఇల్లు కదలనీయనంత అసైన్‌మెంట్స్ ఉన్నాయి తనకు)

**Prabha:** We shall be missing here a lot.
(మనం తనను చాలా మిస్ అవుతాం )

**Subha:** She is a good laugh. She is entertaining enough to make us like her company.

**Prabha:** Well, by the way, I have a bad cold. I don't know how to get rid of it.
(అది సరేకానీ, నాకు బాగా జలుబు చేసింది. అది ఎలా వదుల్చుకోవాలో తెలియ టంలేదు)

get rid of = దేన్నయినా (చెడును) వదుల్చుకోవటం

**Subha:** A cold is not serious enough to cause worry in hot countries, but it is nuisance enough to make us feel out of sorts with yourself.
(ఉష్ణదేశాల్లో జలుబు అనేది పెద్ద ఆదుర్దా కలగజేసేంత జబ్బుకాదు. కాని చికాకు కలిగించేంత సమస్యాత్మకం)

(Feel out of sorts = చికాకు పొందటం)

**Prabha:** Why didn't you take some medicine?
(మందులు ఎందుకు వేసుకోలేదు? )

**Subha:** I did, of course, but the relief has been temporary.
(తీసుకున్నాను కానీ తాత్కాలిక ఉపశమనమే)

**Prabha:** Doctors say you are cured of cold in seven days if you take medicines, and in one week if you don't take medicines.
(మందులతో 7 రోజుల్లో, మందుల్లేకుండా వారానికీ జలుబు నయమవుతుందంటారు డాక్టర్లు)

☯ ☯ ☯ ☯

'Enough' అంటే తెలుసు కదా. చాలు/ చాలినంత అని.

1) I have enough money to buy a car =
నాదగ్గర కారు కొనేందుకు చాలినంత డబ్బుంది.

2) She hasn't (doesn't have) enough money to buy a house =
ఇల్లు కొనేందుకు చాలినంత డబ్బు ఆమె దగ్గర లేదు.

3) **Preethi:** How about some more biriyani?
(ఇంకాస్త బిర్యానీ వేసుకుంటావా? )
**Pratima:** Enough. No more, please.
(చాలు. ప్లీజ్ ఇంక వద్దు. )
**Preethi:** Is so little enough for you?
(ఇంత తక్కువ చాలా నీకు? )
**Pratima:** That's more than enough.
(అది చాలినంత కంటే ఎక్కువ)

4) **Surendra:** When shall we go to the next movie?
(తదుపరి సినిమా ఎప్పుడు చూద్దాం)
**Narendra:** Enough is enough. No more of these movies.
(ఇంకొద్దు బాబూ. ఈ సినిమాలు ఇక వద్దు)




5) He has enough and to spare
అతడికి చాలినంతే కాకుండా, ఇతరుల కివ్వగలిగినంత ఉంది.

చూశారు కదా. enough అర్థం, ఉపయోగం.

**Look at the following too:**

1) You are clever enough to understand easily =
(నువ్వు సులువుగా అర్థం చేసుకొనేంత తెలివైనవాడివి.)
= You are clever; you understand easily.
= నువ్వు తెలివైనవాడివి. నువ్వు సులభంగా అర్థం చేసుకుంటావు. (నువ్వు సులభంగా అర్థం చేసుకొనేంత తెలివైనవాడివి.)

2) He is tall enough to touch the ceiling fan=
సీలింగ్ ఫ్యాన్‌ను తాకగలిగినంత పొడవతడు =
He is tall. He can touch the ceiling fan.
అతడు పొడవు. అతడు సీలింగ్‌ఫ్యాన్‌ను అందుకోగలడు.

3) The class room is large enough to seat 45 students -
45 మంది విద్యార్థులు కూర్చోగల వసతి ఉన్నంత పెద్ద క్లాస్ రూం అది.

4) He is ill enough to need a doctor =
డాక్టర్ సహాయం కావాల్సినంత జబ్బుగా ఉన్నాడతను.

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson.**

1) (I spent) happily enough to remember the days for a long time -
చాలాకాలం గుర్తుండేంత సంతోషంగా గడిపానక్కడ.

2) Namrata is jovial enough to make your time pass quickly -
టైమ్ చాలా త్వరగా గడిచిపోయేటట్లు చేయగలంత చమత్కారి నమ్రత.
Namrata is quite/ very jovial; she can make your time pass quickly.

3) I remember her jokes well enough to make me laugh whenever I remember them =
ఎప్పుడు గుర్తొచ్చినా నవ్వేంత బాగా ఆమె జోక్స్ నాకు గుర్తు/ నేను గుర్తుంచుకుంటాను.
I remember her jokes very well; they make me laugh whenever I remembered them.

4) She has enough assignments/ assignments enough to keep her home -
తనను ఎక్కడికీ కదలకుండా (ఇంట్లోనే ఉండేట్లుగా) చేసేందుకు చాలినంత అసైన్‌మెంట్స్ ఉన్నాయి.
She has a good number of assignments. They keep her home.

5) A cold is not serious enough to cause worry in hot countries -
ఉష్ణదేశాల్లో జలుబు ఆదుర్దా కలిగించేంత తీవ్రమైంది కాదు.
A cold is not very serious in hot Countries; it does not cause worry.

6) It is nuisance enough to make us feel out of sorts =
చికాకు కలిగించేంత సమస్యాత్మకం.
= It is a big nuisance; it makes us feel out of sorts.

ఇవి enough అర్థం, ఉపయోగం. కిందటి lessons లో too ఉపయోగం చూశాం.

too + adjective/ adverb + infinitive వస్తే (మరీ, అతి అనే అర్థంతో) వ్యతిరేకార్థాన్నిస్తుంది.

Enough + infinitive వస్తే positive అర్థం వస్తుంది (అవును అనే అర్థంతో)

**Compare:**

a) He is too weak to walk - He is very weak, so he cannot walk =
బాగా బలహీనంగా ఉన్నాడు, నడవలేదు.

b) He is strong enough to walk fast =
త్వరగా నడిచేందుకు చాలినంత బలంగలవాడు.

2) a) She is too ill to need a doctor =
ఆమె చాలా తీవ్రంగా జబ్బుతో ఉంది. డాక్టర్ అవసరం లేదు. (డాక్టర్‌వచ్చినా ప్రయోజనం లేదు)

b) She is ill enough to need a doctor -
జబ్బు బాగా తీవ్రంగా ఉంది. డాక్టర్‌ను వెంటనే పిలవాలి. (ప్రయోజనం ఉంటుంది)

అదీ too కూ, enough కూ తేడా, రెండింటి తర్వాత infinitive వచ్చినప్పుడు. అయితే మాటల కూర్పు చూడండి enough వాడినప్పుడు.

a) He is wise enough to understand such things =
అలాంటి విషయాలు అర్థం చేసుకోగలిగినంత తెలివిగలవాడతను.


M. SURESAN

మాటల కూర్పు (Word Order) చూద్దాం
Wise (Adj) + enough + infinitive
(అదే too వాడినప్పుడు too + adjective/ adverb + infinitive వస్తుంది కదా? )
ఇదీ గమనించాల్సిన విషయం.

అదే adjective బదులు noun అయితే, enough + noun + infinitive వస్తుంది.

a) There is enough water in the tank to last for the whole day =
(ఈ రోజుకు సరిపడే నీళ్లున్నాయి ట్యాంక్‌లో.)

b) I have enough friends to help me =
(నాకు సాయం చేయటానికి చాలినంతమంది స్నేహితులున్నారు.)

### EXERCISE

**Preetham:** నీ దగ్గరెంత డబ్బుంది?
**Priya:** ఏం? ఎందుకు?
**Preetham:** నాకో రెండొందలిచ్చేంత ఉందా?
**Priya:** అంతలేదు. నాక్కావాల్సిన రెండు పుస్తకాలు కొనేంత డబ్బుంది.
**Preetham:** నాకూ పుస్తకాలు కొనేందుకు రూ.200 తక్కువైంది. మా నాన్న పంపించేవరకు వేచి ఉండే టైమ్ లేదు.
**Priya:** సారీ.

### Answer

**Preetham:** How much money have you?/ do you have?
**Priya:** Why? What do you want?
**Preetham:** Have you enough money to give/ spare/ lend me Rs.200?
**Priya:** Not so much. I have enough money to buy the two books I need.
**Preetham:** I am short of Rs.200/- to buy the books I need. I don't have the time enough to wait till my dad sends me money.
**Priya:** I'm sorry.

**Prem:** Hi Syam, you are so late that all the people have left.

(శ్యాం, నువ్వెంత ఆలస్యమంటే నీకోసం ఉన్న వాళ్లంతా వెళ్లిపోయారు)

**Syam:** I was held up on my way by a terrible traffic jam. The traffic was so heavy that I took an hour to travel one kilometer by car.

(దారిలో రద్దీ నన్ను ఆపేసింది. కారులో ఒక కిలోమీటర్ రావటానికి గంట పట్టింది - అంత రద్దీగా ఉంది)

**Prem:** Didn't you hear us on your mobile?

(నీ సెల్‌ఫోన్‌లో మా మాటలు వినిపించలేదా నీకు? )

**Syam:** I knew you were calling, but I couldn't make out anything. The whole road was so noisy.

(మీరు ఫోన్ చేస్తున్నది నాకు తెలుసు, కానీ మీరేం మాట్లాడుతున్నదీ నేనర్థం చేసుకోలేక పోయాను. రోడ్డంతా అంత గొడవగా ఉంది.)




**Prem:** Why didn't you tell us of it over the cell?

(cell లో చెప్పలేదేం ఈ విషయం? )

**Syam:** It was so noisy that you could hear nothing.

(ఏదీ వినిపించనంత గొడవ)

**Prem:** Anyway, it's all over. Our friends have gone away. Let's plan a meeting this weekend.

(ఏమైతేనేం అయిపోయింది. మన ఫ్రెండ్స్ అందరు వెళ్లిపోయారు. ఈ వారాంతానికి కలుసుకునే ఏర్పాటు చేసుకుందాం)

**Syam:** OK.

మనందరికీ తెలుసు: So కు ఉన్న అర్థాలు:

So = 1) అందువల్ల/ కాబట్టి 2) అంత (American usage)

ఇప్పుడు మనం, so = అంత అనే అర్థంతో ఉన్న ఉపయోగాలు తెలుసుకుందాం.

(ఈ అర్థంతో, so, such (అలాంటి) అనే మాటకు దగ్గరగా ఒక్కోసారి వాడుతుంటాం)

**a)** I can't go out now, It is so hot =

నేనిప్పుడు బయటికెళ్లలేను, అంత ఎండగా ఉంది =

నేనిప్పుడు బయటికెళ్లలేనంత ఎండగా ఉంది.

It is so hot now that I can't go out.




**Now look at the following sentences from the conversation at the beginning of the lesson.**

**1)** The traffic was so heavy that I took an hour to travel one kilometer.

ట్రాఫిక్ ఎంత రద్దీగా ఉందంటే, ఒక కిలోమీటర్ ప్రయాణం చేయటానికి ఒక గంట పట్టింది.

మామూలుగా మాట్లాడే తెలుగులో- ఒక కిలోమీటర్ ప్రయాణానికి ఒక గంట పట్టింది; ట్రాఫిక్ అంత రద్దీగా ఉంది.

**2)** You are so late that all the people have left= ఇతరులంతా వెళ్లిపోయేంతగా ఆలస్యమయ్యావు నువ్వు.

**3)** I couldn't make out any thing. The whole road was so noisy=

నాకేం అర్థం కాలేదు (వినిపించలేదు). Road అంతా అంత గొడవగా ఉంది.

ఇదీ so... that ఉపయోగం. ఇక్కడ మనం గమనించాల్సిన విషయం: so తర్వాత adjective/ adverb, దాని తర్వాత that రావటం.

**a)** She hates him so much that (so + much (adverb) + that) she doesn't want to talk to him

అతడితో మాట్లాడటం ఇష్టంలేదామెకు. అంతగా అతడిని ద్వేషిస్తోంది.

**b)** He is so tall that he can touch the ceiling fan =

ceiling fan ను తాకగలంత పొడవు అతడు.

(so + tall (adj) + that)

కాబట్టి 'so' ఇలా వాడినప్పుడు దాని తర్వాత adjective/ adverb, ఆ తర్వాత that తప్పక రావాలి.

(అయితే present day (ఇప్పటి) American usage లో, so తర్వాత that వదిలేస్తున్నారు.

He is so tall he can touch the fan.

ఇలా అనటం American usage లో తరుచూ వినిపిస్తుంటుంది.)

మీకిప్పటికి అర్థమయ్యే ఉంటుంది- so ... that కి, మనం కిందటి lessons లో తెలుసుకున్న too ... infinitive కి చాలా దగ్గర సంబంధం ఉందని.

The car is so expensive that ordinary people can't buy it = The car is too expensive for ordinary people to buy it. =

రెండింటి అర్థం ఒకటే కదా. అయితే too ... + infinitive అయితే, sentence simple గా ఉండి conversation effective గా ఉంటుంది.

Too ... infinitive వాడగలిగితే, అదే so that ... కంటే మెరుగని తెలుస్తోంది కదా.

**Compare:**

**a)** It's too heavy for me to carry.

**b)** It is so heavy that I cannot carry it.

చూడండి: so ... that ఉన్న sentence (b) బాగా పొడుగ్గా ఉంది. కొంత సంక్లిష్టంగా కూడా ఉంది కదా.

**c)** It is too difficult for me to understand

**d)** It is so difficult that I can't understand it.

c) కంటే (d) complicated గా ఉంది కదా?

so ... that practice చేయండి, కానీ too ... infinitive ఎక్కువ వాడండి.

# It is too difficult .. to understand

**Prem:** Our friends had waited and waited. They had to wait for so long that I served them coffee twice. That was how long it was.

(మన ఫ్రెండ్స్ నీ కోసం ఎంతోసేపు వేచి చూశారు. ఎంతసేపంటే నేను వాళ్లకు రెండు సార్లు కాఫీ ఇవ్వాల్సివచ్చింది. అంతసేపున్నారన్న మాట వాళ్లు)

**Syam:** I'm really sorry but I couldn't help it. When I took out my car to make it here I didn't expect it to happen this way.

(నిజంగా బాధపడుతున్నాను, కాని ఏం చేయను? నేనిక్కడికి రావటానికి నా కారు బయటకు తీసినప్పుడు ఈ విధంగా జరుగుతుం దనుకోలేదు)

(... I couldn't help it = నేనేం చేయలేని పరిస్థితి/ నాకు తప్పిందికాదు.)

eg: I have to go now. I can't help it =

నేనిప్పుడు వెళ్లాల్సిందే. నాకదితప్పదు.

He has to pay the fine. He can't help it =

అతడు fine కట్టాల్సిందే. అతడికది తప్పదు.

To make it here = to reach here =

ఇక్కడికి చేరటానికి.

**Prem:** Why was the traffic so heavy?

(ఎందుకంత రద్దీగా ఉంది ట్రాఫిక్ ఇవ్వాళ? )

**Syam:** For onething, it is a peak traffic hour. Secondly some procession was in the way. At one point it was so long that it took nearly 20 minutes to clear the road.

(ఒక విషయం ఏమిటంటే అది మామూలుగా ట్రాఫిక్ రద్దీ బాగా ఎక్కువగా ఉండే సమయం. రెండోదేంటంటే ఏదో ఊరేగింపు అడ్డం వచ్చింది. ఒక దశలో ఆ ఊరేగింపు ఎంతో పొడవుంది. ఎంతంటే, అది రోడ్డు దాటటానికి దగ్గర దగ్గర అరగంట పట్టింది)

peak traffic = అత్యంత రద్దీ


M. SURESAN

**b)** ఆ కారు సామాన్యులు కొనలేరు. అంత ఖరీదైం దది =

Ordinary people can't buy the car; It's so expensive =

సామాన్యులు కొనలేనంత ఖరీదైన కారది =

The car is so expensive that ordinary people can't buy it.

**c)** It is a long way off; the girl can't walk the distance =

అది చాలా దూరం. ఆ అమ్మాయి ఆ దూరం నడవ లేదు.

ఆ అమ్మాయి నడవలేదు; అంతదూరం అది.

= The girl can't walk the distance; it's such a long way off/ so distant.

= It is such a long way off that the girl cannot walk.

చూశారు కదా. so ను ఈ విధంగా వాడవచ్చు అయితే 'so' ఇలా వాడేటప్పుడు, sentence లోని మాటల కూర్పు గమనించండి.

**1)** The box is so heavy that I cannot carry it.

(ఆ పెట్టె నేను మోయలేనంత బరువు)

**2)** He is walking so slowly that he cannot catch the train.

(ట్రైన్ అందుకోలేనంత నిదానంగా నడుస్తున్నాడతను)

మాటల కూర్పు చూడండి:

... so + adjective (heavy - 1) + that + ... (not) etc.
adverb (slowly - 2)

ఇంకాచూడండి.

**3)** He is so lazy that he cannot finish the work on time.

(సమయానికి పనిపూర్తిచేయనంత సోమరి అతను)

**4)** He talks so fast that I can't understand him

నేనర్థం చేసుకోలేనంత వేగంగా మాట్లాడతాడతను.

**4)** They had to wait so long that I served them coffee twice=

రెండుసార్లు coffee ఇచ్చేంతసేపు వాళ్లు ఎదురు చూశారు. (నీ రాక అంత ఆలస్యమయిందని భావం)

**5)** Why was the traffic so heavy?=

Traffic అంత రద్దీగా ఎందుకుంది?

**6)** ... it was so long that it took nearly 20 minutes to clear the road.

ఆ ఊరేగింపు ఎంత పొడవంటే, అది రోడ్ దాటడానికి 20 నిమిషాలు పట్టింది. (ఆ ఊరేగింపు రోడ్ దాటడా నికి 20 నిమిషాలు పట్టింది. అంత పొడవది.)

**7)** It was so noisy that you couldn't hear anything

మనకు (ఇక్కడ, you అంటే నీవు/ మీరు అని మాత్రమే కాదు; you - అంటే 'ఎవరైనా' అనే అర్థంతో వాడతారనే విషయం ఇంతకుముందు తెలుసుకున్నాం.)

**EXERCISE**

**(Practise the following aloud in English; use only so ... that structure.)**

**Ramana:** మనం ఇవ్వాళ బయటికెళ్లలేం. అంత వానగా ఉంది.

**Sumana:** మరి shopping చేయాలి కదా?

**Ramana:** రేపు చేద్దాంలే.

**Sumana:** ఈరోజు కొనాల్సినవి చాలా ఉన్నాయి. అవి అంత ముఖ్యమైనవి.

**Ramana:** అవును గుర్తొచ్చింది. రేపటిదాకా ఆపలేనంత అవసరమైనవి కదా?

**Sumana:** అయితే మనం పూర్తిగా తడిసిపోయేంత వానగా ఉంది. మరేం చేద్దాం?

**Ramana:** ఓ గంటాగి బయలుదేరదాం.

**Sumana:** అప్పటికి shops అన్నీ మూసేస్తారు.

**Ramana:** Auto లో వెళదాం.

**ANSWER**

**Ramana:** The rain is so heavy/ It's raining so heavily that we can't go out.

**Sumana:** But we've to do shopping.

**Ramana:** Let's do it tomorrow.

**Sumana:** Some of the things are so important that we have to buy them today.

**Ramana:** Yes, I remember. Some of the things are so important that they have to be bought/ we have buy them today.

**Sumana:** The rain is so heavy that we will be drenched. What shall we do?

**Ramana:** Let's start after an hour.

**Sumana:** By then the shops will all have closed.

**Ramana:** We'll take an auto.




# Thank you so much

**Sankar:** Hi Vishnu, you've been away for such a long time that I felt lonely here.
(నేను ఒంటరితనంతో బాధపడేంతకాలం నువ్వు బయటున్నావు)

**Vishnu:** I felt the same too, without your company.
(నీ సాహచర్యం లేక నేనూ అలానే బాధపడ్డా)

**Sankar:** Why did it take so long for you?
(అంతకాలం ఎందుకు పట్టింది? )

**Vishnu:** I had been away on a company assignment. I returned this morning.
(కంపెనీ పనిమీద వెళ్లాను. ఈ పొద్దున్నే వచ్చాను)

Assignment = అప్పగించిన పని.
అసైన్మెంట్ - 'సై' నొక్కి పలుకుతాం.

**Sankar:** What kind of assignment?
(ఎలాంటి పని? )

**Vishnu:** Such a tough assignment that I had to visit a number of places. I had to see a number of dealers, watch the movement of our products, and see that the sales increased.
(అమ్మో చాలా కష్టమైన పని. చాలా చోట్లకు (ఊళ్లకు) తిరగాల్సివచ్చింది. చాలామంది dealers ను చూసి, మా company తయారీల అమ్మకాలు ఎలా ఉన్నాయో గమనించి, అమ్మకాలు పెంచాల్సిన బాధ్యత అది.)

dealers = ఒక కంపెనీ తయారీలు (సరకులు) అమ్మే వాళ్ళు/ shops.

Movement = మామూలు అర్థం = కదలిక(లు). ఇక్కడ అర్థం ఓ company తయారీల అమ్మకపు ధోరణి. (ఉద్యమం అనే అర్థం కూడా ఉంది. Telangana Movement = తెలంగాణ ఉద్యమం)

Products= తయారీ- ఓ కంపెనీ తయారు చేసి అమ్మే వస్తువు. ప్రాడక్ట్స్ - 'ప్రా' నొక్కి పలుకుతాం.

**Sankar:** What a time you had! I really pity you, old boy! You do get a fat salary, but you can't have a minutes leisure.
(ఎంత కష్టంగా గడిపావ్! నిన్ను చూస్తే జాలేస్తుంది, మిత్రమా! నీకు మంచి జీతమే వస్తుంది కానీ క్షణం విశ్రాంతిలేదుకదా!)

**Vishnu:** It isn't the salary that matters. I like the challenging nature of the job. It is such a challenge that you have the satisfaction of having done something. You feel happy that you've achieved something.
(జీతం కాదు ముఖ్యం, అక్కడ నా ఉద్యోగంలో ఉన్న సవాలు నాకిష్టం. ఆ సవాలు ఎంతదంటే, ఏదో కొంత మనమూ సాధించాంకదా అనే తృప్తి మిగులుతుంది (కలుగుతుంది). నేనూ ఏదో సాధించాను./ ఇది నేను సాధించాను అనే తృప్తి ఉంటుంది.)

that matters = ముఖ్యం. achieving = సాధించటం; Achievement = సాధించిన విషయం

**Sankar:** Corporate culture has taken hold of you.
(పెద్ద వ్యాపార సంస్థా సంస్కృతి అధీనంలో ఉన్నావు నువ్వు).

Corporate =పెద్ద పెద్ద వ్యాపార సంస్థలకు సంబంధించిన.

Corporate - pronunciation కార్పొరి/ రెట్.

**Vishnu:** And I am proud of it too.
(అలా ఉన్నందుకు గర్విస్తున్నా.)

**Sankar:** Did you see any movies while you were away?
(బయటున్నప్పుడు సినిమాలేమన్నా చూశావా? )

**Vishnu:** I saw two but they were such lousy movies that I wished I hadn't seen them.
(రెండు చూశా. అవెంత చెత్తంటే చూడకుండా ఉండాల్సింది అనుకున్నా.)

Lousy = చెత్త. Louse - లౌస్- పేను - అసలర్థం- Lousy - అసహ్యంగా/ చెత్తగా ఉంది అని తిట్టడానికి కూడా వాడతారు. Lousy fellow - వెధవ అన్నట్లు.

**Sankar:** Thank God. I wasn't with you.
(బతికిపోయా. నీతో నేను లేనందుకు. (లేకుంటే నేనూ చూడాల్సి వచ్చేది)

**Vishnu:** What next now? Shall we have coffee?
(తర్వాతేంటి? coffee తీసుకుందామా? )

**Sankar:** OK.

☯ ☯ ☯ ☯

కిందటి lesson లో మనం so వాడకం చూశాం కదా. 'so' అంటే-

1) అంత

a) He isn't so tall. (అతనంత పొడుగేంకాదు)

b) The place is so distant.
(ఆ చోటు అంత దూరం)

ముఖ్యంగా so + adjective/ adverb + that (so tall that/ so large that/ so nice that, etc.) అంటే adjective/ adverb లు తెలిపే ఏ మేరకు అని తెలిపేందుకు వాడతాం.

2) American usage లో చాలా అని అర్థం.

a) Thank you so much.
(British: Thank you very much.)




b) You are so nice.
(British: You are very nice)

ఇప్పుడు దగ్గర దగ్గర అలాంటి అర్థం, వాడుక ఉన్న 'such' విషయం చూద్దాం.

**Such అంటే అలాంటి.**

a) I don't like such things = అలాంటి విషయాలు నాకిష్టంలేదు.

b) He never smiles. Such men are very dangerous = అతనెప్పుడూ నవ్వడు. అలాంటివాళ్ళు చాలా ప్రమాదం.

c) She works very hard. Such people prosper = ఆమె చాలా కష్టపడుతుంది. అలాంటివాళ్ళు పైకొస్తారు.

Such ని ఇలా కూడా వాడతాం. (Such ... as కూర్పుతో)

a) Such people as Gandhi are always respected = గాంధీలాంటి వ్యక్తులు ఎప్పుడూ గౌరవం పొందుతారు.
(మామూలు తెలుగు = గాంధీలాంటి వ్యక్తులను ఎప్పుడూ గౌరవిస్తారు)

b) Such trees as the coconut grow very tall (కొబ్బరిచెట్ల లాంటి చెట్లు ఏపుగా పెరుగుతాయి)

ఇక్కడ such వాడే తీరు, అలాంటి అనే అర్థంతో: such + noun + as + noun (ఏ పేరునైనా noun అంటాం)

c) Such movies as Titanic are rare. (Titanic లాంటి సినిమాలు అరుదు)

ఇక్కడ మాట కూర్పు:

Such + movies (noun) + as + Titanic (noun)

అయితే ఒక ముఖ్య గమనిక: ఫలానా వ్యక్తుల, విషయాల లాంటి అనేందుకు కదా ఇక్కడ మనం such ... as వాడుతున్నాం. ఇలా such ... as వాడటం సరైనప్పటికీ, ఇది కాస్త గ్రాంథికం, పాండిత్యం. ఇంతకంటే like వాడటం చాలా simple, better కదా! (లాంటి అనే అర్థంతో)

1) Such men as Gandhi are always respected = Men like Gandhi are always respected.

2) Such trees as the coconut = Trees like the coconut.

such ... as బదులు like వాడటం సర్వోత్తమం కదా. ఇప్పుడు ఇది చూడండి:

a) I bought a variety of fruits such as the mango, the apple, etc.
(మామిడి, apple లాంటి రకరకాల పండ్లు కొన్నా). ఇలాంటిచోట్ల కూడా such as బదులు like వాడటం మన భాషను సరళంగా, సహజంగా వినిపించేట్లు చేస్తుంది.

b) There were a number of things such as pen, paper, etc., = There were a number of things like ...

3) Now look at the following sentences from the conversation at the beginning of the lesson.

a) You have been away for such a long time that I felt lonely.

b) such a tough assignment that I had to visit a number of places.

c) ... they were such lousy movies that I wished that I hadn't gone to them.

so + adjective/ adverb + that- ఉపయోగంలాంటిదే పై sentences లో such ... that ఉపయోగం కూడా.

a) He is so good that all like him= అతను అందరూ ఇష్టపడేంత మంచివాడు.

b) He is such a good man that all like him.
అందరూ అతనంటే ఇష్టపడతారు. అంత మంచివాడ తను. = అతనందరూ ఇష్టపడేంత మంచివాడు.
గమనించారు కదా. ఇక్కడ a) అర్థం, b) అర్థం ఒకటే.


M. SURESAN

c) The day was so hot that we couldn't go out = మేం బయటికి వెళ్లలేనంత ఎండగా ఉంది ఆ రోజు.
[so + adjective (hot) + that]

d) It was such a hot day that we couldn't go out.
దీనర్థం, sentence (c) అర్థం ఒకటే. గమనించండి. అయితే ఇక్కడ word order (మాటల కూర్పు) తేడా.

such + adjective (hot) + day (noun) + that కాబట్టి రెండింటి అర్థం ఒకటే. అయితే, so తర్వాత adjective/ adverb వస్తుంది. such తర్వాత, adjective వచ్చి, దాని తర్వాత noun కూడా రావాలి. ఒక్కోసారి, noun మాత్రమే వస్తుంది.

He is such a man that all like him = అందరూ ఇష్టపడే వ్యక్తి అతను.

ఇదీ so ... that కూ, such ... that కూ ఉన్న సంబంధం, తేడా. ఇంకో విషయం కూడా చూద్దాం.

a) He is such a good man that we all like him = అతను మేమందరం ఇష్టపడేంత మంచివాడు.

b) He is so good a man that we all like him.
(a) లో such a good man = (b) లో so good a man

c) She is so clever a woman that she can solve any problem easily = She is such a clever woman that she can ...
(ఏ సమస్యనైనా పరిష్కరించగలిగినంత తెలివిగలామె)
so clever a woman = such a clever woman

d) India is such a large country/ so large a country that progress cannot be quick
(అభివృద్ధి అంత త్వరితం కానంత పెద్ద దేశం భారత్)
సందర్భాన్ని బట్టి, so గానీ such గానీ వాడవచ్చు.

**Sentences from the conversation:**

1) You have been away for such a long time that I felt lonely.
ఇక్కడ కూడా so వాడవచ్చు. అయితే పైన చూపినట్లుగా such a long time, so long a time అవుతుంది.
You have been away for so long a time that ...

2) ... such a tough assignment that I had to visit many places = so tough an assignment that I had to visit many places ...

3) ... they were such lousy movies that ... = the movies were so lousy that ...

ఇవీ so ... that, such ... that ఉపయోగాలు.

**EXERCISE**

**Pratap:** నిన్న meeting కు చాలామంది వచ్చారా?
**Manish:** ఎంత సంఖ్యలో వచ్చారంటే అంత పెద్ద Hall కూడా సరిపోలేదు.
**Pratap:** వక్త బాగా మాట్లాడాడా?
**Manish:** అందరూ నిశ్శబ్దంగా కూర్చుని శ్రద్ధతో విన్నంత గొప్ప వక్త ఆయన.
**Pratap:** ఏంటాయన ప్రసంగంలో విశేషాలు?
**Manish:** ఆయన చెప్పిన అంశాలు ఎంత ముఖ్యమైనవంటే, మనం సులభంగా అనుసరించగలిగేంతవి.
**Pratap:** అంత మంచి ప్రసంగమా?
**Manish:** జీవితంలో మళ్లీ వినలేనంత మంచి ప్రసంగం.
**Pratap:** దురదృష్టం, రాలేకపోయాను.

**ANSWER**

**Pratap:** Did a large number attend the meeting yesterday? / Was it a largely attended meeting yesterday?
**Manish:** It was such a large number/ so large a number that the hall wasn't enough.
**Pratap:** Did he speak well?
**Manish:** He was such a great speaker/ so great a speaker that all heard him with all attention.
**Pratap:** What were the special points/ highlights of his speech?
**Manish:** He made such good points/ the points he made were so good that we can easily practise them.
**Pratap:** Was it such a good speech/ so good a speech?
**Manish:** So good a speech/ such a good speech that we can't hear it again.
**Pratap:** Unfortunately, I couldn't attend it.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Sourabha:** Hi Susmitha, we'd better start early so that we don't miss Aruna.
(సుస్మితా, మనం తొందరగా బయలు దేరదాం, అరుణను miss కాకుండా ఉండేందుకు.)

We'd better = We had better = మంచిది. You'd better see a doctor = you had better ... = నువ్వు doctor ను చూడటం మంచిది.

**Susmitha:** I am almost ready. I got up quite early so that I might not be late.
(నేను దాదాపు సిద్ధం. త్వరగా లేచాను ఆలస్యం కాకుండా ఉండేందుకు.)

**Sourabha:** That's good. I told the taxi man to be here at 7 so that we need not waste time looking for a taxi.
(మంచిది. Taxi వాలాను ఏడింటికే రమ్మని చెప్పా, మళ్లీ Taxi కోసం time waste కాకుండా.)




**Sourabha:** That I've already done. The taxi will be here the day after tomorrow. She has to rest today and tomorrow to get over the jet lag.
(అదీ చేసేశాను. ఎల్లుండి పొద్దున taxi ready. ఈరోజూ, రేపు తను rest తీసుకుంటుంది jet lag నుంచి బయట పడటానికి.)

jet lag = విమానాల్లో సుదూర ప్రయాణాలు చేయటంలో రాత్రిపగళ్ల మధ్య దేశదేశాలకు ఉండే తేడాల వల్ల కలిగే బడలిక.

**Susmitha:** Let's accompany her to Tirupathi so that we too can have Lord Venkateswara's darsanam.
(మనం కూడా అరుణతో వెళదాం. మనం కూడా తిరుమలేశుని దర్శించుకోవచ్చు.)

**Sourabha:** OK.

☺ ☺ ☺ ☺

కిందటి lessons లో so + adjective/ adverb + that, such + (adj) + noun + that వచ్చే sentences చూశాం కదా.

**a)** He is so good that every one likes him = అతడు అందరూ ఇష్టపడేంత మంచివాడు =




**b)** Harsha goes to bed early so that he can get up early =
త్వరగా నిద్ర లేచేందుకు హర్ష త్వరగా పడుకుంటాడు.

**c)** I am noting down the phone numbers so that I can call you when necessary =
అవసరమైనప్పుడు పిలిచేందుకు అన్ని phone numbers రాసుకుంటున్నాను.

ఇలా పై sentences లోలా, so that అనే expression ఉద్దేశాన్ని తెలుపుతుంది.

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson:**

# .. so that we don't miss ..

**Susmitha:** When exactly is the arrival of the plane?
(Plane correct గా ఎప్పుడొస్తుంది?)

**Sourabha:** At 8.30. It'll be another hour after the touch down for Aruna to come out of the check in area and join us. The collection of the baggage after the baggage check these days take a lot of time because of security reasons.
(8.30కి. Check in area నుంచి బయటికి రావటానికి ఇంకో గంట పడుతుంది అరుణకు. తనిఖీ తర్వాత Baggage తీసుకోవడం భద్రతా కారణాలవల్ల ఈ రోజుల్లో చాలా ఆలస్యమవుతోంది.)

touch down = విమానం భూమ్మీదకు దిగటం.

Check in = మన సామాన్లు విమానాశ్రయ అధికారులు తనిఖీ చేయటం.

Check in అంటే ఇంకో అర్థం = Hotel లో బసకు గది తీసుకోవడం.

baggage - బాగిజ్ (బా bank లో b లా) = సామాన్లు.

baggage (American) = luggage (British)

**Susmitha:** Then why are we going so early?
(అయితే ఎందుకింత ముందే వెళుతున్నాం?)

**Sourabha:** The airport is so long way off. There are likely to be traffic jams. We are starting so early so that nothing may delay us. Better half an hour early than a minute late.
(విమానాశ్రయం చాలా దూరం. Traffic రద్దీలు బాగా ఉండవచ్చు. ఇవేం మనకు ఆలస్యం కలిగించకుండా ఉండేందుకు త్వరగా బయలుదేరుతున్నాం. ఒక నిమిషం ఆలస్యం కంటే ఒక అరగంట ముందుండటం నయం కదా.)

**Susmitha:** The first thing Aruna wants to do after landing here is to go to Tirupathi. Let's fix another taxi ready so that she may not lose time.
(ఇక్కడ దిగగానే ముందు తిరుపతికెళ్లాలని అరుణ కోరిక. ఇంకో taxi ని కూడా మాట్లాడుదాం, time కలిసొస్తుంది.)

He is such a good man that everyone likes him.


M. SURESAN

**b)** She drives so slow that even a bullock cart can over take her =
ఎడ్లబండి కూడా ఆమెను దాటిపోయేంత నెమ్మదిగా కారు నడుపుతుందామె.

Hers is such slow driving that even a bullock cart over takes her.

(overtake = ముందున్న వాహనాన్ని దాటివెళ్లటం)

ఇదీ మనం, so ... that/ such ... that ల గురించి ఇంతవరకు తెలుసుకున్నది.

ఇప్పుడు కింది sentences తేడా గమనించండి:

**a)** He studies so hard that he always scores high =
ఎక్కువ marks వచ్చేంత బాగా చదువుతాడతను.

**b)** He is studying very hard so that he may score high =
ఎక్కువ marks తెచ్చుకునేందుకు, అతను చాలా కష్టపడి చదువుతున్నాడు.

**a)** ... so hard that. [so కు that కు మధ్య hard (adv)]

**b)** so that - ఇక్కడ so కు that కు మధ్య ఇంకేం మాట రావడంలేదు. అవి రెండూ పక్కపక్కనే వస్తున్నాయికదా.

(a) కి, (b) కి అర్థంలో కూడా తేడా గమనించారు కదా.

Sentence (a) He is studying so hard that ... అనేది, అతను ఎంత/ ఏ మేరకు కష్టపడి చదువుతున్నాడో తెలుపుతుంది.

Sentence (b) He is studying very hard so that he may score high ... అనేది అతను ఏ ఉద్దేశంతో చదువుతున్నదీ తెలుపుతుంది.

**గుర్తుంచుకుందాం: So that ఎప్పుడూ మనం ఒక పనిని ఎందుకు చేస్తాం/ మన ఉద్దేశాన్ని (purpose) తెలుపుతుంది.**

**a)** Susila started at 7 itself so that she may not be late for class =
Class కు ఆలస్యం కాకుండా ఉండేందుకు సుశీల ఏడింటికే బయలుదేరింది.

**1)** We'd better start early so that we don't miss Aruna =
అరుణను miss కాకుండా ఉండేందుకు త్వరగా బయలుదేరటం మంచిది.

**2)** I got up quite early so that I might not be late =
ఆలస్యం కాకుండా ఉండేందుకు త్వరగా నిద్రలేచాను.

**3)** I told the taximan to be here at 7, so that we need not waste time looking for a taxi =
Taxi వాలాను ఏడింటికే రమ్మని చెప్పా, మళ్లీ taxi కోసం time waste చేయకుండా/ కాకుండా ఉండేందుకు.

**4)** We are starting so early so that nothing may delay us =
దేనివల్లా ఆలస్యం కాకుండా ఉండేందుకుగాను, మనం ముందే బయలుదేరుతున్నాం.

**5)** Let's accompany her to Tirupathi so that we too can have darsanam =
మనం కూడా తనతో కలిసి వెళదాం, మనమూ దర్శనం చేసుకోవచ్చు.

so that ఇలా వాడతాం. అయితే కొన్ని సందర్భాల్లో so that బదులు to వాడేయవచ్చు, simple గా.

He came here so that he could meet the minister.
మంత్రిని కలుసుకునేందుకు అతనివాళ ఇక్కడికి వచ్చాడు
He came here to meet the minister
(అంటే so that ను ఉద్దేశం తెలిపే అర్థంతో, to + 1st Regular Doing Word = infinitive వాడవచ్చు.)

He bought the bike so that he can move about quickly =
త్వరగా తిరిగేందుకుగాను అతను bike కొనుక్కున్నాడు = He bought the bike to (be able to) move about quickly.

అయితే so that బదులు infinitive వాడటం అన్నిచోట్లా సాధ్యం కాకపోవచ్చు. ఇక్కడ చూడండి.

Let's accompany her so that we too can have darsanam.
మనం కూడా దర్శనం పొందేందుకు, మనం తనతో కలిసి వెళదాం.

ఈ sentence లో so that we too can have darsanam బదులు, to have darsanam అని infinitive (to have) వాడితే అదే అర్థం రాదు. Let's accompany her to have darsanam అంటే వచ్చే అర్థం, దర్శనానికి ఆమెతో కలిసివెళదామనే వస్తుంది. అంతేకాని so that ఉన్న sentence లోలాగ ఆమెతో వెళితే మనకూ దర్శనం అవుతుందని రాదు.

మరోసారి చూడండి:

Let's accompany her so that we can have darsanam too =
మనమూ తనతోపాటు వెళితే మనమూ దర్శనం చేసుకోవచ్చు.

Let's accompany her to have darsanam.
దర్శనానికి తనతోపాటు మనం వెళదాం.

మనం భాష practice చేస్తున్నకొద్దీ, మనకు తెలియకుండానే, so that ఎక్కడ వాడాలో, to ఎక్కడ వాడాలో వాడేస్తుంటాం. Practice alone helps us.

| **EXERCISE** | **ANSWER** |
|---|---|
| **Practise the following aloud in English.** | |
| **Sulochana:** చాలా ఆలోచించి నిర్ణయం తీసుకో, తర్వాత చింతించకుండా ఉండేందుకు. (చింతించటం= regret/ repent) | **Sulochana:** Take a decision, only after a lot of thinking so that you don't regret later (to avoid regretting later) |
| **Sunayana:** అందుకే రెండ్రోజులు అడిగా బాగా ఆలోచించవచ్చని. | **Sunayana:** That's exactly why I've asked for two days time ... so that I can think well about it. |
| **Sulochana:** పెద్దవాళ్లను కూడా అడుగుదాం, వాళ్ల అభిప్రాయమూ తెలుసుకునేందుకు. | **Sulochana:** Let's consult our elders too, so that we can have their opinion. (to have their opinion) |
| **Sunayana:** అందుకనే మామయ్యను ఇక్కడికి రమ్మన్నా. | **Sunayana:** That's why I've asked my uncle to come here. (... I've asked my uncle over here) |
| **Sulochana:** అన్ని విషయాలు ఆయనతో చెప్పాలి మనం, ఆయనకు సరైన అవగాహన వచ్చేందుకు. | **Sulochana:** We should tell him all about it, so that he can have a correct understanding of it. |
| **Sunayana:** ఆయన్ను ఓ రెండ్రోజులు ఇక్కడ ఉండమనాలి, తొందరపాటు నిర్ణయానికి రాకుండా (conclusion= నిర్ధారణ) | **Sunayana:** We should ask him to be here for two days to avoid coming to a conclusion in a hurry. (So that we may not come to a conclusion in a hurry) |
| **Sulochana:** OK. | **Sulochana:** OK. |

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Ramesh:** Hi Nikhila, What brings you here?
(ఏంటిలా వచ్చావ్? )
(ఈ అర్థంతో What brings you here? అనేది అమర్యాదకరం అనే అపోహ ఉంది. కాని ఇది మర్యాదకరమైన పలకరింపే. మీ conversation లో తరచూ వాడండి.)

**Nikhila:** Just to see you. Long since we met, you know.
(నిన్ను చూడటానికే. మనం కలుసుకుని చాలా రోజులయింది కదా)

**Ramesh:** Thank you. Any news of Krishna?
(మంచిదే. కృష్ణను గురించి ఏమైనా తెలుసా? )

**Nikhila:** I'm afraid I haven't any.
(ఏం తెలియదు. Sorry)

**Ramesh:** I was hopeful you'd have some information about him.
(నువ్వేదో అతని గురించి చెప్తావనే ఆశతో ఉన్నా.)

**Nikhila:** Let's call Alamelu. She might have some news.
(అలమేలుకు phone చేద్దాం. ఆమెకు కొంత తెలియొచ్చు.)

**Ramesh:** As a jockey he keeps moving about. Let's call the Race course. They can give us definite information about him.
అతను jockey కదా. అందుకని నగరాలన్నీ తిరుగుతుంటాడు. Race course వాళ్లకు phone చేస్తే వాళ్ల దగ్గర కచ్చితమయిన సమాచారం ఉంటుంది)

(Jockey= జాకీ - గుర్రపుందాల్లో గుర్రాలను నడిపేవాళ్లు. Race course = గుర్రపుందాలు జరిగే మైదానం)

**Nikhila:** But there aren't any races now in Hyderabad. Not the season here. It's the Bangalore racing season. He might be in Bangalore.
(హైదరాబాద్‌లో గుర్రపుందాలేం లేవు ఇప్పుడు. పందాల సమయం కాదిక్కడ. ఇప్పుడు బెంగళూర్ గుర్రపుందాల Time. అతనక్కడుండొచ్చు.)

**Ramesh:** Do you have any friends there?
(అక్కడ నీకెవరన్నా స్నేహితులున్నారా? )

**Nikhila:** I haven't any friends there.
(అక్కడ నాకెవరూ స్నేహితులు లేరు)

**Ramesh:** Neither have I. How about having coffee? I haven't had any since morning.
(నాకూ లేరు. కాస్త coffee తాగుదామా? పొద్దున్నుంచి coffee తీసుకోలేదు నేను)

**Nikhila:** Coffee is certainly welcome. I've come to you for some CDs on spoken English. Can you lend me them?
(Coffee నాకిష్టమే. నేనొచ్చింది కొన్ని spoken English CD ల కోసం. అవి నాకిస్తావా? )

**Ramesh:** List the CDs you want.
(నీక్కావలసిన CD ల list రాయి)

**Nikhila:** I want some paper and pen.
(నాక్కాస్త paper, pen కావాలి)

**Ramesh:** Here you are. Have this coffee too.
(ఇవిగో. ఈ coffee కూడా తీసుకో)

**Nikhila:** Thank you. But I need some more sugar.
(నాక్కొంచెం పంచదార కావాలి.)

**Ramesh:** There isn't any in this bowl. I will get some. Wait.
(ఈ చిన్న పాత్రలో లేదు. నేను తీసుకొస్తా. ఉండు)

☯ ☯ ☯ ☯

Spoken English లో some కు, any కి చాలా ప్రాముఖ్యముంది. మనందరికీ తెలుసు, some అంటే కొంత, కొన్ని అనీ, any అంటే ఏదైనా, ఏవైనా, ఎవరైనా అని.

***Some = కొంత, కొన్ని.***

**a)** There is some milk in the glass =
గ్లాసులో కొంచెం పాలున్నాయి.

**b)** Have some coffee =
కాస్త coffee తీసుకో.

**c)** She cooked some of the rice =
ఆ బియ్యంలో ఆమె కొంత వండింది.

**d)** I gave him some books yesterday =
నిన్న అతడికి నేను కొన్ని పుస్తకాలిచ్చాను.

**e)** Some men were sitting; others were standing =
కొంతమంది కూర్చుని ఉన్నారు, ఇతరులు నిలుచుని ఉన్నారు.

**f)** Only some students were present =
కొందరు students మాత్రమే class కొచ్చారు.

***Any = ఏదైనా, ఎవరైనా***

**a)** Any book/ Any of the books here is very expensive =
ఇక్కడి ఏ పుస్తకమైనా/ ఇక్కడి పుస్తకాలలో ఏదైనా ఖరీదయిందే.

**b)** Any of them will help you =
వాళ్లల్లో ఎవరైనా నీకు సహాయం చేస్తారు.







= Do not (Don't) waste any more time.
తెలుస్తోంది కదా- **no more = not any more.**

1) Waste no more time

2) Don't waste any more time.

ఈ రెండు కూడా grammatical గా correct. అయితే no more కంటే కూడా not any more అనేది spoken English లో ఎక్కువ వాడతారు. అలా వాడితేనే English, సహజంగా ఉంటుంది.

మరికొన్ని **examples చూడండి.**

**a)** There is no sugar in the bowl.
(ఇది spoken English లో అంత ఎక్కువగా వినిపించదు.)
= There isn't any sugar in the bowl.
(ఇది spoken English చాలా natural (సహజం)గా ధ్వనించేట్టు చేస్తుంది.)

**b)** I have no money (not natural) -
I haven't (have not) any money/ I don't

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson:**

**1)** I'm afraid I haven't any.
(I haven't any news = I have no news.
I have no news అంత సహజమైన వాడుక కాదు)

**2)** ... You'd have some news-
not లేదు కాబట్టి some news.
(నీ దగ్గరేదో వార్తలుంటాయని ఆశించా)
(Not / Question తో any)

**3)** ... she might have some news.
not లేదు కాబట్టి some.
(ఆమె దగ్గర కొంత సమాచారం ఉండొచ్చు)

**4)** But there aren't any races now.
(ఇలా అనటం, There are no races అనటం కన్నా సాధారణం, సహజం)

**5)** Do you have any friends there?
(Question కాబట్టి any)

# Have some coffee

***మామూలుగా affirmative sentences (no, not లేని sentences) లో, some, not ఉన్న sentences లోగానీ/ questions లోగానీ any వాడతాం.***


M. SURESAN

**1)** They have some books
(వాళ్ల దగ్గర కొన్ని పుస్తకాలున్నాయి)
X They do not (don't) have any books
(They haven't (have not) any books)
= వాళ్ల దగ్గరేం పుస్తకాలూ లేవు.

**Question:**
Do they have any books?/ Have they any books?
(వాళ్ల దగ్గర పుస్తకాలేమన్నా/ పుస్తకాలేవైనా ఉన్నాయా? )

**2)** He wants some more milk.
(అతనికి ఇంకొంచెం పాలు కావాలి)
X He doesn't want any more milk.
(అతనికింక పాలక్కరలేదు)

**Question:**
Does he want any more milk?
(ఇంకా పాలు కావాలా? )

***అయితే కొన్ని సందర్భాల్లో some, question లో కూడా వాడతాం.***

**a) will you have some more Upma?**
= ఇంకొంచెం ఉప్మా తీసుకుంటారా? దీనికి answer
a) not తో:
No. Thank you. I don't want any more.
b) not లేకుండా:
Thank you. A little more would do.
(ఇంకాస్త కావాలి)

*ముఖ్యంగా గుర్తుంచుకోవాల్సిన విషయం:*
***No = not any***
**eg:** Waste no more time = ఇంక time వృథా చేయొద్దు

**2)** Come no more to me for help
(నా దగ్గరికి సహాయానికి రావద్దు) -
ఇదంత natural కాదు. Spoken English లో సామాన్యంగా ఇది వాడరు. ఇదే అర్థంతో ఎక్కువగా వాడే sentence –
Don't come to me any more for help.

**3)** I don't have any money అనటం,
I have no money కన్నా better, natural.

**4)** She doesn't have any property అనటం,
She has no property కన్నా better, natural.

**6)** I haven't any= I don't have any.
(ఇలా అనటం, I have no friends కన్నా సాధారణం, సహజం)

**7)** I haven't had any coffee since morning.
(Better than saying, I have had no coffee since morning)

మిగతా సంభాషణలో some వాడకం కొంత అనీ, కొన్నీ అనే అర్థంతో వాడాం చూడండి.

### EXERCISE

**Practise the following aloud in English.**

**Vinod:** నీ దగ్గర computer books ఏవో ఉన్నట్లున్నాయి. నాక్కొన్నిస్తావా?
**Vikram:** ఎవరన్నారు? నా దగ్గరేం computer books లేవు.
**Vinod:** నువ్వు మామూలుగా కొంటుంటావు కదా?
**Vikram:** ఇప్పుడు డబ్బులు లేవు. కొనడం లేదు.
**Vinod:** ఆ library లో నాకింకా పుస్తకాలివ్వటం లేదు.
**Vikram:** ఎందుకని?
**Vinod:** నాలాంటి outsiders కి వాళ్లు పుస్తకాలివ్వరట.
**Vikram:** I am sorry. కొనుక్కోవచ్చు కదా?
**Vinod:** నా దగ్గర డబ్బులేదు.

### ANSWER

**Vinod:** You seem to have some computer books. Can you lend me some?
**Vikram:** Who said so? I don't have any (books on computers).
**Vinod:** You usually buy, don't you?
**Vikram:** I don't have any money. I don't buy (them) any more.
**Vinod:** They aren't giving me books any more in the library.
**Vikram:** Why?
**Vinod:** They aren't giving books to outsiders like me any more.
**Vikram:** I'm sorry. Why don't you buy?
**Vinod:** I haven't the money/ I don't have the money.




**ప్రశ్న:** *1. say తర్వాత to ఉంటుంది. tell తర్వాత ఉండదు. కొన్ని verbs usage లో confuse అవుతున్నాం. దీనికి పరిష్కారం మేమిటి?*

*2. exams రాసేటప్పుడు time అయిపోతున్నది అని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?*

*3. He is in college now, He is at college now. తేడా ఏమిటి?*

*– కె.ఆర్. ప్రియదర్శిని, కాకినాడ*

**జవాబు:** **1.** Say తర్వాత to వాడటం, tell తర్వాత to రాకపోవటం అనేది English usage లో భాగం. అంటే వాడుక ప్రకారం వస్తుంది. మనం తెలుగులో ఒకరి మీద కోపంగా ఉంది, అంటాం. ఇక్కడ 'మీద' అని ఎందుకనాలి అంటే ఏం చెప్పలేం కదా? అలాగే English లో ఏ మాట ముందూ/ తర్వాతా ఏ preposition వస్తుందనేది చదివేటప్పుడు, వినేటప్పుడు అలవాటుపడి గుర్తుంచుకోవాల్సిన విషయమే.

**2.** Time is up (Time అయిపోయింది). Half an hour is up (అరగంటయింది).
Time is over అనేది సరికాదు.

**3.** He is in college now = అతను college లో ఉన్నాడు = He is at college now. ఇలాంటిచోట్ల, in, at తేడా లేకుండా వాడుతుంటారు. ఏదైనా correct. కొన్నిచోట్ల, in కు ముందు, 'the' వాడాల్సి రావచ్చు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






# HAVE YOU ANY PROGRAMME TODAY?

**Govardhan:** Where are you going?
(ఎక్కడికెళ్తున్నావ్? )

**Sudarsan:** No where in particular
(ఎక్కడికీ లేదు/ ఫలానాచోటికనేం లేదు, ఏదో అలా వెళ్తున్నా)

**Govardhan:** (Are you) meeting any friends today?
(ఈరోజు ఫ్రెండ్స్‌నెవరినైనా కలుసుకుంటున్నావా? )

**Sudarsan:** None
(ఎవరినీ కలుసుకోవటం లేదు)

**Govardhan:** Have you any programme today?
(ఈరోజు ఏదైనా కార్యక్రమం ఉందా? )

**Sudarsan:** None at all
(అసలేం లేదు)

**Govardhan:** You were asking me for Sekhar's address. What do you want from him?
(నువ్వు శేఖర్ అడ్రస్ అడిగావు. వాడినుంచి ఏమన్నా కావాలా? )

**Sudarsan:** Nothing. I just wanted to see him.
(ఏం అక్కర్లేదు. వాడిని చూడాలనుకున్నాను)

**Govardhan:** Here you are. This slip has his address. Why are you going to see him?
(ఇదిగో ఈ స్లిప్‌లో వాడి అడ్రస్ ఉంది. వాడిని ఎందుకు కలుసుకుంటున్నావు ? )

**Sudarsan:** I wonder if he can help me get a gas cylinder.
(గ్యాస్ సిలిండర్ ఏమన్నా ఇప్పించగలడేమోనని)

**Govardhan:** How much gas have you at home now?
(ఇంట్లో గ్యాస్ ఎంతుంది? )

**Sudarsan:** Nil.
(అసలేం లేదు)

**Govardhan:** I am sure he can help you.
(వాడు నీకు సహాయం చేయగలడనే నమ్మకం నాకుంది.)

**Sudarsan:** But today is Sunday. Is there anything he can do?
(కానీ ఇవ్వాళ ఆదివారం. వాడు చేయగలిగేదేమన్నా ఉందా? )

**Govardhan:** Nothing, I'm afraid.
(ఏంలేదు)

I'm afraid - అలా చెప్పటానికి బాధపడుతున్నా.

**Sudarsan:** So I've to wait till tomorrow. We have to make do with the Kerosene stove at home.
(అంటే రేపటివరకు ఎదురు చూడాల్సిందే. అంతవరకు కిరోసిన్‌స్టవ్‌తో సర్దుకోవాల్సిందే.)

* * *

కిందటి లెసన్‌లో చూశాం మనం. No = not any అని. Spoken English లో తరచూ, no బదులు not any వాడటం సర్వసాధారణమే కాకుండా, సహజం (natural) అని కూడా.

There is no sugar in the bowl లాంటి sentences conversational English లో చాలా అసహజంగా వినిపిస్తుంది. There is no sugar in the bowl బదులు, There isn't (is not) any sugar in the bowl అనేది spoken English లో ఎక్కువ వినిపిస్తుంటుంది, సహజంగా ధ్వనిస్తుంది కూడా.

(ముఖ్య విషయం: No any ఎక్కడా వాడం. There is no any sugar in the bowl. ఇది English కాదు. Not... any చాలా తరచుగా వస్తుంది; no any ఎప్పుడూ రాదు)

**a) Subodh:** How many boys are there in the room?
(ఆ గదిలో ఎంతమంది అబ్బాయిలున్నారు? )

**Prasanth:** There aren't any = ఎవరూ లేరు
There are not any - ఇది చాలా సహజంగా, సర్వసాధారణంగా వినిపించే response.
(There are no students at all - ఇది correct అయినప్పటికీ spoken English లో అంతగా వాడం)

**b) Kamala:** Have you any story books?

**Vimala:** I'm sorry I haven't any/ I don't have any.
(I haven't any అనేది ఎక్కువ వాడతారు)

some, any, not any (n't any రూపంలో) spoken English లో చాలా ప్రాధాన్యం ఉన్నాయి. మన conversation సరళంగా, సహజంగా ధ్వనించాలంటే వీటిని బాగా అధ్యయనం చేసి వాడగలగాలి.

**Look at the following sentences:**

**a) Ram:** I want some paper. Have you any?
(నాకు కాస్త పేపర్ కావాలి. నీదగ్గరేమన్నా ఉందా? )

**Laxman:** I have some/ I do have some, but I can't lend you any. I need all of it now.
(నా దగ్గర ఉంది/ ఉండటానికైతే ఉంది, కానీ నీకేం ఇవ్వలేను. అవన్నీ/ అదంతా నాకు కావాలి.

**గుర్తుంది కదా:**
Paper, uncountable అంటే papers అని plural వాడం; paper ముందు a/ an, 1, 2, 3 లాంటి సంఖ్య లూవాడం. ఇది మనం రాయటానికి, printing కువాడే paper విషయంలో)

M. SURESAN

కాబట్టి మన conversation లో ముఖ్యంగా గుర్తుంచుకోవాల్సిన విషయం. సందర్భాన్ని బట్టి no బదులు, not any (n't any) వాడటం conversation సహజంగా ఉండేట్లు చేస్తుంది.

**ఇంకా చూడండి:**

**b)** There are no good watches in the shop = There aren't any good watches in the shop.
ఇక్కడ There aren't any good watches అనటం, There are no good watches... కన్నా సరళం, సహజం.

**c)** His watch is no better than mine =
నా వాచ్ కంటే అతడి వాచ్ పెద్దమెరుగైందేమీ కాదు - దీన్ని ఇలా అనటం better.
His watch isn't any better than mine (spoken form)
అయితే 'no' form అసలు వాడరని కాదు. 'No' form కూడా చాలా తరచుగా వాడతాం, ముఖ్యంగా లేదు, కాదు, అని ముక్తసరిగా సమాధానాలు (short negative responses) ఇచ్చేటప్పుడు,

**Look at the following sentences:**

**a) Balu:** How many students have come?
(ఎంతమంది విద్యార్థులొచ్చారు? )

**Sekhar:** None/ No one
(ఎవరూ రాలేదు)

**b) Balu:** What did you say?
(ఏమన్నావు? )

**Subha:** Nothing = (I said nothing)
(నేనేం అనలేదు)

**c) Sankar:** who told you to do that?
(నిన్నెవరు చేయమన్నారది? )

**Brahmam:** Nobody.
(ఎవరూ చెప్పలేదు)

ఇలా కాదు, లేదు అని ముక్తసరిగా responses ఇచ్చేటప్పుడు మాత్రమే, no, no combinations వాడతాం.

**d) Sudhakar:** How many books will you give me?
(ఎన్ని పుస్తకాలిస్తావు నాకు? )

**Prabhakar:** None. (None - ఏవీ ఇవ్వను)

**ఇప్పుడిది చూడండి.**

**e) Suman:** How many has he given you?
(అతడు నీకెన్నిచ్చాడు? )

**Sunil:** None/ He hasn't given me any.
చూడండి. short response అయితే None అనేసి ఆపేస్తాం. అదే sentence అయితే, He has'nt, given me any, అని not... any అంటున్నాం. ఇదీ, no, no combinations కూ, not... any కీ ఉన్న తేడా.

**f) Prem:** Who did you consult about this?
(ఈ విషయంలో ఎవరిని సంప్రదించావు? )

**Syam: a)** None (short negative response)
**b)** I didn't consult anyone (sentence)
(I consulted no one అనం)

**g) Sri Ram:** Where did you go last night?
(నిన్న రాత్రి ఎక్కడికెళ్లావ్? )

**Srihari: a)** No where (short response- nagative)
**b)** I didn't go anywhere (sentence)
(I went no where అనం)

ఇలా no, no combination (none, never, no where, nil లాంటివి) short nagative responses కు ముఖ్యంగా వాడతాం. sentence అయితే not... any అంటాం. short negative response లో ఎప్పుడూ ఒకమాటే ఉంటుంది.

**h) Ramesh:** Have you ever been to the US?
(అమెరికా ఎప్పుడైనా వెళ్లావా? )

**Suresh: a)** Never. (short response - one word)
**b)** I haven't been there at any time / so far.
(I have never been there - spoken form లో ఇది అరుదు )

**Let's study the following exchanges from the conversation at the beginning of this lesson:**

ఇవన్నీ కూడా short negative responses:

**1) Govardhan:** Where are you going?
**Sudarsan:** No where (in particular)
(ఎక్కడికీ లేదు)

**2) Govardhan:** (Are you) meeting any friends?
**Sudarsan:** None.
(లేదు)

**3) Govardhan:** Have you any programme today?
**Sudarsan:** None (at all) =
అసలు లేదు.

**4) Govardhan:** What do you want from him?
**Sudarsan:** Nothing.
(ఏం అక్కరలేదు)

**5) Govardhan:** How much gas have you...?
**Sudarsan:** Nil.
(అసలేం లేదు)

**6) Sudarsan:** Is there anything he can do?
**Govardhan:** Nothing.
(ఏం లేదు)

అయితే ఈ Short nagative responses ఇచ్చేటప్పుడు, I'm sorry, I'm afraid, I wonder లాంటివి వాడవచ్చు

**a) Prakash:** Can you lend me some money?
**Prabhat:** I'm afraid, no / No, I'm afraid / I'm sorry, no / No, I'm sorry.

**b) Sumanth:** Is your dad coming?
**Srikanth:** I wonder. (=No)

### Exercise:

**Practise the following aloud in English.**
**(use short negative responses)**

**Gopal:** ఎవరిని కలుసుకున్నావు నిన్న?
**Govind:** ఎవరినీ కలుసుకోలేదు.
**Gopal:** మరెక్కడికెళ్లావు నిన్న రాత్రి?
**Govind:** ఎక్కడికీ వెళ్లలేదు.
**Gopal:** అయితే ఇంట్లో కూర్చొని ఏంచేశావు?
**Govind:** ఏమీ చెయ్యలేదు. టి.వి. చూశా.
**Gopal:** ఎన్ని ఎక్సర్‌సైజులు చేశావు?
**Govind:** ఒక్కటీ చేయలేదు.
**Gopal:** టీవీలో ఎన్ని సీరియల్స్ చూశావు?
**Govind:** ఏదీ చూడలేదు. క్రికెట్ చూశా.

### ANSWER

**Gopal:** Who did you meet yesterday?
**Govind:** None / Nobody
**Gopal:** Then where did you go last night?
**Govind:** No where
**Gopal:** What did you do sitting at home then?
**Govind:** Nothing. I just watched the TV
**Gopal:** How many exercises did you do?
**Govind:** None.
**Gopal:** How many serials did you watch?
**Govind:** None. I watched cricket.

ఈ short negative responses కు బదులు, not... any తో ఉండే sentences practice చేయండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Madhavi:** Your place looks beautiful what with the white wash and paints.
(వెల్ల వేయటం, రంగులు వేయటంవల్ల మీ ఇల్లు అందంగా కనిపిస్తోంది.)

**Sridevi:** I told you, my sister is getting married in a month, so we had the whole building done up. Dad got it white washed and painted.
(చెప్పాను గదా, ఓ నెలలోగా మా అక్కయ్య పెళ్లి. అందుకని ఇల్లంతా సిద్ధం చేశాం. నాన్న ఇంటికి వెల్ల, రంగులు వేయించారు.)

Do up = సిద్ధం చేయటం

**Madhavi:** Who were the workers? I must say they did a good job of it. I will suggest dad that he hire them too for our home.



**Sridevi:** We have to get the invitation cards printed. We have the list of invitees ready. We expect the cards to be ready by tomorrow, but we will start posting them a little later. Inviting now will be too early. People may forget.
(శుభలేఖలు మాత్రం అచ్చుకావాలి. ఆహ్వానితుల జాబితా సిద్ధంగా ఉంది. రేపటికి cards రావచ్చు. కాని పంపటం మాత్రం కొన్ని రోజుల తర్వాత చేస్తాం. ఇప్పుడే పిలిస్తే మరీ ముందరవుతుంది. వాళ్లు మరచిపోవచ్చు)

**Madhavi:** OK. Then. I must be going. I have to get my clothes washed and ironed.
(నేవెళ్లాలి మరి. నా బట్టలు ఉతికించి ఇస్త్రీ చేయించుకోవాలి.)

**Sridevi:** Bye then.



# We had it done on contract

(పనివాళ్లెవరు? పనంతా బాగానే చేశారని చెప్పాలి. మా నాన్నకు చెప్తా, మా ఇంటి పనికి కూడా వాళ్లనే పెట్టుకోమని.)

Do a good job of something = ఒక పనిని సరిగా/ తృప్తికరంగా చేయటం.

Hire = (హయ) మామూలు అర్థం - అద్దెకు తీసుకోవటం. ఇక్కడర్థం - ఓ పనికెవరినైనా కుదుర్చుకోవటం.

**Sridevi:** We had it done on contract. Dad's friend is a small time civil contractor. He got everything done for us.
(అంతా contract పనివాళ్లతో చేయించాం. నాన్న ఫ్రెండ్ ఒక చిన్న సివిల్ కాంట్రాక్టర్. ఆయన మాకన్నీ చేయించాడు.)

**Madhavi:** How are the other preparations going on?
(ఇతర ఏర్పాట్లన్నీ ఎలా సాగుతున్నాయి?)

**Sridevi:** Briskly, of course. You know, all that matters is money. Once you have enough of it you can have anything readied in no time.
(చురుగ్గా జరుగుతున్నాయి. ఒక విషయం తెలుసుకో. అన్నిటికీ ముఖ్యం డబ్బు. అదిగనక చాలినంత ఉంటే దేన్నైనా క్షణంలో సిద్ధం చేయొచ్చు.)

All that matters = అసలు విషయం/ ముఖ్యమైంది అన్నింటా.

In no time = క్షణంలో

briskly = చురుగ్గా/ చకచకా

**Madhavi:** That's true. What about wedding shopping?
(పెళ్లికి కొనాల్సిన వస్తువుల విషయం?)

**Sridevi:** Most of it, over. Sister is getting all her dresses stitched, and some blouses too. She has fall sewn up for her saris.
(ఎక్కువభాగం అయిపోయింది. తన dresses అన్నీ కుట్టించేసుకుంది. కొన్ని blouses కూడా అయిపోయాయి. చీరలకు falls కూడా కుట్టించేసుకుంటోంది.)

Sewn (సోన్) - past participle of sew. sew - pronunciation - సో (no లాగా) = కుట్టడం.

**Madhavi:** So things are going on well.
(అన్నీ సక్రమంగా జరిగిపోతున్నాయయితే)



M. SURESAN

పనులు మనం చేస్తాం. ఇతరులతో చేయిస్తాం. మనం చేయటం అయితే, We do something. ఇతరులతో చేయించటం అనటానికి, we make others do it, అంటాం.

a) The teacher made him study =
Teacher అతడి చేత చదివించాడు.

b) Hari made the little boy walk the whole distance =
హరి ఆ పిల్లాడితో అంత దూరం నడిపించాడు/ నడిచేట్లు చేశాడు.

c) In government offices the staff make people wait =
(ప్రభుత్వ కార్యాలయాల్లోని సిబ్బంది ప్రజలను కాచుకునేట్లు చేస్తారు.)

అంటే చేయించటం అనే అర్థంతో ... make (someone) do (something) అంటాం. అయితే ఇది ఏదో బలవంతంగాగానీ, ఓ శిక్షలాగానీ అనే అర్థం వస్తుంది. రెండో విషయం. ఇలాంటి సందర్భాల్లో make (చేయించటం) అనే అర్థంతో వాడితే, make తర్వాత to రాదు.

He made me do the work =
నాచే పని చేయించాడు.
(He made me to do the work కాదు)
అయితే make ... do అన్నిచోట్లా కుదరదు.

కొన్ని కొన్ని పనులు మనం చేయం. వాటిని డబ్బిచ్చిగానీ, మొహమాటపెట్టిగానీ చేయించుకొంటాం. ముఖ్యంగా మనం పొందే సేవలు. అలాంటప్పుడు make (someone) do (something) రాదు.

అందుకు బదులు-

a) ... have something done by someone

OR

b) ... get something done by someone, అంటాం.

1) Hari has his house white washed regularly-once in two years.
(హరి తన ఇంటికి క్రమం తప్పకుండా వెల్లవేయిస్తాడు- రెండేళ్లకోసారి)

గమనించండి: Hari has ... whitewashed.
whitewashed ఇక్కడ past participle.

2) **Tarun:** How about lending me your bike for a day? (నీ bike నాకీరోజుకిస్తావా?)
**Varun:** Take it, but have it filled.
(తీసుకో, కానీ petrol పోయించు.)
have + it + filled (past participle)

1) The doctor had the patient's ECG taken.
Doctor రోగి ECG తీయించాడు.
(had బదులు got వాడవచ్చు)
structure: had/ got + the patient's ECG + taken (past participle)

2) She had/ got her daughter's birth chart prepared =
ఆమె తన కూతురి జాతక చక్రం వేయించింది.
Birth chart = జాతక చక్రం - పుట్టుక సమయంలో గ్రహం, నక్షత్రాల స్థానాలను తెలిపే గళ్ల పట్టిక.

3) The minister used his influence and got the prime price of land sold to his son-in-law.
తన పలుకుబడితో మంత్రి చాలా విలువున్న భూమిని తన అల్లుడికి అమ్మించాడు.

ఇదీ have/ got + something + past participle వాడకం.

ఇంకా చూడండి.

a) సరైన manager సకాలానికి పని పూర్తి చేయిస్తాడు
A good/ an efficient manager gets the work done on time.
ఇక్కడ gets బదులు has కూడా వాడతాం.

3) అతను ఇంట్లో fans అన్నీ తుడిపించాడు =
He had all the fans at home cleaned
(had ... cleaned (past participle))

4) The TV isn't all right. I'll have to get it repaired.
(TV సరిగా లేదు. దాన్ని repair చేయించాలి.)
have to get it repaired (past participle)

ఇక్కడ మనం గమనించాల్సింది: పైన తెలిపిన పనులన్నీ మనంతట మనం చేయం. వాటిని చేసేవాళ్ల చేత చేయిస్తాం. అటువంటప్పుడు have/ get + something + done (past participle) by someone అంటాం.

b) He some how got/ had the meeting postponed =
మొత్తానికి, అతను meeting ను వాయిదా వేయించాడు.

ఇవీ have/ got + something + past participle ఉపయోగాలు:

**Now let's look at the following sentences from the conversation at the beginning of the lesson:**

1) We had the whole building done up =
(had + the whole building + done (past participle) =
మేం building మొత్తం సిద్ధం చేయించాం

2) We had it done on contract =
అంతా contract తో చేయించాం మేం.
had it done - had + it + done (past participle)

3) You can have anything readied in no time =
క్షణంలో ఏదైనా సిద్ధం చేయించవచ్చు
have + anything + readied (past participle)

4) Sister is getting all her dresses stitched =
అక్కయ్య తన dresses అన్నిటినీ కుట్టించుకుంటోంది.
(getting + dresses + stitched - past participle)

5) She has falls sewn up for her saris =
చీరలకు falls కుట్టించుకుంటోంది.
has + falls + sewn (past participle)

6) We have to get invitation cards printed =
శుభలేఖలు అచ్చేయించాలి.
get (have) + invitation cards + printed (past participle)

7) I have to get my clothes washed and ironed
బట్టలు ఉతికించి ఇస్త్రీ చేయించుకోవాలి.
get (have) + my clothes + washed and ironed (past participle).

**PRACTISE THE FOLLOWING ALOUD IN ENGLISH**

**Vennela:** Fridge ఏదో చెడిపోయిందన్నావు. repair చేయించావా?
**Purnima:** ఆ- చేయించాను. పోయిన శనివారం. మళ్లీ ఇప్పుడు సరిగా పనిచేయటం లేదు.
**Vennela:** నాకు తెలిసిన mechanic ఉన్నాడు. అతడితో చేయిద్దాం ఈసారి.
**Purnima:** మా ఆయన అన్నారు, exchange offer ఏదో ఉందని. కొత్త fridge తో మార్పించుకుందామనుకుంటున్నారు.
**Vennela:** అయితే, కానీ.
**Purnima:** మళ్లీ అదే brand fridge వస్తుంది కదా. అది నాకిష్టంలేదు.
**Vennela:** అయితే ఏం చేయబోతున్నావు?
**Purnima:** ఇది మా mechanic తో అమ్మించి కొత్తది వేరే కొందామనుకుంటున్నాను.
**Vennela:** అదే మెరుగు.

**ANSWER**

**Vennela:** You were saying your fridge was out of order. Did you get/ have it repaired?
**Purnima:** I had it repaired last saturday but it has gone out of order again.
**Vennela:** I know a good mechanic. This time you get/ have it repaired by him.
**Purnima:** My husband has told me of an exchange offer. I want to have this one exchanged for a new one.
**Vennela:** Go ahead then.
**Purnima:** But we get the same brand again. I don't like it.
**Vennela:** So what are you going to do?
**Purnima:** I want to have/ get it sold by our mechanic and buy a new one.
**Vennela:** That's better.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# He will not have me doing any job

**Bhaskar:** Why are you smiling?
(ఎందుకు నవ్వుతున్నావు? )

**Himakar:** We had our uncle here yesterday. All the time he was here he had us in stitches of laughter. He has many jokes.
(నిన్న మామయ్య వచ్చాడు. ఉన్నంతసేపూ కడుపుబ్బ నవ్విస్తూనే ఉన్నాడు. ఆయన చాలా జోక్స్ వేస్తాడు)

stitches of laughter = ఆపుకోలేని నవ్వు.

**Bhaskar:** But why are you laughing now?
(అయితే ఇప్పుడెందుకు నవ్వుతున్నావు? )

**Himakar:** I remembered one of his jokes and that forced me to laugh.
(ఆయన జోక్స్‌లో ఒకటి గుర్తుకొచ్చింది. అది నాకు నవ్వు తెప్పించింది)

**Bhaskar:** We wish to have around people making enjoy fun, don't we?
(సరదా కలిగించే మనుషులు మన పక్కన ఉండాలని కోరుకుంటాం కదా? )

**Himakar:** We do, certainly.
(అవును, కచ్చితంగా)

**Bhaskar:** He was here yesterday, wasn't he?
(నిన్న కదా ఆయనిక్కడుంది? )

**Himakar:** He was on his way to Ooty. He would have me accompany him, but dad didn't like to have me wasting my time when the exams are so close.
(ఆయన ఊటీ వెళుతున్నాడు. నేనూ తనతో వెళ్లాలని ఆయన కోరిక. కానీ మా నాన్న నా పరీక్షలు దగ్గర పడుతుండటంతో, నేను time waste చేయడానికి ఆయన ఒప్పుకోలేదు)

**Bhaskar:** My dad's the opposite. He would have me going around places, exams or no exams. Not that he would have me neglecting my studies, but he leaves it to me.
(మా నాన్న దీనికి వ్యతిరేకం. నేనూళ్లు తిరగడం ఆయనకిష్టమే, పరీక్షలున్నా, లేకున్నా. అయితే నేను చదువు ఉపేక్షిస్తే ఆయన ఊరుకుంటాడని కాదు, కానీ నాకే వదిలేస్తారు)

**Himakar:** You're lucky there. My mom doesn't have me leave my books either.
(ఆ విషయంలో నువ్వదృష్టవంతుడివి. మా అమ్మ కూడా నన్ను పుస్తకాలొదలనివ్వదు.)

**Bhaskar:** But my trouble is of a different kind. My dad has me doing all kinds of jobs at home. That's the only problem.
(అయితే నా బాధ వేరేరకం. మా నాన్న నాతో అన్నిరకాల పనులు చేయిస్తాడు. అదొక్కటే సమస్య.)

**Himakar:** Even there my dad's different. He will not have me doing any job. He does all jobs by himself. OK. I must be going. Bye.
(అక్కడ కూడా మా నాన్న తేడానే. అన్ని పనులూ ఆయనే చేసుకుంటాడు. సరే. నే వెళ్లాలి. Bye)

☆ ☆ ☆ ☆

పై conversation లో have ఉపయోగం చూడండి. Have కు ఉన్న చాలా ఉపయోగాల్లో ఇదొకటి. ఇది Spoken English లో సర్వసాధారణం. ఈ రకమైన ఉపయోగానికి చాలా ప్రాముఖ్యముంది. మీ conversation లో practice చేయండి.




Have/ has (someone) do (ing) something - ఇదీ మనం తెలుసుకోబోతున్న have ఉపయోగం. ఇలా వాడినప్పుడు అర్థం ఒకరిచే ఒక పని చేయించుకోవటం - నచ్చజెప్పో, ఆజ్ఞగానో.

**a)** Hari's wife has him do/ doing all the work at home = హరి భార్య అతడితో అన్ని పనులూ చేయించుకుంటుంది.

**b)** The teacher had the boys decorate the school for the school anniversary =
స్కూల్ వార్షికోత్సవానికి పిల్లలచే స్కూల్‌ను అలంకరించేట్లు చేశాడు.

**c)** The husband had the wife wash / washing and iron / ironing all his clothes =
ఆ భర్త భార్యచే అతడి బట్టలు ఉతికించి ఇస్త్రీ చేయించుకున్నాడు.

పై sentences అన్నింటిలో have someone do / doing something అంటే అర్థం - ఒకరి చేత ఒక పని చేయించుకోవటం - బతిమాలో, బెదిరించో, ఆజ్ఞాపించో. ఇది కూడా చూడండి.

**d)** She had me doing all kinds of jobs for her = నాచేత ఆమె అన్ని పనులూ చేయించుకుంది.

దీనికి వ్యతిరేకంగా మనం ఎవర్నన్నా ఏదైనా చేయనివ్వకపోతే అప్పుడు-

**Rao:** At this hour of the night? No. I can't have you going out alone.
ఇంతరాత్రప్పుడా? నేను నిన్ను ఈ సమయంలో ఒంటరిగా వెళ్లనివ్వను.




**c)** Parents can't have their children wasting time =
తల్లిదండ్రులు తమ పిల్లల్ని సమయం వృథా చేయనివ్వరు.

**d) Kumar:** Mom, can I have one more cup of coffee?
(నేనింకో కప్పు కాఫీ తాగనా? )

**Kusuma:** Not any more, son. I won't have you spoiling your health.
(ఇంకేం లేదు. నిన్ను ఆరోగ్యం పాడు చేసుకోనివ్వను.)

**e)** The teacher won't have her pupils playing in the rain =
టీచర్ విద్యార్థులను వర్షంలో ఆడుకోనివ్వదు.

ఇలా **a)** have someone do something (ఒకరిచేత ఓ పనిచేయించటం);

don't / doesn't / can't / won't have someone doing something = ఎవర్నైనా ఏదయినా పని చేయనివ్వకపోవడం.

**a)** She doesn't have her husband talking badly about her parents =
ఆమె తన తల్లిదండ్రులను గురించి తన భర్తను చెడుగా మాట్లాడనివ్వదసలు.

**b) Sita:** Dad, I want to do combined study with savithri at her home.
(నేను సావిత్రితో కలిసి చదువుకోవటానికి, తన ఇంటికి వెళ్లాలనుకుంటున్నాను.)

**b)** don't / doesn't / can't / won't / couldn't / wouldn't have someone do something (ఒకరిని ఒక పనిచేయనివ్వకపోవటం). Conversation లో చాలా తరచుగా వినిపిస్తుంది. కాబట్టి మీరు కూడా practice చేయండి.

**Now look at the following sentences from the conversation above:**

**1)** ... he had us laughing with his jokes = మమ్మల్ని ఆయన jokes తో నవ్వించేశాడు.

**2)** We wish to have around people making us enjoy fun =
సరదా కలిగించి నవ్వించేవాళ్లు మన పక్కన ఉండాలని కోరుకుంటాం.

**3)** He would have me accompany him to Ooty =
ఆయనతో నన్ను ఊటీకి తీసుకెళ్లాలని ఆయన కోరిక.

**4)** ... dad didn't like to have me wasting my time =
నాన్నకు నా చేత time waste చేయించటం ఇష్టం లేదు.

**5)** ... He would have me going around place నన్ను ఊళ్లు తిప్పాలంటే ఆయనకు ఇష్టం.

**6)** Not that he would have me neglecting my studies =
నన్ను చదువు ఉపేక్షించేలా చేయాలని కాదు.

**7)** My mom doesn't have me leave my books
మా అమ్మ నన్ను పుస్తకాలు వదలనివ్వదు.

**8)** My dad has me doing all work at home =
మా నాన్న నాచేత అన్ని పనులూ చేయిస్తాడు.

**9)** He will not have me doing any job =
ఆయన నాచేత ఏ పనీ చేయించనివ్వడు.

---

**ప్రశ్న:** *i) Sentence లో would have + P.P. వాడితే దాని అర్థం ఏమిటి? ఉదాహరణ ఇవ్వండి.*

*ii) 'Having rested, we continued our Journey'.*
*పై sentence perfect participle కు ఒక ఉదాహరణ. పై sentence ని 'After we had rested we continued our journey' గా రాయొచ్చు కదా! perfect participle ఎప్పుడు ఉపయోగిస్తారు? పై ఉదాహరణకు తెలుగు అర్థం ఏమిటి?*

*iii) కింది sentences అన్నీ మీరు చెప్పిన 'six forms of verb' ప్రకారం correct గానే ఉన్నాయి. వీటి అర్థాలు, ఇవి ఏ tense లో ఉన్నాయో తెలపండి.*

1. *They could be going there.*
2. *They would be going there.*
3. *They should have been going.*
4. *They would have been going.*
5. *They can have done it.*
6. *They may have done it.*

**– ఎస్. జాసన్, ఒంగోలు**

**జవాబు: i)** would have + pp అర్థం = గతంలో ఒక పని జరిగుండేదే కాని జరగలేదు అని.

**a)** Hari would have attended the meeting = హరి meeting కు వెళ్లుండేవాడే కాని వెళ్లలేదు.

**b)** The police would have caught the thief (if they had seen him)= పోలీసులు దొంగను పట్టుకోనుండేవాళ్లు. (వాళ్ళతన్ని చూసుంటే) - చూడలేదు, పట్టుకోలేదు.

**ii)** Having rested, we continued our journey- దీనర్థం- విశ్రాంతి తీసుకోవటంతో (అందువల్ల) మేం ప్రయాణం కొనసాగించాం - అని. విశ్రాంతి తీసుకున్న తర్వాత ప్రయాణం కొనసాగించాం అనటానికి, After having rested, we ... journey అంటేనే After we had rested, we continued our journey అనే అర్థం వస్తుంది. Having + pp కి, అందుచేత, అందువల్ల అనే అర్థం వస్తుంది.

**a)** Having seen it I believe it =
అది నేను చూసినందువల్ల (చూడటంతో) నమ్ముతున్నాను.

**b)** Having started it, he didn't like to stop it =
ప్రారంభించింతర్వాత (అందువల్ల), అతనది ఆపటానికిష్టపడలేదు.

**iii) 1)** They could be going there = వాళ్లక్కడికి ఇప్పుడు వెళ్తూండవచ్చు (ప్రస్తుతం సాధ్యమయ్యే విషయం (possibility in the present) ను తెలుపుతుంది. Present tense.
Even as we are planning to do it, they could be doing it = మనం అదిప్పుడు చేద్దాం అని అనుకుంటున్నప్పుడే వాళ్లది చేసేస్తూండవచ్చు

**2)** They would be going there = వాళ్లక్కడికి వెళ్లాలనుకుంటున్నారు (would be going = wish to be going) - Present tense - కాని ఇది అన్ని సందర్భాల్లో సరికాకపోవచ్చు

**3)** They should have been going = వాళ్లు వెళ్తూండాల్సిందిపుడు, కాని వెళ్లకుండా ఉన్నారు. సందర్భాన్నిబట్టి tense.

**4)** They would have been going = గతంలో వెళ్తూండేవాళ్లే కాని వెళ్లలేదు - Past tense.

**5)** They can have done it - వాళ్లు చేయగలిగినవాళ్లే - చేసుండొచ్చు/లేదు- దీని use కాస్త అస్పష్టం. Tense - Present tense.

**6)** They may have done it - చేసుండొచ్చు. చేయకపోయుండొచ్చు కూడా - సందేహం. Tense - Present tense.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# She got her dresses ironed

**Ranjan:** Dhanraj, why did you get your shirts stitched? You could have bought ready - to - wear ones.

(ఎందుకు నీ shirts కుట్టించావు? ready made shirts కొనుక్కోనుండొచ్చుగా)

ready - to - wear కొత్తమాట ready made కు

**Dhanraj:** Ready - to - wear ones don't suit our specifications. You've to buy them and get them altered again. I don't have the patience. Even if we get the shop man to alter it, it doesn't suit us exactly.

(Ready made బట్టలు నా కొలతలకు సరిపోవు. అది కొంటే మళ్లీ మనం దాన్ని shop వాడితో మార్పించుకోవాల్సి ఉంటుంది. అంత ఓపిక నాకు లేదు. Shop వాడిచేత మార్పించినా అదంత పూర్తిగా suit అవదు)

specifications = కావలసిన వివరాల ప్రకారం

**Ranjan:** That's an idea. In case he isn't able to help us let's get some other classmate to get interested in it.

(బాగానే ఉంది idea. ఒకవేళ అతను చేయలేకపోతే ఇంకెవరన్నా classmate ను ఆసక్తి పొందేట్లు చేద్దాం)

**Dhanraj:** Let's get some high school students to collect samples.

(samples సేకరించటానికి కొంతమంది high school విద్యార్థులను పెట్టుకుందాం)

**Ranjan:** My uncle is a teacher in a high school nearby. I will get him to give us a list of ten students.

(మా మామయ్య, దగ్గరేఉన్న high school లో teacher. ఆయన దగ్గరనుంచి ఓ పది మంది జాబితా తీసుకుందాం)

**Dhanraj:** Time we got busy working on the project.

(Project పని ఎప్పుడో ప్రారంభించుండాల్సింది)


M. SURESAN

అలా చేయించుకోవటం అనే భావంతో have వాడగలిగిన చోటల్లా get వాడవచ్చు

మనం కిందటి lesson లో have కు ఉన్న ఇంకో వాడకం కూడా చూశాం, ఈ ఉదాహరణల్లా...

1. She has even her elders doing all kinds of jobs for her = పెద్దవాళ్ల చేత కూడా ఆమె అన్ని రకాల పనులు చేయించుకుంటుంది.
2. The teacher had her pupils know that they cannot go until they finish the work = పని పూర్తయ్యేవరకు వెళ్లటానికి వీల్లేదని పిల్లలకు అర్థం అయ్యేట్లు చేసింది teacher.

ఇలాంటిచోట్ల కూడా have కు బదులు get వాడవచ్చు అయితే get వాడినప్పుడు sentence structure కొద్దిగా మారుతుంది.

**Ranjan:** Sometimes even our personal tailor can get the clothes spoilt.

(ఆ... కొన్నిసార్లు మన tailor కూడా సరిగా కుట్టకుండా పాడుచేయొచ్చు.)

**Dhanraj:** You can get your tailor to restitch them again.

(మన tailor చేత మళ్లీ కుట్టించుకోవచ్చు)

**Ranjan:** That's OK. But my preference is always for ready made ones.

(నాకు మాత్రం ready made అంటేనే ఇష్టం.)

**Dhanraj:** OK. By the way, we have an assignment to submit next week. I think we can get Neeraj to help us in the assignment. He is good at these things.

(అది సరే కానీ మనిద్దరం వచ్చేవారం assignment పూర్తిచేయాలి కదా. దీనిలో సహాయం చేయటానికి నీరజ్‌ను పిలుద్దామనుకుంటున్నా. అతనికిటువంటి విషయాలు బాగా తెలుసు.)

**Ranjan:** We shall start preparing the questionnaire this evening.

(ఈ సాయంత్రమే మనం ప్రశ్నావళి పూర్తి చేద్దాం.)

Questionnaire = క్వెశ్చనేఅ = సమాచార సేకరణకు తయారుచేసే ప్రశ్నల జాబితా

**Dhanraj:** OK. Let's meet at 4 in the evening.

**Ranjan:** Bye.

☆ ☆ ☆ ☆

ఒకరిచేత ఓ పని చేయించుకోవటానికి make, have ఎలా వాడతామో కిందటి lessons లో చూశాం కదా. అలాగే అదే భావం రావటానికి, get కూడా వాడవచ్చు.

1) He had his bike repaired = అతను bike repair చేయించుకున్నాడు = He got his bike repaired.
2) She had her dresses ironed = ఆమె తన బట్టలు ఇస్త్రీ చేయించుకుంది = She got her dresses ironed.
3) She had herself treated by Dr.Vaid = Dr.Vaid చేత ఆమె వైద్యం చేయించుకుంది = She got herself treated by Dr.Vaid.

She has even her elders doing all kinds of jobs. She gets even her elders to do all kinds of jobs for her.

గమనించండి:

... has even her elders doing = gets even her elders to do all kinds of ...

Sentence లో కూడా had కు బదులు got వాడవచ్చు కాని ఇలాంటి సందర్భాల్లో have వాడకం ఎక్కువ.

She had her pupils know ... = She got her pupils to know.

ఇప్పుడిది చూడండి:

My building is vacant. I want to get some bank to take it on long lease = నా భవనం ఖాళీగా ఉంది. దీర్ఘకాలిక అద్దెకు ఏదైనా bank తీసుకునేట్లు చేయాలని ఉంది.

ఇక్కడ get కు బదులు have వాడవచ్చు

I want to have some bank take it on long lease.

So, మనం అర్థం చేసుకోవాల్సింది:

Have someone to do something = Get some one to do something = ఒకరిచేత ఒక పనిచేయించటం.

a) If you want to sell the car, it is easy to get some one/ have someone to buy it.

If you want to sell the car, it is easy to have some one buying it.

ఇలా వాడవచ్చు get ను, have ను వాడే సందర్భాల్లో.

**Now look at the following sentences from the dialogue at the beginning of the lesson.**

1) You have to get them altered again (= You have to have them altered again)

Sentence structure:

have/ get (something) + done (past participle + by ... (అవసరం ఉంటే)

2) Even if we get the shopman to alter it, it doesn't suit us exactly = shop అతని చేత మార్పు చేయించుకున్నా కూడా, మనకు సరిగ్గా సరిపోవు.
3) Sometimes even our tailor can get our clothes spoilt = మన tailor కూడా సరిగా కుట్టలేకపోవచ్చు

(ఇక్కడ get బదులు have వాడవచ్చు)

4) We can get Neeraj to help us in the assignment = ఈ విషయంలో Neeraj చే సాయం చేయించుకుందాం.

(ఇక్కడ get బదులు have వాడి చూడండి)

5) We can get some other classmate to get interested in it = ఇంకే classmate నయినా ఆసక్తి తీసుకునేట్లు చేద్దాం.
6) Let us get some high school students to collect samples = వాళ్లచేత samples collect చేయిద్దాం.
7) I will get him to give us a list of ten students = ఆయన మనకో పదిమంది విద్యార్థుల జాబితా ఇచ్చేట్లు చేద్దాం.

ఈ sentences అన్నింటిలో, get బదులు have వాడవచ్చు అలా practice చేయండి.

## EXERCISE

**Pran:** చివరకు ఎవరిచేత ఆ మామిడిపండ్లు ఢిల్లీకి pack చేయించావు?

**Kiran:** ఆ wholesale కొట్లోనే ఓ కుర్రాడిచేత. వాడి చేతనే packing material- గంప, గడ్డి, పురికొస, గోనెముక్క తెప్పించుకున్నాను.

(గంప = basket, గడ్డి = straw, పురికొస = country twine, గోనెముక్క = gunny piece)

**Pran:** ఎప్పుడు book చేయించావు మీ అన్నయ్యకు?

**Kiran:** నిన్న. ఆయన ఇల్లు ఈ parcel office కు చాలా దూరం. ఎవరినైనా పంపి తెప్పించుకోమన్నా.

**Pran:** అయితే నీ సమస్య తీరిందన్నమాట.

**Kiran:** ఔను.

## ANSWER

**Pran:** Finally who did you get to pack the mangoes to Delhi?

**Kiran:** I got one of the boys in the wholesale shop to pack it; I got him to get too, the packing material, the basket, the straw, the country twine, and the piece of gunny.

**Pran:** When did you get it booked?

**Kiran:** Yesterday. His home is a long way off from the parcel office. I asked him to get someone to get it for him.

**Pran:** So your problem is solved.

**Kiran:** Yes.

**ప్రశ్న:**

*To be ఎలా వాడతారు? As, like లా (వలె, మాదిరిగా) అర్థం వస్తుందా? To be అంటే అర్థం ఏమిటి? To be ఉపయోగాన్ని ఉదాహరణలతో వివరించగలరు.*

*That man appears to be a thief.*
*That man appears like a thief.*
*ఈ రెండు వాక్యాల్లో to be, like ల అర్థం ఏమిటి?*
*It is said that he is honest.*
*He is said to be honest.*
*It is said that he was honest.*
*He is said to have been honest.*
*She is reputed to be a good teacher.*
*That liar deserves to be thrashed.*
*I should like to be a doctor.*
*He dares to do what he thinks to be right.*
*How is its saltiness to be restored.*

*– ఎస్.గణేష్, విజయనగరం.*



**జవాబు:**

To be అనేది infinitive మూల రూపం. To be వాడకం వాక్యం సందర్భాన్నిబట్టి ఉంటుంది. 'గా' అనే అర్థం వస్తుంది. He appears to be a thief= అతనో దొంగగా కనిపిస్తున్నాడు. He appears like a thief అనే sentence correct కాదు. appear లోనే 'లా' (వలె) అన్న అర్థం ఉంది కాబట్టి. He appears like a thief కన్నా, He appears to be a thief correct. అయితే, సందర్భాన్నిబట్టి, It appears like that అని అంటుంటాం (అదలా కనిపిస్తోంది అన్న అర్థంతో).

To be అంటే ఉండటం. Like అంటే వలె/ లాగా. కాబట్టి ఇలాంటి వాక్యాల్లో To be కి like కు సంబంధం లేదు. ఒకటికావు. To be అంటే ఉండటం అనిగానీ, 'గా' అనిగానీ అర్థం.

ఒక్కోసారి 'to be' బదులు 'as' రావచ్చు- 'గా' అనే అర్థంతో. మీరుదహరించిన sentences అన్నింటిలో to be కి అదే అర్థం వస్తుంది. (ఈ sentences లో it is said ... కు అర్థం- మామూలు తెలుగులో అంటారు/ అంటున్నారు అని. eg: It is said that he is honest = అతను నిజాయతీపరుడని అంటారు. ఇలాంటిచోట్ల It is said, people say కి passive voice).

ఇది గమనించండి.

It is said that he is honest = He is said to be honest (is = to be)

It is said that he was honest = He is said to have been honest (was = to have been - గతం - నిజాయతీ కలవాడుగా ఉండేవాడని అంటారు.)

She is reputed to be a good teacher = మంచి teacher గా పేరుంది. (ఇప్పుడు)

That liar deserves to be thrashed = ... to be thrashed - passive (infinitive) = ఆ అబద్ధాలకోరు (కర్రతో) కొట్టబడాల్సిందే. మామూలు తెలుగులో ఆ అబద్ధాలకోరుకు దెబ్బలు పడాల్సిందే. (deserve - అర్హతగల - గౌరవానికైనా/ శిక్షకైనా)

I should like to be a doctor = నేను doctor గా ఉండటానికిష్టపడతాను.

What he thinks to be right = అతను సరి అనుకునేదిగా ఏదుందో (మామూలు తెలుగు = అతను సరైనది అనుకునేది) to be one of the best = (శ్రేష్ఠమైన వాటిలో ఒకటిగా/ ఒకడుగా

to be restored = పునరుద్ధరింపబడటం (passive)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Sharat:** Srinath has got a sleek new bike. Have you seen it?
(శ్రీనాథ్ మంచి కొత్త bike తెచ్చుకున్నాడు. నువ్వు చూశావా? )
(sleek= సన్నగా మెరుస్తున్న. ముఖ్యంగా cars కూ, bikes కూ, మనుషుల జుత్తుకూ- సన్నగా నిగనిగలాడుతు మెరుస్తూ ఉంటే- వాడతారు)

**Prabhat:** Hasn't he got one already? (Do) You mean he has got two bikes now?
(వాడికి ఇప్పటికే ఒకటుంది కదా? అంటే నువ్వనటం వాడికి రెండు bikes ఉన్నాయనా? )

**Sharat:** Use your brains, Prabhat. He had sold off the old one, and bought this one a few days ago.
(కాస్త ఆలోచించు. పాతదాన్ని అమ్మేసి, దీన్ని కొన్నిరోజుల కిందట కొన్నాడు)

**Prabhat:** You have got a bike and he has got a bike. Unfortunately I haven't got one.
(నీకూ bike ఉంది. వాడికీ bike ఉంది. దురదృష్టవశాత్తు, bike లేనిది నాకే.)

**Sharat:** Your dad has got enough money to buy you one. In fact, your dad and you have more money and more property than I or Srinath.
(నీకు bike కొనగలిగినంత డబ్బుంది మీ నాన్నకు. అసలు నాకంటే, శ్రీనాథ్ కంటే కూడా నీకూ, మీ నాన్నకూ ఎక్కువ డబ్బుంది.)

**Prabhat:** It's not the question of who has got more money than who. It's a question of how one spends it.
(ఇక్కడ ప్రశ్న ఎవరికంటే ఎవరికి డబ్బెక్కువ ఉందని కాదు. ఎలా ఖర్చు పెడతారనేదే ప్రశ్న.)

**Sharat:** I just want to know. Why doesn't your dad buy you a bike?
(అసలు మీ నాన్న నీకు bike ఎందుకు కొనడో తెలుసుకోవాలనుంది.)

**Prabhat:** Just for fear of accidents. He is convinced that a bike is not a safe thing on the road.
(Accidents భయంవల్ల. Bike అనేది road మీద అంత క్షేమకరం కాదని ఆయన నమ్మకం.)
He is convinced= ఆయన గట్టిగా నమ్ముతాడు.

**Sharat:** So how does he want you to go about?
(మరి నువ్వెలా తిరగాలనుకుంటున్నాడాయన? )

**Prabhat:** He has got the opinion that the city bus is the safest means of transport.
(City bus అన్నిట్లో ఉత్తమమైందని ఆయన అభిప్రాయం.)

**Sharat:** We have got bikes. Are we any the less safe than you?
(మాకు bikes ఉన్నాయి. క్షేమం విషయంలో మేమేమన్న నీకన్నా తక్కువగా ఉన్నామా? )

**Prabhat:** Well, that's the opinion he has got. He doesn't want to have moments of anxiety when I am out on the bike.
(సరే అది ఆయనకున్న అభిప్రాయం. నేను bike మీద బయటతిరిగేటప్పుడు ఆందోళన పడకుండా ఉండాలనేది ఆయన కోరిక.)
Anxiety= ఆందోళన

**Sharat:** Have a car, then. That is safer than a bike.
(అయితే car కొనుక్కో. అది bike కన్నా క్షేమకరం కదా.)

**Prabhat:** That's exactly what he is going to do; it is not for my only use, though.
(అదే ఆయన అనుకునేది కూడా. అయితే పూర్తిగా నా ఉపయోగానికి మాత్రమే కాదనుకో)

**Sharat:** How soon is it going to be?
(ఎంత త్వరలో car నీకొస్తుంది? )

**Prabhat:** Quite soon.
(త్వరలోనే)

ఇంతవరకూ మనం, కలిగి ఉండటం అనే అర్థంతో 'have' ఉపయోగం చూశాం కదా? Have కు ఉండే అర్థాలన్నింటితో 'have got' వాడవచ్చు. ముఖ్యంగా British spoken English లో have got వాడుక చాలా ఎక్కువ. గమనించాల్సిందేమిటంటే, have కూ, have got కూ అర్థంలో, ఉపయోగంలో తేడా లేకపోవడం.







3. Your dad has got enough money to buy you one = In fact, you and your dad have got more money than I or Srinath (has got)- ఇక్కడ have got/ has got ఉన్నచోటల్లా have/ has వాడవచ్చు
4. ... who has got more money than who? = who has more money than who?
5. He has got the opinion = He has the opinion.
6. We have got bikes = We have bikes

ఇందాక చెప్పినట్లు, British English లో ఎక్కువ వాడతారు. have got/ has got/ had got, etc. వీటిని not తో వాడినప్పుడు మరికొంత choice వస్తుంది.

**a)** వాడికి తగినంత డబ్బులేదు =
He hasn't (has not) enough money =

Not తో ముఖ్యంగా question లో Don't have/ doesn't have/ Didn't have ... వాడుక ఎక్కువ,Haven't you?/ Hasn't he/ she?/ Hadn't ...? కన్నా. Don't ... have?/ Doesn't ... have?/ Didn't ... have ..? అనేది ఎక్కువగా American English లో వినిపిస్తుంది.

**Amar:** I have got to attend to some work at home. Let me go.
(ఇంటి దగ్గర పనొకటి చేయాలి నేను. నన్ను వెళ్లనీ.)

**Kumar:** What have you got to do now?
(నీవిప్పుడేం చేయాలి? )

**Amar:** I have got to get the carpenter to repair our dining table and fix one of the window glasses.
(మా dining table repair చేయడానికి, కిటికీ glass బిగించడానికి వడ్రంగిని తెచ్చుకోవాలి)

# Haven't you those books?

**a)** I have those books (with me)=
నా దగ్గర ఆ పుస్తకాలున్నాయి=
I have got those books.

**b)** Have you any money that you can lend me? =
నాకు అప్పివ్వటానికి నీ దగ్గర డబ్బేమన్నా ఉందా? =
Have you got any money that you can lend me?

**c)** Don't you have the manners to respect elders? =
పెద్దలను గౌరవించే సత్ప్రవర్తనైనా నీకు లేదా? =
Haven't you/ Haven't you got the manners to respect elders?

చూశారు కదా- have వాడినచోటల్లా have got వాడవచ్చు

**d)** He hasn't enough money to buy a car=
కారు కొనేందుకు చాలినంత డబ్బు అతని దగ్గర లేదు
He has not got enough money to buy a car.

**e)** Hasn't he better clothes than those?
= వాటికన్నా మంచి బట్టలు లేవా అతనికి? =
Hasn't he got better clothes than those?

Have got/ has got/ had got, etc., have/ has/ had కు బదులుగా వాడవచ్చు

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson:**

వాటన్నింటిలో, have got/ has got బదులు have/ has వాడొచ్చు

1. Hasn't he got one already? (Do) you mean he has got two bikes now? = Hasn't he (Doesn't he have) one already? (Do) you mean that he has two bikes now? =
ఒకటుంది కదా ఇప్పటికే అతనికి అంటే నీ అర్థం, అతను రెండు bikes వాడుతున్నాడనా?
2. You have got a bike and he has got a bike. Unfortunately I haven't got one = You have a bike and he has a bike. Unfortunately I haven't one.

He doesn't have enough money = He hasn't got enough money


M. SURESAN

**b)** నీ దగ్గర ఆ పుస్తకాలు లేవా? =
Haven't you those books? =
Don't you have those books? =
Haven't you got those books?

**c)** Hasn't he a brother? =
అతడికి తోబుట్టువు లేడా? =
Doesn't he have a brother? =
Hasn't he got a brother?

అయితే modern, present day English లో Don't have/ Doesn't have form ఎక్కువ వినిపిస్తుంది. అయితే Have you?/ has he? form కాస్త brief గా, simple గా ఉంటుంది.

**a)** Don't you have any work now? =
నీకిప్పుడేం పనిలేదా? =
Haven't you any work now?/
Haven't you got any work now?

**b)** Doesn't he have a car? =
అతడికి car లేదా? =
Hasn't he a car?/
Hasn't he got a car now?

Not తో కూడిన questions లో Don't ... have/ doesn't ... have, didn't ... have అనే expressions ఎక్కువగా వినిపిస్తాయి, ముఖ్యంగా spoken form లో. అతనికి గతంలో కారు లేదా? అనే ప్రశ్నకు, English లో Hadn't he a car? అనే ప్రశ్న కన్నా, Didn't he have a car అనేదే ఎక్కువ వాడుకలో ఉంది. Hadn't he a car? చాలా అరుదు.

కాబట్టి మనం అర్థం చేసుకున్న విషయం:
కలిగి ఉండటం అనే అర్థంతో-

1) Have = have got; has = has got; had = had got, etc.

**Kumar:** I have got to go home too.
(నేనూ ఇంటికెళ్లాలి)

**Amar:** My dad has got to invite my recently married sister and brother-in-law to the Deepavali festival. That's why he is getting the house done up.
(దీపావళికి ఈ మధ్యనే పెళ్లైన మా sister ను, బావనూ ఆహ్వానించాలి మా నాన్న. అందుకనే ఇళ్లంతా సిద్ధం చేస్తున్నారు)

**Kumar:** You were telling me your brother-in-law had got to attend some training programme and wouldn't be able to make it to the Deepavali.
(నువ్వంటున్నావు గదా, మీ బావగారేదో training programme కు వెళ్లాలనీ, దీపావళికి రాలేరనీ? )

**Amar:** But he is coming. The training programme has been cancelled.
(ఆయనొస్తున్నాడు. Training programme cancel అయింది)

మనకు తెలుసు: Have to/ has to + 1st Regular doing word (Have to do, has to do, has to work, etc) అంటే ఓ ఆజ్ఞకు లోబడో, అవసరానికో, విధిగానో మనం చేయాల్సిన విషయాలు చెప్తాయని.

**a)** I have to go now =
నేనిప్పుడు వెళ్లాలి.

**b)** He has to pay Rs.5000/- =
అతను 5000 రూపాయలు చెల్లించాలి.

**c)** She had to join duty that day itself =
ఆరోజే ఆమె duty లో చేరాల్సి వచ్చింది.

ఇలాంటిచోట్ల కూడా, అంటే have to + 1st Regular doing word/ has to + 1st Regular doing word/ had to + 1st Regular doing word వాడే చోట్లలో కూడా, Have got/ has got/ had got + 1 Regular doing word వాడవచ్చు పై సంభాషణలో have got/ has got అలాగే వాడాం చూడండి.

**Exercise:** పై సంభాషణలో have got/ has got కు బదులు, have/ has వాడి practice చేయండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Ramnath:** Have you got to go now? I was hopeful You'd stay for at least a day more?
(నువ్వు వెళ్లాల్సిందేనా? ఇంకో రోజైనా ఉంటావని అనుకున్నా)

**Premnath:** I'm sorry I've got to go. Too many things to attend to, at home.
(సారీ. నేవెళ్లాలి తప్పదు. ఇంట్లో చూసుకోవాల్సిన పనులు చాలానే ఉన్నాయి) **ఇది గమనించండి.**

**a)** attend = హాజరవడం
- class, function, meeting లాంటివి.

He attended class yesterday

**b)** attend to: ఓ పని/ బాధ్యత చూసుకోవటం.

Dad is busy attending to the repairs of the house =
(ఇంటి రిపేరు పనులతో నాన్న తీరికలేకుండా ఉన్నాడు.)

She is attending to the arrangements for the meeting =




week.
(అక్కర్లేదు. ఈ వారాంతానికి అక్కడి నుంచి వచ్చేయవచ్చు)

**Premnath:** Has she got to take anything like a test at the end of the fortnight long training?
(ఆమె ఈ పక్షం/ 15 రోజుల శిక్షణ తర్వాత పరీక్షలాంటిదేమన్నా రాయాలా?)

**Ramnath:** No, she doesn't have to.
(అక్కర్లేదు)

**Premnath:** Had she to attend the same kind of training programme last year .
(కిందటి ఏడాది కూడా తను ఇలాంటి శిక్షణకు వెళ్లిందా?)

**Ramnath:** No, she didn't have to, as she hadn't had two years of service by then.

**Premnath:** When has she got to attend the same kind of programme next?
(మళ్లీ ఇలాంటి ప్రోగ్రామ్‌కు ఎప్పుడు వెళ్లాలి)

**Ramnath:** She needn't for another two years.
(ఇంకో రెండేళ్లపాటు అవసరం లేదు)

**Premnath:** Has she to pay for her travel and other expenses?




# I haven't got a cell

(మీటింగ్‌కు కావాల్సిన ఏర్పాట్లన్నీ ఆమె చూస్తోంది.)

**c)** attend on = రోగులకు/ అతిథులకు సపర్యలు చేయటం.

When I was ill, my elder sister attend on me =
(నాకు ఆరోగ్యం బాగాలేనప్పుడు మాఅక్క సపర్యలు చేసింది)

If you go away now, who will attend on the guests.
(నువ్వెళ్లిపోతే అతిథులను ఎవరు చూసుకుంటారు?)
(అతిథులకు సపర్యలు ఎవరు చేస్తారు?)

**Ramnath:** Aren't there anyone else to take care of them?
(ఆ పనులు చూసుకునేందుకు ఇంక ఎవరూ లేరా?)

**Premnath:** If there were, I needn't be bothered at all.
(ఎవరన్నా ఉంటే, ఇంతబాధ పడాల్సిన అవసరం లేదు కదా!)

**Ramnath:** Have you got to start so early?
(ఇంత పెందలాడే బయల్దేరాలా?)

**Premnath:** No. I needn't (need not), but I have got to leave at least by the 12 noon train. Have you got anything I can carry to your sister.
(లేదు. కానీ కనీసం మధ్యాహ్నం 12 గంటల ట్రెయిన్ కన్నా వెళ్లాలి. మీ సిస్టర్‌కు నీవు ఏమైనా ఇస్తే తీసుకెళతా.)

**Ramnath:** No, you need not. I called her yesterday and spoke to her.
(అవసరంలేదు. నిన్ననే ఫోన్ చేశా)

**Premnath:** Has she got to stay there for long?
(అక్కడ ఆమె చాలారోజులుండాలా?)

**Ramnath:** No, she hasn't got to. She can leave there at the end of this

(ప్రయాణ, ఇతర ఖర్చులూ ఆమే పెట్టుకోవాలా?)

**Ramnath:** No, she needn't. The company bears all the expenses. OK. How about having something to eat before you leave?
(అక్కర్లేదు. సంస్థే ఆ వ్యయాన్ని భరిస్తుంది. వెళ్లేముందు ఏమన్నా తింటావా?)

**Premnath:** I've got to, because the food on the train doesn't suit me.
(ఏదో ఒకటి తినాలి. రైల్లో ఆహారం నాకు పడదు.)


M. SURESAN

* * *

గత lessonలో మనం have/ has/ had, etc కూ have got/ has got/ had got etc కూ ఉన్న సంబంధం గురించి తెలుసుకున్నాం కదా. మనం ముఖ్యంగా రెండు విషయాలు తెలుసుకున్నాం.

**a)** కలిగిఉండడం (possess/ own) అనే అర్థంతో have, has, had etc కూ have got, has got, had got, etc కూ తేడాలేదు. అయితే British spoken formలో have/ has/ had got form ఎక్కువగా వాడుకలో ఉంది.

i) He has a car = He has got a car.

ii) I have some money =
I have got some money.

iii) He had a big house =
He had got a big house.

(అయితే గతం విషయంలో మాత్రం, He had got a lot of property అనడం కంటే He had a lot of property అని ఎక్కువగా అంటారు. (British usageలో కూడా)

ముఖ్యమైన విషయం: **Have got form- future లో రాదు.**

చూడండి.

He will have a lot of money soon.
(త్వరలో అతడికి చాలా డబ్బు వస్తుంది/ అతడి దగ్గర చాలా డబ్బు ఉంటుంది.)

ఇక్కడ will have కు బదులు will have got వాడితే త్వరలో అతడు చాలా డబ్బు పొంది ఉంటాడు అనే విపరీతార్థం వస్తుంది కదా. అందుకని future ను ప్రస్తావించేటప్పుడు, have కు బదులు have got రాదు. (British usageలో కూడా)

**b)** have to/ has to/ had to + 1st Regular Doing Word (have to go, has to stay, had to work)

- ఇవి ఒకరి ఆజ్ఞానుసారమో, అవసరానికో, విధిగానో మనం చేయాల్సిన విషయాలను తెలుపుతాయి.

ఇలాంటి చోట్ల కూడా have to/ has to/ had to + 1st regular doing word కు బదులుగా, అదే అర్థంలో have got to/ has got to/ had got to +1st regular doing word (have got to pay = చెల్లించాలి = has got to pay. Had got to pay = చెల్లించాల్సి వచ్చింది. [past]) అయితే had got to + 1st RDW (Regular Doing Word) అంత common కాదు.

ఇవీ మనం కిందటి lessonలో చూసిన విషయాలు.

**I.** have/ has/ had, etc; కలిగిఉండడం అనే భావంతో వాడినప్పుడు, దానికి opposite చూద్దాం.

**a)** I have (= have got) a cell =
(నాకు సెల్‌ఫోన్ ఉంది.)

I haven't a cell/ I haven't got a cell/ I don't have a cell
(= నాకు సెల్ లేదు).

I have no cell, అనడం, spoken form లో చాలా అరుదు.

**b)** He has a lot of property =
He has got a lot of property
(అతడికి చాలా ఆస్తి ఉంది.)

He hasn't any property/ He doesn't have any property =
(అతడికేం ఆస్తి లేదు.)

He has no property అని అరుదుగా అంటాం.

**C)** She had a good score -
ఆమెకు మంచి స్కోర్ వచ్చింది.

She had got a good score.

She hadn't a good score =

She didn't have a good score.

**II.** ఒకరి ఆజ్ఞానుసారం లేదా అవసరంవల్ల లేదా విధిగానో మనం ఏదైనా చేయాల్సివస్తే అప్పుడు కూడా have to/ has to/ had to + 1st Regular Doing Word వాడతాం.

**a)** I have to go now - (నేనిప్పుడు వెళ్లాలి) =
I have got go now.

**b)** The students have to take the exam.
(విద్యార్థులు పరీక్షలు రాయాల్సిందే)
The students have got to take the exams.

**c)** Suman had to submit the exercise yesterday
(సుమన్ నిన్న ఎక్సర్‌సైజ్ submit చేయాల్సి వచ్చింది)

Suman had got to submit the exercise yesterday.(Had got to + 1st. RDW కాస్త అరుదు.)

ఒక పని చేయాలి అనేందుకు వ్యతిరేకం, ఆ పని చేయనక్కరలేదు. అని కదా? అంటే English లో ఎక్కువగా need not = need n't వస్తుంది. లేదంటే don't have to/ doesn't have to/ didn't have to + 1st. RDW వాడవచ్చు

**Look at the following sentences at the beginning of the lesson.**

**Ramnath:** Have you got to start so early?
(= Have you to start so early?)

**Premnath:** No, I needn't (I need not)

చూశారు కదా! ఇక్కడ have to + 1st RDW (బయల్దేరావా?) అనేదానికి వ్యతిరేకార్థంతో needn't (need not) వస్తోంది.

**b) Premnath:** Have you got any thing I can carry to your sister?

**Ramnath:** No, you need not

Have to/ has to/ had to +1st Regular Doing Word కు Opposite need not మాత్రమే కాకుండా, don't have to/ don't need to, doesn't have to/ /doesn't need to, didn't have to/didn't need to + 1st Regular Doing Word కూడా వస్తాయి.

**a)** I have (got) to do it at once
I need n't/ I don't have to/ I don't need to do it at once.

**b)** Kusuma has (got) to send it today.
Kusuma needn't/ doesn't have to/doesn't need to send it today.

**c)** Pramila had (got) to go yesterday.
Pramila needn't go/didn't have to go/ didn't need to go yesterday.

**EXERCISE**

Lesson ప్రారంభంలో Conversation లోని have (got) to/ has (got)to/ had (got) to expressions కు అన్ని రకాల Opposites practice చేయండి.

ప్రశ్న: నాకు బస్సు ప్రయాణం పడదు.
మాకు నెలకు అరవై యూనిట్లు కరెంటు కాలుతుంది.
పై రెండు వాక్యాలను ఇంగ్లిష్ లో ఎలా చెబుతారు?
– షేక్ జిలానీ, కాకినాడ



జవాబు: Regular Bus journey doesn't agree with me .
We consume about sixty units of current (or)
60 units of current is our monthly consumption.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# I've had enough

**Chandana:** Hi Vandana, you appear to have all leisure in the world. I expected to see you busy preparing for the contest tomorrow? Haven't you got to prepare for the debate tomorrow?

(ఏంటి, చాలా విశ్రాంతిగా ఉన్నట్లు కనిపిస్తున్నావు? రేపటి పోటీకి తయారవుతూ తీరిక లేకుండా ఉంటావని అనుకున్నా. రేపు నీవు డిబేట్‌కు తయారవ్వాలి కదా?

All the leisure/ all the time in the world = చాలా తీరిక/ సమయం ఉండటం.

They have all the time in the world to go for a second run = రెండో పరుగు తీసేందుకు కావలసినంత సమయం ఉంది.

Debate = డిబేట్ (బెయ్ నొక్కి పలుకుతాం)

**Vandana:** I've had enough of it. I'm bored. I'm prepared well enough, I suppose. What about you?

(చాలు బాబూ. విసుగేస్తుంది. బాగానే తయారయ్యానని అనుకుంటున్నా. నీ సంగతేమిటి? )

I've had enough = ఇక చాలు. మనకు చాలు, ఇక అక్కర్లేదు అనిపించినపుడు, I've had enough అంటాం కాస్త విసుగుతో.

**Chandana:** I haven't got to, either. They shouldn't have given the topic so much in advance.

(నేను తయారుకానక్కర్లేదు. వాళ్ళు చర్చాంశం అంత ముందుగా ఇచ్చుండాల్సింది కాదు.)

**Vandana:** Yea. They shouldn't have. They don't seem to have got much experience of conducting debate contests.

(అవును. అంత ముందు ప్రకటించి ఉండాల్సింది కాదు. వక్తృత్వ పోటీలు (Debate contests) నిర్వహించటంలో వాళ్ళకంత అనుభవం ఉన్నట్లు లేదు.)

**Chandana:** Haven't they got to consult people who know? So what's the big idea in announcing the topic so early?

(తెలిసినవాళ్ళను సంప్రదించాలి మరి. అంత ముందస్తుగా topic ప్రకటించటంలో వాళ్ళ ఉద్దేశం ఏమిటి? )

**Vandana:** Participants will mug up their speech at the contest.

(పాల్గొనేవాళ్ళు వాళ్ళ ఉపన్యాసాల్ని బట్టీపట్టేస్తారు.)

mug up= బట్టీ పట్టేయటం.

mug కు ఇంకో అర్థం తెలుసుకదా, handle ఉండే గ్లాసులు. Mug అంటే మూడో అర్థం, నోట్లో గుడ్డలు కుక్కడం.

**Chandana:** They have got plenty of time to get the help of others too.

(ఇతరుల సహాయం పొందేందుకు కూడా బాగా సమయం ఉంటుంది)

**Vandana:** Haven't we got to attend the special class this afternoon?

(ఇవ్వాళ మధ్యాహ్నం మనం స్పెషల్ క్లాసుకు వెళ్లాలి కదా? )

**Chandana:** I have got to, but you needn't. You have got an 'A' grade, so you don't have to.

(నేను వెళ్లాలి, నువ్వక్కర్లేదు. నీకు A grade వచ్చింది. అందుకని నువ్వు రానవసరం లేదు)

**Vandana:** Thank God. Thank you for the news.

(హమ్మ, బతికిపోయాను.)

**Chandana:** You're welcome.

మనం 'have (has)' గురించి ఇదివరకటి lessons లో చాలా విషయాలే తెలుసుకున్నాం గదా. Have (has) కు spoken English లో చాలా ప్రాముఖ్యముంది. చాలా తరచుగా వాడతారు. అన్ని వాడకాలూ తెలుసుకుంటే, conversation లో 30% చాలా easy అయిపోతుంది. అందుకని బాగా practice చేయటం అవసరం. Have (has) గురించి మనకిప్పటివరకు తెలిసిన విషయాలు:

1) I, we, you and they తో 'have' వాడతాం. He, she and it తో అయితే has వాడతాం.

2) have/ has కు అర్థం- కలిగి ఉండటం. మామూలు తెలుగులో అయితే ఒకరికి ఏదయినా (వస్తువు, గుణం, వైఖరి లాంటివి) ఉండటం.

a) I have a car= నాకు car ఉంది. (మామూలు తెలుగులో నేను car కలిగి ఉన్నాను అనం కదా)

b) She has beautiful dark hair=
ఆమెకు అందమైన నల్లని కురులున్నాయి.

ఇలా ఒకరికి ఒక వస్తువు/ గుణం/ భావం etc ఉండటం అనే అర్థంతో British English లో have/ has కు సమానంగా have got/ has got వాడతారు.

a) My cousins have a lot of property=
My cousins have got a lot of property

b) Sumithra has an excellent voice=
Sumithra has got an excellent voice.

ఈ అర్థం (కలిగి ఉండటం)తో am having/ is having/ are having forms వాడం, ఒక్క bath విషయంలో తప్ప.

3) have/ has= (ఆహార పదార్థం) తీసుకోవటం = తినటం/ తాగటం

a) They have coffee in the morning=
వాళ్లు పొద్దున coffee తీసుకుంటారు (తాగుతారు)

b) Sanjana has tea in the afternoon =
సంజన మధ్యాహ్నం tea తీసుకుంటుంది.(తాగుతుంది)

ఈ అర్థం (తీసుకోవటం = తినడం/ తాగడం)తో am having/ is having/ are having వాడతాం.

I am having tea now because coffee isn't available =
coffee లేదు కాబట్టి tea తాగుతున్నా. తినడం/ తాగడం అనే అర్థంతో have got/ has got రాదు.

[have + past participle/ has + past participle వీటికీ, పైన చెప్పిన have/ has, have got/ has got కూ ఏ సంబంధంలేదు. have + past participle, has + past participle - ఈ రెండూ present perfect tense forms.

1) కొంతకాలం కిందటినుంచి ఇప్పటివరకు జరిగిన పని.

2) గతంలో అయిపోయిన పని - Time చెప్పకుండా ఉన్నప్పుడు,

3) just, just now అనే మాటలతో వాడి, ఇప్పుడే అయిపోయిన పనులకు, వాడతాం- గుర్తుందికదా.]

4) have to + Ist Regular Doing Word/ has to + Ist Regular Doing Word (have to go, have to work, has to do, has to come) వీటిని must కు సమానంగా ఒక ఆజ్ఞనుగానీ, అవసరాన్ని గానీ విధిగా చేయాల్సిన పనినిగానీ తెలుపుతుందని కిందటి lessons లో చూశాం. ఇలాంటి అర్థంతో have to / has to + Ist Regular Doing Word బదులు, వాటితో సమానంగా have got to + Ist Regular Doing Word (RDW) / has got to + Ist RDW వాడవచ్చు.

a) I have to go now = నేనిప్పుడు వెళ్లాలి.
I have got to go now.

b) Sujani has to sing at the party tomorrow = రేపటి party లో Sujani పాడాలి= Sujani has got to sing at the party tomorrow.

Have to/ has to, have got to/ has got to వాడిన చోట్ల దాదాపు వాటికి సమానంగా must/ should కూడా వాడవచ్చని ఇంతకుముందు తెలుసుకొన్నాం.

ఓ ఆజ్ఞకు లోబడి/ అవసరాన్ని బట్టి/ విధిగా ఓ పనిచేయాల్సిఉంటే పై forms వాడతాం కదా. దీనికి opposite గా, 'చేయనవసరంలేదు' అనే అర్థంతో needn't (need not)/ don't need to/ haven't got to/ hasn't got to/ don't have to/ doesn't have to వాడతాం.

1) I have to meet the minister (కలుసుకోవాలి)

X I needn't meet the minister/ I don't need to meet the minister/ I haven't got to meet the minister/ I don't have to meet the minister (కలవనక్కరలేదు).


M. SURESAN

ఇవన్నీ కూడా వాడుకలో ఉన్నవే. ఏదైనా వాడవచ్చు British English లో haven't got to/ has n't got to ఎక్కువ వినపడుతుంది. Hadn't got to కాస్త అరుదు. దానిబదులు didn't need to/ didn't have to వాడతారు.

(ఇప్పటికి మీరు గమనించే ఉంటారు. Have to/ has to/ had to కు opposite గా సామాన్యంగా haven't to/ hasn't to/ hadn't to రాదు. I haven't to go/ she hasn't to come అనం.)

**Let us look at the following sentences from the conversation at the beginning of the lesson.**

1) Haven't you got to prepare for the debate tomorrow?

ఇక్కడ negative question లో have got వాడకం గమనించండి. ఈ question లో, నువ్వు రేపు debate కు తయారవ్వాల్సిన అవసరం లేదా? అనే అర్థంతో వాడారు.

దాదాపు ఇదే అర్థంతో mustn't (మస్‌న్ట్) కూడా వాడవచ్చు. shouldn't కూడా వాడతాం.

= Mustn't you prepare/ shouldn't you prepare for the debate? - దాదాపు అన్నీ ఒకటే.

2) I haven't got to (prepare for the debate) = (Debateకు) prepare కానవసరంలేదు = I needn't/ I don't need to/ I don't have to అని కూడా అనవచ్చు.

3) Haven't they got to consult people who know? =
తెలిసిన వాళ్లను సంప్రదించాలి కదా? (Question లో కూడా have got ఉపయోగిస్తున్నాం, ఇక్కడ) = Don't they have to అనవచ్చు.

4) Haven't we got to attend the special class? = Don't we have to attend ... ?

5) I have got to = I have to (I need to అని కూడా అనవచ్చు.)

ఇవీ negative questions లో have got to/ don't have to/ haven't you to ఉపయోగాలు.

ఒక్కోసారి have to బదులు need to కూడా వాడవచ్చు

a) నేనక్కడికి వెళ్ళాలా ఇప్పుడు? =
Have I go to there now?/ Do I have to go there now?/ Do I need to go there now?/ Need I go there now?/ Must I/ should I go there now?

b) వాళ్ళిక్కడికి రావాల్సిందేనా? = Have they to come here?/ Do they have to come here?/ Do they need to come here?/ Need they come here?

ఇవన్నీ మన conversation లో తరచూ practice చేస్తే, మనం daily life situation లో English ధారాళంగా మాట్లాడగలం.

**EXERCISE**

**Practise the following aloud in English.**

**Tarun:** నువ్విప్పుడింటికి వెళ్లనక్కరలేదా?
**Varun:** అక్కర్లేదు. నీతో నేను certificates attestation కు రావాలా?
**Tarun:** నీకూ అవసరమే కదా?
**Varun:** అవును. మరచేపోయా. నావి కూడా attest చేయించుకోవాల్సిన అవసరం ఉంది.
**Tarun:** మనం office లో పదింటికల్లా ఉండాలి కదా?
**Varun:** అవసరం లేదు. పదకొండింటికి వెళితే చాలు.

**ANSWER**

**Tarun:** Haven't you got to/ Don't you have to/ Don't you need to/ Needn't you/ Mustn't you/ shouldn't you go home now?
**Varun:** I needn't/ I don't need to/ I don't have to. Need I/ should I/ must I accompany you for attestation of certificates?
**Tarun:** Don't you need to/ Don't you have to get your certificates attested too. (You need to have your certificates attested too)
**Varun:** Oh. I forgot. I need to/ I have to get my certificates attested too (must/ should కూడా వాడండి)
**Tarun:** Haven't we to be/ don't we have to be/ Needn't we be/ Don't we need to be/ mustn't we be/ shouldn't we be at office by 10?
**Varun:** We needn't be / We don't need to be/ We don't have to be/ We haven't got to be. (simple గా Not necessary). It is enough if we are there by 11.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# No regrets, just getting on

**Loknath:** Hi Somnath, how are things going for you? How is your new job?
(హాయ్ సోమ్‌నాథ్, పరిస్థితులెలా ఉన్నాయి? నీ కొత్త ఉద్యోగం ఎలా ఉంది?)

**Somnath:** Happy to say I'm getting on fine. The job is good too. How about you?
(బాగానే ఉన్నానని చెప్పటానికి సంతోషిస్తున్నాను. ఉద్యోగం కూడా మంచిదే. నీ సంగతేంటి?)

**Loknath:** Thank you. I'm fine too. Getting on well. How are your relations with your colleagues and boss?
(నీ సహోద్యోగులతో, నీ boss తో సంబంధాలెలా ఉన్నాయి? / నీ సహోద్యోగులు నీతో ఎలా ఉన్నారు? నీ boss నీతో ఎలా ఉన్నాడు?)

**Somnath:** Too many colleagues and too short a time for me to say anything about them.
(టైమ్ తక్కువానూ, సహోద్యోగులెక్కువవటం వల్లనూ, ఆ విషయం గురించి నేనేం చెప్పలేను.)

Colleague - కలీగ్ - 'క' నొక్కిపలుకుతాం. అర్థం, సహోద్యోగి. కొందరు అనుకొనేటట్లు classmates కాదు.

**Loknath:** How is your boss towards you?
(నీ boss నీతో ఎలా ఉంటాడు)

**Somnath:** We get on excellently. He is not at all bossy.
(మేం చాలా సత్సంబంధాలతో ఉంటాం. అతనసలు bossy గా (పై అధికారిననే దర్పంతో) ఉండడు.)

**Loknath:** How is your new home? How is your co tenent towards you?
(నీ కొత్తిల్లు ఎలా ఉంది? మీతోపాటు అద్దెకున్నతను మీతో ఎలా ఉంటాడు?)

**Somnath:** We get on. We aren't that Chummy.
(ఏదో అలా ఉంటాం. అంత స్నేహమేం లేదు మాకు)

Chummy - ఛమి - దోస్తీగా ఉండటం - ప్రాణస్నేహం.

**Loknath:** Why so? (ఎందుకలా?)

**Somnath:** The trouble with him is he doesn't let me use my space.
(నా స్థలాన్ని నన్ను వాడుకోనివ్వడు. అదే వాడితో చిక్కు.)

**Loknath:** I don't get at you. What do you mean - he doesn't let you use your space?
(నాకర్థంకావటంలేదు. నీ స్థలాన్ని నిన్ను వాడనివ్వడనా అర్థం?)

**Somnath:** He dries his clothes in my yard. I fixed the clothes line and he hangs his clothes on to it. That obstructs me a lot.
(నా ఖాళీ స్థలంలో నేను దండెం కట్టుకుంటే, ఆయన తన బట్టలారేసుకుంటాడు. నాకది చాలా అడ్డంగా ఉంది.)

Clothes line = బట్టలారేసే దండెం

**Loknath:** You could tell him not to do it.
(అలా చెయ్యొద్దని నువ్వతడికి చెప్పొచ్చుగా)

**Somnath:** He has helped me some time ago. So I am a little hesitant about being frank with him.
(నాకతను కొంతకాలం కిందట సహాయం చేశాడు. అందుకని మనసులో ఉన్నది చెప్పటానికి తటపటాయిస్తున్నాను.)

hesitant = ఏదన్నా చెప్పటానికి / చేయటానికి ఊగిసలాడటం / తటపటాయించటం / పస్తాయించటం.

frank = మనసులో ఉన్నది కుండబద్దలు కొట్టినట్లు చెప్పటం.

**Loknath:** So are you going to let him trouble you?
(అయితే అతడు అలా నీకు అసౌకర్యం కలిగించేట్లే చేస్తావా?)

**Somnath:** I am trying to get the message across to him in some other way.
(ఏదో ఇంకో విధంగా ఆ విషయం అతనికి తెలిసేలా చేయాలని ప్రయత్నిస్తున్నా.)


M. SURESAN

**Loknath:** Best of luck then. It is 10.15. I must be getting along. See you.
(టైమ్ పదింబావయింది. నేవెళ్లాలి. మళ్లీ కలుద్దాం.)

**Somnath:** OK. Bye.

☯ ☯ ☯ ☯ ☯

Get ఉపయోగం, have తర్వాత చాలా ఎక్కువే. దీంతో expressions English లో సర్వసాధారణం. Get తో వచ్చే మాటలు మన సంభాషణలో తరచుగా వాడుతుంటాం. అందుకని వాటిని ఎంత బాగా practice చేస్తే అంతమంచిది.

**1. Get on** - ఈ expression చాలా అర్థాలతో వాడతాం. ముఖ్యంగా కుశల ప్రశ్నలకు సమాధానంగా ఎక్కువే వాడుతుంటాం.

**a) Kamal:** Hi Vimal, how are you?
**Vimal:** OK. Just getting on. Thank you.
(ఏదో అలా జరిగిపోతోంది)

**b)** He is getting on well.
అతను బాగానే/ కులాసాగానే ఉన్నాడు.

**c) Prem:** How are the newly married couple getting on?
(ఆ కొత్త దంపతులు ఒకరితో ఒకరెలా ఉన్నారు?)
**Syam:** Quite well, happily. (బాగానే ఉన్నారు)
(OR)
**Syam:** They unable to get on, unfortunately. Some differences. (It) appears they are headed for a divorce.
(దురదృష్టవశాత్తు వాళ్ల సంబంధాలు అంతబాగాలేవు/ ఒకరికొకరికి పొసగడంలేదు. ఏవో విభేదాలున్నాయి. విడాకులు తప్పనట్టుంది.

Headed for = ఒక దిశగా వెళ్లటం.
The train is headed for New Delhi =
ఆ train న్యూఢిల్లీ వైపెళుతోంది.

**d)** If you want to be happy, you have to get on with what you get =
నువ్వు సంతోషంగా ఉండాలంటే వచ్చిందాంతో తృప్తిపడాలి.

**2. Get along** = వెళ్లటం.

**a)** I must get along. I have work to do.
నేను వెళ్లాలి. నాకు పనుంది.

**b)** He gets along finely =
అతనికి బాగానే సాగిపోతోంది/ గడిచిపోతోంది.

**3. Get at** - ఈ మాట చాలా common. ఒక విషయం కానీ, ఒకరు చెప్పింది కానీ అర్థం చేసుకోవటం.

**a)** I am unable to get at what he says =
వాడు చెప్పింది నేనర్థం చేసుకోలేకుండా ఉన్నాను.

**b)** Kumar: I want to go immediately. Get the money fast. I can't wait. (Do you) get at me?
(నేను వెంటనే వెళ్లాలి. త్వరగా పట్రా. నేనాగలేను. అర్థమయ్యిందా?)

**4. Get across** = ఒక విషయాన్ని ఇతరులకు అర్థమయ్యేట్లు చెప్పటం.

**a) Prasad:** How is your new teacher?
(మీ కొత్త టీచర్ ఎలా ఉంది?)
**Prakash:** She is very good. She has a knack of getting her ideas across to the students.
(చాలా మంచి టీచర్. స్టూడెంట్స్ కు అర్థమయ్యేట్లు చెప్పే కిటుకుంది ఆమె దగ్గర.)
knack - నాక్ - 'నా' nap లో నాలా= కిటుకు/ పద్ధతి

**b)** A news paper ad is the best way to get across your message-
నీ సందేశాన్ని ఇతరులకు తెలిపేందుకు ఓ పత్రికా ప్రకటన మంచి మార్గం.

**c)** He is unable to get across to his ideas to people =
ప్రజలకు తన భావాలు తెలియ చెప్పలేకపోతున్నాడు.

**Look at the following sentences from the conversation at the beginning of the lesson:**

**1) a) Somnath:** Happy to say I'm getting on fine = (బాగానే ఉన్నానని చెప్పటానికి సంతోషిస్తున్నా./ నాకు బాగానే గడిచిపోతోంది అని చెప్పటానికి సంతోషిస్తున్నా.)

**b) Somnath:** We get on excellently= (మేం చాలా బాగా ఉంటాం ఒకరితో ఒకరం/ మా సంబంధాలు చాలా బాగా ఉన్నాయి.)

**c) Somnath:** We get on= (ఏదో జరిగి/ గడిచిపోతుంది)

**2) a) Loknath:** I don't get at you.= (నీవు చెప్పేది నాకర్థంకావటం లేదు.)

**3) Somnath:** I am trying to get the message across to him.
(నా భావాన్ని అతడికి త్వరలో అర్థమయ్యేట్లు చేయటానికి ప్రయత్నిస్తున్నా.)

Get across అంటే ఒక విషయాన్ని ఇంకొకరికి అర్థమయ్యేట్లు చేయటం కదా. ఇదే అర్థంతో put across కూడా వాడతాం.

**a)** I put the idea across to him that he and I go shares =
అతనూ, నేను భాగస్వాములుగా ఉండాలని అతడికి నేను చెప్పాను.

**b)** The teacher is good at putting things across to her pupils =
విద్యార్థులకు విషయం అర్థమయ్యేట్లు చెప్పటం ఆమెకు బాగా తెలుసు.

**5. Get through:** పరీక్షలో pass అవటం

**a)** He got through the exam with very good marks = మంచి మార్కులతో ఉత్తీర్ణుడయ్యాడు.

**b)** He got through with flying colours = చాలా గొప్పగా ఉత్తీర్ణుడయ్యాడతను. (మంచి మార్కులతో.)

with flying colours = చాలా గొప్పగా

ఇవి get తో వచ్చే కొన్ని expressions.

| EXERCISE | ANSWER |
|---|---|
| **Vamsi:** ఎలా ఉన్నావు, వెంకట్? | **Vamsi:** How are you, Venkat? |
| **Venkat:** చింతలేంలేవు. ఏదో అలా జరిగిపోతోంది. | **Venkat:** No regrets, just getting on. |
| **Vamsi:** ఏదో పరీక్ష రాశావు. పాస్ అయ్యావా? | **Vamsi:** You took some exam. Did you get through? |
| **Venkat:** చాలా గొప్పగ్రేడ్‌తో పాస్ తో అయ్యానని చెప్పటానికి సంతోషిస్తున్నా. | **Venkat:** I got through with flying colours. |
| **Vamsi:** నువ్వేమన్నా వాసును కలుసుకోబోతున్నావా? | **Vamsi:** Are you going to meet Vasu? |
| **Venkat:** లేదు. అతడికీ నాకూ పడదు. అతడంటేనాకేం దురభిప్రాయం లేదని ఎంతఅర్థం అయ్యేట్లు చెప్పటానికి ప్రయత్నించినా అతడికర్థంకావట్లేదు. | **Venkat:** No. We don't get on. However much I try to get across to him that I am not prejudiced he doesn't understand. |
| **Vamsi:** నేనతనికి చెప్తాను. | **Vamsi:** I'll explain to him |
| **Venkat:** Wish you good luck. | **Venkat:** Good luck to you. |

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# He got a break




**Anand:** Hi Achyut, since when did you start practising boxing?
(హాయ్ అచ్యుత్. బాక్సింగ్ ప్రాక్టీస్ చేయటం ఎప్పటి నుంచి మొదలెట్టావు?)

**Achyut:** I know you mean the black eye I have. (It has) nothing to do with boxing, my friend.
(నాకు తెలుసు. గాయం వల్ల నా కళ్ల చుట్టూ ఉన్న నల్లమచ్చను గురించి అంటున్నావని. కానీ బాక్సింగ్‌కూ, దానికీ ఏ సంబంధం లేదు.)

Black eye = గాయం వల్ల కళ్ల చుట్టూ ఏర్పడే నల్ల మచ్చ

Nothing to do with = సంబంధం లేదు.

I have nothing to do with this property
(నాకూ, ఈ ఆస్తికి ఎలాంటి సంబంధం లేదు.)

What has a Physics lecturer to do with zoology?
ఫిజిక్స్ లెక్చరర్‌కూ, జువాలజీ కీ సంబంధం ఏమిటి?

A mother has everything to do with her child's well being.
(బిడ్డ సంక్షేమం అంతా తల్లికి సంబంధించిందే.)
తెలుసు గదా: ఇక్కడ have/ has వాడిన చోటల్లా have got/ has got కూడా వాడవచ్చు.

**Anand:** Then how did you get the black eye?
(మరి కళ్ల చుట్టూ ఆ నలుపు ఏంటి?)

**Achyut:** Two days ago, during a power cut, searching for a candle in the dark, I hit the edge of the door. That's why I have the black eye.
(రెండురోజుల కింద కరెంట్ పోయినప్పుడు, కొవ్వొత్తి కోసం వెతుకుతుంటే తలుపు తగిలింది. అదే ఇది.)

**Anand:** It's still bad. You should have seen the doctor.
(అది ఇంకా తీవ్రంగానే ఉంది. డాక్టర్ దగ్గరకు వెళ్లలేదా?)

**Achyut:** I did, of course, but I'm afraid he didn't do a good job of it.
(వెళ్లాను. కానీ సరిగా వైద్యం చేయలేదను కుంటా.)

**Anand:** How much did he charge you?
(ఎంత తీసుకున్నాడు?)

**Achyut:** Rs 100/- per treatment and another fifty rupees for medicines in his own shop.
(వైద్యానికి వంద రూపాయలూ, ఆయన షాప్‌లోనే మందులకు మరోయాభై.)

**Anand:** I am sure he didn't get a good run for his money.
(కచ్చితంగా అతడు తీసుకున్న డబ్బుకు తగిన శ్రమపడలేదు.)

**Achyut:** you are right. It is the third day and there hasn't been any improvement.
(నువ్వు చెప్పింది కరెక్టే. ఇది మూడో రోజు. అయినా ఏం తగ్గలేదు.)

**Anand:** Why don't you get another check up?
(ఇంకోసారి చూపించుకోకూడదా?)

**Achyut:** I went to this doctor because he has a very good name. He got his break when he treated the train accident victims. Since then he has been well known as a trauma specialist.
(ఈ డాక్టర్‌కు మంచి పేరుండటం వల్ల ఆయన దగ్గరకెళ్లాను. రైలు ప్రమాదం బాధితులకు చికిత్స చేయటంతో ఆయన వృత్తి మంచి మలుపు తిరిగింది. అప్పటి నుంచి గాయాల వైద్య నిపుణుడుగా మంచి పేరొచ్చింది.)

Get a break = వృత్తిలో అనుకూలమైన మార్పు రావటం.

trauma (ట్రామా) -
1) తీవ్రమానసిక క్షోభ
Divorced Couples and orphaned Children undergo a lot of trauma.
(విడాకులు తీసుకున్న జంటలూ, అనాథలైన పిల్లలు తీవ్రమానసిక క్షోభ అనుభవిస్తారు.)
trauma కు రెండో అర్థం, డాక్టర్ల భాషలో తీవ్ర గాయాలు.
వాటిని వైద్యంచేసే దశలో trauma specialist = గాయాల వైద్యంలో నిపుణుడు.

**Anand:** I think he had a hand from his uncle in setting up his nursing home.
(ఈ నర్సింగ్ హోం స్థాపించడంలో ఆయన అంకుల్ సహాయం ఉందనుకుంటా.)

**Achyut:** Yes, he had.
(అవును)

*   *   *

English లో have/ has, get వాడకం చాలా సర్వసాధారణమనీ, వీటికి వివిధ అర్థాలున్నాయని కిందటి lesson లో గమనించాం. ఇంకా మనం తెలుసుకుంది, have get - ఈ రెంటినీ చాలా సందర్భాల్లో ఒకదాని బదులు ఇంకోటి వాడవచ్చని. ఈ విషయంలో కాస్త శ్రద్ధతో ఆ సందర్భాలేవో తెలుసుకుని వాటిని వాడటం practice చేస్తే daily life situations లో మనం మాట్లాడే English చాలా simple గా, natural గా ఉంటుంది.

**1) వాడుకలో get కున్న అర్థాలు:**

**a)** పొందటం: He got a prize in the race yesterday.
(నిన్నటి పందెంలో అతడు బహుమతి పొందాడు.)
మాములు తెలుగులో అతడికి బహుమతి వచ్చింది అని అంటాం.

**b)** అవటం: He gets busy from 10 onwards.
(10 నుంచి తీరికలేకుండా అయిపోతాడు.)

**c)** కారణమవటం = She got it done .
(అది ఆమే చేయించింది)

**2) Have కు వాడుకలో ఉన్న అర్థాలు:**

**a)** కలిగిఉండటం: She and her husband have a car each.
మామూలు తెలుగులో ఆమెకు, ఆమె భర్తకు చెరో car ఉంది - కలిగి ఉన్నారు - ఇది get (పొందటం) తర్వాతి ఫలితం.

**b)** కారణమవటం - She has her clothes ironed by him
(అతడితో ఇస్త్రీ చేయిస్తుంది/ చేయించుకుంటుంది)
ఈ lesson ప్రారంభంలో ఉన్న conversation లో get ఉన్న చోటల్లా have వాడవచ్చు అంతకుముందు ఇది చూడండి:

**1)** He got a fever last week = He had a fever.

**2)** She got a clean bill of health from the doctor.
(ఆమె డాక్టర్ వద్ద నుంచి సంపూర్ణ ఆరోగ్యవంతురాలనే మాట పొందింది.)
మామూలు తెలుగులో- ఆమెకు సంపూర్ణ ఆరోగ్యం ఉన్నట్లు డాక్టర్ తేల్చాడు.
She had a clean bill of health from the doctor.
A clean bill of health = సంపూర్ణ ఆరోగ్యం ఉన్నట్లు డాక్టర్ చెప్పడం.

**3)** He got a health check up.
(ఆరోగ్యం పరీక్షించుకున్నాడు- డాక్టర్‌దగ్గర.)
He had a health check up.

**4)** They got what they had wanted =
(వాళ్లక్కావలసింది వాళ్లకు వచ్చింది - వాళ్లు పొందారు.)
They had what they had wanted.
(వాళ్లక్కావల్సింది వాళ్లకుంది. అంటే అది వాళ్లుపొందిన తర్వాత)

**5)** I do all the work, and they get all the name.
(శ్రమనాది, పేరువాళ్లకు)
I do all the work and they have all the name.

**6)** She gets good money from house rents.
(ఇంటి అద్దెల వల్ల ఆమెకు బాగా డబ్బువస్తుంది.)
She has good money from house rents.
Spoken English సరళంగా, సహజంగా ఉండేందుకు, have, got చాలా ఉపయోగపడతాయి. వీలైనంత ఎక్కువగా వాటిని సందర్భాన్నిబట్టి వాడటం practice చేయండి.

**Look at the following sentences from the conversation at the beginning of the lesson.**

అన్నిచోట్ల get బదులు have వాడిచూద్దాం.

**1)** ... How did you get the black eye?
(నీకు కంటి చుట్టూ ఆ నల్లటి మచ్చెలా వచ్చింది?)
... Why do you have/ How did you have the black eye?

**2)** That's why I have the black eye = That's how I got the black eye.
(ఇక్కడ have బదులు get వాడాలంటే కాస్త మార్పు అవసరం.)
Why ని how గా మార్చాం. Present tense లో ఉన్న have బదులు, past tense లో ఉన్న got వచ్చింది కదా? Meaning మారకుండా ఉండేందుకు ఈ మార్పు అవసరం. ఆలోచించండి సులభంగానే అర్థం అవుతోంది.

**3)** He didn't get a good run for his money.
(తీసుకున్న/ పొందిన డబ్బుకు తగినంత శ్రమపడలేదతను.)
(శ్రమ తక్కువ - అందుకతనకి వచ్చిన డబ్బెక్కువ)
He didn't have a good run for his money.
get/ have a good run for one's money.
(డబ్బుకు తగిన విధంగా శ్రమపడటం.)
ఈ expression మీరూ practice చేయండి.

**a)** Software companies make their employees get/have a good run for their money by making them work for 10 to 12 hours a day .
(సాఫ్ట్‌వేర్ కంపెనీలు రోజుకు పది, పన్నెండు గంటల పని చేయించుకుని తామిచ్చే జీతాలకు తగ్గచాకిరి చేయించుకుంటున్నాయి.)

**b)** They won in the end all right, but they got/ had a good run for their money.
వాళ్లు గెలిచారు, బాగానే ఉంది, కానీ చాలా శ్రమపడి గెలిచారు. (వాళ్లకు గెలుపంత సులభంగా రాలేదని)
తక్కువ శ్రమ, ఎక్కువ ఫలితం కాకుండా, బాగా శ్రమించి ఫలితం పొందటం.
Get/have a good run for one's money.


M. SURESAN

**4)** Why don't you have another checkup = ఇంకోసారి పరీక్ష చేయించుకోకుడదూ? =
Why don't you get another checkup.

**5)** He got a break =
అతని దశ తిరిగింది =
He had a break.

**a)** The movie star had a lucky break with the movie, Durmargudu =
దుర్మార్గుడు సినిమాతో ఆ తార దశ తిరిగింది =
The movie star got a break...

**b)** The lawyer had a break with the reservations case =
Reservations case తో ఆయన దశ తిరిగింది =
The lawyer got a break with the reservations case.

**6)** I think he had a hand from his uncle =
ఆయన uncle ఆయనకు చేయూత ఇచ్చాడు =
I think he got a hand from his uncle.

**a)** Get/have a hand = సహాయం పొందటం

**b)** Give a hand = సహాయపడటం
(తెలుగులో hand ఇచ్చాడు అనే పదాన్ని సహాయపడలేదు, మాట తప్పాడు అనే అర్థంతో వాడుతుంటాం, కాని English లో give a hand/ lend a hand అంటే సహాయపడటం అని గుర్తుంచుకుందాం)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Ratnakar:** You appear down beat, What's bothering you?
(నిరుత్సాహంగా కనిపిస్తున్నావు. నిన్ను ఆందోళనపరుస్తున్న విషయం ఏమిటి?)

downbeat= నిరుత్సాహంగా ఉండటం
x upbeat= చాలా ఉత్సాహంగా ఉండటం.

**Himakar:** It's got to do with my career. My claims for promotion have been overlooked a second time.
(ఇది నా career కు సంబంధించిన విషయం. Promotionకు ఉన్న నా అర్హతలను, రెండోసారి కూడా తోసిపుచ్చారు.)

claims= (ఇక్కడ) ఒకదానికున్న అర్హత వల్ల వచ్చే హక్కు.
career - కరీయర్ - 'రీ' నొక్కి పలుకుతాం = విద్యా, ఉద్యోగ, వ్యాపకాలు.
overlook= తోసిపుచ్చటం/ గమనించకపోవటం.)




(చెప్పావు కదా! ఇప్పుడేం చేయబోతున్నావు?)
You've said it - ఎవరైనా చెప్పిందే చెప్తుంటే, మనం విసుగుతో 'You've said it' అంటాం. అబ్బ, చెప్పావు కదా, అని కాస్త విసుగుతో.

**Himakar:** My boss will certainly throw me out, sooner or later. Before I get the sack, I want to get out.
(నా boss, త్వరలోనో, తర్వాతనో మొత్తానికి ఎప్పుడో ఒకప్పుడు నన్ను ఉద్యోగం లోంచి తొలగిస్తాడు. అది జరిగేలోపు నేనే బయటకు పోవాలనుకుంటున్నా.

throw (some one) out = (పదవిలోంచి) ఒకరిని తొలగించటం.
sooner or later = కాస్త ముందూ, వెనుకగా, మొత్తానికి ఎప్పుడో ఒకప్పుడు- ఈ రెండూ కూడా conversational expressions. మీ daily conversation లో వాడటం అలవాటు చేసుకోండి.
get the sack - పదవిలోంచి తొలగింపు.

**Ratnakar:** What will you do without a job? And it is a good job too.

What has a Telugu actor to do with English movies? = తెలుగు నటుడికి, English సినిమాలకూ సంబంధం ఏమిటి? = What has a Telugu actor got to do with English movies? ఈ to do with, have (got) to do with అనేవి English లో సర్వసాధారణం. బాగా practice చేయండి.

**2)** You certainly got a raw deal = నీకు నిజంగానే అన్యాయం జరిగింది = You certainly have a raw deal.

**a)** TRS leaders always complain that Telangana has/ gets a raw deal = టి.ఆర్.ఎస్. నాయకులు తెలంగాణకు ఎప్పుడూ అన్యాయం జరుగుతోందని అంటారు.

చాలా గొప్ప నటి అయినప్పటికీ, awards విషయంలో అంజలీదేవి ఉపేక్షకు గురయింది./ ఆమెను నిర్లక్ష్యం చేశారు = Inspite of being a very good actor, Anjali Devi has always the go-by...

**b)** Though a much better cricketer than most others, Laxman always gets the go-by = చాలామందికన్నా మంచి ఆటగాడైనప్పటికీ, లక్ష్మణ్ ఎప్పుడూ ఉపేక్షకు గురవుతున్నాడు- Laxman ప్రతిభ selectors గుర్తించటంలేదు = ... Laxman has always the go-by.

**5)** I get the sack = I have the sack = నా పదవి ఊడుతుంది.

**a)** Natwarsingh got/ had the sack from the external affairs ministry = విదేశీ వ్యవహారాల మంత్రి పదవినుంచి నట్వర్‌సింగ్‌ను తొలగించారు = ఆయన పదవిపోయింది.

**b)** If I accept the bribe, I will get the sack/ I'll have the sack = నేను లంచం తీసుకుంటే నా పదవి ఊడుతుంది.

[sack a person/ give a person the sack/ throw a person out/ show a person the door/ fire a person = ఒక వ్యక్తిని పదవి నుంచి తొలగించటం - ఇది చాలా common expression. మీ conversation లో వాడండి.]

**6)** You've already got your fingers burnt = నీ చేతులిప్పటికే కాల్చుకున్నావు = You've already had your fingers burnt. (ఒక పని, మామూలుగా మంచిపని చేయటం వల్ల చెడు అనుభవం పొందటం.)

**a)** I don't want to interfere in the matter, I had my fingers burnt the last time= నేనా విషయంలో కల్పించుకోవాలనుకోవటంలేదు. కిందటిసారే చేతులు కాల్చుకున్నాను. (కిందటిసారి కల్పించుకోవటంవల్ల నాకు చేదు అనుభవం ఎదురయింది.)

**b)** Don't invest in shares business. You may have (get) your fingers burnt = Shares లో పెట్టుబడి పెట్టకు. చేతులు కాల వచ్చు (నష్టపోవచ్చు).

ఈ lesson లో get/ have తో వచ్చిన expressions అన్నీ, సర్వసాధారణంగా నిత్యజీవిత సందర్భాల (Daily life situations) లో వాడేవే. ఇవి బాగా ఉపయోగించండి.

# He always gets the go-by

**Ratnakar:** You certainly got a raw deal. Didn't you protest?
(నీకు నిజంగా అన్యాయమే జరిగింది. నువ్వు నిరసన తెలపలేదా?)

protest - ప్రొటెస్ట్ - 'టె' నొక్కి పలుకుతాం= నిరసన/ అనంగీకారం తెలపటం/ వ్యతిరేకించటం.

**Himakar:** I complained to my boss, but he didn't care. He wants me to get me out of the company. He wants to get me out of his way, as I know the job better than he, and as I know he has an itching palm. So he gets the jitters in my presence.
(నేను నా boss కు ఫిర్యాదు చేశాను. అతనేం పట్టించుకోలేదు. అతనికి నేను company వదిలి వెళ్లిపోవాలని కోరిక. అతనికంటే పని నాకు బాగా తెలుసునని నన్ను తనదారికడ్డం తొలగించుకోవాలనుకుంటున్నాడు. అతను లంచాలు తీసుకుంటాడనీ నాకు తెలుసు. అందుకని నేనుంటే అతనికి భయం.

Itching palm. Itch (ఇచ్) = జిల, దురద; palm = అరచేయి. Itching palm - జిల చేయి, అంటే లంచాలు తీసుకునే అలవాటు/ ధోరణి.

Almost all politicians in India have itching palms = రాజకీయాల్లో ఉండే దాదాపు అందరూ లంచగొండులే/ అవినీతిపరులే).

**Ratnakar:** So what are you going to do?
(అయితే ఏం చేయబోతున్నావు?)

**Himakar:** It was certainly my turn for promotion, and I feel very bad that I got the go-by. My junior got it and it still galls me.
(ఈసారి promotion నావంతు. నేను దానికి అన్నివిధాలా అర్హుడిని, కాని నన్ను పక్కన పెట్టారు. నాకన్నా తక్కువ service ఉన్నవాడికి promotion ఇచ్చారు. అది నాకు మంటగా ఉంది.)

turn = వంతు. gall= మనకు అన్యాయం జరిగిందనే బాధ, కోపం.

**Ratnakar:** You've said it, but what are you going to do?


M. SURESAN

(ఉద్యోగం వదులుకొని ఏం చేస్తావు? అది మంచి ఉద్యోగం కూడా.)

**Himakar:** I want to do business.
(ఏదైనా వ్యాపారం చేస్తా.)

**Ratnakar:** You've already got your fingers burnt by doing it earlier. Why think of it again?
(ఒకసారి అదిచేసి చేతులు కాల్చుకున్నావు కదా? మళ్ళీ ఆ ఆలోచనెందుకు?)

**Himakar:** That's true. I had an offer a month ago from a rival company. I'll try that.
(నిజమే. నెలకిందట మా పోటీ కంపెనీ నుంచి ఓ offer వచ్చింది. అది ప్రయత్నిస్తా)

**Ratnakar:** Best of luck.

✪ ✪ ✪ ✪

English Conversation లో get/ have చాలా తరచుగా వచ్చే మాటలనీ, చాలా సందర్భాల్లో ఈ రెండింటినీ ఒకే అర్థంలో వాడవచ్చని కొంతకాలంగా గమనిస్తున్నాం. Get/ have వాడే సందర్భాలు బాగా తెలుసుకోగలిగితే చాలా సహజంగా సరళం (simple) గా మాట్లాడటం సులభతరం అవుతుంది. Lesson beginning లో get/ have తో ఉన్న expressions అన్నీ కూడా daily life situations లో వాడే మాటలే. ఈ మాటలు మీరు అలవాటు చేసుకొని ఉపయోగించగలిగితే, మీరు మాట్లాడే English చాలా బాగుంటుంది.

**The following are the expressions we have used in the conversation at the beginning of this lesson:**

**1)** It's (it has) got to do with my career = It has to do with my career = అది నా career కు సంబంధించిన విషయం. ఇంతకుముందు తెలుసుకున్నాం- to do with/ have (has) to do with/ has got to with = సంబంధం కలిగివుండటం.

**b)** Education got/ had a raw deal in the allocation of funds in the last budget = కిందటి budget లో నిధుల కేటాయింపులో విద్యకు అన్యాయం జరిగింది.

**3)** He wants to have/ get me out of his way = అతను నన్ను అడ్డు తొలగించుకోవాలనుకుంటున్నాడు.

**a)** He wants to have me/ get me out of his way so that he can get rich by bribes = లంచాలు తీసుకొని బాగా డబ్బు చేసుకోవచ్చని నన్ను అడ్డు తొలగించాలనుకుంటున్నాడు.

**b)** Once she gets him out of the way, she can have her will = అతడిని అడ్డు తొలగించుకుంటే, ఆమె ఇష్టం వచ్చినట్లు చేసుకోవచ్చు = Once she has him out of her way she can have her will.

**4)** I feel very bad that I got the go-by. (ఇక్కడ get/ have the go-by అంటే ఒకర్ని, వాళ్ల అర్హతలను ఉపేక్షించటం.) = నాకు అర్హత ఉన్నా నన్ను ఉపేక్షించారని/ పక్కనపెట్టారని బాధగా ఉంది.

**a)** Inspite of being a very good actor, Anjali Devi got the go-by in the matter of awards =

| EXERCISE | |
|---|---|
| **Pavan:** | ఈసారి కూడా Laxman కు team లో అవకాశం రాలేదు. |
| **Praveen:** | అతనికెప్పుడూ అన్యాయమే జరుగుతోంది. (Raw deal వాడండి) |
| **Pavan:** | Selectors, captain, coach అందరూ కలిసి ప్రయోగాలు చేసి చేతులు కాల్చుకున్నారు. భారత్‌కు పరాజయాలు పరిపాటయిపోయింది. |
| **Praveen:** | సరిగ్గా ఆడలేదని గంగూలీని తొలగించారు. సబబే కావచ్చు కానీ team క్రీడలో పెద్ద మెరుగుదలలేదు. |
| **Pavan:** | తప్పు కారణాలతో తప్పు సమయాల్లో క్రీడాకారులను తొలగిస్తుంటారు మనవాళ్లు. Laxman విషయంలో అలాగే చేశారు. |
| **Praveen:** | దేవుడే రక్షించాలి India జట్టును. |

| ANSWER | |
|---|---|
| **Pavan:** | Laxman didn't get the chance this time either. |
| **Praveen:** | He has always had/ got a raw deal. |
| **Pavan:** | The selectors, captain and coach - all had their/ got their fingers burnt by experimenting. Defeat has become a matter of habit for the India. |
| **Praveen:** | Ganguli was sacked/ fired/ given the sack/ got the sack (had the sack for not playing well). May be it is right. But the game of our team hasn't improved. |
| **Pavan:** | They sack players for the wrong reasons at the wrong time. They did it to Laxman. |
| **Praveen:** | God save Indian cricket. |

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Dheeraj:** Hi Neeraj, long since we met. How and where have you been?
(మనం కలుసుకొని చాలా రోజులయింది. ఎలా ఉన్నావ్, ఎక్కడ ఉన్నావ్?)

**Neeraj:** (I've) been out of town for quite sometime. I'd been in troubles for some weeks and that had taken me out of town all these days. I came back only this morning.
(కొంతకాలంగా ఊళ్లోలేను. కొన్నివారాలుగా ఇబ్బందుల్లో ఉన్నాను. అందువల్ల ఊళ్లోలేను. ఇవాళే తిరిగొచ్చాను.)

**Dheeraj:** Sorry to hear that. Are you free from troubles now?
(అది వినడానికి బాధగా ఉంది. ఇబ్బందుల్లో నుంచి ఇప్పుడు బయటపడ్డట్లేనా?)

**Neeraj:** Yes; I can say that I got my head above water now. I've sold of a piece of land and cleared all my debts. I've bought a flat too.
(బయటపడ్డానని చెప్పగలను. కొంతపొలం అమ్మేసి అప్పులు తీర్చేశాను. ఓ flat కూడా కొనుక్కున్నాను.)

**Dheeraj:** Is the flat good? (flat బాగుందా)

**Neeraj:** Quite good. I got my money's worth.
(బాగానే ఉంది. పెట్టిన డబ్బుకు తగినంతది.)

**Dheeraj:** Where is this flat of yours?
(నీ flat ఎక్కడుంది?)

**Neeraj:** In a prime area of the town, yet very quiet.
(నగరంలోని ముఖ్యమైన ప్రాంతంలో, అయినా గొడవలేని చోట.)

**Dheeraj:** But haven't you always been for a peaceful area away from the city?
(కానీ నీకెప్పుడూ ఊరికి కాస్త దూరంగా ప్రశాంతమైన ప్రదేశంలో ఉండాలని కదా?)

**Neeraj:** If I had got my way, I would have really moved out of town.
(నేననుకున్నది జరిగి ఉన్నట్లయితే, town కు కాస్త దూరంగా బయటకెళ్లిపోయేవాడినే.)

**Dheeraj:** Whose choice was the site then?
(అయితే ఆ స్థలం ఎంపిక ఎవరిది?)

**Neeraj:** My wife's choice prevailed.
(మా ఆవిడ ఎంపిక నెగ్గింది.)

Prevail = ఇక్కడి అర్థం - నెగ్గటం; ఇంకో అర్థం = (వదంతులు, వ్యాధులు) వ్యాపించటం.

**Dheeraj:** Didn't you get your say in the matter?
(అయితే ఈ విషయంలో నీ అభిప్రాయాన్ని చెప్పే అవకాశం పొందలేదా నువ్వు?)

**Neeraj:** I did, of course, but her opinion got the better of mine. Wives have a way with such matters, haven't they?
(నేను చెప్పాను. కానీ ఆమె మాటే నెగ్గింది. ఇలాంటి విషయాల్లో భార్యలకు ఏదో కిటుకుంటుంది, కదా?)

**Dheeraj:** Most wives do, but my wife is different. She lets me have my way in everything.
(చాలామంది భార్యలు అంతే, కానీ మా ఆవిడ వేరే.)

**Neeraj:** Yes, yes. She selects the colour and style of even your clothes. Most other wives let their husbands alone in the matter, but your wife is different in that she chooses even clothes for you.
(అవునవును. నీ బట్టల రంగూ, శైలీ అంతా ఆమె ఎంపికే కదా! చాలామంది భార్యలు ఈ విషయం పట్టించుకోరు, కానీ మీ ఆవిడ నీ బట్టలు కూడా ఎంపిక చేస్తుంది.)

**Dheeraj:** That's because we love each other so much.
(మా ఇద్దరిమధ్య అంత ప్రేమ ఉంది మరి.)

**Neeraj:** So it with other couples too.
(మిగతా భార్యాభర్తల సంగతి కూడా అంతే.)

✪ ✪ ✪ ✪

English conversation లో get/ have కు ఉన్న ప్రాముఖ్యం గురించి చర్చిస్తున్నాం. అవి చాలా తరచుగా వస్తాయనీ, get, have చాలాచోట్ల ఒకదాని బదులు ఒకటి వాడవచ్చని తెలుసుకున్నాం. Get, have ఈ రెండూ కూడా కొన్ని ఇతర మాటలతో కలిసి రావటం English conversation లో సర్వసాధారణం అని గ్రహించాం. ఈ lesson లో conversation లో have/ gotతో వచ్చే మరి కొన్ని మాటల అర్థాలూ, వాడుకా తెలుసుకుందాం. ఈ lesson లోని have/ got combination తో వచ్చే మాటలు, daily life situation లో చాలా తరచుగా వినిపించేవే. కాబట్టి వీటిని మీ conversation లోనూ practice చేయండి.

**Look at the following sentences from the conversation at the beginning of the lesson (between Dheeraj and Neeraj).**







# Keep your head above water

**1.** I got my head above water = నేను చిక్కుల్లోంచి బయటపడ్డాను = I have my head above water.

Get/ have one's head above water = చిక్కులు, ముఖ్యంగా డబ్బుచిక్కులు లేకుండా ఉండటం/ ఉండకుండా ఉండటం.

**a)** He earns enough to have his head above water = చిక్కుల్లేకుండా గడిపేందుకు తగినంత సంపాదిస్తున్నాడు = He earns enough to get his head above water.

**b)** She can't seen to get her head/ have her head above water; she always has some problem or the other = సమస్యల్లోంచి బయట పడ్డట్లే కనపడదామె. ఆమెకు ఎప్పుడూ ఏదో ఒక సమస్య ఉంటుంది.

Have/ get కు బదులు keep కూడా వాడతారు. Keep your head above water = సమస్యలు లేకుండా చూసుకో.

Get some one's head/ have some one's head/ keep some one's head above water - ముఖ్యంగా డబ్బు చిక్కుల గురించి అయినప్పటికీ, ఇతర ఇబ్బందులకు కూడా వాడుతుంటారు.

**c)** Work seems to have no end for him; he is unable to get/ have/ keep his head above water = అతడి పనికి అంతున్నట్లు కనపడదు. పనిపూర్తయి హాయిగా ఉండలేక పోతున్నాడతను.

**d)** Amrita is able to keep/ get/ have her head above water now. All her children are well settled = అమృతకు ఇపుడు ఇబ్బందులేం లేవు. ఆమె పిల్లలు బాగా స్థిరపడ్డారు.

**2.** I got my money's worth = I had my money's worth = పెట్టిన డబ్బుకు తగిన ప్రతిఫలం రావటం.

**a)** The car is good. Mahendra got his money's worth = car బాగుంది. Mahendra దానిమీద పెట్టిన డబ్బు వృథాకాలేదు = Mahendra has/ had his money's worth.

**b)** Surendra doesn't mind spending money, but he wants to be sure that he gets/ has his money's worth = డబ్బు ఖర్చుపెట్టేందుకు సురేంద్రకు అభ్యంతరంలేదు, కానీ పెట్టిన డబ్బు వృథా కాకూడదనే అతని ఆలోచన.

**c)** Eat in that restaurant; you get/ have your money's worth = ఆ ఫలహారశాలలో తిను, నువ్వు పెట్టే ఖర్చుకు తగిన ప్రతిఫలం లభిస్తుంది.

**3.** To get one's way with/ to have one's way with = మనం అనుకున్నది పొందగలగటం.

**a)** If I had got my way, I would have really moved out of town = నేననుకున్నది పొందగలిగి ఉంటే/ జరిగి ఉంటే, ఊరు బయటికే వెళ్లుండేవాడిని = If I had had my way I would have really moved out of town.

**b)** You can't get your way/ have your way in all matters = ప్రతి విషయంలో/ అన్ని విషయాల్లో నీ మాటే నెగ్గదు. ప్రతి విషయంలోనూ నీమాటే చెల్లటం కష్టం.

**c)** Kaikeyi finally had/ got her way with Sri Rama walking to the forest = శ్రీరాముడు అడవికి వెళ్లటంతో కైకేయి మాటే నెగ్గింది.

**d)** Sonia Gandhi has/ gets her way with her party colleagues = ఆమె పార్టీలోని తోటి సభ్యుల్లో Sonia Gandhi మాటే చెల్లుతుంది.


M. SURESAN

**4.** Didn't you get your say in the matter = నీ అభిప్రాయం చెప్పే అవకాశం లేదా నీకు= Didn't you have your say in the matter

Have/ get one's say = ఒకరి అభిప్రాయాన్ని వ్యక్తపరచటం.

**a)** In a democracy every one has/ has got their say in matters of public interest = ప్రజాస్వామ్యంలో ప్రజలకు సంబంధించిన విషయంలో ప్రతివారికీ తమ అభిప్రాయం వ్యక్తపరిచే అవకాశం ఉంటుంది.

**b)** Please let me have/ get my say before we decide = మనం నిర్ణయించుకునేముందు, నా అభిప్రాయం కూడా చెప్పనివ్వండి.

**c)** An office assistant has no say/ doesn't get a say in the policy matters of a company = company విధాన విషయాల్లో office assistants (clerks) కు తమ అభిప్రాయాలను తెలిపే వీలుండదు.

**d)** Some parents don't allow their children to have/ get any say about their careers. కొందరు తల్లిదండ్రులు తమ పిల్లల విద్యావృత్తుల విషయంలో వారి అభిప్రాయాలను చెప్పనివ్వరు.

**5.** Her opinion got the better of mine = ఆమె అభిప్రాయం నెగ్గింది, నా అభిప్రాయం మీద = Her opinion had the better of mine.

get/ have better of (some one) = ఒకరిని గెలవటం.

**a)** Australia got/ had the better of India in the last match = కిందటి match లో Australia భారత్‌పై గెలిచింది.

**b)** Bhima got the better of/ had the better of Duryodhana = భీముడు దుర్యోధనుడిని ఓడించాడు.

ఈ expressions అన్నీ కూడా daily real life situations లో వాడేవే అని మీకనిపిస్తోంది కదా; ఇవన్నీ మనం ఎక్కడో విన్నట్లున్నాయికదా. వీటిని మీ spoken English లో భాగం చేసుకోండి. మీకు తెలియకుండానే వీటిని correct గా వాడే అవకాశాలు వస్తాయి.

### EXERCISE

**Sneha:** Hi Sakhi, assignment complete చేశావా?

**Sakhi:** లేదే, నా పనులన్నీ పూర్తిచేసుకుని ఎప్పుడు ఖాళీగా ఉంటానో నాకు తెలియటంలేదు.
(have.. head above water వాడండి)

**Sneha:** TV పట్ల నీ బలహీనత నీ బాధ్యతల్ని ఉపేక్షించేట్లు చేస్తోంది.

**Sakhi:** నిన్న నువ్వేదో Guide కొన్నావు. అది బాగుందా?

**Sneha:** కాస్త ఖరీదే కాని డబ్బుకు తగ్గ విలువుంది దానికి. నా డబ్బు వృథాకాలేదు.

**Sakhi:** నాకు వచ్చిన assignment చాలా కఠినంగా ఉంది. Professor ను మార్చమని అడగనా?

**Sneha:** అటువంటి విషయాల్లో నీ అభిప్రాయానికి తావులేదు.

**Sakhi:** మనమాటే నెగ్గేట్లయితే ఎంత బాగుంటుందో!

**Sneha:** అసాధ్యమైన విషయాల గురించి మాట్లాడకు.

### ANSWER

**Sneha:** Hi Sakhi, have you done the assignment?

**Sakhi:** No, I don't know when I can get my head/ have my head above water.

**Sneha:** Your weakness for TV gets/ has the better of your responsibilities.

**Sakhi:** You bought some guide yesterday. How is it?

**Sneha:** It is a bit high priced, but I had/ got my money's worth.

**Sakhi:** The assignment I've got is tough. Shall I ask the professor to change it?

**Sneha:** You don't have any say in such matters.

**Sakhi:** How I wish our word prevailed!
(prevail = నెగ్గటం, గెలవటం)

**Sneha:** Don't talk of impossible things.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Chinmayi:** What a down pour! How long it lasted! I haven't seen the like of it in the past ten years.
(అబ్బో! ఎంత వానో! ఎంతసేపో! గత పదేళ్లలో ఇంత వాన నేను చూళ్లేదు).

Downpour= జడివాన

**Kiranmayi:** Me too. I thought of going to Chennai, but fortunately I had second thoughts about it and dropped the idea.
(నేనూ చూళ్లేదు. చెన్నై వెళ్లాలనుకున్నాను కాని అదృష్టవశాత్తూ, ఆలోచించి మానుకున్నాను.)

**Chinmayi:** Good idea. Otherwise you'd have been stranded following the disruption of train services. But why did you want to go to Chennai, in the first instance?
(మంచి పనే చేశావు. లేకుంటే train services అంతరాయం వల్ల, ఎక్కడో ఒకచోట చిక్కుపడిపోయేదానివి. అసలు నువ్వు చెన్నై ఎందుకు వెళ్లాలనుకున్నావు? )

stranded= ప్రయాణ సౌకర్యం లేకపోవటం వల్ల ఓచోట చిక్కుపడిపోవటం.

A number of passengers were stranded because of the cancellation of buses. = Buses రద్దు చేయటంవల్ల ప్రయాణికులు చాలా మంది చిక్కుపడిపోయారు.

disruption= Bus, train services కానీ, ఇంక వేటికైనాకానీ అంతరాయం కలగటం.

In the first instance = అసలు, మొదటిగా

**Kiranmayi:** Our head office people have made a number of changes in the policies of the company. I have a strong feeling that some of them can't be implemented here as soon as they want them to be. I spoke to them over the phone about it, but I'm afraid they haven't heard me out. I want to get their full ear, so I thought of meeting them.
(మా head office వాళ్లు కంపెనీ విధానాల్లో చాలా మార్పులు చేస్తున్నారు. వాళ్లనుకున్నంత త్వరగా ఇక్కడ వాటిని అమలుపరచటం కుదరదని నా భావన. దాని విషయం వాళ్లతో నేను phone లో మాట్లాడాను. కాని వాళ్లు నన్ను పూర్తిగా వినలేదనిపిస్తోంది. అందుకని వాళ్లని కలిస్తే వాళ్లు నే చెప్పేది పూర్తిగా వినేలా చేయొచ్చని వెళ్తాను.)

implement= ఇక్కడి అర్థం అమలుపరచటం;

The Government thinks of good policies but fails to implement them = ప్రభుత్వం మంచి విధానాలనే రూపొందిస్తుంది కాని అమలు పరచటంలో విఫలమవుతుంది.

implement కు ఇంకో అర్థం పనిముట్లు/ పరికరాలు - Agricultural/ form implements = వ్యవసాయ పరికరాలు, Surgical implements = శస్త్ర చికిత్సా పరికరాలు

hear some one out = ఒకరు చెప్పింది పూర్తిగా వినటం.

Please hear me out= నేను చెప్పేది పూర్తిగా విను.

**Chinmayi:** How are your relations with your higher-ups in the head office?
(Head office లోని మీ అధికారులతో మీ సంబంధాలెలా ఉన్నాయి? )

Higher-ups = ఒక సంస్థలో పై అధికారులు.

**Kiranmayi:** Well, we can't say we have the best of relations.
(మా మధ్య సంబంధాలు అత్యుత్తమమైనవని చెప్పలేను. అంటే అసలు బాగాలేదని చెప్పటమే.)

**Chinmayi:** Why, what's the matter?
(ఏంటి సమస్య? )

**Kiranmayi:** They always want to get us under their thumb, and we resist.
(వాళ్లెప్పుడూ మమ్మల్ని నొక్కిపెట్టాలని చూస్తారు/ వాళ్ల అదుపులో ఉంచుకోవాలని చూస్తారు. మేం అది వ్యతిరేకిస్తాం)

**Chinmayi:** They can definitely give you some freedom.
(వాళ్లు మీకు కొంత స్వాతంత్ర్యం ఇవ్వొచ్చు)




# His wife gets him under her thumb

**Kiranmayi:** You know they don't want us to get a day off, though we are eligible for it. They want us to work even on holidays, though they pay us overtime for that.


M. SURESAN

(నీకు తెలుసా, మాకు అర్హత ఉన్నప్పటికీ, ఒకరోజు కూడా సెలవు తీసుకోవటానికి ఒప్పుకోరు. సెలవురోజుల్లో కూడా మేం పని చేయాలంటారు. పనిచేసినందుకు అదనంగా భత్యం ఇస్తారనుకో)

eligible for = అర్హత కలిగి ఉండటం.

overtime = overtime allowance = చేయాల్సిన దానికన్నా ఎక్కువ సమయం పనిచేసినందుకు చెల్లించే భత్యం.

**Chinmayi:** That's mean of them. They don't understand that a happy employee is an efficient employee.
(వాళ్లు ఆ విషయంలో చాలా నీచంగా ఉన్నారు. సంతోషంగా ఉండే ఉద్యోగే సమర్థుడైన ఉద్యోగి అనేది వాళ్లకర్థంకాదు)

**Kiranmayi:** That's true. (అది నిజం)

✪ ✪ ✪ ✪

కొన్ని రోజులుగా మనం get/ have తో Spoken English లో సర్వసాధారణంగా daily life situations లో వచ్చే మాటలు చూస్తున్నాం. Let's see a few more of them in this lesson.

**1)** I had second thoughts about it = దాని గురించి పునరాలోచించాను/ మళ్లీ ఆలోచించాను, ఆలోచన మానుకున్నాను/ మార్చుకున్నాను = I got second thoughts about it.

**a)** Sanjana did think of buying a car, but had second thoughts about it because of rising maintenance costs = సంజన car కొందామని అనుకుంది. కాని మళ్లీ కాస్త ఆలోచించుకొని పెరుగుతున్న నిర్వహణ ఖర్చుల కారణంగా ఆలోచన (మనసు) మార్చుకుంది. = Sanjana did think of buying a car but got second thoughts about it.

Have second thoughts = get second thoughts = అంటే అనుమానించటం అని అర్థం కూడా ఉంది.

**a)** Though the manager had agreed to take him in as the office boy, she had/ got second thoughts about him = Manager అతన్ని office boy గా నియమించేందుకు ఒప్పుకొన్నప్పటికీ అతడంటే ఆమెకేదో అనుమానాలున్నాయి. (అతన్ని నియమించక పోవచ్చు)

**b)** I have/ have got seemed thoughts about the bike I have thought of buying = నేను కొనాలనుకుంటున్న car గురించి నాకేవో అనుమానాలున్నాయి.

On second thoughts అన్నా కూడా have/ get second thoughts అనే అర్థమే వస్తుంది. అయితే sentence structure మారుతుంది.

**a) Prasad:** Which school do you want to put your son in?
(మీవాడిని ఏ school లో చేర్చాలనుకుంటున్నావు? )

**Murthy:** Learn public school was my choice but I have/ have got second thoughts now.
(Learn public school నా ఎంపిక. కానీ ఆలోచన మారుతోంది= అందులో చేర్చటం సందేహమే.)

**b) Venkat:** What's happened to your idea of selling off your old house.
(మీ పాత ఇంటిని అమ్మేద్దామనుకున్న నీ ఆలోచన ఏమయింది? )

**Venu:** On second thoughts I felt it better to let it out than to sell it.
(కాస్త ఆలోచించినమీదట అమ్మేయడం కన్నా అద్దెకివ్వటం మంచిదనుకున్నా.)

On second thoughts = మళ్లీ ఆలోచించిన తర్వాత

ఈ second thoughts/ second thought (American) English conversation లో సర్వసాధారణంగా వినిపించే మాట. Practise it.

**2)** I want to get/ have their full ear= నా మాటలు వాళ్లు పూర్తిగా వినేట్లు చేయాలనుకుంటున్నా/ వినే వీలుకోసం చూస్తున్నా.

**a)** I can't get/ have the full ear of my boss. She is too busy.
నేను చెప్పాలనుకున్నది మా boss కు పూర్తిగా వినిపించలేకుండా ఉన్నా. ఆమెకా తీరికలేదు. (నేను చెప్పాలనుకున్నది ఆమెకు వినిపించే వీలులేకుండా ఉంది. ఆమె ఎంతో busy.)

**b)** My Mom complains she can't get the full ear of my dad.
తను చెప్పేది మా నాన్న పూర్తిగా వినిపించుకోడని మా అమ్మ ఆరోపణ.

**3)** They always want to get us/ have us under their thumb= వాళ్లెప్పుడూ మమ్మల్ని వాళ్ల అదుపులో ఉంచుకోవాలని అనుకుంటారు.

**a)** Most mothers-in-law want to have/ get their daughters-in-law under their thumb.
ఎక్కువమంది అత్తలు వాళ్ల కోడళ్లను తమ అదుపులో ఉంచుకోవాలని చూస్తారు.

**b)** The husband has no freedom. His wife gets/ has him under her thumb.
ఆ భర్తకు స్వాతంత్ర్యం లేదు. అక్కడ పై చేయి ఆయన భార్యదే.

**ప్రశ్న:** *i. ing form తర్వాత వెంటనే be form వస్తుందా? ing forms ను be forms తో పాటు ఏ విధంగా వాడతారో తెలపండి.*
*ii. 'Reading books', 'Tendulkar began playing tests' - వీటి అర్థం ఏమిటి?*
*iii. Past participle తో కూడా వాక్యాలు మొదలవుతాయా?*

*– పి. వెంకటేశ్వర్లు, కావలి.*

**జవాబు:**

**i.** '...ing' forms, 'be' forms తర్వాత వస్తే verbs అవుతాయి. '...ing' form, ముందర 'be' form లేకుండా కూడా తరచూ వాడుతుంటాం. అప్పుడది verb కాదు అంతే. 'be' form ముందరలేని '...ing' form అర్థం, రాయటం (writing), తినటం (eating), నడవటం (walking) అని వస్తుంది.

**ii. a)** Reading books improves our knowledge - ఇక్కడ Reading కు అర్థం, చదవటం అని. పై sentence కు అర్థం, పుస్తకాలు చదవటం విజ్ఞానాన్ని పెంపొందిస్తుంది.

**b)** Tendulkar began playing tests = టెండూల్కర్ tests ఆడటం (playing) మొదలెట్టాడు.

**iii.** Past participles తో కొన్ని సందర్భాల్లో మాత్రమే sentences begin అవుతాయి.

Given the circumstances, anybody will behave like him = ఆ పరిస్థితుల్లో ఎవరైనా అతనిలానే ప్రవర్తించేవారు. సాధారణంగా Past participle తో sentence మొదలవదు.

**ప్రశ్న:** *Where we can get good mangoes/ Where we can available good mangoes ఈ రెండు వాక్యాల్లో ఏది సరైంది?*

*– మహేంద్ర, హైదరాబాద్.*

**జవాబు:**

Where we can get good mangoes అని question రాదు - Where can we get good mangoes? అని కదా question form.

Where we can available good mangoes - ఇది సరికాదు. Available అంటే దొరకటం; లభ్యమవటం అని అర్థం. మామిడిపండ్లు దొరకటం, / లభ్యమవటం అనే అర్థంతో అయితే, question తీరు: Where are good mangoes available?

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# To get something straight





M. SURESAN

**Jayathi:** Why don't they take some real serious steps? I need a cylinder now. Let me have it first. Once I get it over with, I can relax.
(నిజమైన చర్యలు ఎందుకు తీసుకోరు? ఇప్పుడు నాకో cylinder కావాలి. ముందు నన్ను తెచ్చుకోనీ. ఆ పని పూర్తయితే, నేనూపిరి పీల్చుకోవచ్చు).

**Aarthi:** Whenever something goes wrong somewhere, the consumer gets the worst of it and the gas dealers and officials get the best of it.
(ఎక్కడ ఏ పొరపాటు జరిగినా, వినియోగదార్లకే బాధ. అధికారులకు, gas dealers కూ పంట.)

**Jayathi:** Let me go now. I am going to get it straight, whether I am getting gas or not.
(నన్ను వెళ్ళనీ. నాకు gas వస్తుందో, రాదో తేల్చుకుంటా.)

**Aarthi:** It is time that they got normal gas supply underway.
(Gas supply సజావుగా ఉండే చర్యలిప్పటికే తీసుకోవాల్సింది.)

It's time that ... =
(ఏదైనా) ఇప్పటికయ్యుండాల్సింది.

It's time you got married =
నువ్విప్పటికే పెళ్లి చేసుకుని ఉండాల్సింది.

**Jayathi:** In all these matters it is annoying to see that the gas dealer has the last word. Protest, argue and haggle as you like they have their way and you are helpless.
(ఇలాంటి విషయాల్లో మనక్కోపం వచ్చేదేంటంటే gas dealer దే తుదిమాట. నిరసన తెలిపినా, వాదించినా, బేరంచేసినా మనం చేసేదేంలేదు, వాళ్లదారి వారిదే.)

haggle= బేరమాడటం

**Jayathi:** Oh, this gas business! India, they say, is improving and we don't get cooking gas when we need it. God knows how long we have to suffer like this.
(ఏంటో ఈ gas విషయం! భారత్ చాలా అభివృద్ధి చెందుతుందంటారు. వంట gas అవసరమైనప్పుడు దొరకదు. ఎంతకాలం ఈ బాధలుపడాలో తెలియటంలేదు.)

**Aarthi:** True. They are giving us no end of trouble, these civil supplies people and gas dealers. The minute we run out of gas we get the blues.
(నిజమే. ఈ పౌరసరఫరాల వాళ్లు, gas dealers, అంతులేని బాధ కలిగిస్తున్నారు. వంట gas అయిపోతుందంటే ఎక్కడలేని దిగులూ వస్తుంది.)

no end of= అంతులేని/ ఎక్కడలేని.

run out of= ఏదైనా అయిపోవటం.

My bike has/ I have run out of petrol =
నా bike లో/ నా దగ్గర petrol అయిపోయింది.

I've run out of cash, so take this cheque= నా దగ్గర నగదు అయిపోయింది, కాబట్టి cheque తీసుకో.

India is running out of its oil resources =
భారత్ చమురునిక్షేపాలు అయిపోతున్నాయి.

I am running out of patience =
నా ఓర్పు నశిస్తోంది.

**Aarthi:** That's true. I needed gas urgently last week, I went straight to the dealer but I got the brush off.
(నిజమే, కిందటివారం నాకు gas కావాల్సి వచ్చి తిన్నగా dealer దగ్గరకే వెళితే, నన్నేం పట్టించుకోలేదు. నా మాటలు తీసిపారేశాడు.)

**Jayathi:** For a cylinder full of gas we have to run around places. This is modern India, which in PM's words will be the global market.
(ఒక్క cylinder gas కోసం ఎన్నిచోట్లకె ళ్లాలో! ఇదీ ఆధునిక భారత్- మన ప్రధాని మాటల్లో global market!)

☯ ☯ ☯ ☯

మనం కొంతకాలంగా daily life conversation లో తరచుగా వినిపించే/ ఉపయోగపడే get/ have తో వచ్చే కొన్ని expressions చూస్తున్నాం. అలాంటివే మరికొన్ని చూద్దాం. వీటిని conversation లో వాడటం అలవాటు చేసుకుంటే, మీ ఆలోచనలను భావాలను చాలా కచ్చితంగా చెప్పగలుగుతారు.

**a) Jagadish:** Why are you so nervous, Paresh?
(ఏంటంత కంగారుగా ఉన్నావు?)

**Paresh:** What is the month? (ఏ నెల ఇది?)

**Jagadish:** November.

**Paresh:** Once we enter November I get the / I have the exam blues.
(నవంబర్ ప్రవేశిస్తే నాకు exams గురించి దిగులు పుడుతుంది).

**Jagadish:** Why in November itself? Isn't it in March?
(November లోనేనా? March లో కదా exams?)

**Paresh:** It's November in the semester system.
(semester పద్ధతిలో పరీక్షలు November లో జరుగుతాయి.)

**Jagadish:** Take heart and get over the blues. Otherwise you can't do well.
(దిగులుపడటం మానేసి ధైర్యం తెచ్చుకో. లేకుంటే exams సరిగ్గా రాయలేవు.)

**1.** ఇక్కడ get the blues/ have the blues చూడండి. దీనర్థం- ఏ విషయంవల్లనైనా మనకొచ్చే దిగులు.

**a)** She has pregnancy blues = ఆమెకు గర్భం వల్ల ఏమవుతుందో అని దిగులుగా ఉంది.

**b)** He has started having summer blues = అప్పుడే అతనికి వేసవికాలం దిగులు పట్టుకుంది= He has started getting summer blues.

get the blues/ have the blues=
దిగులు, కాస్త భయం కూడా.

lesson లోని ఈ sentence గమనించండి.

The minute we run out of gas, we get the blues/ we have the blues = Gas అయిపోయిన క్షణంనుంచి మనకు దిగులేస్తుంది.

**c)** As the month of March approaches, most businessmen get tax blues = March నెల రాగానే వ్యాపారస్తులకు పన్ను దిగులు పట్టుకుంటుంది. (have tax blues)

**2.** Get something over with =
(ఓ పని/ విషయం) కానిచ్చేయటం.

Let me get my exams over with first and I'll play any number of matches = నా exams అయిపోనీ, ఎన్ని matches అయినా ఆడతా.

ఇక్కడ కూడా get బదులు have వాడతాం.

**a)** He has to get his daughter's marriage/ have his daughter's marriage over with. Then only he can think of buying a house = మొదట అతని కూతురి పెళ్లి పూర్తిచేసుకోవాలి. ఆ తర్వాతే ఇల్లు కొనటం సంగతి.

**Look at the sentence in the conversation:**

Once I get it over with, I can relax = Once I have it over with I can relax.
ఆ పని పూర్తిచేసుకుంటే ఊపిరి పీల్చుకోగలను.

Once the CM gets/ has the flood relief measures over with, he can think of expanding the cabinet = వరద సహాయక చర్యలు పూర్తయిపోతే, CM మంత్రివర్గ విస్తరణ గురించి ఆలోచించవచ్చు

**3.** Get the worst of = ఓ విషయం వల్ల జరిగే కీడు.

**a)** Whenever something goes wrong somewhere the consumer gets the worst of it = (ఎక్కడ ఏ పొరపాటు జరిగినా దానివల్ల కీడు వినియోగదార్లకే.) The dealers and officials get the best of it = (Dealers, అధికారులు లబ్ధి పొందుతారు.)

(తెలుసుకదా best **x** worst)

[ To get the best of both the worlds =
అవ్వా కావాలి, బువ్వా కావాలి.
You can't have/ get the best of both the worlds = అవ్వా కావాలి, బువ్వా కావాలంటే కుదరదు.]

**4.** To get something straight = ఏదైనా correct గా అర్థం చేసుకోవడం = to have something straight.

**a)** I am going to get it/ have it straight = నేనది సరిగా అర్థం చేసుకోబోతున్నా (తేల్చుకోబోతున్నా.)

**Kiran:** Let's have it/ let's get it straight. Am I pay for the tickets or you?
(ఇది మొదట తేల్చుకుందాం. Tickets కు చెల్లించేది నువ్వా? నేనా?)

**Kishore:** I've got it straight enough, it's me. (నాకు స్పష్టంగానే తెలుసు. నేనే.)

**b)** Get it/ have it straight. I don't want you here again = సరిగా అర్థంచేసుకో. నువ్వు మళ్లీ ఇక్కడికి రావటం నాకిష్టంలేదు.

**c)** We had better have things straight/ We had better get things straight. Are you coming, or aren't you? =
మనం సరిగా అర్థంచేసుకోవడం మంచిది. నువ్వొస్తున్నావా, రావట్లేదా?

**EXERCISE**

**Pavan:** ఏంటి? ఏదో బాధపడుతున్నట్లున్నావు?
**Sravan:** ఏంలేదు. June వచ్చేస్తుంది కదా, పిల్లల school fees ల బాధ దిగులుగా ఉంది.
**Pavan:** ఎంతేమిటి?
**Sravan:** ఎంతయినా పదివేల రూపాయల మాటే.
**Pavan:** అర్థం చేసుకోగలను. మరి మీ ఇంటి repairs మాటేమిటి?
**Sravan:** ఇది మొదట కానిచ్చుకుంటే ఇంటి repairs విషయం ఆలోచించుకోవచ్చు.
**Pavan:** పదివేల రూపాయలెందుకు? ఏదైనా మామూలు school లో చదివించవచ్చుకదా?
**Sravan:** మంచి చదువు కావాల్సివస్తే, నేనా ఖర్చు భరించాల్సిందే. అవ్వా కావాలి బువ్వాకావాలంటే కుదరదుకదా.

**ANSWER**

**Pavan:** You appear worried about something.
**Sravan:** June is approaching, I get the children's school fees blues.
**Pavan:** How much is it?
**Sravan:** Anywhere about Rs. 10,000/-
**Pavan:** I can understand. What about repairs to your home?
**Sravan:** Once I get it/ have it over with I can think of them.
**Pavan:** Why Rs. 10,000/- You can have your son study in an ordinary school.
**Sravan:** I have to bear the expenditure if I want good schooling. We can't have the best of both the worlds. (We can't get ...)

**ప్రశ్న:** *1. For the 'waters' came lip to my lips.*

*2. I have come to deep waters. ఈ వాక్యంలో water అనొచ్చుకదా?*

*3. Articles లో some and any అనే పదాలను కూడా a/ an వ బహువచనరూపంలో రాస్తున్నారు. ఉదా. 'some sugar' and 'any rice.' వీటిని articles కింద ఎందుకు చూపించడం లేదు?*

*4. 'It is done'. దీనిని ఏ tense లో వాడవచ్చు?*

*– బి.వెంకటేశ్వర్లు, వరంగల్.*



**జవాబు:**

**1.** Waters అని, ఒక నది/ సముద్రంలోని నీళ్లను గురించి మాట్లాడేటప్పుడు అంటారు. The waters of the Krishna (Krishna నదీజలం/ జలాలు), the waters of the Ocean (మహా సముద్రపు నీళ్లు) - ఇలాంటిచోట్ల waters అంటాం. మామూలుగా అయితే water అనే అంటాం. For the waters came lip to my lips - దీనికి మామూలుగా అర్థమేమీ లేదు. సందర్భం తెలిస్తేకాని అర్థం చెప్పలేం.

**2.** I have come to deep waters - ఇది సరైన expression కాదు. I am in deep water = నేను చిక్కుల్లో ఉన్నాను.

**3.** some, any అనేవి articles కావు. అవి determiners. మీరు English మాట్లాడేటప్పుడు వాటిని correct గా use చేయగలిగితే, అవి articles అవుతాయా, determiners అవుతాయా అనే technicalities పట్టించుకోకండి.

**4.** It is done = అది చేయబడుతుంది/ చేయబడింది. అంటే మామూలు తెలుగులో ఆ పని అవుతుంది (క్రమం తప్పకుండా) ఆ పని అయింది, అని.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



**Mohan:** I always see you buying pens. Do you really need so many pens? If you don't mind my saying it, I observe you write very little.

(నువ్వు పెన్నులు కొనటం చూస్తానెప్పుడూ. నిజంగా అన్ని పెన్నులు నీకవసరమా? నువ్వే మనుకోకపోతే నువ్వు రాసేది చాలా తక్కువనే విషయం నేను గమనించాను.)

**Soman:** You are right, of course. I don't write much, yet I take a fancy to pens.

(నువ్వనేది నిజమే. నేనేం ఎక్కువ రాయను, కానీ పెన్నులంటే అభిమానం నాకు/ ఎందుకో ఇష్టపడతా.)

**Mohan:** Why waste so much money?

(ఎందుకంత డబ్బు వృథా చేస్తావు?)

**Soman:** Everybody has their fancy. Just as you have a fancy to shoes, I have a fancy to pens.

(ప్రతివాళ్లూ దేన్నో ఒకదాన్ని ఇష్టపడుతుంటారు. నువ్వు shoes ను ఇష్టపడ్డట్లే, నేను పెన్నులంటే ఇష్టపడతాను.)

**Mohan:** I have an uncle who takes an interest in cell phones. You just don't know how often he changes his phones-atleast once in 8 or 9 months.

(నిన్నరాత్రి నేను ఒక్కక్షణం నిద్రపోలేదు. 11 గంటల వరకు బ్రహ్మ సినిమా చూశాను. ఆ తర్వాత ఎందుకనో నిద్రపట్టలేదు.)

A wink of sleep = కునుకు

**Soman:** That certainly is a good movie. The hero in the movie took the world by storm by his action. It took the audiences breath away.

(అది నిజంగా గొప్ప సినిమాయే. దానిలో hero తన action తో అందరినీ ఆకర్షించాడు)

**Mohan:** It was his first movie. He just took a shot at it and succeeded. He himself didn't expect it to be such a success.

(అదతని మొదటి సినిమా. ఏదో అలా ప్రయత్నించాడు. విజయం పొందాడు. అతడే అనుకోలేదు అంత గొప్పగా విజయవంతమవుతుందని.)

**Soman:** He has his turn now.

(ఇప్పుడతని వంతు.)




# I'll take forty winks

(మా అంకుల్ ఒకాయన ఉన్నాడు. ఆయనకు సెల్ ఫోన్లు అంటే మోజు. ఎంత తరచుగా సెల్‌ఫోన్స్ మారుస్తాడో నీకు తెలియదు. కనీసం ఎనిమిది తొమ్మిదినెలలకొకటైనా మారుస్తుంటాడు.)

**Soman:** We have worked without rest for the past three hours. I feel the strain. So do you I suppose.

(మూడుగంటలుగా విశ్రాంతి లేకుండా పని చేశాం. ఆ శ్రమను feel అవుతున్నా. నువ్వు కూడా feel అవుతున్నావనుకుంటా.)

strain = ఒకపనిచేయటంలో ఉన్న శ్రమ

**Mohan:** Aren't there days when we worked non-stop for 6 to 7 hours without feeling the strain? I do feel the strain today too. I think it's because of the heat.

(ఆరేడుగంటలపాటు నిర్విరామంగా పనిచేసిన రోజులులేవా? అప్పుడేమంత శ్రమనిపించలేదు మనకు. ఇవాళ నాక్కూడా శ్రమ అనిపిస్తోంది. ఎండవల్ల అనుకుంటా.)

**Soman:** Let's take five. We feel refreshed then.

(ఓ అయిదు నిమిషాలపాటు విశ్రాంతి తీసుకుందాం. అప్పుడు మళ్లీ తాజాగా అనిపిస్తుంది.)

**Mohan:** You take five, that won't be enough for me. I'll have just forty winks.

(నువ్వు కాసేపు విశ్రాంతి తీసుకో. నాకది చాలదు. నేనో కునుకు తీస్తా/ కాసేపు నిద్రపోతా)

**Soman:** Do you really need to sleep now?

(నిజంగా నిద్రపోవాల్సిందేనా నువ్వు?)

**Mohan:** I didn't get a wink of sleep last night. Till eleven last night I watched the movie Brahma, and after that some how I couldn't get any sleep.

**Mohan:** I had a terrible time last week. So I am going to take a day off this weekend.

(గతవారమంతా (పనితో) భయంకరంగా గడించింది. కాబట్టి ఈవారాంతంలో ఒకరోజు పనిలోంచి విరామం తీసుకోబోతున్నాను.)

M. SURESAN

**Soman:** Go ahead. I'll take a day off next week.

(కానియ్. నేను వచ్చేవారం ఓరోజు విరామం తీసుకుంటా.)

✪ ✪ ✪ ✪

కిందటి lesson వరకు real life situations లో English conversation లో get/ have తో అతి తరచుగా వచ్చే expressions చూశాం కదా. ఏయే సందర్భాల్లో get, have, రెండూ వాడొచ్చో గమనించాం. Get/ have తో వచ్చే expressions English లో ఎంత సర్వసాధారణమో take/ have తో వచ్చేవి కూడా దాదాపు అంతే. ఈ lesson లో అలాంటివి కొన్ని చూద్దాం. మనం మాట్లాడే తెలుగుకూ, పుస్తకాల్లోని తెలుగుకూ తేడా ఉన్నట్లే, conversational/ spoken English కు, bookish English కూ తేడా ఉంటుంది. ఈ get/ have, take/ have expressions spoken English లో చాలా తరచుగా వినిపిస్తుంటాయి. అందుకని వాటిని మన సంభాషణలో వాడితే అది సహజంగా ఉంటుంది.

**Look at the following expressions in the conversation at the beginning of the lesson.**

1. I don't write much, yet I take a fancy to pens- take a fancy to = have a fancy to
2. I have an uncle who takes an interest in cell phones - take an interest in = have an interest in.
3. Let's take five = Let's have five
4. I'll have just forty winks = I'll take forty winks.
5. The hero in the movie took the world by storm = The hero in the movie had the world by storm.
6. He just took a shot = He just had a shot.

**Let's study these expressions one by one.**

**1.** Take a fancy to = have a fancy to =

ఒక వస్తువన్నా/ వ్యక్తన్నా ఇష్టపడటం/ మోజుపడటం.

**a)** Hari took a fancy to Nalini when they met at a fresher's party =

Fresher's party లో కలుసుకున్నప్పటినుంచి నళిని మీద హరి మోజుపడుతున్నాడు. /నళిని అంటే ఇష్టపడుతున్నాడు =

Hari has a fancy to Nalini.

**b)** Sundari takes a fancy to diamond rings=

వజ్రాల ఉంగరాలంటే సుందరికి మోజు =

Sundari has a fancy to diamond rings.

**c)** Children have a fancy to things of bright colours =

ముదురురంగు వస్తువులపై పిల్లలకు మోజుంటుంది/ పిల్లలు ముదురురంగు వస్తువులను ఇష్టపడతారు=

Children take a fancy to things of bright colour.

**2.** I have an uncle who takes an interest in cell phones =

మా అంకుల్ ఒకాయనకు cell phones అంటే చాలా ఆసక్తి/ ఇష్టం =

I have an uncle who has an interest in cell phones.

**a)** Nehru took a deep interest in children =

Nehru had a strong interest in children =

పిల్లలంటే నెహ్రూకు అమితమైన/ ఎక్కువ ఆసక్తి/ ఇష్టం ఉండేది/ ఇష్టపడేవారు.

**b)** President Kalam has an interest in teaching =

President Kalam takes an interest in teaching =

రాష్ట్రపతి కలాం బోధనంటే ఇష్టపడతారు/ ఆసక్తి చూపుతారు.

**3.** Let's take five = Let's have five. ఇది చాలా గమ్మత్తయిన expression. దీని అర్థం ఓ 5 నిమిషాలపాటు విశ్రాంతి తీసుకుందామని.

**a)** Take five and start work again =

Have five and start work again =

అయిదు నిమిషాలు విశ్రాంతి తీసుకుని మళ్లీ పని ప్రారంభించు.

**b)** He took three fives in an hour's work =

He had three fives in an hour's work =

అతడు పనిచేసిన గంటలో మూడుసార్లు విశ్రాంతి తీసుకున్నాడు. ఇక్కడ five అంటే correct గా 5 నిమిషాలని కాదు, కొద్ది నిమిషాలపాటు అని.

**4.** I'll have forty winks (మనం తెలుగులో ఒక కునుకు తీయటం అనేందుకు English లో సరైన expression) = ఒక కునుకు తీస్తా/ కొద్ది నిమిషాలు నిద్రపోతాను = I'll take forty winks.

**a)** He never misses his forty winks after lunch =

Lunch తర్వాత కునుకు తీయటం మాత్రం మానుకోడాయన.

**b)** All this happened as she took/ had her forty winks =

ఆమె కునుకు తీస్తున్న సమయంలో ఇదంతా జరిగిపోయింది.

**5.** The hero in the movie took the world by storm =

The hero in the movie had the world by storm =

ఆ సినిమాలో hero అందరిని ఆకర్షించాడు/ అందరి మన్ననలూ పొందాడు.

**a)** Tendulkar took the world by storm by being the youngest to score a century =

Tendulkar had the world by storm ... =

Century సాధించిన అతి చిన్నవాడుగా టెండూల్కర్ ప్రపంచదృష్టిని ఆకర్షించాడు/ ప్రపంచాన్ని ఆశ్చర్యపరిచాడు.

**b)** She took the world by storm in her maiden appearance on the screen =

మొదటిసారి తెరమీద కనిపించడంతోనే ఆమె సంచలనం సృష్టించింది/ అందరి మన్ననలూ పొందింది =

She had the world by storm ...

Take the world by storm =

పైన చెప్పిన అన్ని అర్థాలూ ఉన్నాయి.

Maiden = మెయ్‌డన్. 'మె' నొక్కిపలుకుతాం. మామూలు అర్థం కన్య. Maiden appearance/ performance లాంటి సందర్భాల్లో అర్థం - మొట్టమొదటి. Maiden century = మొదటి century.

**6.** He just took a shot = ఏదో ఓ ప్రయత్నం చేశాడు. (లక్ష్యాన్ని కొట్టేందుకు- ఓ బాణం వదిలో/ ఓ తుపాకి గుండుపేల్చో) =He just took a try = He just had a try. వీటన్నిటి అర్థం ఒకటే. ప్రయత్నించి చూశాడు అని (విజయంమీద పూర్తివిశ్వాసం లేకుండా)

**a) Pranav:** Can I see the officer?

(ఆఫీసర్‌ను కలవచ్చా?)

**Bhanu:** He is busy, so I doubt if you can. But take a try/ have a try/ take a shot/ have a shot.

(ఆయన తీరిక లేకుండా ఉన్నాడు. మీరు కలుసుకోగలరో లేరో సందేహమే. అయినా ప్రయత్నించి చూడండి.)

**b)** He wasn't sure of getting the job. He just took a try and was lucky =

ఉద్యోగం వస్తుందనే నమ్మకం లేదతడికి. ఏదో ప్రయత్నం చేశాడు. అదృష్టం వరించింది.

**ప్రశ్న:** QUALIFY అనే పదం అర్థాన్ని, దాన్ని ఉపయోగాన్ని, సులభంగా అర్థమయ్యే ఉదాహరణలతో వివరించగలరు.

– ప్రభుదాస్, నల్గొండ.

**జవాబు:**

'Qualify' in grammar means, describe or say something special about a word.

A word describing or saying something special about another word, qualifies it. Tendulkar is a great cricketer.

Here, the word 'great' says something about or describes the word 'cricketer'. So the word 'great' qualifies the word 'cricketer', usually adjectives qualify nouns.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Suhrid:** Where were you yesterday? Try as I might, I couldn't get you.
(నిన్నంతా నువ్వు ఎక్కడున్నావు? ఎంత ప్రయత్నించినా నీతో మాట్లాడలేక పోయాను.)

**Srikanth:** I went shopping with mom and dad the whole of yesterday. You know my sister is getting married. That kept us busy the whole day.
(అమ్మా, నాన్నతో కలిసి నిన్నంతా shopping చేశా. మా చెల్లెలు పెళ్లని తెలుసు కదా. ఆ పనితో నిన్నంతా మాకు తీరిక లేకుండా పోయింది.)

**Suhrid:** When exactly is the marriage?
(పెళ్లి correct గా ఎప్పుడు?)

**Srikanth:** Three weeks from now to a day.
(Correct గా ఇవాల్టికి మూడువారాల్లో.)

To a day = ఇవాల్టికి (వచ్చే వారం/ వచ్చే నెల, etc)

**Suhrid:** So how did your shopping go off yesterday?
అయితే నిన్న మీ shopping ఎలా జరిగింది?)

**Srikanth:** Well, gold, clothes and other things cost us around Rs 3 lakh. Still there are a lot more things to buy.
(బంగారం, బట్టలూ అన్నీ కలిసి నిన్న మూడు లక్షలయ్యాయి. ఇంకా కొనాల్సినవి చాలానే ఉన్నాయి.)

**Suhrid:** Did you buy things for the bride groom too.
(పెళ్లికొడుకుకు కూడా కొన్నారా?)

**Srikanth:** Not much. We'll have to buy them too. That'll be this weekend.
(అంత లేదు. అవి కూడా ఇంకా కొనాలి. ఈ వారాంతంలో ఉంటుంది ఆ కొనటం)

**Suhrid:** Is he very demanding?
(అతను నిక్కచ్చిగా అడిగే రకమేనా?)

Demanding= అనుకున్నవి కావాలని పట్టుబట్టడం.

**Srikanth:** No, fortunately. When I asked him of the type of clothes and other things we have to give him, he wasn't that particular. I understand that any thing goes with him.
(అదృష్టవశాత్తూ లేదు. మేం ఇవ్వాల్సిన బట్టలు, ఇతర వస్తువులూ ఏ రకమైనవి కావాలని అతన్ని అడిగినప్పుడు, అతనంత పట్టింపులేదన్నాడు. ఆ విషయంలో అతనికే దయినా ఫర్వాలేదని అనుకొంటున్నాను.)

Particular = ఒక విషయంలో పట్టింపుగా ఉండటం.

Dad is particular that I do Engineering = నేను Engineering చదవాలని నాన్న పట్టు దలగా ఉన్నాడు.

Any thing goes = ఏదైనా సరిపోతుంది.

**Suhrid:** You are fortunate there. Most often what we select and what we suggest do not go well with the bridegroom and his people.
(అలాగైతే మీరు అదృష్టవంతులే. చాలా సందర్భాల్లో మన ఎంపిక, మన సూచనలూ వరుడికి, అతడి తరఫు వాళ్లకూ నచ్చవు.)

**Srikanth:** Going by his talk the other day I got the impression that he was quite modern in his out look. He is not insistent on silly formalities of traditional marriages, his people aren't either.
(మొన్న అతను మాట్లాడిన తీరుబట్టి చూస్తే అతను ఆధునిక దృక్పథం ఉన్నవాడుగా అనిపించాడు. సాంప్రదాయిక వివాహాల చిన్న చిన్న లాంఛనాల విషయం పెద్ద పట్టించుకున్నవాడు కాదు. వాళ్లవాళ్లు కూడా కాదు.)

Formalities = లాంఛనాలు.

**Suhrid:** That's the trouble with Indian marriages what goes by the name of formalities often harrasses the bride's people.







మనం daily conversation (Real Life situations లో) go తో వచ్చే expressions చూస్తున్నాం కదా. మరికొన్ని ఇప్పుడు చూద్దాం.

**Look at the following expressions from the conversation at the beginning of the lesson.**

1) I went shopping. ఇది go తో వచ్చే expression. Shopping, hunting, searching లాంటి expressions English లో సర్వసాధారణం.

a) On all the days we were in Delhi we went sight seeing = ఢిల్లీలో ఉన్న రోజుల్లో మేం అక్కడి వింతలను చూడటానికి వెళ్లాం.

Sight seeing అంటే - ఒక ప్రదేశపు వింతలూ, విశేషాలు, దృశ్యాలు.


M. SURESAN

a) Going by what he says, he is not interested in the game =
అతడు చెప్పేదాన్నిబట్టి చూస్తే, అతడికి ఈ game లో ఆసక్తిలేదు.

b) Going by the land prices in Hyderabad it will be impossible for us to buy sites there =
హైదరాబాద్‌లో స్థలాల ధరలు చూస్తుంటే/ ధరలను బట్టి, అక్కడ స్థలాలు కొనటం మనకు అసాధ్యం.

c) Going by his appearance, he appears to be good =
అతని ఆకారాన్నిబట్టి చూస్తే అతను మంచివాడనే అనిపిస్తున్నాడు.

**4) Not go well with.**

Most often what we select and what we suggest do not go well with the bridegroom and his people =

# Anything goes in Indian politics

(మన పెళ్లిళ్లల్లో వచ్చిన చిక్కే అది. లాంఛనాలనే పేరుతో జరిగేవన్నీ పెళ్లి కూతురువైపు వాళ్లను ఇబ్బందిలో పెడతాయి.)

**Srikanth:** It was a really tiring day for us yesterday. For nearly two hours the power went off in the shop and that delayed things.
(నిన్న మేం చాలా అలసిపోయాం. రెండు గంటలపాటు shop లో current లేదు. అందువల్ల ఆలస్యమైంది.)

**Suhrid:** OK. So you haven't completed the shopping. When do you expect to complete it?
(OK. అయితే నువ్వు shopping పూర్తిచేయలేదన్నమాట. ఎప్పుడు పూర్తిచేయాలనుకుంటున్నావు?)

**Srikanth:** If things go well, I suppose it should be complete by the weekend.
(అన్నీ సవ్యంగా జరిగితే ఈ వారాంతాని కల్లా అయిపోవాలి.)

**Suhrid:** All the best.

☺ ☺ ☺ ☺

b) Have a good rest in the morning and go shopping in the evening =
పొద్దునంతా విశ్రాంతి తీసుకుని, సాయంత్రం shopping కు వెళ్లండి.

c) Dushyanta met Shakuntala when he went hunting =
దుష్యంతుడు వేటకు వెళ్లినప్పుడు శకుంతలను కలుసుకున్నాడు.

**2) Go/ Goes** = ఏదయినా ఫరవాలేదు.

a) **Jagdish:** Will this shirt be ok for the function?
(function కు ఈ shirt బావుంటుందా?)

**Naresh:** Don't worry what you wear. Any thing goes.
(ఏం వేసుకుంటున్నావనే విషయం గురించి ఆదుర్దాపడకు. ఏదయినా ఫరవాలేదు.)

b) Anything goes in Indian politics =
భారత రాజకీయాలలో ఏదయినా ఫరవాలేదు (అంటే ఏం చేసినా చెల్లుతుంది అనే అర్థంతో).

Whatever he does goes=
అతడేం చేసినా చెల్లుతుంది.

**3) Going by** = దాని ప్రకారం/ దాన్నిబట్టి చూస్తే. ఇది conversation లో చాలా తరచుగా వినపడుతుంది.

చాలా సందర్భాల్లో మనం ఎంపికచేసేదీ, మనం సూచించేదీ, పెళ్లికొడుక్కు, వాళ్ల వాళ్లకూ రుచించదు.

Not go well with = రుచించదు/ నచ్చదు.

a) My being elected leader did not go well with him =
నేను leader గా ఎన్నికవటం ఆయనకు రుచించ లేదు.

b) Others using his bike doesn't go well with him =
ఇతరులు అతడి bike వాడటం అతడికి నచ్చదు.

c) I avoided suggesting this to him, because it doesn't go well with him =
అతనికి సూచించటం మానుకున్నాను, అతనికి సూచన రుచించదని తెలుసు కాబట్టి.

**5)** The power went off - ఇది go off కు past tense కదా - ఆగిపోయిందని అర్థం/ (lights) ఆరిపోవటం.

The lights went off when the doctor was examining the patient =
రోగిని doctor పరీక్షిస్తున్నప్పుడు lights ఆరిపోయాయి.

**ప్రశ్న:** 1. enter, enter in, enter into ల వాక్య ప్రయోగాల గురించి వివరించగలరు.

2. A hacksaw is used to cut soft metal rods or strips కి, The hacksaw is used to cut soft metal rods or strips కి మధ్య భేదమేమిటి?

3. VIII class social studies లో ఓచోట ఈ విధంగా ఉంది.
The educated class understood the British political institutions and came to know how the British people enjoyed liberty, equality and fraternity in their country. ఈ వాక్యాన్ని కింది విధంగా (మీరు చెప్పిన rules ప్రకారం) రాయలేమా?
The educated class understood the British political institutions and came to know how the British had enjoyed liberty, equality and fraternity in their country.

– యు.రవికుమార్, డిచ్‌పల్లి.

**జవాబు:**

**1. enter** = ప్రవేశించటం. ఒక స్థలంలోకి ప్రవేశించటం = enter a place.
She entered the room and found her friend there =
ఆమె గదిలోనికి ప్రవేశించి, తన friend ను చూసింది.
ఒక సంభాషణలోకి / ఒప్పందంలోనికి దిగటం- **enter into**.

a) She entered into a conversation with her neighbour =
తన పొరుగావిడతో ఆమె సంభాషణలోకి దిగింది.

b) They entered into an argument with the shop keeper =
వాళ్లు shop అతనితో వాదంలోకి దిగారు.

c) They entered into an agreement = ఒప్పందం కుదుర్చుకున్నారు.

**enter** అంటే ఇంకో అర్థం పేర్లు, డబ్బు లాంటివి list, registers/ accounts లోకి ఎక్కించటం.

a) The clerk entered the amount in the accounts book =
ఆ మొత్తాన్ని లెక్కల పుస్తకంలోకి ఎక్కించాడు.

b) They entered his name in the list of criminals =
నేరస్తుల జాబితాలో అతన్ని చేర్చారు.

**2.** A hacksaw, the hacksaw - ఈ రెండింటికీ ఈ సందర్భంలో అర్థంలో తేడా ఏంలేదు.
(The hacksaw అన్నప్పుడు అన్ని hacksaws అనీ, A hacksaw అన్నప్పుడు, ఏ hacksaw అయినా అనీ అర్థాలు వస్తాయి.)

**3.** ఈ వాక్యాన్ని ఏ అర్థంలో ఉపయోగించారనేది గమనించడం ముఖ్యం.
వాళ్ల స్వాతంత్ర్యం (liberty), సమానత్వం (equality), సౌభ్రాత్రం (సోదరభావం- fraternity) అనుభవిస్తున్నారని విద్యార్థులు గమనించారని భావం అయితే text book లో ఉన్న enjoyed correct. అంటే వాళ్లవి అనుభవించడం వీళ్లు గ్రహించటం ఒకప్పుడే జరిగాయనే అర్థంతో ఈ అర్థమే correct.
అలాకాకుండా వాళ్లవి ఎప్పుడో అనుభవించిన తర్వాత వీళ్లు దానిని గ్రహించారని భావం అయితే had enjoyed వాడాలి. కాని ఇక్కడ ఇదికాదు భావం (Text book లో). కాబట్టి text book correct.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Akshara:** I put the sambar in the fridge last night but I now see it has gone bad.
(నిన్నరాత్రి సాంబారు ఫ్రిజ్‌లో పెట్టాను. ఇప్పుడు చూస్తే చెడిపోయింది.)

**Abhaya:** That's not surprising. This place is so hot that things do not keep even if they are frozen.
(అదేం పెద్ద ఆశ్చర్యమేంకాదు. ఫ్రిజ్‌లో ఉంచిన పదార్థాలు కూడా చెడిపోయేంత వేడిగా ఉంటుంది ఈ ప్రదేశం / ఊరు.)

frozen = చల్లబర్చిన ముఖ్యంగా ఫ్రిజ్‌లో. Keep మామూలు అర్థం తెలుసుకదా, ఉంచటం అని. Keep అంటే ఇక్కడి అర్థం పదార్థాలు చెడిపోకుండా నిల్వ ఉండటం అని.

Milk doesn't keep for more than half a day if it is not boiled =
పాలు కాచకపోతే సగం రోజుకే చెడిపోతాయి.

The Ganga Waters keep for a very long time.
గంగ నీళ్లు చాలా కాలం వరకు చెడిపోవు.

keep అంటే ఇంకో అర్థం కొనసాగించటం (continue) అని.

He keeps smoking in spite of his bad health.
అనారోగ్యంగా ఉన్నప్పటికీ smoking కొనసాగిస్తూనే ఉన్నాడు/ smoke చేస్తూనే ఉన్నాడు. ఇదే అర్థంతో keep on అనికూడా అంటారు.
(keeps కు ఇంకో అర్థం ఉంపుడుగత్తె అని కూడా.)

**Akshara:** Something wrong with our fridge too. I had it repaired the other day, but I find no improvement.
(మా ఫ్రిజ్‌లో కూడా ఏదో లోపం ఉంది. మొన్నో రోజున రిపేర్ చేయించాను. కానీ మెరుగేంలేదు.)

**Abhaya:** So what are you going to do?
(అయితే ఏం చేయబోతున్నావు?)

**Akshara:** It is going from bad to worse. The best thing is to go for a new one and sell this one for whatever I can get.
( రానురాను మరీ అధ్వానం అవుతోంది. కొత్తది కొని, దీన్ని ఎంత ధర వస్తే అంత కమ్మేయటం ఉత్తమం.)

**Abhaya:** The sooner you do it the better.
(నువ్వది ఎంత త్వరగా చేస్తే అంత మంచిది.)

**Akshara:** I have to wait for a while. I have gone broke after the jewellery I bought at the beginning of the month. I've to make do with the fridge after all for the present.
(నేనుకాస్త ఆగాలి. ఉన్న డబ్బంతా ఈ నెలారంభంలో నగలు కొనడంతో అయిపోయింది. ఏదేమైనా ప్రస్తుతానికి ఉన్న ఫ్రిజ్‌తోనే సర్దుకోవాలి.)

**Abhaya:** To say that you don't have the money enough to buy a fridge is going too far, girly. Come on. Withdraw money from the bank. After all, you can't go without a fridge in good order.
(ఫ్రిజ్ కొనేందుకు కూడా నీ దగ్గర డబ్బు లేదనటం చాలా విపరీతమే. కానీ, బ్యాంకులో ఉండే డబ్బు తీసుకో. మంచి ఫ్రిజ్ లేకుండా గడపలేవు నువ్వు.)

(girly = ఆడవాళ్లను ముద్దుగా అనటం.)

**Akshara:** What do you know? My cousin Indira borrowed Rs.50,000/- from me. She promised to return it by last month end. Now she has gone back on her word. She denies having made any such promise. She has asked for at least two more months time to return it.
(నీకేం తెలుసు? మా కజిన్ ఇందిర నా దగ్గర యాభైవేల రూపాయలు అరువు తీసుకుంది, కిందటి నెల చివర తిరిగిస్తానని మాటిచ్చింది, కానీ మాటతప్పింది. అలా తను మాటివ్వలేదంటోంది. తిరిగివ్వటానికి ఇంకో రెండునెలల సమయం కావాలంది.)

**Abhaya:** Why didn't you ask her to go to hell when she asked you for the money?
(డబ్బు అడిగినప్పుడు ఇవ్వను ఏం చేసుకుంటావో చేసుకో పో అని ఎందుకు అనలేదు?)

**Akshara:** I'd have, but you know we are running a school together. I can't go it alone. I need her.
(అనేదాన్నే. కానీ మేమిద్దరం కలిసి స్కూల్ నడుపుతున్నాం కదా. నేనొక్కదాన్నే నడపలేను. నాకు తను అవసరం.)








M. SURESAN

# He went broke...

**Abhaya:** Then you've to wait till she returns the money.
(అయితే ఆమె తిరిగిచ్చే దాకా నువ్వు వేచి ఉండాల్సిందే.)

**Akshara:** What else am I doing?
(నేనంతకంటే ఏం చేస్తున్నాను?)

★ ★ ★

Daily life situations లో go తో తరచుగా వచ్చే expressions తో మరికొన్నింటిని చూద్దాం.

**1) go bad** = ఏదైనా (ముఖ్యంగా ఆహార పదార్థాలు) కుళ్లటం/ పాడైపోవడం/ ముగిరిపోవడం.

a) I can't eat that apple. I'm afraid it has gone bad.
(నేనా ఆపిల్‌ను తినలేను. కుళ్లిపోయిందనుకుంటా.)

b) Vegetables go bad quickly in hot weather.
ఎండల్లో కూరగాయలు త్వరగా కుళ్లిపోతాయి/ ముగిరిపోతాయి. (rot అంటే కూడా కుళ్లి/ ముగిరిపోవటం)

గమనించండి: Keep X go bad. ఇందాక చూశాం కదా, keep అంటే చెడిపోకుండా నిల్వ ఉండటం అని. కాబట్టి దానికి వ్యతిరేకం go bad. Conversational English లో నిల్వ ఉండటం అనే అర్థంతో keep చాలా తరచుగా వాడుతుంటారు.

c) Tirupati Laddus keep for more than a week if you keep them in the fridge.
ఫ్రిజ్‌లో ఉంచితే, తిరుపతి లడ్డూలు వారంకన్నా ఎక్కువ రోజులుంటాయి.

d) Keep the vegetables in the fridge. They don't go bad.
కూరగాయల్ని ఫ్రిజ్‌లో పెట్టు. చెడిపోవు/ కుళ్లవు.

చెడిపోయి తినేందుకు పనికిరాని ఆహార పదార్థం = a bad food/ a bad food item.

a) చెడిపోయిన సాంబారు = bad sambar

b) She became sick after eating the bad curry.
చెడిపోయిన కూర తిని ఆమె వాంతి చేసుకుంది/ డోకేసింది.

**2) Go from bad to worse** = రానురాను అధ్వాన్నమవటం. మెరుగుపడకపోగా చెడుగా ఉన్న పరిస్థితి ఇంకా చెడుగా తయారవటం.

a) The performance of our team is going from bad to worse.
మనజట్టు ఆట రానురాను క్షీణిస్తోంది. మెరుగయ్యే బదులు.

b) The patient's condition, in spite of the doctor's efforts, is going from bad to worse.
డాక్టరు ఎంత ప్రయత్నిస్తున్నప్పటికీ రోగి పరిస్థితి అధ్వానంగా తయారవుతోంది, మెరుగవటానికి బదులు.

c) The boy is going from bad to worse.
ఆ కుర్రాడు నానాటికి చెడిపోతున్నాడు.

**3) Go broke** = దివాలా తీయటం/ అసలు డబ్బు లేని పరిస్థితి. ఇది చాలా common expression.

a) The company will soon go broke if it doesn't stop its bad investments.
ఆలోచనలేని పెట్టుబడులాపకపోతే ఆ కంపెనీ త్వరలోనే దివాలా తీస్తుంది.

b) Having put money in bad shares he has gone broke.
పనికిరాని షేర్లు కొని అతడు దివాలా తీశాడు/ పూర్తిగా నష్టపోయాడు/ డబ్బంతా పోగొట్టుకున్నాడు.

c) **Ramana:** What prompted the farmer's suicide?
(అతడిని ఆత్మహత్యకు పురికొల్పిందేమిటి?)

Prompt = పురికొల్పటం/ కారణమవటం

**Raghu:** The recent cyclone washed off his crop. He went broke upto his neck in debts, he took his life.
(ఈ మధ్య వచ్చిన తుపాను అతడి పంటను నాశనం చేసింది. పీకల్లోతు అప్పుల్లో కూరుకుపోయి, ఆత్మహత్య చేసుకున్నాడు.)

go broke అంటే డబ్బు అసలు లేకపోవటం అనే అర్థంతో, be broke అని కూడా అంటుంటాం.

a) **Kishore:** Can you lend me Rs. 100/-

**Krishna:** I am broke. In fact I was thinking of asking you.
(నా దగ్గర పైసాలేదు. అసలు నేనే నిన్నడగాలనుకుంటున్నా.)

be broke అంటే ఇక్కడ be బదులు ఏ be form అయినా, అంటే am/ is/ are, was/ were, will be/ shall be లాంటివి వాడవచ్చు.

b) The government is broke. It's unable to pay its employees.
ప్రభుత్వం దివాలా తీసింది. తన ఉద్యోగుల జీతాలు కూడా చెల్లించలేని స్థితి.

**4) Go too far** = విపరీత ధోరణి చూపటం/ ఆమోద యోగ్యమయిన దానికంటే మితిమీరటం.

a) **Suman:** He threatened to go to police if you trouble him again.
(మళ్లీ నువ్వేమన్నా అతడిని బాధిస్తే పోలీసులకు చెప్తానన్నాడు.)

**Sekhar:** That's going too far. We have been friends for such a longtime. Is it troubling him if I ask him to pay up?
(అది మరీ మితిమీరటం. మేం చాలా కాలంగా స్నేహితులం. డబ్బు తీసుకున్నది తిరిగి ఇమ్మంటే ఇబ్బంది పెట్టినట్లా?)

b) Dismissing the coach for the bad performance of the players is going too far.
(ఆటగాళ్లు బాగా ఆడనిదానికి కోచ్‌ను తొలగించటం, మరీ విపరీతమైన చర్య/ మరీ ఎక్కువ.)

c) **Varma:** I'll not talk to him any more.
(వాడితో నేనింక మాట్లాడను.)

**Sarma:** Isn't that going too far?
అది మరీ విపరీతం కదా. (అంటే అంత దూరం వెళ్లక్కర్లేదని)

**5) Go to hell:** ఇది విసుగు పుట్టినప్పుడు వాడే తిట్టు. ఏమైనాచేసుకో/ Get out అనే అర్థంతో ఇది conversation లో వాడే expression అయినప్పటికీ, కొంచెం జాగ్రత్తగా, పెద్దవాళ్లు గౌరవనీయులు ఉన్న సందర్భాల్లో వాడకూడనిది.

a) **Pradeep:** The exam is tomorrow. He is still not serious about it.
(రేపు పరీక్ష. వాడేం పట్టించుకోవట్లేదు.)

**Pramod:** let him go to hell. I've warned him enough. If he doesn't care, what am I to do. He is grown up enough to know what's good for him.
(వాడు నాశనమైపోనీ/ వాడేమయితే నాకేం?)

b) I warn you not to smoke again. If you still continue, go to hell. What do I care.
(smoke చెయొద్దని చెప్తున్నా. ఇంకా నువ్వు smoke చేస్తానంటే నీఇష్టం. నువ్వు నాశనమైతే నాకేంటి?)

c) **Sudheer:** I won't help you again.

**Damodar:** Go to hell. Who needs your help.
(పోవయ్యా. నీ సహాయం ఇక్కడ ఎవరికి కావాలి?)

ఇవీ Go తో చాలా తరచుగా వచ్చే conversational expressions కొన్ని, daily life situations లో ఇవన్నీ చాలా common. మీ conversation లో మీరువాడగల expressions. ఇవి వాడితే మీ conversation చాలా సహజంగా ఉంటుంది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# Indians go in for cricket a lot

**Rajat:** Have you been to the discount sale? Shirts and trousers and other men's wear are being offered at more than 50% off.

(Discount sale కు వెళ్లావా? Shirts, trousers మగవారి ఇతర బట్టలూ, 50 శాతం ధరకన్నా తగ్గించి అమ్ముతున్నారు.)

మనం మామూలుగా తప్పుగా pant అంటుంటాం. Pants అంటే కొంత ఫరవాలేదు.

Men's wear = పురుషుల దుస్తులు. మామూలుగా Gents' wear అంటుంటాం. ఇది modern English లో ఆమోదయోగ్యం కాదు. అలాగే Ladies/ ladies' wear కూడా present day English లో సరికాదు- Male, female లాగా. Modern usage లో పురుషులకు simple గా men అని, ఆడవారికి అంతే simple గా women అనటం మాత్రమే correct.

**Sarat:** I did have a look at them yesterday, but I observed nobody going for them.

(నిన్న నేను చూశాను, కానీ ఎవ్వరు కూడా వాటిని ఇష్టపడ్డట్లు లేదు.)

**Rajat:** I saw it too. Heaps of them and at rock bottom prices too. But they were all going abegging. A big crowd was there but there appeared to be no takers.

(నేనూ గమనించానది. గుట్టలు గుట్టలుగా పడి ఉన్న బట్టలు కారుచౌకగా అమ్ముతున్నప్పటికీ ఎవ్వరూ కొనటంలేదు. జనం బాగా ఉన్నారు కానీ కొనేవాళ్లెవరూ కనిపించలేదు.)

Rock bottom prices = కారుచౌక ధరలు.

Heap = గుట్ట.

No takers = ఇష్టపడేవాళ్లు లేరు/ కొనేవాళ్లు లేరు

**Sarat:** Didn't you buy anything? (నువ్వేం కొనలేదా? )

**Rajat:** You know I don't really going for such cheap stuff. Buying things just because they are a bargain goes against the grain.

(నీకు తెలుసుగదా, నేనలాంటి చౌకబారు వస్తువులు కొనేందుకు ఇష్టపడనని. చౌకగా వచ్చినంత మాత్రాన కొనటం అనేది నా స్వభావానికే విరుద్ధం.)

Stuff = ఏ వస్తువైనా. bargain అంటే మామూలు అర్థం బేరం అనీ, బేరంచేయటం అనీ. ఇక్కడ bargain అంటే మనం అనుకున్న ధరకంటే ఏదన్నా తక్కువకు వస్తే అది bargain.

**Sarat:** My brother too, to some extent. The other day he bought a pair of trousers for Rs. 850 !

(మా brother కూడా కొంతవరకు అంతే. మొన్నొకరోజు 800 రూపాయలు పెట్టి pants కొన్నాడు!)

A pair of trousers = ఒకటి మాత్రమే. మనం మామూలుగా pant అనేందుకు correct English- trousers. ఇది ఒకటి అని సంఖ్య చెప్పేటప్పుడు, a pair of అంటాం. అలాగే a pair of scissors = ఒక కత్తెర, scissor వాడరు.

**Rajat:** Rs. 800 ! come on, Sarat, Rs. 800 doesn't go far nowadays. A good pair of trousers in my opinion costs at least more than a thousand rupees.

(ఎనిమిది వందలేనా! చూడు శరత్, ఈ రోజుల్లో 800 రూపాయలేపాటి? నా అభిప్రాయం ప్రకారం మంచి trousers కు కనీసం వెయ్యి రూపాయల కంటే ఎక్కువే అవుతుంది.)

**Sarat:** You and my brother go too much by the cost of things. Not all costly things are good, are they?

(నువ్వు, మా brother ఖరీదైనవాటిని ఇష్టపడుతుంటారు. ఖరీదైన వస్తువులన్నీ మంచివికావు కదా? )

**Rajat:** Most often cheap things are certainly bad. Look, the sweater my sister bought for Rs. 250 is already going at the elbows in less than two months.

(చాలామటుకు చౌక వస్తువులు కచ్చితంగా నాసి రకమే. మా sister 250 రూపాయలకు కొన్న sweater అప్పుడే- రెండు నెలల్లోనే, మోచేతుల దగ్గర పాడవుతోంది.)

**Sarat:** I don't deny that. I just mean that expensive things are not always good.

(అది నేను కాదనటంలేదు. నేననేదల్లా ఖరీదైన వస్తువులు ఎప్పుడూ నాణ్యమైనవికావని.)

**Rajat:** I see your point.

(నువ్వనేది నాకర్థమయింది.)

☺ ☺ ☺ ☺

సర్వసాధారణమైన go, take, have, get తో వచ్చే expressions daily life situations లోని conversation లో ఎంత తరచుగా వస్తాయో గమనిస్తున్నాం.




ముఖ్య విషయం: conversational English కూ, bookish (రచనల్లో/ పుస్తకాల్లో వాడే) English కూ ఉన్న తేడా గమనించి, conversational English లో ఏ expressions, natural (సహజం)గా ఉంటాయో, వాటిని మన conversation లో భాగం చేసుకోవటం చాలా అవసరం. కొంత మనసు పెడితే సులభం కూడా. ఇప్పుడు go తో వచ్చే మరికొన్ని expressions చూద్దాం.

**1.** go for - దీన్ని మనం ఇంతకుముందు lessons లో చూశాం కదా- దీనికి ముఖ్యమైన అర్థం, ఎంపిక (choose) చేసుకోవటం అని.

**a)** When you buy a bike, go for one that gives good mileage =

నువ్వు bike కొనాలనుకుంటే, మంచి mileage ఇచ్చే bike ను ఎన్నుకో.

Go for అంటే ఒక ధరకు లభ్యమవటం అని కూడా.

**b)** His three hundred sq. yd. site goes for more than Rs. 80 lakh =

అతడి 300 చ.గ. స్థలం 80 లక్షల రూపాయలకు అమ్ముడవుతుంది/ అంత విలువ చేస్తుంది.

**c)** It doesn't go for more than Rs. 2000.

దాన్ని రెండువేల రూపాయలకంటే ఎక్కువకెవరు కొనరు.

**2.** ఇప్పుడు ఈ lesson లో go in for చూడండి. Go for, go in for- రెండింటికీ common అర్థం, ఎంపిక చేసుకోవడం/ select/ choose అని. అయితే go in for అంటే ఎంపిక చేసుకోవడమే కాకుండా పాల్గొనడం/ ఇష్టపడి అనుభవించటం (enjoy) అనే అర్థం కూడా ఉంది.

**a)** Indians go in for cricket a lot.

భారతీయులు cricket ను చాలా అభిమానిస్తారు/ ఆడతారు.

Go in for అంటే మన వృత్తిని ఎన్నుకోవడం కూడా.

**b)** Most youngmen and women go in for software jobs nowadays.

చాలామంది యువతీయువకులిప్పుడు software jobs నే ఇష్టపడుతున్నారు.

**c)** I don't know why he is going in for teaching when there are much better careers.

teaching కంటే మంచి jobs ఉండగా అతను teaching job ఎందుకు select చేసుకుంటున్నాడో అర్థంకావటం లేదు.

**3.** Go far = విలువ (ముఖ్యంగా డబ్బు) ఉండటం.

**a)** Rs. 100 doesn't go far nowadays.

ఈ రోజుల్లో వంద రూపాయలకు పెద్ద విలువేంలేదు.

**b)** A mere degree doesn't go far these days as far as good jobs are concerned.

ఉద్యోగాల విషయానికొస్తే, ఈ రోజుల్లో ఉత్త degree ఏమంత పనిచేయదు.

**4.** go by - దీన్ని కిందటి lesson లో చూశాం కదా- ఒకదాన్నిబట్టి పోవటం అని. దీని extended use చూద్దాం.

**a)** Appearance means a lot. Most people always go by appearances. ఎలా కనబడతాం అనేది ముఖ్యం. ఎక్కువమంది ఆకారాన్ని బట్టి పోతుంటారు (నిర్ణయానికి వస్తుంటారు).

**b)** Don't go by what he says.

అతడనేదాన్నిబట్టి పోకు. (అతడి మాటలు నమ్మొద్దు)


M. SURESAN

**5.** Go అంటే వెళ్లటం అనే మామూలు అర్థం మనకు తెలుసు. అయితే Go అంటే వస్తువులు చెడిపోవడం/ చిరిగిపోవటం అనే అర్థం కూడా ఉంది.

**a)** His jeans has started going at the knees = అతడి jeans మోకాళ్ల దగ్గర చిరగటం మొదలు పెట్టింది.

**b)** I bought the type only two months ago, but it is already going =

ఆ type నేను రెండునెలల కింద కొన్నాను, అప్పుడే అది చిరిగిపోతోంది.

**c)** The tube in the front room is gone =

front room లోని tube light చెడిపోయింది.

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson:**

**1.** I observed nobody going for them =

వాటిని ఎవరూ ఇష్టపడకపోవటం (కొనకపోవటం) గమనించాను.

**2.** They were all going abegging =

(ఏ వస్తువుకయినా) గిరాకీ లేకపోవటం/ ఎవరూ ఇష్టపడకపోవటం/ సేవకయినా అమ్మకం లేకపోవటం.

**a)** Seats in a number of engineering colleges are going abegging =

చాలా engineering colleges seats ఖాళీగా ఉన్నాయి, చేరేవాళ్ళెవరూలేక.

**b)** With most people going for fuel efficient bikes, scooters are going abegging =

చాలామంది ఇంధన పొదుపు కలిగించే bikes కొనటంతో scooters కొనేవారు లేరు/ scooter గిరాకీ పడిపోయింది.

**3.** I don't really go in for such cheap stuff =

చవకబారు వస్తువులంటే ఇష్టపడనని నీకుతెలుసుగదా.

**4.** Go against the grain = స్వభావానికి విరుద్ధం.

**a)** He is lazy. Working hard goes against the grain =

అతడు సోమరి. శ్రమించడం అతడి స్వభావానికి విరుద్ధం.

**b)** Helping others goes against his grain. He is too selfish =

ఇతరులకు సహాయపడటం అతడి ధోరణికి విరుద్ధం. అతడు మరీ స్వార్థపరుడు.

**5.** Rs. 800 doesn't go far nowadays =

ఈ రోజుల్లో 800 రూపాయలేపాటి?

go far, ఈ అర్థంతో ఎప్పుడూ not తోనే వాడతాం.

**6.** You and my brother go too much by cost =

నువ్వు, మా brother ధరను బట్టి నాణ్యత నిర్ణయిస్తారు.

**7.** The sweater my sister bought is going at the elbows =

మా sister కొన్న sweater మోచేతుల దగ్గర చిరుగుతోంది.

☺ ☺ ☺ ☺

Lesson 244 లో (నవంబరు 23న) ఇచ్చిన exercise కు model సమాధానాలు చూడండి. మీరు frame చేయాల్సిన sentences నమూనా. subject + verb + object + infinitive కదా. కొన్ని model sentences ఇప్పుడు చూడండి ఈ pattern లో.

**Sub vb obj infinitive**

**1.** The teacher told him to sit down.

**2.** He asked his mother to serve him food.

**3.** The boss ordered the clerk to finish the work.

**4.** His friend liked him to attend the function.

**5.** I request her to help me.

ఈ pattern లో ఇంకావచ్చే verbs: desire, advise, beg, invite, prompt, etc.

ఈ కింది pattern లో sentences practice చేయండి.

**Sub verb that clause**

**1.** He said that he would go

**2.** He will think that you are clever.

**ప్రశ్న:** *"కాని నిన్న మా అమ్మ తనను doctor దగ్గరకు తీసుకెళ్ళమంది" - ఇది మొత్తం past tense లో ఉందికదా. కాని మీరు- 'But my Mother wanted me to take her to the doctor' అని ఇచ్చారు. take అనేది- present tense కదా. ఇక్కడ Past tense "took" ఉపయోగించాలి కదా!*

***– జి.గోపి, అనంతపురం.***

**జవాబు:**

'But my mother wanted me to take her to doctor'- ఇక్కడ take (1st Regular Doing Word - I RDW) ముందు 'to' ఉంది కదా. to తర్వాత 1st Regular doing word వస్తే - to go, to come, to take లో లాగా, అవి verbs కావు. అవి అంటే to take, to go, to come, etc లాంటివి infinitives అవుతాయి. వాటికి tense ఉండదు, ఇలాంటిచోట్ల, to వేరేగా దాని తర్వాత వచ్చే go, come, take లాంటివాటిని వేరేగా తీసుకోం. ఒకటిగానే అంటే to come, to go, to take లాగానే తీసుకుంటాం. అవి infinitives. వీటి అర్థం, వాడకం, Spoken English lessons లో చాలాసార్లు వివరించాం. అర్థం: To take = తీసుకెళ్ళేందుకు/ తీసుకెళ్ళాలని/ తీసుకెళ్ళటం అని. To తర్వాత took అని Past form అసలురాదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Bhimesh:** Mukhesh, who are you waiting for?
(ఎవరికోసం చూస్తున్నావు?)

**Mukhesh:** For some one to help me in making arrangements for this function.
(ఈ function కు ఏర్పాట్లు చేయటంలో ఏదైనా సహాయం చేసేవాళ్లకోసం.)

**Bhimesh:** There isn't much to arrange. Can't you and the other volunteers go it alone?
(ఏం పెద్ద ఏర్పాట్లనీ? / ఎక్కువ ఏర్పాట్లేం లేవు. నువ్వు, ఇతర volunteers మీ అంతట మీరు చేసుకోలేరా?)

**Mukhesh:** Go it alone! Easier said than done. Take over and try to go it alone.
(మా అంతట మేం చేసుకోవాలా? చెయ్యటం కన్నా చెప్పటం సులభమే. నువ్వీ పని చేపట్టి నీఅంతట నువ్వు చేయటానికి ప్రయత్నించు.)

easier said than done = చేయటంకంటే చెప్పటం సులభం. ఇది చాలా common expression. మీ conversation లో practice చేయండి.

**Bhimesh:** (Do) you want me to do it? Now, that's too much.
(నన్ను చేయమంటావా? ఇది మరీ అతి.)

**Mukhesh:** Why not? What goes for you goes for me too, doesn't it?
(ఏం? నువ్వెందుకు చేయకూడదూ? నీకు వర్తించేది నాకూ వర్తిస్తుంది కదా?)

**Bhimesh:** I'm sorry. It does, of course. I see your point. I'll give you a hand certainly, and I'll even try to get a few more volunteers to help us.
(Sorry. నిజమే (నాకేది వర్తిస్తుందో, నీకు అదే వర్తిస్తుందనే విషయం). నువ్వనేది అర్థం చేసుకున్నాను. తప్పకుండా నీకు సహాయం చేస్తాను. ఇంకా ఇంకొంతమంది volunteers ను కూడా మనకు సాయం చేయటానికి తీసుకొస్తాను.)

**Mukhesh:** That's really good of you. Thanks.
(అది నీ మంచితనం. Thanks.)

**Bhimesh:** But why are you so tensed up?
(కానీ నువ్వెందుకంత ఆదుర్దా పడుతున్నావు?)

be tensed up = tension తో ఉండటం.

With the exam just a few hours away, he is tensed up =
కొన్ని గంటల్లో పరీక్ష ఉండటంతో అతను చాలా tension/ ఆదుర్దా పడుతున్నాడు.

**Mukhesh:** Perhaps I am, naturally. I'd go to any length to make the function memorable. I am straining every nerve and muscle to see it a success.
(బహుశా - అంతేనేమో (ఆదుర్దాగా ఉన్నానేమో). సహజమే. ఈ function చిరస్మరణీయంగా ఉండేందుకు అవసరమైందంతా/ ఎంతైనా చేయాలనుంది నాకు. ఇది విజయవంతమయ్యేట్టు చూడటానికి శ్రమపడుతున్నాను.)

To strain every nerve and muscle = ఒళ్లు దాచుకోకుండా శ్రమపడటం.

తెలుసుకదా - nerve = నవ్ (bird లో 'బ' లా) = నరం; muscle = మసల్ = కండరం.

Strain every nerve and muscle - ఈ expression కూడా మీ conversation లో practice చేయండి.

The father is straining every nerve and muscle to see his son a doctor =
తన కొడుకును doctor గా చూడాలని ఆ తండ్రి విపరీతంగా శ్రమపడుతున్నాడు.

**Bhimesh:** Why didn't you ask Mahesh too to help you?
(Mahesh ను కూడా నీకు సాయపడాలని ఎందుకడగలేదు?)

**Mukhesh:** I'd rather do without his help than get a 'no' from him.
(అడిగి చేయనని అనిపించుకునేదానికంటే, అతడ్ని అడగకుండా ఉండటమే మంచిదనుకుంటా.)

**Bhimesh:** Why don't you have a break, eat something and continue?
(కాస్త విశ్రాంతి తీసుకుని, ఏదో తిని, మళ్లీ కొనసాగించవచ్చు కదా?)

**Mukhesh:** Why 'something'? Let's go the whole hog and eat a full lunch. I am very hungry.
(ఏదో కొంత ఎందుకు? చేసేదేదో/ తినేదేదో పూర్తిగానే తిందాం. పూర్తి భోజనం చేద్దాం. నాకు చాలా ఆకలేస్తోంది.)

**Bhimesh:** That's ok with me- let's go.
(నాకు అంగీకారమే, వెళ్దాం పద.)

☺ ☺ ☺ ☺

మనం real life situations లో go తో వచ్చే simple, high frequency (చాలా తరచుగా వచ్చే) expressions పరిశీలిస్తున్నాం కదా, ఇప్పుడు మరికొన్ని చూద్దాం.







c) Not everything goes every where =
ప్రతిచోటా ప్రతిదీ చెల్లాలని లేదు.

d) In a democracy what goes for those in power should go for the ordinary citizen too =
ప్రజాస్వామ్యంలో అధికారంలో ఉన్నవారికేది చెల్లుబాటవుతుందో సామాన్య ప్రజలకూ అదే చెల్లుబాటు కావాలి.

**3. Go to any length** = ఎంతకైనా వెనకాడకపోవటం.

a) I'd go to any length to do MBA in one of the IIMs =
IIMs (Indian Institutes of Management) లో ఏదో ఒకదానిలో MBA చేయటానికి కెంతకయినా వెనకాడను.

c) He went the whole hog, if he goes on a holiday; he enjoys a lot. =
ఎక్కడికయినా సరదాగా సెలవులు గడపడానికి వెళ్లినపుడు పూర్తిగా ఆనందిస్తాడు.

**5. Go by** = కిందటి lesson లో దీనికి మనం తెలుసుకున్న అర్థం- దాన్నిబట్టి. going by his words = వాడి మాటల్ని బట్టి చూస్తే.

go by కి ఇంకో అర్థం- నమ్మటం.

Don't go by his words = వాడి మాటల్ని బట్టి వెళ్లొద్దు/ నమ్మొద్దు అని.

Go by అంటే ఆ దారిన వెళ్లటం అనే అర్థం కూడా ఉంది.

a) He goes by my home everyday =
ప్రతిరోజూ మా ఇంటి మీదుగా వెళతాడు.

# Politicians go to any length to get ..

**1. Go it alone** = ఇతరుల సాయం లేకుండా ఎవరైనా తమంతట తామే చేసుకోవటం.

a) Her daughters do not help her in cooking. She won't let them. She goes it alone =
ఆమె కూతుళ్లామెకు వంటలో సాయం చేయరు. ఆమె వాళ్లను తనకు సాయం చేయనివ్వదు. తానే ఒంటరిగా చేసుకుంటుంది.

b) Fed up with the attitude of his sons and daughters-in-law, the old widower is going it alone and is happy =
తన కొడుకుల, కోడళ్ల వైఖరితో విసిగిపోయి, ఆ పెద్దాయన (భార్యలేని వ్యక్తి) ఒంటరిగా బతుకుతున్నాడు, సంతోషంగా.

be fed up with = విసిగిపోవటం.

I am fed up with these TV serials =
TV serials తో విసిగిపోయా.

c) After having worked in a number of companies, I want to go it alone =
చాలా companies లో పనిచేసిన తర్వాత సొంతంగా (ఒంటరిగా) ఏదైనా చేసుకోవాలని ఉంది.

d) Do you need help or will you go it alone?
నీకేమన్నా సాయం కావాలా, లేకుంటే నీ అంతట నువ్వే చేసుకుంటావా?

**2. go** - మామూలు అర్థం- వెళ్లటం.

ఇంతకు ముందు lessons లో మనం చూసింది- సరిపోతుంది అనే అర్థంతో.

Anything goes in politics =
రాజకీయాల్లో ఏం చేసినా చెల్లుతుంది/ సరిపోతుంది.

Any shirt goes with this pair of trousers =
ఈ pants (ఒకటి)తో ఏ shirt అయినా సరిపోతుంది.

Whatever he says goes =
అతడేం చెప్పినా చెల్లుతుంది.

ఇప్పుడు go ఇంకో అర్థం చూద్దాం. అది- 'వర్తించడం'.

a) What goes for men should go for women too =
మగవాళ్లకు వర్తించేది ఆడవాళ్లకు కూడా వర్తిస్తుంది. (అంటే- స్త్రీ, పురుషులు సమానమే.)

b) What goes in AP need not go in Tamilnadu = AP లో చెల్లేదీ/ ఆమోదమయ్యేదీ/ అనువర్తించేది Tamilnadu లో వర్తించనవసరం లేదు.


M. SURESAN

b) Politicians go to any length to get to positions of power =
అధికారం చలాయించగల పదవుల కోసం రాజకీయ నాయకులు ఎంతకైనా వెనకాడరు/ ఎంత ప్రయత్నమైనా చేస్తారు.

c) She'll go to any length to secure the house.
ఆ ఇల్లు పొందటానికి ఆమె ఏమైనా చేస్తుంది.
దేనికోసమైనా ఏమైనా చేయటానికి సిద్ధపడటం - going to any length.

**4. Go the whole hog** = ఏ పనినైనా అరకొరగా కాకుండా పూర్తిగా, క్షుణ్నంగా చేయటం.

a) He doesn't believe in doing things in halves, he goes the whole hog =
అతడు ఏ పనైనా అరకొరగా చేయడు. పూర్తిగా క్షుణ్నంగా చేస్తాడు.

b) Why don't we go the whole hog? Let's buy the best bike in the market.
చేసేదేదో పూర్తిగా చేద్దాం. అలాంటి ఇలాంటి bike కొనటం ఎందుకు? Market లో ఉన్న అత్యుత్తమ bike కొందాం.

b) I go by the post office when I go to college = college కి post office మీదుగా వెళతా.

c) Ganesh went by without even talking to me = నాతో మాట్లాడనైనా మాట్లాడకుండా గణేష్ నా ముందు నుంచే/ పక్కనుంచే వెళ్లాడు.

d) Time గడవటం కూడా go by.

i) Years go by in no time = సంవత్సరాలు ఇట్టే గడిచిపోతాయి.

ii) Two years have gone by since we got married = మా పెళ్లయి రెండేళ్లయింది.

చివరగా ఇది చూడండి.

**Give (somebody) a hand** = ఒకరికి సహాయం చేయటం/ చేయూత ఇవ్వటం. ఇదే అర్థంతో Lend a hand అని కూడా అంటారు.

I am unable to move this box. Please give a hand =
ఈ పెట్టెను జరపలేకుండా ఉన్నా. కాస్త సాయంపట్టు.

అయితే give a hand తెలుగు అనువాదం- చెయ్యివ్వటం అంటే సాయం చేయకపోవటం/ మాట నిలబెట్టుకోకపోవటం అని కదా. దీనికి పూర్తిగా వ్యతిరేకం, give a hand, అర్థం అని తెలుస్తోంది కదా.

Please give me a hand with the preparation of this list =
ఈ జాబితా తయారీలో కాస్త సాయం చేయండి.

Lend us a hand in helping the differently abled =
వికలాంగులకు సాయపడటంలో మాకు తోడ్పడండి.

**Exercise**

**Practise the following aloud in English.**

**Akhil:** కాస్త సాయం చేయమంటావా?

**Nikhil:** అక్కర్లేదు. నేనొంటరిగా చేయగలన్లే.

**Akhil:** ఆ పని ఒక్కరికి చాలా ఎక్కువ. నా సాయం తీసుకో.

**Nikhil:** ఏమిటంత ఆసక్తి చూపిస్తున్నావు?

**Akhil:** నీకు తెలియదా? స్నేహితులకు సాయం చేయడానికి నేనెంతకూ వెనకాడనని?

**Nikhil:** అలాగా? Thank You.

**Akhil:** ఇద్దరం ఏదో విధంగా పూర్తిచేద్దాం ఆ పని.

**Nikhil:** అరకొరగా చేయటం నాకిష్టంలేదు. చేస్తే సజావుగా చేద్దాం.

**Akhil:** అలాగే.

**Answer**

**Akhil:** Shall I give you/ lend you a hand (with it)?

**Nikhil:** Not necessary. I can go it alone.

**Akhil:** The work is too much for one man, take a hand.

**Nikhil:** Why so much interest in helping?

**Akhil:** Don't you know that I go to any length in helping friends?

**Nikhil:** Is that so? Thank you.

**Akhil:** Let's finish off the work some how.

**Nikhil:** I don't like to go things in halves. I'd go the whole hog.

**Akhil:** OK.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



**Damodar:** Hi Sudhakar, what's new?
(హాయ్ సుధాకర్, ఏంటి విశేషాలు?)

**Sudhakar:** Yes. I've something of interest for you. The man who burgled Sudha's place a week ago has given himself up to the police.
(అవును. నీకాసక్తి కలిగించే సమాచారమే. Sudha ఇంటికి కన్నంవేసి దొంగతనం చేసిన మనిషి పోలీసులకు లొంగిపోయాడు.)

Burgle = ఇంటికి కన్నం వేసో, తాళాలు పగలగొట్టో లోపలికి ప్రవేశించి దొంగతనం చేయటం. Burgler = అలా చేసే దొంగ.

**Damodar:** That's real news. Have they recovered anything from him?
(వాడి దగ్గర్నుంచి వస్తువులు ఏమన్నా రాబట్టారా?)

**Sudhakar:** I'm afraid only half the stuff. He has sold off the rest.
(సగం మాత్రమే అనుకుంటా. మిగతాది వాడమ్మేశాడు)



(అలాంటిదేంలేదు. వాళ్లేదో పెద్దగొప్ప పని చేశారనుకొని నువ్వేం మెచ్చుకోనక్కరలేదు. సుధకు వచ్చిందల్లా తను పోగొట్టుకున్న దాన్లో సగం మాత్రమే.)

Nothing of the sort = అలాంటిదేం లేదు. sort = రకం. Men of all sorts = అన్ని రకాల మనుషులు.

**Damodar:** But you must give the devil its due. It's only because they turned the heat on, the thief gave himself up. Sudha wouldn't have got back even half those things which she has got now.
(దేనికదే చెప్పుకోవాలి. ఏదో ఆ పోలీసులు సెగపెట్టటం వల్లనే కదా దొంగ లొంగిపోయాడు. లేకుంటే సుధకు ఇందులో సగమైనా వచ్చేవి కావు.)

Turn the heat on = సెగ పుట్టించటం/ వేడి పుట్టించటం/ ఒత్తిడి తేవటం.

The heat is on. We've to finish the work by the evening = ఒత్తిడి ఎక్కువవుతోంది. (ఇతరుల నుంచి/ అధికారుల నుంచి) సాయంత్రం లోపల పని పూర్తిచేయాలి.

The police have turned the heat on the Maoists. They are on the run = పోలీసులు మావోయిస్టులపై ఒత్తిడి పెంచారు. వాళ్లు పారిపోతున్నారు (స్థావరాలు వదిలి).

# Give her a big hand ..

**Damodar:** That is unfortunate. Sudha gave up hopes of getting her stolen articles back. She must be happy now.
(అది దురదృష్టకరం. దొంగిలించిన వస్తువులొస్తాయనే ఆశ వదులుకుంది సుధ. ఇప్పుడు సంతోషపడుతుండాలి.)

**Sudhakar:** Not quiet. The more valuable things are gone.
(అంతేం లేదు. ఎక్కువ విలువైన వస్తువులు పోయాయి.)

**Damodar:** The police seem to have given a good account of themselves in acting so fast, and catching the thief.
(చాలా త్వరగా స్పందించి, దొంగను పట్టుకోవటంలో పోలీసులు గొప్ప పనే చేసినట్టున్నారు.)

**Sudhakar:** I don't give any credit to them for that. The thief had an accident and no longer was able to be on the run. So he surrendered to the police. The police are just giving themselves airs.
(ఈ విషయంలో పోలీసుల ఘనతేం లేదు. దొంగకేదో యాక్సిడెంట్ అయ్యి, పారిపోలేక పోలీసులకు లొంగిపోయాడు. వాళ్ళేదో తాము సాధించినట్టు గర్వపడిపోతున్నారు.)

**Damodar:** I thought that the thief had given himself up because they had given him good chase. I have thought of giving the police a pat on the back.
(పోలీసులు వెంటబడి తరమటంవల్ల లొంగిపోయాడనుకొని, వాళ్లను మెచ్చుకోవాలనుకొన్నాను.)

chase - చెయ్‌స్ - స్ - size లో z లా = తరమటం.

**Sudhakar:** Nothing of the sort. You needn't give them a big hand as they haven't done any splendid job. What Sudha got back is just a part of her stolen goods.

Turn the heat on, the heat is on - ఈ రెండూ పై అర్థాలతో చాలా ఉపయోగకరమైన expressions. మీ conversation లో బాగా ఉపయోగించండి.

On the run = చట్టం నుంచి/ శత్రువుల నుంచి పారిపోవటం.

**Sudhakar:** The police really deserve appreciation for that. They are giving it their best shot. The other state governments are seeking guidance from A.P. Police in the matter.
(పోలీసులు నిజంగా ఈ విషయంలో మన మెప్పుదలకు అర్హులే. మావోయిస్టుల విషయంలో వాళ్లు అత్యుత్తమమైన ప్రయత్నం చేస్తున్నారు. మిగతా రాష్ట్ర ప్రభుత్వాలు మన పోలీసుల నుంచి సలహాల కోసం చూస్తున్నాయి.)

**Damodar:** O.K. Time for my office. I must be going. (ఆఫీసుకు వేళయ్యింది. నేవెళ్లాలి.)

**Sudhakar:** O.K.

☺ ☺ ☺ ☺

ఈసారి మనం మామూలు conversation లో give తో వచ్చే high frequency expressions చూద్దాం.

**1. give one self up** = స్వచ్ఛందంగా లొంగిపోవటం (ముఖ్యంగా పోలీసులకు)

**a)** On the run for the last two months, the thief gave himself up (to the police) =
గత రెండు నెలలుగా తప్పించుకు తిరుగుతున్న దొంగ లొంగిపోయాడు (పోలీసులకు).

**b)** Though innocent, she gave herself up =
ఆమె నిరపరాధి అయినా పోలీసులకు/ శత్రువులకు లొంగిపోయింది.

**c)** The rebels will give themselves up if their arms supply is cut off =
ఆయుధాల సరఫరా నిలిపివేస్తే, తిరుగుబాటుదార్లు లొంగిపోతారు.


M. SURESAN

Rebel = తిరుగుబాటుదారుడు/ తిరగబడటం.

He was a rebel all his life = తన జీవితమంతా తిరుగుబాటు దారుడిగానే గడిపాడు.

They are sure to rebel against the new law.
(ఈ కొత్త చట్టానికి వ్యతిరేకంగా వాళ్లు తప్పక తిరగబడతారు)

**2. give up** = వదిలేయటం/ మానుకోవటం.

**a)** He hasn't given up his job in spite of failing health =
ఆరోగ్యం దెబ్బతింటున్నప్పటికీ, అతడు ఉద్యోగం మానుకోలేదు.

**b)** Don't give up your attempts, you will succeed =
నీ ప్రయత్నాలు మానుకోకు, విజయం పొందుతావు.

**c)** I am unable to find a solution. I give up.
దీనికి సమాధానం కనుక్కోలేకపోతున్నాను. నేనా ప్రయత్నం మానుకుంటున్నాను.

**3. give a big hand** = మెచ్చుకోవడం (చప్పట్ల ద్వారా) - ముఖ్యంగా ఎవరైనా వేదికమీద చూపించిన ప్రతిభకు ప్రేక్షకులు కరతాళధ్వనులతో అభినందించడం.

**a)** They all gave him a big hand for his excellent singing =
అతడు గొప్పగా పాడినందుకు వాళ్లందరూ చప్పట్లు కొట్టారు.

**b)** Give her a big hand please. Her dance was great =
చప్పట్ల ద్వారా ఆమెను అభినందించండి. ఆమె నాట్యం చాలా గొప్పగా ఉంది.

**4. Give a pat on the back** =
ప్రోత్సాహకరంగా బుజ్జగించి వెన్నుతట్టడం.

**a)** The teacher gave him a pat on the back for his high score =
మార్కులు బాగా వచ్చినందుకు teacher అతడి వెన్నుతట్టింది.

**b)** Let's give her a pat on the back. She has tidied up the home so neatly =
ఇల్లంతా శుభ్రంగా సర్దింది. భుజం తడదాం (మెచ్చుకుందాం).

**5. Give a good account of oneself** =
ఒక పని చాలా బాగా చేయటం.

**a)** Dhoni gave a good account of himself in today's game =
ఈనాటి ఆటలో ధోనీ చాలా గొప్పగా ఆడాడు.

**b)** Give a good account of yourself in the exam. I'll present you a bike = నువ్వు పరీక్షలు బాగా రాయి. నీకు ఒక bike కానుకగా ఇస్తా.

**c)** Indians haven't been giving a good account of themselves in the matches =
పోటీల్లో భారతీయులు సరిగా ఆడటంలేదు.

ఇవీ give తో మామూలుగా వచ్చే కొన్ని expressions. ఈ కింది pattern లో sentences practice చేయండి.

| Sub | verb | obj | that clause |
|---|---|---|---|
| They | will tell | her | that she is not correct. |



**ప్రశ్న:** *1. He learnt to care for creatures smaller than himself - అనే వాక్యంలో himself వాడటం కరెక్టేనా?*

*2. Tag questions లో have, has, had లను possess అనే అర్థంలో ఉపయోగించినప్పుడు అవే రూపాలు tag లో కూడా వస్తాయి కదా. వీటిని ఎప్పుడు ordinary verbs గా తీసుకోవాలి?*

ఉదా: *He had fish for breakfast, didn't he?*

ఇలా *'have'* రూపాలకు *question tag* లో *'do'* రూపాలు ఎప్పుడెప్పుడు వాడాలి?

*3. He may come, He daren't do that లకు tag questions తెలుపగలరు.*

*4. a) To get an entry into the hall, either you have to buy a ticket or you have to give a donation.*

*b) To get an entry into the hall, you have either to buy a ticket or give a donation. (Split infinitive)*

పై వాక్యాల్లో ఏది కరెక్టో తెలుపగలరు.

– *ఇ.వి.సింధూర, ఇ.వి.ఎస్.దీపక్, తాడిపత్రి.*

**జవాబు:**

**1.** Correct (తనకన్నా అనే అర్థంతో)

**2.** ఇది చాలా మంచి question. Have, has, had కు possess, possesses, possessed అనే అర్థాలు వచ్చినప్పుడు రెండు రకాలా వాడవచ్చు: a) haven't...? b) don't...? 2 a) hasn't he/ she/ it? b) doesn't he/ she/ it? 3 a) hadn't ... ? b) didn't ... ?

పైన 1 a), 2 a), 3 a) - British; 1 b), 2 b), 3 b) American.

eg: 1 a) They have the books, haven't they? (British)
b) They have the books, don't they (American)
2 a) She has a pen, hasn't she? (British)
b) She has a pen, doesn't she? (American)
3 a) He had a good education, hadn't he? (British)
b) He had a good education, didn't he? (American). ఇదే పద్ధతి not తో కూడా. అయితే రాను రాను American usage ఎక్కువవుతోంది.

**3.** He may come, mayn't he?
He daren't do that, dare he?

**4.** b) Correct. Split infinitive ఈ sentence లో లేదు. to buy or (to) give a donation - ఇక్కడ infinitives లోని to కు Buy కి మధ్యకానీ, to కు give కు మధ్యకానీ ఏ మాటా లేదుకదా. ఉంటేనే split infinitive అవుతుంది.

eg. for split infinitive: I request you to kindly help me. ఇక్కడ to కు help కు మధ్య kindly వాడటం వల్ల అది split infinitive.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# I gave them a bit of my mind





M. SURESAN

**Pranesh:** Hi Viswesh, have you met Srikar yet?
(హాయ్ విశ్వేశ్, శ్రీకర్‌ను కలుసుకున్నావా?)

**Viswesh:** No, I haven't been able to. I called his brother Tej but there wasn't any response.
(లేదు. కలుసుకోలేకపోయాను. వాడి తమ్ముడు తేజ్‌కు ఫోన్ చేశాను. పలకలేదు.)

**Pranesh:** You'd better do it as soon as possible. Your silence any longer is likely to give rise to avoidable suspicions.
(అది నువ్వెంత త్వరగా చేస్తే అంత మంచిది. నువ్వు ఇంకా మాట్లాడకపోతే రానవసరంలేని సందేహాలు రావచ్చు.)

is likely - is బదులు ఇంకే 'be' form అయినా వాడవచ్చు. ఇంతకుముందు చాలాసార్లు వివరించాం. is likely కి అర్థం - అవ్వచ్చు

He is likely to come today = అతనివాళ రావచ్చు/ వచ్చే అవకాశం ఉంది.

Avoidable = తప్పించగల/ అనవసరమైన)

**Viswesh:** That I know only too well. These few days I've been busy helping my brother in law pack up for his return to the states. I gave him the send off last night.
(అది నాకు బాగా తెలుసు. రెండుమూడు రోజులుగా మా బావ అమెరికాకు తిరిగి వెళ్లడానికి సామాను సర్దడంలో సాయపడుతూ తీరికలేకుండా ఉన్నాను. నిన్నరాత్రి ఆయనకు వీడ్కోలిచ్చాను.)

**Pranesh:** That makes you free, I suppose. You'd better make Srikar or Tej first. But what do you want to meet them for? I don't exactly remember.
(ఇప్పుడు నీకు తీరికనుకుంటాను. శ్రీకర్‌ను గానీ, తేజ్‌నికానీ వెంటనే కలుసుకో. అసలు నువ్వు వాళ్లతో ఎందుకు మాట్లాడాలనుకుంటున్నావు? నాకు సరిగా గుర్తులేదు)

**Viswesh:** It was my fault. I gave them a hard time when they were with me. In a way I was justified. They gave vent to their feelings against my brother and I didn't like it. So I gave them a bit of my mind. But you know, I am always the forget and forgive type. So I want to make it up with them.
(అది నా తప్పే. వాళ్లు నాతో ఉన్నప్పుడు వాళ్లకు నేను ఇబ్బంది కలిగించా. ఒక విధంగా నేనక్కడ సబబే. మా అన్నమీద వాళ్లకున్న వ్యతిరేకభావం వ్యక్తపరిచారు. నాకది ఇష్టంలేకపోయింది. అందుకని నా మనసులో ఉన్నదంతా నిర్మొహమాటంగా చెప్పా. అయితే నీకు తెలుసుగా గతం మర్చిపోయి క్షమించేతత్వం నాదని/ గతం మర్చిపోయి క్షమించే రకం నేనని. అందుకని వాళ్లతో సర్దుకుపోవాలనుకుంటున్నా.)

**Pranesh:** That's very good. They aren't all that bad either. I am sure your strained relations will give way to unending friendship between you.
(వాళ్లుకూడా అంత చెడ్డవాళ్లుకారు. ఇప్పటివరకు మీమధ్య సరిగాలేని సంబంధాలు ఇకపై నిరంతర స్నేహానికి తావివ్వాలని ఆశిస్తున్నాను.)

strained relations = చెడిన సంబంధాలు

A strained marriage = భార్యాభర్తల మధ్య సంబంధాలు సరిగా లేకపోవటం.

**Viswesh:** That's what I wish too.
(అదే నా కోరిక/ ఆశ కూడాను.)

మనం ఇంతవరకు real life situations లో తరచుగా వచ్చే simple words అయిన get/ have/ do/ go లాంటితో వచ్చే expressions పరిశీలిస్తున్నాం కదా. ఇప్పుడు చాలా సాధారణమైన give తో వచ్చే expressions చూద్దాం.

**1. Give rise to** = తావివ్వటం/ దేనికైనా కారణమవటం

**a)** His absence from the marriage gave rise to a lot of suspicion
అతడు పెళ్లికి రాకపోవటం చాలా అనుమానాలకు తావిచ్చింది/ చాలా అనుమానాలను రేకెత్తించింది.

**b)** అతడి వ్యాఖ్యలు ఎప్పుడూ వివాదాలను కలిగిస్తాయి.
His comments always give rise to controversy.
controversy = కాన్ట్రొవసి - 'న్ట్రొ' నొక్కి పలుకుతాం - వివాదం.

**c)** An argument always gives rise to further arguments but doesn't solve any problem.
వాదం ఇంకొన్ని వాదాల్ని రేకెత్తిస్తుందేకానీ, సమస్యలను తీర్చదు.

**2. Give a send off** = వీడ్కోలు ఇవ్వటం.

**a)** Transfer అయిన teacher కు విద్యార్థులు అభిమానంతో వీడ్కోలిచ్చారు = The students gave a warm send off to the transferred teacher.
(warm = వామ్ - మామూలు అర్థం వెచ్చటి. కానీ warm welcome/ warm send off = ఆపేక్ష ఆదరాభిమానాలతో కూడిన స్వాగతం/ వీడ్కోలు)

**b)** A moving send off = దుఃఖంతో వీడ్కోలు.
(Moving - మామూలు అర్థం - కదులుతున్న. Moving అంటే ఇంకో అర్థం - హృదయాన్ని కదిలించే - అని కూడా.
The moving tale of Sita = హృదయాన్ని కదిలించే సీత (రాముడి భార్య) కథ.

**c)** She gave her husband a moving send off at the station
ఆమె తన భర్తకు కన్నీళ్లతో వీడ్కోలిచ్చింది.

**d)** Give a send off = see off.
వీడ్కోలివ్వటం అనే అర్థంతో see (somebody) off అని కూడా అంటాం.

**e)** We saw her off at the airport as she left for the states
ఆమె అమెరికాకు వెళ్లినప్పుడు మేం ఆమెకు విమానాశ్రయంలో వీడ్కోలిచ్చాం.

**3. Give a hard time** = ఇబ్బందులు కలిగించటం/ కఠినంగా చూడటం.

**a)** Most mothers-in-law give their daughters-in-law a hard time
చాలా మంది అత్తలు కోడళ్లపట్ల కఠినంగా ఉంటారు/ ఇబ్బందులు కలిగిస్తారు/ వేధిస్తారు.

**b)** The teacher gave a real hard time to the students by asking them to work beyond time
కాలాతీతమైనా చదవాలంటూ పిల్లలను ఇబ్బంది పెట్టాడు teacher.

**c)** The British gave Indian freedom fighters a hard time
భారత స్వాతంత్ర్య యోధులను బ్రిటిష్‌వాళ్లు చాలా ఇబ్బంది పెట్టారు/ వేధించారు.
మరీ నరకయాతన పెట్టడం అయితే give hell అంటారు.

**d)** The British gave real hell to Bal Gangadhar Tilak
బ్రిటిష్‌వాళ్లు బాలగంగాధర్ తిలక్‌ను నరకయాతన పెట్టారు. (hell = నరకం)

**4. Give vent to one's feelings** =
ఒకరి భావాలను వ్యక్తపరచటం - ముఖ్యంగా కోపం లాంటి తీవ్రమైన భావాలను వెళ్లగక్కటం.

**a)** He gave vent to his anger at the party
ఆయన పార్టీలో తన కోపాన్ని వెళ్లగక్కాడు.

**b)** Mature people don't give vent to their feelings without proper occasion
పరిపక్వత ఉన్నవాళ్లు, సరైన సందర్భాల్లో తప్ప తమ భావాలను వెళ్లగక్కరు.

**c)** She gave vent to her jealousy
ఆమె తన అసూయను వెళ్లగక్కింది.

**5. Give way** = ఒక దశ నుంచి ఇంకో దశకు మారటం.

**a)** On hearing the news his joy gave way to anger
ఆ వార్త వినగానే సంతోషం పోయి, అతడిలో కోపం చోటుచేసుకుంది.

**b)** With her mediation their ill feelings gave way to good understanding
ఆమె మధ్యవర్తిత్వంతో వాళ్ల ద్వేషం పోయి సదవగాహన ఏర్పడింది.

Mediation = మధ్యవర్తిత్వం.
Mediator = మధ్యవర్తి.
Mediator = మీడియేయ్‌ట (ర్).
'యె' నొక్కి పలుకుతాం.

**c)** All over India steam trains have given way to electric and diesel trains
భారతదేశమంతటా, ఆవిరి trains పోయి, వాటి స్థానంలో electric, diesel trains వచ్చేశాయి.

**d)** Typewriting has given way to DTP = Typewriters పోయి వాటి స్థానంలో Computer Printing వచ్చేసింది.
(DTP = Desk Top Publishing = కంప్యూటర్ సాయంతో అప్పటికప్పుడే ప్రచురించే సౌకర్యం)

**Let's now look at the following sentences from the conversation at the beginning of the lesson:**

1. Your silence any longer is likely to give rise to avoidable suspicions =
నీవు ఇంకా మాట్లాడకపోవటం (your silence) అనవసరమైన సందేహాలకు దారితీస్తుంది.

2. I gave him a send off last night
నిన్న రాత్రి అతడికి నేను వీడ్కోలిచ్చాను.
(I saw him off last night. Give a send off కన్నా see off (వీడ్కోలు చెప్పటం అనే అర్థంతో) వాడకం ఎక్కువ.)

3. I gave them a hard time when they were with me
వాళ్లు నాతో ఉన్నప్పుడు వాళ్లకు ఇబ్బందులు కలిగించాను/ ఇబ్బందిపెట్టాను/ వేధించాను

4. I want to make it up with them
వాళ్లతో నేను రాజీపడాలనుకుంటున్నాను

5. I gave them a bit of my mind
వాళ్లకు నా మనసులో ఉన్నది చెప్పేశాను- ముఖ్యంగా నా భావాలను కుండబద్దలు కొట్టేలా ఉన్నదున్నట్లు తెలిపాను (ముఖ్యంగా నా కోపం).
Let me give you a bit of my mind. The sooner you leave me the better
నా మనసులో ఉన్నది చెప్పనీ, నువ్వెంత త్వరగా ఇక్కడి నుంచి వెళితే అంత మంచిది (Get out అని).

6. I am sure your strained relations will give way to unending friendship
మీ దెబ్బతిన్న సంబంధాల స్థానంలో నిరంతరమైన స్నేహం చోటుచేసుకుంటుందని నమ్ముతున్నా.

### EXERCISE

**Practise the following aloud in English:**

**Sita:** ఏంటి మీరంత కులాసాగా కనిపించటంలేదు? నాకేదో ఆదుర్దాగా ఉంది.
**Rao:** ఏం లేదు. బాగానే ఉన్నాను.
**Sita:** ఏదో దాస్తున్నారు. మీరు మాట్లాడకపోవటం పలు సందేహాలకు తావిస్తోంది.
**Rao:** ఇందిర ఎక్కడ?
**Sita:** అల్లుడికి వీడ్కోలివ్వటానికి స్టేషన్‌కు వెళ్లింది.
**Rao:** మన అల్లుడు చాలా మంచివాడు. ఇందిరను ఎప్పుడూ బాధపెట్టడు. (give a hard time వాడండి)
**Sita:** ఆ విధంగా మనం అదృష్టవంతులమే. నిన్న ఏదో కొద్దిగా కోపం వచ్చింది, కానీ కోపం స్థానంలోనే చిరునవ్వు వచ్చేసిందాయనకు.
**Rao:** నిజంగా మంచివాడే ఆయన.
**Sita:** మీరు చెప్పండి. మనం డాక్టర్ దగ్గరకు వెళ్దామా?
**Rao:** నా మనస్సులో ఉన్నది చెబుతున్నా. నాకేం కాలేదు. నువ్వు డాక్టర్ గురించి ఎంత తక్కువగా మాట్లాడితే అంత మంచిది.

### ANSWER

**Sita:** You don't appear to be so well. I am a bit anxious.
**Rao:** Nothing's the matter. I am OK.
**Sita:** You are hiding something. Your silence is giving rise to many suspicions.
**Rao:** Where is Indira?
**Sita:** She has gone to station to give a send off to our son-in-law. (ఇక్కడ our son-in-law కంటే her husband, better.)
**Rao:** He is quite nice. He never gives a hard time to Indira.
**Sita:** That way we are lucky. He was a little angry yesterday, but soon the anger gave way to a smile.
**Rao:** He is really a good man.
**Sita:** Come now tell me. Shall we see a doctor?
**Rao:** Let me give you a bit of my mind. The less you talk about a doctor, the better.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 255

**Prabhav:** What's happened to you all these days? (You're) not to be seen at all.
(ఇన్ని రోజులూ ఏమయ్యావు నువ్వు? / ఏమైంది నీకు? - ఇది తెలుగులో అంత సరైన పలకరింపు మాటకాదు. అసలు కనిపించడంలేదు)

**Vibhav:** (I've) been very much here only. I've been very busy preparing for my Civils.
(ఇక్కడే ఉన్నాను. సివిల్స్‌కు తయారవుతూ తీరికలేకుండా ఉన్నాను. అంతకంటే ఏంలేదు.)

ఇక్కడ only, అంటే the only thing is కు shortform. అర్థం - అంతకంటే ఏంలేదు - అని. Civils = Civil services exams = IAS, IPS వంటి పరీక్షలు.

వివిధ సందర్భాల్లో వాడే standard expressions చూస్తున్నాం కదా. కిందటి lesson లో అభినందించటానికి (congratulate) కు, ప్రోత్సహించటానికి (encouraging) కు సంబంధించిన expressions తెలుసుకున్నాం.

ఈసారి మనం ఒకరిని దేనికైనా పిలవటానికి/ ఆహ్వానించటానికి, అందుకు సంతోషం తెలియజేసి పిలుపును అందుకోవటానికి వాడే expressions తెలుసుకుందాం.

ఒకరిని పిలవటానికి/ ఆహ్వానించటానికి వాడే standard expressions:

ఇక్కడ కూడా మనకు బాగా చనువూ, స్వతంత్రం ఉన్న వాళ్లను పిలవటానికి, అంటే మనం informal గా ఉండే వాళ్లను పిలిచేందుకు (ఆహ్వానించేందుకు) వాడే expressions కూ, మనం అంత స్వతంత్రం, చనువు తీసుకోలేని, మర్యాద బాగా చూపాల్సిన అంటే formal సందర్భాల్లో వాడే expressions కూ చాలా తేడా ఉంటుంది. అవి వేరూ, ఇవి వేరూ. మొదట మనం స్వతంత్రం తీసుకోగలిగి, చనువుగా ఉన్నవాళ్ల విషయంలో, అంటే informal situation లో వాడే expressions చూద్దాం.

e) If you don't mind =
మీకు అభ్యంతరం లేకపోతే/ మీరేమనుకోకపోతే

5. ఇంకా formal invitation - బాగా మర్యాద పూర్వకమైన పిలుపులు:

a) We should/ We'd like to have the pleasure of your company/ presence at the meeting tomorrow =
మీరు రేపు meeting కు తప్పక రావాలని మా కోరిక. (ఇది చాలా గౌరవపూర్వకంగా పిలవటం - హోదాలో/ వయస్సులో/ స్తోమతలో మనకన్నా పెద్దవారిని ఇలా పిలుస్తాం.)

b) We should/ We'd (We would) be highly delighted if you could attend the function =
మీరు function కు రాగలిగితే మాకు అమితానందం. తప్పకరండి.



# Hope you don't mind ..

**Prabhav:** Meeting you, though after a long time, makes me very happy. Let's celebrate our meeting. (Would you) care for some snacks and coffee in any eatery nearby?
(నిన్ను చాలాకాలం తర్వాతయినా కలుసుకోవటం నాకు సంతోషంగా ఉంది. మన కలయికను పండగ్గా చేసుకుందాం. దగ్గరున్న ఫలహారశాలలో ఏదైనా తిని కాఫీ తాగటం ఇష్టమేనా?)

celebrate (an occasion) = ఏదైనా సంతోషకరమైన సందర్భాన్ని వేడుకగా నిర్వహించుకోవడం.

**Vibhav:** That'd be really nice and I am hungry too. Let's see where we can find a good restaurant.
(చాలా బాగుంది, నాకు ఆకలిగా కూడా ఉంది. మంచి రెస్టారెంట్ ఎక్కడ ఉందో చూద్దాం.)

**Prabhav:** What'd (What would) you like to eat? This place is good for poori. Nothing to beat its hot, puffed up poories with potato curry to go with it.
(ఏం తినాలనుకుంటున్నావు? ఈ రెస్టారెంట్‌లో పూరి చాలా బాగుంటుంది. వేడిగా, పొంగిన పూరీలు, దానికి దీటైన బంగాళాదుంప కూరకు సమానం ఏదీలేదు)

**Vibhav:** Then Let's have it. That's something after my heart.
(అది తీసుకుందాం. అది నాకిష్టం.)

After my heart = నాకిష్టమైంది.
something after his heart = అతడికి ఇష్టమైంది.

**Prabhav:** By the way, now that we've met let me tell you this. Some of us are planning a trip to Ajanta. Why don't you join us?

**Vibhav:** Oh, that's really fine. I am really delighted. When is this trip to be?
(చాలా బాగుంది. నాకు నిజంగా సంతోషంగా ఉంది. ఎప్పుడీ ప్రయాణం?)

**Prabhav:** The first week of next month. Angiras is looking after the reservations and other arrangements.
(వచ్చే నెల మొదటివారం. ఆంగీరస్, reservations, మిగతా వ్యవహారాలు చూసుకుంటున్నాడు.)

**Vibhav:** Thank you for the chance of some nice time.
(సరదాగా గడిపే సమయాన్ని కల్పించినందుకు నీకు థాంక్స్.)

☺ ☺ ☺ ☺

1. **How about/ What about.** ఇది చాలా informal గా invite చేయటానికి వాడతాం. మనకు బాగా చనువు ఉన్నవాళ్లకు వాడే expressions ఇవి.

a) How about joining us for a picnic?
మాతో పిక్నిక్‌కేమన్నా వస్తావా?

b) What about (making it to) a dinner tomorrow?
రేపు డిన్నర్‌కు వస్తావా? / రాకూడదూ? (తప్పకుండా రా అనే అర్థంతో. తెలుగులో సరైన ఆహ్వానం తెలిపేందుకు డిన్నర్‌కు వస్తావా? అనం కదా. డిన్నర్‌కు రా అనేదే సరైన పిలుపు. కానీ English లో How about (వచ్చేదుందా/ వస్తావా? అనటం) చాలా common.)

2. **Why don't you ...?** ఇది కూడా చాలా informal invitation కు వాడే expression.

a) Why don't you attend my sister's birthday party coming Friday?
వచ్చే శుక్రవారం మా sister పుట్టినరోజు party కి ఎందుకు రాకూడదు? (అంటే 'రమ్మని' అర్థం)

b) Why don't you make it for tea tomorrow evening?
రేపు సాయంత్రం మా ఇంట్లో tea తీసుకునేందుకు రా.

3. **Please ...** ఇది కొద్దిగా formal. అంటే మనం అంతగా చనువు తీసుకోలేని వ్యక్తులతో వ్యవహరించేటప్పుడు, వాళ్లను పిలిచేందుకు వాడే పదం.

a) Please come home for a party tomorrow evening.
రేపు సాయంత్రం మా ఇంట్లో పార్టీకి రండి/ రమ్మని కోరుతున్నాం.

b) Please make it to the function. Don't fail.
తప్పక రండి function కు.

అలాగే మరికొంచెం formal గా ఆహ్వానించటం:

4. **Would you mind/ Would you care to/ Would you like to ... ?**

a) Would you mind attending a small function at the Taj tomorrow?
రేపు Taj Hotel లో జరిగే చిన్న function కు తప్పకరండి.
(అసలర్థం - వచ్చేందుకేమన్నా అభ్యంతరం ఉందా? అని.)
mind = (ముఖ్యంగా question form లో/ not తో) అభ్యంతరం.

b) Would you mind telling me your name? =
మీ పేరు చెప్తారా? (అభ్యంతరమా?)

c) (Would you) mind my sitting here? =
నేనిక్కడ కూర్చోవచ్చా? (మీకభ్యంతరమా?)

d) Hope you don't mind my saying this =
నేనీ మాట అంటే మీకే అభ్యంతరం లేదనుకుంటా/ మీరేమనుకోరనుకుంటా.

| INVITATIONS | |
|---|---|
| **Informal** | **Formal** |
| 1) How about/ What about | 1) Would you like to ... |
| 2) Why don't you ...?/ Why can't you ... ? | 2) We'd like to have the pleasure of ... |
| 3) Do come for ... | 3) Please ... |
| 4) I'd like you to ... | 4) Please do us the favour of ... |
| 5) We'd like you to ... | 5) We'd like to have the |
| | 6) Would you mind ...? |
| | 7) Hope you don't mind ... |

ఇవీ formal and informal invitations (ఆహ్వానాలు - చనువున్నవాళ్లతో/ లేనివాళ్లతో) కు వాడే standard expressions. ఇవి బాగా practice చేయండి.

**EXERCISE**

**Practise the following aloud in English**

**ఛాయ:** మాయా, రేపు నా పుట్టినరోజే. తప్పకుండా రా.
**మాయ:** కచ్చితంగా వస్తా. నాకు గుర్తుంది.
**ఛాయ:** మీ అమ్మెక్కడ? ఆమెను కూడా పిలవాలనుంది.
**మాయ:** ఇక్కడే ఉంది. చెప్పు.
**ఛాయ:** Aunty, (ఇది సరైన English కాదు.) మీరూవస్తే నాకు సంతోషం.
**మాయతల్లి:** తప్పక రావాలనే ఉంది, కాని ముఖ్యమైన పని ఉంది రేపు. మాయ వస్తుందిలే.
**ఛాయ:** మాయ మా ఇంట్లోనే రాత్రికి ఉండిపోతే మీకేం అభ్యంతరం లేదు కదా?
**మాయతల్లి:** అలాగే.

**ANSWER**

**Chaya:** Tomorrow is my birth day. Do come.
**Maya:** I'll certainly make it. I remembered your birthday.
**Chaya:** Where's you mom. I'd like to invite her too.
**Maya:** There she is. Tell her.
**Chaya:** (to Maya's mother) I'd be delighted/ pleased/ happy if you could attend my birthday party.
**Maya's mother:** I'd like to, very much, but I've some work. Maya will be there.
**Chaya:** (Would you) mind if Maya stays at my place/ with me for the night?
**Maya's mother:** It's OK.

***ప్రశ్న:*** *1. It was due to his careless, he fell down.*
*Owing to his careless, he fell down.*
*పై వాక్యాల్లో due to, owing to అర్థం వివరించగలరు.*
*2. Hardly did the peon ring the bell, when the boys left to the class.*
*Scarcely did the peon ring the bell, when the boys left to the class.*
*పై వాక్యాల్లోని Hardly, Scarcely అర్థాలను, కొన్ని ఉదాహరణలతో వివరించగలరు.*
*3. As they entered the house, they ask for drinking water. అసలు As కు అర్థం because / since కదా?*
*పై sentence లో As కు అర్థం ఏమిటి? As ను తీసివేస్తే వాక్యం అర్థం మారుతుందా?*
*4. Thinking is driven by questions.*
*driven అంటే అర్థమేమిటి?*
*– ఎమ్మెస్సార్, మంచిర్యాల*

**జవాబు:** 1. It was due to his careless he fell down.
Owing to his careless, he fell down.
పై రెండు sentences లో careless తప్పు. carelessness, correct.
due to = owing to. రెండింటి అర్థం అందువల్ల అని. అయితే due to తో sentence begin చేయటం సరికాదు. మీరు రాసినట్లు It was due to ... correct.
అంటే due to ముందెప్పుడూ 'be' form రావాలి.
eg: His failure was (be form) due to his laziness = he failed owing to his laziness.
It was due to అని begin చేస్తే, రెండో clause that తో begin అవుతుంది.
It was due to his careless, he fell down - ఇది ఉండాల్సిన తీరు - It was due to his carelessness, that he failed. రెండో clause, that తో begin అవటం గమనించండి.

2. Hardly did the peon ring the bell when the boys left the class = Scarcely did the peon ring the bell when the boys left the class = No sooner did the peon ring the bell than the boys left the class = As soon as the peon rang the bell the boys left the class = peon (బంట్రోతు) గంటకొట్టిన వెంటనే/ కొట్టీకొట్టక ముందే పిల్లలు class వదిలేశారు. (మీ sentences లో left to the class సరికాదు. Left for the class = class కు వెళ్లారు. Left the class = class నుంచి వచ్చేశారు.)

Some more examples:
a) Hardly did he buy the tickets when the movie began = Scarcely did he buy the tickets when the movie began = Tickets కొన్న వెంటనే movie ప్రారంభమైంది.
b) Hardly did the school close when all the boys rushed home = school అయిపోగానే పిల్లలు ఇళ్లకు పరుగెత్తారు.

3. As అంటే because/ since అనే కాకుండా (ఏదైనా విషయం) జరిగినప్పుడు అనే అర్థం కూడా ఉంది.
a) As he walked along the street, he met his uncle = రోడ్డు వెంబడి నడుస్తున్నప్పుడు వాళ్ల మామయ్యను కలిశాడు.
b) As they entered the house, they asked (ask ఇక్కడ తప్పు) for drinking water = వాళ్లు ఇంట్లోకి ప్రవేశిస్తూ/ ప్రవేశిస్తున్నప్పుడు/ ప్రవేశించగానే మంచినీళ్లడిగారు.

4. Thinking is driven by questions:
Driven, drive కు past participle. Drive అంటే తోలటం అని తెలుసు కదా. is driven అంటే తోలబడుతుంది అని. అయితే drive అంటే ప్రేరేపించటం అనే అర్థంతో కూడా వాడతాం. మీ sentence లో is driven కి అర్థం ప్రేరేపించబడుతుంది అని. sentence అర్థం, ఆలోచన ప్రశ్నలవల్ల ప్రేరేపించబడుతుంది అని. మామూలు తెలుగులో ప్రశ్నలు ఆలోచనను ప్రేరేపిస్తాయి/ రేకెత్తిస్తాయి అని. అంటే ప్రశ్నలు మనల్ని ఆలోచింపజేస్తాయి అని.

SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 256

# It is not my cup of tea...

**Bhas:** The Sabarimala season has started, hasn't it?

(శబరిమల యాత్రా సమయం వచ్చేసింది కదా? )

**Vyas:** It has of course. But why are you asking?

(అవును. ఎందుకు అడుగుతున్నావు? )

**Bhas:** You go there every year. wondering why you don't have your black clothes and mala on this year yet.

(ప్రతిసారీ వెళ్తావు కదా నువ్వు. ఈసారింకా నల్ల బట్టలూ, మాలా వేసుకోలేదేంటా అని అనుకుంటు న్నాను.)

**Vyas:** I propose to be on deeksha from this Saturday onwards that's when I will have the mala on. A few others and I are going, how about joining us this time?

(ఈ శనివారం నుంచి దీక్షలో ఉంటాను. మాల వేసుకుంటాను. నేను మరి కొందరం వెళ్తున్నాం. నువ్వు వస్తావా?

**Bhas:** That's precisely why I am asking. I'd like to go with you this time. How are you going?

(అందుకోసమే అడుగుతున్నాను. నేను నీతో రావా లనుకుంటున్నా. ఎలా వెళ్తున్నావు?

(precisely: ప్రిసైస్లీ- కచ్చితంగా అందుకే)

**Vyas:** As usual. By vanayatra

(మామూలు విధంగానే వనయాత్ర చేస్తున్నాను. శబరిమల యాత్రికులు మొత్తం దూరం నడిచి వెళ్లటం వనయాత్ర.)

**Bhas:** What does it mean? (అంటే)

**Vyas:** A long trek of around 45 km up the hill and down the valley through the jungle, across fords and burns. Why don't you join?

(దాదాపు 45 కి.మీ. నడక- కొండలెక్కి, లోయల్లోకి దిగి, వాగులు వంకలు దాటుతూ వెళ్లాలి. మాతో ఎందుకు రాకూడదు? )

valley- లోయ ford= వాగు, burn= పిల్ల కాలువ

**Bhas:** That sounds quite exciting, though strencious.

(శ్రమతో కూడినదైనప్పటికీ ఉత్సుకత కలిగిస్తోంది)

**Vyas:** Joining us? (వస్తావా? )

**Bhas:** Certainly. I am game for it.

(తప్పకుండా నేను సిద్ధమే)

**Vyas:** Here comes our friend Prabhas.

(మన మిత్రుడు ప్రభాస్ వస్తున్నాడు)

**Bhas:** Let's ask him if he will come too.

(వాడూ వస్తాడేమో అడుగుదాం)

**Vyas:** We are going on Sabarimala pilgrimage. How about being one of us?

(మేం శబరిమల యాత్రకు వెళ్తున్నాం. మాతో వస్తావా? )

**Prabhas:** Sorry. Count me out.

(నన్నొదిలేయండి)

**Bhas:** Come on Prabhas let's enjoy it together.

(ప్రభాస్ అందరం సరదాగా వెళ్దాం)

**Prabhas:** Sorry, cold baths, meal just once a day and the ritual are not-my cup of tea

(sorry చన్నీటి స్నానం, ఒక పూట భోజనం, ఇతర పూజా పురస్కారాలూ, నాకుపడనివి)

● Not my cup of tea. ఎపుడూ not తోనే వాడుతాం = నాకు నచ్చనిది. My బదులు, his, her, your, their, our- ఎవరికి నచ్చనిదైతే దాన్నిబట్టి వాడవచ్చు. conversationలో ఇది చాలా common expression - not my cup of tea అనేది మీ conversationలో వాడండి.

● film music is not his cup of tea. He like classical music.

(అతడుకి film సంగీతం ఇష్టం లేదు. శాస్త్రీయ సంగీతం ఇష్టపడతాడు)

**Vyas:** Let's not compel him.

(అతడిని మనం బలవంతం చేయొద్దులే).

కిందటి lesson లో మనం పిలుపునకు (ఆహ్వానించటానికి)వాడే formal and informal expressions చూశాం కదా. ఇప్పుడు ఆహ్వానాన్ని మన్నించటానికి, స్వీకరించటానికి (accepting an invitation) తిరస్కరించటానికి (rejecting an invitation), formal and informal వాడే expressions చూద్దాం.

మనందరికీ తెలిసిన informal expression, invitations accept చేయడానికి:

Thank you very much / thanks for the invitation, I'll certainly come /I'll be there, and on time (నేన కృడుంటాను అదీ timeకు సరిగా) etc.

ఆహ్వానాన్ని informal గా మన్నించే / స్వీకరించేందుకు మరికొన్ని ఇతర expresions చూద్దాం..

1. Thank you I'd be very much there.

(thank you. నేను తప్పక అక్కడికి వస్తాను)

2. Certainly, that suits me fine =

(తప్పక వస్తాను. నాకది చాలా ఇష్టం).

3. Really? I am there certainly =

(అవునా? నేను తప్పక ఉంటాను/ వస్తాను).

4. Thank you so much / very much. with pleasure = Thank you. సంతోషంగా వస్తా.

5. Would I say no?

(కాదని అంటానా? )= (తప్పక వస్తానని)

ఇలా సందర్భానికి తగిన informal expressions ఏవైనా వాడవచ్చు. ఇవి informal అంటే మనకు బాగా చనువుండే వాళ్ల ఆహ్వానాన్ని స్వీకరించే విధానం ఇంకా informal గా ధ్వనించాలంటే ఈ కింది వాటిని చూడండి.

6. You bet I am there = నేనక్కడ ఉండటం/ రావటం నిస్సందేహం.

7. I am game for it = నేను సిద్ధం. I am game for it అంటే బాగా informal.

8. I won't say no, surely (కచ్చితంగా కాదు అనను)

ఇవీ Informal (పిలిచే, పిలిపించుకునే వాళ్ల మధ్య ఉన్న చనువూ, స్వతంత్రాన్ని బట్టి) పిలుపును మన్నించటానికి వాడే మాటలు. ఇప్పుడు ఆహ్వానాన్ని మన్నించలేకపోవటానికి వాడే మాటలు చూద్దాం.

1. Sorry, I can't come / can't make it.

2. How I'd like, very much, but I can't come.

(రావాలని ఎంతుందో, కానీ రాలేను)

3. Wish I could come, but sorry.

(రావాలనే ఉంది కానీ రాలేను)

4. What a pity! I've promised to accompany Nitish to the bike shop. He is buying a bike

(ఎంత దురదృష్టం! నితీష్‌తో Bike shop కొస్తానని మాటిచ్చా. వాడో bike కొంటున్నాడు.)

5. Can't we have it on some other occasion?

(ఇంకెప్పుడయినా పెట్టుకోవచ్చు కదా)

6. No way, old boy. You have to make do without me=

(లాభం లేదు /వచ్చేవిధంగా లేదు. నేరాకుండానే నువ్వు గడిపేసుకోవాలి.)

● old boy = మన ప్రియ మిత్రులను సంభోదించే తీరు.

7. Not a chance, I'm taking mom to Hyderabad tomorrow. It's sudden.

(వచ్చే అవకాశమే లేదు. అనుకోకుండా మా అమ్మను హైదరాబాద్‌కు తీసుకెళ్తున్నా)

8. Go ahead. I may not be able to attend, after all=

(ఏమైనా నేరాలేను. నువ్వు కాని చేయ్)

ఇపుడు ఆహ్వానానికి వెళ్లలేకపోవటం formal గా ఎలా చెప్పాలో చూద్దామా! formal గా అంటే మనకంటే వయసులో, హోదాలో, స్థోమతలో, పెద్ద వాళ్లు పిలిచినపుడు సున్నితంగా తిరస్కరించటానికి వాడే expressions ఇపుడు చూద్దాం.

**1) Pridhvi:** Mr Varun, please attend as a small get together tomorrow evening at my place.

(మా ఇంట్లో రేపు జరిగే చిన్న party కి తప్పకరండి)

**Varun:** So thoughtful of you, Mr Pridhvi to invite me. Thank you, but you'd excuse me. I have some important work.

(నన్ను గుర్తుంచుకుని పిలిచినందుకు thanks. కాని క్షమించాలి. రేపు నాకు ముఖ్యమైన పనుంది.)

● Mister అని సంబోధించటం formality ను సూచిస్తుంది.

● formal గా తిరస్కరించేందుకు కొన్ని expressions

a) I'd like to very much, but I can't. Sorry

(రావాలని బాగా కోరికగా ఉంది కాని రాలేను)

b) You wouldn't mind I may not making it/ coming, would you? I have some work.

(నాకు పనుంది. నేను రాలేకపోతే మీరేమనుకోరు కదా? )

c) **Santan:** We'd be delighted to have you inau gurate the function.

(ఆ function మీరు ప్రారంభించడం మాకు హర్షదాయకం)

**Prasad:** I'm afraid I won't be able to. However, thank you for the invitation.

(నేనురాలేను, Thank you పిలిచినందుకు)

d) I am sorry I can't. My regrets.

(నేను రాలేనని బాధపడుతున్నా.)

regret = చింతించడం.

e) It's very kind of you, but I regret I have to disappoint you. = మీ దయకు చాలా ధన్యవాదాలు, కానీ మిమ్మల్ని నిరాశపర్చక తప్పడం లేదు. (అయితే తెలుగులో ఈ మాటలు కొంత ఛాందసంగా అనిపిస్తాయి కదా? )

f) Thank you very much; I'd love to come, but I have to meet my lawyer exactly the same time.

(చాలా thanks. రావాలని ఎంతగానో ఉంది. కానీ అదే సమయంలో మా lawyer ను కలవాల్సి ఉంది.)

● అదే చాలా formal గా ఆహ్వానాన్ని మన్నించారనుకోండి. అప్పుడు వాడే expressions:

a) We'd / I'd be highly delighted

b) That's really, kind of you, thank you, I'll certainly make it.

c) Thanks for the invitation. You can be sure of my presence.

d) Pleasure will be mine./ It will be my pleasure to attend the function.

కొంచెం జాగ్రత్తగా వీటిని చదివి గమనించి సందర్భానుసారంగా వాడితే అవే అలవాటయిపోతాయి. Practice చేయండి.

**Exercise:**

Practise as many sentences as you can on the following pattern:

| | Subject | Verb | Object | Obj complement |
|---|---|---|---|---|
| a) | He | swept | the room | clean |
| b) | She | found | the door | locked |

ఇక్కడ object complement అంటే object ను గురించి చెప్పేమాట అని.



# ప్రతిభ

ప్ర. Will, Would కు తేడా ఏమిటి?

I will play cricket

I would play cricket

ప్ర. Either come in or go out దీని అర్థం లోపలికి రా లేదా బయటికి పో కదా?

Either of you can go out,

Either way , it is good. పై వాక్యంలో or లేదు కదా Either ఉంటే or ఉండాలి కదా

పై వాక్యం అర్థాన్ని వివరించగలరు.

ప్ర. రెండు గత సంఘటనలు జరిగినపుడు మొదటిదాన్ని simple past లో రెండోదాన్ని past perfect లో చెప్పాలా?

When I was arrived the station, the train had left.

ఈ వాక్యాన్ని కింది విధంగా కూడా చెప్ప వచ్చా?

When I arrived the station, the train was leaving.

**ఎం.ఎస్.ఆర్, మంచిర్యాల**

**జవాబు:**

జ. will, would కు తేడా

will ఇప్పటి నుంచి future ను తెలుపుతుంది.

Would గతం నుంచి future ను తెలుపుతుంది. (He said (గతంలో అన్నాడు) that he would help her (గతంలో నుంచి future లో help చేస్తానని)

Will, Wouldను గురించిన మిగతా అంశాలను చాలా వివరంగా ఇంతకుముందు lessons లో వివరించాం. చూడండి.

జ. Either... or, అంటే అదైనా సరే, ఇదైనా సరే అని అర్థం.

a) Either of అంటే, రెండింటిలో/ఇద్దరిలో ఏదైనా/ఎవరైనా సరే, అని. ఈ అర్థంతో వాడినపుడు either తర్వాత or రాదు. అలాగే Either way అంటే రెండు పద్ధతుల్లో ఏ విధంగా అయినా సరే, అని.

**Prakash:** Shall we have chicken or biryani?

(Chicken తిందామా, బిర్యానీ తిందామా? )

**Pramod:** Either way is the same for me.

(నాకు రెండింటిలో ఏదైనా ఒకటే)

పై సంభాషణలో either అంటే రెంటిలో ఏదైనా సరే అని అర్థం కాబట్టి, or రాదు.

ఇది చూడండి

You can have either an apple or a mango, but not both:

నువ్వు apple అయినా తిను, మామిడి పండైనా తిను, రెండూ కుదరదు. ఇక్కడ Either... or చూశారు కదా? )

జ. a) When I was arrived at the station...

ఈ భాగంలో was arrived సరికాదు. when I arrived అంటేనే correct.

b) When I arrived at the station, the train had left = నేను stationకు చేరేటప్పటికి, train వెళ్లిపోయింది. (correct)

When I arrived at the station, the train was leaving =

నేను station చేరేప్పటికి, train వెళ్లిపోతోంది - ఇది కూడా correct.

ప్ర. a,e,i,o,u లతో ప్రారంభమయ్యే మాటల ముందు an అని మిగతావాటి ముందు a అని వాడుతుంటాం. కానీ అది ప్రతిసారీ కరెక్ట్ కాదు. a university, a Europian కరెక్ట్ అంటారు. ఇది ఎలా సాధ్యం?

**కె. ఆల్ఫన్స్‌రాజ్, సత్తెనపల్లి**

**జవాబు:** అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ.

పై తెలుగు శబ్దాల్లో దేనితోనైనా ప్రారంభమయ్యే మాటల ముందు an వాడండి. మిగతావాటి ముందు a వాడండి. University, Europian ఈ రెండు కూడా అ నుంచి ఔ వరకు ఉండే శబ్దాలతో ప్రారంభం కానందున an రాదు a వస్తుంది.

**ఎం.సురేశన్**

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 257

**Anupam:** Who do I see here? Nirupam?
(ఎవరూ? నిరుపమ్?)

**Nirupam:** Are you surprised to see me?
(నన్ను చూడటం ఆశ్చర్యంగా ఉందా?)

**Anupam:** Sure. I thought you were in Kolkata.
(నిజంగా. నువ్వు కోల్‌కతాలో ఉన్నావను కున్నా.)

**Nirupam:** I was, but I got back yesterday.
(అవును, ఉన్నా. కాని నిన్న తిరిగొచ్చా)

**Anupam:** How about some coffee? or would you prefer to eat something before that?
(కాస్త కాఫీ తీసుకుంటావా? లేకుంటే ముందు ఏదైనా తింటావా?)

గౌరవ మర్యాదలూ, ఆచార వ్యవహారాల విషయంలో మనకూ, English వాళ్ళకు చాలా తేడా ఉంది. ఇంటికొచ్చిన అతిథులను సత్కరించే విషయంలో ముఖ్యంగా వాళ్ళకిచ్చే ఆహార పానీయాల విషయంలో, వాళ్ళకవి offer చేయటానికి వాడే formal and informal expressions ఇప్పుడు తెలుసుకుందాం.

మనం బాగా చనువుగా ఉండే వ్యక్తులకేదయినా offer చేసేటప్పుడు వాడే informal expressions కూ, మనం అంత చనువు తీసుకోలేని వ్యక్తులకేదయినా offer చేసేటప్పుడు వాడే formal expressions కూ తేడా ఎక్కువగానే ఉంటుంది. అలాగే మనం చనువుతో ఉండగల వ్యక్తులు మనకేదయినా offer చేసినప్పుడు మన స్పందనకు, (informal response) కూ, మనకంత స్వతంత్రంలేని వ్యక్తులు మనకు చేసే offers సందర్భాల్లో మన స్పందనకూ (formal response) చాలా తేడా ఉంటుంది.

The conversation at the beginning of the lesson, you can see, begins with expressions we use when we meet others. ఈ lesson beginning లోఉన్న పలకరింపు మాటలను ముందుగా చూద్దాం.

c) Would you mind having/ Would you mind a little coffee?

d) Won't you (Will you not) have some coffee? (కాస్త coffee తీసుకోరా?)

e) Let me have the pleasure of giving you a cup of coffee.

f) Let me have the pleasure of treating you to some coffee. (treating (some one) to something = ఎవరికైనా ఏదయినా ఇచ్చి సత్కరించటం)

*పై వాటికి స్పందన:*

a) I don't mind. Thank you.
(అభ్యంతరం లేదు. Thank you.)

b) That'd be fine. Thank you.

c) I'd welcome it. Thank you.

d) So thoughtful of you. Thanks.
(ఇతరుల అవసరాల గురించి సరైన ఆలోచనకు = so thoughtful of you)




# What brings you here?

**Nirupam:** I could certainly do with something to eat and then coffee.
(కాస్త ఏదైనా తినేందుకూ ఆ తర్వాత coffee కావాలి.)

**Anupam:** You'll have them. What'd you like to have?
(ఏం తీసుకుంటావు?)

**Nirupam:** You talk although we were in a restaurant, with a variety of eats on the menu. Get me whatever is available in the house.
(మనం ఏదో restaurant లో ఉన్నట్టు, రకరకాల ఫలహారాల menu ఉన్నట్టూ మాట్లాడుతున్నావు. ఇంట్లో ఏదుంటే అది పట్రా/ తిందాం.)

సాధారణంగా ఇంట్లో అంటే at home అంటాం కదా. In the house అంటే కాస్త informal గా ఇంట్లో అని. అంటే తెలుగులో 'కొంపలో' అన్నట్టు.

**Anupam:** Just wait for a few more minutes. You can have idli and karappodi. I expect a distant relative, an uncle of mine. Oh, here he is. Good morning uncle. It's really good to see you again. How are you?
(ఒక్క క్షణం ఉండు. ఇడ్లీ కారప్పొడి తిందువుగాని. దూరపు చుట్టం, మా uncle ఒకాయన వస్తాడని ఎదురు చూస్తున్నా. ఓ, ఆయన వచ్చేశాడు. మళ్ళీ మిమ్మల్ని చూడటం/ కలుసుకోవటం సంతోషంగా ఉంది. ఎలా ఉన్నారు?)

**Uncle:** Wonderful to meet you again, boy. How are things going?
(కలుసుకోవటం సంతోషంగా ఉంది. ఎలా ఉన్నావు?)

**Anupam:** Fine. Thank you. By the way this is my friend Nirupam. Nirupam, this is my uncle Mr. Sitaram.

**Nirupam:** How do you do, sir?

**Uncle:** Fine thank you, how do you do?

**Anupam:** Would you like to have something, uncle? I see you are pretty tired.
(ఏదయినా తీసుకుంటారా? బాగా అలసిపోయినట్టున్నారు.)

**Uncle:** You can say that. I am really tired. I don't mind having a bite.
(నువ్వన్నట్టుగానే నిజంగా అలసిపోయాను. ఏదో తింటానే పట్రా.)

**Anupam:** Would you care for some coffee too, uncle?
(కాఫీ కూడా తీసుకుంటారా?)

**Uncle:** That suits me fine.
(ఆ తీసుకుంటా.)

a) Who do I see here? ఎవరూ? నిరుపమేనా?
(మనల్ని మామూలుగా కలవనివాళ్ళు, చాలాకాలం తర్వాత, అనుకోకుండా కలవడానికొస్తే వాడే మాట.)

ఇలాంటి సందర్భంలో వాడే ఇతర expressions కూడా చూద్దాం.

**a) Look who is here:** చూడు ఎవరొచ్చారో (అంటే రాకరాక వచ్చారని ధ్వనించేట్టు. ఇక్కడ look, మూడో వ్యక్తి లేకపోయినా అంటాం.)

**b) What brings you here?** = ఏంటిలా వచ్చావు? (ఇది అంత మర్యాదకరమయిన మాట కాదని కొందరి అపోహ. కానీ ఇలా అనటంలో తప్పేంలేదు.)

**c) You, ... here? What a surprise!** = నువ్వు, ఇక్కడా! ఆశ్చర్యంగా ఉందే!

ఇవి కొన్ని పలకరింపు మాటలు.

ఇప్పుడు formal, informal offers కు వాడే కొన్ని expressions చూద్దాం.

*ఇంటికొచ్చిన అతిథులు మనకు బాగా సన్నిహితులయితే, వాళ్ళకిచ్చే ఫలహార పానీయాల విషయంలో informal గా offers:*

a) How about/ What about some coffee?

b) Care for some good coffee?

పై రెండింటి అర్థం- కాస్త coffee తీసుకుంటావా/ కాఫీ ... మంచిదేమన్నా పుచ్చుకుంటావా? ఇదే భావం తెలుగులో- కాఫీ తీసుకో అని (తెలుగులో, coffee తీసుకుంటావా? / తీసుకుంటారా? అని అడగడం bad manners కదా, కానీ English లో కాదు.)

*(a), (b)ల్లోని informal offers కు response (స్పందన):*

*coffee పుచ్చుకోవాలనుకుంటే:*

a) I don't mind (నాకభ్యంతరంలేదు)

b) That'd be nice

c) Oh sure. A good cup of coffee is certainly welcome.

d) I could certainly do with some coffee = నాకు కాఫీ కావాలి. (could do with = want)

e) That's nice of you. (అది మంచిదే)

*coffee వద్దు/ అంటే offer ను తిరస్కరించటం/ వద్దనటం informal గా:*

a) No, thanks/ thank you.

b) I don't feel like it now. Thank you.
(నాకు తాగాలనిపించటం లేదు- Thank you.)

c) Oh, not now/ perhaps later. (ఇప్పుడు వద్దు/ తర్వాత తీసుకుంటానేమో. దీని భావం- అసలొద్దని.)

***formal offers:*** *పెద్దవాళ్ళకు, అంతగా పరిచయంలేని వాళ్ళకు ఏదైనా formal గా offer చేసే తీరు:*

a) Would you have/ like/ fancy some coffee? - ఇది formal offer. (అయితే తెలుగులో offer చేసేటప్పుడు- తీసుకుంటారా? - అనం కదా. తీసుకోండి అంటాం.)

b) Would you care for some coffee?

e) That's nice of you, thank you.

f) Oh, sure. A cup of coffee would be welcome. Thank you.

g) Nothing like it at the moment. Thank you.
(ఇప్పుడంతకంటే మంచిదిలేదు. Thank you.)

(అయితే మన సమాజంలో ఆచార వ్యవహారం ప్రకారం, ఎవరింట్లో అయినా coffee offer చేస్తే, పైన అన్నట్టు 'అవును, తాగుతాను' అనలేం కదా. మనకు తాగాలని ఉన్నా కూడా, వద్దనే అంటాం.)

*ఓ offer ను formal గా తిరస్కరించటం/ వద్దనటం:*

a) No please. Thanks.

b) Right now, no. Thank you just the same.
(Just the same = అయినప్పటికీ)

c) Hope you don't mind my saying no. Thank you, any way =
నేను వద్దన్నందుకు మీరేం అనుకోరు కదా. Thank you.

d) Not now/ perhaps later, please.
(ఇప్పుడు కాదులెండి/ తర్వాత చూద్దాం.)

e) Sorry. I don't feel like it. Thank you.
(Sorry. తాగాలనిపించడంలేదు. Thank you.)

ఇవీ formal/ informal offers, వాటికి responses.

☺ ☺ ☺ ☺

కిందటి lesson (No. 256) exercise లో ఇచ్చిన sentence pattern కు నమూనా sentence లు:

| | Sub | Verb | Object | Complement |
|---|---|---|---|---|
| 1) | I | like | my coffee | hot |
| 2) | He | kicked | the door | open |
| 3) | They | elected | him | captain of the team |
| 4) | She | wants | it | done immediately |
| 5) | I | want | the house | painted. |

☺ ☺ ☺ ☺

**EXERCISE**

**Speak aloud as many sentences as you can, on the following pattern.**

| | It | 'be' form | complement | subject (infinitive) |
|---|---|---|---|---|
| a) | It | is | easy | to do that |
| | (అది చేయటం సులభం) | | | |
| b) | It | was | difficult | to carry it. |
| | (దాన్ని మోయటం కష్టం అయ్యింది.) | | | |

***Q. Why present tense always come after "did"?***
*- R. Murali Mohan, Hyderabad, e mail.*

**A.** Did is an auxiliary/ a helping verb. The words like come, take, etc coming after it, as in the verb, for example, did come (=came) did go (=went), did take (=took), etc. are all in the past tense, because, did is a helping verb, used to form the past forms of verbs mostly with not and in questions. Since did itself is past tense, we use only the basic form of the verb after it, like come, go, etc.

***Q. Instead of, Rather than, Apart from, Being.*** *ఈ పదాల గురించి వివరించండి.*
*- Chandu Surapaneni Choudary, e mail.*

**A. i) Instead of** = In place of.

a) He wrote with a pencil instead of with a pen = He used a pencil and not a pen.

b) He likes coffee better than tea, so he took coffee = He took coffee in place of tea = He took coffee instead of tea.

c) He gave him gold instead of money (బదులు)

**ii) Rather than** = We use this expression when we compare two things of different kinds. It also means 'instead of'.

a) Rather than go by bus, he walked the distance = He walked the distance instead of going by bus.

b) I'd rather not see movies than see such movies = I like not to see movies instead of seeing such movies.

**iii) Apart from** (i) = in addition to, besides

**eg:** Apart from stealing his money, they beat him = They not only stole his money, but also beat him.

**b)** Apart from the house, he bought new furniture = He bought not only the house but also new furniture.

**Apart from** (ii) = except for

**a)** Apart from the opening scene, the rest of the movie is very good= The opening scene alone isn't good, the rest of the movie is good.

**b)** Apart from the youngest son, the rest are married = All the other sons are married, the youngest alone is unmarried.

**iv) Being** = (Most often, being has the meaning of because)

**a)** Being rich, he can buy a car = Because he is rich, he can buy a car.

**b)** Being weak, she can't play well = Because she is weak, she can't play well.

***Q. "How long will you be in Hyderabad?" "How long will you be at Hyderabad?" Which one is correct?***
*- Sasanka, e mail*

**A.** How long will you be in Hyderabad? is correct. 'In' is used before big and important places, and at only before small places.

In Hyderabad, In Chennai, In London, etc.

At Mangalagiri, at pattanecheru (very small towns and villages)

I was at college = I was in the college - 'I was at college', is used more than, 'I was in the college'. 'I was in college', is also being accepted in modern usage.

**- ఎం. సురేశన్**

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 258




**Kundan:** Oh, you've come, I am happy. What did you do about that parcel to Naveen? He must be expecting it by now.
(నువ్వొచ్చావు, సంతోషం. Naveen కు పంపాల్సిన parcel విషయం ఏం చేశావు? దానికోసం అతను ఎదురుచూస్తుంటాడు.)

**Jeevan:** Oh, I'm terribly sorry. I clean forgot it. But there is still time. Don't worry.
(అయ్యో, దాని విషయం పూర్తిగా మరచిపోయా. కానీ ఇంకా time ఉందిలే. బాధపడకు.)

**Kundan:** How much time? Just half an hour.
(ఎంతుంది time? అరగంటే కదా.)

**Jeevan:** That's true. I must hurry or the Post office will close. Can you lend me your bike?

Look at the following sentences from the conversation above.

**a)** Jeevan: Can you lend me your bike?
(నీ bike ఇస్తావా?) - Request - అభ్యర్థన.

**b)** Jeevan: Can I have some money too?
(నాకు కాస్త డబ్బు కూడా ఇస్తావా?) - Request - అభ్యర్థన.

**c)** Will you help me with a little dough?)
(కాస్త డబ్బు సాయంచేస్తావా?) - Request - అభ్యర్థించటం.

**d)** Nandan: Would you give it back this evening?
(ఈ సాయంత్రం నాకు తిరిగిచ్చేస్తావా?) - Request - అభ్యర్థన.

**e)** Nandan: Could you get me a recharge card? - Request - అభ్యర్థన.

పై sentences అన్నింటిలో request (అభ్యర్థన)కు వాడే expressions ఉన్నాయి కదా. మన conversation in real life situation లో request చేయటం చాలా తరచుగా జరుగుతుంటుంది.

ముఖ్య గమనిక: Mind తర్వాత noun కాని, -ing form కాని రావాలి.

**d)** Would you mind idli with chutney or would you insist on sambar? - mind తర్వాత 'idli' noun కదా.

**e)** Would you mind having idli as puri is not ready?
పూరి ఇంకా తయారవలేదు, ఇడ్లీ తీసుకుంటారా?

formality అటుంచి, అన్నింటికంటే అత్యంత మర్యాదకరమైన request కు could వాడతాం.

**a)** Could you carry this for me?
దీన్ని మీరు మోస్తారా? (దయచేసి మోయండి)

**b)** Could you (Please) tell me how to go to the Eenadu office?
ఈనాడు office కు దారి చెబుతారా? (దయచేసి చెప్పండి)

# Could you carry this for me?

(త్వరగా వెళ్ళాలి. లేకపోతే Post office మూసేస్తారు. నీ bike కాస్త ఇస్తావా?)

**Kundan:** Why do you need it?(నీకెందుకు bike?)

**Jeevan:** I must rush home, pick up the books, parcel them, hurry to the post office and book it.
(ఇంటికి త్వరగా వెళ్లాలి, ఆ books తీసుకోవాలి, వాటిని parcel చేయాలి, Post office కు తీసుకెళ్లి book చేయాలి కదా.)

**Kundan:** Oh sure, have it. (సరే, తీసుకెళ్ళు.)

**Jeevan:** Can I have some money too?
(కాస్త డబ్బు కూడా ఇస్తావా?)

**Kundan:** I don't have more than Rs.10 on me. Let's see if my cousin Nandan can help. Oh, who do we see here? Oh it's Nandan. Think of the devil and he is there.
(నా దగ్గర పది రూపాయల కంటే ఎక్కువ లేదు. మా cousin Nandan ఏమన్నా ఇవ్వగలడేమో చూద్దాం. అదుగో, ఇక్కడే ఉన్నాడు.)

Think of the devil and he is there = ఎవరన్నా అనుకున్నదే తడవు ప్రత్యక్షమయితే ఇలా అంటారు. అయితే ఇవి మనకు బాగా సన్నిహితంగా ఉండేవాళ్లమీద మాత్రమే వేసే joke.

Devil అంటే తెలుసు కదా? Christian నమ్మకంలో దేవుడి శత్రువు. చెడుకు ప్రతిరూపం.

**Jeevan:** Hi Nandan, good to see you again.

**Kundan:** Will you help us with a little dough? You shall have it back this evening.
(మాక్కాస్త డబ్బు సాయం చేస్తావా? సాయంత్రానికల్లా తిరిగిచ్చేస్తాం.)

Dough = డౌ = డబ్బు అనే అర్థంతో వాడే మాట - తెలుగులో పైసలు/ పిక్కలు/ కాసులు లాగా.

Dough అంటే మామూలు అర్థం చపాతీలకు, పూరీలకు వాడే కలిపిన మెత్తటి పిండి ముద్ద.

**Nandan:** You sure can have it. How much?

**Jeevan:** Atleast Rs. 200/-.

**Nandan:** Here it is, but would you give it back this evening? I need it.

**Kundan:** As soon as I am home, I will pay it to you.

**Jeevan:** We're short of time. Let me have your bike.
(Time తక్కువగా ఉంది. నీ bike ఇవ్వు.)

**Kundan:** Rush then. (త్వరగా పద అయితే)

**Nandan:** Jeevan, on your way back, could you get me a recharge card for my cell?
(నువ్వు తిరిగొచ్చే దారిలో నా cell కు ఓ recharge card పట్టుకురావా?)

**Jeevan:** I'll certainly.

అలా request చేసేటప్పుడు వాడే expressions ఇప్పుడు చూద్దాం. Requests లో కూడా Informal requests కు వాడే expressions కూ, formal requests కు వాడే expressions కూ తేడా ఉంటుంది.

**Informal requests:** వీటికి సామాన్యంగా can వాడతాం. మనకు బాగా పరిచయం ఉన్నవాళ్లను, మనం చనువు తీసుకోగలిగినవాళ్లను, మన friends, brothers and sisters ను request చేసేటప్పుడు can వాడతాం.

**a)** Can you lend me your bike?
నీ bike కాస్త ఇస్తావా?
(ఇవ్వు, please అని.)

**b)** Can I have some money?
కాస్త డబ్బు సర్దుతావా? (Informal)

కొంచెం formal అయితే will వాడతాం. మనకంటే కొంచెం పెద్దవాళ్లను, అంతగా పరిచయం లేనివాళ్లనూ request చేసేటప్పుడు will, won't (will not) use చేస్తాం. ఇందాక చూశాం కదా- Kundan, Nandan ను request చేయటానికిక ఏమన్నాడు?

- Will you help me with a little dough?
ఇక్కడ will, can కంటే తక్కువ సాన్నిహిత్యాన్ని సూచిస్తోంది.
Won't you (will you not) come along with me? మీరు నాతో రారా? (రండి - అని request)

- Would కూడా requests కు వాడతాం. ఇది formal situations లో మాత్రమే. అంటే మనం request చేస్తున్నది మనకంటే వయస్సులో, హోదాలో, స్థోమతలో పెద్దవాళయితే, మనకు పూర్తిగా కొత్తవాళ్లయితే would వాడతాం.

**a)** Would you make room, please? = కాస్త తప్పుకుంటారా?

**b)** Would you lend me that book for a day?= ఒక్కరోజు ఆ పుస్తకం నాకు ఇస్తారా? (formal & polite request)

అయితే సామాన్యంగా would you తో mind చేర్చి వాడతాం formal requests కు.

**a)** Would you mind waiting for a few minutes? = కాస్త wait చేయగలరా? ఇది చాలా formal and polite form of request.

మనకు అసలు పరిచయం లేనివాళ్లను, హోదా, స్థోమతలో పెద్దవాళ్లను చాలా మర్యాదగా request చేసే విధం. ఇంకా చూడండి.

**b)** Would you mind telling me your name?
మీ పేరు చెబుతారా? (దయచేసి చెప్పండి అని)

**c)** Would you mind my using your phone?
మీ phone వాడుకోనిస్తారా?

**c)** Could you help me with some money?
డబ్బు సాయంచేస్తారా? (దయచేసి కొంత డబ్బివ్వండి)

ఈ requests అన్నీ కూడా question forms లో ఉండటం గమనించే ఉంటారు.

**Please note:** Hi, hello, పేరుతో (Mr, Mrs, Miss లాంటివి లేకుండా) ఒకరిని పలకరించటం వాళ్లతో మన కున్న సాన్నిహిత్యాన్ని తెలుపుతాయి. అప్పుడు వాళ్లతో మనం informal గా ఉంటాం అన్నమాట.

Mr, Mrs, Miss లాంటివి Sri, Sir లాంటివి వాటినప్పుడు మనకు వాళ్లకు అంతరం ఉందన్నమాట. అప్పుడు we are formal/ very formal with them. దాన్నిబట్టి మన request form మారుతూ ఉంటుంది.

## EXERCISE

**Practise the following aloud in English**

**Sanjai:** విజయ్, ఈ chapter నాకర్థం కాలేదు. ఓసారి explain చేయవా?

**Vijai:** నాకూ అర్థంకాలేదు. మన professor ఇక్కడే ఉన్నారు. ఆయన్ను అడుగుదాం.

**Sanjai:** Sir, మాకీ chapter అర్థం కాలేదు. మీరు కాస్త explain చేస్తారా?

**Prof.:** తప్పకుండా. మీరు మా ఇంటికి సాయంత్రం రాగలరా? ఇప్పుడు నేను busy గా ఉన్నాను.

**Sanjai:** ఇంకేదయినా time ఇవ్వగలరా? ఈ సాయంత్రం మాకు class ఉంది.

**Prof.:** Sunday రండి.

## ANSWER

**Sanjai:** Hi Vijai, I haven't understood this chapter. Can you explain it to me.

**Vijai:** I haven't understood it either. Our professor is here. Let's ask him.

**Sanjai:** Sir, we haven't understood this chapter. Could you explain it, Sir?/ Would you mind explaining it?

**Prof.:** Certainly/ Certainly not. (Could/ Would you mind ను బట్టి.) Can you come to my place this evening? I am busy now.

**Sanjai:** Could you please suggest some other time? We have a class this evening.

**Prof.:** Make it on Sunday, then.

***Q. In what situations should we use "say" and "tell"?***

*- A. Krishna Sumanth, e mail*

**A.** • Say and tell are more or less is the same, but there is a lot of difference in the way we use them. The difference is very important.

- Say is always followed by to, before the person to whom something is said. eg: He said to me, she said to him, etc.
- Tell is never immediately followed by to.
- You say some thing to some one/ You say some thing. We use say, when we repeat some one's words. She said, 'Go away'.
- Tell always is followed by a person as its object. She told him to/ She told him that ... etc.



- Say can be used without mentioning the person to whom some thing is said.

**a)** He says that he is hungry.
**b)** Kumar said to me that he would go with me.

- Tell is always followed by the person to whom something is said.
- Suseela often tells me that she likes Vijayawada.
- Say is often used to repeat the words of someone.

**a)** Ramana said, "I am hungry".
**b)** Ramana said that he was hungry.

- 'Tell' express commands; 'say' does-n't.
The officer told him to get out.
- 'Say' is never followed by the infinitive (to go, to come, etc).
*He told me to go.*
*He said that I should go.*
(observe the difference)

***Q. What are correct in below and tell me suggestions if any.***

***a. 1. With how many friends you have stayed there?***
***2. How many friends are stayed there with you?***
***3. Any friends there with you?***
***b. 1. How would I contact you?***
***2. How can I contact you?***

*- Santhu, e mail*

**A.** The correct forms of your questions are

**a. 1)** How many friends have you stayed with there?
**2)** How many friends have stayed with you?

**b. 1)** How would I contact you?
This, as an independent sentence is wrong. The correct form is:
How shall I contact you? (Meaning = How do I get in touch with you?)
**2)** How can I contact you = How is it possible for me to contact you.

**- ఎం. సురేశన్**

SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 259

# I'm not at all pleased

**Kalpana:** Is that your progress card? Let me see it. Let me know how well you've fared in the exams?

(అదేనా నీ progress card? ఏదీ చూడనీ. పరీక్షల్లో ఎంత బాగా రాశావో తెలుసుకోనీ.)

**Avinash:** Here it is, mom.

**Kalpana:** Oh Avinash, what kind of marks is this?

(అవినాష్, ఏం marks ఇవి?)

**Avinash:** Aren't they good, mom? I didn't get less than 70% in any subject.

అవి మంచి marks కాదా? ఏ subject లో కూడా 70% కు తగ్గలేదు.)

**Kalpana:** What's wrong with that?

(అందులో తప్పేముంది?)

**Kamesh:** I am not in the least pleased, Kalpana. Why do you put so much pressure on the boy. A few marks less- does it matter much?

(నాకసలు సంతోషంగా లేదు, కల్పనా. ఎందు కంత ఒత్తిడి తెస్తావా కుర్రాడి మీద? ఏవో కొన్ని marks తగ్గాయి- అదేమంత సమస్య?)

**Kalpana:** This kind of talk is what I like least. You don't expect the boy to perform better if you talk like this.

(ఇలాంటి మాటలే నాకసలిష్టంలేదు. మీరే ఇలా మాట్లాడితే వాడింతకంటే మెరుగ్గా ఏం చేస్తాడు.)

**Kamesh:** Marks are not all. So long as he doesn't score low we need not worry. Let him relax.

ii) The way he talked made us none too happy = అతను మాట్లాడిన విధం మనకు చాలా అసంతృప్తిగా ఉంది. (సంతోషంగా లేదు)

**4. Not in the least pleased** =

అసలు సంతోషంగా లేదు. తీవ్రమయిన అసంతృప్తిగా ఉంది.

i) The teacher was not in the least pleased with his marks =

అతడి marks teacher కు ఏమీ సంతోషం కలిగించలేదు. (Teacher అతని మార్కుల పట్ల చాలా అసంతృప్తితో ఉన్నాడు.)

ii) **Babu:** How do you find the arrangements?

(ఏర్పాట్లెలా ఉన్నాయి?)

**Balu:** I'm not in the least pleased.

(ఏం తృప్తికరంగా లేవు)

**Kalpana:** I am not at all pleased with these marks, boy. Who gets the first mark in your class?

(ఈ marks నాకసలు సంతోషం కలిగించటం లేదు. మీ class లో first mark ఎవరికి?)

**Avinash:** What's wrong with those marks, mom? You are never happy with my marks even when they are quite high.

(ఆ marks కు ఏమయింది? ఎంతెక్కువ marks వచ్చినా నీవెప్పుడూ సంతోషపడవు.)

**Kalpana:** You get on my nerves Avi. You call these good marks? 94% in maths, 86% in English, 78% in Telugu, 82% in Science, 75% each in History and Geography. No, Avi, you should have scored even higher. Who gets the first in your class? Tell me that first.

(అవీ, నాక్కోపం తెప్పిస్తున్నావు. ఇవి మంచి marks అంటావా? Maths 94%, etc, ... అవీ, లాభంలేదు. నువ్వు ఇంకా ఎక్కువ marks తెచ్చుకోనుండాల్సింది. మీ class లో first ఎవరు? ఆ విషయం ముందు చెప్పు.)

**Avinash:** Pratibha.

**Kalpana:** You couldn't score higher than the girl. What a shame!

(నువ్వు ఆ అమ్మాయి కంటే ఎక్కువ తెచ్చుకోలేకపోయావు. సిగ్గుచేటు.)

**Kamesh:** Come on Kalpana, our son has scored good enough marks. Why compare? Why are you so envious?

(మనబ్బాయి మంచి marks తెచ్చుకున్నాడు కదా. ఇంకొకరితో పోలికెందుకు? ఎందుకంత ఈర్ష్య నీకు?)

(envious = ఈర్ష్య (envy) కల)

**Kalpana:** I want our boy to stand first in the class. Is that wrong?

(మనబ్బాయి class లో మొదటివాడుగా ఉండాలని నా కోరిక. అది తప్పా?)

**Kamesh:** Look here. Expecting our son to get very good marks is not wrong, but comparison is always bad. You always compare. I am none too happy about it.

(చూడు. మనబ్బాయి ఎక్కువ మార్కులు తెచ్చుకోవాలని ఆశించడం తప్పుగాదు, కానీ పోలిక ఎప్పుడూ మంచిదికాదు. నీవెప్పుడూ పోలిక తెస్తుంటావు. అది నాకు నచ్చదు.)

(మార్కులే ముఖ్యంకావు. మరీ తక్కువ marks తెచ్చుకోనంతవరకు మనం బాధపడనక్కరలేదు. వాడిని కాస్త ఊపిరి తీసుకోనీ.)

**Kalpana:** Ok, Ok. I only want our son to do better. That's all.

(సర్లేండి. మనవాడింకా బాగా చేయాలని నా కోరిక. అంతే.)

**Look at the following sentences from the conversation above.**

**1) Kalpana: I am (I'm) not at all pleased.**

**2) Kalpana: You get on my nerves, Avi.**

**3) Kamesh : I'm none too happy about it.**

**4) Kamesh : I'm not in the least pleased.**

**5) Kalpana: This kind of talk is what I like least.**

గమనించారు కదా: పై sentences అన్నీ కూడా సంతోషపడకపోవటాన్ని తెలిపేవిగా ఉన్నాయి. పైన వాడినవన్నీ మనకు సంతోషం, తృప్తి కలిగించని సందర్భాల్లో వాడే మామూలు expressions. ఇంతవరకు వివిధ సందర్భాల్లో వాడే standard expressions చూశాం కదా. వాటితోపాటే ఇవీ.

**1. I am not at all pleased** =

నాకసలు సంతోషంగాలేదు/ నాకేంతృప్తి లేదు

i) I am not at all pleased with his words = అతని మాటలు నాకసలు సంతోషంగా లేవు.

ii) The spectators were not at all pleased with the way he played =

అతను ఆడిన తీరు ప్రేక్షకులకు అసలు నచ్చలేదు.

**2. You get on my nerves** =

నువ్వు నాక్కోపం తెప్పిస్తున్నావు/ నన్ను విసిగిస్తున్నావు.

i) The way he behaves gets on my nerves = వాడి ప్రవర్తన నాక్కోపం తెప్పిస్తుంది/ నన్ను విసిగిస్తుంది/ చికాకుపరుస్తుంది.

ii) He manages not to get on anybody's nerves =

అతను ఎవరికీ కోపం కలిగించకుండా చూసుకుంటాడు.

iii) Let me not see him here again. He gets on my nerves =

మళ్లీ వాడిని నన్నిక్కడ చూడనివ్వకు. వాడంటే నాకు చికాకు.

**3. I'm (I am) none too happy about it- None too happy about** - ఇది చాలా తీవ్రమయిన అసంతృప్తిని తెలియజేస్తుంది.

i) We are none too happy about the Indian team's performance in South Africa.

South Africa లో భారత్ జట్టు ప్రదర్శన పట్ల మనం తీవ్రమయిన అసంతృప్తితో ఉన్నాం/ అసలు బాగాలేదు.

iii) The CM is not in the least pleased with the remarks of the Minister for Sports and Youth activities. (క్రీడామంత్రి వ్యాఖ్యలపట్ల ముఖ్యమంత్రి చాలా అసంతృప్తిగా ఉన్నారు.)

**5. What I like least** =

దీనర్థం కూడా నాకసలుపడదని.

i) What I like least is the way he talks =

అతడు మాట్లాడే తీరు నాకసలునచ్చదు.

ii) **Chandra:** He went to a movie last night. =

(అతను నిన్న సినిమాకెళ్లాడు.)

**Surya:** That's what I like least about him, his going to movies too often.

(అదే నాకు వాడిలో నచ్చనిది. మరీ ఎక్కువ సినిమాలు చూస్తాడు వాడు.)

ఇవీ మన అసంతృప్తిని, నచ్చని విషయాల్ని, కోపం తెప్పించే విషయాల్ని తెలిపే standard expressions. చాలా మాటలకు ఈ expressions లో not వచ్చి దాని తర్వాత superlative degree రావటం మీరు గమనించే ఉంటారు. ఇది English లో చాలా common. మనకు కోపం తెప్పించే సందర్భాలు real life situations లో ఎక్కువగానే ఉంటాయి కదా. అలాంటప్పుడు పై expressions మనకు చాలా ఉపయోగపడతాయి.

**EXERCISE**

**Practise aloud the following in English**

**Ritish:** నువ్వు మళ్లీ ఆలస్యంగా వచ్చావ్. ఈ విషయంలో నువ్వు నాకెప్పుడూ కోపం కలిగిస్తావు.

**Dheeraj:** Traffic jam లో ఇరుక్కుపోయాను. ఏం చేయమంటావ్?

**Ritish:** మళ్లీ అదేమాట. కొంచెం ముందుగా బయలుదేరవచ్చుకదా?

**Dheeraj:** నువ్వు మాట్లాడే తీరు నాకసలు నచ్చటం లేదు. నేను కావాలని ఆలస్యం కాలేదు కదా. ఈసారిటువంటి సందర్భం రాకుండా చూస్తాన్లే.

**ANSWER**

**Ritish:** You are late again. You get on my nerves in this matter.

**Dheeraj:** I was caught in a traffic jam. What do you want me to do?/ What could I do?

**Ritish:** The same thing again. You could have started earlier.

**Dheeraj:** I am none too happy about the way you talk. I am not late intentionally. I'll see that this isn't repeated.





***ప్రశ్న:* కింది ప్రశ్నలకు అర్థాన్ని వివరించండి.**

*1. He is a teacher, is he?*

*2. He is not a teacher, isn't he?*

*(explain the same way questions or comment tags.)*

*3. Scarcely had the game started when it began to rain.*

*4. No sooner had he heard the news than he started off.*

*5. Hardly had I finished the work when the picture started.*

*6. Barely had I gone there when he went out.*

*7. I can wait unless and until he comes.*

*8. We can't wipe out this evil unless and until the individual thinks so.*

*9. They were asked to maintain sanitation failing which action would be initiated against them. ( How do we use the phrase 'failing' which?)*

*10. Which words do we use instead of the words 'eve teasers'?*

*- K. Rama Krishna, Ongole*

**జవాబు:**

**1.** అతను ఉపాధ్యాయుడు కదా? (Is he?)

**2.** అతను ఉపాధ్యాయుడు కాదు, కదా?

అయితే ఎక్కువ సందర్భాల్లో, He is a/ He is not a teacher అన్నప్పుడు, వీటికి వచ్చే question tags లో not ఉండటం, లేకపోటం అనేది, statement part (stem) లో not ఉండటం, లేకపోవటాన్ని బట్టి ఉంటుంది.

He is a teacher, (ఇక్కడ not లేదు), కాబట్టి, He is a teacher, isn't he? (Question tag లో n't వస్తుంది).

He is not a teacher (ఇక్కడ not ఉంది), కాబట్టి He is not a teacher, is he? (Question tag లో not లేదు)

Sentences 3, 4, 5, 6 - వీటన్నింటికీ అర్థం, (ఓ పని) అయి, అవకుండానే/ వెంటనే అని.

**3.** ఆట మొదలయీ, అవకముందే వర్షం ప్రారంభం అయింది. (ఆట మొదలయిన వెంటనే).

**4.** అతనా వార్త వినీ వినకుండానే, (విన్న వెంటనే)...

**5.** అతను పని పూర్తిచేసి చేయకుండానే (చేసిన వెంటనే)....

**6.** నేనక్కడికి వెళ్లీ, వెళ్లకముందే (వెళ్లిన వెంటనే)....

**7.** దీనికర్థం లేదు. మీరు రాసిన ప్రకారం, దీనర్థం, అతను వస్తే తప్ప, వచ్చేంతవరకూ కాచుకుంటాను.

- What's the idea? (I can't wait అంటే సరైన అర్థం వస్తుంది)

**8.** వ్యక్తి అలా ఆలోచిస్తే తప్ప, ఆలోచించేంతవరకూ (unless= తప్ప, until= వరకు) ఈ చెడును రూపుమాపలేం. (అయితే modern English usage లో unless and until అంతగా ఆమోదయోగ్యం కాదు. Unless కానీ until కానీ వాడితే చాలు).

**9.** Failing which = లేకపోతే/ అలా చేయకపోతే/ అది జరక్కపోతే. పరిశుభ్రత పాటించాలని వారికి చెప్పారు. (ఇది మామూలు తెలుగు- English లో ఉన్నది ఉన్నట్లు అనువదిస్తే వాళ్లు చెప్పబడ్డారు), అలా చేయకపోతే (= failing which) వాళ్ల పట్ల చర్య తీసుకోవాల్సి వస్తుంది.

**10.** Eve teasers అన్న మాట correct English కాదు. English లో ఈ expression లేదు. Teasing Girls అనే అంటారు. Eve teasers కు మనం వాడే అర్థంతో, English లో మాట నాకు తెలిసి లేదు.

**- M. SURESAN**

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 265




**I. Brinda:** Hello, this is Brinda speaking. May I know who you are please.
(హలో, బృంద మాట్లాడుతున్నాను. మీరెవరో తెలుసుకోవచ్చా? )

**Mukta:** Hi Brinda, you are speaking to Mukta. What a surprise! How are things going?
(ఓ బృందా! నువ్వు ముక్తతో మాట్లాడుతున్నావు/ నేను ముక్తను. ఎంత ఆశ్చర్యం! ఎలా ఉన్నావు? )

**Brinda:** You haven't been phoning either.
(నువ్వూ phone చేయట్లేదుగా!)

**Mukta:** The fault is on both sides. But why this call now; all so suddenly?
(ఇద్దరిదీ తప్పుందిలే. ఉన్నట్లుండి ఇప్పుడీ phone ఎందుకోసం? )

**III. Govinda:** Hello, who is it? Sorry I am unable to hear you. There is too much of noise around here. Could you be a little louder?
(హలో, ఎవరండీ? మీరు చెప్పేది వినిపించటంలేదు. ఇక్కడ చాలా గొడవగా ఉంది. మీరు కాస్త బిగ్గరగా మాట్లాడతారా? )

**Gopal:** I can see that. I will call you back in ten minutes.
(నేనర్థంచేసుకోగలను. మరో పది నిమిషాల్లో మీకు మళ్లీ phone చేస్తాను.)

**IV. Srinath:** Hello, who is it, please? Oh, Mr.Srinivas. I am driving. Could you call me a little later?
(Hello, ఎవరండీ. శ్రీనివాస్. నేనిప్పుడు drive చేస్తున్నా. కాస్త తర్వాత phone చేస్తారా? )

**Srinivas:** OK. I will.

**Srinath:** I'll call you back/ get back to you myself after I get off from the vehicle.
(మీకు నేనే phone చేస్తాను, బండి దిగ్గానే.)

**Srinivas:** It's OK.

**Raghav:** Wait (please). Don't hangup yet. I have a lot more to tell you.
(ఆగు/ ఆగండి. అప్పుడే phone పెట్టేయకు. నేను ఇంకా చాలా చెప్పాల్సి ఉంది).

**Ranjan:** I'm sorry. I haven't the time right now to listen to you.
(ఇప్పుడు నువ్వు చెప్పేది వినేంత time లేదు నాకు. Sorry)

**Raghav:** Look, Revathi, Ranjan has hung up in the middle of the conversation.
(చూడు రేవతీ, నా మాటల మధ్యలోనే phone పెట్టేశాడు Ranjan.)

**Revathi:** That's very rude of him. When he makes a call he never ends it. He goes on talking for hours on end.
(అతనలా చేయటం చాలా అమర్యాదకరం. అతను phone చేస్తే ఎప్పటికీ పెట్టేయడు. గంటల తరబడి మాట్లాడతాడు.)

Phone సంభాషణ ముగించటం = end a call.

# Who is it, please?

**Brinda:** Today is a holiday and I remembered you. I thought I'd just say hello to you.
(ఈ రోజు సెలవు, నువ్వు నాకు గుర్తొచ్చావు. ఏదో పలకరిద్దామని phone చేశా)

**Mukta:** That's very good of you.

**II. Ravali:** This is Ravali speaking. Is it Consolidated Real Estates Ltd., please?
(ఇది Consolidated Real Estate Company యేనా? )

**Rasagna:** Yes, it is. What's it please?

**Ravali:** May I have some detailed information about the plots and flats you are selling?
(మీరమ్ముతున్న plots, flats ను గురించిన వివరమైన సమాచారం ఇవ్వగలరా? )

**Rasagna:** With pleasure, of course. But it is not a matter to be talked of over phone. Could you make it to our office any working day between 10 and 5?
(సంతోషంగా. అయితే phone లో చర్చించ గలిగిన చిన్న వ్యవహారం కాదు గదా? మీరు ఏ working day అయినా, 10 నుంచి 5 లోపల మా office కు రాగలరా?

**Ravali:** Your office is too far off for me and I am very busy as working days.
(మీ office నాకు చాలా దూరం. Working daysలో నాకు తీరికుండదు.)

**Rasagna:** That's all right. Just let's know where you live and give us a time when you are available. One of our marketing people will visit you and give you the details, Mrs.Ravali. By the by is this your phone number? can we call this to contact you?
(ఏం ఫరవాలేదు. మీరెక్కడుంటారో ఏ time లో రమ్మంటారో చెప్పండి. మా marketing సిబ్బందిలో ఎవరో ఒకరు మీ దగ్గరకు వస్తారు. అన్ని వివరాలూ ఇస్తారు రవళి. అదిసరే. ఇది మీ phone number కదా? ఈ number తో మీకు phone చేయొచ్చా? )

**Ravali:** Yea. That's the number. I am always available on the number.
(అవును. అదే నా number. ఆ number లో నేనెప్పుడూ ఉంటాను.)

**Rasagna:** Thank you.

ఈ lesson లోని రెండు conversations లో కూడా మొదట మాట్లాడినవాళ్లే తమ పేరు, వివరాలూ చెప్పటం గమనించే ఉంటారు.

ఒకవేళ అవతలివాళ్లు చెప్పేది మనకు ఏ కారణం వల్లయినా సరిగా వినిపించడం లేదనుకోండి. అప్పుడు వాళ్లను మళ్లీ చెప్పమనేందుకు వాడే polite expression.

**a)** Who is it, please? Once again.
(ఎవరండి? మళ్లీ చెప్పండి)

**b)** Pardon (క్షమించండి). Phone సంభాషణలోనే కాకుండా అవతలివాళ్ల మాటలు మనకు సరిగా వినపడకపోతే ఈ మాట (pardon) అంటామని మనలో చాలా మందికి తెలుసు. ఇది కొంచెం formal గా అయితే Beg your pardon అంటాం.

**c)** I'm sorry. I'm unable to hear you. Could you be a little clearer?
(మీరు చెప్పేది నాకు వినిపించటం లేదు. కాస్త ఇంకొంచెం స్పష్టంగా చెబుతారా? )

**d)** Could you repeat yourself please?
I couldn't hear you/ catch you.
(మీరు మరోసారి చెబుతారా? మీరు చెప్పింది నేను వినలేకపోయాను.)

మనం Car, two wheeler లాంటివి drive చేస్తూ cell phone లో మాట్లాడలేకపోతే అప్పుడు వాడే expressions.

**a)** Sorry I am driving. Could you call me a little later?/ I will call you back some time later.
(నేను drive చేస్తున్నాను. కాసేపాగి phone చేస్తారా? / నేను మీకు phone చేస్తాను.)

ఇవన్నీ కూడా conversations 3 and 4 లో ఉన్నాయి కదా.

ఒక్కోసారి phone లో disturbances వల్ల మనం వినలేకపోతే అనే మాటలు.

**a)** Sorry. Your voice isn't clear. Could you please be clearer?
(మీ గొంతు/ మాటలు సరిగా వినిపించడంలేదు. కాస్త స్పష్టంగా చెబుతారా? )

**b)** I hear some noises over the line/ The line isn't clear/ your voice isn't clear. Could you disconnect and call/ try again?
(Line అంతా గొడవగా ఉంది. phone పెట్టేసి మళ్లీ phone చేయండి/ ప్రయత్నించండి.)

disconnect = తెలుసుకదా. phone పెట్టేయటం. phone పెట్టేయటం/ phone లో మాట్లాడటం ఆపేయటానికి ఇంకో మాట, hang up (disconnect).

**Ranjan:** Is that all or have you any thing more to say? I am in a hurry.
(అంతేనా, ఇంకేమన్నా చెప్పాల్సి ఉందా? నేను త్వరగా వెళ్లాలి)

మాటిమాటికీ phone మోగుతూ ఉండటం = Ringing off the hook.

**a)** The phone in the press office has been ringing off the hook for more information about the ministers' involvement in the scam.
ఆ కుంభకోణంలో ఆ మంత్రుల పాత్ర గురించి సమాచారం కోసం, పత్రిక ఆఫీసులో phone మాటిమాటికీ మోగుతూనే ఉంది.

**b)** The hospital phone has been ringing off the hook with offers of blood donation to save the baby's life.
ఆ బిడ్డ ప్రాణం కాపాడటం కోసం, రక్తదానం ఇచ్చే వారి Phone లు మాటిమాటికీ వస్తున్నాయి.

ఇవీ phone conversation కు సంబంధించిన మరికొన్ని expressions.

**EXERCISE**

**Look at the following sentence:**

Smoking is bad for health (Smoking ఆరోగ్యానికి చెడు). We can use 'To smoke' instead of the 'smoking' in the sentence above. The meaning does not change.

To smoke is bad for health (= smoking is bad for health.)

Write as many sentences as you can, in which the '.... ing' form can be changed into the infinitive (like, 'to smoke')

eg: Walking is good for health = To walk is good for health.

ఇలా 'ing' form బదులు infinitive వాడి మీకు వీలయినన్ని sentences మాట్లాడండి.

---

**ప్రశ్న:** *i) Tony, Sony and Rony go to a hotel. / an hotel. ఏది కరెక్టో తెలియజేయండి.*



*ii) I am having a one rupee note అని Lifco Dictionary లో ఉంది. Having ను possession లో వాడకూడదు కదా? వివరించండి.*

*– జి. శంకర్, కేశవపట్నం*

**జవాబు:**

i) A hotel correct.
An hotel - old usage - ఇప్పటి వాడుకలో తప్పు.

ii) కలిగి ఉండటం అనే అర్థంతో am having/ is having/ are having, correct English usage లో సరికాదు. I have a one rupee note, correct.

---

**ప్రశ్న:**

*i) ఒక వ్యక్తిని పరిచయం చేసుకునేటప్పుడు ఆ వ్యక్తి How do you do? అంటే మన response ఎలా ఉండాలి?*

*ii) పరిచయ సందర్భంలో nice to meet you (or) nice meeting you, glad to meet you అంటే మన response ఎలా ఉండాలి? మనం కూడా nice to meet you too అనాలా లేదా ఏవిధంగా మాట్లాడాలి? ఇంతేకాకుండా ఇంకా ఏవిధంగానైనా పరిచయం చేసుకోవచ్చా?*

*iii) ఇంగ్లిష్ నేర్చుకోవడానికి అలాగే American Accent కోసం ఏమైనా తెలియజేయండి.*

*iv) Idioms & Phrases కు ఏదైనా బుక్ ఉందా? లేదా ఏ dictionary బాగుంటుంది?*

*v) By the way ని topic మార్చడానికి ఎలా ఉపయోగిస్తారు?*

*– ఎ. రమణాకర్‌రాజు, ఖానాపూర్*



**జవాబు:**

**i)** మన response కూడా, Fine, thank you; How do you do? అనైనా గానీ, simple గా How do you do? అనైనా గానీ ఉండాలి.

**ii)** Glad to meet you too/ nice to meet you too మీరన్నట్లు.
It's great pleasure meeting you, etc.
(మొట్టమొదటి spoken English lesson చూడండి)

**iii)** English నేర్చుకోవటానికి best method- 1) Reading as much English as possible- newspapers, books (starting from small books and going on to big novels), 2) Listening constantly to English news telecasts, 3) watching English movies for American accents. ఇంతేకాకుండా market లో CDs చాలా ఉన్నాయి- leading book shops లో.

**iv)** Oxford Advanced Learners Dictionary of current English.

**v)** by the by = by the way (used to change the topic).

---

**ప్రశ్న:**

*i) What is the passive voice of "Why don't you keep him offered."*
*Can we write as: Why doesn't he be kept offered by you.*

*ii) Can we say "I have a pen" as I am having a pen.*

*– బి. ప్రభుదాస్, కరీంనగర్*

**జవాబు:**

**i)** Why don't you keep him offered?
ఈ sentence కు అర్థం తెలియటం లేదు. అయితే దీనికి passive form: Why is he not (isn't he) kept offered by you?

**ii)** I have a pen - correct.

*- M. SURESAN*

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 266




Good evening everybody. On behalf of the students, staff and management of Suvidya College, this is Ramachandra welcoming you all to this evening's function, the 23rd annual day celebrations of the College.

(అందరికీ శుభ సాయంత్రం. సువిద్య కళాశాల వార్షికోత్సవం సందర్భంగా, కళాశాల విద్యార్థులు, అధ్యాపకులు, యాజమాన్యం తరఫున నేను రామచంద్ర మిమ్మల్ని ఈ వేడుకకు ఆహ్వానిస్తున్నాను.)

The programme will be starting in a short time from now. May I request all the invitees to be seated so that we can begin the function.

(ఈనాటి కార్యక్రమం మరికొద్ది సేపట్లో ప్రారంభంకానుంది. కార్యక్రమాన్ని ప్రారంభించేందుకు వీలుగా ఆహ్వానితులనందరినీ ఆసీనులు కమ్మని కోరుతున్నాం.)

Dear friends, we are celebrating, as you all know, the 23rd anniversary of the college. I find it a pleasure to let you know the order of events that you are going to witness this evening.

(మిత్రులారా, మీకు తెలుసు. మనం మన కళాశాల 23వ వార్షికోత్సవం నిర్వహించుకుంటున్నాం. మీరు చూడబోతున్న కార్యక్రమ అంశాలు తెలుసుకుందాం.)

We start this evenings proceedings with welcoming the guests on to the dias. The celebrations will begin with a prayer by the college prayer group then follows the welcome address by the President of the college students' society. The next will be the presentation of garlands and bouquets to the guests of the evening and others. We will then listen to a brief report by the Principal of the college's activities and progress during the year. We will then have Prof Narayana introducing the Chief Guest, the renowned scientist, Prof Bhoutik. What follows then is the highlights of the evening's programme, the Chief Guest's message.

(ఈనాటి అతిథులను వేదిక మీదికి ఆహ్వానించటంతో నేటి కార్యక్రమాన్ని ప్రారంభిస్తాం. 23వ వార్షికోత్సవ వేడుకలు కళాశాల ప్రార్థనాబృందం గానంతో ప్రారంభం అవుతాయి. ఆ తర్వాత కళాశాల విద్యార్థి సంఘ అధ్యక్షుడి స్వాగతోపన్యాసం ఉంటుంది. తర్వాతి అంశం వేదిక మీద ఉన్నవారికి పుష్పమాలలు, గుచ్ఛాల సమర్పణ. (Bouquet - బుకే - పుష్పగుచ్ఛం.) ఆ తర్వాతి అంశం, principal నివేదిక - ఈ విద్యా సంవత్సరం (Academic year) కళాశాల ప్రగతిని, కార్యకలాపాల గురించి principal నివేదిక. తర్వాతి అంశం ఈ సాయంత్రం కార్యక్రమంలో ముఖ్యాకర్షణ. (High light = ముఖ్యాకర్షణ).

However, then there will be a vote of thanks proposed by the secretary of the college students' union, Vidyalankaar after all this, we are going to be treated to a variety entertainment programme by the students of our college.

(ఆ తర్వాత విద్యార్థి సంఘం కార్యదర్శి విద్యాలంకార్ వందన సమర్పణ ఉంటుంది. ఆ తర్వాత వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు - మన కళాశాల విద్యార్థుల ప్రదర్శన ఉంటుంది. (Treat = విందు)

మనం ఈసారి Spoken English లో భాగమైన Public speaking (ప్రసంగాలు) గురించి తెలుసుకుంటున్నాం.

ఇది కళాశాల వార్షికోత్సవాన్ని గురించి ఆహ్వానితులకు పరిచయం చేసే ప్రసంగం అని తెలుస్తూనే ఉంది కదా. అంటే ఇది event ను compere చేయటం (event = ఇవెంట్ = మామూలు అర్థం సంఘటన. ఈ సందర్భంలో, ఏదైనా వేదిక మీద జరిగే నృత్య, నాట్య, నాటక ప్రదర్శనల్లాంటివి కూడా events)

Compere (కాంపియ - 'కా' నొక్కిపలుకుతాం) = ఒక సభలో/ సమావేశంలో/ వినోద కార్యక్రమాల్లో/ వేదిక మీద ఏ ప్రదర్శనలోనైనా ప్రదర్శకులను, కళాకారులను, కార్యక్రమాన్ని ప్రేక్షకులకు పరిచయం చేస్తూ వివరించేవారు/అలా వివరించటం.

TV show లో compere ను anchor/ host/ hostess అని కూడా అనడం మీరు గమనించే ఉంటారు.

Compere కు ఇంకో మాట master of ceremonies అయితే ఈ మాట abbreviation MC (EMCEE) అనేది ఎక్కువగా వాడుతుంటారు, పూర్తి మాట Master of Ceremonies కంటే కూడా.

మనం పైన చదివిందంతా కూడా programme compere చేసే విధానం - మళ్లీ గుర్తుంచుకోండి-

Compere అంటే ప్రదర్శనకు వ్యాఖ్యాత అనే అర్థమే కాకుండా వ్యాఖ్యానించటం అనే అర్థం కూడా ఉంది. మనకు కొంచెం ఆత్మ విశ్వాసం ఉండి, మాట్లాడగలిగితే మనమూ compere అవచ్చు. compere చేయవచ్చు అంటే EMCEE చేయవచ్చు. అంటే anchor గా ఓ programme ను host చేయవచ్చు. ఇది public speaking spoken English లో చాలా ముఖ్యమైన అంశం.

ఇప్పుడు ఈ college anniversary compere చేయటం ఎలా ఉందో చూద్దాం. ఈ compere, Ramachandra కదా. ఇక్కడ Ramachandra, College anniversary Celebrations ప్రారంభమయ్యే ముందు ఆ celebrations కు వచ్చిన వాళ్ల నుద్దేశించి చెప్పిన మాటలు. Celebrations ప్రారంభించటానికి ఇంకాస్త వ్యవధి ఉన్నందున, జనాలకు విసుగు పుట్టకుండా అంటున్న మాటలివి.

1. ప్రారంభం: Good evening, everybody.
2. compere స్వీయపరిచయం - ఇది చాలా మంది విస్మరిస్తుంటారు. 'ఎవరు, ఎవరిది?' అని ప్రేక్షకులు అనుకోక ముందే వారికి తెలియడం మంచిది.
3. వచ్చిన వారినందరినీ ఆహ్వానించటం - దీన్నే welcoming the gathering అంటాం. Gathering = ఒక event కు వచ్చే ఆహూతులు. ముఖ్యంగా ఇక్కడ గమనించాల్సిన విషయం. ఎవరు ప్రదర్శన నిర్వహిస్తున్నారో ఆ వివరాలు కూడా తెలపడం - వారి తరఫున కదా compere ఆహ్వానితులను ఆహ్వానించేది.
4. Programme ప్రారంభానికి వ్యవధి ఉంది. వచ్చిన వాళ్లు విసుగు చెందకుండా చూడటం compere విధి. కాబట్టి వాళ్లను మాటలతో engage చేయాలి. అందుకనే ఇక్కడ compere, ఆ రోజు జరగబోతున్న కార్యక్రమాంశాలనను తెలియపరచటంతో ఆ వ్యవధి భర్తీ చేయటం గమనించండి. (ఆనాటి కార్యక్రమం కరపత్రంలో programme line up ఉంటుంది కూడా)

చివరికి ఇలా ముగించవచ్చు. Dear friends, your patience for a few minutes, before we begin.

(మేం ప్రారంభించేందుకు కొద్ది నిమిషాలు పట్టవచ్చు. మీరు ఓర్పుతో ఉండాలని కోరుకుంటున్నాం.)

గమనించాల్సిన విషయాలు:

1) ఆహ్వానించటం ఎప్పుడూ ఒకేలా కాకుండా welcoming లో కూడా Variety చూపిస్తే బాగుంటుంది కదా.

a) I/ We welcome you all
b) I/ We extend a warm welcome to you all
c) A warm/very welcome to all the invitees
d) We take pleasure in welcoming you all
e) It's our privilege to have you all here.
f) Welcome to you all from RamaChandra (Compere/ EMCEE)
g) Welcoming you all is Ramachandra, on behalf of...
h) your presence here is our pleasure.

ఇలా మన ఊహాశక్తికి పదును పెడితే ఎన్ని విధాలు గానైనా స్వాగతించవచ్చు.

ఒక్కటే గుర్తుంచుకోవాలి; Public speaking ఎప్పుడు formal గానే ఉంటుంది. అందుకని అందరికీ ఆహ్లాదం కలిగించి ఎవరినీ నొప్పించకుండా జాగ్రత్తలు తీసుకోవాలి.

ఇవీ కొన్ని సూచనలు. మరికొన్ని సూచనలు వచ్చే lesson లో

**Exercise:** Practise aloud as many sentences of welcome (General Welcome) with the help of other welcome sentences given in the lesson.

## your presence here is our pleasure..

ప్రశ్న: **To + be form గురించి వివరంగా తెలియజేయండి.**

1. To be take ( let form verb)
2. To be taken (p.p.)
3. To be Interesting (ing form)
4. May be taken
5. Can be taken
6. To be grateful

**– కె.అప్పారావు, విజయనగరం**



**జవాబు:** To be అంటే ఉండటం

To be+past participle, infinitive (to take, to see, etc) కు passive form.

i) To be take (to be+1st Regular doing word)

English‌లో ఎక్కడా వాడం.

ii) To be taken అనేది, to take కు passive voice. To be taken కు అర్థం తీసుకెళ్లబడటానికి/ తీసుకెళ్లబడటం అని.

a) He wants to be taken to a doctor.

(అతడు doctor దగ్గరకు తీసుకెళ్లబడమని కోరుతున్నాడు.)

b) To be taken in a bus all the way is not safe.

(అంత దూరమూ busలో తీసుకెళ్లబడటం క్షేమంకాదు.)(అయితే, 'బడటం' తెలుగులో చాలా అరుదు)

iii) To be interesting - to be = ఉండటం; interesting = ఆసక్తికరంగా. To be interesting = ఆసక్తి కరంగా ఉండటం/ఆసక్తికరంగా ఉండేందుకు.

iv) May be taken = తీసుకెళ్లబడవచ్చు.

v) can be taken = తీసుకెళ్లబడగలదు/గలడు/గలరు/వచ్చు

vi) To be grateful = కృతజ్ఞతతో ఉండటం

ప్రశ్న:

**i)** I saw 'a saw is sawing a saw' and such a saw I never saw. ఈ వాక్యార్థాన్ని తెలపండి.

**ii)** He was late. He missed the school bus.

ఈ వాక్యాన్ని రెండు విధాలుగా రాస్తే-

a. If he was late, He would miss the school bus.

b. If he wasn't late, He wouldn't miss the school bus.

**iii)** a. He died in 1919

b. He was died in 1919.

రెండూ సరైనవేనా?

**iv)** a. The Examinations will conduct soon.

b. The Examinations will be conducted soon.

పై రెండింటిలో ఏది తప్పు.

**v)** a. నేను పరీక్ష ఉత్తీర్ణుడనైతిని(నిన్న).

b. వారు నన్ను పరీక్ష ఉత్తీర్ణుడిని చేశారు(నిన్న).

**vi)** Brough around - Bring around ఈ phrase ని వివరించండి.

**– పి. ధనుంజయరావు, శ్రీకాకుళం.**

i) ఒక రంపాన్ని కోసే ఇంకో రంపాన్ని చూశాను. అలాంటి రంపాన్ని నేనెప్పుడూ చూడలేదు. saw కున్న రెండు అర్థాలతో (చూశాను/ రంపం. sawing = రంపంతో కోయటం) చమత్కారంగా రాసిన వాక్యం.

ii) He was late. He missed the school bus. - rewrite as directed అంటే ఆదేశించిన విధంగా రాయండి, అని. అయితే ఆదేశం ఏమిటనేది clear గా లేనప్పుడు, ఈ విధంగా కలపవచ్చు.

a) As/ because/ since he was late, he missed the school bus.

b) If he had been late, he wouldn't (would not) have missed the school bus.

మీరు రాసిన, If he was late, he would miss the school bus - సరైన వాక్యం కాదు.

If he were late, he would miss the school bus - దీనర్థం, అతడు late అవటం అంటూ జరిగితే (అతడు late అవలేదు/ అవడు అని భావం) school bus miss అవుతాడు (miss అవలేదు అని భావం)

If he wasn't late, he wouldn't miss..... - ఇది కూడా సరికాదు. దీనర్థం అంత సరిగా రాదు.

iii) He died in 1919 correct. He was died in 1919, wrong. Die, ఈ verb కు object లేదు. కాబట్టి దాని ముందు was (be form) రాదు.

iv) The exams will conduct soon = పరీక్షలు నిర్వహిస్తాయి అని. పరీక్షలు నిర్వహించబడతాయి. అలా అనడానికి correct sentence, The exams will be conducted.

v) I passed the exam yesterday.

They passed me in the exam yesterday.

vi) bring around - దారికి తేవటం - ఎవరైనా మొండికేసి, వ్యతిరేక ధోరణిలో ఉంటే వారిని మన దారికి తేవటం - దీనికి past tense, brought around. 'Brough around' English కాదు.

**- M. SURESAN**

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 267



**Ramachandra (Compere/ EMCEE):**

May I have your attention, ladies and gentlemen (and my student friends)? All is set for the evening's programme and we now begin by inviting our beloved principal, professor Upadesh to take his seat on dais. Mitra and Charita will escort the principal to his seat on the dais.

(ఆహూతులారా, దయచేసి వినండి. ఈ సాయంత్రం కార్యక్రమానికి అంతా సిద్ధమయింది. మన ప్రియతమ principal ఆచార్య ఉపదేశ్‌ను వేదికమీద స్థానంలో కూర్చోవాలని కోరడంతో మన ఈ సభ ప్రారంభం చేస్తున్నాం. మిత్ర, చరిత ఆయనను వేదిక మీదికి తీసుకొస్తారు.)

సభికుల సావధానం (attention) పొందిన తర్వాత కార్యక్రమం ప్రారంభం- మనం పైన చూసిన రామచంద్ర ఉపన్యాసం.

కార్యక్రమం ప్రారంభానికి అంతా సిద్ధమైన తర్వాత సాధారణంగా మొట్టమొదటి అంశం- విశిష్ట అతిథులను (Chief Guest, Guest of Honour - ఇలాంటి వాళ్లను) వేదిక మీదికి రమ్మని కోరటం. ఒక విషయం చాలా ముఖ్యం- compering లో మన మాటల్లో ఎంత వైవిధ్యం ఉంటే అంత ఆసక్తిదాయకంగా ఉంటుంది. వేదిక మీదికి రావలసిన అయిదారుగురు వ్యక్తుల్లో ప్రతి వ్యక్తినీ I request Mr/ Ms so and so to come on to the dais and take his/ her seat on the dais అని ఒకే రకంగా పిలిస్తే బాగుండదు కదా. ఒక్కొక్కరిని ఒక్కో రకంగా ఆహ్వానిస్తే చాలా variety గా ఉంటుంది. అందుకు మనకు కావలసింది ఎక్కువ vocabulary (పదాల జ్ఞానం). ఇది మనం ఎంత ఎక్కువ చదివితే అంత బాగా వస్తుంది. వైవిధ్యమే (variety) compering కు ముఖ్యంగా public speaking కు సాధారణంగా ప్రాణం!

**d)** We'll now have the privilege of...

(Privilege = ప్రివిలిజ్) = ప్రత్యేక ఆదరం/ హక్కు.

అంతా మన ఊహాశక్తిని బట్టి, మన కున్న vocabulary (పదసంపద) బట్టి, ఎంత variety అయినా చూపించవచ్చు.

ఒక్కోసారి ఆహూతులను direct గానే పిలవవచ్చు

**a)** Sri/ Smt ... , the guest of the evening, will you please/ would you please/ could you please come on to the dais?/ take your seat on the dais?/ grace the dais with your presence?/ honour us with your presence on the dais?

ఒక్కోసారి Chief Guest ను guest of the evening/ of the occasion అని కూడా అంటారు.

# It will now be the turn of ..

May I now invite the chief guest, Vice Chancellor Dr.Vidyadhik of National University to grace the dais with his presence? Vinaya and Vignata will conduct him to his seat on the dais.

(తమ ఉనికితో వేదికను అలంకరించాల్సిందిగా మన ముఖ్య అతిథి, National University ఉప కులపతి, డాక్టర్ విద్యాధిక్‌ను కోరుతున్నాను. వినయ, విజ్ఞత వారిని వేదిక మీదికి తీసుకొస్తారు.)

Next, with equal pleasure we look forward to the presence, on the stage, of Smt Susobhita, Commissioner, Collegiate Education. Ajita and Ajai are requested to show her to her seat.

(తర్వాత, అంతే సంతోషంతో, కళాశాల విద్యా కమిషనర్ శ్రీమతి సుశోభిత వేదిక మీదకు రావడాన్ని ఎదురుచూస్తున్నాం. అజిత, అజయ్‌లు వారిని వేదిక మీదకు తీసుకొస్తారు.)

Now, Dr Acharya, President, Staff Association will do us the favour of taking his seat on the dais. He will be guided to his seat by Rohini and Rohit.

(అధ్యాపక సంఘం అధ్యక్షుడు డాక్టర్ ఆచార్య వేదిక మీద ఆసీనులయ్యే అనుగ్రహం మాకు కలిగిస్తారు. రోహిణి, రోహిత్ ఆయనను వేదిక మీదకు తీసుకొస్తారు.)

It will now be the turn of Miss Sadhana President, student's society to be seated on the dais.

(ఇప్పుడు వేదికమీద ఆసీనులు కావాల్సింది, విద్యార్థి సంఘం అధ్యక్షురాలు, కుమారి సాధన.)

Now the dignitaries on the dais will be garlanded and offered bouquets.

(వేదికనలంకరించిన గౌరవనీయులకిప్పుడు పుష్పమాలలు, పుష్ప గుచ్ఛాలను ఇస్తారు.)

The next on our programme is lighting of the lamp. May I ask volunteers Neeraja and Padmaja to assist the chief guest in lighting the lamp.

(మన కార్యక్రమంలో తర్వాత అంశం జ్యోతి వెలిగించటం/ జ్యోతి ప్రజ్వలన. Volunteers నీరజ, పద్మజలను ముఖ్య అతిథి జ్యోతి వెలిగించటంలో తోడ్పడాల్సిందిగా కోరుతున్నాను.)

☺ ☺ ☺ ☺ ☺

ఇప్పుడు మనం చదివింది కిందటి lesson లో చూసిన compering continuation అని తెలుస్తూనే ఉంది కదా. Compere/ EMCEE Ramachandra కళాశాల వార్షికోత్సవ కార్యక్రమ నిర్వాహణలో భాగమైన ప్రసంగమిది.

మామూలుగా వేదిక మీదికి రావాలనటానికి comperes వాడే expression- I request so and so (ఫలానా వారిని) to come on to the dais and take his/ her seat అని.

(గమనిక: వేదిక = dais - pronunciation - డెయ్స్ - మామూలుగా చాలామంది అనేట్లు డయాస్ కాదు.)

కొంచెం ఊహతో ఇదే భావాన్ని వివిధ రకాలుగా express చేయవచ్చు పైన Ramchandra's compering లో చూశారు గదా- ఒక్కొక్కరిని ఒక్కో రకంగా వేదిక మీదకు ఆహ్వానించటం.

**a)** I request our beloved principal to take his seat on the dais.

**b)** May I now invite ... to grace the dais with his presence (grace = శోభ కలిగించడం)

**c)** Next, with equal pleasure, we look forward to the presence on the stage, of smt susobhita ...

(అంతే సంతోషంతో మేం ఎదురు చూస్తున్నాం, శ్రీమతి సుశోభిత వేదిక మీదకు రావటం.)

look forward to = ఆత్రంగా ఎదురుచూడటం.

**d)** Now Dr Acharya, President, Staff Association will do us the favour of taking his seat on the dais.

(తర్వాత డాక్టర్ ఆచార్య వేదికమీద ఆసీనులై మమ్మల్ని అనుగ్రహిస్తారు- తెలుగులో అనుగ్రహించటం అనేది పెద్దమాటే, కానీ formal English లో ఈ వాడుక సామాన్యమే. favour - American 'favor' - అనుగ్రహం/ ఉపకారం.

Could you do me a small favour?

కాస్త సాయం చేస్తావా? / చేస్తారా?)

**e)** It will now be the turn of Miss Sadhana ... to take her seat on the dais.

ఇప్పుడు విద్యార్థి సంఘ అధ్యక్షురాలు, కుమారి సాధన వంతు, వేదిక మీదికి రావటం.

turn= వంతు

ఇంకా చాలా విధాలుగా కార్యక్రమంలోని ఈ భాగాన్ని compere చేయవచ్చు.

**a)** The next to honour us with his/ her presence on the dais is ...

(తర్వాత వేదిక మీద తమ ఉనికి ద్వారా మనకు ఆనందం కలిగించేవారు ...)

**b)** Equally welcome on to the dais is Mr ...

(శ్రీ ... ని అదే స్వాగతంతో వేదిక మీదికి ఆహ్వానిస్తున్నాం.)

**c)** We consider it a great privilege to have Sri/ Smt ... on the dais.

(శ్రీ/ శ్రీమతి ... వేదిక మీద ఆసీనులవటం మాకో ప్రత్యేకమైన మర్యాదగా/ అనుగ్రహంగా పరిగణిస్తాం.)

Important: Compering కు - స్పష్టంగా, నిదానంగా, కాస్త బిగ్గరగా మాట్లాడటం- ముఖ్యంగా చాలా నిదానంగా, వాక్యంలో ఆపవలసినచోట ఆపి, ప్రాముఖ్యం ఇవ్వాల్సిన మాటలు నొక్కి పలకడం ప్రధానం. వేగంగా మాట్లాడటం కాదు, Effective గా మాట్లాడటం ముఖ్యం.

**ప్రశ్న:**

*See through- See off- See out.*

*Passed out- passed off.*

*Saw in- saw off- saw of.*

*ఈ phrases అర్థాన్ని వివరించండి.*

**– వి. ధనుంజయరావు, శ్రీకాకుళం**

**జవాబు:**

See through = అర్థం చేసుకోవటం. I can see through your plan = నీ plan అర్థం చేసుకోగలను.

See through = transparent = Glass లాగా transparent గా ఉండే. Film stars wear see through clothes = తారలు పల్చటి బట్టలు (పారదర్శకంగా ఉండి, వంటిని దాచని) వేసుకుంటారు.

see off = వీడ్కోలు చెప్పటం - He saw him off at the station.

see out - ఈ expression, English లో లేదు.

passout: 1) స్పృహ తప్పటం (become unconscious); 2) సైనికులు తమ శిక్షణ పూర్తయిన తర్వాత Military College ని వదిలివెళ్ళటం

pass off = (ఒక ఘటన) ఒక విధంగా జరగటం. The event passed off peacefully = ఘటన/ కార్యక్రమం/ విషయం ప్రశాంతంగా జరిగింది.

saw in - English లో ఇది లేదు.

saw off- past tense of see of

saw of - English కాదు.

**ప్రశ్న:** *Explain the deference between the usage of 'Too and Also.'*

**– ఎం. వేణుగోపాలాచారి, హైదరాబాద్**

**జవాబు:**

'Also' is used in formal English, whereas 'too' is used in spoken English. 'Also' comes before the main verb or after a 'be form', whereas too usually comes at the end of the sentence. eg: I went to Kolkata. I also visited some other places near the city. She came here and spoke to me too. (end of the sentence)

**ప్రశ్న:** *1. Students కు 'lesson explanation' ను ఏ tense లో explain చేయాలి.*

*2. అలాగే How to teach prose, poetry, novel (non-detailed). ఈ మూడింటిలో తేడా ఏదైనా ఉందా? వివరించండి.*

**– టి.శివకుమార్, అత్తిలి**

**జవాబు:**

**i)** Tenses explain చేయాల్సింది Telugu లోనా, English లోనా అనేది తెలుపలేదు. Telugu లో అయితే, Compare చేసి వివరించండి. Telugu form ను English form ను.

English లో అయితే time of action of the verb ను బట్టి, verb form ఎలా ఉంటుందో explain చేయండి. eg: form of the verb in the present simple tense - write/ writes.

uses: Regular actions of any type.

Give example from real life. Like ..

**1)** Our school starts everyday at...



**2)** You (Your students) attend classes here from 9 to 4. Ask them to talk of regular actions using present simple tense. Similarly explain to them the present continuous tense- **1)** Its form am+... ing/ is+...ing/ are+... ing. Its uses: actions going on now-

give examples from students' experience-

You are listening/ I am teaching/ A class is going on in this room..., and so on. Try this with the other tenses.

**ii)** To teach prose, ask them to read a paragraph and try to understand the idea in it. Then you check if their understanding is correct.

(But before their reading the paragraph, give them the meanings of difficult words.) Then explain the meaning of each sentence; put them questions now and then. When all the paras are complete, ask them questions about the idea in each para.

How to teach poetry: Read out aloud to the students the poem. Give the meanings of difficult words, as used in the poem. Then read out each line after putting the words in the prose order. They will then be able to follow it more easily. Explain the whole poem again.

Teaching non detailed: Give the summary of the chapter you are going to teach. Read out aloud the chapter para after para - explain the meanings of difficult words. Give the summary of each para.

**ప్రశ్న:** నువ్వు మీ నాన్నకు ఎన్నో వాడివి? - ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**– బి. జహీర్, నంద్యాల్**

**జవాబు:**

There isn't a correct expression in English for asking this kind of question, that is, the exact number of a person/thing in a sequential order. The nearest to it could be, what is your number/place among your siblings? (Siblings= brothers and sisters)

**- M. SURESAN**

# SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 268

# I feel it an honour to ..

**Ramachandra (Compere/ EMCEE):**

The next item on the programme is welcome address by Kumari Sadhana, President, Students' Society/ Kumari Sadhana, President, Students' Society will welcome the gathering.

(కార్యక్రమంలో తర్వాతి అంశం, విద్యార్థి సంఘం అధ్యక్షురాలి స్వాగత వచనాలు/ ఇప్పుడు విద్యార్థి సంఘ అధ్యక్షురాలు కుమారి సాధన ఆహూతులను స్వాగతిస్తారు.)

Over to Sadhana (ఇప్పుడు సాధన.)

**Sadhana:**

Thank you. Ramachandra. I consider it a great honour to welcome, on behalf of our college, Dr. Vidyadhik, VC, National University, to the occasion. It certainly is a rare privilege for us to have you here, Sir, and to listen to your valuable message. You are welcome, Sir.

(Thank you రామచంద్ర. కళాశాల తరపున ఈ సందర్భానికి, మన ముఖ్యఅతిథి, National University ఉపాధ్యక్షులు Dr. విద్యాధిక్‌కు స్వాగతం పలకటం నేనెంతో గౌరవంగా భావిస్తున్నాను. ఇవాళ మీరిక్కడ ఉండటం, మీ అమూల్యమైన సందేశాన్ని మేం వినటం, మాకు లభించిన అరుదైన భాగ్యంగా భావిస్తున్నాం. మీకు స్వాగతం.)

As happy I am to welcome too, Smt. Susobhita, Commissioner, Collegiate Education to our function this evening. She has many achievements to her credit and she can be role model for us. Welcome, madam, on behalf of our college community.

(Commissioner, Collegiate Education శ్రీమతి సుశోభితను కూడా అంతే సంతోషంతో ఆహ్వానిస్తున్నాను. ఆమె సాధించినవి చాలా ఉన్నాయి. ఆమె మనకు ఆదర్శం కాగలదు. మా College తరపున మీకు స్వాగతం.)

My word of welcome goes next to all the invitees, distinguished men and women among them, to this function. We welcome heartily too, the parents of our students.

(తర్వాత ఇక్కడికి విచ్చేసిన ఆహూతులందరికీ, వాళ్లల్లో విశిష్ట వ్యక్తులు కూడా ఉన్నారు. వాళ్లకు మా స్వాగతం. ఇక్కడికొచ్చిన విద్యార్థుల తల్లిదండ్రులకూ మా ఆహ్వానం.)

Finally a warm word of welcome to our beloved Principal, learned lecturers and the student fraternity.

చివరగా మన కళాశాల ప్రిన్సిపల్‌కు, విజ్ఞులైన అధ్యాపకులకు, తోటి విద్యార్థులందరికీ స్వాగతం.

Welcome to all, once again. Thank you.

(fraternity ప్రటనిటి- ట నొక్కి పలుకుతాం) =

1. సంఘీభావం/ సోదరభావం.
2. ఒకే వృత్తికి, వ్యాపకానికి చెందిన వ్యక్తులు. (Teacher fraternity- ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నవాళ్లు.)

**Ramachandra:**

Thank you, Sadhana. We'll now have the pleasure of listening to the Principal's opening remarks as the president of the function and that will be followed by his presentation of the college annual report.

(ఇప్పుడు మన సభకు అధ్యక్షత వహిస్తున్న Principal తొలి పలుకులు/ పరిచయ వాక్యాలు వినే అవకాశం పొందనున్నాం. తర్వాత కళాశాల వార్షిక నివేదిక సమర్పిస్తారు.)

☺ ☺ ☺ ☺ ☺

గత రెండు lessons లో spoken English లో భాగమయిన compering and conduct of a meeting (సభకు ప్రయోక్తగా వ్యవహరించటం, దాన్ని నిర్వహించటం) చదివాం కదా. ఈ lesson లో అది continue చేస్తున్నాం.

[సభ నిర్వహణ రెండు విధాలుగా ఉండవచ్చు

1. మన lessons లో చూస్తున్నట్లు, మొత్తం వేదికమీది అంశాలన్నింటినీ, EMCEE యే compere చేయటం. సభకు అధ్యక్షులు ఉన్నప్పటికీ, non-political meetings లో ప్రస్తుతం చాలామటుకు, కార్యక్రమంలోని అంశాలను, వరుస ప్రకారం వివరించి, వాటికి సంబంధం ఉన్న వాళ్లను వేదిక మీదికి పిలవటం, వాటిమీద సందర్భోచిత వ్యాఖ్యలు చేస్తూ, ఆహూతులకు విసుగు పుట్టించకుండా ఉంచడం లాంటివన్నీ మొత్తం EMCEE/ Compere కే వదిలేస్తున్నారు.

రెండో విధానం: సభ ప్రారంభమయ్యేవరకూ EMCEE/ Compere ప్రసంగాలు - అందరు విశిష్ట అతిథులు stage మీద కూర్చున్న తర్వాత, సభాధ్యక్షులకు ఆహ్వాన పత్రంలోని కార్యక్రమం వరస చూపించి సభను నిర్వహించాలని కోరడం. అప్పుడు అధ్యక్షుడు/ అధ్యక్షురాలు (President) ను కార్యక్రమాన్ని నిర్వహించాలని కోరడం. ఈ తర్వాత EMCEE కి చివరివరకు పని ఉండదు. అంతా President చూసుకుంటారు. ఇది ముఖ్యంగా political meetings జరిగే తీరు. ఇందులో compere పాత్ర చాలా తక్కువ.]

ఇపుడు మనం చూస్తున్నది compere కు ప్రాధాన్యం ఉన్న సభ. విశిష్ట అతిథులు (special guests) వేదిక పైన కూర్చున్న తర్వాత, వారితోపాటు మిగతావారిని కూడా సాదరంగా ఆహ్వానించడం సంప్రదాయం. ఇలా స్వాగతం పలకటం Welcome address. ఈ సభలో విద్యార్థి సంఘ ముఖ్య ప్రతినిధి కుమారి సాధన ఈ స్వాగతోపన్యాసం చేస్తోంది కదా. Welcome address విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలి. మొదటి నుంచి చివరి వరకూ ప్రాముఖ్య వరసలో ఆహ్వానిస్తాం. లేకుంటే అపార్థాలు కలుగుతాయి. Kumari Sadhana's Welcome address has this order:

1. Chief Guest
2. Guest of honour
3. Principal
4. Other invitees and parents
5. Lecturers and other students.

ఈ Welcome address కూడా ఎంత variety గా ఉంటే అంత బాగుంటుంది. ఇక్కడ మనం బాగా ఉపయోగించే మాటలు Privilege, honour, pleasure, joy (ఇది కాస్త తక్కువ), consider/ deem (పరిగణించటం)- ఇవి వాక్యాల్లో ఎలా వాడాలో చూద్దాం.

1) On behalf of our college community,

a) I consider it/ deem it/ a privilege/ honour to Welcome the Chief Guest of the evening, Sir...

b) With immense (అపారమైన)/ great pleasure I Welcome Sir...

c) I find great/ immense pleasure in Welcoming Sir...

d) I now have the pleasure/ privilege of Welcoming Sir...

e) I feel honoured to Welcome Sir...

f) I feel it an honour to Welcome Sir...

ఇలాంటివే కాకుండా ఇదే భావాన్ని స్ఫురింపజేసే దేన్నయినా మనం వాడవచ్చు. ముఖ్యంగా ఇదంతా public speaking లో భాగం కాబట్టి, చాలా preparation అవసరం. సభ/ function ప్రారంభానికి ముందే కార్యక్రమం అన్ని వివరాలు, List of invitees/ in the order of their importance, important details of the invitees with their correct names, position etc., thorough గా తెలిసి పెట్టుకోవటం చాలా ముఖ్యం. ఇదే మన performance బాగా ఉండేట్లు చేస్తుంది. Without proper preparation, stage మీద పొరపాట్లు చేసే అవకాశం ఉంటుంది. Stage మీద చిన్న పొరపాట్లు కూడా సభికులకు పెద్దవిగానే కనిపిస్తాయి.

Important: Speak with confidence. సభికులు మనల్నే చూస్తున్నారు. మనం ఏం తప్పు చేయకూడదు, అనే భావం అసలుండకూడదు. (ఇదే self consciousness అంటారు. ఇది వదిలేస్తే మనం success.) Speak freely and with ease. Next, in your Welcome address, while welcoming a person, turn your face towards him and nod your head.

(ఒకరిని ఆహ్వానించేటప్పుడు, వాళ్ల వైపు తిరిగి తల ఆడించటం బాగా ఉంటుంది.)

Public Speaking కాబట్టి చాలా నిదానంగా, ఆగాల్సిన చోట ఆగి, స్పష్టంగా (distinctly) మాట్లాడితే చాలా బాగుంటుంది.

**EXERCISE**

**Practise compering (in English) the birthday party of your friend, use the following points.**

1. Call the gathering to order. (వచ్చిన వాళ్లందరిని సావధానులను కమ్మనటం.) (May I have your attention, please etc.,)
2. Reminding the invitees of the occasion. (సందర్భాన్ని గుర్తు చేయడం.) (Begin: 'My dear friends, We are here to celebrate ... లాంటి మాటలతో)
3. Welcome all of the invitees.
4. Express your best wishes to your friend on behalf of all the invitees.
5. Blowing of the candles, cake cutting.
6. Entertainment and refreshment.

**ప్రశ్న:** *చనిపోయిన వ్యక్తుల పేరు ముందు late వాడతాం కదా! late తర్వాత Mr./ Mrs. వాడాలా,లేదా late తర్వాత పేరు వాడాలా?*

**- V. S. Murthy, e-mail.**

**జవాబు:** After late, Mr/ Mrs/ Sri is not used, but 'the' must be used before 'late'. (The late NT Rama Rao)

**ప్రశ్న:** *I would like to know, is there any simple good course book for English speaking course. If it is, where can I get it?*

**- Ramanarasaiah, e-mail.**

**జవాబు:** You will find, 'Living English structure' by Stannard Allen, a very useful book. It is very helpful for learners.



**ప్రశ్న:**

1. *What is meant by adverb?*
2. *What is the meaning of contemptuous?*

**- ఆర్. సవిత, హైదరాబాద్**

**జవాబు:**

1. Adverb modifies a verb. Verb subject చేసే పనిని తెలుపుతుంది. ఆ పని ఎలా/ ఏ మేరకు జరిగింది అనే తెలిపే పదం adverb.

   He walked slowly (అతను నిదానంగా నడిచాడు)- ఇక్కడ verb, walked = నడిచాడు. ఎలా నడిచాడు? Answer: Slowly (నిదానంగా) కాబట్టి slowly అనేది adverb. Verb కు ఎలా? (how) అని ప్రశ్న వేసుకుంటే వచ్చే జవాబే adverb.

   He ran fast - ఎలా పరుగెత్తాడు? (How did he run?)

   Answer: Fast. So 'fast' is the adverb here.



2. (ఎవర్నైనా/ దేన్నైనా) తక్కువ భావంతో/ అసహ్యంతో చూసే/ రోతగా అసహ్యించుకొనే అని.

   The whites were contemptuous of the blacks = నల్లవాళ్లపట్ల తెల్లవాళ్లు అసహ్యభావంతో ఉండేవాళ్లు.

   She is contemptuous of whatever I do = నేనేంచేసినా ఆమెకు అసహ్యం.

   He is contemptuous of cricket = క్రికెట్ అంటే అతడికి అసహ్యం.

**ప్రశ్న:** *In spite of అంటే ఏమిటి? దీన్ని ఎప్పుడు వాడతారు? ఉదాహరణలు ఇవ్వండి.*

**- Y. Sudhakar, e-mail**

**జవాబు:**

In spite of = అయినప్పటికీ.

a) Inspite of her treatment by a good doctor, she died. (మంచి డాక్టర్ వైద్యం చేసినప్పటికీ, ఆమె చనిపోయింది.)

b) Inspite of her beauty, she is modest. (అందం ఉన్నప్పటికీ, ఆమె నిగర్వి.)

c) Inspite of his starting late, he was able to catch the train. (ఆలస్యంగా బయలుదేరినప్పటికీ, ట్రైన్ అందుకోగలిగాడు.)

Inspite of తర్వాత ఎప్పుడూ, noun గానీ [sentence (a) and (b)], 'ing' form గానీ (sentence c) వస్తుంది. Inspite of = though.

**ప్రశ్న:**

1. *వీటిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?*
   *i) అతడు చేయించాడు.*
   *ii) అతడు నన్ను చేయమన్నాడు.*
   *iii) అతడి బదులు నన్ను వెళ్లమన్నాడు.*
2. *as- as ఇలా ఎన్ని పదాలున్నాయి? ఉదా: as long as, as much as, as soon as. మరికొన్ని ఉదాహరణలతో వివరించగలరు.*

**– కె.సుధాకర్‌రావు, మనుబోలు**

**జవాబు:**

1. i) He got it/ had it done.
   ii) He asked me to do it.
   iii) He wanted me to go instead of him.
2. మనం తెలియపరచాలనుకున్న భావాన్ని బట్టి, 'as - as' వాడి ఎన్ని phrase లైనా వాడవచ్చు.
   **eg:** As late as; as recently as, as early as, as many as, etc.

**- M. SURESAN**

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 269

# TO RISE HIGH IN LIFE...

**Ramachandra (EMCEE / Compere):**

That was Kumari Sadhana welcoming the guests of the evening.

Now We'll have president of the evening's function, our principal making his opening remarks. It will then be followed by his presentation of the college annual report.

(ఇప్పటి వరకు ఆహూతులకు కుమారి సాధన ఆహ్వానం పలికింది. ఇప్పుడు ఈ సభకు అధ్యక్షులైన మన ప్రిన్సిపల్ తొలి పలుకులు ఉంటాయి. ఆ తర్వాత కళాశాల వార్షిక నివేదికను ఆయన సమర్పిస్తారు)

After the Principals opening remarks followed by college report.

(ప్రిన్సిపల్ ఉపన్యాసం అయ్యాక తర్వాత కాలేజ్ రిపోర్ట్ ఉంటుంది)

**Ramachandra:**

You've just heard the principal presenting the college report. The college has made a good progress with several of the students shining in different fields.

(ప్రిన్సిపల్ నివేదిక విన్నాం; విద్యార్థులు వివిధ రంగాల్లో సాధించిన ఫలితాలు కళాశాలను ప్రగతిబాటలో పయనించడానికి తోడ్పడ్డాయి.) తర్వాతి అంశం.

**Ramachandra:**

Now, on to our next item - the introduction of the chief guest by the vice president of the students' society Mallikarjun.

(కళాశాల విద్యార్థి సంఘ ఉపాధ్యక్షుడు మల్లికార్జున్ ముఖ్యఅతిథిని సభికులకు పరిచయం చేస్తాడు.) over to Mallikarjun.

**After the introduction of the chief guest**

(ముఖ్య అతిథి పరిచయం తర్వాత)

**Ramachandra:**

Well, we've seen from Mallikarjun's introduction that we are very fortunate to have in our midst this evening, a very great man, indeed one who can inspire us to rise high in life. Without further delay let's have his message. We invite you sir, (Vice chancellor, Dr Vidyadhik of National University). looking forward your message.

(ఈ సాయంత్రం ముఖ్యఅతిథిగా మన మధ్యనున్న వ్యక్తి ఎంత గొప్పవారో మల్లికార్జున్ పరిచయం ద్వారా తెలుసుకున్నాం. ఇంకేం ఆలస్యం లేకుండా ఆయన సందేశాన్ని మనం విందాం. మీ సందేశం కోసం ఎదురు చూస్తూ, మళ్లీ మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాం)

**After the chief guest's address**

(ముఖ్యఅతిథి ఉపన్యాసం తర్వాత)

**Ramachandra:**

That was really an inspiring speech by the chief guest. It's a rare privilege to have listened to such words. May I on behalf of my student friends assure you, sir, we will try our best to put into practice your valuable message.Thank you again and again, sir.

(ముఖ్యఅతిథి ఉపన్యాసం చాలా ప్రేరణ కల్గించేదిగా ఉంది. ఇలాంటి మాటలు వినే అవకాశం చాలా అరుదుగా వస్తుంది. మీ సందేశాన్ని ఆచరణలో పెట్టడానికి మా శాయశక్తులా కృషిచేస్తామని మా విద్యార్థుల తరపున నేను హామీ ఇస్తున్నాను. మీకు మా ధన్యవాదాలు)

Prize distribution - that is what is to follow now, my dear friends. Students who have shown their merit in various fields will now have the rare honour of receiving their prizes from the Guest of Honour, Smt Susobhita, Commissioner, Collegiate education.

(దీని తర్వాత బహుమతి ప్రదానం ఉంటుంది. మిత్రులారా, వివిధ రంగాల్లో తమ ప్రతిభను ప్రదర్శించిన విద్యార్థులకు, శ్రీమతి సుశోభిత, Commissioner, Collegiate education, బహుమతి ప్రదానం చేస్తారు.

Susmita and Sekhar will read out the prize list. alternately.

(సుస్మిత, శేఖర్, ఒకరి తర్వాత ఒకరు prizelist చదువుతారు.)

**After the prize distribution**

(బహుమతి ప్రదానం తర్వాత)

**Ramachandra:**

Thank you - very much, Madam, for having taken the trouble to give away as many as 140 prizes both academic and sports. That must have been a strain- giving away 140 prizes, but we could n't help it as that only shows such a large number of achievers.

(మేడమ్, విద్య, క్రీడలకు సంబంధించిన అన్ని బహుమతులు ఇచ్చినందుకు మీకు ధన్యవాదాలు. 140 బహుమతులివ్వటం మీకు చాలా శ్రమే అయ్యుండాలి. కాని తప్పదు. ఎంతమంది ప్రతిభావంతులున్నారో ఈ సంఖ్యే తెలుపుతోంది)

Now follows vote of thanks - to be proposed by the Secretary of the Students Society- Niranjan.

(ఇప్పుడు విద్యార్థి సంఘ కార్యదర్శి నిరంజన్ వందన సమర్పణ ఉంటుంది)

◗ ◗ ◗ ◗ ◗ ◗ ◗

పై ప్రసంగం అంతా మనం గత కొన్ని lessons లో చూస్తున్న Compering Continuation పైనే ఉంది.

* విద్యార్థి సంఘ అధ్యక్షురాలు 'సాధన' స్వాగతోపన్యాసం తర్వాత, President's Opening remarks- అధ్యక్షుడి తొలి పలుకులు- ఉంటాయి.
* Principals annual report, దాని వెంబడే Prize Distribution, ఉంటుంది. ఆ తర్వాత Vote of thanks- సభా కార్యక్రమంలో మామూలుగా ఇదీ వరస.
* (అయితే ఒక్కోకప్పుడు vote of thanks కు ముందు President's closing remarks ఉంటాయి. కానీ College functions లో సాధారణంగా ఇది ఉండదు)
* ఈ వరస క్రమం announce చేసేటప్పుడు, Compere, the next item on the programme is, అని మార్పు లేకుండా ప్రతిసారీ అలా అంటుంటే ప్రేక్షకులకు విసుగనిపించడం సహజం.
* అందుకని ప్రతి అంశాన్నీ announce చేసేటప్పుడు, వేరే విధంగా announce చేస్తే చాలా బాగుంటుంది కదా. దాంతోపాటు అక్కడ సందర్భానుసారం అప్పటికప్పుడు సరిపోయే మాటలు, అప్పటికప్పుడు ఊహించుకొని extemporize (ఎక్స్‌టెంపోరైజ్- జ్, size లో zలా) చేస్తే చాలా అందంగా ఉంటుంది.
* Extemporize: చేయగలడం (సందర్భానికి తగినట్లు అప్పటికప్పుడు అనుకొని పైకిచెప్పటం) Compering ను చాలా ఆకర్షణీయంగా చేస్తుంది.

The next item on the programme అని ప్రతిసారి అనడం ప్రేక్షకులకు విసుగు తెప్పిస్తుంది. ప్రేక్షకుల్లో ఉత్సాహాన్ని నింపే variety గా ఉండే కింది expressions వాడవచ్చు.

a) What follows next is the president's opening remarks
   (తర్వాత వచ్చేదేంటంటే...)

b) We are now going to be treated to a wonderful speech by Sri/Smt... =
   (శ్రీ/శ్రీమతి... తమ అచ్చెరువు కల్గించే ఉపన్యాసంతో మనకు విందు చేయనున్నారు)

(are going to be treated to = విందు ఇవ్వబడబోతున్నాం. మామూలు తెలుగులో 'విందుపొందనున్నాం' అని అంటాం)

(treat= విందు. వైద్యం చేయడం అనే అర్థంలో దీన్ని ఎక్కువగా వాడతారు. ఒకరిపట్ల మనం చూపించే ఆదరాభిమానాలు, etc.)

c) Here's what we've been looking forward to/waiting anxiously all along the chief Guest' address =
   మనం ఇంతసేపూ ఆత్రుతతో ఎదురుచూస్తున్న ముఖ్య అతిథి ఉపన్యాసం ఇప్పుడు వినబోతున్నాం)

d) May I now request Sri/Smt... to inspire us with his / her message, etc., =
   (తమ సందేశంలో మాకు స్ఫూర్తి కల్గించాల్సిందిగా Sri/Smt... కోరుకుంటున్నాను.)

ఇలా మన ఊహాశక్తిని/ మనకున్న vocabulary ఆధారంగా, ఎంతవైవిధ్యంతో (variety)నైనా compere చేయవచ్చు. మీకు Compere చేసే అవకాశం లేకుంటే మీ ఇంట్లో అద్దం ముందు ఒక event ను ఊహించుకొని comparing బిగ్గరగా practice చేయండి. తప్పకుండా మీరూ మంచి compere అవుతారు .

**Exercise:**

మామూలు సమావేశాల్లో చివరి అంశం vote of thanks. దీనిని తెలుగులో వందన సమర్పణ అంటాం. సమావేశానికి వచ్చిన వారందరికీ, సమావేశ విజయకారకులైన వారికీ కృతజ్ఞతలు తెలపడం.

✓ మీరు college students' union Secretary గా ఊహించుకుని చెప్పండి.

**సూచనలు:**

1) ఎక్కువ ప్రాముఖ్యం ఉన్న వ్యక్తికి ముందూ, అతి తక్కువ ప్రాముఖ్యం ఉన్న వారికి చివర thanks - ఆ వరస క్రమంలో - అత్యంత ప్రాముఖ్యం నుంచి అత్యల్ప ప్రాముఖ్యానికి రావాలి.

2) వందన సమర్పణ (vote of thanks)
ఈ వాక్యాలతో Englishలో ఇలా ప్రారంభించండి,
"వందన సమర్పణ చేసే అవకాశం నాకు వచ్చినందుకు ఎంతో సంతోషంగా ఉంది/ఇది నాకిచ్చిన గౌరవం అనుకుంటున్నాను"-
(I find it/feel it/deem it a great pleasure to...)
వందన సమర్పణ చేయటం = propose/offer a vote of thanks.

3) కళాశాల విద్యార్థులు, అధ్యాపకులు, యాజమాన్యం నా తరపున మొట్టమొదటిగా మన ముఖ్య అతిథి (పేరు, హోదా చెప్పండి) కి కృతజ్ఞతలు.

4) ఈనాటి guest of honour శ్రీమతి ...కు కృతజ్ఞతలు

ఇలా సమావేశం విజయవంతం చేసినవారందరూ వచ్చేలా English లో vote of thanks చెప్పండి, .




**ప్రశ్న:**

1. They have been able to solve the problem.
   Structure: have been able to + p.v.
2. She might have been able to get their support.
   Structure: might have been able to + p.v.
3. She must have been able to prove them wrong.
4. Miss Savitri must have been able to incite him to cause harm to his reputation.
   Structure: Must have been able to + p.v.

I have doubts in the above sentences structure. Please clarify.

*S. Mohinuddin, Kurnool*

**జవాబు:**

i) The part 'have been to solve the problem'' of sentence No - 1 is NOT in the structure.



**'have been able to P.V. (passive).**

Here, the division of the sentence should be, 'have been able + to solve + the problem. 'to solve' should be taken as a single unit, because 'to solve (to + 1st Regular doing word) is an infinitive.

So the structure of 'have been able to solve the problem' is: Have been (verb) + able (adjective) + to solve (infinitive) + the problem (noun/object).

No part of the expression here is in passive voice. Only an expression with a 'be' form + past participle (is done, has been given, are seen etc) is in the passive voice. Same applies to your other sentences No. 2, 3 & 4. This is the structure.

**Structure of the sentence**

| Subject | Verb | adjective | infinitive | noun etc |
|---|---|---|---|---|
| They | have been | able | to solve | the problem |
| She | might have been | able | to get | their support |
| She | must have been | able | to prove | them wrong |
| Miss Savithri | must have been | able | to incite | him to cause harm to them |

You see none of your sentences or part of them are in passive voice (PV)



**ప్రశ్న:**

1. After a three day strike, the management has accepted the workers demands. పై వాక్యంలో three days అని బహువచనం రాయకూడదా? వివరించండి.

*T. Sridevi, Dhulipudi*

**జవాబు:** మూడు రోజుల సమ్మె- a three day strike/ three days' strike- ఈ రెండూ correct.

a) The College reopened after a 15 day holiday = The college reopened after 15 days' holiday = after 15 days of holidays.
b) The three day conference ended today = The three days' conference ended today.

**- M. SURESAN**

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 270

**Ramachandra (Compere/ EMCEE):**
(After the prize distribution)
Thank you again and again, Madam, for giving away so many prizes. We know it was a trouble for you standing all the time. Our prize winners, however, will never forget this honour of receiving the prizes from you.
(మీకు మళ్లీ మళ్లీ thanks, అన్ని బహుమతులిచ్చినందుకు. అంతసేపు నిలుచోవడం మీకెంత శ్రమో మాకు తెలుసు, కాని మా విద్యార్థులు మీ నుంచి బహుమతులందుకునే భాగ్యం ఎప్పటికీ మరచిపోరు.)
We won't keep the guests of honour for long. Now the Vote of thanks to be proposed by the Secretary of the students' society, Jayanth. Over to Jayanth.

(తర్వాత మా అభిమాన principal కు, lecturers కూ కృతజ్ఞతలు. వారి సహకారం చాలా అమూల్యమైంది.)
The student volunteers have done a wonderful job organising the whole show. Our thanks to them too.
(విద్యార్థి volunteers ఈ వేడుకను నిర్వర్తించడంలో చాలా గొప్పసేవే చేశారు. వారికీ మా కృతజ్ఞతలు.)
We appreciate the services of the public address system for the neat job that it has turned out to be. So our thanks to Biggara mike systems.
(Mike system చాలా బాగా పనిచేసినందుకు మాకు సంతోషం. వాటిని అమర్చిన బిగ్గర mike systems కు మా ధన్యవాదాలు.)
Finally our thanks to all the students of the college for their part in making the function a grand success.

**Compere:**
Hi guys and gals/ every body, good evening. Welcome to our buddy Viswanath's birthday. He is 22 years young today. We are partying on the occasion. Let's us all make merry.
(Birthday party అనేది ముఖ్యంగా యువతీ యువకుల విషయంలో చాలా informal గా ఉంటుందనేది తెలుసు. అందులో దాదాపు సమవయస్కులుగానే ఉండటం వల్ల చాలా చనువుతో చాలా సరదాగా ఉండవచ్చు.)
Guys = మగవాళ్లు - informal.
Gals = ఆడపిల్లలు - informal.
Friends, ఈరోజు మన friend Viswanath పుట్టిన రోజు. అతడు ఈవేళ 22 సంవత్సరాల చిన్న వయసు - మనం ఈ సందర్భంగా Party నిర్వహించుకుంటున్నాం. సరదాగా గడుపుదాం.




# Our sincere appreciation of ..

(మన విశిష్ట అతిథులను ఎక్కువసేపు ఉంచబోవటం లేదు. విద్యార్థి సంఘ కార్యదర్శి జయంత్ ఇప్పుడు వందన సమర్పణ చేస్తాడు.)
**Jayanth:**
I find great pleasure in proposing this vote of thanks.
On behalf of our college community and on my behalf I thank from the bottom of my heart, our Chief Guest, Dr Vidhyadhik, Vice Chancellor, National University who has graced the occasion with his presence. We are certainly aware how busy he is. Inspite of it he has agreed to come down here, that certainly is a great favour from him. I, also assure you sir, on behalf of my student fraternity here that we will certainly do our best to put in practice your valuable message.
(ఈ వందన సమర్పణ చేయటం నాకెంతో సంతోషంగా ఉంది. మన ముఖ్యఅతిథి ఇక్కడికి విచ్చేసి, ఈ సందర్భానికెంతో వన్నె తెచ్చినందుకుగానూ, మా కళాశాలలోని అందరి తరఫునా, నా తరఫునా హృదయాంతరాల నుంచి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. ఆయన విలువైన సందేశాన్ని తప్పకుండా అమలుపరచటానికి మేం శాయశక్తులా కృషిచేస్తామని నా సోదర విద్యార్థుల తరఫున, నా తరఫునా హామీ ఇస్తున్నాను.)
Our sincere thanks also go to our guest of honour Smt Susobhita, Commissioner, Collegiate education, for having done us the honour of giving away the prizes. We certainly appreciate, madam, your agreeing readily to be here, in spite of your busy schedule.
(కళాశాల విద్యా commissioner, Smt సుశోభిత బహుమతి ప్రదానం చేయటం మాకు చాలా గౌరవప్రదమైన విషయం, అందుకని వారికి మా కృతజ్ఞతలు. తీరికలేని కార్యక్రమాలున్నప్పటికీ, మేము ఆహ్వానించిన వెంటనే ఇక్కడికి మీరు రావటాన్ని మేం హర్షిస్తున్నాం.)
Our other invitees, distinguished citizens of the city, and that includes the parents deserve our thanks next. Their presence here has certainly made the occasion grand and we sincerely thank all of them.
(మా ఆహూతులు, నగరంలోని విశిష్ట వ్యక్తులు - వారిలో మా విద్యార్థుల తల్లిదండ్రులు కూడా ఉన్నారు. వాళ్లిక్కడికి విచ్చేసి ఈ సందర్భానికి గొప్పదనాన్ని తెచ్చారు. వారికి మా కృతజ్ఞతలు.)
deserve = అర్హత కలిగి ఉండటం
Our thanks also to our beloved principal and the lecturers of the college. Their guidance and co operation at every stage was very valuable.

(చివరిగా ఈ సంబరం విజయంలో పాలుపంచుకున్న విద్యార్థులందరికీ ధన్యవాదాలు.)



Compering లోని మెళకువలు తెలుసుకుంటున్నాం మనం. Meeting లోని చివర అంశమైన Vote of thanks (వందన సమర్పణ) ఎలా ఉంటుందో చూశాం కదా. అయితే వందన సమర్పణ అనేది compere చేసే పనికాదు. సంస్థకు సంబంధించిన ముఖ్యులెవరైనా చేస్తారు. కళాశాల విషయానికొస్తే విద్యార్థి సంఘ కార్యదర్శి (Secretary)గానీ, సంయుక్త కార్యదర్శి (Joint Secretary) గానీ చేస్తారు.
కిందటి lesson లో exercise కు, ఈ lesson లో ఇచ్చిన Vote of thanks, model గా తీసుకోవచ్చు. ఇవే పదాలు, ఇవే వాక్యాలతో తెలపాలని లేదు. మన ఊహాశక్తిని ఉపయోగించి, ఎంత variety చూపించగలిగితే అంత బాగుంటుంది. Vote of thanks సభలోని చివరి అంశం. అందరూ వెళ్లిపోయే mood లో ఉంటారు. అందుకని Vote of thanks ను ఆసక్తికరంగా చేయడంలోనే ఉంటుంది మన ప్రత్యేకత. అందుకని పేరు, పేరునా thanks చెబుతూ, వారిని ఏ పని చేయటానికి మనం ఆహ్వానించామో, ఆ పని వాళ్లు బాగా నిర్వహించినందుకు thanks అని చెప్పటం, Vote of thanks ను effective గా చేస్తుంది.
Thanks అనే మాట, మాటిమాటికి ఉపయోగించి, bore కొట్టకుండా thanks బదులు మనం వాడగలిగిన ఇతర expressions:
వీటిని గుర్తుంచుకొని, వైవిధ్యం కోసం వాడండి.
**1)** I/ We thank Sri/ Smt ...
**2)** Our thanks are also due to ...
**3)** Our thanks go to ...
**4)** Our sincere appreciation of Sri/ Smt ... for his/ her ...
(వారు మనకు చేసిన విషయం)
**5)** We are grateful to Sri/ Smt ...
(grateful = కృతజ్ఞత కలిగి ఉండటం)
**6)** Our sincere gratitude to/ We express our gratitute to Sri/ Smt ... (gratitude = కృతజ్ఞత)
**7)** We are deeply obliged to Sri/ Smt ...
(obliged = grateful = కృతజ్ఞత కలిగి ఉండటం)
**8)** We appreciate the services of ... (appreciate = సంతోషం తెలపడం)
**9)** Our deep debt of gratitude to Sri/ Smt ... (debt of gratitude = కృతజ్ఞతా రుణం)
**10)** Words cannot express our gratitude to ...
(వారిపట్ల మాకున్న కృతజ్ఞత మా మాటలు తెలపలేవు)
ఇలా సందర్భశుద్ధిగా ఎన్నయినా చెప్పవచ్చు
Lesson no 268 లో మీకు ఇచ్చిన exercise మీ friend birthday party ని compere చేయమని. అది మీరు practice చేసి ఉంటే మీ సమాధానాన్ని పోల్చి చూసుకోండి.

(మామూలుగా ఎవరి వయసయినా చెప్పేటప్పుడు 20 years old అలా అంటాం. కానీ ఇలాంటి సరదా సమయాల్లో 22 years young అంటాం)
(merry - సరదాగా)
Now that all our pals are here let's begin. Viswanath will now blow off the candles, and let's all sing 'Happy birthday to you'. So the candles are out now. Slice the cake Viswanath.
(మన మిత్రులందరం ఉన్నాం కదా. ప్రారంభిద్దాం. విశ్వనాథ్ కొవ్వొత్తులను ఊదేస్తాడు. మనం Happy birth day to you పాడదాం. కొవ్వొత్తులారిపోయాయిప్పుడు. విశ్వనాథ్, cake ను cut చెయ్.)
Let us have a slice of cake each, and have a drink. To the health of our dear Viswanath. On your behalf, pals, and on behalf of our elders here, I wish our beloved Viswanath, a very happy birthday and many returns of the same. May he give us many many more parties.
(మనమూ తిందాం cake ముక్క. ఆ తర్వాత drink తీసుకుందాం. అంతా విశ్వనాథ్ ఆరోగ్యం కోసం. (English లో సంప్రదాయం- ఒకరి ఆరోగ్యంకోసం మనం తాగుదాం పానీయాలు.) మన స్నేహితులందరి తరఫున, ఇక్కడున్న పెద్దవారి తరఫున, విశ్వనాథ్‌కు happy birthday, ఇలాంటి రోజు మళ్ళీ మళ్ళీ రావాలని కోరుకుంటున్నాం/ కోరదాం. ఇలాగా Party లివ్వాలని కోరుకుందాం.)
Let's have some fun, friends. I'm sure Gayathri will give us a song. Gayathri- come on, you song.
(కొంత వినోదం పొందుదాం. గాయత్రి పాడుతుందని నా నమ్మకం. గాయత్రి నీ పాట వినిపించు.)
ఇలా item తర్వాత item చాలా informal గా announce చేస్తూ వెళ్ళొచ్చు

**EXERCISE**

ఈ birth day party ముగించడాన్ని compere చేయడం practice చేయండి. English లో బిగ్గరగా ఈ కింది సూచనలు వాడండి.
**1)** Well, that's the end of
**2)** That brings to a close
**3)** That concludes
**4)** One more item and that is, etc.
గమనిక: Birthday party చేసుకునేవారు dinner కూడా ఇచ్చేట్లయితే, మధ్యమధ్యలో compere, ఆహూతులకు dinner గుర్తుచేసి, తప్పకుండా dinner తీసుకుని వెళ్ళాలని చెబుతుండాలి. ఇదీ practice చేయండి.

**ప్రశ్న:** *i) Question tags లో I am writing a letter కు Ain't I ? అని చెప్పాలి. కాని, Aren't I? అని చెబుతారెందుకు? వివరించండి.*
*ii) ఇంగ్లిష్ vowels వరసగా వచ్చే పదాలేవైనా ఉంటే తెలపగలరు?*
**- *N.S. Pavan kumar, Vavilapadu.***
**జవాబు:**
**i)** Aren't I? ఇదే correct question tag. English usage ప్రకారం అది అంతే. Usage అంటే వాడుక. usage ఒక్కొక్కప్పుడు grammar కు వ్యతిరేకంగా ఉండొచ్చు. Grammar rule ప్రకారం, amn't I? అనేది question tag కావాలి. అయితే usage లో దీని బదులు, aren't I? అని వాడుకయిపోయింది.
(తెలుగులో 'ఎన్ని నీళ్లు? / ఎన్ని పాలు? ' అంటాం. నీళ్లు/ పాలు, 1, 2, 3 అని లెక్కపెట్టలేకదా, ఎన్ని అనటానికి correct గా అయితే ఎంతపాలు? / ఎంత నీళ్లు? అనాలి. అలా అనం 'ఎంత' అనేది grammar 'ఎన్ని? ' (నీళ్లు, పాల విషయంలో) usage (వాడుక) usage is more poweful than grammar.



**ii)** a, e, i, o and u - ఇవి vowels.
ఇవి వరుసగా (అన్నీ- ఐదు కలిపి) వచ్చే మాట లేదు. అంటే a, e, i, o, u ఆ వరసలో ఇతర letters తో వచ్చే మాటలు, 1) abstemious, 2) facetious. 1) abstemious (అబ్‌స్టీమియస్) = తిండి పానీయాల విషయంలో చాలా controlled గా ఉండటం = పరిమితమైన తిండి, పానీయాలు తీసుకోవడం/ మత్తు పదార్థాల జోలికి వెళ్లకపోవడం.
2) facetious = (ఫసీషస్) - సీ నొక్కి పలుకుతాం = అందరూ serious గా ఉన్నప్పుడు, ఎవరన్నా తమాషాగా jokes వేస్తూ ఉంటే, అది సందర్భం కాకపోతే, అప్పుడు వాళ్లు facetious.

**ప్రశ్న:** *i) I do not send my son to your college*
*I cannot send my son to your college*
*పై వాక్యాల్లో ఏది సరైంది? ఏ సందర్భంలో do; can వాడతారు?*
*ii) 'Let the devil die of cold' దీని అర్థమేమిటి?*
*iii) Rules or marking stress సులభంగా గుర్తించటమెలా?*
*eg: Cousin, pollution, lady, official వంటి పదాల్లో stress marks ఎక్కడ పెట్టాలి? సులభపద్ధతి తెలపగలరు.*
**– వెన్నెల నరసింహారావు, మెదక్.**
**జవాబు:**
**i)** I do not send my son to your college = మీ college కి మా అబ్బాయిని పంపను.
I cannot send my son to your college = మీ college కి మా అబ్బాయిని పంపలేను. (మీ college లోని ఎక్కువ fees వల్ల/ సరైన చదువు లేకపోవటం వల్ల etc.)
can = గల (సామర్థ్యం తెలిపే verb)
I can sing = నేను పాడగలను.
**ii)** Let the devil die of cold= ఆ దుర్మార్గుడిని చలిలో/ జలుబు వల్ల చావనీ (శాపనార్థం).
**iii)** Rules of Marking Stress- ఇది Stress కు సంబంధించిన పుస్తకాల ద్వారా, English News Telecasts (NDTV, CNB, etc) వినటం ద్వారా - అలవాటు మీద వస్తుంది.
cousin- ఇందులో cou (క) syllable మీద stress.
pollution - పొల్యూషన్ - లూ మీద stress.
lady= లేయ్‌డి- లేయ్ నొక్కి పలుకుతాం.
official- అఫీష‌ల్ - 'ఫీ' మీద stress.

**- M. SURESAN**

# SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 271

**Syamal:** The meeting went off very well yesterday, didn't it? The conference room of the hotel was good too.
(నిన్న meeting చాలా బాగా జరిగింది కదా? Hotel లోని conference room - సమావేశ మందిరం - కూడా బాగుంది)

**Komal:** Ofcourse it did, but for some remarks the Chief guest had made.
(ముఖ్య అతిథి చేసిన కొన్ని వ్యాఖ్యలు తప్పించి బాగానే జరిగింది.)

**Syamal:** What were they? I don't exactly remember.
(ఏంటవీ? నాకు correct గా గుర్తులేదు)

**Komal:** You seen to have reached home late last night. Why?
(నిన్న నువ్వు ఇంటికి ఆలస్యంగా చేరినట్టున్నావు. ఎందుకు?)

**Syamal:** I had gone halfway across when I remembered that I had left my sweater in the conference room. So I went back to the hotel to fetch it.
(సగం దూరం వెళ్ళేసరికి conference room లో నా sweeter మరచిపోయానని గుర్తొచ్చింది. మళ్లీ hotel కెళ్లి తెచ్చుకున్నా)

**Komal:** Did you clear the hotel bill?
(Hotel bill ఇచ్చేశావా?)
clear = చెల్లించటం - ముఖ్యంగా అప్పులు, bills లాంటివి.

**Syamal:** They wouldn't accept a cheque, so I paid across the counter.
(వాళ్లు cheque తీసుకోలేదు, అందుకని అక్కడే డబ్బు చెల్లించేశా)

ఇప్పుడు మనం తెలుసుకోబోతున్నది, spoken English లో across వాడుక గురించి: Natural, simple spoken English లో, across ఉపయోగం కాస్త ఎక్కువే. Real life situations లో కొన్ని మాటలతో across జతపరిస్తే expressions చాలా సహజంగా ఉండి సంభాషణ సారళ్యాన్ని (conversational ease) ను తెలుపుతుంది.

**1) across -** మనందరికీ తెలుసు దీనర్థం- **అడ్డంగా** అని. అయితే English లో దీన్ని ఒక ప్రదేశం ఒక వైపు నుంచి ఎదురుగా ఉన్న ఇంకోవైపు, అనే భావంతో ఎక్కువగా వాడతారు.

**a)** Swimming across the Krishna is not an easy job = కృష్ణానది ఈదటం (ఒక ఒడ్డు నుంచి ఇంకో ఒడ్డుకు/ ఒకవైపు నుంచి ఇంకోవైపు ఈదటం సులభమైన పనికాదు)

**b)** The distance he swam measures a Kilometre across = వాడు ఈదిన దూరం ఓ కిమీ ఉంటుంది. (నదికి అడ్డంగా - ఒడ్డు నుంచి ఒడ్డుకు)



# I don't like people talking out of turn

**Komal:** His talking of his son's achievements. That was out of place certainly.
(తన కొడుకు ఘనతను చెప్పుకోవటం. అది ఖచ్చితంగా అసందర్భంగా ఉంది)

**Syamal:** I must have missed that part of the speech, and thank God I did. Just at that time I went into the reception across the conference hall to see the manager. What did he say?
(ఆయన ఉపన్యాసంలో ఆ భాగం నేను miss అయ్యుండాలి. బతికిపోయా miss అయి. అదే time లో conference hall కు ఎదురుగా ఉన్న hotel office కు వెళ్ళా manager ను కలుసుకునేందుకు. ఏం చెప్పాడు?)

**Komal:** That his son holds the records for swimming across the Krishna in the shortest time so far.
(కృష్ణానదిని అతి తక్కువ time లో ఈదటంలో తన కొడుకుది record అని)

**Syamal:** Well, that is something to feel proud of. (అది గర్వించదగ్గ విషయమేకదా?)

**Komal:** And that this has come in all the newspapers and TV Channels across the country .
(అంతేకాక ఈ విషయం దేశం మొత్తం news papers, TV channels లో వచ్చిందని)

**Syamal:** Yes, I remember now. The distance he swam measures a kilometre across from bank to bank.
(ఆ, ఇప్పుడు గుర్తొచ్చింది. ఒడ్డు నుంచి ఒడ్డుకు అతను ఈదిన దూరం ఒక కిలో మీటరు)

**Komal:** That many be great, but I don't like people talking out of turn. I hate to listen to people talking high of themselves. I felt like hitting him across the face.
(అది గొప్పే కావచ్చు కానీ ఎవరైనా అసందర్భంగా మాట్లాడితే వినటం నాకస లిష్టం లేదు. నిజంగా మొహంమీద కొట్టాలనిపించింది నాకు)

**Syamal:** I noticed the smile that spread across his face when someone referred to his son at the end of the meeting.
(Meeting చివర ఎవరో ఆయన కొడుకు గురించి ప్రస్తావిస్తే ఆయన మొహంమీద చిరునవ్వు వెలగడం నేగమనించా)

**Look at the following sentences from the dialogue above:**

1) That was out of place certainly.
2) .... I went into the reception across the conference hall.
3) That his son holds the records for swimming across the Krishna in the shortest time.
4) And that this has come in all the news papers and TV channels across the country.
5) I don't like people talking out of turn.
6) I felt like hitting him across the face.
7) The distance he swam measures a KM across from bank to bank.
8) I noticed the smile that spread across his face.
9) I had gone half way across.
10) I paid across the counter.

**First of all, let's take the two expressions, out of place, and out of turn.**

**Out of place = Out of turn = అసందర్భమైన**

**a)** Clapping hands and garlanding are out of place at a condolence meeting = సంతాప సభలో చప్పట్లు కొట్టడం, పూల దండలు వేయటం (వేదిక మీదున్న వాళ్లకు) ఆ సందర్భానికి తగినవి కావు.

**b)** His jokes were out of place in such a serious situation = (అంత గంభీరమైన పరిస్థితిలో అతని jokes చాలా అసందర్భంగా ఉన్నాయి. (అక్కడ jokes చేయటం సరికాదు)

**Out of turn** = ఒక అర్థం, అసందర్భంగా ఇతరులకు కోపం తెప్పించేట్లు, ఇతరులను నొప్పించేట్లు ప్రవర్తించటం/మాట్లాడటం.

**a)** He was talking out of turn most of the time, as though he were drunk = ఏదో, తాగిన వాడిలా, చాలామటుకు అసందర్భంగా మాట్లాడుతూనే ఉన్నాడు.

**b)** I hope I am not talking out of turn, but what you are doing isn't good = నేనేమన్నా అతిగా/ అసందర్భంగా మాట్లాడుతున్నానేమో నాకు తెలియదు, కాని మీరు చేస్తున్నది మంచిదికాదు.

**Out of turn** అంటే ఇంకో అర్థం, వరుసక్రమం అతిక్రమించి

**a)** The minister got the house site alloted out of turn = ఆ మంత్రి వరుస క్రమంలో కాకుండా, అక్రమంగా ఇంటి స్థలం ఇప్పించుకున్నాడు.

**b)** The out of turn allotment was questioned in the house = అక్రమ కేటాయింపు విషయం శాసనసభలో ప్రశ్నించారు.

**c)** The room measures 20 feet across = ఆ గది ఒకవైపు నుంచి ఇంకోవైపు 20 అడుగులు.

**d)** Halfway across the river he couldn't swim any more. He had to be helped across to the shore = నది సగందాకా వచ్చేసరికి అతను ఈదలేకపోయాడు. అతనికి మిగతా సగం నది దాటడానికి సాయం చేయాల్సివచ్చింది.

**2) Across = ఒక ప్రదేశం మొత్తం**

**a)** students across the country went on strike = దేశం మొత్తంలోని విద్యార్థులందరూ సమ్మె చేశారు.

**b)** People across the country were shocked at the Nithari killings = నిఠారి హత్యల పట్ల దేశం మొత్తం ప్రజలందరూ దిగ్భ్రాంతి చెందారు.

**c)** (from the conversation): This has come in all the newspapers and TV channels across the country = ఈ విషయం దేశం మొత్తంమీద అన్ని వార్తాపత్రికల్లోనూ, అన్ని TV channels లోనూ వచ్చాయని.

**3) Across the face = మొహంమీద** (On the face, ఈ అర్థంలో అంటే మొహంమీద అనే అర్థంతో, వాడకం చాలా తక్కువ. across the face అనేదే ఎక్కువ వాడుక.)

I felt like hitting him across the face =
అతని మొహంమీద కొట్టాలనిపించింది నాకు.
felt like = (ఏదైనా చేయాలని) అనిపించటం.

I noticed the smile spreading across his face =
అతని మొహం మీద వెలుగుతున్న చిరునవ్వు చూశాను.

The shirt is a bit tight across the chest =
ఛాతీ దగ్గర కాస్త బిగుతుగా ఉంది ఆ shirt.

**4) Half way across =** సగందూరం (వచ్చేటప్పటికి/ వచ్చింతర్వాత)

**a)** Half way across he remembered he hadn't brought any money = సగం దూరం వచ్చేటప్పటికి అతనికి గుర్తొచ్చింది డబ్బేం తేలేదని)

**b)** He felt ill, and he left the theatre half way across the movie = ఒంట్లో బాగా లేదనిపించి సినిమా మధ్యలోనే వెళ్లిపోయాడు.

**5. Across the counter** = (ముఖ్యంగా డబ్బు) counter దగ్గర చెల్లించడం

**a)** Crossed cheques can't be cashed across the counter= Crossed cheques కు counter లో డబ్బివ్వరు (దాన్ని bank లో జమ చేయాలని)

**b)** A day may come when you may buy a synthetic heart across a medical shop counter = మందుల shop counter దగ్గర డబ్బులు చెల్లించి కృత్రిమ గుండెలు కొనే రోజు కూడా రావచ్చు

**ప్రశ్న:**

*i) lose, loose ఈ పదాలను ఎలా ఉచ్చరించాలి? వీటి అర్థాలు verb conjugation వివరించగలరు.*

*ii) 1) The IInd world war ended in 1945 (was ended)*

*2) The IInd world war was ended in 1945. ఈ రెండింటిలో ఏ వాక్యం కరెక్ట్?*

*iii) Interview లో తెలియని ప్రశ్నలకు ఏ విధంగా తెలియదు అని చెప్పాలి. అలాగే Interviewers ను ముందుగా ఏ విధంగా సంబోధించాలి?*

***- T. Srinivas, Penumantra***

**జవాబు:**

**i) Lose** - పోగొట్టుకోవటం. (Verb)
Lose (Present) - Lost (Past) - Lost (Past Participle)
He lost his bag (Bag పోగొట్టుకున్నాడు)
Don't lose your money =
నీ డబ్బు పోగొట్టుకోకు.



**Loose**: వదులుగా ఉన్న - (Loose - adj)
She wore a loose skirt -
ఆమె వదులైన లంగా వేసుకుంది.
Loose, adjective కాబట్టి conjugation లేదు.

**ii)** The IInd World War ended in 1945 correct. II - ఈ అంకెను వాడినప్పుడు, IInd అని రాయం- II అంటే second అనే. అంకెలో తెలపాలంటే 2 nd అని రాయవచ్చు అయితే the second World War అన్నప్పటికీ, రాసేటప్పుడు World War II అని రాయటం correct. కానీ చదివేటప్పుడు The second World War అని చదవాలి.

**iii)** Interview లో ఏదైనా ప్రశ్నకు సమాధానం తెలియకపోతే, I am sorry/ I'm afraid I don't know the answer అని చెప్పేస్తే మంచిది. Interview skills గురించి త్వరలో వివరిస్తాం.

**ప్రశ్న:**

*Till, until కు తేడా ఏమిటి? Since, for ఎప్పుడు వాడాలో తెలపండి.*

***- P. Sambasiva Rao, Visakhapatnam***

**జవాబు:**

**i)** till కి until కీ ఏమీ తేడాలేదు. రెండింటిని ఒకదాని బదులు ఒకటి వాడవచ్చు

**ii)** since అంటే ఫలానా time నుంచి, ఫలానా రోజు/ నెల/ సంవత్సరం నుంచి అని.
For అంటే ఇంతకాలంగా, ఇన్ని రోజులు/ నెలలు/ సంవత్సరాలుగా అని అర్థం. చూడండి:

**a)** India has been independent since 1947 (1947 నుంచి భారత్ స్వతంత్రంగా ఉంది) = India has been independent for the past/ the last 59 years. (59 ఏళ్లుగా భారత్ స్వతంత్రంగా ఉంది)

**b)** Tendulkar has played/ has been playing cricket since 1989/ for the past/ last 17 years.

since ఎప్పుడూ point of time తో (నుంచి అనే అర్థంతో), for ఎప్పుడూ period of time (ఇన్ని రోజులూ/ నెలలుగా అనే అర్థంతో వాడతాం.)

**- M. SURESAN**

# SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 272

**Vilakshana:**

Hi Nirikshana, this is our last day at college. No knowing when we can meet again. Parting is painful, isn't it? (College లో ఇది మనకు చివరిరోజు. మనం మళ్లీ ఎప్పుడు కలుసు కోగలమో తెలియదు. విడిపోవడం బాధాకరమే కదా?)

**Nirikshana:**

Why? We can still be meeting, can't we? What stops us? (ఎందుకూ? మనం ఇంకా కలుసుకుంటూనే ఉండొచ్చు కదా? ఏమిటడ్డం?)

**Vilakshana:**

I mean we can't, this way, as students. (నేననటం, ఇలా students గా మళ్లీ కలుసుకోలేమని.)

affect = ప్రభావం చూపటం; to come into effect = అమల్లోకి రావటం.

The anti dowry law came into effect more than ten years ago = వరకట్న వ్యతిరేక చట్టం పదేళ్ల కంటే ముందే అమల్లోకి వచ్చింది.

Academic = విద్యకు సంబంధించిన/ విద్యావేత్త.

What books and subjects a student should study is an academic matter = విద్యార్థి ఏ పుస్తకాలు, ఏ విషయాలు అభ్యసించాల నేది విద్యా విషయం.

Not all the members of a university senate are good academics = university senate సభ్యులందరూ మంచి విద్యావేత్తలుకారు.

**Vilakshana:**

Yea. I've heard of it. They are going to collect this extra fee for the personality development course they are going to offer. I feel that's a good step and so the fee rise is justified.

Replace = ఒక వస్తువును తీసుకుని దానిబదులు అదే రకం వస్తువు ఇంకోటివ్వడం.

2) How good they are at putting across even complex ideas to students

**put across** = వివరించటం/ విశదీకరించటం/ explain

a) He put across his ideas to me in a convincing manner = నాకు నచ్చేవిధంగా అతని ఆలోచనలను నాకు వివరించాడు. (అతని వివరణ వల్ల అతని ఆలోచనలు నాకు నచ్చాయి.)

b) I put across to my father my idea of buying a car = car కొనాలనే నా ఆలోచనను మా నాన్నకు వివరించాను.

c) It is the cost of the project that may discourage him. Anyway put it across to him and see. = ఆ project కు అయ్యే వ్యయం అతన్ని వెనక్కు లాగవచ్చు అయినా అతనికి వివరించి చూడు.

# ... to get across our ideas to others ...

**Nirikshana:**

There you are right of course. Our student days will remain only as sweet memories. (ఆ విధంగా నువ్వు correct. మన విద్యార్థి రోజులు తీపిగుర్తులుగానే ఉండిపోతాయి.)

**Vilakshana:**

But what a great college we've been in (I) doubt very much if we can come across such an institution. The instruction, the system, the environment- why? Everything about it is good. (కానీ ఎంత గొప్ప college లో ఉన్నామో కదా మనం. ఇక్కడి బోధన, పద్ధతి, వాతావరణం - ఒకటేమిటి? ఈ college లో ఏదైనా చాలా బాగుంది.)

**Nirikshana:**

Especially the lecturers and professors - how good they are at putting across to students even complex ideas, without an exception every teacher here reaches out to the students with ease. (ముఖ్యంగా ఇక్కడి lecturers, professors - సంక్లిష్టమైన అంశాలను కూడా, చాలా సులభంగా విద్యార్థులకు వివరించగలరు; అందరు అధ్యాపకులు కూడా, ఎవరూ తప్ప కుండా.)

complex = సంక్లిష్టమైన, with ease = కష్టపడి ప్రయత్నం చేసినట్లు కనపడకుండా, without an exception = ఎవరూ తప్పకుండా. reach out = భావాల్లో ఇతరులను చేరుకోవటం.

**Vilakshana:**

I can't agree with you more. (నువ్వన్నదంతా నేనొప్పుకొంటున్నా.)

ఈ expression, I can't agree with you more = నీతో పూర్తిగా ఏకీభవిస్తున్నా- English conversation లో తరచూ వినిపిస్తుంది. మీరూ practice చేయండి.

**Nirikshana:**

Certainly. Their teaching cuts across students of varying abilities. (నిజమే. వాళ్ల బోధన విద్యార్థుల సామర్థ్య స్థాయితో సంబంధం లేకుండా అన్ని రకాల విద్యార్థులకూ అర్థమవుతుంది.)

**Vilakshana:**

That's true. Ours is a college in demand. (నిజమే. మన college మంచి గిరాకి ఉన్న college.)

**Nirikshana:**

A piece of bad news. It doesn't affect us, though. The college has raised the fees across the board for all students of all courses; to come into effect from the next academic year. (ఓ చెడు వార్త, మనకేం బాధ లేదనుకో. అందరి students కూ fees పెంచేసింది. వచ్చే విద్యా సంవత్సరం నుంచి అమల్లోకి వస్తుంది.)

(అవును. నేను విన్నానది. ప్రతి class కూ అదనంగా బోధించబోతున్న personality development (వ్యక్తిత్వ వికాసం) course కు గానూ ఇది అదనంగా వసూలు చేస్తున్నారు. సబబే.

justify = సమర్థించటం.

justified = సమర్థనీయమైన; సబబైన.

**Nirikshana:**

The course is good for career making people like us. At interviews and group discussions, to get across our ideas to the others, we need that kind of training. (ఉద్యోగాలూ వృత్తుల్లో ప్రవేశించబోయేవారికి ఇది చాలా ఉపయోగం. Interviews లో, Group discussions లో మన ఆలోచనలూ అభిప్రాయాలూ ఇతరులకు స్పష్టంగా తెలియజేయడానికి ఈ శిక్షణ మనకవసరం.)

**Vilakshana:**

OK, Niri. Time that I left. See you again. Keep calling. (OK నిరీ. నేనిప్పటికే వెళ్లిపోయుండాల్సింది. మళ్లీ కలుద్దాం. Phone చేస్తూండు.)

**Nirikshana:** OK, bye.

☺ ☺ ☺ ☺

English conversation లో across తో వచ్చే expressions చాలా తరచుగా వాడతారనీ, ఆ expressions వల్ల మన conversation చాలా simple గా సహజంగా ఉంటుందని కిందటి lesson లో చూశాంగదా. మరికొన్ని across తోటి expressions ఇపుడు తెలుసుకోబోతున్నాం.

**Look at the following sentences from the conversation between Vilakshana and Nirikshana.**

1) I doubt very much if we can come across such an institution

2) ... how good they are at putting across to students even complex ideas

3) Their teaching cuts across students of varying abilities.

4) ... to get across our ideas to others, we need that kind of training.

1) **Come across** = చూడటం/ (ఏదైనా) అనుభవం కలగడం/ తారసపడటం. come across అనేది English లో చాలా common.

a) It is very difficult to come across a person like Mahatma Gandhi = మహాత్మాగాంధీలాంటి వ్యక్తిని చూడటం చాలా కష్టం.

b) You don't come across elephants in cold countries = శీతల దేశాల్లో ఏనుగులు కనిపించవు.

c) Rarely do we come across shops offering replacement of goods with no questions asked = మనం కొన్న వస్తువులను ఏం ప్రశ్న లడక్కుండా బదులు ఇచ్చే shops ను చాలా అరుదుగా చూస్తాం.

3) Their teaching cuts across students of varying abilities = వివిధ సామర్థ్య స్థాయిలున్న విద్యార్థులకు అర్థమయ్యే బోధన వారిది.

**cut across** = విభిన్న వర్గాలలో వ్యాపించి ఉన్న

a) Protest and shock against the Nithari killings cut across party lines = నిఠారి హత్యలపట్ల నిరసన, దిగ్భ్రమ, అన్ని party లకు (ఆ party, ఈ party అని లేకుండా) వ్యాపించింది.

b) Cutting across caste distinctions every one protested against the mass killing of tribals in the area = ఆ వర్గం, ఈ వర్గం అని లేకుండా (కుల విచక్షణ లేకుండా) ప్రతివాళ్లు ఆ కొండ జాతి ప్రజల ఊచకోతను ఖండించారు.

mass killing = ఊచకోత. tribals = కొండజాతి ప్రజలు.

c) Cutting across all kinds of groups, people rose as one person to fight the enemy = ఏ విభేదాలతో పనిలేకుండా ప్రజలందరూ ఒక్కరిగా శత్రువుతో పోరాడారు.

4) ... to get across our ideas to others we need that kind of training = మన అభిప్రాయాలు ఇతరులకు స్పష్టంగా తెలిపేందుకు మనకు ఆ శిక్షణ అవసరం.

**get across** = చాలా శక్తిమంతంగా భావాలను ఒకరికి వ్యక్తపరచటం.

a) To succeed in an interview you should get across your points to the interviewer = Interview లో విజయానికి మన భావాలను / అంశాలను interviewer కు స్పష్టంగా వివరించగలిగి ఉండాలి.

b) Get the idea across to him that he is no longer wanted here = అతనిక్కడ ఉండనవసరం లేదని అర్థం అయ్యేలా చెప్పు.

c) I am unable to get this simple point across to him = ఈ చిన్న విషయం అతనికర్థమయ్యేట్లు చెప్పలేకున్నాను.

put across, get across దాదాపు ఒకటే. అయితే, get across, put across కన్నా కొంచెం stronger. బాగా అర్థమయేట్లు చెప్పటం - get it across.

**EXERCISE**

**Speak aloud sentences on the following pattern.**

| Subject | Verb | Complement etc. |
|---|---|---|
| What he says | is | interesting. |

(అయితే ఇక్కడ subject ఒక మాట కాకుండా, 'wh' తో ఉండే clause.)

మరో example:

| How he does it | will be known | only to me. |
|---|---|---|



**ప్రశ్న:**

i) I saw him enter the room

I saw him entering the room తేడా ఉందా?

ఎ) అతడు గదిలో ప్రవేశించడం నేను చూశాను.

బి) గదిలోకి ప్రవేశిస్తూ అతడిని నేను చూశాను.

ii) Seniority - antonym ఏమిటి?

*– పోతుల శ్రీనివాసు, వేగాయమ్మపేట.*

**జవాబు:**

i) I saw him enter the room అర్థం, I saw him entering the room దాదాపు ఒకటే. తేడా లేదు.

ii) Seniority కి antonym లేదు. seniority అనేది age కీ, experience కీ సంబంధించింది కాబట్టి younger in age & experience అని అనవచ్చు ఒకే మాటగా antonym లేదు.

**ప్రశ్న:**

ఏదైనా మీటింగ్‌లో ఏ విధంగా మాట్లాడాలి? ఏ Tense లో మాట్లాడాలి? అన్ని Tenses ఉపయోగించవచ్చా? ఉదా: Republic day సందర్భంగా కళాశాలలో ఒక meeting ఏర్పాటుచేశారు. ఈ మీటింగ్‌లో అధ్యక్షులు, ముఖ్య అతిథిని, ఇతర పెద్దలను ఎలా సంబోధించాలి? వారిని ఉదహరిస్తూ ఎలా మాట్లాడాలి. వివరించగలరు.

*- T. Ramana Rao, Palakol.*

**జవాబు:**

Meeting లో ఏ tense లో మాట్లాడాలి అనేది మనం మాట్లాడే విషయాన్నిబట్టిగదా ఉంటుంది. Republic Day సందర్భంగా మాట్లాడుతూ, Republic Day ప్రాశస్త్యాన్ని గురించి మాట్లాడేటప్పుడు, Republic Day పుట్టుపూర్వోత్తరాలయితే, past tense లో చెప్తాం, అవి గతం కాబట్టి. Republic Day ఉత్సవం ఆరోజు నిర్వహించుకోవడం ఆనాటి programme వగైరాలంతా, శుభాకాంక్షలతో సహా, present tense. ముందు వచ్చే Republic Day ల ఆకాంక్షలూ, కోరికలూ, అయితే future tense.

మీరడిగిన మిగతా ప్రశ్నలకు సమాధానం Lesson Nos 265 to 270 చూడండి.

**ప్రశ్న:**

i) India need to bowling in the evening. ఈ వాక్యాన్ని ఏ విధంగా question చేయాలి. need అనేది Helping verb కదా. దీనితో question ఎలా చేయవచ్చు?

ii) I do work. ఈ Sentence ను ఏ విధంగా question చేయాలి?

*– పాలకొండ సుధాకర్, ఖమ్మం*

**జవాబు:**

i) India need to bowling in the evening- ఈ sentence సరికాదు. India need(s) to bowl in the evening అంటే correct. India team ను ఒక టీగా పరిగణిస్తే, India needs to bowl అంటాం; India జట్టులోని క్రీడాకారులను పరిగణిస్తే India need to bowl అంటాం. ఈ రెండు sentences లోనూ need (s) main verb. అయితే దీన్నే Need India bowl in the evening? అని question రూపంలో రాస్తే need, helping verb అవుతుంది. ఇంకో example. Need you go there now? (ఇపుడు నువ్వు వెళ్లాల్సిన అవసరం ఉందా?)

ii) 'Do you work here?'

Yes, I do work here. ఇక్కడ work verb. Sentence లోని verb కు object కాదు. ఇక్కడ 'I do work here' కు అర్థం- నేనిక్కడ పనిచేస్తాను, చేస్తాను అని నొక్కిచెప్పటం.

I do work= నేను పనిచేస్తాను అన్నపుడు work= పని అనే అర్థంతో, do కు object అవుతుంది. ఇది ఈ కింది question కు answer: What do you do? - దీనికి Answer: I do work. (I do maths లాగ).

*- M. SURESAN*

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 273

**Abhilash:** How's your dad?
(మీ నాన్న ఎలా ఉన్నారు?)

**Animish:** (He's = He is) near normal. (He was) discharged from hospital the day before (yesterday.)
(దాదాపు కోలుకున్నట్టే. ఆస్పత్రి నుంచి మొన్ననే విడుదల చేశారు.)

(మామూలు తెలుగు - మొన్ననే discharge అయ్యారు. Conversational English లో ఒక్కోసారి 'He's = he is' omit చేస్తారు. అలాగే the day before yesterday అని పూర్తిగా అనే బదులు, the day before అంటారు.)

**Abhilash:** Oh, are they? If I had become a doctor, many more would have been alive.
(అవునా? నేను doctor నయ్యుంటే ఇంకా చాలామంది బతికుండేవాళ్లు)

**Animish:** You and your jokes.
(నువ్వూ, నీ jokes.)

☺ ☺ ☺ ☺

English conversation లో after వాడుక- అడొక్కటే అయినా, మిగతా మాటలతోనైనా, చాలా common. ఇప్పుడు after, after combinations ఉపయోగం చూద్దాం:

**Look at the following expressions from the dialogue above.**

1) May be because of the after effects of the drugs he has been taking.

2) How about the after care services of the hospital?

# After some one's heart

**Abhilash:** (It's) good to hear that.
(వినటానికి సంతోషంగా ఉంది)

**Animish:** He's been advised complete rest for another week, though. He is still very weak. May be because of the after effects of the drugs he's been taking.
(అయినా, ఇంకోవారం పూర్తిగా విశ్రాంతి తీసుకోమని సలహా. ఇంకా బాగా నీరసంగా/ బలహీనంగా ఉన్నారు. ఆయన తీసుకుంటున్న మందుల తర్వాతి ప్రభావం వల్లనేమో.)

**Abhilash:** How about the after care services of the hospital?
(ఆ ఆస్పత్రిలో వైద్యం తర్వాతి సేవల సంగతేంటి?)

**Animish:** Excellent. They look after their patients well. Rather rare these days of corporate hospitals which are mostly after money.
(చాలా బాగుంది. Patients డబ్బు కోసమే చూసే corporate hospitals ఉన్న ఈ రోజుల్లో కాస్త అరుదే.)

Corporate hospitals = వాణిజ్యపరంగా కేవలం లాభాల కోసమే వైద్యాన్నందించే ఆస్పత్రులు.

**Abhilash:** (Do) you mean their fees are low?
(అంటే వాళ్ల fees తక్కువంటావా?)

**Animish:** Not low, but not high either. You get your money's worth of treatment there.
(తక్కువేంకాదు, అలా అని ఎక్కువాకాదు. మనంపెట్టే ఖర్చుకు తగిన వైద్యం లభిస్తుంది.)

worth = విలువ

**Abhilash:** Had I had my will, I would have become a doctor. Medicine was the course after my heart, but dad wouldn't just let me do it.
(నా ఇష్టప్రకారమే అయ్యుంటే, నేనిప్పటికో doctor అయ్యేవాడిని. Medicine నాకు చాలా ఇష్టమైన course. కానీ మానాన్న నన్ను Medicine చేయనివ్వలేదు.)

**Animish:** Thank God he wouldn't. Many persons are still alive.
(ఆయన నిన్ను medicine చేయనివ్వకపోవటం మంచిదయింది. చాలామంది ఇంకా బతికే ఉన్నారు.)

3) They look after their patients well.

4) ... corporate hospitals which are after money.

5) Medicine was the course after my heart.

**1. After effects:** మందులు లాంటివి ఎక్కువగా వాడటం వల్ల వచ్చే ఫలితాలు/ ఏ సంఘటన తరువాతైనా కలిగే ఫలితాలు- ముఖ్యంగా ఇబ్బందులు.

**a)** Lack of appetite and nausea are the after effects of antibiotics.
తినాలనే కోరిక లేకపోవటం (అరుచి)/ ఆకలి లేకపోవటం, వాంతులు వచ్చేట్లనిపించటం, antibiotics వాడిన తర్వాత వచ్చే ఫలితాలు. Nausea (నాసియా) = వాంతులు వచ్చే feeling (కడుపు తిప్పటం) Nauseate = డోకు పుట్టించడం. Antibiotics = Bacteria (సూక్ష్మజీవులు)ను చంపే మందులు. వీటిలో చాలావాటి పేరు చివర 'cin' అని వస్తుంది. (After effects ను side effects అని కూడా అంటారు.)

**b)** People are yet to recover from the after effects of the year before the last's tsunami. కిందటి ఏడాది ముందటేడాది సునామీ ప్రభావాల నుంచి ప్రజలింకా కోలుకోలేదు.
(గమనించండి: effects of tsunami = సునామీ ప్రత్యక్ష ప్రభావం - మనుషులు చనిపోవటం, ఇళ్లు, చెట్లు లాంటివి కొట్టుకుపోవటం, ప్రాణ, ఆస్తి నష్టం. After effects of tsunami = సునామీ పరోక్ష/ దీర్ఘకాలిక ప్రభావాలు = సర్వం కోల్పోయినవారి బీదరికం, నిస్పృహయత, వ్యాధులు లాంటివి.)

**c)** Some Japanese are still suffering from the after effects of radiation.
Radiation పరోక్ష ప్రభావాలతో కొంతమంది జపాన్ వాళ్లింకా బాధపడుతున్నారు.

**2. After care** = మామూలు వైద్యం అయింతర్వాత రోగి గురించి తీసుకునే జాగ్రత్తలు.

**a)** I am always regular about the after care measures my doctor has suggested.
మా doctor సూచించిన వైద్యానంతర జాగ్రత్తల విషయంలో నేనెప్పుడూ సక్రమంగానే ఉంటాను.

**b)** The after care services of the hospital are poor.
వైద్యానంతర సేవల విషయంలో ఆ ఆస్పత్రి అధ్వానమే.

**3. Look after** = Take care = జాగ్రత్త తీసుకోవడం (ముఖ్యంగా ఒక వ్యక్తి ఆరోగ్యం విషయంలో).

**a)** My sister looked after me when I was ill.
నాకు జబ్బుగా ఉన్నప్పుడు మా sister నన్ను చూసుకుంది/ సపర్యలు చేసింది/ సేవలు చేసింది.

**b)** Its parents having been washed away by the floods, there is none to look after the child.
తల్లిదండ్రులు వరదలో కొట్టుకుపోవటంతో ఆ బిడ్డను చూసేవాళ్లెవరూ లేరు.

**4.** Most corporate hospitals are after money.

**After somebody/ something.**
= ఒకరిని/ ఒక విషయాన్ని చేజిక్కించుకోవటం.

**a)** He is after a good career.
మంచి వృత్తి వ్యాపకం కోసం ప్రయత్నిస్తున్నాడు/ చేజిక్కించుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

**b)** Most young men and women are after computer jobs.
చాలామంది యువతీ యువకులు computer jobs వెంట పడుతున్నారు.
అయితే ఒక వ్యక్తి విషయం చెప్పేటప్పుడు He is after you అంటే - నీ కోసమే చూస్తున్నాడు నీకేదో హాని తలపెట్టే ఉద్దేశంతో - అనే అర్థం కూడా ఉంది.

**c)** The enemies were after him.
శత్రువులు అతడి కోసం వెతుకుతున్నారు.

**5. After some one's heart.**
ఒకరు బాగా ఇష్టపడే.

**a)** It's a song after my heart.
అది నాకు బాగా ఇష్టమైనపాట.

**b)** It's a place after her heart.
అది ఆమెకు నచ్చిన ప్రదేశం.

**EXERCISE: VOCABULARY EXERCISE.**

**Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| A. Teach | 1. walk |
| B. Check | 2. pull |
| C. Tug | 3. watch |
| D. Observe | 4. instruct |
| E. Trek | 5. verify |
| | 6. signify |

**Answer:** A - 4 B - 5 C - 2 D - 3 E - 1.

**ప్రశ్న:**
*i) burial, fire, ... require, retire, .. వీటి pronunciation తెలుపగలరు.*
*ii) సమాధుల దగ్గర కాపలా ఉండేవారిని ఏమంటారు? దాని pronunciation తెలపండి.*
*– లావణ్య, కొత్తగూడెం*

**జవాబు:**
**i)** ఈ కింద ఇస్తున్న pronunciation లో
a) cat, bag, rat, bank <u>a</u> తెలిపే శబ్దాన్ని ఆ అక్షరం కింద గీతతో తెలియపరుస్తున్నాం. ఉదా: cat - క్యాట్ - క్యా కింద గీత cat లో క్యా శబ్దంగా అర్థం చేసుకోవాలి.
b) bird లాంటి మాటల్లో 'ir' శబ్దం English కు ప్రత్యేకం. ఈ శబ్దం సూచించటానికి > గుర్తు వాడుతున్నాం. ఉదా: Bird - బ>డ్ curd - క>డ్.
c) ఓ మాటలోని ఏ అక్షరం మీదయినా 'ˈ' గుర్తు ఉంటే ఆ అక్షరం తెలిపే శబ్దాన్ని నొక్కి పలుకుతాం.
burial - బెరియల్ fire - ఫయ general- జెనరల్ interrupt- ఇంటరప్ట్.
(అక్షరం కింద 'ˌ' గుర్తు ఆ శబ్దాన్ని తక్కువ పలికేలా సూచిస్తుంది). marry - మారి mature - మెచుఅ measure - మెజ (జ, pleasure లో 'జ' లాగ) murder- మ>డ murmur- మ>మ owe - ఓ require - రిక్వయ retire - రిటయ scatter - స్కా>ట sorry - సారి survive - సవయివ్ tire - టయ.



**ii)** సమాధుల కాపరి =
burial ground/ grave yard/ cemetery keeper.



# ప్రతిభ

**ప్రశ్న:**
*i) Mr.Natwar Singh said though India is supporting ... there is no compromise. ఈ వాక్యంలో is బదులు was రావాలి కదా.*
*ii) The UPA deputy secretary said Sonia Gandhi will visit quake hit areas. ఈ వాక్యంలో sub-clause would visit తో మొదలవ్వాలి కదా! వివరించగలరు.*
*– ఆర్.ఎస్.మహేష్, కర్నూల్*

**జవాబు:**
You have raised a very good doubt.
In both the sentences above, no dates/ days are mentioned. So, change, 'said' in both the sentences into, 'has said', and the sentences will be absolutely correct. The tense of has said is present tense, and the sub clause verbs being also in present tense, there would be nothing wrong with the sentences. But the sentences as read by the news reader, and as quoted by you are wrong.
Suppose the dates/ days of their saying are mentioned. Then in the first sentence 'is supporting' is correct as it is a present action likely to continue into the future, but, the second verb 'is no compromise' should be changed into, 'would be no compromise', as the idea is indicative of future 'is no compromise' is certainly incorrect on the part of the news reader.
In the case of (ii) Sonia Gandhi would visit is correct. The news reader is wrong in reading as 'will visit'.
You have raised a very good doubt and clarifying it is my pleasure. Look at the following sentence:
He told me yesterday that he is a bank manager here. (నిన్న చెప్పాడు నాతో, అతనిక్కడ, Branch Manager గా ఉన్నానని). The verb 'is' in the sub clause, though the MC Verb told is in the past tense is correct. That's so because not only when he told me yesterday, but also now he is here and likely, in future too, he will be here. Cases like this are exceptions to the rule. Refer also to spoken English lessons Nos. 135, 136, 137 and 138.

**ప్రశ్న:**
*i) ఇంగ్లిష్ మాట్లాడటానికి, రాయడానికి సుమారుగా ఎన్ని పదాలు వస్తే సరిపోతుంది?*
*ii) Being ఎలావాడాలో చెప్పగలరు.*
*– కె. వెంకటేశ్వర్లు, చినమనగుండం*

**జవాబు:**
**i)** Oxford/ Longman's dictionaries చివర 'defining vocabulary' అని list ఉంటుంది. అందులో పదాలు నేర్చుకుంటే చాలు, మామూలుగా మాట్లాడటానికి.
**ii)** Being = అలా ఉండటం వల్ల, అందువల్ల అని. Being tall, he can play well = పొడుగ్గా ఉండటం వల్ల/ పొడుగవటం వల్ల అతను బాగా ఆడగలడు.

- M. SURESAN

SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 274

**Prasad:** Hi Prakash, good to see you. I'm (I am) driving to selall super stores for a bit of shopping. How about coming along? Along with the shopping we can have a bite and some hot coffee to warm our bodies.

(నిన్ను చూడటం చాలా సంతోషంగా ఉంది. Shopping చేద్దామని selall super stores కు (Car లో) వెళుతున్నా. నాతో రాకూడదూ? Shopping తోబాటు కాస్త ఏదైనా తిని, మన దేహాల్ని వెచ్చబరచుకొనేందుకు కాస్త వేడి coffee తాగుదాం.

Drive = ఏదైనా motor వాహనం (Bus/ Car/ Two wheeler) లో వెళ్లటం. ఇక్కడ Car.

**1) Along** - (ఎక్కువగా వాడే అర్థం) - ఒకవైపు నుంచి ఇంకోవైపు (చూడటం/ నడవటం లాంటివి)

a) He walked along the road = అతనా రోడ్ వెంబడే (ఒక చివరి నుంచి ఇంకో చివరి వైపు) నడిచాడు.

b) I looked along the buildings for the one I wanted = ఆ మేడల్ని ఒకవైపు నుంచి ఇంకోవైపు చూశాను నాక్కావలసిన building కోసం.

**2) along** - వెంబడి.

a) There are trees along the beach - ఆ beach వెంబడి చెట్లున్నాయి.

b) There are beautiful buildings along the right side of the road = Road కు కుడివైపంతా (కుడి వైపు వెంబడి) అందమైన కట్టడాలున్నాయి.

**3) along** - ఒకచోటినుంచి కొంచెం దూరంలో.

a) His office is along the road from the theatre - అతని office ఆ road లోనే theatre కు ముందు/ అవతల కొంచెం దూరంలో ఉంది. (Theatre ఉన్న వైపే)

a) Suman: How is she coming along in her studies? (చదువులో ఆమె ప్రగతి/ అభివృద్ధి/ Progress ఎలా ఉంది?)

Naveen: Oh, she is coming along fine. She is the topper in her class. (ఆమె progress చాలా బాగుంది. తన class లో ఆమె first)

b) Things are coming along well for him in his career = అతని వృత్తి వ్యాపకాల్లో అన్ని విషయాలు అతనికి బాగా/ అనుకూలంగా జరుగుతున్నాయి.

c) The movie is coming along nicely says the director = సినిమా చాలా బాగా వస్తోందని/ నడుస్తోందని దర్శకుడంటున్నాడు.

5) I'll be along whenever he wants me = ఆయనకెప్పుడు కావాలంటే నేనప్పుడొస్తాను.

ఇక్కడి expression = be along = ఎక్కడికైనా రావటం.

# How about coming along?

**Prakash:** Who's that next to you in the car? Oh, Pramod, it's you? Well, I don't mind, but I have some work at a place further down the road. I have a bit of shopping to do too. After that you return and I'll walk along.

(Car లో నీ పక్కన ఎవరూ? ప్రమోద్, నువ్వా? Car లో మీతో వస్తాను, కానీ అదే road లో కాస్తవతల నాకు పనుంది. నేనూ కొంత shopping చేయాలి. shopping అయింతర్వాత నువ్వు తిరిగి వెళ్లిపో, నేను నడిచి వెళ్లిపోతా.)

**Prasad:** (Do) you mean you will walk back all the distance?

(మళ్లీ మొత్తం దూరం నడిచి వస్తానంటావా?)

**Prakash:** Don't worry, from there my uncle will take me along to the railway station where we have to receive our cousin. After that he will drop me home.

(ఏం ఫర్వాలేదులే. అక్కడినుంచి మా uncle నన్ను తనతో railway station కు తీసుకెళతాడు, మా cousin ను station లో receive చేసుకునేందుకు. ఆ తర్వాత నన్ను ఇంట్లో దిగబెడతాడు.)

**Prasad:** How is your uncle's building coming along? It's massive structure. When is it likely to be completed?

(మీ uncle కడుతున్న building ఎంతవరకు వచ్చింది? చాలా భారీ కట్టడమే అది. ఎప్పుడు పూర్తవుతుంది?)

**Prakash:** It's almost complete. He wants your advice on the colour scheme because you are an architect.

(దాదాపు పూర్తయింది. ఇంటికి వేయించే రంగుల విషయంలో ఆయనకు నీ సలహా కావాలిట, నువ్వు architect కాబట్టి.)

Architect అంటే తెలుసు కదా - Building plan, అంతకంటే ముఖ్యంగా ఆకారం వంటి విషయాలు తెలిసిన వాస్తుశిల్పి.

**Prasad:** I'll be along whenever he wants me, though I prefer a Sunday.

(ఆయనెప్పుడు రమ్మంటే నేనప్పుడు వస్తా. అయితే ఆదివారం అయితే నాకు ఎక్కువ సౌకర్యంగా ఉంటుంది.)

**Prakash:** He wants flowering plants inside, along the walls enclosing the building.

(Building చుట్టూ ఉన్న గోడల వెంబడి లోపల పూల మొక్కలను పెంచాలని ఆయన అనుకొంటున్నాడు.)

**Prasad:** I'll help him select the plants too. OK. Come along. Let's go.

(ఆ Plants/ మొక్కల ఎంపికలో కూడా నేనాయనకు సాయంచేస్తా. రా. వెళ్దాం.)

☺ ☺ ☺ ☺ ☺

Conversational English లో తరచుగా వినిపించే మరో మాట along, ఆ మాటతో వచ్చే combinations. వాటి వాడుక చాలా తరచుగానే కాకుండా చాలా సులభం కూడా. Along అర్థాలు, ఉపయోగాలు ఇప్పుడు తెలుసుకుందాం.

b) The X Ray room is along the corridor from the consulting room = ఆ నడవాలోనే (doctor) consulting room (సంప్రదించే గది) నుంచి కొంత దూరంలో అదేవైపు ఎక్స్ రే గది ఉంది.

**Now look at the following sentences from the dialogue above.**

1) How about coming along?

2) I'll walk along.

3) My uncle will take me along to the railway station.

4) How is your uncle's building coming along?

5) I'll be along whenever he wants me.

6) He wants flowering plants inside, along the walls enclosing the building.

**1) coming along** = కలిసి/ తో రావటం.

a) How about coming along? = నాతో ఎందుకు రాకూడదూ? (రా, అని)

b) We are going to a movie; come along = మేం సినిమాకెళ్తున్నాం, మాతో రా.

c) Wherever he goes, his dog goes along = వాడెక్కడికి వెళ్తే వాడి కుక్క కూడా అక్కడికెళ్తుంది.

**2) Walk/ go/ move along** = ముందరికెళ్లటం.

a) He walked along without listening to what I was saying = నేను చెప్పేది వినిపించుకోకుండా నడుచుకుంటూ (ముందరికి) వెళ్లిపోయాడు.

b) Move along. You are obstructing others = కదులు. (ఆగకు, ముందుకు నడు). ఇతరులనడ్డగిస్తున్నావు.

c) He drove along looking at the lines of faces on either side = ఇరువైపులా ఉన్న ముఖాల వరుసను చూస్తూ car నడుపుకొంటూ వెళ్లిపోయాడు.

Walk/ go/ move along - ఈ కదలికలను తెలిపే మాటల పక్కన along వాడే చోట్లంతా on కూడా వాడవచ్చు

Let's move along = Let's move on = ముందుకు వెళ్దాం.

He drove along = He drove on = వాహనాన్ని నడుపుకొంటూ వెళ్లిపోయాడు.

3) My uncle will take me along to the railway station = మా మామయ్య/ బాబాయి/ పెద్దనాన్న తనతో నన్ను railway station కు తీసుకెళతాడు.

a) He takes his dog along on his morning walks = ఆయన morning walk కు వెళ్ళేటపుడు తనతో తన కుక్కను తీసుకెళతాడు.

Take along = తనతో కలిసి తీసుకెళ్లటం.

b) Take along some books on the journey = ప్రయాణంలో (చదువుకునేందుకు) నీతోపాటు కొన్ని పుస్తకాలు తీసుకెళ్ళు

4) How's your uncle's building coming along? = మీ uncle కట్టడం ఎంతవరకు వచ్చింది? (దాని ప్రగతి ఎలా ఉంది?)

a) Go ahead. I'll (I will) be along in a few minutes = నువ్వు పద. కొద్ది నిమిషాల్లో నేనూ వస్తా.

b) I'm (I am) going for a walk. Will you be along? = నేను walking కు వెళ్తున్నా. నువ్వు వస్తావా?

c) He will be along soon. We can discuss the matter with him. = అతను త్వరలోనే వస్తాడు. మనం ఈ విషయం అతనితోనే చర్చించవచ్చు

ఇవే కాకుండా, along with అనే మాట కూడా ఉంది. దీనర్థం- 'తోసహా'.

a) The building along with its expensive furniture was sold for a small amount = Furniture తోసహా ఆ building ను తక్కువ ధరకు అమ్మేశారు.

b) The man along with his wife and children were killed in the accident = అతను, భార్యా పిల్లలతో సహా ప్రమాదంలో మరణించాడు.

ఇవీ along తో వచ్చే మాటలు. Practice చేయండి.

**EXERCISE**

**Practice the following aloud in English.**

**Ram:** నీతో ఎవరిని తీసుకొచ్చావు?

**Prem:** ఇద్దరిని. నా cousin ను, ఇంకో friend ను.

**Ram:** వాళ్లిద్దరినీ మనం ఇప్పుడు car లో తీసుకెళ్ళాలా?

**Prem:** అవును. Car లో పడతాం కదా?

**Ram:** పడతాం కాని, కాస్త ఇరుకనిపించవచ్చు (cramped = ఇరుకు)

**Prem:** అలా సర్దుకుందాం. పోదాంపద. (drive వాడండి)

**Ram:** మీ father operation తర్వాత ఎలా ఉన్నారు?

**Prem:** బాగా కోలుకుంటున్నారు. నిన్న లేచి తిరగగలిగారు కూడా.

**Ram:** బాగుంది.

**Prem:** ఎలా వెళ్దాం?

**Ram:** ఈ road వెంబడే వెళ్ళి 'శుభం' కళ్యాణమండపం దగ్గర ఎడమవైపు తిరుగుదాం. మనం వెళ్లాల్సింది, ఆ కళ్యాణమండపం వైపే కాస్త దూరంలో ఉన్న building.

**ANSWER**

**Ram:** Who did you bring along?

**Prem:** Two. My cousin and another friend.

**Ram:** Have we to take them along in the car? (Do we have to ... ?)

**Prem:** Yes. The car can hold all of us, can't it? (hold = పట్టటం)

**Ram:** It does, of course, but we may feel a little cramped.

**Prem:** Let's adjust. Let's drive along.

**Ram:** How is your father after the operation?

**Prem:** He is coming along fine. He was able to move about too, yesterday.

**Ram:** Good.

**Prem:** How do we go now?

**Ram:** We drive along this road and turn left at Subham Kalyana Mandapam. The place we've to go to is along the street from Subham.




**ప్రశ్న:**

1. *In order to, In respect of .. ఈ prepositions అర్థాలు, ఎలా వాడాలో వివరించగలరు.*
2. *Rather than, remains closed from - వీటి అర్థాలు, ఉపయోగించే విధానం చెప్పండి.*
3. *Depend upon, Depend on తేడా ఏమిటి?*
4. *So that అర్థాన్ని ఉదాహరణతో చెప్పండి.*

**– కె. వెంకటేశ్వర్లు, పాదిలి**

**జవాబు:**

**In order to** = అందుకోసం, అందుకు.

In order to meet the CM, he went to Hyderabad (CM ను కలుసుకునేందుకు ఆయన హైదరాబాద్‌కు వెళ్లాడు)

You have to work hard in order to get a good rank. (మంచి rank తెచ్చుకునేందుకు, బాగా కృషి చేయాలి)

అయితే In order to వాడే బదులు 'to' వాడితే సరిపోతుంది. అది simple గా natural గా ఉంటుంది. In order to కొంచెం పాండిత్యం, గ్రాంథికం. వాడకపోతే మంచిది.

**In respect of** = గురించి, పురస్కరించుకొని, సంబంధించిన. ఈ expression కూడా business, official language లలోనే ఎక్కువ వాడతారు.

Money in respect of the work already done has been paid = ఇంతవరకు పూర్తయిన పనికిగానూ, డబ్బు చెల్లించేశారు.

The teacher did not say anything in respect of the absentee students = class కు రాని students ను గురించి teacher ఏం చెప్పలేదు.

In respect of వీలయినంతవరకు వాడకుండా ఉండటం మంచిది (In order to లాగ). In respect of వాడాల్సినచోట concerning కానీ, about కానీ వాడటం మంచిది - simple.

**2) Rather than** - మనికిష్టంలేని ఒకదానికంటే/ ఒకదాని బదులు అని దీనర్థం.

a) Rather than go to a matinee in this hot sun, I will sit at home and watch the TV = ఇంత ఎండలో matinee కి వెళ్ళే బదులు/ కంటే, ఇంట్లో కూచుని TV చూస్తుంటాను.

b) He'd rather have a cooled drink than coffee- అతను కాఫీ బదులు చల్లటి పానీయం ఇష్టపడ్డాడు.

ఇలాంటిచోట్ల, అంటే రెండు వేర్వేరు వర్గాలకు చెందిన వాటిని పోల్చేటప్పుడు than వాడం. Rather than మాత్రమే వాడతాం.

**Remains closed** - మూసి ఉంటుంది.

The college remains closed from today = ఈ రోజు నుంచి మూసి ఉంటుంది. (Will remain closed అని కూడా అనవచ్చు)

**3) Depend on/ depend upon** - రెండూ ఒకటే. అయితే sentence చివర depend వచ్చినప్పుడు upon, better.

He depends on me for everything.

In times of need, be sure that I am here for you to depend upon. (అవసరం వచ్చినప్పుడు, నువ్వు ఆధారపడేందుకు నేనున్నానని ..)

**4) So that** అనేది purpose (ఉద్దేశాన్ని) తెలుపుతుంది.

He looked the room so that no one could enter it. (ఎవరూ ప్రవేశించకుండా ఉండేందుకు గదికి తాళం పెట్టాడు)

He put the money in the bank so that it might be safe (డబ్బు జాగ్రత్తగా ఉండేందుకు/ ఉంటుందని అతను దాన్ని bank లో వేశాడు)

He walked fast so that he might not miss the bus = Bus miss అవకుండా ఉండేందుకు వేగంగా నడిచాడు.

అయితే So that బదులు చాలాచోట్ల to కానీ, to be able to కానీ వాడితే simple గా ఉంటుంది. అన్నిచోట్లా కాదు.

**- M. SURESAN**

SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 275

**Niranjan:** Hi Nirupama, you are late again.
(నిరుపమా, నువ్వు మళ్లీ ఆలస్యం.)

**Nirupama:** Sorry sir, I was caught up in a nasty traffic jam. The flyover under construction is holding up the traffic. Vehicles were moving at a snail's pace.
(Sorry, ఘోరమైన traffic jam లో ఇరుక్కుపోయాను. అక్కడ flyover నిర్మాణంలో ఉండటం వల్ల వాహనాలన్నీ నత్తనడక నడిచాయి.)

Nasty - తిట్టుపదం - ఘోరమైన/ హీనమైన/ ... etc. snail's pace = snail = నత్త; pace = వేగం.

**Niranjan:** I am sure too there wasn't any error from our side. The mistake must be at the H.O. itself.
(నేనూ మనవైపు నుంచి ఏ పొరపాటు లేదని కచ్చితంగా ఉన్నా. పొరపాటు head office లోనే ఉండాలి.)

**Nirupama:** I will check up once again.
(నేను మళ్లీ చూస్తాను.)

English conversation లో 'At' వాడకం చాలా ఎక్కువ. అది మనందరకూ తెలుసు.

❍ మామూలుగా ఓ ప్రదేశం ముందు 'at' వాడితే ఆ చోట అనే అర్థం వస్తుంది.
At home (ఇంటిలో), at college, at office, at the theatre - ఆయాచోట్ల, ఆ ప్రదేశాలలో అని.

❍ Time ముందు at వాడితే ఆ సమయానికి అని అర్థం.
At 4 PM, at 6 PM, at 7 in the morning.

**b)** You think you can get the car cheap. At any rate it's not going to be less than Rs. 3 lac. = (ఆ car చవకగా కొనెయ్యాలని అనుకుంటున్నావు. ఏదేమైనా అది నీకు 3 లక్షల రూపాయలకు తక్కువరాదు)

**3) At any cost** – ఎట్టి పరిస్థితుల్లోనైనా.

**a)** I must reach the place at 9 at any cost = ఎట్టి పరిస్థితుల్లోనయినా నేనక్కడికి 9 కల్లా చేరుకోవాలి.

**b)** You will meet him there at any cost even before I start = నేను బయలుదేరడానికన్నా ముందే ఎట్టి పరిస్థితుల్లోనైనా నువ్వతన్ని కలుస్తావు.

**c)** He wants to see her out of job at any cost = ఏ పరిస్థితిలోనైనా, ఏ పద్ధతి వల్లనయినా, ఆమె ఉద్యోగంలో ఉండకుండా చూడాలనుకుంటున్నాడతను.

# He is good at cricket

**Niranjan:** Even the construction of the flyover is at a snail's pace. God knows when it will be complete.
(Flyover నిర్మాణం కూడా నత్తనడకలా సాగుతోంది. అదెప్పుడు పూర్తవుతుందో దేవుడికే తెలియాలి.)

**Nirupama:** I usually start at home at 9 expecting to be here at 9.45. But from tomorrow onwards I'll start a little earlier. At any rate not later than 8.45.
(మామూలుగా నేనింట్లో 9 కి బయలుదేరతాను ఇక్కడికి 9.45 కల్లా ఉండొచ్చని. కాని రేపటినుంచి కాస్త ముందే బయలుదేరతాను. ఏదేమయినా, 8.45 దాటకుండా బయలుదేరతాను.)

**Niranjan:** That's good. There are three more reports to be got ready. At any cost they must be over by 4 this evening.
(మంచిదే. ఇంకా మూడు reports సిద్ధం కావాల్సి ఉన్నాయి. ఏదేమైనా అవి ఇవాళ నాలుగింటికల్లా పూర్తవాలి.)

**Nirupama:** At all costs they will be ready by 4 sir.
(ఏదేమైనా అవన్నీ కూడా నాలుగింటికి తయారవుతాయి.)

**Niranjan:** OK. I know you'll do it. When you are around, I feel at ease.
(సరే, నాకు తెలుసు నువ్వు చేసేస్తావని. నువ్వు దగ్గరుంటే నాకే చింతా ఉండదు.)

**Nirupama:** Thank you, sir.

**Niranjan:** Look here, Nirupama. There's a small problem - a complaint from our head office - one of the reports we sent last week, they say, is at odds with the one we had sent earlier. How did that happen?
(ఒక చిన్న సమస్య - Head office వాళ్ల నుంచి ఓ compliant - మనం కిందటి వారం పంపిన reports లో ఒకటి మనం అంతకుముందు పంపిన report కు భిన్నంగా ఉందని. అదెలా జరిగింది?)

**Nirupama:** I'm sure it's not our fault. I checked and rechecked all the reports before I sent them. I sat for three hours at a stretch to make sure that nothing was wrong.
(అది మన తప్పుకాదని నేను కచ్చితంగా నమ్ముతున్నాను. ఏ పొరపాటూ రాకుండా ఉండటానికి నేను మూడుగంటలపాటు దాని విషయమే చూశాను.)

❍ మన పరిస్థితిని తెలపడానికి వాడతాం.

**a)** He is at work/ play/ lunch/ dinner/ a party - అతను పనిలో/ ఆడుతూ/ భోంచేస్తూ/ party లో ఉన్నాడు.

**b)** I am at my cousin's/ aunt's etc. = మా cousin/ aunt ఇంటిలో ఉన్నాను.
ఎవరి ఇంటిలో అనేది 's తో తెలపవచ్చు.
He is right now at Ramesh's = అతనిప్పుడు రమేష్ ఇంటిలో ఉన్నాడు. (Ramesh's home/ house అనక్కరలేదు.)

❍ at the moment = ఈ క్షణంలో/ ఇప్పుడు.

**Kumar:** Hello, who's it please?

**Kesav:** I am Kesav. Can I speak to Sadanand?

**Kumar:** He is very busy at the moment. I'm afraid he can't take your call. Can you leave a message?
(ఈ క్షణం ఆయన చాలా busy గా ఉన్నాడు. మీతో మాట్లాడలేడు. ఏదైనా చెప్పమంటారా? )

❍ At war, at peace, at some distance - ఇక్కడంతా at కు అర్థం, లో - అని వస్తుంది.

❍ ఏదైనా rate ముందు at వాడతాం.
at Rs. 60 a dozen, at a speed of 50 Kmph (Kilometres per hour), etc.

❍ ఏదైనా గుణం తర్వాత at వస్తే ఆ గుణం కల అని అర్థం వస్తుంది.

**a)** He is good at cricket = అతడు cricket బాగా ఆడతాడు.

**b)** She is poor at understanding others = ఇతరులనర్థం చేసుకోలేదామె. (ఆమెకా శక్తిలేదు)

**c)** He is clever at getting help from others = ఇతరుల సహాయం పొందటంలో తెలివిగలవాడు.

**Now look at the following sentences from the conversation at the beginning of the lesson.**

**1)** Vehicles were moving at a snail's pace = వాహనాలు నత్తనడక నడుస్తున్నాయి. (చాలా నిదానంగా)

**a)** Work on the flyover is progressing at a snail's pace = Flyover పనులు చాలా మందకొడిగా నడుస్తున్నాయి.

**b)** His book will take a long time to complete. He is writing at a snail's pace = అతని పుస్తకం పూర్తవటానికి చాలాకాలం పడుతుంది. అతను చాలా నిదానంగా రాస్తున్నాడు.

**2) At any rate.** ఏదేమైనా, మహా అయితే.

**a)** I will try to start as early as I can, at any rate not later than 8 = వీలయినంత త్వరగా బయలుదేరేందుకు ప్రయత్నిస్తా. ఏదేమైనా 8 కంటే ముందే (తర్వాత కాకుండా).

**4)** At all costs they will be ready by 4 PM.
**At all costs = at any cost** - Both are same.

**5)** When you are around, I feel at ease = నువ్వు దగ్గరుంటే నాకు ఏ చింతా ఉండదు/ నేనూపిరి పీల్చుకుంటా.

feel at ease/ be at ease = feel relaxed/ be free from worry = విశ్రాంతిగా, worry లేకుండా ఉండటం.

**a)** You'll get what you want. Feel at ease/ be at ease = నీక్కావాల్సింది వస్తుంది. ఆదుర్దాపడకు/ worry అవకు.

**b)** With the police any where around, he could never feel at ease = Police వాళ్లు ఎక్కడైనా దగ్గరుంటే, అతనికి స్థిమితంగా ఉండదు.

**c)** He is never at ease when he sees some one happier than he/ him = అతనికంటే సంతోషంగా ఉన్నవాళ్లెవరినైనా చూస్తే అతనికి సంతోషంగా ఉండదు. (ఈర్ష్య)

**6)** I sat for three hours at a stretch over it = దాని గురించి ఏకధాటిగా మూడు గంటలు కూర్చున్నా.

At a stretch = break లేకుండా, అదే పనిగా.

**a)** He established a record for nonstop singing by singing for 72 hours at a stretch = ఏకధాటిగా 72 గంటలపాటు విరామం లేకుండా పాడి, పాడటంలో record సృష్టించాడు.

**b)** She lectured for three hours at a stretch = ఏకధాటిన 3 గంటలసేపు ఉపన్యసించింది.

ఇవన్నీ చాలా common phrases. Practice చేయండి.

**ప్రశ్న:** *Enter* తర్వాత *into preposition* వాడొద్దని అంటారు. కొన్ని వాక్యాల్లో అలా ఉంటోంది. *Into* ఎలా వాడాలో వివరించగలరు.
*Enter into the new session.*
*We are entering into London.*
*Take permission before enter into the room..* అని రాస్తుంటారు కదా? – ఎన్.సత్యం, ఆదిలాబాద్

**జవాబు:**
Enter తర్వాత into వాడటం సందర్భాన్నిబట్టి ఉంటుంది. ఒక ప్రదేశంలోకి ప్రవేశించటం అయితే, enter అనే అంటాం, into రాదు. సంభాషణలోకి/ వివాదంలోకి/ ఒప్పందానికి దిగటం అయితే enter into అంటాం.

a) Enter a place (room, college, town, etc)
b) enter into a conversation/ discussion/ agreement

1. Entering into the new session ఇది correct. కొత్త session లోకి అడుగిడటం.
2. We are entering into London సరికాదు, We are entering London - correct
3. Take permission before enter into the room - సరికాదు. Take permission before you enter the room - correct.

India entered into an agreement with America - ఇక్కడ into అవసరం.



**ప్రశ్న:**
*According to, Agreeably to, Along with, Away from, Because of, By dint of, By means of, By reason of, By way of, Conformably to, For the sake of .*
*ఈ Phrase prepositions గురించి తెలుగులో వివరించగలరు.*
– కె.నారాయణ, నల్గొండ

**జవాబు:**

**i)** 'to' preposition కు మామూలు అర్థాలు:
1) 'కు/ కి' అని, 2) దగ్గరకు, అటువైపు.

**1)** He gave it to her (ఆమెకు)

**2)** She walked to the classroom = classroom వైపు/ class room దగ్గరకు నడిచింది. (ఇలాంటిచోట్ల to = towards)

**3)** The boy went to his mother = వాళ్లమ్మ దగ్గరికి వెళ్లాడు.

**ii)** with అంటే 'తో'.
Please come with me = నాతోరా.

**iii)** of = 1) గురించి ii) యొక్క

**a)** I know of (= about = గురించి) this.
He knew of it yesterday itself (of= గురించి)

**b)** యొక్క - This is the property of my friend. (అతని యొక్క)

**iv)** from = నుంచి, away = దూరంగా.

అయితే మీరు రాసిన phrases లోని to, with, of, లాంటి prepositions కు ప్రత్యేకంగా అర్థాలుండవు. అవి ఆ phrases లో భాగాలు. ఆ prepositions అన్నీ ఆ మాటల పక్కన వాడుకగా వస్తాయి.

**1.** According to = ప్రకారం

**2.** Agreeably to - ఇదిలేదు - Agreeable to ఉంది. అర్థం - సమ్మతం.
(He is agreeable to my proposal - నా ప్రతిపాదన అతడు ఒప్పుకున్నాడు/ అది అతనికి సమ్మతం.)

**3.** Along with = తోసహా
The house along with its furniture has been sold = ఆ ఇల్లు, furniture తోసహా అమ్మేశారు.

**4.** Away from = దూరంగా.
He lived in a small village away from towns and cities - నగరాలకు దూరంగా చిన్న గ్రామంలో నివసించాడు.

**5.** Because of = అందువల్ల
Because of his laziness he failed = సోమరితనం వల్ల

**6 &7)** By dint of = By means - అందు మూలంగా/ దాని సహాయంతో.
He succeeded by dint of/ by means of his hard work (కృషివల్ల/ కృషి సహాయంతో)

**8.** By reason of = ఆ కారణంగా
By means of their quarrel, they lost their money = వాళ్ల పోట్లాట కారణంగా డబ్బులు పోగొట్టుకున్నారు.

**9.** By way of - i) ఆ విధంగా/ దానికి మారుగా.
We had bread and fruit by way of lunch = bread, పండ్లరూపంలో lunch తీసుకున్నాం.
= lunch బదులు bread, పండ్లూ తీసుకున్నాం.

**10.** conformably to: ఈ మాట English లో లేదు.

**11.** for the sake of = అందుకోసమే.

**a)** He murdered the child for the sake of a few thousand rupees = కొన్ని వేల రూపాయల కోసం ఆ బిడ్డను హత్య చేశాడు.

**b)** He came here for the sake of a job, ఉద్యోగం కోసం ఇక్కడికి వచ్చాడు. ఈ అర్థంతో for the sake of = for.

- M. SURESAN

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 276

# I AM AT SEA WHAT TO WEAR

**Saran:** Visal, You appear busy. (Are you) going somewhere?
(చాలా busy గా కనపడుతున్నావు. ఎక్కడికైనా వెళ్తున్నావా?)

**Visal:** Yes. I'm going for a bit of shopping.
(అవును. కాస్త shopping చేద్దామని బయల్దేరాను/ వెళ్తున్నాను)

**Saran:** I'm not surprised. Whenever I see you, you are out shopping. I'm afraid that at this rate hardly anything will be left for others to buy.
(నాకేం ఆశ్చర్యంగా లేదు. నిన్ను నేనెప్పుడు చూసినా shopping చేయటానికి వెళ్తూ ఉంటావు. ఈ విధంగా/ ఈ తీరున shops లో కొనేందుకు ఇతరులకు ఏం మిగలదేమో అని అనుమానంగా ఉంది)

**Visal:** (Do you) Know what my old man/ dad says? "If you shop at this rate, you'll (you will) end up penniless"
(మా నాన్నేమంటాడో తెలుసా? ఇలా నువ్వు shopping చేస్తూ పోతే నువ్వు పైసా లేకుండా పోతావు" అని.)

(Old man అంటే ఇక్కడ నాన్న అని. కొంచెం స్వతంత్రించి dad బదులు వ్యావహారికంగా వాడేమాట. తెలుగులోనూ అంటుంటారు కదా- మా బాబు ఊర్కోడు అని).

Penniless = చేతిలో పైసా/ చిల్లి గవ్వ లేకుండా ఉండటం. Penny = British currency లో నాణెం. Plural - pence. 100 pence = 1 pound

**Saran:** If you don't mind, so do I feel too. I find you spending quite a lot on clothes and other avoidable things. Why don't you check your spending spree?
(నువ్వేం అనుకోకపోతే, నాక్కూడా అదే అన్పిస్తుంది. బట్టల మీద, ఇతర అనవసరమైన వస్తువులమీదా నువ్వు బాగా ఖర్చు పెడతావు. నీ విచ్చలవిడి ఖర్చును కాస్త అదుపులో పెట్టుకోకూడదూ?)

Spree: (ఏదైనా సరదా) మితిమీరి చేయటం.
Spending spree = సరదాగా మితిమీరి ఖర్చు చేయటం - Eating spree = (సరదాగా) మితిమీరి తినటం. They are on a betting spree = వాళ్ళు మితిమీరి bet లు కాస్తున్నారు. Last lessonలో binge అనే మాట వాడాం. అదీ, spree ఒకటే.

**Visal:** I've (I have) controlled myself a lot. In the last few weeks I haven't spent as much as I did earlier
(నేను చాలా control చేసుకున్నాను. ఈ గడిచిన వారాలలో అంతకు ముందంత ఖర్చు పెట్టలేదు.)

**Saran:** No. What you say is at odds with what I observe you doing. Just yesterday you added one more pair of jeans to the twenty odd pairs you have.
(ఏం లేదు. నువ్వంటున్న దానికి, చేస్తున్నదానికీ ఏం పొంతన లేదు. నేను గమనిస్తున్నాను. నిన్నటికి నిన్న, నీకున్న 20 పై చిలుకు jeans కు మరో jeans తోడు చేశావు).

twenty odd = ఇరవైకి పైగా/ ఇరవై + చిల్లర.
The book costs a hundred odd rupees.
(ఆ పుస్తకం ధర వంద చిల్లర)

**Visal:** I am at it, Saran. I can't resist the temptation to buy a thing when I like it.
(నేను ఆ పని మీదే/ఆ ప్రయత్నంలోనే ఉన్నా. ఏదైనా వస్తువు నచ్చితే అది కొనాలనే కోరికను నేను అణుచుకోలేను.)

Temptation = ఆకర్షణ.
Resist - ప్రతిఘటించటం/ ఇక్కడ తట్టుకోవటం.
The drunkard cannot resist the temptation of the bottle.
(తాగుబోతు మద్యం ఆకర్షణ తట్టుకోలేడు.)
The bottle = మద్యం)

**Saran:** OK. Good luck in your attempts to spend less.

**Visal:** You don't buy as much as I do, but I find your clothes very good. I must say you have good taste.
(నేను కొన్నంత నువ్వుకొనవు. కానీ నీ బట్టలు చాలా బాగుంటాయి. నీ అభిరుచి మంచిది అని చెప్పక తప్పదు.)

**Saran:** I don't know all that. I Select my clothes at random. No pick and choose as you do.
(నాకదేం తెలియదు. ఏదో తోచినవి Select చేసుకుంటాను. పట్టుబట్టి ఇదే కావాలి, అదే కావాలి అని ఏరుకోను.)

Pick and choose = మనక్కావలసినవి/ నచ్చినవి మాత్రమే Select చేసుకోవడం

**Visal:** In spite of the many clothes I buy, Some times I am at sea what to wear for an occasion. Too many clothes to choose from.
(అన్ని బట్టలు కొనుక్కున్నప్పటికీ, ఏదైనా సందర్భానికి ఏం వేసుకోవాలో తెలియని అయోమయంలో ఉంటాను. మరీ ఎక్కువ బట్టల్లోంచి select చేసుకోవడం కూడా కష్టమే.)

**Saran:** So, the lesson is cut down your spendiing.
(కాబట్టి పాఠం: నీ ఖర్చుతగ్గించుకో)

**Visal:** From now on I will be at it sincerely
(ఇప్పటి నుంచి మనస్ఫూర్తిగా ఆ పనిమీదే ఉంటా)

● ● ● ● ● ●

Conversation english లో చాలా common గా వినిపించే at తో వచ్చేమరికొన్ని expressions చూద్దాం.

**Look at the following expressions from the conversation above.**

1) I'm afraid that at this rate hardly anything will be left for others to buy.
2) What you say is at odds with what I observe you doing.
3) I am at it/ I will be at it.
4) I select my clothes at random.
5) In spite of the many clothes I buy some times I am at sea what to wear for an occasion.

**1)** I'm afraid that at this rate hardly anything will be left for others to buy
(ఇలాగే కొనసాగితే/ ఈ విధంగా అయితే ఇతరులు కొనేందుకేమిగలదు.)

**At this rate =** ఇలాగే జరిగితే/ ఇలాగే కొనసాగితే

a) Pollution is growing day by day at this rate the world will be a dead place in some countries = కాలుష్యం రోజు రోజుకీ పెరిగిపోతోంది. ఇదే కొనసాగితే కొన్ని వందల ఏళ్లలోనే ప్రపంచం మరుభూమి అయిపోతుంది.

b) We are cutting off forests. At this rate wild life will be extinct in no time.
(మనం అడవులను నరికేస్తున్నాం. ఇదేకొనసాగితే వన్యమృగాలు అంతరించిపోతాయి.)

extinct = అంతరించి పోయిన, wild life =వన్యమృగాలు

c) You are making to many enimies at this rate there will be none to support you.
(నువ్వు మరీ ఎక్కువ మందిని శత్రువులను చేసుకుంటున్నావు. ఇలాగే కొనసాగితే నీకు మద్దతు ఇవ్వటానికి ఎవరూ ఉండరు.)

**2)** What you say is at odds with what I observe you doing .
(నువ్వు చెప్పేది చేసేది చాలా భిన్నంగా ఉంది. నేను గమనిస్తున్నాను)(నీ మాటలకూ చేతలకూ పొంతన లేదు)

**At odds with =** భిన్నంగా/ పొంతన లేని/ వ్యతిరేకమైన.

a) His behaviour is at odds with his words = అతని ప్రవర్తన అతని మాటలకు భిన్నంగా ఉంది.

b) What he says is at odds with what the press has reported =
అతను చెప్తున్నదీ, వార్తా పత్రికల్లో వచ్చిందీ తేడాగా ఉన్నాయి.

**3)** I selected my clothes at random

At random = ఒక పద్ధతిగా కాకుండా. ముఖ్యంగా ఇది selection విషయంలో వాడతారు.

a) The teacher selected ten students at random from the class = ఆ teacher class లో నుంచి పదిమందిని (ఏ పద్ధతిలేకుండా) ఎన్నుకున్నారు - ఏ ప్రాతిపదికాలేకుండా

b) I picked up these shirts at random =
ఈ shits ను ఏదో అలా Select చేసుకున్నా.

4) I am at it/ I will be at it =
నేను ఆపని మీదే ఉన్నా/ ఆ పని మీదే ఉంటా.

**To be at it =** ఓ పని మీద/ఓ ప్రయత్నంలో ఉండటం.

a) You've asked me to tidy up the home and I am at it.
(నువ్వు నన్ను ఇల్లు సర్దమన్నావు, నేనాపని మీదే ఉన్నా.)

**Hemanth:** I've asked you to choose a good house that I can buy. Do you remember?
(నేను కొనేందుకు ఇల్లు select చేయమన్నానుగా. నీకు గుర్తుందా?)

**Vasanth:** Sure. I do. I am at it
(కచ్చితంగా గుర్తుంది. ఆపని మీదే ఉన్నా)

**Sumanth:** Make sure you finish the work by the week end.
(వారాంతానికి ఎలాగైనా పని పూర్తయేలా చూడు)

**Ananth:** From now on I will be at it and won't rest until it is done.
(ఇప్పటినుంచి ఆ పని మీదే ఉంటా, అపని పూర్తయ్యే వరకు విశ్రమించను)

I want it done immediately. Be at it = ఆ పని నాకు వెంటనే అయిపోవాలి. ఆ పని మీదే ఉండు.

ఈ చిన్న expression, at it, english లో చాలా common. తరచూ practice చేయండి.

5) ... I am at sea what to wear =
ఏది వేసుకోవాలో తెలీటంలేదు.

To be at sea = ఏం చెయ్యాలో తెలీని గందరగోళ స్థితి/ ఏదీ పాలుపోని స్థితి.

a) I am at sea about what to do next =
తర్వాత ఏం చెయ్యాలో తెలీని స్థితిలో ఉన్నాన్నేను.

b) With the loss he has sustained in business he is at see how to recover =
వ్యాపారంలో నష్టాలు పొంది, ఎలా కోలుకోవాలో పాలుపోకుండా ఉండతనికి.

**Exercise: Match the words under A with their meanigs under B**

| A | B |
|---|---|
| 1. bank | A. Speed |
| 2 frugal | B. jump |
| 3. rapid | C. depend |
| 4. dive | D. Economical |
| 5. pace | E. extravagant |
| | F. fast |
| | G. unhealthy. |

Answers 1.C 2.D 3.F 4.B 5.A



**ప్రశ్న:** Spoken English అంటే direct గా simple గా ఉండాలి కదా? I don't see eye to eye with you in that matter అనే బదులు I disagree లేదా I differ with you అని I am with you there అనే బదులు I agree with you అంటే సరిపోతుంది కదా?

*G. Madhusudan, Suryapet*

**జవాబు :**
మీరు చెప్పింది correct. అయితే repetition avoid చేయటానికి conversation లో కొంత variety కోసం అప్పుడప్పుడు, ఇలాంటి idiomatic expressions (I don't see eye to eye with you) మనం వాడవచ్చు. అలాంటివి వాడేప్పుడు అవతలివాళ్లకూడా అది అర్థం అవుతుందా లేదా అనేది దృష్టిలో ఉంచుకుంటే communication free గా ఉంటుంది.

**ప్రశ్న:**
1) నేను ఎప్పుడు రమ్మంటే అప్పుడు నీవు వస్తావా?
2) నేను నిల్చోమన్న వెంటనే నీవు నిల్చోవాలి.
3) నిన్న మీరు రవితో నన్ను హైదరాబాద్‌కు వెళ్లమన్నారట.
4) నేను ఎవరితో మాట్లాడమంటే వారితో మాట్లాడతావా?
5) మొన్న మీరు కృష్ణతో ఇవాళ నన్ను కలవమన్నారట.
6) నేను చెప్పిన వెంటనే ఆ పని నీవు చేయాలి.

పై Expressions లో వెళ్లాలన్నమాట, రమ్మన్నావట, మాట్లాడతావా, వెళతావా లాంటి తెలుగు పదాలకు సమానమైన ఇంగ్లిష్ పదాలను ఎలా చెప్పాలో తెలపండి?

*Krishna, Vizianagaram*

**జవాబు :**
i) Will you come whenever I want you/tell you to come.
ii) You must stand up when I ask you to stand up.
iii) It seems yesterday you wanted me to go with Ravi to Hyderabad.
(It seems yesterday you said that? should go with Ravi to Hyderabad).
iv) Will you talk to any one who I want you to/ask you to talk to.
v) It seems (that) the day before yesterday you wanted Krishna to see/meet me today.
vi) When I ask you to do some thing, you must do it at once.

వెళ్లమన్నావట, అని 'అట'కు It seems/you seem అనవచ్చు మిగతా వాటికి పై sentences చూడండి.

**ప్రశ్న:**
1) I married అనకుండా I got married అంటారు ఎందుకు? double V3 ఎందుకు ఉపయోగిస్తారు?
2) English Alphabet ను బి, సి, డి, జి, అని ఉచ్చరించాలా? లేదా బ్, స్, డ్, జ్, అని ఉచ్చరించాలా?

*G. Madhava Reddy, Devarakonda*

**జవాబు :**
i) I married అంటే ఎవరిని, అని తెలీటం లేదు. అందుకని I married her / him/that girl, etc అనైనా అనాలి. లేకుంటే I got married అంటాం. ఇక్కడ Got main verb కాబట్టి married - past participle వాడతాం.

eg: He got beaten thoroughly - బాగా దెబ్బలు తిన్నాడు. Get కు ఈ విధమైన వాడకం గురించి ముందరి lessons చూడండి.

ii) మామూలుగా ఉచ్చరించేప్పుడు b, c, d, g అనే అంటాం. వాటికి a, e, i, o, u చేర్చినపుడు- బ్, స్, ese, value తో vowel soundను బట్టి వాడతాం.

- M. SURESAN

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 277

# You are at it again

**Harsha:** Hi Sasir, welcome. How was the journey? How's everybody? (స్వాగతం. ప్రయాణం ఎలా జరిగింది? అందరూ ఎలా ఉన్నారు? )

**Sasir:** Fine. Thank you. How are you and your people? (కులాసా. మీరంతా బాగున్నారా? )

**Harsha:** Fine too. You appear travel weary. I suggest we go home and you take rest. (కులాసానే. నువ్వు ప్రయాణ బడలికలో ఉన్నట్టున్నావు. ఇంటికెళ్దాం, నువ్వు విశ్రాంతి తీసుకో. )

(travel weary = ప్రయాణ బడలిక)

**Sasir:** I certainly am. Three hours on flight followed by a whole day's train journey. Quite tedious. Where are you going to put me up? (అవును నిజమే. నా బస ఎక్కడ ఏర్పాటుచేశావు? )

Put some body up = ఒకరికి బస ఏర్పాటు చేయటం

**Harsha:** Where else? At my home. You stay there. You feel absolutely at home. (ఇంకెక్కడ. మా ఇంట్లోనే. అక్కడే ఉండు. నీవక్కడ పూర్తి స్వతంత్రంగా ఉండవచ్చు )

**Sasir:** Thank you. No other suits me so well. But I am here on my company's business. I can stay at any expensive hotel at company's expense.

**Harsha:** True. I understand that, but we can't have each other's company. No more of it. Let's drive home at once. (నిజమే, నాకర్థమయింది, కాని మనిద్దరం కలిసుండలేం కదా? ఇంకా విషయం ఆపు. ఇంటికెళ్దాంపద వెంటనే. )

**Sasir:** As you please. At the same time I want you to be my guest for a day. So I'll move to a good hotel tomorrow night and stay there till the day after. (నీ ఇష్టం. అయితే నువ్వొక్క రోజుకు నా అతిథిగా ఉండు. కాబట్టి రేపు సాయంత్రం నేనేదైనా Hotel కు వెళతా, ఎల్లుండి వరకూ అక్కడ ఉంటా. )

**Harsha:** Oh come on Sasir. You stay the whole time with me. (అదేం కాదు. నువ్వు మా ఇంట్లోనే ఉండు. )

**Sasir:** You are at it again- playing the good host and entertaining company. But you deprive me of the money I can get from my company. (మళ్లీ అదే పని చేస్తున్నావు - మంచి ఆతిథ్యాన్నిచ్చి స్నేహితులకు సరదా చేయటం. అయితే అలా చేయటం వల్ల company నుంచి నాకొచ్చే డబ్బు కోల్పోయేట్టు చేస్తున్నావు. )

playing = మామూలు అర్థం ఆడటం. ఇదిమనందరికీ తెలుసు. Playing అంటే ఒక పాత్ర పోషించడం అని కూడా. NTR played Lord Krishna in a number of movies = NTR చాలా చిత్రాల్లో కృష్ణుడిగా నటించాడు. నిజ జీవితంలోనూ ఏదైనా పాత్రను నిర్వహించటం, play. Playing the good host = మంచి ఆతిథ్యమిచ్చేవాడి పాత్ర పోషించడం- మంచి ఆతిథ్యం ఇచ్చే వాడుగా ఉండటం.

Entertain - దీనర్థం - వినోదం కలిగించటం. ఇక్కడ అర్థం; అతిథులను, ఇతరత్రా ఇంటికొచ్చేవాళ్లనూ చూసుకోవడం.

He is good at entertaining company = తనకు company ఇచ్చే వాళ్లను అతను బాగా చూసుకుంటాడు.

Don't entertain him = అతనితో పెట్టుకోవద్దు. (అతనితో ఎక్కువగా స్నేహంగా ఉండవద్దు/ అతనికి చనువు ఇవ్వవద్దు అని. )

**Harsha:** I'd hear no more of it. You are staying the whole time with me. That's all. (నేను ఇంకేం వినదలుచుకోలేదు. నువ్వు ఇక్కడున్నంతసేపూ మా ఇంట్లోనే ఉంటున్నావు. అంతే. )

**Sasir:** OK. By the way, how's our old friend and Police inspector Sankar? (సరే. అదిసరేగాని మన పాత మిత్రుడు Police inspector Sankar ఎలా ఉన్నాడు? )

**Harsha:** Busy as always- trying to catch criminals at large. Right now he is after a bank robber gang. (ఎప్పటిలాగే తీరికలేకుండా ఉన్నాడు- తప్పించుకు తిరుగుతున్న నేరగాళ్ల వేటలో. ఇప్పటికిప్పుడు Bank ను కొల్లగొట్టిన ముఠాను పట్టుకునే ప్రయత్నంలో ఉన్నాడు. )

**Sasir:** He is at his best when he is out hunting criminals. I've heard he is going to be awarded one of the police awards. (నేరగాళ్లను పట్టుకునే ప్రయత్నంలో సమర్థంగా వ్యవహరిస్తాడు. అతనికేదో police medal వస్తుందని విన్నాను. )

**Harsha:** So he is. We are really happy about it, aren't we? (అవును, మనకు చాలా సంతోషంగా ఉంది కదా? )

**Sasir:** Convey my congrats to him. On my next visit I'll meet him. (అతనికి నా Congrats చెప్పు. నేనీసారి వచ్చినప్పుడు అతన్ని కలుసుకుంటాను. )

☺ ☺ ☺ ☺

Spoken English లో at తో వచ్చే expressions చూస్తున్నాం కదా? ఇప్పుడు మరికొన్ని expressions.

**Look at the following expressions from the dialogue above.**

1) You feel absolutely at home.
2) I can stay at any hotel at company's expenses.
3) At the sametime I want you to be my guest for a day.
4) You are at it again.
5) Busy... always trying to catch criminals at large.
6) He is at his best when he is out hunting criminals

**1) You feel absolutely at home:**

At home అంటే తెలుసుకదా- ఎవరిని గురించి మాట్లాడుతున్నామో వాళ్ల ఇంట్లో అని.

a) He is at home in the evenings = సాయంత్రాలు అతను (వాళ్ల) ఇంట్లోనే ఉంటాడు.

b) They left their children at home = వాళ్ల పిల్లల్ని వాళ్ల ఇంట్లో వదిలేశారు.

(Spoken English లో సాధారణంగా- In my house, In their house, etc., అని అనరు, at home అంటారు. )

'At home' కు ఇక్కడి అర్థం: అతిథులతో- మా ఇంట్లో ఏం సంకోచపడొద్దు/ మీ ఇల్లే అనుకోండి/ మొహమాటపడొద్దు/ ఇబ్బంది పడొద్దు - అని చెప్పడం.

Feel at home during your stay = నువ్వున్నంతసేపూ ఏం మొహమాటపడకుండా free గా ఉండు. (అతిథితో అనే మాట) (ఇబ్బంది పడొద్దు/ ఇబ్బందిగా feel అవ్వొద్దు. )

I am quite at home here = నాకిక్కడ కొత్తేం అనిపించటంలేదు. బాగా సౌకర్యంగా ఉంది. ఏం ఇబ్బందిగా లేదు.

'At home' కు ఇంకో అర్థం, ఏ పనైనా చాలా తేలిగ్గా చేయగలగడం/ ఏ subject అయినా బాగా అర్థం చేసుకోగలగడం.

a) He is quite at home with maths = అతను గణితం బాగా చేస్తాడు.

b) She is at home with singing that kind of songs = అలాంటి పాటలు పాడటం ఆమెకు సులభం.

**2) I can stay at any hotel at company's expense.**

At someone's expense: ఒకరి డబ్బుతో/ ఖర్చుతో.

a) I am staying in this hotel at my company's expense = Company ఖర్చుతో నేనీ hotel లో ఉన్నా.

b) Ministers, MLAs, MPs and government officials travel and enjoy all kinds of comforts at public expense = మంత్రులు, MLA లు, MP లు, ప్రభుత్వ అధికారులు ప్రజాధనంతో ప్రయాణాలు చేస్తారు, అన్ని రకాల సుఖాలూ అనుభవిస్తారు.

c) I went there at my own expense = నా డబ్బు ఖర్చు పెట్టుకునే నేనక్కడికి వెళ్లాను.

**3) At the same time =** ఒక అర్థం- అదే/ ఒకే సమయంలో.

You can't be talking and listening at the same time. ఒకే సమయంలో మాట్లాడటం, వినటం చేయలేవు. ఇక్కడి అర్థం- అయితే (but) అని.

a) He did help me, of course; at the sametime he hasn't repaid the money he has borrowed from me = నాకు సహాయమైతే చేశాడు, అయితే నా దగ్గర తీసుకున్న అప్పు నాకింకా చెల్లించలేదు.

b) Her voice was good, at the same time her accent was horrible = ఆమె గొంతు బాగానే ఉంది, అయితే ఆమె ఉచ్చారణ మాత్రం దారుణం.

c) She was able to pay the bill, at the same time she was angry at the bill amount = Bill చెల్లించగలిగింది ఆమె, అయితే bill అంత పెద్ద మొత్తం అవటం ఆమెకు కోపం తెప్పించింది.

**4) You are at it again =** నువ్వు మళ్లీ అదే చేస్తున్నావు.

be at it = చేసిందే మళ్లీ చేయటం.

a) You are at it again - eating sweets, though the doctor told you not to = మళ్లీ అదే చేస్తున్నావు తీపి తింటూ, Doctor వద్దన్నా కూడా.

b) He is at it again. He has cut class and gone to a movie = మళ్లీ అదే చేస్తున్నాడు- Class ఎగ్గొట్టి సినిమాకెళ్లాడు.

**5) Busy ... always trying to catch criminals at large =** తప్పించుకు తిరుగుతున్న నేరగాళ్లను పట్టుకోవటంలో busy గా ఉన్నాడు.

at large = తప్పించుకు తిరుగుతున్న (నేరగాళ్లు, క్రూరమృగాలు లాంటివి)

a) The suspected murderer of the child is still at large = ఆ బిడ్డను చంపిన వ్యక్తి అనుకుంటున్నతను ఇంకా పరారీలో ఉన్నాడు.

b) The bank robbers are still at large = Bank కొల్లగొట్టిన వాళ్లింకా పరారీలో ఉన్నారు/ పోలీసులకింకా చిక్కలేదు/ తప్పించుకు తిరుగుతున్నారు.

c) The people in the village are scared of a panther at large = ఆ గ్రామ ప్రజలు ప్రమాదకరంగా తిరుగుతున్న చిరుతపులి గురించి భయపడుతున్నారు.

Panther = చిరుతపులి. scare = భయం కలిగించటం.

**6) He is at his best when he is out hunting criminals =** నేరస్థులను వేటాడే విషయంలో అతని గొప్పతనం చూపిస్తాడు/ బయటపడుతుంది.

at one's best = ఒకరి గొప్పతనం బయటపడటం.

He is at his best while acting tragic roles = దుఃఖ పాత్రలు నటించటంలో అతని గొప్పతనం చూపిస్తాడు.

tragic = దుఃఖపూరితమైన.

role = (నాటకాలు/ సినిమాల్లో) పాత్ర.

**Exercise: Match words under A with their meanings under B**

**A:** 1. cunning 2. disgrace 3. kernel 4. omen 5. offspring

**B:** A. portent B. dishonest C. children D. shame E. central part (of an idea) F. geyser.

**KEY: 1.B 2.D 3.E 4.A 5.C.**




**ప్రశ్న:** వాక్యాల్లోని నాలుగు రకాలు, పదాల అమరికను గురించి వివరించగలరు.

– కె. వెంకటేశ్వర్లు, కరీంనగర్

**జవాబు:**

**Four kinds of sentences.**

1) Statement
2) Questions- two kinds of questions:
   i) 'wh' questions (questions beginning with what, when, where, why, how etc)
   ii) Non 'wh' questions- questions without 'wh' words like what, when, where, etc.
3) Imperative sentences. (orders, requests, etc)
4) Exclamations- sentences expressing surprise/ any sudden feeling.

**Word order (order of words) in the different kinds of sentences.**

**1) Statement:**

eg: He is my friend

Word order: He (subject) + is (verb) + my friend

Word order of a statement: Subject + verb

That is, in a statement, the subject comes first and the verb next.

**2) Questions - Word order.**

**a) Wh questions:**

i) Where is he?

Word order: Where (Wh word) + is (verb) + he (subject)

ii) Where are you going?

Word order: Where (Wh word) + are (Helping verb) + you (subject) + going? (Main verb). If a verb has two or more words in it, the first word is the helping verb, and the other words, the main verb.

**b) Non wh questions:**

i) Are they here? Word order: Are (verb) + they (subject) + here

ii) Are they coming? Word order: Helping Are (Helping verb) + they (subject) + coming? (Main verb)

Question word order:

i) Wh word + verb + subject
ii) Wh word+Helping verb+subject+Main verb
iii) Verb + subject
iv) Helping verb + subject + Main verb

**Difference in the word orders of statement and question:** A statement has always the subject before the verb. A question (whether wh question or non wh question) has verb before the subject, or the subject after the helping verb (subject in between the helping verb and the main verb)

**3) Imperative sentence: orders/ requests, etc.**

In all these sentences, the subject is always, you, which is not mentioned.

eg: i) (you) get out

ii) (you) please come in.

Word order: (You) - subject + get (Verb)

**4) Exclamations:** Sentences expressing surprise or sudden feelings:

a) What a leader he was! (He was a very great leader.)

Word order: What (wh word) + a leader (noun) + he (subject) + was! (verb)

b) How tall he is! (= He is very tall)

Word order: How (wh word) + tall (adj) + he (sub) + is! (verb)

c) How slowly he walks! (He walks very slowly)

Word order: How (Wh word) + slowly (adverb) + he (sub) + walks! (verb)

So the word order in an exclamation:

Wh word + Noun/ Adjective/ adverb + sub + verb.

These are word orders in the 4 kinds of sentences.

- M. SURESAN

# SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 278

**Subhash:** Oh ... you are back. What a relief! I missed you a lot during your absence and lot has happened since you left. (అమ్మా... తిరిగొచ్చావా. ఎంత హాయిగా ఉందో! నువ్వు లేనపుడు నిన్ను చాలా miss అయ్యా. చాలా జరిగింది కూడా.)

**Prabhas:** I missed you too. I am happy to be back. (నిన్ను కూడా నేను miss అయ్యా. తిరిగొచ్చినందుకు సంతోషపడుతున్నా.)

**Subhash:** There was a lot of back biting here about you. People were saying behind your back, things they dare not say in your presence. (నీ వెనక నీ గురించి ఎన్ని మాటలన్నారో. నీ ముందు ధైర్యంగా చెప్పలేని మాటలు నీ వెనకన్నారు.)

అవి చాలా తరుచుగా వాడతారు. Back అంటే మామూలు అర్థాలు మనందరికీ తెలుసు. వెనక అనే అర్థం చాలా సాధారణం. back అంటే వీపు అని కూడా కదా?

He carried the bag on his back=
ఆ సంచిని తన వీపు మీద మోశాడు.

back అంటే వెనక్కి అనే అర్థం కూడా ఉంది కదా.

He took it back with him =
అతను దాన్ని వెనక్కి తీసుకెళ్లాడు (తిరిగి తీసుకెళ్లాడు)

కుర్చీ sofa లాంటి వాటిలో మనం ఆనుకునే వెనక భాగం కూడా back. She leant on the back of the chair= ఆమె కుర్చీలో ఆనుకుని కూర్చుంది. (The back of sofa) ఇవి మనలో చాలామందికి తెలిసిన 'back' అర్థాలు.

Back కూ, behind కూ తేడా: Back అంటే వెనకవైపు.

a) He sat at the back of the bus =
Bus లో వెనకవైపు కూర్చున్నాడు.

b) There was a small car behind the bus =
Bus వెనక ఓ చిన్న car ఉంది.

(Back up అంటే ఇంకో అర్థం - Computer program లోగానీ, Disk లోగానీ ఉన్న సమాచారాన్ని Copy చేయటం. The computer program has been backed up = Computer program ను పుస్తకంలోకి copy చేశారు.)

**4) Ramana is behind all this** = దీనివెనక రమణ హస్తం వుంది.

to be behind = ఒకదానికి కారణమయ్యే వ్యక్తులు/ విషయాలు.

a) The Police are yet to know whose hand is behind the Sanjhautha Express blast = సంఝౌతా express పేలుళ్ల వెనుక ఎవరి హస్తం ఉందో police కింకా తెలియదు.

# There was a lot of back biting ..

**Prabhas:** Who said all that and what did they say? Didn't you try to check them? (ఎవరు అలా అన్నది? ఏమన్నారు? వాళ్లను నువ్వు ఆపడానికి ప్రయత్నించలేదా?)

**Subhash:** I was backing you up whenever they indulged in backbiting about you. But none could stop them. (వాళ్లు నీ గురించి చెడుగా మాట్లాడుతుంటే నిన్ను నేను సమర్థిస్తూనే ఉన్నా. కాని వాళ్లను ఎవరూ ఆపలేకపోయారు.)

indulge in = ఏదైనా చెడు పనిచేయటం

Indulge in drink = తాగటం

indulge in vice = వ్యసనాలకు లోబడటం

indulge in violence = దౌర్జన్యానికి పాల్పడటం

**Prabhas:** I now know who they are it must be Rohit and Roshan. I know the reason too. (ఆ ... ఇప్పుడు తెలిసింది వాళ్లెవరో.. రోహిత్, రోషన్‌లై ఉండాలి. నన్ను వాళ్లు తిట్టడానికి కారణం కూడా తెలుసు.)

**Subhash:** You've guessed a right. But why? (నీ ఊహ సరైందే. కానీ ఎందుకు అలా తిట్టారు నిన్ను?)

**Prabhas:** They wanted me to recommend them for inclusion in the team. They are very poor players and so I couldn't. They continued to pester me and I told them to get off my back. That must have offended them. (Team లో చేర్చుకోవడానికి వాళ్లను సిఫార్సు చేయాలన్నారు. వాళ్లు మంచి players కారు. అందుకని నేను వాళ్లను recommend చేయలేకపోయాను. అయినా వాళ్లు నన్ను పీడించటంతో, నన్ను విసిగించవద్దని గట్టిగా చెప్పాను. అది వాళ్లకు కోపం తెప్పించి ఉంటుంది.)

pester = దేనికోసమైనా ఒకరిని పీడించటం

**Subhash:** Correct. They were saying a lot many things about you. But at the back of their minds there perhaps was the feeling that they had been ignored. (వాళ్లేదో చాలా అన్నారు కాని, బహుశా వాళ్ల మనసులో తమను ఉపేక్షించారన్న భావం ఉండి ఉండవచ్చు.) But I think Ramana is behind all this, egging them on. కానీ వాళ్లను రెచ్చగొడుతూ, దీని వెనక రమణ ఉన్నాడని నేననుకొంటున్నా.

egg on = రెచ్చగొట్టడం.

**Prabhas:** Why perhaps? That is exactly at the back of their mind. (ఎందుకలా? అసలదే వాళ్ల మనసులో ఉన్న అసలయిన భావం.)

**Subhash:** Now that you've come back you can talk to them and settle things. (నువ్వు తిరిగొచ్చావు కాబట్టి వాళ్లతో మాట్లాడి అన్నీ పరిష్కారం చేసుకోవచ్చు.)

**Prabhas:** OK. Let's see.



పై సంభాషణలో back తో ఉన్న expressions గమనించారు కదా. Natural conversational English లో back, back తో వచ్చే expressions చాలానే ఉన్నాయి.

(మనం చాలాసార్లు వెనక అనే అర్థంతో back side అని కొంతమంది అనటం వింటుంటాం. back కు, back side కు చాలా తేడా ఉంది. back అంటే తెలిసిందే - వెనక అని, backside అంటే సరైన అర్థం పిరుదులు)

At the back side of the room there was a dog అంటే వచ్చే హాస్యాస్పదమైన అర్థం ఊహించుకోండి. Room కు back side ఉండదు. At the back of the room there was a dog = Room లో వెనక ఓ కుక్క ఉంది. There was a dog at his back = అతని వెనక కుక్క ఉంది. There was dog behind the bus - bus వెనక (bus లో కాదు) ఓ కుక్క ఉంది)

ఇప్పుడు back తో వచ్చే మరికొన్ని expressions చూద్దాం.

**Look at the following sentences from the conversation at the beginning of the lesson:**

1) You are back/ I am happy to be back
2) There was a lot of back biting about you
3) I was backing you up
4) Ramana is behind all this
5) I told them to get off my back
6) But at the back of their minds was the feeling that they had been ignored.

**1) You are back/ I am happy to be back.** ఇక్కడి phrase, be back = వెనక్కిరావటం/ తిరిగిరావటం.

a) My father was back from Tirupathi yesterday
మా నాన్న నిన్న తిరుపతి నుంచి తిరిగొచ్చారు.

b) When will you be back?
నువ్వు మళ్లీ ఎప్పుడు తిరిగొస్తావు?

c) I leave for college at 10 and am back home at 4 = పదింటికి college కి వెళతాను, నాలుగింటికి తిరిగొస్తాను. (Back home అంటే చాలు. Back to home తప్పు. Back at home అంతగా వాడరు)

**2) There was a lot of back biting about you** = నువ్వు లేనప్పుడు నీ గురించి (నీకు తెలియకుండా) చాలా చెడుగా మాట్లాడారు.

a) Only a coward indulges in back biting = పిరికివాళ్ళే ఇతరుల పరోక్షంలో చెడుగా మాట్లాడుతుంటారు. (coward = కౌఅడ్ - కౌ నొక్కి పలుకుతాం = పిరికివారు)

b) He does a lot of back biting about every body = ప్రతివాడి వెనక వాళ్లకు తెలియకుండా ఎప్పుడూ చాలా చెడు అంటుంటాడు.

**3) I was backing you up =**
నిన్ను నేను సమర్థిస్తూ ఉన్నాను.

back up = మద్దతివ్వటం/ సమర్థించటం

a) Krishna always backed up the Pandavas = శ్రీకృష్ణుడెప్పుడూ పాండవులనే సమర్థించాడు.

b) If God could be seen, and if God were to come down, he would back me up. దేవుడు మనకు కనిపిస్తే, ఆయనే దిగి వస్తే, నన్నే సమర్థిస్తాడు.

c) She always backs her husband up = ఆమె ఎప్పుడూ తన భర్తనే సమర్థిస్తుంది.

b) Maoists are behind the blasting of the police station = Police station పేల్చివేత వెనుక మావిస్ట్‌ల హస్తం ఉంది.

(Maoist - correct pronunciation: మావిస్ట్; మావోఇస్ట్ కాదు.)

**5) I told them to get off my back** =
నన్ను పీడించొద్దు/ వేధించొద్దు అని వాళ్లతో చెప్పాను (నన్నొదిలెయ్యండి అని చెప్పాను.)

a) Please get off my back. I can't give you any money now =
ఇప్పుడు నన్నొదిలెయ్. నీకిప్పుడేమీ డబ్బివ్వలేను.

ఎవరైన మనకు విసుగుపుట్టేంతగా ఏదైనా అడిగినా కోపం తెప్పించినా అప్పుడు చికాకుతో అనే మాట- Please get off my back/ Get off my back.

b) Get off my back. Don't trouble me anymore with your requests =
నన్నొదిలేయండి. మీ అభ్యర్థనలతో నన్ను విసిగించకండి.

c) The tourist told the beggars to get off his back =
ఆ tourist ఆ ముష్టివాళ్లను వెళ్లిపొమ్మన్నాడు.

**6) But at the back of their mind was the feeling that they had been ignored** =
వాళ్ళను లక్ష్యపెట్టలేదన్న భావం వాళ్ళ మనసులో ఉంది.

At the back of one's mind =
ఒకరి మనస్సులో ఉన్న ఆలోచన/ కోరిక/ ఉద్దేశం, etc.

a) At the back of his mind is his desire to be elected =
తను ఎన్నికవాలనే కోరిక అతని మనసులో ఉంది.

b) His absence from the meeting is a surprise. No one knows what is at the back of his mind =
అతనివాళ సభకు రాకపోవటం ఆశ్చర్యమే. అతని (మనసులోని) ఉద్దేశం ఎవరికీ బోధపడటంలేదు.

## EXERCISE

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Delicious | A. bodily (of the body) |
| 2. explode | B. raise |
| 3. embrace | C. burst |
| 4. lift | D. hug |
| 5. physical | E. tasty |
| | F. tender |
| | G. scientific |

**KEY: 1-E 2-C 3-D 4-B 5- A.**



**ప్రశ్న:** *Could you draw a 'thumbnail sketch' of what you mean by that? Talk about the issue of displacement and rehabilitation.*

*పై వాక్యంలోని Thumb nail sketch కు- వేలి గోటితో వేసే చిత్రం- అని కాకుండా వేరే అర్థం ఏదైనా ఉందా? దీన్ని ఎలా ఉపయోగించాలి?*

***- N. Satyam Emerald, Adilabad.***

**జవాబు:** Thumb nail sketch అంటే అర్థం మీరన్నట్లు గోటితో గీసే చిత్రం అనే. అయితే Give me/ Let me have a thumb nail sketch of the person you've met లాంటి వాక్యాల్లో దీనర్థం - నువ్వు కలుసుకున్న వ్యక్తిని గురించి క్లుప్తంగా వర్ణించు అని - ఆ వ్యక్తి రూపం/ గుణగణాలు అని.

The magazine gives thumbnail sketches of the Padmasri award winners this year = ఈ సంవత్సరం పద్మశ్రీ పురస్కారాలు పొందిన వారందరి సంక్షిప్త వివరాలూ ఆ magazine లో ఉన్నాయి.

**ప్రశ్న:** *Begin, Start, Commence కు మధ్య తేడా తెలపగలరు. అలాగే lest వాడినప్పుడు should తప్పనిసరిగా వాడాలా?*

***- M Prakasa Rao, Visakhapatnam***



**జవాబు:** Begin, start, commence ఈ మూడింటికి అర్థాలు దాదాపు ఒకటే. అయితే commence పాండిత్యం - bookish and formal. మామూలు conversation లో అంతగా వాడరు. Begin, start ఒకదానిబదులు ఒకటి వాడవచ్చు దాదాపు అన్నిచోట్లా. అయితే begin కన్నా spoken English లో start వాడకమే ఎక్కువ.

- lest తర్వాత should వస్తుంది, లేకుంటే plain infinitive వస్తుంది.

a) He started early lest he should miss the train = He started early lest he miss the train. (He తర్వాత should లేకుండా miss అని plain infinitive రావటం గమనించండి.)

b) He wore a sweater lest he should catch cold = He wore a sweater lest he catch cold.

**ప్రశ్న:** *i) A book exhibition is going to be held పుస్తక ప్రదర్శన నిర్వహించబడుతుంది (Future). దీనిని A book exhibition will be held అని రాయవచ్చా?*

*ii) 'To be' ను particular గా ఎలా వాడతారు? దానిముందు వచ్చే verb ఏ tense లో ఉండాలి?*

***- S. Nagamani, Beechupally***

**జవాబు: i)** A book exhibition is going to be held; A book exhibition will be held. ఈ రెండూ future నే తెలుపుతాయి. అయితే, will be held కన్నా going to be held అనటం ఎక్కువ కచ్చితం.

An exhibition will be held = నిర్వహించబడుతుంది. (అంతకచ్చితం కాదు)

An exhibition is going to be held = నిర్వహించబడుతుంది (కచ్చితం - దీని గురించి సందేహం లేదు)

**ii)** To be ని future కు వాడటం:

a) He is going to be/ will be here in a few days (He is going to be అనేది, will be కంటే ఎక్కువ కచ్చితం)

b) The bride to be has yet to buy her saris = కాబోయే పెళ్లికూతురు తన చీరలనింకా కొనాల్సి ఉంది)

c) This is to be your diet until you are cured = నీకు నయమయ్యేవరకు ఇది నీ పథ్యంగా (రోగులు తీసుకునే పరిమిత ఆహారం) ఉండబోతుంది/ ఉండాలి.

To be ఎప్పుడూ future ను తెలుపదు. will be, shall be, would be, should be ఇవన్నీ to be కున్న కొన్ని రూపాలు- ఇవి మాత్రమే, పైన a), b) c) sentences లో తెలిపినవాటితో future ను తెలుపుతాయి. మీక్కావలసిన ఇతర వివరాలను Eenadu website లో చూడండి.

**- M. SURESAN**

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 279

# I've a lot of back log to clear

**Pradhan:** What's the time now?

**Vardhan:** Nine exactly by my watch.
(నా వాచ్ ప్రకారం తొమ్మిదయింది.)

by my watch = నా వాచ్ ప్రకారం.

**Pradhan:** Nine already! How time flies! Thanks for a well spent hour. I must rush to office. I've (I have) a lot of back log to clear. I suppose it will keep me busy till the week end.
(అప్పుడే తొమ్మిదయిందా. ఓ గంటసేపు బాగా గడిపినందుకు నీకు thanks. ఆఫీస్‌కు వెళ్లిపోవాలి. పేరుకుపోయిన పని చాలా ఉంది. అదంతా అవగొట్టాలి. దానివల్ల ఈ వారాంతం వరకు బిజీగా ఉంటానని అనుకుంటా.) well spent = బాగా గడిపిన.

to clear = అసంపూర్తిగా ఉన్నపనిని పూర్తి చేయటం.

**Vardhan:** You usually sweat it out. Why don't you take it easy for a change.
(మామూలుగా నువ్వు చాలా శ్రమపడతావు. కనీసం మార్పుకోసమైనా ఓసారికి తేలిగ్గా తీసుకోవచ్చు కదా?)

sweat it out= చెమటోడ్చి శ్రమపడటం

**Pradhan:** What do you know? The boss is always on our back; he forgets we are understaffed. If I don't clear the back log, I'll be shown the door. It's as serious as that.
(అది పూర్తయ్యేదాక మా బాస్ మా వెంటపడుతుంటాడు. మాకు సిబ్బంది తక్కువ అన్న విషయం మర్చిపోతాడు. పేరుకుపోయిన పని పూర్తిచేయకపోతే, వెళ్లిపొమ్మంటాడు. ఆ విషయం అంత సీరియస్.)

(To be) shown the door = బయటికి వెళ్లమనటం.

**Vardhan:** I thought your boss was the good sort. (మీ బాస్ మంచిరకం అనుకున్నా.)

sort = type = రకం

**Pradhan:** Good Sort! No other boss can be as nasty as he. Most of us at the office will be very glad to see the back of him.
(మంచా! ఏ బాస్ కూడా అంత దుర్మార్గుడుగా ఉండడు. మా ఆఫీస్‌లో చాలామంది అతడు వెళ్లిపోతే సంతోషిస్తారు.)

Nasty = దుర్మార్గమైన.

**Vardhan:** Perhaps your pay is good.
(మీ జీతం బాగానే ఉంటుందనుకుంటా)

**Pradhan:** Who'd grudge if the pay were as good as the work? what we get is a pittance.
(శ్రమకు తగ్గ/ పనికి సమానమైన జీతం ఉంటే ఎవరు సణుగుతారు? మేంపొందేది చాలా తక్కువ.)

pittance = చాలా తక్కువ డబ్బు. - పిటన్స్- 'పి' నొక్కి పలుకుతాం

**Vardhan:** Then demand a rise.
(పెంచమని డిమాండ్ చేయండి.)

A rise=పెంపు

**Pradhan:** We did and they conceded. But they have back tracked on their offer of a 20% rise in wages.
(మేం డిమాండ్ చేశాం. యాజమాన్యం అంగీకరించింది. కానీ 20 శాతం వేతనాల పెంపు విషయంలో వాళ్లిచ్చినమాట మీద వెనక్కి వెళ్లారు/ మాటమార్చారు)

concede (కన్‌సీడ్) = సమ్మతించటం (డిమాండ్ లాంటి వాటికి).

**Vardhan:** Why so? (ఎందుకని?)

**Pradhan:** We demanded that they raise the pay from a back date, but they wouldn't. They wanted to avoid paying us the back wages.
(మేం గతం నుంచి పెంచమన్నాం. కానీ వాళ్లు (యాజమాన్యం) అంగీకరించలేదు, గతం నుంచి పెంచినందువల్ల వచ్చే బకాయి వేతనాలు ఎగ్గొట్టటానికి)

**Vardhan:** Yea; now I remember. I read about the trouble in your company in the back number of a finance journal.
(ఆ... నాకు గుర్తొస్తోంది. మీ కంపెనీ ట్రబుల్ ను గురించి ఏదో ఆర్థిక పత్రిక పాత సంచికలో చదివాను.)

**Pradhan:** You're right. It must be the December issue of it. OK. I must be going. See you.
(నువ్వు చెప్పింది కరెక్టే. అది డిసెంబరు సంచిక అయ్యుండాలి. నేను వెళ్ళాలి. కలుస్తా)

* * *

Spoken English లో back తో వచ్చే అతిసాధారణమైన expressions ను గురించి తెలుసుకుంటున్నాం కదా.

**Now look at the following sentences from the dialogue above.**

1) I've a lot of back log to clear

2) The boss is always on our back

3) Most of us at the office will be glad to see the back of him.

4) They have back tracked on their offer

5) We demanded that they raise the pay from a back date...

6) They wanted to avoid paying us back wages.

**1) I've a lot of back log to clear =**
పేరుకుపోయిన పని పూర్తి చేయాల్సి ఉంది.
back log = (పని లాంటివి) పేరుకుపోయినవి.

a) In every LPG shop/ gas agency, there is a lot of back log, So you'd (you had) better book in advance.
(ప్రతి gas agency లోనూ ఇప్పటికే book చేసుకున్న చాలామందికి సరఫరా చేయాల్సి ఉంది. అందుకని ముందే Cylinder ను book చేసుకోవటం మంచిది. (ఇంతవరకు book చేసుకుని ఉన్నా cylinder ని ఇంకా పొందనివాళ్లు, back log ఇక్కడ))

b) The back log of applicants for the issue of licences is yet to be cleared. So I'd better apply now so that I can get the licence three months later .
(ఇంతవరకు లైసెన్స్ కోసం దరఖాస్తు పెట్టుకున్న వాళ్ల జాబితా పూర్తవలేదు. నేను ఇప్పుడే అప్లై చేస్తే మూడు నెలలకైనా వస్తుంది.)

**2) The boss is always on our back**
(మా బాస్ ఎప్పుడూ వెంటపడుతుంటాడు పని చేయించటానికి.)
be on some one's back = అదేపనిగా ఒకరి వెంటపడి పనిచేయించుకోవటం/ పోరుపెట్టడం.

a) My dad's on my back about getting married. So I am seeking a job in a distance place.
(పెళ్లి చేసుకోమని మా నాన్న ఒకటే పోరు పెడుతున్నాడు. అందుకని ఏదైనా దూర ప్రాంతంలో ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నా.)

b) She was on her husband's back about costly jewellery. He ran into debts to satisfy her.
(ఖరీదైన నగల కోసం భర్తను పోరుపెట్టేసరికి, ఆమె కోరిక తీర్చడానికి అతడు అప్పులపాలయ్యాడు.)

**3) Most of us will be glad to see the back of him.**
(అతడు వెళ్లిపోతే చూసి సంతోషించేవాళ్లు మా ఆఫీస్‌లో చాలామంది ఉన్నారు.)

glad to see the back of something/ someone=
ఒకరు వెళ్లిపోవటం/ ఒక విషయం అంతమవటం చూసి సంతోషించటం.

a) Who won't be glad to see the back of corruption.
(అవినీతి అదృశ్యమవటం ఎవరికిష్టం లేదు?)

b) Every opposition leader will be glad to see the back of ruling party.
(ప్రతీ విపక్షనేత అధికారంలో ఉన్న పార్టీ వెళ్లిపోవడాన్ని హర్షిస్తాడు.)

c) He was glad to see the back of the guest.
(అతిథి వెళ్లిపోవటం చూసి అతడు సంతోషించాడు.)

**4) They have back tracked on their offer.**
(వాళ్లిస్తామన్న మాట నిలబెట్టుకోలేదు వాళ్లు.)

Back track on offer/ promise/ word = ఇవ్వటం/ వాగ్దానం/ మాట నిలబెట్టుకోకపోవటం

a) The party has back tracked on the policy of free power for all the farmers.
(రైతులందరికీ ఉచితవిద్యుత్ విధానం మాట నిలబెట్టుకోలేదా పార్టీ/పార్టీ మాటమార్చింది/ మాట తప్పింది.)

b) He back tracked on his word of pardon.
(క్షమిస్తానని అన్నమాటను అతడు నిలబెట్టుకోలేదు.)

**5) We demanded that the raise of wages from a back date.**
(పాత తేదీ నుంచి వేతనాలు పెంచమని డిమాండ్ చేశాం.)

Back date = గతంలో ఒక రోజు/ తేదీ.

a) Raju wanted the teacher to issue him a certificate with a back date.
(పాతతేదీ వేసిన సర్టిఫికెట్ ఇవ్వమని రాజు టీచర్‌ను కోరాడు.)

b) Kumari issued a cheque carrying a back date. (కుమారి పాతతేదీతో ఉన్న చెక్‌ను ఇచ్చింది.)

**6) They wanted to avoid paying us back wages .**
(పాతతేదీ నుంచి వేతనం ఇవ్వటం ఎగ్గొట్టాలని అనుకున్నారు. back wages = (Back date నుంచి అమలైన జీతం బకాయిలు.)

a) The court struck down his removal from service and ordered the company to pay him back wages.
(అతడిని ఉద్యోగం నుంచి తొలగించటం కోర్టు కొట్టేసింది; జీతం బకాయిలను చెల్లించమంది.)

b) He spent the back wages on his daughter's marriage.
(తన జీతం బకాయిలతో కూతురి పెళ్లి చేశాడు.)

7) back number =
ఒక పత్రిక గత సంచికను back number అంటాం.

a) I came across your photo in one of the back numbers of the magazine.
(ఆ పత్రిక పాతసంచికల ఒకదాన్లో నీఫోటో చూశాను.)

b) Kumar could not get the back number of the magazine.
(మ్యాగజీన్ పాతసంచిక కుమార్‌కు ఎక్కడా దొరకలేదు.)

**Exercise**

Match the words under A with their meanings under B

| A | B |
|---|---|
| 1) Rural | A) small |
| 2) quiet | B) of villages |
| 3) harm | C) calm |
| 4) polite | D) hurt |
| 5) minute | E) simple |
| | F) courteous |
| | G) complicated |

**Key:** **1.**B; **2.**C; **3.**D; **4.**F; **5.**A.




**ప్రశ్న:** i) Shopping అనే పదం ఎలా పుట్టింది?
ii) I saw/ I did see ల్లో ఏది కరెక్టు?
iii) Miss, Mister, Mrs పదాలకు plural చెప్పండి.

**–అలిశెట్టి స్వామిదాస్, తిప్పాయపల్లి, కరీంనగర్.**

**జవాబు: i)** shop అంటే దుకాణం కదా. దుకాణం/ అంగట్లో వస్తువులు కొంటాం కాబట్టి shopping అంటాం. a) shop = దుకాణం/ అంగడి
b) shop = దుకాణంలోని వస్తువులు కొనడం.
a) I bought these things at/ in that shop = ఆ దుకాణంలో ఈ వస్తువులు కొన్నా.
b) Only when we have money we can shop = డబ్బున్నప్పుడే వస్తువులు కొనగలం.

**ii)** Miss, Mrs, Mr. - వీటికి plural పేర్లకు ముందు వాడరు. వాడకంలో లేదు. అయితే Mr కు plural Messrs అని ఉంది. కాని దీనిని M/s గా company ల పేర్ల ముందు - అది కూడా company ల పేర్లు వ్యక్తుల పేర్లుగా ఉంటేనే వాడతారు.

**eg:** M/s Gopal and Krishna, M/s Syamlal & Sons, లాంటివి. Company పేర్లు, వ్యక్తుల పేర్లలో లేనప్పుడు Messrs వాడం. **iii)** I saw, I did see - రెండూ correct. I saw (the movie last night) = నేను చూశాను. I did see (the movie...) = నేను చూశాను అని నొక్కి చెప్పటం. (నేను చూడకపోవటం ఏమిటి? కచ్చితంగా చూశాను అనే అర్థంతో)
I did see him go out = అతను బయటికి వెళ్లటం నేను చూశాను - చూడటం యదార్థం.

**ప్రశ్న:** కిందివాటికి తేడా తెలపండి.
1. Passenger - traveller
2. Attender - Attendant

**– కె. అప్పలసూరి, విశాఖపట్నం**

**జవాబు:** Traveller అన్నా passenger అన్నా తెలుగులో ప్రయాణికుడు అనే అర్థం వస్తుంది. Traveller అంటే తరచూ ప్రయాణాలు చేసేవాడు అనే అర్థంతో English లో ఎక్కువగా వాడతారు. అంతేకాకుండా మామూలుగా ప్రయాణికుడు అనే అర్థం కూడా ఉంది. Passenger అంటే ప్రయాణికుడే. అయితే ఏదైనా ప్రయాణ సాధనం (car, bus, train) లాంటి వాటిల్లో ప్రయాణికుడు అని. ఇది చాలా ముఖ్యమైన తేడా. passenger ఎప్పుడూ ప్రయాణ సాధనంలో అదీ తను drive చేయకుండా ఇంకెవరైనా drive చేసే వాహనంలో వెళ్లే వాడని అర్థం.
Passengers అందరూ travellers కానీ travellers అందరూ passengers కానక్కరలేదు కదా.

**ii)** Attendant అంటే నౌకరు. shops, parking areas (వాహనాలు నిలిపేచోట్లు-బహిరంగ ప్రదేశాల్లో) customers కు సేవలందించే వాళ్లూ, గొప్ప హోదాల్లో ఉన్నవాళ్లు, ముసలివాళ్లు వ్యక్తిగతమైన సేవలందించేవాళ్లు (దాదాపు సేవకులు) attendants.
అయితే పై అర్థంతో India లో attender అనే మాట వాడుతుంటాం. కానీ standard spoken or written English లో నౌకరు, సేవకుడు అనే అర్థాలతో attender అనే మాట వాడరు. ఒక సందర్భానికి హాజరు (attend) అయ్యేవాళ్లనే attenders అంటారు standard English లో.

**a)** She is a regular attender at these music concerts = ఈ పాట కచేరీలకు ఆమె క్రమం తప్పకుండా హాజరవుతుంది.

**b)** There wasn't any attendant to take care of the blind passenger = ఆ అంధ ప్రయాణికుడిని చూసుకోడానికెవరూ నౌకరు/ సేవకుడు లేదు. (ఎవరి సహాయం లేకుండానే ప్రయాణం చేశాడు)

**c)** Blind passengers are allowed to take an attendant free on the train = అంధ ప్రయాణికులు తమ అవసరాలను చూసుకునే వారిని రైళ్లలో ఉచితంగా తీసుకెళ్లవచ్చు .

**- M. SURESAN**

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 280

**Nisanth:** How is the cultivation going on?
(వ్యవసాయం ఎలా ఉంది? )

**Drupad:** Just getting along. Not so bad anyway.
(ఏదో అలా జరిగిపోతోంది. ఫర్వాలేదు.)

**Nisanth:** How far has the ploughing gone?
(దున్నటం ఎంతవరకు అయింది? )

plough = ప్లవ్ = దున్నటం/ నాగలి

**Drupad:** A few more acres remain. We must put our back into it and finish it in a day or two.
(మరికొన్ని ఎకరాలు ఉన్నాయి. ఎలాగో కష్ట పడైనా ఒకటి రెండు రోజుల్లో పూర్తి చేయాలి.)

**Nisanth:** Yea. That's true. So budget or no budget, prices can go up if the government so wants it.
(అవును. నిజమే. ప్రభుత్వం ధరలు పెంచాల నుకుంటే, బడ్జెట్‌తో సంబంధం లేదు)

**Drupad:** But some how I am sure that the government may not raise taxes. A number of states are going to the polls soon.
(కాని ఈసారి ప్రభుత్వం పన్నులు పెంచదని నేను గట్టిగా నమ్ముతున్నాను. చాలా రాష్ట్రాల్లో ఎన్నికలు జరగబోతున్నాయి.)

Going to polls = ఎన్నికలు జరగటం/ ఎన్నికల్లో పాల్గొనటం

**Nisanth:** Which party do you think will win?
(ఏ పార్టీ గెలుస్తుందనుకుంటున్నావు)

**Drupad:** Any doubt that the ruling party will win? I am sure it's going to.

**b)** I know Vijayawada like the back of my hand.
(నాకు విజయవాడ చాలా బాగా/ పూర్తిగా తెలుసు.)

**c)** He knows Physics like the back of his hand.
(అతడికి ఫిజిక్స్ క్షుణ్నంగా తెలుసు.)

**3) Back door increase in taxes** = దొడ్డిదారిన/ పరోక్షంగా పన్నుల పెంపు.

**a)** The government has started back door increase in taxes.
(ప్రభుత్వం దొడ్డిదారిన పన్నుపెంచటం ప్రారంభిం చింది.(బడ్జెట్ ద్వారా కాకుండా.) )

back door = దొడ్డిదారిన/ పరోక్షంగా/ దొంగత నంగా/ మోసంతో.

**a)** His father works at the office. So he got the job through the back door.



# You are backing the wrong horse

**Nisanth:** My tractor has broken down and the puddle wheels are too rusty. They have to be replaced.
(నా ట్రాక్టర్ చెడిపోయింది. దాని దమ్ము చక్రాలు బాగా తుప్పుపట్టి పోయాయి. వాటిని మార్చాలి.)

puddle = రోడ్లు, ఇతరచోట్ల నీళ్లు, ముఖ్యంగా వర్షం నీళ్లు నిలిచే గుంటలు.

puddle wheels = ట్రాక్టర్ వెనక పొలం దున్నటానికి తగిలించే దమ్ము చక్రాలు

**Drupad:** Is it a major or minor trouble? I mean your tractor.
(నీ ట్రాక్టర్‌కు వచ్చిన సమస్య, పెద్దదా, చిన్నదా? )

major = పెద్ద/ ఎక్కువైన,

minor = స్వల్పమైన/ చిన్నదైన

**Nisanth:** I'm afraid it's major. My mechanic is just useless. Can you suggest a good one?
(అది major trouble అనే నా భయం/ అను మానం. నా మెకానిక్ లాభం లేదు. మంచి మెకానిక్‌ను ఎవరినైనా చెప్పగలవా? )

**Drupad:** Call my mechanic. He knows tractors of any make like the back of his hand.
(నా మెకానిక్‌ను పిలువు. అతడికి ఏ రకమైన ట్రాక్టరైనా చాలా బాగా తెలుసు.)

of any make = ఏ కంపెనీ తయారీ అయినా/ ఏ model అయినా)

**Nisanth:** I've used my tractor too long. I think I'd better sell it off and buy a new one.
(నా ట్రాక్టర్‌ను మరీ ఎక్కువకాలం వాడాను. దాన్ని అమ్మేసి కొత్తది కొనుక్కోవడం మంచి దేమో? )

**Drupad:** Do it before the budget is out this month end. The fear is motor vehicles and motor spares may be taxed higher than now.
(ఈ నెలాఖరులో బడ్జెట్ వచ్చే ముందే కొనెయ్. మోటారు వాహనాలూ, విడిభాగాల మీద ఇప్పటికన్నా ఎక్కువ పన్ను విధించవ చ్చనే భయం ఉంది.)

Spares/ spare parts = విడిభాగాలు

**Nisanth:** Of late the government has started back door increase in taxes, by taxing the raw material.
(ముడి సరుకుల మీద పన్ను వేయటం ద్వారా ఈ మధ్య ప్రభుత్వం దొడ్డి దారిన పన్నులు పెంచటం మొదలుపెట్టింది.)

raw material = ముడి సరకు.

**Drupad:** And some times by a mid year rise in tax.
(మరికొన్నిసార్లు సంవత్సరం మధ్య పన్ను పెంచటం ద్వారా)

(అధికారంలో ఉన్న పార్టీ గెలుస్తుందనే విషయంలో నీకేమన్నా సందేహమా? అది గెలుస్తుందని నేను గట్టిగా నమ్ముతున్నాను.)

**Nisanth:** You are backing the wrong horse, friend. The main opposition will be back in power in most of the states.
(నువ్వు ఓడిపోయే పార్టీని సపోర్ట్ చేస్తు న్నావు. ప్రధాన ప్రతిపక్షం చాలారాష్ట్రాల్లో తిరిగి అధికారంలోకి వస్తుంది.)

**Drupad:** OK, Let's see. (చూద్దాం)

✪ ✪ ✪

Real life situations లో spoken English లో back తో వచ్చే మరికొన్ని expressions చూద్దాం. ఇలాంటి expressions వాడటం వల్ల, ఎక్కువ పెద్దమాటలు వాడేచోట, ఈ సాధారణమైన (back లాంటి) మాటలు వాడితే, మన conversation సరళంగా, సహజంగా ఉంటుంది.

**Look at the following expressions from the dialogue above.**

**1)** We must put our back into it and finish it in a day or two.

**2)** He knows tractors of any make like the back of his hand.

**3)** Of late the government has started back door increase in taxes.

**4)** You are backing the wrong horse.

**The expressions in the sentences above are:**

**1)** put our back into it.

**2)** knows tractors like the back of his hand.

**3)** back door increase in taxes.

**4)** backing the wrong horse.

**1) put our back into it.**
(ఒక పనిచేయటానికి (మనం) ఎంతయినా శ్రమపడటం.)

**a)** We must put our back into it and finish it in a day or two.
(మేం ఎంతైనా శ్రమపడి ఒకటి రెండు రోజుల్లో దాన్ని పూర్తి చేయాలి.)

**b)** If the government really puts its back into it, total literacy is not impossible.
(ప్రభుత్వం నిజంగా శ్రమిస్తే/ కష్టపడితే పూర్తి అక్షరాస్యత అసాధ్యం కాదు.)

**c)** If only you put your back into it, you can really achieve it.
(నువ్వేగనక నిజంగా శ్రమపడితే, సాధించగలవు.)

**d)** Put your back into and nothing is impossible.
(ఎంతైనా శ్రమపడితే ఏదీ అసాధ్యంకాదు.)

**2) Know (some thing/ somebody) like the back of one's hand** = ఒక విషయం బాగా/ పూర్తిగా తెలిసుండటం (కరతలామలకం).

**a)** He knows tractors of any make like the back of his hand.
(ఎలాంటి ట్రాక్టర్లయినా అతడికి బాగా/ పూర్తిగా/ క్షుణ్నంగా తెలుసు.)

అతడి తండ్రి అదే ఆఫీస్‌లో పనిచేస్తాడు. అందువల్ల అతనక్కడ ఉద్యోగం పొందాడు (అంటే ప్రతిభ వల్ల కాకుండా వాళ్ల తండ్రి పలుకుబడివల్ల)

**b)** He is trying back door methods to get the contract.
(ఆ కాంట్రాక్ట్‌ను మోసంగా/ దొడ్డిదారినైనా పొందటా నికి ప్రయత్నిస్తున్నాడు.)

**c)** I don't advise back door methods. Let's go according to rules.
(దొంగ పద్ధతులు/ దొడ్డిదారి పద్ధతులు నా సలహా కాదు (వాటికి నేను విరుద్ధం). నిబంధనల ప్రకారం వెళ్దాం.)

**4) Backing the wrong horse =** ఓడిపోతున్నవాళ్లకు/ గెలుపు అవకాశంలేని విషయా నికి మద్దతివ్వడం.

**a)** Those who supported the NDA in the last general elections were backing the wrong horse.
(గత ఎన్నికల్లో ఎన్డీయేకు మద్దతిచ్చిన వాళ్లు, ఓడిపోయే పార్టీకి మద్దతిచ్చారు.

**b)** America backed the wrong horse in Korea.
(అమెరికా కొరియాలో గెలుపు అవకాశంలేని వర్గాన్ని సమర్థించింది.)

**c)** Expecting Indian movies to be without obscenity is backing the wrong horse.
(అశ్లీలతలేని భారతీయ సినిమాలు ఉంటాయనుకోవడం సరికాదు/ జరగని పని. (అలాంటి సినిమాలు రావు.))

(Backing the wrong horse అనేది గుర్రప్పందాల నుంచి వచ్చింది. ఓడిపోయే గుర్రంమీద పణం పెట్టడం అని అర్థం.)

**ప్రశ్న:**

*i.* వార్తలు అంటే న్యూస్ కదా. *News* కు *singular* ఏమిటి?

*ii.* వర్మ స్పెల్లింగ్‌ను *varma* అని కాకుండా *Verma* అని రాస్తారెందుకు?

*– అలిశెట్టి స్వామిదాస్, తిప్పాయపల్లి, కరీంనగర్ జిల్లా.*

**జవాబు:**

**i.** News, చివర 's' ఉండటం వల్ల plural అనుకుంటాం- కాని English లో news ఎప్పుడూ singular, దానికి plural లేదు. అయినా దానిముందు a/ an రాదు.



**a)** I have news for you / important news for you.

**b)** This is good news / This news is good.

**ii.** వర్మ అనేది Indian name కదా. కాబట్టి ఉచ్చార ణను బట్టి ఏ spelling అయినా వాడవచ్చు.

**ప్రశ్న:**

*Below - beneath - under.*

*on - over - above* భేదాలను వివరించండి.

*– వి. గణేష్, విశాఖపట్నం.*

**జవాబు:**

Below = beneath = underneath

There are, however some differences in the use of these words.

Below = at a lower level place than somebody or some thing; lower in rank, status or position.

a) We can see the fish swimming below the surface of water.

b) A constable is below a sub inspector

c) The window is below the ceiling

Beneath means immediately under (covered up)

a) His body lay beneath a heap of stones

b) Beneath the book lay a Rs. 1000/- note.

Difference between below and beneath:

below: at lower level anywhere.

beneath: Immediately/ just under.

a) Hanging on the wall was a picture below a map = The picture could be any where below the map.

b) The map lay beneath a newspaper = The newspaper was just above/ covering the map.

underneath = almost the same as beneath = Immediately under/ below something when it car or hides it.

a) The ball rolled underneath the standing car = The car covered the ball under it.

b) He was wearing a shirt underneath the sweater.

under = below something.

a) They sat under a tree. (Physical position)

b) The country is under UPA rule now and the state, under congress rule = under the control of.

under = below, when we say, 'It may cost under Rs. 10000/- or below Rs. 10,000/-

ii) On = just above something.

a) The book is on the table. (The table supports the book.)

b) over = anywhere above, some height above.

a) He jumped over the wall.

'over' also means, above in amount, height, age, etc.

b) He is over 6' tall

c) The bridge is five feet above the water level.

d) He is over 60 years in age.

*- M. SURESAN*

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 281

**Bharat:** (Have you) heard of the hot news?
(తాజా, ఆసక్తికరమైన వార్త విన్నావా? )

**Bhavan:** (Do) you mean the government's attempt to gag the media? Thank God, before matters became too hot, the government cancelled the order.
(నువ్వనడం, మీడియా నోరునొక్కేయడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నమే కదా? విషయం మరీ తీవ్రమయ్యేముందే ప్రభుత్వం తన ఉత్తర్వు రద్దుచేసింది)

gag= అరవటానికి వీల్లేకుండా నోట్లో గుడ్డలుకుక్కటం

**Bhavan:** We are fortunate. Democracy is still safe. OK. I've to go now. I've back breaking work. I have to attend to it.
(మనం నిజంగా అదృష్టవంతులమే. ప్రజాస్వామ్యం పదిలం. సరే. నే వెళ్లాలి. నాకు నడ్డివిరిగేంత పని ఉంది. అది చూడాలి.)

**Bharat:** OK, then. Bye.

☺ ☺ ☺ ☺ ☺

Conversation లో back తో వచ్చే expressions మరి కొన్ని చూద్దాం. ఇవన్నీ కూడా సరియైన సందర్భాల్లో వాడితే, సందర్భాన్ని బట్టి అవతలి వాళ్లకు చాలా సులభమై, communication సులభమవుతుంది.

**Look at the following expressions from the conversation above.**

1) He is only a back bencher in the party, as he was at school and college.
2) The government has backed off.
3) It had found it had its back to the wall.
4) The people would have turned their back on the ruling party.
5) Its plan to muzzle the press, it realized, would back fire.

# The government has backed off

**Bharat:** That's very bad. That the government could even think of it is really shocking.
(అది దారుణం. అసలు ప్రభుత్వం ఆ విధంగా ఆలోచించడమే చాలా దిగ్భ్రాంతి కలిగించేదిగా ఉంది)

**Bhavan:** Our former classmate Aravind is a member of the ruling party. Shall we ask his opinion of it? Shall I call him?
(మన classmate అరవింద్ అధికార party సభ్యుడే కదా? వాడి అభిప్రాయం అడుగుదామా? phone చేయనా? )

**Bharat:** Save yourself the trouble. What can he say? He is only a back bencher in the party, just as he was at school and college. Who cares what he thinks?
(అంత శ్రమపడక్కర్లేదు నువ్వు. వాడేం చెప్పగలడు? వాడు party లో ప్రాధాన్యం లేనివాడు. School, college లో కూడా పెద్ద చురుకైన విద్యార్థి కాదుకదా? )

**Bhavan:** The government backed off. That's a big relief. Otherwise the government would have been guilty of a black law.
(ప్రభుత్వం వెనక్కు తగ్గింది. అది పెద్ద ఊరట. లేకపోతే హానికరమైన చట్టాన్ని చేసిన దోషిగా ప్రభుత్వం నిలబడేదే.)

black law = ప్రజలకు చాలా హానికరమైన చట్టం/ దుర్మార్గపు చట్టం

**Bharat:** The government had no choice. It had found that it had its back to the wall.
(ప్రభుత్వానికి ఇంకేం మార్గం లేకపోయింది. ప్రత్యామ్నాయం ఏం కనిపించలేదు.)

**Bhavan:** Its plan to muzzle the media, it realized, would back fire. It thought better of it and cancelled the order.
(మీడియా నోరునొక్కేసే తన పథకం వల్ల తనకే దెబ్బని ప్రభుత్వానికి తెలిసొచ్చింది. కాస్త ఆలోచించి ఉత్తర్వును రద్దుచేసుకుంది)

muzzle = నోరునొక్కేయటం (మాట్లాడకుండా)

muzzle కు ఇతర అర్థాలు. 1) కుక్కలు, గుర్రాలు లాంటి జంతువుల నోరూ, ముక్కు రంధ్రాలూ కలిపి; 2) కుక్కలు లాంటివి కరవకుండా, వాటిమూతికి బిగించే cover.

**Bharat:** If it had gone ahead with the order, the people would have turned their back on the ruling party.
(ప్రభుత్వమే గనుక ఆ ఉత్తర్వును అమలు పరచటంలో ముందుకెళ్ళుంటే ప్రజలు అధికార పార్టీకి విముఖులయ్యే వాళ్లే)

The expressions with 'back' are:

1) back bencher
2) back off
3) found it had its back to the wall
4) Turn their back on.
5) back fire

**1) Back bencher** = (school/ college లాంటి విద్యా సంస్థల్లో) చదువులో అంత ఆసక్తిలేనివాడు. (వెనుక benches లో కూచునేవారు). రాజకీయాల్లో అంత ప్రాముఖ్యంలేని సాదాసీదా సభ్యులు.

**a)** Though a back bencher at school he excelled in studies at college = school లో చదువు పట్ల అంత ఆసక్తి లేకపోయినప్పటికీ, college లో మాత్రం చదువులో బాగా రాణించాడు.

excel = (ఏదైనా రంగంలో/ కార్యాకలాపాల్లో) రాణించటం.

she excels at music and art = సంగీతంలో కళల్లో ఆమె రాణిస్తోంది.

excel తర్వాత in గానీ, at గానీ వస్తుంది.

Excel కు సంబంధించిందే excellent.

**b)** He is a back bencher in the party. Nobody consults him on any matter = అతను పార్టీలో అంత ప్రముఖుడుకాదు. ఎవరూ అతన్ని ఏ విషయంలోనూ సంప్రదించరు.

**2) back off** = వ్యతిరేకతకు, ఎదుటివాళ్లకు భయపడి వెనక్కు తగ్గటం/ ఎదురుపడి పోరాడేందుకు భయపడటం.

**a)** The government has backed off from the confrontation: ముఖాముఖి పోరాటం నుంచి/ వ్యతిరేకతను ఎదుర్కోలేక, ప్రభుత్వం వెనక్కు తగ్గింది.

Confrontation = కాన్‌ఫ్రంటేయ్‌షన్- 'కా', 'టే య్' నొక్కి పలుకుతాం.

అర్థం = సమస్యలను/ శత్రువులను ఎదుర్కోవటం, ముఖాముఖి పోరాడటం.

**b)** I never expected him to back off from the fight = పోరు నుంచి వెనక్కు తగ్గుతాడని నేననుకోలేదు.

**3) Have (some one's) back to the wall** = చాలా క్లిష్టమైన పరిస్థితిలో మనకు నచ్చని నిర్ణయం తప్పనిసరిగా తీసుకోవాల్సిన పరిస్థితి/ ప్రత్యామ్నాయం లేకపోవటం.

**a)** When the corruption charges were proved against him, he had his back to the wall and resigned his job = అతనిపై అవినీతి ఆరోపణలు రుజువైనపుడు, ఏం ప్రత్యామ్నాయం లేక రాజీనామా ఇచ్చాడు.

corruption = అవినీతి,
charges = ఆరోపణలు

**b)** Confronted by the photographs, the murderer had his back to the wall and confessed to the murder = photographs తో నిలదీసినపుడు, హంతకుడు ఇంకేం ప్రత్యామ్నాయం లేక హత్య చేసినట్టు చెప్పేశాడు.

confess= చేసినతప్పు ఒప్పుకోవటం.

confront = ఎదుర్కోవటం/ నిలదీయటం.

**4) Turn one's back on** = వెనుతిరగటం/ తిరస్కరించటం/ వ్యతిరేకించటం/ విముఖత చూపటం.

**a)** Her friends turned their back on her because of her conceit = ఆమె గర్వం వల్ల స్నేహితులందరూ ఆమెకు వ్యతిరేకమయ్యారు.

**b)** The people turned their back on the TDP Government because of its indifference to farmers = రైతులపట్ల నిర్లక్ష్యం వల్ల ప్రజలు TDP కి వ్యతిరేకమయ్యారు.

**5) back fire** = (పథకం లాంటివి) తలకిందులవటం/ తిప్పికొట్టడం. పథకం వేసిన వాళ్లకే హాని కలగడం

**a)** Pak support of terrorism has back fired with the terrorists attacking Pak targets = ఉగ్రవాదులు పాకిస్తాన్‌లో లక్ష్యాలను ధ్వంసం చేయటంతో, ఉగ్రవాదులకు పాక్ మద్దతు తిప్పికొట్టింది.

---

**ప్రశ్న:**

*Please let me know the difference between reminisce, recollect and recount.*

***- B Apparao, Vizag***

**జవాబు:**

i) Reminisce = To think, talk or write about the happy or pleasant things of the past.

a) As we entered our college years after we has left it we reminisced about our student days there.

b) He reminisced about a pleasant week that he had at the small village.

ii) Recollect : Remember something, especially by trying to remember it/ by making an effort to remember it.

a) Try as he might he was unable to recollect what happened on the day of the accident.




b) I recollect everything of what he said on the day of the incident.

Recollect is rather old fashioned and formal and not much in use in modern English. It is not used either in am + ing/ is + ing/ are + ing form.

iii) Recount = narrate/ describe an incident/ an experience.

a) She recounted to the police what she had seen at the accident spot (= She told the police)

b) he recounted in detail his experience of the space travel.




**ప్రశ్న:**

*Big - large, high - huge. వీటి మధ్య తేడాల గురించి వివరించగలరు.*

***– వి. వెంకటరావు, సీతమ్మధార, విశాఖపట్నం.***

**జవాబు:**

i) big, large, huge తో high కు అంత సంబంధం లేదు కదా, చాలా తక్కువ సందర్భాల్లో తప్ప. Big, large, huge కీ high కీ తేడా చాలామటుకు clear.

big - పరిమాణంలో (size) పెద్దదైన. Large, huge కి కూడా ఇదే అర్థం ఉంది. అయితే Spoken English లో పెద్ద అనే అర్థంతో ఎక్కువగా big వాడతారు - large, huge తక్కువ వాడరు. రెండోది, మనుషులను గురించి మాట్లాడేటప్పుడు ఎప్పుడూ large, huge వాడం. Big అనే అంటాం - పెద్ద size/ వయసున్న వాళ్లను. మామూలుగా పెద్దగా ఉన్న అనటానికి big వాడటం correct, large సరికాదు. Large వాడకం formal written English లోనే ఎక్కువ. Huge అంటే చాలా, చాలా పెద్ద అని. Big, large అన్నప్పుడు పెద్ద అనుకుంటే, huge అంటే బాగా ఎక్కువ పెద్దదైన అనే అర్థం వస్తుంది. జీవులు (మనుషులు/ జంతువులు) పెద్దవైనవన్నీ big. అవే formal English లో జంతువులైతే large. (large man/ large woman అనం). వీటికి మించి ఇంకా పెద్దయితే huge. అయితే అప్పుడప్పుడు large family, large numbers అంటాం. Big man, big boy, big smile, big/ large animal అంటాం.

Huge crowd, huge amount of money, huge debts, huge success, etc.

Large eyes వాడతాం.

**ప్రశ్న:**

*I used to I, WE, SHE, THEY, WE, ANY NAME AND ANY RELATIONSHIP in all tenses instead of my friend. But how could I get in simple present tense (present indefinite). Please give me one example in simple present tense.*

***- Keerthana Kusuma e-mail.***

**జవాబు:**

It's only in the present indefinite (simple present) tense that the form of the verb used for the subjects I, We, You and they is different from the form of the verb for he, (my friend, Gopal, My brother) She, (my sister, my classmate, my mother) and it (the book, the pen) etc.

I, We, You and They } Write

He (my friend), She (my sister), It (the pen) } Writes

You add '-s' or '-es' to the verb form for he, she and its.

With not and in questions in the present simple tense, we use do for I, we, you & they, and does for he, she, it, when 'does' is used we don't add 's'/ '-es' to the verb.

eg: 1) She sings well
She does not sing well.
2) He teaches well
He does not teach well

**- M. SURESAN**

# WE CALL OUR COUNTRY

SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 282



**Prahlad:** You were talking about some book yesterday. What is it called?

(నిన్నేదో పుస్తకం గురించి మాట్లాడావు. దాని పేరేంటి?)

**Bhagat:** (Do) you mean the fat book with yellow covers? It's Mathematics Made Easy by prof Ganith. A very useful book really.

(పసుపు అట్టా ఉన్న లావు పుస్తకం గురించేనా నువ్వు మాట్లాడేది? అది Prof (Professor) Ganith రాసిన Mathematics Made Easy. చాలా ఉపయోగకరమైన పుస్తకం)

Made Easy = ఏదైనా సబ్జెక్టును సులభంగా వివరించే పుస్తకానికి ఇలాంటి పేరు పెడతారు.

Maths Made Easy, Physics Made Easy.

Made Easy = సులువుగా చేసిన

**Prahlad:** How about lending it to me for a few days?

(కొన్నిరోజులు నాకు ఆ పుస్తకాన్ని అరువివ్వవా?)

lend= అరువు/ అప్పు ఇవ్వటం.

**Bhagat:** Call me tomorrow evening about this time. I'll let you know If I am done with it and if I can give it to you.

(రేపు ఈసమయానికి నాకు ఫోన్‌చెయ్యి. నేను నీకప్పుడు చెబుతాను, నాకు దాంతోపని యిపోయిందా లేదా అని, దాన్ని నీకివ్వగలనా లేదా అని)

If I am done with it - be done with something = ఒక విషయం పూర్తవటం/ దేనితో అయినా పనిపూర్తవ్వటం ఇంకదాని అవసరం లేకపోవటం.

**Prahlad:** How long can I keep it?

(నేనెంతకాలం ఉంచుకోవచ్చు దాన్ని)

**Bhagat:** Call me back in a week. You can keep it as long as that.

(ఒకవారం తర్వాత తిరిగి ఫోన్ చెయ్.)

**Prahlad:** Is the book really good?

(ఆ పుస్తకం నిజంగా గొప్పదా/ బావుందా?)

**Bhagat:** It's really good. Some of the difficult problems have been worked out very clearly. Our lecturer's teaching isn't as good as that.

(నిజంగా బాగుంది. కొన్ని కష్టమైన లెక్కలు చాలా వివరంగా వివరించి ఉన్నాయి. మన లెక్చరర్ టీచింగ్ దీనంత బాగుండదు.)

**Prahlad:** He calls himself a great teacher, but his explanations are as clear as mud.

(ఆయన తనేదో గొప్ప టీచర్ నంటాడు. కాని ఆయన వివరణ అర్థం చేసుకోవటం చాలా కష్టం.)

As clear as mud = అర్థంచేసుకోవటం కష్టం.

His jokes are as clear as mud.

(అతడి జోక్స్ అర్థంకావు - అంటే నవ్వు పుట్టించవు అని.)

**Bhagat:** Wasn't there a call for a boycott of his classes, because he called students names?

(విద్యార్థులను తిట్టినందుకు నిరసనగా ఆయన క్లాస్‌ల బహిష్కరణకు విద్యార్థులు పిలుపు ఇచ్చారు కదా?)

Boycott = నిరసగా ఓ వ్యక్తిని గానీ/ ఓ పనిని కానీ బహిష్కరించటం)

**Prahlad:** That's true, but they called it off when he told them that he didn't mean to insult them.

(నిజమే కానీ, విద్యార్థులను అవమానించే ఉద్దేశం తనకు లేదని ఆయన చెప్పటంతో, వాళ్లుదాన్ని ఉపసంహరించుకున్నారు. రద్దుచేసుకున్నారు.)

**Bhagat:** Teaching really calls for a lot of patience. Impatience and teaching do not go together. it calls for a lot of preparation too.

(Teaching కు ఓర్పు చాలా అవసరం. ఓర్పులేమీ, బోధన ఈ రెండూ ఒక దానితో ఒకటి పొసగవు. ఇంకా టీచింగ్‌కు preparation -ముందుగా తయారవటం అవసరం)

**Prahlad:** It does, of course. Any idea of becoming a teacher?

(అది నిజమే. నీకేమన్నా టీచర్ అయ్యే ఉద్దేశ్యం ఉందా?)

**Bhagat:** I don't think I can make a good teacher. I don't want to hear cat calls and whistles in my class.

(నేను టీచర్‌గా పనికి రాననుకుంటున్నాను. classay పిల్లికూతలూ, ఈలలూ వినాలని అనుకోవటంలేదు.)

**Prahlad:** Bye then, see you (వస్తా)

☆ ☆ ☆

Call అనేది English లో సర్వసాధారణమైన మాట. అయితే వాడే సందర్భాన్ని బట్టి, దాంతో కలిపే ఇతర మాటలను బట్టి, Call ఉపయోగం English లో చాలా ఎక్కువ. ఇది Simple Spoken English లో చాలా ప్రముఖమైన మాట. Daily real life situations లో దీని వాడకం చాలా ఎక్కువ. ఇప్పుడు call ను గురించి కొన్ని విషయాలు తెలుసుకుందాం.

**1)** Call అంటే మనందరికీ బాగా తెలిసిన అర్థం - పిలవటం.

**a)** Please call the bearer.

కాస్త bearer ను పిలవండి. (మామూలుగా రెస్టారెంట్స్‌లో server అని తప్పుగా పిలిచే ఆహార పానీయాలందించే వారు - bearer. బెయర్)

**b)** The teacher called me to tell me to study well.

(బాగా చదవమని చెప్పటానికి నన్ను పిలిచాడు.)

**2)** Call అంటే పేరు పెట్టి పిలవటం కూడా కదా?

**a)** We call our Country India.

(మనం మన దేశాన్ని భారత్ అని పిలుస్తాం/ అంటాం)

**b)** They call their new born child Anand.

(వాళ్లకు పుట్టిన బిడ్డను ఆనంద్ అని పిలుస్తారు/ అతడికి ఆనంద్ అని పేరు పెట్టారు.)

**c)** We call Gandhi a Mahatma.

(గాంధీని మహాత్ముడని పిలుస్తాం/ అంటాం.)

**Important:** Call తర్వాత as రాదు.

**d)** She called him a fool. (She called him as a fool కాదు)

English లో Passive form of call 'be called ఉపయోగం చాలా ఎక్కువ. (be బదులు, ఏ be form అయినా వాడవచ్చు - am, is, are, shall be, has been, etc)

**a)** Gandhi is called Mahatma - ఇక్కడ is called passive form లో ఉండటం గమనించండి - గాంధీ మహాత్ముడని పిలువబడతాడు - మామూలు తెలుగు -గాంధీని మహాత్ముడంటారు. ఇక్కడ కూడా is called తర్వాత 'as' వాడం.

**b)** Now that she is married to Mr.Sinha, she will be called Mrs.Sinha from now on.

(సిన్హాతో పెళ్లయింది కదా ఆమెకు ఇప్పటి నుంచి ఆమె Mrs. Sinha అని పిలవబడుతుంది. Mrs. Sinha అని పిలుస్తారు.)

**3)** ఇక call కు మామూలుగా ఉన్న ఇంకో అర్థం, ఫోన్ చేయటం.

**a)** I called your home but there was no response.

(మీ ఇంటికి ఫోన్ చేశాను. స్పందనలేదు.)

**b)** I'll call you back.

(నీకు మళ్లీ/తిరిగి ఫోన్ చేస్తాను.)

వీటికి తోడు callకు ఉన్న మరికొన్ని ఉపయోగాలు చూద్దాం.

**Look at the following Sentences from the dialogue at the beginning of the lesson:**

1) What is it (the book) called?
(ఆ పుస్తకం పేరేంటి?)

2) Call me tomorrow evening.
(రేపు నాకు ఫోన్ చెయ్.)

3) Call me back in a week.
(వారం తర్వాత మళ్లీ నాకు ఫోన్ చెయ్.)

4) He calls himself a great teacher.
(ఆయన తనెంతో గొప్ప టీచర్‌అని చెప్పుకుంటాడు.)

5) Wasn't there a call for the boycott of his classes.
(ఆయన class ల బహిష్కరణకు పిలుపిచ్చారు కదా/ పిలుపు వచ్చింది కదా?)

6) ... because he called students, names.
(విద్యార్థులను దుర్భాషలాడినందుకు గాను.)

7) But they called it off when he told them ...
(కానీ వాళ్లు దాన్ని ఉపసంహరించుకున్నారు/ రద్దు చేసుకున్నారు.)

8) Teaching really calls for a lot of patience and preparation.
(టీచింగ్‌కు చాలా ఓర్పు, ప్రిపరేషన్ అవసరం.)

What is it called, Call me tomorrow, Call me back in a week = వీటి అర్థాలు మనకు తెలుసు. ఇప్పుడు వీటిని చూడండి.

**4)** He calls himself a great teacher.

(తనేదో గొప్ప టీచర్‌నని చెప్పుకుంటాడు. ఇక్కడ Call అంటే అర్థం, చెప్పుకోవటం.)

**a)** They call him a great Cricketer, but he is not in form now.

(అతడిని వాళ్లు గొప్ప క్రికెటర్ అంటారు/అని అనుకుంటారు, కానీ అతడిప్పుడు బాగా ఆడే పరిస్థితిలో లేడు.)

**b)** They call you a gentleman, but is this how you behave?

(అందరు నువ్వేదో పెద్దమనిషివంటారు, ఇలానా నువ్వు ప్రవర్తించేది?)

**5)** Wasn't there a call for a boycott...

-ఇక్కడ call కు అర్థం, ఏదైనా చర్యకు పిలుపు అని.

**a)** The Mahatma gave a call for non cooperation.

(సహాయనిరాకరణకు మహాత్మాగాంధీ పిలుపిచ్చారు.)

**b)** The Workers' Union gave a call for tool down strike.

(పనిముట్లు వదిలి సమ్మెకు దిగాలని కార్మికసంఘం పిలుపిచ్చింది.)

**C)** The Maoists' call for a bandh got no response.

(మావోయిస్టుల బంద్ పిలుపునకు స్పందనలేదు.)

**6)** ... because he called students names

- Call (someone) names అంటే ఒకరిని దూషించటం, దుర్భాషలాడ్డం అని. (Idiot, fool, scoundrel, rogue లాంటి మాటలతో తిట్టటం)

**a)** He is good at calling names.

(ఇతరులను తిట్టటంలో వాడు గొప్ప)

**b)** Unable to bear her husband's ill treatment she called him names.

(భర్త వేధింపులు తాళలేక ఆమె అతడిని దూషించింది.)

**7)** But they called off...

Call off = ఉపసంహరించుకోటం/రద్దు చేయటం.

a) The Umpires decided to call off the match because of poor light.

(సరైన వెలుతురు లేనందువల్ల Umpires, match ను రద్దు చేయటానికి నిర్ణయించారు.)

b) The Workers' Union Called off the strike.

(కార్మిక సంఘం సమ్మెను విరమించింది, ఉపసంహరించుకుంది.)

8) Teaching Calls for a lot of patience = Call for = అవసరమవటం.

a) Medicine Calls for Patience.

(వైద్య వృత్తికి ఓర్పు అవసరం)

b) Designing a bridge like that Calls off careful Planning and ingenuity.

(అలాంటి వంతెన రూపకల్పనకు సరైన పథకం, కొత్త పద్ధతులు, కొత్త విధానాలు ఆలోచించగల శక్తి అవసరం.)

Ingenuity - ఇన్‌జెన్‌'యూఅటి: 'యూ' నొక్కి పలుకుతాం. 'ఇ' కొంచెం తక్కువ నొక్కి పలుకుతాం. అర్థం = మేధస్సుతో కొత్తగా ఆలోచించగలగడం, సమస్యలకు, కొత్త పరిష్కారాలు కనుక్కోవటం.)

Ingenuousness- ఇది వేరే. ఏం అరమరికలు లేకుండా మనస్సులో ఉన్నదున్నట్లు frank గా చెప్పే తత్వం).

**Exercise: Match the following:**

| A | B |
|---|---|
| 1. barefoot | A) Broken |
| 2. abundant | B) very much |
| 3. cracked | C) provoke |
| 4. extremely | D) stress |
| 5. irritate | E) Shoeless |
| | F) Plenty |

**Key:** 1) F 2) E 3) A 4)B 5) C



**ప్రశ్న:**

*No, Not ఉపయోగాలు వివరించండి.*

*There is not a cat on the table. There is no cat on the table. ఈ రెండు వాక్యాల్లో ఏది కరెక్ట్?*

*– సి.హెచ్. వెంకటేశం, జడ్చర్ల.*

**జవాబు:**

There is not a cat on the table, There is no cat on the table - రెండూ correct. అయితే Spoken English లో not పూర్తిగా అనకుండా, There isn't a cat on the table అనిగానీ, అంత కంటే మెరుగ్గా There isn't any cat on the table అనిగానీ అంటాం. There is no cat on the table కాస్త formal.

**- M. SURESAN**

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 283




**Ooha:** Hi Satya, you promised to call me back yesterday. I waited and waited but had no call from you.
(నువ్వు నాకు మళ్లీ phone చేస్తానని మాటిచ్చావు నిన్న. ఎంతసేపు కాచుక్కూచున్నానో, నాకు నీ నుంచి phone మాత్రం లేదు.)

**Satya:** I thought I'd call at your place instead of making a call. I couldn't, as my brother who was with me was in a hurry. So I decided to call back when I reached home, but after I was home I clean forgot about it.

**Ooha:** Let's give a call and find out.
(Phone చేసి కనుక్కుందాం.)

**Satya:** I don't think she'll come. Her father isn't well. Just yesterday they called in the doctor. Hope it isn't serious.
(తను వస్తుందని నేననుకోవటం లేదు. వాళ్ల నాన్న కులాసాగా లేడు. నిన్ననే doctor ను పిలిపించారు. అంత serious కాదని ఆశిస్తున్నా.)

**Ooha:** We don't lose anything by calling her. We can find out her dad's condition too.
(Phone చేస్తే పోయేదేం లేదుకదా. వాళ్ల నాన్న పరిస్థితి కూడా తెలుసుకోవచ్చు)

**Satya:** OK.

☺ ☺ ☺ ☺ ☺

Modern spoken English లో phone కు సంబంధించి call రకరకాలుగా వాడతారు. Phone some one/ ring up some one/ give some one a ring అనే మాటలిపుడంత వాడుకలో లేవు.

a) Hema returns others calls promptly = ఎవరన్నా తనకు phone చేస్తే, Hema వెంటనే వాళ్లకు తిరిగి phone చేస్తుంది.

b) I called him and he was away. I am sure he will return my call, as soon as he is back. అతను లేనప్పుడు phone చేశాను. అతడు తిరిగి రాగానే నాకు phone చేస్తాడని గట్టిగా నమ్ముతున్నాను.

**2) I had no call from you** =
నీ నుంచి నాకు phone రాలేదు.

Have a call = Phone రావటం/ పిలుపు రావటం

a) I had a call from office yesterday asking me to proceed to the head office =
Head office కు వెళ్ళాల్సిందిగా నాకు నిన్న office నుంచి phone వచ్చింది.

# I had no call from you

(Phone చేసే బదులు మీ ఇంటికే వద్దామనుకున్నా. కానీ మా brother చాలా తొందరలో ఉన్నాడు. ఇంటికొచ్చినతర్వాత phone చేయటానికి నిశ్చయించుకున్నా. కాని ఇంటికొచ్చేసరికి దాని విషయమే పూర్తిగా మరచిపోయా.)

**Ooha:** I don't know why and this isn't the first time. You rarely return my calls.
(ఎందుకు తిరిగి phone చేయవో తెలియదు, అందులో ఇది మొదటిసారికాదు. నా Phones కు బదులుగా నువ్వు చాలా అరుదుగా Phone చేస్తావు.)

**Satya:** Don't be cross, dear. Take it from me, it will not happen again.
(కోప్పడకు. నేను చెప్తున్నాను కదా, మళ్లీ అలా జరగదు.)

Take it from me = నేను చెప్తున్నాను కదా = నచ్చచెప్పటానికి వాడేమాట

be cross = కోపంగా ఉండటం.

**Ooha:** You've said that before. Show it in action.
(నువ్వింతకుముందే చెప్పావు. ఈసారి చేతలో చూపించు)

**Satya:** At office my job involves taking calls. Too many calls and when I return home late at night, I don't feel like making calls. Please understand me.
(Office లో phone calls receive చేసుకోవటం నా ఉద్యోగంలో భాగం. మరీ మరీ Phones వస్తుంటాయి. రాత్రి ఇంటికొచ్చేసరికి ఇంకెవరికీ Phone చేయాలనిపించదు. నన్నర్థం చేసుకో.)

involves = భాగంగా ఉండటం

**Ooha:** Then why make promises and keep people waiting for you to return their calls.
(అలాంటప్పుడు మాటివ్వటం దేనికి, ఇతరులను నువ్వు తిరిగిచేసే Phone ల కోసం కాచుకునేట్లు చేయటం దేనికి?)

**Satya:** OK. In future I won't keep you waiting for my calls. Be sure of it.
(సరే. ఇకముందు నా phone కోసం నిన్ను కాచుకోనివ్వను. ఇది కచ్చితం.)

**Ooha:** OK. Let's now call Maya up and ask her if she is coming with us to the movie.
(సరే. ఇప్పుడు మాయకు phone చేసి తను మనతో సినిమాకొస్తుందో లేదో అడుగుదాం)

**Satya:** Yea. I remember, coming out of office, I saw her getting into bus. I called out to her. She turned round and waved her hand. I didn't understand what she meant.
(ఆ. నాకు గుర్తొస్తోంది, office నుంచి బయటికి వస్తూ నేను, మాయ bus ఎక్కడం చూశా. బిగ్గరగా పిలిచాను. వెనక్కి తిరిగి చేయి ఊపింది. దానర్థం ఏమిటో నాకు అర్థంకాలేదు)

American influence (ప్రభావం) వల్ల call, దాని ఇతర రూపాలు చాలా వాడుకలోకి వచ్చేశాయి. వాటి గురించి తెలుసుకోవటం, వాటిని సందర్భానుసారంగా వాడటం, వాడగలగడం, real life situation లో చాలా అవసరం, phone అనేది (land/ cell) ఆధునిక జీవితంలో దాదాపు నిత్యావసరమయింది కాబట్టి.

**Look at the following expressions from the dialogue between Ooha and Satya.**

1) You promised to call me back
2) I had no call from you
3) I decided to call back when I reached home.
4) You rarely return my calls.
5) At office my job involves taking calls.
6) I don't feel like making calls
7) Why make people wait for you to return their calls
8) Let's now call Maya up
9) I called out to her.
10) Let's give a call and find out.
11) Just yesterday they called in the doctor.

**1) You promised to call me back** = నాకు నువ్వు మళ్లీ/ తిరిగి phone చేస్తానని మాటిచ్చావు.

Call back/ Call (some one) back = ఒకరికి తిరిగి phone చేయటం. మనం తెలపాల్సిన విషయం మన దగ్గర ready గా లేనప్పుడూ, మనం ఒక విషయం అవునా, కాదా అని తెలిపేందుకు time కావాల్సి వచ్చినప్పుడు, మనం I'll call (you) back and let you know అంటాం.

a) **Tulasi:** Hello Mallika, are you coming for the function tomorrow?
(Hello, నువ్వు రేపు function కు వస్తున్నావా?)
**Mallika:** I haven't decided yet. I am very busy shopping now. I'll call you back in an hour.
(ఇంకా ఏం అనుకోలేదు/ నిర్ణయించుకోలేదు. ఇప్పుడు shopping లో busy గా ఉన్నా. మళ్లీ ఓ గంటాగి phone చేస్తా నీకు.)

b) I can make free calls from my company phone. So just give me a missed call and be sure I'll call you back.
(మా company నుంచి నేను free phone calls చేయొచ్చు కాబట్టి నువ్వు missed call ఇవ్వు. నేను నీకు తిరిగి phone చేస్తా.)

c) He is too busy. Don't expect him to call back, though he says so = అతడు మరీ busy. తను మనకు phone చేస్తానన్నా, phone చేస్తాడనుకోకు.

ఇదే అర్థంతో return a call అంటాం. No. 4 చూడండి: You rarely return my calls. (నా phones కు బదులుగా) నువ్వు చాలా అరుదుగా చేస్తావు. (ఎంతసేపూ నేను నీకు phone చేయటమేగానీ, నువ్వెప్పుడూ చేయవు/ నువ్వే నాకు మళ్లీ phone చేస్తానంటావు కానీ చేయవు.)

అయితే have a call అంటే మామూలుగా పిలుపు రావటం - phone ద్వారానే అని కాదు, letter ద్వారా/ messenger (courier) ద్వారా కూడా కావొచ్చు

I had a call from the company yesterday asking me to attend an interview = Interview కు హాజరు కావాల్సిందిగా నాకు company నుంచి పిలుపు వచ్చింది/ నన్ను interview కు పిలిచారు.

**5) At office my job involves taking calls** =
Office లో phones వస్తే వాటిని receive చేసుకోవటం నా విధిలో భాగం

Take calls = receive a phone call = Phone ఎత్తి ఎవరు phone చేశారో ఎవరికోసమో, ఏం చెప్తారో తెలుసుకోవటం.

a) **Sampanna:** I called your office at 6.30 last evening. There was none to take the call=
మీ office కు నిన్న సాయంత్రం 6.30 కు phone చేశాను. ఎవరూ phone ఎత్తలేదు.
**Sowbhagya:** Who will be there to take calls at 6.30? The office closes at 6.
(6.30 కి phone ఎత్తటానికి ఎవరుంటారు? Office ఆరింటికల్లా మూసేస్తారు.)

b) **Manager:** The caller ID shows that we had a call from our lawyer. Who took the call?
(మనకు lawyer దగ్గర నుంచి phone వచ్చిందని caller ID చూపిస్తోంది. Phone ఎవరెత్తారు?
Caller ID అంటే తెలుసుకదా? Phone చేసినవాళ్ల number మనకు చూపించే సదుపాయం.
**Manjula:** I took the call sir. She wanted some papers.
(నేను phone ఎత్తాను. ఆవిడ కొన్ని papers కావాలంది.)

**6) I don't feel like making calls =**
నాకు phone చేయాలనిపించదు.
Make a call. దీని అర్థం కూడా phone చేయటం అనే.

a) Please make a call to the tailor and tell him we need the clothes urgently=
Tailor కు phone చేసి, మనకు బట్టలు వెంటనే కావాలని చెప్పండి.

b) She made the last call to me at 10 last night. Since then she hasn't made any call=
ఆమె చివరిసారిగా నిన్న రాత్రి 10 కి నాకు phone చేసింది. అప్పటినుంచి నాకింతవరకు phone చేయలేదు.

**8) Let's now call Maya up=**
మాయకు phone చేద్దాం.
call up Maya = call Maya Up = call Maya = మాయకు phone చేయి.

**10) Let's give a call and find out =**
Phone చేసి కనుక్కుందాం.

Give a call= Make a call= call= call up= phone చేయటం.

a) I called out to her= ఆమెను బిగ్గరగా పిలిచాను.
call out= బిగ్గరగా పిలవటం/ అరవటం.
(గమనించండి. call out కూ, phone చేయటం అనే అర్థంతో call తో వాడే expressions కూ సంబంధం లేదు.)

a) I saw my friend sitting in the front row in the cinema. I called out to him but he did not hear me = సినిమా హాల్లో ముందువరసలో ఉన్న నా స్నేహితుడిని బిగ్గరగా పిలిచాను, కాని వాడికి వినిపించలేదు.

b) She called out to her father for help=
ఆమె సాయంకోసం తన తండ్రిని గట్టిగా పిలిచింది.

c) The teacher called out the names of students selected for the competition=
పోటీకి ఎంపికచేసిన విద్యార్థుల పేర్లను teacher చదివాడు.

**11) call in** = ఎవరినైనా పిలవడం- phone లోగానీ, ఎదురుగాగానీ, ముఖ్యంగా doctor, police, fire service వాళ్లను పిలవటం.

---

**ప్రశ్న:** *Is there any difference between 'Depends on' and Depends upon'.*
**– జి.మధుసూదన్, సూర్యాపేట**

**జవాబు:** No difference. However, upon is preferred when the sentence ends with it.
eg. a) A child depends on/ upon its mother for every thing.
b) In his old age, he has no one to depend upon.
Even in b) 'on' can be used, but upon is preferred because the sentence ends with it.

**ప్రశ్న:** *"No documents will be accepted later or in piece meal".* ఈ వాక్యం అర్థాన్ని వివరించి *"in piece meal"* వాడుక ఉపయోగం కూడా తెలపగలరు.
**– కందికట్ల ఆనందకుమార్, గాదరాడ**

**జవాబు:** Piece meal అంటే ఒక పనిని ముందుగా అనుకున్న ప్రకారం ఒక పద్ధతిగా కాకుండా, అప్పుడప్పుడు కొంత ఒక విధంగా, మరికొంత ఇంకో విధంగా చేయటం. ఒక పద్ధతి లేకుండా కాస్త అజాగ్రత్తగా చేయటం.
eg. The house was built in a piece meal manner, so it lacks a neat appearance.



(ఆ ఇల్లు అప్పుడు కొంత అప్పుడు కొంత కట్టారు. అందుకని దానికి సరైన రూపంలేదు.)
మీరు రాసిన sentence లో piece meal ఉపయోగం సరైనదిగా అనిపించడంలేదు. బహుశా ఆ sentence లో ఉద్దేశం, పత్రాలను ఆలస్యంగా, విడి విడిగా స్వీకరించటం జరగదని. అలాంటప్పుడు రాయాల్సిన sentence: No document will be accepted latter or in parts.

**ప్రశ్న:** నేను అమెరికన్ ఇంగ్లిషు *accent* నేర్చుకోవాలనుకుంటున్నాను. *Oxford dictionary* లో చాలా పదాలకు సంబంధించి అమెరికన్ *Pronunciation* ఇవ్వకుండా *British pronunciation* మాత్రమే ఇస్తున్నారు. దీనిద్వారా కొన్నిపదాల *AME* ఉచ్ఛారణ తెలుసుకోలేకపోతున్నాను. కొన్ని పుస్తకాలు సూచించగలరు.
**– టి. రేవతి, హైదరాబాద్**

**జవాబు:** Hyderabad city లో leading book stores లో American Accent మీద, usage మీద ప్రత్యేకించి మంచి మంచి పుస్తకాలు దొరుకుతాయి. వాటిలోని CD ల సహాయంతో practice చేయండి.

- M. SURESAN

**SPOKEN ENGLISH**

ఆంగ్లభాషణ 284




**Amrit:** Hi Prabhat, what a nice place you live in! A lot of trees around with a number of birds on them, and a wide open space. I hear a number of birds calling.

(ప్రభాత్, ఎంత మంచి ఇంట్లో ఉంటున్నావు నువ్వు! చుట్టూ చెట్లూ, వాటి మీద పక్షులు, విశాలమైన ఖాళీ ప్రదేశం. పక్షుల కూతలూ/ అరుపులూ వినిపిస్తున్నాయి.)

**Prabhat:** Well, thanks for calling. Nice of you to have thought of seeing me. What brings you here?

(వచ్చినందుకు thanks. నన్ను చూడటానికి రావటం నీ మంచితనం/ మంచివాడివి, చూడటానికి వచ్చావు. ఏంటిలా వచ్చావ్?)

**Amrit:** I'll have it some other time. Don't worry. I don't mind staying here for a while, though.

(ఇంకెప్పుడన్నా భోంచేస్తాలే. ఫర్వాలేదు. కానీ ఇంకాసేపుండటానికి నాకేమీ అభ్యంతరం లేదు.)

✪ ✪ ✪ ✪ ✪

Spoken English లో daily life situations లో high frequency expressions (తరచుగా వచ్చే expressions) చూస్తున్నాం కదా? మరికొన్ని ఇపుడు చూద్దాం.

**Look at the following sentences from the dialogue above:**

1) Thanks for calling.
2) I called on him and then I thought I'd call round and see you on my way home.
3) The general manager called a meeting.
4) It was ten at night when we called it a day.
5) His orders were that we attend the meeting cancelling all our calls.

a) The salesman has to make ten calls a day = ఆ salesman (ఓ company తయారీలను ప్రచారం చేస్తూ, shop లలో orders తీసుకుని, ఇళ్లల్లో అమ్మేవాళ్లు) రోజుకు 10 చోట్లు చూడాలి.

b) The doctor has made two calls today. He has to make three more calls = Doctor ఇప్పటివరకు ఇద్దరు patients ను చూశాడు; ఇంకా ముగ్గురిని చూడాల్సి ఉంది.

(Call - make a call - phone చేయటం అనే అర్థం కూడా ఉందని ఇంతకుముందు తెలుసుకున్నాం కదా?)

**3) The general manager called a meeting** = General Manager సమావేశం ఏర్పాటు చేశాడు/ చేసింది/ సమావేశపరచారు.

call a meeting/ discussion etc = meeting/ చర్చకు పిలవటం/ ఏర్పాటు చేయటం.

# Shall I call it a day?

**Amrit:** My colleague Kamalakar called in sick yesterday. I called on him and then I thought I'd call round and see you on my way home. But you were no where to be seen yesterday.

(మా సహోద్యోగి కమలాకర్ ఆరోగ్యం సరిగా లేదని నిన్న office కు phone చేశాడు. అతన్ని చూడటానికి అతనింటికి వెళ్లాను. ఇంటికి తిరిగి వెళ్లే దారిలో నిన్ను చూద్దామనిపించి వచ్చాను. నిన్న నువ్వు నాకెక్కడా కనిపించలేదు)

**Prabhat:** The general manager called a meeting and it went on till 10 at night when we called it a day. His orders were we attend the meeting, cancelling all our calls.

(మా general manager meeting పెట్టాడు. అది పూర్తయేసరికి రాత్రి 10 అయింది. మేం వెళ్లాల్సినచోట్లకు కూడా వెళ్ల కుండా meeting కు రమ్మని ఆయన ఆజ్ఞ)

**Amrit:** Why did it go on so late into the night? Was it urgent?

(అంత పొద్దుబోయేదాకా మీటింగ్ ఎందుకు జరిగింది? అంత urgent అనా?)

**Prabhat:** The situation did call for an urgent review of our sales strategies following the budget. Hence the meeting.

(Budget వచ్చిన వెంటనే మా అమ్మకం వ్యూహాల సమీక్షకు అవసరం కలిగిందిలే. అందువల్ల ఆ meeting.)

(strategy = వ్యూహం/ పథకం. Review = సమీక్ష. ఒక విషయం మంచిచెడ్డలు, దాని ఫలితాలూ, పరిశీలించటం. Book review = పుస్తక సమీక్ష; కొత్త పుస్తకం విడుదలయినపుడు పరిశీలించటం. film review = చలనచిత్ర సమీక్ష)

**Amrit:** Did you speak too? (నువ్వూ మాట్లాడావా?)

**Prabhat:** The general manager first called upon the area managers to speak. One of them spoke too long. He took more than 45 minutes. So I thought I'd better not speak.

(General Manager ముందుగా area managers ను మాట్లాడాలన్నారు. వాళ్లల్లో ఒకాయన ముప్పావు గంట మాట్లాడాడు. నేను మాట్లాడకపోతేం మంచిదని మానుకున్నాను.)

**Amrit:** It's already 9.00. When does the last train call here?

(ఇప్పటికే 9.00 అయింది. చివరి train ఇక్కడికి ఎన్నింటికొస్తుంది?)

**Prabhat:** Local trains call at the nearby station every 15 minutes till 10.30. How about having dinner here?

(స్థానిక రైళ్లిక్కడ ప్రతి 15 నిమిషాలకూ ఆగుతాయి, రాత్రి 10.30 వరకు. ఇక్కడ భోంచేసి వెళ్లు.)

6) The situation did call for an urgent review of our sales strategies.
7) The general manager first called upon the area managers to speak.
8) Local trains call at the nearby station every fifteen minutes.

Spoken English లో call తో వచ్చే expressions సర్వసాధారణం. వీటిని బాగా practice చేయండి. మీ spoken English చాలా ప్రతిభావంతంగా, సహజంగా ఉంటుంది.

ఇప్పుడు ఒక్కో expression చూద్దాం:

**1) Thanks for calling** = మా ఇంటికి/ నన్ను చూసేందుకు వచ్చినందుకు thanks.

Call- చాలా తరచుగా ఒక ప్రదేశానికి/ ఒకరిని చూడటానికి/ ఒకరిని పలకరించటానికి వెళ్లటం.

i) ఒక ప్రదేశానికి వెళ్లటం = call at
ii) ఒకరిని చూడటం/ పలకరించటం = call on

(call at a place; call on a person)

a) నిన్న మాఇంటికొచ్చాడతను = He called at my home last night

b) Whenever they go this way, they call at the restaurant for a snack and coffee = ఎపుడిటువెళ్లినా ఏదైనా తిని coffee తాగేందుకు వాళ్లా restaurant కు (pronunciation - రెస్ట్రాంట్) వెళతారు.

call at అంటే ఇదే అర్థానికి దగ్గరగా ఉన్న ఇంకో అర్థంతో వాడిన sentence 8 చూడండి:

**Local trains call at the nearby station every fifteen minutes** = స్థానిక రైళ్లు ఇక్కడికి దగ్గరున్న station కు ప్రతి 15 నిమిషాలకు వస్తాయి, ఆగుతాయి. అంటే call at అంటే, trains, buses లాంటి ప్రయాణ సాధనాలు ఒక station లో ఆగటం (ప్రయాణికులను ఎక్కించుకునేందుకు/ దించేందుకు)

a) అన్ని trains విజయవాడలో ఆగుతాయి = All trains call at Vijayawada.

b) ఇది చాలా నిదానంగా నడిచే train. అన్ని stations లో ఆగుతుంది = This is a very slow train. It calls at all stations/ every station.

c) It calls only at Nellore on its way from Vijayawada to Chennai = విజయవాడ నుంచి చెన్నై వెళ్ళే దారిలో నెల్లూరులో మాత్రమే ఆగుతుంది.

(Doesn't call at this station = Doesn't stop at this station.)

(Whistle call= (ముఖ్యంగా రైళ్లు) కూతవేసేంతసేపు/ చాలా తక్కువసేపు ఒక స్టేషన్‌లో ఆగటం.)

Look at expression 5 above.

**5) ... we attend the meeting cancelling all our calls** = మేం వెళ్లాల్సినచోట్లకు కూడా వెళ్లకుండా meeting కు హాజరు కావాల్సి వచ్చింది.

ఇక్కడ call = visit (సందర్శించటం)

a) The Principal called a meeting of the lecturers = Principal lecturers ను సమావేశపరచారు.

b) The students called a boycott of classes = విద్యార్థులు తరగతుల బహిష్కరణకు పిలుపిచ్చారు.

**6) The situation called for an urgent review** అప్పటి పరిస్థితికి సమీక్ష అవసరమైంది.

a) Call for = అవసర పరిస్థితి ఏర్పడటం. హైదరాబాద్‌లో పెరుగుతున్న నేరాల సంఖ్య వల్ల police చర్య అవసరం అవుతోంది = The growing crime rate in Hyderabad calls for effective police action.

b) Your condition calls for immediate medical attention = నీ పరిస్థితికి వైద్యం ఎంతైనా అవసరం. (నీ ఆరోగ్య పరిస్థితికి వైద్య పరిశీలన ఎంతైనా అవసరం.)

Look at sentence No.2

**2) I called on him** = అతన్ని నేను (వాళ్లింట్లో) కలుసుకున్నాను.

call on = ఒక వ్యక్తిని (నివాసంలో) కలుసుకోవటం.

a) ప్రధాని రాష్ట్రపతిని కలుసుకున్నారు, UP విషయంలో. = The PM called on the President to discuss U.P. affairs.

b) I call on him, but he rarely calls on me = నేనతనింటికి వెళ్లి అతన్ని కలుసుకోవటమే కానీ, అతను మా ఇంటికి వచ్చి నన్ను కలుసుకోడు.

**7) The general manager called upon the area managers to speak** = GM, area managers ను మాట్లాడమన్నారు.

call upon - ఇది కొంచెం formal - ఏదైనా meeting లో అధ్యక్షత వహించేవారు, ఎవరినైనా మాట్లాడటానికి లాంఛనంగా (formal గా) పిలవటం.

a) ఈనాటి గౌరవ అతిథిని మాట్లాడవలసిందిగా కోరుతున్నాను. I call upon the guest of honour to speak.

b) ఈనాటి ముఖ్య అతిథిని వేదిక మీద కూర్చోవాల్సిందిగా పిలుస్తున్నాను = I call upon the chief guest to take his seat on the dais.

**4) It was ten at night when we called it a day** = మేం ముగించేసరికి రాత్రి 10 అయింది.

call it a day = ముగించటం

a) మూడు గంటలపాటు చర్చ తర్వాత సమావేశం ముగించారు = They called it a day after discussing for three hours.

b) 30 overs ఆడింతర్వాత ఆట ముగించారు = After they played 30 overs, they called it a day.

c) I've (I have) studied for 3 hours now, mom; shall I call it a day? = అమ్మా, మూడు గంటలు చదివాను కదా, ఆపెయ్యనా? .

---

**ప్రశ్న:** ఎండమావులు, సీమంతం, పద్మవ్యూహం *(labyrinth)*. వీటికి ఇంగ్లిష్ పదాలు చెప్పండి.

**– వి.భరత్‌భూషణ్, హైదరాబాద్**

**జవాబు:**

ఎండమావి- Mirage - pronunciation మిరాజ్ (జ్- measure లో 'జ' లాగ)- 'మి' నొక్కి పలకాలి.

సీమంతం- English లేదు, వాళ్లకీ ఆచారం లేదు.

పద్మవ్యూహానికి labyrinth కి సంబంధంలేదు, కొంచెం పోలిక తప్ప. పద్మవ్యూహం అనేది ఓ battle field లో formation of soldiers in the form of a padmam (Lotus). Labyrinth అంటే వీధులు, మార్గాలు, అల్లిబిల్లిగా, ఒకదాన్నొకటి cross చేస్తూ, ఎక్కడ మొదలై ఎక్కడ, ఎటువైపు అంతమవుతుందో తెలనివిగా ఉండేవి.

The old city of Hyderabad has a labyrinth of streets.

**ప్రశ్న:** కింది మూడు వాక్యాల్లో ఏది సరైనదో చెప్పండి.

1. *I (am to) request you to kindly arrange to add the credits to the accounts of the respective policy holders.*
2. *I request you kindly arrange to add the credits...*
3. *I request you to kindly arrange for addition of the credits...*

**– వనపర్తి శ్రీనివాసు, నల్లగొండ**

**జవాబు:**

1) I am to request you = మిమ్మల్ని నేను కోరుకుంటున్నాను (విధి- duty)

2) I request you = మిమ్మల్ని నేను కోరుకుంటున్నాను. (ఇష్టపడి కోరుకోవడం.) అయితే I request you kindly arrange అనటం సరికాదు.

మీ letter లో sentence (3)లోలా I request you to kindly arrange అని అనాలి. అయితే ఇందులో కూడా to kindly arrange సరికాదనీ, అది to arrange kindly ఉండాలని grammar కు ప్రాధాన్యం ఇచ్చే వారంటారు. కాని రాను రాను to kindly arrange కూడా standard usage లో భాగమైపోవచ్చు (వీటి అర్థం కూడా మిమ్మల్ని నేను కోరుకుంటున్నాను అని - మన ఇష్టం వల్ల - విధిగాకాదు.)

**ప్రశ్న:** *'Having'* అనేది ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారు. ఉదాహరణలతో వివరించండి.

**– ఎండి. బర్కతుల్లా, బహదూర్‌పుర**

**జవాబు:**

అర్థాన్ని బట్టి having అనేది ఎప్పుడయినా వాడవచ్చు. Having = కలిగిఉండటం.

a) Having a big house is a problem (పెద్ద ఇల్లు ఉండటం సమస్యే)

b) Having a servant is really comfortable = ఓ నౌకరుండటం సుఖమే.

అసలు point ఏమిటంటే, am having, is having, are having అనేవి కలిగిఉండటం అనే అర్థానికి వాడరు. తినటం/ తాగటం అనే అర్థంతోనే వాడతారు.

A) I am having<br>He/ She is having } a car<br>We, you, they are having

ఇలా అనడం తప్పు, car మాకుంది అనే అర్థంతో. కారు మాకుంది అని చెప్పటానికి

B) I have<br>He/ She has } a car అంటాం.<br>We, you, they have

c) I am<br>He/ She is } having some fruits<br>we/ you/ they are

c) కి అర్థం పండ్లు తింటున్నాను/ తింటుంది/ తింటున్నాడు/ తింటున్నాం/ తింటున్నారు అని.

d) I am having coffee because tea is not available = Tea లేదు కాబట్టి కాఫీ తాగుతున్నాను అని.

**- M. SURESAN**

SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 285




# It does, but who cares?

**Ujvala:** Hi Vennela welcome, welcome. What a surprise! Can't say how glad I am to see you! Such a long time since we met.

(రా వెన్నెలా, స్వాగతం. ఏమిటీ ఆశ్చర్యం. నిన్ను చూడటం ఎంత సంతోషంగా ఉందో నేను చెప్పలేకుండా ఉన్నా. ఎంతకాలమైందో మనం కలుసుకుని.)

**Vennela:** The pleasure is equally mine, Ujji.

(నాకూ అంతే సంతోషంగా ఉంది.)

**Ujvala:** So why are you here?

**Vennela:** You know my job keeps me too busy even to breathe. I worked for close to a year without a break. I thought I needed a break.

(నీకు తెలుసు కదా నాది ఊపిరి పీల్చుకోవడానికి కూడా తీరికలేనంత ఉద్యోగమని. దాదాపు ఏడాదిపాటు విరామం లేకుండా పనిచేశాను. కాస్త విరామం కావాలనిపించింది.)

**Ujvala:** So you are here.

(అందుకని ఈ ఊరొచ్చావు.)

**Vennela:** I felt like being free for at least 15 to 20 days. So I came down to this place to spend the time without a care in the world.

(ఓ 15, 20 రోజులు విశ్రాంతిగా స్వేచ్ఛగా ఉండాలనిపించింది. అందుకని ఇక్కడి కొచ్చాను, ఏ బాదర బందీ, సమస్యలూ లేకుండా ఉండేందుకు.)

**Ujvala:** But yours is a responsible job. You are too important in your company. Who'll (who will) take care of it in your absence?

(నీది చాలా బాధ్యతాయుతమైన పని కదా. మీ కంపెనీలో నువ్వు చాలా ముఖ్యమైన దానివి కదా? నువ్వు లేనప్పుడు నీ పని ఎవరు చూస్తారు?)

**Vennela:** That's been taken care of. Any way all that I care about now is my well being. I couldn't just go on working like a machine, could I?

(ఆ ఏర్పాట్లన్నీ చేశారులే. ఏదేమైనా ఇప్పుడు నాకు ముఖ్యమైంది నేను బాగుండటం. యంత్రంలాగా పనిచేస్తూ ఉండలేను కదా.)

**Ujvala:** None else in your company can do your work. Didn't you tell me so whenever you called me?

(నాకెప్పుడు ఫోన్ చేసినా మీ కంపెనీలో ఇంకెవరూ నీ పని చేయలేరని చెప్పేదానివికదా?)

**Vennela:** So? (అయితే?)

**Ujvala:** Won't the work suffer in your absence?

(నీవు లేకపోతే పని కుంటుపడదా?)

**Vennela:** It does, but who cares? It's for the company to take care of it.

(పడుతుంది. అయితే నాకేంటి? ఆ విషయంలో జాగ్రత్త పడాల్సింది కంపెనీ.)

**Ujvala:** That might affect your prospects in your company.

(దానివల్ల కంపెనీలో నీ భవిష్యత్తు దెబ్బతినొచ్చు కదా.)

prospects = భవిష్యదవకాశాలు

affect = ప్రభావితం చేయటం

**Vennela:** It does, for all that I care.

(దెబ్బతింటాయి. అయితే అవనీ/ నాకేంటి?)

**Ujvala:** OK. Would you care to eat some thing or have some thing to drink?

(సరే. ఏదన్నా తీసుకుంటావా - తినటం కానీ, తాగటం కాని.)

**Vennela:** No. I am full. Let's talk of our old times.

(కడుపు నిండుగా ఉంది. ఇప్పుడేం వద్దులే. మన పాత రోజుల గురించి మాట్లాడుకుందాం.)

**Ujvala:** Our classmate Neeraja has left for the states to join her husband.

(మన క్లాస్‌మేట్ నీరజ అమెరికాలో వాళ్లాయన దగ్గరకెళ్లింది.)

**Vennela:** What about her children?

(వాళ్ల పిల్లలు మరి?)

**Ujvala:** She left them in the care of her mother.

(వాళ్లమ్మ సంరక్షణలో ఉంచి/ వదిలి వెళ్లింది.)

**Vennela:** But isn't she old and sick?

(ఆవిడ పెద్దదీ, జబ్బు మనిషీ కదా.)

**Ujvala:** For all that she is very caning, especially about children. She cares for them a lot.

(అయినప్పటికీ పిల్లలంటే ఆమెకు చాలా ఆపేక్ష. వాళ్లంటే ఆవిడకు చాలా ఇష్టం.)

**Vennela:** How I envy Neeraja! There isn't any one to care for my children in my absence. I've to depend on creche.

(నీరజ అంటే నాకెంత ఈర్ష్యగా ఉందో! నేను లేకపోతే నా పిల్లలను చూసుకోవడానికెవరూ లేరు. క్రెష్ మీద ఆధారపడాల్సిందే.)

envy = ఈర్ష్య. మనకు లేని వస్తువు/ సౌకర్యం ఇంకొకరికున్నప్పుడు కలిగే బాధ.

creche (క్రెష్) అంటే తెలుసు కదా. Employed parents పిల్లలను చూసుకునే చోటు.

**Ujvala:** OK. Have this cola. You do look tired.

(సరే. ఈ కోలా తీసుకో. నువ్వు చాలా అలసిపోయినట్టు కనిపిస్తున్నావు.)

☺ ☺ ☺ ☺ ☺

Spoken English లో తరచుగా వాడే expressions (high frequency expressions) లో care, care తో వాడే మాటలూ సర్వసాధారణం.

Care అంటే మామూలు అర్థం జాగ్రత్త- ఇది మనందరకూ తెలుసు. అలాగే careful, with (great) care - చాలా జాగ్రత్తతో; take good care - జాగ్రత్త వహించడం. Take care how you talk to him = వాడితో మాట్లాడే విధం జాగ్రత్త - ఇవన్నీ మనకు తెలుసు.

అయితే care కొన్ని కొన్ని సందర్భాల్లో తప్పుగా వాడుతుంటాం. అలాంటివి రాకుండా let's be careful.

**Look at the following expressions from the conversation above:**

1) I came down to this place to spend the time without a care in the world.
2) Who'll take care of it in your absence?
3) That's been taken care of.
4) All that I now care about is my well being.
5) It does, but who cares?
6) It does, for all that I care.
7) Would you care to eat something?
8) She left them in the care of her mother.
9) She is very caring.
10) She cares for them a lot.

**1) Without a care in the world.**

(ఏ ఆదుర్దా, బాదరబందీ లేకుండా నిశ్చింతగా.)

**a)** He spends his weekend without a care away from the city.

(అతడు వారాంతం నగరానికి దూరంగా నిశ్చింతగా గడుపుతాడు.)

**b)** How fortunate one should be to lead life without a care in the world.

(నిశ్చింతగా/ ఏ బాధా/ ఏ బాదర బందీ లేకుండా జీవితం గడపడానికి మనిషి ఎంత అదృష్టవంతుడై ఉండాలి!)

**2) take care of** =

బాధ్యత వహించడం/ జాగ్రత్త వహించడం.

**a)** Sri Rama walked to the forest, leaving Bharata to take care of the kingdom.

(రాజ్య బాధ్యతను భరతుడికి అప్పగించి రాముడు అడవికి వెళ్లాడు.)

**b)** There is none to take care of the children if she goes away.

(ఆమె వెళ్లిపోతే పిల్లల్ని చూసుకునేందుకెవరూ లేరు.)

**c)** You take care of the planning side, I'll take care of the construction. (ప్లానింగ్ విషయం నువ్వు చూసుకో. నిర్మాణం విషయం నేను చూసుకుంటా.)

**3) That's been take care of:** ఇది take care of కు passive form: ఆ విషయం ఏర్పాటయింది.

Suraj: What about my flight tickets?

(నా విమాన టిక్కెట్ల విషయం ఏమిటి?)

Dhiraj: That has been taken care of. You've (you have) been booked for the Air India flight tomorrow evening.

(అది ఏర్పాటైంది. మీకు రేపు సాయంత్రం ఎయిర్ ఇండియా విమానానికి టిక్కెట్లు రిజర్వు చేశాం.)

**4) All that I now care about is my well being.**

(నాకు ముఖ్యమయిందల్లా నేను బాగుండటం.)

care about: ముఖ్యం అనుకోవటం/ ప్రాముఖ్యం ఇవ్వటం, అలా అనుకున్న విషయంలో ఆసక్తి చూపటం/ దాని గురించి worry అవటం.

**a)** He cares only about money and nothing else. డబ్బు తప్ప ఇంక దేనికీ అతడు ప్రాముఖ్యం ఇవ్వడు. ఇలాంటి అర్థంతో Indian English లో care for అంటుంటారు. ఇది సరికాదు. care for = ఒక వ్యక్తిపట్ల ఆపేక్ష/ అభిమానం చూపటం.

A mother cares for her children.

తల్లి పిల్లల పట్ల ఆపేక్ష చూపిస్తుంది. (ప్రేమిస్తుంది)

**b)** She doesn't care about elders.

(ఆమె పెద్దవాళ్లకంత ప్రాముఖ్యం ఇవ్వదు.)

ఇదే అర్థంతో what/ when లాంటి wh, words ముందు care వాడతాం.

**a)** I don't care what he says.

(వాడేమన్నా నేను లెక్కపెట్టను/ ప్రాముఖ్యం ఇవ్వను.)

**b)** I don't care how you treat me.

(నువ్వు నన్నెలా చూస్తావో నేను పట్టించుకోను.)

**c)** He doesn't care how his son studies.

(కొడుకెలా చదువుతున్నదీ అతడికి పట్టదు.)

**5) Who cares?**= ఎవరికేం పట్టింది? / నాకేంటి?

**a)** Who cares if he wastes his money.

(వాడు వాడి డబ్బు వృథాచేస్తుంటే ఎవరికేంటి?)

**b)** Pranav: He says he won't talk to you.

(నీతో మాట్లాడనంటున్నాడతను.)

Vinai: a) Who cares? (నాకేంటి?)

b) As if anybody cares.

(ఎవరో బాధపడుతున్నట్టు.)

**6) For all that I care** కూడా Who cares? లాగానే- అయితే కానీ, ఎవరికేం- అనటం.

**a)** For all that I care, he might have lost a lot of money.

(వాడు బాగా డబ్బు పోగొట్టుకొనుంటాడు. పోనీ నాకేం?)

**b)** For all that he cares, I am suffering.

నేను బాధపడుతున్నాను, అయినా వాడికేం?

**7)** Would you care to eat some thing?

(మీరేమన్నా కాస్త తీసుకుంటారా?)

**care to -** అతిథులకు ఆహార పానీయాలు/ ఇతర సదుపాయాలు offer చేసేటప్పుడు వాడే మాట.

(Would you) care to have some coffee?

కాస్త coffee తీసుకోండి.

(Would you) care for some coffee. అయితే ఇది కొంచెం formal.

**8) In the care of** = (ఒకరి) సంరక్షణలో

**a)** They grew up in the care of their grand parents.

(వాళ్ల తాత, అమ్మమ్మ/ బామ్మ సంరక్షణలో పెరిగారు.)

**b)** You can't leave children in the care of a drunkard.

(తాగుబోతు సంరక్షణలో పిల్లల్ని వదల్లేం.)

**9) Very caring/ caring** = ఆపేక్ష/ ఆప్యాయత, ప్రేమ కనపరచటం

**a)** Nurses in some hospitals are very caring.

(కొన్ని ఆసుపత్రుల్లో నర్సులు చాలా ఆపేక్షకలవాళ్లు.)

**b)** She is not so caring as some people think.

(కొంతమంది అనుకుంటున్నట్టు ఆమె అంత ఆపేక్ష గలదేం కాదు.)

**10) care for** = ప్రేమించటం.

ఇది మనం చాలా తప్పుగా వాడుతూంటాం, లక్ష్యపెట్టం అనే అర్థంతో. care for అంటే ప్రేమతో చూసుకోవటం. (అప్పుడప్పుడు వింటూంటాం, I don't care for the police- police అయితే నాకు లెక్కేంటి అనే అర్థంతో. ఇది సరికాదు. care for అంటే - అభిమానం ఉండటం.)

a) I care for my children.

(నా పిల్లల్ని నేను ప్రేమిస్తాను.)

b) She cares for her brother.

(ఆమె తమ్ముడంటే ఆమెకిష్టం.)

***ప్రశ్న:*** *i) Where were you yesterday?*

*Where did you yesterday? ఏది కరెక్ట్?*

*ii) Let us sum up - అర్థం తెలపండి.*

*iii) 'case', 'mood' గురించి వివరించగలరు.*

***– గుర్రం శంకర్, శంకరపట్నం, కరీంనగర్ జిల్లా.***

**జవాబు:**

**i)** Where were you yesterday? (నిన్న మీరెక్కడున్నారు). ఇది correct sentence.

Where did you yesterday? ఇది correct sentence కాదు. Meaning పూర్తిగా లేదుకదా? అదే Where did you eat/ sleep/ work, etc. yesterday? అంటే meaning పూర్తయి, నువ్వు నిన్నెక్కడ తిన్నావు/ నిద్రపోయావు/ పనిచేశావు, etc అనే అర్థం వస్తుంది. Where did you yesterday అంటే, did ఇక్కడ verb లో ఓ భాగం (helping verb) మాత్రమే. verb పూర్తవటానికి ఏదో పనిని తెలిపే Main verb - eat/ sleep/ work etc లాంటిది ఉండాలి కదా?

**ii)** Sum up అంటే ఒక ఉపన్యాసం (speech)/ report/ discussion (చర్చ) లాంటి వాటి చివర ఆ speech, report, discussion సారాంశాన్ని క్లుప్తంగా చెప్పటం.

Teacher పాఠాన్ని బోధించిన తర్వాత దాని సారాంశాన్ని క్లుప్తంగా చెప్పటం, to sum up. Let us sum up - ఓసారి మనం చదివినదాని సారాంశాన్ని క్లుప్తంగా చూద్దాం అని.

**iii)** Case, mood: Case అంటే మనకు, తెలుగులో విభక్తి ప్రత్యయాల లాగా చాలామటుకు- I- me, we - us, he - him, ఇలాగ.

Mood అంటే: ఒక విషయం తెలిపే sentences లో (statements) లో ఉండే verb తీరూ, (Indicative mood), ఆజ్ఞలూ, అభ్యర్థనలూ తెలిపే sentences లో verb తీరూ (Imperative mood), కోరికలూ, సందేహాలూ తెలిపే sentences లో (Subjunctive mood) లో verb తీరూను.

అయినా English సరిగా మాట్లాడాలంటే వీటి గురించి తెలుసుకోవాల్సిన అవసరం లేదు.

*- M. SURESAN*

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 286




# Take care of your paise

**Srikar:** How careless you are! You just don't care how you waste money!

(నీది ఎంత అజాగ్రత్త! నువ్వెంత డబ్బు వృథా చేస్తున్నావో నీకు పట్టటంలేదు.)

**Sritej:** Try as I might, I am unable to spend money with care. I think its my impatience.

(ఎంత ప్రయత్నించినా డబ్బు జాగ్రత్తగా ఖర్చుపెట్టలేకపోతున్నా. అది నా అసహనం అనుకుంటా!)

**Srikar:** When you buy a thing you don't care whether it is necessary or not.

(నువ్వు వస్తువు కొనేటప్పుడు అది అవసరమా కాదా అని ఆలోచించవు.)

**Sritej:** That may be true. But how can I control my spending?

(అది నిజం కావచ్చు. కానీ ఖర్చును నియంత్రించడం ఎలా?)

**Srikar:** As if you cared.

(ఏదో నువ్వు నిజంగా అలా అనుకుంటున్నట్టు.)

**Sritej:** I do certainly. In fact, I tried much oftener than I care to remember.

(నిజంగానే అనుకుంటున్నా. అసలు అలాంటి ప్రయత్నం ఎన్నిసార్లు చేశానో నాకే గుర్తులేదు.)

**Srikar:** Before you buy anything the next time count 10. That may stop your buying what is unnecessary.

(ఈసారేదైనా కొనేముందు పది లెక్క పెట్టు. అందువల్ల అనవసరమైన వస్తువేమీ కొనవు.)

**Sritej:** I'll follow your advice.

**Srikar:** You remember this saying: Take care of your paise, the rupees will take care of themselves. Follow that and you are carefree. Forget it and you 'll have all the cares on your shoulders.

(ఈ సామెత గుర్తుంచుకో. పైసలను జాగ్రత్తగా చూసుకుంటే రూపాయలు వాటి సంగతి అవే చూసుకుంటాయి. దీన్ని అనుసరిస్తే నీకు చీకూచింతా ఉండదు. మర్చిపోతే ప్రపంచంలోని బాధలన్నీ నీమీదే ఉంటాయి.)

ఈ సామెత English proverb 'take care of your pence, the pounds will take care of themselves కు అనువాదం. Pence- plural of penny- 100 pence = 1 pound)

**Sritej:** I will try to do that. I'll be careful even about a paisa.

(పైసా విషయంలో కూడా జాగ్రత్తగా ఉండేందుకు ప్రయత్నిస్తా.)

• • • • • • • •

మనం care తో వచ్చే expressions కిందటి రెండు lessons నుంచి చూస్తున్నాం కదా. ఈ lesson లో మరికొన్ని very common expressions చూద్దాం.

**Look at the following expressions from the dialogue above.**

1) How careless you are!
2) I am unable to spend money with care.
3) You don't care whether what you buy is necessary or not.
4) As if you cared.
5) In fact, I tried much oftener than I care to remember.
6) Follow that and you are care free.
7) You'll have all the cares in the world.

**1. Careless =** Without proper care = (సరైన జాగ్రత్త తీసుకోకుండా/ అజాగ్రత్తగా.)

a) She is careless how she walks in such a heavy traffic.
(అంత రద్దీలోనూ ఆమె అజాగ్రత్తగా నడుస్తుంది.)

b) Careless అంటే నిర్లక్ష్యంగా అనే అర్థం కూడా వస్తుంది.
He was careless in his replies.
(అతడి సమాధానాలు చాలా నిర్లక్ష్యంగా ఉన్నాయి.)

c) It was careless of the mother to leave the child alone.
(ఆ బిడ్డను ఒంటరిగా వదిలిపెట్టడం ఆమె అజాగ్రత్త.)

**గమనించండి:** He did it with a lot of care **X** He did it very carelessly. ఇప్పుడిది చూడండి.

**2) With care** = Carefully = జాగ్రత్తగా/ జాగ్రత్తతో

a) Yo should handle glass with care.
(గాజు (వస్తువుల)ను చాలా జాగ్రత్తగా/ జాగ్రత్తతో వాడాలి.)

b) He treated the patient with care.
(ఆ రోగిని అతడు చాలా జాగ్రత్తగా చూశాడు/ ప్రేమతో చూశాడు.)

**3) Don't care :** ఇది కిందటి lesson లో చూశాం. మళ్లీ మరోసారి చూద్దాం. ఎందుకంటే దీనిని చాలా తప్పుగా వాడటం ఎక్కువ.

**a) Prakash:** He talked all rot about you.
(నీ గురించి అతడు చెత్తంతా వాగాడు.)
rot = nonsense

**Prasad:** I don't care. / I don't care what he talks about me.
(వాగనీ. నేం పట్టించుకోను. నాకేంటి?)

b) He doesn't care what people say at his back.
(ఇతరులతని వెనుకేమనుకున్నా అతడేం లెక్కపెట్టడు/ పట్టించుకోడు.)

4) As if you cared.
(నువ్వేదో పెద్ద శ్రద్ధ తీసుకున్నట్టు.)

As if = as though = అయినట్టు కానీ కాదు.

You behave as if you were clever/ as though you were clever.
ఏదో తెలివైనవాడిలా ప్రవర్తిస్తావు (తెలివైనవాడివి కాదు.)

**a) Kiran:**
He said he wouldn't help you in future.
(ఇక నీకు సాయం చేయనని చెప్పాడు).

**Kishore:** As if I cared.
(అయితే ఏంటట? వాడి సహాయం నాకేం అక్కర్లేదనే భావంతో.)

b) She said she wouldn't meet me again, as if I cared.
(నన్ను తను మళ్లీ కలుసుకోనని చెప్పింది, నేనేదో బాధపడేట్టు.)

5) I tried much oftener than I care to remember- than I care to remember=
నేను గుర్తుంచుకోనేందుకన్నా ఎక్కువగా.
I've been in Mumbai more times than I care to remember.
(నేను గుర్తుంచుకోలేనన్ని సార్లు ముంబాయికి వెళ్లాను.)

6) Care free = చీకూచింతా లేకుండా

a) Having married off all his daughters and with his sons well settled, he is care free.
(ఆడపిల్లలందరికీ పెళ్లిచేసి, కొడుకులంతా సెటిల్ అవటంతో చీకూ చింతా లేకుండా ఉన్నాడు.)

b) With food and lodge taken care of, who won't be care free.
(తిండి, ఇల్లు విషయం ఎవరన్నా చూసుకుంటే ఎవరికేం చింత ఉంటుంది?)

7) You'll have all the cares in the world.
All the cares in the world =
ప్రపంచంలోని బాధలన్నీ మనవైనట్లు.

He looked as though he was weighed down by all the cares in the world.
(ప్రపంచంలోని బాధలన్నీ అతడిని కుంగదీస్తున్నట్లు కనిపిస్తున్నాడు.)



**ప్రశ్న:**

1. Vocabulary లోని పదాలు వివిధ రంగాలకు చెందినవి ఇచ్చి, దానిపై వ్యాసాలు ఇవ్వండి. దీని వల్ల ఆయా రంగాల్లో మాట్లాడే విధానం తెలుస్తుంది.
2. ప్రతి వ్యాసం కింద వివిధ కవుల మంచి కొటేషన్లు ఇచ్చి దానికి సరిపోయే తెలుగులో అనువాదం ఇవ్వండి.
3. ఇంగ్లిష్‌లో మాట్లాడం, రాయడం, అర్థంచేసుకోవడం కోసం ఏం చెయ్యాలి?
4. పీజీ స్థాయి ఆంగ్లపుస్తకాల్లోని వ్యాసాలను రాయడంలో ఎన్నిరకాల sentences లో రాస్తారు. వివరించండి.

*–బి.కె. నాయక్, కోమట్‌పల్లి*

**జవాబు:**

1) పాత Lessons లో daily life situations లో అవసరం ఉన్న మాటల గురించి చాలా తెలిపాం. మళ్లీ ఇతర రకాల మాటలు కూడా త్వరలోనే ఇస్తాం.
2) ప్రతి వ్యాసం కింద వివిధ రచయితల Quotations ఇవ్వటం త్వరలోనే ప్రారంభిస్తాం.
3) చదవటం మాట్లాడటమే ఇందుకు ఉత్తమమైన మార్గం. వీలైనంత English చదవటం, Tele news casts వినటం, అవకాశం వచ్చినప్పుడల్లా English మాట్లాడటం- తప్పుచేస్తామేమో అన్న భయం లేకుండా.
4) ఇది సందర్భాన్ని బట్టి వాడతాం- ఏ effect రావాలనే దాన్ని బట్టి ఉంటుంది. ఇది practice వల్ల తెలుస్తుంది.



**ప్రశ్న:**

1) Abort అనే పదంలో BrE. లో 'R' అనే ఉచ్చారణ లేదు. AmE. లో ఉచ్చారణ ఉంది. అసలు అమెరికన్స్ R పలుకుతారా లేదా?
2) R తో కూడుకున్న చాలా AmE phonetics-ల్లో R ఉంటుంది. R ను పలకాలా లేదా BrE ఉచ్చారణ లాగా పలక్కూడదా?
3) అమెరికన్స్ R ను ఉపయోగించే విధానాన్ని ఉదాహరణతో వివరించండి.

*– దేవనాల అనిత, వరంగల్*

**జవాబు:**

A. British English లోలా కాకుండా, American Pronunciation లో 'r' పలుకుతారు. అయితే అది తెలుగులో 'ర' లా కాకుండా (ఱ) లా పలుకుతారు.
Abort - American - అబాఱ్ట్ (అబాఱ్ట్) -
Form - British English - ఫామ్;
American English - ఫొాఱ్మ్
Term - British English - టమ్ (ట, bird లో 'బ' లాగా)
American English - టఱ్మ్.

**ప్రశ్న:**

**i)** Will I cheat you?
( నేను మిమ్మల్ని మోసం చేస్తానా? )
దీనిని Can I cheat you అనవచ్చా?

**ii)** Having అర్థం ఏమిటి?

**iii)** Formal గా, informal గా అంటున్నారు. వీటి అర్థం ఏమిటి?

**iv)** తెలుగు అర్థం ప్రకారం ఇంగ్లిష్‌లో ఏముందో తెలుసుకోవాలంటే Telugu to English డిక్షనరీలో అర్థం దొరకటం లేదు. ఏ డిక్షనరీలో ఉంటాయో వివరించండి.

*– శేషన్న, ఆదోని*

**జవాబు:**

i) Will I cheat you?
అంటే మిమ్మల్ని మోసం చేస్తానా? అని అంటే నాకా ఉద్దేశం లేదని.
Can I cheat you?
అంటే మిమ్మల్ని నేను మోసం చేయగలనా? అని అంటే నాకాసామర్థ్యం లేదని.

ii) having అర్థం 'కలిగి ఉంటూ' అని ఒక అర్థం.

i) Having a big house, he can recevie any number of guests = అతనికి పెద్ద ఇల్లుండటం వల్ల (అతను పెద్ద ఇల్లు కలిగి ఉండటం వల్ల) ఎంతమంది అతిథులైనా ఆదరించగలడు.

2) Having ను past participle తో కలిపి వాడితే అందువల్ల అని అర్థం వస్తుంది.
Having seen the movie he felt happy (సినిమాచూసి /చూడటంతో అతను సంతోషపడ్డాడు)

3) I am / He, she, is/We, you, they are having tea =
Tea తాగుతున్నాను/ తాగుతున్నాడు/తాగుతుంది/ తాగుతున్నారు.
తినేందుకు కూడా - am having / is having / are having అనొచ్చు.

iii) Formal అంటే ఒక పద్ధతి ప్రకారం ఏదైనా చేయటం. Informal అంటే పద్ధతేం పాటించకపోవటం.
Formal, Informal ఈ రెండూ ఇతరుల పట్ల మన ప్రవర్తన విషయంలో వాడతాం.
ఒక హోదాలో ఉన్న వ్యక్తితో వ్యవహరించేటప్పుడు మనం ఓ పద్ధతి ప్రకారం ప్రవర్తిస్తాం- వాళ్లతో అంత స్వతంత్రించి మాట్లాడం/వ్యవహరించం. వాళ్లతో మన భాష formal గా ఉంటుంది. 'అండీ, మీరు, తమరు - ఇలాంటి వన్నీ formal. English లో అయితే, Sir, అనటం, May I come in? లాంటి భాషను వాడటం formal.
మనకుబాగా చనువున్నవాళ్లతో informal (స్వతంత్రం) గా ఉంటాం. ఒరే, రారా, పోరా, నువ్వు - ఇదంతా informal.
Collectors, Ministers, Teachers,Principals తో మనం formalగా ఉంటాం- కొత్తవాళ్లతో/పరిచయం లేనివాళ్లతో formalగా ఉంటాం (స్వతంత్రం తీసుకోం)
మన parents, brothers and sisters friends తో informal గా ఉంటాం.

iv) Telugu to English Dictionary లు ఇప్పటివరకు వెలువడ్డ వాటిల్లో ఇలాంటి expressions కు అర్థం దొరకదు. Standard English Dictionaries లోనే దొరుకుంది.

*- M. SURESAN*

# SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 287




# Now I understand

**Pradeep:** What are you carrying in your brief case?

(నీ Brief case లో ఏం ఉంది?)

(Brief case = ముఖ్యమైన సమాచారం ఉన్న కాగితాలు తీసుకెళ్లే సన్నని suit case)

**Sandeep:** Just a report about my health- a certificate from the medical officer that I do not carry any infectious disease.

(నా health report - వైద్యాధికారి దగ్గర నుంచి నాకేలాంటి అంటువ్యాధులూ లేవని ఇచ్చిన certificate)

**Pradeep:** Why a certificate now?

(ఇప్పుడా certificate ఎందుకు?)

**Sandeep:** I've got to carry it because I am applying for an immigrant visa in the US.

(నాకది అవసరం, నేను అమెరికాలో స్థిర పడేందుకు అప్లై చేస్తున్నాను కాబట్టి.)

immigrant = వేరే దేశంలో స్థిరపడేవాడు.

**Pradeep:** Why do you want to settle in the US?

(అమెరికాలో ఎందుకు స్థిరపడాలనుకుంటున్నావు?)

**Sandeep:** I want to carry on my research there.

(నా పరిశోధనను అక్కడ కొనసాగించాలనుకుంటున్నాను)

**Pradeep:** You can do it here as well.

(అది ఇక్కడ కూడా చేయొచ్చు కదా?)

**Sandeep:** But the universities in the US carry much better facilities for the kind of research I want to do.

(అయితే అమెరికన్ యూనివర్శిటీల్లో నేను చేయాలనుకుంటున్న పరిశోధనకు వసతులు ఇక్కడ కంటే చాలా బాగుంటాయి.)

**Pradeep:** Pity most Indians do not serve their mother land.

(చాలామంది భారతీయులు మాతృదేశానికి సేవ చేయకపోటం దురదృష్టకరం)

**Sandeep:** You don't' understand. The facilities there are different. You don't' need any politicians favour to hold a position or to get a promotion. You've none of give you orders that you've to carry out. Academics enjoy a lot more freedom there.

(నువ్వర్థం చేసుకోవటంలేదు. నీ ఉద్యోగం నువ్వు చేసుకునేందుకుగానీ, Promotion పొందడానికి గాని రాజకీయా అభిమానం నీకు అక్కర లేదక్కడ (Research విషయాల్లో). ఎవరూ నీకు ఆజ్ఞలివ్వరు నువ్వు శిరసావహించేందుకు/ అమలు పరిచేందుకు. అక్కడ విద్యారంగం లోని విద్యాధికులు ఇక్కడ కంటే ఎక్కువ స్వాతంత్ర్యం అనుభవిస్తారు.)

favour = అభిమానం/అనుగ్రహం.

Academics = colleges/ universities లోని విద్యాధికులు.

Academic = విద్యా విషయమైన.

Prescribing a syllabus for a course is an a academic matter =

(ఏదైనా course is an academic matter = ఏదైనా course కు నిర్దేశించే పాఠ్యాంశం విద్యకు సంబంధించింది)

**Pradeep:** I still feel it is a case of distance lending charm to the eyes.

(ఏమో, ఇదంతా దూరపు కొండలు నునుపనే సంగతనుకుంటున్నాను నేను.)

Distance lends charm to the eyes =

దూరపు కొండలు నునుపు (దూరం వల్ల ఏదైనా ఆకర్షణీయంగా కనిపిస్తాయని భావం)

**Sandeep:** Yea. Now I understand. I'm sure you got carried away by the minister's speech the other day telling young Indians to serve their mother land and not to be carried away by all that hype about better opportunities in the states.

(ఆ ఇప్పుడు నాకర్థమైంది. మొన్న ఆ మంత్రి ఉపన్యాసంతో ప్రభావితమైపోయావు. ఆయనన్నాడుగా భారతీయ యువతీయువకులు స్వదేశానికి సేవ చేయాలని, అమెరికాలో ఎక్కువ అవకాశాలున్నాయనే ప్రచారానికి లోనవద్దని.)

**Pradeep:** By the way, where did you buy that suit case?

(అది సరేకానీ, ఆ suit case ఎక్కడ కొన్నావు?)

**Sandeep:** Where else? In the US. There are very big malls carrying a wide range of goods.

(ఇంకెక్కడ అమెరికాలోనే, అక్కడ చాలా రకాల సామాన్లు/వస్తువులమ్మే పెద్ద పెద్ద దుకాణాల సముదాయాలుంటాయి.)

Mall = దుకాణాల సముదాయాలుండే చోటు ముఖ్యంగా US లో.

**pradeep:** OK. I must be going now. I've work at office. Yesterday I made a mistake in the accounts. I did not carry forward the amount in one of the columns to the next. I have to run the whole thing on the system again and set it right.

(సరే నేవెళ్లాలిక. ఆఫీస్‌లో పనుంది నిన్నటి లెక్కల్లో చిన్న పొరపాటు చేశా.)

ఒక column (pronunciation- కాలం = పేజీ పై నుంచి కిందికి వేసే అంకెల నిలువు వరస కూడిక ల్లాంటి వాటిల్లో) చివరి అంకెను, తర్వాతి column పైకి వేయలేదు. ఆమొత్తం లెక్కను computer లో ఎక్కించి తప్పు సరిదిద్దాలి. system= computer

Run it in the system =

computers లోకి ఎక్కించటం

**Sandeep:** Let's meet this evening again. I want to show you a story the eenadu district edition carried about a scam.

(సాయంత్రం కలుసుకుందాం eenadu జిల్లా edition లో ఓ కుంభకోణాన్ని గురించిన స్టోరీ నీకు చూపించాలనుకుంటున్నాను.)

**Pradeep:** O.K. Take care.

(సరే జాగ్రత్త.)

☆ ☆ ☆ ☆ ☆

Daily life situation conversation లో అతితరచుగా వినపడే మాటల్లో carry దాంతో వచ్చే expressions. Carry కు ఉన్న అతిసాధారణ అర్థాలూ, మనకు తెలిసినవీ ఒకచోట నుంచి ఇంకోచోటుకు తీసుకువెళ్లటం/ (వస్తువులను మనుషులను చేరవేయటం, మనతో ఏదైనా తీసుకు వెళ్లటం

(carry కి past tense, past participle - carried)

a) A porter carries luggage = porter (Railway stations/ Bus stations లాంటి చోట్ల కూలీలు) సామాన్లను మోస్తాడు.

b) He was carrying some books.

(అతను కొన్ని పుస్తకాలు తీసుకువెళుతున్నాడు.)

(past లో)

c) A train can carry a large number of passengers.

(ట్రైన్ చాలామంది ప్రయాణికులను తీసుకువెళుతుంది.)

d) City buses carry a large number of commuters to their places of works.

(సిటీ బస్సులు చాలామంది commuters ను వాళ్ల పనిచేసే చోట్లకు చేరవేస్తాయి.)

commuter- కమ్యూటర్. 'మ్యూ' నొక్కి పలుకుతాం = దూరానున్న పనిచేసే చోట్లకు (office/ factories, etc) రోజూ ప్రయాణం చేసేవాళ్లు.

commute = పని ప్రదేశాలకు చాలా దూరం రోజూ ప్రయాణంచేయటం- local trains, city buses లాంటి వాటిల్లో)

e) carry అంటే మనతో తీసుకువెళ్లటం.

i) He always carries a pocket book.

ii) I don't carry much money.

ఇప్పుడు carry కున్న మరికొన్ని అర్థాలూ, ఉపయోగాలూ చూద్దాం.

**Look at the following sentences from the conversation at the beginning of the lesson.**

**I)** A certificate from.... that

1) ... a certificate ... that I do not carry any infectious diseases.

(నాలో ఇతరులకు సోకే అంటురోగాలు లేవని ఇచ్చిన certificate.)

ఇక్కడ carry అంటే అర్థం- ఇతరులకు సోకే అంటురోగాలుండటం.

**a)** Pigs carry/ pigs are the carriers of meningitis.

(పందుల వల్ల మెదడువాపు వ్యాధి వ్యాపిస్తుంది.)

(ఆ వ్యాధిని కల్గించే క్రిములు పందుల్లో ఉంటాయి)

**b)** A variety of mosquitoes carries malaria.

(మలేరియా ఒకరకం దోమలవల్ల వ్యాపిస్తుంది.)

(వాటిలో మలేరియా కలిగించే క్రిములుంటాయి)

2)

i) The universities in the US carry much better facilities for the kind of research I want to do.

ఇక్కడ carry అంటే ఒక చోట, ముఖ్యంగా shops లో, సంస్థల్లో లభ్యమవటం. - అమెరికాలోని universities లో నేను చేయాలనుకునే పరిశోధనకు వసతులు ఇక్కడి కంటే ఎక్కువగా లభ్యమవుతాయి. ఇక్కడికంటే బాగా మెరుగ్గా ఉంటాయి.

ii) There are very big malls carrying a wide range of goods.

(అక్కడ చాలారకాల వస్తువులూ, సామాన్లూ లభ్యమయ్యే దుకాణాల సముదాయాలుంటాయి.)

wide range = విస్తృతశ్రేణి/ చాలారకాల.

3) Carry కి ఇంకో అర్థం: (స్త్రీ) గర్భంతో ఉండటం.

I can't take my wife to the US now because she is carrying.

(నా భార్య కడుపుతో ఉంటంవల్ల ఇప్పుడామెను అమెరికాకు తీసుకు వెళ్లలేను.)

4) Carry కి ఇంకో అర్థం, ఏ విషయమైనా ఓ పత్రికలో ప్రచురితమవటం/ TVలో చూపించటం.

a) The Eenadu carries the news of some scam or the other almost every day.

(దాదాపు ప్రతిరోజూ ఈనాడు పత్రికలో ఏదో ఒక కుంభకోణం గురించిన వార్త ఉంటుంది (ప్రచురిస్తారు).

b) The channel carried a live telecast of the game.

(ఆ ఆట ప్రత్యక్ష ప్రసారం channel లో చూపించారు.)

(ఒక్కోసారి, పత్రికల్లో ఏదైనా విషయం రావటాన్ని Run అని కూడా అంటారు- The Eenadu ran the story of the land grab on its front page = ఆ భూకబ్జా విషయం ఈనాడు మొదటి పేజీలో ప్రచురించింది).

3) I want to carry on my research there.

(నా రిసెర్చ్ అక్కడ కొనసాగించాలనుకుంటున్నాను.)

carry on = కొనసాగించటం, continue చేయటం.

**a)** Gandhi carried on his movement in spite of a lot of opposition.

(వ్యతిరేకత ఉన్నప్పటికీ గాంధీ తన ఉద్యమాన్ని కొనసాగించాడు. (continued))

**b)** Please carry on. Let me not stop your watching the TV.

(మీరు TV చూట్టం కొనసాగించండి. నేను ఆపడం లేదు.)

---

ప్రశ్న:

**1.** They have gone to Hyderabad అంటే వాళ్లు హైదరాబాదు వెళ్లారు. (కదా) వాళ్లు హైదరాబాదు వెళ్లి వచ్చారు అనటానికి They have been to Hyderabad సరైనదా కాదా? I, we తో మాత్రమే been ను ఉపయోగించాలా? (వెళ్లి వచ్చారు అని చెప్పటానికి) He, she, it తో వెళ్లి వచ్చారు అని చెప్పటానికి ఎలా రాయాలి?

2. Where is Vijayawada? దీనిలో Vijayawada మనకందరికి తెలిసిన place కదా? దీని ముందు 'The' రాదా.

3. Simple Present Tense, Future tense తెలుగు వాక్యాలు ఒకేలా ఉంటాయా? నేను వెళ్తున్నా I go, I will go అర్థం ఒకటేనా?

4. soap, paper, bread, ఇంకా చాలా uncountable nouns ను మనం conversation లో papers, breads, soaps అంటూ plural గా పలుకుతూ ఉంటాం. ఇది కరెక్టేనా?

**– జల్లు పుష్ప, హైదరాబాదు.**

**జవాబు:** 1. They have gone to Hyderabad అంటే మీరన్నట్లు వాళ్లు Hyderabad కు వెళ్లారని అర్థం. వెళ్లి తిరిగి వచ్చారనటానికి - They have been to Hyderabad correct వెళ్లి వచ్చారు అనటానికి I and we తో మాత్రమే కాకుండా, he, she, it, they తో కూడా కరెక్టే. అయితే ఎవరి విషయంలోనైనా అంటే ఏ subject అయినా సరే have been \ has been (to a place) అన్నప్పుడు, వాళ్లా ఊరికి వెళ్లి వచ్చారనే కాకుండా, వాళ్లకు ఆ ఊరు తెలుసు, వాళ్లకాఊరితో పరిచయం ఉంది అనే అర్థం కూడా ఉంది.

**e.g.** a) I know Mumbai well. I have been there two or three times.

b) She has been to Delhi.

(ఢిల్లీ వెళ్లి వచ్చింది \ ఢిల్లీ ఆమెకు తెలుసు)

2. పలాని వ్యక్తుల, చోట్ల,పేర్ల ముందు The రాదు. 'తెలిసినచోటు' అంటే, ఆ తెలిసిన చోటుకు ప్రత్యేకమైన పేరుంటే 'the' రాదు. అలా కాకుండా Railway station, post office, etc., లాంటి ప్రదేశాలు అందరికీ తెలుసు- ముఖ్యంగా వాటిని గురించి మాట్లాడుకునేవాళ్లకు. అలా తెలిసిన వాటి ముందు 'the' వస్తుంది. అంతేకాని, Mumbai, Delhi, etc., ప్రత్యేకమైన పేరున్నప్పుడు రాదు.

3. Simple Present - I go లాంటి వాక్యాల్లో అర్థం నేనిప్పుడు వెళ్తున్నానని కానీ, రోజూ వెళ్తాననికానీ (క్రమం తప్పకుండా జరిగే పనులకు). I will go - అంటే future లో వెళ్తానని- అంటే భవిష్యత్తులో ఈ రెండు ఒకటి కాదు కదా?

4. అలా వాటిని plural లో వాడటం తప్పే. అలా వాడకూడదు.

**- M. SURESAN**

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 288

**Nisith:** How much money have you? Do you have?
(నీ దగ్గర డబ్బు ఎంత ఉంది? ఉందా? )

**Mohith:** Why are you asking?
(ఎందుకడుగుతున్నావు? )

**Nisith:** (I was) wondering if you could lend me some money.
(నువ్వేమన్నా నాకు అప్పివ్వగలవేమోనని అనుకుంటున్నా)

**Mohith:** I have just enough money to carry me through this month. I'm afraid I can't lend you any.
(ఈనెల గడవటానికి సరిపోయేంత డబ్బే ఉంది నా దగ్గర. నీకునేను అప్పు ఇవ్వలేననుకుంటా)

**Mohith:** I go with dad. I believe in economy and discipline too.
(నేను మానాన్ననే అనుసరిస్తా. పొదుపూ, క్రమశిక్షణా నేనూ అవలంబిస్తా)

(Believe = నమ్మటం. Believe in = అనుసరణీయమైనదని/ మంచిదని నమ్మటం)

**Nisith:** A good dad's son you are. I appreciate you.
(నువ్వు తండ్రికి తగ్గ కొడుకువు. నిన్ను నేను మెచ్చుకుంటున్నాను).

**Mohith:** OK. Thanks. Look here. You've made a mistake in your calculations. You forgot to carry forwards this amount to the next column.
(సరే. ధన్యవాదాలు. ఇక్కడ చూడు. నీ లెక్కల్లో తప్పు చేశావు. ఈ నిలువు వరస చివరి మొత్తాన్ని తరువాతి నిలువు వరస పైన వేయటం మరచిపోయావు.)

**Nisith:** That's like Mohith - always careful about calculations.

The Prime Minister of Pakistan is only the nominal head.=
పాకిస్థాన్ ప్రధాని పేరుకు మాత్రమే/ నామకః ముఖ్యుడు.
The real head is Musharaff=
అసలైన నేత ముషారఫ్

**3) I have to carry out his instructions =**
carry out = అమలుపరచటం (ఒకరి ఆజ్ఞలు)

a) Laxmana always carried out the orders of Sri Rama =
శ్రీరాముడి ఆజ్ఞలను లక్ష్మణుడెప్పుడూ శిరసా వహించాడు.

b) The King's orders had to be carried out =
రాజాజ్ఞలు ఎవరైనా అమలుపరచాల్సిందే/ అనుసరించాల్సిందే.

c) Carry out my orders. Don't question them
నా ఆజ్ఞలను పాటించు. వాటికి ఎదురుచెప్పకు.

# What rate do they carry

**Nisith:** My brother-in-law has asked me to buy him a bike. He would pay me, of course, but I've to spend now. I am short of Rs 15000/-. If you could lend it to me I would pay off next week.
(మా బావ తనకో bike కొనమని చెప్పారు. ఆయన డబ్బిస్తారనుకో. కాని ముందు నేను పెట్టుబడిపెట్టాలి కదా. ఓ 15000 రూపాయలు తగ్గాయి. నువ్విగనక ఇస్తే వచ్చేవారం ఇచ్చేస్తాను.)

**Mohith:** I do have the money but it is all in fixed deposits. I can't disturb them without the loss of interest.
(నా దగ్గర డబ్బుంది కానీ అంతా fixed deposits లో ఉన్నాయి. వడ్డీ నష్టపోకుండా వాటిని కదిలించలేను)

**Nisith:** What rate do they carry?
(వడ్డీ rate ఎంత? )

(Fixed deposit అంటే తెలుసు కదా? Bank లో ఓ నిర్ణీత కాలానికి (అంటే 3 నెలలు, 6 నెలలు, కొన్ని సంవత్సరాలూ, etc) పొదుపు చేసుకునే మొత్తాలు. ఆ నిర్ణీతకాలం పూర్తయ్యేవరకు డబ్బు తీసుకోవడానికి అవకాశం ఉండదు. మరీ అవసరమైతే మనకొచ్చే వడ్డీ కన్నా ఎక్కువ వడ్డీకి తీసుకోవచ్చు Rate= వడ్డీశాతం)

**Mohith:** Why do you want to know?
(ఎందుకు తెలుసుకోవాలనుకుంటున్నావు? )

**Nisith:** I will pay you that interest or even more. Let me have the money.
(అంతే వడ్డీ కానీ, అంతకన్నా ఎక్కువే కానీ నేనిస్తా. నాకు డబ్బివ్వు.)

**Mohith:** You can have it then. You know, dad's instructions are that I save as much as I can, and I have to carry out his instructions.
(అయితే తీసుకో. వీలయినంత పొదుపు చేయాలని మా నాన్న ఆదేశం. ఆయన ఆదేశాలు పాటించాల్సిందే)

**Nisith:** So you keep just enough money that lasts you a month and put the rest in the bank in fixed deposits.
(అందుకని నువ్వు నెలకు సరిపడా ఉంచుకుని మిగతా Fixed deposits లో పడేస్తావన్న మాట).

**Mohith:** Yea. That's what dad says. He insists on economy and discipline.
(అదే మా నాన్న చెప్పేది. ఆయనకు పొదుపు, క్రమశిక్షణ అంటే పట్టింపు.)

(Economy= పొదుపు)

**Nisith:** I'm afraid it is carrying them too far.
(నాకది అతి పొదుపు, అతి క్రమశిక్షణా అనిపిస్తోంది)

(Mohith అంటే అంతే. లెక్కల విషయంలో ఎప్పుడూ జాగ్రత్తే.)

**Mohith:** OK. OK. Let's get on with our work.
(సరే సరే - పని చేద్దాం)

☺ ☺ ☺ ☺ ☺

Daily life situations లో spoken English లో చాలా తరచుగా carry, carry తో వచ్చే expressions గురించి చర్చిస్తున్నాం కదా. ఈసారి మరికొన్నింటిని తెలుసుకుందాం.

**Look at the following sentences from the conversation between Nisith and Mohith above.**

**1)** I have just enough money to carry me through this month.
**2)** What rate do they carry
**3)** ... and I have to carry out his instructions.
**4)** I am afraid that it is carrying them too far.
**5)** You forgot to carry forward this amount to the next column.

**1) To carry me through this month =**
ఈనెల జరిగేదాకా గడవటానికి.
Carry some one through something =
కష్ట సమయాల్లో తట్టుకోగలిగేలా చేయటం.

a) Gandhi's tenacity carried him through the freedom struggle=
స్వాతంత్ర్య పోరాటంలో గాంధీ పట్టుదలే ఆయన్ను నడిపించింది/ తట్టుకొనేలా చేసింది.

b) Kishore lost his hand in the accident, but his confidence carried him through to success =
ప్రమాదంలో చేయి పోగొట్టుకున్న కిశోర్‌ను అతని ఆత్మవిశ్వాసం విజయానికి నడిపించింది.

c) His determination carried him through the difficult bowling and tight fielding to a century =
Bowling కష్టంగా ఉన్నా, fielding tight గా ఉన్నా, అతని కృతనిశ్చయం అతన్ని century కొట్టేట్టు చేసింది.

Carry someone through something conversational English లో చాలా common & effective. Practice చేయండి.

**2) What rate do they carry.**
ఇక్కడ rate = interest rate = వడ్డీశాతం.
carry = వడ్డీపడటం

a) What rate does the farmer's loan carry? =
రైతుల రుణంమీద వడ్డీ శాతం ఎంత పడుతుంది?

b) These loans carry nominal interests =
ఈ రుణాల మీద చాలా తక్కువ వడ్డీ పడుతుంది.

(Nominal = పేరుకు మాత్రమే)

**4) I am afraid it is carrying them too far =**
ఇది మరీ అతి అనిపిస్తోంది నాకు.

carry something too far = ఒక విషయాన్ని అతిగా చేయటం/ అతిగా చెప్పటం/ అతిగా ప్రాముఖ్యం ఇవ్వటం.

a) We welcome politeness but Hari carries it too far =
మర్యాద అంటే మనకంతా ఇష్టమే, కానీ హరి అతి మర్యాద చూపిస్తాడు. (అభిలషణీయమైన దానికంటే ఎక్కువ)

b) Rama Rao controls his children too much. He carries discipline too far =
రామారావు తన పిల్లల్ని మరీ అదుపులో పెడతాడు. అది అతి క్రమశిక్షణ.

c) She eats very little to stay slim. That's carrying dieting too far =
సన్నగా ఉండాలని చాలా తక్కువగా తింటుంది. అది అతి dieting చేయటం.

Dieting అంటే తెలుసుకదా: లావవుతామనే భయంతో/ సన్నగా నాజూగ్గా కనిపించాలనే కోరికతో ఆహారం తగ్గించుకోవటం/ కొన్ని రకాల ఆహార పదార్థాలే తినటం.

**5) You forgot to carry forward the amount to the next column.**

carry forward = ఒక నిలువు వరస చివర ఉన్న అంకెను, తర్వాతి నిలువ వరసపైన వేయటం - కూడికలు, తీసివేతల తర్వాత. ఇలాంటి అంకెను brought forward (BF) అని కూడా అంటారు.

a) Add this to the amount carried forward =
ఈ మొత్తాన్ని ముందు వరస చివరి మొత్తానికి కలుపు.

b) This amount has been carried forward from the last page =
కిందటి page లోని మొత్తాన్ని ఇక్కడ వేశాం.

## EXERCISE

**MATCH THE FOLLOWING**

| A | B |
|---|---|
| 1. Beverage | A. Walker (on the street) |
| 2. Colossal | B. enjoy |
| 3. Pedestrian | C. flow out |
| 4. Relish | D. drink |
| 5. Ooze | E. huge (very big) |
| | F. remember |

**KEY: 1 D 2 E 3 A 4 B 5 C.**




***ప్రశ్న:***

*1. The nationalist congress party headed by Mr. Sharad Pawar has complained that the congress is not consulting its constituent parties on important issues.*

*2. The BJP president has said that BJP will not support congress at centre.*

*3. However, Miss Umabharathi contradicted the rumour that she is disobeying party principles.*

*4. The PM Vajpayee has said that only NDA can provide the stability to the country.*

*5. The Municipal commissioner, Raghu Veera Reddy, said immediate measures are being taken up to provide drinking water to the residents of Kurnool.*

***జవాబు:*** *న్యూస్‌రీడర్ చెబుతున్న సమాచారం అంతా Indirect speech కాబట్టి 1 వ వాక్యంలో is not consulting బదులు was not consulting అని, 2 వ వాక్యంలో will not support బదులు would not support అని, 3 వ వాక్యంలో she is disobeying బదులు she was disobeying అని, 4వ వాక్యంలో can provide బదులు could provide అని, 5వ వాక్యంలో measures are being taken up బదులు Measures were being taken up అని ఉండాలి కదా! Indirect speech నియమాల ప్రకారం present continuous ను past continuous గా, will / can + present verb ను Would / could + past verb గా మార్చాలి కదా! అలా ఎందుకు చెప్పలేదు? వీటిని కరెక్ట్‌గా ఎలా ఉపయోగించాలో తెలుపగలరు. Idioms కోసం ఏదైనా ఒక మంచి పుస్తకం సూచించగలరు.*

*– హనుమంతు, ప్రియాంక శశాంక్, గార్లదిన్నె, కర్నూలు.*

***జవాబు:***

**1.** ఇది correct: ' The Nationalist congress Party headed by Mr Sharad Pawar has complained... ఇక్కడ reporting verb, 'has complained'. This is in the present tense, so the tense of the reported verb need not be changed, so congress is not consulting is correct.

**2.** పైన sentence no 1 కు చెప్పినట్టుగా ఇక్కడ కూడా reporting verb, has said present tense కాబట్టి reported verb will not support ను would not support గా మార్చకూడదు. కాబట్టి న్యూస్‌రీడర్ వాక్యం కరెక్ట్.

**3.** ఈ sentence లో, పై sentences లోలా కాకుండా, reporting verb- Umabharathi said, 'said' past tense లో ఉంది. కాబట్టి she is disobeying తప్పు. She was disobeying గా ఉండాలి.

**4.** Sentences 1,2 ల్లో లాగా, ఇక్కడి reporting verb, 'has said', present tense కాబట్టి, can provide, correct. ఇది could provide గా మార్చకూడదు.

**5.** ఇక్కడి reporting verb 'said' sentence 3 లో లాగా past tense కాబట్టి, లోపలి reported verbs అన్నీ past tense లో, past form లో ఉండాలి. కాబట్టి are being taken up, wrong. ఇది were being taken up అయితేనే correct.

Idioms కు మంచిపుస్తకం Mcmordie's Book of Idioms.

**- M. SURESAN**




SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 289

# Her word carries a lot of weight

**Kinnera:** Take a look at that woman, getting out of the car. (Do you) know who she is and what she is?

(ఆవిడను ఓసారి చూడు. నీకు తెలుసా ఆవిడెవరో, ఏం చేస్తుందో.)

**Apsara:** Absolutely no idea.

(అసలు తెలియదు)

**Kinnera:** She is a leading lawyer and member of the university syndicate. Her word carries a lot of weight in the university circles.

(ఆమె ప్రముఖ lawyer, university syndicate సభ్యురాలు. ఆమె మాటకు university వర్గాల్లో చాలా విలువ ఉంది)

**Apsara:** Is that so? (అవునా?)

**Kinnera:** She is that great actress Lasya's sister. If Lasya is a talented actress, this woman is a genius of a lawyer.

(ఆ గొప్పనటి Lasya సోదరి ఈమె. ఆమె ప్రతిభ గల నటి అయితే, ఈమె మేధావి అయిన lawyer.)

**Apsara:** Lasya, a talented actress?! You alone say that. I don't see any talent in her. She's just a glam girl.

(లాస్య ప్రతిభగలనటా?! నువ్వొక్కదానివే అలా అనేది. ఆవిడలో నాకేం ప్రతిభ కనిపించలేదు. ఆమెకున్నదంతా ఆకర్షణే.)

Glam girl = glamour girl = అందం మాత్రమే ఉండి, అంత నటనాకౌశలం లేని తార. glamour అసలు అర్థం = సంపద, విజయం వల్ల ఒక వ్యక్తి పొందే ఆకర్షణ.)

**Kinnera:** You're wrong. She's definitely talented.

(నువ్వు పొరబడుతున్నావు. ఆమెకు మంచి ప్రతిభ ఉంది, నటనలో)

**Apsara:** You and others like you get carried away by her glamour and think her action is great.

(నువ్వు, నీలాంటివాళ్లు ఆమె ఆకర్షణీయమైన రూపానికి వశమైపోయి, ఆమె చాలా ప్రతిభ గల నటి అనుకుంటారు)

**Kinnera:** What do you know? She is rare combination of charm and histrionics.

(నీకేం తెలుసు ? ఆమె అందం, నటనా కౌశలాల అరుదైన కలయిక.)

Rare combination = సామాన్యంగా కనపడని రెండు గొప్ప లక్షణాల అరుదైన కలయిక. Histrionics = నటన/ నటనకు సంబంధించిన విషయం (హిస్ట్రియానిక్స్) అయితే ఇది ఎక్కువగా ఇతరుల సానుభూతి పొందటానికి కొందరు చేసే నటన - తెచ్చిపెట్టుకున్న భావాలతో.)

**Apsara:** She is certainly poor at acting.

(ఆమెకు నటనా ప్రతిభ తక్కువే.)

**Kinnera:** She's (she has) bought an old mansion and is carrying out renovation work for it. Once it is complete, it's going to be as glamourous as her.

(ఆమె పాత భవంతి కొని దానికి కొత్త రూపం ఇప్పిస్తోంది. అది పూర్తయితే, అది కూడా ఆమెలా ఆకర్షణీయంగా ఉంటుంది)

(Renovation = రెనవెయ్‌షన్ - వెయ్ నొక్కి పలుకుతాం. అర్థం - పాతబడిన building కు మరమ్మతులు చేసి, రంగులు వేసి మంచి స్థితికి తీసుకురావటం. చాలామంది remodelling అంటుంటారు, సరికాదు)

**Apsara:** Don't be carried away by her glamour and mistake that she is talented.

(ఆమె ఆకర్షణకు లోనై ఆమెకు ప్రతిభ ఉందనే పొరపాటు చేయకు)

**Kinnera:** I am her admirer, whatever you say. Our classmate Mugda, lasya's first cousin has given me her cell number. She said I could talk to Lasya whenever I wanted.

(నువ్వేమన్నా అను నేనామె అభిమానిని/ fan ను. మన classmate ముగ్ధ లాస్యకు first cousin. Lasya cell phone number నాకిచ్చింది, ఎప్పుడైనా మాట్లాడవచ్చని చెప్పింది.)

Admirer = అడ్మయర - 'మ' నొక్కి పలుకుతాం = అభిమాని /fan. Admire = అభిమానించటం / మెచ్చుకోవటం. first cousins = అన్నదమ్ముల / అక్కచెల్లెళ్ల బిడ్డలు

**Apsara:** Why waste your valuable cell phone talk time?

(ఎందుకు cell phone లో talk time వృథా చేసుకుంటావు)

**Kinnera:** I've a lot of carry over from my last card. I won't be wasting much.

• • • • •

Carry తో వచ్చే మరికొన్ని expressions అర్థం, ఉపయోగం ఇప్పుడు తెలుసుకుందాం. ఇవన్నీ కూడా కచ్చితమైన భావ ప్రకటనకు (Precise expression of ideas కు) చాలా ఉపయోగపడతాయి.

**Look at the following sentences from the dialogue above**

1) Her word carries a lot of weight.
2) You get carried away by her glamour.
3) She is carrying out renovation work for the mansion.
4) Don't be carried away by her glamour
5) I have a lot of carry over from my last card.

**1) Carries a lot of weight.** ఇక్కడ carries కు అర్థం కలిగి ఉండటం / ఒకరికి ఒక విషయానికి సంబంధించి ఏదైనా ఉండటం.

Her word carries a lot of weight. (ఇక్కడ weight కు అర్థం - విలువ / ప్రాముఖ్యం) ఆమె మాటకు చాలా విలువ ఉంది. ఆమె మాట చాలా విలువ కలిగి ఉంటుంది.

a) He carries a lot of influence = అతనికి చాలా పలుకుబడి ఉంది.

b) The job of a Collector carries a lot of responsibility = Collector ఉద్యోగం చాలా బాధ్యతతో కూడింది.

c) The position of the MD of company carries a good number of perks = ఓ company Managing Director పదవికి చాలా భత్యాల్లాంటివి ఉంటాయి. Position = పదవి (మామూలుగా పరిస్థితి అనే అర్థంలో ఎక్కువ వాడతాం). (perks = perquisites కు abbreviation - పదవి వల్ల వచ్చే ఉచిత సౌకర్యాలు - ఉచితంగా car, furniture ఉన్న ఇల్లు, పిల్లల చదువు భత్యం లాంటివి)

d) Crimes always carry punishments = నేరాలకెప్పుడూ శిక్ష ఉంటుంది.

**2) You get carried a way by her glamour**

**4) Don't be carried away by her glamour.**

ఇక్కడి expression: to get carried away / to be carried away = (దేనివల్లనైనా) వశం తప్పడం/ దేనిమీదైనా మోజులో మన ఆత్మ నిగ్రహం కోల్పోవటం.

a) Watching cricket on the TV, many viewers get carried away / are carried away by the happenings in the match.

(TV లో cricket చూసే ప్రేక్షకులు match లోని సంఘటనల వల్ల వశం తప్పుతారు / తమను తాము మరచిపోతారు.)

b) So carried away was he by his liking for the film star that he was blind to her defects =

(ఆ film star మీద అతనికున్న మోజులో ఆమె దోషాలేం అతనికి కనిపించలేదు).

c) Don't be carried away by his sweet words. He may deceive you =

(అతని తియ్యటి మాటలతో నువ్వు వశం తప్పకు. అతను నిన్ను మోసం చేయొచ్చు.)

**3) She is carrying out renovation work for the old mansion.**

Carrying out (Carry out) = కిందటి lesson లో carry out అంటే ఆజ్ఞల్లాంటివి అమలుపరచడం అనే అర్థం ఉందని తెలుసుకున్నాం. అయితే ఇక్కడ Carry out కు అర్థం - అనుకున్న పనులు నిర్వహించటం.

a) She is carrying out repairs / renovation work for the old mansion.

(ఆ భవంతికి ఆమె మరమ్మతులు, అలంకారాలూ చేయిస్తోంది.)

b) The government has set up a committee to carry out an enquiry into the accident =

(ఆ ప్రమాదంపై విచారణకు ప్రభుత్వం ఒక committee ని ఏర్పరిచింది.)

c) Tests have been carried out to decide whether the drug is safe or not =

(ఆ మందు క్షేమకరమైనదా, కాదా అని నిర్ధారించేందుకు పరీక్షలు నిర్వహించారు. (జరిగాయి.)

5) I have a lot of carry over from my last card = (పోయిన card లో మిగిలిపోయిన talk time నాకు బోలెడుంది.)

Carry over = గతంలో మిగిలిపోయినదాన్ని/ ఆగిపోయినదాన్ని ప్రస్తుతం వాడుకలోకి తీసుకురావటం.

a) Funds not used in the last financial year are carried over to the present budget = గత ఆర్థిక సంవత్సరంలో వాడని నిధులు ఈ సంవత్సరం budget లో వాడతారు/ వాడకానికి వస్తాయి.

b) The unused amount in the expired card can be carried over to the next period = [Cell Phone] కాలం చెల్లిన card లో మిగిలిపోయిన మొత్తాన్ని తర్వాతి మొత్తంలో కలుపుతారు. (expire= కాలం చెల్లటం)

c) This habit of his is a carry over from his childhood days = ఈ అలవాటు అతని చిన్నప్పటి రోజుల నుంచి వచ్చిందే.

ఇవీ carry తో వచ్చే effective expressions. మన conversation లో practice చేద్దాం.

**Match the following:**

| A | B |
|---|---|
| 1. Farming | A. Tell (usually a story) |
| 2. Polite | B. Cultivation |
| 3. Narrate | C. Area |
| 4. Enormous | D. Courteous |
| 5. Region | E. Unnecessary |
| | F. Huge |

**KEY:** 1) B 2) D 3) A 4) F 5) C.

ప్రశ్న :

Have been able + p.v, may have been able to + p.v., must have been able to + p.v తో వాక్యాలు నిర్మితమైనప్పుడు వాటి అర్థాలు ఎలా ఉంటాయో తెలుపగలరు .

1) We have been able to persuade them.
2) He might have been able to keep the promise.
3) She must have been able to get their support.

పై మూడు వాక్యాల్లో అండర్ లైన్ చేసిన పదాల కాంబినేషన్‌కు అర్థం ఏమిటి. వాడే సందర్భాన్ని తెలపగలరు

***- హుస్సేద్ మోయిన్‌ఖాన్, ఎమ్మిగనూరు***

జవాబు:

1) We have been able to persuade them = మేము వాళ్లకు నచ్చచెప్పగలిగాం. (Past action) చర్య జరిగింది

2) He might have been able to keep his promise = అతను తన మాటను నిలబెట్టుకోగలిగేవాడేమో/ గలిగుండొచ్చు (నిలబెట్టుకోకపోయి ఉండొచ్చు) - doubtful.

3) She must have been able to get their support = వాళ్ల support (కచ్చితంగా) పొందగలిగే ఉంటుంది (పొందింది).

He must have passed = (కచ్చితంగా) Pass అయ్యే ఉంటాడు. (pass అయ్యాడు)

He must have felt angry. He was about to beat me = వాడికి బాగా కోపం వచ్చి ఉంటుంది (వచ్చింది). నన్ను కొట్టబోయాడు.

ప్రశ్న: Thanks, bank, balance, cash మొదలైన పదాలను phonetics ప్రకారం థేంక్స్ / బేంక్/ బేలన్స్ / కేష్... అని పలుకుతాం కదా. కానీ వీటిని తెలుగులో రాసేటపుడు థ్యాంక్స్, బ్యాంక్, బ్యాలెన్స్, క్యాష్ అని ('య'కారంతో) రాస్తారు. అలా రాయడం తప్పు కదా!

***- పోతుల శ్రీనివాసు, వేగాయమ్మ పేట, తూర్పుగోదావరి***

జవాబు:

తెలుగులో thanks లాంటి మాటల్లోని 'a' తెలిపే శబ్దానికి సరైన అక్షరం లేదు. అందుకని bank లాంటివాటిలోని 'a' అక్షరం తెలిపే శబ్దానికి దగ్గరగా ఉన్న శబ్దం, బ్యా. అందుకని అలారాస్తారు. తెలుగులోకూడా, తాటాకులో 'టా', చెప్పాడులో ప్పా ఎలా పలుకుతారో, bankలో కూడా ba అలా పలుకుతాం.

ప్రశ్న :

Adverb గురించి వివరంగా తెలపండి.

***- ఎ. పావని, తాడిపత్రి, అనంతపురం***

జవాబు:

Adverb అంటే verb తెలిపే పని ఎలా జరిగింది అని చెప్పేమాట. He walked slowly. ఈ Sentence లో verb-walked- నడిచాడు. ఎలా నడిచాడు? అంటే slowly అనే answer వస్తుంది కాబట్టి slowly అనేది adverb. అలాగే She sang sweetly. ఇక్కడ ఎలా పాడింది అంటే Sweetly అని answer వస్తుంది కాబట్టి sweetly-adverb. సామాన్యంగా 90% సందర్భాల్లో '-ly' చివర వచ్చే మాటలు Adverbs.

**- M. SURESAN**

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 290




**Vatsala:** That's it. Thank God we are through the exams.
(పరీక్షలైపోయాయి. బతికిపోయాం)

**Suphala:** What a relief! Looking back I just wonder how we were able to bear the stress of it all.
(అబ్బ! ఎంత హాయిగా ఉందో! అయిపోయింది తలచుకుంటే ఆ ఒత్తిడంతా ఎలా తట్టుకున్నామా అనిపిస్తోంది)

**Vatsala:** Unfortunately this isn't the end of it. The worse is yet to come the entrance exams.
(దురదృష్టవశాత్తూ ఇదే అంతం కాదు. ఇంతకంటే అధ్వానం (ఆందోళనకరం)- ప్రవేశ పరీక్షలు ముందున్నాయి.)

**Suphala:** The thing is that all these are in the summer when the students have to bear the hot sun too.
(విషయం ఏంటంటే ఇవన్నీ కూడా వేసవిలోనే ఉంటాయి, విద్యార్థులు ఎండను కూడా భరించాలిప్పుడు)

**Suphala:** Any way, all our troubles will be a thing of the past, if only our efforts bear fruit.
(ఏదైనా, మన ప్రయత్నాలన్నీ ఫలిస్తే మన బాధలన్నీ గతించిన విషయాలవుతాయి.)

**Vatsala:** Have you met pramila of late?
(ఈమధ్య ప్రమీలనేమన్నా కలిశావా?)

**Suphala:** No. We aren't on talking terms.
(లేదు. మేం మాట్లాడుకోవటంలేదు)

not on talking terms = మనస్పర్థల వల్ల, పోట్లాడటం వల్ల మాట్లాడకపోవటం.

**Vatsala:** What's gone wrong?
(ఏమయింది? / ఏం పొరపాటు జరిగింది?)

**Suphala:** She wanted my help in the exam hall which I refused. Since then she has borne a grudge against me.
(పరీక్ష గదిలో నా సహాయం కోరింది. నేనొప్పుకోలేదు. అప్పటినుంచి నా మీద ద్వేషం పెంచుకొంది.)

**Vatsala:** Has she forgotten all the help she had had from you?
(నీ దగ్గర అంతకుముందు పొందిన సహాయం గురించి అంతా మరచిపోయిందా?)

**Suphala:** Life's like that.
(జీవితం అంతే)

☺ ☺ ☺ ☺

తల్లి తన పిల్లలకోసం ఏ కష్టాన్ని భరించటానికైనా సిద్ధపడతుంది.

**b)** Just because of my respect for him I bore all his misdeeds =
అతనిమీద గౌరవం వల్ల, అతని అకార్యాలన్నీ (తప్పుడు పనులు) భరించాను.

ఇదే అర్థం/ భావంతో పైన ఇచ్చిన sentence no 2 చూడండి:

**2) ... all these are in the summer when the students have to bear the hot sun =**
ఇవన్నీ కూడా ఎండవేడిని తట్టుకోవాల్సిన వేసవిలోనే ఉంటాయి.

We can't bear the heat of Bhadrachalam during summer =
వేసవిలో భద్రాచలం వేడిని తట్టుకోలేం.

ముఖ్య గమనిక: తట్టుకోవటం/ భరించటం అనే అర్థంతో 'bear' కు సమంగా stand కూడా వాడతాం.

**a)** I can't stand your silly behaviour =
నీ పిల్లతరహా నడవడి నేను భరించలేను.

**b)** The boss is too intolerant. He can't stand any one saying no to him =
ఆ boss మరీ అసహనం కలవాడు/ Boss కు మరీ అసహనం. అతని మాటలకు కాదు/ లేదు అంటే భరించలేడు.

**b)** Parasurama bore a grudge against Kshatriyas =
క్షత్రియుల మీద పరశురాముడు పగ పెంచుకున్నాడు.

**c)** I bear no grudge against him =
అతనంటే నాకేద్వేషమూలేదు.

ఇవీ bear తో వచ్చే కొన్ని expressions. Practice చేద్దాం.

**EXERCISE**

**MATCH THE FOLLOWING:**

| A | B |
|---|---|
| 1) Obey | A. Chase |
| 2) traffic | B. humble |
| 3) pursue | C. illegal trade |
| 4) meek | D. extraordinary |
| 5) remarkable | E. follow |
| | F. understand |

**KEY:** 1 E 2 C 3 A 4 B 5 D.

# She has borne a grudge

**Vatsala:** What a pity! We haven't had a real full vacation since we entered the 9th class. Our parents have been putting us through some summer course or the other. They must bear all the responsibility for our stress.
(ఎంత దురదృష్టం! 9th class లో అడుగుపెట్టినప్పటి నుంచి మనకు నిజమైన పూర్తి సెలవులంటూ లేవు కదా ఇంతవరకు. మన తల్లిదండ్రులేమో ఏదో ఒక summer course కు పంపుతూనే ఉన్నారు. మన ఒత్తిడికి వాళ్లే బాధ్యత వహించాలి.)

Vacation = సుదీర్ఘ సెలవులు.

We are on vacation = మేం సుదీర్ఘ విరామంలో ఉన్నాం.

Holidays = సెలవులు. ఇవి వరసగా విరామం లేకుండా ఉండనవసరంలేదు.

Vacation = మధ్యలో break లేకుండా వరసగా సెలవులు.

Stress = ఒత్తిడి, ముఖ్యంగా మానసికమైనది.

**Suphala:** But one thing- we needn't carry any more so many books, when we join higher courses.
(అయితే ఒక విషయం- మనం పై చదువుల్లో చేరితే అన్ని పుస్తకాలు మోయనక్కరలేదు.)

**Vatsala:** How we carried more books than our backs could bear! (I) shudder to think of it.
(మన వీపులు మోయగలిగిందానికంటే బరువున్న పుస్తకాలెలా మోశామో! తలచుకుంటేనే భయంతో వణుకు పుడుతుంది/ జలదరిస్తుంది/ గగుర్పొడుస్తుంది.)

Shudder - షడ. 'ష' నొక్కి పలుకుతాం. ఒళ్లు (భయంతో) జలదరించటం. భయంకరమైన ఆలోచనలుగానీ, గతంలో మనం తప్పించుకున్న పెను ప్రమాదాలుగానీ గుర్తుకు వచ్చినప్పుడు కలిగే దడ.

A snake crawled by me; it didn't hurt me, though. I shudder whenever I remember it.
నా పక్కనే పాము పాక్కుంటూ వెళ్లింది. అయితే నన్నేం చేయలేదు. కాని అది గుర్తొచ్చినప్పుడల్లా ఒళ్లు గగుర్పొడుస్తుంది.

Carry తో వచ్చే expressions తెలుసుకున్నాం కదా. Carry కి కాస్త దగ్గర సంబంధం ఉన్న bear గురించి తెలుసుకుందాం.

(bear - present tense, bore - past tense, borne - Past participle)

**1. bear** అంటే మనలో చాలా మందికి తెలుసు- భరించటం, సహించటం, తట్టుకోవటం అని.

చాలామటుకు తట్టుకోలేకపోవటం/ భరించలేకపోవటం అని not తోనే వాడుతుంటాం. Can't (Can not) bear అని ఎక్కువ అంటాం.

**a)** I can't bear his conceit -
అతని గర్వం నేను సహించలేను. (నాకు చిర్రెత్తుకొస్తుంది.)

**b)** She can't bear this news -
ఈ వార్తను ఆవిడ తట్టుకోలేదు.

**c)** We can't bear the cold of Kashmir =
కాశ్మీర్ చలి మనం తట్టుకోలేం.

**2.** ఏదయినా సహనంతో, ధైర్యంగా భరించటం- bear.

Though born a princess, Sita bore the austere life in the forests = రాకుమారిగా పుట్టినా, సీత అడవుల్లో నిరాడంబరమైన జీవితాన్ని భరించింది.

(Austere = ఆస్టియ. సుఖభోగాలు లేని చాలా నిరాడంబరమైన - సన్యాసులు గడిపే జీవితం - austere life.

Mahatma Gandhi led an austere life.

Bear కు ఉన్న ఇతర ఉపయోగాలిప్పుడు చూద్దాం:

**Look at the following sentences from the dialogue above:**

1) ... I wonder how we were able to bear the stress of it all.

2) ... when students have to bear the hot sun.

3) They must bear the responsibility for our stress.

4) How we carried more books than our backs could bear.

5) She has borne a grudge against me.

**1) I wonder how we were able to bear the stress of it all.**
ఇక్కడ bear కు అర్థం పైన చెప్పినట్లు భరించటం/ తట్టుకోవటం.

**a)** A Mother is prepared to bear any hardship for the sake of her children =

**3) They must bear the responsibility for our stress =**
మన ఒత్తిడికి బాధ్యత వాళ్లదే/ వాళ్ల వల్లే మనకు ఒత్తిడి.

bear the responsibility = బాధ్యులవటం.

**a)** The government must bear the responsibility for the rising prices. =
పెరుగుతున్న ధరల బాధ్యత ప్రభుత్వానిదే. = పెరుగుతున్న ధరలకు ప్రభుత్వం బాధ్యత వహించాలి/ ప్రభుత్వం వల్లే.

**b)** She had to bear the responsibility for his suffering = అతని బాధలకు ఆమె బాధ్యురాలయింది/ ఆమె వల్లే అతని బాధలు.

**c)** Syam: Let's do it. (మనం అది చేద్దాం)
Pran: I'm not for it. I can't bear any responsibility for any bad consequences.
(నేను దానికి వ్యతిరేకం. దానివల్ల చెడు ఫలితాలకు నేను బాధ్యత వహించలేను/ బాధ్యుణ్ని కాలేను.)

**4) ... we carried more books than our backs could bear =**
మన వీపులు మోయగలిగిందానికంటే మనం ఎక్కువ పుస్తకాలు మోశాం. (back= వీపు)

ఇక్కడ bare కు అర్థం మోయటం.

**a)** The elephant can bear a lot of weight =
ఏనుగు చాలా బరువు మోయగలదు.

**b)** The bridge is too weak to bear the weight of heavy traffic =
ఎక్కువ రద్దీని మోయలేనంత బలహీనంగా ఉంది ఆ వంతెన.

**c)** The eldest son bears the burden of the family =
ఆ కుటుంబ భారాన్ని పెద్ద కొడుకు మోస్తున్నాడు. (burden = మోత/ బాధ్యత)

**5) She has borne a grudge against me =**
నా మీద ఆమె ద్వేషం/ కోపం కలిగి ఉంది.

bear a grudge = పగ/ కోపం/ ద్వేషం లాంటివి కలిగి ఉండటం.

**a)** Mandhara bore a grudge against Sri Rama =
శ్రీ రాముడి మీద మంథరకు కోపం/ ద్వేషం ఉండేది. (మంథర సలహా మీదనే రాముడు అడవులకెళ్లాలని దశరథుణ్ని కైకేయి కోరింది. బంతాటలో రాముడు ఆడుతున్న బంతి మంథరకు తగిలింది- అందువల్ల ఆ పరిణామం.)

Lesson No 288 లో ఇచ్చిన Exercise, answers కు వివరణ.

**1. Beverage** = drink. మనం తాగేటటువంటి పానీయాలను (మంచినీళ్లు కాకుండా) - coffee, tea, food drinks, alcoholic drinks - వీటన్నింటిని beverages అంటాం. beverage - pronunciation - బెవరిజ్ - 'బె' నొక్కి పలుకుతాం.

**2. Colossal** - Pronunciation - కలాసల్ - 'లా' నొక్కి పలుకుతాం = చాలా పెద్దదయిన/ బృహత్.

A colossal statue - చాలా భారీ విగ్రహం. (ఉదాహరణకు, కర్నాటకలోని గోమటేశ్వరుడి విగ్రహం)

A colossal waste (of money) = చాలా ఎక్కువ వృథా.

A Colossal amount = చాలా పెద్ద మొత్తం.

**3. Pedestrian** = పెడెస్ట్రియన్- 'డ' నొక్కి పలుకుతాం. = పాదచారి. Roads లో నడిచేవాళ్లను (వాహనాలలో వెళ్లేవాళ్లు కాకుండా) Pedestrian అంటాం.

Pedestrian crossing = పాదచారులు రోడ్డుదాటే చోటు/ అవకాశం.

Pedestrian అంటే అంత గొప్పగాలేని - నిరాశపరిచే అని కూడా.

It's a Pedestrian movie - అంత గొప్పగా లేదు ఆ సినిమా, మామూలే.

His game was pedestrian = ఏదో మామూలుగా ఆడాడు.

**4. Relish** = enjoy - ఆనందంగా అనుభవించటం, ఆస్వాదించటం. దేనివల్లనైనా ఆనందం పొందటం.

a) We relished the food at the restaurant = ఆ restaurant లో ఆహారాన్ని (తినడాన్ని) మేం ఆనందించాం.

b) Narada relished creating quarrels = నారదుడు కలహాల్ని కలిగించి ఆనందించేవాడు

c) We relished his speech yesterday = నిన్న అతని ఉపన్యాసాన్ని మేం ఆనందించాం.

**5. Ooze** = (ఊజ్ - జ్, size లో జ్ లాగ) = కారటం (ముఖ్యంగా చిక్కటి ద్రవం) - నెమ్మదిగా.

a) Blood was oozing out of the injury -
ఆ గాయం నుంచి రక్తం కారుతోంది.

b) The vada was oozing oil =
వడలోంచి నూనె కారుతోంది.

c) Pus oozed from the wound =
గాయంలో నుంచి చీము కారుతోంది.

**- M. SURESAN**




SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 291

# What were the rewards?

**Snehit:** Hi Sobhit, when did you come back?
(ఎప్పుడు తిరిగొచ్చావ్? )

**Sobhit:** The day before (yester day).
(మొన్న, conversation లో మొన్న అనేందుకు సామాన్యంగా The day before yester day అని పూర్తిగా అనకుండా, the day before అని అంటారు.)

**Snehit:** You are rundown, aren't you?
(బాగా నీరసంగా ఉన్నట్లున్నావు కదా? )

**Sobhit:** Why do you say that? I'm all right.
(ఎందుకలా అంటున్నావు? నేను కులాసాగానే ఉన్నా)

**Snehit:** Your weary face and lean appearance bear proof of it.
(నీ అలిసిన మొహం, చిక్కిపోయిన ఆకారం దానికి రుజువుగా ఉన్నాయి.)

**Sobhit:** It's true. I am a little tired but otherwise I am in perfect health.
(కాస్త అలిసిపోయిన మాటవాస్తవమే, కానీ బాగా ఆరోగ్యంగా ఉన్నా.)

**Snehit:** Did you have a good time at the village? How did your social service go?
(ఆ గ్రామంలో నీకు సంతోషంగానే గడిచిందా? మీ సంఘ సేవ కార్యక్రమం ఎలా జరిగింది? )

**Sobhit:** Could you wait for ten minutes? I have this report to finish.
(కాసేపు ఆగవా? నేనీ report పూర్తిచేయాలి.)

**Snehit:** How many volunteers participated in the programme?
(ఎంత మంది volunteers అందులో పాల్గొన్నారు? )

Volunteer- వాలంటీయ - ఏదైనా కార్యక్రమంలో స్వచ్ఛందంగా సేవాదృక్పథంతో పాల్గొనేవాళ్లు.)

**Sobhit:** Please bear with me for a few more minutes. Yes It's over. You were asking me how many participated in the programme, weren't you?
(ఇంకాసేపు నాతో ఓపిక పట్టు. ఆ.. అది అయిపోయింది. అందులో వాలంటీర్లు ఎంత మంది పాల్గొన్నారని అడిగావు కదా? )

**Snehit:** Yes, I was. (అవును)

**Sobhit:** As many as fifty.
(50 మంది వరకూ ఉన్నారు)

**Snehit:** What did you achieve?
(మీరేం సాధించారు? )

**Sobhit:** Our efforts did bear fruit and we really succeeded.
(మా ప్రయత్నాలన్నీ ఫలించాయి, మేం నిజంగానే కృతకృత్యులయ్యాం)

**Snehit:** What in?
(దేంట్లో)

**Sobhit:** For one thing thanks to our adult literacy programme, 50% of the adult villagers ended up reading and writing. All the children there are now going to school. We taught them the value of hygene.
(ఒక విషయం ఏమిటంటే, మా వయోజన విద్యాకార్యక్రమం పుణ్యమా అని యాభై శాతం గ్రామస్థులు ఇప్పుడు రాయడం, చదవడం నేర్చుకున్నారు. అక్కడి పిల్లలందరూ బడికెళుతున్నారు. పరిశుభ్రత విలువ వాళ్లకు నేర్పించాం.)

Hygene = ఆరోగ్యానికవసరమైన పరిశుభ్రత.

**Snehit:** Who bore the expenses of the camp?
(ఈ ఖర్చు అంతా ఎవరు భరించారు? )

**Sobhit:** An NGO.
(ఓ ప్రభుత్వేతర సేవాసంస్థ.)

NGO- Non Government Organization.
స్వచ్ఛంద సేవా సంస్థలను ఇలా అంటారు.

**Snehit:** What part of the expenses did they bear?
(ఖర్చుల్లో ఎంత భాగం వాళ్లు భరించారు? )

**Sobhit:** The whole of it. We were comfortably lodged and fed and every one of us did have the satisfaction of doing real service.
(మొత్తం ఖర్చంతా వారిదే. మంచి బస, తిండి ఏర్పాటు చేశారు. మాలో ప్రతి ఒక్కరూ నిజమైన సేవచేసిన తృప్తి పొందారు.)

**Snehit:** What were the rewards?
(మీకొచ్చిన ప్రతిఫలం ఏంటి? )

**Sobhit:** More than anything the satisfaction of having served the under privileged people of a remote village. Providing sources of drinking water was our greatest achievement.
(ఎక్కడో మారుమూల కుగ్రామంలో... వసతులూ, అవకాశాలకు నోచుకోని ప్రజలకు సేవచేయటం. మంచి నీటి వనరులను ఏర్పాటు చేయటం మా అత్యంత గొప్ప సాధన.)

The under privileged = సమాజంలో మిగతా వారి కన్నా తక్కువ వసతులూ, అవకాశాలున్నవాళ్లు/వర్గాలు. దాదాపు వెనుకబడ్డవాళ్లు అనొచ్చు.)

**Snehit:** Any recognition from the government?
(ప్రభుత్వం నుంచి ఏమైనా గుర్తింపు వచ్చిందా? )

**Sobhit:** We had certificates of appreciation from the government, of course. They bore the signature of the governor himself.
(ప్రభుత్వం నుంచి ప్రశంసాపత్రాలు పొందాం. అవన్నీ గవర్నర్ సంతకాలతో ఉన్నాయి.)

**Snehit:** Good to see you back.

● ● ● ●

English లో Daily life situation conversations లో frequently used expressions (తరచూ వాడే మాటలు) లో ఒకటైన 'bear' ఉపయోగాలు కొన్ని కిందటి Lesson లో చూశాం. మరికొన్ని ఇప్పుడు తెలుసుకుందాం.

**Study the following sentences from the conversation between Snehit and Sobhit.**

1) Your weary face and lean appearance bear proof of it.
2) Please bear with me for a few more minutes.
3) Our efforts did bear fruit.
4) What part of expenses did they bear?
5) They bore the signature of the governor.

**1) Your weary face and lean appearance bear proof of it.**

bear proof of = రుజువుగా ఉండటం.

1) The blood on his body bears proof of some fight between the murdered man and the attackers.
(అతడి దేహంమీది రక్తం మరకలు, హత్యకు గురైన అతడికీ, అతడిని దెబ్బతీసిన వారికి మధ్య పోట్లాట జరిగిందని రుజువు చేస్తున్నాయి.)

b) The broken neck bone bears proof that Bob Woolmer was done in.
(Bob Woolmer హత్యకు గురయ్యాడని అతడి విరిగిన మెడ ఎముక రుజువు చేస్తోంది.)

Be done in - (Passive of do in) = హత్య చేయబడటం.

**2) Please bear with me for a few minutes.**

Bear with someone (me/ him/ them, etc) = ఒకరితో ఓపికగా ఉండటం.

a) I am an old man and perhaps keep saying unnecessary things. Bear with me.
(నేనేదో పెద్దవాడిని. అనవసరమైన విషయాలు మాట్లాడతానేమో. కాస్త ఓపికపట్టు.)

b) Am I asking you too many questions? Please bear with me.
(మరీ ఎక్కువ ప్రశ్నలడుగుతున్నానేమో. కాస్త నాపట్ల ఓపిక పట్టు.)

c) **Pranav:** Could you lend me your book once more?
(మరోసారి నీ పుస్తకం ఇస్తావా Please?)

**Prasad:** Have it. (తీసుకో)

**Pranav:** Perhaps I am asking you too often. Please bear with me.
(మరీ ఎక్కువసార్లు అడుగుతున్నానేమో. కాస్త ఓపిక చూపించు/ ఏమనుకోకు)

**3) Our efforts did bear (bore) fruit =**

bear fruit = ఫలించటం. (పథకాలూ, ప్రయత్నాలూ.)

a) The government's attempts to hold the price line have yet to bear fruit.
(ధరలను అదుపులో ఉంచేందుకు ప్రభుత్వ ప్రయత్నాలు ఇంకా ఫలించలేదు.)

hold the price line = ధరలను అదుపులో ఉంచడం / check the prices.

b) His two sons are in the states and his efforts to see them well settled have Borne fruit.
(అతడి ఇద్దరు కొడుకులూ అమెరికాలో ఉన్నారు. పిల్లలు బాగా స్థిరపడటానికి అతడు చేసిన ప్రయత్నాలు ఫలించాయి.)

**4) What part of expenses did they bear?**

bear expenses = ఖర్చులు భరించటం.

a) The government bears the expenses of the ministers' foreign tours.
(మంత్రుల విదేశీ ప్రయాణాల ఖర్చును ప్రభుత్వమే భరిస్తుంది.)

b) He bore the expenses / cost of the orphan's education.
(తల్లిదండ్రులు లేని ఆ పిల్లవాడి చదువు ఖర్చు అతను భరించాడు.)

c) You have to bear the expenses of your travel.
(నీ ప్రయాణ ఖర్చు నువ్వే భరించాలి.)

**5) They bore the signature of the governor.**
(అవి గవర్నర్ సంతకంతో ఉన్నాయి.)

Bear signature = సంతకంతో ఉండటం.

a) You received the money, you can't deny it. The receipt bears your signature.
(నువ్వాడబ్బు తీసుకున్నావు. కాదనలేవు. ఈ రసీదులో నీ సంతకం ఉంది)

b) The blank paper bears his signature.
(ఆ ఖాళీకాగితం అతడి సంతకాన్ని కలిగి ఉంది/ ఆ ఖాళీ కాగితం మీద అతడి సంతకం ఉంది.)

ఈ అర్థంతో bear వాడిన చోట్లంతా Carry వాడొచ్చు.

Postal cards, covers, etc మీద stamps ఉండటం కూడా bear అంటాం.

The cover doesn't bear any stamps.
(ఆ కవర్ మీద స్టాంపులు లేవు.)

**Exercise: Match the following:**

| A | B |
|---|---|
| 1. Harass | A) clever |
| 2. Fair | B) too much |
| 3. Mend | C) unnecessary |
| 4. Excessive | D) repair |
| 5. Shrewd | E) trouble /annoy |
| | F) just/ impartial |

**Key: 1)E 2)F 3)D 4)B 5)A**

**Lesson no 289 లో ఇచ్చిన matching కు వివరణ.**

**1) farming** = cultivation = వ్యవసాయం/ సాగు. అయితే farming వ్యవసాయానికి మాత్రమే పరిమితం కాకుండా ఇప్పుడు అన్నిరకాల పెంపకాలకూ వాడుతున్నారు.

poultry farming = కోళ్ల పెంపకం.

Aqua farming = చేపలు, రొయ్యల్లాంటి జలచరాల భారీ పెంపకం (వ్యాపార సరళిలో)

Farm = సాగులో ఉన్న భూమి.

Farm house = పొలంలో నివసించటానికి కట్టుకునే ఇల్లు.

**2) Polite** = Courteous = మర్యాద ఉన్న

He talks very politely.
(అతడు చాలా మర్యాదగా మాట్లాడతాడు.)

She refused to do it, though politely.
(మర్యాదగానే ఆ పని చేసేందుకు ఆమె తిరస్కరించింది.)

Courteous అన్నా అదే అర్థం వస్తుంది.

politeness = courtesy (కటసీ - 'క' నొక్కి పలుకుతాం. క, bird లో బ లాగ

**3) Narrate** = కథ చెప్పటం/ ఒక వృత్తాంతాన్ని/ కథను వివరించటం.

Pronunciation - నరెయ్‌ట్- రె నొక్కిపలుకుతాం.

She Narrated the short story to her children. (ఆమె తన పిల్లలకు ఆ కథ చెప్పింది)

**4) Enormous** = huge = చాలాపెద్దదైన/ చాలా ఎక్కువైన.

a) The Rashtrapati Bhavan is an enormous building.
(రాష్ట్రపతిభవనం చాలాపెద్దది.)

b) Sita had enormous patience.
(సీతకు చాలా ఓర్పు ఉంది.)

**5) Region** = ఓ ప్రాంతం.

Telangana region = తెలంగాణా ప్రాంతం

Andhra region = ఆంధ్ర ప్రాంతం

***- M. SURESAN***

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 292



**Sravan:** I suppose Pavan has left?
(పవన్ వెళ్లిపోయాడనుకుంటా? )

గమనించండి. పై sentence లో question word order (verb + subject order) లేకపోయినా చివర question mark ఉంది. ఒక్కోసారి చాలా అరుదుగా ఇలా questions అడగవచ్చు

**Bhavan:** Yea, he has, by the 11 o' clock train.
(అవును. వెళ్లిపోయాడు 11 గంటల బండికి.)

**Sravan:** But he told me that he would leave early in the morning.
(నాతో పొద్దున్నే వెళ్తానన్నాడు? )

**Bhavan:** He couldn't catch the early morning train. He was unable to get up early enough.
(పొద్దున train ను అందుకోలేకపోయాడు. పొద్దున్నే లేవలేకపోయాడు.)

**Sravan:** Why? (ఏం? )

**Bhavan:** He caught a bad cold during the night, and had no sleep at all.
(రాత్రి చాలా బాగా జలుబు చేసిందతడికి. అసలు నిద్రపట్టలేదు.)

**Sravan:** No luck there. The police have yet to catch the thief.
(లేదు. police లు ఇంకా దొంగను పట్టుకో వాల్సి ఉంది.)

**Bhavan:** It seems he caught hold of the thief as he grabbed the suit case, but the thief was stronger than him and escaped.
(ఆ దొంగ suitcase ను లాక్కోగానే పవన్ వాడిని పట్టుకున్నాడట. కానీ దొంగ ఇతడికంటే బలవంతుడవటంతో తప్పించుకున్నాడు.)

grab = దొరకబుచ్చుకోవడం/ లాక్కోవడం

**Sravan:** Unfortunate, really.
(నిజంగా దురదృష్టం.)

**Bhavan:** Pavan caught an employee in his company red handed stealing office property. He got him suspended. He thinks that this employee had his suit case stolen.
(office సొత్తు దొంగతనం చేస్తుండగా office లోని ఉద్యోగిని పవన్ పట్టుకున్నాడు. అతడిని suspend చేయించాడు. ఆ ఉద్యోగే ఈ దొంగతనం చేయించాడని పవన్ అనుకుంటు న్నాడు.)

**Sravan:** Pavan is too honest and too strict to tolerate such things.

**1) He couldn't catch the early morning train.**
అతను పొద్దుటి train ను అందుకో లేకపోయాడు.
Bus, train లాంటి వాహనాలను అందుకోవడం catch.

a) He wants to catch the early morning flight to Mumbai.
పొద్దున్నే ముంబైకి వెళ్లే విమానాన్ని అందుకోవాలను కుంటున్నాడతను.

b) You go to Tirupathi by train and catch a bus there to Tirumala.
తిరుపతికి train లో వెళ్లి అక్కడ తిరుమలకు bus అందుకో (ఎక్కు)

**2) He caught a bad cold.**
అతనికి విపరీతమైన జలుబు చేసింది.
ఇక్కడ catch కు అర్థం- ఏదైనా వ్యాధి సోకటం, తగలటం.
cold = చలి, a cold/ common cold = జలుబు

a) There are plenty of mosquitoes. Be careful. You may catch maleria.
దోమలు బాగా ఉన్నాయి. జాగ్రత్త. నీకు మలే రియా తగలొచ్చు

b) Don't stay too long in the water. You'll catch a fever. నీళ్లల్లో ఎక్కువసేపు ఉండకు. జ్వరం తగులుతుంది.

**7) Pavan caught an employee red handed.**
నేరం చేస్తుండగా ఓ ఉద్యోగిని పవన్ పట్టుకున్నాడు.
Catch red handed = (ఒకర్ని) నేరం చేస్తుండగా (ఇంకొకరు) పట్టుకోవటం.

a) The police caught the man red handed while he was stealing.
అతను దొంగతనం చేస్తుండగా police పట్టు కున్నారు.

b) She was caught red handed while abducting the child.
బిడ్డను దొంగిలిస్తూ (kidnap చేస్తూ) దొరికి పోయిం దామె.
Abduct = kidnap.

**8) I'll catch you later.**
నేను మళ్లీ తరువాత మాట్లాడతాను.
Catch some one later = మళ్లీ తర్వాత మట్లాడటం.
Catch some one = ఒకరిని కలుసుకోవడం/ ఒకరితో మాట్లాడటం.

a) Kumar: Hello Prakash, this is Kumar.
Prakash: You'll excuse me Kumar. I am in a meeting. I'll catch you later.
(Kumar, ఏమనుకోకు (క్షమించు). నేను meeting లో ఉన్నా. తర్వాత మాట్లాడతా.)

b) I missed his call but he caught me later.
(అతని phone call miss అయ్యాను. కానీ అతను మళ్లీ phone చేశాడు.)

# I catch what you say

**Sravan:** Then was it he I caught sight of on his way to the station? I saw him from a distance, so (I) wasn't sure it was he. Moreover I had been under the impression that he must have left by the morning train.
(అయితే అతన్నేనా నేను station కు వెళ్లేట ప్పుడు చూసింది? దూరాన్నుంచి చూశాను, అందుకని అతనే అని కచ్చితంగా అనుకోలేకపో యాను. అంతేకాకుండా అతను పొద్దున train లో వెళ్లిపోయాడనే అభిప్రాయంతో ఉన్నా.)

**Bhavan:** No doubt. It was him.
(అతనే. సందేహంలేదు.)

**Sravan:** He appeared to be worried about something during his stay here, wasn't he?
(అతనిక్కడ ఉన్నప్పుడు దేని విషయమో ఆదుర్దా పడుతున్నట్టు కనపడ్డాడు, కదా? )

**Bhavan:** He certainly was worried. He has outdone the others in his company, but others are catching up. He doesn't like it, naturally. He wants to stay on top always.
(అవును. నిజంగానే ఆందోళన చెందుతు న్నాడు. ఇంతవరకు వాళ్ల company లో ఇత రుల కంటే బాగా పనిచేశాడు, కానీ ఇతరులు కూడా ఇతని ప్రమాణాలను అందుకోబోతు న్నారు. అదతనికిష్టంలేదు. సహజమే కదా? ఎప్పుడూ అతనే ముందుండాలనుకుంటాడు.)

stay on top= ఇతరులకంటే ఎత్తయిన (ఉన్నత) స్థితిలో ఉండటం.

**Sravan:** I catch what you say. That's the trouble with all those who want to remain unbeaten.
(నువ్వనేది నాకర్థమయింది. ఇతరులతో ఓడి పోకూడదనుకునేవాళ్లకు ఇదే బాధ.)

unbeaten = అజేయులైన

**Bhavan:** Has he got back his lost suit case yet?
(అతడు పోగొట్టుకున్న suitcase దొరికిందా/ అతను తిరిగి పొందాడా? )

(అలాంటివాటిని సహించలేనంత నిజాయతీప రుడూ నిక్కచ్చి మనిషీ పవన్.)

**Bhavan:** OK. My bus is coming. I'll (I will) catch you later.
(నా bus వస్తోంది. నీతో తర్వాత మాట్లాడ తాను.)



Real life situations లో English conversation లో తరచూ వినిపించే మాటల్లో catch ఒకటి. catch/ catch తో కూడిన expressions కొన్ని ఇప్పుడు తెలుసుకుందాం.
(catch - present tense. caught - past tense and participle.)

Catch అంటే చాలామందికి తెలిసిన అర్థాలు:

1) గాలిలో ఎగురుతున్న (బంతి లాంటి) వస్తువుల్ని పట్టుకోవడం. Catch a ball/ catch a fruit (falling) etc.
I caught the keys as he threw them to me.
అతను తాళంచెవులు నావైపు విసిరితే నేను పట్టుకున్నాను.

2) తప్పించుకుని పారిపోతున్న వాళ్లను/ జంతువులను పట్టుకోవడం, catch.
a) She tried to catch her child running on to the road.
Road మీదికి పరుగెత్తుతున్న తన బిడ్డను పట్టుకోవ డానికామె ప్రయత్నించింది.
b) The cat caught the mouse = పిల్లి ఎలుకను పట్టుకుంది.

ఈ అర్థాలతో మనం catch ఎక్కువ వాడుతుంటాం. ఇప్పుడు catch/ catch తోటి వచ్చే expressions మరికొన్ని గమనిద్దాం.

**Look at the following expressions from the dialogue between Bhavan and Sravan:**

1) He couldn't catch the early morning train.
2) He caught a bad cold.
3) Was it he I caught sight of on his way to the station.
4) He has outdone the others in his company but the others are catching up.
5) I catch what you say.
6) The police have yet to catch the thief.
7) Pavan caught an employee red handed stealing office property.
8) I'll catch you later.

**3) Was it he I caught sight of?**
= అతన్నేనా నేను చూసింది?
Catch sight of = ఒకర్ని/ ఒక వస్తువును అనుకో కుండా చూడటం/ కంటబడటం

a) He doesn't go anywhere near the police station. He is afraid that police may catch sight of him.
అతను police station దరిదాపులకెళ్లడు, police వాళ్ల కంటబడవచ్చని భయం.

b) I caught sight of him as he was getting down from the bus.
అతను bus దిగుతున్నప్పుడు నా కంటబడ్డాడు.

**4) He has out done the others in the company but the others are catching up =**
ఇతరులకంటే బాగా పనిచేశాడు, కానీ ఇతరులు ఇతని స్థాయినందుకొంటున్నారు.
Catch up = ముందున్న వాళ్లను (పోటీలో, క్రీడల్లో, సాధించటంలో) సమీపించటం.

a) India is ahead of China in software, but China is catching up.
Software లో చైనా కంటే భారత్ ముందంజలో ఉంది, కానీ చైనా మనల్ని సమీపిస్తోంది. (త్వరలోనే మనతో సమానమవ్వచ్చు)

b) India can never catch up with Japan in technology.
సాంకేతికంగా భారత్ జపాన్ స్థాయికి చేరుకోలేదు.

c) In the race Hemu has the lead, but Hari is catching up.
ఆ (పరుగు) పందెంలో హేము ముందున్నాడు అయినా హరి అతడిని సమీపిస్తున్నాడు.

**5) I catch what you say.**
నువ్వన్నది నాకర్థమవుతోంది.
catch (ఇక్కడ) = అర్థమవడం/ వినపడటం

a) I couldn't catch him in that noise and crowd .
అంత గొడవ/ జనంలో అతను చెప్పింది నాకు విన పడలేదు.

b) It's difficult to catch his English.
అతడి English అర్థమవటం కష్టం.

**6) The police have yet to catch the thief.**
పోలీసులు దొంగనింకా పట్టుకోలేదు.
దొంగల్ని, నేరస్థులను పోలీసులు పట్టుకోవడం = catch thieves/ criminals, etc.

**EXERCISE**

**Match the following**

| A | B |
|---|---|
| 1. Alien | A. embrace |
| 2. Cobbler | B. change |
| 3 hug | C. Foreign |
| 4 Shift | D. weak |
| 5. Stubborn | E. shoe maker/ repairer |
| | F. firm |

Lesson 290 లోని matching exercise కు వివరణ:

**1. Obey** = follow = (ఆజ్ఞలు, ఆదేశాలు లాంటివి) అనుసరించటం/ పాటించటం/ శిరసావహించడం/ బద్ధులై ఉండటం.
Obey my orders = నా ఆజ్ఞలను పాటించు.
(Obey చేసేవాళ్లు obedient గా ఉంటారు.) An obedient child = తల్లిదండ్రుల మాటవినే బిడ్డ.

**2. Traffic** = Illegal trade = చట్ట విరుద్ధమైన వ్యాపారం. (మామూలు అర్థం= రాకపోకలు - Road మీద). Trafficking in women/ Immoral trafficking = ఆడవారితో (వ్యభిచార) వ్యాపారం చేయటం. Immoral Trafficking Act = వ్యభిచార నిరోధక చట్టం.

**3. Pursue** = chase = వెంటబడి తరమటం.
1) The police pursued the thief = Police లు దొంగను వెంటాడారు.
2) ఉన్నత విద్యలాంటివి అభ్యసించటం.
3) ఒక విషయాన్ని వదలకుండా దానిని గురించి మాట్లాడటం, ఏదైనా చేయటం.

**4. Meek** = humble = సాధు స్వభావం కలిగి, నిరాడంబరంగా ఉండే

**5. Remarkable** = Extraordinary = అసాధారణ మైన/ బాగా చెప్పుకోతగిన India's progress in software is remarkable = software లో భారత్ ప్రగతి చెప్పుకోదగ్గదే (గొప్పగా).

**- M. SURESAN**







# I appreciate your courage

**Bhargav:** Oh God, What's that mark of injury on your chin? Have you taken to boxing or what?

(ఒరిదేవుడో, నీగడ్డం మీద ఆరక్తం మరకేమిటి? Boxing ఏదైన్నా మొదలెట్టావా ఏంటి? )

Take to = ఆసక్తితో మొదలు పెట్టడం, తర్వాత కొనసాగించడం.

**Raghav:** What do you think? I had to fight with a goon trying to abduct a child. He caught me on the chin. I hit back and landed a nice blow on his cheek.

(ఏంటనుకున్నావ్? ఓ బిడ్డను అపహరించుకు పోతున్న దుర్మార్గుడితో పోట్లాడాల్సి వచ్చింది. వాడు కొట్టిన దెబ్బ నాగడ్డం మీద తగిలింది. నేనూ తిరిగి కొట్టాను. వాడి చెంప మీద బాగా తగిలేలా కొట్టాను)

goon = గుండా.

**Bhargav:** When was all this?

(ఇదంతా ఎప్పుడు జరిగింది? )

**Raghav:** Just two days ago.

(రెండు రోజుల కిందటే.)

**Bhargav:** How did it all happen?

(ఇదంతా ఎలా జరిగింది? )

**Raghav:** Caught in rain I was returning home late at night. I caught my breath when I saw some one moving suspiciously, and then heard people shouting, "Catch him, Catch him".

(వర్షంలో చిక్కుకుని ఇంటికి రాత్రి ఆలస్యంగా వస్తున్నా. ఎవరో అనుమానాస్పదంగా తిరుగాడతూ కనపడడంతో... భయం, ఆశ్చర్యంతో నాకు శ్వాస ఆడలేదు. అంతలోనే పట్టుకోండి, అని మనుషులు అరవటం విన్నాను)

**Bhargav:** You had quite an adventure.

(మంచి సాహసకృత్యమే ఎదురైంది నీకు)

**Raghav:** Let me finish. I recovered. I saw a child in his arms. I hit him squarely on his cheeks, and got hold of the child. He boxed me on the chin and escaped.

(నన్ను పూర్తిగా చెప్పనీ. వాడి చేతుల్లో బిడ్డను చూశాను. వాడి చెంపమీద మంచి దెబ్బకొట్టాను. బిడ్డను పట్టుకున్నాను. వాడు నా గడ్డం మీద పిడికిలితో కొట్టి పారిపోయాడు)

hit squarely = నేరుగా (ఎదురుపోటుతో) కొట్టడం.

Box = గుద్దటం.

**Bhargav:** So you were the hero of the day.

(అంటే నువ్వు ఆ రోజు హీరో అన్నమాట)

**Raghav:** You can say that. He caught me off guard. Otherwise I wouldn't have received even this blow.

(నేను ఏమరుపాటుగా ఉన్నప్పుడు పట్టుకున్నాడతను. లేకుంటే ఈ దెబ్బకూడా తగిలేది కాదు.)blow = దెబ్బ.

**Bhargav:** You should have seen it

(నువ్వది ముందే చూసుండాల్సింది) See = ఊహించడం/ముందే ఊహించగలిగి ఉండటం.

**Raghav:** If I had seen it I would have ducked. But then the child could have been hit.

(నేనది చూసి ఉంటే, తలవంచేవాడిని. కానీ ఆ దెబ్బ బిడ్డకు తగిలుండేది.)

**Bhargav:** I appreciate your courage.

(నీ ధైర్యం నేను మెచ్చుకుంటున్నా.)

❖ ❖ ❖

catch తో వచ్చే మరికొన్ని మామూలు expressions ఈసారి తెలుసుకుందాం.

1) He caught me on the chin
2) Caught in rain
3) I caught my breath
4) He caught me off the guard

**1) He caught me on the chin.**

(నా గడ్డం మీద దెబ్బకొట్టాడు/ వాడుకొట్టిన దెబ్బ నా గడ్డానికి తగిలింది.)

Catch (somebody) on a part of the body= దేహంమీద ఏ భాగానికైనా దెబ్బ తగిలేలా కొట్టడం.

a) The thug caught him squarely on the face.

(ఆ దుండగుడు తిన్నగా అతని మొహం మీద కొట్టాడు.)

squarely = పక్కల నుంచి కాకుండా ఎదురుగా. (కొట్టడం)

b) He caught the boy on the ribs.

(పక్కటెముకలకు తగిలేలా ఆ అబ్బాయిని కొట్టాడతను)

c) He caught him on the injured arm again and again.

(గాయపడ్డ చేతిమీదనే మళ్లీ మళ్లీ కొట్టాడతను.)

**2) Be caught in rain I was returning home late at night.**

వర్షంలో చిక్కుకుని ఇంటికి ఆలస్యంగా వస్తున్నా.

be caught in = ఏ పరిస్థితిలోనైనా (ముఖ్యంగా కష్టాల్లో) చిక్కుకోవటం

a) I was caught in rain and was totally drenched.

(వర్షంలో చిక్కుపడి పూర్తిగా తడిసిపోయా.)

b) If you have no proper plans about money you will be caught in financial problems.

(డబ్బు గురించి సరైన పథకం లేకపోతే ఆర్థిక ఇబ్బందుల్లో చిక్కుకుంటావు.)

c) He is often caught in problems because of his interest in others' affairs.

(ఇతరుల విషయాలను ఎక్కువగా పట్టించుకోవడం వల్ల అతను చిక్కుల్లో పడుతుంటాడు.)

**3) I caught my breath.**

(భయం/ ఆశ్చర్యం వల్ల నాకు ఊపిరాడలేదు/ శ్వాస ఆగిపోయినట్లయింది.)

a) I caught my breath when I saw the dog carrying away the baby.

(కుక్క ఆబిడ్డనెత్తుకు పోవడం చూసి నాకు శ్వాస ఆగిపోయింది.)

(భయం, ఆశ్చర్యం Shock వల్ల) ఒక్కోసారి చూసింది నమ్మశక్యం కాకుండా పోవటం వల్ల)

b) When the man given up for dead appeared, the villagers caught their breath.

(చనిపోయాడనుకుని వదిలేసిన మనిషి తిరిగి ఊర్లోకి రాగానే, ఆ గ్రామస్థులందరికి శ్వాస ఆగిపోయింది - ఆశ్చర్యం, భయంతో.)

c) I am sure he will catch his breath if I tell him that he has been selected .

(selected అయ్యాడని చెపితే వాడు సంతోషపడతాడు.)

**4) He caught me off the guard.**

Catch someone off the guard- ఇది చాలా సాధారణంగా conversation లో వాడే మాట. ఏమరుపాటున / ఆదమరచి/ సంసిద్ధంగా లేనప్పుడు పట్టుకోవటం/ దెబ్బతీయటం.

a) The strikers caught the police off the guard and entered the minister's chambers.

(పోలీసులు అప్రమత్తంగా లేని/ సంసిద్ధంగా లేని సమయంలో ఆందోళనకారులు మంత్రి గదిలోకి దూసుకెళ్లారు.)

b) Some of the police officer's questions caught him off the guard.

(Police officer అడిగిన కొన్ని ప్రశ్నలకు జవాబులివ్వటానికి అతను సంసిద్ధంగా లేడు / ఆ ప్రశ్నలడుగుతారని అనుకోలేదు.)

c) They caught the enemy forces off the guard.

(శత్రుసేనలు ఏమరుపాటున ఉన్నప్పుడు వాళ్లు దెబ్బతీశారు.)

**Exercise (Match the following exercise for this lesson).**

| A | B |
|---|---|
| 1. Amaze | A) offspring |
| 2. descendant | B) miserly |
| 3. grave | C) fury (great anger) |
| 4. stingy | D) surprize |
| 5. rage | E) serious |
| | F) gentle |

**Key**

1. D 2. A 3. E 4. B 5.C

Lesson No. 291 Matching exercise కు వివరణ:

**1) Harass** (హెరస్/హరాస్) - హెరస్ అన్నపుడు 'హె' నొక్కి పలుకుతాం. హరాస్ అన్నపుడు 'రా' నొక్కి పలుకుతాం) = Trouble / annoy = వేధించటం / తీవ్రంగా విసిగించటం. Newspapers లో మనం తరచూ చదువుతుంటాం కదా-

a) She committed suicide because her ... in-laws harassed her.

(అత్తగారింటి వాళ్ల వేధింపులకు ఆమె ఆత్మహత్య చేసుకుంది.)

**2) Fair** = Just (న్యాయమైన)/ impartial (నిష్పాక్షికమైన)

The judgment is fair.

( తీర్పు న్యాయంగా/ నిష్పాక్షికంగా ఉంది.)

A thirty rupee fare for this distance is fair.

( ఈ దూరానికి 30 రూపాయల ఛార్జీ న్యాయమే.)

**3) Mend** = repair = సరిచేయటం.

Mend clothes /shoes, etc = చిరుగులు కుట్టటం

**4) Excessive** = too much = అతి అయిన.

The charges are excessive.

( charges మరీ ఎక్కువగా ఉన్నాయి.)

Parents now a days put excessive pressure on their children in studies.

(ఈ రోజుల్లో తల్లిదండ్రులు తమ పిల్లల చదువు విషయంలో మరీ ఎక్కువ ఒత్తిడి పెడతున్నారు.)

**5. Shrewd** = clever = తెలివైన

a) He is a very shrewd politician.

(చాలాతెలివైన/సూక్ష్మంగా ఆలోచించే రాజకీయనాయకుడతడు.)

ప్రశ్న: ఇంగ్లిష్‌లో కింది ప్రశ్నను ఎలా అడగాలి?

I) నీవు మీ అమ్మ, నాన్నలకు ఎన్నోవ సంతానం?
II) speak, talk మొదలైన words ను ఏయే సందర్భాల్లో ఎలా ఉపయోగించాలో వివరించే పుస్తకాన్ని తెలపగలరు.

**–పి. అప్పారావు, మచిలీపట్నం.**

జ: I) సహజంగా, సరళంగా అడిగేవిధానం English లో లేదని చాలాసార్లు చెప్పటం జరిగింది.

II) Speak = Talk= మాట్లాడటం. అయితే ఒక ముఖ్యమైన విషయాన్ని గురించి కాస్త serious గా మాట్లాడటం speak. When any one speaks (ఎవరైనా మాట్లాడుతున్నప్పుడు) వినేవాళ్లు కూడా బదులు మాట్లాడుతున్నారా లేదా (సంభాషణలో పాల్గొనటంలాగా) అనేది అంత ముఖ్యం కాదు. The teacher spoke to the students about discipline (Teacher క్రమశిక్షణ గురించి పిల్లలతో మాట్లాడారు.) ఇక్కడ teacher మాత్రమే మాట్లాడటం జరుగుతుంది.

Talk అన్నప్పుడు సంభాషణ అనే అర్థం స్ఫురిస్తుంది. When we talk (మనం మాట్లాడితే) విషయం అంత serious కాకపోవచ్చు

we talk the whole night about our school days.

(మేం మా స్కూల్ రోజుల గురించి రాత్రంతా మాట్లాడుకున్నాం.)

b) ఒక భాష తెలిసి ఉండటం/ మాట్లాడటం అనడానికి



Speak a language అంటాం కానీ talk a language అనం. (speak a language = ఓ భాష మాట్లాడగలగటం, తెలిసి ఉండటం. speak in a language = ఏదైనా సందర్భంలో ఒక భాషలో మాట్లాడటం.

e.g. He spoke that days in english)

ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు, వివరణలూ Oxford Advanced Dictionary of Current English, longman's Dictionary of Contemporary English లాంటి books లో ఉంటాయి.

ప్రశ్న: i) కిందివాటికి తేడాను వివరించండి. వాటిలో ఏది సరైనదో కూడా తెలియజేయండి.

I am watching Tajmahal
I am seeing Tajmahal
I am looking Tajmahal

ii) ఆయన నాకు రక్త సంబంధీకుడు.

ఆయన నాకు వరస (భార్య/భర్తల సంబంధంలాంటిది) అవుతారు.

వీటిని ఆంగ్లంలో ఎలా అడుగుతారు.

**–డి.గణేష్, పెరుమాళి.**

జ: i) I am watching the Tajmahal correct. I am seeing the Tajmahal wrong I am looking the Taj mahal. I am looking at the Taj mahal, correct.

I am watching అంటే కాస్త ఏకాగ్రత తో చూడటం I am looking at the Taj mahal అంటే Taj mahal చూస్తున్నానని మామూలుగా ఏ ఇతర వస్తువు/ మనిషినైనా చూసినట్లు అంత పరీక్షగా కాకుండా

ii) He is my blood relation

దీనికి correct english మాటలేదు.

**- M. SURESAN**

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 294




# catch 22 situation

**Nithin:** Hei, your trousers are the latest cut, when did you buy it?

నీ trousers (pant అనడం తప్పు.) అధునాతన fashion గా ఉంది, ఎప్పుడు కొన్నావు?

**Nirmal:** Don't you know that's in vogue now?

అదిప్పుడు fashion అని నీకు తెలియదా?

vogue- వోగ్- fashion. చాలా మంచిమాట. conversation లో practice చేయండి.

**Nithin:** I know about it and I know too that it's fast catching on but I did not expect it to catch you so soon.

అది fashion అని నాకెప్పుడో తెలుసు. అది చాలా త్వరగా వ్యాపిస్తోందనీ తెలుసు. కానీ అది నిన్నింత త్వరగా ఆకర్షిస్తుందని అనుకోలేదు.

**Nirmal:** That shows how it has caught youngsters' fancy.

దాన్ని బట్టి తెలుస్తోంది, అది యువకులనెంత ఆకర్షించిందీ.

fancy- ఇక్కడ మోజు

**Nithin:** so you like it.

అంటే నువ్వు దాన్నిష్టపడుతున్నావన్నమాట.

**Nirmal:** I do like it of course, but I have a feeling that it hasn't augured well for me.

నాకిష్టమే. కానీ అదంత మంచి శకునం/ సంకేతంగా లేదనీ- కలిసి రాలేదనే భావం ఉంది నాలో.

augur- ఆగ- శుభ /అశుభ సూచకంగా ఉండటం.

augur well- మంచి (శుభసూచకం) గా ఉండటం/ శుభం సూచించటం.

augur ill- అశుభం సూచించటం. శకునం- omen

**Nithin:** Why do you feel so?

**Nirmal:** The minute I started wearing it I was caught out by a sudden change in the syllabus and pattern of the exam I am taking next month. The fees have been hiked too.

నేనది వేసుకున్న క్షణం నేను వచ్చే నెల రాసే exam syllabus పద్ధతిలో ఆకస్మిక మార్పు నన్నిబ్బందుల్లో పడేసింది. exam fees కూడా పెరిగింది.

**Nithin:** How did you come to buy it?

నువ్వు దానిని ఎలా కొన్నావు?

**Nirmal:** They were offering it at an introductory discount of 30%, so I bought it.

దాన్ని కొత్తగా ప్రవేశపెడుతున్న సందర్భంలో 30% తగ్గించి అమ్ముతున్నారు. అందుకని నేను కొన్నా.

introductory discount: ఏదైనా కొత్త వస్తువు మార్కెట్లోకి ప్రవేశ పెడుతున్నప్పుడు/ పరిచయం చేస్తున్నప్పుడు అమ్మకాలను ఆకర్షించేందుకు ఇచ్చే discount.

**Nithin:** 30% is a big discount, certainly.

30% discount పెద్ద తగ్గింపే మరి.

**Nirmal:** But there is a catch. The discount is offered only if you buy a shirt along with it.

అయితే ఇక్కడో తిరకాసు/ కిటుకుంది. ఒక shirt కొంటేనే ఈ discount ఇస్తారు.

**Nithin:** That's the trick.

అదన్నమాట కిటుకు.

**Nirmal:** Still it is worth it. The trousers cloth is light and soft. It must be expensive.

అయినా నష్టం లేదు,. మనం పెట్టిన డబ్బుకు తగిన విలువ ఉన్నదే. ఆ trousers cloth చాలా తేలిగ్గా మెత్తగా ఉంది. ఖరీదయిందై ఉండాలి.

**Nithin:** I feel like buying a pair too.

నేనూ ఒకటి కొనుక్కోవాలనుకుంటున్నాను.

Pair- జత. Trousers (Pants), Scissors లాంటివి English లో ఎప్పుడూ plural.



**Nirmal:** By the way what about your brother's job?

అదిసరేకానీ, మీ brother job విషయం ఏమయింది?

**Nithin:** He is caught up in a catch 22 situation. He needs experience to get a job, but unless he gets a job he can't get experience.

అతను catch 22 situation లో చిక్కుకున్నాడు. అనుభవం లేనిదే ఉద్యోగం రాదు. ఉద్యోగం వస్తేనే కాని అనుభవం రాదు.

**Nirmal:** Wish him good luck.

☺ ☺ ☺ ☺ ☺

Catch కు సంబంధించిన expressions, real life situations లో, daily conversations లో తరచూ వచ్చే మాటలు తెలుసుకుంటున్నాం కదా. మరికొన్ని ఈ lesson లో చూద్దాం.

**Look at the following sentences from the conversation above.**

1) I know too that it's fast catching on
2) That shows how it has caught youngsters' fancy
3) I was caught out by a sudden change in the syllabus and pattern of the exam I am taking next month.
4) But there is a catch.
5) He is caught up in a catch 22 situation

**1) I know that it's fast catching on.** ఇక్కడి expression, catch on.

catch on అంటే ఏదైనా ప్రజాదరణ పొందటం/ popular అవటం.

a) The game of cricket caught on with the beginning of the live telecast of the game = Cricket ను TV లో ప్రత్యక్ష ప్రసారం చేయడం ప్రారంభించడంతో అది చాలా ప్రజాదరణ పొందింది.

b) Hockey, though the national game of India, has never caught on = భారత జాతీయ క్రీడ hockey అయినప్పటికీ, అదంత ప్రజాభిమానం పొందలేదు.

c) This fashion is catching on here but hasn't been able to make a mark in the other places = ఈ fashion కు ఇక్కడ ఆదరణ బాగానే ఉంది కానీ ఇతర ప్రాంతాల్లో అంత ప్రభావం చూపటం లేదు.

**2) That shows how it has caught youngster's fancy.**

catch someone's fancy = ఒకరిలో మోజు కలిగించటం.

a) The fashion has caught the fancy of teenagers = 13 నుంచి 19 వరకూ వయసుగల యువతలో ఆ fashion మోజు కలిగించింది.

b) The catchy dialogue from the movie has caught the fancy of the audience = ఆ సినిమాలోని ఆ సంభాషణ చాలా వినోదకరంగా ఉండి అందరిలో మోజు కలిగించింది/ అందర్నీ ఆకట్టుకుంది.

catchy (word/ dialogue/ song/ tune) = మంచి వినోదం కలిగించి సులభంగా నోట్లో ఆడే/ గుర్తు పెట్టుకోనేందుకు వీలుగా ఉండే (మాట/ సంభాషణ/ పాట/ రాగం). ముఖ్యంగా వ్యాపార ప్రకటనల్లో వచ్చే వ్యాఖ్యలు చాలా catchy గా ఉంటాయి.

catch the fancy లాగానే, catch the imagination, catch the interest, of some one అని కూడా వాడుకలో ఉంది.

catch the imagination = మనిషి ఊహాశక్తిని రెచ్చగొట్టడం.

Space travel has caught the imagination of many writers and film makers = అంతరిక్ష యానం చాలామంది రచయితల సినీ నిర్మాతల ఊహను రెచ్చగొట్టింది. (అంటే అంతరిక్షయానంలోని వివిధ అంశాలతో రచయితలను పుస్తకాలు రాసేట్టు, నిర్మాతలను సినిమాలు తీసేట్టు చేసిందని).

catch the interest = ఆసక్తి కలిగించటం.

a) Computer games have caught the interest of children = computer games పిల్లల్లో ఆసక్తిని రేకెత్తించాయి.

b) Many episodes of the Mahabharatham catch the interest of readers = మహాభారతంలోని చాలా వృత్తాంతాలు పాఠకుల్లో ఆసక్తిని రేకెత్తిస్తాయి.

**4) But there is a catch** = ఇక్కడేదో కిటుకుంది.

ఇక్కడ catch కు అర్థం, కిటుకు. అంటే పైకి కనపడేంత ఆకర్షణీయం కాకుండా లోపల ఏదైనా మనకు అనుకూలమైంది కాకపోవటం.

a) Buy one shirt, get two shirts free? Oh, there must be a catch in it.

ఒక shirt కొంటే రెండు shirts ఉచితమా? దీంట్లో ఏదో కిటుకుంది. (అంటే ఒక shirt కు రెండు shirts free అంత సులభంగా ఎవరూ ఇవ్వరు. దీనికేదో షరతుంటుందని.)

b) You can enter the competition free, but the catch is you must buy at least Rs 1000 worth of goods in the store = ఆ పోటీలో ఉచితంగా ప్రవేశించవచ్చు కాని కిటుకేంటంటే ఆ shop లో వెయ్యి రూపాయల వస్తువులు కొనాలి.

c) Only Rs 2000 per square yard in such a busy area? There must be a catch in it.= అంత రద్దీగా ఉండే ఆ centre లో చదరపు గజం, రెండువేలేనా? నమ్మశక్యంగా లేదు ఏదో కిటుకుంది దీంట్లో. (పైకి కనిపించేంత అనుకూలం కాదు అని.)

**5) He is caught up in a catch 22 situation** = రెండు విషయాల్లో రెండోది అనుకూలిస్తేగానీ మొదటిది జరగదు, రెండోది జరగాలంటే మొదటిది అనుకూలించాలి. ఉదాహరణకు, experience ఉంటేగానీ job రాదు. కానీ job రానిదే experience రాదు. అలాగే పెళ్లి కుదిరితేగానీ పిచ్చికుదరదు, పిచ్చి నయమైతేగానీ పెళ్లి కుదరదు. ఇలాంటి పరిస్థితి, catch 22 situation.

eg: He needs time and money to get a better job, but his present job gives him no time. If he leaves the job he can't have the money to live on. It is a catch 22 situation.= ఇప్పుడున్నదానికంటే మెరుగైన ఉద్యోగం వెతుక్కోవాలంటే time కావాలి. కాని ఇప్పుడున్న ఉద్యోగం ఆ time ఇవ్వదు. ఇప్పుడా job వదిలేస్తే బతకడానికి డబ్బుండదు. ఇది catch 22 situation.

catch 22 conversation లో చాలా తరచుగా వినిపిస్తుంటుంది. Practice చేద్దాం.

---

**EXERCISE**

**MATCH THE FOLLOWING**

| A | B |
|---|---|
| 1) Cookie | A) oppose |
| 2) Protest | B) uninterested |
| 3) Vague | C) clever |
| 4) Indifferent | D) Worried |
| 5) Keen | E) Uncertain |
| | F) Biscuit |

**KEY: 1 F 2 A 3 E 4 B 5 C**

**- M. SURESAN**

# SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 295

# ప్రతిభ

# I want to beat the ..

**Rupasi:** Where are you rushing Akrithi?
(ఎక్కడికంత త్వరగా వెళ్తున్నావ్? )

**Akrithi:** I am going to see the paintings exhibition.
(నేను వర్ణచిత్రాల ప్రదర్శనకు వెళుతున్నాను.)

Paintings = వర్ణచిత్రాలు

**Rupasi:** But why so early?
(కానీ ఇంత ముందుగా ఎందుకు? )

**Akrithi:** I want to beat the late hour rush.
(ఆలస్యంగా వెళితే జనం ఎక్కువగా ఉంటారు. అలాంటిదేంలేకుండా తాపీగా చూసేందుకు.)

Late hour rush = ఆలస్యం అవటం వల్ల ఎక్కువయ్యే జనం.

**Rupasi:** I see that enthusiasm is catching.
(ఇప్పుడు నాకర్థం అయింది. ఉత్సాహం, ఆసక్తి లాంటివి కూడా వ్యక్తి నుంచి వ్యక్తికి వ్యాపిస్తాయని)

**Rupasi:** I don't know much about art. But I found one of the pictures off the beaten track. It is different from the usual type of paintings.
(నాకు చిత్రకళ గురించి అంతగా తెలియదు. కానీ వాటిల్లో ఒకటి చాలా విలక్షణంగా ఉంది. మామూలు తరగతి చిత్రాల కన్నా అది భిన్నంగా ఉంది.)

**Akrithi:** How about coming with me?
(నాతో రాకూడదూ? / వస్తావా? )

**Rupasi:** That'd be a pleasure, though I've a lot of work to do. Tomorrow evening is the dead line. I want to beat it.
(నాకు రావటం సంతోషమే ఎంతో పనున్నా. రేపు సాయంత్రం ఆ పని పూర్తవటానికి గడువు. గడువు లోపల పూర్తి చేయటానికి ప్రయత్నిస్తున్నా.)

**Akrithi:** (I) wish I were as hardworking as you. For sheer hard work you take some beating.
(నీలాగనే కష్టపడి పనిచేయాలని నా కోరిక. కష్టపడే విషయంలో నీది పైచేయి.)

**Rupasi:** Thank you for the compliment though I don't know how far I deserve it.

**Akrithi:** It really beets me. Till a few months ago, I did not know anything about painting or art in general. But thanks to my uncle, I find myself drawn to art, in particular to oil paintings
(నాకే అర్థం కావటంలేదు. కొన్ని నెలల కిందటి వరకూ, నాకు వర్ణచిత్రాలన్నా, అసలు చిత్రకళ అన్నా ఏమీ తెలియదు. కానీ మా uncle పుణ్యమా అని, చిత్రకళ పట్ల ఆకర్షితురాలయ్యానని తెలుస్తోంది. ముఖ్యంగా తైలవర్ణ చిత్రాల పట్ల.)

Paintings = వర్ణచిత్రాలు - వివిధ రంగులతో వేసే బొమ్మలు. Art = చిత్రకళ. Oil paintings = తైలవర్ణ చిత్రాలు = నూనెలు కలిపిన రంగులతో వేసే బొమ్మలు.

**Rupasi:** (Are you) going to buy any of them?
(వాటిల్లో ఏదన్నా కొనబోతున్నావా? )

**Akrithi:** They are too expensive. I can't afford them.
(అవి మరీ ఖరీదుగా ఉన్నాయి. నేను అంత డబ్బు పెట్టుకోలేను.)

Afford = ఏదైనా కొనగలిగిన స్థితి

**Rupasi:** Weren't you thinking of buying a painting in one of the sections? The painter has caught accurately a village woman with a bundle of hay on her head.
(ఆ విభాగాల్లో ఒకదాన్లో ఉన్న painting కొనాలని అనుకున్నావు కదా- అందులో చిత్రకారుడు గడ్డిమోపు మోస్తున్న గ్రామీణ స్త్రీని చాలా correct గా చిత్రీకరించాడు)

**Akrithi:** Yea. But unfortunately some one else beat me to it. I was just 10 minutes late getting ready the money.
(అవును. కానీ దురదృష్టవశాత్తు నేను కొనేముందే ఇంకెవరో దాన్ని కొనేశారు. డబ్బు సిద్ధం చేసుకునేందుకు 10 నిమిషాలు late అయింది అంతే.)

**Rupasi:** What attracts you so much in it?
(అందులో నిన్నంతగా ఆకర్షించిందేమిటి? )

**Akrithi:** Nothing beats the colour combination and the realism in it.The setting sun is caught in wonderful shades of colours.
అందులో వర్ణాల కలయిక, వాస్తవికత మిగతా చిత్రాల్లోకన్నా గొప్పగా ఉంది. అస్తమిస్తున్న సూర్యుడిని/ సూర్యాస్తమయాన్ని గొప్ప రంగుల ఛాయల్లో పట్టుకున్నాడు చిత్రకారుడు.)

shades of colour = ఒకే రంగులోని ఛాయలు - ముదురు, లేత ...

(నీ మెప్పుదలకు నాకెంత అర్హత ఉందో నాకు తెలియదు కానీ, Thanks.)

☺ ☺ ☺ ☺ ☺

Daily Life Situations లో చాలా frequent గా వినిపించే మాట beat. దీని గురించి ఈ lesson లో తెలుసుకుందాం.

beat అంటే మామూలు అర్థం మనకు తెలిసిందే- కొట్టడం. ముఖ్యంగా బాగా దెబ్బతగిలేటట్లు, మళ్లీమళ్లీ కొట్టడం. అంటే తీవ్రంగా కొట్టడం. మామూలుగా కొట్టడం hit/ strike.

beat - past tense: beat (బీట్ అనే ఉచ్చరిస్తాం, బెట్ కాదు.) past participle: beaten. beat అంటే మామూలుగా వాడే ఇంకో అర్థం - ఓడించటం.

a) Bangladesh beat India
(బంగ్లాదేశ్ భారత్‌ను ఓడించింది)

b) It's difficult to beat Australia =
Australia ను ఓడించటం కష్టం.

కొట్టుకోవటం- ఈ అర్థంతో His heart is still beating అంటాం.

**Now look at the following sentences from the dialogue above.**

**1) I want to beat the late hour rush** =
ఆలస్యం అవటం వల్ల వచ్చే గుంపు బాధ లేకుండా ఉండాలనుకుంటున్నా.

beat the rush = avoid the rush తొక్కిసలాటలో పడకుండా ఉండటం.

I am going early to beat the rush.
(తొక్కిసలాట పాలవకుండా ఉండేందుకు ముందే వెళుతున్నా.)

ఈ భావంతో - అంటే ఒక విషయం వల్ల బాధపడకుండా ఉండేందుకు, తప్పించుకునేందుకు అనే భావంతో beat చాలా విధాలుగా వాడతారు.

a) He avoided the main road to beat the traffic signals =
Traffic signals బాధలేకుండా ఉండేందుకు Main Road వదిలేసి పక్క roads మీద వెళ్లాడు.

b) She wants to beat the tax rules by investing in different kinds of savings
పన్ను నిబంధనల బారి నుంచి తప్పించుకునేందుకు ఆమె వివిధ పొదుపు పథకాలలో పెట్టుబడి పెట్టింది. invest = పెట్టుబడి పెట్టడం. savings = పొదుపు/ పొదుపు చేసిన డబ్బు)

**2) It really beats me** = నాకేం తెలియటంలేదు. అయోమయంగా ఉంది.

a) How he is going to travel with such heavy luggage really beats me = అంత సామానుతో ఎలా ప్రయాణం చేస్తాడనేది నాకేం తెలియటం లేదు.

b) Anil: How are you going to clear your debts?
(నీ అప్పులెలా తీరుస్తావు)
Kamal: It really beats me.
(నాకేం తెలియటం లేదు)

**3) But unfortunately some one else beat me to it** =
ఇంకెవరో నాకంటే ముందే నేను చేయాలనుకున్న పని చేసేశారు. Beat some one to something = ఒకరొక పనిచేద్దామనుకున్నంతలో ఇంకొకరా పని చేసేసి విజయం పొందటం.

a) Rahul beat Sreenu to a place in the team
తనకు జట్టులో స్థానం వస్తుందని శ్రీను అనుకుంటున్నంతలో అది రాహుల్ కొట్టేశాడు.

b) The Eenadu beat the other Newspapers to exposing the scam =
ఈనాడు ఆ కుంభకోణాన్ని మిగతా పత్రికల కంటే ముందే బయటపెట్టింది. (వాళ్లు బయటపెడదాం అనుకున్నంతలో, ఈనాడు ఆ పని చేసేసింది)

**4) Nothing beats the colour combination and the realism in it** = ఏదికూడా దాన్ని మించలేదు - రంగుల కలయికలో, వాస్తవికతలో.

beat అంటే ఇక్కడ మించటం.

a) No other bowler can beat Muralidharan in spin bowling =
spin bowling లో ఏ ఇతర player కూడా మురళీధరన్‌ను మించలేడు.

b) In Tennis he beats others =
Tennis లో అతడు ఇతరులను మించిపోతాడు.

**5) I found one of the pictures off the beaten track.**

Off the beaten track = మామూలుగా ఉండే పోకడకన్నా విభిన్నంగా, విలక్షణంగా ఉండటం.

a) Director BN Reddy's movies were off the beaten track =
దర్శకుడు బియన్ రెడ్డి సినిమాలు మామూలు (మూసలో పోసిన సినిమాల్లా కాకుండా) విభిన్నంగా, విలక్షణంగా ఉండేవి.

b) The music in the movie is off the beaten track = ఆ సినిమాలో, సంగీతం విలక్షణంగా/ విభిన్నంగా ఉంది.

**6) Beat the deadline**

Deadline = గడువు. Beat the deadline = గడువు మించకుండా ఉండటం.

a) The project has to be completed in a week. They are working overtime to beat the deadline =
వారం లోపల ఆ project పూర్తవాలి. ఆ గడువు అందుకొనేందుకు వాళ్లెక్కువ సమయం పనిచేస్తున్నారు.

b) They may not be able to beat the deadline = గడువు లోపల పని పూర్తిచేయలేరేమో.

**7) For sheer hard work you take some beating** = కష్టపడి పనిచేయటంలో నువ్వెందర్నో మించిపోతావు.

Take some beating = ఇతరుల్ని మించిపోవటం.

a) As a tourist spot Kashmir takes some beating = పర్యాటక ప్రదేశంగా కాశ్మీర్ అన్నింటిని మించిపోతుంది.

b) For sheer taste Hyderabad Biryani takes some beating = రుచికి హైదరాబాద్ బిరియానీని మించింది లేదు.

అయితే to take a beating (to take some beating కాకుండా) అంటే ఓడిపోవటం/ దెబ్బతినటం (పేరు, ప్రతిష్ఠ లాంటివి)

a) The team has taken a beating in the last match = క్రితం Match లో ఆ జట్టు ఓడిపోయింది.

b) With its defeat by Bangladesh, India's Cricketing prestige has taken a severe beating = బంగ్లాదేశ్‌తో ఓటమి పొందటంలో భారత్ Cricket ప్రతిష్ఠ తీవ్రంగా దెబ్బతినింది.

**- M. SURESAN**

## SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 296




# Enthusiasm is catching

Spoken English లో daily conversational situations లో catch తో వాడే మరికొన్ని expressions గురించి తెలుసుకుందాం. కింది sentences ఒకసారి చూడండి.

1) Enthusiasm is catching
2) The painter has caught accurately a village beauty with a bundle of hay on her head
3) The setting sun is caught in wonderful shades of colours.

చివరి రెండూ చిత్రలేఖనం (art), photography కి సంబంధించిన మాటలైనా మామూలు సందర్భాల్లో కూడా వాడుతుంటాం.

**1) Enthusiasm is catching** =

ఉత్సాహం అనేది ఒకరినుంచి ఒకరికి వ్యాపిస్తుంది.

ఇక్కడ catching అనే మాటకు అర్థం జాగ్రత్తగా గమనించండి. ఈ సందర్భంలో catching కు అర్థం- ముఖ్యంగా అంటువ్యాధుల్లాంటివి ఒకరినుంచి ఇంకొకరికి వ్యాపించే/ సోకే అని.

a) Measles is catching = పొంగు/ ఆటలమ్మ అంటువ్యాధి.

b) Jagan: Prakash is down with some illness (ప్రకాష్ ఏదో జబ్బుతో బాధపడుతున్నాడు.)

Varun: Hope it is not catching. (అది అంటువ్యాధి కాదుకదా? / అది ఒకర్నించి - అతన్నించి - ఇంకొకరికి సోకదు కదా)

ఒకర్నించి ఇంకొకరికి సోకే వ్యాధిని the disease is catching అంటాం. దీన్నే మామూలుగా an infectious disease అని అంటుంటాం.

Typhoid is catching = Typhoid ఒకర్నించి ఇంకొకరికి వ్యాపిస్తుంది/ సోకుతుంది= Typhoid is infectious/ Typhoid is an infectious disease= Typhoid అంటువ్యాధి.

భావాలూ, ఉద్రేకాలూ (feelings and emotions), మనోస్థితులూ (moods) కూడా catching కదా. అంటే మనం ఎవర్నైనా సంతోషంగా ఉత్సాహంగా ఉండటం చూస్తే మనకూ ఉత్సాహం (enthusiasm), సంతోషం (happiness/ joy) కలుగుతాయి. నిరుత్సాహం, శోకం, చూస్తే మనలో కూడా అదే కలుగుతుంది. ఇవన్నీ కూడా catching. (= spreading)

Habits are catching, and so are fashions

(అలవాట్లూ వ్యాపిస్తాయి, అలాగే fashions కూడా.)

Tears are catching= కన్నీరు కూడా ఒకర్నించి ఒకరికి వస్తుంది. (సినిమాల్లో ఏడుపు scene లు ప్రేక్షకుల్లో ఏడుపు కలిగించినట్లు)

**2) The painter has caught accurately a village beauty with a bundle of hay on her head**=

గడ్డిమోపు తలమీద మోస్తున్న గ్రామీణ యువతి భంగిమను ఆ చిత్రకారుడు తన చిత్రంలో పట్టాడు/ బంధించాడు/ చిత్రించాడు.

**3) The setting sun is caught in wonderful shades of colours (the painting)**=

ఆ వర్ణచిత్రం సూర్యాస్తమయాన్ని ఆశ్చర్యంగొలిపే రంగుల ఛాయల్లో చూపించింది/ చిత్రించింది.

ఏదన్నా సన్నివేశాన్ని/ భంగిమను/ సందర్భాన్ని వాస్తవికతతో చిత్రంలోకానీ/ Photo లోకానీ చిత్రించటం/ బంధించటాన్ని కూడా catch అంటాం.

a) The newspaper has published photos which have caught the minister in the act of taking a bribe = మంత్రి లంచం తీసుకుంటూ చిక్కిన/ దొరికిపోయిన Photo లను ఆ పత్రిక ప్రచురించింది.

b) The Photo/ The picture catches the child with its bright innocent toothless smile= ఆ Photo/ చిత్రం బోసినోటితో అమాయకంగా నవ్వుతున్న బిడ్డను చూపిస్తోంది.

---



***Q. 1.*** *Please give meanings for the following and explain them with examples.*

*illegal illicit illegitimate*

*lawless unlawful.*

***- K.Sainath, Tenali***

**Ans.**

**Illegal:** Against law as found in statute books (books like civil and criminal procedure code according to which courts give judgments), anything the Government has banned, or against court orders = చట్టస్మృతులకు వ్యతిరేకమయింది, ప్రభుత్వం నిషేధించింది, court ఆదేశాలకు వ్యతిరేకమయింది illegal

a) Drugs/ Weapons banned by law are illegal drugs/ weapons. చట్టం నిషేధించిన drugs/ ఆయుధాలు illegal drugs, illegal weapons

b) Continuing to occupy a place after a court has passed order against the occupation is illegal occupation of the place (ఒక స్థలాన్ని ఆక్రమించటం చట్టం ప్రకారం వ్యతిరేకం అని court ఆదేశాల తర్వాత కూడా ఆక్రమించి ఉండటం illegal)

c) It is illegal to marry another person without divorcing one's wife / husband (ఉన్న భార్యకు/ భర్తకు విడాకులివ్వకుండా మరో వ్యక్తిని పెళ్ళాడటం ILLEGAL - చట్టం విరుద్ధం)

d) Having/ using weapons banned by law is ILLEGAL. (చట్టం నిషేధించిన ఆయుధాలను కలిగి ఉండటం/వాడటం చట్టవిరుద్ధం- ILLEGAL

**Unlawful:** Against law in general, not only against law as found in statute books, in court or in government orders, but also against rules as followed by people (unlawful అంటే చట్టాలకూ ప్రభుత్వ నిబంధనలకూ వ్యతిరేకమయినదే కాకుండా మామూలుగా ప్రజలు పాటించే నిబంధనలకు వ్యతిరేకం)

a) It is unlawful to occupy others property.

ఇతరుల ఆస్తులను స్వాధీనం చేసుకోవటం unlawful. చట్ట సమ్మతం కానిది.

b) If such an occupation continues even after court orders the person to vacate it, it is ILLEGAL. (అలా స్వాధీనం చేసుకున్న భూమిని ఖాళీ చేయాలని court order చేసిన తర్వాత కూడా ఖాళీ చేయకపోవటం ILLEGAL

c) Anything against police orders is unlawful but not illegal. It becomes illegal after court says so. (Police ఉత్తర్వులను ఉల్లంఘించడం, UNLAWFUL కానీ, ILLEGAL కాదు. Police ఉత్తర్వులను ఉల్లంఘించినట్లు court తీర్పు చెబితే అది ILLEGAL

This is the difference between unlawful and illegal. Illegal is strictly against court orders. Unlawful is not necessarily against court orders but not accepted by law. Court order కు వ్యతిరేకమయితే Illegal. Court orders కు మాత్రమే కాకుండా, చట్టసమ్మతం కానిది unlawful.

**Illicit:** Not allowed by law, and not approved by society. Illicit drugs are drugs manufactured against law, without the permission of law. The supply, without permission, of weapons, or manufacture, without permission, of weapons is illicit supply and manufacture of weapons; such weapons are illicit weapons. There is an element of secrecy about it. An illicit love affair is a love affair not approved by society.

(చట్టం అనుమతించని, సమాజం ఆమోదించనిది ఏదైనా చేస్తే అది illicit అవుతుంది. ప్రభుత్వ అనుమతి లేకుండా ఆయుధాల తయారీ, వాటి సరఫరా illicit.

ఇందులో కొంత దొంగతనం, రహస్యం ఉంటుంది. బయటికి తెలిస్తే చట్టానికి చిక్కుతారు. రహస్య, అక్రమ ప్రేమాయణం, illicit love affair.

**Illegitimate** - Children born to an unmarried couple are illegitimate children. Children born of an illicit love affair are illegitimate children. (అక్రమ సంబంధంవల్ల పుట్టిన బిడ్డలూ, పెళ్ళికానివారికి పుట్టిన బిడ్డలూ, illegitimate children - అక్రమ సంతానం)

నిబంధనలకు విరుద్ధంగా, ఏ పద్ధతీ పాటించకుండా చేసే పనులు illegitimate. (Anything against established rules and practices is illegitimate.)

a) Some ministers and officers make illegitimate use of public funds - కొందరు మంత్రులూ, Officers, ప్రభుత్వ నిధులను అక్రమంగా వాడుకుంటారు.

b) His promotion is illegitimate - అతని promotion నిబంధనలకూ, పాటించాల్సిన పద్ధతులకూ విరుద్ధంగా జరిగింది.

c) His continuance in the post is illegitimate = అతనాపదవిలో కొనసాగటం నిబంధనలకు, పద్ధతులకు విరుద్ధం.

**Lawless:** (of a country or an area) where laws are not followed or obeyed. (of people) who do not have any respect for law.

A lawless area/ place is an area or place where laws are not followed or obeyed; where people have no respect/ fear of law.

Lawless people are people who have no respect for law or fear of law. eg: terrorists, Maoists, etc. ( lawless area - చట్టానికి ఏ మాత్రం గౌరవం/ విలువలేని, చట్టం ప్రభావం ఏ మాత్రంలేని ప్రదేశం- అక్కడి ప్రజలు చట్టం అంటే భయపడరు, లక్ష్యపెట్టరు)

Lawless People- చట్టాన్ని లెక్కచేయని, చట్టబాహ్యమైన పనులు నిస్సంకోచంగా చేసేవాళ్లు - terrorists, మావిస్టుల లాంటివాళ్లు.

a) Villages and other places under the control of Maoists are lawless areas = మావిస్టుల అధీనంలో ఉన్న గ్రామాల్లో చట్టం ప్రభావమే కనిపించదు. (మావిస్టులు ఏది చట్టం అంటే అదే.)

Maoists are lawless people- they have no respect for law: Maoists చట్టాన్ని గుర్తించరు/ గౌరవించరు.

These are the explanation of the words: illegal, unlawful, illicit, illegitimate, and lawless.

Is there any difference between the two parts of each sentence.

***Q. 2.*** *Please fill in the blanks with appropriate words.*

**Ans.**

i) These are unlawful acts and may lead to your arrest

ii) Seizing his property is an unlawful act

iii) He is engaged in an illicit love affair

iv) He was arrested for illegal / unlawful possession of fire arms

v) Your life is not safe on these lawless mountains

***Q. 3.*** *Explain the phrase - awareness of ends of human life.*

**Ans.** Awareness of the ends of human life = Know the purpose of human life = know what we are born in this world for = మన జీవిత గమ్యం తెలిసి ఉండటం.

***Q. 4.*** *How to distinguish the words that end with pronunciation S and Z*

*eg. Cats - Cats*

*(pronunciation - phonetic symbol)*

*apples -*

*How can we distinguish these type of words without using a dictionary?*

**Ans.** 'S' after the sounds p, t, k, f is pronounced 's'.

cups, cats, books, proofs, in all these cases 's' is pronounced 's'

'S' after b, d, g, l, m, n, and ng usually pronounced, 'z' only if it comes at the end of the words.

jobs, roads, eggs, leaves, calls, dams, tins, songs - in all these cases 's' is usually pronounced 'z'

'S' coming after vowel sounds at the end of the word is pronounced 'z'

eg: is, was, has, fees, etc

When a word ends in ss, the sound is 's' and not z

This will be explained more detailedly in our future lessons exclusively on pronunciation.

***- M. SURESAN***

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 297




# My heart wasn't in it

**Sobhita:** Hi Mohita, you are back! why? What happened?
(తిరిగొచ్చేశావు. ఏమిటి? ఏమయ్యింది? )

**Mohita:** You know what? I resigned my job.
(ఏమైందో నీకు తెలుసా? నేను ఉద్యోగానికి రాజీనామా ఇచ్చా.)

**Sobhita:** Really? you left the job hardly a month after you had joined it? Why? Why did you join in the first instance, then?
(నిజంగానా? చేరి నెల తిరక్కముందే రాజీనామా చేశావా? ఎందుకు? అసలు మొదట ఎందుకు చేరావు? )

**Mohita:** My heart was not in it. I joined because of dad's compulsion. I want to continue my studies.
(నాకు అది ఇష్టంలేదు. మా నాన్న బలవంతం వల్ల చేరాను. నాకింకా చదువు కొనసాగించా లనుంది.)

**Sobhita:** You could have told him of it.
(అదాయనకు చెప్పి ఉండాల్సింది.)

**Mohita:** I did but he wouldn't listen. His heart was set on making me an officer.
(నేను చెప్పాను కాని ఆయన వినలేదు. నన్నో ఆఫీసర్‌గా చేయాలని ఆయన నిశ్చయించు కున్నాడు)

**Sobhita:** What is wrong in it?
(అందులో తప్పేముంది? )

**Mohita:** Nothing wrong. But software job is a career after my heart, so I want to learn some more software and settle in it.
(తప్పేంలేదు. అయితే నాకు నచ్చిన career software job. అందుకని ఇంకొంత software నేర్చుకుని అందులో స్థిరపడాలనుంది నాకు.)

**Sobhita:** I think you made a mistake. I know your boss over there. He is a man with a heart in the right place. He could have certainly helped you to come up in your career.
(నువ్వు పొరపాటు చేశావనుకుంటున్నా. మీ boss నాకు తెలుసు. అతడు మంచి మనసు న్నవాడు. నీ career లో పైకొచ్చేందుకు బాగా సహాయం చేయగలిగేవాడు.)

**Mohita:** I know that, so I didn't have the heart to inform him before hand.
(నాకు తెలుసు ఆయన అలాంటివాడని. అందుకనే ఆయనకది- నేను రాజీనామా చేసే విషయం - ముందు చెప్పలేదు)

**Sobhita:** I'm afraid you are too light hearted about your career throwing away jobs like that.
(మంచి జాబ్‌ను అలా వదిలేయడం, నాకు నువ్వు మరీ సరదాగా తీసుకుంటున్నావని పిస్తోంది.)

**Mohita:** There are jobs for the asking in software, I'm sure once I have the necessary training, jobs'll be waiting for me.
(software లో అడిగితే వచ్చేట్లున్నాయి ఉద్యోగాలు, నా శిక్షణ పూర్తయితే ఉద్యోగాలు నాకోసం కాచుకొనుంటాయి.)

**Sobhita:** Though you say all that, in your heart of hearts you know you've made a mistake. You're not prepared to admit it, though.
(నువ్వింత చెబుతున్నప్పటికీ, పొరపాటు చేశావని నీ మనసులో నువ్వనుకుంటున్నావు. బయటకు నీవు అంగీకరించకపోయినప్పటికీ అది నిజం.)

**Mohita:** Have a heart, Sobhi! Just why don't we talk of something else? What's done is done. We can't go back on it, you know.
(శోభీ, కాస్త దయుంచు! ఇదికాకుండా మరేదైనా ఎందుకు మాట్లాడుకోకూడదూ? జరిగిందేదో జరిగిపోయింది. దాన్ని తిరగ దోడలేం, తెలుసుగదా!)

**Sobhita:** Your future is something close to my heart. How can I avoid thinking of it?
(నీ భవిష్యత్ నాకు చాలా ముఖ్యం. దాని గురించి మాట్లాడకుండా ఎలా ఉండగలను? )

**Mohita:** Do you think I can't take care of my career?
(నా career విషయంలో నేను జాగ్రత్త తీసుకోలేననుకుంటావా? )

**Sobhita:** For all that you say you are still a child at heart. You don't know what you do.
(నువ్వేం చెప్పినా, ఇంకా నువ్వు చిన్నపిల్లవే - నీది చిన్నపిల్ల మనస్తత్వమే. నీవేం చేస్తావో నీకే తెలియడంలేదు.)

**Mohita:** You certainly have a heart of gold, Sobhi. You take so much of interest in me.
(నిజంగా నీది బంగారంలాంటి మనసు. నామీద నీవంత శ్రద్ధ తీసుకుంటున్నావు)

**Sobhita:** Can't you take back your resignation now?
(నీ రాజీనామా ఇప్పుడు వెనక్కి తీసుకోలేవా? )

**Mohita:** I'm afraid it is too late. I'll try just the same.
(దానికి సమయం మించిపోయిందనుకుంటా. అయినా ప్రయత్నిస్తా.)

☺ ☺ ☺ ☺ ☺

Daily life situations లో conversation లో 'heart' వాడకం చాలా ఎక్కువ.

Heart అంటే మనందరికీ తెలిసిన అర్థాలు- హృదయం, మనస్సు- మన భావావేశాలకు నిలయం. Ordinary conversation లో చాలా ఇతర అర్థాలతో heart, దానితో కలిసిన expressions తరచుగా వాడుతుంటారు.

Heart, heart తో కూడిన expressions, English conversations లో ఎంత తరచుగా అంటే మనం వాటిని వాడుతున్నాం అని తెలియకుండానే వాడేస్తుంటాం. అందుకని సహజమైన, సరళమైన English speaking కు heart, heart తో వచ్చే expressions వాడుక తెలుసు కోవటం చాలా ఉపయోగకరం.

Now look at the following expressions from the dialogue above.

**1) My heart wasn't in it** =
I was not interested in it./ I didn't really want to do it.
(నా మనస్సు దానిమీద లేదు/ నాకది ఇష్టంలేదు)

a) I joined the course but my heart wasn't in it.
(ఆ కోర్సులో నేను చేరానుకానీ నా మనసు అందులో లేదు/ దానిమీద నాకాసక్తి లేకపోయింది.)

b) She was at the wedding all right but her heart wasn't in it.
(ఏదో పెళ్లికి హాజరైందిగానీ పెళ్లి సంబరాలమీద మనస్సులేదు ఆమెకు. ఆమెకంత ఇష్టంగా లేదు)

c) He is doing a shoddy job of it. It's clear his heart isn't in it.
(అతడాపని అశ్రద్ధగా/ అజాగ్రత్తగా చేశాడు. అతడి మనసు అందులో లేదు/ అనిష్టంగా చేశాడు.)

Shoddy job = అశ్రద్ధగా, అజాగ్రత్తగా చేయటం/ చేసినపని.

ఇది His/ her heart is not in it - లేదు అనే అర్థంతోనే ఎక్కువ వాడతారు.

**2) His heart was set on it.**

Set your heart on something/ have your heart set on something/ heart to be set on something = to wish strongly to do something =
ఏదైనా చేయాలనే బలమైన కోరిక ఉండటం/ అలా అని ఎంతగానో ఉండటం.

a) His heart is set on becoming a minister.
(అతడికి మంత్రి కావాలని చాలా బలమైన కోరిక/ ఎంతగానో ఉంది.)

b) He has set his heart on becoming a movie director.
(చిత్ర దర్శకుడు కావాలని అతని బలమైన కోరిక/ కావాలని ఎంతగానో ఉంది.)

c) She has her heart set on marrying him.
(అతడిని పెళ్లి చేసుకోవాలని ఆమె కోరిక/ ఆమెకెంతో ఉంది.)

**3) But a software job is a career after my heart.**

(software job నాకు నచ్చిన వృత్తి, వ్యాపకం.)

After my heart = నాకు నచ్చిన

It's a place after my heart.

(అది నాకు నచ్చిన ప్రదేశం)

Not have the heart to do something =
ఒక పనిచేయటం ఇష్టంలేకపోవటం (అందువల్ల ఇతరులు బాధపడతారని).

ఈ expression ఎప్పుడూ not తోనే వాడతారు- ఇష్టంలేదని చెప్పటానికి.

a) She didn't have the heart to tell him of his failure.
(అతడి వైఫల్యాన్ని గురించి అతడికి ఆమె చెప్పలేదు, అతడిని బాధపెట్టటం ఇష్టంలేక.)

b) He doesn't have the heart to take the child away from the mother, though he know that she has T.B.
(ఆమెకు TB (క్షయ) ఉందని తెలిసినా (అందువల్ల ఆ బిడ్డకు కూడా అది సోకవచ్చని తెలిసినా) ఆమె దగ్గరనుంచి ఆ బిడ్డను తీసుకెళ్లటానికి అతడికి మనస్కరించలేదు.)

c) Though he had a good job offer, he didn't have the heart to be away from his aged parents.
(మంచి job అవకాశం వచ్చినా, వయసుమీదపడిన తల్లిదండ్రులను వదిలిపెట్టి వెళ్లడానికి అతనికి మనస్కరించలేదు.)

అయితే

A man/ woman after my heart, అంటే నాకు నచ్చిన అని కాకుండా, నాలాంటి భావాలూ, ఇష్టానిష్టాలూ, ప్రవర్తన కలవాళ్లు అని వస్తుంది. అయితే మనలాంటి భావాలూ, ఇష్టానిష్టాలు ఉన్నవాళ్లు మనకు నచ్చినవాళ్లే అవుతారు కదా?

**4) He is a man with a heart in the right place.**

A person with their heart in the right place =
దయగల, మెత్తటి హృదయం కలవాళ్లు (పైకి అలా కనిపించకపోయినప్పటికీ) అని.

a) The officer is a man with his heart in the right place=
ఆ officer పైకలా కనిపించడుగానీ దయగలవాడే.

b) for all that the daughter- in -law says, she admits that her mother- in -law has her heart in the right place. =
ఆ కోడలు ఏమన్నాసరే, ఆమే ఒప్పుకొంటుంది తన అత్త దయగలదని (మంచావిడేనని).

**5) I didn't have the heart to inform him before hand**

**6) I'm afraid you are too light hearted.**

Light hearted= దేనినైనా సరదాగా తీసుకోవడం.

a) His light hearted talk about such a serious matter irritated me=
అంత serious విషయాన్ని అతను సరదాగా తీసుకోవటం నాకు కోపం తెప్పించింది.

b) Everyone likes her because she is light hearted =
ఆమె ఎప్పుడూ సరదాగా ఉంటుంది కాబట్టి ఆమె అంటే అందరికీ ఇష్టం.

**7) In your heart of hearts** =
హృదయాంతరాళంలో/ మనసుకు.

a) Though he supports her, in his heart of hearts he knows she is wrong =
అతడామెను సమర్థిస్తున్నా, అతనికీ తెలుసు/ అతని మనసుకు తెలుసు, ఆమె తప్పని.

b) In his heart of hearts he feel he is unjust =
అతని మనస్సులో ఉంది, అన్యాయం చేస్తున్నానని.

**8) Have a heart** = కాస్త దయచూపించు

a) Have a heart. Kindly stop lecturing me =
కాస్త దయచూపించు. నాకు ఉపన్యాసం ఇవ్వటం ఆపు. (చమత్కారంగా అనటం)

b) Have a heart. Don't disturb me. Let me study =
కాస్త దయచూపించు. నన్ను చదవనీ. గొడవ చేయకు.

**9) Something close to my heart** =

Something important for me =
నేను ప్రాముఖ్యం ఇచ్చే విషయం.

a) Children's well being is something close to parents' hearts =
పిల్లల యోగక్షేమాలకు తల్లిదండ్రులు ప్రాముఖ్యం ఇస్తారు.

b) This subject is close to my heart =
ఈ విషయానికి నేను ప్రాధాన్యం ఇస్తాను.

**10) You are still a child at heart** =
పైకి పెద్దగా కనిపించినా నీది చిన్నపిల్ల మనస్తత్వం.

At heart = స్వభావం/ వైఖరి.

a) Though he has joined congress, he is still a communist at heart =
కాంగ్రెస్‌లో చేరినప్పటికీ, అతనిదింకా communist స్వభావమే.

b) He is good at heart = అతడు సహృదయుడు.

**11) heart of gold** = బంగారంలాంటి మనస్సు/ సహృదయుడు.

I like him. He has a heart of gold. =
అతడంటే నాకిష్టం. అతడు సహృదయుడు.

*- M. SURESAN*




SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 298

# My heart really sank...

**Sampanna:** You seem to have taken to heart what Vignatha said. Just forget it.
(విజ్ఞత అన్నదానికి బాధపడుతున్నట్లు న్నావు. దాన్ని మరిచిపో)

**Sampurna:** You know very well that I threw my heart and soul into the whole matter. I went out of the way to make it a success. Still she is not satisfied.
(నా శక్తివంచన లేకుండా మనస్ఫూర్తిగా ఆ విషయానికి కృషిచేశాను. అది ఫలించాలని నా శక్తికి మించి పనిచేశాను. అయినా తనకు తృప్తిలేదు).
(go out of the way = ఒక విషయంలో ప్రత్యేకమైన కృషిచేయటం/ అదనంగా ప్రయత్నించటం).

**Sampanna:** She is really heartless to pass such comments on you. I never thought she could be so hard hearted.
(నీమీద అలా వ్యాఖ్యలు చేయటం చాలా నిర్దయ. అంత కఠినంగా ఉంటుందని నేనెప్పుడూ అనుకోలేదు).

**Sampurna:** I want to have someone tell her how much she has hurt me.
(తను నన్నెంత బాధించిందో ఎవరయినా తనతో చెప్తే బాగుంటుందనుకుంటున్నాను).
(hurt= శారీరకంగా/ మాటలతో బాధించటం)

**Sampanna:** I suggest that you'd better have a heart to heart talk with her. Tell her how she has upset you.
(నువ్వు తనతో మనసు విప్పి మాట్లాడటమే మంచిదని నా సూచన. నిన్ను ఎలా బాధించిందో చెప్పు).

**Sampurna:** I'm afraid I am a bit too sensitive. She should have known better than to talk like that.
(నేను మరీ సున్నితమనస్కురాలినను కుంటా. అలా మాట్లాడటం మంచిది కాదని తను తెలుసుకోవాలి.)

**Sampanna:** My heart really sank when I saw you so upset.
(నువ్వంత బాధపడుతున్నప్పుడు నిన్ను చూసి నా గుండె జారిపోయింది.)

**Sampurna:** Really I didn't deserve such words from her.
(అలాంటి మాటలు నన్ననవలసిన అవసరం లేదు./ నన్నలాంటి మాటలనాల్సింది కాదు).

**Sampanna:** I feel that you take things too much to heart.
(నువ్వు ఏ విషయమైనా మరీ ఎక్కువ మనసులో పెట్టుకుంటావనుకుంటా)

**Sampurna:** I've told you I do. But that is no reason for Vignatha to throw words at me like pots and pans.
(చెప్పాను కదా, నేను చాలా సున్నితమని. అయినా అలా నన్ను మాటలనటానికి విజ్ఞతకు కారణం లేదు కదా.)
(Throw words like pots and pans = ఒకర్ని ఇష్టం వచ్చినట్లు మాటలతో బాధించటం).

**Sampanna:** Ofcourse there'sn't. She could have thought better.
(అది correct. తను ఇంకొంచెం ఆలోచించాల్సింది).

**Sampurna:** Even as I looked at her face yesterday, my heart sank. She looked so angry.
(నిన్న తన మొహం చూడగానే నాకు గుండె జారిపోయింది. అంత కోపంగా కనిపించింది.)

**Sampanna:** I observed too. I've never seen her so furious. There wasn't any reason for her to fly into such a rage.
(నేనూ గమనించాను. తను అంత కోపంతో ఉండటం నేనెపుడూ చూడలేదు. అంత కోపంతో ఎగిరిపోవటానికి నాకు కారణం ఏం కనిపించలేదు).
(furious= తీవ్రమైన కోపంతో ఉండటం.
fly into a rage = కోపంతో ఉద్రేకపడటం).

**Sampurna:** By the way what's the news from the hospital? How is Namratha getting on?
(అది సరేకానీ, ఆసుపత్రి సమాచారం ఏమిటి? నమ్రత ఎలా ఉంది?)

**Sampanna:** No Improvement. No deterioration either. But the doctor says she will improve. I told Namratha's people not to lose heart. Namratha's recovery is just a matter of time.
(మెరుగుపడలేదు. క్షీణించనూ లేదు. అయితే పరిస్థితి మెరుగుపడుతుందంటున్నాడు డాక్టర్. నమ్రత వాళ్ళ వాళ్లతో అధైర్యపడొద్దని చెప్పాను. ఆమె కోలుకోవటానికి కొంత time పట్టొచ్చు అంతే.)
deterioration = క్షీణించటం

**Sampurna:** You know my heart missed a beat when I got the news she had been put in the hospital. I couldn't just see how such a strong girl could be so ill.
(తనను hospital లో చేర్చారని వినగానే నా గుండె ఒక్కసారి ఆగిపోయింది. అంత ఆరోగ్యంగా ఉండే ఆ అమ్మాయికంత జబ్బు ఎలా వచ్చిందో అర్థం చేసుకోలేకపోయా.)

**Sampanna:** The best we can do now is to pray for her speedy recovery.
(తను త్వరగా కోలుకోవాలని కోరుకోవటమే మనం ఇప్పుడు చేయగల ఉత్తమమైన పని)

● ● ● ● ● ●

Heart కు సంబంధించిన మరికొన్ని మాటలు ఈ lesson లో చూద్దాం. ఇవి కూడా daily life situation లో మన conversation expressive (అనుకున్నది సరిగా చెప్పగలిగే విధం) గా ఉండేందుకు చాలా సహాయపడతాయి. ఇవన్నీ చాలా simple expressions అనీ, conversation సహజంగా ఉండేందుకు తోడ్పడతాయనీ మీరే గమనిస్తారు.

**Look at the following expressions from the conversation above:**

1) You seem to have taken to heart what Vignatha said.
2) ... that I threw my heart and soul into the whole matter
3) She is really heartless
4) I suggest that you'd better have a heart to heart talk with her
5) My heart really sank when I saw you so upset
6) I feel that you take things too much to heart
7) Even as I looked at her yesterday my heart sank.
8) I told Namratha's people not to lose heart
9) ... my heart missed a beat when I got the news.
10) I never thought she could be so hard hearted.

చూశారు కదా. పైన heart తో వచ్చే expressions అన్నీ మనం ఎక్కడో విన్నట్టూ, చదివినట్టూ అనిపిస్తున్నాయి కదా. అంటే అవి అంత frequent గా spoken English లో వినిపిస్తాయన్న మాట. అందుకని మనమూ practice చేద్దాం వాటిని.

ఈ conversation లో వాడిన మాటల అర్థాలు కూడా తెలుసుకుందాం:

1. upset= కోపం/ మనస్తాపం/ ఆందోళన కలిగించటం - ఈ సంభాషణ సందర్భంలో. ఇవికాకుండా ఇంకా ఇతర అర్థాలున్నాయి
2. sensitive = సున్నిత మనస్తత్వంగల - చిన్న మాటలైనా పడలేని.
3. deserve= అర్హతకల- ఇక్కడ మాటలనిపించుకొనే స్థితి.
4. furious = తీవ్రమైన కోపంగల.
5. rage = తీవ్ర కోపం.
6. speedy recovery = త్వరగా ఉపశమనం/ కోలుకోవటం.

1. You seem to have taken to heart what Vignatha said/ 6. I feel that you take things too much to heart.

Take (something) to heart = ఒక విషయం వల్ల/ ఒకరన్న మాటల వల్ల/ ఒక సంఘటన వల్ల తీవ్రంగా మనస్తాపం చెందటం/ బాధపడటం.

a) He took his failure to heart and is withdrawn = తన వైఫల్యం వల్ల బాధతో అతను ఎవరితోనూ మాట్లాడటం లేదు.

To be withdrawn = ఇతరుల నుంచి దూరంగా ఉండటం/ ఇతరులతో మాట్లాడకపోవటం.

b) Don't take her words so much to heart = ఆమె మాటలు అంతగా పట్టించుకొని బాధపడకు.

c) Sensitive people take even the slightest criticism to heart = సున్నిత మనస్కులు చిన్న విమర్శలను కూడా తట్టుకోలేక బాధపడుతుంటారు.

2) ... That I threw my heart and soul into the matter.

Throw (somebody's) heart and soul into something - ఇది చాలా సాధారణంగా వినిపించే మాట- తరచూ మీ సంభాషణలో వాడండి. దీని అర్థం- అత్యంత ఉత్సాహంతో, శ్రద్ధతో ఏదైనా చేయటం. మనసంతా దానిమీద పెట్టి చేయటం.

a) Once the adult literary programme started, she threw her heart and soul into it. = వయోజన విద్యా కార్యక్రమం మొదలవగానే ఆమె దానిమీద మనస్సుపెట్టి చాలా ఉత్సాహంతో పనిచేసింది.

b) Once he came under Gandhi's influence Potti Sreeramulu put his heart and soul into the freedom struggle = ఒక్కసారి గాంధీ ప్రభావానికి లోనైన వెంటనే, పొట్టి శ్రీరాములు స్వాతంత్ర్యోద్యమంలో ఉత్సాహంతో, శ్రద్ధతో మనస్ఫూర్తిగా పనిచేశారు.

c) You put your heart and soul into the preparation you will certainly get a good rank = (పరీక్షకు) సిద్ధంకావటంలో మనసుపెట్టి ఉత్సాహం, శ్రద్ధ చూపించు. నీకు మంచి rank వస్తుంది.

Put/ throw somebody's heart and soul into (something) X (Somebody's) heart is not in it.

3) She is really heartless. Heartless= దయ, కారుణ్యంలేని, కఠిన మనస్సు కల. దీనర్థం చూస్తూనే తెలుస్తుంది కదా - మనస్సులేని అని. cruel దీనికి synonym (క్రూరమైన)

Hitler was a heartless ruler = Hitler మనసులేని పాలకుడు (కఠకుగుండె)

4) I suggest that you have a heart to heart talk.

Heart to heart talk = (ఇద్దరిమధ్య మనస్పర్థలున్నప్పుడు) మనసువిప్పి మర్మంలేకుండా ఉన్నదున్నట్లు మాట్లాడుకోవటం (సయోధ్య/ సంబంధాల మెరుగు కోసం)

a) Why don't you have a heart to heart talk with her and clear your misunderstandings = నువ్వు, ఆమె ఒకరితో ఒకరు మనసు విప్పి మాట్లాడుకొని మీ అపోహలు ఎందుకు తొలగించుకోరు? (తొలగించుకోవచ్చుకదా?)

b) A heart to heart talk with my colleague ended all our misunderstandings = నా సహోద్యోగితో నా మనసు విప్పి మర్మం లేకుండా మాట్లాడటంతో మా అపోహలు తొలగిపోయాయి.

5) My heart really sank when I saw you so upset

7) Even as I looked at her yesterday my heart sank.

(Somebody's) heart sinks = గుండె జారిపోవటం

a) The thief's heart sank as he saw the police on the scene = police ను ఆ ప్రదేశంలో చూడగానే దొంగ గుండె జారిపోయింది.

b) My heart sank when Dhoni was out too = ధోనీ కూడా out కావడంతో నా గుండె జారిపోయింది (భయం, నిరుత్సాహంతో)

8) I told Namratha's people not to lose heart

lose heart = అధైర్యపడటం, దానితో ప్రయత్నం మానుకోవటం.

a) Low marks? Don't lose heart. Do better next time = తక్కువ మార్కులు వచ్చాయా? అధైర్యపడకు, వచ్చేసారి బాగా రాయి.

b) He lost heart after his second failure = రెండోసారి విఫలమవటంవల్ల అధైర్యంతో అతను మళ్లీ ప్రయత్నం మానుకున్నాడు.

c) Don't lose heart. This is not the end of it. అధైర్యపడకు. ఇది అంతం కాదు కదా?

9) My heart missed a beat. Miss a beat = (భయంతో) గుండె కొట్టుకోవటం ఒక్కసారి ఆగిపోవటం.

a) My heart missed a beat when I didn't find my purse in its usual place = నా purse మామూలుగా ఉండేచోట లేకపోయేసరికి గుండె ఆగిపోయింది.

b) His heart missed a beat when he misstook the rope for a snake= తాడును పామనుకొని పొరపడటంతో అతని గుండె ఒక్క క్షణం ఆగిపోయింది.



1) *Put away, put down పదాలకు తేడా ఏమిటి 2) Not, never లను ఏ సందర్భంలో వాడాలి?*
3) *Have you ever seen Tajmahal? దీని సమాధానాన్ని No తో ప్రారంభించవచ్చా? a) No, I have never seen Tajmahal. b) No, I have not seen Tajmahal. పై వాటిలో ఏది కరెక్ట్?*

**- ఎస్.వి రమణ, కాకినాడ**

**జవాబు:** i) Put away - Put some thing away = to put some thing in a place where it is usually kept = మామూలుగా ఒక వస్తువును ఉంచేచోట తిరిగి ఉంచటం.

Let me put these books away = ఈ పుస్తకాలను మొదట వాటి స్థానంలో ఉంచనీ.

ii) Put down - చాలా అర్థాలున్నాయి. ముఖ్యంగా put down the opposition - వ్యతిరేకతను/ వ్యతిరేకులను అణచివేయటం.

Stalin put down any opposition ruthlessly = Stalin తనను వ్యతిరేకించినవాళ్లను నిర్దాక్షిణ్యంగా అణచివేశాడు.

2. Not = కాదు, లేదు. Never = ఎప్పటికీలేదు/ ఎప్పటికీకాదు. They do not do such things = వాళ్లు అలాంటి పనులు చేయరు.

They never do such things = అలాంటిపనులు వాళ్లెన్నటికీ చేయరు.

3. Correct గా చెప్పాలంటే I have never seen the Taj అంత correct కాదు. I have not seen the Taj అంటే నేనింతవరకు Taj ని చూడలేదు అని. I have never seen - 'ఇంతవరకూ ఎన్నటికీ' అనం కదా! అయితే Modern English usage లో have/ has never + pp (seen, gone, etc) చాలా సాధారణంగా వాడుతున్నారు. తప్పుగా పరిగణించలేం.

**- M. SURESAN**

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 299




# We had had a hearty laugh

**Chandan:** What a time we had last sunday! We really enjoyed the whole picnic to our heart's content.
(గత ఆదివారం ఎంత సరదాగా గడిపామో! ఆ పిక్నిక్ మేం తనివితీరా ఆనందించాం.)

Have a good time/ bad time etc = ఏదైనా సందర్భాన్ని ఆనందంగా/ విచారంగా గడపటం.

Have a happy time during your stay there = మీరక్కడున్నంతసేపూ సంతోషంగా గడపి రండి.

**Charan:** If only our hostel warden had permitted me...! The guy has a heart of stone, I tell you. My repeated requests to let me join you have been no use.
(మా hostel warden నాకు అనుమతిచ్చి ఉంటే ఎంత బాగుండేదో (నేను మీతో వచ్చి ఆనందించేవాడిని) అతడికుండేది నిజంగా రాతి హృదయం. చెబుతున్నాగా. మీతో పిక్నిక్‌కు వెళతానని ప్రాధేయపడినా ఫలితం లేకపోయింది.

**Chandan:** We missed you a lot. I had wished with all my heart your warden would let you go with us. I never thought that he could be so heartless.
(నువ్వు మాతో లేకపోవటం మాకంతా లోటే అనిపించింది. మీ వార్డెన్ నిన్ను మాతో వెళ్ళనివ్వాలని మనసారా కోరుకున్నాను. ఆయన అంత హృదయం లేనివాడని నేనను కోలేదు.)

**Charan:** Any way it is heartening to know you are going again this time to Goa. I am sure to join you come what come may. My dad said I could go.

Come what come may = ఏదేమైనా
(ఎలాగైనా, మళ్ళీ ఈసారి మీరు గోవాకు వెళుతున్నారని తెలిసి ఉత్సాహంగా ఉంది నాకు. మీతో ఈసారి తప్పకుండా ఏదేమైనా వస్తాను. మా నాన్న వెళ్లమన్నాడు.)

**Chandan:** So you have no reason to lose heart any more, then. I assure you we can have a very happy time.
(నిరుత్సాహపడటానికింక కారణం లేదన్న మాట/ ఇంక నువ్వు దిగులు పడనక్కరలేదు. మనం ఎంతగానో ఆనందించవచ్చని చెబుతున్నా నేను.)

**Charan:** Madan was talking of some unhappy thing that happened on your way back.
(మీరు తిరిగొచ్చేపుడు ఏదో అసంతోషకరమైన విషయాన్ని గురించి మదన్ అంటున్నాడు.)

**Chandan:** Yea. What a tragedy! The car a family was travelling in rammed a truck from behind. Two of them were killed. One was seriously injured. That really was heart rending.
(అవును. ఎంత దారుణమో! ఓ కుటుంబం ప్రయాణిస్తున్న కారు లారీని వెనక నుంచి ఢీకొంది. ఇద్దరు చచ్చిపోయారు. ఒకరు తీవ్రంగా గాయపడ్డారు. నిజంగా హృదయవిదారకమే.)

ram = ఢీకొనటం.
rammed - ఢీకొనింది
truck = lorry

**Charan:** That must have been shocking.
(మీకది చాలా దిగ్భ్రమ కలిగించి ఉండాలి.)

**Chandan:** You can say that. It happened right infront of us. We had had a hearty laugh at some joke one of us made and the next minute this happened. (I) can't forget it for my life.
(నువ్వామాట అనొచ్చు మా ముందే జరిగిందది. మాలో ఎవరో వేసిన జోక్‌కు మనసారా నవ్వుకున్నాం. మరుక్షణం ఇది జరిగింది. నా జీవితంలో నేను మరిచిపోలేనిది.)

**Charan:** My heartfelt condolences to the family though I don't know them, and didn't see it all.
(ఆ కుటుంబం నాకు తెలియకపోయినా, ఆ సంఘటన నేను చూడకపోయినా, వాళ్లకు నా సంతాపం తెలుపుతున్నాను.)

**Chandan:** So did we. We all returned home with a heavy heart.
(మేమదే చేశాం. బరువెక్కిన హృదయాలతో ఇంటికి చేరుకున్నాం.)

**Charan:** Our highways are hardly safe.
(మన నగరాలను కలిపే రోడ్లు అంత క్షేమకరం కావు.)

Highways = నగరాలను కలిపే రోడ్లు.

**Chandan:** OK. It's time I were at home. Bye.
(సరే, నేనెప్పుడో ఇంట్లో ఉండాల్సింది. వస్తా.)

☆ ☆ ☆

Heart కు సంబంధించిన expressions real life situations లోని conversation లో తరచూ వినిపిస్తుంటాయి. అలాంటి వాటిని మరికొన్ని ఈ lesson లో చూద్దాం.

**Now look at the following expressions from the conversation above.**

1) The guy has a heart of stone.
2) I had wished with all my heart that he would let you go.
3) ... it is heartening to know you are going again.
4) So you have no reason to lose heart.
5) That really was heart rending.
6) We had had a hearty laugh.
7) My heart felt condolences.
8) We all returned home with a heavy heart.

**1) The guy has a heart of stone.**
(అతనిది రాతి హృదయం/ కఠిన హృదయం.)

Heart of Stone = రాతి హృదయం.

కిందటి lessonలో మనం a heart of gold అనే expression చూశాం కదా. దానర్థం బంగారం లాంటి హృదయం / మంచి మనసు అనీ. దానికి have a heart of stone వ్యతిరేకం అని తెలుస్తోంది కదా?

a) Whoever did it, those responsible for the Noida (Delhi) murders must have hearts of stones.
(ఎవరు వాటిని చేసినప్పటికీ, నోయిడా (Delhi దగ్గర) హత్యలు చేసినవాళ్లు కఠిన/పాషాణ హృదయం గలవాళ్లై ఉండాలి.)

b) Serial Killers have hearts of stones.
(వరుస హత్యలు చేసే వాళ్లు పాషాణ హృదయులు.)

**2) With all (some one's) my heart** = మనస్ఫూర్తిగా

a) I wished with all my heart that India should reach semi finals in world cup Cricket.
(ప్రపంచ కప్ క్రికెట్ పోటీలో భారత్ కనీసం semi finals కన్నా చేరుకోవాలని మనసారా కోరుకున్నాను.)

b) I opened the letter hoping with all my heart that it would convey the news of my selection for the job.
(నేను ఉద్యోగానికి ఎంపికయ్యాననే వార్త నాకు తెలియపరుస్తుందని మనసారా ఆశిస్తూ ఆ ఉత్తరాన్ని తెరిచాను.)

**3) It's heartening to know you are going again.**

**hearten** = ఉత్సాహాన్ని కలిగించే/ ప్రోత్సాహకరమైన - అయితే ఇది ఎక్కువ passive లో వాడతాం. ఒక్కోప్పుడు, It heartens me, It is heartening to know అని కూడా వాడతాం.

a) It is heartening to hear that in spite of his recent illness, he is progressing well in studies.
(ఈ మధ్య జబ్బుపడ్డా, చదువులో బాగానే రాణించడం ప్రోత్సాహకరంగా ఉంది.)

b) Business circles are heartened to know that the govt is not going to impose new taxes.
(ప్రభుత్వం కొత్త పన్నులు విధించటం లేదని తెలిసి వాణిజ్య వర్గాలు సంతోష పడుతున్నాయి.)

heartenకు వ్యతిరేకం dishearten = నిరుత్సాహపడటం/ నిరాశ చెందటం.

a) The News of his Son's failure disheartened the father.
(కొడుకు ఫెయిల్ అయ్యాడని తెలిసి తండ్రి నిరాశ చెందాడు/ నిరుత్సాహపడ్డాడు.

b) It's disheartening that he is not coming - అతడు రావటంలేదనేది నిరాశాకరంగా ఉంది.

**4) So you have no reason to lose heart.**
(అయితే నీవు నిరాశ చెందాల్సిన కారణం లేదు.)

Lose heart = నిరాశ చెందటం. అయితే Lose heart అనేది not తో ఎక్కువ వాడతాం.

a) Don't lose heart. Keep trying you'll succeed. నిరాశ చెందకుండా ప్రయత్నిస్తూండు. విజయం పొందుతావు.

b) Though he did not succeed, he didn't lose heart.
(అతడు జయంపొందనప్పటికీ, నిరాశ చెందలేదు.)

c) She is a great trier. She never loses heart.
(ఆమె ప్రయత్నం కొనసాగిస్తూనే ఉంటుంది. ఎప్పటికీ నిరాశపడదు.)

trier = ట్రయ = నిరాశపడకుండా ప్రయత్నం కొనసాగించే వాళ్లు.

Lose heart to some one = fall in love = ప్రేమలో పడటం/ మనసు పారేసుకోవటం.

The minute he saw Sakuntala, Dushyanta lost heart to her.
(శకుంతలను చూసిన వెంటనే దుష్యంతుడామె పై మనసు పారేసుకున్నాడు/ ప్రేమించాడు)

**5) That really was heart rending.**

Heart rending = హృదయవిదారకమైన/ గుండె బద్దలయ్యే / మనసు ద్రవించే.

a) The Scene of the train accident was heart rending.
(ఆ ట్రైన్ యాక్సిడెంట్ జరిగినచోట దృశ్యం హృదయ విదారకంగా ఉంది.)

b) The Children crying for their dead mother was heart rending.
(చనిపోయిన తమ తల్లి కోసం పిల్లలు ఏడవటం మనసును కలిచివేసింది.)

**6) We had had a hearty laugh:**

Hearty = మనసు నిండా

a) We had a hearty laugh at his joke.
(అతడి జోక్ విని మేం మనసారా నవ్వుకున్నాం.)

b) We had a hearty time.
(సరదాగా నవ్వుతూ, తుళ్లుతూ గడిపాం.)

Hearty Congratulations = హృదయపూర్వక అభినందనలు.

A hearty meal = a large meal = మంచి పసందైన తృప్తికరమైన భోజనం.

**7) Heart felt condolences:**

Condolence = సంతాపం (మృతి/ దుఃఖకరమైన సంఘటన పట్ల. అయితే ఎక్కువగా Condolences అని pluralలో వాడతాం.)

a) Our condolences to/ Our heartfelt to the bereaved family.
(మృతుడి కుటుంబానికి సంతాపం/ సంతాపం - bereaved family = మృతుడి కుటుంబం)

**8) With a heavy heart** = బరువెక్కిన/ విషణ్ణ/ విచారకరమైన హృదయంతో.

a) I convey this sad news to you with a heavy heart.
(విచార హృదయంతో నీకీ చెడువార్తనందిస్తున్నా.)

b) It is with a heavy heart I hear of his failure.
(అతడి వైఫల్యం గురించిన వార్తను విచార హృదయంతో వింటున్నా.)

ప్రశ్న:
1. I wish I had a bike
I wish I had +.. II & III persons ని subject గా ఉపయోగించవచ్చా? వీటిని తెలుగులో ఎలా ఉపయోగిస్తారో తెలపండి.
2. స్పోకెన్ ఇంగ్లిష్ చాలా పుస్తకాల్లో "Iam afraid..." అని వాడుతున్నారు. దీని పూర్తి తెలుగు అర్థం ఏమిటి? ఏ సందర్భాల్లో దీన్ని ఉపయోగిస్తారో వివరంగా తెలియజేయండి.
– ఎం.వి.సుబ్రమణ్యం, చిలకూరు, నెల్లూరు జిల్లా.



జవాబు:
1. I wish I had a bike = I don't have a bike now; So I wish for a bike now (Not possible now) =
నాకు bike ఉంటే ఎంత బాగుండేదో! (లేనిదాన్ని/ ఇప్పుడు పొందలేని దాన్ని కోరుకోవటం.)
I wish you didn't come here =
నువ్వు ఇక్కడికి రాకుంటే బాగుండేది (కాని వచ్చావు.)
I wish they were here =
వాళ్లిక్కడ ఉంటే ఎంత బాగుండును. (వాళ్లు ఇప్పుడు ఇక్కడ లేరు/ ఉండే ప్రసక్తి లేదు.)
afraid అంటే మామూలు అర్థం భయపడుతున్న అని. అయితే spoken English లో ఏదైనా అయిష్టంగా చెప్పేటప్పుడు, I,m afraid అయిష్టతను వ్యక్తపరుస్తుంది. I am sorry అనే అర్థంతో
A: Can you help me with a little money?
B: I am afraid (= I am sorry) I can't (I can not).

- M. SURESAN

# SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 300



**Rasik:** You look so frightened. What happened? What makes you so afraid?
(అంత భయపడిపోయినట్టు కనిపిస్తున్నావు. ఏం జరిగింది? నీకంత భయం కలిగిస్తోన్న దేంటి? )

**Likhit:** I am out of breath. Let me breathe easy first.
(నాకు ఊపిరాడటంలేదు భయంతో. మొదట నన్ను తీరిగ్గా ఊపిరి పీల్చుకోనీ.)

out of breath: భయం, ఆయాసం, అలసటతో ఊపి రాడకపోవటం/ ఊపిరి పీల్చుకోలేకపోవటం.

breathe (బ్రీద్) easy= తీరిగ్గా ఊపిరి పీల్చుకోవడం/ విశ్రాంతిగా /relaxed.

**Rasik:** Come now Likhit. Pull yourself together. I never saw you so full of fear.
(లిఖిత్, కాస్త కుదుటపడు. ఇంత భయంతో నువ్వుండటం నేనెప్పుడూ చూడలేదు.)
(Pull yourself together కుదుటపడు / తమాయించుకో)

**Likhit:** You would look frightened too if you were face to face with your worst enemy.

**Rasik:** That's what I want to know. What exactly happened?
(అదే నేను తెలుసుకోవాలనుకుంటుంది. అసలేం

averted = తప్పింది

**Likhit:** O that was big relief.
(నిజంగా నాకు పెద్ద బరువు దించినట్టయింది.)

**Rasik:** But how did the face off between you start at all?
(అసలు మీ ఇద్దరి మధ్య ఈ పోట్లాట ఎలా ప్రారంభమైంది? )

**Likhit:** It started as a silly argument and developed into a heated exchange. In the course of it, I told him to his face that he was an animal. That enraged him and since then he has borne a grudge against me.
(ఏదో చిన్న వివాదంగా ప్రారంభమైంది, ఆవేశంతో ఇద్దరం మాటలనుకునేదాకా వచ్చింది. ఆ సందర్భంలో వాడో జంతువని వాడి మొహాన్నే అనేశా. అప్పటినుంచి వాడు నా మీద ద్వేషం పెంచుకున్నాడు.)

Bear a grudge = ద్వేషంతో ఉండటం

**Rasik:** But that's too slight a reason for him to hate you much.
(కాని నిన్నంతగా ద్వేషించటానికి అది చాలా చిన్న కారణం కదా? )

**Likhit:** He is very bad. I shouldn't have befriended him in the first instance.
(వాడు చాలా చెడ్డవాడు. నేనసలు వాడితో స్నేహం చేసుండకూడదు.)

befriend=స్నేహం చేయటం.

in the first instance = అసలు

b) The Government faces the difficult situation of putting down the Maoists.
(మావోయిస్టులను అణచివేయటం అనే కష్టమైన సమస్యను ప్రభుత్వం ఎదుర్కొంటోంది)

c) Tendulkar is facing the biggest challenge of his career. He has to regain his form.
(టెండూల్కర్ తన జీవితంలో అతి పెద్ద సవాలెదుర్కొంటున్నాడు. తన సామర్థ్యాన్ని తిరిగి అతడు పొందాలి.)

face to fact = నిజాన్ని ఒప్పుకుందాం.

c) Let's face the fact. We can never be a great force in Cricket.
(మనం యదార్థాన్ని ఎదుర్కొందాం/ఒప్పుకుందాం-క్రికెట్‌లో మనం ఎప్పటికి గొప్ప శక్తి కాలేం.)

**3) Still I put on a brave face. Put on a face .**
(నటించటం (ముఖ కవళికలతో) కనిపించటం.)

a) He was full of fear, but he put on a brave face.
(భయంతో నిండిపోయినప్పటికీ, ధైర్యంగా ఉన్నట్టు ముఖం పెట్టాడు/ పైకి మాత్రం ధైర్యంగానే కనిపించాడు.)

b) Though guilty, she put on as innocent face.
(నేరం చేసినప్పటికీ, పైకి మాత్రం అమాయకురాలిగా కనిపించింది.)

c) I know you for what you are. Don't put on faces.
(నీ సంగతి / స్వభావం నాకు తెలుసు. నటించకు)

**4) Never lose courage in the face of danger.**

# Never lose courage even...

జరిగింది? )

**Likhit:** I had to face my worst enemy in my life. We have met at the restaurant after 20 years. He had the face to walk towards me and make a challenge.
(నా జీవితంలో బద్ధశత్రువును నేను ఎదుర్కోవాల్సి వచ్చింది. 20 ఏళ్ల తర్వాత మేమా రెస్టారెంట్‌లో ఒకరికొకరం ఎదురుపడ్డాం. నా దగ్గరకు వచ్చి మళ్లీ సవాలు చేసేలా కనిపించాడు.)

**Rasik:** But why should he frighten you so?
(నీలో వాడంత భయం ఎందుకు కలిగించాలి?

**Likhit:** He is the most dangerous fellow on earth. He Strikes terror in me. Still I put on a brave a face. As my luck would have it, the police turned up just then and he ran away.
(వాడు అత్యంత ప్రమాదకారి. వాడు నాలో భయం పుట్టిస్తాడు. వాడంటేనే నాకు భయం. అయినా ధైర్యంగానే కనిపించాను. నా అదృష్టం బావుండి అప్పుడే పోలీసులు కనిపించారు. వాడు పారిపోయాడు.)

**Rasik:** Likhit, never lose courage even in the face of danger. If you have to lose, lose with courage. That'd be manly.
(ప్రమాదంలో కూడా ధైర్యంగా ఉండు. ఓడిపోవటం తప్పకపోతే ధైర్యంగా ఓడిపో. అది మగతనంలా ఉంటుంది.)

**Likhit:** When we last faced each other 20 years ago, he made a challenge or some thing. Just to save my face I accepted the challenge, though I had to face up to the fact that I could not beat him.
(ఇరవై ఏళ్ల కిందట మేం ఒకరికొకరం ఎదురుపడినప్పుడు నా మీద సవాలేదో విసిరాడు. నా పరువు కాపాడుకోవడానికి ఆ సవాలు స్వీకరించాను. నేను వాడిని ఎదుర్కోలేనని తెలిసినా.)

**Rasik:** This time too the timely arrival of the police saved your face. Thank God a fight was averted.
(పోలీసులు సమయానికి రావడం వల్ల నీ పరువు దక్కింది. ఒక పోట్లాట తప్పినందుకు దేవుడికి కృతజ్ఞత చెప్పుకో.)

**Rasik:** So no knowing when you will run into him again. Be careful.
(మళ్లీ వాడికి నువ్వెప్పుడెదురు పడతావో తెలీదన్నమాట. జాగ్రత్తగా ఉండు.)

**Likhit:** That I will be, of course.
(జాగ్రత్తగా ఉంటాలే.)

run into some one = ఒకరిని అనుకోకుండా కలుసుకోవడం/ ఎదురుపడటం

Daily life situations లో frequent గా వాడే expressions, ముఖ్యంగా మన conversation natural గా simpleగా ఉండేందుకు వాడాల్సిన expressions గురించి తెలుసుకుంటున్నాం కదా. అందులో భాగంగా ఈ lesson లో face, face తో వచ్చే expressions ను గురించి తెలుసుకుందాం.

face = మొహం. a smiling/ happy/sad face = చిరునవ్వుతో/సంతోషంగా ఉన్న/ విచారంగా ఉన్న మొహం. అలాగే round faced /serious faced, etc గుండ్రటి మొహం/ serious గా ఉన్న మొహం, etc. ఇవన్నీ మనకు తెలిసినవే.

❖ ❖ ❖

**Now look at the following sentences from the dialogue above.**

**1) If you were face to face with danger.**

Face to face: ముఖాముఖి- ఇద్దరు ఒకరికొకరు ఎదురుపడటం.

a) He found himself face to face with her for the first time. He had seen only her picture earlier.
(మొట్టమొదటిసారిగా ఆమెను ముఖాముఖి చూశాడు - అంతకుముందు ఆమె ఫొటో మాత్రమే చూశాడు)

b) That was the first time I came face to face with such a situation.
(అలాంటి పరిస్థితి ఎదురుపడటం నాకు మొదటిసారి)

c) Let's talk face to face. It's better than talking about such a matter over phone.
(మనం ముఖాముఖి మాట్లాడుకుందాం. అలాంటి విషయాలు ఫోన్‌లో మాట్లాడుకోవటం నాకిష్టం లేదు)

**2) I had to face my worst enemy in my life.**

to face = ఎదుర్కోవటం (ఓ పరిస్థితిని/వ్యక్తిని)

a) Let's face the problem and see how we can solve it.
(ఆ సమస్యను ధైర్యంగా ఎదుర్కొని ఎలా పరిష్కరించగలమో చూద్దాం)

(ప్రమాదంలో కూడా ధైర్యం కోల్పోకు.)

in the face of = కష్టాల్లో, క్లిష్ట / ప్రమాదకర పరిస్థితుల్లో

a) In the face of severe opposition, she fought for women's rights.
(తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కొంటూ స్త్రీ హక్కుల కోసం ఆమె పోరాడింది)

b) In the face of difficulties he continued his studies.
(ఎన్ని కష్టాలు ఎదుర్కొన్నా అతడు చదువు కొనసాగించాడు)

c) He gave up the project in the face of protests from his family.
(కుటుంబం నుంచి ప్రతిఘటనలు ఎదురవడంతో అతనాపథకాన్ని విరమించుకున్నాడు)

**5) I accepted the challenge though I had to face up to the fact that I could never beat him.**

I had to face up to the fact = I had to accept and deal with the fact.
(ఆ యదార్థాన్ని ఒప్పుకుని తగిన చర్యలు తీసుకోవడం.)

a) You'll never get such a good job again. You'd better face up to it.
(అలాంటి మంచి జాబ్ నీకు మళ్లీరాదు. ఆ విషయాన్ని అర్థం చేసుకుని మసలుకో.)

b) He had to face up to the fact that he could never play again.
(మళ్లీ తను ఆడలేనని యదార్థాన్ని అతడు అర్థం చేసుకోవాల్సి వచ్చింది)

**6) The timely arrival of police saved your face.**

Save (some one's) face = పరువు దక్కించుకోవటం.

a) The knock of a century by Dhoni saved the face for India which was 5 wickets down for 125 runs.
(125 పరుగులకే ఐదు వికెట్లు కోల్పోయిన భారత్ పరువును ధోనీ కొట్టిన సెంచరీ నిలబెట్టింది.)

b) He had to accept the majority decision just to save his face/It was only a face saving device.
(తన పరువు కాపాడుకోవటం కోసం, మెజారిటీ నిర్ణయాన్ని అంగీకరించాడు/ అలా అంగీకరించటం పరువు దక్కించుకునే మార్గమే.)

# ప్రతిభ

**ప్రశ్న :** 1) ఇంగ్లిష్ నేర్చుకోవాలంటే 275 structures తెలిసుంటే సరిపోతుందా? ఇవి ఎక్కడ దొరుకుతాయి?

2) a) had been able to b) shall had been able to c) Should had been able to d) Will had been able to e) Would had been able to f) May had been able to g) Might had been able to h) Can have been able to i) Can had been able to j) Could have been able to k) Could had been able to l) Must had been able to

+ present verb

ఇలాంటి structures రాయడానికి సాధ్యమవుతాయా? సాధ్యమైతే తెలుగులో translation చేస్తూ ప్రతి structure కు ఒకొక్క example ఇవ్వండి.

*రాజశేఖర్, కొసిగి, కర్నూలు*

**జవాబు:** English sentences అన్నీ ఒక structure లో ఇముడుతాయనేది నిజమే. అయితే వీటిలో చాలా patterns, ordinary conversation లో రావు. అందుకని మనం basic principles (మూల సూత్రాలు) తెలుసుకుని మాట్లాడటం మంచిది. practice చేయటం, వీలైనంతవరకు English చదవటం, TV news casts వినటం చేస్తే English మాట్లాడగలం.

2) had been able to = గతంలో చేయగలిగి ఉన్నాడు/ ఉంది.

a) He had been able to do it before I met him = నేనతన్ని కలుసుకోక ముందే అతనది చేయగలిగాడు.

b) Shall had been able to = ఇది తప్పు

- shall have been able to అని ఉండాలి = భవిష్యత్తులో ఒక సమయానికి ఏదైనా చేయగలిగి ఉంటాడు.

(c), (d), (e), (f), (g) - వీటన్నిటిలో కూడా had రాదు have (been able to) అని వస్తుంది.

Should have been able to = చేయగలిగి ఉండాల్సింది (కాని చేయలేదు)

Will have been able to - future లో ఓ time అనుకుంటే, ఆ time కు చేయగలిగి ఉంటాడు/ఉంటుంది.

Would have been able to = (గతంలో) చేయగలిగి ఉండేవాడు/ఉండేది (కాని లేదు)

May have been able to = (ఇప్పుడు) చేయగల్గి ఉండొచ్చు

Might have been able to = (గతంలో) చేయగలిగి ఉండవచ్చు

Can have been able to - ఇది తప్పు - can/ could తో able రాదు.

a) He should have been able to understand it = అది అర్థం చేసుకోగలిగి ఉండాల్సిందతను (కాని అర్థం చేసుకోలేకపోయాడు)

b) He will have been able to buy a car by the end of this year = ఈ సంవత్సరాంతానికి అతను కార్ కొనగలిగి ఉంటాడు.

c) He would have been able to do it = అతనది చేయగలిగే వాడే (కాని చేయలేదు)

d) He may have been able to meet the CM = CM ను కలుసుకోగలిగి ఉండొచ్చు

e) Must had రాదు - Must have been able to = కలుసుకోగలిగే ఉంటాడు / కలుసుకోగలిగి ఉండాలి.

He must have been able to meet the CM = CM ను (కచ్చితంగా) కలుసుకోగలిగే ఉంటాడు, కలుసుకోగలిగాడు కూడా

పై sentences ను modelగా తీసుకుని మీ conversation లో practice చేయండి.

**- M. SURESAN**

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 301



# Indians are yet to be free from ..

**Prakrit:** (It is) almost 60 years of Independence and still 40000 villages across the Country go without drinking water.

(స్వాతంత్ర్యం వచ్చి అరవయ్యేళ్లవుతోంది. దేశంలో ఇప్పటికీ 40000 గ్రామాలకు మంచినీళ్లు లేవు)

**Sukrit:** Are the big cities any the better?

(పెద్ద నగరాలేమన్నా మెరుగ్గా ఉన్నాయా? )

**Prakrit:** We are able to send rockets into space but can't find a solution to the drinking water problem?

(మనం అంతరిక్షంలోకి rockets ను పంపించ గలుగుతున్నాం కానీ మంచినీళ్ల సమస్యకు పరిష్కారం కనుక్కోలేకపోతున్నాం).

**Sukrit:** Yea. As far as technology is concerned, our Country is OK, though we are unable to catch up with smaller nations like Japan.

(అవును, సాంకేతిక పరిజ్ఞానం విషయానికివస్తే, Japan లాంటి చిన్న దేశాలతో సమానం కాకపోయినా, మన దేశం ఫర్వాలేదు.)

catch up with- తెలుసుగదా, ఇంకొకరితో సమాన మవటం.

**Prakrit:** How does that help? Still a large number of Indians are yet to be free from such evils as illiteracy, poverty, ill health and unemployment.

(దానివల్ల ప్రయోజనం ఏంటి? ఇంకా భారతీయుల్లో చాలామంది నిరక్షరాస్యత, పేదరికం, అనారోగ్యం, నిరుద్యోగ సమస్యల్లాంటి బాధల నుంచి విముక్తి లేకుండా ఉన్నారు కదా? )

**Sukrit:** You can't call your Country advanced as long as there are those four evils you mentioned. But the most basic thing is drinking water for everyone. Provided we have the will, we can certainly find the way.

(నువ్వు చెప్పిన ఆ నాలుగు బాధలూ ఉన్నంత కాలం నువ్వు నీ దేశాన్ని అభివృద్ధి చెందిన దేశ మని అనలేవు. అయితే అతి మౌలికమైంది- మంచినీళ్లు ప్రతివారికి అందజేయడం. నిజంగా మనకు మనసు ఉంటే, మార్గం తప్పకుండా కనిపిస్తుంది.)

**Prakrit:** True. Neither the State governments nor the Central government does nothing about it. They'd rather talk about progress all the time than do something about drinking water for all. What are these governments work if they can't assure drinking water?

(నిజం. రాష్ట్ర ప్రభుత్వాలు కానీ, కేంద్ర ప్రభుత్వాలు కానీ ఆ విషయంలో ఏమీ చేయడం లేదు. అవి ఎంతసేపూ ప్రగతి గురించి మాట్లాడటమేతప్ప మంచినీటి విషయంలో ఏం చేయవు. మంచినీళ్లకు హామీ ఇవ్వలేని ఈ ప్రభుత్వాలెందుకు? )

**Sukrit:** As soon as governments come to power, all that they think of is to continued to be in power. Except for a politician here and a politician there, all are corrupt. We can't fault them for that. They are there as we elect them. The fault is ours.

(ప్రభుత్వాలు అధికారంలోకి రాగానే ఆలోచించే దంతా అధికారంలో కొనసాగేదెలా అనే. ఎవరో ఒకరిద్దరు రాజకీయనాయకులు తప్ప మిగతా వాళ్లందరూ అవినీతిపరులే. కానీ దానికి వాళ్లను తప్పుపట్టలేం. వాళ్లనెన్నుకున్నది మనం. తప్పు మనది.)

**Prakrit:** Yea. No sooner does a politician come to power then they think of themselves and not the people. However, as I've told you earlier the people are to blame.

(అధికారంలోకి వచ్చీరాగానే ప్రతి రాజకీయవాదీ ప్రజల గురించి కాకుండా, తమ గురించే ఆలోచించుకుంటాడు. అయితే, ఇంతకుముందే చెప్పినట్లు ప్రజలదే తప్పు).

**Sukrit:** More and more educated people should show interest in elections so that better people are elected.

(మెరుగైన వాళ్లు ఎన్నికయేట్లు ఎక్కువమంది చదువుకున్నవాళ్లు ఎన్నికల్లో పాల్గొనాలి)

**Prakrit:** While more people voting is important, better people should contest the elections such that more honest people can come to power.

**Sukrit:** Supposing that a minimum educational qualification is prescribed for voters, won't that improve the situation?

(ఓటరుకు కనీస విద్యార్హత నిర్దేశిస్తే పరిస్థితి మెరుగవదంటావా? )

**Prakrit:** Seeing that some times the uneducated do think better than the educated. How can you be sure things will be better?

(కొన్నిసార్లు చదువుకున్నవాళ్లకంటే చదువులేని వాళ్లు బాగా ఆలోచించగలరు. అలాంటప్పుడు నీ ఆలోచనవల్ల పరిస్థితులు మెరుగవుతాయని ఎలా చెప్పగలం? )

**Sukrit:** This certainly is a knotty problem. I despair when I think of the future of the country.

(ఇది చాలా చిక్కు సమస్య. దేశ భవిష్యత్ గురించి ఆలోచిస్తే నిరాశగానే ఉంది నాకు.)

Knotty= నాటీ= ముడులతో ఉన్న,

knot= నాట్ = ముడి.

Despair = నిరాశ x hope = ఆశాభావం

**Prakrit:** I still hope for better days

(మంచి రోజులొస్తాయనే నేనాశిస్తున్నా)

**Sukrit:** Let's keep hoping lest we should lost interest in action.

(ఆశిస్తూ ఉందాం/ ఆశతోనే ఉందాం, పనిలో ఆసక్తిపోకుండా ఉండేందుకు)



**Look at the following sentences from the conversation above.**

1) As far as technology is concerned our Country is OK.
2) ... Indians are yet to be free from such evils as ...
3) You can't call your country advance as long as there are those four evils.
4) Provided we have the will, we can certainly find the way
5) They'd rather talk about progress all the time than do some thing...
6) As soon as governments come to power, all that they think of is ...
7) Except for a politician here and a politician there, all are corrupt.
8) More and more educated people should show interest in elections so that better people are elected.
9) While more people voting is important better people should contest elections such that more honest people can come to power.
10) Supposing that a minimum educational qualifications is prescribed ...
11) Seeing that some times the uneducated do think better than the educated ...

**1) As far as (somebody/ something) is concerned** = ఒక విషయానికొస్తే/ ఒకరి గురించి చెప్పాల్సి వస్తే (అని మన అభిప్రాయం తెలిపేందుకు వాడతాం)

a) As far as that school is concerned, it is one of the best here =

ఆ school విషయానికొస్తే/ ఆ school గురించి చెప్పాలంటే అదిక్కడున్న ఉత్తమ పాఠశాలల్లో ఒకటి.

b) As far as I am concerned, Hyderabad is a better place than Mumbai in some respects =

నా అభిప్రాయంలో/ నామట్టుకు నాకు, కొన్ని విషయాల్లో ముంబై కన్నా హైదరాబాద్ మెరుగు.

(As far as = so far as)

**2) Indians are yet to be free from such evils as poverty etc.**

Such (things/ people etc) as = such ... as = అలాంటివి.

Such rivers as the Ganga and the Godavari are considered holy = గంగా, గోదావరి లాంటి నదులను పవిత్రమైనవిగా పరిగణిస్తారు.

అయితే such ... as, కాస్త పాండిత్యం, గ్రాంథికం. దానిబదులు like వాడితే simple గా, natural గా ఉంటుంది.

'Rivers like the Ganga and the Godavari are considered holy' - ఇది better గా లేదూ?

**3) As long as** - ఇది చాలా useful expression. దీనర్థం ఒక విషయం అయేంతవరకు అని.

a) He was there as long as she was there =

ఆమె ఉన్నంతసేపూ అతను అక్కడున్నాడు.

b) As long as there is corruption, there can be no progress =

అవినీతి ఉన్నంతకాలం, ప్రగతి ఉండదు. (ఇక్కడ as long as కు, if అనే అర్థం వస్తోంది కదా)

c) As long as (so long as) you smoke, your health can't be good = నువ్వు smoke చేస్తున్నంతకాలం, నీ ఆరోగ్యం సరిగా ఉండదు.

As long as = so long as.

**4) Provided** = if. అలా జరిగినపుడే అనే అర్థం వస్తుంది.

a) Provided (that) you study well I'll give you whatever you want =

నువ్వు బాగా చదివితే, నీకేది కావాల్సినా ఇస్తా.

b) He will be selected provided that he plays well = అతను బాగా ఆడితే అతన్ని ఎంపికచేస్తాం.

**5) Rather**- దీని గురించి పాత lessons లో explain చేశాం. (ఒక అర్థం = దానికి బదులుగా)

**6) As soon as** = (ఒక పని) అయిన వెంటనే/ అయీ, అవకముందే.

a) As soon as he came home, he went to bed =

ఇంటికి రాగానే నిద్రపోయాడు. (ఇంటికొచ్చిన వెంటనే)

b) As soon as she enters the class she looks for her friends =

ఆమె class లోకి వచ్చిన వెంటనే తన friend కోసం చూస్తుంది. ఇదే అర్థం, No sooner కూ ఉంది. అయితే No sooner వాడినపుడు దానితోవచ్చే verb రూపం మారి, than రెండో clause లో వస్తుంది.

No sooner does she enter the class than she looks for her friend.

(enters = does enter)

As soon as the thief saw the police, he began to run = No sooner did the thief see the police than he began to run (did see = saw)

**7) except** = తప్ప

a) We work everyday except Sunday

(Sunday తప్ప ప్రతిరోజూ పనిచేస్తాం)

b) Everyone came except Ram

(Ram తప్ప అందరూ వచ్చారు)

c) except for = తప్పిస్తే.

Except for this defect, he is all right (ఈ దోషం తప్పిస్తే అతను సరైనవాడే)

**8) So that** - అందు కోసం/ ఆ ఉద్దేశంతో

a) He came here so that he could see me = నన్ను చూసేందుకు/ చూసే ఉద్దేశంతో ఇక్కడికి వచ్చాడు.

b) He started very early so that he could be sure of meeting the great man =

ఆ గొప్ప వ్యక్తిని తప్పక కలుసుకుందామని అతను చాలా త్వరగా బయల్దేరాడు.

He came here so that he could see me = He came here so as to see me = He came here to see me (the best and simplest)

**9) While** = వైరుధ్యాన్ని తెలిపేందుకు వాడతాం (మామూలుగా ఒక పని గతంలో జరుగుతున్నప్పుడు అని అర్థం - అది అందరికీ తెలుసు)

a) While he is earning a lot, his brother is starving =

అతను బాగా సంపాదిస్తుంటే అతని తమ్ముడు పస్తులుంటున్నాడు.

b) While she is tall, her sister is short =

ఆమె పొడుగు, ఆమె sister పొట్టి

**10) Supposing that** = అనుకో/ అనుకుంటే/ అనుకుందాం.

a) Supposing that he comes here, what will you do? =

వాడిక్కడికి వచ్చాడనుకో, ఏం చేస్తావు?

supposing that = suppose that

b) Suppose he is armed, will you fight with him? =

వాడు సాయుధుడుగా ఉన్నాడనుకో, నువ్వు వాడితో పోరాడతావా?

**11) seeing** = చూస్తూ/ అర్థం చేసుకుని

a) Seeing that he had a gun in his hand, all ran away =

అతడి చేతిలో gun ఉండటం చూసి, అందరూ పారిపోయారు.

b) Seeing that he is not interested in studies, his father put him in business =

చదువులో అతనికి ఆసక్తిలేదని చూసి/ అర్థం చేసుకుని/ కనిపెట్టి వాళ్ల నాన్న అతన్ని వ్యాపారంలో పెట్టాడు.

*- M. SURESAN*

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 302




# WHO WOULD LISTEN?

**Asraya:** Why this face off between you and your cousin Asritha? What exactly went wrong?
(నీ cousin ఆశ్రితకూ నీకూ పోట్లాటేంటి? అసలు పొరపాటెలా జరిగింది? )

**Abhaya:** She insisted that we go to the exhibition and we did. She was childish to be attracted by every silly thing in there and that delayed our returning home. All because of her.
(మేం exhibition కు వెళ్లాలని పట్టుబట్టింది. అలాగే వెళ్ళాం. తనదంతా చిన్నపిల్ల మన స్తత్వం. ప్రతి చిన్న విషయమూ తనకాసక్తి కలి గించటంతో మేం ఇంటికి రావటం ఆలస్యమ యింది. అంతా తన వల్లనే!)

insist= పట్టుబట్టడం.
silly అంటే తెలుసుకదా - అంత తెలివిలేని పిల్లతరహా
silly things - పనికిరాని వస్తువులు/ విలువలేని వస్తువులు

**Asraya:** So? (అయితే)

**Abhaya:** I had to face the music for returning home so late. Our elders blamed me for all that. They had been naturally anxious about our not being in on time.
(అందువల్ల నేను తిట్లు తినాల్సివచ్చింది. మా పెద్దవాళ్లందరూ నన్ను తప్పుపట్టారు. సకాలంలో రాలేకపోయినందుకు వాళ్లు సహజంగానే ఆదుర్దాపడ్డారు)

**Asraya:** Why didn't you tell them that Asritha was to blame for the delay?
(తప్పంతా ఆశ్రితదేనని నువ్వు వాళ్లతో ఎందుకు చెప్పలేదు? )

**Abhaya:** I did, of course, but who would listen? I happen to be the older, so they said I shouldn't have let her stay so long.
(నేను చెప్పాను. కానీ ఎవరు వింటారు? నేను పెద్ద అవటంతో అందరూ నన్నే అన్నారు. అంతసేపు తనను అక్కడ ఉండనివ్వకుండాల్సిం దన్నారు.)

**Asraya:** She isn't that young that you can control her. If she was silly enough to waste time at the exhibition your elders were sillier to fault you for that.
(నువ్వు అదుపులో ఉంచుకొనేంత చిన్నదేం కాదుగా తను? Exhibition లో కాలయాపన చేసేంత తెలివిలేంది తనయితే, అందుకు నిన్ను తప్పుపట్టటానికి వాళ్లకంతకంటే తెలివిలేదు.)

**Abhaya:** Perhaps so. She wouldn't even tell them that the delay was because of her. So I told her to face that she was a crook. That led to our face off. I'm happy I'll have nothing to do with her any more.
(కావచ్చు. అంత ఆలస్యమూ తనవల్లే అయిందని వాళ్లతో చెప్పలేదు. అందుకని దుర్మార్గురాలని తన మొహాన్నే అన్నా. అదే మా పోట్లాటకు దారితీసింది.)

**Asraya:** Does it mean you aren't on talking terms?
(అంటే మీకిద్దరికీ ఇప్పుడు మాటలు లేవనా? )
(not on talking terms = పోట్లాట వల్ల ఇద్దరి మధ్య మాటల్లేకపోవటం)

**Abhaya:** What else then? I am happy.
(ఇంకేంటి మరి? నాకు సంతోషంగా ఉంది)

**Asraya:** How can you continue to be so? Your homes face each other and you have to be seeing each other every so often.
(అలా ఎంతకాలం కొనసాగిస్తావు. మీ ఇళ్లు ఎదురెదురుగా ఉంటాయి. మీరు ఒకరినొకరు తరచూ చూసుకోవాల్సి ఉంటుంది)

**Abhaya:** But I don't care. She has even started making faces at me. She's that silly.
(నాకేంటి? నన్ను వెక్కిరించటం కూడా మొద లుపెట్టింది. అంత మూర్ఖురాలది.)

**Asraya:** You look dull, perhaps because you've taken it too much to heart. Put your face on. We'll go out for a walk.
(ఈ విషయాన్ని నువ్వు మరీ పట్టించుకున్నందువల్ల నువ్వు చాలా కళావిహీనంగా కనిపిస్తు న్నావు. కాస్త make up చేసుకో. బయటి కెళ్దాం.)

**Abhaya:** That suit me fine. Wait. I won't be more than a minute.
(నాకిదిష్టమే. ఉండు. నిమిషంలో తయారై వచ్చేస్తా)

Face కు సంబంధించిన expressions, మన conversation ను simple and effective గా చేసే మరి కొన్నింటిని ఈ lesson లో తెలుసుకుందాం.

**Look at the following expressions from the dialogue above**

1) Why the face off between you and your cousin Asritha?
2) I had to face the music
3) I told her to her face that she was a crook.
4) Your homes face each other.
5) She has even started making faces at me.
6) Put your face on.

1) Why the face off ... ?

**Face off:** ఇది conversation లో, ముఖ్యంగా American English లో తరచూ వినిపిస్తున్న modern expression.
అర్థం: ఎడమొహం, పెడమొహంగా ఉండటం, పోట్లాడుకోవటం, మాటా మాటా అనుకోవటం, etc.

a) The face off between the brothers was over property matters = (ఆస్తి విషయాల్లో ఆ అన్నదమ్ములిద్దరికీ పోట్లాటవచ్చింది)
b) The face off between the wife and the husband has gone to far for a divorce to be averted= ( భార్యభర్తల మధ్య తగాదా విడాకులు తప్పించలేనంత దూరం పోయింది.)

Avert = తప్పించటం/ఏదైనా చెడు జరగకుండా ఆపటం.
ఈ Face off ను బాగా practice చేయండి.

2) I had to face the music.
face the music = చేసిన పనికి శిక్ష, విమర్శనెదుర్కోవటం

a) You are late again today (you are) sure to face the music from the boss =
(మళ్లీ ఇవాళ ఆలశ్యంగా వచ్చావునువ్వు. Boss నిన్ను తిట్టటం / శిక్షించటం ఖాయం. ( మామూలు భాషలో అయితే Boss దగ్గరుందిలే నీకు ఇవాళ అంటాం కదా - ఆ అర్థంతో)
B) She overheard her daughter-in- law speaking ill of her. She will now face the music =
(తనను గురించి కోడలు చెడుగా మాట్లాడటం ఆవిడ వినింది. ఆ కోడలుకుంది ఇవాళ ( ఆ కోడలు ఫలితా న్ననుభవించబోతోందని).
ఇది చాలా ఉపయోగకరమైన expression మీ conversation లో వాడండి

3) I told her to her face that she was a crook.
Tell (some body) to their face = మొహాన్నే అనేయటం.

a) She is quite bold and out spoken. She doesn't hesitate to tell people to their face what she thinks of them =
(ఆవిడ చాలా ధైర్యం కలది, ఉన్నది ఉన్నట్లుగా చెప్పే స్వభావం. ఇతరులను గురించి తానేమనుకుంటున్నదీ వాళ్ల మొహాన్నే చెప్పటానికి సంశయించదు)
b) She told the minister to his face that she hates politicians =
(రాజకీయవాదులను తను ద్వేషిస్తానని మంత్రి మొహాన్నే అందావిడ)

4) Your home face each other.
To face = (ముఖ్యంగా ఇళ్లు, కట్టడాలు, లాంటివి) ఒక దిశవైపు ఉండటం

a) The building faces east =
ఆ కట్టడం తూర్పు ముఖంగా ఉంటుంది.
b) Almost all Hindu Temples face east =
దాదాపు అన్ని హిందూ దేవాలయాలూ, తూర్పు ముఖంగా ఉంటాయి.
c) The school across the road faces the bank= Road కు అవతల ఉన్న స్కూలు bank కు అభిముఖంగా ఉంటుంది.
d) East facing buildings are free from the after-noon heat=
తూర్పు ముఖంగా ఉన్న ఇళ్లకు మధ్యాహ్న వేడి తగలదు.

5) She has started making faces =
(Make faces = మొహాన్ని, మూతిని వంకరగా ఉంచి) వెక్కిరించటం / మూతివిరవటం, etc = pull a face (at somebody)

a) The teacher was enraged when he saw some of the pupils making faces/ pulling a face at him =
(కొంతమంది పిల్లలు తనను వెక్కిరించటం చూసి teacher కు విపరీతమైన కోపం వచ్చింది)
b) Who are you making faces/ pulling a face at? = ఎవర్ని వెక్కిరిస్తున్నావు నువ్వు?
c) She could only make faces/ pull a face as her husband wouldn't take her out =
(తన భర్త బయటికి తీసుకెళ్లనందుకు వెక్కిరించటం/ మూతి విరవటం మాత్రమే చేయగలిగిందామె)

6) Put your face on= Make up చేసుకోవటం (Powder, snow, cream లాంటి వాటితో)

1) She never comes out without putting her face on= Powder, cream, లాంటివి రాసుకోనిదే / Make up చేసుకోనిదే ఆమె బయటకి రాదు.
b) Are you coming out with that face? won't it you put your face on? =
ఆమొహంతో బయటకొస్తావా? కాస్త make up చేసుకో.




**ప్రశ్న : 1)** i) My target is to be a computer professional.
My target is to become a computer professional. ఈ వాక్యాల్లో ఏది కరెక్ట్?
ii) Purchase/buyపదాలను ఎలా వాడాలి?
iii) I am interested, I interested, Affect, Effect పదాల మధ్య తేడాను వివరించగలరు?

***పి. త్రిమూర్తులు, తాళ్లరేవు***

***జవాబు:*** i) My target is to be a computer professional అంటే, computer professional గా ఉండాలనేది నా లక్ష్యం. My target is to become a computer professional అంటే computer professional అవ్వాలని నా లక్ష్యం. రెండూ correct. ii) కొనడం అనేందుకు వాడాల్సిన మాట buy. ఈ అర్థంతో purchase కాస్త పాండిత్యం. కొనటం అనే అర్థంతో purchase వాడకుండటం better. కొన్న వస్తువు అనే అర్థంతో Purchase వాడటం వాడుక. This box is my purchase = ఈ పెట్టె నేను కొన్న వస్తువు. He has gone out to make a few purchases = ఏవో ఒకటి రెండు వస్తువులు కొనేందుకు బయటికి వెళ్ళాడు.
It's a good purchase = ఈ కొనటం బాగానే ఉంది/ మంచి బేరమే = It's a good buy at that price = ఆ ధరకు ఇది కొనటం మంచిదే = తెలివైన బేరం
iii) I am interested = నాకాసక్తిగా ఉంది
I interested = (Some body-him/her etc) = అతడి/ఆమెలో నేను కుతూహలం కల్గించాను. - నాలో వాళ్లకు ఆసక్తి కలిగేలా చేశాను.
iv) Affect = ప్రభావం చూపటం - Rain affect crops = పంటల మీద వర్షం ప్రభావం చూపుతుంది/ ప్రభావితం చేస్తుంది.
Effect = ప్రభావం = Rain has an effect on crops = పంటల మీద వర్షం ప్రభావం ఉంటుంది.

**ప్రశ్న : 2)** Afraid, Wish గురించి వివరించగలరు?

***ఎం.వి. సుబ్రమణ్యం, చిలుకూరు***

***జవాబు:*** afraid అంటే మామూలు అర్థం భయపడుతున్న అని. అయితే Spoken English లో ఏదైనా అయిష్టంగా చెప్పేటప్పుడు, I'm afraid అయిష్టతను వ్యక్తపరుస్తుంది, I am sorry అనే అర్థంతో.
A: Can you help me with a little money?
B: I am afraid (= I'm sorry) I can't (I can not). (Sorry, నే చేయలేను)
I wish I had a bike = I don't have a bike now; so I wish for a bike now (not possible now) = నాకు bike ఉంటే ఎంత బాగుండేదో! (లేనిదాన్ని/ ఇప్పుడు పొందలేని దాన్ని కోరుకోవటం)
I wish you didn't come here = నువ్విక్కడికి రాకుంటే బాగుండేది (కానీ వచ్చావు)
I wish they were here = వాళ్లిక్కడ ఉంటే ఎంత బాగుండును. (వాళ్లిప్పుడిక్కడ లేరు/ ఉండే ప్రసక్తి లేదు)

**ప్రశ్న : 3)** ఇంటర్ ఫస్టియర్ ఇంగ్లిష్‌లో 'shakespeare returned to his native place and died in 1616. అని ఉంది. ఇంగ్లిష్‌లో native place లేదని ప్రతిభలో చెప్పారు. వివరించగలరు 'I am having a one rupee -note అని లిఫ్కో డిక్షనరీలో ఉంది. కానీ having ను possession లో వాడకూడదు కదా?

***గుర్రం శంకర్, శంకరాపురం***

***జవాబు:*** Native place అనే expression english లో లేదు. Native country అనే expression ఉంది- కానీ ఇక్కడ గమనించాల్సిన విషయం - Native country లో native తర్వాత country అని అనకుండా country స్థానంలో ఆ country పేరు వాడతారు.
eg: He always loved his native India (అంటే His native country, India అని కానీ, He loved India, his native country అనకుండా) Native land అనే expression ఉంది - ఇది కూడా ఒకరు పుట్టిన దేశానికే ( గ్రామానికీ/ నగరానికి కాకుండా) వాడతారు Native land అంటారు Native place కాదు. Native city - ఈ expressions వాడుక విషయంలో కూడా జాగ్రత్తగా ఉండాలి. His Native city is Hyderabad/ Newyork లాంటి expressions వాడరు. దీన్ని ఇంకో విధంగా, Native Hyderabadi ఇలా అంటారు - ఆయానగరాల్లో ఎప్పుడూ / మామూలుగా నివసించే వాళ్లు అనే అర్థంతో, కాబట్టి ఏ సందర్భంలో కూడా మనం స్వగ్రామం, స్వస్థలం అర్థంతో వాడే Native Place అన్నమాట Standard english usage లో లేదు.
ii) have అంటే కల్గి ఉండటం (I am having a one rupee note - నా దగ్గర రూపాయి నోటుంది- ) అనే అర్థంతో అయితే మాత్రం am having సరికాదు. I have a one rupee Note అనటం correct- ఇది మీరు Standard dectionary / grammar book లో చూసినా ఉంటుంది.

***- M. SURESAN***




SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 303

# Your face is beaming

**Venu:** Your face is beaming. What makes you so happy? Can I share your joy?
(నీ మొహం నవ్వుతో వెలిగిపోతోంది. నిన్నంత సంతోషపరుస్తున్నదేది? నీ సంతోషంలో పాలు పంచుకోవచ్చా? )

**Vasu:** Why not? My proposals for a research project have been approved by the university - something I've been waiting for all along. Got the news just yesterday.
(ఎందుకు కాదు? ఓ పరిశోధనా పథకానికి నేను పంపిన ప్రతిపాదనలు University ఆమోదించింది. ఇప్పటివరకు నేను అందుకోసమే ఎదురు చూస్తున్నా. నిన్ననే ఆ సమాచారం అందింది.)

**Venu:** Congrats. But I'm not surprised. I didn't expect any thing less.
(అభినందనలు. కాని నాకేం ఆశ్చర్యంగా లేదు. నేను నీనుంచి ఇంతకంటే తక్కువగా ఎప్పుడూ అంచనా వేయలేదు.)

**Vasu:** Know what it means? Independent work supported by a good flow of funds. None above my head to guide me.
(అదేంటో తెలుసా? పుష్కలంగా వచ్చే నిధులతో నేను స్వతంత్రంగా పనిచేయొచ్చు. నాపైన guide చేయటానికి ఎవరూ ఉండరు.

good flow of funds = నిధుల ప్రవాహం బాగుంటుంది./ నిధుల కొరత ఉండదు. Research - పరిశోధన కోసం University ఇచ్చే grants.

**Venu:** How about you professor? What did he say?
(మీ professor సంగతేంటి? ఆయనేమన్నాడు)

**Vasu:** His face lit up when I gave him the news. He was happy
(ఈమాట చెప్పగానే ఆయన మొహం వెలిగింది. సంతోషపడ్డాడు.)

**Venu:** What about your better half?
(మీ ఆవిడ సంగతేంటి? )

better half - భార్య/ భర్త

**Vasu:** She was positively glowing with pride.
(తనైతే గర్వంతో వెలిగిపోయిందనుకో)

**Venu:** Yours is really an achievement for a person your age.
(నీది నిజంగా వయసుకు మించి సాధించిన విజయం)

**Vasu:** While I am very happy about all this, I am only too aware of the responsibility. I have to justify the confidence people have placed in me. I should prove that the funds have been properly used.
(వీటన్నిటివల్ల నాకు సంతోషంగా ఉన్నా, నా బాధ్యతను కూడా మరచిపోలేకుండా ఉన్నా. నాలో ఇతరులుంచిన విశ్వాసాన్ని నిలబెట్టుకోవాలి. నాకు కేటాయించిన నిధులు సద్వినియోగ మయ్యాయని చూపించాలి.)

**Venu:** You have it in you. You can do it. I'm confident of it.
(అది నీలో ఉంది. నువ్వది తప్పక చేయగలవు. నాకానమ్మకం ఉంది.)

**Vasu:** That's going to keep me busy for quite some time.
(ఇది నన్ను కొంతకాలంపాటు తీరికలేకుండా చేయబోతోంది.)

**Venu:** I noticed your colleagues grinning with delight about this. However, I think a few are envious about it.
(నీ సహోద్యోగులంతా సంతోషంగా నవ్వటం నేను గమనించాను. అయితే కొంతమంది ఈర్ష్యగా ఉన్నారనకుంటాను)

**Vasu:** I think I know who you mean. Aren't they Gopal and Venu?
(నువ్వెవరి గురించి అంటున్నావో నాకు తెలుసనుకుంటాను. వాళ్ల గోపాల్, వేణు కదా? )

**Venu:** Let them alone. What can they do?
(వదిలేయ్. వాళ్లేంచేయగలరు? )

**Vasu:** Last year they were glowing over my not getting it. They didn't know I didn't get it for reasons other than merit.
(కిందటి సంవత్సరం నాకిది రాలేదని వాళ్లు చాలా సంతోషపడ్డారు. నా ప్రతిభకు సంబంధం లేని ఇతర కారణాల వల్ల రాలేదనేది వాళ్లకర్థం కాని విషయం.)

**Venu:** You've been outstanding in your field. You'll do even better, I am sure. Go ahead.
(నీ రంగంలో నువ్వు చాలా విశిష్ట కృషే చేశావు. ఇంకా బాగా చేయగలవు. కానియ్.)

**Vasu:** I'll get busy from next week on this project. I need your best wishes and cooperation.
(వచ్చే వారం నుంచి దీనివల్ల తీరికలేకుండా ఉంటాన్నేను. నీ best wishes, నీ సహకారం నాకవసరం)

**Venu:** You have them in plenty. Don't worry.
(అవి నీకెప్పుడూ పుష్కలంగా ఉంటాయి. Worry అవకు)

☺ ☺ ☺ ☺

ఇప్పుడు మనం తెలుసుకోబోయే మాటలన్నీ కూడా మన conversation సరళంగా ఉందనిపించేవే కాకుండా expression కు బలాన్నిచ్చేవే.

Let's look at the following sentences from the dialogue above.

1) Your face is beaming
2) His face lit up when I gave him the news
3) She was positively glowing with pride
4) I noticed your colleagues grinning with delight about this
5) Last year they were gloating when I didn't get it.

ఇవన్నీ కూడా మన సంతోషాన్ని తెలిపే వివిధ రకాల నవ్వులకూ, అవి కల్పించే మన ముఖకవళికలకూ సంబంధించిన మాటలే. బాగా practice చేద్దాం.

**1) Your face is beaming =**
నీ మొహం సంతోషం వల్ల నవ్వుతో వెలిగిపోతోంది.
Beam = సంతోషకరమైన చిరునవ్వుతో మొహం నిండిపోవటం/ మొహం సంతోషంతో వెలిగిపోవటం.

a) The captain of the victorious team beamed at the spectators and the journalists = గెలుపొందిన జట్టు captain సంతోషంగా వెలిగిపోతూ ప్రేక్షకులవైపూ పాత్రికేయులవైపూ చూశాడు.

b) He beamed a smile as he received the prize = బహుమతి అందుకుంటూ అతను సంతోషంగా చిరునవ్వు నవ్వాడు

c) She was beaming with delight to know her daughter topped the class = Class లో తన కూతురు first వచ్చిందని తెలిసి, ఆమె మొహం ఆనందంతో వెలిగిపోయింది.

**2) His face lit up when I gave him the news**
నేనీవార్త చెప్పగానే, అతని మొహం నవ్వుతో ప్రకాశవంతమయింది./ వెలిగిపోయింది.
lit up = Past tense of light = వెలిగించటం
lit up = వెలిగింది.

a) The parents face lit up when he knew his child was out of danger = తన బిడ్డకు ప్రమాదం తప్పిందని తెలిసి తండ్రి/ తల్లి మొహంలో వెలుగు కనిపించింది/ మొహం సంతోషంతో వెలిగింది.

b) This scheme is sure to light up the faces of lakhs of poor people = లక్షల మంది పేద ప్రజల మొహంలో ఈ పథకం చిరునవ్వు వెలిగించటం ఖాయం

**3) She was positively glowing with pride =**
ఆమె మొహం గర్వంతో వెలిగిపోతోంది. (అప్పుడు)
glow = మెరవటం. ఈ సందర్భంలో సంతోషంతో/ గర్వంతో మొహం నవ్వుతూ వెలిగిపోవటం

a) The faces of the bangladesh players glowed with pride as they beat India = భారత్‌ను ఓడించగానే బంగ్లాదేశ్ ఆటగాళ్ల మొహాలు గర్వంతో కూడిన నవ్వుతో మెరిసిపోయాయి.

b) The child glowed wiht delight at the toys his father brought it = తన తండ్రి తెచ్చిన ఆట వస్తువులు చూడటంతో ఆ బిడ్డ మొహం నవ్వుతో విప్పారింది.

**4) I noticed your colleagues grinning with delight about this =**
సంతోషంతో నీ సహోద్యోగుల మొహాలు చిరునవ్వుతో విప్పారటం నేను గమనించాను.

a) Hemu grinned when he heard that thegihad agreed to marry him = ఆ అమ్మాయి తనను పెళ్లి చేసుకోవటానికి ఒప్పుకొందని తెలియగానే హేమూ మొహం నవ్వుతో విప్పారింది.

b) Sadguna grinned from ear to ear as she was called receive prize after prize = బహుమతి వెంబడి బహుమతి స్వీకరించాలని పిలిచినప్పుడల్లా ఆమె నవ్వు చెవినుంచి చెవి వరకు సాగింది (ఆమె మూతి కొనలు చెవుల వరకూ సాగాయి)

An ear to ear grin/ an ear to ear smile = మూతి కొనలు చెవులను తాకేంతగా వచ్చే చిరునవ్వు

**5) Last year they were gloating over my not getting it =**
కిందటి సంవత్సరం నాకు రానపుడు వాళ్లు ఆనందంగా నవ్వారు)

gloat = మనం శత్రువుల మీద విజయం పొందినపుడు/ మన శత్రువులు విఫలమయినపుడు మనకు కలిగే సంతోషం

a) Duryodhana and Sakuni were gloating when they saw the Pandavas walking to the forest = అరణ్యానికి నడుస్తున్న పాండవులను చూసి దుర్యోధనుడు, శకుని సంతోషపడ్డారు.

b) Her not getting the prize didn't worry her. She was gloating over her rival's disappointment = తను బహుమతి పొందలేకపోవటం ఆమెకు బాధ కలిగించలేదు. తన ప్రత్యర్థి నిరాశపడటంతో ఆమె సంతోషించింది.

gloat- ఇష్టంలేనివాళ్ల కష్టాలు, వైఫల్యాలు చూసి కసితీరా నవ్వుకోవటం.

They gloated over the fact that their enemy lost too = తమ శత్రువు కూడా ఓడిపోయాడని వాళ్లు చంకలు గుద్దుకున్నారు.

**- M. SURESAN**



ప్రశ్న: *1. He can able to answer.* ఈ వాక్యంలో can - ability ని సూచిస్తుందికదా. అలాంటప్పుడు able అవసరమా? *He can answer* అనిగానీ, *He ables to answer* అనిగానీ అంటే సరిపోతుందా?
*2. than that of* వాడే సందర్భాలను వివరించగలరు.
*3. nine days wonder- proverb* గురించి తెలపగలరు.
*4. The CM will visit this week.*
*The CM visits this week.* ఏది సరైంది?
*5. Phrasal Verbs* ఏ విధంగా నేర్చుకోవాలో వివరించగలరు.

*అల్లూరి సత్య, సుందరయ్యా కాలనీ, విశాఖపట్నం*

జవాబు: 1) can = గల = be able to. Can, be able to - ఈ రెండింటి అర్థం ఒకటే కాబట్టి వీటిని పక్కపక్కన వాడం. ఏదో ఒకటే వాడుతాం.
He can do it = He is able to do it (రెండింటిలో ఏదో ఒకటి అంటాం)
2) The weight of this box is more than that (the weight) of the other box. (ఈ box బరువు, ఆ box బరువు కంటే ఎక్కువ)
The value of gold is more than that (the value) of most other metals. (చాలా ఇతర metals విలువ కంటే బంగారం విలువ ఎక్కువ)
3) A nine day's wonder = మూణ్నాళ్ల ముచ్చట (తాత్కాలికంగా సంచలనం/ ఆసక్తి కలిగించే వ్యక్తి/ విషయం)
a) Her acting career was a nine day's wonder = ఆమె నటనా జీవితం/ నటిగా ఖ్యాతి తాత్కాలికమే అయింది/ ఎక్కువకాలం నిలవలేదు
b) Hope the boy cricketer will not pass off as a nine day's wonder = చిన్నతనంలోనే గొప్ప cricketer అయిన అతని గొప్పతనం తాత్కాలికం/ కొన్నిరోజులు మాత్రమే ఉండిపోదని ఆశిస్తున్నా.
4) The CM will visit this week = ఈ వారం వస్తారు (అంత కచ్చితంగా కాదు).
The CM visits this week= ఈ వారం వస్తారు (వచ్చేది దాదాపు కచ్చితం).
5) Phrasal verbs పుస్తకాలు, News papers చదవటంవల్ల సులభంగా వస్తాయి.

ప్రశ్న: *1. a) If you had not saved me, I would have died.*
*b) If you had not saved me, I would have been killed.* వీటిలో ఏది కరెక్ట్?
*2. kill, die* ల గురించి తెలుపగలరు.

*- M. Gantalarao, Pudimadaka*

జవాబు: 1. a) నువ్వు నన్ను రక్షించకపోయుంటే, నేను చనిపోయేవాడిని.
b) నువ్వు నన్ను రక్షించకపోయుంటే, నేను చంపబడేవాడిని.
2) Kill అంటే చంపటం - ఇది Passive form లో (be form + killed) వాడితే, ఎవరయినా చంపటం, accident లాంటి వాటిల్లో చావటం అనే అర్థం వస్తుంది.
die అంటే చనిపోవటం.
a) He died in an accident = He was killed in an accident
b) If you drive so rashly you will die/ you will be killed.

ప్రశ్న: Shot gun wedding, Hen night, Stag night పదాల అర్థాలు వివరించగలరు.

*– ఎస్.శ్రీనివాసులరెడ్డి, కలువాయి.*

జవాబు: Shot gun wedding/ marriage = అత్యవసరంగా జరిగే/ జరిపించే పెళ్లి (ముఖ్యంగా పెళ్లికూతురు గర్భవతిగా ఉండటంవల్ల).
Hen night/ hen party = ఆడవాళ్లు మాత్రమే, వాళ్లల్లో ఒకరికి పెళ్లి కాబోయేటప్పుడు జరుపుకొనే party, మగవాళ్లకు ప్రవేశం లేకుండా.
Stag night = మగవాళ్లు మాత్రమే, వాళ్లల్లో ఒకరికి పెళ్లవబోతున్నప్పుడు జరుపుకొనే party, ఆడవాళ్లకు ప్రవేశం లేకుండా).
(Hen = కోడిపెట్ట, stag = మగజింక - తెలుసు కదా? )




SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 304

# I have an eye for beauty

**Gaurav:** What are you all eyes for? I've been watching you for 5 minutes now, you haven't taken your eyes off from the tree.
(ఏంటి ఒళ్లంతా కళ్లు చేసుకుని అటువైపే చూస్తున్నావ్? ఐదు నిమిషాలుగా గమనిస్తున్నా. ఆ చెట్టు మీదినుంచి నువ్వు దృష్టి మరల్చటంలేదు).

**Satvik:** Can't you see the bird there with its wonderful plumage? I haven't seen one like that before. What a wonderful combinations of colours! (ఆశ్చర్యకరమైన రంగుల ఈకలతో ఉన్న ఆ పక్షి కనిపించడం లేదా నీకు? అలాంటి పక్షినింతవరకు నేను చూడలేదు. ఎంత అద్భుతమైన రంగుల కలయిక!

plumage= ప్లూమిజ్- పక్షికున్న రెక్కలూ, ఈకలూ కలిపి.

**Gaurav:** I've been here as long as you but I hadn't seen it till you showed it to me. How is it things like that catch your eyes only?
(నువ్వున్నంతసేపూ నేనూ ఇక్కడే ఉన్నాను, కాని నువ్వు నాకు చూపించేవరకూ నేను దాన్ని చూడలేదు. అలాంటివన్నీ నీ కళ్ల మాత్రమే పడతాయేంటి? )

**Satvik:** Yea, They do; you could see them too if you looked around with the eyes of an artist. I do I have an eye for beauty. That makes all the difference, pal.
(అవును, అంతే. ఒక కళాకారుడి కళ్లతో మన చుట్టూ చూస్తే, నువ్వూ అలాంటివి చూడగలవు. నేనలా చూస్తాను. అందాన్నీ, ఆకర్షణీయమైనవాటినీ చూసిన వెంటనే గుర్తుపట్టే శక్తి నాకుంది. అది నీకు లేదు. తేడా అంతా అదే మిత్రమా!

pal = friend

**Gaurav:** But yesterday it was different. You couldn't spot a butterfly with its beautiful wings a few feet away until I told you. Even then you were unable to see it with the naked eye. You needed binoculars. So much for your eye for beauty!
(కానీ నిన్న వేరే కదా? కొద్ది అడుగుల దూరంలో ఉన్న సీతాకోకచిలుక అందమైన రెక్కలను నేను చెప్పేదాకా నువ్వు గమనించ లేదు. అపుడు కూడా మామూలుగా కళ్లతో కాకుండా binoculars తోనే చూడగలవు. అదీ నీ అందాన్ని గుర్తుపట్టగల శక్తి!)

**Satvik:** I agree. What an amazing display of colours it was! I hadn't clapped my eyes on such a sight before.
(నే ఒప్పుకొంటా. ఎంత ఆశ్చర్యకరమైన రంగుల ప్రదర్శన అది! అలాంటి దృశ్యాన్ని అంతకుముందు నేను చూడలేదు.)

**Gaurav:** OK. It's time we went home.
(సరే. ఇంటికెళ్లాల్సిన time ఎప్పుడో అయింది).

**Satvik:** Let's go then. (అయితే వెళ్దాం పద.)

☺ ☺ ☺ ☺

మామూలు Spoken English లో eye (కన్ను)తో వచ్చే expressions చాలానే ఉన్నాయి. అవన్నీ ఎంత సాధారణం అంటే, చదువుతున్నప్పుడే వాటి అర్థం మనకు స్ఫురిస్తుంది, కాస్త ఆలోచనతో. వీటిని మన conversation లో వాడగలిగేలా practice చేస్తే బాగుంటుంది.

**Look at the following sentences from the conversation above:**

1) You haven't taken your eyes off from that tree
2) How is it that things like that catch your eyes only?
3) You could see them too if you looked around with the eyes of an artist.
4) I have an eye for beauty
5) Even then you were unable to see it with the naked eye
6) I hadn't clapped my eyes on such a sight before.

**1) You haven't taken your eyes off from that tree** =
ఆ చెట్టు మీదినుంచి దృష్టి మరల్చలేదు నువ్వు.

Take (somebody's) eyes off= ఒకదానిని/ ఒకరిని తదేకంగా చూస్తూ దృష్టి మరల్చలేకపోవటం.

a) What an enchanting sight this evening sky is! I am unable to take my eyes off it even for a second =
ఎంత రమణీయమైన దృశ్యమో ఈ సాయంత్రం ఆకాశం! నా కళ్లు ఆకాశంవైపు నుంచి తిప్పలేకుండా ఉన్నా.

b) He was not able to take his eyes off her
ఆమె వంక అదేపనిగా చూస్తున్నాడతను/ ఒళ్లంతా కళ్లు చేసుకుని చూస్తున్నాడు.
ఈ expression గమనించండి: not able to take his eyes off అని, not తోనే వాడతాం.
ఇదే అర్థంతో ఇంకో expression: be all eyes for దీనర్థం కూడా దృష్టి మరల్చకుండా చాలా జాగ్రత్తగా ఒకదానినే/ ఒకరినే చూడటం అని.

a) Supriya was all eyes as she saw Pratap approaching =
ప్రతాప్ దగ్గరకు రావడం చూసి సుప్రియ అతనివైపే చూస్తూ ఉండిపోయింది.

b) We were all eyes as the magician who had himself locked up in a box coming out of it =
తాళం పెట్టెలోంచి బయటకు వస్తున్న ఇంద్రజాలికుడ్ని మేం అలాగే (ఆశ్చర్యంతో) చూస్తూ ఉండిపోయాం.

be all eyes = ఒళ్లంతా కళ్లు చేసుకుని/ కళ్లప్పగించి చూడటం.

**2) How is it that things like that catch your eyes only?** =
అలాంటి విషయాలు నీ ఒక్కడి దృష్టిలోనే పడతాయేంటి? (How is it = Why)

Catch (somebody's) eye= ఒకరి దృష్టిలో పడటం/ ఒకరు మనల్ని చూస్తున్నప్పుడే, వాళ్లనూ మనం చూడటం.

a) As the thief caught the policeman's eye, the policeman without wasting a minute rushed towards him=
దొంగ కంటబడగానే policeman ఒక్క క్షణం కూడా వృథా చేయకుండా, గబగబా అతనివైపు వెళ్లాడు.

b) He caught my eye as he entered the college =
College లోకి ప్రవేశిస్తూ నా కంటబడ్డాడు.

**3) You could see them too if you looked around with an artist's eye** =
కళాకారుడి దృష్టితో నీ చుట్టూ చూస్తే నీవూ వాటిని చూడగలవు/ అవి నీకూ కనిపిస్తాయి.

Look with (somebody's) eyes = ఇంకొకరి కళ్లతో చూడటం. ఇది తెలుగులో కూడా వాడుతుంటాం. అర్థం: వాళ్ల దృష్టిలో అని కదా?

a) Look at it with an Engineer's eye. You find it defective =
ఓ Engineer దృష్టితో చూడు దాన్ని. దానిలో లోపం ఉందని తెలుస్తుంది.
defective = having a defect = లోపంతో ఉండటం.

b) A police officer, he look at things with a policeman's eye=
అతను police officer కాబట్టి ప్రతి విషయాన్ని police దృష్టితోనే చూస్తాడు.

**4) I have an eye for beauty** =
అందాన్ని చూడగానే దాన్ని గుర్తుపట్టేయగలను నేను.

Have an eye for/ Have a good eye for = ఒక విషయం చూడగానే దాన్ని గుర్తుపట్టేయగలగడం/ అలాంటి శక్తి ఉండటం.

a) Look at the way he was planned the house. He has a (good) eye for convenience and comfort=
ఆ ఇల్లు ఎలా plan చేశాడో చూడు. సౌకర్యాలు, సౌఖ్యం అంటే అతనికే తెలుసు. (అంటే సౌకర్యంగా, సౌఖ్యంగా ఉండేట్లు ఇల్లు plan చేశాడు).

b) She really has a (good) eye for colour. Her dress shows that =
ఆమెకు మంచి రంగులేమిటో, చూసినపుడు వాటిని గుర్తుపట్టడం బాగా తెలుసు. అది ఆమె dress ను చూస్తేనే తెలుస్తుంది.

**5) Even then you were unable to see it with the naked eye.**
అప్పుడు కూడా దాన్ని మామూలు(గా) కళ్ళతో చూడలేకపోయావు.

See with the naked eye = కళ్ల జోళ్లు, భూతద్దాలు, binoculars, telescope లాంటి వాటి సహాయం లేకుండా మామూలుగా ఉత్త కళ్లతో చూడగలగడం.

a) Bacteria are not visible to the naked eye
సూక్ష్మజీవులు మామూలు కళ్లకు (Microscope లాంటి వాటి సహాయం లేకుండా) కనిపించవు

b) Some of the planets are visible to the naked eye =
కొన్ని గ్రహాలు కంటికి కనిపిస్తాయి (Telescope లేకుండా)

**6) I hadn't clapped eyes on such a sight before** =
అలాంటి దృశ్యాన్ని చూడకపోవటం.

clap eyes on = ఒక విషయాన్ని/ ఒకరిని చూడటం (ముఖ్యంగా ఆశ్చర్యం, దిగ్భ్రమ కలిగించే దృశ్యాలు)

a) A child playing with a tiger cub- well, that's a sight I haven't clapped my eyes on it before =
ఓ పాప పులిపిల్లతో ఆడటం- అలాంటి (దిగ్భ్రమ కలిగించే) దృశ్యాన్నెప్పుడూ చూడలేదు.

b) I've never clapped my eyes on him before =
అతన్ని ఇంతకుముందు నేనెప్పుడూ చూడలేదు.

- M. SURESAN




**ప్రశ్న:** *I have to talk to them.*
*I have to talk with them.*
*ఈ రెండు వాక్యాల్లో ఏది కరెక్ట్?*
*- M. PARANJEE, Atchutapuram*

**జవాబు:** Both are correct,
Talk to = talk with

**ప్రశ్న:** *Wive, wife, life. వీటి plurals తెలపండి. Lifes పదం ఇంగ్లిష్ వాడకంలో ఉందా?*
*- D.N.Raju, Pudimadaka*

**జవాబు:** Wife - Wives
life - lives
Wive అనే మాట లేదు. lifes అనే మాట కూడా లేదు. కాని life's అంటే జీవితం యొక్క అని;
His life's greatness is known =
అతని జీవితం గొప్పతనం అందరికీ తెలుసు.

**ప్రశ్న:** *Marriages are made in heaven. ఈ వాక్యాన్ని Active Voice, Passive Voice లలో తెలపండి.*
*- M. Navakishore, Pudimadaka*

**జవాబు:** Marriages are made in heaven- దీనికి అర్థం- పెళ్లనేది రాసిపెట్టి ఉంటుంది- అంటే దేవుడు/ విధి- వీటి ప్రకారం వల్లనేగానీ, మన ఇష్టప్రకారంకాదు అని కదా. దీనికి సరైన active లేదనే చెప్పాలి. Active కావాలనుకుంటే,
God/ Fate/ Destiny makes marriages in heaven అని చెప్పుకోవచ్చు
(fate = destiny = విధి.)

**ప్రశ్న:** *a) Active voice, Passive voice లో ఉపయోగించే origin అంటే ఏమిటి?*
*b) As if ను వాడుతూ కొన్ని వాక్యాలు ఇవ్వండి.*
*c) As soon as, as well as మధ్య తేడా తెలపండి.*
*- Praveenkumar, Pudimadaka*

**జవాబు:** 1) Voices లో origin అంటూ ప్రత్యేకంగా నాకు తెలిసిలేదు. Verb ను ఒక Voice నుంచి ఇంకో voice కు మార్చేందుకు, verb form లో వచ్చే మార్పు తెలుసుకుంటే చాలు. Origin గురించి తెలుసుకోనక్కర్లేదు.

2) as if = as though = అయినట్లు/ జరిగినట్లు, కాని అవలేదు/ జరగలేదు అనే అర్థంతో ఎక్కువగా వాడతాం. As if/ as though తర్వాత past tense వాడతాం. (were, past doing word)

eg: 1) He talks as if he were very clever = చాలా తెలివైనవాడయినట్లు మాట్లాడతాడు. (కానీ తెలివైనవాడు కాదు)
2) He behaves as though/ as if he knew nothing about it = దాని గురించి ఏమీ తెలియనట్లు ప్రవర్తిస్తున్నాడు (కానీ వాడికి తెలుసు)
3) She is running as if death were chasing her =
తనను మృత్యువు వెంటబడి తరుముతున్నట్లు (నిజానికి అంత ప్రమాదంలేదు) పరుగెత్తుతోంది.

3) As soon as = ఒక పని అయిన వెంటనే.
a) As soon as you pay the fees, you can sit in the class = fees కట్టిన వెంటనే class లో కూర్చోవచ్చు
b) As soon as he came home he turned on the TV to watch the match = ఇంటికి వచ్చిన వెంటనే TV పెట్టాడు match చూసేందుకు.

As well as - దీనికి as soon as కూ సంబంధమే లేదు కదా. As well as అంటే ఒకదానితోపాటు ఇంకోటి కూడా.
a) He gave me books as well as money = నాకతను డబ్బు మాత్రమే కాకుండా books కూడా ఇచ్చాడు.
b) Hari as well as Siva is here = హరే కాకుండా శివ కూడా ఇక్కడున్నాడు, As well as అంటే ఒకరంత బాగా అవి.
c) He can sing as well as his brother
అతని అన్నంత బాగా అతను పాడగలడు.



SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 305

# Keep an eye on them

**Dhaval:** Congrats on your promotion as the manager of this branch.

(ఈ శాఖకు manager గా promotion వచ్చినందుకు నీకు నా అభినందనలు).

Wish you a happy time as the manager.

(Manager గా నువ్వు సంతోషంగా గడిపేయాలని నా కోరిక)

**Tushar:** Thank you. But I am a bit diffident about my performance as the manager. You know what it means? I am going to be totally responsible for the running of it.

(Thanks. కానీ manager గా నా నిర్వహణ గురించి నాకంతగా నమ్మకం లేకుండా ఉంది. ఇప్పుడేంటి తెలుసా? ఈ branch నిర్వహణకు మొత్తం నేనే బాధ్యుణ్ని.)

diffident- డిఫిడెన్ట్ - ఇది confident కు వ్యతిరేకం

diffident = తమ మీద తమకే నమ్మకం లేకపోవటం

**Dhaval:** You are sure to succeed. You did a splendid job of your last assignment. This isn't going to be more difficult than that. With that experience, you can manage this new job with your eyes closed.

(నువ్వు కచ్చితంగా నెగ్గుతావు. నీకింతకు ముందు అప్పగించిన బాధ్యతను ఘనంగా నిర్వహించావు. ఆ అనుభవంతో ఈ కొత్త బాధ్యతను చాలా సులభంగా చేయగలవు.)

assignment = అసైన్‌మెంట్ - 'సై' నొక్కి పలుకుతాం- ఒకరికి అప్పగించే బాధ్యత/ ఒక పని.

splendid = ఘనమైన/ గొప్పదయిన.

Job మామూలుగా అర్థం, ఉద్యోగం. ఇలాంటి సందర్భాల్లో అర్థం- నిర్వహించిన పని.

He did a good job of it =

అతడా పని చాలా చక్కగా చేశాడు

**Tushar:** I am going to look to you for help and guidance, as always.

(ఎప్పటిలాగానే, నీ సాయం, మార్గదర్శకత్వం కోసం చూస్తుంటాను)

**Dhaval:** You have them always. The pleasure, of course, is mine.

(నీకవెప్పుడూ ఉంటాయి. వాటిని ఇచ్చే ఆనందం నాది)

**Tushar:** Thank you. Could you run an eye over this report - the first I've prepared after my taking over here? Please suggest any changes and improvements I can make in it. I want it to be perfect because it is the first I am turning in after assuming charge here.

(Thanks, కాస్త ఈ report ను - ఇక్కడ నేను బాధ్యత స్వీకరించిన తర్వాత నా మొట్టమొదటిది - గబగబా చదివేయవా? ఏవైనా మార్పులూ, చేర్పులూ సూచించు, please. ఇక్కడ charge తీసుకున్న తర్వాత మొట్టమొదటి report కాబట్టి అది దోషరహితంగా ఉండాలని నా కోరిక.)

taking over = assuming charge = ఒకచోట ఒక పదవి బాధ్యతలు స్వీకరించటం.

perfect = ఏ విధమైన దోషం లేకుండా ఉండటం

Turn (something) in = submit చేయడం

**Dhaval:** I don't mind going through it, but I think it's not necessary. You're being unduly apprehensive.

(చదివేందుకు నాకేం అభ్యంతరం లేదు. కానీ అది అనవసరం అనుకుంటున్నా. నువ్వు అనవసరంగా భయపడుతున్నావనుకుంటా.)

unduly = మరీ/ అనవసరంగా

apprehensive = భయాందోళనలతో ఉండటం

**Tushar:** I have reason to be. You know it is for the eyes of our MD. So I had better take care it is perfect.

(నా భయాందోళనలకు కారణం ఉంది. ఈ report నేరుగా మా MD - Managing Director సమ్ముఖానికే. అందుకని అది అన్నివిధాలా బాగుండేట్లు జాగ్రత్తపడాలి.)

**Dhaval:** You are very modest Tushar, you won awards last year for the best branch manager, and the best managed branch. All eyes were on you as you went up the dais to receive them from the CEO.

(Tushar, నువ్వు చాలా నిగర్వివి. కిందటేడాది, అత్యుత్తమ branch manager గా, అత్యుత్తమంగా నిర్వహించిన branch కు పురస్కారాలు పొందావు. నువ్వా పురస్కార స్వీకరణకు వేదిక మీదకు వెళుతుంటే అందరి కళ్లూ నీ మీదే.)

modest = నిగర్వి అయిన /నిరాడంబరమైన

CEO - Chief Executive Officer - ఒక Company కి ముఖ్య కార్యనిర్వహణాధికారి - Company విధానాలను అమలుచేసే అత్యున్నత స్థాయి అధికారి.

Dais - వేదిక - ఎక్కువగా డయాస్ అని తప్పుగా ఉచ్చరిస్తుంటారు. Correct pronunciation - డెయ్స్

**Tushar:** Thank you Dhaval. Still I'd like to have any advice you'd like to leave me.

(Thanks. అయినా కూడా, నీ సలహా నాకెప్పుడూ ఇష్టమే)

**Dhaval:** Just one piece of advice. Beware the two senior most clerks in your branch. Keep an eye on them. They aren't fair minded.

(ఒక్క సలహా. నీ branch లో అందరికన్నా senior లైన ఇద్దరు clerks విషయంలో జాగ్రత్త. వాళ్లమీద ఓ కన్నేసి ఉంచు. వాళ్లు సరయిన మనస్తత్వం కలవాళ్లు కారు)

**Tushar:** I'll remember that. Thank you.

(అది గుర్తుంచుకుంటాను, thank you)

**Dhaval:** Maintain eye contact with all those who talk to you and work under you. That improves confidence in them.

(నీతో మాట్లాడేవాళ్ల, నీ కిందివాళ్ల మొహంలోకి చూసి మాట్లాడు. అది వాళ్ల విశ్వాసాన్ని పెంచుతుంది.)

☺ ☺ ☺ ☺

Eye తో తరచుగా మన real life conversation లో వచ్చే మాటలు మరికొన్ని ఈ lesson లో చూద్దాం.

**Look at the following expressions from the conversation above**

1) You can manage this new job with your eyes closed.

2) Could you run an eye over this report?

3) You know it is for the eyes of our MD

4) All eyes were on you

5) Keep an eye on them

**1) You can manage this job with your eyes closed**

With your eyes closed = ఏదైనా పనిని చాలా సులభంగా చేయగలగడం.

మనకున్న అనుభవంవల్లగానీ సామర్థ్యం వల్లగానీ ఏదైనా పనిని సులభంగా చేయగలిగితే అప్పుడు మనం దానిని We can do it with our eyes closed or with our eyes shut అంటాం.

a) SV Ranga Rao was such an artiste that he could do any role with his eyes closed/ shut =

(ఏ పాత్రనైనా చాలా సులభంగా/ అవలీలగా/ చేయగల నటుడు SV రంగారావు)

b) Days were when Sachin was able to score centuries with his eyes closed =

అవలీలగా/ సులభంగా Sachin centuries కొట్టే రోజులుండేవి. (అంటే పాత రోజుల్లో సచిన్ చాలా సులభంగా కొట్టేవాడని)

c) She can manage a thousand schools like this with her eyes closed/ shut =

ఇలాంటి వేయి schools సులభంగా నిర్వహించగలదామె/ నడపగలదు. (దీన్నే It's cake walk for her అని కూడా అనొచ్చు)

**2) Could you run an eye over this report?**

Run an eye over something = cast an eye over something = దేన్నైనా గబగబా చదివేయటం.

a) As he had no time he just ran an eye over the letter and left the place= అతనికి time లేక పోవటంతో ఆ ఉత్తరం గబగబా చదివి వెళ్లిపోయాడు.

b) Sumati ran her eye over the news report and told her secretary to prepare a reply

సుమతి ఆ న్యూస్ రిపోర్ట్ గబగబా చదివి, secretary తో దానికి సమాధానం తయారుచేయమంది.

**3) It is for the eyes of our MD.**

for (some body's) eyes only = ఏ ఒకరో మాత్రమే చూడటానికి/ ప్రత్యేకించి ఒకరి కోసం

a) This letter is for the eyes of the CM only=

ఈ ఉత్తరం ముఖ్యమంత్రి మాత్రమే చూడవలసింది. (ఇతరులు చూడకుండా ఉండే ఏర్పాటుతో)

b) This information is for your eyes only. Destroy the paper after you see it =

ఈ సమాచారం కేవలం నీ కోసమే. చదవగానే చింపేసెయ్ (ఇతరుల కంటపడకుండా)

**4) All eyes were on you** = ఇది అందరికీ తెలిసిన expression = అందరి కళ్లూ నీ మీదే.

ఒక ప్రదేశంలో ఉన్నవాళ్లందరు ఒకరివైపే చూస్తుంటే All eyes are on him/ her

Every one's eyes were on the actress as she arrived to inaugurate a textile shop =

బట్టల దుకాణం ప్రారంభోత్సవానికి వచ్చిన ఆ నటిమీదే అందరి కళ్లూ

**5) Keep an eye on them.**

Keep an eye on (some body) = ఒకరినోకంట కనిపెట్టడం/ ఓ కన్నేసి ఉంచటం, (వాళ్లేం చెడ్డపని చేయకుండా)

a) Keep an eye on the boy. He is quite mischievous =

ఆ కుర్రాడ్నో కంట కనిపెట్టి ఉండు, వాడు చాలా అల్లరి పిల్లవాడు.

b) He always kept an eye on the servant. He had his own doubt about the servant's honesty =

ఎప్పుడూ ఆ పని వాడినోకంట కనిపెట్టి ఉండేవాడతను. ఆ పనివాడి నిజాయతీ మీద సందేహాలుండేవతనికి.

అయితే Keep an eye/ have an eye అంటే ఒక విషయాన్ని జాగ్రత్తగా చూసుకొమ్మనే అర్థం కూడా ఉంది.

a) My neighbours kept an eye on our house when we were away =

మేం ఊళ్లో లేనప్పుడు మా ఇరుగుపొరుగువాళ్లు మా ఇంటిమీద ఓకన్నేసి ఉంచారు. = జాగ్రత్తగా చూసుకున్నారు.

b) Could you keep an eye on my luggage while I go and get a water bottle =

నేను water bottle తెచ్చుకుంటాను. కాస్త నా luggage చూస్తుంటారా?

- M. SURESAN



**ప్రశ్న:** అమావాస్యను ఇంగ్లిష్‌లో ఏమంటారు? New moon day లేదా No moon day- ఇందులో ఏది కరెక్ట్?

– వి.రామస్వరూప్, నిర్మల్

**జవాబు:** No moon day అంటే అమావాస్య అయినప్పటికీ చాలా సందర్భాల్లో అమావాస్యను, New moon day అనే అంటారు. ముఖ్యంగా Scientific and technical language లో అమావాస్యను New Moon day అనే అంటారు. మామూలుగా కూడా English లో అమావాస్యనైనా, పాడ్యమినైనా, పెద్ద తేడా లేకుండా New moon day అనే ఎక్కువగా అంటుంటారు.

**ప్రశ్న:** i) He is my best అంటుంటారు. కానీ Superlative degree ముందు The వాడాలి కదా?

ii) a. నేను ఆయనను అడిగాను?

b. నేను మీకు రెండు పెన్నులు ఇస్తున్నాను.

వీటిని ఇంగ్లిష్‌లో ఎలా అంటారు?

– జి.మల్లేశం, నల్గొండ

**జవాబు:** i) Superlative degree ముందు the తప్పక రావాలి. అయితే Superlative degree ని మనం qualify చేస్తే అంటే దానిముందు my, his, ఇలాంటి మాటలొచ్చినపుడు the, రాదు.

a) He is the greatest cricketer in India

b) He is India's greatest cricketer (Greatest ముందు India's అని ఉంది కాబట్టి the రాదు)

ii) a. I have asked him/ I asked him.

b. I am giving you two pens.

**ప్రశ్న:** i) When we use see, look.

ii) How do we pronounce 'g', 'j' ?

– రవికుమార్, కాకినాడ

**జవాబు:** i) **See** = When something/ Somebody appears to us when our eyes are open, we see it or the person. (See = ఏదైనా మనకు కనిపించడం) So see = appear to our eyes.

1) Nowadays we see more and more people in jeans = ఈ రోజుల్లో రానురాను jeans వేసుకునేవాళ్లే ఎక్కువ కనిపిస్తారు.

2) In a forest whichever way you turn your eyes, you see trees = In a forest wherever you turn your eyes, trees appear.

**Look** = When you turn your eyes on some-one or something, you look at them or it (మన ప్రయత్నం చేసి చూడటం)

If you look carefully you can see our teacher standing there.

ii) G/ g is pronounced as telugu- 'గ'

J is pronounced as telugu- 'జ'

**ప్రశ్న:** Infinitive form అయిన be ని ఏయే సందర్భాల్లో వాడొచ్చు?

– వై.ఎస్.కె., లక్సెట్టిపేట

**జవాబు:** be అంటే ఉండటం. దీన్ని ఉండటం అనే అర్థం వచ్చే సందర్భాలన్నిట్లో వాడవచ్చు

eg: 1) To be here any longer is dangerous - ఇక ఇక్కడ ఉండటం ప్రమాదకరం

2) To be patient is always good = ఓర్పుగా ఉండటం ఎప్పటికీ మంచిది.

3) To be in class for 4 to 5 hours is not fun = 4, 5 గంటలసేపు class లో ఉండటం తమాషాకాదు.

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 306



# Wish you all success

**Sita:** I'm sure you'll attend my birthday party. (you) remember the day. don't you?
(నువ్వు నా పుట్టినరోజు వేడుకకు వస్తున్నావని నమ్ముతున్నాను.)

**Indira:** You bet I'll. It's this Monday, isn't it? Wish you a happy birthday and many happy returns of the day.
(తప్పకుండా వస్తా. ఈ సోమవారమేకదా? నీ పుట్టినరోజు సందర్భంగా నా శుభాకాంక్షలు. (నీ పుట్టినరోజు చాలా సంతోషంగా గడవాలనీ, దాన్ని నువ్వు మళ్లీమళ్లీ జరుపుకోవాలనీ కోరుతున్నాను- ఇది English birthday greetings కు అసలైన అనువాదం))

**Sita:** Bring along your dad Mr Raju and your hubby Sriram. I'll invite them over phone as soon as I get home.
(మీ నాన్న రాజుగారినీ, మీవారు శ్రీరాంను తీసుకురా. నేను phone చేసి వాళ్లను పిలుస్తాను, ఇంటికెళ్లగానే)

**Indira:** I will, of course. But wait. I've heard that you've won a big cash prize for a crossword puzzle you've solved.
(తప్పకుండా తీసుకొస్తాను. ఈమధ్య అదేదో గళ్ల నుడికట్టును విప్పినందుకు నీకేదో నగదు బహుమతి వచ్చిందటగా!)

**Sita:** Yes. I feel happy about it.
(అవును. చాలా సంతోషంగా ఉంది.)

**Indira:** My hearty congrats! Win more prizes. How about a treat for it all?
(హార్దికాభినందనలు. ఇంకా ఎక్కువ బహుమతులు గెలువు. ఈ బహుమతి వచ్చినందుకు మాకు విందేదీలేదా?)

treat = విందు

**Sita:** Thank you. How's your preparation for the exam? Wish you all success.
(Thanks. పరీక్షకెలా prepare అవుతున్నావు? నువ్వు విజయం సాధించాలని ఆకాంక్ష.)
The treat I owe you for the cross word puzzle prize will be given soon after the birth day party.
(Crossword puzzle కు సంబంధించిన విందు birthday party తర్వాత ఇస్తాను)

**Indira:** I'll be looking forward to that. How about your brother's new business venture?
(దానికోసం ఎదురు చూస్తుంటా. మీ అన్నయ్య కొత్త వ్యాపార ప్రయత్నం ఏమయింది?)

**Sita:** He will be starting it next friday. All is set.
(వచ్చే శుక్రవారం ప్రారంభిస్తాడు. ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయి.)

**Indira:** Wish him all prosperity.
(అతని వ్యాపారం అభివృద్ధిలోకి రావాలని నా కోరిక)
(prosperity = అభివృద్ధి - సంపద అటువంటివి)

**Sita:** When are you entering your new home?
(మీ నూతన గృహ ప్రవేశం ఎప్పుడు?)

**Indira:** Perhaps the third week of this month. How can you think you won't be told of it? It can't happen without your knowledge, can it?
(ఈనెల మూడోవారంలో ఉండవచ్చు. నీకు చెప్పకుండా ఉంటానని ఎలా అనుకున్నావు? నీకు తెలియకుండా అది జరగదు కదా?)

**Sita:** No, no. It's just my eagerness to wish you a very happy and prosperous life in your new home.
(అదేంకాదు. నువ్వు ఎప్పుడెప్పుడు కొత్త ఇంట్లో చేరతావా, ఎప్పుడెప్పుడు నువ్వందులో సంతోషకరమైన జీవితం గడపాలని కోరాలా అనే ఆత్రుత.)

**Indira:** Well, it isn't far off.
(ఎక్కువ దూరం లేదులే)

**Sita:** OK then. Let me make a move. Bye
(సరే. ఇకనేవస్తా. Bye)

**Indira:** Bye.

పాఠకులొకరు అడిగిన ప్రశ్నకు సమాధానంగా రాసిన సంభాషణ ఇది. English and in general western society లో (ఇంగ్లిష్, సర్వసాధారణంగా పాశ్చాత్య సమాజంలో) మన సమాజంలో కన్నా formalities (మనం ఇతరులతో మాట్లాడుతున్నపుడు, వ్యవహారాలు నడుపుతున్నపుడు పాటించాల్సిన పద్ధతులు) చాలా ఎక్కువ. అలా పాటించకపోతే అది manners లో చాలా తీవ్రమైన లోపం. అలాంటి formal expressions ఈ lesson లో మనం తెలుసుకుందాం.

**Look at the following sentences from the conversation above:**

1) Wish you a happy birth day and many returns of the day.
2) My hearty congrats! (congratulations కి ఇప్పుడు బాగా వాడుకలోకి వచ్చిన short form- congrats)
3) Wish you all success
4) Wish him all prosperity
5) Wish you a very happy and prosperous life in your new home

ఇవన్నీ మన ఆకాంక్షల (wishes) ను, అభినందనల (congratulations) నూ తెలిపే expressions అని తెలుస్తూనే ఉంది కదా. ఇప్పుడు ఏ సందర్భానికి ఏయే expressions వాడతామో చూద్దాం:

మొదట No.3, **Wish you all success** అనాల్సిన సందర్భాలు/ దాదాపు అదే అర్థం ఇచ్చే ఇతర expressions తెలుసుకుందాం.

When some one close to us (మనకు సన్నిహితులు. close = దగ్గరైన) is
1) taking an exam (పరీక్ష రాయబోతున్నపుడు)
2) appearing for an interview (interview కు హాజరవుతున్నపుడు)
3) Participating in a competition (ఒక పోటీలో పాల్గొంటున్నపుడు)
4) Starting a new business or industry (ఒక వ్యాపారాన్ని, పరిశ్రమను ప్రారంభిస్తున్నపుడు)

మన ఆకాంక్షలనిలా తెలుపుతాం. (English కు సరిగ్గా సరిపోయే తెలుగు అనువాదాలు లేవు. ఒకవేళ అలా అనువాదాలు వాడినా, కొంచెం కృతకంగా, ఎబ్బెట్టుగా అనిపిస్తాయి కదా)

ఆకాంక్షలు:
1) Good luck
2) All luck to you
3) Best of luck to you (మీకు అదృష్టం కలగాలని మా కోరిక- ఈ మూడు expressions కూ loose translation). ఇదే అర్థంతో wish you the best of luck.

4) Wish you all success/ wish you every success/ my best wishes to you for success (మీరు విజయం పొందాలని నా కోరిక- వీటి భావం)

ఇవన్నీ పైన చెప్పిన నాలుగు సందర్భాల్లో వాడొచ్చు. అయితే మీ సన్నిహితులు కొత్త వ్యాపారమో/ పరిశ్రమో స్థాపించేటపుడు ఇలా కూడా అనొచ్చు.
1) (Wish you) all prosperity in your venture/ business/ enterprize = మీ వ్యాపారంలో మీరు బాగా అభివృద్ధిలోకి రావాలని నా ఆకాంక్ష.
2) May your business prosper/ thrive (అదే అర్థం. prosper = thrive = అభివృద్ధిలోకి రావటం)

Conversation at the beginning of the lesson లోంచి, No.2 expressions, **My hearty congrats** వాడే సందర్భాలు.

Someone close to you (మీ సన్నిహితులు)
1) has passed an exam (exam లో pass అయ్యారు)
2) has won a competition (పోటీలో గెలిచారు)
3) has been awarded a prize or an award (పురస్కారం పొందారు)
4) ఏదో ఘనమైంది సాధించారు. (has achieved some distinction)

శుభాభినందనలు తెలిపే expressions.
1) My congratulations/ Hearty congratulations/ My hearty congrats to you/ Accept my congratulations/ let me congratulate you on ...
గుర్తుంచుకోవాల్సిన విషయం: Congratulations/ congratulate (someone) తర్వాత on వస్తుంది. For కాదు
మనకంటే చిన్నవాళ్లను అభినందించాలనుకుంటే
1) Congrats, keep it up. (అలాగే కొనసాగించు)
2) That's really great/ grand/ marvellous. Congrats.
3) Congrats. That's superb. I wonder if at your age I could have done as much.
(అభినందనలు- చాలా గొప్ప విషయం. నీ వయసులో నేనంత సాధించగలిగేవాడినా అని నా సందేహం)

ఇవీ అభినందించే విధాలు:

ఇప్పుడు conversation లోని sentence No.1లోని birthday greetings చూద్దాం. ఎవరి birth day సందర్భంలోనైనా మనం సర్వసాధారణంగా చెప్పే greetings:
1. Wish you a happy birthday and many returns of the same. ఇలా కూడా అనొచ్చు
2. Happy birth day to you and many happy returns of it.
3. May you live long enough to celebrate many more birthdays (ఇది మనకన్నా చిన్నవాళ్ల విషయంలో)
5) Wish you a very happy and prosperous life in your new home = మీ కొత్త ఇంట్లో మీకు ఆనందం, అభివృద్ధి కలగాలని ఆకాంక్షలు.
తెలుస్తూనే ఉంది కదా! ఇది నూతన గృహ ప్రవేశ సందర్భంగా అందించే ఆకాంక్ష. ఇంకా ఇలా కూడా అనొచ్చు.
a) All happiness and prosperity in your new home.
b) May your new home bring you all that you wish for = మీ కొత్త ఇల్లు మీరు కోరుతున్నదంతా ఇవ్వాలని మా కోరిక.

House warming = గృహ ప్రవేశం/ గృహ ప్రవేశం సందర్భంగా ఇచ్చే విందు.

**- M. SURESAN**

---

**ప్రశ్న:** కిందివాటిని ఇంగ్లిష్‌లో ఎలా రాయాలో తెలియజేయగలరు.

I a) ఆమె అందం కిటికీలోంచి కనిపించీ కనిపించనట్టు కనిపిస్తుంది.
b) ఈ సంఘటన ప్రభుత్వం పనితీరును చెప్పకనే చెబుతుంది.
II a) (పాటలు) పాడుతూ ఉంటే పాడటం వస్తుంది.
b) (కవితలు) రాస్తూ ఉంటే రాయడం వస్తుంది.
III a) అతడు ఆమెను ఎంతగా ప్రేమించాడంటే, ఆమె కోసం ప్రాణాలు అర్పించేటంతగా ప్రేమించాడు.
b) ఆమె పాలను ఎంతగా వేడిచేసిందంటే, పాలు ఆవిరి అయ్యేంతగా వేడిచేసింది.
IV a) దోచుకున్నవాళ్లకు దోచుకున్నంత
b) తినేవాళ్లకు తిన్నంత
V a) కథకాని కథ b) ఇల్లుకాని ఇల్లు
VI having + III form ఉంటే ఏ అర్థం వస్తుంది? ఉదా: having done. దీని అర్థం తెలుపగలరు.
VII Phrasal verbs నేర్చుకోవడానికి మంచి పుస్తకం సూచించగలరు.

– ఎలిగేటి శివకృష్ణ, దేవునూర్ (వరంగల్)

**జవాబు:**

I a) We get a fleeting glimpse of her beauty through the window/ Her beauty is seen vaguely through the window/ We catch a fleeting glance of her beauty
b) This incident is self explanatory of the government's attitude

II a) Keep singing and you will be able to sing
b) keep writing poetry and you'll be able to write

III a) He loved her so much that he would give his life for her/ He loved her to the point of offering his life for her
b) She boiled milk to the point of evaporation/ She so boiled milk that it evaporated.

IV a) It is up for grabs- (grab- దొరకబుచ్చుకోవటం/ దండుకోవటం/ land grab- భూకబ్జా)
b) దీనిని కూడా It is up for grabs అనొచ్చు / One could eat as much as one wanted

V a) A story but (and at the same time) not a story
b) A home but not a home. (at the same time not a home)

VI Having + past participle.
eg: having done- అది చేసిన తర్వాత/చేయగానే/ చేసినందుకు
a) Having done all the work, he went to bed = పనిపూర్తిచేసి, అతను పడుకున్నాడు
b) Having seen the troubles of the married, he decided not to marry = పెళ్లిచేసుకున్నవాళ్ల బాధలు చూసి/ చూసినందువల్ల అతను పెళ్లి చేసుకోకూడదని నిర్ణయించుకున్నాడు
c) Having known that he had lost a lot of money, how could I ask him for money = చాలా డబ్బు పోగొట్టుకున్నాడని తెలిసి కూడా అతడిని నేను డబ్బెట్లా అడగను?

VII Phrasal Verbs: Cambridge dictionary of Phrasal Verbs చాలా useful book

---

**ప్రశ్న:** *Leave letter లో I cannot attend to the school/ college అని రాయాలా? to school/ college అని రాయాలా? the school/ college అని రాయాలా?*

*– జి.విజయుడు (కర్నూలు)*

**జవాబు:**

I cannot attend school/ college అని రాయటం correct.

leave letter
i) రాస్తున్నది, student/ teacher కాబట్టి, school/ college వాళ్లు పనిచేసేచోటు కాబట్టి the school/ the college అనం.
ii) Attend to అంటే హాజరవటంకాదు. ఒకపని బాధ్యతగా చూసుకోవటం.
a) He is attending to the repairs of our home = మా ఇంటి repair విషయాలు అతను చూసుకుంటున్నాడు.
b) You attend to the arrangements for the party = party ఏర్పాట్లు నువ్వు చూసుకో.

School/ College/ Marriage/ Party కి హాజరవటం, attend. Attend to కాదు. (Attend to వాడకం పైన చెప్పాం కదా?)

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 307



# Better luck next time

**Vinutna:** How about lending me your DVD for a day?
(నీ DVD ఓరోజుకిస్తావా? )

**Bhavana:** By all means. (తీసుకో.)

by all means = నిరభ్యంతరంగా/ తప్పకుండా- దీనిని conversation లో పై అర్థంతో చాలా తరచుగా వాడతారు)

**Vinutna:** Thank you. So nice of you.
(Thank you. నీ మంచితనానికి)

**Bhavana:** Welcome. What do you want to view any way.
(అయినా, ఏం చూడాలనీ? )

**Vinutna:** My niece's first birth anniversary function.
(మా అక్కయ్య కూతురి మొదటి పుట్టినరోజు వేడుక.)

niece = అన్నదమ్ముల, అక్కచెల్లెళ్ల కూతురు

**Bhavana:** Keep it the whole week if you want. Have some movies in too.
(మొత్తం వారం రోజులూ ఉంచుకో. ఏదైనా సినిమాలు కూడా చూడు.)

**Vinutna:** So kind of you. You've always been a friend I can look to in need. Your help the other day was great. I can never forget it.
(అది నీ దయ. (ఇది తెలుగులో చాలా పెద్ద సాయానికే/ అనుగ్రహానికే వాడతాం. అయితే English లో ఇది చాలా frequent గా వచ్చే formal expression.) అవసరంలో నీ సాయం ఎప్పుడూ ఆశించగల friend వి నువ్వు. మొన్న నీ సహాయం నిజంగా గొప్పది. దాన్ని నేనెప్పుడూ మరచిపోలేను.)

**Bhavana:** Not at all, Vinutna. What I did wasn't much. You'd do as much if I needed your help.
(అదేంలేదు. నేను పెద్దగా చేసిందేంలేదు. నాకు నీ సాయం కావలిస్తే నువ్వూ చేస్తావా మాత్రం.)

**Vinutna:** By the way, the dress you wore the other day- it was really fantastic. You looked wonderful in it. Where did you buy it?
(సరేకానీ, మొన్న నువ్వేసుకున్న dress చాలా బాగుంది. దాన్లో నువ్వు చాలా అందంగా కన పడ్డావు. ఎక్కడ కొన్నావది? )

fantastic = అద్భుతమైన

**Bhavana:** Thank you very much for your compliments. I like it very much too. My sister bought for me in Bangalore.
(నీ ప్రశంసకు thanks. నాకూ ఆ dress చాలా ఇష్టం. మా అక్కయ్య నాకోసం Bangalore లో కొన్నదది.)

**Vinutna:** What a good taste she has!
(మీ అక్కయ్యది మంచి అభిరుచే!)

**Bhavana:** Thanks on behalf of my sister too!
(మా అక్క తరపున కూడా thanks.)

**Vinutna:** How did the debate contest go the day before? Did you get any prize?
(మొన్న debate contest ఎలా జరిగింది? ప్రైజ్ ఏమైనా వచ్చిందా? )

**Bhavana:** None, though I did my best.
(నాకేం రాలేదు, నేను చేయగలిగిందంతా చేసినప్పటికీ.)

**Vinutna:** After so much of preparation? That could be terrible for you. Better luck next time.
(అంత prepare అయినా కూడా రాలేదా? నిజంగా నీకది చాలా బాధ కలిగించి ఉండొచ్చు కదా. వచ్చేసారి నీ అదృష్టం ఇంతకన్నా బాగుండాలి.)

**Bhavana:** Thank you, but I'm not worried.
(Thanks. అయినా నాకంత బాధగా ఏం లేదులే.)



**Manasa:** Why do you look so sad? What's wrong?
(ఏంటంత విచారంగా కనిపిస్తున్నావు? ఏమైంది? )

**Mamata:** I thought you knew.
(నీకు తెలుసనుకున్నా.)

**Manasa:** What about?
(దేని గురించి? )

**Mamata:** My brother's daughter is no more.
(మా అన్న కూతురు చనిపోయింది.)

**Manasa:** How terrible! She's hardly four years old. When and how did it happen?
(ఎంత దారుణం! నాలుగేళ్ల కూడా లేవా పాపకు. ఎప్పుడు, ఎలా చనిపోయింది? )

**Mamata:** The day before. She had been down with jaundice. The doctor's best efforts could not save her.
(మొన్న. కామెర్ల బారిన పడింది. Doctor ఎంత ప్రయత్నించినా పాపను కాపాడలేక పోయాడు.)

effort - ఇఫట్ (ఫ bird లో బ లాగ = ప్రయత్నం)

**Manasa:** My condolences to you. Condolences too to your sister and brother-in-law. What a cute child she was! May her soul rest in peace!
(నీకు నా సంతాపం. మీ అక్కకూ, బావకు కూడా. ఎంత అందంగా ఉండేదో ఆ పాప. ఆమె ఆత్మకు శాంతి కలుగుగాక.)



Daily life situations లో వివిధ సందర్భాల్లో వాడే standard expressions గురించి తెలుసుకుంటున్నాం కదా. వాటిల్లో మరికొన్నింటిని చూద్దాం.

***Look at the following expressions from the dialogue above.***

1) By all means
2) Welcome
3) So kind of you
4) Not at all
5) Thank you very much for your compliment
6) That could be terrible. Better luck next time.
7) My condolences to you.

**1) By all means** = నిరభ్యంతరంగా/ తప్పకుండా.

మనం ఇతరులతో ఏ విషయంలోనైనా పూర్తి అంగీకారం తెలిపేందుకు, వాళ్లడిగే సాయం లాంటివి చేయడానికి సంసిద్ధతను తెలిపేందుకు, By all means వాడతాం.

a) Ram: Can I have your bike for a day?
(నీ bike నేనోరోజుకు తీసుకోవచ్చా? )
Syam: By all means. When do you need it?
(తప్పకుండా. నీకది ఎప్పుడు కావాలి? )

b) Pran: Could you do me a favour?
(నాకో సాయం చేసి పెడతావా? )
Prem: By all means. What is it?
(తప్పకుండా. ఏంటది? )

By all means తోగానీ, By all means లేకుండా గానీ, అదే అర్థంతో వాడే ఇంకోమాట, Why not?

a) Nischal: Can I have your book for a few days?
(కొన్ని రోజులు నీ పుస్తకం ఇస్తావా? )
Nikhil: Why not? Take it (by all means)
(తప్పకుండా/ నిరభ్యంతరంగా. తీసుకో.)

**2, 3 & 4 Welcome.** ఇది మనకెవరైనా thanks చెబితే మనం స్పందించాల్సిన విధం. ఇతరులు thanks చెప్పే విధానాన్ని, సందర్భాన్ని బట్టి మన response (స్పందన) కూడా మారుతుంటుంది.

a) ఏదైనా చిన్న విషయానికి formal గా ఎవరైనా thanks చెబితే, దానికి మన response, Welcome/ you are welcome.

b) అలా కాకుండా మనం పొందిన సహాయం కాస్త ఎక్కువే అయితే, thanks చెప్పాల్సిన విధం కూడా మారవచ్చు. కేవలం Thanks/ Thank you అని సరి పెట్టం. మన కృతజ్ఞతను బాగా తెలిపేందుకు కింది విధంగా thanks చెబుతాం.

a) Thank you very much/ so much (American)
(ఇలాంటప్పుడు very/ so నొక్కి పలుకుతాం.)
b) I don't know how to thank you (really) = మీకు thanks ఎలా చెప్పుకోవాలో నాకు తెలియటంలేదు.
c) Thanks a lot really/ thousand thousand thanks
d) I can't really thank you enough.
(మీకు తగినవిధంగా thanks చెప్పుకోలేకపోతున్నాను)
e) That's/ was very kind of you/ nice of you.
f) I'm afraid I can never thank you enough.

ఇలా మనస్ఫూర్తిగా గొప్పగా thanks చెప్పినప్పుడు, you are welcome/ welcome లాంటి స్పందన సరిపోదు. కింది విధంగా స్పందిస్తాం.

1. Not at all
2. It was/ is a / my pleasure.
3. Not at all; glad to be of some help to you.
(ఏం పర్వాలేదు. మీకు కొంతైనా సహాయపడినందుకు సంతోషం.)
4. You are most welcome.

ఈ expressions (thanks చెప్పటానికి, స్పందించటానికి) మన conversations లో practice చేద్దాం.

ఈ expressions మాత్రమే వాడాలని rule లేదు. ఇదే భావం వచ్చే ఏ expression అయినా మీకు తోచింది వాడవచ్చు. No mention/ Don't mention/ Mention not తప్పు. ఇలా కూడా అనవచ్చు

a) It's all right
b) Not at all; glad to have had an opportunity to be of some help/ to help you.
c) The pleasure is mine.

**5) Thank you for your compliment.**

Compliment = మెప్పును తెలిపే మాట.

ఒకరిని మెచ్చుకుంటూ మనం అనే మాట మనం ఇచ్చే compliment.

Pay compliment to someone = ఒకరిని మనం మెచ్చుకుంటూ అనే మాట

a) Akash: You really get clever ideas.
(నీకు నిజంగా తెలివైన ఆలోచనలు వస్తాయి- మెప్పు (compliment)
Pridhvi: Thanks for the compliment.
(నీ మెప్పు (ప్రశంస) కు thanks)

మనల్ని ఎవరు దేనికి మెచ్చుకున్నా, thank you/ thanks for the compliment అంటాం.

b) Anupam: You are a genius. Only you can get such wonderful ideas.
(నిజంగా నువ్వు మేధావివే. నీకే వస్తాయి అలాంటి అద్భుతమైన ఆలోచనలు.)
Nirupam: Thanks for the compliment though I don't know how far I deserve it.
(నీ మెప్పుదలకు thanks, నేను దానికెంతవరకు అర్హుడినో నాకు తెలియ నప్పటికీ- ఇది నిరాడంబర స్పందన.)

**6) Better luck next time-** ఇది విఫలమైన వాళ్లకు, మనం చెప్పగల ఓదార్పు మాట. ఒకసారి విఫలమైన వాళ్లు తమ రెండో ప్రయత్నంలో అయినా విజయం పొందే అదృష్టం కలగాలనే ఆకాంక్ష.

**Prakash:** We lost the match yesterday.
(నిన్న match లో మేం ఓడిపోయాం.)
**Pramod:** Don't take it to heart. Better luck next time.
(దాన్ని పెద్దగా పట్టించుకోకు. ఈసారి మీ అదృష్టం బాగుండాలి.)

**7) Condolences** = మృతుల సన్నిహితులకూ, మృతుల కుటుంబాలకు తెలిపే సంతాపం.

Condolence = సంతాపం. అయితే ఎప్పుడూ condolences అని plural లోనే వాడతాం. మామూలుగా మరణవార్త విన్నప్పుడు కింది విధంగా సంతాపం తెలుపుతాం.

a) I am terribly sorry to hear that. My condolences to you.
b) I am shocked/ It's really shocking. My heartfelt condolences to you.
c) My condolences to you. May god give you the necessary strength of heart and mind to bear the loss =
(Condolences అని చెప్పిన తర్వాత ఈ మాటంటాం. అర్థం = ఈ శోకాన్ని తట్టుకోగల ధైర్య, స్థైర్యాలను దేవుడు నీకివ్వాలని ప్రార్థన)

ఇవన్నీ చనిపోయినవారి గురించి అంటాం.

May his/ her soul rest in peace.
(అతని/ ఆమె ఆత్మకు శాంతి కలగాలి)

**- M. SURESAN**

---

**ప్రశ్న:** సాధారణంగా *improve your writing* అని రాస్తాం. *develop your writing* అని రాయకూడదా? ఎందుకు?

**– టి. రవిచందర్, మెదక్**

**జవాబు:** Improve అంటే మెరుగు పరచుకోవడం,
Develop అంటే ఒక దశ నుంచి ఇంకో దశకు ఎదగటం.
Hand Writing మనం మెరుగు పరచుకుంటాం =
We improve our writing.
మనం మంచి bright students గా ఎదుగుతాం/ తయారవుతాం =
We develop into bright students.



**ప్రశ్న:** *Shall, will* కు *short form - 'll* అని రాస్తారు కదా. అలాంటప్పుడు *I'll buy a car soon* లో *underline* చేసిన భాగాన్ని *will* అనుకుంటే ఆ వాక్యం *definite* అవుతుంది. అదే *shall* అనుకుంటే *Indefinite* అవుతుంది. వాక్యంలోని *underline* చేసిన భాగాన్ని *shall* లేదా *will* అని ఎలా గుర్తించాలో వివరించండి.

**– ఎం.వెంకటేష్, కౌకుంట్ల**

**జవాబు:** 'll అనేది Will కు మాత్రమే short form, shall కు కాదు. Shall కు short form లేదు (Shall not కు short form shan't).
I'll buy a car అంటే I will buy అనే. కాబట్టి doubt కు తావులేదు.

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 308

# My colleague has the boss's ear

**Mukund:** What's wrong Vasanth? I never saw you so dull and upset. What could be worrying you?
(ఏమయింది వసంత్? ఇంత నిరుత్సాహంగా ఇంత చికాకుగా నిన్నెప్పుడూ చూడలేదు. అంత చికాకు కలిగించే విషయం ఏమిటో? )

**Vasanth:** You'd (you would) be as dull and upset too if your boss gave you an earful for no fault of yours.
(నీ తప్పేంలేకుండా నీ చెవులు వాచిపోయేలా నీ boss కూడా చివాట్లు పెడితే నువ్వూ నా అంత నిరుత్సాహంగానూ చికాకుగానూ ఉంటావు)

**Mukund:** What did you do to deserve it?
(అంత చివాట్లు తినేంత నువ్వేం చేశావు? )

**Vasanth:** You didn't lend me your ears then? I told you I had it for no fault of mine.
(అయితే నేను చెప్పింది నువ్వు సరిగా విన లేదన్నమాట. చెప్పానుగా నా తప్పేంలేదని)

**Mukund:** How did it happen then?
(మరయితే ఎలా జరిగింది? )

**Vasanth:** Sam, my colleague has the boss's ear ready whenever he likes. The boss gives him his ear because Sam is good at flattery, and the boss likes flattery. Sam takes the opportunity to tell tales.
(మా boss చెవి నా సహోద్యోగి శామ్‌కు ఎప్పుడూ తెరిచే ఉంటుంది. మా boss తన చెవిని శామ్‌కు అప్పజెప్పేస్తాడు. ఎందుకంటే శామ్ boss ను బాగా పొగుడుతాడు, మా boss కు పొగడ్తలంటే చాలా ఇష్టం. ఆ అవకాశం చూసి శాం అతని చెవులు కొరుకు తుంటాడు.)

tell tales= ఇతరులను గురించి పితూరీలు చేయటం

**Mukund:** You could do that as well.
(నువ్వు కూడా ఆ పనిచేయొచ్చు కదా.)

**Vasanth:** If I had been such, I would have been in a better position than I am in now.
(నేను అటువంటివాడినయుంటే ఇంతకంటే మంచి స్థితిలో ఉండేవాడ్నే)

**Mukund:** You should be a little more practical, buddy. There's no use just minding your business.
(కొంత లౌక్యం ఉండాలి మిత్రమా. నా పని నేను చేసుకుపోతానంటే కుదరదు).

**Vasanth:** I don't care. Next time my boss says anything I am sure to hit back.
(నేనేం లెక్కచేయను. ఈసారి మా boss ఏమైనా అంటే తగినవిధంగా సమాధానం చెప్తా.)

hit back= మాటకు మాట అనటం

**Mukund:** Take care. He is likely to sack you.
(జాగ్రత్త. నీ ఉద్యోగం ఊడగొట్టగలడు.)

sack= ఉద్యోగం లోంచి తీసెయ్యటం

**Vasanth:** He dare not do that. He himself is up to his ears in trouble with his higher ups.
(అతనికాధైర్యంలేదు. అతనే తన పైవాళ్లతో పీకల దాకా గొడవల్లో ఉన్నాడు.)

**Mukund:** Come on Vasanth, just what did you do? What exactly went wrong?
(వసంత్, అసలు నువ్వేం చేశావో చెప్పు. అసలు పొరపాటెక్కడ? )

**Vasanth:** You know I have an ear for music. I like to listen to music. I had the ear phones in the office just when he walked upto my cubicle. He was enraged.
(నీకు తెలుసు నాకు సంగీతమంటే ఇష్టమని. అతను office లోకి వచ్చినప్పుడు నా చెవుల్లో ear phones ఉన్నాయి. దానితో అతనికి కోపం వచ్చింది)

cubicle = offices/ banks లో సిబ్బందికి కేటాయించే ప్రదేశం (partition).

**Mukund:** Then you were clearly at fault. Why find fault with him then?
(అయితే తప్పు నీదే. అతన్నెందుకు తప్పుపడ తావు? )

**Vasanth:** He could have been less harsh. That's all my complaint.
(కాస్త తక్కువ కఠినంగా ఉండాల్సిందతను. అదే నా complaint)

**Mukund:** Don't be caught again. You'd better.
(మళ్లీ పట్టుబడకు. అదే మంచిది.)

♦ ♦ ♦ ♦

Real life situations లో ear (చెవి) కి సంబంధించిన expressions తరచూ వినిపిస్తుంటాయి. వాటిలో కొన్ని బాగా effective గా ఉంటాయి. వాటి గురించి ఇప్పుడు తెలుసుకుందాం.

**1) Give (some one) an earful =** తప్పుచేసిన వాళ్లమీద మనకోపాన్నంతా చూపించేట్లు చివాట్లు పెట్టడం.

a) Dad gave me an earful for the low score I got in maths = లెక్కల్లో తక్కువ మార్కులు వచ్చినందుకు బాగా చివాట్లు పెట్టాడు.

b) She had an earful from the boss for coming late so often. తరచుగా ఆలస్యంగా వస్తుండటంతో boss ఆమెను బాగా చివాట్లు పెట్టాడు.

c) I don't like do it again. I've had an earful= ఇప్పటికే బాగా చివాట్లు తిన్నాను. మళ్లీ నేనాపని చేయను.

**2) You didn't lend me your ears then? =** నేను చెప్పింది సరిగా/ సానుభూతితో వినలేదన్న మాట.

Lend an ear ఒకరు చెప్పిన విషయాన్ని ఓపికతో, సానుభూతితో వినటం. spoken English లో ఇది చాలా common.

a) Karunakar is always ready to lend an ear if any one wants to talk to him about their trouble = ఎవరైనా తమ కష్టాల గురించి చెప్పుకోవాలంటే ఓపిగ్గా సానుభూతితో వినటానికి కరుణాకర్ ఎప్పుడూ సిద్ధమే.

b) feel free to talk to me if you need to. I can always lend an ear = ఎప్పుడు అవసరమనిపించినా నాతో మాట్లాడేందుకు సంకోచించకు. ఓపిగ్గా సానుభూతితో వింటాను/ వినగలను.

c) He often gets into trouble as he lends his ear to all and sundry = ఎవరేది చెప్పినా ఓపిగ్గా సానుభూతితో వినటంవల్ల అతను తరచూ చిక్కుల్లో పడుతుంటాడు.

All and sundry = ఎవరుబడితే వాళ్లు.

**3) My colleague has the boss's ear =** మా boss నా సహోద్యోగి ఏమాట చెప్పితే అది విని అతని అభిప్రాయాలకు సలహాలకు విలువిస్తాడు.

Kumar has Pratap's ear = కుమార్ ఏదిచెప్తే అది వింటాడు Pratap./ కుమార్ అభిప్రాయాలకు, సలహాలకూ విలువిస్తాడు ప్రతాప్./ కుమార్ ఎంత చెప్తే అంత ప్రతాప్‌కు.

a) Sakuni had Duryodana's ear = శకుని ఎంత చెపితే అంత దుర్యోధనుడికి.




b) How I wish I had the CM's ear! = CM నా మాటలు విని నా అభిప్రాయాలకు, సలహాలకు విలువిస్తే ఎంత బాగుంటుంది!

c) People say that Ramachandra Rao has the CM's ear = రామచంద్రరావు ఎంత చెప్తే CM కు అంత అని అందరంటారు. ఈ expression spoken English లోచాలా effective.

**4) The boss gives him his ear.**

give an ear = దీని అర్థం కూడా దాదాపు lend an ear లాగానే. అయితే lend an ear అంటే ఓపికతో సానుభూతితో వినటం.

give an ear అంటే ఓపికతో శ్రద్ధతో వినటం.

a) Don't give ears to rumours = పుకార్లను వినవద్దు (నమ్మవద్దు)

b) Don't give your ear to all and sundry = ఎవరేది చెప్తే అది వినవద్దు.

**5) He himself is up to his ears in trouble =** ఆయనే నిండా కష్టాల్లో మునిగి ఉన్నాడు.

తెలుగులో మనం పీకలదాకా అంటాం కదా? ఆ అర్థంతో.

ఇదే అర్థంతో ఇంకో expression- upto the neck (పీకలదాకా) in trouble = up to the eyes in trouble.

అయితే upto the ears/ up to the eyes మంచి పనులలో కూడా మునిగి ఉన్నాం అని అర్థం వస్తే, upto the neck సమస్యలకు మాత్రమే పరిమితం.

**6) you know I have an ear for music =**

Have an ear for music= సంగీతం, భాషలు లాంటివి వినగానే గుర్తుంచుకోగల శక్తి, మంచి సంగీతంపట్ల ఆకర్షితులవటం.

a) Dr. Balamuralikrishna had a very good ear for music right from his childhood = చిన్నతనం నుంచే Dr. బాలమురళీకృష్ణకు సంగీతమంటే ఆసక్తి ఉండేది.

b) Mimicry artistes must have a good ear for sounds = ధ్వన్యనుకరణ చేసేవాళ్లకు ధ్వనులను అనుకరించే ప్రతిభ, ఆసక్తి ఉండాలి.

*- M. SURESAN*

---

**ప్రశ్న:** 1) "నేను ఇదేమాట అతనితో చెప్పాను." - ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

2) "చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే ఏం లాభం"? - దీనికి సమానమైన proverb ను తెలపండి?

3) మీకిప్పుడు ఏ పాఠం చెబుతున్నారు అనడాన్ని passive voice లో "Which lesson is being taught you? అనొచ్చా?
"మీకు ఫలానా పాఠం పూర్తయిందా"? అనడాన్ని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

4) Nobody can't understand me అనేది ఇంగ్లిష్‌లో ఉందా? Nobody can understand me కి, Nobody can't understand me కి ఏమైనా విశేషార్థాలున్నాయా?

5) He is married/ He has been married అనేవి passive voice లో ఉన్నాయి. He got married లో got – past tense. married కూడా past tense. ఇలా రెండు past tense form లో verbs ఉండొచ్చా? ఈ వాక్యంలో married - part of speech ఏమిటి?

6) Incredible, Incredulous కు మధ్య తేడా ఏమిటి?

7) Imperative ను ఎలా ఉచ్చరించాలి? "open the door", come in, please వాక్యాలకు Question tags ను తెలపండి?

8) Nevertheless, Notwithstanding అర్థాలను, వాక్యంలో ప్రయోగించే విధానాన్ని వివరించండి?

*- D.G. Rama Sarma, Kotwal, Palasa*

**జవాబు:** 1. I told him the same thing

2. There's no use crying over spilt milk
(ఒలికిపోయిన పాలను గురించి చింతించటం వల్ల ప్రయోజనం లేదు)



3) అనొచ్చు / What lesson is being done for you? అనొచ్చు ఏ lesson= What lesson; Which lesson అంటే మనకు, మనం మాట్లాడుతున్నవాళ్లకు తెలిసిన కొన్ని lessons లో / lessons లో ఏది?
ఏ lesson = What lesson.
ఆ lessons లో ఏది? = Which of the lessons

4) Nobody can't understand me- Standard English లో లేదు. English వాళ్లందరూ కూడా English Correct గా మాట్లాడలేరు కదా. అలాంటివాళ్లు Nobody can't understand అంటారు. Not correct.

5) He is married / he has been married - ఇది, He is interested లాంటి expressions లో లా 'married status' (వివాహితుడు అనే స్థితిని) తెలుపుతుంది. ఇక్కడ married ను కేవలం past participle గా తీసుకోకూడదు. ఇక్కడ అర్థం- అతను పెళ్లిచేసుకోబడ్డాడు అని కాదు. అతను వివాహితుడు అని. He is married = అతను వివాహితుడు.
He has been married = అతను కొంతకాలంగా వివాహితుడు -
He has been married for the past year = అతని పెళ్లయి ఒక సంవత్సరం అయింది.
He got married (అతను పెళ్లి చేసుకున్నాడు) లో married - past tense కాదు, past participle - He got dressed లో dressed లా.

6. Incredible = నమ్మశక్యంకాని = That he was able to jump down such a height is incredible = అంత ఎత్తు నుంచి దూకాడంటే నమ్మశక్యం కాకుండా ఉంది. (Unbelievable)
Incredulous = (ఒక విషయాన్ని) నమ్మలేకపోవటం/ నమ్మకపోవటం
1) When I told him I had done all the work, he looked incredulous = అంతపనీ నేనే చేశానని చెబితే వాడు నమ్మనట్టు మొహంపెట్టాడు / వాడు నమ్మలేదు.
2) She was incredulous when told about this = ఇది చెబితే ఆమె నమ్మలేదు. (చెప్పిన విషయం నిజమైనా)

7) Imperative - Pronunciation - ఇంపెరటివ్ - 'పె' నొక్కి పలుకుతాం.
a) Open the door, will you?
b) Come in please, will you?

8. Nevertheless = Not withstanding = though = although = even though
a) He is a genius, nevertheless he is quite modest = అతను మేధావి. అయినప్పటికీ అతను నిగర్వి (Nevertheless - but)
b) Not withstanding his greatness, he is modest = అతనికి గొప్పతనం ఉన్నప్పటికీ అతను నిగర్వి. ఇక్కడ notwithstanding బదులు inspite of వాడొచ్చు

# SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 309




# for your ears only

**Srikar:** What was Jagan saying yesterday?
(నిన్న జగన్ ఏమిటంటున్నాడు? )

**Sritej:** Didn't you hear? You were there as well.
(నువ్వు వినలేదా? నువ్వూ అక్కడ ఉన్నావు కదా? )

**Srikar:** Perhaps you didn't observe what he did. He made sure I was out of earshot before he began to talk to you. If I had heard him I wouldn't have been asking you of it.
(బహుశా అతడేం చేశాడో నువ్వు గమనించ లేదు. నీతో మాట్లాడే ముందు, నేను వినగలిగి నంత దూరంలో లేనని చూసుకుని మాట్లాడటం ప్రారంభించాడు. నేను వినుంటే నిన్ను అడిగేవాడిని కాదు.)

**Sritej:** He was talking all the time about you.
(అతడు మాట్లాడిందంతా నీ గురించే.)

**Srikar:** I knew as much. That's why I'm all ears for what you have to say.
(ఆమాత్రం నాకు తెలుసు. అందుకే నువ్వేం చెబుతావో వినేందుకు ఆతృతగా ఉన్నా.)

**Sritej:** I will tell you what he said. But I want to be sure that it is for your ears only.
(అతడు చెప్పింది నీకు చెబుతాను. కాని అది నీకు మాత్రమే. ఇంకెవ్వరికీ చెప్పకూడదు.)

**Srikar:** You have my word. Go on. I'll not breathe a word of it to anyone.
(నీకు మాటిస్తున్నా, చెప్పు. నువ్వు చెప్పే మాట ఏదీ కూడా ఎవరికీ చెప్పను.)

not breathe a word= రహస్యంగా ఉంచటం/ బయటకు పొక్కనివ్వకుండా ఉండటం

**Sritej:** His complaint was that you had paid a deaf ear to his well meaning advice that you shouldn't go shares in business with Sankar. Sankar, according to him is a cheat, out to have your money.
(నువ్వు శంకర్‌తో వ్యాపారంలో భాగం పెట్టుకో వద్దన్న అతడి సలహాను తోసిపుచ్చావనేది అతడి ఆరోపణ. శంకర్ నీ డబ్బు కాజేయాలనే నిర్ణయంతో ఉన్న మోసగాడనేది అతడి అభిప్రాయం.)

out to do something = ఏదైనా చేయాలనే నిర్ణయంతో ఉండటం

**Srikar:** Yea. That is true. I now repent that I ignored his advice. His words still ring in my ears.
(అది నిజమే. అతడి సలహాను పెడచెవిన పెట్టి నందుకు పశ్చాత్తాపపడుతున్నా. అతడి మాటలు నా చెవిలో ఇంకా మోగుతూనే ఉన్నాయి.)

repent =పశ్చాత్తాపం చెందటం

**Sritej:** He says he can tackle Sankar, and he will help you if you agree.
(Sankar తో ఎలా వ్యవహరించాలో తనకు తెలుసనీ, నువ్వు ఒప్పుకొంటే నీకు సహాయం చేస్తాననీ అన్నాడు.)

tackle = ఓ విషయంలో/ ఓ వ్యక్తితో వ్యవహరించటం

**Srikar:** Of course I am eager to take his help. We'll see him this evening.
(అతడి సహాయం తీసుకోవాలని నిజంగా నాకు ఆత్రుతగా ఉంది. ఇవాళ సాయంత్రం అతడిని కలుసుకుందాం.)

మామూలు సందర్భాల్లో ear తో వచ్చే expressions తెలుసుకుంటున్నాం గదా? మరికొన్నింటిని చూద్దాం.

**Look at the following sentences from the conversation above.**

1) He made sure that I was out of earshot.
2) That's why I am all ears for what you have to say.
3) But I want to be sure it is for your ears only.
4) ... you had paid a deaf ear to his advice.
5) His words still ring in my ears.

**1) Out of earshot** = వినలేనంత దూరం. ఈ మాట spoken English లో చాలా common.

a) Kumar didn't want Lata to hear him. So he waited until she was out of earshot before talking=
తను మాట్లాడుతున్న విషయం లత వినటం కుమార్‌కు ఇష్టంలేదు. అందుకని లత వినలేనంతదూరం వెళ్లేవరకు ఆగాడతను.

b) Fortunately the teacher was out of earshot when we were talking about her=
అదృష్టవశాత్తు మేము teacher గురించి మాట్లాడు కుంటున్నప్పుడు ఆమె వినలేనంత దూరంలో ఉంది.

అలాగే within earshot అంటే వినగలిగినంత దూరంలో అని.

a) He stopped talking when I was within earshot of them.=
వాళ్లు చెప్పుకొంటున్నది నేను వినగలిగినంత దూరంలో ఉన్నప్పుడు అతడు మాట్లాడటం ఆపేశాడు.

b) Just when the boss came within earshot of the group, he heard his name mentioned.=
ఆ బృందం చెప్పుకొంటున్నది వినగలిగినంత దూరం లోకి రాగానే తన పేరు చెప్పుకోవడం boss కు విని పించింది.)

**2) All ears for:** చెబుతున్నది వినేందుకు ఆత్రుతతో ఉండటం.

a) Come on: Fill me in. I am all ears=
కానియ్, అన్నీ నాకు చెప్పు. వినేందుకు చాలా ఆత్రుతతో ఉన్నా.

b) When he knew they were going to talk about the girl after his heart, he was all ears=
తను ఇష్టపడుతున్న అమ్మాయిని గురించి వాళ్లు మాట్లా డబోతున్నారని తెలిసి చెవులప్పగించటానికి సిద్ధపడ్డాడు.

c) He was all ears when they were talking of his greatness=
తన గొప్పతనాన్ని గురించి వాళ్లనుకుంటున్నప్పుడు చెవు లప్పగించి వింటున్నాడు.
(compare- He was all ears for ...)

**3) For someone's ears only**= ఒకరికి మాత్రమే తెలియాల్సిన విషయం/ రహస్యం

a) What I am going to say is for your ears only=
నేను చెప్పబోయేది నీకు మాత్రమే. ఇతరులకు తెలియ కూడదు.

b) Kiran: What did he say? (అతనేమన్నాడు? )
Krishna: I'm sorry. It is for my ears only.
(క్షమించు, నేనది చెప్ప లేను. అది నాకు మాత్రమే తెలియాల్సింది.)
(compare- for some-one's ears only)

**4) Pay a deaf ear/ turn a deaf ear=**
పెడచెవిన పెట్టడం/ వినిపించుకోకపోవటం.

a) Duryodhana paid a deaf ear/ turned a deaf ear to Krishna's words=
శ్రీకృష్ణుడి మాటలను దుర్యోధనుడు పెడచెవిన పెట్టాడు.

b) Never turn a deaf ear to elders' advice=
పెద్దవాళ్ల సలహా ఎప్పుడూ పెడచెవిన పెట్టకు.

**5) Ring in ears** =
చెవుల్లో మార్మోగటం/ వినిపిస్తున్నట్టుండటం.

a) I am unable to forget my maths teacher's teaching. His voice still rings in my ears=
మా లెక్కల టీచర్ teaching నేను మరచిపోలేను. ఆయన మాటలు (గొంతు) ఇప్పటికీ నా చెవుల్లో వినిపి స్తుంటాయి.

b) He could never forget the song. It always rang in his ears.
అతనాపాట ఎప్పటికీ మరచిపోలేకపోయాడు. అది అతడి చెవుల్లో ఎప్పుడూ మార్మోగేది.
(సినిమాల్లో చూస్తుంటాం కదా. Villain, అతని మను షుల దెబ్బలతో పడిపోయిన Hero కు అతడి చెల్లెలు చనిపోతోన్నప్పటి ఆక్రందన వినిపించడంతో అతనిలో ఒక్కసారిగా శక్తి వచ్చి అతడు Villain, అతని మనుషు లను చిత్తుచేయటం. ఆ ఆక్రందన వినిపించటమే Ring in the ears.)

**- M. SURESAN**

---

**ప్రశ్న:** కింది తెలుగుపదాలకు ఇంగ్లిష్ మాటలు తెలుపగలరు.
ఎంగిలి, కల్లాపి, యుద్ధప్రాతిపదికన, రాష్ట్రబంద్, రంగవల్లికలు, హుండీ, పంచభూతాలు, అతిశయోక్తి, విస్తర్లు, పౌర్ణమి, అమావాస్య, వరద బాధితులు, కాయ, సమయస్ఫూర్తి, బీరకాయలు.

– పి.శ్రీనివాస్, మెట్‌పల్లి

**జవాబు:** ఎంగిలి - spittle/ saliva. అయితే మన తెలుగులోలా ఒకరు తినటంవల్ల పదార్థాలు ఎంగిలవటం అనేదానికి English లో లేదు.
Leftovers- ఒకరు తినగా మిగిలిన.
యుద్ధ ప్రాతిపదికన = On a war footing
పంచభూతాలు- భూతాలను English లో elements అంటారు. మనం పంచభూతాలలో ఆకాశాన్ని (శూన్యం) కూడా చేరుస్తాం- అందుకని మనకు పంచ (5) భూతాలు. English లో Elements లో ఆకాశం లేదు. వాళ్లకున్నవి four elements - Earth (పృథ్వి), Air (వాయువు), Fire (అగ్ని), Water (నీళ్లు)- మాత్రమే. ఆకాశం (శూన్యం) వాళ్ల ప్రకారం element కాదు.
అతిశయోక్తి- Exaggeration (ఎగ్జాజరేషన్)
పౌర్ణమి- full moon day; అమావాస్య- No moon day/ New moon day;
వరద బాధితులు- flood victims;
కాయ- English లో కాయయినా, పండయినా, fruit అనే అంటారు. భేదం తెలపాలంటే, కాయ- raw fruit; పండు- ripe fruit.
సమయస్ఫూర్తి= Resourcefulness/ Ready Wittedness.
బీరకాయలు= Bottle gourds
రాష్ట్రబంద్- దీనికంటూ ప్రత్యేకమైన మాట English లో లేదు. Statewide general boycott/ statewide general strike అనే మాటలతో సరిపెట్టుకోవటమే.
కల్లాపి, రంగవల్లికలు, హుండీ- వీటికి English లో మాటల్లేవు.




**ప్రశ్న:** To ను ఎలా ఉపయోగించాలో వివరంగా తెలుపగలరు.

– ఎ.వి. రమణ

**జవాబు:** To మూడర్థాలతో వాడతాం.

1) మీరన్నట్లు 'కు/కి' అనే అర్థం.
He went to school (School కు వెళ్లాడు).
She has gone to the shop to buy some books
(పుస్తకాలు కొనడానికి ఆమె Shop కు వెళ్లింది).

2) To + 1st Regular Doing Word- దీన్ని infinitive అంటారు- to go, to come, to sing- ఇలా వాడితే, వెళ్లటం, రావటం, పాడటం, అనే అర్థం వస్తుంది. ఇలాంటి సందర్భాల్లో To + 1st Regular Doing Word బదులు ... 'ing' form వాడొచ్చు
a) To go/ going there now is dangerous
అక్కడికిప్పుడు వెళ్లటం (=To go/ going) ప్రమాదకరం
b) To smoke/ smoking is bad for health
పొగ తాగటం ఆరోగ్యానికి చెడు

3) To + 1st Regular Doing word- to go, to come, to eat, etc కు వెళ్లాలని, రావాలని, తినాలని- అర్థం వస్తుంది.
a) He wants to go = వాడు వెళ్లాలని అనుకుంటున్నాడు
b) She likes to sing = ఆమె పాడాలని/ పాడటానికి ఇష్టపడుతోంది.
ఇలా To + 1st Regular Doing Word ను infinitive అంటాం.

**ప్రశ్న:** *Ring, Phone అన్న పదాలు verb గా వాడొచ్చా?*
*phone - phoned - phoned*
*ring - rang - rung*
*ఇవి కరెక్టేనా? ఉదాహరణ ఇవ్వండి.*

– పవన్, నరసారావుపేట

**జవాబు:** వాడొచ్చు.
He phoned me/ rang me.
He has phoned me/ He has rung me - all correct.

**ప్రశ్న:** *1) "నీవు గతవారం రోజులుగా పాఠశాలకు ఎందుకు రావడం లేదు?" దీనిని "Why have you been absent for a week?" అనొచ్చా?*
*2) "నీవు ఇక్కడ ఎంతసేపటి నుంచి ఉన్నావు?" దీనిని How long you have been here? అనొచ్చా?*
*3) 'In time', 'Just in time' మధ్య తేడాను Intermediate English grammar by Raymond Murphy పుస్తకంలో ఇలా రాశారు. in time = soon enough. just in time= almost too late.*
*e.g. We got to the station just in time to catch the train.*
*ఈ వాక్యం అర్థం మనం బస్సు ఎక్కినట్టా? లేనట్టా?*

– డి.జి.రామశర్మ, కొత్వాల్

**జవాబు:** 1), 2) కరెక్టే.
3) Bus ఎక్కినట్టే. Almost too late = దాదాపు (పనికానంత) late అని కదా. దాదాపు అంటే దగ్గర, దగ్గర అనీ, పూర్తిగా కాదు అని కదా? దాదాపు ఎక్కనట్టే అంటే అర్థం ఎక్కినట్టే.
He almost missed the bus = bus దాదాపు తప్పిపోయింది = Bus అందుకున్నాడు.
He almost died = దాదాపు చనిపోయాడు- చావు అంచుల్లోకి వచ్చాడు, కాని చావలేదు.

**ప్రశ్న:** *1) God bless you. God singular కదా. blesses వస్తుంది కదా. 2) నీమీద నాకు నమ్మకం ఉంది అనడానికి I have confidence on you సరిపోతుందా. 3) Tooth powder అంటే పన్నుపొడి అనికదా. Teeth powder అని ఎందుకు అనరు? 4) Single (') double (") కొటేషన్లు ఏది ఎప్పుడు వాడాలో తెలియజేయండి.*

– కె. వెంకటేష్, పుండిగల్లి, శ్రీకాకుళం జిల్లా

**జవాబు:** i) God bless you అనేది, May God bless you అనే వాక్యానికి short form. ii) I have confidence in you.
iii) పళ్ళపొడికి Tooth power అనేది వాడుక- Usage ఇలాంటి Usageకి grammer rules apply అవవు.
iv) రెండింటికీ తేడా ఏమీ లేదు.

## SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 310



# I don't like her seeing me here

**Sampanna:** Why are you in a hurry?
(ఏంటంత తొందరపడుతున్నావు? )

**Sangeetha:** I want to leave before Ravali comes here. I don't like her seeing me here
(Ravali వచ్చేముందే నేను వెళ్ళాలనుకుంటున్నా. తను నన్నిక్కడ చూడటం నాకిష్టంలేదు)

**Sampanna:** Do stay here for some more time. I hate your leaving here so early. It's hardly ten minutes since you came here.
(కాసేపు ఉండు please. అంత త్వరగా నువ్వెళ్ళటం నాకసలిష్టంలేదు. నువ్వొచ్చి పదినిమిషాలయినా కాలేదు)

**Sangeetha:** I wouldn't mind staying any length of time, if only Ravali weren't coming.
(ఆ రవళి రాకుండా ఉంటే ఎంతసేపైనా ఉండేందుకు నాకభ్యంతరం లేదు.)

**Sampanna:** It's unfortunate that you don't like each other. I strongly suggest your making it up with each other so (that) we can all be happy.
(మీరిద్దరూ ఒకర్నొకరు ఇష్టపడకపోవటం దురదృష్టకరం. మీరిద్దరూ మళ్ళీ సఖ్యతగా ఉండాలని నేను సూచిస్తున్నా. మనందరం సంతోషంగా ఉండొచ్చు)

**Sangeetha:** I enjoy our being together, but Ravali gives me the impression she is not for it.
(మనందరం కలుసుండటాన్ని నేనానందిస్తాను, కాని తను దానికంత అనుకూలం కాదనే అభిప్రాయం కలిగిస్తుంది రవళి)

**Sampanna:** You are wrong there. I remember Ravali saying the same thing about you. So it is now clear that you both like to become friends again. So I insist on your being here till she comes.
(అక్కడే నువ్వు పొరపడుతున్నావు. రవళి కూడా ఇదే మాటనటం నాకు గుర్తొస్తోంది. అంటే మళ్ళీ స్నేహితులవాలని మీ ఇద్దరికీ ఉందని తెలుస్తోంది. కాబట్టి తనొచ్చేదాకా నువ్విక్కడుండాలని నేను పట్టుబడుతున్నా)

**Sangeetha:** Let's take some other occasion, not now, Sampanna please. I have to go now to help mom in the kitchen.
(ఇంకెప్పుడయినా చూద్దాం ఇప్పుడు కాదులే సంపన్నా. మా అమ్మకు వంటలో సాయపడేందుకు నేను వెళ్లాలి)

**Sampanna:** Stop trying for excuses to go away. You want to be friends with Ravali again but you feel a bit embarrassed to face her. I can understand your feeling so. Stay on.
(వెళ్ళిపోయేందుకు సాకులు వెదకటం ఆపెయ్. రవళితో మళ్లీ స్నేహంగా ఉండాలనే అనుకుంటున్నా తనను చూడటానికి ఇబ్బంది పడుతున్నావు. అలా నువ్వు feel అవటం నేనర్థం చేసుకోగలను. ఉండు.)

excuse = సాకు
lame excuse = కుంటిసాకు
embarrassing = ఇబ్బందిగా అనిపించటం

**Sangeetha:** Won't you please let me go?
(నన్ను వెళ్ళనీయవా? )

**Sampanna:** Excuse my asking you to stay on, but you must.
(నిన్ను ఉండాల్సిందిగా అడుగుతున్నందుకు క్షమించు, కానీ నువ్వుండాల్సిందే)

**Sangeetha:** OK, because you insist so much.
(నువ్వంత పట్టుబడుతున్నందువల్ల సరే)



English conversation లో '...ing' form (going, coming, singing etc) ఉపయోగం చాలా ఎక్కువా, సర్వసాధారణమూను. (తెలుసు గదా: 'ing' form ముందు 'be' form (am, is, was, shall be, have been etc) వస్తే అప్పుడు be form + ing form కలిపి verb అవుతుంది. '...ing' form మాత్రమే verb కాదు)
'-ing' form ను conversation లో ఎక్కువగా వాడేది- రావటం, వెళ్లటం, తినటం లాంటి అర్థాలతో.

a) Coming here is some thing I always like.
ఇక్కడికి రావటం అనేది నాకెప్పుడూ ఇష్టమే.
b) Going there now is not a good idea =
ఇపుడు అక్కడికి వెళ్లటం అంత సరైన ఆలోచన కాదు.
c) Eating too much always causes health problems =
అతిగా తినటం సమస్యలను సృష్టిస్తుంది.

ఇంకా చూడండి.
I don't like staying here any more.
ఇంకా ఇక్కడుండటం నాకిష్టంలేదు
(ఇంతకుముందు చాలాసార్లు వివరించాం. ఈ అర్థంతో '...ing' form వాడే చోట్లంతా infinitive వాడొచ్చని.)

Walking in this hot sun is not fun =
ఈ వేడి ఎండలో నడవటం తమాషా కాదు = To walk (infinitive) in this hot sun is not fun
అయితే ఈ lesson లో మనం తెలుసుకోబోతున్నది- ఈ అర్థంతో '...ing' form ను చాలా verbs తో వాడే సందర్భాలు.

**For example:**

**Look at the following sentences from the conversation at the beginning of the lesson.**

1) I don't like her seeing me here
(ఆమె నన్నిక్కడ చూడటం నాకిష్టంలేదు)
2) I hate your leaving here so early
(నువ్వంత త్వరగా ఇక్కడ్నించి వెళ్లిపోవటం నాకసలు ఇష్టంలేదు)
(గమనిక: ఇలాంటిచోట్ల అన్నివేళలా 'ing' form బదులు infinitive వాడటం వీలుకాదు. ఒకవేళ వీలయినా, '...ing' form నే ఎక్కువ వాడతాం.)

I like you to come = I like your coming.
I like you to come అనే form కన్నా, ఇదే ఎక్కువ వినిపిస్తుంటుంది.

**Look at a few more sentences from the conversation above.**

3) I wouldn't mind staying here.
4) I strongly suggest your making it up with each other.
3) లో staying ముందు ఏమీలేదు. అదే (4) లో making it up ముందు your ఉండటం గమనించండి. ఒక రుచేసే పనులపట్ల ఇతరులు తమ వైఖరి తెలపటానికి '...ing' form ముందు, my, your, our, his, her, their అనే possessive forms గమనించండి. ఇంకా చూడండి.

a) He likes going out for a walk in the morning
(పొద్దున నడిచేందుకు వెళ్లటం అతనికిష్టం)
b) The doctor appreciates his going out for a walk in the morning
(అతను పొద్దున నడిచేందుకు వెళ్లటాన్ని డాక్టర్ మెచ్చుకుంటున్నాడు) Sentence (b) లో అతని పని పట్ల doctor వైఖరి తెలుస్తోంది.

From the dialogue in the lesson.
5) I enjoy our being together
(మనమందరం కలిసి ఉండటం (being) నేనానందిస్తాను)
6) I remember Ravali telling me the same thing
(ఇదే విషయం Ravali చెప్పటం నాకు గుర్తుంది)
7) I can understand your feeling so =
అలా నువ్వు feel అవటం నేనర్థం చేసుకోగలను.
8) Excuse my asking you to stay on =
ఇక్కడ ఉండిపొమ్మని నేనడగటాన్ని క్షమించు
9) Stop trying searching for excuses =
సాకులు వెదకటానికి ప్రయత్నం చెయ్యటం మానుకో.

ఈ కింది sentences మీరు English లో practice చేయండి. underline చేసిన మాటలు 'ing' form లో చెప్పండి.

a) వాడలా మాట్లాడటం ఎవరూ ఇష్టపడలేదు
b) నువ్వంత త్వరగా చర్య తీసుకోవటం అందరూ మెచ్చుకున్నారు
c) Doctor రోగిపట్ల అంత శ్రద్ధ చూపటం చాలా అరుదు.
d) నేను పొగపీల్చడం మీకేమన్నా అభ్యంతరమా? (mind వాడండి)
e) అతడంత సుదీర్ఘోపన్యాసాలు చేయటం ఎవరికీ నచ్చలేదు.

**Answers:**

a) No one liked his speaking so
b) All appreciated your taking such a quick action
c) A doctor taking so much care of a patient is rare (It is rare for a doctor to take so much care of a patient అని కూడా అంటాం.)
d) Do you mind my smoking?
e) No one liked his making such a lengthy speech

సవరణ: Spoken English lesson no 309 లో పాఠకుడికిచ్చిన సమాధానంలో- బీరకాయను Bottle gourd అంటారని వచ్చింది. Ridge gourd అంటారు. Bottle gourd అంటే సొరకాయ.

- *M. SURESAN*

---



1. 'The' ఎప్పుడు ఎలా ఉపయోగించాలి? The ఉపయోగించే చోట a, an ఉపయోగించకూడదా?
2. May be, likely to be అర్థం ఒకటేనా, ఉదాహరణలతో వివరించండి.
3. నేను ఇళ్లు కట్టడానికి చాలా ఖర్చుపెట్టాను.
ఇళ్లు పూర్తిచేయడానికి నాకు చాలా ఖర్చు అయ్యింది.
(ఇంగ్లిష్‌లో వివరించండి)
4. I went to my uncle's. But he had gone out. ఇక్కడ he had gone out అనాలా, he was out అనాలా లేదా he had been out అనాలా? (దీనిలో simple past, past perfect combination ఉంది. simple present, present perfect combination వాడొచ్చా? )

***కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో వివరించండి.***

1. నేను ఆ పని చేయకూడదు అనుకున్నాను. కానీ చేయాల్సి వచ్చింది.
2. నేను విజయవాడ వెళ్లి అక్కడే ఉండిపోవాల్సి వచ్చింది.
3. నేను యోగా నేర్చుకున్నాను. రోజూ చేస్తూ ఉన్నాను.
4. ఎవరెవరు ఏయే పుస్తకం చదవాలో ఆ పుస్తకం మాత్రమే చదవండి.
5. ముందు ముందు చాలా విషయాలు మీకే తెలుస్తాయి.
6. కష్టమైనా, నష్టమైనా మనమే భరించాలి.
7. Get, Take మధ్య తేడా, వాటిని ఏయే సందర్భాల్లో ఉపయోగించాలో వివరించండి.

– వి.మురళీకృష్ణ, ఏలూరు

**జవాబు:** 1. A/ an and the - వీటి గురించి పాత lesson లో చాలా వివరించాం. చూడండి.
2. ఒకటే. He may come here- అతడిక్కడికి రావచ్చు/ వచ్చే అవకాశం ఉంది= He is likely to come here.
May be he is there - (It's) quite likely he is there. దీని గురించి త్వరలో వివరిస్తాం.
3. I spent a lot to build the house
I spent a lot to complete the building/ It took me a lot of money to complete the building.
4. ఏది అనాలి అనేది మనం చెప్పాలనుకున్నదాన్నిబట్టి ఉంటుంది.
a) I went to my uncle's but he had gone out = నేను మా uncle ఇంటికి వెళ్ళాను. కాని ఆయన అప్పటికే బయటికెళ్ళాడు.
b) I went to my uncle's but he was out = నేను మా uncle ఇంటికి వెళ్ళాను. కానీ ఆయనెక్కడో బయట ఉన్నాడు/ ఇంట్లో లేడు.
ఈ అర్థాలతో (a), (b) రెండూ correct.
Simple present, Present perfect combination వాడొచ్చు అయితే అర్థం మారిపోతుంది కదా- Simple past, Past perfect combination తో వచ్చే అర్థం నుంచి.
I want to see him, but he has gone out= నేనతన్ని చూడాలనుకుంటున్నాను. కానీ అతను బయటికెళ్లాడు.
(want- pr. simple, has gone- pr. perfect) - ఇలా మనం తెలియపరచాలనుకున్న idea ను బట్టి ఏ combination అయినా రావచ్చు
I will start it this month end and I will have completed it by the end of next month = ఈ నెలాఖరులో దాన్ని ప్రారంభిస్తాను. వచ్చే నెలాఖరుకు దాన్ని పూర్తి చేసుంటాను.
(will start- future simple, will have completed- future perfect). మీరు ఏ tenses combination వాడాలనేది మీరు చెప్పాలనుకుంటున్నదాన్నిబట్టి ఉంటుంది.

***తెలుగు వాక్యాలను ఇంగ్లిష్‌లో ఇలా..***

1) I thought of not doing it/ I thought I wouldn't do it but I had to do it
2) I went to Vijayawada and had to be there.
3) I have learnt yoga and practise it daily.
4) Every one reads the book they (he or she) should read
5) You will come to know a lot more/ more and more/ a lot as the days go by.
6) We have to bear the losses and the difficulties
7) దీని గురించి చాలా విపులంగా పాత lessons లో వివరించాం.

URL:http://www.eenadu.net/spoken/spoken.htm లో చూడొచ్చు

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 311



# KEEP AT ARM'S LENGTH...

**Srimanth:** Sumanth, What do you think of the guy refusing his bike to me?
(వాడు నాకు bike ఇవ్వకపోవటం గురించి ఏమనుకుంటున్నావు? / (మామూలు తెలుగు) వాడు నాకు bike ఇవ్వలేదు చూడు, ఏమంటావు? )

refuse = తిరస్కరించటం/ ఇవ్వకపోవటం

**Sumanth:** Who are you talking of?
(ఎవరిని గురించి మాట్లాడుతున్నావు? )

**Srimanth:** A bout Vasanth of Course. Do you remember him ever helping others at any time.
(శ్రీకాంత్ గురించి, - ఇంకెవర్ని? (of course) వాడెవరికైనా సహాయం చేయటం నీకు గుర్తుందా? )

**Sumanth:** But What's the cause of your complaint now?
(అయితే ఇప్పుడు నువ్వు కంప్లైంట్ చేయటానికి కారణం? )

**Srimanth:** Yesterday he saw me rushing to college for my certificates urgently. Time was running out. The college office would close in about half an hour.
(నిన్న నా సర్టిఫికెట్స్ కోసం అవసరవసరంగా కాలేజ్ కెళ్లటం చూశాడు. నాకేమో time అయిపోతోంది. అరగంటలో college Office మూసేస్తారు? )

**Sumanth:** So? (అయితే)

**Srimanth:** I saw him chatting with some one on the street and asked for his bike. He just said no. He wouldn't even take me to college.
(వాడు road లో ఎవరితోనో మాట్లాడుతుండటం చూశా. Bike అడిగా. ఇవ్వనన్నాడు. పోనీ వాడన్నా తీసుకువెళతాడా అంటే అదీ లేదు)

**Sumanth:** Srinkanth's doing so is no surprise to me. But I feel you were at fault.
(Srikanth అలా చేయటం నాకేం ఆశ్చర్యంగా లేదు. కాని నువ్వు తప్పు చేశావనుకుంటున్నా)

**Srimanth:** Me? why do you say so?
(నేనా? ఎందుకలా అంటున్నావు? )

**Sumanth:** I have hated you bending over back wards to help him. Why should you do that?
(వాడికి సాయం చేయాలని నువ్వు తహతహలాడిపోవటం నేనెప్పుడూ ఇష్టపడలేదు నువ్వది ఎందుకు చేయాలి? )

**Srimanth:** Well, who ever knew he was this sort?
(ఎవరికి తెలుసు, వాడిలాంటివాడని? )

Sort = రకం

**Sumanth:** You must have disliked me keeping him at arm's length. But I have Known him for what he is - a very very selfish fellow.
(వాడిని నేను ఉంచాల్సిన దూరంలోనే ఉంచటం నువ్వు ఇష్ట పడకపోయుంటావు. వాడు ఎలాంటివాడో నాకు తెలుసు. చాలా స్వార్థపరుడు)

keep at arm's length = (ఎవరికైనా) చనువివ్వకుండా ఉంచాల్సిన దూరంలో ఉంచటం

**Srimanth:** I now realise our discussing him so long is just a waste of time. I now know how I should be with him.
(ఇంతేసేపు వాడిని గురించి చర్చించటం/ మాట్లాడటం సమయం వృథా అని గ్రహించాను. వాడితో ఎలాఉండాలో ఇప్పుడు అర్థం అవుతోంది నాకు)

**Sumanth:** Your realising it atleast now makes me happy.
(ఇప్పటికైనా నువ్వది అర్థం చేసుకోవటం నాకు సంతోషంగా ఉంది)

✦ ✦ ✦ ✦ ✦

**Look at the following expressions from the conversation above**

1) What do you think of <u>the guy refusing the bike</u> to me?
2) Do you ever remember him helping others?
3) Yesterday he saw <u>me rushing</u> to College
4) <u>Srikanth's doing so</u> is no surprise to me
5) I have hated <u>you bending over backwards</u> to help him
6) You must have disliked <u>me keeping him at</u> arm's length
7) I realise <u>our discussing him</u> so long a waste of time

మొదట కిందివాటి మధ్య తేడా గమనిద్దాం:
Column A కింద ఉన్నవాటిని objective form అంటాం; Column B కింద ఉన్నవాటిని possessive form అంటాం (టేబుల్ చూడండి)

Compare A and B below:
A) Do you like me acting that role?
B) Do you like my acting that role?

రెండింటికీ అర్థం, నేనా పాత్ర నటించటం నీకిష్టమేనా? అని.

| A | B |
|---|---|
| me (నాకు, నన్ను) | my (నా) |
| our (మాకు, మనకు, మమ్మల్ని) | our (మా, మన) |
| You (నిన్ను, నీకు) మిమ్మల్ని, మీకు | Your (నీ/మీ) |
| him (అతడిని, అతడికి) | his (అతడి) |
| her (ఆమెను, ఆమెకు) | her (ఆమె యొక్క) |
| Them (వాళ్లను, వాళ్లకు) వాటిని, వాటికి) | their (వాళ్ల, వాటి) |
| Any name (ఏదైనా పేరు)- Gopal, Krishna, Sri Ram, etc = వీళ్లు/వీళ్లకు/వీళ్లను | Gopal's Krishna's, Sri Ram's- 's = వీళ్ల) |

అయితే Aలో me (objective form), B లో my (possessive form) వస్తోంది కదా? ఇపుడు మన discussion, ఇలాంటి సందర్భాల్లో objective form (పట్టికలో column - A) వాడాలా, లేదా possessive form (పట్టికలో column - B) వాడాలా అని.

చక్కటి నాజూకైన English రాసేవాళ్లూ, మాట్లాడేవాళ్లూ, Possessive form (Column-B) నే ఎక్కువ ఇష్టపడతారు. అది Correct కూడా. అయితే మామూలు daily conversation లో objective form (column-A), Possessive form (column - B), రెండూ సమానంగా వినపడతాయి. అందుకని objective form, ముఖ్యంగా Spoken English లో, తప్పనలేం. ఇది సర్వసాధారణం అయిపోయింది.

ఇపుడు మన conversationలోని sentences విషయం చూద్దాం: మొదట

**Sentence No: 2**
Do you ever remember him helping others?
(అతడు ఇతరులకు సాయం చేయటం నీకెప్పుడైనా గుర్తుందా? )
ఇక్కడ <u>him</u> (objective form) వాడుతున్నాం. దీని బదులు his (possessive form) helping others అని కూడా అనవచ్చు అది standard/ written form.

**Sentence No: 5**
I have <u>hated you bending</u> over backwards to help him (అతడికి నువ్వు సాయం చేయడాన్ని నేను ఇష్టపడలేదు). ఇక్కడ <u>you bending</u> లో you objective form- దీని బదులు your bending (possessive form) అని కూడా అనవచ్చు ఇది standard/ written form.

**Sentence No: 6**
You must have <u>disliked me keeping</u> him at arm's length (అతడిని నేను ఉంచాల్సిన దూరంలో ఉంచటం నువ్వు ఇష్టపడలేదు). ఇక్కడ me keeping - me objective form - ఇక్కడ కూడా me కి my (possessive form) Keeping అని కూడా అనవచ్చు standard/ written form లా

**Sentence No:7**
ఇందులో Problem లేదు. I realise <u>our discussing him</u> a waste of time (మనం అతడి విషయం ఇంత చర్చించటం, time waste అని తెలుసుకున్నా). ఇక్కడ objective form, possessive form, రెండూ our కాబట్టి సమస్య లేదు. అలాగే her విషయంలో కూడా.

**Sentence No:1**
What do you think of the <u>guy refusing</u> - ఇలాంటి చోట్ల అంటే.. guy, boy, girl, man, officer etc (nouns) విషయంలో, possessive form (Apostrophe and 's'- తో వచ్చేవి- guy's, boy's, girl's, man's, officer's) కంటే కూడా objective form (Apostrophe and 's' లేని form) వాడకమే ఎక్కువ. (standard/ written form లో కూడా)

**Sentence No : 4**
Srikanth's doing so is no surprise - ఇక్కడ కూడా <u>Srikanth doing so</u> వాడకమే ఎక్కువ. (standard/ written form లో కూడా)
ఇవి చాలా Common గా spoken English లో వచ్చే forms కాబట్టి బాగా Practice చేద్దాం.

***M.SURESAN***

---

ప్రశ్న 1: మీ హాబీస్ ఏంటి అని ఎవరైనా అడిగితే చాలామంది playing cricket, watching TV అంటారు. ఇవి present continuous tense లో ఉన్నాయి. Watch TV, Play Cricket ఇలా కూడా అనొచ్చా?

2. i) వెక్కిరించడాన్ని ఇంగ్లిష్‌లో ఏమంటారు?



ii) Where did you go?, Where would you go? ఈ రెండింటి మధ్య తేడా ఏమిటి?

iii) When should you come? అనే వాక్యం కరెక్టేనా?

iv) spoken English మాట్లాడేటప్పుడు గ్రామర్‌రూల్స్ పాటించాలా? Today's completed actions we have to use have+V3. అయితే కొన్నిచోట్ల V2 వాడుతున్నారు. వివరించగలరు.

వి.కళాకృష్ణ, కైకలూరు.

జవాబు: Expressions like playing, watching are just present participle. They are not verbs in the present continuous. Please understand that am/ is/ are watching, am/ is/ are playing are present continuous forms.

Playing cricket, watching TV mean the act of playing/ watching etc- It is correct to say so.

Smoking is bad for health- here, smoking means, the act of smoking, and smoking is used as a noun.

He likes reading books (పుస్తకాలు చదవడం అతని కిష్టం) So here, playing, watching అంటే, ఆడటం, చూడటం అనే అర్థాలు వస్తాయి. అంతేకానీ ఆడుతున్నాను/ ము/ ఆడుతున్నాడు/ ఆడుతున్నారు అని గానీ, చూస్తున్నాను/ ము/ డు/ రు అనిగానీ రావు.

You can, of course, say that your hobbies are, to watch TV, to play cricket, to listen to music, etc.

2. i) వెక్కిరించటం = Make a face/ make faces, pull a face/ faces, grimace (గ్రిమేయ్స్/ గ్రిమస్)

a) When he was teaching, she was making faces/ pulling faces/ grimacing. అయితే grimace అంటే బాధ వల్ల కూడా ముఖం/ నోరూ వంకర తిప్పటం అనే అర్థమూ ఉంది.

ii) Where did you go? = You went somewhere and where was it (Past)

Where would you go? = Where do you want/ like to go now?

iii) When should you come? = When have you to come? (ఎప్పుడు రావాలి నువ్వు? ) It's correct

iv) We have to. However, some times usage may go against grammar.

What you mean by have + V3 form (have gone, have seen, etc) is the present perfect form. Once you mention the time of action (eg: at 8 this morning, half an hour ago, etc) it is against grammar rules to use the present perfect tense. You have to use the past simple (V2) form, even if it is today's completed action.

They have gone out (no time is mentioned)

They went out at 10 this morning/ half an hour ago/ at 8 in the morning. (You see- this refers to today's action, but because the time is stated, we use the past simple form). It is grammatically wrong to say- "They have gone out at 10 this morning." etc.

ప్రశ్న: 2.
I met him on train అనే ఎందుకనాలి? on స్థానంలో in, at వాడకూడదా?
I am at the institute, I am in the institute పైవాక్యాలకు తేడా ఏమిటి?

ఎస్.రాజ్, హైదరాబాదు.

జవాబు: I met him on train is correct. As this is a matter of usage, there is no explanation why in, at, etc shouldn't be used.

తెలుగులో ఎన్ని నీళ్లు అంటాం. నీళ్లు లెక్కబెట్టే వస్తువు (countable) కాదుగదా 'ఎన్ని' అనటానికి. ఎంత నీళ్లు? అనాలి. నీళ్లు quantity కాబట్టి. కానీ తెలుగు మాట్లాడేవాళ్లు ఎన్ని నీళ్లు అనటం వాడుక (usage). అలాగే English లో కూడా. usage (వాడుక)కు rule అంటూ ఉండదు.

ii) I am at the institute - correct
I am in the institute - wrong
ఓ ప్రదేశంలో, ఓ చోట అనేందుకు, at ఎక్కువ వాడతాం. In దాదాపు వాడం.

He was at (the) college till 8 last evening = నిన్న సాయంత్రం 8 వరకు college లో ఉన్నాడు.

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 312

ప్రతిభ

# Does she like the game?

**Dheeraj:** Isn't Manoj coming with us for the match. I thought he would.
(మనతో match కి Manoj రావటం లేదా. వస్తాడని అనుకున్నా.)

**Neeraj:** No.He isn't. How I wish he were!
(లేదు. రావటంలేదు. అతనొస్తే ఎంత బావుండేదో!)

**Dheeraj:** Didn't you advise him not to miss such an exciting match.
(అంత ఉత్సుకత రేపే match ను కోల్పో వద్దని నువ్వు సలహా ఇవ్వలేదా?)

**Neeraj:** I did, but something came up in the last minute. And he decided not to.
(నేను చెప్పి చూశాను. కానీ చివరి నిమిషంలో ఏదో జరిగింది. అతను వద్దనుకున్నాడు)

**Dheeraj:** (Have you) had your breakfast?
(నువ్వు break fast చేశావా?)

**Neeraj:** No. Not yet. I want to, in some restaurant on the way. Have you?
(ఇంకా లేదు. దార్లో ఏదైన్నా restaurant లో తీసుకుందామనుకుంటున్నా.)

**Dheeraj:** No, I haven't either.
(లేదు, నేనూ తీసుకోలేదు)

**Neeraj:** You weren't here for the last match. I watched it with my cousin.
(కిందటి match కు నువ్వు ఎక్కడ లేవు. నేను మా cousin తో చూశా.)

**Dheeraj:** Do I know him?
(అతను నాకు తెలుసా?)

**Neeraj:** No. You don't. The last time he came here, you were out of town.
(నీకు తెలియదు. అతనిక్కడికి వచ్చినప్పుడు నువ్వు ఊర్లో లేవు.)

**Dheeraj:** Can he play too?
(అతనూ బాగా ఆడగలడా?)

**Neeraj:** Yes. He can. But do you want to stay on till the end of the match?
(ఆడగలడు. అదిసరే నువ్వు match చివరి వరకూ ఉండాలనుకుంటున్నావా?)

**Dheeraj:** I don't know, but I hope to.
(ఏం చెప్పలేనిప్పుడు. కానీ ఉండాలనే ఆశిస్తున్నా.)

**Neeraj:** Do you know that our team hasn't had the best of practice for this match?
(ఈ match కి అంత మంచి practice మన team కు లేదని నీకు తెలుసా?)

**Dheeraj:** It appears so. Two or three of our players had injuries and didn't attend practice.
(అలాగే అనిపిస్తోంది. ఇద్దరు ముగ్గురు గాయాలవల్ల Practice కు హాజరుకాలేకపోయారు)

**Neeraj:** Well, has Sumanth called you?
(Sumanth ఏమైనా, Phone చేశాడా?)

**Dheeraj:** No, but I expect him to.
(లేదు. కానీ Phone చేస్తాడనే అనుకుంటున్నా)

**Neeraj:** OK. Here's a good restaurant. Shall we have some thing to eat?
(ఇదిగో మంచి restaurant. ఏమైనా తిందామా?)

**Dheeraj:** Of course, we will. Let's get in.
(తప్పకుండా. వెళదాం పద)

✦ ✦ ✦ ✦ ✦

పై conversation ను ఎన్నిసార్లు వీలుంటే అన్నిసార్లు చదవండి. ఎందుకంటే ఇందులో మీకు spoken English కు ప్రాణమైన short responses to questions చాలా ఉన్నాయి. English conversation చాలా సహజంగా వినపడాలంటే ఈ short responses (క్లుప్తమైన జవాబులు/ముక్తసరి సమాధానాలు) మనం అలవాటు చేసుకోవటం చాలా అవసరం. ఈ ముక్తసరి సమాధానాలు, చాలా ప్రశ్నలకు జీవం.

ఇక్కడ గమనించాల్సిన ముఖ్య విషయం. చాలా short responses లో question లోని verb, answer లో omit చేస్తాం. దానికి బదులు do, don't, does, doesn't, did, didn't, can, can't, could, couldn't, needn't లాంటి forms ను వాడతాం. ఇవి మనం బాగా practice చేస్తేనే మన conversation natural గా ఉంటుంది. ఒక్క ఉదాహరణ చూడండి.

**Vinai:** May I come in?

**Vijay:** Please do/ do.

చూశారు కదా. Response, Please come in, అని గానీ, come in అని గానీ అనటంలేదు. Please do/ do అంటున్నాం కదా? ఇలా చాలాసందర్భాల్లో అనాల్సి వస్తుంది, question లో ఉన్న verb ను Answer లో omit చేసి. ఇది కూడా చూడండి.

**A:** I can't speak Hindi. Can You?
(నేను హిందీ మాట్లాడలేను. మరి నువ్వు?)

**B:** I can, very well
(చాలా బాగా మాట్లాడగలను)

ఇలాంటివి మనం practice చేయటం కష్టం కానేకాదు. మొదట ఓ 10 సార్లు మనం అలాంటి responses వాడితే, తర్వాత మనకు తెలీకుండానే వాటిని వాడతాం.

Now, look at the following sentence from the conversation at the beginning of the lesson.

Omit చేసిన verbs brackets లో చూడండి.

1) No, he isn't (coming)
2) I did (I advised him)
3) He decided not to (not to come)
4) I want to (I want to have my breakfast)
5) No, you don't (you don't know him)
6) Yes, he can (he can play well)
7) I don't know, but I hope to (stay on till the end of the match)
8) It appears so.
(అలానే అనిపిస్తోంది - అంటే అంతకుముందు చెప్పిన విషయం గురించి)
9) No, but I expect him to. (to call me)
10) Of course, we will.

పైన ఇచ్చిన responses ను, conversationలో ఇచ్చిన questions తో చదవండి.

రెండుమూడు సార్లు చదివితే మీకదే వచ్చేస్తుంది.

ఈ short responses (without repeating the verb) వాడటం చాలా సులభం. Questionలో గానీ, మనం response ఇవ్వాల్సిన verbలో గానీ ఉన్న Helping Verbను గమనిస్తే చాలు. response లో కూడా దాన్నే వాడతాం. Positive response (అవును) అన్నప్పుడు, Yes, Subject + Helping Verb వస్తుంది.

Negative response (కాదు) అన్నప్పుడు, No, subject + Helping verb + n't (= not) వస్తుంది.

| Questions | Responses |
|---|---|
| Do +1st Regular Doing Word (RDW) | Yes + subject + do/ No + subject + don't |
| Does + 1st RDW | Yes + subject + does/ No + subject + does'nt |
| Did = 1st RDW | Yes + subject + did/ No + subject + didn't |
| Shall | Yes, shall / No, shan't |
| Will | Yes, will / No, won't |
| Can | Yes, can / No, can't |
| Could | Yes could/ No couldn't |

కింద చూడండి.

**Q1:** Do you know this place about?
ఇక్కడ Verb: Do know; Helping verb: Do దీన్నే వాడతాం response లో.

**Response:** Yes; I do/ No. I don't
(Yes, I like it/ No. I don't like it అనం)

**Q2:** Does she like the game?
(Helping verb - does)

**A:** Yes. She does/ No. She doesn't
ఇక్కడ కూడా పూర్తి verb తో, Yes, she likes it/ No, she doesn't like it. అని అనం.

**Q3:** Did you go to the movie yesterday?

**R:** Yes, I did/ No. I didn't

**- M. SURESAN**

---

**ప్రశ్న:**
1) Verb లలో ing form లేనివి తెలిపి వివిధ Tense లలో వాటిరూపాలు ఎలా మారతాయో వివరించండి. ఉదా: Love
2) Did I ever used అనే వాక్యం సరైనదేనా?

**-ఏసుదాసు, ఆర్.చంద్రంపాలెం**

**జవాబు:**
'...ing' form అన్ని verbs కు వాడతాం. వాడనిది: am + ing/ is + ing/ are + ing forms.
ఈ form లో వాడని verbs గురించి చాలా lessons లో వివరించాం.
Love కు am loving/ is loving/ are loving లేదు. ఇలాంటి verbs ను ఇప్పుడు జరుగుతున్న పనులను తెలపటానికి కూడా వాడతాం. love/ loves అంటాం.
Did I ever used to - తప్పు. Did I ever use to, correct.

**ప్రశ్న:**
I) I'd, You'd, Let's, It'll, We'll, They'll ను ఎలా pronounce చేయాలి?

**-వేపూరి శ్రీహరి, సూర్యాపేట**

**జవాబు:**
I'd = I would
you'd = you would } త్వరగా మాట్లాడేటపుడు - ఐ ఉడ్, యూ ఉడ్ అనే బదులు ఐడ్, యూడ్ అని pronounce చేస్తాం.
అలాగే 3) Let's (Let us) pronunciation: Let's (లెట్స్)
4) It'll (It will) - pronunciation - It'll - ఇటేల్
5) We'll (Wewill) - Pronunciation- We'll - ఉయ్ల్
6) They'll (They will) " -They'll - దేల్



**ప్రశ్న:**
1) be form 2) be form + ing form 3) be form + past participle 4) Action (doing) verbs 5) shall, should, will, would, can, could, may, might, must, need, ought, dare + 1st RDW 6) has, have, had, shall have, should have, will have, would have, can have, could have, may have, might have, must have, ought have, need have, dare have + past participle. ఇంగ్లీష్‌లో ఏ వాక్యమైనా పై రూపాల్లో ఉండాలని మీరు రాశారు.
1) They have a nice building,
2) he has a car
ఈ రెండువాక్యాల్లో పైన వివరించిన six forms లేవు. వివరించగలరు.

**- డి.వి. నారాయణరావు, గొల్లపూడి**

**జవాబు:**
A. Have, has ... ఈ రెండూ కూడా Past participle తో కలిసి verbs ను form చేస్తాయి.
eg: They have gone (Verb - have + pp )
She has seen him (Verb - has + pp)
అలాకాకుండా, కలిగి ఉండటం అనే అర్థంతో have, has వాడినపుడు, have, 1st Regular Doing Word, has- Second Regular Doing Word అవుతాయి కదా?

**ప్రశ్న:**
1) వార్త (singular), వార్తలు (plural) కదా. News/ tidings ను singular లేదా plural ఎలా చదవాలి?
2) కింది పదాల అర్థాలు వివరించండి.
hast, hath, Goperwood, green poplar, clave, whoredom, spies, besought, bade

**జవాబు:**
i) English లో వార్త అన్నా, వార్తలు అన్నా news. ఇది uncountable. ఎప్పుడూ Singular లోనే వాడతాం. దీనిముందు a/ an రాదు. Tidings కు అర్థం, news. కానీ Tidings అనేది plural. అయితే ఇది Old fashioned- ఇప్పటి వాడుకలో లేదు.
ii) hast, hasth- Old forms of have and has- not in use now.
Gopher అనేది North America అడవుల్లో నివసించే పెద్ద ఎలుక లాంటి జంతువు.
Gopherwood- ఒక రకమైన చెక్క- దీన్నే yellow wood అని కూడా అంటారు. Bible లో నోవా నిర్మించుకున్న పెద్ద నావ (Noah's Ark) కు వాడిన చెక్క. కూడా Gopher wood.
Green Poplar = ఒక రకం చెట్టు. సమశీతోష్ణ శీతల దేశాల్లోనే పెరుగుతుంది.
Clave = కోలాటం కర్ర
Whoredom = వ్యభిచార వృత్తి/ పడుపువృత్తి
Spies = Plural of Spy - గూఢచారులు
besought - (past tense of beseech) = Request
bade - (Past tense of bid) - farewell, good bye లాంటివి చెప్పటం. He bade farewell to her = ఆమెకు వీడ్కోలు చెప్పాడు.

**ప్రశ్న:**
A lot of words,
A few of the things
పై వాక్యాల ముందు 'A' వాడడం తప్పనిసరా? 'A' లేకుండా వీటిని వాడలేమా?

**- ఎస్.రాజ్, హైదరాబాద్**

**జవాబు:** iii) a lot of - ఎక్కువ సంఖ్యలో/ ఎక్కువ మొత్తంలో. A lot of words = చాలా మాటలు.
A lot of words in Telugu are borrowed from Sanskrit - తెలుగులో చాలా మాటలు సంస్కృతం నుంచి వచ్చాయి. He drinks a lot of milk - వాడు చాలా పాలు తాగుతాడు.
A few of the things; a few of things కాదు. A few of the things = ఆ వస్తువుల్లో కొన్ని (తక్కువ సంఖ్యలో). 'lot of' ముందు a తప్పక వాడాలి.
few విషయంలో, few అంటే దాదాపు లేదు అని negative meaning వస్తుంది. A few అంటే కొన్ని అని అర్థం వస్తుంది.

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 313



**Suhrid:** Should I ask for permission to leave?
(నేను వెళ్లటానికి అనుమతి అడగాలా? )

**Brihat:** Of course. Every one has to.
(అంతేకదా, ఎవరైనా అడగాల్సిందే)

**Suhrid:** But so many have left already.
(కానీ ఇప్పటికే చాలామంది వెళ్లిపోయారు కదా)

**Brihat:** I suppose so. But they must have all taken permission.
(అనే అనుకుంటున్నా. అయితే వాళ్లందరు అనుమతి తీసుకునే వెళ్లుంటారు)

**Suhrid:** It doesn't appear so.
(అలా కనిపించటంలేదు)

**Suhrid:** You know I don't own a car yet, but I am sure to, soon.
(నాకు కారు లేదని తెలుసుకదా, కాని త్వరలోనే ఉంటుందనేది కచ్చితం.)

**Brihat:** (Are) you going to take a loan to buy it?
(అది కొనేందుకు రుణమేమన్నా తీసుకో బోతున్నావా? )

**Suhrid:** No; I don't intend to. Not certainly from any financial institution. If at all I do, I may borrow a part of the amount from my cousin.
(లేదు, నాకా ఉద్దేశం లేదు. ఆర్థిక సంస్థల నుంచి మాత్రంకాదు. రుణం అంటూ తీసుకుంటే మా cousin దగ్గరనుంచి కొంత అప్పు తీసుకుంటా)

**Brihat:** But I don't think you need to.
(కానీ ఆ (అప్పు తీసుకునే) అవసరం నీకు లేదనుకుంటా.)

Natural and free flowing (సరళంగా సాగిపోయే) English conversation కు ముఖ్య లక్షణమైన short responses practice చేస్తున్నాం కదా. మరికొన్నింటిని ఈ conversation లో నేర్చుకుందాం.

Question లోని/ అవతల మాట్లాడు తున్నవారి sentences లోని helping verbs (do, does, did, can, could, will, would, etc; am, is, are, was, were, etc) ను వాడి మనం short responses ఇవ్వొచ్చని తెలుసుకున్నాం.

eg: Hemanth: <u>Do</u> you like this book?
(నువ్వీ పుస్తకాన్ని ఇష్టపడుతున్నావా? )

Vasanth: Of course, I <u>do</u>.
(నిజంగానే ఇష్టపడుతున్నా)/
No. I <u>don't</u> (లేదు. నాకిష్టంలేదు)

(Question లోని 'Do' నే response లో వాడతాం)

# No; I don't intend to

**Brihat:** Why are you asking? Do you wish to leave without permission?
(ఎందుకడుగుతున్నావు? అనుమతి తీసుకో కుండా వెళ్లాలని నీ కోరికా? )

**Suhrid:** No, I don't, but I want to know the exact practice.
(అలా అని కాదు. అసలు పద్ధతేమిటో తెలుసు కుందామని.)

**Brihat:** Follow the rule book. Isn't there a copy of it in one of the racks?
(అయితే rule book ను పాటించు. దాని ప్రతి ఆ rack లో దేనిలోనూ లేదా? )

**Suhrid:** I don't think so. Will it be available with any of our colleagues?
(అలా అని నేననుకోవటంలేదు. అది మన సహోద్యోగులు ఎవరి దగ్గరన్నా ఉంటుందా? )

**Brihat:** I hope so. We'll find out from Nishant.
(నేనలా ఆశిస్తున్నాను. నిశాంత్‌ను అడుగుదాం.)

**Suhrid:** Do you want to ask him now?
(ఇపుడతన్ని అడగాలనుకుంటున్నావా? )

**Brihat:** I want to. I am sure he is in.
(అనుకుంటున్నాను. అతను office లో ఉన్నాడనే అనుకుంటున్నా)

**Suhrid:** But I am not. I think he has left early to see the car he wants to buy.
(కానీ నేనలా అనుకోవటంలేదు. తను కొనబోయే car చూసేందుకు ఈరోజు కొంచెం ముందుగానే వెళ్లాడనుకుంటా.)

**Brihat:** What about you? (నీ సంగతేంటి? )

**Suhrid:** I have to, but that'll only be a small amount.
(తీసుకోవాల్సిందే, కానీ అది చిన్న మొత్తమే అవుతుంది)

**Brihat:** I think almost all of us in the company will soon be owning cars.
(మన company లో దాదాపు అందరికీ త్వరలో cars ఉంటాయనుకుంటా)

**Suhrid:** Yea, they will be. At least I hope so.
(అవును. ఉంటాయి. కనీసం అలా అవాలని నేనాశిస్తున్నా.)

**Brihat:** The company's offering a liberal fuel allowance is very tempting. That certainly is the reason for every one going in for a car.
(Company ఇస్తున్న ఉదారమైన ఇంధన భత్యం ఓ మంచి ఆకర్షణ. ప్రతివాళ్లూ car కొనాలనుకునేందుకు అది అసలుకారణం అనుకుంటా)

tempt = ఆకర్షించటం.

The offer of a shirt free with every shirt you buy is tempting (ఒక shirt కొంటే మరోటి ఉచితం అనేది చాలా ఆకర్షణీయంగా ఉంది.)

**Suhrid:** I do suppose so. Have you finished the report?
(అలా అనే అనుకుంటున్నా. నువ్వు report పూర్తి చేశావా? )

**Brihat:** I would have, but I still need some more information. I am sure to, tomorrow.

Short responses లో ముఖ్యమైన విషయం: మనం response ఇచ్చే sentence లోని main verb (పై sentences లో main verb, like) ను repeat చేయక పోవటం. ఇది చాలా ముఖ్యంగా గమనించాల్సిన విషయం- సహజమైన English conversation కు ప్రాణం.

ఈ lesson లో మనం ఇతర రకాల short responses తెలుసుకుందాం.

ఈ lesson లోని conversation ను కూడా మీరు ఎన్ని సార్లు వీలయితే అన్నిసార్లు బిగ్గరగానైనా చదవండి; లేకుంటే మీతో సహకరించే వాళ్లుంటే వాళ్లతో ఈ conversation practice చేయండి- మీలో ఒకరు Suhrid, మరొకరు Brihat గా.

ఈ lesson లోని responses ముఖ్య లక్షణం: ఇక్కడ కూడా మనం response ఇచ్చే questions/ statements లోని main verb ను repeat చేయకుండా, clipped infinitive ను వాడతాం. (infinitive అంటే తెలుసు కదా- to go, to sing, to dance- to + 1st Regular Doing Word). ఈ short responses లో infinitive లో to మాత్రమే వాడి, 1st Regular Doing Words ను వదిలేస్తాం. వీటికి examples గా-

***Look at the following sentences from the dialogues above:***

1) S: Should I ask for ...?
B: Of course, everyone <u>has to</u> (ask)

2) S: <u>Do</u> you want to ask him?
B: I want to (ask)

3) You know I don't' own a car yet, but I am sure <u>to</u> (own), soon

4) B: (Are) you going <u>to</u> take a loan?
S: No; I don't intend <u>to</u> (buy it)

5) But I don't think you need <u>to</u> (borrow)

6) I have <u>to</u> (borrow)

Observe the responses above.

ప్రతి response లో కూడా, to తో ఆగిపోతున్నాం, infinitive ను పూర్తి చేయకుండా- అంటే, to తర్వాత రావాల్సిన I Regular Doing Word ను repeat చేయకుండా.

పైన ఇచ్చిన ప్రతి sentence లో brackets లో మనం repeat చేయని I RDW ఉంది చూడండి.

| Sentence | Response<br>*(I RDW not repeated. Only 'to' in the response)* |
|---|---|
| 1) Should I <u>ask</u> for... | Everyone has <u>to</u>. |
| 2) Do you want <u>to ask</u> him? | I want <u>to</u>. |
| 3) You know I don't own a car yet, ... | but I am sure <u>to</u>. |
| 4) Are you going <u>to take</u> a loan? | No; I don't intend <u>to</u>. |
| 5) ... borrow | But I don't think you need <u>to</u>. |

పై responses (కుడివైపు) అన్నింటిలోనూ sentence 'to' తో ఆగిపోవటం గమనించారు కదా. ఇదీ మనం practice చేయాల్సిన అంశం.

**Lata:** Don't you want to sing?
(నువ్వు పాడాలనుకోవటం లేదా? )

ఇక్కడ to sing అనే infinitive లో, to మాత్రమే repeat చేస్తాం, response లో. sing, repeat చేయం)

**Sasi:** a) I want <u>to</u>, but I have a cold.
(I want to sing అని పూర్తి infinitive అనం)

b) I don't want to.
(ఇక్కడా sing, repeat చేయం)

ఇంకా ఇతర రకాల short responses కూడా ఉన్నాయి: Subject (I/ we/ you, etc) + think so/ don't think so/ suppose so/ hope not లాంటివి.

**- M. SURESAN**

---



**ప్రశ్న:** 1) Varma అని కాకుండా Verma అని ఎందుకు రాస్తారు?

2) In time, on time పదాలకు తేడా ఏమిటి?

3) గంగానదిని ఇంగ్లిష్‌లో ganges బదులు River Ganga అనొచ్చుకదా!

4) Out, late ఈ రెండు పదాలకు $v_1, v_2, v_3, v_4$ తెలపండి.

**– జి.విశాల్, గోదూర్, కరీంనగర్‌జిల్లా**

**జవాబు:** 1) Verma, Varma- ఇలాంటి పేర్లకు standard spelling ఏదీ ఉండదు- ముఖ్యంగా ఇవి non-English names. ఏ ఒక్క spelling మాత్రమే correct, మిగతావి తప్పని చెప్పలేం. ఎలా అయినా, ఆ పేరుగల వ్యక్తి ఇష్టానిష్టాల మేరకు spell చేసుకోవచ్చు.

2) In time అంటే గడువు దాటకుండా అని, అంటే సరిగ్గా గడువుకు మాత్రమే, కాస్త గడువు ముందరే అని.

He reached the station in time to catch the train=

Train అందుకోవడానికి సరైన time కు కాస్త ముందే అతను station చేరాడు.

On time అంటే అనుకున్న సమయానికి సరిగ్గా.

The meeting began on time. =

Correct గా time కు ప్రారంభమయింది.

Be in time for the function so that we can begin it on time =

function time కు సరిగ్గా ప్రారంభించడానికి, నువ్వు కాస్త సమయానికి (అంటే కాస్తముందు) అక్కడ ఉండు.

3) English వాళ్లు గంగానదిని పిలిచిన తీరు Ganges. Greek లో నుంచి వచ్చిన పేరది. కాని ఇప్పుడు Ganges బదులు Ganga అనటమే సబబు. The Ganga rises in the Himalayas. ఇప్పుడు English లో కూడా Ganga అనటమే Correct.

4) Out, late- ఇవి verbs కావు- సందర్భాన్నిబట్టి out, preposition/ adverb అవుతుంది, late- adjective/ adverb అవుతుంది కాబట్టి వీటికి $V_1, V_2, V_3$ లాంటివి ఉండవు. (out చాలా అరుదుగా, ఇక్కడ వివరించడం అసందర్భమైన పరిస్థితిలో verb అవుతుంది- అప్పుడు out-outed-outed అనొచ్చు)

**ప్రశ్న:** *What kind of friend are you?*

*What kind of friend you are?* భేదం ఏమిటి?

2) *It being a rainy day, we took rest* అనే వాక్యం *tense form* వివరించండి.

ఇది *passive voice* లో ఉందా?

3) *Do it now* వాక్యానికి *passive voice form* వివరించగలరు.

**– ఎ.పెంచలయ్య, రాజంపేట**

**జవాబు:** Question గా what kind of friend are you? అనేది correct. (నువ్వు ఎలాంటి స్నేహితు డివి? అనే భావంతో). Exclamation గా what kind of friend you are? అనటం correct, (ఆహా, ఏం స్నేహితుడివయ్యా నువ్వు! అనే భావంతో). అయితే ఎక్కువగా ఇలాంటి sentence exclamation గా వాడతాం కాబట్టి what kind of friend you are? correct.

2) It being a rainy day- దీని tense, we took rest లో ఉన్న verb, took యొక్క tense- past tense. (ఆరోజు వర్షపురోజు కావటంవల్ల = It being a rainy day.) దీని tense, దీని తర్వాత వచ్చే clause లోని verb tense (ఇక్కడ took) ను బట్టి ఉంటుంది.

3) Let it be done now.

**ప్రశ్న:** చూలింత, బాలింత, స్నేహితురాలు, ప్రేమికురాలు. వీరిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

2) రేడియో వినడాన్ని ఏమనాలి?

3) Rupees కి RS అని, Number రాయడానికి NO. అని పెడతారు. ఎందుకని?

**– కె.రవికిశోర్‌కుమార్, చింతలపూడి**

**జవాబు:**

Pregnant woman అంటే చూలింత. బాలింత అనేందుకు English లో సరిపోయే పదం లేదు. బాలింతగా ఉన్న సమయాన్ని (period) ను Lactation, Period of Lactation అనొచ్చు. బాలింతను Lactating woman అనొచ్చు. ఇది వ్యావహారిక English లో బాలింతకు అతి దగ్గరిమాట. Woman in her post natal period అనేది బాలింతకు సరైన మాట. అయితే ఇది doctors వాడే వైద్య పరిభాషలోని పదం. Spoken English లో అరుదు.

ప్రేమికురాలు/ ప్రియురాలు/ ప్రేయసిని ఇంగ్లిష్‌లో Love/ beloved అంటారు.

friend = స్నేహితుడు/ స్నేహితురాలు

2) Listen to a radio

3) అలా వాడుకగా వచ్చేసింది.

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 314




# Let's hope so

**Niyath:** Our friends have all promised to come. And if they are on time, we can have the best of evenings.

(మన స్నేహితులందరూ వస్తామని మాటిచ్చారు. వాళ్లు సమయానికి వస్తే సాయంత్రాన్ని బాగా ఆనందంగా గడిపేయొచ్చు.)

**Mahith:** I am sure of it.

(నాకా నమ్మకం ఉంది.)

**Niyath:** Is Himakar joining us? He'll be great fun.

(హిమకర్ వస్తున్నాడా? వాడుగనక వస్తే చాలా సరదాగా ఉంటుంది.

fun=సరదా. (తమాషా- మామూలు అర్థం).

**Mahith:** Let's hope so. The sky is a bit cloudy and threatens to rain.

(వస్తాడనే ఆశిద్దాం. ఆకాశం కాస్త మబ్బుగా ఉంది, వర్షం వచ్చే సూచనలున్నాయి.)

threaten= మామూలు అర్థం బెదిరించటం.

threatens to rain= వర్షం వచ్చే సూచనలు బాగా ఉండటం

**Niyath:** I don't think so. These are just passing clouds.

(నేనలా అనుకోవటంలేదు. ఇవి కేవలం విడిపోయే మబ్బులే.)

passing clouds= విడిపోయే మబ్బులు

**Mahith:** Will all the invitees turn up?

(ఆహ్వానితులందరూ వస్తారా?)

turn up= హాజరవటం

**Niyath:** I'd rather they all would.

(వాళ్లందరూ వస్తే బాగుంటుందనుకుంటున్నా).

**Mahith:** Your invitation has been rather at a short notice. It was a surprize even to my sister. Because of it not all might turn up.

(నీ పిలుపు కాస్త తక్కువ వ్యవధిలోనే వెళ్లింది. మా sister కే ఆశ్చర్యం వేసింది. అందువల్ల అందరూ రాకపోవచ్చు.)

**Niyath:** I'm afraid so. Some of them didn't received the invitations I had sent by courier. Only when I called them did they come to know of it.

(అది నిజమేనేమో. నేను courier ద్వారా పంపిన పిలుపులు కొంతమందికందలేదు. వాళ్లకు phone చేసినప్పుడే నాకా విషయం తెలిసింది.)

**Mahith:** Will the hotel people be able to make everything ready by the time the guests arrive?

(మన అతిథులందరూ వచ్చేటప్పటికి హోటల్ వాళ్లన్నీ సిద్ధం చేస్తారా?)

**Niyath:** I presume so.

(చేస్తారనే అనుకుంటున్నా)

**Mahith:** It seems this hotel is known for making things ready and well at a very short notice.

(తక్కువ వ్యవధిలో ఏదైనా బాగా చేయటం విషయంలో ఈ hotel (హోటెల్ - 'టె' నొక్కి పలుకుతాం) కు మంచి పేరుంది.)

**Niyath:** So it seems.

(అలానే అనిపిస్తుంది/ కనిపిస్తుంది)

**Mahith:** Will any of them make speeches?

(ఎవరన్నా ఉపన్యాసాలు చేస్తారా? / ప్రసంగిస్తారా?)

**Niyath:** I suppose so

(అనుకుంటున్నా)

**Mahith:** If not others, Ashok is certain to.

(ఇంకెవరూ కాకపోయినా, అశోక్ మాట్లాడటం మాత్రం ఖాయం)

**Niyath:** I believe so. Hope every thing will go well.

(నేనలా అనుకుంటున్నా/ నమ్ముతున్నా. అంతా సవ్యంగా జరిగిపోతుందని ఆశిస్తున్నా)

**Mahith:** Let's hope for the best.

(మంచే ఆశిద్దాం)

☺ ☺ ☺ ☺ ☺

English conversation ను natural గా free flowing (సరళంగా సాగిపోయే విధంగా) ఉండేందుకు చాలా ముఖ్యమైన short responses (ముక్తసరి సమాధానాలు) practice చేస్తున్నాం. ఇంతవరకు మనం రెండు రకాల short responses చూశాం. అవి:

**i)** Subject (I, we, you, they, etc) + helping verbs (Do/ does/ did/ can/could/ will/ would, etc) + n't (not - only when necessary)

**ii)** Subject + verb + to (clipped infinitive)

Eg: Sekhar: Do you want to go now?

Suhas: I want to (clipped infinitive of to go), but I doubt if my mom wants me to (go)

ఇలాంటి responses - అంటే పైన తెలిపిన రెండు రకాల short responses లో కూడా, మనం responses ఇచ్చే sentences లోని verbs నే వాడటం మీరు గమనించే ఉంటారు- Helping verbs తో వచ్చే responses లోగానీ, clipped infinitives తో వచ్చే responses లోగాని.

ఇప్పుడు మనం చూడబోయేది **మూడో రకం short responses.** వీటిల్లో ముఖ్యమైన విషయం- ఈ మూడో రకం responses లో మనం వాడే verb కూ, మనం response ఇచ్చే sentence లోని verbs కు సంబంధం దాదాపు ఉండదు.

Eg: **Sarat:** Do they like this arrangement?

(ఈ ఏర్పాటు వాళ్లకిష్టమేనా?)

**Varun:** I think so. (నేనలానే అనుకుంటున్నా)/

I don't think so. (అలా అని నేననుకోవటంలేదు)

గమనించారు కదా: ముందు sentence లోని verb కూ, response కూ ఏం సంబంధం లేదు. ఇలాంటి responses కూడా conversation ను సజీవం చేస్తాయి. అంతేకాకుండా మనం English బాగా మాట్లాడగల మనే impression కలిగిస్తుంది. ఇదివరకటి రెండు lessons లోని conversations లానే, ఇక్కడి conversation ను కూడా మీరు, మీకు సహకరించేవారితో ఐదారుసార్లు practice చేయండి. లేకుంటే మీరొక్కరే అయితే, దీన్ని ఐదారుసార్లు బిగ్గరగా చదవండి.

***Look at the following responses from the conversation above:***

*1) I am/ I'm sure of it*

*2) Let's (Let us) hope so*

*3) I don't think so*

*4) I'd (I would) rather they all would*

*5) I'm afraid so*

*6) I presume so*

*7) So it seems/ It seems so*

*8) I suppose so*

*9) I believe so*

*10) Let's hope for the best*

All these responses show the speaker's opinion/ attitude.

వీటిని groups కింద విడదీయొచ్చు.

**I. A)** I think so/ I suppose so/ I believe so/ I presume so, etc. (నేనలా అనుకుంటున్నా- అనే అర్థంతో).

**B)** నేనలా అనుకోవటంలేదు- అనే అర్థంతో అయితే, I don't (think so/ suppose so/ believe so/ presume so)

మనతో మాట్లాడుతున్నవాళ్లతో మనం అంగీకరిస్తే, మన response, set (A). అంగీకరించకపోతే response, set (B).

**Bharat:** (Do) you think congress will return to power next time too?

(Congress తిరిగి అధికారంలోకి వస్తుందని నీవు అనుకుంటున్నావా?)

**Arjun:** I think so (అవును)/

I don't think so (కాదు)

**II.** It seems so/ it appears so/ that appears to be the case

(అలానే కనిపిస్తోంది/ అనిపిస్తోంది/ విషయం అదేలా కనిపిస్తోంది/ అనిపిస్తోంది)

దీనికి opposite తెలుసుకదా:

It doesn't - seem so/ appear so

(అలా కనిపించటం లేదు/ అనిపించటంలేదు)

Eg: **Hemanth:** Are they well prepared for the test?

(పరీక్షకు వాళ్లు బాగా తయారయ్యారా?)

**Sumanth:** a) It appears/ It seems so.

(అలానే అనిపిస్తోంది)

b) It doesn't appear so/ it doesn't seem so

(అలా అనిపించటం లేదు)

ఇదే అర్థంతో It looks like that/ It doesn't look like that అని కూడా అనొచ్చు. ఒక్కోసారి, It, omit చేయొచ్చు.

(Think so, believe so, suppose so, presume so తోపాటు, feel so కూడా వాడొచ్చు)

ఇది కూడా చూడండి.

**a) Naresh:** (Do) you think he is all right now?

(వాడిప్పుడు కులాసానేనా?)

**Jagdish:** I found him so

(అలానే కనిపించాడు)

**b) Ramesh:** Do you think the situation is bad?

(పరిస్థితి సరిగా లేదనుకుంటున్నావా?)

**Suresh:** I find it so.

(నాకలానే కనిపిస్తోంది/ అనిపిస్తోంది)

కొత్తగా మనం ఈ మూడోరకం responses లో రెండు groups చూశాం. ఇప్పుడు III Group చూద్దాం.

**III. Group**

**a) Pranav:** (Is) anything wrong with the machine?

(Machine లో ఏదైనా లోపం ఉందా?)

**Prabhat:** I am afraid, so.

(అలాగే ఉంది)

ఇక్కడ afraid కు అర్థం భయపడుతున్న- అనికాదు, sorry అని. ఏదైనా చెడు విషయం చెప్పాల్సివస్తే I'm afraid so అంటాం.

**b) Ajitha:** Is his condition quite serious?

(అతని పరిస్థితి విషమంగానే ఉందా?)

**Anitha:** I'm afraid so.

(అవును, చింతిస్తున్నా)

**c) Karuna:** How is Aruna's condition?

(Aruna పరిస్థితి ఎలా ఉంది?)

**Sahasa:** I'm afraid, not at all good.

(అసలేం బాగాలేదు)

బాధగా అనటం afraid

**d) Bhakar:** Is your father at home?

**Bhavan:** I'm afraid, no.

(లేదని బాధతో చెప్పటం - afraid)

అలాగే ఈ group లో ఇంకో short response, wonder తో వస్తుంది. Wonder మామూలు అర్థం - ఆశ్చర్యం, అద్భుతం. Short responses లో I wonder అంటే నాకు సందేహమే అని.

**a) Vaibhava:** Is Prasanna joining us for the picnic?

(ప్రసన్న మనతో picnic కు వస్తోందా?)

**Sampada:** I wonder.

(నాకు సందేహమే- దాదాపు రాదు/ రాకపోవచ్చని)

**b) Ullas:** Is Santosh willing to buy the car?

(సంతోష్ ఆ car కొనటానికి సుముఖంగానే ఉన్నాడా?)

**Vikas:** I wonder (సందేహమే)

ఇవీ conversation కు సహజత్వం, సరళత్వం కల్పించే short responses. మనకు conversational English వచ్చా రాదా అనేది మనం ఈ short responses ను వాడగలిగేదాన్నిబట్టి చెప్పేయొచ్చు. మన conversation bookish (పుస్తకాలనుంచి) కాదు అనిపించటానికి ఈ short responses బాగా ఉపయోగపడతాయి. Practice చేద్దాం.

***- M. SURESAN***



**Q:** *1. a) Never have I seen such an interesting match*

*b) Never I have seen such an interesting match*

*2. a) I don't know, where he went*

*b) I don't know, where did he go*

*వీటి మధ్య తేడా ఏమిటి?*

*3. a) The cliff is being climbed by the boy*

*b) Will those happy days be ever forgotten?*

*c) His words, must be listened to*

*d) Is my meaning understood?*

*(Is వచ్చినప్పుడు understand రావాలి కదా, understood ఎందుకు వచ్చింది?)*

*e) The crackling of geese saved Rome. తెలుగు అర్థం ఏమిటి?*

*4. నా మాట తను విని ఉంటే కచ్చితంగా విజయం సాధించేవాడేమో. తనకు తగినశాస్తి జరిగిందిలే (వినలేదు కాబట్టి). ఇంగ్లిష్‌లో ఎలా అనాలి?*

*5. I know her (A.V)*

*She is known to me (P.V.)*

*known వచ్చింది కాబట్టి to me వచ్చింది. known లాంటి words ఇంగ్లిష్‌లో ఎన్ని ఉన్నాయి? వివరించండి.*

***- J.Ramesh, J. Anil, Vadlamuru***

**A: 1.** 'Never have I seen such an interesting match' is correct. When we begin a sentence with an adverb like 'never' here, the verb/ auxiliary verb comes before the subject. You say either, I have never seen such an interesting match OR Never have I seen such an interesting match.

**2.** I don't know where he went. The clause 'Where he went' is a part of a statement and not a question. So the question form 'where did he go' is wrong. No comma between know and where.

**3.** All the sentences here are in the passive voice. Passive voice లో verb, 'be form + past participle' గా ఉంటుంది.

a) is being climbed (is being - be form + climbed - past participle). అలాగే d) లో కూడా verb, passive కనుక is అనే 'be' form పక్కన 'understood' అని past participle మాత్రమే వస్తుంది. 'understand' అని present form రాదు.

**4.** If he had listened to me, he would have succeeded. He has had it (తిక్క కుదిరింది)

**5.** Passive voice లో verb తర్వాత by బదులు ఇతర prepositions (known తర్వాత to లాగ) concern, comprise లాంటి ఏ కొన్ని verbs తర్వాత మాత్రమే వస్తాయి. ఇది usage. కొన్నికొన్నిసార్లు usage, grammar rules కు వ్యతిరేకంగా ఉండొచ్చు.

SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 315




**Kowsal:** Hi who do I see here? Oh, Sreyas. Long time, no see, pal. How are things?

(ఎవరూ, శ్రేయస్ కదా? చాలా కాలమైంది మనం కలుసుకొని/ నిన్ను చూసి, మిత్రమా. ఎలా ఉన్నావు? ఏంటి సంగతులు? )

**Sreyas:** Delighted to see you, Kowsal. Every thing OK with me. How are you?

(నిన్ను కలుసుకున్నందుకు చాలా సంతోషంగా ఉంది. నేను బాగానే ఉన్నాను. నువ్వెలా ఉన్నావు? )

**Kowsal:** Fine. When did you come?

(కులాసానే. ఎప్పుడొచ్చావు? )

**Sreyas:** Just yesterday. I thought I should meet you the first thing this morning and you see me here.

(నిన్ననే వచ్చాను. ఇవాళ పొద్దున మొట్ట మొదట నిన్ను కలుసుకోవాలనుకున్నాను. ఇక్కడ నీకు కనిపిస్తున్నాను.)

First thing use చూడండిక్కడ. You should finish the report the first thing tomorrow = రేపు నువ్వు మొట్టమొదట చేయాల్సింది, ఆ report పూర్తి చేయటం. దీన్నే మామూలుగా అయితే The first thing you should do tomorrow is ... అంటాం. అలా అనటం కంటే you should do it the first thing tomorrow అనటం more effective గా ఉంటుంది.

**Kowsal:** What else, then? (ఇంకేంటి? )

**Sreyas:** What about Sampreet? Long since I met or even heard of him. (Do you) know where he is and how he is?

(సంప్రీత్ సంగతేంటి? వాడిని కలుసుకుని గానీ, వాడి గురించి వినిగానీ చాలా కాలమైంది. వాడెక్కడ, ఎలా ఉన్నాడో నీకేమన్నా తెలుసా? )

**Kowsal:** I wish I did. No idea at all.

(అది తెలిస్తే ఎంత బాగుండేదో, అసలేం తెలియదు)

**Sreyas:** He isn't the communicative sort, is he?

(ఇతరులతో అంత సంబంధాలు పెట్టుకొనే వాడు కాదుకదా వాడు? )

**Kowsal:** He certainly isn't. We were the only two he moved closely with when he was here.

(అతనంతే. అతనిక్కడున్నప్పుడు సన్నిహితంగా ఉన్నది మనిద్దరితోనే)

**Sreyas:** Wish he were here now. We could have a splendid time.

(వాడిక్కడుంటే ఇప్పుడెంత బాగుండేది. మనం చాలా సరదాగా/ సంతోషంగా గడిపేవాళ్లం)

splendid = ఏదైనా మంచి విషయం/ గొప్పదైన

**Kowsal:** I know a cousin of his. He works in the electricity department here. Shall I find out from him?

(వాడి cousin ఒకతను నాకు తెలుసు. అతనిక్కడ electricity dept. లో పనిచేస్తాడు. అతన్ని కనుక్కోనా సంప్రీత్ గురించి? )

**Sreyas:** You'd (you had) better and quickly too. He is a nice guy though uncommunicative.

(నువ్వు త్వరగా కనుక్కోవటం మంచిది. Sampreet ఇతరులతో అంత సంబంధాలు పెట్టుకోనివాడయినా, మంచివాడే.)

**Kowsal:** How long are you going to be here?

(ఇంకా ఎంతకాలం/ ఎన్ని రోజులు ఉండబోతున్నావిక్కడ? )

**Sreyas:** For another week. (ఇంకో వారం)

**Kowsal:** Why not longer? I'd (I would) rather you did.

(ఇంకొన్ని రోజులుండకూడదా? )

**Sreyas:** So would I too, but I've got to get back in a week.

(నాకూ ఉండాలనే ఉంది, కాని వారానికి తిరిగి వెళ్లాల్సి ఉంది)

**Kowsal:** That's disappointing.

నిరాశకరంగా ఉంది (వారానికే వెళ్లిపోవటం)

**Sreyas:** Equally so far me. But the call of duty doesn't let me stay longer, pal.

(నాకూ నిరాశాకరంగానే ఉంది. కాని అంత కంటే ఎక్కువ ఇక్కడ ఉండటానికి నా విద్యుక్త ధర్మం ఒప్పుకోదు)

**Kowsal:** I'd you were not so pompous.

(నువ్వంత గొప్ప గొప్ప మాటలు వాడొద్దని నా కోరిక)

pompous = చిన్న చిన్న విషయాలను పెద్ద పెద్ద మాటలతో చెప్పి గొప్పతనాన్ని ప్రాముఖ్యాన్ని తెలపాలనుకోవడం, ఇక్కడ Sreyas, call of duty= నా విద్యుక్త ధర్మం పిలుపు. ఇది example of pompous - పాంపస్

**Sreyas:** I used it for fun, but the fact is I've to get back.

(ఏదో తమాషాకు అన్నాలే. కాని తిరిగి వెళ్లిపోవాలి)

మనం ఈ lesson లో కొంచెం advanced type of short responses ను తెలుసుకోబోతున్నాం. ఇవి కాస్త higher level. అందుకని బాగా practice చేద్దాం.

**Look at the following**

**1) Delighted to see you -**

ఇది మనలో చాలామందికి తెలుసు- మన సన్నిహితులను కలుసుకున్నప్పుడు వాడే మాట- delight= సంతోషం, ఇదే భావంతో మరికొన్ని మాటలు- Glad to see you, good to see you, pleasure meeting you again after such a long time, exciting to see you again, etc

**2) I wish I did =**

నేనా పనిచేసుంటే ఎంత బాగుండేదో! ఈ సందర్భంలో, నాకు అతని గురించి తెలిసుంటే ఎంత బాగుండేది అని. ఇక్కడ చూడండి- know అనే verb repeat చేయకుండా, did వాడుతున్నాం - knew బదులు.

# I'd rather you did

**Anand:** Your father is a diabetic. Does he go for a walk every morning?

(మీ నాన్నకు sugar ఉంది. ప్రతిరోజూ నడుస్తారా? )

**Amar:** I wish he did. He doesn't take care of his health.

(ఆయనలాచేస్తే (walk కు వెళితే) ఎంత బాగుంటుంది! అంటే ఆయన ఇప్పుడు వెళ్లడం లేదు, అని గమనించండి. ఇప్పుడు జరగని విషయం కాబట్టి He did (went బదులు- went= did go) కదా? )

ఇలాంటి responses బాగా practice చేద్దాం

**Bhavya:** Do you go to temple everyday?

(ప్రతిరోజూ గుడికెళ్తావా? )

**Sravya:** How I wish/ I wish I did, but I'm too busy.

(వెళితే ఎంత బాగుండునో, కానీ తీరికలేదు. ఇక్కడ did = did go = went)

**3) He certainly isn't-**

ఇది మనం ఇంతకుముందటి lessons లో వాడిన response కదా. అయితే ఇక్కడ effect కోసం certainly వాడుతున్నాం- కచ్చితంగా అనే అర్థంతో.

**Navya:** Is Kusuma punctual?

(Kusuma punctual గా ఉంటుందా? )

**Kavya:** She rarely is.

(ఆమె punctual గా ఉండటం అరుదు)

ఇలా సందర్భాన్నిబట్టి responses లో certainly, rarely, rather వాడటం practice చేయండి.

**4) Wish he were here now.**

(అతనిక్కడుంటే ఎంత బాగుంటుంది! ఇది response No.1 లాంటిదే కదా!)

**5) You'd (you had) better.**

(నువ్వది చేయటం మంచిది.)

You better pay/ you better to pay - ఇవి తప్పు

**Kundan:** Shall I see a doctor then?

(నేను doctor దగ్గరకెళ్లనా? )

**Chandan:** You had better. (అది మంచిది)

గమనించండి, You had better అని ఆపేస్తాం- పూర్తిగా you had better see a doctor అనం. ఒక్కోసారి you had better అని కూడా అనకుండా, better అనేస్తాం.

**Vismaya:** Shall I buy the book?

**Nischala:** Better (you had better)

**6) I'd (I would) rather you did.**

(నువ్వది చేస్తావని/ చేయాలని నాకోరిక. (నువ్వది చేయటం నాకిష్టం) ఇక్కడ rather = prefer/ like)

**Prem:** Shall I give you the money now?

(డబ్బు నీకిప్పుడివ్వనా? )

**Syam:** I'd (I would) rather you did.

(నువ్విప్పుడివ్వటం నాకిష్టం/ ఇస్తే బాగుంటుంది. ఇక్కడ give వాడని విషయం గమనించండి)

**7) I'd (I would) you were not so pompous.**

అంత pompous గా ఉండకపోవటం నాకిష్టం.

ఇక్కడ I'd = I would = I wish (ఇంతకుముందు lessons లో వివరించాం- would కు wish/ wishes (కోరుకోవటం) అనే అర్థం కూడా ఉందని.

I told him not to buy the car, but he would buy (wishes to buy it.)

I'd (I would) he did it = అతనది చేయాలని నా కోరిక. (అయితే అతను చేయకపోవచ్చు)

ఇలాంటి responses చాలా జాగ్రత్తగా practice చేయండి. గమనించాల్సిన విషయం - ఇలాంటి చోట్లంతా, were, did అని past forms రావటం. ఇది ముఖ్యంగా జరగకపోవటానికి ఎక్కువ అవకాశాలున్నప్పుడే వాడతాం.

**- M. SURESAN**

---

***Question:***

*1. Everything relating to it should is halted. It is a line from an English newspaper. Usually should is followed by be. But here it is 'is'. Is it the usage correct?*



*2. He is charged with attempt. Should not 'an' be prefixed to attempt?*

*3. Why present tense is used widely even though the action is a past event. Eg: The BIE as ordered all colleges not to publish ranks.*

*4. Sd/- is seen before signature in official letters. What does it mean?*

*5. $V_3$ of any verb should be preceded either by have / has / had or be forms of verb. But following sentence violates the above rule. 'Read the passage given below'. In this sentence given ($V_3$ of give) is used alone without have / has /had or be forms of verb.*

*6. There was a great uproar in the parliament over the bill, but still the bill was passed. Here. great - adjective; over - preposition ; Still -? ; passed - verb. But still should not be used in one sentence as conjunction. But here both are conjunction and are in one sentence.*

*7. In letter writing, punctuation marks are not indicated after station, date, subscription, address. This method is seen in Wren & Martyn revised edition of course in old edition too, which is a famous, standard grammar book. Is this method admissible?*

***K. Sainath, Tenali***

**Answer:**

**1.** Everything related to it should halted is wrong. Should be halted is correct. It might be a printing error.

**2.** Yes. It should either be, 'an attempt' or 'the attempt', depending on the context.

**3.** 'Has ordered' is present perfect tense. The present perfect tense refers to 1) a past action, time not stated, 2) an action starting some time in the past and going on till now and 3) an action just completed, if we use words like, just, just now, etc. The BIE has ordered- this is right- it indicates a past action, time not stated. (The ordering is over- a past action. When?- the time is not stated- use no)

**4.** Sd/- means signed. That is, it is signed by the person whose name follows, Sd/-

**5.** By $V_3$ you mean the past participle, don't you? It can be used independently, as in the sentence = Read the passage given below. The use of given here is correct, and therefore the sentence is correct too. The past participle, without have / has, or the be form before it, acts like an adjective (and no like a verb) and qualifies (tells some thing about) the word before it. eg.

a) The man, seen in the park yesterday, is a writer (The man seen = The man who was seen)

b) The book, written 200 years ago, is still popular. (The book which was written) such use of past participle is right.

You are confused because, you call the past participle, $V_3$ (verb3). $V_3$ is a wrong name for the past participle, because the past participle is not a verb. Have / has / had etc + past participle or be form+past participle is a verb. When it is used so, it makes a group of words a sentence, or a clause, depending on whether the group of words has complete meaning or not.

a) The house was built 10 years ago (sentence)

b) The house which was built 10 years ago (clause)

c) He has gone out (sentence)

d) If he has gone out (clause)

**6.** Still - adverb. Passed is not a verb here, it's only a past participle. was passed (be form+past participle) is the verb here. Still is not a conjunction here. Still here is an adverb. It means, in spite of (what has been said before it). So there is nothing wrong in using but and still together, though it is not necessary. Either but or still can be used.

**7.** The practice now is to avoid punctuation marks after station, date subscription and address. Using a comma after each line in the address, a full stop after the last time, commas after subscription, etc- this is totally out dated and no longer is in practice.




SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 316

**Pramod:** What was he complaining about?
(అతను ఇందాక దేనిగురించి complain చేస్తున్నాడు? )

**Ankith:** He wasn't satisfied with the arrangements here, he said.
(ఇక్కడి ఏర్పాట్లతో సంతృప్తి చెందలేదని చెప్పాడతను)

**Pramod:** We provided him with all that he had wanted. What more did he expect from us?
(అతనిక్కావలసిందంతా అమర్చాం కదా? ఇంకేం ఆశించాడు మన నుంచి? )

**Ankith:** He is usually aware of others problems and doesn't usually complain. I don't know why he found fault with us so much.
(ఇతరుల సమస్యలను అర్థం చేసుకుంటాడు అతను, మామూలుగా అంత complain చేయడు. ఇవాళ మనల్ని ఎందుకంత తప్పు బట్టాడో అర్థం కావటంలేదు)

**Pramod:** Did he pay for the extra chairs that he ordered?
(అతను order చేసిన అదనపు కుర్చీలకు డబ్బు చెల్లించాడా? )

**Ankith:** He said he would settle it with you tomorrow. He enquired about you and told me that he would see you tomorrow.
(అది నీతోనే పరిష్కారం చేసుకుంటానని చెప్పాడు. నిన్నడిగాడు, నిన్ను రేపు కలుసు కుంటానని చెప్పాడు.)

**Pramod:** Remind me of it tomorrow first thing in the morning. I'll call him and ask him why argued so long with you about the arrangements.
(రేపు మొట్టమొదట నువ్వు నాకది గుర్తుచెయ్. నేనతనికి phone చేసి నీతో అంతసేపు ఎందుకు వాదించాడో అడుగుతాను.)

**Ankith:** We omitted nothing from the list he had given us. We even added a few things to the list without his asking.
(అతనిచ్చిన జాబితా నుంచి మనం ఏదీ వదలలేదు. ఇంకా మరికొన్ని అతనడక్కుండానే చేర్చాం)

**Pramod:** Instead of thanking us for that he was making all sorts of comments on the arrangements.
(దానికి మనకు thanks చెప్పే బదులు ఏర్పాట్ల మీద అన్ని రకాల comments చేస్తున్నాడు.)

**Ankith:** Tomorrow when you call him you tell him of all this.
(రేపు నువ్వు phone చేసినపుడు ఇదంతా చెప్పు)

ఈ lesson లో the use of certain prepositions తెలుసుకుందాం. ఎప్పుడు ఏ preposition వాడాలి అనేందుకు rules ఏమీ ఉండవు. ఇవి అలవాటుమీద నేర్చుకొని గుర్తుంచుకోవాల్సిందే. ఎందుకంటే prepositions అన్నీ వాడుక (usage) మీద వచ్చేవే. (తెలుగులో, మనకు ఒకరిమీద కోపం ఉంటుంది. ఇక్కడ మీద అని ఎందుకనాలి అంటే ఎలా వివరించగలం? అలాగే English లో కూడా. English లో angry with a person అంటాం - with ఇక్కడ తెలుగులో 'మీద' బదులు.)

ఏ preposition ఎప్పుడు, ఎలా వాడాలనేది ఇదివరలో ఈ lessons లో మనం చాలామటుకు తెలుసుకున్నాం. (ఏ preposition ఎప్పుడు వాడాలి అనేందుకు rule ఏం లేదు కనుక ఇది పూర్తిగా practice వల్లే వస్తుంది. మనం English మాట్లాడటం, వినడం, చదవడాన్ని బట్టి అంత బాగా వస్తుంది.)

మనం ఇంతకుముందు తెలుసుకున్నది ఒక్కసారి గుర్తు తెచ్చుకుందాం. Preposition - ఓ noun/ pronoun/ verb తో, sentence లోని ఒక మాటకు, ఇంకో మాటకు ఉన్న సంబంధాన్ని తెలిపే about, at, in, into, out, on, లాంటి మాటలను prepositions అంటాం. వీటిల్లో చాలా ముఖ్యమైన వాటినన్నింటిని తెలుసుకున్నాం. ఇప్పుడు కొన్ని పై సంభాషణలో వాడినవి చూద్దాం.

a) I am not satisfied with these marks
b) The boss is not satisfied with Mahesh

**3) Expect from-** ఒకరినుంచి ఆశించటం.
a) We can't expect any help from him
b) I expect a reply from him today

**4) Provide with:** సమకూర్చటం.
The guests have been provided with all comforts =
అతిథులకు అన్ని సౌఖ్యాలు సమకూర్చబడ్డాయి. (passive)

**5) Aware of** = (ఒక విషయం) తెలిసి ఉండటం.
a) We are aware of your greatness =
నీ గొప్పతనం మాకు తెలుసు
b) He isn't aware of what has happened =
ఏం జరిగిందో అతనికి తెలియదు.

**6) Find fault with:** ఇది Phrasal verb. =
తప్పుపట్టడం/ నిందించటం

**11) Omit from**= తొలగించటం.
a) Laxman is always omitted unjustly from the team=
జట్టులోంచి లక్ష్మణ్‌ను ఎప్పుడూ అన్యాయంగా తొలగిస్తారు.
(ఇక్కడ English sentence, passive- లక్ష్మణ్ తొలగించబడతాడు అని అర్థం వస్తుంది, తెలుసుకదా? )

**12) Add to** = చేర్చటం/ ఎక్కువ చేయటం
Subtract from = తీసేయటం
a) Don't add to the trouble that is there already by arousing caste feeling =
కులాభిమానాన్ని రెచ్చగొట్టి, ఇప్పటికే ఉన్న కష్టాలను ఇంకా ఎక్కువ చేయొద్దు.

# Remind me of it

***Study the following sentences from the conversation between Pramod and Ankit***

1) What was he complaining about?
2) He wasn't satisfied with the arrangements
3) What more did he expect from us
4) We provided him with all that ...
5) He is usually aware of others problems
6) I don't know why he found fault with us so much
7) Did he pay for the extra chairs?
8) He would settle it with you
9) Remind me of it
10) Why he argued with you so long?
11) We omitted nothing from the list.
12) We even added a few things to the list
13) Instead of thanking us for that ...
14) He was making all sorts of comments on the arrangements
15) You tell him of all this

**1) Complain about** - దేన్ని గురించైనా అసంతృప్తి వెలిబుచ్చటం (ఫిర్యాదు చేయటం). ఇక్కడ preposition, about. గురించి అనే అర్థంతో about చాలా తరచుగా వాడతాం. hear about, know about, talk/ speak about, think about, say/ tell (something) about, argue about .. ఇలా about చాలాచోట్ల వాడతాం. అయితే ఇంతకుముందు ఈ lesson లో చెప్పినట్టు, describe, discuss, explain, mention, state తో about రాదు.

**2) Satisfy with** తృప్తిచెందటం. ఒక విషయం, ఒక వ్యక్తితో తృప్తిపడటం.

He found fault with the actions of his friend
తన friend చర్యలను అతడు తప్పుపట్టాడు.

**7) Pay for** = చెల్లించటం.
Please pay for the coffee=
Coffee కి డబ్బులు చెల్లించు. ఇది చాలా common, మనందరికీ తెలుసు.

**8) Settle (something) with some one**=
ఎవరితోనైనా దేన్నయినా పరిష్కారం చేసుకోవటం/ ఓ తీర్మానానికి రావటం.
India is trying its best to settle the border issue with pakistan
సరిహద్దు వివాదం విషయం Pak తో పరిష్కారం చేసుకునేందుకు భారత్ శాయశక్తులా ప్రయత్నిస్తోంది.

**9) Remind (someone) of something** = ఒకరికి ఒక విషయం గుర్తుచేయటం
a) He remind me of the money I owed him =
అతనికి నేను అప్పున్న విషయం నాకు గుర్తుచేశాడు.
b) The scene reminded me of a similar incident in my life =
ఆ సన్నివేశం నా జీవితంలో జరిగిన అలాంటి సంఘటనను గుర్తుచేసింది.

**10) Argue with some one about some thing**=
ఒక విషయం గురించి ఒకరితో వాదించటం
a) He doesn't like my arguing with him about his orders =
అతని ఆదేశాల విషయం/ ఆదేశాలను గురించి అతనితో నేను వాదించటం అతనికి ఇష్టం లేదు.
b) Don't argue with elders about any thing=
పెద్దవాళ్లతో ఏ విషయం గురించీ వాదించొద్దు.

b) Don't add any more to it =
ఇంక దానికేమీ చేర్చవద్దు

**13) Thank (somebody) for something** =
ధన్యవాదాలు తెలపటం - ఇది మనందరికీ తెలుసు
a) She thanked him for his help=
అతని సాయానికి ఆమె కృతజ్ఞతలు చెప్పింది
b) Thank you for the trouble you taken to help me=
నాకు సాయపడేందుకు మీరు తీసుకున్న శ్రమకు కృతజ్ఞతలు.

**14) Comment on/ Make comment on** =
వ్యాఖ్యలు చేయటం.
a) It is bad manners to comment on others' appearance =
ఇతరుల రూపాన్ని గురించి వ్యాఖ్యలు చేయటం అనుచితం.
b) He makes silly comments on every one=
ప్రతివాళ్లను గురించీ ఏదో పిచ్చి పిచ్చి వ్యాఖ్యలు చేస్తుంటాడతను

**15) Tell some one of/ about something** =
ఒకరికి ఒక విషయం చెప్పటం
a) I told him of/ about what's happened =
జరిగిందాన్ని గురించి అతనికి చెప్పాను.
b) Don't tell any one of/ about this=
దీని గురించి ఎవరికీ ఏమీ చెప్పకు.

**- M. SURESAN**

**ప్రశ్న:**



*1) Fruit ఏక వచనమా, బహు వచనమా?*

*2) Spoken English కు, communicative English కు తేడా ఏమిటి?*

*3) Could you give me explanation in Telugu famous Alexander pope's words.*

*"Words are like leaves; and where they most abound much fruit of sense beneath is seldom found"*

*– గుర్రం శంకర్, శంకరపట్నం.*

**జవాబు:**

1) Fruit is used both as singular and plural. Usually when we refer to a fruit of a single tree or a single variety the plural of fruit is fruit. Fruits (in the plural form) refers to fruits of different varieties. eg. The fruit of this tree is good. (The reference here is to one fruit of one tree). The fruit of the tree are tasty (The reference is to many fruit of the same tree - same variety)

Fresh fruit(s) and vegetable are good for health - accepted as correct.

2) Conversational English is the English used in conversation - what we usually call spoken English.

Communicative English - I don't know if the expression is correct? I think communication English is better- It refers to spoken and written English as well. That is, the English we use both in conversation and writing in informal as well as formal situations.

3) మాటలు (ప్రసంగాల్లో కానీ, రచనలో కానీ) ఆకుల్లాంటివి. మరీ దట్టమైన ఆకుల మాటున పండ్లరుదుగా కనిపించినట్టు మరీ ఎక్కువైన మాటల్లో భావం చాలా తక్కువగా ఉంటుంది. అంటే భావం తక్కువ అయితేనే మాటలు ఎక్కువగా వాడతాం అని.

**ప్రశ్న:**

*1) They went up the feast. ఈ వాక్యంలో went తర్వాత to అనే preposition రావాలికదా!*

*2 a) The copy (notice) circulated to the staff.*

*b) The copy (notice) communicated to the staff. రెండూ కరెక్టేనా?*

*– డి.సుబ్బారావు, కాజులూరు*

**జవాబు:**

1) Went up (past tense of go up) కు పాతకాలపు (archaic/ Bibliel) English లో చేరారు అనే అర్థం ఉండేది.

They went up the feast = వాళ్లా విందుకు చేరారు.) అయితే ఈ అర్థం ఇప్పుడు went up కు లేనేలేదు.

They attended the feast అంటాం correct. Went to అన్నా కూడా correct.

**2.** The copy (of the notice) circulated to the staff =
సిబ్బందికి తెలియచేయబడిన notice ప్రతి =
The copy (of the notice) communicated to the staff.

రెండు వాక్యాల అర్థం ఒకటే. అయితే circulate = కాగితం (విషయంతో కూడిన) గానీ/ notice లాంటిదిగానీ సంబంధించిన వారికందరికీ చూపించడం.

Communicate = విషయం, కాగితం రూపంలో మాత్రమేకాకుండా, ఇంకే విధంగానైనా తెలియపరచటం.

## SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 317




**Champaka:** Heard of it? Chandana has made it to the IIT. Really great.
(విన్నావా? చందనకు IIT వచ్చింది. నిజంగా గొప్ప విషయమే.)

made it = సాధించింది.

**Mallika:** Right from her school days she had been aiming at it. She has been at it steadily, and now she has made it at a single go.
(School రోజుల్నుంచే తనకు IIT మీద గురి. దాని మీదే ఉంది తనకు. ఇపుడు విజయం పొందింది.)

**Mallika:** But the pity is whenever she opens her mouth to speak English, a few fools among our friends laugh at her.
(దురదృష్టవశాత్తూ, ఎప్పుడామె English మాట్లాడేందుకు నోరు తెరిచినా మన friends లో కొంతమంది fools తనను చూసి నవ్వుతుంటారు)

**Champaka:** Mocking at people like that is certainly bad.
(అలా ఇతరుల్ని ఎగతాళిచేయటం తప్పే.)

**Mallika:** I am really delighted at her achievement. She was hinting at joining some spoken English institute to improve her English.
(తను సాధించింది చూస్తే నాకు నిజంగానే ఆనందంగా ఉంది. ఏదో spoken English institute లో చేరుతున్నట్లు నాతో చూచాయగా చెప్పింది)

కొన్ని important prepositions వాడకం చూస్తున్నాం కదా. ఈ lesson లో మనం at వాడకం తెలుసుకుందాం.

***Look at the following sentences from the dialogue above.***

1) Right from her school days she had been aiming at it.
2) She has made it at a single go
3) ... she were as good at English
4) I am really surprised at it
5) ... a few fools ... laugh at her
6) Mocking at people ... is certainly bad
7) I am really delighted at her achievement
8) I started in disbelief at her rank

పైన తెలిపిన సందర్భాల్లో at మాత్రమే వాడతాం.

# She had been aiming at it

**Champaka:** I wish she were as good at English as she is at the sciences.
(Sciences లో ఎంత గొప్పో English లో కూడా అంత గొప్పగా ఉంటే ఎంత బాగుండేది!)

**Mallika:** I am really surprised at it. How could she neglect English so?
(అదేనాకాశ్చర్యం. English మరీ అంత ఎలా పట్టించుకోకుండా వదిలేయగలిగిందీ?)

**Champaka:** But the good thing is, whenever she gets an opportunity she tries to speak in English.
(అయితే ఓ మంచి విషయం ఏమిటంటే, అవకాశం వచ్చినప్పుడల్లా English లో మాట్లాడేందుకు ప్రయత్నిస్తుంది, అది మంచిదే కదా?)

**Champaka:** I started at her rank in disbelief when she showed her rank card to me. She is really tops. We can't but admire her.
(తన rank card నాకు చూపినప్పుడు, ఆ rank ను చూసి నమ్మలేక అలానే చూస్తుండిపోయాను. నిజంగా గొప్ప అమ్మాయే. మనం మెచ్చుకోకుండా ఉండలేం.)

tops = ఒక విషయంలో గొప్ప

can't but = తప్పదు

**Mallika:** Let's wish her all the best.

**1) Aim at**: గురిచూడటం
a) She aimed the pistol at the villain (ఆమె pistol ను villain మీదికి గురిపెట్టింది)
b) He aims at Chief Ministership (అతని లక్ష్యం ముఖ్యమంత్రి పదవి)

**2) At a single go** = ఒక్క/ మొదటి ప్రయత్నంలోనే.
a) He achieved the seemingly impossible at a single go = అసాధ్యంగా కనిపించిన విషయాన్ని ఒక పట్టులో (ప్రయత్నంలో) సాధించాడు.
b) The hero bashed the villain and all his men at a single go = హీరో ఆ villain ను, అతని మనుషులను ఒక్క దెబ్బతో చితక్కొట్టాడు.

**3) Good at English** = English బాగా తెలిసి ఉండటం.

**Poor at** = ఒక విషయం తెలియకపోవటం/ చాతకాకపోవటం.
a) He poor at Maths = వాడికి లెక్కలు రావు.
b) She is weak at languages = భాషలు (భాషలు నేర్చుకోవటం) ఆమెకు రావు/ రాదు.

**4) be surprised at/ be amazed at/ wonder at/ be astonished at** - ఇవన్నీ ఆశ్చర్యానికి సంబంధించిన మాటలు- వీటి తర్వాత ఎప్పుడూ at వస్తుంది.

**5) Laugh at** = ఒకరిని చూసి, ఒక విషయం గురించి నవ్వటం. అలాగే smile at = చిరునవ్వు నవ్వటం - ఒకరిని చూసినపుడు, ఒక విషయం తెలిసినపుడు.
a) Draupadi laughed at Duryodhana's fall = దుర్యోధనుడు పడిపోవటంతో ద్రౌపది నవ్వింది.
b) He smiled at his friend.

**6) Mock at** = ఒకరిని హేళన చేస్తూ నవ్వటం.
a) They mocked at him when he said that he was very good at English = తనకు English బాగా వచ్చని చెప్పినప్పుడు వాళ్లతన్ని చూసి హేళనగా నవ్వారు/ ఎగతాళి చేశారు.
b) We shouldn't mock at the poor = పేదవాళ్లను చూసి హేళనగా నవ్వరాదు.

**7) be delighted** = ఆనందించటం.
I am delighted at this chance = ఈ అవకాశం నాకు వచ్చినందుకు నేను ఆనందిస్తున్నాను.

**8) Stare at** = ఆశ్చర్యంతో/ కోపంతో/ నమ్మలేకుండా చాలాసేపు ఒకేవైపు చూడటం.
a) She stared at him in anger.
b) I stared at it in disbelief

ఇవన్నీ at వాడే సందర్భాలు. బాగా practice చేయండి.

**ఇంతకుముందు నేర్చుకున్న short responses ను ఈ కింది exercise లో practice చేయండి.**

## EXERCISE

**Practise the following aloud in English, adding suitable responses.**

1. Santan: మంచి మామిడిపండ్లు నేనెక్కడ కొనగలనో తెలుసా?
2. Bharat: ఆ, తెలుసు
3. Santan: నన్నక్కడికి తీసుకెళతావా?
4. Bharat: తీసుకెళ్లాలనే ఉంది నాకు, కానీ కాస్త తీరిక లేకుండా ఉన్నానిప్పుడు. సాయంత్రం వరకు wait చేయగలవా?
5. Santan: చేయలేనేమో (afraid వాడండి). వాటిని pack చేయించి, నాగపూర్‌లో ఉన్న నా friend కు పంపాలిప్పుడు.
6. Bharat: మధ్యాహ్నం 12 దాకైనా wait చేయలేవా?
7. Santan: నాకభ్యంతరంలేదు. (mind వాడండి). అది నాకు సమ్మతమే. ధరలెలా ఉన్నాయి, ఏమన్నా తెలుసా? (Any Idea...?). వందల్లో కొంటే కాస్త చవగ్గా ఉంటాయేమో?
8. Bharat: అలాగే నేనూ ఆశిస్తున్నా (hope)
9. Santan: నేను వాటినో transport company ద్వారా పంపుతున్నా. అవక్కడికి చేరేటప్పటికి మగ్గిపోతాయా?
(overripe = మగ్గిపోవటం)
10. Bharat: అలా అని అనుకోవటంలేదు. మనం కొనే పండ్లనుబట్టి, pack చేయించే విధాన్నిబట్టి ఉంటుంది.
11. Santan: నువ్వు మీ బావగారికేం పండ్లూ పంపటం లేదా?
12. Bharat: పంపాలనే అనుకుంటున్నా (want) కానీ, వాళ్లు సెలవులకు Ooty వెళ్లారు.
13. Santan: వాళ్లెప్పుడు తిరిగొస్తారు?
14. Bharat: నాకు తెలిస్తే ఎంత బాగుండును? వాళ్ల దగ్గర్నుంచి నాకు phone వచ్చి వారమయింది.
15. Santan: వాళ్లు త్వరగానే తిరిగొస్తారా?
16. Bharat: అలా అని నేననుకోవటం లేదు. వాళ్లొక Ooty మాత్రమే కాకుండా South India అంతా తిరిగొస్తారనుకుంటా.
17. Santan: నువ్వు వాళ్లను ఇక్కడికి పిలవడంలేదా? (invite)
18. Bharat: పిలవాల్సిందేంలేదు (have to). ఆమె మా అక్కే కదా. మా ఇంటికి ఆమె ఎప్పుడు కావాలంటే అప్పుడు రావచ్చు ఇది ఆమె ఇల్లు కాదా?
19. Santan: ఆమె వస్తోందా అయితే?
20. Bharat: సందేహమే (wonder)
21. Santan: నువ్వెప్పుడు వెళ్లాలని నీ ఉద్దేశం? (intend)
22. Bharat: వాళ్లు తిరిగిరాగానే. నువ్వు నాతో రావడం నాకు చాలా ఇష్టం (rather)
23. Santan: నాకూ ఇష్టమే. ఎన్ని రోజులుండాం అక్కడ? 4, 5 రోజులు సరిపోతాయా?
24. Bharat: ఆ, సరిపోతాయి. అంతకన్నా ఉండలేన్నేను. నాకు ఇక్కడ చాలా పనులున్నాయి.
25. Santan: నా సంగతీ అంతే.

### ANSWER

ఇది model answer మాత్రమే. సరైన అర్థం ఇచ్చే English మీరేది రాయగలిగినా ఫర్వాలేదు.

1. Santan: (Do) you know where I can buy good mangoes?
2. Bharat: Of course I do
3. Santan: will/ can/ could you take me there? (మనం ఎంత polite గా request చేస్తున్నాం అనేదాన్ని బట్టి)
4. Bharat: I'd (I would) very much like to, but I am a little busy. Can you wait till the evening?
5. Santan: I'm afraid no/ I'm afraid I can't. I've to get/ have them packed and sent to my friend in Nagpur.
6. Bharat: Can't you wait at least till 12 noon.
7. Santan: I don't mind. That's OK for me. How are the prices? Any idea/ Any idea how the prices are? Won't they be cheaper by the hundred?
8. Bharat: I hope so.
9. Santan: I am sending them through a transport company (by lorry). Will they be overripe by the time they reach there?
10. Bharat: I hope not. Depends on the quality of the fruit and how we get them packed.
11. Santan: Aren't you sending any to your brother in law?
12. Bharat: I want to, but they have gone to Ooty for holidays.
13. Santan: When will they return/ be back?
14. Bharat: (How) I wish I knew? (It's) a week since they called me.
15. Santan: Will they return (be back/ come back) soon?
16. Bharat: I don't think so. I think they'll tour the whole of South India.
17. Santan: Aren't you inviting them here?
18. Bharat: I don't have to/ do have to? She is my own sister, isn't she? She can come to our home whenever she likes. Isn't this her home as well?
19. Santan: Is she coming then?
20. Bharat: I wonder.
21. Santan: When do you intend to go to her?
22. Bharat: As soon as they are back/ come back/ get back/ return. I'd rather you go with me.
23. Santan: So would I. How long shall we be there? Will four or five days do?
24. Bharat: That will (of course). I can't stay there longer than that. I have a lot of work here.
25. Santan: So have I/ That's the case with me too.



**ప్రశ్న:** *Homographs, Homonyms, Homophones- ఈ మూడు పదాల అర్థాలు వివరించగలరు.*
*ii) a, e, i, o, u - వీటి తర్వాత వచ్చే 'r' ను పలుకకూడదా? ఇది silent అవుతుందా?*

***– సామంత్, వరంగల్***

**జవాబు:** Homographs అంటే ఒకే spelling ఉండి, వేరే pronunciation తో వేరే అర్థం ఉండే మాటలు: eg: minute (మినిట్) అంటే నిమిషం; minute (మైన్యూట్) అంటే సూక్ష్మమైన అని.

Homonyms అంటే ఒకే spelling, ఒకే pronunciation వేరే వేరే అర్థాలున్న మాటలు: can (గల అనే అర్థం- He can do it = అతనది చేయగలడు), can (డబ్బాలాంటిది). ఇక్కడ can, can homonyms.

Homophones - spellings తేడా, అర్థం తేడా, pronunciation ఒకటే ఉన్న మాటలు- knew and new, steel and steal.

eg: bare (దిగంబరమైన), bear (భరించటం, ఎలుగుబంటి)- ఇవి homophones.

ii) British English లో a, e, i, o, u - వీటిల్లో ఏ అక్షరం తర్వాతనైనా వచ్చే 'r' silent. ('r' తర్వాత మళ్లీ a, e, i, o, u రాకపోతే.)

form = ఫామ్ (form లో 'r' o తర్వాత వస్తుంది, కాని r తర్వాత a/ e/ i/ o/ u రావటంలేదు అందుకని 'r' silent.

forum = ఫోరం (ఇక్కడ r, o తర్వాత వచ్చినా, r తర్వాత u వస్తోంది. కాబట్టి r silent కాదు)

అయితే American English లో a, e, i, o, u తర్వాత వచ్చే 'r' silent కాదు. అయితే American 'r' ను Indians లాగా పలకరు. నాలుక కాస్త పైకి తిప్పి తెలుగు 'ఱ' (బండ ర) శబ్దంగా pronounce చేస్తారు.

form - British (ఫాం)
form - American (ఫార్‌ం)

***- M. SURESAN***

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 318




**Suman:** Your jeans are quite nice. You look damn smart in them. Where did you buy them and for how much?
(నీ jeans చాలా అందంగా ఉంది. ఎక్కడ, ఎంతకు కొన్నావు?)

మళ్లీ గుర్తుచేసుకుందాం- jeans, trousers (మనం మామూలుగా తప్పుగా pant అనేది - pants అనొచ్చు), scissors లాంటివి ఎప్పుడూ plural. అయితే వాటిని a pair of jeans, a pair of trousers, a pair of scissors అని ఒక్కదాన్ని చెప్పటానికే వాడతారు. A pair of అన్నప్పుడు అవి singular కింద లెక్క)

**Aswath:** Are they, really? Thanks for the compliment. I bought them at Smarty's for Rs.700/-
(నిజమా? నీ ప్రశంసకు thanks. దాన్ని నేను 700 రూపాయలకు కొన్నాను)

**Suman:** That's really a good buy at that price. I'd buy a pair too.
(ఆ ధరకది మంచి బేరమే. నేనూ కొనుక్కుంటా ఒకటి.)

తెలుసుకదా, ఇక్కడ pair అంటే జత అని అర్థం. రెండు కాదు. Jeans కాబట్టి, a pair of jeans అంటే ఒకటే.

**Aswath:** You'd better go at noon time. That's when the crowd is thin. You can select at leisure. A wide range to choose from.
(నువ్వు మధ్యాహ్నం వెళ్లటం మంచిది. అప్పుడు జనం పల్చగా (తక్కువగా) ఉంటారు. తీరిగ్గా ఎంచుకోవచ్చు)

thin crowd - పల్చటి గుంపు x thick/ large crowd = చాలా పెద్ద గుంపు, wide range = ఎక్కువ రకాలు- వస్తువులు/ ధరలు. range = శ్రేణి

**Suman:** I think I'll go this evening. Why don't you come with me.
(అయితే ఈ సాయంత్రం వెళతా. నువ్వూ నాతో రాకూడదూ?)

**Aswath:** Let's go a few days later. The shopman was hinting at a discount sale from the coming Monday. Wait till then.
(కొద్దిరోజుల తర్వాత వెళ్దాం. ఆ shop అతను వచ్చే సోమవారం నుంచి discount sale ఉండొచ్చని చూచాయగా అన్నాడు. అప్పటి వరకు ఆగు)

**Suman:** I can't but say it again. The jeans are really fine.
(మళ్లీ చెప్పక తప్పటం లేదు/ చెప్పలేకుండా ఉన్నా. Jeans ఎంత బాగుందో!)

**Aswath:** I could have got even a better one than this. I started late and arrived at the shop just half an hour before they were closing.
(ఇంతకంటే మెరుగైన jeans దొరికేదే నాకు. ఆలస్యంగా బయల్దేరాను, shop మూసేసే అర గంట ముందు చేరానక్కడికి.)

**Suman:** You should have gone earlier.
(అంతకంటే ముందే వెళ్లుండాల్సింది)

**Aswath:** I didn't plan to, actually. I just walked in when I saw the shop. I had ready cash too. Anyway no regrets. I am satisfied.
(వెళ్లాలని/ కొనాలని అనుకోలేదు అసలు. Shop కనిపించగానే లోపలికి వెళ్లా. డబ్బు జేబులో ready గా ఉంది. అయితే నేనం బాధపడటంలేదు. నాకీ jeans సంతృప్తికరంగానే ఉంది.)

☯ ☯ ☯ ☯

మనం prepositions study చేస్తున్నాం కదా. 'At' - ఈ preposition చాలా తరచుగా కనిపిస్తుండటం మీరు గమనించే ఉంటారు. ఏయే సందర్భాల్లో 'At' వాడతారో కొన్నింటిని ఇదివరకటి lesson లో తెలుసుకున్నాం. మరి కొన్ని ఈ lesson లో చూద్దాం.

a) Computer books are available at the shop
b) The third rack in the shop has only Computer books
Shop లోని 3వ rack (అలమారా)లో Computer books మాత్రమే ఉన్నాయి.

మనం ఎవరైనా వాడుకగా వెళ్లే చోట్లలో అనేందుకు at వాడతాం (సామాన్యంగా in రాదు)

a) She is at college now.
b) Praveen: Hello, can I speak to your brother? (మీ brother తో మాట్లాడాలి)
Pramod: He is at the bank.
(ఆయన bank లో ఉన్నాడు)

అలాగే, at the doctor's/ at hospital/ at work/ at school/ at the restaurant- ఈ చోట్లలో అనే అర్థంతో at వాడతాం.

ఫలానా వాళ్లింట్లో ఒకరు ఉండటం/ ఏదైనా చేయటం etc.

ఇక్కడ కూడా ఇలాంటి ప్రదేశాల ముందు at వస్తుంది. పెద్ద పెద్ద పట్టణాలు/ నగరాల పేర్ల ముందు, in వస్తుంది.

a) He arrived in Hyderabad/ Vizag/ Guntur/ Warangal, etc.
b) He arrived at (small places/ villages, very small towns, etc).

He arrived at Chilukuru.
Chilukuru is a small village.
అయితే ఫలానా time కు అన్నప్పుడూ, at వాడతాం.
At 4, At 3.30, At 12.15 etc.

# You had better go at noon time

***Study the following sentences from the conversation above:***

*1) I bought them at Smarty's for Rs. 700.*
*2) That's really a good buy at that price.*
*3) .... I arrived at the shop half an hour before they were closing.*
*4) You had better go at noon time.*
*5) You can select at leisure.*
*6) The shopman was hinting at a discount sale.*


M.SURESAN

**1) I bought them at Smarty's.**
నేను దాన్ని Smarty's (shop) లో కొన్నాను.
ఫలానా దుకాణంలో కొనటం = buying things at that shop

a) ఆ shop లో చాలా రకాల వస్తువులు ఉన్నాయి = A wide variety of goods are available at the shop.
b) She was at the fruit market while her husband was at the book shop =
ఆమె పండ్ల దుకాణంలో ఉంటే ఆయన పుస్తకాల దుకాణంలో ఉన్నాడు.
c) There are few things that you can't get at the departmental store =
ఆ department store లో లేని వస్తువంటూ దాదాపు లేదు

In the shop అంటే shop లోపల ఉన్న విషయం తెలపటం
When the fire brokeout, fortunately only a few people were in the shop =
ఆ మంటలు ప్రారంభమైనప్పుడు అదృష్టవశాత్తు ఆ shop లో కొద్దిమంది మాత్రమే ఉన్నారు.
గమనించండి:

c) Ekambar: Where are the boys? (పిల్లలెక్కడ?)
Nilambar: They are playing at their uncle's.
(వాళ్ల uncle ఇంట్లో ఆడుకుంటున్నారు.)

గమనించాల్సిన విషయం: ఫలానా వాళ్లింట్లో అనేందుకు, ఉదాహరణకు శ్రీరాం ఇంట్లో అనేందుకు Sriram's అనే అంటారు. Sriram's house/ home అనరు. Sri Ram's అంటే చాలు.

d) Ram and Syam are at Bheem's
రాం, శ్యాం- భీం ఇంట్లో ఉన్నారు.
(Bheem's home/ Bheem's house అనరు).

**2) At that price** - సామాన్యంగా rate ముందు (ఒక వస్తువు/ ఒక unit ధర), at, price (మనం కొన్న మొత్తం వస్తువుల ధర ముందు for వాడతాం. అయితే ఆ ధరకు అనే అర్థంతో ఒక్కోసారి, at that price అని అంటాం.)

a) I bought these mangoes at Rs. 70/- a dozen
(ఈ పండ్లు నేను dozen 70 రూ/- చొప్పున కొన్నాను)- ఇక్కడ ఎన్ని పండ్లు కొన్నదీ తెలియదు. Rate- అంటే ఒక dozen ధర మాత్రం- కాబట్టి at.
b) I bought these mangoes for Rs. 90/- (ఈ మామిడిపండ్లు నేను 90 రూపాయలకు కొన్నా)- ఇది మొత్తం పండ్ల ధర- price- కాబట్టి, for, అయితే అంత రేటుకు అన్నప్పుడు మాత్రం at that price అనే అంటాం. ఇలాంటి సందర్భాల్లో price కు అర్థం, rate అని.

**3) Arrive at**- ఒకచోటికి చేరటం- arrive at a place (Shop/ College/ Cinema/ at a part of a town/ a city, etc)

ఒక period= విరామం ముందు, in వాడతాం- ఆ period అయ్యేంతవరకు అనే అర్థంతో.
In 10 minutes = 10 నిమిషాలకు
(10 నిమిషాల్లో = within 10 minutes)
In an hour = ఓ గంటకు/ గంటదాటింతర్వాత
(within an hour = గంటలోపు)
In two days = రెండ్రోజుల తర్వాత
(రెండ్రోజుల్లో = within two days)

**5) At leisure** = తీరిగ్గా
a) He is at leisure on Sundays =
అతను Sundays తీరిగ్గా ఉంటాడు.
b) I am not at leisure to discuss these matters =
ఈ విషయాలు చర్చించేందుకు నాకు తీరిక లేదు.

**6) hint at** = చూచాయగా అనటం
a) The CM was hinting at reservations for some more castes =
మరికొన్ని కులాలకు reservations ఇవ్వటం గురించి CM చూచాయగా అన్నారు.
b) He was hinting at starting new lines of business =
కొత్త వ్యాపారాలను ప్రారంభించే విషయం ఏదో చూచాయగా అన్నాడు.

**Practise the following aloud in English- use the proper prepositions:**

Kapil: ఈ విషయం నీతో చర్చించాడా?
Akhil: లేదు. ఏదో చూచాయగా అన్నాడు
Kapil: ఎప్పుడన్నాడీ మాట?
Akhil: నిన్న. కామేష్ వాళ్లింట్లో
Kapil: ఎవరి దగ్గర్నుంచి వచ్చింది వాడికీ వార్త?
Akhil: వాళ్ల doctor hospital లో అనుకుంటా. వాళ్ల doctor ఏదో అతనికి చెప్పినట్టున్నాడు.
Kapil: ఇది మనకు దుర్వార్తే. అతనలా ఆలోచించటం చెడు.
Akhil: వేచిచూద్దాం.

**ANSWER**

Kapil: Did he discuss this with you?
Akhil: No. He just hinted at it
Kapil: When did he say this?
Akhil: Yesterday. At Kamesh's
Kapil: Who did he get this news from?
(from whom did he get this news?- ఇది correct. అయితే spoken English లో చాలా అరుదు)
Akhil: At his doctor's, I suppose. His doctor seems to have told him of/ about it.
Kapil: This is bad news for us. It's bad of him to think so.
Akhil: Let's wait and see.



**ప్రశ్న:** *i) Despite, Beside పదాలను ఎలా ఉపయోగించాలి?*
*ii) Could have been, would have been, need have been, might have been, will have been ఉపయోగాలు తెలపండి.*

**– ఆర్.రాజారావు, దండిగుంట**

**జవాబు:** i) Despite = in spite of = అయినప్పటికీ.
Despite his huge wealth, he leads a simple life =
అతడు బాగా సంపన్నుడైనప్పటికీ, చాలా నిరాడంబర జీవితం గడుపుతున్నాడు
Despite the rain, they went out =
వర్షం వస్తున్నప్పటికీ, వాళ్లు బయటికెళ్లారు.
Besides = in addition to = ఇంకోదానితోపాటు (also).
He gave me some money besides these books =
ఈ పుస్తకాలతోపాటు నాకతను కొంత డబ్బిచ్చాడు.
ii) వీటి ఉపయోగాలు పాత lessons లో చాలా వివరంగా తెలిపాం.

**ప్రశ్న:** *i) The Intermediate first year results would be declared at 11.30 a.m.*
*Since action is carried out in future, will should be used. But 'would' is given. Is it right usage? How?*
*ii) Explain the sentence (1) When you've got Charles to deal with, this may mean he is only plotting. (2) He lived what he wrote, and any attempt to understand this unusual man begins and ends with the man himself.*

***- K. Sainath, Tenali***

**జవాబు:** i) Yes. Would be declared is wrong.
It should be will be declared.
ii) 1) Charles is planning some thing evil. 2) His writing(s) tell you how he lived, so there is no need to study his book(s) to understand him. The only way to understand him is to study the man.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ



SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 319

M.SURESAN

# No scope for argument

**Dayal:** Just what do you know about all this?
(అసలు వీటి గురించి నీకేం తెలుసు? )

**Kripal:** Not much. I was at my desk at office when Dharma came in and started shouting at us.
(ఎక్కువేం తెలియదు. నేను office లో నా desk దగ్గర ఉన్నప్పుడు ధర్మ వచ్చి అందర్నీ కేకలేయటం మొదలుపెట్టాడు)

**Dayal:** What was the cause of his anger?
(అతని కోపానికి కారణమేమిటి? )

**Kripal:** He said he was irritated at the delay in processing his papers at our office. He was tired of having to visit our office so often.
(అతని కాగితాల మీద చర్య తీసుకోవటంలో మా office చేస్తున్న జాప్యం తనకు కోపం కలిగిస్తోందన్నాడు. మా office చుట్టూ తిరిగి తిరిగి విసిగిపోయానన్నాడు)

**Dayal:** Why don't you speed up his papers. You shouldn't give him scope for complaining.
(అతని papers మీరు ఎందుకు వేగతరం చేయరు? Complain చేసే ఆస్కారం అతనికి మీరు కల్పించొద్దు.)

scope= ఆస్కారం/ అవకాశం

**Kripal:** Anil looks into his matter and he was on leave the whole of last week. Work has piled up for him and he may take some more time to study these papers.
(అతని వ్యవహారాలన్నీ అనిల్ చూస్తాడు. గతవారం అంతా అతను సెలవు. పని బాగా పేరుకుపోయింది. ఈ విషయం చూడటానికి అతనికి ఇంకొంత సమయం పడుతుంది.)

**Dayal:** Aren't you familiar with his file? Can't you attend to it without waiting for Anil to deal with it?
(అతని file విషయం నీకు తెలియదా? నువ్వు దాన్ని చూడలేవా, అనిల్ చూసేంతవరకు ఉండకుండా? )

**Kripal:** Anil might object to my handling the file.
(నేనా file చూడటంపై Anil కు అభ్యంతరం ఉండొచ్చు.)

**Dayal:** If that happens, I'll convince Anil of the urgency of the matter. People making scenes in the office isn't good for the company.
(అది జరిగితే, నేను అనిల్‌కు నచ్చచెప్తాను. ప్రజలు office లో గొడవ సృష్టించటం company పేరుకు మంచిదికాదు)

**Kripal:** Then don't worry any more about it.
(ఇంక దాని గురించి చింతించకు)

♦ ♦ ♦ ♦ ♦

Get through with the use of prepositions. Here are some more prepositions that are quite frequent in spoken English.

***Look at the following sentences from the conversation above:***

1) What do you know about all this?
2) I was at my desk
3) He ... started shouting at us
4) What was the cause of his anger?
5) He said he was irritated at the delay in processing ... at our office.
6) He was tired of having to visit our office so often.
7) You shouldn't give him scope for complaining.
8) Anil is looking into his matter.
9) He was on leave
10) Aren't you familiar with his file?
11) Anil might object to my handling the file.
12) I'll convince him of the urgency of the matter.
13) ... is not good for our company.
14) Don't worry about it any more.

**1) Know about** = know of = ఒక విషయం/ ఒకరిని గురించి తెలుసుకోవటం/ తెలియటం. ఇది మనం చాలా సార్లు చూశాం.
అయితే ఓ విషయం గమనించండి - Difference between 1) know and 2) know about.

a 1) I know him= అతను నాకు తెలుసు- మాకు పరిచయం ఉంది.
2) I know about him= అతడి గురించి నాకు తెలుసు- నేనతన్ని చూశాను/ అతని గురించి విన్నాను.

b) I know Physics/ Zoology/ German, etc= ఇవన్నీ నాకు తెలుసు. ఇక్కడ know తర్వాత about రాదు. మనకు ఓ subject తెలుస్తుంది. దాని గురించి తెలియటం అనేది దాదాపు ఉండదు కదా?

c) I know about their marriage. ఇక్కడ తెలుస్తూనే ఉంది కదా- I know their marriage, అని. (Compare, I know the date of their marriage)

ఇది మనం మాట్లాడేటపుడు కొంచెం ఆలోచిస్తే తెలుస్తుంది, వాడుకలో అదే వచ్చేస్తుంది.

**2) I was at my desk**: నా desk దగ్గర నేనున్నాను.
చూడండి: At అనేది దాదాపు మనం ఉండేచోట్లన్నింటిని చెప్పడానికి పనికొస్తుంది. క్రితం lesson లో కూడా చూశాం. At office/ at (the) college/ at (the) school, etc. అంతేకాకుండా - at work (పనిలో ఉండటం), at play- (ఆటలో ఉండటం).

a) He is at work. Don't disturb him
(అతను పనిలో ఉన్నాడు/ అతనేదో పని చేసుకుంటున్నాడు. మనం అతన్ని disturb చేయొద్దు).

b) He has been at play for an hour now= అతను గంటసేపుగా ఆడుతున్నాడు.

**3) shout at** = ఒకరిని గట్టిగా తిట్టడం/ కోపంతో అరవటం.

a) Who are you shouting at = ఎవరిమీద అరుస్తున్నావు నువ్వు?

b) No use shouting at a deaf man= చెవిటివాడి మీద అరిచి ప్రయోజనం లేదు.

**5) be irritated at** = చిరాకుపడటం.

a) He was irritated at her comments. ఆమె వ్యాఖ్యలు అతనికి చిరాకు కలిగించాయి.

b) People are irritated at his way of talking= అతను మాట్లాడే తీరంటే ఇతరులకు మంట.

**6) (be) tired of** = మామూలుగా అలసిపోవటం అనే అర్థంతో వాడతాం. అయితే విసిగిపోవటం అనే అర్థంతో కూడా ఇపుడు బాగా వాడుకలోకి వచ్చేసింది.

a) The Indian movie is tiring= భారత సినిమాలు విసుగు పుట్టిస్తాయి.

b) I am tired of listening to him = అతను చెప్పేది వినటం నాకు విసుగు.

c) They soon tired of the food and wanted a change = ఆహారంతో విసుగుపుట్టి మార్పు కోరుకున్నారు.

**7) scope for** = ఆస్కారం. ఒక పని చేసే అవకాశం.

a) We have to do what he asks us to do. No scope for argument.

b) This sentence says it all very clearly. There is no scope for any doubt = ఈ వాక్యం దాన్ని చాలా స్పష్టంగా చెబుతోంది. సందేహానికి ఆస్కారమే లేదు.

**8) Anil is looking into his matter.**
look into = పరిశీలించటం.

a) The government is looking into the matter ఈ విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తోంది.

b) The minister promised to look into the matter= ఈ విషయాన్ని పరిశీలిస్తానని మంత్రి హామీ ఇచ్చారు.

**9) He was on leave** = సెలవులో ఉండటం.
be on leave = సెలవులో ఉండటం.
go on leave = సెలవులో ఉండటం.
on a holiday = సెలవుల్లో ఇంకోచోటికి విహారానికి వెళ్లటం.
The school is on vacation = School కు సుదీర్ఘ సెలవులు.
అయితే holidays లో/ సెలవుల్లో = During vacation/ during the leave period.

**10) familiar with** = (ఒక మనిషి/ విషయం) తెలిసి ఉండటం/ పరిచయం ఉండటం.

a) He is quite familiar with India = అతనికి భారత్ బాగా తెలుసు.

b) He is not familiar with the city = అతనికి నగరం అంతగా తెలియదు.

c) I am familiar with him = అతను నాకు బాగా తెలుసు. (మా ఇద్దరికీ పరిచయం ఉంది)

**11) object to** = అభ్యంతరం తెలపటం/ ఆక్షేపించటం.

a) Some among the audience objected to some of the speaker's words = వక్త వాడిన కొన్ని మాటలకు సభికుల్లో కొంతమంది అభ్యంతరం తెలిపారు/ ఆక్షేపించారు. (object + to)

b) I object to his joining us = అతడు మనతో కలవటం నాకభ్యంతరం.

**12) convince (somebody) of something** = ఒకరికి ఒక విషయం నచ్చజెప్పటం/ ఒప్పించటం.

a) He convinced his father of the need for a two wheeler = ద్విచక్ర వాహనం అవసరాన్ని అతడు వాళ్ల నాన్నకు నచ్చజెప్పాడు.

b) You cannot convince me of the goodness of coffee or tea = Coffee, tea మేలు చేస్తాయని నువ్వు నన్ను ఒప్పించలేవు.

**13) good for/ bad for** = ఒకరికి మంచి/ చెడు

a) Smoking is bad for health.

b) Walking is good for health

**14) worry about** = ఆదుర్దా చెందటం.
Don't worry about me. I'm OK = నా గురించి ఆదుర్దాపడకు. నేను బాగానే ఉన్నా.

---



***ప్రశ్న: 1)*** *When I went to my friend's room he was sleeping. When I went to my friend's room he had slept. రెండింటిలో ఏది సరైంది?*

***2)*** *They have said that they are going to Hyderabad today. Reporting verb present tense లోగాని, future tense లోగాని ఉంటే reporting speech లో verb మారదు. ఇక్కడ R.V. Present Perfect Tense లో ఉందికదా. ఇది కరెక్టేనా?*

***3)*** *The climate of Hyderabad is better than that of Vijayawada అంటారు. ఇక్కడ that of ఎందుకు వాడాలి. Than సరిపోతుంది కదా?*

– వెన్నెల నరసింహారావు, మెదక్

**జవాబు: 1)** When I went to my friend's room he was sleeping 2) When I went to my friend's room, he had (already) gone to bed - ఈ రెండూ correct. ఉపయోగించవచ్చు

**2)** Present perfect tense అంటే present tense కదా though it talks of a past action, time not stated, an action just completed or an action since then till now. So have said is present tense.

**3)** ఇక్కడ పోలిక Hyderabad climate కూ Vijayawada climate కూ కదా? అందుకని that (= the climate) of Vijayawada అంటాం/ అనాలి కూడా. లేకుంటే The climate of Hyderabad is better than Vijayawada అంటే వచ్చే అర్థం విజయవాడకన్నా, Hyderabad climate better అని- అంటే ఈ sentence Hyderabad climate నూ, Vijayawada నగరాన్నీ పోలుస్తుంది. climate నూ, నగరాన్నీ పోల్చలంకదా?

***ప్రశ్న: 1)*** *What is the correct meaning of cute? eg: She is so cute.*

***2)*** *When do we use younger & youngest?*

***3)*** *When do we use elder & eldest?*

***4)*** *When do we use older & oldest?*

***5)*** *Avoid aping the west.*

– వి. ఆనందబాబు, గన్నవరం

**జవాబు:**

**1)** Very attractive, beautiful and tender (delicate)

**2)** When we refer to the stages of life (age) of human beings/ animals/ plants.
eg: a) He is younger than all others in the class/ in the family.
b) He is the youngest of all in the class/ in the family

**3)** When we refer to the members of the same family
eg: a) He is eldest of her children (same family)
b) Dharmaraja was Bhima's elder (same family)

**4)** Older and Oldest:
Old: 1) (of people/ animals/ plants) = aged (old in age)
2) (of things) - not new
i) He is older than me/ I (not of same family)
ii) He is older than all the other students in the class (not of the same family)
iii) He is the oldest of all in the class (not of the same family)
(of things). i) This Car is older than many other cars here (has been used longer/ bought earlier than many other cars here)
ii) This is the oldest of all cars here (first car to be here)

**5)** ape = to copy/ to imitate
Avoid aping the west = Don't imitate the west.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 320


M.SURESAN

# No doubt about it

**Alankar:** (There are) no two opinions about it. He is the best we have.
(దాని విషయంలో రెండు అభిప్రాయాలకు తావులేదు. మనకున్న వాళ్లల్లో అతను మిన్న)

**Nirankar:** No doubt about it. Every one speaks high of him.
(సందేహం లేదు. ప్రతివాళ్లూ అతడి గురించి గొప్పగానే మాట్లాడతారు.)

**Alankar:** At the first sight people are likely to mistake him for an ordinary man. But a longer acquaintance of him helps a better understanding of his talent and his goodness.
(మొదటిసారి అతడిని చూసినప్పుడు ఎవరైనా అతడిని మామూలు మనిషనే పొరపడతారు. కాని అతడితో ఎక్కువ పరిచయం, అతడి ప్రతిభ, మంచితనం పట్ల మెరుగైన అవగాహనకు తోడ్పడుతుంది.)

acquaintance (అక్వెయిన్‌టన్స్ - 'అ' దాదాపు పలక్కుండా, క్వెయ్ నొక్కిపలుకుతాం) - 1. పరిచయం మాత్రమే, స్నేహంకాకుండా 2. పరిచయస్తులు (స్నేహితులు అనలేం)

**Nirankar:** One good thing about him is his not being proud of his greatness. By nature he is humble.
(అతనిలో ఒక మంచి విషయం ఏమిటంటే తను గొప్పనే గర్వం లేకపోవటం. సహజంగా అతడు నిగర్వి.)

**Alankar:** Another thing is his dislike for praise. Though he's got a number of awards for his services he never boasts of them. It is for this reason that people have such a liking for him.
(ఇంకో విషయం, పొగడ్తంటే అతడికి గిట్టకపోవడం. అతడి సేవలకెన్నో పురస్కారాలు వచ్చినా వాటి గురించి అతను గొప్పలు చెప్పుకోడు. ఈ కారణంవల్ల తనంటే అందరికీ అంత అభిమానం.)

**Nirankar:** Yea, that's why people have great regard for him.
(అవును. అందుకనే ఇతరులకు తనంటే అంత గౌరవం.)

**Alankar:** Some of course are envious of him. There are always those who are critical of others for no fault of theirs.
(అతనంటే కొందరికి ఈర్ష్య. ఏ తప్పూ లేకుండా కూడా కొందరంటే విమర్శించే వాళ్లెప్పుడూ ఉంటారు.)

**Nirankar:** He is not for recognition of any sort. He does service because he likes to.
(ఏ రకమైన గుర్తింపునకూ అతడు వ్యతిరేకి. అతడికిష్టం కాబట్టి సేవ చేస్తుంటాడు.)

**Alankar:** We are privileged to be his friends.
(అతడి స్నేహితులవటం మనకో ప్రత్యేక గౌరవం.)

☺ ☺ ☺ ☺ ☺

మనం తరచుగా వాడే prepositions ను తెలుసుకుంటున్నాం. అందులో భాగంగా మరికొన్ని prepositions, prepositional phrases, prepositions తో వచ్చే మాటలు చూద్దాం.

*To be thorough with the use of preps (prepositions), read the dialogue above aloud, or practise it with your friend/s four or five times. This is important.*

***Look at the following sentences from the conversation above.***

1) *(There are) no two opinions about him.*
2) *No doubt about it.*
3) *At the first sight people are likely to mistake him for an ordinary man.*
4) *But longer acquaintance of him helps a better understanding of his talent.*
5) *One good thing about him is his not being proud of his greatness.*
6) *By nature he is humble.*
7) *Another thing is his dislike for praise.*
8) *It is for this reason that people have a liking for him.*
9) *... people have great regard for him.*
10) *Some, of course, are envious of him.*
11) *... those who are critical of others for no fault of theirs.*

Observe the use of preposition in the sentences above.

**1) No two opinions about it.** Opinion అంటే తెలుసుకదా - అభిప్రాయం అని. ఒకరి మీద/ ఒక విషయాన్ని గురించి ఒకరి అభిప్రాయం అనేందుకు.
Someone's opinion about/ of somebody/ something.
a) What's your opinion about/ of the leader?
ఆ నాయకుడి గురించి నీ అభిప్రాయం ఏమిటి?
b) I don't have a good opinion of him = అతడి గురించి/ మీద నాకు మంచి అభిప్రాయం లేదు.
ఒక్కొక్కప్పుడు opinion on అని కూడా అంటాం.
c) We are unable to understand their opinion on the matter.

**2) doubt about** - doubt (సందేహం) తర్వాత ఎప్పుడూ about వస్తుంది.
I don't have any doubt about his success. (అతడి విజయంలో నాకెలాంటి సందేహం లేదు.)
అయితే Doubt కు రెండర్థాలు:
1) Doubt (noun) = సందేహం
2) Doubt (verb) = సందేహించటం.
సందేహించటం అనే అర్థంతో doubt తర్వాత ఏ preposition రాదు.
I have no doubt (సందేహం) about his character= అతడి శీలం విషయంలో నాకే సందేహం లేదు = I don't doubt his character = అతని శీలం నేను సందేహించటం లేదు.
ఒక్కోసారి doubt తర్వాత as to వాడుతుంటారు. అది కాస్త గ్రాంధికం.
There is some doubt as to whether he has done it or not. (ఇక్కడ as to వదిలేసినా తప్పులేదు.)

**3) At the first sight** = మొదట చూసినప్పుడు. First, second, third ముందు at వాడతాం. అంతేకాకుండా sight (ఒకరిని చూడటం) ముందుకూడా at వస్తుంది.
a) He passed at his second attempt = (అతడు రెండో ప్రయత్నంలో pass అయ్యాడు)
b) At the sight of the teacher the pupils became silent = టీచర్‌ను చూడగానే వాళ్లు నిశ్శబ్దంగా ఉన్నారు.

**4) Acquaintance of** = ఒకరితో ఉన్న పరిచయం. His acquaintance of her soon grew into love = ఆమెతో అతడి పరిచయం ప్రేమగా ఎదిగింది.
a) ఒకరితో ఉన్న పరిచయం = Acquaintance of somebody (of).
b) ఒక విషయం తెలిసి ఉండటం = Acquaintance with something (with)
Sunil's acquaintance with computers is very little = computers ను గురించి సునీల్‌కు తెలిసింది చాలా తక్కువ.
(Acquaintance = పరిచయస్తుడు అని కూడా)

**5) proud of** = ఒక విషయం/ ఒక వ్యక్తిని గురించి గర్వపడటం. a) He is proud of his car
b) Dasaradha had every reason to be proud of his son.
c) India is proud of Dr. Kalam

**6) by nature** = సహజంగా/ స్వతస్సిద్ధంగా/ పుట్టుకతో.
a) By nature he is kind though he appears harsh = సహజంగా అతను దయగలవాడే, కఠినంగా కనిపించినా.
b) By nature he is lazy = స్వతస్సిద్ధంగా అతడు సోమరి/ సోమరితనం అతడి నైజం.

**8) for this reason** - ఇది ఇంతకుముందు చూశాం - reason ముందు, for వస్తుంది.
liking for = ఒకరిపట్ల/ ఒక విషయం అంటే ఇష్టం/ అభిమానం. Liking తర్వాత for
a) The teacher has liking for industrious students= (శ్రమించే విద్యార్థులంటే ( విద్యార్థులపట్ల) ఆ teacher కు ఇష్టం.
b) She has a liking for western dresses = పాశ్చాత్యశైలి బట్టలు ఆమెకిష్టం.

**9) regard/ respect** వీటి తర్వాత for వస్తుందని ఇంతకుముందు తెలుసుకున్నాం.
Some ministers have no regard for government orders = కొంతమంది మంత్రులకు ప్రభుత్వ ఉత్తర్వులంటే లక్ష్యంలేదు.

---

**ప్రశ్న:**
1. రాముడిపై హత్యా యత్నంలో కిరాయి హంతకముఠా పాత్ర ఉన్నట్లు అనుమానిస్తున్నారు.
2. హత్యకు ఒప్పందం కుదుర్చుకున్నట్లు తేలింది.
3. నిందితులు పరారీలో ఉన్నట్లు సమాచారం.
4. భూకబ్జాల వెనుక పెద్ద నాయకులు ఉన్నారని ప్రజలు అనుకుంటున్నారు.
5. శాసనమండలి ఏర్పాటుకు అన్ని హంగులు పూర్తయ్యాయని రాజకీయ విశ్లేషకులు చెప్పుకుంటున్నారు.

పై వాక్యాలను ఇంగ్లిష్‌లో వివరించండి.

★ *To have + $v_3$, To have + been + $v_3$ లతో కొన్ని ఉదాహరణలివ్వగలరు.*
★ *Some members are believed to have complained that some ministers were obliging the CPI(M) and TRS leaders.* ఈ వాక్యాన్ని తెలుగులో వివరించగలరు.

– క్రిష్ణ, కడప

**జవాబు:**
1) A big gang of mercenaries is suspected to be behind the attempt at Ramu's life
2) It is now clear that there was a pact for the murder
3) Information is on hand that the accused are at large
4) Big leaders are supposed to be behind the land grabs
5) The news doing the rounds among political circles is that all arrangements are in place for constituting the legislative council

★ He seems to have told her that he completed the work = ఆ పని తను పూర్తి చేసినట్లు ఆమెతో చెప్పినట్లు కనిపిస్తోంది/ అనిపిస్తోంది. (to have + past participle)
★ I like to have seen the movie = ఆ సినిమా చూసుండాల్సిందనుకుంటున్నా. (చూడలేదు- చూస్తే ఎంత బాగుండేది) (to have + past participle)



★ She likes to have been consulted (to + have + been + past participle) (passive) = తను సంప్రదించబడాల్సిందని అనుకొంటోందామె. (వాళ్లు తనను సంప్రదించి ఉండాల్సింది అనుకుంటోంది)
★ కొంతమంది మంత్రులు CPI (M), TRS నాయకులకిగింది చేస్తున్నారని కొంతమంది సభ్యులు ఆరోపిస్తున్నట్లు నమ్మబడుతోంది. (ప్రజలు/ పార్టీవాళ్లు నమ్ముతున్నారు.)

**ప్రశ్న: a.** *Spoken English, Written English* కు ప్రధాన భేదాలేమిటి?
**b.** *1) You completed the work?*
*2) Today is sunday?*
*3) Why you stopped here?*
*4) How long this goes on?*
*5) You came yesterday?*
*6) Why you called me?* ఇలాంటి సందర్భాల్లో *native speakers* ఎలా మాట్లాడతారు? ఇవి *grammatical* గా కరెక్టేనా?

– వి. ప్రద్యుమ్నాచారి, నకిరేకల్

**జవాబు: a.** Spoken English కు written English కూ తేడా, spoken Telugu కూ written Telugu కు ఉన్నంత ఉంటుంది. Spoken English లో చాలా సందర్భాల్లో sentences పూర్తిచేయకుండా మొదట కొంతభాగం, తర్వాత కొంతభాగం వదిలేస్తుంటాం. for example, you there? You OK? ఇటువంటివి spoken English లో common. (ఇక్కడ verb లేకపోవటం చూడండి.) అదే written English లో కుదరదుగదా? Are you there? Are you OK? అనాల్సిందే. ఇలాంటి చాలా తేడాలున్నాయి.
ఒక్కమాటలో చెప్పాలంటే spoken English చాలా informal గా ఉంటుంది. Written English చాలా formal. Vocabulary (మాటలు), grammar, usage లో కూడా చాలా తేడాలుంటాయి.

**b.** చాలాసార్లు చెప్పాంకదా? Question లో ఎప్పుడూ sentence, verb తో begin అవుతుంది. దానితర్వాత subject వస్తుంది. 1st Regular Doing word/ 2nd Regular Doing word (present simple), Past Doing Word (past simple) విషయంలో, subject ముందు do, does and did వరసగా వస్తాయి. మీరు రాసినవి question form లో లేవు. అవి ఉండాల్సిన తీరు:
1) Did you complete the work?
2) Is today Sunday?
3) Why did you stop here?
4) How long does this go on?
5) Did you come yesterday?
6) Why did you call me?
ఇదీ native speaker మాట్లాడే విధం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

**Damodar:** Where are you coming from?
(ఎక్కడినుంచి వస్తున్నావ్?)

**Manohar:** From Rohit's. I had been there since 8 until I started back for home.
(రోహిత్ ఇంటినుంచి. 8 నుంచి అక్కడే ఉన్నా, ఇంటికి బయలుదేరేవరకు)

**Damodar:** So you are on your way home.
(అయితే ఇంటికెళ్తున్నావన్నమాట/ ఇంటికెళ్లే దార్లో ఉన్నావన్నమాట)

**Manohar:** Rohit had a present from his father- a bike. Looks very sleek. From its looks you can say it is very expensive.
(Rohit కు వాళ్ల నాన్న నుంచి ఓ బహుమతి వచ్చింది- ఓ bike. చాలా అందంగా ఉంది. దాని రూపం చూసే చెప్పవచ్చు అది చాలా ఖరీదైందని.)

sleek = car, bike లాంటివి నునుపుగా ఆకర్షణీయంగా ఉండటం

**Damodar:** That's where my dad differs from Rohit's. My dad loves me, but he doesn't show it. He doesn't believe in giving expensive gifts to me.
(అక్కడే వాళ్ల నాన్నకూ మా నాన్నకు తేడా. మా నాన్నకు నేనంటే ఇష్టమే. కానీ ఖరీదైన బహుమతులివ్వటం లాంటి వాటిల్లో ఆయనకు నమ్మకం లేదు.)

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 321


M.SURESAN

**Manohar:** Rohit's father is quite rich. His income from the shopping complexes he owns in the town itself amounts to a few lakhs per month.
(Rohit వాళ్ల నాన్న బాగా ఉన్నవాడు. ఇక్కడ ఆయనకున్న shopping complexes నుంచి వచ్చే ఆదాయమే నెలకు కొన్ని లక్షలుంటుంది.)

**Damodar:** From what I hear, they are going to buy the building next to our college.
(నేను వింటున్న దాన్ని బట్టి మన college పక్కనున్న building ను వాళ్లు కొనబోతున్నారు.)

**Manohar:** If only they think of it, nothing can prevent them from buying it. Not a surprize- they can afford it.
(వాళ్లనుకోవాలేగానీ, కొనకుండా ఏదీ వాళ్ల నాపలేదు. పెద్ద ఆశ్చర్యం ఏంలేదు, వాళ్లకా తాహతు ఉంది.)

afford= డబ్బు పెట్టగల తాహతు

**Damodar:** But I think Rohit's father's health isn't that good. What exactly is wrong?
(కానీ రోహిత్ నాన్న ఆరోగ్యం అంత బాగుండదనుకుంటా. ఏంటి అసలు సమస్య?)

**Manohar:** I think he suffers from asthma. That comes from his excessive smoking. The condition is awful during the cold season.
(ఆయన ఉబ్బసంతో బాధపడుతున్నాడనుకుంటా. అది ఆయన మరీ ఎక్కువ smoking వల్లనుకుంటా. చలిరోజుల్లో ఆయన పరిస్థితి భయంకరం.)

asthma = ఉబ్బసం. Asthmatic = ఉబ్బసంతో బాధపడేవాళ్లు. asthma - ఆస్మా.

**Damodar:** Unfortunately there is no permanent relief from it.
(దురదృష్టవశాత్తు దానినుంచి పూర్తి విముక్తి లేదు)

**Manohar:** Yea. That's the problem.

♦ ♦ ♦ ♦

మనం గత కొద్ది lessons లో study చేస్తున్న prepositions ఉపయోగంలో భాగంగా preposition, 'from' తరచుగా వాడే కొన్ని సందర్భాలు తెలుసుకుందాం.

from అంటే మామూలు అర్థం తెలుసుకదా: నుంచి అని.

Our college works from 10 to 4
మా college 10 నుంచి 4 వరకు పనిచేస్తుంది.

It's about 300 km from Vijayawada to Hyderabad= విజయవాడ నుంచి హైదరాబాద్‌కు దూరం దాదాపు 300 km.

ఇవి మనకు తెలిసినవే; మరికొన్ని ఇపుడు చూద్దాం.

***Look at the following sentences from the dialogue above.***

1) *Rohit had a present from his father =*
వాళ్ల నాన్న దగ్గరనుంచి రోహిత్ బహుమతి పొందాడు. (మామూలు తెలుగు- వాళ్ల నాన్న వాడికో బహుమతి ఇచ్చాడు)
2) *from its looks you can say ...*
3) *That's where my dad differs from Rohit's.*
4) *His income from the shopping complexes ... a few lakhs per month.*
5) *From what I hear they are going to buy the building ...*
6) *nothing can prevent them from buying it.*
7) *He suffers from asthma*
8) *... there is no permanent relief from it.*

**1) Present from-** ఒకరిచ్చే బహుమతి (ఒకర్నించి వచ్చే బహుమతి అని తెలుగులో అనం కదా)

a) Please accept this small gift from me
నేనిచ్చే (నా నుంచి) ఈ చిన్న కానుకను స్వీకరించండి

b) Any body thinks it an honour to receive an award from the president =
రాష్ట్రపతి చేతులమీదుగా/ రాష్ట్రపతి నుంచి/ రాష్ట్రపతి ఇచ్చే పురస్కారాన్ని స్వీకరించటం ఎవరైనా గొప్ప గౌరవంగానే భావిస్తారు.

**2) and 5) - from** - దాన్నిబట్టి

**2) from its looks** = దాని ఆకారాన్ని/ రూపాన్ని బట్టి (ఆధారంగా)

**5) from what I hear** = నేను వింటున్నదాన్నిబట్టి (ఆధారంగా)

a) from her looks you can say that something has gone wrong =
ఆమె ఆకారాన్ని/ ముఖకవళికలను బట్టి, ఏదో పొరపాటు జరిగిందని చెప్పవచ్చు

b) వాడు చెప్పేదాన్నిబట్టి, వాడిక్కడ ఎక్కువ రోజులు ఉండకపోవచ్చు =
From what he says he may not be here for long

c) వాడు మాట్లాడే తీరునుబట్టి వాడికి ఈ ఏర్పాటు ఇష్టంలేదని తెలుస్తోంది =
From the way he is talking it is clear that he doesn't like this arrangement.

**3) Differ from** = be different from = తేడా ఉండటం.

a) భారత సంప్రదాయాలకు, పాశ్చాత్య సంప్రదాయాలకూ చాలా తేడా ఉంది =
Indian tradition differs a lot from western tradition

b) పండ్ల రంగుల్లో రుచుల్లో చాలా తేడా ఉంటుంది =
Fruits differ from one another in colour and taste

c) బోధించే విధానాల్లో teacher కూ, teacher కూ తేడా ఉంటుంది =
Each teacher differs from the other teacher in methods of teaching

***అభిప్రాయభేదం అయితే differ with.***

a) The son differs with the father in the matter of dowry =
వరకట్నం విషయంలో కొడుక్కూ, తండ్రికీ అభిప్రాయ భేదాలున్నాయి.

b) అక్కడే నేను నీతో విభేదిస్తా =
There I differ with you

**4) Income from** = ఆదాయం వచ్చే మార్గం

a) వ్యవసాయం వల్ల వచ్చే ఆదాయానికి పన్నులేదు=
Income from agriculture is not taxed

b) అద్దెలవల్లవచ్చే ఆదాయంలో 30% పన్ను చెల్లించాలి=
Income from rents is taxed at 30%

**6) Prevent (some one) from (something)** = ఒకరిని ఒక పనిచేయకుండా ఆపటం.

prevent = ఆపటం/ అడ్డగించటం

a) This rain prevents me from going out =
ఈ వర్షం నన్ను బయటికి వెళ్లనీయకుండా చేస్తోంది

b) Kalam ను మరోసారి రాష్ట్రపతిగా ఎన్నుకోనేందుకు రాజకీయ పార్టీలకు ఏమడ్డొస్తోందో నాకర్థం కావటం లేదు=
I don't understand what is preventing the political parties from electing Dr Kalam for a 2nd term/ reelecting Dr Kalam

**7) suffer from** = (ఏదైనా వ్యాధితో) బాధపడటం

వాడు కామెర్లతో బాధపడుతున్నాడు/ వాడికి కామెర్లు
He is suffering from jaundice

(అయితే conversational గా He has jaundice/ He is down with jaundice/ He is laid up with jaundice - అని ఎక్కువగా వినిపిస్తుంటుంది.

suffer from - కష్ట పొందిత్వం.

**8) Relief from** = (బాధలాంటి వాటినుంచి) విముక్తి/ ఊరట

a) వర్షం మండే ఎండల్నుంచి కాస్త ఊరట ఇచ్చింది =
The rain gave us some relief from the heat (of the summer)

b) ఆ stunt, అతి శృంగార సన్నివేశాలనుంచి హాస్యకర సన్నివేశాలు కాస్త విముక్తి కలిగించాయి =
The comic scenes provided us some relief from the stunt and sex scenes.

# from its looks you can say ...

***ప్రశ్న:***

***1.** He is going to Hyderabad on 18th Monday.*

***2.** He will be going to Hyderabad on 18th Monday.*

*పై వాటిలో మొదటిది present continuous tense లోది, రెండోది future continuous tense లోది కదా. వీటి అర్థం, ఏ సందర్భాల్లో వాడతారో వివరించండి.*

**– సురేశ్, హస్నాబాద్**

**జవాబు:**

He will be going to Hyderabad on the 18th Monday - ఇది future continuous = అతడు 18th Monday Hyderabad కు వెళ్తాడని, (Almost the same as he will go to Hyderabad on 18th Monday) అయితే, He will be going ... Monday అనేది, He will go... Monday అనేదాని కన్నా కొంచెం ఎక్కువ certain. ఈ రెండూ అంతకచ్చితం కాదు.



వీటి కంటే ఎక్కువ certain He is going to Hyderabad on 18th Monday ఇది కచ్చితం - తప్పక జరుగుతుంది.

***ప్రశ్న:***

***i)** Recite అంటే కంఠస్థం చేయడమని అర్థం కదా. టీచర్ స్టూడెంట్‌ను పద్యం అప్పజెప్పు అని అడగాలంటే ఇంగ్లిష్‌లో ఏమనాలి?*

***ii)** Exclamatory కి interjection కు ఉన్న తేడాలేమిటి?*

***iii)** Commit, make, do- మధ్య తేడాలేమిటి?*

***iv)** Cheek అంటే బుగ్గ. మరి చెంపను ఏమంటారు?*

***v)** మొట్టికాయలు వేయడాన్ని ఎలా చెప్పాలి?*

**– కె.ఎస్.రావు, మార్టూరు**

**జవాబు:**

**i)** Recite the verse/ poem = పద్యం అప్పజెప్పు.

**ii)** Exclamation,interjection దాదాపు ఒకటే- విపరీతమైన సంతోషాన్ని, బాధను, దిగ్భ్రాంతిని వ్యక్తపరచే శబ్దం, మాట, etc. అయితే exclamation ఒక sentence కావచ్చు. interjection ఎప్పుడూ sentence కాదు. రెండోది, ఎవరైనా మాట్లాడుతున్నపుడు ఇంకొకరు కలిగించే అంతరాయం అనే అర్థం కూడా interjection కు ఉంది.

**iii)** Do అంటే ఏదైనా ఓ పనిచేయటం కదా. I do all the work in the house - అన్ని పనులూ నేనే చేస్తాను. (అయితే do కు ఉన్న ఇతర అర్థాలూ, do తో వచ్చే ఇతర expressions సవివరంగా ఈ pages లో ఇంతకుముందు ఇచ్చాం. పాత lessons చూడండి)

Make అంటే ముఖ్యంగా ఏదైనా తయారుచేయటం- Make food/ Coffee/ tea, etc. Make trouble (Cause trouble అనే అర్థంతో) అని కూడా అంటాం.

Commit అంటే కూడా చేయటమే- అయితే ఇది నేరాలకే వాడతారు. Commit a theft/ suicide/ murder etc. Commit a mistake (తప్పు చేయటం) అనటం, సరి కాదు. Make a mistake అనేది correct expression.

Commit one self/ be committed = దేనికైనా (అభిప్రాయం/ వాగ్దానం లాంటి వాటికి) కట్టుబడి ఉండటం. The Government is committed to the welfare of the people = ప్రభుత్వం ప్రజా సంక్షేమానికి కట్టుబడి ఉంది.

**iv)** కళ్ల కింద ముక్కుకు రెండు వైపులా ఉండే భాగాన్ని మొత్తం cheek అంటారు. బుగ్గలకు వేరుగా చెంపలకు వేరుగా మాటలు లేవు.

**v)** మొట్టి కాయలు వేయటాన్ని rapping with knuckles (నకుల్స్ తో కొట్టడం - knuckles అంటే చేతివేళ్ల joints)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ





M.SURESAN

# His skill comes from practice

**Pradhan:** Tomorrow is Sunday. How I welcome it! I can be free from all work and relax.
(రేపు ఆదివారం. దానికిదే నా స్వాగతం. పనేమీ లేకుండా విశ్రాంతి తీసుకోవచ్చు).

**Vismaya:** How about escaping from a dull Sunday? Why not some outing tomorrow?
(నిస్తేజమైన ఆదివారం నుంచి తప్పించుకో కూడదూ మనం? ఎక్కడికైనా బయటకు వెళితే ఎలా ఉంటుంది? )

outing = సరదాగా ఓ రోజుపాటు ఏ ప్రదేశానికైనా విహారంగా వెళ్లటం.

**Pradhan:** A fine idea! That'll certainly relieve us from a routine Sunday
(చాలా మంచి ఆలోచన! అది మనకు మామూలుగా గడిపే ఆదివారం నుంచి విముక్తిగా ఉంటుంది.)

routine = యథావిధిగా ఒకేలా జరిగే కార్యక్రమం.

**Vismaya:** Let us make it distinct from other Sundays.
(మిగతా ఆదివారాలకూ ఈ ఆదివారానికి స్పష్టమైన తేడా ఉండేట్లు చేద్దాం)

**Pradhan:** I have an idea. Shall we go to our cousins' at Vizag? They'll be very pleased to have us.
(నాకో ఆలోచన వచ్చింది. Vizag లో మా cousins ఇంటికి వెళదాం. మనం వాళ్లతో ఒకటి రెండ్రోజులుంటే సంతోషపడతారు).

**Vismaya:** (Do) you mean those identical twins? How they look alike! Difficult to tell one from another.
(అచ్చం ఒకేలా ఉండే కవల పిల్లలు కదా వాళ్లు? ఒకరికొకరికి తేడా చెప్పటం చాలా కష్టం)

identical= అన్ని విధాల ఒకేరకంగా ఉన్న

**Pradhan:** Even their mother had a problem in their childhood. She distinguished one from the other by having a black thread around the wrist of one of them.
(వాళ్ల అమ్మకు కూడా చాలా కష్టంగా ఉండేది- వాళ్ల చిన్నతనంలో ఒకరికొకరికి తేడా చెప్పటానికి. అందుకని వాళ్లమ్మ వాళ్లలో ఒకరి మణికట్టుకు నల్లదారం కట్టేది గుర్తుపట్టేందుకు)

**Vismaya:** But they are good company. Isn't one of them very good at computers? They say he is an adept at it.
(వాళ్లతో time సరదాగా గడిచిపోతుంది. వాళ్లలో ఒకతను computer లో బాగా నేర్పున్నవాడనుకుంటా)

good company = ఎవరితోనన్నా time సరదాగా గడిచిపోతే వాళ్లు good company.

adept at = నైపుణ్యంగలవాళ్లు

**Pradhan:** His skill comes from practice. He is mad after computers.
(అతని నేర్పంతా పూర్తి అభ్యాసం వల్లనే. అతనికి computers అంటే పిచ్చి)

**Vismaya:** How long has he been practising computers?
(అతనెంతకాలంగా computers practice చేస్తున్నాడు? )

**Pradhan:** Almost from his childhood.
(దాదాపు చిన్ననాటినుంచీ)

**Vismaya:** Is it?

**Pradhan:** His uncle from the states was the inspiration. He is an SW Engineer there.
(అమెరికాలో ఉన్న వాళ్ల మామయ్య అతనికి ప్రేరణ. అక్కడాయన software engineer).

**Vismaya:** Let's go there then.
(అయితే అక్కడికి వెళదాం).

☆ ☆ ☆

మనం ఈ lesson లో preposition 'from' ఉపయోగాలు మరికొన్ని తెలుసుకుందాం.

***Study the following sentences from the conversation above.***

*1) I can be free from all the work and can relax.*

*2) How about an escape from a dull sunday tomorrow?*

*3) That'll certainly relieve us from a routine sunday.*

*4) Let's make it distinct from other sundays*

*5) Difficult to tell one from the other*

*6) Their mother used to distinguish one from the other*

*7) His skill comes from practice.*

**1) be free from** = పని/ బాదరబందీ/ బాధ్యత లేకుండా ఉండటం.

a) He'll be free from all responsibilities once his daughter is married off =
వాళ్లమ్మాయి పెళ్లైపోతే అతనికింకేం బాధ్యతా ఉండదు/ బాధ్యత నుంచి విముక్తుడవుతాడు.

b) He is now a healthy man. He is free from all diseases =
అతనిప్పుడు ఆరోగ్యంగా ఉన్నాడు. అన్ని జబ్బుల నుంచి కోలుకున్నాడు

**2) escape from** = తప్పించుకోవటం, పారిపోవటం.

a) You can never escape from the police if they are really serious =
Police లు నిజంగా శ్రద్ధతో పనిచేస్తే, నువ్వు వాళ్ల నుంచి తప్పించుకోలేవు.

b) Two prisoners have escaped from the jail
ఇద్దరు ఖైదీలు jail నుంచి పారిపోయారు.

**3) relieve from** = విడుదల చేయటం (బాధ, బాధ్యతలు, బరువుల నుంచి)

a) This tablet will relieve you from your headache =
ఈ మాత్ర నీకు తలనొప్పి నుంచి విముక్తి కలిగిస్తుంది
It will give you relief.

b) A further rise in the taxable income level will relieve me from the tax =
పన్నుపడే ఆదాయ పరిమితిలో మళ్లీ పెంపు, నన్ను పన్ను నుంచి తప్పిస్తుంది/ నాకు పన్ను కట్టటం తప్పుతుంది.

**4) distinct from** = విలక్షణంగా ఉన్న-

a) Shakespeare is distinct from other playwrights in English either before him or after him =
అతని ముందరి/ తర్వాత నాటక రచయితలకన్నా Shakespeare చాలా విలక్షణంగా ఉంటాడు.
playwright = dramatist = నాటక రచయిత
play (మామూలు అర్థం, ఆట). Play కు ఇంకో అర్థం - నాటకం. Drama కన్నా కూడా Play నే ఎక్కువ వాడతారు నాటకానికి)

b) Dr Kalam, as a Scientist and President, is distinct from others =
Scientist గా, రాష్ట్రపతిగా Dr. కలాంకు విశిష్టత ఉంది.

**6) distinguish from** = తేడా తెలుసుకోగలగడం/ అర్థం చేసుకోగలగడం.

a) You cannot distinguish one from the other between the twins =
ఆ కవల పిల్లల్లో ఒకరికి, ఇంకొకరికి తేడా తెలుసుకోవటం కష్టం.

b) It is difficult to distinguish a real currency note from a fake note =
నిజమైన currency note కూ నకిలీ currency note కూ తేడా తెలుసుకోవటం కష్టం.

fake = counterfeit = నకిలీ.
to fake = నటించటం.
He faked innocence =
అతడు అమాయకత్వం నటించాడు

ఇదే అర్థంతో tell one from the other వాడతాం. తేడా చెప్పటం/ తెలుసుకోవటం అనే అర్థాలున్న పదాలన్నింటిలో tell one from the other, ఎక్కువగా వినిపిస్తుంటుంది.

Spoken English లో ఈ మాట చాలా తరచుగా వాడుతుంటారు.

a) It is difficult to tell an Indian from a Pakistani
ఇద్దరిలో ఎవరు భారతీయుడో, ఎవరు పాకిస్తానీయో చెప్పటం కష్టం.

b) Just by looking at them, it is difficult to tell a sweet mango from a sour one =
ఆకారాన్ని చూసి, ఏ మామిడికాయ పులుపో, ఏది తీపో చెప్పటం కష్టం.

ఇదే అర్థంతో tell them apart అని కూడా అంటాం.

Bad people and good people look alike. Not possible to tell them apart =
చెడ్డవాళ్లూ, మంచి వాళ్లూ అందరూ ఒకేలా ఉంటారు. ఎవరు మంచో, ఎవరు చెడ్డో చెప్పడం సాధ్యం కాదు.

**7) comes from** = ఇది దానివల్ల/ ఒకటి ఇంకోదానివల్ల జరగటం.

a) He can't do anything on this own. This comes from too much dependence on others =
అతను సొంతంగా ఏం చేయలేడు. అది ఇతరుల మీద ఎక్కువగా ఆధారపడటంవల్ల.

b) He never completes anything in time. This comes from his habitual laziness =
అతనేపనీ పూర్తి చేయడు సమయానికి. అది అతనికి అలవాటయిన సోమరితనం వల్ల వస్తుంది.

---



**ప్రశ్న:** 1. *Being* ను ఎలా వాడాలో తెలియడం లేదు. దీన్ని ఉపయోగించే సందర్భాలు తెలుపండి.

2. *What is your purpose being sent her to the club?* దీని అర్థం వివరించండి.

– కె. శ్రీనివాసరావు, మార్టూరు

**జవాబు:**

Being అంటే మొదటి అర్థం ఉండటం.
Being = to be.
I like <u>being</u> <u>(to be)</u> a CM =
CM గా <u>ఉండటం</u> నాకిష్టం.
I hate <u>being</u> late =
late గా <u>ఉండటం</u> నేనిష్టపడను.
Being తర్వాత past participle వాడతాం- being bowled (bowled - past participle)- అప్పుడు దాని అర్థం bowl చేయబడటం అని. being with us - మాతో ఉండటం; Thank you for being with us: మాతో ఉన్నందుకు thank you.
This being so =
ఇదిలా ఉండటం వల్ల
from this being yours =
ఇది నీదిగా ఉండటం వల్ల
కాబట్టి being = to be = ఉండటం అనేది గుర్తుంచుకుంటే confusion ఏం ఉండదు.

2. What is your purpose in being sent her to the club - ఇది sentence కాదు, అర్థం లేదు కాబట్టి.

**ప్రశ్న:** *'Need'* ను ఎన్ని విధాలుగా వాడవచ్చో వివరించగలరు.

–షేక్ మొహమ్మద్, హైదరాబాద్

**జవాబు:** Verb 'need' ను రెండు రకాలుగా వాడతాం.
(need = అవసరం)

**1.** She needs some dresses- ఇలాంటి sentences లో need అనేది main verb, buy, take, give లాగా.

**2.** She need not come - ఇలాంటి sentences లో verb need come; ఇక్కడ need, helping verb, did not come లో, did లా, does not know లో does లా, do not see లో do లా. కాబట్టి ఇక్కడ needs రాదు.
She needs the books
(ఆ books ఆమెకవసరం)
She need not go now (వెళ్లే అవసరం లేదు. సామాన్యంగా not తో వాడే టప్పుడు, need అనేది helping verb అవుతుంది.)

**ప్రశ్న:**

*1. Please come over to the dais and occupy a seat (or) Kindly come on to the dais and occupy a seat.* రెండింటిలో ఏది కరెక్టు? లేదా ఇంతకంటే మెరుగ్గా ఎలా చెప్పవచ్చు?

*2. Please come down here to a first bench/ come here to first bench.* రెండింటిలో ఏది కరెక్టు. ఇంకా మెరుగ్గా చెప్పవచ్చా?

– అరుణ్, హైదరాబాద్

**జవాబు:** 1) It is neither come on to the dais or come over to the dais - because both of them mean walking to the dais and not getting up the dais. The proper expression is please come up/ go up the dais and take (occupy is literary) your seat.

2) Please come down ('here' not always necessary) to a front (not necessarily 'a first') bench- is good enough.
'Why don't you take a front seat?' 'Please move to the front seat/ front benches' - All these are OK.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# He has opted out of the fray

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 323

M.SURESAN

**Briyesh:** Hi Vinamra, what's hot about the presidential poll?
(రాష్ట్రపతి ఎన్నికల గురించి తాజా వార్త లేంటి? )

hot news = తాజా/ ఆసక్తికరమైన వార్త

**Vinamra:** Good to hear that at least some parties have thought of a second term for Dr. Kalam
(కనీసం కొన్ని పార్టీలయినా Dr. కలాంకు మరోసారి ఆ పదవి ఇవ్వాలనుకోవటం సంతోషకరమైన విషయం.

term = దేనికన్నా ఉండే నిర్ణీత సమయం.
The term of the president of India is five years = భారత రాష్ట్రపతి పదవీ కాలం ఐదేళ్లు.
His first term is up =
ఆయన మొదటిసారి పదవీకాలం ముగిసింది

**Briyesh:** So who are running for the office of the president finally?
(చివరకు రాష్ట్రపతి పదవికి ఎవరెవరు పోటీ చేస్తున్నారు? )

Office - 1) కార్యాలయం - ఇది మనందరికీ తెలుసు.
2) పదవి - ఈ సందర్భంలో అర్థం ఇది.

**Vinamra:** We here that three are in the run for the position.
(ముగ్గురు పోటీలో ఉన్నట్లు వింటున్నాం.)

**Briyesh:** You mean Ms. Pratibha Patil, Bhairan singh Shekavat, and quite likely, Dr. Kalam
(అంటే నువ్వనటం, ప్రతిభా పాటిల్, షెకావత్, బహుశ Dr. కలాం అనే కదా? )

**Vinamra:** I'm afraid Dr. Kalam might opt out of the fray. That'll be unfortunate for India.
(Dr. కలాం పోటీ చేయకుండా ఉండేందుకే ఇష్టపడవచ్చు. అది కాస్త బాధాకరం. భారత్‌కది దురదృష్టమే.)

**Briyesh:** I do agree with you there. Very unfortunate that none of the parties, in the beginning, were in favour of another term for Dr. Kalam. They didn't even think of it.
(ఆ విషయంలో నువ్వు చెప్పేది నేను ఒప్పుకొంటున్నా. దురదృష్టకర విషయమేమిటంటే ఏ పార్టీ కూడా, మొట్టమొదట, Dr. కలాంను రెండోసారి ఎన్నుకోవడానికి సుముఖంగా లేకపోవటం)

**Vinamra:** That is so. The left parties claim they believe in persons with clean record being in such positions. Even they didn't think of Dr. Kalam
(అవును. వామపక్షాలు మచ్చలేనివాళ్లు పదవుల్లో ఉండాలని నమ్ముతామని అంటుంటాయి. అలాంటివాళ్లు కూడా Dr. Kalam గురించి ఆలోచించలేదు)

**Briyesh:** A man of such moral and intellectual stature is inconvenient for them all. Only the 3rd front, whatever their motives, has thought of him and I am sure a majority welcome him.
(అలాంటి నైతిక, మేధాశక్తిగల వ్యక్తి రాజకీయ పార్టీలకు అసౌకర్యంగానే ఉంటారు. వాళ్ల ఆలోచన ఏమయినా, 3rd front వాళ్లు మాత్రమే ఆయన్ను గురించి అనుకున్నారు. ఎక్కువమంది అది స్వాగతిస్తారని నమ్ముతున్నా గట్టిగా)

**Vinamra:** I think if he agrees to be in the run, none of the others will be in the reckoning. They will either withdraw or lose.
(ఆయనే పోటీలోకొస్తే, మిగతా వాళ్లెవరు కూడా గెలుస్తారని అనుకోను. వాళ్లు ఉపసంహరించుకుంటారు లేకుంటే ఓడిపోతారు)

**Briyesh:** Yea. Especially Shekavat. He has said he will withdraw from the fray if Dr. Kalam is agrees to a second term. Perhaps Shekavat doesn't want to be an alsoran.
(అవును. ముఖ్యంగా షెకావత్. Dr. కలాం గనుక రెండోసారి కొనసాగేందుకు ఒప్పుకొంటే తను పోటీనుంచి విరమించుకుంటానని షెకావత్ అన్నారు. బహుశా పోటీచేసి ఓడిపోవటం ఆయనకిష్టం లేదేమో.)

**Vinamra:** Let's wait and see what happens during the run-up to the election
(ఎన్నికల వరకు వేచి చూద్దాం ఏమవుతుందో)

**Briyesh:** That's the only thing we can do.
(మనం చేయగలిగింది అదొక్కటే)

✪ ✪ ✪ ✪

మనం Prepositions గురించి కొద్దికాలంగా చర్చిస్తున్నాం కదా. ఇప్పుడిక్కడ మరికొన్నింటిని తెలుసుకుందాం.

***Look at the following sentences from the conversation above:***

*1) What is hot about the presidential poll?*
*2) Some parties have thought of a second term for Dr. Kalam.*
*3) Who are running for the presidentship?*
*4) We hear three are in the run*
*5) Dr. Kalam might opt out of the fray.*
*6) I do agree with you*
*7) In the beginning none of the parties were in favour of another term for Dr. Kalam.*
*8) Dr. Shekavat has said that he will withdraw from the contest.*
*9) Shekavat doesn't want to be an alsoran.*
*10) Let's wait and see what happens during the run-up to the election.*

**1) Hot about** = ఒక విషయాన్ని/ వ్యక్తిని గురించి తాజా, ఆసక్తికర వివరాలు.

a) I have something hot about Vinod and Visala. They are in love =
వినోద్, విశాల గురించి ఆసక్తికర తాజా విషయం - వాళ్లిద్దరూ ప్రేమించుకుంటున్నారు.

b) **Venkatesh:** What's hot about the stock market? (stock market గురించి తాజా ఆసక్తికర విషయమేమిటి? )
**Naresh:** The shares have crashed.
(share విలువలు కుప్పకూలాయి.)

**2) A second term for Dr Kalam** =
Dr కలాంకు రెండో విడత.

**3) Run for** = ఎన్నికల్లో పోటీ చేయటం.

a) How many are running for the position = ఆ పదవికి ఎంతమంది పోటీచేస్తున్నారు?

b) Dr Kalam is unwilling to run for presidentship a second time =
అధ్యక్షపదవికి రెండోసారి పోటీచేయటం ఆయనకిష్టంలేదు. ఇదే అర్థంతో, అంటే పోటీ చేయటం/ పోటీలో ఉండటం అనే అర్థంతో..

**4) In the run** అని కూడా అంటాం.

a) As of now/ Until now, only two are in the run = ఇప్పటివరకూ, ఇద్దరు మాత్రమే పోటీలో ఉన్నారు.

b) He has announced he is in the run too = తాను కూడా పోటీలో ఉన్నట్లు, ఆయన ప్రకటించాడు. ఒక్కోసారి, In the run = In the fray (ఫ్రే) అని కూడా అంటాం.

fray = పోటీ/ వివాదం/ పోట్లాట.

**5) opt out of** = విరమించుకోవటం.
దీనికి Opposite, opt for = ఎంచుకోవటం, ఇష్టపడటం.
He has opted for Engineering =
అతను Engineering ఇష్టపడ్డాడు.

a) He has opted out of the fray = ఆయన పోటీనుంచి విరమించుకున్నాడు.

b) She has opted out of the committee = Committee నుంచి ఆమె వైదొలిగింది.

**6) Agree with** = ఒకరితో ఏకీభవించటం.

a) I agree with you that Dr Kalam is the best president we have had =
మనకున్న రాష్ట్రపతుల్లో Dr Kalam అత్యంత గొప్పవాడన్న విషయంలో నేను నీతో ఏకీభవిస్తున్నా.

b) She doesn't always agree with her husband = ఆమె ప్రతి విషయంలోనూ/ అన్ని విషయాల్లో తన భర్తతో ఏకీభవించదు.
(Agree తర్వాత ఇతర prepositions కూడా వాడతాం వేరే అర్థాలతో. దాని గురించి తర్వాత తెలుసుకుందాం)

**7) In the beginning** = ప్రారంభంలో

a) In the beginning there were only 30 students in the class

గమనించండి: The beginning/ the end తర్వాత, 'of' రాకపోతే, వాటిముందు 'in' వస్తుంది. అయితే వాటి తర్వాత 'of' వస్తే, వాటిముందు, 'at' వాడతాం. ఇది చాలా ముఖ్యం.

b) In the end, only thirty students remained = చివరికి 30 మంది విద్యార్థులే మిగిలారు.
the end తర్వాత 'of' లేదు. కాబట్టి, the end ముందు 'in' వాడాం.

c) At the end of the class only 30 students remained= Class అయిపోయే చివర 30 మంది విద్యార్థులు మాత్రమే మిగిలారు.
చూశారు కదా - the end తర్వాత of వచ్చింది, కాబట్టి, the end ముందు, at వాడాం.

d) In the beginning, I didn't like him =
At the beginning of our acquaintance I didn't like him = మా పరిచయం ప్రారంభంలో అతనంటే నాకిష్టం లేదు.
(The beginning తర్వాత of రాకపోతే, in.
The beginning తర్వాత of వస్తే, at.)

**8) Withdraw from** = ఉపసంహరించుకోవటం/ విరమించుకోవటం/ Bank నుంచి డబ్బు తీసుకోవటం.
withdraw తర్వాత ఎప్పుడూ from వస్తుంది.

a) He withdrew Rs 4000 from the bank = అతను బ్యాంక్ నుంచి 4000 తీసుకున్నాడు.

b) She withdrew from the beauty contest = అందాల పోటీనుంచి ఆమె విరమించుకుంది.

**9) Alsoran**- ఇది preposition కాదు. అయినా ఉపయోగకరమైన మాట. మీ conversation లో practice చేయండి-
అర్థం: క్రీడల్లో, ఎన్నికల్లో పోటీచేసి ఓడిపోయిన వారిని, alsoran అంటాం. (ఆల్సోరాన్)

a) The alsorans are complaining that the elections were not fair = ఎన్నికలు సక్రమంగా (నిబంధనలకు లోబడి) జరగలేదని ఓడిపోయినవాళ్లు అంటున్నారు.

b) He bet on a horse that was going to be an alsoran= ఓడిపోయే గుర్రంమీద పందెంకాశాడతను.

**10) Run-up (to)** =
ఓ ముఖ్యమైన సంఘటన ముందరి రోజులు.

a) During the run-up to the election =
ఎన్నికల ముందరి రోజుల్లో.

b) Goddess Durga is worshiped in different forms during the run-up for 9 days to Vijayadasami=
విజయదశమికి ముందర తొమ్మిది రోజులపాటు దుర్గాదేవిని వివిధ రూపాల్లో కొలుస్తారు.

c) There were frequent clashes during the run-up to the election=
ఎన్నికల ముందరి రోజుల్లో/ ఎన్నికలయ్యేవరకు చాలా తరచుగా ఘర్షణలు జరిగాయి.
(clash = ఘర్షణ/ పోట్లాట)

---

**Q A**

**ప్రశ్న:** మామిడిటెంక, చేట, గోరింక (పక్షి). వీటికి సమాన ఇంగ్లిష్ పదాలను తెలుపగలరు.
– ఎం.రాజు, చిన్నాయగూడెం (ప.గో.జిల్లా)

**జవాబు:**
1) మామిడిటెంక= the stone of the mango
2) చేట - No word in English
3) గోరింక - Indian myna/ Indian mynah/ myna. (మైనా)

**ప్రశ్న:** *1. When and how to use although, though, eventhough, still and yet.*
*2. What are the meanings and how to use meanwhile, still later, still further, moreover, inspite of, despite of..*
*3. How to write essay writing and precise from the articles of 'the Hindu'.*
*4. How to improve hand writing.*
– పి.మిథున్, అమలాపురం

**జవాబు:**
1. Refer to the lessons from No. 295 onwards. In one of them you find the meanings and use of although, though, even though, still and yet explained in detail.
2. The meanings and use of meanwhile, still later, still further, moreover, inspite of, despite - all these words have been explained too in some of the previous lessons. Click on the computer.
3. That needs other skills. I'm afraid you'll have to wait for some more time for lessons on them.
4. Copy writing is the best way to improve your hand writing.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

## SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 324



M.SURESAN

# Not in the best of moods

**Suvarna:** Hi Rajitha, how are you?
(ఎలా ఉన్నావ్?)

**Rajitha:** Not in the best of moods, you can say. (అసలు మనసేం బాగాలేదు)

**Suvarna:** What happened? (ఏం జరిగింది?)

**Rajitha:** Yesterday was my first day as a teacher, but what a flop it was!
(Teacher గా నిన్న నా మొదటిరోజు, కాని ఎంత విఫలమయ్యానో!)

**Suvarna:** I just can't believe it. I am confident of your teaching ability. You certainly can turnout to be the best of teachers.
(నేను అదసలు నమ్మలేకుండా ఉన్నాను. నీ బోధనాసామర్థ్యం మీద నాకు గట్టి విశ్వాసం ఉంది. ఉత్తమ teacher గా నువ్వు తయారవ్వగలవు.)

**Rajitha:** I thought so too- that I was capable of teaching. But I don't think I impressed my students in my first class.
(నేనూ అలానే అనుకున్నా- నాకు బాగా teach చేయగల సామర్థ్యం ఉందని. కానీ నేను తీసుకున్న మొదటి class లో విద్యార్థుల్లో మంచి అభిప్రాయం కలిగించలేకపోయా.)

impress = మంచి అభిప్రాయం కలిగించటం.

He impressed me in his first appearance itself on the screen = తెరమీద మొదటిసారి కనిపించినప్పుడే అతను నాలో మంచి అభిప్రాయం కల్గించాడు.

**Suvarna:** Don't worry. You are a teacher by choice and you are sure to succeed.
(ఏం ఫర్వాలేదు. Teacher అవ్వాలనేది నీ ఎంపిక. అందు కని నువ్వు teacher గా తప్పక విజయం పొందుతావు).

by choice= మనం ఎంచుకోవటంవల్ల.

He is an engineer by qualification but a cricketer by choice =
అతని విద్యార్హత engineering అయినప్పటికీ, అతను ఎంచుకున్నది cricketer గా ఉండాలని.

**Rajitha:** My choice of teaching as a career was due to the inspiration of our great teachers at high school and college. I am afraid of being a failure as a teacher.
(Teaching వ్యాపకంగా నా ఎంపిక High School, College లో మన గొప్ప teachers ప్రేరణ వల్లనే. Teacher గా విఫలం అవుతానని భయంగా ఉంది).

choice = ఛాయ్స్ = ఎంచుకోవటం.

entirely = పూర్తిగా; due to = అందువల్ల;

inspiration = ప్రేరణ.

**Suvarna:** You've taught only two classes. Two classes can't be an indication of your merit as a teacher =
(నువ్వింతవరకు చెప్పింది రెండు classes. ఈ రెండు classes మాత్రమే నీ ప్రతిభకు సూచిక కాలేవు కదా?)

indication = సూచిక

**Rajitha:** I'm ashamed of myself Suvarna, whatever you might say. My uncle in his time was a great teacher, and I feel I can't prove a worthy niece of his.
(నా గురించి నాకే సిగ్గేస్తోంది. మా మామ ఆయన రోజుల్లో చాలా గొప్ప teacher. నేను ఆయనకు తగిన మేనకోడలునని అనిపించుకోలేనేమోననిపిస్తోంది).

worthy of = తగిన.

No one else is worthy of the President's office except Dr. Kalam =
Dr. Kalam తప్ప ఇంకెవరూ అధ్యక్ష పదవికి తగినవారుకారు.

**Suvarna:** You are not yet a failure. I'm sure you'll improve.
(నువ్వేం విఫలమైనట్లు కాదు. తప్పకుండా మెరుగవుతావు.)

**Rajitha:** All right. Let me hope so.
(సరేలే. అలాగే ఆశిస్తున్నాను/ ఆశించనీ)

⊙ ⊙ ⊙

మామూలు English conversation లో, preposition 'of' వాడే కొన్ని సందర్భాలు తెలుసుకుందాం.

***Study the following sentences from the dialogue between Suvarna and Rajitha:***

*1) Not in the best of moods.*

*2) I am confident of your teaching abilities*

*3) ... that I was capable of teaching*

*4) My choice of teaching was due to the inspiration of our great teachers*

*5) I am afraid of being a failure*

*6) Two classes can't be an indication of your merit*

*7) I am ashamed of myself*

*8) I can't prove a worthy niece of his*

**1) the best of** - ఇక్కడ 'best' superlative degree. మామూలుగా superlative degree తర్వాత ఎప్పుడూ of వస్తుంది.

a) అతను మన నటులందరిలో గొప్పవాడు = He is the greatest of all our actors. (He is the greatest actor of all/ He is the greatest actor అని కూడా అనొచ్చు)

b) గంగ అన్నింటిలో అతి పవిత్రమైన నది= The Ganga is the holiest of Indian rivers.

**2) confident of** = (దేనిలోనైనా) పూర్తి నమ్మకం ఉండటం/ విశ్వాసం ఉండటం.

a) Kesav is confident of success = అతని విజయం మీద అతనికి నమ్మకం ఉంది.

b) The businessman is not so confident of his son's abilities as his successor = తన వారసుడిగా కొడుకు సామర్థ్యం మీద ఆ వ్యాపారవేత్తకంత నమ్మకం లేదు.

successor = వారసుడు

**3) capable of** = సామర్థ్యం ఉండటం.

a) Though old, he is capable of walking long distances = పెద్దవాడయినప్పటికీ, దూరాలు నడిచే సామర్థ్యం ఉందతనికి. (గమనించండి: capable of తర్వాత walking అనే '-ing' form రావటం: capable of తర్వాత noun కూడా వాడొచ్చు)

b) I don't think he is capable of murder = హత్యచేసే సామర్థ్యం అతనికుందని నేననుకోను. (ఇక్కడ capable of తర్వాత murder - noun) దేనిలోనైనా సామర్థ్యంగలవాళ్లను capable అంటాం. - a capable leader, a capable manager, a capable teacher, etc.

**4) choice of** = ఒకరు ఎంచుకోవటం/ ఒకరి ఎంపిక.

a) UPA's choice of Ms Pratibha Patil as the President was a surprise=
అధ్యక్ష పదవికి ప్రతిభా పాటిల్‌ను UPA ఎంచుకోవటం/ UPA ఎంపిక ఆశ్చర్యం కలిగించింది.

b) His choice of Vijayawada for his business is a wise one =
తన వ్యాపారానికి విజయవాడను అతను ఎంచుకోవటం/ అతని ఎంపిక తెలివైనదే.

**5) afraid of** = భయపడటం.

Afraid of తర్వాత కూడా 'ing' form మాత్రమే కాకుండా, noun కూడా వాడవచ్చు.

a) He is afraid of carrying so much large cash = అంత నగదు పట్టుకెళ్లటం అతనికి భయంగా ఉంది. (He is afraid to carry so much large cash - అని to carry లాంటి infinitive వాడొచ్చు)

b) She is afraid of snakes (Noun) =
పాములంటే ఆమెకు భయం.

**6) indication of** = సూచిక.

a) Dark clouds are an indication of rain = కారుమబ్బులు వర్షానికి సూచికలు (సూచిస్తాయి)

b) A player's performance in just one match can't be an indication of his merit =
కేవలం ఒక్క పోటీలో క్రీడాకారుడి ప్రదర్శన అతని ప్రతిభకు సూచిక కాజాలదు. (మామూలుగా తెలుగులో- కేవలం ఒక్క పోటీలో క్రీడాకారుడి తీరును బట్టి అతని ప్రతిభను చెప్పలేం).

**7) ashamed of** = సిగ్గుపడటం (అవమానంతో)

a) Politicians should be ashamed of their corrupt practices= వాళ్ల అవినీతి చర్యలకు రాజకీయ నాయకులు సిగ్గుపడాలి.

b) He felt ashamed of his low score =
తన తక్కువ మార్కులకు అతను సిగ్గుపడ్డాడు.

**8) worthy of:** తగిన విలువగల

If we don't have religious tolerance we are not worthy of being Indians = మనకు మత సహనం లేకపోతే భారతీయులుగా ఉండటానికి తగం. (tolerance = సహనం).



***Q. i)*** *English grammar* నేర్చుకోవడానికి మంచి పుస్తకాలను సూచించగలరు.

***ii)*** *Good morning, Good afternoon and Good evening* లను ఎప్పుడెప్పుడు వాడాలో తెలియజేయగలరు.

**– రవీందర్‌రెడ్డి, హైదరాబాద్**

**A. i)** మీకు అత్యంత ఉపయోగకరమైన grammar book - ఇది regular grammar book కాదు, practice book -

A) Living English Structure by Stannard Allen (Orient Longman's)

B) Examine your English - by Margaret Marisson.

**ii)** సూర్యోదయం నుంచి మధ్యాహ్నం 12 గంటల వరకు (12 noon వరకు) Good morning. 12 noon నుంచి దాదాపు 4 PM వరకు Good Afternoon. ఆ తర్వాత నిద్రపోయే వరకు Good Evening. నిద్రకు ఉపక్రమించేటప్పుడు మాత్రమే Good Night. Good Night తర్వాత మాటలుండవ్.

***Q.*** *సోషల్ లెసన్ చెప్పేటప్పుడు ఏ tenses వాడాలో దయచేసి వివరంగా చెప్పండి.*

**– కె.ఎల్.సుజాత, హైదరాబాద్**

**A.** మీరు teach చేస్తున్నది social studies కాబట్టి, History అయితే అంతా దాదాపు past tense లో ఉంటుంది. Geography, Civics ఇవి ఎక్కువగా present tense లో చెప్పవచ్చు. మీరు చేయాల్సిన ముఖ్యమైన పని- మీరు teach చేస్తున్న class లకు CBSE Schools వాడే NCERT Publish చేసిన Social Studies English Medium books బాగా చదవండి- మీరు చక్కగా English Medium లో teach చేయగలరు.

***Q. i)*** *Persons లో be రూపాంతరాలు am, is, are, was, were కు ఉన్న ప్రాముఖ్యం been (being) కు లేకపోవడాన్ని వివరించగలరు.*

***ii)*** *Predicate should contain a verb in a sentence. కానీ ఈ కింది వాక్యాల్లో verb ను వదిలి predicate ను విడిగా చూపిస్తున్నారు.*

*Subject + Verb Predicate*

*They + Left ______ for Delhi*

*This + is ____ a mango grove*

*Her face + became ___ pale*

*పై వాక్యాల ప్రకారం verb లేకుండా predicate ను వాక్యాల్లో రాయడం సరైన విధానమేనా వివరించగలరు.*

***iii)*** *Study - read వ్యత్యాసాన్ని తెలపండి.*

***- B.Venkateswarlu, Guntur***

**A. i)** been అనేది be కి past participle. Past participle verb కాదు; am, is, are, was, were- ఇవి verbs. been కు ప్రాముఖ్యం ఎందుకులేదు? perfect/ perfect continuous tense, Active, Passive Voice లో been తప్పక రావాలికదా?

**ii)** Predicate అంటే subject గురించి చెప్పే sentence భాగం మొత్తం. మీరు ఇచ్చిన Sentences విషయం:

subject predicate

1. They left for Delhi
2. This is a mango grove
3. Her face became pale

Predicate అంటే subject కాకుండా sentence లోని మిగతా భాగం మొత్తం. అందులో కచ్చితంగా verb ఉంటుంది. verb లేని predicate ఉండదు. అలాంటి group of words, sentences కాదు.

**iii)** Study అంటే ఒక విషయాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడానికో, పరీక్ష కోసమో చదవటం. Read అంటే ఉన్న విషయాన్ని తెలుసుకోవడానికి చదవటం.

a) Students study English, Maths, etc.

b) We read newspapers, magazines, letters, story books, etc.

***Q. i)*** *What is the difference between American English pronunciation and British? Why they got different pronunciation and some spellings.*

***ii)*** *Please give me a good advice to improve spellings.*

***- S. Prakash, Ramachandrapuram***

**A. i)** British English and American English differ a lot in spellings, pronunciation, vocabulary and even in grammar. The difference in American spellings is largely due to Webster, (of Webster's Dictionary fame) who simplified the spelling system a lot. Their (American) pronunciation is different too, because of the influence of a number of European and other races who settled in the US and use English almost as their mother. The space here is too short to answer in full your question, I regret.

**ii)** Divide a word into its syllables and spell each syllable separately. Syllable is an independent sound unit in a word. Take 'sentence'. This word has two syllables - 1) Sen 2) tence. This will help you to spell better.

(1. We don't say, 'a good advice' because 'advice' is uncountable. Please give good advice's correct.

2. Why they got different pronunciation? - the correct form of this question is: Why did they get different pronunciation? Don't feel discouraged at my corrections. Your English is good. It can be better still)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ





M.SURESAN

# ... it is available on the market

**Unnat:** Hi Uttam, it's Govind's birthday on Monday next. (Do you) know that?
(వచ్చే సోమవారం గోవింద్ పుట్టినరోజు. తెలుసా? )

**Uttam:** Yea! He told me of it when we met last. That was on the 12th I think. The birth day is on the 18th, that is, on Monday next, as you say.
(అవును. దాన్ని గురించి మేం పోయినసారి కలుసుకున్నప్పుడు చెప్పాడు, 12వ తారీఖు అనుకుంటా. అతని పుట్టినరోజు 18న, అంటే నువ్వుచెపుతున్నట్లు, సోమవారం)

**Unnat:** He is going to have a good number of guests that day.
(ఆరోజు అతనికి చాలామంది అతిథులు ఉండబోతున్నారు)

**Uttam:** He is quite popular on the campus, and he is quite rich too. So he is making a grand event of it.
(Campus లో వాడికి మంచి ఆదరణ ఉంది, దానికితోడు బాగా ఉన్నవాడు. అందుకనివాడు పుట్టినరోజును ఘనంగా జరుపుతున్నాడు.)

**Unnat:** Yes. He is good at studies too, and equally good at games. He is high on the list of those selected for some award.
(చదువులో, క్రీడల్లోనూ కూడా బాగానే ఉంటాడు. ఏదో బహుమతికి ఎంపికచేసిన వాళ్ల జాబితాలో అతను ప్రథముడు)

**Uttam:** I first happened to meet him on a train. We were surprised to know that we were the same college. On the occasion his parents were with him too.
(అతణ్ని నేను మొట్టమొదట ఓ train లో కలుసుకున్నాను. ఒకే college వాళ్లం అని తెలుసుకుని ఆశ్చర్యపోయాం. ఆ సందర్భంలో వాళ్ల parents కూడా అక్కడే ఉన్నారు.

**Unnat:** He insists on our being at the function punctually.
(మనం function కు time కు ఉండాలని పట్టుబడుతున్నాడు.)

**Uttam:** By the way, did you read that book on personality development our lecturer was talking about?
(అది సరేకానీ, మన lecturer అంటున్న వ్యక్తిత్వ వికాస పుస్తకం చదివావా? )

**Unnat:** I don't think it is available on the market.
(అది market లో దొరుకుతోందని నేను కోవటం లేదు.)

**Uttam:** It's on sale in the book exhibition at a discount. I am going to buy it.
(పుస్తక ప్రదర్శనలో ఆ పుస్తకాన్ని discount లో అమ్ముతున్నారు. నేను కొనబోతున్నాను)

**Unnat:** I think a good number of books on show there are very useful. It's a good opportunity for those who love books.
(అక్కడ ప్రదర్శనలో ఉన్న పుస్తకాలు చాలా ఉపయోగకరం అనుకుంటున్నాను. పుస్తకాల్ని ప్రేమించేవాళ్లకిది మంచి అవకాశం)

**Uttam:** Let's go there this evening.
(ఇవాళ సాయంత్రం అక్కడికి వెళ్దాం)

☺ ☺ ☺ ☺ ☺

*మనం ఇంతవరకూ కొన్ని prepositions గురించి తెలుసుకున్నాం. ఈ lesson లో English లో తరచుగా వచ్చే 'on' ఉపయోగం చూద్దాం.*

*On the table, on the box, on the desk - ఇలాంటి వాటిల్లో on అంటే అర్థం, మీద, పైన అని మనందరకు తెలుసు. సహజమైన English లో on వాడకాలు మరికొన్ని చూద్దాం.*

***Look at the following sentences from the conversation above:***

*1) ... it's Govind's birthday on Monday*
*2) That was on the 12th, the birth day is on the 18th*
*3) He is quite popular on the campus*
*4) He is on the list of those selected*
*5) I first happened to meet him on a train*
*6) Did you read that book on personality development?*
*7) ... it is available on the market*
*8) I think a good number of books on show are useful*

**1, 2) On Monday, on the 12th, on the 18th.**
చూశారు కదా! Days of the week (వారాల పేర్లు) ముందు, dates ముందు on కచ్చితంగా వాడతాం. అయితే తారీఖుల ముందు, on తర్వాత 'the' వస్తుంది. పైన గమనించారు కదా.
ఇంకో విషయం: Day, అది వచ్చే date పక్కపక్కన రాసినప్పుడు, date ముందు on రాదు.
The college reopens on Monday the 12th June.
(order of days, dates and time: మొదట, day, తర్వాత date, month, year, time - ఇదీ వరుస)

The meeting will be held on Tuesday, the 17th of July 2007 at 5 P.M.
Day, dates ముందు on వాడతాం.
అయితే Days, dates ముందు, last, this, that, every and next వస్తే on వాడం.
a) He will start here next Monday.
(వచ్చే సోమవారం- No 'on' before next Monday. On next Monday కాదు)
b) I see him here every 1st.
(ప్రతి నెలా మొదటి తారీఖు నాకిక్కడ కనిపిస్తాడు అతను- on every first కాదు)
c) I will meet him this Saturday.
(అతణ్ని శనివారం కలుసుకొంటున్నాను నేను- on this Saturday అనం)
అయితే ఇది చూడండి.
I'll meet him next Monday =
I will meet him on Monday next.

They came here last Thursday =
They came here on Thursday last
(తేదీల విషయం కూడా ఇంతే)

**3) He is quite popular on the campus.**
Campus = విద్యాలయాల ఆవరణ (College/ School/ University buildings, వాటి చుట్టూ వున్న ప్రదేశం కలిపి)
Campus ముందు, on వస్తుంది, in రాదు.
a) He is the tallest student on our campus
మా విద్యాలయంలో అత నందర్లో పొడుగు.
b) He is the best player on the campus =
ఆ విద్యాలయంలో అతను అందర్లో గొప్ప ఆటగాడు.
అలాగే on the premisses అంటాం. In/ within the premisses కాదు.
premisses (ఎప్పుడూ plural) = ఓ వ్యాపార సంస్థ/ hotel/ factory కి చెందిన buildings, వాటి చుట్టూ వున్న ఆవరణ
a) No smoking on the premisses.
b) I can't allow this on the premisses of my company = నా company ఆవరణలో జరగటం నేనొప్పుకోను.
అలాగే on వాడాల్సిన ఇతర సందర్భాలు (ఈ సందర్భాలన్నింటిలో కూడా తప్పుగా in వినిపిస్తుంటుంది)

**4) On the list** (జాబితాలో)- In the list కాదు
a) His name is the first on the list=
ఆ జాబితాలో అతడి పేరు మొదటిది
b) On the train -
I met him on the train to Mumbai=
Mumbai వెళ్లే train లో కలుసుకున్నానతన్ని.
(in the train కాదు)
c) The food sold on the train (in the train కాదు) is expensive=
train లో అమ్మే ఆహారం ఖరీదెక్కువ.
d) He is now on (in కాదు) the bus to Hyderabad=
అతనిపుడు Hyderabad వెళ్లే bus లో ఉన్నాడు.
e) The Maoists shot him dead on the bus=
మావోయిస్ట్ (మావోఇస్ట్ కాదు) అతన్ని bus లో కాల్చివంపారు.
f) The Police arrested him on the plane to London=
London వెళ్లే plane లో అతన్ని అదుపులోకి తీసుకున్నారు (in the plane కాదు).
అలాగే అమ్మకానికుంది/ అమ్ముతున్నారు అనే అర్థంతో - On the market అంటాం, In the market కాదు
a) The book is on the market=
The book is available in shops
(He is in the market = అతను ఏదో కొనే పనిమీద market లో ఉన్నాడు)
b) There are very good books on the subject on the market =
Market లో ఆ విషయంపైన చాలా మంచి పుస్తకాలున్నాయి.

**6) A book on a subject** = ఒక విషయానికి సంబంధించిన పుస్తకం
a) There are many books on the subject=
ఆ విషయానికి సంబంధించిన పుస్తకాలు చాలా ఉన్నాయి
b) He wrote a book on fashions =
అతను fashions మీద ఓ పుస్తకం రాశాడు.

**8) On sale, on show:**
On sale: అమ్మకంలో ఉండటం
a) The book is on sale=
పుస్తకం లభ్యమవుతోంది / అమ్మకంలో ఉంది.
b) The flowers on show are very attractive=
ప్రదర్శనలో పూలు చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి.




***Q.** కింది వాక్యాల్లో ఏవి సరైనవి?*
*A) i) She broke the bat in two*
*ii) She broke the bat into two*
*B) i) Let's have a break for lunch*
*ii) Lets break for lunch*
*iii) Lets break lunch*
*C) i) It's better you consult a doctor*
*ii) It's better you to consult a doctor*
*D) i) Could you please tell me when the express arrives*
*ii) Could you tell me the arrival of the express*
*E) ing form వాడకూడని పదాలేంటి? love లో ing form వాడొచ్చా? yours lovingly అని రాస్తా రెందుకు? మిగిలినవి ing form లో రాయకపోవడానికి కారణమేంటి?*
*F) Employee, employer లో తేడాలు వివరించగలరు.*

*- డి.గణేష్, పెరుమాళ్ల*

**A.** i) She broke the bat in two, అనటం correct, ఆమె bat ను రెండు ముక్కలుగా విరిచింది అనే అర్థంతో. రెండు ముక్కలే అయితే into two రాదు. ముక్కలు, ముక్కలుగా విరిచింది అనే అర్థంతో అయితే She broke the bat into pieces అనటం correct. గమనించండి: break in two (రెండు ముక్కలు) break into pieces (ముక్కలు, ముక్కలుగా విరవటం)

**B.** i) and ii) రెండింటి అర్థం ఒకటే, రెండూ correct. iii) let's break lunch కి అర్థం లేదు. i) and ii) కు అర్థం, lunch కి విరామం తీసుకుందాం అని.

**C.** i) and ii) రెండూ తప్పు. నువ్వు doctor ను consult చేయటం మంచిది అనేందుకు English లో, You had better consult a doctor, or It's better for you to consult a doctor అనటం correct.

**D.** i) and ii) రెండూ correct. అయితే ii) లో could you tell me the time of arrival / arrival time of the express అంటే అర్థం clear గా ఉంటుంది. i) and ii) కు అర్థం ఒకటే అయినా, పైన సూచించిన సవరణలతో రెండూ correct. అయినా, Could you please tell me when the express arrives, అనేది better.

**E.** '-ing' form, ఏ verb తో అయినా వాడవచ్చు. His loving her (అతడామెను ప్రేమిస్తుండటం) is known to all (అందరికి తెలిసిందే)- loving ఇక్కడ తప్పు లేదు. '-ing' form ఎక్కడైనా ఏ verb తో అయినా వాడొచ్చు వాడకూడనిది: am + ing/ is + ing/ are + ing. అంటే am/ is/ are లతో కలిపి కొన్ని '-ing' forms వాడం. అలాంటి వాటిల్లో love ఒకటి. Am loving/ is loving/ are loving - wrong. దీని బదులు love/ loves అంటాం. am+ing/ is+ing/ are+ing వాడని verbs list ఇదివరకటి lessons లో, ఇటీవల Pratibha plus లో ఇచ్చాం.

**F.** Employee= ఉద్యోగస్థుడు/ ఉద్యోగి. Employer = ఉద్యోగం ఇచ్చేవాళ్లు/ ఉద్యోగంలో నియమించేవాళ్లు.
e.g: The proprietors of any company are the employers and the people who work for salaries or wages are the employees.
కంపెనీ యజమానులు- employers. వాళ్లితరులను ఉద్యోగాల్లో నియమిస్తారు. ఆ సంస్థలో జీతానికి పనిచేసేవాళ్లు (ఉద్యోగులు) employees. అలాగే
a) Trainer - శిక్షకుడు,
Trainee - శిక్షణ పొందేవాడు
b) Examiner - పరీక్షించేవాళ్లు
Examinee - పరీక్షించబడేవాళ్లు/ పరీక్ష రాసేవాళ్లు. ఇలా -er (ఓ పని చేయించే వాళ్లు) -ee (ఆ పనిచేసేవాళ్లు) తో వచ్చే మాటలు పరిశీలించండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

# We were on holiday in Kashmir

**Sampada:** It's you Sanjana. Aren't you supposed to be on holiday? How come I see you here now? (నువ్వా, సంజనా? సెలవుల్లో ఎక్కడికో వెళ్లావని అందరూ అనుకోవటం లేదా? / అనుకొంటున్నారే. నువ్విక్కడ కనిపించడం ఏంటి? )

Aren't you supposed to be? = అందరూ నీ గురించి అనుకోవటం లేదా? = అనుకుంటున్నారు.)

**Sanjana:** Yea. But we were back the day before yesterday. And on my return I had to rush to our village to see my grand dad. I came back this morning.

(అవును. మొన్న తిరిగొచ్చాం. వెంటనే పెదనాన్నను చూడటానికి మా ఊరెళ్లాను. మళ్లీ ఈ రోజు పొద్దున్నే వచ్చా.)

**Sampada:** How is he? (ఆయన ఎలా ఉన్నారు? )

**Sanjana:** He is quite old you know. He has been on medicines for three weeks now, and was on liquid diet for a whole week the week before last. But he is on the way to recovery.

(ఆయన చాలా పెద్దాయన కదా. గత మూడు వారాలుగా మందులమీదే ఉన్నాడు. అంతకుముందు వారమంతా ద్రవాహారంతోనే ఉన్నాడాయన.కానీ ఇప్పుడు కోలుకుంటున్నాడు. diet = డయట్ - ఆహారం/ పథ్యం (రోగులు తీసుకునే పరిమిత ఆహారం)

**Sampada:** Glad to hear that. How was your holiday?

(పోనీలే. సంతోషమే. మీ విహారం ఎలా ఉంది? / ఎలా జరిగింది? )

**Sanjana:** Oh, fine. We enjoyed every minute of it. We spent a lot of time on the beaches of Goa. Dad's friend here has a cottage on the coast, and we stayed there.

(చాలా సరదాగా గడిచింది. ప్రతిక్షణం ఆనందించాం. గోవా beach లో చాలసేపు గడిపాం. మా నాన్న స్నేహితుడికి సముద్ర తీరంలో ఓ cottage ఉంది. అక్కడే మేమున్నాం)

**Sampada:** What else then? (ఇంకేంటి? )

**Sanjana:** Yes, I forget to tell you something interesting. One morning I went shopping alone at the end of it, I was shocked to find I had not a paisa on me. Felt very embarrassed. Then I suddenly remembered I had the bank card. What a relief I felt you know.

(అవును. అన్నట్టు ఒక ఆసక్తికరమైన విషయం చెప్పటం మరిచా. ఒకరోజు నేనొక్కదాన్నే Shopping కు వెళ్లా. అంతా అయిన తర్వాత నాదగ్గర ఒక్కపైసాకూడా లేదని గ్రహించా. ఎంత ఇబ్బందిగా feel అయ్యానో! అప్పుడు ఉన్నట్టుండి గుర్తొచ్చింది. Bank card ఉందని. అబ్బ! బయటపడ్డాను కదా అన్పించింది.)

**Sampada:** I saw a similar situation on the TV once. In one of the serials a character eats at a restaurant and see that he hasn't a paisa on him.

(ఓసారి TV లో ఇలాంటి సన్నివేశాన్నే నేను చూశాను. ఒక Serial లో ఓ పాత్రదారుడు హోటల్‌కెళ్లి అంతా తిన్న తర్వాత తన దగ్గర పైసా లేదని తెలుసుకుంటాడు)

**Sanjana:** You know what was on my mind then? That I'd be made to do some work there, as they show it in the movies.

(అప్పుడు నాకొచ్చిన ఆలోచన ఏంటో తెలుసా? సినిమాల్లో చూపించినట్టు నాతో ఏదైనా పనిచేయిస్తారేమోనని)

**Sampada:** Thank your bank card. It saved you.

(Bank card ఉంటం మంచిదైంది. అది నిన్ను రక్షించింది.)

'on' ఉపయోగించే సందర్భాల గురించి తెలుసుకుంటున్నాం కదా. ఈ lesson లో అలాంటి మరికొన్ని సందర్భాలు చూద్దాం.

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 326


M.SURESAN

**Study the following sentences from the conversation above:**

1) Aren't you supposed to be on holiday.
2) But on my return I had to rush to my village.
3) He has been on medicines, and was on liquid diet for a week.
4) We spent a lot of time on the beaches of Goa.
5) Dad's friend has a cottage on the coast.
6) I was shocked to find I had not a paisa on me.
7) I saw similar situation on the TV once.

1) On holiday. Holiday అంటే తెలుసు కదా? సెలవు రోజని. అయితే ఈ సందర్భంలో holiday కు అర్థం సెలవుల్లో/ సెలవుపెట్టి/ సెలవు తీసుకుని, ఎక్కడికైనా వినోద విహారాలకు వెళ్లడం. ఇలాంటి అర్థంతో holiday వాడినప్పుడు మామూలుగా holidays అనం. Holiday (singular) అనే అంటాం. దాని ముందు 'a' వాడం. Holiday ముందు ఎప్పుడూ on వస్తుంది.

a) We were on holiday in Kashmir last summer = పోయిన వేసవిలో మేము కాశ్మీర్లో గడిపాం (ఉల్లాసంగా)

b) You can't see her for a week. She has gone on holiday = ఆమెను మీరు వారం వరకు కలుసుకోలేరు. ఆమె సెలవు (వినోద విహారాల కోసం) పై వెళ్లింది.

[A holiday= సెలవు రోజు (During holidays (ఇక్కడ plural) = సెలవుల్లో. Vacation = విద్యాలయాలు దసరా, వేసవికి ఇచ్చే సెలవు రోజులు)

2) On my return = తిరిగిరాగానే, వచ్చిన వెంటనే. ఏదైనా సంఘటన జరిగిన వెంటనే అనే అర్థంతో on వాడతాం.

a) On her return home she found all doors open and her jewellry missing = ఇంటికి తిరిగి రాగానే/ వచ్చిన వెంటనే, తలుపులన్నీ తెరచిఉండటం, నగానట్రా కనిపించకపోవటం గమనించింది.

b) On his arrival here he drove to the hotel = ఆయనిక్కడికి చేరగానే/ చేరిన వెంటనే hotel కు car లో వెళ్లాడు.

3) On medicines, on liquid diet, etc.= మందులతో, ద్రవాహారంతో రోజులు గడపటం.

a) The patient has been on antibiotics for the past one week = ఆ రోగి వారం రోజులుగా antibiotics మీద ఉన్నాడు/ antibiotics తీసుకుంటున్నాడు.

(Antibiotics = రోగాలను కలిగించే క్రిములు (bacteria)ను చంపే మందులు)

b) I've been on diet for the past two days. గత రెండు రోజులుగా పథ్యం పుచ్చుకుంటున్నాను/ పథ్యం మీద ఉన్నా/ పరిమితాహారం మీద ఉన్నా.

On liquid diet, on fruit diet, on milk and bread, etc.

ఇవి వాడాల్సిన సందర్భాలు చాలా తరచుగా ఉంటాయి. Practice చేయండి.

4) On the beaches of Goa గోవా సముద్ర తీరంలో / తీరసమీపంలో

a) You find beautiful Yellow sands on the beaches of the bay of Bengal= బంగాళాఖాతం తీరం వెంబడి అందమైన పసుపు ఇసుకతో సుందరంగా ఉంటుంది.

ఇవి గమనించండి: On the sea coast, on the banks of a river, etc (నదీ/సముద్ర తీరంలో/ తీరం వెంబడి అనే అర్థంతో)

a) Vijayawada is on the banks of the Krishana (ఇదే అర్థంతో Vijayawada is on the Krishna అని కూడా అనొచ్చు)

Hyderabad is on the Musi లాగా. అంతేకాకుండా డబ్బు, సమయం ఒకదానికి వెచ్చించటం అనే అర్థంతో spend on అంటాం.

a) The Government has spent Rs Twenty lakh on the project= ప్రభుత్వం ఇంతవరకు ఆ project కోసం రూ. 20 లక్షలు ఖర్చు చేసింది.

b) He spent a lot of time on such an unimportant matter= అలాంటి ప్రాముఖ్యం లేని విషయం మీద అతను చాలా సేపు గడిపాడు

6)... I had not a paise on me.

నా దగ్గర పైసాకూడా లేదు

డబ్బు ఒకరి దగ్గర ఉండటం/ లేకపోవటం అనే అర్థంతో on వాడతాం

a) The cash on me worried me a lot= నా దగ్గర ఉన్న నగదు నాకు ఆదుర్దా కలిగించింది.

b) At any time you can find on him at least a thousand rupees = ఏ సమయంలో అయినా వాడి దగ్గర కనీసం 1000 రూపాయలుంటాయి.

c) How can you go shopping without money on you?= చేతిలో డబ్బు లేకుండా shopping ఏమిటి?

ఈ uses of on బాగా Practice చేయండి

ప్రశ్న:

1. Depends on, Depends upon తేడా తెలియజేయగలరు.
2. Articles గురించి పూర్తి సమాచారం తెలిపే పుస్తకం ఏమైనా ఉంటే తెలపండి.
3. Designation దీని pronunciation చెప్పండి.
4. మనసులో ఇంత బాధ దాచుకుని ఎలా ఉండగలుగుతున్నావు? (ఇంగ్లిష్‌లో)
5. పేపరులో Wee hours అనే పదం కనపడుతుంది. దీని అర్థం ఏమిటి?
6. English perfect గా మాట్లాడాలంటే ఏం చేయాలి?
7. ఇంగ్లిష్ బైబిల్‌లో for తో వాక్యం మొదలవుతుంది. ఎలా?

—జి. వెంకటేష్, కరీంనగర్

జవాబు

1. దీన్ని గురించి ఇంతకుముందే వివరించాం.
2. Living English Structure by Stannard Allen. Published by Orient Longmans.
3. dezigneiʃn డెజిగ్‌నెయ్‌షన్ (జి, size లో జ్ లాగా)
4. How are you able to get on with your heart burdened with so much of anguish/with such a lot of anguish?
5. Wee అంటే ఒక అర్థం చాలా తక్కువ అని /చిన్న అని. In the wee hours of the morning అంటే అర్థం రాత్రి 12 గంటలు దాటిన తర్వాత, ఒకటిరెండు గంటల వరకు.
6. English perfect గా మాట్లాడేందుకు ఒకటే మార్గం - అవకాశం ఉన్నప్పుడల్లా ఇంగ్లిష్ మాట్లాడటం. వీలైనప్పుడల్లా ఇంగ్లిష్ స్టోరీ బుక్స్ చదవడం(చిన్న చిన్న స్టోరీ బుక్స్‌తో మొదలుపెట్టి) ఇంగ్లిష్ న్యూస్ టెలికాస్ట్ వినడం.
7. అలా వాక్యం For తో మొదలవ్వొచ్చు ఇక్కడ For అంటే because(అందువల్ల అని/ కాబట్టి అని)

God punished him. For he is a sinner.

దేవడతన్ని శిక్షించాడు. అతడు పాపి కాబట్టి.

ప్రశ్న: English Idioms నేర్చుకోవడానికి 'Cambridge International Dictionary of Phrasal Verbs' or 'Cambridge International Dictionary of Idioms' రెండింటిలో ఏది ఉపయోగామో తెలపగలరు?

– దివ్య చందన, కర్నూలు



జ. You have to use both of them, because not all phrasal verbs are idioms and not all idioms are phrasal verbs. But more important than these books. Your reading as much as English as you can, helps you to pick up idiomatic expressions in current use. Read english newspapers, English short stories and novels. This is the best and easiest way to learn idiomatic expressions. If you depend only on dictionaries you may know their meanings but not always how to use them correctly.

**ప్రశ్న: ఇంగ్లిష్‌లో Question Tags లేకపోయినా తెలుగులో కదా? కాదా? ఔనా? లేదా? అని వాడటం సరైనదేనా?**

**–బి.సత్తిబాబు, కడియం**

జ. చాలా మంచి doubt. కదా? కాదా? ఔనా? లేదా? అని మనం తెలుగులో అనేందుకు English లో Question Tags వాడుతుంటాం. అయితే ఒక్కొక్కప్పుడు Question tags లేకపోయినప్పటికీ భావం సరిగా తెలిపేదుకు కదా అని వాడితే effective గా ఉంటుంది. e.g. You have the money. Why don't you spend it?- దీన్ని తెలుగులో, నీ దగ్గర డబ్బుంది. ఎందుకు ఖర్చు పెట్టవు? అనేలా కంటే నీ దగ్గర డబ్బుంది కదా? ఎందుకు ఖర్చు పెట్టవు? అంటే కొంచెం ఎక్కువ power చూపిస్తుంది కదా? అందుకనే చాలాసార్లు English లో Question tags లేకపోయినప్పటికీ, కదా? అని అనువాదంలో చేర్చి రాస్తారు. English లో ఉన్నది ఉన్నట్లుగా తెలుగులోకి అనువాదం చేస్తే భావం సరిగ్గా రాదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 327


M.SURESAN

# I go on my own...

**Archana:** Wherever did you buy that dress, Vennela?
(చూసి చూసి ఎక్కడ కొన్నావే ఆ dress?) Wherever = ఎక్కడైనా అని మామూలు అర్థం. ఇలాంటి Questions లో అయితే చూసి, చూసి ఎక్కడ? అని.

Wherever did you pick up such a servant?
(అలాంటి నౌకరు ఎక్కడ దొరికాడో - అంత కంటే నౌకరు దొరకనట్లు అనే అర్థంతో)

**Vennela:** Why? Don't you like it? (ఏం? నీకిది నచ్చలేదా? )

**Archana:** It isn't as good as your other dresses are. Why do I see you in bad dresses on occasion?
(నీ ఇతర dress లంత బాగా లేదది. అప్పుడప్పుడు నువ్వు బాగాలేని dresses లో కనిపిస్తావెందుకు? )

**Vennela:** You know, my expenditure on clothes isn't much. It doesn't exceed Rs 3000/- to Rs 4000 on average.
(నీకు తెలుసా దుస్తుల మీద నా ఖర్చు సగటున నెలకు 3000 నుంచి 4000 రూపాయలకు మించదు.
(exceed = మించటం/ అధిగమించటం)

**Archana:** You don't seem to spend much on conveyance either. I see you most of the time going on foot. Not often do I see you on your scooter.
(నువ్వు ఎక్కడికైనా వెళ్లినా వాహనాల మీద అంత ఖర్చు పెడుతున్నట్టు కనిపించవు. ఎప్పుడూ నడిచివెళుతుంటావు. నీ scooter మీద వెళ్తున్నట్లు కూడా అంత కనపడవు. )
(Conveyance = రాకపోకలకు వాడే వాహనాలు)

[Pramod: What's your conveyance to office?
(Office కు ఎలా వెళతావు? )

Prasanna: The city bus.
(conveyance allowance = (పనిచోటు నుంచి ఇంటికి అయ్యే ప్రయాణ ఖర్చులకిచ్చే భత్యం)]

**Vennela:** Who do you take with you when you buy your dresses?
(నువ్వు dresses కొనేటప్పుడు ఎవరిని తీసుకెళతావు. )

**Archana:** Mom. What about you?
(మా అమ్మను. నీ సంగతేంటి? )

**Vennela:** Iam on my own. I walk because I get excercise. I go on my own because I depend on myself.
(నేను ఒంటిరిగానే వెళతా. నేను ఎక్కువగా నడుస్తా exercise కోసం. నామీదే నేనాధార పడటం నాకిష్టం కాబట్టి నేను ఒంటరిగా వెళతా. )

**Archana:** But you are yet to tell me where you bought the dress?
(అసలింతకీ ఆ dress ఎక్కడ కొన్నావో చెప్పలేదు)

**Vennela:** Not so well known. It is on the road to the railway station. It is on the left of the National Bank there.
(అదంత పేరున్న / అందరికీ తెలిసిన shop ఏంకాదులే. Railway station కు వెళ్లే రోడ్డులో నేషనల్ బ్యాంక్ పక్కన ఉంది. )

Prices of dresses have come down.
(dresses ధరలు తగ్గాయి)

**Archana:** I don't know about clothes, but gold prices are up by 10% on last year.
(దుస్తుల విషయం నాకు తెలియదు కానీ బంగారం మాత్రం కిందటేడాది కంటే 10 శాతం పెరిగింది. )

**Vennela:** That's true. Every day I watch the prices on the TV.
(అవును ప్రతిరోజూ నేను TV లో ధరలు చూస్తాను. )

**Archana:** That reminds me. Did you watch the programme on channel 99 yesterday? It was really exciting.
(ఆ మాటంటే గుర్తొచ్చింది. నిన్న నువ్వు channel 99 లో వచ్చిన programme చూశావా? . చాలా ఉత్సాహం కలిగించేలా ఉంది. )

**Vennela:** I missed it. OK. I must be going. Bye.
(నేను చూడలేదు. నేవెళ్లాలి. Bye)

Preposition 'on' వాడే మరికొన్ని సందర్భాలు చూద్దాం.

**Look at the following sentences from the conversation above:**

1) Why do I see you in bad dresses on occasion
2) My expenditure on clothes isn't much
3) It doesn't exceed... on average
4) I see you most of the time going on foot
5) Not often do I see you on your scooter
6) I am on my own/ I go on my own
7) I depend on myself
8) It is on the road to the railway station
9) It is on the left of the National Bank
10) But gold prices are up by 10% on last year
11) I watch the prices on the TV
12) Did you watch the programme on channel 99?

**1) On occasion:** occasion = సందర్భం.
on that occasion - ఆ సందర్భంలో.
on occasion = అప్పుడప్పుడు.

a) He does smoke but on occasion = అతను smoke చేస్తాడు అయితే అప్పుడప్పుడు.

b) On occasions like the Independence Day, We specially honour the national flag = స్వాతంత్ర్య దినోత్సవం లాంటి సందర్భాల్లో మనం జాతీయ పతాకానికి ప్రత్యేక గౌరవాన్నిస్తాం.

ఇలా occasion ముందెప్పుడూ 'on' వాడతాం.

**2) Expenditure on something.**
(దేనికైనా పెట్టే ఖర్చు వ్యయం)

a) His expenditure on luxuries is little = విలాసాలకు అతను పెట్టే ఖర్చు దాదాపు లేనట్లే/ అతను విలాసాలకు ఖర్చుపెట్టనట్లే.

b) Her expenditure on her dresses is very high = ఆమె దుస్తులమీద ఎక్కువేఖర్చు పెడుతుంది.

**3) on average** = సగటు.

a) I see two movies a month on average = సగటున నెలకు రెండు సినిమాలు చూస్తాను.

b) On average we spend Rs 200 on transport = మా సగటు రవాణా ఖర్చులు నెలకు 200 రూపాయలు.

**4) On Scooter:** మామూలుగా top ఉన్న వాహనాల్లో ప్రయాణం అయితే, by bus, by car, by plane, by train, etc అంటాం. Top లేని వాహనాలైతే, on bike, on scooter, on cycle, on horse, etc.

**5) on foot** = కాలి నడకన.

a) I went all the way on foot = ఆ మొత్తం దూరం నడిచాను.

b) He is too old to come here on foot = అంత దూరమూ నడవలేనంత పెద్దాయన ఆయన.

(He went on foot = He footed the distance = He walked.)

**6) I am on my own -** ఇది చాలా ఉపయోగకరమైన expression. దీని అర్థం: నా అంతట నేనే/ ఒంటరిగా.

a) I don't have any company. I am on my own = నాకు ఎవరి సాహచర్యం లేదు. నా అంతట నేనే ఉన్నాను/ ఒంటరిగా ఉన్నాను.

b) Once you join the hostel, you are on your own. You have no one to take care of you = Hostel లో చేరితే, నీ అంతట నువ్వే ఉంటావు. నిన్ను చూసుకునేందుకు ఎవరూ ఉండరు.

c) He did it on his own. No one helped him = అతడది తనంతట తానే చేశాడు. ఎవరూ సహాయం చేయలేదు.

d) Without waiting for any one, she started on her own= ఎవరికోసమూ ఎదురుచూడకుండా తనంతట తానే/ ఒంటరిగా బయలు దేరింది.

**7) Depend on =** ఒకరి మీద, ఒక దానిమీద ఆధార పడటం.
Depend తర్వాత on/ upon.

a) Kumar depends on his mother for everything = ప్రతి విషయంలో కుమార్ వాళ్లమ్మ మీద ఆధారపడతాడు.

b) Her mother and father gone, Sasi has none to depend upon = తన తల్లిదండ్రులు వెళ్ళిపోవటంతో శశి ఆధారపడటా నికెవ్వరూ లేరు.
(Sentence మధ్యలో depend on, sentence చివ రైతే depend upon)

**8) On the road/ on the way =** దారిలో, road లో; on the street = ఆ వీధిలో

a) I met him on the road
b) The bank is on the next road

9) On the left, on the right = ఎడమవైపు, కుడివైపు

a) The shop is on the left of the bank = ఆ shop, bankకు ఎడమ వైపు ఉంది.
(To the left, to the right అని కూడా అనవచ్చు)

b) The bank is to the right of the shop.
(Shopకు కుడి వైపు Bank ఉంది).

**10) On last year =** కిందటి సంవత్సరం మీద/ కిందటి సంవత్సరం కంటే - అయితే ఇలా వాడినప్పుడు, upon అంటాం.

a) The percentage of passes this year are up on last year = ఈ ఏడాది ఉత్తీర్ణతా శాతం గత సంవత్సరంకంటే ఎక్కువ.

b) His earnings are up on last year = అతని సంపాదన గత సంవత్సరం కంటే పెరిగింది.

**11), 12).** TV, Radio లో Programme చూడటం, వాటిల్లో Programme రావటంలాంటి వాటిని, on the TV, on the radio, on the channel అంటాం In కాదు.

---



కింది వాక్యాల అర్థాలు, ప్రయోగాలను తెలియజేయండి.
1. Be on cloud nine 2. Herculean Task
3. At arm's length 4. To pour cold water
5. To cry over spilt milk.

ఎ.వడివేలు, ఆదోని.

**1. Be on cloud nine =** అంతులేని ఆనందంతో ఉండటం. He was on cloud nine when the girl he loved agreed to marry him.

**2. Herculean task =** హెర్క్యులియన్ task - అతికష్ట మైన/ దాదాపు అసాధ్యమైన పని.
freeing India from poverty is a Herculean task = భారత్‌ను పేదరికం నుంచి విముక్తి చేయటం చాలా, చాలా కష్టమైన పని.

**3. At arm's length =** మనం చేయి చాచేంత దూరం.
He was at arm's length from me = అతడు నా చేయి చాచినంత దూరంలో ఉన్నాడు.
దీంతో వచ్చే idiom: Keep (somebody) at arm's length = దీనికర్థం, ఒకరిని మనతో ఎక్కువ చనువు తీసుకోకుండా ఎంతదూరంలో ఉంచాలో అంతదూరంలో ఉంచడం.

a) Keep him at arm's length = నీతో అతడిని ఎక్కువ చనువు తీసుకోనీకు.
(అతడితో నువ్వు మరింత సన్నిహితంగా మెల గొద్దు).

b) Though she talks to the boys of her class, she keeps them at arm's length to avoid trouble = ఆమె తన class మగపిల్లలతో మాట్లా డినా, వాళ్లకు చనువివ్వదు, ఏ సమస్యలూ రాకుండ ఉండేందుకు.

**4) To pour cold water:** ఉత్సాహాన్ని నీరుగార్చటం/నిరుత్సాహపరచటం, మన ఆలోచనల్ని, plans ను విమర్శించటం/ఆమో దించకపోవటం.
(దీనికి ఇంకో రూపం: To throw cold water.)

a) Our manager pours cold water on every plan we come up with = మా మేనేజర్ మేం ప్రతిపాదించే ప్రతి ప్రతిపాదననూ తిరస్కరించి / విమర్శించి మాకు నిరుత్సాహం కలిగిస్తాడు.
(He can't accept any plan that it isn't his own)

b) He threw cold water on our plans for a picnic by refusing to lend his van in the last minute = పిక్నిక్‌కు వెళ్లేందుకు చివరి నిమిషంలో తన van ఇవ్వ డానికి తిరస్కరించి మా ఉత్సాహం నీరుగారిపోయేలా చేశాడు.

**5) To cry over spilt milk =** ఒలికిపోయిన పాలకోసం చింతించటం.
(ఒకరకంగా చేతులు కాలాక ఆకులు పట్టుకోవటం).

e.g. Someone has stolen your bike. True. You ought to have been more careful. No use crying over spilt milk= నిజమే. నీ bike ఎవరో దొంగించారు. నువ్వింకొంచెం జాగ్రత్తగా ఉండాల్సింది. ఇప్పుడు చింతించి ప్రయోజనం లేదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 328

# I know what's on your mind

**Chalam:** Your medicine has had a good effect on me. I feel much better today, though not all right.
(నీ మందు నా మీద మంచి ప్రభావమే చూపించింది/ బాగానే పనిచేసింది. చాలా మెరుగ్గా ఉంది నా పరిస్థితి ఇవాళ, పూర్తి స్వస్థత లేకపోయినా)

**Kundan:** If my train had been on time, I couldn't have given you the medicine. You are lucky that way.
(నా train time కు వచ్చుంటే నీకు ఆ మందు ఇవ్వలేకపోయేవాడినే నేను. ఆ విధంగా నువ్వదృష్టవంతుడివి)

**Chalam:** I approached you on my brother's suggestion. I didn't know you had the medicine for this kind of complaint.
(మా brother సూచన మేరకే నేను నీ దగ్గర కొచ్చాను. ఇలాంటి బాధ/ జబ్బుకు నీ దగ్గర మందుందని నాకు తెలియదు)

**Kundan:** It is home made. I got it from my father and he had it from his father. We make the medicine on the eve of Ugadi.
(ఇది ఇంటి వైద్యం. మా నాన్న దగ్గర నుంచి దానిని నేను నేర్చుకున్నా. ఆయన వాళ్ల నాన్న దగ్గర నుంచి తెలుసుకున్నాడు. ఉగాది ముందురోజు మేమీ ఔషధాన్ని తయారుచేసి పెట్టుకుంటాం)

**Chalam:** My brother says that it gives on the spot relief to some.
(కొంతమందికి ఈ మందు తక్షణ నివారణ ఇస్తుందంటాడు మా brother)

**Kundan:** It certainly does. When it was on trial in the beginning, it acted immediately, it seems.
(కచ్చితంగా. ఆ మందు మొదటి ప్రయోగాల్లో అది వెంటనే పనిచేసేదట.)

It seems = అలా అనిపిస్తోంది/ కనిపిస్తోంది

**Chalam:** Well, on behalf of all the victims of this complaint, and on my behalf, I thank your grand father for developing it.
(అయితే ఈ వ్యాధి/ బాధ, బాధితులందరి తరపున, నా తరపున మీ తాతకు కృతజ్ఞతలు- ఇంత మంచి మందు రూపొందించినందుకు)

**Kundan:** Don't be so formal, Chalam
(అంత formal గా ఉండకు)

formal - కొత్త/ పెద్ద/ పరిచయం అంతగా లేని వాళ్లతో ప్రవర్తించే తీరు - చనువు తీసుకోకుండా

**Chalam:** I get this trouble on and off you know.
(ఈ బాధ నాకప్పుడప్పుడూ వస్తూంటుంది)

**Kundan:** Just don't worry. I know what's on your mind. You want to be sure it will cure you permanently.
(ఏం ఆదుర్దాపడకు. ఈ క్షణంలో నీ మనసులో ఏముందో నాకు తెలుసు. ఈ మందు నీకు శాశ్వత నివారణ ఇస్తుందా అనే నమ్మకం కావాలి నీకు)

**Chalam:** You've hit the nail on the head.
(చాలా correct గా చెప్పావు)

**Kundan:** Just go on taking this medicine for another week. You will be rid of the trouble for ever.
(ఇంకోవారంపాటు ఈ మందు తీసుకుంటూండు. ఈ బాధ శాశ్వతంగా విరగడవు తుంది)

be rid of = వదిలించుకోవటం/ విరగడవటం

**Chalam:** Thank you again and again.
(మళ్లీ మళ్లీ thanks)

**Kundan:** Not at all. (ఏం ఫర్వాలేదు)

☺ ☺ ☺ ☺ ☺

గత కొన్ని lessons గా preposition on ఉపయోగించాల్సిన సందర్భాలు తెలుసుకుంటున్నాం. On ఉపయోగించటం, ఉపయోగించకుండా ఉండటం అనేదాన్నిబట్టి అర్థం పూర్తిగా మారిపోయే ప్రమాదం చాలా ఉంది. కాబట్టి మన communication సరిగా ఉండాలంటే వాడాల్సినచోట on correct గా వాడాలి.

On వాడాల్సిన మరికొన్ని సందర్భాలిప్పుడు చూద్దాం!

***Study the following sentences from the conversation above:***

1) *Your medicine has had a good effect on me*
2) *If my train had been on time*
3) *I approached you on my brother's suggestion*
4) *We make the medicine on the eve of Ugadi*
5) *It gives on the spot relief to some*
6) *When it was on trial...*
7) *On behalf of all the victims of this complaint and on my behalf, I thank your grand father.*
8) *I know what's on your mind.*
9) *Just go on taking this medicine*


M.SURESAN

కొన్ని మాటల అర్థాలు తెలుసుకోవటం అవసరం.

1) Approach = 1) సమీపించడం 2) సహాయం అర్థించడం
2) Complaint = ఎక్కువగా వాడే అర్థం- ఫిర్యాదు. ఈ సందర్భంలో- వ్యాధి వల్ల కలిగే బాధ/ వ్యాధి (Doctors పరిభాష)
3) behalf = తరపున
4) on and off = తరచుగా

***Now let's discuss the use of on in the sentences above.***

**1) effect on** - (ఒకరి/ ఒకదానిమీద) ప్రభావం ఉండటం. Effect తర్వాత ఎప్పుడూ on ఉంటుంది.

a) Rain or the lack of it has an effect on crops = వర్షం/ వర్షాభావం ప్రభావం పంటలమీద ఉంటుంది.
b) The punishment of the boy had a disciplining effect on the rest of the class = ఆ విద్యార్థికి వేసిన శిక్ష మిగతా class మీద క్రమశిక్షణ కలిగించే ప్రభావం చూపించింది.
c) Magnet has an effect on the flow of current = విద్యుత్ప్రవాహం మీద అయస్కాంతానికి ప్రభావం ఉంటుంది.

**2) On time:** ఇంతకుముందు lesson లో In time వాడాం కదా. In time అంటే అనుకున్న సమయానికి కాస్త ముందే (ఆలస్యం అయ్యే ఆస్కారం లేకుండా) అని అర్థం వస్తుంది.

a) All delegates arrived in time for the meeting = ప్రతినిధులందరూ సమావేశానికి సకాలంలో (కాస్త ముందుగా వచ్చి) హాజరయ్యారు.
b) Hari arrived just on time to board the plane = Plane ఎక్కడానికి correct సమయానికి వచ్చాడు. అంతకుముందూ కాదూ ఆలస్యం లేకుండానూ.
c) The plane landed right on time = ఆ విమానం time కు సరిగ్గా (ఒక్క నిమిషం ముందూ వెనకా కాకుండా) దిగింది.
d) The train arrived on time = Train correct time కు వచ్చింది.

**3) On my brother's suggestion** = మా అన్న/ తమ్ముడి సూచన మీదట/ మేరకు

a) On my lecturer's suggestion I bought this book = మా lecturer సూచన మేరకు నేనీ పుస్తకం కొన్నా.

అలాగే on some one's orders, on some one's advice అంటాం.

b) He is here on his boss's orders తన boss ఆజ్ఞ మేరకు అతనిక్కడున్నాడు
c) On his doctor's advice he gaveup smoking = డాక్టర్ సలహా మేరకు ఆయన smoking మానేశాడు.
d) They gave him the job on the minister's recommendation = మంత్రి సిఫారసు మేరకు అతనికి ఉద్యోగం ఇచ్చారు.

**4) On the eve of** = Eve of అంటే ఓ ముఖ్యమైన (పండగలాంటి) రోజుకు ముందరి రోజు/ ముందరి సాయంత్రం. Eve ముందు ఎప్పుడూ on వస్తుంది. తర్వాత of వస్తుంది.

a) Hemanth bought his children a number of presents on the eve of Christmas/ on Christmas eve = Christmas ముందరిరోజు/ ముందరి సాయంత్రం హేమంత్ తన పిల్లలకు చాలా కానుకలు కొన్నాడు.
b) It happened on the eve of the exam = అది పరీక్షకు ముందు రోజు/ ముందు సాయంత్రం జరిగింది.

**5) on the spot** = తక్షణం/ అక్కడికక్కడే

a) The CM announced a cash award on the spot for the swimmer who rescued the children = పిల్లలను రక్షించిన ఈతగాడికి ముఖ్యమంత్రి అక్కడికక్కడే/ అప్పటికప్పుడే నగదు బహుమతి ప్రకటించారు.
b) Hit by a lorry he died on the spot = లారీ ఢీకొని, అతనప్పటికప్పుడే మరణించాడు. (Spot కు ఇక్కడి అర్థం, చోటు/ స్థలం)

On the spot relief = తక్షణ నివారణ

**6) On trial** = (యంత్రం, మందులు లాంటివి) ప్రయోగంలో ఉండటం. Trial ముందు on వాడతాం.

a) The new medicine is still on trial = ప్రయోగ స్థాయిలోనే ఉంది ఆ కొత్త ఔషధం.
b) This model of the vehicle is still on trial = ఈ నమూనా వాహనం ఇంకా ప్రయోగ దశలోనే ఉంది.

న్యాయస్థానంలో విచారణను కూడా trial అంటారు. దీనిముందు కూడా on వస్తుంది.

c) He is on trial for murder = హత్యానేరంలో అతను విచారణ ఎదుర్కొంటున్నాడు.
d) He was on trial for cheating = మోసం అభియోగంలో అతను విచారణ ఎదుర్కొంటున్నాడు.

**7) On behalf of** = for= ఒకరి తరపున.

Behalf ముందు on, తర్వాత of వస్తాయి.

a) He apologized on behalf of his wife = అతని భార్య తరపున అతను క్షమాపణ అడిగాడు.
b) His lawyer signed on his behalf = అతని తరపున అతని వకీలు సంతకం చేశాడు.

**8) On one's mind** = ఒకరి మనసులో ఉన్న/ ఒకరికి ఆదుర్దా కలిగిస్తున్న.

ఇలాంటి అర్థంతో mind ముందు on.

a) Please tell me what's on your mind. Don't you like the girl? = నీ మనసులో ఏముందో/ నీకు ఆదుర్దా కలిగే విషయమేంటో చెప్పు. ఆ అమ్మాయి నీకిష్టం లేదా?
b) Something is on her mind. I can see that from her face = ఆమె మనసులో ఏదో ఉంది/ ఏదో ఆదుర్దా పడు తోందామె. ఆమె మొహం చూసి గ్రహించగలనది.

**9) Just go on** taking the medicine. ఇక్కడ on preposition కాదు. అయినా to, keep లాంటి కొన్ని verbs తర్వాత on వాడితే, ఆ verbs తెలిపే పని కొనసాగించటం (continue) అని అర్థం వస్తుంది.

a) He goes on smoking in spite of his doctor's advice = Doctor వద్దన్నప్పటికీ smoke చేస్తూనే ఉంటాడు.
b) He walked on another Km = ఇంకో Km దూరం నడుస్తూనే వెళ్లాడు.
c) He kept on arguing though the others were silent = ఇతరులేం మాట్లాడకపోయినా అతడు వాదిస్తూనే ఉన్నాడు.
d) She sang on, but we were not interested మాకంతగా ఇష్టంలేకపోయినప్పటికీ ఆమె పాడుతూనే ఉంది.

---

***ప్రశ్న:*** *కిందివాక్యాలను ఎలా ప్రయోగించాలి?*

1. *As light as a feather*
2. *Upset the apple cart*
3. *At daggers drawn*
4. *As cool as a cucumber*
5. *Make a mountain of a mole hill*

*- ఎ.వి.ఆచారి, వైజాగ్*



***జవాబు:***

**1)** As light as a feather = చాలా చాలా తేలికైన (పక్షి ఈకంత తేలిక)

Though she is fat, she thinks she is as light as a feather = ఆమె లావుగా ఉన్నా, తను చాలా తేలిక (బరువు తక్కువ) అనుకుంటుంది.

**2)** Upset the apple cart = ఒకరి plans ను భగ్నం చేయటం.

Duryodhana and company wanted to bind Lord Krishna, but he upset the apple cart by exhibiting his universal form దుర్యోధనాదులు శ్రీకృష్ణుడిని బంధించాలనుకునేంతలో, ఆయన తన విశ్వరూపాన్ని చూపించి వాళ్ల వ్యూహాన్ని భగ్నం చేశాడు.

**3)** At daggers drawn = ఇద్దరుగానీ, రెండువర్గాలుగానీ ఒకరిపట్ల ఒకరు చాలా కోపంతో/ క్రోధంతో ఉండటం/ కత్తులు నూరడం.

Dagger - చిన్న ఖడ్గం.

The former friends are now surprisingly at daggers drawn with each other = ఆశ్చర్యం ఏమిటంటే అంత మిత్రులిప్పుడు ఒకరిపై ఒకరు కత్తులు నూరుతున్నారు.

**4)** As cool as cucumber = ఏం ఆవేశపడకుండా సంయమనం పాటించటం.

Dharmaraj was as cool as Cucumber even when provoked కవ్వించినప్పుడు కూడా ధర్మరాజు సహనం కోల్పోకుండా, ఆవేశపడకుండా సంయమనంతో ఉండేవాడు.

Cucumber = దోసకాయ.

**5)** Make a mountain of a mole hill = చిన్న విషయాన్ని పెద్దది చేయటం/ చాలా తక్కువ విషయానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వటం/ గోరంతలు కొండంతలు చేయటం.

The first warnings about AIDS were taken as making mountain of mole hill = AIDS గురించి మొదటి హెచ్చరికలను మొదట గోరంత కొండంతలు చేయటం అనుకున్నారందరూ.

Figures of speech: పై వాటిలో చాలా expressions, figures of speech (అలంకారాలు). English బాగా మాట్లాడేందుకు, figures of speech అంత అవసరం లేదు. వీలు వెంబడి అన్నీ తెలియబరుస్తాం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 329



M.SURESAN

# Prices are soaring by the day

**Jaideep:** Hi Pradeep, where's your new home?
(మీ కొత్త ఇల్లు ఎక్కడ? / మారిన ఇల్లు? )

**Pradeep:** Easy to locate. Just by the Head Post Office.
(చాలా సులభం. ముఖ్య తపాలా office పక్కనే)

**Jaideep:** When are you moving in? Have you paid the advance?
(ఎప్పుడు మారుతున్నారు? Advance ఇచ్చేశారా?)

ఇల్లు మారటం = move; shift కాదు.

**Pradeep:** Not yet. I wanted to pay by cheque, but the landlord insisted on cash. Today and tomorrow are bank holidays. Perhaps I will have paid by Tuesday or so.
(నేను cheque ఇవ్వాలనుకున్నా, కాని ఇంటి యజమాని (landlord) నగదుగా ఇవ్వమని పట్టుబట్టాడు. ఈ రోజు, రేపు bank సెలవులు. బహుశ మంగళవారమో, ఆ తర్వాతో చెల్లించటం జరుగుతుంది)

**Jaideep:** What's the rent like?
(అద్దె ఏమాత్రం?)

What is the rent like? = What is the rent? రెండూ ఒకటే. like వివర చేర్చటం conversational.

**Pradeep:** It's around Rs. 6000/-pm. Though the rent is on the high side, the house is by far bigger than our present home.
(దాదాపు నెలకు ఆరువేలు. కొంచెం ఎక్కువే. అయితే ఇప్పుడు మేం ఉన్న ఇంటికంటే చాలా పెద్దది)

**Jaideep:** I remember your telling me that the new landlord is a friend of your father
(మీ కొత్త owner మీ నాన్న friend అని నువ్వన్నట్లు గుర్తు)

**Pradeep:** Yes. He is. Mr. Ramlal- that's his name - a Marvari by birth but settled here.
(అవును పేరు రాంలాల్. పుట్టుకతో మార్వాడి, కాని ఇక్కడ స్థిరపడ్డాడు).

**Jaideep:** So the next few days you'll be busy packing and moving.
(కాబట్టి వచ్చే రెండు, మూడు రోజులు సామాన్లు సర్దడం, మార్చడంతో తీరిక లేకుండా ఉంటావన్నమాట)

**Pradeep:** So will I be. By now mom must have packed some of the things. I must help her.
(అవును. అమ్మ ఇప్పటికే కొన్ని సర్దేసి ఉండాలి. నేను ఆవిడకు సహాయపడాలి)

**Pradeep:** I think your new place is farther off from college than the present one.
(మీ కొత్త ఇల్లు, ఇప్పుడున్న ఇంటికంటే ఎక్కువ దూరం అనుకుంటా)

farther - comparative of 'far'.
Superlative - farthest

**Jaideep:** Yea; but just by a kilometre. Any way I have a bike. So no problem.
(అవును. ఒక కిలో మీటర్ మాత్రమే. అయినా నాకు bike ఉంది. కనుక పెద్ద సమస్యకాదు)

**Pradeep:** But fuel prices are soaring by the day.
(కాని ఇంధనం (fuel- petrol/diesel etc,) ధరలు పెరిగిపోతున్నాయి కదా? )

**Jaideep:** But one k.m. makes no difference.
(ఒక్క కి.మీ.తో పెద్ద తేడా ఏం ఉండదులే)

**Pradeep:** OK. What's the time now?
(ఇప్పుడు time ఎంత? )

**Jaideep:** It's 8.30 by my watch. I'm afraid my watch is running fast by 10 minutes.
(నా watch ప్రకారం 8.30. నా watch 10 నిమిషాలు ముందు నడుస్తోందనుకుంటా.)

**Pradeep:** You're right. The tower clock is showing 8.20.
(నిజమే. Tower మీది గడియారం 8.20 చూపిస్తోంది.)

**Jaideep:** OK. Then. We'll meet again. Bye.

ఈ lesson లో English conversation లో తరచూ వాడే preposition 'by' వివరాలు తెలుసుకుందాం.

మనందరికీ తెలిసిన విషయాలు, by గురించి: ఒక పని ఎవరు చేశారు (passive voice లో) అని తెలిపేందుకు 'by' వాడతాం- 'ఒకరిచేత' అనే అర్థంతో.

a) This book was written by my friend
(ఈ పుస్తకం మా friend చేత రాయబడింది- మామూలు తెలుగు- ఈ పుస్తకం రాసింది మా friend)

b) He was killed by a snake.
(అతను పాముచేత చంపబడ్డాడు- అతను పాము కరచి/ పాముకాటు వల్ల చనిపోయాడు)

ఒక్కోసారి ఇలాకూడా అంటాం: This book is by him (అతను రాసింది ఈ పుస్తకం)

ఇపుడు మరికొన్ని ఉపయోగాలు చూద్దాం:

**Look at the following sentences from the conversation above:**

1) Just by the Post Office
2) I wanted to pay by cheque
3) Perhaps I'll have paid by Tuesday
4) The house is by far bigger than our present home
5) Mr Ramlal is a Marvari by birth
6) By now mom must have packed some of the things
7) Yea, but just by a K.M.
8) Fuel prices are soaring by the day
9) It's 8.30 by my watch
10) I'm afraid my watch is running fast by 10 minutes.

**1) by =** పక్కన =
by the side of= beside.
a) He sat by me = నా పక్కన కూచున్నాడు.
b) I don't like to be by him=
వాడి పక్కన ఉండటానికి నాకిష్టం లేదు

**2) by cheque =** Cheque ద్వారా
a) Payment by cheque are not accepted= cheque ద్వారా చెల్లింపులు తీసుకోరు (తీసుకోబడవు)
b) Pay by DD or money order= DD (Demand Draft / Draft) ద్వారాగానీ/money order ద్వారాగానీ చెల్లించండి.

అయితే by cash అనం- In cash/cash అని అంటాం.
He paid the amount in cash/He paid cash= నగదుగా చెల్లించాడు.

**3) By Tuesday -**
ఇలాంటిచోట్ల by కి అర్థం - ఆ సమయంలోపలనానీ, ఆ సమయానికి కానీ, (సమయం దాటకుండా).
a) He will be here by 8 = ఎనిమిదింటికల్లా (ఎనిమిది దాటకుండా) అతనిక్కడుంటాడు.
అలాగే by now = ఇప్పటికి / ఇప్పటికే.
b) He must have left by now = ఇప్పటికే అతను వెళ్లిపోయుండాలి.
c) By now the train must be at the next station = ఇప్పటికి train next station లో ఉండి ఉండాలి.

**4) By far=**
చాలా (తేడా/ ఎక్కువ\ తక్కువ/ చెప్పేటప్పుడు వాడతాం)
a) Hyderabad is by far cooler than Vijayawada;
విజయవాడ కంటే హైదరాబాద్ చాలా చల్లగా ఉంటుంది.
b) He is by far the best cricketer I' ve seen;
నేను చూసిన cricketers అందరిలో ఇతను చాలా గొప్ప

**5) By birth =** పుట్టుకతో.
a) I am a Tamilian by birth.
పుట్టుకతో Tamilian.
b) Blind / deaf / mute by birth =
(పుట్టుకతో గుడ్డి / చెవిటి / మూగ)

**7)** రెండు వస్తువుల / మనుషుల మధ్య ఏ మేరకు తేడా అని తెలిపేందుకు 'by వాడతాం.
a) Hari is taller than Gopi by a foot =
గోపి కంటే హరి ఒక అడుగు పొడుగు.
b) This car is more expensive than that car by atleast some thousand rupees =
ఆ car కంటే ఈ car కనీసం కొన్ని వేలరూపాయలు ఎక్కువవుతుంది.

**8) By the day =** నానాటికీ / రోజు రోజుకీ,
a) Vegetables prices are rising by the day= రోజురోజుకూ కూరగాయల ధరలు పెరిగి పోతున్నాయి.
b) He is proving more dangerous by the day = రోజు రోజుకీ అతను ప్రమాదకరంగా తయారవుతున్నాడు.

**9) By my watch =**
ఇక్కడ 'by' కి అర్థం, ప్రకారం - నా watch ప్రకారం
a) I'm sorry. I can't go by your watch =
నీ watch ప్రకారం నేను నడుచుకోలేను.
sorry (నీ watch మీద ఆధారపడలేను)
b) What's the time by your watch? =
నీ watch ప్రకారం time ఎంత?
c) It's running fast/ slow by 10 mts.
10 నిమిషాలు ముందు/ ఆలస్యంగా నడుస్తోంది.



**ప్రశ్న:** *i) If I were you* అని అంటారు. కానీ ఇందులో *I singular- was* రావాలి. *were* ఎందుకు వాడతాం?
*ii) I am interested* అనొచ్చు. కానీ, *I am completed* అని అనకూడదు. ఎందుకు?
*iii)* మంచి *spoken English* పుస్తకం చెప్పగలరు.

**– లక్ష్మీనారాయణ, ఆమ్రాబాద్**

**జవాబు: i)** If I were you - ప్రస్తుతం జరగని పరిస్థితి తెలపడానికి ఇది వాడతాం- నేనే నువ్వయితే- నేను నువ్వు అయ్యే పరిస్థితి ఇప్పుడు లేదు కదా. ఇలాంటిచోట్ల ఇది వాడతాం. ఇలాంటి expressions ను ఇంతకుముందు lessons లో వివరించాం. వాటిని చూడండి.

**ii)** I am interested లో interested అనేది ఆసక్తి కలిగిఉన్న అనే అర్థంతో, interested past participle ను వాడుతున్నాం. లేకుంటే am interested ను, interest/ interests కు passive గా కూడా తీసుకోవచ్చు అప్పుడు దాని అర్థం, నాకు ఆసక్తి కలిగించ బడుతుంది అని.

I am completed లో am completed (passive of complete/ completes) కు అర్థం, పూర్తి చేయ బడతాను అని. ఇదిలా అనం కదా?

**iii)** Spoken English పుస్తకాలు, CD లూ market లో చాలానే ఉన్నాయి. మీకుపయోగపడే పుస్తకం- Living English structures by Stannard Allen.

**ప్రశ్న:**
*i) Are you play cricket?; Do you play cricket?*
*ii) Are they happy?; Do they happy?*
*iii) Which class is he study?; Which class does he study?*
*iv) Are you happy?; Do you happy?*
*v) Were you at home yesterday?; Did you at home yesterday?*
*vi) Where were you? Where did you? Where did he yesterday? Where was he yesterday?* పై వాక్యాల్లో ఏవి సరైనవి? వాటిని ఉపయోగించే సందర్భాన్ని తెలపండి.
*vii) a) The teacher explained me the difficult points of grammar.*
*b) The teacher explained the difficult points of grammar to me.* ఏది కరెక్ట్?

**– ఎం.ఎస్.ఆర్., దోనబండ**

**జవాబు:** ఇదివరకటి lessons లో ఇచ్చిన six forms of verbs చూడండి. Are you play cricket, sentence కాదు. అర్థం లేదు (verb లేదు కాబట్టి). Do you play cricket? - Correct.

**ii)** మీ అర్థం, happy గా ఉన్నారా? అని కదా? ఉన్నారా అని ఉండటం రూపాంతరం ఏది వచ్చినా కేవలం 'be' form నే వాడతాం. Happy గా ఉండటం కాబట్టి Do అనే పనిని తెలిపే పదం రాదు. కనుక Are they happy? correct, Do they happy, wrong.

**iv)** పై sentence లో లాగే, Do they happy? (happy do (చేయరు) గదా? ) wrong.

**v)** Do you at home? ఎలా వస్తుంది? ఉన్నారా? అని (be form) రావాల్సినపుడు. So were you... correct.

**vi)** ఇదీ అంతే- be form మాత్రమే వాడండి.

**vii)** Explain is always followed by to.
The correct sentence is -
The teacher explained to me... or
The teacher explained the.. grammar to me, is correct.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

**Santushta:** (Do) you know what happened yesterday?
(నిన్నేం జరిగిందో తెలుసా?)

**Sankalpa:** What happened? (ఏం జరిగింది?)

**Santushta:** I met our childhood playmate Samyukta.
(మన చిన్ననాటి స్నేహితురాలు - మనం తనతో కలిసి ఆడుకున్నాం- సంయుక్తను కలుసుకున్నాను.)

playmate = కలిసి ఆడుకునేవాళ్లు.

**Sankalpa:** (Do) you mean our Samyukta? How come?
(మన సంయుక్తేనా నువ్వనేది? అదెలా జరిగింది?)

How come?= ఎలా?

How come you are here at this time? = ఈ time లో నువ్వు ఇక్కడ ఉండటం ఏమిటి? / ఎలా సంభవం?

**Santushta:** I met her just by chance. I was walking by the State Bank building. When some one from behind put their hands on my shoulder. As I turned round in shock and surprise who did I see there but our old Samyukta!
(State Bank building పక్కనే వెళ్తుంటే ఎవరో వెనక నుంచి తన చేతులు నా భుజం మీద వేశారు. దిగ్భ్రాంతి, ఆశ్చర్యంతో వెనక్కి తిరిగి చూస్తే, ఇంకెవరు? మన సంయుక్త!)

**Sankalpa:** What is she and where is she?
(ఏం చేస్తోంది? ఎక్కడుంది?)

**Sankalpa:** I can't wait to meet her. She was such a nice girl!)
(ఎప్పుడెప్పుడు చూద్దామా అని ఉంది తనని. ఎంత మంచి అమ్మాయో!)

**Santushta:** She is equally anxious to see all of us too. She said she would meet us on the weekend.
(తను కూడా మనల్నందర్నీ కలుసుకోవాలని ఆతురతగా ఉంది. ఈవారం చివర మనల్ని కలుసుకుంటానంది.)

**Sankalpa:** What about her sister Sampada?
(వాళ్ల sister సంపద ఎలా ఉంది?)

**Santushta:** An advocate by profession, she frequently acts in TV serials it seems.
(వృత్తికి lawyer, కానీ తరచుగా TV serials లో నటిస్తోంది.)

**Sankalpa:** I see. How is she doing as a lawyer?
(అలాగా. లాయర్‌గా ఆమె ఎలా ఉందట?)





M.SURESAN

**Santushta:** Not much of a success, I understand. It seems she goes by the book and you know, in professions like law, just going by the book doesn't help.

# She goes by the book

**Santushta:** By qualification an engineer, but by choice a bank officer. She is an officer in the industries sector of the bank.
(Qualification పరంగా అయితే తను Engineer, కానీ తను ఎంచుకున్నది bank officer ఉద్యోగం. Bank పరిశ్రమల విభాగంలో ఆమె ఓ అధికారి)

**Sankalpa:** Has she been here for long?
(ఆమె చాలాకాలంగా ఉందా ఇక్కడ?)

**Santushta:** No; just two weeks since she was transferred here. She has taken residence somewhere near the bank. She was asking about you and our other friends.
(లేదు. రెండువారాల కిందట transfer అయి ఇక్కడకొచ్చింది. Bank కు దగ్గరగా ఎక్కడో ఇల్లు తీసుకుంది. నిన్ను, మన ఇతర friends గురించి అడిగింది.)

(అంత విజయం పొందలేదనే అనుకుంటున్నా. అంతా rules ప్రకారం పోయేట్లుందా అమ్మాయి. తెలుసుగదా, rules (శాస్త్ర) ప్రకారం పోవడం పెద్ద తోడ్పడదు.)

**Sankalpa:** That's right. She must be feeling that she chose law by mistake.
(అది correct. పొరపాటున లాయర్ వృత్తి ఎంచుకున్నానని అనుకుంటుండాలి తను.)

**Santushta:** Is seems she is quite a success on the small screen. She has good offers too, Samyukta says. Not far off is the day when she may take to full time acting.
(TV లో తనకు బాగానే ఉందట. ఇంకా మంచి offers కూడా వస్తున్నాయట. TV నటనే పూర్తి వ్యాపకమయ్యే రోజు ఎంతో దూరం లేదట.)

**Sankalpa:** Good for her. (అది తనకు మంచిది)

☺ ☺ ☺ ☺ ☺

Spoken English లో తరచుగా వినిపించే 'by' గురించి తెలుసుకుంటున్నాం గదా. మరికొన్ని విషయాలు ఇప్పుడు చూద్దాం.

***Look at the following sentences from the dialogue above:***

*1) I met her just by chance.*

*2) I was walking by the State Bank building.*

*3) By qualification an engineer but by choice a bank officer.*

*4) An advocate by profession.*

*5) She goes by the book.*

*6) She must be feeling that she chose law by mistake.*

**1) By chance** = అనుకోకుండా, తలవని తలంపుగా, కాకతాళీయంగా

a) They met by chance on train and became very close friends in just a year
అనుకోకుండా train లో కలుసుకున్నారు వాళ్లు, సంవత్సరం లోపలే ప్రాణమిత్రులయ్యారు.

b) It's by chance that he entered politics. He never thought he would make a career in politics = రాజకీయాల్లోకి అతను ప్రవేశించటం ఏదో కాకతాళీయంగా జరిగింది. అతనెప్పుడూ అనుకోలేదు రాజకీయం అతని వ్యాపకమవుతుందని.

అలాగే by luck అంటాం, అదృష్టవశాత్తు అనే అర్థంతో.

c) By luck I happened to meet my favourite star = అదృష్టవశాత్తు నా అభిమాన తారను కలుసుకోవటం జరిగింది.

**2) By the State Bank building**

By అంటే పక్కన అనే అర్థం ఉందని మనకు తెలుసు. అయితే ఇక్కడ walk by, pass by అనే expressions లో by అర్థం, ఆ వైపుగా, అటువైపు, ఓ ప్రదేశం మీదుగా అని.

a) The procession has passed by the college = ఆ ఊరేగింపు college మీదుగా వెళ్లింది.

b) He walks by our home at 8 every evening
ప్రతి రాత్రి 8 గంటలకు మా ఇంటి మీదుగా వెళ్తాడాయన.

c) Cars pass by the building at great speeds
విపరీతమైన వేగంతో cars ఆ building మీదుగా వెళ్తాయి.

**3) By qualification** = విద్యార్హతల రీత్యా-

a) Some Telugu film actors are doctors by qualification =
కొంతమంది తెలుగు సినీనటులు విద్యార్హతల రీత్యా వైద్యులు/ వైద్య విద్యార్హత కలవాళ్లు.

b) Though an engineer by qualification, he became a cricketer by profession =
అతను engineering విద్యార్హత ఉన్నప్పటికీ cricket క్రీడాకారుడయ్యాడు, వృత్తి రీత్యా.

c) Dr. YSR is a doctor by qualification but a politician by choice =
చదువుకున్నది medicine, ఎంచుకున్నది రాజకీయాలు.

**4) By profession** = వృత్తిరీత్యా

a) His parents are doctors by profession =
అతని తల్లిదండ్రులు వృత్తిరీత్యా వైద్యులు.

b) An advocate by profession, he takes an interest in music =
వృత్తిరీత్యా ఆయన lawyer, కానీ సంగీతంలో ఆయనకు బాగా ఆసక్తి.

**5) Go/ do by the book** = నిబంధనలను కచ్చితంగా పాటించటం/ ఏదైనా శాస్త్ర ప్రకారంగా చేయటం.

a) In dealing with any situation, she always goes by the book =
ఏ సందర్భంలో ఏది చేయాల్సినా ఆమె నిబంధనల మేరకే చేస్తుంది.

b) You cannot always play by the book =
ఎప్పుడూ శాస్త్రప్రకారం ఆడేందుకు వీలుండదు. (అంటే ఇలాంటి సందర్భాల్లో ఇలా, ఇలా ఆడాలి అని నిపుణులు అనుకునే ప్రకారం ఆడటం, playing by the book)

c) Srikanth never played by the book =
Srikanth (cricketer) శాస్త్ర ప్రకారం ఎప్పుడూ ఆడలేదు. (ఇలాంటి bowling ను ఇలా, ఇలా ఎదుర్కోవాలి.. అని నిపుణులు అనుకున్న విధంగా కాకుండా)

**6) By mistake** = పొరపాటున.

a) By mistake I picked up her bag and left my bag behind =
పొరబాటున, ఆమె bag ను నేను తీసుకుని, నా bag ను అక్కడ ఉంచేశా.

b) The Maoists sometimes kill innocent people by mistake =
మావోయిస్టులు, ఒక్కోసారి పొరబాటున అమాయకులను చంపుతుంటారు.

---

**ప్రశ్న:** ఇంగ్లిష్ నాకు అర్థమవుతుంది. కానీ మాట్లాడలేను. ఈ ఇబ్బందినెలా అధిగమించాలి? పదో తరగతి విద్యార్థులు అభిప్రాయాలను, లేఖలను రాయడం ఎలా నేర్చుకోవచ్చో తెలుపగలరు.

– మోహన్. కె, భీమవరం

**జవాబు:** The best way to speak English is to start speaking English in daily life whenever you have an opportunity. Read as much English as you can - short story books. Listen to TV English news casts. In the beginning you may not understand all of it, keep listening. These are the ways you can speak good English.

10th class students, write a few sentences on any topic. Write longer passages. This is the only way.



**ప్రశ్న:** *1. ఇంగ్లిష్‌లో స్పెల్లింగ్ మిస్టేక్స్ రాకుండా ఉండి, pronunciation కరెక్ట్‌గా ఉండాలంటే ఏంచెయ్యాలో తెలపండి.*

*2. ఇంగ్లిష్‌లో 6 verb forms ఉపయోగాలు, ప్రాముఖ్యం వివరించండి. Verb forms ఆరింటిలో ఏ ఒకటైనా ఉంటేనే ఆ వాక్యం కరెక్ట్ అని చెప్పారు. verb forms లేని వాక్యాలు కూడా కొన్ని కరెక్టే కదా. తేడా తెలుపండి.*

– ఎం. విక్రమ్

**జవాబు:** 1. Spoken English lesson No.1 నుంచి computer లో download (Eenadu.net) చేసుకుని మొదటి lesson నుంచి, 1st 50 lessons మొదట చదవండి. మీ సందేహాలన్నింటికి సమాధానం దొరుకుతుంది.

2. Verb లేకపోతే sentence కానే కాదు. 6 verb forms లో ఏదో ఒకటైనా లేని group of words sentence కాదు.

**ప్రశ్న:** కిందివాటికి అర్థాలు తెలియజేయగలరు.

*1. My father earns Rs.3000 whereas my mother earns Rs.7000.*

*2. You have not cleared my earlier loan on other hand you are asking for another loan.*

*3. Kerala demand for more rice yet to be conceded.*

*4. Kumaraswamy to meet Manmohan.*

– స్వామి, క్యాతగానకెరె (కర్ణాటక)

**జవాబు:** 1. మా నాన్న నెలకు రూ.3000 సంపాదిస్తే, మా అమ్మ నెలకు 7000 రూపాయలు సంపాదిస్తుంది. Whereas - మామూలుగా తేడాను సూచించేందుకు వాడతాం.

2. నువ్వు ఇంతకుముందు నేనిచ్చిన అప్పు తీర్చకపోగా, మళ్లీ అప్పు అడుగుతున్నావు.
On the other hand - రెండు విషయాలను పోలుస్తున్నప్పుడు వాడతాం. ఇక్కడ మొదటి అప్పు చెల్లించకపోగా రెండోసారి అప్పు అడుగుతున్నాడు. అయితే ఇక్కడ, on the contrary అంటే better (దానికి వ్యతిరేకంగా).

3. ఇంకా ఎక్కువ బియ్యం కావాలన్న demand ఇంకా ఇవ్వబడలేదు- మామూలు తెలుగులో మరికొంత బియ్యం కావాలనే కేరళ demand ను ఇంకా ఒప్పుకోలేదు (కేంద్రం)

4. మన్మోహన్‌ను కలుసుకోనున్న కుమారస్వామి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# He stands by his word

**Bhaskar:** Heard this? The police seized Chandra by the collar and were taking away.
(ఇది విన్నావా? police లు చంద్ర collar పట్టుకుని తీసుకెళ్ళిపోతున్నారెక్కడికో)

Heard this? = Have you heard this?

**Himakar:** Where to, do you know?
(ఎక్కడికో తెలుసా? )

**Bhaskar:** Where else? To the police station
(ఇంకెక్కడికి? police station కు)

**Himakar:** What exactly did he do for the police to act like that?
(Police లు అలా చేయటానికి వాడేం చేశాడు? )

**Bhaskar:** God knows. Oh that reminds me. He was swearing by God aloud that he had not done anything.
(దేవుడికే తెలియాలి. అలా అంటే గుర్తొస్తోంది. వాడు బిగ్గరగా దేవుడి మీద ప్రమాణం చేసి, నేనేం చేయలేదంటున్నాడు)

**Himakar:** Poor fellow. Day by day he is getting deeper and deeper into trouble. When did you see all this?
(దురదృష్టవంతుడు. రోజురోజుకూ వాడు సమస్యల్లో/ బాధల్లో కూరుకుపోతున్నాడు. ఇదంతా నువ్వెప్పుడు చూశావు? )

**Bhaskar:** I didn't see it, I had it from one of the shop keepers there who knows Chandra by sight and me.
(నేను చూడలేదు. అక్కడో దుకాణం అతను, నన్నూ చంద్రనూ తెలిసినవాడు చెప్పాడు)

**Himakar:** He works mostly by night and sleeps by day. He has mostly night duties. Surprising why he was out during the day.
(అతను రాత్రిపూట ఎక్కువ పనిచేస్తాడు, పగలు పడుకుంటాడు. తనకు night duties ఎక్కువ. పగలు అతనెందుకు బయటున్నాడా అనేది ఆశ్చర్యంగా ఉంది)

**Bhaskar:** That takes me by surprise too. A greater surprise is his having to do anything with the police.
(నాకూ అది ఆశ్చర్యంగానే ఉంది. అంతకంటే ఆశ్చర్యం police విషయాల్లో అతనుండటం)

**Himakar:** I think we'd better go to the police station and know the actual position
(మనం police station కు వెళ్ళి అసలు సంగతేంటో కనుక్కుందాం/ కనుక్కోవటం మంచిది)

**Bhaskar:** My tension is mounting by the hour. Let's go and see him at once
(గంట గంటకూ నాకు tension పెరిగిపోతోంది. వాడ్ని వెంటనే వెళ్ళి చూద్దాం పద)

**Himakar:** Shall we go by ourselves or shall we take some one else with us?
(మనం ఒంటరిగా వెళదామా, ఇంకెవరినైనా తీసుకెళదామా? )

**Bhaskar:** The police are not easy to deal with. Let's take Bhagavan with us. He knows some police officers.
(Police వాళ్ళతో వేగటం అంత సులభం కాదు. మనతో భగవాన్‌ను తీసుకెళదాం. వాడికి కొందరు police officers తెలుసు. )

**Himakar:** Do you think he will come?
(అతనొస్తాడనుకుంటున్నావా? )

**Bhaskar:** He is one to stand by his friends. I'll call him to be ready, so we can pick him up on our way.
(అతను స్నేహితులను ఆదుకునేవాడే. వాడికి phone చేసి ఇంట్లో ready గా ఉండమని చెప్తా, మనం దారిలో వాడిని తీసుకెళ్ళొచ్చు)

**Himakar:** OK, Let's go, then
(అయితే వెళ్దాంపద)

☆ ☆ ☆ ☆

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 331


M.SURESAN

మనం preposition 'by' వాడకం గురించి తెలుసుకుంటున్నాం. ఈ lesson లో కూడా 'by' వాడాల్సిన మరి కొన్ని సందర్భాలు చూద్దాం:

***Study the following sentences from the conversation above.***

1) *The police seized Chandra by the collar*
2) *He was swearing by God..*
3) *Day by day he is getting deeper into trouble*
4) *He works mostly by night*
5) *One of the shop keepers who knows Chandra by sight ...*
6) *He works mostly by night and sleeps by the day.*
7) *That takes me by surprise too.*
8) *My tension is mounting by the hour*
9) *He is one to stand by his friends*

**1) seize by the collar** - seize = బలంగా చేతిని పట్టుకుని లాగటం.

The police seized him by the collar = అతని collar పట్టుకుని (దొరకపుచ్చుకుని) లాగారు.

ఒకరిని పట్టుకోనే, తీసుకెళ్ళే, లాగే విధం చెప్పేందుకు by వాడతాం దేన్ని పట్టుకుని అనే అర్థంతో.

a) He took me by the hard and led me to his room:
నా చేయి పట్టుకుని అతని room కు తీసుకెళ్ళాడు

b) She held the old woman by the arm and helped her cross the road =
ఆమె ఆ ముసలామె చేయి పట్టుకుని road దాటించింది.

c) The villain held her by the hair and dragged her out =
ఆ దుర్మార్గుడు ఆమెను జుత్తు పట్టుకుని బయటికి లాగాడు.

**2) swear by God** = దేవుడి మీద ప్రమాణం చేయటం.

swear = ఇతరులను నమ్మించటానికి మనం ప్రమాణం చేయటం (swore - past tense, sworn - past participle)

a) He swears that he hasn't done that =
అతను ఆ పనిచేయలేదని ప్రమాణం చేస్తున్నాడు.

b) Hari swears by Lord Rama =
హరి రాముడి మీద ప్రమాణం చేస్తున్నాడు.

**3) Day by day** = రోజు రోజుకూ-

a) Day by day he is growing mischievous =
రోజురోజుకూ అతను మరీ అల్లరిగా తయారవుతున్నాడు.

b) Day by day the city is expanding =
రోజు రోజుకూ నగరం పెరిగిపోతోంది.

**4) He works mostly by night**

by night = రాత్రిపూట (పనులు చేయటం)

a) He studies mostly by night =
అతను రాత్రిపూట ఎక్కువ చదువుతాడు.

b) He finishes most of his work by day =
పగలే అతను తన పని ఎక్కువ పూర్తి చేస్తాడు.

**5) Know someone by sight** = ముఖ పరిచయం ఉండటం.

a) I know Chandra by sight =
చంద్రతో నాకు ముఖ పరిచయం ఉంది.
(ఫలానా అతను చంద్ర అని తెలుసు. అంతకు మించి అతనికి నాకు పరిచయంలేదు. )

b) He doesn't know me even by sight =
అతనికి నాతో ముఖపరిచయమైనా లేదు (నన్ను చూసినా, నేను అని తెలియదతనికి. )

**7) Take by surprise** = ఆశ్చర్యం కలిగించటం.

a) He took me by surprise by calling at 12 midnight =
అతను రాత్రి 12 గంటలకు phone చేయటం ఆశ్చర్యం కలిగించింది.

b) She took him by surprise by offering help
ఆమె అతనికి సహాయం చేయటానికి సిద్ధపడటం అతనికి ఆశ్చర్యం కలిగించింది.

**8) By the hour** =

**i)** గంట గంటకు

a) The temperature of the patient is rising by the hour =
గంట గంటకు రోగి temperature పెరిగిపోతోంది.

b) The water level under the bridge is rising by the hour =
వంతెన కింద నీటిమట్టం గంట గంటకూ పెరుగుతోంది.

**ii) By the hour** = గంటకు ఇంత చొప్పున.

a) We pay him by the hour =
గంటకు ఇంత అని చెల్లిస్తాం.

b) We have hired the taxi by the hour =
గంటకు ఇంత అద్దె అన్న ప్రకారం taxi ని అద్దెకు తీసుకున్నాం.

**9) Stand by** (something/ somebody)=
ఒక విషయానికి బద్ధులుగా ఉండటం/ ఒకరికి తోడుగా ఉండటం.

a) At the time of the marriage, the bride and the bridegroom swear that they stand by each other =
పెళ్ళి సమయంలో వధూవరులు ఒకరికొకరు తోడుగా ఉంటామని ప్రమాణం చేస్తారు.

b) You can always rely on him. He stands by his word =
నువ్వతన్ని నమ్మొచ్చు/ అతని మీద ఆధారపడొచ్చు అతను మాటమీద నిలబడతాడు.

---

**ప్రశ్న:** *Excuse, forgive, pardon* - ఈ మూడింటి అర్థమూ క్షమించాలనే కదా! ఏయే సందర్భాల్లో ఉపయోగించాలో వివరించగలరు.

*– ఎం.ఆంజనేయులు, కె.నాగేశ్వరరావు, మొలగవల్లి (కర్నూలు జిల్లా)*



**జవాబు:** ఇది నిజంగా చాలా గొప్ప ప్రశ్న. Excuse, forgive, pardon లకు common meaning తప్పులనూ, నేరాలనూ, తప్పుచేసిన వాళ్ళనూ కొంతయినా/ పూర్తిగానైనా శిక్ష/ తగిన శాస్తి లేకుండా క్షమించి వదిలేయటం.

ఇక ఈ మూడింటికీ తేడాలు:

**1) Excuse:** ఒకరి నిర్దిష్టమైన తప్పులను (specific offenses ను)- అంటే చేయాల్సిన పని చేయకపోవడం, చేయకూడని పనిచేయడం, పనిలో అశ్రద్ధ, అలసత్వం ప్రదర్శించడం, సమాజంలో ప్రవర్తనా నియమాలను పాటించకపోవటం లాంటి తప్పులను, తప్పు చేసిన వాళ్ళనూ కొద్దిగానైనా పూర్తిగానైనా శిక్షించకుండా క్షమించి వదిలేయటం.

a) We excuse his coming late.

b) The teacher excused the students for their misbehaviour

c) I can't excuse his disrespecting me

**2) Pardon:** ఇది ముఖ్యంగా నేరాల విషయంలో వాడతాం. నేరం పెద్దదైనా చిన్నదైనా, నేరస్థులకు విధించాల్సిన శిక్షను కొద్దిగానైనా పూర్తిగానైనా రద్దుచేయటం.

A) The President of India can pardon a convict. (శిక్ష పడినవాళ్ళను రాష్ట్రపతి క్షమించవచ్చు - ఆ అధికారం ఉంది)

B) The Judge pardoned the misbehaviour of the accused in the court = Court లో ముద్దాయి దుష్ప్రవర్తనను న్యాయమూర్తి క్షమించి వదిలేశాడు.

Presidential pardon = క్షమాభిక్ష.

**3) Forgive:** ఇది ఈ మూడింటిల్లో గొప్పది. మనకు కలిగిన హానిని, అపకారాన్ని, ద్రోహాన్ని మన మనసులోంచి పూర్తిగా తొలగించుకుని, అలాంటి హాని, అపకారం ద్రోహం చేసినవాళ్ళపట్ల, క్రోధం, కోపం, ప్రతీకార వాంఛ, శిక్షించే కోరిక ఏమీ లేకుండా పూర్తిగా క్షమించి వదిలేయటం.

a) Gandhi always advised us to forgive even our enemies for whatever they do to us =
మనకు ఏ హాని చేసిన శత్రువులనైనా క్షమించాలని గాంధీ సలహా.

b) I can never forgive her for the way she insulted me = నన్ను అవమానం చేసిన విధానానికి ఆమెను నేనెప్పటికీ క్షమించలేను.

***ఇది కూడా గమనించండి:***

**i)** కొత్తవాళ్ళను, పెద్దవాళ్ళనూ, లాంఛనప్రాయంగా (formal గా) అనుమతి తీసుకోవడానికి excuse me అంటాం!

Excuse me/ If you don't mind, (May I sit here?)

ఇలాంటి సందర్భాల్లో వాళ్ళ అనుమతి మనకు అక్కర్లేదు. కేవలం మర్యాద కోసం అంటాం.

ఎవర్నైనా అడ్డు తొలగాలని అడగడానికి కూడా excuse me అంటాం.

**ii)** ఇతరులు చెప్పింది మనకు వినిపించకపోతే, వాళ్ళను మళ్ళీ చెప్పమనటానికి: Pardon me/ Pardon/ Beg your pardon అంటాం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

## SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 332

# The rain now is to her liking


M.SURESAN

**Ghanatha:** Hi Mahitha, welcome. (I have) been looking forward to giving you a surprise.
(స్వాగతం, మహితా. నిన్ను ఆశ్చర్యంలో ముంచెత్తాలని ఎదురుచూస్తున్నా.)

**Mahitha:** What could that be? Out with it. I can't wait to hear it.
(ఏంటబ్బా అది? త్వరగా చెప్పు. కాచుకునే ఓర్పు నాకు లేదు.)

out with it= (త్వరగా) చెప్పు/ బయటపెట్టు.
I can't wait to hear it = అది వినడానికి ఇంకా కాచుకునే ఓపిక నాకు లేదు/ తహతహలాడుతున్నా

**Ghanatha:** Here it is. Completely to your liking and taste. The type of green dress that you like so much.
(ఇదిగో. పూర్తిగా నీకు నచ్చేదీ, నీ అభిరుచికి తగిందీ. నువ్వెంతో ఇష్టపడే green dress.)

**Mahitha:** That's really wonderful. So thoughtful of you. All thanks to you for remembering me during your shopping in Mumbai.
(గొప్ప విషయం. నన్ను గురించి తలచుకున్నందుకు, నన్ను గుర్తుంచుకున్నందుకూ thanks.)

so thoughtful of you: మనకవసరమైన విషయాలు ఇతరులు గుర్తుంచుకున్నపుడూ, వాటి గురించి శ్రద్ధ తీసుకున్నప్పుడూ మనం కృతజ్ఞత తెలియజేసుకునే పద్ధతి: so thoughtful of you ( so kind of you) అనటం.

**Ghanatha:** You remember I went to Mumbai because my cousin Samatha invited me to stay for a few days in Mumbai. She took me to a modest looking shop where we could get good dresses at moderate prices. The variety there stunned me to silence.
(నీకు గుర్తుందికదా, మా cousin సమత ముంబైకి రమ్మని పిలిచింది. సరసమైన ధరలకు మంచి dresses దొరికే అంత పెద్ద దిగా కనిపించని shop కు తీసుకెళ్ళింది. అక్కడి వైవిధ్యం (variety) నా నోట మాట రానంత నిశ్చేష్టురాలిని చేసింది.)

stun= నిశ్చేష్టులుగా చేయటం.
The sight stunned me= ఆ దృశ్యం నన్ను నిశ్చేష్టురాలిని- అంటే వెంటనే ఏం చేయాలి అని ఆలోచన లేనంతగా- చేసింది.

**Mahitha:** It's really fine, Ghana. I am convinced now that Mumbai is the place for good dresses.
(ఎంత బాగుందో. ముంబాయే dresses కు సరైన చోటని నేనొప్పుకొంటున్నా.)

**Ghanatha:** I was about to choose a pink dress, when Samatha pointed to this dress. When I saw it I just yielded to its temptation. Immediately bought one for you and one for me.
(ఓ pink =గులాబీ రంగు dress ఎంచుకున్నా దాదాపు. అప్పుడు సమత ఈ dress చూపించింది. అంతే. అది కనిపించగానే దాని ఆకర్షణకు లొంగిపోయా. వెంటనే నీకొకటీ, నాకొకటీ కొన్నా.)

**Mahitha:** Hats off to your taste. What else did you see in Mumbai?
(నీ అభిరుచికి జోహార్లు. ఇంకేం చూశావు Mumbai లో?)

**Ghanatha:** Not much. Because of the incessant rains our movements were limited to a few parts of the city.
(ఎక్కువేం చూడలేదు. ఎడతెరిపిలేని వర్షాల వల్ల, మా కదలికలు నగరంలో కొన్ని ప్రదేశాలకే పరిమితమైపోయాయి.)

incessant= ఇన్ సెసన్ట్= ఎడతెరిపిలేని/ విరామంలేని

**Mahitha:** What other news about Samatha?
(సమత గురించి ఇంకేమిటి?)

**Ghanatha:** Samatha was frequently referring to your jokes when she was here last time.
(తనిక్కడికి కిందటిసారి వచ్చినప్పుడు నువ్వేసిన jokes గురించి ప్రస్తావిస్తూనే ఉంది.)

**Mahitha:** Are you and Samatha the same age?
(నువ్వూ సమత ఒకే వయసా?)

**Ghanatha:** No, she is senior to me by a year.
(కాదు, నాకంటే ఆమె ఒక సంవత్సరం పెద్ద.)

**Mahitha:** Did you meet our other friend in Mumbai, Ajitha?
(Mumbai లో మన ఇంకో friend Ajitha ను కలుసుకున్నావా?)

**Ghanatha:** I told you, it was rainy all through. I called her and she said she had to attend on her old mom. She is confined to bed because of asthma.
(చెప్పానుగా. ఒకటే వాన అని. నేను phone చేశాను. అజిత అంది, ఉబ్బసంతో మంచాన ఉన్న వాళ్ళమ్మను చూసుకోవాలని)

**Mahitha:** She is doing fine, isn't she?
(తను బాగానే ఉంది కదా?)

**Ghanatha:** That she is. (బాగానే ఉంది)

**Mahitha:** OK, then.

మన study of the prepositions లో 'to' ఉపయోగం తెలుసుకుందాం ఈ lesson లో:
To అంటే మామూలుగా అందరికీ తెలుసు- (ఒకరి)కి, కు అని అర్థం. తో అనికూడా (చెప్పటం)
a) He gave it to me = నాకు ఇచ్చాడు
b) He said to her that he had passed= తను pass అయ్యానని ఆమెతో చెప్పాడు.
ఇప్పుడు to వాడే మరికొన్ని సందర్భాలు చూద్దాం:

***Study the following sentences from the conversation above.***

1) *I have been looking forward to giving you a surprise*
2) *Completely to your liking*
3) *All thanks to you*
4) *She took me to a modest looking shop*
5) *The variety there stunned me to silence*
6) *Samatha pointed to this*
7) *I yielded to the temptation*
8) *Our movements were limited to a few places*
9) *Hats off to your taste*
10) *Samatha was referring to your jokes*
11) *She is senior to me*
12) *She is confined to bed*

**1) Look forward to:** ఆత్రంగా ఎదురు చూడటం. Look forward తర్వాత to వస్తుంది.
a) We are looking forward to our trip to Kashmir = కాశ్మీర్ పర్యటన కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నాం/ ఎప్పుడెప్పుడా అని.
b) He is looking forward to playing in the big match = ఆ పెద్ద match లో ఆడటం కోసం ఎదురుచూస్తున్నాడు.
**Important:** Look forward to తర్వాత noun కానీ... ing form కానీ వస్తుంది.
I look forward to the match (Match-noun).
I look forward to seeing the match. 'to' తర్వాత seeing... ing form.

**2) To your liking** = నీ ఇష్టానికి తగ్గట్టు
a) The rain now is to her liking = ఇప్పుడీ వర్షం ఆమె ఇష్టానికి తగ్గట్టుగానే ఉంది.
b) This dress will be her liking = ఆమె ఇష్టానికి తగ్గట్టుగానే ఉందీ dress.
ఇలాగే, To someone's taste (ఒకరి అభిరుచికి తగ్గట్టు/ To someone's delight = ఒకరి సంతోషం మేరకు/ To someone's surprise = ఒకరికి ఆశ్చర్యం కలిగించే రీతిలో.

**3) All thanks to you** = ధన్యవాదాలన్నీ నీకే.
a) All thanks to you for your timely help = నీ సకాల సహాయానికి అన్నివిధాలా thanks.
b) No thanks to you for what I am now = నా ఇప్పటి (మంచి) స్థితికి నీకు thanks చెప్పనక్కరలేదు (నువ్వేం చేయలేదు కాబట్టి).

**4) To a ... shop** = Shop కు
a) He went to the shop = Shop కు వెళ్ళాడు
b) She has gone to school = School కు వెళ్ళింది.

**5) To silence** = నోట మాట రాకపోయేంతగా (అవాక్కయ్యేంతగా)
ఇక్కడ, To = అంతమేరకు/ అంతగా.
a) He was shocked to silence = నోట మాట రానంత దిగ్భ్రాంతి చెందాడు.
b) They beat him to death = చనిపోయేవరకు/ చనిపోయేంతగా కొట్టారు.

**6) point to** = ఒకదాన్ని చూపటం.
a) He pointed to the blood stains on the cloth = గుడ్డ మీద రక్తపు మరకలు చూపించాడతను.
b) She delights in pointing to others' faults = ఇతరుల తప్పులు చూపించి సంతోషపడుతుందామె.

**7) yield to** = (దేనికైనా/ ఎవరికైనా) లొంగిపోవటం.
a) Iraq yielded to the superior force of the US = అమెరికాకున్న ఎక్కువ బలానికి ఇరాక్ లొంగిపోయింది.
b) He yielded to her beauty = ఆమె అందానికి అతను లొంగిపోయాడు.

**8) to be limited to** = పరిమితమై ఉండటం
a) Being old, his movements are limited to the surroundings of his home = వృద్ధుడవటం వల్ల అతడి కదలికలు ఇంటి పరిసరాలకే పరిమితం.
b) His knowledge is limited to Andhra Pradesh= అతనికి ఆంధ్రప్రదేశ్ గురించి మాత్రమే తెలుసు/ అంతటికే పరిమితం.

**9) Hats off to** = జోహార్లు/ మెచ్చుకోలు.
a) Hats off to his patience = అతని ఓర్పుకు జోహార్లు.
b) Hats off to your sharp brain నీ చురుకైన బుర్రకు నా జోహార్లు

**10) Refer to** = ప్రస్తావించటం/ సంప్రదించటం.
a) The CM often refers to the Gandhi family = ముఖ్యమంత్రి ఎప్పుడూ గాంధీ కుటుంబం గురించే ప్రస్తావిస్తారు.
b) Refer to the dictionary for the meanings of words = మాటల అర్థాలకు dictionary ని సంప్రదించు.
(Refer to the doctor = Doctor ను సంప్రదించు)

**11)** Senior (వయసులో అనుభవంలో పెద్ద), Junior (చిన్న), Superior (మెరుగైన), Inferior (తక్కువ రకం)- వీటన్నిటి తర్వాత to వాడతాం.

**12) be confined to** = పరిమితమవటం
confined to bed = మంచాన ఉండటం (వ్యాధివల్ల)
He has been confined to bed for weeks now.
(కొన్ని వారాలుగా ఆయన మంచాన ఉన్నాడు.)



**ప్రశ్న:** *Do and make ఈ రెండింటి మధ్య తేడా ఏమిటి? Don't make noise అంటారు కదా. Don't do noise అని ఎందుకు అనకూడదు?*
*కిందివాటిని ఇంగ్లిష్‌లో ఎలా పలకాలి?*
*1. ఎక్కడ పోగొట్టుకున్నామో అక్కడే వెతుక్కోవాలి.*
*2. ఆమె ఒయ్యారంగా నడుస్తూ ఉంది.*
*3. నీవుబాగా కొవ్వుపట్టి ఉన్నావు. అందుకే చెప్పిన మాట వినడంలేదు.*
***– జి.వెంకటేశ్వర్లు, గుంటూరు***

**జవాబు:**
Do and make - ఈ రెండింటిమధ్య తేడా ఇంతకు ముందు వివరించాం. Make అంటే produce అనే అర్థంతో (అంటే పనిచేయటం అని కాకుండా) దేన్నైనా తయారుచేయడం అనే అర్థంతో వాడతాం. Don't make a noise అన్నప్పుడు (ఒక విధంగా) గొడవ తయారుచేయడం అవుతుంది కదా. అందుకని make a noise అంటాం. అంతేకాకుండా అది usage కూడా (వాడుక). మన చేతులు వాడో, ఇంకేదయినా వాడో చేసేది noise కాబట్టి make a noise అంటాం.
1. Search for it where you've lost it.
2. She walks gracefully.
3. పొగరెక్కువయింది అనే అర్థంతో కొవ్వుపట్టి ఉన్నావు/ కొవ్వెక్కున్నావు అనే మాటకు సరిపోయే English expressions లేవు. English లో కొవ్వు (fat, fattened, fatty) కు, పొగరుకు సంబంధంలేదు. ఆ అర్థంతో (పొగరు - ఇతరులను లెక్కచేయనంత) వాడే మాట overbearing. You are overbearing and so you disobey/ defy/ disregard my words/ orders.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# We've got used to it

**Yasasvi:** How long have we to wait here? I'm not used to waiting for such a long time
(ఎంతసేపు వేచి ఉండాలి మనం? ఇంతసేపు వేచి ఉండటం నాకు అలవాటు లేదు)

**Tejasvi:** That's because you were in the US for such a long time. Things are different here. In India we are accustomed to such long waits, and so we don't complain about it. We've got used to it.
(నువ్వు అమెరికాలో చాలా కాలం ఉన్నందు వల్ల అలా అంటున్నావు. ఇక్కడి విషయం వేరే. ఇలాంటి సుదీర్ఘ నిరీక్షణలకు అలవాటు పడిన మేం దాని గురించి పెద్ద బాధపడం/ ఏం అనం. మాకలవాటయిపోయింది కదా? )

wait = waiting- నిరీక్షణ

**Yasasvi:** Why don't you complain to higher authorities?
(పై వాళ్లకెందుకు ఫిర్యాదు చేయకూడదు? )

Authorities = అధికారులు

**Tejasvi:** (It's) hundred to one any action will be taken or things will improve.
(ఫిర్యాదు చేసినా వాళ్ళు చర్య తీసుకునే అవకాశంగానీ, పరిస్థితి మెరుగయ్యే అవకాశంగానీ చాల తక్కువ)

**Yasasvi:** When was your last visit here?
(నువ్విక్కడికి చివరిసారి వచ్చిందెప్పుడు? )

**Tejasvi:** Six months ago to the day. I remember it very well. Some one tried to jump the queue. I objected to it. The man then withdrew of course.
(Correct గా ఈనాటికి ఆర్నెల్ల క్రితం. నాకు బాగా గుర్తుంది. ఒకతనెవరో queue లో జొర బడే ప్రయత్నం చేశాడు. నేను అభ్యంతరం తెలిపా. అతను వెళ్లిపోయాడు.

Jump the queue= క్యూలోకి జొరబడటం/ క్యూ అతిక్రమించటం.

Jump signals / Jump lights = Traffic signals/ lights= అతిక్రమించటం (పట్టించుకోకుండా ముందుకెళ్లిపోవటం.)

Jump bail = (చట్టం) ఓ case లో bail లో విడుదలయి, తప్పించుకోవటం (Police లకు చిక్కకుండా)

**Yasasvi:** Was the queue as long then?
(అప్పుడు క్యూ ఇంత పొడుగుందా? )

**Tejasvi:** Compared to then, the queue now is much shorter.
(అప్పటి క్యూతో పోలిస్తే, ఇప్పటి క్యూ చాలా చిన్నది)

**Yasasvi:** Has there ever been an occasion when the queue moved as soon as it was formed.
(క్యూ ఏర్పడగానే కదలడం అనేది ఇక్కడ ఎప్పుడైనా జరిగిందా? )

**Tejasvi:** Not to my knowledge. People stand in the queue long before the time. That means the queue not moving for some time at least. All appeals to the people concerned to open more queues have been of no avail.
(నాకు తెలిసి లేదు. సరైన సమయానికి చాలా ముందరే క్యూలో నిలబడతారు ప్రజలు. అందువల్ల కొంతసేపైనా క్యూ కదలకుండా ఉంటుంది. దీనికి సంబంధించిన వాళ్లకు మరి కొన్ని క్యూలు తెరవాల్సిందన్న విన్నపాలు ఏ ఉపయోగం లేకుండా పోయాయి.)

**Yasasvi:** Hope it will be over soon.
(ఇది త్వరగా అయిపోతుందని ఆశిస్తున్నాను)

మన study of prepositions లో భాగంగా preposition 'to' ఉపయోగాలు మరికొన్ని ఇప్పుడు తెలుసుకుందాం.

*1) I am not used to waiting for such a long time.*
*2) In India we are accustomed to such long waits.*
*3) We've got used to it.*
*4) Why don't you complain to higher authorities?*
*5) (It's) hundred to one any action will be taken/ things will improve.*
*6) Six months ago to the day.*
*7) Compared to then, the queue now is much shorter.*
*8) Not to my knowledge*

**1) Not used to waiting 3) get used to**
ఈ రెండు expressions లో ఉన్న phrase, be used to, ఇక్కడ 'be' బదులు ఏ be form (am, is, was, were, have been, will be, would be లాంటివి) ఏదైనా వాడవచ్చు - పని జరిగే time ను బట్టి.




be used to = అలవాటు పడటం = get used to. (be బదులు get వాడవచ్చు)

**Very Important:** be used to కూ, used to కూ ఉన్న తేడా తెలుసుకోవటం.

**చాల ముఖ్యం:** అర్థంలోనూ, వాడకంలోనూ be used to కు, used to కు ఉన్న తేడా తెలుసుకోవటం.

ఈ పట్టిక చూడండి:

| Be used/ get used to | used to |
|---|---|
| **అర్థం:** అలవాటుపడటం/ అలవాటు ఉండటం<br>Be used/ get used to తర్వాత ఎప్పుడూ noun కానీ, .....ing form గానీ వస్తుంది. 1st Regular Doing Word (take, walk, etc) రాదు.<br>a) He is used to Coffee in the morning<br>(ఇక్కడ is used to తర్వాత Coffee - Noun - వస్తోంది) = ఆయనకు పొద్దున Coffee అలవాటు.<br>b) He is used to taking Coffee<br>(ఆయనకు పొద్దున్నే Coffee తాగటం అలవాటు.) - ఇక్కడ is used to పక్కన ....ing form వస్తోంది.<br>అలవాటు ఉన్న సమయాన్ని బట్టి, am, is, was, will be/ will get, would be/ would get + used to వాడవచ్చు | **అర్థం:** గతంలో ఒక పనిని వాడుకగా చేయటం (వెళ్లేవాడ్ని, కలుసుకునేవాళ్లం, చేసేవాడు లాంటి భావంతో)/ గతంలో అలవాటు.<br>used to పక్కన ఎప్పుడూ 1st Regular Doing Word మాత్రమే వస్తుంది.<br>a) He used to take a lot of Coffee those days = ఆ రోజుల్లో ఆయన బాగా Coffee తాగేవాడు. used to పక్కన I Regular Doing Word - take.<br>b) Before he became a CM, we used to meet often = ఆయన CM కాకముందు మేం తరచుగా కలుసుకునేవాళ్లం.<br>use to + 1st Regular Doing Word - ఎప్పుడూ గతంలోని పనినే తెలుపుతుంది. |

ఇంకా చూడండి:

a) In the beginning, you may find the new system a bit difficult, but as time goes on, you will get/ will be/ will become used to it (the new system)

ప్రారంభంలో ఈ కొత్త పద్ధతి కాస్త కష్టంగా అనిపించవచ్చు అయితే time గడిచేకొద్దీ నువు దానికి అలవాటు పడిపోతావు.

b) Hari kept late hours. In the beginning his wife had trouble, but in course of time, she was used/ got used/ became used to staying awake late in the nights =
హరి ఇంటికి ఆలస్యంగా వచ్చేవాడు. మొదట్లో అతని భార్యకు ఇబ్బందిగా ఉండేది. కాని time గడిచినకొద్దీ, రాత్రి చాలా సేపు మేల్కొని ఉండటం ఆమెకు అలవాటయిపోయింది.


M.SURESAN

**2) be accustomed to** = దీని అర్థం, వాడకం రెండూ, be used to కు లాగనే. Be accustomed to (అలవాటు పడటం) ఎక్కువ be used to కు లానే, noun కానీ, ...ing form గానీ వస్తుంది.

a) She is accustomed to the climate of this place =
ఈ ప్రదేశం వాతావరణానికి ఆమె అలవాటు పడింది. (climate - Noun)

b) He is not accustomed to getting up early in the morning =
పొద్దున / పెందలాడే లేచే అలవాటు అతనికిలేదు. (getting up... ing form)

**4) Complain to** = (ఎవరికైనా) ఫిర్యాదు చేయటం.

a) She complained to the Principal about the boy = ఆ అబ్బాయిని గురించి ఆమె Principal కు ఫిర్యాదు చేసింది.

b) There is no use complaining to him about his son's behaviour = ఆయన కొడుకు గురించి, ఆయనకు (to him) ఫిర్యాదుచేసి లాభం లేదు.

**5) It's hundred to one**: ఏదైనా జరిగే అవకాశం నూటికి ఒక్క పాలు (చాలాతక్కువ/ దాదాపు జరగదు)

a) It's hundred to one that we can see a corruption free India = అవినీతిలేని భారతదేశాన్ని మనం చూడగలిగే అవకాశం చాలా తక్కువ (నూటికి ఒక్కపాలు)

b) It's hundred to one that he will come = అతను వచ్చే సూచనలు/ అవకాశం చాలా తక్కువ.

**6) Six months ago to the day** = ఆర్నెల్ల కింద సరిగ్గా ఈ రోజు.

To the day = సరిగ్గా ఈ రోజు/ ఈరోజుకు.

a) I will have been here for a year next month to the day = వచ్చేనెల సరిగ్గా ఈ రోజుకు, నేనిక్కడ ఉండటం ఒక సంవత్సరం అవుతుంది. (వచ్చే నెల ఈనాటికి నేనిక్కడ ఓ సంవత్సరం ఉండి ఉంటా.)

b) It happened last year to the day =
గత సంవత్సరం సరిగ్గా ఈ రోజు జరిగింది.
(To the day - conversation లో తరచుగా వినిపిస్తుంది - practice చేయండి)

**7) Compared to** - దానితో పోలిస్తే/ పోల్చి చూస్తే.

a) Compared to last year, we have had less rain this year/ It has rained less this year = గత ఏడాదితో పోలిస్తే, ఈ సంవత్సరం వర్షాలు తక్కువే.

b) Compared to his brother, he is more talented = వాళ్ల brother తో పోల్చి చూస్తే, ఇతనెక్కువ ప్రతిభ కలవాడు.
(ఈ అర్థంతో, compared to బదులు, compared with కూడా వాడతారు)

**8) To my knowledge** = నాకు తెలిసినంతవరకు.

a) To my knowledge that's the best hotel here
నాకు తెలిసినంతమటుకూ, ఇక్కడ ఇది అత్యంత మంచి hotel.

b) To the best of my knowledge, he is innocent = నాకు తెలిసినంత మటుకు అతను నిర్దోషి/ అమాయకుడు.

---

**ప్రశ్న:** *'off' ను, rather, up లను ఏయే సందర్భాల్లో వాడతారో వివరించగలరు.*

*– జి. నరేష్, ఖమ్మం*

**జవాబు:** Off = away from a place, at a distance (in space or time) - అనుకున్నచోట కాకుండా, ఇంకెక్కడో అనే అర్థంతో. eg: The village is 20 Kms off from Hyderabad (ఆ గ్రామం హైదరాబాద్‌కు 20 కి.మీ. అవతల ఉంది)

He threw the ball off = ఆ బంతిని అవతలకు విసిరేశాడు. తెలుగులో వెళ్లిపోయాడు, తినేశాడు, ముంచేశాడు అంటూంటాం, వెళ్ళాడు, తిన్నాడు, ముంచాడు అనే మాటలకు కొంత ఊపివ్వటానికి. అలాగే English లో went off (went), ate off (ate), ran off (ran) లాంటి మాటలతో off వాడతారు. off side- మనం ఉన్న పక్క కాకుండా అవతలి పక్క అని. Off అర్థాలూ, ఉపయోగాలు ఇక్కడ తెలుపలేనంత ఎక్కువ. ఎంత చదివితే అంత బాగా అర్థమవుతుంది. Rather, up లను గురించి ఇదివరలో చెప్పాం.




**ప్రశ్న:**
*1. How do I meet him? ఇది simple future లేదా simple present దేనికి సంబంధించింది?*
*2. Where do they play cricket? అంటే రోజూ ఆడటం గురించి అడిగినట్టా, future గురించి అడిగినట్టా?*

*– బి. వేణుగోపాల్, నెల్లూరు*

**జవాబు:** How do I meet him? అంటే నేనతన్ని ఎలా కలుసుకోవచ్చు? / కలుసుకోవటం? / కలుసుకోగలను? అని general meaning వచ్చేందుకు అంటాం. ఒక్కోసారి వెంటనే జరగబోయే future action (immediate future) కు, present simple వాడటం English లో సర్వసాధారణం.

Where do we go next from here?
(ఇక్కడినుంచి తర్వాత మనం ఎక్కడికి వెళ్దాం? / వెళ్ళటం? )

How shall I meet him?/ How should I meet him? = అతడిని కలుసుకోవటం ఎలా? / అతడిని ఎలా కలుసుకోవాలి?

ఇది అంత కచ్చితంకాని future సూచిస్తుంది. అంటే ఎలాగబ్బా అతన్ని కలుసుకోవడం? అనే భావంతో. దీనికి తేడాగా How do I meet him అంటే ఇప్పుడు నేనతన్ని ఎలా కలుసుకోవడం? (ఇక్కడ కలుసుకోవడం నా ఉద్దేశం ఇపుడు. ఇది spoken form).

Where do they play cricket? మనం మాట్లాడుతున్న సందర్భాని బట్టి, regular కావచ్చు, future కూడా కావచ్చు

A: They play two more games in the course of this week
(ఈ వారంలో రెండు games ఆడతారు)

B: Where do they play? (future- certain).

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Laxman:** How about a movie this evening?
(ఇవాళ సాయంత్రం సినిమాకెళ్దామా?

**Sri Ram:** Nothing in the movies attracts me to them these days. What's there in them except a few dances and fights?
(ఈనాటి సినిమాల్లో నన్నాకర్షించేవేమీ లేవు. ఏం ఉంది వాటిల్లో కొన్ని dances, fights తప్పిస్తే)

**Laxman:** That's the only means of entertainment we have.
(అదొక్కటే మనకున్న వినోద సాధనం.)

means = మార్గం / సాధనం

means - singular, Plural also, means

**Sri Ram:** The other day in one of the cinemas, I saw two men coming to blows, over a very small matter. They quarrelled over who should keep their arm on the arm rest.
(మన సినిమాల్లో మంచివాళ్లు ఇతరుల పట్ల చాలా మంచిగానూ, చెడ్డవాళ్లు ఇతరులపట్ల చాలా క్రూరంగానూ ఉంటారు.)

cruel = క్రూరమైన. The good = మంచి వాళ్లు. The bad = చెడ్డవాళ్లు

**Laxman:** That is so indeed. That's what makes them so unrealistic. Any way, are we going to the movie or aren't we?
(అది అంతే. అందువల్లనే మన సినిమాలు అవాస్తవికంగా ఉంటాయి. ఏదేమైనా, మనం ఇప్పుడు సినిమాకు వెళుతున్నామా లేదా? )

**Sri Ram:** Sorry, no. I don't want to be bored to death.
(sorry. లేదు. చచ్చేంత విసుగు పుట్టించు కోవాలనుకోవటం లేదు నేను)







# We are opposed to his leadership

(మొన్నొకరోజు ఓ సినిమా హాల్లో, ఇద్దరు దెబ్బలాడుకోవటం చూశాను చాలా చిన్న విషయం మీద. సినిమాహాల్లోని కుర్చీమీద ఎవరు చేయి పెట్టుకోవాలనే విషయంమీద వాళ్ల పోట్లాట.)

English లో cinema అంటే అర్థం, cinema hall; దానిలో చూపించే చలన చిత్రం = movie / picture / film. Arm rest = కుర్చీ చేయి మన చేయి ఆనించుకొనేందుకు

**Laxman:** Perhaps that was more entertaining to the spectators than the movie.
(బహుశా సినిమాకన్నా కూడా అదెక్కువ వినోదం కలిగించిందేమో ప్రేక్షకులకు)

**Sri Ram:** To some extent. It began with a fight on the screen, and ended with it. So the audience did not miss much.
(కొంతవరకు. వాళ్ల పోట్లాట తెరమీద పోట్లాటతో ప్రారంభమై దానితో అంతమైంది)

**Laxman:** What was the movie? You told me it was Naaku Nene Neeku Neeve, didn't you. I've seen it too. The songs in it are very good. The playback singer sang the songs to perfection.
(ఏంటా సినిమా? నాకు నేనే, నీకు నీవే అన్నావు గదా? నేనూ చూశాను దాన్ని. దాన్లో పాటలు చాలా బాగున్నాయి. ఆ గాయకురాలు పాటలన్నింటిని నిర్దుష్టంగా పాడింది.)

**Sri Ram:** I am opposed to songs in movies. The best of English movies have no songs in them. Still they hold our attention.
(సినిమాల్లో పాటలను నేను వ్యతిరేకిస్తాను. మంచి English సినిమాల్లో అసలు పాటలుండవు. అయినా అవి మన దృష్టిని ఆకట్టుకొంటాయి.)

hold attention = ఆసక్తి కల్పించటం

**Laxman:** In the movie we are talking about, the villain admitting to his crimes is quite abrupt and unconvincing.
(మనం మాట్లాడుకుంటున్న సినిమాలో విలన్ తన నేరాలన్నీ అంగీకరించడం చాలా sudden గా నమ్మశక్యం కాకుండా ఉంది)

abrupt = sudden. unconvincing = నమ్మశక్యం కాకుండా/ సబబనిపించకుండా ఉన్న

**Sri Ram:** In our movies the good are very good to others, and the bad are very cruel to others.

Preposition 'to' వాడే సందర్భాలు మరికొన్ని తెలుసుకుందాం ఈ lesson లో.

***Look at the following sentences from the conversation above:***

*1) Nothing in the movies attracts me to them.*
*2) I saw two men coming to blows*
*3) To some extent*
*4) The singer sang the songs to perfection*
*5) I am opposed to songs in movies*
*6) The villain admitting to his crimes is abrupt and unconvincing.*
*7) The good are very good to others, the bad, very cruel to others*
*8) I don't want to be bored to death*

**1) Nothing in the movies attracts me to them:**
సినిమాల్లో ఏవీ నన్నాకర్షించవు వాటివైపు.

Attract (Some one) to (something) = ఒకరిని ఒకదానిపట్ల ఆకర్షించటం.

a) The songs in the movie attracted me to it = ఆ సినిమాలోని పాటలు నన్ను ఆకర్షించాయి.

b) What attracted the parent to the school was its discipline and tuition = ఆ school లోని క్రమశిక్షణ, బోధనా ఆ తల్లిని/ తండ్రిని ఆకర్షించాయి.

**2) come to blows** = దెబ్బలాడుకోవటం.

a) What started as a small quarrel led to their coming to blows = చిన్న తగాదాగా మొదలైంది, వాళ్లు ఒకళ్లమీద ఒకళ్లు చేయిచేసుకునేదాకా వెళ్ళింది.

ఇక్కడ to ఒక విషయం ఏ మేరకు జరిగిందీ తెలుపుతోంది కదా. ఇదే ఉపయోగంలో 'to' వాడకం కింది sentences లో కూడా చూడవచ్చు

**3) To some extent:** కొంతవరకు

a) To some extent he is responsible for his own troubles = అతని కష్టాలకు కొంతవరకు అతనే కారణం.

అలాగే to a large extent/ to a great extent అని వాడతాం- చాలామటుకు అనే అర్థంతో

b) The students of the school to a great extent/ to a large extent are from rural areas = ఆ school విద్యార్థులు చాలామటుకు గ్రామీణ ప్రాంతాలవాళ్లు.

c) To a certain extent we lost the contract because of our fault = మనకు contract పోవటం, కొంతవరకు మన తప్పువల్లే.

d) To a lesser or greater extent = ఎక్కువగానైనా/ తక్కువగానైనా - కొద్దో/ గొప్పో.
These changes are likely to affect every one of us to a lesser or greater extent = ఈ మార్పులు మనలో ప్రతీవాళ్లమీద కొద్దోగొప్పో ప్రభావం చూపించవచ్చు

e) These people to a large extent are hard working = ఈ మనుషులు చాలామటుకు కష్టపడి పనిచేసేవాళ్లే.


M.SURESAN

ఈ To some/ a little/ a great/ a large/ to a greater or lesser extent బాగా practice చేసి మీ conversation కు సొగసు కల్పించండి. దాదాపు ఇదే భావంతో, అంటే 'మేరకు' అనే భావంతో వాడే మరో expression:

**4) To perfection** = ఏ విధమైన దోషం లేనంతమేరకు.

a) She sang to perfection = ఏ విధమైన లోపం లేనంత బాగా పాడింది. perfection = పరిపూర్ణత/ ఏ విధమైన లోపమూ లేకపోవటం.

b) He directed the movie to perfection = అతనా సినిమాను ఏ దోషం లేనివిధంగా నిర్దేశించాడు. (Direction/ దర్శకత్వంలో ఏ లోపం లేదు.)

**5) be opposed to** = వ్యతిరేకించటం

a) Gandhi was opposed to any kind of violence = గాంధీ ఏ విధమైన హింసకు వ్యతిరేకి/ అన్ని విధాలా హింసనూ వ్యతిరేకించాడు.

b) We are opposed to his leadership = అతని నాయకత్వాన్ని మేం వ్యతిరేకిస్తాం.

c) I am not opposed to spending money on useful things = ఉపయోగకరమైన విషయాలకు డబ్బు ఖర్చుచేయటం నేను వ్యతిరేకించను.

[గమనించండి:

1) Oppose to తర్వాత noun గానీ, ...ing form గానీ వస్తుంది. 1st Regular Doing Words (come, go లాంటివి) రావు.

2) I am opposed to = I oppose. అంటే be opposed = oppose.]

**6) Admit to** = (నేరంలాంటివి) ఒప్పుకోవటం

a) She admitted to all her crimes = తన నేరాలన్నీ ఆమె ఒప్పేసుకుంది.

b) He admitted to stealing the money = డబ్బు దొంగిలించినట్లు అతను ఒప్పేసుకున్నాడు.

Admitted to తర్వాత కూడా noun గానీ/ ...ing form గానీ వాడతాం. 1st Regular Doing Word రాదు.

**7)** ఇతరులపట్ల ఒకరి ప్రవర్తనకు కూడా 'to' వాడతాం:

a) Lord Rama was very kind to his subjects శ్రీరాముడు తన ప్రజల పట్ల చాలా దయతో ఉండేవాడు. (Subjects = రాజుల పాలనకింద ఉండే ప్రజలు. citizens = ప్రజాస్వామ్యంలోని ప్రజలు)

b) Some parents are very cruel to their children = కొందరు తల్లిదండ్రులు తమ పిల్లలపట్ల చాలా క్రూరంగా ఉంటారు.

(అలాగే, faithful to = విశ్వాసంతో/ గా, loyal to = విధేయతగా, obedient to = విధేయతగా etc.)

**8) be bored to death** = ఇక్కడ కూడా to ఉపయోగం ఏ మేరకు అనే అర్థం.

a) I don't want to meet him. He bores me to death = వాడిని కలుసుకోవాలనుకోవటంలేదు. చచ్చేంత/ చచ్చేవరకు/ చచ్చేమేరకు విసిగిస్తాడు వాడు.

b) His classes bore us to death = అతని class లు చచ్చేంత bore.

Q A

**ప్రశ్న:** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా అనాలి?

1. చెప్పింది చేయడమే నీ పని.
2. నువ్వెంత నీ బతుకెంత నీవు నన్ను ఎగతాళి చేస్తావా?
3. ఎదిగేకొద్దీ ఒదిగి ఉండాలి.
4. ఓ అభాగ్యుడి ఆవేదన కంటే ఓ గొప్పవాడి మౌనం ఈ దేశానికి ఎంతో ప్రమాదకరం.
5. గొప్పవాళ్లు ఎప్పుడు మొండివాళ్లు.
6. వెయ్యిసార్లైనా మరణించి నీకోసం ఒక్కసారి జన్మిస్తా.
7. అసలేం జరిగిందో చూడటానికి నాకు స్పృహ లేదు.
8. ఏదైనా ఇష్టపడి చేయాలిగాని కష్టపడి కాదు.

– జి.వెంకటేశ్వర్లు, గుంటూరు

**జవాబు:**

**1.** Your business is just to do what I tell you to do.

**2.** You mock at/ scoff at/ ridicule me? What are you worth, after all?

**3.** You ought to be somewhat obedient.

**4.** మీ Sentence లో గొప్పవాడు అనే పదానికి అర్థం స్పష్టంగా లేదు- ధనవంతుడనా, ఏదో ఒక రంగంలో రాణించినవాడనా, నీతి, ధర్మం విషయంలో, మహాత్మా గాంధీలా, గొప్పవాడనా? చివరి అర్థం తీసుకున్నట్లయితే a righteous person అనవచ్చు. అలాగే ప్రమాదకరం అంటే ప్రమాదం కలుగుతుందనా? కీడు సూచిస్తుందనా? ప్రమాదకరం అనుకుంటే dangerous అనవచ్చు అప్పుడు మీ భావం English లో:
The silence of a righteous (రైచస్) person is more dangerous than the agony of a needy person. (needy = తిండి, బట్ట చాలినంతలేని అభాగ్యులు)

**5.** The great are always firm.
(ఇక్కడగూడా మొండి అంటే ఇతరులకు బాధ కలిగించే మొండి కాదనా, పట్టుదల గలిగిన అనా? ఇక్కడ పట్టుదల అనే భావం English లో.)

**6.** Even if I die a thousand times, I'll be form once again for you/ another time/ a thousand and first time for you. (మీ భావాన్నిబట్టి)

**7.** I wasn't conscious to know/ to see what happened.

**8.** Work willingly. Don't drudge. (Drudge - కష్టపడి చాకిరి చేయటం)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# I am with you there





M.SURESAN

**Viswas:** I am sorry I forgot the key. I lift it with Madan
(అయ్యో తాళంచెవి నా దగ్గర లేదు. అది మదన్ దగ్గర వదిలి వచ్చాను)

**Nischal:** Who with? (ఎవరి దగ్గర? )

**Viswas:** Does it matter who I left it with? I don't have the key now.
(నేనెవరి దగ్గర దాన్ని ఉంచాననేది కాదు కదా మనకు ముఖ్యం. నా దగ్గర తాళం చెవి లేదు.)

**Nischal:** What are we going to open the trunk with, then?
(ఈ trunk ను దేనితో తెరుస్తాం మరి)

Trunk - పెట్టె

**Viswas:** I think I can open it with a wire.
(Wire తో నేను తెరవగలననుకుంటున్నా)

wire = తీగ

**Nischal:** And Where is a wire now?
(మరిపుడు wire ఎక్కడ ఉంది? )

**Viswas:** Just don't be angry with me. I will some how open the trunk for you. Just wait for a few minutes.
(ఉండు ఊరికినే నామీద కోప్పడకు. నీకా trunk open చేయటం కదా కావాలి. అది నేను చేస్తా. కాస్త ఓపిక పట్టు)

**Nischal:** Do you know where the wire you want is?
(నీకు కావాల్సిన wire ఎక్కడుందో తెలుసా? )

**Viswas:** Look at that small box over there. It is filled with odds and ends. You will find in it a small coil of wire, a pair of pliers and a hammer. Get them.
(అక్కడ ఆ చిన్న పెట్టె ఉంది చూడు. దాన్నిండా ఏవేవో వస్తువులున్నాయి. వాటిల్లో ఓ తీగచుట్ట, పట్కారు, సుత్తి ఉంటాయి. వాటిని తీసుకురా.)

Odds and ends. అంతగా వాడని అన్నిరకాల వస్తువులు. అంత ముఖ్యమైనవి కానివి.

Coil = చుట్ట - the coils of the snake - పాము చుట్టలు. Pliers = ప్లయర్ - జ్, size లో జ్ లాగా - పట్కారు - మామూలుగా తెలుగులో కటింగ్ ప్లేయర్ అంటుంటారు. Hammer– సుత్తి.

**Nischal:** Why do you need a hammer? Hope you don't want break the lock with it. It is an expensive lock.
(సుత్తి ఎందుకు నీకు? దానితో ఆ తాళాన్ని పగలగొట్టవని ఆశిస్తున్నా. అది చాలా ఖరీదైన తాళం)

**Viswas:** Till it was too late you were playing chess with Murthy. If you had finished early we could have gone to Madan and taken it.
(మూర్తితో మరీ ఎక్కువసేపు/ బాగా ఆలస్యమయ్యే వరకు నువ్వు చదరంగం ఆడుతున్నావు. ముందరే ముగించి ఉంటే మదన్ దగ్గరకెళ్లి దాన్ని తీసుకునేవాళ్లం.)

**Nischal:** Come on. Get the wire

**Viswas:** Do you need the hammer too?

**Nischal:** Be careful with the lock. I don't want it broken.
(జాగ్రత్త ఆ తాళం విషయం. అది పగలగొట్టడం నాకిష్టం లేదు.)

**Viswas:** Be sure I don't to damage the lock either. I am with you there.
(నాకూ ఆ తాళం పాడుచేయటం ఇష్టంలేదు నమ్ము. ఆ విషయంలో నేనూ నీతోనే)

**Nischal:** I'd rather part with some money than with the lock. It looks so nice and is imported. I don't want to lose it.
(నేను కాస్త డబ్బయినా పోగొట్టుకుంటా కానీ, తాళం మాత్రం కాదు. చాలా మంచి తాళం. Foreign ది. అది పోగొట్టుకోవటం నాకిష్టం లేదు.)

**Viswas:** OK.OK. Your lock will be safe. Don't worry.
(సరే. నీ తాళం భద్రంగానే ఉంటుంది. గాబరాపడకు)

మనం తెలుసుకుంటున్న Prepositions లో భాగంగా ఈ lesson లో 'with' ఉపయోగాలు తెలుసుకుందాం.

With ను అతి ఎక్కువగా 'తో' అనే అర్థంతో వాడతాం అనే విషయం మనకు తెలిసిందే కదా. ఇదే కాకుండా దీనికి మరికొన్ని ఉపయోగాలు కూడా ఉన్నాయి. వాటిని చూద్దాం.

***Study the following sentences from the dialogue above.***

*1) I left it with Madan*
*2) Who with?*
*3) What are we going to open the trunk with?*
*4) I can open it with a wire*
*5) It is filled with odds and ends*
*6) you were playing chess with Murthy*
*7) Be careful with the lock*
*8) I am with you there*
*9) I'd rather part with some money than with the lock.*

**With** అంటే 'తో' ఒకరితో, ఒకదానితో అనే అర్థం మనకు తెలిసిందే. ఇలాంటి అర్థంతో with వాడటం, sentences (3) and (4) లో చూస్తాం.

**3) What are we going to open the trunk with?** = దేంతో ఆ trunk ను తెరుద్దాం?

**4) I think I can open it with a wire.**
ఓ సన్నని తీగెతో దాన్ని తెరవగలననుకుంటున్నా.

a) He hit it with a hammer -
వాడు దాన్ని సుత్తితో కొట్టాడు.

b) What are you going to with all the money?
అంత డబ్బుతో నువ్వేం చేయబోతున్నావు?

c) I am going to a movie with my friend =
నేను నా స్నేహితునితో సినిమాకి వెళ్తున్నా

**With** అంటే ఓ వస్తువు ఒకరి దగ్గర ఉండటం అనే అర్థం కూడా వస్తుంది.

**1) I left it with Madan** =
నేను దాన్ని మదన్ దగ్గర వదిలేశాను.

**2) Who with?** = ఎవరి దగ్గర?
(మామూలుగా అయితే with whom? అంటాం. అయితే conversation లో, కొంత అసహనంగా ఉన్నప్పుడు, త్వరగా స్పందించేటప్పుడు, with whom? బదులు who with? అనేది ఎక్కువ వినిపిస్తుంది.)

a) All the important documents are with the lawyer = అన్ని ముఖ్యమైన పత్రాలూ లాయర్ దగ్గర ఉన్నాయి.

b) All my money is with my mother =
నా డబ్బంతా మా అమ్మ దగ్గర ఉంది.

c) The book is still with him =
ఆ పుస్తకం ఇంకా అతని దగ్గరే ఉంది.

**5) It is filled with odds and ends:**
**Filled with** = (దేనితోనైనా) నింపటం

a) The bucket is filled with water=
bucket నీళ్లతో నింపి ఉంది.

b) Most Iraqis are filled with hatred for Americans =
ఎక్కువమంది ఇరాకీలు అమెరికన్లపట్ల ద్వేషంతో నిండి ఉన్నారు.

గమనించండి: filled with = full of
It is full of water = అది నీళ్లతో నిండి ఉంది =
It is filled with water (అది నీళ్లతో నింపబడింది.)

c) He filled the drum with rice = ఆ drum ను వాడు బియ్యంతో నింపాడు.

**6) Play with** = ఒకరితో (ఆడటం, పోటీపడటం)

a) India is playing the Ist test match with England =
England తో India మొదటి test match ఆడుతోంది.

b) We cannot compete with Japan in technology=
మనం సాంకేతికరంగంలో Japan తో పోటీ పడలేం.

c) I don't want to fight with anybody =
నేనెవరితోనూ పోట్లాడదలచుకోలేదు.

**7) Be careful with** =
ఒక వస్తువు విషయంలోగాని, ఒక వ్యక్తి విషయంలో గాని, జాగ్రత్తగా ఉండటం.

a) Be careful with him. He may cheat you =
వాడి విషయం జాగ్రత్త. వాడు నిన్ను మోసం చేయగలడు.

b) Be careful with the dinner set. It is very delicate =
ఆ dinner set (భోజనం/ విందు సమయాల్లో ఆహార పదార్థాలుంచుకునే, వడ్డించే పాత్రలు)తో జాగ్రత్త. అది సున్నితమైంది. (పింగాణీ, glass అయితే పగిలిపోతుందని హెచ్చరించటం)

**8) I am with you there** =
నీతో నేను అంగీకరిస్తున్నా/ ఏకీభవిస్తున్నా.

be with somebody = ఒకరితో ఏకీభవించటం/ సమర్థించటం / అంగీకరించటం

a) The CPI and CPM are with the Congress in supporting Pratibha Patil =
ప్రతిభాపాటిల్ కు మద్దతివ్వటంలో CPI, CPM లు కాంగ్రెసును సమర్థిస్తున్నాయి.

b) He is with me there = ఆ విషయంలో అతను నన్ను సమర్థిస్తున్నాడు / నాతో ఉన్నాడు / నాతో ఏకీభవిస్తున్నాడు.

**9) I'd rather part with money:**
**part with =** వదులుకోవటం/ పోగొట్టుకోవటం

a) He parted with his ring =
అతను తన ఉంగరం వదులుకున్నాడు.

b) He is not willing to part with so much money for the sake of a book =
ఓ పుస్తకం కోసం అంత డబ్బు వదులుకోవటం అతనికిష్టం లేదు.

c) He doesn't mind parting with any amount of money for the site, as it is very valuable
ఆ స్థలం బాగా విలువైంది కాబట్టి దానికోసం అతనెంత డబ్బైనా పెట్టేందుకు సందేహించటం లేదు.




***ప్రశ్న:***

I shall be greatful for an appropriate example and also equivalent sentence in telugu for each one of the verb forms given below.

**I form:** ought be, dare be, need be, can have been, need have been, ought have been, dare have been

**II form:** (be form+ ing form) can be+ ing, could be + ing, Ought be+ ing, dare be+ ing, need be+ ing

**IV form:** Need+1st RDW, Ought +1st RDW, dare + 1st RDW

**V form:** can have+, pp, ought have+ pp, dare have+pp, need have+pp

*– ఎం.భోగిప్రసాద్, గుంటూరు*

**జవాబు:**

The six forms of the verbs in English are:

**I) The 'be' form-** (am, is are, was, were, shall be, should be, etc- all forms having 'be' in the end, and have been, has been, had been, shall have been etc- all forms with 'been' in the end)

eg: a) I am a teacher.
b) She has been have for the pass one week.
c) we shall be there tomorrow.
d) He will be our next CM.

**II) Be + ...ing form**

a) She is singing
(is - be form + singing - ing form)

b) They have been working here (have been - be form + working -ing form)

c) She may be arriving tomorrow (may be - be form +arriving - ing forms)

**III) be form + past participle - passive voice**

The work has been done (has been - be form + done past participle)

**IV) Have, has, had, shall have, should have, will have, would have, etc + past participle**

1) They have gone out (have + gone - pp)
2) She would have helped me ( would have + helped -pp)

**V) Doing words**

| I Regular Doing Word | II Regular Doing Word | III Past Doing Word |
|---|---|---|
| come | comes | came |
| see | sees | saw |
| talk | talks | talked |

1) He comes here everyday
(comes - II RDW)

2) They talk to me over the phone quite often (talk - I RDW)

3) He came here yesterday
(came - Past Doing Word)

**VI)** Shall / should / will / would, etc } + 1st RDW

a) He will go there tomorrow
(will go - will + go - 1st RDW)

b) she can sing very well
(can sing - can + sing - 1st RDW)

**Spoken English** పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. **URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# Don't be red with anger




**Dheeraj:** You seem to have had it heavy. I can see that.
(కొంచెం ఎక్కువే తిన్నట్టున్నావు. నాకు తెలుస్తూనే ఉంది)

**Bharat:** I do feel heavy. No doubt about. I can't resist good food when I've an opportunity. Tonight's dinner with the mushroom soup going well with biryani was really tempting.
(కాస్త ఆయాసంగానే ఉంది- ఎక్కువ తినటం వల్ల. అవకాశం వస్తే మంచి భోజనం ఆకర్షణ నేను తట్టుకోలేను. బిర్యానీతో పుట్టగొడుగుల soup నిజంగానే ఆకర్షించింది.)

Mushroom = పుట్టగొడుగులు.

Tempt = ఆకర్షించటం

Resist = ఆకర్షణ/ బలం లాంటి వాటిని తట్టుకోవడం, ఎదిరించగలగడం.

The drunkard cannot resist the temptation of the bottle = సీసా ఆకర్షణకు తాగుబోతు తట్టుకోలేడు.

We could not resist the might of the British empire = British సామ్రాజ్యబలాన్ని మనం ఎదుర్కోలేకపోయాం

**Dheeraj:** You were in bed with indigestion for a week last month. You shouldn't have eaten so much today.
(పోయిన నెల ఒక వారం అంతా అజీర్తితో బాధపడ్డావు కదా? ఇప్పుడంత తినుండకూడదు)

**Bharat:** I am not happy with my eating either. But what could I do? Given my weakness for good food...
(నా విపరీతమైన తిండి విషయం నాకూ సంతోషంగా లేదు. ఏం చేయను? తిండిపట్ల నాకున్న బలహీనతతో...)

**Dheeraj:** Your doctor will not be too pleased with you when you see him tomorrow and I am sure you're going to see him.
(నువ్వు రేపు నీ doctor దగ్గరకు వెళితే ఆయన అస్సలు సంతోషపడడు. నాకు తెలుసు నువ్వు తప్పక వెళ్తావు రేపు)

**Bharat:** I know he will be red with anger. With every visit of mine he grows angrier and angrier. But I can't help it.
(ఆయనకు కోపంతో మొహం ఎర్రబడుతుంది. నేను వెళ్లిన ప్రతిసారీ ఆయన కోపం మరీ ఎక్కువవుతుంది. కానీ వెళ్లక తప్పదు.)

can't help it/ can't help doing something = అది తప్పదు/ అది చేయడం/ చేయకతప్పదు = can't but do it.

**Dheeraj:** I appreciate his concern for you.
(నీపట్ల ఆయనకున్న ఆదుర్దాను మెచ్చుకుంటున్నా)

**Bharat:** I am happy with him. He treats me well. Only thing is I don't follow his advice when it comes to food.
(ఆ doctor విషయం నాకు తృప్తిగానే ఉంది. నాకు బాగానే వైద్యం చేస్తాడు. అసలు విషయం ఏమిటంటే తిండి విషయంలో ఆయన సలహా పాటించను)

**Dheeraj:** Well, hope to see you well tomorrow. (నిన్ను రేపు ఆరోగ్యంగా చూస్తానని ఆశిస్తున్నా) Goodnight.

**Bharat:** Goodnight

మనం preposition 'with' వాడకం చూస్తున్నాం కదా? క్రితం lesson లో with వాడాల్సిన కొన్ని సందర్భాలు తెలుసుకున్నాం. ఇపుడు మరికొన్ని చూద్దాం:

***Study the use of 'with' in the following sentences from the conversation above:***

*1) Tonight's dinner with the mushroom soup going with the biryani was really tempting.*
*2) You were in bed with indigestion for a week.*
*3) I am not happy with my eating either*
*4) Your doctor will not be too pleased with you.*
*5) He will be red with anger*
*6) With every visit of mine ...*

**1) Dinner with:** (a dish/ a food item) = (ఏదైనా వంటకంతో) విందు.

a) The dinner with biryani = బిర్యానీతో విందు. (అంటే విందులో ముఖ్యాంశం బిర్యాని అనే అర్థంతో)

b) My dinner with him yesterday was disappointing = అతనితో నేను తిన్న విందు నిరాశ పరచింది- అంత బాగా లేదు.

with- ఒక వంటకం/ వంటకాలతో, ఒకరితో అనే అర్థంతో dinner/ lunch/ breakfast లాంటివి వాడతాం.

**2) In bed with** (some illness)- ఏదైనా అనారోగ్యంతో బాధపడటం/ మంచాన పడటం. ఇక్కడ కూడా with వాడకం గమనించండి.

a) He is in bed with a fever
(జ్వరంతో బాధపడుతున్నాడు)

b) She was down with jaundice
ఆమె కామెర్లతో బాధపడింది/ ఆమెకు కామెర్లు వచ్చాయి.

అయితే ఒక వ్యాధితో బాధపడటం అనే అర్థంతో suffer వాడినప్పుడు suffer తర్వాత from వాడతాం. with కాదు.

c) He was down with typhoid = He suffered from typhoid.

**3) I am not happy with** my eating habit either

Happy తర్వాత with వాడతాం- ఏ విషయం వల్లనైనా సంతోషపడితే.

a) The father is very happy with his son's rank in the exam = పరీక్షలో తన కొడుక్కు వచ్చిన rank కు తండ్రి చాలా సంతోషంగా ఉన్నాడు.

b) The captain is not happy with the bowling on the first day = మొదటిరోజు bowling విషయంలో captain సంతోషంగా లేడు.

c) The teacher is not at all happy with your progress = నీ ప్రగతి మీ teacher కేం సంతోషం కలిగించట్లేదు (నీ ప్రగతి బాగాలేదు. ఆయనకసలు సంతోషంగా లేదు)

Happy పక్కన with వస్తుంది; About కూడా వాడొచ్చు

d) She is not happy about the arrangements = ఏర్పాట్ల పట్ల ఆమె సంతోషంగా లేదు.

**4) Your doctor will not be too pleased with you**

be pleased with = సంతోషపడటం. Pleased తర్వాత కూడా with వస్తుంది.

a) I am pleased with the marks I got = నేను తెచ్చుకున్న marks కు నేను సంతోషపడుతున్నా.

b) The teacher is not pleased with your behaviour = నీ నడవడి పట్ల teacher సంతోషంగా లేదు.

c) How much money will you be pleased with? =
ఎంత డబ్బయితే సంతోషిస్తావు నువ్వు?

**5) He will be red with anger** =
కోపంతో ముఖం ఎర్రబడటం.

a) Come on. Cool down. Don't be red with anger =
కాస్త కుదుటపడు. కోపంతో మొహం ఎర్రగా చేసుకోకు.

b) He is shaking with fear =
భయంతో వణికిపోతున్నాడు. ఏదైనా భావంవల్ల వచ్చే ఫలితానికి ముందు with వాడటం ఇది.

c) She is pale with fear =
భయంతో ఆమె మొహం పాలిపోయింది.

**6) With every visit of mine**

ఒక సంఘటన వల్ల అనే అర్థంతో with వాడతాం.

a) With the winter approaching, people have started wearing sweaters =
శీత(చలి)కాలం సమీపిస్తుండటంవల్ల (తో), అందరూ sweaters వేసుకోవటం ప్రారంభించారు.

b) With not many to support him, he withdrew from the contest =
ఎక్కువ మంది తనను సమర్థించకపోవటంతో/ పోవటంవల్ల, అతను పోటీనుంచి విరమించుకొన్నాడు.

c) With the students on strike, the college had to be closed =
విద్యార్థులు సమ్మెకు దిగడంవల్ల/ దిగడంతో, కళాశాల మూసేయాల్సి వచ్చింది.

ఈ అర్థంతో (వల్ల/ తో) with వాడకం English లో చాలా ఎక్కువే. Practice చేయండి.




**ప్రశ్న:**
*1. Abandon- ed*
*2. Desert- ed*
*3. leave- left- left*
*4. Forsake, forsook, forsaken*

*వీటన్నింటి అర్థం కూడా వదిలి వేయు అనే కదా?*

*అదే విధంగా 1. abate- ed*
*2. lessen- lessened- lessened*
*3. mitigate- ed*
*4. diminish- ed*
*5. alleviate-ed*
*6. allay- allayed, allayed*
*7. reduce- reduced- reduced*
*8. decrease- ed*

*ఈ verbs అన్నీ కూడా ఒకే అర్థం - తగ్గించడం- అనేనా లేదా వాటికి వేరే అర్థాలున్నాయా తెలుగులో? ఒకే అర్థానికి English లో వీటిలో ఏదో ఒకటి వాడాలా లేదా సందర్భాన్నిబట్టి ఈ verbs ఉపయోగించాలా? English పదజాలం నేర్చుకోవాలంటే ఏం చేయాలి?*

*– కె.ప్రకాశ్, అనంతపురం*

**జవాబు:**

Abandon, desert, forsake- ఈ మూడింటికీ అర్థంలో సారూప్యత వదిలేయటం అని.

Abandon అంటే దేన్నైనా ఏం పట్టించుకోకుండా, కాస్తయినా శ్రద్ధ చూపించకుండా పూర్తిగా దాని కర్మకు దాన్నొదిలేయటం అని.

The driver abandoned the lorry after the accident. (Accident తర్వాత ఆ driver లారీని అక్కడ వదిలేసి వెళ్ళిపోయాడు- Lorry కి ఏమవుతుందని పట్టించుకోకుండా).

The match was abandoned because of the rain (వర్షం వల్ల match వదిలేశారు). (పునఃప్రారంభం లేదు)

Some woman abandoned her child at the railway station (ఎవరో స్త్రీ తన బిడ్డను వదిలేసి వెళ్ళిపోయింది)

Desert అంటే మానవ సంబంధాలను వదులుకోవటం.

The man deserted his wife and children =
అతను భార్యా పిల్లలను వాళ్ళ కర్మకొదిలేశాడు.

The lover deserted the girl after eloping with her -
ఆ అమ్మాయితో లేచిపోయి తనను వదిలేశాడు.

Desert అంటే ఇంకో అర్థం నిర్మానుష్యం చేయటం-
A deserted village - నిర్మానుష్యం అయిన గ్రామం.
ఇది కాస్త గమనించండి.

The building was deserted =
ఆ building ను వదిలేసి పారిపోయారు.

The abandoned building - ఆ building ను వదిలేశారు- దాన్ని మళ్ళీ వాడుకునే ఉద్దేశం లేదు.

Forsake అంటే వదిలేయటమే. అయితే మన సన్నిహితులు వాళ్ళ అవసరం మనకు బాగా ఉన్న సమయంలో మనల్ని వదిలేయటం forsake.

All his close friends forsook him when he badly needed their help=
అతని స్నేహితులందరూ వాళ్ళ అవసరం అతనికున్నపుడు వాడ్ని వదిలేశారు.

If you continue like this, every one will forsake you =
ఇలాగే నువ్వు కొనసాగితే, ఎవరూ నీ సహాయానికి రారు. (ఎవ్వరూ నీ మొర ఆలకించరు)

ఇక leave అంటే మామూలుగా వదిలేయటం.

***ప్రశ్న:*** *కిందివాటిని తెలుగులో ఎలా అనాలో తెలుపగలరు.*

*1. నేను చేయగలను అనుకోవడం నమ్మకం. నేను మాత్రమే చేయగలను అనుకోవడం అహంకారం అవుతుంది.*
*2. ఏదైనా చెబితే అర్థం కాదు, అనుభవిస్తేనే తెలుస్తుంది.*
*3. ఒళ్లు ఎలా ఉంది. పిచ్చి పిచ్చి వేషాలు వేయవద్దు.*
*4. మీ సమాధానాల కోసం వేయి కళ్లతో ఎదురు చూస్తుంటాను.*

***– జి.వెంకటేశ్వర్లు, గుంటూరు***

**జవాబు:**

**1.** That you can do it is confidence. That you alone can do it is conceit.
**2.** To be merely told can't help you to understand. Experience alone can.
**3.** Don't try to be smart? (ఒళ్లు ఎలా ఉందికి English లేదు, మీ భావంతో)
**4.** I'll be waiting eagerly for your answers.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ




# He threw one last look at her

**Vidur:** When we met last you were saying you had a problem. Are you free from it?
(మనం కిందటిసారి కలుసుకున్నప్పుడు ఏదో సమస్య ఉందన్నావు. అయిపోయిందా అది? )

**Sanjai:** Thanks to Vyas. Everything has been solved.
(నిజంగా వ్యాస్‌కు కృతజ్ఞతలు. అతడి వల్ల అన్నీ తీరిపోయాయి)

**Vidur:** He is really a helping type.
(అతను నిజంగా సాయం చేసేవాడే)

**Sanjai:** It's really a wonder that with all his busy activities he found the time to help me.
(అంత తీరికలేని పనులతో ఉండి కూడా నాకు సాయం చేసేందుకు అతడికి time దొరికిందంటే ఆశ్చర్యమే)

**Vidur:** He certainly helps others. That's why he is so popular with our friends.
(ఇతరులకు నిజంగానే సహాయం సాయం చేస్తాడు. అందుకనే మన స్నేహితులందర్లో అత నంటే అభిమానం ఉంది)

**Vidur:** He is a good speaker too. I've attended a number of his speeches. The minute he begins his speech, people listen to him with interest.
(అతను మంచి వక్త కూడా. అతడి ఉపన్యాసా లకు చాలా వాటికి నేను వెళ్లా. అతను మాట్లా డటం ప్రారంభించినప్పటి నుంచి అందరూ చాలా ఆసక్తితో వింటారు)

**Sanjai:** Appearances are deceptive, they say. Inspite of his greatness, he looks so ordinary and unassuming.
(రూపం మోసం చేస్తుందంటారు. పైకి కన్పించే దెప్పుడూ నిజం కాదు. అంత గొప్పవాడైనా, వ్యాస్ చాలా మామూలు మనిషిగా, నిరాడంబ రంగా కన్పిస్తాడు)

Appearances are deceptive - ఇది English లో సామెత - ఆకారం మోసకరం అని అర్థం. ఆకారాన్ని చూసి అసలు స్వభావం తెలుసుకోలేమని.

**Vidur:** That's why we should never judge people by appearances.
(అందుకనే మనం ఎప్పుడూ ఇతరుల/ మను షుల ఆకారాలను బట్టి వాళ్లను అంచనా వేయ కూడదు.)

judge = గుణగణాలను అంచనా వేయటం

**Sanjai:** You know, for some time he was with his uncle's company, as its manager. With his managerial skills it was able to make good profits. The company was able to pay back its creditors all the money owed with interest to the last paisa.
(కొంతకాలం అతను వాళ్ల Uncle Company కి Manager గా ఉన్నాడు. తన యాజమాన్య నైపుణ్యం వల్ల ఆ Company మంచి లాభాలు చేసుకోగలిగింది. అప్పుల వాళ్లందరికీ పైసలతో సహా అప్పులు తీర్చేసింది.)

Creditors = అప్పులిచ్చినవాళ్లు

**Vidur:** Finally when I thanked him profusely for his help, he muttered not at all, and with that he left.
(చివరికి అతనందించిన సహాయానికి నేను thanks చెప్తే, 'not at all' అని సణిగి వెళ్లిపో యాడు).

**Sanjai:** Yea, he is like that. We rarely come across people who are as embarrassed as he to receive thanks.
(అవును అతనంతే. Thanks పొందేటప్పుడు అతనంత ఇబ్బందిగా ఉండేవాళ్లను చాలా అరు దుగా చూస్తాం)

**Vidur:** It's our fortune to have a friend like Vyas.
(Vyas లాంటి friend మనకుండటం మన అదృష్టమే)

**Sanjai:** So it is (అవును)

మన study of prepositions లో భాగంగా with వాడాల్సిన సందర్భాలు మరి కొన్ని తెలుసుకుందాం ఈ lessonలో.

***Look at the following sentences from the dialogue above:***

*1) It's really a wonder that with all his busy activities he found the time to help me.*

*2) That's why he is so popular with our friends.*

*3) People listen to him with interest.*

*4) For sometime he was with his Uncle's Company.*

*5) With his managerial skills it was able to make profits.*

*6) ... and with that he left*


M.SURESAN

**1) With all his busy activities-** ఇక్కడ జాగ్రత్తగా గమనించండి, with ను inspite of (అయినప్పటికీ) అనే అర్థంతో వాడుతున్నాం (అంత తీరికలేని పనులున్నప్పటికీ)

So, with ను inspite of అనే అర్థంతో వాడవచ్చు

a) With all his influence, he could not get the license for his factory =
అంత పలుకుబడి ఉన్నప్పటికీ, తన factory కి license సంపాదించుకోలేకపోయాడు.

b) With all his riches he does not enjoy a happy life = అంత సంపద ఉన్నప్పటికీ జీవితంలో సంతోషం అనుభవించటంలేదతను.

అయితే ఒక్కోసారి, with ను పై భావానికి వ్యతిరే కంగా, అందువల్ల అనే అర్థంతో కూడా వాడతాం.

a) With all his responsibilities I wonder if he can help us.
(అతనికున్న బాధ్యతల మూలంగా (వాటివల్ల) అతను మనకు సహాయం చేయగలడా అని నా సందేహం.)

I wonder = నాకు సందేహం

b) With all the books thrown about the place how can I find the paper I want =
ఈ పుస్తకాలన్నీ ఇంత చిందరవందరగా ఉంటే నాక్కావలసిన paper ఎలా దొరుకు తుంది?

**2) Popular with** = అభిమానం కలిగిన/ పొందిన

a) The teacher is very popular with his students and his colleagues as well =
తన విద్యార్థుల, సహోద్యోగుల అభిమానం ఉందతనికి.

b) The song is popular with film fans =
చలనచిత్ర అభిమానులు ఇష్టపడతారు ఆ పాటంటే.

**3) With interest** = శ్రద్ధగా/ శ్రద్ధతో

a) Please listen to with interest =
నేను చెప్పేది ఆసక్తితో వినండి.

b) We received the news with great joy/ delight/ excitement, etc. =
ఆ వార్త మేం సంతోషంతో/ ఉత్సుకతతో విన్నాం (ఆ వార్త మాకు సంతోషం; ఉత్సుకత కలిగించింది)

c) They heard the news with shock =
ఆ వార్త వారికి దిగ్భ్రమ కలిగించింది.

పై sentences అన్నింటిలో with, ఏ విధంగా అనే విషయం (manner) ను తెలియజేస్తుంది కదా?

**4) with his Uncle's Company** = ఒక సంస్థలో పని చేయటం.

a) He is with the Hindu paper as a Circulation Manager =
అతను హిందూ పత్రికలో Circulation Manager గా పనిచేస్తున్నాడు/ ఉన్నాడు.

b) I am no longer with Speed Motors. I've resigned =
నేనిప్పుడు Speed Motors లో లేను. రాజీనామా చేశాను.

(అయితే with బదులు In కూడా వాడవచ్చు
I am in Speed Motors as an Executive

**5) With his managerial skills-** ఇక్కడ with అంటే 'తో'. తన యాజమాన్య నైపుణ్యంతో, అని.

a) With his acting talent, he can act any role
తన నటనా ప్రతిభతో, అతను ఏ పాత్రలోనైనా నటించగలడు.

b) With his sharp brains he can solve any problem =
తన చురుకైన బుర్రతో ఏ సమస్యనైనా సాధించగ లడు (పరిష్కరించగలడు).

**6) with that he left** = ఆ మాట అని వెళ్లిపోయాడు.

a) He threw one last look at her. With that he left = చివరిసారి ఆమెవైపు చూశాడు. అంతే. అక్కడ్నించి వెళ్లిపోయాడు.

b) He muttered something. With that he sat down there silently = ఏదో సణిగాడు. ఆ తర్వాత అక్కడే కూర్చుండిపోయాడు.

---



**ప్రశ్న:**

*a) Communication gap అంటే ఏమిటి? (మా స్నేహితుడు 'ఇద్దరు వ్యక్తుల మధ్య language అర్థం కాకపోవడం అంటున్నాడు.) ఉదాహరణతో తెలియజేయండి.*

*బి) Letter writing లో Dear sir, yours faithfully, Signature లాంటివి అన్నీ left side వచ్చేలా రాయవచ్చా?*

**– వేముల రామ్మోహన్‌రావు, కొత్తవలస.**

**జవాబు:**

i) Communication gap = సంభాషణలో, ఉత్తర ప్రత్యుత్తరాల్లో, ఒకరు వాడే మాటలు, సందర్భానికి తగినవి కాకపోవటంతో, ఇంకొకరు (వినేవాళ్లు, చదివే వాళ్లు) దాన్ని సరిగా అర్థం చేసుకోకపోవటం/అపార్థం చేసుకోవటం. ఒక్కోసారి మన tone (గొంతు ధ్వని) సందర్భానికి తగినది కాకపోవటంవల్ల కూడా communication gap రావచ్చు

2) రాయవచ్చు ఇప్పుడది accepted form. Letter Writing విషయంలో కచ్చితంగా పాటించాల్సిన rules అంటూ ఉండవు. ఏదైనా ఒక మార్పు వచ్చి దాన్ని ఎక్కువ మంది పాటిస్తే అదే rule అవుతుంది. ముఖ్యంగా Commercial Correspondence లో (వాణిజ్య ఉత్తర ప్రత్యుత్తరాలు) variety కోసం, మార్పులు వస్తుంటాయి. అవే కొంతకాలానికి rules అవుతాయి. ఇప్పటి Correspondence లో Mr (Mister) Mrs, etc., లాంటి abbreviations పక్కన fullstops వదిలేస్తున్నారు. తర్వాత కొంచెం space వదులుతున్నారు. ఇలా trends మారుతుంటాయి.

**ప్రశ్న:**

*I would like to know the clear difference between "clause" and a "sentence".*

*Do all the collective nouns come under neuter gender?*

**– ఎస్. ఆనందరావు, గిడుతూరు.**

**జవాబు:** A clause is a group of words with a verb. A sentence is a group of words with complete meaning.

A sentence must have a verb to have complete meaning, but just by having a verb, a group of words may not have complete meaning. Because a sentence has a verb (with the meaning complete), so it is also a clause. A clause has a verb and may/may not have complete meaning. So a clause is not always a sentence.

When he comes here - a group of words with a verb- meaning not complete, so not a sentence. It is a subordinate clause. When he comes here, his mother will be happy. In this sentence, 'his mother will be happy' is a clause with complete meaning, so it is the main clause.

He knows English - A word group with complete meaning - a sentence (It is also a group of words with a verb - so a clause).

**ప్రశ్న:**

*Rupees three thousand and forty only.* ఇలాంటి వాక్యాల్లో *rupees* అనే పదాన్ని *amount* కి ముందు చదవాలా? లేదా తర్వాతా? B.A.(Honours), M.A. (Honours) మామూలు డిగ్రీకి, ఆనర్స్‌కి తేడా ఏమిటి?

**– వి. శ్రీనివాస్, తూర్పుగోదావరి జిల్లా.**

**జవాబు:** i) రాసేటప్పుడు Rs (Rupees), amount ముందు రాస్తాం. కాని చదివేటప్పుడు, మాట్లాడేటప్పుడు మాత్రం, ముందు ఎంత మొత్తమో చెప్పి, తర్వాత rupees అంటాం.

రాయటం: Rs 15000.00/ Rs 15000/-
చదవటం/చెప్పటం- 15000 rupees అని (rupees) వెనుక వచ్చేలా అంటాం. అలానే అనాలి.

ii) కొన్ని Universities లో ఈ course లు ఉంటాయి. ఇవి సామాన్యంగా degree/graduation కంటే ఎక్కువ స్థాయిలో ఉంటాయి. MA (Hons) లాంటి degree లు ఆ Course లో చాలా ప్రతిభ కనబరిచినవారికి ప్రత్యేకంగా ఇస్తారు. BA (Hons) graduation కంటే హెచ్చుస్థాయిని, MA (Hons), Post graduate కంటే హెచ్చు స్థాయిని సూచిస్తాయి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

**Abhai:** Were you up late last night? I can see that from your face.
(నిన్న చాలాసేపు మేల్కొని ఉన్నావా? నేనది నీ మొహంలో చూడగలుగుతున్నాను./ నీ మొహం చూస్తే తెలుస్తోంది.)

**Vinai:** Yes. I had to be up early as well this morning.
(అవును. అంతేకాకుండా పొద్దున త్వరగా లేవాల్సి వచ్చింది)

**Abhai:** Why so? What's up?
(ఎందుకలా? ఏమిటి విషయం?)

**Vinai:** It has been so for two days now. We have a lot of back log to clear. The time we are allowed is up to tomorrow.
(రెండ్రోజులుగా ఇలాగే ఉంది పరిస్థితి. చాలా పని మిగిలిపోయి ఉంది. మాకిచ్చిన టైమ్ రేపటి వరకు మాత్రమే.)

back log = సకాలంలో పూర్వపక పేరుకుపోయిన పని

**Abhai:** Why is that ? (అలా ఎందుకైంది?)

**Vinai:** Two of our colleagues have been laid up with dengue. They've been on leave for two weeks and so the work has piled up
(మాతో పనిచేసే ఇద్దరు Dengue తో బాధపడుతున్నారు. వాళ్ళు రెండు వారాలుగా సెలవులో ఉన్నారు. అందుకని పనిపేరుకుపోయింది.)

**Abhai:** There are others too to share the work, aren't there?
(ఈ పని కొంత చేసేందుకు, నువ్వు కాకుండా ఇతరులు కూడా ఉన్నారు కదా?)

**Vinai:** But their work isn't up to much. They mess up everything.
(వాళ్ళ పని అంత బాగుండదు. అన్నీ గందరగోళంగా చేస్తారు)

**Abhai:** So you'll be busy till your two colleagues are up and about.
(అయితే మీ colleagues లేచి తిరిగే వరకు నువ్వు busy గానే ఉంటావన్నమాట.)

**Vinai:** Yes. Unfortunately one of the computers is out of order too. It must be up by tomorrow morning, or we have to work on sunday too.
(అవును. దురదృష్టవశాత్తూ కంప్యూటర్లలో ఒకటి చెడిపోయింది. అది రేప్పొద్దుటికి సరైతే సరి. లేకపోతే ఆదివారం కూడా పనిచేయాల్సి వస్తుంది.)

**Abhai:** Whatever you say, I don't feel upto going to work on sundays. That's the last thing I'd like to do.
(నువ్వేమన్నా సరే, ఆదివారాలు పనిచేయటం నాకిష్టం ఉండదు. అది నేను చేయను.)

the last thing I'd do = దాదాపు చేయను

**Vinai:** Your's a good company- proper planning, no overwork, good perks etc. But why have you upped the prices of your products?
(మీ కంపెనీ మంచిది. సరైన ప్లానింగ్. మితిమీరిన పనుండదు. మంచివసతులు. కాని మీ తయారీల ధరను పెంచేశారేంటి?)

Perks= కంపెనీలు, సంస్థలు ఉద్యోగులకు కల్పించే ఉచిత వసతులు

**Abhai:** The raw materials are up by 20%. So we couldn't help it.
(ముడి సరకుల ధరలు పెరిగాయి మేమేం చేయలేం. పెంచక తప్పలేదు.)

**Vinai:** Some other time then. My time is up. I must be going.
(సరే. మళ్లీ కలుసుకుందాం. నాకు టైం అయింది. నేవెళ్లాలి.)

**Abhai:** Bye.

✪ ✪ ✪ ✪ ✪

ఈ lesson లో English conversation లో చాలా తరచుగా వినిపించే up ఉపయోగాలు తెలుసుకుందాం. up ఒక్క preposition గానే కాదు. మిగతా parts of speech లో కూడా వాడతాం. up ఉపయోగం spoken English లో చాలా ఎక్కువే.

*Look at the following sentences from the conversation above*

1) *Were you up late last night?*
2) *I had to be up early as well.*
3) *What's up?*
4) *upto tomorrow*
5) *Two of our colleagues have been laid up.*
6) *So the work has piled up.*
7) *But their work isn't up to much.*
8) *You'll be busy till your colleagues are up and about.*
9) *It must be up by tomorrow.*
10) *I don't feel up to going to work on sundays.*
11) *Why have you upped the prices of your products?*

**1) Were you up? 2) I had to be up.**

To be up = మేల్కోవడం/ మేల్కొని ఉండటం/ నిద్రలేవడం. Spoken English లో నిద్రలేవడం/ మేల్కోవడం అనే అర్థంతో wake up కంటే get up ఎక్కువగా, అన్నింటికంటే be up ఎక్కువగా వినిపిస్తుంటుంది.

(wake up- I wake up at 5, etc., ఇలాంటి చోట్ల wake up కాస్త గ్రాంథికం. అన్నింటి కంటే ఎక్కువ వినపడేది be up. చూడండి.




# When are you up usually?

a) I am up by 5 in the morning = ఐదింటికల్లా లేస్తాను నేను.

b) When are you up usually? = మామూలుగా ఎప్పుడు నిద్రలేస్తావు?

c) Why are you up so early today?= ఇవాళ ఇంత త్వరగా నిద్రలేచావెందుకు?


M.SURESAN

**3) What's up?**= ఏంటి విషయం?

a) He is nowadays seen here frequently and that too at odd times. What's he upto? / Is he up to something? = ఈ మధ్య వాడిక్కడ తరచూ, అదికూడా వేళకాని వేళల్లో కనిపిస్తున్నాడు. ఏంటి విషయం? / వాడేమన్నా చేయబోతున్నాడా? / ఏంటి వాడి ఉద్దేశం?

b) I'm afraid he's up to something= వాడేదో చేయబోతున్నాడని నాకనుమానమే.

c) By their looks, they are upto something: వాళ్ళ మొహాలు చూస్తే వాళ్ళేదో ఉద్దేశంతోనే ఉన్నట్టుంది.

**4) upto tomorrow.** ఇది మనందరికీ తెలిసిందే. ఇక్కడ అర్థం, upto = అంతవరకు.

I don't need it upto Saturday ( till Saturday) శనివారం వరకు నాకు అది అవసరం లేదు.

**5) To be laid up with=** జబ్బు పడటం.

a) She is laid up with 'flu = ఆమె 'flu తో బాధపడుతోంది.

b) Laid up with paralysis, he can't move about = పక్షవాతం బారిన పడటం వల్ల అతను కదలలేదు.

ఇంతకుముందు మనం తెలుసుకున్నాం- to be down with అంటే కూడా జబ్బుపడటం.

c) He is laid up with dengue = He is down with dengue = Dengue తో బాధపడుతున్నాడు.

Laid up with కు సంబంధించిందే expression No

**8) Till your colleagues are up and about .** చూడండి:

To be up and about= జబ్బు నుంచి కోలుకుని తిరగగలగటం.

a) Govind is better now. He should be up and about in a few days = గోవింద్ పరిస్థితి కాస్త మెరుగ్గా ఉంది. ఇంకా రెండు మూడు రోజుల్లో పూర్తిగా కోలుకుని తిరగగలగాలి. (ప్రస్తుత పరిస్థితిని బట్టి).

b) My mother is ok now. She has been up and about since the day before = మా అమ్మ ఇప్పుడు కులాసానే. మొన్నటి నుంచి లేచి తిరుగుతోంది. పూర్తిగా కోలుకుంది.

**6) The work has piled up =** పని పేరుకుపోయింది.

(pile = దొంతర- ఒకదాని మీద ఒకటి ఉండటం - a pile of books = ఒకదాని మీద ఒకటి ఉన్న (దొంతరగా) పుస్తకాలు.

pile= దొంతరగా ఉంచటం - ఒకదాని మీద ఒకటి

He is piling book upon book - పుస్తకాలు ఒకదానిమీద ఒకటి పేరుస్తున్నాడు.

Work is piling up = పని పేరుకుపోతోంది)

Pile తర్వాత up గమనించండి.

**7) Their work isn't up to much.**

**Not up to much =**

(గమనించండి- not లేకుండా ఈ expression వాడం) = అంత నాణ్యత లేని/ అంత తృప్తికరం కాని.

a) Their work isn't up to much = వాళ్ళ పనిలో నాణ్యత అంత ఉండదు / వాళ్ళు (ఆ పని) సరిగా చేయలేరు.

b) He gave some money, but that isn't up to much = నాకు కొంత డబ్బు ఇచ్చాడు అతను, కాని అది నాకు అంత తృప్తిగా లేదు.

c) He repaired my bike, but that isn't up to much= నా bike repair చేశాడు, కానీ అది సరిగా చేయలేదు.

**9) It must be up by tomorrow** - To be up by some time - ఒక సమయానికి ఏదైనా repair అయి వాడుకోవటానికి సిద్ధంగా ఉండటం. (ముఖ్యంగా computers).

a) Let it be up at least by Friday = కనీసం శుక్రవారానికైనా దాన్ని సిద్ధం చేయి, repairs పూర్తి చేసి.

b) Will it be up by tomorrow? = రేపటికి అది సిద్ధంగా ఉంటుందా?

**10) (Not) be / (Not) feel up to =**

ఏదైనా పని చేయలేకపోవటం / చేయాలని అనిపించకపోవటం. ఎక్కువ not తోనే వాడతాం.

a) He is not up to the job. He is certainly a wrong choice = అతనా పని చేయలేడు. అతడ్ని ఆ పనికి ఎంచుకోవటం (పెట్టుకోవటం) కచ్చితంగా తప్పే.

b) I don't feel up to going to college today = ఇవాళ నాకు college కి వెళ్లాలనిపించటం లేదు.

**11) up =** పెంచటం (ధరల్లాంటివి)

They have upped the prices of their products = వాళ్ళ తయారీల ధరలు పెంచేశారు.

---

**ప్రశ్న:** *Please let me know brushing aside grammar rules especially in Indirect speech whether it is modern English usage? Suggest me a title to learn English idioms.*

*– ఆర్.ఎస్. మహేష్, కర్నూలు*

**జవాబు:** The same doubt, raised by two others, also from Kurnool, was cleared in these columns some months ago. You must have seen it. One of the exceptions to the rule (Main Clause- Past Tense, Subordinate Clause also past tense) is in situations like the following:

I met Kiran yesterday.

He told me (yesterday) that he is the Manager of a Bank here.

Strictly according to the rule it should be, He... that he was the Manager of a Bank here. But this would imply that he is not the manager now. So here we don't apply the rule. See also: The station master told me half an hour ago that the train is running late. This is OK. In the sentence from your letter, "... speaking on the occasion the UPA deputy Chairman said Sonia Gandhi will visit..." will visit is definitely wrong. As you say it should be 'would visit'.

**ప్రశ్న:** *కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా అనాలో తెలియజేయగలరు.*

i) *నేనేం చేస్తానో నాకే తెలియదు.*
ii) *నీవు ఆమెను తప్పక సినిమాకు తీసుకుపోవాలి.*
iii) *అతడిని కూర్చోబెట్టాను.*
iv) *ఆమెను 1 కి.మీ. దూరం నడిపించాను.*
v) *రేపు మావోయిస్టులు రాష్ట్ర బంద్‌కు పిలుపిచ్చారు.*
vi) *ఇలాంటి పరిస్థితిని తిరిగి ఎప్పుడూ రానీయకు.*
vii) *నేను 'ది హిందూ' పత్రిక తెప్పిస్తున్నాను.*

*– జి. ప్రశాంత్, నాగార్జునసాగర్*

**జవాబు:**



i) I don't know/ I my self don't know what i will do/ I am going to do
ii) You must take her to the movie
iii) I made him sit/ I seated him
iv) I made her walk a distance of 1Km
v) The Maoists have given a call for a bandh tomorrow
vi) Let this not happen again/ let such a situation never happen again
vii) I am getting/ subscribing to the Hindu.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# He is never off my mind

**Ranjan:** Hi, Harsha, what's new?

**Harsha:** Nothing (ఏం లేదు)

**Ranjan:** I called you the other day but you walked off in a hurry. In fact I called you till you were out of earshot.
(మొన్న ఒకరోజు నేను నిన్ను పిలుస్తుంటే, నువ్వు చాలా త్వరగా వెళ్లిపోయావు. వినపడనంత దూరం వెళ్లే వరకూ పిలిచాను.)

**Harsha:** I didn't really hear you, I swear. Nothing is a greater pleasure than talking to you.
(నీ పిలుపు నాకు నిజంగా వినిపించలేదు. నీతో మాట్లాడటం కంటే నాకు వేరే సరదా ఏం ఉంది?)

**Ranjan:** I returned recently from Mumbai. There I ran into our old friend and classmate Charit. (Do) you remember him?
(ఈ మధ్యే నేను ముంబై నుంచి తిరిగొచ్చాను. అక్కడ అనుకోకుండా మన క్లాస్‌మేట్, పాత స్నేహితుడూ చరిత్ కలుసుకున్నా. చరిత్ నీకు గుర్తే కదా?)

**Harsha:** Of course I do. He is never off my mind. Well, what about him?
(గుర్తులేకపోవడమేంటి? వాడిని ఎప్పుడూ నేను మర్చిపోను. ఏంటతన్ని గురించి?)

**Ranjan:** He is very well off now. He is a big business man of sorts.
(ఇప్పుడు చాలా ధనవంతుడతను. ఏదో బడా వ్యాపారే అతను.)
(of sorts = ఓ రకంగా)

**Harsha:** So he is better off outside the home state. That's good for him.
So long as he was here, he was quite badly off, for all his talent.
(సొంత రాష్ట్రం బయటే బాగున్నాడన్నమాట తను. ప్రతిభ కలవాడైనప్పటికీ ఇక్కడున్నంత కాలం అతనికేం కలిసి రాలేదు.)

**Ranjan:** You can say that. He isn't without talent really. He is able to show that in Mumbai. I think people are well off once they get out of their homes.
(నిజమే. అతను ప్రతిభ లేనివాడేంకాదు. దాన్నతడు ముంబైలో చూపించగలుగుతున్నాడు. స్వరాష్ట్రం నుంచి బయటపడితేనే ధనికులు అవుతారనుకుంటా.)

**Harsha:** So, when are you going to Mumbai again?
(అయితే నువ్వు మళ్లీ ముంబై ఎప్పుడు వెళ్తున్నావ్?)

**Ranjan:** I am off as soon as my ticket is ready. I think that'll take another weak.
(నా టికెట్ రెడీ కాగానే వెళ్తాను. అయితే అదో వారం పట్టవచ్చు.)

**Harsha:** Have you booked your ticket?
(నీ టికెట్ బుక్ చేసుకున్నావా?)

**Ranjan:** No. Not yet. I had been to the station this morning for reserving my ticket. The power was off for nearly an hour. Having no patience to wait any longer I came away. I'm going tomorrow again.
(లేదు ఇంకా. ఇవ్వాళ పొద్దున స్టేషన్‌కు వెళ్లాను రిజర్వ్ చేసుకునేందుకు. కానీ గంటసేపు కరెంటు లేదు. వేచిఉండే ఓపిక లేక వచ్చేశాను. మళ్లీ రేపు వెళ్తాను.)

**Harsha:** You don't seem to be in any hurry to go back.
(తిరిగి వెళ్లేందుకంత తొందరపడుతున్నట్లు కన్పించడం లేదు నువ్వు.)

**Ranjan:** I am off the mood for work. I've a lot of leave in credit. I want to be off work for the whole period of leave.
(పని చేయాలనే ధోరణి రావట్లేదు. నాకు చాలా సెలవులున్నాయి. ఈ సెలవు రోజులైపోయేవరకు పనిచేయకుండా ఉండాలని ఉంది.)

**Harsha:** That makes me happy. We can be together for some time.


M.SURESAN

English conversation లో తరచూ వచ్చే off ను గురించి మరికొన్ని విషయాలు తెలుసుకుందాం.

***Look at the following expressions from the conversation above:***

*1) I called you the other day but you <u>walked off.</u>*
*2) He is never <u>off my mind.</u>*
*3) He is very <u>well off</u> now.*
*4) So he is <u>better off</u> outside the state.*
*5) I think people are <u>well off</u> when they get out of their homes.*
*6) I am <u>off</u> as soon as my ticket is ready.*
*7) The power was <u>off</u> for nearly an hour.*
*8) I want to <u>be off work</u> for the whole period of leave.*

**'off'** అన్నిచోట్లా preposition కాదు. ఒక్కోసారి adverb గా, adjective గా కూడా ఉపయోగిస్తాం.
Just don't worry what part of speech a word is, so long as you are able to use it correctly in your speech. Correct use, that's important.

**Study the following uses of 'off' now:**

**1) Walk <u>off</u>,run <u>off</u>,etc** =
ఇలాంటి చోట్లంతా, off కు అర్థం, away అని. అంటే వెళ్లిపోవటం, పారిపోవటం అనే భావంతో. (అవతలకు వెళ్లిపోవటం/ అవతలికి పారిపోవటం అని)

a) They <u>walked off</u> without listening to her =
ఆమె చెప్పింది వినిపించుకోకుండా వాళ్లు వెళ్లిపోయారు.

b) He threw it <u>off the window</u> =
అతను దాన్ని కిటికీ నుంచి (దూరంగా) <u>విసిరేశాడు.</u>

c) Look. <u>Off</u> he goes =
చూడు. అతను వెళ్లిపోతున్నాడు.

d) <u>Off you go</u>. We don't want you here any more =
Get out. <u>మీరిక్కడ ఉండ నక్కర్లేదు ఏ మాత్రం.</u>

ఇవి కూడా చూడండి:

a) They walked off with the victory/ the prize.
విజయం/ బహుమతి చేజిక్కించుకున్నారు.

b) The boy rang the bell, and as I opened the door, he <u>ran off</u> =
ఆ కుర్రాడు గంట కొట్టాడు. నేను తలుపు తెరిచేటప్పటికి, వాడు <u>పారిపోయాడు.</u>

c) They ran off towards the station =
వాళ్ళు స్టేషన్ వైపు పారిపోయారు.

**3) be well off** = బాగా డబ్బుండటం X
be badly off = డబ్బు లేకపోవటం.

a) You need not worry about Naresh. He's made it good in business and is well off now =
నరేష్ గురించి నువ్వేం చింతించనక్కరలేదు. వ్యాపారంలో బాగా పైకొచ్చాడు. డబ్బు బాగా సంపాదించి ధనికుడిగా ఉన్నాడు.

b) The father is a happy man because his sons are all <u>well off</u> =
కొడుకులందరూ <u>ఉన్నవాళ్లవటం</u> వల్ల తండ్రి చాలా సంతోషంగా ఉన్నాడు.

Well off X badly off -
తెలుస్తోంది కదా, badly off = పేదగా ఉండటం

a) Don't worry. Compared with the average Indian, you aren't <u>badly off</u> =
చింతపడకు. సగటు భారతీయుడితో పోలిస్తే, నువ్వు <u>బీదవాడివి</u> కాదు.

b) We are <u>badly off</u> for investment, so we are unable to start business =
<u>పెట్టుబడి పెట్టలేక</u>/ <u>పెట్టుబడి శక్తి లేక</u> మేం వ్యాపారం ప్రారంభించలేకుండా ఉన్నాం.

c) She isn't so <u>badly off</u> as not to have/ buy good dresses =
మంచి డ్రెసెస్ కొనలేనంత పేదదేం కాదు ఆమె.

**4) So he is <u>better off</u> outside the state =**
రాష్ట్రం బయట ఉంటేనే అతని పని బాగుంది/ అతను <u>బాగా సంపాదించుకున్నాడు.</u>

a) People are <u>better off</u> now than before because of technological progress =
సాంకేతిక పురోభివృద్ధి వల్ల ఇంతకు ముందుకంటే ఇప్పుడు ప్రజల పరిస్థితి (ఆర్థికంగా) మెరుగ్గా ఉంది.

b) The team is <u>better off</u> without him =
వాడు లేకుంటేనే టీమ్ బాగుంది.

**6) I'm off** = నేను వెళ్ళిపోయినట్లే

a) It's already late. I'm off =
ఇప్పటికే ఆలస్యమైంది. నేను వెళ్ళిపోతున్నా.

b) The bird is off to unknown lands =
తెలియని ప్రదేశాలకు ఆ పక్షి (ఎగిరి) పోయింది.

**7) Power is off** = విద్యుత్ లేకపోవడం.
Off work = పనికి వెళ్లకపోవడం.

పైవన్నీ కూడా conversation లో అత్యంత తరచుగా వినిపించే మాటలు. బాగా practice చేయండి.

---

**ప్రశ్న:** *i) "A true book is the life blood of a matter's spirit". దీనికి తెలుగులో అర్థమేమిటి?*
*ii) When we use these phrases?*
*a) On the other hand.*
*b) As a matter of fact.*
*c) on the basis of.*

– *జి. శంకర్, శంకరపట్నం*

**జవాబు:**

i) A true/ great book is the life blood of a master spirit - ఇదీ correct form of the sentence.
అర్థం- ఒక నిజమైన/గొప్ప పుస్తకం ఒక మహాత్ముని ప్రాణాధారమైన రక్తం.

ii) **a) On the other hand** - ఇది on the one hand .., on the other (hand)- ఇది రెండు అభిప్రాయాల/విషయాల/ దృక్పథాల మధ్య తేడా, ముఖ్యంగా వైరుధ్యం తెలిపేందుకు వాడతాం.

- On the one hand they want to give money, but on the other, they don't want to give their money= డబ్బులివ్వటం ఇష్టమే, కాని వాళ్ల డబ్బు ఇవ్వటం ఇష్టంలేదు.
- He did not help me, on the other hand he spread lies about me =
నాకు సహాయం చేయలేదు, చేయకపోగా నామీద అబద్ధాలు ప్రచారం చేశాడు.

**b) As a matter of fact** =
మనం చెపుతున్న విషయానికి కాస్త ఆశ్చర్యం/ ఆసక్తి కలిగించేందుకు వాడే expression, యథార్థానికి అనే భావంతో.

- We have known each other for a long time. <u>As a matter of fact</u>, we were classmates at college =
మేము ఒకరికొకరం చాలాకాలంగా తెలుసు. యథార్థానికి మేం college లో classmates.
- I've helped him. <u>As a matter of fact</u> I've helped him even before he has asked for it = నేను వాడికి సాయం చేశాను. <u>యథార్థానికి</u> వాడు నన్ను అడగకముందే నేను వాడికి సాయపడ్డాను.

**c) On the basis of** =
ఒక విషయం ఆధారంగా; దాన్నిబట్టి.

- Don't act <u>on the basis of</u> what you have heard from others. Wait till you know the facts.
ఇతరులు చెప్పిందాన్నిబట్టి ఏమీచేయకు. వాస్తవాలు తెలుసుకునేవరకు ఆగు.
- <u>On the basis of</u> my experience I draw conclusions. =
నాకున్న అనుభవాన్నిబట్టి నేను నిర్ధారణలకు వస్తాను/ నా నిర్ధారణలు నా అనుభవాన్నిబట్టి ఉంటాయి.

**ప్రశ్న:** కింది వాక్యాలు కరెక్టేనా? వివరించగలరు.
*i) Whom I have to meet?*
*ii) We have to write the exam well.*
*iii) The property was sold before he wanted to buy it.*
*iv) He cannot help but accept defeat.*

– *ఎస్.భాస్కర్‌రావు, నరసన్నపేట*

**జవాబు:** మీరడిగినవాటికి correct sentences:
i) <u>Who</u> have I to meet?
ii) Correct
iii) The property <u>had been sold</u> before he wanted to buy it. (earlier past action)
iv) He <u>cannot help accepting</u> defeat/
He <u>cannot but accept</u> defeat.

**ప్రశ్న:** *i) All the students in our class passed the exam.*
*ii) All of the students in our class passed the exam.*
*ఈ వాక్యాలు కరెక్టేనా? వివరించగలరు.*

– *విష్ణు, హైదరాబాద్*

**జవాబు:** Both the sentences are correct. The first sentence as well as the second sentence means, Every one of the students in our class passed.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ




# I mistook it for her conceit

**Manogna:** (Have you) heard this? Anjana got a prize again.
(విన్నావా? Anjana కు మళ్ళీ prize వచ్చింది)

**Lochana:** What is it this time for?
(ఈసారి దేనికి? )

**Manogna:** For her excellence in studies and for her talent for public speaking.
(చదువులో ఆమె రాణింపునకూ, వక్తృత్వంలో ఆమె ప్రతిభకూ)

**Lochana:** She has won it for the third time in a row, I think.
(ఆమెకు prize రావటం, వరసగా ఇది మూడోసారి అనుకుంటా)

**Manogna:** Our friends are all admiration for Anjana. The one good thing about her is, for all the talent she has, she is quite modest.
(మన స్నేహితులంతా ఆమెను ఎంతో మెచ్చుకుంటున్నారు. అయితే ఒక మంచి విషయం ఏమిటంటే అంత ప్రతిభ ఉన్నప్పటికీ, తను చాలా నిగర్వి)

**Lochana:** In the beginning she wasn't for mincing free by with others. She was a bit reserved. I mistook it for her conceit. But as time went on she opened out, and we now know her for the good girl she is.
(మొదట అందరితో కలివిడిగా ఉండేందుకు ఇష్ట పడేదికాదు. కాస్త ముభావంగా ఉండేది. కాని పోను, పోనూ, అందరితో కలిసిపోయింది. ఇప్పుడు మనకు తెలుసు తను మంచి పిల్ల అని)

**Manogna:** She is too bright for a girl her age, and her background.
(ఆ వయసున్న వాళ్లలో, ఆ పరిస్థితులనుంచి వచ్చిన వాళ్లల్లో నిజంగా తెలివిగల అమ్మాయి తను)

**Lochana:** For now no one among us can be a match for her in studies or in other activities.
(ప్రస్తుతానికి మనలో ఎవరూ కూడా చదువులోగానీ, ఇతర విషయాల్లోగానీ తనకు సమానం కాలేం)

**Manogna:** Now for our business. When are we starting for Jamuna's?
(సరే ఇపుడు మన విషయానికొద్దాం. మనం జమున వాళ్లింటికెప్పుడు బయలుదేరుతున్నాం? )

**Lochana:** I'm afraid we can't start immediately. We have to wait for some time.
(వెంటనే బయలుదేరలేం అనుకుంటున్నా. కాసేపుండాలి)

**Manogna:** Wait? What for and who for?
(ఇంకాసేపు ఉండటమా? దేనికోసం, ఎవరి కోసం? )

**Lochana:** My brother has gone out to get some mangoes, and curds for our lunch. We shall have lunch here and then start.
(మా brother మన భోజనానికి పెరుగు మామిడి పండ్లూ తేవడానికి వెళ్లాడు. మనం ఇక్కడ భోంచేసి బయలుదేరదాం.)

**Manogna:** I don't mind lunch here, but I'm afraid mangoes and curds are not for me.
(ఇక్కడ భోంచేయటం నాకేం అభ్యంతరం లేదు, కానీ మామిడి పండ్లు నాకు పడవే)

**Lochana:** Oh, that's disappointing. Why can't you eat them?
(చాలా నిరాశగా ఉంది. నువ్వెందుకు తినలేవవి? )

**Manogna:** It's six months since the doctor told me, "Look Manogna, no curds and mangoes for you". Since then I've been avoiding them.


M.SURESAN

**Lochana:** Oh, what a pity! What are you going to eat then?
(దురదృష్టం. అయితే ఏం తింటావింక? )

**Manogna:** Just don't worry. I'll make do with whatever you have.
(ఏం ఫరవాలేదు. నువ్వు పెట్టగలదాంతో సరిపెట్టుకుంటా)

☯ ☯ ☯ ☯

*Our study of prepositions లో భాగంగా ఈ lesson లో 'for' ఉపయోగాలు కొన్ని తెలుసుకుందాం.*

***Study the use of 'for' in the following sentences from the conversation between Manogna and Lochana:***

*1) What is it this time for?*
*2) for her excellence in studies and for her talent for public speaking.*
*3) she has won it for the third time in a row.*
*4) Our friends are all admiration for her*
*5) for all the talent she has, she is quite modest.*
*6) I mistook it for her conceit*
*7) She is too bright for a girl her age.*

మనందరికీ తెలిసిన విషయం చాలా సందర్భాల్లో 'for'కు అర్థం: కొరకు, కోసం.

a) We are waiting for you= నీకోసం కాచుకుని ఉన్నాం.
b) This book is for Ramesh and that pen is for you = ఈ పుస్తకం రమేష్ కోసం (రమేష్‌కు), ఆ pen నీ కోసం (నీకు)
c) I am here for some information = ఏదో సమాచారం కోసం ఇక్కడ ఉన్నా.

**1. What is it this time for?** = ఈసారి ఎందుకు వచ్చింది (prize)? ఏ కారణానికి? ఎందుకు? అనే ప్రశ్నలకు జవాబుగా for వాడతాం.
a) What did he get the prize for = ఎందుకొచ్చిందతనికి prize?
b) He was punished for misbehaviour - దుష్ప్రవర్తనకు అతను శిక్షించబడ్డాడు (దుష్ప్రవర్తన వల్ల అతనికి శిక్ష పడింది)
c) They selected him for the job - ఆ ఉద్యోగానికి అతనిని ఎంపిక చేశారు.

**3) 'for'** ను ఎన్నోసారి అనే దాని ముందూ, ఎంతకాలంగా అని తెలిపేందుకు వాడతాం.
a) She has got the prize for the first time this year- ఈ సంవత్సరం మొట్టమొదటిసారిగా ఆమెకే prize వచ్చింది.
b) Our team has defeated them for the third time yesterday = మూడోసారి మా team నిన్న వాళ్ళను ఓడించింది.
c) for ten years he suffered like any thing = పదేళ్లపాటు అతను ఎంతో బాధపడ్డాడు.

**4) Admiration -** అభిమానం, మెచ్చుకోలు- తర్వాత for వస్తుంది.
a) We all have great admiration for Abdul Kalam. అబ్దుల్ కలాం పట్ల మనందరికీ అభిమానం ఉంది/ గొప్ప అభిమానం చూపుతాం
b) Fans are people with great admiration for their favourite actors = అభిమానులకు వారి అభిమాన నటుల పట్ల గొప్ప మెప్పు ఉంటుంది. అలాగే respect తర్వాత కూడా for వస్తుంది.
c) We have great respect for that teacher = ఆ teacher పట్ల మాకు చాలా గౌరవం.
d) Mistake for = పొరపడటం
She mistook him for his brother = అతన్ని చూసి అతని brother అని పొరబడింది.
Don't mistake me for being rude = మీ పట్ల దురుసుగా ఉన్నానని పొరబడవద్దు.

**6) For all =** in spite of (అయినప్పటికీ) అనే అర్థంతో.
a) for all his wealth he is not happy = అంత సంపదతో కూడా/ ఉన్నప్పటికీ అతనికి సంతోషం లేదు.
b) for all his sincerity, he could not get promotion = అంత చిత్తశుద్ధి ఉన్నప్పటికీ/ చిత్తశుద్ధితో పనిచేసినప్పటికీ అతను promotion పొందలేకపోయాడు.

**7) Too bright for a girl her age =** ఆ వయసుకు మించిన తెలివి ఉంది ఆ అమ్మాయికి.
a) He is too tall for a boy his age = అతని వయసుకు మించిన పొడుగతను.
b) He dances too well for his weight = అంత బరువున్నా/ అంత లావయినా నాట్యం బాగానే చేస్తాడు అతను (అంత లావున్నవాళ్లు అలా చేయటం గొప్ప).



**ప్రశ్న:** Spoken English కు సంబంధించి కింది linguistic doubts తీర్చగలరని మనవి. Aspect of English verb ను Halliday's, An Introduction to Functional Grammar లో వివరించారు. తెలుగులో కిందివాటి గురించి తెలుపగలరు.

– కె. రామకృష్ణ, హైదరాబాద్

1. Take/ did take - past, 2. take, takes, does take, do take- present, 3. will take - future, 4. had taken - past in past, 5. has taken - past in present, 6. will have taken - past in future, 7. was taking - present in past, 8. is taking - present in present, 9. will be taking - present in future, 10. was going to take - future in past, 11. is going to take - future in present, 12. will be going to take - future in future, 13. was going to have taken - past in future in past, 14. is going to have taken - past in future in present, 15. will be going to have taken - past in future in future, 16. had been taking - present in past in past, 17. has been taking - present in past in present, 18. will have been taking - present in past in future, 19. was going to be taking - present in future in past, 20. is going to be taking - present in future in present, 21. will be gong to be taking - present in future in future, 22. had been going to take - future in past in past, 23. has been going to take - future in past in present, 24. will have been going to take - future in past in future, 25. had been going to have taken- past in future in past in past, 26. has been going to have taken- past in future in past in present, 27. will have been going to be taken - past in future in past in future, 28. was going to have been taking - present in past in future in past, 29. is going to have been taking - present in past in future in present, 30. will be going to have been taken - present in past in future in future, 31. had been going to be taking - present in future in past in past, 32. has been going to be taking - present in future in past in future, 33. will have been going to be taking - present in future in past in future, 34. had been going to have been taking - present in past in future in past in past, 35. has been going to have been taking - present in past in future in past in present, 36. will have been going to have been taking - present in past in future in past in future.

**జవాబు:**

Take - takes కు ఆ పుస్తకంలో ఇచ్చిన forms, different tenses కు సంబంధించినవి. మీరు రాసిన forms లో

No.2 - Present indefinite/ Simple tense (Regular doing words) - ఇవి regular గా జరిగే పనులను తెలుపుతాయి, ప్రస్తుతంలో: eg: take, takes - regular గా ఏదైనా తీసుకోవటం/ తాగటం.

No.1 - ఇది Past Simple/ Indefinite (Past doing word)- ఇది గతంలో జరిగిన పని చెప్తుంది - He took the book yesterday - అతను నిన్న పుస్తకం తీసుకున్నాడు.

No.3 - Will take - future indefinite/ simple future లో జరిగే చర్యను తెలుపుతుంది. He will take the book tomorrow. రేపు తీసుకుంటాడు.

4. Had taken - had + past participle (Past perfect) - two past actions లో ముందు జరిగిన past action (1st past action ను) తెలుపుతుంది.

eg: He told me that he had taken (had + pp) the book (పుస్తకం తీసుకున్నానని చెప్పాడు) - రెండూ past - తీసుకోవటం, చెప్పటం, ముందరి (1st) past action - తీసుకోవటం, తర్వాత చెప్పటం- 1st past action - had taken (had + past participle) ఆ book లో ఇచ్చిన విధంగా past in the past, past in present, past in future, present in past, etc. వీటిని పట్టించుకోకండి- ఇవి చాలా confusing గా ఉంటాయి. అంతకంటే ముఖ్యంగా practice చేయాల్సింది- వివిధ tenses లో verb forms, అవి ఏయే సందర్భాల్లో వాడుతారనేది. అది తెలియటానికి ఇందులో వాడిన, past in the present, future in the present లాంటి expressions confusing గా ఉంటాయి. - వీటినసలు మీరు పట్టించుకోకండి- take కు ఇచ్చిన verb forms కు అర్థం తెలుసుకుని వాటిని మీ conversation లో సందర్భాన్ని బట్టి వాడండి.

ఇంకో ముఖ్య విషయం: మీరు రాసిన verb forms లో form No. 13, 14, 15, 19, 20, 21 to 35 వరకు ఉన్న verb forms మామూలు conversationలోగానీ, writingలోగానీ, చాలా, చాలా అరుదు. దాదాపు ఎక్కడా వినం/ చూడం. అలాంటి verb forms వాడితే మనం చెప్పేది ఎవరికీ అర్థంగాక communication, break అవుతుంది. వాటిని పూర్తిగా మర్చిపోయి, Pratibha Spoken English లో ఇచ్చిన lessons on verb forms practice చేయండి. మీ question లో మీరు practice చేయాల్సిన verb forms- verb forms from No. 1 to 11, No. 16 to 18, మాత్రమే. ఈ verb కోసం పాత ప్రతిభ spoken English lessons చూడండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 341

# Now for a cup of good coffee


M.SURESAN

**Yagnik:** I am not at all surprised that he has left the town for good. He has conned you all into subscribing to his bogus schemes.

(అతడు ఊరు వదిలి మళ్లీ తిరిగిరాకుండా పారిపోయాడంటే నాకేం ఆశ్చర్యంగా లేదు. మిమ్మల్నందరినీ మాయమాటలతో తన మోసకరమైన స్కీముల్లో చేర్పించి ఉడాయించాడు)

con=నమ్మించి మోసం చేయటం / ముఖ్యంగా మోసకరమైన schemes - వందల రూపాయలకు వేల రూపాయల offer లాంటి వాటితో అందరి దగ్గర డబ్బులు వసూలు చేసి ఉడాయించటం.

conmen= అలా మాయమాటల / schemes డబ్బులతో మాయమయ్యేవాళ్లు- రైళ్లల్లో, ఇలాంటి వాళ్లుంటారు కదా.

con, conman- ఈ మాటలకు మూలం confidence trickster - నమ్మించి మోసం చేసేవాడు,

He conned me into buying a useless car =

(పనికిరాని కారును మోసంతో నాకు అంటగట్టాడు)

**Hemanth:** What do you mean? Did you know about him?

(ఏంటి నువ్వ నేది? అతడి గురించి ఇంతకుముందే నీకు తెలుసా?)

**Yagnik:** I have known him for the cheat he is, all along. I had been warning all but no one paid attention.

(అతడు మోసగాడన్న విషయం నాకు మొదట్నుంచీ / ఇంతకాలమూ తెలుసు. అందర్నీ హెచ్చరిస్తూనే ఉన్నాను, కానీ ఎవరూ వినలేదు)

**Hemanth:** But you didn't warn me.

(కానీ నువ్వెపుడూ నన్ను వారించలేదు)

**Yagnik:** How could you expect me to take you for a fool like all others? I have great regard for your sound thinking.

(ఇతరుల్లా నువ్వూ ఓ మూర్ఖుడివని నేనెలా అనుకుంటాననుకున్నావు? నువ్వు సరైన ఆలోచనాపరుడివని నా నమ్మకం)

**Hemanth:** Now for making good what we've lost. What do you suggest that I do?

(సరే. ప్రస్తుతం నేను పోగొట్టుకున్నది తిరిగి తెచ్చుకోవటం ఆలోచిద్దాం. నన్నేం చేయమని నీ సూచన?)

**Yagnik:** I'am afraid it wait be that easy to get back what you've lost.

(నువ్వు కోల్పోయింది తిరిగి పొందటం అంత సులభం అని నేననుకోను).

**Hemanth:** Yea. The Police say that no other criminal on their records is a match for this one. They haven't been able to catch him so far.

(అవును. తమ రికార్డులకెక్కిన ఏ నేరస్థుడూ, వీడికి సరిరారని పోలీసులు కూడా అంటున్నారు. ఇంతవరకూ వాడిని పట్టుకోలేకపోయారు)

**Yagnik:** It will take some time for us to think of it all. The police are not easy to deal with, though for better or for worse we have to go to them.

(దీన్ని గురించి ఆలోచించుకోవటానికి కాస్త సమయం పడుతుంది. పోలీసువాళ్లతో వ్యవహారం అంత తేలిక కాదు. కానీ ఏదేమన్నా మనం వాళ్ల దగ్గరకె ళ్లాల్సిందే.)

**Hemanth:** Now for our lunch. Where shall we eat?

(ఇపుడు మనం ఏం తీసుకుందాం?)

**Yagnik:** Let's go to Pushti Restaurant. That's the place for a good meal. Today is sunday. They serve mango juice and perugu vada as sunday specials.

(పుష్టి రెస్టారెంటుకు వెళదాం. ఇవాళ ఆదివారం. మామిడి రసం, పెరుగువడ ఆదివారం ప్రత్యేకంగా వడ్డిస్తారక్కడ.)

**Hemanth:** Oh, what a pity? Neither of them is for me. I'm allergic to both mango juice and perugu vada. My doctor said long ago, 'No mango juice for you, Hemanth'

(అబ్బా, ఎంత దురదృష్టం. అవి రెండూ నాకు పడవు. రెండూ నాకు ఎలర్జీనే. మా డాక్టర్ ఎప్పుడో చెప్పారు, హేమంత్, నీకు మామిడి రసం పడదు అని.

**Yagnik:** Don't worry. I'll have yours too.

(ఏం ఫరవాలేదులే. నీవి కూడా నేను తీసుకుంటాను)

**Hemanth:** Ok, then. Let's go.

(వెళదాం పద)

మనం పరిశీలిస్తున్న preposition 'for' ఉపయోగాలు మరికొన్ని తెలుసుకుందాం.

**Study the use of for in the following sentences.**

*1) He has left the town for good.*

*2) I have known him for the cheat he is, all along.*

*3) How could you expect me to take you for a fool?*

*4) I have great regard for your sound thinking.*

*5) Now for making good what we've lost.*

*6) No other criminal is a match for this one.*

**1) for good =** శాశ్వతంగా

(for good కూ మంచికి ఏం సంబంధంలేదు)

a) He came here yesterday. He is here for good.

అతను నిన్న వచ్చాడిక్కడికి. ఇక ఇక్కడే ఉండిపోతాడు, ఎప్పటికీ.

b) They are yours for good.

అవి నీవే ఎన్నటికీ / నీకే ఇచ్చేయటం జరిగింది.

c) Are you leaving for good?

అయితే నువ్వు మళ్లీరావా? (ఎన్నటికీ తిరిగిరాకుండా వెళ్తున్నావా?)

ఇది *conversational English లో frequent.*

**2) To know some one for some thing.**

a) How can you expect her to marry him? She knows him for the bad guy he is .

అతను చెడ్డవాడవడం ఆమెకు బాగా తెలుసు. అతన్నెలా పెళ్లి చేసుకుందని అనుకుంటావు?

b) I know for what you are.

నువ్వేంటో, నువ్వెలాంటివాడివో నాకు తెలుసు.

c) I know you for the liar you are.

నువ్వు అబద్ధాలకోరువని నాకు తెలుసు.

**3) take for =** అనుకోవటం / పొరపాటుపడటం.

a) Sorry, I took you for your brother.

Sorry, నిన్ను మీ brother అనుకున్నా?

b) What do you take me for? Do I look a fool to you?

నన్ను గురించి ఏమనుకుంటున్నావు? నీకు నేను మూర్ఖుడిలా కనపడుతున్నానా?

c) Don't take him for an ordinary man.

అతన్నేమీ సామాన్యుడనుకోకు.

**4) Regard for =** మన్నన / మర్యాద

a) I have great regard for that teacher.

ఆ టీచర్ పట్ల / ఆ టీచర్ అంటే నాకు గౌరవం / మన్నన.

b) People have no regard for him.

అతనంటే ప్రజలకు లక్ష్యం లేదు.

**5) Now for =** అదిసరే, ప్రస్తుతానికి.

a) Now for the money we need. How are we going to get it?

ప్రస్తుతం మనకు కావలసిన డబ్బు విషయం ఆలోచిద్దాం. ఎలా తెచ్చుకోబోతున్నాం దాన్ని

b) Now for a cup of good coffee.

ప్రస్తుతం మంచి కాఫీ ఎలా?

**6) A match for =** సమ ఉజ్జీ

a) No one can be a match for Tendulkar.

Tendulkarకు సమ ఉజ్జీ / సమానం ఎవరూలేరు.

b) They are a match for each other in slanging match.

వాళ్లు తిట్లపోటీలో (ఒకరినొకరు తిట్టుకోవటం, పోటీపడి = slanging match) ఒకరికొకరు సమానం.



**ప్రశ్న:**

*1) Jewel/er (n)= One who sells Jewels;* నగల వ్యాపారి.

*(పై వాక్యం Lifco dictionary లోది)* ఎవరైతే నగలు అమ్ముతారో అని నా అనుమానం. నేను వివరించింది కరక్టేనా?

*2)* కొత్తకోలువు *@ 60* అంటే ఏమిటి? ఇలా @ రౌండప్ చేస్తే దానర్థం ఏమిటి? *format* అర్థం తెలుపగలరు.

*3) which* పక్కన *is, was, in, to* ఇలాంటి *prepositions* వస్తే ఎలాంటి అర్థం వస్తుంది? వివరించండి.

ఉదా: *1. Bad Debt- a bad debt which is irrecoverable; under any circumstance is called a bad debt- which* అంటే ఏది అని. ఇక్కడ *'a bad'* అంటే ఏదైతే తిరిగి పొందలేమో అని నేను అనుకుంటున్నాను.

ఒక వాక్యాన్ని తెలుగులోకి అనువదించాలంటే ఎక్కడి నుంచి ప్రారంభించాలి? (ఒకసారి మీరే చెప్పారు తెలుగులో మొదటినుంచి చదివితే ఇంగ్లిష్ *structure* లో చివరి నుంచి మొదలుపెట్టాలని.)

*4) service tax is to be shown separately in the invoice and is payble based on the payment realised and not on the total amount shown in the invoice.* దీన్ని తెలుగులో ఎలా అనువదించవచ్చు? *('invoice* లో *service tax* అనేది సపరేటుగా సూచించాల్సి ఉంటుంది. *payment* తెలుసుకోవడం మీద ఆధారపడి ఉంటుంది. *invoice* లో మొత్తం అమౌంట్ మీద కాదు.' అని నేను అనువదించాను. కరక్టేనా?)

**– జె. భాస్కర్ , బెంగుళూరు**

**జవాబు:1)** One who sells Jewels- ఇది నగల వ్యాపారికి, English మాట- ఇది వివరణ (explanation)- వివరణ వాక్యం రూపంలోనే ఉండాలని ఎక్కడుంది? అది వాక్యం కాదు. Clause. అది Correct (నగలు అమ్మేవాడు)

**2)** @ = at the rate of = the price of a unit (ఒక dozen ధర. ఒక 100 వస్తువుల ధర, ఒక కిలో ధర, ఒక litre ధర- ఇలా) ఇంతవస్తువు / ఇన్ని వస్తువుల ధర ఇంత చొప్పున అనేందుకు @ వాడతాం.

I bought these mangoes @ Rs 100 per dozen (At the rate of Rs 100 a dozen = డజన్ రూ 100 చొప్పున అని)

Computerలో @ = at/- అంటే ఫలాని Websiteలో అని. Computer IDలో మనం సామాన్యంగా ఏ Company Internet వాడతామో ఆ Company పేరు ముందు, @ పెడతాం. ఇలా: pkrishna@yahoo.com (pkrishna at yahoo.com) (.com = dot com. dot = చుక్క)

format = ఒకదాని design, plan, నమూనా.

The format of the application = application నమూనా.

3) Which అంటే ఏది, ఏదైతే... అది- ఈ రెండు అర్థాలూ ఉన్నాయి. Payment realised అంటే Payment తెలుసుకోవటం అని కాదు, వసూలు చేసిన చెల్లింపు అని. ఇక్కడ realise = వసూలుచేసిన, అని.

ఓ వాక్యం తెలుగులోంచి English కు అనువదించేటప్పుడు సామాన్యంగా Last నుంచి begin చేస్తాం. ఇది అన్నివేళలా అన్ని sentences విషయంలో పాటించటం కుదరదు. సందర్భాన్ని బట్టి ఏంచేయాలో తెలుసుకోవచ్చు

4) మీరు అనువదించిన తీరు correct గానే ఉంది.

**ప్రశ్న:** *Is reading novels the rightway for achieving fluency in English? If it is, the address where I can get such novels and plays would also be appreciated.*

**– ఎస్. మొహినుద్దీన్, కర్నూలు**

**జవాబు:**

Read the novels of James Hadley Chase -they are short and help you to pick up highly conversational and colloquial forms of English. They are easy to get from lending libraries in your city. Read also English Chandamama, and the novels of John Grisham, Irwing Wallare, etc. Read an English daily, preferably the Hindu.

**ప్రశ్న:** 'అతను ఇప్పుడు ఎంత మంచి వాడో ఒకప్పుడు అంత చెడ్డవాడు' అన్న వాక్యాన్ని *'He is as good as he was bad'* అని చెప్పవచ్చా?

**– శ్రీరామ్**

**జవాబు:** He is as good now, as he was bad sometime ago.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# No essenced drink or Chocolate for me


M.SURESAN

**Lochana:** Hi Rachana, what's wrong? You do look ill.
(రచనా ఏమైంది? కాస్త జబ్బుగా కనిపిస్తున్నావు)

**Rachana:** It's the flavoured milk and the chocolate drink I took yesterday.
(నిన్న నేను తీసుకున్న ఫ్లేవర్డ్ మిల్క్, చాకొలేట్ డ్రింక్ వల్ల అదంతా?)

**Lochana:** What have they got to do with your illness, dear?
(వాటికీ నువ్వు బాగా లేకపోవడానికి ఏం సంబంధం?)

**Rachana:** My Doctor long ago told me that they were not for me. No essenced drink or Chocolate for me. I am allergic to them.
(నా డాక్టర్ ఎప్పుడో చెప్పింది. అవి నాకు పడవని. ఎసెన్స్, చాక్లెట్ ఉండే పానీయాలు నాకు పడవని, నాకవి allergy.)

Allergy – కొన్ని ఆహారపదార్థాలు, పానీయాలు, వాతావరణ పరిస్థితులూ, కొందరి శరీరతత్వాలకు పడకపోవటం, అందువల్ల వాళ్లకు బాధలు కలగటం)

**Lochana:** Then why did you take them at all?
(అలాంటప్పుడు అసలెందుకు తీసుకున్నావు?)

**Rachana:** They have a great temptation to me. I like them so much. So, I said to myself, "for all that I care, let me have a go at them", and I took them. And here I am, sneezing like hell and with a running nose. My fondness for them has landed me in trouble.
(అవి నన్నెంతో ఆకర్షిస్తాయి. అవంటే ఎంతిష్టమో నాకు. అందుకని నిన్న అనుకున్నా. 'ఆ ఏమైతే అదవుతుంది. ఒకసారి వాటిని తీసుకుందాం'. అని తీసుకున్నా అంతే. చూశావుగా, తుమ్ములు, ముక్కు కారటం.)

To have a go at something = ఏదైనా చేసి చూడటం.

I'd like to have a go at walking all the way up the hill.
(ఓసారి కొండమీదికి నడిచివెళ్లి (Bus లో కాకుండా / ఇంకే వాహనం మీద కాకుండా) చూడాలని ఉంది)

**Lochana:** I really pity you. For all the enjoyment you had, you might just as well have not bothered about them. Why don't you see a doctor?
(నిజంగా నిన్ను చూస్తే జాలేస్తుంది. నువ్వు పొందిన కొద్దిపాటి ఆనందానికి, వాటిని పట్టించుకుని ఉండాల్సింది కాదు. డాక్టర్‌ను కలుసుకోకూడదూ?)

**Rachana:** She'll give me some anti allergic medicine. That's no good. It has to run its usual cense.
(ఆమె నాకు యాంటీ ఎలర్జిక్ మందులిస్తుంది. అవేం పనిచేయవు. ఆ ఎలర్జీ ఉండాల్సినంత సమయం ఉండి, అదే తగ్గుతుంది)

**Lochana:** For better or for worse you'd better see her. You'll have some relief. Medicine does make a difference.
(ఏదేమైనా, డాక్టర్ దగ్గరికి వెళ్లడం మంచిది. కొంత ఉపశమనం ఉంటుంది. మందులతో తప్పకుండా ఫలితం ఉంటుంది.)

Make a difference = మార్పుండటం

**Rachana:** I'll for now, I'll try things like vicks and boiled and strained pepper water.
(వెళ్తా. అంతవరకు ప్రస్తుతానికి Vicks, మిరియాల కషాయం వాడతా.)

Boiled = మరిగిన / మరిగించిన; Strain = వడపోయటం)

**Lochana:** How long will it trouble you?
(ఇది నిన్ను ఎన్నాళ్లు బాధిస్తుంది)

**Rachana:** At least for a week.
(కనీసం వారం)

**Lochana:** The bus is coming. Let's get into it.
(బస్ వస్తోంది. ఎక్కుదాం.)

❍ ❍ ❍ ❍

*For* వాడే మరికొన్ని సందర్భాలు ఈ *lesson* లో చూద్దాం. **Study the use of for in the following sentences from the conversation above.**

1) *My Doctor told me long ago that they were not for me.*
2) *No essenced drink or Chocolate for me.*
3) *My fondness for them has landed me in trouble.*
4) *For all that I care*
5) *For all the enjoyment you had, you might just as well have not bothered about it.*
6) *For better or for worse you'd better see her.*

**1&2 ..... they were not for me** - not for somebody - ఈ expression చూడండి. ....

not for me = నాకు పడనిది

a) City life is not for me = City life is not suitable for me / does not suit me =
నగర జీవితం నాకు పడదు

b) He likes ice cream a lot, but the pity is that it is not for him.
(ఐస్‌క్రీమ్ అంటే వాడికెంతో ఇష్టం. కానీ దురదృష్టమేంటంటే అది అతనికి పడదు.)

c) This kind of job is not for her / Not for her is this kind of Job =
ఇలాంటి ఉద్యోగం ఆవిడ తత్వానికి పడదు / ఆవిడకు సరికాదు.
(Not for him - ఇలా not తో begin చేస్తే, effect ఎక్కువ)

d) Not for me this kind of entertainment =
ఇలాంటి వినోదం నాకు పడదు.

**2. No mango juice for me** / no, not for me =
మామిడి రసం నాకు పడదు.

**3) Fondness for =** ఇష్టం/మక్కువ

a) His fondness for Cricket is ruining his studies.
(Cricket పట్ల అతనికున్న మక్కువ అతని చదువును పాడుచేస్తోంది.

b) Sugunas fondness for creams is costing her a lot of money =
Creams పట్ల సుగుణకున్న మక్కువ వల్ల ఆమె చాలా ఖర్చు పెడుతోంది.

c) His fondness for jokes often lands him in trouble =
Jokes అంటే అతనికున్న ఇష్టం వల్ల సమస్య లెదుర్కొంటున్నాడతను.

**4) For all that I care =** ఏదేమయితే నాకేం. (అంటే నేనేం పట్టించుకోను, నాకేమంత interest లేదు, అని)

a) For all I care, let him hang himself =
వాడిని ఉరేసుకోని, నాకేం

b) For all I care, You may waste all your money =
నీ డబ్బు వృథా చేసుకో, నాకేం! (విసుగు, నిర్లక్ష్యంతో తెలపటం)

c) For all the officer cares, the clerks may go to the dogs =
గుమాస్తాలు నాశనం అయినా ఆ Officer కేం పట్టదు?
(Something / Somebody going to the dogs = (ఏదైనా / ఎవరైనా నాశనమవటం)
go to hell అని కూడా అంటారు, ఇదే అర్థంతో

d) For all I care what does it matter how he spends his money / He may spend his money as he likes =
వాడి డబ్బు వాడెలా ఖర్చు పెట్టుకుంటే నాకేంటి?

**5) For all the enjoyment you had**
= నువ్వు పొందిన ఆనందాన్ని తలచుకుంటే
(అంటే దాని ఫలితం, ఆ ఆనందం పొందకుండా ఉంటేనే బాగుండేది అన్పించటం)

a) For all that you got for the money,you might as well not have spent it
నువ్వు పెట్టిన డబ్బు తలచుకుంటే, ఆ డబ్బు పెట్టకుండా ఉంటేనే బాగుండేదేమో! (నువ్వు పెట్టిన డబ్బుకు తగినంత ప్రతిఫలం రాలేదని)

b) For all the pleasure I had with so much effort. I might as well have not tried at all =
అంత ప్రయత్నంతో నేను పొందిన సరదా తలచుకుంటే అసలు ప్రయత్నం చేయకపోయుంటే బాగుండేదేమో.

c) For all the distance covered at such an expense by his car, he could have as well taken flight
= కారులో అంత ఖర్చుతో అంత దూరం వెళ్లేకన్నా అతను విమానంలో వెళ్లుండొచ్చు

**6) For better for worse =** ఏదేమైనా

a) Let's go there, for better or for worse = ఏదేమైనా మనం అక్కడికెళ్దాం.
(మంచికైనా, చెడుకైనా /ఫలితమేమైనా)

b) For better or for worse, I've chosen this job, and I will continue in it =
మంచికైనా చెడుకైనా (ఏదైనాసరే) నేనీ ఉద్యోగాన్నెంచుకున్నాను. ఇందులోనే కొనసాగుతాను.

c) For better or for worse. I am quitting this job = మంచైనా, చెడైనా (ఏదేమైనా) నేను ఈ ఉద్యోగం మానుకుంటున్నాను.



**ప్రశ్న:** నాకు ఇంగ్లిష్ రాదు. నేర్చుకోవాలంటే మొదట Tenses తర్వాత Articles ఇలా step by step నేర్చుకోవాలా? ముందు ఏవి బాగా నేర్చుకుంటే కనీసం 50% ఇంగ్లిష్‌లో మాట్లాడగలం? English నేర్చుకోవడానికి మంచి పుస్తకాలుంటే చెప్పండి.

**- పి. బాలు, నర్సాపూర్**

**జవాబు:** మీరు 'ఈనాడు ప్రతిభ'లో Spoken English lessons, No1 నుంచి చదవండి. వాటిలో చెప్పినట్లు practice చేయండి. ఇంతకంటే ముఖ్యం- ఎంత వీలుంటే అంతవరకు English చదవండి- చిన్న చిన్న story books తో ప్రారంభించి, English Newspapers వరకు బాగా చదవండి. English వినండి. మీకు తప్పకుండా వస్తుంది. మాట్లాడగలరు.

**ప్రశ్న:** *unless, lest, torn off, counter fire* వీటిని ఉపయోగిస్తూ వాక్యాలు, వాటి తెలుగు అర్థాలు తెలుపగలరు.

**- ఎ. పెంచలయ్య గౌడ్, రాజంపేట**

**జవాబు: 1)** Unless he knows she is here, he will not come =

a) He will come here only if he knows she is here =
ఆమె ఇక్కడుందని తెలిస్తేనే అతనిక్కడికి వస్తాడు.
unless = అయితేనే / అయితే తప్ప.

b) Unless you send the money you can't get the books. You have to send the money to get the books.
(You can get the books, if you send the money.
(Unless = అయితేనే/ అయితేతప్ప)

c) Unless he has a degree, he cannot get the job = He must have a degree to get the job.

**2)** lest = so that not = (ఏదైనా) అవకుండా ఉండేందుకు.

a) Start early lest you should miss (lest you miss) the train = start early so that you may not miss the train.
(ట్రెయిన్ తప్పిపోకుండా ఉండేందుకు త్వరగా బయలుదేరు.)

b) He ran away lest the police should catch / lest the police catch, him = He ran away so that the police may not catch him.

**3)** Torn off = చింపివేసిన.

a) He found his books torn off (by the child) =
తన పుస్తకాలు (ఆ చిన్న బిడ్డ) చింపేసి ఉండటం కనపడింది అతనికి.

b) He had the agreement torn off -
అతనా ఒప్పందాన్ని చింపేశాడు.

**4)** Counter fire = This expression doesn't appear to be in use. It may mean, return fire. Counter fire అనే మాట English లో ఉన్నట్లు కన్పించదు. ఎదురుకాల్పులు అదే అర్థంతో return the fire అని అంటాం.

a) If some one fires at you, you return the fire.
(ఎవరైనా మీమీద కాల్పులు జరిపితే, మీరు ఎదురుకాల్పులు జరుపుతారు అనే అర్థంతో.)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ




# He is acting for the manager

**Priya:** Hi Sneha, long time, no see. Where have you been all these days?
(ఎన్నో రోజులైంది, మనం కలుసుకొని. ఎక్కడున్నావు, ఇన్ని రోజులూ? )

**Sneha:** Busy with a research project and because of it I had to be away for months gathering material.
(ఏదో పరిశోధనా కార్యంతో తీరికలేకుండా ఉన్నా. దానికి సంబంధించిన సమాచారం సేకరిస్తూ నెలల తరబడి బయట ఉండాల్సి వచ్చింది.)

**Priya:** Have you completed it?
(పూర్తి చేశావా దాన్ని? )

**Sneha:** No. It had to be suspended for want of funds.
(లేదు. నిధుల కొరతతో ఆ ప్రాజెక్టు తాత్కాలికంగా ఆపాల్సి వచ్చింది)

**Priya:** You look run down.
(అలసిపోయి నీరసంగా కనిపిస్తున్నావు)

**Sneha:** That's outside and restaurant food for you! Before I left home I had been on home food and no trouble whatever. Once I left home I couldn't care what I ate, and where I ate. That's affected my health.
(బయట, హోటళ్లలో తినే తిండి అలాంటిదేమరి! ఇల్లు వదలకముందు ఇంటి తిండి తినేదాన్ని. ఏ బాధా లేదు. ఇల్లు వదిలిన తర్వాత ఏం తిన్నాను, ఎక్కడ తిన్నాను అనేది పట్టించుకోలేకపోయా. నా ఆరోగ్యం పాడైంది అందువల్లే.)

**Priya:** I mistook him for your manager.
(నేనితడిని మీ మేనేజర్ అనుకుని పొరపడ్డా.)

**Sneha**: This guy is flexible, but he has no powers. The decisions are the manager's and this man just signs for him.
(ఇతను కొంచెం వినే రకమే, కానీ ఇతనికేం అధికారాలు లేవు. నిర్ణయాలన్నీ మేనేజర్‌వే, ఆయన బదులు సంతకాలు మాత్రం ఈయన చేస్తాడు.)

**Priya:** Why don't you change your job? You can avoid these tours.
(నీ ఉద్యోగం ఎందుకు మార్చుకోవు? ఈ ప్రయాణాలు తప్పుతాయికదా? )

**Sneha:** Just for lack of time. I am so busy at office that I don't find the time to look for a new job.
(సమయం లేనందువల్లే. కొత్త ఉద్యోగం వెతుక్కోలేనంత బిజీ నేను ఆఫీస్‌లో.)

**Priya:** Any, you'd better take care of your health. Any thing for health, you know. Once you lose it, you can't be the same again. That's for sure.
(ఏదేమైనా, నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవటం మంచిది. ఆరోగ్యం కోసం మనం ఏదైనా చేయాలి. ఒకసారి ఆరోగ్యం కోల్పోతే మళ్లీ మనం పూర్తిగా మామూలు కాలేం.)

**Sneha:** You're right
(నువ్వు సరిగ్గా చెప్పావు.)

**Priya:** I've preferred a local job mainly for fear of losing my health.
(ఆరోగ్యం పాడైపోతుందనే భయంతోనే, నేను స్థానికంగా ఉన్న ఉద్యోగం ఇష్టపడుతున్నా.)

**Sneha:** I have told my boss a number of times to keep me here, but he wouldn't listen. He is not one to do things for fear or for favour.
(నన్నిక్కడే ఉంచమని మా బాస్‌తో చాలాసార్లు చెప్పాను. కానీ అతను వినిపించుకోలేదు. అతను భయపడిగానీ, అభిమానానికిగానీ పనిచేసేవాడు కాదు.)

**Priya:** You mean the present man? I thought he was the nice sort.
(నువ్వనేది ఇప్పుడున్న అతడిని గురించా? అతను మంచి రకమనే అనుకున్నానే్నను!)

**Sneha:** No. Not this man. He is not our manager. He is acting for the manager, as he is on leave.
(కాదు. ఈయనకాదు. ఇతను మా మేనేజర్ కాదు. మేనేజర్ సెలవులో ఉన్నందున, ఇతను మేనేజర్ తరఫున పనిచేస్తున్నాడు/ మేనేజర్ స్థానంలో పనిచేస్తున్నాడు.)

♦ ♦ ♦ ♦


M.SURESAN

We've been studying the uses of the preposition, 'for' for the past few days, haven't we? Let's now look at some more uses of 'for'.

*ఈ lesson లో, for వాడిన విధం, English conversation లో చాలా తరచుగా వినిపిస్తుంటుంది. Practice చేయండి. Look at the following sentences from the conversation above.*

*1) It had to be suspended for want of funds.*

*2) I've preferred a local job mainly for fear of losing health.*

*3) He is not one to do things for fear or (for) favour*

*4) He is acting for the manager*

*5) ... and the man just signs for him.*

*6) Just for lack of time*

*7) That's hotel food for you!*

**1&6) for want of = for lack of =** కొరత వల్ల/ లేకపోవడం వల్ల

a) for want of proper support he dropped the idea of standing for the election = సరైన మద్దతు లేకపోవడంతో ఎన్నికల్లో పోటీచేయటం మానుకున్నాడు

b) for want of time for preparation, they want the exam to be put off = తయారయ్యేందుకు సరైన సమయం లేకపోవడం వల్ల, వాళ్లు పరీక్షను వాయిదా వేయాలని కోరుకుంటున్నారు.

c) for want of funds the project hasn't yet taken off = నిధుల కొరత వల్ల ఆ ప్రాజెక్ట్ ఇంకా ప్రారంభం కాలేదు.

d) for want of proper leadership, the party is weak = సరైన నాయకత్వ కొరత వల్ల, ఆ పార్టీ నిస్తేజంగా ఉంది.

*for want of = for lack of. రెండూ ఒకటే. పై సందర్భాలన్నింట్లో, for want of బదులు, for lack of వాడవచ్చు. ఇది చాలా మంచి expression. Practice చేయండి.*

**2) for fear of =** ఆ భయం వల్ల

a) for fear of losing his ministership he says yes to whatever the CM says = మంత్రి పదవి పోతుందనే భయం వల్ల సీఎం చెప్పేదానికల్లా ఆయన తలూపుతాడు.

b) He didn't raise his voice for fear of his father = తండ్రంటే భయం వల్ల అతను గొంతెత్తి మాట్లాడలేదు.

c) for fear of waking the guards, we walked quietly = గార్డ్స్‌ను నిద్రలేపుతామన్న భయంతో మేం నిశ్శబ్దంగా నడిచాం.

d) for fear of contacting AIDS, they avoided the AIDS patient = ఎయిడ్స్ తమక్కూడా వస్తుందనే భయం వల్ల వాళ్లా పేషెంట్ దగ్గరకు వెళ్లలేదు.

**3) for fear or (for) favour =** భయంవల్లగానీ ఇష్టం/ భక్తివల్లగానీ / అభిమానంవల్లగానీ

a) you can't get help here for fear or favour = భయంవల్లగానీ, అభిమానంవల్లగానీ నువ్విక్కడ ఏ సహాయం పొందలేవు. (నువ్వంటే భయంతోగానీ, అభిమానంతోగానీ నీకెవ్వరూ సహాయపడరిక్కడ)

b) Nothing can be had here for fear or favour = భయం వల్లగానీ, అభిమానం వల్లగానీ ఇక్కడేం దొరకదు. (ఇక్కడ నీక్కావలసినది దొరకటం, నువ్వు కావాలనుకొనేది జరగటం చాలా కష్టం అనే భావంతో)

c) (This is) not the place where you can get money for fear or favour = నీకిక్కడ డబ్బిచ్చేవారెవరూ లేరు.

**4&5) For the manager =** ఇక్కడ for అంటే బదులు/ తరఫున అని.

a) The P.S. signs for the minister = మినిస్టర్ బదులు ఆయన పర్సనల్ సెక్రెటరీ సంతకం చేస్తారు.

b) The CEO is acting for the chairman = ఛైర్మన్ తరఫున CEO వ్యవహరిస్తున్నారు.

**7) That's hotel food for you! -** ఇక్కడ for you అంటే అలా ఉంటుంది, తెలుసుకో అని. (Hotel food అలా ఉంటుంది తెలుసుకో!)

a) That's politicians for you! Interested only in themselves and never in the people = అదీ రాజకీయవాదులంటే. తెలిసింది కదా! ఎపుడూ స్వార్థమే, ప్రజల శ్రేయస్సు కాకుండా.

*That's.... for you! - ఇది మంచి conversational bit. బాగా practice చేయండి.*

---

**ప్రశ్న: i)** *I was glad to hear from father that you are still hale and hearty and can take your 4km walk every day - This sentence is observed in Wren& Martin grammar book (old). Please clarify the correctness of this sentence.*

**ii)** *The foundations of many buildings would have (got) damaged in the earthquake.*

**iii)** *By next September -- the shrubs would have grown 4 ft high. Please clarify the correctness of these sentences using 'would have' - one referring to past and another to future.*

– జె. గోవర్ధన్‌రావు, విజయవాడ

**జవాబు:**

**i)** I was glad to hear from father - This is the main clause, and the verb in it 'was' is in the past tense. But the verb in the subordinate clause- are is in the present tense - strictly speaking, it should be 'were', but then the meaning would be affected. We'd get the meaning, that they were still hale and hearty when they heard from their father and not after words. This does not express correctly what person has heard from the father. In informal English (especially when a present situation/ a situation which is continuing is referred to, the present tense verb is preferred even if the main clause verb is in the past tense. **eg:** The station master told me an hour ago that the train is running late by an hour. This is accepted, if it applies to an on going situation. Look at this again: I knew from him yesterday that you are here for a conference tomorrow. In such cases, the rule is not strictly insisted upon.

**ii)** The foundations of many buildings would have got damaged- this means that there was a likelihood of the foundations being damaged, but in fact they were not. If the speaker's meaning was that they were likely to have been damaged, the sentence should be - The foundations of many buildings might have been/ might have got damaged.

**iii)** By next September the shrubs would have grown four ft high- wrong. The reference here is to an action expected to be complete by some time in future.
*The correct sentence is:* By next September, the shrubs will have grown 4' high.

**ప్రశ్న:** *outstretched, yet, someone else* వీటిని ఉపయోగిస్తూ వాక్యాలు, వాటి అర్థాలు తెలుపగలరు.

– ఎ. పెంచలయ్య గౌడ్, రాజంపేట



**జవాబు: i) Outstretched** = బయటకు చాచి/ ముందుకు చాచి. (ముఖ్యంగా శరీర భాగాలు)

a) He ran to his mother with his arms outstretched = చేతులు ముందుకు/ బయటకు చాచి వాళ్లమ్మ వైపు/ దగ్గరకు పరుగెత్తాడు. (కౌగిలించుకొనేందుకు)

b) He was looking with his neck outstretched = మెడ ముందుకు చాచి చూస్తున్నాడు.

**ii) and yet = yet** = though/ although/ eventhough = అయినా/ అయినప్పటికీ.

a) I gave him Rs. 1000/- and yet he is not happy = వేయి రూపాయలిచ్చాను అయినా వాడికి సంతోషం లేదు.

b) I told him to get out and yet he stands there = వాణ్ని వెళ్లిపొమ్మన్నా అక్కడే నిలబడి ఉన్నాడు.

**iii) Someone else** = ఇంకెవరన్నా.

a) He didn't do it. Someone else did it. I don't know who. (అది వాడు చేయలేదు. ఇంకెవరో చేశారు. ఎవరో నాకు తెలియదు.)

b) If you don't help me, someone else will = నువ్వు నాకు సాయంచేయకపోతే, ఇంకెవరన్నా చేస్తారు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Susen:** I'm afraid I'm in for serious trouble.
(నేను తీవ్రమైన ఇబ్బందిలో పడబోతున్నానన్పిస్తోంది.)

**Rasik:** What makes you think so?
(అలా ఎందుకనుకుంటున్నావ్?)

**Susen:** Well, I felt that the job I was assigned at office was not for me. So did I tell the officer. She insisted, I do it. I refused.
(ఆఫీసులో నాకప్పగించిన పని నాకు తగినది కాదని అనిపించింది. ఆ విషయమే మా ఆఫీసర్‌తో చెప్పాను. ఆవిడేమో పట్టుబట్టింది. నేను వల్లకాదన్నాను.)

**Rasik:** Why do you feel it is not for you?
(నీకు తగిందికాదని ఎందుకనుకుంటున్నావు?)

**Susen:** For one thing, it means going out and gathering information out of office hours.
(ఒక విషయమేమిటంటే ఆ పనికి బయట తిరిగి సమాచారం సేకరించాల్సి ఉంటుంది, అదీ ఆఫీసు అవర్సుకు ముందూ తర్వాతా.)

**Susen:** How does that concern you? Any way, she is Ms Rajyalakshmi.
(నీకెందుకు? / ఆవిడ పేరేదైతే నీకేం? సరే, ఆమె పేరు రాజ్యలక్ష్మి)

**Rasik:** I think I know her. Isn't she called Rajyam for short? Her husband is a Railway Officer, isn't he?
(ఆవిడ నాకు తెలుసనుకుంటా. ఆవిడను రాజ్యం అని అంటారు/ పిలుస్తారు కదా? ఆవిడ భర్త రైల్వే ఆఫీసర్ కదా?)

**Susen:** Yea. (Do) you know her then? If you happen to see her tell her I wouldn't do it for any thing.
(అవును - అయితే నీకావిడ తెలుసా? ఈసారి నువ్వావిడను కలుసుకుంటే చెప్పు, ఏదేమయినా నేనాపని చేయను అని.)




# I'd do it for the asking

**Rasik:** Ofcourse, you'd be paid special allowance for it, wouldn't you?
(అయితే దానికి ప్రత్యేక భత్యం ఉంటుంది కదా?)

**Susen:** Certainly. But that doesn't tempt me.
(చెల్లిస్తారు. కాని అదేం నాకాకర్షణ కాదు.)

tempt= ఆకర్షించడం

**Rasik:** If I were you, I'd do it for the asking. What more could you ask for? You needn't sit in the office turning over the files.
(నేనే నువ్వయితే, అది అడగటమే ఆలస్యం అన్నట్లు ఒప్పేసుకోనుండేవాడిని. అంతకంటే ఏం కావాలి? ఆఫీసులో కూర్చుని ఫైల్స్ తిరగేయనక్కర్లేదు.)

**Susen:** For that matter, I had the offer of such a job long ago- I mean, a job that would make me go out about a lot. I hate having to move about. That's precisely why I preferred this job.
(ఆ విషయానికొస్తే అలాంటి ఉద్యోగం- అంటే తిరగటం ఎక్కువ అవసరమయ్యేది- నాకెప్పుడో వచ్చింది. తిరగటం అంటే నాకు చెడ్డ చిరాకు. ఈ జాబ్‌ను ఎంచుకోవడానికి కచ్చితంగా అదే కారణం.)

precisely = exactly = కచ్చితంగా.

**Rasik:** Who's your officer?
(మీ ఆఫీసర్ ఎవరు?)

**Rasik:** For all the world I would do no such thing. Who am I to interfere in such matters?
(అలాంటి పని నేనసలు చేయను. ఇలాంటి విషయాల్లో కల్పించుకోవడానికి నేనెవర్ని?)

**Susen:** OK, OK. Leave it at that. I must rush to office.
(సర్లే, అక్కడాపెయ్. నేను ఆఫీసుకెళ్లాలి. బై.)



Preposition- 'for' ఉపయోగాలు తెలుసుకుంటున్నాం కదా. ఇంకా ఏ సందర్భాల్లో, ఏ అర్థాలతో spoken English లో వాడేదీ ఈ lesson లో చూద్దాం. ఇప్పుడు మనం చూడబోయే ఉపయోగాలు, చాలా తరచుగా వినిపిస్తాయి spoken English లో. For వాడాల్సిన సందర్భాల్లో వాడితే మన sentences నిడివి తగ్గి చాలా simple గా, సహజంగా వినిపిస్తాయి.

***Look at the following expressions from the conversation above.***

*1) I'm in for serious trouble*
*2) The job I was assigned at office was not for me.*
*3) Why do you feel it is not for you*
*4) For one thing, it means going out and gathering information.*
*5) I'd do it for the asking.*
*6) For that matter, I had the offer... long ago*
*7) Isn't she called Rajyam for short?*

**1) Be in for** = ఇబ్బందులెదుర్కోబోవటం/ శిక్ష పొందే అవకాశం. ఈ expression spoken English లో చాలా common. మీ conversation లో తరచూ వాడండి.

a) I am late. I am sure I'm in for trouble=
నేనాలస్యం అయ్యాను. ఇబ్బందిలో పడబోతున్నాన్నేను. సందేహం లేదు.

b) You are doing what you ought not to do. You'll be in for trouble=
నువ్వు చేయకూడని పనిచేస్తున్నావు. ఇబ్బందుల్లో పడతావు.

ఇదే అర్థంతో 'in for it' అని కూడా అంటాం.

c) If she doesn't complete the work by the evening, she is in for it =


M.SURESAN

సాయంత్రం లోపల ఆ పని పూర్తిచేయకపోతే ఆమెకు శిక్ష తప్పదు! (ఆమెకుంది అనేది - వ్యావహారికం)

ఇదే అర్థంతో, you/ he /... asking for trouble అంటాం = ఇబ్బంది పడతావు/ పడతాడు

d) He is smoking too much. He is asking for trouble =
మరీ ఎక్కువ స్మోక్ చేస్తున్నాడు. ఇబ్బంది కొని తెచ్చుకుంటున్నాడు/ పడబోతున్నాడు.

e) You are buying that car? Don't ask for trouble =
ఆ కారు కొనబోతున్నావా? ఇబ్బంది కొనితెచ్చుకోకు.

**2 & 3) Not for me/ not for somebody.**
(సరిపడదు/ తగినది కాకపోవడం/ suit కాకపోవటం)

a) A travel job is not for me =
ప్రయాణాలుండే ఉద్యోగం నాకు పడదు.

b) Not for him is this kind of climate =
ఇలాంటి వాతావరణం అతనికి పడదు (suit కాదు)

c) Ice cream is not for her. Doctor told her so long ago =
ఐస్‌క్రీం ఆమెకు పడదు. డాక్టర్ ఎప్పుడో చెప్పాడది.

**4) for one thing:** Conversation లో చాలా సాధారణంగా ఈ expression వస్తూంటుంది. (తెలుగులో కూడా- ఒకటేమిటంటే... అంటుంటాం.)

a) For one thing, politics are not for me; for another/ secondly, I don't have the time =
ఒకటేమిటంటే రాజకీయాలు నాకు పడవు. రెండోది నాకా టైం కూడా లేదు.

b) For one thing they never invite her and for another, she doesn't like to go there =
ఒక విషయం ఏమిటంటే ఆమెను వాళ్లు పిలవనూ పిలవరు, రెండోది ఆమె వెళ్లనూ వెళ్లదు.

c) For one thing or another, he is almost never at home =
ఏదో విషయం మీద అతడు ఇంట్లో దాదాపు ఎప్పుడూ ఉండడు.

**5) for the asking** = అడిగితే వచ్చేది. సులభంగా వచ్చే వస్తువు/ అయ్యే పని.

a) He will help you for the asking. He will help willingly =
నువ్వడిగితే చాలు, సాయం చేస్తాడతను/ అడగటమే ఆలస్యం సంతోషంగా సాయం చేస్తాడు.

b) The book is yours for the asking. Ask him
నువ్వడగటమే ఆలస్యం. ఆ పుస్తకం నీదవుతుంది. (వాడినడుగు. ఇచ్చేస్తాడు.)

c) There's a lot of demand for the IT people. The jobs are there for the asking =
ఐటీవాళ్లకే మంచి గిరాకీ ఉంది. అడిగితే ఇచ్చేస్తారు ఉద్యోగాలు.

**6) for that matter** = ఇది కూడా తరచూ వినపడే మాట. అర్థం: ఆ విషయానికొస్తే

a) Vijayawada is hot in summer. For the matter which coastal city isn't? =
వేసవిలో విజయవాడ చాలా వేడిగా ఉంటుంది. ఆ విషయానికొస్తే, ఏ కోస్తా నగరం వేడి కాదు?

b) The movie is just dances and stunts. For that matter all Indian movies are just that=
ఆ సినిమా అంతా డ్యాన్సులు, స్టంట్లు మాత్రమే. ఆ విషయానికొస్తే అన్ని చిత్రాలూ అంతే.

**7) for short** - కుదించటం (పేరు లాంటివి)

a) His name is Veera Venkata Satyanarayana Prasad. They call him Satyam for short =
అతడి పేరు వీర వెంకట సత్యనారాయణ ప్రసాద్. అయితే అందరూ అతన్ని సత్యం అంటారు.

b) He comes from 'Gudem', short for Tadepalligudem =
అతడిది గూడెం. అదే తాడేపల్లిగూడెం, కుదించిన పేరు.

---



**ప్రశ్న:**

*i) Injure, wound, hurt- వీటి మధ్య తేడా వివరించగలరు.*
*ii) drawn, sink- వీటి ఉపయోగంలో తేడా ఏమిటి?*

– ఎం. అప్పలరాజు, విశాఖపట్నం

**జవాబు:**

**i. a) Injure:** శరీర భాగానికి దేనికైనా గాయమవడం/ గాయపర్చడం- ముఖ్యంగా అకస్మాత్ ప్రమాదాలవల్ల (Road accident, ఆటల్లో తగిలే దెబ్బలు, జారిపడటం, తదితర ప్రమాదాలవల్ల).

a) She injured her foot while playing tennis -
టెన్నిస్ ఆడుతున్నప్పుడు ఆమె పాదం గాయపడింది.

b) Four people were injured in the bus accident-
Bus ప్రమాదంలో నలుగురికి గాయాలయ్యాయి.

c) Injure లో గాయపడ్డ అవయవానికి ప్రాధాన్యం/ ప్రాముఖ్యం

d) Injure = నష్టం కలిగించడం.
This has injured his reputation -
అతడి పేరుకిది నష్టం కలిగించింది.

**i. b) Hurt.** Hurt అంటే గాయపడటం/ గాయపర్చటం మాత్రమే కాకుండా అందువల్ల కలిగే బాధ, నొప్పి అని కూడా. (Injure లో గాయానికే ప్రాధాన్యం, దాని బాధకంత ప్రాధాన్యంలేదు.)

Hurt అన్నప్పుడు, గాయం ప్రమాదవశాత్తు మాత్రమే కానక్కర్లేదు. ఇంకేవిధంగానైనా గాయమైనా అది hurt.

a) My shoes are hurting me.
(నా షూస్ నాకు బాధ కలిగిస్తున్నాయి.)

b) You are hurting me by holding my hand tight -
గట్టిగా నా చేయి పట్టుకుని బాధ కలిగిస్తున్నావు.

c) ప్రమాదంవల్ల కలిగే బాధ -
He hurt his arm in the accident-
ప్రమాదంలో మోచేతికి దెబ్బ తగిలింది.
Hurt లో బాధకు, నొప్పికి ప్రాముఖ్యం

d) మనోభావాలను దెబ్బతీయడం.
You've hurt my feelings.

e) I feel hurt -
నా (మనసు)కు బాధ కలిగింది.

**i. c) Wound**
ఒక ఆయుధంతో చర్మంమీద పొడిచి గాయపర్చడం/ పొడవడంవల్ల గాయమవటం - ముఖ్యంగా దాడుల్లో/ యుద్ధంలో పెద్ద సంఖ్యలో మనుషులు గాయపడటం.

a) Ten men were wounded in the attack -
ఆ దాడిలో పదిమంది గాయపడ్డారు.

b) He wounded her with a knife.
అతడామెను కత్తితో గాయపర్చాడు.

**ii) drown** - మనిషి మునిగిపోవడం
**sink** - వస్తువు మునగడం.

a) He (was) drowned while swimming =
ఈతకొడుతూ అతడు మునిగిపోయాడు.

b) The ship sank off the coast of Ireland =
Ireland తీరానికి ఆవల ఆ ఓడ మునిగిపోయింది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

# Anything for a friend

**Prasasthi:** Hi Sukrithi, can I have the two books you've promised me?
(నువ్విస్తానన్న ఆ రెండు పుస్తకాలు నేను తీసుకోవచ్చా? / ఇప్పుడు ఇవ్వగలవా? )

**Sukrithi:** I looked for them the whole day yesterday but I could find just one of them. For the present make do with it. I'll try to fish out the other one in a day or two.
(నిన్న రోజంతా వెతికా వాటికోసం. ఒకటే చూడగలిగాను. ప్రస్తుతానికి దానితో సర్దుకో. రెండోదాన్ని కూడా వెతికేందుకు ప్రయత్నిస్తా ఒకటి రెండు రోజుల్లో.)

make do = సరిపెట్టుకోవటం

fishout = వెతికి పట్టుకోవటం

**Prasasthi:** That's nice of you. You've taken a lot of trouble for my sake.
(ఎంత మంచిదానవో! నాకోసం ఎంతో శ్రమ పడ్డావు)

**Sukrithi:** That's Sukrithi anything for a friend.
(అదీ సుకృతి అంటే. తెలుసుకో. స్నేహితుల కోసం ఏదంటే అదే (చేస్తుంది))

**Prasasthi:** Privileged to have a chum like you.
(నీలాంటి నేస్తం ఉండటం నా ప్రత్యేకత)

**Sukrithi:** One more thing. That book is yours for keeps. I don't need it any way.
(ఇంకో విషయం. ఆ పుస్తకం నువ్వే ఉంచేసుకో. నాకు అక్కరలేదు. అవసరం కూడా లేదు)

**Prasasthi:** I'm sorry that I can't keep it for ever. I'll certainly return it to you once my work is over. It's not fair on my part to keep it for myself.
(నేనలా తీసుకోలేను. Sorry. దానితో నా పనైపోగానే నీకు తిరిగిచ్చేస్తాను. దాన్ని నేనుంచేసుకోవటం న్యాయం కాదు)

**Sukrithi:** I am all appreciation for your honest intentions.
(నీ నిజాయతీతో కూడిన ఉద్దేశాలను నేను పూర్తిగా హర్షిస్తున్నా.)

**Prasasthi:** Today is Sunday. There'll be a number of stalls of second hand books. I'll see if I can get the second book there. I'm not sure, but I'll try for what it is worth.
(ఇవాళ ఆదివారం కదా. పాత పుస్తకాలమ్మే చాలా దుకాణాలుంటాయి. ఆ రెండో పుస్తకం అక్కడ దొరుకుతుందేమో చూస్తా. అంత నమ్మకం లేదు. అయినా నా ప్రయత్నం నేను చేస్తా)

**Sukrithi:** I am sure it is some where in the house. It's matter of time before I get it for you.
(ఎక్కడో ఇంట్లోనే ఉందని నా నమ్మకం. కాస్త time పడుతుందంతే. నీకు ఇస్తాన్నేనది)

⊙ ⊙ ⊙ ⊙

***We are discussing the uses of 'for'. The following are some more uses of for. Look at the following sentences from the conversation above.***

*1) I looked for them the whole day yesterday.*
*2) For the present make do with it.*
*3) You've taken a lot of trouble for my sake*
*4) That book is yours for keeps*
*5) Anything for a friend*
*6) I'll try for what it is worth*

**1) Look for** = search for = వెదకటం

a) I am looking for someone who can explain this = ఇది వివరించగలవాళ్లకోసం చూస్తున్నాను/ వెతుకుతున్నాను.

b) What are you looking for? = దేనికోసం వెతుకుతున్నావు?




c) Looking for that book in these huge piles of books is looking for a needle in a haystack = ఈ పుస్తకాల దొంతర్లలో ఆ పుస్తకం కోసం వెతకటం, గడ్డివాములో సూది కోసం వెతకటమే.

Needle in a hay stack= గడ్డివాములో సూది- ఇది idiom, మీరు practice చేయండి.

d) I am looking for some one to help me= నాకు సాయంచేసే వాళ్లకోసం చూస్తున్నా.

**2) For the present** = For now = ప్రస్తుతానికి.

a) This is all the money that I can give you for present = ప్రస్తుతానికి నీకు నేను ఇవ్వగలిగిన డబ్బు ఇంతే.

b) Let's not say or do any thing for the present. Let's wait for his next move = ప్రస్తుతానికి మనమేం చెప్పొద్దు, చెయ్యొద్దు. వాడు చేయబోయేదేంటో చూద్దాం/ వేచి చూద్దాం.

c) Won't this do for the present? = ప్రస్తుతానికిది చాలదా?


M.SURESAN

**3) For somebody's/ someone's sake**= for the sake of someone/ for the sake of somebody = (ప్రత్యేకంగా) ఒకరికోసం/ ఒకదానికోసం

a) A father takes any kind of trouble for the sake of his children = తన పిల్లల కోసం/ వాళ్ల కోసమైతే, తండ్రి ఏదైనా చేస్తాడు.

b) A mother is prepared for any sacrifice for the sake of her children= తన పిల్లల కోసం తల్లి ఎంతటి త్యాగానికైనా సిద్ధపడుతుంది.

c) Harischandra gave up his kingdom for the sake of truth= సత్యం కోసమే రాజ్యాన్ని వదులుకున్నాడు హరిశ్చంద్రుడు.

ఈ expression కూడా practice చేయండి.

**For God's sake** = దయ ఉంచి అనే భావంతోగానీ/ ఒక విషయం చెయ్యమని/ చెయ్యొద్దని గట్టిగా ఆజ్ఞలాగా చెప్పడానికిగానీ వాడతాం.

a) For God's sake, stop beating the child= (కోపంతో, గట్టిగా) ఆ బిడ్డను కొట్టడం ఆపు. ఇక చాలు.

b) He is just a boy, how can he lift that heavy box, for God's sake! = అతను చిన్న కుర్రాడు, ఆ బరువైన పెట్టెను ఎలా ఎత్తగలడు? (గట్టిగా చెప్పడం)

c) For God's sake come out with the truth = ఆ నిజమేదో చెప్పు (ఆదేశం/ ఆజ్ఞ/ ఆక్రోశంతో చెప్పటం)

**5) Anything for-** ఇది చాలా తరచుగా వినపడే expression- practice చేయండి. అర్థం- దేనికైనా సిద్ధం అని.

a) Anything for the sake of/ for a friend= స్నేహితుల కోసం దేనికైనా సిద్ధమే

b) Anything for a quiet life - that's my policy ప్రశాంత జీవితం కోసం దేనికైనా సిద్ధమే. అదీ నా విధానం.

c) He will do anything for money = అతను డబ్బు కోసం ఏం చేసేందుకైనా సిద్ధమే.

**4) for keeps** = for ever = ఎప్పటికీ/ శాశ్వతంగా

a) I give it to you for keeps = అది ఎప్పటికీ నీకిచ్చేస్తున్నా.

b) I've travelled a lot. Now I think I'll be here for keeps = చాలా ప్రయాణాలు చేశానింతవరకు/ ఇంతవరకూ తిరుగుతూనే గడిపాను. ఇంక ఎప్పటికీ ఇక్కడే ఉండిపోవాలనుకుంటున్నా.

c) Has he given it to you for keeps or does he want it back? = అది నీకు ఎప్పటికీ ఇచ్చేశాడా లేకుంటే మళ్లీ తీసుకుంటాడా?

[for keeps X for the time being కదా]

**6) For what it is worth** = మనం చెప్పేదాంట్లో మనకే అంత నమ్మకం లేకపోయినప్పుడు, ఈ expression వాడతాం.

a) I think I'll buy this shirt, for what it is worth ఈ shirt కొనుక్కుంటాలే, (బాగున్నా లేకపోయినా అని/ అంత బాగుండకపోవచ్చు అయినా కొనుక్కుంటా అనే భావంతో)

b) Take the old man's advice for what it is worth = ఆ పెద్దాయన సలహా తీసుకో, చూద్దాం (అంత మంచి సలహా కాకపోవచ్చు)

c) Though I am not sure I can meet him, I'll try for what it is worth = వాడిని కలుసుకుంటాననే నమ్మకం లేదు, అయినా ప్రయత్నిస్తా (దొరుకుతాడేమో).

ఇవన్నీ మీ conversation లో వాడి దాన్ని సజీవమైన సంభాషణగా చేసుకోండి.

---

**ప్రశ్న:**

కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా అంటారో తెలుపగలరు.

1. హెల్మెట్ ధరించకపోతే పరిహారం చెల్లిస్తామా?
2. హెల్మెట్ ధరించకపోతే పరిహారం చెల్లిస్తాము టావా?
3. హెల్మెట్ ధరించకపోతే పరిహారం చెల్లించాల్సిందేనా?
4. హెల్మెట్ ధరించకపోతే పరిహారం తప్పదా?
5. హెల్మెట్ ధరించకపోతే పరిహారం తప్పకపోవచ్చు

– ఎం.డి. కిషన్, కథలాపూర్

**జవాబు:**

1. Do we pay fine/ Are we fined for not wearing (if we don't wear) a helmet?
2. (Do) you mean we pay fine/ We are fined for not wearing a helmet?
3. Have we to/ Must we/ should we pay fine for not wearing a helmet?
4. Can't we help paying fine for not wearing a helmet?
5. Fine/ Penalty might have to be paid for not wearing a helmet

**ప్రశ్న:**

1. *Possessive pronoun, Reflexive pronoun లను subject గా వాడవచ్చా?*
2. *Question Words ను pronoun గా ఏయే సందర్భాల్లో వాడతారు?*
3. *ఒక noun పునరావృతం కాకుండా వాటి బదులుగా He, She, It, They లు ఉన్నాయి కదా! Questions words pronoun గా వాడాల్సిన అవసరం ఏమిటి?*

– డి.రాజు, ఆదోని

**జవాబు:**

1) **Possessive pronouns** as subjects:

a) Mine is that blue car there (నాది)

b) Ours is a most bigger house than this (మాది)

c) Yours is not so good as this (నీది/ మీది)

d) His is a better solution (అతనిది)

e) Hers is a very costly necklace (ఆమెది)

f) Theirs are not clever ideas (వాళ్లవి)

You can't use a **reflexive pronoun** as the subject of a sentence.

2) a) who, whom- ఈ రెండు question words, ఎప్పుడూ Pronouns.

b) What, which, whose - వీటి పక్కన ఏదైనా Noun వస్తే (What book, which pen, whose car లా) అవి adjectives, అలాకాకుండా ఒంటరిగా వస్తే అవి Pronouns.

1) a) What do you want (Pronoun)

b) What book do you have? (What- Adjective)

2) a) Which is the better? (Pronoun)

b) Which book is the better? (Adjective)

3) a) Whose is the book? (Pronoun)

b) Whose book is this? (Adjective)

c) Where, when- ఇవి Adverbs. అయితే since when, by when అన్నప్పుడు when pronoun. When and where కొన్నిసార్లు conjunctions.

d) Why- ఎప్పుడూ Pronoun గా రాదు.

3) Question words relative pronouns గా వాడాల్సిన అవసరం: Two or more sentences ను కలిపేందుకు ఇవి అవసరమే కదా.

He bought a car. The car is blue- ఇలా అనం కదా. అలాంటప్పుడు, The car which he bought is blue అనేందుకు; 'Wh' word అవసరమేకదా?

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

**Srikar:** You look tired. Where have you been?
(నువ్వు చాలా అలసిపోయినట్లు కనిపిస్తున్నావు. ఇంతసేపూ ఎక్కడున్నావు? )

**Sritej:** Out, playing cricket.
(క్రికెట్ ఆడుతున్నా, బయట.)

**Srikar:** You have been out for a long time? Have you been playing for long?
(చాలాసేపు ఇంట్లో లేవు. చాలాసేపు ఆడుతున్నావా? )

**Sritej:** Today out of the six hours since midday I have played for three hours.
(ఇవ్వాళ మధ్యాహ్నం నుంచి ఇప్పటివరకు 6 గంటల్లో, నేను మూడు గంటలు ఆడాను.)

**Srikar:** Did Vijai play today?
(ఇవ్వాళ విజయ్ కూడా ఆడాడా? )

**Sritej:** He has been out of town for three days now. I don't know when he will be back.
(మూడు రోజులుగా వాడు ఊళ్లో లేడు. వాడు మళ్లీ ఎపుడు తిరిగొస్తాడో తెలియదు.)

**Srikar:** But he didn't play in the last match either. He was in town then, wasn't he?
(కిందటి మ్యాచ్‌లోనూ అతనాడలేదు. అప్పుడు ఊళ్లోనే ఉన్నాడు కదా? )

**Sritej:** He wasn't well then. Out of concern for his health his dad told him to take rest.
(అప్పుడతనికి ఒంట్లో బాగాలేదు. అతని ఆరోగ్యం పట్ల ఆదుర్దాతో వాళ్ల నాన్న విశ్రాంతి తీసుకోమన్నాడు.)

**Srikar:** He is a very good player, isn't he?
(అతను చాలా మంచి ఆటగాడు కదా? )

**Sritej:** Yea. You can say that. Out of the ten selected for the state team, he is the only player from our area.
(అవును. కచ్చితంగా. రాష్ట్ర జట్టుకు ఎంపికైన 10 మందిలో మన ప్రాంతం నుంచి ఎంపికైంది అతనొక్కడే)

**Srikar:** I hear that he is out of favour with your captain. Is that true?

**Sritej:** Yea. He is all for keeping him out of the team. He is afraid Vijai might be made captain in his place.
(అవును. అతన్ని జట్టులో లేకుండా చేయాలని బాగా ఉంది. తన స్థానంలో విజయ్‌ను కెప్టెన్‌గా చేస్తారేమోనని అతని భయం.)

**Srikar:** That's bad for the game.
(అది ఆటకు మంచిది కాదు.)

**Sritej:** A lot of players are anxious to have him as our captain. That is adding to the fear of the present captain.
(చాలామంది ఆటగాళ్ళు విజయ్‌ను కెప్టెన్‌గా తేవాలని ఆత్రంగా ఉన్నారు. అది కూడా ఇప్పటి కెప్టెన్ భయాన్ని ఎక్కువ చేస్తోంది.)

**Srikar:** I think Vijai will be made the captain before the year is out.
(ఈ సంవత్సరం చివరిలోపే విజయ్‌ను కెప్టెన్ చేస్తారనుకుంటా.)

**Sritej:** I wish they did. He deserves to be the captain.
(అలా చేస్తే బాగుంటుంది. అతను కెప్టెన్‌గా ఉండేందుకు అర్హుడు.)

**Srikar:** What about Vijai himself? What does he feel about captaincy?
(అసలు విజయ్ మాట ఏంటి? అతనేమనుకుంటున్నాడు కెప్టెన్ పదవి గురించి? )

**Sritej:** He keeps out of this. He doesn't just bother about it. All that he does is to play to his ability.
(అతను ఇందులో కల్పించుకోడు. అతను ఇవన్నీ పట్టించుకోడు. అతను చేసేదల్లా తన శక్తిమేరకు ఆడటమే.)

**Srikar:** I wish him the best of luck. He is a gem of a player.
(అతనికి అదృష్టం కలిసి రావాలని నా కోరిక. ఓ రత్నంలాంటి ఆటగాడతను.)




# He has been out of town

*English conversation లో తరచుగా వినపడే out ను గురించి తెలుసుకుందాం, ఈ Lesson లో. Out చాలా తరచుగా వాడతాం. అయితే Out కాకుండా, 'out of', combination ఎక్కువగా వినిపిస్తుంది. ఆ సందర్భాలను ఇప్పుడు పరిశీలిద్దామా?*


M.SURESAN

**Look at the following sentences from the conversation above.**

1) *Out, playing cricket*
2) *You have been out for a long time*
3) *Out of six hours since midday I've played for three hours.*
4) *He has been out of town*
5) *Out of concern for his health his dad told him to take rest.*
6) *Out of the ten selected for the state team.*
7) *... he is out of favour with your captain.*
8) *He is all for keeping him out of the team.*

**No. 1, 2 and 4 sentences** గమనించండి. వీటిల్లో out కు అర్థం: ఇంట్లో లేకుండా అని. (Opposite - 'in' ఇంట్లో ఉండటం)

**Rafi :** Is your father in?
(మీ నాన్న ఇంట్లో ఉన్నారా? )

**Sunil:** I'm afraid, no. He is out on some important business. He has been out for an hour now.
(లేరు. ముఖ్యమైన పనిమీద బయటికెళ్లారు. గంటసేపుగా ఇంట్లో లేరు/ బయటికెళ్లి గంటయింది).

Out of town = ఊళ్లో లేకపోవటం (ఎలాంటి ఊరైనా సరే, ఎంత పెద్ద నగరమైనా, out of town అనే అంటాం. out of city, in city అంత వినిపించదు.)

**Out of station - తప్పు. ఊళ్లో లేరనే అర్థంతో ఈ expression, English లో లేదు.**

a) My dad has been out of town for two days now =
మా నాన్న రెండ్రోజులుగా ఊళ్లో లేరు.

b) Who says he is out of town. He is very much in = ఎవరన్నారు. ఊళ్లో లేరని కచ్చితంగా ఊళ్లోనే ఉన్నాడు.

ఇది గమనించండి.

An out of towner = ఊరికి కొత్తవాడు/ ఇంకో ఊరి నుంచి వచ్చినవాడు.

My uncle is an out of towner here =
మా uncle ఈ ఊరికి కొత్త (stranger)/ వేరే ఊరికి చెందినవాడు.

A goofing out of towner = ఊరికి కొత్త అవటం వల్ల అయోమయంలో పడేవాళ్లు, పొరబాటు చేసేవాళ్లు, దారి తప్పేవాళ్లు.

An out of town guest =
బయటి ఊరినుంచి వచ్చిన అతిథి.

**Sentences No.3 and 6:**

Out of = అందులో (భాగంగా)

a) Out of the six hours of leisure, I spent 3 hours watching the TV =
ఆరు గంటల విశ్రాంతి సమయంలో, 3 గంటలు TV చూస్తూ గడిపాను.

b) Out of the ten players selected for the state team =
రాష్ట్ర జట్టుకు ఎంపిక చేసిన పది మందిలో.

c) Out of the six best in the class, she is the top =
ఆ class లోని ఆరుగురు ఉత్తమ విద్యార్థుల్లో ఆ అమ్మాయి అత్యుత్తమం.

d) She score a hundred out of a hundred
(ఇక్కడ ఇన్ని గరిష్ఠ మార్కులకు ఇంత అని)
ఆమెకు వందకు వంద మార్కులొచ్చాయి.

e) They were able to get only five out of ten points =
పది points కు 5 points మాత్రమే వచ్చాయి.

**Sentence No 5:**

**Out of concern for** = ఆదుర్దా వల్ల.

a) Out of fear no one opened his mouth =
భయం వల్ల ఎవరూ నోరు విప్పలేదు.

b) Out of pity I helped him, but he is ungrateful =
జాలితో/ జాలివల్ల ఏదో సహాయం చేశాను, కానీ వాడు కృతఘ్నుడు.

**7) Out of favour** = అభిమానం కోల్పోయిన/నచ్చని.

a) This fashion is out of favour with the youth now =
ఈ fashion ఇప్పటి యువత అభిమానం కోల్పోయింది./ ఇప్పటి యువతకు నచ్చటం లేదు.

b) The MLA is out of favour with the CM =
ఆ MLA ముఖ్యమంత్రి అభిమానాన్ని కోల్పోయాడు.

---



**ప్రశ్న:** *inundate, submerge, maroon వీటి తేడా ఏమిటి?*
*– అప్పలరాజు, విశాఖపట్నం*

**జవాబు:**

**Inundate** = నీళ్లు ఒక ప్రదేశాన్ని పూర్తిగా ఆవరించటం/కప్పేయటం.

Flood waters inundated the whole area = ఆ ప్రదేశం మొత్తం వరద నీళ్లు కప్పేశాయి/ ఆక్రమించాయి/ ఆవరించాయి.

**Inundate** అంటే ఇంకో అర్థం, మనకు అలవికానంతగా ఏదైనా పొందడం.

Requests for more information inundated our office = మరింత సమాచారం కావాలనే అభ్యర్థనలు మా office ను ముంచేశాయి/ అభ్యర్థనలతో మా office మునిగిపోయింది.

గమనిక: Inundate కాస్త గ్రాంథికం.

**Submerge:** అంటే మునగటం -
Inundate లాగ ఒక ప్రదేశమే నీళ్లలోనే మునగటం మాత్రమే కాకుండా ఏ వస్తువైనా, ఏ ద్రవంలోనైనా మునగటం.

The fields were submerged by the flood water = పొలాలు వరద నీళ్లలో మునిగిపోయాయి.

ఇక్కడ Submerge = inundate. అయితే submerge అంటే ఇంకే ద్రవంలోనైనా, ఇంకే వస్తువైనా మునగటం/ ముంచటం అనే అర్థం ఉంది.

As she poured the coffee, the sugar cubes were submerged under it = ఆమె coffee పోస్తుంటే పంచదార cubes అందులో మునిగిపోయాయి.

**Maroon** = నిర్మానుష్యమైన చోట తప్పించుకొనేందుకు వీలులేకుండా వదిలేయడం.

a) When the ship sailed off without him, he was marooned on the island = అతను లేకుండా ఆ ఓడ వెళ్లిపోవటంతో, అతను ఆ నిర్మానుష్యమైన ద్వీపంలో ఒంటరిగా ఉండిపోయాడు.

b) Our car brokedown at the dead of night and we were marooned where we did not know = అర్ధరాత్రి మా కారు ఆగిపోవటంతో, మేం ఒంటరిగా ఆ నిర్మానుష్య ప్రదేశంలో, ఎక్కడో తెలియదు, చీకటిలో చిక్కుపడిపోయాం.

c) As the flood waters surrounded the village, the villagers were marooned = వరదనీళ్లు గ్రామాన్ని చుట్టుముట్టడంతో, అక్కడి గ్రామస్థులకు ఇతర ప్రపంచంతో సంబంధాలు లేకుండాపోయాయి.

**ప్రశ్న:**

*1. was announced / has been announced/ had been announced- ఇవి మూడూ past actions. వీటి అర్థం ఏమిటి? ఏ సందర్భాల్లో ఉపయోగిస్తారు? news paper లో ఎక్కువగా was + p.p/ were + p.p ఉపయోగిస్తున్నారు. ఎందుకు?*

*2. could మీరు చెప్పినట్లు past లో ability ని గురించి చెపుతుంది కదా? could ను future లో కూడా వాడవచ్చా? ఒక news paper లో you could enjoy అంటే enjoy చేయవచ్చు అని ఉంది అంటే future కదా? మీరు చెప్పినట్లు you could enjoy అంటే past లో enjoy చేయగలగడం కదా? వివరించగలరు.*

*– రాహుల్, నెల్లూరు*

**జవాబు:**

**1.** Was announced - Past లో కచ్చితంగా మనకు తెలిసిన time లో జరిగిన action - అది ప్రకటించబడింది, గతంలో ఒక time లో అని తెలిసినప్పుడు.

Has been announced - ఇది కూడా past action; the time of action, not stated (ఎప్పుడు announce చేశారనేది తెలియదు కానీ announce మాత్రం చేశారు- has been + pp- Past action, time not known)

Had been annonced ఇదీ past action. అయితే ఇది ఇంకో Past action కు ముందర జరిగింది.

By the time I reached there the result had been announced = మేమక్కడికి చేరేటప్పటికే/ చేరకముందే అది ప్రకటించబడింది.

Had been + pp = the 1st of two past actions.

All the three verbs are in the passive voice.

**2.** Could past ability తెలుపుతుంది- correct. అయితే could ను ఇంకా possibility in the present or future తెలిపేందుకు వాడొచ్చు ఇప్పుడు లేదా future లో సాధ్యమవుతుందనుకునే విషయాన్ని కూడా could లో చెప్పవచ్చు.

She could be here any moment = ఆమె ఏ క్షణంలోనైనా ఇక్కడ ఉండవచ్చు (Present possibiltiy)

They could be here tommorrow = రేపు వాళ్లిక్కడ ఉండవచ్చు/ ఉండే అవకాశం ఉంది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

ప్రతిభ

**Snehit:** Why do you go on needling Karthik the way you do?
(ఎందుకు ఊరికే కార్తీక్‌ను ఎప్పుడూ ఏదో ఒకటి అంటుంటావు?)

needle= ఒకరిని గురించి ఎప్పుడూ ఏదో ఒకటి అని విసిగించటం

**Vaibhav:** Keep out of this, Snehi. This no way concerns you.
(దీనిలో నువ్వు కల్పించుకోకు. నీకు సంబంధం చిన విషయంకాదు.)

concern = సంబంధం ఉండటం

**Snehit:** I don't want two of my friends crossing swords with each other. That's what I am concerned about.
(నా స్నేహితులిద్దరు పోట్లాడుకోవడం చూడాలనుకోవటంలేదు. అది నాకు ఆందోళన కలిగిస్తోంది.)

be concerned = ఆందోళనపడటం.

I am concerned about my father's health = మా నాన్న ఆరోగ్యం నాకు ఆందోళన కలిగిస్తోంది.

cross swords = పోట్లాడుకోవటం

**Vaibhav:** you are out to help him I know. You have always liked him better than me.
(అతడికి ఎలాగో సాయం చేయాలని నీ తపన. ఎప్పుడూ నాకంటే అతడంటేనే నీకు ఇష్టం.)

**Vaibhav:** If he was so much for having it out with me why did you stop him? If as you say he can be dangerous, so can I be. In fact, I've been looking forward to a confrontation with him.
(అంత నాతో తేల్చుకోవాలని అనుకుంటే, నువ్వెందుకు ఆపావు. నువ్వంటున్నట్టు వాడితో ప్రమాదం అయితే, నేనూ అంత ప్రమాదకరంగా ఉండగలను. అసలు నేనతనితో ముఖాముఖి తేల్చుకోవాలని ఎప్పటినుంచో అనుకుంటున్నాను.)

confrontation- కన్‌ఫ్రంటెయ్‌షన్- టెయ్ నొక్కి పలుకుతాం - ముఖాముఖి (పోట్లాట).

showdown, confrontation - ఈ రెండూ ఉప యోగకరమైన మాటలు. practice చేయండి.

**Snehit:** Look here, Vaibhav. I am leaving here for good before the year's out. So before I leave, I want to see you as friends.
(చూడు. ఈ సంవత్సరం పూర్తయ్యేలోపల నేను వెళ్లిపోతున్నా. వెళ్లేముందు మీ ఇద్దర్నీ స్నేహితులుగా చూడాలని నా కోరిక.)

for good= శాశ్వతంగా

**Vaibhav:** Good luck. Keep trying.
(Good luck. ప్రయత్నిస్తూ ఉండు)




# You are out to help him

**Snehit:** Come on Vaibhav. You must be out of your mind to say that. I just want you to stay out of trouble. That's all. Karthik can some times dangerous.
(నీకు పిచ్చెక్కినట్లుంది. నువ్వు ఇబ్బందుల్లో పడకుండా ఉండాలని నా కోరిక. అంతే. కార్తీక్‌తో ఒక్కొక్కప్పుడు ప్రమాదం)

**Vaibhav:** You could warn Karthik as well.
(ఆ విషయం నువ్వు కార్తీక్‌కు కూడా చెప్పవచ్చు కదా.)

**Snehit:** (Are) you sure that I haven't? I've told him very strongly to avoid a show down with you. That's why he isn't provoked even when you try to.
(నేను చెప్పలేదని నీకు తెలుసా? గట్టిగా చెప్పా వాడితో, నీతో అటో ఇటో తేల్చుకునే పద్ధతి వద్దని. అందుకే నువ్వెంత రెచ్చగొట్టడానికి ప్రయత్నించినా అతను రెచ్చిపోకుండా ఉన్నాడు.)

showdown = అటో ఇటో తేల్చుకోవటం (చాలాకాలంగా ఉన్న వివాదం/ పోట్లాట విషయంలో.)

provoke = రెచ్చగొట్టడం/ కవ్వించటం.


M.SURESAN

మనం uses of out/ out of పరిశీలిస్తున్నాం కదా, అవి వాడే మరికొన్ని సందర్భాలు ఈ lesson లో పరిశీలిద్దాం.

**Look at the following sentences from the conversation above.**

1) *<u>Keep out</u> of this.*
2) *You <u>are out</u> to help him.*
3) *You must be <u>out of your mind</u> to say that.*
4) *I just want you <u>to stay out of trouble</u>.*
5) *If he was so much for <u>having it out</u> with me, why did you stop him?*
6) *I am leaving here for good <u>before the year is out</u>*

**1) <u>Keep out of something</u> =**
ఏదైనా విషయంలో జోక్యం చేసుకోకుండా/ కల్పించుకోకుండా ఉండటం.

a) <u>Let me keep out of this</u> affair between the cousins. I don't want to have my fingers burnt =
అదేదో cousins మధ్య వ్యవహారం- నేను కల్పించుకో దలచుకోలేదు. నా చేతులు కాల్చుకోవాలనుకోవటంలేదు.

b) The police have warned him to <u>keep out of the</u> group clashes =
వర్గ పోరాటాల్లో కల్పించుకోవద్దని పోలీసులు అతణ్ని హెచ్చరించారు.

c) When his mother and wife start arguing he <u>keeps out of it</u> =
తన తల్లి, భార్య వాదులాడుకుంటే అతనేం కల్పించుకోడు

**Keep out-** (ఒకచోట) ప్రవేశించకుండా ఉండటం/ ప్రవేశించవద్దని చెప్పటం.

a) 'unsafe building, <u>keep out</u>' =
Building క్షేమకరంకాదు/ అపాయకరస్థితిలో ఉంది. ప్రవేశించకండి.

b) 'Private property. <u>Keep out</u>' =
ఇది private స్థలం. ప్రవేశించకండి.

సామాన్యంగా ఇది హెచ్చరికలకు వాడతారు.

**2) You are <u>out to help</u> him**

<u>Out to do</u> some thing =
ఒక పనిచేయాలనే గట్టి నిర్ణయం/ ప్రయత్నం

<u>Out for</u> some thing =
ఒకదాన్ని పొందాలని గట్టి నిర్ణయం/ ప్రయత్నం

a) He is out to take revenge on you =
నీ మీద కక్ష తీర్చుకోవాలనే వాడి నిర్ణయం/ ప్రయత్నం

b) She is out to make it good in computers =
computers లో రాణించాలని ఆమె నిర్ణయం/ ప్రయత్నం.

make it good= రాణించటం

C) He is out only for one thing and that is money =
అతని ప్రయత్నం అంతా ఒకటే- డబ్బు.

3) Out of one's mind =
పిచ్చెక్కటం/ అర్థం లేకుండా మాట్లాడటం

a) You must be out of your mind to think you can ever become a minister =
నువ్వు మంత్రివి కాగలననుకుంటే, <u>అది నీ పిచ్చి</u>.

b) Any one who says politicians are honest <u>is out of their mind</u> =
రాజకీయ నాయకులు నిజాయతీపరులనేవాళ్లు పిచ్చివాళ్లే.

**4) Stay out of trouble =**
ఇబ్బందుల్లో పడకుండా ఉండటం

a) I don't want to do any business. I am for <u>staying out of trouble</u> =
నేనేం వ్యాపారం చేయదలచుకోలేదు, ఇబ్బందుల్లో పడకూడదని.

b) You'd better stay out of all this =
ఈ విషయాల్లో నువ్వు కల్పించుకోకు.

ఈ అర్థంతో ఇదీ, Keep out of, ఒకటే.

**5) Have it out =**
అటో ఇటో/ తాడో పేడో తేల్చుకోవటం.

a) Why do you ask her. <u>Have it out</u> with him
ఆమెనెందుకు అడగటం నువ్వు? అతనితోనే <u>తేల్చుకో</u>.

b) Unable to bear the insults any more he wanted <u>to have it out with his boss</u> =
అవమానాలను భరించలేక boss తో <u>అటో ఇటో తేల్చుకోవాలనుకున్నాడు</u>.

**6) before the years out = (year is out)**
సంవత్సరాంతం లోపు.

అలాగే before the day/ the week/ the month, etc <u>is out</u> = రోజు/ వారం/ నెల, etc. <u>లోపు</u>.

a) He had finished reading the novel before the day <u>was out</u> =
ఆ రోజులో అతడు ఆ నవల చదవటం పూర్తిచేశాడు.

b) The company had sold out all stock before <u>a week was out</u> =
ఒక్కవారంలో ఆ company సరకంతా అమ్మేసింది.

c) He got the next promotion before the year was out =
ఏడాది తిరగక ముందే తర్వాతి promotion వచ్చేసింది.

---



**ప్రశ్న:** వెయ్యిసార్లైనా మరణించి నీకోసం ఒక్కసారి జన్మిస్తా ప్రశ్నకు *Even if I die a thousand times, I will be born once again for you* అని జవాబు రాశారు. సాధ్యం కానివాటికి, *imagination/ impossible*, అసహజమైన విషయాలకు *II condition* వాడాలి కదా? ఆ *answer Even if I died a thousand times, I would be born once again for you* అంటే బాగుంటుంది కదా! వివరించగలరు.

– ఆర్.రమేష్, కరీంనగర్

**జవాబు:** మీరు correct. అయితే future imaginary అయినప్పుడు, if I die అనటంలో తప్పులేదు. But your sentence 'If I died...', certainly better. Thank you for pointing it out.

**ప్రశ్న:** *i) Sew, Sow, Strew, Strew-* ఈ పదాల ఉచ్చారణ, క్రియా రూపాలు వివరించగలరు. కింది వాక్యాలను తెలుగులో ఎలా రాయాలో తెలపండి.
*ii) Every tide has its ebb.*
*iii) All men are mortal.*
*iv) Either way, it is good.*
*v) The harder I work, The greater is the pleasure.*
*vi) Men may come, and men may go but. I go on for ever.*

– ఎం. రంగయ్య, వరంగల్

**జవాబు:** i) Sew - Sou - సౌ; sow - సౌ;
brew - (బ్రూ) stew - స్ట్యూ
ii) లేచే కెరటం తప్పకుండా పడుతుంది.
iii) మనుషులందరూ మరణించేవాళ్లు/ మనిషికి మరణం తథ్యం
iv) ఎటైనా మంచే (రెండు విధాల్లో)
v) నువ్వెంత కష్టపడితే/ శ్రమిస్తే, అంత ఆనందం.
vi) మనుషులు రావచ్చు, పోవచ్చు కానీ నేనెప్పటికీ సాగిపోతుంటాను.

**ప్రశ్న:** i) గ్రామర్ పరంగా, Tenses పరంగా మంచి పుస్తకాన్ని సూచించగలరు. ii) ఇంగ్లిష్ పేపర్ చదివినప్పుడు sentence పూర్తిగా అర్థంకావడం లేదు. దీనికి కారణం ఏమిటి? iii) Should, would, will వంటి Future would forms ఎప్పుడు, ఏ సందర్భాల్లో ఉపయోగించాలో వివరించండి.

– శ్రీను, హైదరాబాద్

**జవాబు:** i) Living English structure by Stannard Allen (with key) = మీరడిగిన విధంగా మీకు బాగా ఉపయోగపడే పుస్తకం.
ii) అలాగే చదువుతూ ఉండండి - కాలక్రమేణా (రెండు మూడు నెలల్లో) బాగా అర్థం అవుతుంది.
iii) Should, Would, Will.... వీటి ఉపయోగాలు చాలా వివరంగా పాత lessons లో explain చేశాం. చూడండి.

**ప్రశ్న:** 1. Give some examples of post mention words. Whether post mention words are used in formal English?
2. Whether the sentence- "I still remember locking the door" - conveys past tense?

– వి. వెంకటనారాయణరావు, ధర్మవరం

**జవాబు:** 1. Examples of Post mention words (Words formed by combining the meaning and the sound of two already existing words)
a) Edutainment -
Education + Entertainment
(విద్య + వినోదం)
b) Infotainment -
Information + Entertainment =
సమాచారం + వినోదం
c) concerpt- concert + excerpt =
పాట కచేరీలలోంచి తీసిన కొన్ని భాగాలు
2) I still remember locking the door - It does convey a past action but I still remember to have locked/ having locked the door - conveys a past action more clearly.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ




# My secret is out

**Hemang:** What's biting you? For God's sake out with it!

(ఏమిటంత ఆందోళనపడుతున్నావ్? బయటికి చెప్పు!)

**Tushar:** My secret is out. My uncle, of all the people my uncle, has come to know of my affair with Mahima.

(నా రహస్యం బయటపడింది. నాకు మహిమకు మధ్య ఉన్న విషయం, మా మామయ్యకు, ఇంకెవరికో కాదు, మామయ్యకు తెలిసింది.)

**Hemang:** Does he know you intend to marry her too?

(నువ్వు ఆమెను పెళ్లి చేసుకునే ఉద్దేశంతో ఉన్నావని కూడా తెలుసా? )

**Tushar:** Why don't you hear me out? There was a big scene at home yesterday. Mom, dad and he hit the roof when I told them that I want to marry her.

(చెప్పేది పూర్తిగా వినవేం? నిన్న పెద్ద scene మా ఇంట్లో. మహిమను నేను పెళ్లి చేసుకుంటాననగానే ఉగ్రరూపమే.)

hit the roof = విపరీతమైన కోపం

**Hemang:** You told them that?

(అది చెప్పావా నువ్వు వాళ్లతో.)

**Tushar:** I told them that wasn't for a marriage with Purnima, My uncle's daughter. Reason - I'm against marriage between blood relations. So is Purnima for that matter.

**Hemang:** What happened then?

(ఏమైంది ఆ తర్వాత? )

**Tushar:** Even before I could finish, my uncle walked out the door in a huff. My parents haven't cooled down yet. I brought my mom some fruits and she just threw them out the window.

(నేను మాట్లాడటం పూర్తి చేయకముందే మామయ్య కోపంతో విసవిసా తలుపు తీసుకుని బయటికి వెళ్లిపోయాడు. మా అమ్మా, నాన్న ఇంకా చల్లబడలేదు. మా అమ్మకు పండ్లు తెచ్చాను. ఆమె వాటిని కిటికీలోంచి విసిరేసింది.)

**Hemang:** What about your dad?

(మీ నాన్న సంగతేంటి? )

**Tushar:** He wouldn't talk to me. He was sitting in silent anger in his room, with the lights out.

(ఆయన నాతో మాట్లాడటం మానేశాడు. ఏం మాట్లాడకుండా కోపంతో తన గదిలో lights ఆర్పేసి కూర్చున్నాడు.)

**Hemang:** What does Mahima say about it all?

(మహిమ ఏమంటోంది దీన్ని గురించి? )

**Tushar:** She hasn't yet come to know of this

(ఇంకా ఆమెకిది తెలియదు.)

**Hemang:** Talk to your people once again about it.

(మళ్లీ మీ వాళ్లతో ఒకసారి మాట్లాడు.)

**Tushar:** That's what I am trying to do.

(అదే ప్రయత్నం మీదున్నా.)

⊙ ⊙ ⊙ ⊙

Out/ out of విషయాలు తెలుసుకుంటున్నాం. ఈ lesson లో మరికొన్నింటిని చూద్దాం.

**Look at the following sentences from the conversation above:**

*1) For God's sake, out with it.*
*2) My secret is out.*
*3) Why don't you hear me out?*
*4) My uncle walked out the door.*
*5) She throw them out the window.*
*6) He was sitting in his room, with the lights out.*

**1) Out with it =**

బయటపెట్టడం (ఒక విషయం/ రహస్యం వంటివి బయటపెట్టమని అడగటానికి వాడతాం.)

a) You seem to be having something in mind. Come on, out with it = నీ మనసులో ఏదో ఉన్నట్లుంది. కానీ, చెప్పు/ బయటపెట్టు.

b) Is something bothering you? Why don't you out with it?
ఏదైనా నిన్ను ఆందోళనపరుస్తోందా? బయటికి చెప్పవేం?

c) He was out with his intentions finally =
చివరికి వాడి ఉద్దేశాలను బయటపెట్టాడు.

d) After a long interrogation she was out with it =
చాలాసేపు ప్రశ్నించిన తర్వాత, ఆమె పలు విషయాలు బయటపెట్టింది.

**2) My secret is out** = రహస్యం బయటపడిపోవడం.

a) Your secret is out. We know everything about you =
నీ రహస్యం బయటపడిపోయింది. నీ గురించి మాకంతా తెలుసు.

b) How much money he has is a secret, but soon it will be out =
వాడి దగ్గర ఎంత డబ్బుండేదీ రహస్యం. కానీ అది త్వరలోనే బయటపడబోతోంది / తెలుస్తుంది.


M.SURESAN

**3) Hear (somebody) out =**

ఒకరు చెప్తున్నది పూర్తిగా/ చివరిదాకా వినటం

a) She complains that the judge hasn't heard her out =
Judge తను చెప్పింది చివరి వరకూ వినలేదని ఆమె ఆరోపిస్తోంది.

b) Though they heard me out patiently they didn't change their opinion =
నేను చెప్పింది చివరివరకూ వాళ్లు ఓపికతో విన్నప్పటికీ, తమ అభిప్రాయాలను వాళ్లు మార్చుకోలేదు.

ఇది కూడా చూడండి;

**Fight it out -** చర్చల ద్వారా/ పోట్లాట ద్వారా ఒక విషయాన్ని/ వివాదాన్ని తేల్చుకోవటం/ పరిష్కరించుకోవటం.

a) She wants to fight it out with her neighbours = తన పొరుగువాళ్లతో తేల్చేసుకోవాలనుకుంటోంది (చర్చల/ పోట్లాట ద్వారా)

b) We were tired. We left them to fight it out = మేం అలసిపోయాం. ఏదో తేల్చేసుకోమని వాళ్లకు వదిలేశాం. (పరిష్కారమయ్యేవరకు)

c) How long this suspense? Let's fight it out with them = ఎంతకాలం ఈ సందిగ్ధత? ఈసారి మనం వాళ్లతో అటో, ఇటో తేల్చేసుకుందాం. (చర్చల/ పోట్లాట వల్ల)

**4) and 5) Out the door; out the window**

1) Out the door = out of the door = ద్వారంలోంచి

2) Out the window = out of the window = కిటికీలోంచి

Out of the door, Out of the window - ఇలాంటిచోట్ల out of బదులు ఇపుడు, రాను, రాను ముఖ్యంగా Spoken/ Colloquial (వ్యావహారిక) English లో out (of లేకుండా) మాత్రమే వినిపిస్తోంది. కొందరు గొప్ప రచయితలు కూడా out of (లో నుంచి - కిటికీ, ద్వారం వంటి వాటిలో నుంచి అనే అర్థంతో) బదులు, out వాడుతున్నారు.

a) He threw the books out the window =
పుస్తకాలను కిటికీలోంచి బయటకు విసిరేశాడు.
(Out of the window బదులు)

b) She looked out the window =
ఆమె కిటికీలోంచి బయటకు చూసింది.
(Out of the window బదులు)

c) As the car broke down, they all got out the car (out of the car బదులు) and began to push it =
కారు ఆగిపోవటంతో వాళ్లు కారులోంచి దిగి తోయటం మొదలుపెట్టారు.

**6) With the lights out =**

దీపాలు లేకుండా చీకట్లో (దీపాలు ఆర్పేసినందువల్ల/ ఆరిపోయినందువల్ల)

a) The lights were out when he walked in = వాడు లోపలికి వచ్చేటప్పుడు దీపాలు ఆరిపోయాయి.

b) In the middle of the meeting, the lights went out =
సమావేశం మధ్యలో దీపాలు ఆరిపోయాయి.

c) The lights were out, and the thief found his chance =
దీపాలు ఆరిపోయాయి, దొంగకు అవకాశం చిక్కింది/ దీపాలు ఆరిపోయి ఉండటంతో/ ఆరిపోయి ఉన్నాయి, దొంగకు అవకాశం చిక్కింది.

Fire (మంట) ఆరిపోవటానికి కూడా out వాడతాం

a) Luckily the fire was out before much damage was done = అదృష్టవశాత్తు ఎక్కువ నష్టం కలగకముందే మంటలు ఆరిపోయాయి.

b) The fire they lit in the open was out in an hour = ఆరుబయట వాళ్లు చేసిన మంట గంటకే ఆరిపోయింది.

Out ను సందర్భానికి తగినట్లు వాడితే we can carry on conversation in simple, natural English.

**Note:** మంగళవారం సంచికలో (lesson No-347) చివరి ప్రశ్న, దానికి సమాధానంలో, Portmanteau (పోర్ట్‌మాంటో) words బదులు post mention words అని ప్రచురితమైంది. గమనించగలరు.



**ప్రశ్న:**

*i) Please explain the difference between the following transformation of sentences.*
*A.V.: I hate people who are looking at me.*
*P.V.: I hate people being looked at.*
*ii) A.V.: We hear the voices calling for help*
*P.V.: Voices are heard calling for help.- Why the type two can't be transformed type one?*
*We hear the voices being called for help.*
*iii) ఆమె నన్ను చూసి మూతి తిప్పింది- ఇంగ్లిష్‌లో ఎలా చెప్పొచ్చు?*
*iv) What are the uses of participles?*
*v) Whether a Handbook of English grammar (Longman 1972) is available at Hyderabad ?*

– వి. వెంకటనారాయణరావు, ధర్మవరం

**జవాబు:**

i) I hate people who are looking at me- what exactly your idea is, is not clear. If you mean, that in general, you hate people looking at you, the sentence must be, I hate people who look at me (that is, you don't like people/ any body looking at you = You hate any body who looks at you) or better still, I hate people looking at me.

If, on the other hand, you mean that you hate the people (a particular group of people who are looking at you), then the correct thing to say is, I hate the people who are looking at me.

I hate people who look at me = If any body looks at me, I hate them (you hate the act of looking)

I hate the people who are looking at me = Some people (now) are looking at me and I hate them.

I hate people being looked at = I hate any body looking at people.

It is not clear what your idea exactly is.

ii) Voices calling for help are being heard = We hear voices calling for help.
(We hear voices being called for help - meaningless)

iii) She grimaced at me.

iv) Two participles - ★ The present participle (going, coming, walking, taking, etc)

★ The past participle (gone, seen, given, talked, liked, smelt, etc)

★ The present participle with a 'be' form before it forms a verb (am going, has been working, will be coming, etc)

★ It can be used as a subject and an object.

★ The past participle with a 'be' form before it forms passive voice- is given, are taken, has been done, will be grown, etc.

★ The past participle is used in news head lines: a) Comet seen yesterday.
b) Stones thrown at police etc.

★ The past participle with have/has/had, shall have/ should have/ will have etc) forms a verb: have gone, has seen, will have bought, etc.

v) The book seems to be out of print. You can try for old copies of it in 2nd hand book stalls.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




**Nischit:** We are really out of luck. We are just a few minutes late. All the tickets have been sold out.
(మనది దురదృష్టం. కొద్ది నిమిషాలు మాత్రం ఆలస్యంగా వచ్చాం. అన్ని టికెట్స్ అమ్ముడైపోయాయి.)

**Manjit:** That means the movie is out for the coming week, as we are busy through it. We can see the movie only next week.
(అంటే ఈ వారం రోజులూ మనకు సినిమా లేనట్టే, ఎందుకంటే ఈవారం అంతా మనకు తీరికలేదు.)

**Nischit:** Yea. It's out of the question. I doubt if we could make it the next week either. I have to visit my cousin who lives at a little out of the way village in Diviseema.
(అవును. ఆ ప్రసక్తే లేదింక. వచ్చేవారం అయినా మనం చూడగలమా అనేది సందేహమే. నేను దివిసీమలో కాస్త మారుమూల గ్రామంలో ఉండే మా కజిన్‌ను చూసి రావాలి.)

**Manjit:** You are certainly going out of your way to meet him.
(కాస్త ఎక్కువ శ్రమే తీసుకుంటున్నావు అతణ్ని చూసేందుకు.)

**Nischit:** I have to, because we used to be very close when we went to school. He has been a bit out of sorts for the past few weeks. Something is seriously wrong. His son called me yesterday and told me of it.
(నేను వెళ్లాలి, తప్పదు. మేం చాలా స్నేహంగా ఉండే వాళ్లం, స్కూల్లో. కొద్ది వారాలుగా అస్వస్థతగా ఉన్నాడు. ఏంటో కాస్త తీవ్రమైన విషయమే. వాళ్ల అబ్బాయి నిన్న నాకు ఫోన్ చేసి చెప్పాడు.)

**Manjit:** Didn't he visit you a few months ago here?
(కొద్ది నెలల కిందట నిన్ను చూడటానికి ఇక్కడికి వచ్చాడు. అతనేకదా?)

**Nischit:** That's the guy. He came here to buy some tractor spares and a good TV set.
(అతనే. ట్రాక్టర్ విడిభాగాలూ, మంచి TV కొనడానికి ఇక్కడికి వచ్చాడు.)

**Manjit:** There was some argument between you. Finally he proved you were out in calculations, and as a result the bill for the tractor parts was out by over Rs 100 to Rs.125.
(మీ ఇద్దరి మధ్య ఏదో వాదం జరిగింది. చివరికి నీ లెక్కలు తప్పనీ, దాని ఫలితంగా ట్రాక్టర్ స్పేర్ పార్ట్స్ బిల్లు వందో, నూటపాతికో ఎక్కువైందని చూపించగలిగాడతను.)

**Nischit:** Exactly. But we got back the hundred odd rupees from the tractor spares dealer. This friend of mine was quite happy but we had to spend a hundred rupees on transport to get the money back.

**Manjit:** Life is like that you know.
(జీవితం అంతే.)

Out తో వచ్చే expressions పరిశీలిస్తున్నాం మనం. Conversations లో తరచుగా వాడే/ వినిపించే మరికొన్ని expressions ఇప్పుడు చూద్దాం.

***Look at the following expressions from the conversations above:***

1) *We are really out of luck.*
2) *That means the movie is out for the coming week.*
3) *It's out of the question.*
4) *I've to see a cousin of mine who lives at a little out of the way village in Diviseema.*
5) *You are certainly go out of your way to meet him.*
6) *He has been a bit out of sorts for the past few weeks.*
7) *Finally he proved you were out in calculations.... bill... was out by Rs 100 to Rs 125.*




# It's out of the question


M.SURESAN

**1) Out of luck** =
అదృష్టం లేకపోవటం/ దురదృష్టం
a) We were out of luck. We got there too late to see our favourite hero =
మా దురదృష్టం. మేం ఆలస్యమయ్యాం, మా అభిమాన హీరోను చూడలేకపోయాం.
b) She was out of luck to miss the seat just by one mark =
కేవలం ఒక్క మార్కు తక్కువతో సీటు పోగొట్టుకోవటం ఆమె దురదృష్టం.

**2) The movie is out for the coming week** =
ఇక వారం రోజుల దాకా movie లేనట్టే/ మనం చూసే అవకాశం లేదు.
Out (ఇక్కడ) = లేదు/ అవకాశం లేకపోవటం.
a) Cricket is out for us for the coming two weeks because of exams =
పరీక్షల వల్ల ఇక రెండు వారాలు క్రికెట్ లేదు/ ఉండదు/ అవకాశం లేదు.
b) Coaching was out because we didn't find a suitable coach =
సరైన శిక్షకుడు లేకపోవడంతో శిక్షణ లేకపోయింది/ శిక్షణ సాధ్యపడలేదు/ శిక్షణావకాశం లేకపోయింది.
c) Walking is out for him four weeks as his knee is in bandage =
మోకాలి కట్టు వల్ల ఇంక 4 వారాలు అతను నడిచే అవకాశం లేదు.

**3) Out of the question** = Not possible/ not allowed= సాధ్యం కాదు/ అనంగీకారం.
a) You want me to go to the wedding in these clothes. It is out of the question =
ఈ దుస్తులతో పెళ్లికి వెళ్లమంటావా? అది కాని పని/ చచ్చినా ఆ పనిచేయను.
b) Helping the fellow again is out of the question=
వాడికి మళ్లీ సాయం చేయటం అంటూ జరగదు (అసాధ్యం).
c) A poor man becoming a minister? That's out of the question =
బీదవాడు మంత్రి కావడమా? అసాధ్యం.

**4) out of the way place** =
మారుమూల, ప్రయాణం త్వరగా చేయలేని చోటు/ సులభంగా చేరలేని చోటు
a) Sorlagondi is an out of the way village on the coast in Krishna district =
సొర్లగొంది కృష్ణా జిల్లాలో సముద్రతీరంలో ఎక్కడో సులభంగా చేరలేని చోటు.
b) Just for social service he started his hospital in an out of the way town =
సంఘసేవే లక్ష్యంగా ఎక్కడో మారుమూల ఊళ్లో ఆస్పత్రి పెట్టాడతను.

**5) Go out of your way** (to do something) = Go out of somebody's way (to do something)
ఒకరు తాము చేయనక్కర్లేని పని శ్రద్ధ తీసుకుని ఇతరుల కోసం చేయడం- ఇది చాలా common, spoken English లో.
a) He went out of his way to help the stranger =
ఆ అపరిచితుడికి సాయం చేయటంలో తాను చేయనక్కర్లేనంతగా చేశాడు.
b) She went out of her way to help her distant cousin get a job =
ఎవరో దూరపు బంధువు ఉద్యోగం కోసం ఆమె అక్కర్లేని శ్రమపడింది. (దూరపు బంధువుకు అంత సహాయం చేయనక్కర్లేకపోయినా చేసింది.)

**6) Be out of sorts** = కులాసాగా లేకపోవటం/ కాస్త చికాకుగా ఉండటం/ ఇబ్బందిగా ఉండటం
a) She was out of sorts after the long journey
ఆ సుదీర్ఘ ప్రయాణం వల్ల ఆమె అంత కులాసాగా లేదు/ కాస్త చికాకు పడుతోంది.
b) I feel out of sorts in his presence =
అతడు ఉంటే నాకేదో ఇబ్బందిగా ఉంటుంది.
c) He was out of sorts with himself for delaying the work =
పని ఆలస్యంగా చేసినందుకు అతని మీద అతనికే కోపంగా ఉంది.

**7) Out in** (something) = తప్పు/ పొరపాటు చేయడం
a) You are out in your counting =
నీ లెక్క తప్పు/ నువ్వు తప్పు లెక్కించావు
b) Your guess is out by more than Rs. 1000
నీ అంచనాలో తప్పు వెయ్యి రూపాయలపైనే ఉంది/ వెయ్యి రూపాయల తేడా (తప్పు) ఉంది నీ అంచనాలో.
c) The contractor's bill is out by about a lakh rupees =
దాదాపు లక్ష రూపాయల తప్పు ఉంది, ఆ కాంట్రాక్టర్ బిల్లులో.

ఇవన్నీ చాలా simple expressions - అందువల్ల conversation కూడా simple గా, సహజంగా ఉంటుంది.



**ప్రశ్న:** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలో తెలుపగలరు.
1. అరటిపండు (తినడానికి) ఇవ్వమంటావా?
2. అబ్బాయిని పడుకోబెట్టాను.
3. నేను అతనికి సినిమా చూపించను.
4. ఈ పిచ్చిరాతలు వాడే రాసుంటాడు.
5. అన్నం తింటావా?
6. అన్ని వస్తువుల ధరలు తెలుసుకోవాలి.
7. షాపులో ఆమె ఉందో లేదో చూడాలి.
8. నేను రాముని ఆ స్తంభం దాకా తీసుకుపోయాను.
9. పాపాయిని కూర్చోబెట్టాను.
10. లతను తీసుకురావడానికి గీత వెళ్లింది.
11. మావోయిస్టులు రేపు రాష్ట్ర బంద్‌కు పిలుపిచ్చారు.
12. నేను అడగక ముందే అతడు డబ్బులు ఇచ్చాడు.
13. నేను అడిగినా అతడు డబ్బులు ఇవ్వడం లేదు.

– జి. పావని, కరీంనగర్

**జవాబు:** 1. Shall I give you a banana to eat?
2. I put (laid) baby to bed.
3. I'll not show him the movie (మీరు మూవీ చూపించేట్లయితే). I will not let him see the movie (చూడనివ్వను). I will not take him to the movie (తీసుకెళ్లను/ చూపించను).
4. Only he must have written this nonsense.
5. Will you/ would you eat? (would- better)
6. We must know the prices of all articles.
7. We must see if (whether) she is in the shop or not.
8. I took Ramu upto that post/ pillar.
9. I seated the baby/ I had the baby seated.
10. Geetha has gone to fetch Latha.
11. The Maoists have given a call for a bandh tomorrow/ have called for a bandh tomorrow.
12. He gave me money even before I asked him.
13. Though I have asked for the money he is not giving it.

**ప్రశ్న:** *1. He is determined = అతను నిర్ణయించబడ్డాడు... వివరించగలరు.*
*2. A number of buses, a lot of buses. ఈ వాక్యాల మధ్య తేడా ఏమిటి?*
*3. I felt happy on seeing him; I felt happy by seeing him – ఏది correct?*
*4. He remind me of the money I owed him అని ఉంది. He reminded me అని ఉండాలి కదా? ఈ వాక్యంలో సమయం చెప్పలేదు. అలాంటప్పుడు He has reminded me of the money I owed him అని ఉండాలి కదా?*
*5. మా దృష్టికి తీసుకువస్తే మేం చర్య తీసుకుంటాం.*
*6. అడ్డుపుల్ల పడింది.*
*7. గేటు వేసి ఉంది.*
*8. నామీద నీకెందుకంత కక్ష - ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?*

– సూరజ్ బాబా, ఇల్లందు

**జవాబు:** 1. He is determined - ఇక్కడ determined past participle అయినా, అది ఓ condition ను తెలుపుతుంది, passive గా తీసుకోకూడదు. అర్థం, determined (నిశ్చయం/ నిర్ణయం చేసుకున్నవాడు/ కలిగినవాడు)గా ఉన్నాడు అని. He is interested = ఆసక్తి (కలవాడు)గా ఉన్నాడు లాగ.
2. A lot of buses = A number of buses.
3. I felt happy seeing him -ఇదీ correct.
4. He reminded me, correct. He reminded me తేదీ, Time చెప్పలేదు, has reminded రావాలి, కానీ సందర్భాన్ని బట్టి, ఆ situation లో time ఎక్కడైనా చెప్పి ఉండొచ్చు అలాంటపుడు Past doing word వాడటం correct. **eg:** I saw him yesterday. He reminded me of the money. (ఇక్కడ yesterday అని ముందే చెప్పాం కదా. అప్పుడు Past time, stated. అలాంటప్పుడు, Past doing word (past simple) correct.
5. If you bring it to our notice we will take action.
6. Something has come in the way.
7. The gate is/ has been closed.
8. Why are you so vindictive against me/ Why are you so angry with me?

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

# He is a gem of a man




**Nischala:** What do you know of him?
(అతడి గురించి నీకేం తెలుసు?)

**Vignana:** Who are you talking of?
(నువ్వు ఎవరి గురించి మాట్లాడుతున్నావు?)

**Nischala:** Of your friend's cousin, Virup.
(మీ స్నేహితురాలి కజిన్ విరూప్ గురించి.)

**Vignana:** How does he interest you?
(అతడిపట్ల నీకేంటి ఆసక్తి?)

**Nischala:** He has been proposed to me, dad says.
(ఎవరో నాకతని సంబంధం తీసుకొచ్చారని నాన్న అంటున్నారు.)

propose = పెళ్లికి ప్రతిపాదించటం.

He proposed his daughter to his colleague's son =
అతడు తన కూతురిని తన సహోద్యోగి కొడుకుకు ప్రతిపాదించాడు- పెళ్లి సంబంధం కలుపుకోమన్నాడు.

**Vignana:** So you are getting married. congrats!
(అయితే పెళ్లి చేసుకోబోతున్నావన్న మాట. అభినందనలు.)

**Nischala:** A friend of my parent's has brought up the proposal. Nothing certain yet.
(మా పేరెంట్స్ ఫ్రెండ్ ఎవరో ఈ సంబంధాన్ని తీసుకొచ్చారు. ఇంకా ఏం అనుకోలేదు/ అవలేదు.)

**Vignana:** I know Virup well. He is the elder of the two sons of their parents. He stands 5'9'' or there abouts and is quite good looking. He has a good job that fetches him a handsome salary. What else can you ask for?
(అతడు నాకు బాగా తెలుసు. ఇద్దరు కొడుకుల్లో ఇతనే పెద్దవాడు. ఎత్తు 5'9'' ఉండొచ్చు అందగాడే. మంచి జీతం వచ్చే ఉద్యోగం. ఇంకేం కావాలి నీకు?)

There abouts = సుమారుగా/ దాదాపు

**Nischala:** This is the first of the guys coming to see me.
(నన్ను పెళ్లిచూపులు చూసేందుకు వస్తున్న మొదటి వ్యక్తి అతనే.)

**Vignana:** I'm sure there won't be another, because I haven't any doubt about your liking each other. Certainly you are made for each other.
(ఇంకెవరూ నిన్ను చూసేందుకురారని నా నమ్మకం, మీరిద్దరు ఒకర్నొకరు ఇష్టపడతారనే దాంట్లో నాకేం సందేహంలేదు. మీరిద్దరూ ఈడూ, జోడూ.)

Made for each other= ఈడూ జోడూ సరిపోవడం

**Nischala:** Hope so. Dad wants to make sure of the family background before moving further.
(అలా అనే ఆశిస్తున్నా. వాళ్ల కుటుంబ వివరాలను గురించి కచ్చితంగా తెలుసుకోవాలనుకుంటున్నారు నాన్న.)

**Vignana:** All the members of the family are good. I can assure your father of it. They live at a distance of a kilometre from our home.
(వాళ్లందరూ మంచివాళ్లే మీ నాన్నకు దాన్ని గురించి భరోసా ఇవ్వగలను. మా ఇంటి నుంచి ఓ కిలోమీటర్ దూరంలో ఉంటారు వాళ్లు.)

**Nischala:** They are coming to see me on the evening of Sunday. Won't you be around?
(వాళ్లు నన్ను చూసేందుకు ఆదివారం సాయంత్రం వస్తున్నారు. నువ్వురావా?)

**Vignana:** Why me, of all? If you so wish I'll be there, don't worry. But of which group I am going to be, I'm not certain.
(నేనా? అంతగా నువ్వు కోరుకుంటుంటే వస్తాన్లే. వర్రీ అవ్వకు. అయితే ఎవరి పక్షాన నేనుండాలి అనేది నాకు తెలియడం లేదు.)

**Nischala:** You are my classmate, so you are there for me.
(నువ్వు నా క్లాస్‌మేట్‌వి కాబట్టి, నువ్వు నా తరపున.)


M.SURESAN

**Vignana:** Just dont worry. He is a gem of a man and the others are very good as well.
(ఏం ఆందోళనపడకు. అతడు చాలా మంచివాడు, ఇతరులు కూడా మంచి వాళ్లే.)

**Nischala:** Bye then, Viggy.

★ ★ ★ ★

In this lesson we are going to study the uses of the preposition 'of'. మీకు తెలుసుగదా? 'of' చాలా తరచుగా వినిపిస్తుంది English conversation లో.

**Study the following sentences from the conversation above**

*1) What do you know of him?*
*2) Who are you talking of?*
*3) A friend of my parent's has brought up the proposal.*
*4) He is the elder of the two sons.*
*5) This is the first of the guys.*
*6) Dad wants to make sure of the family background.*
*7) All the members of the family.*
*8) On the evening of sunday.*

**Sentences (1) and (2) Know of, talking of =** చాలావరకు గూర్చి గురించి అనే అర్థంతో తరచుగా వాడే పదాలు.

of, about. ఇవి రెండు interchangeable - అంటే గూర్చి అనే అర్థంతో వాడినప్పుడు, of అయినా వాడొచ్చు లేదా about అయినా వాడొచ్చు

a) What do you know of/ about him? =
అతడిని గురించి నీకేంతెలుసు?

b) What did he talk of/ about me?=
అతడు నా గురించి ఏం మాట్లాడాడు?

c) He says this of you / about you =
నిన్ను గురించి అతడిది అంటున్నాడు.

**3) A friend of my parent's =**
my parent's friend = నాతల్లిదండ్రుల స్నేహితుడు

ఇలాంటి చోట్ల 'of' కు చెందిన, యొక్క, సంబంధించిన అని అర్థం వస్తుంది. అయితే ముఖ్యంగా మనుషుల యొక్క అనే భావంతో, of బదులు, 's (Apostrophe and s) ఎక్కువగా వాడతాం.

a) A friend of my brother/ My brother's friend was here yesterday =
నిన్న మా బ్రదర్ స్నేహితుడొకరు ఇక్కడున్నారు.

b) From the look of these houses we can say that they are of the rich =
ఈ ఇళ్ల ఆకారాన్ని బట్టి చెప్పగలం అవి ధనవంతులవని.

మనుషుల విషయంలో యొక్క (possession/ ownership) అని చెప్పేందుకు, of కంటే 's better.

The books of my friend = my friend's books - ఇలాంటిచోట్ల of కంటే, 's' ఎక్కువ సహజంగా ఉంటుంది.

The books on the table are my friend's =
టేబుల్ మీద ఉన్న పుస్తకాలు నా స్నేహితుడివి =
The books on the table are of my friend/ are of my friend's.

ప్రాణం లేని వస్తువులకు 's వాడం. 'of' మాత్రమే వాడతాం.

The legs of the table (Table's legs కాదు);The pages of the book (The book's pages కాదు)

అయితే నగరాలు, దేశాలు, ప్రదేశాల పేర్లకు of బదులు, 's చాలా సాధారణమైపోతోంది ఇప్పుడు.

a) Hyderabad's software companies provide jobs to tens of thousands of people=
హైదరాబాద్‌లోని సాఫ్ట్‌వేర్ కంపెనీలు వేలాది ప్రజలకు ఉద్యోగాలు కల్పిస్తున్నాయి.

b) APSRTC's fleet of buses carry lakhs of passengers everyday across the state=
ఏ.పి.ఎస్.ఆర్.టి.సి.కి చెందిన బస్సులు ప్రతిరోజు లక్షలాది ప్రజలను రాష్ట్రమంతా తీసుకెళతాయి.

fleet = A group of buses/ lorries / ships, etc.

**Sentences 4 and 5; the *elder of*, the first of, etc.**

ఒక వరుస క్రమంలో ఒకరి/ ఒక వస్తువు స్థానం (position) చెప్పేందుకు of వాడతాం.

a) He is the first of the Indians to cross the seas=
సముద్రాలు దాటిన భారతీయుల్లో ప్రథముడు అతడు.
(He is the first Indian అని కూడా అంటాం)

b) This is 45th episode of the serial =
ఆ సీరియల్‌లో ఇది 45వ ఎపిసోడ్.

గమనించండి: ఇక్కడ of = లో

c) Sahadeva is the youngest of the Pandavas =
పాండవుల్లో సహదేవుడు చిన్నవాడు.

**6) Sure of / certain of =** ఒక విషయం గురించి గట్టిగా తెలిసి ఉండటం/ నమ్మకం ఉండటం.

a) Are you sure of success =
విజయం మీద నీకు నమ్మకం ఉందా?

b) He is not sure of attending the marriage =
తను పెళ్లికి రావడం గురించి అతడికి అంత నమ్మకం లేదు.

Sure of బదులు sure about అని కూడా అనవచ్చు

7) ఒక వర్గంలో లేదా సమితిలో ఉన్న వ్యక్తులు.

**e.g.:** The members of a family, the students of a class / of a college, the leaders of a group,

**8) The evening of sunday/** the morning of monday/ the evening of 11th Oct 2006, etc., ఫలానా రోజు/తారీఖు పొద్దున, మధ్యాహ్నం, మొదలైనవి చెప్పేందుకు of వాడతాం

---

**ప్రశ్న:** కింది పదాలకు అర్థాలు, వాడుక తెలుపగలరు.

*i) far off ii) as if iii) derrick iv) else ను ఏ ఏ సందర్భాల్లో ఉపయోగించవచ్చు **e.g.** no one else. అలాగే v) through fare vi) smoke scent vii) pot pies viii) For the time being ix) and so, x) or so xi) any one else, xii) is n't that so*

**– పెంచలయ్య గౌడ్, రాజంపేట**

**జవాబు:** *i)* far off= distant= దూరమైన. Far Off places = దూరమైన ప్రాంతాలు. అయితే, ఒక చోటు చాలా దూరం అనేందుకు, The place is far off అనరు. Far Off ఎప్పుడూ, అదంత దూరమేం కాదు, అనే అర్థంతో, not తోనే వాడతారు.

My College is n't far off from my home =
మా College మా ఇంటి నుంచి దూరమేం కాదు. ఒక చోటు దూరం అనేందుకు Distant అని కానీ, అంతకంటే ఇంకా వాడుకగా a long way off అని కానీ అంటాం. అన్నిటి కంటే, A long way off= దూరం, వాడుక ఎక్కువ.

The place is a long way off = ఆ ప్రదేశం దూరం

The place isn't far off= ఆ చోటు దూరమేం కాదు (దగ్గర)

(ii) As if= అయినట్టు, కానీ కాదు. He talks as if he alone was correct. (అతను తనొక్కడే సరైనట్టు మాట్లాడతాడు- అతను సరి కాదు) As though/ As if -రెండూ ఒకటే, ఇంతకు ముందు lessons లో వివరించాం చూడండి.

iii) Derrick= 1) బరువు లేపేందుకు వాడే ఒక రకమైన Crane. 2) చమురు (Petroleum) నిక్షేపాలున్న చోట్ల bore వేసేందుకు వాడే Drillను అమర్చే Platform.

iv) Also వాడకం గురించి సవివరంగా పాత Lessons లో వివరించాం. చూడండి.

v) Thorough fare (through fare)= A Public Road.

vi) Smoke Scent, vii) Pot pies ఈ మాటలు ఉన్నట్లు లేదు. ఇవి వాడిన Sentence, సందర్భం తెలియజేయండి.

viii) For the time being = ప్రస్తుతానికి.

ix) And so = కాబట్టి

x) Or so= అలా.

It costs Rs 1000/- or so. ఇది వెయ్యి రూపాయలు/ వెయ్యి రూపాయల ప్రాంతంలో ఉంటుంది.

He weights 70 Kgs or so= అతడి బరువు దాదాపు 70 కేజీలు ఉండొచ్చు

xi) Any one else = ఇంకెవరైనా.

Anyone else would not have done it= ఇంకెవరూ అది చేసి ఉండరు. (ఇలాంటి చోట్ల no one else would have done it, అనటం better)

xii) Is that not so? = కదా?

He told you of it. Is that not so (Isn't that so?) = అది నీకు వాడు చెప్పాడు. అంతే కదా? / కదా?



**ప్రశ్న:** *1.* నన్ను కన్న తల్లిదండ్రులకు ఆజన్మాంతం రుణపడి ఉంటాను.
*2.* నీ వంటి మిత్రుడు దొరకడం నా పూర్వజన్మ సుకృతం- ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?

**– కార్తీక్, తిరుపూరు**

**జవాబు:** 1. I shall be indebted life long/ all my life to my parents (who gave me this life).

2. It's my fortune to have a friend like you/ I'm. blessed to have a friend like you/ I feel rewarded to have a friend like you. (English వాళ్లు - Christians కాబట్టి వాళ్లకు పూర్వ జన్మ మీద నమ్మకం లేదు)

# ప్రతిభ




# He fell off his bike

**Dharani:** Your dress is really marvellous. Where did you buy it and how much is it?
(నీ dress చాలా అద్భుతంగా ఉంది. ఎక్కడ కొన్నావు? ఎంతకు కొన్నావ్?)
marvellous- మార్వలస్- 'మా' నొక్కి పలుకుతాం = అద్భుతమైన

**Vidushi:** I bought it at Quick Sale for a discount, of course. They knocked 20% off the dress. So I got it for Rs. 400 less.
(Quick Sales లో discount లో కొన్నాను. Dress అసలు ధరలో 20 శాతం తగ్గించారు. అందువల్ల 400 రూపాయలు తక్కువకు వచ్చింది.)

**Dharani:** Where is this shop?
(ఈ shop ఎక్కడ?)

**Vidushi:** Near Governorpet branch of State Bank of India, fifty yards off the main road.
(State Bank of India Governorpet branch దగ్గరే. Main Road నుంచి 50 గజాల దూరంలో)

**Dharani:** I'd like to have a look at the dresses too. How about going this evening?
(నేనూ అక్కడి dresses ను చూడాలనుకుంటున్నా. ఇవ్వాళ సాయంత్రం వెళ్దామా?)

**Vidushi:** I'm afraid I can't make it this evening. I've to take my younger brother to hospital. He fell off his bike this morning.
(ఇవ్వాళ సాయంత్రం నే రాలేనే. మా తమ్ముడ్ని ఆస్పత్రికి తీసుకెళ్ళాలి. Bike మీది నుంచి కిందపడ్డాడు ఈ ఉదయం.)

**Dharani:** How badly is he hurt?
(గాయాలు ఎంత తీవ్రంగా తగిలాయి?)
hurt = గాయపడటం/ గాయాల వల్ల బాధపడటం

**Vidushi:** Fortunately they are minor injuries. Just a few bruises.
(అదృష్టవశాత్తు చిన్న చిన్న గాయాలే. అక్కడక్కడ గీరుకుపోయింది.)
bruise = (బ్రూజ్- జ్, size లోలా) గీరుకుపోవటం/ గాయంవల్ల చర్మం లేచిపోవటం

**Dharani:** Sorry to hear that.
(అది వినటానికి బాధగా ఉంది)

**Vidushi:** Though no fractures or sprains, his body is aching a lot. I am sure he has to be off duty for the coming two to three days.
విరగటం (ఎముకలు) బెణుకులూ ఏం లేకపోయినా, ఒళ్ళంతా నొప్పులుగా ఉంది. ఇంక రెండు, మూడు రోజులు office కు వెళ్ళలేడని నా నమ్మకం)
fracture- ఫ్రాక్చ్- ఎముకలు/ కీళ్ళు విరగటం.
sprain- స్ప్రెయిన్- బెణకటం/ బెణుకు

**Dharani:** Where was he going?
(ఎక్కడికి వెళ్తున్నాడు?)

**Vidushi:** He was on his way to our village 20 Km off Guntur.
(గుంటూరు నుంచి 20 కి.మీ. దూరంలో ఉన్న మా గ్రామానికి వెళ్తున్నాడు)

**Dharani:** OK. We're getting right off the subject. When shall we go to the discount shop? When can you come?
(సరే. మనం అసలు విషయం వదిలేశాం. మనం ఈ discount shop కు ఎప్పుడు వెళ్దాం? ఎప్పుడు రాగలవు నువ్వు?)

**Vidushi:** Why can't we go tomorrow afternoon?
(రేపు మధ్యాహ్నం వెళ్దాం)

**Dharani:** OK. That suits me fine. I'm off. (సరే. నాకూ వీలుగానే ఉంటుంది. నేను వెళ్తున్నా. Bye.)

◆ ◆ ◆ ◆


M.SURESAN

చాలామంది పాఠకుల కోరిక మేరకు, ఈ lesson లో మనం off అర్థాలు, ఉపయోగాలు తెలుసుకోబోతున్నాం.

Off చాలా తరచుగా వాడతారు English conversation లో. Off కు సర్వసాధారణమైన అర్థం, ఒక పని చేసేయటం అని. మనం తెలుగులో చేశాడు, వచ్చాడు, తిన్నాడు అనేందుకు, ఆ పని పూర్తయింది అని చెప్పేందుకు, చేసేశాడు, వచ్చేశాడు, తినేశాడు అంటుంటాం. ఇలాంటిచోట్ల English లో off వాడతాం.

1) He ate the whole fruit = వాడు పండు మొత్తం తిన్నాడు.
He ate off the whole fruit = వాడు పండు మొత్తం తినేశాడు.

2) He came from Chennai = అతను చెన్నై నుంచి వచ్చాడు.
He came off from the place = అక్కడ్నుంచి వచ్చేశాడు.

3) Finish the work - పని పూర్తి చేయి.
Finish off the work = పని పూర్తి చేసేయి.

ఇప్పుడు off కు ఉన్న మిగతా అర్థాలూ, ఉపయోగాలూ చూద్దాం. ***Look at the following sentences from the conversation above.***

*1) They knocked 20% off the dress.*
*2) ... fifty yards off the main road*
*3) He fell off his bike*
*4) He has to be off duty for the coming two to three days.*
*5) He was on his way to our village 20 km off Guntur.*
*6) I'm off.*

**1. Off the dress/ off the original price** = అసలు ధరలో తగ్గించటం.
a) They knocked 50% off the original price = అసలు ధరలో 50 శాతం తగ్గించేశారు.
b) You can get it at 25% off the price it is usually sold at - మామూలుగా దొరికేదానికంటే అది 25 శాతం తక్కువకు దొరుకుతుంది.
c) He is 3 to 4 Kgs off his weight a week ago- ఒక వారం క్రితం అతని బరువులో 3, 4 కిలోలు తగ్గాడు.

**2. Off the main road** =
Off a place = away from a place = ఒక ప్రదేశానికి అవతల/ దూరంగా
a) He lives in Dilsukhnagar, a kilometre off the main road to the east.
అతనుండేది దిల్‌సుఖ్‌నగర్‌లో, main road కు తూర్పుగా ఒక కి.మీ. దూరంలో.
b) It is village off Guntur - గుంటూరు అవతలి గ్రామం.
c) It is an island off the coast of the Bay of Bengal = బంగాళాఖాతం తీరానికి కాస్త దూరంలో ఉన్న దీవి.

**3. fall off** = కిందికి పడిపోవటం
a) The gale caused all the fruits to fall off the tree = ఈదురుగాలి (gale - తుపానులో వీచే గాలి) కారణంగా చెట్టుకున్న పండ్లన్నీ కింద పడిపోయాయి.
b) He hit the ball so hard that it fell off/ way off the boundary = Boundary కి అవతల/ దూరంగా అవతల పడేంత గట్టిగా కొట్టాడు బంతిని.

**4.** He has to be off duty for the coming week = ఈ వారం అంతా duty చేసే అవకాశం లేదు.
**off duty/ off work** = విధికి, పనికి దూరంగా ఉండటం. విధికి/ పనికి హాజరవకపోవటం.
a) I am off college for tomorrow and the day after - నేను రేపూ, ఎల్లుండి college కి రాను.
b) He has been off office for the last two days because of a fever = జ్వరంవల్ల రెండ్రోజులుగా అతను office కు వెళ్ళటంలేదు.

**6. I'm off** = నే వెళ్తున్నా.
a) I am wanted at home. I'm off = నేను ఇంటికెళ్ళడం అవసరం. వెళ్తున్నా.
b) He is off = అతను వెళ్తున్నాడు/ వెళ్ళిపోయాడు.



**ప్రశ్న:** *1. With a view to తర్వాత verb కు ing చేర్చవచ్చా? ఏ phrases లో వచ్చే to తర్వాత verb ing form వాడవచ్చు?*
*2. Lakh, Crore అనే numbers ను ఎప్పుడు singular లో వాడాలి, ఎప్పుడు plural లో వాడాలి?*
*3. Barely, hardly, scarcely- ఇవి సమానార్థకాలే కదా, interchange చేసి వాడవచ్చా?*

*– కె.ఎస్.శరణ్య, విజయవాడ*

**జవాబు:**
1. With a view to (ఆ ఉద్దేశంతో) తర్వాత ఎప్పుడూ '... ing' form మాత్రమే వస్తుంది.
With a view to owning a house, we are saving money = సొంత ఇల్లు/ ఇల్లు సొంతది ఉండాలనే ఉద్దేశంతో, మేం డబ్బు కూడబెడుతున్నాం
With a view to avoiding the heat of summer we are going to Kashmir= వేసవి వేడి తట్టుకునేందుకు మేం కాశ్మీర్ వెళుతున్నాం.
2. Hundred, Thousand, Lakh, Crore .. వీటిముందు సంఖ్యలు వస్తే singular.
Two hundred, four thousand, six lakh, eight crore, etc. (సంఖ్యలతో వాడితే singular)
సంఖ్యలు లేకుండా వందలాది, వేలాది, లక్షలాది, కోట్లాది అనే అర్థంతో వాడితే plural.
Hundreds of students get scholarships = వందలాది విద్యార్థులు ...
Thousands of cars ply on this road = వేలాది cars ఈ road న తిరుగుతాయి.
Lakhs of people have seen the movie = లక్షలాది ప్రజలు ఆ సినిమా చూశారు.
Crores of people consider Gandhi a mahatma = కోట్లాది ప్రజలు ...
3. Inter change చేయవచ్చు. వాటిలో ఒకదాన్ని వాడే సందర్భంలో మిగతావి కూడా వాడవచ్చు. అయితే barely, hardly తో before, scarcely తో when వాడతాం.

**ప్రశ్న:** *1. How to teach Xth English medium English prose and poetry in English?*
*2. నిరసన వ్యక్తంచేశారు- English లో ఎలా చెప్పాలి?*
*3. I have a half day of school tomorrow. Is it correct?*

*– ఎన్. శివ, వెంపా (ప.గో.జిల్లా)*

**జవాబు:**
1. There are no hard and fast rules for the way you teach a set of students. Teaching methods have to change according to the abilities of the students, the number of students, the class room atmosphere, etc. But the following method may be tried.
   **1)** Before beginning a lesson- put them some questions about the contents of the lesson.
   **2)** Let them read, on their own, a paragraph or a part of a para, if the para is long.
   **3)** Ask them if they have found answers to your questions in the para.
   **4)** Ask them to answer your questions.
   **5)** Then explain the lesson in detail, but before that explain the meanings of the difficult words.
   If it is a poem, read the whole poem first with the necessary pauses. Set the words in prose order and read again. Then follow the method above.
2. Expressed protest.
3. Tomorrow the school is only for half a day/ The school works only for half a day tomorrow.

**ప్రశ్న:** *1. "ఇంకా కొనలేదను" not yet అని చెప్పారు. Not bought yet అని కూడా అనొచ్చా? Not buy yet కూడా కరెక్టేనా?*
*2. No. Only yesterday I came to know he had sold it off. దీనిలో off లేకుంటే అర్థం మారుతుందా?*
*3. Said that (or) told వస్తుంది. కానీ told తర్వాత that రాదని చదివాను, కరెక్టేనా?*
*4. కరెక్టేనా? అని సందేహంగా అడగాలంటే English లో ఏమనాలి?*

*– ఎస్. రవికుమార్, పస్రా (వరంగల్ జిల్లా)*

**జవాబు:**
1. Not yet- దీని అర్థం, దీని ముందరి question ను బట్టి కదా ఉంటుంది. (Not yet= ఇంకా లేదు అని. ఏది ఇంకా లేదనేది ముందరి question ను బట్టి ఉంటుంది). Not bought Yet తప్పు. Have/ has not bought yet- correct. Not buy yet- అదింకా తప్పు.
2. తెలుగులో కూడా మనం, అమ్మాడు బదులు అమ్మేశాడు అంటాం (అమ్మివేశాడు). Sold it off/ away అంటే ఆ పని పూర్తయిపోయింది అని కాస్త emphasis కు అంటాం.
3. Say, tell differences చాలాసార్లు వివరంగా తెలియజేశాం. పాత lessons లో చూడండి.
4. Is it correct? అనాలి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# He is never off my mind

**Ranjan:** Hi, Harsha, what's new?

**Harsha:** Nothing (ఏం లేదు)

**Ranjan:** I called you the other day but you walked off in a hurry. In fact I called you till you were out of earshot.

(మొన్న ఒకరోజు నేను నిన్ను పిలుస్తుంటే, నువ్వు చాలా త్వరగా వెళ్లిపోయావు. వినపడనంత దూరం వెళ్లే వరకూ పిలిచాను.)

**Harsha:** I didn't really hear you, I swear. Nothing is a greater pleasure than talking to you.

(నీ పిలుపు నాకు నిజంగా వినిపించలేదు. నీతో మాట్లాడటం కంటే నాకు వేరే సరదా ఏం ఉంది?)

**Ranjan:** I returned recently from Mumbai. There I ran into our old friend and classmate Charit. (Do) you remember him?

(ఈ మధ్యే నేను ముంబై నుంచి తిరిగొచ్చాను. అక్కడ అనుకోకుండా మన క్లాస్‌మేట్, పాత స్నేహితుడూ చరిత్‌ను కలుసుకున్నా. చరిత్ నీకు గుర్తే కదా?)

**Harsha:** Of course I do. He is never off my mind. Well, what about him?

(గుర్తులేకపోవడమేంటి? వాడిని ఎప్పుడూ నేను మర్చిపోను. ఏంటతన్ని గురించి?)

**Ranjan:** He is very well off now. He is a big business man of sorts.

(ఇప్పుడు చాలా ధనవంతుడతను. ఏదో బడా వ్యాపారే అతను.)

(of sorts = ఓ రకంగా)

**Harsha:** So he is better off outside the home state. That's good for him. So long as he was here, he was quite badly off, for all his talent.

(సొంత రాష్ట్రం బయటే బాగున్నాడన్నమాట తను. ప్రతిభ కలవాడైనప్పటికీ ఇక్కడున్నంత కాలం అతనికేం కలిసి రాలేదు.)

**Ranjan:** You can say that. He isn't without talent really. He is able to show that in Mumbai. I think people are well off once they get out of their homes.

(నిజమే. అతను ప్రతిభ లేనివాడేంకాదు. దాన్నతడు ముంబైలో చూపించగలుగుతున్నాడు. స్వరాష్ట్రం నుంచి బయటపడితేనే ధనికులు అవుతారనుకుంటా.)

**Harsha:** So, when are you going to Mumbai again?

(అయితే నువ్వు మళ్లీ ముంబై ఎప్పుడు వెళ్తున్నావు?)

**Ranjan:** I am off as soon as my ticket is ready. I think that'll take another weak.

(నా టికెట్ రెడీ కాగానే వెళ్తాను. అయితే అదో వారం పట్టవచ్చు.)

**Harsha:** Have you booked your ticket?

(నీ టికెట్ బుక్ చేసుకున్నావా?)

**Ranjan:** No. Not yet. I had been to the station this morning for reserving my ticket. The power was off for nearly an hour. Having no patience to wait any longer I came away. I'm going tomorrow again.

(లేదు ఇంకా. ఇవ్వాళ పొద్దున స్టేషన్‌కు వెళ్లాను రిజర్వ్ చేసుకునేందుకు. కానీ గంటసేపు కరెంటు లేదు. వేచిఉండే ఓపిక లేక వచ్చేశాను. మళ్లీ రేపు వెళ్తాను.)

**Harsha:** You don't seem to be in any hurry to go back.

(తిరిగి వెళ్లేందుకంత తొందరపడుతున్నట్లు కన్పించడం లేదు నువ్వు.)

**Ranjan:** I am off the mood for work. I've a lot of leave in credit. I want to be off work for the whole period of leave.

(పని చేయాలనే ధోరణి రావట్లేదు. నాకు చాలా సెలవులున్నాయి. ఈ సెలవు రోజులై పోయేవరకు పనిచేయకుండా ఉండాలని ఉంది.)

**Harsha:** That makes me happy. We can be together for some time.


M.SURESAN

English conversation లో తరచూ వచ్చే off ను గురించి మరికొన్ని విషయాలు తెలుసుకుందాం.

***Look at the following expressions from the conversation above:***

*1) I called you the other day but you walked off.*

*2) He is never off my mind.*

*3) He is very well off now.*

*4) So he is better off outside the state.*

*5) I think people are well off when they get out of their homes.*

*6) I am off as soon as my ticket is ready.*

*7) The power was off for nearly an hour.*

*8) I want to be off work for the whole period of leave.*

**'off'** అన్నిచోట్లా preposition కాదు. ఒక్కోసారి adverb గా, adjective గా కూడా ఉపయోగిస్తాం.

Just don't worry what part of speech a word is, so long as you are able to use it correctly in your speech. Correct use, that's important.

**Study the following uses of 'off' now:**

**1) Walk off, run off, etc =**

ఇలాంటి చోట్లంతా, off కు అర్థం, away అని. అంటే వెళ్లిపోవటం, పారిపోవటం అనే భావంతో. (అవతలకు వెళ్లిపోవటం/ అవతలికి పారిపోవటం అని)

a) They walked off without listening to her =
ఆమె చెప్పింది వినిపించుకోకుండా వాళ్లు వెళ్లిపోయారు.

b) He threw it off the window =
అతను దాన్ని కిటికీ నుంచి (దూరంగా) విసిరేశాడు.

c) Look. Off he goes =
చూడు. అతను వెళ్లిపోతున్నాడు.

d) Off you go. We don't want you here any more =
Get out. మీరిక్కడ ఉండ నక్కర్లేదు ఏ మాత్రం.

ఇవి కూడా చూడండి:

a) They walked off with the victory/ the prize.
విజయం/ బహుమతి చేజిక్కించుకున్నారు.

b) The boy rang the bell, and as I opened the door, he ran off =
ఆ కుర్రాడు గంట కొట్టాడు. నేను తలుపు తెరిచేటప్పటికి, వాడు పారిపోయాడు.

c) They ran off towards the station =
వాళ్లు స్టేషన్ వైపు పారిపోయారు.

**3) be well off** = బాగా డబ్బుండటం X
be badly off = డబ్బు లేకపోవటం.

a) You need not worry about Naresh. He's made it good in business and is well off now =
నరేష్ గురించి నువ్వేం చింతించనక్కరలేదు. వ్యాపారంలో బాగా పైకొచ్చాడు. డబ్బు బాగా సంపాదించి ధనికుడిగా ఉన్నాడు.

b) The father is a happy man because his sons are all well off =
కొడుకులందరూ ఉన్నవాళ్లవటం వల్ల తండ్రి చాలా సంతోషంగా ఉన్నాడు.

Well off X badly off -
తెలుస్తోంది కదా, badly off = పేదగా ఉండటం

a) Don't worry. Compared with the average Indian, you aren't badly off =
చింతపడకు. సగటు భారతీయుడితో పోలిస్తే, నువ్వు బీదవాడివి కాదు.

b) We are badly off for investment, so we are unable to start business =
పెట్టుబడి పెట్టలేక/ పెట్టుబడి శక్తి లేక మేం వ్యాపారం ప్రారంభించలేకుండా ఉన్నాం.

c) She isn't so badly off as not to have/ buy good dresses =
మంచి డ్రెసెస్ కొనలేనంత పేదదేం కాదు ఆమె.

**4) So he is better off outside the state =**
రాష్ట్రం బయట ఉంటేనే అతని పని బాగుంది/ అతను బాగా సంపాదించుకున్నాడు.

a) People are better off now than before because of technological progress =
సాంకేతిక పురోభివృద్ధి వల్ల ఇంతకు ముందుకంటే ఇప్పుడు ప్రజల పరిస్థితి (ఆర్థికంగా) మెరుగ్గా ఉంది.

b) The team is better off without him =
వాడు లేకుంటేనే టీమ్ బాగుంది.

**6) I'm off** = నేను వెళ్లిపోయినట్లే

a) It's already late. I'm off =
ఇప్పటికే ఆలస్యమైంది. నేను వెళ్లిపోతున్నా.

b) The bird is off to unknown lands =
తెలియని ప్రదేశాలకు ఆ పక్షి (ఎగిరి) పోయింది.

**7) Power is off** = విద్యుత్ లేకపోవడం.
Off work = పనికి వెళ్లకపోవడం.

పైవన్నీ కూడా conversation లో అత్యంత తరచుగా వినిపించే మాటలు. బాగా practice చేయండి.

---

**ప్రశ్న:** *i) "A true book is the life blood of a matter's spirit". దీనికి తెలుగులో అర్థమేమిటి?*
*ii) When we use these phrases?*
*a) On the other hand.*
*b) As a matter of fact.*
*c) on the basis of.*

*– జి. శంకర్, శంకరపట్నం*

**జవాబు:**

i) A true/ great book is the life blood of a master spirit - ఇదీ correct form of the sentence.
అర్థం- ఒక నిజమైన/గొప్ప పుస్తకం ఒక మహాత్ముని ప్రాణాధారమైన రక్తం.

ii) **a) On the other hand** - ఇది on the one hand ..., on the other (hand)- ఇది రెండు అభిప్రాయాల/విషయాల/ దృక్పథాల మధ్య తేడా, ముఖ్యంగా వైరుధ్యం తెలిపేందుకు వాడతాం.

- On the one hand they want to give money, but on the other, they don't want to give their money= డబ్బులివ్వటం ఇష్టమే, కాని వాళ్ల డబ్బు ఇవ్వటం ఇష్టంలేదు.
- He did not help me, on the other hand he spread lies about me =
నాకు సహాయం చేయలేదు, చేయకపోగా నామీద అబద్ధాలు ప్రచారం చేశాడు.

**b) As a matter of fact** =
మనం చెపుతున్న విషయానికి కాస్త ఆశ్చర్యం/ ఆసక్తి కలిగించేందుకు వాడే expression, యథార్థానికి అనే భావంతో.

- We have known each other for a long time. As a matter of fact, we were classmates at college =
మేము ఒకరికొకరం చాలాకాలంగా తెలుసు. యథార్థానికి మేం college లో classmates.
- I've helped him. As a matter of fact I've helped him even before he has asked for it = నేను వాడికి సాయం చేశాను. యథార్థానికి వాడు నన్ను అడగకముందే నేను వాడికి సాయపడ్డాను.

**c) On the basis of** =
ఒక విషయం ఆధారంగా; దాన్నిబట్టి.

- Don't act on the basis of what you have heard from others. Wait till you know the facts.
ఇతరులు చెప్పిందాన్నిబట్టి ఏమీచేయకు. వాస్తవాలు తెలుసుకునేవరకు ఆగు.
- On the basis of my experience I draw conclusions. =
నాకున్న అనుభవాన్నిబట్టి నేను నిర్ధారణలకు వస్తాను/ నా నిర్ధారణలు నా అనుభవాన్నిబట్టి ఉంటాయి.

**ప్రశ్న:** కింది వాక్యాలు కరెక్టేనా? వివరించగలరు.
*i) Whom I have to meet?*
*ii) We have to write the exam well.*
*iii) The property was sold before he wanted to buy it.*
*iv) He cannot help but accept defeat.*

*– ఎస్.భాస్కర్‌రావు, నరసన్నపేట*

**జవాబు:** మీరడిగినవాటికి correct sentences:

i) Who have I to meet?

ii) Correct

iii) The property had been sold before he wanted to buy it. (earlier past action)

iv) He cannot help accepting defeat/
He cannot but accept defeat.




**ప్రశ్న:** *i) All the students in our class passed the exam.*
*ii) All of the students in our class passed the exam.*
*ఈ వాక్యాలు కరెక్టేనా? వివరించగలరు.*

*– విష్ణు, హైదరాబాద్*

**జవాబు:** Both the sentences are correct. The first sentence as well as the second sentence means, Every one of the students in our class passed.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# My heart wasn't in it

**Dhruva:** Hi Apsara, (I) haven't seen you in months. (Have you) been out of town or what?

(నెలలుగా నిన్ను చూడలేదు. ఊర్లో లేవా ఏంటి? )

**Apsara:** I've moved to Hyderabad.

(నేను హైదరాబాద్‌కు మారాను/ హైదరాబాద్‌లో ఉన్నానిప్పుడు)

**Dhruva:** Aren't you any longer in teaching?

(టీచింగ్‌లో లేవా ఇప్పుడు? = ఇప్పుడు నువ్వు టీచర్‌వి కాదా? )

**Apsara:** No. My heart wasn't in it. So I changed over to software. I find a lot of interest and challenge in it.

(నా మనసు టీచింగ్‌లో లేదు/ ఉండేదికాదు. అందుకని కంప్యూటర్స్‌లోకి మారాను. అందులో నాకు చాలా ఆసక్తి, సవాలు కనిపిస్తోంది).

**Dhruva:** Students have lost a very good lecturer in you, I must say. I'd you had continued in teaching.

(విద్యార్థులు నీలో ఓ మంచి లెక్చరర్‌ని కోల్పోయారనే చెప్పాలి. నువ్వు టీచింగ్‌లోనే కొనసాగి ఉంటే ఎంతో బాగుండేది.)

**Apsara:** I don't believe that I was such a good lecturer. Anyway I am happier now. Surprisingly, one in every five people in our company happened to be in teaching for varying periods.

(నేనంత గొప్ప లెక్చరర్‌నని నమ్మటం లేదు. ఆశ్చర్యం ఏమిటంటే మా కంపెనీలో ప్రతి ఐదుగురిలో ఒకరు టీచింగ్‌లో ఏదోకొంత సమయం ఉన్నవాళ్లే.)

**Dhruva:** I used to hear that you spoken in a very impressive voice and but in a gentle voice while you taught. They were in love with it.

(నేను వినేవాడిని నువ్వు చాలా హత్తుకుపోయే, కానీ నిదానమైన గొంతుతో బోధించేదానివని. వాళ్లు నీ గొంతును చాలా అభిమానించారు.)

**Apsara:** Perhaps so. My team members say so too. But the thing is I prefer this job to lecturing in that it offers a challenge, which I didn't find in lecturing.

(అసలు విషయం ఏంటంటే lecturing కన్నా ఈ ఉద్యోగమే నాకిష్టం, ఎందుకంటే ఇందులో ఉన్న సవాలు, లెక్చరింగ్‌లో లేదు.)

**Dhruva:** No, Apsara, in trying to prove yourself right in preferring computers, you are playing down teaching. I feel a teacher finds it really challenging to make a dull student understand their teaching.

(అదేంలేదులే. కంప్యూటర్స్‌ను ఎంచుకోవటంలో నువ్వు సరి అని నిరూపించుకొనే ప్రయత్నంలో టీచింగ్ ప్రాముఖ్యాన్ని కావాలని తగ్గిస్తున్నావు. మందమతి అయిన విద్యార్థికి కూడా అర్థమయ్యేలా బోధించటం టీచర్‌కు పెద్ద సవాలే.)

**Apsara:** May be. But there is no growth in it. Once a teacher, always a teacher.

(కావచ్చు కానీ టీచింగ్‌లో పెరుగుదల ఏదీ ఉండదు కదా? టీచర్‌గా ప్రారంభం, టీచర్‌గా అంతం.)

**Dhruva:** OK. Wish you the best in your new profession.

(సర్లే. నీ కొత్త వృత్తిలో మంచి కలగాలని నా కోరిక.)

**Apsara:** Thank You.

☺ ☺ ☺ ☺ ☺

ఈ lesson లో **In** వాడే సందర్భాలు కొన్ని చూద్దాం.

***Look at the following expressions from the conversation above:***

*1) I haven't seen you in months.*

*2) Aren't you any longer in teaching*

*3) My heart wasn't in it.*

*4) Students have lost a very good lecturer in you.*

*5) One in every five people in our company.*

*6) You spoke in a very impressive voice, but in a gentle voice.*

*7) They were in love with it.*

*8) I prefer this job in that it offers a challenge.*

అందరికీ తెలిసిన విషయం- 'In' అంటే మనం ఎక్కువగా 'లో' అనే అర్థంతో వాడతాం.

In the box/ in the class/ in government service, etc. = పెట్టె/ class/ ప్రభుత్వసేవ, వీటిలో.

**In** వాడే మరికొన్ని సందర్భాలిప్పుడు చూద్దాం.

**1) In months (.. In a period of time)** = నెలలుగా. ఈ expression లో అయితే months అని (నెలలు) వాడాం. ఇదే అర్థంతో ఎంత సమయానికైనా వాడవచ్చు.

a) He hasn't called me in weeks =

He hasn't called for weeks now =

అతను నాకు phone చేసి వారాలైంది. =

కొన్ని వారాలుగా నాకతను ఫోన్ చేయలేదు.

అయితే, in years/ months/ weeks, etc. negative sentence (not తో) లోగానీ, first, last లాంటి వాటి తర్వాతగానీ వాడతాం.

అలా కానప్పుడు, గత కొంతకాలంగా అనే అర్థంతో, for the past, for the last అని అంటాం. తెలుసుకదా.

b) I haven't seen him for the past 2 years =

I haven't seen him in two years =

నేనతన్ని చూసి రెండేళ్లయింది./ రెండేళ్లుగా నేనతన్ని చూడలేదు/ రెండేళ్లలో నేనతన్ని ఒక్కసారీ చూడలేదు.

c) This is the first time that he acted in a year =

ఈ సంవత్సరంలో అతను ఇదే మొదటి సారి నటించింది.

**2) In teaching** - ఇలాంటి సందర్భాల్లో In వృత్తిలో ఉండటం తెలుపుతుంది.

a) He is in a job/ business, etc = అతను ఉద్యోగంలో/ వ్యాపారంలో ఉన్నాడు (ఉద్యోగం/ వ్యాపారం, etc. చేస్తున్నాడు.)

b) She is in journalism = ఆమె journalist. (పత్రికా రచయిత)గా పనిచేస్తోంది.

c) A: What are you in now?

(ఇప్పుడేం చేస్తున్నావ్? )

B: I'm in fashion technology.

(fashion technology లో ఉన్నా. అందులో పనిచేస్తున్నా)

**3) My heart wasn't in it.**

తెలుస్తూనే ఉందికదా? మనసు ఒకదాన్లో లేకపోవటం = ఆసక్తి లేకపోవటం.

a) His heart is not in this job =

అతనికి ఈ ఉద్యోగం నచ్చటం లేదు.

b) Though trained as a dancer, her heart is not in it =

నాట్యంలో శిక్షణ పొందినప్పటికీ, ఆమెకు అందులో మనసు/ ఆసక్తి లేదు.

**4) In somebody** = ఒకరిలో

a) We have in him the future leader of the country = అతనిలో భవిష్యత్ నాయకుడున్నాడు/ అతనిలో నాయకత్వ లక్షణాలున్నాయి.

b) We lost a great singer in Leela.

లీలలో (ఆమె మృతితో) ఒక గొప్ప గాయనిని కోల్పోయాం.

**5) One in every = out of every** = ప్రతి కొంత సంఖ్య (మనుషుల్లో, విషయాల్లో)

a) One in every ten students scored 100%

ప్రతి 10 మందిలో ఒక విద్యార్థికి 100% వచ్చింది.

b) One in every 43 persons has diabetes =

ప్రతి నలభైమూడుగురిలో ఒకరికి చక్కెర వ్యాధి ఉంది.

**6) In voice**- ఇది చాలా ముఖ్యం- తెలుగులో గొంతుతో అంటాం. అయితే, English లో మాత్రం In a low voice (తక్కువ గొంతుతో), In a high voice (పెద్ద గొంతుతో), etc.

a) She speaks in a sweet voice =

ఆమె తియ్యటి గొంతుతో మాట్లాడుతుంది.

b) He shouted in a harsh voice =

కఠినమైన గొంతుతో అరిచాడతను.

**7) In love with** =

ఇష్టపడటం/ ప్రేమించడం/ ప్రేమలో పడటం

a) Dushyantha was in love with Sakuntala.

b) They were in love with each other.

అర్థాలు వివరించక్కర్లేదు కదా.

**8) In that** = ఆ కారణంగా - ఇది చాలా ఉపయోగకరమైన expression, practice చేయండి.

a) Many young heros in Telugu cinema are fortunate in that they are the sons of important people in the industry =

తెలుగు సినిమా పరిశ్రమలోని ప్రముఖుల కొడుకులవటం (ఆ కారణంగా) చాలామంది తెలుగు యువ హీరోల అదృష్టం.

b) It is difficult in that it needs a lot of money

చాలా డబ్బు అవసరం అనేది, అది కష్టం అవటానికి కారణం.


M.SURESAN

---

**ప్రశ్న:** *i) కఠిన పదాలకు అర్థాలు తెలుసుకోవడానికి,*

*ii) English మాట్లాడటానికి మంచి Modern Dictionary పుస్తకం చెప్పగలరు.*

*iii) Call centre లో జాబ్‌కోసం ప్రయత్నిస్తున్నాను. ఇంగ్లిష్ fluent గా రావాలంటే ఏం చేయాలో సలహా ఇవ్వగలరు.*

**– లక్ష్మి, ఆర్.సి.పురం**

**జవాబు:** i) Oxford- Advanced learner's Dictionary of current English

ii) Living English structure by stannard Allen.

iii) ఏదైనా మంచి Institute లో call centre training course తీసుకోండి.

**ప్రశ్న:** *i) నిన్ను మిత్రునిగా పొందినందుకు నేను మహదానందాన్ని పొందుతున్నాను.*

*ii) మీరు చేసిన సాయానికి నా జీవితాంతం రుణపడి ఉంటాను.- ఈ వాక్యాలు ఇంగ్లిష్‌లో ఎలా రాయాలో తెలుపగలరు.*

*iii) Standard English Grammar పుస్తకాన్ని సూచించగలరు.*

**– కార్తీక్, తిరుపూరు**

**జవాబు:**

i) I'm extremely happy to have a friend like you.

ii) I shall be indebted all my life for your help.

iii) Living English structure, by Stannard Allen. (Orient Longmans co)

**ప్రశ్న:** *Look, See, Watch కు తేడా ఏమిటి? ఏ సందర్భంలో ఉపయోగించాలి?*

**–కె. ప్రవీణ్, కొల్లాపూర్**

**జవాబు:**

Look= మనం (ప్రయత్నించి) చూడటం

Watch= పరీక్షగా చూడటం

See= మనకు కన్పించటం (I see a car at a distance = దూరంలో car కన్పిస్తోంది)

Look at the sky at night = రాత్రిపూట ఆకాశం వైపు చూడు). You see stars (నక్షత్రాలు కనిపిస్తాయి.)

We watch a movie/ TV etc.

**ప్రశ్న:** *i) Spoken English లో గతంలో ఒకసారి He seen me on my way to the station to receive my uncle అని రాశారు. ఈ sentence ను present perfect tense లో అయితే He has seen అని past perfect tense లో అయితే He had seen అనాలి కదా? వివరించగలరు.*

*ii) She had worked as teacher before she got married అన్నారు. She had worked as teacher before she married అనకూడదా? Married కూడా past tense కదా. Got అనే మరో verb ను ఎందుకు చేర్చారు?*

**– వి. రామానంద్, హైదరాబాద్**

**జవాబు:** i) He seen me ... ఇది అచ్చు పొరపాటై ఉంటుంది. Railway station కు వెళ్లేదారిలో అని, అయిపోయిన past action కాబట్టి, ఇక్కడ రెండు past actions లేవు కాబట్టి, He saw me ... అని ఉండాల్సింది.

ii) ... Before she married అన్నప్పుడు, she married him/ the name of the man ఉంటే correct. కేవలం she married అని వదిలేయం.

**ప్రశ్న:** *Stationery shop, stationary shop. - ఈ రెండింటిలో ఏది కరెక్ట్?*

**–పి.వి.ఆర్.మూర్తి, విశాఖపట్నం**



**జవాబు:**

Stationery shop is correct.

Difference between stationary and stationery;

- Stationary= Motionless, నిశ్చలంగా ఉన్న, కదలని

A stationary Job = ఒకేచోట (Office లలో) కూర్చుని చేసే ఉద్యోగం.

A stationary vehicle= ఆగి ఉన్న/ కదలకుండా ఉన్న వాహనం.

- Stationery= Materials we use for writing. రాసేందుకు వాడే పరికరాలు- Paper, Pen, Pencil,etc.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

# I am just in from the movie

**Shanmukh:** Where are you coming from?
(ఎక్కడి నుంచి వస్తున్నావు? )

**Dhanush:** I am just in from the movie, Nuvvu Nakoddu. I was late by 10 minutes. For some time I could not make head or tail of what was going on.
(నువ్వునాకొద్దు సినిమా నుంచి ఇప్పుడే వస్తున్నా. 10 నిమిషాలు ఆలస్యంగా వెళ్లాను. కొంతసేపటివరకూ ఏం జరుగుతోందో తలాతోకా తెలియలేదు.)

not make head or tail of = తలాతోకా తెలియకపోవటం

**Shanmukh:** Why were you late?
(ఎందుకు ఆలస్యం అయ్యావు? )

**Dhanush:** Don't worry why I was late. You saw the movie last week, didn't you? Were you in at the start?
(నేనెందుకు ఆలస్యమయ్యానో వదిలెయ్. నువ్వు కిందటి వారం దాన్నిచూశావు కదా? మొదటి నుంచి ఉన్నావా? (చూశావా? )

**Shanmukh:** Yea. I was there from the start. Damodar took me to the movie. Of late he has been quite in with me. Don't know why.
(అవును. మొదటినుంచీ చూశాను. దామోదర్ తీసుకువెళ్లాడు నన్ను. ఈ మధ్య నాతో చాలా స్నేహంగా ఉంటున్నాడు. ఎందుకో తెలియటంలేదు.)

**Dhanush:** That's his nature. He had been in with the management till he got his promotion. Obviously he wants something from you if he is in with you.
(వాడి స్వభావం అంతే. వాడికి promotion వచ్చేవరకు management (యాజమాన్యం)తో చాలా సన్నిహితంగా ఉన్నాడు. నీతో సన్నిహితంగా ఉన్నాడంటే నీ నుంచి ఏంటో కావాలని తెలుస్తూనే ఉంది.)

**Shanmukh:** He has the knack of getting chummy with people in no time. The other day I introduced him to our friend Satyam, and already he wants to be in on our plans to start a business.
(కాసేపటిలోనే ఎవరితోనైనా, స్నేహం పెంచేసుకునే తెలివితేటలు వాడికి బాగా ఉన్నాయి. మొన్నోరోజు వాడిని మన సత్యానికి పరిచయం చేశాను. అంతే. మనం సత్యంతో ప్రారంభించాలనుకున్న వ్యాపారంలో చేరాలనుకుంటున్నాడు.)

Knack= నాక్-నా, Bank లో Ba లాగ= ఏదైనా చేయటంలో/ చేసేందుకు కావాల్సిన తెలివితేటలు

**Dhanush:** He dresses himself quite smartly too. He is always seen in the cut that is in.
(దుస్తులు కూడా చాలా ఆకర్షణీయంగా వేసుకుంటాడు. ఏది fashion లో ఉందో దాంట్లోనే కనిపిస్తాడతను.)

cut= బట్టల fashion

**Shanmukh:** OK. Let's see what he is up to.
(సర్లే. వాడేం చేయాలనుకుంటున్నాడో చూద్దాం.)

☆ ☆ ☆ ☆

మన conversation ను సరళతరం చేయగల *'in'* ఉపయోగాలు మరికొన్ని ఈ lesson లో చూద్దాం. Conversation ను ease తో కొనసాగించాలనుకుంటే ఈ చిన్న చిన్న expressions బాగా practice చేయడం చాలా అవసరం.

**Look at the following expressions from the conversation above.**

*1) I am just in from the movie.*
*2) Were you in at the start?*
*3) Of late he has been quite in with me.*
*4) He has the knack of getting chummy with people in no time.*
*5) ... already he wants to be in on our plans to start a business.*
*6) He is always seen in the cut that is in.*




గమనించారు కదా: పై expressions (underlines చేసినవి) అన్నీ చాలా simple expressions, కానీ సందర్భశుద్ధిగా వాడితే చాలా effective గా ఉంటుంది. Practice చేయండి.


M.SURESAN

**1) I am just in =** నేనిప్పుడే వచ్చాను

ఇంతకుముందు lesson లో చూశాం కదా- In అంటే (Out కు వ్యతిరేకంగా) ఒక చోట ఉండటం అని. దానికి సంబంధించిందే ఈ use of in = ఇప్పుడే లోనికి/ ఒకచోటికి రావడం.

a) The train is in =
Train వచ్చింది.

b) He had just been in when she started asking him questions =
అతను లోనికి రాగానే, ఆమె ప్రశ్నలు ప్రారంభించింది. (ప్రశ్నల వర్షం కురిపించింది)

c) She has just been in. You can see her there = ఆమె ఇప్పుడే లోనికి వచ్చింది. అక్కడ కనిపిస్తోంది చూడు.

**2) Were you in at the start -**
ఇక్కడి expression, be in at something - అర్థం- ఏదైనా జరుగుతున్నపోట ఉండటం.

a) I am lucky to have been in, right from the start of the project -
నా అదృష్టం, ఆ ప్రాజెక్ట్ ప్రారంభం నుంచి నేనక్కడ ఉన్నాను. (ఆ project జరుగుతున్నప్పటి నుంచి ఉన్నాను.)

b) They were not in at the end of the function =
వేడుక చివర వాళ్లక్కడ లేరు.

**3) be in with (some body) =**
ఒకరితో దోస్తీగా ఉండటం/ ఒకరి దగ్గర పలుకుబడి ఉండటం.

a) He has been quite in with her for some time =
ఆమెతో అతను కొద్దికాలంగా చాలా దోస్తీగా/ సన్నిహితంగా ఉంటున్నాడు.

b) The MLA is in with the Chief Minister =
ఆ MLA, ముఖ్యమంత్రితో చాలా సన్నిహితంగా ఉంటాడు. అతనికి ముఖ్యమంత్రి దగ్గర పలుకుబడి ఉంది.

Ramachandra Rao is in with the CM =
రామచంద్రరావు CM కు సన్నిహితుడు/ CM వద్ద పలుకుబడి ఉన్నవాడు.

**4) In no time =**
అతి త్వరలోనే = ఎంతోసేపు పట్టదు.

a) You can learn swimming in no time. It's easy =
ఈత నేర్చుకోవడానికి ఎంతోసేపు పట్టదు నీకు. అది చాలా సులభం.

b) These days children learn computers in no time. =
ఈ రోజుల్లో పిల్లలు computers ఇట్టే/ చాలా త్వరగా నేర్చుకుంటారు/ ఎంతోసేపు పట్టదు.

c) He will be here in no time. Let's be ready to receive him =
అతను రావడానికి ఎంతోసేపు పట్టదు. అతన్ని స్వాగతించేందుకు తయారవుదాం.

**5) be in on something =**
ఒక విషయంలో ప్రమేయం ఉండటం/ తెలిసి ఉండటం.

a) I very much like to be in on your plans =
మీ పథకాలలో నాకూ భాగం ఉండాలనుకుంటున్నాను.

b) He must be in on the discussions about his marriage -
తన పెళ్లి చర్చలలో అతడికి ప్రమేయం ఉండాలి/ అతను కల్పించుకోవాలి.

c) She is in on things that don't concern her =
ఆమెకు సంబంధించని విషయాల్లో కల్పించుకుంటుంది.

be in on బదులు get in on అని కూడా అనవచ్చు

d) I want you to get in on the project =
ఈ project లో నీ ప్రమేయం కూడా ఉండాలనుకుంటున్నాను.

**6) The cut that is in =**
ఇప్పుడు fashion లో ఉన్నది.

a) Jeans are in now =
ఇప్పుడు fashion jeans.

b) Stripes for men are in and plain colours are out =
పురుషుల దుస్తుల్లో చారలు (stripes) ఇప్పుడు fashion. Plain colours పాత fashion (out)

c) Dresses are in and Saris are out =
Dresses ఇప్పటి fashion, చీరలు fashion కాదు (Out)

ఇప్పుడది fashion = That is the in thing now.

---



**ప్రశ్న:** *i) English grammar నేర్చుకోవడానికి మంచి పుస్తకం సూచించండి.*
*ii) కొందరు 'రామాంజనేయులు' అంటే ఇంగ్లిష్‌లో Ramaanjaneyulu, మరో విధంగా Ramanjaneyulu అని రాస్తారు. వీటిలో ఏది కరెక్ట్? రా= 'Raa' కాదా? 'Ra' అని రాస్తారు. మా అంటే 'Maa' కాదా 'Ma' అని ఎందుకు రాస్తారు? స్పష్టంగా తెలపండి.*

**– ఎం.రామాంజనేయులు, మదనాపురం**

**జవాబు:** i) Living English structure by stannard Allen. ఈ book practice చేయండి.
ii) English భాషకు చెందని మాటలు, వాటి pronunciation కు దగ్గరగా వచ్చే విధంగా ఎలా అయినా spell చేయవచ్చు అయితే ఇప్పుడు రామాంజనేయులును మీ పేరుగా మీరెలా spell చేస్తారో, మీకు సంబంధించిన వాటిల్లో అన్నిచోట్లా అలాగే spell అయ్యేట్లు చూసుకుంటే చాలు. ఇలాంటి వాటికి Rules అంటూ ఉండవు. Pronunciation కు ఏది దగ్గరైతే అలా spell చేయవచ్చు

**ప్రశ్న:** *i) 'K' సైలెంట్ అక్షరాన్ని సాధారణంగా 'N' అక్షరం ముందే ఎందుకు ప్రయోగిస్తారు? మిగతా ఇంగ్లిష్ అక్షరాల ముందు ఎందుకు ప్రయోగించరు?*
*ii) O.K. అంటే అర్థం ఏమిటి? ఈ O.K. లో 'K' అర్థం ఏమిటి? ఇక్కడ 'K' ఎలా ప్రయోగిస్తారు?*
*iii) C.B.S.E. విద్యార్థులకు ఏ డిక్షనరీ ఉపయోగకరంగా ఉంటుంది?*

**– జానపాటి శ్రీనివాస్, మిర్యాలగూడ**

**జవాబు:** i) English లో చాలా ఎక్కువ మాటలు latin, french భాషల నుంచి వచ్చినవి. మూల భాషలలో spelling తో English చేరి, pronunciation లో మార్పు చెందాయి, K silent అయ్యే Knee, Knowledge లాంటి మాటలు. వీటికి వివరణ ఇవ్వాలంటే ఓ గ్రంథమే రాయవచ్చు అయినా అనవసరం కదా!
ii) O.K.– దీనికి వివరణ చాలా విపులంగా పాత lessons లో ఇచ్చాం. చూడండి.
iii) Higher classes/ courses విద్యార్థులందరికీ చక్కగా ఉపయోగపడే Dictionary Oxford: An Advanced Learner's Dictionary of Current English.

**ప్రశ్న:** *ఇంగ్లిష్ మ్యాగజైన్స్‌ను అర్థం చేసుకోవాలంటే డిక్షనరీలోని పూర్తి పదాలు నేర్చుకోవాలా? మ్యాగజైన్‌లో తెలియని పదాలు నేర్చుకుంటే చాలా? ప్రపంచ ఇంగ్లిష్ నవలలు, మ్యాగజైన్స్ చదవాలంటే ఎంత vocabulary అవసరం?*

**– జి.సాయికుమార్, హైదరాబాద్**

**జవాబు:** ఏ magazine లోగానీ, పుస్తకంలోగానీ, ఓ dictionary లోంచి పదాలు ఎంపిక చేసుకుని రాయరు. మనం వాడే మాటలు మన ఆలోచనలకు సరైనవిగా/ మన ఆలోచనలను correct గా వ్యక్తపరిచేవిగా ఉంటాయి. ఆ మాటలు ఏ మంచి dictionary లోనైనా ఉంటాయి. dictionary లోనివో, ఏ word-list లోవో మాటలు కంఠస్థం చేస్తే సరిగా మాట్లాడగలం/ రాయగలం అనుకోవటం పొరబాటు. మనం చేయాల్సిందల్లా ఎంత English వీలైతే అంత చదవటం/ వినటం/ మాట్లాడటం - దీన్ని exposure అంటాం కదా? మనకు ఓ భాషకు ఎంత exposure ఉంటే అంత బాగా వస్తుంది. India Today లాంటి magazines regular గా చదువుతూ ఉండండి. చదివేటప్పుడు మాటల అర్థాలు dictionary లో చూడకండి. అర్థంకాని మాటలేవయినా ఉంటే, వాటిని మొదట note చేసుకుని చదవటం పూర్తయిన తర్వాత dictionary చూడండి. వీలైతే ఆ మాటలను అవకాశం ఉన్నప్పుడు వాడండి. అలాగే Daily English news-paper చదవండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 355

# Isn't she into music?

M.SURESAN

**Dhaval:** I saw you going into the bakery this morning. Buying a cake or what?

(ఈరోజు ఉదయం నువ్వు bakery లోకి వెళ్తున్నప్పుడు చూశాను. Cake కొనడానికా ఏమిటి? )

**Sravan:** Yea. I wanted to order a birthday cake for my little sister.

(అప్పను మా చెల్లెలికి birthday cake order చేయడానికి.)

*(Little sister is American for younger sister.)*

**Dhaval:** Isn't that the girl that narrowly escaped an accident last week when the auto she was in crashed into a stationary car?

(ఆ అమ్మాయే కదా? కిందటివారం నిలిచి ఉన్న కారును ఢీకొన్న auto లో ఉండి ప్రమాదం త్రుటిలో తప్పించుకుంది? )

*narrowly escaped* = త్రుటిలో తప్పించుకుంది.

*stationary* = ఒకచోట కదలకుండా ఉన్న.

**Sravan:** Yea. That's the one. Lucky to be alive. Otherwise we wouldn't be celebrating her birthday.

(బతికి ఉండటం అదృష్టం. లేకుంటే మేం పుట్టినరోజు నిర్వహించుకునేవాళ్లం కాదు.)

**Dhaval:** I think she is in her 2nd year of Engineering.

(తను ఇప్పుడు Engineering 2nd year చదువుతోంది కదా? )

**Sravan:** No; How you forget things! She is well into her last but one semester.

(కాదు. నీకు మరుపు ఎక్కువ/ నీవు విషయాలను ఎలా మర్చిపోతావో! తను ఇప్పుడు చివరి semester ముందరి semester లో ఉంది.)

*Last but one* = చివరిదానికి ముందరిది.

*Semester* = విద్యా సంవత్సరంలో సగం కాలం

**Dhaval:** I am sorry. Isn't she into music too? I often see her singing in the competitions on the TV.

(Sorry. సంగీతంలో కూడా చురుగ్గా పాల్గొంటుంది కదా? తరచూ TV లో సంగీత పోటీల్లో కనిపిస్తూ ఉంటుంది.)

**Sravan:** You can say that. She is a fine singer. If only she can put some more time into it! Her studies are in the way.

(కచ్చితంగా. మంచి గాయని తను. ఇంకాస్త సమయం సంగీతానికి కేటాయించగలిగితే బాగుంటుంది! కానీ చదువు అడ్డం వస్తోంది.)

**Dhaval:** How is she able to manage both?

(రెండింటినీ ఎలా నెగ్గుకొస్తోంది? )

**Sravan:** Well, she studies late into the night. She stopped practising since the accident. She had a few injuries and hasn't been totally fit.

(రాత్రి చాలా సేపటివరకు చదువుతుంది. Accident అయినప్పటి నుంచి సంగీతం practice చేయడం లేదు. కొద్దిగా గాయాలై, పూర్తిగా స్వస్థత లేకుండా ఉంది.)

**Dhaval:** Isn't there any case about it?

(దాన్ని గురించి case ఏం లేదా? )

**Sravan:** The police are enquiring into it. The insurance people too are about it.

(Police లు విచారణ చేస్తున్నారు. Insurance వాళ్లు కూడా పరిశీలిస్తున్నారు.)

**Dhaval:** The police can be bribed into putting the case into cold storage. Keep seeing your lawyer about it. What was the auto driver's age?

(Police లు case ఆపే విధంగా లంచాలతో సాధ్యం. మీ lawyer ను తరచూ కలుస్తూ ఉండు. ఆటో driver వయస్సెంత? )

**Sravan:** He is into his late forties. He was saying that he was still Rs. 25000 into his financier and that there was none to take care of him.

(అతను 40వ పడిలో పద్దవాడే. తనింకా తన financier కు రూ. 25000 బాకీ ఉన్నాననీ, తనను చూసుకునే వాళ్లు లేరని అన్నాడు.)

**Dhaval:** Did he want you to drop the case against him? What did you say to him?

(తన మీదున్న case తీసేయమన్నాడా? నువ్వేమన్నావు? )

**Sravan:** I just said I'd look into the matter.

(నేను ఆ విషయం పరిశీలిస్తానే అన్నా.)

☯ ☯ ☯ ☯ ☯

మనం కొంతకాలంగా తెలుసుకుంటున్న prepositions లో భాగంగా **'into'** ఉపయోగాలను ఈ lesson లో తెలుసుకుందాం.

***Look at the following sentences from the conversation above.***

*1) I saw you going into the bakery.*

*2) ... when the auto she was in crashed into a stationary car?*

*3) She is well into her last but one semester.*

*4) Isn't she into music?*

*5) If only she can put some more time into it*

*6) She studies late into the night.*

*7) The police are enquiring into it.*

*8) He is into his late forties.*

**Into** కు మామూలు అర్థం తెలుసుగదా? Into అంటే (ఒక ప్రదేశం/ ఓ వస్తువు) లోనికి. (In = లో; Into = లోనికి). ఇదే ఈ కింది sentence లో చూస్తాం.

**1) I saw you going into the bakery** =

Bakery లోనికి/ Bakery లోకి.

a) He jumped into the river to save the child which had fallen into the river =

నదిలో పడిన బిడ్డను రక్షించడానికి, అతను నదిలోకి దూకాడు.

b) He walked away into the dark night =

ఆ చీకటి రాత్రిలోనే వెళ్లిపోయాడు (చీకట్లోకి నడిచి వెళ్లాడు/ మాయమయ్యాడు)

అలాగే sentence No 2 చూడండి:

**The auto crashed into the car** =

Auto car లోకి దూసుకెళ్లింది/ car ను ఢీకొట్టింది. crash= ఏదైనా పెద్దశబ్దంతో ఢీకొట్టడం/ కింద పడటం.

a) The plane crashed into the jungle below

విమానం కింద అడవిలోకి పడిపోయింది.

b) His bike bumped into the back of a lorry

అతని bike lorry వెనుక భాగాన్ని ఢీకొట్టింది.

Time విషయంలో Into ను, అంతదాకా అనే అర్థంతో వాడతాం. (Sentence No 6)

a) He works late into the night =

రాత్రి బాగా పొద్దుపోయే దాకా పని చేస్తాడతను

b) She carried on her work till late into the night =

రాత్రి చాలా ఆలస్యం అయ్యేవరకు పని చేస్తూనే ఉంది.

c) He did not get married till late into his thirties =

అతను తనకు 30 ఏళ్లకు పైబడేవరకు పెళ్లి చేసుకోలేదు.

**3) be well into** =

at an advanced stage = చాలాభాగం అయిపోయేంతవరకు, ప్రారంభదశ దాటిపోవడం.

a) We are now well into the academic year

మనం విద్యాసంవత్సరంలో చాలా భాగం ముందున్నాం. (ప్రారంభ దశ దాటిపోయాం.)

b) She is well into her last but one semester

చివరి semester ముందు semester ప్రారంభ దశ దాటిపోయింది.

**4) Isn't she into music?**

into something = ఒక విషయంలో బాగా ఆసక్తి, శ్రద్ధ కనబరచడం, అందులో చురుగ్గా పాల్గొనడం.

a) He is into photography in a big way =

చాలా బాగా photography లో ఆసక్తి కనబరుస్తున్నాడు, photography నే అతని ముఖ్య కార్యకలాపం ఇప్పుడు.

b) She is into software =

Computers లో బాగా శ్రద్ధ/ ఆసక్తి చూపిస్తోందామె, దానికి సంబంధించిన విషయాలనే ఎక్కువగా చేస్తోంది.

c) He is no longer interested in engineering. He is into film acting now

అతనికి ఇప్పుడు Engineering లో అంత ఆసక్తి లేదు. సినిమాల్లో నటించటంలో ఆసక్తి, శ్రద్ధ చూపించి ఆ ప్రయత్నం మీదే ఉన్నాడు.

Put into (Sentence No. 5)- చేర్చటం.

a) Put some more force into your words when you make speeches =

నీ ప్రసంగాల్లో నీ మాటలకు మరికొంత శక్తి జోడించు.

b) Indians have to put some more spirit into their play =

భారత్ ఆటగాళ్లు వారి ఆటకు మరికొంత ఉత్సాహం కలపాలి/ జోడించాలి.

Enquire into = విచారించటం.

a) The committee is enquiring into the collapse of the dam =

Dam కూలిపోయిన విషయంమీద ఆ committee విచారణ చేస్తోంది.

b) They have not started enquiring into the matter =

ఆ విషయం మీద వాళ్లు విచారణ ఇంకా ప్రారంభించలేదు.

అలాగే look into the matter అంటే ఒక విషయం పరిశీలించటం.

c) The minister promised to look into the delay in the release of funds =

నిధుల విడుదలలో జాప్యాన్ని పరిశీలిస్తానని మంత్రి మాటిచ్చారు.

## Q&A

**ప్రశ్న:** *ఇంగ్లిష్ Idioms, vocabulary develop చేసుకోవాలంటే ఏం చేయాలి. English usage పై దృష్టి పెట్టాలా? లేక idioms పై ఉంటే చాలా? ఈ రెండింటికీ సంబంధించి మంచి పుస్తకాలు సూచించగలరు. Anagram అంటే ఏమిటి? ఇది vocabulary పెంచుకోవడంలో ఎలా ఉపయోగపడుతుంది?*

– ఎస్.రిహానా బేగం, కల్లూరు.

– ప్రశాంత్, టెక్కలి.

**జవాబు:** ఒకటి గుర్తుంచుకోండి. Language is purely a matter of practice. భాష ఎంత practice చేస్తే అంత బాగా వస్తుంది. Vocabulary పెంచుకోవాలంటే List of words, their synonyms and antonyms practice చేస్తే అంత సులభంగా రాదు. మనం చదువుతుంటే, (English news papers, novels, stories, etc) vocabulary, idioms - ఇవన్నీ కూడా automatic గా వస్తాయి. కాబట్టి Read as much English as you can. Read, read and read- that's the only way to master English in any aspect of it. మీరు ఎంత English చదివితే అంత బాగా అన్నీ vocab, idioms, etc వచ్చేస్తాయి. Word lists, idioms కంఠస్థంచేస్తే అర్థం తెలుస్తుంది కానీ use తెలియదు. అసందర్భంగా వాడటం జరుగుతుంది. So read newspaper everyday for an hour at least.

Anagram is a word formed by changing the order of letters in another word. ఒక మాటలోని అక్షరాల వరసను మారిస్తే ఏర్పడే రెండో మాట, మొదటి మాటకు Anagram. అంతేకాకుండా ఒకదానికొకటి anagram అవుతాయి. eg: Listen, and silent are anagrams. Post and tops/ stop/ pots/ spot are all anagrams. ఇదో ఆటలాగా ఉంటుంది. అందుకని Vocab పెంచుకునేందుకు కొంత ఉపయోగపడుతుంది.

**ప్రశ్న:** *I am leaving Hyd for Mumbai. I am going to Mumbai. Mumbai destination కాబట్టి to వాడొచ్చు కదా? For అంటే 'కోసం' అనే అర్థం వస్తుంది కదా? Mumbai కి వెళ్తున్నాను కానీ Mumbai కోసం కాదు కదా? వివరించగలరు.*

– ఎల్.ఎస్.ఎన్.మూర్తి, హైదరాబాద్

**జవాబు:** Leave for= go to. Leave తర్వాత for మాత్రమే, go తర్వాత మాత్రమే to వస్తుంది. ఇది usage (వాడుక). దాన్ని మనం ఏ విధంగానూ వివరించలేం. తెలుగులో ఎన్ని నీళ్లు అంటాం. ఎన్ని అనేది లెక్కపెట్టేవాటికి కదా వాడతాం. నీళ్లు, ఒక నీళ్లు, రెండు నీళ్లు అని లెక్కించం గదా? అయినా వాడుక (usage) ప్రకారం, ఎన్ని నీళ్లు/ ఇన్ని నీళ్లు/ అన్ని నీళ్లు అనే అంటాం, ఎంత/ ఇంత/ అంత అనకుండా. అలాగే Leave for, go to కూడా. Start తర్వాత కూడా start for అంటాం.

I am starting for college =

నేను college కి బయలుదేరుతున్నాను.

For కు, కోసం అనే కాకుండా, పై example లో లాగా కు/ కి అనే అర్థం (college కి) ఉంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# There isn't any doubt about it

**Vittal:** There are three books on the table. One of them, of course is mine. Whose are the other two?
(Table మీద మూడు పుస్తకాలున్నాయి. వాటిలో ఒకటి నాదనుకో. మిగతా రెండూ ఎవరివి? )

**Venkat:** How do I know? There are no names written anywhere in the books.
(నాకెలా తెలుస్తుంది? / నాకేం తెలుసు? పుస్తకాల్లో ఎక్కడా ఏ పేర్లూ రాసిలేవు.)

**Vittal:** It is clear someone has left them here. Weren't there some of our friends here this morning?
(ఎవరో ఆ రెండు పుస్తకాలను ఇక్కడ వదిలి వెళ్లారని తెలుస్తోంది. మన స్నేహితులు కొందరు ఇవ్వాళ పొద్దున్న ఇక్కడ ఉన్నారు కదా? )

**Venkat:** Yea. I now remember. Harish and Nikhil were here. There were books in Nikhil's hands. The books must be his. There isn't any doubt about it.
(అవును. ఇప్పుడు నాకు గుర్తొస్తోంది. హరీష్, నిఖిల్ ఇక్కడున్నారు. Nikhil చేతిలో పుస్తకాలున్నాయి. ఆ పుస్తకాలు నిఖిల్‌వే అయ్యుండాలి. సందేహంలేదు.)

**Vittal:** When will he come again?
(మళ్లీ ఎప్పుడొస్తాడు వాడు? )

**Venkat:** It's doubtful if he will come here today, or even tomorrow. There was some talk about his going out of town to play a match.
(అతను ఇవ్వాళ, రేపు కూడా ఇక్కడికి రావడం సందేహమే. ఏదో match ఆడటానికి వెళ్తున్నట్టు సమాచారం.)

**Vittal:** You'd better put it away till he returns. There is always a chance of the books being misplaced.
(వాడు తిరిగివచ్చేవరకూ ఆ పుస్తకాలు జాగ్రత్తగా ఉంచు. వాటిని మళ్లీ మనం ఎక్కడో పెట్టే అవకాశాలు ఎప్పుడూ ఉంటాయి.)

**Venkat:** I have gone through some of the pages of the books. One of them interested me a lot. There is a well of information in the pages of the books.
(నేను ఆ పుస్తకాలను కొంతవరకూ చదివాను. వాటిలో ఒకటి నాకు ఆసక్తి కలిగించింది. ఆ పుస్తకం పేజీల్లో సమాచారం చాలా ఉంది.)

Well of information = సమాచారం ఎక్కువగా ఉండటం. Well అంటే బావి కదా? సమాచారపు బావి అని.

**Vittal:** Why don't we call him and tell him to take his books away.

**Venkat:** It'd be useless to try. Only yesterday he lost his cell. I don't have his home number. Do you have it?
(ఆ ప్రయత్నం నిరుపయోగం. నిన్ననే అతను cell పోగొట్టుకున్నాడు. అతని ఇంటి number నాకు తెలియదు. నీకు తెలుసా? / నీ దగ్గరుందా? )

**Vittal:** I don't have it.

**Venkat:** Then let's wait till he comes back.
(అయితే అతను వచ్చేదాకా చూద్దాం.)

☺ ☺ ☺ ☺ ☺

మనం ఇప్పటివరకు spoken English లో చాలా ముఖ్యమైన, చాలా తరచుగా వచ్చే prepositions తెలుసుకున్నాం. వాటి అర్థం, ఉపయోగం తెలుసుకుని, బాగా practice చేయడం చాలా అవసరం. Prepositions వాడకం తెలిస్తే, 50% conversational skill వచ్చినట్టే. ఇంతవరకూ prepositions గురించి చెప్పిన lessons (from lesson No. 321 onwards) మళ్లీమళ్లీ చదివి practice చేయండి.

ఇప్పుడు English లో ముఖ్యంగా spoken English లో వచ్చే **sentence structure** ను చూద్దాం. ఈ lesson లో There తో, It తో begin అయ్యే sentences చూద్దాం.

There, it - ఈ రెండింటి మామూలు అర్థాలు మనకు తెలుసు. There = అక్కడ; It = అది/ ఇది. అయితే English లో There ను, it ను వాటికుండే అర్థాలతో కాకుండా sentence ప్రారంభించడానికి చాలా ఎక్కువగా వాడతాం. ఇలా వాటితో sentence ప్రారంభించడానికి వాడేటప్పుడు వాటికి, అంటే there కు అక్కడ అని, it కు అది/ ఇది అని అర్థం రాదు. ఊరికే sentence ప్రారంభానికి ఉపయోగిస్తాం.

**Eg:** Q: How many books are here?
A: There are four books here.

చూశారు కదా? నాలుగు పుస్తకాలు ఉన్నాయి ఇక్కడ/ ఇక్కడ నాలుగు పుస్తకాలు ఉన్నాయి అని చెప్పడానికి, there తో begin చేశాం sentence ను. ఇక్కడ there కు అక్కడ అని అర్థం అనుకుంటే, sentence ఉండదు. అక్కడ 4 పుస్తకాలు ఉన్నాయి ఇక్కడ- దీనికి అర్థం లేదు. అందుకని sentence కాదు. అంటే there ను ఇలాంటి సందర్భాల్లో sentence ప్రారంభించడానికి మాత్రమే వాడతాం.

It కూడా అంతే.

It is easy to understand it - ఇక్కడ మొదటి It sentence ప్రారంభించడానికే ఉపయోగించాం. (అది అర్థం చేసుకోవడం సులభం) దానికి ప్రత్యేకమైన అర్థం ఏం లేదు.


M.SURESAN

ఇలా there ను, it ను sentence ప్రారంభానికి వాడటం తెలుసుకుందాం:

***Look at the following sentences from the dialogue above:***

*1) There are three books on the table.*
*2) There are no names written any where in the books.*
*3) There were books in Nikhil's hands.*
*4) There isn't any doubt about it.*
*5) There is always a chance of the books being misplaced.*
*6) There is a well of information in its pages.*

పైవన్నీ కూడా **there** తో ప్రారంభమయ్యే sentences.

***Now look at the sentences beginning with 'it' in the dialogue above:***

*1) It is clear some one has left them there.*
*2) It is doubtful if he will come again.*
*3) It would be useless to try.*

చూశారు కదా. There తో, It తో begin అయ్యే sentences.

**1) There are three books on the table -**
table మీద మూడు పుస్తకాలున్నాయి.

ఇక్కడ ఇదే meaning వచ్చేట్టు, Three books are on the table అనవచ్చు. Grammatically correct. కానీ spoken English లో మొట్టమొదటి sentence గా ఇలాంటి sentence అరుదు. ఈ కింది సందర్భాల్లో అనవచ్చు

Kumar brought five books. (of them = వాటిలో) Three books are on the table/ three (of them/ of the) books are on the table. Brackets లో ఉన్నవి అన్నా ఒకటే, అనక పోయినా ఒకటే.

a) There is going to be trouble again
మళ్లీ సమస్యలు ఉండబోతున్నాయి.

b) Weren't there ten students there yesterday? =
నిన్న అక్కడ పదిమంది విద్యార్థులు న్నారా? / ఉన్నారు కదా?

ఇలాంటి there ను, గ్రాంథికంగా Introductory there అంటాం. (Sentence ను Introduce చేస్తుంది కాబట్టి) దీనిని ఏ Tense లోనైనా, ఏ number singular or plural లోనైనా, question tag లోనైనా వాడతాం. Negative sentences కూడా there తో begin చేయవచ్చు.

c) There will be six or seven people waiting for you at the station.
(నీకోసం ఆరేడుగురు wait చేస్తుంటారు- Future)

d) There would have been no problem, if you had told us earlier of it.
(సమస్య ఉండేదికాదు, నువ్వు ముందే చెప్పి ఉంటే - Imaginary Past)

e) There would be a problem, if he were here =
వాడిక్కడ ఉంటే సమస్యే. (వాడు లేడు, సమస్య లేదు- Improbable present)

f) There was not (wasn't) any book here.
(ఇక్కడే పుస్తకం లేదు- Negative sentence)

g) There was expensive furniture in the room, wasn't there? (Question Tag లో there - ఆ రూంలో చాలా ఖరీదైన furniture ఉంది కదా? )

గమనించాం కదా? There, అంటే Introductory there ఇన్ని విధాలా వాడవచ్చు.

Introductory 'It'- అంటే It తో ప్రారంభమయ్యే sentences కూడా ఇలాగే అన్ని tenses తోనూ, negative లో, questions తో ఉపయోగిస్తాం. అది వచ్చే lesson లో చూద్దాం.

**EXERCISE**

Match the words under A, with their meanings under B.

The words in the exercise are some of the most frequently used words in spoken English.

| A | B |
|---|---|
| 1. Absolute | A. Tiny |
| 2. Booze | B. Amusing |
| 3. Comical | C. Show |
| 4. Exhibit | D. Protest |
| 5. Minute | E. Yield |
| | F. Get drunk |
| | G. Complete |

**ANSWERS**

1. G (పూర్తిగా- Absolute right to the property- ఆస్తికి పూర్తిహక్కు).
2. F (తప్పతాగటం)
3. B (హాస్యకరమైన/ నవ్వు పుట్టించే)
4. C (ప్రదర్శించటం)
5. A. (Minute- ఇక్కడ pronunciation- మైన్యూట్- న్యూ- నొక్కి పలుకుతాం/ American- మైనూట్ = సూక్ష్మమైన. minute particles = సూక్ష్మకణాలు)




**ప్రశ్న:** *I have a pen కి నెగెటివ్ I have not a pen అనవచ్చా? లేక I have no pen, I don't have a pen అనాలా? He has two sisters కు నెగెటివ్ He has not two sisters అనవచ్చా? He doesn't have two sisters అనాలా? వివరించండి.*

♦ *గ్రామర్ సూత్రాల్లో if clause లో Had I not told you, you would not have gone there. కానీ నేను చెప్పి ఉండకపోయినట్లయితే క్షమించండి అన్న సందర్భంలో Had I not told you, please excuse me అనవచ్చా?*

*– ఎ. కృష్ణగీతార్జున, నిడదవోలు*

**జవాబు:**

i) I have a pen కి negative I have not a pen అని అనం. Spoken British English లో negative short form లో I haven't a pen కరక్టే.

ii) I have no pen- grammatically correct but rarely used in spoken English.

iii) I don't have a pen- American form and now most widely used negative. This is the best of the three forms.

♦ నేను చెప్పి ఉండకపోతే క్షమించండి- దీనికి correct English లో -

1) సందర్భాన్ని బట్టి చెప్పకపోయిన time తెలిస్తే: If I didn't tell you, please excuse me.

2) చెప్పకపోయిన time తెలియకపోతే: If Ihaven't told you, I'm sorry

eg: 1) A: Why didn't you tell me of it yesterday.
B: Didn't I? I am sorry then/ Oh, If I didn't tell you, I'm sorry.

2) A: You haven't told me of it.
B: If I haven't, I'm sorry.

3) Had I not told you, please excuse me. Had I not told you, is wrong here. (Because, Had I not told you = If I had told you = I had told you. నేను చెప్పి ఉండక పోయుంటే- దీని అర్థం- చెప్పాను అనే కదా. అప్పుడు, excuse ప్రశ్నే లేదు.)

**ప్రశ్న:** *నంబర్ అంటే ఇంగ్లిష్‌లో number అని రాస్తాం కదా? మరి దాన్ని షార్ట్‌గా రాసినప్పుడు 'No' అని ఎందుకు రాస్తారు?*

*– టి. రవీందర్, ఆదిలాబాద్*

**జవాబు:** అవును. Number కు abbreviation (short form) No. No అనేది number కు ఎలా abbreviation అవుతుంది అనే ప్రశ్నకు స్పష్టమైన వివరణ ఇప్పటివరకూ ఏదీ లేదు. అయితే ఎక్కువ ఆమోదం పొందిన వివరణ ఇదీ: Latin భాషలో Number ను Numero అంటారు. ఈ మాటలోని మొదటి అక్షరం N, చివరి అక్షరం, 'o' కలిసి, No అని Number కు abbreviation అయిందని (Mister లోని మొదటి అక్షరం M, చివరి అక్షరం r కలిసి, Mr, Mister కు abbreviation అయినట్టు).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# It's quite pleasant in here

**Kundan:** It has been difficult to get at you. What are you so busy with?
(నిన్ను కలుసుకోవడం/ నీతో మాట్లాడటం చాలా కష్టంగా ఉంది. ఎందువల్ల అంత తీరిక లేకుండా ఉన్నావు? )

**Santan:** Not that I am busy but that you contacted me at the wrong times perhaps.
(నేను busy అవటంకాదు, నువ్వు నన్ను సరైన time లో పలకరించి ఉండకపోయుండొచ్చు.)

**Kundan:** It is so hot outside. Let's get inside and talk.
(బయట ఎండ/ వేడిగా ఉంది. లోపలికెళ్లి మాట్లాడుకుందాం.)

**Santan:** It rained all through yesterday and it is so hot today. The weather is so unpredictable.
(నిన్నంతా వాన. ఈరోజు ఎండ. వాతావరణాన్ని గురించి ముందే చెప్పలేం.)

weather = ఒకరోజు శీతోష్ణస్థితి
climate = సంవత్సరం పొడవునా ఉండే శీతోష్ణస్థితి
predict = జోస్యం చెప్పటం.
unpredictable = ముందే చెప్పలేని స్థితి - (ఒక విషయం/ ఒక వ్యక్తి గురించి)

**Kundan:** It's quite pleasant in here. Why are you turning on the AC? It's OK even without it.
(లోపల ఇక్కడ చాలా ఆహ్లాదంగా ఉంది. AC ఎందుకేస్తున్నావ్? అది లేకపోయినా బాగానే ఉంది.)

turn on = switch on - తెలుసుకదా electric bulbs/ tubes/ motors/ fans లాంటి వాటిని వేయటం.
ఇంకా turn on the tap = పంపు తిప్పటం నీళ్ల వదలడానికి
turn off = switch off = lights, fans లాంటివి ఆర్పేయడం, ఆపేయటం.
turn off the tap = నీళ్ల పంపు/ కొళాయి/ నల్లాను ఆపేయటం.

**Santan:** The two books I gave you last week are on the table. Have you finished with them?
(కిందటి వారం నేను నీకు ఇచ్చిన రెండు పుస్తకాలూ table మీదున్నాయి. వాటితో నీ పని అయిపోయిందా? / అవి చదవటం అయిపోయిందా? )

**Kundan:** There are still a few chapters left in the green covered book. It needs a careful study to understand the book. Very interesting but a bit difficult to understand it.
(పచ్చ అట్ట ఉన్న పుస్తకంలో ఇంకా రెండు chapters మిగిలున్నాయి. ఆ పుస్తకం అర్థం చేసుకోవడానికి జాగ్రత్తగా చదవటం అవసరం. చాలా ఆసక్తిగా ఉంది కానీ అర్థం చేసుకోవడం కాస్త కష్టం.)

**Santan:** Take as long as you like to return them. I can wait.
(నీ ఇష్టం వచ్చినప్పుడు తిరిగివ్వు. తొందరేం లేదు.)

I can wait = తొందరేం లేదు నాకు అనే అర్థంతో spoken English లో అంటాం.

**Kundan:** It might take just a couple of days for me to finish it. It won't be longer than that.
(ఇంకా రెండు రోజులు పట్టవచ్చు అవి పూర్తి చేయడానికి. అంతకంటే అవదులే.)

**Santan:** It doesn't matter if it is longer than that.
(అంతకన్నా ఎక్కువయినా ఫరవాలేదు)

○ ○ ○ ○

కిందటి lesson లో introductory 'there' తో ప్రారంభమైన sentences, అవి ఎలా చేయాలో చూశాం కదా. Now let's study how we can use 'It' to begin sentences without 'It' having any special/ the usual meaning it has.

***Look at the following sentences from the conversation above:***

*1) It has been difficult to get at you.*
*2) It is so hot outside*
*3) It rained all through yesterday and it is so hot today.*
*4) It's quite pleasant in here.*
*5) It needs a careful study to understand it.*
*6) It might take another couple of days for me to finish it.*
*7) It doesn't matter if it takes longer than that.*

***Study the use of 'It' in sentences above. You must have noticed that in all the sentences above, 'It' just begins the sentence and doesn't have its usual meaning it has (this/ that).***

There లాగానే it ను కూడా (sentence ప్రారంభంలో వాడేటప్పుడు) ఏ tense తోనైనా వాడవచ్చు, సందర్భాన్ని బట్టి. ముఖ్యంగా వాతావరణ పరిస్థితులను (weather/ climate conditions) చెప్పేటప్పుడు It వాడక తప్పదు. చూడండి.

a) It is, very hot/ very cold/ not so cold/ not so hot/ sultry (చమట) today.
b) It is very cold near the poles and very hot near the equator.

ధృవాల దగ్గర చాలా చలిగా, భూమధ్యరేఖ దగ్గర చాలా వేడిగా ఉంటుంది.


M.SURESAN

c) It is raining heavily (ఏ tense లోనైనా సందర్భాన్నిబట్టి It తోనే ప్రారంభించాలి కదా. The rain is/ was etc coming/ falling అనటం తప్పే.
d) I thought it might rain = వర్షం వస్తుందని అనుకున్నా.

అలాగే time expressions కు కూడా introductory It వాడతాం.

a) It is three days since he came here (అతనిక్కడికి వచ్చి మూడు రోజులైంది.)
b) It is already late. Let's start = ఇప్పటికే ఆలస్యమైంది. బయలుదేరదాం.
c) It is too early to think of her marriage = ఆ అమ్మాయి పెళ్లి గురించి ఆలోచించడానికి ఇంకా time ఉంది.

అలాగే చాలాచోట్ల - It is true/ false/ a lie/ surprising/ a wonder/ doubtful ... ఇలా చాలా సందర్భాల్లో వాడవచ్చు - spoken English లో చాలా common and natural. ఇవే మన lesson beginning లో కూడా వాడాం. గమనించండి.

**1) It has been difficult to get at you.**

a) It was easy to drive the distance because the road was good, and there wasn't much traffic = Road బాగుండి, traffic అంతగా లేకపోవడంవల్ల, driving easy అయింది.
b) It is a pity that I could not attend the function function కు నేను రాలేకపోవడం చాలా చింతించదగ్గ విషయం.
c) It is a shame that the police are unable to catch the thieves = దొంగలను పోలీసులు పట్టుకోలేకపోవడం సిగ్గుచేటు.

**2) It is quite pleasant in here =**

ఈ లోపల చాలా ఆహ్లాదంగా ఉంది. ఇంకా చూడండి:

a) It is important for him to be here now = ఇక్కడ తను ఇప్పుడు ఉండటం చాలా ముఖ్యం
b) It is here that I met her last year = ఆమెను నేను కలుసుకున్నది ఇక్కడే.

ఈ sentence లో లాగా It is ... that ను ఏదైనా నొక్కి చెప్పేందుకు (emphasize) వాడతాం.

c) It is I/ me that saved his life = అతన్ని కాపాడింది నేను - 'నేను'కు ప్రాధాన్యం - నావల్ల అతడు బతికున్నాడని.
d) It was Jagdish that helped me = నాకు సాయం చేసింది జగదీష్- జగదీష్‌కు ప్రాముఖ్యం.

ఈ కింది sentences కు తేడా గమనించండి

a) Ramesh helped me
రమేష్ నాకు సాయం చేశాడు.
b) It is ramesh that helped me =
నాకు సాయంచేసింది Ramesh (ఇంకెవరో కాదు)

(a) మామూలుగా ఓ విషయం చెబుతుంది.
(b) రమేష్‌కు ప్రాధాన్యం ఇస్తుంది.

e) It is not how much you spend that matters; it is how you spend it that matters =
ఎంత ఖర్చు చేస్తావనేది కాదు ముఖ్యం, ఎలా ఖర్చు చేస్తావనేది ముఖ్యం.

matters = important/ ముఖ్యం.
It doesn't matter = ముఖ్యంకాదు/ ఫరవాలేదు.

## EXERCISE

*Practise the following aloud in English using the introductory 'there' and 'it' as much as you can. (Introductory 'there' and 'it' ను వీలయినన్ని సార్లు వాడండి.)*

**Sampreet:** అతను ధనికుడనే విషయం నిజమే. (It is ... తో begin చేయండి)
**Vardhan:** కానీ అతనంత ధనికుడు కాదనేవాళ్లు కూడా ఉన్నారు. (But there ...)
**Sampreet:** ఒకరి దగ్గర ఎంత డబ్బుంది అనే విషయం చెప్పటం నిజంగా కష్టమే.
**Vardhan:** అతని ఇల్లు మా ఇంటికంత దూరంకాదు.
**Sampreet:** అయితేనేం. ఒక్కోసారి మనతో సన్నిహితంగా ఉండేవాళ్లు ఎటువంటి వాళ్లో చెప్పటం కూడా కష్టమే.
**Vardhan:** అంత తరచుగా ఖర్చు పెట్టడం కూడా నేను చూడలేదు.
**Sampreet:** అతను ధనవంతుడా కాదా అనేది మనకంత ముఖ్యంకాదు గదా. ఇంక దేనిగురించైనా మాట్లాడదాం.

## ANSWER

**Sampreet:** It is a fact that he is rich.
**Vardhan:** But there are also people who say he is not rich.
**Sampreet:** It is always difficult to say how much money a person has.
**Vardhan:** It is not far from my home to his place.
**Sampreet:** So what? It is sometimes difficult for us to say what kind of people who are close to us.
**Vardhan:** I haven't seen him spending much either.
**Sampreet:** It doesn't matter for us whether he is rich or not. Let's talk of something else.




**ప్రశ్న:** *i) Ahead of, on the eve of, on the occasion of - వీటికి ఎలాంటి అర్థం వస్తుంది?*
*Security has been tightened across the country ahead of the Independence day.*
*ఈ వాక్యంలో ahead of బదులు on the eve of లేదా on the occasion of వాడొచ్చా? వివరించండి.*
*ii) a) Engines will not run without lubricants.*
*b) That bank will accepts only DDs- not cheques.*
*c) If the size of the firm is small, cash transactions are in small amounts. In case of large organizations cash transactions will be in big amounts.*
*ఈ వాక్యాల్లో 'will' ను భవిష్యత్‌ను తెలపడానికే వాడారా? వివరించగలరు.*
**– నస్రీన్ నిగార్, కొడుమూరు**

**జవాబు: i)** On the eve of అన్నప్పుడు, ఆ సందర్భానికి ముందురోజు సాయంత్రం అన్న అర్థం ఉన్నప్పటికీ, అది శుభకర విషయాలకే వాడతాం. Ahead of అన్నప్పుడు, ఓ సంఘటన/ సందర్భం ముందు అనే అర్థం ఉంది. కాబట్టి on the eve కన్నా ahead of, better, correct.

**ii) a)** Engines will not run without lubricants- ఇక్కడ will not run = do not run. అయితే ఇది fact of science కాబట్టి do not run అంటే బాగుండేది, will not run అంత సరికాదు. Will, future form అయినప్పటికీ, ఒక్కోసారి habitual/ regular actions కు వాడతారు. అంత తప్పు కాదు.
e.g.: Boys will be boys = ఎలాగైనా కుర్రాళ్లు కుర్రాళ్లే. (అంటే చిలిపి చేష్టలు చేయటం ఆశ్చర్యం కాదు అని)

**b)** That bank will accepts- ఇది verb form కాదు కదా. That bank will accept అయినా అంటాం, లేకుంటే That bank accepts అయినా అంటాం. ఇక్కడ That bank accepts, (habitual/ regular action కాబట్టి) better and correct. Will accept correct కాదు.

**c)** ... cash transactions are (will be బదులు) in big amounts- correct. అవును- will భవిష్యత్తును తెలిపేందుకు వాడటమే ఉత్తమం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ




# Saying is easy but doing is ..

**Spurthi:** Sure, climbing up this small hill is easy. Let's start.
(ఈ చిన్నకొండను ఎక్కడం సులభం. బయలు దేరదాం.)

**Pranathi:** Saying is easy but doing is difficult. We haven't had walking practice for long.
(చెప్పడం తేలికే కానీ చేయడం కష్టం. చాలా కాలంగా నడక మనకు అలవాటు లేదు).

**Spurthi:** That's right. But I still feel walking up the hill isn't any difficult. Why don't we try? I feel debating whether to start or not is wasting time.
(సరే. కొండెక్కడం అంతకష్టం కాదనే అనుకుంటున్నా. మనం ఎందుకు ప్రయత్నించకూడదూ? బయలుదేరదామా వద్దా అని తర్కించుకోవడం సమయం వృథా చేయడమే.)

**Pranathi:** OK. As you wish. Let's start.
(అయితే కానియ్. బయలుదేరదాం.)

**Spurthi:** Just a few minutes. My brother Sreekar is coming. He will join us in a few minutes.
(కాసేపు ఆగు. మా అన్న శ్రీకర్ వస్తున్నాడు. కొద్ది క్షణాల్లో మనల్ని కలుస్తున్నాడు.)

**Pranathi:** Isn't there your other brother too? Having as many people as possible is always good.
(మీ ఇంకో brother కూడా ఉన్నాడు కదా? ఇలాంటి సమయాల్లో ఎంత ఎక్కువమంది ఉంటే అంత మంచిది.)

**Spurthi:** That's right. The more the merrier.
(అవును అదంతే. ఎక్కువ మంది, ఎక్కువ సరదా.)

ఇక్కడ, The more= ఎంతెక్కువ మందుంటే, the merrier= అంతసరదా.

merry= మెరి- 'మె' నొక్కి పలుకుతాం = సరదా.

**Pranathi:** By the time we get down the hill, it will be evening. Do you think any coffee and snack shops will be open then?
(మనం కిందికి దిగేటప్పటికి సాయంత్రమవుతుంది. అప్పుడు coffee, snacks (టిఫిన్) shops తెరిచుంటాయంటావా?)

**Spurthi:** Don't worry. There will be plenty for you to eat and drink. My brothers are getting them.
(Worry కాకు. తినేందుకు, తాగేందుకు చాలా ఉంటాయి. మా brothers తెస్తున్నారు.)

**Pranathi:** We had better start. Your brothers will catchup with us, as they climb up faster than us.
(మనం బయలుదేరదాం. మీ brothers మనల్ని చేరుకుంటారు, వాళ్లు మనకంటే త్వరగా ఎక్కుతారు కాబట్టి.)

catch up with= ముందున్నవాళ్లను చేరుకోవటం.

It will be difficult for us to catch up with Japan in technology= సాంకేతికరంగంలో మనం జపాన్ స్థాయికి చేరుకోవటం చాలా కష్టం.

**Spurthi:** OK then. Here we go.

☺ ☺ ☺ ☺ ☺

Introductory 'It', 'There' తో మనం sentences ఎలా begin చేస్తామో, అవి spoken English లో ఎంత frequent అయిందీ తెలుసుకున్నాం కదా? ఈ lesson లో వీటికి ప్రత్యామ్నాయాల గురించి తెలుసుకుందాం.

***Look at the following sentences from the conversation above:***

*1) Climbing up the hill is easy.*
*2) Saying is easy but doing is difficult.*
*3) ... walking up the hill isn't any difficult*
*4) Debating whether to start or not is a waste of time.*
*5) Having as many people as possible is always good.*

ఈ sentences కాస్త జాగ్రత్తగా పరిశీలించండి. అన్నీ కూడా '...ing' forms తో ప్రారంభమవుతున్నాయి. ఇంతకుముందు చూశాం కదా- '...ing' form కు- రావటం, తినటం.. ఇలాంటి అర్థాలు వస్తాయి.

e.g.: 1) Eating too much is not good = ఎక్కువగా తినటం మంచిది కాదు.
2) Smoking is bad for health = పొగపీల్చడం ఆరోగ్యానికి చెడు.

పై sentences from No 1 to 5 అన్నింటికి కూడా ఇలాంటి అర్థాలు రావటం గమనించండి.

**1) Climbing up the hill is easy** =
కొండెక్కటం సులభం.

ఇప్పుడు జాగ్రత్తగా గమనించండి. ఈ sentence లో climbing కు బదులు to climb వాడొచ్చు అర్థం మారకుండా. అంటే ఇలాంటి సందర్భాల్లో '...ing' form కు బదులు 'to + 1st Regular Doing Word వాడుకోవచ్చు. అలాగే, ఈ రెండింటి బదులు, introductory 'It' కూడా వాడొచ్చు (To + 1st Regular Doing Word - Infinitive).

**Climbing up the hill is easy** =
ఆ కొండెక్కడం సులభం =
To climb up the hill is easy =
It is easy to climb up the hill.

మిగతా sentences కూడా ఇలా మార్చవచ్చు చూడండి.

**2) Saying is easy but doing is difficult** =
చెప్పటం సులభమే, కానీ చేయటం కష్టం=
To say is easy but to do is difficult=
It is easy to say but (it is) difficult to do.


M.SURESAN

**3) Walking up the hill isn't any difficult** =
కొండపైకి నడవటం ఏం కష్టం కాదు. =
To walk up the hill isn't any difficult =
It isn't any difficult to walk up the hill.

**4) Debating whether to start or not is a waste of time** =
To debate whether to start or not is a waste of time =
బయలుదేరదామా వద్దా అని తర్కించటం సమయం వృథా =
It is a waste of time to debate whether to start or not.

**5) Having as many people as possible is always good** =
ఎంతమంది ఉంటే అంత సరదా =
To have as many people as possible (వీలయినంతమంది ఉండటం) is always good =
It is always good to have as many people as possible.

చూశారు కదా: ఇలాంటి, అంటే పైన చెప్పిన సందర్భాల్లో మాత్రమే, '...ing' form తో ప్రారంభించే sentence ను, Infinitive (to + 1st Regular Doing Word) తోగానీ, Introductory 'It' తోగానీ ప్రారంభిస్తాం.

మరికొన్ని examples చూద్దాం.

**a)** Discussing this topic with him is useless =
To discuss with him this topic is useless =
It is (It's) useless to discuss this matter with him. =
ఈ విషయం అతనితో చర్చించడం నిరుపయోగం.

**b)** Teaching children needs a lot of patience=
పిల్లలకు బోధించేందుకు చాలా ఓర్పు అవసరం=
To teach children needs a lot of patience =
It needs a lot of patience to teach children.

Introductory 'it' తో కొంచెం higher level లో చాలా ideas express చేయొచ్చు

**a)** It requires a lot of effort to scale the mountain=
ఆ పర్వతం ఎక్కేందుకు చాలా ప్రయత్నం అవసరం. (require = రిక్వయ్- క్వ నొక్కి పలుకుతాం= అవసరం. scale= climb up = ఎక్కటం.) =
To scale the mountain requires a lot of effort=
Scaling the mountain requires a lot of effort.
(effort- ఎఫట్- 'ఎ' నొక్కి పలుకుతాం= ప్రయత్నం/ శ్రమ)

**b)** Being here at this time is dangerous =
ఈ సమయంలో ఇక్కడ ఉండటం ప్రమాదకరం =
To be here at this time is dangerous =
It's (it is) dangerous to be here at this time.

**Look at this now:**

**a)** That you are late is surprising =
నువ్వు ఆలస్యం కావటమనేది ఆశ్చర్యంగా ఉంది =
It is surprising that you are late.

అయితే ఇక్కడ infinitive తో sentence ప్రారంభించటం కుదరదు. అయితే ...ing form వాడొచ్చు

Your being late is surprising (are అనేది 'be' form కాబట్టి దానికి being అనేది ...ing form అవుతుంది.

**Important:** That he is late ...ఇలా that తో sentences begin చేయడం spoken English లో అరుదు. ఇలాంటిచోట్ల, introductory 'it' మాత్రమే సహజంగా ఉంటుంది. That తో sentences ను begin చేయటం తెలుసుకోవడం ఉపయోగకరం, అయితే దాన్ని spoken English లో వాడకుంటే మంచిది, it తో ప్రారంభించడమే better.

## EXERCISE 1

**Practise aloud the following using introductory 'it', or introductory 'there'.**

**Sambhu:** జాగ్రత్తగా వేయి ఆ లెక్క. Correct గా ఉండటం ఎప్పటికీ మంచిది.

**Vishnu:** ఇక్కడ దగ్గర దగ్గర వందకు మించి పుస్తకాలున్నాయి. ఒక్కొక్కటి లెక్కించడం అంత సులభంకాదు కదా?

**Sambhu:** నిజమే. దానికి చాలా ఓర్పు కావాలి. కాని మనమేం చేయలేం దాని విషయం.

**Vishnu:** ఇంకేం పద్ధతి లేదా దీన్ని తప్పించేందుకు. ఇప్పుడిది చేయటం అంత ముఖ్యం, అవసరమూనా?

**Sambhu:** Complaint చేయటంవల్ల ప్రయోజనం లేదు. మనం ఇది చేయాల్సిందే.

**Vishnu:** మనం ఇది చేయాల్సిరావటం దురదృష్టకరం. ఏం చేస్తాం. కానియ్.

**ANSWER**

**Sambhu:** Be careful how you count/ count carefully. It is always good to be accurate.

**Vishnu:** There are nearly more than a hundred books here. It isn't easy to count them one by one, is it?

**Sambhu:** That's true. It requires/ needs a lot of patience, but we can't help it.

**Vishnu:** Isn't there any method to avoid this? Is it so important and urgent to do it now?

**sambhu:** There's no use complaining. We have to do it.

**Vishnu:** It is important we have to do it. What can we do. Let's do it then.

పై sentences లో introductory 'it' తో ప్రారంభమైన sentence ను ...ing' form తోగానీ, infinitive తోగానీ ప్రారంభించవచ్చేమో చూడండి.

## EXERCISE 2

**Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1 Cowardice | A slip |
| 2 Durable | B break/ destroy |
| 3 Recur | C throw |
| 4 Lapse | D happen again |
| 5 Smash | E lasting |
| | F fear |

**KEY:** 1 F (పిరికిదనం) 2 E (మన్నికగల- చాలాకాలం ఉండటం- వస్తువులు) 3 D (పునరావృతమవడం/ మళ్లీ మళ్లీ జరగడం) 4 A (పొరపాటు) 5 B (ధ్వంసం చేయటం/ బద్దలు కొట్టటం)



**ప్రశ్న:** *Money, cash, payment, amount.. వీటిని ఎప్పుడు ఎలా ఉపయోగించాలో తెలుపగలరు.*

– ఎం.సత్యనారాయణ, హైదరాబాద్.

**జవాబు:** 1) Money- నాణాలూ, currency రూపంలో (10, 100, 500, 1000 రూపాయల నోట్లలో) ఉన్న డబ్బు Money. ఇది మీ దగ్గర, మీ ఇంట్లో, మీ Bank లో ఉండవచ్చు

2) cash- ఇది కూడా నాణాలు (coins) currency notes (Rs. 10,100 నోట్ల రూపంలో) ఉన్నడబ్బే. ఇది మీ దగ్గర, మీ ఇంట్లో, ఏ ఖర్చుకైనా ready గా ఉన్న డబ్బే. Bank లో మీరు దాచుకున్న డబ్బు, money అవుతుంది కానీ cash కాదుకదా? బయట మీకు అందుబాటులో కానీ, Bank లో కానీ ఉన్న డబ్బు money. ప్రస్తుతం మీ అందుబాటులో మీ దగ్గర/ మీ ఇంట్లో ఉన్న నగదు/ రొఖ్ఖం cash.

3) Payment = ఇది మనం 1) ఇంకొకరికి చేసే చెల్లింపు. 2) చెల్లించిన/ చెల్లించాల్సిన మొత్తం. ఇదిcash (నగదు)గా కావచ్చు, cheque, DD, postal order ద్వారా కావచ్చు

4) Amount = ఎంత డబ్బు అన్నది.
What is the amount you have paid?
(ఎంత/ ఏ మొత్తం డబ్బు చెల్లించావు?)
a) I've paid some amount
కొంత/ కొంత మొత్తం మాత్రమే చెల్లించాను.
b) I have to pay some more amount
నేను ఇంకా కొంత చెల్లించాల్సి ఉంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 359

# Try not to waste a single minute

**Srikar:** (Do) you want to go now?
(ఇప్పుడు వెళ్లాలనుకుంటున్నావా? )

**Sritej:** I have to. My parents intend to leave for Kolkotha next week, and they'd like me to take care of the house when they are away.
(వెళ్లాలి. మా అమ్మానాన్న, కోల్‌కతాకు వెళ్లాలనే ఉద్దేశంతో ఉన్నారు. వచ్చేవారం వాళ్లు లేనప్పుడు నేను ఇల్లు చూసుకోవాలని వాళ్లనుకుంటున్నారు.)

Intend = ఉద్దేశంతో ఉండటం/ ఉద్దేశించటం

**Srikar:** I wish to tell you not to stop practising music. Try not to waste even a single minute. Remember the competitions this month end.
(సంగీతం ప్రాక్టీస్ చేయటం మాత్రం మానకు. ఒక్కక్షణం కూడా వృథా చేయకుండా ఉండేందుకు ప్రయత్నించు. ఈ నెలాఖర్లో పోటీ విషయం గుర్తుంచుకో.)

**Sritej:** I hope to get one of the prizes this time. I am determined to do my best. I've decided to practice at least four hours a day.
(ఈసారి కనీసం ఒక బహుమతి తెచ్చుకోవాలని ఆశిస్తున్నా. నా శక్తికొద్దీ ప్రయత్నించాలనే పట్టుదలతో ఉన్నా. రోజుకు నాలుగు గంటలైనా ప్రాక్టీస్ చేయాలని నిర్ణయించుకున్నా.)

**Srikar:** That's good. Prize or no Prize, practice seriously. Do your best. Effort is all.
(మంచిది బహుమతి వచ్చినా రాకపోయినా, నీ కృషి నువ్వు చెయ్యి. తీవ్రంగా ప్రాక్టీస్ చెయ్యి. ప్రయత్నం లోనే ఉంది అంతా.)

**Sritej:** Gagan has agreed to help me in my practice. Don't worry. I refuse to get discouraged even if I don't get a prize. I shall be satisfied if I can give out my best.
(గగన్ నాకు సాయం చేసేందుకు అంగీకరించాడు. నాకు బహుమతి రాకపోయినా నిరుత్సాహపడను. నా శక్తి కొద్దీ నేను చేయగలిగితే దాంతోనే తృప్తిపడతా.)

**Srikar:** I promise to do my best too, to support you. I'll have my Tabala ready by the time you return. Bye the bye when do you propose to return.
(నా వంతు సాయం నేను చేస్తానని హామీ ఇస్తున్నాను. నువ్వు వచ్చేప్పటికి నా తబలా కూడా సిద్ధంగా ఉంటుంది. అదిసరే, నువ్వెప్పుడు తిరిగి రావాలనుకుంటున్నావు?)

propose = ప్రతిపాదించడం/ అనుకోవడం.

**Sritej:** Depends. I prefer to be here at least a week before the competitions.
(అంతా పరిస్థితుల మీద ఆధారపడి ఉంటుంది/ అంతా అక్కడి పరిస్థితులను బట్టి. పోటీలకు కనీసం వారం ముందు ఇక్కడ ఉండాలనుకుంటున్నా.)

**Srikar:** Ok then.

✪ ✪ ✪ ✪

ఈ lesson లో మనం కొన్ని verbs ను వాడే sentence patterns ను study చేద్దాం. ఇంతకు ముందు lessons లో introductory there, Introductory it తో వచ్చే sentence patterns చూసినట్లు.

**Study the use of the verbs in the conversation above:**

*1) Do you want to go now?*
*2) I have to (go).*
*3) My parents intend to leave for Kolkotta.*
*4) I wish to tell you not to stop.*
*5) Try not to waste a single minute.*
*6) I hope to get one of the prizes.*
*7) I am determined to do my best*
*8) I've decided to practice...*
*9) Gagan has agreed to help me...*
*10) I promise to do my best.*
*11) When do you propose to return.*
*12) I prefer to be here at least a week before the competitions.*

మరోసారి పై sentences ను గమనించండి: వాటిలో ప్రతి verb తర్వాత infinitive (to+ 1st Regular Doing Word) రావడం గమనించండి. ఇది conversational english లో చాలా common pattern. ఇది బాగా practice చేయండి.

All the following verbs are followed by the infinitive (to+ 1st Regular Doing Word).

పై verbs అన్నీ కూడా సందర్భాన్నిబట్టి ఏ tenseలో అయినా వాడవచ్చు. ఇక్కడ infinitive కు అర్థం - 'అని' అనిగానీ, కి/కు అనిగానీ వస్తుంది.

I want to go = వెళ్లాలని.
She is trying to sing = పాడటానికి ప్రయత్నిస్తోంది.

ఈ కింది verbs తర్వాత, Conversation at the beginning of the lesson లో చూపిన విధంగా infinitive వాడవచ్చు.

want, wish, like, hope, begin, start, decide (నిర్ణయించుకోవడం), agree (ఒప్పుకోవడం), promise, offer (ఇవ్వజూపడం/ ఏదైనా పనిచేసేందుకు ముందుకు రావడం), propose (ప్రతిపాదించడం, అనుకోవడం) prefer (ఇష్టపడడం- ఒకదాని కన్నా ఇంకొకటి), refuse (తిరస్కరించడం) ఒప్పుకోకపోవడం, forget (మరచిపోవడం); ఇలాంటివి ఇంకా verbs ఉన్నాయి. మాట్లాడేపుడు మీకు అవి వాటంతట అవే స్ఫురిస్తాయి.

**1) Do you want to go now?**
(వెళ్లాలని అనుకుంటున్నావా? ) want + infinitive

**2) I have to go.**
(నేను వెళ్లాలి.) have + to go - infinitive.

**3) My parents intend to leave.**
(intend + to leave = వెళ్లాలనే ఉద్దేశంలో ఉన్నారు.)

**4) I wish to tell you...**
(wish + to tell = చెప్పాలని కోరుకుంటున్నాను/ అనుకుంటున్నాను.)

**5) Try not to waste a minute.**
(ఒక నిమిషం కూడా వృథా చేయకుండా ఉండేందుకు ప్రయత్నం చెయ్యి.)

Try to learn English = English నేర్చుకోవడానికి ప్రయత్నించు. Try + to learn - Infinitive.

**6) I hope to get one of the prizes.**
(hope + to get - infinitive - బహుమతి పొందుతానని ఆశిస్తున్నా.)

**7) I am determined to do my best.**
(am determined + to do - Infinitive- my best = చేయగలిగినంత చేయాలని కృతనిశ్చయంతో ఉన్నా.)

**8) I've decided to practise.**
(decided + to practise - Infinitive - ప్రాక్టీస్ చేయాలని నిర్ణయించుకున్నా.)

**9) Gagan has agreed to help me.**
(has agreed + to help - Infinitive - సాయం చేసేందుకు ఒప్పుకున్నాడు.)

**10) I promise to do my best.**
(promise + to do = చేస్తానని మాట ఇస్తున్నాను.)

**11) When do you propose to return?**
(propose + to return -Infinitive - తిరిగి రావాలని అనుకుంటున్నావు? )

**12) I prefer to be here.**
(prefer + to be - Infinitive - ఇక్కడ ఉండేందుకు ఇష్టపడుతున్నాను.)

ఇలా Infinitiveను, అని/ కి/ కు అర్థాలతో పై verbs తర్వాత వాడవచ్చు.

**Exercise, Practise aloud in English the following, using the verbs with infinitives wherever possible.**

**Vaibhav:** నాకు ఆ ఫంక్షన్‌కు వెళ్లాలని చాలా ఇష్టంగా ఉంది. నువ్వూ రావడానికి ప్రయత్నించు.

**Prasanth:** నేను కంప్యూటర్ క్లాస్‌కు వెళ్లాలనుకుంటున్నా. ఫంక్షన్ టైమ్‌కు తిరిగి వస్తానని ఆశిస్తున్నా. నేను రాగలిగితే, నీతో వెళ్లటం ఇష్టమే (prefer వాడండి).

**Vaibhav:** సుభాష్ మనల్ని తన కారులో తీసుకెళ్లడానికి సిద్ధమయ్యాడు. అతడితో వెళ్లటం మంచిది కదా.

**Prasanth:** అతడితో వెళ్లేందుకు నేను ఒప్పుకోను. మనకు మన బైక్‌లు ఉన్నాయి కదా?

**Vaibhav:** ఓహ్! నేను నీతో చెప్పడం మరచిపోయాను. నేను నా బైక్‌ను ఓవరాల్ చేయడానికి మెకానిక్‌కు ఇచ్చాను.

**Prasanth:** నా బైక్ ఉంది కదా!

**Vaibhav:** నువ్వు టైమ్‌కి రాకపోతే నేనేం చేయాలి?

**Prasanth:** నేను రాకపోతే నిన్ను తీసుకెళ్లడానికి సుభాష్ ఉన్నాడు కదా?

**Vaibhav:** అయితే అతడితో ఆ విషయం చెప్పాలి కదా? (Have to వాడండి). చెప్పకపోతే నన్ను తీసుకెళ్లేందుకు ఎవరూ ఉండరు.

**Prasanth:** నేను ఫంక్షన్ టైమ్‌కి తిరిగి రావాలనే ప్లాన్ చేసుకుంటున్నాను. రాలేకపోతే ఫోన్ చేస్తాను.

**Vaibhav:** అలాగే!

**ANSWER**

**Vaibhav:** I like very much to attend the function. You try to come as well.

**Prasanth:** I want to go to/attend the computer class. I hope to return by the function time/in time for the function. If I can, I'd like to go with you.

**Vaibhav:** Subhash has offered to take us on his car. It's better to go with him, isn't it?/is n't it better to go with him/ hadn't we better go with him?

**Prasanth:** I refuse to go with him. We have our bikes, haven't we?

**Vaibhav:** Oh, I forgot to tell you. I gave my bike to my mechanic to overhaul it.

**Prasanth:** My bike is there.

**Vaibhav:** What shall/ I do if you fail to return on time.

**Prasanth:** Subhash is there to take you.

**Vaibhav:** But I have to tell him of it. If I don't, none will be there to take me.

**Prasanth:** I am planning to return in time for the function. If I can't I will ring you up and tell you.

**Vaibhav:** OK.

M.SURESAN

**EXERCISE II**
**Match the following**

| A | B |
|---|---|
| 1. Gag | A. Fight |
| 2. Kin | B. Experience |
| 3. Offend | C. Anger |
| 4. Rigid | D. Sibling |
| 5. Undergo | E. muzzle |
| | F. fall |
| | G. stiff |

**KEY:** ★1-E; Muzzle (నోరు నొక్కేయడం- మాట్లాడనీయకుండా)

❍ The government is trying to gag/muzzle the press.
(ప్రభుత్వం వార్తా పత్రికల నోరు నొక్కే ప్రయత్నం చేస్తోంది.)

❍ The robbers gagged the bank staff.
(బ్యాంకు సిబ్బంది నోట్లో దోపిడీ దొంగలు గుడ్డలు కుక్కారు- అరవకుండా.)

Gag - నోట్లో కుక్కే గుడ్డ- అని కూడా అర్థం ఉంది.

★ 2-D; sibling = సహోదరులు - ఒకే తల్లికి పుట్టిన బిడ్డలు - అన్నదమ్ములు, అక్కా చెల్లెళ్లు.

అయితే Kin అంటే మామూలు చుట్టాలనే అర్థం కూడా ఉంది. ఆ అర్థంతో ఎక్కువ వాడతాం.

Kith and Kin = చుట్టాలు/ బంధువర్గం.

★ 3-C; offend = కోపం తెప్పించడం, మనసును గాయపరచడం.

❍ The government's comments on Lord Sri Rama has offended the Hindus.
(శ్రీరాముడి మీద ప్రభుత్వ వ్యాఖ్యలు హిందువుల మనసులను గాయపరిచాయి/ మనోభావాలను దెబ్బతీశాయి.)

★ 4-G; Rigid = గట్టిగా వంగని.

❍ The wooden plank is rigid.
(ఆ చెక్కబల్ల గట్టిగా ఉంది. అది ఎటువంటిదీ అటు వంగదు.)

A pencil is rigid. (పెన్సిల్ వంగదు.)

తమ అభిప్రాయాలను మార్చుకోనివాళ్లు కూడా rigid.

★ 5-B; undergo = అనుభవించడం.

❍ I had to undergo a lot of trouble to get the certificate.
(సర్టిఫికెట్ తెచ్చుకోవడానికి చాలా కష్టపడాల్సి వచ్చింది.)



**ప్రశ్న:** తెలుగులో మామిడి పండు అని, ఇంగ్లిష్‌లో *mango* అని అంటాం. తెలుగులో సునీత, ఇంగ్లిష్‌లో *Sunitha* అని కూడా అంటాం. పదాలు వేరేఅయినా పలకడం ఒకే విధంగా ఎందుకుంది? ఇంగ్లిష్‌లో సునీతని *mango* లాగా ఎందుకు వేరే విధంగా ఎందుకు పిలవకూడదు?

– రఘు, ప్రవీణ, హైదరాబాద్

**జవాబు:** 1) ఒక మనిషి పేరును English లోకి అనువదిస్తే ఆ పేరు తనదని వారికెలా తెలుస్తుంది. English లో ఓ అమ్మాయి పేరు Rose అనుకోండి. ఆ అమ్మాయిని గులాబీ అని పిలిస్తే, ఆమె పలుకుతుందా?

2) మీ పేరు Raghu కదా. English లో రఘుకు మాట ఏంటి? అన్ని పేర్లకూ ఒక భాష నుంచి ఇంకో భాషకు అనువాదం అసాధ్యం కదా?

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

ప్రతిభ

# What do you want me to do?

**Adithya:** So what do you want me to do?
(అయితే నన్నిప్పుడేంచేయమంటావు? )

**Subodh:** Just allow him to stay in the job another month and then decide.
(ఇంకో నెల ఉద్యోగంలో ఉండేందుకు అనుమతించు/ ఉండనీ, ఆ తర్వాత నిర్ణయించు.)

**Adithya:** What then?
(ఆ తర్వాతేంటి? )

**Subodh:** Warn him strictly to mind his behaviour towards the women staff. Tell him to leave them alone or else..
(మహిళా సిబ్బందిపట్ల అతని ప్రవర్తన విషయం గట్టిగా హెచ్చరించు. వాళ్ల విషయం పట్టించుకోవద్దని చెప్పు. లేకుంటే...)

or else= లేకుంటే... ఇలా వదిలేస్తే తీవ్ర పరిణామాలు ఎదుర్కోవాల్సి వస్తుందని చెప్పటం.

**Adithya:** I doubt very much if he will mend. You are asking me to give him another chance. Is that it?
(అతను మారతాడనేది నాకు సందేహమే. ఇంకో అవకాశం ఇమ్మంటున్నావతనికి- అంతే కదా? )

Is that it = అంతేకదా? / అదేకదా? Conversation లో వాడకం ఎక్కువ. Practice చేయండి.

**Subodh:** Yea. But order him strictly just to mind his business.
(అంతే. అయితే తన పనేదో తాను చూసుకుపొమ్మని మాత్రం గట్టిగానే చెప్పు/ ఆజ్ఞాపించు)

**Adithya:** If he doesn't mend?
(అతను మారకపోతే? )

mend/ mend one's ways = ప్రవర్తన మార్చుకోవటం.

**Subodh:** You have the option. Show him the door.
(నువ్వు ఎంచుకునే పద్ధతి ఉంది కదా. బయటికి పంపెయ్.)

**Adithya:** You advise him to be careful then. Tell him you've helped him to stay in the job and that even if you request me to help another time, there won't be any use.
(అయితే అతన్ని జాగ్రత్తగా ఉండమని సలహా ఇవ్వు. నీ సహాయంవల్ల అతనీ ఉద్యోగంలో ఉన్నాడని చెప్పు. అంతేకాకుండా మరోమారు నువ్వు అభ్యర్థించినా ప్రయోజనం ఉండదని చెప్పు.)

**Subodh:** I'll, of course.
(చెప్తాను. తప్పకుండా)

**Adithya:** I wish some one were there to teach my staff elementary behaviour and office etiquette. I want some expert to conduct a workshop on it.
(నా సిబ్బందికి కనీస ప్రవర్తన నేర్పించేందుకెవరయినా ఉంటే బాగుంటుంది. దానిమీద workshop నిర్వహించేందుకెవరయినా కావాలి నాకు.)

Office etiquette - etiquette = manners (ఎటికెట్). Office etiquette - Office లో ఉండాల్సిన manners.

Workshop = ఏదయినా అంశం మీద నైపుణ్యం సాధించేందుకు చర్చించుకుని విజ్ఞానాన్ని పెంచుకొనే సదస్సు.

**Subodh:** That sounds good. We'll think of it.
(అది బాగానే ఉంది. ఆలోచిద్దాం.)

☯ ☯ ☯ ☯

కిందటి lesson లో verbs followed by infinitives, ఉండే sentence pattern చూశాంకదా? (Infinitive = to + 1st Regular Doing Word)

eg: a) She wants to sing
(wants + to sing - infinitive)
b) He likes to go (likes + to go - infinitive)
c) They wish to have some rest
(wish + to have - Infinitive)

ఇలాంటి verbs చాలా చూశాం కిందటి lesson లో. ఇప్పుడు ఈ sentence pattern study చేయండి.

He wants to go =
దీనర్థం అతను వెళ్లాలనుకుంటున్నాడని కదా.
She likes to sing =
ఆమె పాడాలనుకుంటోంది/ ఇష్టపడుతోంది.

పై pattern లో వాడగలిగిన verbs లో చాలావాటిని మనం, ఈ కింది pattern లో కూడా వాడవచ్చు

He wants me to go
(అతను నేను వెళ్లాలనుకుంటున్నాడు)

ఈ pattern:
He (subject) + wants (verb) + me + infinitive

ఇందులో verb కూ infinitive కు మధ్య me రావడం గమనించండి. Compare the following.

a) He wants to go [wants (verb) వెంటనే to go (infinitive) = అతను వెళ్లాలనుకుంటున్నాడు.
b) He wants me to go- [wants (verb) + me (somebody) + to go (infinitive)]

(a) లోవలె కాకుండా, (b) లో verb వెంబడే infinitive రావడం లేదు. మధ్యలో somebody (me/ him/ her/ them/ us, Prasad, Sita, etc) or something (the bus/ the car) trouble/ the problem/ the disease) వస్తోంది గమనించండి.




ఇది చాలా తరచుగా వచ్చే pattern, spoken English లో.

ఇలాంటి pattern, you can see in the conversation at the beginning of the lesson.

***Look at the following sentences from the conversation above:***

1) What do you want me to do?
[ Want - verb + me (somebody) + to do - infinitive ] = నన్నేం చేయమంటావు?
2) (You) warn him strictly to mind..
[ Warn (verb) + him (somebody) + to mind (infinitive) ]
3) You are asking me to give him...
[ are asking (verb) + me (somebody) + to give (infinitive) ]
4) Order him to mind his business
[ Order (verb) + him (somebody) + to mind (infinitive) ]
5) You advise him to be careful.
[ advise (verb) + him (somebody) + to be (infinitive) ]


M.SURESAN

6) ... you request me to help him [request (verb) + me (somebody) + to help (infinitive)]
7) I wish someone to conduct a workshop
[ wish (verb) + someone (somebody) + to conduct (infinitive) ]

చూశారుగదా, spoken English లో చాలా తరచుగా వచ్చే sentence pattern ఇది.

మరోసారి, verb + infinitive pattern కూ, verb + somebody+ something pattern కూ తేడా చూడండి.

1 a) Do you want to sing? (verb + infinitive) =
నువ్వు పాడాలనుకుంటున్నావా?
b) Do you want her to sing? (want + her (somebody) + to sing (infinitive) =
(నువ్వు ఆమె పాడాలనుకుంటున్నావా? )

2 a) I like to stay =
నేనుండేందుకు ఇష్టపడుతున్నా.
b) I like her to stay =
నేనామె ఉండాలని ఇష్టపడుతున్నా.

ఇలాంటి verbs questions, not తో కూడా వాడతాం.

3 a) Do you advise me to wait?
(నేను కాసేపుండాలనా నీ సలహా? )
[ advise (verb) + me (somebody) + to wait (infinitive) ]
b) When do you expect the bus to arrive?
[ do expect (verb) + the bus (something) + to arrive (infinitive) ] = Bus ఎప్పుడొస్తుందని అనుకుంటున్నావు?

కింది verbsను ఈ patternలోవాడి practice చేయండి.

Advise (సలహా ఇవ్వడం), allow (అనుమతించటం) ask (అడగటం), beg (బతిమాలటం), command (ఆజ్ఞాపించడం), compel (బలవంతం చేయడం), encourage (ప్రోత్సహించటం), force (బలవంతం చేయడం) help, instruct (=teach), invite, request, teach etc.

## EXERCISE

**Practise the following aloud in English.**

**Gopi:** లక్ష్మణ్‌ను నేనిక్కడికి రమ్మన్నాను. అతనింకా రాలేదు. (tell/ ask వాడండి)
**Anil:** నేను కూడా అతను వస్తాడనే అనుకుంటాను (expect వాడండి)
**Gopi:** అతను తనకు ఈత నేర్పమని అన్నాడు. (want, teach వాడండి)
**Anil:** నన్ను కూడా request చేశాడు.
**Gopi:** వాళ్ల నాన్న అతను ఈత నేర్చుకోవడం అనుమతించడట. అందుకని మనల్నది రహస్యంగా ఉంచమని అన్నాడు (want వాడండి/ like అయినా సరే)
**Anil:** అయితే మనం జాగ్రత్తగా ఉండాలి. అలా అయితే నేనతన్ని నేర్చుకునేందుకు ప్రోత్సహించను. వాళ్ల నాన్న అనుమతి తీసుకుని రమ్మని సలహా ఇస్తా.
**Gopi:** మరీమరీ బతిమాలుతున్నాడు నేర్పించమని. ఈత నేర్చుకునేందుకు సాయపడదాం.
**Anil:** నాకయితే ఇష్టంలేదు.
**Gopi:** సరే, చూద్దాం.

## ANSWER

**Gopi:** I have told/ asked Lakshman to come, but he hasn't.
**Anil:** I expect him to come too.
**Gopi:** He wanted me to teach him to swim. (Teach him swimming అనొచ్చు)
**Anil:** He requested me too.
**Gopi:** It seems his dad doesn't allow him to learn swimming. So he wants/ likes us to keep it a secret.
**Anil:** Then we should be careful. In such a case I don't encourage him to learn swimming. I'd advise him to get his dad's permission.
**Gopi:** He is begging us to teach him. Let's help him to learn.
**Anil:** I don't like it.
**Gopi:** OK. Let's see.




**ప్రశ్న:** కిందివాటికి తెలుగు వాక్యాలు తెలుపగలరు. (గ్రామర్ రూల్స్ అవసరం లేదు.
*1. He thinks 2. He is thinking*
*3. He has thought*
*4. He has been thinking*
*5. He thought 6. He was thinking*
*7. He had thought*
*8. He had been thinking*
*9. He will/ shall think*
*10. He will/ shall be thinking*
*11. He will/ shall have thought*
*12. He will/ shall have been thinking.*
– ఎం.మదన్‌మోహన్‌రావు, మిర్యాలగూడెం

**జవాబు:** 1) He thinks = అతను అనుకుంటాడు (మామూలుగా)/ అతను అనుకుంటున్నాడు (ఇప్పుడు) [ఆలోచిస్తాడు (మామూలుగా)/ ఆలోచిస్తున్నాడు (ఇప్పుడు)]
2) He is thinking - is thinking- present continuous form - is/ are thinking - ఇవి question form లో మాత్రమే వస్తాయి. He is thinking వాడం- He thinks అనే అంటాం.
3) He has thought= a) అతను అనుకున్నాడు/ ఆలోచించాడు (గతంలో) (He has thought of buying a house/ of a new plan.)
b) ఇంతవరకూ అనుకున్నాడు/ ఆలోచించాడు.
He has thought that I am a fool, but now he knows he has made a mistake.
4) He has been thinking = గతంలో ఒక సమయం/ సంఘటన నుంచి ఇప్పటివరకూ, ఇంకా అనుకుంటున్నాడు/ ఆలోచిస్తున్నాడు. Has been thinking అరుదుగా వాడతారు. Has thought ఎక్కువ, ఇదే అర్థంతో.
5) He thought- గతంలో ఒక సమయంలో ఆలోచించాడు/ అనుకున్నాడు.
6) He was thinking- గతంలో కొంత కాలంపాటు అనుకుంటున్నాడు (అనుకునేవాడు)/ ఆలోచించేవాడు.
7) He had thought- past లో ఒక సంఘటన ముందు అనుకున్నాడు/ ఆలోచించాడు.
He had thought so before I corrected his opinion
(నేనతన్ని correct చేసే ముందు అలా అనుకున్నాడు.)
8) He had been thinking so until I corrected him =
అతన్ని నేను correct చేసే వరకు అలానే అనుకుంటూండేవాడు
9) He will/ think = అనుకుంటాడు/ ఆలోచిస్తాడు future లో.
10) He will/ be thinking = అలా ఆలోచిస్తూ ఉంటాడు (future లో ఒక సమయంలో ఆలోచన continue అవటం).
11) He will have thought = future లో ఒక time కు ముందు, ఆలోచించి ఉంటాడు.
By this day next week he will have thought that I helped you.
(అలా అనుకుని ఉంటాడు).
12) He will have been thinking - future లో ఒక సమయానికి ముందు నుంచి ఆ సమయం వరకూ ఆలోచిస్తుంటాడు.
By this time tomorrow, he will have been thinking about it.
గమనిక: Verb think కదా. మన ఆలోచనకు సంబంధించింది. ఒకరు ఆజ్ఞాపిస్తే మనం ఆలోచించం. అందుకని He subject అయినప్పుడు think లాంటి verb ను shall తో వాడం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ



# I would have him help me

**Anant:** Did you see Damodar anywhere around? (It's) days since I met him.
(దామోదర్ ఏమన్నా కనిపించాడా నీకు? అతడిని చూసి రోజులైంది.)

**Jagan:** Yea. I saw him shopping at the super market last evening. What's the matter?
(సూపర్‌మార్కెట్లో నిన్న సాయంత్రం ఏదో కొంటూ ఉండగా చూశానతడిని. ఏమిటి విషయం?)

**Anant:** I heard him tell Lalith he would be out of town for a few days. Do you know anything about it?
(కొన్నిరోజులు ఊర్లో ఉండనని లలిత్‌తో చెప్పంటే విన్నాను. నీకేమైనా తెలుసా ఆ విషయం?)

**Jagan:** I observe you show a lot of interest in Damodar nowadays. What could be the reason?
(దామోదర్ పట్ల నువ్వు ఈ మధ్య చాలా ఆసక్తి చూపుతుండటం నేను గమనిస్తున్నాను. ఏమిటి కారణం?)

**Anant:** Just nothing. Of late I have noticed him doing very well in computers. I would have him help me; that's all.
(ఈ మధ్య అతను కంప్యూటర్స్ బాగా చేయడం గమనించాను. అతని సాయం తీసుకోవాలని అనుకున్నా. అంతే.)

**Jagan:** I observe him helping others liberally. I find him the helping sort.
(ఇతరులకు అతను ఉదారంగా సాయం చేయడం నేను గమనించాను. అతను సాయపడే రకమే.)

**Anant:** The other day I watched him doing a program on the system. I found him do it effortlessly and very fast. He's really brilliant.
(మొన్నొక రోజు అతను కంప్యూటర్ మీద ఏదో ప్రోగ్రామ్ చేస్తుంటే చూశాను. చాలా సులువుగా చేయడం గమనించాను. నిజంగా ఆ విషయంలో చాలా చురుకు అతను.)

effortlessly= ప్రయత్నం చేసినట్లు కనిపించకుండా ఉండటం

He acts effortlessly= అతను అప్రయత్నంగా నటించేస్తాడు = అతనికి నటన అప్రయత్నంగా వస్తుంది = అతను నటించేటప్పుడు ఏదో నటించాలని ప్రయత్నించినట్లు ఉండదు.

**Jagan:** Is he so good at it? I haven't known it. I just thought he knew his computers.
(ఓ అంత బాగా చేస్తాడా? ఏదో కంప్యూటర్స్ బాగా తెలుసనే అనుకుంటున్నా.)

**Anant:** Before he leaves town, I wish to have his help on a project. Let me go find him.
(అతడు వెళ్లే ముందు ఓ ప్రాజెక్ట్ విషయంలో అతడి సహాయం కావాలి. అతనెక్కడున్నాడో వెతికి పట్టుకుంటా.)

**Jagan:** OK.

*Look at the following sentences from the dialogue above:*

*1) I saw him shopping at the supermarket.*
*2) I heard him tell Lalith he would be out of town.*
*3) I observe you show a lot of interest in ...*
*4) ...I've noticed him doing very well in computers.*
*5) I would have him help me.*
*6) I observe him helping others liberally.*
*7) I watched him doing a program.*

**Look at the verbs in the sentences above:**

1) saw (see)
2) heard (hear)
3) observe (గమనించడం)
4) have noticed (notice = గమనించడం)
5) have
6) watched (watch-అదే పనిగా చూడటం)

గమనించే ఉంటారు. ఇవన్నీ కూడా మన బాహ్యేంద్రియాలకు సంబంధించిన verbs (verbs of sense perception. Sense = బాహ్యేంద్రియం- కన్ను/ ముక్కు/ చెవి/ నాలుక/ చర్మం, perception = గ్రహణశక్తి.

ఈ verbs ను అంటే see/ hear/ watch etc. లను వాడేటప్పుడు, వీటి తర్వాత ...ing form గానీ, 1st Regular Doing Word (come, go, walk etc.,) వాడవచ్చు; అంటే ఈ pattern లో:

see/ hear/ watch + ... ing form/ 1st Regular Doing Word (Ist RDW): అలా వాడినప్పుడు వచ్చే అర్థం; ఒక పని జరుగుతుండగా చూడటం, ఒకరు చెప్తుండగా వినడం, ఏదైనా జరుగుతుంటే గమనించడం... ఇలా వస్తుంది. ఇది కూడా spoken English లో తరచూ వినిపించే sentence pattern: ఇప్పుడు కొన్నింటి గురించి చూద్దాం.

**See:** a) I see him walking this way every morning.
ప్రతి ఉదయం అతనిలా నడిచి వెళ్లడం నేను చూస్తాను/ నడుస్తూ నాకు కనిపిస్తాడు. (See + Somebody/ something + ... ing form)

ఈ sentence లో, see him తర్వాత, ... ing form బదులు 1st RDW (go, walk, etc) కూడా వాడవచ్చు దాదాపు పై అర్థంతో.

b) I see him walk this way every morning.
[see + somebody/ something + walk (1st RDW)]

c) They saw the train leaving/ leave (...ing form + 1st RDW) the station =
రైలు స్టేషన్ వదులుతున్నప్పుడు/ వదులుతుండగా వాళ్లు చూశారు.

d) If anyone sees you doing/ do this, (...ing form 1st RDW) they will report to the police.
(నువ్విలా చేస్తుండగా/ చేయటం ఎవరన్నా చూస్తే పోలీస్‌లతో చెప్తారు).

**Hear** కూడా ఇదే పద్ధతిలో వాడొచ్చు

a) I heard the bell ringing/ bell ring (...ing form/ 1st RDW) =
గంట మోగడం నాకు వినిపించింది.

b) He heard you saying/ say (...ing form/ 1st RDW) that he was wrong.
నువ్వు అతడిని తప్పు అంటుండగా/ అనటం అతడు విన్నాడు/ అతడికి వినిపించింది.

**watch** = గమనించి చూడటం.

a) The police watched the thief entering/ enter the bank (...ing form / 1st RDW) =
దొంగ బ్యాంకులోకి వెళ్తుండగా/ వెళ్లడం పోలీసులు గమనించి చూశారు.

b) He watched her leaving/ leave (...ing form/ 1st RDW) and escaped =
ఆమె గదినుంచి బయటకు వెళ్లడం/ వెళుతుండగా గమనించి అతడు పారిపోయాడు.

**listen to**:

He listened to her singing/ sing for a few minutes and selected her for singing in his movie =
ఆమె పాడుతుండగా/ పాడటం కొద్ది నిమిషాలు విని, తన సినిమాలో పాడేందుకు తీసుకున్నాడు.

listen to తర్వాత కూడా, ...ing form/ 1st RDW.
Hear= మనకు వినిపించడం.
listen to= మనం ప్రయత్నం చేసి వినడం.

I hear some noise =
ఏదో శబ్దం వినిపిస్తోంది.

I am listening to you =
నువ్వు చెప్పేది నేను వింటున్నా.

ఈ pattern లో వచ్చే verbs మరికొన్ని; notice, have (చేయించడం లాంటి అర్థంతో)


M.SURESAN

**observe** = గమనించడం

a) I observe him studying/ study (...ing form/ 1st RDW) late in to the night =
అతను రాత్రి పొద్దుపోయేదాకా చదువుతుండటం/ చదువుతుండగా నేను గమనించాను.

b) He observes her walking/ walk by his home every morning (... ing form/ 1st RDW)=
ప్రతి ఉదయం ఆమె వాళ్లింటి మీదుగా వెళ్లటం అతను గమనిస్తాడు.

**smell** = వాసన రావడం (వాసన చూడటం కాకుండా)

a) Do you smell something burning/ burn (...ing form/ 1st RDW)=
ఏదో కాలుతున్న వాసన వస్తోందా నీకు?

b) If he smells the food cooking/ (...ing form/ 1st RDW) his appetite increases =
వాడికి వంట వాసన వస్తే తినాలనే కోరిక ఎక్కువవుతుంది.

appetite - ఆపిటైట్ - ఆ, ant లో a లాగ - ఆ నొక్కి పలుకుతాం= తినాలనే కోరిక

**EXERCISE**

**Kripal:** నువ్వు రోజూ పొద్దున్నే ఇలా వెళ్లడం చూస్తాను, ఎక్కడికి వెళ్తావు?

**Dayal:** నన్ను నువ్వు గమనించడం కూడా నేను చూస్తాను. నేను computer class కు వెళతాను.

**Kripal:** నీకేదో job వచ్చినట్లు నీ cousin చెప్పగా విన్నాను. నిజమేనా?

**Dayal:** నిజమే, నీకు అతను చెప్పడం నేను విన్నాను.

**Kripal:** Congrats! నీ ముఖం సంతోషంతో వెలిగిపోవడం నేను గమనిస్తున్నా.
(observe వాడటం; వెలగటం=glow)

**Dayal:** నేను మా నాన్న వేకువనే లేచి చదవడం గమనించేవాడిని. అదే నేను అలవాటు చేసుకున్నా. అదే నా విజయానికి కారణం అనుకుంటున్నా.

**ANSWER**

**Kripal:** Every morning I see you going/ go this way. Where do you go?

**Dayal:** I see you observing me/ observe me too. I go to computer classes.

**Kripal:** I heard your cousin telling/ tell me about a job you've got. Is it true?

**Dayal:** Yea. I heard him telling you/ tell you.

**Kripal:** I observe your face glowing/ glow with joy.

**Dayal:** I used to watch my father get up/ getting up early in the morning and studying. I thing that's the reason for my success.

---

**ప్రశ్న:** When should be used the following sentences, could you please clarify by all means?

1) Sonia Gandhi is due to arrive Kashmir.
2) Sonia Gandhi is bound to arrive Kashmir.
3) Sonia Gandhi is likely to arrive Kashmir.
4) Sonia Gandhi is to arrive Kashmir.
5) Sonia Gandhi has to arrive Kashmir.
6) Sonia Gandhi is about to arrive Kashmir.

– బి. ఆదిశేషయ్య, కర్నూలు

**జవాబు:** In all the sentences in your list, arrive must be followed by in.

Now for the meanings for the sentences:

1) Sonia Gandhi is due to arrive... = She is expected to arrive/ we expect her to arrive/ Arrangements have been made for her visit (In fact, we are waiting for her arrival)

2) Sonia Gandhi is bound to arrive.. = She is certain / sure to arrive - no doubt about it.

3) Sonia Gandhi is likely to arrive = There are good chances / There is a probability of her arriving (There are chances of her not arriving as well. There is a slight doubt about her arrival)

4) Sonia Gandhi is to arrive = She will surely arrive here.

5) Sonia Gandhi has to arrive = Sonia Gandhi is ordered to come here or has the necessity to come here, so she must come. The sentence, though grammatically correct, doesn't suit/ is not applicable to a person of Ms Gandhi's status - nobody can compel her to arrive in Kashmir. No necessity either, for her to arrive.



6) Sonia Gandhi is about to come here = Ms Gandhi is arriving in a short time.

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 362

# She let me believe so

**Sampada:** What makes you think so?
(నిన్ను అలా ఆలోచించేలా చేసేదేమిటి? / నువ్వెందుకలా అనుకుంటున్నావు? )

**Arpitha:** Think what? (ఏమని? )

**Sampada:** That Archana will help you solve the problem.
(ఆ సమస్య తీర్చడంలో అర్చన సాయపడుతుందని)

**Arpitha:** She let me believe so. She said she would discuss the matter thoroughly with me and help me arrive at a solution.
(అలా అని నమ్మించింది. తను నాతో ఆ విషయం పూర్తిగా చర్చించి ఒక సమస్య తీరేందుకు సాయపడతానంది.)

**Sampada:** That really surprises me. I haven't known Archana spend so much time on a friend. Never known her help any one.
(అది నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. అర్చన తన స్నేహితులకోసం అంత సమయం వెచ్చించడం నాకు తెలియదు. తనెప్పుడూ ఇంకొకళ్లకు సాయం చేయడం నాకు తెలియదు.)

**Arpitha:** She surprised me too. I haven't even expected her to be interested in my problem. Of late, however, I've noticed her take an interest in others.
(తను నన్ను కూడా ఆశ్చర్యపరిచింది. నా సమస్యలో తను ఆసక్తి చూపుతుందని కూడా నేననుకోలేదు. అయితే ఈ మధ్య తను ఇతరుల విషయంలో ఆసక్తి చూపడం గమనించాను.)

of late = lately = ఈ మధ్య. Late (ఆలస్యం)కూ, of late/ lately కి సంబంధంలేదు.

**Sampada:** You are lucky then. If she wants to help she will help. She's that type.
(నువ్వు అదృష్టవంతురాలివే. అనుకుంటే తప్పక సాయంచేస్తుంది తను. తను ఆ రకం.)

**Arpitha:** You know she wouldn't even have me stay alone in my room. She suggests that I move to her place. That's still more surprising. Of course I told her that I wouldn't have her have trouble on my account.
(ఇంకా తెలుసా, నన్ను నా room లో ఒంటరిగా ఉండనివ్వనని కూడా అంది. నన్ను వాళ్ల ఇంటిలో ఉండమంది. అది ఇంకా ఆశ్చర్యకరం. అయితే నేను చెప్పాననుకో, నావల్ల తనకేం బాధలుండేందుకు ఒప్పుకోనని.)

on my account = నావల్ల, on (some body's) account = ఒకరి వల్ల.

**Sampada:** Any way, I am happy that you have the help from the right person.
(ఏదేమైనా, నువ్వు సరైన వ్యక్తి నుంచి సాయం పొందుతున్నందుకు నాకు సంతోషంగా ఉంది.)

☯ ☯ ☯ ☯

కిందటి lesson లో verbs of sense perception (బాహ్యేంద్రియాలకు సంబంధించిన verbs) - see, hear, smell, etc. ను కింది pattern లో వాడొచ్చని తెలుసుకున్నాం.

verb + somebody/ something + Ist Regular Doing Word (Ist RDW)/ ...ing form

eg: a) He saw the teacher enter/ entering the class. ఈ sentence లో verb pattern:
saw (verb) + the teacher + enter (I RDW)/ entering (...ing form)

b) I hear her sing/ singing in the mornings.
hear (verb) + her (somebody) + sing (I RDW)/ singing (...ing form)

ఈ pattern లో మనం వాడగల మరికొన్ని verbs (other than verbs of sense perception) ఈ lesson లో చూద్దాం.

***Look at the following sentences from the conversation above.***

*1) Archana will help you solve your problem*
*2) She let me believe so*
*3) ... would help me arrive at a solution*
*4) I haven't known Archana spend so much time on a friend.*
*5) Never known her help any one*
*6) ... I've noticed her take an interest in others.*
*7) She wouldn't have me stay alone*
*8) I wouldn't have her have any trouble on my account.*

**1) and 3) Help** - ఈ verb ను రెండు విధాలుగా వాడతాం.

**a)** Help + somebody + to do (infinitive) + something

**b)** Help + somebody + do (1st Regular Doing Word) + something

eg: a) Will you help me to carry this box? =
b) Will you help me carry this box?


M.SURESAN

చూశారు కదా? sentence a) లో help + somebody + to carry (Infinitive). అదే sentence b) లో help + somebody + carry (1st RDW) - ఈ రెండింటి అర్థం ఒకటే.

అయితే, help ను ఇలా వాడినప్పుడు ...ing form రాదు.

**2) let** - దీనర్థం మీకు తెలుసు- allow (సమ్మతించడం)/ ఓ పని చేయనివ్వటం.

a) He let me in to the room= He allowed me into the room = అతడు నన్ను room లోనికి అనుమతించాడు/ రానిచ్చాడు.

b) Let him go = అతన్ని వెళ్లనీ.

c) Let me look at it = నన్ను దాన్ని చూడనీ.
ఈ sentences లో subject- you.
Let ను వాడే pattern: Let + somebody/ something + 1st RDW.

d) The teacher lets us ask questions- lets (verb) + us (somebody) + ask (1st RDW)= teacher మమ్మల్ని ప్రశ్నలడగనిస్తుంది.

e) Why don't you let me talk? (నన్నెందుకు మాట్లాడనివ్వవు? )- do let (verb) + me (somebody) + talk (1st RDW)

f) He let the child tear the book. (ఆ బిడ్డను పుస్తకాన్ని చింపనిచ్చాడు/ ఆ బిడ్డ పుస్తకాన్ని చింపడం ఆపలేదు) Let (verb) + the child (somebody) + tear (I RDW)

g) He let the car gather dust (ఆ కారును దుమ్ము కప్పేట్టు/ పట్టేట్టు/ కారు పాడైపోతున్నా పట్టించుకోలేదు. - Let (verb) + the car (something) + gather (1st RDW). అయితే let తర్వాత ...ing form రాదు. Only 1st RDW.

**4, 7 and 8): Have**- Have కు ఇలాంటి sentences లో అర్థం- allow (ఓ పని చేయనివ్వటం/ చేయనివ్వకపోవటం- not have అయితే).

a) I can't have you spending all that money= I can't allow you to spend all that money=
నువ్వంత డబ్బు ఖర్చుపెట్టడం నేనొప్పుకోను/ నిన్నంత డబ్బు ఖర్చుపెట్టనివ్వను.
ఇప్పుడు చూడండి.

b) The principal won't (will not) have us waste/ wasting our time. (Principal మన time వృథా చేయనివ్వడు)
Will have (verb) + us (somebody) + waste (I RDW)/ wasting (...ing form)

c) I will have you sing/ singing that song again and again (నేను నీతో ఆ పాట మళ్లీ మళ్లీ పాడించుకుంటా)

Have ను ఈ అర్థంతో, ఈ pattern లో వాడటం spoken English లో చాలా common.

d) She has her friend come and stay with her.
Has (verb) + friend (somebody) + come ... (1st RDW) = తన స్నేహితురాలు తన దగ్గరకు వచ్చి తనతో ఉండాలని ఆమె కోరిక.

**5) Know.** ఇది కూడా ఈ pattern లో అంటే Verb + somebody/ something + 1st RDW/ ...ing form లో వాడవచ్చు

a) I have known her helping/ help a number of people.
(ఆమె చాలా మందికి సహాయపడటం నాకు తెలుసు)
Have known (verb) + her (somebody) + helping (...ing form)/ help (I RDW)

b) No one knew him giving/ give any trouble for others- అతను ఇతరులకు కష్టం కలిగించటం అనేది ఎవరికీ తెలియదు (కలిగించలేదు)
Knew (verb) + him (somebody) + giving (...ing form)/ give (1st RDW)

**6) Noticed**- ఇది see, observe లాగా వాడవచ్చు
I noticed her work/ working late in to the night.= ఒకరితో ఒక పని చేయించడం అనే అర్థంతో make వాడినప్పుడు కూడా ఈ pattern వస్తుంది. అయితే ...ing form రాదు.

a) He made me walk to school.
(School కు నడిపించాడు)

b) Teachers should make students study.
(Teachers విద్యార్థులను చదివించాలి/ చదివేలా చేయాలి)

తరచూ ఇలాంటి sentences లో make తర్వాత infinitive వాడుతుంటారు. అది సరికాదు.

**EXERCISE**

**Practise the following aloud in English**

**Sekhar:** నువ్వక్కడికి ఎందుకు వెళ్లాల్సి వచ్చింది? (make- go వాడండి)
**Chakri:** అతడి room సర్దడంలో సహాయపడేందుకు వెళ్లా (సర్దడం= tidy up)
**Sekhar:** నిన్ను తన వస్తువులు ముట్టుకోనిచ్చాడా అతను?
**Chakri:** నిన్ను అతడి గురించి అలా మాట్లాడనివ్వను నేను.
**Sekhar:** అతనంటే నువ్వు ఇష్టపడటం నేను గమనించాను. నన్ను నువ్వు support చేయటం నాకు తెలియదు.
**Chakri:** I'm sorry. నువ్వు నన్నలా అపార్థం చేసుకోనివ్వలేను నేను.
**Sekhar:** Doesn't matter. మనం ఏదన్నా సినిమాకు వెళదాం పద.
**Chakri:** అది నాకిష్టమే.

**ANSWER**

**Sekhar:** What made you go there?
**Chakri:** I went there to help him (to) tidy up his room.
**Sekhar:** Did he let you touch any of his things?
**Chakri:** I won't have you talk/ talking of him like that.
**Sekhar:** I've noticed you like him/ liking him. I haven't known you support/ supporting me.
**Chakri:** I'm sorry. I can't have you misunderstand/ misunderstanding me like that.
**Sekhar:** Doesn't matter. Let's go to a movie.
**Chakri:** That suits me fine.



**ప్రశ్న:** రెన్ అండ్ మార్టిన్ హైస్కూల్ ఇంగ్లిష్ గ్రామర్ అండ్ కాంపోజిషన్ పుస్తకంలో Nouns గురించి వివరిస్తూ exercise లో ఒక ప్రశ్నను ఈ విధంగా ఇచ్చారు.
Point out the Nouns and say whether they are common, proper, collective or abstract.
1. He gave me a bunch of grapes.
పై వాక్యానికి ఇచ్చిన key లో bunch ను collective noun గా, grapes ను common noun గా విడివిడిగా పేర్కొన్నారు. కానీ ఇక్కడ a bunch of grapes అంటే ద్రాక్ష గుత్తి అని ఒకే అర్థం వచ్చినప్పుడు a bunch of grapes అనే phrase మొత్తాన్ని collective noun గా చెప్పవచ్చు కదా? bunch ని grapes ని విడదీసి చెప్పాలా? అదే పుస్తకంలో collective noun అంటే a collection of persons or things taken together and spoken as one whole అని నిర్వచించారు. దీని ప్రకారం a bunch of grapes అనే phrase మొత్తాన్ని collective noun గా చెప్పవచ్చు కదా! వివరించగలరు.

*– ఎం. శంకర్, అశ్వాపురం*

**జవాబు:** Noun అనేది ఎప్పుడూ ఒకే word; a group of words కాదు. కాబట్టి a bunch of grapes మొత్తాన్ని Noun గా తీసుకోం. Noun అంటే ఒకే word కనుక, bunch ని వేరేగా, grapes ని వేరేగా తీసుకుంటాం. అప్పుడు bunch, collective noun; grapes, common noun అవుతాయికదా. అయితే a bunch of grapes అనేది phrase (a group of words without a verb) కాబట్టి, అది noun లా function చేస్తుంది కాబట్టి, దాన్ని Noun phrase అంటాం. Definition ప్రకారం కూడా A collective noun is the name given to a collection of persons or things taken together or spoken as one కదా. అప్పుడు ఈ phrase లో bunch మాత్రమే, a collection. Grapes కాదుకదా?

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# She beat him blue and black

**Sriram:** You keep your room clean. I really appreciate you for that.
(నీ గది చాలా శుభ్రంగా ఉంచుకుంటావు. అందుకు నిన్ను నేను మెచ్చుకుంటాను.)

**Gopal:** Oh, thank you. I feel out of sorts if I find the place untidy. I want the place always clean and tidy.
(Thanks. గదిలో వస్తువులు చిందరవందరగా పడి ఉంటే నాకు చిరాగ్గా ఉంటుంది. నా రూమ్ ఎప్పుడూ శుభ్రంగా ఎక్కడుండాల్సిన వస్తువు అక్కడుండటం నా కోరిక.)

tidy = (వస్తువులు) ఉండాల్సినచోట ఉండటం

**Sriram:** It drives me mad too if I find things thrown about. The other day Sekhar perhaps walked in rain. He got his shoes muddy and just walked into my room.
(వస్తువులన్నీ చెల్లాచెదురుగా పడి ఉంటే నాకూ పిచ్చెత్తినట్టుంటుంది. మొన్నొకరోజు శేఖర్ వర్షంలో నడిచి వాడి చెప్పులకు బురద అంటించుకున్నాడు. బురద చెప్పులతో నా గది లోకి నడిచి వచ్చాడు.)

**Gopal:** He has all bad manners. I have observed him opening his mouth wide whenever he yawns even when we are in a serious discussion.
(అతడికి సభ్యతలేదు. ఆవులిస్తే నోరంతా తెరిచేస్తాడు, ఏదైనా ముఖ్య విషయం మాట్లాడుతున్నప్పుడు కూడా.)

**Sriram:** That's true. The other day at dinner he was licking his fingers clean as he ate. It made me really sick to watch him to do it.
(అది నిజమే. మొన్న dinner లో వేళ్లంతా శుభ్రంగా నాకేస్తున్నాడు. అది చూసి నాకు వాంతొచ్చింది/ డోకొచ్చింది.)

lick= నాకటం. sick= వాంతి పుట్టడం/ డోకు రావడం. sick కు ఇంకో అర్థం మనకు తెలిసిందే- జబ్బుగా ఉండటం.

**Gopal:** Such things really turn me red too.
(అలాంటివి నాకు నిజంగానే కోపం తెప్పిస్తాయి.)

turn red = కోపంతో ఎరుపెక్కటం

**Sriram:** When I see him do such things, I feel like beating him black and blue.
(అతనలాంటివి చేసినప్పుడు, నాకు నిజంగా వాడిని చితకబాదాలనిపిస్తుంది.)

**Gopal:** By the way, will you take me to Satyam? He has promised me some books that I need for my record work. I need them urgently. I don't know his home. Take me there.
(అది సరే, నన్ను సత్యం దగ్గరికి తీసుకెళతావా? వాడు నాకు కొన్ని పుస్తకాలిస్తానన్నాడు. అవి నా record work కు అవసరం. వాడిల్లు నాకు తెలియదు. నన్నక్కడికి తీసుకెళ్లు.)

**Sriram:** OK. Let's go.
(అయితే పద.)

☺ ☺ ☺ ☺ ☺

Conversational English లో అతి తరచుగా వినిపించే sentence patterns మరికొన్ని ఈ lesson లో చూద్దాం.

***Look at the following sentences from the conversation above:***

*1. You keep your room clean.*
*2. I feel out of sorts if I find the place untidy.*
*3. I want (to have) the place clean and tidy.*
*4. It drives me mad too... if I find the place untidy.*
*5. He got his shoes muddy.*
*6. I have observed him opening his mouth wide.*
*7. He was licking his fingers clean.*
*8. It made me really sick.*
*9. Such things really turn me red.*
*10. I feel like beating him black and blue.*

Like, find, drive, get, observed, lick, make, turn, feel- ఇలాంటి verbs ను ఉపయోగించేటప్పుడు పైన తెలిపిన pattern లో sentences వాడటం spoken English లో చాలా తరచుగా వినిపిస్తుంది. ఇది తక్కువ మాటలతో ఎక్కువ భావాన్ని స్ఫురింపచేస్తుంది.

ఈ pattern ఇలా ఉంటుంది.

verb + somebody/ something + adjective (గుణాన్ని, స్థితిని తెలిపే పదం)-

(Adjectives కు- ఉన్న, ఉన్నటువంటి, ఐన, ఐనటువంటి అనే అర్థాలు వస్తాయి. వీటిని గుర్తించటం చాలా సులభం. eg: happy = సంతోషంగా ఉన్న/ సంతోషకరమైన, long= పొడవైన, clever= తెలివైన, తెలివిగల, soft = మెత్తనైన, etc- ఇవన్నీ adjectives. ఒక మనిషి/ ఒక వస్తువు గుణాన్ని/ ఉండే స్థితిని తెలిపేవి. ఎలాంటి వస్తువు, ఎలాంటి మనిషి, ... ఇలా దేనికైనా ఎలాంటి అని ప్రశ్న వేసుకుంటే వచ్చే జవాబు adjective.

eg: AP is a big state- ఆంధ్రప్రదేశ్, ఎలాంటి రాష్ట్రం? - పెద్ద రాష్ట్రం. కాబట్టి పెద్ద (big) adjective.

The car is beautiful - car ఎలాంటిది? / ఎలా ఉంది? beautiful (అందం)గా ఉంది. కాబట్టి beautiful- adjective.

పై sentences అన్నింటిలో verbs ను ఎలా వాడామో గమనించండి:

**1)** You keep your room clean-
keep (verb) + your room (something) + clean (adjective) =
నీ room నువ్వు శుభ్రంగా ఉంచుకుంటావు.

a) His sweater kept him warm-
kept (verb) + him (somebody) + warm (adjective) =
అతడి sweater అతడిని వెచ్చగా ఉంచింది.

b) This tablet will keep the temperature low-
will keep (verb) + the temperature (something) + low (adjective)-
ఈ tablet ఉష్ణోగ్రతను తక్కువగా ఉంచుతుంది.

**2)** I find the place untidy- ఇక్కడ verb, find - చూడటం/ కనపించటం/ గమనించటం

a) The doctor found him ill-
found (verb) + him (somebody) + ill (adjective)-
Doctor అతను జబ్బుగా ఉండటం గమనించాడు.

b) The police found the doors open-
found (verb) the doors (something) + open (adj) =
తలుపులు తీసి ఉండటం police లు గమనించారు.

**3)** Want కూడా ఈ pattern లో వస్తుంది.

a) Kiran wants his coffee hot- wants (verb) + his coffee (something) + hot (adjective) =
కిరణ్‌కు coffee వేడిగా కావాలి.

b) Suneeta wants her clothes clean-
wants (verb) her clothes (something) + clean (adj)

**4)** drive:

a) He drives me mad-
drives (verb) + me (somebody) + mad (adj)-
నాకు పిచ్చెక్కిస్తున్నాడు.

b) The noise is driving me crazy-
is driving (verb) + me (somebody) + crazy (adj) =
ఈ గొడవ నాకు పిచ్చి కలిగిస్తోంది.

**6)** ... opening his mouth wide-
He opened the door wide-
opened (verb) + the door (something) + wide (adj) =
తలుపు బార్లా తెరిచాడు.

**7)** He was licking his fingers clean-
was licking (verb) + his fingers (something) + clean (adjective) =
శుభ్రంగా వేళ్లు నాకుతున్నాడు.

**8)** It made me sick= నాకు వాంతి పుట్టించింది.
ఇది కూడా made (verb) + me (somebody) + sick (adjective) pattern.

**9)** It turned me red=
నన్ను కోపంతో ఎర్రబడేట్లు చేసింది=
turned (verb) + me (somebody) + red (adjective)

The news turned him pale-
turned (verb) + him (somebody) + pale (adj)-
ఆ వార్త అతడిని పాలిపోయేలా చేసింది.

**10)** beat-

a) She beat him blue and black-
beat (verb) + him (somebody) + blue and black (adj) =
ఆమె వాడిని చితకబాదింది.

b) The mechanic beat the sheet flat-
beat (verb) + the sheet (something) + flat (adj)

ఇలా ఈ verbs అన్నింటినీ ఈ pattern లో అంటే verb + somebody/ something + adjective pattern లో వాడవచ్చు ఇలా వాడగలిగిన verbs ఇంకా: see, wish, hold, boil, burn, leave, paint, etc.

M.SURESAN

## EXERCISE 1

**Practise the following aloud in English: (Use the above pattern where possible)**

**Sampath:** ఆమె ఇప్పుడే నేల శుభ్రంగా ఊడ్చింది. నువ్వు దాన్ని మురికిచేస్తున్నావు.

**Sukumar:** అంతే కావచ్చు కానీ లోపల fridge ఖాళీగా ఉండటం గమనించాను. నేను ఆకలితో ఉంటే చూడటం నీ కోరికా?

**Sampath:** ఆ పాత్రలన్నీ నేను నింపే వదిలాను ఆహార పదార్థాలతో. నీ అబద్ధాలు నాకు కోపం కలిగిస్తున్నాయి.

**Sukumar:** నువ్వు నాకు పిచ్చెక్కిస్తున్నావు నీ మాటలతో. నేనింటికి రాగానే bottled drinks చల్లగా ఉండాలని నేనను కుంటా (want వాడండి)

**Sampath:** నీ మాటలు జీర్ణం చేసుకోవటానికి నాకు కష్టంగా ఉంది. నాకు కోపంతో వెర్రెక్కించకు.

**Sukumar:** OK. OK. Sorry ఇప్పుడు గుర్తొచ్చింది నాకు. ఇందాక కృష్ణ వచ్చాడు. వాడంతా తిని, తాగేశాడనుకుంటా.

### ANSWER

**Sampath:** She has swept the floor clean. You are making it dirty.

**Sukumar:** That's OK. I have found the fridge in the house empty. Do you want/ wish/ like to see me hungry?

**Sampath:** I left all the dishes full. Your lies are driving me mad/ angry.

**Sukumar:** You are driving me mad. When I come home I want the bottled drinks chill.

**Sampath:** I find your words hard to digest. Don't drive/ make me mad.

**Sukumar:** OK. Sorry. I remember now. Krishna was here. I think he ate and drank everything.

## EXERCISE 2

**Match the words under A with their meaning under B.**

| A | B |
|---|---|
| 1 yield | A hawk |
| 2 well off | B rub clean |
| 3 scrub | C cleanliness |
| 4 peddle | D dirt |
| 5 hygiene | E rich |
| | F surrender |
| | G cycle |

**KEY:**

**1 - F.** Yield/ surrender= లొంగిపోవడం.
The Australians yielded to the superior bowling of Indians=
భారత మేటి bowling కు Australians లొంగిపోయారు.
The enemy yielded after a strong fight=
శత్రువు బాగా పోరాడి లొంగిపోయాడు.
(yield (ఇంకో అర్థం) = పంట దిగుబడి)

**2 - E.** Rich. He is quite well off, but his brother is badly off =
అతడు ధనవంతుడే కానీ అతని brother ఏమీ లేనివాడు.

**3 - B.** Scrub. నేలలాంటివి శుభ్రపరచేందుకు పీచులాంటి వస్తువులతో రుద్దటం. She scrubbed the dirty marks off the floor =
నేలమీది మట్టిమరకలను ఆమె రుద్దేసింది.

**4 - A.** రెండింటికీ అర్థం- వీధుల్లో తిరుగుతూ వస్తువులు అమ్మటం. Peddler = Hawker= వీధుల్లో తిరుగుతూ అమ్ముకునేవాళ్లు.

**5 - C.** Hygiene. పరిశుభ్రత - ముఖ్యంగా ఆసుపత్రుల్లో/ ఆరోగ్యానికి అవసరమైన పరిశుభ్రత.
The hospital has no hygiene = ఆసుపత్రిలో పరిశుభ్రత లేదు. Unhygienic food= అనారోగ్యం కలిగించే అపరిశుభ్రమైన ఆహారం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ




# She finds herself cheated every time


M.SURESAN

**Chakradhar:** Did you finish your assignment?
(నీ అసైన్‌మెంట్ పూర్తిచేశావా?)

assignment= ఒకరికి బాధ్యతగా అప్పజెప్పిన పని.

**Giridhar:** Of course not. You remember, last week I had my books stolen. Then followed a sunday. No shops were open to buy books. The next day I had to leave town to call on my sick uncle. I returned yesterday, and because of the trade bandh, I found all the shops closed.
(అప్పేలేదు. గుర్తుందికదా నీకు, కిందటివారం నా పుస్తకాలెవరో దొంగిలించారు. ఆ తర్వాత ఆదివారం వచ్చింది. పుస్తకాల షాపులేవీ లేవు పుస్తకాలు కొనడానికి. జబ్బుతో ఉన్న మా మామయ్యను చూసేందుకు మరుసటి రోజు నే ను ఊరెళ్లాను. నిన్న తిరిగొచ్చినా, వ్యాపారుల బంద్ వల్ల షాపులన్నీ మూసుండటం చూశాను.)

**Chakradhar:** The boss is not all too happy. He was expecting you to turn it in last saturday itself.
(బాస్ చాలా కోపంగా ఉన్నాడు. నువ్వు దాన్ని పోయిన శనివారం చేసి ఇచ్చేస్తా వని ఆశించాడాయన.)

all too= మంచికానంత (ఎక్కువ)/ అతి.

Not తో, not లేకుండా కూడా వాడతాం.

He comes here all too often.
(అతడిక్కడికి మరీ ఎక్కువగా వస్తాడు - అన్నిసార్లు రావడం మనకిష్టం లేదు. మంచిది కాదు.)

**Giridhar:** What does he know? The theft of the books and the other things has left me shocked, and yet this man wants the work completed even before the due time.
(ఆయనకేం తెలుస్తుంది? ఆ పుస్తకాలు, ఇతర వస్తువుల దొంగతనం నన్ను షాక్‌లో పడేసింది. అయినా ఈయనేమో గడువుకు ముందే పని పూర్తి చేయాలంటాడు.)

due date/ due time= గడువు.

**Chakradhar:** Just don't worry. The due date is still a week off. You borrow my books and get it done by then. In the mean time I'll tell the boss not to trouble you.
(ఏం బాధపడకు. గడువు ఇంకా వారం రోజులుంది. నా పుస్తకాలు తీసుకుని పని పూర్తిచెయ్యి. ఈ మధ్యలో నిన్ను తొందర పెట్టొద్దని నేను బాస్‌తో చెబుతా.)

**Giridhar:** Just three more days and I'll have it done.
(ఇంకో మూడు రోజులు చాలు. దాన్ని నేను పూర్తి చేస్తాను.)

**Chakradhar:** You have already made your ability known to him. He knows when he gives you a job you do it well. That's we in the office hear your name called whenever he has a tough job on hand.
(నీ సామర్థ్యం ఆయనకిప్పటికే తెలిసేలా చేశావు. నీకో పని అప్పగిస్తే నువ్వది బాగా చేస్తావని ఆయనకు తెలుసు. అందుకే ఏదైనా కష్టమైన పని అవ్వాల్సి ఉంటే, అతడు నీ పేరే పిలవటం వింటాం ఆఫీసులో అందరం.)

**Giridhar:** But it doesn't get me even a wood of appreciation in the end.
(అయితేనేం? ఇంత చేసినా నాకో మెప్పు మాట ఉండదు.)

**Chakradhar:** Let it not worry you. He isn't going to be here for long.
(బాధపడకు. అతడిక్కడ ఎక్కువకాలం ఉండబోవటం లేదు.)

a) He left the box open.
(అతనా పెట్టె తెరిచి వదిలేశాడు.)

b) Sarala keeps her room clean.
(సరళ తన గదిని శుభ్రంగా ఉంచుతుంది.)

పై sentences లో left (leave), keeps (keep) లాంటి verbs ను కింది pattern లో వాడాం కదా!

a) left (verb) + the box (something) + open (adjective)

b) keeps (verbs) + her room (something) + clean (adjective).

ఇలా వాడే Verbs ను -అంటే ఇలాంటి pattern లో వాడే Verbs ను మనం గత lesson లో చూశాం కదా? మరి కొన్ని చూడండి

The Kidnappers set the boy free.
(కిడ్నాపర్లు ఆ పిల్లాడిని వదిలేశారు.)

set (verb) + the boy (somebody) + free (Adjective) ఈ Pattern లో వాడగల verbs అన్నింటినీ, కింది pattern లో కూడా వాడతాం.

Verb + somebody/ something + past participle.(అంటే పై sentence లో చివర adjective కు బదులు past participle (pp) వస్తుందన్నమాట.)

**Now look at the following sentences from the conversation above**

1) ...*I had my books stolen.*
2) ...*I found all the shops closed.*
3) ... *The theft of the books and the other things left me shocked.*
4) ...*and get it done (by then).*
5) ...*and I'll have it done.*
6) *you have (already) made your ability known (to him).*
7) *We in the office hear your name called.*

**Observe all the sentences above. You find the past participle of the end of almost all the sentences. Don't worry about the word's in brackets.**

1) I had my books stolen-
had (verb) + my books (something) + stolen (past participle-pp). అంటే have ఇలాంటి pattern లో వాడవచ్చన్న మాట- ఇది spoken english లో తరచూగా వచ్చే pattern.

★ He has his car painted once in four years-
has (verb) + his car (something) + painted(pp)
(ప్రతి నాలుగేళ్లకు తన కారుకు పెయింట్ వేయించుకుంటాడు)

**2) I found the all the shops closed.**
found (verb) + all the shops (something) + closed(pp)
(అన్ని షాపులు మూసి ఉండటం చూశాను.)

★ She finds herself cheated every time.
finds (verb) + herself (somebody) + cheated (pp)
(తను మోసపోయినట్లు గమనిస్తుందామె -ప్రతీసారి)

**3) The theft of the books and the other things left me shocked.**
left (verb) + me (somebody) + shocked (pp)
(ఆ పుస్తకాలు, ఇతర వస్తువుల దొంగతనం నన్ను షాక్‌లో పడే సింది.)

★ She leaves her child unattended.
leaves (verb) + her child (somebody/something) + unattended (pp)
(ఆమె తన బిడ్డను చూసుకునేందుకెవరూ లేకుండా వదిలివెళ్లి పోతుంది.)

**4) ...get it done.**
get (verb) + it (something) + done (pp)
(ఆ పనిచేయి/ చేయించు.)

★ He gets his house white washed once in three years.
gets (verb) + his house (something) + white washed (pp)
(అతడు తన ఇంటికి మూడేళ్లకోసారి వెల్లవేయిస్తాడు.)

★ The officer got the clerk transferred.
got (verb) + the clerk (somebody) + transferred (pp)
(ఆఫీసర్ గుమాస్తాను బదిలీ చేయించాడు.)

**5) Have it done-** ఇదికూడా, I had my books stolen, pattern లాంటిదేకదా?

★ I will have the house cleaned (before I enter it).
(ఇంట్లో చేరేముందు ఇంటిని శుభ్రం చేయించుకుంటా.)
Will have (verb) + the house (something) + cleaned (pp)

★ The doctor will have him tested.
(డాక్టర్ అతడిని పరీక్షిస్తాడు.)
will have (verb) + him (somebody) + tested (pp)

**6) You have made your ability known to him.**
have made (verb) + your ability (something) + known (pp)

We hear your name called.
(నీ పేరు పిలవడం మాకు వినిపిస్తుంది.)
here (verb) +your name (something) + called (pp)

ఇప్పుడు పై sentences చూసిన తర్వాత మనం గమనించాల్సింది. కిందటి lesson లో verb + somebody / something + adjective pattern లో వాడగల verbs అన్నింటినీ ఈ lesson లో చూపినట్లు.
verb + somebody / something + past participle pattern లో వాడవచ్చు.

ఈ రెండు patterns conversational English లో చాలా సర్వసాధారణంగా వినిపిస్తాయి- బాగా practice చెయ్యండి.

## EXERCISE

**Practise the following aloud in English:**

**Sagar:** నేనింటికి తిరిగొచ్చేసరికి తాళం పెట్టుండటం చూశాను. ఎక్కడికెళ్లావు?
(find వాడండి)

**Sudhir:** నా బట్టలు ఇస్త్రీ చేయించుకునేందుకు లాండ్రీకెళ్లాను.

**Sagar:** నువ్వెప్పుడూ అంతే. నేనొచ్చే సమయానికి ఇంటికి తాళం పెట్టివెళతావు.
(leave వాడండి)

**Sudhir:** అయితే ఇంటికి తాళం వేయకుండా వదిలి వెళ్ల మంటావా? అప్పుడు గానీ మన వస్తువులన్నీ దొంగిలించుకు పోరు.

**Sagar:** ఆ మాట నేనన్నానా? ఇంటిని తెరిచిపెట్టి వెళ్ల మని అన్నానా?
(keep వాడండి.)

**Sudhir:** అయితే ఇంకేంటి? ఏదేమైనా ఇల్లు భద్రంగా ఉండటమే నాక్కావల్సింది.
(want, secured వాడండి.)

## ANSWER

**Sagar:** When I returned home, I found the house locked. Where have you been?

**Sudhir:** I had been to the laundry. I wanted (to have) my clothes ironed.

**Sagar:** You're always like that. By the time I came home, you leave the house locked and go.

**Sudhir:** (Do) you mean that I leave it unlocked? We shall then have all over things stolen.

**Sagar:** Did I say that? Did I ask you to keep the house opened?

**Sudhir:** Then What? I want the house fully secured. Thats all.

Secured = తలుపులన్నీ మూసి, తాళాలు వేసి ఇంటిని జాగ్రత్తగా ఉంచటం




**ప్రశ్న:** *i) Present perfect tense లో for, since ఉపయోగించవచ్చా? వివరించండి.*

*ii) I have been ill for 2 days. (నేను 2 రోజుల నుంచి అనారోగ్యంగా ఉన్నాను.)*

*iii) It has been there for 3 days. (అది మూడు రోజుల నుంచి అక్కడ ఉంది.)*

*iv) He has been abroad for 10 days. (అతడు పదిరోజుల నుంచి abroad లో ఉన్నాడు.)*

**– రమేష్‌కుమార్**

**జవాబు:** i) Present perfect tense లో for, since తప్పకుండా వాడతాం.
Your three sentences given as examples for the Present perfect tense: ii) I have been ill for 2 days, iii) It has been here for 3 days, and iv) He has been abroad for 10 days are correct. However, They will be better/ clearer if you say, for the past 2/ 3/ 10 days / for 2/ 3/ 10 days now, instead of for 2/ 3/ 10 days.

**ప్రశ్న:** *Kill, murder, assassinate ఈ మూడింటి అర్థమూ చంపాలనే కదా? వివరించండి.*

**– ఎం. రంగయ్య, వరంగల్**

**జవాబు:** Kill అంటే చంపటం అని. ఇది మనుషులనే కాక జంతువులను, దేన్నైనా అని. Murder అంటే హత్య - ఒక మనిషిని చంపటం మాత్రమే. Assassination- రాజకీయహత్య. రాజకీయ కారణాల వల్ల ఒకరిని ముఖ్యంగా ఓ పదవిలో ఉన్నవారిని చంపటం, assassinate.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# You'll find it an advantage

**Dharitri:** Hi Bhumika, congrats!

**Bhumika:** What on? (ఎందుకు?)

**Dharitri:** I heard that they elected you chairperson of the students' union.
(నిన్ను విద్యార్థి సంఘానికి అధ్యక్షురాలిగా ఎన్నుకున్నారని విన్నాను.)

**Bhumika:** Not a thing I like very much, you know. My friends all forced me and my dad wanted it too.
(నాకంత ఇష్టం లేదని తెలుసుగా? నా స్నేహితులు బలవంతపెట్టారు. మా నాన్నా కావాలనుకున్నారు.)

**Dharitri:** Last time they made me chairperson and it is now your turn.
(కిందటిసారి నన్ను అధ్యక్షురాలిని చేశారు. ఇప్పుడు నీవంతు వచ్చింది.)

turn = వంతు, by turns = వంతులవారీ

**Bhumika:** I find the job a nuisance. It is a crown of thorns. It's going to prove a waste of time for me. I can't concentrate on my studies.
(ఈ పని ఓ తలనొప్పి అయ్యేట్టు కనిపిస్తోంది. ఇదో ముళ్ల కిరీటం. ఇది కేవలం సమయం వృథా అయ్యేదిగా తయారవబోతోంది. నా చదువు మీద శ్రద్ధచూపించలేను కదా.)

**Dharitri:** That's true. That was my experience too. But for it, I could have definitely got a better score.
(అది నిజమే. నా అనుభవం కూడా అదే. ఈ పదవే లేకుంటే, నాకింకా మంచి మార్కులే వచ్చేవి.)

**Bhumika:** I have second thoughts about it.I feel like resigning. Shall I?
(నాకిప్పుడు వేరే ఆలోచనలొస్తున్నాయి. రాజీనామా చేయాలనుంది. చెయ్యనా?)

**Dharitri:** Don't do that. You'll find it an advantage too. It will develop leadership qualities in you. They may designate you president of some other committees.
(అలా చేయకు. ఇది నీకొక మేలు కూడా అనిపిస్తుంది. నీలో నాయకత్వ లక్షణాలు పెంచుతుంది. వాళ్లు నిన్ను మరికొన్ని కమిటీలకు అధ్యక్షురాలిగా నియమించవచ్చు.)

designate = నియోగించటం/ నియమించటం

**Bhumika:** By the way, how is your sister Ila and her new born child?
(అది సరే, మీ అక్క ఇల, వాళ్ల కొత్తపాప ఎలా ఉన్నారు?)

**Dharitri:** They are fine. Just yesterday they named the child Dharuni.
(బాగానే ఉన్నారు. నిన్ననే వాళ్ల పాపకు ధారుణి అని పేరు పెట్టారు.)

**Bhumika:** That's fine. She is so cute, and plump. I'd like to call her dimple, as dimples appear on her cheeks when she smiles.
(బాగానే ఉంది. ముద్దుగా బొద్దుగా ఉంటుందా పాప. నవ్వితే బుగ్గల మీద సొట్టలు కనిపిస్తాయి. అందుకే నాకు ఆ పాపను డింపుల్ అని పిలవాలనుంది.)

**Dharitri:** Her dad got promotion the day after her birth. So he considers the baby a bringer of luck.
(పాప పుట్టిన మరుసటిరోజే వాళ్ల నాన్నకు ప్రమోషన్ వచ్చింది. అందుకని ఆయన ఆ పాప వల్ల తనకు కలిసొచ్చిందని అనుకుంటున్నాడు.)

**Bhumika:** Shall we see the baby this evening?
(ఇవాళ సాయంత్రం వెళ్లి చూద్దామా పాపను?)

**Dharitri:** O.K.

కిందటి రెండు lessons లో కొన్ని verbs ను కింది patterns లో వాడవచ్చని తెలుసుకున్నాం.

**a) verb + some body/ some thing + adjective**

**eg:** I found the box empty.
(నేను ఆ పెట్టె ఖాళీగా ఉండటం చూశాను.)

**Pattern:** found (verb) + the box (some thing) + empty (adjective)

**b) verb + some body/ some thing + past participle**

**eg:** He wanted the work done.

**Pattern:** wanted (verb) + the work (some thing) + done (past participle)

ఇప్పుడు ఈ lesson లో మనం చూడబోతున్నది పై రెండు patterns కు చాలా దగ్గరైందే. అయితే ఈ pattern లో చివర adjective/ past participle బదులు, మనం Noun వాడతాం. (Noun: దేనికైనా మనం ఇచ్చే పేరు: leader, chairman, village, etc)

**eg:** They declare India winner.
(ఇండియాను విజేతగా ప్రకటించారు.)

**Pattern:** declared (verb) + India (some thing) + winner (noun)

ఇంతకుముందు pattern లో- 1) verb + somebody/ something + adjective 2) verb + some body/ something + past participle) వాడగలిగినన్ని verbs ఈ lesson లో మనం చూడబోయే pattern: verb + somebody/ something+ noun లో రావు. ఈ pattern లో వచ్చే verbs సంఖ్య కాస్త తక్కువే.


M.SURESAN

***Now look at the following sentences from the conversation at the beginning of the lesson:***

*1) ... they elected you chairperson of the students' union.*
*2) ... they made me chairperson.*
*3) ... I find the job a nuisance.*
*4) You'll find it an advantage.*
*5) They may designate you president.*
*6) They named their child Dharuni.*
*7) I'd like to call her dimple.*
*8) He considers the baby a bringer of luck.*

**No 1): They elected you chairperson.**
(నిన్ను అధ్యక్షుడిగా/ అధ్యక్షురాలిగా వాళ్లెన్నుకున్నారు.)
elected (verb) + you (somebody) + chair person (noun)
(ఇంతకుముందు patterns లో చివర noun బదులు adjective/ past participle వాడాం కదా.)

The board chose Dhoni Captain.
(బోర్డ్ ధోనీని కెప్టెన్‌గా ఎంపికచేసింది.)

అంటే choose (ఎంచుకోవటం/ ఎంపిక చేసుకోవటం) కూడా ఈ pattern లో వాడవచ్చు.

**2) They made me a chairperson.**

Make కూడా ఈ pattern లో వస్తుంది.

a) They often make him a fool.
(అతడిని వాళ్లు తరచూ వెర్రివాడిని చేస్తారు.)
make (verb) + him (somebody) + a fool (noun)

b) Srirama made Bharata King.
(శ్రీరాముడు భరతుడిని రాజును చేశాడు.)
made (verb) + Bharata (somebody) + King (noun)

**3) and 4): find.** దీనిని కూడా ఈ pattern లో వాడతాం.

a) They found the village a nice place.
(వాళ్లు ఆ గ్రామం మంచిదిగా ఉండటం చూశారు.)
found (verb) + the village (some thing) + a nice place (noun)

b) The Coach found the players champions.
(కోచ్ ఆ క్రీడాకారులు champions- నిష్ణాతులైనట్లు గమనించాడు).
found (verb)+the players (somebody) + champions (noun)

**5) Designate**= ఒక విధికి/ ఉద్యోగానికి నియమించటం/ నియోగించటం.

a) They designate only the best people officers.
(ఉత్తములైన వాళ్లనే ఆఫీసర్స్‌గా నియమిస్తారు.)
designate (verb) + the best people (somebody) + officers (noun)

b) The company designated him manager.
(కంపెనీ అతడికి మేనేజర్ పదవి ఇచ్చింది.)
designate (verb) + him (somebody) + manager (noun)

ఇక్కడ గమనించాల్సింది: Appoint కూడా ఇలా వాడతాం.

They appointed him secretary, ఇలా అనడమే ఎక్కువ, appointed as కంటే.

**6) Name -**

a) They named their child Raghav.
named (verb) + their child (somebody) + Raghav (noun)

b) If I build a house, I will name it Ayodhya.
I will name (verb) + it (some thing) + Ayodhya (noun)

**7), 8) Call: consider** కూడా ఈ pattern లోనే వాడతాం.

a) She called him a fool.
called (verb) + him (somebody) + a fool (noun)

b) We consider Gandhi a mahatma.
గాంధీని మహాత్ముడిగా పరిగణిస్తాం.
consider (verb) + Gandhi (somebody) + a mahatma (noun).

**ప్రశ్న:** 1) I have studied here for the past two years. నేను ఇక్కడ ఇప్పటివరకు రెండేళ్లు చదివాను. ఇలాకాకుండా- I studied here for 2 years since then అనొచ్చు కదా? లేదా I have been studying here for 2 years అనొచ్చా?

2) He has worked here since 2004. వాడొచ్చా? అతనిక్కడ 2004 నుంచి పనిచేశాడు. అంటే ఇంకా పనిచేస్తూనే ఉన్నాడని అర్థం. అలాంటప్పుడు He has been working here since 2004 కదా?

– రమేష్‌కుమార్

**జవాబు:**

**1)** I studied here for 2 years since then అనటం correct కాదు. Since then implies that the action started some time in the past and has continued till now/ is going on even now. If you use, studied, we don't get that meaning. Studied is past simple tense and talks only a completed action in the past. The sentence, I have been studying here for the past/ last two years, is correct.

The difference between a) I have studied here for the past/ last 2 years, and b) I have been studying for the past/ for the last 2 years is very little or almost nil. The verb Have been/ Has been+ ing is used to stress continuity, though.

**2)** It is correct to say. He has worked here since 2004 for the past/ for the last / for (a time period) now are important.

**ప్రశ్న:** 1. I am able to, 2. I was able to, 3. I will be able to వీటిని ఎప్పుడు వాడాలి?

– ఎస్.జె.సూర్య, వైజాగ్

**జవాబు:** I am able to - ఇప్పుడు (ఏదైనా) నేను చేయగలను. I was able to - చేయగలిగాను గతంలో (past). I will be able to - చేయగలుగుతాను, future లో.

## EXERCISE

**Practise aloud the following in English.**

**Preethi:** ఏంటీ? గదిలో వస్తువులన్నీ చిందరవందరగా వేసున్నట్టు కనిపిస్తోంది? (find throw వాడండి)

**Priya:** నేను గదిలోకి వచ్చేటప్పటికే ఇలా కనిపించింది. (see వాడండి). మన పుస్తకాలూ dress లు కొన్ని దొంగిలించి ఉండటం నేను చూశాను (notice, steal)

**Preethi:** కిందటి వారమే కదా మన owner గదికి వెల్ల వేయించాడు. చూడు ఆ గోడల నిండా కాఫీ మరకలే. (get, white wash)

**Priya:** అవును. ఆ దొంగ filter లో మిగిలి ఉన్న decoction ను అలా చల్లినట్టున్నాడు.

**Preethi:** వాటినంతా శుభ్రం చేయించాలి మనం. లేకుంటే మన friends మనల్ని dirty గా లెక్కకడతారు. అసలు దొంగ ఎలా వచ్చాడు లోపలికి?

**Priya:** నేను వచ్చేప్పటికే తాళం బద్దలు కొట్టి ఉండటం గమనించాను. Police కు phone చేశాను. వాళ్లు కొద్ది నిమిషాల్లో ఇక్కడ ఉండొచ్చు

## ANSWER

**Preethi:** What's wrong? I find things thrown all over the place in the room.

**Priya:** Even as I entered the room, I saw them scattered like that. I noticed too some of our books and dresses stolen.

**Preethi:** Only last week our landlord had our room whitewashed. Look, there are coffee marks all over the wall.

**Priya:** Yes. The thief left the wall stained with the decoction left in the filter.

**Preethi:** We must get it cleaned. Or else our friends may consider us dirty. But how did the thief enter in the first place?

**Priya:** Even as I came I noticed the lock broken. I called the police. They may be here in a few minutes.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# Let me save you the trouble

**Nischal:** I find the book quite useful. Where did you buy it? I had been looking for it in a number of shops.

**Sankalp:** I find it surprising that none of you could see it earlier than? It had been there all along.

(మీరెవ్వరూ దాన్ని చూడలేకపోవడం నాకు ఆశ్చర్యంగా అనిపిస్తోంది/ నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. అది అంతసేపూ అక్కడే ఉంది)

**Nischal:** How about lending me the book for a few days, I mean, after you are done with it?

(ఆ పుస్తకాన్ని నాకు కొన్ని రోజులపాటు ఇవ్వటం మాటేమిటి/ ఇస్తావా, అదేలే, నువ్వు పూర్తిచేసింతర్వాత? )

**Sankalp:** Why just lend? I'll present you the book after I finish it. Have it for keeps.

(అరువేం కర్మ? ఆ పుస్తకాన్ని నీకు కానుకగా ఇచ్చేస్తా నేను చదివిన తర్వాత. నువ్వు దాన్ని ఎప్పటికీ ఉంచుకోవచ్చు.)

for keeps= శాశ్వతంగా/ for ever.

**Nischal:** So kind of you. Thanks, but why the generosity?

(అది నీ సహృదయత. Thanks. కానీ ఎందుకీ ఉదారత? )

generosity= దాతృత్వం/ ఔదార్యం.

Karna was generous- కర్ణుడు దానగుణం కలవాడు.

**Sankalp:** You've given me a number of books. You've always offered me help even before I asked for it. So my gifting you this book, if at all it is worth the name of a gift is just nothing.

(నువ్వు నాకెన్నో పుస్తకాలు ఇచ్చావు. నేనడగక ముందే నాకు సాయం అందించేందుకు నీవెప్పుడూ సిద్ధమే. కాబట్టి నేనీ పుస్తకాన్ని నీకు కానుకగా ఇవ్వటం, కానుక అనిపించుకునే విలువ దానికుంటే, అంత పెద్ద విషయమేంకాదు.)

worth= విలువ కల

**Nischal:** Show me the book once more. I want to read the opening para.

(మరోసారి ఆ పుస్తకాన్ని చూపించు. మొదటి పేరా చదవాలని ఉంది)

**Sankalp:** Here you are, but I see you have no spects on. Don't worry. I'll read you the paragraph.

(ఇదిగో, అయితే నీ కళ్లజోడు కనిపించడం లేదు నీ దగ్గర/ నీ కళ్ళ జోడున్నట్టు లేదు. ఫరవాలేదులే. ఆ Paraను నేను చదువుతాను.)

**Nischal:** Let me save you the trouble. I can wait till you can send me the book.

(నీకాబాధ తప్పించనీ. నువ్వు నాకా పుస్తకాన్ని పంపించేదాకా ఆగ గలనులే)

**Sankalp:** That's fine then. I'll finish it in two or three days and give it to you. By the way why are you so fond of books?

(సరే అయితే. రెండు మూడ్రోజుల్లో అది పూర్తిచేసి నీకిస్తా. అది సరే, పుస్తకాలంటే నీకెందుకంత ఇష్టం? )

**Nischal:** Dad used to buy us a number of books when we were children. He used to tell us bed time stories too.

(మా నాన్న మా చిన్నప్పుడు మాకు చాలా పుస్తకాలు కొనేవాడు. పడుకున్నప్పుడు కథలు కూడా చెప్పేవాడు.)

**Sankalp:** Lucky there. Bye then. See you.

(వస్తా)

✪ ✪ ✪ ✪

Bring, buy, get give, gift, lend, offer, tell present, sing, read, order, cook, sell, pass (అందించటం) throw (విసిరేయటం) - ఈ verbs మన daily conversation (spoken English) లో చాలా తరచుగా వాడతాం కదా? వీటిని వాడే తీరు చూద్దాం. వీటిల్లో చాలా వాటిని రెండు రకాలుగా వాడవచ్చు (2 patterns) ఒకే అర్థంతో.

**1) I brought him a shirt**

(నేనతనికి shirt తెచ్చాను)

**Pattern:** brought (verb) + him (somebody/ something) + a shirt (something)

**2) I brought a shirt for him**

(నేనతనికి shirt తెచ్చాను)

**Pattern:** brought (verb) + a shirt (something/ somebody) + for (preposition) + him (somebody)

(పై verbs అన్నింటినీ ఒకరికోసం/ ఒకరికి, ఒక పని చేయటం అనే అర్థంలో వాడతాం. ఎవరికి అనేది చిన్న మాట గనుక అయితే, దానిని ఎక్కువగాverb పక్కనే వాడతాం.)

I brought him a shirt. (ఇక్కడ him చిన్నమాట కనుక దానిని ఎక్కువగా verb పక్కనే వాడతాం.)

I brought a shirt for him కంటే I brought him a shirt అనేదే spoken English లో ఎక్కువగా వినిపిస్తుంది.

**3) Give** కూడా give + somebody + something pattern లో వస్తుంది.

a) Please give me the book

b) He will give you all the information

(అయితే it వచ్చినప్పుడు మాత్రం, please give it to him అంటాం. ఏది చిన్నగా ఉంటే అది verb పక్కన ఉంటుంది.)

**4) Gift** - కానుక ఇవ్వడం

He gifted his beloved a diamond necklace

(తన ప్రియురాలికి అతను వజ్రాల necklace కానుకగా ఇచ్చాడు)

gifted (verb) + his beloved (somebody) + a diamond necklace (something)


M.SURESAN

ఇప్పుడు మనం ఈ lesson లో ఈ pattern: verb + somebody/ something + something చూద్దాం. ఈ pattern మీ conversation లో practice చేయండి. చాలా సహజంగా ఉంటుంది.

***Now look at the following sentences from the conversation at the beginning of the lesson.***

*1. How about <u>lending me the book</u>?*

*2. I'll <u>present you the book</u>*

*3. You've <u>given me a number of books</u>*

*4. My <u>gifting you the book</u> is nothing*

*5. <u>Show me the book</u> once more*

*6. I'll <u>read you the paragraph</u>*

*7. Let me <u>save you the trouble</u>*

*8. I can wait till you <u>send me the book</u>*

*9. Dad used to <u>buy us a number of books</u>*

*10. He used to <u>tell us bed time stories</u>*

**1. lend** = అరువివ్వటం

Could you lend me some money? = నాకు కాస్త డబ్బు అప్పిస్తారా?

lend (verb) + me (somebody) + some money (some thing)

ఈ pattern లో ఎక్కువగా verb తర్వాత somebody (వ్యక్తి)యే వస్తుంది.

ఇదే sentence ను ఈ విధంగానూ అనొచ్చు

Could you lend some money to me?

అయితే, lend + some body + some thing- ఈ pattern ఎక్కువ సహజంగా, సరళంగా ఉంటుంది- ముఖ్యంగా conversation లో.

**2) I'll present you the book-**

present (verb) + you (some body) + the book (some thing)

The bridegroom presents the bride a ring. That's the custom.

(పెళ్లి కొడుకు, పెళ్లికూతురికి ఉంగరం బహూకరిస్తాడు- అది ఇక్కడ ఆచారం.)

(custom - ఆచారం)

presents (verb) + bride (somebody) + a ring (something)

పైన ఇచ్చిన model sentences లోని మిగతా verbs (underline చేసినవి) అన్నీ ఈ pattern లోనే ఉండటం గమనించండి.

| S.No. | verb | somebody | something |
|---|---|---|---|
| 5 | Show | me | the book |
| 6 | Read | you | the paragraph |
| 7 | Save | you | the trouble |
| 8 | Send | me | the book |
| 9 | Buy | us | a number of books |
| 10 | Tell | us | bed time stories |

**6. I'll read you the paragraph =**

నీకా paragraph చదివి వినిపిస్తాను.

(Read someone something = ఒకరికి ఒక విషయం చదివి వినిపించడం)

**7. Save you the trouble =**

నీకా శ్రమ తప్పిస్తాను.

save = తప్పించడం, ఏదైనా కష్టాన్ని.

పై sentences from 1 to 10 లోని verbs అన్నింటినీ somebody చివర వచ్చేట్లు వాడవచ్చు అయితే correct preposition వాడాల్సి ఉంటుంది. Grammatical గా అది correct అయినా, conversation లో ఎక్కువ వినిపించేది preposition లేని pattern మాత్రమే.

**EXERCISE**

Conversation between Nischal and Sankalp తర్వాత ఇచ్చిన list of verbs ను చూడండి: bring, buy, etc. వాటిలో ప్రతిదాన్నీ verb + somebody + something pattern లో వాడి ప్రతిదానికీ ఒక sentence రాయండి. కింది model sentences తో పోల్చుకోండి.

1. Please bring/ get/ give her a glass of water.
2. He bought/ presented/ gifted her an expensive jewel.
3. Please sing me the song you sang yesterday.
4. My dad ordered me a new pair of clothes.
5. Please pass me the book.
6. She cooked her guests a nice dinner.
7. He sold them his new car.
8. She threw him the book.

**ప్రశ్న: 1.** Everyone has a roof above his head.
Everyone has a roof above their head.
Everyone has a roof above their heads.

పై వాక్యాల్లో ఏది కరెక్ట్? ఒకవేళ everyone అంటే both genders వస్తాయి కాబట్టి their వాడితే ఆ ప్రకారం their heads రావాలి కదా! their head ఏమిటి? వివరించగలరు.

**2.** Idioms కు proverbs కు తేడా ఏమిటి?

**3.** Provide తర్వాత with ఎప్పుడు వస్తుంది? ఎప్పుడు రాదు? వివరించండి.

– కె.రత్నరాజు, వైజాగ్

**జవాబు:**

**1.** Every one has a roof above their head అనేది correct. Every one అంటే both genders రావాలి కాబట్టి his or her అని అనాలి. అయితే అలా మాటి మాటికి అనటం చాదస్తంగా ఉంటుంది కాబట్టి ఇపుడు their అని అనటం వాడుకయిపోయింది. అయితే their ను singular గానే భావించాలి. ఎందుకంటే ఇలాంటి సందర్భాల్లో their = his or her (singular) (his and her కాదు) కాబట్టి their head, correct.

**2. Idiom** is a group of words with the meaning of the group of words as a whole having no connection with the meaning of any word in the group.

**eg:** The long and short of - this is an idiom. దీని అర్థం- సారాంశం అని. The long and short of what he says is he wants money = వాడి మాటల సారాంశం (summary) వాడికి డబ్బు కావాలని. ఈ idiom లోని long అర్థానికిగానీ, short అర్థానికిగానీ, the long and short of మొత్తానికి వచ్చే అర్థంతో ఏం సంబంధం లేదు కదా. అలాంటి expression, idiom.

**Proverb** అంటే సామెత - a wise saying, born out of the experience of the speakers of a language over a long period.

**eg:** All that glitters is not gold. ఇది proverb = మెరిసేదంతా బంగారం కాదు. = పై మెరుగులను చూసి మోసపోవద్దు. Proverbs లో idioms ఉండవచ్చు. కానీ idioms అన్నీ proverbs కావు కదా.

**3.** provide with = supply

provide ను వాడే విధం:

a) provide somebody <u>with</u> something

b) provide something <u>for</u> somebody

c) provide something.

a) The hostel <u>provides</u> the <u>boys</u> (somebody) with <u>all facilities</u> (something) = ఆ hostel పిల్లలకు అన్ని వసతులూ కల్పిస్తుంది (ఇస్తుంది)

b) The free hospital <u>provides</u> <u>real good services</u> (something) <u>for</u> the <u>poor of the area</u> (somebody) = ఆ ధర్మాసుపత్రి అక్కడి పేదలకు నిజమైన సేవలందిస్తుంది

c) The book <u>provides</u> the <u>information</u> (something) you want = ఆ పుస్తకం నీకు కావలసిన సమాచారం ఇస్తుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# Don't mind who gave it to me

**Vipul:** Who gave this news to you?
(నీకు ఎవరిచ్చారీ వార్త? )

**Vinay:** Don't mind who gave it to me. The point is why you didn't tell this to me.
(ఎవరు చెప్పారనేది వదిలెయ్. నువ్వెందుకు నాకీ విషయం చెప్పలేదనేది ముఖ్యం.)

**Vipul:** Gopal sent the message to me only yesterday. We are meeting only now. Thought of seeing you earlier but as mom was cooking breakfast for me I thought I had better wait till I finished. Hence the delay.
(గోపాల్ నాకీ వార్త నిన్న పంపాడు. మనం ఇప్పుడే కలుసుకుంటున్నాం. అమ్మ బ్రేక్‌ఫాస్ట్ ఏదో చేస్తుంటే అది పూర్తయ్యాక వద్దామను కున్నా. అందువల్లే ఆలస్యం.)

**Vinay:** I see you don't have the papers. Why didn't you bring them to me? That could have provided better information to me.
(నీ దగ్గర ఆ కాగితాలు లేనట్లున్నాయి. వాటిని ఎందుకు తీసుకురాలేదు? అవి నాకు ఎక్కువ సమాచారం ఇచ్చి ఉండేవి కదా? )

**Vipul:** Gopal denied the permission to me to take the file out. Otherwise I would have definitely got it for you.
(ఫైల్‌ను బయటకు తీసుకువెళ్లేందుకు గోపాల్ నాకు అనుమతి ఇవ్వలేదు.)

**Vinay:** Did he show the whole file to you? Are you sure that the file has all the papers?
(నీకతను మొత్తం ఫైల్ చూపించాడా? అందులో అన్ని కాగితాలు ఉన్నాయని నీకు నమ్మకమేనా? )

**Vipul:** I didn't ask it of him, and he didn't offer it to me either.
(నేను అతడిని అడగనూ లేదు, అతను నాకు ఇవ్వడానికి ముందుకు రానూలేదు.)

**Vinay:** We must present all this information to the members tomorrow at the meeting. If we don't, it is going to cause a lot of trouble for us.
(ఈ సమాచారం మొత్తం రేపు సభలో సభ్యుల ముందు ఉంచాలి. లేకుంటే అది మనకు చాలా కష్టాలు కలిగిస్తుంది./ అందువల్ల మనకు ఇబ్బందులు ఉంటాయి.)

**Vipul:** I understand all that. We have still time. We can call Gopal and ask him to rush the file to us.
(అవున్లే. నాకు అర్థమయిందంతా. అయితే మనకు ఇంకా సమయం ఉంది. గోపాల్‌కు ఫోన్ చేసి ఆ ఫైల్ త్వరగా పంపమని చెప్పొచ్చు.)
rush= త్వరగా పంపడం

**Vinay:** Ok. Call him immediately and tell him we have no time to lose. He must pass the file to us as soon as possible.
(సరే. అతడికి ఫోన్ చేసి వెంటనే చెప్పు. మనకు సమయం లేదని. అతను మనకు ఆ ఫైల్ ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా పంపాలని చెప్పు.)

**Vipul:** It's done.
(వెంటనే చేస్తా ఆ పని.)



కిందటి lesson లో మన bring, buy, give, get, offer, refuse, send, sell, show, sing లాంటి verbs ను verb + somebody/ something + somebody/ something pattern లో వాడతాం అనీ, ఇది spoken English లో తరచూ వినిపించే pattern అనీ తెలుసుకున్నాం కదా? ఇందులో మామూలుగా verb తర్వాత వెంటనే somebody (him, her, me, Sekhar, Suguna) - వ్యక్తులను తెలిపే పదాలే ఎక్కువగా వినిపిస్తాయి, ఆ తర్వాత ఎక్కువగా (something)- ఒక విషయాన్ని/ ఒక వస్తువును తెలిపే పదాలే వినిపిస్తాయి.

**eg:** I gave him the book.
gave (verb) + him (somebody- వ్యక్తి) + the book (thing- వస్తువు/ విషయం)

అయితే ఈ pattern లో వాడే verbs ఇంకో pattern లో కూడా వినిపిస్తాయి, కింద చూపించినట్లు:

I gave the book to him.
gave (verb) + the book (something) + to (preposition) + him (somebody)

conversation లో verb + somebody + something pattern, verb + something + preposition + somebody కన్నా ఎక్కువ వినిపిస్తుంది. అది సహజం (natural) గా కూడా ఉంటుంది.

***Now look at the following sentences:***

*1) Who gave this news to you?*
*2) Don't mind who gave it to me.*
*3) Gopal sent the message to me.*
*4) Why didn't you bring them to me?*
*5) Gopal denied the permission to me.*
*6) I'd have definitely got it for you.*
*7) Did he show the file to you?*
*8) We must present all this information to the members.*
*9) We can ask him to rush the file to us.*
*10) He must pass the file to us.*

పై sentences అన్నీ కూడా verb + something + preposition + somebody pattern లో ఉండటం గమనించండి.

M.SURESAN

**1) Who gave this news to you?**
Gave (verb) + this news (something) + to (preposition) + you? (somebody)
పై sentence ను verb + somebody + something pattern కు మార్చేయవచ్చు
Who gave you this news?
Gave (verb) + you (somebody) + this news? (something)
పైన ఉన్న sentences అన్నింటినీ కూడా verb + something + prep. (preposition) + somebody- ఈ pattern నుంచి,
verb + somebody + something pattern కు మార్చవచ్చు.

**2) Don't mind who gave it to me-**
a) gave (verb) + it (something) + to (prep.) + me (somebody) =
Don't mind who gave me it.
b) gave (verb) + me (somebody) + it (something)
(It వచ్చినప్పుడు, అంటే something, it అయినప్పుడు ఈ pattern కాస్త అరుదు) - It ఉంటే pattern (a) నే ఎక్కువగా వాడతాం.

**3) Gopal sent the message to me**
sent (verb) + the message (something) + to (prep.) + me (somebody)=
Gopal sent me the message-
sent (verb) + me (somebody) + the message (something)

**4) Why didn't you bring them to me?**
Did bring (verb) + them (something/ somebody) + to (prep.) + me (somebody) =
Why didn't you bring me them?
= Did bring (verb) + me (somebody) + them (something)

**5) Gopal denied the permission to me**
a) Denied (verb) + the permission (something) + to (prep.) + me (somebody) =
Gopal denied me the permission -
b) Denied (verb) + me (somebody) + the permission (something)

**6) I'd have got it for you-**
a) Got (verb) + it (something) + for (prep.) + you (somebody) =
I'd have got you it -
b) Got (verb) + you (somebody) + it (something)
(అయితే, sentence No.2 లో లాగా 'It' వచ్చినప్పుడు pattern (a) నే ఎక్కువగా వాడతాం.)

**7) Did he show the file to you?**
a) Did show (verb) + the file (something) + to (prep.) + you? (somebody)=
b) Did he show you the file?-
Did show (verb) + you (somebody) + the file (something)

**8) We must present all this information to the members-**
a) must present (verb) + all this information (something) + to (prep.) + the members (somebody)=
b) We must present the members all this information- must present (verb) + the members (somebody) + all this information (something)

**9) We can ask him to rush the file to us =**
a) to rush (infinitive) + the file (something) + to (prep.) + us (somebody)=
b) to rush us the file- to rush (infinitive) + us (somebody) + the file (something)

**10) He must pass the file to us-**
a) must pass (verb) + the file (something)+ to (prep.) + us (somebody) =
b) He must pass us the file-
Must pass (verb) + us (somebody) + the file (something)

చూశారు కదా- ఈ రెండు patterns కూ meaning ఒక్కటే. అయితే గమనించాల్సిన విషయాలు:
1) Spoken English లో pattern (b)- verb + somebody + something (He gave you the book) pattern నే ఎక్కువ వాడతాం. అది సహజంగా ఉంటుంది కూడా. pattern (a) సందర్భాన్ని బట్టి ఉపయోగిస్తాం.
2) పై sentences లో pattern (a) లో ఎక్కువగా preposition 'to' వచ్చింది. verb ను బట్టి preposition మారుతుంటుంది.
pattern (b) ని మనం ఎక్కువగా వాడటం మంచిది.

**ప్రశ్న:**
1. సంతకానికి, పేరుకు, ఆటోగ్రాఫ్‌కు తేడా ఏమిటి?
2. ఒక్కోసారి అలా జరుగుతుందంతే...
3. ఎందుకోమరి ఈ పూట నాకేమీ తోచడం లేదు.
4. మీరు చేసిన పనివల్ల అందరూ బాధపడుతున్నారు.
5. ఎలా జరిగేదుంటే అలా జరుగుతుంది- వీటిని ఇంగ్లిష్‌లో ఎలా రాయొచ్చు?
*– జి రవిబాబు, ఆదిలాబాద్*



**జవాబు:** 1) సంతకం - ఇది ఏదైనా మనకు తెలుసు, మనం ఒప్పుకున్నాం అని తెలిపేందుకు చేసే signature . ఏ ఒప్పంద మైనా (మనకు సంబంధించింది) మన signature లేనిదే చెల్లదు. పేరు- name - దీనికీ సంతకానికీ సంబంధం లేదు కదా. తేడా తెలుస్తూనే ఉంది కదా? మన పేరు ఎవరైనా రాయవచ్చు. సంతకం మాత్రం మనం చేస్తేనే చెల్లుతుంది. మన సంతకం ఇంకెవరు చేసినా నేరమే.
Autograph - ఓ గొప్ప/ ప్రసిద్ధిచెందిన/ ప్రజాభిమానంగల వ్యక్తి తన అభిమానులకు వారి కోరిక మీద, రాసి ఇచ్చే సంతకం.
2) It happens/ It does happen sometimes
3) I'm bored/ I'm getting bored because I've nothing to do.
4) everyone is unhapy/ suffering because of what you've done
5) What will happen will happen

**ప్రశ్న:** 1. retinue 2. reunion 3. speak aside 4. off-spring– వీటి అర్థాలు తెలుపగలరు.
5. I go to temple కు, I go to the temple కు ఉన్న తేడా ఏమిటి?
6. If you will come, I will give it you.
If you come, I will give it you.
ఈ వాక్యాల్లో ఏది కరెక్ట్?
*– నాగిరెడ్డి, శ్రీనివాసులురెడ్డి, కలువాయి*

**జవాబు:** 1. retinue= ఓ ప్రముఖ వ్యక్తి సహాయానికి, రక్షణకు వాళ్ల వెంబడి ఉండే మందీ మార్బలం (ఆ వ్యక్తి అనుయాయులు)
The minister arrived with all his retinue at the place of the meeting =
ఆ సభాస్థలికి మంత్రి తన అనుయాయులతో/ మందీ మార్బలంతో వచ్చాడు.
2. Reunion= పునస్సంగమం - విడిపోయిన వాళ్లు తిరిగి కలుసుకోవడం.
The story ends happily with the reunion of the separated lovers. విడిపోయిన ప్రేమికులు మళ్లీ కలుసుకోవడంతో కథ సుఖాంతమవుతుంది.
3. speak aside: వినకూడని వాళ్లకు వినిపించకుండా మాట్లాడటం - He spoke to his friend aside so that the teacher couldn't hear it - Teacher కు వినిపించకుండా తన friend తో మాట్లాడాడు.
4. Offspring - సంతతి (singular and plural రెండూ offspring) - Man is the offspring of the monkey (నరుడు వానర సంతతివాడు)
5. I go to temple - రోజూ వాడుకగా, ముఖ్యంగా దేవుడి పూజకు గుడికి వెళ్లడం
I Go to the temple - దేవుణ్ని కొలిచేందుకు కాకుండా ఇంకే పనిమీదన్నా గుడికి వెళ్లటం
6. If you come I will give it to you. If clause, షరతును తెలిపేదయితే (conditional clause అయితే) దాన్లో future tense వాడం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

# put out the lights .. turn off the gas




**Surekha:** Come on; put on your clothes and get ready. In another ten minutes we must be at the station to see off Bhavan.

(బట్టలేసుకుని సిద్ధమవండి. ఇంకో పది నిమిషాలకు, భవన్‌కు వీడ్కోలు చెప్పేందుకు station లో ఉండాలి.)

**Sumant:** Yea. Let me first of all carry this jewellery up and lock it up in the safe. Meanwhile you pack up the things to be handed to him at the station.

(అవును/ సరే. మొదట ఈ నగల్ని పైకి తీసుకెళ్ళి, locker లో పెట్టి తాళం వేయనీ. ఇంతలో నువ్వు station లో అతనికివ్వాల్సిన వస్తువుల్ని pack చెయ్యి.)

**Surekha:** Don't forget to put out the lights upstairs. You usually do.

(పైన lights ఆర్పేయటం మర్చిపోకు. మామూలుగా నువ్వు మర్చిపోతుంటావు).

**Sumant:** Don't worry. I won't, this time.

(ఆందోళనపడకు. ఈసారి మర్చిపోన్లే)

**Surekha:** Last time when I returned home I found the lights on.

(కిందటిసారి నేను ఇంటికి తిరిగొచ్చేసరికి lights వెలుగుతూండటం చూశాను).

**Sumant:** You don't forget to turn off the gas cylinder. That's important.

(gas cylinder కట్టేయడం నువ్వు మర్చిపోకు.)

**Surekha:** Hurry up then. Not much time left. I have to bring in the chairs that are in the varandah.

(త్వరగా కానీ, ఎక్కువ time లేదు. వరండాలో ఉన్న కుర్చీలన్నింటినీ లోపలికి తీసుకురావాలి)

**Sumant:** Bhavan will be very happy that we will be there to see him off. Let's be at the station well before the train comes in.

(అతనికి వీడ్కోలిచ్చేందుకు మనమక్కడ ఉన్నామంటే అతను సంతోషిస్తాడు. Train వచ్చే వేళకంటే బాగా ముందుందాం అక్కడ).

**Surekha:** OK. Lock up the jewels and come down. Hurry up.

(నగలన్నీ తాళం పెట్టి కిందికి రా. త్వరగా కానీ)

**Sumant:** OK.

☯ ☯ ☯ ☯

English conversation లో తరచుగా వినిపించే మరికొన్ని patterns గురించి ఈ lesson లో చూద్దాం.

***Look at the following sentences from the conversation above.***

*1) Put on your clothes.*

*2) We must be at the station to see off Bhavan.*

*3) Let me first carry the jewellery up and lock it up.*

*4) Don't forget to put out the lights.*

*5) Don't forget to turn off the gas.*

*6) Lock up the jewels.*

In the sentences above, observe the expressions. 1) put on 2) see off 3) carry the jewellery up 4) put out 5) turn off 6) lock up.

పై expressions లో ప్రతిదానిలో verb, ఆ verb తర్వాత preposition కానీ, adverb (ఒక పని ఎలా జరిగిందీ తెలిపే మాట) కానీ వస్తున్నాయి కదా? చూడండి. 1) put తర్వాత on 2) see తర్వాత off 3) carry తర్వాత up, 4) మళ్లీ put తర్వాత up 5) turn తర్వాత off, and 6) lock up లో lock తర్వాత up.

ఇలాంటివాటిని phrasal verbs అంటాం. ఇవి English లో సర్వసాధారణం. ఒక్కోకప్పుడు phrasal verb లో verb తర్వాత వచ్చే preposition, adverb ను బట్టి, verb అర్థం ఉంటుంది. ఇది practice లోనే తెలుస్తుంది.

eg: put on- ఇక్కడ put కు ఉన్న అర్థానికీ, put on కు ఉన్న అర్థానికీ చాలా తేడా ఉంది.

Put అంటే తెలుసు కదా? పెట్టడం/ ఉంచడం అని.

Put the book on the table =

పుస్తకం table మీద ఉంచు.

అయితే put on అంటే ధరించటం.

Put on your clothes and start =

బట్టలేసుకుని బయలుదేరు.

ఇలాంటి expressions ను phrasal verbs అంటాం. మనం వీటిని conversation లో correct గా వాడగలిగితే, phrasal verbs, adverbials, adverb particles అనే grammatical పేర్లను గుర్తుంచుకోనక్కర లేదు.

**1) Put on your clothes -**

ఇక్కడ put on వచ్చే sentence pattern చూద్దాం: తెలుసుకదా. Put on your clothes/ Please put on your clothes లాంటి sentences లో subject ఎప్పుడూ you.

Put on your clothes =

You put on your clothes.

Please put on your clothes =

You please put on your clothes.

**Put on your clothes** =

మీ బట్టలేసుకోండి.

sentence pattern:

a) Put (verb) + on (prep/ adverb) + your clothes (something)

b) He took off his shirt =

shirt తీసేశాడు.

Pattern: took (verb) + off (prep/ adverb) + his shirt (something)

**2) We must be at the station to see off Bhavan.**

see off (somebody) = see (somebody) off వీడ్కోలివ్వటం. ఈ verb కూడా పై verb లాగానే.

They saw me off at the bus stand =

Bus stand కు వచ్చి నన్ను సాగనంపారు.

**3) Carry the jewellery up =**

carry up the jewellery. ఇక్కడి pattern కూడా carry (verb) + up (prep/ adverb) + the jewellery (something)

a) He held up his hand =

అతను తన చేయి పైకెత్తాడు.

Held (verb) + up (prep) + his hand (something)

b) She entered the room and switched on the light.

switched (verb) + on (prep) + the light (something)




**4) Don't forget to put out the lights =**

put out = దీపాలు, మంటలు ఆర్పేయటం

put (verb) + out (prep) + lights (something)

a) He put out all lights before going to bed =

పడుకునేముందు అతడు దీపాలన్నీ ఆర్పేస్తాడు.

puts (verb) + out (prep) + the lights (something)

b) The firemen put out the fire =

Fire department (అగ్నిమాపకదళం) వాళ్లు మంటలార్పేశారు.

Put (verb) + out (prep) + the fire (something)

**5) Don't forget to turn off the gas (cylinder)=**

Gas cylinder కట్టేయటం/ ఆపేయటం/ బంద్ చేయటం మర్చిపోకు.

turn (verb) + off (prep) + the gas (something)

turn off = బంద్ చేయటం/ ఆపేయటం

a) He does not turn off the tap after collecting water/ drawing water =

నీళ్లు పట్టుకున్న తర్వాత అతను pump/ కుళాయి/ నల్లను బంద్ చేయలేదు/ కట్టేయలేదు

b) Turn off the lights before going out =

బయటికెళ్లేముందు దీపాలు ఆర్పేయ్.

turn (verb) + off (prep) + the lights (something)

**6) Lock up the jewels =**

నగలకు తాళంపెట్టు.

lock (verb) + up (prep) + jewels (something)

Nobody in that village locks up their home =

ఆ గ్రామంలో ఎవరూ ఇళ్లకు తాళాలు వేయరు.

lock (verb) + up (prep) + their home (something)

ఇప్పుడు మనం చూసింది: కొన్ని verbs తర్వాత వాడుకగా (usage) on, off, up, down, in, out, away, back లాంటి మాటలు (ఇవి prepositions కావచ్చు adverbs కావచ్చు ఏదనేది అంత పట్టించు కోనవసరంలేదు) వాడతాం. ఇవి verb అర్థాన్ని ప్రభావితం చేస్తాయి. వీటి అర్థాలు practice వల్ల ఎక్కువ వస్తాయి. అయితే ఇంతకుముందు చూసిన అన్ని patterns కంటే ఈ verb pattern English లో ఎక్కువ ఉపయోగిస్తున్నారు. ఇలాగైతే మన సంభాషణ చాలా సహజంగా ఉంటుంది. వీటిని బాగా practice చేయండి.

**EXERCISE**

**Syam:** అంతకంటే మంచి shirt ను వేసుకునుండొచ్చు కదా నువ్వు? (put on వాడండి)

**Prem:** నా బట్టలన్నీ కూడా ఆ suit case లో ఉన్నాయి. అది తాళం పెట్టి ఉంది. తాళం నా దగ్గర లేదు.

**Syam:** ఆ తాళాలు నీతో ఎందుకు తెచ్చుకోలేదు? వాటిని ఎక్కడ పారేశావు? (throw away వాడండి)

**Prem:** అదే నాకు తెలియడం లేదు.

**Syam:** నువ్వు వాటిని table మీద వదిలేశావు. నేను వాటిని తీశాను. (pick up వాడండి). ఇవిగో.

**Prem:** Thank you.

**ANSWER**

**Syam:** You could have put on a better shirt than that.

**Prem:** All my shirts are in that suit case. The suit case is locked up. I don't have the keys.

**Syam:** Why didn't you bring the keys along?/ the keys with you? Where did you throw them away?

**Prem:** That's what I don't know.

**Syam:** You left them on the table. I picked them up. Here they are.

**Prem:** Thank you.



**ప్రశ్న:** 1. Now that I am a responsible person.

2. The director requested the Government to make the following amendment: That the competent authority should verify their service particulars...

పై వాక్యాల్లో that ఎందుకు వాడినట్టు? that వాడటం వల్ల వాటి అర్థం మారుతుందా?

**– పోతుల భీమేశ్వరరావు, వేగాయమ్మపేట**

**జవాబు:** 1. Now that- ఇక్కడ ఈ రెండు మాటలను కలిపివాడితే వచ్చే అర్థం - అందువల్ల (because).

Now that I'm a responsible person =

నేనిప్పుడో బాధ్యతకల వ్యక్తిని కనుక/ కాబట్టి.

2. రెండో వాక్యంలో That కు అర్థం 'అని'. That the competent authority ... అధికారం గల అధికారి. వారి service విషయాలు నిజమా కాదా అని తెల్చుకోవాలి అని (that), ప్రభుత్వాన్ని ఆయన అభ్యర్థించాడు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# Why don't you put your clothes on?

**Nirmal:** What are you waiting for still? Why don't you put your clothes on and get ready? Can't you see the time's up?
(ఇంకా దేనికోసం చూస్తున్నావ్ నువ్వు? దుస్తులు వేసుకుని తయారుకావేం? టైమ్ అయ్యిందని అర్థం చేసుకోవేంటి? )

**Satpal:** Turn the fan on please. It's quite sultry in here.
(కాస్త ఫ్యాన్ వెయ్యి. ఇక్కడ చాలా చెమట పోస్తోంది.)

sultry = చెమటగా ఉండటం

**Nirmal:** Don't you hear me? I've said the time's up. Here am I hurrying you up and you are still talking about drying up your body.
(నేను చెప్పేది వినిపించడం లేదా? ఇక్కడ నేనేమో టైమ్ అయ్యిందని చెపుతూ ఉంటే నువ్వేమో ఒళ్లు ఆరబెట్టుకోవడం గురించి మాట్లాడుతున్నావ్.)

**Satpal:** Cool down. I do remember we've got to go station to see Sundar off. I've found it out. The train is late by an hour.
(తగ్గు. మనం స్టేషన్‌కు వెళ్లి సుందర్‌కు వీడ్కోలు చెప్పాలని గుర్తుంది. నేను కనుక్కున్నా. రైలు గంట ఆలస్యం.)

**Nirmal:** But we've still a lot of things to do before that.
(కానీ అంతకుముందు చేయాల్సిన పనులు చాలా ఉన్నాయి కదా? )

**Satpal:** What are they?
(ఏంటవి? )

**Nirmal:** We have to pick Nagaraj up on the way, drop him off at his office and proceed.
(దారిలో నాగరాజును ఎక్కించుకుని అతడిని ఆఫీస్‌లో దింపి మనం వెళ్లాలి.)

**Satpal:** Any thing else we've to do?
(ఇంకేమన్నా ఉందా మనం చేయాల్సింది? )

**Nirmal:** Don't you know we've to take the books back from him, pack them up neatly and hand them over to Sundar at the station?
(అతని దగ్గర పుస్తకాలు తీసుకుని, వాటిని నీట్‌గా ప్యాక్ చేసి, సుందర్‌కు స్టేషన్లో అందివ్వాలని తెలియదా నీకు? )

**Satpal:** All that won't take much time, will it? I'll be ready in just ten minutes. Be a good friend and send some coffee up, will you?
(అంతా కలిపి ఎక్కువ టైమ్ పట్టదు కదా? పది నిమిషాల్లో తయారవుతాను. మంచి స్నేహితుడివి కదా? కాస్త కాఫీ పంపించవా? )

**Nirmal:** Keep pouring coffee down your throat and you won't be far off from gastric trouble and acidity. All right. I'll have the coffee sent up, but ask the boy to clear the earlier coffee things off the table. Get ready soon.
(గొంతులోంచి కాఫీ పోస్తూ ఉండు, గ్యాస్ట్రిక్ ట్రబుల్, ఎసిడిటీకి చాలా దూరం ఉండవు/ త్వరలోనే నీకు అవి వస్తాయి. సరే కాఫీ పంపుతాను. కానీ ఆ కుర్రాడిని ఆ పాత కాఫీ కప్పులను టేబుల్ మీదనుంచి తీసేయమను.)

**Satpal:** Thank you. I won't be more than ten minutes.
(పది నిమిషాలకన్నా ఎక్కువ ఉండను.)

✪ ✪ ✪ ✪

కిందటి lesson లో మనం English conversation లో చాలా తరచుగా వినిపించే, spoken English కు సహజత్వాన్ని (అంటే మనం మాట్లాడే English చాలా సహజంగా వినిపించేట్టు చేసే) కల్పించే, verb + adverb particle (prep/ adv) pattern వచ్చే sentence pattern చూశాం. అలాంటివి మరికొన్ని చూద్దాం ఇప్పుడు. అయితే ఒక్కతేడా.

**Look at the following sentences (a) and (b) and observe the difference between the two:**

a) Come on, put on your clothes

b) Come on, put your clothes on.

*a) put (verb) + on (prep) + clothes (something)*

*b) put (verb) + your clothes (something) + on (adv)*

(Don't worry what name we give to a word- prep or adverb. Just practise and you'll be able to speak correctly.)


M.SURESAN

ఏం గమనించాం? (a) లో on, your clothes ముందుంది. (b) లో on, your clothes తర్వాత వస్తోంది కదా? అలా on position లో మార్పు ఉన్నప్పటికీ అర్థంలో మార్పుండదు. మన సౌకర్యాన్నిబట్టి ఈ on లాంటి మాటలు somebody/ something ముందుగానీ, వెనకగానీ వాడవచ్చు

Compare (a) and (b) below:

**a) I will send back the books.**

Pattern: *will send (verb) + back (prep) + the books (something) =*

నేను ఆ పుస్తకాలు తిరిగి పంపుతాను =

**b) I will send the books back.**

Pattern: *will send (verb)+ the books (something) + back (adverb)*

అంటే send back something/ somebody = send something/ somebody back అన్నమాట.

ఏ మాటకు ఏ పేరు, preposition or adverb అనే విషయం పట్టించుకోకండి. మాటలు సరిగా వాడటమే ముఖ్యం. వాటి పేరు అనవసరం.

కిందటి lesson లోనూ, ఈ lesson లోనూ ఇలాంటి మాటలు రెండు విధాలుగా వాడే తీరు చూస్తాం మనం.

**Look at the following sentences from the conversation between Nirmal and Satpal:**

వీటన్నింటిలో verb + somebody/ something + on/ in/ up/ back, etc. pattern ఉంది.

వీటన్నింటినీ last lesson లో మనం చూసిన pattern: verb + on/ in/ up/ back, etc. + somebody/ something pattern లోకి మార్చవచ్చు అంటే patterns ఒకదాని బదులు ఒకటి వాడవచ్చు

**1) Why don't you put your clothes on?**
*Do put (verb) + your clothes (something) + on=*
Why don't you put on your clothes?
*Do put (verb) + on + your clothes (something)*

**2) Turn the fan on = Turn on the fan**
*(verb + something + on = verb + on + something)*

**3) Drying your body up= Drying up your body.**
*(verb + something + up = verb + up + something)*

**4) We've to go to station to see Sundar off**
*(see (verb) + Sundar (somebody) + off)*
= We've to go to station to see off Sunder
*(see (verb) + off + Sundar (somebody))*

**5) We've to pick Nagaraj upon the way =**
We've to pick up Nagaraj on the way.
*(verb + somebody + up = verb + up + somebody)*

**6) We've to take the books back =**
We've to take back the books
[take (verb) + the books (something) + back = take (verb) + back + the books (something)]

**7) Pack them up = Pack up them**
[pack (verb) + them (something) + up = pack (verb) + up + them (something)]

**8) Hand them over to Sunder = Hand over them to Sundar**
[hand (verb) + them (something) + over = hand (verb) + over + them (something)

**9) Send some coffee up = Send up some coffee**
(send (verb)+some coffee (something) + up = send (verb) + up + some coffee (something)

**10) Find the place out = Find out the place.**
[find (verb) + the place (something) + out = find (verb) + out + the place (something)]

అయితే ఇది అన్ని చోట్లా వీలుకాకపోవచ్చు, I mean, ఈ మార్పు.

He hurried me up= నన్ను తొందర పెట్టాడు అంటాం. He hurried up me అనం. అలాగే He found it out అంటాం. He found out it అనం. ఇది మనం బాగా practise చేసి మాట్లాడుతున్నప్పుడు మనకే తెలిసిపోతుంది, వాడుకలో, ఏ grammar book చూడకుండానే.

## EXERCISE

**Practise the following aloud in English in both the patterns shown above:**

**Kinnera:** He Gandharv, నువ్వు సమయానికి వచ్చావు. మీ ఆవిడేది?

**Gandharv:** ఆవిడ ఇంకా పిల్లలకు బట్టలు వేస్తోంది. నేను బ్యాగ్స్ అన్నీ ప్యాక్ చేసి పట్టుకు వచ్చాను. తను ఇంకాసేపట్లో వచ్చేస్తుంది.
(dress up వాడండి)

**Kinnera:** కాస్త కాఫీ తీసుకుంటావా?

**Gandharv:** ఇంట్లో ఉన్న కాఫీ అంతా తాగేశాను. నా పొట్ట ఇంకేం తీసుకోలేదు.
(Take in వాడండి)

**Kinnera:** నువ్వు కాఫీ వద్దనటం ఆశ్చర్యంగా ఉంది.

**Gandharv:** ఇది నేను నైట్ డ్యూటీలు చేయటం వల్ల అలవాటు చేసుకున్నా. మెల్లిగా ఈ అలవాటు మానేయాలనుకుంటున్నా.
(Pick up, give up వాడండి)

**Kinnera:** Wish you good luck.

## ANSWER

**Kinnera:** You are on time. Where is your wife?

**Gandharv:** She is still dressing up the children/ dressing the children up. I've packed up all the bags/ packed all the bags and brought them along/ brought along them. She will be in, in a few minutes.

**Kinnera:** How about some coffee?

**Gandharv:** I have drunk all the coffee at home. My stomach can't take in anymore/ can't take anymore in.

**Kinnera:** Surprising to hear you don't want coffee.

**Gandharv:** I picked up the habit/ I picked the habit up because of night duties. Slowly I want to give up the habit/ give the habit up.

**Kinnera:** Wish you good luck.



**ప్రశ్న:** *English pronunciation కు సంబంధించి నాకు కొన్ని సందేహాలున్నాయి. ఈ కింది symbols కు sounds ఎలా ఉంటాయో ఉదాహరణతో తెలపగలరు.*
/ ʌ / /a:/ /ə:/ / I / / i:/ / æ / / U/ /u:/
/ 3:/ /ʃ/ / tʃ/ /dʒ/ /əU/ /aU/ /eə/ /b/
**–జి.శంకర్, శంకరపట్నం**

**జవాబు:** These are the sounds for the following symbols:

1. / ʌ / = అ - as in but (bʌt)
2. /a:/=ఆ-as in cart (ka:t) (ఇది పెదవులు నాలుక flat గా పెట్టి అంటాం)
3. /ə:/= ఆ (ఇది పెదవులు గుండ్రంగా ఉంచి అనాలి)
 = as in all (ə:L)
4. / I / = ఇ = as in fit (fIt)
5. / i:/ = ఈ = as in meet (mi:t)
6. / æ / = as in ban (bæn)- cat (kæt)
7. / U/ =ఉ = as in book (bUk)
8. /u:/ = ఊ = as in fool (fu:l)
9. / 3:/= ఇది తెలుగులో లేదు- bird-(b3:d) - 'r' పలకం (silent)
10. /ʃ/ =ష =as in ship (ʃIp)
11. / tʃ/ = ఛ=as in chit (tʃIt)
12. /dʒ/ = జ = as in jug = (dʒʌg)
13. /əU /= - as in go
 (correct Eng pronunciation- గో/ గొ కాదు- గొఅవ్- ఇది త్వరగా అంటే వచ్చే శబ్దం- గొవ్‌కు, గవ్‌కు మధ్య.
14. /aU/ = ఔ- as in now (naU)
15. /eə/=ఎఅ-as in tear (teə-'r' పలకం-silent-లేక)
16. /b/- ఇది మామూలు b నే కదా బహుశా మీరు / ɒ / బదులు /b/ రాశారేమో. / ɒ/ = as in not= పెదవులు గుండ్రంగా ఉంచి not అంటే వచ్చే శబ్దం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

# My boss may consider it a mistake

**Anupama:** (You) Know something. Karuna has offered to help me complete my project.
(ఓ విషయం తెలుసా? నా ప్రాజెక్ట్ పూర్తి చేయడానికి కరుణ సహాయం చేస్తానంది.)

project = ప్రాజెక్ట్= మనకు అప్పగించిన పని

**Nirupama:** Karuna, of all? I find it quite strange. Karuna helping someone is rather unusual.
(కరుణ సహాయం చేయడమా? అది చాలా వింతగా అనిపిస్తోంది? కరుణ ఒకరికి సహాయం చేయడం చాలా అసాధారణమే.)

**Anupama:** I'm fortunate perhaps.
(నాకు ఉందేమో ఆ అదృష్టం.)

**Nirupama:** True. You should think it a fortune to get help from Karuna. But one thing. She is very good at the subject and can see your project through.
(నిజమే. కరుణ సహాయం పొందటం నీ అదృష్టమనే అనుకోవాలి. తనకు ఆ సబ్జెక్ట్ చాలా బాగా తెలుసు. అందువల్ల నీ ప్రాజెక్ట్ పూర్తయ్యేలా చూడగలదు.)

**Anupama:** I've been feeling it very difficult to handle the subject. I've been looking for some one with whose help I can finish it off. The last date isn't far off too. Karuna's help is timely.
(ఈ విషయాన్ని handle చేయడం చాలా కష్టం అనుకుంటూ ఉన్నాను. ఎవరి సహాయంతో దాన్ని పూర్తి చేయగలనా అని అనుకుంటున్నా. చివరి తేదీ కూడా అంత దూరంగా లేదు. కరుణ సహాయం సకాలానికి వచ్చింది.)

timely= సకాలమైన; timely rain= సకాల వర్షం; untimely= అకాలమైన; untimely death= అకాల మరణం

**Nirupama:** I've been putting my project off for quite sometime now. I should speed it up too. Otherwise my boss may consider it a mistake to have allotted me the project.
(నేను నా ప్రాజెక్ట్‌ని చాలా కాలంగా వాయిదా వేస్తున్నాను. నేను దాన్ని వేగవంతం చేయాలి. లేకపోతే మా బాస్ నాకీ ప్రాజెక్ట్ కేటాయించడం పొరపాటైందని అనుకోవచ్చు.)

**Anupama:** Do carry the project through to its end. Yours is an easy project. No reason for you to delay it.
(దాన్ని పూర్తి చెయ్. నీది చాలా సులభమైన ప్రాజెక్ట్. దాన్ని ఆలస్యం చేయడానికి కారణం ఏం కనిపించడం లేదు.)

**Nirupama:** Yea. You are right. I've been just lazy. To be lazy is sweet, I feel.
(నువ్వు కరెక్ట్. నేను బద్ధకించాను. బద్ధకం మధురమేమో.)

**Anupama:** So do I too, but the results are bad.
(నాకూ అలానే అనిపిస్తుంది. కానీ ఫలితాలు చెడుగా ఉంటాయి.)

❍ ❍ ❍ ❍

మనం కిందటి రెండు lessons లో 1) verb + somebody/ something + adverbial pattern, 2) verb + preposition + somebody / something pattern లో వాడగల verbs తెలుసుకున్నాం.

అంతేకాకుండా చాలా verbs విషయంలో pattern (1) నుంచి pattern (2) కు, pattern (2) నుంచి pattern (1) కు మార్చవచ్చని కూడా చూశాం.

**pattern 1:** Please put out the lights.

put (verb) + out (prep) + the lights (something)

**pattern 2:** Please put the lights out.

put (verb) + the lights (something) + out (adv)

రెండింటికీ అర్థం: దీపాలు ఆర్పేయండి అని. ఇలాంటి verbs Spoken English లో చాలా సర్వ సాధారణమే కాకుండా రానురాను ఎక్కువవుతున్నాయి కూడా, ఎందుకంటే అవి చాలా simple గా ఉండి మాట్లాడటానికి చాలా సౌకర్యంగానూ ఉంటాయి. ఎక్కువ భావాన్ని తక్కువ మాటల్లో చెప్పడానికి సహాయపడతాయి.




అలాగే మనం ఈ lesson లో study చేసే verbs మరికొన్ని పై patterns లో వాడే వీలు ఉండగా, ఇంకొన్ని verbs, verb + it + something pattern లో వాడే వీలున్నవి చూస్తాం. ఈ pattern కూడా చిన్న sentences లో conversation ను కొనసాగించడానికి తోడ్పడతాయి.


M.SURESAN

**Look at the following sentences from the conversation above.**

**I.** *1) She can see your project through.*
*2) I can finish it off.*
*3) I've been putting my project off.*
*4) I should speed it up.*

పై sentences అన్నీ కూడా verb + something/ somebody + adverbial pattern లో ఉండటం గమనించండి. అయితే ఓ ముఖ్య విషయం. పై వాటిల్లో కొన్ని expressions మొత్తం అర్థానికీ, వాటిలో ఉండే మాటల అర్థానికీ అంత సంబంధం లేకుండా ఉండటం గమనించండి.

**eg:** 1) See your project through: ఇందులో see something through అంటే ఓ విషయం/ పని పూర్తయ్యేట్లు చూడటం. ఇక్కడ see, through పదాల అర్థాలకూ, పూర్తి చేయడం అర్థానికీ సంబంధం లేదు కదా? ఇలాంటి phrasal verbs, చదవటం వల్ల వస్తాయి.

**1) See your project through.**

**pattern:** see (verb) + your project + through (adv)

a) I want to see the building through before I leave for the states. (స్టేట్స్‌కు వెళ్లే ముందు ఈ కట్టడం పూర్తి చేయాలనుకుంటున్నా.)

b) Ramesh saw the arrangement through= రమేష్ ఆ ఏర్పాట్లన్నీ పూర్తిచేశాడు/ పూర్తి చేయించాడు.

అయితే see through something అంటే - అర్థం చేసుకోగలగడం - అనే అర్థం వస్తుంది.

I can see through your plans = మీ పథకాలు నేను అర్థం చేసుకోగలను.

**2) Finish it off.** finish (verb) + it (something) + off (adv)

Finish your work off/ finish off your work.

We can go to a movie= పని పూర్తి చేసేయ్. సినిమాకి వెళ్లొచ్చు

finish (verb) + your work + (something) + off (adv) =

finish (verb) + off (prep) + your work (something).

**3) Put something off = Put off something** = వాయిదా వేయడం

a) My friends have put off their trip.

put (verb) + off (prep) + their trip (something)=

మా స్నేహితులు ప్రయాణం వాయిదా వేసుకున్నారు = My friends have put their trip off.

put (verb) + their trip (something) + off (adv)

b) Sambhu has put off his marriage = Sambhu has put his marriage off = శంభు తన పెళ్లి వాయిదా వేసుకున్నాడు.

**4) Speed it up =** వేగవంతం చేయడం

speed (verb) + it (something) + up (adv)

= speed (verb) + up (prep) + the work (something)

It వచ్చినప్పుడు, speed it up అనే అంటాం. speed up it అనం.

a) The government wants to speed up jalayagnam.
(ప్రభుత్వం జలయజ్ఞాన్ని త్వరితం/ వేగవంతం చేయాలని అనుకుంటోంది.)

b) Unless he speeds up the construction he can't finish it by next month = అతను కట్టడం వేగవంతం చేయకపోతే వచ్చే నెల లోపల పూర్తి చేయలేడు.

speed up something= speed something up.

**II.** 1) I find it strange
2) You should think it a fortune to get help from Karuna.
3) I've been feeling it very difficult to handle the subject.
4) My boss may consider it a mistake

ఈ sentences లో వాడిన verbs: find, think, feel and consider. వీటిని వాడిన pattern చూడండి.

**I find it strange.**

**pattern:** find (verb) + it + strange (complement). ఇక్కడ complement అంటే వాక్యం పూర్తికావడానికి వాడే మాట (that which completes is complement). చాలా తక్కువ verbs మాత్రమే ఈ pattern లో వస్తాయి.

### EXERCISE

**Practise the following aloud in English:**

**Sambhu:** అది ప్రారంభించావు కదా. పూర్తయ్యేట్లు చూడు. (see,/ carry వాడండి.)

**Vishnu:** నాకు విసుగ్గా ఉంది. సాయం అందించే వారు లేరు. ఒంటరిగా కొనసాగించడం నావల్ల కావడం లేదు. (lend a hand వాడండి.)

**Sambhu:** అంటే నువ్వు మానేయాలని అనుకుంటున్నావా? (give up వాడండి.)

**Vishnu:** అది కాదు. సహాయం చేసేవాళ్లెవరన్నా ఉన్నారా అని చూస్తున్నా. (look for వాడండి.)

**Sambhu:** నా సహాయం అడగవచ్చు కదా? (ask for వాడండి.)

### ANSWER

**Sambhu:** You've begun it. See it through/ carry it through.

**Vishnu:** I'm tired. None to lend me a hand/ lend a hand to me. Find it impossible to carry it on alone.

**Sambhu:** (Do) you mean you want to give it up?

**Vishnu:** Not that. I am looking for some one to help me.

**Sambhu:** You can ask for/ take my help.

---

## Q&A

**ప్రశ్న:** *Imaginary forms లో should have వాడినప్పుడు had been/ had + pp రావాలి కదా! వివరించగలరు.* *– కె.నరసింహారెడ్డి, హైదరాబాద్.*

**జవాబు:** You are right. It should have been, had been/ had+pp
The verb forms in the three situations are as follows.

| Situation | 'If' clause verbs | Main clause verbs |
|---|---|---|
| Probable Present (అంటే ప్రస్తుతంలో గానీ, future లో గానీ జరిగే అవకాశం ఉంది) | Present tense - am, is, are; 1st RDW, 2nd RDW; am+past participle, is + past participle, are + past participle | will be, shall be, can be, may be; will, shall, can, may } + 1st RDW (go, talk, etc); will, shall, may, can } be + Past Participle |

**Example:** If Ramesh comes home, his mother will feel happy. (Both Ramesh's coming home and his feeling happy are probable. They are likely to happen.)

In the case of scientific facts, however, the main clause verb is usually in the present simple tense. **eg:** If an object is heated it expands. (Main clause verb - expands - present simple)

| Situation | If clause | Main clause |
|---|---|---|
| Improbable present (ప్రస్తుతం జరగనివి) | were/ past doing-word (gave, came, etc)/ were + Past Participle (Passive voice) (we don't use was here) | would, should, could, might } be/ 1st RDW (go, talk, etc) OR would, should, could, might } be + PP (Passive Voice) |

**eg:** If he were here; we would consult him (అతనిక్కడ ఉంటే సంప్రదిస్తాం. అతను లేడిక్కడ ఇప్పుడు. అందుకని సంప్రదించటం లేదు)

If he knew this he would be happy (అతనికిది తెలిస్తే - తెలిసే పరిస్థితి ఇప్పుడు లేదు - అతను సంతోషిస్తాడు)

| Situation | If clause | Main clause |
|---|---|---|
| Imaginary Past/ unreal past (ఊహించుకునే గతం- ఏదైనా జరిగింది, జరక్కుండా ఉంటే అనిగానీ, జరగనిది జరిగుంటే ఎంత బాగుండేది అనిగానీ అనుకోవటం) | had been/ had + past participle (PP)/ had been + PP (Passive) | would, should, could, might } have been/ have + PP/ have been + PP (Passive Voice) |

**eg:** 1) If he had been here, she would have met him (అతనిక్కడ ఉండి ఉంటే, ఆమె అతన్ని కలుసుకునేది (లేదు - కలుసుకోలేదు)

2) If Saritha had answered one more question, she would have got the top rank (ఇంకో question answer చేసి ఉంటే, ఆమెకు top rank వచ్చుండేది).

# ప్రతిభ

**Sandhya:** Don't you think it strange for Udaya to behave like that towards us?
(ఉదయ మనపట్ల ఆ విధంగా ప్రవర్తించటం నీకు వింత అనిపించటం లేదా?)

**Sampada:** There certainly is some change in her, and I find it rather sudden.
(కచ్చితంగా తనలో ఏదో మార్పుంది, అది కూడా చాలా ఉన్నట్టుండి వచ్చింది).

**Sandhya:** I suppose it to be sudden too. But I find it a change for the better. She is now gentle and soft spoken unlike in the past.
(నాకూ అకస్మాత్తనే అనిపిస్తోంది. అయితే ఈ మార్పు మంచికనే అనిపిస్తోంది. తనిప్పుడు నెమ్మదిగా నిదానంగా మాట్లాడుతోంది).

**Sampada:** Yea. Most of our friends used to consider it difficult to talk to her. She used to be rude. Now all that's changed.
(గతంలో మన స్నేహితుల్లో చాలామంది తనతో మాట్లాడటం కష్టం అనుకునేవాళ్ళు. కాస్త దురుసుగా ఉండేది. అదంతా మారిపోయిందిప్పుడు.)

**Sandhya:** I feel it possible because of the soft-skills workshops she has attended in the past few weeks. The trainer Mr.Sumukh held the workshops and Udaya took them quite seriously.
(గత కొద్దివారాలుగా తను పాల్గొన్న soft-skills workshops వల్ల ఉదయలో ఆ మార్పు వచ్చిందనుకుంటున్నాను. శిక్షకుడు సుముఖ్ ఆ workshops నిర్వహించాడు, ఉదయ ఆ workshops లో చాలా శ్రద్ధ చూపించింది.)

softskills = వ్యక్తిత్వ వికాసానికి (personality development) సంబంధించిన మెళకువలు: communication skills (సంభాషణా, వక్తృత్వ నైపుణ్యం/ భావ వ్యక్తీకరణ) positive attitude (సుముఖ/సానుకూల వైఖరి), goal setting (గమ్య నిర్దేశం), time management (సమయ నియంత్రణ), interpersonal relations (వ్యక్తులతో సంబంధాలు) - వీటన్నింటినీ softskills అంటారు. వృత్తి, ఉద్యోగాల్లో ప్రవేశించే యువతీయువకులు ఇవి తెలుసుకోవటం ముఖ్యం. workshop = మామూలు class లాగా కాకుండా శిక్షణపొందేవాళ్లే శిక్షకుడి guidance తో, పై మెళకువలు తమంత తాము నేర్చుకొనే పద్ధతి.

**Sampada:** Do you really believe it to be useful to attend such workshops?
(అలాంటి workshops లో పాల్గొనటం ఉపయోగకరం అని నిజంగా నమ్ముతావా నువ్వు?)

**Sandhya:** Depends on the trainer. Some trainers are really effective.
(అది శిక్షకుడిని/ workshop నిర్వాహకుడి నిబట్టి ఉంటుంది. కొంతమంది trainers నిజంగానే మనల్ని ప్రభావితం చేయగలరు)

effective = మార్పుగలిగినటువంటి

**Sampada:** (Do) you mean Sumukh is one such?
(అంటే సుముఖ్ అలాంటి trainer అనా నువ్వనేది?)

**Sandhya:** Certainly. Not a few deem it a fortune to be trained by him.
(కచ్చితంగా. అతని శిక్షణ పొందటం ఒక అదృష్టంగా భావించేవాళ్ల తక్కువ మందేం కాదు).

**Sampada:** I see it is necessary for me now. I'll take the earliest opportunity to attend his workshop.
(నాకిది అవసరమని ఇప్పుడనిపిస్తోంది. ఆయన workshop attend అయ్యే తక్షణ అవకాశాన్ని వాడుకుంటాను.)

**Sandhya:** I've attend it once. I don't mind attending it a second time though I call it a bit expensive. It is Rs 3000 for a three day workshop.
(నేను ఒకసారి పాల్గొన్నాను. రెండోసారి పాల్గొనేందుకు నాకభ్యంతరం లేదు, అది ఖర్చయిందని నేనంటున్నప్పటికీ. మూడు రోజుల workshop కు మూడువేలు)

**Sampada:** Of course; I understand.

☺ ☺ ☺ ☺

Spoken English లో బాగా ఎక్కువగా వినిపించే sentence patterns చూస్తున్నాం. ఈ lesson లో అలాంటి patterns లో మరొకటి తెలుసుకుందాం.

***Look at the following sentences from the conversation above.***

1) *Don't you think it strange for Udaya to behave like that?*
2) *I find it rather sudden*
3) *I suppose it to be sudden too.*
4) *Most of our friends used to consider it difficult to talk to her.*




# I find it rather sudden


M.SURESAN

5) *I feel it possible because of the softskills workshop she has attended.*
6) *Not a few deem it a fortune to be trained by him.*

ఈ sentences అన్నింటిలో verb తర్వాత it వస్తోంది కదా? ఈ it- pattern లో భాగం మాత్రమే. ప్రత్యేకమైన అర్థమేమీలేదు దానికిక్కడ.

**1) Don't you think it strange for Udaya to behave like that.**

ఈ sentence pattern,

Do think (verb) + it + strange (adjective) + for Udaya... (phrase - a group of words without a verb)

a) I think it my duty to inform the police of it,
Pattern: think (verb) + it + my duty (noun) + phrase.

ఈ pattern లో it తర్వాత noun/ adjective + clause (a group of words with a verb)/ phrase, etc.

ఈ pattern లో మనం వాడగలిగిన ఇతర verbs: find (sentence no.2 above), suppose (sentence no.3), consider (పరిగణించటం- sentence no.4), feel (sentence no.5), deem (sentence no.6)

**2) Find:**

a) She found it difficult to understand it.
found (verb) + it + difficult (adj) + phrase

b) They found it insulting to be there any more.
found (verb) + it + insulting (ing form/ adj) + phrase.

**3) I suppose it (to be) sudden**

a) suppose (verb) + it + to be sudden (phrase)

b) suppose (verb) + it + sudden (adjective)
Pattern b కాస్త అరుదు. = ఇది అకస్మాత్తను కుంటాను.

**4) Most of our friends used to consider it difficult to talk to her.**

used to consider (verb) + it + difficult (adj) + to talk to her (infinitive/ phrase)

a) They considered it a shame to lose the game.
(వాళ్లు ఆటలో ఓడిపోవడం సిగ్గుచేటుగా పరిగణించారు)
considered (verb) + it + a shame (noun) to lose the game (infinitive/ phrase)

b) He considered it an honour to be chosen leader.
(నాయకుడిగా ఎంపికవడం గొప్ప గౌరవంగా పరిగణించాడతను.)
considered (verb) + it + an honour (noun) + to be chosen leader (infinitive/ phrase)

**5) I feel it possible because of the softskills work shops.**

feel (verb) + it + possible (adj.) + phrase.

a) He feels it respectable to talk to elders like that = పెద్దలతో అలా మాట్లాడటం గౌరవం అనుకుంటాడు.
feels (verb) + it + respectable (adj) + infinitive/ phrase.

b) She felt it dangerous to go alone in the night = రాత్రి ఒంటరిగా వెళ్లడం ప్రమాదకరమని అనుకుంది.
Pattern: felt (verb) + it + dangerous (adjective) + to walk alone in the night (infinitive/ phrase)

**6) Not a few deem it a fortune to be trained by him =**

అతని శిక్షణ పొందటం ఒక అదృష్టం అనుకునేవాళ్లు తక్కువేంకాదు.

deem= consider= పరిగణించటం.

Pattern: deem (verb) + it + a fortune (noun) + to be trained by him (phrase)

a) Every one deems it an honour to get the title Padmasri =
ప్రతివాళ్లూ పద్మశ్రీ పురస్కారం పొందటం, ఒక గౌరవంగా పరిగణిస్తారు/ గౌరవంగా పరిగణిస్తారు.

b) I deem it a pleasure to invite the chief guest up the dais =
ముఖ్య అతిథిని వేదిక మీదికి ఆహ్వానించటం ఆనందంగా భావిస్తున్నాను.

ఈ pattern లో వాడగలిగిన verbs: think, find, consider, feel, suppose, believe, deem, etc.

ఒక విషయం గమనించండి: verb + it + noun/ adj + phrase, etc., pattern లో వాడగల పై verbs అన్నింటి విషయంలో it, తర్వాత to be వాడొచ్చు

I think it strange for him to behave so = I think it to be strange for him to behave so.

ఇలాగే మిగతా verbs విషయంలో కూడా.

ఈ pattern మన conversation, simple గా, effective గా ఉండేందుకు తోడ్పడుతుంది. Practice చేద్దాం.

**EXERCISE**

**Practise the following aloud in English.**

**Gopi:** అలాంటి teacher దగ్గర చదవటం నా అదృష్టం అనుకుంటున్నాను. (think వాడండి)

**Ramu:** నిజమే. ప్రతి విద్యార్థి తను చెప్పింది అర్థం చేసుకునేట్లు చేయటం ఆయన ధర్మంగా భావిస్తాడు. (feel వాడండి)

**Gopi:** మా అన్న కూడా తను ఈ teacher కు విద్యార్థిగా ఉండటం ఒక విశిష్ట అవకాశంగా భావించేవాడు (consider, privilege వాడండి)

**Ramu:** ఆయన teaching వినటమే ఆనందంగా పరిగణించేవాళ్లుంటే, ఆయనకు best teacher పురస్కారం రాకపోవటం గర్హనీయం (deem, consider, deplorable వాడండి).

**ANSWER**

**Gopi:** I think it a fortune to study under him.

**Ramu:** True. He feels it his duty to make every student understand his teaching.

**Gopi:** My brother also considered it a privilege to have been his student.

**Ramu:** While there are those who deem it a pleasure to listen to his teaching, we consider it deplorable that he has not got the best teacher award.

**ప్రశ్న:**



1. Only some snakes are poisonous.
   - Some snakes are only poisons.
2. We reached home before the Sun has set.
   - We reached home after the Sun had set.
3. No sooner he saw a snake he ran away.
   - As soon as he saw a snake he ran away.
4. What can I do?
   - What am I to do?

ఈ నాలుగు వాక్యాలకు తెలుగులో అర్థాలు తెలియజేయగలరు.

**– అంతటి పెంచలయ్య, రాజంపేట**

**జవాబు:**

1. Only some snakes/ some snakes only/ some snakes alone are poisonous (కొన్ని పాములు మాత్రమే విషపూరితమైనవి) some snakes are only poisonous కు అర్థంలేదు.
2. We reached home after the Sun had set. ఈ sentence correct. We reached home before the Sun has set - wrong (reached - past tense, has set - present tense)
3. No sooner he saw a snake he ran away ఇది తప్పు. Correct form of the sentence: No sooner <u>had he seen</u>/ <u>did he see</u> the snake, <u>than</u> he ran away = As soon as he saw the snake he ran away.
4. What can I do? = నేనేం చేయగలను? What am I to do= నేను చేయాల్సిందేంటిప్పుడు/ నేనేం చేయాలి? Both the sentences are correct. ఇలాంటి ఉదాహరణలు ఇంతకుముందు చాలా ఇచ్చాం చూడండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# There's no use submitting it now

**Kantha:** I never thought it would be so difficult getting a certificate from a government department.
(ప్రభుత్వ శాఖ నుంచి సర్టిఫికెట్ పొందడం ఇంత కష్టమని నేనెప్పుడూ అనుకోలేదు.)

**Sabitha:** What did you think- that you could get it in a jiffy?
(ఏమనుకున్నావు నువ్వు - చిటికెలో తెచ్చుకోగలనని?)

in a jiffy- క్షణంలో

**Kantha:** I knew it wouldn't be easy, but never imagined it would be so difficult.
(అది సులభం కాదని తెలుసు, అయితే ఇంత కష్టంగా ఉంటుందని నేనెప్పుడూ అనుకోలేదు.)

**Sabitha:** I had a bitter experience too just a month ago when I went for my caste certificate. There was a lot of delay. I had an argument with one of the clerks there. It made no difference. I then realised it was foolish arguing with them.
(ఓ నెల కిందట caste సర్టిఫికెట్ తెచ్చుకోవడానికి వెళ్లినప్పుడు నాకూ చేదు అనుభవం ఎదురైంది. చాలా ఆలస్యమైంది. అక్కడి గుమాస్తాతో వాదించాను. అందువల్ల పరిస్థితిలో ఏం తేడా లేదు. అప్పుడు అర్థమైంది వాళ్లతో వాదించటం మూర్ఖత్వమని.)

**Kantha:** Just no use trying to do that; you know. Grease there palms and it will be easy getting anything done in a government office.
(అలా ప్రయత్నం చేయడం వల్ల ఏం ఉపయోగం లేదు. అదే వాళ్ల చేతులు తడిపితే. ఏదైనా సులభమే.

grease the palm = చేతులు తడపడం

**Sabitha:** I got the certificate any way.
(మొత్తానికి ఎలాగో సర్టిఫికెట్ తెచ్చుకున్నాను.

**Kantha:** What are you going to do with that?
(దాంతో ఏం చేయబోతున్నావు?)

**Sabitha:** Why are you asking so?
(ఎందుకలా అడుగుతున్నావు?)

**Kantha:** It's too late girly. There's no use submitting it now. The last date was the day before.
(ఇప్పుడది మరీ ఆలస్యంగా తెచ్చావు. దాన్నిపుడు సబ్మిట్ చేయడం వల్ల ప్రయోజనం లేదు. చివరితేది మొన్ననే అయిపోయింది.)

girly = అమ్మాయ్ అని చనువుతో అనడం

**Sabitha:** That's disappointing really. So what should I do now?
(చాలా నిరాశగా ఉంది. ఇప్పుడు నేనేం చేయాలి?)

**Kantha:** Oh, I remember. With a late fee you can submit it till this weekend.
(ఆ. ఇప్పుడు గుర్తొచ్చింది. late fee తో ఈ వారం చివరిదాకా పంపవచ్చు)

**Sabitha:** What's the late fee?
(late fee ఎంత?)

**Kantha:** Rather on the high side, I'm afraid, Rs 50/- a day.
(కాస్త ఎక్కువే. రోజుకు 50 రూపాయలు.)

**Sabitha:** What a nuisance having to pay so much money!

**Kantha:** Don't delay any further. Post it soon.
(ఇంకా ఆలస్యం చేయకు. వెంటనే పోస్ట్ చెయ్.)

**Sabitha:** Yea. Let me rush.
(అవును, నన్ను వెంటనే వెళ్లనీ.)

✪ ✪ ✪ ✪

Spoken English లో ముఖ్యంగా informal situations లో (అంటే మనకు బాగా పరిచయం ఉన్నవాళ్లతో) సంభాషణ జరిపేటప్పుడు వాడే sentence pattern ఈ lesson లో తెలుసుకుందాం. ఈ pattern బాగా practice చేసి మీ conversation లో వాడండి. చాలా సహజం (natural) గా ఉంటుంది.

**Observe the following sentences from the dialogue above:**

1) .... *it'd be so difficult getting a certificate from a government office.*
2) ... *it was foolish arguing with them.*
3) *Just no use trying that*
4) *It will be easy getting anything done in a government office.*
5) *There's no use submitting it now.*

**1) .... it'd be difficult getting a certificate...**

ఈ part of the sentence pattern చూద్దాం. అంతకు ముందు గమనించాల్సిన విషయం- ఇక్కడ చూపించిన sentences అన్నీ కూడా, introductory 'it'/ 'there' తో begin అవడం. (Introductory it/ there వీటిని ఇంతకుముందు వివరించాం. - English లో చాలా తరచుగా sentences ను, There/ It తో ప్రారంభిస్తాం. అలా ప్రారంభించినప్పుడు there కు అక్కడ అని కానీ, it కి అది అని కానీ అర్థం రాదు.

**eg:** There are 10 students here = ఇక్కడ పదిమంది విద్యార్థులు ఉన్నారు.
It is easy to learn English = English నేర్చుకోవడం సులభం.

ఈ రెండు sentences లో, there, it లను sentence begin చేసేందుకు వాడతాం. అందుకనే వాటిని 'Introductory' (పరిచయం చేసే) there/ it అని అంటాం.

.... it'd be difficult getting a certificate.
Pattern: It + would be (be form) + difficult (adjective) + getting (... ing form) =
పొందటం కష్టం.

**2) ... it was foolish arguing with them.**
Pattern: It + was (be form) + foolish (adjective)+ arguing (...ing form)=
వాళ్లతో వాదించడం మూర్ఖత్వం.

**3) (It's) just no use trying that.**
Pattern: It + is (be form)+ (just)+ (no) use (noun) + trying (... ing form) =
అది ప్రయత్నించటం నిరుపయోగం.

**4) It will be easy getting anything from him.**
Pattern: It + will be (be form) + easy (adj) + getting (...ing form)=
ఏది పొందడమైనా సులభమే.

**5) There's no use submitting it now.**
Pattern: There + is (be form) + (no) use (noun) + submitting (... ing form)
ఈ sentences అన్నింటి pattern కూడా It/ there + be from + adjective/ noun + ...ing form.


M.SURESAN

**Look at the following too:**
There's no use talking to a fool.
a) There + is (be form) + (no) use (noun) + talking (...ing from)
b) It's no good helping the undeserving.
It + is (be form) + (no) good (adjective) + helping (...ing form)=
అపాత్రులకు సాయం చేయడం మంచిదికాదు.
deserve = అర్హత ఉండటం
the deserving = అర్హత ఉన్న వాళ్లు
the undeserving = అర్హతలేని వాళ్లు/ అపాత్రులు

ఇది spoken English లో తరచుగా వినిపించే sentence pattern. అయితే కొన్ని nouns, adjectives మాత్రమే ఈ pattern లో వాడతాం.

It/ there తర్వాత noun/ adjective + ...ing form pattern లో వచ్చే nouns, adjectives చాలా తక్కువ. ఆ nouns, adjectives ఇవీ: మీరు గమనించే ఉంటారు.
1. difficult (adj)
2. easy (adj)
3. foolish (adj)
4. <u>no</u> good (adj)
5. <u>no</u> use (noun)

ఇంకో విషయం: It + be form తర్వాత + noun/ adjective- ఏదైనా వస్తుంది. కానీ there + be form తర్వాత మాత్రం noun మాత్రమే వస్తుంది.

1) వాడికి నచ్చజెప్పడం కష్టం.
It is difficult convincing him =
(It + be form + adjective)
2) ఇంత ఆలస్యంగా reservation దొరకడం సులభం కాదు.
It's not easy getting reservation at this late hour.
3) అంత తక్కువ జీతానికి పనిచేయడం మూర్ఖత్వం =
It's foolish working for such a low salary.
4) ఇంకా ఇక్కడ వేచి ఉండటం అంత మంచిది కాదు =
It's no good waiting here any more.
<u>no</u> good= మంచిది <u>కాదు</u> అనే అర్థంతోనే వాడతాం.

5) Is it any good staying here any longer? =
ఇంకా ఇక్కడ ఉండటం ఏమన్నా మంచిదా?
6) అతడి మీద ఆధారపడటం నిరుపయోగం =
It's/ There's no use depending on him.

పై sentences అన్నింటిలో కూడా మామూలుగా అయితే, ...ing form కు బదులు infinitive (to + 1 St RDW) వాడవచ్చు. (There ఉన్న sentence లో తప్ప.)

1) ...It'd be so difficult getting... =
It'd be so difficult to get...
2) ...It was foolish <u>arguing</u> with them =
...it was foolish <u>to argue</u> with them
3) ...no use/ no good తర్వాత... ing form మాత్రమే వస్తుంది. Infinitive రాదు.
4) It will be <u>easy getting</u> any thing from him=
It will be easy <u>to get</u> anything.

అయితే మామూలు conversational Spoken English లో '...ing' form pattern, ...infinitive వచ్చే pattern కంటే ఎక్కువ వినిపిస్తుంది, difficult, easy, foolish, లాంటి మాటల విషయంలో.

**ప్రశ్న:** 1. Opposite words అన్ని పదాలకూ ఉంటాయా? లేదా adjectives కు మాత్రమేనా? Teacher-student, Father-Mother, Son-daughter ఇవి opposite words అవుతాయా?
2. ఆమె అతడికి భయపడింది.
3. ఆమె అతడిని భయపెట్టింది.
**– టి. రమాప్రత్యూష, శ్రీశైలం**

**జవాబు:** 1. కొన్ని పదాలకు ఉండకపోవచ్చు. అయితే మీరనుకుంటున్నట్లు కొన్ని parts of speech కి మాత్రమే (Adjectives కి మాత్రమేనా అని అడిగారు కదా?) ఉండి మరికొన్నింటికి లేకపోవటం ఉండదు. A part of speech (Noun, Adjective, Verb, etc) కి చెందినవైనా అన్నింటికీ opposite ఉండకపోవచ్చు
Teacher, Student opposites కావు. Teacher, Learner; Master, Student oppsite అవుతాయి. father, mother; son, daughter- oppsite genders మాత్రమే కానీ opposites కావు.
2. ఆమె అతడికి భయపడింది-
She was afraid of him.
3. ఆమె అతడ్ని భయపెట్టింది-
She scared him/ frightened him/ terrified him.

**ప్రశ్న:** Spoken English lessons మొదటినుంచి కావాలంటే ఏం చేయాలి?
**– కె. రాజమౌళి, కంతాత్మకూర్**

**జవాబు:** Eenadu spoken English lessons internet నుంచి download చేసుకుని ప్రింట్ తీసుకోవచ్చు ప్రతి వ్యాసం కింద Website ID ఉంటుంది చూడండి.

### EXERCISE

**Practise the following aloud in English.**

**Abhishta:** ఇక్కడ వేచి ఉండటం వల్ల ఉపయోగం ఏమైనా ఉందా?
**Sushmita:** నువ్వే కదా మనం ఇక్కడ వేచి ఉందాం అన్నది. (suggest వాడండి)
**Abhishta:** అన్నాననుకో. ఇంకేమాత్రం ఇక్కడ wait చేయడం కష్టమే. నాకు ఓర్పు పోతోంది.
**Sushmita:** ఇప్పుడు complain చేయడం మంచిగా అనిపించట్లేదు నాకు.
**Abhishta:** ఇక్కడ wait చేయాలని సూచించడం నా మూర్ఖత్వమే.
**Sushmita:** సరే. పద.

### ANSWER

**Abhishta:** Is there any good/ Is it any good waiting here?
**Sushmita:** It is you who suggested our waiting here.
**Abhishta:** I did suggest it, of course. I have lost my patience.
**Sushmita:** I feel it's no good complaining now.
**Abhishta:** It's foolish my suggesting that we wait here.
**Sushmita:** Ok. Let's go.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# Please avoid taking coffee so often



**Dr. Sita:** Please avoid taking coffee so often. It affects your health.

(అన్నిసార్లు కాఫీ తాగడం మానేయండి. మీ ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుంది.)

**Rao:** I want to give up taking it too. I'll try from today, not suddenly, but gradually.

(నేనూ మానేయాలనే అనుకుంటున్నాను, ఈరోజు నుంచి ప్రయత్నిస్తాను. ఆకస్మికంగా కాదు, క్రమక్రమంగా.)

gradually = గ్రాడ్యుఅలీ = క్రమక్రమంగా

**Dr. Sita:** First, stop taking coffee after *6 O' clock* in the evening. That sends you to sleep early.

(మొదట సాయంత్రం 6 తర్వాత కాఫీ తాగడం మానెయ్యండి. అది మీకు త్వరగా నిద్రపట్టేలా చేస్తుంది.)

**Rao:** But I enjoy watching late night shows on the TV.

(అయితే టీవీలో బాగా పొద్దు పోయిన తర్వాత వచ్చే ప్రదర్శనలు చూడటం నాకు ఆనందం.)

**Dr. Sita:** You'd better finish watching the TV and go to bed before 10 or 10.30. That makes for good health.

(రాత్రి పది, పదిన్నరకు టీవీ చూడటం పూర్తి చేసుకుని నిద్రపొండి. ఆరోగ్యానికి మంచిది.)

**Rao:** My other problem is I can't get up earlier than 7 in the morning.

(నాకు ఇంకో సమస్య పొద్దున ఏడింటికి ముందు లేవలేను.)

**Dr. Sita:** Start taking much less coffee than you do now. That'll solve all your problems.

(ఇప్పటికైనా కాఫీ బాగా తక్కువ తీసుకోవడం మొదలెట్టండి. అది మీ సమస్యలన్నింటినీ తీరుస్తుంది.)

**Rao:** I remember my dad in my childhood saying so too - that coffee affects sleep, and when sleep is affected, health in general is affected too.

(నా చిన్నతనంలో మా నాన్న చెప్పడం కూడా నాకు గుర్తుంది. కాఫీ నిద్రను పాడు చేస్తుందనీ, దానివల్ల ఆరోగ్యం పాడవుతుందనీ.)

**Dr. Sita:** That's right. I consider giving up coffee altogether. But as you said, I'd advise you to do it gradually.

(అది కరక్టే. కాఫీ పూర్తిగా మానేయడం ఉత్తమం అని నేను అనుకుంటున్నా. అయితే మీరన్నట్లు దాన్ని క్రమక్రమంగా మానేయండి.)

**Rao:** Thank you. Shall I make a move now? It's already 10.30 perhaps time for you to go to bed.

(సరే అయితే నేను వెళ్లనా మరి? ఇప్పటికే 10.30 అయ్యింది. మీరు నిద్రపోయే సమయమేమో?)

**Dr. Sita:** Don't risk going back to your village so late in the night. You can sleep here for tonight and start early in the morning. My brother is here to give you company?

(ఇంత రాత్రి ఇంటికెళ్లే సాహసం చేయకండి. ఈ రాత్రికి ఇక్కడ పడుకోండి. పొద్దున్నే వెళ్ల వచ్చు. మా బ్రదర్ మీకు కంపెనీ ఇస్తాడు.)

**Rao:** Thank you for the gesture. No risk going back now because I have my cousin accompanying me. Five more minutes and he will be here with his car. We'll be back in the village in an hour.

(మీరు చేయాలనుకున్న ఆ మేలుకు కృతజ్ఞతలు. వెళ్లటం అంతపెద్ద ప్రమాదకరమేమీకాదు. మా కజిన్ నాతో వస్తున్నాడు. అయిదు నిమిషాల్లో తన కారుతో ఇక్కడుంటాడు. ఓ గంటకల్లా మా గ్రామంలో ఉంటాం.)

**Dr. Sita:** Ok, then; best of luck.

gesture= జస్చ- మామూలు అర్థం సౌజ్ఞ/ సైగ. ఇక్కడి అర్థం- ఏదైనా ఇతరులకు చేసే చిన్న ఉపకారం

Accompany – అకాంపని- కాం నొక్కి పలుకుతాం- ఇంకొకరితో కలిసివెళ్లటం

☯ ☯ ☯ ☯

Spoken English లో చాలా verbs తర్వాత noun కానీ... ing form కానీ వస్తుంది. Infinitive (to + 1st RDW) రాదు. అలాంటి verbs కొన్నింటిని మనం ఇప్పుడు తెలుసుకోబోతున్నాం.

**Look at the following sentences from the dialogue above.**

*1) Please avoid taking coffee so often.*
*2) Stop taking coffee in the evening after 6 O' clock.*
*3) You'd better finish watching the TV.*
*4) Start taking much less coffee.*
*5) I remember my dad saying so too.*
*6) I consider giving up coffee altogether.*
*7) Don't risk going back to your village so late in the night.*

పై sentences అన్నింట్లో verb తర్వాత '...ing' form రావటం గమనించండి. '...ing' form బదులు కొన్ని verbs తర్వాత noun రావచ్చు. Infinitive మాత్రం రాదు. ఒక్కోసారి infinitive వచ్చినా అర్థం తేడా ఉంటుంది.

**Study the following.**


M.SURESAN

**1) Avoid** = అవాయిడ్- వా నొక్కిపలుకుతాం = ఏదైనా చేయకుండా ఉండటం.

a) We should avoid talking bad about others =
ఇతరుల గురించి చెడు మాట్లాడకుండా ఉండాలి.
avoid talking = avoid + ... ing form

b) Avoid watching TV during exams
(పరీక్షల్లో టీవీ చూడొద్దు.)
avoid watching = avoid + ... ing form
avoid తర్వాత noun వాడవచ్చు

c) Let's avoid this road. It's narrow =
ఈ రోడ్ వదిలేద్దాం. ఇది చాలా ఇరుకు.
avoid + (this) road (noun)

d) I avoid rice at night. I take only chapathis =
రాత్రి నేను భోజనం చేయను. చపాతీలే తీసుకుంటా.
avoid + rice (noun)

e) As far as possible he avoids autos. He goes by the city bus =
వీలైనంత వరకు ఆటోల్లో వెళ్లడు. సిటీబస్‌లో వెళతాడు.
avoids + autos (noun)

**2) Stop** = stop తర్వాత noun కానీ/ ing form కానీ వస్తుంది.

a) Stop talking = మాట్లాడటం ఆపండి.
stop + talking (....ing form)

b) They have stopped coming here =
వాళ్లు ఇక్కడికి రావడం మానేశారు.
Have stopped + coming (... ing form)

c) The police stopped the people from going in to the office =
ప్రజలు ఆఫీసులోకి వెళ్లకుండా పోలీసులు ఆపేశారు.
stopped + the people

**compare a) and b) below:**

a) He stopped talking to me.
stopped + talking (... ing from)

b) He stopped to talk to me.
stopped + to talk - infinitive

a) కి అర్థం - అతడు నాతో మాట్లాడటం మానేశాడు.
b) కి అర్థం - నాతో మాట్లాడటానికి ఆగాడు - (దారిలో, etc.) [stop తర్వాత, ... ing/ noun కూ, stop తర్వాత infinitive కూ అర్థం తేడా అది. ]

**3) Finish** = a) Let him finish his speech- ఆయన speech ని ముగించనీ
finish + his speech (noun)

b) He has just finished eating and is washing his hands.
(ఇప్పుడే తినడం ముగించి చేతులు కడుక్కుంటున్నాడు.)
finished + eating (...ing form)

Finish తర్వాత infinitive రాదు.

**4) Start** = దీని తర్వాత ...ing form, noun, infinitive మూడు వాడతాం, అర్థంలో ఏం తేడా లేకుండా. (అర్థం తెలుసు గదా, ప్రారంభించటం)

a) Gopal started to tell me (infinitive) a story.
= Gopal started telling me a story.
= Gopal started a story. (noun)

b) Sumanth started to argue (infinitive) with me..
started an argument (noun) with me
started arguing (..ing form) with me
= సుమంత్ నాతో వాదించడం ప్రారంభించాడు.

**5) Remember** = గుర్తు రావడం.
Remember తర్వాత కూడా noun/... ing form వస్తుంది. Infinitive కూడా వస్తుంది. కానీ అర్థంలో తేడా వస్తుంది.

a) I remember the name very well =
ఆ పేరు నాకు బాగా గుర్తుంది.
[remember + the name (noun)]

b) I remember seeing you somewhere =
నిన్నెక్కడో చూసినట్లు గుర్తొస్తోంది నాకు.
remember + seeing (...ing form)

c) Please remember to send me the book =
నాకు పుస్తకం పంపించడం గుర్తుంచుకోండి.
[Remember + to send (...infinitive)]

d) I didn't remember to post the letter =
ఉత్తరం పోస్టు చేయటం గుర్తుంచుకోలేదు నేను.
[Remember + to post (infinitive)]

**6) Consider** = పరిగణించడం/ అనుకోవడం.

a) I consider waiting here a waste of time.
(ఇక్కడ వేచి ఉండటం అనవసరమని భావిస్తున్నాను నేను.)
consider + waiting (...ing form)

b) I still consider Sachin the best of players =
ఇప్పటికీ సచిన్‌ను నేను ఉత్తమ క్రికెటర్‌గా పరిగణిస్తాను.
[consider + Sachin (noun)]

**7) Risk** = సాహసం చేయడం/ ప్రమాదకర పనిని చేసేందుకు సిద్ధపడటం.

a) Sita can not risk going out in this chill weather. She will be ill if she does =
ఇంత చలిలో సీత బయటికెళ్లే సాహసం చేయలేదు. బయటికెళ్తే జబ్బు పడుతుంది.
[risk + going (...ing form)]

b) The hero risked his life to save the heroine =
హీరోయిన్‌ను రక్షించేందుకు హీరో తన ప్రాణాన్ని కూడా లెక్క చేయలేదు/ ప్రమాదానికి గురిచేశాడు.
risked + his life (noun)]

చూశాం కదా? Avoid, stop, finish, remember, consider, risk- ఈ verbs తర్వాత మామూలుగా ...ing form కానీ noun కానీ వస్తుంది. Avoid, finish, consider, risk తర్వాత infinitive రానే రాదు. Stop తర్వాత infinitive వస్తే ఏదో పనిచేసేందుకు ఆగడం అనే అర్థం వస్తుంది. Remember తర్వాత infinitive ఫలానాపని చేయడం గుర్తుంచుకో అనే అర్థంతో వాడతాం. Start తర్వాత, ...ing form, noun, infinitive మూడూ వాడవచ్చు. ఇలాంటి మరికొన్ని verbs next lesson లో చూద్దాం.



**ప్రశ్న:** 1) Come to school regularly- స్కూల్‌కి రెగ్యులర్‌గా రా!

2) You come to school regularly- నువ్వు స్కూల్‌కి రెగ్యులర్‌గా వస్తున్నావు.

ఇందులో స్కూల్‌కి రెగ్యులర్‌గా రాని విద్యార్థిని మందలించడానికి మొదటి వాక్యం ఉపయోగించాలి. రెండోవాక్యం ఉపయోగిస్తే అతడు స్కూల్‌కి రెగ్యులర్‌గా వస్తున్నట్లే కదా అర్థం?

3) ఫలానా పని చెయ్యి అని చెప్పడానికి చాలా మంది you వాడటం గమనించాను. Do your duty first బదులు you do your duty first, come to school in time బదులు you come to school అని చెప్పడం సర్యైందేనా?

**– పోతుల శ్రీనివాస్, వేగాయమ్మపేట**

**జవాబు:** 1) You come to school regularly, come to school regularly.

– ఈ రెండింటినీ కూడా విద్యార్థిని మందలించేందుకు వాడవచ్చు అయితే you come to school regularly అన్నప్పుడు సందర్భాన్ని బట్టి నువ్వు school కు సక్రమంగా వస్తావు అనే అర్థం కూడా ఉంది. you come to school regularly– దీనికి school కు సక్రమంగా రా అనే అర్థమూ వస్తుంది.

2) నువ్వు school కు సక్రమంగా వస్తున్నావు/ వస్తావు అనే అర్థం కూడా వస్తుంది.

3) Do your duty first బదులు you do your duty first అనీ; come to school on time కు బదులు you come to school on time అనీ అనటం కచ్చితంగా సరైందే.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Visisht:** Hi Dheeraj, where do I see you going every morning this way?
(ప్రతి ఉదయం నువ్వెక్కడికి వెళుతూ కనిపిస్తావిటువైపు? )

**Dheeraj:** Don't you know I practise swimming everyday. I like swimming very much.
(రోజూ ఈత practice చేస్తాన్నేను. తెలియదా నీకు? ఈతంటే నాకు చాలా ఇష్టం)

**Visisht:** Mind teaching me swimming too?
(నాకూ ఈత నేర్పిస్తావా? / నేర్పించేందుకు నీకేమన్నా అభ్యంతరమా? )

**Dheeraj:** I'd love to. Let's start tomorrow itself.
(నాకు చాలా ఇష్టం. రేపే ప్రారంభిద్దాం)

**Visisht:** I am a bit afraid.
(నాకు కాస్త భయంగా ఉంది.)

**Dheeraj:** Keep fearing and you will never learn anything.
(భయపడుతూ కూర్చుంటే నువ్వేదీ నేర్చుకోలేవు)

**Visisht:** Somehow still waters scare me.
(ఎందుకనో నిశ్చలంగా ఉన్న నీళ్లంటే నాకు భయం/ నిశ్చలంగా ఉన్న నీళ్లు నాకు భయం కలిగిస్తాయి.)

scare= దడపుట్టించటం

**Dheeraj:** I will teach you at the swimming pool. It's quite safe.
(నేన్నీకు swimming pool లో నేర్పుతా. అది క్షేమమే.)

**Visisht:** Where else do you go to swim every day?
(నీవు ఇంకెక్కడికి వెళతావు ఈదడానికి? )

**Dheeraj:** I go to the river to swim. I find the waters more refreshing. Time that I left for the river. You will excuse my going away now.
(నేను నదికి వెళతా. నది నీళ్లు ఎక్కువ తాజాగా ఉండేట్లు చేస్తాయి. ఇప్పటికే నదికి వెళ్లేందుకు ఆలస్యమయింది. నే వెళుతున్నా, ఏమనుకోవు కదా? )

**Visisht:** I can't help envying you. You are such an excellent swimmer.
(నిన్ను చూసి ఈర్ష్యపడకుండా ఉండలేను. అంత మంచి ఈతగాడివి నువ్వు)

**Dheeraj:** I hate, not swimming even for a day. If I miss the swimming even for a day I feel out of sorts.
(ఈత ఒకరోజు మానేయటం కూడా నాకిష్టం లేదు. ఒకరోజు ఈతకు వెళ్లకపోతే చికాకుగా ఉంటుంది నాకు)

**Visisht:** OK then. I can't wait any longer. I will accompany you from tomorrow.
(సరే అయితే. నేను ఇంకెంత మాత్రం ఆగలేను. రేపటి నుంచి నీతో వస్తా.)

**Dheeraj:** I'm afraid you are more a talker than doer. I am not very sure that you'll come tomorrow. You keep postponing things.
(నువ్వు మాటకారివేగానీ చేతకాడివి కావని నా అనుమానం. రేపు నువ్వొస్తావని నాకు పెద్ద నమ్మకం లేదు. నువ్వు వాయిదా వేస్తుంటావెప్పుడు.)

**Visisht:** Why do you say so?
(అలా ఎందుకంటున్నావు? )

**Dheeraj:** My experience of you is that you find some excuse or the other not to do something.
(నిన్ను గురించి నా అనుభవం ఏమిటంటే ఓ పనిచేయకుండా ఉండేందుకు ఏదో నెపం దొరుకుతుంది నీకు)

**Visisht:** I'll prove you wrong tomorrow.
(నువ్వు తప్పని రేపు రుజువు చేస్తాను)

**Dheeraj:** OK. Let me hope so.
(అలాగే ఆశిస్తున్నా)

☆ ☆ ☆







# Mind teaching me swimming?


M.SURESAN

ఇదివరకటి lessons లో మనం తెలుసుకున్నది:

1) కొన్ని verbs తర్వాత, noun గానీ ing form గానీ మాత్రమే వస్తాయని (infinitive రాకుండా),

2) కొన్ని verbs తర్వాత noun/ ing form/ infinitive వస్తాయని,

3) కొన్ని verbs తర్వాత noun/ ing form వచ్చేటప్పుడు వచ్చే అర్థానికీ, verbs తర్వాతనే ...infinitive వచ్చేటప్పుడు వచ్చే అర్థానికీ చాలా తేడా ఉంటుందని.

ఈ lesson లో మరికొన్ని verbs, with noun/ ...ing forms తెలుసుకుందాం.

***Look at the following sentences from the conversation above.***

*1) I practise swimming*

*2) Mind teaching me swimming?*

*(Mind= Would you mind)*

*3) Keep fearing and you'll never learn anything*

*4) You'll excuse my going now*

*5) I can't help envying you*

పై sentences అన్నింటినీ గమనించారు కదా- verbs తర్వాత - ing form రావటం. ఇలాంటిచోట్ల, -ing form బదులు noun కూడా రావచ్చు.

**1) Practise**- అభ్యసించటం

a) She practises singing every morning
= ఆమె ప్రతిరోజూ పాడటం అభ్యసిస్తుంది
practise + singing (...ing form)- దీని తర్వాత noun వాడవచ్చు

b) Sunil wants to practise fluit=
సునీల్ fluit నేర్చుకోవాలనుకుంటున్నాడు.
practise + fluit (fluit - noun). Practise తర్వాత infinitive రాదు.

**2) Mind** = అభ్యంతరం తెలపటం/ ఆక్షేపించటం. దీని తర్వాత కూడా infinitive రాదు.

a) If you do the work properly, I don't mind paying you more=
నువ్వు పని సరిగ్గా చేస్తే, నీకింకా ఎక్కువ డబ్బు ఇవ్వడానికి నాకు అభ్యంతరంలేదు.

don't mind + paying (...ing form)

b) People don't mind taxes if they are within limits = కొంత పరిమితికి లోబడి ఉంటే పన్నుల పట్ల ప్రజలకు అభ్యంతరం ఉండదు.
don't mind + taxes (noun)

c) The teacher doesn't mind an extra class if it is before 4 =
4 గంటలకు ముందయితే, teacher కు ఇంకో class తీసుకోవడానికి అభ్యంతరం లేదు.
doesn't mind + (extra) class (Noun)
ఈ verb, mind తర్వాత infinitive రాదు.

**3) Keep fearing** = keep on fearing

keep = keep on = కొనసాగించటం

a) In spite of the doctor's warning, he keeps eating fatty foods =
Doctor హెచ్చరించినప్పటికీ ఆయన కొవ్వు పదార్థాలు తింటూనే ఉంటాడు/ ఉన్నాడు.
keeps + eating (...ing form)

b) The police have arrested him twice. Still he keeps (on) stealing
keeps (on) + stealing (... ing form)
keep on = keep. అయితే Modern usage లో కొనసాగించటం అనే అర్థంతో keep ఎక్కువ వాడతారు. keep/ keep on తర్వాత noun రాదు, infinitive అంతకన్నా రాదు.

**5) Can't help** = తప్పదు.
(ఈ అర్థంతో, అంటే can't help అనే clause లో భాగంగా వచ్చినప్పుడు) ఇందులోని help కూ, సహాయపడటం అనే అర్థం వచ్చే help కూ సంబంధం లేదు.

I can't help envying you
= నీ మీద ఈర్ష్య పడక తప్పటం లేదు.
can't help + envying (... ing form)

a) She can't help going now, though it is late in the night =
బాగా పొద్దుపోయినప్పటికీ, ఆమె వెళ్లక తప్పదు.
can't help + going (... ing form)

b) Murali could not help the trip to Hyderabad
= మురళికి హైదరాబాదు ప్రయాణం తప్పలేదు.
could not help + the trip (noun)
దీని తర్వాత కూడా, ... infinitive రాదు.
గమనించండి: Mind, ఆజ్ఞలో కాకపోతే not తోనే వాడతాం.

---

**ప్రశ్న:** *i) Future continuous tense కు voice లేదా? ఉంటే mango will be being eaten by me అనే passive voice లో be and being అనే verbs రాయవచ్చా? అలాగే perfect participle ను having beaten అని రాశారు. Having అనే పదాన్ని perfect tense లో, ఏ ఇతర పద్ధతుల్లో perfect participle ను (having eaten) ఉపయోగిస్తారో తెలపండి.*

*ii) Being అంటే ఏమిటి? దీని గురించి వివరించగలరు.*

**– ఎ. పెంచలయ్య, రాజంపేట**

**జవాబు:**

i) Perfect continuous tenses కు passive voice వాడం. అందుకు బదులు- has been + past participle/ have been + past participle (present), had been + pp (past), will/ shall have been + pp (future) వాడతాం.

Having taken his food, he went to bed. (భోజనం చేసిన తర్వాత అతడు నిద్రపోయాడు.)

Having walked the whole distance he is tired. (అంత దూరం నడిచినందువల్ల అతడు అలసిపోయాడు.)

perfect participle ను పై విధంగా వాడతారు.

He was very happy to have got a chance to help her. (ఆమెకు సహాయం చేసే అవకాశం వచ్చినందుకు (గతంలో) అతడు సంతోషించాడు (ఇది కూడా గతం.)

ii) Being rich, he can buy a car.
(ధనికుడిగా ఉన్నందువల్ల కారు కొనగలడు.)
being = అలా ఉండటంవల్ల.

**ప్రశ్న:** *మీరు exercise లో if you fail to return on time అని ఒకచోట, I am planning to return in time for the function అని మరోచోట చెప్పారు. ఇలా రెండూ వాడొచ్చా?*

**– జె. రామసుబ్బయ్య, కావలి**




**జవాబు:** In time - సమయానికి కాస్త ముందు, సమయం దాటకుండా.

On time = సమయానికి కచ్చితంగా.

a) He was in time for the function = వేడుకకు సమయం దాటకుండా/ కాస్త ముందే వచ్చాడు.

**ప్రశ్న:** *1) ఇద్దరు వ్యక్తులు రైలు కింద పడి మరణించారు (ప్రమాదవశాత్తు) అన డానికి ఇంగ్లిషులో Two persons got run over and killed కరెక్టేనా? లేక died అనాలా?*

*2) after all అంటే అర్థం ఏమిటి?*

**– కె. వైకుంఠం, కొత్తవలస**

**జవాబు:** 1) Correct. Kill, passive voice లో చంపబడటం/ మరణించటం అనే రెండర్థాలూ ఇస్తుంది.

He <u>was killed</u> by the Maoists = అతను మావోయిస్టులచే చంపబడ్డాడు (మామూలు తెలుగులో- మావోయిస్టులతన్ని చంపేశారు)

He <u>was killed</u> in an accident = ప్రమాదంలో అతను మరణించాడు (అతను చంపబడ్డాడు)

2) After all = ఏదేమయినా.

a) After all, it is how much you study that matters not how long you study= ఏదేమయినా/ చివరికి నువ్వెంత సేపు చదివావనేది కాదు, ఎంత చదివావనేది ముఖ్యం.

b) <u>After all</u>, Duryodhana had to hide under water for fear of Bhima = <u>ఏమయితేనేం/ చివరికి</u>, భీముడి భయంతో దుర్యోధనుడు నీళ్లల్లో దాక్కోవాల్సి వచ్చింది.

**ప్రశ్న:** *I wish I knew his phone number.*

*I wish I would know his phone number.*

*I wish I had his phone number.*

వీటి అర్థాలను తెలియజేయగలరు.

**– సి హెచ్. నరసింహారావు, రంగారెడ్డి**

**జవాబు:** I wish I knew his phone number = I wish I had his phone number = <u>ఇప్పుడు</u> నాకతని phone number తెలిస్తే ఎంత బాగుంటుంది = నా దగ్గర అతని phone number ఉంటే ఎంత బాగుండేది ఇప్పుడు (అయ్యో, <u>నాకిప్పుడు</u> అతని phone no <u>తెలియదే</u>/ నాదగ్గర ఇప్పుడు అతని phone no <u>లేదే</u> అని అనుకోవడం)

I wish I would know his phone number ఇది సరైన అర్థం ఇవ్వదు. ఇలాంటిది sentence కాదు.

I wish to know his phone number = అతని Phone number తెలుసుకోవాలని ఉంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

# I like walking long distances




**Damodar:** Doctors strongly advise walking and jogging. That's OK. They do keep us fit. But do they help slimming?
(నడవాలని, నెమ్మదిగా పరుగెత్తాలని doctors గట్టిగా సలహా ఇస్తారు. బాగానే ఉంది. అవి మనల్ని చురుగ్గా ఉండేట్టు చేస్తాయి. అయితే నడవటం, నిదానంగా పరుగెత్తటం సన్నబడేందుకు సాయపడ తాయా? )

**Subhakar:** They certainly do. But doctors also recommend avoiding fatty foods. Your doctor has told you that. Remember.
(కచ్చితంగా అవి సన్నబడేట్టు చేస్తాయి. అయితే కొవ్వు ఎక్కువగా ఉన్న ఆహార పదార్థాలను వదిలేయాలని కూడా సిఫారసు చేస్తారు. నీ doctor కూడా చెప్పాడది నీతో. గుర్తుంచుకో.)

**Damodar:** The trouble, however is, people like eating fatty foods as they are tasty and tempting.
(అసలు చిక్కల్లా అవి రుచిగా, నోరూరి స్తుంటాయి కాబట్టి వాటిని తినటానికే ఇష్ట పడతాం.)

tempting = ఆకర్షించే/ కోరిక కలిగించే.

**Subhakar:** Isn't that where we should need to be careful? We should have a lot of self control.
(అక్కడే కదా మనం జాగ్రత్తగా ఉండాలి? మనమీద మనకు చాలా అదుపుండాలి.)

**Damodar:** I have been doing that for the past two months, but I haven't lost much weight.
(నేను గత రెండు నెలలుగా ఇవన్నీ చేస్తున్నాను, అయినా ఏమంత తగ్గలేదు.)

**Subhakar:** But you haven't been all that strict about diet. Not always have you gone without fatty foods. I do see you still enjoying poori, butter non, potato stuff and all that.
(తిండి విషయంలో అంత కచ్చితంగా ఏం లేవులే నువ్వు. కొవ్వు ఎక్కువగా ఉండే ఆహారాన్ని అంతగా వదిలేయటంలేదు. నువ్వింకా పూరీ, బంగాళదుంప, butter non లను చక్కగా తినటం నేను చూస్తూనే ఉన్నాను.)

**Damodar:** I admit eating them but not as often as you seen to think.
(నేనవి తింటున్నానని ఒప్పుకొంటా, కానీ నువ్వనుకునేంత తరచుగా మాత్రం కాదు.)

**Subhakar:** But not rarely either. Can you defend eating 2 varieties of ghee sweets just yesterday? A large cup of icecream too.
(అంత అరుదుగా కూడా కాదులే. నిన్నటికి నిన్న రెండు రకాల నేతి మిఠాయిలు, వాటితోపాటు పెద్ద cup లో icecream తినటం ఎలా సమర్థించుకుంటావు? )

**Damodar:** You know I avoid a second helping of them?
(అలాంటివి వెంటనే మరోసారి తిననని నీకు తెలుసు.)

second helping = బాగుందని వెంటనే మరోసారి ఇంకొంచెం తినటం

**Subhakar:** But you help your self to such large quantities that you don't need a second helping.
(అయితే నువ్వు మొదటిసారే బాగా ఎక్కువ తిన్నపుడు మరోసారి వెంటనే తినే అవసరం ఉండదు.)

**Damodar:** There, there. You observe my eating too closely.
(అదిగో. నా తిండి విషయాలను మరీ గమనిస్తున్నావు.)

**Subhakar:** Cut down your eating you'll become slim.
(తిండి తగ్గించుకో. సన్నబడతావు.)

☺ ☺ ☺ ☺

గత కొన్ని lessons లో verbs followed only by the '...ing' form or by the noun and not by the infinitive. అంటే ing forms/ nouns వెంటనే వచ్చే verbs గురించి తెలుసుకున్నాం. అలాంటివే మరికొన్ని verbs ఇప్పుడు చూద్దాం.

***Look at the following sentences from the conversation above.***

*1) Doctors strongly advise walking and jogging.*
*2) But doctors also recommend avoiding fatty foods.*
*3) People like eating fatty foods.*
*4) I admit eating them.*
*5) Can you defend eating two varieties of ghee sweets?*

గమనించారు కదా- పై verbs తర్వాతంతా కూడా '...ing' form రావటం. Like, advise తర్వాత మాత్రం, '...ing' మాత్రమే కాకుండా, noun/ infinitive కూడా వస్తుంది.

Let's have another look at them:

**1) Advise** (తెలుసు కదా, సలహా ఇవ్వడం).

a) My father advises waking up early = త్వరగా నిద్రలేవటం మంచిదని మా నాన్న సలహా ఇస్తారు.

b) We advise starting early to avoid the risk of missing the train = ముందుగానే బయలుదేరాలని మా సలహా. అందువల్ల train తప్పిపోయే ప్రమాదం ఉండదు.

అయితే దీని తర్వాత, అంటే advise తర్వాత noun/ infinitive కూడా వాడొచ్చు. అయితే infinitive వాడినప్పుడు ఎవరిని advise చేసిందీ తెలియపరుస్తాం.

a) The doctor has advised milk for the sickly child = జబ్బుగా ఉన్న బిడ్డకు పాలు ఇమ్మని doctor సలహా ఇచ్చాడు.
has advised (verb) + milk (noun)

b) The doctor has advised the mother to give milk to the boy= ఆ పిల్లాడికి పాలు ఇమ్మని ఆ తల్లికి doctor సలహా ఇచ్చాడు.
has advised (verb) + the mother (సలహా ఎవరికిచ్చింది) + to give (infinitive)

c) He has advised me to take rest =
has advised (verb) + me (ఎవరికి సలహా ఇచ్చిందీ) + to take (infinitive)

**2) Doctors also recommend avoiding fatty foods.**

recommend (verb) + avoiding (...ing form)

a) The manager recommended taking her for the job = ఆమెను ఉద్యోగంలో నియమించాలని Manager సిఫారసు చేశాడు.
recommended (verb) + taking (..ing form)

b) The experts recommend using copper wire for the circuits = నిపుణులు ఈ circuits కు రాగితీగలు వాడటం మంచిదంటున్నారు.
recommend (verb) + using (...ing form)

c) Experts recommend the use of copper wire = రాగి తీగల ఉపయోగం మంచిదని నిపుణుల సిఫారసు.
use (vb) = ఉపయోగించటం. use (noun) = ఉపయోగం. ఇంకా, work (పనిచేయడం) - verb. work- పని- noun.

recommend తర్వాత infinitive ఎప్పుడూ రాదు.

**3) People like eating fatty foods.**

like (verb) + eating (... ing form)

I like walking long distances =
చాలా దూరం నడవటం నాకిష్టం.

like (verb) + walking (...ing form). అయితే, ఇందాక చెప్పినట్లు, like తర్వాత noun వస్తుంది, infinitive కూడా వస్తుంది.

a) She likes cooking = వంటచేయటం ఆమెకిష్టం. (వండటం ఆమె ఇష్టపడుతుంది.)
likes (verb) + cooking (...ing form)

b) I like the mango a lot = మామిడిపండంటే నాకు చాలా ఇష్టం/ నేను చాలా ఇష్టపడతాను.
like (verb) + the mango (noun)

c) He likes to act tragic roles =
అతను విషాద పాత్రలు నటించటం ఇష్టపడతాడు/ అతను విషాద పాత్రలు నటించేందుకు ఇష్టపడతాడు.
likes (verb) + to act (infinitive)


M.SURESAN

**4) I admit eating them =**
అవి తిన్నట్టు నేనొప్పుకొంటాను.
admit= ఏదైనా (ముఖ్యంగా చెడుపని) చేసినట్టు ఒప్పుకోవడం.

admit (verb) + eating (...ing)

a) She admitted ill treating her step son = తన సవతి కొడుకును సరిగ్గా చూడటం లేదని ఆమె ఒప్పుకొంది.
admitted (verb) + ill treating (...ing form)
ill treat = సరిగా చూడకపోవటం.

The Police Officer ill treated the MLA's P.A. =
M.L.A. PA ను Police Officer సరిగా చూడలేదు/ సరైన మర్యాద ఇవ్వలేదు.

మరీ పెద్ద నేరాల విషయంలో ఒప్పుకోవటం అయితే, admit + to + ...ing form/ admit + to + noun వస్తుంది.

b) He admitted to committing the murder = హత్య చేసినట్టు అతను ఒప్పుకొన్నాడు.
admitted (verb) + to + committing (...ing form)

commit = ముఖ్యంగా చెడుపనులు చేయటం- commit theft (దొంగతనం)/ a crime (నేరం)/ a murder (హత్య)/ suicide (ఆత్మహత్య), etc.

c) She admitted (to) her theft =
తన దొంగతనం ఆమె ఒప్పుకొంది.

**5) defend** = సమర్థించుకోవటం/ సమర్థించటం

defend అంటే ఇంకో అర్థం = రక్షించడం.

The armed forces defend the country = సాయుధ దళాలు దేశాన్ని రక్షిస్తాయి.

Can you defend eating all that =
అవన్నీ తినటం సమర్థించుకోగలవా?
(అది సబబని చెప్పగలవా? )
defend (verb) + eating (...ing form)

a) Teachers cannot defend beating students = విద్యార్థులను కొట్టడం ఉపాధ్యాయులు సమర్థించలేరు.
defend (verb) + beating (...ing form)

b) None can defend killing others =
ఇతరులను చంపటం ఎవ్వరూ సమర్థించలేరు.
defend (verb) + killing (noun)

c) He defended his actions =
తన చర్యలను సమర్థించుకున్నాడు.
defend (verb) + actions (noun)

## EXERCISE

**Practise the following aloud in English.**

**Aswini:** నువ్వెందుకు పొగ పీల్చకుండా (తాగకుండా) ఉండవు? (avoid వాడండి)

**Nivas:** నువ్వు coffee తీసుకోవటం ఆపేయ్. నేను cigarette తాగటం మానేస్తా (stop, give up వాడండి)

**Aswini:** Doctors జ్వరంలో coffee తీసుకోవాలని సలహా ఇస్తారు తెలుసా? ఏ doctor కూడా ఎట్టి పరిస్థితుల్లోనూ పొగ పీల్చటం సిఫారసు చేయరు (recommend వాడండి)

**Nivas:** అంటే smoking కంటే coffee better అంటావు. అందుకని నువ్వు coffee తాగటం కొనసాగిస్తావు, నన్నేమో పొగపీల్చటం ఆపేయమంటావు (continue, discontinue వాడండి)

**Aswini:** కచ్చితంగా అదే నా అభిప్రాయం

**Nivas:** Coffee తాగటం సమర్థించుకుంటున్నావు నువ్వు, అంతే.

**Aswini:** Coffee తీసుకోవటం కూడా చెడే అని అంటున్నా నేను. కానీ cigarette కంటే మెరుగు.

**Nivas:** సరేకానియ్. త్వరగా తినటం ముగించు. 1st show time అయింది.

## ANSWER

**Aswini:** Why don't you avoid smoking?

**Nivas:** You stop taking coffee. I will give up smoking.

**Aswini:** Doctors advise taking coffee in fever. No doctor under any circumstances recommends smoking.

**Nivas:** So you mean coffee is better than smoking. So you want to continue taking coffee but you want me to discontinue smoking.

**Aswini:** That's exactly what I mean

**Nivas:** You are defending taking coffee; that's all.

**Aswini:** I mean taking coffee is bad too, but better than the cigarette.

**Nivas:** OK. Finish eating. It's time for the first show.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# Let's sit down to work on them


M.SURESAN

**Dhairya:** I sent my brother Vikram out to get a notebook for me. Don't know why he isn't back yet.
(మా బ్రదర్ విక్రమ్‌ను నాకు నోట్‌బుక్ తీసుకురమ్మని పంపాను. ఇంతవరకు తిరిగి రాలేదెందుకో.)

**Sahasa:** The shop isn't far off, is it?
(షాపు అంత దూరమేంకాదు కదా?)

**Dhairya:** His classmate had come here to play chess with him, and both of them left together to get me the notebook.
(తనతో చెస్ ఆడటానికి అతని క్లాస్‌మేట్ వచ్చాడు. ఇద్దరూ కలసి బయటికెళ్ళారు నోట్ బుక్ తెచ్చేందుకు.)

**Sahasa:** What's the notebook for?
(నోట్‌బుక్ ఎందుకు ఇప్పుడు?)

**Dhairya:** I need it to make notes for the coming exam, and I called you to help me in it.
(పరీక్ష వస్తోంది కదా, అందుకే నోట్స్ తయారు చేసుకొనేందుకు నాకు నోట్‌బుక్ అవసరమైంది. నిన్ను పిలిచింది కూడా అందులో నాకు సహాయానికి.)

**Sahasa:** I don't know how to help you. Perhaps I'm no better at the subject than you.
(నీకెలా సాయం చేయాలో నాకు తెలియదు. నీకంటే నాకా సబ్జెక్ట్ ఎక్కువ తెలియదేమో?)

**Dhairya:** I'm sure you are.
(నువ్వు నాకంటే మెరుగని నా నమ్మకం.)

**Sahasa:** OK. I'll try to do what I can. First of all we should be thorough with the basics to understand the subject well and to make notes.
(అయితే సరే. నేను చేయగలిగింది చేసేందుకు ప్రయత్నిస్తా. మొట్టమొదట ప్రాథమికాంశాలు తెలుసుకోవాలి క్షుణ్ణంగా, సబ్జెక్ట్ అర్థం చేసుకోవాలన్నా, నోట్స్ తీసుకోవాలన్నా.)

**Dhairya:** I think I'am well up in the basics.
(బేసిక్స్ నాకు బాగానే తెలుసనుకుంటున్నా.)

basics = ప్రాథమికాంశాలు, ఏ సబ్జెక్ట్‌లోనైనా.
be well up = బాగా తెలిసి ఉండటం.
He is <u>well up</u> in physics = అతనికి ఫిజిక్స్ బాగా తెలుసు.

**Sahasa:** Then? (ఇంకేంటి?)

**Dhairya:** I want you to help me out with the 13th and the 14th chapters.
(నాకు 13, 14 అధ్యాయాల విషయంలో నీ సహాయం కావాలి.)

**Sahasa:** I think I can be some help to you there. Why the delay then? Let's sit down to work on them.
(ఆ విషయంలో నేను నీకు సహాయపడగలనని అనుకుంటున్నా. ఇంకేంటి ఆలస్యం? కూర్చుని వాటిని చూద్దాం.)

**Dhairya:** But I need the notebook. Here he is, my brother, with the notebook. Why the delay, Vikram?
(నాకే నోట్‌బుక్ కావాలి కదా? అదిగో మా తమ్ముడు రానే వచ్చాడు, నోట్ బుక్‌తో. ఎందుకు ఆలస్యమైంది విక్రమ్?)

**Vikram:** I stopped on the way to watch a man walking on stilts. Here's the notebook.
(దారిలో ఎత్తయిన కర్రల మీద కాళ్ళుంచి నడిచే అతడిని చూడటానికి ఆగాను. ఇదిగో నోట్‌బుక్.)

walking on stilts = మనం చూస్తుంటాం, వీధుల్లో, రెండు ఎత్తైన కర్రల సాయంతో భూమికి బాగా ఎత్తుగా నడుస్తుండే వాళ్ళను. ఆ కర్రలను stilts అంటాం. ఒకటయితే stilt.
stilted house = కొంత ఎత్తువరకు స్తంభాలు మాత్రమే ఉండి, వాటిపైన నిర్మించిన ఇల్లు. చాలా flats, stilted houses కదా? Ground floor అంతా స్తంభాలే ఉంటాయి. First floor నుంచి నివాసానికి ఇళ్ళు ఉంటాయి. ఇవి stilted houses.

**Dhairya:** That's very risky I don't know why people take such risks.
(అది చాలా ప్రమాదకరం. అసలెందుకంత సాహసం చేస్తారో?)

**Sahasa:** Just to earn a living. That's all.
(కూటి కోసమే కదా అంతా.)

♦ ♦ ♦ ♦

**Look at the sentence:**
Nidhi has taken MPC group <u>to do</u> engineering = Engineering చదవాలని నిధి MPC group తీసుకుంది. (to do = to study)
to do engineering = ఇంజినీరింగ్ చదివేందుకు/ చదవాలని - అక్కడ To do (to + 1st Regular Doing Word), infinitive. పై sentence లో to do engineering లో to do (infinitive) purpose ను అంటే ఉద్దేశాన్ని తెలుపుతోంది కదా?
(Engineering <u>చదవాలనే ఉద్దేశంతో</u> నిధి MPC తీసుకుంది)
ఇలా purpose ను తెలపడానికి మనం infinitive ను చాలా ఎక్కువగా వాడతాం. English లో ఇది చాలా ఉపయోగం, ముఖ్యంగా spoken English లో.

***Now look at the following sentences from the dialogue above.***

1) *I <u>sent</u> my brother <u>out</u> to <u>get</u> a notebook for me.*
2) *His classmate <u>had come here</u> to play chess with him.*
3) *Both of them <u>left to get me</u> a notebook.*
4) *I <u>need it to make</u> notes.*
5) *I <u>called you to help</u> me.*
6) *We should be thorough with the basics <u>to understand</u> the subject well.*
7) *Let's <u>sit down to work</u> on them.*
8) *I <u>stopped</u> on the way <u>to watch</u> a man on stilts.*
9) *Just <u>to make a living.</u>*

ఈ sentences అన్నింటిలో pattern చూద్దాం.

a) She needs money to buy the necklace = Necklace కొనడానికి ఆమెకు డబ్బు అవసరం.
needs (verb) + money (somebody) + to buy (infinitive) (Necklace కొనాలనే <u>purpose</u> కు)

b) He brought his brother to help me.
brought (verb) + his brother (somebody) to help me (Infinitive)

కాబట్టి ఇలాంటి అర్థంతో వచ్చే sentence pattern: verb + somebody/ something + infinitive. అయితే ఒక్కొక్కప్పుడు somebody/ something లేకపోవచ్చు
eg: The Doctor came to see the patient.
came (verb) + to see (infinitive - purpose - ఉద్దేశం)

పై conversation లోంచి తీసిన sentences (from 1 - 9) లోని verbs అన్నింటినీ ఈ pattern లో వాడవచ్చు చూడండి.

**1) send**: పంపడం
a) The manager sent his assistant to find out the facts =
యదార్థాలు తెలుసుకుని రమ్మని మేనేజర్ తన అసిస్టెంట్‌ను పంపాడు.
b) She sent her daughter to the US to study there=
ఆమె తన కూతురిని అమెరికాకు పంపింది అక్కడ చదవడానికి.
sent (verb) + his assistant/ her daughter (somebody) + to find/ to study (infinitive)

**2) come**: రావటం
a) He came to my office to get some information = ఏదో సమాచారం కోసం అతను నా ఆఫీస్‌కు వచ్చాడు.
came (verb) + to get (infinitive)
b) She comes here to teach the boy.
comes (verb) + to teach (infinitive) చెప్పేందుకు

**3) leave** = వెళ్లటం
a) He left to meet his friend =
తన ఫ్రెండ్‌ను కలుసుకోవడానికి (purpose) వెళ్లాడు.
left (verb) + to meet (infinitive)

**4) need** = అవసరమవటం
a) I need your support to achieve this.
(ఇది సాధించేందుకు -purpose - నీ మద్దతు నాకవసరం.)
need (verb) + your support (some thing) + to achieve (infinitive)
b) The country needs a person like Gandhi to progress.
(దేశ ప్రగతికి (పురోగతి చెందడానికి) - purpose - గాంధీలాంటి వ్యక్తి దేశానికి అవసరం.)
needs (verb) + a person... (somebody) + to progress (infinitive)

**5) call** = పిలవటం/ phone చేయటం
a) He called me to tell me what I had to do.
(నేనేం చేయాలో చెప్పటానికి -purpose - అతను నన్ను పిలిచాడు/ phone చేశాడు.)
called (verb) = me (somebody) + to tell (infinitive)
b) They called the station to find out the position of the train.
(ట్రెయిన్ విషయం తెలుసుకోవటానికి (purpose) వాళ్ళు స్టేషన్‌కు ఫోన్ చేశారు.)
called (verb) + the station (something) + to find out (infinitive)

**6) be** = ఉండటం.
a) I was at the station to receive my uncle = మా అంకుల్‌ను తీసుకురావడానికి purpose - నేను స్టేషన్‌లో ఉన్నాను.)
was (be) + to receive (infinitive)
b) He should be here to help us = మనకు సహాయం చేయటానికి అతడు ఇక్కడ ఉండాలి.
should be (be from) + to help (infinitive)

**7) sit** (కూర్చోవడం)
a) He sat down to study the map.
(మ్యాప్‌ను పరిశీలించడానికి కూర్చున్నాడు.)
sat (verb) + to study (infinitive)
b) They sat down to eat the meal.
(వాళ్ళు భోజనానికి కూర్చున్నారు.)
sat (verb) + to eat (infinitive)

**8) stop** = ఆగటం/ ఆపటం
a) He stopped his work to answer my question.
నా ప్రశ్నకు సమాధానం చెప్పడానికి తన పనిని ఆపాడు.)
stopped (verb) + his work (verb) + to answer (infinitive)
b) The speaker stopped his speech to answer a question.
ఓ ప్రశ్నకు జవాబు ఇవ్వడానికి వక్త తన ప్రసంగాన్ని ఆపాడు.

**9) to make a living** = జీవనానికి/ జీవనోపాధికి
a) People do all sorts of things to make a living = జీవనానికే/ జీవనభృతి కోసం/ పొట్టకూటి కోసం (purpose) ప్రజలు ఏవేవో చేస్తుంటారు.
b) He does such things to get the favour of his boss = Boss అనుగ్రహం కోసం (purpose) అలాంటి పనులు చేస్తాడతను.
does (verb) + such things (something) + to get (infinitive)

In the past few lessons, we have seen verbs followed by the '... ing form' or the noun, and not by the 'infinitive'. In this lesson, we have seen the verbs followed by the infinitive.

**EXERCISE**

పై nine sentence లో infinitive బదులు for + ... ing form వాడగలరేమో చూడండి.

**ANSWER**

1) I sent my brother out <u>to get</u> a note book.
I sent my brother <u>for getting</u> a note book.
2) His classmate had come here <u>to play</u> chess.
His classmate had come here <u>for playing</u> chess.
3) Both of them left <u>to get me</u> a note book.
<u>for getting me</u> a notebook.
4) I need it <u>to make notes</u> =
I need it <u>for making notes</u>
5) I called you <u>to help</u> me =
I called you <u>for helping</u> me.
6) We should be thorough with the basics <u>to understand</u> the subject =
We should be thorough with the basics <u>for understanding</u> the subject.
7) Let's sit down to work on them - ఇక్కడ for + ... ing చాలా అరుదు/ దాదాపు వాడరు.
8) I stopped on the way <u>to watch a man</u> =
I stopped on the way <u>for watching a man.</u>
9) Just <u>to make a living</u> =
Just <u>for making a living.</u>

సూచన: sentences 6, 7, 8 లలో for + ... ing అంత ఎక్కువగా వాడం. ఇలాంటి sentences లో infinitive మాత్రమే simple గా natural గా ఉంటుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# Do you know how to cook?

**Vatsalya:** (Do) you know how to cook?
(నీకు వండటం ఎలాగో తెలుసా?)

**Anuraga:** What you've just tasted is my cooking.
(ఇప్పుడు నువ్వు రుచి చూసింది నా వంటనే.)

**Vatsalya:** That's really marvellous. I just can't understand how you are able to cook so well.
(చాలా అమోఘం. అంత బాగా ఎలా వండ గలుగుతున్నావో నాకర్థం కావటం లేదు.)

marvellous = మావ్‌లస్ = అద్భుతమైన/ అమోఘమైన. marvel = మావల్= అద్భుతం/ అమోఘం.

**Anuraga:** Why do you wonder how people can cook? It isn't that difficult. All that you need is the interest and a little practice.
(ఎవరైనా వండగలరంటే అంత ఆశ్చర్యపోతా వెందుకు? అంత కష్టమేం కాదది. అవసర మైందేమిటంటే అందులో ఆసక్తి/ నేర్చుకోవా లనే కోరికా, కొంత అలవాటూను.)

**Vatsalya:** How did you learn it and who did you learn it from?
(నువ్వెలా, ఎవరి దగ్గరనుంచి నేర్చుకు న్నావు?)

**Anuraga:** Who else from? From my mother. You should learn how to cook from mom; she is so good at cooking.
(ఇంకెవరి దగ్గర్నుంచి. మా అమ్మ దగ్గ ర్నుంచే. వండటం మా అమ్మ దగ్గరే నేర్చుకోవాలి. ఆవి డంత బాగా వండు తుంది.)

**Vatsalya:** You don't suggest that I go now to your mom hundreds of kilometres away just to learn how to cook!
(వందల కిలోమీటర్ల దూరంలో ఉన్న మీ అమ్మ దగ్గరకెళ్లి వంట నేర్చుకోమనటం లేదు కదా!)

**Anuraga:** Yea. That's what I suggest exactly. During the next vacation, do come down to our place, spend a few days there and learn cooking.
(కచ్చితంగా అదే చెప్తున్నా. వచ్చే సెలవుల్లో మా ఊరికి రా. కొన్ని రోజులుండు. వంట నేర్చుకో.)

**Vatsalya:** (Do) you want me to wait till then?
(అప్పటిదాకా wait చేయమంటావా?)

**Anuraga:** Yes. Just observe how my mother cooks, and you've learnt cooking.
(అవును. మా అమ్మ వండటం జాగ్రత్తగా గమనించు. నీకు వంట వచ్చేసినట్లే.)

**Vatsalya:** Is that so? (అవునా?)

**Anuraga:** Enquire any of my relatives in our place how my mother cooks. You will know.
(మా చుట్టాల్లో ఎవరినైనా విచారించు (అడుగు), మా అమ్మ ఎలా వండుతుందో, నీకు తెలుస్తుంది.)

**Vatsalya:** What are you talking? Don't I know how she cooks? Your cooking itself is good, so hers must be certainly better. Need I enquire how she cooks?
(నువ్వేం మాట్లాడుతున్నావు? ఆమెలా వండుతుందో నాకు తెలియదా? నీ వంటే చాలా బాగుంది కాబట్టి ఆవిడది ఇంకా బాగుండాలి. దానికి అందరినీ అడగాలా?)

**Anuraga:** Take a joke, girly. (ఏదో joke చేశాన్లే.)



***Look at the following sentences from the conversation above.***

*1) Do you know how to cook?*
*2) I just can't understand how you are able to cook so well.*
*3) Why do you wonder how people can cook?*
*4) You should learn how to cook from my mother.*
*5) Just observe how my mother cooks.*
*6) Enquire any one how my mother cooks.*

పై sentences లోని verbs ను గమనించండి. ప్రతి దాని తర్వాత కూడా how తో begin అయ్యే clause రావటం గమనించండి (clause = A group of words with a verb). సామాన్యంగా ఈ verbs తర్వాత how, what, when, where లాంటి 'wh' words తో ప్రారంభ మయ్యే clauses వస్తాయి. లేకుంటే, వాటితో ప్రారంభ మయ్యే phrases అయినా రావచ్చు. వీటన్నిటి బదులు, ఈ verbs తర్వాత noun/ ...ing form రావచ్చు. Let's study them more closely.

**1) know**: దీని తర్వాత noun/ ...ing form వస్తాయి. లేకుంటే 'wh' words (how, when, where, what, etc) + clause/ phrase (phrase: a group of words without a verb)

a) He knows English (అతనికి English తెలుసు)
knows (verb) + English (noun)

b) He knows swimming (ఈదటం తెలుసు)
knows + swimming (...ing form)

c) He knows how to swim (ఎలా ఈదాలో తెలుసు) knows + how + to swim (infinitive/ phrase)

d) I know where we can meet him.
know (verb) + where ('wh' word) + we can meet him (clause)

**Important:** Know తర్వాత వెంటనే infinitive వస్తే, ఒకరు చేయాల్సిన పని వాళ్లకు తెలుసు అనే అర్థం వస్తుంది, ఆ పని ఎలా చేయాలో అని కాకుండా.


M.SURESAN

a) He knows how to do it =
అతనికది ఎలా చేయాలో తెలుసు.
(knows + how + to do)

b) He knows to do it =
అతనికది చేయాలని తెలుసు.

తేడా చూశాం కదా? అలాగే-
She knows how to cook =
వంట ఎలా చేయాలో ఆమెకు తెలుసు.
(knows + how + infinitive)
She knows to cook =
ఆమెకు తను వంట చేయాలని తెలుసు.
knows + to cook (infinitive)

**2) understand** (అర్థం చేసుకోవటం/ తెలుసుకోవటం/ అర్థమవటం)

a) Kapil understands English
[Kapil కు English అర్థమవుతుంది.
understands + English (noun)]

b) Kapil understands how to do it =
అది ఎలా చేయాలో kapil కు తెలుసు/ అర్థం అవుతుంది
understands + how ('Wh' word) + to do (infinitive)

c) Dravid understands why he has been dropped =
తననెందుకు వదిలేశారో ద్రావిడ్‌కు అర్థమవుతోంది.
understands + why (wh word) + he has been dropped (clause)

understand తర్వాత వెంటనే infinitive వాడం.

**3) wonder** = 1) ఆశ్చర్యపోవటం 2) అనిశ్చితంగా ఉన్న విషయం గురించి ఆలోచించటం.

a) I wonder at Sachin's batting talent =
సచిన్ batting ప్రతిభ నాకాశ్చర్యం కలిగిస్తుంది.
wonder + at (about) + ... talent (Noun)

b) I wonder how he can do it =
అతనెలా చేయగలడబ్బా అని అనుకుంటున్నా (చేయగలడా అనే సందేహం)
wonder + how + he can do it (clause)
wonder తర్వాత that + clause వస్తే ఓ పని జరిగినందుకు ఆశ్చర్యం ప్రకటించటం అవుతుంది.

c) I wonder that he did all this =
ఇదంతా అతను చేశాడంటే ఆశ్చర్యపడుతున్నాను.
wonder + that + he did ... (clause)
(ఒక్కోసారి ఈ అర్థంతో how కూడా వాడవచ్చు that బదులు)

**4) learn** = నేర్చుకోవటం/ తెలుసుకోవటం. Learn తర్వాత noun/ ... ing form/ wh clause వాడతాం.

a) She learnt English at school.
learnt + English (noun)

b) She is learning to cook/ cooking from her mother.
(వాళ్లమ్మ దగ్గర్నుంచి వంట/ వండటం నేర్చుకొంటోంది.)
is learning + to cook (infinitive) + cooking (...ing form)

c) Subhadra has learnt how to operate a computer =
Computer ఎలా వాడాలో సుభద్ర నేర్చుకుంది.
has learnt + how + to operate (infinitive)

d) Sukumar is learning how he can live on a small budget =
చిన్న/ తక్కువ ఆదాయంతో ఎలా బతకాలో సుకుమార్ నేర్చుకుంటున్నాడు.
(Budget = బజిట్/ బజెట్ = ఉన్న డబ్బుతో ఎలా సరిపెట్టుకోవాలి/ డబ్బు ఎలా ఖర్చు పెట్టాలి అనే విషయం.)
is learning (verb) + how ('wh' word) + he can live ... (clause)

**5) observe** = గమనించటం.

a) The police have been observing the movements of the suspects.
(అనుమానితుల కదలికలను police లు కొంత కాలంగా గమనిస్తున్నారు)
have been observing (verb) + the movements (Noun)

b) The medical students observed how the professor did the operation
(ఆ professor ఎలా operation చేశారో, ఆ వైద్య విద్యార్థులు గమనించారు)
observed + how ('wh' word) + the professor did the operation (clause)

**6) enquire** = విచారించటం/ అడగటం (Inquire అని కూడా అంటాం)

a) He enquired about my brother's job =
ఆయన మా brother ఉద్యోగాన్ని గురించి అడిగాడు.
enquired + about (ఇది వాడాల్సిందే) + job (Noun)

b) He enquired when the train would come
Train ఎప్పుడొస్తుందని అతను అడిగాడు/ విచారించాడు.
enquired + when ('wh' word) + the train would come (clause)

c) He enquired whether the train would be late =
Train ఆలస్యమవుతుందా అని అడిగాడతను.
enquired (verb) + whether + the train would be late (clause)

పై verbs లో enquire తప్ప, మిగతా అన్ని verbs తర్వాత 'that' తో begin అయ్యే clauses వాడొచ్చు.

---

**ప్రశ్న:** 1. aisle 2. debut 3. arsehole 4. peninsula – వీటిని ఎలా పలకాలి? అర్థం కూడా తెలుపగలరు.
5. Has the cat has got your tongue?
6. Some arsehole had parked. So I couldn't get out.
ఈ వాక్యాల అర్థాలు తెలుపగలరు.
– *నాగిరెడ్డి శ్రీనివాసులురెడ్డి, కలువాయి*

**జవాబు:**

**1) Aisle** = ఐల్ - సినిమాహాల్స్‌లో, class rooms లో, busses/ planes లో, seats వరసల మధ్య ఉండేదారి. (bus లలోకూడా W (window) seat, A (Aisle) seat అని ఉంటుంది కదా. Aisle seat అంటే seats మధ్య ఉండే దారి వేపుది)

**2) Debut** - డెయ్‌బ్యూ/ డెబ్యూ = నర్తకుల, నటుల ప్రథమ రంగ ప్రదర్శన. (First appearance on the stage of a dancer/ actor, etc.) ఇప్పుడు ఈ మాటను ఇతర రంగాలకు కూడా వాడుతున్నారు.
Tendulkar made his test debut in 1989 (ఆయన 1989లో మొదటిసారిగా test match ఆడాడు)




**3)** Arsehole/ Asshole (American) - ఇది బూతుపదం- దీని అర్థం ఇక్కడ వివరించలేం. Pronunciation - ఆస్‌హోల్. [English అర్థం - Anus] తిట్టటానికి వాడతారు, మూర్ఖుడా అనే అర్థంతో.

**4)** Peninsula- పనిన్‌స్యల/ పనిస్యల- 'ని' నొక్కి పలుకుతాం- మూడువేపుల నీళ్లు, ముఖ్యంగా సముద్రం మధ్య ఉన్న భూభాగం- భారతదేశం, ఓ peninsula - అరేబియా సముద్రం, హిందూ మహాసముద్రం, బంగాళాఖాతం మధ్య భూభాగం, India. So India is a peninsula.

**5)** Has the cat got your tongue? / Lost your tongue? =
ఏంటి మాట్లాడటం లేదు? / నువ్వెందుకు మాట్లాడటం లేదు? / నోరేమన్నా మూగబోయిందా?

**6)** ఎవడో మూర్ఖుడు (arsehole) అడ్డంగా తన car ను park చేశాడు. అందువల్ల నేను బయటకు రాలేకపోయా.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# Have there been suicides there too?

**Vipul:** (I) missed you for almost a week. Where had you been?

**Prapul:** I've just returned from Chinnapalle. I was among our classmates who had been there on a social work project. We carried out some social work there for about a week.
(చిన్నపల్లె నుంచి ఇప్పుడే తిరిగొచ్చాను. అక్కడో social service కార్యక్రమానికి మా క్లాస్‌మేట్స్‌తో నేనూ వెళ్లాను. ఓ వారం పాటు అక్కడ సాంఘిక సేవా కార్యక్రమం నిర్వహించాం.)

**Vipul:** Have there been suicides there too?
(అక్కడ కూడా ఆత్మహత్యలు జరిగాయా?)

**Prapul:** You mean of farmers? Oh, quite a good number. It's a pity that in a village of 6000 odd population there have been nineteen suicides.
(రైతుల ఆత్మహత్యల గురించా నువ్వనేది? చాలానే. ఆరువేల చిల్లర జనాభా ఉన్న ఆ గ్రామంలో ఇంతవరకు 19 ఆత్మహత్యలు జరిగాయి.)

**Vipul:** It's sad that the government hasn't done much about it. They've announced a number of schemes for their welfare, though.
(శోచనీయమైన విషయం ఏమిటంటే ప్రభుత్వం దాన్ని గురించి పెద్దగా ఏం చేయలేదనేది. చాలా పథకాలు ప్రకటించినప్పటికీ.)

**Prapul:** It is unfortunate that most of the schemes do not reach the poorest farmers. They are little benefited by these schemes though they are meant for them.
(ఈ పథకాలు చాలా పేదవాళ్లయిన రైతులదాకా వెళ్లవు. ఈ పథకాలవల్ల వారికి ప్రయోజనం లేనట్లే, అవి వాళ్ల కోసం అయినప్పటికీ.)

**Vipul:** It is obvious that corrupt officials and politicians prevent the funds from going to the farmers.
(అవినీతి అధికారులు, రాజకీయ నాయకులు ఈ నిధులను పేద రైతులకు చెందకుండా చేస్తున్నారనేది తేటతెల్లం.)

**Prapul:** It is true that middlemen swindle most of the funds too.
(దళారులు ఈ నిధుల్లో చాలావాటిని కాజేస్తున్నారనేది నిజం.)

swindle = కాజేయటం

**Vipul:** It is probable that some poor farmers are not aware of these schemes at all.
(కొంతమంది పేద రైతులకు ఈ పథకాల గురించి తెలియకపోవడం కూడా సాధ్యమే).

**Prapul:** Is it a fact that nearly Rs 30 lakh meant for your village has been diverted to the MLA's village?
(మీ గ్రామానికి ఉద్దేశించిన 30 లక్షల రూపాయలను, MLA గ్రామానికి మళ్లించిన విషయం నిజమేనా?)

**Vipul:** It is not surprising if it has been.
(అలా జరిగితే వింతేం కాదు.)

**Prapul:** Let's hope that India will see better days.
(భారత్‌కు మంచి రోజులు వస్తాయని ఆశిద్దాం).

✪ ✪ ✪ ✪

కిందటి lessons లో చూశాం కదా- It తో, There తో వాక్యాలు ప్రారంభించవచ్చని, అలాంటప్పుడు వాటికి అర్థం ఏం ఉండదని. Sentence ప్రారంభానికి మాత్రమే వాడతామని, వాటిని Introductory There/ It అంటామని తెలుసుకున్నాం.

ఇప్పుడు Introductory 'It' తో spoken English లో సర్వసాధారణంగా వినిపించే మరికొన్ని రకాల pattern తెలుసుకుందాం.

***Look at the following sentences from the conversation above.***

*1) Have there been suicides there too?*

*2) It's a pity that in a village of 6000 population, there have been nineteen suicides.*

*3) It's sad that the government hasn't done much about it.*

*4) It's unfortunate that most of the schemes do not reach the poor.*

*5) It's obvious that corrupt officials and politicians prevent the funds from going to the farmers.*

*6) It's true that middle men swindle most of the funds.*

*7) It's probable that some poor farmers are not aware of these schemes.*

*8) Is it a fact that nearly Rs. 30 lakh meant for your village...?*

*9) It's not surprising if it has been.*

కిందటి lessons లో Introductory It/ there తో begin చేసిన sentences లో '...ing' form వాడటం చూశాం. ఇప్పుడు ముఖ్యంగా Introductory It తో ప్రారంభమై, 'that' clause (That తో ప్రారంభమయ్యే clause) ఎలా వస్తాయో చూద్దాం. ఇది spoken English లో very common.

ఏదైనా ఒక విషయం సంతోషకరం/ దురదృష్టకరం/ ఆశ్చర్యకరం/ శోచనీయం/ విచారకరం అనే అర్థాలతో ఇవి ఎక్కువ వాడతాం. మనం ఇలాంటి sentences బాగా practice చేద్దాం.


M.SURESAN

**1) Have there been suicides there too?**

గమనించండి: ఇక్కడ మొదటి 'There' introductory. అంటే ఈ there sentence ప్రారంభానికే. Question కాబట్టి verb తర్వాత వచ్చింది. (ఈ question కు answer: Yes, there have been suicides there (= in that place - ఈ there కు అర్థం ఇలా వస్తుంది) too.)

**2) It's a pity that ...** = అది శోచనీయం

It's a pity that he couldn't pass =
వాడు పాస్ కాలేకపోవడం శోచనీయం/ బాధాకరం.
It's (It is) a pity + that he couldn't pass (that clause)

**3) It's sad ....** = అది విచారకరం

a) It's sad that Dravid has been dropped.
(Dravid ను జట్టులోకి తీసుకోకపోవడం విచారకరం.)

b) It's unjust that Dravid has been ignored.
(Dravid ను పరిగణించకపోవడం అన్యాయం.)

c) It's clear that injustice has been done to the south.
(దక్షిణ భారత ఆటగాళ్లకు అన్యాయం జరిగిందనేది స్పష్టం.)

It's + sad/ unjust/ clear + that... (that clause)

**4) It's unfortunate that...**

It's unfortunate that we lost the match.
= మనం మ్యాచ్‌లో ఓడిపోవడం దురదృష్టం.
It's + unfortunate + that ... (that clause)

**5) It's obvious.** obvious = స్పష్టం/ తేటతెల్లం

a) It's obvious that Tennis is a game for the rich = టెన్నిస్ ధనవంతులు మాత్రమే ఆడగల క్రీడ అనేది స్పష్టం/ తేటతెల్లం.
It's + obvious + that ... (That clause)

b) It was obvious that it was a murder and not a suicide =
అది హత్యే, ఆత్మహత్య కాదనేది తెలుస్తూనే ఉంది/ స్పష్టం.

**6) It's true...** (అది నిజం)

a) It's true that some land grabbers have government support =
కొంతమంది భూ కబ్జాదారులకు ప్రభుత్వ మద్దతు ఉందనేది వాస్తవం/ యదార్థం/ సత్యం.

b) It was true that he had cheated the government =
అతడు ప్రభుత్వాన్ని మోసం చేశాడనేది యదార్థం.

**7) It's probable that...**

probable = జరిగే/ ఉండే అవకాశం ఉండటం

a) It's probable that he came here when I was away =
నేను లేనప్పుడు అతడిక్కడికి వచ్చి ఉండొచ్చు/ వచ్చే అవకాశం ఉంది.
It's probable + that... (That clause)

b) Is it probable that he can pass?
= అతడు పాస్ అయ్యే అవకాశం ఉందా?
Is it probable + that... (That clause)

**8) Is it a fact that...?**

fact = వాస్తవం

a) Is it a fact that you met him yesterday? = నువ్వు అతడిని నిన్న కలుసుకోవడం యదార్థమేనా?
Is it + a fact + that... (That clause)

b) It is not a fact that he came here =
అతనిక్కడికి రావడం నిజం కాదు.
It is (not) + a fact + that (That clause)

**9) It's not surprising that ....**

= అదేంపెద్ద ఆశ్చర్యం కాదు
It's not surprising that/ it's no surprise that
= అదేం ఆశ్చర్యం కాదు

**Kesav:** Most people here have lung diseases.
(ఇక్కడ చాలామందికి శ్వాసకోశ వ్యాధులున్నాయి.)

**Arjun:** It is not surprising that they have the diseases. The factory here pollutes the atmosphere.
(వాళ్లకా వ్యాధులుండటం ఆశ్చర్యమేం కాదు. ఇక్కడి ఫ్యాక్టరీ వాతావరణాన్ని కలుషితం చేస్తుంది.)

It's not + surprising + that... (That clause)

It's a surprise that Dravid has been dropped
= Dravid ను తొలగించడం ఆశ్చర్యమే.
It's + a surprise + that....
(That clause)

(ఇది చూడండి: It's a surprise, Dravid losing his place in the team. Introductory It ను ఇలా కూడా వాడతాం. పై sentences అన్నింటిని ఇలా మార్చడానికి ప్రయత్నించండి.
It's a pity/ surprise/ sad, etc + somebody/ something + ...ing form)

### EXERCISE

Practise the following aloud using introductory It/ there when possible.

**Nakul:** వాడిక్కడికి రాకపోవడం ఆశ్చర్యమే.

**Manoj:** ఏమిటంత ఆశ్చర్యం? వాడొస్తేనేం, రాకపోతేనేం?

**Nakul:** వాడంటే నీకు ఇష్టంలేదనేది తెలిసిందే కదా? (clear వాడండి.)

**Manoj:** నువ్వు నన్ను అర్థం చేసుకోలేకపోవడం విచారకరం. (sad వాడండి.)

**Nakul:** వాడికీ నీకు అభిప్రాయ భేదాలు ఉండటం నిజం కాదా?

**Manoj:** అది నిజమే. నాకు అబద్ధాలు చెప్పేవాళ్లంటే ఇష్టం లేదనేది యదార్థం.

**Nakul:** అయితే వాడు అబద్ధాలు ఆడతాడంటావా?

**Manoj:** నేనది వేరే చెప్పాలా?

### ANSWER

**Nakul:** It's a surprise/ surprising that he hasn't come.

**Manoj:** What's so surprising about it?

**Nakul:** It's clear that you don't like him.

**Manoj:** It's sad that you can't understand me.

**Nakul:** Isn't it a fact that you have differences with him?

**Manoj:** It's true (that I have). It is clear that I don't like people who lie/ liars.

**Nakul:** (Do) you mean he lies? He is a liar?

**Manoj:** Need I say that again?

**ప్రశ్న:**

We reached home after the sun had set. ఈ వాక్యం correct అన్నారు. ఈ వాక్యంలో after బదులు before వాడొచ్చు కదా! వివరంగా తెలియజేయగలరు.

– వి.ప్రేమ్‌చంద్, చిలకలూరిపేట.

**జవాబు:**

1) We reached home before the sun has set. 2) We reached home after the sun had set. వీటిని పరిశీలిద్దాం:

1) We reached home before the sun has set- Main clause verb- reached- past tense; subordinate cl verb- has set- present tense- ఇలా ఉండటంవల్ల, ఈ sentence తప్పుకదా. We reached home before the sun had set అన్నా తప్పే కదా? ఇక్కడ earlier past action- reaching home. అందువల్ల reach, past perfect form, had reached ఉండాలి. Setting of the sun- later past simple- set ఉండాలి. అప్పుడు correct sentence, We had reached home before the sun set (సూర్యాస్తమయం ముందే మేము ఇల్లు చేరాం అనే అర్థంతో).

2) We reached home after the sun had set = సూర్యాస్తమయం తర్వాత ఇల్లు చేరాం- ఈ అర్థంతో పై sentence correct కదా? ఇల్లు చేరటం ముందు, అందుకని, had reached. సూర్యాస్తమయం, తర్వాత, అందుకని, the sun set.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

# That's what I want to know too

**Sita:** Where can we meet Indira?
(మనం ఇందిరను ఎక్కడ కలుసుకోగలం?)

**Gopal:** That's what I want to know too. Don't you have any idea?
(అదే నేను తెలుసుకోవాలనుకుంటున్నది కూడా. నీకేం తెలియదా?)

**Sita:** I'm afraid, no. Wait. I remember now. She told me she was going to Mr. Raju's. That's where we can find her.
(లేదనుకుంటా. ఉండూ. ఇప్పుడు గుర్తొస్తోంది నాకు. రాజు ఇంటికి వెళ్తున్నానని చెప్పింది. మనం ఆమెను అక్కడ చూడొచ్చు)

**Gopal:** Why on earth did she want to go to Mr. Raju's?
(రాజు ఇంటికి ఎందుకు వెళ్లాలని అనుకుంది అసలు?)

**Sita:** She wanted to learn from Mrs Raju how to make Jangri. That's why she went there.
(శ్రీమతి రాజు దగ్గర జాంగ్రీ చేయడం నేర్చుకోవాలనుకుంది. అందుకు వెళ్లిందక్కడికి.)

**Gopal:** How do you know that she went there for that?
(అందుకనే వెళ్లిందని నీకెలా తెలుసు?)

**Sita:** Just yesterday she was telling me that Mrs Raju was good at making Jangri, and that one of these she should learn it from her. That's how I know she went for that.
(శ్రీమతి రాజు జాంగ్రీ బాగా చేస్తుందని, తను నేర్చుకోవాలని నిన్ననే నాతో అంది. అలా తెలుసు తనం దుకోసం అక్కడికి వెళ్లిందని.)

**Gopal:** Can you tell me when Indira left here?
(ఇక్కడ్నించి ఇందిర అక్కడికి ఎప్పుడెళ్లిందో చెప్పగలవా?)

**Sita:** We were watching a serial, and in came our friend Ramu. That's when both of them left here for Raju's.
(మేము TV serial చూస్తున్నాం. అప్పుడు మన మిత్రుడు రాము వచ్చాడు. అపుడు వాళ్లిదరూ కలిసి రాజు ఇంటికి వెళ్లారు.)

**Gopal:** Are both of them there? That's good. In fact I've been trying to meet Ramu for some time now. Shall we go there then?
(వాళ్లిద్దరూ అక్కడున్నారా అయితే? బాగుంది. అసలు నేను రామును కలుసుకోవాలనుకుంటున్నా. అయితే వెళదామా అక్కడికి?)

**Sita:** We shall. Let me clean up the mess on the dining table. I won't be a minute.
(వెళదాం. Dining table మీద గందరగోళంగా ఉంది. అది శుభ్రం చేసి వస్తా. ఒక్క క్షణం.)

mess = కంగాళీ, గందరగోళంగా, అపరిశుభ్రంగా ఉన్న. I won't be a minute = ఒక్క క్షణం కూడా ఉండను. They won't be five minutes = ఐదు నిమిషాలు కూడా ఆలస్యం చేయరు వాళ్లు.

ఇది మీ English లో practice చేయండి.

✪ ✪ ✪ ✪

Daily real life situations లో spoken English లో అదే (అదే నాక్కావాల్సింది లాంటి sentences లో), అక్కడే (అక్కడే అది జరిగింది లాంటి sentences లో), అప్పుడే (అప్పుడే అది చూశాను లాంటి sentences లో), అలాగే (ఆమె అలాగే చేసింది లాంటి sentences లో), వరుసగా what, where, when, how లను వాడుతుంటాం. ఇవి వాడకుండా ఇంకా simple గా చెప్పవచ్చు వీలయినంతవరకూ అలా చెప్పటమే మంచిది. అయితే కొన్ని సందర్భాల్లో అదే, అక్కడే, అప్పుడే, అలాగే అనే విషయాలు నొక్కి చెప్పే అవసరం (stress చేసి చెప్పే అవసరం) వచ్చినప్పుడు, what, where, when and how లాంటి మాటల వాడకం తప్పనిసరి.

**Study the following:**

a) I want to Know that =
అది నేను తెలుసుకోవాలనుకుంటున్నాను.

b) That's what I want to know =
అదే నేను తెలుసుకోవాలనుకుంటున్నది.

తేడా గమనించారు కదా, (a)కి (b) కి. (a) లో అది అనేస్తున్నాం. (b) లో, "అదే" అని, దాన్ని నొక్కి చెప్తున్నాం.

ఇలా, అంటే (b) లో మాదిరిగా ఒక విషయాన్ని నొక్కి చెప్పేందుకు, That's what, that's where, that's when and that's how లాంటి clause లు spoken English లో తరచూ వినిపిస్తాయి. వీటిని వాడటం వల్ల మనం stress చేయాలనుకున్న వాటిని స్పష్టంగా చెప్పగలం. ఇది practice చేయండి. వాటిని మీ conversation లో వాడండి. చాలా effective గా ఉంటుంది.

***Look at the following sentences from the dialogue above.***

*1) That's what I want to know too.*
*2) That's where we can find her.*
*3) That's why she went there.*
*4) That's how I know she went there.*
*5) That's when both of them left for Mr. Raju's.*

పై sentences లో underline చేసిన expressions బాగా practice చేసి మీ conversation లో వాడండి.




**1) That's what I want to know =**
నేను తెలుసుకోవాలనుకుంటున్నది అదే. ('అదే' కు ప్రాముఖ్యం)

(I want to know that అనొచ్చు అయితే, ఇక్కడ that కు stress లేదు, అంటే అదే అని అర్థం రాదు. 'అది' కి, 'అదే' కి తేడా చాలా ఉంది కదా!)




Some more examples:

a) That's what I don't like = నాకు నచ్చనిది అదే/ అదే నాకు నచ్చనిది. పోల్చండి. I don't like that అది నాకు నచ్చదు.

b) He wants me to sweep. That's (exactly) what insults me =
నన్ను ఊడవాలంటాడు. అదే నాకు అవమానకరంగా ఉండేది.
(compare that insults me)

**2) That's where we can find her =**
అక్కడ/ అక్కడే దొరుకుతుందామె మనకు/ మనకామె దొరికేదక్కడే.

a) Go to the first shop on the left of the road. That's where you get any book. =
Road కు ఎడమవైపున్న మొదటి shop కు వెళ్లు. అక్కడే దొరుకుతుంది నీకు ఏ పుస్తకమైనా.
పోల్చండి: You get any book there.

b) Oval? I know. That's where Indians played their first match. =
Oval విషయమా నువ్వనేది? నాకు తెలుసు. అక్కడేగదా Indians తమ మొదటి match ఆడింది?

c) That's where we met for the first time, isn't it? = అక్కడే కదా, మనం మొదటిసారి కలుసుకుంది. (పోల్చండి! We met there for the first time, didn't we?)

**3) That's why** = అందుకే/ అందుకనే.

a) Sachin is not proud. That's why I like him, even if he doesn't play well sometimes =
సచిన్‌కు గర్వంలేదు. అందుకనే అతనంటే నేనిష్టపడతాను/ నాకిష్టం, కొన్నిసార్లు బాగా ఆడకపోయినా.)
(పోల్చండి. I like him for/ because of it)

b) She has the same opinions as I. That's why I support her =
నాలాంటి భావాలే ఆమెవి. అందుకనే నేనామెకు మద్దతిస్తాను.

**4) That's when** = అప్పుడు/ అప్పుడే.

a) You remember his uncle coming in. That's when I left the place. =
నీకు వాళ్ల uncle రావడం గుర్తుందికదా? అప్పుడే నేనక్కడ్నించి వెళ్లిపోయింది.
(పోల్చండి: I left the place then)

b) That's exactly when I entered =
Correct గా అప్పుడే నేను ప్రవేశించింది.
(పోల్చండి: I entered then)

**5) That's how** = అలా(గే).

a) That's how he built his house = తను ఆ ఇల్లు కట్టిందలాగే.

b) People came up in life the hard way. That's how he came up too =
కష్టపడటంవల్లే జీవితంలో పైకి వస్తారెవరైనా. అతను పైకొచ్చిందీ అలాగే.
(పోల్చండి: He came up like that too)

చూశారు కదా: 1) That's what కూ that కూ, 2) That's where కూ there కూ, 3) That's why కీ, because/ for కూ, 4) That's how కూ, like that కూ, and 5) That's when కూ, then కూ ఉన్న తేడా? That's తో వచ్చే expressions, ఇందాక సూచించినట్లు emphasis కు వాడతాం. ఇది conversation లో ముఖ్యం. Practice చేయండి.

**ప్రశ్న:** 1. Lay, lie, laid, lied, weigh, weight, by, bye- వీటి pronunciation తెలుపగలరు.

2. Will have been, shall have been, can have been, may have been, dare have been, need have been- వీటి అర్థాలు, వాడుక తెలియజేయగలరు.

3. i) In the light of, ii) lighter movement - అర్థాలు, వాడుక చెప్పండి.

*– టి.సూర్యనారాయణ, రావులపాలెం*

**జవాబు:**

1. lay- లెయ్, lie- లయ్; laid- లెయ్‌డ్; lied- లైయ్‌డ్; weigh= వెయ్ (వె-పెదవులను గుండ్రంగా తిప్పి దగ్గరకు తీసుకురండి); weight= వెయ్‌ట్ (వె-పైన చెప్పినట్లే) by, bye= బై.

2. Will have been/ shall have been- future లో ఒక సమయంలో ముగిసిన/ ఉంటుందనుకున్న స్థితి (A state of being likely to have been/ to be continuing by some time in future)

a) They <u>will have been here</u> by this time tomorrow / by ten tomorrow morning = రేపీపాటికి/ రేపు పదికల్లా వాళ్లిక్కడ ఉండి ఉంటారు.

b) By this time next year, I shall have been out of India/ in the US =
వచ్చే సంవత్సరం ఈ సమయానికి (= ఈ సమయానికి ముందే) నేను భారత్ బయట/ US లో ఉంటాను. (అంటే ఈ time కు ముందే, భారత్ వదిలి/ US కు చేరి ఉంటాను.)

Can have been - ఉండి ఉండగలగటం-

He can have been the President-
అతను president గా ఉండగలిగేవాడు.

అయితే ఇది చాలా అరుదుగా వాడతారు. can have been అర్థంతో can be నే ఎక్కువగా వాడతారు.

May have been - ఇది కూడా కాస్త అరుదు. ఉండి ఉండవచ్చు అనే అర్థంతో - He may have been there = అతనక్కడ ఉండవచ్చు - ఇదే అర్థంతో may be ఎక్కువ వాడతారు. అదే may have + past participle (been బదులు) - He may have gone- వాడు వెళ్లుండొచ్చు- దీనికన్నా He might have gone ఎక్కువ వాడతారు.

Dare/ need have been- ఇవి ఎక్కువ not తో వాడతాం.

He dare<u>not</u> have been there= అక్కడ ఉండే ధైర్యం వాడికి లేదు/ అక్కడ ఉండగల సాహసం అతను చేయలేదు (అంటే అక్కడ <u>లేదు</u> అనే అర్థంతో)

He need not have been there= అతనక్కడ ఉండాల్సిన అవసరం లేదు = అతనక్కడ అనవసరంగా ఉన్నాడు - అతనక్కడ ఉండాల్సిన అవసరం లేదు- అతనక్కడ ఉన్నాడు గతంలో- అలా ఉండటం అనవసరం)

3) i) In the light of = ఆ ప్రకారం చూస్తే/ దాని/ వాటి ఆధారంగా/ దాని ఫలితంగా

a) <u>In the light of his remarks</u> it is clear he won't be here for long =
<u>అతని వ్యాఖ్యలను బట్టి చూస్తే</u>, అతనిక్కడ ఎక్కువ కాలం ఉండడనేది స్పష్టం.

b) In the light of what has happened, I have to change my opinion of things = <u>ఇప్పుడు జరిగినదాన్ని బట్టి</u>, నేను కొన్ని విషయాల గురించి నా అభిప్రాయాలు మార్చుకోవాల్సి వస్తోంది.

ii) lighter moments (lighter <u>movements</u> కాదు)
In lighter moments = (ఎవరైనా సరదాగా/ serious గా లేని సందర్భాలలో)

a) In his lighter moments he is very jovial = అతను serious గా లేనప్పుడు, చాలా సరదాగా, jokes వేస్తూ ఉంటాడు.

b) In her lighter moments, we can persuade her to do any thing = ఆమె serious గా లేనప్పుడు, మనం ఆమె చేత ఏ పనైనా చేయించుకోవచ్చు/ ఏ పనైనా చేసే విధంగా నచ్చజెప్పవచ్చు
persuade = నచ్చజెప్పటం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# It is ... that is in the way

**Bhargav:** Didn't you say you'd be back on saturday itself? Why this delay?
(నువ్వు శనివారమే తిరిగొస్తానన్నావుకదా? ఎందుకీ ఆలస్యం?)

**Sourabh:** I thought I could but my cousin Anand ...
(రాగలననే అనుకున్నాను కానీ, నా cousin Anand ...)

**Bhargav:** ..didn't let you. I know you would say that. Last time too, it was Anand that stopped you, wasn't it?
(నిన్ను రానివ్వలేదు. అలా చెప్తావనీ నాకు తెలుసు. కిందటిసారి కూడా ఆనందే నిన్ను ఆపాడు, అవునా?)

**Sourabh:** Yes.

**Bhargav:** What holds you together, so fast?
(మీ ఇద్దరినీ అంత గట్టిగా కట్టిపడేసేదేది? / మీ ఇద్దరి మధ్య అంత గట్టి బంధమేంటి?)

fast= గట్టిగా. ఎక్కువగా fast అంటే వేగంగా అనే అర్థంతో వాడుతుంటాం.

**Sourabh:** It's our closeness in our childhood that keeps us so together. We spent our childhood together for about four years at our grand dad's.
(చిన్నతనంలో మేం కలిసి ఉండటం మమ్మల్ని అంత సన్నిహితంగా ఉంచుతోంది. దాదాపు నాలుగేళ్లపాటు చిన్నప్పుడు మా తాతయ్య ఇంట్లో కలిసి పెరిగాం.)

closeness = సాన్నిహిత్యం

**Bhargav:** He doesn't visit you as often as you visit him, does he?
(నువ్వతని దగ్గరకు వెళ్లినంత తరచుగా, అతన్నిన్ను చూసేందుకు రాడు కదా?)

**Sourabh:** True. It's his business that's in the way. Whenever he can, he visits me overnight and is back in the morning.
(అతని వ్యాపారం అతన్ని రానివ్వదు. అయితే వీలున్నప్పుడల్లా/ రాగలిగినప్పుడల్లా రాత్రిపూట వచ్చి పొద్దున వెళ్లిపోతుంటాడు.)

**Bhargav:** After all, it is this togetherness that makes human beings different from animals.
(ఏదేమైనా, ఇలాంటి బంధాలే కదా, మానవులకూ, జంతువులకు తేడా చూపించేది)

**Sourabh:** It's his warmth and hospitality that draws me to him.
(అతని ఆదరం, ఆతిథ్యం నన్ను బాగా ఆకర్షిస్తాయి.)

warmth= ఆదరం/ ఆప్యాయత

hospitality = ఆతిథ్యం

hospitable= అతిథులను బాగా చూసే

draw = attract = ఆకర్షించటం

**Bhargav:** You are as warm and hospitable to him, aren't you?
(నువ్వూ అతని పట్ల అంతే ఆదరంగా, ఆతిథ్యం చూపేట్టుగా ఉంటావు కదా?)

**Sourabh:** That I am. I like him very much.
(నేనూ అంతే. అతనంటే నాకు చాలా ఇష్టం.)

**Bhargav:** When is he coming here next time?
(అతనీసారి ఇక్కడికి ఎప్పుడొస్తున్నాడు?)

**Sourabh:** His programme is uncertain. It's the uncertainty of his programme that some times irritates me. I want to be sure that I'm at home for him.
(అతని programme చాలా అనిశ్చితం. ఈ అనిశ్చితే నాక్కాస్త చికాకు కలిగిస్తుంది. అతనొచ్చినప్పుడు నేను ఇంట్లో ఉండాలి కదా?)

**Bhargav:** Why are you angry with him?
(ఎందుకు కోప్పడ్తున్నావతన్ని?)

**Sourabh:** Not at all. I only feel bad if I'm not at home when he comes. If he comes when I am there I feel happy.
(అదేం లేదు. అతనొచ్చినప్పుడు నేను లేకపోతే బాధపడతా. అతను నేనున్నప్పుడొస్తే సంతోషపడతా.)

**Bhargav:** I understand. (నా కర్థమవుతోంది.)

✪ ✪ ✪ ✪

***Observe the difference between sentence A and sentence B below:***

**A.** Maoists killed him. (మావోయిస్టులు అతన్ని చంపారు)

**B.** It is Maoists that killed him.
(అతన్ని చంపింది మావోయిస్టులు)

గమనించండి: A లో ఒక విషయాన్ని మామూలుగా చెప్తున్నాం. అదే B లో అతన్ని చంపింది మావోయిస్టులు అన్నప్పుడు, మావోయిస్టులకు ప్రాధాన్యం. (We stress, Maoists, అతన్ని చంపింది మావోయిస్టే, ఇంకెవరో కాదనే అర్థంతో)

**Look at the following pairs of sentences again.**

**A)** India won the match because of Sachin.
(సచిన్ వల్ల భారత్ match గెలిచింది)

**B)** It is because of Sachin that India won the match.
భారత్ గెలిచిందంటే సచిన్ వల్లనే. (ఇంకెవరి వల్లా కాదు)

అంటే తెలుస్తోంది కదా: ఏదైనా విషయాన్ని/ ఓ sentence లో ఏదైనా భాగాన్ని నొక్కి చెప్పేందుకు Introductory 'It' వాడతామన్నమాట. ఇది వాడటం బాగా practice చేస్తే, మనం ప్రాముఖ్యం ఇవ్వాలనుకున్న విషయాన్ని తెలియజేయవచ్చు.


M.SURESAN

**A)** Prasad helped me, not you =
నాకు సాయం చేసింది ప్రసాద్, నువ్వు కాదు.

**B)** It is Prasad that helped me, not you =
నాకు సాయంచేసింది ప్రసాదే. నువ్వేంకాదు.

***Now look at the following sentences from the dialogue above:***

*1) ... it was Anand that stopped you, wasn't it?*

*2) It was our closeness in childhood that keeps us so together.*

*3) It is his business that is in the way.*

*4) After all, it is this togetherness that makes human beings different from animals.*

*5) It is his warmth and hospitality that draws me to him.*

*6) It is the uncertainty of his programme that irritates me.*

Introductory It ను ఇలా వాడేటప్పుడు, sentence రూపం గమనించండి:

It is Shekhar that got the prize.

It + 'be' form + subject + 'that' clause.

It + be form clause తర్వాత 'that' తో begin అయ్యే clause (a group of words with a verb) వస్తుంది.

**Sunil:** I'm sorry that you've lost the ring. No use worrying. Forget it.
(నీ ఉంగరం పోయినందుకు బాధగా ఉంది. Worry అయి ప్రయోజనం లేదు. మరచిపో.)

**Suman:** (It's) easy for you to say that. After all, it is not your ring that is lost, it's mine.
(అలా అనటం సులభమే. ఏదేమైనా, పోయింది నీ ఉంగరం కాదు కదా, నాది./ It's my ring that is lost, not yours. (పోయింది నా ఉంగరం, నీది కాదుకదా?)

ఇది not తో (పై sentence లోలా) నే కాకుండా question లో వాడతాం.

**Kavita:** Why do you waste money?
(డబ్బెందుకు పాడుచేస్తావు?)

**Kanaka:** Is it your money that I am spending? Why are you worried?
(నేను ఖర్చుపెడుతున్నది నీ డబ్బా? నువ్వెందుకు బాధపడటం?)

Conversation లోని sentences గమనిద్దాం:

**1)** It was Anand that stopped you, wasn't it? =
నిన్నాపింది ఆనందే కదా? (ఇంకెవరో కాదు)
(Compare: Anand stopped you)
It clause + that clause

**2)** It is our closeness in childhood that keeps us so together =
మా చిన్నప్పటి సాన్నిహిత్యం మమ్మల్నంత దగ్గరగా ఉంచుతుంది.
It is our closeness ('It' clause) + that keeps us so together (that clause)

**3)** It is his business that is in the way.
It is his business (It clause) + that is in the way (that clause)

**4)** It is this togetherness that makes human beings different from animals.
It is this togetherness (It clause) + that makes human ... (That clause)

**5)** It is his warmth and hospitality that draws me to him.
It is his warmth ... (It clause) + that draws me to him. (That clause)

**6)** It is the uncertainty of his programme that irritates me.
It is the uncertainty ... (It clause) + that irritates me (That clause).

ఈ 'It' clause + That clause combination మీ conversation లో బాగా practice చేయండి.

---




**ప్రశ్న:** ఏ రోజైనా ఒక వ్యక్తిని మొదటిసారి కలిసినప్పుడు good morning అని greet చెయ్యడం సరైనదేనా?

– పి. గోవిందరాజు, వేగాయమ్మ పేట

**జవాబు:** Good morning, ఎప్పుడైనా, మధ్యాహ్నం 12 గంటల వరకు మాత్రమే. తర్వాత 4, 4.30 వరకు good afternoon, ఆ తర్వాత రాత్రి నిద్రపోయేవరకు, good evening, రాత్రిపూట, నిద్రపోయేముందూ, రాత్రి చివరిసారిగా కలుసుకుంటే, good night.

**ప్రశ్న:** 1. I will <u>get/ make</u> them *do* the work.
2. I will <u>get/ make</u> them <u>done</u> the work.
3. I <u>got/ made</u> them <u>do</u> the work.
4. I <u>got/ made</u> them <u>done</u> the work.

పై వాక్యాలు సరైనవేనా? వాటి అర్థాలు వివరించగలరు. Get/ make లాంటి పదాలు వచ్చినప్పుడు verb (ఇక్కడ do) Ist form లో ఉండాలా?

– పి. శ్రీనివాస్, ద్రాక్షారామం

**జవాబు:**
1) I'll get them <u>to do</u> the work = I will make them <u>do</u> the work = I'll have them <u>do</u> the work = I'll have the work done by them.
2) I will get/ make them done the work- Wrong
3) I got <u>them to do</u> the work = I <u>made them</u> <u>do</u> the work.

Got/made done - Wrong

Get/ Got + somebody + to do = make/ made somebody + <u>do</u>. Past Doing Word రాదు.

**ప్రశ్న:** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి.
1. సినిమా చూశావా? ; 2. సినిమా చూడకు;
3. సినిమా చూడు; 4. చూస్తే లాభమేమిటి? ;
5. చూడకపోతే నష్టమేమిటి? ; 6. చూస్తావా? ;
7. చూడవా? ; 8. చూస్తున్నావా? ;
9. సినిమా చూపించు;
10. చూపిస్తావా? ;
11. చూడాలనుకుంటున్నావా? ;
12. చూడొద్దనుకుంటున్నావా?

– ఆర్. శ్రీదేవి, జమ్ములపాలెం (ప్రకాశం జిల్లా)

**జవాబు:** 1. Have you seen the movie?
2. Don't see movies (సినిమాలు చూడకు)/ Don't see the movie (ఏదైనా ఫలానా movie చూడొద్దంటే).
3. See the movie.
4. What's the use of seeing the movie? seeing movies?
5. What do you lose if you don't see the movie?
6. Do you see movies? (సినిమాలు చూస్తావా?) Will you see the movie? (ఆ సినిమా చూస్తావా?)
7. Don't you see movies? (మామూలుగా చూడవా?)/ Won't you see the movie (ఆ సినిమా చూడవా?)
8. Are you watching the movie?
9. Show me/ Take me to the movie.
10. Will you show?
11. Do you want to/ like to/ wish to see a movie/ feel like seeing/ watching a movie?
12. Don't you want to/ wish to/ like to see the movie?
English లో cinema = theatre (The hall in which movies are shown).
చలన చిత్రం: movie/ the pictures/ film.

# ప్రతిభ

# Ask whoever you like

**Pradeep:** Were you at the theatre last night? What movie did you go to?
(నిన్న సినిమాహాల్ దగ్గరున్నావా నువ్వు? ఏ సినిమాకెళ్లావు?)

**Jaideep:** What's the matter? (విషయం ఏమిటి?)

**Pradeep:** Aren't you watching too many movies?
(నువ్వు మరీ ఎక్కువ సినిమాలు చూడటం లేదా?)

**Jaideep:** Whoever told you that I had been to a movie last night was lying.
(నిన్న నేను సినిమాకెళ్లానని చెప్పిందెవరైనా అబద్ధం చెప్పారు.)

**Pradeep:** Think whatever you like, you have seen to many movies this week - wasting time and money.
(ఏమైనా అనుకో. ఈ వారం ఇప్పటికే చాలా సినిమాలు చూశావు. డబ్బు, సమయం వృథా కదా?)

**Jaideep:** Ask whoever you like. I didn't go to any movie last night. Whenever I want to go to the pictures, I definitely inform you. You know that.
(నువ్వు ఎవరినైనా అడిగి తెలుసుకో. నిన్న రాత్రి నేను ఏ సినిమాకూ వెళ్లలేదు. నేను సినిమాకెళ్తే నీతో తప్పక చెప్తాను. నీకది తెలుసు.)

**Pradeep:** Whoever denies it? However much I advise you, you don't cut down on your movies. True, you inform me, but does it reduce the number of movies you see?
(ఆ మాట కాదన్నదెవరు? నేనెంత సలహా ఇచ్చినా నీ సినిమాలు తగ్గించుకోవుగదా? నిజమే, నాతో చెప్పే వెళ్తావు సినిమాకు. కానీ అందు వల్ల నీ సినిమాల సంఖ్య తగ్గుతుందేం?)

**Jaideep:** OK. You shall not have cause to complain from now on. Yes, I won't be watching more than a movie a fortnight.
(ఇప్పటి నుంచి నన్ను తప్పుపట్టే అవకాశం నీకుండదు, సరేనా? అవును. 15 రోజులకో సినిమా కంటే ఎక్కువ సినిమాలు చూడను)

**Pradeep:** What is there in the Indian movies to attract us? Whichever movie you take, you find it loud, vulgar and dull.
(భారతీయ సినిమాల్లో ఏం ఉంది మనల్ని ఆకర్షించేందుకు? నువ్వు ఏ సినిమా తీసుకున్నా, అది గొడవ గొడవగా, అశ్లీలతతో, అనాసక్తికరంగా ఉంటుంది.)

**Jaideep:** True, of course. I assure you I'll cut down on movies.
(నిజమే. నా సినిమాల సంఖ్య తగ్గిస్తానని హామీ ఇస్తున్నా.)

☯ ☯ ☯ ☯ ☯

**Observe the following:**

Whatever, whoever, Whichever, Wherever, Whenever, However, etc. (ఇక్కడ 'Wh' words (What, Who, When etc.) చివర ever ఉంది కదా. వీటి అర్థం, ఉపయోగం ఈ lesson లో చూద్దాం.

i) 'Wh' word తో ever వాడేటప్పుడు రెండింటినీ ('Wh' word నూ, ever ను) కలిపి ఒకేమాటగా వాడతాం.

ii) వీటిని ఏదైనా (Whatever), Whoever (ఎవరైనా, ఎవరినైనా, ఎవరినైనా) Whichever (ఎవరైనా, ఏదైనా, Wherever (ఎక్కడయినా), Whenever (ఎప్పుడైనా), However (ఎలా ఐనా) అనే అర్థంతో వాడతాం.

**Important:** Modern English, ముఖ్యంగా spoken English లో Whom (ఎవరిని, ఎవరికి) వాడకం దాదాపు లేదు. Whom వాడాల్సిన అన్నిచోట్లా, Whom (ఎవరిని, ఎవరికి) అనే అర్థంతో Who వాడటం సహజమైన (natural) English.

నువ్వు ఎవరితో మాట్లాడావు? ఈ అర్థంతో Whom వాడాలనుకుంటే, Whom ముందు preposition రావాలి: To Whom did you talk? అని రావాలి.కానీ Modern English లో ఇది చాలా అసహజం, అనవసరమైన పాండిత్యంగానూ అనిపిస్తుంది. ఇందుకు బదులు Who did you talk to? అనాల్సింది. అయితే ఇక్కడ, preposition 'to' sentence చివర వస్తుంది.

Who were you quarrelling with? (ఎవరితో నువ్వు పోట్లాడుతోంది?) గమనించండి, with sentence చివర రావటం.

a) Who are you calling? (ఎవరిని పిలుస్తున్నావు? / ఎవరికి Phone చేస్తున్నావు?)

b) Who do you want to consult?
(ఎవరిని సంప్రదించాలనుకుంటున్నావు?)

ఇలాంటిచోట్ల ఎక్కడా whom వాడం, whom దాదాపు అదృశ్యమైపోయినట్లే, modern spoken English లో.

***Now Look at the following sentences from the conversation at the beginning of the lesson.***

*1) Whoever told you that had been to a movie was lying.*

*2) Think whatever you like, you have seen...*

*3) Ask whoever you like.*

*4) Whenever I want to go to the pictures, I definitely inform you.*

*5) Whichever movie you take, you find it loud, vulgar and dull.*




**1) Whoever =** ఎవరైనాసరే

Whoever has done it, has done it well =
అదెవరు చేశారోగానీ/ చేసిందెవరైనా సరే, చాలా బాగా చేశారు.

b) Whoever violates the rule will be punished =
నిబంధనను ఎవరు ఉల్లంఘించినా శిక్షింపబడతారు. (మామూలు తెలుగు - వాళ్లకు శిక్ష పడుతుంది.)


M.SURESAN

**3) Ask whoever you like =**
ఎవరినైనా అడుగు, నీ ఇష్టం (నీ ఇష్టం వచ్చినవాళ్ల నడుగు) - చూస్తున్నాంకదా? ఎవరిని అనే అర్థంతో కూడా, whoever అంటున్నాం. (whomever కాదు)

a) Consult whoever you like, they will give you the same advice =
ఎవరినైనా సంప్రదించు, వాళ్లు ఇదే సలహా ఇస్తారు.

b) Advise whoever you like, but not me =
నీకిష్టం వచ్చిన వాళ్లకు నీ సలహా ఇవ్వు, నాకు మాత్రం కాదు.

పై రెండు sentences లో whomever అని కాకుండా whoever వాడటం గమనించండి.

**2) Think whatever you like ...**

**whatever =** ఏదైనా.

a) You do whatever I tell you to do =
నేను చెప్పేది ఏదైనా అది నువ్వు చెయ్యి.

b) Buy whatever you want; I will give you the money =
నీకేదికావాలో అది కొనుక్కో; నేనిస్తాను డబ్బులు.

c) Whatever you know about it is not correct = దాన్ని గురించి నీకు తెలిసింది ఏదైనాసరే, అది సరికాదు.

(ఇక్కడకూడా Modern spoken English లో, Whatever బదులు, మామూలు simple 'What' వాడేస్తున్నారు.)

Eat whatever you like = Eat what you like. Eat what you like ఎక్కువగా వినిపిస్తుంది, నీకేది ఇష్టమైతే అది తిను, అనే అర్థంతో.

**4) Whenever =** ఎప్పుడయినాసరే

a) Come whenever you like, our doors are open to you =
నీకిష్టం వచ్చినప్పుడు రా/ నువ్వెప్పుడయినా రా, మా తలుపులు తెరిచే ఉంటాయి నీకు.

b) Whenever he comes here, he brings along his dog =
అతడు ఇక్కడికి ఎప్పుడొచ్చినా/ వచ్చినప్పుడల్లా, అతడి కుక్కను కూడా తీసుకువస్తాడు.

c) I'll come at 12 or One, whenever I can =
పన్నెండింటికో, ఒంటిగంటకో, ఎప్పుడు రాగలిగితే అప్పుడొస్తాను.

**5) Whichever =** ఏదయినాసరే/ ఏదైతే అది.

a) Try both of them; eat whichever you find the tastier =
రెండింటినీ చూడు; ఏది రుచెక్కువగా ఉంటే అది తిను.

b) Whichever of us reaches the cinema earlier should buy the tickets =
మనలో సినిమాకు ఎవరు ముందెళ్లినా మిగతా వాళ్లకు కూడా టికెట్స్ కొనాలి.

(Which/ whichever వస్తువులకే కాకుండా, మనుషులకు కూడా వాడతాం.

Which of the candidates is the better? =
ఆ అభ్యర్థుల్లో ఎవరు మెరుగు?

Who among the candidate is the better?)

c) Whichever way you look at it, it is a big waste =
దాన్ని ఏ కోణంలో నుంచి చూసినా, అది వృథా.

**6) However/ Howevermuch =** ఎలాగైనా/ ఎంతైనా.

a) However great the Australian team is, it has loss to India =
ఆస్ట్రేలియా జట్టు ఎంత గొప్పదయినా, అది భారత్ చేతిలో ఓడిపోయింది.

b) However much the car costs, I will buy it = కారు ధర ఎంతైనా సరే, నేనది కొంటాను.

ఇవి- ever తో అంతమయ్యే మాటల వివరాలు. వీటిని బాగా practice చేద్దాం.

---

Q A

**ప్రశ్న:**

*The decision <u>comes</u> in the wake of centre accepting the RIL formula on gas price against the wishes of the state government.*

*Dr Kakodkar's carefully- worded comments <u>come</u> amidst a raging political debate on the Indo-US nuclear deal in India with left parties and the opposition closely watching his approach at IAEA. ఈ వాక్యాలు న్యూస్‌పేపర్‌లోవి. వీటిల్లో verb simple past tense వాడాలి కదా. ఇక్కడ simple present tense వాడారు. ఇది ఎలా కరెక్టో తెలుపగలరు.*

***– సాంబశివరావు, విజయవాడ***

**జవాబు:**

Newspaper లో report చేసేటప్పుడు, past actions at a definite time కు కూడా present simple వాడతారు. ఇది usage (వాడుక).

India match గెలిచింది, అని, match గెలిచిన next day, ఎలా report చేస్తారు? - India <u>wins</u> the match. (Wins- Simple Present). అలాగే, Bridge <u>crashes</u>, 10 people die (Bridge <u>కూలింది, పదిమంది చనిపోయారు</u> అని) ఇది news reporting లో సర్వసాధారణం; తప్పుకాదు.

గతంలో ఎప్పుడో ఎవరో అన్న విషయం ఇంకొకళ్లతో మనం చెప్పేటప్పుడు కూడా ఇలా present tense వాడతాం:

My father <u>says</u> that he saw you here yesterday. మీ father మీరంటున్నప్పుడు మీ ఎదురుగా లేకపోయినా ఇలానే అంటాం. ఇది తప్పుకాదు.

**ప్రశ్న:**

*i) rub shoulder with ii) rub the wrong way*
*iii) churn out - అర్థాలు, వాడుక చెప్పండి.*

***– టి.సూర్యనారాయణ, రావులపాలెం***

**జవాబు:**

i) Rub shoulders with = భుజాలు రాచుకు తిరగటం/ అతిచనువుగా ఉండటం/ అతి స్నేహంగా ఉండటం.

a) We don't expect a boss to rub shoulders with his subordinates = పై అధికారినెప్పుడూ కిందవాళ్లతో భుజాలు రాచుకుతిరగాలని అనుకోం/ అతిచనువుగా/ అతిస్నేహంగా ఉండాలని ఆశించం.

b) I have a status of my own. <u>I don't rub shoulders with</u> all and sundry = నాకంటూ ఒక స్థాయి ఉంది. నేను అయినవాళ్లు/ కానివాళ్లం దరితో అతి చనువుగా ఉండను.

All and sundry = పనికిమాలిన/ విలువలేని ప్రతివాళ్లూ.

ii) Rub the wrong side (wrong way కాదు)= కోపం తెప్పించటం

a) You rub the wrong side of the CM if you ask him of land grabs = నువ్వు CM తో భూకబ్జాల గురించి మాట్లాడితే, ఆయనకు కోపం తెప్పిస్తావు.

b) (Are) you going to ask him for his bike? you'll be rubbing him on the wrong side = నువ్వు వాడ్ని bike అడగబోతున్నావా? అయితే వాడికి కోపం కలిగించబోతున్నావు? (నువ్వు వాడ్ని bike అడిగితే వాడికి కోపం వస్తుంది.)

iii) churn out - వేగంగా ఎక్కువ మొత్తంలో తయారు చేయటం.

a) The large number of engineering colleges across the state are <u>churning out</u> engineering graduates by the thousands. రాష్ట్రంలోని engineering colleges వేలసంఖ్యలో engineering పట్టభద్రులనుతయారుచేస్తున్నాయి.

b) The Telugu film industry is churning out movies in a large number every year = ఏటా తెలుగు సినిమా పరిశ్రమ పెద్ద సంఖ్యలోనే సినిమాలను తయారుచేస్తోంది.

[churn=(అసలర్థం) చిలకటం. <u>Churn</u> curds and you get butter = పెరుగును <u>చిలికితే</u> వెన్న వస్తుంది)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# So it all boils down to this

**Dhanush:** How did you come by that shirt, Puneeth?
(పునీత్! నీకు ఆ షర్ట్ ఎలా వచ్చింది? )

**Puneeth:** Why? Isn't it good?
(ఏం? అది బాగా లేదా? )

**Dhanush:** My God! How could you ever think of wearing it?
(బాబోయ్! అలాంటి షర్ట్ వేసుకోవాలని ఎలా అనుకోగలవు? )

**Puneeth:** Cut the crap and tell me what you find is wrong with it.
(చెత్త మాటలాపి, ఆ షర్ట్ దోషం ఏమిటో చెప్పు.)

**Dhanush:** The colour and the stripes across, like the ones the sidekicks of the villains in movies wear.
(ఆ రంగూ, ఆ అడ్డచారలూ, సినిమాల్లో విలన్ అనుచరులు వేసుకునేవిలాగా ఉన్నాయి.)

**Puneeth:** Stop it. My aunt presented it to me. She came to India for a few weeks' stay from the US. It's a US product you know.
(ఆపు. అది మా అత్తయ్య కానుక, కొద్ది వారాలపాటు ఇండియాలో ఉండాలని అమెరికా నుంచి వచ్చింది. అది US తయారీ తెలుసా.)

**Dhanush:** So it all boils down to this. Whatever is American goes; Is that what you mean?
(అంటే నీ మాటల సారాంశం: ఏదైనా అమెరికన్ అంటే అది చెల్లుతుంద నేగా? )

**Puneeth:** That's what I feel. Nothing can be wrong with any thing American.
(నా అభిప్రాయం అదే. అమెరికన్ వస్తువు ఏదైనా మంచిదే.)

**Dhanush:** Perhaps it's paid to say so to your aunt. Otherwise she wouldn't have given you anything. Is that right.
(మీ అత్తయ్యతో అలా అనటం, నీకు మంచిదై ఉండొచ్చు లేకపోతే ఆవిడ నీకు ఏమీ ఇచ్చేది కాదు. అంతేనా? )

**Puneeth:** Don't be silly.
(పిచ్చి పిచ్చిగా మాట్లాడకు.)

**Dhanush:** What else did she get you?
(ఆమె నీకు ఇంకా ఏం తెచ్చింది? )

**Puneeth:** What's your Interest? You want to pull my legs still?
(నీకెందుకు? ఇంకా నన్నాటపట్టించాలనా? )

**Dhanush:** Come now, Puneeth, be a sport. What more did you have from her?
(ఓ పునీత్, సరదాగా ఉండు, కోప్పడకు. ఆమె నుంచి ఇంకా ఏం వచ్చాయి నీకు? / ఆమె నీకు ఇంకా ఏమిచ్చింది? )

**Puneeth:** What you say of me, goes for you too. Your brother brought you a pair of jeans from the States last year. I didn't notice anything special about it. Such or even better jeans we can get here at lower prices.
(నా గురించి నువ్వనేది నీకూ వర్తిస్తుంది. పోయిన సంవత్సరం మీ అన్న నీకు జీన్స్ తెచ్చాడు కదా? దాంట్లో ఏం ప్రత్యేకత కనిపించలేదు నాకు. అలాంటివి, అంతకంటే మంచి జీన్స్ ఇక్కడ తక్కువ ధరలకు దొరుకుతాయి.)

**Dhanush:** OK. You must be happy that you've paid me back in the same coin. Let's stop here and think of having real good walk for a few kilometres.
(సర్లే దెబ్బకు దెబ్బ కొట్టానని సంతోషపడుతున్నావనుకుంటా. ఇక్కడ ఆపేద్దాం, కొన్ని కిలోమీటర్ల దూరం బాగా నడుద్దాం. ఏమంటావు? )

**Puneeth:** I don't feel upto it now. Let's have some coffee first.
(అంత ఓపిక నాకు లేదిప్పుడు. కాస్త కాఫీ తాగుదాం.)

✪ ✪ ✪ ✪

**Look at the following sentences from the conversation above:**

*1) How did you come by that shirt?*
*2) cut the crap*
*3) ... the sidekicks of the villain wear in the movies.*
*4) So it all boils down to this*
*5) Perhaps it's paid (It has paid) to say so to your aunt.*
*6) What you say to me, goes for you to*
*7) I don't feel up to it now.*

**1) Come by =** పొందడం/ ఏదైనా మనకు దొరకడం (ముఖ్యంగా, అంత మామూలుగా కాని విషయం)

a) You are a commerce graduate. How did you come by this computer job?
= నువ్వు కామర్స్ గ్రాడ్యుయేట్‌వి కదా? నీకీ కంప్యూటర్ జాబ్ ఎలా వచ్చింది? ఎలా సంపాదించగలిగావు?

b) Wherever did you come by those sun glasses? They look awful on your face =
ఆ కూలింగ్ గ్లాసెస్ నీకెక్కడ దొరికాయి బాబూ? నీ మొహానికి అవి ఘోరంగా ఉన్నాయి.


M.SURESAN

c) Where did the management came by such a lecturer? =
అలాంటి లెక్చరర్ మేనేజ్‌మెంట్‌కి ఎక్కడ దొరికాడో?

**2) cut the crap =** చెత్తవాగుడు ఆపు/ అసలు విషయం చెప్పు - ఇది ఇంతకుముందు lessons లో వివరించాం, చూడండి.

**3) sidekicks =** అనుచరులు. మన సినిమాల్లో విలన్ అనుచరులు. Yes, boss అంటూ విలన్ చెప్పే దుర్మార్గపు పనులు చేసే అతడి అనుచరులు.

a) No Telugu movie goes without the villain having a number of sidekicks =
అనుచరులు లేని విలన్ ఉండటం, తెలుగు సినిమాలో చూడం.

b) Most politicians have their sidekicks to carry out nasty jobs =
దుర్మార్గపు పనులు చేసేందుకు రాజకీయ నాయకులకు అనుచరులు ఉంటారు.

**4) It all boils down to this =** సారాంశం అని.
ఇది చాలా మంచి, useful expression. మీ conversation లో తరచూ వాడండి.

a) What the doctor has said boils down to over eating not being good for health =
డాక్టర్ చెప్పిన మాటల సారాంశం/ అర్థం అంతా, అతిగా తినడం ఆరోగ్యానికి మంచిది కాదని.

b) Our argument boils down to whether or not to buy the car =
కారు కొనడమా, వద్దా అనేది మన వాదన సారాంశం.

**5) It's paid = It has paid**
(it pays అనే expression కు tense మార్పు)
it pays = లాభదాయకం/ మంచిది- ఇది చాలా common, spoken English లో practice చేయండి.

a) It pays to increase our vocabulary =
మన పద సంపదను పెంచుకోవడం లాభదాయకం/ ఎప్పటికైనా మంచిది.

b) It paid him to have supported the CM =
సీఎంను సమర్థించడం అతడికి లాభమే అయ్యింది/ అతడికి మంచిదే అయ్యింది.

c) It pays to tell the truth =
నిజం చెప్పడం (ఎప్పటికీ) మంచిది.

d) Crime doesn't pay- నేరం వల్ల ఏం లాభం లేదు. / నేరం ఎన్నటికీ మంచిదికాదు.
- ఇది చాలా popular saying (ఎక్కువగా వినిపించే సూక్తి).

**6) .... goes for you too.**
go for = వర్తించటం.

a) What goes for the ordinary citizen in India does not go for people's representatives and ministers. They are above law =
భారత్‌లో సాధారణ పౌరుడికి వర్తించేవి, ప్రజాప్రతినిధులకూ, మంత్రులకూ వర్తించవు. వాళ్లు చట్టానికి అతీతులు.

b) What goes for the male child, should go for the female child too, but not in our society =
మగబిడ్డకు వర్తించేది, ఆడ శిశువుకు కూడా వర్తించాలి, కానీ మన సమాజంలో అలాకాదు.

**7) I don't feel up to it now:** feel up to = (ఏదైనా చేసేందుకు) ఓపిక/ శక్తి ఉండటం. ఎక్కువగా ఓపిక లేదు అనే అర్థంతో not తో వాడతాం.

a) Having had no sleep the night before, I didn't feel up to my usual morning walk =
ఆ రాత్రంతా నిద్ర లేకపోవడం వల్ల, మార్నింగ్ వాక్‌కు ఓపిక లేకపోయింది.

b) Because of his age, he doesn't feel up to any work =
వయసు పెరగడం వల్ల, ఏ పనీ చేసే ఓపిక అతడికి లేదు/ ఉండటం లేదు.

మీ సంభాషణలో పై expressions ను బాగా practice చేసి వీలైన చోటల్లా వాడండి.

---



**ప్రశ్న:**

1. *i) What silence can achieve speech can never; ii) speculation iii) broad band - వీటిని తెలుగులో ఏమనాలి?*
2. *i) ఈనాటి మా విద్యార్థులు రేపటి భారతీయ ఉన్నతాధికారులు.*
   *ii) లోక కల్యాణం - వీటిని ఇంగ్లిష్‌లో ఏమనాలి?*
3. *i) You ought to have been more careful. ఇక్కడ verb - ought to + 'be' form. కానీ ought to + 1st RDW రావాలి కదా?*
   *ii) The project has to be completed in a week. Verb- has to + be + pp. has to + 1st RDW రావాలి కదా?*
   *iii) To be ని ఎలా ఉపయోగించాలి? వివరంగా తెలపండి.*

**– టి.సూర్యనారాయణ, రావులపాలెం**

**జవాబు:** 1. i) మాటలు/ ఉపన్యాసాల వల్ల సాధించలేనిది, మౌనం (నిశ్శబ్దం)తో సాధించగలం.

ii) Speculation = పరిస్థితులెలా మారతాయి, అసలు మారతాయా లేదా అని ఊహించుకుని పథకాలు వేసుకోవడం. ఇళ్ల స్థలాలు, shares లాంటివి కొని, అమ్మేటప్పుడు, ధరలు పెరుగుతాయా, పడిపోతాయా అనే ఊహతో లెక్కలు వేసుకోవడం - speculation. ఎవరు ఏ పని చేయబోతారు, మన ఎత్తుకు, అవతలి వాళ్ల పైఎత్తు ఎలా ఉంటుంది. ఇలాంటి ఆలోచన speculation.

Who will win the match is a matter of speculation = పోటీలో ఎవరు గెలుస్తారనేది ఊహించుకోవాల్సిందే. (ఇతమిత్థంగా చెప్పలేం.)

iii) Broad band: Internet, phones లాంటి వాటికి సంకేతాలు పంపే శబ్దపు అలల లాంటి శ్రేణి - communications కు సంబంధించిన technical word.

2. i) Our students of today are the high ranking officials/ administrators of tomorrow.

ii) లోకకళ్యాణం= The good of the world.

3) i) ought to have been more careful- ఇంకొంచెం ఎక్కువ జాగ్రత్తగా ఉండాల్సింది (గతంలోని విషయం).

You ought to respect elders= ఇప్పుడు పెద్దవాళ్లని నువ్వు గౌరవించాలి. (నీ ధర్మం) (ought to + 1st RDW)

ii) The project has to be completed in a week- has to be completed passive voice- దీని అర్థం - వారానికంతా project పూర్తిచేయబడాలి. Passive voice గా ఇది correct.

ఇదే active voice లో అయితే, మీరు అన్నట్లు has to + 1st RDW వస్తుంది- అయితే subject he/ she గా ఉండాలి.

He/ she has to complete (has to + 1st RDW) the work in a week.

iii) To be= ఉండటం. I dont like to be here = ఇక్కడ ఉండటం నాకు ఇష్టంలేదు.

To be good/ truthful is difficult = మంచిగా/ నిజాయతీగా ఉండటం కష్టం.

**ప్రశ్న:** *I came here to do the work.*
*I came here for doing the work.- Please quote some examples using 'To' and 'for' with meanings.*

**- ఎ.రామాంజనేయులు, కర్నూలు**

**జవాబు:** I came here to do the work = I came here for doing the work = ఆ పని చేసేందుకు నేనిక్కడికి వచ్చాను.

a) He sold his house to clear his debts = He sold his house for clearing his debts = అప్పులు తీర్చేందుకు అతడు ఇల్లు అమ్మేశాడు.

b) He uses his knowledge to help others/ for helping others = ఇతరులకు సహాయ పడేందుకు అతడు తన విజ్ఞానాన్ని ఉపయోగిస్తాడు. మరికొన్ని ఉదాహరణలకు Lesson No – 375 చూడండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

**Rohit:** It's you, Ranjan? How come you are here at this time?
(రంజన్, నువ్వా? ఇక్కడున్నావేంటి, ఈ వేళప్పుడు?)

**Ranjan:** Where else do you expect me to be? It's now 6 and I am on my way to the library.
(ఇంకెక్కడ ఉంటానని అనుకుంటున్నావు? ఇప్పుడు టైమ్, ఆరు. నేను లైబ్రరీకి వెళుతున్నాను.)

**Rohit:** But you usually practise tennis at this time, don't you? You practise in flood lights too.
(కానీ ఈ సమయంలో నువ్వు టెన్నిస్ ప్రాక్టీస్ చేస్తుంటావు కదా? ఫ్లడ్‌లైట్స్‌లో కూడా నువ్వు ఆడుతుంటావు కదా?)

**Ranjan:** I've given up. All my efforts to be a good tennis player have come nothing. I've decided I can never become a good tennis player. I didn't want to be a mediocre.
(నేను మానేశాను. మంచి టెన్నిస్ క్రీడాకారుడు అవ్వాలన్న ప్రయత్నాలేం ఫలించలేదు. గొప్ప టెన్నిస్ ఆటగాడిని కాలేనని నిర్ణయించుకున్నాను. అంత మంచి ఆటగాడు కాదు అనిపించుకోవడం నాకు ఇష్టం లేదు.

mediocre=మీడియోఅకర్ - యో నొక్కి పలుకుతాం - దేనిలో అయినా అంతగా రాణించని వాళ్లు.

The movie is just mediocre. Nothing much to talk of = సినిమా అంత బాగా ఏంలేదు. అంత చెప్పుకోవాల్సిందేం లేదు.

**Rohit:** You should have kept on with it. Don't you think 8 to 9 months is too short a period for you to decide?
(నువ్వు దాన్ని కొనసాగించాల్సింది. నువ్వు నిర్ణయించుకోవడానికి 8, 9 నెలలు చాలవని అనుకోవడం లేదా?)

**Ranjan:** It is too long, rather. Just 3 or 4 months is enough to help you decide. Moreover my studies were being disturbed.
(అది చాలా ఎక్కువ. మూడు నాలుగు నెలలు చాలు, నువ్వు నిర్ణయించుకోనేందుకు. అంతే కాకుండా నా చదువు పాడైపోతుంది.)

**Rohit:** So finally you came round to your dad's view that studies are more reliable than sports, when it comes to career.
(కెరీర్ విషయానికి వస్తే ఆటల కంటే చదువే ఎక్కువ ఆధారపడదగిందనే మీ నాన్న అభిప్రాయానికే వచ్చావన్నమాట.)

**Ranjan:** Yea. To some extent. Come to think of it, I should have started on tennis at a still younger age.
(అవును. కొంతవరకు. ఆ విషయానికి వస్తే నేను టెన్నిస్ ఇంకాస్త చిన్నవయసులోనే ప్రారంభించి ఉండాల్సింది.)

**Rohit:** What happened to your bike? You are on foot.
(నీ బైక్ ఏమైంది? నడుస్తూ కనిపిస్తున్నావేంటి?)

**Ranjan:** You know it's an old bike that my dad give me. Some of the parts have come off and the mechanic has told me that it's no use. Instead of my riding it, it rides me when it breaks down, and that is too frequent.
(అది పాత బైక్ అని తెలుసు కదా, అది మా నాన్న నాకిచ్చింది. దానిలో కొన్ని భాగాలు పాడైపోయాయి, మెకానిక్ కూడా అది ఇంక ఉపయోగపడదని చెప్పాడు. అది నన్ను మోసే బదులు, నేను దాన్ని మోయాల్సి వస్తోంది, అది ఆగిపోయినప్పుడల్లా - అందులో అది ఆగిపోవడం కూడా ఎక్కువే.)

**Rohit:** Walking is good for health, no doubt. But why don't you ask your dad for a new bike?
(నడక ఆరోగ్యానికి మంచిదే అనుకో. అయినా మీ నాన్నను కొత్త బైక్ అడగలేదా?)

**Ranjan:** He will come down heavily on m; if I do that. I know better than to do that.
(అలా చేస్తే మా నాన్న చాలా కోప్పడతారు నా మీద. అదంత మంచి పనికాదని నాకు తెలుసు.)

◆ ◆ ◆ ◆

***Look at the following expressions from the conversation above:***

*1) How come you are here at this time?*
*2) All my efforts to be a good player have come to nothing.*
*3) You should have kept on with it*
*4) Finally you came round to your dad's view.*
*5) come to think of it, ....*
*6) some parts have come off*
*7) He will come down heavily on me.*




# come to think of it

**1) How come...?** ఇది Spoken English లో చాలా తరచుగా వాడే expression. అర్థం = ఏంటి ఇలా అయ్యింది? అని ఓ సంఘటన వివరం అడగటం.

a) Geeta: I've cancelled my Tirupathi trip.
(నేను నా తిరుపతి యాత్ర విరమించుకున్నా.)
Sitha: How come?
(ఏంటి? ఎందుకని?)

b) How come you no longer are friends with Jajadish? =
నువ్వు జగదీష్‌తో స్నేహంగా లేక పోవడమేంటి నువ్వు?

ఈ How come తరచుగా వాడండి మీ conversation లో.


M.SURESAN

**2) come to nothing**: విఫలమవటం

a) The government's attempts to gag the press have come to nothing =
పత్రికల నోళ్లు నొక్కేయాలన్న ప్రభుత్వ ప్రయత్నాలు విఫలమయ్యాయి.

b) The government's attempts to keep the land deal under wraps have come to nothing =
ఆ భూమి వ్యవహారం గోప్యంగా ఉంచాలని ప్రభుత్వం చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి.

Keep under wraps - మూసి ఉంచడం/ రహస్యంగా ఉంచడం

**3) Kept on with it/ Keep on with some thing** - ఒక పనిని కొనసాగించడం = continue.

a) In spite of severe opposition, the government keeps on with the acquirement of land for SEZs=
తీవ్ర వ్యతిరేకత ఉన్నప్పటికీ ప్రభుత్వం SEZs (ప్రత్యేక ఆర్థిక మండళ్ల) కోసం స్థలం సేకరిస్తూనే ఉంది.

acquire = పొందడం/ సేకరించడం (అక్వయ)

b) He kept on with his teaching though he was old =
వయసైనప్పటికీ, ఆయన బోధనను కొనసాగించాడు.

**4) To come round** = దారికి తేవడం (అంతకుముందు వ్యతిరేకించినదాన్ని ఒప్పుకోవడం)

a) I am sure that because of his recent losses, he will come round to our view =
అతనికి ఈ మధ్య కలిగిన నష్టాల వల్ల మన దారికే మళ్లీ వస్తాడనుకుంటా.

b) Don't worry. He will come round. He will pay what we've demanded =
ఏం worry అవకు. వాడు తప్పక దారికి వస్తాడు. మనం అడిగింది వాడు చెల్లిస్తాడు.

**5) Come to think of it.**
'ఆ, గుర్తొచ్చింది'/ 'అసలు సంగతి' అనే అర్థంతో వాడతాం ఈ మాట.

a) Come to think of it, I haven't seen him in years.
ఆ గుర్తొచ్చింది. అతడా - అతడిని చూసి చాలా సంవత్సరాలయింది.

b) I met him yesterday. We spend an hour talking to each other. Come to think of it. He wanted to see you =
నిన్న అతడిని కలుసుకున్నా. గంటసేపు మాట్లాడుతూ గడిపాం. అసలు సంగతి- అతడు నిన్ను కలవాలనుకుంటున్నాడు.

**6) some parts have come off**: come off - (ఏ భాగానికైనా భాగం) విడిపోవడం/ ఊడిపోవడం.

a) The button has come off the shirt =
షర్ట్ బటన్ ఊడిపోయింది.

b) The system has come off =
ఆ యంత్ర భాగాలు విడిపోయాయి. వాటంతట అవే.

**7) Come down heavily on (some body)** = తీవ్రంగా విమర్శించడం

a) The opposition has come down heavily on the government's policy =
ప్రతిపక్షాలు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించాయి.

b) The officer came down heavily on the clerk for delaying the file =
ఫైల్‌ను ఆలస్యం చేసినందుకు, ఆఫీసర్ గుమాస్తాను తీవ్రంగా కోప్పడ్డాడు.

ఇవన్నీ spoken English లో సర్వసాధారణం. సహజం. Practise చేద్దాం.

---

**ప్రశ్న:** *1) I wish it were possible.*
*2) I wish you were there.*
*3) I wish I didn't have to work.*
తెలుగులో అర్థం వివరించగలరు.
***– సీహెచ్.నాగేశ్వరరావు, రంగారెడ్డి జిల్లా.***

**జవాబు:**
I wish it <u>were</u> possible= అది సాధ్య<u>మైతే</u> ఎంత బాగుండేది! (<u>ఇప్పుడు</u> అది సాధ్యంకాదు)
I wish you were there= <u>నువ్విప్పుడు</u> అక్కడ ఉంటే బాగుండేది (<u>నువ్విప్పుడు</u> అక్కడ లేవు)
I wish I did'nt have to work= నేను <u>ఇప్పుడు</u> పని చేయాల్సిన అవసరం లేకుండా ఉంటే ఎంత బాగుండేది. (నేను <u>ఇప్పుడు</u> పనిచేయాల్సి వస్తోంది. అది నాకిష్టంలేదు)

**ప్రశ్న:** రెండువేల నుంచి మూడువేల పదాలు తెలుసుకుంటే ఇంగ్లిష్ తేలిగ్గా మాట్లాడవచ్చని ఇటీవల ఒక మేగ జైన్‌లో చదివాను. అది నిజమేనా? పదాలు తెలుసుకునేందుకు ఏదైనా ఒక పుస్తకాన్ని సూచించండి.
***– వి.జాఫర్‌ఖాన్, అనంతపూర్***

**జవాబు:**
మీరు Oxford Advanced Learner's Dictionary of Current English లో చివర Defining words list చూడండి. ఆ words కు ఆ dictionary లోనే meaning, use చూసి నేర్చుకోండి.

**ప్రశ్న:**
*i) Give me the pronounciation of the following short forms: I'm, we're, you're, they're, he's, she's, it's, I've, we've, you've, they've, he's (he has), she's, it's, I'd (I would/ I had), we'd, you'd, they'd, he'd, she'd, it'd.*
*ii) Should we pronounce the word 'THE' as 'dha' or 'dhee'? Please explain.*
*iii) What is the meaning of the following sentences and in what situations, we use that type of sentences?*
*'You are fired'. 'I am fired'.*
***– సతీష్‌బాబు, హైదరాబాద్***

**జవాబు:** i) అయమ్, వుయ(ర్), యు/యూఅ(ర్), దెయ్అ(ర్), హిజ్ (size లో జ్‌లా), షిజ్, ఇట్స్, అయివ్, వుయివ్, వియివ్, యువ్, దెయివ్, He's= he is/ he has (సందర్భాన్ని బట్టి), she's = she is/ she has (సందర్భాన్ని బట్టి), it's = it is/ it has (సందర్భాన్ని బట్టి), వు/వియిడ్, you'd (యుడ్), దెయిడ్, హిడ్, షిడ్, ఇటిడ్

ii) Pronounce the as దీ i (ది) before words beginning with vowel sounds - any of the telugu sounds అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ.
pronounce 'the' as దె (ద) before words beginning with other sounds.
eg: the egg= ది ఎగ్; the book = ద బుక్

iii) You are fired = You are <u>dismissed</u> from the job. (నిన్ను ఉద్యోగం నుంచి తొలగించారు)
I'm fired = నన్ను dismiss చేశారు (తొలగించారు).

**ప్రశ్న:**
*Be good, be quiet* అర్థం ఏమిటి? ఎప్పుడు ఉపయోగిస్తారో వివరించగలరు.
***– కిరణ్‌కుమార్, వెరుకుపల్లి***

**జవాబు:**
Be = ఉండు/ ఉండండి.
(You) be here = మీరిక్కడ ఉండండి/ నువ్విక్కడ ఉండు.
Be good = You be good = మంచిగా/ మంచివాడివి/ మంచిదానివిగా ఉండు.
Be quiet = you be quiet = నిశ్శబ్దంగా/ నిదానంగా ఉండు.
To be = ఉండటం (Infinitive).
<u>To be</u> here is not good for us =
ఇక్కడ <u>ఉండటం</u> మనకు మంచిదికాదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 384

# It doesn't make sense

**Bhupesh:** Whatever is keeping you busy, Mukhesh? You've been irregular to classes.
(నిన్ను తీరికలేకుండా చేసేదేమిటి? Class లకు సక్రమంగా రావటంలేదు నువ్వు)

**Mukhesh:** I told you. I've signed up for the Personality Development Course by Dr. Paripurna. It is for 2 weeks. That is in my way of attending classes.
(చెప్పాను కదా. Dr. పరిపూర్ణ నిర్వహిస్తున్న వ్యక్తిత్వ వికాసం course లో చేరాను. అది రెండు వారాలు. Class లకు రాకపోవడాని కది కారణం/ అది classes కు అంత రాయం కలిగిస్తోంది)

**Bhupesh:** It doesn't make any sense. What is so urgent about the personality development course? Why at the cost of classes and attendance? Personality Development Course can wait, but not your regular classes and the university exams.
(అది అర్థం లేని పని. ఈ వ్యక్తిత్వం వికాసం course కు అంత తొందరేం వచ్చింది పుడు? Classes, attendance కోల్పోయేంత అవసరమా అది? Personality development course ఆగుతుంది, కానీ class లు, university exams ఆగవు కదా? / ఈ course ఎప్పుడ యినా తీసుకో వచ్చు, కాని classes, exams ఆగవు కదా? )

**Mukhesh:** You are right, of course. But then this course will help me to take the exams with more confidence.
(నువ్వు సబబే అనుకో, అయితే పరీక్షలు ఎక్కువ ఆత్మవిశ్వాసంతో రాసేందుకు ఈ course సహాయపడుతుందని అనుకుం టున్నా.)

**Bhupesh:** Set off the benefits of this course against advantages of regular study. Regular study keeps you thorough with the subject. And thoroughness gives you more confidence than any personality development course can.
(ఈ course వల్ల లాభాలకూ, సక్రమంగా చదవటంవల్ల కలిగే మేలుకూ తేడాలు పరిశీ లించు. సక్రమంగా చదవటంవల్ల subject క్షుణ్ణంగా వస్తుంది. Subject మీద పట్టు, ఏ personality development course కన్నా, ఎక్కువ ఆత్మవిశ్వాసాన్ని కలిగిస్తుంది.)

advantage = అడ్వాన్‌టిజ్ - డ్వా నొక్కి పలుకుతాం = మేలు/ లాభం.

thorough = ఒక విషయం క్షుణ్ణంగా/ పూర్తిగా తెలియటం. Thorough with - Thorough తర్వాత ఎప్పుడూ with రావాలి. He is thorough with the subject = అతడికి ఆ subject క్షుణ్ణంగా/ పూర్తిగా తెలుసు

**Mukhesh:** Yes. Now I feel I should have thought better.
(అవును. నాకిప్పుడనిపిస్తోంది ఇంకాస్త మెరుగ్గా ఆలోచించాల్సింది నేను)

**Bhupesh:** Who gave you the idea?
(ఈ ఆలోచన నీకెవరిచ్చారు? )

**Mukhesh:** We were discussing careers in general, and my cousin Rupesh came-up with the suggestion that we take the course.
(ఏదో మామూలుగా వ్యాపకాలను గురించి మాట్లాడుకుంటుంటే నా cousin రూపేష్ మనం ఈ course తీసుకోవాలనే ఆలోచన ఇచ్చాడు.)

**Bhupesh:** And you fell in with the idea thoughtlessly.
(నువ్వేమో అనాలోచితంగా ఒప్పేసు కున్నావు.)

**Mukhesh:** I've paid only half the fee. I'd better stop it and attend classes regularly.
(నేను fee సగమే కట్టాను. ఇప్పుడు ఆపేసి classes కు రావటం మంచిదనుకుంటా)

**Bhupesh:** That sounds good. Giving up the course in the middle is bad, but missing classes and attendance is worse.
(ఇది బాగుంది. Course మధ్యలో ఆపే యటం చెడే. కాని classes and attendance పోగొట్టుకోవటం అంతకన్నా అధ్వానం)

**Mukhesh:** Thank you for the advice.

☺ ☺ ☺ ☺ ☺

***Now look at the following expressions from the dialogue above.***

*1) I've signed up for the personality development course*
*2) It doesn't make sense*
*3) Set off the benefits of the course against the advantage of regular study.*
*4) My cousin Rupesh came up with the suggestion*
*5) (That) sounds good.*
*6) That's in the way of my attending classes.*


M.SURESAN

**1) sign up for** = (courses/ programmes లాంటి వాటిల్లో) చేరటం.

a) I wanted to sign up for the yoga course, but the high fee held me back = ఆ యోగా శిక్షణలో చేరాలనుకున్నా, కానీ అంత high fee (ఎక్కువగా ఉన్న fee) నన్నా పేసింది/ high fee వల్ల నేను చేరలేదు.

hold back = వెనక్కు తగ్గటం/ ఆపటం.

b) Pranav has signed for the course but hasn't attended a single class. He even paid the fees = ప్రణవ్ ఆ course లో చేరాడు. fees కూడా కట్టాడు. కానీ ఇంతవరకు ఒక్క class కు కూడా రాలేదు.

c) Both the brothers have signed up for the army =
ఆ ఇద్దరు అన్నదమ్ములూ, సైన్యంలో చేరారు.
మనకు తెలుసు, sign up for = join. Modern spoken English లో సందర్భాన్నిబట్టి sign up for ఎక్కువ వాడకంలో ఉంది. మన conversation లో వీలయినప్పుడల్లా వాడదాం.

**2) make sense** = (అలా చేయడంలో) అర్థం ఉంది.

a) Ramesh: I want to buy a bike, but my wife wants me to buy a scooter.
(నేను bike కొనాలనుకుంటున్నా, కానీ మా ఆవిడేమో scooter కొనాలంటోంది)

Naresh: Buying a bike makes sense. A bike gives a higher mileage than a scooter. It is more economical.
(Bike కొనటంలో అర్థం ఉంది/ తెలివైన పని. Scooter కంటే bike ఎక్కువ mileage ఇస్తుంది. అది ఆదా.)

Economical = ఆదా/ పొదుపు

b) Ram: I am going on bike to Hyderabad.
(Bike మీద హైదరాబాద్ వెళుతున్నా)

Gopal: All the 265 km from Vijayawada? It doesn't make sense. It's very risky.
(విజయవాడ నుంచి 265 కిలోమీటర్లూనా? అది అర్థం లేని పని. చాలా ప్రమాదకరం)

**3) set off (against)** రెండింటి మధ్య ఉన్న తేడాలను/ వైరుధ్యాన్ని పరిశీలించడం.

a) The dark colour of the inside of the jewel case sets off the brightness of the gold chain =
ఆ నగల భరిణె లోపలి ముదురురంగు ఆ బంగారు గొలుసు ప్రకాశానికి విరుద్ధంగా ఉంది/ ఆ ముదురురంగువల్ల, బంగారు గొలుసు మరింత మెరిసిపోతోంది.

b) The fair complexion of the bride sets off the dark complexion of the groom =
పెళ్లికూతురి ఎరుపు రంగుకు, పెళ్లికొడుకు ముదురు రంగుకు తేడా/ వైరుధ్యం బాగా కనిపిస్తోంది.
complexion = skin colour = చర్మం రంగు

c) Set off the security of a government job against the high pay of a private job =
ప్రభుత్వోద్యోగం భద్రతకూ, ప్రైవేట్ ఉద్యోగం ఎక్కువ జీతానికీ తేడా గమనించు.

**4) come up with** (a suggestion/ an idea, etc) = ఒక ఆలోచన, సూచన చేయటం.

a) Just when I didn't know what I should do, my dad came up with the idea that I set up a mineral water plant =
నేనేం చెయ్యాలో నాకు తోచనప్పుడు, ఓ mineral water తయారీ కేంద్రాన్ని ఏర్పాటు చేసుకో మనే ఆలోచన ఇచ్చాడు మా నాన్న.

b) He came up with the idea that we collect casettes of old songs sell them =
పాత పాటల casettes సేకరించి వాటిని అమ్మాలనే ఆలోచన అతను చేశాడు.

**5) sounds good** = బాగానే ఉంది.

a) His action plan for preparation for the match sounds good = Match కు తయారవ టానికి అతని వ్యూహం బాగానే ఉంది.

b) Their advice sounds good = వాళ్ల సలహా మంచిదిగానే ఉంది.

**6) In the way** = అడ్డంగా/ అంతరాయంగా. దీని గురించి ఇంతకుముందు వివరించాం.



**ప్రశ్న:**

*i) Rather than ను ఏయే సందర్భాల్లో ఎలా ఉపయోగిస్తారో వివరించగలరు.*
*ii) గంజి వార్చడాన్ని ఇంగ్లిష్‌లో ఏమంటారు?*
*iii) Phonetic transcription లో కిందివాటి గురించి వివరించగలరు.*
**ɑ, ɒ, ɔ, z, ʒ, dʒ.**
*iv) English vocabulary కి, Phonetic transcription కి మంచి పుస్తకాలు తెలుపగలరు.*

**- వి.ఈశ్వరరావు, శ్రీకాకుళం.**

**జవాబు:**

**i) Rather than** అంటే, దాని బదులు, (ఇంకోటి చేయడం మెరుగు) అని అర్థం. దీన్ని ముఖ్యంగా సంబంధంలేని రెండు విషయాలలో ఒకటి ఇంకో దానికంటే మెరుగు అని చెప్పేందుకు వాడతాం.

a) Rather than buy the ticket and watch the match on the field, I would watch it on the TV free =
Ticket కొని field లో match చూసేందుకంటే, (ఇంట్లో కూచుని) డబ్బు ఖర్చు లేకుండా TV లో చూస్తాను. (చూసేందుకు బదులు, అనవచ్చు)

b) Rather than teach geography through books, why don't you try the TV? =
భూగోళాన్ని పుస్తకం ద్వారా బోధించే బదులు, TV ద్వారా బోధించే ప్రయత్నం చేశావా?

c) Rather than see such movies, not watching them is better =
అలాంటి సినిమాలు చూసే బదులు, అసలు సినిమాలు చూడకపోవటం మెరుగు.

**ii)** గంజివార్చటానికంటూ ప్రత్యేకమైన English expression లేదు. Decanting the gruel (after allowing the cooked rice to settle) అనవచ్చు. Gruel - గ్రూఅల్ - గ్రూ నొక్కి పలుకుతాం = గంజి. Decanting = వార్చటం/ తేరబోయటం. (Coffee decoction, filter లేకపోతే, coffee పొడి అడుక్కు దిగిపోయిన తర్వాత తేరబోసేట్టు)

**iii) ɑ,** = ఆ- నాలుకను flat గా ఉంచి పెదవులను తెరిచిపెట్టి (కింది దవడను, కిందికి పెట్టి) పలికే శబ్దం- **cart** లో **ɑ** లాగ/ **father** లో **ɑ** లాగ.

**ɒ**, - అ - పెదవులను గుండ్రంగా తిప్పి, నాలుక పక్కలను పైకి తిప్పి పలికే శబ్దం - cot లో లా - **KɒT**.

ɔ - కొత్త system లో ఈ symbol వాడటంలేదు. ఇది (పాత system లో) **ɒ** కి బదులు వాడేవాళ్లు.

ɔ: - ఇది **ɒ** కు దీర్ఘం - ఆ.

**(cot=cɒt; all = ɔ:l** - ఆల్. ఈ 'ఆ' పలికేందుకు కూడా పెదవులు గుండ్రంగా తిప్పండి. నాలుక పక్కలను పైకి తిప్పండి.**)**

**z** - ఇది Zoo లో Z లాగ. Zoo = Zu:

**ʒ** - ఇది mea<u>s</u>ure లో, vi<u>s</u>ion లో, <u>s</u> ను పలికే విధం.

**dʒ** - ఇది, జ - <u>J</u>am లో 'జ' శబ్దం.

**iv)** English vocabulary కి vocabulary books చాలానే ఉన్నాయి. అయితే ఇవి words, వాటి meanings, antonyms ఇస్తాయి. వాటిని కంఠస్థం చేసేందుకే అవకాశం ఉంటుంది, కాని వాటి use తెలీదు. Vocabulary increase చేసుకునేందుకు ఒక్కటే మార్గం - English newspapers, books వీలయినంత ఎక్కువగా చదవటం-
Pronunciation - Oxford: Advanced Learner's Dictionary of current English ఉత్తమం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ



# They almost came to blows

**Dheeraj:** Interesting information has come to light, you know?

(చాలా ఆసక్తికరమైన సమాచారం వెలుగులో కొచ్చింది, నీకు తెలుసా? )

**Neeraj:** What about? (దేని గురించి? )

ఇలాంటి సందర్భాల్లో spoken English లో about what? కంటే what about? అని ఎక్కువగా వింటాం.

**Dheeraj:** That Santosh has come into something.

(సంతోష్‌కేదో ఆస్తి వచ్చిందని.)

**Neeraj:** That comes as a surprize. Doesn't it? (అది ఆశ్చర్యమే కదా? )

**Dheeraj:** You bet it does. (కచ్చితంగానే.)

ఏదైనా బాగా కచ్చితం అనేందుకు You bet అంటాం.

**Neeraj:** His aunt's will came his way a few days ago. It's a big relief for him. He's been down and out for some time now.

(వాళ్ల అత్త వీలునామా కొన్ని రోజుల కిందటే అతడికి దొరికింది. పెద్ద ఊరట అతడికిది. కొంతకాలంగా ఏం (డబ్బు) లేకుండా ఉన్నాడు పాపం)

will = వీలునామా

**Dheeraj:** He must be a happy guy now. The will coming out of nowhere should have come as a big boon to him.

(చాలా సంతోషపడుతుండాలి ఇప్పుడతడు. ఆ వీలునామా ఎక్కడి నుంచో ఊడిపడ్డట్లు రావడం పెద్ద వరమై ఉండాలి.)

boon = వరం × curse = శాపం

**Neeraj:** Unfortunately it's not going to be all that smooth for him. His cousins are in his way. There was a heated exchange between him and them. They almost came to blows.

(దురదృష్టవశాత్తూ అదంత సులభం అనిపించడంలేదు. అతడి cousins అడ్డుతగులుతున్నారు (ఆ వీలునామా విషయంలో). అతడికీ వాళ్లకూ పెద్ద వివాదం జరిగింది. దాదాపు కొట్టుకునేంత వరకూ వచ్చింది.)

heated exchange = వేడి వేడి వాదోపవాదాలు

**Dheeraj:** Why should they dispute his right by the will?

(వీలునామా ద్వారా అతడికొచ్చిన హక్కును వాళ్లెందుకు కాదనాలి? )

**Neeraj:** They are envious naturally. They were shouting at him like hell; they wanted a share in the property which he denied and rightly so.

(వాళ్లు ఈర్ష్యపడటం సహజంకదా! అతడి మీద వాళ్లు అరిచిపారేస్తున్నారు. వాళ్లకూ భాగం కావాలన్నారు. అతడేమో అదేం కుదరదన్నాడు. అది correct కదా!)

**Dheeraj:** He wants to see you about it because your uncle is a lawyer.

(ఆ విషయమై నిన్ను కలుసుకోవాలనుకుంటున్నాడు మీ uncle lawyer కదా!)

**Neeraj:** OK. Let him come. I'll take him to my uncle.

(రానీ. మా uncle దగ్గరకు తీసుకెళతా.)

***Look at the following expressions from the conversation above.***

*1) Interesting information has come to light.*
*2) That Santosh has come into something.*
*3) That comes as a surprize.*
*4) His aunt's will came his way a few days ago.*
*5) He's been down and out for some time now.*
*6) The will coming out of nowhere should have come as a big boon to him.*
*7) They almost came to blows.*

Spoken English లో చాలా సాధారణంగా వినిపించే expressions మరికొన్ని ఇపుడు తెలుసుకుందాం.

**1) Come to light:** ఏదైనా విషయం వెలుగులోకి రావడం/ ఉన్నట్టుండి అందరికీ తెలియడం.

a) Some interesting facts about his past have come to light. One of them is that he had married another woman before he married his present wife =
ఆయన గతంలోని కొన్ని ఆసక్తికర నిజాలు వెలుగులోకి వచ్చాయి. వాటిల్లో ఒకటి ఆయనకింతకు ముందే ఓ భార్య ఉందని.

b) His shady dealings have come to light only recently =
అతడి చెడు లావాదేవీలు ఈ మధ్యనే వెలుగులోకి వచ్చాయి.

c) With his role in the murder coming to light he has gone underground =
ఆ హత్యలో అతడి పాత్ర బయటపడటంతో అతడు అజ్ఞాతంలోకి వెళ్లిపోయాడు.

go underground = అజ్ఞాతంలోకి వెళ్లటం

**2) Come into something** = inherit property = ఆస్తి పొందడం/ ఆస్తి సంక్రమించడం

a) He has come into a large property with the death of his foster father= పెంపుడు తండ్రి మరణంతో అతడు గొప్ప ఆస్తికి వారసుడయ్యాడు/ పెద్ద ఆస్తి అతడికి సంక్రమించింది.

b) He never expected to come into such a large fortune =
అంత ఆస్తికి తను వారసుడనవుతానని అతడెప్పుడూ అనుకోలేదు.

**3) Come as a surprize** = ఆశ్చర్యం కలిగించడం

a) Their marriage has come as a surprize to everyone, as their fathers had differences = వాళ్ల తండ్రులకున్న అభిప్రాయభేదాలవల్ల వాళ్ల పెళ్లి అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

b) **Madhu:** The minister has occupied two hundred acres of Government land.
(ఆ మంత్రి 200 ఎకరాల ప్రభుత్వ భూమిని ఆక్రమించాడు.)
**Sudha:** Does it come as a surprize? Ministers are there for only Govt land.
(అదేమన్నా ఆశ్చర్యమా? మంత్రులుండేది భూ కబ్జాకే గదా? )

**4) Come (somebody's) way** = అవకాశాల్లాంటివి అనుకోకుండా రావడం/ పొందడం/ తగలడం.

a) Make the best of the opportunities that come your way = నీవు పొందే అవకాశాలను సద్వినియోగం చేసుకో.

b) I am ready to take whatever comes my way, praise or blame = పొగడ్తయినా, నిందయినా, దేన్ని పొందటానికైనా నేను సిద్ధమే.



M.SURESAN

**5) be down and out** = చేతిలో పైసా కూడా లేకుండా ఉండటం/ పూర్తిగా నిరుపేదగా ఉండటం.

a) Because of his vices he is down and out, and no one is willing to help him = అతడు వ్యసనాల వల్ల డబ్బంతా పోగొట్టుకున్నాడు. అతడికి సహాయపడేందుకు ఎవరికీ ఇష్టం లేదు.

b) I am down and out. I can't lend = నా దగ్గర పైసాలేదు. నీకు నేనేమీ అప్పివ్వలేను.

c) The Pandavas were down and out when they lost the game of die = జూదంలో ఓడిపోయిన పాండవులు నిరుపేదలయ్యారు.
Dice = పాచికలు. Die = ఒక పాచిక.

d) The Government isn't doing much for the down and outs in the country = దేశంలోని నిరుపేదలకు ప్రభుత్వం అంతగా ఏం చేయడం లేదు.

**6) Come out of nowhere** = ఉన్నట్టుండి కనిపించడం/ ఎక్కడినుంచో ఊడిపడటం

a) Just when we were talking about him, he came out of nowhere = అతడి గురించే మాట్లాడుకుంటున్నాం, ఇంతలోనే ఎక్కడినుంచో ఊడిపడ్డట్లు ప్రత్యక్షమయ్యాడు.

b) Work hard for money. It doesn't come as if from nowhere/ come from nowhere = డబ్బు కావాలంటే కష్టపడాలి. ఎక్కడ్నుంచో ఊడిపడదు కదా?

**7) Come to blows** = దెబ్బలాడుకోవడం.

a) The Congress and the TDP workers come to blows = Congress, TDP కార్యకర్తలు దెబ్బలాడుకున్నారు.

b) The heated exchange between the two groups led to their coming to blows = ఆ ఇరువర్గాల వాగ్వివాదం దెబ్బలాటకు దారితీసింది.

ఇవన్నీ కూడా conversation లో తరచూ వినిపించే expressions. మాట్లాడేటపుడు practise చేయండి.

---



***ప్రశ్న:** 1) He is suffering from "Othello syndrome". ఈ వాక్యంలో Othello syndrome అంటే ఏమిటి?*
*2) మీరు ఏం చేయిస్తున్నారు - దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా అడగాలి?*
*3) a) నేను ఢిల్లీ వెళ్లి వచ్చాను.*
*b) నేను ఢిల్లీ వెళ్లి వస్తున్నాను.*
*c) నేను ఢిల్లీ వెళ్లి వస్తాను. - ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?*
*4) a) The information given is correct.*
*b) The given information is correct.*
*పై రెండు వాక్యాల్లో ఏది సరైంది? అలాగే పై వాక్యాల్లో given (V3) part of speech తెలపండి.*
*– స్వాతి, హైదరాబాద్.*

**జవాబు:** 1) Othello Syndrome అంటే భార్య ప్రవర్తన, శీలాన్ని శంకించటం. భార్యను అనుమానించటం.
2) What are you getting done?
3) a) I have been to Delhi
b) I am returning from Delhi
c) I will go to Delhi and come back/ return
4) (a) and (b) రెండూ correct. ఇవ్వబడిన సమాచారం (మామూలు తెలుగులో (వాళ్లు) ఇచ్చిన సమాచారం) సరైనదే అనే అర్థంతో. అయితే 'Information given' అనేది ఎక్కువ వాడతాం. ఈ two sentences లో 'given' is past participle. ఇది adjective చేసే పనిచేస్తుంది.

***ప్రశ్న:** 1) Period of time Past tense కు చెందినప్పుడు after రావాలి అని ఒక పుస్తకంలో ఉంది. He published the book after a few months. దీని తెలుగు అర్థం, మరిన్ని ఉదాహరణలతో వివరించగలరు.*
*2) Will, shall కు ప్రయోగ భేదం తెలపగలరు.*
*– ఆర్.ఎన్.వెంకటేశ్వర్లు, పాలకొల్లు.*

**జవాబు:** 1) అది సరికాదు. He published the book a few months later. '... a few months after' అన్నప్పుడు, after తర్వాత, ఏదైనా రావాలి- after his child's birth/ marriage, etc.
2) ఇది పాత lessons లో ఉంది, చూడండి.

***ప్రశ్న:** I need to have knowledge of phonetics to improve my pronunciation? Kindly let me have the pronunciation of following words 1) corps 2) corpse.*
*I am an engineering graduate. Which dictionary will serve me better?*
*– మౌనిక, అనంతపురం.*

**జవాబు:**
Certainly. You should know phonetic symbols thoroughly to be able to pronounce correctly. OED (Oxford English Dictionary) offers a pronunciation CD with Oxford Advanced Learner's Dictionary of current English.
1) Corps - ఖో (ర్) - [ k ɔ: (r) ] = దళం.
2) Corpse - ఖోప్స్ - dead body [ k ɔ:ps ] especially of a human being. (అయితే ఇక్కడ ఖో పూర్తిగా ఖో కాకుండా 'ఖో'కి 'ఖా'కి మధ్య శబ్దం).

***ప్రశ్న:***
*The Army foiled an infiltration attempt when they shot dead a militant near the LOC.*
*1. Shot dead both $V_2$'s. How possible?*
*2. 'A' pronounce ə అ & ɔ: ఆ, where and when they take place?*
*Explain 'The' pronounced as ద & ది why? Please give the explanation with examples.*
*– మహ్మద్ ఇమ్రాన్, తాండూరు.*

**జవాబు:**
1) In the expression, shot dead, shot is not $V_3$ (Past participle), but the past simple form (Past Doing Word) of shoot.
2) 'A' the indefinite article is pronounced 'ə' (అ- raise the tongue slightly when you pronounce this) normally, and as **'ei'** (ఎయ్) when you stress it. It is never pronounced as ɔ: (ఆ).
ə book (a before 'book' not stressed)
**ei** book (a before book is stressed)
a) The is pronounced as 'ది' before words beginning with Vowel sounds (not letters)- These sounds are అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ. The (ది) egg, The (ది) ant, the (ది) owl etc.
b) The is pronounced as (ద) before words beginning with consonant sounds (sounds other than, అ, ఆ, ఇ, ఈ, etc...). The (ద) pen, the (ద) book, etc.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# I go mad and forget everything

**Nishith:** You look dull and out of your head. What's the matter?
(చాలా నిరుత్సాహంగా, ఆందోళనలో ఉన్నట్లు కనిపిస్తున్నావు. ఏంటి విషయం? )

**Sampath:** Wouldn't you be if you scored low and your dad were mad about it?
(నీకూ తక్కువ మార్కులొచ్చి మీ నాన్న నీ మీద ఎగిరిపడితే, నువ్వు ఆందోళనగా ఉండవా? )

**Nishith:** Surely I wouldn't be mad enough to be playing and watching cricket with the exams round the corner. I was warning you, but you didn't care.
(పరీక్షలు దగ్గరకు వస్తున్నప్పుడు నేను నీలాగ క్రికెట్ ఆడటం, చూడటంలాంటి పిచ్చి పని చేయను. నేను నీకు చెపుతూనే ఉన్నా. నువ్వు పట్టించుకోలేదు.)

**Sampath:** Stop it. You always look for an opportunity to blame me. Don't think I am a child you can tutor?
(ఇక ఆపు. ఎప్పుడెప్పుడు నన్ను తప్పుపడదామా అని చూస్తుంటావు. నేనేమన్నా చిన్నపిల్లాడినా నీతో చెప్పించుకునేందుకు? )
tutor = బోధించడం- ముఖ్యంగా ఏ పని చేయాలో/ చేయకూడదో చెప్పడం

**Nishith:** Don't go mad at me, Sampath. I was only trying to find out why you were so worried.
(నా మీద కోప్పడకు. ఎందుకంత ఆందోళనతో ఉన్నావో తెలుసుకో వాలనుకున్నాను.)

**Sampath:** What can I do? I can't control my weakness for cricket. When I see Sachin and Dhony playing, I go mad and forget everything.
(ఏం చేయను? క్రికెట్ పట్ల నాకున్న బలహీనతను అదుపులో పెట్టుకోలేకపోతున్నాను. సచిన్‌గానీ, ధోని గానీ ఆడటంచూస్తే నాకేదో ఉత్సాహం వచ్చేసి అన్నీ మరిచిపోతాను.)

**Nishith:** Don't I love cricket too? But I tell myself, 'no cricket at the cost of my studies'.
(నాకు మాత్రం ఇష్టంలేదా క్రికెట్ అంటే? కానీ నాకు నేను చెప్పుకుంటాను, 'క్రికెట్ వల్ల చదువుకు భంగం కలగకూడదని'.)

**Sampath:** I am nothing when compared with Devanand. The other day when India won, he went mad; and had a party with all of us.
(దేవానంద్‌తో పోలిస్తే నాది చాలా తక్కువ. మొన్న భారత్ గెలిచినప్పుడు, చాలా ఆనందోత్సాహాలతో మా అందరితో పార్టీ చేసుకున్నాడు.)

**Nishith:** That's real madness. Sachin and Dhoni get money and fame when they play. We lose our time and future. Watching them getting money and fame that affects our future.
(అది నిజంగా తెలివిమాలిన పని. సచిన్, ధోనీ ఆడితే వాళ్లకు డబ్బూ, ఖ్యాతీ వస్తుంది. వాళ్లది పొందుతుంటే మన సమయం, డబ్బూ పోగొట్టుకుంటాం, మన భవిష్యత్తూ పాడవుతుంది.)

**Sampath:** You watch and play cricket too, don't you?
(నువ్వూ క్రికెట్ ఆడుతుంటావు, చూస్తుంటావు కదా? )

**Nishith:** I do, but only so long as if doesn't come in the way of my studies.
(ఆడతాను, చూస్తాను. ఎంతవరకు? దానివల్ల నా చదువుకు అంతరాయం కలగనంతవరకు.)

**Sampath:** Nishith, surely there's something I've to learn from you.
(నిజంగా నీ దగ్గర నేర్చుకోవాల్సింది చాలా ఉంది.)

mad అంటే పిచ్చి/ మనస్థిమితం లేని, అనే అర్థంతో చాలా మంది (India లో) వాడటం వింటుంటాం. అయితే standard spoken/ written English లో mad కు పిచ్చి అనే అర్థం చాలా పాతబడిపోయింది. Modern English లో mad అంటే పిచ్చి/మనస్థిమితం లేని అనే అర్థం వాడుకలో లేదు. Mad/ madness లాంటి మాటలను, కోపం, మోజు, తెలివిలేని (foolish/ stupid) అతికోత్సాహం లాంటి అర్థాలతోనే ఎక్కువ వాడతారు. పిచ్చి/ మనస్థిమితం లేని/ మానసిక స్థితి సరిగా లేని అనే అర్థాలతో, crazy, insane, mentally unsound, of an unsound mind లాంటి expressions వాడతాం.

a) నీకేమన్నా పిచ్చా = Are you crazy.
b) అతనికి మనస్థిమితం లేదు/ పిచ్చి పట్టింది/ పిచ్చెక్కింది = He is insane/ mentally unsound/ of an unsound mind.

Lunatic = పిచ్చివాళ్లు; Lunacy = పిచ్చి

ఇప్పుడు modern spoken English లో mad వాడకం తెలుసుకుందాం.

**Look at the following expressions from the conversation above.**

1) You look dull and out of your head.
2) I wouldn't be mad enough to be playing and watching cricket....
3) Don't go mad at me.
4) I go mad and forget everything.
5) No cricket at the cost of my studies.
6) He went mad and had a party.
7) Madness...




**1) Out of your (somebody's) head** = crazy = పిచ్చిగా ఉండటం.
a) (Do) you want to buy that useless car? You must be out of your head, really = ఆ పనికిమాలిన కారు కొందామనుకుంటున్నావా? అయితే నీకు నిజంగా పిచ్చిపట్టింది.
b) He must be out his head to hope to be the next CM = తర్వాత సీఎం తానవుతానని ఆశించటం పిచ్చే (తెలివిలేనితనం/ తెలివితక్కువ.)

**2) I wouldn't be mad enough to be playing and watching cricket.**
- ఇక్కడ be mad అంటే అర్థం, పిచ్చి పనులు (గమనించండి: తెలివిలేని పనులు/ ఆలోచన లేని పనులు అనే అర్థంతో - మతిస్థిమితం లేని అనే అర్థంతో కాదు) = క్రికెట్ ఆడటం చూడటం లాంటి తెలివితక్కువ/ మూర్ఖపు పనులు నేను చేయను.
a) You took that cheat as a partner? You are mad = ఆ మోసగాడిని భాగస్వామిగా తీసుకున్నావా? నీకసలు తెలివి లేదు/ అది అవివేకం.
b) People who think that politicians are there to serve people are just mad = రాజకీయ నాయకులు ప్రజాసేవకే అనుకునేవాళ్లు పిచ్చివాళ్లు (అమాయకులు/ తెలివిలేనివాళ్లు/ అవివేకులు అనే అర్థంతో).

**3) Go mad (at somebody)** = (ఒకరి మీద) = విపరీతమైన కోపం రావడం.
a) He went mad at his friend for cheating him = తనను మోసం చేసినందుకు తన స్నేహితుడి మీద విపరీతమైన కోపం వచ్చింది.
b) Her husband, she knows, is sure to go mad if he cames to know what her new dress costs = తన కొత్త dress ఎంతయిందో తన భర్తకు తెలిస్తే, తనమీద తప్పకుండా కోపం వస్తుందని ఆమెకు తెలుసు.

**4) Go mad** కు ఇంకో అర్థం = ఆనందంతో, ఉత్సాహంతో ఊగిపోవడం
a) The whole stadium went mad when Youvraj hit six sixes in a row = యువరాజ్ వరసగా ఆరు సిక్సులు కొట్టడంతో stadium (క్రీడాస్థలి) మొత్తం ఆనందంతో/ ఉత్సాహంతో నిండిపోయింది.
b) People go mad when they see the dancer on the screen = ఆ dancer తెరమీద కనిపించగానే ప్రజలందరూ ఆనందోత్సాహాలతో ఊగిపోతారు (ఈలలు, చప్పట్లతో).
c) I go mad and forget everything = ఆనందంతో/ ఆ ఉత్సాహంలో అన్నీ మర్చిపోతాను.

**6) He went mad and had a party** = ఆ ఆనందంలో party చేసుకున్నాడు.- ఇది కూడా No.5 - go mad లాంటిదే.

**7) Madness =** పిచ్చే - అయితే మతిస్థిమితం లేని అనే అర్థంతో కాదు - మూర్ఖత్వం అనే అర్థంతో (ఎక్కువగా this/ that is (sheer) madness అంటాం - చాలా అవివేకం అనే అర్థంతో)
a) (Are you) selling away the house? That's (sheer) madness = ఇల్లు అమ్మేస్తున్నావా? అది (ఉత్త) మూర్ఖం/ అవివేకం. sheer = ఉత్త
b) She is marrying that good for nothing fellow. That's real madness = ఆ పనికిరాని వెధవను పెళ్లిచేసుకుంటోంది. అది మూర్ఖత్వం/ అవివేకం.

**5) At the cost of =** ఒక దానికి నష్టం కలిగేవిధంగా.
a) No body says you shouldn't watch movies, but not at the cost of your studies = సినిమాలు చూడొద్దని ఎవరూ అనరు, కానీ దానివల్ల చదువుకు నష్టం రాకూడదు.
b) I am ready to help others, but not at the cost of my job = నేను ఇతరులకు సహాయపడేందుకు సిద్ధమే కానీ నా పదవికి నష్టం/ ప్రమాదం కలిగేవరకు మాత్రం కాదు.

---




**ప్రశ్న:** *Give me an example sentence for each one of the verb forms given below under each category namely (I, II, IV and V) and also equivalent sentence in Telugu.*

*I form: ought be, dare be, need be, can have been, need have been, ought have been, dare have been.*

*II form: (be form + ing form) can be + ing, could be + ing, ought be + ing, dare be + ing, need be + ing.*

*IV form: Need + 1st RDW, ought +1st RDW, dare +1st RDW*

*V form: can have + pp, ought have + pp, dare have + pp, need have + pp*

**– ఎం.భోగిప్రసాద్, గుంటూరు**

**జవాబు: I form:** Ought to be = You ought to be polite to elders. (నువ్వు పెద్దల పట్ల మర్యాదగా ఉండాలి- moral obligation)

Dare be: How dare you be even when I've asked you to get out? (నేను వెళ్ళిపొమ్మన్నా ఇక్కడ ఉండటానికి ఎంత ధైర్యం నీకు? )

Need be - Usually with not, or in questions: You need not be here any longer (నువ్విక్కడ ఉండనవసరం లేదు)

Can have been - They can have been there for some time = వాళ్ళక్కడ ఉంటుండొచ్చు- గతంలో ఓ సమయం నుంచి ఇప్పటివరకూ- possibility (సాధ్యమే)

Ought to have been - You ought to have been kind to him = నువ్వు అతడి పట్ల దయతో ఉండాల్సింది, కానీ లేవు, (Past- did not happen)

Need have been - usually in questions, or with not

You need not have been there = నువ్వక్కడ ఉండే అవసరం (గతంలో) లేదు కదా? (కానీ ఉన్నావు)

Dare have been - With so many of my enemies there I dare not have been there and came away = అంత మంది శత్రువులక్కడున్నప్పుడు, అక్కడ ఉండే ధైర్యం చాలలేదు నాకు. వచ్చేశాను.

**II form:** She can be singing this song there now. (possibility- ఇప్పుడామె ఈ పాటను అక్కడ పాడుతూ ఉండొచ్చు)

He could be doing the same thing there = ఇదే పని అక్కడ కూడా చేసి/ చేస్తూ ఉండొచ్చు (Possibility- past/ present- less possible then can be + ing)

She need not be helping him: అతడికి సహాయం చేస్తూ ఉండే అవసరం లేదు.

You ought to be taking care of your old parents at home instead of playing cards here: ఇంట్లో వృద్ధ తల్లిదండ్రులను చూసుకుంటూ ఉండాల్సింది ఇప్పుడు నువ్వు పేకాట ఆడుతున్నావు- Moral obligation.

How dare you be talking so in my presence? = నా సమక్షంలో ఇలా మాట్లాడుతూ ఉండటానికి ఎంత ధైర్యం నీకు?

If I have money, I need not be serving you = నా దగ్గర డబ్బుంటే నీకు సేవ చేస్తుండే అవసరం లేదు.

**IV form:** Need I see him now? = అతడిని నేను కలుసుకోవడం అవసరమా?

You ought to respect elders = పెద్దలను గౌరవించాలి (Moral obligation)

You dare not smoke in my presence = నా ముందర cigarette కాలుస్తావా? / అంత ధైర్యమా?

**V form:** He can have done it - చేయగలిగి ఉండవచ్చు- Possibility

You ought to have been polite = కాస్త మర్యాదగా ఉండాల్సింది నువ్వు (గతంలో), కానీ లేవు.

She dare not have been here if I had been there = నేనక్కడ ఉండి ఉంటే, ఆమెకు అక్కడ ఉండే ధైర్యం లేకపోయేది.

You need not have been so kind to him = అతని పట్ల నువ్వు చూపినంత దయ చూపనక్కర లేదు. (అనవసరంగా దయ చూపించావు/ అంత దయ చూపి ఉండక్కర్లేదు).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 387

**ప్రశ్న:**

*1) Conjunction ఉపయోగిస్తూ రెండు వాక్యాలను passive లో at time incident గురించి రాయొచ్చా?*

*2) The News reporter said, "The S.I. (Sub-Inspector of Police) was gunned down when the Naxals were attacked (encountered)." - వ్యాకరణపరంగా ఈ వాక్యం సరైందేనా? దీన్ని Indirect/ reported speech లో ఎలా రాయాలో తెలుపగలరు.*

*– టి.వి.సతీష్, విజయవాడ*

**జవాబు:**

**1)** రాయవచ్చు. ముఖ్యంగా పనిచేసింది ఎవరు అని తెలియనప్పుడు, ఇలా రాయటమే సౌకర్యం.
eg: a) Instructions had been given and they were followed.
b) The murder had been planned carefully and executed quickly = హత్యను చాలా జాగ్రత్తగా plan చేసి అమలుపరిచారు (తెలుగు - active)
అయితే ఇలా అన్ని సందర్భాల్లో passive voice చాలా అసహజంగా ఉంటుంది.

**2)** Correct, అయితే ఇక్కడ passive అనవసరం. మొత్తం Active voice లో when the police attacked the naxalites they gunned down the inspector అనవచ్చు
The news reporter said/ reported that the SI had been gunned down when the Naxalites had been attacked.



**ప్రశ్న:** *1) 'Bicycle' కి గాలి కొట్టించాలి అంటే ఇంగ్లిష్‌లో ఏమని అడగాలి?*
*2) Right కి correct కి తేడా ఏమిటి?*
*3) Power has failed, మళ్లీ తిరిగి రావడాన్ని ఏమంటారు?*

*– వి.ఇందిరా రాణి, కమలాపురం*

**జవాబు: 1)** The tube has to be filled/ inflated (Passive). Active Voice లో అయితే ఎవరు కొట్టించాలి అనేదాన్నిబట్టి I/ we/ you etc., have to get the tube filled/ inflated. (Inflate= ఇన్‌ఫ్లేయ్‌ట్ - ఫ్లేయ్ నొక్కి పలుకుతాం- అర్థం - గాలితో నింపటం)
**2)** తేడా లేదు.
**3)** Power is back/ is on again. (Power has failed బదులు Power has gone off/ power is off అనటం ఇంకా simpler)

# Countable .. Uncountable

**ప్రశ్న:** *Sir, I have a doubt about "Countables & Uncountables" especially these are the nouns when used in abstract sense. Before such nouns the marks '[C, U]' are indicated at noun entry level in the Oxford Advanced Learner's Dictionary. So, generally it implies that if the marks '[C, U]' appears beside any noun; they can be used both in countable & un-countable form too- though they have abstract sense in the meaning.*

*And you know sir, for the sake of readers understanding example sentences are also given at each noun entry level in the Oxford Advanced Learner's Dictionary. Though, oh well, I'm not able to distinguish the nouns used in the example sentences whether they are countables or uncountables. For example, you can take a glance over the following example sentences that are quoted from Oxford Dictionary. And kindly clarify me in each example sentence the underlined noun whether is countable or uncountable. And if it is in-fact a countable/ uncountable, how it can be found out with just having a glance over them? Here I'm quoting the meanings and example sentences of that nouns used similarly in the Oxford. They are:*

*I Failure: Not doing something (sth) '[C, U]': The act of not doing sth, especially sth you are expected to do.*
*1) The failure of the United Nations to maintain food supplies.*
*2) Failures to comply with the regulations will result in prosecution. Sir, please inform me how recognize the word "Failure" used in sentence whether it is a countable or uncountable. If it is a countable or uncountable, how do you yourself identify it? May be it will look you a simple thing. But it confuses me a lot and so you please don't think that such question has not ever been asked by others!*

*II Capability [C, U]: The ability or a qualities necessary for doing sth.*
*3) Animals in the zoo have lost the capability catching food for themselves.*
*4) Beyond the capabilities of current technology.*
*5) Age affects a range of persons capabilities. Please let me know how to recognize the noun **capability** used in each sentence whether it is countable or uncountable. Just explain in brief as I know fundamentals of these. Could you please look at the following sentence too?*

*III Extension [C, U] ~ (of sth) The act of increasing the area of activity, group of people, etc. that is affected by sth.*
*6) The extension of new technology into developing countries.*
*7) a gradual extension of the powers of Central Government.*
*8) The bank plans various extensions to its credit facilities. Please clarify me of each underlined nouns used above are C/ U. And how to assure myself just having a glance over the nouns whether they are countable or uncountable? Hope you will see the following too kindly with a bit of patience.*

*IV Expectation: [C, U] a belief that sth will happen because it is likely.*
*9) We are confident in our expectation of a full recovery.*
*10) The was a general expectation that he would win.*
*11) I applied for the post more in hope than expectation.*
*12) The expectation is that property prices will rise. Please clarify the noun 'expectation' used in the each sentence whether it is countable or uncountable.*

*V Expertise [U]: Expert knowledge of sth in a particular subject, activity or job.*
*13) We have the expertise to help you run your business. The definite article 'the' might be used before an uncountable noun like this? Would mind letting me know of this?*

*VI Culture [C, U]: The beliefs and attitudes about sth people in a particular group or organizations.*
*14) A culture of failures exists in some schools.*
*15) We are living in a consumer culture.*
*16) The political culture of the United States & Europe are very different. In which sentence from 14 to 16 the noun cultures used as C or U? Would you please kindly clarify me?*

*– ఎస్. మొహినుద్దీన్, కర్నూలు*

M.SURESAN

**జవాబు:**

A very good question, one which a number of people want to know the answer to. The general rule is a countable has a plural form, and a/ an is invariably used before its singular form. If a/ an is not found before a word, or if it is not used in the plural form it is uncountable. Also note that the same word with one meaning may be countable, and with another, uncountable.

The word **failure** can be used both as a countable and uncountable with the meaning, the act of not doing something. This means you won't be wrong whether you use it as a countable or an uncountable. In the sentence, the failure of the United Nations to maintain food supplies ..., **(1)** failure can be either a countable or uncountable. In a sentence like, A failure of our school systems is ..., failure is countable because, failure has 'a' before it and a failure here means one of the failures. (The plural form of the word). You see here failure used both as a countable and an uncountable. In such cases it doesn't matter how you use it.

In your second sentence, failure to comply with the regulations .... **(2)** (you copied it wrongly as failures) the word failure is uncountable because we don't find 'a' before it. We don't say either, failures (plural) to comply with the regulations ...

**II.** Though the dictionary says that **'capability'** is countable as well as uncountable, it is more used as a countable and on very few occasions as an uncountable. Very rarely do we see capability used without 'a' before it, which means it is most often used as a countable.

In your first sentence, Animals in the zoo have lost the capability of catching ..., **(3)** capability may be both countable and uncountable. Whichever way you use it, the sentence is correct. In your sentences **(4)** and **(5)**, capability is clearly countable because, the plural form is used (capabilities).

**III 6)** No problem here again. In this sentence, extension, though shown as [U & C] is uncountable with this meaning, an increase in the area of an activity.

**7)** A gradual extension ... . Note the use of 'a' before extension. So here extension is countable.

**8)** The bank plans various extensions- here, note that the plural of extension is used. So obviously it is countable.

**IV. Expectation:** In the sentence, 'We are confident ...,' **(9)** expectations can either be a countable or an uncountable. Usually in such sentences, if the plural form is used, it is countable.

**10)** This was a general expectation ... . Here, 'a' before (general) expectations shows that it is countable.

**11)** I applied ... more in hope than expectation. Note that there is no article 'a' before expectation, so it is uncountable. In this sentence, 'hope' is uncountable too. Perhaps you know that hope, like expectation is both countable and uncountable. [My hopes are that he will pass- hope, used in plural- so countable. I have given up hope of any help from him. Hope- no 'a' before it, so it is uncountable here.]

**12)** The expectation is - here we can also say, The expectations are that the property ... when you say, the expectation is , ... , expectation is both countable and uncountable. In the sentence, the expectations are ... the word is countable.

**V Expertise:** Why not? 'The' must be used before a countable or an uncountable, when it is qualified, that is, when you get an answer to the question which put to the countable or the uncountable.

eg: **a)** Milk is a strong food.
In this sentence, milk is uncountable. No 'the' before it because you don't have an answer to 'which milk is a strong food?' (That is, milk here is not qualified.) So, no the before it.

**b)** The milk in fridge is a day old.
Milk- uncountable. Which milk is a day old? You get the answer: 'milk in the fridge' (That is, milk here is qualified). So you must use 'the' before it.

Another example:
**a)** Advice is easy to give. (I'm sure you know advice is uncountable.) Which advice is easy to give? No answer to this question. So no the before advice.
**b)** The advice I got from him was good.
Which advice was good? The answer- Advice I got from him. So you have to use the before advice. We use the before uncountables when you get an answer to 'which'.

**VI culture:** This is a very good question again.

1) If the meaning of culture is the way of life, customs and beliefs of a society, a country, culture is uncountable. Indian culture/ British culture, etc.

2) If culture means beliefs or attitudes of a particular group, it is countable. eg: Team India has a culture of yielding under pressure. This means that Team India's attitude (వైఖరి) to pressure (ఒత్తిడి) is yielding (లొంగిపోవడం).

In sentence No **(14)** , A culture of failures ..., note the use of 'A' before culture. When a/ an is used before a word it is countable. So, culture in sentence No 14 is countable.

For the same reason [a consumer culture a before culture] culture in sentence **(15)** also is countable.

sentence No **(16)** : The phrase here is political cultures. (You have wrongly copied it as the political culture)- cultures- This is the plural form of culture. When a word can be used in the plural, it is countable. So, in sentence No 16, cultures is countable.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# You drive me out of my mind

**Pradeep:** Ok then. I am leaving.
(సరే అయితే, నేను వెళ్తున్నా.)

**Jaideep:** Where?
(ఎక్కడికి?)

**Pradeep:** I told you. I want to meet Sukhdev and settle the matter with him.
(చెప్పాను కదా. సుఖ్‌దేవ్‌ను కలుసుకుని ఈ విషయం తాడోపేడో తేల్చుకోవాలని.)

**Jaideep:** Now? Are you nuts? How are you going, any way?
(ఇప్పుడా? పిచ్చేమన్నా పట్టిందా నీకు? అయినా ఎలా వెళ్తున్నావు?)

**Pradeep:** I have my bike.
(నా బైక్ ఉంది కదా?)

**Jaideep:** You must be really out of your mind to risk going at this time of the night, and that too, when it's raining cats and dogs.
(ఇంత రాత్రివేళ, అదీ కుండపోతగా వర్షం కురుస్తుంటే వెళ్లే సాహసం చేస్తున్నావంటే నీ బుర్ర సరిగా పనిచేయట్లేదు.)

**Pradeep:** Don't drive me mad, Jai, with your silly objections. I could have gone this morning had it not been for your foolish suggestion that I go this evening.
(నీ వెర్రి అభ్యంతరాలతో నాకు కోపం తెప్పించకు. ఈ సాయంత్రం వెళ్లమన్న నీ తెలివితక్కువ సూచన లేకపోతే నేను పొద్దున్నే వెళ్లిపోయుండే వాడినే కదా?)

**Jaideep:** Whoever expected it would rain so heavily?
(ఇంత వర్షం వస్తుందని ఎవరనుకున్నారు?)

**Pradeep:** Whatever it is, I'm going. I've my rain coat, so I can drive.
(ఏది ఏమైనా నేను వెళ్తున్నా. నాకు రెయిన్ కోట్ ఉంది. నేను డ్రైవ్ చేయగలను.)

**Jaideep:** My only fear is you are not a safe driver. You drive like mad and I'm afraid for your safety.
(నాకు ఒక్కటే భయం. నువ్వు జాగ్రత్తగా డ్రైవ్ చేయవు. నా భయమంతా నీ క్షేమం గురించే)

afraid of = ఒకరిని/ ఒక విషయం గురించి భయపడటం

afraid for = ఒకరిని గురించి worry కావడం

**Pradeep:** Thank you. But I've to go now. Tomorrow is sunday, and Sukhdev won't be home. He's been driving me nuts with his threats that he will sell away the property to someone else if I don't give him a clear word.
(థ్యాంక్స్ కానీ నేను వెళ్లాలిప్పుడు. రేపు ఆదివారం, సుఖ్‌దేవ్ ఇంట్లో ఉండడు. నేను స్పష్టంగా చెప్పకపోతే ఆ ఆస్తిని ఇంకెవరికైనా అమ్మేస్తాననే బెదిరింపులతో నాకు చిరాకు తెప్పిస్తున్నాడు.)

threat = బెదిరింపు/ ప్రమాదం;

threaten = బెదిరించడం

**Jaideep:** Are you going to be too late by just a day? Call him and tell him that you will settle it tomorrow.
(ఒక్క రోజులో మించిపోతుందా ఏంటి? ఫోన్ చేసి చెప్పు రేపు తేల్చేస్తానని.)

**Pradeep:** You drive me out of my mind, Jai. Let me settle it now. The rain seems to let up. If you want I'll wait till the rain stops. But go I must today. Tomorrow morning I've other work to take care of.
(నిజంగా నాకు పిచ్చెక్కిస్తున్నావు నువ్వు. నన్నిప్పుడే తేల్చుకోనీ. వర్షం ఆగిపోయేలా ఉంది. అంతగా నువ్వు కావాలనుకుంటే వర్షం ఆగేదాకా ఉండి వెళ్తాను. ఈరోజు తప్పక వెళ్లాలి నేను. రేప్పొద్దున వేరే పనులున్నాయి నాకు.

let up = వర్షం, బాధ, కష్టాలు లాంటివి తగ్గడం/ తగ్గుముఖం పట్టడం

Thanks to the tablet, the pain finally let up =
ఆ టాబ్లెట్ వల్ల బాధ/ నొప్పి చివరకు తగ్గింది.

ఇది Spoken English లో తరచూ వినిపించే మాట. మీ conversation లోనూ practice చేయండి.

**Jaideep:** I don't know why you are mad keen on that property. There are others as good.
(ఆ స్థలం/ ఆస్తి అంటే నీకంత మోజేమిటో నాకర్థం కావడంలేదు. అంత మంచి స్థలాలు ఇంకా ఉన్నాయి కదా?)

**Pradeep:** My mind is set on it. You can't change it.
(నా మనస్సు ఆ స్థలం మీదే ఉంది. నువ్వది మార్చలేవు.)

**Jaideep:** OK. Do what you like.
(సరే. నీకిష్టం వచ్చినట్లు చెయ్యి.)

Spoken English లో చాలా తరచుగా వినిపిస్తూ చాలా సహజంగా అనిపించే mad కు సంబంధించిన విషయాలు మరికొన్ని ఇప్పుడు తెలుసుకుందాం. కిందటి lesson లో చూశాం కదా? Present day English లో పిచ్చి/ ఉన్మాదం/ మతితప్పిన/ మతిస్థిమితం లేని అనే అర్థంతో mad ను వాడం అనీ, mad కు ఇప్పుడు వాడే అర్థాల్లో ముఖ్యమైంది, కోపం, అవివేకం, మోజులాంటివి. ఒకరికి పిచ్చి పట్టింది (మతి భ్రమించింది అనే అర్థంతో) mentally ill అని అనవచ్చు. ఒకవేళ మానసిక రుగ్మత, అంటే మతి భ్రమణం అనే అర్థంతో, mad వాడితే, చాలా ఆక్షేపణీయం. Mad కు సంబంధించి మరి కొన్ని మాటలు చూద్దాం.



M.SURESAN

**Look at the following expressions from the conversation above:**

*1) Are you nuts?*

*2) You must be really out of your mind to risk going...*

*3) Don't drive me mad.*

*4) You drive like mad.*

*5) He's been driving me nuts with his threats.*

*6) You drive me out of my mind.*

*7) I don't know why you are mad keen on the property.*

**1) Nuts:** పిచ్చి (అవివేకం/ తెలివిలేనితనం అనే అర్థంతో) /వెర్రి

a) He is nuts to throw up such a good job and start his own industry =
అతడు అంతమంచి ఉద్యోగం మానుకుని సొంత పరిశ్రమ పెట్టుకోవడం పిచ్చిపనే/ తెలివిలేని పని/ అవివేకం.

b) Knowing his character so well, she is nuts to marry him =
అతడి గుణం తెలిసి కూడా అతడిని పెళ్లి చేసుకోవడం ఆమె అవివేకం.

Spoken English లో అవివేకం అనే అర్థంతో nuts చాలా సహజంగా, simple గా ఉంటుంది. మీ సంభాషణలో వాడండి.

c) I was nuts to have trusted you =
నిన్ను నమ్మడం నా 'అవివేకం'.

**2) be out of somebody's mind =** దీనర్థం కూడా వెర్రిపని/ అవివేకం అనే.

a) You are out of your mind to think that projects are for people. They are to fill the pockets of ministers, engineers and contractors =
ప్రాజెక్టులు ప్రజల కోసం అనుకుంటే అది నీ పిచ్చే/ అవివేకం అవుతుంది. అవి మంత్రులు, ఇంజనీర్లు, కాంట్రాక్టర్ల జేబులు నింపడానికే.

b) Are you out of your mind to cross the road in such heavy traffic? =
వాహనాల రాకపోకలతో ఇంత రద్దీగా ఉన్నప్పుడు రోడ్డు దాటాలనుకోవడం నీకేమన్నా పిచ్చా (అంత అవివేకమా?).

**3) Don't drive me mad =** నాకు కోపం తెప్పించకు.

drive somebody mad = ఒకరికి కోపం తెప్పించడం.

a) Don't drive me mad by always talking about your favourite hero.
(ఎప్పుడూ నీ అభిమాన నటుడి గురించి మాట్లాడి నాకు కోపం తెప్పించకు.)

b) The traffic jams in Hyderabad drives any one mad =
హైదరాబాద్‌లో రాకపోకలు స్తంభించడం ఎవరికైనా పిచ్చి పుట్టిస్తుంది/ చిరాకు కలిగిస్తుంది.

**5) Driving somebody nuts = driving somebody mad** = పిచ్చెక్కించడం/ చిరాకు పుట్టించడం

a) The heat of Vijayawada in summer drives any body nuts =
విజయవాడలో వేసవి ఎండ నిజంగా పిచ్చెక్కిస్తుంది/ చిరాకు పుట్టిస్తుంది.

b) He is driving me nuts with his chatter =
అతడి వాగుడుతో నాకు చిరాకు పుట్టిస్తున్నాడు.

**6) Drive somebody out of their mind =** పిచ్చెక్కించడం/ చిరాకు పెట్టడం

**4) Drive like mad :** పిచ్చెక్కినవాడిలా drive చేయడం

like mad = ఏ పనైనా - అదే పనిగా/ పిచ్చిగా చేయడం.

- ఇది కూడా spoken English లో common

a) I'm afraid to go on his car. He drives like mad.
= వాడి కారులో నేను వెళ్ళను. వాడు చాలా అజాగ్రత్తగా/ పిచ్చిగా నడుపుతాడు.

b) He wants to make it to the IAS. He is preparing like mad =
ఐఏఎస్ కావాలనే ఆలోచనతో పిచ్చిగా/ చాలా తీవ్రంగా/ అదే పనిగా తయారవుతున్నాడు.

c) The sight of the elephant that villagers ran like mad =
ఆ ఏనుగు కనిపించగానే, ఆ గ్రామస్థులు (విపరీతమైన భయంతో) అమిత వేగంతో పరిగెత్తారు.

d) Greed makes him work like mad =
దురాశతో పిచ్చిపట్టినట్టు శ్రమపడుతున్నాడు.

**7) be mad keen on somebody/ something =** ఒకరిపట్ల/ ఒకదానిపట్ల విపరీతమైన మోజుతో ఉండటం.

a) I am mad keen on the bike in the advertisement this morning =
ఇవ్వాళ ఉదయం ప్రకటనలో వచ్చిన బైక్ అంటే నాకు వెర్రి మోజుగా ఉంది.

b) The CM is mad keen on the names of Indira Gandhi family =
ఇందిరాగాంధీ కుటుంబ సభ్యుల పేర్లంటే సీఎంకు విపరీతమైన మోజు.



ప్రశ్న: కిందివాక్యాల్లో మొదటిది మీ lesson లో ఇచ్చింది. రెండోది కూడా (బ్రాకెట్లో ఉన్నది) రాయవచ్చా? తప్పయితే సరైన వాక్యం తెలపండి.

*1. My friends have left for Hyd. (My friends have gone to Hyd).*

*2. I don't feel like studying here. (I don't feel like to study here.)*

*3. I haven't the money. (I have no money.)*

*4. I am starting for college. (I am starting to go to college.)*

*5. For spending a few days with me. (For spending with me a few days.)*

*6. You always come late. (You are always come late.)*

*7. If I had money I would lend you. (If I had money I would have lend you.)*

*8. I shall phone to you. (I shall phone you.)*

– జె.బి.సి. ఖమ్మం

**జవాబు: 1.** అనవచ్చు

**2.** అనేందుకు లేదు; feel like తర్వాత noun or '...ing' form వస్తుంది. to + 1st regular doing word (1st RDW) (అంటే infinitive) రాదు.

**3.** అనవచ్చు. అయితే Spoken English లో ఎక్కువగా I haven't the money అనే అంటారు.

**4.** అనవచ్చు అయితే, I am starting for college, simpler కదా?

**5.** అనవచ్చు

**6.** You are always come late సరికాదు కదా? చూడండి. are come (are +1st RDW) form లో verb ఆసలుండదు కదా?

**7.** If I had money, I would have lend you. Would have lend, బదులు would have lent ఉండాలి. అప్పుడయినా సరికాదు.

A) If I had had the money, I would have lent you - ఇది correct. అయితే ఈ sentence కూ,

B) If I had the money, I would lend you కూ అర్థంలో తేడా ఉంది. - A కు అర్థం - నా దగ్గర డబ్బు ఉండి ఉంటే నీకు అప్పు ఇచ్చి ఉండేవాడిని (ఇది గతం - Imaginary Past). B కు అర్థం - నా దగ్గర ఇప్పుడు డబ్బులేదు. అందుకని అప్పిచ్చే ప్రశ్నేలేదు. (ఉండటం అంటూ జరిగితే (ఇప్పుడు) నీకు ఇచ్చేవాడిని - ఇప్పుడు లేదు, నీకు ఇవ్వటమూ జరగదు) - ఇది Improbable Present

**8.** అనవచ్చు

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ



# He is fighting for life

**Prasen:** You look worried. What's the matter?
(నువ్వు చాలా ఆందోళనగా కనిపిస్తున్నావు. ఏమిటి విషయం? )

**Ranjan:** I've bad news.
(చెడువార్త చెప్పాలి నీకు)

**Prasen:** Who does it concern? Yea, I can guess. Isn't it about Santan?
(ఎవరి గురించి? ఆ, నేనూహించుకోగలను. శంతన్ గురించే కదా? )

concern = గురించి

It does not concern me = అది నాకు సంబంధించింది కాదు

**Ranjan:** You are right. You know he had an accident the day before. He is fighting for life in Goodcare Hospital.
(నువ్వు చెప్పింది నిజమే. మొన్న వాడికి accident అయ్యింది తెలుసుకదా? ఇప్పుడు Goodcare Hospital లో ప్రాణం కోసం పోరాడుతున్నాడు)

**Prasen:** Very sorry to hear that. (It's) difficult to imagine him lying sick or injured. So fighting fit he had always been.
(అది వినడం నిజంగా బాధాకరంగా ఉంది. జబ్బుతో, గాయాలతో అలా పడుకుని ఉన్నాడని ఊహించుకోవటమే కష్టంగా ఉంది. ఎప్పుడూ దృఢంగా, ఆరోగ్యంగా ఉండేవాడు.)

**Ranjan:** It's really a sad sight, his mom and dad trying hard to fight back their tears, in vain.
(వాళ్ల అమ్మా, నాన్నా కళ్ల నీళ్లు ఆపుకొనేందుకు చేస్తున్న వ్యర్థప్రయత్నం నిజంగా విచారకర దృశ్యం.)

in vain= ప్రయోజనంలేని/ నిష్ఫలమైన

He tried hard for the post but in vain/ He tried hard in vain for the post = ఆ పదవి కోసం అతడు చేసిన ప్రయత్నాలు వ్యర్థం/ అతడు వ్యర్థ ప్రయత్నం చేశాడు.

**Prasen:** Why? Is his condition that critical?
(ఏమిటి? అతడి పరిస్థితి అంత విషమంగా ఉందా? )

critical=(ఒకరి ఆరోగ్య పరిస్థితి) విషమం/ ఏ క్షణంలో అయినా చనిపోయే స్థితి/ అటో ఇటో చెప్పలేనిది

**Ranjan:** The doctors have a real fight on their hands to save him =
(అతడిని రక్షించడానికి ఆ వైద్యులు చాలా తీవ్రంగా పోరాడాల్సి ఉంటుంది/ చాలా కష్టపడాల్సి ఉంటుంది.)

**Prasen:** Hope they aren't fighting a losing battle.
(వాళ్ల పోరాటం నిష్ఫలం కాదనే ఆశిస్తున్నాను.)

**Ranjan:** So do I. The trouble was Santan always fought shy of wearing a helmet.
(చిక్కేమిటంటే శంతన్ Helmet పెట్టుకొనేందుకెప్పుడూ అయిష్టంగా ఉండేవాడు.)

**Prasen:** Yes. I've noticed it too. He'd wear it on the main road and remove it on the lanes. And I think the accident took place on a lane.
(అవును. నేనూ అది గమనించాను. Main road లో వెళ్లేటప్పుడు పెట్టుకుంటాడు. సందుల్లో తీసేస్తాడు. ఈ ప్రమాదం ఓ సందులో జరిగిందనుకుంటా.)

**Ranjan:** That's true. (అవును)

**Prasen:** I'm going to see him.
(నేనతడిని చూసేందుకు వెళుతున్నా.)

**Ranjan:** Hope you'll have good news for me.
(మంచి వార్త ఏదన్నా తీసుకొస్తావని ఆశిస్తున్నా)

☆ ☆ ☆ ☆ ☆

Fight అంటే పోరాడటం, పోరాటం అని మనకు తెలుసు. అయితే fight కు Spoken English లో, ఒక్కోసారి ఇతర మాటలతో కలిపితే వేరే అర్థాలు కూడా వస్తాయి. వీటిని conversation లో తరచూ వాడుతూ ఉంటారు. ఈ fight తో వచ్చే కొన్ని phrases ను, వాటి వాడకాన్ని ఇప్పుడు తెలుసుకుందాం.

***Look at the following expressions from the conversation above***

1) *He is fighting for life in Good care Hospital.*
2) *So fighting fit he had always been*
3) *... his mom and dad trying hard to fight back their tears.*
4) *The doctors have a real fight on their hands.*
5) *Hope they aren't fighting a losing battle.*
6) *Santan always fought shy of wearing a helmet.*

**1) fighting for life:** Fighting for (his/ her/ somebody's life) = Trying hard to be alive, especially, when some one is seriously injured or very ill =
ప్రమాదంవల్లగానీ, జబ్బువల్లగానీ ఆరోగ్య పరిస్థితి చాలా విషమంగా ఉన్నపుడు ప్రాణాలతో ఉండటానికి చేసే ప్రయత్నం = మామూలు తెలుగులో మృత్యువుతో పోరాడటం.

a) The motorist, after a week long fight for life is slowly recovering = ఆ motorist (ప్రమాదంలో చిక్కుకున్నతను) వారంపాటు మృత్యువుతో పోరాడి మెల్లగా కోలుకుంటున్నాడు.

b) The cancer patient succumbed to cancer after a determined fight for life for over a year. = కృతనిశ్చయంతో ఏడాదిపాటు మృత్యువుతో పోరాడి ఓడిపోయాడు, ఆ cancer రోగి.

succumb- సకం - కం నొక్కి పలుకుతాం = లొంగిపోవడం. He succumbed to jaundice = కామెర్ల వ్యాధికి లొంగిపోయాడు (ఆ వ్యాధితో చనిపోయాడు.)

She succumbed to the injuries = గాయాలకు ఆమె లొంగిపోయింది/ చనిపోయింది.


M.SURESAN

Viswamithra succumbed to Menaka's charms = మేనక అందానికి విశ్వామిత్రుడు లొంగిపోయాడు.

c) He's been fighting for life for over a year now = ఏడాదిగా మృత్యువుతో పోరాడుతున్నాడు/ ఆరోగ్య పరిస్థితి చాలా విషమంగా ఉంది.

**2) fighting fit** = ఎవరన్నా fighting fit అంటే వాళ్లు చక్కటి ఆరోగ్యంతో, దృఢంగా ఉన్నారని.

a) Though 80 years old, he is fighting fit, and is ready to contest the election. = 80 ఏళ్ల వయస్సులో కూడా ఆయన చక్కటి ఆరోగ్యంతో చురుగ్గా ఉన్నాడు. ఎన్నికల్లో పోటీకి సిద్ధంగా ఉన్నాడు.

b) This is a real surprise. He was fighting fit till yesterday and today he is down with a heart attack = ఇది నిజంగా ఆశ్చర్యమే. నిన్నటివరకూ రాయిలా ఉన్నాడు, ఇవ్వాళ ఆయనకు గుండెపోటు.

**3) fight back** = ఏదైనా చేయాలనుకున్న పనిని బలవంతాన ఆపుకోవటం,భావాలను బయటకు తెలియకుండా ఆపుకోవటం.

a) As the auto driver continued to argue, the constable lost his patience with great difficulty. He fought back his urge to beat him (Auto driver అదేపనిగా వాదిస్తుండటంతో constable సహనం కోల్పోయాడు. ఆటో driver ను కొట్టాలనే కోరికను అతను అతి కష్టం మీద ఆపుకున్నాడు.)

urge = బలమైన కోరిక

b) As the policeman demanded a bribe, I fought back/ fought down my hatred for him = Police లంచం అడిగేసరికి నాక్కలిగిన ద్వేషాన్ని బయటపడకుండా ఆపుకున్నా.
(fight back = fight down)

c) She fought back her tears as her lover delayed his return = తన ప్రియుడి రాక ఆలస్యమవడంతో వచ్చిన కన్నీళ్లను ఆమె ఆపుకుంది.

**4) Have a real fight on (somebody's) hands** = తీవ్ర శ్రమపడాల్సి రావటం.

a) Today's students have a real fight on their hands to make it to Engineering or Medicine ఈనాటి విద్యార్థులు Engineering చదవాలన్నా, Medicine చదవాలన్నా చాలా శ్రమించాల్సి వస్తోంది.

b) Pakisthan has a real fight on its hands to make it through to the final match= చివరి match కు వెళ్లాలంటే పాకిస్థాన్ చాలా శ్రమపడాల్సి వస్తుంది.

**5) fighting a losing battle** = ఫలితం రాదని తెలిసి కూడా ప్రయత్నం చేయటం/ ఓడిపోతామని తెలిసి కూడా పోరాడటం.

a) In trying to deny his hand in the landgrab, the minister is fighting a losing battle = ఆ భూకబ్జాలో తన ప్రమేయం లేదని చూపేందుకు మంత్రి చేస్తున్న ప్రయత్నం నిష్ప్రయోజనం.

b) You can't get him to repay the money. You are only fighting a losing battle= వాడి దగ్గరనుంచి డబ్బు రాబట్టలేవు. నీ ప్రయత్నం నిష్ప్రయోజనం

**6) fight shy of** = అయిష్టత చూపటం/ వెనుకాడటం/ తప్పించటం (avoid)

a) Women fought shy of wearing helmets in the beginning= మొదట్లో ఆడవాళ్లు helmet లు ధరించటానికి ఇష్టపడలేదు.

b) I don't know why you fight shy of discussing the problem with him = అతనితో సమస్య చర్చించడానికి నీకెందుకిష్టంలేదో/ ఎందుకు దాటేస్తున్నావో నాకు అర్థమవటంలేదు.

c) Don't fight shy of expressing your opinions openly = బాహాటంగా నీ అభిప్రాయాలు చెప్పేందుకు వెనుకాడకు.



***ప్రశ్న:*** *i) Get అంటే 'పొందడం' అనే అర్థం ఉంది కదా? చాలా సందర్భాల్లో వివిధ రూపాల్లో - get, getting, get in, get on, get lost, get to, get off, get out - ఉపయోగిస్తుంటారు. వీటికి తెలుగు అర్థాలను ఉదాహరణలతో వివరించగలరు.*

*ii) Make ఉపయోగాలు తెలపండి. అలాగే be, to be, being, to be + past participle ($V_3$), to have + past participle, to have been + participle ఉపయోగాన్ని తెలియజేయగలరు.*

*iii) తీవ్రవాదులు మంత్రిని కిడ్నాప్ చేశారని అనుకుంటున్నారు. ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?*

*iv) Happen, take place, going on పదాల భేదం తెలుపగలరు.*

– ఎస్. శ్రీనివాస్, కొప్పునూర్

**జవాబు: i)** Getting అంటే కూడా పొందడం. Getting good marks isn't easy = మంచి మార్కులు పొందటం అంత సులభం కాదు.

Get in = లోపలికి రా. get on = సర్దుకుపోవడం.

I can't get on with this low salary = ఈ తక్కువ జీతంతో నేను సర్దుకుపోలేను.

Get to = సమీపించడం/ దగ్గరకు వెళ్లడం

Get lost = get out (వెళ్లిపో)

Get off = దిగడం (వాహనాల నుంచి)

**ii)** Make ఉపయోగం ఇదివరకటి lessons లో వివరించాం. చూడండి.

**be = to be = being** = ఉండటం.

To be/ being honest is difficult = నిజాయతీగా ఉండటం కష్టం.

**To be + pp** = ఏదైనా చేయబడటం;
e.g.: to be seen = చూడబడటం,

a) To be elected President of India is great = అధ్యక్షుడిగా ఎన్నుకోబడటం గొప్ప. (అధ్యక్షుడిగా ఎన్నికవడం గొప్ప)

b) It is not good to be seen here = ఇక్కడ చూడబడటం మంచిది కాదు. (మనల్ని ఇక్కడ ఎవరైనా చూడటం మంచిది కాదు)

**To have been + PP** = ఇది to be + PP కు past tense - గతంలో ఏదయినా చేయబడటం.

a) The Lawyer seems to <u>have been consulted</u> in the matter= ఈ విషయంలో ఆ lawyer సంప్రదించబడ్డట్టు కనిపిస్తోంది. (ఈ విషయంలో వాళ్లే lawyer ను సంప్రదించినట్టు కనిపిస్తోంది)

b) He seems <u>to have been murdered</u>= అతను హత్య చేయబడినట్లు కనిపిస్తోంది.

**iii)** People believe/ suppose/ think (ఇవన్నీ active); It is believed/ supposed/ thought (ఇవన్నీ passive) that extremists have kidnapped the minister. ఇలా కూడా రాయవచ్చు

People believe the minister <u>to have been kidnapped</u> by the extremists.
(to have been + PP కు మరొక ఉదాహరణ)

**iv) Happen-** సంభవించడం/ సంఘటన జరగడం/ మామూలుగా మానవ ప్రమేయం లేకుండా.

a) The incident <u>happened</u> yesterday - ఆ సంఘటన నిన్న జరిగింది.

b) The elephants damaging the crop happened last month = ఏనుగులు పంటను నాశనం చేయటం జరిగింది పోయిన నెల.

**Take place-** ఇది కూడా జరగటమే. అయితే ఇది మానవ ప్రమేయంతో

a) The marriage <u>took place</u> last month = ఆ పెళ్లి కిందటివారం జరిగింది.

b) The school anniversary takes place usually in March = ఆ school వార్షికోత్సవం మామూలుగా మార్చి నెలలోజరుగుతుంది.

**Going on**= కొనసాగుతున్న/ continuing

a) The meeting is going on = సభ జరుగుతోంది (continuing/ taking place)

b) When the class was going on he stood upto ask a question= క్లాస్ జరుగుతుండగా ఏదో ప్రశ్న అడిగేందుకు నిలబడ్డాడు అతను.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**ప్రశ్న:** *1. Present perfect continuous tense ను passive లోకి ఎలా మార్చాలి?*
*2. Passive verb ను ఏ tense లో ఉపయోగించాలి? subject, object గుర్తించడం ఎలా?*

**– టి.కిరణ్‌కుమార్, గోరంట్ల**

**జవాబు:** 1. Perfect continuous tenses (present, past and future) కు Passive voice లేదు.

2. Active voice లో verb ఏ tense లో ఉంటుందో, Passive లో కూడా అదే tense లో ఉంటుంది/ ఉండాలి.

**e.g.:** Active: He waters the plants everyday.- verb - waters, tense -present simple.

ఈ sentence కు passive: The plants are watered by him everyday. Verb - are watered - are + pp. ఈ Passive లో subject, the plants. (sentence దేన్ని గురించి చెప్పుందో, అది దాని subject) Verb - are watered. (subject తర్వాత sentence కు అత్యంత ముఖ్యమయిన మాట/ మాటలు, verb).




**ప్రశ్న:** *1) మీరు passive forms exercise లో Four were killed and ten injured in the accident yesterday అని ఇచ్చారు. Four were killed and ten were injured in the accident yesterday అని ఉండాలి కదా?*

*2) అదే లెసన్‌లో transformation principles (d) లో shall be/ should be... లవ + 1st RDW active అయితే shall be/ should be... + pp passive అన్నారు. ఇది కరక్టేనా?*

*3) What nonsense are you talking?; What nonsense you are talking . తేడా ఏమిటి?*

*4) Were you, by any chance, in college last evening? in the college అనవచ్చా? కాలేజ్ తెలిసిందే కదా? The ఉపయోగించాలి కదా?*

**– ఎన్. పెంటయ్య, ఘట్‌కేసర్**

**జవాబు: 1)** Four were killed and ten were injured అనడానికి బదులు, were రెండు clauses కూ ఒకటే (common) కాబట్టి, four were killed and ten, injured అనొచ్చు తప్పులేదు, అయితే ten పక్కన comma ఉంటే clear గా ఉంటుంది. మాట్లాడేటప్పుడు, ten పక్కన comma అనలేం కదా, అందుకని, ten అని కాసేపు ఆపి, injured అంటాం. **2)** అంతే కదా? e.g.: You shall do it. (AV. verb: shall + 1st RDW) దీనికి Passive Voice: It shall be done by you -Verb: shall be + done - shall be + pp (done) కదా? అలాగే He should carry it (A.V.verb: should carry - should + 1st RDW). దీనికి Passive: It should be carried by him. Verb: should be carried (should be + carried - pp)- సరైనదే కదా? **3)** What nonsense are you talking? correct. What nonsense you are talking అనేది correct question form కాదుకదా? **4)** ఓ college విద్యార్థులు వాళ్ల college గురించి మాట్లాడేటప్పుడు, in college అనే అనాలి. In the college అనం. College కి సంబంధం లేనివాళ్లు college లో ఉన్నపుడే in the college అంటాం. e.g.: My father was in the college yesterday to meet the principal. (మా father కు college తో సంబంధం లేదుకదా?). అలాగే మీరు ZPHS, Ghatkesar లో Teacher అనుకోండి. అప్పుడు You go to school at 9.30/ You attend school everyday. The school కాదు. ఎందుకంటే మీరు school కు సంబంధించిన వాళ్లు కనుక.

**ప్రశ్న:** *1. Past perfect, continuous, Future perfect గురించి వివరించగలరు.*

*2. నా బుక్ తీసుకొచ్చారా అంటే ఈ రోజు అర్థంలో కిందివాటిలో మొదటిది ఉపయోగించవచ్చా?*

*Have you bought my book.*

*Did you bring (my) book last day - ఈ రెండింటిలో మొదటిది ఎప్పుడు ఉపయోగించాలి? అలాగే పొద్దున జరిగిన దాని గురించి సాయంత్రం మాట్లాడుకునేటప్పుడు దాన్ని present perfect లేదా simple past దేన్ని ఉపయోగించాలి?*

*has he given? (అతడు ఇచ్చాడా?), Has he taken? అతడు తీసుకున్నాడా? - అనొచ్చా?*

**– బి.చందు, సిరిసేడు**

**జవాబు:** 1. Past perfect, continuous, Future perfect tenses ను గురించి చాలా వివరంగా పాత lessons లో చెప్పాం, చూడండి.

2. Have you brought my book? – నువ్వు నా పుస్తకం తెచ్చావా? (ఇది correct)

Did you bring my book yesterday? (last day అనం) - ఇదీ correct.

Have + pp/ has + pp - దీన్ని past action, time not stated (గతంలో జరిగిన పని, ఏ రోజు/ ఎప్పుడు అని time చెప్పని) సందర్భాల్లో వాడతాం. ఆ విధంగా Have you brought my book, correct. Past action, time stated (గతంలో ఎప్పుడు జరిగిందీ తెలిపే పదం, yesterday, last year etc. ) సందర్భమైతే Did you bring my book yesterday? correct.

Has he given the money?
Has he taken your book? } Correct. Because has given, has taken - refer to past actions, time not stated. (ఎప్పుడు జరిగిందీ తెలియని past actions.)




# You are mistaken

**ప్రశ్న:** *I. a) Please inform me the proper word for the following. 'A' is having a job. The emoluments paid are not sufficient to meet both ends. So 'A' is doing another job, to have more salary to meet. - I am wishing some sentence and words, whether they are correct or not?*

*1. A second string to the bow.*

*2. A substitute job to meet the demand.*

*3. Mercenary (Adj). ఈ వాక్యాలకు single word or sentence తెలుపగలరు.*

**– జి.వి. పద్మావతి, ఒంగోలు**

**జవాబు:** I Hope you don't mind noting the following: We don't say: a) A is having a job, b) To meet both ends; but we say: a) A has a job, b) To make both ends meet. (జీవితం గడిపేందుకు చాలినంత సంపాదించటం)

II. a) Doing a second job for additional income = Make (some, a little, etc) money on the side

b) A job a person does in addition to their main = a sideline.

i) A teacher by profession, he makes some money on the side by writing stories. (వృత్తిరీత్యా teacher అతను. కథలు రాసి మరికొంత సంపాదించుకుంటాడు.)

ii) A teacher, writing stories is his sideline (sideline = a job in addition to the main job)

iii) a) A second string to the bow: The correct form of this expression is, a) Have more then string to your bow; b) Have another/ more strings to your bow.

The meaning of these expressions is, "to have more than one plan, idea or skill you can use it you need to." It does not mean an additional job.

b) A substitute job means a job that you do instead of the job that you are doing now, not an additional job.

c) Mercenary means doing anything just for the sake of money. The men who work for a goonda are mercenaries because they do anything just for money.


M.SURESAN

**ప్రశ్న:** *కిందివాక్యాల్లో మొదటిది మీ lesson లో ఇచ్చింది. రెండో వాక్యం కూడా సరైనదేనా? కాకపోతే కరెక్ట్ వాక్యం తెలపండి.*

*1. If you study well. (If you are study well.)*

*2. He went to a movie last night. (He went for a movie last night.)*

*3. Whom do you help? (Whom do you help to?)*

*4. She came here to join a college. (She came here to join in a college.*

*5. To join a software institute. (To join in a software institute.)*

*6. How are you? (How you are?)*

**– జె.బి.సి. ఖమ్మం**

**జవాబు:** 1. If you are study well - ఇది తప్పుకదా? Are study లాంటి verb from లేదు కదా?

Please remember: The verb must be in one of the 6 forms given here: 1) The be form; 2) the be form + the ... ing form; 3) The be form + the past participle; 4) have/ has/ had/ shall have/ will have, etc... + past participle; 5) The Doing Words and 6) shall, should, will, would etc + the 1st RDW.

You see that are (be form) + study (1 st RDW) is not among the 6 forms of the verb. గుర్తుంచుకోండి: be from తర్వాత Doing Words రానేరావు.

2. Went for a movie సరికాదు.

3. అనేందుకు లేదు. Help తర్వాత to preposition రాదు. (I help/ helped him అంటామే కానీ I help/ helped to him అనం)

4. Join in తప్పు. Join a college correct.

5. ఇది కూడా ముందు వాక్యం లాగానే.

6. How you are? ఇది correct question form కాదు గదా? (Question: Verb always before the subject)

**ప్రశ్న:** *1. English లో formal, informal words ఉన్నాయి కదా? అంటే ఏమిటి?*

*2. 'మాట తప్పడం' - ఇంగ్లిష్‌లో ఏమంటారు?*

*3. The pen which has black refill is mine among those.*

*The pen that has black refill is mine among those - వీటిలో ఏది కరెక్ట్? తేడా ఏమిటి?*

*4. The pens that are blue in colour are mine.*

*The pens those are blue in colour are mine. - వీటిలో ఏది కరెక్ట్?*

*5. Depend on, depend upon - తేడా ఏమిటి?*

*6. నువ్వు పొరపాటు చేశావు, నువ్వు పొరపాటు పడ్డావు.*

*ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో You have mistaken, You are mistaken అని రాయవచ్చా?*

*7. Happy Sankranti to everybody.*

*Happy Sankranti everybody. - వీటిలో ఏది కరెక్ట్?*

*8. Enter the house, enter into the house మధ్య తేడా ఏమిటి?*

*9. English vocabulary కి సంబంధించిన మంచి పుస్తకం సూచించండి.*

**– ఆర్.శివ, రైల్వేకోడూరు**

**జవాబు:** 1.Formal అంటే ఓ పద్ధతి ప్రకారం చేసే అని, ముఖ్యంగా మానవ సంబంధాల్లో. పెద్దవాళ్లతో, గొప్ప వాళ్లతో, మనకు అంతగా పరిచయంలేని వాళ్లతో- ఎలా అంటే అలా మాట్లాడం కదా? (స్నేహితులతోనో, అన్నదమ్ములతోనో మాట్లాడినట్లు). చాలా గౌరవంగా, ఓ పద్ధతిగా వారితో మాట్లాడతాం. వాళ్లతో వ్యవహరించే తీరు కూడా ఒక పద్ధతిగా ఉంటుంది. ఇది formal. ఒక officer తోనో, ఓ పెద్ద వ్యక్తితోనో మనం formal గా ఉంటాం. మన friends తో informal గా ఉంటాం. మన తల్లిదండ్రులతో, ముఖ్యంగా తల్లులతో informal గా ఉంటాం.

2. Failing the word - fail your / his/ their word.

3. రెండూ అంత ఆమోదకరమైన sentences కావు. సరైన వాక్యం: Among those pens the one with the black refill is mine OR Among those the pen with the black refill is mine.

మీ sentences లో mine among those అనేది సరైన word order కాదు. ఇలాంటప్పుడు clarity చాలా ముఖ్యం. అందుకని, Among those pens, ముందుంటే బాగుంటుంది.

4. The pens that are blue in colour, correct. (The blue pens are mine/ mine are the blue pens అంటే ఇంకా simple కదా?)

5. రెండూ ఒకటే. అయితే sentence చివర వచ్చినపుడు 'depend upon' better. I depend on him - depend, sentence మధ్యలో వచ్చింది కాబట్టి, on వాడాం (upon వాడినా తప్పులేదు). He is not to be depended upon - ఇక్కడ depend sentence చివర వచ్చింది. కాబట్టి depend upon ఇలా వాడటం better (on వాడినా తప్పు లేదు).

6. నువ్వు పొరపాటు చేశావు = You have made a mistake. నువ్వు పొరపడ్డావు = You are mistaken. You have mistaken - ఈ sentence లో ఏం పొరపాటు చేసిందీ చెప్పటం లేదు, sentence పూర్తవలేదు. You have mistaken him for his brother - అతని తమ్ముడిని /అన్నను అతడిగా పొరబడ్డావు నువ్వు. You have mistaken అని వదిలేస్తే దాన్ని ఎలా పొరబడింది తెలియదు.

7. Both are correct. Happy sankranthi to everybody = ప్రతి వారికీ ఆనంద సంక్రాంతి.

Happy Sankranthi every body = (మీ ఎదురుగా ఉన్నవాళ్లను) every body అని పిలిచి వాళ్లకు శుభసంక్రాంతి తెలపటం.

8. ఒక ప్రదేశంలోకి ప్రవేశించటం - Enter a place. ఒప్పందం కుదుర్చుకోవడం, సంభాషణలోకి దిగడం అనే అర్థంతో, enter into an agreement/ into a conversation, etc.

9. Vocabulary కంటూ ప్రత్యేకంగా ఉండే పుస్తకాలే చదవనక్కరలేదు. వీలయినపుడల్లా English చదవండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ



# I left them to fight it out

**Nipun:** Chandan is fighting the election this time too, but it's going to be tougher for him than last time.
(ఈసారి కూడా చందన్ ఎన్నికల్లో పోటీ చేస్తున్నాడు. కిందటిసారికంటే ఈసారి గెలవడం అతడికి ఎక్కువ కష్టం.)

**Sugun:** Yea. He has to fight more people for leadership than he did last time.
(అవును. నాయకత్వం కోసం కిందటిసారికంటే ఈసారి ఎక్కువమందితో పోటీచేయాల్సి ఉంది.)

**Nipun:** He has the toughest challenge from Nandan. Nandan has the support of a sizable section of the voters.
(అతడికి గట్టిపోటీ నందన్ నుంచే. ఓటర్లలో చెప్పుకోదగ్గ వర్గమే, నందన్‌ను బలపరుస్తున్నారు.)

sizeable/ sizable= ఎక్కువ భాగమే

**Sugun:** I disagree with you there. He is not such a serious opposition to Nandan.
(అది నేనొప్పుకోను. అతడు నందన్‌కు అంత పెద్ద పోటీ ఏం కాదు.)

**Nipun:** What do you know? The other day after making a speech, Chandan had to fight off his crowd of admirers to come out of the auditorium. That's the following he has.
(ఏం తెలుసు నీకు? మొన్నొకరోజు ఉపన్యాసం ఇచ్చిన తర్వాత ఆ సభ నుంచి బయటికొచ్చేందుకు తన అభిమానుల మధ్య నుంచి రావడానికి ఎంతో పోరాడాల్సి వచ్చింది. అంతగా అభిమానించే వాళ్లున్నారతడికి.)

admirers= fans= అభిమానులు.

following= మద్దతు/ support.

The hero has a large fan following= ఆ hero కు పెద్ద సంఖ్యలోనే అభిమాన/ అనుచర గణం ఉంది.

**Sugun:** Do you know that the other candidate Hari has still plenty of fight left in him? You can't count him out.
(ఇంకో అభ్యర్థి హరికి కూడా మంచి పోటీ ఇవ్వగల శక్తి, సంకల్పం ఉన్నాయని తెలుసా నీకు? అతడ్ని తేలికగా తీసిపారేయలేం.)

**Nipun:** Still he may not be the force that Nandan is. Chandan is still the favourite, but the next candidate that has a fighting chance in him is Nandan, certainly not Hari.
(అయినా అతను నందన్ అంత గొప్ప/ గట్టి ప్రత్యర్థి కాలేడు. అందరూ అనుకునేది చందనే గెలుస్తాడని. అయితే అతని తర్వాత ఏదైనా పోరాడి గెలవగల సమర్థత ఉండేది నందన్‌కేగానీ, హరికి కాదు.)

**Sugun:** Let's wait and see. Yesterday our friends Karthik, Ramesh, Pratap and others fought about this issue for a whole hour. I left them to fight it out.
(చూద్దాం. నిన్న మన స్నేహితులు కార్తీక్, రమేష్, ప్రతాప్, ఇతరులూ ఓ గంటసేపు ఇదే వాదించుకున్నారు. వాళ్లనే తేల్చుకోమని నేను వచ్చేశా.)

**Nipun:** It's unfortunate that the candidates are fighting on the basis of caste.
(వాళ్లు కులం ప్రాతిపదికన పోటీచేయటం దురదృష్టకరం)

**Sugun:** Nandan did not do it at first. But when Chandan started it, Nandan wanted to fight fire with fire and started the caste appeal.
(మొదట నందన్ అలా చేయలేదు. కాని Chandan దాన్ని ప్రారంభించటం చూసి ముల్లును ముల్లుతోనే తీయాలని, తాను కూడా కులం ప్రస్తావన తెచ్చాడు.)

**Nipun:** OK. Let's wait and watch. (వేచి చూద్దాం.)

Last lesson లో మనం spoken English లో fight కు సంబంధించిన మాటలు చూశాం కదా. మరికొన్ని మాటలు fight కు సంబంధించినవే, తెలుసుకుందాం. ఈ lesson లో fight తో వచ్చే మాటలు అన్నీ పోరాటానికి సంబంధించినవే కాకపోవటం చూస్తాం.

**Look at the following sentences from the dialogue above.**

*1) Chandan is fighting an election this time too.*
*2) He has to fight more people for leadership than he did last time.*
*3) Chandan had to fight off his crowd of admirers to come out of the auditorium.*
*4) Hari has still plenty of fight left in him.*
*5) The next candidate that has a fighting chance in him is Nandan.*
*6) Our friends fought about this issue for a whole hour.*
*7) I left them to fight it out.*

**1) Fighting an election:** Fight an election అంటే తెలుస్తూనే ఉంది కదా? ఎన్నికల్లో పోటీ చేయటం అని.

a) Only the rich can make it to the Assembly or Parliament in India. Fighting an election costs a lot =
భారత్‌లో సంపన్నులే Assembly లకుగానీ, Parliament కుగానీ ఎన్నికవగలరు. ఎన్నికల్లో పోటీ చేయటం చాలా ఖర్చుతో కూడిన పని.

b) To fight an election is one thing, to win is quite another.
ఎన్నికల్లో పోటీచేయటం ఒక ఎత్తు, గెలవటం ఒక ఎత్తు.


M.SURESAN

**2) To fight people = compete =** ఇతరులతో పోటీ చేయటం.

a) He has to fight 5 other candidates to be through to the assembly =
అసెంబ్లీకి వెళ్లాలంటే అతడు మరో ఐదుగురితో పోటీచేయాల్సి ఉంది.

b) You don't always fight people to win. You do it just for the pleasure of it.
గెలవటానికనే ఇతరులతో పోటీ చేయం. ఆనందం కోసం కూడా చేస్తాం.

**3) Fight (something/ somebody) off =** ఒకరిని/ ఒక విషయాన్ని నిరోధించేందుకు ప్రయత్నించటం, కాస్త దౌర్జన్యంతో కూడా.

a) The stars had to fight off the crowds to get out of the auditorium =
ఆ సభాస్థలి నుంచి బయటపడేందుకు ఆ సినిమా తారలు జనాన్ని తోసేసి రావాల్సి వచ్చింది.

b) The police had to fight off the demonstrators to take the Minister out =
మంత్రిని బయటకు తీసుకువచ్చేందుకు పోలీసులు ప్రదర్శకులను చెదరగొట్టాల్సి వచ్చింది.

demonstrators = ప్రదర్శకులు

Though old, he fought the robbers off =
ముసలివాడైనప్పటికీ, ఆ దోపిడిగాళ్లతో పోరాడి తరిమేశాడు.

**4) Plenty of fight (left) in somebody =** ఇంకా ఓపిక/ శక్తి మిగిలి ఉండటం.

a) My grandmother still has plenty of fight left in her to walk the whole distance. =
ఇంతదూరమూ నడిచేందుకు మా అమ్మమ్మకు/ బామ్మకు ఇంకా ఓపిక/ శక్తి మిగిలి ఉంది.

b) In spite of the early loss of wickets, the Pak team has plenty of fight left in it.=
త్వరగా wickets కోల్పోయినప్పటికీ, Pak జట్టులో ఇంకా పోరాటపటిమ/ కోరిక ఉన్నాయి.

**5) Have a fighting chance =** శ్రమపడి, కృతనిశ్చయంతో విజయం సాధించగలగడం.

a) If you starts working at it, you still have a fighting chance =
నువ్వు కష్టపడితే, నువ్వు సాధించగలిగే అవకాశం ఉంది.

b) Don't worry. Begin now. You still have a fighting chance =
బాధపడకు. ఇప్పుడు ప్రారంభించు. నీకు విజయావకాశాలు ఉన్నాయి.

**6) fight about =** వాదించుకోవడం.

a) They fought about for a whole night but did not arrive at any settlement =
రాత్రంతా వాదించుకొని ఏ తీర్మానానికి రాలేకపోయారు వాళ్లు.

b) The boys in the back benches are fighting about the best actor =
చివరి benches లో కూర్చున్న పిల్లలు, ఉత్తమ నటుడి గురించి వాదించుకుంటున్నారు.

**7) fight it out =** ఏదైనా విషయం తీర్మానం చేసుకోవటం (settle చేసుకోవటం)

a) He just left home leaving his wife and his mother to fight it out =
అతను బయటికెళ్లిపోయాడు, తల్లినీ భార్యనూ పోట్లాడుకోమని.

b) Let's go. Let them fight it out =
మనం వెళ్దాం పదా. వాళ్లనే తేల్చుకోనీ (పోట్లాట, వాదన).

## ప్రశ్న:



1. C.P.Brown Dictionary లో pronunciation కు సంబంధించి కిందివి నాకు అర్థం కాలేదు. వివరంగా తెలియజేయగలరు.
a - ā, á, â, ă, ầ – అ, ఆ, ప
d-ed-et - డద
E- ē ė ě - ఎ,ఏ, ఇ, ఈ
i - ī ǐ - ఇ, ఈ, ఐ
O - Ō, Ó, Ô - ఓ,ఒ
U - Ū Ú, Û Ǔ - ఉ,ఊ, ఆ - వీటిని ఎలా పలకాలో తెలపండి.

2. English paper చదివేటప్పుడు అర్థాలు చూడొద్దని మీరంటారు. చదివిన తర్వాత చూడటానికి గుర్తుండవు కదా? తెలుగు మీడియం వారికి Oxford ఏ సిరీస్ ఎలా ఉపయోగపడుతుంది?

– బి.సత్తిబాబు, కోరుకొండ

**జవాబు:**

మీరు రాసినవి pronunciation (ఉచ్చారణ)కు సంబంధించినవి.

i) *a* = *ā* = (అ)= cot లో o గా పలుకుతాం - అయితే ఇది పలికేటప్పుడు పెదవులు గుండ్రంగా తిప్పి, నాలుక పక్కలు పైకి తిప్పుతాం.
*a* = అ - తెలుగులో మనం మామూలుగా ఉచ్చరించే 'అ'కు, English లో *a* రాదు.
*a* = ఆ - ఇది, cot లోని o లాగా పెదవులు గుండ్రంగా తిప్పి, నాలుక పక్కలు పైకి తిప్పుతాం - *fall* లో లాగా.
'*a*' ను English లో ఏ పదంలో కూడా, 'ఏ' గా పలకం. 'ఎయ్'లాగా పలుకుతాం, *fate* (ఫెయిట్) లో లా.

ii) d ని *bad* లో 'డ'లా పలుకుతాం.
*Looked, booked* లో d (ed), t గా పలుకుతాం. Looked = లుక్ట్.

iii) E (e) ని, bet లాంటి పదాల్లో, 'ఎ' గా పలుకుతాం. 'ఏ' లా ఏ పదంలోనూ రాదు నాకు తెలిసి. *fete* అనే మాటలో ఫెయిట్ (ఎయ్)లా వస్తుంది. *feel* లో 'ఈ'లా వస్తుంది.

iv) *i* - ఇది *fit, kill* లాంటి వాటిల్లో 'ఇ' లా పలుకుతాం. *Magazine* లాంటి మాటలో 'మాగజీన్'- 'ఈ' లా పలుకుతాం.
*sign* లాంటి మాటల్లో 'ఐ' లా పలుకుతాం.

v) O - ఇది British English లో 'ఒవ్' లా పలుకుతాం - go - గొవ్ (వ్ పలికీ పలకనట్లు ఉంటుంది). American English / Indian English లో ఒ అని వస్తుంది - go - గొ/ గో.

vi) U - దీన్ని '*full*' లాంటి మాటల్లో, 'ఉ' లా పలుకుతాం. (*full* - ఫుల్)
*rule* లాంటి మాటల్లో 'ఊ' లా పలుకుతాం. (రూల్)
*But* లాంటి మాటల్లో U ను 'అ' గా పలుకుతాం.

2) చదివేటప్పుడే dictionary లో అర్థాలు చూసుకుంటూ చదివితే, మీ చదువు సాగదు, విసుగేస్తుంది, చదవడం ఆపేస్తారు. అలాకాకుండా చదువుకుంటూపోతే, సందర్భాన్నిబట్టి కొన్ని మాటల అర్థాలు dictionary సహాయం లేకుండా చాలసార్లు correct గానే ఊహించుకోగలం. అంతేకాకుండా ఎక్కువసార్లు ఒకేమాట వచ్చినప్పుడు, అది మన mind లోని, auto register వల్ల, మన ప్రయత్నం లేకుండా మన speech లో వాడేయటం జరుగుతుంది. చదివిన తర్వాత అన్ని మాటలూ మరిచిపోం కదా? ఏ రెండు మూడు మాటలయినా గుర్తుంటాయికదా. మీరు వాటి అర్థాలు తెలుసుకుంటే చాలు. Telugu Medium వాళ్లు Oxford Dictionary చివర defining words list అని ఉంటుంది. ముందు వాటి అర్థాలు తెలుసుకుంటే మిగతావాటికి అర్థాలు తెలుసుకోవడం సులభం. వాటి అర్థాలకు కొంతకాలం ఏదయినా English - Telugu Dictionary వాడండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

# He has fought to the finish




**Subhakar:** So, what's new?
(అయితే ఏంటి విశేషాలు? )

**Jayakar:** I am returning from Vishnu. A piece of good news is that he has got admission into IIM.
(Vishnu దగ్గర నుంచి తిరిగొస్తున్నాను. శుభవార్త, అతడికి IIM లో ప్రవేశం లభించింది.)

(IIM = Indian Institute of Management)

**Subhakar:** That's really great. Getting admission into IIM is certainly an achievement. I should walk a hundred miles to shake hands with him.
(నిజంగా గొప్పే. IIM లో ప్రవేశం అంటే ఏదో ఘనకార్యం సాధించినట్లే. వందమైళ్లు నడిచైనా అతడికి shakehand ఇవ్వాల్సిందే.)

Walk a hundred miles to shakehands with somebody= ఎవరైనా ఏదైనా ఘనకార్యం సాధిస్తే ఈ మాటంటాం.

**Jayakar:** The thing to be appreciated here is his fighting spirit. Really hats off to his patience and perseverance.
(మనం మెచ్చుకోవాల్సింది ఎంత కష్టమైనా సాధించాలనే కోరిక/ సాధించేవరకు పోరాడాలనే కోరిక. నిజంగా అతడి ఓర్పునూ, పట్టుదలనూ మెచ్చుకోవాల్సిందే.)

appreciate: అప్రీషిఎయేట్ - ప్రీ నొక్కి పలుకుతాం= మెచ్చుకోవటం; patience- పెయ్షన్స్- తెలుసు గదా? ఓర్పు/ ఓపిక.

perseverance- ప (bird లో 'బ' లా) సివియరన్స్- వి నొక్కి పలుకుతాం. అర్థం= పట్టుదల- సాధించేవరకు విశ్రమించని గుణం; hats off- ఎవరినయినా మెచ్చుకునేందుకు వాడే మాట. జోహార్ లాగా.

**Subhakar:** His failure in his first attempt roused his desire to fight back. It did not disappoint him, but has fought back successfully.
(మొదటి యత్నం విఫలమవడం అతడిలో ఎదురు పోరాడాలనే కోరికను రేపిందేగానీ, అతడిని నిరుత్సాహపరచలేదు. ఎదురు పోరాడి జయించాడు)

**Jayakar:** He has put up a good fight this time, and has won. IIM was his life time goal. His stand was IIM or his father's business. He would not study any other course.
(ఈసారి ఏదో ఒకటి తేల్చుకోవాలని శ్రమించాడు. IIM లో చదవాలనేదీ అతడి జీవిత గమ్యం. అతడి వైఖరి, IIM గానీ, లేకపోతే వాళ్ల నాన్న వ్యాపారంగానీ. ఇంకే course చదవకూడదని.)

goal = గమ్యం

**Subhakar:** Yea. He wanted to see it through to the end and he did. He has fought to the finish.
(అవును. దాని అంతు చూడాలనుకున్నాడు. చూశాడు. చివరివరకూ పోరాడాడు మొత్తానికి.)

**Jayakar:** He has always been the fighting type. He'd fight tooth and nail for anything he wants.
(ఎప్పుడూ పోరాడే తత్వమే/ చివరివరకూ ప్రయత్నించే తత్వమే అతడిది. తనకు కావాల్సింది వచ్చేవరకు ప్రయత్నిస్తూనే ఉంటాడు గట్టి నిర్ణయంతో.)

**Subhakar:** All said and done it's a great achievement. I'll go to him and congratulate him personally.
(ఏదేమైనా ఇది ఘనకార్యమే. నేను వెళ్లి వ్యక్తిగతంగా అతడిని అభినందిస్తాను.)

మనం కిందటి రెండు lessons లో spoken English లో సాధారణంగా వినిపించే fight, దానితో వచ్చే ఇతర మాటలు, వాటి వాడకం చూశాం. ఇంకా fight కు సంబంధించిన మాటలు, conversation లో తరచూ వాడగలిగినవి మరికొన్ని ఉన్నాయి. ఈ lesson లో వాటిని చూద్దాం. వాటిని తరచూ మీ conversation లో వాడే అవకాశాలుంటాయి.

***Look at the following sentences from the conversation at the beginning of the lesson.***

*1) The thing to be appreciated here is his fighting spirit.*

*2) His failure in his first attempt roused his desire to fight back.*

*3) He has put up a good fight this time.*

*4) He has fought to the finish.*

*5) He'd fight tooth and nail for any thing he wants.*

**1) Fighting spirit**- పోరాడి సాధించాలనే కోరిక/ ఎంత కష్టమైనా సాధించాలనే గట్టి నిర్ణయం. (సులభంగా నిస్పృహ చెందకుండా, నిస్సహాయత చూపించకుండా)

a) The one that succeeds in life is always the one with fighting spirit = కష్టపడయినా సాధించాలనుకొనేవాళ్లే/ పోరాడి గెలవాలనుకునేవాళ్లే జీవితంలో విజయం సాధిస్తారు.


M.SURESAN

b) It is not just enough to have ambition. You should have the fighting spirit= ఆకాంక్ష/ ఏదో సాధించాలనే కోరిక మాత్రమే చాలదు. ఎంత కష్టమైనా సాధించాలనే నిర్ణయం/ పోరాటస్ఫూర్తి అవసరం.

c) Gandhi's desire for peace was matched by his fighting spirit. He fought so hard for peace= శాంతి కావాలని ఎంతగా కోరుకున్నాడో గాంధీకి అంతగా (సమానంగా) ఏదైనా సాధించేందుకు నిర్ణయం/ కృషి (పోరాటస్ఫూర్తి) ఉండేది. శాంతి కోసం గట్టి పోరాటమే చేశాడు. (శాంతి కోసం పోరాటం - ఈ మాటల్లో వైరుధ్యం గమనించండి)

**2) fight back** = (మనకేం హాని జరగకుండా) ఎదురు పోరాటం.

a) Pakistan fought back to avoid defeat= ఓటమి తప్పించుకునేందుకు పాకిస్థాన్ ఎదురునిలిచి పోరాడింది.

b) The tribals in India do not have the power to fight back, though they are exploited= దోపిడికి గురవుతున్నప్పటికీ, భారత గిరిజనులకు దాన్ని ఎదిరించే శక్తి లేదు.

(exploited= ఒకరి బలహీనతను మన బాగుకు వాడుకోవటం; అశక్తతను వాడుకోవటం/ మామూలుగా దోపిడికి గురయ్యే బలహీనవర్గాలను, they are exploited అంటుంటారు)

**3) Put up a good fight**= కష్టాలకూ, శత్రువులకూ సులభంగా లొంగకుండా వీలయినంతవరకూ పోరాడటం/ లొంగిపోయే వరకూ పోరాడుతూండటం/ విఫలమయ్యేవరకూ ప్రయత్నిస్తూండటం. (ప్రయత్నలోపం లేకపోవటం.)

a) They lost the match in the end, but they did put up a good fight = ఓడిపోయారు, కానీ (ఓడకుండా ఉండేందుకు) తీవ్ర ప్రయత్నమే చేశారు.

b) All credit to them for putting up a stiff fight. Doesn't matter if they lost= ఓడిపోతేనేం? / విఫలమైతేనేం? వాళ్లు మాత్రం గట్టి ప్రయత్నమే చేశారు. అందుకు వాళ్లను మనం మెచ్చుకోవాల్సిందే.

All credit = మెచ్చుకోవాల్సిన విషయం.

**4) Fight to the finish** = అటో ఇటో తేలేదాక పోరాడటం/ శ్రమించటం.

a) This exam is going to be a fight to the finish for me = నేను మాత్రం ఈ పరీక్ష విషయంలో తాడో పేడో తేల్చుకుంటాను.

b) This time it is going to be a fight to the finish. Either he or me will stay= ఈసారి అటో ఇటో తేలిపోయేదాకా పోరాడతా/ ప్రయత్నించేస్తా. వాడుంటాడో నేనుంటానో తేలాలి.

c) The third time was a fight to the finish. The result was in his favour= మూడోసారికి తేలిందది. ఫలితం వాడికి అనుకూలంగా ఉంది.

**5) Fight tooth and nail**= గట్టి పట్టుదలతో పోరాడటం.

a) The residents of the new colony are fighting tooth and nail for a road and bus stop = ఆ colony వాసులు కొత్త road, bus stop కోసం ఆందోళన చేస్తున్నారు.

b) They are fighting tooth and nail for the withdrawal of new taxes = కొత్త పన్నుల ఉపసంహరణ కోసం వాళ్లు గట్టిగా పోరాడుతున్నారు.

ఇది కూడా తెలుసుకోండి:

Fight fire with fire = ముల్లును ముల్లుతోనే తీయటం.

You set a thief to catch a thief. This is fighting fire with fire = దొంగను పట్టుకోవడానికి ఇంకో దొంగను నియోగించటం, ముల్లును ముల్లుతో తీయడమే.

---

**Q.** i) Who do you like the most? అనొచ్చా? Who/ Whom - రెండూ కరెక్టేనా?

ii) Vis-a-vis అంటే అర్థమేమిటి? ఎలా ఉపయోగించాలి?

*- Dhana, OU Campus, Hyderabad.*

**A.** i) Who do you like most అనే అంటాం. అలాగే అనాలి, present day spoken English లో. ఈ columns లో దీని గురించి చాలాసార్లు వివరించాం. 'Whom' వాడకం Modern English లో లేదు. మనలాంటి Indian speakers of English- 'Whom' గురించి తెలుసుకోనక్కరలేదు. Who వాడటం చాలా పాండిత్యం/ గ్రాంథికం.

ii) Vis-a-vis- Pronunciation: వీఆవీ/ వీఅవీ. రెండింటిలోనూ, రెండో వీ నొక్కిపలుకుతాం- అర్థం. పోల్చిచూస్తే, ఆ సంబంధంగా/ ఆ నేపథ్యంలో.

a) What do you think of India's relations with the US vis-a-vis Pakistan? = అమెరికాతో భారత్ సంబంధాలు, పాకిస్థాన్ సంబంధాలతో పోల్చి చూస్తే ఎలా ఉన్నాయి, నీ అభిప్రాయంలో.

b) Congress Govt's free power supply to farmers vis-a-vis TDP's promise of a kilo rice for two rupees = రైతులకు కాంగ్రెస్ ప్రభుత్వ ఉచిత విద్యుత్ సరఫరా, తెలుగుదేశం రెండు రూపాయలకు కిలో బియ్యం పథకం, ఒక దానితో ఒకటి పోలిస్తే ...




**Q.** Please explain:

She neither returned the books nor paid the bill. Besides ......... (complete as directed)

*- NV Reddy, Ugranapalle*

**A.** Besides not returning the books, she did not pay the bill.

**Q.** i) They were living in America.

They had been living in America.

ఈ రెండు వాక్యాలకు తేడా వివరించగలరు.

ii) I am interested in reading.

You are satisfied. ఈ వాక్యాలు ఏ tense లో ఉన్నాయో తెలుపగలరు.

*- Bharathi, Hyderabad*

**A.** i) They were living in America - గతంలో ఒక సమయంలో జరిగిన పని - అప్పుడు వాళ్లు America లో నివసిస్తున్నారు అని.

They had been living in America అంటే, గతంలో ఒక పనికిముందే వాళ్లు America లో నివసించటం ప్రారంభించి, ఆ పనిదాకా ఉన్నారని.

They had been living in America when Roosevelt became the President- Roosevelt అధ్యక్షుడయ్యేటప్పటికి వాళ్లు America లో నివసిస్తున్నారు- వాళ్లు అంతకు ముందే అక్కడ ఉన్నారు, Roosevelt President అయ్యేవరకు కూడా ఉన్నారు అని.

ii) రెండూ Present Tense కదా (Are - Present Tense)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Q.** *Simple present tense లో subject singular లో ఉన్నప్పుడు verb కు 's'గానీ, 'es' గానీ చేరాలి కదా. కాని "I go to school" లో అలా ఉండదెందుకు? ఇందులో 'I' singular కదా? He, she, it మొదలైన singulars ఉన్నప్పుడు అలాంటి వాక్యాల్లో verb కు s/ es చేరుతుంది కదా? ఈ సందేహం తీర్చగలరు.*

*- N. Bhanuchandar, Madhuvaripalem*

**A.** Simple present లో అన్ని singulars కూ 's'/ 'es' చేర్చరు. III person singular (He, she, it) కు మాత్రమే s/ es చేరుస్తారు. 'I' first person singular కాబట్టి దానికి s/ es చేర్చరు. అలాగే you కు అర్థం, నువ్వు/ మీరు రెండూ. అయితే you ను ఎప్పుడూ plural subject గానే పరిగణిస్తాం- You are, You were, You have been, etc.

# ప్రతిభ

**Q.** *A doctor treats patients అనేది కరెక్టా? A doctor treats the patients కరెక్టా? The patients అని వాడొచ్చా? తెలియజేయగలరు.*

*- Dasaradhi Naik, Kasibugga*

**A.** A doctor treats patients, correct.

The patients అని ఎప్పుడంటాం? ఏ patients? అని question వేసుకుంటే, answer వస్తే అప్పుడు The patients అనటం correct.

A doctor treats the patients in this area (Doctor ఏ patients ను treat చేస్తాడు? అని ప్రశ్న వేసుకుంటే, patients in this area అని జవాబు వస్తుంది కాబట్టి, ఇక్కడ patients ముందు the వాడాలి.)

a) A teacher teaches students (ఏ students?- no answer. So, no 'the' before students)

b) A teacher teaches the students who live on this colony. Question వేసుకోండి. ఆ teacher ఏ students కు teach చేస్తుంది? - ఈ question కు answer, students who live in this colony అని వస్తుంది కదా? అందుకని students ముందు 'the' వాడతాం.

ఇది చాలామందికొచ్చే సందేహమే. ఎక్కడయినా 'the' వాడాలా, కూడదా అని సందేహం వస్తే, ఆ మాటకు ముందు ఏ అనే ప్రశ్న వేసుకోండి. Answer వస్తే, the వాడండి. లేకుంటే వాడకండి.

Lecturers in this college teach well. ఇక్కడ lecturers ముందు 'the' వాడాలా, కూడదా? question వేయండి: ఏ (which) lecturers బాగా బోధిస్తారు?

Answer: Lecturers in this college. ఇలా ఇక్కడ ఉంది కాబట్టి, lecturers ముందు 'the' రావాలి.

Lecturers teach. ఇక్కడ lecturers ముందు 'the' అవసరమా? ఏ/ which lecturers teach? అనే question వేద్దాం- answer లేదు కదా? అందుకని, lecturers teach అన్న sentence లో lecturers ముందు 'the' వాడం.




**Q.** *i) ఇంగ్లిష్‌లో మొత్తం verb patterns లేదా model sentences ఎన్ని? 275 ఉన్నాయని చదివాను, నిజమేనా? అవన్నీ ఉండే పుస్తకం తెలుపగలరు.*
*ii) Compartive degree లో ఉన్న adjectives ను ఉపయోగించే సందర్భాలను వివరించగలరు.*
*iii) It is of no use. దీని అర్థమేమిటి?*
*iv) Be + of తో ఉండే వాక్యాల గురించి తెలుపగలరు.*

*- T.Satyanarayana, Bhimavaram*

**A.** i) English లో దాదాపు 275 patterns ఉన్నట్టు అంచనా. అయితే Daily life లో అవసరమయ్యే, Informal/ formal writing లో వచ్చే వాడే patterns 45/ 50 కి మించవు. Patterns అంత కూలంకషంగా అభ్యసించనక్కరలేదు. మనం conversation బాగా practise చేస్తూ, English చదవటం, TV news telecasts వింటూంటే patterns తో సంబంధం లేకుండా English లో communicate చేయగలం, సునాయాసంగా, తప్పులు లేకుండా.

ii) మీ ఈ ప్రశ్న కాస్త అస్పష్టంగా ఉంది. దాదాపు అన్ని adjectives నూ comparative degree లో వాడుతూనే ఉంటాం కదా? రెండు అంతకు మించి ఉన్న మనుషులను, వస్తువులను, విషయాలనూ పోల్చినప్పుడల్లా comparative degree వస్తూనే ఉంటుంది. అంటే మనం వాడుతూనే ఉంటాం కదా? ఇంక అన్ని సందర్భాలూ అవే కదా? మీ సందేహం స్పష్టంగా తెలపండి.

iii) It is of no use అని ఇప్పటి English లో అనటం లేదు. It is no use అంటాం. It is no use talking to a fool -మూర్ఖుడితో మాట్లాడటం నిరుపయోగం. అయితే Be + of అంటే- ఉంది/అయింది అనే అర్థం వస్తుంది.

iv) a) He has been of great help to me = అతడు నాకు చాలా సహాయంగా ఉన్నాడు.

b) She is of a noble mind = ఉదాత్తమైన (గొప్ప) మనసు కలావిడ ఆమె.

c) She is of Indian origin settled in the US= ఆమె భారత సంతతికి చెంది America లో స్థిరపడ్డావిడ.

d) They are of equal competence = వాళ్లంతా ఒకే సామర్థ్యం ఉన్నవాళ్లు.

ఇలా ఇంకా ఎన్నైనా రావచ్చు. Practise చేసి చూడండి.

# I prefer coffee to tea

**Q.** *i) What is your plan? What will be your plan? ఈ రెండు వాక్యాల అర్థం ఒకటేనా? ఏ వాక్యం ఎప్పుడు వాడాలో తెలియజేయగలరు.*
*ii) I prefer coffee to tea. ఇందులో దేనిని prefer చేసినట్లు? వివరించగలరు.*

*- M.D. Mohiyoddin, Sangareddy.*

**A.** i) What will be your plan? - నీ ప్రణాళిక ఏమిటి? / ఎలా ఉంటుంది? future లో.

What would be your plan?- ఇది ఊహించుకునే ప్రస్తుతం సాధ్యం కాని విషయం.

If you were elected Chief Minister, what would be your plan? = నువ్వు ఇప్పుడు CM గా ఎన్నికయితే (ఇప్పుడా అవకాశం లేదు కదా? ) నీ ప్రణాళిక ఏమిటి?

I will give you Rs. 1000/-. What will be your plan? = నేను నీకు వేయి రూపాయలిస్తాను. నీ plan ఏమిటి?

If I gave you Rs. 1000/-. What would be your plan? = నేను నీకు వెయ్యి రూపాయలు ఇచ్చాననుకో (ఇవ్వటం లేదు) నీ plan ఏమిటి?

What would be your plan? అన్నప్పుడు దీని ముందరి sentence (conversation లో) ను బట్టి ఇది సరైనదా, కాదా? సరైతే అర్థం ఎలా ఉంటుందని చెప్పవచ్చు. Independent గా ఒకే sentence గా What would be your plan? సరి కాదు. What will be your plan? is correct.

ii) I prefer coffee to tea అన్నప్పుడు coffee నే prefer చేసినట్టు. Prefer వెంటనే వచ్చేదాన్నే మనం prefer చేసినట్టు.


M.SURESAN

**Q.** *i) I am given ii) I was given iii) I will be given. ఇవి కరెక్టేనా? వీటి అర్థాలు, టెన్సెస్ వివరించగలరు.*

*- Ch. Ranjith Kumar, Medak.*

**A.** మీ sentences అన్నింటిలో verb, Be form + participle [am/ was/ will be (be forms) + given (past participle)] అంటే verb is in the passive voice- అర్థం ఎలా వస్తుంది?

i) I am given = నేనివ్వబడతాను, ఇక్కడ, మిగతా రెండు sentences లో కూడా 'నేను' ఏది ఇవ్వబడతానో చెప్పలేదు. అంటే మీ sentences ఒక విధంగా correct. మీ sentence ను ఇలా imporve చేయవచ్చు.

I am given homework everyday. (ప్రతిరోజూ నేను homework ఇవ్వబడతాను - మామూలు తెలుగులో, ప్రతిరోజూ నాకు home work ఇస్తారు)

ii) I was given - నేను ఇవ్వబడ్డాను- past లో ఏమివ్వబడ్డారు? అనే ప్రశ్నకు answer ఉంటే sentence improve అవుతుంది.

I was given a prize = నేను బహుమతి ఇవ్వబడ్డాను (నాకు బహుమతి ఇవ్వబడింది). మామూలు తెలుగు - నాకు బహుమతి ఇచ్చారు/ వచ్చింది.

iii) I will be given = నేనివ్వబడతాను/ నాకు ఇవ్వబడుతుంది (Future లో). ఏది?

I will be given the money = నాకు డబ్బు ఇవ్వబడుతుంది (నాకు డబ్బిస్తారు, future లో)

I am given - Present simple (PV)
I was given - Past simple (PV)
I will be given - Future simple (PV)

**Q.** *కింది మాటలను ఆంగ్లంలో ఏమంటారో తెలియజేయగలరు.*
*1) ఆగర్భ శ్రీమంతుడు; 2) అల్పసంతోషి; 3) అసాధ్యుడు; 4) దేవుడి ప్రసాదం; 5) నాకు సొంత ఇల్లుంది; 6) నాకు ఇద్దరు కొడుకులు; 7) నిస్పృహ; 8) టీ చల్లారిందా? ; 9) అన్నీ కాయలేనా? ; 10) చుట్టపు చూపు; 11) నిరుద్యోగభృతి; 12) చంద్రమండలం; 13) భూగోళం.*

*- G. Ashok, Godhur*

**A.** 1) Born rich, 2) easily pleased, 3) a tough guy/ a tough customer, 4) God's grace/ gift, 5) I own a house/ My home is my own, 6) I have two sons, 7) Despair, 8) Has the tea gone cold? (చల్లారిపోయిందా? అంటే తాగేందుకు వీల్లేకుండా), Is the tea cold enough (to drink)? = తాగేందుకు వీలయినంతగా చల్లబడిందా? , 9) Are all of them raw?, 10) One of somebody's occasional visits/ a casual visit, 11) Unemployment allowance, 12) The lunar region/ world, 13) The globe.

**Q.** *i) The wall. ది వాల్/ ద వాల్ ఏది కరెక్ట్?*
*ii) Which tense do we use with 'ever' and 'never'? with simple present or present perfect? Please clarify.*

*- Adyan, Warangal*

**A.** i) తెలుగు శబ్దాలు, అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ- ఈ శబ్దాల్లో దేనితోనైనా ప్రారంభమయ్యే English మాటల ముందు, the ని 'ది' గా పలుకుతాం. మిగతా శబ్దాల ముందు 'the' ని 'ద' గా పలుకుతాం. Wall- వాల్ కదా? అ నుంచి ఔ వరకున్న శబ్దాలలో వా (wall) లేదు కదా? అందుకని the wall= ద వాల్ అనే అంటాం. ది wall సరికాదు.

The (ది) egg (ఎగ్); ద book.

The (ది) idea (ఐ); The (ద) university (అ నుంచి ఔ వరకున్న శబ్దాల్లో యూ లేదు కాబట్టి)

ii) ever (ఎప్పుడూ/ ఎప్పుడైనా), never (ఎప్పుడూ లేదు/ ఎప్పుడూ కాదు)- వీటిని we can use them in almost all tenses.

a) Nothing good ever happens here (present tense)

b) Have you ever seen such a movie (present perfect)

c) Did he ever help you when he was alive? (past)

d) Will you ever understand this? (future), etc.

Same is the case with 'never'

a) He never comes here (Pr. tense)

b) He never knew about this (when he was alive)- Past

c) He will never know (Future), etc.

**Q.** *Naturally, certainly, by the by, any how, by all means లాంటి పదాలు కొన్ని తెలుపగలరు.*

*- N.P. Santosh Kumar, Secunderabad.*

**A.** Common sentence beginings in spoken English.

1) How about ... ?/ What about ... ?
2) At long last (చివరికి/ ఎట్టకేలకు)
3) In the first instance (మొదట/ అసలు)
In the first instance why did you go there at all? (అసలు నువ్వెందుకెళ్లినట్లక్కడికి? )
4) As long as .../ so long as ... (అది అయ్యేంత/ ఉండే వరకు) As long as money plays a role in elections we can't have real democracy. (ఎన్నికల్లో డబ్బు పాత్ర ఉండేవరకు, నిజమైన ప్రజాస్వామ్యం ఉండదు)
5) In case/ if/ suppose/ given/ assuming, etc.
6) Surely/ by no means/ at any rate/ at any cost, etc.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

# (That's) the end of story

**Nischala:** Poor Jwala. Her brother has come to a bad end. (I have) been expecting it, the way he was carrying on.

**Nikhila:** Yea. Getting drunk all the time and moving with anti social characters. Her father tried to give him good education, and launch him on a good career, but that couldn't be.

(అవును. ఎప్పుడూ తాగి అసాంఘిక శక్తులతో తిరగడం. వాళ్ల నాన్న అతడిని బాగా చదివించి, మంచి ఉద్యోగంలో ఉండేట్లు చేసేందుకు ప్రయత్నించారు, కానీ అది జరగలేకపోయింది.)

**Nischala:** What's it now? Six months in jail, is it?

(ఏమయిందిప్పుడు? ఆరునెలల జైలు శిక్షా?)

**Nikhila:** Something like that, I've been told.

(అలాంటిదే- నాకెవరో చెప్పారు.)

**Nischala:** Jwala used to tell me that her dad was at the end of the rope trying to set right her brother.

(జ్వాల నాతో అంటూండేది- తన తమ్ముడిని మంచి మార్గంలో పెట్టేందుకు వాళ్ల నాన్న ప్రయత్నం చేసి అలసిపోయాడని.)

**Nikhila:** Well, that appears to be the end of story for him.

(అంతటితో అతడి కథ ముగిసినట్లుంది.)

**Nischala:** But there is still hope for him. The six months in jail may change him, and he can still have a good career. This may not be the end of the world for him, may it?

(అయినా ఏమీ అయిపోలేదులే. ఇంకా కొంత ఆశ ఉంది. ఆరు నెలల jail అతడిలో మార్పు తీసుకురావచ్చు. ఇంకా అతడు జీవితంలో బాగా స్థిరపడవచ్చు. అంతా అయిపోయినట్లు కాదు కదా?)

**Nikhila:** What do you mean? With this conviction can he get any job?

(ఏంటి నీ ఉద్దేశం, ఏం అయిపోలేదులే అనడంలో? ఈ శిక్షతో అతడికేమన్నా ఉద్యోగం వస్తుందా?)

conviction = court దోషులకు విధించే శిక్ష

**Nischala:** A job in government service or a private organisation is not the be all and end all of life, is it?

(ప్రభుత్వోద్యోగం కానీ, private సంస్థలో ఉద్యోగం కానీ జీవిత పరమావధి కాదు కదా?)

**Nikhila:** What else can he do?

(ఇంకేం చేయగలడతను?)

**Nischala:** He can jolly well run his father's business. It's profitable business and he can assist his father.

(వాళ్ల నాన్న వ్యాపారం చక్కగా/ హాయిగా చేసుకోవచ్చు. వాళ్ల వ్యాపారం లాభాల్లో ఉంది. అతడు వాళ్ల నాన్నకు సాయం చేయవచ్చు.)

jolly well = హాయిగా

You can jolly well talk what you like but action is not that easy.

= మాటలు హాయిగా చెప్పొచ్చు నీకేం. చేసేటప్పుడు తెలుస్తుంది అంత సులభం కాదని.

**Nikhila:** It seems he is repentant.

(అతడు చాలా పశ్చాత్తాపపడుతున్నట్టుంది.)

**Nischala:** That he is.

(అవును.)

**Nikhila:** But people don't forget things so soon, you know.

(కానీ ప్రజలు ఇలాంటి విషయాలను అంత సులభంగా మర్చిపోరు కదా?)

**Nischala:** He won't be here. His father has taken a positive view of it. He feels this is not the end of the world for his son. He would go to the ends of the earth to resettle him at some other place.

(అతడిక్కడ ఉండడు. వాళ్ళ నాన్న అతడి గురించి సుముఖ వైఖరితోనే ఉన్నాడు. ఆయన ప్రకారం ఇదేం అతడి జీవితంలో అత్యంత అధ్వానమైందిగా అనుకోవటం లేదు. అతడికి ఇంకోచోట పునరావాసం కల్పించే తీవ్ర ప్రయత్నం చేస్తున్నాడు).

**Nikhila:** Let's hope for the best.

(మంచే ఆశిద్దాం).

♦ ♦ ♦ ♦

Spoken English లో చాలా తరచుగా వాడగల, ఇతరులకు సులభంగా అర్థమయ్యే మాటలు, 'end' తో కలిసి వచ్చే వాటిని తెలుసుకుని మన conversation లో practise చేద్దాం.

***Look at the following sentences from the dialogue above.***

*1) Her brother has come to a bad end.*

*2) ..... her dad was at the end of the rope trying to set right her brother.*




*3) Well, that appears to be end of story for him.*

*4) This may not be the end of the world for him.*

*5) A job ... is not the be all and end all of life.*

*6) He would go to the ends of the earth for his son.*


M.SURESAN

**1) Come to a bad end**= దుర్మరణం పొందడం, శిక్ష పొందడం, ముఖ్యంగా స్వయంకృతాపరాధం వల్ల (తన మరణానికి/ తనకు పడిన శిక్షకు తనే కారణమైతే) (ఏదైనా మూడటం)

a) Saddam Hussain came to a bad end, because of his inhuman behaviour = తన అమానుష ప్రవర్తన వల్ల సద్దాం హుసేన్ అలాంటి మరణం పొందాడు.

b) The way he is acting, he will certainly come to a bad end: వాడి చేతలు చూస్తుంటే వాడికేదో చెడు జరుగుతుంది/ వాడికేదో మూడింది.

c) It's no surprize Sanjay Dutt has come to a bad end. He should not have been found in possession of weapons = Sanjay Dutt కు శిక్ష పడటంలో ఆశ్చర్యం ఏం లేదు. తన దగ్గర ఆయుధాలు ఉంచుకోవాల్సింది కాదు.

come to a bad end = come to a sticky end.

**2) At the end of the rope** = ఏదైనా ప్రయత్నం చేసి అలసిపోవడం/ విసిగివేసారడం.

a) The teacher was at the end of her rope teaching the boys maths = తన విద్యార్థులకు గణితం నేర్పాలనే ప్రయత్నంలో ఆమె విసిగి వేసారి పోయింది.

b) I am at the end of my rope. I can't any more make them understand this = నేను విసిగివేసారిపోయాను. వాళ్లకీ విషయం అర్థమయ్యేట్లు చెయ్యలేను.

**3) End of story** = కథ ముగిసినట్లే/ ఒక విషయం గురించికానీ ఒక వ్యక్తిని గురించి కానీ ఇంక చెప్పేందుకు ఏమీలేదు/ చెప్పాల్సిందంతా అయిపోయినట్లే.

a) Well, he is not coming here. That's the end of story = అతడిక్కడికి రావడం లేదు. అంతే. (ఇక చెప్పాల్సిందేం లేదని.)

b) He told his father that he'd marry only that girl. (That's) the end of story = ఆ అమ్మాయినే పెళ్లిచేసుకుంటానని వాళ్ల నాన్నతో చెప్పేశాడు. అంతే. ఇక చెప్పాల్సిందేంలేదు.

**4) Not the end of the world** = అంతా అయిపోయినట్లు కాదు. (మంచి జరగవచ్చు, ఇప్పుడు కూడా) (జరగాల్సిన చెడు అంతా జరగలేదు.)

a) The judge told Sanjay Dutt that the punishment was not the end of the world for him, and that he had a lot of future ahead = ఈ శిక్షతో అంతా అయిపోలేదని, అతడికి ఇంకా మంచి భవిష్యత్తుందని, న్యాయమూర్తి సంజయ్ దత్‌తో అన్నాడు.

b) This failure in this exam need not be the end of the world for you. Try again and you will succeed = ఈ పరీక్షలో fail అవడంతో అంతా అయిపోయినట్లేం కాదు. మళ్లీ పరీక్ష రాయి. pass అవుతావు.

end of the world ఎప్పుడూ not తోనే వాడతాం.

**5) The be all and end all of (life)** = జీవిత పరమావధి. (జీవితంలో అన్నిటికంటే ముఖ్యమైందిగా భావించేది).

a) Money is not the be all and end all of life, is it? = డబ్బే జీవిత పరమావధి కాదు కదా?

b) His career is the be all and end all of his life = అతడి ఉద్యోగమే/ వ్యాపకమే అతడి జీవిత పరమావధి.

c) Cricket appears to be the be all and end all of his life = క్రికెట్ అతడి జీవిత పరమావధిగా అనిపిస్తోంది.

**6) Go to the ends of the earth** = విశ్వప్రయత్నం చేయడం/ ఎంత శ్రమకైనా సిద్ధపడి ప్రయత్నం చేయడం, ఏదయినా సాధించేందుకు

a) Gandhi went to the ends of the earth to unite Hindus and Muslims = హిందూ, ముస్లిం ఐక్యతకోసం గాంధీ విశ్వప్రయత్నం చేశాడు/ ఎంతో శ్రమతో ప్రయత్నించాడు.

b) Some of our elected representatives would go to the ends of the earth to amass wealth = సంపద కూడబెట్టుకోవడానికి, ఏదైనా/ ఏ ప్రయత్నమైనా చేస్తారు.

### EXERCISE

**Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1. Indifferent | A false |
| 2. Violate | B bogus |
| 3. Launch | C break |
| 4. Adjourn | D uninterested |
| 5. Fake | E postpone |
| | F start |
| | G spend |

**Answers**

**1-D;** uninterested = శ్రద్ధలేని/ చూపని, నిర్లక్ష్యం చేసే.

Some doctors and nurses in govt hospitals are indifferent to the patients' health = ప్రభుత్వాసుపత్రుల్లో కొంతమంది doctors, nurses రోగులను నిర్లక్ష్యం చేస్తారు/ పట్టించుకోరు.

He is indifferent to studies = వాడికి చదువు మీద శ్రద్ధలేదు.

Indifferent తర్వాత to వస్తుంది.

No parent can be indifferent to their child's welfare = ఏ తల్లిదండ్రులు కూడా తమ పిల్లల సంక్షేమం పట్ల నిర్లక్ష్యంగా ఉండరు.

Indifferent X concerned (ఆదుర్దా పడే, ఆసక్తి చూపే)

**2.** violate - (C) break= ఉల్లంఘించడం/ అతిక్రమించడం (నిబంధనలు/ చట్టాల లాంటి వాటిని)

The police fined him for violating traffic rules= ట్రాఫిక్ నిబంధనలు అతిక్రమించినందుకు, పోలీసులు అతడికి జరిమానా విధించారు.

violate X observe (పాటించడం)

Observe traffic rules = (Traffic నిబంధనలను పాటించండి.)

**3.** launch = (F) start = ప్రారంభించడం - ఏదైనా పెద్ద ఎత్తున, ఓ ఉద్యమంలా ప్రారంభించడం.

The minister, launched pulse polio programme/ campaign last sunday = మంత్రి polio కార్యక్రమం/ నిర్మూలన ఉద్యమాన్ని కిందటి ఆదివారం ప్రారంభించారు.

Rockets, satellites లాంటి వాటిని కక్ష్యలోకి, కొత్త నౌకను జలాల్లోకి ప్రవేశపెట్టడం కూడా launch.

launch X terminate (ముగించడం)

pronunciation- లాంచ్.

**4.** Adjourn- అజన్- జ, bird లో 'బ' లా- 'జ' నొక్కిపలుకుతాం= (E) postpone- సభలూ, సమావేశాలూ, ముఖ్యంగా court proceedings (కార్యకలాపాలు) తాత్కాలికంగా ఆపడం/ వాయిదావేయడం.

The speaker (of the assembly) adjourned the assembly till Monday = అసెంబ్లీ అధ్యక్షుడు సమావేశాన్ని సోమవారం వరకు నిలిపేశారు/ సోమవారానికి వాయిదా వేశారు.

The judge adjourned the case till the next month= న్యాయమూర్తి case ను వచ్చే నెలకు వాయిదా వేశారు/ case విషయాలను వచ్చే నెల వరకు ఆపారు.

adjourn X complete/ conclude (పూర్తి చేయడం/ ముగించడం)

**5.** Fake- ఫెయ్‌క్= (B) bogus- బూటకపు/ మాయ/ నకిలీ/ మిథ్య. News papers లో చదువుతుంటాం కదా: Fake encounters = బూటకపు అకస్మాత్ ముఖాముఖి పోరాటం.

ఉదా: Police, మావోయిస్టులు అనుకోకుండా ఒకరికొకరు ఎదురుపడినప్పుడు జరిగే పోరాటం, encounter.

అనుకోకుండా ఏదైనా కష్టాలు ఎదురవడం, encounter.

The West Bengal government encountered opposition in Nandigram = నందిగ్రాంలో ప్రభుత్వానికి ప్రతిఘటన (అనుకోకుండా) ఎదురయ్యింది.

Fake notes= నకిలీ currency నోట్లు/ దొంగ నోట్లు

He faked innocence = అతడు అమాయకత్వం నటించాడు.

fake X genuine (జెన్యూయిన్) = అసలయిన, వాస్తవమైన/ నిజమైన.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

# Keep your end up

**Jayanthi:** You appear very down today. What could be wrong?
(చాలా విచారంగా కనిపిస్తున్నావు. ఏమయింది? ఏమయి ఉండొచ్చు?

down= విచారంగా/ నిరాశగా/ నిస్పృహగా)

**Vinathi:** I've failed to make it to the civils a second time. You can imagine my disappointment. Try as I might, I'm unable to get over it.
(Civils exam మళ్లీ pass కాలేకపోయాను. నా నిరాశ నువ్వూహించుకోగలవు. ఎంత ప్రయత్నించినా ఆ నిస్పృహను మాత్రం పోగొట్టుకోలేకపోతున్నాను.)

get over= (బాధలాంటి వాటిని) అధిగమించడం.

**Jayanthi:** Cheer up Vinathi. Keep your end up. IAS is not the end of the road for you.
(బాధపడకు. నిరాశ కలిగించే విషయమే. అయిపోయిందిగా. మరచిపోయి ఉల్లాసంగా ఉండు. దీంతో ఏం అయిపోలేదుగా)

**Vinathi:** That has been life time ambition, you know.
(అది నా జీవిత ఆశయంగా ఉండింది, తెలుసా? )

**Jayanthi:** Well, civils is not the career that ends all careers, Vinathi. There are other careers as bright as, or even brighter than IAS or IPS.
(అన్ని careers కంటే civils (IAS/ IPS లాంటివి) మాత్రమే గొప్పవి/ ముఖ్యమైనవీ కావు కదా? అంత గొప్పవీ, అంతకంటే గొప్పవీ, ఇతర careers ఉన్నాయి కదా? )

**Vinathi:** Well, that's a poor consolation you know. You can never get rid of the feeling that you could not achieve what you wanted to. It keeps eating you up.
(అలా అనుకుని సర్దుకుపోవాల్సిందే. కాని మనం అనుకున్నది సాధించలేకపోయామనే భావం మనల్ని వదలదు కదా? అది మనల్ని బాధిస్తూనే ఉంటుంది.)

get rid of = వదిలించుకోవడం

consolation= ఓదార్పు,

poor consolation = సరైన ఓదార్పు కాదు

**Jayanthi:** That's true. Any way you've kept your end of the deal. 'Do what you ought to do, and leave to God the rest', says the Geetha. So don't worry. (అది నిజమే. నువ్వు చేయగలిగిందంతా నువ్వు చేశావు కదా? 'నువ్వు చేయాల్సింది నువ్వు చెయ్. ఫలితం దేవుడికొదిలెయ్', అన్నాడు పరమాత్ముడు గీతలో.

**Vinathi:** I'm afraid that hardly comforts me. At the end of the day, it is the result that matters, and not your effort.
(అది నాకంత ఊరట కలిగించడం లేదు. ఏదేమన్నా, మనమేం సాధించామనేదే ముఖ్యం కానీ, మనం ఎంత ప్రయత్నం చేశామని కాదు కదా? )

matters = ముఖ్యమవటం.

It matters little whether he comes or not = అతడొస్తాడా రాడా అనేది అంత ముఖ్యం కాదు

**Jayanthi:** So what are you going to do?
(అయితే ఏం చేయబోతున్నావు? )

**Vinathi:** I'll give it another try. My cousin Pranathi has succeeded in her second attempt and she thinks no end of herself. Our relatives too keep comparing us. So I must make it.
(ఇంకోసారి ప్రయత్నిస్తా. మా cousin ప్రణతి రెండోసారి select అయింది. తన గురించి ఎంతో (గొప్పగా) అనుకుంటోంది. మా చుట్టాలు కూడా మమ్మల్ని పోలుస్తుంటారు. కాబట్టి నేను తప్పకుండా IAS కావాల్సిందే.)

give something a try = ప్రయత్నించి చూడటం/ ప్రయత్నించడం- ఇది conversational. మీరూ practise చేయండి.

**Jayanthi:** All the best to you then. By the bye has Unnathi called you?
(నీకు విజయం లభించాలి. అది సరే. ఉన్నతి నీకేమన్నా phone చేసిందా? )

**Vinathi:** No. I've been waiting for it for weeks on end. I will call her today.
(వారాలుగా దానికోసమే చూశా. నేను phone చేస్తానివ్వాళ)

☆ ☆ ☆ ☆

కిందటి lesson లో spoken English/ daily conversation లో తరచూ end తో వచ్చే కొన్ని expressions చూశాం కదా? మరికొన్ని expressions ఇప్పుడు తెలుసుకుందాం. ఇవి మీరు మీ conversation లో వాడి చూడండి. ఎంత effective గా ఉంటాయో తెలుస్తుంది.




*Look at the following expressions from the conversation above:*

*1) Keep your end up*
*2) Civils is not the career that ends all careers*
*3) You've kept your end of the deal*
*4) At the end of the road, it is the result that matters, not the effort.*
*5) She thinks no end of herself*
*6) I've been waiting for it for weeks on end.*



M.SURESAN

**1) Keep (somebody's) end up** = continue to be happy and cheerful even in difficulties = కష్టాల్లో కూడా ఉత్సాహంగా ఉల్లాసంగా ఉండగలగడం.

a) Sita, wife of lord Sri Rama, kept her end up even during her stay in the forests = వనవాసంలో కూడా శ్రీరాముడి భార్య సీత తన సంతోషాన్ని కోల్పోలేదు/ ఉల్లాసంగానే గడిపింది.

b) The one who keeps their end even in difficulties are real heroes = కష్టాల్లో కూడా ఉల్లాసంగా ఉండగలిగేవారే నిజమైన వీరులు

c) All that you've lost is just an exam. Keep your end up = నువ్వు exam లో fail అయ్యావు. అంతేకదా? మరచిపో/ సంతోషంగా ఉండు.

**2) A career that ends all careers** (something that ends all somethings) = ఒకే రకానికి చెందిన వాటిల్లో ఒకటి మిగతా వాటన్నింటికంటే మిన్నగా ఉండటం/ ముఖ్యంగా ఉండటం.

a) At last, he thought he had bought a car that would end all cars = చివరికి అన్ని car ల కంటే గొప్ప car కొన్నానని అనుకున్నాడు.

b) The youth of today think that a software job in the US is the career that ends all careers = అమెరికాలో software job ఇంకే career కన్నా గొప్పది/ ముఖ్యమైనదిగా భావిస్తున్నారు ఈనాటి యువత. ఇది ఈ మధ్య బాగా వాడుతున్న expression- practice చేయండి.

Here is at last the movie that ends all movies = చివరికి వచ్చింది అసలు చిత్రం- మిగతా వాటికన్నా గొప్పది

**3) Keep (somebody's) end of the deal** = తనవంతు పని తాను చేయడం/ తన బాధ్యతను తాను.

a) The bowlers have done their job. The batsmen should now keep their end of the deal = Bowlers (తక్కువ పరుగులిచ్చి ఎక్కువ వికెట్లు పడగొట్టి) తమ పని తాము చేశారు. ఇక batsmen తమ వంతు బాధ్యత నిర్వహించాలి.

b) Son, I've paid your fees, bought you all the books and provided all that you need. Now, you keep your end of the deal = బాబూ, నీ fees కట్టాను. పుస్తకాలన్నీ కొనిచ్చాను, నీక్కావలసిన వసతులన్నీ కల్పించాను. ఇక నీ బాధ్యతను నువ్వు నిర్వహించు (బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకుని).

c) Though India has done its part of the job, Pakistan has failed to keep its end of the deal = భారత్ తనవంతు పనిచేసినప్పటికీ, పాకిస్థాన్ తన బాధ్యతలో విఫలమైంది (తన మాట నిలబెట్టుకోలేదు).

**At the end of the day** - ఇది చాలా common గా వినిపించే expression కదా? అర్థం: ఏదైతేనేం/ చివరికి.

a) At the end of the day, how hard you've worked is not important, how much you've scored/ what marks you've got is important = ఏదేమైనా/ చివరకు/ ఎవరైనా చూసేది, నువ్వు ఎంత కష్టపడి చదివావని కాదు, నీకెన్ని marks వచ్చాయని.

b) At the end of the day what we've said matters, not what we feel = చివరికి మనం ఏమనుకుంటున్నది కాదు, మనం ఏం చెప్పామన్నదే పట్టించుకుంటారెవరైనా.

**4) End of the road/ the line** = చివరి దశ/ ఏదైనా మునుపటిలా కొనసాగించలేని స్థితి.

a) Nutanprasad's injury was the end of the road for him = నూతన్‌ప్రసాద్‌కు (shooting సమయంలో) అయిన గాయంతో ఆయన మామూలు నటన అంతమైపోయింది/ నటనను కొనసాగించలేకపోయారు.

b) When she fell seriously ill she thought it was the end of her career as an athlete = ఆమె తీవ్రంగా జబ్బుపడ్డప్పుడు క్రీడాకారిణిగా తన చివరిదశ వచ్చేసిందనుకుంది/ కొనసాగలేదనుకుంది.

Athlete = ఎథ్లీట్ - a, any లో 'ఎ' లా.

**5) No end of** = ఎక్కువగా/ అమితమైన

a) It is no end of trouble to get anything done in a government office = ప్రభుత్వ office లో పనిచేయించుకోవడం చాలా కష్టం/ పెద్ద సమస్యే.

b) She is no end happy with the money she got as a prize = బహుమతిగా వచ్చిన డబ్బుతో ఆమె చాలా సంతోషంగా ఉంది.

**6) On end** = continuously = చాలా కాలంగా

a) We've been waiting for you for hours on end = మేం నీ కోసం గంటల తరబడి చూస్తున్నాం.

b) For weeks on end, he was to be seen nowhere = వారాల తరబడి అతనెక్కడా కనిపించలేదు.

**EXERCISE**

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Precisely | A. Aim |
| 2. Ridiculous | B. talk |
| 3. Acquire | C. need |
| 4. Purpose | D. earn |
| 5. Mention | E. exactly |
| | F. absurd |
| | G. question |

**KEY: 1-E. Precisely= exactly**- కచ్చితంగా, accurate గా, correct గా. The time now is 8.49 AM precisely. సమయం ఇప్పుడు correct (కచ్చితంగా) 8.49 పొద్దున. In running races time is measured precisely = పరుగు పందాల్లో సమయం కచ్చితంగా (సెకన్ల దశాంశంతో) కొలుస్తారు. We are precise in weighing gold = బంగారం చాలా కచ్చితంగా తూస్తాం X vague (అస్పష్టమైన). I have a vague idea of his address = అతని address నాకు అస్పష్టంగా తెలుసు/ సరిగా తెలియదు.

**2-F. Ridiculous = absurd** = హాస్యాస్పదమైన. It is ridiculous to say that success can be achieved overnight = రాత్రికి రాత్రే విజయాన్ని సాధించగలం అనడం హాస్యాస్పదం. He looks ridiculous in red trousers and green shirt = ఆ ఎర్ర pants, green teashirt లో చాలా హాస్యాస్పదంగా కనిపిస్తున్నాడు. (అందరూ అతడిని చూసి నవ్వేట్లు) X sensible (సవ్యమైన)/ serious.

**3-D. Acquire = earn** = సంపాదించుకోవడం/ పొందడం. Within three years of entering politics, he acquired property worth Rs. 60lakh. = రాజకీయాల్లో ప్రవేశించిన మూడేళ్లలోపే 60 లక్షల విలువకల ఆస్తి సంపాదించాడతడు. Degree (చదువు)/ fame/ ఖ్యాతి/ friendship/ money/ position (పదవి, స్థితి) - వీటన్నింటినీ సంపాదించడాన్ని కూడా acquire అంటాం. కొనడం అనే అర్థం కూడా ఉంది. The government has acquired land for college - ఇక్కడ acquire = సేకరించటం.

**4-A. Purpose = aim**= ఉద్దేశం, లక్ష్యం. He went to Hyderabad with the purpose of learning computers = Computers నేర్చుకునేందుకు (నేర్చుకునే ఉద్దేశంతో) అతడు హైదరాబాద్ వెళ్లాడు. He is here with the purpose of getting some information = ఏదో సమాచారం కోసం అతడిక్కడ ఉన్నాడు.

**5-B. Mention = talk** చెప్పటం/ ఒకరిని గురించి, ఒక విషయాన్ని గురించి మాట్లాడటం/ ప్రస్తావించడం. The CM mentioned the Rs.2 per kilo scheme, while talking about his government's programme = తన ప్రభుత్వ ప్రణాళికను గురించి మాట్లాడుతూ, రెండు రూపాయలకు కిలో బియ్యం పథకం గురించి CM మాట్లాడారు/ ప్రస్తావించారు. Don't mention his name, said he to his daughter = అతని పేరు చెప్పకు, అని తండ్రి కూతురుతో అన్నాడు X omit = (ప్రస్తావించకుండా) వదిలేయడం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



**ప్రశ్న:** *After 15 overs Australia were 121-2 అనే వాక్యాన్ని cricket ప్రత్యక్ష ప్రసారంలో చూశాను. ఈ వాక్యంలో were ఉన్న చోట was ఉండాలి కదా? ఏది, ఎందుకు కరెక్టో వివరించండి.*

*– ఎన్.ధర్మపురి, వెంకటాపూర్, ఆదిలాబాద్ జిల్లా*

**జవాబు:** దేశాల పేర్లతో, ఆ దేశాల జట్లను గురించి మాట్లాడేటప్పుడు plural వాడతాం. India were 121/2 at lunch అన్నప్పుడు అర్థం- Lunch సమయానికి భారత జట్టు (team) లోని players 121 పరుగులు చేశారని. ఇలాంటి సందర్భాల్లో singular గానీ plural గానీ వాడొచ్చు. India was 121/2 అని కూడా అనొచ్చు.




**ప్రశ్న:** *i) Who/ what/ which లు subject గా వాడిన ప్రశ్నల్లో do/ does/ did ఎందుకు వాడకూడదు? ఇందులో subject గా వాడిన పదాలు ఏవి? eg: Who broke the jug?*

*ii) Who/ what/ which లు object గా ఉపయోగించే సందర్భాల్లో do/ does/ did వాడతాం.*

*eg: Who do you want to play with your team?*

*ఇందులో object గా వాడిన పదాలు ఏవి? subject ఏది? వివరించండి.*

*iii) Part of speech లో verb, adjectives గాను, adverb గాను noun గాను మార్పు చెందుతాయి. వాటి అర్థాలు, వాటిని ఏ విధంగా ఉపయోగిస్తారు? అర్థాన్ని ఎలా తీసుకోవాలో ఒకే మాటను తీసుకుని, sentence pattern పద్ధతిలో వివరంగా తెలియజేయగలరు.*

*iv) Verb forms 6 రకాలు అన్నారు. అవి ఏమిటి? వివరించగలరు.*

*– జి.కె.రావు, హైదరాబాద్*

**జవాబు:**

i) Who, which తో మాత్రమే questions లో do, does, did వాడం. 2) What తో వాడతాం కదా? What do you know? What does he want? What did he say? 3) Who, which తో కూడా negative questions లో do, does, did వాడతాం కదా. Who does not know it? Which (of you) did not do the home work, etc. వీటన్నింటిలో కూడా subject, who, what, which.

ii) Who do you want to play with? ఇక్కడ who, present day English లో whom కు బదులు వాడే మాట. ఇక్కడ subject you. ఎందుకంటే నువ్వు ఎవరితో ఆడాలను కుంటున్నావు? అన్నప్పుడు, subject is you.

iii) మీ question కొంత అస్పష్టంగా ఉంది. నాకు అర్థమైనంతవరకు ఈ example ఇస్తున్నాను, చూడండి.

1. **Beauty (n)** = అందం
   The beauty of Kashmir attracts a large number of tourists.
2. **Beautiful (adj)** = అందమైన, అందంగా ఉన్న.
   The scenery of Kashmir is beautiful.
3. **Beautiful (Adv)** = అందంగా
   He decorated the house beautifully.
4. **Beautify (verb)** = అందంగా చేయటం/ అలంకరించటం. He beautified the place by growing a garden in it = అక్కడ ఓ తోటను పెంచి ఆ ప్రదేశాన్ని అందంగా చేశాడు.

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 396

**Sentence Patterns**

1) Beauty (Noun)
Noun (Subject) Verb Object
The beauty of Kashmir + attracts + a large ...

2) Beautiful (Adj)
Subject Verb subject complement (Adjective)
The scenery of Kashmir + is + beautiful

3) Beautifully (adv)
Sub Verb Object Adverb
He + decorated + the house + beautifully

4) Beautify (verb)
Subject Verb Object
He + beautified + the place

**iv) 6 forms of the verb**

1. Be forms
2. Be form + ing form
3. Be form + past participle (PP) (Passive Voice)
4. Have/ has/ had/ will have/ shall have etc + PP
5. Doing words I RDW II RDW PDW
   come, comes, came
6. Shall/ should/ will/ would/ can/ could may/ might/ must etc. + 1st RDW.

**ప్రశ్న:** *i) Would, Should, Could ఏ సందర్భాల్లో ఉపయోగించాలో స్పష్టంగా తెలుపగలరు.*

*ii) sine qua non అంటే ఏమిటి?*

*iii) Simple past, past perfect ఎప్పుడు ఉపయోగించాలి?*

*iv) తెలుగులో ఒక వ్యక్తిని గౌరవంగా సంబోధించేటప్పుడు, "మీరు", "తమరు", "వారు" అని వ్యవహరిస్తాం. అంటే ఏకవచన గౌరవసూచకం అన్నమాట. అలాగే ఇంగ్లిష్‌లో ఒక వ్యక్తిని గౌరవిస్తూ సంబోధించడమెలా?*

*– పి.ఎస్.వి. రమణబాబు, తిరుపతి*

# sine qua non అంటే ఏమిటి?

**జవాబు:** i) Would, should, could ఉపయోగాలు చాలా వివరంగా ఇంతకుముందు ఇచ్చాం. చూడండి.

ii) sine qua non - సైన్‌క్వానాన్= ఏదైనా సాధించాలనుకున్నప్పుడు మనకు అవసరమైన విషయం/ గుణం. అది లేనిదే మనం సాధించలేం.

a) Industry is the sine qua non for success = విజయానికి కృషి అవసరం/ ముఖ్యం (కృషి లేనిదే విజయం పొందలేం).

b) Careful planning is the sine qua non of success in any venture = ఏ గొప్ప కార్యం/ వ్యాపారం విజయానికైనా మంచి పథకం అవసరం/ ముఖ్యం.

iii) Simple past - for past actions, time known; past perfect for past actions, time not stated.

a) I have seen the movie = నేను ఆ సినిమా చూశాను- ఎప్పుడు చూసిందీ చెప్పటంలేదు- tense, past perfect.

b) I saw it last night = నేను దానిని నిన్న రాత్రి చూశాను- ఇక్కడ time - last night అంటున్నాం కాబట్టి, saw - past simple వాడుతున్నాం.

iv) You = నువ్వు/ మీరు. గౌరవ సూచకంగా మీరు అనాలన్నా, you అనే అంటాం. You please అంటాం. అంతకంటే వేరే ఏమీ expressions లేవు.


M.SURESAN

**ప్రశ్న:** *Have పక్కన had ఉపయోగించవచ్చా అనే ప్రశ్నకు she has had this job for the last one year అని example ఇచ్చారు. దీన్ని She has been this job for the last one year అనడం తప్పా?*

*– శిరీష, నెల్లూరు*

**జవాబు:**

i) Have + past participle/ has + past participle గతంలో ప్రారంభమై ఇంతవరకూ జరిగిన పనిని తెలుపుతాయి.

నాకు car ఉంది = I have a car (ఇప్పుడు).

నాకు car ఓ సంవత్సరంగా ఉంది = I have had a car for the past one year అంటాం కదా? అలాగే ఆమెకు ఆ ఉద్యోగం సంవత్సరంగా ఉంది అనేందుకు, పై sentence లో car కు బదులు job వాడండి.

అప్పుడొచ్చే sentence:

She has had this job for the last one year.

She has been this job for the last one year =

ఈ sentence లో verb has been. ఇది be form (అంటే గతంలో ఒక సమయం నుంచి ఇప్పటివరకూ/ ఇంకా ఉండటం (state of being) చెప్తుంది).

కాబట్టి She has been this job for the last one year= ఆమె గత సంవత్సరంగా ఈ ఉద్యోగంగా ఉంది. ఆమె ఉద్యోగంగా ఉండదు కదా? ఉద్యోగంలో ఉంటుంది. అలా అనేందుకు She has been on this job for the last one year. అంటే, అప్పుడు ఆమె ఈ ఉద్యోగంలో ఉంది అని వస్తుంది.

**ప్రశ్న:** *English spelling games గురించి కొన్ని సందేహాలు: 'c, s' – ఇవి ఎప్పుడు ఏవి వస్తాయో ఉదాహరణలతో వివరించగలరు.*

*- C.Madhu, Warangal*

**జవాబు:** ఎప్పుడు c, ఎప్పుడు s వస్తుంది అని చెప్పడం చాలా కష్టం. English లో c ని s లా ఎప్పుడు, k లా ఎప్పుడు, అనేది ఆ పదం ఏ భాషలోంచి English లోకి వచ్చిందనే విషయం మీద ఆధారపడి ఉంటుంది. అది తెలుసుకోవడం ఇంకా కష్టం. అందుకని c తో ఏదయినా కొత్త మాట వస్తే, దాని pronunciation dictionary లో చూసి తెలుసుకోవాల్సిందే.

**ప్రశ్న:** *Question tag లో I am a doctor, aren't I? అని వచ్చినపుడు I am not a doctor, am I? అని వస్తుందా? are I? అని వస్తుందా? ఈ రెండూ ఇలా question tag ఎందుకొస్తున్నాయి? తెలుపగలరు.*

*- M.Moses, Vijayawada*

**జవాబు:** I am not a doctor, am I? అనే అంటాం.

**ప్రశ్న:** *i) Kindly clarify that, the main clause should be 'would' or 'should' or according to its subject (I, II or III persons) in the sentences of imaginary condition.*

*The text book of VIII (EM) prescribed by the Govt. of A.P., says that the main clause normally uses 'should', not 'would'. Here normally means....?*

*ii) How ro pronunce the word 'dais'?*

*iii) ప్రతిభాపాటిల్ ఎన్నో రాష్ట్రపతి? తివారి ఆంధ్రప్రదేశ్‌కి ఎన్నో గవర్నరు?*

*- What are the question forms in English for such type of questions?*

*- I.V.Ramaswamy, Karimnagar*

**జవాబు:**

i) మీరు చెప్పినలాంటి సందర్భాల్లో, should వాడకం చాలా పాండిత్యంగా అనిపిస్తుంది. Modern English usages లో, should కి would కి ఇలాంటి సందర్భాల్లో తేడా అంతరించిపోయింది. Direct, Indirect speech లో, conditionals లో requests లో ఇంతకుముందు should వాడే చోట్లన్నింటిలో should కు బదులు British, American English లలో would మాత్రమే వాడుతున్నారు. If I were you, I should like to do it - ఇది old usage. If I were you, I'd (would) like to do it - ఇది modern usage. Present day English లో should- ఒకరు చేయాల్సిన (బాధ్యతగా) పనిని తెలిపేందుకు, సలహా ఇచ్చేందుకు మాత్రమే వాడుతున్నారు.

ii) Dias - డెయిస్

iii) దీనికి English లో సరైన వాక్యంలేదు. ఇది ఇంతకుముందు వివరించాం.

**ప్రశ్న:** *i) I am writing this letter with a good intention. ఇక్కడ intention అనేది countable noun or uncountable noun like information and furniture?*

*ii) What about his letter?*

*How about his programme?*

*పై రెండు వాక్యాల్లో verb ఏమైంది? ఆ రెండింటినీ affirmative sentence లో, passive voice లో ఎలా రాయాలో తెలుపగలరు.*

*iii) He is suffering from joint pain.*

*She is my dream girl- ఇక్కడ joint, dream ఏ రకమైన adjectives?*

*iv) She came here to read the books.*

*She came here for reading the books - ఈ రెండింటికీ ఉన్న తేడాను వివరించండి.*

*- Dr.P.Anjaneyulu, Srikakulam*

**జవాబు:**

i) Intention (ఉద్దేశం) అనేది countable. చాలా అరుదుగా uncountable. అయినప్పటికీ information, furniture లాంటి uncountable మాత్రం కాదు.

ii) ఇది వాడుక వల్ల వచ్చిన మాటలు. Mostly spoken form. అందుకని verbs రావు. ఇలాంటివి మరికొన్ని- Why trouble me now? (Why do you trouble me now బదులు)/ Why not? (ఎందుకు కాకూడదు/ ఎందుకు లేదు?) etc.

(I don't like to go అనేందుకు response గా అనే మాట?)

iii) Joint, dream ఈ రెండూకూడా nouns used as adjectives, college student లో college లా.

iv) రెండూ ఒకటే - అర్థంలో తేడా లేదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

**Jayanth:** (It's) days since met you. Whatever has happened to you?

(నిన్ను చూసి చాలా రోజులయ్యింది. ఏమిటి విషయం?)

కొంచెం ఆశ్చర్యం తెలపడానికి What బదులు Whatever అంటాం.

**Sumanth:** What do you think? I have my hands full. The President of our association has given me the responsibility of making all the arrangements for the conference next week.

(ఏమనుకుంటున్నావు? అస్సలు తీరిక లేకుండా ఉన్నాను. మన సంఘం అధ్యక్షుడు వచ్చే వారం జరిగే సమావేశానికి కావాల్సిన ఏర్పాట్లన్నీ - ఆ బాధ్యతను పూర్తిగా నాకు అప్పగించారు.)

conference = సమావేశం

**Jayanth:** He can be sure he has placed the job in capable hands. He can be rest assured that nothing can go wrong.

(ఆయన ఈ పనిని సమర్థులకే అప్పగించాననే నమ్మకంతో ఉండవచ్చు. ఏ పొరపాటూ జరగదని నిశ్చింతగా ఉండవచ్చు)

be rest assured = నిశ్చింతగా ఉండటం

**Sumanth:** Fortunately I have the time and money in hand. That does make things easy. But at times I have to get my hands dirty too, as the workers are a bit lazy and irregular.

(అదృష్టవశాత్తూ దానికి కావాల్సిన డబ్బూ, సమయం బాగానే ఉన్నాయి. అందువల్ల పని సులభంగానే ఉంది. కానీ అప్పుడప్పుడూ పనివాళ్ల బద్ధకం వల్లా, సరిగా ఉండకపోవడం వల్లా వాళ్లు చేసే పనులు కూడా కొన్ని నేను చేయాల్సి వస్తోంది.)

**Jayanth:** Are you handling the invitations too?

(ఆహ్వానాలు పంపడం కూడా నీ పనేనా?)

**Sumanth:** Yes, I am.

(అవును.)

**Jayanth:** Why don't you let me take care of the invitations? You have enough on your hands already with the arrangements.

(ఆహ్వానాల విషయం నాకు వదిలేయకూడదూ? ఈ ఏర్పాట్లతోనే నువ్వు తీరిక లేకుండా ఉన్నావు.)

**Sumanth:** Thank you. That's a big relief.

(థ్యాంక్స్. అది నాకు పెద్ద విముక్తి.)

**Jayanth:** Let me have the list of invitees. I will have some of them delivered by hand, and the rest through courier service or by post.

(ఆహ్వానితుల జాబితా నాకివ్వు, కొన్నింటిని నేను చేతితో అందించేలా చూస్తాను, మిగతావి కొరియర్ ద్వారా గానీ, పోస్ట్ ద్వారా గానీ పంపుతాను.)

**Sumanth:** Am I clear then that the matter is entirely in your hands?

(అయితే ఆ విషయం అంతా నీ చేతుల్లో ఉన్నట్లే కదా?)

**Jayanth:** They are certainly out of your hands. Don't you worry, any more about them.

(అవి నీ చేతుల్లో లేవిప్పుడు. దాన్ని గురించి ఇంకేం ఆందోళన పడకు.)

**Sumanth:** I can speed up this work now.

(అయితే నేనీ పని త్వరగా పూర్తి చేయవచ్చు)

**Jayanth:** So you can.

(అవును.)

**Sumanth:** Our association has enough money to meet all the expenses. So nobody need put their hand in their pocket. Do take some money now.

(మన అసోసియేషన్‌కు చాలా డబ్బుంది. కాబట్టి ఎవరూ కూడా వాళ్ల డబ్బు ఖర్చు పెట్టనవసరం లేదు.)

**Jayanth:** That I know. Let me first of all have the list and the invitations.

(అది నాకు తెలుసు. మొదట ఆహ్వానితుల జాబితా, ఆ ఆహ్వానాలు నాకివ్వు.)

**Sumanth:** They are all at the printer's who is near at hand. Come, let's go.

(అన్నీ ప్రింటర్ దగ్గరే ఉన్నాయి. అతడు కూడా ఇక్కడకు దగ్గరే, వెళదాం పద.)

❖ ❖ ❖ ❖

Spoken English లో daily real life situations లో hand తో వాడే expressions కు చాలా ప్రాధాన్యం ఉంది. చాలా తరచుగా వాడుతుంటారు కూడా. ఇవన్నీ చాలా simple expressions. మన సంభాషణ చాలా సరళంగా, సహజంగా ఉండేట్లు చేస్తాయి. మనమూ practice చేద్దాం.

**Now look at the following expressions from the dialogue above.**

*1) I have my hands full.*

*2) He can be sure that he has placed the job in capable hands.*

*3) I have the time and money in hand.*





# I have my hands full

*4) ... I have to get my hands dirty.*

*5) You have enough on your hands.*

*6) Am I clear then that the matter is entirely in your hands.*



M.SURESAN

1) Have (somebody's) hands full- I/ we/ you/ they have my/ our/ your/ their hands full. He/ she has his/ her hands full = ఏదైనా పని వల్ల అస్సలు తీరిక లేకుండా ఉండటం.

a) He has his hands full with the arrangements for his daughter's marriage =
వాళ్ల అమ్మాయి పెళ్లి ఏర్పాట్లతో ఆయన అస్సలు తీరిక లేకుండా ఉన్నాడు.

b) I have my hands already full with repairs to my house. I can't attend to any other work now =
నా ఇంటి మరమ్మతులతో నా చేతుల నిండా పనితో తీరిక లేకుండా ఉన్నా, ఇంకేపనీ చూడలేనిప్పుడు.

2) In somebody's good/ safe/ capable, etc hands = ఏ వస్తువైనా/ విషయమైనా, మనుషులైనా, మనం ఆధారపడదగిన వ్యక్తి చూస్తున్నపుడు.

a) If Dr. Vaidya is treating you, you are in safe hands
= డా॥ వైద్య నీకు వైద్యం చేస్తున్నట్లయితే, నువ్వు క్షేమకరమైన చేతుల్లో ఉన్నట్లే (ఆయన వైద్యంలో నువ్వు క్షేమంగానే ఉంటావు).

b) With Kumble as captain, the team is in capable hands
= కుంబ్లే సారథ్యంలో (captain గా ఉంటే) భారత జట్టు సమర్థుడి చేతిలో ఉన్నట్లే (కుంబ్లే సమర్థుడని).

3) Something in hand/ to have something in hand/ have time/ money in hand = ఏదైనా మనం వాడుకునేందుకు మన దగ్గర ఉండటం.

a) He has plenty of money in hand
= అతడు వాడుకునేందుకు అతడి దగ్గర బాగా డబ్బుంది.

b) We still have a week in hand before the exams =
పరీక్షలకింకా మనకు వారం రోజుల సమయం ఉంది.

c) I haven't much time in hand =
నాకంత ఎక్కువ టైమ్ లేదు.

d) Though he has the amount in hand, he is unwilling to spend =
కావాల్సిన డబ్బు తన దగ్గర ఉన్నప్పటికీ, ఖర్చు పెట్టడం అతడికి ఇష్టంలేదు.

4) To get my hands dirty = దైహిక శ్రమ చేయడం/ కాయకష్టం చేయడం

a) Though he is a supervisor, he is ready to get his hands dirty if there is a need =
అతడు supervisor అయినప్పటికీ/ అతడి పని అజమాయిషీ అయినప్పటికీ, అవసరమైతే దైహిక శ్రమకు కూడా అతడు సిద్ధమే.

b) This job is only for these who are willing to get their hands dirty =
దైహిక శ్రమను ఇష్టపడే వాళ్ళనే/ కాయకష్టం చేసేందుకు ఇష్టపడేవాళ్లకే ఈ ఉద్యోగం.

c) As he is educated, he doesn't want to get his hands dirty =
చదువుకున్న వాడు కాబట్టి కాయకష్టం చేయడం అతడికి ఇష్టం లేదు.

5) To have enough on one's hands =
(ఒకరికి) చాలినంత పని ఉండటం.

a) She has enough on her hands with her new born child and so cannot do any job =
ఇప్పుడే పుట్టిన బిడ్డతో ఆమెకు చాలినంత పని. అందుకని ఆమె ఏ ఉద్యోగం చేయలేదు.

b) He doesn't have enough on his hands, so he gets all sorts of silly ideas =
అతడికి చాలినంత పనిలేకపోవడంతో అతడికి పనికిమాలిన ఆలోచనలన్నీ వస్తుంటాయి.

6) Something in somebody's hands =
ఏదయినా ఒకరి అధీనంలో ఉండటం.

a) The matter is no longer in my hands. It is now entirely in my lawyer's hands =
ఆ విషయం ఇప్పుడు నా దగ్గర లేదు (నేనేం చేయలేను). అదంతా మా లాయర్ చేతిలో ఉంది/ ఆయనే అంతా చూసుకుంటున్నాడు.

b) The whole affair is in your hands. You can do as you like =
అంతా నీ చేతుల్లో ఉంది. నువ్వేమనుకుంటే అది చేయగలవు.

Affair - అఫెఅ - విషయం/ సంబంధం

a) I don't know anything about the affair =
నాకు ఆ విషయం ఏమీ తెలియదు.

b) People suspect an affair between the two =
ప్రజలు వాళ్లిద్దరికీ ఏదో సంబంధం ఉందనుకుంటారు.

## EXERCISE

**Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1. Abscond | A Stop |
| 2. Irrelevant | B Escape |
| 3. Greedy | C Gentle |
| 4. Mild | D Surrender |
| 5. Withhold | E Unconnected |
| | F Covetous |
| | G Generous |

## ANSWERS

1. (B) escape = తప్పించుకోవడం/ పారిపోవడం, ముఖ్యంగా పోలీసులు పట్టుకోకుండా, చట్టానికి దొరకకుండా.

The parents of one of the students who killed their classmate have been absconding since the shooting incident =
classmate ను కాల్చి చంపిన విద్యార్థుల్లో ఒకరి తల్లిదండ్రులు తప్పించుకు తిరుగుతున్నారు (పోలీసులకూ, చట్టానికి దొరకకుండా).

The cashier of the bank is absconding =
Bank cashier పారిపోయాడు X Surrender = లొంగిపోవడం.

2. (E) unconnected = అసందర్భమైన/ సందర్భ శుద్ధిలేని (out of place)/ అసంబద్ధమైన. ఒక విషయం గురించి మాట్లాడుతూ ఉన్నప్పుడు మరో విషయం ప్రస్తావించడం, irrelevant.

While talking of the ability of a player, remarks about his appearance, or to his girl friend are irrelevant =
ఓ క్రీడాకారుడి శక్తి గురించి మాట్లాడుతున్నప్పుడు అతడి ఆకృతిని గురించి కానీ, అతడి స్నేహితురాలిని గురించి కానీ చేసే వ్యాఖ్యలు అసందర్భం/ అసంబద్ధం.

An engineer's qualification is irrelevant to a bank job =
ఇంజినీర్ విద్యార్హతలు bank ఉద్యోగానికి అసంబద్ధం X Relevant.

3. (F) covetous = దురాశ ఉన్న/ అత్యాశ/ పేరాశ ఉన్న

Most politicians are greedy. They enter politics only because of their greed =
రాజకీయ నాయకుల్లో ఎక్కువమంది దురాశాపరులే. అసలు వాళ్ళు రాజకీయాల్లో ప్రవేశించడానికి కారణం వాళ్ల దురాశే.

covetous = పరుల ఆస్తిపై కోరిక కూడా.

4. (C) Gentle = నిదానం/ దుడుకుకాని

Unlike the father who is rude (మొరటు) the son is mild =
మొరటువాడైన తండ్రిలా కాకుండా, కొడుకు నిదానస్థుడు.

mild అంటే ఇంకొన్ని అర్థాలు సాధు స్వభావం ఉన్న/ ఘాటులేని/ తీవ్రతలేని/ అంత ఉద్రిక్తతలేని X severe (తీవ్రమైన)/ harsh (కఠినమైన)/ violent (హింసాత్మకమైన).

5. (A) Stop = దేన్నయినా ఆపేయడం.

He withheld important information =
ముఖ్యమైన సమాచారాన్ని అతడు ఇతరులకు అందకుండా ఆపేశాడు.

Kunthi withheld the secret of Karna's birth till the end =
కర్ణుడి జన్మ రహస్యాన్ని కుంతి దాచిపెట్టింది/ ఇతరులకు చెప్పలేదు.

Results of certain candidates have been withheld =
కొందరు అభ్యర్థుల ఫలితాలు ఆపివేయబడ్డాయి (మామూలు తెలుగు ఆపేశారు.)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




**Vasanth:** Could you get back your money?
(నీ డబ్బు నీకు తిరిగి వచ్చిందా?)

**Bharath:** You know better than to expect that. This is India. Once you lose some thing it is lost forever.
(అలా ఆశించడం తెలివితక్కువ. ఇది భారత దేశంకదా? ఒకసారి నువ్వేదయినా పోగొట్టు కుంటే అది తిరిగి రానట్లే.)

**Vasanth:** Did you report to the police?
(Police లకు report చేశావా?)

**Bharath:** What'll be the use? In most cases you have to grease their palms. It's hundred to one that they catch the thief and if at all they do, you don't get all your money back. Sometimes they are hand in glove with thieves.
(ఏం ఉపయోగం? చాలా సందర్భాల్లో వాళ్లకు లంచాలివ్వాల్సి వస్తుంది. వాళ్లు దొంగను పట్టుకోవడం నూరింట ఒకటి. పట్టు కోవడం అంటూ జరిగినా మన డబ్బంతా మనకు తిరిగిరాదు. కొన్నిసార్లు దొంగలూ పోలీసులు లాలూచి పడటం కూడా ఉంటుంది.)

grease the palm= చేతులు తడపటం; palm= అరచేయి; grease తెలుసుకదా - యంత్రాలు, చక్రాలు సరిగా కదిలేందుకు పేసే పదార్థం.

**Vasanth:** Not all policemen or police officials are corrupt. The amount you've lost is not small either. The Inspector of your area is supposed to be honest. Just give it a try. The police station is close at hand to your place too.
(అందరు పోలీసులు, అధికారులు అవినీతి పరులుకారు. అంతేకాకుండా నువ్వు పోగొట్టు కున్న డబ్బు తక్కువేంకాదు. ప్రయత్నించు. Police station మీ ఇంటిదగ్గరే కూడాను.)

**Bharath:** The thief that has stolen my money seems to be an old hand at it. He left no traces whatever of his crime. Thieves must be clever fellows, as I can see now.
(నా డబ్బు దొంగిలించిన దొంగ చాలా అను భవజ్ఞుడిలా ఉన్నాడు. ఎక్కడా తన నేరానికి సంబంధించిన గుర్తులు వదలలేదు. దొంగలు చాలా తెలివైన వాళ్లుగా ఉంటారని నాకిప్పుడు తెలుస్తోంది.)

**Vasanth:** So certainly are most criminals. Cleverness and crime go hand in hand. Suppose a thief is caught and jailed once he won't stop stealing. He would only think of how to steal next time without being caught. That sharpens his cleverness.
(చాలామంది నేరగాళ్లు తెలివిగలవాళ్లే. నేరాలూ తెలివితేటలూ ఎప్పుడూ కలిసే ఉంటాయి. ఒకసారి దొంగతనం చేసిన దొంగ జైలుకెళ్లాడనుకో వాడు దొంగతనం మానడు. సరికదా, ఈసారి పట్టుబడకుండా దొంగతనం ఎలా చేయాలా అనే ఆలోచి స్తాడు. అలా ఆలోచిస్తూ తెలివిమీరిపోతారు వాళ్లు)

**Bharath:** OK. I will give a report for what it is worth. Let's see what happens.
(సరే. దాని విలువ దానిదే అనట్టు report ఇచ్చి చూస్తాను. ఏం జరుగుతుందో చూద్దాం.)

**Vasanth:** Good luck.

☺ ☺ ☺ ☺

Spoken English లో daily real life situations లో చాలా సాధారణంగా వినిపించే hand తో వచ్చే మరికొన్ని ఉపయోగకరమైన మాటలు ఈసారి తెలుసుకుందాం.




# Industry and success go hand in hand


M.SURESAN

***Look at the following expressions from the conversation above:***

*1) Sometimes they are hand in glove with thieves.*

*2) The police station is close at hand to your place.*

*3) Cleverness and crime go hand in hand.*

**1) Hand in glove** = చెడు విషయాల్లో/ నేరాల్లో/ రహస్య విషయాల్లో కొందరు కుమ్మక్కవడం.

a) We see daily reports in news papers that engineers and contractors are hand in glove in the irregularities in the execution of projects = వార్తా పత్రికల్లో రోజూ కథనాలు చూస్తూనే ఉంటాం- projects నిర్వహణలో జరిగే అక్రమాలలో ఇంజినీర్లు కాంట్రాక్టర్లు ఎలా కుమ్మక్కవుతున్నారో.

irregularities= అక్రమాలు/ నిబంధనల ఉల్లంఘన;
execution = నిర్వహణ;
execute = నిర్వహించడం;
Executive = పెద్ద పెద్ద సంస్థల్లో వాటి విధానా లను అమలుపరిచే/ నిర్వహించే అధికారి.

b) The poling staff in one of the booths were acting hand in glove with one of the candidates =
ఒక polling కేంద్రంలోని సిబ్బంది, ఒక అభ్యర్థితో కుమ్మక్కయ్యారు.

c) Some times the police are hand in glove with criminals = కొన్నిసార్లు పోలీసులు నేరగాళ్లతో లాలూచి పడు తుంటారు.

**2) close/ near at hand** = చేరువ/ సమీపం/ దగ్గర/ అతిదగ్గర (స్థలం/ సందర్భం/ వ్యక్తి) ఉండటం.

a) We don't have any shops close/ near at hand. For everything we have to go long distances. =
ఇక్కడికి దగ్గర్లో shops ఏమీలేవు. ఏది కావాలన్నా చాలా దూరం వెళ్లాల్సిందే.

b) I don't have the information at hand now. Wait for an hour and I can get it for you.=
ఆ సమాచారం/ వివరాలు ప్రస్తుతం నా దగ్గర లేవు. గంటసేపాగు. నీకా వివరాలు అందిస్తా.

c) The exams are close at hand and you haven't even started preparation =
పరీక్షలు దగ్గర పడుతున్నాయి. నువ్వింకా సన్నాహాలే మొదలు పెట్టలేదు.

d) The doctor is close at hand. Consult him=
Doctor దగ్గరే ఉన్నాడు కదా. ఆయనన్నడుగు.

**3) Go hand in hand** = రెండు విషయాలు/ ఇద్దరు వ్యక్తులు కలిసి ఉండటం/ ఒకదానికొకటి అవినాభావ సంబంధం ఉండటం.

a) Over eating and illness go hand in hand=
అతిగా తినడం జబ్బులూ కలిసే ఉంటాయి.
(అతిగా తినడం వల్ల జబ్బులు వస్తాయి కచ్చితంగా)

b) Industry and success go hand in hand =
కృషి, విజయం ఎప్పుడూ ఒకదానితో ఒకటి ఉంటాయి. (కృషి ఉంటే విజయం తప్పదు)

c) Communication abilities and career prospects go hand in hand =
career లో రాణించటం, communication నైపుణ్యం రెండూ కలిసే ఉంటాయి. (communication నైపుణ్యం ఉంటేనే career లో రాణించ గలం.)



**ప్రశ్న:** *మీరు is + ing form రానివాటిలో belong ఒకటి అని చెప్పారు. అసలు Regular Doing Actions ని simple present లో చెప్పాలి కదా? ఆ విధంగా 'This land belongs to him' - correct. Regular గా milk తీసుకునేవాళ్లు 'I am drinking milk' అనక్కర్లేదు కదా! 'I drink milk' అంటే సరిపో తుంది. ఇదీ అటువంటిదే కదా! Belong పక్కన కూడా ing form వస్తుంది కానీ 'is' తో కలిపిరాదు. 'check your belongings before you leave' అంటాం కదా!*

*- O.V.Laxmi, Kanuru*

**జవాబు:**
మీరు చెప్పాలనుకున్నదేంటో స్పష్టంగా తెలియడం లేదు. Belong am/ is/ are + ing form లో వాడం అనే విషయమేగా మీరంటున్నది. That certainly is right. Belong ను am/ is/ are + ing form లో వాడం అని చెప్పడంలో ఉద్దేశం పాఠకులను అది వాడకుండా చేసేందుకే.

- ఒక belong మాత్రమే కాకుండా am/ is/ are + ing form లో వాడని verbs ను దేన్నయినా, ఉత్త ... ing form గా (దానికి ముందు, am/ is/ are లేకుండా) వాడొచ్చు కదా?

a) <u>Loving</u> the poor is the quality of great people= పేదవాళ్లను <u>ప్రేమించటం</u> గొప్ప వాళ్ల లక్షణం.

b) <u>Hoping</u> to get a high rank he studied well.

c) <u>Needing</u> my help he came to me.

d) <u>Belonging</u> to this group is an honour.

**ప్రశ్న:**
*i)* మేము రోజూ పిల్లలను చదివిస్తుంటాము.
*ii)* మేము ఆటలు ఆడిస్తాము.
*iii)* నేను విద్యార్థులను ఆటలు ఆడించాను.
*iv)* నేను విద్యార్థులను చదివించాను. అనే వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

***- కె.రామకృష్ణ, పోసానిపేట, అందోలు***

**జవాబు:**
1. We make the students study (everyday)
2. We make them play
3. I have made the students play
4. I made the students study.

**ప్రశ్న:** నేను ఆ పని చేయిస్తాను అనే వాక్యాన్ని English లో ఎలా చెప్పాలి?

***- జె.కె.ప్రసాద్, జగన్నపేట***

**జవాబు:** I will get/ have it done. ఎవరిచేత చేయించేది తెలిస్తే/ I will make him/ her/ somebody do it.

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Feeble | A. oppose |
| 2. Grave | B. abandon |
| 3. Object | C. accept |
| 4. Fierce | D. weak |
| 5. Desert | E. violent |
| | F. serious |
| | G. confront |

## EXERCISE

**Key and explanation:**

**1-D.** Feeble= weak = బలహీనమైన/ నీరసంగా ఉన్న.
She was too feeble to walk= నడవలేనంత బలహీనంగా ఉంది.
He was old and spoke in a feeble voice = అతను వృద్ధుడు, బలహీనమైన గొంతుతో మాట్లాడాడు.
X strong/ robust (బలంగల)

**2-F.** Grave = serious = తీవ్రమైన/ గంభీరమైన.
The consequences of your action will be very grave. = నీ చర్య ఫలితాలు చాలా తీవ్రంగా ఉంటాయి.
It is a matter of grave concern, the missing of the child = ఆ బిడ్డ తప్పిపోవడం చాలా తీవ్రమైన ఆందోళన కలిగించే దిగా ఉంది.
(concern = worry; Grave అంటే మామూలు అర్థం సమాధి; grave X light.)

**3-A.** Object = oppose= (ఇక్కడ) అభ్యంతరం తెలపడం/ ఆక్షేపించడం.
They objected to my presence at the meeting = నేనక్కడ ఉండటానికి వాళ్లు అభ్యంతరం తెలిపారు.
They object to the way she dresses = ఆమె బట్టలు ధరించే తీరును వాళ్లు ఆక్షేపిస్తారు.
Object తర్వాత to వస్తుంది. దాని తర్వాత noun కానీ, ... ing form కానీ వస్తుంది.
I object to noise (noun)= గొడవంటే నాకభ్యంతరం.
I object to wasting (... ing form) money = డబ్బు వృథా చేయడం నాకభ్యంతరం. X allow.

**4-E.** Fierce = violent = దౌర్జన్యకరమైన/ హింసాయుతమైన.
The Tiger is a fierce animal= పులి హింసించే జంతువు (క్రూర మృగం).
తీవ్రమైన పోటీని కూడా fierce competition అంటాం.
There is fierce competition between the two parties.
fierce X mild/ gentle.

**5-B.** Desert = abandon = (ఎవరినైనా/ దేన్నయినా) పట్టించుకోకుండా నిస్పృహ యంగా వదిలేయడం.
The man deserted his wife and children = తన భార్యను, పిల్లల్ని వదిలేశాడతను (దిక్కులేనివాళ్లుగా చేశాడు).
A deserted place = ఓ ప్రదేశాన్ని అక్కడి వాళ్లందరూ ఖాళీచేసి వెళ్లిపోతే అది deserted place అవుతుంది.
The police found the room deserted = ఆ గది నిర్మానుష్యంగా ఉండటం చూశారు పోలీసులు.
Desert అంటే విధినిర్వహణ నుంచి పారిపోవడం కూడా.
The policeman deserted his post of duty = ఎవరి అనుమతి లేకుండా/ ఎవరితో చెప్పకుండా ఆ పోలీసు వెళ్లిపోయాడు/ పారిపోయాడు.
desert (వదిలివేయటం) x support
desert (పారిపోవడం) x stay
desert (విధినిర్వహణ నుంచి వెళ్లిపోవడం) x attend.
desert - ఎడారి అనే అర్థం కూడా ఉందని మనకు తెలుసు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

ప్రతిభ




# He wanted to go too



ప్రశ్న:

1. Big, large, great - ఈ మూడింటి అర్థం ఒకటే కదా! ఏయే సందర్భాల్లో ఉపయోగించాలో తెలపండి.
2. కిందివాక్యాలను ఆంగ్లంలో ఎలా రాయాలో వివరించండి.
   i) ఆఫీసర్లే నా కొంప ముంచిండ్రు.
   ii) సంజయ్‌దత్‌కు మధ్యంతర బెయిల్ దొరికింది.
   iii) భూపోరు మరింత జోరు.
   iv) ప్రాజెక్టులకు త్యాగధనుల పేర్లు పెడితే తప్పేంటి.
   v) దుక్కులు దున్నారు. దిక్కులు చూస్తున్నారు.
3. దేశభాషకు లేని ప్రాధాన్యం ఆంగ్లభాషకెందుకో తెలపండి.

*– యం.రంగయ్య, ఇల్లందు*

జవాబు:

1. Big, large- ఈ రెండూ కూడా వస్తువుల పరిమాణాన్ని (size ను) తెలుపుతాయి. పెద్దదైన అనే అర్థంతో spoken English లో large కన్నా big ఎక్కువగా వాడతాం. Large కొద్దిగా గ్రాంథికం.
He needs a big sized shirt./ This shirt is too big for him (అయితే Ready made దుస్తుల companies, commercial Ads లో big కు బదులు large వాడుతుంటారు: large size/ extra large size etc. ఇలా spoken English లో అరుదు.) A big group/ a big company/ a big car, etc అని వస్తువులకు చెబుతాం. / a big city/ country అని కూడా అంటాం. సామాన్యంగా written language లోనే ఇలాంటి చోట్ల big అర్థంతో large వాడతాం.
Big, మనుషులకు వాడినప్పుడు, మరికొన్ని సందర్భాల్లో, పెద్ద (వయసులో) వాళ్లు, ముఖ్యమైన వాళ్లు అనే అర్థం వస్తుంది. He is a big man / is in a big position అంటాం, అతడు చాలా ప్రముఖుడు అనే అర్థంతో. Large ఇలాంటి చోట్ల వాడం. A large man అంటే హాస్యానికి బాగా లావుగా ఉన్న మనిషి అనే అర్థం వస్తుంది. Big కు ముఖ్యమైన/ అతి ముఖ్యమైన అనే అర్థం ఉంది. Today is the big day of her life/ Sancranthi is a big festival for the hindus. ఇక్కడ large వాడం. Large కి ఒకే అర్థం: పెద్దదైన.
Great = గొప్ప. ఈ మాట ఓ గుణంలో గొప్పదనాన్ని సూచిస్తుంది. A great city - ఇక్కడ నగరం size కంటే, నగరం ప్రాముఖ్యతకు ప్రాధాన్యం. అంతేకాకుండా మనం చూడలేని/ తాకలేని వస్తువుల పరిమాణానికి (size), great వాడతాం. She showed great courage = ఆమె గొప్ప/ ఎక్కువ సాహసాన్ని చూపింది. Sita had great patience - గొప్ప సహనం. - ఇలాంటి చోట్ల big/ large రావు.
గమనించండి: A large number/ a large amount / a large quantity, etc.
(a large amount = ఏదైనా పెద్ద మొత్తంలో A big amount = డబ్బు పెద్ద మొత్తంలో) పై expressions లో మిగతావాటిల్లో సామాన్యంగా big వాడం.
2. i) It is the officers that ruined me/ the officers ditched me.
   ii) Sanjaydutt got interim bail.
   iii) Land struggle intensified (for that)
   iv) What is wrong in naming projects after people of sacrifice?/ after people who have made sacrifices?
   v) దుక్కులు దున్నారు... = They have ploughed the field and are waiting for rain.
3. చారిత్రక కారణాల వల్లే ఆంగ్లభాషకు ప్రాధాన్యం. దాదాపు 200 ఏళ్ల పాటు, ప్రపంచ సగభాగాన్ని English వాళ్లు పాలించడం అతి ముఖ్య కారణం. రెండోది English వాళ్లు America ఖండాల్లో (Canada తో సహా), Australia లో వలస వెళ్లి స్థిరపడిపోవడం. మూడోది, ఇతర భాషల మాటలను తనదిగా చేసుకోగల శక్తి English భాషకు ఉండటం. నాలుగోది science and Technology కి సంబంధించిన అభివృద్ధికి అంతా English మాట్లాడే వాళ్లు ఎక్కువగా కారణం అవడం.

ప్రశ్న:

Oxford advanced learner's dictionary లో వివరణ "proverbs and sayings" ఇచ్చారు. అందులో కేవలం వాటి అర్థాలు మాత్రమే తెలిపారు. కానీ వాటిని వాక్యాల్లో ఎలా ఉపయోగించాలో తెలపలేదు. సందర్భాన్ని బట్టి వాటిని వాడటానికి, పట్టు సాధించడానికి ఏదైనా పుస్తకం సూచించండి.

*– ఎల్.శ్రావ్య, నంద్యాల*

జవాబు:

మీరు Oxford Advanced Learner's Dictionary లోనే ఆ proverbs కు సంబంధించిన మాటల దగ్గర చూస్తే, వాటి అర్థం కనిపిస్తుంది. A stitch in time saves nine - ఇది proverb కదా? Oxford Advanced Learner's Dictionary లో, stitch మాటకు ఇచ్చిన అర్థాల్లో ఈ proverb కు అర్థం కూడా ఉంది, చూడండి. ఇంకే book చూడాల్సిన అవసరం లేదు.

---

ప్రశ్న:

Sir, I have some doubts of telugu translations relating to modal auxiliaries.

1. a) I shall have completed the work.
   b) I should have completed the work.
2. a) I will have completed the work.
   b) I would have completed the work.
3. a) I can have completed the work.
   b) I could have completed the work.
4. a) I may have completed the work.
   b) I might have completed the work.
5. I need have completed the work.
6. I ought to have completed the work.
7. I must have completed the work - Explain the difference in Telugu.

◆ Suggest me a good book for collocations & some informal English dictionaries & informal spoken English books.

*–కె.రామకృష్ణ, ఖమ్మం*

జవాబు:

1. a) నేను (future లో ఒక సమయంలోపు) పని పూర్తి చేసి ఉంటాను.
   b) నేను పని పూర్తి చేయాల్సింది (గతంలో) కానీ చేయలేదు.
2. a) = 1 a) = నేను future లో ఒక పనిపూర్తి చేసి ఉంటాను (అనుకున్న సమయంలోపు).
   b) పని పూర్తి చేసుండేవాడిని కానీ చేయలేదు.
3. a) పని పూర్తి చేయగలిగేవాడిని - ఇది దాదాపు వాడకంలో లేదు - ఇది వాడం.
   b) చేయగలిగే వాడిని కానీ చేయలేదు.
4. a) పని పూర్తి చేసేవాడినేమో? (doubt) (present)
   b) పనిపూర్తి చేసుండేవాడినేమో (doubt-past)
5. a) ఇలాంటి చోట్ల need have + pp వాడం- need not have + pp (not తోనే) వాడతాం = చేసుండే అవసరం లేదు. కానీ చేశాను.
6. పని చేసుండాల్సింది (అది నా ధర్మం) కానీ చేయలేదు.
7. పని చేసే ఉంటాను కచ్చితంగా.
(He must have forgotten it = అతడు దాన్ని మర్చిపోయే ఉంటాడు.)

Cambridge Dictionary of collocations ఉపయోగకరం ఈ విషయంలో. Read novels to improve your spoken English skills. Read India Today and such other English magazines.


M.SURESAN

ప్రశ్న:

కిందివాక్యాల్లో మొదటిది మీ lessons లోది. రెండో వాక్యం నేను 'to' ను 'use' చేసి రాశాను. అక్కడ to use చేయవచ్చా? ఇలాంటి వాక్యాల్లో to ఎలా, అసలు ఎక్కడ వాడాలో వివరించగలరు.

1. Does she think of going home - Does she think of going to home.
2. I go there every sunday - I go to there every sunday.
3. He wants to talk you - He wants to talk to you - He wants to talk with you (with వాడవచ్చా?)
4. He wishes to go home - He wishes to go to home.
5. He is coming here tomorrow- He is coming to here tomorrow.
6. I am going there next week- I am going to there next week.
అలాగే కిందివాక్యాలు కూడా చూడండి.
7. Without him the picnic can't be fun - Without of him the picnic can't be fun.
8. I am grateful to you for your help - I am grateful to your help.
9. What about your parents? - What is about your parents?
10. I will send it through Ramu - I will send it by Ramu.

*– జెబిని, ఖమ్మం*

జవాబు:

1, 2, 4, 5 & 6. Home, there, here - వీటిముందు to రాదు. Go home, go there, come here etc.
3. Talk to you = Talk with you (Both correct).
Without somebody / something = ఒకరు / ఒక విషయం లేకుండా - without తర్వాత of ఎప్పుడూ వాడం.
8. Grateful (కృతజ్ఞులుగా ఉండటం)
I am grateful to you ( వ్యక్తి ముందు to) for this help (ఏ విషయానికి అనే దాని ముందు, for)
I am grateful to your help సరికాదు. మీ సహాయానికి (విషయం) కాబట్టి దాని ముందు, for రావాలి.
9. What about something? / somebody? - ఇక్కడ What తర్వాత is లాంటి verbs ఏవీ రావు.
10. Send it through, correct. By - wrong.

---

ప్రశ్న:

i) Please make them sit down- దయచేసి వాళ్లను కూర్చోబెట్టండి.
ii) Ask them to sit down- వాళ్లను కూర్చోమని చెప్పండి. - పై తెలుగు వాక్యాలకు ఇంగ్లిష్ వాక్యాలు correct అవునో కాదో తెలపండి. తప్పయితే సరైన సమాధానాలు వివరించండి.
iii) ఒక విద్యార్థి చాలా తెలివైనవాడు. ప్రతీ విషయంలోనూ. అంటే all rounder అన్న మాట. 'నువ్వు all rounder వి మేము ఏమని పిలవాలి' అనడానికి English లో You are all rounder what we call you అనడం కరక్టేనా?
iv) మా కోచ్ వల్లే ఇది (prize) నాకు వచ్చింది అన్న వాక్యానికి ఇంగ్లిష్‌లో By my coach. I got it అంటే సరిపోతుందా?

*– చంటి, విశాఖపట్నం*

జవాబు:

i) Correct.
ii) You are an all rounder. What shall we call you?
iii) I got it because of my coach (by my coach ఇక్కడ సరికాదు).

ప్రశ్న:

1. To కి, Too కి మధ్య సంబంధం, వాటిని ఎప్పుడెప్పుడు ఉపయోగిస్తారు? వివరించండి.
2. పట్టుదలతో కావాలని, చేయాలని అనే పదాలను ఇంగ్లిష్‌లో తెలిపి, కొన్ని ఉదాహరణలు ఇవ్వండి.

*– ఎం.ఆంజనేయులు, కె.నాగేశ్వరరావు, మొలగవల్లి*

జవాబు:

1. To కు, too కు సంబంధం లేదుకదా? To అంటే వాళ్లకు/ ఒకరికి అనే అర్థంతో, to them, to him, to her, to Ram, to Lakshman అని వాడతాం. I gave it to Ram = రాంకు ఇచ్చాను. ఒక చోటికి అనే అర్థంతో వాడతాం. To Hyderabad, To Nellore = హైదరాబాద్‌కు, నెల్లూరుకు అని. ఫలాని time వరకు అనే అర్థంతో from 10 to 4 (10 నుంచి 4 వరకు) అని అంటాం.
To go, to come, to see లాంటి infinitives లో, to go = వెళ్లటానికి/ వెళ్లటం/ వెళ్లటం/ వెళ్లాలని, - ఇలా వాడతాం.
★ Too = Also = కూడా.
He wanted to go too = అతడు కూడా వెళ్లాలనుకున్నాడు.
★ Too = అతి. It is too costly = అది అత్యంత ధర (నేను కొనలేను/ కొనను).
Too... to రెండూ కలిపి ఇలా వాడతాం.
He is too selfish to help others = అతడు ఇతరులకు సహాయపడనంత స్వార్థపరుడు.
2. పట్టుదలతో= with perseverance/ tenacity.
She showed a lot of perseverance/ tenacity and finally won = ఆమె గొప్ప పట్టుదల కనబరచి సాధించింది.
కావాలనీ/ చేయాలనీ (ఉద్దేశ్యపూర్వకంగా)= Intentionally/ deliberately.
a) He intentionally delayed starting so that he would miss the train and stay at home = Train తప్పిపోయి ఇంట్లోనే ఉండాలని, ఉద్దేశపూర్వకంగానే/ కావాలని అతడు ఆలస్యంగా బయలుదేరాడు.
b) She deliberately appeared in ordinary clothes so that people might not know she was rich = ఆమె ఇతరులు తను ధనికురాలినని తెలుసుకోకుండా ఉండేందుకు, కావాలనే, మామూలు దుస్తులు వేసుకుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 400

# 400



*June 12, 2005* న ప్రారంభమయ్యింది మన **spoken English course.** ఇది **400th lesson.** నిరంతరాయంగా ఇన్ని lessons పూర్తి చేయగలిగినందుకు ఎంతో సంతోషంగా ఉంది. ఈ achievement కు ముఖ్యకారణం, పాఠకుల అపూర్వ స్పందన. ఈ course చాలా ఉపయోగపడిందనీ, English ధైర్యంగా మాట్లాడగలుగుతున్నామని రాసిన పాఠకులెందరో! పట్టణ, English medium లో చదివినవాళ్లు, పూర్తిగా గ్రామీణ నేపథ్య తెలుగు medium వాళ్లు ప్రతిస్పందిస్తున్నారు. ఈ lessons ను ఇంకా ఎక్కువ ఉపయోగపడేలా అందిస్తాం. ఇంతవరకు వచ్చిన lessons కు సంబంధించి కొన్ని ముఖ్యమైన సూచనలు:

- ప్రతి lesson సంభాషణ (ఓ conversation) తో ప్రారంభమవుతుంది కదా? ఈ సంభాషణను మీరు మామూలుగా చదవటం కాకుండా spoken English లో ఆసక్తి ఉన్న మరో వ్యక్తితో చెరో పాత్రగా lesson లోని సంభాషణను practise చేయండి. ఆ తర్వాత పాత్ర మార్చి మళ్లీ practise చేయండి.
- ఈ 400 lessons లోని సంభాషణలు (at the beginning of each lesson) నిత్య జీవితంలోని దాదాపు అన్ని సందర్భాల గురించి ఉన్నాయి. ఈ dialogues మీరు అధ్యయనం చేయడం వల్ల, పలకరింపు/ కుశలమడిగే మాటల దగ్గర్నుంచి, చాలా సంక్లిష్ట సందర్భాల్లో (complex situations) దాకా వాడే simple (సరళమైన), natural (సహజమైన) spoken English forms మీ English conversation లో భాగమవుతాయి. Then you can speak English with ease. (సౌలభ్యంతో. ప్రయత్నం చేసి మాట్లాడినట్లుకాకుండా).
- చాలా lessons లో ఇచ్చిన vocabulary (పదసముదాయం/ మాటలు) మన నిత్య జీవితంలో తరచూ వాడేవే English లో. వాటిని కూడా మరోసారి చూడండి.
- Voice (Active & Passive), Degrees of comparison, Direct and Indirect speech- వీటిని grammar exercises గా practise చేయకండి. అవసరమైనపుడు సందర్భానికి తగినట్టుగా వాటిని ఎలా వాడాలో తెలియపరిచాం. వాటిని అలాగే practise చేయండి. మీరు ఒక రకం sentence వాడి వాటిని ఇంకో రకం sentence (voice, degrees, direct & indirect speech) లోకి మార్చేందుకు ప్రయత్నించవద్దు. Situation నుబట్టి ఏ type of sentence suitable అవుతుందో దాన్ని వాడండి.
- Get, give, take, see, put, do, talk, walk, sleep, make, hand, go, find, look, come, stand, buy, bring, know, pay, mind, hot, learn, want, mean లాంటి అతి సాధారణమైన మాటలతో వచ్చే expressions చాలావాటిని ఈ spoken English lessons లో సోదాహరణంగా ఏయే సందర్భాల్లో వాడొచ్చో తెలియజేశాం కదా? వాటన్నింటినీ practise చేసి మీ conversation లో భాగంగా చేసుకోండి. అప్పుడే మీ language simple గా conversational గా ఉంటుంది. (గ్రాంథికంగా, కృతకంగా కాకుండా). ముఖ్యంగా వివిధ సందర్భాల్లో వాడే expressions practise చేయండి. ముందు ముందు lessons లో English pronunciation, public speaking కు సంబంధించిన విశేషాలు తెలియజేస్తాం. వాటిని సాధన చేయండి.
- Most important: ఏ భాషయినా సరిగా మాట్లాడాలంటే clarity of thinking (ఆలోచనల్లో స్పష్టత) ఉంటే,clarity of speech (మాటల్లో స్పష్టత) ఉంటుంది. అందుకని స్పష్టంగా ఆలోచించడం నేర్చుకోండి.
- ఈమధ్య వస్తున్న vocabulary items అన్నీ కూడా చాలా సాధారణమైన మాటలు, కొద్దిadvanced level spoken English మాటలు. వాటి అర్థాల తోపాటు, వివరణ, వాటిని వాడిన sentences, వాటి pronunciation, వ్యతిరేకాలు (Antonyms) ఇస్తున్నాం. వీటితో మీ పదసంపద పెంచుకోండి. (Increase your word power).

ఇవీ సూచనలు. ఎప్పటిలాగే మీ సందేహాలు రాయండి. సమాధానాలు వస్తాయి, ప్రశ్నల సంఖ్య వల్ల కాస్త ఆలస్యం కావచ్చు. We wish all our readers a further period of purposeful spoken English course.

---

# She is a girl who you can always trust

**Chakora:** Chakita is the girl who told me about it. (నాకీవిషయం చెప్పిన అమ్మాయి చకిత)

**Champa:** She is the girl who saw it all happen. So what she told you must be correct. (జరిగింది చూసింది తనే. కాబట్టి ఆమె చెప్పింది correct గానే ఉండాలి.)

**Chakora:** The information I had had earlier was different. So you say Chakita's information is more reliable. (అంతకుముందు నాకు తెలిసిన సమాచారం అందుకు భిన్నంగా ఉంది. అయితే నువ్వు చకిత ఇచ్చిన సమాచారమే నమ్మదగిందంటావు.)

reliable = రిలయబుల్ = ఆధారపడదగిన/ నమ్మదగిన

**Champa:** Yea. It is. (Do) you know she is a girl who you can always trust. (అవును. అంతే. తను నమ్మదగిన అమ్మాయి అని నీకు తెలుసా?)

**Chakora:** I do, of course. But isn't she the girl whose essay got the best prize in the last month's competition? (అది తెలియకేం? ఆ అమ్మాయి వ్యాసానికేగదా గత నెల వ్యాసరచన పోటీల్లో ఉత్తమ బహుమతి వచ్చింది?)

**Champa:** That's right. She got a cash prize of Rs.15000/-. With it she bought the necklace she wears now. (అవును. 15000 రూపాయల నగదు బహుమతి వచ్చింది. తనిప్పుడు వేసుకుంటున్న necklace ఆ డబ్బుతో కొన్నదే.)

**Chakora:** (She) must be a brilliant girl. (తెలివైన పిల్లే అయి ఉండాలి.)

**Champa:** Of course. She is.

☆ ☆ ☆ ☆



M.SURESAN

కాస్త advanced level (ఉన్నతస్థాయి)spoken English forms కొన్ని ఈ lesson లో చూద్దాం. (ఇంతకుముందు lessons లో ఈ forms ను కొంత తెలుసుకున్నాం.) రెండు sentences ను who, which, whose, where లాంటి మాటలతో ఎలా కలపవచ్చో తెలుసుకుందాం.

***Look at the following sentences from the conversation above.***

1) Chakita is the girl who told me about it.
2) She is a girl who you can always trust.
3) Isn't she the girl whose essay got the best prize in the essay competition.

**1) Chakita is the girl. She told me about it-** ఈ రెండు sentences నూ 'Who' వాడి పైన ఇచ్చిన sentence (1) లోలా కలుపుతాం.

Chakita is the girl who told me about it.

a) Gandhi was the leader. He preached peace and non violence (ఆ నాయకుడు గాంధీ. ఆయన శాంతి అహింసలు బోధించాడు.) ఈ రెండింటినీ 'Who' తో ఇలా కలపవచ్చు.
Gandhi was the leader who preached peace and non violence.

b) Sachin is the cricketer. He has the record for most runs.
= Sachin is the cricketer who has the record for most runs.

ఇంతకుముందు మనం తెలుసుకున్నాం కదా? Present day English (ఈనాటి English) లో whom దాదాపు అంతరించిపోయిందని, దాని బదులు కూడా Who నే వాడుతున్నామని. చూడండి:

The man who I met yesterday was my schoolmate. (నిన్న ఎవరినైతే కలుసుకున్నానో, అతడు నా schoolmate- మామూలు తెలుగు- నిన్న నేను కలుసుకున్నతను నా schoolmate. పాత English లో అయితే The man whom I met ... అని వస్తుంది. ముఖ్యంగా spoken English లో Whom ఇప్పుడు లేదు.) పై sentence ఈ కింది sentences ను కలపటం వల్ల వస్తుంది కదా?

I met a man yesterday. He was my schoolmate. (నిన్న నేనొకతడిని కలుసుకున్నాను. అతడు నా schoolmate)

**2) She is a girl who you can always trust.**

(= She is a girl + you can always trust her- ఆ అమ్మాయి నువ్వెప్పుడూ నమ్మదగిన అమ్మాయి). అయితే ఇలాంటి sentences లో who వదిలేసినా తప్పులేదు, simpler కూడా.

She is a girl who you can trust = She is a girl you can trust.

He is the leader (who) everyone admires. (admire = అభిమానించడం/ మెచ్చుకోవడం)

**3) Isn't she the girl?** + Her essay got the first prize = Isn't she the girl whose essay got the prize? ఎవరి (whose) వ్యాసానికైతే 1st prize వచ్చిందో, ఆమె ఈమే కదా? మామూలు తెలుగు- 1st prize వచ్చింది ఈమె వ్యాసానికే కదా?

a) He is the student whose books were stolen.
ఈ అబ్బాయి పుస్తకాలే ఎవరో దొంగిలించారు.

b) The man whose car was lost is my friend = ఎవరి కారైతే పోయిందో అతడు నా friend = పోయిన కారు నా friend దే.

ఇలా మనం who, whose, which వాడి sentences కలుపవచ్చు. ఇంకొన్ని విధాలు వచ్చే lesson లో.

---

## EXERCISE

**Match the words A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Accompany | A. fix |
| 2. Burden | B. agitate |
| 3. Dilemma | C. load |
| 4. Vice | D. go with |
| 5. Spin | E. wickedness |
| | F. turn |

## ANSWERS

**1-D. Accompany= go with** = (ఒకరితో) కలిసి వెళ్లడం.

Sita accompanied SriRama to the forests = అరణ్యవాసానికి సీత శ్రీరాముడితో (కలిసి) వెళ్లింది. Wherever he goes she accompanies him = అతనెక్కడికి వెళితే ఆమె కూడా అతనితో (కలిసి) వెళుతుంది.

Duties should accompany rights = హక్కులతోపాటు విధులూ ఉండాలి.

Pronunciation: అకంపని - కం నొక్కి పలుకుతాం.

Accompany x avoid (వదిలేయడం)

**2-C. Burden = load** = బరువు/ భారం.

The burden of the school bag is too heavy for the children to carry = స్కూలు సంచి పిల్లలు మోయలేనంత బరువు.

అయితే burden ఎక్కువగా బరువు, బాధ్యతలు అనే అర్థంతో వాడతాం.

He has the burden of educating his son and marrying off his daughter. తన కొడుకు చదువు, కూతురు పెళ్లి బాధ్యతల బరువు ఆయనపైనుంది.

He has a huge debt burden = ఆయనకు పెద్ద రుణభారం ఉంది.

**3-A. Dilemma = fix**; (Dilemma- డిలెమ - లె నొక్కి పలుకుతాం) = సందిగ్ధ/ అటో ఇటో తోచని పరిస్థితి.

We all know about Lakshmana's dilemma = లక్ష్మణుడి సందిగ్ధ పరిస్థితి మనకు తెలుసు- Whether to stay with Sita to protect her or obey her command to go in search of SriRama- సీతతోనే ఉండి ఆవిడను రక్షించడమా, లేకుంటే ఆవిడ ఆజ్ఞ ప్రకారం రాముడి కోసం వెళ్లడమా? అని.

The left parties are in a dilemma whether to support the nuclear deal or to get out of the coalition and face a mid term poll = వామపక్షాల సందిగ్ధస్థితి- అణు ఒప్పందం విషయంలో Congress ను సమర్థించడమా లేదా సంకీర్ణంనుంచి వైదొలగి మధ్యంతర ఎన్నికలకు సిద్ధమవడమా? అనే సందిగ్ధంలో ఉన్నాయి.

Fix అన్నా అదే అర్థం. మామూలు అర్థం - గుచ్చటం, బిగించటం, etc.

Dilemma x resolution (నిర్ణయం)

**4-E. Vice = wickedness** = దుర్మార్గం/ చెడు/ దుర్వ్యసనం. Vices ను ఎక్కువగా వ్యసనాలు అనే అర్థంతో వాడతారు.

A man of many vices = చాలా వ్యసనాలున్న వ్యక్తి.

Drinking, gambling (జూదం), sex లాంటివన్నీ vices. Drugs కూడా vice.

Indulge in vice = వ్యసనానికి లోనవడం/ వ్యసనాల పాల్పడటం.

He indulges in all vices = అతనికన్ని వ్యసనాలూ ఉన్నాయి.

Vice x virtue (సుగుణం).

Sita (Lord Rama's wife) was a woman of great virtue (సుగుణవతి). Truth, honesty - ఇవన్నీ virtues.

**5-F. Spin = turn** = గిరగిర తిరగడం (తన చుట్టూ తాను తిరగడం. A top (బొంగరం) spins = బొంగరం గిరగిర తిరుగుతుంది.

The Earth spins around its axis = భూమి తన చుట్టూ తాను (అక్షం = axis) తిరుగుతుంది.

Spin bowling = బంతి గిరగిరా తనచుట్టూ తాను తిరిగేట్లు bowl చేయడం. Spin అంటే తిప్పటం కూడా. Kumble spins.

**B. Agitate** = ఆందోళన చేయడం.

BCs are agitating for more reservations = BC వర్గాలు ఎక్కువ reservations కోసం ఆందోళన చేస్తున్నాయి.

**Agitate** = shake.

Be agitated = ఆందోళన చెందడం. We are agitated about the increasing number of kidnaps = Kidnaps ఎక్కువవడం వల్ల మనం ఆందోళన చెందుతున్నాం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

# I studied at that college ..

**Pradhan:** What are you reading?
(ఏం చదువుతున్నావు? )

**Pramukh:** (I am reading) the book (that) you gave me yesterday
(నిన్న నువ్విచ్చిన పుస్తకం)

**Pradhan:** Here is another book on the same subject. Read this too.
(అదే విషయంమీద ఇది ఇంకో పుస్తకం. ఇది కూడా చదువు)

**Pramukh:** Let me finish the one I am reading now.
(ఇప్పుడు నేను చదువుతున్న పుస్తకం పూర్తి చేయనీ.)

**Pradhan:** Pranav, whose book you are reading now, wants it back tomorrow.
(నువ్వు చదువుతున్నది, ప్రణవ్ పుస్తకం అది అతను రేపు కావాలంటున్నాడు)

**Pramukh:** I'm afraid I can't finish it so soon. Couldn't you ask him to let me have it for a few more days?
(అంత త్వరగా నేనది పూర్తిచేయలేనేమో. ఇంకొన్ని రోజులు ఆ పుస్తకాన్ని ఉంచుకోనిమ్మని అడగవా? )

**Pradhan:** The time for which he would let me have it was four days. The days that have passed are already six. It won't look nice to ask him for some more time. Any way I'll try. He may not mind it.
(అతను నన్నుంచుకోమన్నది నాలుగు రోజులే. అప్పుడే ఆరురోజులైపోయాయి. మళ్లీ ఇంకాస్త time అడగడం అంత బాగుండదు. అయినా ప్రయత్నిస్తా. అతనేమనుకోకపోవచ్చు.)

**Pramukh:** Is the book that you have better than this?
(నీ దగ్గరున్న పుస్తకం దీనికంటే బాగుందా? )

**Pradhan:** It is for the person who reads it to decide. In these matters everyone has their opinions.
(చదివేవాళ్లు నిర్ణయించుకోవాల్సిన విషయం అది. ఇలాంటి విషయాల్లో ఎవరి అభిప్రాయాలు వాళ్లవే.)

**Pramukh:** I do agree with you there. Tastes differ as rivers differ.
(నువ్వు చెప్పింది నేను ఒప్పుకొంటాను. నదుల నీళ్లలాగే మనుషుల అభిరుచులూ తేడాగా ఉంటాయి.)

tastes differ as rivers differ- (సామెత) = లోకోభిన్నరుచిః/ పుర్రెకోబుద్ధి, జిహ్వకోరుచి.

**Pradhan:** How do you find the book that you are reading now?
(నువ్విప్పుడు చదువుతున్న పుస్తకం ఎలా ఉంది? )

**Pramukh:** Quite interesting.
(బాగానే ఉంది/ పూర్తిగా ఆసక్తి కలిగించేదిగా ఉంది/ పూర్తిగా ఆసక్తి కలిగిస్తోంది)

**Pradhan:** But our friends Prakash and Prasad who read a lot of such books find it not so good.
(కానీ ఇలాంటి పుస్తకాలు చాలా చదివే మన మిత్రులు ప్రకాష్, ప్రసాద్‌లకు అంతగా నచ్చలేదు)

**Pramukh:** Yea. That reminds me. I met them yesterday at the book shop where good second hand books are sold.
(ఆ. గుర్తొచ్చింది. మంచి second hand books అమ్మే ఆ shop లో కలుసుకున్నాను.)

**Pradhan:** When exactly did you meet them?

**Pramukh:** Just at the time when you left me for home
(Correct గా నువ్వు నా దగ్గరనుంచి ఇంటికి వెళ్లిపోయినప్పుడు.)

**Pradhan:** I see.
(అలాగా)

✪ ✪ ✪ ✪ ✪





M.SURESAN

కిందటి lesson లో రెండు sentences కలిపేందుకు Who, whose, which, that, లాంటి మాటలు ఎలా ఉపయోగపడతాయో చూశాం. ఇది కాస్త advanced stage of conversational aspect. అంటే కొంచెం పైస్థాయికి సంబంధించింది. మనం సంభాషించేటప్పుడు spoken English లో ఎప్పుడూ చిన్నచిన్న sentences వాడుతూ ఒక విషయం చెప్పలేం కదా? అలా చెప్పినా ఏదో చిన్న పిల్లలు మాట్లాడినట్లుంటుందేకాని, అంత పరిపక్వత ఉన్నట్టుండదు.

Sunil was here yesterday. He is my classmate. ఇలా అనడంలో తప్పులేదు. అయితేspoken language లో ఇలాంటి చిన్న sentences ను ఒకటిగా కలిపి మాట్లాడితే ఇంకా బాగుంటుంది, ఇలా...

Sunil who was here yesterday is my classmate.
(నిన్న ఇక్కడ ఉన్న sunil నా classmate)

ఇంతకుముందు మనం చూశాం. ఇలాంటి చిన్నచిన్న sentences ను కలిపేందుకు మనం who, which, that, whose, where and when వాడొచ్చు. ఇది మనం practise చేసి వాడగలిగితే మన conversation కు ఇంకా నిండుదనం వస్తుంది. అలాంటివి మనం ఈ lesson లో చూద్దాం:

***Look at the following sentences from the conversation above:***

*1) I am reading the book that you gave me yesterday.*
*2) Let me finish the one I am reading now.*
*3) Pranav whose book you are reading now wants it back.*
*4) The time for which he lent me this book was four days.*
*5) The days that have passed are six.*
*6) It is for the person who reads it to decide.*
*7) I met them at the book where good second hand books are sold.*

**1) I am reading the book=**
నేను పుస్తకం చదువుతున్నా.
ఏ పుస్తకం? - That you gave me yesterday.
నువ్వు నిన్న ఇచ్చిన పుస్తకం. ఇక్కడ That కు బదులు which వాడొచ్చు.

**2) Let me finish the book (that) you gave me yesterday-** ఇదికూడా పై sentence లాగే రెండు sentences కలిపే విధం.
ఇలాంటి sentences లో that కానీ which కానీ వాడొచ్చు. రానురాను that ఎక్కువ వాడుతున్నారు.

అయితే that/ which- రెండింటిని కూడా వదిలేయొచ్చు, అది best/ simple.
I have seen the movie (which/ that) you wanted me to see (that/ which omit చేయటం best)= I've seen the movie you wanted me to see.

**3) You are reading Pranav's book. He wants it back-** వీటిని కలుపుదాం-
నువ్వు ప్రణవ్ పుస్తకం చదువుతున్నావు. దాన్నతను కావాలంటున్నాడు- whose వాడదాం.
Pranav whose book you are reading wants it back.
a) Parasurama's guru was Siva. Parasurama could not bear Rama breaking Siva's bow.
whose (ఎవరిదైతే) తో కలుపుదాం:
Parasurama whose guru was Siva could not bear Rama breaking his bow.
bow= ధనుస్సు- తెలుసుకదా?

**4) The time for which he lent me this book was four days**= He lent me this book + The time was four days.

**5) The days that have passed are six**= Days have passed. They are six.

**6) It is for the person who reads it to decide it=** It is for the person to decide it. Which person- the one who reads it.

**7) I met them at the book shop + Good second hand books are sold=** I met them at the book shop where good second hand books are sold.

**8) I studied at that college + You are talking about it=** You are talking about the college where (in which) I studied = నువ్వు మాట్లాడుతున్నది నేను చదువుకున్న college గురించే.

ఇలా రెండు sentences ను కలపటం బాగా practise చేయండి.

## EXERCISE

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Clout | A Metal ware |
| 2. Wield | B Rent |
| 3. Hardware | C Slow |
| 4. Reign | D Handle |
| 5. Lease | E Rule |
| | F Power |
| | G split |

**KEY: 1-F. Clout= Power=** సత్తా (శక్తి, పలుకుబడి- ముఖ్యంగా రాజకీయాల్లోనూ, బాగా డబ్బుండటం వల్ల వచ్చే శక్తి, పలుకుబడి).
Kumar has the clout to get the contract= contract పొందగల శక్తి (సత్తా), పలుకుబడి (influence) కుమార్‌కున్నాయి.
YSR's opinions carry a lot of clout with congress high command including Sonia Gandhi= సోనియాగాంధీ సహా congress అధిష్ఠానవర్గాన్ని ప్రభావితం చేయగల సత్తా YSR కు ఉంది.

**2-D. Wield= Handle** (verb)= (1) (ఏదైనా వస్తువును) మన అదుపులో ఉంచుకోగలగడం.
A Boy of ten years cannot wield a motor cycle= పదేళ్ల కుర్రాడు motor cycle ను అదుపులో ఉంచుకోలేడు/ handle చేయలేడు (ఆ బారాన్ని మోసి, దాన్ని అదుపులోకి తెచ్చుకునే శక్తి అతనికి ఉండదు)= A bike is unwieldy for a ten year-old boy.
The teacher found the class unwieldy because it had about a hundred students= వందమంది విద్యార్థులున్న ఆ class ఆయన control చేయలేకపోయాడు.
(2) YSR wields a lot of clout in congress
(ఇక్కడ wield= అధికారంలాంటివి చలాయించడం)= Congress లో YSR చాలా అధికారాన్ని చలాయిస్తాడు.
unwieldy X manageable

**3-A. Hardware= Metal ware=** ఇనుములాంటి లోహాలతో తయారయిన వస్తువులు, పనిముట్లు, పరికరాలు- ముఖ్యంగా గృహనిర్మాణానికి, యంత్రసామగ్రికి సంబంధించిన వస్తువులు. ware= వస్తువు/ వస్తువులు.
(2) Computer లోని యంత్ర electronic భాగాలు. (X software = Computer ను వాడేందుకు ఉపయోగించే programs, etc.)

**4-E. Reign= Rule.**
Reign- (pronunciation- రెయిన్)= పాలన/ పాలనాకాలం.
Srikrishnadevaraya's reign is known for its peace and prosperity= శ్రీకృష్ణదేవరాయల పాలన శాంతి, సౌభాగ్యాలకు పేరొందింది.
During the reign of Congress = Congress పాలనలో.

**5-B. Lease= Rent.** దీర్ఘకాలిక అద్దె (భూములు, భవనాల్లాంటి వాటిని ఎక్కువ కాలానికి అద్దెకివ్వడం/ అందువల్ల వచ్చే అద్దె/ బాడుగ/ కిరాయి)
a) He leased out his site to the factory= తన స్థలాన్ని factory కి అద్దెకిచ్చాడు.
b) The lease is for a period of ten years= అద్దెకాలం పదేళ్లు.
c) He gets a lease of Rs. 10000 a month= నెలకు పదివేల అద్దె.
lease= కౌలు (పొలాన్ని కౌలుకివ్వడం).
lease holder= అద్దెకున్నవారు/ కౌలుదారు= tenant.
A second lease of life= మరణాంతక ప్రమాదం నుంచి బయటపడటం/ కోలుకోవడం.
He narrowly escaped death= త్రుటిలో చావు తప్పించుకున్నాడు.
He has a second lease of life= మళ్లీ జన్మ ఎత్తినట్లే.

**G. Split**= చీలడం.
The party split in two= Party రెండుగా చీలింది. (split- split- split).



**ప్రశ్న:** *1. Your invitation has been rather at a short notice.*
*2. I would rather they all would.* ఇక్కడ rather కు అర్థం ఏమిటి?
*3. Presume* ఎలా ఉచ్చరించాలి?
**– బి.శారద, ఏలూరు**

**జవాబు:** 1) Rather= కాస్త/ కొంచెం ఎక్కువ/ (మనకు ఇబ్బంది కలిగించేంత/ మనకిష్టంలేనంత)
Your invitation has been rather at a short notice= మీ పిలుపునకు మేం స్పందించటానికి వ్యవధి కాస్త తక్కువ= మమ్మల్ని మీరు పిలిచిన సందర్భానికి, మేం తయారై రావడానికి time సరిపోకపోవచ్చు
2) I would rather= I'd rather- ఇక్కడ rather అంటే కోరుకోవడం= ఒకదానికంటే ఇంకోదాన్ని ఎక్కువ ఇష్టపడటం.
I'd rather have coffee than tea=
నేను tea కంటే coffee ని ఎక్కువ ఇష్టపడతాను.
3) Presume- pronunciation- ప్రిజ్యూమ్- 'జ్యూ' size లో జ లా. 'జ్యూ' నొక్కిపలుకుతాం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 402

# He agreed with me

## idiomatic usage



**Q:** *Kindly clarify about the idiomatic usage of the verb 'agree'. We say, a) We agree with you, b) We agree to your proposal, c) We agree on the dates fixed.*

*We do not have a clear idea about the context in which these form of the idiom should be used.*

***- S. Sivaprasad, Machilipatnam***

**A:** Agree తర్వాత వచ్చే preposition, దాని అర్థాల తేడాను బట్టి ఉంటుంది.

1) Agree= ఏకీభవించడం/ ఏకాభిప్రాయం ఉండటం. ఈ అర్థంతో అయితే Agree with somebody.
He agreed with me about the need to hold a meeting = సమావేశం అవసరమనే విషయంలో అతడు నాతో ఏకీభవించాడు/ అతడి, నా అభిప్రాయం ఒకటే.
(Agree + with people)

2) Agree = ఒప్పుకోవడం/ అంగీకరించడం, ముఖ్యంగా ఒక విషయం మనకిష్టంలేనప్పుడు, అది మనకు మొదట నచ్చనప్పుడు, Agree to something.
a) The management agreed to the postponement of its decision = తన నిర్ణయాన్ని వాయిదా వేసుకునేందుకు యాజమాన్యం అంగీకరించింది. (Agree to + an idea/ proposal)
b) The management may not agree to a reduction in the hours of work = పని గంటలు తగ్గించడానికి యాజమాన్యం అంగీకరించకపోవచ్చు
c) After some argument, he agreed to pay what I had wanted = కొంత వాదం తర్వాత నేనడిగినంత చెల్లించేందుకు అంగీకరించాడు.
agree + infinitive (Agree to go; Agree to pay, etc)

3) Agree= (ఇతరులతో) ఒక అంగీకారానికి రావడం (కొంత చర్చ తర్వాత).
We agreed on the 29th as the date of the meeting = సమావేశం 29వ తేదీగా నిర్ణయించుకున్నాం/ ఒక అంగీకారానికి వచ్చాం.

4) If two or more reports about an incident are the same, they agree with each/ one another = ఒకదానితో ఒకటి సరిపోవడం
a) The information I received does not agree with your report of it = నాకు వచ్చిన సమాచారం, నువ్విస్తున్న report ఒకటిగా లేదు.
b) His story agrees with what the police have said = అతడి కథ, police లు ఇచ్చిన సమాచారం ఒకటిగానే ఉంది.

5) Agree with something = ఒక విషయాన్ని ఆమోదించడం/ సమ్మతించడం.
a) Do you agree with death punishment = నువ్వు మరణశిక్షను ఆమోదిస్తావా?

## funeral & cremation

**Q:** *1) Dictionary - Thesaurus తేడా ఏమిటి?*
*2) I came to read "సచివాలయంలో నక్సల్స్ రెక్కీ". What is రెక్కీ? దాని spelling ఏమిటి?*
*3) 'I take privilege' - privilege usage తెలుపగలరు.*
*4) I have read in the Hindu "36 foot Ganesh idol". We have to use feet. But here foot is used, why?*
*5) Difference between funeral & cremation.*
*6) Difference between cool & cold.*
*7) Difference between marriage & wedding.*

***- P. Sreenivasarao, Pithapuram***

**A:** 1) A dictionary gives the definitions, meanings, and explanations of words. A thesaurus gives lists of synonyms without detailed explanation.

2) ఇది మంచి question. British English, Recce (రెకె) తెలుగులో రెక్కీ అని వాడుతుంటారు. Reconnaissance (రికానిసెన్స్- కా నొక్కి పలుకుతాం) కు British short form Recce, American English, Recon. వీటికి అర్థం శత్రువు స్థావరాలు, శక్తి సామర్థ్యాలు, కదలికలకు సంబంధించిన సమాచారం సేకరించడం, దాడిచేసే ఉద్దేశంతో. Naxals/ Maoists conduct recce (reconnaissance) about their targets (వాళ్ల లక్ష్యంగా ఎంచుకున్న మనుషుల గురించి)

3) 'Privilege' in sentences like, "I feel it a privilege .../ I have the privilege .../ I take it (as) a privilege ...". (we don't say, I take the privilege ...) something of which you feel proud and lucky (మనం గర్వంగా, అదృష్టంగా భావించేదైనా privilege)

4) 36 foot Ganesa idol is correct. We say, "The idol is 36 feet tall" or "It is a 36 foot tall idol". He is six feet tall= He is a six foot tall man. That is the accepted usage.

5) A funeral is the religious ceremony or ceremonies performed at the death of a person. Cremation is the burning of a dead body as different from burial which means laying the body underground.

6) Cool- comfortable- anything cool gives us comfort and is pleasant. 'Cold' makes us feel uncomfortable. Cool water is what we like to drink, where as cold water is not pleasant to drink. Cool = చల్లని, cold = చలిగా ఉన్న/ చల్లబడిపోయిన. (The coffee has gone cold, I can't drink it)

7) Marriage is the union of a man and a woman resulting in their living together as a husband and wife. Wedding is the religious ceremony at which a man and a woman marry each other. Marriage is also their legal relationship. He married her is more common than he wedded her. Wedded the meaning of married is out dated.

## intransitive verbs

**Q:** *1. Principal verb గా be forms (am, is, are, was, were) లను ఎన్ని విధాలుగా ఉపయోగించవచ్చు?*
*2. Transitive, Intransitive verbs గురించి వివరించండి.*
*3. నాకు ఇంగ్లిష్ సరిగా రాదు- ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?*

***- P. Sivanagaraju, Musunuru***



M.SURESAN

**A:** 1) Principal verb ను అర్థాన్ని బట్టి, time of action (Tense) నుబట్టి ఎన్నిరకాలుగానైనా వాడొచ్చు)

2) Transitive verb అంటే, object ఉన్న verb. ఎవరిని? దేనిని? అనే ప్రశ్నకు సమాధానం వచ్చే verb. He sees me every day. Verb- sees= చూస్తాడు/ కలుస్తాడు, ఎవరిని? Ans: me. కాబట్టి see transitive (object ఉన్న) verb.

Intransitive verb- object లేని verb. అంటే ఎవరిని? దేనిని అని ప్రశ్న వేస్తే answer రాని verb.
go there every day. Verb- go = వెళ్లడం- ఎవరు వెళ్లడం? / దేనికి వెళ్లడం? Answer రాదు కదా? అందుకని go, intransitive verb.

3) I don't know English well./ I am not good at English/ poor at English.

## simple, complex, compound

**Q:** *కింది simple, complex and compound sentences తెలుగు అర్థాలు తెలియజేయండి.*

*1. In spite of his poverty, he is honest. (simple)*
*Though he is poor, he is honest. (complex)*
*He is poor, but he is honest. (compound)*
*2. Owing to illness, he was absent.*
*As he was ill, he was absent.*
*He was ill and so he was absent.*
*3. Incase of working hard, you will pass.*
*If you work hard, you will pass.*
*You must work hard, and then you will pass.*
*4. Incase of not working hard, you will fail.*
*Unless you work hard, you will fail.*
*You must work hard otherwise you will fail.*
*5. He came in order to talk to me.*
*He came, so that he could talk to me.*
*He came and talked to me.*
*6. Soon after his arrival we left.*
*As soon as he come, we left.*
*He came and at once we left.*
*7. On seeing/ having seen the police, the thief ran away.*
*When the thief saw the police, he ran away.*
*The thief saw the police and he ran away.*

***- A. Sudhakar, Bhiknoor***

**A:** మీరు 7 sets of simple, complex and compound sentences రాశారు. ప్రతి set లోనూ అందులో ఉండే simple, compound, complex sentences ల అర్థాలు ఒకటే కదా. అయితే వాటిల్లో వచ్చే phrase లు, conjunctions లూ తేడా అవచ్చు కాని అర్థం ఒకటే.

**Set 1:** 1) In spite of = అయినప్పటికీ = 2) though = అయినప్పటికీ = 3) but = అయితే/ కానీ.
**Set 2:** 4) Owing to = అందువల్ల = 5) As = ఎందువల్లనంటే = 6) and so.
**Set 3:** 7) In case of = ఆ పరిస్థితిలో = 8) If =అలా అయితే = 9) and then = అయినప్పుడు
**Set 4:** 10) In case of = 11) unless = అయితే తప్ప = 12) Otherwise = లేకపోతే
**Set 5:** 13) in order to = అందుకు = 14) so that = అందుకోసం = 15) and = అందుకు తోడు.
**Set 6:** 16) soon after = వెంటనే ఆ తర్వాత = 17) as soon as = 18) at once = వెంటనే
**Set 7:** 19) on seeing = having seen = చూడటం వల్ల = 20) when = అప్పుడు = 21) and = మళ్లీ.

## Jointly/ together

**Q:** *1) సంయుక్తంగా, పాడిపరిశ్రమ, అతిశయోక్తి- ఈ పదాలకు ఇంగ్లిష్ మాటలేమిటి?*
*2) కింది మాటలకు తేడాలు వివరించండి.*
*Climate - Weather Test- Examination*
*Invention - Discovery Anthem - Song*
*Elementary - Primary*
*3) Date of birth ను Christian era లో ఎలా రాయాలి?*
*4) W.e.f. పూర్తి రూపం ఏమిటి?*
*5) పెళ్లి రోజున, రిసెప్షన్ రోజున వధూవరులను ఇంగ్లిష్‌లో ఏమని అభినందించాలి?*

***- Challa Devadas, Vemulapadu***

**A:** 1) సంయుక్తంగా = Jointly/ together
పాడిపరిశ్రమ =Dairy industry
అతిశయోక్తి= Exaggeration

2) Climate = ఒక ప్రదేశపు సంవత్సరపు సగటు శీతోష్ణస్థితి (ఎండ, వాన, చలి, తేమ, పరిస్థితి- సంవత్సరం పొడవునా)

♦Weather- ప్రదేశపు ఒకరోజు శీతోష్ణస్థితి.

♦Test, Exam అంత పెద్దదీ, ముఖ్యమైందీ కాదు. Test ఒక్కోసారి exam కు బదులుగా గానీ, exam కు అదనంగా గానీ నిర్వహించే పరీక్ష. అంతకంటే ముఖ్యమైన తేడా. ఒక విద్యార్హత qualification పొందడానికి రాయాల్సింది, exam మాత్రమే కానీ, test కాదు. Modern English లో examination కు బదులు exam వాడతారు. examination చాలా గ్రాంథికం. ఇప్పుడు అంత వాడుకలో లేదు, India లో తప్ప.

♦**Invention**- ఏదైనా కొత్తగా సృష్టించడం. Computer, TV, cell phone- ఇవన్నీ Inventions - లేని వాటిని సృష్టించడం.

♦**Discovery**- ఉన్న దానిని కనుక్కోవడం, మొదటిసారిగా చూడటం, అర్థం చేసుకోవడం.

♦**Anthem**- గీతం- ఒక దేశానికీ, జాతికీ, ఓ సంస్కృతికి చెందిన ప్రజలకూ ప్రత్యేక ప్రాముఖ్యం ఉన్న పాట, ప్రత్యేక సందర్భాల్లో మాత్రం పాడేది. 'జనగణమన' మన జాతీయ గీతం- national anthem (National song అనం).

♦**Song** అంటే ఏ పాటైనా.

♦**Elementary**- ప్రారంభదశలో ఉన్నా (ముఖ్యంగా విద్య)elementary questions - మౌలికమైన - మొట్టమొదటి.

♦**Primary**- ప్రాథమికమైన/ ముఖ్యమైన విద్య విషయంలో Elementary education (American) = Primary education (British) = education for people from 5 years to 11 years old.
This is of primary importance = అతి ముఖ్యమైన విషయం.

3) మనం ఇప్పుడు రాస్తున్నదే Christian Era. ఒకరి date 12'3'1987 అయితే అది Christian Era. ఇపుడు మనం ఉన్నది 2007 Christian Eraలోనే.

4) With effect from- ఏదైనా అమల్లోకి వచ్చే తారీఖు/ నెల/ సంవత్సరం

5) i) Wish you a long and happy married life.
ii) May yours be a long and happy married life.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# A doctor who specialises in heart diseases


M.SURESAN

**Sugandhi:** (Do) you remember Sunayana? She brought me a dress from Singapore.
(సునయన గుర్తుందా? తను నాకు సింగపూర్ నుంచి dress తెచ్చింది.)

**Supushpa:** (Do) you mean your childhood friend? She lives in Kolkota. Isn't that the one?
(నువ్వనేది నీ చిన్ననాటి స్నేహితురాలిని గురించి కదా? తను కోల్‌కతాలో ఉంటుంది ఆమే కదా?)

**Sugandhi:** Yes. That she is. She is coming home to tea with me. How about joining us?
(అవును. తనే అది. మా ఇంటికి టీకి వస్తోంది. నువ్వు కూడా రాకూడదా?)

**Supushpa:** I'm afraid I can't. The lecturer has given me an assignment. I have to complete it by tomorrow.
(నేను రాలేను, sorry. మన lecturer నాకో assignment ఇచ్చింది. నేను దాన్ని రేపటి లోపల పూర్తి చేయాలి.)

**Sugandhi:** My lecturer gave me an assignment as well. But I finished it yesterday itself.
(మా lecturer నాకూ ఇచ్చింది assignment. అయితే నేనది నిన్ననే చేసేశాను.)

**Supushpa:** You are a lucky girl. Your lecturer gives easy assignments.
(నువ్వు అదృష్టవంతురాలివి. మీ lecturer అన్నీ సులభమైన assignments ఇస్తుంది.)

**Sugandhi:** Last night you went to a movie. How was it? (నిన్న రాత్రి సినిమాకెళ్లావు. ఎలా ఉంది?)

**Supushpa:** You certainly missed it. It was really interesting. I went with two of my cousins. They really liked it.
(నువ్వు నిజంగా పోగొట్టుకున్నావు. మంచి సినిమాను. అది చాలా ఆసక్తికరంగా ఉంది. మా cousins ఇద్దరితో వెళ్లాను. వాళ్లకది నచ్చింది.)

**Sugandhi:** The director is Nirdesac. So it must have been good.
(దాని దర్శకుడు నిర్దేశక్ కదా. అందుకని బాగుండే ఉంటుంది.)

**Supushpa:** He has directed 4 movies so far. They have all been crowd pullers.
(ఇంతవరకూ నాలుగు చిత్రాలకు దర్శకత్వం వహించాడాయన. అన్నీ జనాకర్షకాలే.)

**Sugandhi:** Well, I must be going. I've to make arrangements.
(సరే. నేను వెళ్లాలిక. ఏర్పాట్లు చేయాలి.)

**Supushpa:** What arrangements?
(ఏం ఏర్పాట్లు?)

**Sugandhi:** I told you.
(చెప్పాను కదా?)

**Supushpa:** Oh now I remember. You are giving tea to Sunayana. You have to make arrangements for it.
(ఆ గుర్తొచ్చింది. సునయనకు tea ఇస్తున్నావు కదా. అందుకు నువ్వు ఏర్పాట్లు చెయ్యాలి.)

**Sugandhi:** Bye.

☺ ☺ ☺ ☺

కిందటి lesson లో రెండు మూడు sentences ను ఒకే sentence గా కలపడం చూశాం కదా- Who, which, that, whose, where, etc. వాడి. మరి కొన్నింటిని ఇప్పుడు చూద్దాం. ఇది కొద్దిగా కష్టం కాబట్టి మరింతగా practise చేయడం అవసరం.

**Look at the following pairs of sentences from the conversation above.**
(పై సంభాషణలోని కింది వాక్యాల జతలను చూడండి.)

1) *(Do) you remember sunayana? She brought me a dress from Singapore.*
2) *(DO) you mean your childhood friend? She lives in Kolkota.*
3) *The lecturer has given me an assignment. I have to complete it tomorrow.*
4) *You are a lucky girl. Your lecturer gives easy assignments.*
5) *Last night you went to a movie. How was it?*
6) *He has directed four movies so far. They have all been crowd pullers.*
7) *You are giving tea to Sunayana. You have to make arrangements for it.*

ఈ sentence pairs (వాక్యాల జతల) ను ఒకటిగా కలపడానికి ప్రయత్నిద్దాం: చూడండి:

**1)** (Do) you remember Sunayana. She brought me a dress from Singapore = (D0) you remember Sunayana Who brought me a dress from Singapore.
(Who వాడి రెండింటినీ కలిపాం కదా?)

**2)** (Do) you mean your childhood friend? She lives in Kolkota = Do you mean your childhood friend who lives in Kolkota?
(కోల్‌కతాలో ఉన్న నీ చిన్ననాటి నేస్తాన్ని గురించేనా నువ్వనేది?)

***This is how we use 'Who' to join two sentences. Some more examples.***

a) My friend took me to a doctor. He specialises in heart diseases = My friend took me to a doctor who specialises in heart diseases.

b) She is our classmate Surekha. She gets the top score in every subject = ఆమె మా classmate సురేఖ. ప్రతి subject లోనూ ఆమె top score తెచ్చుకుంటుంది - వీటిని ఒకే sentence గా: She is our classmate Surekha who gets the top score in every subject.

**3)** The lecturer has given me an assignment. I have to complete it by tomorrow. (Lecturer నాకో assignment ఇచ్చింది. రేపటికి నేనది పూర్తి చేయాలి.) ఈ రెండు sentences నూ ఇలా which వాడి కలపవచ్చు.

The lecturer has given em an assignment which I have to complete by tomorrow. (మనుషుల విషయమైతే who వాడతాం. వస్తువులకయితే which వాడతాం) ఇది కొద్దిగా ఆలోచిస్తే ఇంకో విధంగా కూడా కలపవచ్చు- second sentence తో begin చేసి.

I have to complete by tomorrow the assignment which the lecturer has given me. ఇలాంటి sentences లో which తీసేయొచ్చు. తీసేయడం better. చూడండి -

The lecturer has given me an assignment I have to complete by tomorrow/ I have to complete by tomorrow the assignment the lecturer has given me.

చూస్తున్నాం కదా పై రెండు sentences లో which లేదు. Which వాడేచోట that కూడా వాడవచ్చు ఇది కిందటి lesson లో గమనించాం.

**4)** You are a lucky girl. You lecturer gives easy assignments - ఈ రెండింటినీ కలిపేందుకు whose వాడతాం (ఎవరి లెక్చరర్ సులభమైన assignments ఇస్తుందో, వాళ్ళు మీరే/ అది నువ్వే - ఇది అసహజమైన తెలుగు- మామూలుగా మనం అనేది సులభమైన assignments ఇచ్చే lecturer ఉన్న అదృష్టవంతురాలివి నువ్వు)

a) He is the lucky guy. His essay got the first prize= అతడు అదృష్టవంతుడు. అతడి వ్యాసానికి మొదటి బహుమతి వచ్చింది = he is the lucky guy whose essay got the first prize = ఎవరి వ్యాసానికైతే మొదటి బహుమతి వచ్చిందో అతడే ఇతడు. మామూలు తెలుగు - తన వ్యాసానికి మొదటి బహుమతి పొందినతడు ఇతడు.

b) He is a great actor. His films are all popular = అతడు గొప్ప నటుడు, అతడి సినిమాలన్నీ ప్రజాదరణ కలవి. Whose తో join చేద్దాం.
He is a great actor whose films are all popular.

**5)** Last night you went to a movie. How was it? = నిన్న రాత్రి సినిమాకెళ్ళావు. ఎలా ఉంది? Let's join these two sentences. ఈ sentences ను రెండు విధాలుగా కలపొచ్చు

i) How was the movie to which you went last night?

OR

ii) How was the movie which you went to, last night?

తేడా గమనించండి (i) లో to which you went, (ii) లో which you went to అని వస్తోంది.

Sentence (i) ....to which you went అంత ఆమోదయోగ్యం కాదు. Modern English లో ఇది ఛాందసం. Which you went to last night? అనడం correct. అయితే రెండు sentences లోనూ which అనవసరం. Which తీసేసి కిందివిధంగా అనడం best.

How was the movie you went to last night? ఇది simplest కూడా.

అలాగే The grocery from which we buy our provisions is shut = The grocery which we buy our provisions from is shut = The grocery we buy our provisions from is shut.

grocery = కిరాణా కొట్టు ; provisions = కిరాణా సరకులు, పప్పులు, చింతపండు etc.

ఇక్కడ మనం చూడాల్సింది, buy తర్వాత shop ముందు వచ్చే preposition 'from' ఎక్కడా వదలం అని (దీన్ని గురించి) next lesson లో ఎక్కువగా తెలుసుకుందాం.)

**6)** He has directed four movies so far. They have all been crowd pullers

ఈ రెండింటినీ ఇలా కలపొచ్చు కదా?

He has directed four movies so far all of which have been crowd pullers. ఇదే అర్థం వచ్చేట్టు, ఇలా కూడా కలపవచ్చు, which వాడకుండా

The four movies he has directed so far have all been crowd pullers. [The four movies (which) he has directed so far have all been crowd pullers.]

a) He has copied his answer from a book. It is here = అతడు తన answer ను ఈ పుస్తకం నుంచి copy చేశాడు. అదిక్కడుంది. ఈ రెండింటినీ join చేస్తే,
The book from which he has copied his answer is here = The book he has copied his answer from is here (Which లేకుండా).

b) He kept his books in this bag. It is lying here (అతడు తన పుస్తకాలు ఈ bag లో పెట్టాడు. అది క్కడ పడి ఉంది) = The bag in which he kept his books is lying here = The bag he kept his books in is lying here (which లేకుండా).

**7)** You are giving tea to Sunayana. You have to make arrangements for it,
Which తో పై రెండూ కలుపుదాం.
You have to make arrangements for the tea (which) you are giving to sunayana.
He bought the House. His brother wanted to buy it too = He bought the house (which) his brother wanted to buy too. అతడు కొనాలనుకున్న ఇంటిని వాళ్ళ అన్న/ తమ్ముడు కొన్నారు.



**ప్రశ్న:** *V అంటే verb. $V_1$ = (verb1) = present tense. $V_2$ = (verb2) = past tense. $V_3$ = (verb3) = past participle. $V_4$ = (verb4) = present participle. పైన రాసినవన్నీ కరక్టేనా? వీటిని గురించి స్పష్టంగా వివరించండి.*

*– కె.కుటుంబరావు, వైరా, ఖమ్మం*

**జవాబు:** మీరు రాసినవి correct. V అంటే verb స్వరూపం, to go, to see etc. ఇవి infinitives. వీటి గురించి ఇంతకుముందు lessons లో చాలా వివరంగా తెలిపాం. చూడండి.

$V_1$= Present simple tense.
**e.g.:** go, goes, take, takes etc.
a) I go to the part once a week (go-v.)
b) She takes coffee in the mornings. (takes-$V_1$)
c) I went to the doctor yesterday (went-$V_2$)
d) She took milk this morning (took-$V_2$)

$V_3$- Past participle - e.g.: gone, taken లాంటివి. ఇవి verbs కావు, $V_1$, $V_2$ లాగ.
Past participle ముందు ఏదైనా 'be' form వస్తే అప్పుడు, be form + participle, verb అవుతుంది.
**e.g.:** The shop is closed (verb - is - be form + closed - past participle)- ఇలాంటి verbs passive voice లో ఉంటాయి. లేకుంటే Have/ has/ had/ shall have/ would have + past participle- ఇలాంటివి verbs అవుతాయి.
**e.g.:** He would have gone [verb-would have + gone (pp) ]

$V_4$= Present participle- going, coming లాంటి 'ing' forms. Past participle లాగ ఇవి- 'ing' forms (present participles) కూడా verbs కావు. వీటి ముందు 'be' form ఉంటేనే అప్పుడు, be form + ing form కలిపి verbs అవుతాయి.
He is going [verb-is(be)+ ing]
She is coming [verb-is(be)+ing]

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

**Visesh:** You are in a very smart shirt today. Where did you buy it?
(నువ్వు వేసుకున్న shirt చాలా నాజూగ్గా ఉంది. ఎక్కడ కొన్నావు?)

**Sasesh:** I usually buy all my clothes from smartdress. I bought this there as well.
(నా దుస్తులన్నీ నేను smartdress లో కొంటా. ఇది కూడా అక్కడే.)

**Visesh:** You were talking to a tall guy yesterday. Who was he?
(నిన్న నువ్వు పొడుగ్గా ఉన్న ఒకతడితో మాట్లాడుతున్నావు. ఎవరతడు?)

**Sasesh:** Don't you remember? He is Raghu. I spent my last summer with him. He is my distant cousin.
(గుర్తులేదా నీకు? కిందటి వేసవిలో అతడితోనే ఉన్నా నేను. నాకు దూరపు cousin అతడు.)

**Visesh:** Yea. I remember now. But why did you go to him? I usually remember something about his helping you.
(అవును. ఇప్పుడు గుర్తొచ్చింది నాకు. అసలు నువ్వు అతడి దగ్గరకు ఎందుకెళ్ళావు? అతడు నీకేదో సహాయం చేయడం గురించి అస్పష్టంగా గుర్తుంది నాకు.)

vague (= అస్పష్టమైన) X clear. (vague- వెయ్‌గ్)

**Sasesh:** You were out of town at the time. I had to spend time with someone. So I went to him. He is very good at a number of games. Chess is one of them. I learnt it from him.
(ఆ సమయంలో నువ్వు ఊళ్లో లేవు. ఎవరో ఒకరితో time గడపాలిగదా? అందుకని వాళ్ళూరు వెళ్ళాను. అతడు ఆటలు బాగా ఆడతాడు. వాటిలో chess ఒకటి. అతడి దగ్గర అది నేర్చుకున్నా.)

**Visesh:** I now understand why you play the game so well.
(ఇప్పుడు నాకర్థమయ్యింది నువ్వెందుకు chess అంత బాగా ఆడతావో.)

**Sasesh:** Have you seen the cricket bat at my place? He used to practise with it. He gave it to me.
(మా ఇంట్లో cricket bat చూసే ఉంటావు నువ్వు. అతడు దానితోనే practise చేసేవాడు. అది నాకిచ్చేశాడతడు.)

**Visesh:** Seems to be the good sort.
(మంచిరకంగానే (మంచివాడిలాగే) కనిపిస్తున్నాడతడు.)

**Sasesh:** He really is. He is one of the people who like company.
(నిజమే. ఇతరుల సాహచర్యం కోరుకునే వాళ్లలో అతనొకడు.)

**Visesh:** I like to meet him.
(అతడిని కలుసుకోవాలనుకుంటున్నాను.)

**Sasesh:** You will have the opportunity when he comes here next week.
(వచ్చేవారం అతనిక్కడికి వచ్చినప్పుడు నీకా అవకాశముంటుంది.)

⊙ ⊙ ⊙ ⊙

గత రెండు lessons లో మనం who, whose, which, that, where, when లతో రెండు sentences ను ఎలా కలపొచ్చో తెలుసుకున్నాంగదా? ఈ lesson లో కూడా మనం దాన్నే చూడబోతున్నాం అయితే కొంత తేడాతో.

ముందుగా మనం prepositions గురించి తెలుసుకున్నది (పాత lessons లో) బాగా గుర్తుకు తెచ్చుకోవాలి. గుర్తుంది కదా. Prepositions అంటే: above, after, along, at, before, between, by, down, for, from, in, into, like, near, of, off, on, out of, over, since, through, under, up, with, without లాంటి మాటలు.




## This knife we cut the fruit with..

వీటిని place, positions, time, or method తెలిపేందుకు nouns/ pronouns ముందు వాడతాం. వీటిని చాలా వివరంగా పాత lessons లో చూశాం.

Who, whose, etc. లతో రెండు మూడు sentences ను కలిపేటప్పుడు prepositions ఎక్కడ వాడాలనేది చాలా ముఖ్యమైన విషయం Modern Spoken English లో. Prepositions ను sentences చివర వాడటం ఇప్పటి వాడుక.

In which class are you? (నువ్వే class?)

ఈ sentence లో, preposition (prep) sentence ముందుంది కదా? అయితే Modern English (ముఖ్యంగా Spoken English) లో, sentence చివర వస్తుంది preposition, ఇలా.

Which class are you in? (నువ్వే class లో ఉన్నావు? / నువ్వే class?)


M.SURESAN

*1) You are in very smart shirt today. Where did you buy it? = Where did you buy the smart shirt you are in? (In చివర వస్తోంది కదా?)*

*2) I usually buy all my clothes from smartdress. I bought this there as well = I bought this from smartdress where I usually buy all my clothes from (from- prep)*

*3) You were talking to a tall guy yesterday. Who was he? = Who was the tall guy you were talking to, yesterday? (to- prep)*

*4) He is Raghu. I spent my last summer with him = He is Raghu, who I spent my last summer with. (with- prep)*

*5) I had to spend time with someone. So I went to him = I went to him to spend time with. (with- prep)*

a) Of which college are you a student? = నువ్వు ఏ college విద్యార్థివి? = b) Which college are you a student of? - (a), (b) లలో (b), (Preposition- 'of' చివర వాడింది) ఎక్కువ common.

నువ్వది ఏ shop లో కొన్నావు? = Which shop did you buy it from? (From which shop did you buy it? అనం)

అది కోసేందుకు నాకు చాకు కావాలి= I want a knife to cut it with. (with చివర వాడాం.)

ఇది గుర్తుంచుకోండి- ఇప్పుడు రెండు, మూడు sentences ను join చేసేటప్పుడు పై sentences లోలా preposition చివర వాడటం correct.

***Now look at the following pairs of sentences and observe how we can join them with the preposition in the end.***

*6) He is good at a number of games. Chesss is one of them = Chess is one of the number of games he is good at. (అతడికి బాగా వచ్చిన games లో chess ఒకటి)*

*7) Have you seen the cricket bat at my place? He used to practise with it = Have you seen at my place the cricket bat he used to practise with?*

చూశారు కదా, పై sentence pairs (వాక్యాల జతలను) కలిపినప్పుడు, preposition చివర రావటం. Spoken English లో ఇలాగే కలుపుతాం. ఇలా వాడితే మన conversation చాలా effective గా ఉంటుంది.

ఇంకో విషయం. పై pairs of sentences అన్నింటిలో కూడా, వాటిని కలిపేటప్పుడు which, that, whose, where, and when లాంటి మాటలు omit చేశాం కదా. ఇలా omit చేసే మరికొన్ని examples చూద్దాం, prepositions చివర వచ్చేట్లు.

**1)** We cut the fruit with this knife. It is very sharp. ఈ రెండింటిని ఇలా కలుపవచ్చు

a) This knife which we cut the fruit with (prep) is very sharp.

b) This knife we cut the fruit with is very sharp.

a) లో which వాడి కలిపాం. b) లో which లేకుండా కలిపాం. (b) లోలా కలపడమే బాగుంటుంది. సులభం కూడా.

**2)** I am looking for a stick. I want to beat the dog with it (నేను కర్ర కోసం చూస్తున్నా. దానితో కుక్కను కొట్టేందుకు)- వీటిని join చేస్తే:

a) I am looking for a stick which I want to beat the dog with.

b) I am looking for a stick I want to beat the dog with.

a) is more common and more accepted than (b).

ఇవి కొంచెం కష్టం. అందుకని బాగా practise చేయండి. వీలున్నంత English చదవండి.

### EXERCISE

**Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1. Hatch | A. Offend |
| 2. Rude | B. Dishonour |
| 3. Abuse | C. Quarrel |
| 4. Scandal | D. Impolite |
| 5. Dispute | E. Brood |
| | F. Refined |
| | G. Polished |

**KEY: 1-E. Hatch = Brood** = (పక్షులు) గుడ్లను పొదిగి గుడ్ల నుంచి పిల్లలు బయటకు వచ్చేలా చేయడం.

All the eggs have been hatched= అన్ని గుడ్లనుంచి పిల్లలు బయటకొచ్చాయి.

The eggs are about to hatch = గుడ్లలోంచి (గుడ్లుపెట్టే ఏ ప్రాణైనా) పిల్లలు బయటకు రాబోతున్నాయి, ఏ క్షణంలోనైనా.

To hatch (a plan) = ఏదైనా రహస్య పథకాన్ని/ కుట్రను రూపొందించడం.

Terrorists hatched the plan to kill MS Benazir Bhutto even before she returned to Pakistan = Benazir Bhutto పాక్‌కు రాకముందే తీవ్రవాదులు ఆమె హత్యకు కుట్ర పన్నారు.

**2-D. Rude = Impolite** = Ill mannered- ఇతరులపట్ల గౌరవ మర్యాదలు చూపకపోవడం/ మోటు/ మొరటుగా ప్రవర్తించే.

He was rude enough not to offer even a seat to his visitor = ఇంటికొచ్చిన అతిథిని కూర్చోమని కూడా చెప్పనంత మొరటు అతడు.

She told him rudely to get out = ఏమాత్రం మర్యాద లేకుండా అతడిని బయటకెళ్లమంది.

**Rude X Refined** (సంస్కారంగల)

**3-A. Abuse = Offend** = దుర్భాషలాడటం/ నోటికొచ్చినట్లు తిట్టి అగౌరవపరచడం.

The two cricketers abused each other and it took some time for the umpire to calm them- ఆ ఇద్దరు cricketer లు ఒకరినొకరు బాగా తిట్టుకున్నారు. వాళ్ళను సమాధానపరచేందుకు umpire కు కొంత సమయం పట్టింది.

He abused me for no fault of mine = నా నేరం ఏం లేకపోయినా నన్ను అతడు నోటికొచ్చినట్టు తిట్టాడు/ దుర్భాషలాడాడు.

**Abuse X Praise/ Commend** (మెచ్చుకోవడం)

Abuse కు ఇంకా అర్థాలున్నాయి. Spoken English లో ఇది తరచూ వాడతాం. మిగతా అర్థాలు తర్వాతి lesson లో.

**4-B. Scandal = Dishonour=** ఇతరులను దిగ్భ్రాంతపరచే చెడు ప్రవర్తన, చెడు వ్యవహారాలతో సంబంధం = scam.

Lalu Prasad Yadav was involved in the fodder scandal = పశువుల మేత కుంభకోణంలో లాలూప్రసాద్ యాదవ్‌కు సంబంధం ఉందంటారు/ ఇరుక్కున్నాడు = (involved)

Most Ministers are involved in some scandal or the other = చాలామంది మంత్రులు ప్రజలను దిగ్భ్రాంతపరచే చెడు ప్రవర్తన, దుశ్చర్యలతో సంబంధం ఉన్నవాళ్లు.

People in public service should guard themselves against scandals= ప్రజాసేవలో ఉన్నవాళ్ళెవరయినా దిగ్భ్రాంతికర దుశ్చర్యలతో సంబంధం లేకుండా జాగ్రత్తపడాలి.

**Scandal X Honour/ Glory** (=గౌరవం/ వైభవం)

**5-C. Dispute = Quarrel.** వివాదం.

Border dispute = సరిహద్దు వివాదం.

River waters dispute = నదీ జలాల వివాదం.

Nobody buys disputed property- వివాదాల్లో ఉన్న ఆస్తిని ఎవరూ కొనరు.

**Dispute X Agreement**

**G. Polished** = సంస్కారంగల/ good - mannered.

He is a polished young man = మంచి manners ఉన్న యువకుడు. (**Refined** దీనికి కూడా synonym).



**Q.** *i) Applications called for for the post of ... ఈ వాక్యంలో for రెండుసార్లు ఉపయోగించవచ్చా?*
*ii) Ex కు former కు తేడా ఏమిటి?*
***- A. Kiranmai, Hyderabad***

**A.** Applications called for, for the post of... ఇక్కడ for రెండుసార్లూ అవసరమే. మొదటి for, Applications కు- Applications called for = Applications which have been called for. రెండో for, for the post of = ఆ ఉద్యోగం కోసం.
ii) Ex= former- అర్థంలో ఉపయోగంలో తేడా లేదు.

**Q.** *Biodata, Resume కు తేడా ఏమిటి?*
***- GVSM Patnaik, Chinamerangi***

**A.** Biodata అంటే ఒకరి జీవిత వివరాలు- ముఖ్యంగా జీవితంలో సాధించిన వివరాల జాబితా. (విద్యార్హతలతో) మనం Job application లో తెలియపర్చేవి.
Resume (రెజ్యూమెయ్- జ్యూ, size లో జ్ లా) = మనం ఉద్యోగానికి apply చేసేటప్పుడు, మన application లో ఇచ్చే మన విద్యార్హతలు, ఇంతకు ముందు/ ఇప్పటివరకు చేసిన ఉద్యోగాల వివరాలు. Biodata కంటే Resume లో ఎక్కువ వివరాలిస్తాం. Resume లో ప్రతి వివరం ఇస్తాం.
Resume (American English) = Curriculum Vitae (CV) (British English)
Resume కు ఇంకో అర్థం- ఒకరి ప్రసంగం, వ్యాసం, etc లోని ముఖ్యాంశాలు/ summary.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






# SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 405



M.SURESAN

# Don't hangout here any longer

**Q.** *i) Assent, Consent;*
*ii) Astonished, Surprised;*
*iii) Avenge, Revenge;*
*iv) Bill, Act- ఈ పదాల అర్థభేదం వివరించగలరు.*
*– ఎం.రంగయ్య, ఇల్లందు*

**A.** i) Assent = అధికారంలో ఉన్నవారి అంగీకారం/ అంగీకారం తెలియజేయడం.

The president assented/ gave his assented to the bill passed by the parliament = Parliament ఆమోదించిన bill కు రాష్ట్రపతి అంగీకారం తెలిపారు.

❖ Consent= అనుమతి/ అనుమతించడం.

The father gave his consent/ consented to their marriage = వాళ్ల పెళ్లికి తండ్రి సమ్మతించాడు/ అనుమతించాడు.

రెండు మాటలూ గ్రాంథికమైనవే. పైన చెప్పిన సందర్భాల్లో మాత్రమే వాడతాం.

ii) Astonished, surprized- ఈ రెండింటికీ అర్థం ఆశ్చర్యపోవడం అనే. అయితే, surprized అంటే మనం అనుకోని ఘటన ఏదైనా జరిగినప్పుడు మనకు కలిగే భావం. Astonish అంటే surprize కంటే చాలా ఎక్కువ ఆశ్చర్యం- దిగ్భ్రమ కలిగించేది అని. అసలు ఊహించని విషయాలు జరగడంవల్ల కలిగే ఆశ్చర్యం.

❖ I was surprized at his presence there = అతనక్కడ ఉండటం చూసి ఆశ్చర్యపోయాను (అతనక్కడ ఉంటాడనుకోలేదు/ ఉన్నాడు).

❖ We were astonished at the six year old boy's memory and his ability to do complicated mathematics = ఆ ఆరేళ్ల బాలుడి అపూర్వ జ్ఞాపకశక్తి, ఏ సంక్లిష్టమైన లెక్కలైనా చేయగలగడం, మాకు దిగ్భ్రమ కలిగించింది. (Astonish = మనం రాయిలా, స్థాణువులా నిలిచిపోయేంత ఆశ్చర్యం).

## Avenge, Revenge

iii) Avenge - మనకు సంబంధించిన వారికి జరిగిన అన్యాయానికి మనం ప్రతీకారం సాధించడం.

eg: He avenged his father's death = తన తండ్రిని చంపినందుకు ప్రతీకారం తీర్చుకున్నాడు.

Parasurama avenged his father's killing by Karthaveeryarjuna by killing Kshatriyas = క్షత్రియులను చంపి తన తండ్రి కార్తవీర్యార్జునుడిని చంపినందుకు, పరశురాముడు ప్రతీకారం తీర్చుకున్నాడు.

❖ Revenge = మనకు జరిగిన అన్యాయానికి మనం ప్రతీకారం తీర్చుకోవడం.

Duryodhana took revenge on Pandavas because he felt insulted by Drowpadi = ద్రౌపది తనను అవమానించిందనే బాధతో దుర్యోధనుడు ప్రతీకారం తీర్చుకున్నాడు.

iv) Parliament/ Assemblies లో ఆమోదం పొందిన తీర్మానం- Bill. అది రాష్ట్రపతి/ Governor అంగీకారం పొందిన తర్వాత చట్టం- Act అవుతుంది.

**Q.** *Corporate పదానికి అర్థం ఏమిటి? Corporate hospital, corporate industries, corporate culture - వీటి అర్థాలు ఏమిటి?*
*2. Hang out అంటే అర్థం ఏమిటి? దీనిని వాక్యంలో ఎలా, ఏ సందర్భంలో ఉపయోగించాలి?*
*3. Men are from mars and women from venus - ఈ వాక్యం అర్థం ఏమిటి?*
*4. Side, Aside అర్థం, తేడా ఏమిటి? ఎలా ఉపయోగించాలి?*
***- Naaz Sultana, Hyderabad***

## Side, Aside

**A.** Corporate = ఒక పెద్ద వ్యాపార సంస్థకు సంబంధించిన. Corporate hospital = (ప్రభుత్వ/ ధర్మాసుపత్రుల్లా) సేవాదృక్పథంతో కాకుండా, వ్యాపారంగా లాభాపేక్షతో నిర్వహించే ఆసుపత్రి.

Corporate Industries = పెద్ద పెద్ద వ్యాపార సంస్థలు నిర్వహించే పరిశ్రమలు.

Corporate culture = వ్యాపార సంస్థల నమ్మకాలు, దృక్పథాలూ, సిద్ధాంతాలూ, working habits.

2. Hangout = ఒకచోటు నుంచి వెళ్లిపోకుండా అక్కడే తచ్చాడటం.

Get going. Don't hangout here any longer = ఇంకనడూ. ఏమాత్రం ఇక ఇక్కడ ఉండకు.

3. ఇది జోతిషంలోని మాట.
Mars = అంగారకుడు
Venus = శుక్రగ్రహం.

4. Side = పక్కన. Aside = ఒకరికి తెలియకుండా ఇంకొకరితో రహస్యాలు మాట్లాడటం.

He said this in an aside = ఇది నాతో అన్నాడు (ఇతరులకు వినిపించకుండా).

**Q.** *1. Each, every తేడా ఏమిటి?*
*2. It is useful to/ for me.*
*It is convenient to/ for me. etc. ఇలాంటి sentences లో to, for లలో ఏది రాయాలి? ఏదైనా రూల్ ఉందా?*
*3. He sold half of his property.*
*Half of the fruit is bad. ఈ వాక్యాలను of లేకుండా రాయొచ్చా?*
*4. Cotton clothes, iron box అంటాం కదా? Woollen clothes ను wool clothes, gold medal ను golden medal, wooden horse ను wood horse అనొచ్చా?*
***- T. Siva, Nandikotkuru***

## Each, Every

**A.** 1. Each అంటే ఓ group లో ప్రతి వస్తువూ/ ప్రతి వ్యక్తి (ఒక్కొక్క) అని. Every అంటే ఓ group లో అన్నీ/ అందరూ అని.

Each boy here has a book = ఇక్కడ ఉన్న ప్రతి అబ్బాయికీ ఓ పుస్తకం ఉంది.

Every boy here has a book= ఇక్కడ ఉన్న అబ్బాయిలందరికీ పుస్తకాలున్నాయి. ఇంకా చూడండి:

Each of them received a gift = వాళ్లల్లో ప్రతి ఒక్కరూ ఒక్కో బహుమతి పొందారు.

Every one of them received gifts = వాళ్లందరూ బహుమతులు పొందారు.

I saw each car pass by = ప్రతి car ఇలా వెళ్లడం/ ఇలావెళ్లిన ప్రతి car నూ చూశాను.

I saw every car pass by = ఇలా cars వెళ్లడం/ అన్ని cars ఇలా వెళ్లడం (అక్కడున్న అన్ని cars ఇలా వెళ్లడం) చూశాను.

2. Useful to somebody = ఒక వ్యక్తికి (to) ఉపయోగకరం, useful for something= ఒక విషయానికి ఉపయోగకరం (for)

a) Tools are useful to mechanics for their repairing work= మరమ్మతులు చేసేందుకు (for repairing work), పరికరాలు mechanics కు (to mechanics) ఉపయోగకరం.

b) This book is useful to you (నీకు/ వ్యక్తికి) for your research (నీ పరిశోధనకు/ ఒక విషయానికి)

Convenient for somebody for something

A car will be convenient for me for my movements = నేను తిరిగేందుకు car సౌకర్యంగా ఉంటుంది.

ఇలాంటి వాటికి rules ఉండవు, ఇవి వాడుక. చదవడంవల్ల, dictionary, grammar books సాయంతో తెలుసుకోవాల్సిందే.

3. Half of his property = Half his property- ఎలా రాసినా correct.

4. చాలా మంచి ప్రశ్న. Cotton, iron విషయంలో, వాటికి cotton/ iron తో చేసిన అనే అర్థమిచ్చే adjectives కూడా cotton, iron. అందుకని cotton cloth/ clothes, iron trunk, iron rod అంటాం.

Wool విషయంలో wool తో చేసిన అని అర్థం వచ్చే adjective, woollen అని వేరే ఉంది కాబట్టి woollen clothes అంటాం.

ఇక బంగారంతో చేసిన అని అర్థం, gold కూ ఉంది. Golden కూ ఉంది. అయితే మామూలు భాషలో బంగారపు అనే అర్థంతో gold ఎక్కువగా వాడుకలో ఉంది. బంగారపు అనే అర్థంతో golden అనే మాటను, ఎక్కువగా సాహిత్యంలో వాడతారు. బంగారంలాంటి (అత్యంత విలువ ఉన్న) అనే అర్థంతోనే (బంగారపు అనే అర్థంతో కాకుండా) golden, అనడం వాడుక (usage).

Wool, woollen లాగానే, wood, wooden. Wooden- చెక్కతోచేసిన- wooden furniture; wooden chair, etc. (wood work= చెక్కపని).

Wooden కు మరో అర్థం, ముఖంలో భావాలేమీ కనిపించని.

This actor's face is wooden = ఈ నటుడు తన మొహంలో భావాలేమీ చూపలేడు. (నటనరాదు).

Her delivery of dialogues is wooden = ఆమె (నటి) సంభాషణల్లో హావభావాలేం కనిపించవు. (Dialogues పలకడం చేతకాదు.)

**Q.** *English to Telugu to English కు dictionaries ఏ author వి అయితే బాగుంటాయో తెలియజేయండి.*
***- K. Vijay, Kadapa***

**A.** ఇప్పటికీ శంకరనారాయణ Telugu to English Dictionary, the best.

**Q.** *I request you to kindly let me know the Indirect speech for this: "Do you go to Agra this year?" she said to Kamala.*
***- A. Bunganna, Kurnool***

**A.** She asked Kamala if she would go to Agra that year.

## Whom - Who

**Q.** *1. Future tense లో ఉపయోగించే shall, will ల మధ్య తేడా వివరించండి.*
*2. Mayor కు feminine noun - Mayoress కదా! మరి విజయవాడకు lady ఉన్నప్పుడు mayoress అనాలి. Mayor అంటున్నారు. ఎందుకు?*
*3. Spoken English-367 lesson లో Who gave this news to you? అని చెప్పారు. అలా కాకుండా Who did give this news to you? అనకూడదా? వివరించగలరు.*
*4. The point is why you didn't tell this to me అని చెప్పారు. Question word తర్వాత helping verb రావాలి కదా? Why didn't you tell this to me అని రాయకూడదా?*
***- T. Vijayapal, Vijayawada***

**A.** 1. Shall, will తేడాలు చాలా వివరంగా ఇంతకు ముందు lessons లో ఉన్నాయి. చూడండి.

2. Mayor, actor, poet, etc లాంటి వాటికి feminine forms (Mayoress, actress, poetess, etc) ఉన్నప్పటికీ, Modern English లో వాటిని వాడటం లేదు. మగవాళ్లకైనా, ఆడవాళ్లకైనా ఒకే పదం వాడటం ఇప్పటి పద్ధతి. eg: She is a great singer (Songstress = గాయని వాడటం లేదు)

3. Who తో Question begin చేసినప్పుడు, దాని తర్వాత helping verbs like do, does & did రావు. ఇది who = ఎవరు అనే అర్థంతో వాడితే. ఇప్పటి English లో ఎవరిని, ఎవరికి, అనే అర్థంతో whom బదులు who వాడుతున్నాం. (Whom వాడకం ఇప్పటి English లో లేదు) who ను ఎవరిని ఎవరికి అనే అర్థంతో whom బదులు వాడితే అప్పుడు questions లో who తర్వాత do, does, did లాంటి మాటలు (helping verbs) వాడతాం.

Who gave it to you = నీకది ఎవరు ఇచ్చారు?

Who did you give it to? = నువ్వది ఎవరికిచ్చావు?

Who saw you there? = నిన్నక్కడ ఎవరు చూశారు?

Who did you see there? = నువ్వక్కడ ఎవరిని చూశావు.

4. The point is why you didn't tell this to me? ఈ sentence లో Why you didn't tell this to me, అనేది question కాదు కదా?

Why you didn't tell this to me అంటే ఇక్కడి అర్థం, నువ్వెందుకు నాతో చెప్పలేదనేది, అని అర్థం, Question కాదు కాబట్టి helping verb రాదు, రాకూడదు. The point is why you didn't .. అనడం correct.

Nobody knows where he is (అతనెక్కడున్నాడో ఎవరికీ తెలియదు)- .. where he is = ఎక్కడున్నాడో- question కాదుకదా. అందుకని Where is he అనం... Where he is అనడమే correct.

**Q.** *మీరు 19.08.2007 Spoken English లో Out of the six best in the class she is the top అని రాశారు. కానీ best అనేది ఎప్పుడూ ఒక్కటే ఉంటుంది కదా? (superlative) దాన్ని ఇలా చెప్తే బాగుంటుంది కదా? Out of the six top students in the class she is the best.*
***- P. Srinivas, Vegayammapeta***

**A.** Best అనేది ఒక్కటే ఉండాలని అనలేం కదా? One of the best అనేది వాడుకలో ఉంది కదా? He is one of the best students in the class అంటాం కదా? రెండోది, of the six top students, she is the best, అన్నప్పుడు గమనించాల్సిన విషయం- మామూలుగా top అంటే అన్నింట్లో గొప్పది/ అందరిలో గొప్పవారు అని కదా? అంటే సామాన్యంగా top అనేది ఒకరికే/ ఒక విషయానికే.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ




# The stench of corruption fills India

**Tejas:** Vihar, you've been searching for a book. Is this it?
(నువ్వు ఓ పుస్తకం కోసం వెతుకుతున్నావు. ఇదేనా అది?)

**Vihar:** That certainly it is. Where did you see it?
(కచ్చితంగా అదే. ఎక్కడ కనిపించింది నీకు?)

**Tejas:** You lent it to Vinai. He asked me to give it back to you.
(నువ్వది వినయ్‌కిచ్చావు. అతడు నీకు దీన్నిచ్చేయమన్నాడు.)
Here it is. (ఇదిగో)

**Vihar:** How forgetful of me. I lent the book to him. I clean forgot it.
(ఎంత మతిమరుపు నాకు! అతడికీ పుస్తకం ఇచ్చానని పూర్తిగా మరచిపోయాన్నేను.)

**Tejas:** What's the book about?
(దేన్ని గురించి పుస్తకం అది?)

**Vihar:** It's a wonderful book. It tells us how to develop self confidence.
(అద్భుతమైన పుస్తకం ఇది. ఆత్మవిశ్వాసం ఎలా పెంచుకోవాలో చెప్తుంది.)

**Tejas:** How about lending it to me for a few days?
(కొన్ని రోజులపాటు నాకాపుస్తకం ఇస్తావా?)

**Vihar:** Certainly, but let me finish it. This author has a son. He is famous too.
(తప్పకుండా. మొదట నన్ను దాన్ని పూర్తిచేయనీ. ఈ రచయితకొక కొడుకున్నాడు. అతను కూడా బాగా పేరున్నవాడే.)

**Tejas:** Does he write on the same subjects too?
(అతడు కూడా ఇదే విషయాల మీద రాస్తాడా?)

**Vihar:** He does. They are well known too.
(అవును. అతడి పుస్తకాలు కూడా బాగా పేరున్నవే.)

**Tejas:** Our lecturer Sambasiva Rao recommended their books to me. He also conducts training programmes on these subjects.
(వాళ్ల పుస్తకాలు చదవాలని మన lecturer Sambasiva Rao చెప్పారు. ఆయన కూడా ఈ విషయాల్లో శిక్షణ తరగతులు నిర్వహిస్తారు.)

**Vihar:** When do you think you can finish the book?
(పుస్తకాన్ని ఎప్పుడు పూర్తిచేయగలనని అనుకుంటున్నావు?)

**Tejas:** It is not just reading, you know. I have to study it and make notes. Just a few days. Let's say the weekend.
(అది కేవలం చదవటం కాదుకదా. దాన్ని బాగా పరిశీలించి చదివి notes రాసుకోవాలి. కొద్ది రోజులు. ఈ వారాంతం అనుకో.)

**Vihar:** OK then. But do let me have it.
(సరే. కానీ నాకా పుస్తకం మాత్రం ఇవ్వు)

***Look at the following sentence pairs from the dialogue above.***

*1) You've been searching for a book. Is this it?*
*2) You lent it to Vinai. He asked me to give it back to you.*
*3) I had lent it to him. I clean forgot about it.*
*4) It is a wonderful book. It tells us how to develop self confidence.*
*5) The author has a son. He is famous too.*
*6) He writes books on the same subject. They are well known too.*
*7) Our lecturer Sambasiva Rao recommended their books to me. He conducts training programmes on the same subject.*

ఇంతవరకు మనం Who, whose, which, that, when, where లతో రెండు sentences ఎలా join చేయొచ్చో చూశాం కదా?

ఈసారి అదే పద్ధతిలో కాస్త పొడుగాటి sentences ఎలా join చేయగలమో తెలుసుకుందాం. ఇలా join చేసేటప్పుడు, తెలుగులోని మొదటి sentence, English లో చివర రావచ్చు. ఇందుకు వ్యతిరేకమే అవచ్చు. మనం ఎలా join చేసినా అర్థం మాత్రం మారకూడదు. అది ముఖ్యం.


M.SURESAN

**1)** You've been searching for a book. Is this it? - book- inanimate (అచేతనమైన/ ప్రాణంలేని- అందుకని which తో join చేస్తాం.)
Is this the book which you've been searching for?
ఇంతకుముందు చూశాం. ఇలాంటిచోట్ల which వదిలేయొచ్చని.
Is this book you've been looking for.

**2)** You lent it to Vinai. He asked me to give it back to you.
ఈ రెండింటినీ, ఇలాంటి sentences ని కలిపేటప్పుడు కాస్త జాగ్రత్త అవసరం. కొద్దిగా కష్టం. చూడండి.
Vinai who you lent the book to, asked me to give it back to you.
Vinai who you lent the book to = Vinai to whom you lent the book - whom ఇప్పుడు ఇలా వాడటంలేదని, దానిబదులు who to అంటారని మనం చాలాసార్లు చూశాం.
A: I gave the book to Satish.
B: Who to? (To whom బదులు) = ఎవరికి?

**3)** I lent the book to him. I clean forgot about it = I clean forgot (that) I lent it to him.
(అతడికి పుస్తకం ఇచ్చాను. అది నేను మరచిపోయాను = అతడికి పుస్తకం ఇచ్చానని మరచిపోయాను)

**4)** It is a wonderful book. It tells us how to develop self confidence.
It is wonderful book which (that) tells us how to develop self confidence.
(ఇక్కడ మనం which/ that, వదిలేయడానికి లేదు. ఎందుకంటే, ఇక్కడ which/ that తెలిపేది, sentence subject గురించి.)
అదే sentence No.1 లో అయితే which/ that, book గురించి చెప్తాయి. ఇక్కడ book subject కాదు. అందుకని which/ that, వదిలేయొచ్చు

[I bought a pen yesterday. It is this. ఇక్కడ Pen, subject కాదు. అందుకని sentence ను కలిపేటప్పుడు which/ that omit చేయగలం.)
This is the pen which/ that I bought yesterday
= This is the pen I bought yesterday.

**5)** The author has a son. He is famous too = The author has a son who is famous too.
(ఇక్కడ కూడా who ముఖ్యం. Omit చేయటం కుదరదు.)

**6)** He writes books on the same subject. They are well known too.
ఈ రెండు sentences నూ He writes books on the same subjects which are well known too అని కలిపాం అనుకోండి. అప్పుడు which books గురించి చెప్పకుండా, దానికి దగ్గరున్న subject గురించి చెప్పినట్లవుతుంది. కాబట్టి ఇలాంటి సమస్య వచ్చినప్పుడు, which తో కలిపే పనేలేకుండా, and తో కలిపితే problem ఉండదు.
He writes books on the same subject and they are famous too. లేకుంటే which కావాలనుకుంటే, ఇలా కలుపుతాం.
The books (which/ that) he writes on the same subject are famous too.
(ఇక్కడ which/ that వదిలేయొచ్చు)

**7)** Our lecturer Sambasiva Rao recommended their books to me. He conducts training programmes on the same subject.
= Our lecturer Sambasiva Rao who recommended their books to me conducts training programmes on the same subject.
ఈ sentence pairs (వాక్యాల జతల)ను కలపడం కొంచెం కష్టమైనదే. అందుకని కాస్త practice అవసరం. మీరు join చేయలేకపోయినంత మాత్రాన అధైర్య పడనక్కరలేదు, చదువుతూ, practise చేస్తూ ఉంటే అదే వస్తుంది.

## EXERCISE I

**Join the following pairs of sentences using who, whom, whose, which/ that.**

**1)** He has two sons. They are the same height as he. (who)
**2)** There are two rooms upstairs. They have not been used for years. (which/ that)
**3)** Is that your teacher? His son left for the states last week. (whose)
**4)** A few attended the lecture. They found it interesting. (who/ that)
**5)** This pen is Ramesh's. He is not here now. (whose)

## ANSWERS

**1)** He has two sons who are the same height as he.
**2)** There are two rooms upstairs which/ that have not been used for years.
**3)** Is that your teacher whose son left for the states last week?
**4)** The few who attended the lecture found it interesting.
**5)** Ramesh whose pen this is is not here.

## EXERCISE II

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Braggart | A. Sideview (of head) |
| 2. Profile | B. Stink |
| 3. Deserve | C. Wish |
| 4. Stench | D. Earn |
| 5. Frown | E. Boaster |
| | F. Glare |
| | G. Outline |

**KEY: 1-E. Braggart = Boaster** = గొప్పలు చెప్పుకొనేవాళ్లు/ ప్రగల్భాలు పలికేవాళ్లు. Brag = Boast = ప్రగల్భాలు పలకటం/ గొప్పలు చెప్పుకోవడం.
Team India did not live up to its brag= భారత జట్టు తన ప్రగల్భాలు నిజం చేయలేకపోయింది.
Uttarakumara (the Mahabharatam) was a braggart/ boaster= భారతంలో ఉత్తరకుమారుడు ప్రగల్భాలమారి.
Each political party boasts of its achievement= ప్రతి పార్టీ తాను సాధించినదాని గురించి గొప్పలు చెప్పుకొంటుంది.

**2- A, G. Profile = Sideview (of head), Outline** పక్కనుంచి చూసినప్పుడు ఒక వ్యక్తి ముఖరేఖ (side-view of a person's head & face), (ఎదుటినుంచి చూసినప్పుడు కాకుండా).
NT RamaRao had an impressive profile = NT రామారావు మొహం (sideview) మనస్సును ఆకట్టుకునేది.
ఒకరిని/ ఒకదాని గురించి ముఖ్యమైన వివరాలు కూడా profile.
Let me have a profile of the company = ఆ కంపెనీ వివరాలు (దాని చరిత్ర సంక్షిప్తంగా) నాకు తెలుపు.
High profile = ప్రముఖమైన.
He is a high profile actor.

**3-D. Deserve= Earn**= అర్హత పొందడం.
Kumble deserves to be the captain = Captain గా ఉండేదుకు కుంబ్లేకు తగిన అర్హత ఉంది.
Most ministers don't deserve to be ministers = మంత్రుల్లో ఎక్కువమంది ఆ పదవులకు అర్హులుకారు.
(earn = ప్రతిభ, కృషి వల్ల అర్హత సంపాదించుకోవడం)
He deserves the punishment/ to be punished = అతడు ఆ శిక్షకు అర్హుడు.
undeserving = అర్హతలేని.

**4-B. Stench= Stink** = దుర్వాసన/ కంపు/ కుళ్లు కంపు.
The stench of the dead bodies at the place of the accident filled the air = శవాల దుర్వాసన (కుళ్లు, కంపు) తో నిండిపోయిందక్కడ గాలంతా.
The stench of corruption fills India = భారత్ అంతా అవినీతి కుళ్లుకంపుతో నిండి ఉంది.
The stench of something burning could be felt strongly = ఏదో కాలిన దుర్వాసన వస్తోంది.
**X** fragrance (సువాసన)

**5-F. Frown = Glare** =నొసలు చిట్లించి కోపం/ తీవ్ర అసమ్మతి తెలపడం.
The minute I turn on the TV, I see a frown on my dad's face = నేను TV on చేస్తే చాలు, మా నాన్న మొహంమీద నొసలు చిట్లింపుతో కోపం/ అసమ్మతి ఉంటాయి.
frown = కోపం, అసమ్మతితో నొసలు చిట్లించడం.
Elders frown at youngsters talking of love and sex = చిన్నవాళ్లు ప్రేమ, శృంగారం గురించి మాట్లాడటం పెద్దవాళ్లకు కోపం తెప్పిస్తుంది.
Glare = కోపంగా చూడటం.
He glared at me when I asked for more salary = ఎక్కువ జీతం అడిగినందుకు నావైపు కోపంగా చూశాడు. frown X smile.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ




# Has he come? Do you know?

**Ramesh:** Do you know if Jagadish is back from the US?
(జగదీష్ అమెరికా నుంచి తిరిగొచ్చాడా లేదా అనేది నీకేమైనా తెలుసా?)

**Naresh:** Of course he is. He landed in Chennai a few days ago. I don't remember exactly whether it was last Wednesday or Thursday, but he called me from Chennai one of those days.
(వచ్చాడులే. కొన్నిరోజుల కిందటే చెన్నైలో దిగాడు. బుధవారమో, గురువారమో గుర్తులేదు కానీ, ఆ రెండ్రోజుల్లో ఒకరోజు నాకు phone చేశాడు.)

**Ramesh:** He told us that he would get us some books from the US. Any idea if he has brought them or not?
(అమెరికా నుంచి మనకేవో పుస్తకాలు తెస్తానన్నాడు. తెచ్చాడా లేదా అనేదేమన్నా తెలుసా?)

**Naresh:** No. He said he would call you too. Didn't he?
(లేదు. నీకూ phone చేస్తానని అన్నాడు. చేయలేదా?)

**Ramesh:** He must have. I haven't had my cell about me for the past few days.
(చేసే ఉంటాడు. కొద్దిరోజులుగా నా cell నా దగ్గర లేదు.)

**Naresh:** Why? What happened?
(ఏమయింది?)

**Ramesh:** It hit the floor as it slipped from my pocket. The cell technician doubts if it can be repaired at all.
(నా జేబులోంచి జారి నేలమీద పడింది. అదసలింకా పనిచేస్తుందా అని ఆ cell technician కు అనుమానంగా ఉంది).

**Naresh:** I do not know if it is an expensive piece, but it is very nice to look at.
(అది ఖరీదైందా కాదా అనేది నాకు తెలియదు కానీ, చూడటానికి చాలా బాగుంటుంది).

**Ramesh:** You let it is expensive. I am not sure if I can get the same kind of piece again.
(కచ్చితంగా అది చాలా ఖరీదైందే. అలాంటిది ఇంకోటి దొరుకుతుందా అనే విషయం నాకు అనుమానమే)

**Naresh:** Don't worry. You can get much better pieces than that for a much less price. The market is flood with all kinds of cells.
(ఏం బాధపడకు. అంతకంటే తక్కువ ధరకు, అంతకంటే మంచి cell phones నీకు దొరుకుతాయి. అన్ని రకాల cell phones market లో వెల్లువెత్తుతున్నాయి.)

**Ramesh:** Help me choose one.
(నాకొకటి select చేసిపెట్టు).

**Naresh:** Depends on whether you want an ordinary cell or one with additional features like Camera, FM radio, etc.
(నీకెలాంటి cell కావాలో దానిమీద ఆధారపడి ఉంటుంది- మామూలు cell కావాలో, లేకుంటే అదనపు features- Camera, FM radio లాంటివి ఉండేదా అనేదాన్నిబట్టి.)

**Ramesh:** Depends on my pocket too, doesn't it?
(అది నా తాహతునుబట్టి కూడా ఉంటుంది కదా?)

**Naresh:** It certainly does. (అంతేకదా)

**Ramesh:** Let us see tomorrow.
(రేపు చూద్దాం).

☆ ☆ ☆


M.SURESAN

ఇంతకుముందు మనం Who, whose, which, that, when, where తో sentences join చేయడం తెలుసుకున్నాం కదా? ఇప్పుడు వేరే అర్థాలతో వేరే రకంగా join చేయడం తెలుసుకుందాం. ఈ join చేయడం Spoken English లో చాలా common. Real life situations లో చాలా తరచుగా వాడాల్సి వస్తుంది. తెలుసుకుని practise చేద్దాం.

**Has he come? Do you know?**

(= వాడు వచ్చాడా? నీకు తెలుసా? )- ఈ రెండు sentences ను ఇలా join చేస్తాం:

Do you know whether/ if he has come or not? = అతనొచ్చాడో లేదో నీకు తెలుసా?

చూశాం కదా? ఇలాంటి sentences ను కలిపేందుకు, whether కానీ if కానీ ఏదయినా వాడొచ్చు. అయితే ఎక్కువగా whether వాడటమే సరైందంటారు. ఎందుకంటే whether అంటే అవునా? / కాదా? అని మాత్రమే. If కి అవునా? / కాదా? అనే కాకుండా ఇతర అర్థాలు కూడా ఉన్నాయి. (If= అయితే అనే అర్థం కూడా ఉంది కదా?) అయితే If చిన్నమాటవడంతో, అదే ఎక్కువగా వాడతారు.

2) మనకు తెలుసు- Direct speech లో ఉన్న 'Non Wh' questions ను Indirect speech లోకి మార్చేటప్పుడు, If/ whether వాడతామని.

"Can you do it?" he said to me. (Direct speech)

He asked me if (whether) he could do it.

☆ ☆ ☆ ☆

***Now look at the following sentences from the passage above.***

*1) Do you know if Jagadish is back from the US?*

*2) I don't remember exactly whether it was last Wednesday or Thursday.*

*3) Any idea if he has brought them or not?*

*4) The cell phone technician doubts if it can be repaired at all.*

*5) I do not know whether it is an expensive piece.*

*6) I am not sure if I can get the same kind of piece again.*

*7) Depends on whether you want an ordinary cell or one with additional features.*

I do not know whether/ if he did it or his brother=

అది చేసింది అతడా అతడి తమ్ముడా అనేది నాకు తెలియదు. రెండింటి/ ఇద్దరి మధ్య- అనే విషయాన్ని గురించి మాట్లాడేటప్పుడు ఈ whether/ if వాడతాం.

I am unable to say whether I am happy or sad = నేనే చెప్పలేకపోతున్నాను, సంతోషంగా ఉన్నానా, దుఃఖంగా ఉన్నానా అని.

**1) Is Jagadish back from the US? Do you know:** (జగదీష్ అమెరికా నుంచి తిరిగొచ్చాడా? నీకేమన్నా తెలుసా? )- ఈ రెండు sentences ను if/ whether తో కలిపితే:

Do you know if Jagadish is back from the US (or not)?

**2)** Was it last Wednesday or Thursday? + I don't remember = I do not remember whether/ if it was last Wednesday or Thursday.

**3)** Has he brought them or not? (Have you) any idea? = (Have you) any idea whether/ if he has brought them or not?

**4)** The cell phone technician doubts if it can be repaired at all = Can it be repaired at all (or not)? + The cell phone technician doubts.

**5)** Is it an expensive piece or not? + I do not know = I do not know if/ whether it is an expensive piece (or not)

**6)** Can I get the same kind of piece? + I am not sure = I am not sure whether/ if I can get the same kind of piece.

ఈ sentences అన్నింటిలో whether/ if sentence మధ్యలో వస్తుంది కదా? ఇలా కాకుండా sentence ను మనం if/ whether తోనే ప్రారంభించవచ్చు

a) Is he is going to help me? + It is doubtful= If he is going to help me (or not) is doubtful/ It is doubtful if he is going to help me.

b) Is he a Congressman or TDP man? + It is very difficult to say = If/ whether he is a Congressman or TDP man is difficult to say.

## EXERCISE I

**Practise the following aloud in English.**

**Ram:** అతనక్కడ ఉన్నాడో లేడో నీకు తెలుసా?

**Som:** నాకెలా తెలుస్తుంది? అతనక్కడికి బయలుదేరాడా లేదా అనే విషయం కూడా తెలియదు నాకు.

**Ram:** నీకేమన్నా అనుమానమా వాడసలు వెళ్లాడా లేడా అని?

**Som:** అలా అని కాదు. అతడు ఈరోజు వెళ్తాడా రేపు వెళ్తాడా అనేదే నాకు తెలియని విషయం.

**Ram:** అక్కడికి వెళ్లినా కూడా, ఈ విషయం గుర్తుంచుకుంటాడా లేదా అని నా భయం.

**Som:** నేను అతడిని ఈ విషయం ఎవరితో చర్చిస్తావని అడగడం మరచిపోయా. Officer తోనా ఆయన PA తోనా అతడు చర్చించబోయేది?

**Ram:** నాకూ తెలియదు.

### ANSWER

**Ram:** Do you know if he is there?

**Som:** How do I know? I don't even know if he has started for the place or not.

**Ram:** Do you doubt if he has started or not?

**Som:** Not that. What I don't know is whether he will start today or tomorrow.

**Ram:** My fear is even if he goes there whether he will remember this or not.

**Som:** I forgot to ask him who he is going to discuss the matter with the Officer or his PA?

**Ram:** I don't know either.

## EXERCISE II

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Fuss | A. Dodge/ Avoid |
| 2. Renew | B. Stopgap |
| 3. Circumvent | C. Injury |
| 4. Trait | D. Complain |
| 5. Makeshift | E. Characteristic |
| | F. Resume |
| | G. Rotate. |

**KEY: 1-D. Fuss= Complain=** చిన్నచిన్న విషయాల గురించి నస/ గొడవపెట్టడం/ ఉద్రేకపడటం.

He fusses over a few rupees he had to spend extra = రెండు మూడ్రూపాయలెక్కువ ఖర్చయిందని ఏం నస పెడుతున్నాడో (ఏం బాధపడుతున్నాడో).

"Mom, I bunked just one class in a whole month. Why fuss so much about it" = అమ్మా నెల మొత్తంలో నేనువెళ్లంది ఒక్క class కు కదా. ఎందుకంత గొడవ చేస్తావు దాన్ని గురించి?

Don't make a fuss about small things. Get on with the work = చిన్న చిన్న విషయాల గురించి గొడవ చేయకుండా పనికానీ.

fussy= ప్రాముఖ్యంలేని విషయాలు పట్టించుకొనే.

She is fussy about even about the water she drinks = మామూలుగా తాగే నీళ్ల విషయంలో కూడా ఆమెకు అనవసరమైన పట్టింపే.

fussy x easy going.

**2-F. Renew = Resume** = పునఃప్రారంభించడం/ పునరుద్ధరించడం.

We have to renew our driving licenses which expire this month end = ఈ నెలాఖరుతో expire అయ్యే మన driving licenses పునరుద్ధరించుకోవాలి.

The lease is for 6 years. It can be renewed further = అద్దె కాలం ఆరేళ్లు. ఆ తర్వాత దాన్ని మళ్లీ కొనసాగించవచ్చు. కాలపరిమితి అయిపోయింతర్వాత మళ్లీ పొడిగించటం renew.

Renewed vigour= కొత్త శక్తి, కొత్త ఉత్సాహం.

Renew X Terminate.

**3-A. Circumvent= Dodge/ avoid.**

అసలు అర్థం: మన దారికేదయినా అడ్డంవస్తే చుట్టూ తిరిగి వెళ్లడం. Road కు అడ్డంగా గుట్టలూ, కొండలూ ఉంటే, road, వాటిని circumvent చేస్తుంది. అంటే దాని చుట్టూ తిరిగి వెళ్తుంది)

ఎక్కువగా వాడే అర్థం: ఒక చట్టాన్ని, అసౌకర్యంగా ఉన్న నిబంధననూ తెలివిగా అధిగమించడం.

He is circumvented the tax law by registering a part of his property in his brother-in-law's name = పన్ను చట్టం తనకు వర్తించకుండా ఉండేందుకు, తన బావమరిది పేర కొంత ఆస్తి రాశాడు.

For every law, there is a circumvention = ప్రతి చట్టాన్నీ ఉల్లంఘించేందుకు దొడ్డి దోవ ఏదో ఉంటూనే ఉంటుంది (ఇది English proverb).

Circumvent X Confront (ఎదుర్కోవడం).

**4-E. Trait = Characteristic** = లక్షణం (ఒకరి స్వభావంలోని లక్షణం)

a) Honesty, truth and non violence were the important traits of Gandhi= నిజాయతీ, సత్యం, అహింస, గాంధీ స్వభావంలోని ముఖ్య లక్షణాలు.

b) Most traits are hereditary = చాలా లక్షణాలు వంశపారంపర్యం.

**5-B. Makeshift= Stopgap = temporary** = తాత్కాలికంగా ఉపయోగపడే.

a) The speaker made his speech from on a makeshift stage = తాత్కాలికంగా ఏర్పరచిన వేదిక మీదినుంచి ఆయన ప్రసంగించాడు.

b) Madamme Curie, the discoverer of radioactivity carried on her experiments in a make shift lab = అణుధార్మిక శక్తిని కనుగొన్న Mme Curie తన పరిశోధన అప్పటికప్పుడు ఏర్పరచుకున్న (పక్కా కాని) lab లో కొనసాగించింది.

Stopgap = ప్రస్తుతానికి ఏర్పరచుకొనే వసతి, పక్కా వసతి వచ్చేవరకు.

Makeshift/ Stopgap X Permanent

ఇవన్నీ కూడా high frequency words in Spoken English. మీ conversation లో వాడి practice చేయండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Q.** 1. కొన్ని ఆర్టీసీ బస్సులపై picket అని ఉంటుంది. దీని అర్థం ఏమిటి?

2. English లో పదాల సరైన pronunciation phonetics (IPA) ద్వారా నేర్చుకుంటున్నాం కదా? మరి English is not a phonetic language ఎందుకంటారు?

3. Hello, Good morning one and all అని ఒక group of members ను wish చేయవచ్చా?

4. Sister concern company అంటే అర్థం ఏమిటి? ఎప్పుడు ఉపయోగించాలి?

5. Glad to see you- So am I... ఇక్కడ So am I అంటే అర్థం ఏమిటి?

## So am I

6. The nerd అంటే అర్థం ఏమిటి?

7. Sale, Sell అర్థం, తేడా వివరించండి.

**- M.Navitha, Nalgonda**

**A.** 1. Picket is the name of an area in Hyderbad, just as Koti, Sultan Bazar are. RTC bus మీద Picket అని ఉంటే అక్కడికి (Picket అనే ప్రదేశానికి) వెళ్లే bus అని.

అయితే Picket అనే English మాటకు అర్థం, strike (సమ్మె) చేస్తున్న కార్మికులు, ఎవరినీ factory, company లోనికి వెళ్లకుండా అడ్డుకోవడం.

2. IPA లేకుండా, English లోని letters of alphabet (a, b, c, ... z) కూ అవి తెలిపే శబ్దాలకూ సంబంధం లేనందువల్ల, English spelling is unphonetic అంటాం. C ని కొన్నిచోట్ల, క, కొన్నిచోట్ల 'స'గానూ పలుకుతాం. ఇది ఒకే అక్షరం, రెండు శబ్దాలకు వాడతాం. అలాగే రెండు మూడు అక్షరాలు ఒకే శబ్దాన్ని తెలుపుతాయి. అలాగే 'ష' శబ్దానికి tion, ssion, shun ఇలా ఇన్ని spellings వస్తాయి.

Puff - rough (ff = gh = ఫ్)

Though (ఇక్కడ gh కి విలువలేదు)- ఇలా పద్ధతి అంటూ లేని spelling, pronunciation వల్ల, English, unphonetic.

3. చేయవచ్చు

4. Sister concern/ company అంటే దాదాపు ఒకే యాజమాన్యం కింద ఉన్న ఒక company, అదే యాజమాన్యం కింద ఉన్న ఇంకో company కి sister concern (company). concern = company

5. Glad to see you = నిన్ను కలుసుకుంటున్నందుకు సంతోషంగా ఉన్నా.

So am I = అలాగే (so) am I = నేనూ (సంతోషంగా) ఉన్నా.



M.SURESAN

6. Nerd =

1) మూర్ఖుడు/ Old fashioned/ bore

2) computers లో ఆసక్తి బాగా ఉన్నవాడు.

7. Sale = అమ్మకం; Sell= అమ్మడం.









**Q.** 1. Think = ఆలోచించడం, suppose = అనుకోవడం అన్నారు. మరి I think he is watching the T.V. వాక్యంలో 'అనుకుంటా' అన్నారు. వివరించండి.

2. What does the glass contain?/ What's there in that glass = (ఆ గ్లాస్‌లో ఏముంది? )

3. I <u>was</u> <u>at</u> college (లో ఉన్నాను). దీన్ని I <u>was</u> <u>in</u> college గా రాయొచ్చా?

**- N.Suguna Santhi, Vizag**

**A.** 1. Think = ఆలోచించడం/ అనుకోవడం - రెండర్థాలూ ఉన్నాయి. 'అనుకోవడం' అనే అర్థంతో think = suppose. I think so = నేనలా <u>అనుకుంటున్నాను</u>. Think about it = దాన్ని గురించి <u>ఆలోచించడి</u>.

## At college

2. Both are correct.

3. I was at college - correct. సామాన్యంగా standard English లో నేను college లో ఉన్నా అనే అర్థంతో I was in the college అన్నారు. అయితే ఇది చూడండి.

There are 1800 students in the college = College లో చదివేవాళ్లు 1800 అని.

I studied at that college = నేను college లో చదివాను.

**Q.** ఒక ఆంగ్ల దినపత్రికలో వచ్చిన వార్తలోని మాటలను ఇక్కడ ప్రస్తావిస్తున్నాను. *"All I can say is that I have full faith in the Judiciary. I <u>am thankful</u> to the people of the country..."*

ఇక్కడ I am grateful to the people of the country అనాలి కదా? I am thankful అని ఎందుకు వాడినట్లు? No reference is made to divine beings కదా? అలా కూడా అనొచ్చా? వివరించగలరు.

**- P.Arun Prasad, Vizag**

**A.** You are right. Thankful = <u>దేవుడి</u> పట్ల కృతజ్ఞతను తెలిపేందుకే వాడతాం. మానవుల పట్ల కృతజ్ఞతకు grateful to somebody అంటాం, అలానే అనాలి. దేవుడికైతేనే, Thankful అంటాం, అలా అంటే చాలు. Thankful to God అని అనక్కర్లేదు కూడా.

## grateful

ఎందుకంటే Thankful అంటేనే దేవుడికే అని. I am Thankful I have such good parents = నాకలాంటి తల్లిదండ్రులున్నందుకు దేవుడికి కృతజ్ఞుడిని/ కృతజ్ఞురాలను. (గమనించండి: Thankful మాత్రమే. Thankful to God కాదు.)

# May I now request .. to ..

**Q.** దయచేసి ఈ సందేహాలను తీర్చగలరు.

1) సంతాపసభను English లో ఏమంటారు? Condolence meeting అనొచ్చా?

2) స్మారక చిహ్నం అంటే ఏమిటి? దయచేసి

3) Functions సందర్భాల్లో అతిథులను ఆహ్వానించడానికి సంబంధించి English లో ఎలా మాట్లాడాలి?

⊙ "వేదికనలంకరించిన పెద్దలకు, సభకు విచ్చేసిన అతిథులకు, ప్రేక్షకులకు, ఆహూతులకు నా హృదయపూర్వక నమస్కారాలు"

4) "ఎంత busy గా ఉన్నా కూడా పిలవగానే విచ్చేసినందుకు, మమ్మల్ని మన్నించి సభకు వచ్చినందుకు ఎంతో సంతోషిస్తున్నాం. వారికి భగవంతుడి కటాక్షం సదా ఉండాలని కోరుతున్నాం"

5) "... వారిని వేదికనలంకరించాల్సిందిగా కోరుతున్నాం"

6) "వారు ఇంతసేపు తమ సమయాన్ని మాతో పంచుకున్నందుకు మాకు ఎంతో ఆనందంగా ఉంది"

7) స్మారక/ సంతాపసభల్లో వేరుగా మాట్లాడతారు. వారి కుటుంబానికి సానుభూతి తెలుపుతూ చనిపోయిన వ్యక్తికి మనతో/ మనకు వారితో ఉన్న అనుబంధం గురించి స్మరిస్తాంకదా! అప్పుడు ఎలా మాట్లాడాలి? వీటి గురించి ఏ వైనా books దొరుకుతాయా? తెలుపగలరు.

8) Letter Writing Books ఎవరివి తీసుకోవాలి?

9) మీరు having తినడానికి సంబంధించి వాడాలన్నారు. కాని ఓ lesson లో (1) Having lost his parents in his childhood, parental love is new to them. (2) Having made the mistake repentance filled him. (3) Having seen his mother after a long time was a great joy for him. (4) Having been elected unanimously, he felt very happy. 4 సరియైనదన్నారు. Having phrase అంటే ఏమిటి? Have ను ఎన్నిరకాలుగా వాడొచ్చు?

⊙ M.L.A./ M.P. ల ముందు ఏ article ను ఉపయోగించాలి. పూర్తి అబ్రివేషన్‌ను చెబితే The ఉపయోగించాలా? అంటే The Member of Parliament/ The Member of Legislative Assembly ?

⊙ Councillor కు ముందు article ఏది రావాలి?

⊙ Nobody/ anybody తర్వాత has/ have ఏది వస్తుంది? Singular or plural? Verb ఏది?

⊙ He, She, It లు III person singular లా? లేదా II person లా?

⊙ I, We, They ఇవి, You singular లా లేదా Plurals?

⊙ Direct, Indirect speech గురించి చిన్న అనుమానం. eg: He asked "Have you seen her anywhere?" అతడు అడిగాడు, "నీవు ఆమెనెక్కడైనా చూశావా?". దీనిని He asked me if (whether) I had seen her anywhere, ఇందులో If (whether) లు ఎందుకొస్తాయి?

## అతిథులకు ఆహ్వానం ..

⊙ ఒక Book లో D & Ind speech గురించి చదివాను. దానిలో 4 types పరిశీలించాలన్నారు. 1. Statements (2) Yes/ No Questions (3) Wh & How Questions (4) to infinitives (Command & Request) గురించి ఇచ్చారు.

eg: I. He said "I am very happy."' దీనికి He Said that he was very happy గా చెప్పారు.

II. He asked me "Are you happy?". దీనిని He asked me if I was happy గా చెప్పారు. ఇక్కడ If ఎందుకు? He asked me బదులు He told/ said me he was happy అనొచ్చా?

III. He asked me "why are you happy?". దీనిని He asked me why I was happy గా చెప్పారు.

IV. He said to me "Buy a Computer". దీనిని He told me, to buy a computer. వీటి గురించి అంటే speech ల గురించి వివరించగలరు.

**– ఒక పాఠకురాలు, కర్నూలు జిల్లా.**

**A.** 1) సంతాపసభ = Condolence Meeting

2) స్మారక చిహ్నం = Memorial.

3) My hearty welcome to the distinguished people on the dais, the other guests, the audience and the other invitees.

4) We are extremely happy to have amidst us, Sri ...... , who inspite of their being busy have taken the time off to be here this evening. May god shower his blessings on them!

5) May I now request Sri .... to come up the dais and take his/ her seat.

6) We are grateful to them all for sparing their valuable time to us.

7) Our heartfelt condolences to the bereaved family. The late ---- (Name of the dead person) was closely associated with this institution and helped the institution to grow. We remember with gratitude his/ her contribution to the institution. May his/ her soul rest in peace. ఇలాంటి వాటికి English for various occasions తో books ఉంటాయి. చూడండి.

8) Letter Writing కు English Grammar & Composition మీద ఏ standard book అయినా ఫర్వాలేదు.

9) Having వాడకూడదని చెప్పలేదు ఏ lesson లో కూడా. Am having/ is having/ are having- ఈ expressions కు కలిగి ఉండటం (possession) అనే అర్థం రాదు. తినడం/ తాగడం అనే అర్థం వస్తుంది. కలిగి ఉండటం (ఒకరికి ఒక వస్తువు ఉంది అనే అర్థం) రాదు. Having lost his parents- ఇలాంటి expressions లో having, verb form మాత్రమే. ఈ having కూ, కలిగి ఉండటం అనే అర్థంతో వచ్చే have కూ సంబంధం లేనేలేదు. Having lost his parents= తల్లిదండ్రులను కోల్పోవడం <u>వల్ల</u>- ఇలాంటి అర్థం వస్తుంది. అలాగే have gone/ has seen/ had done లాంటి expressions లో have/ has/ had కూ కలిగి ఉండటం అని అర్థం వచ్చే have/ has/ had కూ సంబంధం ఏమాత్రం <u>లేదు</u>. Having gone, has done etc లో have, has లు verb forms మాత్రమే- పాఠకులు ఇది గమనించాలి.

⊙ Having done his duty, he went home for rest = తన duty పూర్తిచేసుకుని/ పూర్తవడంతో అతడు విశ్రాంతి కోసం ఇంటికి వెళ్ళాడు.

⊙ Having seen it, I understand why people are talking like that = <u>నేనది చూడటంవల్ల</u> నాకర్థమవుతోంది అందరూ ఎందుకలా అంటున్నారో.

⊙ Have వాడే విధాలు: 1) Have= possess=own=కలిగి ఉండటం (ఈ అర్థంతో am having/ is having/ are having వాడం).

2) Have= తినడం/ తాగడం (am having/ is having/ are having ఈ అర్థంతోనే వాడతాం).

3) Present perfect, past perfect tenses లో verb లో భాగంగా మాత్రమే, ప్రత్యేక అర్థం లేకుండా Auxiliary/ helping verb గా వాడతాం.

4) Having seen/ Having gone లాంటి expressions లో కూడా, have అనేది participle లో భాగమే, చూసి/ చూసినతర్వాత/ చూడటంవల్ల అనే అర్థాలతో. Having gone కు కూడా ఇలాంటి అర్థాలే వస్తాయి.

⊙ MLA, MP ల ముందు an వాడతాం, a కాదు (MLA, MP = ఎం.ఎల్.ఎ., ఎం.పి. కదా? అ ఆ ఇ ఈ ఎ ఏ ఐ ఒ ఓ శబ్దాలతో ప్రారంభమయ్యే English మాటలముందు <u>an</u> వాడతాం).

⊙ Nobody/ Anybody III person singular (He/ she) కాబట్టి has వాడతాం వాటి తర్వాత. పూర్తిగా అయితే, general sense లో వాడితే, a వస్తుంది. ఫలానా MLA, ఫలానా MP అంటే The వస్తుంది. A/ An or The ఉపయోగాల కోసం పాత lessons చూడండి. A/ The Councillor.

| Person | Singular | Plural |
|---|---|---|
| I | I | We |
| II | You (నువ్వు) | You (మీరు) |
| III | He, She, it | They |

⊙ You తర్వాత ఎప్పుడూ plural verb వాడతాం.

1) Statement ను direct నుంచి indirect కు మారిస్తే, quotations తీసేసి <u>that</u> తో ప్రారంభిస్తాం.

2) Wh questions ను Indirect లోకి మారిస్తే quotations తీసేసి 'Wh' word తోనే ప్రారంభిస్తాం. ఇక్కడ asked మాత్రమే. Tell రాదు.

3) Non Wh questions అయితే, quotations తీసేసి, Whether/ if తో ప్రారంభిస్తాం. ఇక్కడ asked మాత్రమే వస్తుంది- Tell రాదు.

4) Buy a Computer- ఇది imperative sentence (అడగడం/ ఆజ్ఞాపించడం, etc). ఇలాంటిచోట్ల tell/ ask ఏదయినా వాడొచ్చు. ఇంకా వివరాలు కావలిస్తే పాత lessons చూడండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Q.** She, Women, Lady, Girl - ఈ పదాలను ఎక్కడ, ఎప్పుడు ఎలా ఉపయోగించాలో వివరించగలరు.

*- M. Satyanarayana, Hyderabad.*

**A.** She అంటే మీకు తెలుసనే అనుకుంటున్నా.

Women = స్త్రీలు. Lady అర్థం కూడా స్త్రీ అనే. అయితే మామూలుగా స్త్రీ అనే అర్థంతో, Woman అనే అంటాం. ఈ అర్థంతో Lady అనే మాట ఇప్పటి వాడుకలో లేదు.

## Women, Lady

పాతరోజుల్లో ఉన్నత వర్గాల/ వంశీకుల స్త్రీలను ladies అనేవాళ్లు. ప్రజాస్వామ్యం ప్రభావంవల్ల ఇప్పుడు ఏ వర్గానికి చెందిన స్త్రీలనైనా women అనే అంటాం. సభల్లో శ్రోతలనుద్దేశించి ప్రసంగించే ladies and gentlemen అనే expression లో మాత్రమే lady మిగిలిఉంది. ఒక్కోసారి కోపంలోగానీ, ఎగతాళికిగానీ, కొంచెం formal గా గానీ ఆడవాళ్లను lady అంటుంటారు.

Girl అంటే అమ్మాయి అని తెలుసుకదా.

**Q.** పెట్రోలియం ట్యాంకర్ వెనకాల Highly Inflammable అని రాసి ఉంటుంది. కొన్నింటికి In మీద తెల్లరంగు పూస్తున్నారు. వీటికి సరైన అర్థాలు తెలుపగలరు.

*- MVS Kondala Rao, Visakhapatnam*

**A.** Inflammable = Flammable. రెండింటి అర్థాలూ ఒకటే - మండిపోయే - అని.




# SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 409


M.SURESAN

# We have to advise them

**Q.** కిందివాటిని ఉదాహరణలతో వివరించండి.

1) ever 2) meanwhile 3) feature 4) more over 5) still later 6) still further 7) through 8) throughout 9) else, or else.

*- G. Naresh, Armoor*

**A. 1.** Ever = ఎప్పుడైనా/ ఎప్పటికైనా

a) I am ever ready to help you = I am always ready to help you = నీకు సహాయం చేసేందుకు నేనెప్పుడూ సిద్ధమే

b) Have you ever been to London? = నువ్వు ఎప్పుడైనా London వెళ్లావా?

**2.** ఈ లోపల. Get the vegetables. Meanwhile I will cook the rice = మీరు కూరలు తెండి. ఈలోపల నేను అన్నం వండుతాను.

## meanwhile

**3.** feature = లక్షణం.

Truthfulness was the important feature of his character. = సత్యపాలన ఆయన ముఖ్య లక్షణం. ముఖం, కన్ను, ముక్కుతీరు = feature. ఒక ప్రదేశపు భౌగోళిక లక్షణం = feature. Magazines/ Newspapers లోని శీర్షిక.

**4.** moreover = అంతేకాకుండా.

The doctor not only treated him. Moreover he gave him some money = Doctor అతడికి వైద్యం చేశాడు. అంతేకాకుండా అతడికి కొంత డబ్బిచ్చాడు.

**5.** still later = ఆ తర్వాత/ ఇంకా తర్వాత.

I came late. He came still later = నేనే ఆలస్యం. అతడు నాకంటే ఆలస్యం.

**6.** still further- ఇంకా.

Still further delay will be dangerous. ఇంకా ఆలస్యం అయితే ప్రమాదమే.

**7.** through = గుండా.

The train travels through a tunnel = ఆ train సొరంగం (tunnel) గుండా పోతుంది.

**8.** through out = ఒక సమయం మొత్తం.

Throughout his stay here he was helpful to others = అతడిక్కడ ఉన్నన్ని రోజులు/ ఉన్నంతసేపూ ఇతరులకు సహాయం చేశాడు.

**9.** else/ or else = లేకపోతే.

Study well, else/ or else you can't pass = బాగా చదువు. లేకపోతే pass కాలేవు.

**Q. 1.** He developed skills <u>while</u> he was working in police department. (or)

He developed skills <u>when</u> he was working in police department.

While కి when కి usage చాలా confusion గా ఉంది. వివరించగలరు.

**2.** One finds difficulty in answering phone call even <u>in</u> one's home. (or)

One finds difficulty in answering phone call even <u>inside</u> one's own home.

- in ఎక్కడ inside ఎక్కడ వాడాలో వివరించగలరు.

## while, when

**3.** I am told there are many crocodiles in the lake. (or)

I am told <u>that</u> there are many crocodiles in the lake.

- ఈ రెండింటిలో ఏది కరెక్ట్? that ఎక్కడ వాడాలో, ఎక్కడ వాడకూడదో తెలపండి.

*- B.Appala Raju, Visakhapatnam*

**A. 1.** While ఎక్కువగా ఓ action continuing during a period of time చెప్పేందుకు వాడతాం.

While he was working... = అతడు పనిచేస్తున్నప్పుడు- ఆ పనిచేస్తున్న కాలం అంతా.

When he was working..= అక్కడపనిచేస్తున్నప్పుడు

When వాడినప్పుడు, ఆ సమయంలో ఎప్పుడో ఒకప్పుడు, అప్పుడప్పుడు, చాలాసార్లు.

While అంటే ఆ సమయం మొదలు నుంచి చివరి వరకు. అయితే continuity అంత important కానప్పుడు when అయినా వాడొచ్చు. while అయినా వాడొచ్చు.

While/ When he was reading something the police entered the room.

While they were playing, he was studying - (వాళ్లు ఆడుతున్నంతసేపూ అతడు చదువుతున్నాడు)- ఇక్కడ when రాదు.

**2.** In = లో; Inside = లోపల. బాగా లోపలికి ఉంటే inside అంటాం. తేడా చూడండి.

a) The box was hidden in the room.

b) The box was hidden somewhere inside the room. A కి అర్థం, room లో. B కి అర్థం room లోపల ఎక్కడో.

In= లో. Inside = బాగా లోపల.

**3.** That omit చేయడం, ఎక్కడైనా సరే, తప్పు కాదు.

**Q. 1.** Some words in English are - i (ఐ) sound, some are e (ఇ) sound.

**e.g.:** a) I (ఐ) sound words are: fight, kite, might, night, wife, knife, ride.

b) E (ఇ) sound words are: kill, mill, silk, nill, grim, kiss, miss, big - How to recognize their sound with respect to these words. If there is any rule to identify please mention.

c) Mention the pronunciation of these words: Fill, live, milestone, file, hive

## with regard to

**2.** Could you mention the meanings of these phrases in Telugu.

i) With regard to; ii) In regard to; iii) In reference to; iv) Where of; v) Where on; vi) Where in.

*- Gurram Shankar, Keshavapatnam*

**A. 1.** a) సామాన్యంగా ఒకే syllable ఉన్న మాటలోని spelling లో 'i' తర్వాత consonant వచ్చి (a, e, i, o, u కాని శబ్దాలు) చివర e ఉంటే అలాంటి మాటలోని 'e' ని ఐ గా pronounce చేస్తాం. అలాగే single syllable ఉన్న మాటలో gh, i తర్వాత వస్తే దాన్ని ఐ గా పలుకుతాం. అందుకని మీరు రాసిన first set of words ను, fait, kait, mait ... లా pronounce చేస్తాం.

b) మీ రెండో set of words లో, i తర్వాత double consonant (u) రావడం, చివర e లేనందువల్ల, i ని ఇ గా pronounce చేస్తాం. Kill, mill, nill, kiss, miss - i followed by double consonants, and no e in the end. So 'i' has the sound of ఇ. Big, grim etc లో చివర e లేదు. అందుకని 'i' ని ఇ గా పలుకుతాం.

c) Fill - ఫిల్, Live = లివ్ = బతకడం/ జీవించడం.

Live = లైవ్ = బతికి ఉన్న/ సజీవమైన/ యదార్థమైన - అప్పటికప్పుడు జరుగుతున్న.

Live (లైవ్) telecast - జరుగుతున్న విషయాన్ని అప్పటికప్పుడు చూపించడం (TV లో).

**2.** i) With regard to = ఆ సందర్భంగా/ ఆ విషయాన్ని గురించి- with regard to = In regard to.

ii) అయితే In regard to కంటే with regard to ఎక్కువ వాడుక.

With regard to his health, I can't say anything = అతడి ఆరోగ్యం విషయం (గురించి) నేనేం చెప్పలేను.

iii) In reference to - ఎక్కువగా with reference to అంటాం = దాన్ని గురించి (about).

With reference to your application, please attend an interview on ... = మీ application గురించి, ఆ సందర్భంగా మీరు ... తేదీన Interview కు రండి.

iv) Where of = of which = అందులో (భాగంగా)

The book where of the sentences are a part = The book of which the sentence are a part = ఈ వాక్యాలు భాగంగా ఉన్న పుస్తకం.

He bought some land where of (of which) he gave an acre to his sister.

v) Where on/ Where upon = దాని ఫలితంగా/ దరిమిలా - He called her a liar where on/ where upon she walked out- అతడు ఆమెను అబద్ధాలకోరు అన్నాడు. దానిమీద ఆమె అక్కడ్నించి వెళ్లిపోయింది (ఆ కారణంగా).

vi) Where in= అందులో= in which. I showed him the letter where in he found the amount clearly written= ఆ మొత్తం స్పష్టంగా రాసి ఉన్న జాబును అతడికి చూపాను.

**Q.** 1. a) We have to <u>advice</u> them.

b) We have to <u>advise</u> them.

పై వాక్యాల్లో ఏది కరెక్ట్. వాటి అర్థాలు ఏమిటి? Have to + $V_1$ ప్రకారం b correct కదా? అయితే ఒక వ్యాకరణ పుస్తకంలో have to advice (N) అని ఉంది. అది అచ్చుతప్పా? వివరించండి.

**2.** a) If he runs <u>fast</u>, he will catch the bus.

b) If he runs <u>fastly</u>, he will catch the bus - పై వాటిలో ఏ వాక్యం correct? ఇక్కడ fast adverb కదా? adverb ను fastly గా కూడా ఉపయోగించవచ్చా?

## break into pieces

**3.** If I drop the chalk piece, it will break <u>to</u> pieces (or) break <u>into</u> pieces. Which is correct?

**4.** a) He is dead.

b) He is died - ఇవి రెండూ కరెక్టేనా? b వాక్యం S + H.V + $V_3$ సూత్రం ప్రకారం p.v. లో ఉపయోగించవచ్చా? Object లేని verb కు p.v. ఉండదు కదా? ఒక సినిమాలో She is died అని ఉపయోగించారు. ఆమె చంపబడింది అనే అర్థంలో అది సరైందేనా? తెలుపగలరు.

*- R.Chittibabu, Tanuku*

**A.** 1. Sentence b correct. Have to advice (N) అనడం తప్పు. 1) Have to తర్వాత ఎప్పుడూ plain infinitive (advise) వాడతాం. 2) Advice verb కాదు కాబట్టి ఇక్కడ వాడం.

2) Fast కు adverb fast మాత్రమే. fastly అనే మాట లేదు.

3) It will break into pieces, correct. Break it to pieces సరికాదు.

4) Die కి past participle died. Die అంటే చావడం - ఇది intransitive verb (verb without an object). We don't use the past participle of an intransitive verb after a 'be' form. So he is died - wrong. Dead = చనిపోయిన/ చనిపోయి ఉన్న - Adjective. 'Be' from (is) తర్వాత adjective వాడతాం. కాబట్టి He is dead - correct.

Is died (be from + PP($V_3$) of an intransitive verb) అసలు verb కాదు గదా? She is died ఎవరు/ ఎక్కడ వాడినా తప్పే. ఆమె చంపబడింది = She is killed. (She has been killed).

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Q.** *Please clarify the following doubts and give example of each one in telugu translations.*



1. *Anything else*
2. *Anybody else*
3. *Someone else*
4. *Nothing else*
5. *Nobody else*
6. *Some where else*
7. *If conditions మూడు రకాలు అని తెలుసు. ఇది వరకటి lessons లో చదివాను. కానీ condition 2 and 3 ఎప్పుడు ఉపయోగిస్తారు. ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారు? ఉదాహరణలతో వివరించగలరు.*

**- Anthati Penchalaiah, Rajampeta**

**A.** 1) Anything else - ఇంకేమన్నా ఉందా?

Have you anything else to say? = మీరు చెప్పాల్సిందింకేమన్నా ఉందా?

2) Anybody else = ఇంకెవరన్నా.

Anybody else in Sita's position might not have gone to the forests with her husband = సీత పరిస్థితుల్లో ఇంకెవరున్నా భర్తతో అరణ్యాలకు వెళ్లేవారు కారేమో.

3) Someone else = ఇంకెవరన్నా.

I can't help you. Ask someone else = నేన్నీకు సాయం చేయలేను. ఇంకెవరినన్నా అడుగు.

4) Nothing else = ఇంకేం లేదు.

I can only pity you. I can do nothing else = నేన్నిన్ను జాలి తలచగలను (నేను నీపై జాలి చూపగలను). అంతకంటే నేనింకేం చేయలేను.

5) Nobody else = ఇంకెవరూ లేరు.

Nobody else can play so well as Sachin = సచిన్‌లా ఇంకెవరూ ఆడలేరు.

6) Somewhere else - ఇంకెక్కడయినా.

We can't find it here. Let's look for it somewhere else = అదిక్కడ లేదు. ఇంకెక్కడయినా ఉందేమో చూద్దాం.

7) If I were you, I would do it= (ఇప్పుడు) నేను నువ్వయితే (అయ్యే అవకాశం లేదు) ఆ పని చేస్తాను. (చేసే అవకాశం లేదు- Present లో)

## Anything else/ Anybody else

If he took the medicines, he would be cured = అతడు ఆ మందులు తీసుకోవడమంటూ జరిగితే (జరగదు), అతనికి నయమౌతుంది (ఇప్పుడు అవదు). ఇది condition II.

దీన్లో, If తర్వాత, were కానీ, past simple (Past Doing Word) కానీ వస్తుంది; Main clause లో would/ should/ could/ might + 1st RDW వస్తుంది.

Condition II ఇప్పటి (present) విషయాన్ని తెలుపుతుంది).

**Condition III**

If he had seen me, he would have talked to me (అతడు నన్ను చూసి ఉంటే, నాతో మాట్లాడుండేవాడే- చూడలేదు, మాట్లాడలేదు. ఇది Past లో అయిపోయిన సంఘటన.

ఇక్కడ If తర్వాత, had been/ had + past participle వస్తుంది.

Main clause లో

would have + past participle/
should have + past participle/
could have + participle /
might have + past participle కానీ వస్తుంది.

If he had consulted me, I would have given him correct advice.

= అతడు నన్ను సంప్రదించి ఉంటే, (సంప్రదించలేదు) నేనతడికి సరైన సలహా ఇచ్చుండేవాడిని (ఇవ్వలేదు)

ఇది past.

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 410


M.SURESAN

# In the event of an accident, call no 108

**Q.** *కిందివాటికి అర్థాలను ఉదాహరణలతో వివరించగలరు.*

1. *In connection with*
2. *In the wake of*
3. *By dint of*
4. *By virtue of*
5. *For the sake of*
6. *In accordance with*
7. *In compliance with*
8. *In consequence with (of)*
9. *In lieu of*
10. *In reference to (and) with reference to*
11. *In the event of*
12. *On account of*
13. *Owing to*
14. *With a view to*
15. *With an eye to*
16. *In regard to (and) with regard to*
17. *In course of*
18. *On behalf of*
19. *conformity*
20. *by reason of*
21. *agreeable to*
22. *by means of*
23. *in favour of*
24. *not withstanding*
25. *in association with*
26. *away from*
27. *in comparison to*
28. *instead of*
29. *due to.*

**- MV Subrahmanyam, Chillakur, Nellore**

**A. 1)** In connection with= **10)** In reference to/ with reference to= **16)** in/ with regard to=(ఇద్దరు ముగ్గురు ప్రస్తావిస్తున్న) విషయానికి సంబంధించి/ దాని గురించి.

In connection with/ in reference to/ with reference to/ in regard to/ with regard to the books you have asked for, I wish to tell you that I cannot lend them to you at present = నువ్వు నన్నడిగిన పుస్తకాల విషయంలో/ పుస్తకాలకు సంబంధించి/ పుస్తకాల గురించి, వాటిని నీకు నేనిప్పుడివ్వలేనని చెప్తున్నాను. గమనిక: ఈ expressions అన్నీ గ్రాంథికం. Spoken English లో దాదాపు వాడం. Formal written English లో వీటి వాడకం ఎక్కువ. వీటిల్లో కూడా in regard to కంటే with regard to, in reference to కంటే with reference to ఎక్కువ వాడతాం.

## In accordance with/ In compliance with

**2)** In the wake of = దాని ఫలితంగా (ఒక సంఘటన తరవాతి పరిణామాలు, ముఖ్యంగా చెడు పరిణామాలను గురించి చెప్పేటప్పుడు ఇది వాడతాం.

a) The cyclone brought in its wake, floods and epidemics = తుపాను తర్వాత పరిణామాలుగా వరదలూ, అంటువ్యాధులూ వచ్చాయి.

b) In the wake of his unthought of action, we had to hang down our heads in shame = అతడి అనాలోచిత చర్య ఫలితంగా మనం సిగ్గుతో తలవంచుకోవాల్సి వచ్చింది.

c) Cricket lovers in India protested in the wake of wrong umpiring = తప్పుడు umpiring దరిమిలా/ దాని పరిణామంగా భారత్ cricket అభిమానులు నిరసన తెలిపారు.

**3)** By dint of = ఒక పద్ధతిద్వారా= **22)** by means of

He achieved success by dint of his hard = తన కృషి ద్వారా అతడు విజయం సాధించాడు.

(by dint of = తద్వారా)

**4)** By virtue of = ఆ కారణంగా.

He got the job by virtue of his experience. (అతడి అనుభవం కారణంగా అతడికా ఉద్యోగం వచ్చింది).

By virtue of being the collector, he is superior to the other officials = Collector అవటంవల్ల అతడు మిగతా అధికారులకంటే ఎక్కువ

**5)** for the sake of = కొరకు/ కోసం.

Gandhi sacrificed his life for the sake of Hindu-Muslim unity. హిందూ ముస్లిం ఐక్యత కోసం గాంధీ ప్రాణాలర్పించాడు.

**6)** In accordance with = ప్రకారం/ అనుగుణంగా.

The marriage took place in accordance with Hindu customs = హిందూ ఆచారాల ప్రకారం ఆ పెళ్లి జరిగింది.

**7)** In compliance with= నిబంధనలకు బద్ధులుగా/ నిబంధనలకు అనుగుణంగా/ ఆదేశానుసారం.

In compliance with the orders from the government, the boys were admitted into the hostel = ప్రభుత్వ ఆదేశానుసారం ఆ పిల్లలను హాస్టల్లో చేర్చారు.

**8)** In consequence of = తత్ఫలితంగా.

In consequence of his foolish actions he lost all his property = అతడి మూర్ఖపు చర్యల ఫలితంగా ఆస్తి అంతా పోగొట్టుకున్నాడు. In consequence with లేదు.

**9)** In lieu of = అందుకు బదులు.

The company offered them cash in lieu of the prize he had won = అతడు గెలుచుకున్న prize కు బదులుగా కంపెనీ అతడికి డబ్బిచ్చింది.

**11)** In the event of = If (ఆ పరిస్థితిలో).

In the event of an accident, call no 108. (ప్రమాదం జరిగితే/ జరిగే పరిస్థితిలో, no 108 కు phone చేయండి)

**12)** On account of = అందువల్ల = because of = **13)** owing to:

On account of the rain/ because of the rain/ owing to the rain the match was cancelled = వర్షం కారణంగా match రద్దయింది.

**14)** With a view to = ఆ ఉద్దేశంతో.

He saved all the money with a view to buying a house = ఇల్లు కొనే ఉద్దేశంతో అతడు డబ్బు పొదుపుచేశాడు.=

**15)** With an eye to - ఇది కూడా with a view to లాగానే.

**17)** In the course of = కొంత/ తగినంతకాలం గడిచాక.

She got married and in the course of time became a mother of two children.

In the course of their journey they visited a number of places = తమ ప్రయాణ సమయంలో చాలా ప్రదేశాలు చూశారు.

**18)** on behalf of = తరఫున.

I am signing on behalf of my minor children = నా మైనర్ పిల్లల తరఫున నేను సంతకం పెడుతున్నాను.

**19)** In conformity with = నిబంధనలకు అనుగుణంగా/ ఆదేశానుసారం.

In conformity with your orders we are starting for Delhi = మీ ఆదేశాల ప్రకారం మేం ఢిల్లీకి బయల్దేరుతున్నాం.

**20)** By reason of = **12)** on account of.

**21)** Agreeable to = ఒప్పుకోవటం.

I am agreeable to this proposal = ఈ ప్రతిపాదనకు నేనొప్పుకుంటున్నా.

**23)** In favour of = (ఒకరికి) అనుకూలంగా.

The umpire ruled in favour of the Australian team = Australian team కు అనుకూలంగా తన నిర్ణయం ఇచ్చాడు umpire.

## In the event of/ On account of

**24)** notwithstanding = In spite of = అయినప్పటికీ

**25)** In association with = సంయుక్తంగా.

The State Government in association with the company is starting a hospital = రాష్ట్ర ప్రభుత్వం ఇంకో company తో కలిసి ఆసుపత్రి ప్రారంభిస్తోంది.

**26)** Away from = ఆవల/ దూరంగా

**27)** In comparison to = పోల్చి చూస్తే

A is much better in comparison to B.

**28)** Instead of = బదులు

**29)** Due to = Owing to.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# I don't know what to do

**Midhun:** What's biting you? Why do you look so worried?
(నిన్నేం బాధపెడుతోంది? ఎందుకంతలా బాధ పడుతున్నట్లు కనిపిస్తున్నావు?)

**Aslesh:** I have to pay the fees tomorrow. I haven't the money to pay. I don't know what to do.
(రేపు నేను fees కట్టాలి. నా దగ్గర డబ్బు లేదు. ఏం చేయాలో తెలియడం లేదు)

**Midhun:** Let me tell you how to get over the difficulty. If only you are a little enterprizing you can approach a bank for an educational loan.
(ఈ కష్టం దాటేదెలాగో నన్ను చెప్పనీ. కాస్త నీకు చొరవంటూ ఉంటే ఏదయినా bank నుంచి విద్యారుణం పొందవచ్చు)

enterprizing = చొరవగల

**Aslesh:** I don't know which bank to go to. I don't know anybody connected with any bank.
(ఏ bank కు వెళ్ళాలో తెలియదు నాకు. Bank లతో సంబంధముండే ఏ వ్యక్తీ నాకు తెలియదే.)

**Midhun:** I know who we can go to for help. My distant uncle is a bank manager. He is close to our family.
(సాయంకోసం ఎవరి దగ్గరికెళ్లాలో నాకు తెలుసు. మా దూరపు మామయ్య bank manager. మా కుటుంబంతో ఆయన సన్నిహితంగా ఉంటాడు.)

**Aslesh:** So? (అయితే?)

**Midhun:** I will take you to him and ask him if he can help you
(నేను నిన్ను ఆయన దగ్గరకు తీసుకెళతాను. ఆయనేమన్నా నీకు సహాయం చేయగలడేమో అడుగుతాను)

**Aslesh:** Come on, Midhun, I have to pay the fees tomorrow. How can I wait till you take me to your uncle and do all these things.
(ఏంటంటున్నావు నువ్వు? నేను fees కట్టాల్సింది రేపు. మీ మామయ్య దగ్గరికి నువ్వు నన్ను తీసుకెళ్ళి అవన్నీ చేసేదాకా నేనెలా ఆగగలను?)

**Midhun:** Can't you borrow money from someone till you get the bank loan?
(Bank loan వచ్చేవరకూ ఎవరిదగ్గరైనా అప్పు తెచ్చుకోలేవా?)

**Aslesh:** That's exactly the problem. I don't know who to approach for a hand loan of a few thousand rupees.
(అదే నా సమస్య. కొన్ని వేల రూపాయల అప్పు కోసం ఎవరి దగ్గరకెళ్లాలనేది నాకు తెలియడం లేదు)

**Midhun:** You'd better request the principal for a few more days' time.
(మరికొన్ని రోజుల సమయం ఇవ్వమని principal ను request చెయ్యి/ చెయ్యడం మంచిది)

**Aslesh:** I don't think he will allow me any more time. I'll try, any way. But you haven't told me where to meet this uncle of yours? Is his bank in this place?
(ఆయన నాకింకా time ఇస్తాడని అనుకోవడం లేదు. అయినా ప్రయత్నిస్తాను. కానీ నువ్వు మీ మామయ్యనెక్కడ కలుసుకోవాలో చెప్పలేదు. ఆయన bank ఈ ఊళ్లోనేనా?)

**Midhun:** Yes. It is. I am just wondering when to see him. He is not easy to meet. Wait. Let's go home. I'll ask my dad to call him and see if he is in. I'll have my dad talk to him about it. Let's go.
(అవును. ఇక్కడే. ఆయన్ను కలుసుకోవడం అంత సులభం కాదు. ఉండు. మా ఇంటికెళ్దాం పద. మా నాన్నను ఆయనకు phone చేసి bank లో ఉన్నాడో లేదో కనుక్కోమంటాను. మా నాన్నను ఆయనతో మాట్లాడిపిస్తా.)

**Aslesh:** Thank you. That's kind of you.

⊙ ⊙ ⊙


M.SURESAN

Spoken English లో daily real life situations లో వాడే expressions లో భాగంగా ఇదివరకటి lesson లో Whether/ if ల ఉపయోగం చూశాం కదా? ఇప్పుడు దగ్గర దగ్గర అలాంటిదే మనకు నిత్యజీవితంలో ఎదురయ్యే సందిగ్ధాలను తెలిపేందుకు వాడే expressions చూద్దాం.

***Look at the following expressions from the conversation above:***

*1) I don't know <u>what to do</u>.*
*2) Let me tell you <u>how to get over</u> this difficulty.*
*3) I don't know <u>which bank to go to</u>.*
*4) I know <u>who we can go to</u>.*
*5) I don't know <u>who to approach for</u> a bank loan.*
*6) I'm just wondering <u>when to see him</u>.*

పై sentences అన్నింటిలో కనిపించే pattern: 'Wh' word + Infinitive (to + Ist Regular doing word. What ('wh' word) + to do (Infinitive) గమనించారు కదా. పై expressions (those underlined) అన్నీ కూడా 'Wh' words తో begin అయ్యేవే అని. అంటే ఏం చేయాలో, ఎవర్ని కలుసుకోవాలో, ఎక్కడికి, ఎప్పుడు, ఎలా వెళ్లాలి? / ఎక్కడ, ఎప్పుడు, ఎలా చేయాలి? లాంటి భావాలను తెలిపే expressions అన్నమాట. వీటిని సమయానుకూలంగా వాడటంవల్ల మన conversation చాలా simple గా natural గా ఉంటుంది. Practise చేయండి.

మనం మామూలుగా ఎదుర్కొనే పరిస్థితి- ఇప్పుడేం చేయాలో తెలియడం లేదు. అని కదా? దీనికంటాం..

1) What to do. (= ఏం చేయాలో)
   a) అతను ఏం చేయాలో నిర్ణయించుకోలేకపోతున్నాడు = He is unable to decide what to do
   b) తర్వాతేం చేయాలో ఆమె మరచిపోయింది. She has forgotten what to do next.

(Very important- గమనించండి: ఏం చేయాలో తెలియడంలేదు లాంటి sentences లో, 'ఏం చేయాలో' అనేది భాగమైనప్పుడే What to do అంటాం. అలాకాకుండా 'ఏంచేయాలిప్పుడు?' అనేదే ఒక sentence అయి, ఆ అర్థం వచ్చేందుకు, "What to do now?" అనడం సరైన English కాదు. కింద compare (A) and (B).

(A) I want to know what to do now? (నేనేం చేయాలో తెలుసుకోవాలనుకుంటున్నా- ఇక్కడ What to do, ఒక sentence లో భాగం మాత్రమే. కాబట్టి ఇక్కడ ఇది correct.

(B) I have no money. What to do now?
(నా దగ్గర డబ్బులేదు. ఏం చేయాలిప్పుడు? - ఇక్కడ What to do now అనేది sentence లో భాగంకాదు. వేరే sentence లాగా వాడుతున్నాం - ఇది తప్పు.) ఇది చాలా ముఖ్యంగా గుర్తుంచుకోవాల్సిన విషయం. ఇలాంటి సందర్భాల్లో, అంటే, ఏంచేయాలిప్పుడు? = What is to be done now? ( What to do? కాదు, కాదు.)

**Kumar:** We've waited for an hour. Jeevan hasn't come. (గంటసేపు చూశాం. జీవన్ ఇంకా రాలేదు.)

**Kesav:** What's (what is) to be done now? (ఇప్పుడేం చేద్దాం? / చేయాలి?) (ఇలాంటిచోట్ల What to do? తప్పు)

2. Let me tell you how to get over the difficulty = ఈ కష్టం ఎలా అధిగమించాలో నన్ను చెప్పనీ.
   a) He has told her how to do it = అదెలా చేయాలో అతనామెకు చెప్పాడు.
   b) Please show us how to separate these two = ఈ రెండింటినీ ఎలా వేరుచేయాలో చెప్పగలరు.

3. I don't know which bank to go to = ఏ bank కు వెళ్లాలో తెలియడం లేదు.
   A) She can't decide which dress to wear for the party = Party కి ఏ dress వేసుకోవాలో ఆమె తేల్చుకోలేకపోతోంది.
   B) He didn't tell me which book to refer to = ఏ పుస్తకాన్ని చూడాలో అతను నాకు చెప్పలేదు.

4) I know who we can go to = మనం ఎవరిదగ్గరికి వెళ్ళాలో నాకు తెలుసు.
   a) ఎవరిని సంప్రదించాలో నాకర్థం కావడం లేదు= I don't see who to consult (see= understand)
   b) అందరు అభ్యర్థులూ పనికిమాలినవాళ్లే. ఎవరిని ఎన్నుకోవాలనేది పెద్ద ప్రశ్న = All candidates are equally bad. The big question is who to elect

5) I don't know who to approach for help ఇదికూడా sentence (4) లాగానే.

6) I am just wondering when to see him = అతన్నెప్పుడు కలవాలా అని ఆలోచిస్తున్నా.
   a) ఎప్పుడు బయల్దేరాలో నీకేమన్నా చెప్పాడా? = Did he tell you when to start?
   b) పనెప్పుడు పూర్తిచేయాలో నీకేమన్నా idea ఉందా? = (Do you have/ Have you) any idea when to complete the work?

7) a) ఆ పుస్తకం కోసం ఎక్కడ వెదకాలో కాస్త చెప్పు = Please tell me where to look for the book?
   b) ఈ రాత్రికి ఎక్కడ నిద్రపోవాలో చూపించు = Show me where to sleep for tonight.

---

## EXERCISE

**Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1 Forgive | A Sharp |
| 2 Longing | B Repeat |
| 3 Hitch | C Reduce |
| 4 Recur | D Excuse |
| 5 Steep | E Extending |
| | F Obstacle |
| | G Yearning |

**KEY:**

**1 - D. Excuse = Pardon** = క్షమించడం.
Oh God, please forgive us our sins = దేవుడా మా పాపాలను క్షమించు.
To err is human but to forgive is divine = పొరపాట్లు మానవ సహజం, క్షమించడం దైవగుణం. (Divine = దేవుడికి సంబంధించిన)
I can never forgive him for what he has done to me = నాకతడు చేసిందానికి నేనతడిని ఎన్నటికీ క్షమించలేను.
(forgive - present; forgave - past; forgiven- past participle)
Forgive X Retaliate (రిటాలియేయిట్) = దెబ్బకు దెబ్బ/ ప్రతీకారం తీర్చుకోవడం. (Hit back).

**2 - G. Yearning** = బలమైన కోరిక/ తపించిపోవడం/ బెంగపెట్టుకోవడం
a) The boy is unable to study well because of his longing for home/ longing for his mother, etc = ఇంటిమీద/ తల్లిమీద బెంగవల్ల సరిగా చదవలేకపోతున్నాడు.
b) I have a longing to hear his voice again= అతడి గొంతు వినాలనే కాంక్షలో ఉన్నాను నేను.
c) We can understand his longing to hear her songs = ఆమె పాటలను వినాలనే అతడి కోరికను మనం అర్థం చేసుకోగలం.
Long = కోరుకోవడం/ బెంగపడటం.
Longing x Indifference (అనాసక్తి)

**3 - F. Obstacle** = అడ్డంకి/ సమస్య/ అంతరాయం/ ఇబ్బంది. ఏదైనా పనిలో కొద్దిగా ఆలస్యాన్ని కలుగజేసే అడ్డంకి.
a) In spite of the rain the programme went off without any hitch= వర్షం వచ్చినప్పటికీ కార్యక్రమం ఏం అంతరాయం లేకుండా జరిగిపోయింది.
b) I foresee a few hitches on our walking tour= మన పాదయాత్రలో కొన్ని చిన్న ఇబ్బందులు ఎదురవుతాయని నేననుకుంటున్నా (foresee= ముందే ఊహించడం)
c) There was a hitch towards the end of the programme because of the drizzle = కార్యక్రమం చివరన తుప్పర వల్ల కాస్త ఇబ్బంది కలిగింది.

**4 - B. Recur = repeat** = మళ్లీ మళ్లీ సంభవించడం, పునరావృతమవడం
a) The Maoist violence recurs frequently in the backward regions of the state = రాష్ట్ర వెనుకబడిన ప్రాంతాల్లో మావిస్ట్ హింసాకాండ మళ్లీ మళ్లీ జరుగుతూనే ఉంటుంది.
b) Some illnesses recur and surgery is the only permanent cure for them = కొన్ని వ్యాధులు మళ్లీ మళ్లీ వస్తుంటాయి. అలాంటివాటికి శస్త్ర చికిత్సే శాశ్వత నివారణ.
c) The earthquake recurred three times and damaged the area permanently= భూకంపం మూడుసార్లు రావడంతో ఆ ప్రాంతం అంతా శాశ్వతంగా దెబ్బతింది.

**5 - A. Sharp** = (కొండలు/ పర్వతాలు/ మెట్లు లాంటివి) నిటారుగా ఉన్న/ నిడుపైన/ వాలు తక్కువగా ఉండి ఎక్కేందుకు ప్రమాదకరంగా ఉన్న.
1) The car rolled down the steep mountainside = నిటారుగా ఉన్న పర్వతం వాలుమీంచి కిందకు దొర్లిపోయిందా కారు. 2) The old man found it difficult to climb up the steep flight of stairs = నిటారుగా ఉన్న ఆ మెట్లెక్కడం ఆ ముసలాయనకు కష్టమనిపించింది.
Flight of stairs = మెట్ల కూర్పు. ధరల్లాంటివి ఒక్కసారిగా విపరీతంగా పెరగటం = Steep rise in prices.
The prices of vegetables have risen steeply/ sharply over the past week = గత వారం రోజుల్లో కూరగాయల ధరలు విపరీతంగా పెరిగాయి. (sharp అంటే ఎక్కువగా వాడే అర్థం = పదునైన. కానీ ఇక్కడి అర్థం, ఒక్కసారిగా, నిడుపుగా అని)
steep x gradual/ moderate.
Gradual = క్రమ, క్రమంగా. Moderate = ఒక మోస్తరు- (Moderate price = ఎక్కువా, తక్కువా కాకుండా ఒక మోస్తరు ధర/ సరసమైన ధర).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# What on earth for?

**Abhijith:** Hi Adbhuth, weren't you supposed to be in Vijayawada today? How come I see you here?
(నువ్వు ఈరోజు విజయవాడలో ఉండాలని అనుకుంటున్నాం. ఇక్కడ కనిపిస్తున్నావేంటి?)

**Adbhuth:** You're right. I was told to be in Vijayawada today. But because of a last minute change in the programme I had to cancel my trip.
(నిజమే. నన్నివాళ విజయవాడలో ఉండమన్నారు. కాని చివరి నిమిషం మార్పువల్ల నా ప్రయాణం మానుకోవాల్సి వచ్చింది)

**Abhijith:** Who's responsible for the change?
(ఎవరు మార్పునకు కారణం?)

**Adbhuth:** Our director is. He is believed to have told the manager to change the programme.
(మన director. Programme మార్చమని అతడు manager కు చెప్పినట్లు నమ్ముతున్నారు)

**Abhijith:** What on earth for? (ఎందుకు?)
కొంచెం విసుగ్గా అనేటప్పుడు, on earth అంటుంటాం

**Adbhuth:** Who knows? We are expected to follow orders. That's what I do. So long as I am paid properly why should I bother?
(ఎవరికి తెలుసు? మనం వాళ్ల ఆజ్ఞలు పాటించాలని వాళ్లను కుంటారు. నేను చేసేదీ అదే. నాకు నా జీతం సరిగ్గా అందేవరకు నాకేంటి? నేనెందుకు బాధపడాలి?)

**Abhijith:** That's well said. Our director is considered very efficient. But aren't such sudden changes a waste of money? Difficult to believe efficiency and wastage can go together.
(బాగా చెప్పావు. మన director ను చాలా సమర్థుడిగా పరిగణిస్తారు. కాని ఇలాంటి ఆకస్మిక మార్పువల్ల డబ్బు వృథా కదా? సామర్థ్యం, డబ్బు వృథా కలిసి ఉంటాయని నమ్మటం కష్టం.)

efficient = ఇఫిష్‌న్‌ట్- 'ఫి' నొక్కి పలుకుతాం = సమర్థులైన;
efficiency= ఇఫిష్‌న్‌సి- 'ఫి' నొక్కి పలుకుతాం = సామర్థ్యం

**Adbhuth:** True. Programmes are often changed only because of improper planning. Improper planning is the result of inefficiency.
(నిజమే. Programmes తరచూ మార్చడం, సరైన ప్రణాళిక లేకపోవడం వల్లనే. సరైన ప్రణాళిక లేకపోవడం, అసమర్థత ఫలితమే.)

inefficiency= ఇనిఫిష్‌న్‌సి- 'ఫి' నొక్కి పలుకుతాం= అసమర్థత

**Abhijith:** I think he is soon going to be replaced; the present director, I mean.
(త్వరలోనే ఆయన్ను మారుస్తున్నారనుకుంటా, అదే, ఇప్పుడున్న director ను.)

**Adbhuth:** What good that's going to be?
(అందువల్ల ప్రయోజనమేంటి?)

**Abhijith:** The company will be placed on the path to growth.
(Company అభివృద్ధి మార్గంలో ఉంటుంది)

**Adbhuth:** How are you so sure of it?
(అంత కచ్చితంగా ఎలా చెప్పగలవు?)

**Abhijith:** The new director may prove more efficient than the present one. At least that is what is hoped.
(కొత్త director ఇప్పుడున్న director కంటే సమర్థుడుగా ఉండొచ్చు అలా అని కనీసం ఆశిస్తున్నారు)

**Adbhuth:** OK. Let's hope so too.
(మనమూ అలాగే ఆశిద్దాం)

⊙ ⊙ ⊙


M.SURESAN

ఇప్పుడు మనం Advanced level of Spoken English లోకి అడుగుపెడుతున్నాం. ఈ దశలో మనం ముఖ్యంగా తెలుసుకోవాల్సింది సందర్భానుసారంగా passive voice వాడటం.

English లో ముఖ్యంగా Spoken English లో వీలయినంతవరకు passive voice వాడకుండా ఉండటం మంచిదని ఇంతకుముందు చాలాసార్లు చెప్పాం. ముఖ్యంగా ప్రతి active voice లోని verb నూ, passive లోకి మార్చడం వల్ల (grammar కోసం), భావాన్ని passive లో తెలియజేయడం చాలా వికృతంగా, కృతకం (artificial) గా ఉండి, Spoken English లో సహజత్వం లోపిస్తుంది. అలాగని passive voice వాడాల్సిన అవసరం అసలు లేదని కాదు. Verb తెలిపే పనికి ప్రాధాన్యం ఇవ్వాల్సి వచ్చి, ఆ పనిని చేసే subject మనకు clear గా చెప్పలేకపోయినపుడే, passive ఉపయోగం అవసరం, సహజం.

eg: This house was built ten years ago.

Verb - was built (was- be form + built - past participle- voice - passive)

గుర్తుంది కదా? Verb, be form + past participle (PP) గా ఉంటే అది passive. తెలుగులో "బడు" అని అర్థం వస్తుంది.

This house was built ten years ago=
ఈ ఇల్లు పదేళ్ల కిందట కట్టబడింది-

Spoken Telugu లో ఇలా అనం కదా? ఈ ఇల్లు (ఇంటిని) పదేళ్ల కిందట కట్టారు అంటాం.

ఇక్కడ Spoken English లో passive voice అవసరం. ఎందుకంటే, ఎవరు కట్టారని కాకుండా, కట్టింది (verb) ఎప్పుడు అనే విషయానికి ప్రాధాన్యం. అంతే కాకుండా subject (పని చేసిందెవరు) తెలియనప్పుడు passive వాడాల్సిందే.

The Road has been repaired=
Road repair అయింది (చేయబడింది అనకుండా).

Road repair చేసిందెవరో తెలియదు/ చెప్పలేం కాబట్టి passive- has been repaired - ఇక్కడ అవసరం. ఇలాంటిచోట్ల మాత్రమే Spoken English లో passive అవసరమవుతుంది.

The lunch was cooked by my sister.
గమనించండి- by my sister- ఇది చాలా అసహజం.

ఇంతకంటే, My sister cooked the lunch (active) సహజంగా, సరళంగా ఉంది కదా?

గుర్తుంచుకుందాం: Active voice లో subjects - I, we, you, he, she, they, someone, nobody, a man, the boy, etc people, etc అయినప్పుడు వాటిని passive లో దాదాపు వాడకపోవడమే మంచిది, అందం (By me, by us, లాంటి expressions రాకుండా).

***Now look at the passive expressions used in the conversation above.***

*1) Weren't you (= Were you not) supposed to be in Vijayawada today?*
*verb = were supposed (PV)*

*2) I was told to be in Vijayawada today.*
*Verb - was told (PV)*

*3) He is believed to have told the manager.*
*Verb - is believed (PV)*

*4) We are expected to follow orders.*
*Verb - are expected (PV)*

*5) So long as I am paid properly.*
*Verb - am paid (PV)*

*6) That's well said.*
*Verb - is said (PV)*

*7) Programmes are often changed.*
*Verb - are changed (PV)*

*8) He is going to be replaced.*
*Verb - is going to be replaced (PV)*

*9) That's what is hoped.*
*Verb - is hoped (PV)*

**1) You are supposed** - మామూలు తెలుగులో- (నిన్ను/ నీ గురించి) అనుకుంటున్నారు

a) You are supposed to be the leader = నువ్వు నాయకుడివని అనుకుంటున్నారు (అనుకోబడుతున్నావు)

b) You are supposed to be in Delhi today = నువ్వీరోజు ఢిల్లీలో ఉన్నావని అనుకుంటున్నారు.

**2) I was told** = నాతో చెప్పారు - ఎవరు చెప్పారో తెలుపడం వీలుకాకపోతే ఇలా అంటారు.

a) We were told you were going to buy a flat= నువ్వేదో flat కొనబోతున్నావని మాతో ఎవరో అన్నారు.

b) This was reported to the Principal = అది Principal కు ఎవరో చెప్పారు.

**3) He is believed** = (అతడి గురించి) నమ్ముతున్నారు.

Tendulkar is believed to be the best batsman in the world = టెండుల్కర్ అత్యంత గొప్ప batsman అని అందరూ నమ్ముతున్నారు.

**4) We are expected** = మనల్ని ఆశిస్తున్నారు.

**5) I am paid** = నేను చెల్లించబడతాను- మామూలు తెలుగులో- నాకు చెల్లిస్తారు.

ఇలాగే మిగతావి కూడా. More in the next lesson.

## EXERCISE

**Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1. Awkward | A. Terrify |
| 2. Twist | B. Vary |
| 3. Landscape | C. Clumsy |
| 4. Scare | D. Delicate |
| 5. Fluctuate | E. Bend |
| | F. Scenery |
| | G. Straighten |

**KEY: 1-C. Awkward= Clumsy** = ఏదైనా పని చేయడంలో కంగారుపడటం, గందరగోళం.

a) As he walked up the stage, he appeared very awkward = వేదిక మీదికి నడిచి వెళ్లేటప్పుడు చాలా తడబడుతూ, కంగారుగా కనిపించాడు.

b) 'Have you any money?'
'I'm sorry, I don't have any' he said.
awkwardly = 'నీ దగ్గర డబ్బేమైనా ఉందా?'
'లేదు,' అన్నాడతడు ఇబ్బందిగా మొహంపెట్టి

c) She tried to dance but she was quite awkward = ఆమె dance చేసేందుకు ప్రయత్నించింది, కానీ చాలా కంగారుగా తడబడింది.

Awkward - ఆక్వడ్ (క్వడ్- bird లాగ)- ఆ నొక్కి పలుకుతాం. Awkward situation- ఇబ్బందికర పరిస్థితి. మీరింటికి పిలిచిన friend, మీ ఇంటికి వచ్చినప్పుడు, మీ తల్లిదండ్రులతడిని అవమానిస్తే మీ position చాలా awkward గా ఉంటుంది. Awkward అంటే అసౌకర్యమైన అనే అర్థం కూడా ఉంది.

He sat in an awkward position.

Awkward (కంగారు, తడబాటు అనే అర్థంతో) × skillful/ adroit = చాకచక్యంతో, Awkward (ఇబ్బందికరమైన అనే అర్థంతో) × graceful (హుందాగా).

**2-E. Twist = Bend** = వంచడం. Twisted rod = వంచిన కడ్డీ. (Twist - Twisted - Twisted)

He twisted my arm behind my back = నా చేతిని వెనకకు మెలితిప్పాడు.

The road twists and turns too often = ఆ road మరీ వంకర తిరుగుతుంది/ వంకరటింకరగా ఉంటుంది.

As she fell she twisted her neck = ఆమె పడిపోవటంతో మెడ తిరిగిపోయింది.

Twist అంటే ఒకరు చెప్పిందాన్ని వక్రీకరించి చెప్పడం.

When he reported the matter to me he twisted what his father had said = నాతో చెప్పేటప్పుడు వాళ్ల నాన్న చెప్పిందాన్ని మార్చి/ వక్రీకరించి చెప్పాడు. (వాళ్ల నాన్న చెప్పిందొకటి, అతను నాతో చెప్పిందింకొకటి)

Twist X straighten (= వంగి ఉన్నదాన్ని సాఫీగా చేయడం)

**3-F. Landscape = Scenery**= ప్రకృతిదృశ్యం.

The landscape of Kashmir is beautiful= కాశ్మీర్ ప్రకృతిదృశ్యం సుందరంగా ఉంటుంది.

The landscape of Araku valley is enchanting= అరకు లోయ దృశ్యం మంత్రముగ్ధుల్ని చేస్తుంది.

enchanting = ఆకట్టుకునే, మంత్రముగ్ధులు చేసే.

**4-A. Scare = Terrify**= భయం కలిగించడం

The sudden appearance of the dog scared the child = అనుకోకుండా ఆ కుక్క కనిపించడం, ఆ బిడ్డను భయపెట్టేసింది.

The thought of death punishment scared the murderer = మరణశిక్ష గురించి ఆలోచన ఆ హంతకుడిలో దడపుట్టించింది.

The sight of our headmaster scares us = మా headmaster కనిపిస్తే చాలు, మేం భయపడిపోతాం.

Scare X reassure (ధైర్యంతో స్థిమితపడటం)

On seeing the policeman, the thief was scared and I felt reassured = Police ను చూడగానే దొంగకు దడపుట్టింది, నాకు ధైర్యం కలిగింది.

**5-B. Fluctuate = Vary** = మారుతూ ఉండటం తరచుగా- పరిమాణంలో, నాణ్యతలో, ధరలో.

The price of petroleum fluctuates in the international market = అంతర్జాతీయ విపణిలో పెట్రోలియం ధరలు తరచూ మారుతుంటాయి.

Fluctuating voltage = Current voltage లో తరచూ విపరీతమైన మార్పులు.

His mood fluctuated between the happiest and the saddest = అతడి మనస్థితి అతి సంతోషం నుంచి అతి దుఃఖానికి ఊగింది.

Fluctuate X Persist (= ఒకే స్థితిలో కొనసాగడం).

This price has persisted for the past few weaks = ఈ ధర గత కొద్ది వారాలుగా (ఒకే విధంగా/ మార్పులు లేకుండా) కొనసాగుతోంది.

**D) Delicate** = సున్నితమైన. A baby's skin is delicate = బిడ్డ చర్మం సున్నితంగా ఉంటుంది. An egg shell is delicate = కోడి గుడ్డు పెంకు సున్నితం.

Delicate X tough (దృఢమైన).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

## SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 413

## Would be - ఎలా అర్థం చేసుకోవాలి?

**ప్రశ్న:** *1. To be + pp form గురించి తెలియజేయగలరు. దీన్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలి. ఉదాహరణకు to be won కు అర్థం ఏమిటి?*

*2. Would be గురించి తెలియజేయండి. Would be + pp form ను ఏ విధంగా అర్థం చేసుకోవాలి? ఉదాహరణకు would be done, would be won అర్థం ఏమిటి?*

*3. ఇంగ్లిష్‌లో ఒక పనిని చేయిస్తాను అనడానికి ఏమనాలి? నేను ఆ పనిని చేయిస్తాను అనడానికి ఏమనాలి?*

*4. కిందివాటిలో ఏవి కరెక్ట్?*



*I. a) What does the poet says?*
*b) What does the poet say?*
*II. a) Where does she goes?*
*b) Where does she go?*
*III. a) What does he thinks?*
*b) What does he think?*

*5. 2nd RDW ను Question తోగానీ, not తోగానీ చెప్పేటప్పుడు does వస్తుంది కదా? మరి does ను ఉపయోగించినప్పుడు 1st RDW ఎందుకు రాస్తారు? అది తప్పుకాదా? వివరించండి.*

*6. Am, is, are ప్రస్తుతం ఉండటాన్ని తెలియజేస్తాయి కదా? am+pp, is + pp, are+ pp లను ఎలా అర్థం చేసుకోవాలి?*

*Was come తప్పు అని చెప్పారు. కానీ was + pp, were + pp గురించి తెలియజేశారు కదా! అలాంటప్పుడు was + pp ఏ విధంగా తప్పవుతుంది? He is come కరెక్ట్ అయినప్పుడు He was come ఎందుకు తప్పు?*

*7. ఇక్కడ అన్ని రకాల సైకిళ్లు అమ్మబడతాయి అనడానికి All types of cycles will be sold here అనాలి కదా? All types of cycles are sold here అని ఎందుకు అంటారు? దాని అర్థం అన్ని రకాల సైకిళ్లు ఇక్కడ అమ్మబడి ఉన్నాయి అని వస్తుంది కదా?*

**– అభిజిత్, హైదరాబాద్**

**జవాబు:** 1. to be + pp (am/ is/ are/ shall be/ was/ can be, etc + past participle) form లో verb passive voice లో ఉంటుంది.

(pp = past participle అని తెలుసు కదా? )

To be won = గెలుచుకోబడాల్సిన అన్నట్లు.

Three prizes to be won=

గెలుచుకోబడేందుకు (మామూలు తెలుగు- గెలుచుకునేందుకు) మూడు బహుమతులు.

More work to be done =

చేయబడేందుకు (చేయాల్సిన) పని ఇంకా ఉంది.

2. Would be - దీని గురించి ఇంతకుముందు చాలాసార్లు వివరించాం. గతంలోంచి భవిష్యత్ చెప్పడానికి ఇది వాడతాం.


M.SURESAN

I thought that he would be there = అతడక్కడ ఉంటాడని నేననుకున్నా - అనుకున్నది గతం - అతడు ఉండటం అప్పటి నుంచి future కాబట్టి would be.

would be + pp = would be done, would be seen, etc.

He Know that it would be done = అది చేయబడుతుందని అతడికి తెలిసింది.

She hoped that she would be given the prize = Prize తనకివ్వబడుతుందని ఆమె ఆశించింది.

We all expected that the match would be won by India = Match భారత్‌చేత గెలువబడుతుందని మేం అనుకున్నాం (మామూలు తెలుగు: భారత్ match గెలుస్తుందని అనుకున్నాం).

3. I will make (somebody) do it/ I will get it/ have it done.

4. 1b, 2b and 3b correct.

5. 2nd RDW ను not/ question తో వాడినప్పుడు does + 1st RDW మాత్రమే వస్తుంది. Does తో 2nd Regular Doing Word రాదు.

He likes me X He does not like me

likes + not / ? = (does like)

Does + 1st RDW మాత్రమే correct

6. am + pp/ is + pp/ are + pp- Regular గా జరిగే పనిని passive voice లో తెలియజేస్తాయి.

I am taught (am + taught - pp of teach) for an hour everyday = (ప్రతి రోజూ (Regular) నేను గంటసేపు బోధించబడతాను. (మామూలు తెలుగు- ప్రతిరోజూ గంటసేపు నాకు బోధిస్తారు.)

He is seen (is + seen - pp of see) here everyday =

ప్రతిరోజూ (Regular) అతడిక్కడ చూడబడతాడు. (ప్రతిరోజూ అతడిక్కడ కనిపిస్తాడు.)

They are given (are + given - pp of give) coffee every morning =

ప్రతి ఉదయం వాళ్లు coffee ఇవ్వబడతారు- (వాళ్లకు coffee ఇస్తారు)

Was + pp/ Were + pp- గతంలో జరిగిన పనులకు.

It was done yesterday - నిన్న చేయబడింది

They were taken home =

అవి ఇంటికి తీసుకెళ్లబడ్డాయి.

గమనిక: be form తో object ఉన్న verbs కు మాత్రమే past participle వాడతాం. అంటే ఎవరిని/ దేనిని అని verb కు ప్రశ్న వేసుకుంటే answer వచ్చే verbs కు object ఉంటుంది. come- రావడం- ఎవరిని/ దేనికి రావడం? - Answer లేదు. అందుకని was come/ were come రాదు. తప్పు.

7. Will be sold అంటే future లో అమ్మబడతాయని అర్థం. Are sold అంటే క్రమం తప్పకుండా/ ఎప్పుడూ అమ్మబడతాయని. Book Shops లో పుస్తకాలెప్పుడూ అమ్మబడతాయి కాబట్టి are sold అనే అనాలి.

---

## I am young, aren't I?

**ప్రశ్న:** *'Question Tag' లు, I am young, amn't I ? , I am correct, aren't I ? - ఇలా తేడాగా ఉంటున్నాయి. 'be' form పక్కన not లేకపోతే, not వస్తుంది. కానీ 'aren't' ఎందుకు వస్తుంది? amn't I ? కదా రావాల్సింది? కొన్ని పుస్తకాల్లో amn't I గా, మరికొన్నింటిలో aren't I గా వస్తున్నాయి. ఇంకా ఇలాంటి తేడాలుంటే చెప్పగలరు?*

**– వి.మోహన్, కంతేరు**

**జవాబు:** I am young, aren't I? అనడం correct. ఒక్క 'I' విషయంలో మాత్రమే, question tag లో n't (not) వచ్చినప్పుడు, aren't I? అని వస్తుంది, రావాలి. ఇది వాడుక, (usage) కాబట్టి వివరణ అంటూ ఉండదు. గుర్తుంచుకోవాల్సిందే. అయితే మళ్లీ question tag లో, "I" తో not లేకపోతే am I? అనే వస్తుంది.

---

## "I will come here"..

**ప్రశ్న:** *He said, "I will come here"... ఈ వాక్యానికి Indirect Speech లో come స్థానంలో go వస్తుందా? వివరించండి.*

*కరెన్సీ నోట్లపై I promise to pay the bearer the sum of one hundred rupees అని రాసి ఉంటుంది. దాని భావం ఏమిటి?*

**– పావని, సుధ, మత్స్యపురి, పశ్చిమగోదావరి**

**జవాబు:** అవును. He said that he would go there, correct.

Currency notes ను ముద్రించి చలామణి చేసే బాధ్యత Reserve Bank of India ది. ఆ bank governor, ఒక నోటుకున్న ద్రవ్య విలువ (monetary value - డబ్బుల విలువ)ను తెలిపే హామీ ఇది. వంద రూపాయల నోటున్న వారెవరికైనా (bearer = నోటును పొందినవారు) వంద రూపాయల ద్రవ్యం (డబ్బు) చెల్లిస్తానని Reserve Bank of India Governor హామీ ఇది.

---

## Invention/ Discovery

**ప్రశ్న:** *What is the difference of Invention and Discovery.*

**– ఎన్. సిద్ధణ్ణ, రాయదుర్గం**

**జవాబు:** Invention - లేని దాన్ని సృష్టించడం - Electric bulb, TV, Telephone లాంటి వాటిని, Inventions అంటాం.

Discovery - ఉన్న దాన్ని మొదటగా చూడటం/ అర్థం చేసుకోవడం/ తెలుసుకోవడం.

Columbus discovered America - అమెరికాను మొదట చూసింది Columbus.

The discovery of the law of gravitation = భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని మొదట అర్థం చేసుకున్నది.

---

# He is seen here everyday

## match ends in a draw ?

**ప్రశ్న:** *దైనందిన, ప్రకృతి సంబంధిత, సహజ, చరిత్రాత్మక అంశాలను simple present tense లో వర్ణిస్తారు. జరిగిపోయిన ఘటనలను simple past tense లోనే చెప్పాలి. ఇండియా-పాక్‌ల మధ్య క్రికెట్ మ్యాచ్ డ్రా అయ్యింది. ఇది చారిత్రాత్మక అంశం కాదు. జరిగిపోయిన కాలానికే. అయినా channels లో, News Papers లో కూడా Indo-Pak match ends in a draw అంటూ ends simple present tense ఎందుకు వాడారు? ఇలాగే ఎన్నో అంశాలు The talks 'fail' అంటూ తరచూ రేడియోల్లో వింటున్నాం. పేపర్లలో చదువుతున్నాం. ఇది learners కూ, beginners కూ తప్పుడు సంకేతాలు ఇస్తున్నట్లే కదా? ఇది ఏ సూత్రం ప్రకారం జరుగుతోంది? వివరించగలరు.*

**– ఎ. కృష్ణగీతార్జున, నిడదవోలు**

**జవాబు:** A very good question.

News Paper reporting లో ముఖ్యంగా headings లో జరిగిపోయిన విషయాలను present simple లో report చేయడం మొదటి నుంచి వస్తున్న ఆనవాయితీ (convention). అంతేకాకుండా immediate past లో జరిగిన విషయాలను కొన్నిసార్లు simple present లో తెలియజేస్తాం.

Eg: I come to express my gratitude to you. మీకు కృతజ్ఞతలు తెలిపేందుకు నేనిక్కడికి వచ్చాను. ఇక్కడ I have come అన్నా అనొచ్చు.

అందుకనే news paper headings లో Twenty die as train derails (Train పట్టాలు తప్పటంతో 20 మంది మరణం), Elephants destroys crops and kill villagers (పంటల్ని నాశనం చేసి మనుషులను చంపిన ఏనుగులు) లాంటి headings చూస్తాం. అయితే The use of simple present for past events, headlines కు మాత్రమే పరిమితం. Headlines కింది కథనంలో (News report/ story లో) మాత్రం సంఘటన జరిగిన day/ date ను తెలిపి, past simple వాడతారు.

News paper regular గా చదవడం అలవాటయితే learners/ beginners కు ఉండే confusion తొలగిపోతుంది. కొన్ని TV channels లో తప్పుగా India won the match అని రాస్తుంటారు. ఇది India wins అని కానీ, India has won అని కానీ ఉండాలి. India wins అన్నప్పుడు journalistic language అవుతుంది. India has won అన్నప్పుడు past action, time not stated అవుతుంది.

---

## walking stick అంటే నడుస్తున్న కర్ర కాదు

**ప్రశ్న:** *No Smoking, Missing, Drinking Water, Parking లాంటి ప్రకటనలను -ing form లో రాస్తారెందుకు? Do not smoke here, missed అని రాయవచ్చు కదా? 'తప్పిపోయాడు' అనడానికి 'missing' సరైన అర్థాన్నిస్తుందా? Drinking water కు 'నీళ్లు తాగుతున్న' అని అర్థం చేసుకుంటున్నాం. తాగేనీరును Drinking water అని కాకుండా మరో మాట/ రూపంలో చెప్పలేమా? అలాగే parking అంటే ఏమని అర్థం చేసుకోవాలి? దయచేసి వివరించగలరు.*

**– వి.మోహన్, జగిత్యాల**

**జవాబు:** Missing అంటే తప్పిపోయిన అనే అర్థం వస్తుంది. Correct. అయితే, ఇక్కడ missing అంటే కనబడటంలేదు/ జాడలేదు అనే అర్థం కూడా వస్తుంది. కాబట్టి తప్పిపోయాడు అనడానికి missing correct మాటే. Drinking అంటే తాగుతున్న అనే కాకుండా తాగేందుకు అనే అర్థం కూడా వస్తుంది.

walking stick = stick used for walking.

writing table = table which we use for writing

మీ సందేహం చాలా మంచి సందేహమే.

working women = ఉద్యోగం చేసే/ చేస్తున్న స్త్రీలు

అయితే walking stick అంటే నడుస్తున్న కర్ర అని రాదు.

ఇది వాడుకలో అలా వచ్చే expression.

Printing ink అంటే printing (ముద్రించేందు) కు వాడే ink అనే వస్తుంది కానీ ముద్రించే ink అని రాదు కదా.

missed = కోల్పోయిన

missed chance = (మనుషులు) కోల్పోయిన అవకాశాలు.

ఇక్కడ missed, past participle.

He missed the chance = అతడు అవకాశాన్ని పోగొట్టుకున్నాడు.

ఇక్కడ missed - past simple.

ఇలాంటివి ఇంకా చాలా ఉన్నాయి. వాటిని మనం సందర్భానుసారం అర్థం చేసుకోవాలి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

# The team has been announced

**Amogh:** A piece of good news. You've been selected for the college team.
(ఓ శుభవార్త. నువ్వు college team కు ఎంపికయ్యావు)

**Akhil:** That's real good news. Are you sure of it?
(మంచి వార్తే అది. కాని నిజమేనా?/ నీకు గట్టిగా తెలుసా?)

**Amogh:** The team has been announced. Your name is on the list.
(జట్టును ప్రకటించారు. నీ పేరు జాబితాలో ఉంది)

**Akhil:** I am really happy about it. Thank you. Who else are included in it?
(నేను నిజంగా సంతోషంగా ఉన్నా. Thank you. ఇంకెవర్ని చేర్చుకున్నారందులో?)

**Amogh:** Our friend Sunil has been dropped. He was found to have a knee problem.
(సునీల్‌ను వదిలేశారు. అతనికేదో మోకాలి సమస్య ఉంది)

**Akhil:** When is the match? (Match ఎప్పుడు?)

**Amogh:** The match will be held this 15th and players will be asked to report for practice from the 3rd onwards.
(Match, 15th న అవుతుంది. ఆటగాళ్లందరిని 3 నుంచి practice కు హాజరవాలంటారు.)

**Akhil:** I would have been there too if I had been in town yesterday.
(నిన్న నేను ఊళ్లో ఉంటే, నేనక్కడ ఉండేవాడ్నే.)
I'd have got all this information myself.
(ఈ సమాచారమంతా నేనే తెలుసుకునుండేవాడ్ని)

**Amogh:** The winners in the match will be sent to Mumbai to play the finals.
(ఇక్కడ గెలిచినవాళ్లను finals లో ఆడేందుకు ముంబైకి పంపుతారు)

**Akhil:** This will please my parents no end. Thank you again for giving me this wonderful piece of news. I am really thrilled.
(మా అమ్మానాన్నకీవార్తతో విపరీతమైన ఆనందం కలుగుతుంది. నీకు మళ్లీ మళ్లీ thanks, ఈ అద్భుతమైన సమాచారానికి. నాకు నిజంగా పులకరింతగా ఉంది)

thrill= గగుర్పొడుపు/ పులకరింత.

English లో ప్రాముఖ్యమున్న passive voice గురించి చర్చిస్తున్నాం కదా. English లో passive voice కు ప్రాధాన్యం చాలా ఉన్నప్పటికీ అవసరమైనప్పుడు వాడటమే అందంగా ఉంటుందనీ, అనవసరంగా వాడినప్పుడు చాలా వికృతంగా ఉంటుందని కూడా తెలుసుకున్నాం కదా? ముఖ్యంగా- by (ఎవరిచేత) - ఆ పని చేయబడింది (ఇది Telugu passive form) అని మనకు స్పష్టంగా తెలిసినప్పుడు, by X/ Y/ Z అని passive voice వాడటం అనవసరం. పనిచేసిందెవరో (subject) కచ్చితంగా తెలిసినప్పుడు, active voice లో చెప్పడమే సహజంగా ఉంటుందని గుర్తుంచుకోండి. ముఖ్యంగా Spoken English లో... by me/ him/ you/ us/ her/ them/ it/ somebody వచ్చే passive voice వాక్యాలకు స్థానం లేదు. By తో వచ్చే passive ఉంటే అది వాడకుండా ఉండటమే మంచిది.

***Now look at the following sentences from the dialogue above.*** See if they can be only in passive voice or if they can be better if they are in active voice. (ఈ Sentences passive voice లో మాత్రమే చెప్పగలమా లేకుంటే వాటిని passive voice లోకి మార్చి చెప్తే మెరుగ్గా ఉంటాయా చూడండి). ఈ వాక్యాలన్నీ passive.





M.SURESAN

**1)** You have been selected for the college team= నువ్వు college team కు ఎంపిక చేయబడ్డావు. (మామూలు తెలుగు- నువ్వు ఎంపికయ్యావు/ నిన్ను ఎంపిక చేశారు) verb- have been + selected [be form + past participle (PP)]

**2)** The team has been announced. verb- has been announced- be form + pp (passive voice) = Team ప్రకటించబడింది- మామూలు తెలుగులో- Team ప్రకటించారు.

**3)** Who else are included in the team? Verb- are + included (be form + PP) passive = Team లో ఇంకెవరు చేర్చబడ్డారు? మామూలు తెలుగు- Team లో ఇంకెవర్ని చేర్చారు?

**4)** Our friend Sunil has been dropped. Verb- has been dropped = be form + PP- passive voice= Sunil తొలగించబడ్డాడు. మామూలు తెలుగు- సునీల్‌ను తొలగించారు.

**5)** The match will be held this 15th. verb- will be held - 'be' form + PP - passive= Match ఈ 15న నిర్వహించబడుతుంది. మామూలు తెలుగు- match ఈ 15న ఉంటుంది/ జరుగుతుంది.

**6)** Players will be asked to report for practice from the 3rd. verb- will be asked- be form + PP - passive= ఆటగాళ్లు 3 నుంచి practice కు హాజరుకావాలని అడగబడతారు= Players ను 3నుంచి practice కు రమ్మంటారు- మామూలు తెలుగు.

**7)** The winners in the match will be sent to Mumbai. Verb- will be sent- be form + PP - passive voice = పంపబడతారు- మామూలు తెలుగు- గెలిచినవాళ్లను ముంబైకి పంపుతారు.

గమనించారు కదా, పై English sentences అన్నీ verb passive గా ఉన్నవే. అవి passive voice లో ఉంటేనే English లో సరిగా అర్థం వస్తుందికదా?

**1)** నువ్వు ఎంపికయ్యావు- దీన్ని passive లోనే చెప్పగలం. ఎందుకంటే ఎవరు నిన్ను ఎంపికచేశారనేది స్పష్టంగా లేదు కాబట్టి. ఈ భావాన్ని active లో చెప్పడం కుదరదు- You have been selected.

**2)** The team has been announced. దీన్ని active voice లో చెప్పటం కాస్త కష్టమే కదా, ఎవరు ప్రకటించారు అనేది స్పష్టంగా తెలియదు కాబట్టి. తెలుగులో అయితే ఎవరు ప్రకటించారు అనే విషయానికి ప్రాధాన్యం ఇవ్వకుండా, జట్టు ప్రకటించారు అనేస్తాం. ఎవరు ప్రకటించారు? - దీనికి ప్రాముఖ్యం లేదు. ఇటువంటి సందర్భాల్లో English లో passive మాత్రమే వాడగలం. లేకుంటే The selection committee అనే వివరంతో, The selection committee has announced the team అనొచ్చు. ఇలా అనే బదులు passive better కదా, selection committee omit చేసి.

**3)** Who else are included? ఈ passive form కు కూడా active కష్టమే, చేర్చేవాళ్లెవరో తెలియదుకాబట్టి. ఇక్కడ English లో active దాదాపు లేనట్లే.

**4)** Sunil has been dropped= సునీల్‌ను తొలగించారు (ఎవరో చెప్పడం లేదు - చెప్పనవసరం లేదు. ప్రాముఖ్యం drop అయినందుకే, ఇక్కడ కూడా English లో active కష్టమే. మళ్లీ The selection committee has dropped Sunil అనాలి, selection committee అనే extra మాటలు చేర్చి)

**5)** The match will be held this 15th. ఇక్కడ active లేనట్లే- ఎవరు match నిర్వహిస్తారనేది తెలియదుకాబట్టి.

**6)** Players will be asked to report for practice from the 3rd. ఇక్కడ కూడా active అసాధ్యం, Team management will ask the players to report .. అని అనుకుంటే తప్ప.

ఇలాంటి passive forms Spoken English కు ప్రాణం. కిందివాటిని కూడా గమనించండి.

a) Immediate action should be taken to check bird flu (pv) = Bird flu ను అదుపు చేసేందుకు తక్షణ చర్యలు తీసుకోవాలి.

b) A large number of birds have been culled = పెద్ద సంఖ్యలో కోళ్లను చంపేశారు.
cull = సంఖ్య తగ్గించేందుకు/ వ్యాధి నివారణకు జంతువులను, పక్షులను చంపడం.

---

## EXERCISE

**Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1 Blossom | A Terrible dream |
| 2 Stigma | B Push |
| 3 Junk | C Pleasure |
| 4 Thrust | D Flower |
| 5 Nightmare | E Heart |
| | F Disgrace |
| | G Waste |

**KEY: 1-D. Blossom= Flower** = పూవు/ పూలగుత్తి. ముఖ్యంగా చెట్టు/ మొక్కమీద ఉన్నప్పుడు.

The blossoms on the plants in the garden were very fragrant=
తోటలోని మొక్కల పూలు సువాసననిచ్చాయి.

Blossom- బ్లాసమ్ (Countable- singular, plural లో కూడా వాడొచ్చు).

Mango blossom- మామిడిపూత.

Cherry blossom- చెరి మొక్కల పూలు.

Blossom అంటే పూవు వికసించడం అని కూడా అర్థం.

Buds blossom in the spring season=
వసంత రుతువులో మొగ్గలు వికసిస్తాయి/ పుష్పిస్తాయి.
విజయవంతంగా సంతోషంగా ఎదగడాన్ని కూడా blossom అంటాం.

She blossomed into a fine young girl =
అందమైన అమ్మాయిగా ఎదిగిందామె.

His business blossomed into a profitable activity= అతడి వ్యాపారం లాభాల దిశలో ఎదిగింది.

Their friendship blossomed into love =
వాళ్ల స్నేహం ప్రేమగా ఎదిగింది.

The trees are in blossom = చెట్లు పుష్పిస్తున్నాయి.

**to blossom** (అభివృద్ధి చెందడం/ పుష్పించడం) **X to decay** (నశించడం/ క్షీణించడం)

**2-F. Stigma= Disgrace**= సమాజం పరువు తక్కువగా అప్రతిష్ఠగా భావించే విషయం/ సమాజం ఆమోదించని ప్రవర్తన.

Alcoholism is a stigma =
తాగుబోతన్నాన్ని (మద్య వ్యసనాన్ని) సమాజం తీవ్ర అప్రతిష్ఠగా/ అనామోదకరంగా భావిస్తుంది.

In the Indian society a woman's remarriage is considered a stigma=
భారత సమాజంలో స్త్రీ రెండో పెళ్లి చేసుకోవడం పరువు తక్కువ/ చేయకూడని పనిగా భావిస్తారు.

The stigma of AIDS/ The stigma attached to AIDS makes it difficult to control it =
AIDS ను గురించి అపోహలూ, అదేదో అప్రతిష్ఠకరమైన/ సిగ్గుపడాల్సిన విషయంగా భావించడంవల్ల దాని నియంత్రణ కష్టమవుతోంది.

Pregnancy before marriage/ without marriage is a stigma =
పెళ్లిముందు/ పెళ్లికాకుండా గర్భం అప్రతిష్ఠాకరం/ అవమానకరం/ సమాజం ఆమోదించని విషయం.

Karna carried with him throughout his life the stigma of a casteless man =
తక్కువ కులం వాడనే అప్రతిష్ఠ కర్ణుడు జీవితాంతం మోయాల్సి వచ్చింది.

**Stigma X honour** (గౌరవం)

**3-G. Junk= Waste**=
చెత్త/ నిరుపయోగమైన వస్తువులు.

I want to spend the coming sunday clearing all the junk at home =
ఈ ఆదివారం ఇంట్లో ఉండే పనికిరాని సామాన్లన్నింటిని పారేయాలనుకుంటున్నా.

He bought that chair in a junk shop=
అతడా కుర్చీని పనికిరాని సామాన్ల shop లో కొన్నాడు.

Most TV serials and Indian movies are just junk=
TV serials, సినిమాల్లో చాలామటుకు చెత్తవే.

Junk food= మనం బయట తినే ఆహార పదార్థాలు. (సులభంగా తయారై, సులభంగా తినగలిగే అనారోగ్యకరమైన తిండి- బజార్లో దొరికే మిర్చి బజ్జీలు, పునుగులు లాంటివి)

He speaks all junk = అతడు మాట్లాడేది చెత్త.

Junk heap = చెత్తగుట్ట.

Throw it on the junk heap =
దాన్ని చెత్తగుట్టలోకి విసిరెయ్.

**4-B. Thrust = Push** = (దేనిలోపలికైనా) తోయటం.

He Thrust his hands into the pocket and brought out a five hundred rupee note =
జేబులోకి చేతిని దూర్చి/ పోనిచ్చి ఓ 500 రూపాయల నోటు బయటకు తీశాడు.

She thrust past the crowd and ran off =
ఆమె ఆ జనం పక్కనుంచి నడిచి పారిపోయింది.

I thrust a hundred rupee note in the clerk's hand and I got my certificate immediately =
ఆ గుమాస్తా చేతిలో వంద రూపాయల note పెట్టాను. అంతే. వెంటనే నాకు certificate వచ్చేసింది.

**Thrust X withdraw** (వెనక్కి రావడం)

**5-A. Nightmare = Terrible dream** =
భయంకరమైన కల/ భయంకరమైన అనుభవం.

Waiting in the queue for Lord Venkateswara's darsanam is a nightmare =
వెంకటేశ్వరస్వామి దర్శనంకోసం క్యూలో నిలుచోవడం ఓ భయంకర అనుభవం.

Travelling long distances without reservation can be a nightmare=
రిజర్వేషన్ లేకుండా ఎక్కువ దూరాలు రైల్లో ప్రయాణించడం భయంకరమైన అనుభవం కావచ్చు

He gets nightmares almost every day =
దాదాపు ప్రతిరోజూ అతడికి పీడకలలు/ భయంకరమైన కలలొస్తాయి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# What's this supposed to be for?


M.SURESAN

**Achyuth:** Hi Ananth, take this.
(అనంత్, ఇది తీసుకో.)

**Ananth:** What's it and why give it to me?
(ఏంటది? నాకెందుకిస్తున్నావు?)

**Achyuth:** Can't you see? It's a wrist watch and it's my gift to you.
(అర్థంకాలేదా? అది వాచ్. అది నా కానుక నీకు.)

**Ananth:** What's this supposed to be for? What's the occasion?
(ఇది దేనికోసం? ఏంటి సందర్భం?)

**Achyuth:** Your watch was stolen, wasn't it? You haven't had a watch since then. So I thought I would gift you a watch.
(నీ వాచ్ దొంగిలించబడింది కదా? / నీ వాచ్ ఎవరో దొంగిలించారు కదా? అందుకని నీకు కానుకగా ఇవ్వాలనుకున్నా.)

**Ananth:** Thank you, but this brand of watches is known to be very expensive, so I can't accept it.
(థ్యాంక్స్. అయితే ఇలాంటి వాచీలు చాలా ఖరీదైనవిగా అందరికీ తెలుసు. అందుకని నేను తీసుకోలేకపోతున్నా.)

**Achyuth:** Look here. This is just nothing when I think of how much you've helped me. This was awarded to me in some contest, and I have two other watches. It's been idle for some time.
(చూడు. నువ్వు నాకు చేసిన సహాయంతో పోలిస్తే ఇదేమంతకాదు. ఏదో పోటీలో ఇది నాకివ్వబడింది/ నాకొచ్చింది. నాకింకా రెండు వాచీలు ఉన్నాయి. ఇది ఉపయోగం లేకుండా ఉంది. అందుకని నీకిస్తున్నా.)

**Ananth:** I feel a watch is not a necessity. It's worn more as an ornament rather than as a utility.
(వాచ్ అనేది అవసరం కాదని నా భావన. ఉపయోగపడే వస్తువుగా కంటే కూడా ఎక్కువగా దాన్ని ఆభరణంగా ధరిస్తారు.)

utility = నిత్యజీవితంలో ఉపయోగపడే వస్తువు

**Achyuth:** Aren't cell phones widely used? Are they necessary?
(సెల్‌ఫోన్స్ విరివిగా వాడబడవా? (వాడరా?) అవి అవసరమా?)

**Ananth:** They aren't, for all people.
(అందరికీ కాదు.)

**Achyuth:** But aren't they used? So is it with watches. Come now. Do take it. You'll love it.

(అవీ వాడబడుతున్నాయి కదా? / అవీ వాడుతున్నారు కదా! వాచీల విషయమూ అంతే. ఇదిగో తీసుకో. నువ్వు దాన్ని బాగా ఇష్టపడతావు.)

☯ ☯ ☯ ☯ ☯

కిందటి రెండు lessons నుంచీ Important of passive voice గురించి discuss చేస్తున్నాం కదా! మనం గుర్తుంచుకోవాల్సింది.

**1)** పనిచేసిందెవరో (subject) తెలిసినప్పుడు active voice is always preferable and passive voice is to be avoided.

**2)** Subject స్పష్టంగా తెలియనప్పుడు, అదీ sentence short గా ఉండేట్లయితే passive voice preferable.

Passive forms, ముఖ్యంగా Spoken English లో వాడాల్సినవి:

Be said to/ Be known to/ Be found to/ Be supposed to, etc.,

I/ We (be) told/ informed, etc.

వీటన్నింటికి మామూలు తెలుగులో అర్థాలు:

a) He is said to know all about it = వాడికి దాని విషయం అంతా తెలుసని అంటున్నారు.

b) They are known to be great players = వాళ్లు గొప్ప క్రీడాకారులని అందరికీ తెలుసు.

This fact is known to all = ఈ నిజం అందరికీ తెలుసు. (every one knows it).

c) The little girl was found crying for her lost chain = పోగొట్టుకున్న గొలుసు కోసం ఏడుస్తూ కనిపించిందా చిన్నపిల్ల.

d) Tendulkar is supposed to be the best batsman in the world = టెండుల్కర్‌ను ప్రపంచంలో అత్యుత్తమ బ్యాట్స్‌మెన్‌గా అనుకుంటారు.

be supposed to కు must అనే (చేయాలి/ చేయకూడదు - శాసించే విధంగా వచ్చే) అర్థం కూడా ఉంది.

e) You are supposed to pay the fees by the 15th = 15 కల్లా నువ్వు ఫీజు కట్టాలి.

f) What am I supposed to do now? = నేనేం చేయాలిప్పుడు? (ఏం చేయమంటారు?)

ఇది కూడా చూడండి.

g) We are told to wait here = మమ్మల్ని ఇక్కడ వేచి ఉండమన్నారు.

(చెప్పిందెవరో స్పష్టంగా చెప్పలేనప్పుడు- ముఖ్యంగా పై అధికారులూ, ఎక్కువమంది చెప్పినప్పుడు.)

h) They have been informed of it - వాళ్లకీ విషయం తెలియపరిచాం/ తెలియపరిచారు.

ఈ forms అన్నీ కూడా Spoken English లో వాడే అవసరం ఉంది. బాగా practise చేయండి.

**Now look at the following sentences from the conversation between Achyuth and Ananth.**

1) What's this supposed to be for? = ఇది దేనికని అనుకోను?

2) Your watch was stolen

3) This brand of watches is known to be very expensive = ఈ brand watches చాలా ఖరీదయినవని అనుకుంటారు.

4) This was awarded to me.

5) It is worn more as an ornament rather than as a utility.

6) Are n't cell phones widely used?

In all the sentences above, the verbs are all be forms + pps and so are in the passive voice. అవి అన్నీ కూడా passive లో ఉండటానికి కారణం, active లో వాటి subject స్పష్టంగా తెలియకపోవడం వల్లే, ఒక్క 1st sentence లో తప్ప. (What's this supposed to be for?) అయినా ఇది conversation లో చాలా తరచుగా వినిపిస్తుంది. వాడండి మీరు కూడా.

**A:** Come, take this money? (ఇదిగో ఈ డబ్బు తీసుకో.)

**B:** What's this supposed to be for? (దేనికనుకోమంటావు?)

**2) Your watch was stolen =**
నీ watch దొంగిలించబడింది/ దొంగిలించారెవరో.

మీరు గమనించే ఉంటారు- నేరాల విషయంలో, నేరం చేసిందెవరో స్పష్టంగా తెలియనప్పుడు, passive లోనే చెబుతాం. ఇది English లో పెద్ద సౌకర్యం.

a) He was murdered/ was found murdered. (చంపబడి ఉండటం కనిపించింది.)

b) The bank was burgled/ robbed - Bank లూటీ చేయబడింది (Bank లో దొంగతనం జరిగింది- మామూలు తెలుగు.)

c) Jewellry worth lakhs was stolen = లక్షల రూపాయల విలువ చేసే నగలు దొంగిలించబడ్డాయి (దొంగతనం చేశారు). అలాగే, ప్రమాదాలకు కూడా passive.

d) He was injured in an accident = అతడు ప్రమాదంలో గాయపడ్డాడు.

e) He was taken to hospital (passive)

ఇలాంటివన్నీ passive లోనే చెబుతాం. Practise చేయండి.

**3) This brand of watches is known to be very expensive**

= ఈ brand watches ఖరీదైనవని అందరికీ తెలుసు.

**4) This was awarded to me.**

బహుమతులు/ పురస్కారాలు లాంటివి ఎక్కువ passive లో చెబుతాం.

a) Sachin was awarded the man of the match prize.

b) He was rewarded for his courage = అతడి సాహసానికి అతడికి బహుమతి వచ్చింది.

**5) It is worn more as an ornament rather than as a utility**

= ఉపయోగపడే వస్తువుగా కంటే కూడా ఆభరణంగా ధరిస్తారు.

ఇది చాలామంది చేసే పని కాబట్టి ఇక్కడ కూడా passive.

**6) Aren't cell phones widely used? =**

Cell phones బాగా వాడటంలేదా (ప్రజలు)?

పైన చెప్పిన సందర్భాల్లో మాత్రమే passive సహజంగా ఉంటుందని గుర్తుంచుకుందాం.

---

## EXERCISE

**Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1 Blame | A Improbable |
| 2 Unlikely | B Ladle |
| 3 Intimate | C Complain |
| 4 Scoop | D Inspire |
| 5 Motivate | E Close |
| | F Expel |
| | G Include |

## KEY

**1-C.** Blame = Complain = ఆరోపించడం/ నిందించడం/ తప్పుపట్టడం (Find fault with)

a) I don't blame any body for my failures = నా వైఫల్యాలకు నేనెవరినీ నిందించడం లేదు. b) Don't blame me later. I have warned you enough. నిన్ను చాలినంత హెచ్చరించాను. తర్వాత నన్నేమనకు నువ్వు. c) He always blames it on others = అతడెప్పుడూ ఇతరులను తప్పుపడతాడు. (తనలో తప్పుంచుకుని), Blame అంటే నిందించడం అనే కాకుండా, నింద అనే అర్థం కూడా. I will take a blame for it = నేను దానికి నిందపడతా/ నేను దానికి బాధ్యత వహిస్తా. Blame X Praise/ Commend = పొగడటం/ మెచ్చుకోవడం.

**2-A.** Unlikely = Improbable = అసంభవం.

probable = సంభవించే/ జరిగే అవకాశం ఉన్న.

a) India is unlikely to win = భారత్ గెలిచే అవకాశం లేదు. b) He is unlikely to go = వాడు వెళ్ళే అవకాశం లేదు/ వెళ్లకపోవచ్చు c) "Will there be an election soon?" (త్వరలో ఎన్నికలేమైనా ఉంటాయా?) "Quite unlikely" (లేకట్లే/ అవకాశం లేదు). Unlikely X Likely (సంభవం/ జరగవచ్చు) గమనించండి. Like (ఇష్టపడటం/ పోలిక ఉండటం) కూ, likely, unlikely లకూ ఏ సంబంధమూ లేదు.

**3-E.** Intimate = Close = సన్నిహితమైన, ముఖ్యంగా స్నేహానికీ, వ్యక్తిగత సంబంధాలకూ ఈ మాట వాడతాం. Duryodhana, Sakuni and Karna were very intimate = దుర్యోధనుడు, కర్ణుడు, శకుని చాలా సన్నిహితులు. Intimate friends - చాలా ప్రాణస్నేహితులు. ఆడా, మగా అక్రమ సంబంధానికి కూడా intimate అంటారు. Varma and Geetha were supposed to have intimate relationship = వర్మకు, గీతకు చాలా సన్నిహిత సంబంధాలుండేవని అనుకుంటారు. Intimate X Aloof = దూరంగా ఉండటం/ కలవకుండా ఉండటం. For sometime they have been aloof from each other = కొంతకాలంగా వాళ్లు ఒకరికొకరు దూరంగా ఉన్నారు.

Intimate (verb) అంటే తెలియపరచడం అనే అర్థం ఉంది.

He has intimated to me his decision to start a business = వ్యాపారం ప్రారంభించాలన్న తన నిర్ణయాన్ని అతడు నాకు తెలియపరిచాడు (చెప్పాడు). I don't have any intimation about it from him = దాన్ని గురించి అతడి దగ్గర నుంచి నాకేం సమాచారం లేదు. Intimate (తెలియపరచడం) X Conceal (దాచడం)

**4-B.** Scoop = Ladle = తోడటం/ దేన్నైనా spoon, గరిటె (Ladle) లాంటి దాంతో తోడి పైకి తీయడం. He scooped up, the tender coconut from the shell after pouring the water in a glass (ఆ కొబ్బరి నీళ్లను గ్లాస్‌లో పోసిన తర్వాత చిప్పలోని లేత కొబ్బరిని తోడి తీశాడు.) మనం అప్పుడప్పుడు Ice cream scoops చూస్తాం కదా. Spoon తో తోడి తీస్తారు కాబట్టి scoop అంటాం. 2) Scoop కు ఇంకో అర్థం తోడితీసే గరిటె/ spoon. 3) Scoop అంటే ఇంకో అర్థం- Journalism (వార్తాపత్రికల) కు సంబంధించింది. ఇతర వార్తాపత్రికలు ప్రచురించకముందే, ఏదైనా వార్తాపత్రిక ప్రచురించే కథనం/ సంచలనాత్మక విషయాలు. Scoop X Cover.

**5-D.** Motivate = Inspire = (ప్రేరేపించడం/ ప్రేరేపణ కలిగించడం (సామాన్యంగా మంచివాటికి) పురిగొల్పడం. Kumble is a good captain who can motivate his team = తన జట్టును ప్రేరేపించే/ పురిగొల్పే మంచి captain కుంబ్లే. Only self interest motivates most politicians - స్వార్థచింతనే రాజకీయ నాయకులను ప్రేరేపిస్తుంది. (వాళ్ళేం చేసినా స్వార్థచింతన దాని వెనుక ఉంటుంది.) Better salaries and working conditions motivates employees = మెరుగైన జీతాలు, మెరుగైన పని పరిస్థితులూ ఉద్యోగులను ప్రేరేపించ/ ప్రోత్సహించ గలవు. Motivate X Deter (ఆపడం)

**F**-Expel = బహిష్కరించడం. a) The principal expelled the students from the college = Principal, ఆ విద్యార్థులను college నుంచి బహిష్కరించారు. (Dismissed). b) Two men suspected to have terrorist connections have been expelled from the country. Terrorists తో సంబంధం ఉన్న ఇద్దరు వ్యక్తులను దేశం నుంచి బహిష్కరించారు.

**G** - Include = Add = చేర్చడం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

**ప్రశ్న:** కింది వాక్యాలకు అర్థాలు వివరించగలరు.

1. a) I would like to act in that play.
   b) I should like to have acted in that play.
2. a) To help him would be a pleasure.
   b) To have helped him would have been a pleasure.
3. a) The tourists would like to see the ruins.
   b) The tourists would like to have seen the ruins.
4. a) The mechanic was to repair the car today.
   b) The mechanic was to have repaired the car today.
5. To have explained matters to him before he died was my duty.
6. To have been able to bless the couple would have given him great satisfaction.

– కె.ఎస్.రెడ్డి, హైదరాబాద్

**జవాబు:**

1. a) ఆ నాటకంలో నటించడానికి ఇష్టపడుతున్నాను/ నటించాలని ఉంది.
   b) (గతంలో ప్రదర్శించిన) ఆ నాటకంలో నటించి ఉండాల్సిందని అనుకుంటున్నా. (అవకాశం రాలేదు).
2. a) అతడికి సహాయం చేయడం సంతోషం (ఇప్పుడు)
   b) (గతంలో) అతడికి సహాయంచేస్తే సంతోషంగా ఉండేది/ అతడికప్పుడు సహాయం చేయడం/ చేసి ఉంటే సంతోషపడేవాడిని (సహాయం చేయలేదు).
3. a) పర్యటకులు ఆ శిథిలాలను చూడటానికి ఇష్టపడుతున్నారు (ఇప్పుడు).
   b) పర్యటకులు ఆ శిథిలాలను చూసి ఉంటే (గతంలో) సంతోషపడేవాళ్లు (చూడలేదు).
4. a) The mechanic was to repair the car today- ఇందులో was to repair ... today కు అర్థం అంత సరిగా రాదు. Is to repair అంటే mechanic car ను ఈరోజు repair చేయాలి అని అర్థం వస్తుంది. (ఈరోజు అయిపోయే లోపల చేసి ఇవ్వాలని).
   b) Mechanic ఈరోజు car ను repair చేసుండాల్సింది (కానీ చేయలేదు).
5. అతడు చనిపోకముందే (అతడు చనిపోయాడు) అతడికి విషయం వివరించడం నా ధర్మం.
6. ఆ పెళ్లయిన జంటను ఆశీర్వదించడం (ఆశీర్వదించలేకపోయాడు) అతడికి తృప్తి కలిగించి ఉండేది.

**ప్రశ్న:** కిందివాటిని ఇంగ్లిష్‌లో ఎలా అంటారు?

1. ఆంధ్రుల సినీ ఆరాధ్య దైవం NTR
2. If I tell once, it means telling 100 times. ఇది సినిమాలో డైలాగ్‌కు సరిపోతుందా?
3. BSNL ఉద్యోగులు అర్ధ నగ్న ప్రదర్శన చేశారు.
4. నలుగురిలో గట్టిగా తేన్పకు.
5. Hotel లో భోజనం చేస్తే పొట్ట వస్తుంది.
6. నీకు పొట్ట వచ్చింది. ఎక్సర్‌సైజ్ చెయ్.
7. మీకు రేపు స్కూల్ ఉందా?
8. అతడి తండ్రి గట్టిగా పిలిచినా, రవి నింపాదిగా ఒళ్లు విరుచుకుని వెళ్లాడు.

– వి.ఎల్.జి. రాజు, శ్రీకృష్ణపట్నం

**జవాబు:** 1. NTR is the Andhra cine idol.
2. If I say once, it is saying a hundred times.
3. BSNL employees staged a half-naked protest/ demonstration (or) BSNL employees paraded half naked.
4. Don't belch in public.
5. You gain weight/ put on weight/ you become fat if you eat out.
6. You have put on weight. Do exercise.
7. Do you have/ have you school/ classes tomorrow?
8. Though his father shouted for him he was in no hurry. Stretching his body he walked at leisure to his father.

**ప్రశ్న:** i) Corps, corpse, polyandry, polygamy, pooh-pooh, pooh, poignant. ఈ పదాల ఉచ్చారణ, అర్థాలు తెలుపగలరు.

ii) కింది వాక్యాలను తెలుగులో వివరించలరు.

ii) All but my uncle attended the marriage.
iii) The crying need of the country is food.
iv) I succeeded in neither attempts.
v) We should try to bring him round by our argument.
vi) Still waters run deep.
vii) We should not while away our time unnecessarily.
viii) He is a square man in a round hole.
ix) The globe-trotter has walked round the world twice.
x) The roar of the lion broke the still of the night.

– ఎం.రంగయ్య, ఇల్లంద

**జవాబు:**

i) **Corps** - Pronunciation - కో (ర్- ఇది silent- అంటే r పలకం) = సైనికదళం (రెండు మూడు విభాగాలున్న పెద్దదళం. ఇది NCC లో కూడా వస్తుంది. NCC = National Cadet Corps = జాతీయ సైనిక దళం. Cadet - సైన్యంలో officer గా శిక్షణ పొందేవాళ్లు).

**Corpse** - కాప్స్ = శవం.

## SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 416

M.SURESAN

**Polyandry**= పోలియాండ్రీ= బహుభర్తృత్వం (ఒకరి కంటే ఎక్కువ భర్తలున్న స్త్రీ) (ద్రౌపదిలా)

**Polygamy** (పలిగమి)= బహుభార్యాత్వం= ఒకరికంటే ఎక్కువ బతికున్న భార్యలుండటం.

**Pooh-Pooh**- పూహ్, పూహ్ (ప్రతిపాదనలూ, సిద్ధాంతాలూ, ప్రణాళికలూ, సలహాలలాంటి వాటిని) ఏం విలువ ఇవ్వకుండా చెత్త, పనికిరానివని కొట్టిపారేయడం.

He pooh-poohed my theory - నా సిద్ధాంతం చెత్త అని కొట్టిపారేశాడు/ ఖాతరు చేయలేదు.

**Pooh**= ఏదైనా చెడుకంపు వస్తున్నప్పుడు అనే మాట- 'ఛీ' లాగ. ఇతరుల ideas ను ఖాతరు చేయకుండా ఉండేందుకు అనేమాట- ఛత్, ఛ, ఛ లాగా.

**Poignant**- పాయ్‌న్యంట్- హృదయాన్ని కదిలిచ్వేసే/ ఉద్వేగపరిచే (సన్నివేశాలు/ మాటల్లాంటివి).

ii) మా uncle తప్ప అందరూ పెళ్లికి వచ్చారు (ఇక్కడ but= except).

iii) దేశానికిప్పుడు అత్యవసరవిషయం (crying need) ఆహారం.

iv) నేను నా రెండు ప్రయత్నాల్లోనూ విజయం పొందలేదు.

v) మన వాదనలతోనే అతడిని మన మార్గంలోకి తీసుకు రావాలి/ నచ్చజెప్పాలి.

vi) నిశ్చలంగా ఉన్న నీటికి లోతెక్కువ. (అంతుపట్టని)

vii) మనకాలాన్ని అనవసరంగా వృథా చేసుకోకూడదు. (While away= waste.)

viii) అతడు తనకు అనువుగానిచోట/ పరిస్థితుల్లో ఉన్నాడు. అతడా పరిస్థితుల్లో ఇమడలేడు.
An honest man in today's politics is a square peg in a round hole =
ఈనాటి రాజకీయాల్లో నిజాయతీపరుడు ఇమడలేడు.
peg = మేకు. square peg= నలుచదరంగా ఉన్న మేకు
round hole = గుండ్రంగా ఉన్న కంత

ix) ఆ లోకసంచారి (Globe = లోకం/ ప్రపంచం; trotter = సంచారి) రెండుసార్లు ప్రపంచం చుట్టూ నడిచాడు.

x) ఆ సింహగర్జన రాత్రి నిశ్శబ్దాన్ని (stillness) చీల్చివేసింది.

# This will be the scenario

**ప్రశ్న:** 1. ఒక విషయం గురించి ఇంగ్లిష్‌లో రాయాలనుకుంటే grammar mistakes ఉంటున్నాయి. భాషా నైపుణ్యం పెంచుకోవడానికి, తప్పులు లేకుండా రాయడానికి ఏం చేయాలి? మంచి పుస్తకం సూచించండి.

2. కింది పదాల అర్థాలు, ఉచ్చారణ తెలుపగలరు.
i) spectrum, ii) infrastructure, iii) seeking, iv) mortality, v) delegation, vi) scenario, vii) stream, viii) dispite.

– వి.రెడ్డిభాస్కర్, రామాపురం, కడప

**జవాబు:**

1. మీరు రాసేదాంట్లో grammar mistakes ఉంటున్నాయని మీకు తెలిస్తే మీకు correct English తెలిసినట్లే కదా. మీరు రాసింది పొరపాటని తెలిసినప్పుడు, దాన్ని correct చేసుకోవడం కష్టంకాదు. మీరు ఏదయినా రాసినప్పుడు కొంచెం English మీకంటే బాగా తెలిసిన వారికి చూపించి correct చేయించుకోండి. రాయడం practice ఎక్కువయినకొద్దీ, తప్పులు తగ్గిపోతాయి.
Living English Structure by Stannard Allen మీకు బాగా ఉపయోగపడగల పుస్తకం.
అంతేకాకుండా బాగా తీరిక సమయాల్లో Oxford Learner's Dictionary of Current English చూడండి. మాటల అర్థాలే కాకుండా వాటిని వాడిన sentences కూడా చూడండి. మీ mistakes తగ్గిపోతాయి.

2. i) **Spectrum**- స్పెక్ట్రమ్- ఇంద్రధనుస్సులోని కాంతి రంగుల శ్రేణి. తెల్లకిరణం, prism లోంచి వెళ్లినప్పుడు కనిపించే కాంతి వర్ణచారల శ్రేణి.

**Spectrum**= ఏ శ్రేణి అయినా.
The participants were from the ends of social spectrum=
పాల్గొన్నవాళ్లు సమాజంలోని శ్రేణి మొత్తం (ఆ చివర నుంచి - బీద, ఈ చివర వరకు, గొప్ప) ఉన్నారని.

ii) **Infrastructure**= ఇన్‌ఫ్రాస్ట్రక్చ (ర్) =
ఒక సంస్థ/ దేశం/ company నడిపేందుకు కావలసిన మౌలిక సదుపాయాలు (basic facilities)- buildings, electricity, roads, water etc.

iii) **Seeking**- సీకింగ్-
1) దేన్నైనా పొందడానికి ప్రయత్నించడం.
He is seeking a good job =
అతడు మంచి ఉద్యోగం పొందే ప్రయత్నం చేస్తున్నాడు.
2) వెదకడం–
I am seeking a good building for my school = నా school కు మంచి భవనం కోసం వెతుకుతున్నాను.

iv) **Mortality** = 1) మానవ సహజమైన మరణం
2) ఒక నిర్ణీత సమయంలో (సంవత్సరం/ నెల, etc) జరిగే మరణాల సంఖ్య. (Mortality rate = ఒక సమయంలో ప్రతి వెయ్యిమందిలో ఎంతమంది మరణించారనే వివరం
3) మరణం: Hospital Mortality = ఆస్పత్రిలో మరణం.
Pronunciation మాటాలిటి- టా నొక్కిపలుకుతాం.

v) **Delegation** - డెలిగెయ్‌షన్=
1) ప్రతినిధిబృందం.
Indian trade delegation in the US =
అమెరికాలో ఉన్న భారత వాణిజ్య ప్రతినిధిబృందం.
2) మనం చేయాల్సినపని ఇంకొకళ్లకు అప్పజెప్పటం.
The Information minister was happy about the CM's delegation of some of his work= ముఖ్యమంత్రి తన పనిలో కొంత సమాచారమంత్రికి అప్పజెప్పడం, ఆయనకు సంతోషాన్ని కలిగించింది.

vi) **Scenario** = సినారియో
1) తెరమీద కనిపించే సినిమా కథా సంవిధానం- ఏయే పాత్రలు ఎప్పుడెప్పుడు కనిపించాలి, ఏయే సంఘటనలు ఎప్పుడెప్పుడు చూపించాలి అని తెలిపేది. ఇప్పుడు దాన్ని screenplay అంటాం.
2) భవిష్యత్తులో విషయాలు ఎలా జరగబోతాయో అనే అంచనా. This will be the scenario in AP- No party will get an absolute majority in the next election. AP భవిష్యత్ చిత్రం ఇలా ఉంటుంది- ఏ party కి కూడా వచ్చే ఎన్నికల్లో కచ్చితమైన majority రాదు.

vii) **Stream** = స్ట్రీమ్ - 1) చిన్న నది 2) ప్రవాహం. 3) ఒకే వయస్సు, ఒకే రకమైన ప్రతిభగల విద్యార్థుల వర్గం.

viii) **Despite** = In spite of = అయినప్పటికీ-
Despite the rain he went out = వర్షంగా ఉన్నప్పటికీ అతడు బయటకు వెళ్లాడు (మీ spelling సరి చూసుకోండి- despite correct).

**ప్రశ్న:** i) He used to write with this pen.
ii) He used this pen to write with.
iii) Come here.

పై వాటిలో మొదటిదానికి usedn't he?, రెండోదానికి didn't he?, మూడోదానికి don't you? సరైనవేనా? వివరించగలరు.

iv) "నేను సత్యంగా, ధర్మబద్ధుడనై ఆధ్యాత్మిక జ్ఞానంతో జీవిస్తాను. నేను అభివృద్ధి చెందుతూ, నా కుటుంబాన్ని, నా బడిని, నా గ్రామీణులను, నా దేశాన్ని 2020 నాటికి అగ్రగామి దేశంగా చేస్తాను." ఈ వాక్యాలను పాఠశాలలో ప్రతిరోజూ చేసే ప్రతిజ్ఞలో చేర్చారు. వీటిని ఇంగ్లిష్‌లో ఎలా అంటారో తెలియజేయగలరు.

– కె.శశికాంత్‌రెడ్డి, గుంజపడుగు

**జవాబు:** Sentences 1 and 2 రెండింటికీ, question tag, 'Didn't he?'. 'Usedn't he?' కూడా correct. అయితే ఇప్పుడిది వాడటం లేదు.

Sentence 3 - Come here కు Q. Tag:
Come here, will you?
Imperative sentences (ఆజ్ఞలూ, అభ్యర్థనలు, అడగడం తెలిపే sentences) కు, question tags ఎప్పుడూ future forms (shall/ will) తోనే వస్తాయి.
Lets go now, shall we?

4) "I pledge to abide by truth and to discharge my duty aided by a spiritual vision. While I seek my growth, I will strive to help my family and village to grow, and to make my country the foremost country in the world".

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# Unless he cancelled his trip


M.SURESAN

**Chethan:** As I was on my way home, I ran into your uncle.

(నేను ఇంటికెళ్తోంటే దారిలో మీ అంకుల్‌ను కలవడం జరిగింది.

run into = అనుకోకుండా ఎవరినైనా కలుసుకోవడం/ ఎవరికైనా ఎదురుపడటం

**Chandan:** Who?

(ఎవరినీ)

**Chethan:** Your uncle.

(మీ అంకుల్‌ను.)

**Chandan:** (It) Can't be. Unless he cancelled his trip to Nellore.

(అసంభవం. ఆయన నెల్లూరు ప్రయాణాన్ని రద్దుచేసుకుంటే తప్ప.)

**Chethan:** Yea. That's what he told me indeed. He was supposed to have left for Nellore yesterday morning, but something came in the way and he had to stay back.

(అవును. ఆయన నాకు చెప్పిందీ అదే. నిన్న పొద్దున నెల్లూరుకు బయలుదేరాలని అనుకోవడం జరిగిందనీ, అయితే ఏదో అడ్డొచ్చి ఆగిపోవాల్సి వచ్చిందని అన్నాడు.)

**Chandan:** Oh. Hence my not getting the call from him from Nellore.

(అదీ. అందువల్లే నెల్లూరు నుంచి నాకాయన ఫోన్ రాలేదు.)

**Chethan:** He wants to see you this evening. He said he would call you in the mean time.

(నిన్ను ఈ సాయంత్రం కలుసుకోవాలనుకుంటున్నాడాయన. దాని ముందు నీకు ఫోన్ చేస్తానని చెప్పాడు.)

**Chandan:** Because of some work at home I couldn't go to his place. If I had gone I would have known about it.

(ఇంట్లో ఏదో పని వల్ల వాళ్లింటికి వెళ్లలేకపోయాను. వెళ్లుంటే నాకు తెలిసుండేది.)

**Chethan:** He asked me to tell you to see him today.

(తనని ఇవ్వాళ సాయంత్రం కలుసుకోమని నీతో చెప్పమన్నాడు.)

**Chandan:** I will, ofcourse provided I can get my bike back in the evening. I've given it for servicing.

(తప్పకుండా, నా బైక్ సాయంత్రం వస్తే. నేను దాన్ని సర్వీసింగ్‌కి ఇచ్చి ఉన్నా.)

**Chethan:** Go when you like. I've done my job - telling you of it.

(నీ ఇష్టం వచ్చినప్పుడు వెళ్లు. నా పని- నీకు చెప్పడం- నేను చేశాను.)

**Chandan:** By the way, did you talk to Ganesh about our programme next week.

(అది సరేకానీ, వచ్చేవారం మన ప్రోగ్రామ్ గురించి గణేష్‌తో మాట్లాడావా?)

**Chethan:** Sorry, I haven't been able to get at him. Though I tried his number three to four times yesterday he was out of reach. Unless we go home to him we can't get him.

(అతడిని నేను పట్టుకోలేకుండా ఉన్నా. నిన్న మూడు నాలుగు సార్లు అతడి నంబర్‌కు ఫోన్ చేసినా, అతడిని చేరుకోలేకపోయాను. అతడింటికి వెళ్తే తప్ప అతడు మనకు దొరికేట్టు లేడు.)

**Chandan:** He is usually at home in the mornings. That's the best time to see him. Therefore you go to him tomorrow morning.

(అతడు పొద్దున పూట ఇంట్లోనే ఉంటాడు. అతడిని కలుసుకునేందుకు అది మంచి సమయం. కాబట్టి నువ్వు అతడి దగ్గరకు రేపొద్దున వెళ్లు.)

**Chethan:** We can decide the programme ourselves. All that we need to tell him about is how many of his men we require and when we need them. As such there is no need to meet him now.

(మనమే ప్రోగ్రామ్ నిర్ణయించవచ్చు. అతడికి మనం చెప్పాల్సిందల్లా అతడి మనుషులు మనకెంతమంది ఎప్పుడు కావాలి, అని. ప్రస్తుతానికి ఈ పరిస్థితుల్లో మనం అతడిని కలుసుకోనవసరం లేదు.)

**Chandan:** Ok. As you please.

(నీ ఇష్టం.)

Spoken English లో active voice లోనైనా passive voice లోనైనా, direct and indirect speech లోనైనా, connectives- రెండు మూడు phrases, clauses and parts of sentences ను కలిపే మాటలను గురించి తెలుసుకోవడం చాలా అవసరం. English లో word order చాలా ముఖ్యం కాబట్టి, ఏ మాట ఎక్కడ రావాలో ఎలా వాడాలో తెలుసుకోవాలి. ఒక పాఠకుడి కోరిక మేరకు వాటిని గురించి చాలా వివరంగా ఇక్కడ తెలియజేస్తున్నాం. Practise చేయండి.

**Look at the following sentences form the conversation above:**

1) *Can't be <u>unless</u> he cancelled his trip to Nellore- unless*
2) *<u>Unless</u> we go to him in the morning, we can't get him.*
3) *That's what he told me <u>indeed</u>*
4) *<u>Hence</u> my not getting the call from Nellore.*
5) *He will see you <u>meanwhile</u>.*
6) *<u>Because</u> of some work at home I couldn't go to his place.*
7) *<u>By the way</u> did you talk to Ganesh about our programme next week.*
8) *Though I tried his number I found him out of reach.*
9) *As such there is no need to meet him.*

**1) unless:** అయితే తప్ప/ అయితేకాని

a) Unless you start now you cannot see him = నువ్విప్పుడు బయలుదేరితే తప్ప నువ్వు అతడిని కలుసుకోలేవు. (ఇప్పుడు బయలుదేరితేనే నువ్వతడిని కలుసుకోగలవు.)

b) I can't do it unless the boss gives me permission = మా boss <u>అనుమతిస్తే తప్ప</u>/ <u>అనుమతిస్తే కానీ</u> నేనది చేయలేను. (మా boss అనుమతిస్తేనే నేనది చేయగలను.)

గమనించండి: unless ఏ పరిస్థితుల్లో ఒక పని జరగగలదు (present లో గానీ, future లో గాని) అనేది తెలియపరుస్తుంది. ఇంతవరకు జరగని విషయాన్ని, నిజంకాని దాన్ని చెప్పేందుకు ఇది వాడం.

c) <u>Unless</u> you study well, you can't pass- నువ్వు బాగా చదివితేనే తప్ప నువ్వు పాస్ అవలేవు. (చదివితేనే pass అవగలవు -present/ future).

d) <u>Unless</u> he knows you are here, he will not come = నువ్విక్కడున్నావని తెలిస్తే తప్ప అతడిక్కడికి రాడు/ తెలిస్తేనే వస్తాడు.

unless = అయితే తప్ప. if= అయితేనే.

unless = if not; if = unless not -ఇది అర్థం చేసుకుందాం unless = అయితే తప్ప/ అయితే కాని if = అయితేనే

a) <u>Unless</u> you <u>pay</u> you <u>can't</u> get the certificate = డబ్బు కడితేనే కడితే కానీ certificate రాదు = if you pay you can get the certificate = డబ్బు కడితే నీకు certificate వస్తుంది.

చూశారు కదా? unless ఉన్న sentence లో not వస్తే, if ఉన్న sentence లో not ఉండదు.

b) <u>Unless</u> I know what exactly has happened, I <u>can't</u> comment =
అసలేం జరిగిందో తెలియందే, నేనేం చెప్పలేను = (only) if I know what has happened, I can comment = జరిగిందేమిటో తెలిస్తే నేనమన్నా చెప్పగలను.

c) <u>Unless</u> he has the money, he <u>can't</u> buy a car = <u>if he</u> has the money he <u>can</u> buy a car.

d) <u>Unless</u> she takes the medicines, she can't recover = మందులు తీసుకుంటేనే తప్ప/ తీసుకుంటేనే కానీ, ఆమె కోలు కోలేదు = If she takes the medicines she <u>can recover</u> = మందులు తీసుకుంటే ఆమె కోలుకుంటుంది.

ఈ రెండు సందర్భాల్లోనూ, ఆమె మందులు ఇంతవరకు తీసుకోలేదు. తీసుకోవచ్చు/ తీసుకోకపోవచ్చు. మిగతా వాటిని గురించి వచ్చేసారి.

---

**Exercise: Match the words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1. Rejoice | A. Swarm about |
| 2. Cobbler | B. Physical |
| 3. Infest | C. Experience |
| 4. Manual | D. Include |
| 5. Undergo | E. Feel happy |
| | F. Decrease |
| | G. Maker/ Repairer of footwear |

**Key**

**1-E.** Rejoice = Feel happy = సంతోషించడం/ ఆనందించడం. Parents <u>rejoice</u> at the success of their children = పిల్లల విజయంతో తల్లిదండ్రులు ఆనందిస్తారు.

When she got a good rank in Eamcet her parents <u>rejoiced</u> = ఆమెకు Eamcet లో మంచి rank రావడం ఆమె తల్లిదండ్రులకు సంతోషం కలిగించింది. Kaikayi had cause to <u>rejoice</u> when Rama walked to the forest = రాముడు అడవులకు వెళ్లటం కైకేయికి ఆనందం కలిగించింది./ కైకేయి ఆనందానికి కారణం అయ్యింది.

We <u>rejoice</u> on the Independence = స్వాతంత్ర్య దినోత్సవం మనం ఆనందిస్తాం. Rejoicing ఏదైనా వేడుకగా/ పండుగగా గడుపుకోవడం

Rejoice X Mourn (విలపించడం/ దుఃఖించడం) We mourn the death of Gandhi on every Jan 30 = ప్రతి జనవరి 30న, మనం గాంధీని తలచుకుని విలపిస్తాం.

**2-G.** Cobbler = Maker/ Repairer of footwear = చెప్పులు తయారు చేసే/ repair చేసేవాళ్లు = చర్మకారులు. The cobbler wouldn't repair (mend) my shoes for less than Rs. 20/- = 20 రూ. లకు తక్కువయితే నా shoes repair చేయనన్నాడు. (బట్టలు, పాదరక్షల లాంటివాటిని repair చేయడం = mend. your shoes need mending = నీ shoes కు repairing అవసరం) Mend your behaviour = నీ ప్రవర్తన మెరుగుపరచుకో.)

**3-A.** Infest = Swarm about = ఎలుకలు, పందికొక్కులు, ఈగలు లాంటి ఇబ్బందికర జంతువులు, దొంగలు దోపిడీగాళ్లు ఎక్కువగా ఉండటం. వాళ్ల బెడద. a) The place <u>is infested</u> with rats = ఆ చోటంతా ఎలుకల మూకలే. The tables in the eatery <u>are infested with</u> flies = ఆ టిఫిన్ సెంటర్‌లోని టేబుల్స్ అంతా ఈగలే.

The area is <u>infested</u> with pick pockets and cheats = ఆ ప్రదేశం మొత్తం జేబుదొంగలూ, మోసగాళ్లే. It is a thief infested area = ఆ ప్రదేశం దొంగలమయం.

Swarm = ఈగలు, దోమలు లాంటి కీటకాల గుంపు. A swarm of files/ mosquitoes = ఈగలు/ దోమల గుంపు (ముఖ్యంగా వాటివల్ల బెడద.)

**4-B.** Manual = Physical = శారీరకమైన. manual labour = శారీరక/ దైహిక శ్రమ. Computer లూ, విద్యుచ్ఛక్తి సహాయం లేకుండా మనుషుల చేతులతో జరిగే. Manual X Automatic. Manual అంటే మరో అర్థం = యంత్రాలు, సాధనాలు కొన్నప్పుడు, అవి ఎలా వాడాలో వాటి లక్షణాలేవో తెలిపే చిన్నపుస్తకం. (TV లు, cell phones కొన్నప్పుడు వాటితో వచ్చే పుస్తకాలు.)

**5-C.** Undergo = Experience = అనుభవించడం/ ఓ అనుభవం చవిచూడటం. He have to <u>undergo</u> a lot of trouble even to get a small thing done in a govt office = ప్రభుత్వ కార్యాలయాల్లో చిన్నపని చేయించుకోవాలన్నా చాలా బాధపడాల్సి (అనుభవించాల్సి) వస్తుంది. b) parents undergo a lot of agony when their children are ill = పిల్లలు జబ్బుపడితే తల్లిదండ్రులు చాలా క్షోభను అనుభవిస్తారు.

Agony = క్షోభ. Undergo X Avoid/ escape.

**D. Include** = చేర్చడం. He is included in the team = అతడిని team లో చేర్చుకున్నారు/ అతడు team లో ఉన్నాడు.




**ప్రశ్న:**

1. Paper అనే దానికి plural లేదుకదా? మరి news papers అంటారెందుకు?
2. Nobody go(es) there ఏది కరెక్ట్?
3. Nobody has/ have a pen.

– *సూరజ్‌బాబా, ఇల్లందు*

**జవాబు:**

1. Paper కు plural లేనిది, రాయడానికీ, printing కు వాడే paper అనే అర్థంతో వాడినప్పుడే.

Paper కు ఉన్న ఇతర అర్థాలు = 1) Document (ముఖ్యమైన పత్రం) 2) Newspaper. ఈ అర్థంతో వాడినప్పుడు, paper కు plural ఉంటుంది.

I've lost some of my pape<u>rs</u> = నా పత్రాల్లో కొన్ని పోగొట్టుకున్నాను. (Certificates, ఆస్తికి సంబంధించిన పత్రాల లాంటివి)

His photo appeared in the pape<u>rs</u> (Newspapers) today = అతడి ఫొటో ఈ రోజు పత్రికల్లో పడింది.

2. Nobody- singular, అంటే he/ she కాబట్టి, verb, goes correct.
3. పై కారణంవల్లే, has correct.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

# It's not as such a house..

**Venu:** How's the new house you've bought?
(నువ్వు కొన్న కొత్త ఇల్లు ఎలా ఉంది?)

**Gopal:** It's not as such a house, but a set of rooms interconnected. Just a few amenities. That's all.
(అది ఇల్లంటే ఇల్లు కాదు, ఒకదానితో ఒకటి కలిసిన గదులు. వసతులంతగా లేవు.)

amenities = వసతులు

**Venu:** So it's going to take quite some time for you to move in then.
(అయితే అందులో చేరేందుకు ఇంకాస్త time పట్టొచ్చన్నమాట.)

**Gopal:** You can say that. (నువ్వు correct) It needs some repairs and alterations. As such it is not suitable for family to move in.
(దానికి కొన్ని మరమ్మతులు, మార్పులు అవసరం. ఉన్నపళాన ఆ ఇంట్లోకి మారడం కుదరదు.)

**Venu:** When do you expect it to be ready?
(ఎప్పటికి తయారై ఉంటుందనుకుంటున్నావు?)

**Gopal:** Not before Vinayaka chavithi, any way, though the work is going on fast.
(ఏదేమైనా వినాయక చవితి ముందు మాత్రం కాదు, పనిమాత్రం చురుగ్గా సాగుతున్నప్పటికీ.)

**Venu:** How much is it going to cost you?
(ఎంత ఖర్చవబోతోంది నీకు?)

**Gopal:** Despite all the care I am taking, it is likely to exceed Rs. 4 lac. Such matters as these often cost more than our estimates.
(నేను చాలా జాగ్రత్తలు తీసుకుంటున్నప్పటికీ, నాలుగు లక్షల రూపాయలు దాటిపోవచ్చు. ఇలాంటి విషయాలెప్పుడూ మన అంచనాలను దాటిపోతూనే ఉంటాయి.)

**Venu:** Provided you personally supervise whatever the masons, the carpenters, the plumbers and the electricians do.
(తాపీవాళ్లు, వడ్రంగులు, నీళ్లపైపులు మార్చేవాళ్లు, electricians చేసే పనిని నువ్వు దగ్గరుండి చేయించుకుంటేనే.)

**Gopal:** That's right. Our supervision always makes a lot of difference.
(అంతే. మనం అక్కడ ఉండి చూసుకుంటే చాలా తేడా వస్తుంది.)

**Venu:** It's rather tiring and a big strain not only on your pocket, but also on your mind and body.
(ఇలాంటి పని కాస్త విసుగు కలిగించేదిగానే ఉంటుంది. డబ్బు ఖర్చే కాకుండా, మనసుకు, శరీరానికి కూడా శ్రమే.)

**Gopal:** Don't I know it? I had hell with the workers when I was on the job.
(నాకు తెలియదా ఏంటి? నా ఇల్లు కట్టుకుంటున్నప్పుడు పనివాళ్లు నరకం చూపించారు.)

hell= నరకం.

on the job = పనిలో/ పనిమీద ఉండటం- ఇక్కడ అర్థం- ఇల్లు కట్టడం.

**Venu:** These construction workers are such callous fellows that they don't care what happens to you.
(ఈ construction workers (తాపీ మేస్త్రీలు, వడ్రంగులు, plumbers) మనకేమైనా వాళ్లు పట్టించుకోరు.)

callous= feeling లేని.

**Gopal:** That's true. However we can't do without them.
(నిజమే. కానీ వాళ్లు లేనిదే పనవదు కదా?)

**Venu:** OK. I must be going. See you.
(సరే. నేను వెళ్ళాలి.)

Spoken English లో మనకు ఎదురయ్యే సమస్య- పెద్ద విషయాలను చెప్పే పెద్ద మాటలు ఎలా వాడాలో తెలుస్తుండిగానీ చిన్న చిన్న విషయాలకొచ్చేసే చిక్కుల్లో పడుతుంటాం.





M.SURESAN

ఈ lesson లో కొన్ని చిన్న విషయాల అర్థం, వాడకం తెలుసుకుందాం. (Last lesson లో చాలా సాధారణంగా వాడే, if, unless లను చూశాం. అలాంటివి మరికొన్ని ఇప్పుడు చూద్దాం.)

***Now look at the following sentences from the conversation above.***

*1) It's not as such a house, but ...*

*2) As such it is not suitable for a family to move in.*

*3) Not before Vinayaka chavithi any way, though the work is going on fast.*

*4) Despite all the care I am taking it is likely to exceed Rs. 4 lac.*

*5) Provided you personally supervise what they do.*

*6) The workers are such callous fellows that they don't care what happens to you.*

*7) That's true. However we can't do without them.*

**1) As such**= మనం అనుకునేలా/ మనం మామూలుగా అర్థం చేసుకునేలా- not ... as such (not తో) ఎక్కువ వాడతాం- మనం అనుకునేవిధంగా/ అలా అంటే అలా అని కాదు అనే అర్థంతో. ఇది Spoken English లో చాలా common. Practice చేయండి.

a) He is not as such the leader, but is regarded as one= అతను నాయకుడంటే నాయకుడు కాదు, కానీ అందరూ అలా అనుకుంటారు.

b) The car is not as such my own, but I can use it as long as I want to = Car నా సొంతదా అంటే కాదు, కానీ దాన్ని నేను నాక్కావలసినంత కాలం వాడుకోవచ్చు.

c) The PM as such doesn't decide matters. There is the cabinet and more importantly Mrs Sonia Gandhi = ప్రధానమంత్రి ఆయనగా ఆయనేం నిర్ణయం తీసుకోరు. ఆయన మంత్రివర్గం, అంతకంటే ముఖ్యంగా సోనియాగాంధీ ఉన్నారుకదా?

**2) Though**= although= even though= అయినప్పటికీ. ఈ మూడూ ఒకటే. ఏది వాడినా అర్థం ఒకటే.

a) Though/ Although/ Even though he is rich, he leads a simple life =
అతడు ధనికుడైనా చాలా నిరాడంబరంగా జీవిస్తాడు.

b) Though he can speak Telugu, he doesn't =
అతడు తెలుగు మాట్లాడగలిగినప్పటికీ మాట్లాడడు.

c) Though many do not like him, they follow him = చాలామందికి అతడు ఇష్టంలేకపోయినప్పటికీ, అతడినే అనుసరిస్తారు.

Though, but, despite, in spite of, however - వీటన్నిటికీ అర్థం ఒకటే - అయినా/ అయినప్పటికీ. అయితే వాడే తీరులో చాలా తేడాలున్నాయి. వీటిలో ఏ రెండింటినీ ఒకే sentence లో వాడం.

Though (he is) tall, he is not handsome = అతడు పొడుగైనా అందగాడు కాదు. (He is not handsome though he is tall అని కూడా అనొచ్చు) = He is tall but (he is) not handsome.

It is an express train, but it is very slow = though it is an express train, it is very slow = అది express, అయినా అది చాలా slow.

Despite = in spite of = అయినప్పటికీ అనే అర్థం, though, but లాగా. వీటిని వాడేటప్పుడు మళ్లీ sentence రూపం మారిపోతుంది.

(Despite వాడకం కాస్త పాండిత్యం, గ్రాంథికం. Spoken English లో అరుదు)

**Observe the following.**

Though he has (a) good command of English, he rarely uses English = English అతడికి బాగా తెలిసినప్పటికీ, అతడు English అరుదుగా వాడతాడు = He has (a) good command of English but he uses English rarely = In spite of his good command of English, he uses it rarely = Despite (Spoken English లో అరుదు) his command of English, he uses English rarely.

**However= but.** Sentence ను but తో (written English లో) ప్రారంభించం. అలా ప్రారంభించాల్సినప్పుడు but బదులు however వాడతాం.

Though the book is very useful it is priced high = ఆ పుస్తకం ఉపయోగకరమైనప్పటికీ ధర బాగా ఎక్కువే = The book is very useful, but it is high priced. = In spite of the book being useful/ In spite of the usefulness of the book, it is high priced = Despite (In spite of తర్వాత లాగానే) the book/ being useful/ usefulness of the book, it is high priced = The book is very useful. However, it is high priced. (గమనించండి. ఇక్కడ but వాడితే, ఈ రెండూ sentences ఒకటే అయిపోవడం.)

## EXERCISE

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Bluff | A. Basic |
| 2. Incentive | B. Advanced |
| 3. Staunch | C. Trick |
| 4. Surpass | D. Inducement |
| 5. Fundamental | E. Strong |
| | F. Excel |
| | G. Secretive |

**KEY: 1-C. Bluff = Trick** -అబద్ధాలు చెప్పి తప్పుదారి పట్టించడం/ మోసగించడం/ బుకాయించడం.

He bluffed to me that he was a CBI man = తను CBI (Central Bureau of Investigation) కి సంబంధించిన వాడినని నమ్మబలికాడు/ బుకాయించాడు. ముఖ్యంగా ఏదైనా పనిచేయించుకునేందుకు ఏదో గొప్ప హోదాలో ఉన్నవాళ్లుగా/ గొప్ప హోదాల్లో ఉన్నవాళ్లకు సంబంధించిన వాళ్లుగా బుకాయించడం, bluffing.

She bluffs that she is the close relative of the DIG = DIG కి దగ్గర చుట్టాన్నని ఆమె చెప్పుకొంటోంది (ఏదో మోసం చేసేందుకు)- అంతా బూటకం.

He says he can speak three or four languages, but I doubt he is bluffing = అతడు మూడు నాలుగు భాషలు మాట్లాడగలనంటున్నాడు. కానీ నా అనుమానం అతడబద్ధాలు చెప్తున్నాడని /అంతా బూటకమని.

That he always carries a gun with him is just a bluff = తనతో ఎప్పుడూ తుపాకీ ఉంటుందని అతడనే మాటలు వట్టి బూటకమే/ బుకాయింపే.

They bluffed their way past the security to the minister = ఎవరిమో అని చెప్పుకొని/ బుకాయించి భద్రతా సిబ్బందినిదాటి మంత్రిదాకా వెళ్లారు.

**2-D. Incentive = Inducement** = ప్రోత్సాహకం/ ప్రేరణాంశం. ఓ సంస్థలోని ఉద్యోగులు ఎక్కువ సమర్థంగా, ఉత్సాహంతో పనిచేసేలా ప్రోత్సహించేందుకు వస్తు/ ధన రూపంలో ఇచ్చే బహుమతులు, commission (జీతానికి అదనంగా), పదోన్నతి (promotion) లాంటివి. విద్యార్థులకిచ్చే merit prizes/ scholarships కూడా incentives.

The chance of getting bribes acts as an incentive in some government departments = కొన్ని ప్రభుత్వ శాఖల్లో లంచాలు పొందే అవకాశం ప్రోత్సాహకంగా పనిచేస్తుంది.

Inducement= ప్రేరేపణ/ పురికొల్పడం.

His taking alcohol is the result of his friend's inducement =
అతడు తాగటం, అతడి స్నేహితుడి ప్రోత్సాహ ఫలితమే.

Induce = ప్రేరేపించడం.

The old woman induce the girl to prostitution = ఆ ముసలామె ఆ అమ్మాయిని వ్యభిచారంలోకి దింపింది.

Nothing would induce me to vote for him again = ఏది కూడా నన్ను మళ్లీ అతడికి ఓటు వేసేలా చేయలేదు. The drug induces sleep= ఆ మందు నిద్ర కలిగిస్తుంది.

**Incentive X Disincentive.**

**Inducement X determent** (నిరోధకం)

**3-E. Staunch = Strong** = గట్టి/ బలమైన- ఒకరికిచ్చే మద్దతు/ ఒకరిపట్ల విధేయత (loyalty) విషయంలో.

He is a staunch supporter of congress party = అతడు Congress party కి బలమైన మద్దతుదారుడు/ గట్టి congress వాది.

Britain is staunch ally of the US =
బ్రిటన్ అమెరికాకు బలమైన మిత్రదేశం.

ally (అలై) = మిత్రదేశం/ మిత్రపార్టీ, etc.

He is a staunch believer in Mahatma's principles =
అతడు గాంధీ ధర్మాలను గట్టిగా నమ్మినవాడు.

**Staunch X wavering** (నిర్ణయించుకోలేక ఊగిసలాడే)

**4-F. Surpass = Excel** = అధిగమించడం.

The sales surpassed all our estimations = అమ్మకాలు మా అంచనాలను అధిగమించాయి/ దాటిపోయాయి.

Tendulkar, by scoring this century surpassed himself = ఈ వంద score చేయడంతో టెండూల్కర్ తనను తనే అధిగమించాడు.

Japan excels all the western countries in technology = సాంకేతిక రంగంలో జపాన్ పాశ్చాత్య దేశాలను అధిగమించింది.

**Surpass/ excel X underperform** (మనం ఆశించినదానికంటే తక్కువ సాధించడం)

**5-A. Fundamental = Basic** = మౌలికమైన/ ప్రాథమిక (అతిముఖ్యమైన)

Violence is against the fundamental principles of Hinduism = హింస అనేది హిందూ ప్రాథమిక/ మౌలిక సూత్రాలకు వ్యతిరేకం.

Truth is fundamental to Gandhism = సత్యం గాంధీతత్వానికి ప్రాథమికమైనది/ అతి ముఖ్యమైనది.

These are the fundamentals of maths- addition, subtraction, multiplication and division = కూడిక, తీసివేత, గుణకారం, భాగహారం- ఇవి గణితానికి మూలాలు.

**Fundamental** (ప్రాథమికం)
X **Advanced** (ఉన్నతస్థాయి)

**Fundamental** (ముఖ్యమైన)
X **Secondary** (తక్కువ ప్రాముఖ్యమున్న)

Food, clothing and shelter are fundamental. The rest are secondary =
కూడు, గుడ్డ, గూడు ఇవి జీవిత ముఖ్యావసరాలు. మిగతావి తర్వాత.

**G) Secretive** = గుంభనంగా ఉండే స్వభావం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

**ప్రశ్న:** కిందివాటి గురించి వివరించగలరు.

1. You are not supposed to go there.
2. ఎంత కష్టపడ్డానో అంత రాశాను.
3. The fight have taken place between one another/ between each other.
4. As far as; 5. So far as
6. You are not supposed to have done it.
7. I have been to Vijayawada- అంటే Vijayawada నాకు బాగా తెలుసు. అలాగే I have been to him అంటే అతడు నాకు బాగా తెలుసనే అర్థం వస్తుందా?
8. Where as; 9. Have to be taken

– సూరజ్‌బాబు, ఇల్లందు

**జవాబు:**

1) You are not supposed to go there = నువ్వక్కడికి వెళ్లడం కూడదనుకుంటారు/ నువ్వక్కడికి వెళ్లకూడదు.

2) I wrote as much as I worked hard.

3) The fight has (fight have కాదు, fight అంటే it కాబట్టి, has రావాలి) taken place between one another- correct ఇద్దరికంటే ఎక్కువమంది తగవైతే; between each other- ఇద్దరి మధ్యనే తగవైతే.

4) & 5) As far as = So far as = వరకు
As far as I know = So far as I know = నాకు తెలిసినంతవరకు.

6) నువ్వది చేసుండకూడదని అనుకుంటారు= నువ్వది చేసుండకూడదు.

7) I have been to Vijayawada-
నేను విజయవాడకు వెళ్లి వచ్చాను. (అక్కడికి వెళ్లినందువల్ల) విజయవాడ తెలుసు అని.
I have been to him=
నేనతడిని కలుసుకుని/ అతడి దగ్గరికి వెళ్లి వచ్చాను అని. (తెలియకపోవచ్చు).

8) Whereas = తేడా తెలిపేందుకు వాడే మాట.
He is tall whereas his brother is short = అతడు పొడుగు కానీ అతడి తమ్ముడు పొట్టి.

9) Have to be taken = తీసుకోబడాలి
These medicines have to be taken for a month-
ఓ నెలపాటు ఈ మందులు తీసుకోబడాలి (మామూలు తెలుగు- తీసుకోవాలి).

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 419

**ప్రశ్న:** 1. a) What is poetry?, b) What is prose?, c) What is novel?, d) What is fiction? - వీటికి సంబంధించి simple గా definitions ఇవ్వగలరు.

2. ఒక English పద్యం లేదా prose కు substance తయారుచేసేటప్పుడు matter అంతా ఒకే tense లో, అదికూడా simple present లోనే ఉండాలా? సందర్భాన్ని బట్టి అన్ని tenses ఉపయోగించవచ్చా? ఒక చిన్న పద్యం ఇచ్చి దాని భావం వివరించగలరు.

3. "The grass is always greener on the other side is"- అంటే అర్థం ఏమిటి?

– టి.లీలాగాయత్రి, తాడేపల్లిగూడెం

**జవాబు:** 1. (a) Poetry= కవిత్వం / కావ్యం= A piece of writing in metrical lines (measured lines) expressing deep thought, feeling and emotion.
Imagination is its important quality.
Each line, or each set of lines has a definite pattern of syllables, stressed and unstressed.

b) Any piece of writing, long or short, on any topic and with a logical sequence of thought.

c) Novel = A long story with a definite plot, and having a logical sequence of events.

d) Fiction = Any story- a short story or a novel.

2. సందర్భాన్ని బట్టి అర్థం చెడకుండా ఏ tense అయినా వాడవచ్చు. అయితే narrate చేసేప్పుడు present tense కానీ, past tense కానీ వాడతాం.
ఓ English poem ను ఇచ్చి అర్థం వివరించమని అడిగారు. తప్పకుండా వివరిస్తాం. అయితే ప్రస్తుతం స్థలాభావం వల్ల ఇవ్వలేకపోతున్నాం.

3. "పొరుగింటి పుల్లకూర రుచి" అని- దాదాపు. మనకున్నవి బాగా ఉన్నా కూడా, ఇతరులకున్నవి ఇంకా బాగుంటాయి అనుకునే స్వభావం.
(The grass is always greener on the other side of the fence = కంచెకు అవతలి గడ్డి ఇక్కడి గడ్డికంటే పచ్చన).

# I have had coffee just now

**ప్రశ్న:** 1) Having, being, getting. వీటి అర్థాలను ఉదాహరణలతో వివరించగలరు.
2) Keep తో వచ్చే prepositions, keeping అర్థం తెలుపగలరు.
3) Make, do కి తేడా ఏమిటి?
4) To be, will be – తేడా ఏమిటి?
5) Future continuous tense లో will be బదులు to be వాడొచ్చా?
6) Have ($v_1$), had ($v_2$), had ($v_3$) వివరించగలరు. Have had, had had - ఉదాహరణలివ్వగలరు.
7) విమానం take off అయిందంటారు. ఇలా verb పక్కన off రావడం, coming up.. గురించి తెలుపగలరు.
8) Direct, Interrogative sentence లోనేకాక ఇతర sentences లో కూడా who వస్తుందా? ఎలా అర్థం చేసుకోవాలి. వివరించగలరు.
9) కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.
1. ఎవరి ఇష్టం వాళ్లది. 2. నీవు ఎవరి గురించి చెపుతున్నావో నాకు అర్థం కావడం లేదు. 3. నీవు ఈ పని ఎవరితోనైనా చేయించుకోవచ్చు. 4. ఆ నాలుగు పుస్తకాలలో ఈ రెండు పుస్తకాలు బెటర్.

– వై.ఎస్.గిరి, కాకినాడ

**జవాబు:** Having (1) కలిగి ఉన్న అనే అర్థంతో-

a) Having a car, he can easily go places = కారు ఉండటంవల్ల అతడు సులభంగా ఊళ్లు తిరగగలడు.

b) Having cancer, he is unable to move about అతడికి cancer ఉన్నందువల్ల తిరగలేకపోతున్నాడు.

c) Having a lot of money, he can offered car = బాగా డబ్బుండటంతో/ ఉన్నందువల్ల అతడికి car స్తోమత ఉంది.

M.SURESAN

(2) having + past participle- Having done, having gone, etc ఒక పనిచేయడం వల్ల/ చేయడంతో అనే అర్థంతో వాడతాం.

a) Having seen the movie, he can tell us whether it is good or bad = ఆ సినిమా చూశాడుగా అతడు? / చూసినందువల్ల, అదెలా ఉందో అతడు చెప్పగలడు.

b) Having studied in the college for 2 years, I know a lot about it = ఆ college లో రెండేళ్లు చదివినందువల్ల దాన్నిగురించి నేను చాలా చెప్పగలను.

c) Having gone there, he saw for himself what kind of place it is = అక్కడికి వెళ్లడం వల్ల అది ఎలాంటి ప్రదేశమో తనకు తానే తెలుసుకోగలిగాడు.

**Being** = ఉన్నందువల్ల, ఉండటంతో

1) Being ill, he cannot attend college= జబ్బుగా ఉన్నందువల్ల, అతడు college కి రాలేడు.

2) Being tall, he can bowl well= అతడు పొడుగ్గా ఉండటం వల్ల/ ఉండటంతో బాగా bowl చేయగలడు.

**2) & 3)** Get, Keep తో వచ్చే మాటలూ, make, do లకు తేడాలూ పాత lessons లో వివరంగా చెప్పాం. చూడండి.

**4) to be** = ఉండటం (ఎప్పుడైనా కావచ్చు)

a) To be here any longer is dangerous = ఇక్కడ ఏమాత్రం ఉండటం ప్రమాదమే (ఇప్పుడే).

b) To be a captain is difficult = Captain గా ఉండటం కష్టమే. (ఎప్పుడయినా)

**Will be** అంటే future లో ఉండటం కదా?

a) He will be here in a few minutes = ఇక కొద్ది నిమిషాల్లో అతడిక్కడుంటాడు (future).

b) They will be ministers if he becomes the CM= అతడు CM అయితే వాళ్లు మంత్రులుగా ఉంటారు (future).

**5)** ఈ question అంత స్పష్టంగా లేదు. future continuous బదులు to be రాదు.

**6)** Have (pr.tense) - had (past tense) had (past participle) - వీటి అర్థం కలిగి ఉండటం అని తెలుసు కదా? ఈ అర్థంతో వాడే వీటికి, have had, had had లాంటి verbs లో, have had లో, have కూ, had had లో మొదటి had కూ, ఏం సంబంధం లేదు. ఇక్కడి have, had, verb form చేయడానికి తోడ్పడతాయి. అంతే. వాటికి Independent status లేదు.

I have had 2 cups of coffee so far = verb - have had - have + had (past participle of have) - tense present perfect- అర్థం- 1) ఇప్పటి వరకు కలిగి ఉండటం 2) గతంలో time తెలియనప్పుడు, కలిగి ఉండటం 3) ఇప్పుడు ఏదైనా తీసుకోవడం (తినడం/ తాగడం).

a) I have had the opportunity once = ఒక్కసారి నాకా అవకాశం కలిగింది (Past - time not known).

b) They have had three chances so far= ఇప్పటివరకు వాళ్లకు మూడు అవకాశాలు వచ్చాయి.

c) I have had coffee just now, I don't want any more = ఇప్పుడే coffee తీసుకున్నా. అక్కరలేదు.

Had had - the past perfect tense of have - for the earlier of two past actives:
I had had a Maruthi car before I bought this Honda = ఈ హోండా కారు కొనకముందు నాకో మారుతీ కారు ఉండేది.

**7)** Take off, coming up, put out వీటన్నింటిని prepositional phrases/ phrasal verbs అంటాం. ఇవి భాష వాడకంలో వచ్చేవేకానీ వీటికి rules అంటూ ఉండవు. తెలుగులో, "అంత తేలిగ్గా కొట్టిపారేయకు ఈ విషయాన్ని" అంటాం. తెలుగు నేర్చుకునే English వాడికి, ఈ అర్థం మనం చెప్తేకానీ అర్థంకాదు కదా. ఈ English phrasal verbs కూడా అంతే. చదవడంవల్ల ఇవన్నీ తెలుస్తాయి.

**8)** Direct, Interrogative sentence లోనేకాక Indirect speech లోనూ, other kinds of sentences లో కూడా who వస్తుంది కదా?
He asked me who had done it. ఈ sentence Indirect speech మాత్రమే కాకుండా statement (Interrogative కాకుండా) కూడా. ఇక్కడ కూడా who వచ్చింది కదా? మీ సందేహం ఏమిటో స్పష్టంగా తెలపండి.

**9)** 1) Every one has their own likes and dislikes.
2) I do not understand who you are talking about.
3) You can get/have this job done by any one you like *OR* you can get any body to/ have any body do the job *OR* you can make anybody do the job.
4) Of these four books, these two are better than the other two books. *OR* These two are the better of the 4 books.

---

**ప్రశ్న:** "నేను ఆ రహస్యం బయటకు చెప్పదలచుకోలేదు" అన్న వాక్యాన్ని ఇంగ్లిష్‌లో "I do not want to open the secret" గా చెప్పవచ్చా? ఇంకా better గా ఎలా చెప్పాలి?
అలాగే interrogative sentence లలో regular గా "why you are going?" కరెక్టా లేక "Why are you going?" కరెక్టా? వివరించండి.

– మనోరంజని, విజయవాడ

**జవాబు:** 1. రహస్యం లాంటి విషయాలు బయటపెట్టడం/ ఇతరులకు తెలియచేయడం= reveal.
I don't want to reveal the secret.
2. Question కదా? question లో ఎప్పుడూ verb తర్వాతే subject వస్తుంది. So, why are you going? [(are (verb) + you (subject)] correct.

**ప్రశ్న:** Please translate the following sentence in Telugu.
"A contract contingent on not happening of some event in future can be enforced if that event becomes impossible."

– జి.ఆర్.మోహన్‌రావు, అల్లంపురం

**జవాబు:** "భవిష్యత్‌లో ఒక సంఘటన జరగదు అనుకున్న పరిస్థితిలో/ ప్రాతిపదిక మీద కుదిరిన ఒప్పందం, ఆ సంఘటన అసంభవం అయినా అమల్లోకి వస్తుంది." (English వాక్యం అంత స్పష్టంగా లేదు).

**ప్రశ్న:** నేను Rapidex book, మీ spoken English lessons, ఇతర English books చదువుతున్నాను. గుర్తు పెట్టుకుంటున్నాను. కానీ ఇతరులతో మాట్లాడేటప్పుడు reply త్వరగా ఇవ్వలేకపోతున్నాను. ఏం చేయాలో తెలుపగలరు.
కింది వాటి అర్థాలు తెలియజేయగలరు.
i) I don't try to speak loudly.
ii) I try not to speak loudly.

– ఎస్.కె.జానీమియా, లింగగిరి, నల్గొండ జిల్లా

**జవాబు:** ధైర్యంగా సంకోచం లేకుండా, తప్పులు మాట్లాడుతానేమో అనే బెరుకు లేకుండా మాట్లాడుతూ ఉండండి. రెండు నెలల్లో మార్పు కనిపిస్తుంది.
i) బిగ్గరగా మాట్లాడేందుకు ప్రయత్నించను. (బిగ్గరగా మాట్లాడాల్సినప్పుడు అలా చేయకపోవడం)
ii) బిగ్గరగా మాట్లాడకుండా ఉండేందుకు ప్రయత్నిస్తాను. (బిగ్గరగా మాట్లాడటం మంచిది కాకపోయినప్పుడు).

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ




# He was rather unwilling

**Gopal:** I discussed the matter with him yesterday for nearly two hours.
(నేనీ విషయం నిన్న అతడితో రెండు గంటల సేపు చర్చించాను)

**Padma:** Hence you couldn't see me yesterday, you mean?
(అందువల్ల నిన్న నువ్వు నన్ను కలుసుకోలేక పోయానంటున్నావు కదా? )

**Gopal:** Exactly. He was rather unwilling to come here, but somehow I persuaded him to finally he agreed.
(అంతే, అతడు ఇక్కడికి వచ్చేందుకు కాస్త అయిష్టంగానే ఉన్నాడు, కానీ ఎలాగో అతడిని ఒప్పించాను.)

persuade = పర్‌స్వేయ్‌డ్ (పర్, bird లో 'ర్' లా) = నచ్చజెప్పడం/ ఒప్పించడం.

I can <u>persuade</u> him to join our team = మన team లో చేరేట్లుగా నేనతడిని <u>ఒప్పించగలను</u>.

**Padma:** How is he preparing for the exams?
(పరీక్షలకెలా తయారవుతున్నాడు? )

**Gopal:** Quite well, I hope. He is the hard working type. So he is sure to succeed.
(బాగానే అనుకుంటున్నా. అతడు కాస్త కష్టపడే రకమే. కనుక విజయం కలుగుతుందనే అనుకుంటున్నా.)

**Padma:** You can't always be sure. Sometimes not withstanding one's efforts, one is not sure of success. There's that element of luck too, isn't there?
(ఎప్పుడూ అలా అవుతుందని గట్టిగా చెప్పలేం. కొన్నిసార్లు, మనం ఎంత గట్టిగా ప్రయత్నించినా, విజయం కలుగుతుందని గట్టిగా నమ్మలేం. అదృష్టమనేది కూడా తోడవాలి కదా? )

**Gopal:** Yea. I agree with you there. How hard you've worked or whether you've worked hard at all doesn't matter. Ultimately it is the marks that you get that counts, isn't it?
(అవును. నువ్వనేది నేనొప్పుకొంటా. నువ్వెంత కష్టపడ్డావు, అసలు కష్టపడ్డావా లేదా అనేది కాదు ముఖ్యం. చివరికి ఎన్ని మార్కులు నువ్వు తెచ్చుకున్నావనేదే ముఖ్యం, కదా? )

**Padma:** That's because of the exam system we have. We sometimes see surprize results- the not so thorough student scoring more than the thorough one.
(అది మన పరీక్షా విధానంవల్ల. కొన్నిసార్లు ఆశ్చర్యకరమైన ఫలితాలు చూస్తుంటాం- విషయం అంతా క్షుణ్నంగా తెలిసిన విద్యార్థి కంటే, అంతగా తెలియని విద్యార్థికి ఎక్కువ మార్కులు రావడం.)

**Gopal:** Yea. Such things do happen. Why some times? Quite often.
(అవును అలాంటివి జరుగుతుంటాయి. కొన్నిసార్లేంటి? తరచుగానే.)

**Padma:** You can always score high providing/ provided you know the technique of preparation. A thorough study of previous years' question papers will help you know what areas you've to study well. Not always it is necessary to study the subject from end to end.
(తయారవాల్సిన కిటుకు తెలిస్తే పరీక్షల్లో ఎక్కువ మార్కులు తెచ్చుకోవచ్చు. కిందటేడాది question papers పరిశీలిస్తే ఏయే అంశాలు బాగా చదివితే చాలో తెలిసిపోతుంది. Subject ను మొదటినుంచి చివరివరకూ చదవడం ఎప్పుడూ అవసరం కాదు)

**Gopal:** That's true. OK. Shall we start for the college now?
(నిజమే. College కి బయలుదేరదామా? )

**Padma:** OK.

Spoken English లో తరచుగా వాడాల్సివచ్చే connectives అనే చిన్న చిన్న మాటల వాడకం తెలుసుకుంటే మనం మాట్లాడే English చాలా correct గా, సహజంగా ఉంటుందనుకున్నాం కదా? ఇప్పుడు మరికొన్ని మాటలు చూద్దాం.

***Look at the following expressions from the conversation above.***

*1) <u>Hence</u> you couldn't see me, you mean*

*2) He was <u>rather</u> unwilling.*

*3) <u>Notwithstanding</u> one's efforts, one is not sure of success.*

*4) <u>Ultimately</u> it is the marks that you get that matters.*

*5) That's <u>because of</u> the exam system we have.*

*6) You can always score high <u>providing</u> you know the technique of preparation.*

**1) Hence** = for this reason = ఈ కారణంగా.

a) Kumar is quite hardworking. Hence his success = కుమార్ చాలా కష్టపడి పనిచేస్తాడు/ కృషి చేస్తాడు. అతడి విజయానికదే కారణం.

b) It's been raining heavily for the past twenty four hours. <u>Hence</u> the late arrival of a number of trains = గత 24 గంటలుగా భారీ వర్షం కురుస్తోంది. <u>ఆ కారణంగానే</u> <u>రైళ్లన్నీ</u> ఆలస్యంగా చేరుతున్నాయి.

అయితే hence గ్రాంథికం. Conversation లో వాడం. So, therefore, because లాంటివి ఎక్కువగా వాడతాం.

c) He is lazy. Hence his unwillingness to work = అతడు బద్ధకస్తుడు. అందుకే ఏ పనిచేసేందుకూ ఇష్టపడడు.

**2) Rather** = కొంచెం ఎక్కువే (మనకు నచ్చని విషయాలు)


M.SURESAN

a) The day is <u>rather hot</u> = ఇవాళ <u>కొంచెం ఎండగానే ఉంది</u> (అందువల్ల అసౌకర్యం)

b) The movie is rather dull = ఆ సినిమా కొంచెం విసుగే (అంత బాగా లేదు)

ఇవి చూడండి:

1)The movie is dull = సినిమా బాగాలేదు.

2) The movie is rather dull = అంతేం బాగాలేదు.

3) The movie is very dull= ఆ సినిమా చాలా చెత్తగా ఉంది.

(rather, very కంటే తక్కువ.)

c) The modern movies are rather noisy = ప్రస్తుత సినిమాలు గొడవే/ గొడవెక్కువగానే ఉంటాయి.

**3) Notwithstanding** = In spite of = అయినప్పటికీ.

<u>Notwithstanding</u> public opposition, the government wants to postpone the elections = ప్రజావ్యతిరేకత <u>ఉన్నప్పటికీ</u>, ప్రభుత్వం ఎన్నికలను వాయిదా వేయాలనుకుంటోంది.

Sukumar is going to marry the girl, <u>notwithstanding</u> his parents' objection = తన తల్లితండ్రులకు అభ్యంతరం <u>ఉన్నప్పటికీ</u> సుకుమార్ ఆ అమ్మాయిని పెళ్లాడబోతున్నాడు.

Notwithstanding, పూర్తిగా పాండిత్యం, గ్రాంథికం. ఇదే అర్థం వచ్చే nevertheless కూడా అంతే. Spoken Englishలో వినిపించదు (ఎవరైనా వాడితే అర్థమయ్యేందుకు ఈ గ్రాంథిక ప్రయోగాలు ఇక్కడ చేర్చాం. మనం మాట్లాడేటప్పుడు వాడేందుకు కాదు). వీటికి బదులు మనం వాడగలిగిన మాటలు- In spite of, though, but, although, even though -వీటిని last lesson లో వివరించాం కదా?

**5) Because of** = అందువల్ల.

a) <u>Because of</u> his fever he can't attend class today =
Because he has a fever he can't attend class today =
అతడు జ్వరం <u>వల్ల</u>/ అతడు జ్వరంతో ఉండటం <u>వల్ల</u> class కు రాలేడు.

Because of తర్వాత ఎప్పుడూ noun/ ing form వస్తుంది. Because తర్వాత ఎప్పుడూ verb వస్తుంది.

b) Because of his help I passed the exam. [Because of + help (noun)] = అతడి సహాయం వల్ల నేను pass అయ్యాను. = Because he helped me I passed the exam [Because + helped (verb)] = అతడు సాయం చేయడం వల్ల pass అయ్యాను.

**6) Providing** = Provided = if అయితేనే (Condition)

a) Provided/ Providing you pay the money in advance, you can get the books = నువ్వు ముందు డబ్బుకడితేనే నీకు ఆ పుస్తకాలొస్తాయి.

b) I don't mind your coming to the movie provided/ providing you pay for your ticket = నీ ticket కు నువ్వు డబ్బు పెట్టుకుంటే నువ్వు నాతో సినిమాకొస్తే నాకేం అభ్యంతరం లేదు.

c) Provided he is fit he can join the team = అతడు fit గా ఉంటే (ఆడే స్థితిలో ఉంటే) team లో చేరొచ్చు

---

**EXERCISE: Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1 Aviation | A Stop |
| 2 Intentional | B Polite and pleasant behaviour |
| 3 Pause | C Mark |
| 4 Grace | D Doubtless |
| 5 Scar | E Aircraft technology |
| | F Think |
| | G Deliberate |

<u>**Key and explanation:**</u>

**1) Aviation - (E) = Aircraft technology.** విమానాల నిర్మాణం, విమానయానం, విమానశాస్త్రం లాంటి వాటికి సంబంధించిన విషయాలు/ విమానయానం.

a) You have to study aviation to become a pilot = Pilot అయ్యేందుకు aviation చదవాలి.

b) Aviation has advanced tremendously since the Wright brothers flew their plane = Wright brothers విమానాన్ని కనిపెట్టినప్పటినుంచి ఇప్పటివరకూ విమానశాస్త్రం బ్రహ్మాండంగా అభివృద్ధి అయింది. Civil Aviation = పౌర విమాన విషయాలు (విమానదళ విమానయానం(Air force-military aviation కాకుండా).

b) It's difficult to imagine the world without aviation = విమానయానం లేని ప్రపంచాన్ని ఊహించుకోవడం కష్టం.

Avian = పక్షులకు సంబంధించిన. Aviation- pronunciation- ఎయ్‌వియేయ్‌షన్ - యెయ్ నొక్కి పలుకుతాం. Avionics - విమానాలలో వాడే electronic పరికరాలకు సంబంధించిన శాస్త్రం.

**2) Intentional - (G) = deliberate** = ఉద్దేశపూర్వకమైన. ఏదైనా చేయాలన్న ఉద్దేశంతోనే చేయడం.

a) His delay in meeting her was <u>intentional</u> = అతడామెను <u>కావాలనే/</u> <u>ఉద్దేశపూర్వకంగానే</u> ఆలస్యం చేశాడు/ కావాలనే ఆలస్యంగా కలుసుకున్నాడు.

b) He withheld the information <u>intentionally</u> = <u>కావాలనే/</u> <u>ఉద్దేశపూర్వకంగానే</u> అతడు ఆ సమాచారాన్ని ఆపేశాడు/ బయటకు రానివ్వలేదు.

Intentional X Unintentional (అనుకోకుండా)

a) My remarks were <u>unintentional</u> = నా వ్యాఖ్యలు <u>అనుకోకుండా</u> చేసినవి (ఉద్దేశపూర్వకం కాదు)

**3) Pause - (A) = Stop** = ఆగడం.

a) The speaker during his speech <u>paused</u> to have water = ఆయన తన ఉపన్యాసం మధ్యలో <u>ఆపాడు</u> నీళ్ల తాగేందుకు.

b) Don't hurry. <u>Pause</u> for a while to think about it clearly = తొందరపడకు. <u>కాస్త ఆగు</u> దాని గురించి స్పష్టంగా ఆలోచించేందుకు.

c) She paused for breath as she spoke very angrily= చాలా కోపంతో మాట్లాడుతూ కాసేపు ఆగింది, ఊపిరి పీల్చుకునేందుకు.

[Electronic పరికరాల్లో, pause button ఉంటుంది కదా? దాన్ని నొక్కితే అది ఆగిపోతుంది]

Pause X resume (మళ్లీ ప్రారంభించటం)

He <u>resumed</u> his walk after a half an hour's rest = అరగంట విశ్రాంతి తర్వాత తన నడక <u>మళ్లీ ప్రారంభించాడు</u>.

**4) Grace - (B) = Polite and pleasant behaviour**= నడవడిలో హుందాతనం/ గౌరవనీయత.

a) He had the grace to accept defeat =
తన ఓటమిని అంగీకరించడంలో చాలా హుందాతనం చూపించాడు/ హుందాగా/ గౌరవనీయంగా తన ఓటమిని ఒప్పుకొన్నాడు.

b) True, your daughter married against your will. Now that it's over have <u>the grace</u> to bless her and accept the marriage = నిజమే. మీ అమ్మాయి నీకిష్టంలేని పెళ్లి చేసుకుంది. అయిపోయిందేదో అయిపోయిందికదా? <u>హుందాగా</u> <u>గౌరవనీయంగా</u> తనను ఆశీర్వదించి పెళ్లిని ఆమోదించు.

c) Though very elderly, he had the <u>grace</u> to accept his mistakes and apologize = పెద్దవాడైనా, తన తప్పులను ఒప్పుకొని క్షమాపణ కోరే <u>హుందా/</u> <u>గౌరవనీయత</u> అతడు చూపించాడు.

**5) Scar - (C) = Mark** = మచ్చ- గాయంవల్లగానీ, పుట్టుకతోగానీ కలిగే వికారమైన మచ్చ

a) A knife wound has left a <u>deep scar</u> on his face = కత్తితో అయిన గాయం, అతడి మొహంమీద <u>పెద్ద మచ్చను</u> మిగిల్చింది.

b) You can recognize him by the <u>scar</u> on his hand = అతడి చేతిమీద ఉన్న <u>మచ్చ</u> సహాయంతో నువ్వతడిని గుర్తించవచ్చు

c) The <u>scar</u> that the fire has cause hasn't heeled yet = కాలడం వల్ల అయిన <u>మచ్చ</u> ఇంకా మానిపోలేదు.

Heel = పుండు, మచ్చ, గాయం లాంటివి నయమవడం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



ప్రతిభ




# The government wants to initiate ..

**Q.** *1. Launch- unveil- initiate- introduce - తేడా ఏమిటి?*

*2. Sounds good! expression meaning?*

*3. CBFC certified rates (abbreviation full form)*

*4. It's a girlthing అనేది English expression కాదా?*

*5. Good bye అంటే శాశ్వతంగా "bye" చెప్పినట్లేనా?*

*6. Suomoto statement, slated, busted ల అర్థాలు ఏమిటి?*

*7. English- Telugu dictionary సూచించండి.*

*8. తెలుగులో ఈ రోజు school లేదా? English లో ఇలాంటి expression ఉంటుందా?*

*9. ఈమె నాకు వరుస అవుతుంది అనడానికి English లో ఎలా చెప్పాలి?*

*– బి. సతీష్ బాబ్జీ, టంగుటూరు*

**A. 1.** Launch = ఉద్యమాలు, గొప్పవాటిని సాధించేందుకు చర్యలు లాంటివి పెద్ద ఎత్తున ప్రారంభించడం-

Launch AIDS eradication campaign= AIDS నిర్మూలనా ఉద్యమం (Campaign- కాంపెయిన్).

Launching serious measures against corruption = అవినీతి వ్యతిరేక చర్యలు ప్రారంభించడం.

Space ships, rockets ను అంతరిక్షంలోకి పంపడం/ కొత్త నౌకను జలప్రవేశం చేయించడం కూడా launch. (Launch a rocket/ spaceship/ ship).

వాహన companies కొత్తరకం వాహనాలను market లోకి ప్రవేశపెట్టడం కూడా launch.

♦ Unveil = ఆవిష్కరించడం [Veil= ముసుగు. Unveil = ముసుగు తొలగించడం). దేన్నైనా మొట్టమొదటగా బహిరంగంగా ప్రదర్శించడం- ముఖ్యంగా విగ్రహాలూ, చిత్తరువులూ లాంటి వాటిని. అయితే ఇప్పుడు కొత్త నమూనా cars, ఇతర వాహనాల్నో market లోకి విడుదల చేయడాన్ని కూడా unveil అంటున్నారు.

♦ Initiate - ఇనిషియేయ్ట్- ని నొక్కిపలుకుతాం. ప్రారంభించడం/ ప్రారంభం అయ్యేట్లు చేయడం.

1) The government wants to initiate certain economic reforms = ప్రభుత్వం కొన్ని ఆర్థిక సంస్కరణలను ప్రారంభించాలనుకుంటోంది.

2) The chairman initiated the discussion about the new policies= కొత్త విధానాల గురించి చర్చను అధ్యక్షుడు ప్రారంభించారు.

♦ Introduce= 1) పరిచయం చేయడం. 2) కొత్త తయారీలను, నటీనటులను, పద్ధతులను ప్రవేశపెట్టడం.

a) The company is introducing a new product into the market = మార్కెట్‌లోకి తమ కొత్త తయారీని ప్రవేశపెట్టింది ఆ company.


M.SURESAN

b) The producers are introducing two new actors in the movie. నిర్మాతలు తమ సినిమాలో ఇద్దరు కొత్త తారలను పరిచయం చేయబోతున్నారు.

**2.** Sounds good = OK = బాగానే ఉంది.

**A:** I wish to exchange my ring for your wrist watch = నా ఉంగరం మీకిచ్చి మీ wrist watch నేను తీసుకోవాలనుకుంటున్నాను.

**B:** Sounds good. Here you are = బాగానే ఉంది (నాకు సమ్మతమే). ఇదిగో తీసుకోండి.

**3.** Central Board of Film Censor fixed rates = సినిమాలను censor చేసే సంఘం నిర్ణయించిన rates.

**4.** It's a girl thing- ఈ expression Englishలో లేదు.

**5.** Good bye/ bye - శాశ్వతంగా కాదు. తిరిగి కలుసుకునేంత వరకు మాత్రమే.

**6.** Suomoto Statement = ఒకరన్నదానికి/ ఒకరి కోరిక/ అభ్యర్థన మేరకు కాకుండా తమంత తామే చొరవ తీసుకుని చెప్పేమాటలు/ చేసే వ్యాఖ్య.

The judge took the case suomoto = తనంత తానే ఆ న్యాయమూర్తి ఆ కేసును తీసుకున్నారు. (ఎవరో case పెట్టడం వల్ల కాకుండా.)

♦ Slated = ఓ కార్యక్రమంగా ఉండటం. The inauguration of the bridge is slated for next month= వచ్చేనెల bridge ప్రారంభోత్సవ కార్యక్రమం ఉంది.

♦ Busted= broken (పగలగొట్టబడిన)

Bust= పగలగొట్టడం/ ధ్వంసం చేయడం.

He busted the TV = TV ని పగలగొట్టాడు.

**7.** Sankara Narayana's English to Telugu Dictionary.

**8.** Don't you/ we have school today?

**9.** ఈమె నాకు వరస అవుతుంది. అంటే మీ అర్థం, ఆమెను మీరు పెళ్లి చేసుకోగల చుట్టరికం అనా? అలా అయితే దానికి correct గా సరిపోయే మాట English లో లేదు. అయితే Kindred (కిండ్‌ - డ్‌, Bird లో లాగ) అనే మాటకు దగ్గర దగ్గర ఈ అర్థం రావచ్చు- Kindred = ఒకరి కుటుంబం, వారి దగ్గరి చుట్టాలు. (We are kindred and can take her to wife అనవచ్చు) అయితే English వాళ్లు, మనలాకాకుండా, వరసకు అన్నదమ్ముళ్ల కూతుర్లను పెళ్లి చేసుకోవడం not uncommon.

---

**Q.** *మాకు get తో ఉండే వాక్యాలు చాలా ఇబ్బందిగా ఉన్నాయి. ఒకచోట I will you get you for that. You bastard! అంటే నిన్ను చంపేస్తాను అని ఉంది. ఇది కరక్టేనా? ఇలాంటి వాక్యాలను ఎలా అర్థం చేసుకోవాలో వివరించండి.*

*– సి.హెచ్.శ్రీధర్, హైదరాబాద్*

**A.** Correct. (నీ పని/ నీ అంతు చూస్తాను.)

ఇలాంటి expressions అన్నీ usage కి సంబంధించినవి. చదవడం వల్ల వీటిని సందర్భాన్ని బట్టి అర్థం చేసుకోవడం అలవాటవుతుంది. ఇంకా ఇలాంటి expressions వచ్చినప్పుడు dictionary కూడా సహాయపడుతుంది.

---

**Q.** *1. No one knows when he will come* ***or*** *whether he will come at all. దీని అర్థమేమిటి?*

*2. Coordinating conjunctions ఉన్న వాక్యం complex లేదా compound అనేది ఎలా తెలుసుకోవచ్చు?*

*3. Word formation కు మంచి పుస్తకం తెలియజేయగలరు.*

*– అందె కరుణాకర్, ఖాజీపేట, వరంగల్ జిల్లా*

**A. 1.** అతడెప్పుడొస్తాడో, అసలు వస్తాడో లేదో ఎవరికీ తెలియదు.

**2.** Coordinating conjunctions- and, but, yet, so, therefore, else, or else, or etc., ఉన్న sentences ఎప్పుడూ compound sentences.

**3.** Word power by Norman Lewis చదవండి.

---

**Q.** *1. "కొన్ని రంగుల పెన్నులున్నాయి. అందులో నాది ఎర్ర పెన్ను". దీనిని ఇంగ్లిష్‌లో ఎలా అనాలి?*

*2. Op-ed page అంటే ఏమిటి?*

*3. "రోజూ ఈనాడు పేపరు చూస్తే నీకు ఇంగ్లిష్ వస్తుంది". దీనిని ఇంగ్లిష్‌లో చెప్పడమెలా?*

*4. "బజారుకు పోయి ఉత్తరాలు కొనుక్కురా". ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా అనాలి?*

*5. She married him. She got married him. ఇందులో అర్థ భేదమేమైనా ఉందా?*

*6. "జుట్టు ఉండే కోడి పుంజు. లేకుంటే కోడి పెట్ట". ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా అంటాం?*

*7. అన్ని పదాలకు అర్థాలు తెలిపే తెలుగు to English dictionary సూచించగలరు.*

*– ఆర్. వికాస్, కొంపెల్లి*

**A.** 1. Among the coloured pens there, the red one is mine.

2. Op-ed page = ఒక newspaper లో Op-edpage అంటే, editorial page (సంపాదకీయం రాసే పేజి) కి opposite (ఎదురుగా ఉన్న) page - ఈ page లో సాధారణంగా వార్తలు కాకుండా వ్యాఖ్యలూ (comments), ముఖ్యమైన అంశంమీద గొప్ప రచయితల రచనలూ ఉంటాయి.

3. If you read the Eenadu every day, you can learn English.

4. Go out and get some cards and covers.

5. She married him - correct.

She got married him - wrong.

She got married to him, correct.

6. The cock has hair whereas the hen doesn't.

7. Use Telugu-English Dictionary by Sankara Narayana.

---

**Q.** *Adjective of quality, Adjective of quantity గురించి తెలియజేయగలరు. Dictionary లోని adjectives అన్నీ వీటిమీదే ఆధారపడి ఉంటాయా? ఇక్కడిస్తున్న కొన్ని పదాలు అలాంటివేనా తెలుపగలరు. eg: Bankrupt, clement, clever, little, sorry, sound, thin, red, blue, small, large, wan, versant.*

*– వి.వెంకటేష్, తాడిపత్రి.*

**A.** English చక్కగా మాట్లాడేందుకు adjectives గురించి తెలుసుకోనవసరం లేదు కదా? మాటల అర్థం, వాటి ఉపయోగం తెలిస్తే అవి ఏ parts of speech అనేది అనవసరం అని మీరే తెలుసుకుంటారు.

గుణాన్ని తెలిపే adjectives, adjectives of quality. సంఖ్యను తెలిపేవి adjectives of number, few, some, etc. ఒక మొత్తాన్ని తెలిపేవి adjectives of quantity- little, some much, etc.

Dictionary లో ఉండే adjectives, adjectives of quality, adjectives of quantity or adjectives of number గా ఉంటాయి.

మీ list లోని adjectives లో little తప్ప మిగతావన్నీ adjectives of quality. Small, large సందర్భాన్ని బట్టి (small no, large quantity etc) adjectives of quantity. Spoken English కు ఈ ప్రసక్తి అనవసరం.

---

**Q.** *Could you kindly tell me which of the following is right?*

*1. a) By whom will have the mango been eaten?*

*b) By whom will the mango have been eaten?*

*2. a) He asked me which my book was.*

*b) He asked me which was my book.*

*3. What does the following sentence mean?- "I'm afraid you've to wait". a) expressing fear b) expressing inability c) expressing apology d) ordering*

*4. Are there any particular rules on the placement of 'by agent' in passive voice? Which of the following is more natural?*

*a) The gods are worshipped by her at her husband's side?*

*b) The gods are worshipped at her husband's side by her. How to determine the placement of by agent?*

*5. If you were Raju's friend, what advise would you have given him? - Is this sentence correct?*

***- Udaya Kumar Esikela, Tadpatri.***

**A. 1.** b) is correct. When a verb has 2/ more words in it, the subject comes after the first word in the verb. Still better than b is who will the mangoes have been eaten by? - But the use of passive here is unnecessary and sounds artificial.

Don't you think active voice is natural and simpler here? Who will have eaten the mangoes? (Active) isn't this simpler than such cumbersome .. and ugly construction as by whom ..?

**2.** (a) is correct. As the sentence is a statement (not a question), the verb in the second clause should come after its verb. So sentence (a) is correct.

**3.** Answer is c. I'm afraid = I'm sorry.

**4.** We usually use passive voice only when the agent is not known or when we are not certain about the agent. So the use of by is most often unnecessary. Where it is necessary, it is better to avoid passive.

Compare: a) The steam engine was invented by James Watt (PV)

b) James Watt invented the steam engine.

Doesn't b) appear natural and simpler than a). So when you know the agent of an action, av is always preferable.

Re. rules of the placement of the by agent, it is better placed immediately after the verb.

He gave them a book - They were given by him a book is better than they were given a book by him, but both these passive forms are uncalled for. He gave them a book is better, simpler, and natural.

a) Why don't you say, she worshipped the gods at her husband's side? Isn't this better than the ugly pv construction in your letter? (a) and (b) are equally bad, and I would advise you to use the av form here.

**5.** No. It is wrong- correction: If you were Ravi's friend what advice would you give him (not advise, not would you have given him).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

**Chitra:** Hi, Saila, how about having an ice-cream?
(Icecream తీసుకుందామా? )

**Saila:** I'd rather have something hot than ice-cream.
(Icecream కంటే ఏదన్నా వేడిగా తిందామను కుంటున్నా)

**Chitra:** You mean you want something hot even in this hot weather?
(ఇంత ఎండలో కూడా వేడిగా తీసుకుంటాననా నువ్వనడం? )

**Saila:** You heard me.
(నేను చెప్పింది విన్నావు కదా? )

రెండోసారి ఏదైనా చెప్పటం ఇష్టంలేకపోతే/ విసుగయితే You heard me అంటాం.

**Chitra:** Well, then. You go to the restaurant across the road and have what ever you want hot. Then you get back to the room. In the mean time, I'll have a good cup of icecream and come back to the room.
(అలాగే. నువ్వు road అవతల ఉన్న హోటల్ కెళ్లి వేడిగా ఏం తీసుకుంటావో తీసుకుని room కొచ్చేసెయ్. ఈ మధ్యలో నేను మంచి icecream తిని room కు చేరుకుంటా)

**Saila:** That restaurant is awful. I'll go to some other restaurant.
(ఈ హోటల్ దారుణంగా ఉంటుంది. ఇంకే restaurant కైనా వెళతా. )

awful = దారుణం/ భయంకరం- మనకు నచ్చని విషయాన్ని ఇలా వర్ణిస్తాం.

**Chitra:** Indeed it is! I once had something to eat there a month ago, and since then I haven't stepped into it. What they serve is junk.
(కచ్చితంగా అది దారుణమే. నెలకిందట అక్కడ ఏదో తిన్నా. అంతే. మళ్లీ అప్పటినుంచి దానిలోకి అడుగు పెట్టలేదు. వాళ్ల తిండి/ వాళ్లు వడ్డించే టిఫిన్‌లాంటివి చెత్త)

**Saila:** More over the prices are very high as well.
(అంతేకాకుండా, ధరలూ ఎక్కువే.)

**Chitra:** The place is, however clean and tidy, and looks posh.
(అయితే restaurant మాత్రం చాలా శుభ్రంగా ఉంటుంది, గొప్పగా కనిపిస్తుంది.)

posh = చాలా నాజూకుగా, ఖరీదైన, ధనిక వాతావరణం ఉన్న. Banjara Hills in Hyderabad is a posh area. The Taj Krishna is a posh hotel.

**Saila:** That's not so important. What ultimately matters is affordability and taste.
(అదంత ముఖ్యం కాదుగదా? చివరకు మనకు నచ్చేది, ముఖ్యమైందీ, మన తాహతుకు తగిందా లేదా, రుచి- ఇవే కదా? )

**Chitra:** That's true. Let me go then.

ఈ lesson లో కూడా Spoken English లో వాడ గల, తరచూ వినిపించే ఉపయోగకరమైన చిన్న చిన్న మాటల గురించి తెలుసుకుందాం. సందర్భానికి తగ్గట్టు వీటిని వాడితే మన conversation చాలా simple గా, అంతకంటే ముఖ్యంగా చాలా natural గా ఉంటుంది.

***Now look at the following sentences from the conversation above.***

*1) I'd rather have something hot than an ice-cream*

*2) Indeed it is!*

*3) ... since then I haven't stepped into it again.*

*4) What ultimately matters is affordability and taste.*

*5) In the meantime/ meanwhile I'll have a good cup of ice-cream.*




# Indeed it is!


M.SURESAN

**1) Rather** - last lesson లో rather (రాద)కు ఉన్న అర్థం, ఉపయోగం చూశాం. మనకు నచ్చనిది కాస్త ఎక్కువే అనిపించినప్పుడు rather అంటాం అని తెలుసు కదా? The movie is rather lengthy- ఆ సినిమా పెద్దదే (పెద్దదవడం బాగాలేకపోవడానికో కారణం)

a) The book is rather boring = ఆ పుస్తకం కాస్త విసుగే. The injuries are rather serious = ఆ గాయాలు కాస్త తీవ్రమైనవే. అయితే rather ఈ కింది sentences లో వాడిన తీరు చూడండి.
I'd rather have hot coffee than an ice-cream - ఇక్కడ rather = prefer (ఒకదానికంటే ఇంకోటి ఎక్కువ ఇష్టపడటం). ఇలాంటి సందర్భాల్లో I would rather కు బదులు I'd rather అని వాడతాం.

b) She'd rather die than tell a lie = ఆమె చావటానికైనా సిద్ధమేగానీ, అబద్ధం మాత్రం చెప్పదు.

c) I'd rather starve than eat in that restaurant = పస్తయినా ఉంటాగానీ ఆ హోటల్లో నేను తినను.

Rather కు ఇంకో అర్థం: ఒక విషయం అంత గట్టిగా చెప్పలేనప్పుడు rather వాడతాం.

d) I rather believe he is corrupt = అతడు అవినీతిపరుడే అనిపిస్తోంది (నేనంత గట్టిగా చెప్పలేను)

e) She rather suspects her husband's character= ఆమె భర్తమీద ఆమెకు కొంత అనుమానమే/ కాస్త అనుమానిస్తోంది.

Rather కు ఇంకో అర్థం:
Do you call it scarlet? It's rather pale red= ఏంటి, అది ముదురు ఎరుపంటావా? ఏంకాదు, లేత ఎరుపు.

She is an actor, or rather, a dancer. ఆమె నటి. అలా అనే బదులు ఆమెను నర్తకి అనవచ్చు

**2) Indeed** = really = నిజంగా.

ఈ సామెత మనలో చాలామందికి తెలుసు కదా? A friend in need is a friend indeed = అవసరంలో ఆదుకునే స్నేహితుడే నిజమైన స్నేహితుడు.

Spoken English లో నిజంగా/ కచ్చితంగా అంతే అని ఇతరులన్న విషయాన్ని అంగీకరించేందుకు indeed వాడతాం.

a) 'Sachin is the greatest batsman in the world' (ప్రపంచంలోనే సచిన్ గొప్ప batsman) 'Indeed he is' (కచ్చితంగా అంతే)

b) Kumar: Are you really going to help him? (నిజంగా అతడికి సహాయం చేయబోతున్నావా? )
Kesav: Indeed I am- yes/ Yes, (I am), indeed. (అవును, కచ్చితంగా.)

Indeed ను ఇంకా అవునా? / నిజమేనా? అనే అర్థంతో ఆశ్చర్యాన్ని/ హేళనను (నమ్మలేని విషయమైతే) తెలిపేందుకు వాడతాం.

c) Tarun: You know a man bit a dog? (మనిషి కుక్కను కరిచాడు తెలుసా? )
Varun: A man biting a dog indeed! I've yet to see such a thing. (మనిషి కుక్కను కరవడమా? ఔనా? అలాంటి విషయం నేనింతవరకూ చూడలేదు. (ఆశ్చర్యం)

d) A man walking on water indeed! Come now, be sensible = నీటి మీద నడిచే మనిషా? నిజమా! (హేళన) కాస్త తెలివిగా మాట్లాడు.

అన్నిటికంటే ఎక్కువగా అవును, నిజంగానే/ కచ్చితంగా అనే అర్థంతో indeed వాడతాం.

Praneeth: Is he a great player?
Praphul: Indeed he is! (నిస్సందేహంగా/ కచ్చితంగా)

**3) Since** = అప్పటినుంచి (గతంలో ఓ సమయం నుంచి)

a) We first met two years ago. Since then we have been close friends= మేం మొదట రెండేళ్ల కిందట కలుసుకున్నాం. అప్పటినుంచి ప్రాణ స్నేహితులుగా ఉన్నాం.

b) Since/ eversince he came here, he has been playing with us= అతడిక్కడికి వచ్చినప్పటి నుంచి మాతో ఆడుతూ ఉన్నాడు.

Since కు ఇంకో అర్థం, because = అందువల్ల. (since = As = because).

Since he is rich he can buy a car = అతడు ధనికుడవడం వల్ల, car కొనగలడు.

Since the prices are up, we are not able to buy a number of things = ధరలు పెరిగినందువల్ల, చాలా వస్తువులు కొనలేకుండా ఉన్నాం.

**5) In the meanwhile/ meantime** = ఈ లోపల.

a) I will certainly meet him tomorrow. In the meantime don't tell him I am here = నేను అతడిని రేపు తప్పక కలుసుకుంటాను. ఈ లోపల నేనిక్కడున్నానని అతడితో అనకు.

b) My car will be ready only tomorrow. In the meanwhile I have to make do with my bike = నా car రేపటికి ready అవుతుంది. ఈ లోపల నా bike తో సర్దుకోవాలి నేను.

---

### EXERCISE

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1 Affection | A Divide |
| 2 Vertical | B Obscenity |
| 3 Split | C Impolite |
| 4 Pornography | D Unconditional |
| 5 Discourteous | E Fondness |
| | F Hatred |
| | G Straight up |

**KEY: 1) Affection = (E) Fondness** = ప్రేమ/ ఆపేక్ష/ ఇష్టం (ముఖ్యంగా ఒక వ్యక్తిపట్ల ఇంకొకరికి).

a) Chandram has great affection for his sister = చంద్రంకు వాళ్ల చెల్లెలంటే చాలా ఆపేక్ష/ ప్రేమ.

b) In movies heroes show great affection for their sisters and are ready to give them their life = సినిమాల్లో heroes చెల్లెళ్ల పట్ల ఎంతో ప్రేమ చూపిస్తారు, వాళ్లకోసం ప్రాణ త్యాగానికైనా సిద్ధపడతారు.

c) He doesn't show his wife any affection = తన భార్యపట్ల అతడేం ప్రేమ/ ఆపేక్ష చూపించడు.

Affection is always followed by for.

**Affection X Dislike**

**2) Vertical= (G) Straight up**= నిటారుగా/ నిలువుగా.

a) Palm and coconut trees usually have vertical and straight growth = తాటి, కొబ్బరి చెట్లు మామూలుగా నిలువుగా ఏపుగా పెరుగుతాయి.

b) The rocket rose vertically = ఆ rocket నిలువుగా పైకి లేచింది.

c) A helicopter can rise vertically whereas a plane cannot = Helicopter గాల్లోకి నిలువుగా లేవగలదు, విమానం లేవలేదు.

**Vertical X Horizontal** = భూమికి సమాంతరంగా.

Vertical expansion (of a building) = అంతస్తు మీద అంతస్తు కట్టుకుంటూ పోవడం.

d) In some cities there is a ban on vertical expansion of buildings= కొన్ని నగరాలలో భవనాల ఎత్తు మీద (ఒక level తర్వాత) నిషేధం ఉంది.

**3) Split = (A) = Divide** = చీలడం, చీల్చడం.

[Split (pr.tense) - split (past tense) - split (past participle)]

a) The party split in two because of the differences between the two top leaders = ముఖ్య నాయకుల మధ్య వచ్చిన అభిప్రాయభేదాల వల్ల పార్టీ రెండుగా చీలింది.

b) The original Islam religion split in two - the sunny and the shia = మొట్టమొదటి ముస్లిం మతం రెండుగా చీలింది- 1) సున్నీ 2) షియా.

c) The nuclear pact issue with the US has split the ruling coalition = అమెరికాతో అణు ఒప్పందం అంశం అధికారంలో ఉన్న సంకీర్ణ ప్రభుత్వాన్ని చీల్చింది.

Split wood = కట్టెలను పేళ్లుగా చీల్చడం.

**Split X Unite.**

Split అంటే చీలిక అని కూడా అర్థం. The split in the party has weakened it = Party లో చీలిక దాన్ని బలహీనపరిచింది. ఈ అర్థంతో **split X union** (కలయిక).

Split verdict = ఎన్నికల్లో ఏ ఒక్క party కి పూర్తి మెజారిటీ రాకపోవడం.

verdict = తీర్పు - ఇక్కడ ప్రజల తీర్పు

**4) Pornography= (B) Obscenity/ vulgarity** (అశ్లీలత). అశ్లీలత అసభ్య శృంగారంతో నిండివున్న సినిమాలు, కథలు, నవలలు- మామూలుగా మనం blue films (వ్యక్తులను నగ్నంగా చూపించే చిత్రాలు) అంటాం.

The government has banned the movie/ novel under the anti pornography act = ఆ సినిమా/ నవలను ప్రభుత్వం అశ్లీల వ్యతిరేక చట్టం కింద నిషేధించింది.

Pornography కి short form, porn (పోర్న్).

Porn movie = పచ్చి శృంగారం చూపే సినిమా.

Soft porn = అర్ధనగ్న సన్నివేశాలు ఎక్కువగా ఉండే భారతీయ సినిమాల్లాంటివి.

**Pornographic X Decent**

**5. Discourteous = (C) impolite** = మర్యాద చూపని/ దురుసు = Impolite = rude.

a) The student's behaviour to the teacher was discourteous = Teacher పట్ల విద్యార్థి ప్రవర్తన చాలా దురుసు/ మొరటుగా ఉంది.

b) His answers were discourteous = అతడి సమాధానాలు చాలా దురుసుగా ఉన్నాయి.

(Courtesy = కర్టసీ = గౌరవం/ మర్యాద. Courtesy costs nothing = మర్యాదకు మదింపు లేదు/ మర్యాద వల్ల మన డబ్బేంపోదు. courtesy = politeness)

**Discourteous X Courteous** (కటియస్ - క, bird లో 'ఐ' లా.)

**D) Unconditional** = బేషరతుగా.

Unconditional withdrawal of strike = బేషరతుగా సమ్మె ఉపసంహరణ.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 423

# Just as you say

**Ratnasri:** Just as I was coming in, I noticed you watching the TV.
(లోపలికి వస్తుండగానే, నువ్వు TV చూస్తూ ఉండటం గమనించాను)

**Sreekar:** No mom. I had just turned on the TV and you entered.
(లేదమ్మా. అలా నేను TV పెట్టాను, ఇంతలోనే నువ్వు వచ్చావు.)

**Ratnasri:** No more of TV now, get back to your books.
(ఇంక TV ఏం లేదు. నీ పుస్తకాలు తీయి మళ్లీ.)

**Sreekar:** Just as you say. I am going back to my books.
(నువ్వెలా చెబితే అలా. చదవటానికెళుతున్నా మళ్లీ.)

**Ratnasri:** That's a good boy. I promised to buy you new clothes if you got good score. You got good scores in last week's tests. Accordingly I bought you a shirt and a pair of pants/ trousers for you.
(మంచివాడివి. నీకు మార్కులు బాగావస్తే కొత్తబట్టలు తెస్తానన్నాను/ మాటిచ్చాను. నీకు కిందటి వారం పరీక్షల్లో marks బాగా వచ్చాయి. అన్న ప్రకారమే ఓ shirt, pants తీసుకొచ్చాను.)

(pair of pants = తెలుసుగదా pants అని, plural గానే వాడతాం ఎప్పుడూ- తెలుగులోలా pant అనం. ఒకటైనాగూడా pants అనే అంటాం. ఎన్ని అయితే అన్ని pairs of pants/ trousers. ఒకటే అయితే, a pair of pants/ trousers)

**Sreekar:** Oh, thank you, mom, but just one pair. Is that all?
(Thanks అమ్మా. అయితే ఒక జతేనా? ఇంతేనా? )

**Ratnasri:** Get better marks this time. I promise you a surprize gift.
(ఈసారి ఇంకా మంచి marks తెచ్చుకో. నువ్వనుకోని బహుమతి, అనుకోనప్పుడు ఇస్తా.)

surprize gift- మనం వస్తుందని అనుకోనప్పుడు వచ్చే gift.

**Sreekar:** Even higher than what I've got? It's difficult, mom.
(ఇప్పటికంటే ఇంకాఎక్కువ marks రావాలా? కష్టం, అమ్మా)

**Ratnasri:** Nothing is difficult. (ఏదీ కష్టంకాదు)

**Sreekar:** Even Teja who is usually first in our class scored less than me last time.
(మామూలుగా మా class లో first అయిన తేజాకు కూడా కిందటిసారి నాకంటే తక్కువ మార్కులొచ్చాయి తెలుసా? )

**Ratnasri:** Stop talking and start studying.
(మాటలాపి చదువు మొదలుపెట్టు)

**Sreekar:** The clothes are really good. Your choice is really nice.
(బట్టలు చాలా బాగున్నాయి. నీ ఎంపిక నిజంగా బాగుంది.)

**Ratnasri:** Try them on.
(వేసుకుని చూడు, సరిపోతాయో లేవో)

**Sreekar:** OK.

M.SURESAN

***Look at the following expressions from the conversation above.***

*1) Just as I was coming in I noticed you watching the TV.*
*2) Just as you say.*
*3) Accordingly I bought you clothes.*
*4) Even higher than what I've got.*
*5) Even Teja who is usually first in our class, scored less than me.*

**Just as, even-** ఈ మాటల అర్థం, వాడకం తెలుసుకుందాం ఈసారి.

**Just as** = అప్పుడే (ఒక సంఘటన జరిగినప్పుడే)

a) Just as the train started, some one pulled the chain =
Train బయల్దేరగానే, ఎవరో chain లాగారు.

b) Just as the police entered the room, he escaped through the other door=
Police గదిలోకి ప్రవేశించగానే, అతడు ఇంకో ద్వారం నుంచి పారిపోయాడు.

**2) Just as** ఇంకో అర్థం - అచ్చం అలాగే.

a) Just as your mother loves you, every mother loves her child =
నీ తల్లి నిన్ను ప్రేమిస్తున్నట్లే/ ఎలా ప్రేమిస్తుందో, ప్రతి తల్లి తన పిల్లలనలాగే ప్రేమిస్తుంది.

b) Just as you think you are good, so does everyone think they are good=
నువ్వు మంచివాడివని నువ్వనుకున్నట్లే/ నువ్వెలా అనుకుంటావో ప్రతివాళ్లూ అలాగే అనుకుంటారు.

ఇది కూడా చూడండి:
Just as you say = నువ్వెలా అంటే అలా.

c) 'Sit here till I come back'
(నేను తిరిగొచ్చేవరకు ఇక్కడే కూర్చో)

'Just as you say' = నువ్వెలా అంటే అలాగే
Just as you wish = నీ కోరిక ప్రకారమే
Just as you order = నీ ఆజ్ఞ ప్రకారమే

**2) Even** = కూడా, ఈ కింది భావంతో:

a) Even a man like Gandhi made mistakes =
గాంధీలాంటి ఆయన కూడా తప్పులు చేశాడు.

b) Even in America we can't get things like this
= అమెరికాలో కూడా ఇలాంటి వస్తువులు దొరకవు.

c) Some people say that our buses are better than even those in the states =
అమెరికాలో bus ల కంటే కూడా మన bus లే బాగుంటాయని కొందరంటారు.

(Even though = అయినప్పటికీ;
even = కూడా)

**Even** = ఇంకా.

a) He got even higher marks than what he got last time =
కిందటిసారి కంటే ఇంకా ఎక్కువ మార్కులు తెచ్చుకున్నాడు.

b) He is not happy with the Rs.2 Crore he has. He wants an even higher amount than that
= అతడికున్న రెండు కోట్ల రూపాయలతో సంతోష పడటంలేదతను. ఇంకా ఎక్కువ కావాలంటున్నాడు.

## EXERCISE

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1 Absorb | A Cover |
| 2 Wrap | B Terrify |
| 3 Frighten | C Earlier |
| 4 Previous | D Suck up |
| 5 Substantial | E Shadowy |
| | F Large |
| | G Hot |

**Key and Explanation:**

**1 Absorb = (D) Suck in** = (తేమ లాంటి వాటిని) పీల్చుకోవడం.

Sponge absorbs/ sucks in water = sponge నీటిని పీల్చుకుంటుంది.

Some kinds of phenyl absorb moisture = కొన్ని రకాల ఫినైలు తేమను పీల్చేస్తాయి.

A child can't absorb the type of information it gets at school = పాఠశాలల్లో పొందే సమాచారాన్ని/ విజ్ఞానాన్ని పిల్లలు ఆకళింపు చేసుకోలేరు.

These springs absorb any amount of shock = ఈ springs ఒడిదుడుకుల వల్ల కలిగే ఎంత దెబ్బనైనా తట్టుకోగలవు.

(మోటార్ వాహనాలన్నింటికీ shock absorbers ఉంటాయి. అవి గతుకుల రోడ్లలో కలిగే కుదుపును వాహనం తట్టుకునేట్లు చేస్తాయి)

**Absorb X emit/ discharge** = బయటకు పంపడం.

**2 Wrap= (A) cover** = i) కప్పడం;
ii) వస్తువులను paper లాంటి వాటితో pack చేయడం (పుస్తకాలకు అట్ట వేసేలా).

1) Immediately after he brought the book home, he wrapped it in brown paper =
పుస్తకం ఇంటికి తీసుకురాగానే, దానికి brown paper తో అట్టవేశాడు.

2) He wrapped the gift article in colourful paper =
ఆ కానుకను అతడు రంగుల పేపర్‌తో pack చేశాడు.

3) As it was very cold she wrapped the baby in a blanket
= బాగా చలిగా ఉండటం వల్ల ఆమె బిడ్డను దుప్పటితో కప్పింది.

4) The food is wrapped in foil =
ఆ తినుబండారాన్ని తగరంతో (foil) pack చేశారు.

5) Every thing about the murder is wrapped in secrecy=
ఆ హత్యకు సంబంధించి అన్ని విషయాలు రహస్యంతో కప్పి ఉన్నాయి (మామూలు తెలుగులో- రహస్యంగా ఉంచారు).

**Wrap X unwrap/ reveal/ expose.**

unwrap= కప్పు/ ముసుగు లాంటివి తొలగించడం.

reveal= (రహస్యాలు/ సమాచారం) తెలియపరచడం/ బహిర్గతం చేయడం/ వెల్లడించడం,

expose = బయటపెట్టడం (రహస్యాలు/ సమాచారం)

**3 Frighten= (B) Terrify=** విపరీతమైన భయం కలిగించడం/ భయభ్రాంతులను చెయ్యడం

1) The sight of the dog frightened the child =
ఆ కుక్క కనిపించడం ఆ బిడ్డకు భయభ్రాంతి కలిగించింది.

2) Your threats do not frighten me =
నీ బెదిరింపులు నాకు భయాన్ని కలిగించవు/ నీ బెదిరింపులకు నేను భయపడను.

3) We are frightened when we imagine ghosts and spirits =
భూతాలు పిశాచాలను గురించి ఊహించుకుంటే మనకు భయం కలుగుతుంది.

**Frighten X Reassure** = ధైర్యం/ భరోసా కలిగించడం.

The sight of the police reassured the villagers, frightened by the Maoists =
మావోయిస్ట్ కలిగించిన భయంతో ఉన్న గ్రామస్థులకు police వాళ్ల కనిపించడం ధైర్యం కలిగించింది.

**4. Previous = (C) earlier** - ఇంతకు ముందటి.

1) In the precious lesson too, there was an exercise on vocabulary =
ఇంతకుముందటి lesson లో కూడా vocabulary exercise ఉంది.

2) In his previous visit, he stayed for only two days =
అతడింతకుముందు వచ్చినప్పుడు, రెండ్రోజులే ఉన్నాడు.

**Previous X Next** (తర్వాతి)

**5) Substantial** = బాగా ఎక్కువగా/ large

1) The government has allotted substantial funds for Jalayagnam =
జలయజ్ఞానికి ప్రభుత్వం బాగా ఎక్కువగా/ సమృద్ధిగా నిధులు కేటాయించింది.

2) The doctor's treatment has brought about a substantial improvement in the patient's condition =
ఆ doctor వైద్యంతో ఆ రోగి పరిస్థితి బాగా మెరుగుపడింది.

3) There is a substantial increase in the salaries of the employees =
ఉద్యోగుల జీతాలు చాలా బాగా (ఎక్కువగా) పెరిగాయి.

**Substantial** (సబ్‌స్టాన్షల్) **X Meagre** = స్వల్పమైన.

The rise in the salary is meagre = జీతం పెరుగుదల స్వల్పం.

## Q&A

**Q.** *1) Voice, tenses* గురించి తెలియజేయగలరు.
*2) Marry (v)* అనే *verb* కు- పెళ్లి చేసుకునే, పెళ్లి చేసే- అనే రెండర్థాలున్నాయా?
*3) Despite, in spite of* ల ఉపయోగంలో ఏమైనా తేడా ఉందా?

**– కె.శ్రీకృష్ణకుమార్, బాపట్ల.**

**A.** 1) Lesson 1 to 30 లో tenses, Lesson 25 - 90 లో voice ఉంటాయి చూడండి.

2) Marry = పెళ్లి చేసుకోవటం. He married her = అతనామెను పెళ్లి చేసు కున్నాడు.
Marry = పెళ్లి చేయడం; He married his daughter (off) to an engineer = వాళ్ల అమ్మాయిని ఆయన ఓ engineer కు ఇచ్చి పెళ్లి చేశాడు. రెండు విధాలుగా చెప్పొచ్చు పెళ్లి చేయండి అనే అర్థంతో- He married her to an engineer/ He married her off to an engineer. అయితే పెళ్లి చేయడం అనే అర్థంతో marry somebody to somebody అని ఒకరి కొడుకులూ/ కూతుళ్ల విషయంలోనే వాడతాం. వాళ్ల ఇద్దరమ్మాయిల పెళ్లిళ్లు చేసేశాడు = He has married his two daughters off. ఇక్కడ off అవసరం. లేకుంటే ఆయన వాళ్లను పెళ్లి చేసుకున్నాడనే విపరీతార్థం వస్తుంది.

3) Despite, in spite of గురించి ఈ మధ్యనే వివరించాం చూడండి.

**Q.** మీరు *Oxford Advanced Learners Dictionary* అని, *Oxford Advanced Learners Dictionary of Current English* అనీ రాశారు. రెండూ వేర్వేరా? *American accent* కోసం మంచి *dictionary* సూచించగలరు.

***- SK Sardar, Nellore***

**A.** రెండూ ఒక్కటే. మీకు ఈ dictionary లోనే, ప్రతి పదానికీ British accent, దాని పక్కనే NAME అనే abbreviation తో American accent కనిపిస్తుంది. చూడండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Q. 1.** *Think, thought ల ఉపయోగాలను సవివరంగా కిందివాటిని అనువదిస్తూ తెలుపగలరు. a) రేపు వారు వస్తారని నేను అనుకుంటున్నాను. b) రేపు వారు వస్తారేమోనని నేను అనుకుంటున్నాను. c) నిన్న వారు వస్తారని నేను అనుకున్నాను.*

*2. I thought that they will take it. I thought that they would take it. - ఈ రెండింటిలో ఏది కరెక్ట్?*

***- Madhu, Hyderabad***

**A. 1.** a) I think they will come tomorrow.

b) I think they may/ might come tomorrow.

c) I thought they would come yesterday.

**2.** I thought they would take it అనడం correct. I thought- ఇక్కడ thought past tense (గతంలో పని) - అనుకున్నప్పుడు (గతంలో) వాళ్లు తీసుకోవడం అనేది future కాబట్టి would వాడతాం. He said that he would help me. (సహాయం చేస్తానని అన్నాడు- అన్నది గతంలో, అప్పట్నించి future కాబట్టి would help).

# ప్రతిభ

**Q. 1.** *There is a question in a spoken English- "Are quality soaps available here?" Is it correct expression?*

*2. What are the steps to be followed in writing a story writing because it is major challenge for X class students including in which tense is should be explain.*

*3. If teaching of English attractive to the students what method should be followed English to English or English to Telugu (version) or Translation method for high school students (mother tongue students)*

*4. America comprises of fifty one states - in this sentence does comprise takes of or not? Explain.*

*5. What is the difference between do you have, have you got?*

***- G.Shankar, Karimnagar***

**A. 1.** Strictly speaking the expression quality soaps is wrong. It should be quality brands of soap, if the reference is to the soap brands of the same company or different companies. Only in commercial language, 'soaps' is used, as for example, 'Godrej Soaps Ltd,' and the use is limited only to business products. In ordinary conversation, however, 'soaps' is not used.

A TV serial is also called 'soap.' Here 'soap' (with the meaning of a TV serial) is countable.. I was watching a soap (a TV serial) yesterday. 'How many soaps are telecast by the channel?' - These are OK.

## SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 424

# The book comprises ten chapters

**2.** As we are short of space here, we are sorry we can't explain 'story writing' now. We shall do it when time and space permit. Our regrets. (This is a page on spoken English, and so it has the priority.)

**3.** Depends on the type of students you have. If they are English medium students, English to English is preferable. If on the other hand they are Telugu medium students start with translation method, and gradually take them on to English - English method. When you use translation method, put them a no of questions on the lesson content and encourage them to answer only in English.

M.SURESAN

**4.** Comprise is not followed by 'of'. The book comprises ten chapters.

**5.** Do you have...? = Have you got...?

Both the forms show possession. However, do/ does/ did have... is common in American English in statements and in questions (meaning possession).

Have you got...?

With the meaning of possession in British English in statements and questions.

Have you got.. is not used in questions at all in American English. Have got is used in American English to say that someone has something rather than another. eg: I don't have a car, but I've got a bike.

Have you is also used in British English with the same meaning as have you got?

**Q. 1.** *మీరు ఒక lesson లో- "I went to my uncle's yesterday. They were tidying up their home" అని ఇచ్చారు. కానీ tidying up their place కదా? Possessive form తో place రాదా? వివరించగలరు.*

*2. మరో lesson లో- "Perhaps you are afraid you may put on weight" అని ఇచ్చారు. కానీ perhaps you are afraid you will put on weight అనొచ్చు కదా?*

*3. Vocabulary లో ditch అర్థం వివరిస్తూ- "He ditched her after he found another girl friend" అన్నారు. కానీ "He ditched her after he had found another girl friend" కాదా?*

***- P. Ratnakar, Visakhapatnam***

**A. 1.** Tidying up their home = Tidying up their place. ఇలాంటిచోట్ల home అన్నా place అన్నా ఒకటే.

**2.** ఇక్కడ, perhaps, 'you are afraid' అనే దానికి సంబంధించింది కదా? అందుకని, Perhaps you are afraid, is correct. Perhaps you may be afraid అంటే తప్పే. Take the second part of the sentence: You are afraid you may put on weight- ఇప్పుడిది దీనికి సరిపోతుంది కదా? Of course, perhaps and may are not used in the same sentence. Here perhaps goes with are afraid.

**3.** After words like before/ after, had + past participle వాడాలనే నిబంధన ఎప్పుడూ పాటించక్కర్లేదు. had + past participle వస్తే correct. Simple past వాడినా ఫర్వాలేదు.

He returned home after he attended class. ఇక్కడ After he had attended అన్నా ఫరవాలేదు after ఉంది కాబట్టి.

I went to his college, but he had already left/ left by then. ఇలాంటిచోట్ల had + pp కచ్చితంగా వాడాల్సిందే.

**Q.** *There for, there of, there to, so as to- వీటిని ఉపయోగించే విధానం వివరించగలరు.*

***- G. Ram Mohan Rao, Alampuram.***

**A.** There-for, there-of, there-to, there-upon, there-by, so as to- ఇవన్నీ కూడా గ్రాంథికంగానే కాకుండా చట్ట న్యాయ పరిభాషలో భాగంగా ఎక్కువ వాడతారు.

1) There-by: పైన చెప్పిన/ ఇంతకుముందు తెలిపిన వాటి కారణంగా/ వాటి ఫలితంగా.

a) He does most of the work, thereby reducing my part of the work= ఎక్కువ పనంతా అతడే చేస్తాడు (దానివల్ల/ దాని ఫలితంగా/ ఆ కారణంగా) నా వాటా పని తగ్గిస్తూ.

b) He got elected as an MP and thereby gained a number of privileges and a lot of influence = అతడు MP గా ఎన్నికయ్యాడు, దాని మూలంగా/ తత్ఫలితంగా చాలా ప్రత్యేక హక్కులు, పలుకుబడి సంపాదించాడు.

2) There-for- ఇది ఇపుడు దాదాపు కనుమరుగై పోయింది, చట్టపరిభాషలో/ గ్రాంథిక భాషలో కూడా ఎవరూ వాడటం లేదు. అర్థం: పైన చెప్పిన/ ఇంతకు ముందు తెలిపిన వారి/ వాటి కోసం; వాటికి కారణమైన.

a) The building was caught in a huge fire and the causes therefor are not known = ఆ కట్టడం పెద్ద మంటలో చిక్కుకుంది, దాని (ఆ మంటకు) కారణాలు తెలియదు.

b) They are estimating the cost of the house and talking about the repairs needed there for = వాళ్లు ఆ ఇంటి ధరను అంచనా వేస్తున్నారు. ఇంకా ఆ ఇంటికి/ ఇంటికోసం అవసరమయ్యే repairs గురించి మాట్లాడుతున్నారు.

3) There-of= పైనచెప్పిన/ఇంతకుముందు తెలిపిన వారికి/ వాటికి సంబంధించిన.

a) He has no right to all the property or any part there of= అతడికి ఆ ఆస్తినిగానీ, దానిలో/ దానికి చెందిన భాగాన్నిగానీ అమ్మే హక్కు లేదు.

b) She hasn't used the building or any part there of =

ఆ కట్టడాన్నిగానీ, తద్భాగాన్నిగానీ ఆమె ఇంతవరకు వాడలేదు.

4) There upon = అందుమీదట- వెంటనే.

a) Rajasekhar made some comments on Chiranjeevi. There upon the fans of Chiranjeevi attacked him =

రాజశేఖర్ చిరంజీవి మీద వ్యాఖ్యలు చేయగానే/ చేసిన మీదట ఆయన అభిమానులు రాజశేఖర్ మీద దాడి చేశారు.

b) The terrorists were seen crossing the border. Thereupon the security forces opened fire =

సరిహద్దు దాటుతున్న తీవ్రవాదులను చూసిన వెంటనే/ మీదటే భద్రతా దళాలు కాల్పులు ప్రారంభించాయి.

5) There-to = పైన చెప్పిన వాటికి/ ఇంతకుముందు తెలిపిన వాటికి.

a) I am willing to follow the agreement and any other conditions attached there to =

ఆ ఒప్పందాన్నీ, దానికి చేర్చిన ఇతర షరతులను అమలు పరచేందుకు/ అనుసరించేందుకు నేను ఇష్టపడుతున్నాను.

b) He has the right to use the building and any land attached there to =

ఆ కట్టడాన్ని, దానికి చేర్చి ఉన్న స్థలాన్ని వాడుకునే హక్కు అతడికి ఉంది.

6) So as to = అంతగా

a) She is not so rich as to buy a car =

Car కొనేంత ధనికురాలు కాదామె.

b) We went to the stadium early so as to get the front seats =

ముందున్న seats పొందేందుకు/ పొందాలని మేం stadium కు ముందుగానే వెళ్లాం.

c) He is most of the time at home so as to make his son study =

తన కొడుకును చదివించేందుగ్గానూ, అతడెక్కువ ఇంట్లోనే ఉంటాడు.

**Q. 1.** *While కు మరో అర్థం used to show contrast అని ఒక పుస్తకంలో చూశాను. కింది వాక్యంలో while ను ఏ అర్థంతో వాడినట్లో వివరించండి.*

*a) The girls sang while the boys played. (contrast)*

*b) The bee worked while the cricket sang*

*2. 'Over' కు sense of అని చూశాను.*

*adverbial use: The match is over.*

*heard or said by means of or using:-*

*I don't want to say over the telephone*

*3. For అర్థం as to be అని చూశాను. దాని అర్థం ఇందులో They left him on the battle field for dead. అదే విధంగా Gopal did it for me ( on account of) ఇక్కడ on account of అర్థం వివరించగలరు.*

***- G. Naresh, Armour***

**A. 1.** Used to show contrast అంటే రెండింటి మధ్య ఉన్న వైరుధ్యం/ పూర్తి వ్యతిరేకత.

The girls sang while the boys played ఇక్కడ Girls X Boys, sang, different from played- ఈ విధమైన తేడా/ వైరుధ్యం (contrast) తెలిపేందుకు while వాడతాం.

He supports the congress while his wife is a member of the TDP (అతడు congress మద్దతుదారుడైతే అతడి భార్య TDP సభ్యురాలు)

మీరిచ్చిన రెండో example లో కూడా, bees కు cricket కూ, worked sang కూ ఉన్న contrast ను while తెలుపుతుంది.

**2.** Match అయిపోయింది అనే అర్థంతో, over ఇక్కడ adverb. They are well లో well లాగ.

Heard or said by means of or using అంటే దేని ద్వారానైనా/ దేన్నయినా వాడి వినడం/ చెప్పడం అని.

I don't want to say anything over phone = phone ద్వారా/ phone వాడి/ phone లో ఏదీ చెప్పదలచుకోలేదు.

**3.** for = as to be = ఉన్నట్లుగా - ఇది ఒక అర్థం.

1) a) They left him for dead = చనిపోయిన వాడిలాగ (చనిపోయిన వాడిని వదిలేసినట్లు) అతడిని వదిలేశారు.

b) I took him for a good man = అతడిని నేను మంచి వాడిలాగానే అనుకున్నా.

2) for = కొరకు/ కోసం. Gopal did it for me = గోపాల్ అది నా కోసం/ నా కొరకు చేశాడు.

3) for = on account of = అందువల్ల - ఇది 3వ అర్థం.

I don't like him for he is a bad man = అతడు చెడ్డవాడు, అందువల్ల (for/ on account of ) అతడంటే నాకిష్టం లేదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 425

# Scarcely ever do I miss..

M.SURESAN

**Rahim:** You here? Out on an evening?
(నువ్విక్కడా? సాయంత్రం బయటికి రావడమా?)

**Rohit:** Why the surprise?

**Rahim:** Because I seldom see you moving out in the evenings.
(నువ్వీ సమయంలో బయటికి రాగా నేను చూడటం అరుదు కాబట్టి.)

**Rohit:** You're right ofcourse. But that's not going to be the case any longer. I no longer want to be at home in the evenings.
(నిజమే. అయితే ఇక అలా జరగదు. సాయంత్రం ఇంట్లో ఉండాలని ఇంక అనుకోవడం లేదు.)

**Rahim:** Why this sudden change?
(ఇంత ఆకస్మిక మార్పు ఎందువల్లనో.)

**Rohit:** Because I've come to realise that evenings are enjoyable outdoors.
(సాయంత్రాలు బయటే సరదాగా ఉంటాయని తెలుసుకున్నాను కాబట్టి.)

**Rahim:** What did you use to do in the evenings earlier? Watching TV serials perhaps.
(ఇంతకు ముందు సాయంత్రాలెలా గడిపేవాడివి? టీవీ సీరియల్స్ చూస్తూనేమో.)

**Rohit:** TV serials? I never watch them. I turn on the TV only to watch the news channels. How do you spend your evenings?
(టీవీ సీరియళ్లా? నేనెప్పుడూ వాటిని చూడను. న్యూస్ ఛానెల్స్‌ను చూసేందుకే టీవీ పెట్టుకుంటాను నేను. నువ్వు ఎలా గడుపుతావు సాయంత్రాలు?)

**Rahim:** Like this. Out on the road taking long walks.
(ఇలా. రోడ్డు మీద, చాలా దూరం నడుస్తూ.)

**Rohit:** (Do) you do it everyday?
(రోజూనా?)

**Rahim:** Scarcely ever do I miss my evening walk.
(సాయంత్రం నేను నడవకపోవడం అరుదు.)

**Rohit:** (Do) You have company on your walks?
(నీకు తోడెవరైనా వస్తుంటారా నీ నడకలో.)

**Rahim:** Barely any.
(దాదాపు ఎవరూ లేరు.)

**Rohit:** Don't you feel lonely?
(ఒంటరిగా ఉన్నట్లు అనిపించదా?)

**Rahim:** At no time.
(ఎప్పుడూ లేదు.)

**Rohit:** (Do you/ would you) mind my joining you?
(నేను నీతో రావచ్చా?)

**Rahim:** Most welcome.
(తప్పక రా.)

✪ ✪ ✪ ✪ ✪

రెండు మూడు lessons నుంచీ సంభాషణల్లో వచ్చే కొన్ని common phrases చూస్తున్నాం కదా? మరికొన్ని ఇప్పుడు చూద్దాం.

**Look at the following sentences from the conversation above.**

*1) ... Because I seldom see you moving out in the evenings.*

*2) ... That's not going to be the case any longer.*

*3) I no longer want to be at home in the evenings.*

*4) I never watch them.*

*5) Scarcely ever do I miss..*

*6) Barely any.*

1) Seldom = rarely = అరుదుగా

a) I've seldom seen a student with such a talent = అంత ప్రతిభ ఉన్న విద్యార్థిని చాలా అరుదుగా చూశాను.

b) They seldom meet each other = వాళ్లు ఒకరినొకరు అరుదుగా కలుసుకుంటారు/ వాళ్లు కలుసుకోవడం అరుదు.

c) I seldom see Kumar helping others = కుమార్ ఇతరులకు సహాయం చేయడం అరుదుగా చూస్తాను/ అతడు ఇతరులకు సహాయం చేస్తుండగా నేను చూడటం అరుదు.

2) Any longer = (సమయం గురించి) ఇంకేమాత్రం.

a) We are already late. Let's not delay any longer = మనం ఇప్పటికే ఆలస్యం. ఇంకేమాత్రం ఆలస్యం చేయొద్దు.

b) They can't wait any longer = వాళ్లింకే మాత్రం వేచి ఉండలేరు.

c) They have told him they won't help him any longer. (ఇంక అతడికి ఇక ఏమాత్రం సహాయం చేయబోమని, వాళ్లు అతడితో చెప్పేశారు.)

3) No longer = Not any longer.
No longer = (సమయం) ఇంక లేదు/ ఇంకమీదలేదు.

a) They will sell milk no longer. They have changed over to sweets business = వాళ్లింకమీద పాలు అమ్మరు. స్వీట్స్ వ్యాపారానికి మారారు.

b) Musharaff can rule no longer = ముషారఫ్ ఇక మీదట పరిపాలించే ప్రశ్నే లేదు.)

4) Never = ఎప్పటికీలేదు/ కాదు.

a) He never drinks = అతడు అసలు తాగడు.

b) We were at the same school, but we never talked to each other = మేం ఒకే school లో చదువుకున్నాం కానీ ఎప్పుడూ మాట్లాడుకోలేదు.

c) He never talks bad of others = అతడు ఇతరులను గురించి చెడుగా ఎప్పటికీ మాట్లాడడు.

5) Scarcely (ever) = Barely = Hardly ever = దాదాపు లేదు/ (ఏదైనా సంఘటన జరగడం), దాదాపు అరుదు.

a) She scarcely (ever)/ barely (ever)/ hardly (ever) comes here = ఆమె ఇక్కడికి రావడం చాలా అరుదు/ రాదనే అనాలి.

b) His friends hardly/ scarcely/ barely/ recognised him. He had changed and aged so much = అతడి స్నేహితులు అతడిని గుర్తుపట్టలేదు. అతడంత మారిపోయాడు, బాగా వయసొచ్చేసింది.

c) Laxman scarcely/ hardly/ barely fails his team = లక్ష్మణ్ తన జట్టును నిరాశపరచడం చాలా అరుదు/ నిరాశపరచడనే చెప్పాలి.

---

**Exercise: Match The words under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1 Cord | A Shake |
| 2 Omen | B Report |
| 3 Fulfil | C Sign |
| 4 Shiver | D Disappoint |
| 5 Hearsay | E Thin rope |
| | F Accomplish |
| | G Frown |

**KEY:** 1-E; 2-C; 3-F; 4-A; 5-B.

**EXPLANATION**

1-E. Cord = Thin rope = దారం/ తాడు.

(wire) cord = Telephone లాంటి పరికరాలకుండే wire ముక్క. Cordless అంటే తెలుసుగదా. Wire లేకుండా పనిచేసే (phone లాంటి) పరికరాలు. They tightened the wire cord around her neck = ఆమె మెడ చుట్టూ wire ముక్కను బిగించారు. He connected the motor to the wheel with a piece of/ length of cord = ఆ మోటారును wire ముక్కతో చక్రానికి కలిపాడు.

2-C. Omen = Sign = శకునం. Bad omen = దుశ్శకునం, Good omen = శుభ శకునం.

a) A cat crossing you on your way out is considered a bad omen = పిల్లి ఎదురు రావడం దుశ్శకునంగా భావిస్తారు.

b) Seeing the picture of god as you get up is a good omen = లేవగానే దేవుడి బొమ్మ కనిపించడం శుభ శుకునం

Ominous = సంకేతమైన/ భవిష్యత్తును సూచించే, ముఖ్యంగా ఏదో కీడు జరగబోతుందని సూచించే.

a) The wicked foursome considered the arrival of Lord Krishna ominous = దుష్ట చతుష్టయం (దుర్యోధనాదులు) కృష్ణుడు రావడాన్ని (రాయబారానికి) ఏదో కీడు జరగబోతున్నట్లుగా భావించారు.

b) Kaikeyi's silence as Dasaratha entered her palace was ominous = కైకేయి నిశ్శబ్దంగా ఉండటాన్ని చూసి కీడు శంకించాడు దశరథుడు.

3-F. Fulfil = Accomplish = అనుకున్నది సాధించడం/ కోరిక నెరవేర్చుకోవడం

a) Dr Kalam's urges youngsters to dream of great things and work hard to fulfil them = గొప్ప గొప్ప కలలు కని వాటిని సాధించేందుకు/ నెరవేర్చుకునేందుకు కృషిచేయాలని డాక్టర్ కలాం ఉద్బోధ.

urge అర్జ్ = గట్టిగా కోరడం/ ఉద్బోధించడం

b) He fulfiled his father's desire that he should becoming an engineer = తను engineer కావాలన్న తన తండ్రి కోరికను అతడు నెరవేర్చాడు.

fulfil dreams/ desires/ wishes, etc, నెరవేరడం/ అనుకున్నది సాధించడం.

Accomplish = సాధించడం.

Tendulkar accomplished the rare feat of scoring 38 centuries = 38 సెంచరీలు కొట్టి టెండుల్కర్ అరుదైన ఘనత సాధించాడు.

Accomplish X Fail (విఫలమవడం)

4-A. Shiver = Shake - వణికిపోవడం - వర్షం/ చలి జ్వరం/ భయం వల్ల.

The boy shivered at the sight of what he thought was a ghost = తను భూతం అనుకున్నది కనిపించగానే ఆ పిల్లాడు భయంతో వణికిపోయాడు.

b) Gone are the days when students shivered at the sight of their teachers = ఉపాధ్యాయులను చూసి విద్యార్థులు (భయంతో) వణికిపోయే రోజులు పోయాయి.

c) The poor old women was shivering in the cold of rainy night = ఆ వర్షపు రాత్రి చలికి ఆ పేద వృద్ధ మహిళ వణికిపోతోంది.

Sending shivers down the spine = (భయంతో వణుకు పుట్టించడం.

The thought of AIDS sends shivers down our spines = ఎయిడ్స్‌ను గురించిన ఆలోచన మనకు భయంతో దడ పుట్టిస్తుంది.

Spine = వెన్నెముక = back bone.

5-B. Hearsay = Report = ఇతరులు చెప్పుకోగా మన చెవినపడటం/ మన చెవినపడే విషయాలు (కర్ణాకర్ణిగా వినడం) - నిజం కాకపోవచ్చు/ నిజమని కచ్చితంగా తెలియదు.

a) 'Their marriage? Yea, I know about it. But it's only hearsay. = 'వాళ్ల పెళ్లా? అవును, నాకు తెలుసు. అయితే అది ఎవరో చెప్పగా వినడమే. (ఎంత నిజమో నాకు తెలియదు).

b) Do you know about it for certain?
('నీకది కచ్చితంగా తెలుసా?')
'No. It's just hearsay.'
'లేదు. ఎవరో అంటుండగా విన్నదే'.)

D. Disappoint = నిరాశ కలిగించడం

a) His marks in the exam disappointed his father = పరీక్షలో అతడి మార్కులు అతడి తండ్రికి నిరాశ కలిగించాయి.

b) The movie is really disappointing = ఆ సినిమా నిరాశ కలిగించింది.

Disappoint X Satisfy

G. Frown= Look angrily (కోపంతో చూడటం) (అనామోదకరంగా)

a) In the beginning a career in the movie was frowned at = మొదటి రోజుల్లో సినిమా నటన అంటే పెద్దలు కోపగించుకునే వాళ్లు.

b) He frowned at me when I pointed to his defects = అతడి లోపాలు చూపించేసరికి నామీద కోపంతో చూశాడు.

Frown X Smile (చిరునవ్వు)

---

**Q&A**

**ప్రశ్న:** *Ram, speed, wive పదాలను verb గా వాడొచ్చా? Ram- Rammed -Rammed Speed - Sped - Sped Wive - Wived - Wived ఇవి కరక్టేనా? ఉదాహరణ ఇవ్వండి.*
*– ఎం. రంగయ్య, ఇల్లంద*

**జవాబు:** Ram, speed మాత్రమే verbs గా వాడవచ్చు

1. The bus rammed the truck from behind = లారీని, bus వెనకనుంచి తిన్నగా ఢీకొట్టింది. ముఖ్యంగా ఒక వాహనం ఇంకో వాహనాన్ని బలంగా ఢీ కొనడం, ఎక్కువగా వెనకనుంచి.

2. Speed 1) వేగవంతం చేయడం (పనుల్లాంటి వాటిని). The work on the project has been speeded up = ప్రాజెక్ట్ పనులు వేగవంతం చేయబడ్డాయి (చేశారు).

Speed -Sped - Sped = వేగంగా వెళ్లిపోవడం. The car sped away on hitting the cyclist = cyclist ను ఢీకొట్టి ఆ car దూసుకుపోయింది.

Wive, prose లో మామూలు conversation లో verb గా వాడటానికి లేదు. Poetic గా వాడినా చాలా అరుదు. Not accepted.

**ప్రశ్న:** *1. Hospital లో చేర్పించినాగానీ అంతగా ఫలితం లభించలేదు.*
*2. ఇది ఆత్మహత్య కాదని విశ్వసిస్తున్నాను.*
*ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?*
*–వి.నారాయణరావు, విజయనగరం*

**జవాబు:** 1.Though he was admitted in the hospital, there wasn't much improvement/ He was admitted in the hospital but things didn't improve.

2. I am convinced that it is not a suicide.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 426

# He is by no means innocent

M.SURESAN

**Vandana:** Well, this is a secret. On no account should tell another soul of it.
(అర్థమయ్యిందా? ఇది రహస్యం. ఏ కారణం వల్ల కూడా నువ్వీ విషయం ఇంకో ప్రాణికి చెప్పకూడదు)

**Varshita:** You know very well that at no time have I leaked out a secret. Be assured that it's going to be between you and me.
(ఎప్పుడు కూడా నేనే రహస్యమూ బయటపెట్టలేదని నీకు తెలుసు. ఇది మనిద్దరి మధ్యే ఉండే విషయమని భరోసాతో ఉండు.)

**Vandana:** I know it very well, of course. You know our classmates Vachana and Vasudha. They are by no means to be trusted with any secret.
(అది నాకు బాగా తెలుసు. మన classmates వచన, వసుధ తెలుసు కదా? వాళ్లతో మనం ఏ రహస్యం నమ్మి చెప్పలేం.)

**Varshita:** On the one hand they are eager for information, but on the other, they can never keep a secret. There comes the trouble. They are the first people to misunderstand us if they know we have this secret from them.
(ఒకవైపేమో, అన్నీ తెలుసుకోవాలని తహతహ, మరోవైపేమో ఏ రహస్యం దాచలేరు. అక్కడే వస్తుంది చిక్కంతా. మనం ఏదో దాస్తున్నామని తెలిస్తే మనల్ని మొట్టమొదట అపార్థం చేసుకునేదివాళ్లే)

**Vandana:** For heaven's sake, you are not going to tell them of this, are you?
(ఓరి దేవుడోయ్, నువ్వాళ్లకే విషయం చెప్పవు కదా? )

**Varshita:** I am the last, I promise you, to part with this secret to them. Be sure of it.

**Vandana:** That's fine. I believe you. Now about your buying some dresses for me in Chennai. When are you leaving?
(సరే అయితే. నిన్ను నేను నమ్ముతున్నాను. ఇప్పుడు నువ్వు నాకు Chennai నుంచి dresses తెచ్చే విషయం. నువ్వు ఎప్పుడు బయల్దేరుతున్నావు?

**Varshita:** The day after. By the evening train.
(ఎల్లుండి సాయంత్రం)

**Vandana:** I want you to buy 3 very good dresses of the latest cut. Here, take this Rs. 6000/-.

**Varshita:** Why such a lot of money? It's my cousin's shop and I can get them at substantial concession for you. Rs. 5000/- will do.
(అంతెందుకూ? అది మా cousin shop. నీకు మంచి concession ఇప్పించగలను. రూ. 5000 చాలు.)

**Vandana:** But still keep it. Just in case. You can always give me back the balance.
(ఎందుకైనా మంచిది. ఉంచు. మిగిల్తే నాకు తిరిగిచ్చెయ్యి)

**Varshita:** I am likely to be back on Sunday, or at the most on Monday.

**Vandana:** That's OK.

***Look at the following expressions from the dialogue above:***

*1) On no account should you tell another soul of it.*
*2) ... at no time have I leaked out a secret.*
*3) They are by no means to be trusted with any secret.*
*4) On the one hand they are eager for information, but on the other they can never keep a secret.*
*5) For heaven's sake, you aren't going to tell them of this secret, are you?*
*6) But still keep it. Just in case.*

***Let's now look at some of the conversational expressions shown above.***

**1) On no account/ Not on any account** = ఏ కారణం వల్లకానీ. (For whatever reason)
a) On no account shall you leave office before 5 and that too without my permission = ఏ కారణంవల్లనైనా సరే నువ్వు 5 ముందు office వదిలి వెళ్లడానికి వీలులేదు, అదీ నా అనుమతి లేకుండా.
b) The work shall not be delayed on any account = ఏ కారణంవల్లనైనా సరే, పని ఆలస్యమవడానికి వీల్లేదు.
c) See that the police do not come here on any account = ఏ కారణంవల్లనైనా police లు ఇక్కడికి రాకుండా చూడు.

**2) At no time = Not at anytime** = ఏ సందర్భంలో కూడా.
a) At no time during the freedom struggle did Gandhi ask his followers to be violent = స్వాతంత్ర్య పోరాటంలో ఏ సమయంలో కూడా గాంధీ తన అనుచరులను హింసకు పూనుకోమని చెప్పలేదు.
b) At no time during his stay here, did he call me = He did not call me at anytime during his stay here = అతడిక్కడ ఉన్నప్పుడు ఏ సమయంలో కూడా నాకు phone చేయలేదు.
c) At no time was he seen without a gun = తుపాకీ లేకుండా అతనెప్పుడూ కనిపించలేదు.

**3) By no means = not at all** = అసలు కానే కాదు.
a) He is by no means innocent. He can't be cheated so easily.= అతడేం అమాయకుడు కాదు. అంత సులభంగా మోసపోడు.

by no means= not by any means
b) She is not by any means a bad singer. She is famous at home as well as abroad = ఆమేం అంత పనికిరాని గాయకురాలు కాదు. దేశంలోనే కాక, విదేశాలలో కూడా ఆమెకు బాగా పేరుంది.
c) In spite of the many brands of cars on the market, they are by no means within the reach of the common man = మార్కెట్‌లో చాలా రకాల cars ఉన్నప్పటికీ, సామాన్యులకు అందుబాటులో ఏంలేవు.

**4) On the one hand, on the other... On the one hand** = రెండు వైరుధ్యాలను తెలిపేందుకు ఈ expression వాడతాం.
a) On the one hand he wants a car, but on the other he doubts his ability to bear the fuel costs = ఒకవైపేమో అతడికి కారు కావాలని, మరోవైపేమో, petrol ధరలు భరించగలనా అనే సందేహం.
b) on the one hand he is against doing a job but on the other he doesn't want to lose the money he gets from the job = ఒకపక్క నేమో ఉద్యోగం చేయకూడదని, మరోపక్కనేమో ఉద్యోగం వల్ల వచ్చే డబ్బు వదలుకోకూడదని.

**5) For heaven's sake/ for God's sake/ for goodness's sake/ for Christ's sake** = విసుగ్గాగానీ/ కోపంగా గానీ, ఏదైనా పని తప్పకుండా జరగాలను కున్నప్పుడుగానీ అనే మాట.
a) For God's/ heaven's sake, listen to me = (విసుగ్గా/ కోపంతో) నే చెప్పేది విను.
b) For heaven's sake, please finish the work by tomorrow = (కొంచెం బతిమాలుతూ) రేపటికి పని పూర్తి చెయ్యి.
c) For heaven's sake, don't disturb me = నన్ను నా పని చేసుకోనీ, అంతరాయం కలిగించకు.

**6) Just in case** = అదేమన్నా అవసరం అయితే/ ఎందుకైనా మంచిది/ అవసరం అయితే.
a) Take some extra money. Just in case you need it, you can have it = డబ్బు కొంత అదనంగా తీసుకెళ్లు. అంతగా అవసరమైతే ఉంటుంది.
b) Let me have your phone number. Not that I'm going to disturb you, but just in case = నాకు మీ phone no. ఇవ్వండి. అంటే phone చేసి మిమ్మల్ని disturb చేద్దామని కాదు. అంతగా అవసరమైతే ఉంటుంది కదా అని.
c) Start an hour early. Just in case ... = ఒక గంట ముందు బయల్దేరు. ఎందుకైనా మంచిది.

---

## EXERCISE

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1 Adequate | A Plan |
| 2 Reform | B Friendly (to guests/ visitors) |
| 3 Strategy | C Punishment |
| 4 Hospitable | D Ill |
| 5 Penalty | E Enough |
| | F Change (for improvement) |
| | G Meagre |

**KEY: 1-E, 2-F, 3-A, 4-B, 5-C.**

**Explanations:**

**1) Adequate= Enough= Sufficient**= చాలినంత.
a) We don't have adequate water supply during the summer = వేసవిలో చాలినంత/ తగినంత నీళ్ల సరఫరా ఉండదు.
b) His knowledge is adequate to teach elementary classes = ప్రాథమిక తరగతులకు బోధించేందుకు చాలినంత జ్ఞానం అతడికుంది.

Adequate అంటే తగిన అర్హత, సామర్థ్యంగల అనే అర్థం కూడా ఉంది.
c) He is not adequate for the task = అతడికి ఈ పనికి తగిన సామర్థ్యం లేదు.

**Adequate X Inadequate.**

**2) Reform= Change for improvement** = సంస్కరణ/ సంస్కరించడం.
a) A lot of reforms have been made in the educational system = విద్యావిధానంలో చాలా సంస్కరణలు జరిగాయి.
b) The finance minister has promised a number of economic reforms = ఆర్థికమంత్రి చాలా ఆర్థిక సంస్కరణలు తెస్తానని మాట ఇచ్చారు.

**3) Strategy = Plan** = వ్యూహం.
a) What is your strategy to overcome this difficulty? = ఈ అవాంతరాన్ని దాటేందుకు నీ వ్యూహం ఏమిటి?
b) The defence ministry has worked out a strategy to deal with the border situation = సరిహద్దు విషయంలో రక్షణశాఖ ఒక వ్యూహాన్ని రచించింది.

strategic = వ్యూహాత్మకమైన.
Strategic changes are necessary to be able to face aggression =
దాడిని ఎదుర్కొనేందుకు వ్యూహాత్మక మార్పులవసరం.

**4) Hospitable = Friendly** (to guests/ visitors)= సాదరంగా ఆతిథ్యమిచ్చే/ అతిథులను సంతోషపెట్టే స్వభావమున్న.
A hospitable person receives guests very warmly and is happy when their guests are happy.
a) Indians by nature are very hospitable = భారతీయులు స్వతహాగా ఆతిథ్యం విషయంలో సాదరంగా ఉంటారు.
b) No guest ever goes unfed at his home. He is so hospitable = ఏ అతిథి కూడా అతడింట్లో భోజనం చేయకుండా వెళ్లడు. ఆతిథ్యంలో అతడంత గొప్ప.

**Hospitable X Cold** = అతిథుల పట్ల నిర్లక్ష్యం.
He was very cold to the guests =
అతిథులనంతగా ఆదరించలేదతను.
Inhospitable = దీనికి, hospitable కూ సంబంధం లేదు.
వాతావరణం భరించలేనంత చలిగా ఉండి ఎక్కడా వెచ్చటి ఆశ్రయం దొరక్కపోతే, అది inhospitable climate/ inhospitable region (ప్రాంతం).

**5) Penalty = Punishment** = శిక్ష.
a) The penalty for this offense is 6 months jail =
ఈ నేరానికి (offense) శిక్ష ఆరునెలల కారాగారం.
b) Follow the rules or face the penalty =
నిబంధనల ప్రకారం నడచుకో లేదా శిక్షనెదుర్కో.
c) He paid the penalty for harassing his wife for dowry =
భార్యను కట్నం కోసం వేధించినందుకు, అతడు తగిన శిక్ష అనుభవించాడు.
(Pay penalty = శిక్ష అనుభవించడం)
**Penalty X Reward** (బహుమానం).
Penal = శిక్షకు సంబంధించిన.

**G) Meagre** = చాలా తక్కువైన/ స్వల్పమైన
**X adequate** (చాలినంత), **plenty** (అపారమైన).

**Q.** ఇంగ్లిష్ భాషలో *imperative sentence* లలో *sit down, stand up* అని ఎందుకు వాడతారు? *Stand* అనే పదానికే నిలబడటం అని అర్థం కదా? మరి అలాంటప్పుడు *sit down, stand up* లకు బదులు *sit, stand* అనకూడదా? మన తెలుగులో కూర్చో, నిలబడు అంటామే కానీ కింద కూర్చో, పైకి నిలబడు అనం కదా? వివరించండి.

– మనోరంజని, విజయవాడ

**A.** Sit కూ, Stand కూ చాలా అర్థాలున్నాయి. వాడుక (usage) ప్రకారం sit down అంటే నిలుచున్న స్థితి (standing position) లోంచి కూర్చోవడం. అలాగే stand up అంటే కూర్చున్న position నుంచి నిలుచోవడం. Stand = మామూలుగా నిలుచోవడం; He was standing at the station the whole day. Stand up = కూర్చున్నవాళ్లు నిలుచోవడం. He stood up to answer the questions = ప్రశ్నకు సమాధానం చెప్పేందుకు (అంతవరకూ) కూర్చుని ఉన్న అతడు నిలుచున్నాడు. అలాగే, sit అంటే మామూలుగా కూర్చోవడం - We sat for three hours at the station = మేం మూడు గంటలపాటు కూర్చున్నాం/ కూర్చునే ఉన్నాం. Unable to stand any longer, he sat down = ఇంకేమాత్రం నిలుచోలేక (అంతవరకూ నిలుచున్న) అతడు కూర్చున్నాడు.



# Seeing is believing

**Q.** 1. *Please explain me word order and its rules to be followed while using modern English usage.*

2. *What is the meaning of cleft sentence? Give me some examples.*

3. *While using question tags, if the stress is on a particular word, it conveys different meaning. eg: "Tomorrow is a holiday isn't it?". If the stress changes from word to word the meaning varies. Please explain in detail.*

4. *Please explain me enchoative verbs. What are their uses in modern English?*

5. *Seeing is believing. This is a structure in English. eg: Whether following sentence can be used as an example of the above structure. The best service you are doing to society is refraing from doing the bad things.*

6. *Doubt relating to usage of between - among. When we refer to more than two things generally we use among. If we have a definite number in our mind between can also be used. For eg: Luxemburg lies between Belgium, Germany and France. Pl. explain.*

– వి.వెంకటనారాయణరావు, ధర్మవరం

**A.** 1. The question is not clear. If you mean the word order in different kinds of sentences here is the answer.

a) The Statement/ The assertive sentence (A sentence saying something- eg: The book is on the table. He has not come.)

Word order in a statement.

The book is on the table
subject verb

We see here that the statement has the subject (sb) + verb (vb) word order. That is, in a statement the subject comes first and the verb, next.

b) Question/ Interrogative sentence.

i) Is he here?
verb subject

ii) Are they coming?
helping verb subject main verb

iii) Where is he?
'Wh' word vb sb

iv) Where is he going?
'Wh' word vb subject

(A 'Wh' word is a word beginning with 'Wh' like.. What, Where, When, Why, Who, Whose, Which and how-usually used for asking questions).



We see there are **two kinds of questions**- Non 'Wh' questions- Questions without 'Wh' words (eg: questions (i) and (ii) above) and 'Wh' questions- questions beginning with 'wh' words. In both kinds of questions, the subject comes after the verb, or after the helping verb. When there are two/ more words in a question the first of them is the helping verb and the others are main verb.

**The imperative sentence:** (orders, wishes, etc.) In most of them the subject is 'you' but not stated.

i) (you) get out - Sb + Vb

ii) (you) please come in - Sb + Vb.

**The exclamatory sentence-** a sentence expressing surprize or a sudden feeling.

i) What a fool he is!
'Wh' word Noun Sb Vb

ii) How hot the day is!
'Wh' word adjective sb vb

iii) How well she sings!
'Wh' word Adverb sb vb

The word order in the exclamatory sentence is: 'Wh' word+Noun/ Adjective/ Adverb+Subject+Verb.

Sometimes the exclamatory sentence may not have the noun/ Adj/ Adv after the 'wh' word. eg: How he shouts!

In any version of English including modern English, any sentence has one of the four word orders shown above. (Feel free to write again if you find this answer not clear enough, but let your question be clear).

M.SURESAN

**2) A cleft sentence** is a sentence that begins with an 'it clause' or 'that clause' (clauses beginning with 'It' or 'that') and has another clause following it.

**eg:** i) It is this chapter that I found difficult to understand.

ii) That is the picture I want you to look at.

Sentence No.1 has an 'It clause' (It is this chapter), followed by the other clause, 'That I found...) sentence (2) has a 'That clause' (that is the picture) followed by the other clause 'I want you to look at'.

**3)** Tomorrow is a holiday, isn't it. If you are sure that tomorrow is a holiday, the stress on holiday, and isn't it has a fall, that is, holiday and isn't it? are said with a falling intonation. However, if you are not sure whether tomorrow is a holiday or not, the word holiday is uttered with falling intonation and 'isn't it?' with rising intonation.

a) Tomorrow is a holiday, isn't it? (The speaker is sure that tomorrow is a holiday)

b) Tomorrow is a holiday, isn't it? (The speaker is not sure whether tomorrow is a holiday, so holiday is said with falling intonation and isn't with rising intonation.

**4)** It is not 'enchoative' but 'inchoative' (ఇన్‌కోఅటివ్) verb. An inchoative verb expresses a change of state, that is, a change from one condition to another. **eg:** The college will close for summer vacation on the 12th April.

In this sentence, 'will close' (instead of 'will be closed') expresses a change of state (open to closed), happening on its own, without anybody causing it. So, 'will close' (close) is an inchoative verb. So is the verb, 'opened' an inchoative verb in the sentence, The shops opened as usual that day.

**5)** In one way it is, and in another way, it isn't. Seeing is believing- the structure of the sentence is Subject + Verb + Complement. In the sentence- the best service you are doing to society is refraing from..., if you take the whole clause 'The best you are doing to society' as the subject of the sentence, its structure is the same as that of 'seeing is believing'. However, if you take the subject of the sentence, 'seeing is believing', as a present participle (and not a clause), the sentence, 'The best service...' is not the same structure.

The sentences, 'Refraining from evil is doing the best service to society/ Doing the best service to society is refraing from evil- are exactly the same structure as, 'seeing is believing'.

**6)** Here, between is correct. We use 'between' (and not among) when we refer to an area or any geographical feature (rivers, mountain ranges, etc.) separating two or more points.

---

**Q.** కిందివాటిని ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

1. ప్రస్తుతానికి నేను ఖాళీగా ఉన్నాను. ఇప్పుడు నేను ఏ ఉద్యోగమూ చేయడం లేదు.

2. నువ్వు, నేను కేవలం నిమిత్తమాత్రులం. చేసేది, చేయించేది ఆమె.

3. *Interview* కి వెళ్లినప్పుడు, మనల్ని *interview* చేయడానికి నలుగురు లేదా అయిదుగురు ఉంటారు. వాళ్లని విష్ చేసేటప్పుడు ఒక్కొక్కరిని *good morning (evening)* అనాలా లేదా అందరికీ కలిపి ఒకేసారి *good morning all of you* అని అనాలా?

4. *He passed Degree* దీనికి *passive voice* ఎలా చెప్పాలి?

5. అతడు అతడి స్వార్థం కోసం (అవసరం) ఎవరినైనా మోసం చేయగలడు. ఎంతకైనా తెగించగలడు. కనీసం ఫ్రెండ్ అని కూడా చూడడు.

6. *The shop is open at 10'O clock* అన్నప్పుడు *shop* ఎవరిచేతనైనా *open* చేయబడుతుంది కదా? అలాంటప్పుడు *The shop opened at 10* అనే అనాలి కదా?

– జి.వెంకటేశ్వర్లు, కందుకూరు

**A.** 1. Right now/ At present I am jobless/ unemployed. (Jobless అమర్యాదకర పదం కాదు.)

2. You and I are just instrumental. It is she that does and gets done everything.

3. Good morning, sirs/ sirs and Madam (s) if both men and women are on the board of interview.

4. The degree was passed by him - అయితే ఇది passive కోసం passive. ఇలాంటి passives వాడం - ఈమధ్య వచ్చిన lessons లోని passive వాడకం మీది అంశాలు చూడండి.

5. He is very selfish. For his selfish purposes, he doesn't hesitate to cheat. He is upto anything if it serves his purposes.

6. Open ఇక్కడ verb కాదు. Open ఇక్కడ తెరిచి ఉన్న అనే అర్థంతో adjective. The shop is open = Shop తెరిచి ఉంది. The shop is opened at 10 everyday (Passive) = Shop తెరవబడుతుంది రోజూ 10 గంటలకు.

---

**Q.** కింది సందేహాలను తీర్చగలరు.

1. *A cup is in the saucer* ***(or)*** *on the saucer.*

2. *The teacher is sitting in the chair* ***(or)*** *on the chair.*

3. *Wednesday* ని ఎలా పలకాలి?

4. *Drought* ని కొందరు డ్రాట్‌గానూ, మరి కొందరు డ్రౌట్‌గానూ పలుకుతున్నారు. తొమ్మిదో తరగతి కొత్త ఇంగ్లిష్ టెక్ట్స్ బుక్‌లో *drout* గా ఉంది. మరి ఏది కరెక్ట్?

5. *listen* ని ఎలా పలకాలి?

6. *Every day, daily* భేదమేమిటి? ఏయే సందర్భాల్లో ఉపయోగించాలి?

– వై. భాస్కరరావు, జగ్గయ్యపేట

**A.** 1) A cup on a saucer

2) Sit on a simple (చేతుల్లేని) chair/ Sit in an arm chair (చేతులున్న కుర్చీ)/ Sit in an easy chair.

3) వెన్జ్‌డెయ్- న్జ్ లోని జ వత్తు size లో జ్ లా

4) లిస్‌న్ 5) డ్రౌట్

6) Everyday = daily. అయితే daily bread (నిత్యం ఆహారం) లాంటి expressions లో daily బదులు everyday రాదు.

---

**Q.** 1. *It is two pounds heavy. It is two pounds in weight.* ఈ రెండు వాక్యాల్లో ఏది కరెక్ట్? ఎలా తెలుసుకోవాలి?

2. *She is five feet three inches tall. She is five foot three inches tall* ఈ రెండు వాక్యాల్లో తేడా ఏమిటి?

3. *It is a 5 foot 9 inch bed.* ఈ వాక్యంలో *inches* వాడొచ్చా? *inch, pound* మొదలైనవి ఏకవచనంలోనే వాడాలా?

– నాగిరెడ్డి శ్రీనివాసులురెడ్డి, కలువాయి

**A. 1)** It is two pounds heavy= It is two pounds in weight - Both are correct.

**2)** She is 5 feet three inches tall అనడమే correct. She is five foot three inches tall - wrong. Look at the following:

a i) She is five feet three inches tall=

ii) She is a five feet three inch girl

b i) The tower is sixty feet tall =

ii) It is a sixty foot tall tower.

**3)** It is a 5 foot 9 inch bed అనం; It is a 5 feet 9 inch bed అంటాం.

observe the following:

a) He bought a bed measuring 5 feet 9 inches = He bought a 5 feet 9 inch bed.

ఇలాంటిచోట్ల, feet (plural), inch (singular) వాడతాం.

b) He bought the estate for Rs. 2 crore. (రాయడం Rs. 2 crore = చదివేటప్పుడు 2 crore rupees అంటాం) = The estate he bought is a two crore rupee (rupees కాదు) estate.

Measurements, ధరలూ లాంటి వాటికి సంబంధించిన వస్తువుల ముందు, singular number (పైన చూపినట్లు) మాత్రమే వాడతాం. అయితే రెండు units (foot, inches) ఉన్నప్పుడు, రెండోదాన్ని మాత్రమే singular గా వాడతాం. Example No. 3 (Bed) చూడండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 431

# You talk as if you hadn't seen him

**Sampreeth:** Who were you talking to yesterday?
(నిన్న నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావు? )

**Santhript:** Don't you know? You talk as if you hadn't seen him. It was Vallabh I was talking to.
(నీకు తెలియదా? అతడ్ని చూడనట్లు మాట్లాడకు. నేను మాట్లాడుతున్నది వల్లభ్‌తో)

**Sampreeth:** As soon as I came, he left, and it was rather dim. So, I wasn't sure it was Vallabh.
(నేను రాగానే అతడు వెళ్లిపోయాడు. అప్పుడు మసక చీకటిగా ఉంది. అందుకని అతడు వల్లభేనా అని రూఢిగా తెలియలేదు).

**Santhript:** Why didn't you ask me yesterday itself?
(నిన్ననే ఈ విషయం ఎందుకడగలేదు? )

**Sampreeth:** I had some thing more important on my mind. You remember too I was in a great hurry.
(అంతకంటే ముఖ్యమైన విషయం ఏదో నా బుర్రలో ఉంది. అంతేకాకుండా నేనప్పుడు చాలా తొందరలో ఉన్నానని నీకూ గుర్తుంది.)

**Santhript:** Even if you were in a hurry you could have asked me (తొందరలో ఉన్నా కూడా నన్నడిగి ఉండొచ్చు కదా? ). But why are we wasting time on something past? Why all that enquiry about Vallabh? Do go and see him if you want to.
(అయినా అయిపోయిందాని గురించి ఇంత సమయం ఎందుకు వృథా? అంత విచారణెందుకు వల్లభ్‌ను గురించి- కలుసుకోవాలనుకుంటే వెళ్ళి కలుసుకో.)

**Sampreeth:** As if I wouldn't if I wanted to. You don't need to say that.
(అనుకుంటే నేను కలుసుకోకుండా ఉండనా? నువ్వలా ఏమనక్కర్లేదు.)

**Santhript:** Take it easy old boy.
(ఏదో అన్నాన్లే. అంతగా పట్టించుకోకు.)

**Sampreeth:** You needn't say that either. I am the last man to take you amiss.
(అది కూడా నువ్వు చెప్పక్కర్లేదు. నిన్ను ఎప్పుడూ అపార్థం చేసుకోను.)

Take somebody amiss = ఒకర్ని అపార్థం చేసుకోవడం

**Santhript:** In no circumstances can there be any misunderstanding between us.
(ఏ పరిస్థితుల్లో కూడా మన మధ్య మనస్పర్థలు రావు)

**Sampreeth:** I am sure of that too.
(నా నమ్మకం అదే)

**Santhript:** OK. Shall we have some drink? Shall I get you some coffee?
(ఏదైనా తాగుదామా? మంచి coffee ఇవ్వనా నీకు? )

**Sampreeth:** Don't feel like it now. Thanks all the same.
(Coffee తాగాలనిపించడం లేదిప్పుడు. అయినప్పటికీ thanks)

***Now look at the following sentences from the dialogue above.***

*1) You talk as if you hadn't seen him*
*2) As soon as I came he left*
*3) Even if you were in a hurry you could have asked me*
*4) I am the last man to take you amiss*
*5) In no circumstances can there be any misunderstanding between us*
*6) Thank you all the same*

**1) As if/ As though** = అయినట్టు, కానీ కాదు.

ఇది Spoken English లో వాడే సందర్భాలు చాలా ఎక్కువే. కాబట్టి బాగా practise చేద్దాం.

M.SURESAN

a) He orders me about as if/ as though I were his servant = నేనేదో అతడి పనిమనిషినైనట్లు నాకు ఆజ్ఞలు జారీ చేస్తుంటాడు. (నేనతడి పనిమనిషిని కాదు)

b) She behaves as if she alone knew the truth = ఆమె ఒక్కదానికే నిజం తెలిసినట్లు ప్రవర్తిస్తుందామె. (ఆమె ఒక్కదానికే కాదు, ఇతరులకు కొంతమందికి కూడా తెలుసు)

c) You look as though you didn't have anything to eat so far = ఇంతవరకూ ఏమీ తిననట్లు కనిపిస్తున్నావు నువ్వు. (తిన్నావు కానీ తిననంత నీరసంగా కనిపిస్తున్నావు.)

ముఖ్యంగా గమనించాల్సింది: As if/ as though వచ్చినప్పుడు, దాని తర్వాత verb ఎప్పుడూ was/ were/ PDW (Past Doing Word) వాడతాం. అలా వాడితే, ఇప్పటి (present) సంగతి తెలియపరుస్తుంది. అదే had been/ had, pp వాడితే past విషయాన్ని తెలియజేస్తుంది.

d) Why do you look at me as if I was/ were a cheat?= నేనేదో మోసగాడినయినట్టు చూస్తున్నావేమిటి నా వైపు? (As if I was- British, As if I were- American) ఇక్కడ వాడుతున్నది, was/ were అయినా, మనం మాట్లాడుతున్నది ఇప్పటి (present) విషయం.

e) He talks as if/ as though his bowling alone helped his team to win= తన bowling వల్ల మాత్రమే తన team గెలుస్తున్నట్లు (ఇప్పుడు- Present లో) అతడు మాట్లాడుతాడు/ అతనంటుంటాడు. గమనించండి: As if/ As though తర్వాత verb- helped (Past Doing Word). (తన bowling మాత్రమే విజయానికి కారణం కాదు).

f) He is shivering as if he had seen a ghost= అతడేదో భూతాన్ని చూసినట్టు (చూడలేదు) వణికిపోతున్నాడు. ఇక్కడ As if/ as though తర్వాత verb, had + pp - ఇది past action ను (చూసినట్టు) తెలుపుతుంది.

## EXERCISE

**Match the expressions under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Keep back | A. Faultless |
| 2. Display | B. Escape punishment |
| 3. Sound | C. Bend |
| 4. Get away with | D. withhold |
| 5. Stoop | E. Reveal |
| | F. Exhibit |
| | G. Unhappy |

**KEY: 1-D, 2-F, 3-A, 4-B, 5-C.**

**Explanation:**

**1) Keep back = Withhold** = ఆపేయడం. ఏదైనా ఒక విషయం/ సమాచారం పూర్తిగాగానీ, కొంతగానీ చెప్పకుండా దాయడం.

a) I suspect he has kept back from us some important facts about his earlier life = తన గత జీవితం గురించిన కొన్ని ముఖ్యమైన వాస్తవాలను మనకు చెప్పకుండా ఆపేశాడని/ దాచాడని నా అనుమానం.

b) Don't keep anything back from him. It is important that he know everything that concerns him = అతడి దగ్గర ఏదీ దాచవద్దు/ అతడికి తెలియాల్సిన ఏ సమాచారం ఆపవద్దు. అతడికి సంబంధించిన అన్ని విషయాలూ అతడికి తెలియడం ముఖ్యం.

**keep back X reveal** (తెలియజేయడం)

**2) Display = exhibition** = ప్రదర్శన.

a) There was a display of excellent batsmanship by Rohit sharma = రోహిత్‌శర్మ చక్కటి batsmanship (batsman నైపుణ్యం) ప్రదర్శించాడు.

b) The hawkers displayed their wares on the pavement = వీధిలో అమ్ముకునే వాళ్లు, road platform మీద తమ వస్తువులను ప్రదర్శించారు.

Hawkers = peddlers = వీధుల్లో (shops లేనివాళ్లు) అమ్ముకునేవాళ్లు.

pavement = road కు రెండు వైపులా పాదచారులకోసం ఎత్తుగా కట్టే platforms. Platform/ foot path సరైన మాటలు కావు. Pavement దానికి correct పేరు.

Pavement dwellers = pavement మీద నివసించే వాళ్లు.

c) There was a display of the latest model jewellery at the ornament show= నగల ప్రదర్శనలో తాజా model ఆభరణాల ప్రదర్శన ఉంది.

**Display X conceal.**

**3) Sound = faultless** (లోపంలేని).

a) Though he is eighty years old, he enjoys sound health = అతడు 80 ఏళ్ల వాడైనప్పటికీ, చాలా ఆరోగ్యంగా ఉన్నాడు.

b) His financial position is sound = అతడి ఆర్థిక పరిస్థితికి ఏం ఢోకాలేదు/ చాలా బాగా ఉంది.

c) The advice he gives is always sound = అతడిచ్చే సలహా ఎప్పటికీ మంచిదే.

d) A Sound mind in a sound body = శారీరకారోగ్యంతో పాటు మానసికారోగ్యం.

e) Sound thinking = సరైన ఆలోచనాసరళి.

Of an unsound mind = మతిస్థిమితంలేని.

**Sound X unsound** (సరిగాలేని)

**4) Get away with = escape punishment** = తప్పుచేసి శిక్ష తప్పించుకోవడం.

a) Though he grabbed a lot of land he got away with it = ఎంతో భూమి కబ్జా చేసినప్పటికీ అతడు శిక్షపడకుండా తప్పించుకున్నాడు.

b) Don't drive without your helmet on. You cannot get away with it = Helmet లేకుండా వాహనం నడపకు. శిక్ష పడకుండా తప్పించుకోలేవు.

c) It is surprising that he got away with just 3 months in jail though he cheated people of lakhs of rupees = లక్షల రూపాయల మేరకు మోసం చేసినప్పటికీ, అతడు మూడు నెలల jail శిక్షతో తప్పించుకోవడం ఆశ్చర్యంగా ఉంది.

**5) Stoop = Bend** = వంగడం/ దిగజారడం.

a) He stooped to kiss the little boy = ఆ చిన్న పిల్లాడిని ముద్దుపెట్టుకునేందుకు వంగాడు అతడు.

b) She stooped to pick up her ring which had slipped down = జారిపడిపోయిన ఉంగరాన్ని తీసుకునేందుకు ఆమె కిందకు వంగింది.

c) Politicians stoop to any level for their selfish purposes = తమ స్వార్థప్రయోజనాలకోసం రాజకీయనాయకులు ఏ స్థాయికైనా దిగజారుతారు.

d) I can't stoop to lying just for a thousand rupees = కేవలం వేయి రూపాయల కోసం అబద్ధాలు చెప్పే స్థాయికి నేను దిగజారలేను.

పై list లో, keep back, get away with లాంటి expressions ను phrasal verbs అంటాం.

**Q. 1.** "We arranged to meet at 7:30 but she never turned up." ఈ వాక్యాన్ని "We arranged to meet at 7:30 but she didn't turn up yet." అని చెప్పవచ్చా?

**2.** కింది వాక్యాలు కరెక్టేనా?

Why didn't you turn up to the party yesterday?
Sorry! I am not going to turn up my duty to-day.
Kavitha didn't turn up to yesterday class?
I've been waiting for her since 3:30 pm but she didn't turn up yet.

***- P. Sumalatha, Hyderabad.***

**A.** 1) We arranged ..... but she never turned up = We arranged .... but she did not turn up. Yet ఇక్కడ వాడం. 'Never turned up' is almost the same as 'did not turn up' (Never turned up = ఆమె రానేలేదు. she did not turn up = ఆమె రాలేదు.)

Yet = ఇంకా/ ఇప్పటికీ. ఇది has not turned up = ఆమె ఇప్పటికీ రాలేదు, అనే అర్థం. Did not turn up/ Never turned up = (గతం) ఆమె రాలేదు.

2) a) Turn up to - wrong. turn up for, correct. (Why didn't you turn up for the party yesterday?).

b) Sorry, I am not going to turn up for duty today. (my duty ఇక్కడ సరికాదు. Turn up తర్వాత, for రావాలి, duty/ party etc. ముందు)

c) Kavitha didn't turn up for yesterday's class.

d) I've been waiting for since 3.30, but she hasn't turned up yet. Yet= ఇప్పటివరకు (till now) అన్నప్పుడు, have + pp / has + pp వాడతాం. Past Doing Word (did turn) రాదు.

**Q. 1.** ఏకకాలంలో జరుగుతున్న రెండు చర్యలను చెప్పడానికి మీరు ఉదాహరణగా- "Gita is singing and working at the same time" అని పేర్కొన్నారు. "Gita is working while singing songs" (గీత పాటలు పాడుకుంటూ పనిచేస్తుంది) అనొచ్చుగదా?

**2.** Ravi is eating while watching T.V. (రవి టీవీ చూసుకుంటూ అన్నం తింటున్నాడు) అనొచ్చుగదా?

**3.** అతడికి dance అంటే interest అనడానికి- "He is interested in dance" అని ఎందుకు రాస్తారు? He interests in dance అని రాయొచ్చుగదా?

**4.** Pronunciation కు dictionary సూచించగలరు.

***- Madhavan, Hyderabad.***

**A.** 1) Gita is singing and working at the same time = Gita is singing while she is working/ while she is at work/ as she is singing = Gita is working while singing - OK.

2) Ravi is eating while watching the TV - OK.

3) He interests అంటే అతడు ఇతరులకు ఆసక్తి కలిగిస్తాడు అని అర్థం కదా? He is interested అంటే అతడికి ఆసక్తి (dance లో) ఉంది.

4) Oxford Advanced Learner's Dictionary of Current English.

**Spoken English** పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. **URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Q.** 1. "భాషా ఒక్కసారి చెప్పితే వందసార్లు చెప్పినట్లే." ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

2. Follow my advice. దీనిని passive లో My advice should be followed అని రాయొచ్చా? లేదా Let my advice be followed అనాలా?

3. 'కవితలు'- ఇంగ్లిష్‌లో ఏమంటారు?

4. What a beautiful building is it! దీనిని He exclaimed that what a beautiful building it was అని రాయొచ్చా?

5. Grammar లో antecedent అంటే ఏమిటి?

**- KSR, Marturu**



## భాషా ఒక్కసారి చెప్పితే..

**A.** 1. If Bhasha says so once, he has said it a hundred times/ If Bhasha says so once, it is saying so a hundred times.

2. Let my advice be followed- correct. (My advice should be followed is the passive of "You should follow my advice")

3. Poems/ Verses/ Compositions/ Pieces of poetry.

4. రాయకూడదు. 'He exclaimed that it was a very beautiful building' అనాలి.

5. Antecedent: ఒక sentence/ clause/ phrase లో ఒక మాటను గురించి చెప్తూ, ఆ మాట వెనక వచ్చే ఇంకో మాట, ముఖ్యంగా ఒక pronoun.

a) He stopped the ball and threw it at the stumps. ఈ sentence లో ball, it కు antecedent (It, ball ను గురించి చెప్తోంది కదా? )

b) She gave me a book which was very interesting. దీనిలో which (pronoun) కు, book antecedent.



M.SURESAN

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 432





**Q.** 1. I am talking కు, I am speaking కు తేడా ఏమిటి?

2. నేను నీకు సినిమా చూపిస్తాను. దీనిని ఇంగ్లిష్‌లో I will show you a film అనాలా? I will take you a film అనాలా?

**- VD Anand, Koppole**

## Speak - talk

**A.** 1) Speak ముఖ్యమైన విషయాల గురించి formal గా ఎవరితోనైనా మాట్లాడటం. Speak అంటే మాట్లాడు కుంటున్నవారిలో ఒకరు మిగతా వాళ్లకంటే ఎక్కువ మాట్లాడతారు. Talk, ఎప్పుడూ ముఖ్య విషయాల గురించే కాకపోవచ్చు. కాలక్షేపానికి కొంతమంది ముచ్చట్లాడుకోవడం, సంభాషించుకోవడం talk అవుతుంది. Speak ఇలాంటి సందర్భాలకు వాడం.

The teacher spoke to the students about the exams= రానున్న పరీక్షల గురించి teacher విద్యార్థులతో మాట్లాడారు. (ఆయన మాట్లాడగా విద్యార్థులు విన్నారు)

We talked about our school days = మా బడి రోజుల గురించి మాట్లాడుకున్నాం. (ఇక్కడ ఉన్న వాళ్లం దరూ మాట్లాడినట్లు). ఈ సందర్భంలో talk బదులు speak వాడలేం కదా?

2) I will show you a film, correct కాదు. I will take you to a film, correct.

I will show you a film అంటే ఆ film ను (cinema ను) మీరు తీశారు, వాళ్లకు చూపిస్తారనే అర్థం వస్తుంది.

**Q.** 1) But then they have had their heroes too. ఈ వాక్యానికి అర్థం, Have, had లను పక్కపక్కనే ఉపయోగించిన కొన్ని వాక్యాలు తెలుపగలరు.

2) Sports & Games, get - obtain, steal - rob భేదం వివరించగలరు.

3) I am a student, aren't I? లో question tag aren't I కు ఎందుకొస్తుంది?

4) ఆంగ్లభాషలో అతిపెద్ద పదం ఏమిటి?

5) నేను నిన్ను ప్రేమిస్తున్నాను అని చెప్పడానికి I love you అంటాం. అలాగే నేను నీతో స్నేహం చేస్తున్నాను అని ఎలా చెప్పాలి?

**- V Purushotham, Ammakkapeta**

# They have had their heroes too

**A.** 1) అయినా వాళ్ల heroes వాళ్లకూ (ఇంత వరకూ) ఉన్నారు.

a) I have had three cups of coffee so far = ఇప్పటివరకూ నేను 3 cups of coffee తాగి ఉన్నాను.

b) He has had this car for a year now = గత సంవత్సరంగా అతడికీ car ఉంది (అతడి car ను కలిగి ఉన్నాడు)

c) He has just had his dinner = అతడిప్పుడే భోంచేశాడు.

ఇక్కడ tense - present perfect form: Have/ has + pp of 'have' (had)

2) రెండింటికీ దాదాపు ఒకే అర్థం, క్రీడ, క్రీడా కలాపాలన్నింటినీ కలిపి **sports** అంటాం. అయితే మామూలుగా ఒకే సారి ఇద్దరి మధ్య/ రెండు జట్ల మధ్య మాత్రమే కాకుండా, ఎక్కువమంది మధ్య ఒకేసారి జరిగే పోటీలను sports అంటారు. Running race (పరుగు పందెం), high jump, long jump- ఇలాంటివాటిల్లో ఒకేసారి ఎక్కువమంది పాల్గొంటారు, ఎక్కువ (రెండింటికంటే) ఎక్కువ team లు పాల్గొనవచ్చు- ఇలాంటివి sports. అలాకాకుండా, ఒకేసారి, ఇద్దరి మధ్య, రెండు జట్లు మాత్రమే పాల్గొనే క్రీడలు- Tennis, football, cricket లాంటివి, **games**.

**get** = పొందడం = **obtain.** అయితే get, మామూలు spoken form, obtain గ్రాంథికం. ఇంకా get = పొందడం/ తెచ్చుకోవడం/ సంపాదించుకోవడం/ తీసుకు రావడం. obtain= పొందడం మాత్రమే, అది కూడా ప్రయత్న ఫలితంగా. Get లో ప్రయత్నం లేకపోవచ్చు compare:

a) He got the permission

b) He obtains the permission = అతడు అనుమతి పొందాడు. అయితే, obtain చాలా గ్రాంథికం.

a) He got his degree

b) He obtained his degree

b) శ్రమ ఉందని తెలుపుతుంది.

**Steal** అంటే దొంగిలించడం. ఒకరికి తెలియకుండా వాళ్ల వస్తువు అక్రమంగా తీసేసుకోవడం (రహస్యంగా).

**Rob**= దోపిడి చేయడం- ఒకరి వస్తువు బలవంతంగా, దౌర్జన్యంగా లాక్కోవడం.

a) He stole my pen= నా pen దొంగిలించాడు.

b) They robbed him of his watch and chain = వాళ్లతడి watch ను, గొలుసును లాక్కున్నారు.

3) ఇది చాలాసార్లు వివరించాం. అది వాడుక (usage). English మాతృభాషగా కల వాళ్లు అలా అంటారు కాబట్టి, అందరూ అలానే అనాలి.

iv) FLOCCINAUCINIHILIPILIFICATION (29 letters- Longest non technical word)

v) I am friends with you/ I am your friend. Love (ప్రేమ) కు verb form love (ప్రేమించడం) లాగా friend (స్నేహితుడు) కు verb form లేదు, స్నేహం చేస్తున్నాను అనే అర్థంతో. Be friend అని ఉంది, అయితే దానికి- ఒకరితో స్నేహం పెట్టుకోవడం అనే అర్థం వస్తుంది.

**Q.** Be form + participle కలిసి $V_3$, అలాగే Be form + ing కలిసి $V_4$ అవుతాయి కదా. కాని- వెళ్లిపోయుంటాడు, చేస్తూ ఉండి ఉంటాడు, వస్తూ ఉంటాడు లాంటి clear గా తెలియని verbs కు ఈ అసమాపక క్రియా రూపాన్ని ఎలా వాడతాం? వివరించగలరు.

**- P Janaki Rao, Salur**

## be form + ..

**A.** $V_3$ అంటేనే Past Participle కదా? అలాగే కేవలం '...ing' form నే $V_4$ అంటారు. Strictly speaking (correct గా అయితే) Past Participle ($V_3$), Present Participle ($V_4$)- ing form verbs కావు. మీరన్నట్లు అవి అసమాపక (Non finite) verbs.

వెళ్ళిపోయుంటాడు = He must have gone.

చేస్తూ ఉండి ఉంటాడు = He must have been doing it.

వస్తూ ఉంటాడు = He must be coming.

పై sentences లో verb - must have + pp, would have been + ing, and must be + ing. ఈ sentences లో కేవలం past participle, కేవలం present participle వాడలేదుకదా. వాటిముందు 'be' form, must have + pp form లో ఉన్నాయి. వెళ్లిపోయుంటాడు. చేస్తూ ఉండి ఉంటాడు, వస్తూ ఉంటాడు- ఇవి Non finite verbs (అసమాపక క్రియలు) కావు. ఎందుకంటే ఈ verbs అవి తెలిపే పనికాలాన్ని (past) కచ్చితంగా తెలియజేస్తున్నాయి కదా. మీరు అర్థం చేసుకోవాల్సింది- కేవలం past participle కూ, be form + past participle/ have/ has/ had, etc + pp కూ ఉన్న తేడా, 2) కేవలం '...ing' form కూ, be form + ing form కూ ఉన్న తేడా. కేవలం 'pp' ($V_3$), కేవలం '...ing' form, verbs కావు. Past participle రూపాన్ని వాడతాం, కానీ, verb గా కాదు.

eg: a) The book given to him- అతనికివ్వబడిన పుస్తకం (అతనికిచ్చిన పుస్తకం- మామూలు తెలుగు)

b) The song sung at the party= party లో పాడబడిన (పాడిన) పాట.

c) The man talking to the woman (కేవలం... ing from) = ఆ స్త్రీతో మాట్లాడుతున్నతను.

d) The girl reading the book = పుస్తకం చదువుతున్న అమ్మాయి

a), b) లలో కేవలం pp, c) d) లో కేవలం '..ing' form వస్తోంది కదా, కాని అవి verbs కావు.

**Q.** Man, person, candidate- వీటిని ఎలా ఉపయోగించాలో తెలుపగలరు.

**- M.Satyanarayana, Hyderabad.**

## Man - person

**A.** Man= మగవాడు.

He is a handsome man= అతడు అందమైన వాడు.

Man= మనిషి.

Man is mortal= మనిషికి మరణించే స్వభావం ఉంది (ఇక్కడ Man= మనిషి= మానవులు= పురుషులు, స్త్రీలు కలిపి). అయితే మగ, ఆడవాళ్లను గురించి చెప్పేందుకు, man ఇప్పుడు వాడటం లేదు.

No man can live for ever= ఎవ్వరు కూడా శాశ్వతంగా ఎల్లకాలం జీవించలేరు- ఇక్కడ no man అంటే ఏ మగవాడైనా అని కాదు కదా, ఆడవాళ్లు కూడా అని. పైన చెప్పినట్లు, ఆడా మగా ఇద్దర్నీ ఉద్దేశించి చెప్పేటప్పుడు, ఈ రోజుల్లో man వాడటం లేదు. అలాంటిచోట్ల వాడేమాట person= వ్యక్తి (పురుషుడు/ స్త్రీ)

Man doesn't live for ever- ఇది old fashioned. ఇప్పుడు చెప్పేతీరు: A person doesn't live for ever= ఏ వ్యక్తీ ఎల్లకాలం జీవించరు.

Candidate = అభ్యర్థి. (ఎన్నిక, పరీక్ష, ఎంపికలాంటి వాటికి పోటీచేసే)

**Q.** 1. As, Although; 2. But, also - వీటికి సంబంధించి నాలుగు ఉదాహరణలను వివరించగలరు.

**- K. Sandhya, Chirala**

## As, Although; But, also

**A.** 1. __ it was raining we went out, 2. We went out __ it was raining. ఈ రెండు sentences లో కూడా, although ఒకటే correct; Although= అయినప్పటికీ, Although it was raining= వర్షం వస్తున్నప్పటికీ. రెండు sentences కూ అర్థం 1) వర్షం వస్తున్నప్పటికీ మేం బయటికెళ్లాం. 2) బయటికెళ్లాం మేం, వర్షం వస్తున్నప్పటికీ. ఈ రెండింటిలో దేనిలో కూడా As రాదు. As= అందువల్ల. ఇది వాడితే వచ్చే అర్థం: వర్షం వస్తున్నందువల్ల బయటికెళ్లాం అని. దీనికి అర్థం లేదుకదా.

You can't eat the cake and have it too- ఇది English సామెత = అవ్వా కావాలి, బువ్వా కావాలి అంటే కుదరదు అని. దీన్ని మీరిచ్చిన రెండు sentences లోనూ, sentence చివర too వాడటమే correct. Sentence No.1 లో కూడా How can you eat the cake and have it too? అనడమే సరి. (cake తినైనా తినాలి, లేకుంటే ఉంచుకోనైనా ఉంచుకోవాలి. cake ను తింటూ అది అయిపోకుండా ఉండాలంటే ఎలా? అని అర్థం).

**Q.** 1. సీమంతం, 2, నీవు కూడా ఆ తాను ముక్కవే, 3. మేనరికం. వీటిని ఇంగ్లిష్‌లో ఎలా అంటారో తెలియజేయగలరు.

**- P.B. Bharat, Hyderabad.**

## సీమంతాన్ని ఏమంటారు?

**A.** 1) సీమంతంకు correct గా suit అయ్యే English పదం లేదు- దాన్ని English లో వర్ణించి వివరించాల్సిందే. (A ceremony in a 5th/ 7th/ 9th month pregnant woman is given new bangles etc)

2) You are a chip off the old block- but this expression is limited to the members of a family.

Shaun Pollock is a great cricketer. After all he is a chip off the old block (His father Greame Pollock was also a great cricketer)

3) No exact equivalent for మేనరికం in English. The word nearest to మేనరికం is consanguinity (blood relation). Consanguineous marriage is the marriage between a young man and a young woman, who are first cousins (having common grand parents). In the Indian tradition the marriage (మేనరికం) is between first cousins, one of whom is the cousin of the other on the mother's side.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 433

# That will be the last thing

**Nirukta:** Why don't you put off your trip just by a couple of days?
(నీ ప్రయాణం ఓ రెండ్రోజులు వాయిదా వేసుకోకూడదూ? )

put off = వాయిదా వేయడం

The exam has been put off = పరీక్ష వాయిదా పడింది

**Vimukta:** I've reserved my journey. How can I postpone it?
(రిజర్వ్ చేసేసుకున్నాను. ఎలా వాయిదా వేయను? )

**Nirukta:** We can have the ticket cancelled and the reservation made for another day, say saturday.
(Ticket cancel చేసుకుని ఇంకో రోజుకు, అంటే శనివారానికి మళ్లీ reserve చేసుకోవచ్చు కదా)

**Vimukta:** That'll be the last thing I am going to do. How are you sure of my accommodation on the saturday train?
(ఆ పని మాత్రం చేయను నేను. శనివారం train లో నాకు berth దొరుకుతుందని నమ్మకం ఉందా నీకు? )

**Nirukta:** My brother can manage that. He knows people who can help us in that. He can certainly manage a berth for you on saturday.
(మా అన్నయ్య ఆ విషయం చూసుకోగలడులే. ఆ విషయంలో సహాయం చేసేవాళ్లు అతడికి తెలుసు. కచ్చితంగా నీకు శనివారం berth దొరికేలా చేయగలడు.)

manage = ఏదైనా పని చేయగలగడం

**Vimukta:** Even if he has people to help him, it may be difficult. There will be certainly the weekend such on saturday.
(తనకు సహాయం చేసేవాళ్లున్నప్పటికీ, మీ అన్నయ్యకు అది కష్టం కావచ్చు. శనివారానికి వారాంతం ఉంటుంది కదా/ శనివారం వారాంతం కదా? )

**Nirukta:** I am sure even then my brother can manage it just the same.
(అయినప్పటికీ, మా అన్నయ్య ఎలాగో ఒకలా సాధించగలడనే నమ్మకం నాకుంది.)

**Vimukta:** And when will he do it?
(అదెప్పుడు చేస్తాడాయన.)

**Nirukta:** As soon as he comes home, we will talk to him about it. Let's see.
(ఇంటికి రాగానే మాట్లాడదాం. చూద్దాం)

**Look at the following sentences from the conversation above:**

*1) That will be the last thing I am going to do.*

*2) Even if he has people to help him it may be difficult.*

*3) I am sure my brother can manage it all the same.*

*4) As soon as he comes back we will talk to him about it.*

M.SURESAN

**1) The last thing/ the last person/ the last place, etc =** మనకస్సలు ఇష్టంలేని విషయం/ వ్యక్తి/ ప్రదేశం, etc.

a) A hospital is the last place we wish to go to = మనం అత్యంత తక్కువ ఇష్టంతో వెళ్లేచోటు ఆసుపత్రి/ ఎవరు కూడా ఆసుపత్రికి వెళ్లేందుకు ఇష్టపడరు.

b) He is the last person I want to meet = నేను అందరికంటే ఆఖరున కలుసుకునేవాడే అతడు/ అతడిని కలుసుకోవడం నాకస్సలు ఇష్టంలేదు.

c) An income tax raid is the last thing any rich person wants = ఆదాయం పన్ను అధికారుల దాడి ఏ ధనికుడికీ ఇష్టం ఉండదు. (వాళ్లు కావాలనుకునేవాటిల్లో అది చివరిది)

**2) Even if =** అయినా కూడా

a) Even if he comes here I will not talk to him = అతడిక్కడికి వచ్చినా నేనతడితో మాట్లాడను.

b) Even if I have to walk all the way, I will go there = అంత దూరమూ నడవాల్సినప్పటికీ, నేనక్కడికి వెళ్తాను.

ఇది అంటే, even if, even though, though, although కి దగ్గర.

**3) All the same/ just the same = but.**

a) I didn't help him much. He thanked me all the same/ just the same = నేనతడికి చేసిన సహాయం అంత ఎక్కువేమీ కాదు, అయినా నాకతడు thanks చెప్పాడు.

b) He certainly is a good friend of mine. All the same he doesn't tell me everything about his earnings = అతడు నాకు మంచి మిత్రుడే. అయినా తన సంపాదన గురించి అన్ని విషయాలూ నాతో చెప్పడు.

c) You may not buy it. Just the same/ all the same you can see it = నువ్వది కొనకపోవచ్చు కానీ దాన్ని చూడొచ్చుకదా.

**4) As soon as =** వెంటనే/ తక్షణమే

a) This lecturer is very sincere. As soon as he takes the attendance, he begins teaching = ఆయన చాలా చిత్తశుద్ధి ఉన్న lecturer. Attendance తీసుకున్న వెంటనే బోధన ప్రారంభిస్తాడు (time waste చేయకుండా)

b) As soon as he came in he switched on the TV = లోపలికి వచ్చిన వెంటనే TV on చేశాడు.

c) As soon as the shop opened, all the copies of the book were sold out = Shop తెరిచిన వెంటనే, ఆ పుస్తకాలన్నీ అమ్ముడైపోయాయి.

---

**EXERCISE**

**Match the words and expressions under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1. (to) go back on | A Community |
| 2. Folk | B Lazy |
| 3. (To) Sweat over | C Unusual |
| 4. Sluggish | D Heavy |
| 5 Peculiar | E Work hard |
| | F Fail |
| | G Common |

**Key:** 1-F, 2-A, 3-E, 4-B, 5-C.

**1) To go back on = fail** - ఇచ్చిన మాట నిలబెట్టుకోకపోవడం/ మాట విఫలమవడం.

a) He went back on his promise of providing us all facilities during our stay there = అక్కడ మేం ఉన్న సమయంలో మాకు అన్ని సౌకర్యాలు కల్పిస్తానన్న మాటలను అతడు నిలబెట్టుకోలేదు.

b) She is not one to go back on her word = తను ఇచ్చిన మాటను నిలబెట్టుకోని వ్యక్తి కాదావిడ.

c) Hope you don't go back on what you've said now = నువ్విప్పుడన్న మాటను నువ్వు నిలబెట్టుకుంటావనే ఆశిస్తున్నాను.

**Go back on X fulfil/ keep** = ఇచ్చిన మాటను నిలబెట్టుకోవడం

Srirama helped his father to keep/ fulfil his promise to Kaikeyi = శ్రీరాముడు దశరథుడికి సహాయపడ్డాడు, ఆయన కైకేయికిచ్చిన మాటను నిలబెట్టుకునేందుకు.

Dreams are fulfiled= కలలు నెరవేరాయి

**2. Folk = Community** = ఒక తెగకు/ వర్గానికి చెందిన ప్రజలు. The village folk= గ్రామస్తులు/ ఒక గ్రామంలోనివాళ్లు.

a) The village folk are more hospitable than the towns folk = పట్నవాస ప్రజలకంటే గ్రామాల్లో ప్రజలు ఆతిథ్యం (ఆదరణ) ఎక్కువ చూపిస్తారు.

b) The working class folk in most countries lead a mechanical life = చాలా దేశాల్లో శ్రామికవర్గ ప్రజలు తమ జీవితాన్ని యాంత్రికంగా గడుపుతుంటారు.

c) The folks at home will be angry if I go home late = నేనింటికి ఆలస్యంగా వెళ్తే ఇంట్లోవాళ్లు కోప్పడతారు.

Folk అంటే 'జానపద' అనే అర్థం కూడా ఉంది. Folk tales = జానపద గాథలు, Folk dance = జానపద నృత్యం, Folk music = జానపద సంగీతం - బుర్రకథలు, పల్లెపదాలు లాంటివి.

Hi, folks = మన friends ను ఒక్కోసారి ఇలా అంటాం/ పిలుస్తుంటాం.

**3) To sweat over** = శ్రమించడం/ ఏదైనా శ్రమపడిచేయడం, sweat = చెమట.

a) I really sweated over the book = నేను ఆ పుస్తకాన్ని కష్టపడి రాశాను/ నేను ఆ పుస్తకం రాయడానికి చాలా శ్రమపడ్డాను.

b) The Indians sweated over the victory in the match = Match చాలా శ్రమపడి గెలిచారు భారతీయులు/ వాళ్లు match గెలిచేందుకు చాలా శ్రమపడ్డారు.

c) He sweated over the report the whole night = ఆ రిపోర్ట్ తయారు చేసేందుకు రాత్రంతా శ్రమపడ్డాడతడు.

**4) Sluggish = lazy** = బద్ధకంగల/ బద్ధకంతో ఉన్న/ చాలా మందకొడిగా నిదానంగా జరుగుతున్న.

a) The police investigation of the crime has been sluggish = ఆ నేరం దర్యాప్తు చాలా మందకొడిగా, నిదానంగా జరిగిందింతవరకు.

b) If he continues to be sluggish he can't finish the work in time = అతడిలా మందకొడిగా/ బద్ధకస్తుడుగా కొనసాగుతూ ఉంటే సకాలానికి పని పూర్తిచేయలేడు.

c) The work on the project is very sluggish = ఆ ప్రాజెక్టు పనులు చాలా మందకొడిగా నిదానంగా సాగుతున్నాయి.

sluggard = బద్ధకస్తుడు. (స్లగడ్ - గడ్, bird లో 'బ' లాగ.)

**Sluggish X fast**

**5) Peculiar = unusual** = మామూలు కాని/ మామూలుకంటే భిన్నంగా ఉన్న/ వింతగా ఉన్న.

a) Chandra's behaviour at the party was peculiar = నిన్న party లో చంద్ర ప్రవర్తన వింతగా ఉంది.

b) The Telangana issue has put the government in a peculiar situation = తెలంగాణ అంశం/ విషయం ప్రభుత్వాన్ని చాలా వింత పరిస్థితిలో ఉంచింది/ పడేసింది.

c) The drink had a peculiar taste = ఆ పానీయం రుచి చాలా వింతగా/ మామూలుకానిదిగా ఉంది.

d) He is peculiar OK, but we have to bear with his peculiarities for some time = అతడు కాస్త వింత, కానీ కొంతకాలం అతడి వింత తత్వాన్ని మనం భరించాల్సిందే.

**Peculiar X ordinary/ normal/ general.**

---

**Q.** *కింది వాటిలో ఏది కరెక్టు?*

*1) Two hours is/ are over.*

*2) Five hundred rupees is/ are in my hand.*

*3) He, you and I attended the meeting. You, he and I attended the meeting.*

*4) Soft skills అంటే ఏమిటి?*

*కిందివాటి మధ్య తేడా ఏమిటి?*

*5) Holidays, vacations, 6) Tradition - custom, 7) Suggestion - advice*

*- P.Srinivasa Rao, Pithapuram*

**A.** The following are the correct ones because any amount of money and any period of time are singular.

1) Two hours is over (correct)

2) Five hundred rupees is a big amount (correct)

3) You, he and I - correct

4) Soft skills - personality development (వ్యక్తిత్వ వికాసం) including communication skills, time management, positive attitude, goal setting and decision making.

5) Holidays అంటే అప్పుడప్పుడు, లేకుంటే తక్కువ కాలం వచ్చే సెలవులు. Vacations అంటే ఏకబిగిన ఎక్కువ రోజులు సెలవులు రావడం.

a) We have three holidays during this week - ఈ వారంలో 3 రోజులు సెలవు. (మూడురోజులూ వరుసగా రానక్కరలేదు- మూడురోజుల్లాంటి తక్కువగా ఉన్న సెలవులు vacation కాదు.)

b) The court is on vacation = కోర్టు సెలవుల్లో (చాలా రోజులపాటు ఒకేసారి) ఉంది.

c) Vacation usually extends over weeks and is continuous.

6) Tradition అంటే సంప్రదాయం. ఒక సమాజంలో చాలాకాలంగా ప్రజలు పాటించే జీవనరీతి. ఇందులో భాగం, custom = ఆనవాయితీ- custom is a part of the tradition. A custom is a habit/ practice of a group of people, and carried on by generation. A number of customs make a tradition. Tradition అన్నప్పుడు కాస్త మత సంబంధమైన విషయం అనేది కూడా స్ఫురిస్తుంది.

7) Advice = సలహా; suggestion = సూచన. మనం advice ఇచ్చినప్పుడు ఇలా చెయ్యి అని అంటాం. సూచన అయితే, నేను చెప్పేది కూడా ఆలోచించు అని అర్థం. సూచన (suggestion) కంటే, advice (సలహా) గట్టిగా చెప్పడం అవుతుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# In such a case you can never grow

**Irfan:** Still in the same job? Won't you change?
(అదే ఉద్యోగంలో ఉన్నావా? మారవా నువ్వు?)

**Ricky:** Why should I? I am quite happy with the job I am in.
(ఎందుకు మారాలి? నేను చేస్తున్న ఉద్యోగం నాకు బాగానే ఉంది.)

**Irfan:** Won't you change even if you get a better job?
(ఇంతకంటే మంచి ఉద్యోగం వచ్చినా మారవా?)

**Ricky:** I'll, in case it doesn't mean my moving out of here. I like the place so much.
(మారతాను, నేను ఈ ఊరు విడిచి వెళ్లని పక్షంలో. ఈ ఊరంటే నాకంత ఇష్టం.)

**Irfan:** That's foolishness. In such a case you can never grow.
(అది మూర్ఖత్వం. అలా అయితే నీకు పెరుగుదల ఉండదు.)

**Ricky:** We hardly ever agree on these matters. I am contented with what I have. You're ambitious.
(ఈ విషయాల్లో మనకు ఒకరికొకరికి కుదరదు. నాకున్న దానితో నేను తృప్తిపడతాను. నీకేమో కాంక్ష ఎక్కువ.)

Ambition = ఆకాంక్ష. జీవితంలో మనం ఏదైనా అవ్వాలనే/ చేయాలనే కోరిక

political ambition= రాజకీయాల్లో పదవి కోసం/ పలుకుబడి కోసం/ అధికారం కోసం ఆకాంక్ష

**Irfan:** One needs to be ambitious otherwise how can one come up?
(ఎవరికైనా ఆకాంక్ష ఉండాల్సిందే కదా? లేకపోతే ఎవరూ పైకి రాలేరు.)

one = ఎవరైనాసరే

**Ricky:** No sooner did I see you than I thought you would discuss just this. Why not something else just for a change?
(నిన్ను చూడగానే అనుకున్నా, నువ్వీ విషయమే చర్చిస్తావని. ఇంకేదైనా మాట్లాడకూడదూ, కాస్త మార్పు కోసం?)

**Irfan:** I do it lest you rot in the present job. It's just friendly interest, nothing more.
(నువ్వు ఇదే ఉద్యోగంలో ఉండి మురిగిపోకూడదని నేను ఆ విషయం మాట్లాడటం, ఏదో స్నేహితుడిగా నీ మీద నాకున్న శ్రద్ధ, అంతకంటే మరేంలేదు.)

rot = మురిగిపోవడం/ కుళ్లిపోవడం

rot, rotted (past tense), rotten (pp)

rotten egg = పాడైపోయిన గుడ్డు

it's a rotten movie = చెత్త సినిమా

**Ricky:** Thank you.

✪ ✪ ✪ ✪

**Look at the following expressions from the conversation above.**

1) *I'll, in case it doesn't mean my moving out of this place.*
2) *In such a case you can never grow.*
3) *We hardly ever agree on these matters.*
4) *Otherwise how can one come up?*
5) *I do it lest you rot in the present job.*

**1) In case = if = suppose** = అయితే, (అలా అనుకుంటే)

a) In case he comes here, please let me know = అతడిక్కడికి వచ్చినట్లయితే (if he comes here) నాకు తెలియజెయ్యి.

b) In case you need my help, feel free to ask me = నీకు నా సాయం అవసరం అయితే, అడిగేందుకు సంకోచించవద్దు (స్వతంత్రంగా అడుగు).

c) In case of an accident call 108 = ప్రమాదం జరిగినట్లయితే 108 కి phone చేయండి.

**2) In such a case** = అలా అయితే/ ఆ పరిస్థితుల్లో/ అలాంటప్పుడు.

a) Whether he attends the party or not he has to pay. In such a case isn't it better to attend the party = అతడు party కి వచ్చినా రాకపోయినా డబ్బు కట్టాల్సిందే. అలాంటప్పుడు రావడమే మంచిది కదా?

b) He will be here whether you like it or not? In such a case you'd better call him = నీకిష్టం ఉన్నా లేకపోయినా అతడిక్కడుంటాడు. అలాంటప్పుడు/ ఆ పరిస్థితిలో అతడిని పిలవడమే మంచిది.


M.SURESAN

**3) Hardly ever** = దాదాపు లేదు/ లేనట్లే.

a) In our school days we hardly ever liked each other = మా school రోజుల్లో మాకు ఒకరికొకరికి పడేది కాదు (ఒకరంటే ఒకరికి ఇష్టం ఉండేది కాదు.)

b) She pampers her daughter so much that she hardly ever notices her faults = ఆమె తన కూతురుని ఎంత గారాబంగా చూసుకుంటుందంటే, ఆ కూతురులో ఏ తప్పూ గమనించదామె.

pamper = గారాబం చేయడం

c) He hardly ever walks. He always goes by car = అతడు నడవటమంటూ ఉండదు. ఎప్పుడూ కారే.

**4) Otherwise** = కాకపోతే/ లేకపోతే

a) Follow the rules. Otherwise you will be in trouble = నిబంధనలు పాటించు. లేకపోతే చిక్కుల్లో పడతావు.

b) Every party tries please the minorities otherwise it can't get their votes = ప్రతి పార్టీ మైనారిటీలను సంతోషపరిచేందుకు ప్రయత్నిస్తుంది. లేకపోతే వాళ్ల ఓట్లు రావు.

**5) lest** = అలాకాకుండా ఉండేందుకు = so that ... not

a) Start early enough lest you (should) miss the train = Train తప్పిపోకుండా ఉండేందుకు ముందుగానే బయలుదేరు.

b) I carried an umbrella lest I (should) get drenched = తడవకుండా ఉండేందుకు గొడుగు పట్టుకెళ్లాను.

c) He paid her enough money lest she (should) complain later = తర్వాత ఏం అనకుండా ఉండేందుకు ఆమెకు చాలినంత డబ్బు ఇచ్చాడతను.

Incase, lest- ఇవి కొంచెం గ్రాంథికం.

Incase బదులు If వాడటం simpler. అలాగే lest బదులు so that... not వాడటం simpler. ఇవి ఇక్కడ వివరించింది మనం వాడటానికి కాదు. ఇతరులు వాడితే మనకు అర్థం అయ్యేందుకు.

---

### EXERCISE

**Match the expressions under A with this meanings under B.**

| A | B |
|---|---|
| 1. Put up with | A. Cause |
| 2. Lead to | B. Destruction |
| 3. Optimistic | C. Release money |
| 4. Ransom | D. Tolerate |
| 5. Havoc | E. Hopeful |
| | F. Repetition |
| | G. Slave |

**Key: 1-D; 2-A; 3-E; 4-C; 5-B.**

### EXPLANATIONS

1) Put up with = Tolerate = సహించడం/ భరించడం/ సహనంతో ఉండటం.

a) The Pandavas had to put up with all kinds of humiliation from the Kauravas = కౌరవులు చేసిన అన్ని రకాల అవమానాలను పాండవులు, భరించాల్సి వచ్చింది.

humiliation = అవమానం

b) It's difficult to put up with the unclean atmosphere here = ఇక్కడి అపరిశుభ్ర వాతావరణం భరించడం కష్టం.

c) It's impossible to put up with him = అతడిని భరించడం/ అతడితో నెగ్గుకు రావడం అసాధ్యం.

2) Lead to = Cause = కారణమవడం/ దారి తీయడం

a) The husband's illtreatment of his wife led to their divorce = భార్యను ఆ భర్త సరిగా చూసుకోకపోవడం (illtreatment) వాళ్ల విడాకులకు కారణమైంది.

b) The failure to take timely decisions leads to all kinds of troubles = సకాలంలో నిర్ణయాలు తీసుకోకపోవడం చాలా అనర్థాలకు దారి తీస్తుంది.

c) His misconduct led to his dismissal from service = అతడి దుష్ప్రవర్తన అతడిని ఉద్యోగం నుంచి తొలగించడానికి కారణమైంది.

lead = ముందుండి నడిపించడం/ దారి చూపడం;

leader = నడిపించేవాడు, నాయకుడు

3) Optimistic = Hopeful = మంచిని ఆశించే

a) I am optimistic about India's victory in the match = పోటీలో భారత్ విజయం పొందుతుందని ఆశిస్తున్నాను.

b) I don't share your optimism about a corruption free India = అవినీతి లేని భారతదేశం వస్తుందని నీకున్న నమ్మకం/ ఆశ నాకు లేదు.

c) The lack of fitness among our players doesn't give me the optimism about their winning = మన ఆటగాళ్లలో fitness లేకపోవడం వల్ల వాళ్ల గెలుపు పట్ల నేనంత ఆశావహంగా లేను.

Optimism X Pessimism

4) Ransom = Release money = Money/ amount which kidnappers demand to release the person they have abducted (kidnapped) = Kidnap చేసిన వ్యక్తిని విడుదల చేసేందుకు kidnappers అడిగే డబ్బు

kidnap = abduct

a) The kidnappers demanded a ransom of Rs 1 lakh to release the abducted child = ఎత్తుకెళ్లిన బిడ్డను విడిపించేందుకు kidnappers లక్ష రూపాయలడిగారు.

b) He had his father released after paying a ransom of Rs 10 lakh = 10 లక్షల విడుదల సుంకం (ransom) చెల్లించి తన తండ్రిని విడిపించుకున్నాడు.

5) Havoc = Destruction =వినాశనం/ నష్టం

a) The cyclone caused great havoc in the coastal area = కోస్తా ప్రాంతంలో తుపాను పెను వినాశనాన్ని కలిగించింది.

b) Duryodhana played havoc with the lives of the Pandavas = దుర్యోధనుడు పాండవుల జీవితంలో పెద్ద నష్టాన్నే కలగజేశాడు.

c) Ishant Sharma played havoc with the Australian batsmen = ఆస్ట్రేలియా batsmen కు ఇషాంత్ శర్మ తీరని నష్టాన్ని కలిగించాడు.

**F. Repetition** = మళ్లీ మళ్లీ చెప్పడం/ చేయడం (repeat చేయడం)

a) His repetition of the mantram did him some good = ఆ మంత్రాన్ని మళ్లీ మళ్లీ ఉచ్చరించడం అతడికి కొంత మంచి చేసింది.

b) His repetition of the misdeed made every one angry = ఆ అకృత్యం అతడు మళ్లీ/ మరోసారి (repeat) చేయడం అందరికీ కోపం కలిగించింది.

ఇది కూడా చూడండి: Repetitive = మళ్లీ మళ్లీ వచ్చే

a) His speeches are repetitive = అతడి ఉపన్యాసాలు ఒకే విషయం పునరావృతం అయ్యేవిగా ఉంటాయి. (కొత్తదనం లేదు)

b) The themes of Indian movies are repetitive = భారతీయ సినిమాల కథాంశం ఎప్పుడూ పునరావృతం (మళ్లీ మళ్లీ ఒకే కథాంశం - కొత్తదనం లేకుండా) అవుతుంటుంది.

---

**ప్రశ్న:**

కిందివాక్యాలను ఇంగ్లిష్‌లోకి అనువదించండి.

a) సమాధానం వెతకగా వెతకగా దొరికింది.
b) ఆ బుట్టలో ఉన్నవి కాయలా? పళ్లా?
c) నేను మా తల్లిదండ్రులకు రెండో కొడుకును.
d) ఈ మధ్య నేను అతడిని పట్టించుకోవడం లేదు.
e) ఈ రోజు మధ్యాహ్నం రెండు గంటలపాటు మంచి కునుకు పట్టింది.
f) పరీక్షాహాల్లో నేను నిన్నే గమనిస్తుంటాను.
g) మావోయిస్టులు దేశంలోనే అతి పెద్ద స్తూపాన్ని మన రాష్ట్రంలో నిర్మించబోతున్నారు.
h) అతడిని ఇక్కడకు రమ్మను.
i) అక్కడికి వెళ్లనని రాసివ్వు.
j) అతడు చేస్తున్న సాహసాలు ప్రజల మెప్పు పొందాయి.
k) యూరప్‌లో చలి ఎక్కువ.
l) నేనన్న మాటలకు అతడికి కోపం వచ్చిందా?

– సి హెచ్.సుధాకర్, అల్లీపురం మెదక్

**జవాబు:**

a) I found the answer/ solution after a lot of/ a long search.
b) Are the fruit(s) in the basket raw or ripe?
c) I am the second son of my parents.
d) Oflate I haven't been caring about him.
e) I had a good nap for two hours this afternoon.
f) I'll be observing only you in the exam hall.
g) The Moists are going to put up the largest domed edifice (స్తూపానికి English లో సరైన మాట లేదు) in the whole country.
h) Tell him to come here.
i) Give it in writing that you will not go there.
j) His daring acts have won the praise of the people.
k) Europe is very cold.
l) Did he get angry at my words?

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



**Q.** *Finite Verbs, Non-Finite verbs అంటే ఏమిటి? అదేవిధంగా Gerund, Present Participle కు మధ్య తేడా తెలుపగలరు. Gerund అంటే verb + noun అనీ (A running track), అలాగే participle అంటే verb + adjective అని (A running stream) ఓ గ్రామర్ పుస్తకంలో చదివాను. ఇక్కడ running అనేది verb, stream అనేది noun కదా. మరి ఇది participle ఎలా అయ్యింది? వివరించగలరు.*

***- K.Ravi, Pollanki.***



**A.** మన Spoken English lessons లో 6 forms of the verb (Verb కు ఉన్న 6 రూపాలు) ఇచ్చాంకదా: 1) 'Be' forms, 2) 'Be' form + ...ing form 3) Be form + Past participle 4) Have/ has/ had/ shall have/ will have, etc + pp 5) Doing Words (I RDW, II RDW, PDW), 6) shall/ should/ will/ would etc., + 1st RDW (see spoken English lesson No. 24) - వీటినే finite verbs/ verbs అంటాం. Non finite verbs- 1) The infinitive (to go, to sing, etc) 2) The ...ing form (going, coming, singing etc.,) 3) The past participle (given, sung, etc). Non finite verbs, verbs కావు. వాటినలా Non finite verbs అనడంవల్ల, Past participle ను V3 అనడంవల్ల మనకు కలిగే confusion అంతా ఇంతా కాదు. Non finite verbs అనే మాట మర చిపోండి. వాటిని verbs కావనే అనుకోండి. అప్పుడే మీరు సరిగా రాయగలరు/ మాట్లాడగలరు. మీరు మాట్లాడేందుకు, రాసేందుకు Gerund, Past participle తేడా తెలియనవసరం లేదు కదా? Noun ఎలాంటిది అని తెలిపేది adjective అని గుర్తుపెట్టుకుంటే చాలు.

**Q.** *Please explain how to use verbs to question form. ప్రశ్నల్లో verb ఏ రూపంలో ఉండాలి? Can, could, should, have, had, has, will, would, shall, may, might లాంటివి ఉపయోగిస్తే verbs eg. seen లాంటివి v.conv2, conv3 వేటిలో ఉండాలి?* ***- G.Anilkumar, Hyderabad.***

**A.** The verb in a question always comes before the subject.

eg: Is he your friend? (అతడు నీ స్నేహితుడా?) ఇక్కడ is (verb), he (subject) ముందు వస్తోంది కదా? Is he coming? (అతడు వస్తున్నాడా?) ఇక్కడ is (helping verb), he (subject) కు ముందు వస్తోందికదా. Verb లో రెండు మూడు మాటలుంటే మొదటి మాట helping verb, రెండో మాట main verb. కాబట్టి question లో ఎప్పుడూ verb తర్వాత గానీ, helping verb తర్వాతగానీ మాత్రమే subject ఉంటుంది.

Can, could, will, would, shall, should, may, might, have, has - వీటిని questions లో వాడినప్పుడు, వీటి తర్వాత ఎప్పుడూ v1 వస్తుంది. eg: can help, could do, will sing, etc. ఇలా verb వచ్చినప్పుడు, can, could, etc., helping verbs అవుతాయి. అవునా? అప్పుడు question:

| Can | you | help me? |
|---|---|---|
| Helping verb | subject | main verb (v1) |

ఇలావస్తాయి, ఈ verbs questions లో. వీటిని గురించి ఇదివరలో చాలా వివరంగా చెప్పాం. చూడండి.




**Q.** *1) "వాడిక్కడికి వచ్చాడా? నువ్వక్కడికి వెళ్లావా?" అనే దానిని మీరు Did he come here, or did you go to him? అని ఇచ్చారు. దీనిలో నువ్వక్కడికి వెళ్లావా అనే భావం స్ఫురించడం లేదు కదా?*

*2) నేను రానా వద్దా స్టేషన్‌కు?*

*Shall I go to the station with you or not? ఈ Sentence లో 'రానా' అనే భావం స్ఫురించడం లేదు కదా? తెలుపగలరు.*

*3) ఒక English book లో a) I was out of station లేదా b) I was not in town అనవచ్చు అని రాశారు, మీరు మాత్రం out of station అని అనకూడదు అని రాశారు. వీటిలో ఏది, ఎందుకు కరెక్టో? వివరించగలరు.*

***- P.Murali Krishna, Pedanindrakolanu.***


M.SURESAN

**A.** 1) మీ సందేహం సరైనదే. Did you go to him, correct అర్థం, నువ్వు వాడి దగ్గరకు వెళ్లావా? అని. అయితే అక్కడికి= వాడి దగ్గరకూ అనే భావంతో Did you go to him? అన్నాం.

2) ఇది కూడా మంచి ప్రశ్న. Come అంటే, రావటం అని; అయితే నా/మా/మన దగ్గరికి ఒకరు రావడం, నా/మా/మనతో ఒకరు రావడాన్ని తెలిపేందుకు మాత్రమే come అంటాం. మనం ఇంకొకరితో కలిసివెళ్లడానికి come అనం, అప్పుడు go అంటాం.

Shall I come to you now?=

నీ దగ్గరకు రానా ఇప్పుడు?

Shall I go with you?=

నీతో కలిసిరానా?

Will you come to me? =

నువ్వు నా దగ్గరకు వస్తావా?

3) English writers (English మాతృభాషగా కల రచయితలు) అయితే out of station (ఊళ్లోలేరు అనే అర్థంతో) అలా రాసి ఉండరు. Out of station (ఎవరైనా ఊళ్లో లేరు అనే అర్థంతో కానీ, ఇంకే అర్థంతో కానీ) English లో లేదు. ఊళ్లో లేకపోవడం= be out of town అనడం correct.

# I don't know much about them

**Q.** *1. This house is my brother's in-law.*

*This house is my brother in-law's.*

*Which is correct?*

*2) నాకు వాళ్ల గురించి అంతగా తెలియదు -*

*I don't know much about them.*

*నాకు అంత టైము ఉండదు -*

*I have no much time to watch T.V.*

*నువ్వు అంత risk తీసుకోవద్దు.*

*You don't take that much of risk.*

*3) I've 3 nephews and 2 nieces. Do nephews and niece have plural form?*

*4) వాళ్లు మాట్లాడుతూ నడుస్తున్నారు.*

*They are walking while talking.*

*5) నేను మూడు నెలల నుంచి మిమ్మల్ని కలవాలనుకుంటున్నాను.*

*I've been thinking to meet you since 3 months. Is it correct? If it is correct, the verb think is not used in progressive tenses, is it? So how is it correct?*

*6) నీవల్లే నేను ఇదంతా చేయవలసి వస్తుంది (Present)*

*I have to do all this only because of you (future) నీవల్లే నేను ఇదంతా చేయాలి.*

*వాడివల్లే నేను రోజు ఇక్కడికి రావాల్సి వస్తుంది.*

*7) నన్ను కాబట్టి ఏమీ అనలేదు. If you had done it, you would have been scolded.*

*8) I don't quite know. Please translate in telugu.*

*9) 80 Rupees have been charged for giving an application*

*80 Rupee has been charged for....*

*80 Rupees has been charged for*

*Which one is correct among these sentences?*

***- Madhav, Hyderabad***

**A.** The following are correct.

1) This is my bother-in-law's home. This is/ these are my brother-in-law's house/ homes (plural)

(Brother-in-law-Singular, Brothers- in-law- Plural)

2) a) I don't know much about them.

b) I don't have/ haven't the time to watch the TV

c) You don't take so much of risk/ that kind of risk.

3) Nephews- Plural of nephew

Nieces - plural of niece.

4) They are talking and walking/talking while walking/they are walking as they are talking/they are walking and talking as well.

5) I have been thinking of meeting you for the past/ the last three months. Think can be used in the progressive tense with the meaning of 'intend' (ఉద్దేశం ఉండటం)

6) I have to do all this because of you (present)

I will have to do all this because of you (future)

7) Because it was I/me he didn't say anything. If it had been someone else....

8) నాకంతగా తెలియదు/ నాకు తెలియదు.

9) Eighty rupees has been charged for...

**Q.** *1) 'Nobody can't understand me' అనేది ఇంగ్లిష్‌లో ఉందా? 'Nobody can understand me' కు 'Nobody can't understand me' కు అర్థభేదమేమైనా ఉందా?*

*2) 'నేను ఇదేమాట అతడితో చెప్పాను' అనడానికి ఇంగ్లిష్‌లో ఎలా అనాలి?*

*3) నీవు గతవారం రోజులుగా పాఠశాలకు ఎందుకు రావడంలేదు? అనడానికి Why have you been absent for a week? అనొచ్చా?*

***- Sarma & Seenu, Bathupuram***

**A.** 1) No body can understand me అనటం correct. Nobody can't అన్నప్పుడు రెండుచోట్ల not వస్తుంది కదా. 'లేదు' అనేందుకు ఒకచోటనే (sentence) not వస్తుంది.

2) I told him the same thing

3) Why have you been absent for a week= వారంగా ఎందుకు absent (గైర్హాజరు) అయ్యావనే అర్థంతో అది correct. అయితే ఎందుకు రావడంలేదు? అనేందుకు, Why have you not been/ why haven't you been coming to class? అంటాం. రెండు sentences కీ అర్థం ఒకటే అనుకోండి, అయితే మాటల్లో తేడా ఉంది కదా?

**Q.** *1. I would walk two miles every morning.*

*We should attend the classes more regularly. Present Future లో కూడా walk చేస్తుంటాం కదా. Present Future లో కూడా attend అవుతూ ఉండవచ్చు కదా! Would, should వాడొచ్చా? ఏయే సందర్భాల్లో వాడాలి?*

*2. కరెంటు వచ్చింది. మీరు మీ పని కానివ్వండి.*

*3. వాళ్లు గెలుస్తారని నేననుకుంటున్నాను. నేను కూడా అలాగే అనుకుంటున్నాను. ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?*

***- N. Amareswari Tirupathi***

**A.** Would ను past నుంచి future తెలిపేందుకే కాకుండా, past habits (గతంలో అలవాట్లను) తెలిపేందుకు కూడా వాడవచ్చు. I/ he/ somebody would walk 2 miles every morning = నడిచేవాడిని/ వాడు, etc.

We should attend the class more regularly = Class కు సక్రమంగా వెళ్లాలి (మన అవసరం/ విధి/ నిబంధన). అయితే regular అంటేనే సక్రమంగా అని కదా- దీనికి more regularly అని comparative ఉండదు. ఉంటే regular, లేకుంటే irregular అవుతుంది.

Present future:

We shall/ will walk two miles every morning.

Present future కు would/ should రాదు.

2) The power is back. Carry on your work.

3) I think they will win.

4) So do I (నేనూ అలాగే అనుకుంటున్నా) I think so too.

**Q.** *కిందివాటిని ఇంగ్లిష్‌లో ఎలా అంటారు?*

*1. ఈ టేబుల్ శుభ్రంగా ఉందా?*

*2. శుభ్రంగా లేదా?*

*3. శుభ్రం చేయిస్తున్నాను.*

*4. శుభ్రం చెయ్యి.*

*5. శుభ్రం చేయించాను.*

*6. శుభ్రం చేయనా?*

*7. శుభ్రం చేయిస్తా.*

*8. శుభ్రం చెయ్యను.*

*9. శుభ్రం చేయించను.*

*10. శుభ్రం చేయించు.*

*11. శుభ్రం చేశాను.*

*12. నువ్వే శుభ్రం చేసుకో.*

*13. శుభ్రంగా లేదు.*

*14. శుభ్రంగానే ఉంది.*

***- Dontula Premalatha, Adilabad***

**A.** 1. Is this table clean?

2. Isn't it clean?

3. I am getting it cleaned

4. Clean it

5. I've (have) got it cleaned

6. Shall I clean it?

7. I'll get it cleaned

8. I don't clean it

9. I don't get it/ have it cleaned

10. Get/ have it cleaned

11. I've cleaned it

12. Clean it yourself

13. It's not clean

14. It's clean.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**





SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 436

# But for you I wouldn't have got...

**Sakhya:** Thank you very much. But for you I wouldn't have got this kind of marks in the exam.
(నువ్వు లేకపోయుంటే/ నీ సహాయం లేక పోయుంటే, పరీక్షల్లో ఇలాంటి marks వచ్చుండేవి కావు.)

**Sneha:** You're welcome. It isn't much that I did. Your effort helped you too.
(నేను చేసింది పెద్దగా ఏమీలేదు. నీ ప్రయత్నం కూడా ఉంది. అదే నీకు సాయపడింది.)

**Sakhya:** I wish to give you a treat. Tell me when you are free so that I can fix a date.
(నీకు party ఇవ్వాలనుకుంటున్నా. నీకెప్పుడు ఖాళీనో చెప్పు, date fix చేసేందుకు.)

**Sneha:** Make it any day after the day after tomorrow.
(ఎల్లుండి తర్వాత ఏ రోజయినా సరే.)

**Sakhya:** That's OK. It'd be really fine. Where shall we go? Who else shall I call?
(బాగానే ఉంటుంది. ఎక్కడికెళదాం? ఇంకెవరిని పిలవను?)

**Sneha:** You're the host. You decide.
(నువ్వు కదా ఆతిథ్యం ఇస్తున్నావు. నువ్వు నిర్ణయించు.)

**Sakhya:** Which of the two restaurants do you think will be better- Suruchi or Shadrasa? Shall I call Prema and Preethi?
(ఏ హోటల్ బాగుంటుందనుకుంటున్నావు? సురుచినా లేకుంటే షడ్రసనా? ప్రేమ, ప్రీతిలను కూడా పిలవనా?)

**Sneha:** Either of the places is OK. Yea. Call them.
(రెండింటిలో ఏదయినా ఫర్వాలేదు. వాళ్లిద్దర్నీ పిలువు.)

**Sakhya:** OK then.

**Look at the following expressions from the conversation above:**

1) But for you I wouldn't have got this kind of marks.
2) Tell me when you are free so that I can fix a date.
3) Either of the places is OK.

**1) But for you =** నువ్వే లేకుంటే.

But for something/ But for somebody = అదే లేకుంటే/ వాళ్లే లేకపోయుంటే.

a) But for Krishna's help the Pandavas would not have won = కృష్ణుడి సహాయమే లేకుంటే పాండవులు గెలిచుండేవారు కాదు.

But for బదులు ఇలా కూడా చెప్పవచ్చు:

If Krishna had not helped the Pandavas, they would not have won =

But for Lord Krishna's help the Pandavas would not have won.

b) But for Tendulkar India would have lost the match = టెండూల్కరే లేకపోయుంటే భారత్ match లో ఓడిపోయుండేది.

c) But for the loan from the bank he could not have gone to the US for studies = Bank రుణమే లేకపోయుంటే, అతడు అమెరికా వెళ్లేవాడు కాదు.



M.SURESAN

**2) So that =** అందుకుగాను

a) I came here so that I can see you = నిన్ను చూసేందుకు నేనిక్కడికి వచ్చాను.

b) People invest so that they can make profits = లాభాలు గడించేందుకే ఎవరైనా పెట్టుబడి పెడతారు.

అయితే, so that బదులు to వాడవచ్చు. అది simpler కూడా.

a) I came here so that I can see you = I came here to see you.

b) People invest so that they can make profits = People invest (only) to make profits.

**3) Either of =** రెండింటిలో/ ఇద్దరిలో ఏదైనా/ ఎవరైనా.

a) Of the two pens, take either = ఆ రెండు pens లో, ఏదైనా తీసుకో.

b) Will you come to me or shall I come to you? Either is OK for me = నువ్వు నా దగ్గరికి వస్తావా, నేను నీ దగ్గరికి రానా? ఏదైనా ఫర్వాలేదు నాకు.

c) Does either of them know where I am = వాళ్లిద్దర్లో ఎవరికయినా తెలుసా నేనెక్కడున్నానో?

**గుర్తుంచుకోండి:**

Either of = రెండింటిలో/ ఇద్దరిలో ఏదైనా/ ఎవరైనా

Any of = రెండింటికంటే ఎక్కువ వాటిల్లో/ ఇద్దరికంటే ఎక్కువమందిలో, ఏదైనా/ ఎవరైనా.

## EXERCISE

**Match the expressions under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1. Blow up | A. Wide |
| 2. Worldly | B. Torture |
| 3. Extensive | C. Unquestionable |
| 4. Persecution | D. Destroy |
| 5. Indisputable | E. Tall |
| | F. Practical |
| | G. Extreme |

**KEY: 1-D, 2-F, 3-A, 4-B, 5-C.**

## EXPLANATIONS

1) Blow up = Destroy = ధ్వంసంచేయడం/ పేల్చేయడం. Bombs లేదా పేలుడు పదార్థాలు (explosives) వాడి విధ్వంసానికి పూనుకోవడం.

a) Terrorists, tried to blow up the Parliament building = Terrorists, bombs/ explosives తో Parliament ను కూల్చేసేందుకు ప్రయత్నించారు.

b) Naxalites have blown up a number of police stations = నక్సలైట్లు చాలా police stations ను పేల్చేశారు.

2) Worldly = Practical = లౌక్యం ఉన్న/ ప్రాపంచికమైన.

సామాన్యంగా ఈ లోకంలో మన జీవితానికి సంబంధించినదాన్ని worldly అంటారు. మనకున్న ఆస్తులు, డబ్బు, పలుకుబడి, నగలు, వగైరాలన్నీ మన worldly possessions (ఆస్తులు)

a) He is good at managing worldly affairs. ప్రాపంచిక విషయాలను చూసుకోవడంలో అతడు దిట్ట. (తన ఆస్తులూలాంటివాటిని జాగ్రత్తగా చూసుకోగలడు)

Practical అంటే కూడా అదే అర్థం దాదాపు. మనమేం చేయగలం, చేసినందువల్ల వచ్చే లాభమేమిటి? ఇతరులకు మనం సహాయం చేసి వాళ్ల సహాయం పొందగలగడం - ఇలా లౌకికంగా ఉండేవాళ్లను worldly అంటాం.

b) He is too worldly to help others for nothing = ఏం ఆశించకుండా ఇతరులకు సహాయంచేసేంత అలౌకికుడేమీ కాదతను.

worldly = materialistic (ఇహలోకానికి సంబంధించిన) × spiritual = ఆత్మకు సంబంధించిన/ ఆధ్యాత్మికమైన. spirit = soul = ఆత్మ)

3) Extensive = wide = విస్తృతమైన.

a) The Chief Minister has ordered an extensive study of farmers' problems = రైతుల సమస్యల మీద విస్తృతమైన అధ్యయనం చేయాలని ముఖ్యమంత్రి ఆదేశించారు.

b) The cyclone has caused extensive damage to crops = పంటలకు విస్తృతమైన నష్టం కలిగించింది తుపాను.

c) Extensive research has been done into cancer but a cure is yet to be found = Cancer మీద విస్తృత పరిశోధనలు జరిగినప్పటికీ, దాని నివారణ ఇంకా తేలలేదు.

extensive X limited (పరిమితమైన)

4) Persecution = torture = వేధింపు/ చిత్రహింస.

a) Galileo was subjected to persecution for stating that the earth goes round the sun = సూర్యుడి చుట్టూ భూమి పరిభ్రమిస్తోందని చెప్పినందుకు గెలీలియో (శాస్త్రజ్ఞుడు) వేధింపులకు గురయ్యాడు.

b) Taslima Nasreen had to flee to India to escape the persecution in her country = తన దేశంలో వేధింపులు తప్పించుకునేందుకు తస్లీమా నస్రీన్ భారత్‌కు పారిపోవాల్సి వచ్చింది.

Subject to = బాధకు/ రోగానికి గురవడం

flee - fled (P.T) - fled (P.P) = పారిపోవడం

persecute X comfort (ఊరట కలిగించడం)/ support (బాసటగా నిలవడం)

5. Indisputable = unquestionable = నిర్వివాదాంశమైన.

question అంటే ప్రశ్న/ ప్రశ్నించడం అనే కాకుండా విభేదించడం అనే అర్థం కూడా ఉంది

dispute = వివాదం

a) His right to the property is indisputable = ఆ ఆస్తికి అతడికున్న హక్కు నిర్వివాదాంశం.

b) That Tendulkar is the greatest batsman is indisputable = టెండూల్కర్ అతి గొప్ప batsman అనేది నిర్వివాదాంశం.

indisputable X dubious (doubtful) questionable (వివాదాంశమైన)

G. Extreme = విపరీతమైన (ఇంతకుముందు వివరించాం.)

Q&A

**ప్రశ్న:**

*I. Pooh-pooh, Betenoir అనే పదాలకు అర్థం తెలపండి.*

*II. ఈ కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?*

*1. నేను వెళ్లి మరలా వస్తాను.*

*2. నేను నీతో కూడా వస్తాను.*

*3. ఈ నిబంధనలు తప్పకుండా అమలు కావాలి.*

*4. ఈ సర్టిఫికెట్లు అప్లికేషనుతో పాటు తప్పనిసరిగా జత చేయాలి.*

*5. నువ్వు అతడిని గతంలో ఎప్పుడు చూశావు?*

*6. నేను అతడిని చాలాకాలం కిందట చూశాను.*

*7. అతడిని మొన్ననే చూశాను.*

*III. ఆంగ్లభాషలో idioms and phrases కు ఉన్న ప్రాధాన్యం ఏమిటి?*

*IV. Should, must ఏయే సందర్భాల్లో వాడాలి?*

– వి.ఎన్.వి.రమణబాబు, తిరుపతి

**జవాబు:**

I. Pooh-pooh - ఒకరు చెప్పిన విషయాన్ని, ఒక సిద్ధాంతాన్ని, అర్థం లేనిదని కొట్టిపారేయడం.

a) He pooh-poohs whatever his father says = వాళ్ల నాన్న ఏది చెప్పినా, అది అర్థరహితమని కొట్టిపారేస్తాడు/ లెక్కచేయడు.

b) Many pooh-poohed Galileo's theories = గెలీలియో సిద్ధాంతాలను చాలామంది చెత్త అని కొట్టిపారేశారు/ తిరస్కరించారు.

Betenoire (బెట్‌న్వా)= మనకు అసలు నచ్చని విషయం/ వ్యక్తి ('అతడంటేనే నాకు మంట' అనే భావంతో).

a) Harbhajan Singh was the betenoire of the Australian team till recently = Australia జట్టుకు కొంతకాలం కిందటి వరకూ, హర్భజన్‌సింగ్ అంటేనే మంటగా ఉండింది.

b) Saddam Hussain was the betenoire of George Bush = George Bush కు అసలు పడని వ్యక్తి సద్దాం హుసేన్.

II. 1. I will go and come back.

2. I will go with you/ I'll accompany you.

3. These rules/ regulations/ provisions should be/ shall be/ must be/ have to be implemented strictly/ without fail. (నిబంధనల విషయంలో అయితే, shall be మిగతా వాటికంటే సరైంది).

4. These certificates must be enclosed with the application/ candidates shall enclose these certificates with the application.

5. When did you see him (last)?

last = చివరిసారి

6. I saw him long ago.

7. I saw him just the day before/ only the day before.

III. చాలా ప్రాధాన్యమే ఉంది. ఆంగ్ల భాషలోనే కాదు, ఏ భాషలోనైనా సరే idioms,-కీ phrases ఉంటాయి. వాటి ప్రాధాన్యం చాలా ఎక్కువే. అవి సహజమైన భాషలో భాగం.

IV. మామూలు Spoken English లో should ను వాడిన చోటల్లా must వాడవచ్చు అయితే should కంటే must కు force ఎక్కువ. You should do it = నువ్వది చేయాలి. You must do it = నువ్వది చేయాలి అని గట్టిగా చెప్పడం.

**ప్రశ్న:**

*కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?*

*1. కొవ్వొత్తి ఆరిపోయింది (ఎవరూ ఆర్పకుండానే)*

*2. నేను కొవ్వొత్తి ఆర్పేశాను*

*3. దారం తెగిపోయింది (ఎవరూ తెంపలేదు)*

– పి.శివరావు, ఇల్లందు

**జవాబు:**

1. The candle is out/ has gone out.

2. I put out the candle.

3. The thread has snapped.

# ప్రతిభ

## SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 437

**ప్రశ్న:**

*Please clarify following doubts and write examples for each doubt.*

*1. I wish you would stop smoking.*

*2. I wish today was Saturday.*

*3. I wish she would be quiet.*

*4. I shall writing a letter - దీన్ని A letter shall be being written by me అనొచ్చా?*

*5. In spite of, despite అలాగే Although/ though లను ఏయే సందర్భాల్లో వాడతారో వివరించండి.*

*6. On the other hand అంటే ఏమిటి? ఉదాహరణలతో వివరించండి.*

**– ఎ.పెంచలయ్య, రాజంపేట**

**జవాబు:**

1. I wish you would stop smoking = You smoke and I don't like it. I wish that you stop smoking.

2. ఇవాళ శనివారం అయితే ఎంత బాగుండును! (ఇవాళ శనివారం కాదు. అయితే బాగుండేది అనే అర్థంతో) ఇక్కడ గమనించాల్సింది - I wish today was. Today-present, Was-past tense. దీనిబదులు were కూడా వాడొచ్చు - ప్రస్తుతం అసంభవమైన వాటికి, ప్రస్తుతం తీరని కోరికలకు ఇలా was/ were వాడతాం. I wish he were here = అతడిక్కడ ఇప్పుడు ఉంటే ఎంత బాగుండును!

3. I wish she would be quiet = ఆమె నిశ్శబ్దంగా ఉండాలని కోరుకుంటున్నా (అంటే ఆమె ఇప్పుడు గొడవ చేస్తోంది, అని).

దీనికి I wish she were quiet కూ తేడా గమనిద్దాం: I wish she would be quiet = ఆమె నిశ్శబ్దంగా ఉండాలని కోరుకుంటున్నా - ఇది ఇప్పుడు గానీ, future లో గానీ జరిగే అవకాశం ఉంది. I wish she were/ was (were-American; was-British) quiet - ఇది ఇప్పుడు (ఆమె నిశ్శబ్దంగా ఉండటం) జరగదు.

4. మీరు I shall be writing a letter అంటున్నారనుకుంటా. దీనికి passive voice, grammar for grammer's sake, the letter shall/ will be being written అనొచ్చు. (నా చేత letter రాయబడుతూ ఉంటుంది.) ఇది తెలుగులోనే కాదు, passive ఎక్కువగా వాడే English లో కూడా అసహజంగా ఉంటుంది. I shall be writing a letter- direct గా simple గా అర్థం అవుతున్నప్పుడు, passive లో చెప్పాల్సిన అవసరంలేదు. కదా.

5 & 6. వీటికి 424 - 42 Lessons చూడండి.

---

**ప్రశ్న:**

*1. Partnership 24 runs off 37 balls.*

*పై వాక్యంలో off కు అర్థం ఏమిటి? దానికి బదులు from రాస్తే తప్పా?*

*2. Get together party కి అర్థం ఏమిటి?*

*3. India win by 5 wickets ఎలా కరెక్ట్?*

*లైవ్ టెలికాస్ట్‌లో ఇండియా గెలవగానే పై టైటిల్ వేస్తారు. Win కు బదులు past tense అయిన won ఉండాలి కదా?*

**– డి.ప్రేమలత, ఆదిలాబాద్**

**జవాబు:**

1. Off అంటే ఇక్కడ 'నుంచి'/ 'లో' అని అర్థం. Off 37 balls = 37 balls నుంచి/ 37 balls లో అని.
2. Get together party అనం. Get together అన్నా అంటాం, Party అన్నా అంటాం. నలుగురూ కలసి సరదాగా party చేసుకోవడం/ ఏదైనా తిని తాగి సరదాగా గడపడం అని అర్థం.
3. Newspaper, TV headings లో సంఘటన జరిగిపోయిందైనా present tense (present simple) లో రాస్తారు. తర్వాతి Report ఇచ్చేటప్పుడు మాత్రం present perfect లేదా past simple వాడతారు.

---

**ప్రశ్న:**

*1. Quarterly/ Half yearly/ Annual examinations - అంటే కరెక్టా? లేక Quarterly/ Half yearly/ Annual examination అంటే కరెక్టా?*

*2. కింది వాక్యాలను passive voice లో రాయడమెలా?*

*1. I shall go to market*

*2. I go to market*

*3. I went market*

*4. I waited*

**– వై.గాయత్రి, ఆసిఫాబాద్**

**జవాబు:**

1. Quarterly/ Half year/ Annual Examinations అనడమే Correct.
2. 1st, 2nd and 3rd sentences లో verb, go (shall go, go, went). Go అనేది object లేని verb (అంటే ఎవరిని/ దేనికి వెళ్లడం అని ప్రశ్నించుకుంటే answer రాదు). Object లేని verbs (Intransitive verbs) కు Imperative sentences లో తప్ప passive ఉండదు. I waited లో కూడా wait, Intransitive verb కాబట్టి passive రాదు. అయితే Imperative sentences లో (ఆజ్ఞలు, కోరికలు తెలిపేవి) Intransitive కు కూడా passive ఉంటుంది. కానీ అది చాలా కృతకంగా ఉంటుంది.

**e.g.** AV: Please go away (request).
PV: You are requested to go away.
AV: Wait here.
PV: You are asked to wait here.

---

**ప్రశ్న:**

*కింది పదాలకు అర్థాలు, ప్రయోగాలు తెలపండి.*

*A. 1. Messrs 2. Matricide 3. Utter 4. Bluff 5. Evasion 6. Eviction 7. Gypsy 8. Uplift, lift up ఇవి రెండూ ఒకే అర్థాన్ని ఇస్తాయా? తెలపండి.*

*B. ఇప్పుడు చాలామంది house wife అనడానికి బదులు గౌరవభావంగా 'హోమ్‌మేకర్' అంటున్నారు. ఇది కరక్టేనా?*

*C. The lecture was as dull as ditch water.*

*D. You can buy most of the cold remedies over the counter - ఈ రెండు వాక్యాల అర్థం ఏమిటి?*

**–ఎన్.శ్రీనివాసులురెడ్డి, కలువాయి**

M.SURESAN

# As dull as ditch water

**జవాబు:**

A. 1. Messrs is the plural of Mister (Mr). చాలా మంది పేర్లు చెప్పున్నప్పుడు ప్రతి పేరు ముందు Mr. వాడే బదులు, మొదటి పేరు ముందు Messrs వాడతాం. తెలుగులో సర్వశ్రీ లాగా. Mr. Reddy, Mr Naidu and Mr. Sastry = Messrs Reddy, Naidu and Sastry. Company లు వ్యక్తుల పేర్లతో ఉంటే, వాటి ముందు కూడా Messrs ను M/s గా సూచిస్తాం. M/s Larsen & Turbo (ఇది వ్యక్తుల పేర్లతో ఉండే company ముందు మాత్రమే) M/s Johnson and Johnson, etc.

2. Matricide = మాతృహత్య/ తల్లిని చంపడం. cide అంటే చంపడం, suicide = ఆత్మహత్య

Patricide = పితృహత్య
Fratricide = సోదరహత్య, etc.,
Cide = ప్రాణులను చంపే మందులు
Pesticide = క్రిమి చీడపురుగుల సంహారిణి
Insecticide = కీటక నాశని
Genocide = ఒక జాతి మొత్తాన్ని చంపేయడం

Hitler, Jews (యూదు) జాతిని మొత్తం చంపేయాలనుకున్నాడు. కాబట్టి అతడిది genocide.
Infanticide = శిశుహత్య

3. Utter = total = పూర్తి.
In utter sorrow she committed suicide = పూర్తి విషాదంతో ఆమె ఆత్మహత్య చేసుకుంది.
His utter carelessness caused the accident = అతడి పూర్తి నిర్లక్ష్యం ప్రమాదాన్ని కలిగించింది.

4. Bluff = బుకాయించడం
He bluffed to the people of the village that he was a revenue official = తను revenue అధికారినని ఆ గ్రామస్తులను బుకాయించాడు.
Bluff ఇంతకు ముందు lessons లో వివరించాం చూడండి.

5. Evasion = ఎగ్గొట్టడం/ ఎగవేత
Evasion of taxes is common all over the world = పన్నుల ఎగవేత ప్రపంచంలో సాధారణం.
a) He was punished for his evasion of duty = Duty ఎగ్గొట్టినందుకు అతడికి శిక్షపడింది.
b) He evaded a direct answer = సమాధానం దాటవేశాడు. (evade duty/ taxes, etc)

6. Eviction = to make somebody vacate a place. (ఒక ప్రదేశాన్ని/ ఇంటిని ఖాళీ చేయించడం.)
a) The Municipal authorities evicted the people occupying its land = తన స్థలాన్ని ఆక్రమించుకున్న వాళ్లను మున్సిపాలిటీ ఖాళీ చేయించింది.
b) The court ordered the eviction of the land grabbers from the Government land = ప్రభుత్వ భూములను ఆక్రమించినవారిని ఖాళీ చేయించాలని court ఆదేశించింది.

7. Gypsy = మన రాష్ట్రంలోని లంబాడీలు, ఎరుకలు లాగా Europe లో ఒక సంచారజాతి.

8. Uplift = అభివృద్ధి
Rural uplift projects = గ్రామీణాభివృద్ధి పథకాలు
Social uplift = సామాజిక అభివృద్ధి.
Lift up = దేన్నయినా పైకి లేపడం
He lifted up his head = అతడు తల పైకెత్తాడు.
Nobody lifted up a finger when the boy teased the girl in public = అందరిముందూ ఆ అమ్మాయిని ఏడిపిస్తున్న అబ్బాయివైపు ఒక్కరుకూడా వేలెత్తి చూపలేదు.

B. Housemaker కాదు, Homemaker అవును. ఇప్పుడు, homemaker ను housewife కంటే ఎక్కువగా వాడుతున్నారు. అమెరికాలో అయితే house worker ఇప్పటి వాడుక.

C. As dull as ditch water - ఇది English idiom = చాలా అనాసక్తికరమైన/ extremely boring.
The movie/ novel is as dull as ditch water = ఆ సినిమా/ నవల చాలా bore గా ఉంది.

D. Over the counter = (మందుల లాంటివి) Doctor's prescriptions లేకుండా సులభంగా కొనగలిగితే, we buy them over/ across the counter.

---

**ప్రశ్న:**

*కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?*

*1. నేను దారాన్ని తెంపేశాను.*

*2. ఇంట్లో లైట్లు ఆరిపోయాయి (ఎవరూ ఆర్పలేదు)*

*3. ఇంట్లో లైట్లు వెలిగాయి (ఎవరూ స్విచ్ వేయలేదు)*

*4. ఇంట్లో కరెంటు పోయింది.*

*5. కరెంటు వచ్చింది.*

*6. నా చెప్పులు తెగిపోయాయి.*

**–వి.శివరావు, ఇల్లందు**

**జవాబు:**

1. I cut the thread/ I snapped the thread.
2. The lights have gone out/ are off.
3. The light is back/ The lights/ lamps are back/ The lights (lamps) are on again.
4. The power is off/ out; The power has gone off/ out.
5. The power is back.
6. మనం భారతదేశంలో వాడే చెప్పులకు Englishలో సరైన మాట లేదు. Chappals ఆంగ్లీకరించిన హిందీమాట - English వాళ్లకు, Americans కూ అది అర్థంకాదు, వాళ్లు అలాంటి చెప్పులు వాడరు కాబట్టి. వాళ్లు ఇంట్లో మాత్రమే వాడే slippers పాదం పైభాగాన్ని మాత్రమే మూసి ఉంచుతుంది. మన belt shoes, వాళ్ల sandals. Shoes, ankle కిందకు ఉంటాయి. Boots, ankle పైకి ఉంటాయి. అందువల్ల నా చెప్పులు తెగిపోయాయి. అంటే, The straps of my footwear has snapped అనాలి. Footwear అంటే ఏ రకమైన పాదరక్షయినా.
Straps = పట్టీలు.
Shoes have worn out = shoes అరిగిపోయాయి.

---

**ప్రశ్న:**

*ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు మాట్లాడబడును అని ఇంగ్లిష్‌లో చెప్పడానికి Telugu is spoken in Andhra Pradesh అనాలా? లేదా Telugu is being spoken in Andhra Pradesh అనాలా? రెండింటికీ తేడా ఏమిటి?*

**–కె.నాగచైతన్య, పాయకరావుపేట**

**జవాబు:**

Telugu is spoken in AP= APలో తెలుగు మాట్లాడబడును- ఎప్పుడూ- అక్కడి భాష అది, అని అర్థం. Telugu is being spoken in AP= ఇప్పుడు APలో తెలుగు మాట్లాడబడుతూ ఉంది/ఇప్పుడక్కడ తెలుగు మాట్లాడుతూ ఉన్నారని అర్థం. ఇది సరి కాదు కదా? ఆంధ్రప్రదేశ్‌లో ఎప్పుడూ మాట్లాడేది తెలుగే కదా? అందుకని Telugu is spoken correct. Telugu is being spoken in AP- Incorrect.



**ప్రశ్న:**

1. Please explain how to use backdrop word.
2. The pronunciation of 'The and A'. Some times 'The' pronounced ద and some other times ది. A - ఎ and అ please give detail examples.
3. Please explain Adversity is the touch stone of friendship.

– ఉమ్మోహని, తాండూర్

**జవాబు:**

1. Backdrop actually means the curtain that is at the back part of the stage, forming the background.

But backdrop used in the expression, 'against this backdrop' means, the circumstances and general conditions in which an event takes place.

a) The budget frees the farmers from the repayment of bank loans. Against this backdrop, it is clear that it is an election budget = ఈ నేపథ్యంలో చూస్తే = against this backdrop.

b) It is against the backdrop of the Godhra incident that communal clashes began in Gujarat = The Godhra incident explains the communal trouble in Gujarat.

2. Please refer to Spoken English lesson No.3 for the correct pronunciation of 'The'.

The article 'a' is pronounced as అ when it has no stress, and as 'ఎ' when it is stressed. 'a' మామూలుగా పలికితే, అ కొంచెం నొక్కి పలికితే, ఎ గా వినపడుతుంది. (అ book - మామూలుగా చెప్పడం. నేను ఒక పుస్తకాన్ని గురించే చెప్తున్నాను అని నొక్కిపలికితే, అప్పుడు, ఎ book అంటాం.)

3. Very different situations in life are the real test of friendship = You know that a friend of yours is a real friend when he helps you in difficult situations.




**ప్రశ్న:**

1. Everyone attended the meeting.
2. Three centuries have been made by V.V.S.Laxman in the Sydney play ground.

ఈ రెండు వాక్యాలకు question tag తెలిపి, వాటిని వివరించగలరు.

– సుధ, పావని; మత్స్యపురి, పశ్చిమగోదావరి

**జవాబు:**

1. Everyone attended the meeting, didn't they? అయితే కొందరు grammarians, didn't he/ she? అనాలంటారు, everyone = ప్రతి ఒక్కరూ (ఆడా, మగా) ఉండొచ్చు కదా అని. అయితే Modern English లో ఇలాంటి చోట్ల they వాడుకైపోయింది.
2. Three centuries have been made by Laxman, haven't they? (అయినా ఇక్కడ ఈ passive voice అనవసరం కదా? Laxman has made three centuries, hasn't he? అనడం simpler కదా?)

**ప్రశ్న:**

కింది వాక్యాలను తెలుగులో ఎలా రాయాలో తెలుపగలరు. అలాగే వ్యాకరణ రూపంలో వివరించగలరు.

I. 1. I am convincing her. (present participle)
2. She is now convinced (past participle)
3. We have convinced her (past participle)
4. You are very convincing (adjective)
5. She has a speaking part in the school play (adjective)

II. Simple future tense లో
1. I shall be twenty next Saturday.
2. It will be Diwali in a week.
3. We will know our exam results in May – ఈ వాక్యంలో will be know ఎందుకు రాకూడదో వివరించగలరు.

III. ఇంగ్లిష్- తెలుగు గ్రామర్, ఇంగ్లిష్ గ్రామర్‌లో modal verbs గురించి వివరించే పుస్తకాలు తెలపండి.

IV. 1.You are astonishing everyone.
2. You are astonishing.
3. Everyone was astonished.
4. The writing is very bhorned.

– కె.నరసింహారెడ్డి, హైదరాబాద్

**జవాబు:**

I. I am convincing- ఇక్కడ present participle అయిన convincing verb, am convincing లో భాగం. ఈ verb రూపం - be from + ... ing form. ఇక్కడ present participle ను independent గా వాడటం లేదు కదా?




2. She is now convinced, ఇక్కడ convinced, she is interested లో interested లాగా, past participle, అయితే అది adjective గా వాడతాం.
3. We have convinced her - ఇక్కడ convinced (pp), verb లో భాగం (Have/ has/ had etc., + past participle)

II. Will be/ shall be 'be' forms - ఇవి subject ఉండే స్థితిని తెలుపుతాయి. Will know, shall know (will/ shall + 1st RDW) subject చేసే పనులను తెలిపే action words.

English లో WILL be know అనే verb form లేదు.

III. మంచి grammar book ఏదయినా modals ను గురించి తెలుపుతుంది - Wren and Martin తో సహ.

IV. 1. You are astonishing everyone = నువ్వు అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తుతున్నావు.

# You are astonishing everyone

4. You are very convincing - ఇక్కడ convincing మీరన్నట్లు adjective (The book is interesting లో, interesting లాగా).

5. Speaking part - ఇక్కడ ...ing form adjective లాగా పనిచేస్తుంది. Interesting book లో Interesting లాగా. ఒకమనిషి/ వస్తువు ఎలాంటిదో చెప్పేది, adjective.


M.SURESAN

2. You are astonishing = నువ్వు ఆశ్చర్యం కలిగిస్తున్నావు.
3. Everyone was astonished = అందరూ ఆశ్చర్యపోయారు.
4. The writing is very bhorned?

bhorned/ bhorsed? - ఇది అర్థం కావడం లేదు. ఈ మాట English లో లేదు.

**ప్రశ్న:**

1. మొగమాటం, చిత్తశుద్ధి పదాలను ఆంగ్లంలో ఏమంటారు? Hesitation, demur, modest లాంటివి సరైన అర్థాన్ని (మొగమాటం) సూచిస్తాయా? Sincerity అన్న పదం చిత్తశుద్ధికి సరిపోదా?
2. 'నాకు తెలియదు' అన్న అర్థంలో 'I wouldn't know ' అని కొన్ని నవలల్లో చదివాను. 'I don't know' సరైంది కాదా?

– ఆర్.ఎం.వి.ఎన్.రమాకాంతరావు, విశాఖపట్నం

**జవాబు:**

1. మొహమాటం- Unassertiveness.

చిత్తశుద్ధి - Sincerity.

Hesitation - సంశయం, ఇదికాస్త మొహమాటానికి దగ్గర. అయితే, correct గా lack of assertiveness = మనం అనుకున్నది నిర్మొహమాటంగా చెప్పగలిగేశక్తి లేకపోవడం, అనేదానికి పూర్తిగా సరిపోదు.

Demure/ modest - ముఖ్యంగా ఆడవాళ్ల విషయంలో - ఇతరుల దృష్టిని ఆకర్షించకుండా ఉండే అనే అర్థంతో వాడతాం.

Demur - అసమ్మతిగా ఉండటం.

2. I don't know - నాకు తెలియదు అని మామూలుగా అనడం.

I wouldn't know - నాకేం తెలియదు, దాని విషయం అని కొంచెం గట్టిగా చెప్పడం.

**ప్రశ్న:**

1. So-called అంటే ఏమిటి?
2. He got killed- ఈ వాక్యం కరక్టేనా? రెండు past forms పక్కపక్కనే రాకూడదు కదా?
3. అభినందనీయుడు - దీనికి ఇంగ్లిష్ పదం ఏమిటి?
4. She encircling her being – దీని అర్థం ఏమిటి?

– కె.ఎస్.ఆర్., దర్శి

**జవాబు:**

1. So called = అలా అనబడే/ అలా పిలవబడే.

a) These politicians, the so called servants of the public, serve only themselves = ప్రజా సేవకులనబడే ఈ రాజకీయ నాయకులు తమ కోసమే పనిచేస్తుంటారు.

b) The so called world champions in cricket, the Australians, had to accept defeat at the hands of the Indians = ప్రపంచ విజేతలుగా పిలవబడే ఆస్ట్రేలియన్లు, భారత్ చేతుల్లో ఓటమిని అంగీకరించాల్సి వచ్చింది.

c) The so called expert in English has made these mistakes = ఆంగ్లంలో నిపుణుడుగా పేరున్న ఆయన ఈ తప్పులు చేశాడు.

2. He got killed - Correct. ఇక్కడ killed past tense కాదు, past participle.
3. Deserves to be appreciated/ has to be appreciated.
4. She encircling her being- అర్థం లేదు.

**ప్రశ్న:**

1. i) Past participle తో వాక్యం ప్రారంభించి కొన్ని ఉదాహరణలు ఇవ్వండి.

ii) అలాగే వాక్యానికి ప్రారంభంలో if లేదా had లేకుండా conditional sentence ఏర్పడుతుందా? ఎలా?

2. a) We should save the trees from being cut down.

b) He was against the treasures being sent to France. – పై రెండు ఉదాహరణల్లో being అర్థం ఏమిటి?

3. Orlando told Gonymede that he had advised his brother to get ready for the marriage the next day and that he himself would have loved to get married to his Rosalind [As you like it.] అండర్‌లైన్ చేసిన వాక్యభాగానికి తెలుగు అర్థం చెప్పగలరు.

4. I have been down, suh, to see ol' - దీనికి తెలుగు అర్థం ఏమిటి?

– కె.ఎస్.ఆర్. మార్టూరు

**జవాబు:**

1. i) Given the freedom that he wants, he can achieve anything = అతడికి కావలసిన స్వాతంత్ర్యం అతడు ఇవ్వబడితే (అతడికిస్తే అతడేదైనా సాధించగలడు)

Given - past participle

Thrown out of job, he is starving = ఉద్యోగం నుంచి తొలగించబడి, అతడు పస్తులుంటున్నాడు.

Thrown - past participle

ii) Conditional sentence అంటే మీ అర్థం condition ను తెలిపే sentence అయితే, If, had లేకుండా ఏర్పడుతుంది.

When/ provided you work hard, you will succeed- ed = నువ్వు కష్టపడితే విజయం పొందుతావు. ఇది conditional sentence కదా? When/ provided you work hard - Condition. ఇక్కడ when = provided = if.

Before you pay the fees, you cannot be admitted = మీరు fees కట్టక ముందు మిమ్మల్ని చేర్చుకోలేం. ఇక్కడ కూడా Before you pay the fees, condition కదా.

2. Cutting down = (Active voice) = being cut down (Passive voice)

from cutting down - నరకడం నుంచి (నరకకుండా) from being cut down = నరకబడటం నుంచి (నరకబడకుండా) - Passive లో 'be' form అవసరం, అందుకు being వాడతాం. అలాగే, He was against sending the treasures to France (AV) = ఆ నిధులను France కు తరలించేందుకు అతడు వ్యతిరేకం = He was against the treasures being sent to France (Passive)- ఇక్కడ అంటే ఇలాంటి చోట్ల being కు ప్రత్యేక అర్థం ఏం ఉండదు - అది passive construction లో verb form లో భాగం.

3. Rosalind ను పెళ్లిచేసుకుంటే తనకు కూడా ఆనందంగా ఉంటుందని (చెప్పాడు).

4. Suh అంటే ఇక్కడ ఆ మాట్లాడే అతడు, Sir ను pronounce చేసే విధం, అలాగే ol' కూడా all ను pronounce చేసే విధం.

**ప్రశ్న:**

1. 'సంయుక్తంగా' పదానికి ఆంగ్లపదం ఏమిటి?

ఉదా: యువరాజ్ సింగ్, గ్రేమ్ స్మిత్ ఇద్దరూ సంయుక్తంగా మ్యాన్ ఆఫ్ ది సిరీస్ అవార్డు గెలుచుకున్నారు.

2. బంద్‌కు ఆంగ్లపదం ఏమిటి? మావోయిస్టులు రేపు రాష్ట్ర బంద్‌కు పిలుపు ఇచ్చారు. దీన్ని ఆంగ్లంలో ఎలా చెప్పాలి?

– వి.రాజ్‌కుమార్, హైదరాబాద్

**జవాబు:**

1. సంయుక్త = joint. Yuvraj and Greame Smith won the man of the match award jointly/ They won the award jointly.
2. బంద్‌కు సరైన ఆంగ్లపదంలేదు. A total/ general strike అనవచ్చు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 439

# Why are you so worked up?


M.SURESAN

**Mihir:** Don't poke fun at me. I hate to see you bursting into laughter like that.

(నన్ను ఆటపట్టించకు. నువ్వు అలా పగలబడి నవ్వడం నాకేమాత్రం ఇష్టం లేదు.)

**Akhil:** Take it easy Mihir. It's just an innocent joke.

(అలా బాధపడకు, తేలిగ్గా తీసుకో. అదే దురుద్దేశం లేని joke.)

**Mihir:** Your joke, let me tell you, is out of place.

(నీ joke కు ఇది సమయం కాదని చెప్తున్నా).

**Akhil:** Why are you so worked up?

(ఎందుకంత ఆందోళన/ కోపంగా ఉన్నావు?)

**Mihir:** You would be, as well, if you were in my place. Here I am running short of time to finish my work, and you disturb me by your silly jokes.

(నువ్వు నా స్థానంలో ఉంటే నువ్వు కూడా నాలాగా ఆందోళనతోనే ఉంటావు. పని పూర్తిచేసేందుకు time లేక నేను బాధపడుతుంటే నీ అర్థంలేని jokes తో నన్ను disturb చేస్తున్నావు)

**Akhil:** I'm sorry, old boy. I am ready to lend a hand to help you complete your work. Let me know. What can I do for you?

(Sorry మిత్రమా, నీ పని పూర్తయ్యేందుకు నేను సాయం చేస్తాను. నేనేం చేయగలనో చెప్పు.)

**Mihir:** That's being a friend. Dictate these addresses to me as I write.

(Friend అంటే అలా ఉండాలి. ఈ address లు నువ్వు చదువుతూంటే నేను రాస్తుంటా.)

**Look at the following expressions from the conversation above:**

1) Don't poke fun at me.
2) Your joke is out of place.
3) Why are you so worked up?
4) I am running short of time.

**1) Poke fun:** ఆటపట్టించడం/ గేలిచేయడం/ ఎగతాళి చేయడం/ అపహాస్యం చేయడం

a) Neeraja has no sense of time and place. She pokes fun at every body as if she were very smart = నీరజకు ఎప్పుడూ, ఎక్కడా అనే ఆలోచన ఉండదు. తనేదో మహా తెలివైందైనట్లు అందరినీ ఎగతాళి చేస్తుంటుంది.

b) Don't poke fun at his clothes. He isn't as well as off as you are = అతడి దుస్తులు చూసి నవ్వకు/ ఎగతాళి చేయకు. అతడు నీ అంత ధనికుడు కాదు.

c) Poking fun at others is certainly bad manners = ఇతరులను అపహాస్యం చేయడం తప్పకుండా దుష్ప్రవర్తనే.

**2) Out of place =** అసందర్భమైన/ సమయా సందర్భాలు లేని

a) Claps and cheers are out of place at a condolence meeting = సంతాప సభలో చప్పట్లు, కేరింతలూ అసందర్భంగా ఉంటాయి. (అలాంటి సంతాప సమయంలో సరికావు) condolence = ఒకరి మరణం పట్ల సంతాపం

b) Her jokes were out of place in a serious situation like that = అంత గంభీరమైన పరిస్థితిలో ఆమె jokes అసందర్భంగా ఉన్నాయి.

c) Informal clothes are out of place when you attend an interview = Interview కు మామూలు దుస్తులు (T Shirts, jeans లాంటివి) అసందర్భంగా ఉంటాయి/ సమయోచితంగా ఉండవు.

**3) Work somebody/ Yourself up/ be worked up into =** దేన్ని గురించయినా ఆవేశపడిపోవడం/ ఉద్రేకపడిపోవడం/ అసహనానికి లోనవడం.

a) Don't work yourself up into such anger. There isn't any need for it = అంత కోపం తెచ్చుకోకు. అంత అవసరమేం లేదిప్పుడు.

b) On seeing their favourite hero, the crowd worked itself up into great excitement = వాళ్ల అభిమాన hero కనిపించగానే ఆ జనం తెగ ఉత్సాహ పడిపోయారు (వాళ్ల ఉత్సాహానికి పట్టపగ్గాలు లేకుండాపోయింది).

c) Why is he so worked up even at the mention of my name = నా పేరు వింటేనే అంత కోపం తెచ్చుకుంటున్నాడేమిటి?

**4) Run short of =** కొరతగా ఉండటం

a) Hurry up we are running short of time = త్వరపడు time లేదు మనకు.

b) I doubt if we can complete the project if we run short of funds like this = ఇలా మనకు నిధులు కొరతగా ఉంటే మనం project పూర్తి చేయగలమా అని నాకు సందేహంగా ఉంది.

ఇవన్నీ Spoken form of English లో చాలా common. మీ Spoken English సహజంగా ఉండాలంటే ఇవి వాడండి, practise చేసి.

---

**EXERCISE**

**Match the expressions under A with their meanings under B.**

| A | B |
|---|---|
| 1. Soothing | A. Very small |
| 2. Covet | B. Allot |
| 3. Minute | C. Surround |
| 4. Harp on | D. Comforting |
| 5. Set aside | E. Hint |
| | F. Desire |
| | G. Continue to talk about |

**KEY : 1-D; 2-F; 3-A; 4-G; 5-B.**

**EXPLANATION**

1) Soothing = Comforting = ఉపశమనం/ ఊరట కలిగించే/ ఓదార్పు కలిగించే

Soothe = ఓదార్పు/ ఊరట/ ఉపశమనం కలిగించడం

Soothe - Soothed (past & past participle)

a) The music was very soothing to her in the troubled state of her mind = చికాకుగా ఉన్న ఆమె మనసుకు ఆ సంగీతం ఊరట కలిగించింది.

b) He found the words of his teacher very soothing when he lost hope of success = విజయంపై నిరాశ పొందినప్పుడు అతడికి వాళ్ల టీచర్ మాటలు చాలా ఓదార్పు కలిగించాయి.

c) The ointment soothed the pain of the injury = గాయం బాధ నుంచి ఆ ointment ఉపశమనం కలిగించింది.

Soother = పిల్లలు ఏడవకుండా వాళ్ల నోట్లో పెట్టే rubber పీక

Soothe X Aggravate/ Upset/ Irritate

Aggravate = బాధలను, కష్టాలను ఎక్కువ చేయడం

Upset = మనసును చిరాకు/ ఆందోళనకు గురిచేయడం

Irritate = మంటలాంటి బాధ కలిగించడం/ కోపం తెప్పించడం

2) Covet = Desire = చాలా గాఢంగా కోరుకోవడం.

a) Who doesn't covet to be a CM?/ the position of a CM? = CM గా ఉండేందుకు ఎవరు కోరుకోరు? / CM పదవిని కాంక్షించరు?

b) I have long coveted the chance of having a job in that company = చాలా కాలంగా ఆ company లో ఉద్యోగం కోరుకున్నాను నేను.

c) The director long coveted the chance to make a movie with that hero = ఆ హీరోతో ఒక చిత్రం చేయాలని ఆ దర్శకుడు చాలాకాలంగా కోరుకున్నాడు.

Coveted = చాలామంది ఎక్కువగా కాంక్షించే.

In cricket the World cup is a coveted trophy = Cricket లో ప్రపంచ కప్ అనేది అందరూ (అన్ని teams) కాంక్షించే trophy.

Trophy = విజయానికి చిహ్నంగా ఇచ్చే cups, medals, etc.

Covet X Despise (అసహ్యించుకోవడం/ ద్వేషించడం)

3) Minute = దీన్ని మినిట్‌గా pronounce చేస్తే అర్థం, నిమిషం. కానీ మైన్యూట్‌గా pronounce చేస్తే అర్థం, (A) very small = చాలా చిన్న/ సూక్ష్మమైన అని.

Minute particles = సూక్ష్మమైన కణాలు/ సూక్ష్మమైన ముక్కలు

a) Even a minute quantity of cyanide is deadly = Cyanide (ఒక రసాయనం) ఎంత తక్కువైనా ప్రాణాంతకం అవుతుంది.

b) Minute gold particles were strewn all over the place = చిన్నచిన్న బంగారు ముక్కలు నేలంతా పడి ఉన్నాయి.

Strewn = చెల్లాచెదురుగా పడి ఉండటం

Minute X Enormous (పెద్ద)

4) Harp on = continue to talk about = ఒకే విషయాన్ని గురించి అదే పనిగా మాట్లాడుతుండటం (ఇతరులకు విసుగు పుట్టించేలా)

a) Meet him a hundred times, he always harps on the falling standards of education = ఆయన్ను వందసార్లు కలుసుకో, ఆయనెప్పుడూ పడిపోతున్న విద్యా ప్రమాణాల గురించే మాట్లాడుతూ విసిగిస్తాడు.

b) Don't harp on your past failures. Think of what you can do to win in future = నీ గత వైఫల్యాలను గురించే మాట్లాడుతూ ఉండకు. భవిష్యత్తులో ఎలా గెలవగలవో ఆలోచించు.

c) All through his speech the speaker was harping on good old days = ఆయన ఉపన్యాసం మొత్తం పాత రోజుల గురించే మాట్లాడాడు.

Harp on, phrasal verb

5) Set aside (ఇదీ phrasal verb) = Allot = కేటాయించడం

a) He set aside half an hour every morning for yoga = ఆయన ప్రతి రోజూ అరగంట యోగాకు కేటాయించాడు.

b) He has set aside a part of his savings for his daughter's marriage = తను పొదుపు చేసుకున్న మొత్తంలో కొంత భాగాన్ని కూతురు పెళ్లికి కేటాయించాడు.

Set aside కు ఇంకో అర్థం = పై court కింది court తీర్పును కొట్టేయడం.

The high court set aside his conviction by the lower court = కింది court లో అతడికి పడిన శిక్షను high court కొట్టేసింది.

Conviction = Judge విధించే శిక్ష

---

**ప్రశ్న:**

1. Twenty five minutes is enough for you to get rapped - పై వాక్యంలో is ఉపయోగించడం కరక్టేనా?

2. a) It would have led to escalation in violence.
 b) Lest it should lead to escalation in violence - ఈ రెండు వాక్యాలకు ఒకే అర్థం వస్తుందా?

3. How did I do on others? దీని తెలుగు అర్థం ఏమిటి?

– కె.ఎస్.ఆర్., దర్శి

**జవాబు:**

1. Correct. Any period of time/ any amount of money is singular.

2. a) It would have led to the escalation of violence. = అది హింస/ దౌర్జన్యం పెరిగేందుకు దారి తీసి ఉండేది. (అలా కాలేదు)

b) Lest it should lead to escalation of violence = హింస/ దౌర్జన్యం పెరగకుండా ఉండేందుకు - ఇది sentence కాదు, అర్థం పూర్తవలేదు కాబట్టి

lest = so that not = ఒక విషయం జరగకుండా ఉండేందుకు.

చూశారు కదా, పై రెండు వాక్యాల అర్థం ఒకటి కాదు.

3. How did I do on others - దీనికి అర్థం లేదు. Something is missing in the group of words.

**ప్రశ్న:**

1. a) This is the first time to go there.
 b) This is the first time to have gone there.

2. a) The Romans were the first people to see the animal.
 b) The Romans were the first people to have seen the animal.

పై వాక్యాల మధ్య తేడా ఏమిటి?

– ఐ.సత్యనారాయణ, తాటిపర్తి

**జవాబు:**

1. a) This is the first time (for him) to go there = అతడక్కడికి వెళ్లడం ఇది మొదటిసారి. (ఇంతకు ముందు వెళ్లలేదు/ దీని తర్వాత వెళ్లే అవకాశం ఇంకా వచ్చుండకపోవచ్చు.)

b) This is the first time (for him) to have gone there = (గతంలో) అతడక్కడికి వెళ్లటం అది/ ఇది మొదటిసారి. ఆ తర్వాత కూడా అతడక్కడికి వెళ్లుండొచ్చు అయితే ఇక్కడ This కు బదులు that అంటేనే అర్థం సరిగా వస్తుంది.

2) a) The Romans were the first to see the animal = మొట్టమొదటిసారి ఆ జంతువును Romans చూశారు. (మనం refer చేస్తున్న time లో)

b) The Romans were the first to have seen the animal = (మనం ప్రస్తావిస్తున్న సందర్భానికి ముందు) ఆ జంతువును చూసినవాళ్లలో Romans మొదటివాళ్లు. (మనం మాట్లాడుకుంటున్నది, మొదటి శతాబ్దం అనుకుంటే, అంతకుముందే ఆ జంతువును చూసినవాళ్లున్నారు. వాళ్లల్లో Romans మొదటివాళ్లు.)



అయితే 2 (a) కీ, 2 (b) కీ ఉన్నతేడాను అంతగా పట్టించుకోనక్కరలేదు; 2(a) simple and direct.

గమనిక: మార్చి 27న ప్రచురితమైన స్పోకెన్ ఇంగ్లిష్-438 లో ఓ పాఠకుడు అడిగిన ప్రశ్నలో 'you are astonishing every one' అని ఉంది. ఆ వాక్యం తప్పు. సమాధానంలో కూడా అదే వాక్యం వచ్చింది. కానీ 'you astonish every one' సరైన ప్రయోగం. గమనించగలరు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# That's non of your business



**ప్రశ్న:**

1. Enquiry, Inquiry ఒకటేనా?
2. Bidding అనే పదం invitation కు పర్యాయపదమా?
3. Matrimony, wedding కు, propitious -auspicious కు పర్యాయ పదమా?
4. Awesome, spanking, kick-ass, slap-up, rattling, classic ఈ పదాలన్నీ excellent పదానికి పర్యాయపదాలేనా?
5. నామకరణ వేడుకను ఇంగ్లిష్‌లో appellation ceremony లేదా denomination function అనొచ్చా?
6. Betrothal, engagement ఒకటేనా?
7. Reception కు ovation అనే పదం వాడొచ్చా?
8. That's non of your business అంటే ఏమిటి?
9. మనకు ఎవరైనా thanks చెబితే మామూలుగా it's ok లేదా welcome అంటాం. కానీ ఒక హిందీ సినిమాలో mention not అని విన్నాను. దీన్ని ఏ సందర్భంలో ఉపయోగించవచ్చు?
10. ఒక విధమైన time ను సూచించేటప్పుడు AM లేదా PM వాడతాం కదా? వాటికి బదులు morning the 9 O' clock, evening six O' clock అని వాడొచ్చా?
11. Raiment, attire, apparel, vestures, habiliments, clobber, garments, get-up, rigout, costume, dress, clothing ఒకటేనా?
12. Congratulations బదులు felicitation వాడొచ్చా?
13. Bistro, Roadhouse, Boarding house, Lunchonette, Snackbar, Buffet, Canteen ఒకటేనా?

– యు.అజయ్ కుమార్, ఆదిలాబాద్

**జవాబు:**

1. రెండూ ఒకటే, Enquiry - British, Inquiry - American.
2. కాదు. Bid అంటే ప్రయత్నం, వేలం పాడటం, వేలం, ఏదైనా పనిచేసేందుకు నేను చేస్తానంటూ ముందుకు రావడం (ముఖ్యంగా tender/ contract ల విషయంలో). అసలు, bid, invite అనేవి synonyms అనే ఆలోచన ఎందుకు వచ్చింది మీకూ? Invite అంటే ఆహ్వానించడం కదా?
3. Matrimony = Wedding = Marriage ఇవన్నీ synonyms. ఇంతకుముందు lessons లో marriage కీ, wedding కూ ఉన్న తేడా వివరించాం చూడండి.
   Propitious = అనుకూలమైన (మన ప్రయత్నాల విజయానికి) (పరిస్థితులు లాంటివి)
   a) The time is not propitious for the start of a new business =ఇది అనుకూలమైన సమయం కాదు.
   Auspicious = శుభకరమైన
   b) At the auspicious moment, he declared the building open = ఆ శుభముహూర్తాన (సమయంలో) ఆయన ఆ కట్టడం ప్రారంభించినట్లు ప్రకటించాడు.
   Auspicious అనేది మంచిరోజుకు, ముహూర్తాలకు సంబంధించింది
   Propitious - సదవకాశానికి/ అనుకూల పరిస్థితులకూ సంబంధించింది.
4. Kick - ass తప్ప మిగతావన్నీ excellent కు synonyms - చాలా గొప్పగా, మనలో గొప్ప అభిప్రాయాన్ని కలిగించేదిగా - Impressive అనే అర్థంతో. అయితే, spanking, rattling, slap-up ఈ మూడింటినీ nouns ముందరే వాడతాం, ఒంటరిగా కాకుండా.
   a) It's a rattling good movie.
   b) He treated us to a slap-up dinner
   c) The car sped off at a spanking pace - మూడింటిలో spanking ను ముఖ్యంగా వేగానికి ముందు వాడతాం.


M.SURESAN

5. అనం. Christering (క్రిసనింగ్) అనొచ్చు అయితే దీనికి కూడా correct గా అయితే, church లో christians నామకరణం అని అర్థం. Naming ceremony అనొచ్చు
6. అవును. అయితే betrothal, old fashioned, ఇప్పుడెవరూ వాడటంలేదు. Engagement వాడుకలో ఉంది.
7. రెండూ ఒకటి కాదు. Reception - ఆహ్వానానికి, విందులులాంటి వాటికి సంబంధించింది. Ovation - శ్రోతలు, సభికులు, ప్రేక్షకులు చప్పట్లు కొట్టి, మెప్పు, ఆమోదం తెలపడం, వక్తలు, ప్రదర్శకులు లాంటి వాళ్ళు వేదిక మీదికి వస్తున్నప్పుడు తెలిపే హర్షధ్వానం.
8. అది నీకనవసరం/ అది నీకు సంబంధించింది కాదు. దాంట్లో నువ్వు తల దూర్చకు.
9. Mention not/ No mention correct కాదు.
10. దీని విషయం ఇంతకుముందే తెలిపాం. Spoken English లో AM/ PM అనం. Morning/ Evening అనే అంటాం.
11. అన్నీ ఒకటే అయితే spoken language లో ఎక్కువ వాడుకలో ఉన్నవి. Dress, Clothes, Clothing మాత్రమే. Costume - ఎక్కువ నటీనటులు వేసుకునే దుస్తులకు వాడతాం. మిగతా పదాలన్నీ గ్రాంథికం, పాండిత్యం. Get up అనేది దుస్తులు వేసుకున్న తర్వాత appearance ను తెలుపుతుంది. Rigout – ధరించి (పాండిత్యం).
12. అనొచ్చు కానీ felicitation ఎక్కువగా సన్మానించడం అనే అర్థంతో వాడతాం- ఇదికూడా పాండిత్యం. Spoken English లో వాడం.
13. Bistro- (American) మనదేశంలో చిన్న tea stall లాంటిది. (మనదేశంలో ఈ మాట అర్థం కాదు)
    Boarding House - మామూలు హోటల్లా కాకుండా, private houses లో అందరికీ కాకుండా కొంతమందికి మాత్రమే బస, ఆహార సదుపాయాలున్న చోటు.
    Buffet = Railway stations/ trains/ bus stations లో ఆహార పానీయాలమ్మే దుకాణాలు. మామూలు అర్థం- వడ్డన విందు కాకుండా, అతిథులే వడ్డించుకునే విందు.
    Lunchonette = మామూలు భోజనం (simple meal) వడ్డించే చిన్నతరహా ఆహారశాల - ఇది American - ఇప్పుడు వాడుకలో లేదు.
    Road House = High ways లో main road పక్కన ఉండే ధాబాల లాంటివి. ఇదికూడా old fashioned. ఇప్పుడంత వాడుకలో లేదు.
    Canteen - ఇది తెలుసుకదా? factories, schools, colleges లో వాటికి అనుబంధంగా నడిచే ఫలహారశాల. ఇప్పుడు ఈ అర్థాలతో (canteen తప్ప) వాడుకలో ఉన్నవి - Restaurant, eatery and snackbar.

---

**ప్రశ్న:**

1. It, it's ల గురించి వివరంగా తెలపండి.
2. Passive voice లో by అనే preposition కాకుండా కొన్నిసార్లు to కూడా వస్తుంది. To ఎప్పుడెప్పుడు వస్తుందో ఉదాహరణలతో తెలపండి.
3. 'Enough' ఉచ్చారణతో సహా usage ను తెలపండి.
4. 1. ఆత్మగౌరవం 2. ప్రేమజంట 3. మమతానురాగం 4. కల్పితం 5. సంప్రదాయం 6. అపురూపం 7. సస్యశ్యామలం 8. తరం 9. పంచాంగం - ఈ మాటలకు ఇంగ్లిష్ పదాలు తెలపండి.

– ఎం.రామంజి, మదనాపురం

**జవాబు:**

1. It = అది/ఇది- ముఖ్యంగా మనం ఇప్పుడు మాట్లాడుతున్న విషయం గురించి చెప్పేటప్పుడు వాడతాం.
   a) Your pen is on the table. It has been there since yesterday = నీ pen table మీద ఉంది. నిన్నటి నుంచి అది అక్కడే ఉంది.
   b) He often smiles at her. She doesn't like it = అతడు ఊరికే ఆమెను చూసి నవ్వుతాడు. అది ఆమెకు ఇష్టం లేదు.
   It's = It is - ఇది ముఖ్యంగా Spoken English form. హడావిడిలో It is అనడానికి బదులు, it's అనేస్తుంటాం.
2. ఇలాంటివి చాలా అరుదు.
3. Enough = ఇనఫ్- న నొక్కి పలుకుతాం = చాలినంత/ చాలినన్ని.
   a) I haven't enough money to buy a car = Car కొనేందుకు చాలినంత డబ్బు నా దగ్గర లేదు.
   b) He packed enough clothes for his weekend journey = వారాంతపు ప్రయాణానికి కావాల్సినన్ని దుస్తులు సర్దుకున్నాడతను.
4. 1) Self respect; 2) Couple; 3) Love and attachment; 4) Fictitious; 5) Tradition; 6) Unprecedent/ rare; 7) Greenery; 8) Generation; 9) Almanac.

---

**ప్రశ్న:**

1. మా కొళాయికి నీళ్లు వస్తున్నాయి. నేను నీళ్ల పట్టాలి.
2. బిందె ఎక్కడ ఉంది? బిందెలో నీళ్లున్నాయా?
3. నాకు వజ్రం లాంటి ఒక రాయి దొరికింది. - ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా పలకాలి?

– ఇర్ఫాన్, నంద్యాల

**జవాబు:**

1. We are getting water through our tap. I should draw water.
2. బిందెకు సరైన మాట English లో లేదు. Pail (bucket) అనొచ్చు అయితే ఇదంత వాడుకలో లేదు.
   Where is the pail? Is there water in the pail?
3. I found a stone. It looks like/ appears to be a gem.

---

**ప్రశ్న:**

Er. Naveen Kumar, Er.B.Vaikuntam ఇలా వృత్తుల పేర్ల ముందు (nouns) వాడే Er పూర్తి రూపం ఏమిటి? స్త్రీల పేర్ల ముందు కూడా ఇలా ఉపయోగించవచ్చా? దీని అర్థం ఏమిటి?

– భారతి, సంధ్య, హనుమకొండ

**జవాబు:**

Doctor లకు, Dr లా, ఈమధ్య మనదేశంలో Engineer ల పేర్ల ముందు Er అని రాసుకుంటున్నారు. Engineers ఆడవాళ్లయితే, వాళ్ల పేర్ల ముందు కూడా వాడొచ్చు అయితే ఇది అంత accepted abbreviation కాదు, Dr (Doctor) లాగా.

---

**ప్రశ్న:**

1. a) I am very happy to have met him.
   b) I am very happy being met him. - ఈ రెండింటి మధ్య తేడా ఏమిటి?
2. i) No matter, ii) in no time అంటే ఏమిటి?
3. i) Being an educated,
   ii) Having been educated – వీటి మధ్య తేడా ఏమిటి?
4. దమ్ముంటే రా... చూసుకుందాం.. దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?
5. Which would you rather be? దీని అర్థం ఏమిటి?
6. The flowers smell sweet
   He looks cold
   He worked hard
   Subject + verb + adj or adverb ఈ నిర్మాణంలో చివర ఉన్న పదాలను adjectives గా భావించాలా? లేదా adverbs గా భావించాలా?

– కె.శ్రీనివాసరావు, మార్టూరు

**జవాబు:**

1. a) I am very happy to have met him = I am very happy that I met him (some time ago) on some past occasion) - నేనతడిని కలుసుకున్నందుకు (గతంలో) సంతోషంగా ఉన్నాను.
   b) I am very happy being met him- ఇది sentence కాదు కదా? I am very happy, having met him/ Having met him, I am very happy అంటే correct = I am happy to have met him.
2. i) No matter = ఏదేమైనప్పటికీ
   a) No matter what you say, I can't believe you = నువ్వేమన్నా సరే, నేను నిన్ను నమ్మలేను.
   b) No matter where he is the police will not leave him = అతడెక్కడున్నా సరే పోలీసులు అతడిని వదలరు.
   ii) In no time = అనతికాలంలోనే, చాలా తక్కువసేపులో.
   a) If only you have the money, you can buy the car in no time = నీకు డబ్బుంటూ ఉండాలే కానీ, కారు కొనడం ఎంతసేపు?
   b) Fans gathered in no time to see their favourite star = తమ అభిమాన తారను చూసేందుకు అభిమానులు క్షణంలో గుమిగూడారు.
   c) If you are ready, we can go there in no time = నువ్వు సిద్ధంగా ఉంటే, మనం అక్కడికి వెంటనే వెళ్లిపోవచ్చు
3. i) Being an educated (person)/ Being educated = చదువుకున్నవాళ్లుగా ఉండి/ అవడం వల్ల
   a) Being educated/ Being an educated person she is respected = ఆమె చదువుకున్నదవడం వల్ల, అందరూ ఆమెను గౌరవిస్తారు.
   ii) Having been educated = చదువుకున్నందు వల్ల (గతంలో)
   Having been educated in England, he speaks English like the English - England లో చదువుకోవడంతో/ చదువుకోవడం వల్ల, అతడు ఇంగ్లిష్ వాళ్లలా, English మాట్లాడతాడు.
4. Come on, let's have it out/ come if you dare.
5. Which would you rather be? నువ్వు ఏ విధంగా ఉండటానికి ఎక్కువ ఇష్టపడతావు?
   a) What would you rather be a hero or a fan of a hero? = ఏ విధంగా ఉండటానికి ఎక్కువ ఇష్టం నీకు - hero గానా, hero అభిమానిగానా?
6. The flowers smell sweet, he looks cold - sweet and cold - adjectives.
   He works hard - hard - adverb.
   Sweet and cold విషయంలో వాటిని మీరు చూపిన sentences లో adjectives గా భావిస్తాం. (Sweetly, coldly- adverbs) Hard- శ్రమించి - ఇది adverb. (Hardly - వేరే అర్థం, దాదాపు లేదని)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

Q A

**ప్రశ్న:**

1. *Please tell me 'Future perfect continuous tense' in telugu meaning. Give one (or) two examples*
2. *What is difference of 'kindly and respect'.*
3. *Resume (or) Bio-data*
4. *రాయడం- write, ఆడటం- play. ఇలాంటి words ను verbs అంటాం. వాటిని nouns గా ఎప్పుడు, ఎలా రాయాలి? ఎలా ఉపయోగించాలి?*

**– బి.భాస్కర్, నంద్యాల**

**జవాబు:**

1) Future perfect continuous - భవిష్యత్‌లో ఒక సమయానికి ముందు ప్రారంభమై ఆ సమయం వరకూ కొనసాగుతూ ఉంటుంది అనుకునే action కు, future perfect continuous tense వాడతాం.

a) I shall have been attending a class by this time tomorrow = రేపీపాటికి నేను class attend అవుతూ ఉంటాను. Attend అవడం అంతకుముందే ప్రారంభమై, రేపు ఈ సమయంలో కూడా continue అవుతూ ఉంటుంది.

b) In five years from now, he will have been practising a doctor = ఇప్పట్నించి ఐదేళ్లకు అతడు doctor గా practice చేస్తుంటాడు. practice అంతకు ముందే ఆరంభమై అప్పటికింకా continue అవుతూంటుంది.

2) Kindly అంటే దయతో అని అర్థం కదా? ఎవరినైనా మర్యాదపూర్వకంగా ఏదైనా అడిగేటప్పుడు వాడే మాట, please బదులు.

please/ kindly let me have your address = కొంచెం మీ address ఇవ్వండి.

Respect = గౌరవం. Kindly, ఎవరినైనా respect ఇచ్చి ఏదైనా అడిగేందుకు వాడతాం. kindly ఇంకో అర్థం - దయాస్వభావం ఉన్న.

3. Resume and Biodata: Not much different.

**Resume-** Details like your address, Date of birth, age, qualification from the highest to the least, previous service and experience, first mentioning the present position and last your earliest job- in this order.

**Biodata:** Details of your DOB, age, experience and qualifications in a proper order.

Both are submitted when applying for a job. Most companies now prefer the format of Resume- Pronounced- రెజ్యూమెయ్ (British), రెజుమెయ్ (American)- జ, size లో జ్‌లాగ.

Write- ఇది ఎప్పుడూ verb గానే (రాయడం) వాడతాం. దీన్ని noun గా ఎప్పుడూ వాడం. (Newspaper, Magazine ల లాంటి వాటిల్లోని వ్యాసాలను write-up అంటాం. అది noun)

Play - verb అయితే ఆడటం.

(Played - past tense; played - pp)

They play hockey very well.

(వాళ్లు హాకీ చాలా బాగా ఆడతారు)

Play (Noun) - 1) ఆట 2) నాటకం (Drama)

a) The play had to be cancelled because of rain.

(వర్షం వల్ల ఆట రద్దుచేయాల్సి వచ్చింది.)

b) Kalidasa wrote a number of Plays

(కాళిదాసు చాలా నాటకాలు రచించాడు)

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 441

ప్రతిభ

# Listening to the music, he is dancing

**ప్రశ్న:**

1. *He supported nuclear energy, adding we have to find new sources.*
2. *The three men took a house for rent claiming to be Ayurvedic doctors.*
3. *He sat back waiting for noise subsiding.*
4. *He came out with a loaded remark, telling them you are doing good job.*

*పై వాక్యాల్లో underline చేసిన ing forms ఏయే tense లో ఏ విధమైన action తెలుపుతాయో వివరించగలరు.*

5. *To ని result గా కూడా రాస్తారంటారు. ఎలా?*
6. *This is to certify that. ఇక్కడ to ను ఎలా అర్థం చేసుకోవాలో తెలియజేయగలరు.*

**– ఎస్.గౌరీశంకర్, పామర్రు**

**జవాబు:** '...'ing' form ఒక పనిని చేయడం/ చేస్తున్న/ చేస్తూ, అనే అర్థంతో వాడతాం. ఇది present, past or future అనేది, అది వచ్చే sentence లోని verb ను బట్టి ఉంటుంది. చూడండి.

1. He supported Nuclear energy adding that we had (have ఇక్కడ సరికాదు) to find new sources = కొత్త వనరులు కనుగొనాలంటూ (ఇంకా అంటూ,) అణుశక్తిని ఆయన సమర్థించాడు.

చూశారు కదా ఇక్కడ adding= ఇంకా అంటూ (అంటే ముందు చెప్పిందానికి ఇంకా చేర్చి అంటూ)- ఇక్కడ adding- Past కదా, సమర్థించడం, Past కాబట్టి.

2. The three men took a house for rent claiming to be Ayurvedic doctors= ఆయుర్వేద వైద్యులం అని చెప్పుకుంటూ ఇల్లు అద్దెకు తీసుకున్నారు. తీసుకున్నారు- Past, కాబట్టి claiming కూడా past.

3. He sat back waiting for the noise subsiding- ఇక్కడ subsiding (... ing form) సరికాదు. He sat ... for the noise to subside- సద్దుమణిగేవరకు ఆనుకుని కూచున్నాడు.

M.SURESAN

4. He came out with a loaded remark telling them, 'you are doing a good job'= మీరు చాలా మంచిపని చేస్తున్నారంటూ, ఒక అర్థసహిత వ్యాఖ్య చేశాడు. ఇక్కడ కూడా ...ing form, past, verb, came past కాబట్టి.

a) Walking down the road, he saw a very tall man= Road లో నడుస్తూ (నడుస్తుండగా) చాలా పొడుగ్గా ఉన్న వ్యక్తిని చూశాడు. (Walking- past)

b) I will be in Vijayawada tomorrow, discussing the topic with my friends= ఈ విషయం మా స్నేహితులతో చర్చిస్తూ, రేపు నేను విజయవాడలో ఉంటాను (Discussing- ఇక్కడ future)

c) Listening to the music, he is dancing- సంగీతం వింటూ (present) dance చేస్తున్నాడు.

To +1st RDW (to go, to come, etc)

5) To ను result తెలిపేందుకు ఇలా వాడతాం.

The coffee is too hot to drink= తాగలేనంత వేడిగా ఉంది

(తాగడంలేదిప్పుడు- to drink ఇక్కడ result ను తెలుపుతుంది కదా? too... to drink= తాగలేనంత.)

I was able to finish the work = పనిపూర్తిచేయడం జరిగింది.

To finish = పూర్తిచేయడం- result of my ability.

6) This is to certify that ... ను ఇలా అర్థం చేసుకోవాలి:

That... = ఈ పత్రంలో తెలిపిన విషయం, to certify = నిజమని తెలిపేందుకు, this is = ఈ పత్రం ఉంది (ఇవ్వబడింది).

**ప్రశ్న:** 1. *Has she forgotten all the help she had had from you?*

*ఇందులో had, had అని రెండుసార్లు ఉపయోగించాలా? ఒక్కసారి ఉపయోగిస్తే చాలు కదా? వివరించగలరు.*

2. *Is it your family?*

*Is that your grand mother?*

*Is that your sister?*

*What is it ?*

*What is that ?*

*it అన్నా that అన్నా "అది" అనే అర్థం కదా? ఈ రెండు పదాలను ఏయే సందర్భాల్లో ఉపయోగించాలి?*

**– శోభ, నెల్లూరు**

**జవాబు:**

1. Has she forgotten all the help she had had from you- పొరపాటు. ఇలా ఉండాలి-

Did she forget all the help she had had from you? ***Or***

Has she forgotten all the help she has had from you?

ఇప్పుడు Had had= Had+past participle of have (had)- Past perfect tense- రెండు past actions లో ముందరి past action ను చెప్పేందుకు వాడతాం.

Did she forget the help she had had from you? = నీ దగ్గర నుంచి సహాయం పొందింది.

(I past action- had + pp of have- had had).

Did she forget? (అది) మరచిపోయిందా- రెండో past action.

ఈ సందర్భాల్లో had had వాడతాం.

She had her breakfast and then went out=

Breakfast తీసుకుని (1st Past action- had + PP of have (had) ) బయటికెళ్లింది.

2) It = మనం దేని గురించి మాట్లాడుతున్నామో అది అని. దాదాపు అన్ని సందర్భాల్లో It కానీ that కానీ వాడొచ్చు.

**ప్రశ్న:** 1. *Will you take me home on your bike అన్నారు. ఈ వాక్యాన్ని will you take me to home on your bike అనాలి కదా? మీరు preposition 'to' ను ఎందుకు ఉపయోగించలేదో వివరించగలరు.*

2. *"The programme will begin in a few minutes" అన్నారు. few minutes plural కదా? 'a' article singular కదా? few minutes ముందు singular ఎందుకు ఉపయోగించారు?*

**– పి. రామానంద్, మల్కాజ్‌గిరి, హైదరాబాద్**

**జవాబు:**

1) Home ముందు సామాన్యంగా to కానీ, my/ his/ her/ their/ somebody's home అని కానీ అనం. Home వాడినప్పుడు, ఎవరి గురించి మాట్లాడుతున్నామో, వారి ఇల్లే అని అర్థం.

He is going home (అతడిని గురించి చెప్తున్నాం. కాబట్టి ఇక్కడ అతడి ఇంటికే అని అర్థం. To రాదు/ his home రాదు)

She left her pen at home (ఆమె తన pen (వాళ్ల) ఇంట్లో మరచిపోయింది.

They brought the body home = ఆ శవాన్ని అతడి ఇంటికి తీసుకొచ్చారు.

2) ఇంతకు ముందు వివరించి ఉన్నాం. Few = దాదాపు లేదని అర్థం. Few minutes = No minutes. A few = small number (తక్కువ సంఖ్యలో) ఇది English usage (వాడుక).

**ప్రశ్న:**

1. *Thank, thankful మధ్య తేడా వివరించండి.*
2. *ఆరిపోయే దీపం. దీన్ని ఇంగ్లిష్‌లో ఏమంటారు?*
3. *హతుడు/ హతురాలును ఇంగ్లిష్‌లో ఏమంటారో తెలుపండి.*
4. *Award ఇచ్చే వాళ్లను తెలిపేందుకు ప్రత్యేక పదం ఉందా?*
5. *అతడి జీవితం ఆరిపోయే దీపం. ఇంగ్లిష్‌లో ఏమంటారు?*

**– ఎ. కృష్ణగీతార్జున, నిడదవోలు**

**జవాబు:** 1) Thank you, Thanking you ఒకరికి ధన్యవాదాలు చెప్పేందుకు వాడతాం- ఇది తప్పు కాదు. Thank him, Thank her - ఇవన్నీ correct. Thankful (Adjective) ను మాత్రమే దేవుడికి కృతజ్ఞతలు చెప్పేందుకు వాడతాం. ఆ సందర్భంలో మాత్రమే Thankful to God అనం. Thankful అంటే God పట్లనే. మనుషుల పట్ల కాదు. అక్కడ God omit చేస్తాం. Thank ని verb గా ఎవరికైనా వాడవచ్చు.

2) Light about to go out/ to be snuffed off.

3) The murdered= హతుడు/ హతురాలు. (The deceased అనవచ్చు, అయితే చనిపోయినవాళ్లు అనే అర్థమే వస్తుంది, హత్యవల్ల మాత్రమే కాకుండా)

4) Award ఇచ్చే వాళ్లను తెలిపేందుకు ప్రత్యేకమైన మాట అంటూ ఏదిలేదు. అయితే ఆ అర్థంతో Award giver/ award conferor అని అనవచ్చు. Confer= బహుమతి/ పురస్కారం ప్రదానం చేయడం ( A conferred the award on B)

5) His life is like a light about to go out/ about to be snuffed out.

**ప్రశ్న:** *ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్, సీఫెల్, బిబిసి, ఓరియంట్ లాంగ్‌మన్ తదితర సంస్థల స్పోకెన్ ఇంగ్లిష్ కోర్సు పాఠాలు, సీడీలు ఎలా లభిస్తాయో తెలియజేయగలరు.*

**– కె.వి.పురుషోత్తం, తాడిపత్రి**

**జవాబు:** పెద్ద నగరాల్లోని ఏ పెద్ద పుస్తకాల shop లో అయినా ఇవి దొరుకుతాయి. మీకు కావలసిన సమాచారం ఆయా companies కు రాస్తే తెలుస్తుంది. ఇంటర్‌నెట్ ద్వారా వివరాలు తెలుసుకోవచ్చు.

**ప్రశ్న:** *The principal wished the students all success - లాంటి structures or sentence patterns తో ఇంగ్లిష్ improve చేసుకోవడానికి, కేవలం వీటికి సంబంధించిన పుస్తకం ఉందా?*

**– బి.సుజయ్, సత్తుపల్లి**

**జవాబు:**

ఏ Standard English Grammer book లో అయినా మీకీ patterns దొరుకుతాయి. అయితే, A Guide to patterns and usage in English by AS Hornby (Oxford) మీకు చాలా ఉపయోగపడుతుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 442

# it might thin out in an hour

**Sowrabha:** You haven't started yet. Aren't you going?
(నువ్వింకా బయల్దేరలేదు. నువ్వు వెళ్లడం లేదా? )

**Narmada:** Who says I'm not? I'm just waiting for the traffic to ease off a bit.
(ఎవరంటున్నారు నేను వెళ్లడం లేదని. Traffic రద్దీ తగ్గుతుందేమోనని చూస్తున్నా.)

**Sowrabha:** You won't be starting for another hour in that case. The peak traffic hour will last that long at least.
(అలా అయితే, ఇంకో గంటగ్గానీ నువ్వు బయల్దేరలేవు. కనీసం అంతసేపయినా ఉంటుంది.)

**Narmada:** You must know better. I have been here for hardly for two days and I thought that it might thin out in just half an hour. By the way, what's the name of the street Susmitha lives in and how do I get there?
(నీకే తెలియాలి నాకంటే/ నువ్వే correct కావచ్చు. నేనిక్కడున్నది సరిగా రెండ్రోజులు కూడా కాదు. అందుకని ఓ అరగంటలో రద్దీ తగ్గుతుందనుకున్నా. అది సరే, సుస్మిత ఉండే వీధి పేరేంటి? అక్కడికి ఎలా వెళ్లడం? )

**Sowrabha:** Not to easy to forget it. It's Tanguturi Street. Named after the great freedom fighter and first CM of Andhra State, the late Tanguturi Prakasam.
(అది మరచిపోవడం అంత సులభం కాదు. అది టంగుటూరి వీధి. స్వాతంత్ర్యయోధుడూ, ఆంధ్ర రాష్ట్ర మొదటి ముఖ్యమంత్రి కీ.శే. టంగుటూరి ప్రకాశం పేరు పెట్టారు దానికి.)
(The late = కీర్తిశేషులైన)

**Narmada:** (Are) you sure that I can go there easily?
(అక్కడికి నేను సులభంగానే వెళ్లగలనని నీకు నమ్మకం ఉందా? )

**Sowrabha:** Oh, sure. You can't miss the way. You just go straight down the road, and turn left at the next crossing. The third house on the right is Sushmita's. I would go with you, if I did not have this work to do.
(తప్పకుండా. అసలు దారి తప్పలేవు. ఈ road వెంబడివెళ్లి I crossing దగ్గర ఎడమవైపు తిరుగు. కుడివైపు మూడో ఇల్లే సుస్మితది. ఈ పనిలేకుంటే నేన్నీతో వచ్చేదాన్నే.)

**Narmada:** OK, then. I'm off.
(సరే. నేను బయల్దేరుతున్నా)

***Look at the following sentences from the conversation above:***

*1) I am just waiting for the traffic to ease off a bit*
*2) The peak traffic hour will last that long*
*3) Named after the great freedom fighter and first CM of Andhra State*
*4) I thought that it might thin out in half an hour.*

**1) Ease off=** తగ్గుముఖం పట్టడం/ మెల్లగా తగ్గి ఆగిపోవడం.

a) It is only after an hour that the rain showed signs of easing off = ఓ గంటసేపటి తర్వాతే వాన తగ్గుముఖం పట్టే సూచనలు కనిపించాయి.

b) The leader's grip on the party eased off after its defeat in the elections = పార్టీ గత ఎన్నికల్లో ఓడిపోయింతర్వాత ఆ నాయకుడికి దానిమీద పట్టు తగ్గిపోయింది.

c) The price situation doesn't seen to ease off at all in the near future = సమీప భవిష్యత్తులో ధరల పరిస్థితి అసలు తగ్గేట్లు కనిపించడంలేదు.

d) With the departure of all the guests the pressure on mom has eased off = అతిథులందరూ వెళ్లిపోవడంతో అమ్మ మీద ఒత్తిడి తగ్గిపోయింది.

eased off = eased up - అంటే ease off బదులు ease up కూడా వాడవచ్చు.

ఇది Spoken English లో తరచూ వినిపించే expression (Phrasal verb). Practise చేయండి.

దీనికి దగ్గర అర్థం ఉన్నదే, **sentence no 4 లో thin out** చూడండి.

**Thin out** = పలచబడటం.

a) The crowd that had collected to see the street fight thinned out as the police arrived = police లు రాగానే వీధి పోట్లాటను చూసేందుకు గుమిగూడిన జనం పలచబడిపోయారు. (చాలామంది వెళ్లిపోయారు)

b) Forests are thinning out forcing wild animals into villages and towns = అడవులు పలచబడిపోవడం వల్ల వన్యమృగాలు గ్రామాలు, పట్టణాల్లోకి ప్రవేశించక తప్పడంలేదు.

c) As the rain eased up, the crowds that had gathered at the shops and restaurants thinned out = వర్షం తగ్గుముఖం పట్టగానే shops, restaurants లో గుమిగూడిన జనం పలచబడ్డారు.

M.SURESAN

**3) Name after** = ఇది English లో చాలా common గా వాడే expression- ఎవరికైనా ఏ పేరయినా పెట్టడం.

a) They named the child after its grandfather= ఆ బిడ్డకు తన తాత పేరు పెట్టారు.

b) Nellore district will soon be named after the late Potti Sreeramulu = నెల్లూరు జిల్లాకు త్వరలో దివంగత పొట్టి శ్రీరాములు పేరు పెట్టనున్నారు.

(The late = దివంగత, కీర్తిశేషులు)

c) He named his son after his favourite film star = తన కొడుకుకు అతడు తన అభిమాన సినిమా నటుడి పేరు పెట్టుకున్నాడు.

**2) Peak hour/ Peak time/ Peak season** = ఏదైనా ముమ్మరంగా సాగే సమయం.

a) Summer is the peak season for the railways = రైల్వే ప్రయాణాలు బాగా ఎక్కువగా ఉండే సమయం వేసవి.

b) During the peak season mangoes sold at Rs 200 a dozen = బాగా గిరాకీ ఉన్న సమయంలో మామిడిపండ్లు రూ.200కు డజన్ చొప్పున అమ్ముడయ్యాయి.

c) From 9 to 11 in the morning, and from 5 to 9 in the evening are the peak traffic hours in any city = ఏ నగరంలో అయినా పొద్దున 9 నుంచి 11 వరకు, సాయంత్రం 5 నుంచి 9 వరకు traffic రద్దీ బాగా ఎక్కువగా ఉంటుంది.

[Peak అంటే తెలుసు కదా? పర్వత శిఖరం అని - అత్యున్నత స్థానం/ స్థాయి అని.

a) The peak of his playing career is past = అతడి క్రీడా వ్యాపకంలో అత్యున్నత స్థాయి దాటిపోయింది. (ఇప్పుడంత గొప్పగా ఆడటంలేదు)

b) He is now at the peak of his acting career= అతడు తన నటనలో అత్యున్నత స్థాయిలో ఉన్నాడు.]

**Peak season** (బాగా గిరాకీ/ ముమ్మరంగా ఉన్న సమయం) **X Lean season** (అంత గిరాకీ/ ముమ్మరం లేని సమయం.)

a) The railways propose to reduce fares during the lean season = గిరాకీ లేని సమయాల్లో ఛార్జీలు తగ్గించాలని రైల్వే ప్రతిపాదిస్తోంది.

b) The city bus is the best during lean traffic hours = రద్దీ బాగా పలచగా ఉన్నప్పుడు city bus ఉత్తమం.

c) The milk prices go up during the lean procurement time = పాల సేకరణ బాగా తగ్గి ఉండే సమయంలో పాల ధరలు పెరుగుతాయి.

(Lean అంటే మామూలు అర్థం తెలుసుగదా - సన్నని.)

He is lean and tall = అతను సన్నగా పొడుగ్గా ఉంటాడు. ఈ అర్థంతో lean x fat.

---

**EXERCISE**

**Match the expressions under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1 Wither | A Try |
| 2 Endeavour | B Lessen |
| 3 Relapse | C Trickle |
| 4 Lighten | D Inform |
| 5 Seep | E Dryup |
| | F Revert |
| | G Add |

**KEY: 1-E, 2-A, 3-F, 4-B, 5-C.**

**EXPLANATIONS:**

**1) Wither = (E) Dryup**= ఎండిపోవడం/ వాడిపోవడం/ వడలిపోవడం.

Withered flowers = వాడిపోయిన పూలు.

Withered leaves = వాడిన ఆకులు.

a) The plant has withered in the hot sun = ఎండ వేడికి మొక్క ఎండిపోయింది (చనిపోయింది)

b) After a bout of typhoid he looks withered = Typhoid దెబ్బవల్ల అతడు బాగా నీరసించినట్లు కనిపిస్తున్నాడు.

(bout = జబ్బు తగలడం/ ఆ జబ్బువున్నకాలం)

c) We water plants to keep them from withering = ఎండిపోకుండా ఉండేందుకు మొక్కలకు నీళ్లు పోస్తాం.

d) Our hopes have withered away = మన ఆశలన్నీ ఉడిగిపోయాయి.

**Wither X refresh/ renew/ revive** = తిరిగి పూర్వపు శోభ పొందడం.

The greenery has revived with the recent rain = ఈ మధ్య వానల వల్ల పచ్చదనం మళ్లీ పుంజుకుంది/ పచ్చదనం చిగురించింది.

**2) Endeavour = (A) Try** = ప్రయత్నించడం, ప్రయత్నం.

Try/ attempt కంటే ఇది కాస్త గ్రాంథికం. Pronunciation- ఇన్‌డెవ.

a) It shall be the endeavour of every citizen to serve the country selflessly = నిస్వార్థంగా దేశానికి సేవ చేయాలనేది ప్రతి పౌరుడి ప్రయత్నంగా ఉండాలి.

b) I will endeavour my best to serve the country = నా దేశానికి సేవ చేసేందుకే నేను శాయశక్తులా కృషి చేస్తాను.

c) His endeavours were all in vain = అతడి ప్రయత్నాలన్నీ వృథా అయ్యాయి.

**3) Relapse = (F) Revert** = తిరిగి (అధ్వానంగా ఉన్న) యథాస్థితికి రావడం/ జబ్బులాంటివి తిరగపెట్టడం (నయమయ్యేబదులు)

a) He had a relapse of jaundice and died because of that = కామెర్లు తిరగపెట్టడం వల్ల అతడు చనిపోయాడు.

b) He relapsed into silence = కాసేపు మాట్లాడి మళ్లీ నిశ్శబ్దమైపోయాడతడు.

c) After a break of a few months he relapsed into drugs = కొన్ని నెలల విరామం తర్వాత అతడు మళ్లీ drugs తీసుకోవడం మొదలుపెట్టాడు.

d) A few minutes after coming to, she relapsed into unconscious state = తెలివొచ్చిన కొద్ది నిమిషాలకే ఆమె మళ్లీ స్పృహ కోల్పోయింది.

**Relapse X Progress.**

**4) Lighten = (B) lessen-** బరువు/ బాధ్యతల్లాంటివి తగ్గించడం.

a) By marrying a boy of her choice she lightened her parents' burden of searching for a groom = తను ఎంచుకున్న అబ్బాయిని పెళ్లి చేసుకుని, తల్లిదండ్రులకు పెళ్లికొడుకును వెదికే బాధ్యత/ బరువు తగ్గించింది.

b) His getting a job, he lightened his father's burden = ఉద్యోగం పొందడంవల్ల తన తండ్రికి బాధ్యత తగ్గించాడతడు.

c) The tax burden on senior citizens has been lightened = వయోవృద్ధుల మీద పన్ను భారం తగ్గింది.

**Lighten X Intensify** (తీవ్రతరం చేయడం)

**5) Seep = (C) Trickle** = బొట్టుబొట్టుగా నిదానంగా తేమచేరడం/ తడవడం.

a) Whenever it rained water seeped through the ceiling and walls = వర్షం వచ్చినప్పుడల్లా కప్పు, గోడలలోంచి తేమ కారుతుంది/ కప్పు గోడలు తేమ తేమగా అవుతాయి.

b) Blood seeped through the bandage = Bandage రక్తంతో తేమగా ఉంది.

c) Because of defective construction water is seeping = నిర్మాణ లోపంవల్ల నీళ్లుకారి గోడలు తేమగా ఉన్నాయి.

**Seep X Dry.**

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**





# The Mango tastes sweet



**ప్రశ్న:**

1. *President Ms Prathiba Patil said here on Monday that her Govt. hopes that the agreement becomes possible.* ఈ వాక్యంలో ప్రతిభాపాటిల్ పేరు ముందు Mrs వాడాలి కదా Ms ఎందుకు వాడారో వివరించగలరు.
2. *Yours truly, Yours sincerely, Yours obediently, Yours affectionately, Yours faithfully, Yours lovingly* మొదలైన వాటికి అర్థాన్ని, సందర్భాన్ని తెలియజేయండి.
3. *Letters లో Thanking you,* తర్వాత కామా ( , ) ఎందుకు పెట్టాలో వివరించండి.
4. *Idioms కు Phrases కు తేడా ఏమిటి?*

–వి.శ్రీనివాసరావు,పిఠాపురం

**జవాబు:** 1. పెళ్లైన స్త్రీయా కాదా అని సందేహంగా ఉన్నపుడు Ms వాడతాం. పెళ్లైన స్త్రీలు వారి ఇష్టాన్నిబట్టి Mrs వాడుకోవచ్చు. లేదా Ms (miss) వాడుకోవచ్చు. పెళ్లి కాని స్త్రీల విషయంలో miss పూర్తిగా రాస్తాం. వాళ్ల ఇష్టాని ష్టాలు తెలియనప్పుడు Ms వాడటం పద్ధతి. పెళ్లైన తర్వాత కూడా పుట్టింటివాళ్ల ఇంటిపేరే పెట్టుకోవడం ఇష్టమైతే కూడా Ms అనే రాస్తాం. విడాకులు తీసుకున్న వారిపేరు ముందు కూడా అదే.

2) Letter ముగింపులోవాడే yours truly, yours faithfully లాంటి expressions ను subscription అంటారు.

**Yours truly**: మనకు అంతగా పరిచయంలేని వ్యక్తులకు, పూర్తిగా కొత్తవాళ్లకు రాసే formal letters కు వాడే subscription: Yours truly. sir/ madam/ dear sir/ dear madam లాంటి సంబోధనలు వాడినపుడు Yours truly, అని రాసి సంతకం పెడతాం. అయితే ఇది American usage లో ఎక్కువ.

**Yours faithfully** (మీ విశ్వసపాత్రుడైన). ఇది ముఖ్యంగా official letters ముగింపులో వాడే subscription. ప్రభుత్వాధికారులకు, పై అధికారులకు, official గా మనకంటే superior status లో ఉన్నవాళ్లకు రాసే ఉత్తరాల్లో వాడే subscription. sir/ madam అని సంబోధించే letters కు ఇది వాడతాం. ఒక్కోసారి దీని బదులు కూడా yours truly వాడుతుంటారు, ముఖ్యంగా American usage లో.

**Yours sincerely** మనకు బాగా తెలిసిన వాళ్లను mr/ mrs/ miss/ శ్రీ/ శ్రీమతి - వీటితో వాళ్ల పేరుతో సంబోధించినప్పుడు, మన friends కు రాసేటపుడు yours sincerely, అని రాస్తాం. American usage అయితే sincerely yours, (అర్థం: మీ నమ్మకానికి పాత్రుడైన)

**Yours obediently:** ఇది students వాళ్ల Teachers/ Headmasters/ Principals కు రాసేటపుడు వాడే subscription (తమ విధేయుడైన అనే అర్థంతో)

**Yours affectionately** (Yours affectionately ఇప్పుడు వాడుకలోలేదు.)/ yours lovingly, (అపేక్ష/ అభిమానం/ ప్రేమతో ఇది మన చుట్టాలకు రాసే



M.SURESAN

ఉత్తరాల్లో వాడే subscription. అత్యంత సన్నిహితులైన తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, భార్యాభర్తలు, ఆప్తమిత్రులు లాంటి వాళ్లకు, yours lovingly/ with love/ love అని రాస్తాం. (Lots of love అని కూడా అంటాం)

మన స్నేహితులకు రాసే ఉత్తరాలను Dear friend/ My dear friend అని ప్రారంభించడం సరికాదు. My dear అని friend పేరు రాయాలి. My dear Nagaraj/ Priyanka; Dearest Nagaraj/ Priyanka - ఇవి మీ friends names అయితే)

3) **Thanking you** అని ఏ రకమైన letter లోనైనా రాయడం సరికాదు. Letters లో matter ముగించి, subscription రాసి సంతకం పెడతాం ఎప్పుడూ. Thanking you - correct letter లో దానికి స్థానంలేదు. కాబట్టి దాని తర్వాత comma ఉండాలా ఉండకూడదా అనే చర్చ అనవసరం.

4) Phrase అంటే a group of words without a verb. In response to your letter (మీ ఉత్తరానికి స్పందనగా)- ఇది phrase కు ఉదాహరణ, ఎందుకంటే ఇది verb లేని group of words. అలాగే outside the class hours కూడా. Phrase అర్థం, phrase లోని విడి మాటల అర్థాన్ని బట్టి తెలుస్తుంది. దాని మొత్తం అర్థం, దానిలోని మాటల అర్థానికి సంబంధించిందిగా ఉంటుంది. Idiom అన్నా కూడా group of words. అయితే Idiom మొత్తం అర్థానికీ, అందులో ఉన్న మాటల అర్థానికి సంబంధం ఉండదు. Idiom లోని విడి మాటల అర్థాన్ని బట్టి Idiom మొత్తం అర్థం తెలుసుకోలేం. అసాధ్యం కావచ్చు కూడా. eg: The long and (the) short of - ఇది Idiom. దీని అర్థం- సారాంశం అని. The long and (the) short of his speech is that he is great = అతడి ఉపన్యాస సారాంశం అంతా తను గొప్పవాడినని. గమనించారు కదా? Idiom లోని long కు, short కు కానీ, 'సారాంశం' అనే అర్థానికిగానీ ఎక్కడా సంబంధం లేదు. long, short ను బట్టి idiom అర్థం తెలుసుకోలేం. ఇది idiom కు phrase కు తేడా. తెలుగులో కూడా idioms (జాతీయాలు/ నానుడి) ఉన్నాయి కదా. Eg: నడుంవాల్చడం= విశ్రాంతి తీసుకోవడం.

---

**ప్రశ్న:** 1. *క్రికెట్ కామెంటరీలో 'welcome boundary' అన్న పదం బాగా వినిపిస్తుంది. దీని అర్థమేమిటి?*

2. *B.Ed. అంటే Bachelor of Education, D.Ed. అంటే Diploma in Education. ఒకచోట 'of' మరోచోట 'in' ఎందుకు వచ్చాయి?*

3. *ఒకటో పట్టణ పోలీస్ స్టేషన్‌ను I town Police Station అంటున్నారు. Ist town police station అనకూడదా?*

4. *The Text Booklet is printed in found (4) series, viz. A,B,C,D. ఈ వాక్యంలో viz. పూర్తి రూపం, అర్థం ఏమిటి?*

– వి.శ్రీనివాస్, అమ్మక్క పేట్

**జవాబు:** Welcome boundary = స్వాగతించతగిన boundary అంటే ఆ boundary ఆనందం కలిగించేది. Welcome news= స్వాగతించతగిన (అంత ఆనందకరమైన వార్త) Bachelor (B.A., B.Sc) లాంటి వాటిల్లో తర్వాత ఎప్పుడూ 'of', Diploma తర్వాత ఎప్పుడూ 'in', usage. దీనికి rule అంటూ ఏం లేదు. (వాడుక=usage).

ఇక్కడ one town అంటే మొదటి పట్టణం అని అర్థం కాదు- one town = నగరంలో ఒకటో విభాగం/ ప్రదేశం (Area) కు సంబంధించిన అని. అలాగే 2 town అంటే పట్టణంలో రెండో Area కు సంబంధించిన అని. Viz. Abbreviation for namely = మొదలుగాగల/ మొదలైన. All the former Telugu actors viz ANR, NTR, SVR, Savithri, etc = ANR, NTR, SVR, సావిత్రి మొదలైన గత నటులందరూ.

---

**ప్రశ్న:** *ఇంగ్లిష్‌లో మాట్లాడటానికి వీలైనంత vocabulary తెలుసుకోవడం ముఖ్యమా లేదా sentence structure ముఖ్యమా? Sentence Structures బాగా practise చేయడం ముఖ్యమా చదువుతుంటే అవే వస్తాయా? అసలు total structure S+V+O కదా. ఒక్కోసారి చాలా పెద్ద వాక్యం లాంటిది సబ్జెక్టుగా, చాలా పెద్దవాక్యం object గా ఉంటుంది. ఇలాంటి వాటిని frame చేసుకోవడం ఎలా? 'నిన్న సాయంత్రం మా ఇంటికొచ్చి నువ్విచ్చిన ఎర్రరంగు చీరను పిల్లవాడు ఆడుకుంటు పొరబాటున తగులబెట్టాడు.' ఇందులో చీర(s)+ పిల్లవాడు(o)+ తగలబెట్టడం(v). ఇలాంటి పొడుగు వాక్యాలు ఎలా చేసుకోవాలి? Main rules తెలియజేయగలరు.*

– యు.శ్రీనివాసరావు, జరుగుమల్లి (ప్రకాశంజిల్లా)

**జవాబు:** 1) English బాగా మాట్లాడాలి, రాయగలగాలీ అంటే మనం ఎంత English చదివితే అంతబాగా వస్తుంది. అయితే అలా చదివేటప్పుడు ఆ sentence structures, usage, new words, అవి ఎలా use చేశారనే వాటి మీద దృష్టి ఉంచి చదవాలి. అందుకే Reading benefits the prepared rye and mind. ఓ రచయిత రాసిన sentence structure ఎలా ఉందో గమనిస్తూ చదవాలి. చదవడం పూర్తయ్యాక మన mind లోని auto register ఆ ప్రయోగాలను అప్రయత్నంగా మనతో పలికిస్తుంది, రాయిస్తుంది. Prepared mind and eye కి ఉదాహరణ: Newton ముందు చాలామంది పండ్లు కింద పడటం చూశారుకానీ భూమికి ఆకర్షణశక్తి ఉందనేది ఆయనకొక్కడికే స్ఫురించింది. చదివేటప్పుడు sentences గమనిస్తే చాలు. అలాగే vocabulary కూడా. Word lists బట్టీపట్టడం వల్ల రాదు. చదువు తుంటే ఏమాట ఎలా వాడాలో కూడా (అర్థం ఒకటే కాకుండా) తెలుస్తుంది.

2) Subject of a sentence ఒక్క మాటగా/ ఒక phrase (Group of words without a verb)/ ఒక clause ఉండవచ్చు

a) The Mango tastes sweet- Subject- Mango (one word)

b) The book explaining the procedure is in our library- దీని subject- The book explaining the procedure = ఒక phrase (group of words without a verb)

c) The book I was reading yesterday is very interesting. Subject- The book ... yesterday- clause (group of words with a verb)

'చాలా పెద్ద వాక్యం, subject గా, చాలా పెద్దవాక్యం object గా ఉంటుందని రాశారు. Subject, object అన్నీ కలిపితేనే కదా వాక్యం అయ్యేది. Subject, object గా కనిపించే పెద్దవాక్యాలు, మీరనుకునేలా వాక్యాలు (sentences) కావు. అవి పైన చూపించిన విధంగా పెద్ద, పెద్ద phrases/ clauses మాత్రమే అవుతాయి. Subject గానీ, objects కానీ వాటంతట అవే sentences కావు కదా. Sentence అవ్వాలంటే పూర్తి అర్థం ఉండాలి. Subject/ Object ఒక్కటే పూర్తి అర్థం ఇవ్వదు.

'నిన్న సాయంత్రం... తగలబెట్టాడు.'

ఈ sentence కు English:

Our boy while playing got burnt by chance the red sari you gave us yesterday when you came to us.

ఈ sentence ను జాగ్రత్తగా గమనించండి: ఇందులో పిల్లవాడు (our boy) మీరనుకుంటున్నట్టు object (o) కాదు. subject (S) కదా. Got burnt- ఇది verb (V). దేన్ని తగలబెట్టాడు? Sari ని కాబట్టి sari, object (o), subject (s) కాదు. The red sari which you gave us yesterday when you come to us - మొత్తం object గా కూడా తీసుకోవచ్చు అప్పుడది (object) రెండు clauses అవుతాయి. అయితే Spoken English లో ఎప్పుడూ, written English లో ఎక్కువసార్లు ఇలాంటి complicated structure వాడం. Clipped sentences ఎక్కువ వాడతాం Spoken English లో, short sentences written english లో. అప్పుడు reader కు strain ఉండదు. అర్థం చేసుకునేందుకు అంత పొడుగు వాక్యాల అవసరం ఏమిటి?

---

**ప్రశ్న:** 1. *Pronunciation, pronounciation వీటిల్లో ఏది కరెక్టు?*

2. *I deserved it అనే expression అర్థం ఏమిటి? ముఖ్యంగా deserve కు అర్థం ఏమిటి?*

3. *Advertisement ఈ పదాన్ని ఏ విధంగా pronounce చేయాలి? అడ్వర్టైజ్‌మెంట్ అనాలా లేదా అడ్వటిస్‌మెంట్ అనాలా?*

4. *'Vote of thanks' అనే Idiomatic expression కు అర్థం ఏమిటి?*

5. *Content ఈ పదాన్ని కాంటెంట్ అని పలకాలా లేదా కంటెంట్ అనాలా?*

6. *'It is been a wonderful experience'. ఈ వాక్యం ఏ tense లో ఉంది?*

7. *Enough/ anough – వీటిల్లో ఏది కరెక్టు?*

– ఎం. సురేష్, బెల్లంపల్లి

**జవాబు:** 1) Pronunciation, Correct.

2) I deserved it = 1) నాకా అర్హత ఉండింది. 2) నాకు తగిన శాస్తే జరిగింది. Deserve= అర్హులవటం.

a) I deserved the prize= Prize కు అర్హత నాకుండింది. (నాకు రావాల్సింది ఆ prize)

b) I did the wrongthing. So I deserved the punishment = నేను తప్పు చేశాను. నాకీ శిక్ష పడాల్సిందే.

3) Advertisement Pronunciation: British: అడ్వొటిస్‌మెంట్ - డ్వొ - Bird లో బ 'లాగా', డ్వొ నొక్కి పలుకుతాం.

American= అడ్వ(ర్)టైజ్‌మెంట్ - జ్ size లో z లా, tise నొక్కి పలుకుతాం.

4) Vote of thanks - ఇందులో vote కు అర్థం లాంఛనప్రాయం (formal) గా కృతజ్ఞత తెలిపే చిన్న ప్రసంగం అని.

5) ఒక పుస్తకంలో ఉన్న విషయం, ఒక పాత్ర లాంటి వాటిలో ఉన్న వస్తువులు అనే అర్థంతో content ను- కాంటెంట్‌గా pronounce చేస్తాం (‘కాం’ మరీ అంత దీర్ఘం కాదు)

తృప్తిగా ఉన్న/ తృప్తిపడిన/ తృప్తికల్గించే అనే అర్థంతో అయితే కంటెంట్‌గా pronounce చేస్తాం, టెం నొక్కి పలుకుతాం.

6) It is been a wonderful experience - ఇది సరైన sentence కాదు. దీనికి సరైన form, It's (It has) been a wonderful experience= అది చాలా అద్భుతమైన అనుభవం- tense - present perfect ('be' form).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# The Mango tastes sweet


M.SURESAN



**ప్రశ్న:**
1. *President Ms Prathiba Patil said here on Monday that her Govt. hopes that the agreement becomes possible.* ఈ వాక్యంలో ప్రతిభాపాటిల్ పేరు ముందు Mrs వాడాలి కదా Ms ఎందుకు వాడారో వివరించగలరు.
2. *Yours truly, Yours sincerely, Yours obediently, Yours affectionately, Yours faithfully, Yours lovingly* మొదలైన వాటికి అర్థాన్ని, సందర్భాన్ని తెలియజేయండి.
3. *Letters లో Thanking you, తర్వాత కామా ( , ) ఎందుకు పెట్టాలో వివరించండి.*
4. *Idioms కు Phrases కు తేడా ఏమిటి?*

–వి.శ్రీనివాసరావు,పిఠాపురం

**జవాబు:** 1. పెళ్లైన స్త్రీయా కాదా అని సందేహంగా ఉన్నపుడు Ms వాడతాం. పెళ్లైన స్త్రీలు వారి ఇష్టాన్నిబట్టి Mrs వాడుకోవచ్చు లేదా Ms (miss) వాడుకోవచ్చు పెళ్లి కాని స్త్రీల విషయంలో miss పూర్తిగా రాస్తాం. వాళ్ల ఇష్టాన్ని తెలియనప్పుడు Ms వాడటం పద్ధతి. పెళ్లైన తర్వాత కూడా పుట్టింటివాళ్ల ఇంటిపేరే పెట్టుకోవడం ఇష్టమైతే కూడా Ms అనే రాస్తాం. విడాకులు తీసుకున్న వారిపేరు ముందు కూడా అదే.

2) Letter ముగింపులోవాడే yours truly, yours faithfully లాంటి expressions ను subscription అంటారు.

**Yours truly**: మనకు అంతగా పరిచయంలేని వ్యక్తులకు, పూర్తిగా కొత్తవాళ్లకు రాసే formal letters కు వాడే subscription: Yours truly. sir/ madam/ dear sir/ dear madam లాంటి సంబోధనలు వాడినపుడు Yours truly, అని రాసి సంతకం పెడతాం. అయితే ఇది American usage లో ఎక్కువ.

**Yours faithfully** (మీ విశ్వాసపాత్రుడైన). ఇది ముఖ్యంగా official letters ముగింపులో వాడే subscription. ప్రభుత్వాధికారులకు, పై అధికారులకు, official గా మనకంటే superior status లో ఉన్నవాళ్లకు రాసే ఉత్తరాల్లో వాడే subscription. sir/ madam అని సంబోధించే letters కు ఇది వాడతాం. ఒక్కోసారి దీని బదులు కూడా yours truly వాడుతుంటారు, ముఖ్యంగా American usage లో.

**Yours sincerely** మనకు బాగా తెలిసిన వాళ్లను mr/ mrs/ miss/ శ్రీ/ శ్రీమతి - వీటితో వాళ్ల పేరుతో సంబోధించినప్పుడు, మన friends కు రాసేటపుడు yours sincerely, అని రాస్తాం. American usage అయితే sincerely yours, (అర్థం: మీ నమ్మకానికి పాత్రుడైన)

**Yours obediently:** ఇది students వాళ్ల Teachers/ Headmasters/ Principals కు రాసేటపుడు వాడే subscription (తమ విధేయుడైన అనే అర్థంతో)

**Yours affectionately** (Yours affectionately ఇప్పుడు వాడుకలోలేదు.)/ yours lovingly, (అపేక్ష/ అభిమానం/ ప్రేమతో ఇది మన చుట్టాలకు రాసే ఉత్తరాల్లో వాడే subscription. అత్యంత సన్నిహితులైన తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, భార్యాభర్తలు, ఆప్తమిత్రులు లాంటి వాళ్లకు, yours lovingly/ with love/ love అని రాస్తాం. (Lots of love అని కూడా అంటాం)

మన స్నేహితులకు రాసే ఉత్తరాలను Dear friend/ My dear friend అని ప్రారంభించడం సరికాదు. My dear అని friend పేరు రాయాలి. My dear Nagaraj/ Priyanka; Dearest Nagaraj/ Priyanka - ఇవి మీ friends names అయితే)

3) **Thanking you** అని ఏ రకమైన letter లోనైనా రాయడం సరికాదు. Letters లో matter ముగించి, subscription రాసి సంతకం పెడతాం ఎప్పుడూ. Thanking you - correct letter లో దానికి స్థానంలేదు. కాబట్టి దాని తర్వాత comma ఉండాలా ఉండకూడదా అనే చర్చ అనవసరం.

4) Phrase అంటే a group of words without a verb. In response to your letter (మీ ఉత్తరానికి స్పందనగా)- ఇది phrase కు ఉదాహరణ, ఎందుకంటే ఇది verb లేని group of words. అలాగే outside the class hours కూడా. Phrase అర్థం, phrase లోని విడి మాటల అర్థాన్ని బట్టి తెలుస్తుంది. దాని మొత్తం అర్థం, దానిలోని మాటల అర్థానికి సంబంధించిందిగా ఉంటుంది.

Idiom అన్నా కూడా group of words. అయితే Idiom మొత్తం అర్థానికీ, అందులో ఉన్న మాటల అర్థానికి సంబంధం ఉండదు. Idiom లోని విడి మాటల అర్థాన్ని బట్టి Idiom మొత్తం అర్థం తెలుసుకోలేం. అసాధ్యం కావచ్చు కూడా. eg: The long and (the) short of - ఇది Idiom. దీని అర్థం- సారాంశం అని. The long and (the) short of his speech is that he is great = అతడి ఉపన్యాస సారాంశం అంతా తను గొప్పవాడినని. గమనించారు కదా? Idiom లోని long కు, short కు కానీ, 'సారాంశం' అనే అర్థానికిగానీ ఎక్కడా సంబంధం లేదు. long, short ను బట్టి idiom అర్థం తెలుసుకోలేం. ఇది idiom కు phrase కు తేడా. తెలుగులో కూడా idioms (జాతీయాలు/ నానుడి) ఉన్నాయి కదా. Eg: నడుంవాల్చడం= విశ్రాంతి తీసుకోవడం.

---

**ప్రశ్న:** 1. *క్రికెట్ కామెంటేరీలో 'welcome boundary' అన్న పదం బాగా వినిపిస్తుంది. దీని అర్థమేమిటి?*
2. *B.Ed. అంటే Bachelor of Education, D.Ed. అంటే Diploma in Education. ఒకచోట 'of' మరోచోట 'in' ఎందుకు వచ్చాయి?*
3. *ఒకటో పట్టణ పోలీస్ స్టేషన్‌ను I town Police Station అంటున్నారు. Ist town police station అనకూడదా?*
4. *The Text Booklet is printed in found (4) series, viz. A,B,C,D. ఈ వాక్యంలో viz. పూర్తి రూపం, అర్థం ఏమిటి?*

– వి.శ్రీనివాస్, అమ్మక్క పేట

**జవాబు:** Welcome boundary = స్వాగతించతగిన boundary అంటే ఆ boundary ఆనందం కలిగించేది. Welcome news= స్వాగతించతగిన (అంత ఆనందకరమైన వార్త) Bachelor (B.A., B.Sc) లాంటి వాటిల్లో తర్వాత ఎప్పుడూ 'of', Diploma తర్వాత ఎప్పుడూ 'in', usage. దీనికి rule అంటూ ఏం లేదు. (వాడుక=usage).

ఇక్కడ one town అంటే మొదటి పట్టణం అని అర్థం కాదు- one town = నగరంలో ఒకటో విభాగం/ ప్రదేశం (Area) కు సంబంధించిన అని. అలాగే 2 town అంటే పట్టణంలో రెండో Area కు సంబంధించిన అని. Viz. Abbreviation for namely = మొదలుగాగల/ మొదలైన. All the former Telugu actors viz ANR, NTR, SVR, Savithri, etc = ANR, NTR, SVR, సావిత్రి మొదలైన గత నటులందరూ.

---

**ప్రశ్న:** *ఇంగ్లిష్‌లో మాట్లాడటానికి వీలైనంత vocabulary తెలుసుకోవడం ముఖ్యమా లేదా sentence structure ముఖ్యమా? Sentence Structures బాగా practise చేయడం ముఖ్యమా చదువుతుంటే అవే వస్తాయా? అసలు total structure S+V+O కదా. ఒక్కోసారి చాలా పెద్ద వాక్యం లాంటిది సబ్జెక్టుగా, చాలా పెద్దవాక్యం object గా ఉంటుంది. ఇలాంటి వాటిని frame చేసుకోవడం ఎలా? 'నిన్న సాయంత్రం మా ఇంటికొచ్చి నువ్విచ్చిన ఎర్రరంగు చీరను పిల్లవాడు ఆడుకుంటు పొరబాటున తగులబెట్టాడు.' ఇందులో చీర(s)+ పిల్లవాడు(o)+ తగులబెట్టడం(v). ఇలాంటి పొడుగు వాక్యాలు ఎలా చేసుకోవాలి? Main rules తెలియజేయగలరు.*

– యు.శ్రీనివాసరావు, జరుగుమల్లి (ప్రకాశంజిల్లా)

**జవాబు:** 1) English బాగా మాట్లాడాలి, రాయగలగాలీ అంటే మనం ఎంత English చదివితే అంతబాగా వస్తుంది. అయితే అలా చదివేటప్పుడు ఆ sentence structures, usage, new words, అవి ఎలా use చేశారనే వాటి మీద దృష్టి ఉంచి చదవాలి. అందుకే Reading benefits the prepared rye and mind. ఓ రచయిత రాసిన sentence structure ఎలా ఉందో గమనిస్తూ చదవాలి. చదవడం పూర్తయ్యాక మన mind లోని auto register ఆ ప్రయోగాలను అప్రయత్నంగా మనతో పలికిస్తుంది, రాయిస్తుంది. Prepared mind and eye కి ఉదాహరణ: Newton ముందు చాలామంది పండ్లు కింద పడటం చూశారుకానీ భూమికి ఆకర్షణశక్తి ఉందనేది ఆయనకొక్కడికే స్ఫురించింది. చదివేటప్పుడు sentences గమనిస్తే చాలు. అలాగే vocabulary కూడా. Word lists బట్టీపట్టడం వల్ల రాదు. చదువుతుంటే ఏమాట ఎలా వాడాలో కూడా (అర్థం ఒకటే కాకుండా) తెలుస్తుంది.

2) Subject of a sentence ఒక్క మాటగా/ ఒక phrase (Group of words without a verb)/ ఒక clause ఉండవచ్చు

a) The Mango tastes sweet- Subject- Mango (one word)

b) The book explaining the procedure is in our library- దీని subject- The book explaining the procedure = ఒక phrase (group of words without a verb)

c) The book I was reading yesterday is very interesting. Subject- The book ... yesterday- clause (group of words with a verb)

'చాలా పెద్ద వాక్యం, subject గా, చాలా పెద్దవాక్యం object గా ఉంటుందని రాశారు. Subject, object అన్నీ కలిపితేనే కదా వాక్యం అయ్యేది. Subject, object గా కనిపించే పెద్దవాక్యాలు, మీరనుకునేలా వాక్యాలు (sentences) కావు. అవి పైన చూపించిన విధంగా పెద్ద, పెద్ద phrases/ clauses మాత్రమే అవుతాయి. Subject గానీ, objects కానీ వాటంతట అవే sentences కావు కదా. Sentence అవ్వాలంటే పూర్తి అర్థం ఉండాలి. Subject/ Object ఒక్కటే పూర్తి అర్థం ఇవ్వదు.

'నిన్న సాయంత్రం... తగలబెట్టాడు.'

ఈ sentence కు English:

Our boy while playing got burnt by chance the red sari you gave us yesterday when you came to us.

ఈ sentence ను జాగ్రత్తగా గమనించండి: ఇందులో పిల్లవాడు (our boy) మీరనుకుంటున్నట్లు object (o) కాదు. subject (S) కదా. Got burnt- ఇది verb (V). దేన్ని తగలబెట్టాడు? Sari ని కాబట్టి sari, object (o), subject (s) కాదు. The red sari which you gave us yesterday when you come to us - మొత్తం object గా కూడా తీసుకోవచ్చు అప్పుడది (object) రెండు clauses అవుతాయి. అయితే Spoken English లో ఎప్పుడూ, written English లో ఎక్కువసార్లు ఇలాంటి complicated structure వాడం. Clipped sentences ఎక్కువ వాడతాం Spoken English లో, short sentences written english లో. అప్పుడు reader కు strain ఉండదు. అర్థం చేసుకునేందుకు అంత పొడుగు వాక్యాల అవసరం ఏమిటి?

---

**ప్రశ్న:** 1. *Pronunciation, pronounciation వీటిల్లో ఏది కరెక్టు?*
2. *I deserved it అనే expression అర్థం ఏమిటి? ముఖ్యంగా deserve కు అర్థం ఏమిటి?*
3. *Advertisement ఈ పదాన్ని ఏ విధంగా pronounce చేయాలి? అడ్వర్టైస్‌మెంట్ అనాలా లేదా అడ్వటిస్‌మెంట్ అనాలా?*
4. *'Vote of thanks' అనే Idiomatic expression కు అర్థం ఏమిటి?*
5. *Content ఈ పదాన్ని కాంటెంట్ అని పలకాలా లేదా కంటెంట్ అనాలా?*
6. *'It is been a wonderful experience'. ఈ వాక్యం ఏ tense లో ఉంది?*
7. *Enough/ anough – వీటిల్లో ఏది కరెక్టు?*

– ఎం. సురేష్, బెల్లంపల్లి

**జవాబు:** 1) Pronunciation, Correct.

2) I deserved it = 1) నాకా అర్హత ఉండింది. 2) నాకు తగిన శాస్తే జరిగింది. Deserve= అర్హులవటం.

a) I deserved the prize= Prize కు అర్హత నాకుండింది. (నాకు రావాల్సిందే ఆ prize)

b) I did the wrongthing. So I deserved the punishment = నేను తప్పు చేశాను. నాకీ శిక్ష పడాల్సిందే.

3) Advertisement Pronunciation: British: అడ్వొటిస్‌మెంట్ - డ్వొ - Bird లో బ 'లాగా', డ్వొ నొక్కి పలుకుతాం. American= అడ్వ(ర్)టైజ్ మెంట్- జ్ size లో z లా, tise నొక్కి పలుకుతాం.

4) Vote of thanks - ఇందులో vote కు అర్థం లాంఛనప్రాయం (formal) గా కృతజ్ఞత తెలిపే చిన్న ప్రసంగం అని.

5) ఒక పుస్తకంలో ఉన్న విషయం, ఒక పాత్ర లాంటి వాటిలో ఉన్న వస్తువులు అనే అర్థంతో content ను- కాంటెంట్‌గా pronounce చేస్తాం ('కాం' మరీ అంత దీర్ఘం కాదు) తృప్తిగా ఉన్న/ తృప్తిపడిన/ తృప్తికల్గించే అనే అర్థంతో అయితే కంటెంట్‌గా pronounce చేస్తాం, టెం నొక్కి పలుకుతాం.

6) It is been a wonderful experience - ఇది సరైన sentence కాదు. దీనికి సరైన form, It's (It has) been a wonderful experience= అది చాలా అద్భుతమైన అనుభవం- tense - present perfect ('be' form).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 444

# My bike broke down

**Subodh:** Oh, you are late. You've upset my whole programme.
(నువ్వు ఆలస్యంగా వచ్చావు. నా programme అంతా తలకిందులు చేశావు.)

upset= (1) మనం చేయాలనుకున్నది అస్తవ్యస్తం అయిపోవడం. upset= (2) కోప్పడటం/worry కావడం)

**Pranav:** I'm sorry. My bike broke down on the way and it took an hour for me to have it set right.
(Sorry, మధ్యలో నా bike చెడిపోయింది. దాన్ని మళ్లీ సరిచేయించేందుకు గంటపట్టింది.)

**Subodh:** I'm afraid if we go now we'll be breaking in on the meeting of the our boss and the MD. The boss had told me that he had an important meeting with the MD and that at this time we couldn't meet him alone.
(మనం ఇప్పుడు వెళితే మన boss, MD (Managing Director) ల meeting కు అంతరాయం కలిగిస్తామేమో అనుకుంటున్నా. తనకు MD తో ముఖ్యమైన meeting ఉందని, తననీ time లో ఒంటరిగా కలుసుకోలేమని అన్నాడు.)

**Pranav:** So what shall we do now?
(అయితే మనం ఇప్పుడు ఏం చేయాలి?)

**Subodh:** You have your cell. You could have called me and told me of your bike breaking down.
(నీ cell ఉంది కదా? నీ bike చెడిపోయిన విషయం నాకు phone చేసుండొచ్చుకదా?)

**Pranav:** Our seeing him today is very important. If we can't, we shall miss the opportunity of confiding certain things in him.
(ఆయన్నీరోజు కలుసుకోవడం మనకు చాలా ముఖ్యం. లేకపోతే అతడితో కొన్ని విషయాలు రహస్యంగా చెప్పుకొనే అవకాశాన్ని కోల్పోతాం.)

**Subodh:** Are you talking about some one breaking into his office and making away with important files?
(నువ్వనేది ఆయన office లోకి ఎవరో ప్రవేశించి కొన్ని files దొంగతనం చేయడం గురించా?)

**Pranav:** Exactly. (అదే)

**Subodh:** Is it being wise? May not the culprits give us trouble?
(తెలివైన పనేనా అది? ఆ తప్పుచేసినవాళ్లు మనమీద పడొచ్చు కదా?)

culprit= దోషి/ నేరస్థుడు

**Pranav:** How will they know?
(వాళ్లకెలా తెలుస్తుంది?)

**Subodh:** (Are) you sure of that? Then OK.
(ఆ నమ్మకం నీకుందా? అయితే సరే.)

***Look at the following sentences from the dialogue above.***

*1) My bike broke down on the way*

*2) We'll be breaking in on meeting of our boss and the MD.*

*3) We shall miss the opportunity of confiding certain things in him.*

**1) Broke down =** past tense of break down = యంత్రాల్లాంటివి చెడిపోవడం/ పనిచేయక పోవడం/ ఆగిపోవడం.

a) The bus full of passengers broke down half way through the level crossing =
Level crossing దాటుతుండగా మధ్యలో ప్రయాణికులతో నిండిన ఆ bus చెడిపోయి ఆగిపోయింది.
Halfway through= మధ్యలో, A number of people left halfway through the meeting = సమావేశం మధ్యలో చాలామంది వెళ్లిపోయారు.

b) As one of the LPG plants broke down cooking gas is in short supply =
LPG యంత్రాల్లో ఒకటి చెడిపోవడం వల్ల వంట gas కొరతగా ఉంది. Break down అంటే అంతరాయం కలగడం అనే అర్థం కూడా ఉంది.

a) The talks between the management and workers' union has broken down=
యాజమాన్యానికి కార్మిక సంఘాలకు మధ్య చర్చలు విఫలమయ్యాయి/ వాటికి అంతరాయం కలిగింది.

b) The breakdown of power has affected agriculture =
విద్యుచ్ఛక్తి అంతరాయం వ్యవసాయాన్ని దెబ్బతీసింది.

Break down అంటే మరో అర్థం మనసులోని బాధను ఆపుకోలేక కన్నీళ్లు పెట్టుకోవడం

When I told her the news she broke down=

a) నేనావిడకు ఆ వార్త చెప్పగానే కన్నీళ్లు పెట్టుకుంది, దుఃఖాన్ని ఆపుకోలేక.

b) The pak captain broke down unable to bear the defeat =
ఓటమి భరించలేక pak captain కన్నీళ్లు పెట్టుకున్నాడు.

M.SURESAN

**2) Break in on** = ఒక చోటికి వెళ్లి అక్కడివాళ్ల పనికి అంతరాయం కలిగించడం.

a) He has no manners. He broke in on us when we were discussing something = అతడికి manners లేదు. మేమేదో చర్చించుకుంటుంటే మధ్యలో అడ్డుపడ్డాడు/ వచ్చి అంతరాయం కలిగించాడు.

b) Sorry, I'll come later. You appear to be in serious work and I don't like to break in on you =
Sorry, మళ్లీ వస్తానే. నువ్వేదో పనిమీదున్నావు. నీకడ్డు తగలడం నాకిష్టంలేదు.

**3) confide in =** ఒకరిని నమ్మి, మన ఆంతరంగికులుగా భావించి మన రహస్యాలన్నీ వాళ్లకు చెప్పడం.

a) The pandavas always confided in Lord Krishna =
పాండవులెప్పుడూ వాళ్ల రహస్యాలన్నీ కృష్ణుడితో చెప్పుకొనేవాళ్లు.

b) He is too strong minded to confide in any one =
ఎవరితోనూ తన రహస్యాలు చెప్పుకోనంత గట్టి మనసున్నవాడు.

**Q. 1.** A child is crying అనే వాక్యాన్ని question tag లో రాయాలంటే child అనేదానికి కచ్చితంగా male, female అని తెలియదు కాబట్టి తగిన pronoun ఏది?

**2.** I am a boy అనే వాక్యంలో question tag aren't I అని ఎందుకు రాయాలి? వాక్యంలో helping very ఏది ఉంటే అదే రాసుకోవాలి కదా. వివరించగలరు.

*– కె.రాజ్‌కుమార్, చల్లగరిగ*

Q&A

**A. 1)** A child is crying, isn't it? Child ను English లో సాధారణంగా 'It' అంటారు. బిడ్డ అంటే మగా/ ఆడా కావచ్చు అందుకని అది English లో It అవుతుంది.

**2)** I am a boy, aren't I?
ఇక్కడ Question tag, aren't I అనే వస్తుంది. ఇది వాడుక (usage). Are అనేదే helping verb.

**EXERCISE**

**Match the words/ expressions under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1 Perfume | A Foul smell |
| 2 Stink | B Exactly (on time) |
| 3 Bawl | C be fond of |
| 4 On the dot | D Throw |
| 5 Have a soft spot for | E Scent |
| | F Silence |
| | G Shout. |

**KEY: 1 E, 2 A, 3 G, 4 B, 5 C.**

**Explanations:**

**1) Perfume = (E) Scent** = పరిమళం/ సువాసన

a) The jasmine is a flower with the sweetest perfume =
చాలా/ అత్యంత ఆకర్షణీయమైన సువాసన/ పరిమళం ఉండే పువ్వు మల్లె

b) The perfume of roses filled the room =
గులాబీల సువాసనతో గది నిండిపోయింది/ సువాసన గదిని నింపింది.

Perfume అంటే అత్తరు అనే అర్థం కూడా ఉంది. పరిమళ ద్రవ్యం కలిపిన ద్రవాలు, మనం ఒంటికి రాసుకునేవి కూడా perfumes.

c) you can find a wide range of perfumes in that store =
ఆ దుకాణంలో విస్తృత శ్రేణి పరిమళాలను/ అత్తరులను నువ్వు చూడొచ్చు

d) There is no mistaking who it is. The perfume gives her out =
ఎవరున్నారిక్కడ అనే విషయంలో పొరపాటు లేదు. ఆమె వాడే అత్తరే ఆమె ఉందని తెలుపుతుంది/ ఆమెను పట్టించేస్తుంది.

ఇప్పుడు perfume బదులు spray వాడుతున్నాం. perfume bottle కు sprayer (మూత నొక్కితే వంటి మీదికి జల్లులా పడే ఏర్పాటు) ఉండటంతో ఆ perfume ను మనం spray (జల్లులాపడేట్లు) చేసుకుంటాం కదా. అందుకని ఇప్పుడు perfume ను spray అని కూడా అంటున్నాం.

**perfume x stink/ stench** (కంపు)

**2) stink (A) = foul smell** = దుర్వాసన.

fowl = చెడు/ అనాహ్లాదకరమైన.

a) The stink from the rotting carcasses filled the place =
కుళ్లుతున్న ఆ జంతువుల కళేబరాల నుంచి వస్తున్న కంపుతో ఆ ప్రదేశమంతా నిండిపోయింది.

rotting = కుళ్లుతున్న/ మురుగుతున్న. carcass pronunciation - కాకస్ - జంతువుల మృతదేహాలు (ముఖ్యంగా పెద్ద జంతువులవి).

b) Not having been cleaned for days, the bathroom is stinking =
రోజుల తరబడి శుభ్రం చేయకపోవడంతో స్నానాల గది గదులన్నీ కంపు కొడుతోంది.

c) His name stinks in this area =
ఈ ప్రదేశంలో అతడి పేరంటేనే అసహ్యించుకుంటారు (అతడి పేరిక్కడ కుళ్లు కంపు కొడుతున్నదని)

Stink (present) - stank/ (past) - stunk (past participle)

**Stinking** (కంపు కొడుతున్న) **x fragrance** (సువాసన కలిగి ఉన్న.) Fragrance = సువాసన = perfume

**3) Bawl = (G) shout** = అరవడం/ గొడవచేయడం/ గోలపెట్టడం, చాలా కోపంతో/ రాద్ధాంతం చేయడం.

a) As soon as he came in he bawled at the secretary for not completing the work =
వచ్చీ రాగానే, పని పూర్తిచేయనందుకు secretary మీద కోపంతో అరిచేశాడు.

b) Don't bawl orders at me. I am not your servant =
నా మీద అరిచి ఆజ్ఞాపించకు. నేనేం నీ పనిమనిషిని కాను.

c) Your bawling can't threaten me. Cool down = నీ అరుపులు నన్నేం బెదిరించవు. తగ్గు. Bawl అంటే బిగ్గరగా ఏడుపులు/ పెడబొబ్బలు పెట్టడం అనే అర్థం కూడా ఉంది.

**4. On the dot = (B) exactly on time** కచ్చితంగా అనుకున్న సమయానికి.

a) The train arrived at 4.15 on the dot =
Train correct గా/ కచ్చితంగా 4.15కు వచ్చింది. (ఒక సెకను కూడా తేడా లేకుండా)

b) I'll be here at 5 on the dot/ at 5 sharp =
నేనిక్కడ కచ్చితంగా 5 గంటలకు ఉంటా.
(on the dot = sharp = అనుకున్న సమయానికి కచ్చితంగా)

**5) Have a soft spot for = (C) be fond of** = (ఒకరి పట్ల ప్రత్యేక అభిమానం ఉండటం)

If someone has a soft spot for some one else=
ఒకరిపట్ల ఇంకెవరికైనా ప్రత్యేకాభిమానం ఉన్నప్పుడు, (వాళ్ల మీద ఈగ వాలనివ్వం/ వాళ్లకు ఏ సహాయమైనా చేస్తాం/ వాళ్ల తప్పులు మనకు కనిపించవు.)

a) Drona had always a soft spot for Arjuna =
ద్రోణుడికి అర్జునుడంటే ప్రత్యేకాభిమానం.

b) Most people have a soft spot for their home town/ home =
చాలామందికి వాళ్ల స్వస్థలం పట్ల ప్రత్యేకాభిమానం ఉంటుంది.

**Have a soft spot for x be prejudiced against**

(prejudice = నిరాధారమైన దురభిప్రాయం).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 445

# Don't lose your temper

**Prahlad:** Very difficult to get on with Nishit. No knowing when he loses his temper.
(Nishit తో వేగడం కష్టమే. వాడికెప్పుడు కోపం వస్తుందో తెలియదు.)

**Prasen:** So it is. I've experienced it as well. That's why I am very careful how I talk to him.
(అవును నాకూ అనుభవం అయ్యింది. అందుకనే వాడితో మాట్లాడేటప్పుడు జాగ్రత్తగా ఉంటాను.)

**Prahlad:** That's quite bad of him. He can't always expect people to bear his temper. I don't care whether I am friends with him or not, but the next time I'll make it clear to him that enough is enough.
(ఆ విషయంలో అతడు సరికాదు. అతడి కోపాన్నందరూ ప్రతిసారీ భరించాలనుకోకూడదు కదా? అతడితో స్నేహం ఉన్నా లేకపోయినా నాకేం బాధలేదు. ఈసారి మాత్రం నేను చెప్పేస్తాను ఇంక చాలించమని.)

**Prasen:** Nothing wrong in that, I assure you. His younger brother Nishal is so sweet tempered. What a contrast!
(ఆ విషయంలో నువ్వు తప్పుకాదు, నేను కచ్చితంగా చెబుతున్నా. అతడి తమ్ముడు ఎంత నిదానస్థుడో. ఇద్దరి మధ్యా ఎంత తేడా!)

Contrast = తేడా/ వైరుధ్యం

**Prahlad:** He has already lost a good number of friends because of his temper. Why doesn't he change?
(తన అసహనత వల్ల ఇప్పటికే చాలామంది స్నేహితులనతడు కోల్పోయాడు. మారడేంటి?)

**Prasen:** He can learn from his brother who is so sweet tempered.
(నెమ్మదస్తుడైన తన తమ్ముడిని చూసి నేర్చుకోవచ్చు కదా.)

But one thing. For all his bad temper he is good at heart and quite helpful.
(అయితే ఒక విషయం. అంత కోపిష్టి అయినప్పటికీ అతడు మంచి మనసున్నవాడు, సహాయకారీ.)

**Prahlad:** Still behaviour matters, you know.
(అయినా నడవడి ముఖ్యం కదా?)

**Prasen:** Why these observations now?
(ఇప్పుడీ వ్యాఖ్యలన్నీ ఎందుకు?)

**Prahlad:** This morning I called him and asked him to return my books that I had lent him a week ago. He flew into a rage and blasted me over the phone.
(ఇవాళ ఉదయం వారం కింద అతడికిచ్చిన పుస్తకాలను తిరిగి ఇమ్మని అడిగా. అంతే phone లో రెచ్చిపోయాడు.)

**Prasen:** Did he return the books?
(పుస్తకాలు తిరిగిచ్చాడా?)

**Prahlad:** He did, of course. He came to me, threw them on my face and left in a huff.
(ఇచ్చాడులే. మా ఇంటికొచ్చి పుస్తకాలు నా మొహానకొట్టి కోపంగా వెళ్లిపోయాడు.)

**Prasen:** That's just like him. (వాడంతే.)

***Look at the following sentences from the conversation above:***

*1) No knowing when he loses his temper.*
*2) He can't always expect us to bear his temper.*
*3) His younger brother is so sweet tempered*
*4) He flew into a rage*

పై sentences లో ఎక్కువగా temper అనేమాట కనిపిస్తోంది కదా. దీన్ని Spoken English లో కోప స్వభావాన్ని తెలిపేందుకు ఎక్కువగా వాడతాం. Practice చేయండి.

Temper = చిన్న చిన్న కారణాలకే ఎక్కువ కోపం చూపించే స్వభావం. ముఖ్యంగా sudden గా కోప్పడే స్వభావం, సరైన కారణం లేకుండా.

a) That temper of his makes him enemies of all= ఆ కోపిష్టి స్వభావమే అతడికందరిని శత్రువులను చేస్తుంది.

M.SURESAN

(ఒక Petrol bunk లో ఇలా ఉంది. Don't lose your temper-Nobody wants it. అర్థం అయింది కదా? 'నీ కోపాన్ని పారేసుకోకు. అది ఎవరికీ అక్కర్లేదు' అని. ఇక్కడ lose = పారేసుకోవడం)

Don't lose your temper = కోప్పడకు = keep your temper.

**2) Bear somebody's temper** = ఒకరి కోపాన్ని భరించడం.

a) I don't want to work with him. Difficult to bear his temper =
అతడితో కలిసి నేను పనిచేయను. అతడి కోపాన్ని భరించడం కష్టం.

b) A man of such temper is unfit for teaching = అంత కోపిష్టి స్వభావం కలవాడు teaching కు పనికిరాడు.

**1) Lose temper** = సులభంగా కోప్పడటం.

a) Ramana lost his temper at his child's spilling the milk =
పాలు ఒలకబోసిన పాపమీద రమణకు ఎక్కడలేని కోపం వచ్చింది.

b) Don't lose your temper. Let's try to understand the situation =
అంత కోప్పడకు/ ఉద్రేకపడకు. పరిస్థితిని అర్థం చేసుకుందాం.

b) If you can bear my mother-in-law's temper. You can bear anything =
నువ్వు మా అత్త కోపాన్ని భరించగలిగితే ఏదైనా భరించగలవు.

**3) Sweet tempered** = నెమ్మదైన/ నిదాన స్వభావం ఉన్న (ముఖ్యంగా చంటి పిల్లల విషయంలో)

a) She is such a sweet tempered baby =
నిదాన స్వభావం ఉన్న/ నవ్వుతుండే పాప ఆ పిల్ల.

b) His sweet temper endears him to all =
అతడి నెమ్మది స్వభావం అతడిని అందరూ ఇష్టపడేలా చేస్తుంది.

endear = ఇష్టపడేలా

**4) Fly in to a rage/ a temper=** ఉన్నట్టుండి కోపంతో ఉద్రేకపడటం.

a) The minute the bowler bowled him the batsman flew into a rage/ a temper =
Bowler, Batsman ను bowl చేయటంతో batsman కోపంతో ఊగిపోయాడు.

b) No use flying into a rage/ a temper. Try to convince me =
కోపంతో చిందులుతొక్కితే ఉపయోగంలేదు. నాకు నచ్చజెప్పు.

Be in a temper = కోపంతో ఉండటం.

No use talking to him as he is in a temper = వాడిప్పుడు చాలా కోపంగా ఉన్నాడు. వాడితో ఇప్పుడు మాట్లాడితే ఉపయోగం ఉండదు.

ఇవి కూడా చూడండి.

Quick/ fiery / violent temper = కోపంతో ఉద్రేకపడిపోవడం.

---

## EXERCISE

**Match the expressions under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Gossip | A. Stroke |
| 2. Caress | B. Coax |
| 3. Hug | C. Idle talk |
| 4. Cajole | D. Affectionate |
| 5. Fond | E. Embrace |
| | F. Encourage |
| | G. Hate |

**Key: 1 - C, 2 - A, 3 - E, 4 - B, 5 - D.**

**1. Gossip= (C) Idle talk** (Idle = పనిపాట లేకుండా) = పుకారు/ Gossip= 1) పనిపాట లేకుండా చెప్పుకునే/ అమ్మలక్కల కబుర్లు). (ముఖ్యంగా ఇతరులను గురించి, వాళ్ల సంబంధాల గురించి) 2) అలా కబుర్లాడుకోవడం, ఇతరులను గురించి ఉన్నవీలేనివీ చెప్పుకోవడం. 3) అలా కబుర్లాడేవాళ్లు.

a) He can never make it good in his profession. He spends most of his time gossiping = వాడు తన వృత్తిలో పైకి రాడు. ఎప్పుడూ ఇతరుల గురించి పోచుకోలు కబుర్లతో గడుపుతాడు.

b) Gossip has it that the boss has a soft spot for his secretary= Boss కు తన secretary పట్ల ప్రత్యేకాభిమానం ఉందని పుకారు.

c) Almost all Indian News channels are just gossip channels. How much time they spend on gossip! = భారత వార్తా channels దాదాపు అన్నీ పోచుకోలు కబుర్ల channels. (సినిమా తారలు, నేరస్థుల విషయాలతో కాలం గడిపేస్తాయి.)

d) All film magazines are full of gossip = సినీ పత్రికలన్నీ (ఏ తార ఎవరినో ప్రేమించి, వేరెవరినో పెళ్లి చేసుకుందనో, ఏ hero విడాకులు తీసుకున్నాడో అనే వివరాలతో) పుకార్లతో నిండి ఉంటాయి.

e) She is a gossip. No one believes her = ఆమె ఉత్త పుకార్ల మనిషి. ఆమెను ఎవరూ నమ్మరు.

**2) Caress = (A) stroke** = బుజ్జగింపుగా నిమరడం.

a) As he watched the TV, he caressed the dog in his lap = TV చూస్తూ, తన ఒళ్లోని కుక్కను నిమురుతూ ఉన్నాడు.

b) She caressed the child gently = మృదువుగా ఆ బిడ్డను నిమిరిందామె.

(stroke = ప్రేమను తెలిపేందుకు మృదువుగా నిమరడం)

**3) Hug = E) Embrace** = కౌగిలించుకోవడం

a) The mother hugged her child and lifted it up to kiss it = తల్లి బిడ్డను కౌగిలించుకుని ముద్దాడేందుకు ఎత్తుకుంది.

b) Most movies show the hero and heroine hugging too often = చాలా సినిమాల్లో కౌగిలింతలు మరీ ఎక్కువసార్లు చూపిస్తారు.

**4) Cajole = B) Coax=** బుజ్జగించి ఎవరితోనైనా ఏదైనా పనిచేయించుకోవడం/ తియ్యటి మాటలు చెప్పి ఇతరులతో పనిచేయించుకోవడం.

a) The mother cajoled her son into marrying a girl of her choice = కొడుకుని బుజ్జగించి/ మంచి కబుర్లు చెప్పి తనకు నచ్చిన అమ్మాయిని పెళ్లి చేసుకునేట్లు చేసిందా తల్లి.

b) He cajoled the boy into agreeing to do the work = అతడా కుర్రాడిని బుజ్జగించి, పని చేసేందుకు ఒప్పుకొనేలా చేశాడు.

c) He coaxed information out of him = అతడిని బుజ్జగించి సమాచారం రాబట్టాడు.

**5) Fond = (D) Affectionate** = ఆపేక్షగల/ ప్రేమగల

a) The scene shows the fond embrace of the mother and the child = ఆ scene తల్లీ బిడ్డా అనురాగంతో/ ఆపేక్షతో కౌగిలించుకోవడం చూపిస్తోంది.

b) I have fond memories of my school days = నాకు నా school రోజుల గురించి తీపి/ ఇష్టమైన జ్ఞాపకాలున్నాయి.

**fond x averse** = విముఖంగా ఉన్న

I am averse to the idea = నాకా idea ఇష్టంలేదు.

---

## Q&A

**Q.** 1. Say, see కి ing form వాడవచ్చా?; 2. Till, Until ఒకే meaning ఇస్తాయా?; 3. పింగాణీని ఇంగ్లిష్‌లో ఏమంటారు?; 4. Nothing doing- వివరించగలరు.; 5. Lend, borrow, owe, debt - అర్థాలేమిటి?; 6. గుండు చేయించడాన్ని ఇంగ్లిష్‌లో ఏమంటారు?; 7. Anybody, Anyone - ఈ రెండూ ఒకటేనా?

***- G. Balakrishna Reddy, Kandrapadu.***

**A.** 1) Say కు, see కి 'ing' form అన్ని సందర్భాల్లోనూ వాడతాం. వాడనిది am/ is/ are + seeing. Am/ is/ are saying వాడవచ్చు. Am/ is/ are seeing. 1) కలుసుకోవడం (చూడటం అనే అర్థంతో కాకుండా) అనే అర్థంతో వాడవచ్చు. He is seeing the doctor this evening. 2) ఒకరితో గడపడం (ముఖ్యంగా ప్రేమికులు) అనే అర్థంతో కూడా Am/ is/ are seeing వాడతాం.

The boy and the girl are seeing a lot each other = వాళ్లు ఒకరితో చాలా సమయం గడుపుతున్నారు (ప్రేమికులు కాబట్టి) ఈ అర్థంతో Am/ is/ are seeing నే ఎక్కువ వాడతారు.

2) Till= until. 3) China/Porcelaine (china ఎక్కువ వాడతారు)

4) అదేం కుదరదు/ అందుకు నేనొప్పుకోను/ అలా వీల్లేదు.

5) lend= అప్పివ్వడం/ అరువివ్వడం. borrow= అప్పు తీసుకోవడం. owe= అప్పుండటం. (He owes me Rs.1000/- = అతడు నాకు 1000 రూపాయలప్పున్నాడు.) Debt= అప్పు. He has cleared debts = అతడు అప్పులు తీర్చేశాడు.

6) Tonsure = టాంష్; Clean shaven అని కూడా అంటాం.

7) ఒకటే.

# ప్రతిభ

**ప్రశ్న:** 1. I too, I also, I myself ఒకే అర్థాన్నిస్తాయా?
2. Must be, should be ఒకే అర్థాన్నిస్తాయా? వీటిలో ఏది powerful?
3. Die కి మూడు రూపాలు తెలియజేయండి.
4. English లో కొన్ని verbs ముందు 'A' ఎందుకు చేరుస్తారు? ఉదాహరణకు wake - awake, lone - alone, wait - await.

**- G. Balakrishna Reddy, Kandrapadu.**

**జవాబు:** 1. I too= I also. అయితే Modern usage లో ఎక్కువగా me too అంటున్నారు. Spoken English లో also అంతగా వాడరు. దాని బదులు as well అంటారు.
He is a student, isn't he?
(అతడు student కదా?)
'Yes. Me as well.' (అవును. నేను కూడా)
I myself = నేనే. I myself am not going. There is no question therefore of my wife going there = నేనే వెళ్లడం లేదు. ఇక నా భార్య వెళ్లే ప్రశ్నేలేదు కదా.
2. Must is more powerful than should.
3. Die (present) - Died (past) - Died (past participle)
4. కొన్ని verbs ముందు A చేరిస్తే అవి Adjectives అవుతాయి. అంటే అయిన/ అయినటువంటి/ ఉన్న/ ఉన్నటువంటి అర్థాలతో.
Awake = మేలుకుని ఉన్న, alone = ఒంటరిగా ఉన్న (అయినా lone అనేది verb కాదు కదా?)
Wait = await. రెండూ verbs.
Wait for = await.

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 446

**ప్రశ్న:** 1. Walked, asked లాంటి పదాల చివర ed ని 't' గా ఉచ్చరించాలన్నారు. కొన్ని సందర్భాల్లో సరిపోవడం లేదు, దయచేసి వివరించగలరు.
2. dignify = 'dIgnI/ fai ఇందులో I కు, f కు మధ్య గీత ఎందుకో తెలుపండి.
3. Candidate ను క్యాండిడేయిట్ అన్నారు. అయితే Dr. S. Lakshminarayan డిక్షనరీలో క్యాండిడట్ అని ఉంది. ఏది కరెక్టు?

**– జి.లిఖిత, కురవి**

**జవాబు:** 1. కొంచెం practise చేస్తే తప్పకుండా ఏ కష్టం లేకుండా askt, lookt అని pronounce చేయగలం. అలాంటి మాటలు ఉచ్చరించినప్పుడల్లా గుర్తుంచుకుని అలా అంటూ ఉంటే, మనకది అలా అలవాటైపోతుంది.
2. I కి f కి మధ్య గీత మీరెక్కడ చూశారు? ఈ గీత అవసరం లేదు. దానికి ప్రాముఖ్యమూ లేదు.
3. కాండిడెయిట్/ కాండిడట్- ఈ రెండూ correct ఉచ్చారణలే. ఏదైనా అనవచ్చు అయితే (కాండిడెయ్‌ట్) ఎక్కువ వాడుకలో ఉంది.

**ప్రశ్న:** 1. Home, House - వీటి తేడా వివరించగలరు.
2. Should, would రెండూ future forms. ఈ రెండింటి మధ్య కచ్చితమైన తేడా ఏమిటి?

**– చంద్రశేఖర్, విజయనగరం**

**జవాబు:** 1) Home కు House కు తేడా ఇంతకు ముందు చాలాసార్లు explain చేశాం. పాత lessons చూడండి.
2) Should, would రెండూ future from the past, అంటే past లోంచి future ను తెలుపుతాయి. అయితే should ను ఇలా వాడటం old fashioned. ఇప్పుడెవరూ వాడటంలేదు. Would అలా వాడతాం.
He said that he would help me. (నాకు సాయంచేస్తానని అన్నాడతడు). అతడు అన్నది గతంలో. సాయం చేస్తాననడం, అన్నప్పట్నించి, future. అలాంటప్పుడు, would వాడతాం.
Should present day English లో orders, necessity తెలిపేందుకు వాడతాం.
He should be here at 10.
= అతడు పదింటికి ఇక్కడుండాలి... (Order)
I should start now or I'll miss the train = నేనిప్పుడు బయల్దేరాలి లేకపోతే train అందదు. (Necessity)
ఇవన్నీ clear గా ఇంతకుముందు lessons లో ఉన్నాయి. చూడండి.

## He came to me every morning

**ప్రశ్న:** 1) He was coming to me every morning.
2) He came to me every morning.
3) He would come to me every morning.
ఈ వాక్యాల అర్థం ఒకటేనా?
4) అన్నం మాడిపోయింది (మాడిపోవడం)
5) నేను అలిగాను (అలగడం)
6) చెట్టుమీద పిట్ట వాలింది (వాలింది)
7) దీనికి రెండు పువ్వులు పూసాయి (పూయడం)
8) మామిడి చెట్టుకు రెండు కాయలు కాశాయి (కాయడం)
9) పెన్సిల్ చెక్కడం. 10) అక్షరాలు తుడిపేయడం.
వీటిని ఇంగ్లిష్‌లో ఎలా అనాలో తెలుపగలరు.

**– టి. నవీన్‌కుమార్, వేచరేణి**

**జవాబు:** 1) He was coming to me every morning సరైన sentence కాదు. దీనికి ప్రతిరోజూ అతడు నా దగ్గరికి వచ్చేవాడు అనే అర్థం రాదు, was coming ఇక్కడ సరైన verb కాదు. ఎందుకంటే ఇక్కడ గతంలో (అతడు నా దగ్గరకు రావడం) ఒక సమయంలో (కొంత కాలంపాటు ప్రతిరోజు కాకుండా) జరిగిన పనికాదు కదా.


M.SURESAN

He came to me every morning = (అప్పుడు గతంలో) ప్రతిరోజూ ఉదయం నా దగ్గరకి వచ్చాడు/ వచ్చేవాడు.
He would come to me/ used to come to me every morning = ప్రతి ఉదయం అతడు నా దగ్గరకొచ్చేవాడు (ఆ రోజుల్లో).
4) The rice is charred.
5) To be cross/ to get cross/ to be in a mood/ a nasty mood.
6) The bird alighted on the tree
7) The tree has put on two flowers (put on flowers)
8) The mango tree has borne two fruit (English లో fruit = కాయ/ పండు. ఒకే చెట్టు కాయలు/ పండ్లు = fruit) (bear fruit = చెట్టుకాయలు కాయడం)
9) Sharpening the pencil.
10) Eraze/ rub off letters.

**ప్రశ్న:** As clear as mud = అర్థం చేసుకోవడం కష్టం అని ఇచ్చారు. Telugu to English డిక్షనరీలో ఈ వాక్యమే దొరకలేదు. ఇలాంటి అర్థాలు తెలుసుకోవడానికి Telugu to English డిక్షనరీ ఉందా?

**– శేషన్న, ఆదోని**

**జవాబు:** ఇలాంటి మాటల expressions అర్థాలు తెలుగు- ఇంగ్లిష్ dictionary ల్లో దేన్లోనూ దొరకవు. ఎందుకంటే ఏ తెలుగు - English dictionary లో కూడా, word meanings మాత్రమే ఉంటాయి. Usage, Idioms (English) తెలిపే Telugu - English dictionary ఇంతవరకు ఎవరూ రాయలేదు. As clear as mud లాంటి expressions, Oxford Advanced Learner's Dictionary, Longman's dictionary లాంటి వాటిలో తప్పక దొరకుతాయి. అయితే వాటికోసం dictionary వెదుకుతూ ఉండలేం కదా. Standard English authors రాసే books, novels, standard English magazines, journals చదివేటప్పుడు అవి తగులుతుంటాయి. అలా మనం వాటిని అర్థం చేసుకోవడమే.

**ప్రశ్న:** 1. 'To whom soever it may concern' దీని అర్థమేమిటి? Usage తెలుపగలరు.
2. If I were a king I could rule the country very well. I తర్వాత were అనేది ఎలాంటి సందర్భాల్లో వస్తుందో వివరించగలరు.
3. Affect, effect వీటి మధ్య తేడా, usage తెలుపగలరు.
4. Letters లో Thanking you అని రాయడం ఎంతవరకు సబబు? Thanking you అనే structure కరెక్టా కాదా? లేదా Thank you అని రాయాలా?

**– ఎండి. అజీజ్, చిన్నకాపర్తి**

**జవాబు:** Certificates, Important information, ఆస్తుల తగాదాలను గురించిన విషయాల్లాం టివి ఎవరికి తెలపాలో స్పష్టంగా తెలియనప్పుడు, బహిరంగంగా తెలిపితే, వాటిలో ఆసక్తి ఉన్నవాళ్లు ఆ విషయాలను తెలుసుకోవాలనే ఉద్దేశంతో To whomesoever it may concern అని ప్రకటిస్తాం/ రాస్తాం. దీని అర్థం ఈ కింది విషయాల్లో ఆసక్తి/ ఈ కింది విషయాలతో సంబంధం, కలవారెవరికైనా అని అర్థం. అలాంటివారు ఇక్కడ తెలిపిన విషయాలు గమనించాలని కూడా అర్థం.
2) ఇది ప్రస్తుతం జరగని విషయం. నేనే (ఇప్పుడు) రాజునైతే (అయ్యే ప్రశ్నే లేదు), దేశాన్ని చక్కగా పాలిస్తాను. (రాజు అవ్వడం అంటూ జరిగితే, అది అవ్వదు, దేశాన్ని చక్కగా పాలించేదీ లేదు అని). ఇలాంటిచోట్ల were/ past forms వస్తాయి. తర్వాత భాగంలో would/ should/ could/ might రావాలి. ఇది వివరంగా ఇంతకుముందు lessons లో తెలిపాం చూడండి.
3) పాత lessons చూడగలరు.
4) Thanking you రాయడం సరికాదు. (మీకు ధన్యవాదాలు తెలుపుతూ అనే అర్థంతో ఈ phrase correct, అయితే letters లో వాడనవసరం లేదు. సరికాదు కూడా.)

**ప్రశ్న:** 1. Fly = ఎగురు, ఎగురవేయు. ఈ verb లాగా transitive, intransitive verb గా పనిచేసే క్రియలను గురించి ప్రత్యేకంగా తెలుసుకునే మార్గం చెప్పండి.
2. ఈ వాక్యాలను English లో ఎలా చెప్పాలి?
అతడు వంగాడు.
కొమ్మ వంగింది.
ఆమె అన్నం తినిపిస్తోంది.

**– కె. శ్రీనివాసరావు, పులివెందుల**

**జవాబు:**
1. Oxford Dictionary లాంటి మంచి dictionaries ఇలాంటి పదాలను స్పష్టంగా వివరిస్తాయి. కాస్త ఓపికతో చూడగలిగితే ..
2. He bent down
The branch bent down
She is feeding somebody.

**ప్రశ్న:** ఎమ్మార్వో (MRO), ఎమ్మీవో (MEO), ఎమ్మెల్యే (MLA), హవ్వార్యూ (how are you), వేరీజిట్ (where is it), దిసీజ్ (This is) - తెలుగులో మాదిరిగా సంధులుచేస్తూ కలిపి పలకకూడదని, విడివిడిగా (ఎంఆర్ఓ, ఎంఈవో, ఎంఎల్ఏ) పలకాలని అంటారు. నిజమేనా?

**– ఎం. మదన్‌మోహన్‌రావు, మిర్యాలగూడెం**

**జవాబు:** కలిపి పలకకూడదనే rule ఏమీలేదు. అయితే abbreviation విషయంలో, దాన్లో ఉన్న అక్షరాలు తెలిపే శబ్దాలను మాత్రం correct గా pronounce చేయాల్సిందే కదా. అలాంటప్పుడు కొన్ని సంధులు కలవకపోవచ్చు.
MRO = ఎమ్ఆఓఉ (ఉ కు పొల్లు)- ఇక్కడ సంధి, R ను British English లోలా, ఆ అంటామా లేదా American English లోలా, ఆర్ అంటామా అనే దానిమీద ఆధారపడి ఉంటుంది. This is విషయంలో మాట్లాడేటప్పుడు, దిసిజ్ అని కలిపే అంటాం. ఇక్కడ కూడా దేన్నయినా ప్రాముఖ్యం ఇచ్చి పలకాలనుకున్నప్పుడు, This ఇజ్ important అంటుంటాం. (ఇక్కడ This కు ప్రాముఖ్యం. అలాగే Where is it కూడా. Where ఇజిట్? వ్వే (ర్) ఇజ్ it? etc.

**ప్రశ్న:** 1. 'read' మూడు tense లను తెలియజేయండి.
2. ఇంగ్లిష్ మాట్లాడటం వస్తున్నా, మంచి accent మాత్రం రావడం లేదు. ఎలా నేర్చుకోవాలి?
3. స్పోకెన్ ఇంగ్లిష్ టీచింగ్‌లో సెటిల్ కావాలని కోరిక. దీనికి డిగ్రీతోపాటుగా ఇంకేం చేయాలి?

**– శ్యామల, విశాఖపట్నం**

**జవాబు:** 1) Read కు past tense and past participle (read) ను red (రెడ్) గానే pronounce చేస్తాం. రీడ్ అనడం సరికాదు.
2) మంచి accent రావాలంటే phonetic symbols బాగా నేర్చుకుని English news telecasts regular గా వినండి. తప్పకుండా సరైన accent వస్తుంది.
3) Spoken English trainer గా settle అవ్వాలంటే, degree తర్వాత P.G చేసి, Diploma In Teaching English (CIEFL, Hyderabad) course చేయండి.

**ప్రశ్న:** 1) Be అనే పదానికి past tense- was/ were అని, past perfect tense కు been అని రాశారు. Is అనే పదానికి was - were అవుతుంది కదా. అలాకాకుంటే is కు tense ఏమిటి?
2) చాలామంది మాటల్లో 'కాంట్‌బట్' అంటుంటారు. దానర్థం తప్పనిసరి అనా? అలాగే 'certainly' అన్నా 'తప్పనిసరి' అని అర్థం కదా. ఈ పదాన్ని ఎందుకు ఉపయోగించరు?
3) Sorry, apology కు మధ్య తేడా ఏమిటి? రెండింటికి 'క్షమాపణ' అనే అర్థం కదా. ఏయే సందర్భాల్లో వీటిని ఉపయోగిస్తారో వివరించండి.

**– కె. శ్రీదేవి, శృంగవరపుకోట**

**జవాబు:** 1) be అనేది అన్ని be forms కూ వర్తిస్తుంది. అయితే to be = is. కాబట్టి be (is) కు past tense, was/ were, past perfect, been. Is - present tense కదా?
2) Can't but = చేయకతప్పదు. He can't but go there = అతడక్కడికి వెళ్లక తప్పదు.
Can't but situation = తప్పనిసరి పరిస్థితి
Certainly = తప్పకుండా
ఈ రెండింటికీ తేడా ఉంది కదా?
I can't but go now = నేను వెళ్లక తప్పదక్కడికి (నా కిష్టంలేకపోయినా, ఇతరుల, పరిస్థితుల, బలవంతం వల్ల.)
I'll certainly go there = నేను తప్పకుండా వెళతాను (ఎవరూ నన్ను బలవంతం చేయడం లేదు.)
3) Sorry= విచారిస్తున్నాను/ చింతిస్తున్నాను.
Apology = క్షమాపణ. ఈరెండింటికీ తేడా:
Sorry: I'm sorry I am late = ఆలస్యంగా వచ్చినందుకు చింతిస్తున్నా.
(అంటే నేను తప్పుచేశాను కాబట్టి చింతిస్తున్నా.) మనం చేసిన తప్పుకు మనంతట మనం చింతిస్తే sorry. Apology అంటే క్షమాపణ కదా. Apology ని demand చేస్తాం. Apology చెబుతాం. ఒకరు sorry అయితే (చింతిస్తే) వాళ్లప్పుడు apology చెప్పవచ్చు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# Shall I make you some coffee?

**Puneeth:** (Would you) mind waiting (for) a bit? once my mom comes back we can start.
(కాసేపు ఆగేందుకు నీకేమైనా అభ్యంతరమా? / ఆగుతావా? మా అమ్మ తిరిగి రాగానే మనం బయలుదేరదాం.)

**Kundan:** Not at all. I'm not in any hurry.
(ఏం ఫరవాలేదు. నాకేం తొందరలేదులే.)

**Puneeth:** Shall I make you some coffee in the mean time?
(ఈలోపు నీకు కొంచెం కాఫీ చేయనా/ ఇవ్వనా?)

**Kundan:** Oh, that'd be welcome. (I) haven't had anything for hours.
(అలాగే. కొన్ని గంటలుగా నేనేం తీసుకోలేదు.)

**Puneeth:** Do you wish to have anything to eat?
(ఏమన్నా తింటావా?)

**Kundan:** I don't feel like it now. Coffee would do.
(ఏమీ తినాలనిపించడం లేదు. Coffee చాలు.)

**Puneeth:** What about this movie we're going to? Is it good?
(మనం వెళుతున్న ఈ సినిమా బాగానే ఉందా?)

**Kundan:** Released three weeks ago it's running to pack houses still.
(మూడువారాల కిందట విడుదలైనప్పటికీ ఇంకా నిండిన halls తో నడుస్తోంది.)

**Puneeth:** (It's) not surprising directed by darshak and starring such big names.
(అందులో ఆశ్చర్యమేమీలేదు, దర్శక్ దర్శకత్వం చేసి, పెద్దపెద్ద తారలు నటించినప్పుడు.)

**Kundan:** The collections recorded so far is really astounding. Expected to hit an all time high, it has already surpassed the producer's estimates.
(ఇంతవరకూ నమోదైన collections చాలా ఆశ్చర్యకరంగా ఉన్నాయి. ఇంతవరకూ, ఇకముందు లేనంతగా గొప్ప collections ఉంటాయని ఆశిస్తోన్న ఈ చిత్రం, నిర్మాత అంచనాలనిప్పటికే దాటిపోయింది.)

Astounding = విపరీతమైన ఆశ్చర్యం కలిగించే
An all time high = ఇంతకుమునుపు, ఇకముందు కంటే గొప్పగా
surpass= దాటిపోవడం /మించిపోవడం
Japan has surpassed the US in the production of fuel efficient cars = తక్కువ petrol తో ఎక్కువ దూరం నడిచే కార్ల తయారీలో జపాన్ అమెరికాను మించిపోయింది.

**Puneeth:** Showing in that old theatre, if it is still drawing crowds, the movie has to be very good.
(అంత పాత theatre లో ఆడుతూ ఇంత మంది ప్రేక్షకులను ఆకర్షిస్తోందంటే, ఆ చిత్రం గొప్పదే అయ్యుండాలి.)

**Kundan:** Shot mostly abroad, the movie includes some sights that are a real treat to the eyes, it seems.
(ఎక్కువ భాగం విదేశాల్లో చిత్రించిన ఈ సినిమాలో కొన్ని దృశ్యాలు కన్నులపండువగా ఉంటాయట.)

treat మామూలు అర్థం = వైద్యం చేయడం; అతిథుల/ ఇతరుల పట్ల మనం చూపే మర్యాద, ఆదరణ లాంటివి. ఇక్కడ అర్థం treat= విందు.
He giving a birthday treat today.
(ఇవ్వాళ అతడు పుట్టిన రోజు విందు ఇస్తున్నాడు.)


M.SURESAN

**Puneeth:** Yea. The theatre is old, and the road to it, repaired just a year ago, is now in a bad shape thanks to the quality of our municipality works.
(ఆ hall పాతది. అక్కడికెళ్ళే రోడ్డు ఏడాది కింద repair చేశారు. అపుడే అధ్వానంగా తయారయ్యింది, మన మునిసిపాలిటీ పనుల నాణ్యత తీరది.)

**Kundan:** Isn't that your mom coming?
(ఆ వస్తున్నది మీ అమ్మకాదా?)

**Puneeth:** Sure she is. We can start now.
(అవును కచ్చితంగా. మనం బయలుదేర వచ్చు.)

***Look at the following expressions from the conversation above:***

**1) Puneeth: (Would you) mind waiting a bit?**
**Kundan: Not at all.**

**Mind=** అభ్యంతరం చెప్పడం/ ఆక్షేపించడం/ అభ్యంతరం ఉండటం. తెలుగులో ఈ మాటలు కొంచెం పాండిత్యంగా అనిపించినా, Would you mind ...?/ Mind ...? English లో చాలా common. మనం చేసేది, చెప్పేది, అవతలి వాళ్లకు ఇబ్బంది కలిగించేలా ఉంటే మనం చేయక, చెప్పక తప్పకపోతే, అప్పుడిలా- Would you mind/ Mind? అంటాం- మీకేమన్నా అభ్యంతరమా? / మీరేం అనుకోరకదా? అనే భావంతో. If you don't mind అని కూడా అంటాం. ఇందుకు సుముఖ స్పందన (అభ్యే. అలాంటిదేం లేదు అనే అర్థంతో) Not at all అంటాం.

a) A: Would you mind/ Mind my sitting here?/ if I sit here?
(నేనిక్కడ కూర్చోవడం మీకేమన్నా అభ్యంతరమా?. మామూలు తెలుగు: నేనిక్కడ కూర్చోవచ్చా?)
B: Oh, not at all. You are welcome.
(నిరభ్యంతరంగా. తప్పక కూర్చోండి.)

b) A: (Would you) mind giving me your pen?
(మీ pen ఇస్తారా?)
B: Not at all. Here you are.
(ఏం ఫర్వాలేదు. ఇదుగో, తీసుకోండి.)

ఇది Spoken English లో common, ముఖ్యంగా మనం గౌరవించేవాళ్లతో మాట్లాడేటప్పుడు. Practise చేయండి.

**2) Released three weeks ago, its running to packed houses.** ఇక్కడ released, past participle (pp) of release. PP ని సాధారణంగా V3 అంటుంటారు (Third form of the verb అని). అయితే కేవలం PP ఎప్పుడూ verb కాదు. PP కి అర్థం, బడిన, బడే అని వస్తుంది.

Released three weeks ago = మూడువారాల కిందట విడుదల చేయబడి- (మామూలు తెలుగు: మూడువారాల కిందట విడుదలయ్యి ...)

**3) Directed by Darshak, and starring such big names -** ఇక్కడ కూడా, directed, past participle. అర్థం- నిర్దేశించబడి.
Directed by Darshak = దర్శక్ చే direct చేయబడి. (మామూలు తెలుగు: దర్శక్ direct చేసిన.)

**4) The collections recorded so far =** ఇక్కడ కూడా recorded, past participle; అర్థం: ఇప్పటి వరకు నమోదు చేయబడిన (మామూలుగా: ఇప్పటివరకు నమోదైన)

**5) Shot mostly abroad** ఇక్కడ కూడా shot - past participle of shoot (చిత్రాన్ని చిత్రీకరించడం) - అర్థం: చిత్రీకరించబడి.
Shot mostly abroad = ఎక్కువ భాగం విదేశాల్లో చిత్రీకరించబడి. (చిత్రీకరించిన/ చిత్రీకరించి.

**6) The road repaired a year ago.**
ఇక్కడ repaired, pp of repair.
అర్థం= repair చేయబడిన. మామూలు తెలుగు: repair అయిన/ repair అయి.
ఇలా use of past participle English లో చాలా common మాత్రమే కాకుండా, సౌకర్యవంతం కూడా.

a) Some of the songs sung at the party were sweet= ఆ party లో పాడబడ్డ పాటలు (కొంత మంది పాడిన పాటలు) మధురంగా ఉన్నాయి.

b) The match began an hour ago is still on = గంట కిందట ప్రారంభించబడిన (మామూలుగా తెలుగు: గంట కిందట ప్రారంభమైన) ఆ match ఇంకా జరుగుతూనే ఉంది.

c) The candidates chosen for the scholarships deserve them. (Scholarships కు ఎంపిక చేయబడ్డ (మామూలు తెలుగు: ఎంపికైన) అభ్యర్థులందరూ అర్హులే.

Past participle ను ఇలా ఉపయోగించడం వల్ల, మన sentences, short అవుతాయి.
చిన్న sentences తో ఎక్కువ భావం తెలపవచ్చు బాగా practise చేయండి.

---

### EXERCISE

**Match the words under A with their meanings under B**

| A | B |
|---|---|
| 1. Anticipation | A. Exploit |
| 2. Profiteer | B. Temple |
| 3. Shrine | C. Peak |
| | D. Expectancy |
| | E. Suppose |

**KEY: 1-D, 2-A, 3-B.**

**Explanation:**

**1) Anticipation = (D) Expectancy-** ఏదైనా జరుగుతుందని/ జరగబోయే దానికోసం ఎదురుచూడటం.
ఎన్నికల ఫలితాలు/ పరీక్షా ఫలితాలు/ ఓ వ్యక్తిని కలుసుకునే ముందు, ఏం జరగబోతుందో అని ఉత్కంఠతో (అప్పుడప్పుడు కంగారు/ భయంతో) ఎదురు చూడటం.

a) In anticipation of a good rank in the exam, he promised a party to his friends = పరీక్షల్లో మంచి rank వస్తుందనే ఊహతో తన friends కు party ఇస్తానని మాటిచ్చాడు

b) We waited with anticipation to meet the great leader =
ఆ గొప్ప నాయకుడ్ని కలుసుకునేందుకు ఉత్కంఠతో ఎదురుచూశాం.

c) She cooked extra food in anticipation of more guests =
ఎక్కువ అతిథులొస్తారనే ఆలోచనతో ఆమె ఎక్కువే వండింది.

Anticipation అంటే ముందుచూపు అనే అర్థం కూడా ఉంది.

**Anticipation X Retrospect** జరిగిపోయిన విషయాల గురించి/ గతం గురించి ఆలోచన
In retrospect, I now see I made a mistake= గతాన్ని గురించి ఆలోచిస్తే నేను పొరపాటు చేశానని అర్థమవుతోంది.

**2) Profiteer = (A) Exploit** - నిత్యావసర వస్తువు ల్లాంటివి కొరతగా ఉన్నప్పుడు, వాటిని ఎక్కువ ధరలకు అమ్మి అక్రమ లాభం పొందడం.

a) Cement and steel dealers are trying to profiteer following the hike in taxes on them =
సిమెంట్, ఉక్కుమీద పన్నులు పెంచడంతో, వ్యాపారులు వాటిని ఎక్కువ ధరలకమ్మి అక్రమ లాభాలు పొందుతున్నారు.

b) The government has warned traders against profiteering in essential commodities =
నిత్యావసర వస్తువులు అక్రమ లాభాలకు విక్రయించకూడదని ప్రభుత్వం వ్యాపారుల్ని హెచ్చరించింది.

**Profiteer X Lose.**

**3) Shrine = (B) Temple** = గుడి/ గుడిలాంటి పవిత్ర/ ప్రార్థనా మందిరాలు.

a) At Tirumala is the shrine of Lord Venkateshwara =
తిరుమలలో శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయం ఉంది.

b) He spent his retired life visiting all the shrines in India =
తన పదవీ విరమణ తర్వాత గుళ్లూ గోపురాలు దర్శిస్తూ జీవితం గడిపాడాయన.

---

**Q.** *1. As elusive as a pick-pocket అంటే ఏమిటి?*
*2. ఇంగ్లిష్‌లో కొన్ని పదాలకు వ్యతిరేక పదాలు రాయాలంటే కొన్నింటిముందు non, మరికొన్నింటిముందు un, ఇంకొన్నింటిముందు im, dis అనే పదాలు రాస్తాం. వీటికి ఏమైనా సూత్రాలు ఉన్నాయా?*
*3. Bank - shore మధ్య తేడా ఏమిటి?*
**– ఎస్. పట్టాభిరామ్, జగ్గయ్యపేట**

**A.** 1. Elusive అంటే చేతికి చిక్కని. సులభంగా దొరకని దొంగలు, నేరస్థులు, చేతికి దొరకని చేపలు, చేజిక్కని అవకాశాలూ ఇలాంటివి elusive.
pickpockets (జేబుదొంగలు) చేతికి చిక్కరు సులభంగా. అందుకని జేబుదొంగల్లా చేతికి చిక్కని వాళ్లను as elusive as a pickpocket అంటాం.
2. ఇలా వ్యతిరేక భావాలను, అర్థాలను మార్చేందుకు, మాటల ముందు చేర్చే 'un-' 'in-', 'non-' 'dis-' లాంటి శబ్దాలను prefixes అంటాం. ఈ శబ్దాలను ఉపయోగించడానికి సూత్రాలేం లేవు. ఏ భాష నుంచి English లోకి మాటవచ్చిందనే దాన్నిబట్టి, ఈ prefixes వాడకం ఉంటుంది.
3. నది ఒడ్డు- bank. సముద్రపు ఒడ్డు shore.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




SPOKEN ENGLISH

ఆంగ్లభాషణ 448

# .. laws made only to be broken

**Snehit:** This is one of the books published recently on the subject of child labour.
(బాలకార్మిక వ్యవస్థ మీద ఈమధ్య ప్రచురించిన పుస్తకాల్లో ఇదొకటి.)

**Samhit:** Why are you showing it to me?
(నాకెందుకు చూపిస్తున్నావ్?)

**Snehit:** My uncle has written it; those who have read it say it is very good.
(ఇది రాసింది మా బాబాయ్. దానిని చదివినవాళ్లందరూ అది చాలా బాగుందన్నారు.)

**Samhit:** That's a topic debated quite often nowadays. In spite of the ban on it, child labour continues unchecked.
(ఈ రోజుల్లో తరచూ అందరూ చర్చిస్తున్న విషయం అది. బాలకార్మిక వ్యవస్థను నిషేధించినప్పటికీ, అదుపులేకుండా సాగిపోతూనే ఉంది.)

**Snehit:** This is perhaps one of the laws made only to be broken.
(ఉల్లంఘించేందుకే చేసిన చట్టాల్లో ఇదొకటేమో.)

**Samhit:** (It's) not so simple as it looks. Perhaps it will take some more time.
(కనిపించేంత సులభమైన సమస్యేం కాదది. ఇంకొంచెం కాలం పడుతుంది, పూర్తిగా అమలయ్యేందుకు.)

**Snehit:** How about giving the book a look?
(ఆ పుస్తకాన్ని ఓసారేమన్నా చదువుతావా?)

**Samhit:** Oh sure. I was about to ask you myself.
(తప్పకుండా. అసలు నేనే నిన్ను అడగబోతున్నా.)

**Snehit:** It's not as interesting as a novel certainly, but it does give us a lot of information. Reading it certainly adds to our general knowledge.
(నవలల్లాగా ఆసక్తికరంగా లేదుకానీ మనకు చాలా విషయాలను తెలుపుతుందీ పుస్తకం. మన general knowledge పెంచుతుంది.)

**Samhit:** Your comparing it with a novel is meaningless. If it were a novel about child labour, the comparison would be right.
(నువ్వు దాన్ని novel తో పోల్చడం సరికాదు. అది బాలశ్రమ ఆధారంగా రాసిన novel అయితే, అలా పోల్చడం correct అవుతుంది)

**Snehit:** My uncle is good at making things interesting. Holding reader's attention on a matter like this one isn't possible for everyone.
(విషయాల్ని ఆసక్తి కలిగించేట్లు చేయడం మా బాబాయికి బాగా తెలుసు. ఇలాంటి అంశంమీద పాఠకుల ఆసక్తిని నిలిపి ఉంచడం అందరికీ సాధ్యంకాదు.)

**Samhit:** How about lending it to me for a couple of days?
(నాకో రెండురోజులపాటు ఆ పుస్తకం ఇవ్వగలవా?)

**Snehit:** Oh, sure. Have it.

**Samhit:** Thank you.

**Snehit:** Welcome

కిందటి lesson లో మనం past participle ఉపయోగం English conversation లో ఎంత ఎక్కువగా ఉంటుందో చూశాంకదా? Past participle కు బడిన/ బడి నటువంటి అనే అర్థాలు కూడా వస్తాయని తెలుసుకున్నాం. ఇప్పుడు మరికొన్ని వివరాలు చూద్దాం.

***Look at the following sentences from the dialogue above:***

*1) This is one of the books published recently*

*2) That's a topic debated quite often*

*3) ... it remains unchecked*

*4) This is one of the laws made only to be broken*

**1) One of the books published on the topic=** ఈ అంశంమీద ప్రచురించబడిన (Published- past participle) పుస్తకాల్లో ఒకటి. మామూలు తెలుగు- ఈ అంశంమీద ప్రచురితమైన పుస్తకాల్లో ఇదొకటి. (గమనిక: English లో చాలా verbs కు past tense, past participle ఒకేలా ఉంటాయి. అలాంటప్పుడు అది past tense అవుతుందా, PP అవుతుందా అని సందేహం కలుగుతుంది. ఈ సందేహం అక్కర్లేదు. ఇలాంటిచోట్ల past tense రాదు.



M.SURESAN

Past tense వస్తే subject ఆ పని చేసినట్లు అని అర్థం వస్తుంది. Eg: The book published last week. ఇక్కడ published, past tense గా తీసుకుంటే, ఆ పుస్తకం ప్రచురించింది అని అర్థం వస్తుంది. పుస్తకం ప్రచురింపబడుతుందే గానీ, ప్రచురించదు కదా. కాబట్టి ప్రచురించబడు అనే అర్థం వస్తే అది past participle మాత్రమే అవుతుంది. ఇంకో example చూడండి.

a) The man killed was about fifty years old

b) The man killed the snake.

(a) లో killed, past tense గా తీసుకుంటే ఆ మనిషి చంపాడు అనే అర్థం వస్తుంది. ఎవరిని? దీనికి ఈ sentence లో జవాబు లేదు. కాబట్టి ఇందులో killed, past participle అవుతుంది, ఆ చంపబడ్డ మనిషి దాదాపు 50 ఏళ్లవాడు. మనం మామూలుగా అంటాం- ఆ చనిపోయిన మనిషి దాదాపు 50ఏళ్లవాడు. ఇలా తెలుసుకోవాలి, past tense కూ, past participle కూ difference.

**2) This is a topic debated quite often:** తరచుగా చర్చించబడుతున్న అంశం ఇది (తరచుగా దీన్నందరూ చర్చిస్తున్నారు).

a) The question raised often is whether Chiranjeevi will enter politics or not - ఇందులో raised - PP of raise = తరచూ వేయబడే (చాలా మంది లేవనెత్తే) ప్రశ్నే చిరంజీవి ... అని.

b) The book selected for the prize = బహుమతికి ఎంచుకోబడ్డ పుస్తకం (బహుమతికి ఎంపికైన పుస్తకం).

**3) It remains unchecked-** unchecked (PP) (అదుపు చేయబడకుండా) అది అదుపు చేయబడకుండా ఉంటోంది (దానికి అదుపు లేకుండా పోతోంది- మామూలు తెలుగు).

a) It remained closed for several days = చాలారోజులపాటది మూయబడే ఉంది. (మామూలు తెలుగు- చాలా రోజులపాటది మూసే ఉంది.)

b) Several children vaccinated developed reactions= టీకాలివ్వబడ్డ (vaccinated- PP) చాలా మంది పిల్లలకు అది పడలేదు.
(మామూలు తెలుగు- టీకాలు వేసిన చాలా పిల్లలకదిపడలేదు)

**4) This is one of the laws made.** (made- PP) = చేయబడ్డ చాలా చట్టాల్లో ఇదొకటి. (చేసిన చట్టాల్లో ఇదొకటి).

Past participle కు ఇంకో ఉపయోగం చూద్దాం.

a) The book torn was mine - చింపబడ్డ (చిరిగిపోయిన) పుస్తకం నాది.

b) His torn book shows his carelessness.

Sentence (a) లో PP, torn book తర్వాత; (b) లో torn (PP) book ముందు వస్తోంది కదా. రెండు sentences లోనూ అర్థం మామూలు తెలుగులో- చిరిగిన పుస్తకం అని. ఇంకా చూడండి.

The candidates selected will soon get orders= The selected candidates= ఎంపిక చేయబడ్డ (ఎంపికయిన) అభ్యర్థులు orders పొందుతారు. (మామూలు తెలుగు- ఎంపికయిన అభ్యర్థులకు orders త్వరలో వస్తాయి) అయితే PP ముందు వెనకలైనప్పుడు అన్నిచోట్లా ఒకే అర్థం రానక్కరలేదు. అప్పుడు సందర్భాన్నిబట్టి అర్థం చేసుకోవాలి.

a) His shirt, torn in the fight, is new= ఆ పోట్లాటలో చింపబడ్డ అతడి shirt (పోట్లాటలో చిరిగిన అతడి shirt కొత్తది)

b) His torn shirt showed his poverty= అతడి చిరిగిన/ చింపబడ్డ shirt అతడి పేదరికాన్ని చూపించింది.

మీరు చదివేటప్పుడు, ఈ past participle ఉపయోగాన్ని జాగ్రత్తగా గమనించండి.

Newspaper Head lines లో past participle వాడకం చాలా సాధారణం. ఈ కింది Newspaper head lines study చేయండి- past participle use తెలుసుకునేందుకు.

a) BJP leaders Arrested on their protest March=
నిరసన యాత్రలో Arrest చేయబడ్డ BJP నాయకులు.

b) Two Maoists shot dead in encounter =
ఎదురుకాల్పుల్లో కాల్చిచంపబడ్డ మావిస్టులు.
(తెలుగు పత్రిక Headline- ఎదురుకాల్పుల్లో ఇద్దరు మావిస్టు కాల్చివేత)

c) Govt. Appeal Turned Down in Supreme court=
సుప్రీంకోర్టులో తోసిపుచ్చబడ్డ ప్రభుత్వ అప్పీలు.
(తెలుగు పత్రికలో: ప్రభుత్వ అప్పీలును తోసిపుచ్చిన సుప్రీంకోర్టు/ సుప్రీంకోర్టు తోసిపుచ్చిన ప్రభుత్వ అప్పీలు)

d) Three Held in a Murder Case=
హత్యకేసులో అరెస్టు చేయబడిన ముగ్గురు.
(held= arrested. తెలుగు Headline: హత్య కేసులో ముగ్గురి అరెస్ట్)

e) Halltickets Not Received =
అందని halltickets.

f) One Killed and Six Injured In Road Accident=
(చంపబడ్డ ఒకరు, గాయపరచబడ్డ ఆరుగురు)
మామూలు తెలుగు- రోడ్డు ప్రమాదంలో ఒకరి మరణం, ఆరుగురికి గాయాలు.

**EXERCISE**

**Write News headlines in English for the following, using past participles.**

a) ముగ్గురు టెర్రరిస్టుల నిర్బంధం
(నిర్బంధించడం= detain)

b) పేదలకు పట్టాల పంపిణీ
(పంచడం= Distribute)

c) దుబాయ్‌లో ముగ్గురు భారతీయ కార్మికుల మరణం
(PP of Kill వాడండి)

d) నేపాల్‌లో ఎన్నికల నిర్వహణ
(hold= నిర్వహించడం).

**ANSWERS**

a) Three terrorists detained

b) Pattas distributed to the poor

c) Three Indian labourers killed in Dubai

d) Elections held in Nepal

Q&A

**Q.** "నిన్న ఎవరి నెక్లెస్ పోయింది" అనడానికి *Whose necklace was lost/ was missing yesterday?* అన్నారు. ఇక్కడ *was missing* అంటే *past continuous* అవుతుంది కదా! దీనిని ఎలా వాడారో వివరించగలరు.

***- Ashok, Hyderabad***

**A.** Where necklace was missing- ఇక్కడ missing, was missing లో భాగంగా past continuous కాదు. Missing ఇక్కడ, The, book is interesting లో interesting లాగా adjective. 'When she came back, the necklace was missing' - ఇక్కడ was missing అనేది past continuous- necklace కనిపించలేదు అనే అర్థంతో.

I knew I was missing the movie - Movie కోల్పోతున్నానని/ పోగొట్టుకుంటున్నానని అనే అర్థంతో, was missing past continuous. రెండు ప్రయోగాలు సందర్భాన్నిబట్టి correct అయినప్పుడు, అది ఏ tense, ఏ part of speech అనే చర్చ అనవసరం కదా?

**Q.** *1. 'i' in 'Na'ive' is always written or printed like `i (double dot over `i) why?*

*2. Are energy forms like electricity, magnetism, heat, light.. material nouns or abstract nouns? Explain why?*

*3. I am married. Is it the passive form as I am married (by someone) or married is used as an adjective? How can we know?*

*4. Are Americans following Britain English or following their own. I have asked this because in some grammar books written by Norma Lewi, who is native Author of America. I found 'meter' instead of 'metre' and so many.*

***- Ch. Govardhan, Pidathapolur***

**A.** 1) The i in Na'ive is always printed with double dots to indicate that both the vowels 'a' and 'i' are pronounced, as na-Ive and not as neive.

2) All these nouns are abstract nouns. But when light means a lamp it is a common noun.

3) In 'I am married', married is an adjective, like interested in 'I am interested'. We know it is not the passive form because in the passive form we use the object, I am married to him/ her. In this sentence, am married is passive. In the sentence, I am married- married is an adjective.

4) Americans follow American English and not British English. The official spelling book in the US is Webster's Dictionary (Webster was an American and he was solely responsible for American spelling.) In other aspects like pronunciation and usage too, only American English is accepted in the US.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 449

# He enjoys taking long walks

☆**Susen:** You look so tired, why? people moving to new homes should apear happy.

(ఏంటి? అలసిపోయినట్లు కన్పిస్తున్నావు? కొత్త ఇంటికి మారేవాళ్లు సంతోషంగా ఉండాలి కదా?)

**Prasen:** A new home does make me happy, but moving into it is not such an easy thing. Packing and moving do take the life out of you. Believe me I haven't had a wink of sleep for three days now.

(కొత్త ఇల్లనేది సంతోషకరమైన విషయమే, కానీ అందులోకి మారడం సులభమైన విషయమేమీ కాదు. సామాన్లు ప్యాక్‌చేయడం, వాటిని తరలించడం ప్రాణం పోతుందనుకో. మూడ్రోజులుగా నాకు ఒక్క కునుకు లేదంటే నమ్ము.)

Take the life out of some one = ప్రాణం తీయడం.

The money lender is taking the life out of the farmer for the money he lent him =

ఆ వడ్డీ వ్యాపారి తను ఇచ్చిన అప్పుకు, ఆ రైతు ప్రాణాలు తోడేస్తున్నాడు/ తీస్తున్నాడు.

Money lender = వడ్డీ వ్యాపారి

**Susen:** But you've engaged professional packers and movers for the job.

(అయితే నువ్వు ఆ పనిని సామాన్లు ప్యాక్ చేసి, తరలించే కంపెనీకి అప్పజెప్పావు కదా?)

professional = ఏ పనైనా ఒక వృత్తిగా, సంపాదనకు చేసే.

Professional Tennis players = వృత్తిగా, ఉపాధి కోసం టెన్నిస్ ఆడే క్రీడాకారులు

Professional actors = వృత్తిపరమైన నటులు.

Professional x Amateur = సరదాకోసం చేసేవాళ్లు.

(మనలో చాలామంది amateur photographers / actors కదా?)

**Prasen:** They are not so careful how they pack and move. You must supervise their work, or else your goods are damaged.

(అంత జాగ్రత్తగా ఏంచేయరు వాళ్లు, ప్యాకింగ్ అయినా, తరలించడమైనా, నీ పర్యవేక్షణ ఉండాలి. లేకుంటే మన వస్తువులు పాడవుతాయి.)

**Susen:** And then, there is of course arranging things in the new home. That you have to do it yourself.

(ఆ తర్వాత వాటినన్నింటినీ సర్దడం ఉందిగా. అది నువ్వే చేస్కోవాలి.)

**Prasen:** That's right. That has taken me a whole couple of days. Still it is'nt over.

(అవును. అందుకు నాకు రెండురోజులు పట్టింది. అయినా ఇంకా అది పూర్తవలేదు.)

**Susen:** Sleeping in a new place makes a difference as well.

(కొత్తచోట నిద్రించడం కూడా కాస్త తేడానే.)

**Prasen:** Yea. Takes some time, adjusting to the new place.

(అవును. కొత్త చోటుకు అలవాటు పడేందుకు సమయం పడుతుంది.)

**Susen:** Isn't yours the newly painted house, the third one on the right side of the street?

(నీది ఆ వీధిలో కుడి వైపున రంగులు వేసిన మూడో ఇల్లేకదా?)

**Prasen:** That's the one.

**Susen:** Isn't your accommodation paid for by your company?

(నీ వసతి/ ఇంటికి అద్దె కంపెనీయే చెల్లిస్తుందా?)

**Prasen:** Not the whole of it, just 60% of it.

(మొత్తం కాదు. 60 శాతం మాత్రమే)

**Susen:** Wish you a happy life in your new home.

(కొత్త ఇంట్లో నువ్వు సంతోషంగా ఉండాలని కోరుకుంటున్నాను.)

**Prasen:** Thank you.

☆ ☆ ☆

క్రితం రెండు lessons లో Past participle uses చూశాం. ఈ lesson లో present participle (...ing form) uses తెలుసుకుందాం.

**Look at the following sentences from the dialogue above.**




1) People moving into new homes should appear happy.
2) ... but moving into a new home is'nt such an easy thing.
3) Packing and moving do take the life out of you.
4) There is, of course, arranging things in the new home.
5) Sleeping in a new place does make a difference.

సాధారణంగా '...ing' form కు వచ్చే అర్థాలు 1) ఏదైనా ఒకపని చేస్తున్న,
2) ఒక పని చేయడం,
3) ఒకపని చేసే.. అనే అర్థాలు వస్తాయి. ఇప్పుడు చూడండి

1) People moving into new homes should appear happy =
కొత్త ఇంట్లోకి మారే వాళ్లు సంతోషంగా కనిపించాలి.

a) Students doing engineering have good job opportunities =
ఇంజినీరింగ్ చదివే విద్యార్థులకు మంచి ఉద్యోగావకాశాలున్నాయి.

b) Vehicles plying the highway have to pay a toll =
ఈ రహదారిలో వెళ్లే వాహనాలు టోల్ చెల్లించాలి.

c) Teachers teaching maths need a lot of patience =
లెక్కలు బోధించే టీచర్లకు చాలా ఓర్పు అవసరం

II '...ing' form కు ఇంకో అర్థం ఒకపని చేయడం

2) Packing and moving into a new home isn't such an easy thing =
సామాన్లు ప్యాక్ చేయడం, కొత్త ఇంటికి మారడం అంత సులభమైన విషయం కాదు.

a) Watching Indian movies can be boring =
భారతీయ సినిమాలు చూడటం విసుగు కల్గించవచ్చు

b) Smoking is injurious to health =
పొగపీల్చడం ఆరోగ్యానికి హానికరం.

నాలుగో వాక్యంలో arranging కు కూడా ఇదే అర్థం వస్తుంది.

4) Arranging things in a new home takes the life out of us =
కొత్త ఇంట్లో సామాన్లు సర్దడం మన ప్రాణాల్ని తోడేస్తుంది.

(అయిదో వాక్యం కూడా అంతే.)

5. Sleeping in a new place does make a difference =
కొత్త చోట నిద్రించడం, మనకు కాస్త తేడాగా అన్పిస్తుంది.

ఇదీ '....ing' form అర్థం, ఉపయోగం. Spoken English లో ఇలా '....ing' form వాడటం చాలా తరచు.

ఇంకా ఇలా కూడా వాడతాం: ఒకరు ఒక పని చేయడం అనే అర్థంతో.

His coming here makes everyone happy =
అతనిక్కడికి రావడం అందరికీ ఆనందం కలిగిస్తుంది.

Kumar's buying the site was a wise move =
కుమార్ ఆస్థలాన్ని కొనడం తెలివైన పని.

గమనించండి: ఇలాంటి చోట్ల, అంటే ఒకరు ఒక పని చేయడం అనే అర్థంతో my, our, your, his, her, their + ing form వస్తుంది.

a) I don't like your coming late to class.
(నువ్వు క్లాసుకు ఆలస్యంగా రావడం నాకిష్టం లేదు.)

b) My father was angry at my getting such low marks
(నేనంత తక్కువ మార్కులు తెచ్చుకోవడం పట్ల మా నాన్నకు కోపం వచ్చింది.)

c) He is not keen on our attending the function=
మేమా కార్యక్రమానికి హాజరు కావడం పట్ల అతడికి అంత పట్టింపులేదు.

Keen = శ్రద్ధ/ పట్టింపు ఉండడం.

He is keen on going to the US =
అతడు అమెరికా వెళ్లాలనే పట్టింపు/ పట్టుదలతో ఉన్నాడు)

ఒక వ్యక్తి ఒక పనిచేయడం అనే అర్థంతో వాళ్ల పేర్ల వెంటనే 's తోకానీ/ లేకుండా కానీ ...ing form వాడతాం.

a) Every one observed Prasanth's/ Prasanth talking to the girl = ప్రశాంత్ ఆ అమ్మాయితో మాట్లాడటం అందరూ గమనించారు.

b) The students' / students shouting of Slogans wasn't to the liking of the principal =
విద్యార్థుల నినాదాల గొడవ ప్రిన్సిపల్‌కు నచ్చలేదు.

c) Everyone was shocked at Kesav's/ Kesav talking like that =
కేశవ్ అలా మాట్లాడటం పట్ల అందరూ దిగ్భ్రాంతి చెందారు. Be used to (అలవాటుండటం/ పరిపాటి కావడం), enjoy (ఆనందించటం), give up (మానేయడం), Mind (అభ్యంతరం తెలపడం) = Object to, Prefer ఒక దానికన్నా ఇంకోటి ఎక్కువ ఇష్టపడటం.

Practise- వీటి తర్వాత ఎప్పుడూ Noun గానీ లేకుంటే -'ing' form గానీ వస్తుంది. Infinitive రాదు.

a) i) I am used to the heat of Vijayawada.
(నాకు విజయవాడ ఎండవేడి అలవాటే. Heat-noun)

ii) I am used to getting up early.
(నాకు పెందలాడే లేవడం అలవాటు. Getting-ing form)

b) i) He enjoys sweets. (sweets తినడాన్ని అతడు ఆనందిస్తాడు. Sweets-noun)

ii) He enjoys taking long walks.
(చాలా దూరం నడవడాన్ని అతడు ఆనందిస్తాడు/ అతనికిష్టం)

c) i) He gave up his job for an acting career.
(నటనా వ్యాపకం కోసం అతడు తన ఉద్యోగాన్ని మానేశాడు/ వదిలేశాడు.)

Gave up + job (noun)

ii) He gave up smoking
(smoking మానేశాడతను.)

gave up + smoking ...ing form).

---

**Practise the following aloud in english.**

**Pradhan:** అతడిక్కడికి రావడం గురించి నీకు తెలుసా?

**Pravesh:** వాళ్లక్క తన friend తో మాట్లాడటం చూడగానే నాకర్థమయింది అతడొచ్చాడని.

**Pradhan:** అతడిలా suddenగా రావటం నాకిష్టం ఉండదు. అతడిక్కడుంటే చూసుకోవడం (attend on) పెద్ద తలనొప్పి.

**Pravesh:** అతడిని ఒంటరిగా వదిలి వెళ్లడం bad manners కదా?

**Pradhan:** అతడు వెళ్లటం గురించి నీకేమయినా తెలుసా?

**Pravesh:** నేనింకా అతడిని కలవలేదు.

**Answer**

**Pradhan:** Do you know about his coming here?

**Pravesh:** When I saw his sister talking to her friend, I knew he had came.

**Pradhan:** I don't like his coming suddenly like this. when he is here attending on him is a headache.

**Pravesh:** Leaving him alone will be bad manners

**Pradhan:** (Have you) any idea of his going?

**Pravesh:** I haven't met him yet.

Q&A

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలో తెలుపండి.

1. ఇరుక్కుని కూర్చోవడం (ఉదా: ఒకే బల్లపై అందరూ ఇరుక్కుని కూర్చోవద్దు.)
2. ఇసకేస్తే రాలనంత జనం ( ఉదా. ఈ రోజు తిరుమల్లో ఇసకేస్తే రాలనంత జనం ఉన్నారు.)

–ఎన్.శ్రీ, తిరుపతి

**A.** 1. Sitting crowded/ to sit crowded/ to crowd (Don't sit crowded on the same bench) (The bench is cramped/ crowded. Why don't some of you move out? = Bench ఇరుగ్గా ఉంది. మీలో కొంత మంది వచ్చేయండి.

2. దీనికి తగ్గట్టుగా ఏమీలేదు. అయితే ఇలా అనొచ్చు Crowd too thick to let even sand grains to pass.

**Q.** స్పోకన్ ఇంగ్లిష్ పాఠాలు నిరంతరాయంగా ఇవ్వడం కంటే వందో, రెండువందలో పాఠాలతో ఒక భాగాన్ని ముగించి, ఆ తరవాత అడ్వాన్స్‌డ్ పాఠాలతో మరో భాగం మొదలు పెట్టి ఉండవచ్చు కదా? ఈ స్పోకన్ ఇంగ్లిష్ పాఠాలు ఎప్పటికి పూర్తవుతాయి? ఇంగ్లిష్‌లో మాట్లాడాలంటే మీరిచ్చిన వాటిలో ఎన్ని పాఠాలు చదివితే సరిపోతుంది?

– ఎస్.వెంకట్, పి.తిరుమల్ హైదరాబాద్

**A.** భాష అనేది ముఖ్యంగా English లాంటిది ఎప్పుడూ మారుతూనే ఉంటుంది. అందుకే ఇంకా ఇలా ఇస్తున్నాం. మామూలుగా నిత్యజీవితంలో అవసరమయ్యే వరకు తెలుసుకునేందుకు మొదటి 200 lessons చాలు. అయితే ఇంకొంచెం బాగా మాట్లాడేందుకు practice కోసం ఈ Lessons ఇస్తున్నాం. Advanced Stageలోనే మనం ఉన్నాం. ఇప్పుడు ఇలా ఇస్తూండటం వల్ల మీరు Englishలో touchలో ఉండి కొత్తవి నేర్చుకోగలుగుతారు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Q.** 1. Accent అంటే అర్థం, ఉపయోగం తెలుపండి.

2. Too, also, so do, either లు ఒకేలా అనిపిస్తాయి. వాటిని ఎలా ఉపయోగించాలో తెలుపండి.

3. Phrasal verbs కు ప్రత్యామ్నాయం ఉందా? వాటి ఉపయోగం ఏమిటి? Example- adjust = make do. అలాగే phrasal verbs, Idioms ను conversation లో ఉపయోగిస్తే effective గా ఉంటుందా?

**- K.Babji, Sankavaram**

**A.** Accent అంటే యాస. ఒక దేశం/ ఒక ప్రాంతం/ జిల్లా ప్రజలు ఒక భాషను మాట్లాడే తీరు. మన తెలుగుభాషనే కోస్తా ప్రజలు మాట్లాడే తీరు (Coastal area accent), రాయలసీమ ప్రజలు మాట్లాడే తీరు (Rayalaseema accent) and తెలంగాణలో మాట్లాడే తీరు (Telangana accent) వేర్వేరు కదా. ఒకరి accent ను బట్టి వాళ్ళే ప్రాంతం ప్రజలో చెప్పవచ్చు. We all speak English with an Indian accent = మనం అంతా English ను భారతీయ యాసతో మాట్లాడతాం. Important - ఇంపార్టెంట్ - ఇది ఇండియన్ accent. ఇంపాటంట్, పా నొక్కి పలికి pronounce చేస్తే అది British accent అవుతుంది. Accent అంటే stress అని కూడా అర్థం. English లో ఒక మాటలోని ఏదైనా శబ్దాన్ని నొక్కి, పలికితే, ఆ శబ్దం మీద accent/ stress ఉంటుంది. English - ఇందులో మనం (Indians) గ్లీని నొక్కి పలుకుతాం- ఇంగ్లీష్ అని. అయితే ఈ పదంలో ఇం మీద stress. accent ఉంటుంది. ఇంగ్లీష్ - ఇంకొంచెం force తో పలుకుతాం. అంటే English ను pronounce చేసేటప్పుడు, the accent is on 'in'.

2) Too, also, so do, either - వీటి గురించి ఇంతకుముందు lessons లో చాలా వివరంగా తెలిపాం, చూడండి.

3) Phrasal verbs వాడటం వల్ల మన భాష simple గా natural గా ఉంటుంది. Phrasa verbs భాషలో సహజమైన భాగాలు.

Let's adjust with what we have అనడం కంటే Let's make do with what we have అంటే భాష natural గా ఉంటుంది కదా.

(Adjust కొద్దిగా గ్రాంధికం కావచ్చు). Phrasal verbs నూ, idioms నూ వాడితేనే భాష చాలా effective గా ఉంటుంది.

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 450



**Q.** 1. Does it have a name? కరెక్టేనా? third person singular కాబట్టి Does it have a name అనాలి కదా.

2. How go your studies/ How does go your studies ఏది కరెక్టు?

3. Going two hours earlier is better than to be late by two minutes .. ఇది కరెక్టేనా?

4. I don't have at home the tablets I usually take అన్నారు. దాన్ని I don't have the tablets at home which I usually take అంటే తప్పా?

5. So have I, like to ఈ రెండూ ఒకటే అర్థాన్ని ఇస్తాయా?

**- V. Narayana Reddy, Giddalur**

**A.** 1) Question కానప్పుడు not తో, III person singular తో has వస్తుంది. Question లో, notతో Does have అవుతుంది కదా?

2) How go your studies? (నీ చదువెలా ఉంది? )/ How goes life? (జీవితం ఎలా ఉంది? ) ఇవన్నీ పలకరింపు మాటలు. Studies, plural కదా? How does your studies go? అనడం సరికాదు. How does go your studies? ఇంకా తప్పు. (Does go, verb అయినప్పుడు, does కు, go కు మధ్యలో Subject you రావాలి కదా? )

3) Correct.

4) I don't have the tablets at home which I usually take. ఇక్కడ, home which I usually take = నేను మామూలుగా తీసుకునే ఇల్లు అని అర్థం వస్తుంది. తీసుకునేది tablets నేగానీ, ఇంటిని కాదు కదా? కాబట్టి ఇది సరికాదు.

5) So have I. ఇది ఇంకొకరి మాటలకు నాకూ ఉంది, అని స్పందించే వాక్యం.

'I have a car' (నాకు car ఉంది)

'So have I'(నాకూ ఉంది)

ఈ అర్థంతో, I like to ఎలా వస్తుంది? సరికాదు.

**Q.** 1. I have no money. I have not money. ఈ రెండింటికి తేడా ఏమిటి?

2. Vis-a-vis దీని అర్థం ఏమిటి? ఏ విధంగా ప్రయోగించాలి? వివరంగా తెలుపగలరు.

**- Dhana, Hyderabad**

**A.** 1) I have no money- ఇది correct= నా దగ్గర డబ్బులేదు.

I have not money- ఇది సరికాదు.

I haven't (have not) any money/ I haven't the money- ఈ రెండింటిలో ఏదైనా correct, కాస్త అర్థం తేడాతో.

I haven't any money = నా దగ్గరేం డబ్బు లేదు.

I haven't the money= నా దగ్గర (దేనికైనా కావలసిన) డబ్బులేదు.

Why don't you buy a car? = (నువ్వు car ఎందుక్కొనవు? )

I haven't the money = (నా దగ్గర అందుక్కావలసిన) డబ్బులేదు. అందుక్కావలసిన అని అర్థం రావడానికి, the వాడతాం.

'You haven't paid the fees yet' = (నువ్వింకా fees కట్టలేదు)

'I haven't the money' = (అందుక్కావలసిన డబ్బు నా దగ్గర లేదు)

2) vis-a-vis (వీజవీ- జ, size లో జ్ లా) = దానికి సంబంధించి.

# He gets/ got married to her

**Q.** 1. Spoken English, Grammar, Dictionary కి గానీ usage of word book మంచి books (English-Telugu) చెప్పండి. మీరేమన్నా రాశారా?

2. He get married her. He get to do. It get written. He got done the work. ఈ get, got అర్థాలు తెలుపండి.

3. He would like to have done అర్థం తెలుపండి. to have done ఏయే సందర్భాల్లో వాడాలో, ఎన్ని అర్థాలుంటాయో వివరించండి.

4. Past లో, future లోగానీ అతడాపని చేయాలి. దీన్ని English లో ఎలా చెప్పాలి?

5. Could అనేది Future tense లో ఉపయోగించవచ్చా? (అన్ని ఉపయోగాలు తెలుపండి).

He said "He could do the work". అంటే అతడు future లో చేస్తాడనా? past లో చేశాడనా? చేస్తుండేవాడనా?

6. Would do కు చేశాడనే అర్థం ఉందా? He said "He would do the work" అంటే చేస్తుండేవాడనా? Future లో చేస్తాడనా? Usages తెలుపండి.

**- Venkata Rao, Guntur**

**A.** 1) Grammar & usage కు మీకు బాగా ఉపయోగపడే పుస్తకం, Living English structure by Stannard Allen. Dictionary, Oxford Advanced Learner's Dictionary of current English.



M.SURESAN

దురదృష్టవశాత్తూ English - Telugu ఉండే మంచి spoken English book లేదు.

నేనింకా రాయలేదు.

2) He get married to her. He get to do it- సరైన sentences కావు.

He gets/ got married to her, correct.

Get married = పెళ్ళి చేసుకోవడం (get, married తో చేసుకోవడం అనే అర్థంతో వాడతాం.

He get to do it బదులు He has got to do it అనడం correct. Got ఇక్కడ has got అనే verb లో భాగం. దీనికి ప్రత్యేకంగా అర్థం ఉండదిక్కడ.

He has got to do it = అతడది చెయ్యాల్సిందే.

3) He would like to have done it - అది (గతంలో) చేసుండేందుకు ఇష్టపడేవాడే- చేయలేదు.

To have done = గతంలో ఏదైనా చేసుండటం.

To have done it in the circumstances is really great = అలాంటి పరిస్థితుల్లో అలా చేసుండటం (అతడాపని చేశాడు) గొప్ప విషయమే.

He seems to have gone = అతడు వెళ్ళిపోయినట్టున్నాడు.

4) He had to do it = అతడాపని చేయాల్సి వచ్చింది/ చేయక తప్పలేదు, చేశాడు (Past).

He must do it/ He will have to do it/ He should do it = future లో అతడా పనిచెయ్యాలి.

5) Could- future లో possibility (సాధ్యమయ్యే/ జరగగల విషయాన్ని) తెలుపుతుంది.

If you go to Hyderabad, you could run into him= నువ్వు హైదరాబాద్ వెళితే అతడిని అనుకోకుండా ఎక్కడైనా కలుసుకోవచ్చు (అది సాధ్యం).

6) He said he could do the work (He could do the work, inverted commas లో ఉండకూడదు) అర్థం అతడా పని చేయగలుగుతానని చెప్పాడు. అంటే ఈ sentence లో could past నే తెలుపుతోంది కదా?

7) Would do కు చేసేవాడు (వాడుకగా గతంలో) అని అర్థం వస్తుంది.

While at school, he would do it everyday = School లో ఉన్నప్పుడు అది అతడు ప్రతిరోజూ చేసేవాడు. = He used to do it.

He said he would do the work = అతడు ఆ పని చేస్తానని అన్నాడు, ఇక్కడ కూడా he would do it, inverted commas లో ఉండకూడదు.

**Q.** 1. Function, Celebration, Reception వీటిని గురించి వివరించగలరు.

2. Wedding, Marriage వీటిని కూడా తెలుపండి.

**- Meduri Satyanarayana, Hyderabad**

**A.** Function: వేడుక/ ఉత్సవం. Independence day function, marriage function (సాంఘిక, మతపరమైన ఉత్సవాలు)

Celebration: The way in which we conduct a function- ఒక సందర్భాన్ని- పెళ్లి, పుట్టినరోజు, విజయాలను అందర్నీ ఆహ్వానించి ఘనంగా జరుపుకోవడం.

Reception: ఏదైనా birthday, marriage లాంటి సందర్భంలో ఇచ్చే విందు, tea party, etc.

Marriage, wedding దాదాపు ఒకటే- పెళ్లి అని. అయితే wedding అన్నప్పుడు, పెళ్లి సమయంలో జరిగే మత సంబంధమైన పవిత్రంగా భావించే తంతు పద్ధతులకు ప్రాధాన్యం ఉంటుంది.

The marriage took place last year = వాళ్ళ పెళ్లి కిందటేడాది జరిగింది.

The wedding took place with due ceremony= తగిన సంప్రదాయంతో (సంప్రదాయబద్ధంగా) ఆ పెళ్లి జరిగింది.

**Q.** House full, full of house; Non-vegetarian, not -vegetarian; Only vimal, vimal only - వీటిలో ఏది కరెక్టు? Over, up లకు తేడా ఏమిటి? example ను eg: అని రాయవచ్చా?

**- GLT Ram, Secunderabad.**

**A.** 1) House Full అంటే cinema hall నిండిపోయింది. Seats ఖాళీలేవు/ Tickets అన్నీ అమ్ముడయిపోయాయి అని అర్థం. తెలుసుకదా ఇక్కడ house= cinema hall/ theatre అని. Full of house అనం కదా? House కు అర్థం ఇల్లు అనే కాకుండా, ఏ కట్టడం (building) అయినా అని ఇంతకుముందు lessons లో చెప్పాం కదా.

Business House = వ్యాపార సంస్థ.

House = Parliament/ Assembly/ Council/ Meeting - ఇవి జరుగుతున్న ప్రదేశాలు కూడా.

2) Non-Vegetarian (Not-Vegetarian కాదు)= శాకాహారంకాని/ శాకాహారికాని వ్యక్తి. ఈ అర్థాలతో అయితే Non-Vegetarian, Correct. Non అని దేని ముందయినా చేరిస్తే అదికానిది అని.

Indians x Non-Indians (భారతీయులుకానివారు/ భారతీయేతరులు).

Not vegetarian ఒకమాటకాదు, రెండు మాటలు= శాకాహారం/ శాకాహారి కాదు.

3) Over అంటే ఒకదానిపై అని అర్థం.

There is a map on the wall over the table= Table కుపైన ఎక్కడో (Table మీదనే కాకుండా), గోడమీద map ఉంది.

He jumped over the wall = మీది నుంచి దూకాడు, అవతలివైపు.

up = పైకి. He climbed up the hill = కొండపైకి ఎక్కాడు.

His office is up the stairs = మెట్ల పైన అతని office ఉంది.

Up అంటే ఓ దిక్కు, వెంబడే అనే అర్థం కూడా ఉంది. His home is further up the road= అతడి ఇల్లు ఈ రోడ్ వెంబడే దూరంగా/ చివర ఉంది.

4) మనం చెప్పాలనుకున్న భావాన్ని బట్టి, only position ఉంటుంది. He wears only Vimal clothes = అతడు ఎప్పుడూ విమల్ దుస్తులే వేసుకుంటాడు. (ఇంకే కంపెనీవి వాడడు). He only wears Vimal= అతడు మాత్రమే విమల్ దుస్తులు వేసుకుంటాడు- ఇంకెవరూ వాటిని వాడరు. అయితే, He wears Vimal only= He wears only Vimal- ఇక్కడ Vimal only అన్నా, Only Vimal అన్నా ఒకటే కదా?

5) Example కు సరైన abbreviation Eg నే, ఇది Latin భాష నుంచి వచ్చిన Exempligratia (ఎగ్జెంప్లిగ్రేషియా) కు abbreviation. Eg కి correct అర్థం, for example = ఉదాహరణకు, అని.

# ప్రతిభ




**Sanket:** What do I read in this newspaper here? 'Maoists slaughtering Tribals'.
(ఈ వార్తాపత్రికలో నేను ఏం చదువుతున్నాను? 'గిరిజనులను ఊచకోత కోస్తున్న మావోయిస్టులు'.)

**Satwik:** The Chattisgadh Government is yet to learn a lesson or two from the Andhra Pradesh Government in checking the atrocities of the Maoists.
(మావోయిస్ట్ అకృత్యాలను ఆపడంలో ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుంచి ఇంకా నేర్చుకోలేదు.)

Learn a lesson or two- ఇది ఒకరి దగ్గర నుంచి ఇంకొకరు కొంత నేర్చుకోవడం అనే అర్థంతో English లో సాధారణంగా వాడే expression.

There is a lesson or two I can learn from you about spending money carefully = డబ్బు జాగ్రత్తగా ఖర్చుపెట్టే విషయంలో నీ దగ్గర నుంచి కొంత నేర్చుకోవాలి నేను.

**Sanket:** Here's another piece of news under the heading, 'Kutch Rising from the Ruins'.
(ఇంకోవార్త, ఈ heading కింద: 'శిథిలాల నుంచి పైకి లేస్తున్న కచ్'.)

**Satwik:** I've read it. It's interesting. (It) tells us how Kutch, levelled to the ground in the 2001 earthquake, Kutch has developed into a thriving industrial centre.
(నేను చదివానది. చాలా ఆసక్తికరంగా ఉంది. 2001 భూకంపంలో నేలమట్టమైన కచ్ (గుజరాత్‌లోని ప్రాంతం) విజయవంతమైన పారిశ్రామిక కేంద్రంగా ఎలా వృద్ధి చెందిందో చెబుతుందది.)

English Newspaper లలో Headlines (ముఖ్యాంశాలు తెలిపే Headings) సాధారణంగా పైన సంభాషణలో తెలిపినట్లుంటాయి. మన English speaking నైపుణ్యం పెంచుకునేందుకు English Newspapers చదవడం అన్నివిధాలా అవసరం. అందులో భాగంగా English Newspapers లో Headings అర్థం చేసుకోవడం చాలా ముఖ్యం. కొత్తగా చదవడం మొదలుపెట్టేవాళ్లకు ఈ headings కాస్త వింతగా తోస్తాయి. వాటిని అర్థం చేసుకునే విధం ఇప్పుడు తెలుసుకుందాం.

English News headings కొన్ని sentences గా ఉంటాయి, మరికొన్ని Phrases (Groups of Words Without Verbs - Verbs లేని పదసముదాయాలు) గా ఉంటాయి. ఈ phrases మూడు రకాలు: 1) Phrases with '...ing' forms 2) Phrases with infinitives and 3) Phrases with past participles. (ఇంతకుముందే మనకు తెలుసు: కేవలం '...ing' form (going, coming, etc), verb కాదు. Be form తో కలిసి ఉన్న '...ing' form మాత్రమే verb (am going, is singing, etc). అలాగే Infinitive (to go, to sing, etc) verb కాదు. ఆ విధంగానే కేవలం past participle (seen, eaten, given, liked, etc) verb కాదు. దానిముందు be form ఉంటేనే (is seen, are eaten, has been given, will be liked, etc) అవి verbs.

News headlines sentences గా ఉంటే అందులో verbs Ist Regular Doing Words (present simple) గా ఉంటాయి, గతంలో జరిగిన విషయాన్ని report చేస్తున్నా కూడా.

News Headlines లో '...ing' form ఎక్కువగా కొద్దికాలంలోనే కచ్చితంగా జరిగే విషయాలను తెలుపుతుంది.

కాని, ఒక్కోసారి '...ing' form తో ఉన్న headlines ఇప్పుడు జరుగుతున్న విషయాన్ని కూడా తెలుపుతాయి.

Kutch Rising From Ruins = శిథిలాల నుంచి పైకి లేస్తున్న/ అభివృద్ధి చెందుతున్న కచ్. ఇది ఇప్పుడు జరుగుతున్న విషయం.

a) Counting going on in Byelections = ఉప ఎన్నికల్లో కొనసాగుతున్న (ఇప్పుడు) ఓట్ల లెక్కింపు.

b) Cement Dealers Hoarding Stocks = స్టాకులను అక్రమంగా నిల్వ చేస్తున్న సిమెంటు వ్యాపారులు. ఇది కూడా ఇప్పుడు జరుగుతున్న విషయం.

hoard= అక్రమంగా సరకు నిల్వచేయడం (కొరత ఉన్నపుడు అధిక ధరలకమ్మేందుకు)

b) Satyam To Open Software Centres In Somemore Centres = మరికొన్నిచోట్ల సాఫ్ట్‌వేర్ కేంద్రాలు ప్రారంభించనున్న సత్యం (Computers)

c) Public Distribution System To Be Streamlined = ప్రజాపంపిణీ విధానాన్ని చక్కదిద్దనున్న ప్రభుత్వం.

(ఇక్కడ to be streamlined = to be + PP of streamline= ఇది to streamline కు passive form- చక్కదిద్దబడనున్న ప్రజాపంపిణీ వ్యవస్థ అని వస్తుంది. కాని మామూలు తెలుగులో అలా అనం కదా.

d) New Bridge To Be Opened For Traffic Next Month = రాకపోకలకు వచ్చే నెలనుంచి తెరవబడనున్న కొత్తవంతెన. మామూలు తెలుగు - వచ్చే నెల నుంచి (రాకపోకలకు) కొత్త వంతెన ప్రారంభం.

Newspaper Headings ను ఇలా అర్థం చేసుకోవాలి.

**EXERCISE**

**Practise News headlines for the following in English.**

1) కొత్త విమానాశ్రయాన్ని ప్రారంభించనున్న సోనియా గాంధీ(...ing form వాడండి)
2) విశాఖలో రాత్రిపూట విమానాలు దిగే సదుపాయాలు త్వరలో ప్రారంభం (Infinitive వాడండి)
3) త్వరలోనే భారత్‌కు వస్తున్న Olympic జ్యోతి (Torch) (... ing form వాడండి)
4) Royal Challengers ను ఓడించిన Kolkata Knight Riders (Sentence గా RDW వాడండి)
5) కొత్త మోడల్స్‌ను ప్రవేశపెట్టనున్న మారుతి (Infinitive వాడండి).

**ANSWERS**

1) Sonia Gandhi Inaugurating The New Airport.
2) Night Landing Facilities To Begin Soon In Visakha.
3) Olympic Torch Coming To India Soon
4) Kolkata Knight Riders Defeat Royal Challengers.
5) Maruthi To Introduce New Models.

# Government To Open 3 More IITs

**Sanket:** 'BSNL to extend its services to more villages'. This is another news headline.
('మరికొన్ని గ్రామాలకు సేవలను విస్తరించనున్న BSNL')

**Satwik:** That's really welcome news. Whatever India's progress in other fields, its progress in communications during the last ten years has been amazing.
(నిజంగా అది స్వాగతింపదగ్గ వార్త. మిగతా రంగాల్లో భారత్ ప్రగతి ఎలా ఉన్నా, communications రంగంలో మాత్రం అద్భుతంగా ఉంది.)

amaze= చాలా ఆశ్చర్యాన్ని కలిగించడం.

**Sanket:** Government to implement new pay scales from 2006. This is another headline here.
(ఇంకో head line: కొత్త వేతన స్కేళ్లను 2006 నుంచి అమలుపరచనున్న ప్రభుత్వం.)

**Satwik:** This is the election year, you know. The government is going all out to please every section of voters.
(ఇది ఎన్నికల సంవత్సరం కదా? ప్రతి వర్గం ఓటర్లను సంతోషపరిచేందుకు ప్రభుత్వం అన్నివిధాలా ప్రయత్నిస్తోంది.)

Go all out = అన్ని విధాలా ప్రయత్నించడం

**Sanket:** Government to open 3 more IITs in the coming year- this is perhaps the best of the news in the papers today.
(ఇంకా మూడు IIT లను ప్రారంభించనున్న ప్రభుత్వం. బహుశా ఈనాటి వార్తలన్నింటిలో ఇదేనేమో మంచివార్త.)

**Satwik:** It is to start 7 more IIMs too.
(ఇంకా 7 IIMs ను కూడా ప్రారంభించనుంది.)

**Sanket:** And the OBC quota to be implemented from this year too.
(మళ్లీ OBC quota కూడా ఈ సంవత్సరం నుంచే అమలవనుంది.)

**Satwik:** Wait. Someone is calling. Let me attend to it.
(ఆగు. ఎవరో నాకు phone చేస్తున్నారు. చూడని.)


M.SURESAN

Eg: India Wins the Second Test (రెండో test లో భారత్ గెలుపు/ రెండో test ను గెలిచిన భారత్) - ఇక్కడ గమనించాల్సిన విషయం- Match గెలవడం, ఇక్కడ past అయినా heading లో మాత్రం present simple (Regular Doing Words) వాడతారు. దానికింద వివరాలు మాత్రం past tense లో ఉంటాయి. చూడండి:

**India Wins II Test**

India, on Thursday, won the second test against Australia by 36 runs. Tendulkar and Laxman top scored for India.
(గురువారం భారత్, ఆస్ట్రేలియాపై రెండో టెస్టులో 36 పరుగుల తేడాతో విజయం సాధించింది.)

ఇప్పుడు phrases (verbs లేని group of words) తో ఉన్న Headlines చూద్దాం.

***Look at the following from the conversation above:***

*1) Maoists Slaughtering Tribals*
*2) Kutch Rising From Ruins*
*3) BSNL To Extend Its Services To More Villages*
*4) Government To Implement New Pay Scales From 2006*
*5) Government To Open 3 More IITs In The Coming Year*
*6) It Is To Start 7 More IIMs*

**1) Maoists Slaughtering Tribals** - (ఇది '...ing'- form ఉన్న headline = గిరిజనులను ఊచకోత కోస్తున్న మావోయిస్టులు (Slaughter = ఊచకోత/ మేకలు, గొర్రెలాంటి జంతువులను వాటి మాంసంకోసం వధించడం.)

ఇంకా చూడండి:

a) Iran President Visiting India = భారత్‌కు రానున్న/ వస్తున్న ఇరాన్ అధ్యక్షుడు.
(visiting= సందర్శించనున్న. '...ing' form- Headingలో)

b) Congress Preparing For Byelections = ఉప ఎన్నికలకు సిద్ధమవుతున్న కాంగ్రెస్. (Preparing- ...ing form)

c) HUDA Acquiring More land = మరికొంత భూమిని సేకరించనున్న HUDA.
acquiring= సేకరించనున్న.

ఇప్పుడు Infinitives తో (to go, to come etc) తో వచ్చే Headings చూద్దాం. ఇవన్నీ త్వరలోనే కచ్చితంగా జరగబోయే వాటిని తెలుపుతాయి.

**4) Government To Implement New Pay Scales from 2006** = కొత్త వేతనాలను 2006 నుంచి (వెనుక తేదీ నుంచి) అమలుపరచనున్న ప్రభుత్వం.

implement = అమలుచేయడం

**5) and 6) Government to open three more IITs and 7 more IIMs** = ఇంకా మూడు IIT లను, 7 IIM లను ప్రారంభించనున్న ప్రభుత్వం.

a) Symonds To Play For Hyderabad = హైదరాబాద్ తరపున ఆడనున్న సైమండ్స్.



**Q. 1.** Though/ although/ inspite of ఈ మూడూ ఒకే అర్థాన్నిచ్చినా, ఏయే సందర్భాల్లో ఎలా వాడాలో తెలుపగలరు. a) She was very ill. She managed to smile at everyone. b) They mass copied yet they failed- ఈ వాక్యాలకు వీటిని ఎలా ఉపయోగించాలి?

**2.** The meeting had hardly started when slogan shouting began. దీన్ని hardly తో ఎలా ప్రారంభించాలి? ఉదాహరణలతో వివరించగలరు.

**3.** ఆరోగ్యకరమైన శిశుజననాలకోసం చర్యలు తీసుకోవాలనేందుకు measures to birth control babies are needed అనవచ్చా? దీన్ని కరెక్టుగా ఎలా రాయాలి?

***- A.Penchalaiah, Rajampeta***

**A. 1.** a) i) Though/ Although she was ill, she managed to smile at every one.
ii) Inspite of being ill/ Inspite of her illness she managed to smile at everyone.
b) i) Though/ Although they mass copied they failed.
ii) Inspite of mass copying they failed.

Though, although, even though, but, yet, inspite of- వీటన్నిటికీ అర్థం అయినా/ అయినప్పటికీ. అయితే, వీటిని వాడేటప్పుడు sentence construction మారుతుంది. ఈ ఉదాహరణ చూడండి.

She was ill, but/ yet she managed to smile = though/ although/ even though she was ill, she managed to smile.

Inspite of తర్వాత noun/ ...ing form కానీ వస్తుంది. Inspite of her illness (noun)/ inspite of being (..ing form) she managed to smile.

**2.** Hardly had the meeting started when slogan shouting begun. (Hardly తో begin చేస్తే subject ముందు had వస్తుంది.)

a) He had hardly left the theatre when it started raining = Hardly had he left the theatre when it started raining.

b) Supriya had hardly bought the book when some one stole it = Hardly had Supriya bought the book when some one stole it.

c) The sun had hardly risen when the birds began to sing = Hardly had the sun risen when the birds began to sing.

d) He had hardly got his degree when he got a good job = Hardly had he got his degree when he got a job.

**3.** Measures are needed to control the birth of babies (to check population growth.)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 452

# The price rise .. unprecedented

**Ritwik:** The Civil Supplies Department to arrange the sale of cooking oil and red-gram through fair price shops.

(వంట నూనె, కందిపప్పు చౌకధరల దుకాణాల ద్వారా అమ్మకానికి ఏర్పాటుచేయనున్న పౌరసరఫరాలశాఖ.)

**Satwik:** Who says that? (ఎవరంటున్నారది?)

**Ritwik:** It reads so here. That's according to a media release by the Director, Civil Supplies.

(అలా అని ఉందిక్కడ. పౌరసరఫరాల Director విడుదల చేసిన మీడియా పత్రం ప్రకారం.)

**Satwik:** Perhaps it follows a spate of protests and demonstrations by some sections of the people and the opposition parties in the recent weeks.

(కొన్ని వర్గాల ప్రజల, విపక్షాల నిరసనలూ, ప్రదర్శనల కారణంగా కావచ్చు)

**Ritwik:** The price rice in the recent months has been unprecedented. In a bid to control prices the government might have taken the decision.

(క్రితం నెలల్లో ధరల పెరుగుదల ఇంతకుముందెన్నడూ లేనంత ఎక్కువగా ఉంది. ధరలను నియంత్రించేందుకు ప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకునుండొచ్చు.)

unprecedented = ఇంతకుముందు లేనివిధంగా

**Satwik:** The minister in a media conference attributes the price rise to international price situation.

(ఒక మీడియా సమావేశంలో మంత్రి ధరల పెరుగుదలకు, అంతర్జాతీయ ధరల పరిస్థితి కారణంగా తెలిపారు.)

**Ritwik:** That may be the government stand but that isn't the whole reason for it. It's the failure of the government to rein in prices.

(అది ప్రభుత్వ వైఖరి కావచ్చు, కానీ అది పూర్తి కారణం మాత్రం కాదు. ధరలను అదుపుచేయడంలో ప్రభుత్వం వైఫల్యమే అది.)

**Satwik:** Wait. I read some thing sensational here. 'A baba sacrifices a child and drinks its blood'.

(ఉండు. ఇక్కడో సంచలనవార్త కనిపిస్తోంది. 'బిడ్డను బలిచ్చి రక్తంతాగిన బాబా'.)

**Ritwik:** That's really shocking. Just can't understand how people tolerate these fake swamijis.

(అది చాలా దిగ్భ్రాంతికరం. ప్రజలు ఈ కపట స్వాములను ఎలా భరిస్తారో అర్థం కాదు.)

**Satwik:** This is how it goes. 'A seven month old baby ...'

**Ritwik:** Stop it. I can't hear the details. Have the police acted in the matter?

(ఆపు. నేనా వివరాలను భరించలేను. Police ఏమన్నా చర్య తీసుకున్నారా?)

**Satwik:** They've taken him into custody for interrogation.

(వాళ్లతడిని అదుపులోకి తీసుకున్నారు ప్రశ్నించేందుకు)

**Ritwik:** Thank God, they've nabbed him. But it's hundred to one he'll be punished soon.

(పోన్లే వాళ్లతడిని arrest చేశారు. అయితే అతడికి శిక్షపడటం మాత్రం త్వరగా జరగదు)

Spoken English improve చేసుకునేందుకు English newspaper చదవడం చాలా ఉపయోగకరం. అందులో భాష అర్థం చేసుకోవడం ముందుగా కాస్త కష్టం అనిపించవచ్చు ప్రారంభకులకు. గత రెండు lessons లో English newspaper అర్థం చేసుకోవడం ఎలాగో కొంత తెలుసుకున్నాం. మరికొన్ని విషయాలిప్పుడు తెలుసుకుందాం.

***Look at the following sentences from the conversation above.***

*1) The Civil Supplies Department to arrange the sale of cooking oil and red gram through fair price shops = (Red gram = కందిపప్పు)*

*2) That's according to a media release by the Director, Civil Supplies.*

*3) ... it follows a spate of protests and demonstrations by some sections of people and the opposition parties.*

*4) The price rise in recent months has been unprecedented.*

*5) In a bid to control prices the Government might have taken the measure.*

*6) The Government alleges that traders have been hoarding stocks.*

**1) The Civil Supplies Department to arrange the sale of cooking oil and red gram** = వంట నూనె, కందిపప్పు అమ్మకాలు ఏర్పాటు చేయనున్న పౌరసరఫరాలశాఖ.

ఇంతకుముందు చూశాం, ఇలా to arrange అని infinitive ను headings తో తరచూ వాడతారని.

a) Government to take stern action against hoarders - ఇది sentence కాదు. Infinitive తో ఉన్న phrase మాత్రమే- News headlines లో ఇది సాధారణం- అర్థం- అక్రమ నిల్వలు చేసేవారిపై తీవ్ర చర్యలు తీసుకోనున్న ప్రభుత్వం.

b) CM to visit town today = నగరానికి రానున్న CM.

**2) That's according to a media release by the Director, Civil Supplies.**

Media (మీడియా) అంటే వార్తా ప్రతికలూ, రేడియో, టి.వి. వగైరా.

Media- Plural of Medium. ఇక్కడ Medium అంటే Medium of Mass Communication = చాలా మందికి వార్తలను తెలిపేందుకు (communicate చేసేందుకు) వాడే సాధనం- Newspaper, TV, Radio, etc. Print Media = వార్తా పత్రికలు. Electronic Media = TV, Radio లాంటివి. Print Media ను Press అని కూడా అంటారు.

Media release = వార్తాసాధనాల (Print and electronic media) ద్వారా ప్రజలకు విషయాలను తెలిపేందుకు, ప్రసారం కోసం, ఎవరైనా media కు విడుదల చేసే సమాచార పత్రం.

Press Release = పత్రికలకిచ్చే సమాచార పత్రం.


M.SURESAN

A Govt of India media release= Media కు విడుదల చేసిన భారతప్రభుత్వ సమాచారపత్రం/ సమాచారం.

Press/ Media release ను Press/ Media hand out అని కూడా అంటాం.

Media conference = మీడియా reporters కు సమాచారం అందించేందుకు ఏర్పాటు చేసే సమావేశం.

The Govt will take all measures to check the price rice, the minister told a media conference here on friday = ధరలను అదుపులో ఉంచే చర్యలను తీసుకుంటామని మంత్రి శుక్రవారం ఏర్పాటు చేసిన మీడియా (రిపోర్టర్ల) సమావేశంలో చెప్పారు.

Media briefing = మీడియా వారికి సమాచారాన్ని వివరించడం.

Brief= వివరణ/ వివరించడం/ సమాచారం/ సమాచారం అందించడం.

The project director briefed the media about the salient features of the project= Project ముఖ్యమైన లక్షణాలను project director మీడియాకు వివరించారు.

salient= (సెయ్‌లిఅంట్)= ముఖ్యమైన/ గమనించదగ్గ features = లక్షణాలు

**3) A spate of protests and demonstrations.**

spate= వెల్లువ. protest= నిరసన/ వ్యతిరేకత. demonstration= ఒక విషయానికి మద్దతు/ వ్యతిరేకత తెలిపేందుకు గుంపుగా నిర్వహించే ప్రదర్శన.

There were protests and demonstrations against land take over by the Govt for SEZ = ప్రత్యేక ఆర్థిక మండలి (SEZ) కోసం ప్రభుత్వం భూములను స్వాధీనం చేసుకోవడానికి వ్యతిరేకంగా నిరసనలు/ ప్రదర్శనలు జరిగాయి.

మన దేశంలో ఇలాంటివి- protests, demonstrations, hunger strikes (నిరాహారదీక్షలు), relay fasts (జట్లు, జట్లుగా ఒక్కోరోజు నిరాహార దీక్షలు), rally (ఊరేగింపుగా జనం వెళ్లడం)- చాలా సాధారణమే కదా.

Newspaper లో ఎక్కువగా వాడే ఇంకో పదం- following = దాని దరిమిలా/ వెంబడి.

Following the Minister's assurance, the people withdrew their agitation = మంత్రి హామీ ఇవ్వడంతో/ ఇచ్చిన తర్వాత ప్రజలు తమ ఆందోళన (agitation) విరమించుకున్నారు.

Following the rice in prices, the common man finds life difficult = ధరలు పెరగడంతో సామాన్యుల జీవితం కష్టంగా ఉంది.

**4) Unprecedented** = మునుపెన్నడులేని.

Unprecedented rain has hit the farmers hard= ఇంతకుముందెన్నడూ లేని తీవ్ర వర్షాలు రైతులను దెబ్బతీశాయి.

**5) In a bid-** ఇది English newspapers లో తరచూ కనిపించే పదం.

Bid= attempt= ప్రయత్నం

The Police foiled the bid of the demonstrators to force their way into the secretariat= సచివాలయంలోకి బలవంతంగా ప్రవేశించాలన్న ప్రదర్శకుల ప్రయత్నాన్ని police లు విఫలం చేశారు.

foil= ఒకరి ప్రయత్నాన్ని అడ్డుకోవడం

In a bid to get the votes of the minorities the Govt is showing special interest in their welfare = మైనారిటీల ఓట్లు పొందే ప్రయత్నంలో, ప్రభుత్వం వారి సంక్షేమం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపుతోంది.

welfare = సంక్షేమం

**6) Allege** = నిరాధారమైన వ్యాఖ్యలు/ ఆరోపణలు చేయడం. (నిజంకావచ్చు కాని ఆధారాలు లేవు)

allegation = ఆరోపణ.

The dead woman's parents alleged that their son-in-law killed their daughter = అల్లుడే తమ కూతుర్ని చంపాడని మృతురాలి తల్లిదండ్రులు ఆరోపిస్తున్నారు.

b) The Minister alleged that the opposition was politicising everything = ప్రతి విషయాన్నీ ప్రతిపక్షాలు రాజకీయం చేస్తున్నాయని మంత్రి ఆరోపించారు.

## Q & A

**Q.** *1. Gandhi would often say that, he was an ordinary man. ఇది గతంలో (past లో) జరిగిన పనికదా? ఇక్కడ would వాడటం ద్వారా future అవుతుంది కదా? నిజానికి దీన్ని Gandhi used to say that, he was an ordinary man అనాలి కదా?*

*2. కిందివాటిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?*

*a) రేపు మాకు నల్లా వస్తుంది.*

*b) రేపు మాకు నల్లా రాదు.*

*c) నల్లా వస్తోంది బిందెలతో నీళ్లు పట్టుకోండి.*

*d) మీకు నల్లా రోజూ ఎన్ని గంటలు వస్తుంది?*

*e) నల్లా నీళ్లు పట్టి ఉంచరా?*

*3. Sandals, flip-flops, mules, slippers ఈ foot wears మధ్య తేడా ఏమిటి? మనం తొడిగే లెదర్ చెప్పులను ఇంగ్లిష్‌లో ఏమంటారు?*

*4. చపాతీలను ఇంగ్లిష్‌లో ఏమంటారు?*

*5. Make food/ tea.. prepare food/ tea.. వీటిలో ఏది కరెక్టు?*

***- Meer Mukarram Ali, Hyderabad***

**A. 1.** Would, future from the past మాత్రమే కాకుండా, past habit, past practice ను కూడా తెలుపుతుంది. అంటే గతంలో regular/ repeated గా జరిగిన పనిని తెలిపేందుకు కూడా would (=used to) వాడతాం.

Gandhi would often say = Gandhi often used to say = గాంధీ అనేవారు/ చెప్పేవారు. Would = used to.

**2.** a) We get water tomorrow.

b) We don't get water tomorrow.

c) Water is coming. Collect/ draw water in your bitcher (బిందెకు సరిపోయే మాట English లో లేదు.)

d) For how many hours do you get water?

e) Don't you draw water and store it?

**3.** Sandals- మనం belt shoes అనేవి.

Mules- మడమ (heel) ను cover చేయకుండా, పాదం ముందు భాగం మాత్రం cover చేసే, ముఖ్యంగా ఆడవాళ్లు వాడే high heeled foot wear (ఇంట్లో మాత్రమే వాడేవి).

Flip-flops= మన Hawai slippers (ఇంట్లో మాత్రమే వాడేవి).

Slippers= ఇవికూడా ఇంట్లో మాత్రమే వాడతారు. పాదం ముందుభాగం మాత్రమే మూసిఉంచి, Flat గా ఉంటాయి.

Footwear = ఏ రకమైన చెప్పులయినా footwear. ఫైపవ్నీ కూడా footwear (footwears సరికాదు).

footwear = పాదరక్షలు. Shoes/ boots/ mules, etc.

గమనిక: ఫైపవ్నీ కూడా western countries లోనే వాడతారు, flip-flops/ slippers తప్ప. మనం వాడే చెప్పులు English వాళ్లు వాడరు. అందుకని English లో వాటికి సరిపోయే మాట లేదు. Chappal అనే హిందుస్థానీ మాటను మనం English లో వాడతాం. ఇది English వాళ్లకు అర్థం కాదు.

**4.** Chapathi అనే.

**5.** Make/ prepare food/ tea- రెండూ (make, prepare) కరెక్టే. అయితే prepare కొంచెం గ్రాంథికం. Make simple - Make అనడం better.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



**Q.** 1. *A police recruit was asked during exam, what would you do if you had to arrest your own mother? He said 'call for back up'.*

2. *Do you know... what did the potato chip say to the battery? well, guess... It said: If you are Eveready I am Frito Lay.!*

3. *A girl phoned me the other day and said. Come on over, there's no body home, I went over Nobody was home!*

4. *A baby monkey asks his father, Father why are we so ugly? The father says to him don't stress my son you should see the one who is reading this!*

*We want to know the meaning of remarkable phrases underlined above and we will be thankful to you if you explain the whole meaning of the joke fourth one.*

***- Rahaman, Kothapally***

**A.** 1) Back up here means extra help or support you can get if necessary. Back up in computing means a copy of file you keep and use if the original is lost. In this joke, it means that the candidate for the police job means that he alone can't arrest his mother, he needs extra support. This means his mother is too dangerous/ difficult for him to deal with alone!

2) Eveready as you know is a famous brand of battery. Frito lay here, I think, is also the brand name of some substance made of glass and used for technical purposes.

3) The girl says, 'come on over, there's nobody home'. He went there expecting the girl to be alone at home, but 'nobody' (including the girl) was at home! The girl fooled him.

4) Who is the one reading this joke? You, I or for that matter, anyone who is reading the joke. The father monkey means that the reader of the joke is ugly, and so the son monkey need not feel bad about being ugly.




**Q.** *1) Be seated అనేది passive voice కదా! మరి ఎవరితోనైనా Please be seated అన్నది ఉపయోగించడం సరైనదేనా? విపరీతార్థం వస్తుందా తెలుపండి.*

*2) 'ఎన్నో' అన్న మాటకు old English ప్రకారం 'Howmanyeth' అన్న పదం సరైనదేనా?*

***– S. Kumar, Kurnool***




**A.** 1) అవును. Be seated is the passive of "Please seat yourself." అయితే please seat yourself అనేది పాండిత్యం (మీరాసీనులుకండి అన్నట్లు). అందువల్ల (please) be seated, (please) అనడం సరైనదే. అదే సరైనది, మర్యాద simple గా చూపేది.

2) Howmanyeth అనేది old English కానేకాదు. ఈ expression, Gwynn అనే Englishman, English, తెలుగు రెండూ బాగా తెలిసిన పండితుడు suggest చేసిన మాట. అయితే ఈ మాట standard spoken English కాదు. Standard dictionaries లో ఎక్కడా record కాలేదు. మనం ఈ మాట వాడితే మంచి English తెలిసిన చాలామందికి అర్థం కాదు.

# Being she is very intelligent ..

**Q.** 1. *Being their faithful servant, finally Nasreen cheated them.*

2. *Being she is very intelligent, she succeeded in dealing the situation.*

3. *Being it is one of the finest product of Wipro, it is today known to every consumer.*

4. *Being she was disgraceful in public by Ravi, she has decided not to talk to him now onwards.*

5. *Been my watch damaged I returned it to the shop.*

6. *Been beaten by her teacher, Reshma has been not interested going to school.*

7. *Been our companion for the past 6 months, she is not often coming to us, as she became a famous anchor of TV programmes.*

8. *Mr.Sadiq is now improved been learning English for the past 6 months.*

*పై వాక్యాల్లో తప్పులుంటే వాటిని సరిదిద్ది, ఎలా రాయాలో తెలుపగలరు.*

***- Sravani, Nandyala***

**A.** 1) Being అనేది, continuous form of 'be'. 1) Present continuous, past continuous tenses ను passive కు మార్చేందుకు వాడతాం.

a) The machine is being repaired (p.v. of present continuous)= Machine repair చేయబడుతోంది- ఇపుడు.


M.SURESAN

b) The terrorist was being questioned by the police (Terrorist police లచే ప్రశ్నింపబడుతూ ఉన్నాడు- గతంలో ఒక సమయంలో) - passive of past continuous.

2) Being ను అలా ఉండటం వల్ల/ ఆ కారణంగా అనే అర్థంలో వాడతాం.

Being intelligent, she dealt with him cleverly = తెలివైందిగా ఉండటంతో/ తెలివైందవడం వల్ల, అతడితో తెలివిగా నెగ్గుకొచ్చింది.

Being rich, he can easily buy a car = ధనవంతుడిగా ఉండటంవల్ల అతడు సులభంగా car కొనగలడు.

కేవలం been వాడం. Having been వాడతాం. అర్థం: గతంలో అలా ఉండటంతో.

a) Having been a man of peace, Gandhi never got angry= Gandhi శాంతికాముకుడుగా ఉండటంతో (గతంలో కదా? ) ఆయనెప్పుడూ కోప్పడేవాడుకాదు.

Having been + pp కి అర్థం: అలా చేయబడటంతో - passive అవుతుంది.

Having been cheated once, he was careful the second time= ఒకసారి మోసగింపబడటంతో (మామూలు తెలుగు- ఒకసారి మోసపోవడంతో), రెండోసారి అతడు జాగ్రత్తగా ఉన్నాడు.

1) Being their faithful servant, Nasreen finally cheated them = వాళ్లకు విశ్వాసపాత్రురాలైన సేవకురాలుగా ఉంటూ చివరకు వాళ్లనే మోసం చేసింది.

2) Being she is very intelligent she succeeded in dealing with the situation- Being ఇలా వాడం. Being తో ఉన్న group of words లో verb (పై sentence లో, being she is -being, is -ఇలా రావు). ఈ sentence correct form:

Being intelligent she succeeded ... OR She, being intelligent, succeeded in .. అంటాం. (Being ఉన్న word groups లో is లేనిది గమనించండి)

మీ sentences (2), (3), (4), (5) లలో ఇదే mistake ఉంది. వాటిని ఇలా సవరించండి.

3) Being one of the finest products of wipro (wipro ఉత్తమ తయారీల్లో అది ఒకటవడం వల్ల- Being it is having it is today known to all customers. (అందరు ఖాతాదార్లకూ అది తెలుసు)

4) Being disgraced (disgraceful కాదు) in public by Ravi, she has decided not ... (రవి చేత బహిరంగంగా అవమానించబడటంవల్ల/ తో ...)

5) Been my watch - Been ఇలా వాడం. Been ఎప్పుడూ having తో వస్తుంది ఇలాంటి సందర్భాల్లో: My watch having been damaged (నా watch దెబ్బతినడంతో) damage చేయబడటంతో), I returned it to the shop (దాన్ని నేను shop లో తిరిగిచ్చేశాను) ఇక్కడిచ్చినట్లు రాస్తే, ఇది past నే తెలుపుతుంది.

6) Having been beaten by her teacher, Reshma has not been ...

7) Having been our companion for the past 6 months, she often comes to us, though she has become a famous ...

8) Mr Sadiq has been trying to improve his English for the past 6 months.

**Q.** 1. *కిందివాటిలో ఏది సరైన వాక్యం-*

*His last drawn full pay was Rs.5000*

*His last drawn full pay is Rs.5000*

2. *కింది వాక్యంలో past perfect tense ఉపయోగించడం కరెక్టేనా?*

*Eg: We are from 'so and so' association. We had applied for permission to use the function hall. May I know whether we have the permission?*

***- J. Govardhana Rao, Vijayawada.***

**A.** 1) His last drawn pay was Rs. 5000/- is correct, because it refers to a pay drawn in the past, and as he no more draws the pay.

2) In the example, we had applied is unacceptable. Since it is a past action the time of which isn't stated, it should be, 'We have applied'.

**Q.** *1) Some words in English are (అ) sound, some are (ఒ) sound. How to recognise their sound?*

*2) A person holds M.A., M.Phil, Ph.D. etc, ఇక్కడ holds అనకుండా studied అనవచ్చా?*

***- G.Shankar, Keshavapatnam***

**A.** 1) Pronunciation గురించి త్వరలో వివరిస్తాం.

2) A person holds M.A., M.Phil., Ph.D., and PGCTE - ఇక్కడ holds అంటే degrees, properties లాంటివి కలిగి ఉండటం. Degree గతంలో ఎప్పుడో తెచ్చుకుని ఉండవచ్చు కానీ ఆ degree మనకెప్పుడూ ఉంటుంది. (We continue to hold it.) So holds here is correct. Using past tense here is wrong.

He holds the post of VC (Now)

He hold the post of VC (in the past)

Degrees are things, which once we get, we continue to have. So holds is correct.

**Q.** ***I was tired of walking.***

***I wanted to take rest.***

ఈ వాక్యాలను 1. By using a participle

2. By using an absolute phrase
3. By using an infinitive
4. By using a preposition with a noun or gerund
5. By using a noun or phrase in apposition
6. By using an adverb or adverb phrase
7. By using both and not only but also, as well as
8. By using for and so
9. By using a noun clause
10. By using an adjective clause
11. By using an adverb clause లను ఉపయోగించి తెలుపండి. వీటికి తెలుగు అనువాద వాక్యాలు, పై వాక్యాలు తయారుచేయడానికి సూచనలు తెలుపండి.

***- Seshanna, Adony***

**A.** మీరు చెప్పాలనుకున్నది direct గా simple గా- I was tired of walking, so I wanted to take rest అని చెప్పగలిగినప్పుడు మీరడిగినన్ని విధాలుగా, confuse చేసే grammatical terms వాడి చెప్పాలనుకోవడం అవసరమా? ఇవి spoken English lessons కదా. మనం చెప్పదలుచుకున్నది, simple గా direct గా చెప్పాలనుకోవాలేగానీ, grammar for the sake of grammar ధోరణిలో ఓ grammatical exercise చేసినందువల్ల వచ్చే లాభమేమిటి? అలాంటి చర్చవల్ల confusion తప్ప ఇంకేం ఉండదు. అయినా మీకు కావాలనుకుంటే ఈ కింద ఇచ్చాం చూడండి. మనం English బాగా మాట్లాడగలిగినప్పుడు ఏ భావాన్ని ఎలాంటి sentence లో, ఏ parts of speech వాడి తెలపాలనేది మనకు దానంతటదే తడుతుంది.

1) Tired of walking, I wanted to take rest (Tired of walking - Tired - P.P)

2. Being tired (of walking)/ The walking tiring me, I wanted ... (Abs. phrase: Being tired the walking tiring me)

3) Too tired to walk, I (to walk- infinitive)

4) మీరు ఇచ్చిన sentence లో of - prep, walking - gerund కదా?

5) I, the walker, (walker, in apposition to I) being tired of walking ...

6) Being too tired of walking I wanted to take rest. (Being too tired - adverb phrase)

7) I was both tired and desired/ wanted rest

I was not only tired, but also wanted to take rest.

8) I wanted take rest, for I was tired

I was tired so I wanted to take rest.

9) That I was tired made me want to take rest (NC)

10) I who was tired of walking wanted to take rest. (Adj cl)

11) As I was too tired, I wanted to take rest (Adv cl)

ఇలా వివిధ రకాల sentences ఒకే భావాన్నిచ్చేవి తయారుచేసేందుకు మీరు parts of speech, phrase, different kinds of phrases, clause and different kinds of clauses గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి. మేం ఇక్కడ ఇచ్చే lessons కేవలం Spoken English మీద కాబట్టి, వీటిని గురించి వివరించలేం. ఏ standard grammar book అయినా బాగా study చేయండి, మీకు తెలుస్తుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 454

# We must address ourselves

**Sisir:** The Government had ordered a probe into the collapse of a part of the dam under construction, said spokesperson of the public works department.

(నిర్మాణంలో ఉన్న dam భాగం కూలిపోవడంపై ప్రభుత్వం విచారణకు ఆదేశించిందని ప్రజాపనుల శాఖ ప్రతినిధి ఒకరు తెలిపారు.)

**Karim:** Is anything new about it in our country? This isn't first of such incidents either. Obviously it's a lack of quality in construction.

(ఇదేం పెద్ద కొత్తకాదు కదా మన దేశంలో? ఇలాంటి సంఘటనల్లో ఇదేం మొదటిదీ కాదు. నిర్మాణంలో నాణ్యత లోపం అని స్పష్టంగా తెలుస్తోంది.)

obviously= స్పష్టంగా తెలిసిపోవడం

**Sisir:** The opposition has flayed the government, the officials and the contractors for the mishap.

(విపక్షం ప్రభుత్వాన్ని, అధికార్లను, contractorలను తీవ్రంగా విమర్శించింది.)

**Karim:** What are the casualties?

(ఎందరు మరణించారు? ఎందరికి గాయాలయ్యాయి?)

**Sisir:** According to unconfirmed reports, 8 dead and a good number rendered homeless, says this paper.

(ధ్రువపడని సమాచారం ప్రకారం, చనిపోయినవారు 8 మంది కాగా, చాలామంది నిరాశ్రయులయ్యారు.)

**Karim:** Let me read the rest. Official sources, however, put the number of dead at 2, and those homeless at 32. The Govt has announced Rs 5 lakh ex-gratia for the families of the dead and total rehabilitation for the homeless.

(మిగతాది, నేను చదువుతాను. అధికారవర్గాలు చనిపోయింది ఇద్దరని, నిరాశ్రయులు 32 మందని అంచనా వేస్తున్నాయి. ప్రభుత్వం మృతుల కుటుంబాలకు రూ.5 లక్షలు, నిరాశ్రయులకు పూర్తి పునరావాసం ప్రకటించింది.)

homeless = నిరాశ్రయులు.

exgratia = ఉచిత సహాయం.

put the number = సంఖ్యగా గుర్తించడం/ అంచనా వేయడం.

**Sisir:** Addressing a media conference, the chief minister has announced a probe and assured that all those guilty will be punished.

(మీడియా సమావేశంలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ, విచారణకు ఆదేశించడమే కాకుండా దోషులందర్నీ శిక్షిస్తామని హామీ ఇచ్చారు.)

guilty= దోషులైన

assure= హామీ ఇవ్వడం

**Karim:** But you know public memory is short. They soon forget all about it and raise hell only when another such incident takes place.

(తెలిసిందేగా ప్రజల జ్ఞాపకశక్తి చాలా తక్కువ/ వాళ్లేదయినా త్వరగా మరచిపోతారు. మళ్లీ ఇలాంటి ఘటన ఇంకోటి జరిగితే అప్పుడు మళ్లీ గొడవ చేస్తారు.)

raise hell= గొడవ చేయడం.

**Sisir:** That's true.

*English news head lines, reporting లో వాడే expressions గురించి తెలుసుకుంటున్నాం కదా. ఈసారి మరికొన్నింటిని చూద్దాం.*

***Look at the following sentences from the dialogue above.***

*1) The government had ordered a probe into ...*

*2) The opposition has flayed the government.*

*3) What are the casualties?*

*4) According to unconfirmed reports 8 dead and a good number rendered homeless.*

*5) Official sources, however, put the number of dead ...*

*6) The govt has announced an ex-gratia payment of Rs 5 lakh.*

*7) Addressing a media conference the CM has assured ...*

మొదట no.7 చూద్దాం.

**7) Addressing a media conference ...**

Address- దీనికి మామూలు అర్థం - చిరునామా. కానీ పై sentence లో అర్థం, ఒకరినుద్దేశించి ప్రసంగించడం. Address అంటే ప్రసంగం/ ఉపన్యాసం అని కూడా.

a) At the beginning of every session of the Parliament, the President addresses a joint session of the Lok Sabha and Rajya Sabha = పార్లమెంట్ ప్రతి సమావేశం ప్రారంభంలో President, లోక్‌సభ, రాజ్యసభ సంయుక్త సమావేశాన్నుద్దేశించి ప్రసంగిస్తారు.

b) In his address to the students the chief guest advised them to be industrious = విద్యార్థులనుద్దేశించి చేసిన ప్రసంగంలో, వాళ్లను బాగా కృషి చేయాల్సిందిగా ముఖ్య అతిథి సలహా ఇచ్చారు.

Address అంటే ఇంకో అర్థం కూడా ఉంది (పై సందర్భంలో కాదు). ఏదైనా ఒక పరిస్థితిని, సమస్యను గురించి ఆలోచించి దాన్ని ఎలా పరిష్కరించగలమో తేల్చడం.

We must address ourselves to the problem of pollution = వాతావరణ కాలుష్యం సమస్యను మనమే ఆలోచించి పరిష్కరించుకోవాలి.

The Chief Minister's speech did not address the basic problems= ముఖ్యమంత్రి ప్రసంగం మౌలిక సమస్యల పరిష్కారం గురించి ఏమీ తేల్చలేదు. (ఈ మూడో అర్థం కాస్త పాండిత్యం. Spoken English లో వాడం. దాని బదులు deal with అంటాం).

**1) Probe** = enquiry = విచారణ. ఇది కూడా English news papers లో తరచూ కనిపించే మాట. ఏదైనా దుర్ఘటన/ కుంభకోణం/ అక్రమాలు జరిగాయనే ఫిర్యాదులు వస్తే అందులోని నిజాలు నిర్ధారించేందుకు, బాధ్యులను గుర్తించి శిక్షించేందుకు చేసే విచారణ (enquiry)/ దర్యాప్తు.

a) Committee to probe into the diversion of Rs 2 per kilo rice= రెండు రూపాయల కిలో బియ్యం అక్రమ రవాణా/ తరలింపు గురించి దర్యాప్తు చేసేందుకు కమిటీ.


M.SURESAN

b) A thorough probe will reveal several irregularities in all govt departments= క్షుణ్నమైన దర్యాప్తు ప్రతి ప్రభుత్వ శాఖలోని చాలా అక్రమాలను వెల్లడి చేస్తుంది.

reveal= వెల్లడించడం/ తెలపడం.

**2) Flay** = అసలు అర్థం చర్మం వలవడం, కానీ ఇక్కడి అర్థం (English పత్రికల్లో వాడేది)- నిశితంగా విమర్శించడం, దుయ్యబట్టడం.

a) All the opposition parties flayed the government for the poor maintenance of BC hostels = BC hostels నిర్వహణ తీరుపై విపక్షాలన్నీ ప్రభుత్వాన్ని దుయ్యబట్టాయి.

b) The CPM has flayed the government over its delay in compensation to the displaced = నిర్వాసితులకు ఇవ్వాల్సిన నష్టపరిహారంలో జాప్యం గురించి ప్రభుత్వాన్ని CPM దుయ్యబట్టింది.

displace= (project లు, హింసలతో ప్రజలను) నిర్వాసితులను చేయడం.

flay= condemn (ఖండించడం)/ denounce

**3) Casualties** = ఒక దుర్ఘటనలో గాయపడ్డవాళ్లు, మరణించినవాళ్లు.

a) The casualties following the landslide are very high = కొండ చరియ కూలడంవల్ల మరణించినవాళ్లు, గాయపడ్డవాళ్లు ఎక్కువే.

b) Fortunately there were no casualties in the building collapse in Ameerpet = అమీర్‌పేటలో భవనం కూలడంలో (కూలిన ఘటనలో) అదృష్టవశాత్తు మృతులు, క్షతగాత్రులు ఎవరూలేరు.

**4) Unconfirmed reports** = ధ్రువపడని వార్తల ప్రకారం అని. (ఇది newspapers లో తరచూ కనిపించే మాట. అంటే అంతగా ఆధారాల్లేని వార్తల ప్రకారం అని.)

a) According to unconfirmed reports reaching here, the chinese have moved their forces closer to the border than before =

ఇక్కడికి వస్తున్న ధ్రువపడని వార్తల ప్రకారం- చైనా బలగాలు సరిహద్దుకు ఇంతకుముందుకంటే దగ్గరగా వచ్చాయి.

దీనికి వ్యతిరేకం official sources = అధికారిక వర్గాలు. అంటే ప్రభుత్వం అధికారికంగా తెలియజేసే/ బహిరంగపరచే సమాచారం ప్రకారం.

reliable sources = నమ్మదగిన వర్గాలు.

(reliable = నమ్మదగిన. source = వార్తలను తెలిపే మూలం - ఇక్కడ వర్గాలు.)

**EXERCISE**

**Practise aloud the following in English.**

1) అమెరికాతో అణు ఒప్పందాన్ని ఖండించిన CPM. (flay/ condemn వాడండి)

2) అసెంబ్లీ, కౌన్సిల్‌ను ఉద్దేశించి ప్రసంగించనున్న గవర్నర్.

3) రూఢికాని వార్తల ప్రకారం మృతుల సంఖ్య 12.

4) BC hostel లో విషాహారం వడ్డన విషయంలో దర్యాప్తుకు ప్రభుత్వం ఆదేశించింది.

5) ఆ వార్తలింకా ధ్రువపడలేదు.

**ANSWER**

1) CPM flays/ condemns/ denounces Indo - American nuclear deal.

2) Governor to address the assembly and the council.

3) The death toll/ The number of dead is 12, according to unconfirmed reports.

4) Government orders probe into food poisoning incident in BC hostel.

5) The news has not been confirmed/ The news is yet to be confirmed/ There is no confirmation of the news.

(Toll = మామూలుగా మనందరికి తెలిసిన అర్థం- వాహనాలకు ప్రభుత్వం వసూలుచేసే రహదారి పన్ను. Death toll - ఇక్కడ అర్థం ఓ దుర్ఘటనలో మృతుల సంఖ్య.)

---

**Q.** **1.** *What are the difference of words say and tell.*

**2.** *What are the difference of words complain- complaint. Please explain with examples.*

***- B. Bhaskar, Nandyal***

**A.** **1.** Please refer to spoken English lesson No 66.

**2.** 'Complain' is a verb. 'Complaint' is a noun.

When we are not happy about something, we complain about it.

a) When something is stolen we complain (ఫిర్యాదు చేస్తాం) to the police

b) The police will register our complaint (ఫిర్యాదు).

We complain= we make a complaint.

**Q.** **1)** *'I' plural అని విద్యార్థులకు ఎలా చెప్పాలి? You అనేది singular or plural? Students కు ఎలా బోధించాలి?*

**2)** *What do they do? దీని అర్థం ఏమిటి? వాక్యంలో రెండుసార్లు do అవసరమా?*

**3)** *డామిట్, హ్యాట్సాఫ్ పదాలు ఎలా ఆవిర్భవించాయి? వీటి అర్థం ఏమిటి?*

**4)** *Deluxe అనే పదానికి తెలుగులో అర్థం ఏమిటి?*

***- G. Ashok, Godhur***

**A.** **1)** I ఎప్పుడూ singular కదా. Plural ఎలా అవుతుంది? (I = నేను- ఒకరినే తెలుపుతుంది- కాబట్టి ఎప్పుడైనా singular.)

**2)** What do they do? = వాళ్లేం చేస్తారు (మామూలుగా). What do they do after class?= Class తర్వాత వాళ్లేం చేస్తారు? (రోజూ). ఇందులో మొదటి do, helping verb. రెండో do, main verb.

**3)** Damn it లో Damn = (దేవుడు) పాపులను నరకానికి పంపడం. Damn it, శాపనార్థం/ తిట్టుగా వాడతారు, తెలుగులో, దుంపతెగ/ పీడ, అన్నట్లు. Damn it, my plans are all upset = ఛ, నా పథకాలన్నీ తలకిందులయ్యాయి.

Hats off = మెచ్చుకుంటూ అనే మాట/ జోహార్లు.

Hats off to the way Tendulkar batted= Tendulkar bat చేసిన విధానికి జోహార్లు.

Western countries లో ఎవరినైనా మెచ్చుకునేందుకు, తల మీదున్న hat తీసి, చేత్తో ఊపుతారు.

Hats off = (టోపీలు) తీసి ఊపడం. అందువల్ల hats off అంటాం.

**4)** Deluxe= Luxurious = విలాసవంతమైన.

(Oxford dictionary చూడండి. ఇది French నుంచి English లోకి వచ్చిన మాట.)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 455

# politicians mostly are dishonest


M.SURESAN

**Rashid:** What happened to the reservoir scam?
(ఆ reservoir కుంభకోణం ఏమైంది?)

**Bhagat:** The minister has strongly denied that he or any member of his family had any hand in it.
(తనకుగానీ, తన కుటుంబ సభ్యుల్లో ఎవరికిగానీ అందులో ప్రమేయం లేదని మంత్రి గట్టిగా అంటున్నారు.)

**Rashid:** The leader of the opposition has lashed out at the minister's role in the allotment of contracts or in the execution of the works.
(contracts కేటాయించే విషయంలో పనుల నిర్వహణలో లోపాలకు, విపక్ష నాయకుడు మంత్రిని తీవ్రంగా విమర్శించాడు.)

**Bhagat:** The party has also passed a resolution condemning the government inaction at the rising prices and the inflation.
(పెరుగుతున్న ధరల విషయంలో ప్రభుత్వం చర్య తీసుకోకపోవడాన్ని, ద్రవ్యోల్బణాన్ని ఖండిస్తూ ఆ పార్టీ తీర్మానం చేసింది.)

**Rashid:** All this is all right. That is normal in a democracy. But the way the leaders are trading abuses at one another, and calling one another names is really regrettable.
(అదంతా బాగానే ఉంది. విమర్శలు ప్రజాస్వామ్యంలో సాధారణమే. అయితే ఆ నాయకులు ఒకరి నొకరు దూషించుకోవడం, తిట్టుకోవడం నిజంగా గర్హించదగిందిగా ఉంది.)

regrettable = చింతించదగిన

**Bhagat:** I fully agree with you. The public conduct of the leaders has hit an all time low. Their abusive language makes us wonder what kind of leaders we have elected.
(నువ్వు అన్నదాంతో నేను ఏకీభవిస్తున్నా. మన నాయకుల బహిరంగ ప్రవర్తన ఎన్నడూ లేనంత తక్కువ స్థాయికి దిగజారింది. వాళ్ల తిట్లు, భాష చూస్తుంటే ఎలాంటి నాయకులను మనం ఎన్నుకున్నామా అనే ఆలోచన వస్తుంది.)

public conduct = ప్రజల మధ్యలో ఉన్నప్పుడు ఒకరి ప్రవర్తన

hit = (ఇక్కడ) తాకడం/ తగలడం.

All-time low = ఎన్నడూ లేనంత తక్కువ.

All-time high = ఎన్నడూ లేనంత ఎక్కువ.

The prices of essential commodities have hit an all time high = నిత్యావసర వస్తువుల ధరలు ఎన్నడూ లేనంత ఎక్కువగా ఉన్నాయి. ఈ expression మీ conversation లో వాడండి.

**Rashid:** That's true. What do you think of the elections in Karnataka.
(నిజమే. కర్ణాటక ఎన్నికల విషయం ఏమంటావు?)

**Bhagat:** They have passed off peacefully says this paper.
(అవి ప్రశాంతంగా జరిగిపోయాయని పేర్కొంటోంది ఈ paper.)

pass off = జరిగిపోవడం

**Rashid:** No incidents of violence or any such thing?
(హింసాయుత సంఘటనల్లాంటివేం లేవు కదా?)

**Bhagat:** None. The voter turn out is 60%. Not so bad, after all.
(ఓటు వేయడానికి వచ్చినవారి సంఖ్య 60% అంత తక్కువేం కాదు, ఏమైనా.)

after all = ఏమైనా

**Rashid:** It's only in states like Bihar that we come across rigging, booth capturing and general violence.
(బీహార్ లాంటి రాష్ట్రాల్లో మాత్రమే మనం rigging, polling booth ల ఆక్రమణ, దౌర్జన్యం చూస్తాం.)

rig = అక్రమమార్గంలో ఎన్నికల ఫలితాలు ప్రభావితం చేయడం (ఇందులో దౌర్జన్యం ఉండదు. ఓటర్లను డబ్బులాంటి వాటితో ప్రభావితం చేయడం మాత్రమే. దీనికింకోమాట fixing = cricket matches లోలా.)

**Bhagat:** Politicians often dismiss as baseless such allegations in news papers.
(రాజకీయ నాయకులు పత్రికల్లో వచ్చే అలాంటి ఆరోపణలను నిరాధారమని తోసిపుచ్చుతారు.)

**Rashid:** That's no surprize. Politicians mostly are dishonest.
(అదేం ఆశ్చర్యకరం కాదు. ఎక్కువమంది రాజకీయనాయకులు నిజాయతీ లేనివాళ్లే.)

(గమనిక: ఈ సంభాషణలోని సందర్భాలు, ఈ పాఠం కోసం కల్పించినవే. వాస్తవానికి పోలిక కేవలం కాకతాళీయమే)

Newspapers లో తరచూ వాడే expressions గురించి చర్చిస్తున్నాంగదా? మరికొన్ని ఇక్కడ చూద్దాం.

1) *The minister has strongly denied that he or any member of his family had any hand in it.*
2) *The leader of the opposition has lashed out at the minister's role in the allotment of contracts...*
3) *The party has also passed a resolution condemning the govt's inaction*
4) *The way the leaders are trading abuses, and calling one another names...*
5) *They have passed of peacefully says the paper*
6) *The voter turm out is 60%*
7) *Politicians often dismisses newspaper reports as baseless allegations.*

**1) The Minister has strongly denied.**

deny = ఇక్కడి అర్థం, కాదనడం - నేనలా అనలేదు/ ఆ మాట నేను అనలేదు అనడం (ఇతర అర్థాలు - ఎవరికైనా ఏదైనా ఇవ్వకపోవడం.

He denied me the permission to go home - ఇంటికెళ్లేందుకు, నాకాయన అనుమతి ఇవ్వలేదు.

deny ఇక్కడ = refuse

a) The minister denied that he made such a remark about Gandhi =
గాంధీని గురించి తను అలాంటి వ్యాఖ్య చేయలేదని మంత్రి అన్నారు.

b) The M.L.A. has denied that he has made insulting remarks about any caste =
ఏ కులాన్ని గురించి అవమానకర వ్యాఖ్యలు చేయలేదని MLA అన్నారు.

c) He has denied all the words that have been reported in the media =
Media లో వచ్చిన వార్తలు తను అనలేదని ఆయన అన్నాడు.

**2. The leader of the opposition has lashed out at the minister's role...**

Lash out = నిశితంగా విమర్శించడం. (అసలు అర్థం కొరడా, కర్రలాంటి వాటితో బాగా దెబ్బతగిలే విధంగా, బలంగా కొట్టడం/ బాదడం.)

whip = కొరడా

whip lash= కొరడా దెబ్బ

Gulf countries లో నేరస్తులకు whip lashes శిక్షగా విధిస్తారు.

a) Rain lashed the state the whole of yesterday =
నిన్నంతా వర్షం రాష్ట్రాన్ని దెబ్బతీసింది/ కుదిపేసింది.

b) The CPM lashed out the govt's move to declare a number of areas as SEZs =
ప్రత్యేక ఆర్థిక మండళ్లుగా చాలా ప్రదేశాలను ప్రభుత్వం ప్రకటించడాన్ని CPM దుయ్యబట్టింది.

కిందటి lesson లో flay ను ఇదే అర్థంలో వాడటం చూశాం.

**3) Condemn** - ఇది కూడా దాదాపు lash, flay లాంటి మాట. దేన్నయినా ఖండించడం, విమర్శించడం

a) All of us condemn the inability of the govt's failure to check the belt shops =
Belt shops నియంత్రణలో ప్రభుత్వ వైఫల్యాన్ని మనం అందరం ఖండిస్తాం.

b) The BJP has condemned the Indo-American nuclear deal =
భారత్ అమెరికా అణు ఒప్పందాన్ని BJP ఖండించింది.

**Pass a resolution** తీర్మానాన్ని ఆమోదించడం/ తీర్మానించడం.

a) The conference passed a resolution condemning the action of the terrorists =
టెర్రరిస్టుల చర్యలను ఖండిస్తూ, ఆ సమావేశం ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

b) The party unanimously passed a resolution/ resolved unanimously to support the govt's policy =
ప్రభుత్వ విధానాన్ని సమర్థిస్తూ ఆ party ఏకగ్రీవంగా తీర్మానించింది.

unanimously= ఏకగ్రీవంగా

**4) Trading abuses and calling names =** తిట్టుకోవడం/ ఒకరినొకరు దూషించుకోవడం.

a) The leaders traded abuses at each other =
ఒకర్నొకరు తిట్టుకున్నారు

abuse= తిట్టడం (బూతులు వాడటం)

calling names = fool, rogue లాంటి మాటలు వాడటం

b) He called me names, but I kept quiet =
నన్ను నానామాటలు అన్నాడు, నేనేమీ అనలేదు.

**5) Pass off peacefully** = ప్రశాంతంగా జరిగిపోవడం

a) The discussions passed off peacefully =
చర్చలు ప్రశాంతంగా జరిగాయి.

b) We expect the polls to pass off peacefully=
ఎన్నికలు ప్రశాంతంగా జరుగుతాయనే ఆశిస్తున్నాం.

**6) The voter turnout** = ఓటు వేసే వారి సంఖ్య.

a) The voter *turnout* was rather poor =
ఓటు వేసిన వారి సంఖ్య కాస్త తక్కువే.

b) We have yet to know the percentage of member turnout =
సభ్యుల హాజరు సంఖ్య శాతం ఇంకా తెలియాల్సి ఉంది.

**7) Baseless allegations** = నిరాధారమైన ఆరోపణలు

a) The allegations were proved baseless =
ఆరోపణలు నిరాధారమైనవిగా తేలాయి.

b) Whatever the media report, politicians dismiss them as baseless =
మీడియా ఏమన్నా రాజకీయ నాయకులు వాటిని నిరాధారమైనవిగా తోసేస్తారు.

---

**Q&A**

**Q.** 1. "నేను శ్రీకాంత్ ఎక్కడ న్నాడో అని ఆలోచించాను" అని చెప్పడానికి *I thought that where Srikanth was? (wh clause + s + v)* అనొచ్చా?

2. *Infact* కు అర్థం, ఉపయోగం తెలుపగలరు.

3. *Wh తో మొదలయ్యే clause లలో wh + s + v, wh + v + s ఉన్నట్లే how తో ఎలాగో వివరించండి. You called me a few days back (మీరు కొద్ది రోజుల కిందట నాకు ఫోన్ చేశారు) - సరైనదేనా?*

4. *"నేను ఈ ఎగ్జామ్‌లో క్వాలిఫై అవ్వాలంటే ఎన్ని మార్కులు తెచ్చుకోవాలి" అని అడగడానికి- How many marks will I be got in this exam to qualify అనొచ్చా?*

5. *బ్యాట్స్‌మన్ బాగా ఆడుతున్నప్పుడు - He starts to hit the ball అనొచ్చా?*

**- V.Sekhar, Hyderabad**

**A. 1)** I thought where Srikanth was correct. A clause with a 'wh' word (what, where, etc) doesn't have 'that' before the 'wh' word. He knows why she is here. (ఆమె ఇక్కడెందుకుందో అతడికి తెలుసు. ఇక్కడ మనం 'wh' word ముందు that వాడం.)

**2)** Infact = truly/ నిజాయతీ. అయితే, దీన్ని సాధారణంగా, అలాకాకపోగా అనే అర్థం (వ్యతిరేకంగా) వచ్చేట్లు వాడతాం.

Eg: I wasn't late. Infact I was there earlier than all others = నేనేం ఆలస్యంకాదు. అసలు అందరికంటే ముందే నేనక్కడున్నాను.

He is not short. In fact he is taller than any of us = అతడేం పొట్టికాదు. ఆ మాటకొస్తే అతడు మనందరికంటే పొడుగు. (నిజానికి అతడు మనందరికంటే పొడుగు)

**3)** I know how he got the book - How he got the book - ఈ 'wh' clause లో How (wh) + he (s) + got (v)

What is your name? - ఇందులో What (wh word) + is (v) + your name? (s)

You called me a few days ago (a few days back - wrong)

**4)** How many marks should I/ have I to get in the exam to qualify? ఎన్ని మార్కులు తెచ్చుకోవాలి అంటే shall/ must/ have to/ has to get అనాలి కదా? will I get? అంటే వస్తాయి అని అర్థం, రావాలి అని కాదు. Will I be got - ఇది wrong form of the verb (will I get అనాలి- కాని ఇక్కడది సరికాదు)

**5)** అనొచ్చు

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 456

# The Speaker Adjourned the House

**Devnath:** The Speaker of the Assembly appealed to the opposition to let the proceedings of the House go on calmly.
(అసెంబ్లీ చర్చలు ప్రశాంతంగా సాగనివ్వాలని Speaker ప్రతిపక్షాలకు విజ్ఞప్తి చేశారు.)

**Srinath:** But the opposition continued their protests and slogan shouting. The Speaker adjourned the house for an hour.
(కానీ ప్రతిపక్షాలు తమ నిరసనలను, నినాదా లివ్వడాన్ని కొనసాగించారు. Speaker సభను గంటసేపు వాయిదా వేశారు.)

**Devnath:** The plea of some of the leaders for a higher outlay in the budget for the welfare of the backward classes was accepted by all.
(వెనుకబడినవర్గాల సంక్షేమం కోసం బడ్జెట్‌లో మరికొంత ఎక్కువ కేటాయించాలన్న కొందరు నాయకుల విజ్ఞప్తిని అందరూ అంగీకరించారు.)

**Srinath:** The founder of the new party has called for the rooting out of corruption in politics. He has called for the end of dynastic rule.
(కొత్త పార్టీ సంస్థాపకుడు రాజకీయాల్లో అవినీతిని సమూలంగా తొలగించేందుకు పిలుపునిచ్చారు. వారసత్వ పాలన అంతానికి కూడా పిలుపునిచ్చారు.)

**Devnath:** He has asserted that once his party is voted to power, there will be true democracy and the people will have real power.
(తమ పార్టీ అధికారంలోకి వస్తే నిజమైన ప్రజాస్వామ్యం ఉంటుందని, ప్రజలకే నిజమైన అధికారం ఉంటుందని ఆయన నొక్కిచెప్పారు.)

**Srinath:** What do you say about the film hero entering politics?
(సినిమా నాయకుడి రాజకీయ ప్రవేశం గురించి నువ్వేమంటావు?)

**Devnath:** That's welcome, so long as the intentions are good.
(ఉద్దేశాలు మంచివైతే అది స్వాగతింపదగిందే?)

**Srinath:** Well, that's the news digest today. Let's see if we get some late news on the TV.
(ఈనాటి వార్తా సంగ్రహం అదీ. TV లో ఏమన్నా తాజా వార్తలొస్తాయేమో చూద్దాం.)

Spoken English ధారాళంగా రావడానికి English news paper reading చాలా సహాయపడుతుంది కదా. అయితే కొంత అలవాటైతేనే కానీ English newspaperలో భాష అర్థం కాదు. అది అర్థం చేసుకునేందుకు, English newspaper లో ఎక్కువగా కనిపించే మరికొన్ని పదాలు, expressions ఇప్పుడు చూద్దాం.

***Look at the following sentences.***

*1) The Speaker of the Assembly appealed to the opposition to let the proceedings of the House go on calmly.*
*2) The Speaker adjourned the House.*
*3) The plea of some of the leaders for a higher outlay in the budget for the welfare of the backward classes...*
*4) The founder of the new party has called for rooting out of corruption.*
*5) He has asserted that once his party come to power...*
*6) Well, that's the news digest today.*
*7) Let us see if we get some late news on the TV.*

పైవాటిల్లో చాలా expressions assembly కి సంబంధించినవి. Assembly సమావేశాలు జరుగుతున్న సమయంలో, English newspapers లో పై మాటలు విరివిగా కనిపిస్తుంటాయి.

**1) The Speaker ... appealed:** Appeal = విజ్ఞప్తి చేయడం.

a) The leader appealed to the people to do their bit to the progress of the country = దేశ ప్రగతికి తమ వంతు తాము కృషిచేయాలని, ఆ నాయకుడు ప్రజలకు విజ్ఞప్తి చేశాడు.

b) We appeal to you to support us in our fight for justice = న్యాయం కోసం మా పోరాటంలో మీ మద్దతుకు విజ్ఞప్తి చేస్తున్నాం/ అభ్యర్థిస్తున్నాం.


M.SURESAN

Appeal అంటే విజ్ఞప్తి చేయడం అనే కాకుండా విజ్ఞప్తి అనే అర్థం కూడా ఉంది.

c) His appeal fell on deaf ears = అతడి విజ్ఞప్తిని ఎవరూ వినిపించుకోలేదు.

(To fall on deaf ears = వినిపించుకోలేకపోవడం)

**3)** విజ్ఞప్తి/ అభ్యర్థన అని **appeal** కు ఉన్న అర్థంతో ఇంకోమాట, plea (ప్లీ).

Make a plea for = విజ్ఞప్తి చేయడం.

The murdered girl's parents made a plea for speedy detection of the guilty and punishment = హత్యకు గురైన బాలిక తల్లిదండ్రులు త్వరగా దోషులను పట్టుకోవాలని, శిక్షించాలని విజ్ఞప్తి చేశారు. (Plea అన్నప్పుడు అందులో కొంత ఉద్వేగం ఉంటుంది.)

**2) The Speaker adjourned the House.** మొదట house చూద్దాం. మనం ఈ మాటకు ఎక్కువగా వాడే అర్థం- ఇల్లు. అయితే, lesson సందర్భంలో house = అసెంబ్లీ (శాసనసభ)/ శాసనమండలి (legislative council)/ Parliament - ఇలాంటి చట్టసభలు ఏదైనా కావచ్చు. Lower House = Loksabha, Upper House = Rajyasabha. House Committee = Assembly/ council/ parliament లోని సభ్యులతో ఏర్పాటైన committee.

Adjourn = ఒక నిర్ణీత సమయం వరకు సభా/ court కార్యకలాపాలను ఆపేయడం (వాయిదా వేయడం)

The Speaker adjourned the house for 2 days = శాసన సభాధ్యక్షుడు రెండ్రోజులపాటు సభను ఆపేశారు/ వాయిదా వేశారు.

The Judge adjourned the case for a fortnight= ఓ పక్షంపాటు న్యాయమూర్తి case ను వాయిదా వేశారు.

Sine Die = నిరవధికంగా, మళ్లీ ఏ తేదీ అని తెలిపేంతవరకు. శాసనసభల సమావేశానంతరం (సమావేశాలు ముగిసిన తర్వాత)...

The House is adjourned Sine Die (సైనడయ్/ సైనడీయమ్)- చట్టసభ నిరవధికంగా వాయిదా పడింది.

**4) To call for/ to give a call for** = పిలుపివ్వడం/ ప్రజలను ఏదైనా పనికి పురిగొల్పడం.

a) The leader has called for united fight against anti democratic forces = అప్రజాస్వామిక శక్తులకు వ్యతిరేకంగా ఐక్యంగా పోరాడాలని నాయకుడు పిలుపునిచ్చాడు.

b) The chief guest has given a call for a better education system = మెరుగైన విద్యావిధానం కోసం ముఖ్య అతిథి పిలుపునిచ్చారు.

**5) Assert** = ఏదైనా దృఢంగా నొక్కిచెప్పడం.

a) The minister asserted in the House that there were no irregularities in his ministry = తన శాఖలో ఎలాంటి అక్రమాలూ లేవని మంత్రి గట్టిగా చెబుతున్నారు.

b) The accused asserted his innocence = ఆ నిందితుడు తన నిర్దోషిత్వాన్ని గట్టిగా తెలుపుతున్నాడు. (నేరాన్ని అంగీకరించడంలేదు)

ఇంతకుముందు, deny అంటే ఓ విషయాన్ని అన్నట్లు ఒప్పుకోకపోవడం అని తెలుసుకున్నాం కదా. దానికి assert, వ్యతిరేకం. చూడండి:

He denied any irregularities in his ministry = He asserted there were no irregularities.

c) No one believed his assertion that he was innocent = తను నిర్దోషి అని అతడు గట్టిగా అనడం ఎవరూ నమ్మడం లేదు.

Assert = నొక్కిచెప్పడం, Assertion = నొక్కిచెప్పే విషయం.

**6) Newsdigest-** digest (డైజస్ట్/ డిజస్ట్) ఎక్కువగా ఈ మాటను జీర్ణించుకోవడం అనే అర్థంతో వాడతాం.

a) A child can't digest that kind of food = ఆ బిడ్డ అలాంటి ఆహారాన్ని జీర్ణించుకోలేదు.

b) He is unable to digest the fact that his dearest friend has cheated him = తన ప్రాణ స్నేహితుడు తనను మోసం చేశాడనే సత్యాన్ని అతడు జీర్ణించుకోలేకపోతున్నాడు.

ఈ lesson సందర్భంలో digest (ఇక్కడ pronunciation - డైజస్ట్ మాత్రమే) కు అర్థం, సంగ్రహం/ సంక్షిప్తం. ఉపన్యాసం/ report/ గ్రంథం/ వ్యాసం/ వార్తలోని ముఖ్యాంశాలుండే సంగ్రహ రూపం/ సంక్షిప్త రూపం- digest (famous magazines, Reader's Digest లోనివన్నీ కూడా గొప్ప రచనల సంగ్రహ రూపాలే.)

Newsdigest- వార్తా సంగ్రహం- సంగ్రహించిన (ముఖ్యాంశాలు మాత్రమే ఉండి, అనవసర వివరాలు లేని) వార్తలు.

Just post me with the latest newsdigest = తాజా వార్తల సంగ్రహాన్ని మాత్రమే నాకందించు.

Post - ఇక్కడి అర్థం- వార్తలను, వివరాలను అందించడం.

a) This news paper is always upto date. It posts us with the latest in every field = ఈ వార్తా పత్రిక తాజాగా ఉంటుంది. ప్రతి రంగంలోని తాజా వార్తలను మనకందిస్తుంది.

b) He keeps the manager posted with all the happenings = అన్ని సంఘటనల వివరాలను అతడు manager కు అందిస్తూనే ఉంటాడు.

**7. Let us see if we get some late news ...**

Late news, old news- తేడా తెలుసుకుందాం.

late news = ఇప్పటిప్పుడే అందే వార్తలు.

old news = పాత (అందరికీ తెలిసిపోయిన) వార్తలు.

late news అందించగలిగే పత్రికలు, TV news channels ఎక్కువ ఆదరణ పొందుతాయి.

---

**Q.** *1) How many people have you invited? How many people did you invite-* తేడా ఏమిటి?

*2) Let me go* అంటే నన్ను వెళ్లనీ అని అర్థం కదా. *Let* అంటే అనుకోవడం అనే మరో అర్థం ఇంగ్లిష్‌లో ఉందా?

*3) He had been to Delhi* అంటే అతడు ఢిల్లీ వెళ్లి వచ్చాడు అని అర్థం. ఈ వాక్యం *past perfect continuous* లో ఉందికదా. వివరించగలరు. *Regarding* కు అర్థం *uses* తెలుపండి.

*4) When are you leaving for Kashmir* అంటే నీవెప్పుడు కాశ్మీర్‌కు బయలుదేరుతున్నావు అని అర్థం కదా. నీవెప్పుడు కాశ్మీర్‌కు బయలుదేరుతున్నావో అని అనడానికి *When you are leaving for Kashmir* అనొచ్చా?

*5) So far, obviously* గురించి వివరించగలరు.

*6)* మా నాన్నకు కొడుకునైనందుకు నేను గర్వపడుతున్నాను. *Being, having been* ఉపయోగించి చెప్పగలరు.

**– V.Sekhar, Hyderabad**

**A.1)** How many people have you invited? = ఇంతవరకు ఎంతమందిని పిలిచావు? (పిలవాల్సినవాళ్లు ఇంకా ఉన్నారా? పిలుపులింకా అయిపోకపోవచ్చు పిలుపులకు ప్రాధాన్యం, పిలిచిన time కు కాదు)

How many people did you invite? = (మొత్తం) ఎంతమందిని పిలిచావు? ఇది గతంలో ఒక సమయానికి (ఆ సమయం సందర్భాన్నిబట్టి తెలుస్తుంది) పిలుపులు అయ్యాయి. ఎంతమందిని పిలిచావు అని.

**2)** Let అంటే అనుకోవడం అనే అర్థం లేదు. Let x be equal to 100 (Let x = 100) అంటే అర్థం, x 100 కు సమానంగా ఉందని. అలా అనే బదులు suppose s = 100, అంటే అనుకో అనే అర్థం వస్తుంది.

**3)** He went to Delhi = Delhi వెళ్లాడు. (తిరిగి వచ్చాడో రాలేదో తెలియదు. Time చెప్పలేదు కాబట్టి, He has gone to/ has left for Delhi, He went to Delhi కంటే better. 'He went to Delhi yesterday' - ఇది OK.

He had been to Delhi - Delhi వెళ్లి తిరిగి వచ్చేశాడు- రెండూ గతం.

I had been to my sister's place last week = గతవారం నేను మా అక్కయ్య వాళ్లింటికి/ ఊరికి వెళ్లాను. అక్కడ్నించి తిరిగి వచ్చేశాను, కాబట్టి had been. Had been, past perfect, correct కానీ usage ప్రకారం ఇలా అంటాం.

**4)** అనొచ్చు. Please tell me when you are leaving for Kashmir = నువ్వు కాశ్మీర్ ఎప్పుడు వెళ్తున్నావో, నాతో చెప్పు.

**5)** So far = ఇప్పటివరకు. So far I have not met him = నేనిప్పటివరకు అతడిని కలవలేదు.

Obviously = clearly = చాలా సులభంగా అర్థమయ్యే/ స్పష్టం.

He doesn't talk to me much. Obviously he doesn't like me = నాతో ఎక్కువ మాట్లాడడతడు. అంటే నేనంటే అతడికి ఇష్టం లేదనేది స్పష్టమేగా.

He suggested that we eat out. Obviously there wasn't enough food for all of us = హోటల్లో తిందాం అన్నాడతడు. అంటే దానర్థం/ స్పష్టంగా తెలుస్తుంది కదా? ఇంట్లో మా అందరికి సరిపోయేంత భోజనం లేదని.

**6)** I am proud of being his son = ఆయన కొడుగ్గా ఉండటానికి (కొడుకునైనందుకు) నేను గర్వపడుతున్నా- ఇప్పుడు. Kumar is proud of having been his son= ఆయన కొడుగ్గా ఉండినందుకు (గతంలో) కుమార్ గర్విస్తున్నాడు- ఆయన (father) ఇప్పుడు బతికిలేరు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

**Prachand:** Cases had been booked against erring gas distributors, said the Director civil supplies authority.
(అక్రమాలకు ఒడిగడుతున్న gas పంపిణీదారుల మీద case లు పెట్టడం జరిగిందన్నారు పౌర సరఫరాల అధికారులు.)

erring = తప్పు చేస్తున్న;
error = తప్పు/ పొరబాటు

**Prabhat:** India boasts of making progress and still we are starved for cooking gas. What a pity!
(భారత్ ఏదో పురోగమిస్తోందని గొప్పలు చెప్పుకుంటాం. అయితే మనం వంట gas కు కూడా ఇబ్బంది పడుతున్నాం. ఎంత దురదృష్టం.)

starve = తిండి లేక పస్తుండటం
starve of something = దేనికన్నా కొరత ఉండటం
pity = జాలి; ఇక్కడి అర్థం దురదృష్టకరం.
It's a pity that he hasn't been selected= అతడు ఎంపిక కాకపోవడం దురదృష్టకరం/ విచారకరం

**Prachand:** India has definitely progressed, no doubt, and is progressing. But the reality is far short of the hype about the progress.
(భారత్ అభివృద్ధి సాధించింది, సాధిస్తోంది కూడా. అయితే దాన్ని గురించి ప్రచారం కంటే వాస్తవం చాలా తక్కువే.)

reality = వాస్తవం
far short of = చాలా తక్కువ
His marks are far short of his father's expectations = అతడు తెచ్చుకున్న marks అతడి తండ్రి ఆశించిన దాని కంటే చాలా తక్కువ.

**Prabhat:** Look at this. The gallup poll on the Karnataka elections predicts a clear majority for the BJP, according to this newspaper.
(ఇది చూడు. కర్ణాటక ఎన్నికల విషయంలో జరిగిన gallup poll ప్రకారం, BJP కి స్పష్టమైన మెజారిటీ వస్తుందని ఈ పత్రిక కథనం.)

Poll అంటే తెలుసుకదా ప్రజాభిప్రాయం, ముఖ్యంగా ఎక్కువ ప్రజల భావాల్ని ప్రతిబింబించగల ఓ వర్గం అభిప్రాయాలు/ అలాంటి అభిప్రాయ సేకరణ.
The polls = ఎన్నికలు
The nation is going to the polls next year = వచ్చే సంవత్సరం జాతి మొత్తం ఎన్నికల్లో పాల్గొనబోతోంది.

**Prachand:** But the exit polls point to a neck and neck race between BJP and BSP. Not always do these polls prove to be correct.
(అయితే exit polls BJP, BSP లకు దాదాపు సమానమైన seats రావచ్చని తెలుపుతున్నాయి. ఈ అభిప్రాయ సేకరణలు అన్ని సమయాల్లోనూ సరికావు.)

exit= బయటకు రావడం

**Prabhat:** Any way the congress is going to have the worst of it all.
(ఏదయితేనేం congress అన్నిట్లో అధమ స్థితిలో ఉంది.)

**Prachand:** The intelligence agencies have their own estimate of the results.
(ప్రభుత్వ గూఢచార వర్గాలు, వాళ్ల అంచనా వాళ్లు వేసుకుంటున్నారు.)

**Prabhat:** I wonder what's going to happen in Telengana.
(తెలంగాణాలో ఏం జరగబోతోందనేది ఆసక్తికరమైన విషయమే.)

**Prachand:** Let's wait and see. (వేచి చూద్దాం.)

**Prabhat:** That's all we can do.
(మనం చేయగలిగిందంతే.)

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 457

## the reality is far short of the hype


M.SURESAN

Newspapers లో ఎన్నికలకు సంబంధించి, పౌర సరఫరాలకు సంబంధించి వాడే పదజాలాన్ని ఇప్పుడు కొంత తెలుసుకుందాం. అంతేకాకుండా report చేసే విధానం కూడా పత్రికల్లో ప్రత్యేకమైన పద్ధతిలో ఉండటం గమనిస్తాం. అది తెలిస్తే మనం newspaper సులభంగా అర్థం చేసుకోగలం.

***Look at the following sentences from the dialogue above:***

*1) Cases had been booked against erring gas distributor, said the civil supplies authorities.*
*2) But the reality is far short of the hype about the progress.*
*3) The gallup poll on the Karnataka elections predict a clear majority for the BJP.*
*4) But the exit polls point to a neck and neck race between the BJP and the BSP.*

**1) ...., said the civil supplies authority.**

Civil supplies authority= పౌర సరఫరాల అధికారి/ పౌర సరఫరా యంత్రాంగం- Ration బియ్యం, కిరోసిన్ లాంటి సరుకుల పంపిణీ వ్యవస్థ.

మామూలుగా మనం ఎవరైనా ఏదైనా చెప్పారని English లో అనేందుకు, He/ She said అని ప్రారంభిస్తాం. దాని తర్వాత వాళ్లు చెప్పిన విషయాన్ని indirect speech లో తెలుపుతాం. అయితే newspaper లో చాలావరకు, విషయాన్ని ముందర చెప్పి, తర్వాత he/ she said అనో said he/ she అనో తరచుగా కనిపిస్తుంది.

a) The government is doing every thing to contain inflation, assured Mr Chidambaram, union finance minister.
(చూశారు కదా, విషయం ముందర చెప్పి, చివర ఎవరు చెప్పారో తెలుపడం) = ద్రవ్యోల్బణాన్ని అదుపులోకి తెచ్చేందుకు ప్రభుత్వం చేయవలసిందల్లా చేస్తుందని, కేంద్ర ఆర్థిక మంత్రి చిదంబరం హామీ ఇచ్చారు.

ఇలాంటి sentences లో sequence of tenses అంతగా పాటించకపోవచ్చు

b) We should stand united in this moment of crisis, appealed the prime minister to the nation= ఈ విపత్కర పరిస్థితుల్లో మనమంతా ఐక్యంగా ఉండాలని ప్రధానమంత్రి జాతికి విజ్ఞప్తి చేశారు.

crisis= విపత్తు/ ఆపద. (క్రైసిస్)- ఇక్కడ కూడా గమనించండి, appealed the prime minister అని వాక్యం చివర, ఎవరు చెప్పిందీ రావడం.

**2) But the reality is far short of the hype**

Reality = వాస్తవం, hype = ఒక విషయాన్ని/ వస్తువును/ తయారీని/ ఒక వ్యక్తి గొప్పతనాన్ని/ సినిమాను గురించి ఎంతో ఘనంగా, లేని గొప్పతనాన్ని అంటగడుతూ చెప్పడం/ విశేష ప్రచారం చేయడం/ ఆర్భాటం చేయడం.

a) Inspite of all the media hype, I found the movie dull= మీడియా (వార్తా పత్రికలు, magazines, TV channels, etc.,) ఎంత గొప్పగా ప్రచారం చేసినా/ చేసినప్పటికీ, నాకు మాత్రం ఆ సినిమా చెత్తగానే ఉంది.

b) There's always a lot of hype in India about the children of those in high offices. For example, look at that hype about Rahul Gandhi = భారత్‌లో గొప్ప పదవుల్లో ఉన్నవాళ్ల పిల్లల గురించి ఎంతో గొప్పగా ప్రచారం జరుగుతుంది. రాహుల్ గాంధీ గురించి జరిగే ఘన ప్రచారం దీనికో ఉదాహరణ.

ఏ పార్టీకి ప్రభుత్వం ఏర్పరిచే మెజారిటీ రాకపోవచ్చని, **Gallup polls** జోస్యం. Hung assembly/ parliament = అసెంబ్లీ/ parliament లో ఏ పార్టీకి ప్రభుత్వాన్ని ఏర్పరిచే majority రాకపోవడం. అప్పుడు కొన్ని పార్టీల కలయికతో సంకీర్ణ (coalition) ప్రభుత్వం ఏర్పడుతుంది. ఇప్పుడు కేంద్రంలో UPA లాంటిది.

**4) The exit polls point to ...**

Exit polls కూడా ఒక రకమైన survey. Gallup polls ఎన్నికలు జరిగేముందు నిర్వహిస్తారు. Exit polls ఎన్నికల రోజున, ఓటువేసి బయటకు వస్తున్న వారిని, వారెవరికి ఓటు వేశారో తెలుసుకుని, ఫలితాలను అంచనా వేసేందుకు జరిపే అభిప్రాయ సేకరణ.

Exit = బయటకు రావడం. బయటకొచ్చేవారి అభిప్రాయ సేకరణ కాబట్టి దీన్ని exit poll అంటాం.

---

## Q&A

**Q.** అకడమిక్/ పోటీ పరీక్షల్లో ఉపయోగపడే కింది పదాలకు అర్థాలను తెలుపగలరు.
*analyse, contrast, describe, comment, compare, illustrate, elucidate, enumerate, trace, elaborate, discuss, argue, differentiate, evaluate, examine, assess, on what, in what, for what, explain, bringout, point out, outline, interpret, give an account, determine, characterise, review, to what, substantiate, critically evaluate, summaries, categorise.*

***- K.P.V. Rao, Vizag***

**A.** Analyse = విశ్లేషించడం అంటే ఒక విషయం ప్రతి అంశాన్ని క్షుణ్నంగా అర్థం చేసుకోవడం/ వివరించడం.
Contrast = రెండింటికున్న తేడాలు పరిశీలించడం. X Compare = పోలికలు తెలుపడం;
Illustrate = ఉదాహరణలతో (సోదాహరణంగా) తెలుపడం;
Describe= వర్ణించడం.
Elucidate = Explain = Elaborate = వివరించడం/ సవివరంగా/ సవిస్తరంగా తెలుపడం= bringout.
Discuss= Argue = చర్చించడం,
Comment = వ్యాఖ్యానించడం;
Enumerate = ఒక్కొక్కటిగా ఒకదాని గుణాలను/ అంశాలను తెలుపడం
Differentiate = తేడాలు వివరించడం.
Evaluate = Assess = అంచనా వేయడం;
Examine = పరిశీలించడం,
Point out = చూపించడం;
Trace = ఒక వృత్తాంతం వివిధ పరిణామాలను తెలుపడం;
Outline= టూకీగా వివరించడం;
Give an account of = వృత్తాంతం తెలుపడం;
Review = సమీక్షించడం,
Interpret = మనకు తోచిన విధంగా వివరించడం;
Determine = నిర్ధరించడం;
Characterise = లక్షణాలను తెలుపడం;
In what/ To what/ For what - ఇవన్నీ పూర్తి వాక్యాన్నిబట్టిగానీ అర్థం కావు.
Substantiate = నిరూపించడం (ఆధారాలతో)
Critically evaluate = విమర్శనాత్మకంగా అంచనా వేయడం
Summarise = క్రోడీకరించడం/ సంగ్రహంగా తెలుపడం
Categorise = తెగలుగా విభజించడం.

**Q.** *When, while –* ఉపయోగించే సందర్భాల్ని వివరించగలరు.
**1 a)** *I saw her when she was going out.*
**b)** *I saw her while she was going out-*
**2 a)** *He was studying when she was cooking.*
**b)** *When he was studying, she was cooking.*
ఏది కరెక్టు?

***- KS Krishna Metpalli***

**A. When** = at/ during the time that something happens = ఒకపని జరిగేటప్పుడు/ జరుగుతూ ఉన్న సమయంలో.
**While** = During the time that something happens= ఒకపని జరుగుతూ ఉన్న సమయంలో.
While, when- రెండూ దాదాపు ఒకటే అని తెలుస్తోంది కదా. అయితే while ను ఎక్కువగా continuous action కు వాడతాం. మీరిచ్చిన రెండు sentences కూడా correct.
1 a) I saw her when she was going out = ఆమె బయటకెళ్లినప్పుడు నేను చూశాను. (వెళ్లడం చూశాను)
b) I saw her while she was going out = ఆమె బయటికెళుతూ ఉండగా నేను చూశాను.
2) Both are correct. అయితే ఈ రెండు sentences లోనూ, when బదులు while better. When referes to particular point of time.
1) When I knocked at his door, his dog barked = అతడి తలుపు నేను తట్టినప్పుడు అతడి కుక్క మొరిగింది. (ఆ క్షణంలో)
2) When he saw his sister, he felt happy = చెల్లెల్ని చూడగానే సంతోషపడ్డాడు.
**'While' refers to a period** (ఒక సమయం అంతా)
1) While I was watching the TV, he was studying seriously = నేను TV చూస్తున్న సమయంలో (ఆ సమయం మొత్తం) అతడు చదువుతూ ఉన్నాడు - ఇది continuous.
2) While she was busy (during the time she was busy), he was chatting with his friends = ఆమె తన పనిలో తీరికలేని సమయం అంతా అతడు స్నేహితులతో కబుర్లాడుతున్నాడు.

**Q.** *Prosthodontia, Denture* అంటే ఏమిటో ఉదాహరణలతో వివరించగలరు.

***- Ratna kishore, Hyderabad***

**A.** Prosthodontia = కట్టుడు పళ్ల అమర్చడం. Prosthodonties, Periodontal, periodontology- ఇవన్నీ కూడా దంత వైద్యానికి సంబంధించిన highly technical పదాలు. Spoken English లో వాడేవికావు. వీటి అర్థాలకు medical dictionary చూడండి.
Denture (మీరు రాసినట్లు DUTURE కాదు)= కృత్రిమ పన్ను - Acrylic తోకానీ metal తోకానీ చేసినవి. ఈ రోజుల్లో సహజమైన పళ్ల రంగును పోలిన పింగాణీ కృత్రిమ పళ్లు దొరుకుతున్నాయి. ఇవి మిగిలిన సహజమైన పళ్లను పోలి ఉంటాయి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**ప్రశ్న:** 1. What is the origin of 'Hat-trick' and how did it derive?

2. What is the difference between 'curriculum vitae' and resume?

3. Though the news are past, headings are present indefinite tense in the newspaper, why?

a. 'Chaudhary seeks open hearing' (heading) Pakistan chief Justice Iftikar Chaudhary who was removed by Pakistan President... sought open hearing...

b. 'Centre sits on proposal'(heading) A proposal submitted by the state... Please clarify my doubts.

**- N.Satyam Emerald, Ramakrishnapur**

**జవాబు:** Origin of the word 'Hattrick' - Originally in 1858. An English bowler Stephenson who in1858 took three wickets in three balls in a row got a hat as a present for his feat. Money was collected on the spot from those watching the game, a hat was bought on the spot and it was presented to Stephenson.

This feat of taking three wickets, from then onwards came to be known as a Hattrick. In the beginning bowlers who got Hattrick were presented hats. The term later was extended to other games like hockey, football etc.

2) In American usage curriculum vitae and resume (pronounced) రెజ్యూమెయ్/ రెజెమెయ్ - జ size లో 'జ' లాగ) are the same. They are details of your educational qualifications, the jobs you have done, your experience, etc., with your name and address which you send when you apply for a job. Usually curriculum vitae is more detailed than a resume. A resume is brief.







3) That is a journalists convention. Even in Spoken English, we sometimes say 'I come here to seek your support,' though we say this after reaching the place, that is after the action is completed. In English, the present simple sometimes is used to refer to immediate past.

a) and b) - The headline is usually in the present tense and the report following it is in the present perfect/ past simple, depending on whether the time is stated or not. This has been explained in our earlier answers to the same question.

**ప్రశ్న:** Ships sail on the sea
Ships sail in the sea
ఈ రెండింట్లో ఏది కరెక్టు?

**V Ramakrishna, Rajahmundry.**

**జవాబు:** తెలుగులో సముద్రంలో అనవచ్చు కానీ, Englishలో, లో (in) అని మనం అనుకునే చాలాచోట్ల, 'on' వస్తుంది. 'on the list, on the train, on the plane, etc.

ఇది ఇంతకుముందు వివరించాం చూడండి.

Ships sail on/ across the sea - correct (in the sea - wrong)

# Headline is usually in the present tense

**ప్రశ్న:** Kindly let me following doubts be clarified, and give examples in English and Telugu.

1. What is the correct meaning of 'Right Now?'
2. Not Now, At present, Now itself be used instead of Right Now?
3. Are there 'right then', 'right here', 'right there' words in english?
4. What is the difference between 'from January' and 'right from January'?
5. What is the difference between 'might have done' and 'must have done'? What is the question form to these sentences?
6. What is the correct meaning of 'where as'.
7. What is the difference between keep asking and keep on asking.

**- Ravi, Hyderabad**

**జవాబు:** 1) A Right now = Now itself = ఇప్పుడే/ ఇప్పటికిప్పుడే/ వెంటనే. I can't give you the money right now. You have to wait = నీకిప్పుడు వెంటనే/ ఇప్పటికిప్పుడు ఆ డబ్బు ఇవ్వలేను. నువ్వు ఆగాలి.

Do it right now = వెంటనే ఆ పని చెయ్యి.

Right now I can show you what kind of man he is = ఇప్పటికిప్పుడు/ వెంటనే /ఈ క్షణంలో నేను చూపించగలను నీకు, అతను ఎటువంటివాడో.

2) 'Now itself' can be used instead of 'right now', but not now or at present. 'Right now' shows greater urgency than now/ at present.

3) Yes. There are. 'right then' = Right at that time = ఆ క్షణంలోనే.

He demanded his money back and right then and there, I gave him back his money = తన డబ్బు కావాలన్నదే తడవుగా, అప్పటికప్పుడు అక్కడికక్కడ నేనతనికిచ్చేశాను.

The man, the police wanted was right there but they didn't recognise him= పోలీసులకు కావాల్సిన వాడక్కడే ఉన్నాడు అయినా వాళ్లతన్ని గుర్తించలేదు.

He is right here`, just in front of you = వాడిక్కడే ఉన్నాడు, నీ ఎదురుగా.


M.SURESAN

Right here let's settle the matter = ఇక్కడికిక్కడే ఈ విషయం తీర్మానం చేసుకుందాం.

4) 'Right from January' is more or less the same as 'from January' - రెండూ దాదాపు ఒకటే. అయితే right from January అంటే కచ్చితంగా January నుంచి.

He has been here right from January =January మొదటి నుంచి అతనిక్కడ ఉన్నాడు.

5) Might have done = Perhaps he did it = చేసుండొచ్చు (సందేహం).

Must have done = చేసే ఉంటాడు, సందేహం లేదు.

He might have gone = వెళ్లిపోయుండొచ్చు

He must have gone = వెళ్లిపోయుంటాడు, సందేహం లేదు.

Question forms: Might he have done it? = అతడు చేసుండొచ్చా?

Must he have done it? = అతడు చేసే ఉంటాడా?

6) 'Whereas' is used to compare and contrast two things/persons, etc.

a) He is tall, whereas his brother is short = అతడు పొడుగే, కానీ అతడి brother పొట్టి.

b) North Indians prefer tea whereas South Indian like coffee = ఉత్తర భారతీయులు టీ ఇష్టపడతారు, అయితే దక్షిణ భారతీయులకు కాఫీ ఇష్టం.

Law/ Court Languageలో whereas అని sentence మొదట్లో వాడతారు, 'అందువల్ల' అనే అర్థంతో. Whereas (Because) The court feels that justice has not been done...

7) Keep asking = Keep on asking

Don't keep/ Don't keep on asking me the same question.

= అదే ప్రశ్న అడుగుతూ ఉండకు నన్ను.

He continuous to be the president by default = ఎన్నికలు తగిన సమయంలో జరగనందు వల్ల అతడు అధ్యక్షుడిగా కొనసాగుతున్నాడు.

**ప్రశ్న:** కింది వాక్యాలకు తెలుగులో అర్థం చెప్పండి.

1. a. Ramesh is about to sell.
   b. Ramesh is about to be sold.
2. a. Rani is going to sell.
   b. Rani is going to be sold.
3. i) Turner prize to be declared today.
   ii) Main film yet to be certified.
   iii) The world is said to be created out of nothing
   iv) To err is human.
v) The wind having been failed. (p.v.లో p.p)
4. ఈ వాక్యాలను అనువదించండి.
   i) Seeing is believing.
   ii) None but fools have ever believed it.
   iii) None of his poems are well known.
   iv) Do you know the where and when of the happening.
   v) I can't say the how and where of it.
5. Whatever, whichever ఎప్పుడెలా ఉపయోగించాలి?
6. రాము గొర్రెను నడిపిస్తున్నాడు.
7. సరళ శ్రీదేవిని నడిపిస్తుంది.
8. ఆరోగ్యంగా ఉండాలంటే మంచి ఆహారం తీసుకోవాలి.
9. కొందరు మాట్లాడుకుంటే నేను విన్నాను.
10. పరిగెత్తాలంటే శక్తి కావాలి.

**- Thirupathi Rao, Potli**

**జవాబు:** 1. a) రమేష్ (దేన్నో) అమ్మబోతున్నాడు.

b) రమేష్ అమ్మబడబోతున్నాడు = రమేష్‌ను ఎవరో అమ్మబోతున్నారు.

2. a) and 2 b) - పై అర్థాల్లాగానే.

3. i) to v) - ఇవన్నీ News paper headlines. Lessons 450 to 457లో వీటిని గురించి వివరంగా ఉంది. చదవండి.

i) ఈ రోజు ప్రకటించబడుతోంది Turner Prize (Turner Prize ప్రకటన నేడు).

ii) సినిమాను ఇంకా certify చేయాల్సి ఉంది/ ఇంతవరకూ సినిమా certify అవలేదు.

iii) ప్రపంచం/ విశ్వం శూన్యం నుంచి సృష్టి అయ్యిందని అంటారు.

iv) పొరపాట్లు మానవ సహజం.

v) ఇది correct కాదు - The wind having failed అని ఉండాలి. అర్థం, గాలి అనుకూలంగా వీయకపోవడంతో.. (నావ లాంటివి కదల్లేదని).

4) i) కళ్లకు కనిపించేది నమ్మదగిందే (కొందరు వ్యక్తుల ప్రకారం) = కళ్లకు కనిపించేది అబద్ధం అవదు కదా.

ii) మూర్ఖులు తప్ప ఇంకెవరు దాన్ని నమ్మలేదు.

iii) అతడు రాసిన కవిత్వం ఏదీ ప్రసిద్ధి చెందలేదు.

iv) నీకు అది ఎప్పుడు ఎక్కడ జరిగిందో తెలుసా? (The when and where of an event = ఓ సంఘటన జరిగిన స్థలం, సమయం)

v) అది ఎలా ఎప్పుడు జరిగిందో నేను చెప్పలేను.

5) Whatever = ఏమైనా/ ఏదైనా.
whichever = ఏదైనా

1. a) Whatever the price, I will buy the car = ధర ఏదైనా/ ఎంతైనా నేనా carను కొంటాను.

b) Whatever your reason, you are late = కారణం ఏమైనా నువ్వాలస్యమే.

2 a) Whichever book you want/ whichever is the book you want, you can find it in that shop = నీక్కావలసిన పుస్తకం ఏదైనా/ నీక్కావలసింది ఏ పుస్తకమైనా, ఆ shopలో దొరుకుతుంది.

b) Whichever team plays well will get an award of Rs. 10000 = బాగా ఆడే ఏ జట్టుకైనా, రూ.10000 బహుమానం వస్తుంది.

6) Ramu is walking the sheep.

7) Sarala is walking Sridevi.

8) If you want to be healthy, you should eat good food.

9) I overheard some people talking.

10) You need energy to run.

**ప్రశ్న:** 1. There isn't any way you please with elbows.

2. He was held down by some ropes.

పై రెండు వాక్యాలకు తెలుగులో అర్థం తెలుపండి.

3. I am having a one rupee note అని ఒక డిక్షనరీలో ఉంది. మరి havingను (possession) అనే అర్థంలో వాడకూడదు కదా. I have one rupee note అనాలి కదా. దయచేసి వివరించండి.

**- Gurram Shankar, Shankarapatnam**

**జవాబు:** 1) There isn't any way you please with your elbows = నీ మోచేతులతో నన్నేం సంతోషపెట్టవు = మోచేతులతో కూడా బాధిస్తావు.

2) Held down = పైకి లేవకుండా ఉంచడం = తాళ్లతో కట్టేసి పైకి లేవకుండా చేశాడు.

Hold down = కింద ఉండేలా చేయడం =

3) I am having a one rupee note అని ఉన్న dictionary సరైంది/ మంచిది కాకపోవచ్చు. I have a one rupee note, correct.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 459

# It's not worth the candle

**Midhun:** You look run down Chandan.
(చందన్ నువ్వు చాలా నీరసంగా కనిపిస్తున్నావ్.)

(be) run down = నీరసంగా/ కళ తగ్గి/ చిక్కిపోయి ఉండటం

**Chandan:** You can say that.
(నువ్వలా అనడంలో తప్పులేదు.)

**Midhun:** But why?
(అయితే ఎందుకని?)

**Chandan:** The pressures of my new position after promotion are telling on me. My work has doubled and I leave office rather late.
(ప్రమోషన్ తర్వాత నా కొత్త హోదాలోని ఒత్తిళ్లు నా మీద ప్రభావం చూపిస్తున్నాయి. నా పని రెండింతలైంది. ఆఫీస్ నుంచి ఆలస్యంగా వస్తున్నా.)

**Midhun:** But you had been after it till you got it, and now you don't seem to be happy.
(అది వచ్చేవరకూ దాని వెంటపడ్డావ్, తీరా అది వచ్చిన తర్వాత అంత సంతోషంగా ఉన్నట్లు లేవు.)

**Chandan:** For one thing, the work is heavy and tiring and for another I am unable to catch up with the new technology. Spending hours getting used to it.
(ఒకటేమో పని చాలా ఎక్కువ. అలసట కలిగిం చేస్తోంది; రెండోది ఈ కొత్త టెక్నాలజీకి అలవాటు పడలేకపోతున్నా. దానికి అలవాటుపడే ప్రయత్నంలో గంటల కొద్దీ సమయం పడుతోంది..)

**Midhun:** Didn't you foresee all this before you wanted the promotion.
(ప్రమోషన్ కోరుకునేముందు ఇవన్నీ ఊహించలేదా నువ్వు?)

**Chandan:** I did of course, but couldn't understand that this would be as difficult as this. Moreover I had a fear that if I didn't take the promotion, I might be edged out by the new boss.
(తెలుసు నాకు, అయితే ఇంత కష్టంగా ఉంటుందని అర్థం చేసుకోలేకపోయాను. అంతే కాకుండా, ప్రమోషన్ తీసుకోకపోతే మా కొత్త బాస్ నన్ను బయటకు తోసే ప్రమాదం ఉందని కూడా భయపడ్డాను.)

**Midhun:** Atleast is the increase in pay worth the trouble?
(కనీసం నీ జీతంలో పెరుగుదల నీ కష్టానికి తగ్గట్టు ఉందా?)

**Chandan:** The rise of course is substantial. It is that that keeps me going, with all the strain.
(పెరుగుదల మాత్రం ఘనంగానే ఉంది. అంత శ్రమైనా కూడా, అదే నన్ను ఇంకా కొనసాగేటట్లు చేస్తోంది.)

**Midhun:** Whatever the rise, it is not worth the candle, if you can't keep yourself well. Health first and anything else next, you know.
(జీతం ఎంత ఎక్కువైనా, నీ ఆరోగ్యం దెబ్బతినే పక్షంలో అదంత ముఖ్యం/ విలువైంది కాదు. మొదట ఆరోగ్యం, ఆ తర్వాతే ఏదైనా.)

**Chandan:** I think one more month and I'll have got used to it.
(ఇంకో నెల, ఆ తర్వాత నాకిది అలవాటైపోతుంది.)

**Midhun:** Let's hope so. All the best. I'd rather be going. Bye.
(అలాగే ఆశిద్దాం. నేను వెళతానింక. బై.)

**Now look at the following phrasal verbs from the dialogue above.**


M.SURESAN

Phrasal verbs అంటే తెలుసు కదా? వీటిలో రెండు మూడు మాటలుంటాయి. వాటిల్లో ఒకటి verb. అయితే ఆ verb మామూలు అర్థానికి ఈ కలయికలో ఉన్నప్పటి దానికీ సంబంధం ఉండదు. ఇవి English మాతృభాషగా ఉన్న వాళ్లకే తెలుస్తాయి. మనకు కూడా అలవాటైతేనే అర్థం అవుతుంది. ఇప్పుడు ఇలాంటివి కొన్ని చూద్దాం.

*1) You look run down*

*2) The pressures of my work... are telling on me.*

*3) ... I am unable to catch up with the new technology.*

*4) ... I feared to I might be edged out.*

*5) It is that that keeps me going*

*6) It's not worth the candle* (ఇది phrasal verbకాదు. Idiom. దాని గురించి ఇంతకు ముందే వివరించాం.)

**1) To look run down/ appear run down =** అలిసిపోయి నీరసించినట్లు కనిపించడం

To be run down = నీరసించి ఉండటం

a) Though he has recovered from Jaundice, he is still run down = అతడు కామెర్ల నుంచి కోలుకున్నప్పటికీ ఇంకా నీరసంగా, బలహీనంగా ఉన్నాడు.

b) The hard work is definitely telling on her. She is really run down.

ఇక్కడ రెండు Phrasal Verbs ఉన్నాయి చూడండి. 1) Telling on 2) be run down

పై వాక్యానికి మొత్తం అర్థం. ఆమె అలసిపోయి కళతప్పి కనిపిస్తోంది. ఆమె పడుతున్న శ్రమ ఆమె మీద ప్రభావం చూపుతోంది. (Is telling on).

అంటే tell onకు అర్థం, ప్రభావం చూపడం అని తెలుస్తోంది కదా?

a) The fear of exams is telling on the little girl. She is quite nervous and tensed up = పరీక్షల భయం ఆ చిన్న పిల్లలో కనిపిస్తోంది/ ప్రభావం చూపుతోంది. ఆమె కంగారుగా, బిగపట్టినట్లుంది.

b) His quick temper is telling on his relations with others = చీటికీ మాటికీ కోప్పడే అతడి స్వభావం ఇతరులతో అతడి సంబంధాలను దెబ్బతీస్తోంది.

(Run down కు ఇతర అర్థాలు చాలా ఉన్నాయి. అవి తర్వాత తెలుసుకుందాం.)

Tell on, conversationలో ఎక్కువగా వినిపించే expression. మీరూ వాడండి.

**3) To catch up with =** అవగాహన చేసుకోవడం/ ఓ కొత్త విషయానికి అలవాటు పడటం.

a) Though trained, it will take some time for the office staff to catch up with the use of computers = శిక్షణ పొందినప్పటికీ, కంప్యూటర్ల వాడకం గురించి అవగాహన పొందడానికి/ అలవాటుపడటానికి ఆఫీస్ సిబ్బందికి కొంతకాలం పడుతుంది.

b) Though from a village, she didn't take much time to catch up with the ways of the city = గ్రామీణ వాతావరణం నుంచి వచ్చినప్పటికీ ఆమె నగర జీవితానికి త్వరలోనే అలవాటు పడింది/ నగర జీవనశైలిని త్వరలోనే అర్థం చేసుకుంది.

**5) Keep something/ somebody going =** కొనసాగేట్లు చూడటం.

a) The hope that her husband, though missing, is still alive keeps her going = తన భర్త తప్పిపోయినా, ఇంకా బతికే ఉన్నాడన్న ఆశ ఆమెను జీవించేట్లు చేస్తుంది/ ఆ ఆశ వల్లే ఇంకా ఆమె బతికుంది.

b) Assured supply of milk from the villages around keeps the milk products factory going = చుట్టూ ఉన్న గ్రామాల నుంచి నిరంతరమైన/ కచ్చితమైన పాల సరఫరా వల్ల ఆ పాల ఉత్పత్తుల ఫ్యాక్టరీ కొనసాగుతోంది.

Assured = guaranteed

c) Have this bread to keep you going till lunch = ఈ బ్రెడ్ తిను, లంచ్ వరకు ఆకలి లేకుండా ఉండేందుకు.

d) I have enough money to keep me going till I get my first salary = నా మొదటి జీతం వచ్చే వరకు జరుగుబాటయ్యేందుకు నా దగ్గర చాలినంత డబ్బుంది.

**6) Not worth the candle =** అంత ప్రయోజనకరం కాదు/ శ్రమకు తగ్గ ఫలితం.

a) The remuneration he got for the job was not worth the candle = అతడా పనికి పొందిన పారితోషికం అతడు పడ్డ శ్రమకు తగిందికాదు.

b) I'm not going to try for the job. The place is too far off to be worth the candle = ఆ ఉద్యోగానికి నేనేం ప్రయత్నించబోవడంలేదు. అది మరీ దూరం, శ్రమకు తగిన ఫలితం లేనంతగా.

అయితే, not worth the candle వాడుక క్రమంగా తగ్గిపోతోంది. అవసరాన్ని బట్టి ఉపయోగించండి.

---

## Q & A

**ప్రశ్న:** *When we are born, we cry and others laugh. We should try to live in such a way that when we die, others should cry and we should laugh.*
- పై వాక్యాల్లో ఏదైనా తప్పు ఉందా? వివరించండి.

**- Sudha, Pavani, Veeravasaram (W.G.Dist)**

**జవాబు:** ఆ వాక్యం ఇలా ఉండాలి.
When we are born, we cry and others laugh. We should try to live in such a way that when we die, others cry and we laugh. (other should cry and we should laugh కాదు.)

**ప్రశ్న:**
I. *What did Venu's mother tell him last night?*
1) *Venu's mother told you to keep your shoes polished and ready last night.*
2) *Venu's mother told your shoes are polished last night.*
- పై రెండు సమాధానాల్లో ఏది కరెక్ట్? 1 or 2?

II. *i) Venu's books and bag are keeping.*
*ii) Venu's books and bag is keep. - Which is correct?*

**- B. Hanumantha Rao, Macherla**

**జవాబు:**
I. What did Venu's mother tell him last night? (వేణు వాళ్ల అమ్మ అతడితో రాత్రి ఏం చెప్పింది?) దీనికి మీరు ఇచ్చిన answers రెండింటిలో ఏదీ సరికాదు.
1) What did Venu's mother tell him? అన్న ప్రశ్నకు, Venu's mother told him అని రావాలి కదా, told you ఎలా వస్తుంది? కాబట్టి అది, Venu's mother told him last night to keep his (your) shoes polished and ready. Last night చివర రాదు.
2) Venu's mother told your shoes are polished last night. ఇందులో తప్పులు ఒకటి: told తర్వాత ఎవరితో చెప్పిందనేది తెలియాలి కదా? ; రెండు: ఇక్కడ కూడా your shoes ఎలా వస్తుంది, his అని కదా రావాలి? ; మూడు: last night (past కదా?) అన్నపుడు shoes are రాదు, shoes were polished వస్తుంది. అవునా?

II. i) Venu's books and bag are keeping.
ii) Venu's books and bag is keep. ఈ రెండు వాక్యాలకు అర్థం లేదు.

**ప్రశ్న:**
I. *Who is a good friend?*
*i) A good friend is one who helps us in problems. ii) A good friend is a help us with problems - What is correct answer in these lines?*
II. *A house is a place to live in, which protects us heat, cold and rain.*
*Which స్థానంలో it వాడొచ్చా?*
III. *i) What are climbers?*
*ii) What is climbers?*
*పై రెండు వాక్యాల్లో ఏది కరెక్ట్?*
IV. *Liquid is solid form of water?*
*ఇక్కడ of ఎలా ఉపయోగపడుతుంది?*

*-B. Hanumantha Rao, Macherla*

**జవాబు:**
I. i) A Good friend is one who helps with problems. ఇది correct.
II. వాడొచ్చు అయితే sentence కొద్దిగా మార్చాలి. ఇలా: A house is a place to live in, and it protects us from heat, cold and rain.
III. i) What are climbers? అనేది correct. Climbers, plural కదా? కాబట్టి are climbers అనే అంటాం.
IV. of = యొక్క; of water = నీళ్ల యొక్క

**ప్రశ్న:**
*1. I am getting used to marriage.*
*2. As many as 500 people attended the function* -వీటికి తెలుగులో ఉదాహరణలతోపాటు అర్థం వివరించండి.

**- MV Subramanyam, Chillakuru**

**జవాబు:**
1) Am getting used to = అలవాటుపడుతున్నాను. Be used/ get used to = అలవాటుపడటం/ కొత్తదనం పోవడం/ పాతబడటం. దీని గురించి పాత lessonsలో చాలా వివరంగా ఇచ్చాం. చూడండి.
2) As many as 500 people attended the function. ఇక్కడ as many as అంటే అంత పెద్ద సంఖ్యలో - 500 మంది దాకా వచ్చారు! అని, ఇతరులను impress చేసేందుకు చెప్పడం.
I gave him as much as Rs. 1000/- = అతడికి నేను తక్కువేం ఇవ్వలేదు 1000 రూపాయలు ఇచ్చాను తెలుసా?

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

# Would you stop talking shop?

**Samuchitha:** Hi Nirupama, can you even think of it? My walking all the 5 km last night home from the party?
(నువ్వది అనుకోనైనా అనుకోగలవా? Party నుంచి ఇంటికి 5 కిలోమీటర్లూ నేను నడిచిరావడం?)

**Nirupama:** I was in the same position as well. I thought of walking home, but I didn't feel up to it. Fortunately Nikhila gave me a lift and dropped me home.
(నాదీ అదే పరిస్థితి. ఇంటికి నడిచి రావాలనుకున్నాను, కానీ అంత చేయగలననిపించలేదు. అదృష్టవశాత్తు నిఖిల lift ఇచ్చి మా ఇంట్లో నన్నొదిలిపెట్టింది.)

**Samuchitha:** What a bore Kumar was last night!
(కుమార్ ఎంత విసిగించాడో నిన్న రాత్రి!)

**Nirupama:** He always is! He talks shop whenever we meet him. He tires us with his work as a software man all the time.
(అతనెప్పుడూ విసిగిస్తాడు! ఎప్పుడు మనం అతడిని కలిసినా తన ఉద్యోగం గురించే మాట్లాడతాడు. Software మనిషిగా తన అనుభవాల్ని చెబుతూ విసిగిస్తాడు.)

**Samuchitha:** Nischaya is his exact opposite. She claims that once. She is out of office she doesn't talk about it and she is as good as her word.
(నిశ్చయ కుమార్‌కు పూర్తి వ్యతిరేకం. Office బయట office విషయాలు మాట్లాడనంటుంది. ఆ మాట నిలబెట్టుకుంటుంది.)

**Nirupama:** Yea. In fact you rub her up the wrong side if you even just refer to it.
(అవును. అసలు మనమాప్రసక్తి తెస్తేనే తనకు కోపం వస్తుంది.)

**Samuchitha:** How good your relations with others are depends on how and what you talk about to them.
(ఇతరులతో నీ సంబంధాలు ఎలా ఉంటాయనేది నువ్వు వాళ్లతో ఎలా మాట్లాడతావు, ఏం మాట్లాడతావనేదాన్నిబట్టి ఉంటాయి.)

**Nirupama:** You are right on the nail. I agree with you there completely. The less you talk of yourself, the better, always.
(నువ్వు చెప్పింది correct. నీతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నా. మన గురించి మనం ఎంత తక్కువగా మాట్లాడితే అంత మంచిది.)

**Samuchitha:** By the way, some thing very surprising. I saw Nikhila and Akhila together last evening. Are they friends again?
(అదిసరే. చాలా ఆశ్చర్యకరమైన విషయం. నిఖిల, అఖిల మళ్లీ కలిసుండటం చూశాను నిన్న. మళ్లీ వాళ్లు స్నేహితులయ్యారా?)

**Nirupama:** Don't you know? They have kissed and made up. They are friends like never before.
(నీకు తెలియదా? వాళ్లు మళ్లీ ఒకటైపోయారు. ఇంతకుముందెప్పుడూ లేనంత స్నేహితులైపోయారిప్పుడు.)

**Samuchitha:** Happy to hear that.
(వినేందుకు సంతోషంగా ఉంది.)

మనం ఇప్పుడు మరికొన్ని phrasal verbs గురించి తెలుసుకుందాం. Phrasal verbs ఎప్పుడూ మన practice పై ఆధారపడి ఉంటాయి. మనం ఎంత ఎక్కువగా మన conversation లో వాటిని వాడితే అంత బాగా గుర్తుంటాయి.

***Look at the following sentences from the conversation above:***




*1) ... I didn't feel up to it*
*2) He always talks shop whenever we meet him*
*3) She is as good as her word (ఇది phrasal verb కాదు)*
*4) In fact you rub her up the wrong way/ wrong side if you even refer to it.*
*5) You are right on the nail*
*6) They have kissed and made it up*


M.SURESAN

**1) Feel up to it/ feel up to something** = ఒక పని చేసే ఓపిక/ ఉత్సాహం ఉండటం.

a) I do jog for about 4 to 5 km everyday, but yesterday, some how I didn't feel up to it.= ప్రతిరోజు నేను 4, 5 కి.మీ. jog (వ్యాయామంలో భాగంగా నిదానంగా పరుగెత్తడం) చేస్తాను. కాని నిన్న మాత్రం నాకా ఓపిక లేకపోయింది.

b) Because of her age aunt Prameela didn't feel up to visiting my sister in the hospital and seeing her baby = (పెద్దవయసువల్ల ప్రమీల అత్తయ్యకు ఆసుపత్రికి వెళ్లి మా చెల్లెల్ని, పాపను చూసే ఓపిక లేకపోయింది.)

c) You look weak. Do you feel up to walking the distance? = నీరసంగా కనిపిస్తున్నావు. అంత దూరం నడవగలవా? / నడిచే ఓపిక ఉందా?

గమనించండి: 1) Feel up to తర్వాత noun కానీ ...ing form కానీ వస్తుంది. 2) feel up to ఎప్పుడూ not తో, ఓపిక, శక్తి లేదని చెప్పేందుకూ, question లోనూ వాడతాం.

**2) talk shop** = మన వృత్తి, వ్యాపకాలను గురించి మాట్లాడటం.

a) Well, we are at a marriage. Would you stop talking shop? Remember, not all of us are doctors = మనం పెళ్లికొచ్చాం. మీ వృత్తి వ్యాపకాల విషయాలు మాట్లాడటం ఆపుతారా? ఇక్కడున్న వాళ్లందరం doctors కాం. గుర్తుంచుకోండి. (అంటే పెళ్లికొచ్చిన ఇద్దరు doctors వైద్యం విషయం మాట్లాడుకుంటున్నారన్న మాట.)

b) We are here to enjoy the party. No talking shop please = మనం party ఆనందించేందుకు వచ్చాం. దయచేసి సొంత/ వృత్తి విషయాల సంగతి వద్దు.

c) If you talk shop, others find you a bore = నీ వృత్తి/ ఉద్యోగాల విషయమే మాట్లాడుతుంటే ఇతరులకు నువ్వు bore అనిపిస్తావు.

**3) As good as one's word** = ఎవరైనా అన్నమాట నిజం చేయడం/ అన్నమాట ప్రకారం నడుచుకోవడం.

a) He said he would help me and he was as good as his word= అతడు నాకు సాయం చేస్తానన్నాడు, ఆ మాట అతడు నిలబెట్టుకున్నాడు.

b) The officer promised immediate action, but I doubt if she is going to as good as her word= ఆ అధికారి వెంటనే చర్య తీసుకుంటానంది కానీ ఆమె తన మాటను నిలబెట్టుకుంటుందా అనేది నాకు సందేహమే.

**4) Rub somebody up the wrong side/ way**= కోపం తెప్పించడం

a) Talk to him of the present day cinema and you are sure to rub him up the wrong side= నువ్వు ఆయనతో ఇప్పటి సినిమా పోకడలను గురించి మాట్లాడితే ఆయనకు తప్పకుండా కోపం తెప్పిస్తావు/ ఇప్పటి సినిమా పోకడలను గురించి మాట్లాడటం ఆయనకు కోపం తెప్పించడమే.

b) Why do you rub him up the wrong side by rising that issue = ఆ విషయం గురించి మాట్లాడటమెందుకు, ఆయనకు కోపం తెప్పించడమెందుకు?

**5) Be right on the nail** = correct గా చెప్పడం/ ఊహించడం, etc.

a) You are right on the nail when you say he is not the man for the job = అతడు ఆ పనికి తగడు అనడంలో నువ్వు చాలా correct.

b) The newspaper was right on the nail when it wrote that the government would certainly gag the press if only it had an opportunity = అవకాశం దొరికితే ప్రభుత్వం పత్రికల నోళ్లు నొక్కేస్తుంది అని ఆ పత్రిక రాయడం కచ్చితంగా correct.

c) You are right on the nail there. No government is for transparency = నువ్వు correct. ఏ ప్రభుత్వమూ పారదర్శకతకు అనుకూలంకాదు. ఆ విషయంలో నువ్వు correct.

transparency = పారదర్శకత- రహస్యాలు/ గోప్యం లేకుండా ప్రజలకు అన్ని విషయాలు తెలపడం.

**6) Kiss and make it up** = పాత కక్షలూ, పోట్లాటలూ మరచిపోయి రాజీపడటం.

a) You expect YSR and NCB to kiss and make it up! That'd never happen. = YSR, చంద్రబాబు రాజీపడతారంటావా? / YSR, NCB మధ్య సయోధ్య ఉంటుందంటావా? అది అసంభవం.

b) Politics make strange bed fellows = రాజకీయాల్లో విచిత్ర సాంగత్యాలేర్పడతాయి.

You can find irreconcilable foes kissing and making it up = రాజీపడని ప్రత్యర్థులు పాతకక్షలు మరచిపోయి స్నేహితులవడం అసాధ్యమేమీకాదు

1) Politics make strange bed fellows = రాజకీయాల్లో వింత వింత సాంగత్యాలేర్పడతాయి.

2) There is no permanent friendship or enmity in politics = రాజకీయాల్లో శాశ్వత స్నేహాలు, శత్రుత్వాలు ఉండవు.

3) Politics is the last refuge of the scoundrel = నీతిమాలినవాళ్ల చివరి శరణు (ఆశ్రయం) రాజకీయాలు.

ఈ మూడు English లో famous proverbs.

## Q&A

***Q. 1.*** *The boys - (finish) the game by five.*
ఈ వాక్యంలో- *1. will finish, 2. will have finished, 3. finished* – ఏది సరైన సమాధానం అవుతుంది?

*2. The car (stop) when the police signalled*
ఈ వాక్యంలో- *1. was stopped, 2. stopped, 3. had stopped* – ఏది సరైన సమాధానం అవుతుంది?

***– P. Venkateswara, Madanapalle***

**A. 1.** a) The boys will finish the game at 5 = అయిదింటికి పిల్లలు ఆట ముగిస్తారు. (future)

b) The boys finished the game at 5 = అయిదింటికి (గతంలో) పిల్లలు ఆట ముగించేశారు.

c) The boys will have finished the game by 5 = అయిదు లోపలగానీ అయిదింటికిగానీ పిల్లలు ఆట ముగించేసుంటారు. (అప్పటి లోపల అయిపోతుంది)

**2.** The car stopped and the boys jumped out of it = కారు ఆగింది, పిల్లలందులోంచి బయటకు గెంతారు - ఇక్కడ car stopped అనేది correct కదా?

The car was stopped అని ఎప్పుడంటారు?

car లోపల ఉన్న వాళ్లు కాకుండా car బయట ఉన్న వాళ్లు దానికి అడ్డుతగిలి అది వెళ్లకుండా చేసినప్పుడు కదా?

The car was stopped by the protesters = ఆ నిరసనకారులు car ను ఆపేశారు - వాళ్ల చేత car ఆపబడింది. ఇలాంటి సందర్భాల్లో was stopped correct అవచ్చు.

The car stopped when the police signalled; The car had stopped when the police signalled - ఈ రెండు sentences వేర్వేరు అర్థాలతో correct.

1) The car stopped when the police signalled = Police signal వేయగానే/ వేయడంతో car ఆగింది - రెండూ ఒకేసారి జరిగాయి.

2) The car had stopped when the police signalled= Police signal ఇచ్చాడు. అప్పటికే car ఆగింది. Car ఆగడం signal ఇచ్చే ముందే జరిగిందని- అలా జరిగే అవకాశాలూ ఉంటాయి కదా.

3) The Police has signalled and the car stopped = Police signal ఇచ్చాడు. కారు ఆగింది- ఇది మామూలుగా జరిగేదే.

Subordinate clause Past Perfect లో సాధారణంగా ఉండదు.

The car was stopped when the police signalled = Police, signal ఇవ్వగానే car ను ఎవరో ఆపారు.

The car stopped --- . Car ఆగింది police signal ఇవ్వగానే.

The car had stopped --- . = signal ఇవ్వక ముందే car ఆగింది.

Before, after లు వాడినప్పుడు ముందు జరిగిన పనికి, past perfect అంత పట్టింపు లేదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# Had I the wings of a dove...












**Q.** కిందివాటిని ఉదాహరణలతో తెలుగులో వివరించండి.

**1.** *a) I would rather you went by air.*

*b) They would rather you paid them by cheque.*

**2.** *a) I move that Mr. Gupta <u>be</u> <u>appointed</u> Chairman.*

*b) It is suggested that a ring road <u>be</u> <u>built</u> to relieve the congestion.*

*c) We recommended that the subscription <u>be</u> <u>increased</u> to ten rupees.*

*underline part* గురించి వివరించండి.

**3.** కింది వాక్యాలకు తెలుగులో అర్థాన్ని తెలుపండి.

*a) There was not a woman present but wept to hear such news.*

*b) They elected Rama than whom no better boy ever went to school.*

**4.** కింది వాక్యాలకు ఉదాహరణలతోసహా తెలుగులో అర్థాన్ని తెలుపండి. *Structure* కూడా వివరించండి.

*a) Had I not seen this with my own eyes I would not have believed it.*

*b) Had I the wings of a bird I would fly away.*

*c) He would be happier were he honester.*

*d) Were an angel to tell me such a thing of you, I would not believe it.*

*e) What would you answer did I ask such a question?*

**5.** కిందివాటికి తెలుగులో అర్థాన్ని వివరించండి.

*a) Whatever happens keep calm.*

*b) Whichever road we take we shall be too late.*

*c) However cleverly you may cheat, you will be found at last.*

**6.** *a) So good a man is he that all respect him.*

*b) So cold was it that many died.*

*c) He spoke in such a low voice that few could hear him.*

**7.** *a) As you have made your bed so you must lie on it.*

*b) As he has lived so will he die.*

*c) As the twig is bent the branch will grow.*

***- M.V.Subramaniyam, Chillakur***

**A. 1.** Would rather= wish/ prefer (ఇష్టపడటం)

I'd rather you went by air = నువ్వు plane లో వెళ్లడమే నాకిష్టం/ వెళితే బాగుంటుంది.

They'd rather you paid them by cheque= నువ్వు cheque ద్వారా చెల్లించాలని కోరుకుంటున్నారు

Would rather గురించి ఇంతకుముందు చాలా వివరంగా తెలిపాం.

**2.** (a), (b) and (c) లో be appointed, be built, be increased- ఇవన్నీ should be appointed/ built/ increased కు short forms. Move (ప్రతిపాదించడం), suggest (సూచించడం), recommend (సిఫార్సు చేయడం) వీటి తర్వాత ఎప్పుడూ should clause గానీ, noun గానీ, ...ing form గానీ వస్తుంది.

**3.** (a) అక్కడ కన్నీళ్లు పెట్టుకోని స్త్రీ అంటూ లేదు. (... not a woman but ... ఇది old fashioned- ఇప్పుడు వాడటంలేదు)

(b) ఇక్కడ no better ever went to school- went to school= మీ sentence అర్థం= Rama కంటే గొప్ప విద్యార్థి లేడు/ ఉండేవాడు కాదు. అలాంటి రామాను ఎన్నుకున్నారు వాళ్లు.

**4.** a) Had I not seen= If I had not seen= నేను చూసి ఉండకపోతే (చూశాను)

b) Had I the wings of a dove= నాకేగనుక పావురం లాగా రెక్కలుండుంటే= If I had the wings of a dove

c) Were he honester= If he were honester= అతడు ఇంతకంటే నిజాయతీగలవాడైతే (కాదు). అయితే honest కు comparative honester వాడుకలో లేదు.

d) were an angel to tell me= If an angel were to tell me= దేవత వచ్చి చెప్పినా (అంటే ఏ పరిస్థితుల్లోనూ)

e) Did I ask you such a question= If I asked you such a question= నేను నిన్ను అలాంటి ప్రశ్న అడిగితే/ అడగమంటూ జరిగితే (అది జరగదు/ నేను నిన్నలా అడగను)

**5.** a) Whatever happens= ఏమైనా సరే

b) Whichever road we take= మనం ఏ దారిన వెళ్లినా

c) However cleverly you may cheat= నువ్వెంత తెలివిగా మోసంచేసినా.

**6.** a) So good a man is he ... = He is so good a man ... = అతడెంత మంచివాడంటే ..

b) So cold was it that many died = It was so cold that many died = చాలామంది చనిపోయారు, అంత చలిగా ఉంది.

c) He spoke in such a low tone that few could hear him= ఎవరికీ వినిపించనంత తక్కువ గొంతుతో మాట్లాడాడతను.

7. a) As you have made your bed you must lie on (so you ... కాదు. As వస్తే so రాదు, so వస్తే as రాదు)= నువ్వు నీ పక్కను ఏర్పాటు చేసుకున్నావు కాబట్టి అక్కడే పడుకోవాలి.

b) ఎలా బతికాడో అలాగే చనిపోయాడు.

c) ఉపశాఖ వంగినందుకు కొమ్మ పెరుగుతుంది.

---

**Q.** *1.* Friendship with అనకూడదు. Friends with అనొచ్చా ?

*2.* Date కు Dated కు తేడా వివరించండి. ఏది ఎక్కువగా ఉపయోగించాలి.

*3.* She bought a blue long ribbon. దీన్ని సరిచేయడం ఎలా?

***- M. Eswara Rao, M. Venkatapuram***

**A. 1.** Friendship with అనొచ్చు అనకూడదని ఎక్కడా లేదే. My friendship with him lasted twenty years = అతడితో నాకు స్నేహం ఇరవై ఏళ్లుండింది. (అతడితో నా స్నేహం ఇరవయ్యేళ్లు కొనసాగింది)

Friends with కూడా correct.

a) The minute he saw the neighbouring boy, he became friends with him.

b) In just a few days, he became friends with most of the boys in the class= కొద్ది రోజుల్లోనే అతడు class లో చాలామందితో స్నేహం చేశాడు/ చాలామంది స్నేహం పొందాడు.

**2.** Date= తారీఖు/ తేదీ. dated= ఫలానా తారీఖున/ తేదీన. This letter is dated 20th May = ఈ ఉత్తరం May 20 వ తారీఖున రాశారు/ ఈ ఉత్తరం తేది, 20 May.

**3.** She bought a long blue ribbon- correct. Long, blue - ఇది సరైన వరస.

---

**Q.** *1. What is the structure and meaning of following sentences?*

*i) It appears to be some juice.*

*ii) He swallowed some tablets to be relieved of it.*

*iii) Good books are still to be written.*

*2. Which sentence is correct? Please explain about them.*

*A. i) Do you know where is she going?*

*ii) Do you know where she is going?*

*B. i) I know what is the reason?*

*ii) I know what the reason is?*

*3. What are the Active Voice formations (sentences) of following sentences?*

*a) She is interested in tennis.*

*b) We are worried about his health.*

*c) Gandhi was born in 1869.*

*4. If I want to improve my communication skill, what should I do?*

***- B. Venkata Rao, Talavaram***

**A. 1.** i) It (sub) + appears (verb) + to be (infinitive) + some juice (complement)

ii) He (sub) + swallowed (verb) + some tablets (object) + to be relieved (passive infinitive) + of (prep) + it (obj of prep)

iii) Good books (sub) + are (verb) + still (adverb) + to be written (passive infinitive).

**2.** A ii) is correct, because the sentence is not a question and so you can't have verb + subject pattern. It is a statement and the subject she comes first and then the verb 'is going'

B ii) is correct for the same reason as above.

3. a) She is interested in tennis- Here interested need not be taken as a part of the verb, but as an adjective in the form of a past participle. Interested is almost always used as an adjective and not as a past participle forming part of a passive verb. Still, the active form of the sentence can be:

Tennis interests her.

b) His health worries us.

Here too, Worried in the sentence, 'We are worried ...', worried is an adjective (like interested)

c) Gandhi was born in 1869. Born is an intransitive verb (having no object), so it has no passive voice.

---

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపండి.

*1.* అన్నం పెట్టమని కాళ్లావేళ్లా పడ్డాడు.

*2.* ఆమెకు కొంచెం గర్వంకూడా పుట్టుకొచ్చింది.

*3.* ఎప్పుడెప్పుడు తినడం పూర్తవుతుందా, వెళ్లిపోదామా అని అతడు అనుకోసాగాడు.

*4.* రంగు వేయించుకోగానే సరిపోదు, బాగా ఆరబెట్టుకోవాలి.

*5.* అయినా వాడు వింటేగా.

*6.* వాడి ముచ్చటలో వాడున్నాడు.

*7.* ఇంకేముంది? వాడు దాంట్లో మునిగిపోయాడు, బయటకు రావడానికి నానా తంటాలు పడ్డాడు. గిలగిలా కొట్టుకున్నాడు. ఆఖరుకు ఏదో ఒకలాగా బావిలో నుంచి ఎగిరి బయట పడ్డాడు.

*8.* చూస్తే ఏముంది?

*9.* తన నిగనిగలాడే నల్లరంగు కనిపిస్తే ఒట్టు.

*10.* వాడి కడుపు మండిపోయింది.

*11.* పరుగెత్తి కనిపించకుండా దూరంగా పారిపోయింది.

*12.* అప్పటి నుంచి దెయ్యానికి, దేవుడి పడకుండా పోయింది.

*13.* కొంచెం చీకటి పడితే చాలు.

*14.* ఈ పచ్చిక నీ అబ్బ సొమ్మా?

*15.* జింక చిక్కితేగా!

*16.* వాడు చిక్కనే లేదు.

*17.* వాడు చచ్చినట్టు ఒప్పుకున్నాడు.

***- M. Surendra Reddy, Mallaram***

**A.** 1. He begged for food

2. She developed a little conceit

3. He just wanted the eating to be over/ to be finished and get out as soon as possible.

4. It isn't just enough to get painted, you have to have it dried.

5. But he wouldn't listen

6. He is enjoying himself/ He is absorbed in his own affairs.

7. It was almost over. He was drowned; he had a hell of trouble to get out; he struggled a lot. Finally, somehow, he managed to jump out of the well.

8. What was there to see?

9. I could swear that his shining black colour couldn't be seen.

10. He was furious.

11. She fled and disappeared.

12. Since then God and Satan (the devil) have fallen out with each other.

13. It's just enough if it gets a little dark.

14. This grass is not your property, is it?

15. The deer wouldn't be caught.

16. He hasn't been caught at all.

17. He had to agree/ He could not help agreeing/ He could not but agree.

పై వాక్యాలన్నింటి సందర్భం తెలిసినప్పుడే వాటికి సరయిన English expressions చెప్పగలం. సందర్భాన్ని బట్టి మాటల అర్థం ఉంటుంది కదా?

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 462

# Do something for good


M.SURESAN

**Suswara:** Hi Suvidha, What's new?
(ఏంటి విశేషాలు? )

**Suvidha:** Nothing except that I am impatient to get back to Vizag.
(ఏమీలేవు. ఎప్పుడెప్పుడు వైజాగ్‌కు తిరిగి వెళ్లిపోదామా అని ఉండడం తప్ప.)

**Suswara:** So soon! Why at all? I thought you had come here for good. Isn't that what you told me?
(అప్పుడే! అసలెందుకు వెళ్లాలనుకుంటున్నావు? నువ్విక్కడ ఉండిపోవడానికి వచ్చావనుకున్నా. అదేకదా నువ్వు నాతో చెప్పింది? )

**Suvidha:** I did and I thought so too. But somehow I feel like getting back?
(అవును చెప్పాను. నేనూ అలాగే అనుకున్నాను. కానీ ఎందుకో వెళ్లిపోవాలనిపిస్తోంది.)

**Suswara:** But why? Aren't your new colleagues here good to you? Anything against the office environment here? Don't you like your promotion?
(అయితే ఎందుకు? ఇక్కడ నీ సహోద్యోగులు నీపట్ల సరిగా లేరా? ఇక్కడి ఆఫీసు వాతావరణం నీకేమన్నా ప్రతికూలమా? నీ ప్రమోషన్ నీకిష్టం లేదా? )

**Suvidha:** I have nothing against my colleagues here. They are bending over backwards to please me, so I can be here. They prefer me to their previous boss. I do enjoy my promotion too.
(నా సహోద్యోగులను అనాల్సిందేం లేదు. నేనిక్కడుండేందుకు, అన్ని విధాలా నన్ను సంతోష పెట్టేందుకు ప్రయాస పడుతున్నారు. వాళ్లకు ఇంతకుముందున్న బాస్ కంటే నేనే ఇష్టం. నా ప్రమోషన్ కూడా నాకు సంతోషమే.)

**Suswara:** Then what else is wrong?
(మరింకేంటి నీబాధ? )

**Suvidha:** I think I'd blame it on the climate. It doesn't appear to agree with me. The food here doesn't either.
(ఇక్కడి వాతావరణాన్ని తప్పుబట్టాల్సి వస్తోంది. నాకు పడుతున్నట్లు కనపడటంలేదు కూడా. ఇక్కడి తిండీ నాకు పడటం లేదు.)

**Suswara:** Why do you think so?
(అలా ఎందుకు అనుకుంటున్నావు? )

**Suvidha:** I haven't been well for even two days running since I came here. I've had some digestion problems too.
(వరుసగా రెండు రోజులు కూడా నేను ఆరోగ్యంగాలేను ఇక్కడి కొచ్చినప్పటి నుంచి. కాస్త అజీర్తి సమస్యలు కూడా ఉన్నాయి.)

Two Days Running - ఇక్కడ Running కు continuously నిర్విరామంగా అని కూడా అర్థం.
He had the fever for 3 days Running = మూడు రోజులు నిర్విరామంగా అతడికి జ్వరం వచ్చింది.
Running = without a break

digestion = డై/ డిజెశ్చన్ = జీర్ణం

**Suswara:** A few more weeks here and I am sure you will get used to it all. Just don't worry.
(మరి కొన్ని వారాలు జరగనీ, అన్నింటికీ అల వాటు పడిపోతావు/ వాటంతటవే సర్దుకుపోతాయి. ఏం Worry అవ్వకు. తొందరపాటు నిర్ణయాలు తీసుకోకు.)

Haste = తొందరపాటు
Hasty = తొందరపాటైన

**Suvidha:** I think I'll get adjusted too, but I can't bet on it. When I got the transfer on promotion, I didn't bargain for this Kind of situation. I do like this place and want to be here but my health is bothering me.
(నేను సర్దుకుంటుందిలే అనుకుంటున్నా కాని అంత నమ్మకం లేదు. Promotion మీద బదిలీ అయినప్పుడు ఇలాంటి పరిస్థితి ఉంటుందని ఊహించలేదు. ఈ ఊరంటే నాకిష్టమే కానీ నా ఆరోగ్యమే కాస్త ఆందోళన కలిగిస్తోంది.)

**Suswara:** I'm sure you are going to get over it. You'll be all right and you're going to be here for years.
(వీటన్నింటి నుంచి బయట పడగలవనే నమ్మకం నాకుంది. నువ్వు త్వరలోనే బాగుంటావు, సంవత్సరాలపాటు ఇక్కడే ఉంటావు.)

**Suvidha:** I Hope so too.
(నేనూ అదే ఆశిస్తున్నా.)

మనం daily life situationsలో తరుచుగా వినే phrasal verbs మరికొన్ని తెలుసుకుందాం. వాటిని మన conversation లోనూ practise చేద్దాం.

**Look at the following sentences from the conversation above.**

***1) I thought you had <u>come here for good</u>.***
***2) I <u>have nothing against</u> my collages.***
***3) They are <u>bending over backwards</u> to please me.***
***4) I think <u>I'd blame it on</u> the climate.***
***5) It doesn't appear <u>to agree with</u> me.***
***6) I think i'll get adjusted too, but <u>I can't bet on it</u>.***

పై expressions అన్నీ కూడా మనం తరచూ వింటూ ఉంటాం. ఇవన్నీ కూడా మామూలుగా అందరూ వాడేవే.

1) Do some thing <u>for good</u> - ఇక్కడ for good అంటే శాశ్వతంగా.

a) He has left the country <u>for good</u> - అతడు దేశం వదిలి <u>శాశ్వతం</u>గా వెళ్లిపోయాడు/ మళ్లీరాడు.

b) Here, take this TV it's yours for good- ఇదిగో, ఈ TV తీసుకో. అదింక నీదే.

c) We have separated before, but I think it is <u>for good</u> this time = ఇంతకు ముందు మేం విడిపోయాం, కానీ ఈసారి మాత్రం మేం <u>శాశ్వతం</u>గా విడిపోయామనుకుంటున్నా.
(అంటే, ఇంతకు ముందు మేం విడిపోయి కలుసుకున్నాం, కానీ ఈసారి ఆ అవకాశం లేదనుకుంటా) British English లో దీన్ని for good and all అనీ అంటారు.

2) Have nothing against somebody/ some thing = Have no complaints about some body/ something = ఒకరిని/ ఒక విషయాన్ని అయిష్టత/ ఫిర్యాదులు లేకపోవడం.

a) I have nothing against the teachers- its only the fees that I complain about = టీచర్ల మీద నాకేంలేదు. ఫీజుల విషయమే నా అభ్యంతరం అంతా.

b) He said he <u>had</u> <u>nothing</u> <u>against</u> <u>any</u> <u>body</u>. He just blamed his fate = తనకు ఎవరిమీదా ఏ విధమైన కోపమూ లేదన్నాడు. విధిని తిట్టుకున్నాడు.

3) Bend over backwards/ fall over backwards = ఒకర్ని సంతోషపరిచేందుకు శతవిధాలా ప్రయత్నించడం/ ప్రయాసపడటం. ఇది చాలా ఉపయోగకరమైన expression.

a) Congress people bend over backwards/ fall over backwards to get the favour of the Nehru- Gandhi family = నెహ్రూ - గాంధీ కుటుంబాల అనుగ్రహం పొందేందుకు కాంగ్రెస్ వాళ్లు శతవిధాలా ప్రయాసపడతారు. (ఆ కుటుంబం అనుగ్రహం కోసం వారు దేనికైనా సిద్ధమే.)

b) Don't bend over backwards to please me. If you want my help, just ask.
(నన్ను సంతోషపరిచేందుకు అంత ప్రయాసపడకు. నీకు నా సహాయం కావాలంటే అడుగు అదిచాలు.)

c) The new teacher is bending/ falling/ leaning over backward to please the students = ఆ విద్యార్థుల మెప్పుపొందేందుకు ఆ కొత్త teacher అన్ని విధాలా ప్రయాసపడుతున్నాడు.

4) To blame it on somebody/ something = ఒకరిని/ ఒక విషయాన్ని నిందించడం/ తప్పుపట్టడం/ కారణంగా చూపించడం.

a)The doctor <u>blames</u> his illhealth <u>on</u> lack of exercise = అతడి అనారోగ్యానికి కారణం అతడికి వ్యాయామం లేకపోవడమే అంటున్నారు డాక్టర్.

b) I blame his failure on his laziness = అతడి సోమరితనమే అతడి వైఫల్యానికి కారణం అంటాను నేను.

c) He blames his poverty on everybody except his unwillingness to workhard = అతడు తన పేదరికానికి <u>అందరినీ కారణంగా చూపిస్తాడు</u>, కష్టపడి పనిచేసేందుకు ఇష్టపడని తన తత్వాన్ని తప్ప.

Blame it on someone/ something = blame some body/ something for something.

5) Agree with - దీని మామూలు అర్థం మనందరికీ తెలుసు- అంగీకరించడం. అయితే ఇక్కడి అర్థం, ఆహారం/ వాతావరణం లాంటివి ఒకరికి పడటం/ suit అవడం.

a) Outside food <u>doesn't</u> <u>agree</u> with me = Outside food doesn't <u>suit</u> me = బయటి ఆహారం నా ఒంటికి <u>పడదు</u>.

b) He left for home <u>for good</u> as the climate here <u>did not agree</u> with him = ఇక్కడి శీతోష్ణస్థితి అతడికి పడనందువల్ల అతడు వాళ్ల ఊరెళ్లిపోయాడు. ఇకరాడు.

c) Does the food here <u>agree with you?</u>= ఇక్కడి ఆహారం నీకు <u>పడుతోందా?</u>

6) I can't bet on it - can't bet on something = అంతనమ్మకంగా చెప్పలేకపోవడం.

a) 'Will Chiranjeevi's party form the next government?'
(ఈసారి ప్రభుత్వాన్ని చిరంజీవి పార్టీ ఏర్పరుస్తుందా? )
'Well, I like the idea, but I can't bet on it.'
(అది నాకిష్టమే. కానీ అంత నమ్మకంగా చెప్పలేకపోతున్నా.)

b) I'll be happy if they win, but I can't bet on it = వాళ్లు గెలిస్తే నాకు సంతోషమే. కానీ నాకంత నమ్మకం లేదు. ఇది ఎప్పుడూ not తోనే వాడతాం.




**Q.** 1. I have not received any information from you as yet. ఈ వాక్యంలో not తర్వాత receive అని ఉండాలి కదా.
2. i) ashamed of, ii) ashamed for, iii) ashamed to do దయచేసి ఉదాహరణలతో వివరించండి.
3. Bare, naked ఈ రెండు పదాలను ఏది ఎక్కడ ఉపయోగించాలో తెలపండి.
4. Go slow ఉదాహరణతోపాటు అర్థం చెప్పండి.

***-K. Malyadri Reddy, Guntur***

**A.** ఒక విషయం కాదు/ లేదు అనేందుకు not దేని ముందైనా/ దేని తర్వాతైనా వాడవచ్చు అయితే shall, should, will, should, can, could, may, might, must తర్వాత not ఉన్నా లేకపోయినా 1st form of the verb వాడతాం. Do, does, did తర్వాత not వస్తే 1st form వస్తుంది. Have to, has to, had to తర్వాత not లేనప్పుడు 1st form of the verb వస్తుంది.

2. Ashamed of, ashamed to + 1st RDW మాత్రమే వాడతాం. Ashamed for లేదు.
He was ashamed of <u>his behaviour</u>.
ఇక్కడ ashamed of తర్వాత now (behaviour) రావడం గమనించండి.
Ashamed of తర్వాత 'ing' form కూడా రావచ్చు. e.g. She was ashamed of getting up so late. Ashamed to తర్వాత, Ist RDW వస్తుంది. అంటే Infinitive వస్తుంది. He was ashamed to adjust that he had failed = అతడు fail అయ్యానని ఒప్పుకునేందుకు సిగ్గుపడ్డాడు.

3. Bare = నగ్నమైన = naked. అయితే bare బట్టలతో కప్పని శరీర భాగాలకు మాత్రమే వాడతాం, naked ఏ బట్టలూ వేసుకోని వ్యక్తిని వర్ణించేందుకు వాడతాం.
She stood naked on the beach = ఆమె నగ్నంగా నిలబడింది.
She walked barefooted / She walked in bare <u>feet</u> (part of the body).
He had just a loin cloth on. The body waste upward and his legs were <u>bare</u> = నడుముకు మాత్రం ఏదో గుడ్డచుట్టుకున్నాడు, నడుముపైన, కాళ్లమీద బట్టల్లేవు.
ఏదైనా మోడుగా ఉన్న దాన్ని bare అంటాం.
The tree is bare = చెట్టు ఆకుల్లేక మోడుగా ఉంది.
The ground is bare of grass or tress = ఆ నేల మీద ఎక్కడా పచ్చికగానీ చెట్లుగానీ లేవు.
Bare arms = ఆచ్ఛాదనలేని చేతులు
<u>Bare walls</u> stood where once there had been a building = ఒకప్పుడు కట్టడం ఉన్న ఆ చోట మొండి గోడలు మాత్రమే ఉన్నాయి. ఇదీ bareకు, nakedకూ తేడా

4. go - slow = పని అయిష్టంగా నిదానంగా చేయడం- సమ్మెకు బదులు.
The workers are on go - slow = కార్మికులు పనిని నిదానంగా చేస్తున్నారు. తమ నిరసన/ అయిష్టత వ్యక్తంచేసేందుకు.
The government is going slow on the matter = ప్రభుత్వం ఆ విషయంలో అంత ఉత్సాహం కనబరచటం లేదు. ఏదో నిదానంగా చేస్తోంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Sambhav:** These fruits aren't any good. Why did you buy them at all?
(ఈ పండ్లేం బాగాలేవు. నువ్వసలెందుక్కొన్నావు వాటిని? )

**Vaibhav:** The season is almost over. Good fruits are hard to come by.
(ఈ పండ్లకాలం దాదాపు అయిపోవచ్చింది. మంచి పండ్లు దొరకడం కష్టంగా ఉంది)

**Sambhav:** We could have done without them, couldn't we? No fruit is better than bad fruit.
(అవి లేకపోయినా బాగుండేది కదా? చెడిపోయిన పండ్లు తినేకంటే అసలు తినకుండా ఉండటం మేలు కదా? )

**Vaibhav:** Don't go on like that. Eat them or leave them.
(అలా మాట్లాడటం ఆపు. తింటే తిను, లేకుంటే లేదు)

**Sambhav:** All to the good then. I won't have them and I shan't fall ill.
(అయితే సరే. నేను వాటిని తినను జబ్బు పడను)

**Vaibhav:** Yea. You're right. I shouldn't have bought them. I was on my way back home when I saw these fruits. I bought them without knowing that I was throwing away good money on bad fruit.
(అవును. నువ్వన్నది నిజమే. వాటిని కొనుండాల్సింది కాదు. నేనింటికి తిరిగి వస్తున్నప్పుడు ఈ పండ్లను చూశాను. పనికిరాని పండ్లమీద డబ్బు తగలేస్తున్నానని తెలియకుండా వీటిని కొన్నాను)

**Sambhav:** Where were you coming from?

**Vaibhav:** I had been to the station to see off my cousin.
(మా cousin ను train లో ఎక్కించి వీడ్కోలు చెప్పేందుకు station కు వెళ్లాను)

**Sambhav:** You do fuss over your guests. You needn't have gone in this hot sun. He can find his way about, can't he?
(అతిథులను మరీ/ అతిగా మర్యాద చేస్తావు నువ్వు. ఇంత ఎండలో వెళ్లడం అవసరమా చెప్పు. అతడంతట అతడు వెళ్లగలడుగదా? )

**Vaibhav:** I fuss over my guests because they fuss over me when I am their guest. This guy that I've just seen off takes no end of trouble to make me comfortable when I visit him.
(నేనతిథిగా ఉన్నప్పుడు వాళ్లు అతిగా మర్యాద చేస్తారు. కాబట్టి నేను వాళ్లను అంత బాగా చూసుకుంటాను. ఇప్పుడు నేను రైలెక్కించి వచ్చినతడు, నేను వాళ్లింటికి వెళితే నాకన్ని సదుపాయాలు కల్పించేందుకు అంతులేని శ్రమ పడతాడు.)

**Sambhav:** This cousin of yours, Gowrav, I agree is really good. Any one will take to him at first sight.
(మీ ఈ cousin, గౌరవ్ నిజంగా మంచివాడే. నేనొప్పుకొంటున్నా. ఎవరైనా చూడగానే అతడంటే ఇష్టపడతారు)

**Vaibhav:** You are right.

**Sambhav:** OK. I have made some tea. What about the putting the cups out?
(సర్లే. నేను టీ చేశాను. Cups బయటకు తీస్తావా? )

**Vaibhav:** Why not? (తప్పకుండా)

ఈ lesson లో మనం daily life situations లో వాడే/ వినే spoken English expressions తెలుసుకుందాం; వీటిని తరచూ వాడదాం. అప్పుడు మన English, conversational ease (సంభాషణా సౌలభ్యం)తో చాలా సహజంగా, simple గా ఉంటుంది.

***Now look at these expressions.***

**1) Hard to come by** = దొరకడం కష్టం.

a) Honest politicians are hard to come by = నిజాయతీగల రాజకీయనాయకులు దొరకడం కష్టం/ రాజకీయాల్లో నిజాయతీగలవాళ్లు అరుదు.




# Honest politicians are hard to come by


M.SURESAN

b) Those were the days when jobs were hard to come by = ఉద్యోగాలు సులభంగా దొరకని రోజులవి.

c) Computer trained people aren't hard to come by these days = Computer శిక్షణ ఉన్నవాళ్లు దొరకడం అంత కష్టం కాదీ రోజుల్లో.

d) Why are the fruits so high priced? Are they hard to come by? = ఆ పండ్లేందుకంత ధరగా ఉన్నాయి? (ఆ పండ్లకు అంత ధర ఎందుకు? ) దొరకడం కష్టంగా ఉందా?

ఇది చాలా సాధారణం spoken English లో. వీలయినప్పుడల్లా వాడదాం.

**2) Fuss over** = ఎవరిపట్లనైనా అతి శ్రద్ధ చూపడం/ పిల్లలపట్ల, అతిథులపట్ల మరీ ఆదరణ చూపడం/ ఆతిథ్యంతో అతిథులను ఉక్కిరిబిక్కిరి చేయడం.

a) I'd think twice before visiting him. He fusses over me. I feel really uncomfortable = అతడి దగ్గరకు వెళ్ళేందుకు ఒకటికి రెండుసార్లు ఆలోచిస్తా. తను ఉక్కిరి బిక్కిరి చేస్తాడు (అతిథి మర్యాదలతో). నాకు కాస్త అసౌకర్యంగా ఉంటుంది.

b) She fusses over the child too much; that's likely to spoil it = ఆ బిడ్డపట్ల ఆమె అతిశ్రద్ధ చూపుతుంది/ బాగా గారాబం చేస్తుంది. అది ఆ బిడ్డను పాడుచేయొచ్చు

fuss = చిన్న చిన్న విషయాల గురించి ఎక్కువ ఆదుర్దా పడటం/ రాద్ధాంతం చేయడం.

a) He made all that fuss over a few rupees = ఆ కాస్త డబ్బుకు అంత రాద్ధాంతం చేశాడతడు

b) If I don't get back home before 9, there'll be a lot of fuss = 9 లోపల నేనిల్లు చేరకపోతే పెద్ద రాద్ధాంతం జరుగుతుంది.

make a fuss of = ప్రాముఖ్యంలేని విషయాలమీద అతి శ్రద్ధ చూపడం.

a) Don't make a fuss of your dog now. Mind your guests first = నీ కుక్కను గురించి అంత ఆదుర్దా పడకిప్పుడు. ముందు అతిథులను సరిగా ఆదరించు.

b) Mom, stop fussing, about me. I'll be all right in a day or two = అమ్మా, నా గురించి ఆదుర్దాపడటం ఆపు. ఒకటి రెండు రోజుల్లో నేను బాగానే ఉంటాను (బాగవుతాను).

**3) Do without** = ఏదయినా లేకుండానే గడిపేయడం/ అవసరం లేకపోవడం

a) I can do without a car, because I don't move out much = నేను బయట ఎక్కువ తిరగను, కాబట్టి car లేకుండా గడిపేయగలను.

b) A minister cannot do without a secretary = మంత్రి, secretary లేకుండా గడపలేడు/ మంత్రికి secretary చాలా అవసరం.

c) Living beings cannot do without oxygen = oxygen లేకుండా ప్రాణులు ఉండలేవు/ ప్రాణులకు oxygen చాలా అవసరం.

do with = అవసరం.

a) I can do with some coffee. Any good coffee shop here? = నాకు coffee చాలా అవసరం ఇప్పుడు. ఇక్కడ మంచి coffee shop ఏదయినా ఉందా?

b) She could have done with some money this morning. I didn't have any = ఆమెకు పొద్దున డబ్బు అవసరమయింది. నా దగ్గరేం లేకపోయింది.

**4) Go on like that**= అదే ధోరణిగా ఏదయినా చేస్తూ ఉండటం (Continue to do something)

a) Talk to him of cricket and he just goes on like that for hours = అతడితో cricket గురించి మాట్లాడు. అంతే. ఇక గంటల తరబడి అదేపనిగా మాట్లాడుతూ ఉంటాడు.

b) He goes on like that, viewing the TV. There's no stopping him= అతడలా TV చూస్తూ ఉండిపోతాడు. అతడిని ఆపడమంటూ ఉండదు.

**5) All to the good** = అదీ మంచిదే. (జరిగేదీ/ జరిగింది మనం అనుకున్నది కాకపోయినా, అదీ మన మంచికే అనడం)/ అదీ మన మంచికే/ అలా అవడం కూడా ఒకందుకు మంచిదయింది.

a) He missed the train but it was all to the good because it had an accident = అతడు train అందుకోలేకపోవడం మంచిదే అయింది. ఆ train కు accident అయింది.

b) It was all to the good that she didn't make it to the screen; she is earning much more as a TV anchor = ఆమె సినీతార కాలేకపోవడం మంచిదే అయింది. ఇప్పుడామె TV anchor గా చాలా బాగా సంపాదిస్తోంది.

**6) To see off** = To send off = వీడ్కోలు చెప్పడం

a) He was too busy even to see his wife and children off on their holiday trip = భార్యాపిల్లలు సెలవులకు ఎక్కడికో వెళుతున్నా వాళ్లను station లో train ఎక్కించి వీడ్కోలు చెప్పేంత తీరిక కూడా లేకపోయిందతడికి.

b) They gave him a warm send off = అతడికి ఆప్యాయతతో వీడ్కోలిచ్చారు.

**7) Take no end of trouble** = ఎంత శ్రమైనా పడటం.

a) Politicians take no end of trouble to stay in power = రాజకీయనాయకులు అధికారంలో ఉండేందుకు ఎంత శ్రమైనా పడతారు

b) Parents take no end of trouble to educate their children = పిల్లలను చదివించేందుకు తల్లిదండ్రులు ఎంత శ్రమైనాపడతారు.

**8) Take to some body/ something** = ఎవరినైనా/ దేన్నైనా ఇష్టపడటం/ అభిమానించడం

a) He did not take to the new job and left it in a week = కొత్త ఉద్యోగం అతడికిష్టం లేకపోవడంతో, దాన్ని వారానికే వదిలేశాడు.

b) Every one took to the new actor in his first appearance = ఆ నటుడి మొదటి చిత్రం/ నాటకంతోనే అందరూ అతడంటే ఇష్టపడ్డారు.



**Q.** కిందివాటిని ఇంగ్లిష్‌లో ఏమనాలో తెలియజేయగలరు.

1. గాలిలో పిట్టను చూసి మసాలా నూరినట్లు.
2. ఏ ఒక్కరూ నోరు మెదిపితే ఒట్టు.
3. కామాంధుడైన యజమాని.
4. లగ్నం సిద్ధం. మొగుడుపెళ్లాలు దొరికితే విఘ్నం లేకుండా వివాహం సాధ్యం.
5. సప్తస్వరాల పలకరింత, హృదయాల పులకరింత.
6. దళితులపై దమనకాండ.
7. బతిమాలినా పట్టించుకోలేదు.
8. తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టేవాడు.
9. సంగ్రామస్ఫూర్తి.
10. బద్ధకంలో హాయి, ఆచరణకు నోచుకోని ఆలోచనలు ఎన్నడూ ఉన్నతికి తోడ్పడవు.

*- K.Nagaraju, Gabbeta (Warangal dist.)*

**A.** మీరు రాసినవాటన్నింటికీ English లో మక్కీకి మక్కీగా అర్థం వచ్చే వాక్యాలు ఉండవు. దాదాపు అదే అర్థం వచ్చే వాక్యాలు కొన్నింటినిస్తున్నాం.

1) Counting the eggs before they are hatched = గుడ్లను పొదక్కముందే పక్షులను (కోడిపిల్లల్లాంటి వాటిని) లెక్కపెట్టినట్లు.

2) Curse me if even one opened their mouth = Damned be the one that opened their mouth.

3) Lascivious (లసీవియస్= కామాంధుడైన అంటే కామంతో కళ్లు మూసుకుపోయిన అని రాకపోవచ్చు కాని కామం ఎక్కువగా ఉండే అని అర్థం వస్తుంది) land lord.

4) సరైన proverb English లో లేదు. Everything but the bride and the groom is set the wedding

5) The melody/ the harmony of the musical notes thrilling the heart. (సప్తస్వరాలు= Octave)

6) Savagery/ Onslaught on the dalits/ atrocities on the dalits

7) ఎవరూ బతిమాలినా అనేది చెప్పలేదు. His/ my/ her etc appeals/ pleas fell on deaf ears/ He was deaf to our pleas/ appeals.

8) Biting the hand that feeds = అన్నం పెట్టిన చేతులనే కొరకడం. (తిన్న ఇంటి ... ఈ నానుడికి సరైనదిదే)

9) The spirit of combat/ fighting spirit

10) One can never prosper if they find ease in laziness, and if their thoughts are not translated into actions.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Q. 1.** *కింది వాక్యాల్లో ఏవి సరైనవో, అర్థాలతో వివరించగలరు.*

*I like you so much.*

*I like you very much.*

*2. what kind of person is he?*

*what sort of person is he? ఏది correct ?*

***- Rajkumar, Darsi***

**A. 1.** much = చాలా.

I like you so much (American) = నువ్వంటే నాకు ఎంతో ఇష్టం = I like you very much (British) = నువ్వంటే నాకు చాలా ఇష్టం- రెండు sentences కూడా correct.

**2.** What kind of/ sort of ...? రెండూ correct.




**Q. 1)** *Active voice నుంచి passive voice లోకి ఎందుకు మార్చాలి?*

*I am married లో passive form లో object ఉండాలని చెప్పారు. I am married to him/ her He was murdered ఇది passive కదా. దీనిలో object ఏమిటి?*

**2)** *Mind, enjoy, practise, be used to etc. లాంటి పదాలముందు noun/ infinitive రావాలన్నారు. వేల పదాలు ఉంటాయికదా! వాటినెలా గుర్తించాలి?*

*eg: He enjoys taking long walks.*

**3)** *Phrase openings, Accepted phrases అంటే ఏమిటి? కొన్ని ఉదాహరణలు తెలుపగలరు.*

**4)** *noun/ adv/ adj clauses అంటే ఏమిటి? కొన్ని ఉదాహరణలు తెలుపగలరు.*

*a) Can you tell me when he left?*

*b) When he left is still a mystery.*

*c) Do you remember the day when he left?*

*d) How could he know the result when he left before the end?*

*e) They invited him again even when he left once without saying good bye.*

*Please explain the use of 'when he left' given above sentences.*

***- A.Sudhakar, Peddamalla reddy***




# Can you tell me when he left?


M.SURESAN

**A. 1)** ఎందుకు మార్చాలి, active నుంచి passive కు? మార్చనక్కరలేదు. మార్చాలని నిబంధనలేదు. అయితే చెప్పే విషయం సూక్ష్మంగా, స్పష్టంగా ఉండేందుకుగాను సందర్భాన్నిబట్టి, active voice వాడాలా, passive voice వాడాలా అనేది తెలుస్తుంది.

తెలుగులో Road repair అయింది- ఈ భావాన్ని English లో active లో తెలపడం కష్టం. ఎందుకంటే రోడ్డు రిపేర్ ఎవరు చేశారు అనేది కచ్చితంగా ఫలానా వాళ్లు అని చెప్పలేంకదా. అలాంటప్పుడు passive సహజం (natural) గా ఉంటుంది. The road has been repaired. అలాగే పుర/ నగరపాలకసంస్థ (Municipality) రోడ్లను చూసుకుంటుంది. (అది దాని బాధ్యత) అనేందుకు, చూసుకునేది మునిసిపాలిటీ అని తెలుస్తోంది కాబట్టి, The municipality maintains roads అని ఇక్కడ active లో చెప్తాం. దీన్ని passive లో చెప్పడం కాస్త కృతకంగా ఉంటుంది. (The roads are managed by the municipality)

ఇలా సందర్భాన్నిబట్టి, మనం చెప్పేది ఇతరులకు సులభంగా, స్పష్టంగా అర్థమయ్యేందుకు ఏ voice లో సాధ్యమో, ఆ voice లో వాడతాం. అంతే గానీ voice మార్చాలనే నిబంధన ఎక్కడా లేదు.

**2)** Married ఇక్కడ, I am interested in cricket లో interested లాగ adjective- అంటే ఒక గుణాన్ని/ స్థితిని తెలిపే పదం. 'be' form పక్కన + ed, + ied, + d లాంటివి వచ్చినంత మాత్రాన వాటిని past participle అనుకుని, అది verb లో భాగంగా భావించి, passive అనుకోవడం పొరబాటు. అయితే I am married to him/ her- ఇక్కడ to తర్వాత object ఉంది (ఎవరిని? - ఆమెను/ అతడిని) కాబట్టి, am married ఇక్కడ passive.

He was murdered (by somebody)- ఇక్కడ by somebody లో somebody object. అది ఎవరో తెలియదు కాబట్టి వదిలేస్తాం. కావాలంటే object చేర్చుకోవచ్చు (by somebody లా). కాని అనవసరం కదా?

**3)** Phrase openings అంటే sentence ప్రారంభంలో వాడే phrases. eg: In my opinion ... (నా అభిప్రాయంలో); To tell you the truth ... (నిజం చెప్పాలంటే); Regarding that matter ... (ఆ విషయం గురించి...), To be frank (ఉన్నదున్నట్లు చెబితే ...) **గమనించండి:** ఈ expressions అన్నీ కూడా మన ఆలోచనలను మాటల్లో చెప్పడానికి వీలు కల్పిస్తాయి. అయితే కొన్నిసార్లు ఈ phrase openings లో finite verbs కూడా రావచ్చు ఇవన్నీ కూడా conversation లో అందరూ తరచూ వాడుతుంటారు, కొన్నిసార్లు అవి ఊతపదాలుగా వస్తుంటాయి కూడా (తెలుగులో కూడా చాలామంది, మాట్లాడే ముందు, మరేం/ అది సరే కానీ/ అవునూ/ ఇంతకీ ... అని వాడుతుంటారు, వాటికి ప్రత్యేకంగా అర్థం ఏమీ ఉండదు. అలాగే ఈ phrase openings). Some more examples of phrase openings:

1) How about ...?/ What about ...?
2) Unfortunately/ fortunately
3) Pity that ... (he couldn't come)
4) If don't mind ... (మీకభ్యంతరం లేకపోతే)
5) It would be no use ...
6) The best way to.. (అన్నింటికంటే మంచిమార్గం..)
7) Supposing that he ... (అనుకో...)
8) According to ...
9) Even if ... (అయినా కూడా)
10) On the occasion (ఆ సందర్భంలో)

**Accepted phrases:** Conversation/ spoken English లో చాలా తరచుగా ఉపయోగించే phrase/ idioms: వీటిల్లో wishes (Have a good time, Have a nice day, A happy journey లాంటివి), formal గా వాడే expressions (Never mind/ just don't worry, I'm afraid, లాంటివి), ఇంకా May I ...?/ I have news for you లాంటి expressions ఉంటాయి. తర్వాత We had better, We'd rather, you see ..., No idea, etc. ఇలాంటివి మామూలుగా spoken English లో మనం అతి తరచుగా వాడే phrases. వీటిల్లో కొన్ని idioms కావచ్చు, కొన్ని ఊతపదాలుగానూ ఉంటాయి.

2) Noun/ ing form తో follow అయ్యే (Infinitive రాకుండా) ఇలాంటి expressions చాలానే ఉన్నాయి, కానీ వేల పదాలు మాత్రం లేవు.

**4) Clause** అంటే A group of words with a verb. **Noun Clause:** Noun చేసే పని, అలాగే ఒక sentence కు subject గా ఉండటం, ఒక verb కు/ ఒక preposition కు object గా ఉండటం, ఒక clause కనుకచేస్తే అది noun clause. అలాగే ఒక clause ను adjective గా/ adverb గా వాడితే, అది adjective/ adverb clause అవుతుంది. ఏ standard grammar bookలో అయినా ఈ వివరాలుంటాయి. చూడండి. ఇది spoken English కు అంత ఉపయోగం కాదుగదా? ఇక్కడ వివరించలేం. 4 a, b sentences లలో when he left అనేది noun clause, ఎప్పుడు వెళ్ళాడో అనే అర్థంతో. Sentence d లో చివరికి ముందే వెళితే అనే అర్థంతో, sentence e లో, goodbye చెప్పకున్నా వెళ్లినప్పటికీ అనే అర్థంతో, adverb clauses. Sentence c లో the day when he left, adjective clause (అతను వెళ్లినరోజు అనే అర్థంతో).

---

**Q. 1)** *In an old lesson you gave time sequence of a sentence... Time, date, month, year.. but after that you don't follow the sequence. Kindly understand the doubt and rectify it.*

*eg) In the lesson- 'on a January evening', 'on Sunday morning', but my doubt is 'on an evening of January', on morning of Sunday'. Which one is correct?*

*⊙ Please explain the difference between the sentences.*

*As the train went through the tunnel / As the train was going through the tunnel .. It became suddenly dark.*

***- Anamika, Hyderabad***

**A.** 1) The correct sequence is Time, day, date, month and year/ Day, date, month, year and time.

No connection between the sequence given above and example you want to be clear about.

a) On a January evening= On the evening of one of the 31 days in January. The evening of which day? The speaker is not clear about it.

b) On Sunday morning= On the morning of a particular Sunday- the speaker and the listener know which Sunday it is.

c) On an evening in (not of) January- same meaning as on a January evening.

d) On the morning of Sunday= (b) on Sunday morning- the morning of a particular Sunday- the speaker and the listener know which Sunday it is.

Neither of the sentences is correct. sentence can be improved as:

As the train entered the tunnel, it became suddenly dark. Suddenly implies a particular moment, so you cannot use 'went' or 'was going' here as they refer to a prolonged or continuous action.

**Q. 1)** *Interrogative sentences లో wh forms ఉన్నా, helping verb రావాల్సిందేనా? Who gave it to you? ; Who did give it to you? లలో ఏది కరెక్టు? ఎందుకు?*

**2)** *How long has he been out?*

*How long has he gone out? తేడా వివరించగలరు.*

**3)** *Will you come or not? ఈ వాక్యం సరైనదా, కాదా? ఎందుకు?*

**4)** *నువ్వాపని చేయకుండా ఉండలేవా? అనే వాక్యాన్ని ఇంగ్లిషులో ఎలా రాస్తాం?*

***- Mohan Rao, Ongole***

**A. 1)** ఒక 'who' (wh word) తో వచ్చే questions లోనూ, 'what' తో వచ్చే questions లోనూ, helping verb రాదు.

Who gave it to you? correct. అలాగే who came here yesterday? Who did it? లాంటి questions లో helping verb రాదు. అయితే whom బదులు who వాడితే- ఇప్పుడు spoken English లో whom వాడటంలేదు- అక్కడ helping verb రావాలి.

Who (Whom) did you meet yesterday? = నువ్వు నిన్న ఎవరిని కలుసుకున్నావు?

Who (To Whom బదులు) did you give the book to? = నిన్న ఎవరికిచ్చావు ఆ పుస్తకం?

అలాగే What happened yesterday?/ What happened? ఇక్కడ కూడా helping verb రాదు.

**2)** How long has he been out = అతడు ఎంతకాలంగా బయటున్నాడు? మామూలు అర్థం= ఎంతసేపయింది అతడు బయటకు వెళ్లి?

How long has he gone out?- This sentence is wrong. దీని బదులు How long is it since he went out?= అతడు బయటికి వెళ్లి ఎంతసేపయింది? అనడం better.

**3)** Correct

**4)** Can't you stop/ avoid doing it?

**Q. 1.** *Abbreviations ను small letters లో రాయొచ్చా? ఉదాహరణకు w.e.f., i.e., e.g., a.m., p.m., viz లాంటివి చిన్న అక్షరాల్లో కనిపిస్తుంటాయి. ఇవి కరెక్టేనా?*

**2.** *Mineral water, distilled water, purified water లను తెలుగులో ఏమనాలి?*

***- P. Lingam, Nagpur***

**A. 1.** ఎలా రాయవచ్చు- Capitals లోనా/ small letters లోనా అనేది, మొదటినుంచి ఆ abbreviation ఏ letters లో ఉందీ అనే ఆనవాయితీనిబట్టి ఉంటుంది. ముఖ్యంగా Latin, Greek languages నుంచి వచ్చిన abbreviations small letters లో ఉంటాయి. a.m., p.m. British language లో small letters; American English లో AM, PM (Capitals)

**2.** Mineral= ఖనిజం- ఉప్పు, ఇతర salts- ఇవన్నీ ఖనిజాలు, ఇలాంటి ఖనిజాలతో శుద్ధి పరచిన నీటిని Mineral water అంటాం. తెలుగులో ఇప్పటివరకూ దీనికి పేరు లేదు. మనం పెట్టవచ్చు- ఖనిజ జలం అని.

Distilled water= కాచి వచ్చిన ఆవిరిని చల్లబరచగా వచ్చే శుద్ధజలం. ఇదీ శుద్ధజలమే.

Purified water= శుభ్రపరచిన/ నిర్మలమైన నీళ్లు- purified water, distilled water కావచ్చు, లేదా mineral water కావచ్చు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

## Third Anniversary!

Dear Readers,

Here is a cause for celebration for us! Today is the THIRD ANNIVERSARY of our SPOKEN ENGLISH PAGE!!

This page on Spoken English started on June 12, 2005, completes its third year of publication today and is entering its fourth year. On this occasion, we share our joy with the readers who have benefited from the page and with its well wishers as well. We are extremely happy at the popularity it has enjoyed and the enthusiastic response it has evoked among the readers. We feel privileged to have been of help and encouragement to all those wishing to speak English fluently and confidently. We are glad to have guided a number of others in improving their English speaking ability. The large number of letters we receive every day from our readers requesting us to clear their doubts shows how popular the Spoken English page is and how much interest it has generated.

We do welcome the doubts of the readers. However, we regret that in spite of our best efforts, limitations of space do not let us attend to all of them promptly.

The response and the interest of the readers have been very encouraging and we assure them that we will make every effort to make it still more useful for them.

We welcome your suggestions for the further improvement of this page.

Wishing you all success in your attempts to improve your Spoken English skills.

- M.Suresan

M.SURESAN

ప్రతిభ

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 465

# She knows the ropes

**Ravali:** How was last night's concert? Did I miss a lot?
(నిన్న కచేరి ఎలా ఉంది? నేనేమన్నా చాలా కోల్పోయానా?)

**Lasya:** Don't you worry. You didn't miss much. It wasn't that good- I mean Susmitha's singing.
(ఏం బాధపడకు. నువ్వు ఎక్కువేం కోల్పోలేదు. అదేమంత బాగాలేదు- నేననేది సుస్మిత గానం గురించి.)

**Ravali:** If you don't mind my saying so, I never thought much of Susmitha as a singer.
(నేనలా అనడం గురించి నువ్వేం అనుకోకపోతే, గాయనిగా సుస్మిత అంటే నాకంతపెద్ద అభిప్రాయం లేదు.)

**Lasya:** For that matter, even the accompaniments were not good. For all the publicity that the concert got, it surely was a disappointment.
(ఆ విషయానికొస్తే, ఆ పక్క వాయిద్యాలూ ఏమీ బాగాలేవు. ఇచ్చిన ప్రచారంతో చూసుకుంటే కచేరి చాలా నిరాశాకరంగా ఉంది.)

accompaniments= కచేరీల్లో పాటపాడేవాళ్ల పక్క ఉండే వాయిద్యాలు- మృదంగం, తబలా లాంటివి.

**Ravali:** But her sister Vandana is different. She is really talented. The minute it is known... she is giving a concert, people make a beeline to attend it.
(కానీ వాళ్ల అక్క వందన విషయం వేరు. తనకు నిజమైన ప్రతిభ ఉంది. ఆమె కచేరి చేస్తుందన్న విషయం వినగానే.. ప్రజలు వరసకట్టి నిలబడతారు, ఆమె సంగీతం వినేందుకు.)

**Lasya:** She knows the ropes, and what her listeners want. That way Susmitha cannot hold a candle up to Vandana.
(ఆమెకు ఎలా పాడాలో తెలుసు. తన శ్రోతలేం కావాలనుకుంటారో తనకు తెలుసు. అసలు సుస్మితకూ వందనకు పోలికేలేదు.)

**Ravali:** Vandana practises much more than Susmitha. Susmitha doesn't realise that her reputation is at stake. Why doesn't she work hard?
(సుస్మితకంటే వందన చాలా ఎక్కువ practise చేస్తుంది. తన పేరు దెబ్బతింటుందనే విషయం సుస్మిత గ్రహించదు. ఎందుకు శ్రమపడదు?)

**Lasya:** By the way, why are things all over the place? What's up?
(అదిసరేకాని ఏంటీ ఇల్లంతా వస్తువులున్నాయి? ఏంటి సంగతి?)

**Ravali:** We are getting the place done up. The decorators will be in soon.
(మేం ఇంటిని అలంకరించుకోబోతున్నాం. అలంకరించేవారు రాబోతున్నారు.)

**Lasya:** Happy to hear that, Bye.
(సంతోషం, వస్తా.)

English conversation లో తరచుగా వినిపించే accepted phrases తెలుసుకుంటున్నాం కదా. ఇవన్నీ దాదాపు ఊతపదాలుగా వస్తుంటాయి. ఇవి daily life situations లో వాడేందుకు చాలా ఉపయోగపడతాయి. వాటిలో మరికొన్ని ఇప్పుడు తెలుసుకుందాం.

***Look at the following expressions from the conversation above:***

*1) I never thought much of Susmitha as a singer.*
*2) For that matter even the accompaniments were not good.*
*3) For all the publicity the concert got, it was a disappointment.*
*4) The minute she gives a concert, people make a beeline to attend it.*
*5) She knows the ropes.*
*6) ... her reputation is at stake.*

**1) Think much of** (Past tense and PP - thought) = ఏదో గొప్పగా అనుకోవడం= Think a lot of

a) He thinks much of/ a lot of his ability to make speeches = ఉపన్యాసాలివ్వడంలో తన సామర్థ్యం గురించి ఆయన చాలా గొప్పగా అనుకుంటాడు.

b) I don't think much of his attainment as an actor = నటుడిగా ఆయన సాధించిన ఘనత గురించి నాకంత గొప్ప అభిప్రాయంలేదు. నటనలో ఆయనకంత గొప్పతనం ఉందని నేనుకోవడంలేదు.

c) No one thinks much of Indian politicians' honesty = భారతీయ రాజకీయ నాయకుల నిజాయితీ గురించి ఎవ్వరూ అంత గొప్పగా అనుకోరు.

గమనించారు గదా: think much of/ not think much of అనే simple expression తో ఎంత భావం స్ఫురింపజేయవచ్చో- అది natural Spoken English కు గుర్తు.

**2) For that matter** = ఆమాటకొస్తే/ ఇంకా చెప్పాలంటే. ఇది మనం వాడదగ్గ చాలా సాధారణమైన accepted phrase- మన Spoken English సహజంగా ఉండేట్టు చేస్తుంది.

a) Money plays an important part in our elections. I strongly believe it. For that matter every Indian knows = మన ఎన్నికల్లో డబ్బు పాత్ర చాలా ఉంది. దాన్ని నేను నమ్ముతాను ఆ మాటకొస్తే ఆ విషయం అందరికీ తెలుసు.

b) I didn't like the movie at all. Nor did any of my friends for that matter = నాకా సినిమా అసలు నచ్చలేదు. ఆ మాటకొస్తే మా friends ఎవ్వరికీ నచ్చలేదు.

c) He never touches liquor or for that matter never even smokes = అతడు మద్యం ముట్టుకోడు, ఇంకా చెప్పాలంటే సిగరెట్ కూడా తాగడు.

ఇది కూడా మీ conversation లో practise చేయండి.

**3) for all** = In spite of = అయినప్పటికీ.

a) For all the reputed players they had, the two teams lost all the matches = గొప్ప పేరున్న ఆటగాళ్లు ఆ రెండు జట్లలో ఉన్నప్పటికీ అవి అన్ని పోటీల్లోనూ ఓడిపోయాయి.

b) For all his effort, what he got was very little = అంత శ్రమపడినప్పటికీ, అతడు పొందిన ప్రతిఫలం చాలా తక్కువ.

c) For all his wealth, he isn't all that happy. His health is a matter of worry for him = అంత డబ్బున్నా, అంత సంతోషంగా ఏంలేడతడు. అతడి ఆరోగ్యం అతడిని వ్యాకులపరుస్తుంది.

**4) Make a beeline** (something) = తిన్నగా ఒకచోటికి వెళ్లడం, ఆత్రుతతో.

a) The minute the filmstar arrived in the town, her fans made a beeline to her hotel = సినిమా తార ఊళ్లోకి వచ్చిందని తెలియగానే అభిమానులందరూ తిన్నగా ఆమె hotel కు వెళ్లారు.

b) (Do) you expect people to make a beeline to see you? You are not that great = ప్రజలందరూ వరసకట్టి తిన్నగా నిన్ను చూసేందుకు వస్తారనుకుంటున్నావా? నువ్వంత గొప్పవాడివేం కాదు.

**5) Know the ropes** = ఒక పని ఎలాచేయాలో బాగా తెలియడం.

a) Let him drive. He knows the ropes = అతడిని drive చేయనీ. అతడికి ఎలా drive చేయాలో బాగా తెలుసు.

b) If I were you, I wouldn't take up the job. I'm sure you don't know the ropes = నేను నీ పరిస్థితిలో ఉంటే ఆ పనిచేయను. నీకాపని గురించి ఏమీ తెలియదని నా నమ్మకం.

show somebody the ropes = ఒక పని ఎలా చేయాలో ఒకరికి నేర్పడం

**6) At stake** = ఏదైనా పోయే/ పోగొట్టుకునే ప్రమాదం ఉండటం.

a) The party should win this election. The PM's job is at stake = ఈ ఎన్నికల్లో పార్టీ తప్పక గెలవాలి. లేకుంటే ప్రధానమంత్రి పదవికే ప్రమాదం.

b) We should not let the factory close down. Hundreds of jobs are at stake = ఈ factory ని మూతపడనివ్వకూడదు. వందల ఉద్యోగాలు పోయే ప్రమాదం ఉంది.

c) I can't let my daughter marry that good for nothing fellow. Our family prestige is at stake = నా కూతురు ఆ పనికిరానివాడిని పెళ్లాడటం నేను ఒప్పుకోను. నా కుటుంబ పరువు, ప్రతిష్ఠ పోయే ప్రమాదం ఉంది.

At stake చాలా సాధారణంగా వినిపించేమాట. మన సంభాషణల్లో వాడదాం.

Stake = పందాల్లో/ జూదంలో పెట్టే పణం/ కాసేటటు వంటి పందెం డబ్బు/ వస్తువు; పందెం కాయడం.

a) Dharmaraja staked his kingdom in the game of dice; he staked even his wife = తన రాజ్యాన్నేకాక తన భార్యను కూడా పందెంగా పెట్టాడు ధర్మరాజు జూదంలో

b) The stake is Rs.100 per round = ఒకసారి ఆటకు పందెం వంద రూపాయలు.

## Q&A

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

*1. అతడి వద్ద నుంచి నేను నీకు డబ్బు ఇప్పిస్తాను.*
*2. మీకు శ్రమ ఎందుకు లెండి. నేను తెప్పిస్తాను కూర్చోండి.*
*3. అతడు డబ్బు ఇవ్వకపోతే నేనే నీకు డబ్బు కట్టేస్తాను.*
*4. అతడి చేత ఆ పని చేయిస్తాను.*
*5. Being తో future tense చెప్పండి.*
*6. Being one of the finest products of wipro being it* **is** *having it is today. ఇందులో is రాకూడదు కదా.*

***- Azamtulla, Anantapur***

**A.** 1. I will make him give/ pay you the money/
I'll get him to pay you the money/
I'll have him pay you the money.
2. Why trouble yourself? I'll get it for you
3. If he doesn't give you the money I'll pay it to you.
4. I'll make him do it.
5. No future tense, in fact no tense for 'being'
6. రాకూడదు.

**Q.** కింది తెలుగు పదాలను/ మాటలను ఇంగ్లిష్‌లో ఏమంటారు? జాతీయం, నుడికారం, పలుకుబడి, వాడుక పదం, సామెత, నానుడి, నీతి వాక్యం, సూక్తి.

***– G. Vishal, Karimnagar***

**A.** జాతీయం/ నుడికారం= Idiom.
పలుకుబడి/ వాడుక పదం= usage.
సామెత/ నానుడి= proverb.
నీతివాక్యం/ సూక్తి= precept.

**Q.** *He has a lesson.* తెలుగులో ఈ వాక్యానికి అర్థం తెలుపగలరు. ఇక్కడ *has* వాడకం కరెక్టేనా?

***– D. Sailaja, Adoni***

**A.** సందర్భాన్నిబట్టి- 1) అతడి దగ్గర పాఠం ఉంది 2) అతడు పాఠం (గుణపాఠం) నేర్చుకుంటున్నాడు.
Has వాడకం correct.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

# We are getting our home done up

**Praful:** I want to meet Pramod. Any idea where he lives.
(ప్రమోద్‌ను కలుసుకోవాలనుకుంటున్నాను. ఎక్కడుంటాడో ఏమన్నా తెలుసా?)

**Prasen:** Yea. He lives next door to Prabhat. Of course you have Prabhat's address, don't you?
(ప్రభాత్ ఇంటి పక్కనే. నీకు ప్రభాత్ ఇల్లు తెలుసు కదా.)

**Praful:** And that reminds me. Did Prabhat get the job? You perhaps know he attended the interview for appointment to the position of a branch manager of a company?
(ఆ మాటంటే గుర్తొచ్చింది. Prabhat కు ఆ ఉద్యోగం వచ్చిందా? ఏదో Company branch manager ఉద్యోగానికి interview కు వెళ్లాడని నీకు తెలుసనుకుంటా.)

**Prasen:** He almost took the job but on second thoughts decided against it. His joining the company means his leaving his old parents alone here.
(దాదాపు చేరినట్టే అయ్యిందికానీ కాస్త ఆలోచించి మానేశాడు. ఆ company లో చేరడం అంటే వయసుమళ్లిన తన తల్లిదండ్రులని ఒంటరిగా వదిలేయడమేనని అర్థం అవడంతో మానుకున్నాడు.)

**Praful:** He should have thought over the matter before he applied for the job.
(అదంతా job కు apply చేసేముందు ఆలోచించుకుని ఉండాల్సింది.)

**Prasen:** That's true. Your voice suggests you have a cold coming on. What's the matter.
(నిజమే. నీ గొంతు వింటూంటే నీకు జలుబు వచ్చేట్టుంది. ఏమిటి విషయం?)

**Praful:** You can say that. Don't you see my running nose? Wait a minute. I feel like blowing my nose.
(నిజమే. నా కారే ముక్కు కనిపించడం లేదూ? ఉండు, కాస్త చీదనీ.)

running nose = కారేముక్కు
blow the nose = చీదడం

**Prasen:** By the way, why do you want to see Pramod now? Is it urgent?
(అది సరే, ఇప్పుడు ప్రమోదును ఎందుకు కలవాలనుకుంటున్నావు? అంత అవసరమా?)

**Praful:** We're getting our home done up, and I want to consult Pramod about it. He is good at interior decoration you know.
(మా ఇంటిని కాస్త అలంకరిస్తున్నాం. ఆ విషయంలో అతడిని సంప్రదించాలనుకుంటున్నాను. అలంకారాలను గురించి అతడికి బాగా తెలుసు కదా?)

interior decorations = ఇంటి/ building లోపలి అలంకరణ

**Prasen:** No body in town can hold a candle to him in that. He has taste.
(ఊరు మొత్తంలో ఎవరూ ఆ విషయంలో అతడికి సాటిరారు. అతడికి మంచి అభిరుచి ఉంది.)

**Praful:** But I'm afraid he is too busy to do our house up. He undertakes quite big jobs.
(మా ఇంటిని అలంకరించే తీరిక అతడికుండదేమో. అతడు పెద్ద పెద్ద పనులు చేపడతాడు.)

**Prasen:** Don't worry. He will oblige you. We are all friends you know.
(ఏం worry అవకు. నీ పని ఒప్పుకుంటాడులే. మనం అంతా స్నేహితులం కదా?)

oblige= సహాయం చేసేందుకు సిద్ధపడటం/ చేయడం

**Praful:** I hope so.
(అలాగే ఆశిస్తున్నాను.)

Spoken English లో తరచూ వినిపించే phrases మరి కొన్నింటిని ఇప్పుడు చూద్దాం.




***Look at the following expressions from the conversation above:***

*1) He lives next door to Prabhat*
*2) And that reminds me*
*3) He almost took the job but on second thoughts decided against it*
*4) He should have thought over the matter*
*5) Your voice suggests you have a cold coming on*
*6) We are getting our home done up*
*7) No body in town can hold a candle to him*


M.SURESAN

**1) Next door=** పక్కిల్లు

a) He lives next door to me = అతడి ఇల్లు మా పక్కనే/ మా పక్కిల్లే అతడిది

b) We are next door neighbours = మేం పక్క పక్కన ఇళ్లవాళ్లం.

c) The office is next door but one to the beauty parlour = beauty parlour తర్వాతి ఇల్లు తర్వాతి ఇల్లే ఆ office.

**2) And that reminds me** = ఆ మాటంటే గుర్తొస్తోంది (ఒక విషయంవల్ల ఇంకో విషయం గుర్తుకురావడం.)

So elections are round the corner. That reminds me. When is Chiranjeevi announcing his party? = అయితే ఎన్నికలు సమీపిస్తున్నాయన్న మాట. ఆ మాటంటే గుర్తొస్తోంది. చిరంజీవి తన పార్టీని ఎప్పుడు ప్రకటిస్తారో?

round the corner = దగ్గరకొస్తున్న/ సమీపిస్తున్న

The exams are round the corner and the students are naturally tensed up =
పరీక్షలు సమీపిస్తున్నాయి. విద్యార్థులు కంగారు, భయాలకు లోనవుతున్నారు.

on second thoughts = మళ్లీ ఆలోచించిన మీదట/ మరికొంత ఆలోచన తర్వాత/ పునరాలోచన మీదట మనసు మార్చుకోవడం.

a) I thought I'd buy a house, but on second thoughts I wanted to go in for a flat = ఇల్లు కొందామనుకున్నాను, కానీ కాస్త ఆలోచించిన తర్వాత మనసు మార్చుకుని flat కొందామనుకున్నాను.

b) We shall meet him. No. On second thoughts let him come to us = అతడి దగ్గరకెళదాం మనం. ఒద్దులే. కాస్త ఆలోచిస్తే అతడే మన దగ్గరకు రావడం అనేది నా కొత్త నిర్ణయం.

c) On second thoughts he wouldn't go to a movie = మొదట సినిమాకెళ్లాలనుకున్నాడు. మళ్లీ ఆలోచించుకుని/ ఆ నిర్ణయం మార్చుకుని సినిమాకెళ్లలేదు.

***On second thoughts (British) = On second thought (American).*** ఇది చాలామంచి expression. Practice చేద్దాం.

**Have no second thoughts about** (Something) = దేని విషయమైనా ఒకే నిర్ణయంతో ఉండటం.

a) I have no second thoughts about buying that car = ఆ car కొనే విషయంలో ఆలోచించే ప్రసక్తే లేదు, కొంటున్నాను.

b) Do it at once. Have no second thoughts = ఆ పని వెంటనే చెయ్యి. రెండో ఆలోచన వద్దు.

**4) Think over a matter** = ఒక విషయం గురించి ఆలోచించడం బాగా/ తీరిగ్గా.

a) What have you decided? No hurry. Think over the matter and let me know = ఏం నిర్ణయించావు? తొందరేం లేదు. ఆ విషయం బాగా ఆలోచించుకుని నాకు తెలియపరచు.

Think over the matter = Think the matter over. అలాగే, Talk over the matter = Talk the matter over = ఓ విషయం చర్చించడం.

a) I'll talk the matter over with my father and take a decision/ decide = మా నాన్నతో ఆ విషయం చర్చించి నిర్ణయం తీసుకుంటా/ నిర్ణయిస్తాను.

**5) Coming on** = జబ్బు/ బాధలు లాంటివి ప్రారంభం కావడం/ అయ్యే సూచనలు కనిపించడం. దీన్నెప్పుడూ is coming/ are coming రూపంలోనే వాడతాం.

a) I feel I have a fever coming on = నాకేదో జ్వరం వచ్చేట్టనిపిస్తోంది.

b) The indications are that a cold wave is coming on = చలిగాలులు వీచే సూచనలు కనిపిస్తున్నాయి.

**6) Do something up** = అలంకరించడం/ ఏ వస్తువుండాల్సినచోట, ఆ వస్తువును ఉంచి, ఇల్లు లాంటివి సర్దటం = Tidy up/ decorate

a) As soon as he gets up he does his bed up = నిద్ర లేచిన వెంటనే పక్క సర్దేస్తాడతడు.

b) They are doing up the hotel for tourist season = పర్యాటకుల సమయం కోసం వాళ్లు Hotelను కొత్తగా కనిపించేట్టు చేస్తున్నారు.

c) The bed looks done up. Perhaps no body has slept on it = సర్దిన పక్క సర్దినట్టే ఉంది. ఎవరూ దానిమీద పడుకున్నట్టు లేదు.

**7) Hold a candle to - Not hold a candle to** అని not తోనే వాడతాం. ఎవ్వరూ సాటిరారు/ ఏదీ సాటి రాదు అనే అర్థంతో.

a) No modern player of cricket can hold a candle to Sachin = ఇప్పటి cricket ఆటగాళ్లలో సచిన్‌కెవ్వరూ సాటిలేరు.

b) The sons of the great actors of the past can not hold a candle to their fathers = గత గొప్ప నటుల కొడుకులెవరూ కూడా వాళ్ల తండ్రులకు సాటి రారు.

Hold a candle to తప్ప మిగతా expressions అన్నీ - ఈ lesson లో వివరించిన వాటిలో, Spoken English లో చాలా common. వాటిని బాగా practise చేసి మీ English conversation సహజంగా ఉండేట్లు చేసుకోండి.




**Q.** *If I had known you were in hospital, I would have gone to visit you.* ఇక్కడ gone బదులు come కదా వాడాల్సింది. ఇలాంటి వాక్యాలు రెండు, మూడుచోట్ల చూశాను. అక్కడా go రూపమే వాడారు. నీ దగ్గరకు వస్తాను, నీతో వస్తాను, నీ వద్దకు వచ్చేవాడిని ఇలా ఎదుటి వ్యక్తి వద్దకు, తో అన్నప్పుడు go వాడటం ఎలా కరెక్టు? come రూపం మాత్రమే వాడాలి కదా? వివరించగలరు.

***- G. Sambasiva Rao, Vijayawada***

**A.** English లో come ముఖ్యంగా ఒకరి దగ్గరికి, వాళ్లింట్లో/ వాళ్ళ ఊళ్లో ఉన్నప్పుడు, వాళ్లింటికి/ వాళ్ళ ఊరికి వెళ్లడం అనే అర్థంతో వాడతాం.

I will come to you whenever you want me (ఎప్పుడు నీకు కావాల్సినా నేను నీ దగ్గరకు/ మీ ఇంటికి మీ ఊరికి వస్తాను)

My uncle is coming tomorrow = రేపు మా మామయ్య/ బాబాయి వస్తున్నాడు (మా ఇంటికి/ మన ఊరికి)

ఇంకోచోట ఉన్నవాళ్ళ దగ్గరకు వెళ్లడం అనే అర్థంతో, come వాడతారు, కానీ go వాడకం ఎక్కువ.

Where are you now? At college? Wait, I'll go to meet you there/ I will soon be there = నువ్వెక్కడున్నావిప్పుడు? college లోనా? అయితే అక్కడే ఉండు. నే వస్తున్నా, నిన్ను కలుసుకునేందుకు/ త్వరలో అక్కడుంటా.

2) I am going to the station. Why don't you go with me? = నేను station కెళ్తున్నా. నువ్వూ నాతో రాకూడదూ?

3) If you had been at office then, I would have gone there for your advice = నువ్వప్పుడు Office లో ఉండి ఉంటే, సలహా కోసం Office కు వచ్చుండే దాన్ని (go)

అయితే Indian centextలో పై సందర్భాలన్నింటిలో come వాడతాం. అది అంత acceptable కాదు.

**Q.** *1. Helping Verbs* గురించి వివరించగలరు. ఏయే సందర్భాల్లో ఉపయోగించాలో తెలుపగలరు.
**2.** స్వర్గం, నరకం, నరకయాతన- వీటిని ఇంగ్లిష్‌లో చెప్పండి.
**3.** తెలుగులో 'గారు' బదులు ఇంగ్లిష్‌లో ఏమనాలి?

***- G. Anil Kumar, Hyderabad***

**A. 1.** Helping Verbs గురించి lessons 180-210 లో వివరించాం, చూడండి.
**2.** Heaven, hell, horrors of hell.
**3.** తెలుగులో గారు = Mister

**Q.** *Command* కు *order* కు తేడా ఏమైనా ఉందా?

***- D.Sailaji, Adoni***

**A.** Command, order దాదాపు ఒకటే. అయితే అధికారికంగా, ఓ అధికారి తన అధికారాన్ని వినియోగిస్తూ ఇచ్చే ఉత్తర్వు command. Command ఇచ్చేందుకు అతడికే అధికారం ఉంది. Order ఎవరైనా, అధికారం ఉన్నా లేకపోయినా ఇచ్చే ఆజ్ఞ కావచ్చు

a) The captain of a ship commands.

b) The house owner ordered the servant to get out. (House owner కు అధికారం ఉండొచ్చు, కానీ అది official కాదు) order ను command కు బదులు వాడొచ్చు కానీ command ను order కు బదులు అన్నిచోట్లా వాడలేం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






**Q. 1.** *Ist class to Vth Class లోని పిల్లలకు స్టేజ్ పైన ఇంగ్లిష్‌లో మాట్లాడించే పద్ధతిని తెలపండి.*

**2.** *కిందివాటిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?*

*1. శుభముహూర్తం, 2. నానబెట్టడం (నీటిలో నానబెట్టడం, మాట నాన్చడం) 3. సాగదీయడం.*

**- MCFG Narsing Rao, Adilabad**

**A. 1.** మొట్టమొదట చిన్నపిల్లలు, అంటే I నుంచి V class విద్యార్థులకు మనం రోజూ వాడే వస్తువులను, రోజూ చేసే పనులను English లో క్షుణ్నంగా నేర్పించండి. తర్వాత This is a book; That is a pencil- ఇలాంటి చిన్న చిన్న వాక్యాలు practise చేయించండి. Is, are, am, was, were ల ఉపయోగం తెలియజెప్పి practise చేయించండి. (NCERT, CBSE course లకు తయారుచేసిన books ఈ విషయంలో చాలా ఉపయోగకరం). మెల్లమెల్లగా రెండు మూడు చిన్న చిన్న sentences, ఒక వస్తువు గురించి, ఒక సంఘటన గురించి చెప్పండి, చెప్పించండి. Stage పైన వాళ్లతో ఏ విషయం గురించి మాట్లాడించాలో, make a list of it. చిన్న చిన్న classes, I to III వరకయితే, వాళ్ల పేర్లు, వాళ్ల parents' names, వాళ్లెంతమంది అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు- ఇలాంటివి మాట్లాడించండి. 4th, 5th class పిల్లలతో ఇంకాస్త కష్టమైన విషయాలు మాట్లాడించవచ్చు

ముఖ్యమైన విషయం: Stage మీద మాట్లాడటం ఒక ప్రత్యేకమయిన ప్రక్రియ అనే భావం వాళ్లల్లో కలగనివ్వకూడదు. వాళ్లను మామూలుగా English లోనే మాట్లాడమనండి, వాళ్లతోనూ మీరు English మాట్లాడండి.

**2.** 1) శుభముహూర్తం: Auspicious time/ moments/ occasion, 2) నానబెట్టడం = soak, 3) సాగదీయడం = stretch




**Q. 1.** *Generally, we use the word 'QUESTION BANK'. But there will be a lot of questions in it. So, we have to use 'QUESTIONS BANK'. Why don't we use this?*

**2.** *'QUESTIONS AND ANSWERS'*
*'QUESTION AND ANSWERS'*
*Which of these is correct?*

**- N. Vishnupriya, Anantapur**

**A. 1.** Though a question bank has a number of questions, the word, question in question bank, as 'stamp' in stamp collection, or as key in a keypunch, is used as an adjective, telling us something about the noun following it. What kind of bank? - A question bank. What kind of collection? - Stamp collection, etc. An adjective has no number (singular/ plural). Hence question bank is correct.

**2.** In the expression, questions and answers, you have a number of questions and each question has an answer - many questions and many answers. So you cannot say question and answers. You have to say, 'Questions and answers'.

---

**Q.** 1.a) *I shall have completed the work.*
b) *I should have completed the work.*
2. a) *I will have completed the work.*
b) *I would have completed the work.*
3. a) *I can have completed the work.*
b) *I could have completed the work.*
4. a) *I may have completed the work.*
b) *I might have completed the work.*
5. a) *I need have completed the work.*
b) *I ought to have completed the work.*
c) *I must have completed the work.*
*పై వాక్యాలను తెలుగులో వివరించగలరు.*

**- K. Rama Krishna, Khammam**

**A.** 1.a) నేను future లో ఒక సమయానికి/ సమయం లోపు ఆ పని పూర్తి చేసుంటాను. (Not definite)
b) ఆ పని ఇప్పటికే పూర్తిచేసి ఉండాల్సింది (కానీ చేయలేదు).
2. a) నేనాపని future లో ఓ సమయానికి/లోపల కచ్చితంగా పూర్తి చేసుంటాను (definite)
b) నేనాపని పూర్తి చేసేవాణ్ని (కానీ చేయలేదు) (గతంలో)
3. a) నేనాపని పూర్తి చేయగలుగుతాను
b) నేనాపని పూర్తి చేయగల్గేవాడినే (గతం) కానీ చేయలేదు
4. a) నేనాపని పూర్తి చేసుండొచ్చు (ఇప్పుడు)
b) నేనాపని చేసుండేవాడినేమో (గతంలో)
5. a) నేనాపని పూర్తి చేయాల్సిన అవసరం ఉండింది (కానీ నేను చేయలేదు)
b) ఆ పని పూర్తి చేసి ఉండాల్సింది (నైతిక బాధ్యతగా) కానీ చేయలేదు
c) నేనాపని పూర్తి చేసే ఉంటాను (చేసాను)

I should have done it = చేయాల్సింది, చేయలేదు.

I ought to have done it = ఇది నీతిగా/ బాధ్యతగా చేయాల్సింది, చేయలేదు.

I ought to have taken my old father to hospital = వయసుమళ్లిన నాన్నను ఆస్పటల్‌కు తీసుకెళ్లాల్సింది, (కానీ తీసుకెళ్లలేదు)

**Q.** *ఆక్స్‌ఫర్డ్ అడ్వాన్స్‌డ్ లర్నర్ డిక్షనరీని ఉన్నది ఉన్నట్లుగా English to Telugu ఎవరైనా రాశారా? మార్కెట్‌లో ఉంటే పుస్తకం పేరు, రచయిత పేరు, ధర తెలపండి.*

**- D. Seshanna, Aadoni**

**A.** ఎవరూ రాయలేదు. అది copy right book. కాబట్టి దాన్ని వాళ్లే ప్రచురించాలి. ఇంతవరకూ ప్రచురించలేదు.

# The rich are getting richer, and the poor, poorer

**Q. 1.** *a. My strength is the strength of 10 because my heart is pure.*
*b. We have had enough of it too.*
*వీటికి తెలుగులో అర్థం వివరించగలరు.*

**2.** *a. Sorry for*
*b. Wedded-too. వీటి అర్థాన్ని, ఉపయోగాన్ని వివరించగలరు.*

**3.** *a. ధనవంతుడు ఎప్పుడూ ధనవంతుడుగానే ఉంటాడు. బీదవాడు ఎప్పుడూ బీదవాడుగానే ఉంటాడు. దీనికి ఇంగ్లిష్‌లో సామెత ఉంటే తెలుపగలరు.*
*b. It is my pen, this is my pen. వీటిలో ఏది కరెక్టు? It, this ఉపయోగాన్ని వివరించగలరు.*

**- S.Satish, Kodempaka.**


M.SURESAN

**A. 1.** a. నా హృదయం నిర్మలమవడంవల్ల నా బలం పదిమంది బలానికి సమానం.

b. అది చాల్లే, ఇంక అక్కర్లేదు. (ఏదైనా మనం విసుగుపుట్టేవరకు అనుభవించినట్లయితే We have had enough of it too).

e.g.: How about a movie this evening?
(ఇవ్వాళ సాయంత్రం సినిమాకెళదామా?)
'We have had enough. No more please'.
(చాలినన్ని చూశాం. ఇంకొద్దులే).
'How about a game of chess, then?'
(అయితే chess ఆడదామా?)
'We have had enough of it too'.
(అదీ చాలినంత ఆడాం. ఇంకొద్దు)

**2.** a. Sorry for అంటే- 'విచారిస్తున్నా అది జరిగినందుకు' అని కదా?

b. Wedded-too= She has completed her studies and is wedded too= ఆమె చదువైపోవడమే కాకుండా పెళ్లి కూడా అయిపోయింది. too= కూడా

**3.** a. The rich are getting richer, and the poor, poorer.

b. రెండూ correct. This is my pen = ఇది నా pen. It is my pen = మనం మాట్లాడుతున్న (ఏ pen గురించి మాట్లాడుతున్నామో) ఆ pen నాది.

---

**Q. 1.** *He remembers the school where he studied. ఈ వాక్యంలో relative pronoun 'where' అనేది remembers అనే verb ను ఎలా qualify చేస్తుంది, అర్థాన్ని ఎలా విశదీకరిస్తుంది?*

**2.** *Show me the house where he was assaulted. అనే వాక్యంలో where అనే relative pronoun was assaulted అనే verb అర్థాన్ని ఎలా qualify చేస్తుంది? Relative pronoun absence లో దాని అర్థంలో ఏ మార్పు ఉంటుంది?*

**3.** *Relative Pronouns కు సంబంధించి Restrictive or Defining, Continuative Non-defining పదాల గురించి వివరించగలరు.*

**- Chinni, Nalgonda**

**A. 1)** ఈ sentence లో Where అనేది Relative pronoun కాదు. Where అసలు pronoun కాదు, కాబట్టి, relative pronoun అసలవ్వదు. Where ఈ sentence లో conjunction- రెండు మాటలను, phrases ను, sentences ను, clauses ను కలిపేపదం. 'Where' ఇక్కడ school గురించి తెలుపుతుంది. He studied in the school. He remembers it. ఈ రెండు sentences ను where తో కలుపుతాం- He remembers the school where he studied.

Conjunction దేనినీ qualify చేయదు. Relative Pronoun కూడా దేనినీ qualify చేయదు. అంతకుముందున్న noun గురించి తెలుపుతుంది. The school where he studied- ఇక్కడ where school గురించి చెప్తుంది, అంతేగాని verb ను qualify/ modify చేయదు.

**2)** ఈ ప్రశ్నకు కూడా పై సమాధానమే.

**3)** Defining relatives who, which, that మనం sentence లో omit చేయలేం. అవి sentence లో ముఖ్యమైన భాగం.

The man who helped you at Tirupathi is my cousin. (ఇక్కడ who omit చేయలేం కదా? అంతేకాకుండా, ఎవరు నా cousin? అనే question కు నీకు తిరుపతిలో సాయం చేసిన వ్యక్తి అని జవాబు. ఇది ఈ sentence కు ముఖ్యం.

Non defining relatives తో వచ్చే clauses sentences కంటే ముఖ్యం కావు. అదనపు సమాచారాన్ని ఇచ్చేందుకు వాటిని వాడతాం.

His friend, who studies in the US, met him yesterday. ఇక్కడ who studies in the US = America లో చదువుతున్న అని. కానీ ఈ sentence లో ముఖ్యమైన భావం: అతడి friend అతడిని కలుసుకున్నాడని. ఆ friend America లో చదువుతున్నాడనేది additional information only అని. కానీ ఈ sentence లో ముఖ్యమైన భావం: అతడి friend అతడిని కలుసుకున్నాడని.

Spoken English practise చేస్తున్నకొద్దీ ఏది defining, ఏది non-defining అనేది మనకే తెలుస్తుంది. Spoken English నేర్చుకునే దశలో ఈ తేడా తెలియడం అంత ముఖ్యం కాదు.

**Q.** *ORTHODOX ను అర్థం సహా ఎలా వాడాలో వివరించగలరు.*

**- Kesava Rao, Vijayawada**

**A.** Orthodox = సనాతనమైన - చాలాకాలం నుంచి వాడుకలో ఉన్న (నమ్మకాలు, సంప్రదాయాలు లాంటివి)

ప్రాచీన సంప్రదాయాలు, నమ్మకాల, జీవన విధానాల పట్ల గౌరవం ఉండి, వాటి ప్రకారమే నడుచుకునేవారు orthodox. ప్రాచీన హిందూ సంప్రదాయాలను అవలంబించే వ్యక్తి an orthodox Hindu. Orthodox medicine = సంప్రదాయ వైద్యం.

**Q.** *a) I need paper to write the answers to these questions (uncountable).*
*b) I have a paper to show my right to the property (countable). ఈ రెండు వాక్యాల్లో a) లో un-countable గా b) లో countable గా paper ను ఉపయోగించారని తెలుసుకునేదెలా? రెండింటిలో paper అని మాత్రమే ఉందికదా.*

**- D. Sailaja, Adoni**

**A.** రాయడానికి, print చేయడానికి వాడే paper uncountable. Paper అంటే ముఖ్యమైన పత్రాలు, certificates అనే అర్థంతో అయితే countable. The paper అంటే newspaper అనే అర్థం కూడా ఉంది. ఆ అర్థంతో కూడా paper, countable.

**Q. 1.** *She returned quickly than I expected. ఈ వాక్యంలో తప్పు ఏమైనా ఉందా?*

**2.** *పొలమారడాన్ని (తింటున్నపుడు, తాగుతున్నప్పుడు) ఇంగ్లిష్‌లో ఏమంటారు?*

**- Pavani, Sudha, Veeravasaram**

**A. 1)** నేననుకున్నదానికన్నా త్వరగా తిరిగివచ్చింది అని కదా sentence అర్థం? అంటే ఇక్కడ మనం comparative degree వాడాలి కదా? కాబట్టి She returned more quickly than I expected అనాలి. Comparative degree లేకుండా than రాదు.

**2)** get choked/ choke. She choked as she was eating fast = త్వరత్వరగా తినడంవల్ల పొలమారింది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# Don't lord it over me like that

**Likhit:** What's up? You and the others were discussing something seriously.
(ఏం జరుగుతోందిక్కడ? నువ్వు, మిగతావాళ్లు ఏదో చాలా తీవ్రంగా చర్చించుకుంటున్నారు)

**Nishit:** That's where you are wrong. The minute you see a group of people you think they are in a serious discussion.
(అక్కడే నువ్వు పొరబడుతున్నావు. ముగ్గురు నలుగురు కలిసుండటం చూస్తే చాలు, వాళ్లేదో చర్చలో ఉన్నారనుకుంటావు)

**Likhit:** Nothing of the sort. I sure saw you talking about something very seriously.
(అదేం లేదు. మీరేదో చాలా ముఖ్యమైన విషయం మాట్లాడుకోవడం చూశాన్నేను)

Nothing of the sort = అలాంటిదేంలేదు/ అదేం కుదరదు. Spoken English లో చాలా common. Practise చేయండి.

**Nishit:** Cut that out and let's go for lunch. We are a bit late, so if the what we want to eat is off the menu, we have to take what's going.
(ఇక ఆపు, మనం భోజనానికి వెళ్దాం పద. మనం కొద్దిగా ఆలస్యంగా వెళుతున్నాం, మనం తినాలను కున్నది అయిపోతే అక్కడ ఏదుంటే అది తినాలి.)

Menu (మెన్యు) అంటే తెలుసుగదా? Hotels/ restaurants లో ఆహార పదార్థాల పట్టిక - వాటి పరిమాణం, ధరలతో.

**Likhit:** Don't lord it over me like that. You aren't my boss, are you?
(ఊరకనే నాకు ఆదేశాలు జారీచేయకు. నువ్వేం నా boss కావు కదా?)

**Nishit:** Why are you so cross today? There is no telling/ knowing when you get upset and when you are pleasant.
(ఎంటంత కోపంగా ఉన్నావివాళ నువ్వు? నువ్వెప్పుడు కోప్పడతావో, ఎప్పుడు ఆహ్లాదంగా ఉంటావో చెప్పలేం)

**Likhit:** I'm sorry I hurt you. But let me tell you this. When I saw you all talking together, I felt left out and that did upset me.
(నిన్ను బాధపెట్టినందుకు విచారిస్తున్నా. కానీ ఇది చెప్పనీ. మీరందరూ కలిసి మాట్లాడుకుంటుంటే నన్ను మీరొదిలేసినట్లు అనిపించింది. అది నాకు కాస్త కోపం తెప్పించింది)

**Nishit:** Let me assure you again it wasn't that serious. I don't even remember what we were talking about.
(అంత ముఖ్యమైన విషయం ఏం మాట్లాడుకోవడంలేదు మేం. అసలేం మాట్లాడుకుందీగూడా మరచిపోయా.)

**Likhit:** OK then. Let's eat. I'm hungry.
(సర్లే. వెళ్లి భోంచేద్దాం. నాకు ఆకలిగా ఉంది)

**Nishit:** As I've said we are late. The chances are that we may get the left overs. So let's skip rice and have some snacks instead.
(నేనన్నట్లు మనం lunch కు ఇప్పుడు late. ఏదో అడుగు బొడుగువి తినాల్సి వస్తుంది. కాబట్టి భోజనం వదిలేసి ఫలహారమేమన్నా చేద్దాం.)

**Likhit:** Whatever you say.
(నువ్వేం చెప్తే అదే).

Daily life situations లో conversation లో మరి కొన్ని చాలా సాధారణమైన phrases and expressions చూద్దాం ఈ lesson లో.

***Look at the following sentences from the dialogue above.***

*1) What's up?*
*2) Nothing of the sort*
*3) We have to take what's going*
*4) Don't lord it over me like that*
*5) There's no knowing when you are upset and when you are pleasant*
*6) I felt left out*
*7) We may get only the left overs*

పైవన్నీ కూడా మన సంభాషణకు చాలా సహజత్వాన్ని (naturalness) ఇస్తాయి. ఇవి వాడే అవకాశాలు చాలానే ఉంటాయి. వీలయినప్పుడల్లా/ అవకాశం వచ్చినప్పుడల్లా వీటిని వాడుతూ అలవాటు చేసుకోవాలి.




**1) What up?**- ఏం జరుగుతోందిక్కడ? / ఏమిటి విషయం?

a) There's a big crowd in front of the Collector's Office. What's up?= Collector కార్యాలయం ముందు పెద్ద గుంపుంది. ఏమిటి విషయం? / ఏం జరుగుతోంది?

b) I don't know what's up, but I saw him chasing somebody= ఏం జరుగుతోందో/ విషయం ఏమిటో తెలియదుగానీ, వాడెవరినో తరమడం చూశాను.

**2) Nothing of the sort** = అలాంటిదేంలేదు

a) Me insulting him? Nothing of the sort = నేను అతడిని అవమానించడమా? అలాంటిదేంలేదు.

Nothing of the sort = Nothing of the kind.

b) (Do) You think mangoes are cheaper this season than in the last season? Nothing of the kind. In fact they are dearer this year = క్రితంసారికంటే ఈసారి మామిడిపండ్లు చౌకని అనుకుంటున్నావా? అలాంటిదేంలేదు. ఆమాటకొస్తే ఈసారే ఎక్కువ ప్రియంగా (ఎక్కువ ధరలు) ఉన్నాయి.

**3) We have to take what's going** - What's going = What's available = ఏది దొరికితే అది.

a) They couldn't get the kind of fruit they wanted. So they had to make do with what was going =
వాళ్లక్కావలసిన రకం పండ్లు దొరకలేదు. అందుకని దొరికినవాటితోనే సర్దుకుపోవాల్సి వచ్చింది.

Make do with= సర్దుకుపోవడం- దీన్నింతకుముందు వివరంగా చర్చించాం.

b) What's going now in the college is only Civil Engineering seats. The seats in other branches have been filled = ఇప్పుడా college లో Civil Engineering లో మాత్రమే seats దొరుకుతాయి/ ఖాళీగా ఉన్నాయి. మిగతా branches లో seats అయిపోయాయి.

**4) Lord it over** = పెత్తనం చలాయించడం.


M.SURESAN

a) He sits in his seat all the time lording it over his co workers, though they are his equals = ఎంతసేపూ తన seat లో కూర్చుని తనతో సమానమైన సహోద్యోగులమీద పెత్తనం చలాయిస్తుంటాడతడు.

మనమేం పనిచేయకుండా, పెద్దా, చిన్నా అని కూడా చూడకుండా ఇతరులను ఆజ్ఞాపించడం, lord it over అంటే. ఇది bad manners.

b) Being the only child in the family he is pampered and lords it over even elders= ఆ కుటుంబంలో ఒకే పిల్లవాడవడంతో గారాబం చేస్తారు. వాడేమో పెద్దవాళ్లను కూడా ఆజ్ఞాపిస్తుంటాడు.

Pamper= గారాబంచేయడం= spoil.

Pampered child = spoilt child = గారాబం వల్ల చెడిపోయిన బిడ్డ.

c) Don't lord it over us. We are not your servants = మామీద పెత్తనం చలాయించకు. మేం నీ సేవకులం కాదు.

**5) There's no knowing/** There's no saying= తెలియకపోవడం/ చెప్పలేకపోవడం.

a) As things stand now, (there's) no knowing/ saying which party will win the next elections=
ఇప్పటి పరిస్థితిని బట్టి చూస్తే వచ్చే ఎన్నికల్లో ఏ పార్టీ గెలుస్తుందో తెలియడం లేదు/ చెప్పలేకుండా ఉన్నాం.

b) (There's) no knowing when the inflation will come down=
ద్రవ్యోల్బణం ఎప్పుడు తగ్గుతుందో తెలియడం లేదు.

c) No knowing when this will end=
ఇదెప్పుడు ముగుస్తుందో తెలియడంలేదు.

**6) Feel left out-** Past tense & past participle- felt left out=
సరైన ప్రాముఖ్యం/ గుర్తింపు/ మర్యాద ఇవ్వకుండా వదిలేశారనే భావం.

a) When they did not ask her to the movie she felt left out = ఆమెను సినిమాకు రమ్మని పిలవక పోవడంతో ఆమె తనను వాళ్లు ఉపేక్షించినట్లు అనుకుంది.

b) I do feel left out if you don't mention me in your speech =
నీ ఉపన్యాసంలో నా పేరు చెప్పకపోతే, నాకు సరైన గుర్తింపివ్వలేదని బాధపడతా.

**7) Left overs-** అందరూ తినగా మిగిలిన ఆహార పదార్థాలు.

a) The left overs at the dinners were enough to feed at least 10 adults=
ఆ విందులో అందరూ తినగా మిగిలిపోయిన ఆహారం 10 మంది పెద్దవాళ్లకు సరిపోతుంది.

b) He grew up feeding on the left overs of his father's master =
తన తండ్రి యజమాని ఇంట్లో మిగిలిపోయిన ఆహారంతో అతడు పెరిగాడు.

c) They fed the left overs to the poor=
తాము తినగా మిగిలిన ఆహారాన్ని పేదవాళ్లకు ఇచ్చేశారు.

---

**Q.** ఇంగ్లిష్ నేర్చుకోవాలంటే సరైన పుస్తకం చదివితే సరిపోతుందా? లేదా Spoken English Centre కు వెళ్లాలా? తెలపండి.

***- A.M.N., Nizamabad***

**A.** రెండూ అవసరమే. మంచి Spoken English Coaching Centre లో చదవడంతోపాటు, అక్కడ వారు recommend చేసే మంచి పుస్తకమూ అవసరమే. మీకు ఈనాడు Spoken English lessons బాగా ఉపయోగపడతాయి. మొదటినుంచి చదివి practise చేయండి. కేవలం grammar తెలుసుకోవడం వల్ల English మాట్లాడటం రాదు.

**Q.** *1. You must work hard. Or you will not get good marks.*
*2. You must run quickly. Then only you may catch the bus.*
*3. She is very shy, otherwise she can enjoy parties.*
*4. He is lazy. He may not get good marks.*
*5. She had come early. So the teacher did not punish her.*
*6. I had no garden. So I did not grow flowers.*

*పై వాక్యాలను if ఉపయోగించి ఎలా రాయాలో తెలపగలరు. If ఉపయోగించడంలోని నియమాలు, నిబంధనలను తెలపగలరు.*

*కింది వాక్యాలను ENOUGH ఉపయోగించి ఎలా రాయాలో తెలపగలరు. అలాగే enough ఉపయోగించే విధానం వివరించగలరు.*

*1. The fruit is ripe, she can pick it.*
*2. He is not very good. I can't believe him.*
*3. You are quite old. You can earn your bread.*

***- P Azharuddin, Somandepalli***

**A.** ఇలాంటి sentences లో if వాడాలనుకుంటే, మొదట వాటిని correct గా అర్థం చేసుకోవాలి. If వాడి sentence మార్చేటప్పుడు, అర్థం మారకుండా ఉండేలా sentence మార్చాలి. Take sentence 1 for example. Sentence 1 అర్థం: నువ్వు శ్రమపడాలి లేకపోతే మంచి marks రావు. ఇక్కడ if వాడాలనుకుంటే, అలాచేస్తేనేకానీ అనే idea రావాలి కదా? అంటే sentence ను ఇలా మార్చాలి. నువ్వు శ్రమపడితేనే మంచి మార్కులు వస్తాయి.= If you work hard, you will get good marks. Same applies to the second sentence- If you run quickly you may catch the bus.

Sentence 3: Otherwise = or. కాబట్టి ఇది కూడా sentence 1 లాగానే: If she is not shy she can enjoy parties.

Sentence 4: అతడు సోమరి అందుకని మంచి marks రావు. If పెడితే, అతడు సోమరికాకపోతే మంచి marks రావచ్చు. If he is not lazy, he may get good marks. Sentences 1 to 4, or, otherwise, తో ఉన్న sentences ను, ఇతర related sentences తో if తో కలపాలనుకుంటే, not లేని sentences లో not పెట్టడం, not ఉన్న sentences లో not తీసేయడమో చేయవచ్చు.

5th and 6th sentences, Sentences 1 to 4 లోలా కాకుండా, past situation ను తెలుపుతున్నాయి. అందుకని if తో, past perfect (had been/ had + past participle) రావాలి.

Sentence 5: If she had not come early, the teacher would have punished her (ఆమె త్వరగా రాకపోయుంటే, teacher శిక్షించేవాడే = త్వరగా వచ్చింది. Teacher శిక్షించలేదు)

6) If I had had a garden, I would have grown flowers (నాకేతోట ఉండుంటే, పూలు పెంచేదాన్ని = తోటలేదు, పూలు పెంచలేదు)

**II.** 1) The fruit is ripe enough for her to pick it. (She can pick it, for her to pick it కావడం గమనించండి)

2) He is not good enough for me to believe him. (I can not believe him బదులు for me to believe him రావడం చూడండి)

3) You are old enough to earn your bread (You can earn your bread బదులు to earn your bread రావటం చూడండి)

పై sentences లో enough వాడినప్పుడు, రెండో sentence/ clause, to తో begin అయ్యే infinitive phrase గా మారుతుంది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







**Q. 1.** *Comprise, Consist, Contain, I don't discriminate these three words. What is the difference among them? Please explain.*

*2. Why are you nit your braid to the last? Why are you braiding your braid to the last?*

జడ ఎందుకు చివరి వరకు అల్లుతున్నావు? పై వాక్యం సరైనదేనా? ఊడిపోతుంది అని ఇంగ్లిష్‌లో సమాధానం ఎలా చెప్పాలి?

*3.* రెప్పవేయకు, చూస్తూనే ఉండు దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

*4.* పూజ చేసే సమయంలో, వంట చేసేటప్పుడు, స్త్రీల అలంకరణ గురించి జరిగే సంభాషణ ల్లోని పదాలు ఇవ్వగలరు.

**- Bangaru Sarada, Eluru.**

**A. 1.** A very good question.

**Comprise** is almost the same as consist, but there is a slight difference.

Comprises = include/ have some thing/ somebody as parts or members = వస్తువును/ వ్యక్తులను భాగంగా కలిగిఉండటం/ భాగం కావడం.

a) Maths comprises Algebra, Trigonometry, etc.= Algebra, Tringonometry, మ్యాథ్స్‌లో భాగంగా ఉంటాయి.

b) The cabinet comprises the Prime Minister and the other ministers = Cabinet లో ప్రధానమంత్రి, ఇతర మంత్రులూ ఉంటారు.

**Consists of** (of ఎప్పుడూ రావాలి) = A fan consists of (కలిగిఉండటం) a motor and three blades = Fan లో ఓ motor, 3 blades ఉంటాయి (fan వాటిని కలిగి ఉంటుంది.)

The book consists of ten pages = ఆ పుస్తకంలో 10 పేజీలున్నాయి.

The party consists of 8 members.

**contain** = ఒకదాంట్లో ఇంకోటి ఉండటం.

a) The glass contains some milk = గ్లాసులో పాలున్నాయి.

b) The medicine doesn't contain alcohol= ఆ మందులో alcohol లేదు.

**2)** Why are you plaiting/ knitting your braid to the last?/ to the end? (Better)

Answer: Because the plaits may fall off

**3)** Stare/ keep staring.

**4)** Worship= కొలవడం, ఆరాధించడం, Pray = ప్రార్థించడం Kneel= మోకరిల్లడం, Prostrate (before God) = సాష్టాంగ నమస్కారం చేయడం; decorate = అలంకరించడం, floral= పూల (flowers) కు సంబంధించిన, chant= మంత్రాల్లాంటివి/ గీతాల్లాంటివి/ దేవుడి పేర్లలాంటివి వల్లించడం; meditate = ధ్యానించడం; meditation = ధ్యానం; bow = తలవంచడం pay obeisance = విధేయతతో తలవంచడం.

# The match is slated for next week





M.SURESAN

**Q. 1.** *Let me know the underlined phrase 'that' in the following sentences whether it refers to **So** or **Because**.*

*a. The patient states that he banged his right arm hard against a door that it turned black and blues the way around.*

*b. He states that he has not chosen to take his blood pressure medication that his blood pressure has been okay.*

*2. He is noticing that his legs get tighten and tired as he is walking that he sits down and rest and he is able to get up and go again.*

*In this sentence the phrase that refers to what? I think it refers to **So**, with the meaning **because**, is not it?*

*3. You have suggested to read novels by present day writers. Can you please mention their names?*

*4. While Karnataka slated to go for polls in May 2008, political parties hope that the issue will be sidelined. What is the exact telugu meaning of this sentence? Here in the sentence the phrase 'slate' what does it mean?*

*5. Jack was on time for session and appeared some what well put together though he was dressed somewhat flamboyantly. What would be the meaning of the phrase 'well put together'?*

*6. What is the difference among the phrases 'quantity, amount and degree and abundant-plenty'? In what kind of sense can these adjectives are used? Can we use all these adjectives to explain numerical and abstract expressions?*

*7. In how many days you are going to give lessons on pronunciation in Eenadu. I think, being humble, it had better if I know pronunciation by you at an earliest since it is a great need for me to know about it rather than knowing about it as merely improving the knowledge.*

*8. Either have I to read Times of India or the Hindu to improve English from the colloquial point of view.*

**- S Mohinuddin, Kurnool.**

**A. 1.** (a) 'that' in the sentence means so that = as a result.

b) 'that' in the sentence is wrong. 'As' or 'because' in its place would have been correct. But are you sure that the sentence was dictated by a white American native speaker of English? They don't make such mistakes. Or is it that you didn't hear it properly?

**2.** In this sentence too there are mistakes which native speakers of English/ careful users of English do not make. 1) 'is noticing' is wrong. It should be 'he notices' 2) Gets tighten should be 'gets tightened'. 3) 'As he is walking' should be, 'As he walks'. I am unable to understand what the doctor meant when he dictated the sentence. Are you sure you heard the dictation correctly? This sentence (No2) as such doesn't make any sense. Perhaps what the doctor wanted to say was, "He notices that his legs get tightened and tired as he walks and that when he sits down, and rests, he is able to get up and go again" this makes some sense, doesn't it?

**3.** The novels that can help you improve your spoken English skills are those by James Hadley Chase, Harold Robins, Jeffrey Archer, Robert Ludlum, Irwing Wallace, John Grishan, Sidney Sheldon, etc. Chase is the best.

**4.** The sentence should be, 'While Karnataka is slated to go for polls ...' = కర్ణాటకలో May 2008 లో ఎన్నికలు జరిగే ప్రణాళిక ఉండటం వల్ల, ఈ విషయం ప్రాముఖ్యం కోల్పోవచ్చని రాజకీయ పార్టీలు ఆశిస్తున్నాయి. ఇక్కడ while కంటే As/ because బాగుండేదేమో! be slated= అనుకున్న programme, (కార్యక్రమం) ప్రకారం జరగబోయే సంఘటన.

a) The match is slated for next week = అనుకున్న కార్యక్రమం (programme) ప్రకారం match వచ్చేవారం జరగనుంది.

b) The building was slated to be opened last month itself= అనుకున్న కార్యక్రమం ప్రకారం కిందటి నెలలోనే ఆ కట్టడం ప్రారంభం కావాల్సింది.

**5.** Well put together= clean and tidy

**6.** Quantity= amount- used especially with uncountables. Quantity can sometimes be used with countables too. Amount, unlike quantity refers to a sum of money. (A large quantity of drugs/ weapons, etc. A large amount of money) Degree = extent (ఏ మేరకు అని). She has intelligence of a high degree. A certain degree of skill is required to do the job.

Abundant and plenty are not directly connected with 'Amount/ quantity/ degree'

Abundant = large in quantity or number = plentiful. Abundant patience is required to do this kind of job. (Abundant water, money, etc = large quantities of water or money)

'Abundant' is used with uncountables.

Plenty also means a large amount of or a large number of. Plenty of eggs/ milk etc.

**7.** It will be very soon.

**8.** You are perhaps right, but in the TOI the expressions/ words are too colloquial to understand.

**Q. 1.** *'KANGAROO'* అనే పదానికి సరైన ఉచ్చారణ ఏమిటి? కొంతమంది 'క్యాంగ్రూ' అని, మరికొందరు 'క్యాంగారూ' అని అంటున్నారు. ఏది సరైనది?

*2. The statue of liberty is at the entrance to New York harbour.* ఈ వాక్యంలో *entrance* అనేది ఏమిటి? *common noun? abstract noun?* వివరించగలరు. *Entrance* ను *common noun* గా ఎప్పుడు వాడతారు? *abstract noun* గా ఎప్పుడు వాడతారు?

*3. He built a stone wall.* ఈ వాక్యంలో *stone wall* అనేది *compound word.* కానీ *stone (noun)* అనేది *wall (another noun)* ను *modify* చేస్తుంది. ఈ సందర్భంలో *stone* అనేది *objective* అవుతుందా?

**- M. Anirudh, Aswapuram**

**A. 1.** Correct pronunciation of kangaroo is క్యాంగరూ (క్యా, cash లో 'క' లా)

**2.** Entrance ఇక్కడ common noun. Entrance అంటే ద్వారం, తలుపు, ఎవరైనా, ఏదైనా ఎక్కడికైనా ప్రవేశించే చోటు (దర్వాజా/ gate/ passage, etc) అనే అర్థంతో ఎక్కువగా వాడతాం. అలాంటి సందర్భాల్లో ఇది common noun. Entrance అంటే ప్రవేశం = ఏదైనా వ్యాపకంలో పాల్గొనడం అనే అర్థం ఉంది. అప్పుడు entrance abstract noun అవుతుంది. His sudden entrance into politics surprized everyone= రాజకీయాల్లో అతడి ఆకస్మాత్ ప్రవేశం అందరినీ ఆశ్చర్యపరిచింది. ఇక్కడ entrance, abstract noun.

**3.** Stone అనేది adjective అవుతుంది, stone wall అనే phrase లో- college student లో college లా, village atmosphere లో village లా. అయితే Spoken English కు ఈ చర్చ అంతగా అవసరం లేదు.

**Q.** *'Wh' question words (why, when, where, who etc)* తర్వాత *helping verbs* వస్తే అది *question structure* కదా. కిందివాక్యాల్లో సరైనవేవో తెలపగలరు.

*1. a) I don't know who he is.*

*b) I don't know who is he.*

*2. a) I don't know how many hours she sleeps.*

*b) I don't know how many hours does she sleep.*

*3. a) I don't know who they are.*

*b) I don't know who are they.*

*The below 6 sentences are in statement structure.* కానీ *wh, question words (who, when, wher etc)* తర్వాతే *helping verbs* వస్తున్నాయి. *wrong* కదా? ఉదాహరణలతో వివరించగలరు.

1. Hemanth is the man who can give the information.
2. I don't know who can go there.
3. The people who are not interested in games can go home.
4. I don't know who will go there today.
5. He is sending his boy who will fetch the bike.
6. He is out with another customer who is buying a new bike.

**- Anand Sekhar, Secunderabad.**

**A.** మీరిచ్చిన Sentences 1 (a) (b), 2 (a), (b), 3 (a), (b) లలో, 1(a), 2(a), and 3 (a) లే correct. ఎందుకంటే 'wh' words తో begin అయ్యే clauses ఉన్నప్పటికీ, అవి statements మాత్రమేకానీ, questions కావు కదా? 1(a) తీసుకోండి- అర్థం- అతడెవరో నాకు తెలియదు. ఇందులో అతడెవరో అనేది question కాదు. 'అతడెవరో నాకు తెలియదు' అనే statement లో భాగం. అందుకని అది subject + verb structure లోనే ఉంటుంది. 'Wh' words questions తో వాడతాం, కానీ questions లో మాత్రమే వాడం, statements లో కూడా వాడతాం. మీరు రాసిన sentences వాటికి ఉదాహరణలు. మీ ఇతర sentences లో (II section - sentences 1 to 6 ను ఇలా అర్థం చేసుకోవాలి.)

1) The man who can give the information = ఎవరైతే information ఇవ్వగలరో ఆ మనిషి - మామూలు తెలుగు: Information ఇవ్వగలిగిన మనిషి. అలాగే

2) Who can go there (part of a statement) = ఎవరు వెళ్లగలరో - మామూలు తెలుగు - వెళ్లగలిగినవారు

3) The people who are not interested in games = Games లో ఆసక్తి లేనివాళ్లు.

4) ... who will go = ఎవరు వెళతారో/ వెళ్లేవాళ్లెవరో

5) ... his boy who will fetch the bike = Bike తెచ్చే తన కుర్రాడిని

6) With another customer who is buying a new bike= కొత్త bike ను కొంటున్న / కొనే ఇంకో customer తో...

పై sentences లోని 'wh' clauses ను ఇలా అర్థం చేసుకుంటే అవి questions అనిపించవు, statements గానే కనిపిస్తాయి. అప్పుడు subject + verb order correct అనిపిస్తుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Q.** 1. *Tenses ను గురించి ఏయే lessons లో discuss చేశారో ఆ లెసన్ల నెంబర్లు తెలపగలరు.*
2. *Second conditional clause ను గురించి వివరించగలరు.*

**– SriKrishna Das, Tenali**

**A.** 1. Lessons 20 onwards .
2. Second Conditional clause, Improbable present (ప్రస్తుతం అసంభవం)ను తెలుపుతుంది.

eg: If I were the CM you would be my finance minister. గమనించండి: అర్థం నేను ఇప్పుడు CMను అయితే (నేను CMను అవడం అంటూ జరిగితే- అది జరగదు కదా? ) నువ్వు నా ఆర్థిక మంత్రివి అవుతావు (ఇదీ జరగదు).

If he contested the elections. He would win. అతడు ఎన్నికల్లో పోటీ చేస్తే - అతడు గెలుస్తాడు. (అతడిప్పుడు ఎన్నికల్లో పోటీచేసే అవకాశం లేదు) ఇలాంటి సందర్భంలో 'If clause'లో were (singular subject కు కూడా)గానీ, III Doing word (past simple) గానీ వస్తుంది, main clause లో would/ should/ could/ might వస్తుంది.

If he got a chance, he could prove his talent. అతడికి అవకాశం వస్తే- ఇప్పుడు రాదు, అతడు తన ప్రతిభను రుజువు చేసుకోగలడు - ఇదీ జరగదు.

If she knew she would win, she might participate గెలుస్తుందని తెలిస్తే- తెలిసే అవకాశం లేదు, ఆమె పాల్గొనవచ్చేమో.

**Q.** *Happy x unhappy అయితే stop x non stop అవుతుంది ఎందుకు? Un, non ఏ విధంగా ఉపయోగించాలి?*

**- K.Nagadivya, Tatipaka**

**A.** Happy కి opposite un happy, కానీ, stop కి opposite non stop కానక్కరలేదు. Non అంటే ఒక తెగకు చెందని (అంటే ఒక తెగకు చెందిన అనేందుకు విరుద్ధంగా) అని అర్థం.




Non-stop, stopping కు (ఆగే)opposite, కానీ stop కు కాదు.

మీది interesting question.

Non అంటే 'కాని' అనే అర్థం/ ఇతర అనే అర్థం.

Christians (క్రైస్తవులు), non Christians (క్రైస్తవులు కానివారు - వీరిలో క్రైస్తవ జాతికి చెందని వారెవరైనా - Hindus, Muslims, Sikhs, అవ్వొచ్చు)

ఇది చూడండి: unchristian = క్రైస్తవానికి విరుద్ధమైన.

Idol worship is unchristianism = విగ్రహారాధన క్రైస్తవ సిద్ధాంతానికి/ క్రైస్తవానికి విరుద్ధం (తగనిది) అలాగే It's an unhindu practice = అది అహైందవ చర్య. Opposites form చేసేందుకు un-, in-, im-, dis-, లాంటివి వస్తాయి. అయితే వీటిలో ఏ మాట ముందు ఏది వాడాలనేది ఆ మాట ఏ భాష నుంచి English లోకి వచ్చింది, ఉచ్చారణా సౌలభ్యాన్ని (convenience of pronunciation) బట్టి ఉంటుంది.

# If I were the C.M. ..







**Q.** 1. *You are serious.*
*You are being serious.*
*ఈ రెండు వాక్యాలకు అర్థంలో ఉన్న తేడాలను వివరించగలరు.*
2. *Appalled at something. Appalling. ఈ పదాల అర్థంలోని తేడాలను తెలపండి.*
3. *Afford పదాన్ని ఎలా ప్రయోగించాలో వివరించగలరు.*
4. *Should have, Could have, Would have ఈ పదాల సముదాయాన్ని వాక్యాల్లో ఉపయోగించినపుడు ఎలాంటి అర్థం వస్తుందో ఉదాహరణలతో వివరించగలరు.*
5. *Should have been, Could have been, Would have been ఏ అర్థాన్ని వ్యక్తం చేయడానికి ఉపయోగిస్తారో తెలపండి.*

**- Santhi, Ongole**

**A.** 1. You are serious - నువ్వు serious గా ఉన్నావు ఇప్పుడు /ఉంటావు (మామూలుగా/ నీ స్వభావం అది కావచ్చు)

You are being serious = ఇప్పుడు నువ్వు serious గా ఉన్నావు.

2. Appalled at - భయం, అసహ్యం పొందడం we are appalled at the living conditions in slums = మురికివాడల్లోని జీవన పరిస్థితులు భయాన్ని, అసహ్యాన్ని కలిగిస్తాయి - భయంకరం.

Appalling = భయాన్ని అసహ్యాన్ని కలిగించే.

The food and treatment given to boys and girls in B.C. Hostels is appalling = B.C. Hostels లో పిల్లలకు పెట్టే తిండి, వారిపట్ల ప్రవర్తన భయాన్ని, అసహ్యాన్ని కలిగిస్తాయి- భయంకరం.

3. Afford = ఏదైనాకొనగల/ పొందగల/ అనుభవించగల స్తోమత.

a) With his income he cannot afford a car = అతడి ఆదాయంతో అతడు car కొనలేడు.

b) Being rich, he can afford a much better house = ధనికుడవడం వల్ల, ఇప్పుడున్న ఇంటికంటే మెరుగైన ఇంట్లో ఉండే స్తోమత అతడికుంది. (Afford తర్వాత buy వాడం.)

4. Should have = ఉండాలి.

Could have = ఉండగలిగే పరిస్థితి గతంలో.

Would have = ఉండటం.

a) He should have a car because he travels a lot = చాలా ప్రయాణం చేస్తాడు కాబట్టి అతడికి car ఉండాలి.

b) He could have a car -because he was rich = ధనికుడవటం వల్ల అతడు car వాడగలిగాడు. (ఆ స్తోమత అతడికి ఉంది.)

We could have a lot of leisure those days = ఆ రోజుల్లో మేం చాలా విశ్రాంతి పొందగలిగేవాళ్లం.

I would have = I wish to have.

I would have coffee instead of tea = Tea బదులు coffee తీసుకోవాలనుకుంటున్నాను నేను.

5. Should have been = ఉండవలసింది (గతంలో) కానీ లేదు.

Could have been = ఉండగలిగేదే (గతంలో) కానీ లేదు.

Would have been = ఉండేదే/ ఉండేవాడే కానీలేదు. (గతంలో)

వీటిని గురించిన వివరణ కోసం పాత lessons చూడండి.

**Q.** *నేను డిగ్రీ తెలుగు మీడియం విద్యార్థిని. స్పోకెన్ ఇంగ్లిష్ నేర్చుకోవాలనుకుంటున్నాను. ఈ విషయంలో C.I.E.F.L. ఎలా ఉపయోగపడుతుంది. అసలు C.I.E.F.L. ముఖ్య ఉద్దేశం ఏమిటి? ఇందులో ఇంగ్లిష్‌కు సంబంధించి ఎలాంటి కోర్సులు నేర్చుకునే అవకాశం ఉందో తెలుపగలరు.*

**- M. Snehalatha, Narsampeta**

**A.** మీ present qualification, మీరు ఎంచుకున్న career ను బట్టి CIFFL లో మీకు ఏ course ఉపయోగపడుతుందనేది ఉంటుంది. చాలాcourse లు ఉన్నాయి. CIFEL పేరు ఇప్పుడు IIEFL. Website browse చేయండి. వివరాలు తెలుస్తాయి.

**Q.** *కిందివాటిని ఇంగ్లిష్‌లో తెలపగలరు.*
1. *అతడు కాళ్లు ఈడ్చుకుంటూ నడుస్తున్నాడు.*
2. *బండిలో పెట్రోలు అయిపోయింది. అందుకని బండిని నడిపించుకుంటూ పెట్రోల్ బంకు వరకు తీసుకువెళ్లి పెట్రోలు కొట్టించుకున్నాడు.*
3. *ఉన్నది ఉన్నట్టుగా చూడు. లేనిదాన్ని ఊహించకు.*
4. *I'd అంటే ఏమిటి? ఎక్కడ ఉపయోగించాలి?*

**- S. Srikanth, Hyderabad.**

**A.** 1. He is dragging his feet/ slogging
2. The vehicle ran out of petrol. So he walked it upto the petrol bunk and had it filled.
3. See things as they are; don't imagine.
4. I'd = I had/ I would (సందర్భాన్ని బట్టి)

**Q.** *Make, get, as, ing forms కు ఉన్న విస్తృతార్థాలేమిటి?*
1. *ing form ముందు వస్తే ఎలా అర్థం వస్తుంది. e.g. Considering of our future relations.*
2. *I am confirming కు I confirming కు ఉన్న తేడా ఏమిటి?*

**- M. Sashidhar, Anaparthi**

**A.** Make, get and as లను గురించి చాలా విపులంగా ఇంతకు ముందు lessons లో వివరించాం.

'...ing' form అనేక విధాలుగా వాడతాం.

1) ఒక పనిచేస్తూ/ చేస్తున్నపుడు

a) Walking down the street, he saw his friend = వీధి వెంబడి నడుస్తూ/ నడుస్తున్నపుడు, అతడు తన స్నేహితుడిని చూశాడు.

b) Entering his home, he found things all over the floor = ఇంట్లోకి ప్రవేశిస్తూనే /ప్రవేశించినపుడు/ ప్రవేశించగానే నేలమీద వస్తువులు పడుండటం చూశాడు.

c )'...ing' =ఒక పని చేయడం

Sitting in class for five hours a day is not easy = రోజుకు అయిదు గంటలు class లో కూర్చోవడం సులభం కాదు.

d) Smoking is bad = సిగరెట్ తాగటం చెడు.

...ing - చేస్తూ.

considering our future relations = మన భవిష్యత్ సంబంధాలను దృష్టిలో ఉంచుకుని.

2) I am confirming = నేను ధ్రువపరుస్తున్నాను - ఇది sentence

I confirming = నేను ధ్రువపరుస్తూ - ఇది sentence కాదు.

**Q.** *ఇంగ్లిష్ నేర్చుకోవడానికి మీ spoken English lessons తోపాటు ఇంగ్లిష్ దినపత్రికలు, కథల పుస్తకాలు, పిల్లల text books చదువుతాను. Dictionary ఎక్కువగా రిఫర్ చేస్తుంటాను. దీంతో 80% అర్థం అవుతుంది. ఇంగ్లిష్‌లో paragraphs, letters రాస్తుంటాను. కానీ ఇంగ్లిష్ మాట్లాడలేకపోతున్నాను. మెరుగుపడాలంటే ఏం చేయాలో, ఏ కోణంలో కృషిచేయాలో తెలపగలరు.*

**- G. Venkatagiri, Chowlamaddi**

**A.** మీరు English improve చేసుకునేందుకు సరైన పద్ధతులనే అనుసరిస్తున్నారు. Dictionary refer చేయడం కాస్త తగ్గించండి. Speaking ఎక్కువ practice వల్ల వస్తుంది. మాట్లాడలేకపోవడం అనేది సరికాదు. అవకాశం ఉన్నప్పుడల్లా, తప్పు మాట్లాడతామేమో అనే భయం లేకుండా మాట్లాడేస్తూ ఉండండి. రెండు మూడు వారాల్లోనే చాలా improvement కనిపిస్తుంది. మీరు మాట్లాడగలరు, practice చేయండి.

**Q.** 1. *I am pursuing my M.B.A., she is pursuing her B.Tech. ఇలా my M.B.A., her B.Tech అని degree ల ముందర his, my, her అని వాడవచ్చా? MBA/ MCA/ B.Tech ఇవి అందరికీ సమానమే కదా. అసలు ఏది కరెక్టు పద్ధతి?*
2. *Lecturer/ Professor/ Reader in English/ Dean వీరి వృత్తిలో ఉన్న తేడా ఏమిటి? Deemed University? అంటే ఏమిటి?*
3. *Abroad అనే పదాన్ని ఎలా ఉపయోగించాలి? అర్థం ఏమిటి? I went abroad అనాలా? లేదా I went to abroad అనాలా? My husband is abroad లేదా in abroad అనాలా? వివరంగా తెలపగలరు.*
4. *Oxford Dictionary లో Speak/ Talk వీటి మధ్య తేడా వివరిస్తూ- Two or more people are having a conversation అని వాక్య నిర్మాణం ఉంది. Having అనేది తినడం, తాగడానికి మాత్రమే ఉపయోగించాలి కదా? standard books లో కూడా are having, having అనేది వేరే అర్థాలకు ఎందుకు ఉపయోగిస్తున్నారో వివరించగలరు.*

**- P. Narayanamma, Nidadavolu**

**A.** 1. My MBA, her B.Tech- ఇది usage -English లో అలా అనడం వాడుక. My, her, his లేకుండా I am doing MBA, She is pursuing, B.Tech అనడం కూడా correct. కాబట్టి దాన్ని గురించి అంత ఆలోచించనక్కరలేదు. అయితే, pursuing studying అనేది కాస్త గ్రాంథికం. Spoken English లో doing బాగుంటుంది.

2. Lecturer - ఈ వృత్తిలో ఉన్నవాళ్లు teaching (బోధన) కే పరిమితం అవుతారు. వీళ్లపని ముఖ్యంగా బోధనే.

Readers, teaching మాత్రమే గాకుండా, research (పరిశోధన) చేస్తుంటారు, research చేసేవాళ్లకు guidance ఇస్తారు.

Professors teaching తోపాటు, research guide చేయడమే కాకుండా వాళ్ల శాఖ పాలనావ్యవహారాలు కూడా చూస్తుండవచ్చు

Reader కంటే Professor హోదా ఎక్కువే కాకుండా, ఎక్కువ అనుభవాన్ని కూడా సూచించవచ్చు అనుభవం బాగా ఉండి, subject మీద బాగా పట్టున్న వాళ్లెవరన్నా హోదాతో సంబంధం లేకుండా Professor కావచ్చు

3. Abroad = విదేశంలో/ విదేశానికి.

I went abroad, correct. (Abroad అంటేనే విదేశానికి అని కాబట్టి.)

అలాగే Her husband is abroad అనే అంటాం. abroad అంటే విదేశంలో అని అర్థం కాబట్టి.

4. am/ is/ are having తినడం, తాగడంకాకుండా ఇతర అర్థాలతో చాలా అరుదుగా వాడతారు.

Problem, conversation లాంటి వాటి విషయంలో. అయితే conversation విషయంలోam/ is/ are having చాలా అరుదు, వాడకపోవడమే మంచిది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







**Q.** 1. *Being a teacher I should be an ideal to my students.* ఈ వాక్యం కరెక్టేనా?

2. ఇందులో *to* అనే *preposition* వాడటం కరెక్టేనా?

3. *Being* ను ఉపయోగిస్తూ రెండు లేదా మూడు ఉదాహరణలు ఇవ్వగలరు. *Being* అనే పదాన్ని తెలుగులో ఏయే అర్థాలతో వాడవచ్చో తెలియజేయగలరు. 'నేను ఉపాధ్యాయుడిని అయినందున పిల్లలకు నేను ఆదర్శవంతంగా ఉండాలి' అనేదానికి పై ఇంగ్లిష్ వాక్యం కరెక్టేనా? లేకపోతే ఈ అర్థం వచ్చే *english sentence* చెప్పగలరు.

4. *As if*ను ఏవిధంగా ఉపయోగించాలో ఉదాహరణలతో వివరించగలరు.

5. *Though,although, inspite of* ఉదాహరణలతో తెలపండి.

6. *Ironically* దీనిని ఏ సందర్భంలో ఉపయోగించాలో చెప్పగలరు.

*- Md. Ayub Ahmad, Choutpalli*

**A.** 1. & 2. Absolutely right. Ideal to is correct as well.

3. b) Being rich, he can buy anything. (ధనికుడిగా ఉన్నందువల్ల......)

b) Being tall, he can touch the roof (పొడుగ్గా ఉన్నందువల్ల/ ఉండటంతో......)

c) Being a teacher ... కు మీరిచ్చిన తెలుగు అర్థం correct ఈ sentence కు ఈ meaning వస్తుంది.

4. As if/ As though = అయినట్లుకానీ, కాదు.

a) She behaves as if she were very rich = తనే చాలా ధనవంతురాలయినట్లు (కానీ కాదు) ప్రవర్తిస్తుందామె.

b) He looked at me as though I were guilty = నేనేదో దోషినయినట్లు (కానీ నేను దోషిని కాదు) నా వైపు చూశాడు.

c) You look as though/ as if you hadn't eaten for days= రోజులపాటు ఏమీ తిననట్లు (కానీ తిన్నావు) కనిపిస్తున్నావు.

She looks as if she were rich = ధనవంతురాలైనట్లు (కానీ కాదు) కనిపిస్తోంది.

She looks like a rich woman = ధనికురాల్లా కనపడుతోంది (అయి ఉండొచ్చు).

# She looks as if she were rich

5. Though/ although = in spite of

i) Though/although he is rich he doesn't spend much = in spite of being rich he doesn't spend much.

ii) Though/although he takes long walks, he is not tired = In spite of taking long walks, he is not tired.

6. 1) Ironically = in a way that the meaning of what you say is the opposite of what you wish to say. eg: oh, you got 10 marks out of 100. Excellent! You are really great (నీకు 100కు 10 మార్కులొచ్చాయా? అబ్బో! చాలాగొప్ప మార్కులే! నువ్వు గొప్పవాడివే.

2) Ironically - of a situation which is the opposite of what you have expected.

Eg: I travelled by car so that I can reach the place sooner than by bus. Ironically the car broke down on the way and I reached the place much later than the bus.

(Bus కంటే ముందర చేరొచ్చని car లో బయల్దేరాను. కానీ మధ్యలో car చెడిపోవడంతో, bus కంటే చాలా ఆలస్యంగా చేరాను. ఇది ironical. ముందు చేరేందుకు car లో బయల్దేరినా ఆలస్యం అవడం).

---




**Q.** హిందూ న్యూస్‌పేపర్‌లో కింది వాక్యంలో *'chin blame'* అని ఇచ్చారు. దాని అర్థం వివరించండి.

*Over the past two years, Prime Minister Manmohan Singh has taken on the 'chin blame' for every security failure in every part of the country.*

*- Satyam , Ramakrishnapuram*

**A.** There is no such expression as chin blame in English. There is the expression, Take on the chin = ఏ కష్టాన్నయినా/ క్లిష్ట పరిస్థితినైనా బాధపడకుండా సాకులు వెతక్కుండా నిబ్బరంతో భరించడం. Eg. He took his defeat on the chin = He accepted his defeat without complaint = తన ఓటమిని నిబ్బరంగా భరించాడు/ అంగీకరించాడు, ఎవరినీ, దేన్నీ నిందించకుండా. The Hindu లో sentence మీరు ఇలా చూసి ఉంటారు. PM Manmohan Singh has taken on the chin - The blame far every security failure = ప్రతి భద్రతావైఫల్యానికి తనమీద వచ్చిన నిందను నిబ్బరంతో భరించారు అని భావం. (ఇక్కడ taken on the chin, the blame.... అని చదువుకోవాలి? )


M.SURESAN

**Q.** *Watch, Seeing, Looking* ఈ మూడు పదాలను ఏయే సందర్భాల్లో వాడతారో తెలపండి.

*We watch the aeroplane when it is taking at the ground* అంటున్నాం.

*We looking the aeroplane when it is taking at the ground* అనకూడదా? వీటి మధ్య సంబంధాన్ని వీటిని ఏయే సందర్భాల్లో వాడతారో తెలపండి.

*-M. Anjaneyulu, K. Nageswarao, Molagavalli.*

**A.** Watch = గమనించడం/ సంఘటన జరుగుతున్నంతసేపు చూస్తూ ఉండటం. Look = దేనినయినా, ఎవరినయినా చూడటం, వాళ్ల/ వాటి వైపు చూడటం, Watch అన్నప్పుడు కాస్త పరీక్షగా చూస్తాం, look అంటే చూడటం మాత్రమే (గమనించేటప్పుడు ఉన్నంత శ్రద్ధ ఉండదు).

**Q.** *Too- enough, since-for* ల మధ్య తేడా తెలుపగలరు. అదేవిధంగా *idioms and phrasal verbs*ను గురించి పూర్తిగా వివరించగలరు. *- K. Usharani, Kurnool.*

**A.** Too అంటే ఏదైనా జరగనంతగా ఎక్కువ అని.

He is too weak to walk = నడవలేనంత బలహీనంగా ఉన్నాడు = He is not strong enough to walk.

(too weak = not strong enough) = నడిచేంత బలం లేకుండా ఉన్నాడు)

The food is too bad to eat = The food is not good enough to eat. ఇదీ వీటి రెండింటి connection ఇంకో విషయం -too = so that... not.

He is too weak to walk = He is so weak that he cannot walk.

Since he is weak, he cannot walk = He cannot walk, for he is weak/ He cannot walk. For he is weak Idioms & Phrasal Verbs ఇప్పుడు వివరిస్తున్నాం చూడండి.

---

**Q.** కింది తెలుగు వాక్యాలను ఇంగ్లిష్‌లో చెప్పండి.

1. కోర్టు అతడికి పదేళ్ల కఠిన కారాగార శిక్ష విధించింది.
2. మృతుడి తరఫు బంధువులు ధర్నా చేశారు.
3. అతడు బలహీనమైన పార్టీలో ఉండటం వల్ల అతడికి సరైన గుర్తింపు లభించలేదు.
4. ఇంత జరిగినా వాడికి బుద్ధిరాలేదు.
5. దేవస్థానంలో భక్తులు కిటకిటలాడుతున్నారు.
6. దేవస్థానంలో భక్తుల రద్దీ చాలా ఎక్కువగా ఉంది.
7. నాకు జీవితంలో ఒక్క కోరిక మిగిలిపోయింది.
8. నీ తల్లిదండ్రులు నీ మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు.
9. వాళ్ల ఆశలన్నీ అడియాశలయ్యాయి.
10. నిన్ను ఏ చేసినా పాపం లేదు.
11. తాగిన మైకంలో వాడు ఏం చేస్తున్నాడో వాడికే అర్థం కావడం లేదు.
12. బస్సు ఆగివున్న ఆటోను ఢీకొట్టడంతో ఈ ప్రమాదం జరిగింది.
13. తాగి కారు నడపడం వల్ల రోడ్డు పక్కన పడుకున్న పది మంది కాళ్లమీదుగా కారు పోనిచ్చాడు.
14. వాడు అంతే. అదో టైపు.
15. ఆమె పరీక్ష పాస్ కాలేదని తీవ్ర మనస్తాపానికి గురైంది.
16. వసంతకాలంలో చెట్లు చిగురిస్తాయి.
17. చెయ్యని తప్పుకు పదేళ్ల జైలు శిక్ష అనుభవించాను.
18. నువ్వు తప్పు చేసి నింద వాడిమీదకి నెడతావేంటి?
19. వాడు వింటేగా అని ఇంగ్లిష్‌లో అనడానికి *- He wouldn't listen* అంటే సరిపోతుందా? చెబితే వింటేగా, చెబితే విన్నావా? వీటిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?
20. వాడు అన్నింటికీ తెగించేశాడు.
21. ఈ రోజుల్లో అమ్మాయిలు, అబ్బాయిలు బరితెగించి, విచ్చలవిడిగా తిరుగుతున్నారు.
22. పరీక్షలు దగ్గర పడుతున్నాయి.
23. పరీక్షలు ఉన్నన్నిరోజులు ఒళ్లు దగ్గరపెట్టుకుని చదవండి.
24. కోర్టు అతడిపై ఒక షరతు విధించింది.
25. నా ఆస్తి మొత్తం నీకే ఇచ్చేస్తా.
26. నా ఆస్తి నీ పేరు మీద రాస్తా.
27. ఆస్తి ఎవరి పేరు మీద ఉంది?
28. ఈ నోటు చెల్లదు, చిరిగిపోయింది.
29. నీ ఇష్టమొచ్చినట్టు ఊరేగు.
30. క్లాసులో దిక్కులు చూడకు.
31. నేను ఈ విషయాన్ని అతడిని అడిగినప్పుడు నీళ్లు నమిలాడు.
32. వాడు గుటకలు వేస్తున్నాడు.
33. ఇండియాకు స్వాతంత్ర్యం ఎప్పుడు వచ్చింది అనడానికి *When did India become free? When did India got freedom?* రెండింటిలో ఏది కరెక్టు?
34. బెలూన్ పేలిపోయింది.
35. టీచర్ నన్ను గ్రౌండుచుట్టు నాలుగుసార్లు పరుగెత్తమన్నారు.
36. టీచరు నన్ను బెంచిమీద నిల్చోమన్నారు.
37. టీచరు నాతో గోడకుర్చీ వేయించారు.
38. టీచరు గుంజీలు తీయించారు.
39. అతడు వాళ్ల అమ్మ మీద బెంగపెట్టుకున్నాడు.
40. నీ సత్తా నిరూపించుకోవడానికి ఇదే సరైన సమయం.

*- M. Nagaraju, Tallavalasa.*

**A.** 1) The court convicted him to/ sentenced him to/ awarded him ten years rigorous imprisonment.

2) The relatives of the deceased/ dead person staged a dharna.

3) Being a member of a party not so prominent he lacks recognition.

4) Inspite of what has happened he hasn't learnt a lesson.

5) The Devasthanam is crowded with devotees.

6) There are a large number of devotees in the temple/ There is a large crowd of devotees in the temple.

7) I have one unfulfilled desire in my life.

8) Your parents have a lot of hope on you/ many hopes on you.

9) All their hopes have been shattered.

10) You deserve the worst punishment.

11) He doesn't realise what he is doing in his drunken state/ Totally drunk he doesn't'/ is not able to realise what he is doing.

12) The accident resulted from a bus hitting a standing auto.

13) Driving drunk, he ran the car over the legs of ten people sleeping on the roadside.

14) He is rather odd.

15) She is very upset at not passing the exam.

16) Trees put on new leaves in the spring

17) For a crime that I did not commit I underwent a ten year jail term.

18) Why do you blame him for your fault?

19) He wouldn't listen, Did you listen?

20) He is desperate.

21) Boys and girls these days are unrestrained/ show no restraint (in their behaviour)

22) Exams are approaching.

23) During the exams study with all seriousness.

24) The court has imposed a condition/ restriction him.

25) I'm ready to give you my whole property.

26) I will write my property in your name.

27) In whose name is the property?

28) The note is torn and doesn't go/ It's a bad note, it's torn.

29) Go to hell

30) Pay attention to what's going on in the class

31) When I asked him about it he blinked (నీళ్లు నమిలాడు అనేందుకు సరైన మాట లేదు. Blink = కళ్లార్పడం)

32) He is gulping (ఏం చెప్పాలో తెలియక గుటకలు వేశాడు అనేందుకు ఇది వాడతాం. నాకు తెలిసి English లో ఈ భావానికి expression లేదు)

33) Both are correct.

34) The balloon blew up

35) The teacher asked me to run 4 times around the ground.

36) The teacher made me stand up on the bench.

37) The teacher made me sit against the wall.

38) The teacher made me do sit-ups

39) He is longing for his mother.

40) This is the time to prove your mettle

**Spoken English** పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

**Karpura:** Which train are you going to book your tickets by?
(ఏ train లో నువ్వు టికెట్లు book చేసుకో బోతున్నావు? )

**Harathi:** It's going to make no difference; I mean whether it's mail or Circar Express. Only upper berths are available.
(ఏదయితేనేం? హౌరామెయిల్ అయినా సర్కార్ express అయినా. దేన్లోనయినా upper berths మాత్రమే ఉన్నాయి.)

**Karpura:** But then the time of your reaching does matter. The earlier you reach the better.
(కాని నువ్వు చెన్నై చేరే సమయం ముఖ్యమే కదా? నువ్వెంత త్వరగా చేరితే అంత మంచిది.)

**Harathi:** It does, of course. But the trouble is that the mail reaches Chennai too early in the morning. I'd rather take the Circar Express as it reaches Chennai after day break.
(అవును ముఖ్యమే. అయితే చిక్కేమిటంటే మెయిల్ చెన్నైకి మరీ వేకువనే చేరుతుంది. నేను Circar Express లోనే వెళ్లడం మంచిద నుకుంటా, ఎందుకంటే అది చేరేసరికి బాగా తెల్లారిపోతుంది.)

Day break = పొద్దుపొడుపు, తెల్లవారడం.

**Karpura:** Yea. That makes a difference. You can't go alone by auto when it is dark.
(నిజమే. తేడా ఉంది. చీకట్లో ఒంటరిగా auto లో వెళ్లలేవు కదా? )

**Harathi:** It makes little difference if some one receives me at the station and takes me home.
(ఎవరయినా station కు వచ్చి నన్ను ఇంటికి తీసుకెళితే అంత సమస్య ఉండదు)

**Karpura:** It's all one whether you reach too early in the morning or after day break so long as you've some one with you.
(నీతో ఎవరన్నా ఉండేట్లయితే మరీ పొద్దున చేరడమైనా, తెల్లారిన తర్వాత చేరడమైనా ఒకటే)

**Harathi:** I expect my cousin to receive me, but I am not sure. So, just to be on the safe side, I think I'll take the Circar Express.
(మా cousin వస్తాడనుకుంటున్నా, కానీ అంత నమ్మకం లేదు. ఎటుబోయి ఎటొచ్చినా మంచిది, సర్కార్ express లోనే వెళతా.)

**Karpura:** I think so too. You'll have no problem.
(నేనూ అదే అనుకుంటున్నాను. అలాగైతే ఏ సమస్యా ఉండదు.)

**Harathi:** How about going with me to the station for booking the ticket?
(Ticket book చేసుకోవడానికి నాతో station కు రాకూడదూ? )

**Karpura:** I have yet to finish the assignment I have to submit tomorrow.
(రేపు నేను submit చేయాల్సిన assignment ఇంకా పూర్తిచేయలేదు.)

Assignment = ఒకరికి అప్పగించిన పని- ఇక్కడ home work లాంటిది.

submit = పూర్తిచేసి చూపించడం (Teacher/ lecturer లాంటివాళ్లకు)

**Harathi:** No matter what you have to do, you should go with me.
(నీకేపనున్నా, నువ్వు నాతో రావాల్సిందే)

**Karpura:** OK; Let's go then.

English conversation లో చాలా తరచుగా వినిపించే మాటలు, difference, matter కు సంబంధించినవి. Difference అంటే మనందరికి తెలుసు తేడా అని. Difference తో వచ్చే conversational expressions అన్నింటికీ (Spoken English లో చాలా common) తేడా అనే అర్థమే వస్తుంది. ఆ expressions ను మనం కింద చూపినట్లు practise చేస్తే మన conversation చాలా simple గా సహజంగా ఉండి, మనకు English బాగా తెలుసనే అభిప్రాయం కలిగిస్తుంది.

అలాగే matter (noun) కు మనకు తెలిసిన అర్థాలు- పదార్థం అని, రాత, ఉపన్యాసాల్లాంటి వాటిల్లో విషయా లని. అయితే matter (verb) కు అర్థం- ప్రాముఖ్యం ఉండటం అని. ఈ రెండు మాటలకు సంబంధించిన విష యాలను, పై సంభాషణల్లో వాడిన విధంగా విపులంగా తెలుసుకుని, మన conversation లో కూడా practise చేద్దాం.

***Look at the following sentences from the dialogue above:***

*1) It's going to make no difference*

*2) But then the time of your reaching does matter (matters)*

*3) That makes a difference*

*4) It makes little/ no difference*

*5) No matter what you have to do, ...*

*6) But the time of your reaching does matter*




**Make a difference** = తేడా ఉండటం, ఆ తేడా వల్ల ప్రభావం ఉండటం.

**Make no difference** = ప్రభావం లేకపోవడం = do/ does not make any difference.

a) TDP leaders feel Devender Goud's leaving the party makes no difference to it = దేవేందర్ గౌడ్ వెళ్లిపోవడంవల్ల పార్టీమీద ఏ ప్రభావం ఉండదని (నష్టం ఏంలేదని) TDP నాయకులు భావిస్తున్నారు.

b) It makes no difference to your health what exercise you do. All that is needed is some exercise = నువ్వేం వ్యాయామం చేస్తావనేది కాదు ప్రధానం, వ్యాయామం ఏదో ఒకదుండటం అనేది ముఖ్యం.

c) A good knowledge of English makes a lot of difference to your career = English పరిజ్ఞానం నీ వృత్తివ్యాపకాలమీద చాలా ప్రభావం చూపుతుంది.

d) 'We don't have our Car' (మన Car లేదు)
'Does it matter? Let's take a Taxi' (అదంత ముఖ్యమా? / ఏమైంది Car లేకపోతే? Taxi లో వెళ్దాం.)

e) 'He is not willing to help me' (అతడు నాకు సహాయం చేసేందుకు సుముఖంగా లేడు)
What does it matter? Am I not here to help you? (ఏంటి అయితే? నేన్లేనా నీకు సాయపడేందుకు? )

f) What clothes you wear, how you talk, and how confident you appear matter a lot in an interview = నువ్వేం బట్టలు వేసుకున్నావు, ఎలా మాట్లాడతావు, ఎంత ధైర్యంగా కనిపిస్తావనేది interview లో చాలా ముఖ్యం/ వీటికి interview లో చాలా ప్రాధాన్యం ఉంటుంది.
They make a lot of difference to your chances of getting the job = నువ్వు ఉద్యోగం పొందే అవకాశాలమీద వాటి ప్రభావం చాలా ఉంటుంది.

g) What matters is not what you speak. What matters/ does matter is how you speak = నువ్వేం మాట్లాడతావనేది కాదు ముఖ్యం, నువ్వెలా మాట్లాడతావనేది అసలు ముఖ్యం.
(పై sentences అన్నింటిలో you అంటే 'నువ్వు' అనే కానక్కర్లేదు. ఇలాంటి sentences లో you అంటే ఎవరైనా అనే అర్థం ఎక్కువ.
You cannot get success without sweating for it = చెమటోడ్చనిదే (sweat= చమట) ఎవరూ విజయం సాధించలేరు)

h) He didn't show proper respect to me. Not that it matter, but it shows his bad manners = అతడు నాకు సరైన మర్యాద ఇవ్వలేదు. అదంత ముఖ్యం కాదనుకో, కాని అదతడి manners లేకపోవ డాన్ని తెలుపుతుంది.

i) 'I left my pocket comb at home' (నా చిన్న దువ్వెన ఇంట్లో వదిలిపెట్టి వచ్చాను)
'Does it matter now? Think of the exam ahead'. (అదంత ముఖ్యమా ఇప్పుడు? రాయాల్సిన పరీక్ష విషయం ఆలోచించు)

చూశారు కదా? Difference, matter తో వచ్చే expressions. ఇవి బాగా వాడండి మీ Spoken Englishలో. మీ English కు సౌలభ్యం, సహజత్వం ఉంటుంది.

# It makes little/ no difference


M.SURESAN

a) Saying the right thing at the right time makes a difference in others' opinion about you = సరైన సమయంలో సరైన విషయం చెప్పడం/ మాటలనడం, నీ మీద ఇత రులకున్న అభిప్రాయాన్ని మార్చగ లదు/ మార్పు తెస్తుంది/ దానిమీద ప్రభావం చూపుతుంది. (తేడా కలుగజే స్తుంది.)

b) Timely rain does make a lot of difference to crops = సకాల వర్షాలు పంటల మీద గట్టి ప్రభావమే చూపుతాయి. (సకాల వర్షాలవల్ల పంటలో చాలా తేడా ఉంటుంది, మంచికి)

(Does make = makes. ఏదైనా నొక్కిచెప్పాలనుకుంటే ఇలా 1st Regular Doing Word (RDW) బదులు, Do + 1st RDW, II RDW బదులు does + 1st RDW; PDW బదులు (did + 1st RDW) వాడతాం.

i) I know him = అతడు నాకు తెలుసు.
I do know him = అతడు నాకు తెలియపోవడం ఏమిటి? (బాగా తెలుసని నొక్కిచెప్పడం)

ii) She speaks English = ఆమె English మాట్లాడు తుంది. She does speak English (of course) ఆమె English మాట్లాడకపోవడం ఏమిటి? (బాగా మాట్లాడుతుంది)

iii) I saw him entering the room = గదిలో అతడు ప్రవేశిస్తుండగా చూశాను.
I did see him entering the room = అతడు గదిలో ప్రవేశిస్తుండగా నేను కచ్చితంగా చూశాను.

c) A 0.1 degree difference in body temperature makes all the difference between life and death = మనిషి temperature (జ్వరం ఉన్న పుడు) లో 0.1 degree తేడా జీవన్మరణ సమస్య కావచ్చు. 0.1 డిగ్రీ తేడాతో మనిషి బతకడమో చావ డమో తేలిపోతుంది. (ఉదా: 105.9 - మనిషి బతక డమో చావడమో తేలిపోతుంది. (ఉదా: 105.9 - మనిషి బతికి ఉండొచ్చు 106 - మనిషి చనిపోవచ్చు)

d) Your ability to speak in English makes a lot of difference to the treatment you get from others = నీ English మాట్లాడే సామర్థ్యం ఇతరులు నిన్ను చూసే విధానాన్ని ప్రభావితం చేస్తుంది. (నీ English వల్ల నీకిచ్చే మర్యాదలో తేడా ఉంటుంది)

**But the time of your reaching does matter.** ఇక్కడ matter ఉపయోగం చూద్దాం. ఇలాంటిచోట్ల matter కు అర్థం, ప్రాముఖ్యం, ప్రాధాన్యం/ ప్రాముఖ్యం కలిగి ఉండటం. పై sentence కు అర్థం, నువ్వ క్కడ చేరే సమయం ముఖ్యం అని. (ఇక్కడ కూడా does matter= matters అయితే ముఖ్యం అని నొక్కి చెప్పేందుకు does matter)

a) Your making a speech does not matter. What does matter/ matters is your presence = నువ్వక్కడ ఉపన్యసించడం ముఖ్యం కాదు. నీవక్కడ ఉండటం అనేది చాలా ముఖ్యం.

b) She quit the job because her children mattered more to her than the job = ఉద్యోగం కంటే ఆమె పిల్లలు ఆమెకు ముఖ్యం కాబట్టి ఆమె ఉద్యోగం వదిలేసింది.

c) How much I spend doesn't matter to me. What matters is whether I can get a good return for my money = నేనెంత ఖర్చుపెడతాననేది కాదు నాకు ముఖ్యం. నేను పెట్టిన డబ్బుకు సరైన ప్రతిఫలం పొందానా లేదా అనేది ముఖ్యం.




**Q.** *"Don't forget sending me your new address and the phone number."* ఇందులో తప్పేమిటి?

***- M.S. Madhu, Vijayawada.***

**A.** ఏదైనా చేసేందుకు మరచిపోవడం/ మరచిపోకపోవడం అనే అర్థంతో, forget తర్వాత infinitive వాడతాం, ... ing form వాడం. కాబట్టి మీ sentence, 'Don't forget sending me your... number,' కు correction: Don't forget to send me your new address and phone number. (ఇచ్చిన sentence లో error... forget sending). forget తర్వాత '-ing' form వస్తే, ఏదైనా చేసిన పని మరచిపోవడం అని అర్థం వస్తుంది.

a) She forgot calling you = She forgot she had called you= నిన్ను పిలిచిన/ నీకు phone చేసిన విషయం మరచిపోయింది. (చేసిన పని మరచిపోవడం)

b) She forgot to call you = నిన్ను పిలవడం/ phone చేయడం ఆమె మరచిపోయింది (చేయా ల్సిన/ చేయాలనుకున్న పని మరచిపోవడం)

**Q.** *It is easy to preach others.* దీనిని ఇలా కూడా రాయొచ్చా తెలుపగ లరు. *a) Preaching others is easier. b) It is easy to preaching others. c) To preach others is easy. d) With other preaching is easy.*

***- Anthati Penchalaiah, Rajampeta***

**A.** Important: Preach తర్వాత ఎప్పుడూ to రావాలి. Preach others, wrong. Preach to others అనాలి కాబట్టి sentence 1 ( It is easy preach others) కూడా తప్పే. Preaching others is easier- sentence (a) లో రెండు తప్పులు కదా? ఒకటి, Preaching to others అనాలి, రెండు: పోలిక లేకుండా easier అనే comparative degree వాడితే, meaning, incomplete... easier than.... అని ఉండాలి. b) It is easy preaching others- to preaching సరికాదు. To preach to others అంటాం- It is easy to preach to others. (c) లో కూడా To preach to others అని ఉండాలి కదా. (d) Sentence కాదు, అర్థం లేదు కాబట్టి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# Not that I know of




**Yoga:** Has Kusala bought that car after all?
(ఇంతకీ కుశల ఆ car కొన్నదా?)

**Kshema:** Not that I know of. I met her just the day before and she didn't say anything about it.
(ఏమో మరి; నాకు తెలిసినంతవరకూ లేదు. మొన్ననే తనను కలిశాను నేను. ఆ విషయం తనేమీ చెప్పలేదు నాకు)

**Yoga:** She was particular about it. No matter what I said, and no matter what the price would go for it.
(ఆ car కొనాలని పట్టుదలగా ఉంది. నేనెంత చెప్పినా, ఆ car ఎంత ధరైనా తను కొనేందుకే నిర్ణయించుకుంది.)

**Kshema:** It's all the better if she buys it. She will be spending more if she goes for a new car. That will cost more than this.
(ఈ car కొనడమే నయం. కొత్తకారు కొంటే దీనికంటే ఎక్కువ ధరే ఉంటుంది. అప్పుడు ఎక్కువ ఖర్చవుతుంది.)

**Yoga:** Let her first make sure of her driving. Can she drive well?
(మొదట తన driving మీద నమ్మకం తెచ్చుకోనీ. బాగానే drive చేయగలదా?)

**Kshema:** I saw her driving two or three times but was not on the car when she drove. To be on the safe side she had better have some more practice before she buy's this car.
(తను car నడపడం నేను రెండుమూడు సార్లు చూశాను. అయితే తను drive చేస్తున్నప్పుడు నేనా car లో లేను. ఏదేమైనా/ ఏదీ జరక్కుండా ఉండేందుకు, car కొనేముందు మరికొంత driving practice చేస్తే మంచిది.)

**Yoga:** It will of her good.
(అది మంచిదే)

**Kshema:** (Do you) know what happened yesterday? I was crossing the road in heavy track. A car almost hit me. Just in the nick of time I reached the other side. It was hair-breadth escape.
(నిన్నేం జరిగిందో తెలుసా? traffic ఎక్కువగా ఉన్నప్పుడు road దాటుతున్నాను. ఒక కారు నన్ను దాదాపు ఢీ కొట్టింది. అది జరిగే క్షణానికి ముందు నేనవతలికి చేరుకున్నా. (వెంట్రుక వాసిలో తప్పించుకున్నా).
The car sped away though I stood there grinding my teeth at the driver. It could have been a hit and run case.
(ఆ car driver మీద పళ్లు కొరుకుతూ నిలుచున్నా నేను, car మాత్రం వేగంగా వెళ్లిపోయింది. ఢీకొట్టి పారిపోయే సంఘటన అయ్యుండేదే నిన్న).

**Yoga:** You're lucky to be alive. Your 'yoga' was good.
(ఇంకా బతికుండటం నీ అదృష్టమే. నీ 'యోగం' బాగుంది.) Congrats.

**Kshema:** Thank you. Oh, sorry. I owe you a hundred rupees. Sorry I've delayed. I'll give it this evening.
(Sorry. నేన్నీకో వందరూపాయల అప్పున్నాను కదా? ఆలస్యం అయింది, ఇవ్వడం. ఈ సాయంత్రం ఇచ్చేస్తాను.)

**Yoga:** Doesn't matter. I can wait.
(ఫర్వాలేదులే. నేనాగగలను.)

**Kshema:** You are such a good friend.

Daily life situations లో వాడే మరికొన్ని expressions మనం ఇప్పుడు తెలుసుకుందాం. వీటి frequency (వాడేసార్లు) చాలా ఎక్కువ. చాలా ఉపయోగపడతాయి మనం మాట్లాడేటప్పుడు. బాగా simple expressions కావడం వల్ల conversational ease ఉంటుంది.

***Look at the following expressions from the conversation above:***

*1) Not that I know of. I met her the day before and she didn't say anything about it.*
*2) No matter what I said, and no matter what the price she'd still buy it*
*3) It's all the better if she buys that car*
*4) to be on the safe side she had better have some more practice*
*5) I reached the other side just in the nick of the time.*
*6) ... Though I stood there grinding my teeth at the driver.*
*7) It'd have been a hit and run case*
*8) (It) doesn't matter*

**1) Not that I know of** = నాకు తెలిసినంతవరకూ లేదు/ కాదు. ఈ expression వాడే సందర్భాలు మనకు ఎక్కువగానే తటస్థపడుతుంటాయి. ఏమో! నాకు తెలిసినంతవరకూ లేదు- అని తెలుగులో కూడా చాలాసార్లు అంటుంటాం కదా? అందుకు సరైన English మాట, 'Not that I know of'

a) **Kinnera:** Has she a house here?
(ఆమెకేమన్నా ఇక్కడ ఇల్లుందా?)
**Kasturi:** Not that I know of.
(ఆమెకు ఇక్కడ ఇల్లున్న సంగతి నాకు తెలియదు/ నాకు తెలిసినంత మటుకు లేదే)

b) **Satvik:** Ritwick has phoned, hasn't he?
(రిత్విక్ phone చేయలేదు కదా?)
**Karthik:** Not that I know of
(చేసినట్టు నాకేం తెలియదు/ నాకు తెలిసినంత మటుకు లేదు)

ఇది అవకాశం వచ్చినప్పుడల్లా వాడండి.

**2) No matter** = ఏదేమైనప్పటికీ/ ఎంతైనా

a) No matter how hard he tried, he could not get her love = అతడు ఎంత ప్రయత్నించినా, ఆమె ప్రేమను పొందలేకపోయాడు.

b) No matter what you say, I don't believe you want to help me = నువ్వెంత/ నువ్వేం చెప్పినా నువ్వు నాకు సాయం చేస్తావని నేను నమ్మను.

c) No matter where you live, they will still trouble you = నువ్వెక్కడున్నా, నీకు వాళ్ల బాధ కలిగిస్తూనే ఉంటారు.

[ఇంతకుముందు lesson లో no matter కు ఉన్న ఇంకో ఉపయోగం తెలుసుకున్నాం కదా? ఫర్వాలేదులే అనే అర్థంతో కూడా no matter వాడతాం.

eg: **Pranav:** I'm sorry I can't lend you my book today = నీకు ఈరోజు నా పుస్తకం ఇవ్వలేను, sorry.

**Pragna:** No matter. I can wait till tomorrow = ఫర్వాలేదులే. రేపటిదాకా ఉండగలను.]

No matter what ఇది పై వాటికి దగ్గరగా ఉన్న ఇంకో expression - అర్థం - ఏదేమైనా సరే (జరగాల్సింది జరిగి తీరుతుంది)

a) I'll meet the officer no matter what = ఏదేమైనా సరే, officer ని కలిసి తీరతాను.

b) No matter what, I'll be there tomorrow = ఏదేమైనా సరే రేపు నేనక్కడుంటా.

**3) All the better** - ఇది కూడా మనకు చాలా ఉపయోగపడే expression- conversational - ఎక్కువగా వాడండి. అర్థం = అది ఇంకా మంచిది/ మంచిదయింది, అంతవరకూ అని.

a) The curry was all the better for the ten minutes extra frying = కూర పది నిమిషాలెక్కువ వేగడం మంచిదే అయింది. (పది నిమిషాలెక్కువ పట్టినా మంచిదే అయింది, కూర ఎక్కువ రుచిగా ఉందని)




b) It's all the better he doesn't know Telugu. We can say whatever we like of him = వాడికి తెలుగు తెలియకపోవడం మంచిదే అయింది. వాడి గురించి మనం ఏమైనా చెప్పుకోవచ్చు

**4) To be on the safe side** = ఇబ్బంది లేకుండా ఉండేందుకు (ముందు జాగ్రత్తగా)/ దేనికైనా మంచిది/ ఎందుకైనా మంచిది.

a) Rs. 1500 may be enough, but take a little more, just to be on the safe side = పదిహేను వందల రూపాయలు చాలు. కాని దేనికైనా మంచిది కాస్త ఎక్కువ తీసుకెళ్లు.

b) The road is safe, but just to be on the safe side take some one with you = ఆ road ప్రమాదమైందేం కాదూ, ఎందుకైనా మంచిది. ఎవర్నయినా తోడు తీసుకెళ్లు.

c) Take another copy of the letter, to be on the safe side = ఎందుకైనా మంచిది, ఆ letter ఇంకో copy తీసుకో.

**5) In the nick of time** = చివరిక్షణంలో.

a) Luckily the police arrived in the nick of time and saved the girl = చివరిక్షణంలో/ అంతా అయిపోయిందనుకున్న సమయంలో, అదృష్టవశాత్తు police వాళ్లొచ్చి ఆ అమ్మాయిని రక్షించారు.

b) There will be no use coming to me in the nick of time = చివరిక్షణంలో నాదగ్గరకొస్తే నేనేం చేయలేను.

c) He came in the nick of time when the plane was about to start = Plane బయల్దేరేముందు, చివరిక్షణంలో airport కు వచ్చాడతడు.

In the nick of time కు దగ్గర అర్థం ఉండే ఇంకో expression - In the eleventh hour.

a) In the eleventh hour oxygen was given to him and he was saved = చివరిక్షణంలో అతడికి oxygen ఇచ్చారు, అతడు బతికాడు.

b) Eleventh hour decisions usually go wrong = చివరిక్షణంలో తీసుకునే నిర్ణయాలు మామూలుగా తప్పవుతుంటాయి.

c) He got such low marks because of his eleventh hour preparation = చివరిక్షణంలో సిద్ధంకావడంవల్ల అతడికి తక్కువ marks వచ్చాయి.

**6) Grinding my/ his/ somebody's teeth** = కోపంతో పళ్లు కొరకడం (Grind, ground - past tense and past participle)

a) He ground his teeth as the speaker criticised him = ఉపన్యాసకుడు తనను విమర్శిస్తుంటే అతడు కోపంతో పళ్లు కొరుకుతున్నాడు.

b) She grinds her teeth even at the mention of her divorced husband's name = విడిపోయిన తన భర్త పేరు వింటే చాలు, ఆమె పళ్లు కొరుక్కుంటుంది, కోపంతో.

**7) Hit and run case** = Road Accidents విషయంలో, accident కలిగించే driver (ఇంకో వాహనాన్ని, ఎవరైనా వ్యక్తిని ఢీకొట్టిన driver) తన వాహనాన్ని ఆపకుండా పారిపోవడం.

a) He died in the hit and run accident= కారు ఢీకొని, కారు ఆపని accident లో అతడు చనిపోయాడు.

b) He is a hit and run driver and everybody knows it = Accident లు చేసి వాహనాన్ని ఆపకుండా వెళ్లిపోయే driver అతడు. అతడందరికీ తెలుసు.

**8) It doesn't matter** = It's no matter = no matter = ఫరవాలేదు.

---




**Q.** *1) She looks upon sex as a commodity to be exploited to the fullest for her own personal gratification.* దీనికి తెలుగు అర్థం చెప్పగలరు. *To be exploited* అంటే అర్థం ఏమిటి?

*2)* ఇంగ్లిష్ బాగా మాట్లాడాలనుకునేవాళ్లకు కమ్యూనికేషన్ స్కిల్స్ ఎలా పెంపొందించుకోవాలో సూచనలు ఇవ్వగలరు.

*3) This turns out to be particularly unfortunate.* దీనికి తెలుగు అర్థం చెప్పగలరు.

*4) Because of, by means of, in accordance with-* ఇవి ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారో తెలుపగలరు.

***- G.Suresh, Guntur.***

**A.** 1) ఆమె Sex ను (శృంగారాన్ని) తన స్వార్థ తృప్తి కోసం వాడుకోదగిన వస్తువుగా చూస్తుంది.

2) Communication Skills ఎలా పెంపొందించుకోవాలో ఇంతకుముందు చాలాసార్లు వివరించి ఉన్నాం.

3) ముఖ్యంగా ఇది చాలా దురదృష్టకరమైన విషయంగా తయారైంది.

4) a) Because of = ఆ కారణంగా.
The match was cancelled because of the rain = వర్షం కారణంగా match రద్దయింది.

b) By means of = తద్వారా.
He came up in life by means of hard work = శ్రమ ద్వారా అతడు జీవితంలో పైకొచ్చాడు.
By means of his contacts he can get anything done = తనకున్న సంబంధాల ద్వారా అతడు ఏ పనైనా చేయించగలడు.

c) In accordance with = ఆ ప్రకారం.
In accordance with the agreement she should vacate the house = ఒప్పందం ప్రకారం ఆమె ఇల్లు ఖాళీచేయాలి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Q.** *Indeed, Rather than లకు అర్థమేమిటి? ఇంగ్లిష్‌లో వీటి వాడుక గురించి తెలుపగలరు.*

***- P.Sreenivasulu, Hyderabad.***

**A. Indeed** ను భిన్న సందర్భాల్లో వేర్వేరు అర్థాలు ధ్వనించేలా వాడతాం.

**1) Indeed=** నిజంగా (really)

A friend in need is a friend indeed.

(అవసరానికి వచ్చే స్నేహితుడే నిజంగా/ నిజమైన స్నేహితుడు)

**2) Indeed** ను- 'అవును అది కరక్ట్'/ 'అవును అది నిజమే' - అనే అర్థంతో కూడా వాడతాం.

A: Would you be happy if I gave you some more money?

(ఇంకాస్త డబ్బిస్తే నువ్వు సంతోషిస్తావా? )

B: I would be, indeed =

అవును. అది నిజమే.

**3) Indeed** ను ముందు అన్నమాటకు వ్యతిరేకంగా వచ్చే అర్థంతో వాడతాం.

He wasn't disappointed at all. Indeed he was happy =

అతడసలు నిరుత్సాహపడలేదు. ఇంకా చాలా సంతోషించాడు.

**Rather than=** రెండు వేర్వేరు విషయాలను పోలుస్తూ ఒకటి ఇంకోదానికంటే ఎక్కువ అని comparative degree తెలిపేందుకు rather than వాడతాం. ఇంకా preference (ఇష్టత) తెలిపేందుకు వాడతాం.

I'd rather starve than eat that food = అలాంటి ఆహారం తినేందుకంటే నేను పస్తు ఉండేందుకే ఇష్టపడతాను = Rather than eat that food I'd starve.





**Q.** *1. Thirteen day training programme for the teachers. దీనిని heading గా వాడినపుడు A thirteen day training అనిగాని, Thirteen days training అనిగాని రాయనవసరం లేదా?*

*2. The Prime Minister left New Delhi on a four day visit to Australia- ఈ వాక్యం సరైనదేనా?*

***- Pavani & Sudha, Matsyapuri***

**A.** 1. You are correct. It should be 'A thirteen day-tour' అనిగానీ, 'A thirteen days' tour' అనిగానీ రాయడం correct. అయితే Newspaper Headlines లో articles (A/ an and the) omit చేయడం సంప్రదాయం. అది తప్పుగా అనుకోరు.

2. అది సరైనదే.

# Study late into the night







M.SURESAN

**Q.** *1. Billet-doux, love letter ఒకటేనా?*

*2. Epistle, Missive లు ఏ రకమైన ఉత్తరాలు?*

*3. Vale, Valedictory function, farewell, send off, Adieu ఒకటేనా?*

*4. Venality, Bribery ఒకటేనా?*

*5. Baccy, Tobacco, snout, guvnor, boss ఒకటేనా?*

*6. Molestation, Nuisance, Mutation, Alteraction, Vicissitude, Variation ఇవన్నీ ఒకటేనా?*

*7. Nihilism, Terrorism*

*8. Lucubration - Nocturnal study ఒకటేనా?*

*9. Noontide, Noon, Noon time- eventide, evening, eve ఒకటేనా?*

***- U. Ajay Kumar, Adilabad.***

**A.** మీరు రాసిన మాటల సముదాయాల (sets of words) లో కొన్ని sets, synonyms, చాలా ఎక్కువ sets లోని మాటల్లో ఒకదానికొకటి సంబంధం లేనిని ఉన్నాయి. కొన్ని sets లోని కొన్ని మాటలు చాలా గ్రాంథికమైనవి, formal written English లో కూడా చాలా అరుదుగా కనిపించేవి. Spoken English లో అసలు వాడనివి- వాడినా ఎవరికి అర్థం కాకుండా communication break కలిగించేవి. మీరీ పదాలను ఎక్కడనుంచి సేకరించారో తెలియడంలేదు; ఇంకో విషయం, ఏ సంబంధం లేని 4, 5 మాటలను ఒకే set లో చూపించి ఇవన్నీ ఒకటేనా అని అడుగుతున్నారు. మీకు వాటిని ఎలా వివరించాలో అర్థం కావడంలేదు.

ఉదాహరణకు Terrorism కూ, Nihilism కూ సంబంధం ఏం ఉందని తేడా వివరించమంటారు? మీరు మంచి dictionary సాయం తీసుకోండి. ఈ Spoken English lessons లో మామూలు daily life situations లో వాడే మాటలు, వాటి వాడుక గురించి మాత్రమే తెలియజేయగలం, గమనించండి.

1. Billet- doux (బిలట్‌డూ)= love letter. అయితే Billet- doux, french మాట- ఎప్పుడైనా హాస్యానికి లేదా గ్రాంథికంగా వాడేమాట, అందరికీ అర్థంకాకపోవచ్చు.

2. Epistle - అసలర్థం - Jesus మొదటి అనుచరులు రాసిన ఉత్తరాల్లో ఏదైనా. ఇంకో అర్థం = ఏదైనా ముఖ్యమైన విషయం గురించి సుదీర్ఘమైన లేఖ- గ్రాంథికంగా కానీ లేదా హాస్యానికిగానీ వాడేమాట. మామూలు ఉత్తరానికి ఇది వాడం.

Missive అంటే కూడా ముఖ్య విషయం గురించి సుదీర్ఘమైన అధికారిక లేఖ- గ్రాంథికం, హాస్యానికి వాడే మాట. మామూలు ఉత్తరాలకు ఈ మాట వాడటం ఛాందసంగా వినిపిస్తుంది.

3. Vale = Valley = లోయ. Vale అనేది poetic.

Valediction= వీడ్కోలు పలకడం, ముఖ్యంగా ఓ వీడ్కోలు సభలో- ఇది చాలా పాండిత్యం, మామూలు వీడ్కోలుకు వాడం. (వ్యక్తుల బృందానికో, విద్యార్థుల సమూహానికో, ప్రత్యేక సభలో పలికే వీడ్కోలు).

Valedictory function= పైన తెలిపిన ఉద్దేశంతో ఏర్పాటుచేసిన సభ/ వేడుక

Farewell= వీడ్కోలు. Give/ say a farewell = వీడ్కోలు చెప్పడం (ఓ వ్యక్తి ఇంకోవ్యక్తి/ వ్యక్తులకు)= sendoff= వెళ్లిపోతున్న వ్యక్తిని సాగనంపడం.

Adieu = goodbye - ఇది పాతదైపోయింది. ప్రస్తుతం వాడుకలో లేదు.

4. Venality= డబ్బుకోసం నీతిమాలిన పనులు చేయడం= bribery= లంచం. రెండూ దాదాపు ఒకటే. అయితే Venality గ్రాంథికం. Spoken English లో అరుదు.

5. Baccy= బ్యాకి (British English లో మాత్రమే- బ్యా, Bank లో ba లా)= Tobacco. Snout కు Tabacco కు ఏంసంబంధం? Snout అంటే పంది లాంటి జంతువుల ముక్కు, నోరూ కలిపి.

Guvnor= boss (Guvnor- British Eng)

6. Molestation, nuisance ఈ రెండింటికి ఏంటి సంబంధం? అసలెలా వచ్చింది మీకా Idea? Molestation- శారీరకంగా, లైంగికంగా ముఖ్యంగా పిల్లలను హింసించడం.

Nuisance = చికాకు, బాధ కలిగించడం.

Mutation - జీవశాస్త్రానికి సంబంధించిన మాట- మనుషుల, చెట్ల, జంతువుల జన్యుపదార్థాలు, వాటి సంతతిలో చెందే మార్పు.

Alteraction = ఈ మాట English లో లేదు.

Vicissitude = ఒకరి జీవితంలోని మలుపులు, సమస్యలూ.

Variation = తేడా/ మార్పు.

7. Nihilism = మిథ్యావాదం. ప్రపంచంలో మత, సాంఘిక నమ్మకాలకూ, ఆచారాలకూ ఏ విలువాలేదు, అవి పనికిరావనే తత్వం.

Terrorism = తీవ్ర హింసావాదం.

8. Lucubration (చాలా అరుదు) = Nocturnal study (అరుదు) = రాత్రిపూట చాలాసేపు శ్రమించి చదవడం. Study late into the night అంటే అందరికీ అర్థం అవుతుంది కదా?

9. ఒకటే. అయితే noontide గ్రాంథికం.

మీరు ఏ book of synonyms నుంచో సేకరించిన మాటలను ఇక్కడ అడిగినట్టున్నారు. అలాంటి పుస్తకాలలో ఉన్న వందలాది మాటలను వివరించడం కష్టం కదా? అందులోనూ అవి Spoken English లో వినిపించేవి కావు.

**Q.** ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

1. తన దురుసు ప్రవర్తనతో విద్యాలయాన్ని భ్రష్టు పట్టించాడు.
2. సన్మానాన్ని నిర్వహించడం/ సన్మాన కార్యక్రమం.
3. మన గురుతర బాధ్యతనెరిగి ప్రవర్తించాలి.
4. ఆయన జాతికి చేసిన సేవలు వెలలేనివి.
5. కలం, హలములందు ఘనుడు.
6. పండిత పరిష్కృతం.
7. తనదైన శైలిలో
8. ఉత్ప్రేక్షాలంకారం
9. విగ్రహాన్ని ఆవిష్కరించారు.
10. రోడ్డు పక్కన వర్షపునీటికి పెద్ద మడుగులా ఏర్పడి బర్రెలు, దున్నపోతులు లాంటి పశువులకు క్రీడాశయమైంది. దీనిపై వెంటనే స్పందించి తగిన చర్య తీసుకోమని మున్సిపల్ అధికారులను కోరడమైంది.

***- Y. Gayathri, Asifabad.***

**A.** 1. He ruined the institution by his high handed behaviour.

2. Conducting/ organising a felicitation ceremony (English లో ఇంతకంటే సరైన మాట లేదు. ఈ మాట అంతగా సరిపోదు. సన్మాన కార్యక్రమాలకు ఆంగ్ల సంప్రదాయంలో అంత ప్రాముఖ్యం లేదు)

3. We should behave with a high sense of responsibility/ We should conduct ourselves, conscious of our serious responsibility.

4. The services he rendered to the nation are invaluable.

5. He is good at writing and forming as well.

6. Emended by scholars.

7. In his/ her own style.

8. ఉత్ప్రేక్షాలంకారం- దీనికి సరైన పదం English లో లేదు.

9. Unveiled the statue.

10. Buffaloes are lolling about in the large puddle (of rain water) along the margin of the road. The Municipal authorities are requested to respond and take immediate action to end this.

**Q.** 1. కొందరు *Grammar Depth* గా చెబుతాం అంటున్నారు. మరికొందరు *Grammar Deep* గా చెబుతాం అంటున్నారు. ఇందులో ఏది కరెక్ట్?

2. *Tenses లో perfect continuous tense లకు passive form (voice) ఎందుకు వాడకూడదో తెలియజేయగలరు.*

***– V.B. Naidu, Ganapathi, Bhimavaram***

**A.** 1. Grammar deep గా చెబుతాం అనడం correct.

2. Perfect continuous tenses కు passive form చాలా అసాకర్యంగా, కృతకంగా grammar కోసం grammar గా (English రాయడానికి, మాట్లాడటానికి కాకుండా) కనిపిస్తుంటుంది. (have/ has/ had/ shall have/ will have been being + PP)- ఇదీ వాటికి passive - ఇది ఎంత ఇబ్బందికరమో తెలుస్తోంది కదా?

**Q.** *1. Active Voice లో verb 12 రూపాల్లో ఉన్నట్లు రాశారు. మరొకచోట verb 6 రకాలు అన్నారు. ఏది కరెక్టు?*

*2. Pratibha Plus లో కూడా ఇంగ్లిష్ గ్రామరే ఇస్తే బాగుంటుంది. గ్రామర్‌కు ప్రాముఖ్యం ఇవ్వగలరు.*

***- S. Satyanarayana Murthy, Kakinada***

**A.** 1. Active Voice లోని 12 forms అయినా passive voice లోని 8 forms అయినా, ఆ 6 forms లోనే ఉంటాయి. English లో ఏ voice లోని ఏ verb అయినా ఈ six forms- 1) be form 2) be form + ...ing form 3) be form + pp (passive) 4) Have/ has/ had/ shall have/ will have, etc + pp 5) Doing words 6) Shall/ should/ will/ would etc + 1st Regular Doing Word - వీటిలో ఒకటిగానే ఉంటుంది.

2. Pratibha Plus లో Vocabulary (words- వాటి ఉపయోగం) రాయడంలో ఉద్దేశం grammar తోబాటు పాఠకులు పద సంపదను కూడా పెంచుకోవాలని.

**Q.** *1. Consonant sounds V, W లకు తేడా ఏమిటి?*

*2. Present perfect continuous, past perfect continuous, future perfect continuous, future continuous tense కు passive voice లేదంటారు కదా. ఎందుకు లేదు. వీటిలో transitive verbs కూడా వాడతాం కదా, వివరించగలరు.*

***- P. Srinivasa Rao, Pitapuram***

**A.** 1. పై వరస పళ్లను కింది పెదవికి తాకిస్తే వచ్చే శబ్దం V. ఇది F కు దగ్గర. పెదవులను గుండ్రంగా తిప్పి నాలుకను flat గా పెట్టి ఉచ్చరించే శబ్దం 'W'. V, W లకు ఇలా చాలా తేడా ఉంది.

2. ఇది ఇంతకుముందు వివరించాం. వీటికి passive చాలా కృతకంగా, grammar కోసం grammar గా ఉంటుంది. వీటికి passive చాదస్తంగా ఉంటుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 475

# What was the matter with him?

**Arogya:** Kundan made a fool of himself yesterday, didn't he?
(కుందన్ నిన్న ఒట్టి వెర్రిబాగులవాడిలా ప్రవర్తించాడు కదా? )

**Iswarya:** Yes, by making jokes that were all out of place.
(అవును, అసందర్భమైన jokes వేసి.)

**Arogya:** He wasn't aware that others were poking fun at him. I was really sorry for him.
(తనను ఇతరులు ఆటపట్టిస్తున్నారని అతడికర్థం కాలేదు. నిజంగా అతడి గురించి నేను బాధపడుతున్నాను.)

**Iswarya:** I tried to warn him, but he took it amiss. He thought I was discouraging him out of envy.
(అతడిని హెచ్చరించాలని ప్రయత్నించాను. కానీ అతడు నన్ను అపార్థం చేసుకున్నాడు. నేనేదో ఈర్ష్యతో అతడిని నిరుత్సాహపరుస్తున్నాననుకున్నాడు.)

**Arogya:** What was the matter with him? Why couldn't he understand that you meant well.
(ఏమైందతడికి? నువ్వు సదుద్దేశంతోనే చెప్పావు కానీ ఎందుకర్థం చేసుకోలేకపోయాడు? )

**Iswarya:** He didn't quite catch what I was trying to drive at.
(నేను ఏం చెప్పేందుకు ప్రయత్నిస్తున్నానో అతడు గ్రహించలేదు.)

**Arogya:** Don't worry. If the worst comes to the worst he will stop talking to you. You won't be the worse off for it after all.
(ఏం ఫరవాలేదులే. అంతగా అయితే ఏమవుతుంది నీతో మాట్లాడటం మానేస్తాడు. అంతే గదా? దానివల్ల నీకేం నష్టం జరగదు.)

**Iswarya:** I understand that. By the way, (would you) mind dropping me at home on your scooter?
(అంతేలే. అది సరేకానీ, నన్ను నీ scooter మీద ఇంటి దగ్గర దింపవా? )

**Arogya:** Not at all, though my scooter is not as good as before I had it repaired.
(ఏం ఫరవాలేదు/ అదేం లేదు. అయితే scooter repair చేయించిన తర్వాత అంతకు ముందున్నంత బాగాలేదు.)

**Iswarya:** Then don't mind me. You just get along. I'll walk home.
(అయితే నన్నొదిలెయ్యి. నువ్వు కానియ్. నేను నడిచి వెళతా ఇంటికి.)

**Arogya:** No, No. I can still manage it. Don't worry.
(అదేం లేదు. నేను ఎలాగోలా నిన్ను తీసుకెళతానులే.)

**Iswarya:** Things are going to be different from Monday. The class hours will be from 8 to 3, instead of from 10 to 5 as they are now.
(సోమవారం నుంచి పరిస్థితులు మారతాయి కదా. Classes ఇప్పటిలాగా 10 నుంచి 5 వరకు కాకుండా 8 నుంచి 3 వరకుంటాయి.)

**Arogya:** That certainly is a change for the worse. We have to get up rather early in the morning .
(ఈ మార్పు వల్ల చెడే. పొద్దున ఇంకాస్త త్వరగా లేవాల్సి వస్తుంది.)

**Iswarya:** (There is) no helping it. Things are not in our hands.
(తప్పదు. మన చేతుల్లో ఏమీ లేదు కదా.)

*High frequency expressions used in daily real life situations* గురించి తెలుసుకుంటున్నాంగదా? ఇప్పుడు మరికొన్ని చూద్దాం. ఇవి కూడా మనకు బాగా ఉపయోగపడే మాటలు. చాలా సౌకర్యంగా ఉంటాయి. మన మామూలు భావాలు తెలిపేందుకు వీటిని అవకాశం వచ్చినప్పుడల్లా వాడుతుండండి.

***Look at the following expressions from the dialogue above:***

*1) Kundan made a fool of himself*
*2) ... by making jokes that were out of place*
*3) He wasn't aware that others were poking fun at him*
*4) I tried to warn him but he took it amiss*
*5) What was the matter with him?*
*6) ... you meant well*
*7) If the worst comes to worst*

**1) Made a fool of himself-** Make a fool of oneself. ఇక్కడ oneself బదులు himself/ herself/ themselves etc.. ఏదైనా వాడొచ్చు.

Make a fool of oneself = వెర్రివాళ్లలా కనిపించడం ఇతరులకు. మన మాటల, చేతలవల్ల/ నవ్వుల పాలవడం.

a) He made a fool of himself by talking about things he did not know = తనకు తెలియని విషయాల గురించి మాట్లాడి తన తెలివితక్కువతనం చూపించుకున్నాడు/ వెర్రివాడిలా కనపడ్డాడు/ నవ్వుల పాలయ్యాడు.

b) You only make a fool of yourself if you interfere in the affairs of a husband a wife = భార్యాభర్తల విషయాల్లో కల్పించుకుంటే నీ వెర్రితనమే బయటపడుతుంది/ మూర్ఖుడిలా కనిపిస్తావు.

c) Why make a fool of yourself by offering advice unasked = ఇతరులు అడక్కుండానే సలహాలిచ్చి వెర్రివాడిలాగనిపించుకుంటావెందుకు?

**2) Out of place** - అసందర్భమైన

a) His jokes were out of place on such a serious occasion = ఆ గంభీరంగా ఉన్న సందర్భంలో అతడి jokes చాలా అసందర్భంగా ఉన్నాయి.

b) Nothing ill of the dead. That will be out of place at a condolence meeting = చనిపోయినవాళ్లను గురించి చెడుగా మాట్లాడకూడదు. అలా మాట్లాడటం సంతాపసభలో అసందర్భంగా ఉంటుంది.

c) Her black dress was out of place for the auspicious occasion = ఆ శుభ సందర్భంలో ఆమె నల్ల dress అసందర్భంగా ఉంది.

d) Your comments are out of place = నీ వ్యాఖ్యలు సందర్భోచితంగా లేవు.


M.SURESAN

**3) Poking fun at somebody** = ఇతరులను గేలిచేయడం/ ఆటపట్టించడం/ అపహాస్యం చేయడం.

a) Everyone was poking fun at his fatness = అందరూ అతడి లావు గురించి ఎగతాళి చేస్తున్నారు (ఆ సందర్భంలో)

b) Don't poke fun at his poor clothes = అతడి చవక బట్టల గురించి గేలిచేయకు.

c) Poking fun at others for whatever reason is bad manners = ఏ కారణంవల్లనైనా ఇతరులను ఆటపట్టించడం చెడు ప్రవర్తన.

**4) Took it amiss** = Past tense of take it amiss = అపార్థం చేసుకోవడం.

a) Don't take me amiss, but you had better, wear better clothes = నువ్వింకా మంచి బట్టలు వేసుకుంటే మంచిది. ఇలా అన్నందుకు నన్నపార్థం చేసుకోకు/ ఏమనుకోకు.

b) If you don't take me amiss, your attending the function is not good = నువ్వేమనుకోకపోతే/ నువ్వు నన్ను అపార్థం చేసుకోకపోతే, నువ్వీ function కు రావద్దు (రావడం మంచిదికాదు).

c) Would she take it amiss if I offered help = నేను సహాయం అందిస్తే ఆమేమన్నా అపార్థం చేసుకుంటుందా? . **amiss** = తప్పు/ పొరపాటు

Something is amiss some where = ఎక్కడో ఏదో పొరపాటు/ తప్పుంది.

**5) What was the matter with him?**

**Matter with (somebody)** = ఏంటి విషయం? ఏమైంది (ఎవరికైనా)

a) What is the matter with the doctor? He doesn't want to treat patients any more = ఏమైందా Doctor కు? రోగులెవరినీ చూడనంటున్నాడు? (చూడకూడదు అనుకుంటున్నాడు)

b) "Is anything the matter? You don't look all right" = "ఏమైనా అయ్యిందా? / ఏంటి విషయం? సరిగా ఉన్నట్లు లేవు? "

"Nothing's the matter. I'm perfectly OK" = "ఏమీ కాలేదు. నేను చక్కగానే ఉన్నా."

ఈ matter తో వచ్చే expressions వీలైనప్పుడల్లా వాడి, మీ conversation లో భాగం చేసుకోండి.

**6) Mean well** = సదుద్దేశంతోనే మాట్లాడటం/ ప్రవర్తించడం. Past Tense and Past Participle- meant (well)

a) I meant well when I told him not to eat so much. He took it amiss and felt I was against his eating = అతడిని అంతెక్కువ తినొద్దని నేను సదుద్దేశంతోనే అన్నా. అతడు నన్ను అపార్థం చేసుకున్నాడు, నాకేదో అతడు తినడం ఇష్టం లేదనుకుని.

b) When elders chide us they mean well = పెద్దవాళ్లు మనల్ని సదుద్దేశంతోనే (మంచి కోసమే) మందలిస్తారు. **chide** = మందలించడం/ కోప్పడటం ..

**7) If the worst comes to the worst** = అధమపక్షంలో/ జరగకూడనిదంటూ జరిగితే/ హీనాతిహీన పక్షంలో.

a) He is willing to join the army. He feels that if the worst comes to the worst, he will die = సైన్యంలో చేరేందుకు ఇష్టపడుతున్నాడతడు. మహా అయితే తను చనిపోతాడంతే కదా అనుకుంటున్నాడతడు.

b) If the worst comes to the worst, I may have to sell my property = జరగకూడనిదంటూ జరిగితే, నేను నా ఆస్తిని అమ్మాల్సి వస్తుందేమో!

c) She wants to marry anyone but him. If the worst comes to the worst, she would remain unmarried = అతడిని తప్ప ఇంకెవరినైనా పెళ్లాడాలనుకుంటోంది. అధమపక్షంలో అవివాహితగానే ఉండిపోవాలనుకుంటోంది.

---

**Q.** *1. Fortune 500 companies, fortune 500 clients* వీటి అర్థం, ఉపయోగం తెలపండి.

*2. Maruthi Inc/ Bharathi Inc* - చివర ఉన్న Inc ను ఎలా చదవాలి? దీని అర్థం ఏమిటి?

*3. Don't try to imitate your friends. Leave that to Daffy and Elmer.* ఇక్కడ *Daffy and Elmer* అంటే ఏమిటి? ఈ వాక్యం పూర్తి అర్థం ఏమిటి?

*4. A twitching rabbit is less likely to make it than a cool cucumber* ఈ వాక్యానికి అర్థం ఏమిటి?

*5. Institute* కు *Academy* కు తేడా ఏమిటి? *Spoken English Academy* ప్రత్యేకత ఏమిటి?

*6. Manners makesth a man* అంటే ఏమిటి? *Makesth* దీనిని ఎలా ఉచ్చరించాలి?

*7.* మనసు చంచలమైంది, మనసుతో ఆలోచించకు, మెదడుతో ఆలోచించు. దీనిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

***- Neena Nair, Hyderabad***

**A. 1.** Fortune అనేది ఒక American Magazine. ఈ magazine ప్రతి సంవత్సరం, వ్యాపార సంస్థ (companies) ల సాంవత్సరిక అమ్మకాల విలువ (నగదులో) ఆధారంగా అత్యధిక అమ్మకాలు చేసి గొప్ప లాభాలు గడించే 500 వ్యాపార సంస్థల జాబితా తయారుచేసి ప్రకటిస్తుంది. ఆ జాబితాలో చోటుచేసుకున్న company లను Fortune 500 company లంటారు. ఆ జాబితాలో చేరగలగడం ఒక సంస్థ చేసే అమ్మకాల విలువకూ, తద్వారా పొందే లాభాలకు ఒక సూచిక. ఆ జాబితాలో చేరగలగడం ప్రతిష్ఠాత్మక విషయం.అలా గుర్తింపు పొందే Companies Fortune 500 Clients అవుతాయి.

**2.** Maruti Inc/ Bharathi Inc- వీటిల్లో Inc= Incorporated = Ltd = Limited. మన దేశంలో Company పేర్ల చివర Ltd (Limited), Americaలో Inc (Incorporated) కు సమానం. అంటే ఈ company ల అధికారుల బాధ్యత పరిమితం అని.

**3.** నీ స్నేహితులను అనుకరించవద్దు. (copy చేయవద్దు). ఆ పని Daffy (వ్యక్తి పేరు కావచ్చు/ Fool అని అర్థం రావచ్చు), and Elmer (వ్యక్తి)కూ వదిలెయ్. అంటే ఇంకొకరిని copy చేయడం నువ్వు చేయదగిన మంచి పనేం కాదు అని.

**4.** కంగారు కంగారుగా ఉండే కుందేలు కంటే ఏం చల్లదనలని (ఉద్రేకపడని) దోసకాయ నయం అని. English లో as cool as cucumber అంటే ఏం ఉద్రేకపడకుండా, సంయమనం కోల్పోకుండా ఉండటం. కుందేలు దోసకాయ కంటే విలువైంది. అయితే కంగారు కంగారుగా ఉండే కుందేలు కంటే ఉద్రేకపడని దోసకాయ (కుందేలంత విలువలేదు) నయం అని. అంటే కంగారుగా ఉండేవాళ్లకంటే కంగారు పడకుండా balanced గా ఉండేవాళ్లు నయమని.

**5.** Institute - విద్య, వృత్తి, వృత్తికవసరమైన శిక్షణా- ఇలాంటి ఉద్దేశాలున్న సంస్థ. Indian Institute of Sciences, Institute of Engineering and Technology, etc. ముఖ్యంగా సాంకేతిక విద్యా వృత్తులకు సంబంధించిన సంస్థ- Institution.

Academy- ఏదో ఒక subject/ రంగంలో ప్రత్యేక శిక్షణ ఇచ్చే/ ప్రోత్సహించే సంస్థ/ కళాశాల, etc- Academy of Arts/ Academy of music, etc. Spoken English Academy అంటే English సంభాషణలో శిక్షణ ఇచ్చే సంస్థ అని. అయితే Academy ఇలాంటి చిన్న చిన్న వాటికి వాడటం సరికాదు. చాలా ప్రతిష్ఠాత్మకమైన, ఉన్నత ప్రమాణాలున్న సంస్థను మాత్రమే Academy అంటాం.

**6.** ప్రవర్తన ఒకరిని మనిషిగా చేస్తుందని = మనిషి గొప్పతనం వారి ప్రవర్తనను బట్టి అని. Maketh- Old English for make.

**7.** Mind wavers; don't let your mind think, let your brains do it.



**Q.** *1. I have been able to maintain regularity. దీనిని passive voice లో ఎలా రాస్తారు. ఇది ఏ tense లో ఉంది?*

*2. Be structure అంటే ఏమిటి? దీనినెలా ఉపయోగిస్తారు? దీనిలో verb లేదా object ఉంటాయా?*

*3. What is the difference between past continuous and past perfect continuous.*

*4. "I go through fire and fire to enrich my english communication skills." అర్థమేమిటి?*

***- V. Pavankumar, Hyderabad***

**A.** 1. The verb in the sentence is have been. This is a 'be' form and 'be' forms don't have passive voice. The tense of 'have been' is present perfect.

2. 'Be' structure అంటే am/ is/ are/ was/ were లాంటి 'be' forms తో కలిసి ఏర్పడే verbs. వీటికి objects ఉండొచ్చు/ లేకపోవచ్చు.

I am eating bread - ఇక్కడ am eating (verb)కు object bread

She is running- ఇక్కడ verb is running కు object లేదు.

3. Past continuous (was/ were + ...ing) talks of an action, continuing at a point of time in the past.

When he entered the room, I was watching the TV = At the time of his entering the room, I was watching. The action of 'watching' was going on. (అతడు గదిలోకి వచ్చినప్పుడు నేను TV చూస్తున్నాను)

Past perfect continuous tense talks of an action that had started earlier than, and continued till another past action.




గతంలో రెండు పనుల్లో ఒకటి ముందే ప్రారంభమై రెండో పని వరకూ కొనసాగితే అది past perfect continuous (had been + ...ing).

a) She had been working as a teacher till she got married = పెళ్లయ్యేంత (II Past action) వరకు, (పెళ్లయింది గతంలో) ఆమె teacher గా పని చేస్తోంది. (పెళ్లవక ముందు ప్రారంభమై, పెళ్లి వరకు teacherగా పనిచేసింది)

b) He had been driving at 100 Kmph when the accident took place = Accident జరిగేటప్పటికి (II past action) అతడు 100 Kmph వేగంతో నడుపుతున్నాడు. (అంతకుముందే 100 Kmph వేగం అందుకున్నాడు.)

4. నా communication skills పెంచుకునేందుకు ఎంత కష్టానికైనా సిద్ధమే/ ఎంతైనా కష్టపడతాను. 'go through fire' పాత వాడుక.

---

**Q.** *కింది వాక్యాలు సరైనవేనా?*

*1. He paid a deaf ear to our instructions.*

*2. Many a times I told you to work properly.*

*3. You are my well wisher.*

*4. Due to breach of sluice the water in the tank go out and tank become fallow/ vacant.*

*5. He comes once in a blue moon.*

***- Y. Gayatri, Asifabad***

**A.** 1. ఈ వాక్యం correct

2. Many a time (not many times)

3. correct

4. సామాన్యంగా కాస్త జాగ్రత్తగా English మాట్లాడే వాళ్లు due to తో sentence ప్రారంభించరు. Owing to/ because of తో begin చేస్తారు. ఈ sentence ను ఇలా correct చేయొచ్చు Because of the breach in the sluice the tank has been emptied of water.

5. ఇది correct.




M.SURESAN

**Q.** *I is singular or plural please clarify. IInd person singular లో you ఉంది plural లోనూ you ఉంది. అలాగే I కూడా ఉపయోగించవచ్చా?*

***- N. Ashok, Khammam.***

**A.** మొదట singular, plural అంటే తెలుసుకోండి. Singular (number) అంటే ఏకవచనం, అంటే ఒకరిని, ఒక వస్తువును, ఒకదాన్ని గురించి చెప్పేది.

Plural (number) = బహువచనం అంటే రెండూ, అంత కంటే ఎక్కువను గురించి చెప్పేది.

I అంటే నేను అని. నేను ఎంత మంది? ఒక్కరే కదా. అందుకని I ఎప్పుడూ singular- దానితో వచ్చే verbs singular గానే ఉండాలి కదా. I RDWs (Go, come, take etc.,) have, had, shall/ will etc. + have etc., I person singular (I), I person plural (we) II person singular and plural (you), III person plural (they) తో వాడతాం. III person singular (He, She, it) తో II RDW (comes, goes, takes, does etc.) and 'has' వాడతాం.

You-II person singular = నువ్వుYou-II person plural = మీరు. అయితే, you ను singular (నువ్వు)గా వాడినా plural (మీరు)గా వాడినా దానితో వచ్చే verb ఎప్పుడూ plural గానే ఉంటుంది. ఇది భాషా లక్షణం.

I తో have వాడినంత మాత్రాన అది plural కాదు. I ఎప్పుడూ singular.

---

# He points to my mistakes always

**Q.** *Please give the meanings and examples for the following words.*

*i) so well as ii) as much as*
*iii) So much of/ that much of*
*iv) refer to v) of having vi) for having*
*vii) with respect to viii) As we know that*
*ix) At which*
*x) To be able to + $V_1$ (i.e. to be able to solve)*
*xi) Points to / pointing to*
*xii) As a result*
*xiii) For the commencement of*
*xiv) Commencement of*
*xv) Request to/ Requested to*
*xvi) Ward to attend*

***- B. Ashok, Warangal***

**A.** i) So well as- an expression of comparison and saying that one thing is not equal to another.

No one can sing so well as SP = No one has the ability to sing like SP. SP can sing better than others.

ii) As much as = such an amount/ quantity. I spent as much (money) as he did = The money I spent is equal to the money he spent.

She cannot eat as much as he does. (అతడు తిన్నంత ఆమె తినలేదు)

iii) So much of = such a quantity of/ such an amount అంత= that much of I don't have so much (of) money.= అంత డబ్బు (దేనికైనా కావలసినంత డబ్బు) నాదగ్గరలేదు= I don't have that much (of) money.

iv) Refer to = ప్రస్తావించడం= Talk about.

a) The CM always refers to the achievements of his government = CM ఎప్పుడూ తన ప్రభుత్వం సాధించిన వాటి గురించి ప్రస్తావిస్తుంటారు.

v) Of having = కలిగి ఉండటం.

He is proud of having such a car= అలాంటి car ఉన్నందుకతడు గర్వపడతాడు.

vi) For having= కలిగి ఉన్నందుకు/ ఉన్నందుకు

I envy him for having such a house = అలాంటి ఇల్లు అతడికి ఉన్నందుకు నాకు ఈర్ష్యగా ఉంది.

vii) with respect to = దానిని గురించి/ ఆ విషయాని కొస్తే. With respect to your abilities, they are not suitable for the job = (నీ శక్తి సామర్థ్యాల విషయానికి వస్తే, అవి ఆ ఉద్యోగానికి సరిపోవు)

viii) As we know that = అది మనకు తెలిసుండటంవల్ల/ అది మనకు తెలుసు కాబట్టి. As we know that he is here, let us consult him= అతడు ఇక్కడ ఉన్నాడని తెలిసినందువల్ల మనం అతడిని సంప్రదిద్దాం.

ix) At which= దాని మీదట. He said something at which she was angry= అతడు ఏదో అన్నాడు, అది ఆమెకు కోపం తెప్పించింది.

x) To be able to do/ understand etc., = చేయగలగడం.

She is able to walk now = ఆమె నడవగలుగుతోందిప్పుడు.

To be able to solve = పరిష్కరించగలగడం.

xi) Points to / pointing to = చూపుతున్నారు/ చూపిస్తూ.

He points to my mistakes always = అతనెప్పుడూ నా తప్పులను చూపుతాడు.

Pointing to the car= Car ను చూపిస్తూ.

xii) As a result = ఆ ఫలితంగా.

He wasted time, as a result he failed = అతడు time waste చేశాడు. దాని ఫలితంగా అతడు తప్పాడు.

xiii) For the commencement of = దాని ప్రారంభానికి. We are waiting for the commencement of the programme. కార్యక్రమం ప్రారంభానికి మేము ఎదురుచూస్తున్నాం.

xiv) Commencement of = ప్రారంభం,

The commencement of that programme depends on the arrival of the Chief guest = కార్యక్రమం ప్రారంభం కావడం అనేది ముఖ్య అతిథి రావడం మీద ఆధారపడి ఉంటుంది.

xv) Request to= (ఒకరికి) అభ్యర్థన. He made a request to us to help him. (సహాయం కోసం అభ్యర్థించాడు) Requested to అనే ప్రయోగం లేదు.

xvi) Ward to attend చూసుకోవాల్సిన పిల్ల/ పిల్లవాడు.

I have a ward to attend to = నేను చూసుకోవాల్సిన పిల్ల/ పిల్లవాడు ఉన్నారు.

Ward = ఒకరి సంరక్షణలో ఉన్నవాళ్లు.

---

**Q.** *Spoken English for you పుస్తకం మా ప్రాంతంలో లభించడం లేదు. దయచేసి పబ్లిషర్స్ అడ్రస్ తెలియజేయండి.*

***- S. Anil kumar, Potkapalli***

**A.** Spoken English for you పుస్తకాలను ప్రచురించిన Publisher's address:

Emerald Publishers,
15A First Floor,
CASA Major Road,
Egmore,
Chennai 600008.

**Q.** *కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఏమనాలో తెలియజేయగలరు.*

*1. ఎ) జూన్‌లో వర్షాలు పడతాయి.*
*బి) బ్యాంక్‌లో చెక్ జమచేశాను. (బ్యాంక్‌లోని నా ఎకౌంట్‌లో అనే అర్థంతో)*
*సి) ఎండలు బాగా ముదిరాయి*
*డి) ఎండలో నేనెక్కడకూ రాను.*
*ఇ) అక్కడ ఆగిన బస్సులో ఇద్దరు ఎక్కారు, ముగ్గురు దిగారు.*
*ఎఫ్) ఆటోలు ఎక్కకూడదు*
*జి) తల బయట పెట్టకు*
*హెచ్) మనం తర్వాతి స్టేజిలో దిగుతాం*

*2. 3 day orientation programme on teaching English. Two thousand only.*

*ఈ రెండు వాక్యాల్లోని day, thousand అనే పదాలను plural లో days, thousands అని ఎందుక రాయకూడదు?*

***- G. Vishal, Karimnagar***

**A.** 1. a) It rains in June

b) I credited the cheque into my account in the bank

c) The sun has got/ become very hot

d) I don't go out in the (hot) sun

e) Three got down from and two got into the bus that stopped there.

f) We shouldn't get into autos.

g) Don't keep your head out

h) We get down at the next stage.

2. అది వాడుక (usage) కాబట్టి.

**Q.** *1. Made of, made from వీటి ఉపయోగంలో తేడాలు తెలుపగలరు.*

*2. పెంకులు (ఇంటి పైకప్పుమీద వాడేవి), కొంచెం పెద్దగాఉండే బంగాళాపెంకులు- ఈ రెండింటికి ఒకే పదం ఉందా? లేదా వేర్వేరుగా పిలుస్తారా?*

***- Pavani, Sudha, Matsyapuri (W.G.Dt)***

**A.** 1. ఒక వస్తువు తయారైన తర్వాత కూడా అందుకు వాడిన ముడిపదార్థం కనిపిస్తుంటే అది made of.

Tables are made of wood = Tables చెక్కతో తయారుచేయబడతాయి. (మామూలు తెలుగు- చెక్కతో తయారవుతాయి) Tables తయారైన తర్వాత కూడా చెక్క కనిపిస్తుంటుంది. అలా కాకుండా తయారైన వస్తువులో దాని ముడిసరుకులు కనపడకపోతే అది made from.

Paper is made from bamboo pulp= కాగితం వెదురు గుజ్జులోంచి తయారు చేయబడుతుంది. (తయారవుతుంది). Paper లో వెదురుగుజ్జు కనిపించదు.

2. పెంకుకు English, tile - ఏ రకమైన పెంకయినా.

A tiled house = పెంకుటిల్లు.

మనం బంగాళాపెంకులు అనేవి మంగుళూరు (కర్ణాటక) పెంకులు - Mangalore tiles. బంగాళాపెంకులు అనేమాట ఎలా వచ్చిందో తెలియదు.

---

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Q. 1.** స్కూలు వర్క్‌బుక్‌లో ఇచ్చిన Dictionary ఎక్సర్‌సైజ్ గురించి సులభంగా వివరించగలరు. Dictionary లో confuse ను వెతుకుతుంటే ముందు, వెనక పేజీలో constable/ content ను చూస్తాం. వీటిలో head word ను ఎలా గుర్తించాలి? ఇలాంటి ఎక్సర్‌సైజ్‌లను ఎలా ఫాలో కావాలి?

*2. I am having good books, Ramu is having a big top-* ఈ తరహా వాక్యాలను కొన్ని ఇంగ్లిష్ పుస్తకాలలో చూస్తుంటాం. వీటి వాడుక గురించి తెలియజేయగలరు.

**- G.Shankar, Keshavapatnam**

**A. 1.** In this exercise the student is to say whether the word 'confuse' is found a) On the same page as the head words (words at the left and the right top corner of the page in the dictionary) are found, b) On a page, after the head words page, or c) on a page before the head words page. In the alphabetical order, 'confuse' comes much earlier than 'constable' and 'content', so the answer is c. In confuse, f comes after n, whereas in 'constable' and 'content' 's' and 't' follow con; 's' and 't' come much later than f.

**2.** 'Am having' and 'is having' in these sentences are wrong. Correct sentences: I have good books and Ramu has a big top.

*6.* నాకెందుకో అయోమయంగా ఉంది.

*7.* భవనాలకు ఉపయోగించే ఊసలను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**- L. Nookaraju, Narsipatnam**

**A. 1.** చేటకు ప్రత్యేకమైన మాట లేదు. Winnowing (చెరిగే, తూర్పారబోసే) tray అనొచ్చు.

**2.** ముంత, చెంబు- రెండింటికీ ewer. ఇది ఇప్పుడంతగా English లో వాడటంలేదు.

**3.** రెండూ సరైనవే.

**4.** Both are correct.

**5.** I can't hit/ strike/ fight anyone. I don't have the strength.

**6.** I am confused; I don't know why.

**7.** Rods

**Q. 1.** *Rather, Rather than* అనే పదాలకు అర్థం ఒకటేనా? వీటి *differences* ను చెప్పండి.

*2. Wedge* అంటే ఏమిటి?

*3. Monopthong* అంటే ఏమిటి? దీనికి ఉదాహరణ ఇవ్వండి.

*4. as well as* అంటే ఏమిటి?

*5.* ఒక బెంచిలో ఇద్దరు కూర్చోవడానికి స్థలం సరిపోతుంది. అయితే అందులో నలుగురు ఇరుక్కుని కూర్చున్నారు. మరి ఇక్కడ ఇరుకుగా ఉంది అనడానికి *conjusted* గా ఉంది అనొచ్చా?







**Q. 1.** *Dignity of labour* అంటే అర్థం ఏమిటి? ఏయే సందర్భాలలో దీనిని వాడతారు?

*2. Switched off* అనడం తప్పుకదా! రెండు *Past tense* లు వాడొచ్చా? *Switched* అనాలా? *Switch off* అనాలా? ఏది కరెక్ట్?

**- DSR Murthy, Hyderabad**

**A. 1.** శ్రమలోని ఔన్నత్యాన్ని dignity of labour అంటాం. మన పని మనం చేసుకోవడం, అది మన 'పరువుకు లోపం' అనుకోకుండా. మన ఇల్లు మనం ఊడ్చుకోవడం, మన బరువులు మనమే మోయడం, మన వస్తువులు మనమే శుభ్రం చేసుకోవడం. ఇతరులతో, కూలివాళ్లతో చేయించకుండా ఎవరిపని వారు చేసుకోవడం, పరువు తక్కువ, ప్రతిష్ఠకు భంగం అనుకోకుండా - అది dignity of labour.

**2.** Off అనేది, verb కాదు. అది past tense అయ్యే ప్రశ్నలేదు. కనుక Switched off (Past tense of switch off) = దీపాలు ఆర్పేశారు. Switch off (Present tense)- ఆర్పివేయి/ ఆర్పేస్తారు. They switch off lights by ten = పదికల్లా దీపాలార్పేస్తారు.

usage (వాడుక), and Idiom (నానుడి), అంతేకాకుండా వాళ్ల ఉచ్చారణ అర్థం చేసుకోగలగడం. దీనికి English news telecasts వీలైనంతగా వినడం మంచి మార్గం.

**2.** Leaving no stone unturned = శాయశక్తులా కృషిచేయడం/ ఏ విధమైన ప్రయత్నమూ వదలకుండా చేయడం.

I will leave no stone unturned to have a house of my own = నా సొంత ఇంటిని పొందేందుకు అన్ని విధాలా ప్రయత్నిస్తాను.

**Q. 1.** *I saw him at the zoo. I happened to see him at the zoo.* ఈ రెండు వాక్యాల అర్థం - నేను అతడిని జూ వద్ద చూశాను. కానీ వాక్య నిర్మాణంలో మార్పు వచ్చింది. ఏ పరిస్థితిలో *happened + to* + $v_1$ ఉపయోగిస్తాం?

*2. The news had spread around India-*
*The news had spread through out India.*
*The news had spread across India.*
ఈ మూడు వాక్యాల మధ్య భేదం ఏమిటి?

*3. He went to pushkarghat to have a holy dip. He went to pushkarghat to be taken a holy dip. to have* బదులు *to be* ఉపయోగించవచ్చా?

**- K. Srinivasa Rao, Darsi**

# They switch off lights by ten

**Q.** *To whom are you talking?, Who are you talking to?* వీటి అర్థాలు తెలపండి. ఒకదానికి బదులు మరొకటి ఉపయోగించవచ్చా?

**- D. Sailaja, Adoni.**

**A.** To whom are you talking= Who are you talking to. Present day English లో, ముఖ్యంగా Spoken English లో whom వాడేచోట who వాడుతున్నారు. 'To whom are you talking?' correct అయినప్పటికీ, ఇప్పుడు వాడుకలో లేదు. అతడు ఎవరితో మాట్లాడుతున్నాడు? = Who is he talking to? (To whom is he talking కాదు). Was/ is సందర్భాన్ని బట్టి వాడతాంకదా?

**Q.** *Don't you worry* ఏం బాధపడకు అని అంటున్నారు. కానీ *You don't worry* అని ఉండాలి కదా? అలాగే *Practise* చేయండి. *Practice* చేయండి ఏది కరెక్ట్? *Postpone* కు *opposite - advance* కరెక్టేనా? *prepone* వాడకూడదు కదా. మరి కొన్ని డిక్షనరీలలో *prepone* ఉంటోంది. ఎందుకు?

**- P. Krishna Murthy, Secunderabad.**

**A.** Don't you worry, వ్యావహారికం. Spoken English లో ఇది వాడుక. Don't you worry, Don't you do any thing of the sort (అలాంటిదేం చేయొద్దు) అని చెప్పడం, you don't ... అనడం కంటే గట్టిగా చెప్పడం.

తెలుగులో అనేటప్పుడు practice/ practise ఏదయినా ఫర్వాలేదు. Practice చేయండి = అభ్యాసం చేయండి. Practise చేయండి = అభ్యసించండి.

Prepone, English లో లేదు- English మాతృభాషగా కలవారికిది అర్థంకాదు.

**Q. 1.** ఇంట్లో ఉపయోగించే చేటను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

*2.* ముంతను *Ewer,* మరి చెంబును ఏమంటారు? ఈ రెండింటి మధ్య తేడాను తెలపండి?

*3.* డ్రైవర్ బస్సు ఎక్కుతున్నాడు. *The driver is getting into the bus- The driver is boarding the bus.* ఏది కరెక్టో చెప్పగలరు.

*4.* నేను బస్సు దిగాను. *I got down the bus, I get off the bus-* ఏది కరెక్టు?

*5.* నేనెవరినీ కొట్టలేను. నాకు అంత బలం లేదు.

*6. To be* అనేది ఎలా వాడాలి? దాని అర్థం ఏమిటి?

*7. Unless, although* ఈ రెండు పదాలకు అర్థం ఒకటేనా? వీటిని ఎలా ఉపయోగించాలి?

*8. non, none* లను ఎలా పలకాలి?

**- E. Lilly, Gooty**

**A. 1.** Rather, Rather than గురించి ఇంతకుముందు చాలాసార్లు వివరించాం. ఈ మధ్యకూడా ఓసారి వివరించాం. చూడండి.

**2.** పెద్ద పెద్ద దుంగలను, కొంత కోసి వదిలిపెట్టి ముందు, ఆ చీలినచోట పెట్టే చెక్క/ ఇనుప ముక్కను wedge అంటారు. మళ్లీ రంపాన్ని దూర్చేందుకు వీలుగా, (రెండుగా చీలిన భాగాన్ని తెరిచి ఉంచేందుకు) ఉపయోగించేది.

**3.** ఒకే vowel sound ఉన్న శబ్దాన్ని monophthong అంటాం. eg. Quit- pronunciation- Kwit- ఇక్కడ ఒకే vowel sound 'i' (ఇ) ఉంది. Q - ఇది monophthong.

**4.** as well as అంటే- రెండూ/ అదేకాక ఇది కూడా.

Vijayawada as well as Guntur is hot during the summer= విజయవాడ, గుంటూరు ఈ రెండూళ్లూ/ విజయవాడే కాకుండా గుంటూరు కూడా వేసవిలో బాగా వేడిగా ఉంటాయి.

**5.** Cramped అంటాం. Congested అంటే జనసమ్మర్దం, ఇరుకిరుకుగా ఉన్న ప్రదేశాలు, నగరాలు. Benches లాంటి వాటికి వాడం. Room (గదులకు) వాడతాం. జనం ఎక్కువగా ఉండి అందరికి సరిపోని గది.

**6.** to be = ఉండటం. To be here is dangerous= ఇక్కడ ఉండటం ప్రమాదకరం.

**7.** unless = అయితే తప్ప: Although = though = even though = అయినప్పటికీ. వీటి గురించి చాలాసార్లు వివరించాం. చూడండి.

**8.** Non- నాన్- (నా మరీ దీర్ఘంకాదు)
None - నన్




**Q. 1.** భాష, ప్రాంతాలను బట్టి ఉచ్చారణ మారుతుంటుంది కదా! మాతృభాషను అక్షరాస్యులు, నిరక్షరాస్యులు మాట్లాడినప్పుడు భేదం కనిపిస్తుంది. నిరక్షరాస్యులు మాట్లాడినప్పుడు *Parts of the speech, Tenses, Degree of Comparison, Prepositions* అప్రయత్నంగా వారి మాటల ద్వారా అక్షరాస్యులకు తెలుస్తుంది. కానీ వాటి విషయం నిరక్షరాస్యులకు తెలియదు. వారు భాషను మాట్లాడగలరు. ఆంగ్లేయులలో నిరక్షరాస్యులు ఉంటారు కదా! మరి వారు ఇంగ్లిష్‌ను చక్కగా మాట్లాడతారు. అలాంటిది మనం ఇంగ్లిష్‌లో వ్యాకరణ విషయాలన్నీ తెలిసినా ఆంగ్లభాషను అనర్గళంగా మాట్లాడలేకపోతున్నాం. ఒక ఆంగ్లేయుడు మనతో భాషించినపుడు అతని భాషను మనం అర్థం చేసుకోలేకపోవచ్చు. దీనిని అధిగమించడానికి ఏంచేయాలి?

*2. Leaving no stone unturned* అనే *phrase* అర్థం, దాని ప్రయోగం గురించి వివరించగలరు.

**- Gopinath, Amudalavalasa.**

**A. 1.** నిరక్షరాస్యులుకూడా, grammar లో జ్ఞానంలేకుండా, తమ మాతృభాషను correct గానే మాట్లాడతారు కదా. వాళ్లకు parts of speech లాంటివి తెలియకపోయినా వాళ్ల భాషను మనం తప్పు పట్టలేం కదా? దీనివల్ల, ఒక భాష మాట్లాడేందుకు knowledge of grammar అవసరం లేదని తెలుస్తోంది కదా? భాష మాట్లాడగలిగేందుకు grammar అవసరం కాదు. Regular practice. North India లోని తెలుగువాళ్లు హిందీ చక్కగా మాట్లాడగలరు. కానీ హిందీ grammar వాళ్లకు తెలుసా? మాట్లాడటంవల్ల, ఇతరులు మాట్లాడుతున్నప్పుడు వినడంవల్ల, భాష త్వరగా వస్తుంది. English కూడా అంతే. English వాళ్ల English అర్థం చేసుకునేందుకు, knowledge of grammar అంతగా అవసరం లేదు. English లోని మాటలు (vocabulary),

**A. 1.** a) I saw him at the zoo = అతడు నాకు zoo లో కనిపించాడు/ నేనతడిని zoo లో చూశాను.

b) I happened to see him at the zoo = నేనతడిని zoo లో చూడటం తటస్థించింది/ Zoo లో అతడు నాకు తటస్థపడ్డాడు.

a) లో నేనతడిని కలుసుకున్నాను అనే భావం స్ఫురిస్తుంది. b) లోనిది అనుకోని సంఘటన.

**2.** ఈ మూడింట్లో, The news had spread across India, correct. మిగతా రెండూ సరికాదు. అర్థం - ఈ వార్త భారత్ అంతా వ్యాపించింది.

**3.** అతడు పవిత్ర స్నానంకోసం పుష్కర ఘట్టానికి వెళ్లాడు. ఈ అర్థంతో ఈ sentence లో to have, correct. To be taken a holy dip - దీనికర్థం లేదు. ఇది తప్పు, to have బదులు ఇది వాడకూడదు.

**Q.** *Simple Present tense* లో *Subject Singular* గా ఉంటే *Verb* కు *s* చేర్చాలి. లేదా *Subject Plural* గా ఉంటే *Verb* కు *s* చేర్చనవసరంలేదు. *cut (v1) - cut (v2) - cut (v3) - cutting (v4)* - దీనిని గమనిస్తే *v1, v2, v3* లు ఒకే విధంగా ఉన్నాయి. ఇలాంటి *Verbs* ను ఏమంటారు. ఈ విధమైన *Verbs* ను ఉపయోగించి *Simple present tense* లో *He cuts trees, They cut trees* అయితే, ఈ *Verb* ను ఉపయోగించి పై వాక్యాన్ని *Simple Past* లో ఏ విధంగా రాయాలి?

**- B.Raghu, Godasalapalli**

**A.** ఇవి Regular/ weak verbs.

He cuts trees - simple past

They cut trees = ఇది simple past కావొచ్చు, simple present కూడా కావొచ్చు. ఇలాంటప్పుడు మనం వాడే time expressions ను సందర్భాన్నిబట్టి past tense/ present tense అనేది తెలుసుకోగలం.

They cut trees here every day - (simple present)

They cut the trees here last week - (simple past)

# Watching the TV doesn't always pay

**Mohit:** It is surprising. I haven't seen you for days. What's the matter?
(ఆశ్చర్యం. కొద్దిరోజులుగా నువ్వు నాకు కనిపించలేదు. ఏంటి విషయం? )

**Sobhan:** You know very well that I signed up for the personality development programme, don't you? It was a three day programme which ended yesterday.
(నేను వ్యక్తిత్వ వికాసం course లో చేరానని తెలుసుకదా? అది మూడు రోజుల కార్యక్రమం. నిన్ననే పూర్తయ్యింది.)

**Mohit:** (Do) you feel you are benefited from it?
(దానివల్ల లాభం పొందినట్టు నీకనిపిస్తోందా? )

**Sobhan:** Certainly. It pays to attend courses like that.
(తప్పకుండా. అలాంటి courses తీసుకోవడంవల్ల కచ్చితంగా ప్రయోజనం ఉంటుంది.)

**Mohit:** I attended two such courses. I've found that what they teach us in them do not work in real life situations.
(అలాంటి courses నేను రెండుసార్లు తీసుకున్నా. వాటిల్లో చెప్పేదంతా నిజ జీవితంలో పనిచేయదని నాకనిపిస్తోంది.)

**Sobhan:** I've yet to see. It's only yesterday that the course was completed. I have to try it in my daily life situations.
(అదింకా నేను చూడాల్సి ఉంది. నిన్ననే కదా ఆ course పూర్తయింది. నా నిజ జీవితంలో వాటిని ప్రయోగించాల్సి ఉంది.)

**Mohit:** Theory is one thing and practice is quite another. You'll soon see. Not all that you learnt there can be practised.
(సిద్ధాంతాలకూ, ఆచరణకూ చాలా తేడా ఉంది. అక్కడ నేర్చుకున్నవన్నీ మనం ఆచరణలో పెట్టలేం.)

**Sobhan:** I now see that the courses you've attended haven't benefited you much. You still have negative attitude.
(ఆ కోర్సులు నీకేమీ ప్రయోజనం చేకూర్చలేదని ఇప్పుడు అర్థమవుతోంది. నీకింకా విముఖ వైఖరి పోలేదు.)

**Mohit:** I speak from experience.
(నా అనుభవంతో నేనలా మాట్లాడుతున్నా)

**Sobhan:** Well, let me try.
(నన్ను ప్రయత్నించనీ)

**Mohit:** Do it and wish you all success.
(కానియ్, నీకు విజయం చేకూరాలనే నా కోరిక)

Daily life situations లో వాడే very common expressions చూస్తున్నాం కదా. అవి మన Spoken English చాలా సరళంగా చాలా సహజంగా ఉండేట్లు చేస్తాయి. మరికొన్ని expressions ఇప్పుడు చూద్దాం.

*1) You know very well that I signed up for a personality development course, don't you?*
*2) It pays to attend courses like that*
*3) I found that what they teach us don't work in real life situations.*
*4) Theory is one thing and practice is quite another.*
*5) You still have a negative attitude*




SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 478

**1) Sign up for:** ఒక course లోగానీ, శిక్షణలోగానీ చేరడానికి/ చేరే ఉద్దేశంతో పేరివ్వడం.

a) I thought I'd sign up for the NCC but on second thoughts dropped the idea= NCC లో చేరేందుకు పేరిద్దామని అనుకున్నాను, కానీ కాస్త ఆలోచించిన తర్వాత మానుకున్నా.

b) More people than expected signed up for the blood donation programme= రక్తదాన కార్యక్రమానికి అనుకున్నదానికంటే ఎక్కువమంది పేరిచ్చారు.

c) He wanted to sign up for the course, but the high fee held him back = అతడు course లో చేరాలనుకున్నాడు. కానీ fee బాగా ఎక్కువవడం అతడిని ఆపేసింది. (Hold back= ఆపడం)

**2) It pays** = దానివల్ల ప్రయోజనం ఉంటుంది.

a) It pays to improve your communication skills = Communication skills పెంపొందించుకోవడంవల్ల ప్రయోజనం ఉంటుంది.

b) Connections with those in high positions certainly pay= ఉన్నతస్థాయిలో ఉన్న వ్యక్తులతో సంబంధాలు కచ్చితంగా పనిచేస్తాయి.

c) Watching the TV doesn't always pay= TV చూడటంవల్ల అన్నివేళలా ప్రయోజనం ఉండదు. (It's a waste of time అని)

**3) don't work:** (మన ఆలోచనలూ, plans లాంటివి) పనిచేయకపోవడం/ వాటివల్ల ప్రయోజనం లేకపోవడం.

a) My plans did not work. I was disappointed = నా ప్రణాళికలేం పనిచేయలేదు. నేను చాలా నిరాశచెందాను.

M.SURESAN

b) Kesav: This is the way you can get the job = ఈ విధంగా నువ్వా ఉద్యోగం సంపాదించుకోగలవు.

Kumar: No. that won't work. I shall only end up jobless = లేదు. అదేం పనిచేయదు. అలా అయితే నేను ఉద్యోగం లేకుండానే/ నిరుద్యోగిగానే మిగిలిపోతా.

c) Things don't work the way we want them to = మనం అనుకున్నవి అనుకున్నట్లు పనిచేయవు/ పనిచేయవు.

**4) This is one thing and that is quite another** = దీనికీ దానికీ చాలా తేడా ఉంది.

a) Being interested in politics is one thing and taking part in active politics is another = రాజకీయాల్లో ఆసక్తి ఉండటానికి, క్రియాశీల రాజకీయాల్లో పాల్గొనేందుకు చాలా తేడా ఉంది.

b) To preach is one thing and to practise is quite another = ఉపదేశించడానికి, ఆచరించడానికి చాలా తేడా ఉంది.

c) To know about a place from books is one thing and to see it is another = ఒక ప్రదేశాన్ని గురించి చదివి తెలుసుకోవడం, ఆ ప్రదేశాన్ని చూడటం ఒకటి కాదు.

**5) Negative attitude** = విముఖ వైఖరి, (ఇది Spoken English లో తరచుగా వినిపించే expression కాదు. అయినా తెలుసుకోవడం మంచిదే) 'దేనివల్లా ఏ ప్రయోజనం ఉండదు' అనే తత్వం.

a) To think that we cannot learn English is a sign of a negative attitude = మనకు English రాదులే అనుకోవడం విముఖ వైఖరి.

b) We can never win if we have a negative attitude = మనకు విముఖ వైఖరి ఉంటే మనం విజయం సాధించలేం.

Negative attitude X Positive attitude (సుముఖ వైఖరి)

a) మనం ఏ పనిచేయలేం/ మనకు మంచి జరక్కపోవచ్చు/ మన ప్రయత్నం సఫలం కాదు - Negative attitude.

b) మనం ఆ పనిచేయగలం/ చేసి చూద్దాం, ఫలితమేదయినా/ మనకు విజయం లభిస్తుంది - Positive attitude.

---

## Q&A

**Q.** *1. Set out, Set in, Set of, Set down* కు అర్థాలు చెప్పండి?

*2. As, to be* ఏ సందర్భాల్లో వాడతారు? *As* కు ముందు *sentence* వచ్చినపుడు దాని అర్థం ఏ విధంగా వస్తుంది?

*3. By* ఏ సందర్భంలో వాడతారు, *By out, By of, By out* అర్థాలను తెలపండి?

*4.* నాకు ఇంగ్లిష్ నేర్చుకోవాలనుంది. దానికి నాకు *As, as well as, as* మధ్యలో వచ్చినపుడు వాక్యాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? చెప్పండి?

**- SD Khader Basha, Nellore**

**A.** 1. Set out = Begin a journey = 1) ప్రయాణం ప్రారంభించడం = బయల్దేరడం. (ముఖ్యంగా దూర ప్రయాణం). set out ఇంకో అర్థం, ఏదైనా పని ప్రారంభించడం, పూనుకోవడం.

He set out to break the world record in swimming = ఈతలో ప్రపంచ record ను అధిగమించడానికి పూనుకున్నాడు.

Set in = ప్రారంభం కావడం (ముఖ్యంగా అంత మంచివి కానివి)

Summer has already set in = వేసవి అప్పుడే ప్రారంభమైంది (ఎండలు బాగా కాస్తున్నాయి)

Set of - ఈ మాట English లో లేదు.

A set of = కొన్ని వస్తువుల/ వ్యక్తుల బృందం

A set of books = పుస్తకాల సమితి.

A set of boys = కొందరు బాలుర బృందం

Set down = write down = రాయడం, మరచిపోకుండా ఉండేందుకు.

a) He set down his experiences in his dairy = అతడు తన అనుభవాలన్నీ తన diary లో రాశాడు (పొందుపరిచాడు)

b) The warden set down the rules of the hostel = హాస్టల్ నిబంధనలను warden రాశాడు (విధించాడు)

**2. As** = వలె/ కాబట్టి/ అంత (పోల్చినపుడు)

a) He talks as his father does = అతడు వాళ్ల నాన్నలాగే/ వలె మాట్లాడతాడు.

b) As = అందువల్ల/ కాబట్టి = As it is expensive I don't want to buy it = అది ఖరీదవడం వల్ల నేను కొనుక్కోవాలనుకోవడంలేదు.

c) పోలిక = She is as tall as her sister = ఆమె తన అక్కంత/ అక్కలా పొడుగు.

**3. By** - దీన్ని ఇంతకుముందు lessons లో వివరించాం, చూడండి. By of, By out- ఈ expressions English లో లేవు.

**4. As** విషయం పైన వివరించాం కదా?

As well as = 1) అంత బాగా.

I cannot sing as well as her =

ఆమె అంత బాగా నేను పాడలేను.

As well as = 2) రెండింట్లో, ఇద్దరిలో రెండూ/ఇద్దరూ.

He as well as his sister is here = అతడూ, అతడి sister - ఇద్దరూ ఇక్కడ ఉన్నారు. (అతడేకాక, అతడి sister కూడా)

As కు ఉన్న అర్థాలు వివరించాం కదా. సందర్భాన్ని బట్టి సరైన అర్థం ఊహించుకోవాలి. ఇది చదవగా చదవగా తెలుస్తుంది.

**Q.** *Why do you like your friend?* అనే ప్రశ్నకు సమాధానాలుగా- *a) I like my friend because she is loving and kind to me. b) I like my friend because she loves and kind to me.* రెండూ కరెక్టేనా?

**- M.Chandrika Mahalakshmi, Perumandra**

**A.** a) She is loving - ఇక్కడ is loving verb కాదు. is verb, loving adjective, He is a loving husband లో loving లా.

b) I like my friend because she loves and kind to me అంత correct కాదు. Correct form of the sentence. I like my friend because she loves me and is kind to me. ఇక్కడ loves, verb. Sentences a కి, b కి structure లో తేడా ఉంది.

**Q.** *1. Play, Show, Game, Sport* వీటిని ఎక్కడ, ఎప్పుడు,ఎలా వాడాలి?

*2. Brilliant, Intelligent, Clever, Genius* వీటి గురించి కూడా చెప్పండి.

**- Maduri satyanarayana, Hyderabad**

**A.** 1. Play- ఆట/ ఆడటం- ఎక్కువగా ఆడటం అనే అర్థం తోనే వాడతాం.

Play = ఆట అనే అర్థంతో వాడినప్పుడు, ఏ విధమైన క్రీడ అయినా కావొచ్చు

Because of rain the play ended = వర్షం వల్ల ఆట ఆగింది/ అయిపోయింది.

(play అంటే నాటకం అనే అర్థం కూడా ఉంది)

Play = game = sport అయితే, game సామాన్యంగా ఇద్దరి మధ్యనో, రెండు జట్ల మధ్యనో జరిగే క్రీడ- Cricket, Tennis, Chess, etc. Sport ఇద్దరు లేదా ఎక్కువ వ్యక్తులు ఒకేసారి పాల్గొనే క్రీడ- running race, high jump, long jump, etc.

**2.** Brilliant = అసాధారణమైన తెలివి/ ప్రజ్ఞ కల, ఇతరులను ఆశ్చర్యపరిచే/ ఇతరులలో గొప్ప అభిప్రాయం కలిగించే తెలివి తేటలు, నేర్పు- A brilliant scientist/ idea/ performance (ప్రదర్శన) (మామూలు అర్థం- ప్రకాశవంతమైన/ brilliant sun shine, etc)

Intelligent, clever - ఈ రెండూ దాదాపు ఒకటే- చాలా తెలివికల, దేన్నైనా సులభంగా అర్థం చేసుకునే శక్తి, ఆలోచించగల శక్తి. అయితే intelligent పుట్టుకతో వచ్చే గుణానికి ఎక్కువ వాడతాం; clever ఒక్కొక్కప్పుడు, మనం సంపాదించే, పెంపొందించుకొనే తెలివితేటలు కావొచ్చు. Clever కు, కొన్ని సందర్భాల్లో, మోసంచేయగల అనే negative అర్థం కూడా ఉంది.

a) An elephant is an intelligent animal.

b) A fox (నక్క) is a clever animal.

Genius. అసాధారణమైన తెలివితేటలు, ప్రజ్ఞా పాటవాలూ, నైపుణ్యం.

He is a writer of genius. ఇలాంటి లక్షణాలున్న వ్యక్తి కూడా genius. అన్నిటి కన్నా గొప్పది- Genius. దాని తర్వాత, brilliant, ఆ తర్వాత intelligent/ clever.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

ప్రతిభ




# What do you take us for?

**Charith:** The boss wants us to start work in two days. He doesn't want is to be delayed any longer.

(మన boss రెండ్రోజులకల్లా పని మొదలు పెట్టమంటున్నాడు. ఇంకేం ఆలస్యం కాకూడ దంటున్నాడు.)

**Manasa:** Why such a short notice?

(అంత తక్కువ సమయమా?)

**Charith:** He always takes us by surprise. There's no helping it. Come what may we have to do it.

(ఆయన ఎప్పుడూ మనకు ఆశ్చర్యమే కలిగి స్తుంటాడు. అది తప్పదు. ఏదేమైనా మనం చేయాల్సిందే).

**Manasa:** What does he take us for? Machines or human beings?

(మనల్ని ఏమనుకుంటున్నాడాయన? యంత్రా లనా, మనుషులనా?)

**Charith:** It's all fixed up. There's no changing it now.

(అంతా నిర్ణయమైపోయింది. మనం మార్చేదేం లేదందులో).

**Manasa:** We'll have to put up with this nuisance manager, I feel. It all boils down to this: do what the boss says or get the hell out of here.

(ఈ తలనొప్పి manager ను భరించా ల్సిందేననుకుంటా. దీని సారాంశం ఏమిటంటే boss చెప్పేది విను. లేకుంటే వెళ్లిపో అని).

**Charith:** No use complaining. Will you see about the files that are important for the information we've to give? Meanwhile, I'll attend to the classification.

(తిట్టుకోవడం వల్ల ప్రయోజనం లేదు. మనం ఇవ్వాల్సిన సమాచారం గురించి చూస్తావు కదా? నేను వాటి వర్గీకరణ ఏర్పాటు చేస్తా).

**Manasa:** I'll see to it, but first of all let me have something to eat. It's lunch time.

(అది చేస్తాన్లే, కానీ ముందు నన్నేదన్నా తిననీ. ఇప్పుడు భోజన సమయం).

**Charith:** Do have your lunch, but see that the files are ready in an hour.

(భోంచేయి. కానీ ఓ గంటకల్లా files ready చేయి).

**Manasa:** Sooner said than done. I am sure I'm going to quit this job, once I get a better job.

(చెప్పడం తేలికే, చేయడమే కష్టం. ఇంతకంటే మంచిఉద్యోగం వస్తే, ఇది వదిలేస్తాన్నేను).

**Charith:** But till then you've to do what you are told to do. Go about the files and get them ready in an hour.

(అంత వరకు నీకు చెప్పింది నువ్వు చేయా ల్సిందే. ఆ files గురించి చూసి వాటిని ready చెయ్).

**Manasa:** Give me half an hour more they will be ready.

(ఇంకో అరగంట ఇవ్వు. నేను వాటిని ready చేస్తా).

ఈ lesson లో daily real life situations లో అతి సామాన్యంగా conversation లో వినిపించే మరి కొన్ని మాటలు చూద్దాం. ఇవన్నీ మన వైఖరి (attitude) ను తెలియజేసే expressions, conversation లో సహజమైన భాగాలు కూడా. వీటిని సందర్భం వచ్చినప్పుడల్లా practise చేద్దాం.

***Look at the following sentences from the conversation above.***

*1) Why such a short notice?*

*2) He always takes us by surprise.*

*3) There's no helping it.*

*4) What does he take us for.*

*5) It's all fixed up.*

*6) We'll have to put up with this nuisance manager, I feel.*

*7) It all boils down to this.*

*8) Will you see about the files.*

*9) Sooner send than done.*

*10) Go about the files.*

**1) At a short notice-** ఇక్కడ notice కు అర్థం, ఏదైనా పనికి మనకిచ్చే గడువు/ వ్యవధి.

a) We give you three months' notice to vacate the house= ఇల్లు ఖాళీ చేసేందుకు మూడు నెలల గడువు ఇస్తున్నాం.

b) It's impossible for anyone to do it at such a short notice= అంత తక్కువ వ్యవధిలో అది చేయడం ఎవరికీ సాధ్యంకాదు.

c) The boss asked him to quit without notice= ఏం వ్యవధీ/ గడువు ఇవ్వకుండానే boss అతడిని ఉద్యోగం వదిలేయమన్నాడు. (వెంటనే అతడ్ని ఉద్యోగం నుంచి తొలగించారు)

**2) Take by surprise=** ఆశ్చర్యం కలిగించడం.

a) His sudden appearance here took us all by surprise= అతనిక్కడ ఉన్నట్టుండి కనిపించడం మాకాశ్చర్యం కలిగించింది.

b) His resigning the job took us all by surprise= అతడు రాజీనామా చేయడం మాకాశ్చర్యం కలిగించింది.

c) Her singing at the party took us all by surprise= ఆమె party లో పాడటం మాకాశ్చర్యం కలిగించింది.

**3) There's no helping it- No helping something=** అదితప్పదు/ దాని గురించి మనమేం చేయలేం.

a) Prasad: Have we to pay the amount?

(మనం ఆ మొత్తం చెల్లించాల్సిందేనా?)

Pramod: There's no helping it if we want to join the course.

(మనం course లో చేరాలంటే తప్పదు)

b) No bus in sight. We have to walk the distance. No helping it= Bus ఎక్కడా కనిపించ డంలేదు. మనం నడవాల్సిందే. తప్పదు.

c) There's no helping bribing officers to get things done. The system is like that= పనులు కావాలంటే అధికారులకు లంచం ఇవ్వక తప్పదు. వ్యవస్థ అలా ఉంది.

**4) To take someone for something** = ఒకరి గురించి అనుకోవడం.

a) What do you take us for- your servants? = ఏమనుకుంటున్నావు మమ్మల్ని- నీ నౌకర్లమా?

b) Don't take her for a fool. She can outsmart you = ఆవిడేమీ మూర్ఖురాలనుకోకు. నీకంటే తెలివి తేటలు చూపగలదు.

c) Because of his appearance I never took him for the scientist he is = అతడి వాలకం చూసి అతడు scientist అనుకోలేదు నేను.



M.SURESAN

**5) Be fixed up** = నిర్ణయమైపోవడం.

a) It's all fixed up. All that we have to do is wait for the funds = అంతా నిర్ణయమైపోయింది. మనం చేయాల్సిందంతా నిధులకోసం చూడటమే.

b) It's all fixed up. You are the first to go = అంతా నిర్ణయమైపోయింది. మొదట వెళ్లాల్సింది నువ్వే.

c) Nothing is fixed up. The boss has to decide = ఇంకా ఏం కుదరలేదు. Boss నిర్ణయించా ల్సిందే.

**6) Put up with** = సహించడం/ భరించడం/ తట్టుకోవడం

a) The government says we've to put up with the inflation for some more time = కొంతకా లంపాటు ఈ ద్రవ్యోల్బణాన్ని తట్టుకోవాల్సిందేనని ప్రభుత్వం అంటోంది.

b) (It's) difficult to put up with him. He is such a nuisance = అతడిని భరించడం కష్టం. అంత తలనొప్పివాడు.

**7) It all boils down to this** = దాని సారాంశం/ అర్థం ఇదే.

a) It all boils down to this: power cuts will increase = విద్యుత్‌కోత పెరుగుతుంది. ఇదీ సారాంశం/ ముఖ్యాంశం.

b) It all boils down to our working for more hours with less pay = ముఖ్యాంశం ఏమిటంటే మనం తక్కువ జీతంతో ఎక్కువ గంటలు పనిచేయా లని.

c) The CM's acting in a silent movie boils down to his not uttering a dialogue with any scope for controversy = CM మూకీలో నటించడం సారాంశం- వివాదానికి తావిచ్చే సంభాష ణేదీ ఉచ్చరించకపోవడం.

**8) See about something** = (ఒక్క విషయం) చూసుకోవడం.

a) I'll make the hall ready. Will you see about the chairs for the guests? = నేను hall సిద్ధం చేస్తాను. నువ్వు కుర్చీల విషయం చూస్తావా?

b) Don't worry. I'll see about the arrangements for the guests' stay = ఏం ఆందోళన పడకు. అతిథుల బస ఏర్పాట్ల విషయం నేను చూసు కుంటా.

**9) Sooner said than done** = చెప్పడం తేలికే చేయడమే కష్టం.

a) Dad wants me to walk to college. Sooner said than done = మా నాన్న college కి నడిచి వెళ్లమంటాడు. చెప్పడం తేలికే.

No sooner said than done అనే expression కూడా ఉంది- దీనర్థం- నువ్వు చెప్పడమే ఆలస్యం, నేను చేసేందుకు సిద్ధం అని.

Anand: Will you make arrangements for my stay?

(నా బసకు ఏర్పాట్లు చేస్తావా?)

Amrit: No sooner said than done.

(మీరు చెప్పడమే ఆలస్యం. ఇదిగో, ఇప్పుడే చేస్తా)

**10) Go about =** (ఇక్కడి అర్థం) = ఒక పని ప్రారంభించే సన్నాహాలు చేయడం.

a) As soon as the funds are ready, I'll go about the construction = నిధులు సిద్ధం కాగానే, నిర్మాణం ప్రారంభిస్తాను.

b) He has already gone about getting the permission = అనుమతి కోసం ప్రయత్నాలు మొదలు పెట్టాడతడు.



**Q.** *Bad, Dangle, Bank, Valid, Nap, Narrow, Bouquet, Author, Shout, Maoism, Sauce, Narrow, Contemptuous, Congestion, Unique, Louse - ఉచ్చారణ గురించి వివరించగలరు.*

***- A. Madhav, Hyderabad***

**A.** Bad, Dangle, Bank, Valid, Nap, Narrow - ఈ మాటల్లోని 'a' ని, తెలుగులో తాటాకు, చెప్పాడు లాంటి మాటల్లోని 'టా', 'ప్పా' లా పలకాలి, అయితే దీర్ఘం లేకుండా పలుకుతాం.

Bouquet- బుకెయ్ - 'కె' నొక్కి పలుకుతాం.

Author - ఆథ(ర్)- ఈ మాటలో 'ఆ' ను పెదవులు గుండ్రంగా విప్పి, నాలుక పక్కలు పైకి వంచి, 'ఆ' అంటే వచ్చే శబ్దం. దీనికి, 'art' (ఆర్ట్)లోని 'ఆ' కు తేడా ఉంది. 'ఆ(ర్)ట్'లోని ఆ ను, పెదవులు నాలుక flat గా ఉంచి అంటాం.

Shout లోని ou, Maoism లోని ao- వీటిని now లోని ow లా పలుకుతాం.

Now pronunciation- నవ్ కాదు, నావ్ కాదు, న- అంత హ్రస్వంగా కాకుండా, నా- అంత దీర్ఘమూ కాకుండా నాలుక flat గా పెట్టి, పెదవులు దగ్గరగా చేరిస్తే వచ్చే శబ్దం.

Sauce లోని 'ఆ' శబ్దం = author లోని 'ఆ' శబ్దం.

Narrow లోని ow శబ్దం పూర్తి ఓ కాదు. ఇది కొంచెం go, no లో లా పలకాల్సి ఉంటుంది. ఇది ప్రత్యక్షంగా పలికి తెలియపరచే విషయం- రాతలో సాధ్యం కాదు. రాతలో చూపినా ఛాందసంగా ఉంటుంది.

Contemptuous = కన్‌టెమ్ప్చుఅస్

Congestion - కన్‌జస్చన్

Unique - యునీక్

Louse - (now లోలా) లవ్స్ (ల కాస్త దీర్ఘం) చెప్పాం కదా. ఇవి ప్రత్యక్షంగా పలికి వినిపించవలసిన శబ్దాలు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

**Neeraj:** It's very clever of you, making Sarath pay for you too.
(శరత్‌ను నీకు కూడా చెల్లించేట్లు చేయడంలో చాలా తెలివి చూపించావు.)

**Mukund:** Yea, you can say that. Imagine my surprize when he asked the bearer to charge it upto him.
(నిజమే. అతడు bearer తో తనకు bill ఇమ్మన్నప్పుడు నా ఆశ్చర్యం నువ్వు ఊహించు కోవాల్సిందే.)

**Neeraj:** Did he offer to pay the bill?
(అతడు bill కడతానన్నాడా?)

**Mukund:** He did, for sure.
(అవును. నిజంగా.)

**Neeraj:** Didn't Bhavan join you?
(Bhavan మీతో రాలేదా?)

**Mukund:** He is yet to get over the shock of his bad score in the last exam.
(పోయిన exam లో వచ్చిన తక్కువ మార్కుల shock నుంచి అతడింకా తేరుకో లేదు.)

**Neeraj:** That's a pity. His failure was the least expected.
(అది దురదృష్టం. అతడు fail కావడం దాదాపు ఎవరూ అనుకోనిది.)

**Mukund:** Pardon! I didn't quite catch what you said.
(ఏంటీ? నువ్వన్నది నేను సరిగా విన్లేదు.)

**Neeraj:** I was saying few expected Bhavan to score so low.
(భవన్‌కు అంత తక్కువ మార్కులొస్తాయని దాదాపు ఎవరూ అనుకోలేదు అని అంటున్నా.)

**Mukund:** Oh, by the way, there's something you can do for me. But first I could use some coffee.
(అది సరేకానీ, నువ్వు నాకు చేయగల సాయం ఒకటుంది. అంతకుముందు కాస్త coffee తాగాలనుంది.)

**Neeraj:** Oh, sure. I feel like some good coffee too. Let's go to some good restaurant. But what can I do for you?
(తప్పకుండా. నాకూ coffee తాగాలనే అనిపిస్తోంది. మంచి హోటల్‌కెళ్దాం. అయితే నేను చేయగలిగిందేమిటి?)

**Mukund:** How about putting in a good word for me with our boss. Isn't he your cousin?
(నా గురించి ఓ మంచి మాట మా manager తో చెప్పకూడదా? అతడు నీ cousin కదా?)

**Neeraj:** Yes, he is. What do you want from him?
(అవును. నీకేం కావాలి అతడి నుంచి?)

**Mukund:** I want my section changed. That makes the work light for me.
(నా section మార్చుకోవాలనుంది. అందువల్ల పనిభారం తగ్గుతుంది.)

**Neeraj:** Unfortunately he knows better than to listen to me in such matters.
(దురదృష్టవశాత్తూ అతడు ఇలాంటి విషయాల్లో నా మాట వినడు.)

**Mukund:** But you are so close.
(మీరు చాలా సన్నిహితంగా ఉంటారు కదా?)

**Neeraj:** He believes in, and makes me understand,'Thus for and no further'?
(ఎవరు ఎంతవరకు ఉండాలో అంతవరకే ఉండాలనే విషయం నమ్ముతాడతడు.)

**Mukund:** I'm disappointed.
(నాకు నిరాశగా ఉంది.)

**Neeraj:** Don't worry. I'll still try. With any luck he may consider.
(ఫర్వాలేదులే. ప్రయత్నిస్తా. అదృష్టం బాగుంటే అతడు ఆలోచించవచ్చు.)

**Mukund:** Thank you.

Daily conversation లో వచ్చే మరికొన్ని high frequency spoken English expressions ఈ lesson లో చూద్దాం. వీటిని అవకాశం వచ్చినప్పుడల్లా వాడండి.




# Put in a good word for some one

***Look at the following sentences from the dialogue above:***
*1) It's very clever of you.*
*2) ... he asked the bearer to charge it up to him.*
*3) He did, for sure.*
*4) He is yet to get over the shock of his low score.*
*5) Pardon! I didn't quite catch what you said.*
*6) I could use some coffee.*
*7) .. putting in a good word for me ..*


M.SURESAN

**1) It's very clever of you=** అది నీ తెలివితేటలు. ఇలాంటి expressions మరికొన్ని ఇలా వాడవచ్చు. It's very good/ kind/ bad/ foolish of some one (you/ him/ her/ them etc.) = వాళ్లకా గుణాలున్నాయని చెప్పడం.

a) It was really great of Dharmaraja to save the Kouravas from the Gandharvas = గంధర్వుల బారినుంచి దుర్యోధనాదులను రక్షించడం ధర్మరాజు గొప్పతనం.
మనకెవరయినా సాయంచేస్తే, మామూలు thanks కంటే ఎక్కువ చెప్పేందుకు- It's very/ so kind of you అంటాం.

b) It's very bad of him to ill treat his wife = తన భార్యను బాధించడం అతడి దుర్మార్గం.

c) It was foolish of Dharmaraja to gamble with Sakuni = శకుడితో జూదమాడటం ధర్మరాజు అవివేకం.

**2) Charge it to some one/ charge some one for some thing** = ఒకరిని చెల్లించమనడం.

a) Charge the drinks to me, and my room rent and food to the company = పానీయాలకు నా దగ్గర వసూలు చేయండి/ నా ఖర్చుగా తీసుకోండి/ నేను చెల్లిస్తాను, నా గది అద్దె, ఆహారం company ఖర్చులో రాయండి/ నుంచి వసూలు చేయండి.

b) All expenses of ministers are charged to the government = మంత్రుల ఖర్చంతా ప్రభుత్వం నుంచి వసూలవుతుంది.

c) What's the bill? Charge it to me, please = Bill ఎంత? నా దగ్గర నుంచి తీసుకోండి.

d) He charged her Rs. 800/- for repairing the TV = TV repair చేసినందుకు ఆమె దగ్గర నుంచి ఎనిమిది వందల రూపాయలు తీసుకున్నాడు.

**3) For sure** = కచ్చితంగా/ నిస్సందేహంగా.

a) She will be back on Monday, for sure = ఆమె కచ్చితంగా సోమవారం తిరిగి ఇక్కడుంటుంది.

b) One thing is for sure. No party will get enough majority to form the government in the next elections. ఒకటి మాత్రం కచ్చితం. వచ్చే ఎన్నికల్లో ఏ పార్టీకీ ప్రభుత్వాన్ని ఏర్పరచే బలం రాదు.

**4) To get over** = బాధ/ జబ్బు నుంచి కోలుకోవడం/ మామూలు స్థితికి రావడం/ తేరుకోవడం.

a) Indira Gandhi never got over the untimely death of her son Sanjay Gandhi = తన కొడుకు సంజయ్‌గాంధీ అకాల మరణం వల్ల బాధ నుంచి ఇందిరాగాంధీ కోలుకోనేలేదు.

b) Get over it and start a new life = ఆ బాధ నుంచి తేరుకో. కొత్త జీవితం ప్రారంభించు.

c) It took months for her to get over the Jaundice = కామెర్ల నుంచి కోలుకునేందుకు ఆమెకు నెలలు పట్టింది.

**5) Pardon!:** ఎవరైనా చెప్పింది మనకు వినిపించనప్పుడు, మళ్లీ ఇంకోసారి చెప్పండని మర్యాదగా అడగడం. (I) Beg your pardon అని కూడా అంటాం. ముఖ్యంగా పెద్దవాళ్లతో/ మనకంటే పై స్థాయిలో ఉన్నవాళ్లతో/ అపరిచితులతో ఇలా అంటాం. అర్థం: ఏమన్నారు? అని.

Pardon అసలర్థం- క్షమించండి (sorry) (విననందుకు, మరోసారి చెప్పండి అనేందుకు)

Catch = మామూలు అర్థం, పట్టుకోవడం కదా? ఇక్కడి అర్థం, వినిపించడం.

Pardon, I couldn't catch you = క్షమించండి, మీరన్నది నాకు వినిపించలేదు. మరోమారు చెప్తారా?

**6) I could use some coffee.** ఇక్కడి 'use' అర్థం, Spoken Englishలో కావాలి/ ఇష్టం అని. ఇది చాలా బాగుంటుంది, Spoken English లో.

a) We could use a good dinner before going to a movie, couldn't we? = సినిమాకెళ్లేముందు మంచి dinner బాగుంటుంది కదా?/ మనకిష్టమే కదా?

b) You could use a good drink, I am sure = నీకిప్పుడు మంచి పానీయం అవసరం అనిపిస్తోంది నాకు.

c) I could use some hot stuff in this cold weather = ఈ చల్లటి వాతావరణంలో ఏదైనా వేడిగా తినాలనిపిస్తోంది నాకు.

**7) Put in a good word for some one** = ఒకరిని recommend/ సిఫారసు చేయడం. (వాళ్ల గురించి మంచిగా చెప్పడం).

a) His brother-in-law got the job because he put in a good word for him. = అతడు recommend చేయడం వల్ల అతడి బావమరిదికి ఆ ఉద్యోగం వచ్చింది.

b) He has none to put in a good word for him = అతడిని recommend చేసేందుకెవరూ లేరు. (English లో recommend గ్రాంథికం, Put in a good word for somebody/ put in a word in somebody's favour- ఇవి Spoken Language forms).

---

# Q & A

**Q.** *1. In respect of 2. by virtue of 3. be regarded 4. any how 5. mind blowing - వీటి అర్థాలేమిటి? 6. exchange - change తేడా ఏమిటి?*

***- A Sridhar, Oripenta***

**A. 1. In respect of** = దాన్ని గురించి/ ఆ విషయంలో.

1) The rule does not say anything in respect of the students of private schools = Private schools students విషయంలో, ఆ నిబంధన ఏం చెప్పడం లేదు.

2) They want to go to court in respect of the property = ఆ ఆస్తి విషయంలో వాళ్లు కోర్టుకు వెళ్లాలనుకుంటున్నారు.

అయితే in respect of వాడే చాలాచోట్ల about వాడొచ్చు. అది simple.

He said the same thing in respect of/ about those books = ఆ పుస్తకాల్ని గురించి/ పుస్తకాల విషయం అతడదే అన్నాడు.

**2. By virtue of:** Because of = అందువల్ల.

By virtue of her age she can't apply for the job = ఆమె వయసు వల్ల/ ఆమె వయసు కారణంగా, ఆమె ఆ ఉద్యోగానికి apply చేయలేదు.

By virtue of being a CM, he can travel at Govt expense = CM కావడంవల్ల ఆయన ప్రభుత్వ ఖర్చుతో ప్రయాణం చేయొచ్చు.

**3. Be regarded - Regard** = పరిగణించడం/ అనుకోవడం.

Be (am/ is/ are, etc..) regarded = పరిగణించబడటం (PV)

Gandhi is regarded as a Mahatma = Gandhi ఒక మహాత్ముడిగా పరిగణించబడుతున్నాడు. (మామూలు తెలుగు - గాంధీని మహాత్ముడిగా పరిగణిస్తాం)

He wants to be regarded as great = అతడు గొప్పవాడుగా పరిగణింపబడాలని అనుకుంటున్నాడు.

**4. Anyhow - 1)** ఏదేమైనా = any way.

I knew he wouldn't come, but any how I invited him/ I invited him any way = అతడు రాడని నాకు తెలుసు కానీ ఏదేమైనా అతడిని నేను ఆహ్వానించాను.

2) **Any how =** ఇష్టం వచ్చినట్లు (ఓ పద్ధతి లేకుండా). He put the things in the box anyhow and the box wouldn't close = ఆ పెట్టెలో వస్తువులు ఇష్టం వచ్చినట్టు పెట్టాడు, అదిప్పుడు మూసుకోవడం లేదు.

**5. Mind blowing** = దిగ్భ్రమ/ దిగ్భ్రాంతి కలిగించే.

a) Some of the feats in the circus were mind blowing = Circus లోని కొన్ని feats దిగ్భ్రమ కలిగించేవిగా ఉన్నాయి.

b) The way the husband cut off his wife's head and carried it to the police station is mind blowing = భార్య తల నరికి police station కు తీసుకెళ్లిన విధం దిగ్భ్రాంతి (shocking) కలిగిస్తోంది.

**6. Exchange** = మార్పిడి - ఒకదాన్నిచ్చి బదులింకోటి తీసుకోవడం.

They exchanged rings = వాళ్లు ఉంగరాలు మార్చుకున్నారు. ఒకరి ఉంగరం ఇంకొకరిదానితో మార్పిడి చేసుకున్నారు.

Change= మార్పు/ మారడం.

There is a change in the rule = నిబంధనలో మార్పుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ




# .. crying out for a corruption free govt

**Visisht:** The whole city was plunged into darkness for an hour last night. I ended up almost crashing into a lorry.

(నిన్న రాత్రి గంటసేపు నగరమంతా చీకట్లో మునిగిపోయింది. చివరికి నేను ఓ లారీకి ఢీకొన్నంత పనయింది)

**Vikranth:** What's so surprising about it? These things do happen. I think it was due to the power cut.

(అందులో అంత ఆశ్చర్యపడేదేముంది? ఇలాంటివి జరుగుతూనే ఉంటాయి. అది విద్యుత్తు కోత వల్ల అనుకుంటా.)

**Visisht:** But isn't the power cut from 3 to 6 in the evening? I am talking about the power going off at 9.

(విద్యుత్తు కోత సాయంత్రం 3 నుంచి 6 వరకు కదా? నేను మాట్లాడేది 9 గంటలకు current పోవడం గురించి)

**Vikranth:** Power supply is erratic these days. It doesn't fit in with the government's promise of limiting the power cut to regular hours.

(విద్యుత్ సరఫరా ఒక పద్ధతిగా ఉండటంలేదీ రోజుల్లో. ప్రతిరోజూ నిర్ణీత సమయానికి (కోత) పరిమితంగానే ఉంటుందన్న ప్రభుత్వ హామీకి పొంతన కుదరదు)

erratic= ఒక పద్ధతి లేకుండా

**Visisht:** The whole nation is crying out for more power and we are unable to step up our power generation.

(దేశం మొత్తం ఎక్కువ current కావాలని ఘోషపెడుతోంది, మనమేమో విద్యుదుత్పత్తిని పెంచలేకపోతున్నాం)

step up= పెంచడం/ ఎక్కువ చేయడం

**Vikranth:** That's exactly why our central government wants to sign the nuclear deal with the US. It will give us what we need very badly- plenty of electric power.

(సరిగ్గా అందుకే మన కేంద్ర ప్రభుత్వం అమెరికాతో అణు ఒప్పందం కుదుర్చుకోవాలనుకుంటోంది. మనకు ముఖ్యంగా కావలసిన-విద్యుచ్ఛక్తిని అదిస్తుంది.)

**Visisht:** It's not as simple as all that, friend. It's all very complicated. I doubt how many politicians that voted on the confidence motion know thoroughly about it.

(అంత సులభమైన విషయమేమీ కాదది. అసలు మొన్న విశ్వాసతీర్మానంలో ఓటేసిన రాజకీయవాదుల్లో ఎంత మందికి దాని గురించి క్షుణ్నంగా తెలుసనేది నాకనుమానమే.)

complicated = సంక్లిష్టమైన/ సులభం కానేకాని

thoroughly = క్షుణ్నంగా/ పూర్తిగా

**Vikranth:** (It was) quite a surprize win for the government. It had almost written off the support of some of the parties.

(అది ప్రభుత్వానికి ఆశ్చర్యకరమైన విజయమే. కొన్ని పార్టీల మద్దతు మీద దాదాపు నమ్మకం కోల్పోయిందది)

**Visisht:** I did expect the government to sail through. After all, horse-trading is not new to us.

(నేను గెలుస్తుందనే అనుకున్నా. ఏదేమైనా ఏదోవిధంగా మద్దతు తెచ్చుకోవడం మనకు కొత్తేం కాదుకదా? )

**Vikranth:** OK. Let's wind up our discussion here. How about taking a good walk along the tankbund.

(సరేలే. ఇంక చర్చ ముగిద్దాం. Tankbund వెంబడి కాసేపు నడుద్దామా? )

**Visisht:** Sorry, I don't feel up to it. I am tired. (I) wish to go home and take rest.

(Sorry, అంత ఓపిక లేదిప్పుడు నాకు. అలసిపోయా. ఇంటికెళ్లి విశ్రాంతి తీసుకుందామని అనుకుంటున్నా)


M.SURESAN

Daily real life situations లోని conversation లో ఎదురయ్యే మరికొన్ని expressions ఈ lesson లో చూద్దాం. అయితే ఈసారి expressions are of a slightly higher level. ఇది కూడా practise చేద్దాం, మన daily language లో భాగం చేసుకుందాం.

***Look at the following expressions from the dialogue above***

*1) The whole city was plunged into darkness*

*2) It doesn't fit in with ...*

*3) The whole nation is crying out for more power.*

*4) It had written off the support of some of the parties.*

*5) I did expect the govt to sail through*

*6) Let's wind up our discussion here.*

**1) Plunge** (Past tense & PP: Plunged): పడిపోవడం/ దూకడం/ మునగడం/ ముంచడం

a) He climbed up the tower and plunged to his death = Tower మీదికెక్కి పడిపోయాడు చావు కలిగేలా. (Tower మీదికెక్కి పడి చనిపోయాడు-ప్రమాదవశాత్తు కావచ్చు/ ఆత్మహత్యా కావచ్చు)

b) Stock market prices which had plunged last week recovered with the UPA victory = క్రితం వారం పతనమైన stock market ధరలు, UPA గెలుపుతో కోలుకున్నాయి.

c) He plunged into the river to save the drowning child = మునిగిపోతున్న బిడ్డను రక్షించేందుకు అతడు నదిలోకి దూకాడు.

d) The robber plunged a knife into the man's chest = ఆ దోపిడిదొంగ అతడిని కత్తితో పొడిచాడు.

e) Soon after Gandhi's returned from South Africa he plunged into politics= దక్షిణాఫ్రికా నుంచి తిరిగి రాగానే, గాంధీ రాజకీయాల్లోకి ప్రవేశం చాడు/ మునిగిపోయాడు. (ముఖ్యంగా ఉత్సాహంతో, sudden గా చేయడం)

**2) Fit in with:** సరిపోవడం/ Suit కావడం/ ఇమడటం

a) In the beginning he found it difficult to fit in with the people working here = మొదట్లో ఇక్కడ పనిచేస్తున్న వాళ్లతో సర్దుకోలేకపోయాడు.

b) Your arrangements do not fit in with your plans = నీ ఏర్పాట్లు నీ పథకం ప్రకారం లేవు.

c) Where do I fit in here? You are all doctors and I am an engineer = నేనిక్కడ ఎలా ఇమడతాను? మీరందరూ doctors; నేను engineer ను.

**3) Cry out for =** చాలా అవసరమైనదానికోసం ఆరాటపడటం/ కోరుకోవడం.

a) Having lost its parents the child is crying out for parental love= తల్లిదండ్రులను పోగొట్టుకున్న ఆ బిడ్డ తల్లిదండ్రుల ప్రేమకోసం ఆరాటపడుతోంది.

b) The country is crying out for a corruption free government = దేశం అవినీతి లేని ప్రభుత్వం కోసం ఆరాటపడిపోతోంది.

దీనికి సంబంధించిందే, crying need = చాలా అవసరమైన విషయం.

a) The crying need of the hour is a leader of great leader = ప్రస్తుతం దేశానికి అత్యవసరమైనది ఓ గొప్ప నాయకుడు.

b) Full employment is the crying need of the hour = పూర్తి ఉద్యోగిత ఇప్పటి అత్యవసర విషయం.

of the hour = ప్రస్తుత/ మనం మాట్లాడుతున్న సమయపు

**4) It had written off** - to write some person/ something off = ఒక వ్యక్తి/ ఓ విషయం గురించి ఆశ వదలుకోవడం. ముఖ్యంగా వసూలుకాని బాకీలను వదులుకోవడం/ ఆశ వదులుకోవడం.

a) The company has written off the amount as a bad debt = వసూలు చేసుకోలేని బాకీగా ఆ company ఆ మొత్తాన్ని వదులుకుంది.

b) The old parents have written off their son as totally unhelpful = ఆ ముసలి తల్లిదండ్రులు తమ కొడుకు సహాయంమీద ఆశ వదులుకున్నారు.

c) It's too big an amount to be written off = అది వదులుకోలేనంత పెద్ద మొత్తం

d) I've written off our leaders and parties as good for nothing = మన నాయకులు, పార్టీలు దేనికీ పనికిరారని నేను ఆశ వదులుకున్నా.

**5) To sail through** = గండం గడిచి గట్టెక్కడం.

a) The UPA has sailed through the confidence vote = UPA ప్రభుత్వం గండం గడిచి గట్టెక్కింది.

b) The team sailed through to a win = గెలుపుకు ఆ జట్టు గండం గడిచి గట్టెక్కింది.

c) No one expected him to sail through to success in the exam = పరీక్షలో గండం గడిచి అతడు నెగ్గుతాడని ఎవరూ అనుకోలేదు.

**6) Wind up** - wound up (PT & PP) = ముగించడం

a) The leader wound up his speech with an appeal to the students to serve the society = విద్యార్థులను సమాజసేవ చేయాల్సిందిగా కోరుతూ, ఆయన తన ఉపన్యాసాన్ని ముగించాడు.

b) Let's wind up the show = ఈ ప్రదర్శనను ఇంతటితో ముగిద్దాం.

c) Because of losses they have decided to wind up their business = నష్టాలవల్ల వ్యాపారాన్ని మూసేయాలని నిర్ణయించుకున్నారు వాళ్లు.




**Q.** *1. Elect, Select అర్థం, ఉపయోగం తెలుపగలరు.*

*2. grace or god's grace? ఏది కరెక్టు?*

*3. turnkey అర్థం ఉపయోగం తెలుపగలరు.*

*4. Benchmark అర్థం ఏమిటి? ఎలా వాడాలి?*

*5. Earmark ను ఎలా ఉపయోగించవచ్చు?*

*6. Grams కు ఇంకో అర్థం గురించి వివరించగలరు.*

*7. Abbreviation for telegram అంటే ఏమిటి?*

*8. Bindover అర్థం, ఉపయోగం వివరించగలరు.*

*9. Boost అంటే ఏమిటి?*

*10. కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా అంటారు?*

*a) నువ్వు వస్తానంటే నే వద్దంటానా?*

*b) నువ్వు వస్తానంటే నేను వద్దంటాను.*

*c) నేను వస్తానంటే నువ్వు వద్దంటావా?*

*d) నేను వస్తానంటే నువ్వు వద్దంటావు.*

***- A Sridhar, Oripenta***

**A.** 1) Elect = ఎన్నుకోవడం. They elected him President = అతడిని అధ్యక్షుడిగా ఎన్నుకున్నారు వాళ్లు. నలుగురైదుగురు కలిసి ఓ అభ్యర్థిని ఎన్నుకోవడం.

Select = ఎంచుకోవడం/ ఎంపిక చేసుకోవడం.

He selected this shirt from among the ten shirts there= అక్కడున్న 10 shirts లో అతడు ఈ shirt ను ఎంచుకున్నాడు/ ఎంపిక చేసుకున్నాడు. (ఇది ఒక్కరే చేయొచ్చు/ ఎక్కువ మంది చేయొచ్చు) ఇష్టపడటమని కూడా అర్థం.

2) God's grace. correct

3) Turnkey= వెంటనే వాడేందుకు వీలుగా తయారుచేసి ఇవ్వడం.

The company executes projects on a turn key basis = ప్రాజెక్టులను వాడేందుకు సిద్ధంగా ఉండేలా తయారుచేసి ఇస్తుంది ఆ కంపెనీ.

4) Benchmark = నాణ్యతా ప్రమాణం.

Sachin's play is the benchmark against with other players can be judged = ఇతర క్రీడాకారుల సామర్థ్యాన్ని కొలిచేందుకు Sachin ను ప్రమాణంగా తీసుకుంటారు.

5) Earmark - 1) కేటాయించడం. (usually passive)

50% of the seats are earmarked for backward classes = 50 శాతం seat లు వెనుకబడిన వర్గాలకు కేటాయించారు.

2) ఒక పనికి/ ఉద్దేశానికి దేన్నైనా, ఎవరినైనా అనుకోవడం/ గుర్తించడం.

Rahul Gandhi is earmarked as the future PM of India = భావి ప్రధానిగా రాహుల్‌గాంధీ గుర్తించబడుతున్నాడు/ అనుకుంటున్నారు.

6) American spelling of Gramme.

7) Abbreviation for telegram - కొన్ని Company లు తమకు తక్కువ ధరతో telegram పంపేందుకిచ్చే telegraphic పేరు. ఇది రాస్తే address లో మాటలు తగ్గి పొదుపు అవుతుంది.

8) Bindover = (నేరాలకు సంబంధించి) ఏదైనా, ఏ ప్రదేశంలోనైనా జరిగే నేరాలకూ, ఒకరిపై జరిగే ఎలాంటి దౌర్జన్యానికీ, ఎవరినైనా బాధ్యులుగా చేయడం. ఇది Police లు నేర చరిత్ర ఉన్నవాళ్లను కట్టడి చేసే విధం.

9) Boost = ప్రోత్సాహం, మద్దతు ఇవ్వడం.

10. a) If you wish to come you're welcome.

b) I am against your coming/ if you want to come, I will say no.

c) If I want to come, Will you say no?

d) If I want to come, you will say no.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



**Q. 1.** "అతడిని నాకు పరిచయం చెయ్యవా?" - దీనిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?
**2.** "How do you do?" అన్నప్పుడు మనం తిరిగి అదే వాక్యం చెప్పడం సమాధానం ఎలా అవుతుంది?
**3.** Of course ను ఏయే సందర్భాల్లో వాడతారు?
**4.** "నీ కోసం ఎన్ని ఇబ్బందులెదుర్కొన్నానో నీకు తెలియదు?"- దీనిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?
**5.** అవార్డుకు, రివార్డుకు మధ్య తేడా ఏమిటి?
**6.** "నేనింతే" అనడానికి ఇంగ్లిష్‌లో ఏమనాలి?
**7.** "వెధవ (వెత్త) సలహాలివ్వకు"- దీనిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

*- Dr.Ramesh, J.Krishna, Rajapuram*

**A. 1)** Won't you/ wouldn't you/ why don't you/ introduce him to me?/ How about introducing him to me?

**2)** "How do you do?" ను ప్రశ్న రూపంలో ఉన్న సమాధానంగా తీసుకోవాలి. అది English వాళ్ల సంప్రదాయం.

**3)** కచ్చితంగా/ అంతేకదా/ అది వేరే చెప్పాలా? ఈ అర్థాలే కాకుండా మర్యాదకరంగా అనుమతి ఇవ్వడానికి కూడా వాడతాం.

'Can I have your pen?'
'of course you can' (తప్పకుండా).
ఇంకా 'అది తెలుస్తూనే ఉంది కదా?' అనే అర్థం కూడా వస్తుంది.
'Did India lose in the finals?'
(ఇండియా finals లో ఓడిపోయిందా?)'
'of course, it did' (అంతేగాక మరేముంది)

**4)** You don't know how much trouble I faced for your sake.

**5)** Award- ఒకరి సేవలకు, గొప్పతనానికి, ప్రతిభకు ఇచ్చే బహుమతి, బిరుదు, సత్కారం.
Award- మామూలుగా కొంతకాలంగా ఒకరి కృషి/ ప్రతిభకు గుర్తింపు.
Reward- ఒక నిర్దిష్టమైన పనికి ఇచ్చే బహుమతి.
a) Reward for good behaviour (మంచి నడవడికి పురస్కారం)
b) The father rewarded the son for his good score in the exam (పరీక్షల్లో మంచి మార్కులకు బహుమతి)
కృషి, శ్రమకు ప్రతిఫలం కూడా reward.

**6)** I am what I am/ That's what I am.

**7)** Don't give stupid/ useless advice.

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 482



**Q. 1.** Either - or, Neither - nor, though - but, not only but also గురించి వివరించగలరు.
**2.** ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలో తెలుపగలరు. ఎ) వరదలు బీభత్సాన్ని సృష్టిస్తున్నాయి. బి) నష్టపోయినవారికి సీఎం పక్కా ఇళ్లు కట్టిస్తామని హామీ ఇచ్చారు. సి) ఆ పడవ నీటిలో మునిగిపోయింది. డి) ప్రభుత్వం ఇచ్చిన హామీలను నెరవేర్చలేకపోయింది. ఇ) వాయుగుండం అల్ప పీడనంగా మారే అవకాశం ఉంది.

*- Lakshmana Rao, Jangareddygudem*

**A. 1.** Either-or- అదైనా/ఇదైనా (రెండింటిలో/ ఇద్దరిలో)
Either Guntur or Vijayawada will be the venue of meeting = గుంటూరుగానీ, విజయవాడగానీ ఈ సభకు వేదికగా ఉంటుంది.
Neither - nor (రెండింటిలో ఏదీలేదు)
I like neither idly nor puri= నాకు ఇడ్లీ ఇష్టంలేదు, పూరీ ఇష్టంలేదు.
Though= అయినప్పటికీ, but = అయితే.
Though he is rich he does not spend much = అతడు ధనికుడైనప్పటికీ ఎక్కువ ఖర్చుపెట్టడు = He is rich but he doesn't spend much = అతడు ధనికుడు కానీ ఎక్కువ ఖర్చు పెట్టడు.
Not only but also = అదేగాక ఇది కూడా.
He is not only handsome but also clever = అతడు అందగాడే కాకుండా తెలివిగలవాడు కూడా.

**2.** a) The floods are causing havoc.
b) The CM has assured those affected/ the victims that proper houses would be built for them.
c) The boat sank.
d) The government hasn't been able to keep its promises.
e) The cyclonic wind is likely to turn into a depression.

**Q. 1.** Who knows the answer? (సమాధానం ఎవరికి తెలుసు అనే అర్థంతో) తప్పుకదా? మీరలా వాడారు. ఇక్కడ whom బదులు who ఉండాలికదా?
**2.** What brings you here? అన్నారు. ఈ వాక్యం simple present లో ఉంది కదా. You తో verb కు s చేరదుకదా, అంతేకాకుండా question form తో do/ does వాడాలికదా?
**3.** "ఏ హోటల్‌లో ఉంటాయి పూరీలు?" దీనిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి? దీనిలో sub, verb, object ఏమిటి? వాటిని ఎలా అమర్చాలి?
**4.** Gold Rush అంటే ఏమిటి? ఇది వాడుకలో ఉందా?
**5.** Certainly, O.K., Of course.. వీటిమధ్య తేడా ఏమిటి?
**6.** మీరు "She went/ left for the U.S. last week అన్నారు. Left అంటే వదలడం కదా. వ్యతిరేక అర్థం రాదా?

*- B.Viveka Satyanandam, Korukonda*

**A. 1)** తెలుగులో 'ఎవరికి' అని వాడినప్పటికీ, English లో know కు తెలియడం అని చెప్పేందుకు I/ we/ you/ he/ she/ it/ they/ who అనే అంటాం, me/ us/ him/ her/ them/ whom రాదు.

**2)** Simple present లో he/ she/ it కు మాత్రమే verb కు 's' or 'es' చేరుస్తాం. What/ who తో కొన్ని సందర్భాల్లో question కు do/ does రాదు, ముఖ్యంగా 'who' తో.
Who does know/ who does like లాంటి question forms లేవు.

**3)** Where/ In which restaurant do we get puris?
we - subject, do get (=get)- verb.

**4)** ఎక్కడైనా బంగారం ఉంది అని తెలుసుకుని గుంపులు గుంపులుగా ప్రజలక్కడికి వెళ్లడం.

**5)** Certainly= of course= కచ్చితంగా/ correct.
OK = సరేలే/ all right.

**6)** Left అనేది leave కు past tense. Leave అంటే వదిలేయడమనే అర్థమే కాకుండా, ఒక ప్రదేశం వదిలివెళ్లడం (= బయలుదేరడం/ వెళ్లిపోవడం) అనే అర్థం కూడా ఉంది.
The train leaves Vijayawada at 7 = ఏడింటికి ఆ train Vijayawada వదులుతుంది.

# a car can be a white elephant

**Q.** ఈ పదాలకు అర్థాలను ఉదాహరణలతో తెలుపగలరు. 1. On the other hand. 2. At the risk of 3. Quondam friend 4. Read between the lines. 5. Red letter day. 6. To and fro. 7. White elephant. 8. Wear and tear. 9. While away. 10. Go to the wall.

*- A. Penchalaiah, Rajampeta*

**A. 1)** On the other hand= ఇది on the one hand ..., on the other hand అనే phrase లో భాగం. పరస్పరం భిన్నంగా, ముఖ్యంగా వ్యతిరేకంగా ఉన్న భావాలను తెలపాలనుకున్నప్పుడు ఈ phrase వాడతాం. అర్థం: ఒకవైపేమో... ఇంకోవైపేమో...
a) On the one hand he wants to see the film actor, but on the other he doesn't want to miss the class= అతడికి ఒకవైపేమో ఆ నటుడ్ని చూడాలని ఉంది, మరోవైపు class పోగొట్టుకోవడం ఇష్టంలేదు.
b) On the one hand she knows she can't go alone, but on the other (hand) she is unwilling to ask for other's help= (ఒకవైపేమో) తనేమో ఒంటరిగా వెళ్లలేదు. మరోవైపు ఇతరుల సాయం అడగడం తనకిష్టంలేదు.

**2)** At the risk of= అంత ప్రమాదమైనప్పటికీ/ చాలా ప్రమాదానికి సిద్ధపడి - (ముఖ్యంగా మన తెలివిలేని తనం బయటపడే ప్రమాదం/ ఇతర్లకు కోపం కలిగించే విధంగా)
a) At the risk of angering my father, I took my girl friend to a movie= మా నాన్నకు కోపం కలిగించే ప్రమాదానికి సిద్ధపడి నా girl friend ను సినిమాకు తీసుకెళ్లా.


M.SURESAN

b) The government wants to sign the nuclear pact even at the risk of our independence = మన స్వాతంత్ర్యాన్ని కోల్పోయే ప్రమాదానికి కూడా సిద్ధపడి, మన ప్రభుత్వం అమెరికాతో అణు ఒప్పందం కుదుర్చుకోవాలనుకుంటోంది.

**3)** Quondam friend= పాతకాలపు స్నేహితుడు. ఇది చాలా గ్రాంథికం/ పాండిత్యం. Quondam బదులు, one-time వాడటం మెరుగు.

**4)** Read between the lines= find out a meaning not directly stated- పైకి కనిపించని అర్థం (ఒక రచనలో)
Reading between the lines, I am sure she wants a share in the property = ఆమె చెప్పేదానికి పైకి తెలియని అర్థం, తనకు ఆస్తిలో వాటా కావాలని.

**5)** Red letter day- A very important day/ A day that we can't forget easily.
Aug 15 is a red letter day in the history of India.

**6)** To and fro = to and from = అటు ఇటు
a) In his worry he was walking to and fro in the room = ఆందోళనతో గదిలో అటు ఇటు తిరుగుతున్నాడు.
b) You will be paid I class to and fro charges = రెండువైపులా I class charges నీకు చెల్లిస్తారు.

**7)** White elephant= a very expensive thing= చాలా ఖరీదైన వస్తువు/ విషయం.
In these days of spiralling oil prices, a car can be a white elephant= పెట్రోల్ ధరలు విపరీతంగా పెరుగుతున్న ఈ రోజుల్లో, car వాడటం చాలా ఖర్చయిన విషయం.

**8)** Wear and tear= అరుగుదల (వస్తువులు, ముఖ్యంగా వాహనాల్లాంటివి)
The cost of a thing goes as decreasing because of a wear and tear = అరుగుదలవల్ల వస్తువు ధర తగ్గిపోతూ ఉంటుంది.

**9)** While away = కాలంగడిపేయడం పనీపాటాలేకుండా.
While he is very busy, his brother whiles away time watching the TV= అతడు తీరికలేకుండా ఉంటే, అతడి తమ్ముడు TV చూస్తూ కాలం గడిపేస్తుంటాడు.

**10)** Go to the wall= ఓ company/ సంస్థ నిధుల కొరతవల్ల నష్టపోవడం/ విఫలమవడం, వ్యాపారం చేయలేకపోవడం.
The company went to the wall because of mismanagement of funds= నిధుల యజమాన్యంలో లోపాలవల్ల company నష్టపోయింది/ మూసేయాల్సిన/ దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది.

**Q. 1.** Demise, Die, Expire, Pass away ... వీటి మధ్య తేడా ఏమిటి?
**2.** Dismissal, removal, retrench వీటి అర్థాలను వివరించగలరు.

*- N.Pentaiah, Ghatkeswar*

**A. 1. Demise-** ఒక అర్థం- ఒక సంస్థ/ వ్యవస్థ/ company/ పథకం. వీటి అంతం లేదా విఫలం అని. మరణం అనే అర్థంతో చట్టపరిభాషలో, గ్రాంథికంగా గానీ, హాస్యానికి గానీ మాత్రమే వాడతారు. మామూలు spoken/ written English లో వాడరు.

**Die-** చనిపోవడం- Indian English లో మరణం అనే అర్థంతో ఇది వాడటం చాలామంది తప్పుగా అమర్యాదకరంగా భావించి, demise/ expire అని వాడుతుంటారు. అది సరికాదు. Die అమర్యాదకరమైన పదంకాదు; సహజమైన భాషలో భాగం. Demise/ expire, die కి బదులు వాడటం- మామూలు spoken/ written English లో ఛాందసంగా, గ్రాంథికంగా ఉంటుంది.

**Expire:** దేనికైనా కాలం చెల్లడం. ఒక పత్రానికి/ ఒప్పందానికి/ పదవికి కాలం దాటిపోయి అది ఏమాత్రం అమల్లో లేకపోవడం. మందుల విషయంలో కూడా ఒక నిర్దిష్ట కాలం తర్వాత వాడనివి date expired అవుతాయి. Expire కు చావు అనే అర్థం ఉంది, అయితే ఇది చాలా గ్రాంథికం- spoken English లో పాండిత్యం అవుతుంది.

**Pass away-** చనిపోవడం- Die అనే మాట వాడటం ఇష్టంలేకపోతే ఇది వాడొచ్చు. ఇది conversational. సులభంగా అర్థమయ్యే మాట కూడా.

**2) Dismiss-** తొలగించడం. ఇది ముఖ్యంగా, పదవిలో/ ఉద్యోగంలో ఉన్నవారిని శిక్షించేందుకు తొలగించడం.

**Remove** కూడా దాదాపు ఇంతే. పదవి/ ఉద్యోగం నుంచి తొలగించడం, శిక్షగా/ ప్రతీకారంగా.

**Retrench** కి అసలర్థం- ప్రభుత్వం/ company ఖర్చు తగ్గించుకోవడానికిగానీ, పొదుపుకోసంగానీ ఉద్యోగులను తీసేయడం retrench. ఇది శిక్ష/ ప్రతీకారంకాదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# He has been playing cricket ..



**R.M.V.N. Ramakantha Rao, Visakhapatnam**

**Q.** *రెన్ అండ్ మార్టిన్ వ్యాకరణ పుస్తకంలో క్రియను Present Perfect Tense లో ఏయే సందర్భాల్లో వాడాలో చర్చిస్తూ: "To denote an action beginning at some time in the past and continuing up to the present moment" అని ఉంది. మళ్లీ Present Perfect Continuous Tense గురించి కూడా అలాగే రాసుంది. "The Present Perfect continuous is used for an action which began at some time in the past and is still continuing". ఇది కాస్త confusion కు గురిచేస్తుంది. వివరించగలరు.*

**A.** Present Perfect Tense talks of an action continuing up to the present moment, where as Present Perfect Continuous denotes an action starting in the past and continuing even now.

He has played cricket for half an hour now - అరగంటగా cricket ఆడాడు- ఇప్పటివరకు. ఇంకా ఆడుతున్నాడా/ ఆపేశాడా అనేది ఈ tense clear గా తెలుపదు.

అదే Present Perfect Continuous అయితే (He has been playing cricket for the past half an hour) అతడు అరగంటగా cricket ఆడుతున్నాడు (ఇప్పుడింకా ఆడుతూనే ఉన్నాడు) అనే అర్థం వస్తుంది.

Present Perfect - అప్పటినుంచి ఇప్పటివరకు.

Present Perfect Continuous - అప్పటినుంచి ఇంకా. అయితే ఈ తేడా అంతగా పాటించనక్కరలేదు. ఎందుకంటే I have been waiting for you for the past one hour. (Present Per. Cont) అనే sentence తీసుకుందాం. ఈ sentence, wait చేస్తున్న వాళ్లు, ఎవరికోసం wait చేస్తున్నారో, వాళ్లతో, వాళ్లువచ్చినప్పుడే అనగలరు కదా? వాళ్లు వచ్చేసిన తర్వాత waiting అయిపోయినట్లే కదా? అంటే ఇక్కడ Present Perfect Continuous Tense ను ఇంతవరకూ జరిగిన పనికేగానీ, ఇంకా continue అవుతున్న action కు వాడటం లేదు కదా?

దీన్నిబట్టి, మనకు తెలిసేది: Present Perfect కూ, Present Perfect Continuous Tense కూ తేడా అంతగా లేదని. అయితే continuity ని ఎక్కువ stress చేయాల్సినపుడు Pr. per. cont. tense better.

**Q.** *సిద్ధాంతపరంగా 'shall' First persons లో futurity ని, second and third person లో compulsion (command, promise, threat) ని సూచిస్తుంది. అలాగే 'will' First Persons లో certainty ని, second and third person లో futurity ని సూచిస్తుంది కదా. కానీ ప్రస్తుతం ఈ తారతమ్యాలు లేకుండానే shall ను will ను indiscriminate గా వాడుతున్నారు. పైగా shall చాలా అరుదుగా కనిపిస్తోంది. సరైనదేనా?*

**A.** Modern English usage లో shall కూ, will కూ తేడా దాదాపు అంతరించిపోయింది. American English లో shall దాదాపు వాడటం లేదు. I and we తో మాత్రమే shall వాడుతున్నారు, అది కూడా చాలా గ్రాంథికం అనుకుంటారు. we/ I shall be happy, I/ we shall be late బదులు, I/ we will be happy/ late అనే అనేస్తున్నారు.

British English లో కూడా shall వాడకం I and we తో questions కు మాత్రమే, అదీ offers/ suggestions కు వాడుతున్నారు, Shall I make you some coffee/ shall we start? లోలా.

ఇది సరైనదా కాదా అనే విషయం Educated people with English as mother tongue ఎలా మాట్లాడతారనేదాన్ని బట్టి ఉంటుంది కదా? అలాంటివాళ్ల వాడుక ప్రయోగాలే standard అవుతాయి. Usage is more powerful than grammar or dictionary అనే సూక్తి ఉండనే ఉంది కదా. Native speakers వాడే expressions కొంతకాలానికి dictionary/ grammar లో accept అవుతుంటాయి. అది మనం సరైందే అని accept చేయాల్సిందే. అంతేకాకుండా అందువల్ల language simplify అవుతోంది. అది మంచిదే.

---

**U. Ajay Kumar, Adilabad**

**Q.** *Nom de plume = Agnomen = cognomen = soubriquet ? ఈ పదాలన్నీ సమానార్థకాలేనా?*

**A.** ఒకటే = Nickname- మారుపేరు = మరో పేరు. English లో nickname అగౌరవ సూచకంకాదు.

**Q.** *Perdition, subversion, spiflication, havoc, dilapidation, annihilation, devastation, extermination, damnation, extirpation, desolation ఒకటేనా?*

**A.** Perdition, damnation = పాపులు, చావు తర్వాత పొందే నరకయాతన. శాపనార్థాలకు వాడే మాటలు. మిగతా మాటలన్నీ నాశనం అనే అర్థంతో synonyms.

**Q.** *Picnic, junket, jaunt, outing, fete champetre= వనభోజన యాత్ర. కరెక్టేనా?*

**A.** Picnic= outing = fete champetre = భోజన విహారయాత్ర- Fete champetre- French మాట- English లో అరుదు.

Junket = సరదాయాత్ర, ముఖ్యంగా ప్రజాధనంతో. (మన మంత్రులు ప్రభుత్వ ఖర్చుతో విదేశాలు తిరిగి రావడం లాంటిది)

Jaunt = సరదా ప్రయాణం

**Q.** *Journey = peregrination = travel ఒకటేనా?*

**A.** Journey = Travel = Peregrination (పాండిత్యం)

**Q.** *Rialto= Market= Bazar ఇవన్నీ ఒకటేనా?*

**A.** ఒకటే.

**Q.** *Thorough fare = main road. కరెక్టేనా?*

**A.** Correct.

**Q.** *Thingumabob = anonymous?*

**A.** Anonymous= పేరు తెలియని/ అజ్ఞాత/ సంతకం లేని (letters లాంటివి). Thingamabob = సమయానికి సరిగా గుర్తురాని వస్తువు/ వ్యక్తికి వాడే మాట.

**Q.** *Funeral song = cremation song = plaintive song = elegy = dirge = threnody?*

**A.** Plaintive song = విషాద గీతం.

Elegy = చనిపోయినవారి జ్ఞాపకార్థం రాసే కవిత్వం. మిగతావన్నీ ఒక్కటే. అర్థం- చరమగీతం.

**Q.** *Repository, necropolis, crematorium, crematory, cemetery, burial ground, grave yard.*

**A.** Repository (నిధి)- మిగతా మాటలతో దీనికి సంబంధం లేదు.

Crematorium = Crematory = (మృతదేహాల) దహనశాల (శ్మశానం)

Necropolis= burial ground = grave yard = cemetery (మృతదేహాలను పూడ్చిపెట్టేచోటు (శ్మశానం)

**Q.** *Moll, demirep, wench, drab, trollop, tramp, havlot, pro, whore, floozy, strumpet, scarlet woman, courtesan, adulteress, bawd, prostitute- ఒకటేనా?*

**A.** ఈ కింది వాటికి తప్ప మిగతా వాటికొకే అర్థం, వేశ్య అని. Drab ను ఈ అర్థంతో ఇప్పుడు వాడటం లేదు.

Wench= ఆడవాళ్లకు కాస్త అమర్యాదకరమైన మాట.

Courtesan = వేశ్య. అయితే పాతరోజుల్లో రాజుల కొలువులో దేవదాసీలలాంటివాళ్లు. ఇప్పటి వేశ్యావృత్తిలో ఉన్న స్త్రీలకిది వర్తించదు.


M.SURESAN

Tramp= వేశ్య, అయితే చాలా అరుదు.

Adulteress= భర్త కానివారితో సంబంధం ఉన్న స్త్రీ

Adulterer= భార్యకాని వారితో సంబంధంకల పురుషుడు.

Pro= దీనికి వేశ్య అనే అర్థం లేదు. ఏదయినా వ్యాపకాన్ని వృత్తిగా కలవాళ్లు- professionals- దీనికి abbreviation 'Pro'. ఇప్పుడు సానియా మీర్జా- Pro = Professional Tennis Player (ఆమె వృత్తి, tennis క్రీడ.)

**Q.** *Exorcist, warlock, conjurer, charmer, enchanter, magician, juggler, necromancer, sorcerer, wizard, prestidigitator కు అర్థం ఒకటేనా?*

**A.** అన్నీ ఇంద్రజాలం/ మాయాజాలం/ గారడీకి సంబంధించిన మాటలే, అయితే తేడాలున్నాయి.

Exorcist = అతీతశక్తులతో మనుషులకు పట్టే దయ్యాలను వదలగొడతామని చెప్పుకొనేవాళ్లు.

Warlock = చేతబడిలాంటివి చేయగలవాళ్లు అని.

Conjurer = ఏమీలేనిచోట వస్తువులను/ మనుషులను కనపడేట్టు చేయగలవాళ్లు. (ఖాళీగా ఉన్న చేతిలో డబ్బులాంటివి కనపడేట్టు చేయగలవాళ్లు).

Charmer = మంత్రజాలంతో ఇతరులను తమపట్ల ఆకర్షింపజేసుకోగలవాళ్లు/ సమ్మోహనశక్తిగలవాళ్లు = Enchanter = మాంత్రిక శక్తులతో ఇతరులను వశం చేసుకోగలవాళ్లు

Juggler= 4, 5 వస్తువులను (బంతుల్లాంటి వాటిని) గాల్లోకెగరేసి ఏదీ కిందపడకుండా పట్టుకొనేవాళ్లు = Prestidigitator= Necromancer= చనిపోయిన వారి ఆత్మలతో సంభాషించగల శక్తులున్నవాళ్లు.

Sorcerer = భూత ప్రేత పిశాచ శక్తులతో ఏమైనా చేయించుకోగలిగేవాళ్లు అని.

Wizard = మాంత్రికుడు/ కనికట్టు విద్య తెలిసినవాళ్లు. అయితే ఏ రంగంలో అయినా నైపుణ్యంకలవాళ్లను కూడా ఆ రంగ Wizard అంటారు. Sachin is a batting/ cricket Wizard. The boy is a computer Wizard (Computer లో నిపుణుడు)

**Q.** *Hai, Hi ఈ రెండింటిలో ఏది కరెక్టు?*

**A.** Hi అనేది correct.

**Q.** *Jeopardy, menace, peril, hazard, danger, breakneck అర్థం ఒకటేనా?*

**A.** ఒకటే. అయితే breakneck ను ప్రమాదకరమైన వేగానికి (breakneck speed) వాడతారు. మిగతా వాటి మధ్యలో కూడా చిన్న చిన్న తేడాలున్నాయి.

**Q.** *Hospital = infirmary = dispensary ఒకటేనా?*

**A.** ఒకటే కావు. Infirmary అంటే కూడా ఆసుపత్రే, అయితే ఏదైనా ఓ సంస్థలో/ ఓ factory లోని వాళ్లకు వైద్యం చేసే ఆసుపత్రి (విడిగా కాకుండా)- అది ఆ సంస్థలో భాగం. Dispensary= ఆసుపత్రిలో మందులు కలిపి ఇచ్చే భాగం.

**Q.** *Vade-mecurm= handbook= bibelot= leaflet ఒకటేనా?*

**A.** Vade-mecurm= bibelot= pocket book.

Leaflet= folder= printed సమాచార పత్రం- మడతపెట్టిన రెండు మూడు పేజీల సమాచారం ఉన్న paper.

---

**SK Abbas, Nellore**

**Q.** *కాల్ సెంటర్, బి.పి.ఒ. సిబ్బందికి ట్రెయినింగ్ ఇచ్చే వాయిస్ ట్రైనర్‌గా, English Language Trainer గా career ఎంచుకోవాలనుకుంటున్నాను. అందుకు కావాల్సిన విద్యార్హతలు, కోర్సుల వివరాలు తెలుపగలరు.*

**A.** మీ ఆశయం చాలా మంచిదే. మీరు చేయాల్సింది- 1) English & Foreign Languages University, Hyderabad లో Diploma course in communication skills లాంటివి వెంటనే చేయడం. 2) పై Institute/ British Council/ Oxford/ Cambridge వాళ్ల English Language CDs సహాయం తీసుకోవడం. 3) English speaking బాగా practise చేయండి. 4) Call centre training/ Accent training courses (హైదరాబాద్‌లో ఇలాంటి courses నిర్వహించే institutes చాలా ఉన్నాయి.) లో చేరండి. శిక్షణ పొందండి. ఇది చాలా ముఖ్యం. ఎంత వీలుంటే అంత English చదవండి- ముఖ్యంగా novels లాంటివి. 5) Eenadu spoken English lessons లో ప్రతి lesson ముందు ఇచ్చే conversation మీ friend (s) తో practice చేయండి.

---

**A.Sridhar, Oripenta**

**Q.** *Cost to cost sale అంటే ?*

**A.** కొన్న ధరకే అమ్మేయడం లాభం వేసుకోకుండా/ తయారుచేసిన ఖర్చుతో లాభంలేకుండా అమ్మడం.

**Q.** *Up date అంటే ఏమిటి?*

**A.** Up date= ఈ క్షణం వరకూ జరిగిన/ ఉన్న విషయాలను సమాచారాన్ని మార్పులను తెలుసుకోవడం/ తెలియజేయడం.

**Q.** *Upto date అంటే ఏమిటి?*

**A.** Up to date= తాజా/ నూతన.

**Q.** *Bubbly అంటే ఏమిటి?*

**A.** Bubbly= 1) నురగలు/ బుడగలతో ఉన్న (పానీయంలాంటివి) 2) ఎప్పుడూ ఉత్సాహంగా, సంతోషంగా ఉండే, jokes చేస్తూ.

**Q.** *Impact అంటే ఏమిటి?*

**A.** Impact= ప్రభావం,

The impact of oil prices = చమురు ధరల ప్రభావం

**Q.** *Punch dialogue అంటే ఏమిటి?*

**A.** Punch dialogue = అతి ముఖ్యమైన/ ముఖ్యాకర్షణ కలిగిన dialogue.

**Q.** *ఎక్కడ ఎలా ఉన్నది అక్కడ అలాగే- ఇంగ్లిష్‌లో ఏమంటారు?*

**A.** As is, where is

**Q.** *layout అంటే ఏమిటి?*

**A.** layout = ఇళ్లు, ఇళ్ల స్థలాల, roads ను చూపించే plan

**Q.** *Beehive అంటే ఏమిటి?*

**A.** Beehive = తేనెతుట్టె

**Q.** *Bump అంటే ఏమిటి?*

**A.** Bump = (ఎత్తుపల్లాల విషయంలో) ఎత్తుగా ఉన్న ప్రదేశం/ ఢీ కొనడం/ ఢీ కొట్టడం.

**Q.** *Washed out అంటే ఏమిటి?*

**A.** Washed out = 1) ఎక్కువ ఉతకడం వల్ల రంగు వెలిసిపోయిన (బట్టలు). 2) అలిసిపోయి నీరసంగా ఉన్న

**Q.** *Dark horse అంటే ఏమిటి?*

**A.** Dark horse = అందరి అంచనాలకు విరుద్ధంగా ఎవరూ అనుకోని విధంగా ఓ పోటీలో గెలిచేవాళ్లు/ ఏదైనా పోటీలో ఎవరూ ఊహించని రీతిలో గెలిచేవాళ్లు/ జట్టు

**Q.** *Under dogs అంటే ఏమిటి?*

**A.** Under dogs = ఓటమి పాలవుతారని/ ఓటమి పాలయ్యే వ్యక్తులు/ జట్టు. (మనకు సామాన్యంగా, ఏదైనా పోటీ జరిగేటప్పుడు, మన సానుభూతి అంతా ఓడిపోతున్న వ్యక్తి/ జట్టు (under dog) పట్ల ఉంటుంది.)

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**









# Bring someone round

**J. Appalaswamy Naidu, Seripeta**

**Q.** *కింది phrasal verbs అర్థాలు, ఉదాహరణలతో వివరించగలరు.*

*look through, brought round, breakout, hang on, see out, see through, see of, see off, pass out, pass off, pass over.*

**A. Look through=** Carefully examine= జాగ్రత్తగా పరిశీలించడం.

Look through the files and see if you can find the certificate =

ఆ files ను జాగ్రత్తగా పరిశీలించి ఆ certificate వాటిలో ఎక్కడైనా ఉందేమో చూడు.

**Bring round** (P.T. Brought round)

Bring someone round/ around = ఒకరిని మన వైపు తిప్పుకోవడం/ మన మాట వినేట్లు చేయడం/ ఒప్పించడం.

In the beginning she was against joining the company, but somehow I brought her round to accepting the job =

Company లో చేరేందుకు ఆమెకసలు ఇష్టం లేదు, కానీ నేనామెను ఎలాగో ఒప్పించాను.

**Break out**= (వ్యాధులు/ యుద్ధాలాంటివి) ప్రబలడం.

Cholera broke out in the area last month and claimed a number of lives =

ఆ ప్రదేశంలో కలరా ప్రబలి చాలామందిని బలిగొంది.

**Hang on** = Wait (past & past participle- hung on)

I told him to go but he hung on, I don't know why =

అతడిని వెళ్లిపొమ్మన్నాను, కానీ ఇక్కడే ఉన్నాడు/ తచ్చాడుతున్నాడు. ఎందుకో నాకు తెలియడం లేదు.

**Seeout** = ఒకరిని తలుపు వరకు సాగనంపడం

a) Please wait. I'll see you out =

ఆగండి. తలుపు వరకు వస్తాన్నేను.

b) Don't worry. I'll see myself out=

మీరాగండి. నేనిక వెళతా.( ఈ ఉపయోగం ఎక్కువ)

**See through** = ఇతరుల మోసపు ఆలోచనలను గ్రహించడం.

Krishna saw through the idea of Duryodhana to have him hound.

తనను బంధించాలనే ఆలోచన దుర్యోధనుడికి రావడం కృష్ణుడు గ్రహించాడు.

**See of** = ఇలాంటి expression లేదు.

**See off**- సాగనంపడం/ వీడుకోలివ్వడం.

I am going to the station to see off my friend = నా స్నేహితుడిని సాగనంపేందుకు నేను station కు వెళుతున్నాను.

**Pass out** = స్పృహ తప్పడం

Severely injured he passed out on his way to hospital=

తీవ్రగాయాలతో అతడు ఆసుపత్రికి వెళ్ళే దారిలో స్పృహ కోల్పోయాడు.

ఇంకో అర్థం- శిక్షణ పూర్తిచేసుకోవడం

He passed out and was appointed immediately =

శిక్షణ ముగించుకున్న వెంటనే అతడికి ఉద్యోగం వచ్చింది.

**Pass off** = Pass off as లో భాగం - ఒకరు ఒంకొకరిలా చలామణి కావడం.

He tried to pass off as a rich man but others could see through his attempt =

అతడేదో ధనికుడిగా చలామణి అవుదామని చూశాడు, కానీ ఇతరులు అతడి ప్రయత్నాన్ని గ్రహించారు.

**Pass over** = వదిలేయడం

M.SURESAN

The minister passed over the important details of the subject =

మంత్రి ముఖ్యమైన వివరాలను వదిలేశారు.

**Q.** ఎదుటివారు మనతో చెప్పిన విషయానికి మనం *agreement, disagreement* వ్యక్తపరుస్తాం. ఉదాహరణకు ఎవరైనా *I like sweets* అంటే, మనకు కూడా అవి ఇష్టం అయితే *I too* అని చెబుతాం. అలాగే కింది వాక్యాలకు *agreement, disagreement* తెలియజేయగలరు.

*1) I'd like an ice cream.*

*2) I've never been to Hyderabad.*

*3) I should read the newspaper every day.*

**A.** I too correct, కానీ దాని కంటే so am I/ so do I/ so did I/ so would I, etc..., better.

1) So would I - ఇది I'd like too కంటే better.

2) Nor have I/ Neither have I/ I haven't either.

3) So should I, I should too కంటే better.

**Q.** *కింది Direct Speech లోని వాక్యాలను Indirect Speech లో ఎలా రాయాలో వివరించగలరు.*

*1) A said to B, "When is the wedding to take place?"*

*2) A asked B, "Does your school have a big library?"*

**A.** 1) A asked B when the wedding was going to take place.

2) A asked B if their school had a big library.

**Q.** *కింది పదాలకు plural forms తెలియజేయగలరు.*

*echo, deer, history*

**A.** echoes, deer, histories

**Q.** *కిందిఖాళీలో ఏం వస్తుందో తెలుపండి.*

*a. Ramesh has always got his ------ in his book. No wonder he has no time for game (mouth, nose)*

*b. We have to ------ permission from the minister to start a school in our village (get/ obtain)*

**A.** 1) Nose 2) get, obtain రెండూ కరెక్టే, అయితే obtain గ్రాంథికం.

---

**R.M.V.N.Ramakantha Rao, Visakhapatnam**

**Q.** *Will తో సరిపోయేదానికి (కేవలం భవిష్యత్తును సూచించే సందర్భాల్లో) would వాడటం ప్రఖ్యాత ఆంగ్ల వార్తాపత్రికల్లో కూడా కనిపిస్తోంది. ఇలా వాడటం ఆంగ్ల భాష స్వచ్ఛతను కల్తీచేయడం కాదా?*

**A.** Independent గా (Main clause లో) would ను future సూచించేందుకు వాడటం సరికాదు అనే విషయం చెప్పక్కరలేదు. It is certainly incorrect. (The Hindu లాంటి ప్రఖ్యాత పత్రికలో కూడా తప్పులు కాస్త తరచూ కనిపిస్తూనే ఉన్నాయి.

27.07.08 Hindu లో Page 4 లో headline Nuclear deal vital than winning polls అని ఉంది చూడండి, more vital అని ఉండాల్సింది)

**Q.** *Take a call, Factored into అనే phrases కు, Redux అనే పదానికి అర్థమేమిటి? ఉదాహరణలతో వివరించగలరు.*

**A.** Take a call: to receive a phone call (usually in offices/ institutions etc). The person who takes (receives) the call need not be the person who is called. "You had a call when you were away. Your secretary took the call".

Factor into: To include some thing when you are planning something don't forget to factor in/ into the increase in the costs of cement and steel when you calculate the cost of constructions.

Redux= bring back/ revive = తిరిగి తేవడం/ సంఘటన పునరావృతమవడం.

We want Ramarajya redux = రామరాజ్యం తిరిగి రావాలని కోరుకుంటున్నాం.

No one wants the autrocious practices of the middle ages redux = మధ్యయుగాల అకృత్యాలు మళ్లీ జరగాలని ఎవరూ కోరుకోరు.

**Q.** *A. Millington-Ward రాసిన 'Use of Tense in English' పుస్తకం ఎక్కడ లభ్యమవుతుందో తెలియజేయగలరు.*

**A.** ఈ very useful book ఇప్పుడు దొరకడం లేదు.

---

**U. Ajay Kumar, Adilabad**

**Q.** *Aliment, Grab, Repast, Comestible, Pabulum, Nosh, Victuals, Substenance ఇవన్నీ Food కు పర్యాయపదాలా?*

**A.** మీరు చాలా Sets of Synonyms రాశారు. అవన్నీ మీరు ఏదో book of synonyms లో నుంచి తీసి రాసినవి కదా? అవి synonyms కాబట్టే ఆ book లో synonyms గా రాశారు. ఇంక అవి synonyms అవుతాయా, కావా అనే సందేహం ఎందుకు మీకు? అయితే ఒక విషయం అర్థం చేసుకోవాలిక్కడ. Synonyms గా ఉన్న మాటలు దాదాపు ఒకే అర్థం ఉండేవిగా ఉంటాయి. అంతేగాని అన్నింటికీ కచ్చితంగా ఒకే అర్థం ఉండవు. కొన్ని మాటలు synonyms అయినంత మాత్రాన, వాటినన్నింటినీ ఒకే సందర్భంలో వాడేందుకు వీలుపడదు. మీరిచ్చిన మొదటి set of synonyms లో aliment ఇప్పుడు వాడుకలో లేదు. grab అంటే బాగా బాగా busy గా ఉండి (తీరిక లేక) ఏదో నాలుగు మెతుకులు తినడం, రెండు గుక్కలు తాగడం అనే అర్థం వస్తుంది. Repast, comestible, victuals- ఇవన్నీ గ్రాంథికం, ఆహారం అనే అర్థంతోనే. Pabulum వాడుకలో లేదు. Nosh = మనం 'కూడు' అనే మాటకు సరిపోతుంది. food/ something to eat/ eatables- ఇలాంటి మామూలు మాటలు వాడొచ్చు మనం. కొన్ని మాటలు ఏదయినా మంచి పుస్తకం (standard book) లో synonyms అని రాసున్నప్పుడు synonyms గాక మరేమవుతాయి? వాటికర్థం దాదాపు ఒకటిగానే ఉంటాయి కదా? ఎటొచ్చీ వాటిలో వేటిని ఏ సందర్భంలో వాడాలో తెలుసుకోవడం ముఖ్యం. మీరడిగిన మాటల జాబితా మొత్తాన్ని వివరించడం, ఒక చిన్న dictionary రాసినంత అవుతుంది.

**Q.** *Cant, alms-man, cadger, mendicant, beggar ఒకటేనా?*

**A.** Cant తప్ప మిగతావన్నీ synonyms. Cant ఈ group లో రాదు.

**Q.** *Soiree, bevy, beano, gala, fete, carnival, revelry వీటన్నింటికి అర్థం ఒకటేనా?*

**A.** Bevy తప్ప మిగతావన్నీ synonyms వేడుక, party జరుపుకోవడం అనే అర్థంతో.

**Q.** *Inferno = hell, Heaven = paradise కరెక్టేనా?*

**A.** అవును. నరకం, స్వర్గం.

**Q.** *Ruffian, rowdy, rogue, varlet, rapscallion, bully, villain, swindler, rascal, scamp, trickster, scoundrel, miscreant, carrikin, hooligan, wrongdoer, bun కు అర్థం ఒకటేనా?*

**A.** అన్నీ కూడా synonyms = దుర్మార్గుడు.

**Q.** *Animadversion = criticism ఒకటేనా?*

**A.** animadversion = criticism

**Q.** *Songful, Dulcet, Enphonious, canorous, luscious, mellifluous ఒకటేనా?*

**A.** ఒకటే - గాన మాధుర్యానికి సంబంధించి.

**Q.** *Exultation, exhilaration, ecstasy, felicity, delectation ఒకటేనా?*

**A.** ఒకటే- అమితానందం.

**Q.** *Far-out, topnotch, tophole, smashing, superfine, alphaplus లకు అర్థం ఒకటేనా?*

**A.** ఒకటే - farout మాత్రం కాదు- దీనర్థం అందరికంటే భిన్నంగా ఉండటం.

**Q.** *Drunkard, souse, sot, alky పర్యాయపదాలేనా?*

**A.** అవును.

**Q.** *Circumjacents, surroundings ఒకటేనా?*

**A.** Circumjacents వాడుకలో లేదు.

**Q.** *Adjacent = near కరెక్టేనా?*

**A.** Adjacent అంటే ఆనుకొని ఉన్న- Our home is adjacent to the department store- దాన్ని ఆనుకొని ఉన్నదే మా ఇల్లు. Near = దగ్గర. చూశారా? Adjacent, near - synonyms- అయితే అర్థంలో కాస్త తేడా లేదూ. ఆనుకుని ఉన్నది, దగ్గరే అవుతుంది. పక్కనే ఉంది కనుక. రెండు మాటల్నీ ఒకే సందర్భంలో వాడలేం కదా?

**Q.** *Filthylucre, money, doubloon, dibs, pelf, spondulix అంటే డబ్బు అనే అర్థం వస్తుందా?*

**A.** డబ్బు అనే అర్థం Dibs కు తప్ప అన్నిటికీ వస్తుంది. అయితే lucre- అంటేనే డబ్బు అని అర్థం. Filthy lucre= పెంట/ వెధవ/ పాపిష్టి డబ్బు= pelf. మిగతా వాటిల్లో, money తప్ప మిగతా మాటలు, డబ్బు అని అర్థం వచ్చేవే కానీ, అంత గౌరవప్రదమైన మాటలు కావు. తెలుగులో, పిక్కలు, కాసులు, ఖైలం ఇలాంటి మాటల్లా.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

**Nisanth:** I didn't quite catch what you said. Could you repeat it?
(మీరు చెప్పింది నాకు సరిగా వినపడలేదు. మరోసారి చెప్పరా? )

**Visisht:** I was saying that but for your help I couldn't have completed the job.
(మీ సహాయం లేకపోయుంటే నేనాపని పూర్తిచేయలేక పోయేవాడిని అంటున్నా.)

**Nisanth:** That's nothing. You would do as much for me if I needed your help.
(అంతేం లేదు లెండి. నాకు మీ సాయం కావలిస్తే మీరూ చేస్తారు కదా? )

**Visisht:** Yea. I am anxious to get my turn to help you.
(మీకు సాయం చేసే అవకాశం కోసం నేనెదురు చూస్తున్నా.)

**Nisanth:** When you help me the same holds good for you; I mean what you've said to me.
(మీరు నాకు సాయం చేసినప్పుడు మీకూ అదే వర్తిస్తుంది; అంటే మీరు నాతో అన్న మాటలు.)

**Visisht:** Ok, Ok from now on, I will have to see you off and on. Hope you don't mind that.
(సర్లేండి. ఇప్పటి నుంచి మిమ్మల్ని నేను అప్పుడప్పుడు కలుసుకోవాల్సి వస్తుంది. మీకేం అభ్యంతరం లేదు కదా? )

**Nisanth:** You are most welcome. But make sure I am in town when you want to see me. Just give a call before you wish to me. I see that your home has had a new coat of paint. It's all the better for it.
(మీకు స్వాగతం. అయితే మీరు నన్ను కలవాలనుకునే ముందు, నేనున్నదీ, లేనిదీ ఖాయం చేసుకోండి. మీరొచ్చే ముందు నాకోసారి phone చేయండి. మీ ఇంటికి ఈమధ్యనే రంగు వేయించినట్టున్నారు. అందువల్ల ఇల్లు మెరుగ్గా కనిపిస్తోంది.)

**Visisht:** The painter has done a good job of it. He has given it very good finish.
(పెయింటర్ తన పని చాలా బాగా చేశాడు. మంచిగా కనిపిస్తోందిప్పుడు.)

**Nisanth:** How long did he take to finish the painting?
(రంగులు వేసేందుకు అతడికి ఎంతకాలం పట్టింది? )

**Visisht:** He said he'd finish it in a week, and he was as good as his word.
(వారానికల్లా ముగిస్తానన్నాడు, అలాగే మాట నిలబెట్టుకున్నాడు.)

**Nisanth:** The painter I had, was a big disappointment. He made a mess of everything.
(నా painter నాకు చాలా నిరాశ కలిగించాడు. అంతా కంగాళీ చేసేశాడు.)

**Visisht:** Next time when you do up your place, let me know. I will send my painter over.
(మీరు మళ్లీ మీ ఇంటికి రంగులు వేద్దామనుకున్నప్పుడు చెప్పండి. మా painterను పంపుతాను.)

**Nisanth:** That's not going to be in the near future. Already I've burnt my fingers enough. It really cost me a fortune to have the whole place painted.
(అది ఇప్పుడప్పుడే కాదులే. ఇప్పటికే చేతులు కాల్చుకున్నా. మొత్తం ఇంటికి రంగులేయించేందుకు చాలానే ఖర్చయింది.)

**Visisht:** True. Things have become so expensive now a days. I've learnt my lesson too. I'll just as soon leave the, home unpainted than have it painted at such an expense. It has landed me in debt as well.
(నిజమే. ఈ రోజుల్లో అన్నీ బాగా ఖరీదయిపోయాయి. అంత ఖర్చు పెట్టి రంగు వేయించడం కంటే, అసలు రంగు వేయించకుండా ఉండటమే మంచిది. దానివల్ల కొంత అప్పుల్లో కూడా పడ్డా.)

**Nisanth:** That's being sensible. OK. I must be off. See you soon. Feel free to call me.
(అలా చేయడం - అప్పుచేయకుండా ఉండటం తెలివైనపని. సరే ఇంక నేను వెళ్లాలి. మళ్లీ కలుస్తాను. ఫోన్ చేయడానికి సందేహించకండి.)
sensible = తెలివైన

**Visisht:** Bye then.




# ప్రతిభ

# I will have to see you off and on


M.SURESAN

సంభాషణలో continuity ఉండేందుకు చాలా సాధారణంగా వాడే కొన్ని expressions ఈ lessonలో తెలుసుకుందాం. ఇవి వీలయినన్ని సార్లు మీ conversationలో practiceచేసి మీ భాషలో భాగంగా చేసుకోండి.

***Look at the following expressions from the dialogue above.***

1. But for your help I couldn't have completed the job.
2. I am anxious to get my turn to help you.
3. ... the same holds good for you.
4. I will have to see you off and on.
5. Already I have burnt my fingers.
6. Make sure I am in town.
7. The painter has done a good job of it.
8) ... and he was as good as his word.
9) He made a mess of everything.

**1) But for = Without = అది లేకుంటే/ అదే లేకుంటే**

a) But for Gandhi India could not have got Independence in the nonviolent manner = గాంధీయే లేకుంటే అహింసా మార్గంలో స్వాతంత్ర్యాన్ని భారత్ పొందగలిగేదే కాదు.

b) But for my teacher's help I wouldn't have passed the exam = మా teacher సాయమే లేకుంటే నేను Pass అయ్యేవాడిని కాదు.

c) But for his drunken behaviour the party went off well = అతడి తాగుబోతు ప్రవర్తన తప్ప party అంతా బాగానే ఉంది.

**2) Turn =** ఎక్కువగా వినపడే అర్థం తిప్పడం. కానీ ఇక్కడి అర్థం వంతు/ అవకాశం.

a) Whose turn is it drive now? = ఇప్పుడు Car నడపడం ఎవరి వంతు?

b) When his turn to cook came he pretended illness but had a full meal first the same = వంట చేసేందుకు అతడి వంతు రాగానే జబ్బు నటించాడు కానీ భోజనం మాత్రం వదల్లేదు.

c) Please wait your turn in the queue = మీ వంతు వచ్చేవరకు క్యూలో ఆగండి.

**3. Hold good = నిజమవడం/ వర్తించడం**

a) Gandhi's teachings hold good even 60 years after his death = గాంధీ చనిపోయిన అరవై ఏళ్లకు కూడా ఆయన బోధనలు వర్తిస్తూనే ఉన్నాయి/ నిజమవుతూనే ఉన్నాయి.

b) What holds good for men in matters of salary holds good for women as well = జీతం విషయంలో పురుషులకు వర్తించేది స్త్రీలక్కూడా వర్తిస్తుంది.

**4) Off and on/ on and off = అప్పుడప్పుడు** = Occasionally/ Now and again

a) He plays well usually but disappoints on and off/ off and on = మామూలుగా బాగానే ఆడతాడు అతడు, అయితే అప్పుడప్పుడు నిరాశపరుస్తుంటాడు.

b) He usually keeps good health but is ill off and on/ on and off because of his old age = మామూలుగా అతడి ఆరోగ్యం బాగానే ఉంటుంది. అయితే పెద్ద వయసు వల్ల అప్పుడప్పుడు జబ్బుపడతాడు.

c) He attends classes off and on = అతడు classకు అప్పుడప్పుడొస్తుంటాడు.

**5) Burn one's fingers = చేతులు కాల్చుకోవడం– అవివేకమైన చర్యా పరిణామాల్ని భరించడం.**

a) I burnt my fingers by investing in film production I'll never do it again = సినిమా తీయాలని పెట్టుబడిపెట్టి చేయి కాల్చుకున్నాను. మళ్లీ ఆ పని చేయను.

b) He doesn't want a political career. He is afraid he may burn his fingers = అతడు రాజకీయాలను వ్యాపకంగా పెట్టుకోవాలనుకోవడం లేదు. చేతులు కాల్చుకుంటానేమో అని భయపడుతున్నాడు. (అదంత తెలివైన పనికాదనీ, దాని పరిణామాలు తనకనుకూలంగా ఉండకపోవచ్చనీ/ తాను నష్టపోవాల్సివస్తుందని అతడి భయం.)

**6) Make sure = నిర్ధారించుకోవడం/ రూఢీ చేసుకోవడం**

a) (Do) you want to see the CM? Have you made sure he is in town? = CM ను కలుసుకోవాలనుకుంటున్నావా? ఆయన ఊళ్లో ఉన్నాడో లేదో రూఢీ చేసుకున్నావా?

b) Before a bank lends money it makes sure that the borrower can repay the amount = Bank రుణాలిచ్చే ముందు ఆ అప్పు తీసుకునేవాళ్లు తిరిగి చెల్లించగలరా లేదా అని నిర్ధారణ/ రూఢీ చేసుకుంటుంది.

c) Before you try to correct others, make sure you are = ఇతరుల తప్పులను సరిచేసే ముందు నువ్వు సరిగ్గా ఉన్నావని రూఢీ పరుచుకో.

**8) As good as one's word = చెప్పిన మాటను నిలబెట్టుకోవడం.**

a) He said he would help him and he was as good as his word = నాకు సాయం చేస్తానన్నాడు. ఆ మాట నిలబెట్టుకున్నాడు.

b) Harischandra/ Karna was as good as his word = హరిశ్చంద్రుడు/ కర్ణుడు మాట ఆడి తప్పలేదు.

**9) Make a mess of something = అంతా పాడు చేయడం.**

a) He never does anything well. He makes a mess of everything = అతడు ఏ పనీ సరిగా చేయడు. ప్రతిదీ పాడుచేస్తాడు.



***M. Pratap, Warangal***

**Q.** నేను B.Ed. చేస్తున్నాను. Communicative English లో Role Play గురించి తెలపండి. Lawyer-Client, Teacher-Student మధ్య role-play వివరించగలరు.

**A. Role Play = పాత్ర నటన,** అంటే ఎవరో ఒకరు (doctor/ lawyer/ teacher/ student)గా ఊహించుకుని వాళ్లు మాట్లాడే English practice చేయించేందుకు ఇదొక మార్గం. Lawyer - client, teacher-student మధ్య జరిగే సంభాషణను ఇద్దరు students తో మాట్లాడించడం. Spoken English ఇలా కూడా నేర్చుకోవచ్చు

**1) Lawyer - Client**

**Lawyer:** Come on in, Mr. Client. You know our case has been posted to next Monday (రండి Client మీ case వచ్చే సోమవారానికి వాయిదా వేశారు.

**Client:** Yes, I know that. What will happen that day? (అవును. నాకది తెలుసు. ఆ రోజు ఏమవుతుందండి? )

**Lawyer:** We are ready for arguments. But the Opposite lawyer may ask for an adjournment. (మనం వాదానికి సిద్ధంగానే ఉన్నాం. కానీ అవతలి Lawyer వాయిదా అడగొచ్చు)

**Client:** What are our chances of winning? (మనం గెలిచే అవకాశాలు ఎలా ఉన్నాయి? )

**Lawyer:** Just don't worry. We have good chances of winning. The opposition case is weak. That's why their lawyer is asking for adjournments. (ఏం ఆందోళన పడకండి. అవతలి వాళ్ల case బలహీనంగా ఉంది. అందుకే వాళ్ల లాయర్ అన్ని వాయిదాలు అడుగుతున్నాడు.)

**Client:** It is nearly two years since we filed our case. Nothing has happened. (మనం case పెట్టి దగ్గర దగ్గర రెండేళ్లవుతోంది. ఇంతవరకు ఏమీ జరగలేదు.)

**Lawyer:** That's nothing unusual. When you go to court you must be prepared for it. (అదేం అసాధారణ విషయం కాదు. Court కెళ్లితే అలాంటి వాటికి సిద్ధపడి ఉండాలి.)

**Client:** But you said in the beginning that it would be disposed of in a year and a half. (అయితే మీరప్పటినుంచి సంవత్సరంలోపే తేలిపోతుందని అన్నారు కదా? )

**Lawyer:** The situation was then different. However I am going to press for early hearing. (అప్పటి పరిస్థితి వేరే. అయితే నేను అయితే నేను త్వరగా hearing కు వచ్చేట్టుగా ఒత్తిడి తీసుకొస్తాను.)

**Client:** Thank you.

**2) Teacher- Student**

**Student:** Good morning Sir.

**Teacher:** Good morning. Have you done the homework? (Homework చేశావా? )

**Student:** Here it is sir. You've given us four sums. I have been able to do two. The other two are too different for me. Could you help me with them Sir? (మీరు 4 లెక్కలు ఇచ్చారు, రెండుచేయగలిగాను. మిగతా రెండూ నాకు బాగా కష్టంగా ఉన్నాయి. వాటి విషయంలో మీ సాయం కావాలి)

**Teacher:** That's what most of the students have said. They have had problems with the same sums. (చాలామంది విద్యార్థులదే అన్నారు. ఎక్కువ మందికి ఆ లెక్కలు అర్థం కాలేదు).

**Student:** Are you explaining them, Sir? (మీరు దాన్ని చెబుతారా? )

**Teacher:** Yes, go back to your seat. I'll work them out for you .(అవును. నీ చోట్లోకి తిరిగివెళ్లు. వాటిని నేను చేసి చూపిస్తా)

**Student:** Thank you Sir.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**









# It being a hot day..

**D. Ganesh, Perumali**

**Q.** *Cell, Jail, Prison, Trial - వీటి అర్థాలన్నీ ఒకటేనా? వివరించగలరు.*

**A.** Jail = Prison = కారాగారం. Jail, Prison రెండూ ఒకటే. Cell అంటే కారాగారంలో ఖైదీలను ఉంచే ఒక గది. ప్రతి Jail/ Prison లో cells ఎన్నైనా ఉండొచ్చు. Police Station లోని lockup గది కూడా cell.

Trial కూ పై వాటికీ ఏం సంబంధంలేదు Trial అంటే, ఒక వ్యక్తి నేరస్థుడా, కాదా అని తేల్చేందుకు court లో జరిగే విచారణ.

**Q.** *కాకుల గుంపును Murder అనీ, కప్పల గుంపును Army అని అన్నట్లే- ఇంకా ఇలాంటి మందల గురించి చెప్పండి.*

**A.** గొర్రెల మంద- A flock of sheep.

వలలో మనం పట్టుకోగలిగిన చేపలు- a catch/ a haul of fish;

చేపల సమూహం (నది/ సముద్రంలో)- A shoal/ school of fish

నెమళ్లగుంపు/ సింహాలగుంపు- A pride of peacocks/ lions

బళ్లకు, రథాలకూ పూన్చే ఎద్దులు/ గుర్రాలు - A team of oxen/ horses.

తోడేళ్ల/ వేటకుక్కల గుంపు- A pack of wolves/ hounds;

ఈగల/ దోమల/ తేనెటీగల/ ఏ కీటకాలదైనా/ చీమల గుంపు/ దండు- A swarm;

కోడి/ బాతు పిల్లల సమూహం- A brood;

కుక్కలు/ పందులు/ పిల్లులు లాంటి జంతువులు ఒక్కసారిగా ఈనే పిల్లలగుంపు- litter, etc

**Q.** *Exams రాసేటప్పుడు- American English ను వాడొచ్చా?*

**A.** India లో అది ఆమోదం కాదు.

**Q.** *Tall అనే adjective ని ఉపయోగించి Noun, Adv, verb గా మార్చే కొన్ని వాక్యాలు తెలుపగలరు.*

**A.** Tallness- noun= పొడుగు. అయితే దీని ఉపయోగం చాలా అరుదు. ఈ మాట ఉన్నప్పటికీ, ఎక్కువగా పొడుగు/ ఎత్తు అనే అర్థంతో tallness బదులు height వాడతారు.

Tall- adv- Stand tall అనే idiom లో మాత్రమే, tall, adverb గా వాడతాం. దీని అర్థం, ఏ పరిస్థితినైనా ఎదుర్కోనేందుకు సిద్ధంగా విశ్వాసంతో ఉండగల.

Virendra Sehwag stood tall among the Indian players= భారత్ ఆటగాళ్లలో వీరేంద్రసెహ్వాగ్ (ఒక్కడే) ఏ పరిస్థితినైనా ఎదుర్కోగలిగాడు, విశ్వాసంతో, గర్వంగా.

Tall- Verb గా వాడం.

**Q.** *Being a human- He behaved like a ghost. అంటే సరిపోతుందా?*


M.SURESAN

**A.** Being = ఉండటంవల్ల.

Being a human = మానవుడిగా ఉండటం వల్ల. ఈ అర్థంతో, మీ sentence, Being a human, he behaved like a ghost కు- మానవుడై ఉండటంవల్ల ప్రేతంగా ప్రవర్తించాడనే విపరీతార్థం వస్తుంది.

Though a human (మానవుడై ఉండి కూడా/ మానవుడైనప్పటికీ) he behaved like a ghost= ప్రేతంగా ప్రవర్తించాడు అనే సరైన అర్థం వస్తుంది. రెండోది- మామూలుగా మనిషి/ మానవుడు అనేందుకు 'a human being' అంటాం. Human అంటే మానవ (= మనిషికి సంబంధించిన అనే అర్థంతోనే వాడతాం, కానీ A human = మనిషి అనే అర్థంతో వాడం. అయితే 'యంత్రమో/ జంతువోకాదు, మనిషే' అనే భావంతో, humans అని plural వాడతాం. A human అని singular వాడం.

eg: Some animals can hear much better than humans. Singular గా అయితే, A human being అనే అంటాం.

**Q.** *It being a hot day, it is better to take an umbrella. మొదట It ఎందుకు వాడతారు?*

**A.** It being a hot day, it is better to take an umbrella- ఇలాంటి sentences లో 'it' sentence ప్రారంభించేందుకు వాడతాం. It is raining (వాన వస్తోంది)/ It is dangerous to walk in the middle of the road- ఇలా. ఇక్కడ it కు, అలాగే కొన్ని sentences ప్రారంభంలో ఉండే there కు ప్రత్యేకమైన అర్థాలు లేవు.

**Q.** *Keep your mouth be shut దీన్ని Mind your tongue అని చెప్పవచ్చా? Why should I? అని పై వాక్యానికి సమాధానంగా చెప్పవచ్చా?*

**A.** Keep your mouth shut (Keep your mouth be shut కాదు- ఇది తప్పు)= నోర్మూస్కో. Mind your tongue= నోరు అదుపులో పెట్టుకో/ మాటలు జాగ్రత్తగా రానీ. Why should I? = నేనెందుకలా చేయాలి? - ఇదీ అర్థం- ఇలా reply చెప్పొచ్చు.

---

## Columnist - Contributor

**G. Ravi Babu, Nirmal**

**Q.** *Journalist, Reporter, News Contributor, Stringer, Columnist పదాలకు అర్థం తెలుపుతూ వీటిని ఏయే సందర్భాల్లో వాడతారో వివరించగలరు.*

**A.** Reporter, Stringer, Columnist- వీళ్లందరూ Journalists = పాత్రికేయులు. వార్తాపత్రికల్లో ఇతర పత్రికల్లో (magazines లాంటి) రాసేవారు.

Reporter- వార్తాపత్రిక సిబ్బందిలో ఒకరు. వీళ్లను తెలుగులో విలేఖరి అంటాం- జరిగే సంఘటనలను వార్తాపత్రికకు రాస్తారు.

Stringer- వీళ్లు వార్తాపత్రిక సిబ్బంది కాదు (అంటే నెలసరి జీతంమీద పనిచేసే వాళ్లుకారు) కానీ ఓ వార్తాపత్రికకు విలేఖర్లు (reporters) లేనిచోట జరిగే సంఘటనలను, కథనాలను పత్రికలకు రాసేవాళ్లు. వీళ్లకు రచనకు ఇంత అని పారితోషికం ఉంటుంది.

Columnist- వీళ్లు పత్రికా సిబ్బంది కావొచ్చు/ కాకపోవచ్చు వీళ్లు పత్రికలలో ఏదో ఒక శీర్షిక (feature) నిర్వహిస్తుంటారు. పత్రికలలో column/ columns (పత్రిక పేజీలో ఉండే నిలువు భాగం/ భాగాలు) రాస్తుంటారు కాబట్టి, columnists. వీళ్లు కూడా Journalist లే. ఈనాడు పత్రికలో రాసే, కులదీప్‌నయ్యర్, నూరానీ, రామచంద్రగుహ లాంటివాళ్లు.

Contributor - పత్రికలకు, newspapers కు, magazines కూ వాళ్లకు బాగా తెలిసిన విషయాల గురించి రాసేవాళ్లు. వీళ్లు journalists కానక్కర లేదు.

---

## Seeing movies is ..

**B. Premlal, Gandhari**

**Q.** *సినిమాలు చూడటం వల్ల లాభం ఏమిటి? దీన్ని ఇంగ్లిష్‌లో What is the use of seeing movies? అని అనడం కరెక్టేనా?*

**A.** ఇప్పుడు చూస్తుండటం అనే అర్థంతో am/ is/ are seeing అని అనం (see కి చూడటం అనే అర్థంతో, am/ is/ are + ing form లేదు) అయితే seeing వాడొచ్చు అర్థం, చూస్తూ/ చూడటం.

Seeing that the boy was weak, I helped him= ఆ కుర్రాడు బలహీనంగా ఉండటం చూసి/ చూస్తూ నేనతడికి సాయం చేశాను.

Seeing movies is a waste of time= సినిమాలు చూడటం సమయం వృథా.

---

## I did meet him ..

**Anita, Khammam**

**Q.** *"నువ్వు నిజంగా అద్భుతమైన ఉపన్యాసాన్ని కోల్పోయావు" అనే వాక్యానికి you did miss... అని ఉపయోగించారు. ఇది past tense లోని వాక్యం కాబట్టి ఇక్కడ you missed అనాలి కదా. దీని గురించి తెలపగలరు.*

**A.** You <u>did miss</u> అని గట్టిగా నొక్కిచెప్పడానికి అంటాం. I <u>did meet</u> him yesterday= నిన్న నేనతడిని కలుసుకున్నాను (అందులో సందేహంలేదు) అనే భావంతో. మామూలుగా అయితే, You missed, I met him yesterday అనే అంటాం. అలాగే I do know him (I know him బదులు), He does sing (He sings బదులు) లాంటి sentences, నాకతడు తెలియకపోవడం ఏమిటి? అతడు పాడకపోవడం ఏమిటి? (పాడతాడు) అనే అర్థంతో, అంటాం.

---

## You can stay with us ..

**O. Jeevan Wesley, Guda (Visakhapatnam Dist)**

**Q.** *కిందివాటిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?*

ఫలం, అధిక ఫలం, అత్యధిక ఫలం.

**A.** ఇది Economics కు సంబంధించిన విషయం. ఫలం= returns, అధికఫలం= very good returns, అత్యధికఫలం= optimum returns.

**Q.** *విద్య (education) తప్పని నేను చెప్పడం లేదు. దాంతోపాటు మంచి జీవితం ఉండాలి.*

**A.** I don't say education is bad, but it should be coupled with good life.

**Q.** *తన మహిమార్థమై మనం జీవించాలి.*

**A.** We must live for His grace.

**Q.** *ఆ విషయంలో ఉన్నటువంటి రహస్యమేమిటి?*

**A.** What's the secret of the matter?

**Q.** *ప్రేమ్ ఒక మంచి బాలుడు అలాంటప్పుడు తన తమ్ముడు చెడ్డవాడు.*

**A.** Prem is a good boy but/ while/ whereas his brother is bad.

**Q.** *అలా అయితే ఎలా?*

**A.** If so, how?

**Q.** *అతడిని చూడాలనుకున్నప్పుడల్లా ఆ విషయం మరచిపోతుంటారు.*

**A.** Whenever I think of seeing him, I just forget it.

**Q.** *ఎంగిలి*

**A.** Spittle (ఉమ్మి అనే అర్థంతో). ఒకరు కొంత తిని వదిలిన పదార్థం- ఎంగిలికి English లో మాటలేదు. అలా తిని వదిలిన పదార్థాన్ని left over అంటాం.

**Q.** *looked లుక్ట్‌గా చదవాలని మీరొక లెసన్‌లో చెప్పారు. ఇది ఎలా సాధ్యం?*

**A.** K తర్వాత, ed (look + ed) వస్తే దాన్ని t గా pronounce చేస్తాం. అది ఉచ్చారణ.

**Q.** *ఈరోజు మాతో ఉండి వెళితే బాగుంటుంది. (లేదా) ఈరోజు మాతో ఉండొచ్చుగా.*

**A.** You can stay with us for today/ How about staying with us for today?/ Why don't you stay with us for today?

**Q.** *నేను M.A. English చేయాలనుకుంటున్నాను. అందుకు ఎలా ప్రిపేర్ కావాలి?*

**A.** M.A. English చేయాలనుకుంటే, మొదట మీరు, History of English Literature, Background to the study of Literature లాంటి books చదవండి. ఆ తర్వాత prescribed text books చదవండి- guides సాయంతో అర్థం చేసుకోండి. Writing practice బాగా ఉండాలి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**A. Premkumar, Rajampet**

**Q.** *Please explain the following doubts and their meanings with examples.*

- *For the time being.*
- *And so*
- *As long as*
- *Please explain whether the following statement is true or false*

*1 (A.V.) I shall be eating a mango.*

*(P.V.) A mango will be being eaten by me.*

*2 (A.V.) She will be watching a movie.*

*(P.V.) A movie will be being watched by her (is it correct or not)*

**A. For the time being=** For the present= temporarily. "I don't know when the power will be back. For the time being let's have a candle." (Current ఎప్పుడొస్తుందో తెలియదు. ప్రస్తుతానికి, కొవ్వొత్తితో గడుపుదాం)

- **And so** = Therefore = Because of that.

I don't have enough money and so (therefore) I don't want to buy the car = Because I don't have enough money, I don't want to buy the car.

- **As long as=** Till something continues.

As long as we are lazy, we can never come up = During the time that we are lazy we can never come up. (మనం సోమర్లుగా ఉన్నంతకాలం మనం పైకి రాలేం.)

- We don't use passive voice forms for future continuous tense (shall be +ing/ will be +ing). It looks very awkward.




**Kumar, Bhimadole.**

**Q.** *Advice కు Suggestion కు తేడా తెలుపగలరు.*

**A.** Advice అంటే సలహా; suggestion (Pronunciation సజెశ్చన్) అంటే సూచన.

నువ్విలా చెయ్. నేచెప్తున్నానుగా. నా సలహా తీసుకో. ఇది advice.

నువ్విలాచేస్తే ఎలా ఉంటుంది? కాస్త ఆలోచించు- ఇది suggestion. ఇదికూడా కాస్త ఆలోచించు- suggestion.

**Q.** *ఏ సందర్భంలో 3rd person singular + have వాడతామో వివరించగలరు.*

*eg. Let god have his way.*

*He might have done that.*

**A.** III person singular (He/ She/ it) తో have రానే రాదు. III person singular + shall/ should/ can/ could/ may/ might/ must/ need etc తర్వాత have వస్తుంది. అంటే He/ She/ it కు have కు మధ్య సందర్భాన్నిబట్టి పై వాటిల్లో ఏదో ఒకటి రావాలి.

# He was there promptly at 10

**J. Bhaskar, Bangalore**

**Q.** *The task of recording business transaction is described as the art of book-keeping. Task అంటే ఏమిటి?*

**A.** Task = ఒకరు చేయాల్సిన పని

**Q.** *Depreciation will be charged at 10% on the book value of the asset i.e. on Rs.9000/- (i.e 10,000 - 1,000) and so on. ఈ వాక్యం అర్థాన్ని, so, on పదాల అర్థాలను ఉదాహరణలతో వివరించగలరు.*

**A.** తరుగుదలను పుస్తకాల్లో నమోదుచేసిన ఆస్తి విలువలో 10 శాతంగా లెక్కిస్తారు. అంటే రూ. 10000 విలువ ఉన్న ఆస్తి అయితే 10% (1000) తగ్గించి, 9000 మీద లెక్కకడతారు. ఇలా...

So on = ఇలా, ఈ విధంగా, వగైరా, వగైరా

He was saying that he had no money, that he had to borrow to help others, so on and so on.. = తన దగ్గర డబ్బు లేదనీ, ఇతరులెవరికో సాయం చేసేందుకు అప్పుచేయాల్సి వచ్చిందనీ, ఇలా ఏదేదో ... (so on...) చెప్పుకొచ్చాడు.

**Q.** *Acknowledgement - Acknowledge - receipt - prompt - summary - summarise, correspondent - sundry-debtor, sundry-creditor - in the mean time - I am sure that .. ఉదాహరణలతో వివరించగలరు.*

**A. Acknowledgement =** ఏదైనా మనం పొందినందుకు, మనం అది పొందామని చెప్పడం/ రాసి ఇవ్వడం.




I want an acknowledgement for the book I've given you = మీరు పుస్తకం తీసుకున్నట్లుగా నాకు రాసివ్వండి (I want an acknowledgement = I want you to acknowledge)

He acknowledged the books I sent him = నేను పంపిన పుస్తకాలు తను తీసుకున్నట్లు ఆయన తెలిపాడు.

**Receipt** = రశీదు.

Please give him a receipt for the money he has given you = అతడు మీకిచ్చిన డబ్బుకు రశీదు ఇవ్వండి.

**Prompt** = సరైన time కు.

He was there promptly at 10 = 10కి సరిగ్గా అక్కడున్నాడు అతడు.

**Sundry creditors** = చిన్న చిన్న రుణదాతలు. (చిన్న, చిన్న మొత్తాలు అప్పిచ్చినవాళ్లు)

The debt to sundry creditors amounted to Rs. 10 lakh = చిన్న, చిన్న అప్పులవాళ్లకివ్వాల్సిన మొత్తమే 10 లక్షలు.

**Summary** = సారాంశం.

**Summarise** = సంక్షిప్తం చేయడం/ ఒక ఉపన్యాసం/ రచన సారాంశాన్ని రాయడం.


M.SURESAN

This is the summary of his speech = ఆయన ఉపన్యాసం సారాంశం ఇది.

Please summarise the report = (Please give a summary of the report) = ఆ నివేదిక సారాంశం తయారుచేయండి.

**Correspondent** = ఒక వ్యాపార/ విద్యాసంస్థ తరపున ఉత్తరప్రత్యుత్తరాలు జరిపేవాడు/ News paper/ magazines లో రాసేవాళ్లు.

**Sundry debtors, sundry creditors.**

Sundry = అవీ ఇవీ అన్నీ కలిపి.

There were a few books and sundry other things in the room = ఆ గదిలో కొన్ని పుస్తకాలూ, ఇతర కొన్ని (అంత ముఖ్యం కానివి- అవీ, ఇవీ, అన్నీ) వస్తువులూ ఉన్నాయి.

**In the mean time** = ఈలోపల.

**I'm sure** = నేను గట్టిగా నమ్ముతున్నా.

వీటి ఉపయోగాలింతకుముందు చాలాసార్లు వివరించాం- పాత lessons చూడండి.

**Q.** *Rajesh brings in cash to provide capital for his business. ఈ వాక్యానికి అర్థం తెలియజేయగలరు. Brings కు cash కు మధ్య in వస్తుందా? ఇక్కడి అర్థం క్యాష్‌లో అనా? దయజేసి వివరించగలరు.*

**A.** Rajesh brings in cash = Rajesh brings cash in = ఈ రెండూ ఒకటే = రాజేష్ వ్యాపారంలోకి నగదు తెస్తాడు/ తెచ్చాడు పెట్టుబడి పెట్టేందుకు.

**Q.** *Cash comes into the business. Therefore cash account is debited. Which account is to be credited? Rajesh is the giver. But one should not debit or credit the proprietor's account. ఈ వాక్యంలో one should గురించి వివరించగలరు.*

**A.** నగదు వ్యాపారంలోకి వస్తుంది కాబట్టి దాన్ని ఖర్చుల్లో (debit) చూపాలి. అయితే ఎవరూ కూడా proprietor లెక్కల్లో జమలు ఖర్చులూ చూపకూడదు.

One = ఎవరైనా సరే. should = తప్పక చెయ్యాలి.

One should know one's limits = ఎవరైనా సరే వారి హద్దులు వారు తెలుసుకోవాలి.

One should follow traffic rules = ఎవరైనా సరే traffic నిబంధనలు పాటించాలి.

**Q.** *By communication, we mean the process of passing information as well as understanding from one person to another. 1) It is involved in all human relations. 2) It is the nervous system of any organised group.* మొదటి వాక్యంలో *in* ఎందుకు వచ్చింది, రెండో వాక్యంలో *nervous* అర్థం వివరించగలరు.

**A.** Communications దానిలో చేరి ఉంది అని చెప్పాలంటే in ఉండాల్సిందే కదా.

involved in = ఒకదాన్లో చేరి ఉండటం

nervous system = మన దేహంలోని నాడీ మండలం. మన రక్తప్రసరణకు నాడీమండలం ఎంత ముఖ్యమో ఒక వ్యక్తుల సమూహానికి communications అంత ముఖ్యం అని.

**K. Nagamani, Tadpatri**

దయచేసి కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలపండి.

**Q.** మీతో నాకు ముఖాముఖి మాట్లాడాలని అనిపిస్తుంది.

**A.** I feel like having a face to face talk with you

**Q.** మీతో ఇంగ్లిష్ చెప్పించుకోవాలని అనిపిస్తుంది.

**A.** I wish to have English taught by you.

**Q.** మీ చేత ఇంగ్లిష్ రాయించుకోవాలనిపిస్తుంది నాకు.

**A.** I wish to have English written by you.

**Q.** మీరు బి.పి. చెక్ చేయించుకున్నారా?

**A.** (Have you) had your BP checked?

**Q.** అతడికి బ్లడ్ టెస్ట్ చేయించారా?

**A.** Have you got his blood tested?/ blood test done?

**Q.** ఆమెకు షుగర్ చెక్ చేయించావా? ఎంత ఉంది?

**A.** Did you get her sugar checked? How much is it?

**Q.** మీరు కంటి ఆపరేషన్ ఎప్పుడు చేయించుకుంటారు?

**A.** When will you have your eye operation ?

**Q.** మీరు కంటి ఆపరేషను ఏ డాక్టరుతో చేయించుకున్నారు?

**A.** Which doctor did you go to for your eye operation/ who was the surgeon?

**Q.** మీరు ఏ డాక్టరుతో కంటి ఆపరేషను చేయించుకుంటారు?

**A.** Which doctor are you going to for your eye operation? / who is your surgeon?

**Q.** మీరు యూరిన్ టెస్ట్ చేయించుకున్నారా?

**A.** (Have you) Had your urine tested?

**Q.** ఆమెకు స్కానింగ్ తీయించమని డాక్టర్ చెప్పాడా?

**A.** Did the doctor tell her/ to have a scan taken?/ advise a scanning for her?

**Q.** నేను బి.పి. చెక్ చేయించుకున్నాను.

**A.** I had/ got my BP checked.

**Q.** నేను ల్యాబ్ టెక్నీషియన్‌తో షుగర్ చెక్ చేయించుకుంటే 100 / 170 ఉందన్నాడు.

**A.** I had my sugar checked and the lab technician said it was 100 / 170.

**Q.** నేను డాక్టర్ చేత మా అబ్బాయికి టీకాలు వేయించాను.

**A.** I got the doctor to/ I had the doctor vaccinate my child.

**Q.** మీరు డాక్టర్ చేత మీ అమ్మాయికి టీకాలు వేయిస్తారా?

**A.** Will you have your daughter vaccinated (by the doctor)

**Q.** రాజు నాకు రేషన్ కార్డు ఇప్పిస్తానన్నాడు.

**A.** Raju told me he would get a ration card for me.

**Q.** మీరు ఆక్స్‌ఫర్డు డిక్షనరీలు తెప్పిస్తారా?

**A.** Are you going to get Oxford Dictionaries?

**Q.** మీరు ఈ మెడిసిన్లు ఎక్కడ నుంచి తెప్పిస్తారు?

**A.** Where do you get these medicines from?

**Q.** మీకు ఏమి తెప్పించమంటారు?

**A.** What shall I/ we get (for) you?

**Q.** ఎక్కడ నుంచి ఇలాంటి పుస్తకాలు తెప్పించుకోవచ్చు?

**A.** Where can we get these books from?/ How can we order these books?

**Q.** అతడికి స్టేట్ బ్యాంక్‌లో లోన్ ఇప్పిస్తానన్నాను.

**A.** I told him I would get him/ help him to get a loan in SBI.

**Q.** హెడ్‌మాస్టర్ ఒకపేద విద్యార్థిని డిగ్రీ వరకు ఉచితంగా చదివిస్తానన్నారు.

**A.** A Head master offered to educate a poor student freely up to degree.

**Q.** రవి ఒక కాలేజ్ కట్టిస్తానన్నాడు పేదవిద్యార్థులకు.

**A.** Ravi said he would start a college for poor students.

**Q.** రాము నా బైక్ రిపేర్ చేయిస్తానన్నాడు.

**A.** Ramu said he would get my bike repaired.

**Q.** రాజు మా కారు రిపేర్ చేయిస్తానని చెప్పి, చేయించలేదు.

**A.** Raju said he would get our car repaired but he hasn't.

**Q.** ఆయన ఇల్లు రిపేరు చేయించుకుని బాడుగలో డబ్బు పట్టుకోమన్నాడు.

**A.** He told us to get the repairs done at our cost and deduct it in the rent.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






**M. Satyanarayana, Hyderabad**

**Q.** *Manner, honour, respect* - వీటిని ఎలా ఉపయోగించాలో వివరించగలరు.

**A.** **Manner=** విధం/ రీతి.

He behaved in a bad manner= చాలా చెడ్డ (విధం)గా ప్రవర్తించాడు.

Manners = ప్రవర్తన. Bad manners = సరికాని ప్రవర్తన, Good manners = మంచి ప్రవర్తన

**Honour=** ఒకరు పొందే గౌరవం.

She had the honour of being the leader of the group = ఆ బృందానికి నాయకురాలిగా ఉండే గౌరవం ఆమెకు దక్కింది.

**Respect=** మనం ఇంకొకరిపట్ల చూపే గౌరవం లేదా మన పట్ల ఇతరులు చూపే గౌరవం.

**Q.** *Theatre, Auditorium, Hall* వీటి గురించి తెలుప గలరు.

**A.** **Theatre=** నాటక/ వినోద ప్రదర్శనశాల. American English లో సినిమా hall. ఇంకో అర్థం - నాటక కళ.

**Auditorium=** 1) Theatre లోగానీ, సినిమా hall లోగానీ, ప్రేక్షకులు కూర్చునే భాగం

2) వినోద కాలక్షేపాలు (పాట/ నాట్య కచేరీలు) ఉపన్యాసాలు నిర్వహించేందుకు వాడే hall.

గమనిక: English లో Cinema అంటే చలన చిత్రం కాదు. చలన చిత్రాలు చూపించే సినిమా hall. Cinema అంటే కేవలం building మాత్రమే. చలన చిత్రం అనేందుకు English లో film/ movie/ picture అంటారు.

**Pavani & Sudha, Matsyapuri**

**Q.** *Care* తర్వాత *of, about* లను ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారో తెలుపగలరు.

**A.** **Care of-** ఒకరికి ఉద్దేశించిన ఉత్తరం వారిపేరనే ఇంకొకరి address కు పంపేటప్పుడు వాడతాం. To Sri Prasad, C/o Sri Prakash- ఇక్కడ C/o = Care of. Prasad కు మనం రాసే ఉత్తరం, Prakash కు పంపమని.

**Care about** something/ somebody = ఒక విషయం పట్ల/ ఒకరిపట్ల ఆసక్తి/ శ్రద్ధ/ ఆదుర్దా కనపరచడం etc.

a) All that he cares about is money = అతడి శ్రద్ధంతా డబ్బు గురించే.

b) I can't see him hurt. I really care about him = అతడు గాయపడితే నేను చూడలేను. అతడి విషయంలో నాకు శ్రద్ధ ఉంది.

c) The Government doesn't care about environmental problems = పర్యావరణ సమస్యల మీద ప్రభుత్వానికి శ్రద్ధ లేదు.

**Q.** *All India Radio News* లో ఒకప్పుడు *The situation is returning to normalcy* అని వాడే వారు. ఇప్పుడు *normalcy* స్థానంలో *normal* వాడుతున్నారు. రెండూ వాడవచ్చా లేదా *normal* నే వాడాలా? వీటి గురించి వివరించగలరు.

**A.** Normalcy/ Normality- ఇవి American English లో ఎక్కువ వాడతారు.

అర్థం- మామూలు పరిస్థితి.

Normal- సగటు, మామూలు పరిస్థితి/ సంఖ్య/ మొత్తం

The situation is returning to normal = పరిస్థితి మామూలుకు తిరిగివస్తోంది.

**S. Ananda Rao, Giduthuru**

**Q.** *He is standing there. He stood there-* ఈ రెండు వాక్యాలకు తేడా ఏమైనా ఉందా? అలాగే *He is sitting there/ He sat there-* తేడా ఏమిటి?

**A.** He is standing there = అతడిప్పుడు అక్కడ నిల్చుని ఉన్నాడు.

He stood there = అతడక్కడ నిల్చున్నాడు (గతంలో)

ఇదే తేడా- He is sitting there కూ, He sat there కూ.

**Q.** *What is your father's name?* ఇక్కడ *apostrophe* అవసరమా?

**A.** అవసరం.

**Q.** నేను ఆరో తరగతి చదువుతున్నాను. దీన్ని ఇంగ్లిష్‌లో ఎన్ని రకాలుగా చెప్పవచ్చు

**A.** I am studying in VI class/ I am doing VI class/ I am in VI class.

**Q.** *Clause* కూడా *subject, predicate* కలిగి ఉంటే, *sentence* కు దీనికి తేడా ఏమిటి?

**A.** Clause కు అర్థం పూర్తిగా ఉండాలని లేదు, subject, predicate ఉంటే చాలు. Sentence కు పూర్తి అర్థం ఉండాలి కదా.

**Q.** *బోడిగుండును ఇంగ్లిష్‌లో ఏమంటారు?*

**A.** Clean shaven/ tonsured head.




**K. Nagamani, Tadpatri**

**Q.** మాకు ఒక మంచి అద్దె ఇల్లు చూడమని రాజుతో చెప్పాను.

**A.** I told Raju to look for good house we can take for rent.

**Q.** రాజు మాకు ఒక మంచి అద్దె ఇల్లు చూస్తానని చెప్పాడు.

**A.** Raju said he would fix us a good house for rent.

**Q.** టీచర్ అల్ఫాబెట్స్ రాయించి పిల్లలకు బాగా దిద్దమని చెప్పింది.

**A.** Teacher get the children to/ have the children write the alphabet/ letters of the alphabet and let them trace it.

**Q.** స్టూడెంట్లను పరీక్షలకు బాగా చదివించండి.

**A.** Make the students study well for the exam.

**Q.** మీరు నాతో గ్రామర్ చెప్పించుకుంటారా?

**A.** Will you have me teach you grammar.

**Q.** మీ ఆస్తి మాకు రాయిస్తారా?

**A.** Will you pass on your property to us?/ Will you settle your property in our favour?

# To be good is difficult

**Q.** మీకు ఇల్లు ఎవరు కట్టిస్తారు?

**A.** Who will get the house built for you?

**Q.** అల్ఫాబెట్స్ పిల్లల చేత బాగా దిద్దించండి.

**A.** Have/ Let the children trace the alphabet thoroughly. (Alphabets అనం letters of the alphabet అనొచ్చు)

**Q.** *Bond* రాయించమని అతడికి చెప్పండి.

**A.** Tell him to get the bond drafted/ written.

**Q.** అతడు మాతో అగ్రిమెంట్ రాయించుకున్నాడు.

**A.** He had the agreement signed by us.

**Q.** రాజు, రాముతో నోట్స్ రాయించుకుంటున్నాడు.

**A.** Raju has Ramu to write the notes for him.



M.SURESAN

**Q.** హెడ్‌మాస్టారు నాకు కాలేజ్‌లో సీట్ ఇప్పిస్తానని చెప్పాడు.

**A.** H.M. said he would get me admitted into the college/ ... get me admission.

**J.Bhaskar, Bangalore**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో వివరించగలరు.

*Interview* లో మీ గురించి చెప్పండి అనేందుకు ఏమంటారు?

**A.** Tell us about/ talk about yourself

**Q.** ఇప్పుడు చేస్తున్న ఉద్యోగాన్ని ఎందుకు విడిచిపెడుతున్నారు? / విడిచిపెట్టారు?

**A.** Why are you giving up the present job = (ఎందుకు విడిచిపెడుతున్నారు? )/ Why did you give up the last job? (ఎందుకు వదిలేశారు? )

**Q.** మిమ్మల్నే ఎందుకు తీసుకోవాలి?

**A.** Why should we take you?

**Q.** మీ బలాలు, బలహీనతల గురించి చెప్పండి.

**A.** Tell us about your strengths and weaknesses

**Q.** క్లిష్ట పరిస్థితుల్లో ఎలా వ్యవహరిస్తారు?

**A.** How do you face a crisis?

**Q.** మీ భవిష్యత్తు ప్రణాళికలు ఏమిటి?

**A.** What are your future plans?

**Q.** ఎక్కువస్థాయి ఉద్యోగం ఉంది చేస్తారా?

**A.** Are you prepared to take a job of a higher status?

**Q.** ఈ ఉద్యోగం గురించి ఏమైనా అడగదలిచారా?

**A.** Have you/ Do you have any questions to ask about this job?

**Q.** *You don't make it* ను విడదీస్తే *You do make not it* అని వస్తుంది కదా. దీని గురించి వివరించగలరు.

**A.** You don't make it= You do not make it (you do make it not కాదు). మామూలుగా మాట్లాడేటప్పుడు don't, రాసేటప్పుడు do not అంటాం.

**Q.** *Why should business letters be brief-* దీనర్థం ఏమిటి? *Should* ను ఏయే సందర్భాల్లో వాడాలో వివరించే లెసన్ నెంబరు చెప్పగలరు.

**A.** Business letters క్లుప్తంగా ఎందుకుండాలి?

Should ను వాడే సందర్భాలు lesson no. 40 to 50 లో చూడండి.

**Q.** *Our fore fathers and grand parents perhaps did not know the transistors and television sets, air travel to mention a few.* దీనర్థం ఏమిటి? *Mention* గురించి వివరించగలరు.

**A.** మన పూర్వీకులూ, తాతముత్తాతలకు బహుశా transistors, televisions, విమాన ప్రయాణాలు- ఇవి కొన్ని మాత్రమే/ ఇంకా చాలానే (= to mention only a few) - బహుశ తెలిసి ఉండకపోవచ్చు.

Mention= చెప్పడం.

Please mention your name= మీ పేరు చెప్పండి.

**Q.** *With passage of time and the growth of civilisation human wants have increased in number and variety.* దీనర్థం వివరించి, *civilisation, in* గురించి తెలియజేయగలరు.

**A.** కాలం గడిచిన కొద్దీ, నాగరకత పెరగడంతో మనుషుల కోర్కెల సంఖ్యలు, రకాలు పెరిగాయి.

Civilization = నాగరకత

in number = సంఖ్యలో. 'లో' అనేందుకు 'in' వాడాలి కదా?

**Q.** *Adjective, adverb* లను ఏ విధంగా తెలుసుకోవాలి, ఎలా ఉపయోగించాలి?

**A.** Adjective అంటే ఒక మనిషి/ వస్తువు, etc. ఎలాంటిది అని తెలిపే పదం.

A tall boy ఎలాంటి అబ్బాయి? Tall (పొడుగైన) అబ్బాయి. ఇక్కడ Tall, adjective.

The building is beautiful - Building ఎలా ఉంది? Beautiful (అందం)గా ఉంది- కాబట్టి beautiful, adjective.

ఎలాంటి, ఎటువంటి అనే ప్రశ్నలకు వచ్చే సమాధానం Adjective.

ఒక పని ఎలా జరిగింది? / ఎలా చేశారు? అనే ప్రశ్నకు వచ్చే జవాబు Adverb.

He played well- అతడు బాగా ఆడాడు? ఎలా ఆడాడు? బాగా (well) అనే సమాధానం వస్తుంది. కాబట్టి well, adverb.

**Q.** *To be, have, has to be, as per* గురించి వివరించగలరు.

**A.** To be = ఉండటం.

To be good is difficult = మంచిగా ఉండటం కష్టం.

I, we, you and they have to be/ He, she and it has to be = తప్పనిసరిగా ఉండాల్సి రావడం.

They have to be/ should be/ must be here = వాళ్లిక్కడ తప్పక ఉండాలి.

She has to be careful = ఆమె జాగ్రత్తగా ఉండాలి.

As per = ఆ ప్రకారం.

As per the rules of the school students have to come in uniform = స్కూల్ నిబంధనల ప్రకారం విద్యార్థులు uniform లోనే రావాలి.

**Q.** *The sunday shops are closed* అంటే *sunday shops* మూయబడతాయని అర్థం. మరి ఇప్పుడు మూయబడ్డాయనేందుకు ఏమనాలి?

**A.** Sunday shops కూ on Sunday, shops కూ తేడా ఉంది. Sunday shops అంటే ఆదివారాలు కూడా తెరిచి ఉండే shops.

On sunday, shops are closed అని ఉండాలి మీ sentence. అర్థం, ఆదివారం, shops మూసేస్తారు అని- ప్రతి ఆదివారం జరిగే విషయం. జరగలేదని కాదు, దీనర్థం.

Shops have been closed = Shops మూయబడ్డాయి. (ఎప్పుడో తెలియదు)

Shops were closed on that Sunday= ఆ ఆదివారం, shops మూయబడ్డాయి- ఇక్కడ గతంలో ఫలానారోజు అని తెలుపుతున్నాం కాబట్టి, were closed.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**Kishore, Chemudugunta**

**Q. 1.** *Don't forget sending me your new address and the mobile number.* ఈ వాక్యంలో ఏదైనా తప్పు ఉంటే చెప్పండి.

**2.** *You have occupied my seat. What is the part of speech of 'my' here. Are there any other variations in using the same word as different parts of speech.*

**A. 1.** No error. But there is a difference between 1) Don't forget sending me your address .. and 2) Don't forget to send me your address. Sentence no. 1) means, you have sent me your address, and don't forget it. Sentence no 2) means, I don't have your address, I need it and don't forget to send it. So, strictly speaking the sentence, Don't forget sending me your address is correct.

**2.** 'My' here is a possessive adjective. This is the only part of speech of 'my'

I - nominative
me - objective } pronouns
mine - possessive

**B.Bhaskar, Nandyal.**

**Q.** *Please explain 4 types of sentence with two examples and telugu meanings. 1. assertive sentence, 2. Interrogative sentence, 3. Imperative sentence, 4. Exclamatory sentence*

**A. 1.** Assertive sentence- A sentence which states something= ఒక విషయాన్ని చెప్పే వాక్యం.

a) Vijayawada is on the banks of the Krishna = విజయవాడ కృష్ణ ఒడ్డున ఉంది.

b) India is not a small country = భారత్ చిన్నదేశం కాదు.

2. Interrogative sentence = ప్రశ్నలు వేసే వాక్యాలు

a) Where is your father? = మీ నాన్న ఎక్కడ?

b) Is she a good singer? = ఆమె మంచి గాయనేనా?

3. Imperative sentence: ఆజ్ఞలివ్వడానికి వాడే వాక్యాలు:

a) Get out = వెళ్లిపో, b) Don't move = కదలకు

4) Exclamatory sentence = ఆశ్చర్యాన్ని, ఉద్వేగాన్ని తెలిపే వాక్యం.

a) How tall he is! = అతడెంత పొడుగో!

b) Alas! How she suffered! = అయ్యో ఆమె ఎంత బాధపడిందో!




**U.Srinivasa Rao, Zarugumalli**

**Q.** *ఒక వాక్యాన్ని తెలుగులో ఎన్నో రకాలుగా కింది విధంగా చెప్పవచ్చు.*

*1. అందాల నటుడు శోభన్‌బాబును చూడటానికి చెన్నై వెళ్లాలనుకున్నాను.*

*2. నేను వెళ్లాలనుకున్నా చెన్నై అందాల నటుడు శోభన్‌బాబును చూడటానికి.*

*3. చెన్నై వెళ్లాలనుకున్నా నేను అందాల నటుడు శోభన్‌బాబును చూడటానికి.*

*4. అందాల నటుడు శోభన్ బాబును చెన్నైలో చూడటానికి వెళ్లాలనుకున్నా.*

*అలాగే ఇంగ్లిష్‌లోకూడా ఒక వాక్యాన్ని frame చేసి దాన్నే వెనక్కు, ముందుకు తిప్పి మాట్లాడవచ్చా? మాట్లాడితే అర్థం మారిపోతుందా?*

*1. I want to go Chennai to see the pretty/ beautiful actor Sobhan babu.*

*2. To see the beautiful actor Sobhan babu I wish to go Chennai.*

**A.** తెలుగు వాక్యాలలో మాటల వరుసకంత ప్రాముఖ్యంలేదు. ఏ మాట sentence లో ఎక్కడ వచ్చినా అర్థం ఒకటిగా ఉంటుంది, మీరన్నట్లు విభక్తి ప్రత్యయాల వల్ల. మీరిచ్చిన ఉదాహరణలే అందుకు నిదర్శనం. అయితే English sentences లో word order మారితే అర్థం మారే ప్రమాదం ఉంది.

1) Sachin hit the ball, 2) The ball hit Sachin - ఈ రెండింటి అర్థం ఒకటే కాకపోగా, పూర్తి వ్యతిరేకం కదా.

అయితే మీరు చెప్పిన English sentences లో-

1. I want to go to Chennai, to see..

2. To see Sobhan babu I ...

మీరు మార్చింది, sentence లోని words కాకుండా clauses ను. Clauses/ phrases position మారిస్తే meaning మారకపోవచ్చు, word position మారిస్తే మాత్రం meaning మారుతుంది. I want to go to Chennai to Sobhan babu అనడం, I want to go to Sobhan babu to see Chennai - రెండూ ఒకటే కాదు కదా? ఇదీ గమనించాల్సిన విషయం.




**Anthati Penchalaiah, Rajampeta**

**Q. 1.** *Please explain correct answer and meanings for the following questions.*
*It is easy to preach others.*
*Preaching others is easier.*
*To preach others is easy.*
*It is easy to preaching others.*
*With others preaching is easy.*

**2.** *ఈ వాక్యాలకు అర్థాలను వివరించగలరు.*
*Some snakes are only poisonous.*
*Only some snakes are poisonous.*

**A. 1.** First of all, 'preach' should always be followed by 'to'. For this reason, all the sentences you've given are wrong. Any of the following is correct.

1) It is easy to preach to others

2) Preaching to others is easy

3) To preach to others is easy

all of them have the same meaning = ఇతరులకు బోధించడం సులభమే అని.

**2.** Some snakes are only poisonous = They have the only quality of being poisonous; they don't have any other quality. This is meaningless, so the sentence is not correct.

Only some snakes are poisonous = of all the snakes in the world, some only are poisonous, not all of them.

# I wish I had the wings of a dove


M.SURESAN

**Y. Gayathri, Asifabad**

**Q.** *God, Govt., India etc., వాక్యం మధ్యలో వచ్చినా capital letters రాస్తారు కదా. God కు సంబంధించి అతడు, అతడికి సంబంధించిన అన్నప్పుడు he, his కూడా capital letters రాయాలా?*

**A.** మతంతో సంబంధం లేకుండా, అందరూ కొలిచే ఒకే దేవుడు అనే భావంతో అయితే, God ఎప్పుడూ G (Capital G) తోనే రాయాలి. ఈ భావంతో God కు బదులు, He/ His/ Him అన్నప్పుడు, Capital H వాడతాం. అలాకాకుండా వాయుదేవుడు, వరుణదేవుడు, ప్రేమదేవుడు (మన్మథుడు) లాంటి వివిధ రకాల దేవుళ్ల ను గురించి మాట్లాడేటప్పుడు small 'g' నే రాస్తాం. ఈ god కు plural కూడా ఉంటుంది. అంతేకాకుండా god of love, god of success - ఇలాంటి god ముందు, the వస్తుంది. అదే ఒకే దేవుడు అని వ్యవహరించినప్పుడు, the రాదు God ముందు. ఈ god, gods కు బదులు రాసే pronoun, he/ him etc, కు small h మాత్రమే వాడతాం.

**Q.** *Economy, Economics వీటిని ఎకానమి, ఎకనామిక్స్ అనాలా? ఇకానమి, ఇకనమిక్స్ అనాలా? సరైన ఉచ్చారణ తెలుపగలరు.*

**A.** Economy - ఇకానమి -'కా'- నొక్కి పలుకుతాం. Economics - ఈకనామిక్స్- ఇందులో 'ఈ' కొద్దిగా తక్కువగా, 'నా' బాగా నొక్కి పలుకుతాం. Pronunciation తెలిపేందుకు dictionary లో వాడే 'ə' గుర్తు, rural లాంటి మాటల్లో, 'a' శబ్దాన్ని సూచిస్తుంది. ఈ శబ్దం 'అ' కు దగ్గరగా ఉంటుంది కాని 'అ' కాదు. 'అ' పలికేటప్పుడు, నోరు పూర్తిగా తెరుస్తాం. కానీ 'ə' తెలిపే శబ్దాన్ని ఉచ్చరించేటప్పుడు నోరు చాలా కొద్దిగా తెరిచీ/ తెరిచీ తెరవకుండా 'అ' అనాలి.

**Q.** *కొన్ని డిక్షనరీల్లో ఉచ్చారణ కోసం must not - mustn't - mdsn- అని ఉంటుంది. ఎలా ఉచ్చరించాలో తెలుపండి.*

**A.** Mustn't నోరు తెరవకుండా మసన్ట్అని పలకండి. అప్పుడు వినపడే స శబ్దంలో 'ə' వినిపిస్తుంది.

**Q.** *Environment - ఎన్విరాన్‌మెంట్ కరెక్టా ఎన్వాన్‌మెంట్ కరెక్టా అంటే R silent గా ఉండాలా?*

**A.** Environment - pronunciation ఇన్‌వైరన్‌మన్‌ట్ -రన్, మన్‌ట్ - వీటిని ఇందాక తెలిపినట్లు, నోరు తెరిచీ తెరవకుండా పలకండి - 'వై' నొక్కి పలకండి.

**Q.** *Contribute - kon- trib'ūt, cooler - ko''l'er. అక్షరాలపైన '-' ఉంటే ఎలా ఉచ్చరించాలి. దేనికి దీర్ఘం, దేనికి దీర్ఘంలేకుండా ఉచ్చరించాలో తెలుపగలరు.*

**A.** మీరు చూసిన dictionary ప్రకారం, అక్షరాలపైన ' " ' ఉంటే ఆ అక్షరాలు తెలిపే శబ్దాన్ని నొక్కి, దీర్ఘంగా పలకాలి. ' ' ' గుర్తు ఉన్న అక్షరాలను, నొక్కి పలుకుతాం - దీర్ఘం లేకుండా.

' - ' ఈ గుర్తు మీ dictionary ప్రకారం, u ను 'అ' లా (fun లో లా) కాకుండా, 'యూ'లా పలకాలి అని సూచించేందుకు ఉందొచ్చు. Oxford/ Cambridge లాంటి dictionaries pronunciation ను సూచించేందుకు వాడే గుర్తులు వేరే, అవే standard.

**Q.** *Phrasal Verbs ను తెలుగులో ఏమంటారో తెలుపగలరు.*

**A.** Phrasal Verbs ను క్రియా సమాసాలు అనవచ్చు.

**Q.** *కిందివాటిలో ఏది కరెక్టో తెలుపగలరు.*

*1) "Is there anything I can get you? " (or ) "Can I get you anything?"*

*2) "Can you open the window? " (or) "Do you open the window?"*

**A.** రెండూ correct, వేర్వేరు అర్థాలతో;

1) నేన్నీకు తేగలిగిందేమన్నా ఉందా? నేన్నీకేమన్నా తెచ్చేదా?

2) కిటికీ కాస్త తెరుస్తావా? నువ్వు సామాన్యంగా ఆ కిటికీ తెరుస్తావా? (తెరిచే ఉంచుతావా? )

**R.Balu, Miryalaguda**

**Q.** *ఇంగ్లిష్‌లో ఒక పదం ఎంతవరకు ఉంటుంది. ఒక వాక్యంలో, పేరాగ్రాఫ్‌లో ఒక పదాన్ని గుర్తించడం ఎలా?*

**A.** పదం అంటే English లో word- దీన్నే మాట అని కూడా అంటాం. అర్థం ఇచ్చే శబ్దాల కలయికను పదం/ మాట/ word అంటాం. The book is on the table = ఈ sentence లో the, book, is, on, the table- వీటిలో ప్రతి ఒక్కటీ పదమే/ word.

**Q.** *వాక్యంలో articles కు independent status ఉంటుందా లేదా వాటి ముందు ఉన్న పదంతో కలిసి ఒక పదంగా ఏర్పడతాయా?*

**A.** ఉండదు. A/ an, the- ఇవి English లో articles. A/ an = ఒక/ ఏదైనా. The = ఆ. ఇలా వీటికి అర్థాలున్నప్పటికీ, వీటిని independent గా sentence లో వాడం. వీటి అవతల ఉన్న పదం అర్థాన్ని ఇవి వివరంగా తెలియజేస్తాయి.

book = పుస్తకం, A book = ఒక పుస్తకం egg = గుడ్డు, An egg = ఒక గుడ్డు, Boy = పిల్లవాడు. The boy there is my brother = అక్కడున్న ఆ బాలుడు మా తమ్ముడు. ఇలా articles, వాటి తర్వాత వాడే పదాల అర్థాలను పరిమితం చేస్తాయి.

**Q.** *Precis writing లో మూడో వంతు పదాలకు కుదించి రాయమంటారు. Precis రాసే విధానాన్ని తెలుపగలరు.*

**A.** Precis writing కు ఇచ్చిన మొత్తం పదాలను, a, an, the తో సహా- ఇవన్నీ words (పదాలు) కాబట్టి, దాన్ని మూడుతో భాగించి, అన్ని మాటలకు కుదించాలి.

**Q.** *పదాల ముందు ఏయే పదాలుంటే వాటికి independent status ఉండదో తెలుపండి.*

**A.** పదాలన్నింటికీ, తెలుగులోలా independent status ఉంటుంది. అలా లేకపోతే అవి పదాలెలా అవుతాయి?

**R.Ramakrishna, Vijayawada**

**Q.** *I wish I had wings of a bird.*
*I wish I had the wings of a bird.*
*రెండింటిలో ఏది కరెక్టు?*

**A.** I wish I had the wings of a dove, correct. Wings of a dove అన్నప్పుడు, ఏ wings అనే question కు wings of a dove అనే answer వస్తోంది కదా? అందుకని the కచ్చితంగా అవసరం అక్కడ.

**Q.** *దరఖాస్తులు రాసేటప్పుడు చివరలో I request you to ... అని అనడానికి బదులు I request that I may be ... అనాలని విన్నాను. ఏది సరైనదో తెలుపండి.*

**A.** I request you to/ to be kind enough to అనడంలో తప్పేంలేదు. I request that I may be ... కొంచెం అనవసర పాండిత్యం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# It looks like it is going to rain

**Chinmaya:** Can we go out in this weather? It looks like it's going to rain again.
(ఈ వాతావరణంలో బయటికెళ్లగలమా? మళ్లీ వర్షం వచ్చేట్లు కనిపిస్తోంది).

**Tanmaya:** The chances are it will rain again and that too, very heavily. The sky is overcast.
(మళ్లీ వానొచ్చే సూచనలే ఉన్నాయి. అదీ చాలా పెద్దగా. ఆకాశమంతా కారుమబ్బు కమ్మేసింది.)

**Chinmaya:** So what shall we do? (అయితే చేద్దాం? )

**Tanmaya:** I am in a fix too. The book we want to get from Saranya is very important and she will be leaving in an hour.
(నాకూ ఏం చేయాలో తోచడంలేదు. శరణ్య దగ్గర నుంచి మనం తెచ్చుకోవాలనుకున్న పుస్తకం చాలా ముఖ్యమైంది; తనేమో ఓ గంటలో వెళ్లిపోతోంది.)

**Chinmaya:** Look. It's started drizzling again. If we get out now, we are sure to get drenched.
(చూడు, అప్పుడే తుంపర మొదలైంది. ఇప్పుడు మనం బయల్దేరామంటే పూర్తిగా తడిసిపోతాం.)

**Tanmaya:** But we need the book.
(కానీ ఆ పుస్తకం మనకవసరం.)

**Chinmaya:** Excuse me. For all that you say I don't think much of it.
(ఏమనుకోకు. నువ్వేం చెప్పినా ఆ పుస్తకం మీద నాకేం అంత గొప్ప అభిప్రాయం లేదు.)

**Tanmaya:** You don't? (లేదా నీకు? )

**Chinmaya:** Sorry, no. There are much better books on the subject than that.
(Sorry, లేదు. అంతకంటే ఆ subject మీద చాలా మంచి పుస్తకాలున్నాయి.)

**Tanmaya:** Then why were you all ears to Saranya when she was praising the book.
(మరయితే శరణ్య ఆ పుస్తకాన్నంతగా పొగుడుతుంటే అంత శ్రద్ధగా విన్నావెందుకు? )

**Chinmaya:** You imagine things. I was not all that interested.
(నువ్వన్నీ ఊహించుకుంటావు. నేనేం అంత శ్రద్ధ చూపించలేదు.)

**Tanmaya:** Ok. Now that we can't go to Saranya in this bad weather, will you at least show me the books you say are much better.
(సరే. వాతావరణం బాగాలేని ఈ పరిస్థితిలో మనం శరణ్య దగ్గరకు వెళ్లలేం కాబట్టి, తన దగ్గరున్నదానికంటే మంచి పుస్తకం నీ దగ్గరున్నాయన్నావే, వాటిని చూపించు.)

**Chinmaya:** Wait. All in good time. I'll get them to you as soon as the weather clears.
(ఆగు కాస్త ఓపికపట్టు. త్వరలోనే చూపిస్తా. ఈ మబ్బువీడనీ.)

**Tanmaya:** OK. I'm stopping because of you. Mind what you're about. You have given the word.
(సరే. నేనాగిపోతున్నా నీ వల్ల. నువ్వేమన్నావో, ఏం చేయబోతున్నావో, గుర్తుంచుకో. నాకు మాటిచ్చావు.)

**Chinmaya:** You won't be disappointed. How about having meal with me at my place now? I don't know what mom has cooked. You'll have to take pot luck.
(నువ్వు నిరాశ చెందకు. మా ఇంట్లో భోంచేయకూడదా నాతో. మా అమ్మ ఏం వండిందో నాకు తెలియదు. మన అదృష్టం కొద్దీ/ ఏదుంటే దానితోనే సరిపెట్టుకోవాలి.)

**Tanmaya:** No, I have to go. Mom will be waiting for me. Moreover my cousin is coming.
(లేదు. నేను వెళ్లాలి. అమ్మ నా కోసం చూస్తూ ఉంటుంది. అంతేకాకుండా మా cousin కూడా వస్తోంది.)

**Chinmaya:** OK. Let's now look for those books.
(సరే. ఆ పుస్తకాలెక్కడున్నాయో చూద్దాం పద.)

Daily conversation లో real life situations లో వాడే expressions గురించి చర్చిస్తున్నాం కదా. వాటిలో మరికొన్ని ఈ lesson లో తెలుసుకుందాం. వీటిని మనం సందర్భాన్నిబట్టి వాడితే, మన English చాలా వ్యావహారికంగా, సునాయాసంగా మాట్లాడినట్టనిపిస్తుంది. Practice చేయండి.

***Look at the following sentences from the conversation above:***

*1) It looks like it's going to rain.*
*2) The chances are it will rain again and that too very heavily.*
*3) The sky is over cast.*
*4) I am in a fix.*
*5) For all that you say, I don't think much of that book.*
*6) Why were you all ears to saranya?*
*7) All in good time.*
*8) Mind what you're about.*

**1) Look like** = దీనర్థం, మనందరికీ తెలిసిందే - పోలిక ఉండటం. ఒకదానిలా/ ఒకరిలా ఇంకోటి/ ఇంకొకరు ఉండటం.

She looks like her sister = ఆమె తన అక్క/ చెల్లెల్లానే ఉంది.




c) It looks like there will be another tsunami
= ఇంకో సునామి వచ్చేలా ఉంది/ అనిపిస్తోంది.

**2) That too** = అదికూడా/ అందులోనూ/ దానికి తోడు.

a) Do you want me to all the way, and that too in this hot sun? = అంత దూరమూ నడవమంటావా నన్ను, అందులోనూ ఇంత ఎండలో?

b) He gave just half the money and that too after a lot of delay = అతడు నాకు సగం డబ్బే ఇచ్చాడు, అదీ చాలా ఆలస్యంగా.

**3) Overcast=** ఆకాశం బాగా మబ్బేసి ఉండటం/ కారుమబ్బులతో ఉండటం.

a) The sky being overcast, the fisherman did not set out into the sea = ఆకాశం మేఘావృతమై ఉండటంవల్ల, ఆ జాలరి సముద్రంలోకి వెళ్లలేదు.

b) The sky was overcast and we got wet in the drizzle = కారుమబ్బులు కమ్మి ఉంది ఆకాశం, మేం జుల్లులో తడిశాం.

**4) Be in a fix/ get in a fix=** క్లిష్ట పరిస్థితిలో ఉండటం. ఇది చాలా సాధారణంగా వాడే మాట.

a) We'll be in fix if we lose this money too
= ఈ డబ్బు కూడా పోగొట్టుకుంటే మనం చాలా ఇబ్బందుల్లో పడతాం.

b) We've got ourselves in a fix by investing in this business




**Not think much of** = ఒకరిని గురించి సదభిప్రాయం/ గొప్ప అభిప్రాయం ఉండకపోవడం (ఎక్కువగా లేకపోవడం అనే భావంతో not తో వాడతాం)

a) Not many think much of Ganguly nowa days = గంగూలీని గురించి చాలామందికి గొప్ప అభిప్రాయం లేదిప్పుడు.

b) She doesn't think much of the Chiranjeevi effect = ఆమెకు చిరంజీవి ప్రభావం మీద అంత గొప్ప అభిప్రాయం లేనట్టుంది.

**7) Be all ears** = అత్యంత ఆసక్తితో శ్రద్ధగా వినడం/ చెవులప్పగించడం.

a) She was all ears for her lover's words = తన ప్రియుడి మాటలామె అత్యంత శ్రద్ధతో/ చెవులప్పగించి వింటోంది.

b) I am all ears for your story. Please start = నీ కథ శ్రద్ధగా వినేందుకు సిద్ధంగా ఉన్నా. ప్రారంభించు. (పోల్చండి: All eyes)

**7) All in good time** = త్వరలోనే/ జరగాల్సిన సమయంలోనే. జరగాల్సింది సరైన సమయంలోనే అనుకున్నట్టు జరుగుతుంది, తొందరపడకు, అనే అర్థంతో.

a) 'Mom, when will the food be ready?'
(అమ్మా, అన్నం ఎప్పుడు తయారవుతుంది? )

దీనికి సంబంధించిందే look alike = ఒకేలా ఉండటం.

The brothers look alike = ఆ అన్నదమ్ములు ఒకేలా ఉంటారు.

**look alike** - ఇలా కూడా వాడతాం-

a) He is his father's look alike
= అతడు అచ్చు వాళ్ల నాన్నలానే ఉంటాడు.

b) A number of movies/ novels are woven around look alikes
= చాలా సినిమాలు/ నవలలు ఒకే పోలికున్నవాళ్ల చుట్టూ అల్లినవే.

అయితే It looks like it's going to rain అనే మాటల్లో looks like కు అర్థం, అనిపించడం/ కనిపించడం.

a) He looks like having been beaten = అతడు బాగా దెబ్బలు తిన్నట్లు కనిపిస్తున్నాడు.

b) The teacher looks like having seen our tricks = మన వేషాలను teacher గ్రహించినట్లుంది/ అనిపిస్తోంది.


M.SURESAN

= ఈ వ్యాపారంలో పెట్టుబడి పెట్టి చిక్కుల్లో పడ్డాం/ ఏమీ పాలుపోని స్థితిలో ఉన్నాం.

Be in a fix అంటే ఎటూ తేల్చుకోలేని స్థితి కూడా - To do or not to do something అనే మీమాంస.

**5) For all that/ for all etc =** అయినప్పటికి

a) For all its batting power, India lost the match = Batting శక్తి ఉన్నప్పటికీ/ ఎంత batting శక్తి ఉంటేనేం, భారత్ ఓడిపోయింది.

b) For all that I worked, I got very little = నేనెంతో చేసినప్పటికీ నాకొచ్చింది తక్కువే.

c) For all our claims of democracy, only the rich have all the power= మనది ప్రజాస్వామ్యం అని ఎంత చెప్పుకున్నప్పటికీ ధనికులదే అధికారం అంతా.

'All in good time, boy, all in good time'
(త్వరలోనే బాబూ.)

b) He got what he wanted, all in good time = అతడు కావాలనుకున్నది పొందాడు, అదీ త్వరలోనే/ అనుకున్న సమయంలోనే.

**8) Mind what you're about =** నువ్వేం చేయబోతున్నావో జాగ్రత్త! ఇదో విధంగా హెచ్చరించడం.

a) 'I have decided to contest the elections'
(నేను ఎన్నికల్లో పోటీ చేయాలని నిర్ణయించుకున్నా.)

'Mind what you're about. It'll cost you all that you've earned in the last 10 years'.
(నువ్వేం చేస్తున్నావో జాగ్రత్త/ ఆలోచించు. గత పదేళ్లలో నువ్వు సంపాదించిందంతా ఖర్చయిపోతుంది)

b) Mind what you're about. You're going to face a strong opponent - ఏం చేస్తున్నావో జాగ్రత్త! చాలా బలమైన ప్రత్యర్థినెదుర్కోబోతున్నావు.

---

**Q.** *I have had a car - ఈ వాక్యంలో had possession కు సంబంధించిందా?*
*- Abhijeet, Hyderabad*

**A.** I have had a car లో have, present perfect tense ను తెలిపేమాట. దీనికి have కలిగి ఉండటం (possession) కు సంబంధం లేదు. Had పై sentence లో have కు past participle.

**Q.** *I got married., I was married. ఈ రెండింటిలో ఏది కరెక్టు?*
*He has left for Bombay. He has gone to Bombay. ఈ రెండు వాక్యాలకు తేడా ఉందా?*
*- L. Nageswara Rao, Gudivada*

**A.** I got married = నేను పెళ్లి చేసుకున్నాను- ఫలానా రోజున/ సంవత్సరంలో.
I was married = నేనప్పటికి వివాహితుడిని.
మొదటి sentence లో పెళ్లి చేసుకున్నాను అనే పనికి ప్రాధాన్యం.
రెండో sentence లో, వివాహితుడిని అనే భావానికి ప్రాధాన్యం ఉంది.
He has left for Bombay = He has gone to Bombay.

**Q.** *1. How could you ever get admission in that school? ఇక్కడ ever ఉపయోగం ఏమిటి? Ever ఉపయోగించకపోతే అర్థంలో వచ్చే తేడా ఏమిటి?*
*2. Some other brands will then be as cheap as this or even cheaper. ఇక్కడ then ఎందుకు ఉపయోగించారు? Then ఉపయోగించడం వల్ల ఏ భావంపై stress పడుతుంది?*
*- B. Sarada, Eluru*

**A.** 1. మామూలుగా ever అంటే ఎప్పటికీ అని అర్థం. అయితే ఇలాంటి sentences లో ever అంటే అసలు అని అర్థం వస్తుంది, ఆశ్చర్యం వ్యక్తపరిచేందుకు. మీరా school లో అసలు admission ఎలా పొందగలరు? అన్నట్టు.
2. then = అప్పుడు (అప్పుడు/ ఆ పరిస్థితిలో)

**Q.** *సిపాయిల తిరుగుబాటును Sepoy mutiny అనాలా? Soldiers mutiny అనాలా? ఇంగ్లండ్‌లో సిపాయిని ఏమంటారు? మనదేశంలో sepoy అన్న పదం ఎలా స్థిరపడింది? - P. Mohan, Jagityal*

**A.** Sepoy అనేది Hindi/ Urdu మాట. స్వాతంత్ర్యానికి పూర్వం British military officers కింద పనిచేసే అతి కిందిస్థాయి సైనికులను sepoy అనేవాళ్లు. ఈ మాట ముఖ్యంగా British సైనికులకు, భారత సైనికులకూ తేడా తెలిపేందుకు వాడేవారు. ఇప్పుడు మన దేశంలో sepoy బదులు Jawan (జవాన్) వాడుతున్నారు. Sepoy ఇప్పుడు వాడుకలో లేదు. Jawan, Indians English. Sepoy, Jawan, Soldier- ఇవన్నీ ఒకటే. సైనికుడు అని.

**Q.** *మీరు నిన్న ఇంట్లో ఉన్నారా? - ఇంగ్లిష్‌లో ఏమనాలి? Were you at home yesterday/ Was you at home yesterday?*
*- M. RatnaKishore, Miryalaguda*

**A.** You= నువ్వు/ మీరు. నువ్వు అని వాడినా, మీరు అని వాడినా, you తో వచ్చే verb ఎప్పుడూ plural. అందుకని you are/ were అంటాం. You was అనం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ



**J. Krishna, Rajapuram**

**Q.** న్యూస్‌పేపర్లలో missing ప్రకటనలు వస్తుంటాయి. Missing అని కాకుండా missed అని రాస్తే బాగుంటుంది కదా. అలాగే No smoking, No parking, Drinking water లాంటి వాటిని ing form లో రాస్తారెందుకు? Do not smoke here, Do not park your vehicles here అని రాస్తే బాగుంటుంది కదా.

**A.** Smoking, drinking, parking - ఇలాంటి మాటల్లో 'ing' form కి అర్థం ఆ పనిచేయడం అని (పొగతాగడం, తాగడం, వాహనాలు నిలపడం). No smoking/ parking, etc- పొగతాగడం/ వాహనాలు నిలపడం కూడదని. Do not smoke/ Do not park, etc కంటే No smoking/ No parking simpler కదా?

**Q.** Bearer, Butler, Waiter, Server, Steward ... వీటికి అర్థమేమిటి?

**A. Bearer** అంటే ఏదైనా తెచ్చే వాళ్లు/ మోసేవాళ్లు అని అర్థం. Restaurants లో ఆహార పదార్థాలు అందించే వారికి ఈ మాట సరికాదు, వాడం.

**Butler** = పెద్దపెద్ద/ సంపన్నుల ఇళ్లల్లోని పనివాళ్లలో ముఖ్యుడు - The chief man servant.

**Waiter** = server = Restaurants, విందులు, parties లో వడ్డించేవారు. అయితే ఈ అర్థంతో standard English లో waiter అనేమాట ఎక్కువ వాడతారు. Server అనే మాట ఎక్కువ మన దేశంలోనే వినిపిస్తుంది. Restaurants లో వడ్డించేవారిని waiter అనే పిలుస్తారు. (Waitress = ఈ పనులు చేసే ఆడవాళ్లు)

**Steward** = Restaurants/ clubs/ bars లో వడ్డనను అజమాయిషీ చేసే వ్యక్తి/ పెద్ద పెద్ద దివాణాల్లో (Estates) లో ఆస్తుల వ్యవహారాలను చూసేవాడు. (Stewardess = ఈ పనులు చేసే స్త్రీ)

---

**A. Sridhar, Oripenta**

**Q.** Shop-shoppe, novelties, passing cloud, phonetics, big burn, affordable, ring master, echo tourism, picket, out post, big furn, roll over, royalty, signing off, accessories.. వీటిని వివరించగలరు.

**A. Shop** = దుకాణం/ అంగడి = Shoppe - Old spelling of shop - used now only in shop names (దుకాణాల పేర్లలో మాత్రమే ఇప్పుడు కనిపిస్తుంది. Shop, shoppe, రెండింటి pronunciation ఒకటే)

**Novelties** = అంత విలువ చేయని, ఆకర్షణీయంగా తయారుచేసిన వస్తువులు - కొన్ని రోజుల అలంకారానికి, వాడకానికి పనికొచ్చే వస్తువులు

**Passing cloud** - తేలే మేఘం - వర్షం కురవనిది.

**Phonetics** = ఓ భాషలోని మాటల/ శబ్దాల ఉచ్చారణ తెలిపే శాస్త్రం

**Big burn** - big = పెద్ద, burn = కాలిన గాయం. ఈ రెండింటినీ కలిపితే వచ్చే పదం లేదు.

**Afford** = కొనగలగడం/ ఖర్చు పెట్టగలగడం, I can't afford a car.

**Affordable** = కొనగలిగిన. Affordable prices = కొనగలిగిన ధరలు.

**Ring master** = Circus లో జంతువులనాడించడం, ఇతర విన్యాసాలనూ చేయించే బాధ్యతలున్న circus కళాకారుడు.

**Ecotourism** = పర్యటకులు, పర్యావరణానికి హాని కలిగించని విధంగా నిర్వహించే విహార ప్రయాణాలు (Holiday tours); ముఖ్యంగా పర్యటకులు చెల్లించే డబ్బు కొంత పర్యావరణ పరిరక్షణకు వాడే పద్ధతిలో

**Picket** = 1) సమ్మె జరుగుతున్నప్పుడు సంస్థ, factory లోనికి ఎవరూ వెళ్లకుండా ఆపడం.
2) దేన్నయినా సంరక్షించేందుకు నియమించే సైనికుల/police ల బృందం.

**out post:** 1) శత్రువుల కదలికను గమనించేందుకు ముఖ్య సైనిక స్థావరం నుంచి దూరంగా ఉండే సైన్య విభాగం. అలా దూరంగా ఉండే చిన్న Police stations.
2) మారుమూల గ్రామ ప్రాంతాల్లో ఉండే చిన్న police Station/ భవన సముదాయం.

**Big furn** - ఈ మాట ఎక్కడా లేదు.

**Roll over** - పక్కలో పడుకుని ఒకవైపు నుంచి ఇంకో వైపు తిరగడం.

**Royalty** = రాజరికం.

**Signing off** = Radio/ TV programmes ముగించడం/ ఉత్తరాల చివర, 'ఇంతే సంగతులు' అని రాయడం. ఇంకా మన ఆమోదం తెలుపుతూ సంతకం పెట్టడం.

**Accessories** = వాహనాలు/ యంత్రాల్లాంటి వాటికి అవసరం కాకపోయినా, అదనంగా అమర్చే సామగ్రి - Car/ bike/ cycle accessories - musical horns, bells, ఇతర అలంకారాలు/ సామగ్రి,

**Q.** గారు, శ్రీ ను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** గారు, శ్రీ = Mr/ Ms (miss)/ Mrs.

**Q.** I want to go to America. I want to go America. ఈ రెండు వాక్యాల్లో ఏది కరెక్టు?

**A.** I want to go to America- Correct.

**Q.** Smell, odour తేడా ఏమిటి?

**A.** Smell = వాసన; Odour = ఘాటైన వాసన

**Q.** Shop పేరు ముందు ఉండే M/s అంటే ఏమిటి?

**A.** M/s = Plural of Mr (Mister) = సర్వశ్రీ

**Q.** Mrs అంటే ఏమిటి?

**A.** Mrs - పెళ్లయిన ఆడవాళ్ల పేర్ల ముందు చేర్చే పదం.




**Q.** బైక్ మీద అటూ, ఇటూ కదలవద్దు.

**A.** Don't sway; sit steady.

**Q.** ఎక్కువసేపు టీవీ చూడొద్దు.

**A.** Don't watch the TV too long.

**Q.** వేడిగా ఉంది, ముట్టుకోవద్దు (తాకవద్దు).

**A.** It's hot, don't touch it.

**Q.** పుస్తకాలన్నీ బ్యాగ్‌లో పెట్టుకో.

**A.** Put all the books in your bag.

**Q.** పెన్సిల్ షార్ప్ చేసుకో.

**A.** Sharpen your pencil.

**Q.** త్వరగా కానివ్వు (ఏదైనా పని చేస్తున్నప్పుడు)

**A.** Hurry up.

**Q.** స్కూల్‌కు వెళ్లే టైమ్ అయ్యింది, తొందరగా తిను.

**A.** It's time for School/ Time's up; eat fast.

**Q.** పక్కవాడికి కొంచెం పెట్టు (తినేటప్పుడు)

**A.** give him/ her some (of what you're eating)

**Q.** కొంచెం సేపు పడుకో.

**A.** Lie down for sometime.

**Q.** ముందుగా హోం వర్కు రాసుకుని, తర్వాత ఆడుకోవడానికి పో.

**A.** Do the homework first and then go out to play.

**Q.** చిరుతిండి ఎక్కువగా తినకు.

**A.** Don't eat too much of snacks.

**A.** "Can you understand English?" He said to her- ఇది అడగడాన్ని తెలిపే sentence- నువ్వు English అర్థం చేసుకోగలవా? అని ఆమెను అతడడిగాడు- IS- He asked her if she could understand English.

"Will you start tomorrow?" He said to her- ఇది అడగడమే కదా? = నువ్వు రేపు బయల్దేరుతున్నావా? అని ఆమెను అతడడిగాడు - He asked her if she was starting the next day.

**Q.** Mani says, "I am ready" అని, Mani says that she is ready అని అంటాం. కానీ ఇంకొకరికి report చేసేటప్పుడు Mani said that she was ready అని కదా అనాలి? Reporting verb ను present tense లో ఎప్పుడు వాడతాం? Reporting verb present or future లో ఉంటే reported speech లో tense మారదా?

**A.** కొన్ని నెలల తర్వాత/ కొంచెం సమయం తర్వాత/ కొన్ని రోజుల తర్వాత మనం మూడో మనిషికి report చేయాల్సినపుడు, Mani says అనం కదా? (an hour/ two days/ some time ago) Mani said అనే అంటాం కదా? (Mani says two days ago అనం కదా?) అప్పుడు reporting verb కచ్చితంగా past tense అవుతుంది కదా? మనం ఇలాంటి విషయాల్లో ఉన్న నిబంధనలను అర్థం చెడకుండా ఉండే వరకే పాటిస్తాం. నిబంధనల వల్ల అర్థం చెడిపోయే ప్రమాదం ఉంటే నిబంధనలను వదిలేస్తాం.

ఇక్కడ exercise/ exam లో Mani says అని ఉంటే అక్కడ says present tense అవుతుంది అనేది గమనించాలి. విడిగా మనం ఎప్పుడో చెప్పుకున్న విషయం అయితే said అనే అంటాం.

# Don't watch the TV too long

**K.Ramesh Rao, Nagarjuna Sagar**

**Q.** Please give list of Vocabulary kangaroo words for the benefit of readers. eg: market= mart, spoil= soil etc...,

**A.** A Kangaroo word has in its spelling, a smaller word which is its synonym. Devilish - evil, lineage - line, Destruction - ruin, Nourished - Nursed, Instructor - tutor, Curtail - cut, Assured - sure, Deceased - dead, Falsities - lies, Deliberate - Debate, variegated - varied, Pantaloons - Pants, Satisfied - sated, Instantaneously - instantly, Boundaries - Bounds and so goes the list.

---

**MV Subramanyam, Chillakur**

కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపండి.

**Q.** చదువుతూ రాయి. **A.** Read as you write.

**Q.** రాసేటప్పుడు చదువు **A.** Readout when you write.

**Q.** టీవీ చూస్తూ తినవద్దు.

**A.** Don't watch the TV while you eat.

**Q.** తినేటప్పుడు టీవీ చూడవద్దు. and so goes the list.

**A.** Don't eat while you watch the TV.

**Q.** తినేటప్పుడు మాట్లాడవద్దు.

**A.** Don't talk while you eat.

**Q.** బైక్ ఎక్కు. **A.** Get up on the bike.

**Q.** బైక్ దిగు. **A.** Get off the bike.

**Q.** యూనిఫాం వేసుకో. **A.** Wear your uniform.

**Q.** యూనిఫాం విప్పెయ్యి. **A.** Take off the uniform.

**Q.** ఏ ఏ సబ్జెక్టుల్లో హోం వర్కు ఇచ్చారు?

**A.** In which subjects do you have homework.

**Q.** హోం వర్కు పూర్తిచేశావా?

**A.** Have you done/ finished your homework?

**Q.** రేపు స్కూల్ ఉందా?

**A.** Do you have school tomorrow?

**Q.** హోం వర్కు మొదలుపెట్టు.

**A.** Start doing/ begin your homework.

**Q.** మిగిలిన హోం వర్కు ఎప్పుడు రాస్తావు?

**A.** When will you do the rest of the HW?


M.SURESAN

**Q.** పెందలాడే చదువుకుని పడుకో.

**A.** Finish your studies early and then go to bed.

**Q.** మక్కికి మక్కి ట్రాన్స్‌లేట్ చేయకు.

**A.** Don't translate word to word.

**Q.** టీవీ కొంచెం సౌండ్ పెంచు.

**A.** Raise the volume.

**Q.** ఫ్రిజ్ డోర్ ఎక్కువసేపు తీసి ఉంచకు.

**A.** Don't keep the fridge open too long.

**Q.** నేను ఎక్కువసేపు ఇంక ఇక్కడ ఉండలేను.

**A.** I can't stay here any more.

**Q.** అతడు వస్తూ ఉండవచ్చు ( doubt + present continuous)

**A.** He may be coming.

**Q.** అతడు వస్తూ ఉండి ఉండవచ్చు (doubt + past continuous)

**A.** He might have been coming.

**Q.** అతడు తప్పక వస్తూ ఉంటాడు. (Must + present continuous)

**A.** He must be coming.

**Q.** అతడు తప్పక వస్తూ ఉండి ఉంటాడు. ( Must + past continuous)

**A.** He must have been coming.

**Q.** అలాగే doubt + future continuous.

**A.** He may be coming/ He will perhaps be coming.

**Q.** అలాగే Must + Future continuous.

**A.** He must be coming.

---

**K. Kamala, Vizianagaram**

**Q.** Direct and Indirect speech విషయంలో- Imperative sentence అంటే ఆజ్ఞలు, అభ్యర్థనలు, అడగడం అన్నారు. ఈ అడగడానికి సంబంధించి కొన్ని వాక్యాలు చెప్పండి.

**Q.** Would, Could ను present tense లో spoken English లో ఎక్కువగా వాడతారు. అవి ఎప్పుడు వాడాలి? How could he? So could I వీటి అర్థం ఏమిటి? ఎలా ఉపయోగించాలి?

**A.** అవును. would ను ముఖ్యంగా 1) wish అనే అర్థంతో 2) Question రూపంలో ఉన్న requests తెలిపేందుకు (Would you lend me your book?) 3) Offers కు (Would you have some coffee?), 4) ఏదైనా చేసేందుకు మన ఇష్టానిష్టాలను తెలిపేందుకు, like/ love/ hate/ prefer తో (I would love to hear her sing)- ఇలా present tense లో వాడతాం.

Could present tense లో వాడకం- 1) possibility (సాధ్యత) తెలిపేందుకు (Be careful. He could defeat you = అతడు నిన్ను ఓడించవచ్చు జాగ్రత్త). 2) Question రూపంలో అత్యంత మర్యాదగా (would కంటే ఎక్కువగా) request చేసేందుకు.

Could you lend me some money (please)? (కాస్త డబ్బు అప్పిస్తారా? ) - ఇలా. వీటి గురించి వివరంగా వీటికి సంబంధించిన lessons లో చూడండి.

**Q.** Phrasal verbs అన్నింటికి అర్థాలు డిక్షనరీలో దొరకడం లేదు. Put off, put on, put through, put up, put up with ఇలాంటి వాటి అర్థం, ఉపయోగం తెలుసుకోవడమెలా?

**A.** Cambridge International Dictionary of Phrasal Verbs మంచి ఉపయోగకర పుస్తకం. దాని సహాయం తీసుకోండి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**





# Nothing comes to you on its own



**A.Sudhakar, Bhiknur**

Please define these words: Surrealism, existentialism, impressionism, symbolism, puritanism, naturalism, realism, transcendentalism, multiculturalism.

**A.** All these words are related to art, literature and philosophy.

**Surrealism** = A style of art and literature in the 20th Century. In this type of art and literature unconnected things are shown in combination, as in a dream, to express what's happening in some body's mind (ఈ శైలి వర్ణ చిత్రాల్లో, సాహిత్యంలో, మన హృదయాంతరాళాల్లో జరిగే భావాలనూ, ఆలోచనలనూ పరస్పర సంబంధం లేని వస్తువులను, దృశ్యాలను, కలల్లోలా కలిపి చూపుతారు.)

**Existentialism** = అగమ్యగోచరమైన ఈ ప్రపంచంలో అర్థం వెతికే బదులు, తమ చర్యలకు తామే బాధ్యులమని వాదించే తత్వం (Philosophy).

**Impressionism:** Again a term from art = చిత్రకళకు, ముఖ్యంగా తైలవర్ణ చిత్రాలకు సంబంధించింది- రంగుల (colours) తో రంగుల ఛాయల (shades of colour) తో మనిషి భావాలను, ఉద్వేగాలను చూపడం, మనిషి మొహంలో ఆ భావాలు చూపడం బదులు.

**Symbolism:** In art and literature using symbols to convey ideas. చిహ్నాలు/ గుర్తులతో భావాలనూ, సంఘటనలనూ తెలపడం- మరణాన్ని తెలిపేందుకు ఆరిపోతున్న దీపంలాంటి వాటితో, విషాదానికి మోడువారినట్లు చూపడం లాంటివి.

**Puritanism:** శీలం, ప్రవర్తన, నడవడి విషయాలలో ఎటువంటి తప్పిదాన్ని క్షమించలేకపోవడం/ వాటి విషయాలతో అతిగా, కచ్చితంగా ఉండటం.

**Naturalism:** వస్తువులను, వ్యక్తులను అవి/ వాళ్ళు ఉండే విధంగా/ సహజంగా చూపడం/ చిత్రించడం.

**Realism:** సంఘటనలను, వ్యక్తులను వాస్తవ రూపంలో, ముఖ్యంగా అనాహ్లాదకరమైన విషయాలనూ అలాగే చూపడం. (సినిమాల్లో శవదహన దృశ్యాలూ, క్రూరహత్యలు లాంటివి సహజంగా జరిగే తీరులో చూపడం దీనికి ఉదాహరణ)

**Transcendentalism:** ఆత్మజ్ఞానం/ ఆత్మప్రబోధంతో సత్యాన్వేషణ చేయడం.

**Multiculturalism:** భిన్న సంస్కృతుల కలయిక మంచిదనే తత్వం.

---

**T.Satyanarayana, Vempadu**

**Q.** ఇంగ్లిష్‌లో ప్రశ్నలు ఎన్ని రకాలు, అవి ఏమిటి? వాటిని ఏ విధంగా classify చేస్తారు? ఒక్కొక్క question word తో ఎన్ని రకాలుగా ప్రశ్నలు అడగవచ్చో తెలియజేయగలరు. ప్రత్యేకంగా question patterns పైన పుస్తకం ఏమైనా ఉంటే తెలియజేయగలరు.

**A.** English లో two types of questions- 1) 'Wh' Questions- starting with 'Wh' words. (What, When, Where, Who, Whom, Whose, Which and Why) - the answers to these questions are statements.

2) Non-Wh Questions- పై 'Wh' మాటలతో ప్రారంభం కానివి (am, is, are, was, were, can, could, shall, should, will, would, etc తో ప్రారంభమయ్యేవి)- వీటికి answers, yes or no.

ఇంతకంటే వేరే questions patterns లేవు. వీటినే సందర్భాన్ని బట్టి మార్చి మార్చి అడుగుతుంటాం.

**Q.** "నేను ఇంగ్లిష్ టీచర్ అయినంత మాత్రాన ఇంగ్లిష్ పదజాలమంతా తెలియాలని ఏమీ లేదు." దీనిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలో తెలియజేయగలరు.

**A.** Just/ simply because I am an English teacher I can't be expected to know the whole vocabulary in English./ That I am an English teacher is no reason why I should know all the words in English.

**Q.** Suffixes - fy - en లాంటి వాటితో Nouns ను verb గా మార్చడానికి, ish లాంటి suffix తో nouns ను adjectives గా మార్చడానికి ఏమైనా రూలు ఉందా? లేదా ఏయే nouns ను ఆ విధంగా verbs గా, adjectives గా మార్చవచ్చో తెలియజేయగలరు.

**eg:** strength - strengthen, threat - threaten, specify, electrify, satisfy etc.,

**A.** అలాంటి rule ఏమీ లేదు. Suffixes సాధారణంగా మాటల parts of speech ను మారుస్తాయి. ఏ మాట తర్వాత ఏ suffix ను చేరిస్తే ఏ part of speech అవుతుందనేది, 1) ఆ మాట ఏ భాషనుంచి English లోకి వచ్చిందీ, 2) ఉచ్చారణాసౌలభ్యం (ease of pronunciation) ను బట్టి ఉంటుంది.

కొన్ని nouns ను verbs గా మార్చే examples: Note - notify; sanctity- sanctify; solid-solidify; beauty- beautify.

Adjectives ను verbs గా మార్చే examples: wide - widen; broad - en; weak - en; dead - en; etc ఇలా చెప్పుకుంటూపోతే పెద్ద list అవుతుంది.

**Q.** Agent nouns చివర er, or, ar లతో ఏర్పడుతున్నాయి. వీటికి ఏమైనా రూల్ ఉంటే తెలియజేయగలరు.

**A.** అలాంటి rule అంటూ ఏం లేదు. అయితే t చివరవచ్చే శబ్దాలకు ఎక్కువగా '--or' వస్తుంది. మిగతా letters b, d, g, m, n, etc., చివరవచ్చేవాటికి, '-er' చేరుస్తాం. అయితే ఇది కూడా అన్నిచోట్లాకాదు. '-ar' వచ్చేది చాలా తక్కువ. అది, '-er', '-or' లాంటి agent noun suffix కాదు. English భాషాపరిణామంలో ఓ ప్రక్రియ ద్వారా వచ్చేదది.

**Q.** పోరాడి సాధించిన విజయాలే మనకు అత్యంత ప్రియమైనవి.

**A.** We savour only those victories we struggle to accomplish.

**Q.** లక్ష్యాన్ని వదిలిపెడితే విజయం నీ దరిదాపుల్లోకి రాదు.

**A.** If you lose sight of your goal, victory shall never be yours.

**Q.** ధర్మం అంటే కర్తవ్యం, పరాయణత, సదాచారం.

**A.** Duty is devotion and adopting a good means to a good end

**Q.** నిరంతరం శ్రమించేవాడిని చూసి ఓటమి భయపడుతుంది.

**A.** Defeat dreads the ever industrious.

**Q.** ఇతరులపై నమ్మకం తాత్కాలికం. నీపై నీకున్నది శాశ్వతం.

**A.** Your faith in others is fleeting. Your faith in yourself is lasting.

**Q.** ఏది తానై నీదరికి చేరదు. శోధించి, సాధించాలి.

**A.** Nothing comes to you on its own. You should go after it and achieve it.

**Q.** కాలం నీకోసం ఆగదని తెలిపే సాధనం గడియారం.

**A.** The clock is a device that reminds you that time waits for none.

**Q.** సంయమనం **A.** Restraint
**Q.** సానుకూలత **A.** Favourable (సానుకూలమైన)
**Q.** అవగాహన **A.** Understanding
**Q.** సంచలనం **A.** Sensation
**Q.** నేపథ్యం **A.** Background
**Q.** నిప్పులు చెరగడం **A.** Rage (against some one/ some thing)

---

**A.V. Subba Rao, Oripenta**

కింది పదాలకు అర్థాలను తెలుపండి.

**Q.** Handling charges

**A.** ఏ వస్తువులకైనా మన order బుక్ చేసుకుని వాటిని చేరవేసేందుకు, ప్రయాణాలకు tickets book చేసేందుకు company లు వసూలు చేసే రుసుం.

**Q.** Osteoporosis

**A.** వయసు పైబడటం వల్ల, ఎముకలు గుల్లగా, పెళుసుగా తయారయ్యే వ్యాధి.

**Q.** Ether

**A.** తేలికగా ఆవిరైపోయే ఒక రసాయన ద్రవం- రోగులకు మత్తు తెప్పించేందుకు వాడతారు.

**Q.** Down town

**A.** ఒక నగరంలోని వ్యాపార ప్రదేశం- నివాస స్థలానికి భిన్నంగా.

**Q.** K.G. Basin అంటే కృష్ణ, గోదావరి బేసిన్- కరెక్టేనా?

**A.** Krishna Godavari Basin- ఆ నదుల పరీవాహక ప్రాంతం. ఆ నదులకు రెండువైపులా ఉండే ప్రాంతం (అందులోని చిన్నచిన్న ఏరులు ఆ నదుల్లో కలుస్తూ)

**Q.** campaign **A.** ఉద్యమం
**Q.** carnival **A.** సంబరం/ వేడుక/ మేళా
**Q.** catchment area **A.** ఒక నది/ సరస్సులోకి వర్షం నీరు ప్రవహించే ప్రాంతం.
**Q.** saga **A.** వీరుల సాహసగాథ
**Q.** Inflow **A.** నదుల్లోకి వర్షాల వల్ల వచ్చి చేరే నీరు.

**Q.** Shade-shadow తేడా ఏమిటి?

**A.** Shade = ఎండ/ వెలుతురు పడని చోటు.
Shadow = నీడ

**Q.** Just do it **A.** ఆ పని చేసెయ్/ మాట్లాడకుండా పని చూడు.
**Q.** Just like that **A.** దానిలాగానే/ అది అంతే/ ఏదో అలా.
**Q.** Hands free **A.** Telephone లాంటి పరికరాలను చేత్తో పట్టుకోకుండా వాడగల సదుపాయం.
**Q.** Kitty party **A.** అందరూ చందాలేసుకుని చేసుకునే party
**Q.** Kitty Bank **A.** పేకాటలో అందరూ పణంగా పెట్టే డబ్బు మొత్తం - గెలిచిన వాళ్లు తీసుకునేది

**Q.** బహుముఖ ప్రజ్ఞాశాలి అనేదానికి Multifaced or Multifaceted ఏది కరెక్టు?

**A.** Versatile genius.
Multi faced = చాలా ముఖాలు ఉన్న.
Multi faceted = చాలా వైపులున్న.
A multifaceted problem = వివిధ/ బహు అంశాలున్న సమస్య

**Q.** Norms **A.** ప్రమాణాలు (Standards).

**Q.** Go there, go over there ఈ రెండింటి తేడాను తెలుపండి.

**A.** Go there = అక్కడికి వెళ్లు/ వెళ్లడం. Go over there = ఇదికూడా అక్కడికి వెళ్లడమే, అయితే అక్కడికి వెళ్లేందుకు ఏదైనా దాటివెళ్లడం- ఒక గదినో/ ఓ ప్రదేశాన్నో/ ఓ ఊరునో/ ఓ నదినో/ ఓ సముద్రాన్నో దాటి కావచ్చు

a) Please go over to the director in the next room = పక్కగదిలో ఉన్న director దగ్గరికి వెళ్లండి- (గది దాటి వెళ్లాలి)

b) Many young Indians are going over to the US for better opportunities.

c) Go over there and see what's happening = అక్కడికివెళ్లి (ఇంకోచోటు/ గది/ ఊరు, etc కావచ్చు) ఏం జరుగుతోందో చూడండి.

**Q.** Dictionary లో outwit కు అర్థం get the better of by being more intelligent అని రాశారు. ఇక్కడ of by రెండు prepositions ఒకేచోట వచ్చాయి. ఇలా ఒకేచోట రెండు prepositions ఉపయోగించవచ్చా? ఏయే సందర్భాల్లో ఉపయోగించవచ్చో వివరించగలరు.

**A.** చాలానే ఉన్నాయి, ముఖ్యంగా phrasal verbs వాడేటప్పుడు a) You don't know who passed by in your absence b) I am signing in by ten tomorrow. ఇలా ఎన్నన్నా రావచ్చుకదా? ఇవన్నీ ఎక్కువ phrasal verbs, idioms, తర్వాత, passive voice లో రావచ్చు

The disease he was cured off by the doctor was typhoid. ఏదైమైనా, సందర్భం వచ్చినప్పుడు, మనకు తెలియకుండానే, ఇలాంటివి correct గానే వాడుతుంటాం.

---

**G. Narsing rao, Adilabad.**

కిందివాటిని ఇంగ్లిష్‌లో ఏమంటారో తెలియజేయగలరు.

**Q.** గమ్యం స్థిరంగా ఉండాలి. మార్గం కచ్చితంగా నిర్ణయించుకోవాలి. ప్రయత్నం రాజీలేని ధోరణిలో సాగాలి. అప్పుడే విజయం మనదవుతుంది.

**A.** Have your goal fixed. Fix the means to accomplishing it. Pursue it unwaveringly. Victory shall be yours.



M.SURESAN

**Q.** మతమేదైతేనేం మనిషి మంచివాడైతే చాలు.

**A.** What religion a person is not important. His goodness is.

**Q.** విద్య అంటే అక్షర జ్ఞానం కాదు. సరైన దిశను చూపేదే విద్య.

**A.** Mere literacy is not education. Real education defines your direction.

**Q.** ఈ జీవితం అపూర్వ వరం. దానిని చరితార్థం చేసుకో.

**A.** Life is a great boon. Make it worthwhile.

**Q.** ప్రతి సమస్య పరిష్కారంలోను కొత్త సమస్యకు బీజం ఉంటుంది.

**A.** In the solution to a problem lies the seed of a new problem.

**Q.** ఎత్తయిన శిఖరానికి చేరాలంటే తలవంచి ముందుకు సాగాలి.

**A.** To scale a high peak you have to bend your head and proceed.

**Q.** ఎంతటి శిఖరమైనా నేల నుంచే ప్రారంభం.

**A.** Even the highest peak has its base on the ground.

---

**M. Rangaiah, Illendu**

కింది పదాలను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**Q.** అభివాదం **A.** Salutation/ obeisance
**Q.** ఎద్దేవ **A.** Mockery/ ridicule
**Q.** ఎండగట్టడం **A.** Expose
**Q.** స్పందించడం **A.** Respond
**Q.** పరామర్శించడం **A.** Enquire about/ after (some one's well-being)
**Q.** పారదర్శకత **A.** Transparency
**Q.** గర్హించడం **A.** Deplore
**Q.** పుండు **A.** Sore
**Q.** గజ్జి **A.** Scabies
**Q.** సారాంశం **A.** Summary/ Sum and substance/ Gist/ Synopsis

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






# When is he likely to be free?

**Akarsh:** Hello, is this 6454406 please?
(హలో, ఇది 6454406 నంబరేనా? )

**Vishal:** Yes, who is speaking please?
(అవును, మాట్లాడుతున్నదెవరండీ? )

**Akarsh:** I am Akarsh. May I speak to Niriksh?
(నేను ఆకర్ష్‌ను. నిరీక్ష్‌తో మాట్లాడొచ్చా? )

**Vishal:** Sorry. He's just gone out. (He) won't be back for an hour.
(సారీ. తనిప్పుడే బయటికెళ్లాడు. ఒక గంటకు గానీ తిరిగిరాడు.)

**Akarsh:** May I know who is speaking?
(ఎవరు మాట్లాడుతున్నారో తెలుసుకోవచ్చా? )

**Vishal:** I am Vishal, Niriksh's elder brother. Anything important, Akarsh?
(నేను Niriksh అన్న విశాల్‌ను. ఏమన్నా ముఖ్యమైన విషయమా? )

**Akarsh:** Yes, it is. I am his classmate. We have an exam the day after and I want to borrow a book from him. It's urgent.
(అవును. ముఖ్యమే. నేనతడి classmate ను. మాకు ఎల్లుండి ఒక పరీక్ష ఉంది. అతడినుంచి పుస్తకం కావాలి నాకు. చాలా అవసరం.)

**Vishal:** I'm afraid you've to wait till he is back.
(అతడు తిరిగొచ్చేంతవరకూ మీరు wait చేయాల్సిందే అనుకుంటున్నా.)

**Akarsh:** Hasn't he a cell? Could you give me the number?
(అతడికి cell phone లేదా? ఆ నంబర్ కాస్త ఇస్తారా? )

**Vishal:** If he had one you would know it, as you are classmates.
(అతడికి cell ఉంటే మీకు తెలియకుండా ఉండదుకదా? మీరు classmates కాబట్టి.)

**Akarsh:** He was telling us he would buy one, so I thought he had.
(మాతో అంటున్నాడు తను cell కొంటానని. కొన్నాడేమో అనుకున్నా.)

**Vishal:** No chance. Dad's against it.
(ఆ ప్రశ్నేలేదు. మానాన్న ఒప్పుకోరు.)

**Akarsh:** Then could you pass on the message? Could you ask him to call me back as soon as he is home.
(అయితే ఈ విషయం అతడికి చెబుతారా? ఇంటికి రాగానే నాకు phone చెయ్యమని చెబుతారా? )

**Vishal:** But I'm going out too, and no idea when I'll be back.
(నేనూ బయటికెళుతున్నా, ఎప్పుడు తిరిగొస్తానో తెలియదు.)

**Akarsh:** (Is there) No one else at home?
(ఇంట్లో ఇంకెవరూ లేరా? )

**Vishal:** I'll do one thing. I will write out a message for him and leave it here. Which number are you calling from please?
(అయితే నేనొక పనిచేస్తాను. ఈ విషయం రాసి పెడతానిక్కడ. మీరే number నుంచి phone చేస్తున్నారు? )

**Akarsh:** It is 2626267. It's urgent please.

**Vishal:** I understand. I'll see that he'll get back to you.
(అర్థమైంది. రాగానే మీకు phone చేసేలా చూస్తా.)

**Akarsh:** Thank you.

**Vishal:** You're welcome.

ఈ lesson లో English లో telephone conversation ఎలా చేయాలో తెలుసుకుందాం.

Phone conversation మామూలు conversation లా కాకుండా కాస్త polite (మర్యాదకరంగా), formal గా ఉండాలన్న విషయం/ ఉంటుందన్న విషయం అందరికీ తెలిసిందే. అయితే స్నేహితుల మధ్య బాగా చనువున్న వారితో free గానే మాట్లాడతాం. అలాంటి సందర్భాల్లో ఇప్పుడు మనం తెలుసుకోబోయే విషయాలు పట్టించుకోనక్కరలేదు. మనకంత పరిచయం లేనివాళ్లతో phone లో మాట్లాడేటప్పుడు-

1. మన voice (గొంతు) చాలా clear గా ఉండాలి.
2. మనం చెప్పేది నిదానంగా ఒక్కోమాట స్పష్టంగా విన పడేలా మాట్లాడటం మంచిది. అలాకాకపోతే అవతలివాళ్లకు సరిగా వినపడక repeat చేయాల్సి వస్తుంది. అది waste of valuable phone time.
3. అవతలివాళ్లు చెప్పేది మనం ఓపిగ్గా విన్న తర్వాతే స్పందించాలి.

మనకందరికీ తెలిసిన విషయం ఇంకొకటి: భారతీయ భాషల్లో కంటే English లో Thanks (కృతజ్ఞత), Sorry (క్షమాపణ) If you don't mind (మరోలా అనుకోకుంటే/ అభ్యంతరం లేకపోతే) May I... (మర్యాదగా అడగటం) తరచుగా వాడతాం. ఇవి phone conversation లో కచ్చితంగా పాటిస్తాం. ఇక please విషయం చెప్పనక్కరలేదు కదా.


M.SURESAN

సాధారణంగా phone conversation (English) లో గుర్తుంచుకోవాల్సింది- మనం సరైన number కే phone చేశామా లేదా అని నిర్ధారించుకోవడం. అందుకని, ముందుగా మనం అనేది.

1) Is it/ Is this (మనంచేసే number) ... Please?

లేకుంటే మనం మాట్లాడాలనుకున్నవాళ్లే phone ఎత్తారా లేదా అని ధ్రువీకరించుకునేందుకు

Am I speaking to Niriksh, please?
Is this Niriksh? (కొంచెం చనువుగా)
(పై రెండింటికీ అర్థం- నేను మాట్లాడుతుంది నిరీక్ష్‌తోనేనా? ).

దీనికి phone receive చేసుకున్నవాళ్ల స్పందన:

Yes, speaking. (నేనే నిరీక్ష్ మాట్లాడుతున్నా) Who is this please? (మీరెవరండీ? )
May I know who is speaking? (మాట్లాడేదెవరో తెలియపరుస్తారా? ) ఇవి బాగా practise చేయండి.

**Now, look at the conversation below:**

**Govind:** Hello, can I speak to Mr. Gopal please? (గోపాల్‌తో మాట్లాడొచ్చా? )

**Ganesh:** Who is speaking please?
(ఎవరండీ మాట్లాడుతుంది? )

**Govind:** I am Govind here. (నేను Govind)

**Ganesh:** I'll call Gopal. Please hold on/ hold the line while I call him.
(Gopal ను పిలుస్తాను. line లో ఉండండి.)

**Govind:** I'll wait. (ఉంటాను)

చూశారుకదా? line లో ఉండండి అనేందుకు please hold on/ hold the line అంటాం. ఇంకాస్త మర్యాదగా అనేందుకు could you please hold (on)/ hold the line? అని కూడా అనవచ్చు

ఒకవేళ phone వచ్చిన వ్యక్తి ఇంకో phone లో మాట్లాడుతుంటే

Could you just wait? He/ she is busy on another line/ He is (busy) talking to someone else అంటాం.

ఇప్పుడు ఇది చూడండి.

**Eswar:** Hello, this is Eswar. Can I speak to Sambhu?
(నేను Eswar ను మాట్లాడుతున్నాను. శంభుతో మాట్లాడొచ్చా? )

**Sankar:** I'm afraid you can't. He is busy/ He is attending a meeting/ He is in a meeting.
(ఆయనతో ఇప్పుడు మాట్లాడలేరేమో. ఆయన busy గా / meeting లో ఉన్నారు.

**Eswar:** When is he likely to be free?
(ఎప్పుడు ఆయన తీరిగ్గా ఉండొచ్చు? )

**Sankar:** Sorry. No idea Sir. Could you ring up again after half an hour?
(తెలియదండీ. ఓ అరగంట తర్వాత పిలుస్తారా? )

Ring up = Phone చేయడం.

**Eswar:** Will he be available surely then?
(అప్పుడు కచ్చితంగా దొరుకుతారా ఆయన? )

**Sankar:** Don't know sir. Just take a chance and see.
(తెలియదండి. ప్రయత్నించి చూడండి.)

చూశారుగదా phone వచ్చిన వ్యక్తి అందుబాటులో లేనప్పుడు ఇలా జరుగుతుంది సంభాషణ.

మీరు phone చేసిన వ్యక్తి ఇప్పుడు అందుబాటులో లేడు అని మర్యాదగా అనేందుకు I'm afraid/ I'm sorry, లాంటి expressions వాడితే చాలా బాగుంటుంది. ఇవీ practise చేయండి. మళ్లీ ఇది చూడండి.

**Sridevi:** Is this 24111213 please?

**Srivalli:** Yes. Who do you want please?
(అవును. ఎవరు కావాలండీ మీకు? )

**Sridevi:** I wish to speak to Sripriya. Is she there? I am Sridevi.
(శ్రీప్రియతో మాట్లాడాలనుకుంటున్నా. ఆమె ఉందా అక్కడ? నేను శ్రీదేవిని.)

**Srivalli:** She is out right now. (She is) expected back in two hours.
(ప్రస్తుతం ఆమె లేదిక్కడ. రెండు గంటల తర్వాత రావచ్చనుకుంటున్నాం.) Can I take your message for her? (ఆమెకేమన్నా చెప్పాలా? )

**Sridevi:** I won't be able to call her again today. Please pass on this message to her. There is an important meeting tomorrow at 5 in the evening. She has to attend it without fail.
(ఇవాళ మళ్లీ నేనామెకు phone చేయలేను. ఈ మాట ఆవిడకు చెప్పండి. రేపో ముఖ్యమైన meeting ఉంది. తను తప్పక హాజరవ్వాలి.)

**Srivalli:** Sure. I'll tell her. (తప్పక చెబుతాను)

ఇలా phone లో కావాల్సిన వ్యక్తి లేనప్పుడు వాళ్లకు తెలియపర్చాల్సిందేమన్నా ఉంటే ఇలా జరుగుతుంది సంభాషణ. ఇప్పుడు ఈ సంభాషణ చూడండి.

**Supriya:** Hello, I am Supriya here, can I speak to Sulekha please?
(నేను సుప్రియను మాట్లాడుతున్నా. Sulekha తో మాట్లాడొచ్చా)

**Sujana:** Hi Supriya. I am Sujana. Sister is out visiting one of our aunts. (She) will be back only at 2.
(నేనే Sujana, మా అక్క మా aunt వాళ్లింటికి వెళ్లింది.)

**Supriya:** Tell her to call me back when she gets home, with you.
(ఇంటికి రాగానే నాకు ఫోన్ చేయమని చెప్పు.)

**Sujana:** Sorry, I'm going out too. Is it important? I'll leave a message for her in that case.
(అయ్యో, నేనూ బయటికెళుతున్నా. ఏంటి అదేమన్నా ముఖ్యమా? అలా అయితే message వదిలి వెళతాలే, రాసి)

Message- వార్త/ విషయం/ సందేశం

**Supriya:** That's fine. The message is, that she should meet me as soon as she can so that we can prepare for the quiz ahead.
(అయితే ఈ మాట చెప్పు. రాగానే నన్ను కలవమని quiz కు prepare అయ్యేందుకు.)

**Sujana:** OK. I will write it down for her to see it as soon as she is back.
(OK. తను రాగానే చూసేందుకు వీలుగా రాసి పెట్టి వెళతాను.)

ఇది phone వచ్చిన వ్యక్తి లేనప్పుడు వారికి సమాచారం తెలిపేందుకు message రాసి, ఉంచడం. Offices లో పనిచేసే వారికి ఇది చాలా ముఖ్యం. Official గా message ఎలా తీసుకోవాలో వచ్చే lesson లో చూద్దాం.

### గుర్తుపెట్టుకోవలసింది

**Opening the conversation:** Hello, is this .... (number) please/ Is this (name of the person called)? / Am I speaking to (name of the person called)? / Can I speak to (name of the person called)? etc.

**Response to the above:** Yes, (name of the person called) speaking, and who is this please? / May I know who is speaking?

Phone వచ్చిన వ్యక్తిని పిలవాల్సివచ్చి, అవతలివాళ్లను line లో ఉండండి అనడం: Please hold on/ Please hold the line/ Could you hold on? etc.



**M. Srihari Babu, Ongole**

కింది వాటిని ఇంగ్లిష్‌లో చెప్పండి.

**Q.** కొంచెం తక్కువ.
**A.** This is a little less.
**Q.** కొంచెం ఎక్కువ.
**A.** This is a little too much/ more.
**Q.** అసలు లేదు.
**A.** There isn't any at all.
**Q.** బాగా ఎక్కువ.
**A.** (There is) too much of it.
**Q.** బాగా తక్కువ.
**A.** (There is) too little of it.
**Q.** కాఫీలో షుగర్ తక్కువగా ఉంది.
**A.** The coffee has less sugar than I like. (The coffee could have a little more sugar.)
**Q.** ఎక్కువగా ఉంది.
**A.** There is more sugar than I like.
**Q.** కొంచెం ఎక్కువగా ఉంది.
**A.** There is a little more sugar than I like.
**Q.** అసలు లేదు.
**A.** There is no sugar at all in the coffee.
**Q.** బాగా ఎక్కువ.
**A.** There is too much of sugar in the coffee.
**Q.** బాగా తక్కువగా ఉంది.
**A.** There is too little sugar in the coffee.

కాస్త Idiomatic గా చెప్పాలంటే The coffee could take some more sugar. (కొంచెం తక్కువ)
The coffee is too sweet - మరీ ఎక్కువ.
A little more sugar and the coffee could be fine - కాస్త తక్కువ etc.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# Every dog has his day

**Nagaraju, Srikakulam**

కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో వివరించగలరు.

**Q.** ఇది చూసి అతడు చలించిపోయాడు.

**A.** He was shaken/ moved at the sight.

**Q.** కన్నతల్లి బిడ్డను అమ్మేసిన ఘటన నగరంలో చోటు చేసుకుంది.

**A.** The city was the scene of a mother selling off her own child.

**Q.** ఇది పలువురిని కంటతడి పెట్టించింది.

**A.** It brought tears to many.

**Q.** తలకిందులుగా తపస్సు చేసినా నువ్వు ఈ పని చేయలేవు.

**A.** Try/ struggle as you might, you can never do it.

**Q.** అతడు తపస్సులో నిమగ్నమైపోయాడు.

**A.** He is deep/ lost in his penance.

**Q.** దసరా సంవత్సరానికి ఒకేసారి వస్తుంది.

**A.** Dasera comes only once a year.

**Q.** పిల్లి పిల్లలు పెట్టడం.

**A.** Cat littering kitten.

**Q.** కోడి గుడ్లు పెట్టడం.

**A.** Hen laying eggs.

**Q.** నన్ను ఎప్పుడు రమ్మంటారు?

**A.** When shall I come? / When do you want me to come?

**Q.** నేను మీ ఆఫీసుకు దగ్గరలోనే ఉన్నాను.

**A.** I am/ live near your office/ close to your office.

**Q.** అతడు దేశం కోసం తన సర్వస్వాన్నీ త్యాగం చేశాడు.

**A.** He sacrificed his all for the country.

**Q.** సాటి మానవుడు

**A.** Fellow human being.

**Q.** దేశ విదేశాల్లో అతడి పేరు మారు మోగిపోయింది.

**A.** He is known at home and abroad.

**Q.** సుప్రీంకోర్టు దీనిపై స్టే విధించింది.

A. Supreme Court has stayed this.

**Q.** కోర్టు అతడికి బెయిల్ మంజూరు చేసింది.

**A.** The Court has granted him bail.

**Q.** పన్ను విధించడం

**A.** Impose/ Levy a tax

**Q.** అతడు కోర్టు నుంచి స్టే ఆర్డర్ దక్కించుకున్నాడు.

**A.** He obtained a stay order from the court.

**Q.**. అతడు పది లక్షల రూపాయలు విరాళంగా ఇచ్చాడు.

**A.** He donated Rs. 10 Lakh.

కింది సామెతలను ఇంగ్లిష్‌లో వివరించగలరు.

**Q.** కుక్క కాటుకు చెప్పుదెబ్బ.

**A.** Tit for tat

**Q.** ముందుంది మొసళ్ల పండుగ.

**A.** The worse is yet to come

**Q.** ఇల్లలకగానే పండగ కాదు.

**A.** One swallow doesn't make summer

**Q.** చెరపకురా చెడేవు.

**A.** You fall in the pit you dig for others.

**Q.** కూటికోసం కోటి విద్యలు.

**A.** All struggle for a morsel of food.

**Q.** ప్రతి మనిషికి ఒక సమయం వస్తుంది.

**Q.** ఐకమత్యమే బలం.

**A.** Unity is strength.

**A.** Every dog has his day.

**Q.** English-English, English-Telugu ఏ dictionary advantage గా ఉంటుందో తెలుపగలరు.

**A.** అది మీ English పరిజ్ఞానాన్ని బట్టి ఉంటుంది. మీరు English meanings అర్థం చేసుకోగలిగితే English to English best.

**Q.** నేను తలుచుకుంటే ఏమైనా చేయగలను.

**A.** Once I decided to do/ think of doing something, I can do it.

**Q.** నేను ఒక టార్గెట్ పెట్టుకుంటే అది reach అయ్యే వరకు try చేస్తా.

**A.** Once I set myself a target, I keep trying till I reach it/ I don't rest till I reach it.

**Q.** నేను ఎవరినైనా ఒకసారి నమ్ముతాను. ఆ నమ్మకం ఉంచుకుంటే తప్పకుండా help చేస్తాను.

**A.** I trust any body just once. If I find them trustworthy, I definitely help them.

**U. Srinivas, Jarugumalli**

**Q.** ఇంగ్లిష్ నుంచి తెలుగులోకి వాక్యాన్ని మార్చేటప్పుడు లేదా మాట్లాడేటప్పుడు కొంత భావంలో తేడా వస్తుంది. కరెక్టుగా భావానికి సరిపడేవిధంగా ఎలా frame చేసుకోవాలి. ఉదాహరణకు ఇంట్లో లైట్లు ఆరిపోయాయి. The lights have gone out అంటే లైట్లు బయటకు వెళ్లాయి అని కదా. కరెక్టు ఇంగ్లిష్ మాట్లాడాలంటే తెలుగుతో పోల్చుకోకుండా మాట్లాడితే సరిపోతుందా? పోల్చుకుంటే కొంచెం తేలికవుతుందా వివరించగలరు?

**A.** ఏ రెండు భాషల్లో కూడా ఒకే భావానికి వాడే words/ phrases (మాటలూ/ మాటల సమూహాలు) word to word correspondence (మక్కికి మక్కీగా అను వాదం) కుదరదు. correct English మాట్లాడేందుకు తెలుగుతో పోల్చుకోవచ్చు. అయితే ఇది కొంతవరకే correct అవుతుంది. తెలుగులో కూడా lights ఆరిపోయాయనే బదులు lights/ current పోయాయి/ పోయింది అంటాం కదా. తెలుగు మాటల పోలిక ఉండటాన్నిబట్టి అనువదిస్తే చాలా వరకూ (పూర్తిగా) కాదు; కొంత సులభం కావచ్చు

**Q.** ప్రకృతిని ఆస్వాదించడం.

**A.** Enjoying/ savouring the beauty of nature.

**Q.** ప్రకృతిని ఆస్వాదించాలని ఎవరికి అనిపించదు చెప్పు?

**A.** Who doesn't feel like enjoying the beauty of nature?

**Q.** ప్రభుత్వం నక్సల్స్‌తో చర్చలు జరపడానికి ఒప్పుకుంది.

**A.** The Govt has agreed to negotiations/ hold negotiations/ talks with the Nexalities

**Q.** ఇంతకాలానికి, ఇన్ని రోజులకు నీ ముఖంలో చిరునవ్వు చూడగలిగాను.

**A.** After a long time/ At last/ After so many days I am able to see a smile on your face.

**Q.** అతడు ఇంత సంతోషంగా ఉండటం నేనెప్పుడూ చూడ లేదు.

**A.** I haven't seen him so happy before.

**Q.** ఇదంతా నీ పుణ్యమే. ఏమి ఇచ్చి నీ రుణం తీర్చుకోగలను.

**A.** All thanks to you. Nothing I can do can clear me from your obligation.

**Q.** Just thanks అని చెప్పి నీ రుణాన్ని తీర్చుకోలేను.

**A.** A mere thank you can not free me from my indebtedness to you.

**Q.** మళ్లీ నువ్వు ఈ ఇంటి చుట్టుపక్కలకు వచ్చావో సహించేది లేదు.

**A.** I can't tolerate seeing you any where around this place.

**Q.** దివంగత ముఖ్యమంత్రి

**A.** The late CM

**Q.** నా కోసం ఒక్క కన్నీటిబొట్టు అయినా కార్చు అది చాలు.

**A.** Kindly shed a drop of tear for me. That'll do

**Q.** నువ్వు వస్తే చాలు. నాకు ఇంకేమీ వద్దు.

**A.** It is just enough if you come. I don't want anything more.

**Q.** మీ ఇల్లు చూడొచ్చా ఒకసారి?

**A.** Can I see your house once?

**Q.** ఏడాది తిరిగేసరికి నిన్ను కోటీశ్వరుడిని చేస్తాను.

**A.** I will make you a millionaire by the turn of the year.

**Q.** నాకు రావాల్సిన డబ్బు ఎలా రాబట్టుకోవాలో నాకు తెలుసు.

**A.** I know how to get the money due to me.


M.SURESAN

**Q.**. అతడు అప్రూవర్‌గా మారిపోయాడు.

**A.** He has turned an approver.

**Q.** నువ్వు అప్రూవర్‌గా మారితే శిక్ష తగ్గవచ్చు.

**A.** If you turn an approver, you may get remission in your punishment.

**Q.** ఇక్కడుండి ఇబ్బందిపడే బదులు అక్కడికి వెళితే పోయేదేముంది?

**A.** What do we lose if we go there instead of facing all the troubles here?

**M.Chandu, TB.Palem**

**Q.** కింది వాటికి plural తెలుపగలరు.

a) Salesman b) Musulman c) youngman

**A.** a) Salesmen b) musalmans c) young men

**Q.** కాబోయే భార్య, కాబోయే భర్త, పిల్లికళ్ల అమ్మాయి, పిల్లికళ్లు, చదువుకున్నవాడు- వీటిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Would be wife/ husband. Cat-eyed girl, cat eyes, educated person.

**Q.** Lawyer, Pleader, Advocate, Vakil - వీటికి తేడా ఏమిటి?

**A.** Lawyer = చట్టం బాగా తెలిసినవాడు.

Advocate = ఒకరిని సమర్థించేవారు- చట్టపరంగా పైరెండింటికీ అర్థం - న్యాయవాది. Pleader అంటే కూడా అదే అర్థం - అయితే పాతరోజుల్లో ఇది వాడేవారు, చట్టం (Law)లో degree లేకపోయినా. ఇప్పుడు ఈ మాట వాడుకలోలేదు. Vakil అన్నా అదే, ఇప్పుడు వాడుకలో లేదు.

**Q.** House, Home, Apartment, Building వీటికి తేడా తెలుపండి.

**A.** House - ఇల్లు (ఏ ఇల్లయినా)

Home = మనం ఎవరిని గురించి మాట్లాడుతున్నామో వారు నివసించే ఇల్లు, కుటుంబంతో;

Apartment = flat/ a set of flats.

Building = కట్టడం భవనం అనే అర్థంతో

**Q.** For the water came lip to my lips. ఈ వాక్యానికి తెలుగులో అర్థం చెప్పండి.

**A.** For the water came lip to my lips కాదనుకుంటా upto my lips నా పెదవుల వరకు (అంత లోతుగా) నీళ్ల వచ్చేశాయి.

**Q.** పాలకూర, గోరుచిక్కుడు, బొబ్బర్లు వీటిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Spinach, Cluster beans, Cowpeas.

**P. Gopal, Tirupathi**

కింది future tense లోని వాక్యాలకు తెలుగులో అర్థం ఉదాహరణతో వివరించగలరు.

**Q.** I shall talk.

**A.** I shall talk - నేను మాట్లాడతాను (futureలో)

**Q.** I shall be talking.

A. I shall be talking - future లో ఒక నిర్ణీత సమయంలో/ ఫలానా సమయంలో మాట్లాడుతుంటాను.

I shall be talking to him at 5 tomorrow - రేపు సాయంత్రం ఐదింటికి నేనతడితో మాట్లాడుతూ ఉంటాను.

**Q.** I shall have talked.

**A.** I shall have talked = Futureలో ఓ సమయానికి ముందు మాట్లాడేసి ఉంటాను.

I shall have talked to him by this time tomorrow = రేపీపాటికి నేనతడితో మాట్లాడేసి ఉంటాను.

**Q.** I shall have been talking.

**A.** I shall have been talking = Future లో ఓ సమయానికి ముందే మాట్లాడటం ప్రారంభించి ఆ సమయం వరకూగానీ, ఆ సమయంలో ఇంకాగానీ మాట్లాడుతూ ఉంటాను. I shall have been talking to him by this time tomorrow = రేపీపాటికి ముందే మాట్లాడ్డం ప్రారంభించి, ఈపాటివరకూ / ఇంకా మాట్లాడుతూ ఉంటాను.

**M. Ram Naik, Hyderabad**

కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

**Q.** నీ ముందు నేను ఎంత?

**A.** What am I before you?

**Q.** నా ముందు నీవు ఎంత?

**A.** What are you before me?

**Q.** అసలు నీకు నేను ఎలా కనపడుతున్నాను?

**A.** How do I appear to you?

**Q.** అసలు నా గురించి ఏమి అనుకుంటున్నావు?

**A.** What do you take me for?

**Q.** సున్నితమైన

**A.** Sensitive

**A. Bunganna, Munagalapadu**

**Q.** Please let me know the other form of the sentence "Agreement ceases as soon as we attempt to define wisdom." The starting words of your sentence should have "No sooner".

No sooner ---------

Please let me know the other forms also if any.

**A.** No sooner do we define wisdom, than the argument ceases.

**P. Mohan, Jagityal**

**Q.** Dispensary, Hospital, Nursing home, Clinic ల మధ్య తేడా ఏమిటి?

**A.** Dispensary = ఆసుపత్రుల్లో మందులు కలిపే విభాగం. (ఒకప్పుడు ఆసుపత్రి అనే అర్థంతో వాడేవారు. ఇప్పుడా అర్థం లేదు).

Hospital = రోగులకు సేవలందించే ఆసుపత్రి - వైద్యం పొందేందుకు మాత్రం వచ్చి వెళ్లిపోయే వాళ్లకు (Outpatients) మాత్రమే కాకుండా, అక్కడే కొన్ని రోజులు ఉండటానికి వసతులు ఉన్న (In patients) ఆసుపత్రి.

Clinic = ఒక/ కొన్ని వ్యాధులకు ప్రత్యేకంగా చికిత్సలందించే ఆసుపత్రి- Eye clinic/ ENT clinic (చెవి, ముక్కు, కంటి వ్యాధులకు మాత్రమే)/ family planning clinic, etc.

Nursing home = Private doctors నడిపే ఆసుపత్రి. Standard English లో Nursing home కు ముఖ్యంగా వృద్ధులకు వైద్యం చేసే ఆసుపత్రి అని అర్థం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# Could you put me through to her?

**Sindhura:** Hello, I am Sindhura here; may I speak to Mandaara please?
(హలో, నేను సింధూరను మాట్లాడుతున్నా. మందారతో మాట్లాడవచ్చా? )

**Sahana:** You mean Ms Mandaara Mukund, our Manager?
(మీరనేది మా Manager, శ్రీమతి మందార ముకుంద్‌తోనా? )

(Ms = స్త్రీ వివాహితా, కాదా అని తెలిపేందుకు ఇష్టం లేనప్పుడు, వివాహితయినా భర్త ఇంటిపేరు వాడనప్పుడూ ఉపయోగించే సంబోధనా పదం)

**Sindhura:** Exactly.
(కచ్చితంగా)

**Sahana:** I'm afraid you can't right now. She is in an important meeting.
(మీరిప్పుడామెతో మాట్లాడలేరు. ఆమె ముఖ్యమైన మీటింగ్‌లో ఉన్నారు)

**Sindhura:** Oh, is that why I haven't been able to get her on the cell for an hour now?
(అందుకేనా ఆమె నాకో గంట నుంచి సెల్‌లో దొరకడం లేదు)

**Sahana:** You're right.
(అవును, అందుకే)

**Sindhura:** I'm a close friend of hers and this is personal and urgent. Would you mind putting me through to her?
(నేను ఆమెకు దగ్గరి స్నేహితురాలిని. ఇది చాలా ముఖ్యమైన వ్యక్తిగత విషయం. నాకామెను కలపరా? )

**Sahana:** I'm afraid I can't. I have strict instructions not to disturb her till the end of the meeting.
(కష్టమండీ. మీటింగ్ అయ్యేంతవరకు ఆమెకు అంతరాయం కలిగించకూడదని నాకు కచ్చితమైన ఆదేశాలున్నాయి.)

**Sindhura:** Oh, that disappoints me. The matter can't wait that long.
(నాకు నిరాశగా ఉంది. అంతసేపు ఆపే విషయం కాదది.)

**Sahana:** I'm sorry. There's no helping it, ma'm, but I have my instructions. Hope you can understand.
(తప్పదు, క్షమించండి. నేనేం చేయలేను. నా ఆదేశాలు నాకున్నాయి కదా? మీరర్థం చేసుకోగలరనుకుంటాను)

(Ma'm: Madamకు short form. Pronunciation- మామ్)

**Sindhura:** Any other way you can help me?
(మీరు నాకింకేమన్నా చేయగలరా? )

**Sahana:** I can certainly take a message. You can leave a message, if it's not private.
(మీరు చెప్పాలనుకున్న వార్త ఆమెకు అందించగలను, అదంత వ్యక్తిగతం కాకపోతే, మీరు నాకది చెప్పండి)

**Sindhura:** OK. Perhaps that's the best I can do. Here it is: I left behind my chain at her place last night. I hope it is safe. Tell her from me to keep it safe. I'll collect it from her when I visit her next Friday.
(సరే. ఇప్పుడు నేను చేయగలిగిందల్లా అదే అనుకుంటా. నా గొలుసు వాళ్లింట్లో వదిలేశాను. అది భద్రంగానే ఉందనుకుంటా. వచ్చే శుక్రవారం ఆమెను కలుసుకున్నప్పుడు మళ్లీ తీసుకుంటా.)




**Sahana:** I'll convey this to her. I do understand the importance of the matter. I'll ask her to call you as soon as the meeting ends.
(ఆమెకు ఈ మాట తెలియజేస్తాను. విషయం ప్రాముఖ్యం నాకర్థమైంది. మీటింగ్ అయిపోగానే మీకు ఫోన్‌చేయమని చెబుతాను.)

మనం Phone Conversationలో వాడే English మాట్లాడాల్సిన తీరు తెలుసుకుంటున్నాం కదా.
మరికొన్ని విషయాలిప్పుడు చూద్దాం.
మనం ఇంతవరకు తెలుసుకుంది:

1) మనం ఫోన్ చేసేటప్పుడు, ఫోన్ చేస్తున్నది సరైన నంబరుకేనా అని నిర్ధారించుకుంటాం.
Is this (phone no.) Please?/ Is this (మనం పిలిచే వ్యక్తుల పేరు చెప్పి) place/ home, please?
2) అలాగే మనం పిలుస్తున్న వ్యక్తే మాట్లాడుతున్నారా అని నిర్ధారించుకునేందుకు, Am I speaking to so and so, please? / Is this so and so, please అంటాం.
3) పై వాటికి స్పందనగా:
Yes, please and who is this?/ Who is speaking please? అంటాం.
Am I speaking to so and so? అనేందుకు జవాబుగా,
Yes, speaking (phone వచ్చినవాళ్లు phone తీసుకుంటే) and who's this please? అంటాం.
4) ఫోన్ వచ్చినవాళ్లు అందుబాటులో లేనప్పుడు;
మర్యాదగా I'm sorry/ I'm afraid he/ she is not here; / he/ she is out right now; will be back in ---minutes/ hours అనో అంటాం.
5) ఫోన్ వచ్చినవాళ్లు ఫోన్ అందుకొనే వరకూ lineలో ఉండండి, పిలుస్తాను అనేందుకు
Please hold (on)/ please hold the line అంటాం.

ఇప్పుడు Official/ formal phone conversationలో వాడే English మాట్లాడాల్సిన తీరు, పై సంభాషణలో గమనించాం కదా?

ఫోన్ వచ్చిన వ్యక్తి వెంటనే అందుబాటులో లేనప్పుడు, వాళ్లను ఫోన్ దగ్గరకు పిలిచే వీల్లేనప్పుడు పై సంభాషణలోని కింది మాటలను వాడతాం.

1) You mean Ms. Mandaara Mukund, our Manager?
2) I'm afraid, you can't right now.
3) Could you put me through to her?
4) I can certainly take a message. You can leave a message.

పైవన్నీ అర్థం అవుతున్నాయి కదా?
1) మీరు పిలుస్తుంది/ మాట్లాడాలనుకుంది శ్రీమతి మందార ముకుంద్‌తోనా-గమనించండి.
ఇది Official/ formal.
2) ఇప్పటికిప్పుడే మీరు మాట్లాడలేరనుకుంటా.
3) Put me through- మనం మాట్లాడాలనుకునే వ్యక్తికి phone line కలపడం
4) I can take a message -
మీరు చెప్పాలనుకుంది నేనామెకు అందించగలను.
Official/ formalగా message (వార్త) ఇవ్వడమంటే చాలా జాగ్రత్తగా ఇవ్వాలి?
ఇలాంటి సందర్భాల్లో అవి (Messages) రాసి ఉంచాలి. ఇలా:
1) Date : Call for (ఎవరికి వచ్చింది Phone): ----
2) Call/ message from (ఎవరి నుంచి phone):----
3) Time of call: ----
3) a) Will call again (మళ్లీ Phone చేస్తారు)at --- (time)/ after/ in --- (- minutes/ half an hour/ an hour etc.,)

ఇలాకాకుండా ఫోన్ చేసినవాళ్లు, ఏదైనా message (వార్త) అందించమంటే:
Message: ---- (క్లుప్తంగా, ముఖ్యమైన సమాచారం అంతా ఉండేట్లు)

ఈ Lessonలో ఇచ్చిన conversationలోని message రాసి Ms. Mandaara Mukundకు చూపించాల్సింది ఇలా:
1) Date: ----
2) Call for: Ms. Mandaara Mukund, Manager
3) Call from: Ms. Sindhura
4) Time of Call: ---- AM/ PM
5) Message: Ms Sindhura forgot her chain in your place/ home. Wants it to be kept safe at home/ locker till her next visit next Friday. To call Ms Sindhura as soon as the meeting ends.

ఇలాకాకుండా (అంటే official/ formal కానప్పుడు) మనం మౌఖికంగా (నోటిమాటతో/ oral) message phone పొందినవారికి అందించాలంటే.
Ms. Mandaara, a/ one Ms Sindhura called you/ You had a call from a/ one Ms Sindhura an hour ago. She left her chain behind at your place last night it seems. She wants you to keep it safe at home/ in a locker till she visits you again Friday.
ఇలా ఉంటుంది. ఇదేం అసలు కష్టమైందిగా కనపడటంలేదు కదా.
Practice చేస్తే మీకే తెలుస్తుంది, ఎంత సులభమో.




**G. Shankar, keshavapur.**

**Q.** The Bard of Avon. What is the meaning of the underline part in telugu?
**A.** Bard (గ్రాంథికం) = కవి.
Avon (ఏవన్) -Shakespeare జన్మించిన Stratford గ్రామం ఈ నది ఒడ్డున ఉంది. అందుకని Shakespeare ను Bard of Avon అంటారు.

**Q.** 'You have a car' What is the question tag of it?
**A.** You have a car, don't you?

**Q.** My father has been admitted to hospital or in hospital which is the correct usage?
**A.** Admit to/ Admit into a hospital. "In" సరికాదు.

**Q.** If an employee was having a bad day. ఈ వాక్యంలో having వాడటం కరెక్టేనా?
**A.** Have ను am/ is/ are/ was/ were having formలో problem/ difficulty కి వాడవచ్చు. అందుకని He was having a bad day (a difficult/ unpleasant day).

**K. Nagamani, Tadpatri**

**Q.** Tahsildar తో ఈ application లో sign చేయించుకోమని మీకు ఎవరు చెప్పారు?
**A.** Who told you to get the certificate signed by the Tahsildar?

**Q.** Collector ఈ application మీద sign చేయిస్తానన్నారు నాకు.
**A.** The Collector said he would get the application signed for me.

**Q.** Minister తో నా ఫైల్‌లో sign చేయిస్తావా?
**A.** Can you/ you will get the minister to sign my file?

**Q.** Students ఒకరికి ఒకరు ఆన్సర్లు చెప్పుకుంటున్నారు.
**A.** The students are getting one another to answer the questions.

**Q.** ఎవరెవరు Answers చెప్పించుకున్నారు?
**A.** Who are all those that have got the answers given?

**Q.** నేను కాంగ్రెస్‌కు vote వేసి, వేయించి గెలిపిస్తాను.
**A.** I'll vote for congress, get others to vote for it and make it win.

**Q.** Congressకు vote వేయండి, వేయించండి.
**A.** Vote for congress and make others vote for it.

**Q.** Americaకు Flight ఎన్ని గంటలకు ఉందో కనుక్కోమని చెబుతావా?
**A.** Will you ask him to find out when the flight to America is/ the time of the flight to America.

**Q.** నాకు పది లక్షలు ఇమ్మని అతడికి చెప్పండి.
**A.** Tell him to give me Rs.10 lakh.

**Q.** అతను నాకు పది లక్షలు ఇస్తే ఇమ్మని చెప్పండి. లేకపోతే లేదు.
**A.** Tell him to give me Rs.10 lakh or nothing at all. (10 లక్షలు లేకపోతే ఏమీవద్దు).
Tell him to give me..... or leave it (చెబితే చెప్పండి లేకుంటే లేదు)

**Q.** నాతో grammar చెప్పించుకోం అన్నారు విద్యార్థులు.
**A.** The students don't want me to teach them grammar.

**S. Satyanarayana Murthy, Kakinada**

**Q.** Active Voice, Passive Voice ల గురించి వివరించండి.
Verb ను Active Voice నుంచి Passive Voice లోకి మార్చినప్పుడు Voice మారుతుంది కదా. గతంలో మీరు మారదు అన్నారేమిటి?
మారుతుందని మీరే కింది ఉదాహరణలు ఇచ్చారు.
The enemy has bombed these bridges (active voice) has + p.p.
The bridges have been bombed by enemy (passive voice) have been +p.p.
ఇక్కడ వాక్యం objectతో begin అవుతుంది కాబట్టి bridges plural లో ఉంది కాబట్టి have వాడారు. Verb లో మార్పు ఉంది కదా.
has +.p.p(active)
have been +.p.p.(passive) ఇక్కడ passiveలో been అదనంగా వచ్చింది.
దయచేసి voice మారినప్పుడు tense మారుతుందో లేదో వివరించగలరు.
**A.** పొరపాటున voice మారదు అని రాశాం.
Voice మారినప్పుడు tense మారదని గ్రహించగలరు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# What else went wrong?

**Adbhuta:** Oh, what a morning it was! I haven't had the like of it in years!
(అబ్బా, ఎలా ఉండిందో ఇవాళ ఉదయం! అలాంటి ఉదయం ఇన్నేళ్లలో నేను ఎప్పుడూ చూడలేదు)

**Ascharya:** Well, what happened?
(ఏం జరిగింది? )

**Adbhuta:** I overslept and got up late at 7.30. I was late for office by almost an hour.
(మామూలుకంటే ఎక్కువసేపు నిద్రపోయి 7.30కు లేచా. Office కు దాదాపు గంట ఆలస్యంగా వెళ్లా)

**Ascharya:** Why? You could have made up for your late rising in some other way. What else went wrong?
(నీ ఆలస్యాన్ని ఇంకే విధంగానైనా తగ్గించుకో నుండొచ్చు కదా? ఇంకేమైనా జరిగిందా? )

**Adbhuta:** Every thing. The bathroom was flooded, and no water through the tap. Somebody in the house kept the tap on the whole night and the water tank was dry.
(అన్నీనూ. Bathroom అంతా నీళ్ళే. ఇంట్లో ఎవరో రాత్రంతా pump తిప్పి పెట్టడంతో, tank లో నీళ్లంతా ఖాళీ)

**Ascharya:** Things do happen like that some times.
(కొన్నిసార్లలా జరుగుతుంటాయి)

**Adbhuta:** Wait. You haven't heard the last of it. The washing machine broke down in the middle and the gas cylinder had to be replaced in the middle of cooking.
(అంతటితో అయిపోలేదు (నా కష్టాలు). మధ్యలో washing machine చెడిపోయింది. వంట అవుతుండగా cylinder మార్చాల్సి వచ్చింది.)

**Ascharya:** I really pity you.
(నిన్ను చూస్తే నాకు జాలేస్తుంది)

**Adbhuta:** One of the pipes is still leaking and the drainage system is choked.
(Pump లలో ఒకటి ఇంకా కారుతూనే ఉంది. Drainage కేదో అడ్డుపడింది)

**Ascharya:** Nothing surprising in it to people who have seen a bit of life. Things either good or bad do happen in a row. They never happen alone.
(జీవితంలో కొంత అనుభవం ఉన్నవాళ్లకు ఇవేం పెద్ద ఆశ్చర్యకర విషయాలు కావు. మంచైనా, చెడైనా వరుసగా జరుగుతాయి. ఒక్కొక్కటిగా జరగవు)

**Adbhuta:** The only relief is the boss is out of town. Otherwise I'd have had it.
(ఒక్కటే కాస్త ఊరట కలిగించేది. Boss ఊళ్ళో లేకపోవడం. లేకపోతే నా పని అయిపోయుండేది.)

* * *

పై సంభాషణలోని విషయాలు మనం ఎదుర్కొనే సమస్యల గురించే అని తెలుస్తోంది కదా. They are our every day problems. Let us have a look at them and how they are expressed in English.

***Look at the following expressions from the dialogue above:***

1) I haven't had the like of it in years.
2) What else went wrong?
3) The bathroom was flooded.
4) You haven't heard the last of it.
5) The washing machine broke down.
6) One of the pipes is still leaking.
7) ... the drainage system is choked.
8) ... for people who have seen a bit of life.


M.SURESAN

**1) Haven't seen the like of it:** The like of it = అలాంటిది/ అలాంటి విషయం/ సంఘటన.

a) Rarely do we see the likes of Sachin and Dhoni =
Sachin, Dhoni లాంటివాళ్లను మనం అరుదుగా చూస్తాం.

b) A record crowd attended the meeting. I hadn't seen the like of such a crowd at any other meeting =
Record సృష్టించేంత జనం ఆ సభకు వచ్చారు. అలాంటి జనాన్ని ఇంతకుముందు ఏ సభలో కూడా చూడలేదు.

**2) Go wrong** = ఇదింతకుముందు చాలాసార్లు మనం వాడాం. పొరపాటు జరగడం/ ఏదయినా సరిగా, ఉండాల్సిన విధంగా ఉండకపోవడం.

a) Something is wrong with him/ Something has gone wrong with him =
అతడిలో ఏదో తప్పుంది.

b) Something has gone wrong with the washing machine =
ఆ washing machine ఏదో చెడిపోయినట్టుంది.

c) Something has gone wrong between the friends. They are not in good terms now =
ఆ friends మధ్యలో ఏదో చెడింది. వారి సంబంధాలిప్పుడు సరిగా లేవు.

What's wrong? ఈ expression English conversation లో చాలా సాధారణంగా వినిపిస్తుంటుంది. ఏది పొరపాటుగా జరిగినా ఇది వాడతారు.

d) "I am not going to office today."
(నేనివాళ office కు వెళ్లడం లేదు)
"What's wrong?"
(ఏమయింది? )

e) "I wish to leave immediately." (నేను వెంటనే వెళ్ళిపోవాలనుకుంటున్నా)
"Is anything wrong?"
(ఏమన్నా పొరపాటు జరిగిందా? / ఏమిటి విషయం)

Bathroom flooding, tap leaking (leaking taps)/ The washing machine has broken down/ breakdown of the washing machine. (స్నానాల గది వెల్లువడం (నీటితో నిండిపోవడం), పంపునీళ్లు కారడం, washing machine పనిచేయకపోవడం)

These are all more or less everyday problems కదా? (More or less = దాదాపు)

వీటితోపాటు the choking of the drainage system = మురుగునీరు ఆగిపోవడం.

Drain= మురుగునీరు బయటకు వెళ్లేందుకు మార్గం/ కాలువ

Tap leaking, breakdown of the washing machine, electric fuse blowing off (fuse పోవడం)- వీటన్నిటినీ repair చేయడం, fix అంటాం.

a) The bathroom is flooded. Let's mop it = Bathroom నీళ్లతో నిండిపోయింది. దాన్ని తుడుద్దాం.

Mop= 1) తడిగా ఉన్న నేలను తుడవడం, mop తో. 2) పొడవాటి కర్ర చివరన అమర్చిన cotton తాళ్ల కుంచె/ plastic పలక. (నేలమీద నిలిచిన నీళ్లను అద్దేందుకు/ తోసేందుకు వాడతాం)

చెమటగా ఉన్న మొహాన్ని అద్దడం (hand kerchief తో) కూడా mop.

It was very sultry and every one in the room was mopping their face = చాలా చెమటగా ఉండింది. ఆ గదిలో అందరు మొహాలు తుడుచుకుంటున్నారు.

b) The tap is leaking and the drainage is choked. Call the plumber.
(పంపు కారిపోతోంది, drainage లో నీళ్లు నిలిచిపోతున్నాయి. Plumber ను పిలువు.)

Choke = నీళ్లు పారకుండా నిలిచిపోవడం (పొరపోవడం/ పొలమారడం కూడా)

Plumber = Taps (కొళాయిలను) pipes (నీళ్ల పైపులను), Drainage నూ repair చేసేవాళ్లు

Plumbing = Water pipes, drainage కు సంబంధించిన విషయం.

Break down = యంత్రాలు చెడిపోవడం.

వీటన్నింటినీ repair చేయడం- fix.

a) A plumber can fix the leaking taps and the choking of drains = కారుతున్న pump లను, నీళ్లు పారని drain లను, plumber fix (repair) చేయగలడు.

b) The cycle mechanic took just ten minutes to fix the puncture to the tube = Puncture ను పది నిమిషాల్లో repair (fix) చేశాడు.

అంటే fix ను ఏ రకమైన repair కైనా వాడొచ్చు

a) When the fuse blow off, fortunately the electrician was at hand to fix it = Fuse పోగానే దాన్ని వేసేందుకు/ repair చేసేందుకు, అదృష్టవశాత్తు electrician దగ్గరలోనే ఉన్నాడు.

b) Call me when the fuse blows off the next time. I can fix it = ఈసారి fuse పోయి, lights ఆరిపోతే నన్ను పిలవండి, నేను repair చేయగలను.

c) There is none here to fix the problem in the fan = Fan repair చేసేందుకు ఇక్కడ ఎవ్వరూ లేరు.

Fix - ఒక సమస్యకు పరిష్కారం కనుక్కోవడం అనే అర్థంతో కూడా వాడతాం.

The government feels it can fix the problem of hoarding = అక్రమ నిల్వల సమస్యకు పరిష్కారం కనుక్కోగలనని ప్రభుత్వం భావిస్తోంది.



**Nagaraju, Srikakulam.**
కింది వాక్యాలను ఇంగ్లీష్‌లో తెలుప గలరు.

**Q.** రాజకీయ పార్టీ పెట్టడం.
**A.** Starting a political party

**Q.** పార్టీ పేరు ఖరారైంది.
**A.** The name of the party has been confirmed.

**Q.** పార్టీ పేరు ప్రకటించడం.
**A.** To announce/ Announcing the name of the party.

**Q.** ముందస్తు ఎన్నికలు వచ్చే అవకాశం లేదు.
**A.** There is no likelihood of advance polls/ Advance polls are unlikely.

**Q.** ఎన్నికలు వస్తున్నాయి.
**A.** The elections are coming.

**Q.** పార్టీలోంచి బయటకు వచ్చేయడం.
**A.** To quit/ Quitting a party.

**Q.** Spoken English institute పెట్టడం.
**A.** To start/ Starting a spoken English institution.

**Q.** Black out అంటే ఏమిటి?
**A.** a) విద్యుత్ సరఫరా అంతరాయం వల్ల కలిగే చీకటి.
b) ప్రభుత్వ/ Police ఆంక్షల, ఆదేశాల వల్ల పత్రికలు/ TV (Media) ప్రజలకు సమాచారాన్ని అందించలేకపోవడం (Black out of news. ఇందిరాగాంధీ విధించిన emergency సమయంలో mediaపై ఆంక్షల వల్ల ఇలాంటి black out కొనసాగింది.)
c) అపస్మారక స్థితిలో పడిపోవడం/ తాత్కాలికంగా చూపు/ జ్ఞాపకశక్తి కోల్పోవడం.
d) యుద్ధ సమయంలో శత్రు విమానాలు bomb దాడి చేసేందుకు గుర్తించకుండా ఉండేలా, పట్టణాల్లో/ నగరాల్లో దీపాలు వెలిగించకూడని పరిస్థితి.

**Q.** First Off- అంటే ఏమిటి?
**A.** First Off- కచ్చితమైన అర్థంతో ఇలాంటి expression ఏదీలేదు. బహుశా మీరు దీన్ని first half (మొదటిసగం- విరామం ముందటి సగం) కు పొరబడి ఉంటారు.

**Q.** Pisses off- అంటే ఏమిటి?
**A.** Pissed off- a) Piss off- ఒకరిని get out అనే బదులు వాడేమాట. Piss Off = Get out.
Be pissed of- ఒకరివల్ల/ ఒక విషయం కారణంగా విసిగిపోవడం.
I am pissed off with his behaviour. (అతడి ప్రవర్తనతో నేను విసిగిపోయా)
(Piss అంటే మూత్రవిసర్జన చేయడం- కాస్త బూతు కిందలెక్క- go to toilet/ bathroom బదులు)

**Q.** Shoved- అంటే ఏమిటి?
**A.** Shoved- Past tense of shove = తోయడం/ నెట్టడం, మొరటుగా.

**Q.** Roof top - అంటే ఏమిటి?
**A.** ఇంటి పైకప్పు- కప్పు పైభాగం

**Q.** She did get your rock off- అంటే ఏమిటి?
**A.** She did get your rocks off- Get rocks off= 1) శృంగార క్రీడ/ సంభోగంలో కలిగే స్ఖలనం 2) మనకు ఆనందాన్నిచ్చే పనిచేయడం.

**Q.** It is deadly to him.
**A.** అతడికది మరణాంతకం/ చావును కలిగించేది. (అంత ప్రమాదమైంది)

**Q.** Refil లో ink అయిపోయింది.
**A.** The refil has run out of ink/ is exhausted/ is dry.

**Q.** ద్వితీయ విఘ్నం.
**A.** దీనికి correct English మాట లేదు, English వాళ్లకానమ్మకం లేదు కాబట్టి. అయితే second obstruction/ second hindrance (రెండో అడ్డంకి అనే అర్థంతో) అనవచ్చు. ద్వితీయ విఘ్నం- రెండో రోజు అంతరాయం అనే అర్థంతో- the inauspicious (అశుభకరమైన) break on the second day అనొచ్చు.

**Q.** వెలుతురు సరిగా లేకపోవడంతో ఆటకు అంతరాయం కలిగింది.
**A.** Bad light interrupted the play/ The play was interrupted because of bad light.

**Q.** అతడు నీకు అన్ని విధాలా తగిన వరుడు.
**A.** He is a suitable groom (bride-groom) for you in every way.

**Q.** నీ performance ను బట్టి job అవకాశాలు ఉంటాయి.
**A.** Your job opportunity/ opportunity to get a job depends on your performance/ Your chances of getting the job depends on your performance.

**Q.** చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం.
**A.** Damming a river after the waters have flowed out = నీళ్ళు పొర్లిపోయిన తర్వాత నదికి ఆనకట్ట వేయడం.
(crying over spilt milk= ఒలికిపోయిన పాలకు చింతించడం)

**Q.** సన్యాసం పుచ్చుకో.
**A.** Become a Sanyasin.

**Q.** తీర్థం, ప్రసాదం.
**A.** తీర్థం- దీనికి కచ్చితంగా సరైన మాట English లో లేదు. అతి దగ్గరగా వచ్చే మాట libation- అయితే ఇదిప్పుడు వాడుకలో లేదు.
ప్రసాదం - Offering (నైవేద్యం పెట్టే ఆహారం).

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# No where else do you see this system



**P. Babu, Somandepalli**

**Q.** If clause వాడుక, దానిలోని రకాలు ఉదాహరణలతో వివరించగలరు.

**A.** If clause - An If clause is a group of words beginning with 'If' and having a verb in it. If తో ప్రారంభమై verb ఉండే group of words ను If clause అంటాం. అయితే ఇలాంటి If clauses షరతులు (conditions) తెలిపేవయితే వాటిని conditional clauses అంటాం. ఉండటానికి conditional clauses నాలుగయినా మనకు confusion కలిగించేవి మూడే.

Conditional Clauses (If clause expressing a condition) ఉన్న sentence లో main clause (a clause with complete meaning) కూడా ఉంటుంది. ఇలాంటివి నాలుగు రకాలుగా ఉంటాయి.

1) ఇందులో చెప్పేవి ఎప్పుడూ జరుగుతాయి/ నిజం.

a) If you heat a substance, it expands.

(వస్తువును వేడిచేస్తే అది వ్యాకోచిస్తుంది/ దాని size పెరుగుతుంది.)

b) If you turn to the east in the morning, you see the sun.

(పొద్దున తూర్పువైపు తిరిగితే సూర్యుడు కనిపిస్తాడు.)

ఈ రెండు sentences లోనూ, If (conditional) clause లో, main clause లో verbs present tense లోనే ఉంటాయి. If clause లో చెప్పింది జరిగితే, main clause లోది కచ్చితంగా జరుగుతుంది.

**Sentence A:** Verb in 'If' clause - heat - present tense; verb in the main clause - expands - present tense.

**Sentence B:** If clause verb - turn - present tence; Main clause verb - see - also present tense.

ముఖ్యంగా facts of science/ universal truths చెప్పేటప్పుడు ఇలా వస్తుంది.

**ఇందులోనే ఇంకో రకం:** ఇది గతంలో తప్పకుండా జరిగిన విషయం.

If I opened the door/ whenever I opened the door/ I always saw him standing there.

నేను తలుపు తెరిస్తే, అతడక్కడే నిలబడి కనపడేవాడు.

If clause verb- opened (simple past) main clause verb- saw (also simple past)

పై రెండింటి విషయంలో అంత confusion లేదు.

ఇప్పుడు ఇవి చూద్దాం.

a) If he comes here, his mother will be happy (అతడిక్కడికి వస్తే వాళ్లమ్మ సంతోషిస్తుంది) = అతడిక్కడికి వచ్చే అవకాశం ఉంది. వాళ్లమ్మ సంతోషించే అవకాశమూ ఉంది. ఇది probable present. (ప్రస్తుతం/ Future లో జరిగే అవకాశం ఉన్న విషయం) If clause - comes- present tense. Main clause - will be - future tense.

b) If he can come at 7, he can/ will be able to meet her.

అతడు ఏడింటికి రాగలిగితే - (రావచ్చు - ఆ అవకాశం ఉంది) అతడామెను కలుసుకోగలిగే అవకాశం ఉంది. ఇది కూడా ప్రస్తుతం/ future లో సంభవం.

If clause verb - can come- present tense (future implied) - Main clause- can meet/ will be able - present (future implied)

దీనిని probable present అంటాం.

3) a) If he saw me here now/ were to see me here now, he would be/ would feel very angry -

ఈ sentence అర్థం చాలా స్పష్టంగా తెలుసుకోవాలి. అతడిప్పుడు నన్నిక్కడ చూడటం అంటూ జరిగితే (జరిగే అవకాశం లేదు) అతడికి చాలా కోపం వస్తుంది. (ఇదీ జరిగే అవకాశం లేదు) - ఇక్కడ tenses గమనించండి.

**If clause:** Past simple/ were (even for singular subjects)- saw; Main clause- would/ should/ could) might + Ist Regular Doing Word.

b) If I were very strong, I could beat him.

నేను బలవంతుడినయితే (కాను), వాడిని ఓడించగలను. (కాని ఇప్పుడు చేయలేను)

If clause; If I were strong - verb - were - Main clause verb - could beat.

ఇది తెలుగులో అంతవాడుకలో లేదు. అందుకని ఇది అర్థమవడం కాస్త కష్టం.

If he were Doctor, I would consult him. (అతడు Doctor అయితే, అతడిని నేను సంప్రదిస్తాను. అతడు Doctor కాడు, అందుకని నేను సంప్రదించను/ సంప్రదించడం లేదు)

తెలుసు కదా? ఇది improbable (అవకాశంలేని/ సంభవించని) present (ప్రస్తుతం).

4. Imaginary past– ఊహించుకునే గతం/ నిజంకానిది

If he had started earlier, he would have seen her = కాస్త ముందే బయలుదేరుంటే అతడామెను చూసేవాడే.

(అతడు ఆలస్యంగా బయలుదేరాడు, అందుకని ఆమెను చూడలేదు.)

If clause verb- had been/ had + past participle (past perfect) Main clause verb- would have/ should have/ could have/ might have been or would have/ should have/ could have/ might have + past participle.

b) If he had consulted me, I would have given him good advice = అతడు నన్ను సంప్రదించి ఉంటే (సంప్రదించలేదు) అతడికి నేను మంచి సలహా ఇచ్చుండేవాడిని - (ఇవ్వలేదు).

ఇదంతా జరిగిపోయింది- ఊరికే అనుకుంటాం, అలా జరిగితే/ జరక్కపోతే బాగుండేదీ.. ఇలా. దానిని గురించి చేయగలిగిందేమీలేదు. అందుకని దానిని imaginary past అంటాం.

M.SURESAN

**M.V. Subrahmanyam, Chillakur**

**Q.** కింది conjunctions కు తెలుగులో అర్థాలు ఇస్తూ, ఎలా ఉపయోగించాలో తెలుపండి.

In order that, On condition that, Even if, So that, Provided that, As though, In as much as, As if, Else, Lest

**A. In order that** = అది జరిగేందుకుగాను.

He worked hard in order that he may have enough money in his old age = He worked hard in order to have enough money in his old age = He worked hard to have enough money in his old age = He worked hard so that he may have enough money in his old age = ముసలితనంలో చాలినంత డబ్బుండేందుకుగాను అతడు చాలా కష్టపడి పనిచేశాడు/ శ్రమించాడు.

**In order that/ in order to/ to/ so that** = అందుకుగాను. వీటిలో In order that/ in order to కాస్త గ్రాంథికం. to/ so that, simple.

They are collecting money in order to that they may help/ in order to help / so that they may help/ to help the flood victims = వరద బాధితులకు సహాయం చేసేందుకు వాళ్లు డబ్బు పోగుచేస్తున్నారు.

**On condition that** = ఆ షరతుకు లోబడి;

I will give you the loan on condition that you repay it by this month end = ఈ నెలాఖరులోపు నువ్వు తిరిగిచ్చే షరతు మీద నీకు నేను అప్పిస్తాను.

The Principal re-admitted him on condition that he will not repeat what he has done = అతడు చేసింది మళ్లీ చేయననే షరతుమీద అతడిని principal మళ్లీ చేర్చుకున్నాడు.

**Even if** = అయినప్పటికీ; అయినా కూడా

a) Even if the Chief Minister asks me to contest, I won't = CM నన్ను పోటీచేయమని అడిగినా/ అడిగినా కూడా నేను పోటీచేయను.

Contest = పోటీ చేయడం/ పోటీ.

b) Even if the CM recommends you, I won't give you the job = CM నిన్ను recommend చేసినా/ చేసినాకూడా నేను నీకు ఉద్యోగం ఇవ్వను.

**So that** = ఏదైనా జరిగేందుకు.

He started early so that he can reach the place on time = సమయానికి చేరుకునేట్లుగా/ చేరుకునేందుకుగాను అతడు పెందలాడే బయలుదేరాడు.

Have a room mate so that you may not feel lonely = ఓ room mate ను చూసుకో, ఒంటరితనం అనుభవించకుండా ఉండేందుకు.

**Provided that** = if = అయితే / ఆ పక్షంలో.

a) Provided that you pay all your fees dues you will get your hall ticket = నీ fees బకాయిలన్నీ చెల్లించినట్లయితే/ చెల్లించేపక్షంలో నీకు hall ticket ఇస్తారు.

b) I will go there provided (that) you pay for my travel = నా ప్రయాణ ఖర్చులు నువ్వు భరిస్తే/ భరించే పక్షంలో నేనక్కడికి వెళతాను.

Provided కాస్త గ్రాంథికం. నిబంధనలూ, చట్ట పరిభాషలో ఎక్కువగా వాడతారు.

**As though** = అయినట్లు, కానీ, కాదు

He speaks as though he were very clever = ఏదో చాలా తెలివైనవాడయినట్లు (కానేకాదు) మాట్లాడతాడు.

**As though** = As if.

**In as much as** = ఆ మేరకు.

In as much as he knew about it, he went on talking = తనకు తెలిసిందంతా అతడు మాట్లాడుతూ ఉన్నాడు. ఇది out dated - వాడుకలో లేదు.

**Else - some -, every-, any-, no-,** లతో ప్రారంభమయ్యే మాటలతో (some one, every one, any where, no where ఇలాంటి మాటలతో) కలిపి వాడితే, ఇంకా అనే అర్థం వస్తుంది. Question words, 'wh'- తో begin అయ్యే మాటలతో వస్తుంది.

Some one else was there besides him = అతడితోపాటు, ఇంకా ఎవరో ఉన్నారక్కడ.

No where else do you see this system = ఈ పద్ధతి ఇంకెక్కడా కనపడదు.

**Or else** = లేకపోతే = otherwise

Come exactly at 7 daily as else you will lose your job = రోజూ ఏడింటికి రావాలి, లేకపోతే నీ ఉద్యోగం పోతుంది.

**lest = so that not** = అలా కాకుండా ఉండేందుకు.

He took enough care lest some one (should) deceive him = తనను ఎవరూ మోసగించకుండా ఉండేందుకు అతడు తగు జాగ్రత్త తీసుకున్నాడు.

**Q.** Object of a preposition అంటే ఏమిటి? Subject, Object అనేవి verb కే ఉంటాయి కదా. ఉదాహరణలతో వివరించగలరు.

**A.** Preposition కు దేనిని/ ఎవరిని అని ప్రశ్న వేసుకుంటే వచ్చే answer, object of the preposition.

a) They threw stones at the police - ఇక్కడ preposition 'at' కదా? At whom? అంటే police అనే answer వస్తుంది కదా. అప్పుడు police is the object of the preposition, 'at'.

b) The police are searching for the terrorist - ఇక్కడ preposition, for = కోసం. ఎవరికోసం వెతుకుతున్నారు? terrorist కోసం, కాబట్టి terrorist, ఇక్కడ object of the preposition, 'for'.

చూశారు కదా verb తర్వాత preposition వస్తే, పై senteces లో మాదిరిగా - చాలా verbs తర్వాత prepositions వస్తుంటాయి కదా? eg: look at, pay for, jump into, etc. - అలావచ్చినప్పుడు సాధారణంగా preposition తర్వాతిమాట (ఎవరిని, దేనిని అనే ప్రశ్నకు సమాధానంగా వచ్చేది), object of the preposition అవుతుంది.

**Q.** కిందివాటిని తెలుగులో ఉదాహరణలతో వివరించగలరు. Had better, had rather, would rather, sooner than, rather than.

**Had better** - సలహా ఇచ్చేందుకు వాడేమాట.

You had better go to bed early - నువ్వు పెందలాడే నిద్ర పోవడం మంచిది. She had better stop taking coffee = ఆమె coffee తీసుకోకుండా ఉండటం మంచిది.

**Had rather** - ఈ expression English లో లేదు.

**Would rather** = మన ఇష్టాన్ని తెలిపే expression - ఒకటి చేయడానికంటే ఇంకోటి చేసేందుకు ఇష్టపడటం.

I would rather starve than eat in that restaurant = ఆ హోటల్లో తినేందుకంటే పస్తుండేందుకు ఇష్టపడతాను నేను. (starve = పస్తుండటం)

**sooner than** = అంతకంటే త్వరగా.

He recovered sooner than the Doctor had expected = Doctor అనుకున్న దానికంటే త్వరగా కోలుకున్నాడతడు.

Recover = కోలుకోవడం. అయితే would sooner than అన్నా **rather than** అన్నా అర్థం - would rather (పైన వివరించాం కదా)లా ఒకపని కంటే ఇంకో పని చేసేందుకు ఇష్టపడటం.

I would sooner starve than eat in that restaurant = I would rather starve than eat in that restaurant.

**Q.** కింది వాక్యాలకు తేడాను వివరించగలరు. ఇవి past habits ను తెలియజేస్తాయా?

1. I would take milk in the morning.

2. I used to take milk in the morning.

**A.** 1) నేను పొద్దున పాలు తీసుకునేందుకు ఇష్టపడతాను/ (గతంలో) ఇష్టపడేవాడిని.

2) నేను పొద్దున పాలు తాగేవాడిని.

**Q.** Wren & Martin లో explanation లో govern, modify, qualify అనే పదాలు వాడారు. వీటి గురించి తెలుగులో వివరించగలరు.

**A.** Govern - ఒక మాట ఇంకో మాటను/ phrase ను govern చేస్తే ఆ మాట, ఆ ఇంకో మాటను/ phrase ను వాడే విధాన్ని శాసిస్తుంది.

The Government of India. ఇక్కడ India is governed by the preposition 'of'.

Modify - ఒకమాట అర్థాన్ని ఇంకోమాట ఎక్కువ చేయడం. సాధారణంగా ఎలా? అనే ప్రశ్నకు సమాధానంగా వచ్చే మాట, ఇంకో మాటను modify చేస్తుంది. Adverb, verb ను/ adjective ను/ ఇంకో adverb ను modify చేస్తుంది.

He sang well. ఎలా పాడాడు? Well. కాబట్టి Well, sang ను modify చేస్తుంది.

Qualify - గుణగణాలను తెలపడం - adjective చేసేపని (వర్ణించడం).

He is a tall boy. ఇక్కడ tall boy ను వర్ణిస్తోంది. So, the adjective 'tall' qualifies the noun, boy.

**Nagaraju, Srikakulam**

కిందివాటిని తెలుగులో ఏమంటారో తెలుపగలరు.

**Q.** దేవుడికి నైవేద్యం పెట్టడం.

**A.** Making an offering to god.

**Q.** మొక్కు తీర్చుకోవడం.

**A.** Fulfil one's vows.

**Q.** తలనీలాలు సమర్పించుకోవడం.

**A.** Offering of hair.

**Q.** అమ్మవారికి కానుకగా ఇవ్వడం.

**A.** Making/ offering a gift/ something to the deity.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

ప్రతిభ




# She is a real doll

**Punya:** Has Moksha come back?
(మోక్ష తిరిగొచ్చిందా? )

**Priya:** She has. I met her yesterday.
(వచ్చింది. నిన్న నేను కలుసుకున్నాను)

**Punya:** She must have launched into a long account of her travels.
(తన ప్రయాణాలను గురించి దీర్ఘంగా చెప్పడం మొదలుపెట్టుండాలే)

Account = మామూలుగా మనం account అంటే లెక్కలనే అర్థంతో వాడుతుంటాం.

Account అంటే ఇక్కడి అర్థం, ఒక విషయం/ సంఘటన ను గురించి వివరంగా చెప్పడం.

**Priya:** She did of course. It seems while her cousin was driving her home in Chennai, their car bumped against the pavement.
(ఆ పనే చేసింది. తన cousin తనను ఇంటికి car లో తీసుకెళుతుంటే అది pavement కు ఢీ కొట్టిందట.)

pavement = Road కు రెండు వైపుల ఉండే కాలిబాట, మనం మామూలుగా తప్పుగా platform అంటుంటాం. దీనికి ఇంకోమాట Kerb. American - side walk. Pavement dwellers = ఇల్లు లేక pavement మీదనే జీవించేవాళ్ళు.

dwell - live; dweller = people who live

**Punya:** Hope they are safe.
(వాళ్ళకేం కాలేదను కుంటా)

**Priya:** Nothing very serious fortunately, but Moksha's ankle is badly sprained. She is walking with a limp.
(అదృష్టవశాత్తు అంత పెద్ద గాయాలేం లేవు, కాని మోక్ష చీలమండ (కాలికి పాదాన్ని కలిపే కీలు) బాగా బెణికింది. కాస్త కుంటుతూ నడుస్తోంది.)

Sprain = బెణుకు/ బెణకడం

**Punya:** Sorry to hear that. I must go and see her then.
(వినేందుకు బాధగా ఉంది. ఒకసారి వెళ్ళి చూడా లయితే.)

**Priya:** You know her cousin, Kaivalya, don't you? She was here for two years. She used to hang out with Moksha. Don't you remember?
(తన cousin కైవల్య నీకు తెలుసు కదా? ఇక్కడ రెండేళ్ళుంది. ఎప్పుడూ మోక్షతోనే ఉండేది. నీకు గుర్తులేదా? )

**Punya:** I do of course. I know Kaivalya. Moksha and she used to while away their time shopping, going to movies or chatting.
(ఎందుకు తెలియదు? కైవల్య నాకు బాగా తెలుసు. తనూ మోక్ష ఎప్పుడూ ఏదో ఒకటి కొంటూ, సినిమాలకెళుతూ, కబుర్లు చెప్పుకుంటూ కాలం గడిపేవాళ్ళు.)

**Priya:** She is a real doll, this Kaivalya, with her round face, dimples, dark round eyes.
(చాలా అందంగా ఉంటుంది కైవల్య, గుండ్రటి మొహం, సొట్ట బుగ్గలు, నల్లటి గుండ్రటి కళ్ళు.)

**Punya:** Yea, enough. The long and short of it all is that she is really cute.
(అవును. చాలు. నువ్వు చెప్పే మాటల సారాంశం అంతా ఆ అమ్మాయి చాలా అందమైం దని)

cute = అందమైన

**Priya:** So when are you going to see Moksha? If I have the time, I'll go with you as well.
(అయితే మోక్షనెప్పుడు చూస్తావు? నాకు తీరి కుంటే నేను నీతో వద్దామని)

**Punya:** Likely this evening, but in any case, tomorrow.
(సాయంత్రం కావచ్చు లేదా రేపు)

**Priya:** If it is tomorrow, it will be in the evening, won't it?
(రేపయితే, సాయంత్రమే కదా? )

**Punya:** You've guessed aright. Let's make it at 6. (నువ్వు సరిగానే ఊహించావు. ఆరింటికి వెళ్దాం)

**Priya:** OK.

మనం కొంతకాలంగా phrasal verbs ను గురించి తెలుసుకుంటున్నాం. Phrasal verbs అంటే తెలుసు మనకు - రెండు మూడు మాటలుంటాయి, ఒక phrasal verb - అందులో ఒకటి verb, మిగతావి preposition/ adverbగా ఉండే చిన్న మాటలు - at, for, in, into etc. అయితే ఒక phrasal verb మొత్తం అర్థానికీ, అందులో ఉండే ఒక్కో మాట అర్థానికీ ఏం సంబంధం ఉండదు. ఇది మన conversationలో వాడుతుంటే practice మీద అర్థమయ్యే విషయం. ఈ lesson లో మనం మామూలుగా నిత్యజీవితంలో వాడగల phrasal verbs తెలుసుకుందాం.

***Look at the following expressions from the conversation above.***

*1) She must have launched into a long account of her travels.*
*2) .... their car bumped against the pavement.*
*3) She used to hang out with Moksha all the time.*
*4) Moksha and she used to while away their time...*
*5) She is a real doll*
*6) The long and short of it all is that she is cute.*
*7) Likely this evening, in any case, tomorrow.*
*8) You've guessed aright.*


M.SURESAN

**1) Launch into** = దేని గురించయినా సుదీర్ఘంగా ఉత్సాహంతో చెప్పడం/ వర్ణించడం మొదలుపెట్టడం.

a) Just mention the US, and he launches into an account of his tour to the place = నువ్వు అమెరికా పేరెత్తావంటే చాలు/ పేరెత్తడమే ఆలస్యం, వాడు తన పర్యటన మీద సుదీర్ఘోపన్యాసం ఇస్తాడు.

b) She launched into a narration of her experiences as the only woman in her office = తన office లో తనొక్కతే స్త్రీగా తన అనుభవాలను గురించి వివరించటం మొదలుపెట్టింది.

Give an account of = ఓ వృత్తాంతం (విషయం) వివరంగా చెప్పడం. Narration = కథనం - దేన్నయినా కథలా చెప్పడం. Narrate= (కథ) చెప్పడం.

**2) Bump against** = ఢీ కొట్టడం = Crash into/ hit/ knock against.

a) The car bumped against a lamp post and rested on the kerb = ఆ car light స్తంభాన్ని ఢీ కొట్టుకుని pavement మీద నిలిచింది.

b) The dents on the car show that it has bumped against something = ఆ car దేనికో ఢీ కొందని దానిమీద సొట్టలే తెలుపు తున్నాయి.

Dent= సొట్ట

**3) Hang out** = ఒకచోట చాలాసేపు గడపడం- పని ఉన్నా లేకపోయినా.

a) He hangs out at the park most of the evenings = చాలా సాయంత్రాలు అతడా park లో గడుపుతాడు, పనేంలేక.

b) She hangs out at the beauty parlour wasting all her money on beauty care = ఎప్పుడూ ఆమె ఆ beauty parlour లోనే గడుపుతుంది, సౌందర్య పోషణకు డబ్బు వృథా చేస్తూ.

Hangers out = ఒకచోట ఎక్కువ సమయం గడిపేవాళ్ళు (ఏమీ తోచక)

The police have rounded up the hangers out at the park after 10.30. = 10.30 తర్వాత park లో గడుపుతున్నవారం దరినీ police లు అదుపులోకి తీసుకున్నారు.

**4) While away** = సరదాగా, బద్ధకంతో కాలం గడిపేయడం

a) We whiled away our time watching the TV and playing cards = TV చూస్తూ, పేకాట ఆడుతూ కాలం గడి పేశాం సరదాగా, బద్ధకంతో.

b) Don't while away your time. Do some thing solid = నీ time అలా గడిపేస్తూ వృథా చేసుకోకు. గట్టిగా ఏదైనా చెయ్.

c) He has a lot of property to fall back upon, so he just whiles away his time = అతడికి కావ లసినంత ఆస్తుంది, ఆసరా ఇచ్చేందుకు. అందుకని అలా కాలం గడిపేస్తుంటాడు, ఏం చేయకుండా.

To fall back upon = కష్టాల్లో అక్కరకొచ్చేందుకు

a) The old woman has none to fall back upon = ఆ ముసలావిడకు కష్టాల్లో అక్కరకొచ్చేందుకు/ ఆస రాగా ఉండేందుకు ఎవరూ లేరు.

b) He has a little savings in the bank to fall back on/ upon = ఏదో ఆసరాకొచ్చేందుకు/ అక్కర కొచ్చేందుకు bank లో పొదుపు చేసుకున్న సొమ్ముంది.

**5) A real doll** = చాలా అందగత్తె. ఇది phrasal verb కాదు, idiom.

a) Though a real doll, she never made it good as a model = చాలా అందగత్తె అయినప్పటికీ model గా తను అంత పైకి రాలేకపోయింది.

b) Being a real doll, she has set quite a number of hearts afire = చాలా అందగత్తె కావడం వల్ల చాలా యువ హృదయాలను ఆమె కలవరపెట్టింది.

(Set afire = set fire to = అసలర్థం - తగలబెట్టడం. ఇక్కడ కలవరపెట్టింది)

**6) The long and short of** = సారాంశం = అసలు విషయం క్లుప్తంగా - ఇది కూడా idiom మాత్రమే. Phrasal verb కాదు. Phrasal verb అయితే ఒక మాట verb గా ఉంటుంది.

a) You have said enough. The long and short of it is that you are not at fault - చెప్పింది చాలు. నువ్వు చెప్పేదంతా/ చెప్పే దాని సారాంశం, తప్పు నీది కాదని.

b) The long and short of his speech was that his party alone could serve the country = ఆయన ఉపన్యాసం సారాంశం అంతా, తన party ఒక్కటే దేశానికి సేవ చేయగలదని.

**7) In any case** = ఏది ఏమైనా/ ఏది జరిగినప్పటికీ = ఇది కూడా phrasal verb కాదు. Prepositional phrase.

a) I am likely to go there in a day or two; in any case before thursday = నేనొకటి రెండు రోజుల్లో అక్కడికి వెళ్ళొచ్చు ఏదేమైనా గురువారం ముందరే వెళతా.

b) There is no use complaining now. In any case we aren't going to get back the money - ఇప్పుడు బాధపడి ప్రయోజనం లేదు. ఏదేమైనా ఆ డబ్బు మనకు తిరిగి రాదు.

**8) Guess aright** = సరిగా ఊహించుకోవడం.

a) "That's the car you want to buy, isn't it?" (ఆ car నే కదా నువ్వు కొనాలనుకుంటుంది? )
'You've guessed aright. How do you know, (Correct గానే ఊహించావు. ఎలా తెలుసు నీకు? )

b) She guessed aright that the police were looking for her = తన కోసమే police లు చూస్తు న్నారని ఆమె సరిగ్గానే ఊహించింది.

---

**A.V. Subba Rao, Oripenta**
కింది పదాలకు అర్థాలు వివరించగలరు.

**Q.** Fellowship
**A.** సాంగత్యం

**Q.** Tycoon
**A.** వ్యాపారంలో/ పారిశ్రామికంగా ఎంతో సంపాదించి తద్వారా పలుకుబడి, స్థోమత పెంచుకున్న వ్యక్తి.

**Q.** Big shot
**A.** ప్రముఖ/ ముఖ్యమైన/ పలుకుబడిగల వ్యక్తి

**Q.** Pilot project
**A.** ఏదైనా ప్రణాళిక/ project ఎంతవరకు విజయవంతమవుతుందో తెలుసుకునేం దుకు ప్రయోగాత్మకంగా నిర్వహించే project. దాని జయాపజయాలనుబట్టి, దాన్ని కొనసాగించడమా, మానుకోవ డమా అనేది నిర్ణయిస్తారు.

**Q. Pylon**
**A.** చాలా ఎత్తులో విద్యుత్తీగలను కలిపే బాగా ఎత్తయిన metal స్తంభాలు. High voltage wires ను బాగా ఎత్తులో ఉంచేందుకు వాడతారు.

**Q. contribution**
**A.** 1) చందా 2) దోహదం/ సహాయం చేయడం/ తోడ్పడే విషయం.

**Q. feedback**
**A.** 1) ఒక పని ఎంతవరకు బాగా జరి గింది, లోపాలేమన్నా ఉన్నాయా, ఎంత ఉపయోగకరంగా ఉన్నాయని ఇతరుల నుంచి వచ్చే సలహా, విమర్శ, సమాచారం. 2) Mike లు amplifier లలో వచ్చే శబ్దం.

**Q. enterprises**
**A.** Company/ వ్యాపారం. పెద్ద ఎత్తున సాహసోపేతంగా పెట్టుబడితో నిర్వహించే వ్యాపారం. Enterprises (plural) ముఖ్యంగా company పేర్లలో కనిపిస్తుంది.

**Q.** subscription
**A.** చందా

**Q. enterprenuer**
**A.** enterprenuer - Pronunciation ఆంటప్రెనా(ర్)- అర్థం సాహసంతో ఎంతో పెద్ద ఎత్తున పెట్టుబడి పెట్టి వ్యాపారం నడిపి లాభం పొందేవాళ్ళు.

**Q. swap**
**A.** మార్పిడి/ మార్చుకోవడం.

**Q. melo drama**
**A.** melo drama = అతి దుఃఖం/ అతి హాస్యం/ అతిప్రేమ/ అతి త్యాగం- ఇలా అన్నీ అతిగా చూపిస్తే వాస్తవికంగా ఉన్న కథలు, నాటకాలు, సినిమాలు- భారతీయ సినిమాలు దాదాపు అన్నీ melo dramas (having too much of sentiment to be realistic.)

**Q. cost - price** ఈ రెండింటి తేడా వివరించగలరు.
**A. Cost -** ఒక వస్తువు కొనేందుకు, చేసేందుకు ఒక పని చేపట్టి పూర్తి చేసేందుకు అవసరమైన డబ్బు.

**Price:** ఒక వస్తువు కొనేందుకు, ఏదైనా సేవను పొందేందుకు చెల్లించే ధర.

The cost of construction of a house = ఇల్లు కట్టేందుకయ్యే ఖర్చు

The price of the building = ఆ కట్టడం (భవనం, ఇల్లు, etc) ధర.

**Q. help desk, help line**
**A.** ఏదైనా సంస్థ వినియోగదార్లకు ఉచిత సహాయ సమాచారాలందించే ఏర్పాటు.
Help desk= స్థలం,
Help line = phone.

**Q. protem speaker**
**A.** కొత్తగా ఏర్పాటయిన Assembly/ Parliament, Speaker ను ఎన్నుకునే వరకు సభా వ్యవహారాలను నడిపే తాత్కాలిక speaker.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# Who did you learn it from?


M.SURESAN



**A. Sridhar, Oripenta**

కిందివాటికి అర్థాలు వివరించగలరు.

**Q.** Basic Instinct **A.** నైజం/ నైజగుణం

**Q.** blue mat **A.** ఇది పదం కాదు, America లో ఓ company పేరు.

**Q.** blue print **A.** Blue Print = 1) మనం చేయబోయే పనులకు తయారుచేసుకునే ప్రణాళిక. eg: A blue print for the development of atomic energy - అణుశక్తి అభివృద్ధికి ప్రణాళిక.
2) పాత రోజుల్లో ప్రత్యేక నీలిరంగు కాగితం మీద, building లు, యంత్రాల photo copy (eg: A blue print of the proposed building - ప్రతిపాదిస్తున్న building plan)

**Q.** awesome **A.** సంభ్రమాశ్చర్యాలు కలిగించే- అంత సులభంగా అర్థంకాకుండా భయం, గౌరవం, కాస్త ఆందోళన కలిగించే (సన్నివేశాలు/ దృశ్యాలు/ కార్యాలు)

**Q.** wake-awake **A.** wake - నిద్రలేపడం. Awake = మెలకువగా ఉన్న

**Q.** sleep-asleep **A.** sleep - నిద్రపోవడం. Asleep - నిద్రపోతున్న

**Q.** loud-aloud **A.** loud - బిగ్గరైన Aloud - బిగ్గరగా (he spoke in a loud voice; He was speaking aloud)

**Q.** rise-arise-arose

**A.** rise - లేవడం/ నిద్రలేవడం/ నిలబడటం = Arise - సమస్యల్లాంటివి తలెత్తడం
Arise from - దేనివల్లయినా కలగడం (సమస్యల్లాంటివి). అయితే Arise = rise. Rise కు ఉన్న అర్థాలు దీనికీ ఉన్నాయి, కానీ ఆ అర్థాలతో arise పాండిత్యం.

**Q.** round-around **A.** Round - గుండ్రటి/ చుట్టూ. Around = చుట్టూ.

**Q.** right-aright **A.** Right = సరైన. Aright = సరిగా.

**Q.** flight-aeroplane **A.** Flight = పక్షి/ విమానం ఎగరడం; విమాన ప్రయాణం

**Q.** wait-await **A.** Wait for = Await - await గ్రాంథికం

**Q.** ultimatum **A.** చివరి హెచ్చరిక - ఆ తర్వాత ఇక చర్యే

**Q.** police combing **A.** Police లు నేరస్థుల కోసం గాలించడం

**Q.** covert **A.** రహస్యమైన X overt (బాహాటమైన)

**Q.** core committee **A.** Core committee = ఓ సంస్థలో ముఖ్యమైన కేంద్ర సంఘం

**Q.** punch dialogue **A.** Punch Dialogue = సంభాషణ మొత్తంలో అతి ముఖ్యమైన dialogue.

**Q.** boom **A.** Boom = 1) (వ్యాపారంలో) విపరీతమైన పెరుగుదల/ అమ్మకాల జోరు.
2) బూం అని వినిపించే శబ్దం.

**Q.** stamina **A.** సత్తువ

**Q.** namkeen **A.** ఇది English మాటకాదు.

**Q.** inter act **A.** ఎవరితోనయినా మాట్లాడటం, కలిసి పనిచేయడం, etc.

**Q.** zinc food **A.** zinc = యశదం- ఒక metal (లోహం) zinc food కు ప్రత్యేకమైన అర్థంలేదు.

**Q.** dare devil **A.** ప్రమాదాలకు లెక్కచేయకుండా, ఏ సాహసానికైనా సిద్ధపడేవారు.

**Q.** count down **A.** పై అంకె నుంచి (100 లేదా 10 నుంచి) సున్న వరకు లెక్కించడం, bombs, rockets లాంటివి పేల్చేందుకు వదిలేందుకు. 2) ముహూర్తం దగ్గరపడటం.

**Q.** night out **A.** రాత్రంతా మేల్కొని ఉండటం.

**Q.** dam good **A.** చాలా బాగున్న.

**Q.** turbonator **A.** ఈ మాట English లో లేదు. Turban తలపాగా, Bowler Harbhajan Singh తలపాగా చుట్టుకుని వికెట్లు పడగొడతాడు. (terminate - అంతం చేయడం; terminator - అంతం చేసే వాడు - అందుకని అతడిని అలా వ్యవహరిస్తారు)

**Q.** frustration **A.** నిరాశ వల్ల కలిగే నిస్పృహ/ నిరుత్సాహం

**A. Sudhakar, Bhiknoor**

**Q.** ప్రతి ఇంటర్వ్యూలో 'Tell us about yourself' అని అడుగుతారు. దీనికి సమాధానంగా అభ్యర్థి బయోడేటాతోపాటు ఏమి చెప్పాలి?

**A.** Tell us about yourself అన్నప్పుడు first, పేరు చెబుతాం - My name is so and so అని begin చేయకుండా (English medium LKG, UKG పిల్లల్లా), I am so and so; I am from (మీ ఊరి పేరు), location (District, nearest important city, మీ family background (Agriculture/ business/ service, etc), your siblings (తోబుట్టువులు), your education (school and college), present occupation, ఇలా చెప్పాలి. మనకు మామూలుగా ఒక minute సమయం ఇస్తారు. ఒక్కోసారి ఎక్కువ సమయం కూడా ఇస్తారు. అప్పుడు, మీ interests, hobbies లాంటివి చెప్పొచ్చు

**Q.** A, An, The ఇవి articles కదా. వీటిని demonstrative adjectives అంటారెందుకు? కొన్ని ఉదాహరణలతో తెలపండి.

**A.** ఫలానాది అని తెలిపే (demonstrate చేసే) adjectives లా ఉంటాయి కాబట్టి- a/ an- ఒక/ ఏదైనా/ ఆ.

**Q.** Who, that, which ల ఉపయోగం ఉదాహరణలతో వివరించండి.

**A.** Who = ఎవరు? Who is he? (ఆయనెవరు? ) who has done this? (ఇది చేసిందెవరు? ) who = whom = ఎవరిని/ ఎవరికి etc.
Who did you learn it from? = నువ్వది ఎవరి దగ్గర నేర్చుకున్నావు?
Who did you defeat? = నువ్వోడించింది ఎవరిని?
Who did they give it to? = దాన్ని వాళ్లు ఎవరికి చ్చారు?
That = ఆ.
Give me that book (నాకా పుస్తకం ఇవ్వు)
That- Relative pronoun.
This is the book that I gave him yesterday= నేనతడికిచ్చిన పుస్తకం ఇదే.
Which ని 'ఏ?' అనే అర్థంతో question అడిగేందుకు వాడతాం.
Which book is yours? (ఏ పుస్తకం నీది? )
Which ని that లా relative pronoun గా వాడతాం.
This is the book which gives you the information you want = మీక్కావాల్సిన సమాచారం ఇచ్చే పుస్తకం ఇదే.

**Q.** Pronoun agreement, pronoun consistency, pronoun ambiguity అంటే ఏమిటి? ఉదాహరణలు తెలపండి.

**A.** ఇవన్నీ Technical terms- grammar ను ప్రత్యేకంగా చదివేటప్పుడు వచ్చేవి. ఇవేం తెలియకుండానే correct గా English మాట్లాడటం సాధ్యమే. అయినా కింద వివరిస్తున్నాం. ఇవి తెలియకుండానే English చక్కగా మాట్లాడొచ్చు/ రాయొచ్చు

Everyone of the boys knows what he has to do- ఇక్కడ everyone కు pronoun he, అందుకని verb కూడా knows. ఇది pronoun agreement.

The boy knows what he is expected to do, and what he is capable of doing. ఇక్కడ boy బదులు, consistent (uniform గా) he అనే pronoun వాడటం pronoun consistency.

Give milk to the child after it boils. ఇక్కడ after it boils అని కదా ఉంది, milk కూ, child కూ pronoun, it. కాబట్టి ఇక్కడ after it boils అంటే పాలు మరిగిన తర్వాత అని కాకుండా బిడ్డ మరిగిన తర్వాత అనే అర్థం వస్తుంది కదా, it, child కు దగ్గరగా ఉండటం వల్ల, ఇలాంటి విపరీతార్థం, pronoun ambiguity (సందేహం) వల్ల వస్తుంది. ఇలాంటివి పెద్దగా పట్టించుకోకండి. Correct అని తోచింది మాట్లాడండి.

**G. Madhusudan Suryapet**

**Q.** వారికే అర్థం కాకపోతే మనమెంతటి వాళ్లం అనడానికి English లో "When they could not understand that after all what we are" అంటే సరిపోతుందా?

**A.** When even they can't/ when they themselves can't understand it, what about us?/ how can we after all?

**Ravuri Sridevi, Jammulapalem**

**Q.** Barrage and Reservoir

**A.** Barrage (Pron: British బరాజ్- జ్, measure లో su లా/ American- బారిజ్) అంటే నీళ్లు పొర్లిపోకుండా, వరదనీళ్ల ప్రమాదం కలిగించకుండా, ఆపి ఉంచేందుకు కట్టే బలమైన గోడ.
Reservoir- నీళ్లను నిల్వచేసే సహజంగా ఏర్పడిన/ మానవ నిర్మితమైన జలాశయం.

**Q.** G.O. and Proceeding

**A.** G.O.- Government Order- ప్రభుత్వ చట్టాన్ని అమలుచేసే విధానాన్ని తెలిపే ప్రభుత్వ ఆజ్ఞాపత్రం. G.O. విడుదల కానిదే చట్టానికి కార్యరూపం ఉండదు.
Proceeding: ప్రభుత్వంలోని వివిధ శాఖాధిపతులు (Heads of Departments) తమ శాఖల్లో G.O. అమలుచేసేందుకు జారీచేసే పత్రం.

**Q.** Certificate and Diploma

**A.** Certificate- 1) ఒకరికి ఉన్న అర్హతలను తెలిపే పత్రం.
Certificate Course= ఏదయినా subject లో శిక్షణ పొంది/ పరీక్ష రాసి ఆ subject లో అర్హత తెచ్చుకునేందుకు course.
Diploma: 1) Degree Certificate లాంటి విద్యార్హతను తెలిపే పత్రం.
2) ఒక నిర్ణీతకాలంలో ఏదయినా subject లో పొందే శిక్షణ- Diploma course అని కూడా అంటారు.

**Q.** Receipt and counterfoil

**A.** Receipt= రశీదు, Counterfoil= నకలు

**Q.** Electronics and Electricals

**A.** Electronics- Electronic పరికరాలలో విద్యుత్ ప్రవాహాన్ని అధ్యయనంచేసే శాస్త్రం (Electron కు సంబంధించిన)
Electricals- ఈ మాట ఎక్కువగా Shops boards మీద కనిపిస్తుంది. మామూలు భాషలో electrical అనే అంటాం- అర్థం- విద్యుత్తుకు సంబంధించిన/ విద్యుచ్ఛక్తితో పనిచేసే.

**Q.** Knowledge and Wisdom

**A.** Knowledge- విజ్ఞానం/ ఒక subject చదవడంవల్ల, పుస్తకాల, పరిశోధనలవల్ల తెలుసుకునే విషయం.
Wisdom- జ్ఞానం- జీవితానుభవాల వల్ల, ఆలోచనల వల్ల మనం పొందేది.

**Q.** Location and situation

**A.** Location= ప్రదేశం= situation. అయితే situation కు ఇంకో అర్థం, పరిస్థితి. I don't want to face such a situation again= అలాంటి పరిస్థితి మళ్లీ ఎదుర్కోవాలని లేదు నాకు.

**Q.** Wishes and Congratulations

**A.** Wishes= కోరికలు/ ఆకాంక్షలు. ఒకరికి (మంచి) ఏదయినా జరగాలనే ఆకాంక్ష(లు)
Congratulations= ఎవరైనా ఏదైనా సాధిస్తే మనం తెలిపే అభినందనలు.
ఎవరైనా ఏదైనా మంచి/ గొప్ప పని ప్రారంభించేటప్పుడు మనం wishes/ best wishes చెప్తాం. వాళ్లా పని విజయవంతంగా పూర్తిచేసినప్పుడు congratulations చెప్తాం.

**Q.** Time table and Schedule

**A.** Time table= ఏ సమయానికి ఏది జరగాలో తెలిపే పట్టిక= Schedule.
schedule కు వేరే అర్థాలు: 1) ఆమోదం పొందిన ఏ ప్రణాళికైనా.
2) ఒక ఉద్దేశంతో తయారుచేసిన అధికారిక జాబితాలు.

**Jhansi, Mangalagiri**

**Q.** నిన్న క్లాసులో ఎంతవరకు చెప్పుకున్నాం?

**A.** What did we learn yesterday?

**Q.** పుస్తకాలు చేత్తో పట్టుకుని చదవండి.

**A.** Hold your books in your hands and read them.

**Q.** అందరూ హోంవర్కు చేశారా?

**A.** Have all of you done the home work?

**Q.** అందరూ లేచి రావద్దు. ఒకరి తర్వాత ఒకరు రండి.

**A.** Don't all of you come to me at the same time. Come one by one.

**Q.** అందరూ పెద్దగా చదవండి.

**A.** All of you read aloud.

**Q.** ముందుగా హోం వర్కు చూస్తా. తర్వాత క్లాస్ చెబుతాను.

**A.** I'll first check your home work and then teach the lesson.

**Vicky, Karimnagar**

**Q.** India win by 5 wickets. ప్రత్యక్ష ప్రసారంలో టీవీలో ఇండియా గెలవగానే ఈ టైటిల్ వేస్తారు. Win బదులు won రావాలి కదా.

**A.** ఇంతకు ముందు చాలాసార్లు చెప్పాం. News Paper Headings/ TV Headings లో, జరిగిపోయిన విషయాలకైనా Present Simple వాడతారు.

**Q.** Kurnool, Cuddalore, Allahabad లాంటి పేర్లలో అనవసర అక్షరాలు ఎందుకు? Kurnool, Kadapa అని ఎందుకు రాసుకోలేం?

**A.** ఇవన్నీ British వాళ్లు మన ఊళ్ల పేర్లకు వాడిన ఇప్పటికైనా మారిస్తే బాగుంటుంది. ఇప్పుడు Cuddapah ను Kadapa అనే Spell చేస్తున్నాం కదా.

**Q.** Get together party అర్థం ఏమిటి?

**A.** నలుగురూ కలిసి తేనీటి విందు/ dinner చేసుకోవడం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



## 500th Lesson on Spoken English

Dear Readers,

Here is our 500th lesson on Spoken English. Starting on June 12, 2005, this course in Spoken English has had an uninterrupted run so far. A page on Spoken English, three to four times a week, along with a page on Vocabulary/ Grammar Made Easy, running for a period of three years and a quarter and still going on is perhaps a record. And we must thank you, the readers for your whole-hearted and enthusiastic support.

**Our plan for the lessons: Each lesson is a continuation of the previous lesson. At the same time, even the new reader is sure to find in it some thing very useful for improving his/ her Spoken English skills.**

Your numerous letters with your questions on and doubts about Spoken English encourage us to be of even greater help to you. To make our lessons more effective and useful we are planning innovations. We are going to start shortly lessons on advanced English speech skills. We assure you, however, the lessons will be in the same simple and easily understandable style of the earlier lessons. We are confident that you will certainly respond to them and learn them with the same enthusiasm as now or even with more enthusiasm.

This course is for you; therefore we welcome your suggestions for its greater usefulness. We look forward to your and our well-wishers' continued support, and assure you of our best services.

- M.Suresan

suresanm@yahoo.com



# That will serve the purpose

**Advaith:** How much have you been able to collect for the party we've thought of having?

(మనం అనుకున్న party కి ఎంతమటుకు పోగుచేయగలిగావు? )

**Vedanth:** Not much, I'm afraid. All that we could scrape together was about Rs. 3000, and that's nowhere near our need.

(అంతేమీ లేదు. ఎంతో కష్టంతో మనం పోగుచేయగలిగింది మూడువేల రూపాయలే.)

I'm afraid = (ఇక్కడ) I am sorry

**Advaith:** That's quite disappointing. Our estimates are around Rs. 9000. A large chunk of the amount goes to the singer and his band.

(చాలా నిరాశాకరంగా ఉంది. మన అంచనాలు దాదాపు 9000 రూపాయలు. దాన్లో ఎక్కువభాగం గాయకుడికి, అతడి band కూ ఇవ్వాల్సి ఉంటుంది.)

Chunk = భాగం, band = వాద్య బృందం

**Vedanth:** Why should we have an out of town band? I think we can make do with a local band. That will serve the purpose, I think.

(బయటినుంచి వచ్చే band ఎందుకు మనకు? స్థానిక band తో సర్దుకుపోవచ్చు అనుకుంటా. దాంతో మనకు పని జరిగిపోతుంది)

**Advaith:** Yea. That appears to be the best in the circumstances. We are unable to rake up the money for anything better.

(అవును. ఈ పరిస్థితుల్లో అదే ఉత్తమం అనిపిస్తోంది. అంతకంటే ఇంక దేనికీ మనం డబ్బు పోగుచేయలేకుండా ఉన్నాం.)

**Vedanth:** I think people play up anything not local. Some of our local bands and singers are even better than those from outside.

(బయటినుంచి వచ్చే దేనిగురించయినా జనం గొప్పగా చెప్పుకొంటారు. మన ఊళ్లో ఉన్న గాయనీగాయకులు, band బయటినుంచి వచ్చే వాళ్లకంటే మెరుగు.)

**Advaith:** The mike blasing from outside is really deafening. I wish they could keep it down.

(అబ్బా! బయట mike హోరు చెవుడు కలిగించేట్టుంది. తగ్గిస్తే బాగుండు.)

**Vedanth:** We can do nothing. We've to bear it; that's all. It's the festive season.

(దానిని మనం ఏం చేయలేం, భరించాల్సిందే. ఇది పండగ సమయం కదా.)

**Advaith:** OK. Mom has set the table. Let's eat. I'm hungry. No one to serve us, as mom's gone out. We have to help ourselves.

(అమ్మ భోజనానికి అంతా సిద్ధం చేసింది. నాకాకలేస్తోంది. మనకు వడ్డించేందుకెవరూ లేరు. మనకు మనం వడ్డించుకోవాల్సిందే.)

M.SURESAN

**Vedanth:** I'll eat but I don't want you to ask me to help myself to more than I can eat. That's the trouble in eating with you.

(భోంచేస్తాను, కానీ నేను తినగలిగినదానికంటే ఎక్కువ వడ్డించుకోమని నన్ను బలవంత పెట్టొద్దు. నీతో అదే నాకు బాధ.)

**Advaith:** OK. I leave it to you. I'm aware you are now 20 going on to 21, and you know what suits you best.

(సరేలే. అదంతా నీకే వదిలేస్తున్నా. నీకిప్పుడు 20 ఏళ్లు పూర్తయ్యి 21లో అడుగుపెడుతున్నావు. నీకేది మంచిదో నీకు తెలుసని నాకు తెలుసు.)

**Vedanth:** A piece of interesting news for you. Our friend Visisht's exhibit in the on going science fair has won an award.

(నీకో ఆసక్తికరమైన వార్త. ఇప్పుడు జరుగుతున్న science fair లో మన friend విశిష్ట్ ప్రదర్శించిన వస్తువుకు బహుమతి వచ్చింది.)

Exhibit = Exhibition లో ప్రదర్శించే వస్తువు.

**Advaith:** Really? Very great indeed. He should give us a party then.

**Vedanth:** We'll ask him tomorrow.

(రేపు అడుగుదాం)

Daily real life situations లో మనం వాడే చాలా అర్థవంతమైన, ఉపయోగకరమైన phrasal verbs మరికొన్ని ఈ lesson లో తెలుసుకుందాం. ఇవి మనం మాట్లాడేటప్పుడు తడుముకోకుండా వాడగలిగితే మన conversation చాలా impressive గా ఉంటుంది.

***Now look at the following sentences from the dialogue above.***

*1) All that we could scrape together was about Rs. 3000*

*2) That's no where near our need*

*3) ... people playup anything not local*

*4) I wish they could keep it down*

*5) That will serve the purpose*

*6) Mom's (Mom has) set the table*

*7) We have to help ourselves*

*8) I don't want you to ask me to help myself more than I can eat.*

*9) You are now twenty going on to 21*

*10) our friend's exhibit has won an award at the ongoing science fair.*

**1) Scrape together** = అతి కష్టంతో ఏదయినా పోగుచేయగలగడం.

1) They could scrape together just three or four books by the poet = అతి కష్టంమీద వాళ్ల ఆ కవి రాసిన రెండు, మూడు పుస్తకాలు మాత్రమే సేకరించగలిగారు.

2) Can we scrape together a team for the match on Thursday? = గురువారం match కు మనం ఓ జట్టుకు ఆటగాళ్లను పోగుచేయగలమా?

3) He scraped together the money for his children's education by selling off his old house = తన పిల్లల చదువు కోసం తన పాత ఇల్లు అమ్మేసి ఏదో కొంత డబ్బు సేకరించగలిగాడు.

scrape= రేకులాంటి వాటితో దేన్నయినా గీకి శుభ్రపరచడం/ ఒకదానికి అంటుకున్న దానిని గీకేయడం.

Scraping the floor of paint marks= నేలమీది paint మరకలను గీకడం.

Scape through/ Scrape = అతి కష్టంమీద నెగ్గడం, pass కావడం.

a) If he can scrape through the exam his father will be happy/ If he can scrape a pass in the exam, his father will be happy = అతడు (అతి కష్టంతో) pass అయితే చాలు (కనీస marks తో) వాళ్ల నాన్న సంతోషిస్తాడు/ కనీస marks తో pass అయితే చాలు, వాళ్ల నాన్న సంతోషిస్తాడు.

b) The Manmohansingh Govt scraped a victory by just a few votes = కేవలం కొన్ని votes తేడాతో మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం నెగ్గగలిగింది.

**3) Play up** = ఒక విషయానికి లేనిప్రాముఖ్యం ఇవ్వడం.

a) He plays up his Telugu medium background to justify his poor English = తన English అంత బాగుండకపోవడానికి కారణంగా తన తెలుగు మీడియం గురించి అతిగా చెబుతుంటాడు.

b) He plays up his injury to dodge work = పని ఎగ్గొట్టేందుకు కారణంగా తన గాయాన్ని మరీ ఎక్కువ చూపుతాడు. (గాయాన్ని సాకుగా చూపుతాడు)

దీనికి వ్యతిరేకం, play down. ఒకదాని ప్రాముఖ్యం తగ్గించి చూపడం.

a) Every party plays down the achievements of the opposition party =

ప్రతి party, ప్రతిపక్షాలు సాధించినవాటిని తక్కువ చేసి మాట్లాడుతుంది.

b) The home minister played down the threat of the terrorists =

Home Minister తీవ్రవాదుల వల్ల ప్రమాదాన్ని గురించి తక్కువ చేసి మాట్లాడాడు. (అంత ప్రమాదమేమీ లేదన్నాడు)

**4) Keep (something) down** = శబ్దం, గొడవలాంటి దానిని తగ్గించడం.

a) Could you please keep your voice down? = కాస్త గొంతు తగ్గించి మాట్లాడరా?

b) Keep the volume of the TV down. Don't you see I'm studying for an exam? =

TV గొడవ తగ్గించు. నేను పరీక్షకు చదువుతున్నానని కనిపించడంలేదా?

Keep (somebody) down = అణిచిపెట్టడం అనే అర్థం కూడా ఉంది.

For centuries the Hindu society has kept the Dalits down =

శతాబ్దాలుగా హిందూ సమాజం దళితులను అణిచిపెట్టింది.

**5) Serve the purpose** = ఒక పనికి ఏదైనా సరిపోవడం/ పనికిరావడం.

a) We need a glass, but let's use this mug. It'll serve the purpose =

మనకు గ్లాసు ఒకటి కావాలి, కానీ ఈ mug సరిపోతుందిలే.

b) We need a car. A bike may not serve the purpose =

మనకు car అవసరం. Bike అవసరానికి సరిపోదు.

**6) Set the table/ lay the table** = భోజనం వడ్డించేందుకు అన్నీ సిద్ధం చేయడం. దీని తర్వాత serving (వడ్డించటం) జరుగుతుంది.

a) My sister has set the table. Mom will serve the lunch = మా చెల్లి/ అక్క భోజనానికన్నీ సిద్ధం చేసింది. మా అమ్మ వడ్డిస్తుంది.

b) The table is set and mom's going to serve the dinner = భోజనానికంతా ready గా ఉంది (కంచాలు, plates, spoons అంతా ready చేయడం.) అమ్మ వడ్డించబోతోంది.

**7), 8) Help oneself** = (భోజనంలో) ఏదైనా వడ్డించుకోవడం తమకు తాము.

a) If you want a little more sugar in the coffee, help yourself. The sugar bowl is on the table =

నీ coffee లో ఇంకా పంచదార కావాలంటే వేసుకో. పంచదార పాత్ర table మీదే ఉంది.

b) As he was hungry, he helped himself to some more rice = ఆకలిగా ఉండటంతో అతడు మరికొంచెం అన్నం వడ్డించుకున్నాడు.

**9) going on** = (వయసు విషయం) ఒక సంవత్సరంలో అడుగిడబోవడం.

a) She is now 16, going on 17 =

తనకిప్పుడు 16 నిండి, 17 రాబోతోంది.

b) You are now going on 18, and you will have the voting right =

నీకిప్పుడు 18 రాబోతోంది, దాంతోబాటు vote హక్కు వస్తుంది.

**10) on going** = ప్రస్తుతం జరుగుతున్న.

a) Who will win the on going match? =

ఇప్పుడు జరుగుతున్న match ఎవరు గెలుస్తారు?

b) The on going debate on reservations will continuous for some time =

ప్రస్తుతం reservations మీద జరుగుతున్న చర్చ మరికొంతకాలం కొనసాగుతుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# It's a job after my heart

**Gokul:** Hi Kailas, how are you?

(ఎలా ఉన్నావు? )

**Kailas:** Fine. Thank you. How are you?

(బాగానే ఉన్నాను. నువ్వెలా ఉన్నావు? )

**Gokul:** Fine too. Thank you. Long time, no see. What's the matter?

(బాగానే ఉన్నా. Thank you. కలిసి చాలా కాలమైంది. ఏంటి విషయం? )

**Kailas:** (I had) been out of town for quite some time. My uncle wanted my help in some matter.

(కొన్ని రోజులుగా ఊరిలోలేను. మా మామయ్య కేదో సాయం కావాల్సివస్తే వెళ్లా).

**Gokul:** Isn't he a businessman?

(ఆయన వ్యాపారి కదా? )

**Kailas:** Yes. He is. In fact I went there to be of help to him in his business.

(అవును. అసలు నేను వెళ్లింది ఆయన వ్యాపారంలో సాయపడేందుకే.)

**Gokul:** Isn't his ice cream business?

(ఆయనది ఐస్‌క్రీం వ్యాపారం కదా? )

**Kailas:** Yes, it is. He was short of hands to manage the sales which had gone up by more than 50%. The sales had been helped along by the hot weather early this summer.

(అవును, అదే. 50 శాతాని కంటే ఎక్కువ పెరిగిన అమ్మకాలను చూసేందుకు చాలినంత మంది లేకపోయారు. ఈ వేసవి మొదట్లోని ఎండ అమ్మకాలు పెరగడానికి బాగా తోడ్పడింది.)

**Gokul:** Why don't you join him? Isn't he pre poned to take you as a partner?

(నువ్వు ఆయనతో కలవొచ్చుకదా? నిన్ను పార్టనర్‌గా తీసుకునేందుకు ఆయనకు ఇష్టం లేదా? )

Kailas: Business isn't my cup of tea. My choice is a software job; that's why I'm doing MCA; Don't you understand it?

(నాకు business నచ్చదు. నా ఎంపిక Software ఉద్యోగం. అందుకనే నేను MCA చేస్తున్నా. అర్థం కాదా? )

**Gokul:** If I were you, I would jump at such an opportunity. That's a career after my heart.

(నేనే నువ్వైతేనా, అలాంటి అవకాశం వస్తే ఎగిరి గంతేసే వాడిని. నాకు అతి ఇష్టమైన వ్యాపకం - వ్యాపారం.)

**Kailas:** Distance lends charm to the eye. Business isn't the cat walk that you imagine is to be.

(దూరపు కొండలు నునుపు. Business అనేది నువ్వనేంత సులువు కాదు.)

**Gokul:** Depends on how you look at is.

(నువ్వు దానిని గురించి చూసే తీరును బట్టి ఉంటుంది.)

**Kailas:** OK. Let's agree to disagree.

(సర్లే. నీకూ నాకు కుదరదు)

చాలాకాలమైంది కదా మనం పలకరింపు మాటలు(Greeting)తెలుసుకుని. ఒకసారి పునరావృతం చేసుకుందాం. అంతేకాకుండా మనం నిత్యం వాడే మరికొన్ని expressions కూడా తెలుసుకుందాం.

***Look at the following expressions from the dialogue above:***

1) a) How are you?

b) Longtime, no see

2) He was short of hands.

3) The sales had been helped along by the hot weather...

4) Business isn't my cup of tea.

5) If I were you, I would jump at the opportunity.

6) It's a career after my heart.





M.SURESAN

1) a) How are you? = ఎలా ఉన్నావు? ఎలా ఉన్నారు? ఇది మనందరికీ తెలిసిన అత్యంత సాధారణమైన పలకరింపు (Greeting) మాట కదా? అయితే, How are you? అనేముందు మనం Hello (name), Hi, అని కూడా అంటాం కదా? అయితే గుర్తుంచుకోవాల్సిన విషయం ఏమిటంటే, మనకంటే పెద్దవాళ్లను, మన పైవాళ్లను పలకరించినప్పుడు Hi అనం. Hello, Good morning / Good evening / Good afternoon, Sir అంటాం. సమయాన్నిబట్టి - అంటే ఇది formal. ఇప్పుడు చూడండి (formal) 'Hello, Good morning sir, How are you?

దీనికి జవాబుగా అవతలి వాళ్లు స్పందించే తీరు:

a) Fine. Thank you. How are you?

b) (I'm) fine too. Thank you.

c) Same here. Thank you.

(పలకరింపు) greetingకు వాడే ఇతర expressions.

a) How are you getting on?

b) How goes the word with you?

c) How is it with you?

d) How is everybody? (కుటుంబంలో అందరినీ కుశలం అడిగేందుకు)

చాలా కాలం తరువాత కలుసుకుంటే...

a) Long since we met; how are you?

b) Ages since we met; What's the matter?

(మనం కలుసుకుని యుగాలైంది. ఏంటి విషయం? )

Age = యుగం (ఇక్కడి అర్థం)

c) Long time, no see.

(చాలాకాలమైంది చూసి.) చాలాకాలం తరువాత కలుసుకుని, అలా కలుసుకోవడం చాలా అశ్చర్యకరమైతే,

a) Hi, who do I see here, Naveen?

(ఏంటి నవీనేనా, అబ్బ, ఎంత కాలమైందో నిన్ను చూసి)

b) Oh, Naveen, is it you? What do I owe this pleasure to?

(నవీన్, నువ్వేనా? ఎంతకాలానికి? ఏం అదృష్టం? )

c) Oh, what a privilage to see you, though after a long time.

(ఇది కాస్త formal) - అంటే మనం అంతగా చనువు తీసుకోని వారితో)

వీటిని బాగా ప్రాక్టీస్ చేద్దాం.

ఇప్పుడు మనం మిగతా expressions చూద్దాం:

**1) Short of hands -** ఏ పనికైనా చాలినంతమంది సిబ్బంది లేకపోవడం.

i) Short of = కొరతగా ఉన్న

a) We are short of cash. Would you accept a cheque?

మా దగ్గర నగదు కొరతగా ఉంది/ చాలినంత నగదు లేదు. చెక్కు పుచ్చుకుంటారా?

b) India is short of crude oil reserves.

భారత్‌లో క్రూడ్ ఆయిల్ నిల్వల కొరత ఉంది / చాలినంత క్రూడ్ లేదు.

c) Sorry, We can't finish the job by the week end. We are short of hands =

ఈ వారాంతానికి మేం పని పూర్తి చేయలేం. మనుషులు / సిబ్బంది కొరత ఉంది / చాలినంత సిబ్బంది లేరు.

d) We need at least two more hands in the department = మా శాఖకు అదనంగా కనీసం మరో ఇద్దరు అవసరం.

**3) Help along =** ఏదైనా సులువుగా త్వరితంగా జరిగేటట్లు చేయడం / మేలుకలగడం / ఊతమివ్వడం.

a) Availability of Scientists is helping along our space programmes = మా శాఖకు అదనంగా శాస్త్రజ్ఞులు ఉండటం వల్ల అంతరిక్ష కార్యక్రమాలు చురుగ్గా సాగుతున్నాయి.

b) Government's lineancy is helping along the belt shops = ప్రభుత్వ ఉదాసీనత బెల్ట్ షాపులకు ఊతమిస్తోంది.

**4) Not my cup of tea =** నాకు నచ్చనిది / నాకు ఆసక్తి కలిగించనిది. ఇలాగే, not his / her/ their.... ఎవరిదైనా చెప్పవచ్చు. (గిట్టనిది). a) Maths is not his cup of tea = గణితంలో అతడికి ఆసక్తి లేదు/ అతడికి ఇష్టమైంది కాదు.

b) Social service is not the Politician's cup of tea = సంఘసేవ అనేది రాజకీయ వాదులకు గిట్టనిది.

**5) Jump at an opportunity/ offer =** అవకాశం వస్తే ఎగిరి గంతెయ్యడం.

a) Who won't jump at the offer of CM's post? =

ముఖ్యమంత్రయ్యే అవకాశం వస్తే ఎవరు ఎగిరి గంతెయ్యరు? / ఎవరు ఇష్టపడరు?

b) The minute he was offered the post he jumped at = ఉద్యోగావకాశం రాగానే అతడు ఎగిరి గంతేశాడు.

b) After one's heart = కోరుకున్నది

a) It's a job after my heart = అది నాకు నచ్చిన ఉద్యోగం.

b) I named my daughter Lakshmi because it's a name after my heart = నాకు లక్ష్మి అనే పేరు ఇష్టం కాబట్టి మా అమ్మాయికి ఆ పేరు పెట్టాను.

---



**Vicky, Karimnagar**

**Q.** I saw, I did see ఈ రెండింటిలో ఏది కరెక్టు?

**A.** రెండూ correct. - I saw = నేను చూశాను/ నాకు కనిపించింది. I did see = నేను కచ్చితంగా చూశాను అని నొక్కి చెప్పడం.

**S Raj, Warangal**

**Q.** నాకు ఇంగ్లిష్ బాగా నేర్చుకోవాలని ఉంది. దయచేసి మంచి పుస్తకం పేరు చెప్పండి.

**A.** Living English Structure by Stannard Allen చదవండి. చదవటం, మాట్లాడటం practice చేయండి.

**Q.** Foreign language నేర్చుకోవడానికి సంబంధించి డిక్షనరీ లేదా మంచి పుస్తకం పేరు చెప్పగలరు.

**A.** Creford Dictionary

**Q.** నేను ప్రతిరోజు ఇంగ్లిష్ న్యూస్ పేపర్ చదువుతాను. దీనివల్ల ప్రయోజనం ఉందా?

**A.** ప్రయోజనం ఉంది

**Q.** Root, Route వీటి మధ్య తేడా ఏమిటి?

**A.** Root = వేరు; Route = మార్గం.

**Rajia Sultana, Bollavaram**

**Q.** ఒక వాక్యంలో principle verb ను transitive గా వాడారో intransitive గా వాడారో వెంటనే తెలుసుకోవడం ఎలా?

**A.** Verb కు ఎవరిని/ ఎవరికి/ దీనిని/దీనికి అని వాడారా? Question వేసి దానికి answer వస్తే, ఆ verb transitive, లేకుంటే intransitive.

**Q.** He trained in acting in the film institute. ఇక్కడ verb transitive గా ఉందా? intransitiveగా ఉందా?

**A.** He trained in acting... ఇక్కడి verb, trained = శిక్షణ పొందాడు. ఎవరిని/ ఎవరికి/ దీనిని/ దీనికి (దేనిలో కాదు) శిక్షణ పొందాడు? అన్న ప్రశ్నకు answer లేదు కాబట్టి, ఈ sentenceలో train intransitive.

**Q.** Reshma Sultana trains her students in gymnastics ఇక్కడ verb transitive గా వాడారా? లేదా intransitive గా వాడారా?

**A.** He trained her in acting ఇక్కడ ఎవర్ని train చేశాడు? అన్న ప్రశ్నకు ఆమెను అని బదులు వస్తుంది. కాబట్టి ఈ sentenceలో train transitive

**Q.** Change ను transitive, instransitive రెండు విధాలుగా వాడొచ్చా?

ఉదాహరణకు His acting in the movies has changed him a lot. ఇక్కడ verb transitive అవుతుందా?

మరొక ఉదాహరణ After six months on her job Rehana came back here from the United States. But she seems to have put on weight and have changed a lot that I hardly, recognised her. ఇక్కడ verb transitive లేదా intransitive.

**A.** Sultana train her student - ఎవర్ని train చేస్తోంది? - తన studentsను - So, 'trains' is transitive.

His acting ... has changed him -

ఇక్కడ ఎవర్ని అంటే him అని వస్తోంది కదా జవాబు. కాబట్టి Change ఇక్కడ transitive.

She seems... to have changed a lot =

ఆమె మారినట్టుంది (ఆమె ఎవరినీ మార్చలేదు) కాబట్టి, Change ఇక్కడ intransitive.

**V.Kasturi, Peda Kakani**

**Q.** He has decided to do it / He decided to do it. She realised the fact/ she has realised the fact / She had realised the fact. ఈ verb forms అర్థం కావడం లేదు. దయచేసి వివరించగలరు.

**A.** ఇప్పటివరకు/ ఇంకా జరుగుతున్న పనులకు have/ has + PP (Past Participle) వాడతాం. Time తెలిసినా, అయిపోయిన వేరే విషయం ప్రస్తావిస్తున్నా past doing word వాడతాం. He has decided to do it (నిశ్చయించుకున్నాడు.) ఎప్పుడు? Time తెలియడం లేదు. నిశ్చయించుకోవడం జరిగింది.

He decided to do it - ఈ sentence ఉన్నది ఉన్నట్టుగా అయితే తప్పు. Time expression లేదు కాబట్టి. అయితే అంతకుముందు జరిగిన సంఘటన సందర్భం, pastలో ఫలానా time అని తెలిసినప్పుడు He decided, correct.

Eg: He consulted the doctor yesterday. The doctor told him to give up smoking. He decided to do it. ఇక్కడ సందర్భం pastలో ఫలానా time అని తెలుస్తోంది కదా? (Yesterday) అలాంటప్పుడు,

He decided correct.

మామూలుగా 'decided' independent sentenceలో రాదు. He has decided రావాలి. అలాగే మిగతా రెండూ.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 502

# She told me that she was waiting for you



### A. Bunganna, Munagalapadu

**Q.** Please let me know the Active Voice for have you ever been bitten by a dog?

**A.** Has a dog ever bitten you?

**Q.** "My brother is not taller than I." I found this sentence in study material. Is it correct?

**A.** My brother is not taller than I/ me.

What you found in the study material is correct.

### S. Sriram, Hyderabad

**Q.** Obama is a regular guy, ain't he? అన్న న్యూస్ పేపర్ heading కు తెలుగులో అర్థమేమిటి?

**A.** Obama క్రమం తప్పని (ఇక్కడ regular కు అర్థం, అది వాడిన సందర్భాన్ని బట్టి వేరే అవ్వొచ్చు). మనిషి (Guy) కదా?

Ain't he? - ఇది సామాన్యంగా Black Americans, Isn't he? అని question tag కు బదులు వాడతారు. Isn't he? = Is he not? (అవును కదా? )

**Q.** కింది short forms కు పూర్తి పదం, అర్థం తెలుప గలరు.

ain't, I'd, There's, He's, Who's, Won't, We're, I've

**A.** Ain't = Isn't (Is not)

I'd= I had/ I would-సందర్భాన్ని బట్టి

There's = There is/ There has సందర్భాన్ని బట్టి

He's = He is/ He has

Who's = Who is; Won't = Will not

We're = We are

I've = I have

### M. Satyanarayana, Hyderabad

**Q.** Emporium, Mall, Shop, Show room, Store, Merchant, Employ, Job వీటిని ఎక్కడెక్కడ ఉపయోగించాలో వివరించగలరు.

**A.** **Emporium** - పెద్ద దుకాణం - ముఖ్యంగా ఒక రకమైన వస్తువులను అమ్మే చోటు. Cloth Emporium - ఇది old fashioned - ఇప్పుడంతగా వాడటంలేదు. England, USలో.

**Mall** - దుకాణాల సముదాయం ఉండే పెద్ద వ్యాపార శాల - వస్తువులను, సేవలను అమ్మే shops సముదాయం. దీనినే Shopping Mall అని కూడా అంటారు. అయితే ఈ మాట ముఖ్యంగా American.

**Shop** = వస్తువులను/ సేవలను పొందే ఏ దుకాణమైనా- Book shop, Mechanic shop, etc. ఇది ముఖ్యంగా British.

**Show room** = అమ్మకానికున్న వస్తువులను ఆకర్షణీయంగా ప్రదర్శించి అమ్మే పెద్ద Shop.

Britain, America లలో Show room లు ఎక్కువగా Cars/ Electrical goods ప్రదర్శనకూ, అమ్మకానికీ ఏర్పరుస్తారు.

**Store** = రకరకాల వస్తువులను అమ్మే పెద్ద దుకాణం = Department store. America లో ఏ రకమైన Shop నైనా- పెద్దది/ చిన్నది/ ఒకే రకం వస్తువులను అమ్మే shop ను, store అంటారు.

**Merchant** = వ్యాపారి/ వర్తకుడు

**Employ** = ఉద్యోగానికి నియమించడం/ ఒక పని అప్పజెప్పడం.

In the employ of = ఒక company/ సంస్థ ఉద్యోగంలో ఉన్న/ ఒక వ్యక్తి (somebody) ఇచ్చిన ఉద్యోగంలో పనిచేసే.

**Job** = ఉద్యోగం Job holder = ఉద్యోగి.

### Pavani, Sudha, Matsyapuri

**Q.** Utmost care and attention has gone into the making of this product. ఈ వాక్యంలో has స్థానంలో have అవసరం లేదా? ఇలాంటి ఉదాహరణలు కొన్ని వివరించగలరు.

**A.** ఇక్కడ care (జాగ్రత్త), attention (శ్రద్ధ) రెండూ, utmost (అత్యంత) అనేదానితో కలిసి ఉన్నాయి. (Utmost care and utmost attention అన్న అర్థంతో) - అంటే దాదాపు ఒకే గుణాన్ని తెలుపుతున్నాయి కాబట్టి, has gone తప్పు కాదు, అయితే have gone మెరుగు.

**Q.** Located, situated ఈ రెండింటి usage ను తెలుపగలరు.

**A.** Located అన్నా situated అన్నా దాదాపు ఒకటే. 'ఫలానా చోట, ఫలానా పరిసరాల్లో, ఫలానా దూరంలో ఉన్న' అనే అర్థంతో. వీటిని ముఖ్యంగా ప్రదేశాలకు, భవనాలకు వాడతాం.

The village is located/ situated at the foot of the hills = ఆ గ్రామం ఆ కొండల దిగువన ఉంది.

అయితే situated అనేది అప్పుడప్పుడు ఓ పరిస్థితిలో ఉన్న అనే అర్థంతోనూ వాడతాం.

Situated in such circumstances, he is helpless = ఆ పరిస్థితుల్లో అతడు నిస్సహాయుడు.

**Q.** Shakespeare రాసిన 'Julius Caesar' లో The most unkindest cut ... అని ఒక వాక్యం ఉంటుంది. విషయ తీవ్రతను బట్టి double superlatives వాడవచ్చా? వివరించగలరు.

**A.** Double Superlative మనలాంటివాళ్లు వాడటం కచ్చితంగా తప్పే. అయితే మీరన్నట్లు విషయ తీవ్రతను తెలిపేందుకు most unkindest అని Shakespeare లాంటి గొప్ప కవులు/ రచయితలు వాడినప్పుడు, మనం అందులోని భావాన్ని గ్రహించి, తప్పును వదిలేస్తాం. కవులకు అలా వాడే స్వేచ్ఛ ఉంది. (వాళ్లకు తెలియక కాదు కదా? ) ఈ స్వేచ్ఛను, poetic license అంటాం.

### Mounika, Guntur

**Q.** వాస్తును ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** వాస్తు అంటే ఏ విధంగా ఇల్లు కడితే యజమానికి ఏ విధమైన ఫలితాలుంటాయి అని చర్చించే వాస్తు శాస్త్రానికి Englishలో మాట లేదు. ఇంటి ఆకారం, design, అందాలు, హంగులు- ఇలాంటి వాటి అధ్యయనాన్ని Architecture అంటారు.

**Q.** Please give me అంటారా? లేదా Please give to me అంటారా? Me అంటే నాకు అని కదా? కొన్ని situations లో for me, to me అని ఎందుకు use చేస్తారు?

**A.** Please give me (something)/ Please give something to me అనడం correct. Please give to me అనం. అలాంటప్పుడు సందర్భాన్ని బట్టి, please give me... సరైనదే కానీ, sentence పూర్తయినట్టు కాదు. ఇలా అసంపూర్తిగా ఉన్నప్పుడు, Please give to me తప్పు.

**Q.** Fear, afraid ఇవే కాకుండా భయాన్ని తెలిపే పదాలు ఉన్నాయా? ఉదాహరణతో తెలుపగలరు.

**A.** Fright, horror, dread, panic, terror, awe, etc. అయితే వాటిని ఎలా వాడాలో తెలుసుకోవాలి. ఇంకో విషయం fear = 1) భయం, 2) భయపడటం.

The sight caused fear in the child = ఆ దృశ్యం పిల్లవాడికి భయం కలిగించింది.

Children fear dogs = పిల్లలు కుక్కలకు భయపడతారు. ఈ భయపడటం అనే అర్థంతోనే fear = be afraid of.

**Q.** Ruin, destruction అర్థం ఒకటేనా? You have ruined my day ఎలాంటి situations లో వాడతాం.

**A.** Ruin కు, destruction కూ తేడా ఉంది.

Ruin = నాశనం; Destruction = ధ్వంసం.

He ruined her life = ఆమె జీవితాన్ని అతడు నాశనం చేశాడు.

The company was ruined = ఆ company నాశనమయ్యింది (దివాళా తీసింది).

The destruction of the city in the bombing ruined the life of many = Bomb వల్ల ధ్వంసమైన నగరంలో చాలామంది నాశనమయ్యారు.

**Q.** నాకు Grammar బాగానే తెలుసు. కానీ మాట్లాడేటప్పుడు కొన్ని words search చేయాల్సి వస్తుంది. అలా కాకుండా ఏం చేయాలి?

**A.** English reading బాగా practice ఉంటే ఆ సంకోచం ఉండదు. వీలైనంత English చదవండి. News telecasts వినండి.

### Sainath, Kamalakuru

**Q.** There was no explanation as to why it should breach at the exact place, time and on the same day. ఈ వాక్యానికి తెలుగు అర్థం తెలుపగలరు. ఈ వాక్యంలో as to అవసరమా?

**A.** సరిగ్గా అదే ప్రదేశంలో, అదే సమయంలో, అదే రోజున గండి ఎలా పడింది అనే విషయానికి వివరణ లేదు/ అనే విషయం వివరించలేకపోతున్నారు. అయితే మీరిచ్చిన sentence లో as to అనవసరం, తప్పు కూడా. As to లేకపోతేనే మీరిచ్చిన sentence correct. కొన్ని సార్లు కొంతమంది about కు బదులు as to వాడుతుంటారు. అది సరికాదు.

**Q.** Alleged, Allegedly వీటిని ఎలా పలకాలి?

**A.** అలెజ్‌డ్ 'లె' నొక్కి పలుకుతాం; అలెజ్‌డ్‌లి.



M.SURESAN

**Q.** Face lift అర్థం పద ప్రయోగం తెలుపండి.

**A.** 1. ముడతలు, ముడతలుగా ఉన్న మనుషుల ముఖాన్ని వైద్యం ద్వారా ముడతలు లేకుండా చేసి, యవ్వనంగా కనిపించేట్లు చేయడం.

2) కట్టడాలకు, ఇళ్లకు, మార్పులు, చేర్పులూ చేసి ఆకర్షణీయంగా చేయడం.

**Q.** Deterioration ఈ పదాన్ని ఎలా ఉచ్చరించాలి?

**A.** డిటిరిఅరెయ్‌షన్ - రెయ్ నొక్కి పలుకుతాం.

**Q.** Woo, woes ఉచ్చారణ, అర్థం తెలుపండి.

**A.** Woo - ఉచ్చారణ - వూ- ఒకరి మద్దతు పొందే ప్రయత్నం చేయడం.

All parties in India woo the minorities. (భారత్‌లో పార్టీలన్నీ మైనారిటీల మద్దతు పొందే ప్రయత్నం చేస్తుంటాయి.)

Woes - ఉచ్చారణ - వోవ్జ్- బాధలు, ఇబ్బందులు.

The woes of Sita - సీత బాధలు/ కష్టాలు.

**Q.** Bid ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారు?

**A.** bid = 1) వేలంపాటలో పాడటం.

2) వేలంలో ఒకరి పాట.

3) ఓ పనిని నేనింతకు చేస్తానని సిద్ధపడటం (Tenders లాంటివి).

4) ప్రయత్నం, ప్రయత్నం చేయడం.

5) Good Morning, good bye లాంటివి చెప్పడం.

### V. Kasturi, Pedakakani

**Q.** మీరో సందర్భంలో particular time ను mention చేస్తే past doing verb వాడతామని చెప్పారు. కానీ ఒక దినపత్రికలో ఇలా ఉంది.

Last year the no. of jaundice cases has not crossed the 350 but this year the figure has touched 1470.

Finally this year they have managed to find a solution.

ఇక్కడ particular time mention చేశారు అయినా Past doing verb వాడలేదు కదా, వివరించగలరు.

**A.** Last year the number of cases has crossed - ఇక్కడ last year అని time చెబుతూ has crossed వాడటం సరికాదు. Last year the number of cases crossed (Past Doing Word (PDW) అనడమే correct.

But this year the figure has reached 1470, correct. ఇక్కడ this year అంటే ఈ సంవత్సరం ఇప్పటివరకూ అని. (ఈ సంవత్సరం ఇంకా అయిపోలేదు)- కాబట్టి has crossed అనే అంటాం. Finally this year, they have managed కూడా. ఈ కారణం వల్ల correct

**Q.** After a break up with Aishwarya, Salman has had many ups and downs. ఈ వాక్యంలో has వాడాలో, past doing verb వాడాలో వివరించగలరు.

**A.** After the break up with Aishwarya... has had ఇదీ correct అవుతుంది. అర్థం- ఆమెతో విడిపోయిన తరువాత నుంచి ఇప్పటివరకూ అనే కదా. అందుకని has had (has + PP) correct.

**Q.** After a long time we saw her at a party. ఈ వాక్యంలో verb have seen వాడొచ్చా?

**A.** After a long time we saw her at a party. ఇక్కడ time సందర్భాన్ని బట్టి ఊహించుకుంటాం. Party అయిపోయింది కాబట్టి. Recently అంటే ఎప్పుడూ have/ has + PP వస్తుంది.

### S.Krishna Prasad, Hyderabad

**Q.** It was indeed bureaucracy at work. Reactive rather than proactive. ఈ వాక్యానికి అర్థం ఏమిటి, అలాగే proactive అనే మాటకు అర్థం ఏమిటి?

**A.** Reactive = సంఘటన జరిగేటప్పుడు/ జరిగిన తర్వాత దాని చెడు ఫలితాన్ని ఆపే ప్రయత్నం.

Proactive = సంఘటన జరగకముందే ఊహించి చొరవతో చర్యలు తీసుకుని దాని చెడు ఫలితాలు రాకుండా చూడటం.

**Q.** భజన (పై అధికారుల మెప్పుకోసం) చేయడాన్ని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Flattery/ Sycophancy (సికోఫాన్సి) = భజన (పొగడ్త అనే అర్థంతో).

**Q.** దేవుడికి చేసే భజనను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** దేవుడి భజనకు సరైన మాట Englishలో లేదు. Choral (బృంద) recital (పాడటం) of hymns (హింజ్- జ్, size లో జ్‌లా- hymn- గీతం) అనొచ్చు. మామూలుగా bhajan అంటారు. (Meera bhajans, etc.).

### A. Kotireddy, Bitragunta

**Q.** She did tell me that she was waiting for you.

She told me that she was waiting for you.

పై రెండు వాక్యాలకు అర్థంలో తేడా ఏమైనా ఉందా? తెలియజేయగలరు.

**A.** She did tell me that she was waiting for you = నీకోసం తను wait చేస్తున్నానని కచ్చితంగా చెప్పింది. (ఆమె చెప్పింది తప్పకుండా అని నొక్కి చెప్పడం) (ఆమె చెప్పడం కచ్చితం)

She told me that she was waiting for you = నీకోసం wait చేస్తున్నానని చెప్పింది.

### Rahul, Khammam

**Q.** Spoken English నేర్చుకోవడానికి మంచి పుస్తకం చెప్పగలరు. English pronunciation కోసం ఏమైనా క్యాసెట్లు, సీడీలు ఉంటే వివరాలు తెలుపండి.

**A.** Spoken English కోసం 'A Living English Structure' by Stannard Allen చదవండి. Pronunciation నేర్చుకోవడానికి పెద్ద book shops లో CDs దొరుకుతాయి.

University of English and Foreign Languages (మునుపటి CIEFL) వాళ్ల CDs కొనండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# By and large he was successful



**G. Shankar, Keshavapatnam.**

**Q.** Could you give me the meanings of these phrases. For instance, Even while, Even since, By and large, Elan and ease, Knives ad forks.

**A. For instance** = for example.

Every chapter of the book is interesting- for instance this chapter itself- ప్రతి chapter ఈ పుస్తకంలో ఆసక్తికరం. ఉదాహరణకు, ఈ chapter.

**Even while** = Even as some thing is happening. Even while I was telling him not to smoke, he lit a cigaratte. (Smoke చెయ్యొద్దని చెబుతుండగానే అతడు సిగరెట్ ముట్టించాడు)

**Even since** లేదు, Ever since - అప్పటి నుంచి; Ever since he came here he began troubling others = అతడు ఇక్కడికి వచ్చిన క్షణం నుంచి ఇతరులను ఇబ్బంది పెడుతూనే ఉన్నాడు.

**By and large** = చాలా మటుకు. By and large he was successful in his attempts = అతడు తన ప్రయత్నాల్లో చాలామటుకు విజయం పొందాడు.

By and large students are satisfied with his teaching.

**With elan and ease** = అవలీలగా శక్తిమంతంగా, ఆకర్షణీయమైన శైలిలో ఏదయినా చేయడం.

a) He performed the feat with elan and ease = ఆ (circus) feat ను అతడు అవలీలగా/ సునాయాసంగా ఆకర్షణీయమైన రీతిలో చేశాడు.

b) She sang with elan and ease = ఆమె సునాయాసంగా శక్తిమంతంగా ఆకర్షణీయంగా పాడింది.

**Knives and forks** = తినేందుకు వాడే spoons, knives (చాకులు), forks.

**Q.** They produce in an audience an effect peculiar to the theatre. Here article 'an' is suitable or not?

**A.** Correct (Audience - collective form - countable as a group)

**Q.** Could you suggest a good grammar book for intermediate level by native speaker.

**A.** Raymond Murphy's Elementary Grammar.

**Linganna, Adilabad.**

**Q.** My father's three brothers lived with their families in the same house, but by far, my father was the most liberal. ఇక్కడ 'by far' ఉపయోగం, అర్థం వివరించగలరు, ఉదాహరణలివ్వగలరు.

**A.** By far = ఏదయినా మిగతావాటికంటే మంచిగా/ అధ్వానంగా ఉందని చెప్పేందుకు వాడతాం.

a) By far Punjab/ Punjab by far is the most industrialised state in India = భారత్‌లోని అన్ని రాష్ట్రాల్లో పంజాబ్ పారిశ్రామికంగా అభివృద్ధి చెందింది.

b) This is by far the safer than any other method = మిగతా పద్ధతుల కంటే ఈ పద్ధతి సురక్షితం.

**Shyam Raj, Hyderabad.**

**Q.** Gopal is the shortest of the three.

Can we say the above superlative sentence like this- Gopal is the shortest of them all.

**A.** a) Gopal is the shortest of the three = b) Gopal is the shortest of them all - (Both) (a) and (b) are correct.

However, note this point. An adjective is in one or the other of three degrees only if there is a comparison. If there is no comparison, that is, if you are not comparing two or more things with one another, the adjective is not in any degree. The sentence, Raju is a short boy' does not compare Raju's height with any other persons. So here 'short' is an adjective, but has no degree. If you say, 'Raju is (is not) as short as Gopal' or No other boy is as short as Gopal, 'short' is in positive degree. In your sentence (2) and (3), shorter, and shortest are in comparative and superlative degrees respectively.

**P. Suresh Varma, Palakollu.**

**Q.** రాయించడం, చదివించడం, చేయించడం వీటిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** రాయించడం, చదివించడం, చేయించడం లాంటివి causative verbs అంటాం. వీటికి దాదాపు అన్నింటికీ make వాడవచ్చు చాలా చోట్ల 'have', 'got' కూడా వాడుతుంటాం. I'll make him phone you = అతడితో నేను phone చేయిస్తాను = I'll get him to phone you = I'll have him phone you - ఇలా అన్నింటికీ ప్రయత్నించండి.

**Q.** Future లో జరిగిపోతుంది. (తప్పకుండా) జరిగుతుంది అనే వాక్యాలను ఇంగ్లిష్ ఎలా చెప్పాలి?

**A.** It shall happen = Future లో తప్పక జరుగుతుంది.

It shall have happened = Future లో మనం అనుకున్న సమయానికి జరిగి ఉంటుంది.

**Q.** Would ఉపయోగాలు తెలియజేయగలరు.

**A.** Would ఉపయోగాలను తెలుసుకునేందుకు సంబంధిత lessons చూడండి.

**K.Nagadivya, Tatipaka**

**Q.** Happy x unhappy అయితే stop x nonstop ఎందుకవుతుంది? Un, Non వీటిని ఎలా ఉపయోగించాలో తెలుపండి.

**A.** ఏ పదానికైనా ముఖ్యంగా adjectives (గుణాలు తెలిపే పదాల)కు ముందు 'un-' చేరిస్తే, వ్యతిరేకార్థం వస్తుంది unhappy (సంతోషంలేని) unjust (అన్యాయమైన), etc.

Non కూడా వ్యతిరేకార్థాన్నిస్తుంది. అయితే అది 'un-', 'in-' (in- కూడా వ్యతిరేకార్థం ఇస్తుంది) అంత strong కాదు. 'Non', adjectives కే కాకుండా ఇతర parts of speech లతో కూడా వాడతాం.

**D.L. Rao, Suvarnapuram.**

**Q.** నేను ఆమెకు వినిపించాలనే పాడాను.

**A.** I sang so that she would hear me/ I sang only to be heard by her.

**Q.** నీవు అతడికి వినిపించేట్టు పాడాలి.

**A.** Sing in such a way that he hears you.

**Q.** ఎప్పుడు, ఎక్కడ ఏమవుతుందో ఎవరికైనా ఎలా తెలుస్తుంది?

**A.** Who knows what happens and when.

**Q.** Off we went through a series of left and right turns, traffic lights and even a short jaunt up a one-way lane the wrong way. ఈ వాక్యానికి అర్థం ఏమిటి?

**A.** కుడి, ఎడమలు తిరుగుతూ, traffic lights దాటుకుంటూ, ఇంకా one way సందునుంచి దూసుకుపోతూ తప్పు దారిలో అలా వెళ్లిపోయాం.

**U.S.S. Pranav, Hyderabad.**

**Q.** మీ నాన్న చెప్పింది కరెక్టే అని ఇంగ్లిష్‌లో చెప్పడానికి What your father said, is correct లేదా What your father said was correct అనాలా? What your father has said, is/ was correct అనాలా? వివరించగలరు.

**A.** సందర్భాన్ని బట్టి What your father said was correct/ is correct - రెండూ correct. మీ నాన్న చెప్పింది అప్పుడు (past లో) Correct = was correct. (అతడక్కడ past లో ఉన్నాడనో. ఈ విధంగా). మీనాన్న చెప్పింది ఇప్పటికీ correct అనేందుకు What your father said is correct అని అంటాం.

**KSR, Marteru.**

**Q.** Fused participle అంటే ఏమిటి? దీనిని ఎప్పుడు ఉపయోగిస్తారు?

**A.** Fused participle - here, participle refers to the present participle, observe.

Students' coming late is not tolerated. (విద్యార్థులు ఆలస్యంగారావడాన్ని teachers సహించరు)

a) లో Students' coming late లో, coming late (coming- present participle- used as a gerund) subject- singular, so, is not tolerated, correct అవుతుంది.

b) లో Students కు apostrophe లేదు, కాబట్టి Students subject అవుతుంది. plural అప్పుడు is tolerated (singular verb) సరికాదు కదా. ఇలా Gerund subject గా ఉండి, దాని ముందరి, noun/ pronoun, possessive case లో (యొక్క అనే అర్థంతో) లేనప్పుడు, ఆ gerund, fused participle అవుతుంది. ఇది standard spoken/ written English లో సరికాదు. అదే Students coming late are not tolerated కొంతవరకు better.

**Q.** Compound gerund అంటే ఏమిటి? దీన్నెలా ఉపయోగిస్తారు?

**A.** I saw him coming here and talking to some one. ఇక్కడ, coming, talking అనే రెండూ అంతకన్నా ఎక్కువ gerunds ను ఒకే sentence లో వాడితే అవి compound gerund అవుతాయి. ఇంకా చూడండి.

Avoiding smoking is good for health ఇక్కడ వరసగా, Avoiding, smoking వాడటం కూడా compound gerund. I saw him coming here and talking to some one. ఇక్కడ, coming, talking అనే రెండూ అంతకన్నా ఎక్కువ gerunds ను ఒకే sentence లో వాడితే అవి compound gerund అవుతాయి.

**Q.** An elderly man అంటుంటారు కదా. An elder man అని ఎందుకు అనకూడదు?

**A.** Elder- పెద్ద/ elderly- పెద్ద అయిన అందుకని elderly man అంటాం.

He is the elder of the two - వాళ్లిద్దర్లో అతను పెద్ద. Elders of the family = కుటుంబ పెద్దలు. ఒకరిని మాత్రమే పెద్ద అని singular గా వాడం.

**Q.** వాక్యంలో that of ను ఎప్పుడు ఉపయోగిస్తారు? Since the age of 15 the only control on me was that of my sister. ఈ వాక్యంలో that of అర్థం ఏమిటి?

**A.** మీ sentence లో that of my sister కు లో, that = the control. అంతకు ముందు వాడిన control కు, that refer చేస్తుంది.

eg: His car is more beautiful as his brother's = His car is more beautiful that (=the car) of his brother= His car is more beautiful than his brother's car.

కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

**Q.** నాకు కర్మపట్టి మీ దగ్గర పనిచేస్తున్నాను.

**A.** It's my misfortune to work under you.

**Q.** జరిగేదేదో జరగని.

**A.** Let what happens happen.

**Q.** అందరూ ప్రశాంతంగా ఉండగా నేనెందుకు మథనపడాలి?

**A.** When others aren't bothered at all, why should I?

**Q.** నీదేం పోయింది, కారేం కర్మ విమానమైనా కొంటావు.

**A.** How does it matter to you? Why just a car, you can buy even a plane.

**Q.** విశ్వసనీయ వర్గాల భోగట్టా.

**A.** Information from reliable sources.

**Q.** నువ్వు కాబట్టి ఊరుకున్నా మరెవరయినా అయివుంటే చెంప చెళ్లుమనిపించుండేవాడిని.

**A.** It's you. It is had been someone else, I'd have slapped them hard.

**Q.** వాడిని తన్నడం చూసి ఆమె జాగ్రత్త పడింది.

**A.** His being spanked alerted her/ she became alert an seeing him spanked.

**Q.** నువ్వు పోలీస్‌వి అయినంత మాత్రాన మే భయపడాలా?

**A.** Should we fear just because you are a policeman?

**G. Prasanth, Godhoor.**

**Q.** Guide, Directory, Diary, Almanac, Calender వీటి మధ్య తేడా ఏమిటి?

**A. Guide -** A guide gives information about a particular subject 1) ఒకే విషయం ఉపయోగకరమైన సమాచారం ఇవ్వగల పుస్తకం- A tourist guide / A TV guide, etc.

**Directory:** ఒకే వర్గానికి చెందిన ప్రజల, విషయాలనుగూర్చి వాళ్ల addresses, ఇతర వివరాలను తెలిపే పుస్తకం - A Telephone directory/ Trade (వ్యాపార వివరాల) Directory/ A Medical directory etc.,

**Diary -** దినచర్య రాసే పుస్తకం కదా?

**Calender -** దీని గురించి చెప్పనక్కరలేదు కదా

**Almanac -** తిథి, వారనక్షత్రాలు తెలిపే పంచాంగం.

**Q.** Module, booklet, brochure, hand book, manual, pamphlet - వీటి మధ్య తేడా ఏమిటి?

**A. Module** కు ఈ list లోని మిగతా మాటలకు ఏవిధమైన సంబంధంలేదు - 1) Colleges, Universities లో ఒక శిక్షణ విషయాల unit ను module అంటాం. 2) ఒక ప్రత్యేకమైన భాగమూ, module. 3) ఒక ప్రణాళికలోని ఒక భాగాన్ని కూడా module అంటాం.

**Booklet =** ప్రత్యేకమైన అట్టలు లేకుండా, పుస్తకరూపంలో ఉండే చిన్న పుస్తకం booklet. ఇందులో ఒకే విషయాన్ని గురించిన సమాచారం ఉంటుంది. ఏ చిన్న పుస్తకాన్నయినా booklet అంటాం.

**Brochure** (pron- బ్రోష- British; American - బ్రోషూర్.) = ఒక వస్తువు/ సేవల ప్రచారం (Advertisement) నిమిత్తం, ఆ వస్తువు/ సేవలను గురించి సమాచారం, బొమ్మలతో వివరించే చిన్న పుస్తకం.

**Handbook =** ఒక వస్తువును ఉపయోగించాల్సిన విధానాన్ని తెలిపే చిన్న పుస్తకం- ఈ అర్థంతో ఇదీ manual ఒకటే. అయితే handbook అనేది ఇతర విషయాలు- వంట, ఆరోగ్యం/ వ్యాయామం/ వస్తువుల repair విషయాలను కూడా తెలిపే పుస్తకం.

**Manual =** యంత్రాలూ, వాహనాలు, కొన్నవాటిని గురించిన వివరాలు, వాటి ఉపయోగ విధాలు తెలిపే పుస్తకం.

**Pamphlet =** దీన్ని మనదేశంలో ఒక వస్తువు/ సేవ ప్రచారార్థం వాడే కరపత్రం అనే అర్థంతో ఎక్కువగా వాడతాం. అయితే ఇది సరికాదు. Pamphlet అంటే ప్రస్తుతం ప్రజలు బాగా ఆసక్తి చూపిస్తున్న విషయం (topic of current interest) ని చర్చించే వ్యాసం- ఉదా: Terrorism; పట్ల ప్రభుత్వ వైఫల్యాన్ని తెలిపే వ్యాసం.

మామూలుగా ప్రకటన ఉద్దేశంతో ఇచ్చే కరపత్రం, English లో hand bill.

**Q.** Salary, Remuneration, Honourarium- తేడా?

**A.** Salary = ఉద్యోగికి ఇచ్చే నెలసరి జీతం.

Remuneration = ఒక పనికి ఇంత అని ఇచ్చే పారితోషికం (ఒక course నిర్వహించేందుకు, ఒక సేవ అందించేందుకు)

Honourarium - ఇది కూడా దాదాపు పారితోషికమే. అయితే Honourarium ఒక సేవ అందించినందుకు మొత్తంగా (rate ప్రసక్తి లేకుండా) ఇచ్చే గౌరవ రుసుం.

M.SURESAN

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






**B. Lalitha, Vijayawada.**

**Q.** Wren & Martin high school grammar book లో Active voice ను Passive voice గా మార్చమని కింది వాక్యాన్ని ఇచ్చారు.

The enemy have defeated our army. దీనికి key book లో answer The army had been defeated by the enemy అని ఉంది. ఈ వాక్యం present perfect tense లో ఉన్నప్పుడు has been అని రావాలి కదా. Had been అనేది past perfect tense లో వస్తుంది కదా, వివరించగలరు.

**A.** The army has been defeated అనడం correct passive voice. You are right in saying that the verb in the passive should be, has been. The sentence in the key perhaps has a printer's mistake.

**M. Nageswara Rao, Peda Avutapalli.**

**Q.** ఎన్నో లేదా ఎన్నవ అనేదానికి సరిపోయే పదం ఇంగ్లిష్‌లో లేదన్నారు. Of which అనే expression కు అర్థం ఎన్నో లేదా ఎన్నవా అనే కదా, తెలుపగలరు.

**A.** ఎన్నవ అనేందుకు సరైన English expression లేదని చాలాసార్లు సూచించాం. Of which అంటే 'ఎన్నవ' అనే అర్థంకానీ దానికి దగ్గర అర్థంకానీ రాదు. Of which = దాని/ దానికి సంబంధించిన.

1. This is the book of which I was talking = నేను ఏ పుస్తకం గురించి మాట్లాడుతున్నానో అది ఇది.
2. Of which book are these the pages? ఈ pages ఏ పుస్తకానివి (దేనివి)?

**A. Krishna Geetarjuna, Nidadavolu.**

**Q.** 1. BJP was to meet in chennai on July 21. NDTV 24x7 వార్తల head lines లో జులై 18న ఈ వాక్యం చూశాను. జులై 21 భవిష్యత్తును సూచిస్తోంది కదా. అలాంటప్పుడు will meet అనిగాని, meets అనిగాని, is to meet అనిగాని లేదా is meeting అనిగానీ ఉండాలి. కానీ was to meet అంటే ఎలా కరెక్టు. ఒకవేళ వాక్యం Indirect లో ఉండి ముందు మాటలు లోపించాయనుకోవాలా? పైగా అది indirect లో చెప్పవలసిన సందర్భం కాదు కదా.

2. BJP decides to postpone its National Executive Meet. ఇది నిర్ణయం తీసుకున్న తర్వాత వార్తే. అలాంటప్పుడు ఇక్కడ decided అని రావాలి కదా.

**A.** 1. Was to meet - wrong - no doubt about it.

2. Immediate past action ను simple present లో చెప్పడం వాడుకలో ఉంది. eg: I come to seek your help. వచ్చీ రావడంతోనే ఇలా చెబుతాం. నీ సహాయం పొందేందుకు వచ్చాను అనే అర్థంతో.

come కు ఇక్కడ వచ్చాను అనే అర్థం- అయితే ఇది immediate past (క్షణాల ముందు జరిగిన)కు మాత్రమే (I have come కు equivalent).

**K.R.Aachari, Vaikuntapuram.**




**Q.** I am going to go ఈ వాక్యంలో to తర్వాత go, come verbs

2) **But that you are my brother**, I must have killed you.

3) **For some reason best known to himself** suddenly he went away.

**A.** 1) Be but advised = let (somebody) advise you = ఈ సలహా తీసుకో.

2) But that you are my brother = నువ్వు నాకు brother కాకపోయుంటే.

3) For some reason best known to himself = అతడికి మాత్రమే తెలిసిన కారణాల వల్ల = (ఏ కారణం చేతనో/ ఎందుచేతనో)

**Laxman Goud, Joharapuram.**

**Q.** నిత్య జీవితంలో వాడగలిగే idioms ఉన్న మంచి dictionary పేరు సూచించండి.

**A.** Oxford Advanced Learners' Dictionary of Current English (Seventh Edition 2005) లోని చివరి పేజీల్లో ఉండే sayings and proverbs నేర్చుకుంటే చాలు. అవి మీరు కోరుకునే విధంగా నిత్య జీవితంలో సంభాషణకు ఉపయోగపడతాయి.

**Pavani, Sudha, Matsyapuri.**

**Q.** She has been ill for the last three months. ఈ వాక్యంలో for

course. The present participle here (going) does the work of a noun, as it (going) acts as the object complement of the verb, had seen.

He seen me on my way .........

This sentence is wrong, as 'seen' is only a past participle and so, not a verb. Perhaps there is a printer's mistake here, or you have copied it wrongly, please check up. It must be, He saw/ He said he had seen me on .... the railway station.

**S. Shakir Ahmed, Kurnool.**

**Q.** Transitive, Intransitive verbs గురించి తెలియజేయండి. వాక్యంలో verb ఉన్నప్పుడు దాన్ని transitive గా వాడారో intransitive గా వాడారో తెలుసుకోవడం ఎలా? collect, check, pause లాంటి verbs ను transitive గా, Intransitive గా ఎలా వాడాలో తెలుపగలరు?

**A.** Transitive verb అంటే object ఉన్న verb - ఎవరిని? దేనిని? అనే ప్రశ్న వేసుకుంటే సమాధానం వచ్చే verb. Eg: give = ఇవ్వడం, దేన్ని ఇవ్వడం అంటే సమాధానం దేన్నయినా ఇవ్వడం అని వస్తుంది. కాబట్టి give transitive. అలాగే see చూడటం, దేన్ని చూడటం - ఫలానా వారిని అని సమాధానం ఉంది. కాబట్టి ఇవి transitive verbs. ఎవరికి, దేనికి అన్న ప్రశ్నలకు సమాధానం వచ్చే verbs కూడా transitive.

Object లేని verbs intransitive verbs. వీటికి ఎవరిని, దేనిని అని ప్రశ్నలు వేసుకుంటే సమాధానం రాదు. Eg: go = వెళ్లడం; ఎవరిని/ దేనిని/ ఎవరికి/ దేనికి వెళ్లడం? ఈ ప్రశ్నలకు సమాధానాలు లేవు. కాబట్టి go, intransitive. అయితే ఒకే verb కు రెండు, మూడు అర్థాలు ఉన్నప్పుడు ఒక అర్థంతో transitive, ఇంకో అర్థంతో intransitive అవ్వొచ్చు.

Eg: collect = 1) సేకరించడం - ఈ అర్థంతో ఇది transitive, ఎందుకంటే, దేన్ని సేకరించడం అంటే సమాచారం/ stamps / books/ addresses లాంటి సమాధానాలు వస్తాయి. ఈ అర్థాలతో ఇది transitive.

Collect - 2) గుమిగూడటం, ఒకచోట చేరడం, అనే అర్థంలో intransitive - దేన్ని గుమికూడటం/ చేరడం అన్నప్రశ్నలకు సమాధానం రాదు.

Water collected in front of the room = గది ముందు నీళ్లు చేరాయి/ నిలిచాయి.

A large crowd collected there - పెద్ద సంఖ్యలో జనం గుమికూడారు (intransitive).

Check = సోదా చేయడం / తనిఖీ చేయడం/ పరీక్షించడం - దేన్ని/ఎవరిని అంటే సమాధానం వస్తుంది కాబట్టి transitive అవుతుంది.

Check అంటే ధ్రువీకరించడం, ఇంకొకరితో.

He checked with his brother- తన brother తో సరిచూసుకున్నాడు.

Pause = ఆపడం- transitive.

He paused the tape recorder - tape recorder ను ఆపాడు.

Pause = ఆగడం - Intransitive.

He paused in his speech - ఉపన్యాసం ఇస్తున్నప్పుడు కాసేపు ఆగాడు - intransitive.

**Q.** Idioms పై పట్టు సాధించాలంటే ఎలాంటి పుస్తకం చదవాలి? Idioms dictionary కొంటే అందులో వేల idioms ఉంటాయి. నిత్యం ఉపయోగించే Idioms కోసం ఏ పుస్తకం మంచిది?

**A.** Mcmordie's book of Idioms చదవండి. ఇందులో daily life లో వాడే idioms గురించి చాలా వివరంగా ఉంది.

# I come to seek your help

**Y. Kumar, Hyderabad.**

**Q.** He has bought the car this morning. He has gone to Agra this year. this అని time specify చేస్తే present perfect వాడొచ్చా?

**A.** The past simple tense is used for a past action the time of which is clearly stated. That is, if the action took place at a specified time in the past, the tense to be used in past simple, in spite of the use of, 'this'.

He bought a car this morning కూ He has gone to Agra this year కూ తేడా ఉంది, రెండు sentences కూ common గా this ఉన్నప్పటికీ. This morning అని ఎప్పుడంటాం? Morning అయిపోయిన తర్వాతే కదా? (మధ్యాహ్నమో/ రాత్రో/ సాయంత్రమో అంటాం) అంటే మనం అయిపోయిన సమయంలో జరిగిన action ను, ఆ సమయం తర్వాత మాట్లాడుకుంటున్నాం. కాబట్టి ఇక్కడ past simple మాత్రమే రావాలి (bought) కానీ this year అనడంలో అర్థమేమిటి? ఈ year అయిపోలేదనే కదా (అయిపోతే last year అంటాం. అప్పుడు past simple వాడాలి కదా? )

This year లో ఎప్పుడు అనేది కచ్చితంగా తెలపనప్పుడు, ఈ సంవత్సరంలో ఆయన ఆగ్రాకు వెళ్లి ఉన్నాడు అనే అర్థంతో He has gone to Agra this year, కరక్టే(ఇక్కడ కూడా He has been to Agra, better). అదే jan/ feb/ sep this year అని time specify చేస్తే అతడు ఈ సంవత్సరం, january లో Agra వెళ్లాడు అనే అర్థంతో. He has gone to Agra in January this year అనడం సబబేనా? (January అయిపోయిన తర్వాత) Observe the difference between a) and b) below.

a) It has happened this month.
b) It happened in the first week of this month.

Do you see the difference? sentence (a) talks of an action of this month at no specified time- so the tense is present perfect.

Sentence (b) talks of an action at a specified time ( I week of this month - I week's past), so the tense is past simple.

a) They have done it three times this century.
b) They did it three times in the first half of this century.

కాబట్టి this అని ఉన్నంత మాత్రాన present perfect వాడటం సరికాదు. Time specify చేస్తే past simple వాడతాం.

వాడవచ్చా? దానికి బదులుగా I am ready to go/ come or I am about to go/ come వాడాలని నలభై ఏళ్ల కిందట మా మాస్టారు చెప్పారు. వివరించగలరు.


M.SURESAN

**A.** I am going = నేను వెళుతున్నాను.

I am going to go = వెళ్లబోతున్నాను.

మీరే అన్నారు కదా నలభై ఏళ్ల కిందట మీ ఇంగ్లిష్ మాస్టారు చెప్పిన విషయమని, అది అప్పటి మాట. ఇప్పుడు, present day English లో going to go (వెళ్లబోతున్నారు) going to come (రాబోతున్నారు) అనేవి సర్వసాధారణం అయిపోయాయి - both in British and American Englishలో. అందుకని ఇప్పుడవి తప్పు కాదు.

**E.V. Sindhura, Deepak, Tadipatri.**

**Q.** మీరొకచోట They are watching the T.V. అని, I think my mother is watching the T.V. అని రాశారు. T.V. ముందు the అనే article ఉండకూడదు కదా? The T.V. అంటే T.V. set ను refer చేసినట్టు అవుతుంది. దయచేసి వివరించగలరు.

**A.** T.V. set ను T.V. programmes నూ ఈ రెండింటిలో దేన్ని చెప్పడానికయినా T.V. అనిగానీ, the T.V. అనిగానీ అనవచ్చు అయితే ఎవరయినా/ ఏదైనా T.V. లో కనిపించడం. ఏదైనా T.V. programme T.V. లో ఉంది అని చెప్పేందుకు, on T.V./ on the T.V. అంటాం.

**G. Maheswari, Secunderabad.**

**Q.** If he had money, he could have paid to Ramu.

If he had money, he would have paid to Ramu.

ఈ రెండు వాక్యాలకు తేడా తెలియజేయగలరు.

**A.** ఈ రెండు sentences సరైనవి కావు. Correct form of the sentences:

1. If he had had the money, he would have paid to Ramu. (అతడి దగ్గర డబ్బు ఉండి ఉంటే, రాముకు చెల్లించేవాడే.)
2. If he had had the money, he could have paid Ramu. (అతడి దగ్గర డబ్బు ఉండి ఉంటే రాముకు చెల్లించగలిగేవాడే.)

**S. Rechana Arshia, Joharapuram.**

**Q.** కింది వాక్యాల్లో bold చేసిన పదాలకు అర్థాలు ఏమిటి?

1) **Be but advised** and I'll send you there.

లేదా since ఏది వాడాలో తెలుపండి.

**A.** She has been ill for the last three months . మూడు నెలలుగా - ఇది ఇంత కాలంగా అని చెప్పేటప్పుడు.

since అంటే ఫలానా రోజు/ గంట/ సమయం నుంచి అని.

**Q.** ప్రభుత్వం జారీచేసే ఉత్తర్వుల్లో G.O.M.S. No. అని R.C. No. అని రాస్తారు. M.S., R.C. అంటే ఏమిటో వివరించగలరు.

**A.** G.O. = Government Order

M.S. = Manuscript (రాతప్రతి)

R.C.No. = Reference number.

**Q.** There is no chair to sit on, no pen to write with and no table to work at. ఈ వాక్యం సరైనదేనా? Sit on a chair అనాలా? Sit in a chair అనాలా? తెలుపగలరు.

**A.** సరైనదే. చేతులున్న కుర్చీ (Arm chair)/ Easy chair లాంటివయితే, sit in; చేతుల్లేని కుర్చీ అయితే sit on అనాలి.

**Rajan k, Yadavole.**

**Q.** Once you wrote two sentences the following way in spoken English-

Sunil told me he had seen you going some where.

He seen me on my way to the station to receive my uncle.

The above underline parts seem to be unusual. Generally we use present/ past participle forms as adjectives and nouns. If we use them as verbs in our sentences, they should come after helping verbs ( be / have forms). But you used them as verbs without helping verbs. I think this is not proper way using the participles. Please clear my doubt and give lessons on the topic of infinitives (continuous, perfect infinitives).

**A.** ....... had seen you going somewhere. Your point here is that 'going' being a present participle, should be used as a noun/ adjective or, if it is used as a verb, it should have a helping verb before it. You are right, of

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# All colours merge into white


M.SURESAN



**P.L.N.Rao, Warangal**

**Q.** ఈ సిలబస్ ఇప్పటికే పూర్తి కావాలి. కానీ, కాలేదు. ఈ వాక్యం ఇంగ్లిష్‌లో చెప్పండి.

**A.** The syllabus should have been finished by now, but I haven't finished it.

**Q.** Wanted Marketing Executives ఇది ఏ Verb Form.

Wanted అనేది present, past, p.p.లో ఏ verb?

**A.** Wanted - Past Participle

**Q.** Instruction Booklet supplied with application form అని పేపర్లో ఇచ్చారు. ఇది Future ను సూచిస్తూ చెప్పారు. మరి Instruction Booklet supplied అనేది Past doing Verb కదా. తెలపండి?

**A.** Instruction Booklet supplied with the application form = Instruction booklet will be supplied with ....... అంటే, supplied, will be suppliedలో భాగం, past participle గా.

**T.Siva, Nandikotkur.**

**Q.** కిందివాటి అర్థ భేదాలను ఉదాహరణల ద్వారా విశదపరచండి.

Cool, Cold

**A.** Cool = చల్లని; Cold = చలిగా

**Q.** Go to bed, sleep

**A.** Go to bed = నిద్రకు ఉపక్రమించడం,
sleep = నిద్రించడం (నిద్రలో ఉండటం)

**Q.** Begin, commence, start

**A.** Begin = commence = start.

Begin తర్వాత infinitive (to + 1st RDW)/...ing form/ noun వాడవచ్చు;

Start + noun/... ing ఎక్కువగా వాడతారు;

Start + infinitive అంత సరికాదు.

Commence - పాండిత్యం/ గ్రాంథికం.

**Q.** Ago, back, before

**A.** Ago - ముందు/ క్రితం - Two days ago = రెండు రోజుల క్రితం - ఈ అర్థంతో back వాడటం సరికాదు.

He came here two days ago (correct)
He came here two days back (wrong)
He came here two days before(wrong)

ఒక సంఘటన, సమయానికి ముందు = Before.

i) He had given me the book before I asked for it = నేను అడగక ముందే నాకు అతడు ఆ పుస్తకం ఇచ్చాడు.

ii) That was before the Independence = అది స్వాతంత్ర్యానికి ముందు.

**Q.** far, long, distant

**A.** far = దూరమైన

How far is Delhi from Agra? = ఢిల్లీ ఆగ్రా నుంచి ఎంత దూరం?

Agra is not far from Delhi = ఢిల్లీ నుంచి ఆగ్రా దూరమేం కాదు. చూశారు కదా? Questions లోనూ, దూరం కాదు అనే అర్థంతో not తో far ను వాడతాం. Far offఅనే phrase లోనూ వాడతాం. అంతేకానీ, Hyderabad is far from Delhi - అని ఉత్త far ను not లేకుండా (దూరం అనే అర్థంతో) వాడం. దూరం అనేందుకు distant/ a long way off/ a long way from (a place) అంటాం.

Long = వస్తువులు (కర్రల్లాంటివి)/ కథలు/ చిత్రాలు లాంటివి - పొడవైన.

మనలో చాలామంది long ను దూరం అనే అర్థంతో వాడుతుంటారు అది సరికాదు.

**Q.** Speak, talk

**A.** Speak, talk - ఇది ఇంతకుముందు lesson (No 305-310) లో వివరించాం, చూడండి.

**Q.** Also, too

**A.** ఇది ఇంతకుముందు చాలా వివరంగా 2, 3 సార్లు తెలియజేశాం. పాత lessons చూడగలరు.

**Q.** Base, basis

**A.** Base = అడుగు భాగం; మూలం.
basis = ఆధారం.

**Q.** Big, large

**A.** i) Big = పరిమాణం, ప్రాముఖ్యంలో పెద్ద large = వైశాల్యంలో, areaలో పెద్ద. large, big అంత conversational కాదు.

**Q.** Put on, wear, dress

**A.** i) Put on = తొడుక్కోవడం/ వేసుకోవడం బయటకు వెళ్లేటప్పుడు, ఏదైనా సందర్భానికి, స్నానం వగైరా తర్వాత దుస్తులు వేసుకోవడం, put on.

ii) Wear మామూలుగా ధరించడం.
He wears white always/ He wears spects/ a watch, etc.

iii) Dress = 1) ధరించడం - దీనికి - self/ selves add చేయాలి. He dresses himself in lalchi and pyjamas = అతడు లాల్చీ పైజామా ధరిస్తాడు.

Dress = 2) దుస్తులు - ఆడవారి, పిల్లల దుస్తులు. మగవారి దుస్తులను dress అనం. clothes అంటాం.

**Q.** Round, around

**A.** Round = around

**Q.** Over, above

**A.** i) ఒకదానిపైన/ ఒకదానికంటే ఎత్తున ఉన్న అనే అర్థంతో, over = above.

His office is the small room above/ over the fancy shop = Fancy కొట్టు పైన ఉన్న చిన్న గది అతడి office.

The picture hanging on the wall is above/ over the table.

అయితే ఒకవైపు నుంచి ఇంకో వైపునకు అనే అర్థంతో over మాత్రమే వాడతాం.

The mob jumped over the wall = ఆ మూక గోడ దూకింది.

ii) Above = over = ఒక స్థాయికి మించిన/ ఒకస్థాయి కంటే ఎక్కువ.

a) The plane is flying at 30000 ft. above the ground = భూమికి 30000 అడుగుల ఎత్తున విమానం ఎగురుతోంది.

ఇలాంటి చోట్ల over రాదు. Overను ముఖ్యంగా వయసు/ వ్యవధి/ సంఖ్య/ డబ్బు లాంటి వాటితో వాడతాం.

i) He is over 18 and has the voting right.
ii) We waited over (for more than) two hours.
iii) It costs over Rs.2000/-
iv) There are over 30 students in the class.

**Q.** Under, below

**A.** Under = below.

అయితే under అంటే ఒకదాని కింద అని కానీ, ఒక దానితో కప్పి అనికానీ వాడతాం.

i) The box is under the table.
ii) The book was under the files.

Below అంటే ఒక దానికి బాగా దిగువన ఉన్న (బాగా కిందగా ఉన్న) అనే అర్థంతో వాడతాం.

While he stood on the roof she stood below on the road అతడు కప్పుపైన నిలబడుంటే, ఆమె కింద ఉన్న Road మీద నిలబడింది.

**Q.** What, which

**A.** What = ఏది/ ఏం/ ఏ?

Which = ఉన్న వాటిల్లో ఏది?

What book do you want? = నీకే పుస్తకం కావాలి?

Which book do you want?=(ఒకచోట ఉన్న పుస్తకాల్లో) నీకే పుస్తకం కావాలి?

**Q.** Near, near by, near to

**A.** Near = దగ్గరైన/ దగ్గరగా ఉన్న

He lives near the College.
The College is next to the park.
He lives somewhere nearby = Park పక్కన College. అతనెక్కడో అక్కడికి దగ్గరగా ఉంటాడు.

**Q.** కిందివాటిలో ఏది కరెక్టో తెలుపగలరు.

a) A scissors is a useful instrument
b) A scissors are a useful instrument

**A.** రెండూ కాదు. Scissors ఎప్పుడూ plural. అందుకని దాని ముందు 'a' వాడం. So, Scissors are a useful instrument, correct. ఒక కత్తెర అనేందుకు, A pair of scissors అంటాం. Pair, singular, So a pair of scissors is...

**Q.** a) Deduct తరువాత in form లలో ఏది రావాలి?

**A.** b) Merge తరువాత into, with లలో ఏది రావాలి?

a) Deduct from - correct
b) Merge into, merge with - రెండూ correct.

i) All the smaller banks in the area merged with the larger bank. (ఒకదానితో ఒకటి కలిసిపోవడం)

ii) All colours merge into white (ఒక దానిలో విలీనమవడం)

**Q.** కింది వాక్యానికి తెలుగులో అర్థం తెలుపగలరు.

The wicked foursome considered the arrival of Lord Krishna ominous.

**A.** ఆ దుష్ట చతుష్టయం కృష్ణుడి రాకను దుశ్శకునంగా/ చెడుని సూచించేదిగా అనుకున్నారు.

Omen = శకునం. Ominous = దుశ్శకునంగా ఉన్న.

**Q.** Gandhi was whiter than white which few others before and after him have been. తెలుగులో అర్థం వివరించగలరు.

**A.** తనకు ముందూ, తర్వాత ఎవరూ లేనంత నిర్మలంగా గాంధీ ఉన్నారు. ఇక్కడ whiteకు సందర్భానుసారం అయిన అర్థాన్ని చెప్పుకోవాల్సిందే. బహుశా ఇక్కడ white = pure = నిర్మలమైన అనేమో. అలా అయితే sentenceకు అర్థం పై విధంగా ఉంటుంది.

**A. Sathyanarayana, Hyderabad.**

**Q.** భారత్-పాకిస్థాన్‌ల మధ్య టెస్ట్ మ్యాచ్‌లు జరుగుతున్నపుడు - దూరదర్శన్‌లో స్క్రోల్ మీద - Who will win the match అని ఇచ్చారు. ఇది సరైందేనా? దగ్గరి భవిష్యత్తులో జరిగే విషయాలు చెప్పేటప్పుడు Simple Present లో చెప్పాలి కదా? అంటే Who win the match అని ఉండాలి కదా? ఈ సందేహాన్ని తీర్చండి.

**A.** సరైందే. దగ్గరి భవిష్యత్‌లో జరిగే విషయాలు ఎప్పుడు జరుగుతాయో కచ్చితంగా Time తెలిస్తేనే, simple present వాడతాం.

He comes here next week. ఇక్కడ next week అని time కచ్చితంగా తెలుస్తోంది కాబట్టి, comes ఇక్కడ correct.

Time తెలియనప్పుడు will/ shall అనేవి కరెక్టు.

**R. Sangam Naidu, Kovvur.**

**Q.** పురుషుల పేర్లకు ముందు Mr. ఉంచడం మనకు తెలిసిందే. వారు వివాహితులు కావచ్చు, కాకపోవచ్చు. కానీ, స్త్రీల విషయంలో వివాహితులకు Mrs. అని, వివాహం కాని వారికి Miss. అని వాడతాం. ఎందుకని? స్త్రీలలో వివాహితులకు, కుమారికలకు ఒకే పదం ఉపయోగించవచ్చా? తెలపండి?

**A.** పెళ్లి తర్వాత భర్త ఇంటి పేరు భార్య ఇంటిపేరుగా మారడం సంప్రదాయం అందువల్ల, వివాహితులకు Mrs, అవివాహితులకు Miss అనడం వాడుకయ్యింది. అయితే ఈ రోజుల్లో పెళ్లయిన స్త్రీలు కూడా వారి భర్త ఇంటిపేరుతో పిలిపించుకోవడం ఇష్టంలేకపోయినా, పెళ్లయింది అని తెలుపడం ఇష్టం లేకపోయినా, వాళ్ల పేర్ల ముందు Miss అని పెట్టుకుంటున్నారు. ఇలాంటి సందర్భాల్లో Miss అని పూర్తిగా రాయకుండా Ms అని రాస్తారు.

**Q.** సిలబల్ ( syllable) అంటే ఏమిటి? ఇందులో మళ్లీ Mono syllabic, Di syllabic, Tri syllabic words అంటే ఏమిటి? వివరించండి?

**A.** ఒక word (మాటలో) స్వతంత్రంగా ఉచ్చరించగల శబ్దాన్ని syllable అంటాం. Sentence అనే మాట sen, tense అనే రెండు శబ్దాల కలయిక. కాబట్టి sentence అనే మాటలో sen, tense అనే రెండు syllables ఉన్నాయన్న మాట.

Disyllabic = A word of two syllables (eg. sentence)

Trisyllabic = A word of 3 syllables.
eg: construction - con struc tion.

**Q.** మనం సమయం గురించి చెప్పేటప్పుడు A.M., P.M. లు వాడతాం. ఎలా వాడాలి? అసలు పూర్తి అర్థాలు ఏమిటో చెప్పండి?

**A.** AM - రాత్రి 12.01 నుంచి మధ్యాహ్నం 12.00 వరకు. PM - మధ్యాహ్నం 12.01 నుంచి రాత్రి 12.00 వరకు.

Spoken Englishలో AM, PM వాడం.
AM = Ante Meridiem
PM = Post Meridiem

**Q.** Conditional clauses (If clauses) సవివరంగా తెలియజేయండి? వాడటం కూడా?

**A.** Conditional Clausesకు పాత lessons చూడండి. చాలాసార్లు వివరించాం.

**Q.** మనం మన సంభాషణల్లో సాధారణంగా O.K. అనే పదం వాడతాం. అసలు O.K. అంటే ఏమిటి? దాని పుట్టుపూర్వోత్తరాలేమిటి?

**A.** OKకు సరైన వివరణ ఇంతవరకు స్పష్టంగా తెలియని విషయం. కొంతమంది ప్రకారం American Ol (all) Korekt (correct) (All right అనే అర్థంతో) అనే expressionకు abbreviation అని. మరికొంతమంది ప్రకారం Red Indian భాషల్లోని మాట. అయితే ఏమీ స్పష్టంగా తెలియదు.

**K.Manickyam, Chittoor.**

కింది వాక్యాలకు తెలుగు అనువాదం తెలపండి

**Q.** If he came, I would help him.

**A.** వాడు రాడు, రావడం అంటూ జరిగితే.

**Q.** If you worked hard, you would get good marks.

**A.** నువ్వు కష్టపడటం అంటూ జరిగితే (జరగదు).

**Q.** The horse would kick, if you went near it.

**A.** నువ్వు దాని దగ్గరకు వెళ్లడం అంటూ జరిగితే (అది జరగదు).

**Q.** I would bring a toy for you if I went to the market.

**A.** నేను market కంటూ వెళితే, (నేను వెళ్లే పరిస్థితి లేదు).

ఈ వాక్యాల్లో If clauses-
1) If he came -
2) If you worked hard -
3) If you went near it-
4) If I went to the market -

వీటిల్లో చెప్పేవి జరగవు.

ఇది జరిగితే sentence రెండో భాగంలో చెప్పేది జరుగుతుంది. ఇదీ జరగదు. అంటే రెండూ జరగవు (Improbable)అని అర్థం

**M. Peter Chowdary, Vizag.**

**Q.** Year by year.
year after year. ఈ రెండు వాక్యాల మధ్య తేడా ఏమిటి? వీటిని ఎలా ఉపయోగించాలో ఉదాహరణలతో వివరించగలరు.

**A.** Year by year - సంవత్సర, సంవత్సరానికి/ ఏడాదికేడాదికీ, Year after year = ఏళ్ల తరబడి

His income grew year by year = ఏడాదికేడాదికి అతడి సంపాదన పెరిగింది.

Year after year he hoped that his son would return = ఏళ్ల తరబడి అతడు తన కొడుకు రాకను ఆశించాడు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






**K.SambasivaRao, Anantapuram**

**Q.** Co-relative conjunctions అంటే ఏమిటి? వాటిని ఉదాహరణలతో వివరించండి.

**A.** జతలుగా వచ్చే conjunctions, correlative conjunctions అవి:

a) Both... and b) Either ... or c) Just as... so
d) Neither ... nor e) Not only... but also
f) Whether...or

ఇవి ఇతర conjunctions లాగానే words ను, phrases (groups of words without verbs) ను clauses (groups of words with verbs) ను కలుపుతాయి.

a) Both Rama and Krishna are the avatars of Vishnu.
(రాముడు, కృష్ణుడు ఇద్దరూ కూడా విష్ణువు అవతారమే)

b) Either coming here or calling him makes no difference = ఇక్కడికి రావడంకానీ, వాడికి phone చేయడంకానీ రెండూ ఒకటే.
(అదికానీ, ఇదికానీ, అతడుకానీ, ఇతడు కానీ)

c) Just as you talk back when you are offended, so will your son when he is offended = నీకు కోపం వస్తే నువ్వు ఎదురు చెప్పినట్లు, నీ కొడుకు కూడా వాడికి కోపం వచ్చినప్పుడు నీకు ఎదురు చెబుతాడు.

d) Neither he nor his brother is honest = అతడూ నిజాయతీపరుడు కాడు, అతడి తమ్ముడూ కాడు.
(రెండింట్లో ఏదీ లేదు, ఇద్దరిలో ఎవరూ లేరు)

e) Not only but also = అదే కాక, ఇది కూడా. Not only does he waste his time, but also troubles others = వాడి సమయం వృథా చేసుకోవడమే కాకుండా, ఇతరులనూ ఇబ్బందిపెడతాడు.

f) Whether... or = అవునా కాదా.
I don't know whether he will come or not/ I don't know whether or not he will come here.
ఇలాంటి చోట్ల whether బదులు 'if' వాడవచ్చు.

**Y.V. Srilakshmi, Bommanampadu.**

**Q.** Polite forms లో suggestion కు Advise కు ఉన్న తేడాలను వివరించగలరు. రెండింటి అర్థం ఒకటే కదా. Usage లో ఏమైనా మార్పు ఉందా? అలాగే, fear, frightened, terrified, afraid లకు ఉన్న తేడాలను వివరించండి.

**A.** 1) Polite forms అంటే మర్యాదను తెలిపే words, model verbs. would, could తో question forms లో వచ్చే sentences/ expressions
a) Could you explain this again?
b) Would you wait for a minute?
ఇలాంటివి. వీటన్నింటిని కూడా చాలా వివరంగా పాత lessons లో ఇచ్చాం చూడండి.

2) Advise అంటే సలహా ఇవ్వడం.
I advise you to buy the book and read it.
(ఆ పుస్తకం కొని చదవమని నేను సలహా ఇస్తున్నాను.)

Suggestion - అంటే సూచన. suggest అంటే సూచించడం- ఇది advise అంత బలంగా చెప్పడం కాదు. ఆ పని చేస్తే బాగుంటుందేమో? - ఇది suggest చేయడం. ఆ పని చేయి నువ్వు, నీకు మంచిది- ఇవి advising.

I advise you to stop smoking.
(సిగరెట్ మానుకో.)
I suggest that you stop smoking.
(నువ్వు సిగరెట్ మానడం మంచిది.)
You do it/ you had better do it/
why don't you do it?
ఇవన్నీ advise.
How about/ what about doing it? If I were you, I would/ wouldn't do it- ఇవన్నీ suggestions.

3) Fear = భయపడటం - ముఖ్యంగా ధైర్యాన్ని కోల్పోవడం
a) She fears her husband = భర్తంటే ఆమె భయపడుతుంది. అతడిని ఎదుర్కొనే ధైర్యం ఆమెకు లేదు.

b) Frightened= అకస్మాత్తుగా భయానికి, దిగ్భ్రమకు గురి కావడం.
She was frightened at the right of the robber with a gun= తుపాకీతో ఉన్న ఆ దొంగను చూడగానే ఆమెకు భయం పుట్టింది. (అకస్మాత్తుగా, దిగ్భ్రమతో)

c) Terrify = భయంతో వణుకూ, తీవ్రమైన బాధ కలిగించడం.
The memory of the maoist gunning down the villagers terrifies her even today = మావోయిస్టు ఆ గ్రామస్థులను కాల్చి చంపిన జ్ఞాపకాలు భయంతో ఆమెలో వణుకూ, బాధ పుట్టిస్తున్నాయి.

**A. Sudhakar, Biknur.**

**Q.** Structural word, content word అంటే ఏమిటి?

**A.** Content Words- సంభాషణలో రచనలో భావాన్ని తెలిపే మాటలు -Nouns, Verbs, Adjectives and adverbs.
ఇవి లేకపోతే sentences భావం తెలియదు కదా?
Structural Words: వాక్య నిర్మాణానికి (sentence structure కు) అవసరమయ్యే మాటలు - Articles (a/an and the), Prepositions (on, in, into, at, etc), conjunctions (and, but, etc,) determines (any, each, some, etc.)




**Q.** విద్యార్థి prose/ poetry ద్వారా గ్రహించవలసిన ముఖ్యవిషయాలు ఏమిటి?
ఉపాధ్యాయుడు పాఠం ముగించిన తరువాత విద్యార్థులతో ప్రాక్టీస్ చేయించాల్సిన పద్ధతులను తెలపండి.

**A.** Prose ద్వారా Vocabulary (meaning and use of words), sentence construction, expressing an idea in different ways, and writing skill (రచనా నైపుణ్యం).
Poetry వల్ల ఊహాశక్తి, అది వ్యక్తపరిచే విధం, Vocabulary వర్ణనాశక్తి లాంటివి పెంపొందించుకోవచ్చు.

**Q.** ఏవైనా కొన్ని మంచి Novels పేర్లు చెప్పండి.

**A.** కొన్ని Novels అంటే ఏ ఉద్దేశానికి? ఎవరికి? విద్యార్థులకా? బోధకులకా? General reading కా? అనే దానిని బట్టి ఉంటుంది.
చిన్నపిల్లలకూ, ఇప్పుడిప్పుడే englishలో ప్రావీణ్యం సంపాదించుకొంటున్న వారికి, Short stories తో ప్రారంభించడం మంచిది. వీటికి RK Narayan, Tagore, Raja Rao, Ruskin Bond, Mulkraj Anand, Anitha Das లాంటి భారతీయ రచయితల ఆంగ్ల రచనలతో ప్రారంభించడం మంచిది. English చందమామ బాగా ఉపయోగపడుతుంది.

**Q.** She is a good girl. దీనికి simple sentence సరిపోతుంది కదా. దీన్ని She is a girl and is good (compound), She is a girl who is good (complex) లోకి మార్చాల్సిన కారణాన్ని తెలపండి. అన్ని వాక్యాల meaning, context ఒక్కటే కదా?

**A.** అలా మార్చాల్సిన అవసరం లేదు. మనం ఎంత సులభంగా అర్థమయేట్టు మాట్లాడాలి, రాయాలి అనేది మనసులో ఉంచుకుంటే మనకు ఎటువంటి sentence వాడాలో అదే తెలుస్తుంది. మీరిచ్చిన example, Grammar for the sake of grammar (వ్యాకరణం కోసం వ్యాకరణం) అభ్యసించటానికి మాత్రమే ఉపయోగం.

**A. Lakshmi Narayana, Yellandu.**

**Q.** 'పుర్రెకో బుద్ధి జిహ్వకో రుచి' అనే వాక్యానికి సమాన అర్థాన్నిచ్చే ఇంగ్లిష్ జాతీయం ఏదైనా ఉందా?

**A.** Tastes differ as rivers differ (ఒక్కో నది ఒక్కోరకంగా ఉన్నట్టు, ఒక్కొక్కరి అభిరుచి ఒక్కోరకంగా ఉంటుంది/ లోకోభిన్న రుచిః)

**Q.** 'నేను ఇతరులను ఒక మాట అనను. మాట పడను' ఇంగ్లిష్‌లో ఎలా పలకాలి?

**A.** I don't utter a word against others, nor do I take a word.

**Q.** 'పిట్ట కొంచెం, కూత ఘనం' అర్థాన్నిచ్చే ఇంగ్లిష్ జాతీయం ఏదైనా ఉంటే చెప్పండి?

**A.** Appearances are deceptive-
(ఆకారం వల్ల స్వభావం తెలియదు)

**Q.** ఇంగ్లిష్‌లో ఎల్లుండిని 'Day after day' అంటారా? లేదా Tomorrow next day అంటారా? ఏది కరెక్టు?

**A.** The day after tomorrow అంటాం. Day after day = రోజుల తరబడి tomorrow next day తప్పు.

**Anil, ponnur.**

ఈ మూడు వాక్యాలను ఇంగ్లిష్‌లో చెప్పగలరు.

**Q.** నువ్వు నా బర్త్‌డే పార్టీకి ఆహ్వానించబడ్డావు.

**A.** You have been invited to...

**Q.** నువ్వు నా బర్త్‌డే పార్టీకి ఆహ్వానించబడుతున్నావు.

**A.** You are being invited to...

**Q.** నువ్వు నా బర్త్‌డే పార్టీకి ఆహ్వానించబడతావు

**A.** You will be invited to...

**Q.** Could I leave the school a little early?
దీనికి తెలుగు అర్థం చెప్పండి?

**A.** కాస్త త్వరగా (మామూలుకన్నా) నేను వెళ్ళొచ్చా school నుంచి? (మర్యాదగా permission అడగడం)

**Q.** At all, after all, by now గురించి వివరించి ఒక ఉదాహరణ ఇవ్వండి.

**A.** At all = అసలు. He didn't like the movie at all = అతడికా సినిమా అసలు నచ్చలేదు. (ఎక్కువగా no/ not తో వాడతాం)
After all = ఇంతచేసీ After all the trouble I have taken, I have got only one hundred rupees = నేనింత కష్టపడ్డా నాకొచ్చింది వంద రూపాయలే.
After all, how much money you have is important, not how you got it ఏదేమైనా నీదగ్గరెంత డబ్బుందనేది ముఖ్యం, నువ్వెలా సంపాదించావని కాదు.
By now = ఈ పాటికి
By now the programme should have started = ఈ పాటికి/ ఈ సమయానికి కార్యక్రమం ప్రారంభం అయ్యుండాల్సింది (అవలేదు).

**Q.** That's what my family won't see.
దీనికి తెలుగు అర్థం చెప్పండి.

**A.** అదే మా కుటుంబం చూడనిది/ అర్థం చేసుకోనిది.

**Q.** Her eyes are as blue as flowers.

**A.** ఆమె కళ్ళు పూలంత నీలంగా ఉంటాయి. (English వాళ్ళకు blue eyes ఇష్టం)

**Q.** Some words in the story that you may not know. ఇక్కడ that అంటే ఏమిటి?

**A.** That you may not know = ఇక్కడ that కు అర్థం, which అని (ఏ మాటలైతే నీకర్థం కావో అని)

**Q.** This exercise can be done as many times as you like in a day. ఇక్కడ can be done అంటే ఏమిటి?

**A.** Can be done = చేయబడగలవు (మామూలు తెలుగు - చేయగలవు)

**Q.** 'నేను కూడా చూడలేదు' అనే వాక్యాన్ని
I also didn't see it. అనాలా?
I didn't also see it అనాలా?
I too didn't see it అనాలా?
I didn't see it too. అనాలా? చెప్పండి.

**A.** I didn't see it too/ I didn't see it either.

# Her eyes are as blue as flowers


M.SURESAN

**KSR, Marture.**

**Q.** చదువు సంధ్యా రాని వాడికి ఓటుహక్కు దేశానికి పెను ముప్పు.
చదువు సంధ్యా రానివాడికి లభించే పదవి దేశానికి కొరివి. ఈ మాటల్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** Voting right for the illiterate is a disaster to the country.
An office for the illiterate is the nation's ruin.

**Q.** Being lost his wife.
Having lost his wife.
ఈ రెండు వాక్యాలకు అర్థం ఒకటేనా?

**A.** Being lost his wife - తప్పు.
Having lost his wife. correct - భార్య పోవడంతో/ పోవడంవల్ల

**Q.** ఈ డబ్బు మా నాన్నకు ఇచ్చేస్తా.

**A.** I'll give the money to my father.

**Q** ఫీజు కట్టి వస్తా?

**A.** I'll pay the fees and come

**Q.** మా నాన్నను పిలిచొస్తా.

**A.** I'll call my father and come

**Q.** ఏ రోజు చెప్పిన పాఠం ఆ రోజే చదవమని చెప్తున్నాను. కానీ మీరు చదవడం లేదు. మిమ్మల్ని ఏం చేయాలో చెప్పండి? - దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా పలకాలో చెప్పండి?

**A.** I tell you to learn a lesson the day it is taught, but you don't do it. What shall I do with you?

**Q.** నేను వచ్చినందుకు అతడు కోప్పడ్డాడు.

**A.** He was angry because I had come.

**Q.** ఆకాశం ఇంతక్రితం వరకు తెల్లగా ఉంది. ఒక్కసారిగా ఎర్రబడింది. కాకిలెక్కలు, సింహావలోకనం .. వీటిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్తారు?

**A.** Till a short while ago the sky has been white, and it has turned red suddenly.
Guess/ Guess work / Unreliable figures, Revision.

**S. Narasimga Rao, Karimnagar.**

**Q.** గతంలో Having గురించి రాశారు. ఏదైనా కారణానికి కూడా Having వర్తిస్తుంది కదా?
ఉదా: having met my friend I went away. ఒక గ్రామర్‌కు సంబంధించిన పుస్తకంలో పై విధంగా చూశాను. వివరించగలరు. ఇక్కడ ఇంగ్లిష్ వాక్యానికి తగినట్టుగా తెలుగులో అర్థం రావడంలేదు. తెలపండి.

**A.** అవును. Having lost his wife, he felt lonely = భార్య పోవడంవల్ల అతడు ఒంటరితనం అనుభవిస్తున్నాడు.
Having walked all the distance, I feel tired = అంతదూరం నడవడంవల్ల నాకు అలసటగా ఉంది.
ఇది practice (talking practice) వల్ల వస్తుంది.

**Ch. Raghukiran, Nagavaram.**

వీటిని తెలుగులోకి అనువదించండి.

**Q.** దీనిపై సంతకం చేయడం వల్ల తమకు నష్టమేమీ లేదు.

**A.** You don't lose anything by signing here/ you've nothing to lose if you sign here.

**Q.** ఇక్కడ వాహనాలు నిలిపితే మీకే నష్టం.

**A.** If you park your vehicle here you will have trouble.

**Q.** ఆయన పదవుల కోసం డబ్బులు వెదజల్లే వ్యక్తి.

**A.** Money doesn't matter to him if only he can get an office.

**Q.** ఇక్కడ సంతకం పెట్టు.

**A.** Sign here

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ




# I am crossing my fingers


M.SURESAN



**Ch.Raghukiran, Nagavaram (Nizamabad)**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుప గలరు.

★ ఈ రోజు సామాను కొనుక్కోవాలి= I've to make some purchases today.

★ ఈ రోజు యోగా తప్పకుండా చేయాలి = I must do yoga today.

★ నాకు బైక్ కొనేంత సామర్థ్యం(డబ్బు) లేదు = I can't afford a bike

★ నాకు ఇల్లు కొనేంత సామర్థ్యం లేదు = I can't afford a house of my own.

**Riaz Pasha, Warangal.**

**Q.** What is the different between 'been and being'.

**A.** Been కు independent use లేదు. Have, had, shall have, etc., తో కలిసి 'be' forms ను form చేస్తుంది.

Being = ఉండటం వల్ల/ ఉండటంతో

Being ill he can't move = జబ్బుతో ఉండటం వల్ల/ ఉండటంతో అతడు కదలలేడు.

**Q.** Do you came? and Did you come? తేడా ఏమిటి?

**A.** Do you come? = నువ్వు regular గా ఇక్కడికి వస్తుంటావా?

Do you came - తప్పు.

Did you come? = గతంలో - (ఓ నిర్ణీత సమయంలో) నువ్విక్కడికి వచ్చావా?

**Q.** Login and logout తేడా తెలపండి.

**A.** Login = Computerలో పని ప్రారంభించడం

Log out = Computerలో మనం చేస్తున్న పని ముగించడం.

**Q.** Sign in and Sign out తేడా వివరించండి.

**A.** Sign in = ఒకచోట ప్రవేశించేటప్పుడు Visitors register లో Visitors చేసే సంతకం.

Computer లో e -mail పంపేందుకు Internet లోకి ప్రవేశించడం.

Sign out; 1) ఒక ప్రదేశం నుంచి బయటికి వెళ్లేటప్పుడు register లో సంతకం చేయడం.

e-mail పంపించిన తర్వాత Internet నుంచి నిష్క్రమించడం.

**Q.** Signing off

**A.** Signing off = ఉత్తరాన్ని ముగించడం (ఇంతే సంగతులు అని చివర రాయడం)

**Q.** Mean by ppt ($V_3$) past participle?

**A.** Mean -Past Participle - Meant

**Q.** Meanings and usage of below written.

Just crossing someone finger అంటే ఏమిటి?

**A.** Crossing one's fingers =

Hoping our plans will be successful (మన పథకాలు ఫలిస్తాయని ఆశించడం) (Keep one's fingers crossed)

I've finished what I have to do. I am crossing my fingers = నేను చెయ్యాల్సింది చేశాను.

ఫలితం ఉంటుందనే ఆశిస్తున్నాను.

**Q .** Much into (I am not much into Vastu. Is it correct or not?)

**A.** Be not much into = Not to be interested in or doing something.

I am not much into vastu = నాకు వాస్తులో పెద్ద ఆసక్తిలేదు, అంత తెలియదు కూడా.

**Q.** Cut to (song is not cut to one place to one place, is it correct or not?)

**A.** Cut to = కాదు Cut from... to - In Movies/ TV, etc = to move quickly from one scene to another. eg. The scene cuts from the forest to the palace. (ఆ దృశ్యం చాలా త్వరగా అడవి నుంచి రాజభవనానికి మారుతుంది )

**Q.** Throughout (Throughout the movie my favourite place is ... is it correct?)

**A.** Throughout - from the beginning to the end: The hero is seen throughout the movie = ఆ సినిమా అంతా (మొదలు నుంచి చివర వరకు) హీరో కనిపిస్తాడు.

Throughout the movie my favourite place is = సినిమా మొత్తం (throughout)... ఆ తర్వాత my favourite place కు అర్థం ఇక్కడ సరిపోవడం లేదు.

**Q.** Came into being

**A.** Came into being = ఉనికిలోకి రావడం/ ఉండటం ప్రారంభం అవడం

The Universe came into being several billion years ago = చాలా వందల కోట్ల ఏళ్ల కిందట విశ్వం ఉనికిలోకి వచ్చింది.

**Q.** I would rather they all would (please explain briefly again)

**A.** I'd rather they all would = వాళ్లేపని చేస్తే/ అందుకు సమ్మతిస్తే బాగుంటుందని అనుకుంటున్నా. I'd rather = I prefer (నేను ఇష్టపడతా)

**Q.** Are you a coffee free?

**A.** ఈ group of words sentence కాదు, అర్థం లేదు. కాబట్టి బహుశా మీరు చూసిన sentence, 'Are you a coffee freak?'

freak అంటే దేనిలోనైనా విపరీతమైన అభిమానం, ఆసక్తి ఉన్న వాళ్లు. Are you a coffee freak? = మీరు Coffee అభిమానులా?

**Q.** He has worked since 1989 (but 'has' shows just passed out actions only) please explain.

**A.** The sentence is correct. Has + Past Participle indicates an action starting in the past (1989) and continuing till now. You are correct in saying that has + pp talks of an action just completed. This is its other use, in addition to the above.

**Q.** She goes to her friends on sunday.

(ఆమె వాళ్ల స్నేహితుల ఇంటికి ఆదివారం వెళుతుంది.)

I have seen this in Spoken English and my doubt is in the question house / home not mentioned.

**A.** ఆమె వాళ్ల friends ఇంటికి వెళుతుంది = She goes to her friends'. (s తర్వాత apostrophe గమనించండి. అది ఉంటేనే friends 'ఇంటికి' అనే అర్థం వస్తుంది.

She goes to her friends (friends కు apostrophe లేదు) = ఆమె తన friends దగ్గరకు వెళుతుంది. friends' - friends + ' - ఇలా apostrophe వాడితే, house/ home అక్కరలేదు. ఇలాంటి చోట్ల house or home వాడటం తప్పు కూడా.

**Q.** What should I do to get used to Foreign English?

**A.** Read as much English as you can, listen to English news channels and speak english whenever you have a chance.

**G. Narsing Rao, Adilabad.**

**Q.** VISION అంటే అర్థం ఏమిటి?

**A.** Vision = చాలా ఊహతో తెలివిగా మనం రచించుకున్న ప్రణాళిక ప్రకారం, మన భవిష్యత్తును గురించి మనకున్న దృశ్యం.(ఆలోచన).

**Q.** To be the most admired and successful express distribution company in India by meeting and exceeding our customers, expectation of services. దీని అర్థం ఏమిటి?

**A.** మన సేవలపై మన వినియోగదారులకున్న ఆశలు తృప్తికరంగా తీర్చడం, ఆ ఆశలను అధిగమించడం ద్వారా, భారత్ మొత్తంలోనే అత్యంత అభిమానం పొందే, విజయవంతమైన Express Distribution సంస్థగా రూపొందడం.

**Q.** MISSION కు అర్థం తెలపండి.

**A.** Mission = మన భవిష్యత్తును గురించి మనకున్న దృశ్యాన్ని నిజం చేసుకునేందుకు మనం అనుసరించాలనుకునే మార్గం, విధులు.

**Q.** 1) To focus on customers loyalty & make it the goal of our organization.

2) To encourage our people for adoption of new technologies, processes and system for improved, reliable and speedy service.

3) To relentlessly monitor to reach a minimum net service level of 98% delivery.

**A.** 1) (మా) మన ఖాతాదారుల అభిమానం పొందటం మీద దృష్టి పెట్టడం, దాన్ని మన సంస్థ గమ్యంగా చేసుకోవడం.

2) మెరుగైన, నమ్మకమైన, సత్వర సేవలందించేందుకు, కొత్త సాంకేతిక పరిజ్ఞానం, వినూత్న పద్ధతులు అవలంబించేలా మన సిబ్బందిని ప్రోత్సహించడం.

3) 98 శాతం నికర సేవలందించే స్థాయికి చేరేవిధంగా మన సేవలను నిరంత రాయంగా నిర్దేశించడం.

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థం చెప్పండి.

**(suggestions for success)**

★ Marry the right person. This one decision will determine 90% of your happiness or misery = నీకు తగిన వ్యక్తిని పెళ్లి చేసుకో. అదే 90 శాతం వరకు నీ సంతోషాన్నిగాని, దుఃఖాన్నిగాని నిర్ణయిస్తుంది.

★ Give people more than they expect and do it cheerfully = మీ నుంచి ఇతరులు ఆశించే దాని కంటే ఎక్కువగా మీరు సంతోషంగా ఇవ్వగలగాలి.

★ Be forgiving of yourself and others = నీ పైనా, ఇతరుల పైనా క్షమాగుణం అలవరచుకో.

★ Be generous = వితరణ (దాన) శీలం కలిగి ఉండు.

★Have a greatful heart.= కృతజ్ఞత కలిగివుండు (Grateful, Greatful కాదు)

★ Persistence, Persistence, Persistence = పట్టుదల, పట్టుదల, పట్టుదల

★ Discipline yourself to save money on even the most modest salary = జీతం ఎంత సామాన్యమైనదైనా, పొదుపు చేసుకునేలా నిన్ను నువ్వు నియంత్రించుకో.

★ Treat every one you meet like you want to be treated = నిన్ను ఇతరులు ఎలా చూడాలనుకుంటావో, ఇతరులను నువ్వు అలాగే చూడు.

★ Commit yourself to quality = నాణ్యతకు బద్ధుడివై ఉండు.

★ Be loyal, Be honest = విధేయత, నిజాయితీ కలిగి ఉండు.

★ Be a self-starter = ఇతరుల మీద ఆధారపడకుండా చొరవ చూపించు.

★ Stop blaming others. Take responsibility for every area of your life = ఇతరులను నిందించకుండా నీకు సంబంధించిన విషయాలన్నింటికీ నీవే బాధ్యత వహించు.

**T. Siva, Nandikotkur.**

**Q.** కిందివాటి Pronunciation తెలుపగలరు.

★ Menace = మెనస్ - 'మె' నొక్కి పలుకుతాం.

★ Proboscis = ప్రబొసిస్ - 'బొ' నొక్కి పలుకుతాం

★ Superb = స్యూపర్బ్ - 'ప' నొక్కిపలుకుతాం; ప, bird లో 'బ' లాగా.

★ Oblation = అబ్లెయ్షన్ - 'బ్లెయ్' నొక్కి పలకాలి.

★ Drought = డ్రౌట్

★Pigeon = పిజన్ - 'పి' నొక్కి పలుకుతాం

★ Chaos = కెయస్ - 'కె' నొక్కి పలుకుతాం.

★Tyrant = టైరంట్- 'టై' నొక్కి పలుకుతాం.

★ Tyrrany = టిరని - 'టి' నొక్కి పలుకుతాం

★Martyr = మాట(ర్) - 'మా' నొక్కి పలుకుతాం.

**Q.** I turned off the light.

I turned the light off.

I turned off it.

I turned it off వీటిలో ఏవి సరైనవో తెలపండి.

**A.** I turned off it తప్పు మిగతావన్నీ సరైనవే.

**Q.** Phrasal Verbs ను ఎప్పుడు విడదీసి రాయాలో వివరించండి.

**A.** Verb, preposition మధ్య it రాదు. Phrasal verb లోని, verb ను particle (preposition/ adverb) ఎప్పుడు విడదీయాలనేందుకు కచ్చితమైన rule అంటూ ఏదీ లేదు.

వాడకను బట్టి తెలుసుకోవాల్సిందే.

**M. Satyanarayana, Hyderabad.**

**Q.**Fine, well, good, fantastic, superb, wonderful ఈ పదాలను ఎప్పుడు, ఎక్కడ, ఎలా ఉపయోగించాలి?

**A.** Well తప్ప మిగతావాటినన్నింటినీ ఏదైనా చాలా బాగుందని చెప్పేందుకు వాడతాం. Well అంటే బాగా (మిగతా వాటికి అర్థం - బాగున్న).

Fantastic = చాలా బాగున్న/ అద్భుతమైన)/ గొప్పగా ఉన్న.

Excellent = Superb = చాలా గొప్పగా ఉన్న (ముఖ్యంగా అదే రకమైన మిగతావాటికంటే), పరిపూర్ణమైన (ఇంకేం తప్పుపట్టలేం)

Wonderful = గొప్ప ఆనందాన్ని కలిగించే/ ఆకర్షణీయమైన.

Well = పైవాటిలోని wellను సామాన్యంగా nouns ముందు వాడం.

Well = (ఆరోగ్యం) బాగాఉన్న. ఏదైనా పని ఎవరైనా బాగాచేస్తే - He has done it well అంటాం కదా- అలాగే He played/ understood (something) well అంటాం.

వీటికన్నింటికీ అర్థాలు ఇంకా చాలా ఉన్నాయి. మంచి dictionary చూడండి.

**R. Sridevi, Jammulapalem (Prakasam Dist)**

**Q.** ఇటీవల వార్తల్లోకి వచ్చిన 'CERN' పూర్తి అర్థం ఏమిటి? ఇది French Acronym అని పత్రికల్లో చదివాను దీని అర్థం ఏమిటి?

**A.** CERN అనేది French acronym.

(Abbreviation లోని letters కలిపితే పదంలాగా ధ్వనించే మాట Acronym).

CERN కు french భాషలో అర్థం Council of European Nuclear Research = యూరోపియన్ అణు పరిశోధనా మండలి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# He is supposed to do that work


M.SURESAN



**Ananda Rao, Guntur**

**Q.** What is the difference between these pairs of words.
- specially - especially
- till - until
- speak - talk
- though - although

**A.** **Especially** = ప్రముఖంగా/ ముఖ్యంగా.
All farmers in the state, especially those growing cotton and tobacco are in trouble = రాష్ట్రంలోని రైతులందరూ, ముఖ్యంగా పత్తి, పొగాకు పండించేవాళ్లు ఇబ్బందుల్లో ఉన్నారు.
**Specially** = ప్రత్యేకంగా.
The train is being run specially to clear the festival rush = పండుగ తాకిడిని తట్టుకునేందుకు ప్రత్యేకంగా ఈ రైలు నడుపుతున్నారు.
- till = until
- **Speak** - అర్థం, కాస్త ముఖ్యమైన విషయాలు formal గా మాట్లాడటం - భాష మాట్లాడటం = speak a language. Speak a few words on the occasion = ఈ సందర్భంగా రెండు మూడు మాటలు మాట్లాడటం.

**Talk** - అంత ముఖ్యంకాని విషయం గురించి మాట్లాడటం. మామూలు పిచ్చాపాటిలాంటి సంభాషణ - talk.
- **Though = Although**

**Q.** I have some doubts with regard to Degrees of comparison. Generally we say...
beautiful - more beautiful - most beautiful.
But why can't we say...
beautiful - less beautiful - least beautiful.
eg: 1. She is the least beautiful girl in the class.
She is less beautiful than any other girl in the class.
No other girl in the class is no little beautiful as she.
2. She is one of the least beautiful girl in the class.
She is less beautiful than many other girls in the class.
Very few girls in the class are as little beautiful as she.
3. Radha is less beautiful than sita.
Sita is not so little beautiful as Radha.
Can we write the sentences as above? ఈ వాక్యాలను తెలుగులో వివరించగలరు.

**A.** Yes. We can say so. Less beautiful and least beautiful are comparative and superlative respectively, too.

Your sentences in eg No. 2) are correct- grammatically, but the positive degree (as little beautiful as) is not proper usage. Isn't it more convenient to say, sita is not so/ as beautiful as the other girls in the class.

2) In this example too, it is better to avoid 'little' before the positive degree. We can as well say, 'very few girls in the class are as beautiful as she'.

3) Here again 'little' is better avoided before beautiful. Omitting 'little' before beautiful, makes the sentence sound better without changing the meaning in any way.

Here are the translations: Literal translations look awkward.
1) Class లోని అందరిలో సీత తక్కువ అందం కలది/ తక్కువ అందగత్తె. (Sup)
Comp: Class లోని ఏ ఇతర అమ్మాయికన్నా సీత అందం తక్కువ.
Positive: ఏ ఇతర అమ్మాయి సీతంత అందం తక్కువ కాదు.
2) Class లో తక్కువ అందమైన అమ్మాయిల్లో సీత ఒకతి (Sup)
Comp: class లోని ఎక్కువమంది అమ్మాయిలకంటే సీత అందం తక్కువ.
Pos: సీతంత తక్కువ అందమైన అమ్మాయిలు class లో ఉన్నవాళ్లు చాలా తక్కువ.
3) రాధ సీతకంటే తక్కువ అందమైంది- comparative.
Positive: రాధ సీతంత అందమైన అమ్మాయి కాదు.

**Q.** ఏకపత్నీవ్రతుడు.

**A.** Monogamist అనొచ్చు అయితే ఒకే సమయంలో ఒక భార్య కలవాడే English లో monogamist. అంటే ఒక భార్యకు విడాకులిచ్చి రెండోసారి ఇంకో ఆవిడను పెళ్లాడినా, monogamist అనే అంటాం. జీవితమంతా ఒకే భార్యతో గడిపేవాడు (ఏకపత్నీవ్రతుడు) అనేందుకు English లో సరైన మాట లేదు.

**Q.** I am talking with/ to you. ఏది కరెక్టు?

**A.** Both are correct.

**Ch. Raghukiran, Nagaram**

**Q.** What is the difference between- Games and sports, Revolt and Revolution, Report and statement, Cash and Amount, Rate and Price, Speed and Fast, Hai and Hellow, Poem and Rhyme, Details and Particulars, Whole and Total, Blue and Indigo, Award and Reward, Staff and Faculty.

**A. Games** అంటే ఇద్దరిమధ్య, రెండు జట్ల మధ్య జరిగే క్రీడ - cricket, foot-ball, chess etc.
**Sports** అంటే ఇద్దరు, రెండు జట్ల కంటే ఎక్కువ మంది పాల్గొనేందుకు వీలున్న క్రీడలు - Running race, Swimming etc.
**Revolt-** తిరుగుబాటు- అధికారం/ అధికారంలో ఉన్నవారికి వ్యతిరేకంగా దాడి.
**Revolution-** విప్లవం - సామాజిక (social) రాజకీయ, ఇతర రంగాల్లో వచ్చే పెనుమార్పు- a great change in the ways of life of a people, society, country, or world- a revolution has good results almost always.
**Report-** A presentation of the important details of a meeting or Incident- ఒక సమావేశాన్ని/ ఘటనను గురించి తెలిపే నివేదిక.
**Statement:** వ్యాఖ్య- ఒక విషయాన్ని గురించి మన అభిప్రాయాన్ని తెలిపే comment.
**Cash-** నగదు- Money in the form of currency notes and coins.
**Amount-** The amount of money (డబ్బు 'ఇంత' అని చెప్పడం) అయితే 'ఇంత' అనే భావంతో amount ను దేనికయినా వాడతాం- Amount of money/ Amount (quantity) of water, etc.
**Rate-** ఒక కిలో/ డజన్/ litre/ meter ధర
**Price-** కొన్న సరకు/ వస్తువుల మొత్తం ధర.
**Speed-** The rate at which a thing moves, as 60 Kms/ Hour.
**Fast-** moving at great speed, very quickly.
Speed is a noun, 'Fast' is an adverb.
**Hai- Hi-** More common- Informal greeting. మనకు బాగా పరిచయమున్న వాళ్లను పలకరించే తీరు.
**Hello-** slightly formed greeting కొంచం మర్యాదతో పలకరించే విధం.
**Poem=** పద్యం, **Rhyme=** అంత్యప్రాస రెండు మాటలు ఒకే శబ్దంతో అంతమవడం- Live and give, kiss and miss, sit and hit - These pairs of words rhyme with each other because they end in the same sound.
**Details = particulars** = వివరాలు
**Whole** refers to quantity or a group, **total** refers to number. Whole and total are synonyms.
**Blue-** నీలి/ నీలం
**Indigo-** ముదురు నీలం
**Award=** ఒకరు కనబరిచే ప్రతిభకు/ కృషికి బహుమతి/ పురస్కారం.
**Reward-** ప్రతిఫలం- ఒక పని విజయవంతంగా పూర్తిచేసినందుకు ఇచ్చే బహుమతి.
**Staff** = ఒక సంస్థ సిబ్బంది.
**Faculty** = Universities, Colleges లో ఉండే బోధనా శాఖ; Maths faculty, English faculty, etc.; ఆ శాఖలో ఉండే అధ్యాపక వర్గం.

**K.B. Nardas, Cheriyala**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.
ఎవరెవరొచ్చారు?

**A.** Who all have come?

**Q.** ఈ దారిన ఒక అబ్బాయి వెళుతుండగా చూశారా?

**A.** Have you seen a boy going this way?

**Q.** ఏంటి ఇంకా కబుర్లు, విశేషాలు చెప్పరే?

**A.** What more?/ What else?

**Q.** ఈ పెన్నులో ఇంక్ అయిపోయింది/ ఇది పారడం లేదు/ రాయడం లేదు.

**A.** The pen has run out of ink. It isn't writing any more.

**Q.** ఈ పెన్ను నడుస్తుంది. దీనికి This pen is writing అనడం సరిపోతుందా?

**A.** సరిపోతుంది.

**Q.** I had no other object than to beat him అంటే ఏమిటి?

**A.** వాడిని కొట్టడం తప్ప నాకింకే ధ్యేయమూ లేదు.

**Q.** Shake కు gender form ఉంటుందా? ఉంటే రెండు forms తెలుపగలరు.

**A.** ఇది arab మాట. తెలియదు.

**Q.** Chameleon అంటే ఊసరవెల్లి అని అర్థం, అయితే మొత్తం పదాన్ని ఎలా ఉచ్ఛరించాలి?

**A.** కమీలిఅన్- 'మీ' నొక్కి పలుకుతాం.

**Q.** విస్తరాకులను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** సరైన మాట లేదు- eating leaves అనొచ్చు

**Q.** ముందు పెళ్లి జరగనివ్వండి. పెళ్లయ్యాక అన్ని సంగతులు అంతే. ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** Let the marriage go on first. Once the marriage is over, everything will settle down (అన్ని సంగతులు అంతే అంటే అర్థం కాలేదు) 'everything will settle down' అన్నీ సర్దుకుంటాయి.

**Q.** Stomach, Abdomen రెండింటికి అర్థం ఒకటేనా?

**A.** Abdomen= ఛాతీ కింది భాగం - ఇందులో పొట్ట (stomach), పెద్ద పేగు, చిన్న పేగు ఉంటాయి. stomach = పొట్ట మాత్రమే.

**Pavani, Sudha, Matsyapuri**

**Q.** Computers, key boards, adaptors, chargers ఇలా ఏ విదేశీ వస్తువు చూసినా వాటిపై ముద్రించే తయారీ వివరాలతోపాటుగా ఒకచోట capital letters లో CE అని కచ్చితంగా ముద్రించి ఉంటుంది. అంటే Conformity with Environment అని అర్థమా? వేరే అర్థం ఉందా? వివరించగలరు.

**A.** CE = Certified Ecofriendly = పర్యావరణానుకూలమైనదిగా ధ్రువీకరించింది.

**Q.** Using the word 'actor' to the females, correct or not? (I have seen in the newspaper.)

**A.** Actor, author, singer, poet లాంటి మాటలను ఆడా, మగా ఇద్దరికీ ఉపయోగించడం వాడుకైపోయిందిప్పుడు. తప్పులేదు, సౌకర్యంగా ఉంటుంది కూడా.

**Q.** Thank you sir, Thanking you sir. - which is correct?

**A.** Thanking you, sir, - correct

**K. Ramakrishna, Khammam.**

**Q.** కిందివాటిని తెలుగులోకి ఎలా మార్చాలో తెలుపగలరు.
He is certain to address the meeting.

**A.** అతడు సభలో మాట్లాడటం కచ్చితం.

**Q.** We are bound to be late.

**A.** మనం కచ్చితంగా late అవుతాం.
be bound కు ఇంకో అర్థం (ఈ సందర్భంలో కాదు)- ఒక పని చేయాల్సిన బాధ్యత ఉండటం.
I am bound to take care of my old parents = వృద్ధులైన మా తలిదండ్రులను చూసుకోవాల్సిన బాధ్యత నాకుంది.

**Q.** She got to go there tomorrow.

**A.** She got to go కాదు, She has got to go there tomorrow = ఆమె రేపు అక్కడికి తప్పకుండా వెళ్లాల్సి ఉంది/ వెళ్లక తప్పదు.

**Q.** We are likely to get approval.

**A.** ఆమోదం వచ్చే అవకాశం ఉంది.

**Q.** She is opt to hesitate a lot.

**A.** ఆమె చాలా సందేహించవచ్చు (ఏదైనా చేసేందుకు). ఆమెకు సందేహించే స్వభావం ఉంది.

**Q.** He is due to start as a courier early.

**A.** అతడు courier గా బయలుదేరాల్సి ఉంది.

**Q.** We are obliged to you.

**A.** నీకు మేం రుణపడి ఉన్నాం (కృతజ్ఞతలు తెలపడం)- కాస్త formal.

**Q.** He is supposed to do that work.

**A.** అది అతడు చేయాల్సిన పని/ ఆ పని చేయాల్సింది అతడు.

**Q.** We had rather leave this place.

**A.** Had rather అనం. We would rather leave the place = మేం ఇక్కడినుంచి వెళ్లిపోవడానికే ఇష్టపడుతున్నాం (ఇక్కడ ఉండేందుకంటే).

**Q.** I had as well stay where I am.

**A.** I had కాదు; I'd (I would) as well stay where I am = ఇప్పుడు నేనున్నచోటనే ఉండేందుకిష్టపడుతున్నాను.

**VLG Raju, Srikrishnapatnam.**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా అనాలో తెలుపగలరు.
మీకు రేపు స్కూలు ఉందా?

**A.** Do you have classes/ school tomorrow? (or) Is your school/ will your school be open tomorrow? / Is tomorrow a working day for your school?

**Q.** నేను బర్త్‌డే చేసుకోవడం మానేశాను.

**A.** I stopped celebrating my birth day.

**Q.** అతడికి వాళ్లమ్మ చివరి చూపు కూడా దక్కలేదు.

**A.** He could not have even the last look at his mother.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






**G. Govinda Rao, Visakhapatnam.**

**Q.** Albeit అంటే ఏమిటి? ఒక వాక్యాన్ని దీనిని ఉపయోగించి తెలుపగలరు.

**A.** Albeit = Although/ though/ even though = అయినప్పటికీ. అయితే albeit గ్రాంథికం మాత్రమే కాకుండా old fashioned.

**Q.** కింద అండర్‌లైన్ చేసిన పదాలకు తెలుగులో సరిపోయే పర్యాయపదాన్ని ఉపయోగిస్తూ అనువదించగలరు. Trend of small movies took a nosedive with all and sundry jumping into the bandwagon.

**A.** Take a nosedive = ధరలూ, విలువలూ లాంటివి అకస్మాత్తుగా విపరీతంగా పడిపోవడం.

Jump into the bandwagon = వేలంవెర్రిగా ఎక్కువ మంది చేస్తున్న పనిని మనమూ చేయడం, అలాంటి గుంపులో ఒకరవడం, వారితోపాటు మనమూ పేరు పొందేందుకోసం.

AP politicians are eager to jump into the pro Telengana bandwagon = తెలంగాణ వేర్పాటును సమర్థించే వారిలో చేరిపోవాలని AP రాజకీయవాదులు తహతహలాడుతున్నారు. (ఓట్లు/ రాజకీయలబ్ధి కోసం). అయితే మీరు ఉదహరించిన వాక్యంలో jump into the bandwagon వాడకం సరికాదు. Jump into the bandwagon ముఖ్యంగా మనుషుల విషయంలోనే వాడతాం, మీ sentence లోలా చిన్న తరహా సినిమాలకు కాకుండా.

With the formation of PRP, a number of TDP leaders and members have jumped into the bandwagon= PRP ఏర్పాటుతో చాలామంది TDP నాయకులూ, సభ్యులూ, అందులో మిగతావారితోపాటు చేరిపోయారు.

**Q.** B.J.P. not apologetic about Hindutva.

**A.** హిందుత్వ సిద్ధాంత విషయంలో BJP లో పశ్చాత్తాప ధోరణి/ తప్పు చేశాం, క్షమించండి అనే ధోరణి కనిపించడం లేదు.

**Q.** He debunked that astrology is a science.

**A.** జ్యోతిశ్శాస్త్రం, ఓ శాస్త్రమనే విషయాన్ని ఆయన బూటకం అని కొట్టిపారేశాడు.

Debunk = అదో బూటకం/ నిజంలేదని అవహేళన చేయడం.

**Q.** The festival showcased Rajkapoor's performance.

**A.** ఆ ఉత్సవం రాజ్‌కపూర్ నటనను ఆకర్షణీయంగా ప్రదర్శించింది.

To show case = దేన్నయినా ఆకర్షణీయంగా కనపరచడం.

**Q.** 'Awara' rendered Rajkapoor a household name in Soviet.

**A.** 'ఆవారా' చిత్రం మూలంగా Soviet Russia లో రాజ్ కపూర్ పేరు ఇంటింటా వాడే/ వినిపించే మాటైపోయింది.

**Q.** Artists are run- of- the- mill type.

**A.** అందులోని కళాకారులు చాలా మామూలు నటనను ప్రదర్శించారు.

Run-of-the-mill = విశిష్టత ఏమీలేని చాలా మామూలైన. అయితే ఇది మనుషులకు (ఇక్కడ కళాకారులకు లాగా) వాడరు. కళాకారుల ప్రదర్శన కథలూ, చిత్రాలు, నాటకాల్లాంటివి కొత్తదనం ఏమీలేక ఎప్పుడూ చూసే లాంటివిగా ఉంటే, వాటిని run-of-the mill అంటాం.

**Q.** Viswanath, the person betrays no vestige of sterling success.

**A.** వ్యక్తిగా విశ్వనాథ్‌లో ఆయన సాధించిన గొప్ప విజయాల చిహ్నాలేవి కనిపించవు (అంటే ఆయన అంత నిగర్వి అని)

betray = (ఇక్కడ) ప్రదర్శించడం,

vestige = అవశేషం. sterling = గొప్ప.

**Q.** The element of art and creativity in film making, with due apologies is non-existent.

**A.** with due apologies = ఈ మాటలన్నందుకు క్షమించడం, కానీ అనకుండా ఉండలేను. (క్షమాపణ కోరుతూ ఈ మాటలంటున్నా).

**Q.** The earlier producers are rich and solvent enough to the take the failures in their stride.

**A.** పాత నిర్మాతలు ధనికులూ, తగినంత డబ్బు నిల్వలూ ఉన్నవారు (solvent) అవడంతో, వారు వైఫల్యాలను, ఒడిదుడుకులనూ తట్టుకున్నారు.

Solvent = అవసరానికి కావల్సినంత నగదు ఉండటం.

take failures in their stride = వైఫల్యాలను తట్టుకోవడం

**Q.** Today, financiers diktat is the last word.

**A.** ఈ రోజున financiers దే చివరి శాసనం.

**Q.** I have my innings for over three decades.

**A.** మూడు దశాబ్దాలుగా నా కార్యకలాపాలు సాగాయి.

**Q.** Take objection, take exception కు తేడా ఏమిటి?

**A.** రెండూ ఒకటే- అభ్యంతరం తెలపడం/ ఆక్షేపించడం.

**Q.** Discussion కు, Deliberation కు తేడా ఏమిటి? ఉదాహరణలతో వివరించగలరు.

**A.** Discussion = చర్చ

Deliberation = ఓ నిర్ణయం తీసుకునే ముందు జాగ్రత్తగా ఆలోచించడం.

If more than one person deliberate, ఓ విషయం మీద నిర్ణయం తీసుకునే ముందు అందరూ కలిసి ఆలోచించడం (deliberate).

**Q.** The craft village strikes a right chord.

**A.** Crafts village = కళల (ముఖ్యంగా చేతిపనుల) ప్రోత్సాహం కోసం ఏర్పర చిన ప్రత్యేక colony/ ప్రదేశం.

The crafts village strikes the right chord = ఆ crafts village ప్రజల్లో సరైన భావాన్ని/ సానుకూల స్పందనను కలిగించేదిగా ఉంది.

Strike the right chord = సరైన భావాన్ని కలిగించడం.

**Q.** No let-up in Olive Ridley killings.

**A.** Olive Ridley turtles (ఒక రకమైన తాబేళ్ళ)ను వేటాడి చంపటంలో ఎడతెరిపి లేదు (అడ్డం లేకుండా సాగుతూనే ఉంది).

**Q.** Beware of BJP bid to polarise society.

**A.** సమాజాన్ని పరస్పర వ్యతిరేక వర్గాలుగా చీల్చే/ విడదీసే BJP ప్రయత్నాల విషయంలో జాగ్రత్తగా ఉండండి.




**A. Penchalaiah, Rajampet.**

**Q.** Please clarify the following doubts.

**Meanwhile** (meantime) = ఈ మధ్యలో/ ఇంతలో.

i) The meal is getting ready. Meanwhile have some bread = భోజనం సిద్ధమవుతోంది. ఇంతలో కాస్త bread తిను.

ii) I was planning to go there. In the meantime this happened = నేనక్కడికి వెళ్లాలనుకుంటున్నా. ఇంతలో ఇది జరిగింది.

**Q.** 'To' Preposition అర్థమేమిటి?

Let's drink to the health of our respected foreign guests అంటే?

**A.** To కు చాలా అర్థాలున్నాయి. Let's drink to the health of - ఇక్కడ, to కి అర్థం, 'కోసం' అని. (ఆయన ఆరోగ్యం కోసం).

**Q.** 'According to' కు అర్థమేమిటి?

**A.** According to అంటే, ప్రకారం అని. ఇది ఒక phrase; to కు ప్రత్యేకమైన అర్థం ఏమీలేదు.

# I wish I spoke perfect English

**Q.** The admirer sang paens about the actor.

**A.** పాటలతో పొగడటం (sing paeans)

**Q.** He exhibited all his poetical repertoire.

**A.** Repertoire (రిపట్వా) = Repertory = ఓ కళాకారుడు/ కళాకారిణి/ కళాసంస్థ ప్రదర్శించగల నాట్య, సంగీత, నాటక, ఇతర కళాంశాలన్నీ కలిపి.

He exhibited all his poetical repertoire = ఆయనకు తెలిసిన కవితాంశాలన్నింటిని ప్రదర్శించాడు.

**Q.** In Nair of Kerala, women reigns supreme for centuries.

**A.** కేరళలో నాయర్ల వర్గంలో శతాబ్దాలుగా స్త్రీలు అధికారాన్ని చలాయించారు.

మీ sentence clear గా లేదు, తప్పులు కూడా ఉన్నాయి. దానికి correct form:

Among Nairs of Kerala, women have reigned supreme for centuries

Reign supreme = నిరాటంకంగా పాలించడం.

ఒక రంగంలో అత్యంత గొప్పవారుగా వెలుగొందడం.

Balamurali Krishna reigns supreme in classical music = శాస్త్రీయ సంగీతంలో బాలమురళీకృష్ణ అత్యంత గొప్ప.

**Q.** MLA has espoused the cause of Pulichintala project.

**A.** Espouse a cause = ఒక ఆశయానికి పూర్తి మద్దతివ్వడం/ ఒక ఉద్దేశానికి బాసటగా ఉండటం.

**Q.** The company is gearing up for expansion (ఇందులో 'gear' అన్న పదానికి మోటారు వాహనాల్లో ఉపయోగించే gear పదానికి వాడకంలో సారూప్యం ఉందా? )

**A.** ఆ సంస్థ తన అభివృద్ధికి సంసిద్ధమవుతోంది. (gearing up)

**Q.** We are meandering aimlessly in lawns.

**A.** ఏ గమ్యమూ లేకుండా ఎటుబడితే అలా తిరుగుతున్నాం. (Lawns = పెద్ద పెద్ద భవనాల ముందు అందం కోసం పెంచే పచ్చిగడ్డి plots)

**Q.** Vizag vignettes.

**A.** Vignettes (విన్యట్) = ఓ వ్యక్తిని, సందర్భాన్ని తెలిపే సంక్షిప్త రచన/ రేఖాచిత్రం.

Vizag vignettes = వైజాగ్‌కు సంబంధించిన విషయాలను తెలిపే చిత్రాలు/ రచనలు.

M.SURESAN

కింది వాక్యాలకు తెలుగులో అర్థాలు తెలుపుతూ ఉదాహరణలివ్వగలరు.

1. I am having tea now =
2. Neither of my sisters is married.
3. Neither of them has a car.
4. Neither of us saw it happen.

**A.** 1. ఇప్పుడు నేను టీ తీసుకుంటున్నాను/ తాగుతున్నాను.
2. మా అక్కలు/ చెల్లెళ్లిద్దరిలో ఎవరికీ పెళ్లికాలేదు.
3. ఆ ఇద్దరిలో ఎవరికీ కారు లేదు.
4. మా ఇద్దరిలో ఎవరూ అది జరుగుతుండగా చూడలేదు.

**Q.** Hardly, Scarcely, No sooner పదాలను ఏయే సందర్భాల్లో వాడతారో తెలుపగలరు.

**A.** Hardly/ Scarcely= 1) అరుదుగా/ దాదాపు లేదు.

He hardly comes here =

అతడు ఇక్కడికి చాలా అరుదుగా వస్తాడు.

He scarcely knows me =

నేనతడికి దాదాపు తెలియదు.

2) Hardly= scarcely= No sooner... than= ఒక పని జరిగీ, జరగకముందే/ జరిగిన వెంటనే.

Hardly/ scarcely did he see/ had he seen the police when he ran away= No sooner did he see/ had he seen the police than he ran away = అతడు పోలీసును చూసీ/ చూడగానే/ చూసిన వెంటనే, పారిపోయాడు.

**Q.** కింది వాక్యాలకు అర్థాలు వివరించగలరు.

**A.** 1) I wish I spoke perfect English =

నేను చక్కటి ఇంగ్లిష్ మాట్లాడితే ఎంత బాగుంటుంది.

2) If only I was/ were better looking = నేనింకొంచెం అందంగా ఉంటే...!

**G. Naresh, Armoor.**

**Q.** Whether, Meanwhile పదాల అర్థాలు తెలియజేసి, sentence formation లో వీటిని ఏ విధంగా ఉపయోగిస్తామో వివరించగలరు.

**A.** **Whether** అంటే, అవునా, కాదా అనే అర్థంతో వాడతాం.

I don't know whether he is here or not = ఇక్కడ ఉన్నాడో, లేదో నాకు తెలియదు.

Whether you like it or not you have to do it = నీకు నచ్చినా, నచ్చకపోయినా నువ్విది చేయాల్సిందే.

**C. Swetha, Railwaykodur.**

**Q.** స్టూడెంట్స్‌ని ప్రశ్నలు అడిగినప్పుడు ఈ ప్రశ్నకు ఆన్సర్ చెప్పేవాళ్లు చేతులు పైకెత్తండి అనేటప్పుడు rise your hands అంటారు. చేతులు దించండి అనేటప్పుడు put down hands అనడం కరెక్టేనా?

**A.** 1. Rise your hands అనం- Raise your hands అంటాం.

Rise = లేవడం, నిలబడటం, ఎదగడం.

Raise = (దేన్నయినా) ఎత్తడం, చేతులెత్తడం కాబట్టి, raise your hands.

Students rise when the teacher enters class.

Put down your hands, correct.

**Q.** మిమ్మల్ని లైన్ ప్రకారం ప్రశ్నలడుగుతా అనడానికి ఇంగ్లిష్‌లో I shall ask you questions in line wise అనాలా లేదా In a line wise అనాలా?

**A.** I will ask you questions in linewise/ in a linewise- ఇవేం అనం. I shall ask you questions one by one/ one after another/ by turns/ in the order of your seats, etc. అంటాం.

By turns = వంతుల ప్రకారం.

In the order of - ఆ వరుసలో.

**Q.** నిన్ను పరీక్షల్లో ఫెయిల్ చేస్తా అనడాన్ని ఇంగ్లిష్‌లో ఎలా అనాలి?

**A.** I will fail you.

**Q.** 'కొండగుర్తు' దీన్ని ఇంగ్లిష్‌లో ఏమంటారు? విద్యార్థులకు పాఠం చెప్పేటప్పుడు ఈ విషయాన్ని గుర్తుపెట్టుకోవడానికి ఒక కొండగుర్తు ఉంది అని చెబుతుంటాం కదా.

**A.** కొండగుర్తు = Landmark - ఏదైనా చోటు/ ఇల్లు ఎక్కడుందో తెలిపేందుకు, వాటికి దగ్గరగా ఉండే ప్రముఖమైన ప్రదేశం.

Cinema Halls, Colleges, Govt. Offices, temples - ఇవన్నీ landmarks గా ఉపయోగపడతాయి.

పాఠ్య విషయాల్లో ఏదైనా గుర్తుంచుకునేందుకు తెలిపే కొండగుర్తు అనే అర్థంతో landmark వాడం.

I will tell you something to remember these things by=

ఇవన్నీ గుర్తుంచుకునేందుకు వీలుగా ఓ విషయం చెప్తాను.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# I am bound to go there



**K.S.R., Martur, Prakasam.**

**Q.** Be రూపాలు (is, am, are, was, were) అయిదు. మరి, be ని కలిపితే ఆరవుపుతున్నాయిగదా, been, be రూపం ఎందుకు కాదు?

**A.** be రూపాలు, am, is, are, was, were, మాత్రమే కాకుండా, 'be' చివర వచ్చే verbs- shall be, will be, should be, would be, can be, could be, may be, might be, must be, ought be, dare be, need be- ఇంకా been చివరవచ్చే verbs- have been, has been, had been, shall/ should/ will/ would/ can/ could/ may/ might have been.

Been- be రూపమే, కాని అది verb కాదు.

**Q.** I have heard about her. I have heard of her - వీటిమధ్య తేడా ఏమిటి?

**A.** I have heard about her = I have heard of her.

**Q.** Absolute Phrase (అబ్‌సల్యూట్ ఫ్రేజ్) అంటే ఏమిటి? ఎప్పుడు ఉపయోగిస్తాం?

**A.** Being a holiday, I did not go to school that day = ఈ sentence లో, Being a holiday అనేది absolute phrase.

English లో ఎప్పుడూ, ఏ phrase అయినా, దానికి దగ్గరగా ఉన్నదాన్ని గురించి చెప్తుంది. (Phrase = A group of words without a verb). ఇక్కడ Being a holiday అనే phrase, I కి దగ్గరగా ఉంది. అందువల్ల దానికి Being a holiday, I అంటే, నేను సెలవైనందువల్ల అనే విపరీతార్థం వస్తుంది. ఇలా దగ్గరున్న subject కు సంబంధం లేని phrase ను absolute phrase అంటాం. So,

Being a holiday, I did not go to school that day- wrong. దీనికి correct form,

That day being a holiday, I did not go to school- ఇక్కడ that day being a holiday = ఆ రోజు సెలవైనందువల్ల.

**Q.** Finite, non finite verbs అంటే ఏమిటి? వాటిని ఉపయోగించే సందర్భాలు తెలుపగలరు.

**A.** Finite verbs ఉంటేనే, complete meaning ఉండే group of words, sentence అవుతుంది.

Finite verbs గురించి ఇంతకుముందు చెప్పాం, మళ్లీ ఇంకోసారి వివరిస్తున్నాం. ఇవి 6 రూపాల్లో (forms) ఉంటాయి.

1) Be forms (పైన తెలిపాం కదా? అవి.)

2) Be form + ... ing form- am going, is taking, has been doing, should have been coming, etc.

3) Be form + Past Participle- am seen, is done, will be given, would have been completed etc.

4) Have/ has/ had/ shall have/ will have, etc + Past Participle- Have seen, has done, shall have gone, etc.

5) Doing words: Ist Regular Doing Word (I RDW), IInd Regular Doing Word (IInd RDW), Past Doing Word (PDW).

| Ist RDW | IInd RDW | PDW |
|---|---|---|
| come | comes | came |
| take | takes | took |
| give | gives | gave |
| see | sees | saw |
| do | does | did, etc. |

6) Shall/ should/ will/ would/ can/ could/ may/ might/ must, etc + I RDW shall do, can see, may talk, etc.

ఈ 6 classes of verbs మాత్రమే finite verbs.

Non finite verbs: ఇవి ఉన్న groups of words, phrases మాత్రమే అవుతాయి తప్ప sentences కావు. ఇవి verbs కిందకు లెక్కకు రావు.

కిందివి non-finite verbs.

1) The infinitive- to + Ist RDW- to go, to walk, to see, etc.

Infinitive కు తెలుగులో మూడర్థాలున్నాయి.

a) ఒక పని చేయడం అనే అర్థం-

To walk such a long distance is not easy = అంత దూరం నడవడం సులభం కాదు.

b) ఒక పని చేయడానికి (purpose) అనే అర్థంతో.

He came here to see me = నన్ను చూసేందుకు అతడిక్కడికి వచ్చాడు.

c) ఒక పని చేయాలనే అర్థంతో.

I want to go home = నేనింటికి వెళ్లాలని అనుకుంటున్నా.

రెండో non-finite verb- '...ing' form- going, coming, etc.

'...ing' form కు, infinitive కు లాగే ఒక పని చేయడం అనే అర్థం వస్తుంది.

Walking the distance is not easy = ఆ దూరం నడవడం తేలికేం కాదు = To walk the distance is not easy.

'...ing' form కు ఇంకో అర్థం, ఒక పని చేస్తూ, ఒక పని చేస్తుండగా.

Walking along the street, I ran into my friend = Road వెంబడి నడుస్తూ/ నడుస్తుండగా అనుకోకుండా నా స్నేహితుడ్ని చూశాను.

3) మూడో non finite verb, Past Participle- seen, taken, given, etc. అర్థం: చూడబడిన, తీసుకోబడిన, ఇవ్వబడిన అని.



The man seen at the book store is my neighbour = Book store లో చూడబడిన ఆయన (మామూలు తెలుగు- Book store లో కనిపించిన ఆయన) మా పక్కింటాయన.

The stone thrown by the boy = ఆ పిల్లాడి చేత విసరబడ్డ రాయి. - మామూలు తెలుగు- అతడు విసిరిన రాయి.

ఇవీ finite and non finite verbs.

**Q.** I brought it for him. Indirect object కు ముందు preposition వాడకూడదు. మరి ఈ వాక్యం కరెక్టేనా?

**A.** Indirect object కు ముందు preposition రాకూడదనేం లేదు కదా?

I sold the book to Harish - ఇక్కడ Harish, Indirect object కదా? దానిముందు to అనే prep వస్తోంది కదా? అయితే, It Indirect object గా ఉన్నప్పుడు మాత్రం Sub + Verb + Direct object + Prep + Object of the prep- pattern రాదు.

I sold him the book- ఈ sentence లో, Indirect object, him ను,

I sold the book to him - ఇక్కడ, him ను, object of the preposition 'to' గా మారుస్తాం.

'It' విషయంలో ఇలా రాదు. అందువల్ల,

I brought it for him అనే అంటాంకానీ, I brought him it అనం.

**Q.** preposition కు సరైన నిర్వచనం తెలపండి. వాక్యంలోని ఇతర పదాలతో ఉన్న సంబంధాన్ని తెలియజేసే పదాన్ని preposition అంటారు. కరెక్టేనా? I came on foot లో on కు, ఇతర పదాలకు ఏ రకమైన సంబంధం ఉంది?

**A.** Preposition ఒక sentence లోని మాటలకున్న సంబంధం తెలుపుతుంది.

ఇప్పుడు I came on foot- on foot లో 'on' కు అర్థం, నడకన అని. మన తెలుగులో విభక్తి ప్రత్యయాలు, English లో prepositions దాదాపు ఒకే స్వభావాన్ని కలిగి ఉంటాయి.

---

**K. Ramakrishna, Ongole**

**Q.** What are the telugu translations to the below given sentences.

He is a teacher, is he?

**A.** He is a teacher, is he? - అతడు టీచరేనా? అని వ్యంగ్యంగా అడగడం.

**Q.** He is not a teacher, isn't he?

**A.** He isn't a teacher, isn't he? - అతడు టీచరేం కాదుగదా? అనడం.

**Q.** Scarcely had the game started when it began to rain.

**A.** ఆట మొదలయా అవగానే వర్షం ప్రారంభం అయింది.

**Q.** No sooner had he heard the news than he started off.

**A.** ఆ వార్త విన్న వెంటనే అతడు బయలుదేరాడు.

**Q.** Hardly had I finished the work when the picture started.

**A.** నా పని పూర్తయా అవగానే/ అయిన వెంటనే చిత్రం మొదలయింది.

**Q.** Barely had I gone there when he went out.

**A.** నేనక్కడికి వెళ్లీవెళ్లకుండానే/ వెళ్లగానే అతడు వెళ్లిపోయాడు.

**Q.** I can wait unless and until he come.

**A.** ఈ sentence కు అర్థం లేదు. (అతడు వస్తేనేకానీ, వచ్చేంతవరకు నేను wait గలను ఇలా అనం కదా? అతడు వస్తే కానీ నేను wait చేయను అంటే అర్థం రాదు కదా. అతడు వచ్చేంతవరకు (until he comes) నేను wait చేయలేను అంటే అర్థం చేసుకోగలం.)

**Q.** We can't wipe out this evil unless and until the individual thinks so.

**A.** ప్రతివ్యక్తీ లేదు అనుకునేంతవరకూ, అనుకుంటేనే తప్ప, మనం ఈ దోషాన్ని నిర్మూలించలేం.

**Q.** They were asked to maintain sanitation failing which action would be initiated against them. (How do we use the phrase failing which)

**A.** పరిశుభ్రత పాటించాలని వాళ్లు చెప్పబడ్డారు. అందులో (పారిశుధ్యం పాటించడంలో) వాళ్లు విఫలమయితే (failing which) కఠిన చర్యలు వారిమీద ప్రారంభించబడతాయి.

**Q.** In 50 n.p., 60 n.p, - here n.p. stands for?

**A.** np = Naye paise, ఇప్పుడు వీటినే పైసా (singular), paise (plural) అంటున్నాం. దేశంలో అణాలు, పైసలు (అప్పటి పద్ధతి ప్రకారం, ఒక రూపాయి = 192 పైసలు) తీసేసి, రూపాయికి వందపైసలు ప్రవేశపెట్టినపుడు, కొత్త పైసలును, నయా (hindi for new) paise అని వ్యవహరించారు. ఆ తర్వాత, 100 పైసల లెక్క బాగా వాడకంలోకి వచ్చాక నయా తీసేశారు.

**Q.** How do we use the following semi-modals in conversation. Do give telugu translations also. be at a loss to, be supposed to, be bound to, be liable to, be apt to, be on the point of.

**A.** In all the expressions, we can use any 'be' form instead of 'be'.

★ be at a loss to (understand) = అర్థం చేసుకోలేకుండటం.

I am at a loss to understand how he died so suddenly = అంత అకస్మాత్తుగా ఎలా చనిపోయాడో నాకర్థమవడంలేదు.

★ be supposed to = అనుకోబడటం.

He is supposed to be the greatest actor of the day. ఈనాటి మేటినటుడిగా అతడు అనుకోబడుతున్నాడు (అతడిని అనుకుంటున్నారు)

★ be bound to = కచ్చితంగా ఏదైనా చేయాల్సి రావడం/ చేసే బద్ధుడిగా ఉండటం.

★ I am bound to go there tomorrow = రేపు నేనక్కడికి కచ్చితంగా వెళ్లాలి.

Ministers are bound to serve the public = మంత్రులు ప్రజాసేవకు బద్ధులై ఉన్నారు.

Be liable to = జరిగే అవకాశం ఉండటం, తప్పక జరగడం.

a) He is liable to go there = అతడక్కడికి వెళ్లే అవకాశం ఉంది.

b) They are liable to be punished if they cross limits = వాళ్లు హద్దుమీరితే తప్పక శిక్షపడుతుంది.

★ be apt to = అవకాశం ఉండటం.

He is apt to come here any moment (అతడు ఏ క్షణాన్నయినా రావచ్చు - వచ్చే అవకాశం ఉంది)

★ Be on the point of = ఓ పని చేయబోతూ ఉండటం.

He was on the point of buying the car when I stopped him = అతడు car కొనబోతూ ఉండగా నేను ఆపాను.

**Q.** How do we use the following modal idioms in conversation. Do give telugu translations also. Had as well, had best, can't help, can't bear, can't stand, must needs, may as well, can't help but, can't make nothing of, can you beat it, will be able to, may be able to, should be able to, would be able to, might be able to, would have been able to

**A.** Had as well, had best అనే expression లేదు. had best బదులు had better ఎక్కువ వాడుక. ఎవరికైనా సలహా, సూచనలిచ్చేందుకు వాడతాం.

You had better start now = మీరిపుడు బయలు దేరడం మంచిది.

★ can't help = తప్పదు.

If you want good education, you can't help spending money = మంచి చదువు కావాలంటే డబ్బు ఖర్చు పెట్టక తప్పదు.

★ can't bear = భరించలేకపోవడం = can't stand

We can't bear the heat of Vijayawada in summer = విజయవాడలో వేసవి ఎండ భరించలేం = We can't stand the heat ...

★ must needs = తప్పక - He must needs come here = అతడిక్కడికి రాక తప్పదు.

★ May as well- ఎంపిక తెలపడం- (అది చేసే బదులు, ఇది చెయ్యొచ్చు కదా అనే అర్థం.)

Instead of going to a cinema, you may as well watch the movie on the TV at home = Hall కి వెళ్లి సినిమా చూసే బదులు, ఇంట్లో కూర్చుని TV లో చూడొచ్చు కదా?

★ Can't help but = Can't help. మామూలుగా can't help అనో, can't but అనో అంటాం, 'తప్పదు' అనే అర్థంతో.

★ You can't help walking = నడవక తప్పదు = You can't but walk. సాధారణంగా You can't help but walk అని, help, but కలిపి వాడం. అయితే ఈ మధ్య గొప్ప ఆంగ్ల అమెరికన్ రచయితలిలా can't help but అని వాడుతున్నారు.

★ Can't make nothing of it- ఇది సరైన మాట కాదు. can't make anything of it లేదా can make nothing of it అనాలి. అర్థం- నాకేం అర్థం కావడం లేదు అని.

I can't make anything/ I can make nothing of what he is saying = అతడంటున్నది నాకేం అర్థంకావడం లేదు.

★ Can you beat it? దీనికి ప్రత్యేకమైన అర్థం ఏం లేదు. Beat అంటే ఓడించడం అనే అర్థం తీసుకుంటే Can you beat him? అంటే నువ్వు వాడిని ఓడించగలవా అనే అర్థం వస్తుంది.

★ Will be able to = చేయగలగడం. Future లో would/ should/ can/ could/ may/ might be able to - వీటికి Lesson No. 35 - 38 చూడండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# I am still on the job

**Vasoo:** Hi Swapna, finished your assignment?
(స్వప్నా అసైన్‌మెంట్ పూర్తయ్యిందా?)

Assignment = విద్యార్థులకు పాఠ్యాంశాల మీద/ ఉద్యోగాలు, వృత్తుల్లో ఉన్నవాళ్లకు అప్పగించిన పని).

**Swapna:** (I'm) still on the job. How about lending a hand? Sasi has promised to help, but for some reason best known to herself has been hanging back. I did help her a lot when the going wasn't good for her.
(ఆ పని మీదే ఉన్నా. కాస్త సాయం చేయ కూడదా? శశి సాయం చేస్తానని మాట ఇచ్చింది, కానీ ఎందుకనో ముందుకు రావడం లేదు. తన పనులు సరిగ్గా జరగనప్పుడు నేను తనకు సాయం చేశాను).

**Vasoo:** Sasi isn't the type. Some powerful reason must be holding her back.
(అలాంటిది కాదు శశి. ఏదో బలమైన కారణం తనను ఆపుతూ ఉండాలి.)

**Swapna:** I know too that she isn't one to let down a friend in need. She must be having some reason, I know. What I feel is she could let me know of it
(శశి అవసరంలో ఉన్న వాళ్లను వదిలేసే రకం కాదని నాకూ తెలుసు. ఏదో కారణం ఉండి ఉండాలని కూడా నాకు తెలుసు. నేను అనేది ఏమిటంటే అదేదో నాకు చెప్పొచ్చు కదా అని).

**Vasoo:** I think she works for a firm that keeps her busy. She moves about a lot too because of her job.
(తను పని చేసే కంపెనీ తననెప్పుడూ తీరిక లేకుండా ఉంచుతుంది. ఆ పనివల్ల తిరుగుడు కూడా ఎక్కువే).

firm = company.

**Swapna:** Well, she can tell me of it. You know very well the kind of help I need from her, I can have only from her. She has the information I need.
(అది నాతో చెప్పొచ్చుకదా? తను నాకు చేయగలిగిన సహాయం తనొక్కతే చేయగల దు/నేనామె దగ్గరే పొందగలను. నాక్కావాల్సిన సమాచారం తన దగ్గరే ఉంది.)

**Vasoo:** You are wrong there. I forgot to tell you. My uncle works on the same project. He told me yesterday he has some books on the subject. I'm sure they can be of help to you.
(అక్కడే పొరబడుతున్నావు నువ్వు. నీకు చెప్పడం మర్చిపోయా. మా బాబాయి కూడా ఇదే project మీద పనిచేస్తున్నాడు. ఆయన దగ్గర కొన్ని పుస్తకాలున్నాయని చెప్పాడు. అవి నీకు ఉపయోగపడొచ్చు.)

Project = ప్రణాళిక ప్రకారం చేసే పని ఏదైనా.
ఒక ప్రణాళికా ప్రకారం నీరు వృథా పోకుండా నిల్వచేసేందుకు నదులకు డ్యామ్‌లను కడతాం. కాబట్టి వాటిని ప్రాజెక్టులు అంటాం.

**Swapna:** Then why don't you put me on to him? I am impatient to finish the assignment. I want to have it done and dusted.
(అయితే నాకాయనను పరిచయం చేయవా? ఈ assignment ఎప్పుడెప్పుడు అయిపోతుందా అని ఉంది నాకు. పూర్తి చేసేయాలనుంది.)

**Vasoo:** Make it tomorrow evening then uncle is likely to be at our place then.
(అయితే రేపు సాయంత్రం చేస్తా. మా బాబాయి మా ఇంటికొస్తాడు).

ఇంతకు ముందు Phrasal verbs ను గురించి కొంత తెలుసుకున్నాం. Phrasal verbs అంటే గుర్తుంది కదా? ఒక verb - దాని తర్వాత, ఒక Preposition(s) / adverb(s), వచ్చి వాటిలో ఒక్కొక్కదాని అర్థానికీ, వాటిని కలిపితే వచ్చే మొత్తం అర్థానికీ ఏమీ సంబంధం లేకపోతే దాన్ని Phrasal verb అంటాం.


M.SURESAN

eg: to put out = (Lights, మంటలు లాంటివి) ఆర్పేయడం చూడండి. ఇక్కడ put అర్థానికి, out అర్థానికి, put out మొత్తం అర్థానికీ సంబంధం లేదు కదా. కాబట్టి put out అనేది phrasal verb. ఈ Lesson లో కొన్ని phrasal verbs చూద్దాం.

Look at the following sentences from the conversation above.

1) I am still on the job.
2) For reasons best known to herself, she has been hanging back.
3) ... some powerful reason must be holding her back.
4) I did help her a lot when the going wasn't good for her.
5) She isn't the one to let down a friend in need.
6) Why don't you put me on to him.
7) I want to have it done and dusted.

**1) To be on the job =** ఒకపని చేస్తూ/ మీదే ఉండటం
(ఇది Phrasal verb కాదు).

a) You wanted him to clean and tidy up the house. He is on the job = వాడిని నువ్వు ఇల్లు శుభ్రపరిచి సర్దమన్నావు. అతడు ఆ పనిమీదే ఉన్నాడు.

b) Don't worry. We have some of our best men on the job. Your house will be completed in time = మీరేం బాధపడకండి. మా మంచి పనివాళ్లలో కొందరు మీ పనిమీదే ఉన్నారు. మీ ఇల్లు సకాలంలో పూర్తవుతుంది.

c) I don't know why, but I feel like sleeping when on the job = ఎందుకో తెలియదు. పనిలో ఉన్నపుడే నాకు నిద్ర పోవాలనిపిస్తుంది.

**2) To hang back =** (ఏదయినా పనిచేసేందుకు) వెనుకాడటం/ సందేహించడం.

a) She is hanging back from signing the agreement = ఒప్పందం మీద సంతకం చేసేందుకు ఆమె వెనుకాడుతోంది.

b) The other students rushed ahead to see the VIP, but he hung back, watching what would happen = మిగతా విద్యార్థులంతా ఆ వి.ఐ.పి.ని చూట్టానికి ఎగబడితే, అతడు మాత్రం ఏం జరుగుతుందో చూసేందుకు వెనకుండిపోయాడు.

**3) To hold back =** ఆపడం/ ఆగడం (చేయాలనుకున్న పనిని/ చెప్పాలనుకున్న విషయాన్ని చేయకుండా చెప్పకుండా ఉండటం).

a) I was about to tell her the secret but held back in the last minute = ఆమెకు నా రహస్యం చెప్పేయాలనుకున్నానుగానీ, చివరి క్షణంలో ఆపేశాను.

b) What's holding you back? why don't you join us for the picnic = ఏ కారణంవల్ల నువ్వాగిపోతున్నావ్? మాతో పిక్నిక్‌కు ఎందుకు రాకూడదు?

**4) Good Going =** పరిస్థితులు అనుకూలించడం/ ఒక పని బాగా చేయడం. అయితే Going is good అంటే పరిస్థితులనుకూలించడం అనే అర్థంతో వాడతాం.

a) So long as the going is good, none complains about you = పరిస్థితులు అనుకూలించినంత వరకూ మనల్ని ఎవరూ ఏమీ అనరు.

b) The going hasn't been very good for Ganguly and Dravid for sometime now = గంగూలీకీ, ద్రావిడ్‌కూ పరిస్థితులు కొంతకాలంగా బాగాలేవు.

**5) To let down - to let somebody down =** చేస్తామన్న సహాయం ఇస్తామన్న మద్దతు ఇవ్వకుండా నిరాశపరచడం.

a) My friend let me down by denying his promised help = సహాయం చేస్తానని మాట ఇచ్చిన నా స్నేహితుడు (మాట నిలబెట్టుకోకుండా) నన్ను నిరాశపరిచాడు.

b) He let down his team down by his poor batting = చెత్త బ్యాటింగ్ చేసి తనపై ఎంతో ఆశలు పెట్టుకున్న తన జట్టును అతడు నిరాశపరిచాడు.

c) Hope you will not let me down by not being present at the voting. I am counting on your vote = ఓటింగ్‌కు రావడం మాని నన్ను నిరాశపరచకు. నీ ఓటు మీదనే నేను ఆధారపడుతున్నా.

**6) To put (somebody) on to (somebody else) =** ఒకరిని ఇంకొకరికి పరిచయం చేయడం.

a) I don't have what you need, but I can put you on to one who can help you with it = నీ కవసరమైంది నా దగ్గర లేదు, కానీ నీకా సహాయం చేయగల వ్యక్తిని పరిచయం చేయగలను.

b) If you can do it, do it don't put me onto anyone else = నువ్వు చేయగలిగితేనే చేయి. అంతేకాని ఇంకెవరి దగ్గరకీ నన్ను పంపకు.

**7) Done and dusted =** పూర్తిచేసిన (phrasal verb కాదిది - Idiom).

a) Here is my Spoken English lesson for the Newspaper, done and dusted = వార్తాపత్రికకు రాయాల్సిన Spoken English lesson ఇదిగో, పూర్తయిపోయింది.

b) They brought all the furniture, done and dusted = మొత్తం ఫర్నీచర్ పూర్తిచేసి వాళ్లు తీసుకొచ్చారు.
ఇది ఇప్పుడిప్పుడు ఎక్కువగా వాడుకలోకి వస్తున్న మాట. practice చేయండి.

---



**N. Sashi, Hyderabad.**

**Q.** Have had / has had ఈ పదాలను ఎప్పుడు, ఎక్కడ ఎలా వాడాలో ఉదాహరణలతో వివరించండి.

**A.** Have had/ has had = have / has + past participle of have = ఇంతవరకు ఒక వస్తువు మనకుండటం/ గతంలో ఎప్పుడో తెలియని సమయంలో ఉండటం.

a) I have had this car for 3 years now = ఈ కారు నా దగ్గర మూడేళ్లుగా ఉంది.
b) He has had this fever since yesterday = అతడికి నిన్నటి నుంచి జ్వరంగా ఉంది.
c) She has had coffee already and doesn't want any more = ఆమె కాఫీ తీసుకుంది, ఇంకేమీ అక్కర్లేదు.

**Q.** కింది వాక్యాల గురించి వివరించండి.
He is gone.
He is prepared.
Questions are given.
The box is broken.
The above four sentences are passive sentences or not? If they are not passive voice sentences, please explain them in detail with examples.

**A.** The first two sentence are not passive, though the verbs there are, be forms+pp. In sentence 1, 'gone' talks about his state of being 'gone' (వెళ్లినవాడై ఉన్నాడు).
In 2) prepared talks about preparedness (సిద్ధపడి ఉన్నాడు). వీటి రెండింటికీ active voice try చేయండి, రావు. (They prepare) him రావచ్చు, కానీ ఇదే అర్థం రాదు.)
3) and 4) are passive sentences.

**A. Penchalaiah, Rajampet**

**Q.** కిందివాటిని వివరించండి.
- I will have none of you.

I will have none of you = మీరెవరూ నాకొద్దు. అయితే, I will have none of it అనే వాక్యం, నువ్వు చెప్పేదేమీ నేను వినదలుచుకోలేదు అనే అర్థాన్నిస్తుంది.

- Be off. Be off = get out.
- To go by to go by = to go according to something. I go by what you say = నువ్వు చెప్పేదాన్ని అనుసరించి నేను చేస్తా.

---




## పవర్ మేనేజ్‌మెంట్‌లో ఎం.బి.ఎ.

మహర్షి దయానంద్ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉన్న హర్యానాలోని నేషనల్ పవర్ ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్ ఎం.బి.ఎ. ప్రోగ్రామ్ ఇన్ పవర్ మేనేజ్‌మెంట్ కోర్సులో ప్రవేశానికి దరఖాస్తులు ఆహ్వానించింది.

**ఎంపిక :** నవంబర్ 16న జరిగే క్యాట్-2008 పరీక్ష స్కోరు ద్వారా ఎంపిక చేస్తారు.

**అర్హతలు :** బి.ఇ. లేక తత్సమాన పరీక్షలో అన్ని సెమిస్టర్స్‌లో సగటున కనీసం 60 శాతం మార్కులుండాలి.

**దరఖాస్తు :** ప్రాస్పెక్టస్, అప్లికేషన్ పోస్టు ద్వారా కోరుకుంటే రూ.1000లకు National Power Training Institute, Faridabad పేరుపై డి.డి. తీసి వినతిపత్రం జతచేసి పంపాలి. వెబ్‌సైట్ www.ntpi.nic.in నుంచి కూడా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు

**ముఖ్యమైన తేదీలు:** దరఖాస్తుల జారీ: అక్టోబర్ 1 నుంచి ప్రారంభమైంది.
అప్లికేషన్ల స్వీకరణకు చివరితేదీ : 2009 ఫిబ్రవరి 23.
(గ్రూప్‌డిస్కషన్, ఇంటర్వ్యూలు: 2009 మార్చి 26, 27.

## పంజాబ్ విశ్వవిద్యాలయం

చండీగఢ్‌లోని పంజాబ్ విశ్వవిద్యాలయం, యూనివర్సిటీ బిజినెస్ స్కూల్ ఎం.బి.ఎ.(ఐ.బి., హెచ్.ఆర్., బయోటెక్)లో ప్రవేశం కోసం దరఖాస్తులు ఆహ్వానించింది.

**అర్హతలు :** 1. ఎం.బి.ఎ.(బయోటెక్) కోర్సుకు: బయోసైన్సెస్‌లో డిగ్రీ లేదా పి.జి.డిగ్రీలో కనీసం 50 శాతం మార్కులు రావాలి.
2.ఎం.బి.ఎ.(హెచ్.ఆర్, ఇతర కోర్సులకు) : కనీసం 50 శాతం మార్కులతో డిగ్రీ లేక తత్సమాన కోర్సు చేసి ఉండాలి.

**ఎంపిక :** నవంబర్ 16, 2008న జరిగే క్యాట్ పరీక్ష స్కోరు ఆధారంగా ఎంపిక చేస్తారు.

**దరఖాస్తు :** ప్రాస్పెక్టస్, దరఖాస్తు ఫారాలను వెబ్‌సైట్ నుంచి డౌన్‌లోడ్ చేసుకోవచ్చు ఇతర వివరాలకు వెబ్‌సైట్ www.ubs.puchd.ac చూడొచ్చు

**ముఖ్యమైన తేదీలు:** 1. దరఖాస్తుల జారీ: అక్టోబర్ 15 నుంచి నవంబర్ 15 వరకు.
2) దరఖాస్తుల స్వీకరణకు చివరి తేదీ: నవంబర్ 15.

**చిరునామా:** Chairman, University Business School,
Panjab University,
Chandigarh-160014

---

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# I alone can do it



**S. Sriram, Hyderabad**

**Q.** By pass road ను తెలుగులో ఏమనాలి?

**A.** మళ్లింపు దారి/ రహదారి అనొచ్చు

**Q.** (Bank) Pass book ను తెలుగులో ఏమనొచ్చు?

**A.** తెలుగులో సరైన మాటలేదు.

**Q.** రామయ్యను Ramayya అని కాకుండా Ramaiah అని ఎందుకు రాస్తున్నారు. 'య్య' కు iah ఎలా సరి పోతుంది?

**A.** Indian names విషయానికొస్తే, సరైన శబ్దాన్ని తెలిపే ఏ spelling అయినా సరిపోతుంది. Standard spelling అంటూ ఏం ఉండదు.

**Q.** దసరా స్పెల్లింగ్ 'Dussehra' కరెక్టేనా?

**A.** British పాలన అవశేషం ఆ spelling (Dussehra). Dasara అంటే సరిపోతుంది, Cuddapah కు బదులు Kadapa అని వాడొచ్చు.

**G. Shankar, Keshavapatnam**

**Q.** What is/ are the difference between the sentences which are as follow under.

i) I don't try to speak loudly.

ii) I try not to speak loudly.

**A .** i) బిగ్గరగా మాట్లాడేందుకు ప్రయత్నించను.

ii) బిగ్గరగా మాట్లాడకుండా ఉండేందుకు ప్రయత్నిస్తాను- రెండింటికీ అర్థం దాదాపు ఒకటే.

**Q.** i) I alone can do it.

ii) I can do it alone.

**A .** i) నేనొక్కడినే అది చేయగలను

ii) నేనది ఒక్కడిగా (ఇతరుల సహాయం లేకుండా) చేయగలను.

**Q.** i) The mother loves Amitab better than me.

ii) The mother loves Amitab better than I.

**A .** i) ఆ తల్లి నన్ను ప్రేమించేందుకంటే అమితాబ్‌ను ఎక్కువ ప్రేమిస్తుంది = ఆ తల్లికి నాపై కంటే కూడా అమితాబ్ మీద ప్రేమ ఎక్కువ

ii) అమితాబ్‌ను నేను ప్రేమించేదు కన్నా ఆమె ఎక్కువ ప్రేమిస్తుంది = అమితాబ్ పట్ల నాకున్న ప్రేమకన్నా ఆమె ప్రేమ ఎక్కువ.

**A. Sudhakar, Peddamallareddy (Nizamabad)**

**Q.** You told us in the previous lessons about 'if conditions' have no shall, will, should and would in them. But I have seen some sentences like (a) If you will wait a moment I'll fetch a chair (b) I should be very grateful if you would do that for me. Please clarify.

**A.** In sentences like a) If you will wait a moment... the 'if' clause is not a conditional clause. It is a request, and so the rule that will/ shall/ would/ should should not be used in it does not apply here. In your sentences, If you will wait = Just wait a moment, and... if you would do that = please do that. So you see that not all clauses beginning with 'if' are conditional clauses. A conditional clause expresses a condition. That is, what the main clause states will happen only if what the subordinate clause (beginning with 'if' some times) states happens.

eg: If he gets the job, his mother will feel happy. Here his mother will feel happy on condition that he gets the job. If you pay more, you can travel A/C = on condition that you pay more, you can travel A/C.

**Q.** Present continuous లో some verbs see, think, know, understand etc., am + is + are + ing form లో రావు కదా. ఈ వాక్యాలను వివరించండి.

1. I'm seeing her tomorrow.
2. You're always seeing something strange.
3. I was just thinking it might be a good idea.

**A.** 'See' has the meaning of 'meet' too. With the meaning of 'meet' 'see' can be used in the am/ is/ are + ing form. In the sentence, 'you are always seeing strange things', the word 'see' has the meaning of imagining (ఊహించుకోవడం). With this meaning, am/ is/ are seeing is used, but it is not correct. 'You always see strange things' is certainly better.

One of the meanings of 'think' is, having ideas, words or pictures in your mind about something' (ఒక విషయం గురించి మనకు కలిగే ఆలోచనలు, మాటలు, దృశ్యాలు). ఈ అర్థంతో 'am/ is/ are thinking' వాడవచ్చు. 'What are you thinking?' - దేన్ని గురించి ఆలోచిస్తున్నావు? / ఏం చెప్పాలనుకుంటున్నావు? దాన్ని గురించి విషయం ఏం ఉంది మనసులో అనేకానీ, నువ్వేం ఆలోచిస్తున్నావని కాదు. ఆ అర్థంతో 'I was just thinking it was a good idea' - (ఆ, ఏం లేదు అది మంచి ఆలోచనే అనిపించింది నాకు) correct.

**Nagasrinivas, Chirala**

**Q.** గతంలో నుంచి ఇంకా చేస్తుండగలిగే వాడిని అనడానికి could have + p.p. + ing form వాడవచ్చా?

**A.** Could have p.p. ing form అంటే ఇక్కడ p.p అంటే been అయినట్టయితే వాడవచ్చు. Been తప్ప ఇంకే p.p. వాడటానికి లేదు.

He could have been (p.p.) doing it for two days now = అతనది రెండు రోజుల క్రితం నుంచి ఇప్పటివరకు/ ఇంకా చెయ్యగలుగుతుండేవాడే (కాని చేయలేకపోయాడు)

అయితే, చేయగలిగాడు (చేశాడు కూడా) అనే అర్థం కావాలంటే He has been able to do it అనాలి.

**Q.** గతంలో నుంచి ఇంకా జరుగుతూ ఉండేది అనడానికి would have + P.P. + ing form వాడొచ్చా?

**A.** It would have been going on for sometime = జరుగుతూ ఉండేదే కాని జరగలేదు.

It has been going on for sometime past = గతంలో ప్రారంభమై ఇంకా జరుగుతూ ఉంది.

**Q.** గతం నుంచి ఇంకా చేయాల్సి ఉండేది ఇలాంటి expressions ను ఇంగ్లిష్‌లో ఎలా తెలుపవచ్చు? వీటికేమైనా structure ఉందా?

**A.** Somebody- he/ she/ they, etc, should have been doing it- వాళ్లది చేస్తూ ఉండాల్సింది, కానీ చేయడం లేదు.

They must have been doing it for sometime now = వాళ్లది కొంతకాలంగా కచ్చితంగా చేస్తూ ఉన్నారు.

ఏ మంచి Grammar book అయినా వీటిని వివరించగలదు.

**Q.** ఇతడు లేకపోతే, నేను ఇన్ని రోజుల నుంచి ఇక్కడ ఉండగలుగుతుంటే వాడిని కాదు- దీనిని ఇలా అనొచ్చా?

If he is no, I couldn't have been living here for such this time.

**A.** ఇది సరికాదు. ఇలా అనాలి.

If he had not been here (అతడు లేకపోయుంటే), I could not have been here for such a long time. (నేనింతకాలమిక్కడ ఉండగలిగేవాడినికానుండగలిగాను)

**Q.** అతడుంటే నేను చేస్తుండేవాడిని అనడానికి If he is, I would have been doing it అనవచ్చా?

అతడు లేకపోతే నేను చేయాల్సి వచ్చేది అని అనడానికి ఎలా అంటాం?

**A.** ఇక్కడ కూడా, If he had been here, I would to have been doing it అంటాం.

M.SURESAN

**P. Srinivasu, Tatiparthi.**

**Q.** May I request you to clarify the following doubts. He started to run. He started running. వీటి మధ్య తేడా ఏమిటి?

**A.** He started to run = He started running (పరుగు ప్రారంభించాడు)

**Q.** I like to play cricket. I like playing cricket.

**A.** I like to play cricket = I like playing cricket (cricket ఆడటం నాకిష్టం)

In these contexts, to play = playing; to start = starting.

**P. Simhachalam, Vijayawada**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లోకి అనువదించండి.

సెలవుల గురించి అడిగితే సార్ ఏమన్నారు?

**A.** What did the teacher say about holidays?

**Q.** ఇతరుల అభిప్రాయాలను మనం గౌరవించాలే తప్ప, మన అభిప్రాయాలను వాళ్లపై రుద్దకూడదు.

**A.** We should only respect others' opinions but not impose our opinions on them.

**Q.** నేను నా జీవితంలో ఏదైనా సాధించాల్సిన సమయం వచ్చింది.

**A.** The time has come when I should achieve something in life.

**Q.** అయినా కష్టాలు మనకు చెప్పి వస్తాయా ఏంటి? కాలానికి తగ్గట్టుగా సర్దుకుపోవడమే.

**A.** We can't anticipate/ No knowing when we face troubles. We've to get adjusted with them/ take them in their stride.

**Q.** రఘుకు నీ సెల్‌ఫోన్ గురించి చెప్పకుండా మంచి పని చేశావు. లేకపోతే బ్యాలెన్స్ ఫోన్‌లో వేయమని మన జేబులు చిల్లులు చేసేవాడు.

**A.** You did a good thing, not telling Raghu about the cell phone. Otherwise he'd have made a hole in our pockets by ... (Balance phone లో వేయడమంటే అర్థం కాలేదు)

**Q.** భవిష్యత్ కాలానికి సంబంధించిన will/ shall + infinitive, be form + going to, Be about to, simple present tense, present continuous tense, (am, is was) be + to గురించి తెలుపగలరు. వీటిని వాడే సందర్భాలను ఉదాహరణలతో వివరించండి.

**A.** తెలుసుగదా? I/ We + shall, he/ she/ it/ they + will- అంత కచ్చితంకాని భవిష్యత్తును తెలియజేస్తాయి. I shall be here again- నేనిక్కడ మళ్లీ ఉంటా (కచ్చితం కాదు) He will go tomorrow- రేపు వాడు వెళ్తాడు (కచ్చితంకాదు) అదే I/ we + will- మాట్లాడే వాళ్ల నిర్ణయాన్ని, ఉద్దేశాన్ని, వాళ్ల మాట ఇవ్వడాన్ని తెలుపుతుంది.

He/ she/ it/ they + shall- orders (ఆజ్ఞలు), నిబంధనలు, మాట ఇవ్వడానికీ వాడతాం. అయితే, Modern English లో ముఖ్యంగా spoken form లో, will అన్నింటికీ వాడుతున్నారు. ఒక నిబంధనలు తెలిపేందుకే he/ she/ it/ they shall వాడుతున్నాం.

shall be/ will be doing- భవిష్యత్తులో అనుకున్న ఓ సమయానికి, జరుగుతూ ఉండే పనికి చెబుతాం.

I shall/ will be discussing this matter with him tomorrow- రేపీ విషయాన్ని అతడితో చర్చిస్తుంటాను.

Be (am/ is/ are/ was/ were) going to do (something)= భవిష్యత్‌లో ఏదైనా చేయబోతున్నామని/ జరుగుతుందని చెప్పడం.

He is going to pay the bill tomorrow= అతడు రేపు bill చెల్లించబోతున్నాడు- ఇది He will pay the bill కంటే కచ్చితం.

(He shall pay the bill = అతడు బిల్ చెల్లించాలి- Order/ rule)

He is to pay (be form + infinitive) the bill = అతడు bill చెల్లించాలి/ చెల్లించాల్సి ఉంది (ఇంకా చెల్లించలేదు)

He was to pay the bill = గతంలో అతడు bill చెల్లించాల్సి ఉండింది (చెల్లించాడు కూడా అనే అర్థం, సాధ్యం)

**Q.** ఇంగ్లిష్‌పై పట్టు సాధించాలంటే మాతృభాష తెలుగుపై పట్టు ఉండాలని అంటున్నారు. అంటే ఏమిటి? అనువాద పుస్తకాలు (ఇంగ్లిష్ నుంచి తెలుగు) చదివి అర్థం చేసుకోవాలా? లేకపోతే ఇంగ్లిష్‌లో sentence structures practice చేసి నేర్చుకోవాలా? Sentence structure కు సంబంధించి కొన్ని అనువాద పుస్తకాల పేర్లు చెప్పండి.

**A.** English వచ్చేందుకు తెలుగు బాగా తెలియాల్సిందే. సందేహంలేదు. ఎందుకంటే మన ఆలోచనలు స్పష్టంగా ఉంటే మనభాష కూడా స్పష్టంగా ఉంటుంది. తెలుగు బాగా తెలిసి ఉంటే, భావ స్పష్టత పెరుగుతుంది. అప్పుడు English లో కూడా మనం స్పష్టంగా చెప్పగలం. Structures practise చేసినంత మాత్రాన English పై పట్టురాదు. Sentence లో పదాల అమరిక (structure) ఇలా ఉండాలి అనుకుని, ఆ ప్రకారం (మాట్లాడేటప్పుడు) పదాలను అమర్చం కదా? English మాట్లాడని వాళ్లమధ్యగదా మనం ఉంటున్నాం. అందుకని next best ఎంత వీలుంటే అంత English చదవడం వల్ల లాభపడతాం. Grammar knowledge, structures అంతగా సాయపడవు. అవకాశం చిక్కినప్పుడల్లా, తప్పో, ఒప్పో మాట్లాడేయడం, వీలయినంతసేపు English వినడం (TV newscasts) వీలయినంత English చదవడం ఉత్తమ మార్గం.

**Q.** ఇంగ్లిష్‌లో standard grammar books పేర్లు తెలుపగలరు.

**A.** మీకు మంచి Grammar books: 1) Essential English Grammar 2) Advanced English Grammar by Reymond Murphy.

**Q.** కింది వాక్యాలను తెలుగులో అనువదించండి.

Let me sleep over it.

**A.** కాసేపాగు. నన్ను కాస్త time తీసుకోనీ, దాన్ని గురించి నిర్ణయించేందుకు.

**Q.** Stop kidding, and don't even joke about it.

**A.** నీ jokes ఆపు. kidding = joke చేయడం

**Q.** Wake up, sleep head. You were no.1 not any more, I suppose.

**A.** Sleepy head, sleep head కాదు - Sleepy head = నిద్రమొహం (పూర్తిగా నిద్రమత్తు నుంచి కోలుకోని వాళ్లు). Wake up, sleepy head. You were no.1. Not any more = మేల్కో, నిద్ర మొహమా. ఒకప్పుడు నువ్వు నెం.1. ఇప్పుడు కాదు.

**Q.** Stop yapping and get the hat out of my house.

**A.** పిచ్చిపిచ్చిగా కోపం తెప్పించేట్టు వాగకు. పో, ఇక్కడ్నించి. (Get out)

**Q.** Are you no nuts? This is Vijayawada.

**A.** నీకేమన్నా పిచ్చెక్కిందా? ఇది విజయవాడ.

**Q.** If you speak another word you're fired.

**A.** ఇంకోమాట మాట్లాడావంటే నీ ఉద్యోగం ఊడుతుంది. (fire = ఉద్యోగం నుంచి తొలగించడం).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# I've asked them over for Deepavali

M.SURESAN



**D. Umapathi, Adilabad**

**Q.** Let me know the difference between 'Surety' and 'Guarantor', which words being used various places in finance and banking sectors. Is there any legal terminology demands to write like 'Guarantor' instead of 'surety'. Please give some examples with usage.

**A.** 'Guarantor' is a general term (a non legal word) which means a person who agrees to be responsible for somebody's behaviour in general or accepts the responsibility to see something happens.

'A 'Surety' is a legal word. It means 1) an amount of money offered as a promise that you will repay a debt (on your/ someone else's behalf), appear in court, etc., 2) a person who takes the responsibility to repay a debt if the debtor fails to repay the debt, appear in court on their behalf.

**V Madhulalitha, Tadipatri**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో వివరించగలరు.

Opposition leaders తమ పార్టీ కార్యకర్తల చేత ధర్నా చేయించారు.

**A.** The opposition leaders had a dharna staged by their party men.

**Q.** చాలామంది ప్రజలు రాష్ట్రంలో మద్యాన్ని నిషేధించాలని కోరుతున్నారు.

**A.** A large number of people want a ban on liquor in the state.

**Q.** మీరు డబ్బులు ఇస్తామంటే నేను వస్తాను. లేదంటే రాను.

**A.** I won't come unless you pay.

**Q.** అతడు తన తల్లిని ఆసుపత్రిలో చూపిస్తానని చెప్పి చూపించలేదు.

**A.** He said he would take his mother to hospital but didn't.

**Q.** మీరు నాకు ఇంగ్లిష్ నేర్పిస్తానని చెప్పి నేర్పించలేదు.

**A.** You said you would teach me English, but you didn't.

**Q.** పెళ్లికూతురు తల్లిదండ్రులను కనుక్కుని మాకు ఫోన్ చేయమని రాజుతో చెప్పాను.

**A.** I told Raju to find out from the brides parents and phone us.

**Q.** ఎవరు, ఎవరిని కొట్టారు?

**A.** Who beat who?

**Q.** ఎవరు నీకు ఫోన్ చేస్తామని చెప్పారు?

**A.** Who told you they would phone you?

**Q.** జాన్ నాకు ఫోన్ చేస్తానని చెప్పారు.

**A.** John told me he would call me.

**Q.** ఎవరు, ఎవరిని కొట్టించారు?

**A.** Who got whom beaten?

**J. Krishna, Rajapuram**

**Q.** ఔట్ సోర్సింగ్‌కు తెలుగులో అర్థం ఏమిటి?

**A.** ఏదయినా ఓ పెద్ద సంస్థ దానికవసరమైన చిన్నపనులను తమ ఉద్యోగులకు కాకుండా, బయటివారికి అప్పగించడం, BPO = Business Process Outsourcing = వ్యాపారంలో కొన్ని ప్రక్రియలను, బయటివారితో చేయించుకోవడం. చాలా telephone కంపెనీలు, వాళ్ల బిల్లుల తయారీని, తయారైన బిల్లులను, customers కు పంపడాన్ని, కొన్నికొన్నిచోట్ల వాటిని వసూలు చేయడాన్ని ఇతర సంస్థలకు అప్పగిస్తుంటాయి- ఇది BPO. అలాగే పెద్ద, పెద్ద కార్లు తయారుచేసే సంస్థలు, వాటికి కావాల్సిన horns, screws, nuts, head lamps లాంటి వాటిని చిన్న బయటి company లతో చేయించుకోవడం కూడా BPO.

**Q.** ఫెమినిస్ట్, ఘోస్ట్ రైటర్- వీటికి తెలుగులో అర్థం ఏమిటి?

**A.** Feminist = స్త్రీల హక్కులకు మద్దతిచ్చి పోరాడేవారు. Ghost Writer = ఇంకొకరికి ఏదయినా రాసి పెట్టేవారు (వ్యాసాలు, గ్రంథాలు లాంటివి)

**Q.** మీ అన్నదమ్ముల్లో నువ్వు ఎన్నోవాడివి? అని ఇంగ్లిష్‌లో ఎలా అడగాలి?

**A.** దీనికి English లో సరైన మాటల్లేవు.

**Q.** 'ఇలాగయితే ఎలా? ', 'కలకాలం వర్ధిల్లు'. ఈ వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** 'If this is so, how can we get on?'

'May you live long with all prosperity.'

**Q.** That's why wife treats husband like toxic waste - అర్థం తెలుగులో వివరించగలరు.

**A.** అందుకనే భార్య భర్తను, విషకరమైన వ్యర్థ పదార్థంగా చూస్తుంది.

**Q.** All that you can afford ..

**A.** నువ్వు కొనగలిగిందల్లా- All that you can afford is just a cycle = నువ్వు కొనగలిగిందల్లా ఒక సైకిల్ మాత్రమే.

**Q.** ఎన్‌సైక్లోపీడియా అంటే అర్థం ఏమిటి?

**A.** Encyclopedia = విజ్ఞాన సర్వస్వం. మనకు కావాల్సిన ఏ విషయం గురించయినా తెలియజేయగల పుస్తకం.

**Naga Srinivasa, Chirala.**

**Q.** కింది Phrasal verbs కు తెలుగులో సరైన అర్థాలను తెలుపగలరు.

Accord with, Account for, Account, Ace out, Ache for, Act out, Act up, Add up, Add upto, Agree with, Aim at, Allow of, Allude to, Amount to, Angle for, Announce against, Announce for, Answer for, Answer to, Ante up, Arrive at, Arse about/ around, Ascribe to, Ask after, Ask around, Ask for, Ask in, Ask out, Ask over/ round, Aspire to.

★ Accord with = సరిపోవడం. The government's actions are not in accord with their policies = ప్రభుత్వ చర్యలు దాని విధానాలకు సరిపోవడం లేదు/ వారి విధానాలకు, చర్యలకు పొంతనలేదు. పొంతనలేదు అనేదాన్ని ఎక్కువగా not తో వాడతాం.

★ Account for = 1) కారణమవడం/ వివరించడం.

The traffic jam accounts for the delay of my arrival = Traffic jam కారణంవల్ల నా రాక ఆలస్యం అయింది.

2) ఒక మొత్తం/ సంఖ్య అవడం: Andhras account for 50% of the pilgrims to Sabarimala = శబరిమల యాత్రికుల్లో 50 శాతం ఆంధ్రులే.

★ Ace out = defeat = ఓడించడం. The Indian team aced out Australia in the last test match = గత test match లో భారత జట్టు ఆస్ట్రేలియాను ఓడించింది.

★ Ache for= ఎక్కువగా కోరుకోవడం/ తపించడం.

The child is aching for a mother's love = తల్లి ప్రేమకోసం తపించిపోతోంది.

★ Act out = ఓ సందర్భాన్ని, కథను నటనలో చూపడం- The teacher made the students act out the lesson on Ekalavya- ఏకలవ్య మీది పాఠాన్ని teacher పిల్లలతో నటింపజేసింది.

★ Act up = 1) (యంత్రాలు/ అవయవాలు) పనిచేయకపోవడం. As Kumble's shoulders acted up, he missed the last test = కుంబ్లే భుజం సరిగా పనిచేయకపోవడంతో గత test ఆడలేకపోయాడు.

2) పిల్లల్లాంటివాళ్లు అతిగా ప్రవర్తించడం. The teacher made the boy stand as he acted up = అతిగా ప్రవర్తించడం వల్ల teacher అతడిని నిలబెట్టాడు. Don't act up. you may face trouble = అతిగా ప్రవర్తించకు. చిక్కుల్లో పడగలవు.

★ Add up = పెరగడం.

The amount he saved added upto Rs. 10,000/- = తను దాచుకున్న మొత్తం 10 వేలదాకా పెరిగింది.

★ Add up to = సరైన కారణమవడం. He hasn't attended classes for a week. What does it add up to?. He doesn't like studies= వారంగా అతడు classes కు రావడంలేదు. కారణం తెలుస్తూనే ఉంది కదా? అతడికి చదువు ఇష్టం లేదు.

★ Agree with = ఏకీభవించడం. He doesn't agree with his father in the matter of dowry = కట్నం విషయంలో అతడు తన తండ్రితో ఏకీభవించడం లేదు.

★ Aim at = లక్ష్యంగా పెట్టుకోవడం. Both Lalu and Mayavathi are aiming at PM's office = లాలూ, మాయావతీ ఇద్దరూ PM పదవిని లక్ష్యంగా పెట్టుకున్నారు.

★ Allow for = పరిగణనలోకి తీసుకోవడం. It shouldn't cost more than Rs.20000/- even after allowing for the recent rise in prices = ధరల పెరుగుదల పరిగణనలోకి తీసుకున్నా దాని ధర 20000 రూపాయలకు మించదు.

★ Allow of = సుసాధ్యం చేయడం. The delay in the release of books allows of only one reason- the government wants to help black marketeers. = పాఠ్యపుస్తకాల విడుదలలో జాప్యానికి ఒక కారణమే సాధ్యం- ప్రభుత్వం black market వాళ్లకు సాయపడాలనుకోవడం.

★ Allude to = పరోక్షంగా ప్రస్తావించడం. The minister in his speech alluded to the past government's failures = తన ప్రసంగంలో మంత్రి గత ప్రభుత్వ వైఫల్యాలను గురించి ప్రస్తావించారు (పరోక్షంగా).

★ Amount to = 1) కొంత మొత్తం అవడం. The fares to the place and back amount to a thousand rupees = అక్కడికి వెళ్లి తిరిగొచ్చేందుకు 1000 రూపాయలు అవుతుంది.

2) ఒకదానికింద లెక్కవడం/ ఒకదానితో సమానమవడం your behaviour amounts to violation of duty = నీ ప్రవర్తన విధి ఉల్లంఘన కిందికి వస్తుంది/ తో సమానం.

★ Angle for = ఒకదాన్ని కోరుకోవడం (బయటికి చెప్పకుండా). He is angling for Prime ministership = అతడి దృష్టి ప్రధాని పదవి మీద ఉంది.

★ Announce against = (రాజకీయాల్లో) ఒక రాజకీయ నాయకుడికిగానీ, పార్టీకిగానీ బహిరంగంగా వ్యతిరేకత తెలపడం.

The very people who announced against the party are getting ready to join it now = బహిరంగంగా ఆ పార్టీకి వ్యతిరేకత తెలిపినవాళ్లు, ఇప్పుడా పార్టీలో చేరేందుకు సిద్ధపడుతున్నారు.

★ Announce for x Announce against = ఒక నాయకుడికి/ పార్టీకి బహిరంగంగా మద్దతు తెలపడం = A number of TDP members have announced for PRP = TDP సభ్యులు చాలామంది PRP కు బహిరంగంగా మద్దతు తెలిపారు.

★ Answer back = (ముఖ్యంగా పిల్లలు) పెద్దవాళ్లకు బదులు/ ఎదురు చెప్పడం.

The mother told the child not to answer back = తనకు ఎదురుచెప్పొద్దని బిడ్డను తల్లి గదమాయించింది.

★ Answer for = 1) ఇతరులకు నమ్మకం, నాణ్యత (వస్తువుల విషయం కూడా) గురించి భరోసా ఇవ్వడం. I worked in the company for a year. I can answer for the quality of their products = ఆ company లో నేను ఒక ఏడాది పనిచేశాను. వాళ్ల తయారీల నాణ్యతకు నేను పూచీ ఇవ్వగలను.

2) సంజాయిషీ ఇచ్చుకోవడం= I am doing it on your advice. You have to answer for the consequences = నీ సలహా మేరకు నేనీ పనిచేస్తున్నా. ఫలితాలకు నీదే బాధ్యత/ నువ్వే సంజాయిషీ ఇచ్చుకోవాలి.

★ Answer to = జవాబుదారీగా ఉండటం. He answers only to the Managing Director of the company = ఆ సంస్థ M.D. కే అతడు జవాబుదారీ.

★ Ante up = చెల్లించడం. If you want a good Engineering degree you have to ante up at least 60 to 70 thousand rupees = మంచి ఇంజినీరింగ్ విద్య కావాలంటే, కనీసం 60 వేల నుంచి 70 వేల వరకూ చెల్లించాల్సి ఉంటుంది. (up the ante = దేన్నయినా పెంచడం, ముఖ్యంగా ధరలను)

★ Arrive at = ఒక చోటికి/ ఒక సమయంలో చేరడం. The train arrived at Hyderabad at 12 noon.

★ Arse about = (ఇదికాస్త బూతు మాట) = పెద్దల, గౌరవనీయుల సమక్షంలో వాడకూడనిది - ప్రాముఖ్యం లేని విషయాలతో సమయం వృథా చేయడం.

He arses about talking about films.

★ Ascribe to = ఒకరికి ఒక గుణం (ముఖ్యంగా చెడు గుణం) ఉందని చెప్పడం/ లేని గుణాలు అంటగట్టడం. Don't ascribe selfishness to me = నాకు స్వార్థం అంటగట్టకు.

★ Ask after = ఒకరి యోగక్షేమాలు విచారించడం. He asked after you = నీ కుశలం గురించి అడిగాడు అతడు.

★ Ask around = దేన్ని గురించయినా వాకబుచేయడం/ విచారించడం.

I asked around at office if anybody could help me/ I asked around for any vacant house = ఎవరయినా నాకు సహాయం చేయగలరేమోనని విచారించాను/ ఏదయినా ఇల్లు ఖాళీగా ఉందేమోనని వాకబు చేశాను.

★ Ask for = ఎవరికోసమైనా అడగడం. The boss was asking for you after you had left office = నువ్వు ఆఫీస్ వదిలి వెళ్లిన తర్వాత boss నిన్ను గురించి/ నీ కోసం అడిగాడు.

★ Ask in = ఆహ్వానించడం మన ఇంట్లోకి. When I saw him standing in the sun, I asked him in = అతడు ఎండలో నిలబడి ఉండటం చూసి, అతడిని నేను ఇంట్లోకి పిలిచాను/ ఆహ్వానించాను.

★ Ask out = మనం వెళుతున్న/ వెళ్దామనుకున్న చోటికి ఇతరులను ఆహ్వానించడం.

He asked his girl freind out to a movie. = తన girl freind ను సినిమాకు ఆహ్వానించాడు.

★ Ask over = ఎవరినయినా ఇంటికి ఆహ్వానించడం.

I've asked them over for Deepavali = వాళ్లను దీపావళికి మా ఇంటికి ఆహ్వానించాను= ask around.

★ Aspire to = సాధించాలనే ఆకాంక్ష ఉండటం. He is aspiring to be the next CM- తర్వాతి CM గా ఉండాలని అతడు ఆకాంక్షిస్తున్నాడు.

Gandhi never aspired to any position or power = ఏ పదవులను, అధికారాన్ని గాంధీ ఎన్నడూ ఆకాంక్షించలేదు.

**Spoken English** పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm







# How dare you do that?



**K. Rama Rao, Poluru.**

**Q.** Your brother who rides a motor-cycle does not use a helmet. Advise him to use a helmet. దీనికి సమాధానం It would be better for you, using a helmet. ఇది కరెక్ట్ అవుతుందా? లేదా ఇంకా ఏమయినా ఉంటే చెప్పండి.

**A.** It'll be better for you to wear a helmet/ It's better for you to wear a helmet/ You had better wear a helmet (ఇది అన్నింటిలో best).

**Q.** How do you do? దీనికి సమాధానం How do you do? అవుతుందా? వేరే ఏమయినా ఉందా?

**A.** అంతే, How do you do? అనడమే

How do you do ముందు, thank you చేర్చవచ్చు.

**Q.** How are you? అనేదానికి I am fine సమాధానం అవుతుందా? కాదా?

**A.** Thank You, I am fine. How are you, సరైన response.

**Q.** Return these books to the library అనేది కింది వాటిలో ఏమవుతుంది?

a) Making a request

b) Offering a suggestion

c) Giving an order

d) Making a statement

**A.** Return the books to the library - ఇది request/ suggestion/ order అవుతుందా అనేది అది చెప్పేవాళ్ల కంఠధ్వనిని బట్టి ఉంటుంది. కాస్త గట్టిగా చెబితే order. కొంచెం చివరి మాటను ఎక్కువ ధ్వనితో అంటే suggestion. Please చేర్చకపోయినా ఆ ధ్వనితో అంటే request, statement మాత్రం కాదు.

---

**Irfan, Nandyal.**

**Q.** ఎవరితోనైనా రాత్రి 9.00 గంటలకు కలిస్తే ఏమని విష్ చేయాలి? either good evening, or good night.

**A.** Good evening అంటాం. రాత్రిపూట అంతా మాట్లాడి విడిపోయేటప్పుడు, నిద్రపోయే ముందు మాత్రమే good night అనాలి.

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

నేను రేపు ఇల్లు ఖాళీ చేస్తున్నాను.

**A.** I am vacating tomorrow.

**Q.** నేను నీళ్లు పట్టాలి. బిందె ఎక్కడ ఉంది?

**A.** I have to draw/ collect water where's the vessel? (బిందెకు సరైన మాట englishలో లేదు.)

**Q.** Vote of thanks అంటే ఏమిటి? ఎలా చెప్పాలి?

**A.** Vote of thanks అంటే సభ చివర్లో ముఖ్య అతిథులకు, ఇతర ఆహుతులకు, సభ సాఫీగా నడిచేందుకు సహకరించిన అందరికీ, కృతజ్ఞతలు తెలియజేయడం.

మొదట, Chief guest (ముఖ్య అతిథి)/ President/ Chairman (అధ్యక్షులు)/ Guests of honour (గౌరవ అతిథులకు) Thanks చెబుతాం.

It's my privilege now/ I have the privilege now to propose a/ the vote of thanks.

First of all, on behalf of (తరఫున) The Association (సభను నిర్వహించేవారు), and on my (own) behalf, I'd like to thank Sri/ Smt... for her presence here on this occasion. Inspite of his/ her busy schedule, but she has accepted our invitation and be here, and thanks to him/ her once again for his/ her valuable message (సందేశం).

Next, our thanks go to Sri/ Smt.... for...

We like to thank also Sri.../ Smt...

Smt/ Sri... next deserve our thanks for...

We thank also those who decorates the stage, etc.,

Finally we thank all those who are present here for their valuable presence.

ఇది నమూనా మాత్రమే. మన ఊహ, భాషా జ్ఞానాన్ని బట్టి ఇంకా బాగా చెప్పవచ్చు.

**M. Aakamsha, Hyderabad.**

**Q.** Should have been, Could have been ఇలాంటి be forms కు Question tags ఎలా తీసుకుని రాయాలి? (should or have).

**A.** Should have been, could have been కు Question tags, should, couldతోనే form చేస్తాం.

He should have been here by now, shouldn't he?

She could have been a collector, couldn't she?

**Q.** Split infinitives కు అర్థం ఎలా వస్తుందో ఉదాహరణలతో వివరించండి.

**A.** Infinitive అంటే, to + 1st RDW (Regular Doing Word) - to go, to come, to sing, etc. ఈ infinitive వాడేటప్పుడు, to కు, 1st RDW లకూ మధ్య ఏ మాటా వాడకూడదని rule.

I request you to kindly help me. ఈ sentence లో to help infinitive. To, help లకు మధ్య kindly రావడం వల్ల - to kindly help, split infinitive. (Infinitive ను విడదీయడం). I request you to help me kindly అనలేం. ఎందుకంటే (kindly (దయతో) me తర్వాత వస్తుంది కాబట్టి. అలా రావడం వల్ల help అనేదానికి Kindly దూరమై అర్థం సరిగా రాకపోవచ్చని. అందుకని కొందరు to kindly help అనడం ఇష్టపడతారు.

Grammar ప్రకారం ఇలా రాయడం తప్పు అయితే ఇప్పుడు ఇలా ఉపయోగించడం వాడుకైపోయింది.

ఇంకో విషయం request అనడంలోనే దయతో అనే భావం వస్తుంది కాబట్టి request వాడితే Kindly వాడనవసరం లేదు.

I request you to help me చాలు. He told me to slowly drive the car. ఇక్కడ కూడా to slowly drive, split infinitive- తప్పే. He told me to drive the car slowly, better. Split infintive అయినా split చేయని infinitive అయినా అర్థం మారదు.


M.SURESAN

**Q.** Vocabulary పెంచుకోవడానికి ఏవైనా పద్ధతులుంటే తెలుపగలరు?

**A.** ఎంత English చదివితే, అంత Vocabulary పెంచుకోవచ్చు. Vocabulary మీద పుస్తకాలు కూడా చాలా ఉన్నాయి.

**Q.** అంతేకదా? అనడానికి ఇంగ్లిష్‌లో ఏమనాలి?

**A.** Isn't it so?

**Q.** 'అలాంటప్పుడు' ను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Then/ in such a case

**Q.** 'ఎలాగోలా' అని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** Somehow or the other.

**Q.** Can కు able to కు భేదం క్లుప్తంగా చెప్పండి.

**A.** Can = చేయగలిగి ఉండటం - ఇది వాడినప్పుడు మనం చేస్తూ ఉండొచ్చు లేకపోవచ్చు.

Able to = చేయగలిగి, చేస్తున్నాను.

I can play cricket = నేను cricket ఆడగలను.

(ఈ వాక్యంలో ఆడటం జరిగిందా లేదా తెలియదు)

I am able to cricket = ఇప్పుడు నేను cricket ఆడగలుగుతున్నాను. ఆడుతున్నాను కూడా. అయితే రెండింటికీ అంత తేడా లేదు.

---

**K. Chandu, Sirisilla.**

**Q.** కింది వాక్యాలను తెలుగులో వివరించగలరు.

They shall have done it;

**A.** They shall have done it = భవిష్యత్తులో ఒక time లోపల వాళ్లది చేసి ఉండాలి.

They shall have finished the work by the time I return = నేను తిరిగొచ్చే సరికి వాళ్లు పని పూర్తిచేసి ఉండాలి.

**Q.** They should have done it.

**A.** They should have done it = వాళ్లది చేసి ఉండాల్సింది (కాని చేయలేదు)

**Q.** They will have done it; they would have done it.

**A.** They will have done it = Future లో ఒక time కు చేసేసి ఉంటారు.

They would have done it = వాళ్లది చేసే వాళ్లే (కానీ చేయలేదు)

**Q.** They can have done it; they could have done it.

**A.** They can have done it = (ఇప్పుడు) చేయగలిగి ఉంటారు/ అయిపోయుండొచ్చు - ఇది ఎక్కువ వాడం.

They could have done it = వాళ్లది చేయగలిగేవాళ్లే కానీ చేయలేదు.

**Q.** They may have done it; they might have done it.

**A.** They may have done it = చేసేసి ఉండొచ్చు They might have done it = వాళ్లది చేసి ఉండొచ్చు

**Q.** They must have done it;

**A.** They must have done it = చేసి ఉండాలి వాళ్లు, అయిపోయి ఉంటుందనే అర్థంతో.

They must have passed the exam = Exam pass అయ్యే ఉండాలి. Otherwise they wouldn't have got the job = లేకపోతే వాళ్లకు job వచ్చేది కాదు (వచ్చింది)

**Q.** They need have done it; they ought have done it; they seem have done it.

ఇక్కడ dare, need, seem, ought ల తర్వాత to వస్తుంది కదా. అందువల్ల వీటిని to తో ఎలా ఉపయోగించాలో చెప్పండి.

They ought to have done it = వాళ్లది (తమ ధర్మంగా / నైతిక బాధ్యతగా) చేయాల్సింది, కానీ చేయలేదు.

**Q.** They dare have done it. వివరించండి.

**A.** Dare కు రెండర్థాలున్నాయి-

1) సవాలు చేయడం 2) ఎంత ధైర్యం? అనే భావం. సవాలు చేయడం అనే అర్థంతోనే dare to వస్తుంది.

He dared me to a fight = నన్ను అతడు పోట్లాటకు సవాలు చేశాడు.

Dare = సాహసించడం/ ఎంత ధైర్యం అని questionలో ఆ ధైర్యంలేదు, అని negativeలో వాడతాం. ఇక్కడ to రాదు.

How dare you do that? = అది చేసేందుకు ఎంత ధైర్యం నీకు?

He dare not face her = ఆమెను ఎదుర్కొనే ధైర్యం అతడికి లేదు.

Need ను రెండు రకాలుగా వాడతాం -

1) Main verb గా I need your help = నీ సహాయం నాకవసరం she doesn't need any more money = ఆమెకు ఇంకేమీ డబ్బు అవసరం లేదు.

2) Need as a helping verb - ఇది ఎక్కువగా question తోనూ, లేదా not తోనూ వాడతాం.

You need not pay now = నువ్విప్పుడు చెల్లించనవసరం లేదు.

Need వాడకంలో British, American English ల మధ్య తేడా ఉంది.

American English లో need ను helping verb గా వాడటం చాలా అరుదు.

a) British Englishలో You need not go (need - helping verb) =

American English:

You don't need to go (need - main verb)

b) British English: Need they go now?

(need - helping verb) =

American English:

Do they need to go now?

Need విషయంలో British Englishకు, American Englishకు అర్థంలో కూడా తేడా ఉంది.

British Englishలో needకు అర్థం, have to/ must అని వస్తుంది. అయితే ఎక్కువగా questionలో/ notతో వస్తుంది.

Need I see the officer now?

a) British English:

నేనిప్పుడు officer ను చూడాలా? (must/ have I to see the officer?)

Do I need to see the officer now? American English: నేనిప్పుడు officer ను చూసే అవసరం ఉందా?

b) He need not have gone there - British English: వాడక్కడికి వెళ్లాల్సిన విషయం కాదు. (కానీ వెళ్లాడు) - వెళ్లకుండా ఉండాల్సింది.

He didn't need to go there - American English వెళ్లే అవసరంలేదు (వెళ్లుండొచ్చు/ వెళ్లకపోయుండొచ్చు)

గుర్తుంచుకోవాల్సింది- American Englishలో need ఎక్కువగా main verb; దీని తర్వాత పైన తెలిపినట్టు 'to' వస్తూంటుంది.

Seem అంటే అలా కనిపిస్తోంది/ కనపడుతున్నారు అని కదా: seems తర్వాత to be/ to + 1st RDW (do, go, take etc.,)/ to have + past participle (pp) వస్తాయి.

a) He seems to be a good fellow = అతడు మంచివాడుగా కనిపిస్తున్నాడు.

b) He seems to like it = దానిని అతడు ఇష్టపడుతున్నట్టు కనిపిస్తున్నాడు.

c) He seems to have gone home = అతడు ఇంటికి వెళ్లిపోయినట్టుంది.

Ought to - ఒక పనిని నైతిక బాధ్యతగా చేయడం (must - ఆజ్ఞ/ అవసరం)

He ought to take care of his children = తన పిల్లలను గురించి అతడు శ్రద్ధ తీసుకోవాలి (ధర్మం, నైతిక బాధ్యత)

You ought to have given him some respect; after all he is much older than you = అతడికి నువ్వు మర్యాద ఇవ్వాల్సింది; ఏదేమయినా అతడు నీకంటే చాలా పెద్ద కదా?

---

**K. Krishnaiah, Rajampeta.**

**Q.** అతడే కదా నిన్న వచ్చింది? is not he who came yesterday? ఇది కరెక్టేనా?

**A.** Is he not the one/ Isn't he the one who came yesterday?

**Q.** He is a man who came yesterday.

This is he (man) who came yesterday.

వీటిలో ఏది కరెక్టు? లేదా సరైన వాక్యం తెలుపండి.

**A.** This is the man (one) who came yesterday.

**Q.** కిందివాటిని ఇంగ్లిష్‌లోకి మార్చండి.

- నీ రుణం నేను తీర్చుకుంటాను.

- పెళ్లిలో వాడే అక్షింతలు

**A.** I am ever indebted to you/ I can't repay your debt.

Termeric coated rice అనొచ్చు కానీ, English లో సరైన మాటలేదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# You don't measure upto that

M.SURESAN



**K. Krishnaiah, Rajampeta.**

**Q.** ఎలా పోవాలనుకుంటున్నావు?

How do you planning to go.

How do you thinking to go.

రెండూ కరెక్టేనా?

**A.** రెండింటిలో ఏదీ correct కాదు. How do you planning...? ఈ మీ sentence లో, verb లేదు కదా? మీరు How are you planning to go? అనాలి, లేదా How do you plan to go? అనాలి. Do... planning, మేం తెలిపిన ఆరు forms of verbs లో లేదు కదా: ఆ six forms of verbs ఇవి:

1) Be forms (am, is, are, was, were, 'be', 'been' చివర వచ్చేవి.)
2) Be forms + .. ing form (am going, has been singing, etc)
3) Be form + past participle (Passive voice) (am seen, was done, should be taken, etc.)
4) Have, has, had, shall have, should have ... etc + past participle (Have seen, has gone, should have known, etc.)
5) Doing words: 1) Ist regular doing words (go, come, sing, walk, etc.)
2) IInd Regular doing words (goes, comes, sings, walks, etc) and 3) went, gave, sang etc.,.) and
6) Shall/ should/ will/ would/ can/ could etc + Ist RDW (shall take, will give, can take, should give, etc). ఈ 6 formsలో ఏదో ఒకటి లేకుండా sentence ఉండదు. మీ sentence How do you planning to go? ఈ group of words లో, పైన తెలిపిన 6 forms లో ఏదీ లేదు కదా? అందుకని మీరు రాసింది sentence కాదు. How do you plan/ How are you planning? ఉండాలి. అలాగే How do you thinking to go? ఇందులో కూడా, verb లేదు. How do you think of going? అనాలి.

**G. Viajayakumar, Anantapur.**

**Q.** కింది వాక్యాలు కరెక్టేనా వివరించగలరు.

The box is very heavy for me to lift.

**A.** The box is too heavy for me to lift అనడం కరెక్ట్. Very heavy for me to lift అనం. Very heavy and I can't lift it అనవచ్చు

**Q.** The film is too good.

**A.** దీనికి వివరంగా ఇంకేదన్నా చేరిస్తే correct గా ఉంటుంది. The film is good కూడా correct, అయితే అలా అన్న సందర్భం తెలియాలి.

The film is too good; I don't want to miss it. (నేను వదులుకోలేనంత బాగుందా సినిమా)/ The film is too good for me to miss నేను వదులుకోలేనంత బాగుందని అంటాం.

**Q.** It was too hot yesterday.

**A.** Correct. మనం ఏపనీ చేయలేనంత ఎండగా ఉంది అనే భావంతో. Too ఎప్పుడూ కాస్త negative sense ఇస్తుంది.

**Q.** He is bad dressed.

**A.** He is badly dressed అనడం correct.

**Q.** He married lately in life.

**A.** Lately అంటే ఈ మధ్య అని అర్థం, ఆలస్యంగా అని కాదు. Late అంటే ఆలస్యంగా అని. He married late in his life అనడం correct.

**Q.** He is very stronger than I.

**A.** He is much stronger than I - correct. Very stronger తప్పుకాదు, కానీ వాడుక కాదు.

**Q.** The three sisters quarrelling with each other.

**A.** The three sisters quarrelling with each other - ఇది sentence కాదు, verb లేదు కాబట్టి. Are/ were/ will be etc. quarrelling అంటే verb (be form + ing form) ఉన్నట్లు; అప్పుడు sentence correct అవుతుంది.

**N.V.Krishna Rao, Hyderabad.**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో చెప్పండి.

నేను నిన్న ఊరు వెళ్లాను.

**A.** I was out of town yesterday. (ఏ ఊరు వెళ్లిందీ చెప్పనప్పుడు)

ఏ ఊరైనా వెళ్లి తిరిగి వచ్చిన తర్వాత, ఆ ఊరు (Hyerabad అనుకుందాం) వెళ్లాను / వెళ్లివచ్చాను అని చెప్పడం.

I had been to Hyderabad (yesterday).

**Q.** నేను ఊరు వెళ్లాను.

**A.** I went to (ఊరి పేరు)

**Q.** నేను ఊరు వెళతాను రేపు.

**A.** I am leaving for/ going to/ I will leave for/ will go to (ఊరి పేరు) - ఊరిపేరు చెప్పనప్పుడు - I will be out of town/ I won't be in town tomorrow.

**Q.** నేను ఊరు వెళ్లగలనా?

**A.** Can I go?

**Q.** నేను ఊరు వెళ్లి రాగలనా?

**A.** Can I go to ... and return?

**Q.** పనుల వత్తిడి వల్ల నేను ఊరు (అక్కడకు) వెళ్లలేకపోయాను.

**A.** Because of pressure of work I couldn't / I am unable to leave town/ go to (ఊరి పేరు)

**Q.** ఆర్థిక ఇబ్బందుల వల్ల నేను కలవాల్సిన వ్యక్తిని కలవలేకపోయాను.

**A.** Money problems kept me from meeting the person I had to meet / I couldn't meet the person I had to meet, because of money problems.

**S.Ramulu, Hyderabad.**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

"నీకు అంత సీన్ లేదు."

"నేను నీకు నచ్చానా?"

**A.** You don't measure up to that.

Do you like me?

**P.Siva Rao, Yellandu.**

**Q.** Kindly explain the difference between bath and bathe

Can I say... I am bathing. Please wait.

**A.** Both has two meanings in British English -

1) As a noun, and

2) As a verb.

I have a bath every morning = I bath every morning. I am bathing is correct.

I bath every morning (British English)

I bathe every morning (American English)

In any case I have a bath/ I take a bath is more common than I bath / I bathe.

**Q.** What is the difference between a sentence and a clause.

**A.** A sentence is a group of words with a complete meaning. (To have the complete meaning, the group should have a verb in it.)

A clause is a group of words with a verb. eg: If he comes here; Because he sang well; Whenever I go there.

Even a sentence is a clause because it is also a group of words with a verb.

**Q.** What is the difference between a phrase and an idiom.

**A.** A phrase is a group of words without a verb. eg: In case of doubt; on the occasion of his marriage, etc.

An idiom is also a group of words, but in the case of an idiom, the meaning of the idiom as a whole has no connection with that of any word in the idiom.

eg: The long and short of. This is an idiom. The expression means the most important facts about a situation (without all the details)/ the summary of a writing/ a speech.

The long and short of his speech is that he is correct and that the others are wrong = The summary of his speech is he is right and others are wrong. So you see that the words 'long' and 'short' have no connection with the most important details/ summary. Such an expression is an idiom.

**G. Shankar, Shankarapatnam.**

**Q.** మీరు ఒకచోట The student admitted to having taken drugs అని రాశారు. ఇందులో having సరిపోతుంది, taken అదనం కదా. తెలియజేయగలరు. తాగడానికి, తినడానికి having వాడతాం కదా అలాగే ఈ వాక్యంలో having చాలు కదా.

**A.** Admitted to having drugs = Drugs కలిగి ఉన్నట్టు ఒప్పుకున్నాడు. Admitted to having taken drugs = Drugs తీసుకున్నట్టు (పుచ్చుకున్నట్టు) ఒప్పుకున్నట్లు. Having taken లో having, helping verb కదా having done, having seen లోలా, have పుచ్చుకోవడం అనే అర్థంతో వాడాలంటే The student admitted to having had drugs అంటాం.

**Q.** ఒక డిక్షనరీలో I am having a one rupee note అని ఉంది. Having ను (possession) లో వాడకూడదు కదా. I have a one rupee note తప్పా? Having ఏ సందర్భాల్లో వాడాలో తెలుపండి.

**A.** I am having a one rupee note సరికాదు, I have a one rupee note అనడమే correct.

**Q.** 'In order of' ఏ సందర్భంలో వాడతారో వివరించండి.

**A.** In the order of: ఆ వరస క్రమంలో

a) In the order of numbers = సంఖ్యల వరుస క్రమంలో Students are sitting in the order of their roll nos. = విద్యార్థులు వారి roll number క్రమంలో కూర్చుని ఉన్నారు.

b) The officers were seated in the order of their importance = ఆ అధికారులు తమ ప్రాముఖ్యం క్రమంలో ఆసీనులయ్యారు.

**Q.** Let's sum up అంటే తెలుగులో అర్థం తెలియజేయగలరు.

**A.** Let us sum up = మనం చెప్పుకున్న చర్చించిన విషయాలు, సంక్షిప్తంగా స్పష్టంగా మరోసారి చెప్పుకోవడం.

**B. Vijaya Raju, Sangareddy.**

**Q.** Love, appear, owe, own, think లాంటి పదాలను continuous tense లో ఎందుకు రాయకూడదు?

**A.** Love, appear, owe, own, think లాంటి verbs continuous tense లో రాకపోవడం English భాషాధర్మం/ వాడుక (usage). English మాతృభాషగా ఉన్నవాళ్లు మొదటి నుంచి ఈ verbs ను continuous tense లో వాడకపోవడం వాడుకయినందువల్ల అది భాష ధర్మమైంది.

**Q.** Deal in అనే పదాన్ని 'వ్యాపారం చేయడం' అనే అర్థంలో, Deal with అనే పదాన్ని 'నిర్వహించు' అనే అర్థంలో ఎందుకు ఉపయోగించాలి?

**A.** Deal తర్వాత వచ్చే preposition ను బట్టి అర్థం మారడం కూడా usage విషయమే కదా.

ఇలాంటి expressions ను, deal in, deal with phrasal verbs అంటాం. తెలుగులో ఒకరిమీద కోపం వచ్చిందంటాం కదా? ఇక్కడ ఒకరిమీద అనే ఎందుకనాలి? ఒకరితో కోపం వచ్చిందని ఎందుకనకూడదూ? అంటే ఏం సమాధానం చెబుతాం? ఆ భాష తీరు అంతే అని చెప్పుకోవాల్సిందే. English లోనూ అంతే.

**M. Ravichandra Reddy, Hyderabad**

**Q.** కింది పదాలను ఇంగ్లిష్‌లో ఏమంటారో తెలుపండి.

రోలు, రోకలిబండ, పొత్రం, పచ్చడి, పప్పుగుత్తి, రుబ్బడం

**A.** రోలు = Mortor- అయితే ఇది మనం వాడే రోలంత పెద్దది కాదు.

రోకలిబండ = Pestle (పెస్‌ల్)

పొత్రం = Grinder, పచ్చడి = Chutney

పప్పుగుత్తి = Pestle, రుబ్బడం = Grind

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో అనువదించండి.

నేను మా అమ్మకు పచ్చడి దంచడంలో సహాయపడతాను.

**A.** I help mother in making/ grinding chutney.

**Q.** నేను వంటల రుచిని ఇట్టే పసిగట్టగలను.

**A.** I can easily sense the flavour of cooking

**Q.** వంటలో ఏమి తక్కువైందో సులభంగా గ్రహించగలను.

**A.** I can easily grasp what is wrong in the cooking of an item.

**Q.** రోలు, రుబ్బురోలు ఒకటేనా? ఇంగ్లిష్‌లో వేర్వేరు పదాలున్నాయా?

**A.** 'Mortor' is the only word, nearest in meaning to all of them.

**Q.** గ్రామంలో అందరికీ కలిపి ఒక పెద్ద రోలు ఉంటుంది, దానికేమైనా పేరుందా?

**A.** The village mortor అనొచ్చు

**A.Sudhakar, Peddamallareddy (Nizamabad)**

**Q.** Why choose I (we) shall and you, (he, she,it) will for the future tense?

**A.** Shall and will are natural aspects of the English language. Can we explain why వెళతాం is used with మేము, and, వెళతాను is used with నేను? They are just parts of the language.

Present simple (go, come, see, sees, goes, etc) is used sometimes to denote immediate future, especially when we are definite about the time, it's not a new practice.

a) I go there tomorrow.

b) She comes here next week.

Shall/ will is used for future in general compare:

a) She comes here next week.

b) She will come here next week.

In a) her coming is definite, and

b) her coming is not so certain.

That's the difference between the use of shall/ will for future and the present simple for future.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




**Durga:** You cannot tell Ram from Lakshman. I've seen other twins, but no pair so close as these two.

(రామ్, లక్ష్మణ్‌లలో ఎవరెవరో చెప్పలేం. నేను ఇతర కవల పిల్లలను చూసి ఉన్నా. కానీ మరీ ఇంత పోలికలున్న కవలలను చూడలేదు)

**Venkat:** True. I've seen them a good number of times, but telling them apart, - I give up.

(నిజమే. వాళ్లన్నేను ఎన్నిసార్లు చూశానో, కానీ ఎవరు ఎవరో చెప్పడంలో నేను చేతులెత్తేస్తున్నా.)

Give up = ప్రయత్నం విరమించుకోవడం

**Durga:** But there is some thing that helps. While Ram is quite tidy and always smartly dressed, Lakshman is shabby.

(అయితే మనకు సాయపడేదొకటుంది. రామ్ ఏమో శుభ్రంగా, మంచి బట్టలేసుకుంటే, లక్ష్మణ్ కొంత అశుభ్రంగా ఉంటాడు.

Tidy = శుభ్రంగా ఉండటం - మనుషులు, స్థలాలు, ఇళ్లు.

Tidy x Shabby = అసహ్యమైన

**Venkat:** Yea, I have observed that too. Lakshman just doesn't bother what kind of clothes he wears.

(అవును. అదీ నేను గమనించాను. ఎలాంటి బట్టలు వేసుకుంటాడో అసలు పట్టించుకోడు లక్ష్మణ్)

**Durga:** Infact, Ram's clothes can set him apart even in a crowd.

(అసలు, ఎంత జనంలోనైనా రామ్ బట్టలు అతడి ప్రత్యేకతను తెలుపుతాయి)

1) You can't tell Ram from Lakshman.
2) ... but telling them apart, - I give up.
3) Ram's clothes can set him apart even in a crowd.

**1) Tell onething from another** - ఒకదానికీ/ వ్యక్తికీ, ఇంకోదానికీ/ వ్యక్తికీ తేడా తెలుసుకోవడం/ చెప్పగలగడం.

a) It is difficult to tell an Indian from a Pakistani (భారతీయులకూ, పాకిస్థానీయులకు తేడా చెప్పడం కష్టం - ఇద్దరూ ఒకేలా ఉంటారు అని)

b) He, speaking English?! He cannot tell 'a' from 'b'. అతడు English మాట్లాడటమా?! అతడికి a కు, b కు తేడా తెలియదు.

c) I can't trust him with a car. He cannot tell a steering wheel from a gear = Carను అతడితో drive చేయించడం నాకు నమ్మకం లేదు (అతడి driving మీద నాకు నమ్మకం లేదు). అతడికి steering wheel కు, gear కూ తేడా తెలియదు.

**2) Tell something apart** = తేడా తెలిసి ఉండటం.

a) 'Can you tell one Indian movie from another?' (ఒక భారతీయ సినిమాకూ ఇంకో సినిమాకూ తేడా చెప్పగలవా?)

'No, I can never tell them apart. Only the actors are different. Fights, duets and dances are there in every movie.'

(అబ్బే, నేను చెప్పలేను. తారలే వేరు. fights, duets, నాట్యాలు అంతా ఒకే రకం)

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 516


M.SURESAN

ఈ expressions English లో చాలా common. చాలా simple expressions. Daily life situations లో బాగా ఉపయోగపడతాయి.

☆ ☆ ☆

English లో there, it లతో sentences begin చేయడం చాలా సాధారణం. తరచూ ఇలా there/ it తో sentence begin చేసినప్పుడు, వాటికి ప్రత్యేకమైన అర్థం ఉండదు. Sentence begin చేసేందుకే వాడతాం. వీటిని ఏ tense లోనైనా వాడొచ్చు

a) There are 40 colleges in this city = ఈ నగరంలో 40 కళాశాలలున్నాయి. గమనించండి. There కు ఉండే 'అక్కడ' అన్న అర్థం ఇక్కడ ఉండకపోవడం.

b) There are a four students here = ఇక్కడ నలుగురు విద్యార్థులున్నారు. చూశారు కదా. ఇక్కడ కూడా there కు ప్రత్యేకమైన అర్థం ఏమీ లేదు. (అలా ఉంటే అక్కడ నలుగురు విద్యార్థులున్నారిక్కడ అనే విపరీతార్థం వస్తుంది కదా? పై రెండు సందర్భాల్లోనూ),

a) 40 colleges are in the city అనడం కానీ,

b) 4 students are here అనడం కానీ అంత సరైన English వాడుక కాదు. అందుకని there వాడతాం. అలాగే 'It' కూడా. అది అనే అర్థంతో కాకుండా sentence begin చేసేందుకే వాడతాం.

b) It is boring to wait for so long = To wait (infinitive)/ waiting for so long is boring.

ఇవి గమనించండి:

a) It is raining
b) It is very hot today
c) It is a long time since we met (మనం కలుసుకుని చాలా కాలమైంది)
d) It is about 300 Km from here to Hyderabad. (ఇక్కడి నుంచి హైదరాబాద్‌కు 300 కి.మీ.)
e) It's 10.15 now (ఇప్పుడు పదింబావు అయ్యింది).

ఇలా time, date, day, distance, weather ను గురించి మాట్లాడేటప్పుడు 'it' తో ప్రారంభించడం దాదాపు తప్పనిసరి.

# I can't trust him with a car

**Venkat:** I will speak to Lakshman about it. Tell him to be a little tidier and smarter.

(ఈ విషయం లక్ష్మణ్‌తో మాట్లాడతాను నేను. కాస్త మంచి బట్టలు తొడుక్కుని కొంత చూడగలిగేట్టు కనపడమని చెబుతా)

**Durga:** You had better.

(అవును. అలా చేయడం మంచిది.)

ఇది కవల పిల్లల పోలికలకు సంబంధించిన సంభాషణ అని తెలుస్తూనే ఉంది కదా. మనుషులను, ప్రదేశాలను గురించి తెలిపేటప్పుడు వారి పోలికలకూ, తేడాకు వాడే phrasal verbs ను గురించి ఇప్పుడు తెలుసుకుందాం. ఇవి చాలా simple expressions. మీ Spoken English చాలా సహజంగా ఉండేలా చేస్తాయి. ఇతరులు మీరు వాడుతున్న సందర్భాన్ని బట్టి సులభంగా అర్థం చేసుకోగలరు.

***Look at the following expressions from the dialogue above:***

**3) Set (something/ somebody) apart** = తేడా కనిపించడం/ విలక్షణంగా ఉండటం.

a) We have very good batsmen but Tendulkar's talent is distinct. It sets him apart from the rest = మనకు చాలా మంచి batsmen ఉన్నారు. కానీ టెండూల్కర్ ప్రతిభ అతడికీ మిగతా వాళ్లకూ ఉన్న తేడాను తెలుపుతుంది.

b) IITs' excellence sets them apart from the other engineering institutions.

IIT ల రాణింపు వాటిని విలక్షణమైనవిగా చేస్తాయి.

c) You can tell him apart even in a crowd. There is always some thing in him that sets him apart = (గుంపులో కూడా అతడినిట్టే పట్టేయగలం. మిగతా వాళ్లకంటే భిన్నంగా కనిపించేట్టు చేసే విలక్షణత అతడిలో ఏదో ఉంది.)

a) It is easy to learn English = English నేర్చుకోవడం సులభం.

b) It will be difficult for you to get tickets if you delay = ఆలస్యం చేస్తే tickets దొరకడం కష్టం.

c) "Will it take long to learn English thoroughly" = English క్షుణ్నంగా నేర్చుకునేందుకు చాలా కాలం పడుతుందా?

"No. It won't take longer than a few months if you practise regularly." (అదేం లేదు. సక్రమంగా practice చేస్తే రెండు మూడు నెలలకంటే పట్టదు.)

d) It's in his nature to put off things = వాయిదాలు వేయడం అతడి స్వభావంలోనే ఉంది.

అయితే It తో begin చేసే చాలా sentences ను Infinitive తోగానీ, .... ing form తోగానీ ప్రారంభించవచ్చు

a) It is bad to smoke = To smoke (infinitive) is bad = Smoking is bad.

| EXERCISE 1 | ANSWERS |
|---|---|
| **కిందివాటిని There/ It తో practise చేయండి.** | |
| 1) ఈ table మీద 10 పుస్తకాలున్నాయి. | 1) There are ten books on this table. |
| 2) ఆ గదిలో ఎంత మంది విద్యార్థులున్నారు? | 2) How many students are there in the room? |
| 3) ఆ రోజెందుకో చాలా చలిగా ఉండింది. | 3) Some how it was very cold that day. |
| 4) నువ్వింత పొద్దున్నే లేవడం చూడటం చాలా విచిత్రంగా ఉంది. | 4) It is very strange for me to see you get/ getting up so early in the morning. |
| 5) నువ్వు చెప్పేదాంట్లో ఓ point ఉంది. | 5) There is a point in what you say. |
| 6) మహాభారతంలో దీని ప్రస్తావన (reference) ఉంది. | 6) There is a reference to it in the Mahabharatam. |
| 7) అతడిని నిన్న ఇక్కడ చూడటం ఆశ్చర్యంగా ఉండింది. surprize = ఆశ్చర్యం | 7) It was surprizing to see him here yesterday. |
| 8) ఆకాశంలో కోటానుకోట్ల (billions) నక్షత్రాలున్నాయి. | 8) There are billions of stars in the sky. |
| 9) పూర్తి సమాచారం అందేవరకు ఏదీ చెప్పడం కష్టం. | 9) It is difficult to say anything until we get the full information. |
| 10) ఇక్కడ 10 questions ఉన్నాయి. | 10) There are ten questions here. |

| EXERCISE 2 | ANSWERS |
|---|---|
| **కింది సంభాషణ English లో practise చేయండి. Sentences ప్రారంభంలో there, it వాడండి.** | |
| **Preethi:** నిన్న class లో ఎంతమంది విద్యార్థులున్నారు? | **Preethi:** How many students were there in the class yesterday? |
| **Sahithi:** 10 మంది కూడా లేరు. | **Sahithi:** Hardly ten/ There were hardly ten students in the class |
| **Preethi:** విద్యార్థులను class కు రప్పించడం (to make students attend classes) కష్టంగా ఉంది. | **Preethi:** It is (becoming) difficult to make students attend classes. |
| **Sahithi:** బహుశా నిన్నటి వాతావరణమేమో? నిన్నంతా జడివాన కురుస్తూ చలిగా ఉంది. | **Sahithi:** Perhaps it was the weather yesterday. It was raining cats and dogs yesterday. It was cold too. |
| **Preethi:** కొంతమంది teachers రాకపోవడం కూడా ఆశ్చర్యమే. | **Preethi:** It is surprizing that some teachers didn't come either yesterday. |
| **Sahithi:** నిన్న classes cancel చేసుంటే బాగుండేది. | **Sahithi:** It would have been better if we had cancelled classes yesterday. |

**A. Penchalaiah, Rajampeta**

**Q.** It is easy to preach others దీనికి కింది options లో ఏది కరెక్టో వివరించగలరు.

1. Preaching others is easier.
2. To preach others is easy.
3. It is easy to preaching others.
4. With others preaching is easy.

**A.** It is easy to preach to others అనాలి, preach తర్వాత to తప్పకుండా వాడాలి, ఎవరికి బోధించడం అని తెలిపేందుకు. ఇదే అర్థం ఇచ్చే ఇతర sentences.

1. Preaching to others is easy (preaching తర్వాత to రావాలి, comparison లేనప్పుడు, easier అనం)
2. To preach to others is easy (preach తర్వాత to - ఇక్కడ కూడా రావాలి.)
3. It is easy to preach to others- easy to తర్వాత ...ing form రావచ్చు - దీనినే ఇలా అనొచ్చు. It is easy, preaching to others.
4. ఈ sentence పూర్తిగా తప్పు.

**S. Mohinuddin, Gowligeri (Kurnool)**

**Q.** Kindly clarify doubts in the following sentence structures.

1. They have been able to persuade them.
2. She must have been able to notice them.

Structure: (must have been able to + p.v.)

3. They might have been able to solve the problem.

Structure: (might have been able to + p.v.)

**A.** 1. They have been able to persuade them= They have succeeded in making them agree.

2. She must have been able to notice them = She certainly has noticed them.

3. They might have been able to solve the problem = Perhaps they had the ability to solve/ did not have the ability to solve the problem (doubt)

**K.R. Achari, Vykuntapuram**

**Q.** He promised to come, but he never turned up. ఇక్కడ promised - turned రెండూ past actions కదా. Promised అనేది remote past అందుకని had promised రావాలి కదా (Wren & Martin grammar & composition book లో ఉంది). Going to అనే ప్రయోగం తర్వాత go, come రావని మా టీచర్ చెప్పినట్లు గుర్తు. clarify చేయగలరు.

**A.** He had promised to come, but never turned up అనడమే correct, కానీ had promised వాడకపోవడం అనేది అంత తప్పు కాదు - standard writers of English కూడా ఇలా రాస్తున్నారు.

Going to go, Going to come - Modern English లో తప్పుకాదు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**







# All lay loads on a willing horse



**Ramprasad, Kovvur.**

**Q.** సభలు, సమావేశాలు, సదస్సులు, వేదికల మీద ఇంగ్లిష్‌లో మాట్లాడవలసి వచ్చినప్పుడు అనుసరించాల్సిన పద్ధతులు, ప్రారంభం, ముగింపు ఎలా ఉండాలనే విషయాలపై ఏమైనా tips అందించగలరు.

**A.** సభలు, సమావేశాలూ నిర్వహించే తీరు రెండు రకాలుగా ఉండొచ్చు

1) ఒక వ్యక్తి Emcee (Master of Ceremonies) గా వ్యవహరిస్తూ, TV లో anchor/ compere (కంపియర్)లా కార్యక్రమంలోని అంశాలను ఒక దాని తర్వాత ఇంకోదాన్ని announce చేయడం.

2) సభకు అధ్యక్షత (Presiding) వహించే వ్యక్తి (President/ Chairperson) కార్యక్రమంలోని అంశాలను వరుసగా ప్రకటించడం.

1) Emcee నిర్వహణ: Emcee గా వ్యవహరించేవారు మంచి వక్తలై ఉండాలి, ప్రోగ్రామ్‌లోని అంశాల వరుసను జాగ్రత్తగా ప్లాన్ చేసుకోవాలి. ఏ అంశం ఎవరికి సంబంధించిందో ముందే తెలుసుకోవాలి. Emceeing చేసేవాళ్లు తాము తెలిపే విషయాలను ముందుగా practice చేసుకోవడమే కాకుండా అవసరమైతే శ్రోతలకు విసుగు కలగకుండా, వినోదం కలిగేలా సమయస్ఫూర్తితో వ్యాఖ్యలు చేయగలిగి ఉండాలి.

**సభా ప్రారంభం:** Good evening everybody/ to you all. This is (Emcee పేరు) Welcoming you on behalf of (ఎవరి/ ఏ సంస్థ తరఫునో ఆ పేరు చెప్పడం) to this evenings function/ event. In a few moments from now the event will start and may I request all the audience to be seated. (శ్రోతలందరూ కూర్చోమని ప్రార్థన).

2. వేదిక (Dais-డయాస్ కాదు డెయిస్) మీద ఆసీనులయ్యేవాళ్లను వేదిక మీదికు ఆహ్వానించడం. ఇది ఆసీనులయ్యేవాళ్ల ప్రాముఖ్యతా క్రమాన్ని బట్టి ఉంటుంది.

a) We begin our programme now - On behalf of (తరఫున) of the organization (సభను నిర్వహించే సంస్థ) and on my behalf, I invite Sri ... (Head of the organization - సంస్థ అధిపతి) to come up the dais and take his/ her seat. So and so will escort him/ her to his/ her seat ( వేదిక శ్రోతలకు చాలా దూరంగా ఉన్నప్పుడు, అంతదూరమూ ఒక్కరే ఒంటరిగా నడిచి రావడం ఇబ్బందిగా ఉంటుందని అనుకుంటే ఓ ఇద్దరిని, ఆయనను/ ఆమెను వేదిక దగ్గరకు వెంటబెట్టుకుని రమ్మంటాం- escort - (తోడు రావడం).

b) ఇప్పుడు ఆహ్వానించవలసిన వ్యక్తి, సభకు అధ్యక్షత వహించేవారుగాని/ ముఖ్య అతిథిగానీ, ఇద్దరూ వేర్వేరయితే మొదట అధ్యక్షులను వేదిక మీదకు పిలవాలి. అందుకు ఇలా చెప్పొచ్చు:

I now have the pleasure of inviting up the dais Sri/ Smt ... who will preside over the function/ meeting. So and so will accompany him/ her to the dais.

Accompany- అకాంపని - తోడు రావడం.

c) President తర్వాత Chief guest ఆ తర్వాత ఇంకెవరన్నా వేదిక మీదకు రావాల్సి ఉంటే వారినీ వేదిక మీదకు ఆహ్వానిస్తాం. అయితే I now invite, I now invite అని ఒకేమాదిరి విసుగు కలిగే విధంగా మాట్లాడకుండా, కాస్త వెరైటీగా ఉండటం చాలా బాగుంటుంది. ఇక్కడే MC (Emcee) గొప్పతనం తెలుస్తుంది - అలా వెరైటీగా ఉండాలంటే, అప్పుడప్పుడు ముందర practice చేసుకున్న మాటలు కాకుండా, అప్పటికప్పుడు (without preparation) ఆసక్తికరంగా మాట్లాడగలిగి ఉండాలి. దీనినే extemporizing అంటారు. ఇలా ఉండొచ్చు

1) I invite...
2) It's now my pleasure to invite...
3) I feel it a great honour to invite ...
4) Sri/ Smt .... will now do us the honour of being present on the dais.
5) Now sri/ smt... will grace the dais with his/ her presence on the stage. ఇలా చెప్పుకుంటూ వెళ్లొచ్చు, పైన చెప్పినవి నమూనాకు మాత్రమే - సందర్భోచితంగా MC (Emcee) తన ఊహాశక్తి (imagination)తో, వాక్చాతుర్యంతో ఏమయినా చెప్పవచ్చు

a) అందరూ ఆసీనులయ్యాక Garlanding/ Giving bouquets - మాలలు వేయడం/ పుష్పగుచ్ఛాలివ్వడం. ఇది రెండు విధాలుగా చేయొచ్చు 1) ఒక్కోవ్యక్తి stage మీదకు రాగానే ఆయన/ ఆమెకు ఇవ్వడం. 2) అందరూ stage మీద కూర్చున్న తర్వాత అందరికీ ఒకేసారి ఇవ్వడం - ఎవరెవరికి ఎవరు ఇవ్వాలో ముందే రాసుకుని, వారి పేర్లను పిలవడం ... so and so (ఫలానావాళ్లు) will garland so and so (ఫలానివాళ్లను) present a bouquet (బుకే)to so and so.


M.SURESAN

b) అంతా అయిన తర్వాత సామాన్యంగా సభ జ్యోతి వెలిగించడంతో (lighting of the lamp) తో ప్రారంభమవుతుంది. MC అది announce చేస్తారు. ఆ తర్వాత ప్రార్థన (prayer) చేస్తారు. ఇక్కడ, May I request all the gathering to stand in silence as the prayer song is sung అంటాం. (Prayer చాలా క్లుప్తంగా ఉండటం మంచిది - రెండు, మూడు నిమిషాలకు మించకుండా)

ఇక్కడి నుంచి సభా కార్యక్రమాలకు అధ్యక్షత వహించే వారు (President/ Chairperson) announce చేయటం ఒక రకం; MC యే announce చేయడం రెండో విధం.

President announce చేసే పద్ధతిలో అయితే MC ఇలా అంటారు: I now request the president of the evening's function/ meeting to conduct the proceedings, అని, Programme sheet ను ఆయన/ ఆమెకు అందించడం.

MCయే continue చేసే పద్ధతిలో -

c) Welcome address ఉంటుంది. స్వాగత వచనాలు- ఇవి ఎవరయినా చెప్పవచ్చు అందరినీ శ్రోతలతోసహా స్వాగతించడం.

d) Introduction of the President/ Chief Guest: అధ్యక్షులు/ ముఖ్య అతిథిని సభకు పరిచయం చేయడం. ఇది సభకు ముందరి రోజే వారి వివరాలను సేకరించి, ఎవరితోనయినా పరిచయం చేయించడం.

Mr .../ Ms ... so and so will now introduce the Chief Guest అనే వాక్యంతో (సామాన్యంగా పుట్టిన తేదీ, స్వస్థలం, విద్య, ఉద్యోగ వివరాలు, సాధించినవి - ఇలాంటి వివరాలు).

e) తర్వాత President/ Chief Guest's speech. MC, The President/ Chief Guest will now address the gathering/ will give his/ her valuable message/ will do us the honour of giving his/ her valuable message/ we shall now have the pleasure of listening to so and so అనే మాటలతో President/ Chief Guest ఉపన్యాసం మొదలుపెట్టడాన్ని ప్రకటిస్తారు.

f) ఇలా ఎంతమంది మాట్లాడితే, అంత మందినీ పరిచయం చేసి వారితో మాట్లాడించిన తర్వాత presentation of Mementos (జ్ఞాపికలు) ఇవ్వడం.

MC ఇలా అనొచ్చు Sri... so and so/ Smt... so and so will do us the favour of accepting this small memento (మమెంటో) from us/ a small token (గుర్తు) of our gratitude for his/ her presence this evening.

ఈ mementosకు ముందు prize distribution (బహుమతుల ప్రదానం) ఉండొచ్చు. Our students will now have the honour of receiving prizes form Mr./ Ms...

g) సభ దాదాపు ముగిసినట్లే - ఇప్పుడు, Vote of thanks - వందన సమర్పణ - సభకు విచ్చేసిన ముఖ్య అతిథులకు/ అధ్యక్షత వహించినవారితో మొదలుపెట్టి, సభను జయప్రదం చేసినందుకు శ్రోతలతోసహా అందరికీ thanks చెప్పడంతో సభ ముగుస్తుంది.

ఇక్కడ కూడా on behalf of ..., I thank so and so (ఫలానావాళ్లు), for such and such a thing (ఫలానావాటికి) ... అని పదేపదే I thank, I thank అని repeat చేయకుండా వెరైటీ కోసం Our thanks are due to/ our thanks go to/ so and so deserve (ఫలానావాళ్లు, మా ధన్యవాదాలకు అర్హులు) our thanks/ we are grateful to so and so/ our gratitude to so and so for .../ a great thank you to ... అని ముగించవచ్చు

**గమనిక:** The Chief guest/ so and so with his/ her auspicious hands give away the prizes (తమ శుభకరమైన చేతులతో - ఈ usage English లో లేదు. అందుకని auspicious వాడకపోవడం మంచిది. అలాగే సన్మానించడం అనే అర్థంతో felicitate అనే మాట English లో లేదు. Honour అంటే చాలు. Felicitate వాడకపోవడం మంచిది. వాడటం సరికాదు కూడా. అరుదుగా felicitations అనే మాట felicitations to you! అని, మీకు సుఖసంతోషాలు కలుగుగాక! అనే అర్థంతో వాడొచ్చు; ఇది కూడా కాస్త పాండిత్యం. దాని బదులు All happiness to you అని వాడొచ్చు

ఇవి సభలూ, సమావేశాలు ప్రారంభం, ముగింపు నిర్వహణకు సంబంధించిన tips. మరిన్ని వివరాలు specific గా ఏదైనా సభను ఊహించుకుని, మాటలతో సహా నిర్వహించవలసిన విధం మరో సందర్భంలో తెలుసుకుందాం.

**P.S. Reddy, Guntur**

**Q.** 'ఎప్పుడయినా మోసేవారి మీదనే ఇంకాస్త భారం పడుతుంది' అని ఇంగ్లిష్‌లో చెప్పడానికి All lay loads on a willing horse అంటే సరిపోతుందా?

**A.** మోసేవారి మీదనే ఇంకాస్త భారం పడుతుంది = All lay loads on a willing horse - correct.

**N. Srinivas Rao, Nutakki (Guntur)**

**Q.** Verb 3, 4, 5 రూపాల గురించి వివరంగా తెలియజేయగలరు.

**A.** Verb 3వ రూపం (III[rd] form) - Be form + Past Participle (PP) - Am/ is / are / was / were, చివర be వచ్చే shall be / should be / will be / would be etc., లాంటివి, చివర been వచ్చే have been/ has been, shall have been, should have been లాంటివి 'be' forms కదా. Verb III[rd] form లో ఈ be forms లో దేనితోనయినా PP చేరిస్తే verb అవుతుంది. అప్పుడది Passive Voice.

He is seen here every day - verb - is (be form) + seen (PP of see) has been done ( has been - be form) + done (PP of do) ; should be taken (should be - be form) + taken (pp) -ఇవి verbs of the III[rd] form.

**4వ రూపం:** Have/ has / had /shall have/ should have/ will have/ should have / would have / could have ... ఇలా have చివర వచ్చేది ఏదయినా + Past Participle (PP)

He has seen the book.

They would have gone home, etc.,

**5వ రూపం:** ఇవి Doing words. ఇవి మూడు -

1) I[st] Regular Doing Word (I[st] RDW),
2) II[nd] Regular Doing Word (II[nd] RDW) and
3) Past Doing Word (PDW) వీటికి ఉదాహరణలు:

| I[st] RDW | II[nd] RDW | PDW |
|---|---|---|
| come | comes | came |
| teach | teaches | taught |
| sing | sings | sang |
| talk | talks | talked |
| like | likes | liked |
| smell | smells | smelt |

వీటిల్లో Ist RDW ను, I, we, you and they తో II[nd] RDW ను, He, she, it తో వాడతాం.




**ఎల్.పి.సెట్-2008**

లాంగ్వేజ్ పండిట్ ట్రైనింగ్ కోర్సుల్లో ప్రవేశానికి నిర్వహించే ఎల్.పి.సెట్ -2008 నోటిఫికేషన్ విడుదలైంది.

**విద్యార్హతలు:** 1.తెలుగు పండిట్:బి.ఎ. (తెలుగు లిటరేచర్), లేదా బి.ఎ.(ఓరియెంటల్ లాంగ్వేజ్-తెలుగు)లేదా తెలుగు ఒక ఆప్షనల్ సబ్జెక్టుగా ఏదైనా డిగ్రీ లేదా ఎం.ఎ.(తెలుగు).
**2. హిందీ పండిట్:** హిందీ ఆప్షనల్‌గా డిగ్రీ లేదా ఎం.ఎ.(హిందీ) **3. ఉర్దూ పండిట్:** బి.ఎ.లో ఉర్దూ లేదా ఎం.ఎ. (ఉర్దూ).
**వయసు:** 2008 జులై 1 నాటికి 19 సంవత్సరాలు నిండి ఉండాలి. గరిష్ఠ పరిమితి లేదు.
**దరఖాస్తు:** అన్ని ప్రధాన పోస్టాఫీసులు లేదా ఇ-సేవా కేంద్రాల్లో రూ.150 చెల్లించి పొందవచ్చు పూర్తి చేసిన అప్లికేషన్లను తమ జిల్లాకు చెందిన డైట్ సెంటర్లలో సమర్పించాలి.
**ముఖ్యమైన తేదీలు:** 1. దరఖాస్తుల విక్రయం: నవంబరు 6 నుంచి ప్రారంభం.
2. పూర్తిచేసిన దరఖాస్తులను పంపడానికి చివరి తేదీ: నవంబరు 27
**3.ఎంట్రన్స్ టెస్ట్ తేదీ: డిసెంబర్ 14**
ఇతర వివరాలకు నవంబరు 3 నాటి ప్రముఖ ఆంగ్ల దినపత్రికలు చూడొచ్చు

**ఐ.ఐ.టి. జామ్ - 2009**

దేశంలోని ప్రముఖ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (ఐ.ఐ.టి)లలో ఎం.ఎస్‌సి. ప్రవేశానికి నిర్వహించే ఎం.ఎస్‌సి. జామ్ (JAM)- 2009 ప్రకటన వెలువడింది.
ఈ పరీక్ష ద్వారా ఐ.ఐ.టి.లలో ఎం.ఎస్‌సి./ఎం.ఎస్‌సి.- పిహెచ్.డి. డ్యుయెల్ డిగ్రీ ప్రోగ్రాములతోపాటు ఐ.ఐ.టి. రూర్కీలో మూడేళ్ల ఎం.సి.ఎ, ఎం.టెక్. కోర్సుల్లో అడ్మిషన్లు లభిస్తాయి.
ఇతర వివరాలకు వెబ్‌సైట్
**www.jam.iitkgp.ac.in**

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# He alone knows the truth





M.SURESAN



**T. Siva, Nandikotkur.**

**Q.** Across, through; alone, lonely ల ఉపయోగాన్ని వివరించండి.

**A.** 1) Across = ఒక వైపు నుంచి ఇంకో వైపునకు అడ్డంగా. He drew a line across the page - page కు అడ్డంగా గీత గీశాడు.

He walked across the street = రోడ్డుకు ఒక వైపు నుంచి ఇంకో వైపునకు నడిచాడు.

- ★ ఎదురుగా - The bank is just across the road from my place = Bank మా ఇంటికి ఎదురుగానే road అవతల ఉంది. అయితే ఇక్కడ Across from అంటాం.
- ★ ఒక ప్రదేశం మొత్తం - MS Subbalakshmi is acclaimed across the country as a great singer = దేశం మొత్తం ఎం.ఎస్. సుబ్బలక్ష్మిని గొప్ప గాయనిగా కొనియాడుతుంది.

The news has spread across the city = ఈ వార్త నగరం మొత్తం వ్యాపించింది.

2) Through = గుండా, ద్వారా

She was looking through the key hole = ఆమె తాళం కంత గుండా/ లోంచి/ ద్వారా చూస్తూ ఉంది.

b) He knew about it through his sister = వాళ్ల అక్క ద్వారా అతడు ఈ విషయం తెలుసుకున్నాడు.

3) Alone, lonely; Alone = ఒక్కరే/ ఒంటరిగా; lonely = ఒంటరిగా.

a) He alone knows the truth = నిజం అతడికి ఒక్కడికే తెలుసు. ఇక్కడ, alone బదులు lonely వాడం.

b) She felt alone = she felt lonely = ఆమె ఒంటరిగా / ఒంటరితనంతో బాధపడుతోంది.

c) She lives alone in that home = ఆ ఇంట్లో ఆమె ఒక్కతే ఉంటోంది. ఇక్కడ lonely రాదు.

d) She is alone = ఒంటరిగా ఉంటోంది.

She is lonely= ఆమె ఒంటరితనంతో బాధపడుతోంది.

**Q.** To rule, to rule over ల మధ్య తేడాను విశదీకరించండి.

**A.** To rule = ఏలడం. ఒక దేశాన్ని, రాజ్యాన్ని, సామ్రాజ్యాన్ని.

To rule over = ఒక ప్రాంతం/ ప్రదేశం/ దేశం మీద ఆధిపత్యం చలాయించడం.

a) Asoka ruled Magadha = అశోకుడు మగధ రాజ్యాన్ని పాలించాడు.

b) Asoka ruled over a vast empire= అశోకుడు విశాలమైన సామ్రాజ్యం మీద ఆధిపత్యాన్ని చలాయించాడు/ సామ్రాజ్యానికి ఆధిపత్యం వహించాడు.

**Q.** Fight with, fight against లను ఏయే సందర్భాల్లో ఉపయోగించాలి? శత్రువుతో పోరాడటాన్ని ఏమని రాయాలి?

i) Fight against somebody = ఒకరితో పోరాడటం/ యుద్ధం చేయడం.

a) Indians fought against the British for Independence. (స్వాతంత్ర్యం కోసం భారతీయులు British వారితో పోరాడారు.)

b) India fought against Pakistan = భారత్, పాక్‌తో పోరాడింది/ యుద్ధం చేసింది.

ii) fight with = వాదించడం/ వాదులాడుకోవడం.

a) They fought with each other over/ about who should sit in the chair = ఎవరు కుర్చీలో కూర్చోవాలనే విషయం మీద వాళ్లు వాదులాడుకున్నారు.

b) He often argues with the teachers = అతడు తరచుగా teachers తో వాదిస్తుంటాడు.

**Q.** Over, above, below, under ల ఉపయోగాన్ని వివరించండి.

**A.** Above, over = ఒకదానిపైన అనే అర్థంతో రెండింటినీ వాడొచ్చు The Sun shone/ over the sea = సూర్యుడు సముద్రం మీద ప్రకాశించాడు. (మామూలు తెలుగు = సముద్రం మీద సూర్యుడి వెలుగు పడింది)

అయితే He jumped over the fence అనే అంటాం; jumped above అనం.

Below = ఒక దానికి బాగా కింద/ దిగువన.

a) There was a photo below the tube light on the wall = గోడ మీద tube light కు కింద/ దిగువన ఓ photo ఉంది.

b) He hid the box below the table = ఆ పెట్టెను table కింద దాచాడు.

under = ఒకదాని కింద - ఈ అర్థంతో under, below ఒక్కటే. అయితేunder అంటే ఒకదాని కిందనే - His certificate lay under the book on the table = అతడి certificate ఆ table మీది ఆ పుస్తకం కిందే ఉంది.

**P. Ramakrishna, Vijayawada.**

**Q.** ఈమధ్య కాలంలో (తెలుగులో ఉచ్చారణతో కూడిన) ఇంగ్లిష్ - తెలుగు డిక్షనరీలను చాలామంది పబ్లికేషన్స్ నిర్వాహకులు విడుదల చేశారు. A అక్షరంతో వచ్చే మాటల ఉచ్చారణ ఒక డిక్షనరీలో ఒకవిధంగా మరో డిక్షనరీలో ఒక విధంగా ఉంది. రెండు డిక్షనరీలలో ఇచ్చిన పదాలు - ఉచ్చారణ ఇలా ఉన్నాయి. వీటిలో ఏది సరైన ఉచ్చారణో చెప్పండి?

Aback = ఎబాక్; Aback = అబాక్

Abandon = ఎబాండన్

Abandon = అబాండన్

| | |
|---|---|
| Abate = ఎబేట్ | Abate = అబేట్ |
| Abide = ఎబైడ్ | Abide = అబైడ్ |
| Ablaze = ఎబ్లేజ్ | Ablaze = అబ్లేజ్ |
| Abode = ఎబోడ్ | Abode = అబోడ్ |

**A.** Viayawada Emesco Publication dictionary లో సూచించిన pronunciations correct. రెండోది సరికాదు.

Aback, Abandon, Abate, Abide, Ablaze, Abode - వీటన్నింటిలో 'A' ను 'అ' లా పలకాలి, దాని తర్వాత వచ్చే 'b' శబ్దాన్ని నొక్కి పలుకుతాం. eg: above =అ 'బొ' - 'అ' శబ్దం వినీ వినపడకుండా 'బొ' శబ్దం ఎక్కువగా నొక్కి పలుకుతాం.

**M Rangaiah, Yellandu.**

**Q.** కింది tense ల ఉపయోగాన్ని ఉదాహరణలతో తెలుపండి.

Present Perfect ను ఎప్పుడు వాడాలి?

**A.** Present Perfect(form of the verb, I/ we/ you/ they have + Past participle; He/ she/ it + has + Past Participle (PP) - Have gone, has seen etc.

We use this tense for a past action, time not stated - గతంలో జరిగిన విషయం, జరిగిన time తెలియనప్పుడు.

They have seen that movie = వాళ్లు ఆ సినిమా చూశారు - గతంలో; ఎప్పుడు అనేది చెప్పడం లేదు.

**Q.** Past Tense ను ఎలా వాడాలి?

**A.** గతంలో జరిగిన విషయం, ఎప్పుడు జరిగింది అని చెప్పినప్పుడు Past simple tense (Past doing word - saw, went, gave, etc) వాడతాం.

They saw the movie yesterday = వాళ్లు నిన్న సినిమా చూశారు.

మరికొన్ని చూడండి.

a) He has taken my book (has taken - present perfect - అతడు నా పుస్తకం తీసుకున్నాడు - గతం, అయితే, గతంలో ఎప్పుడు అనేది చెప్పలేదు)

b) He took my book last night - (took - past simple tense) - అతడు నిన్న నా పుస్తకం తీసుకున్నాడు. (నిన్న అని time తెలుపుతున్నాం)

Look at the following too:

a) He has passed intermediate (Past - time not stated)

b) He passed intermediate in 2007 = అతడు 2007లో Inter పాస్ అయ్యాడు - time తెలిసిన గతం.

**Q.** Past Perfect Tense ఉపయోగం ...

**A** Past Perfect Tense - verb form - Had + Past Participle (PP) for the 1st of 2 or more past actions - గతంలో జరిగిన రెండు విషయాల్లోముందరి విషయాన్ని had + pp - past perfect లో చెబుతాం.

a) I went to his place yesterday at 4, by then he had gone out = నిన్న నేను అతడి ఇంటికి 4 గంటలకు వెళ్లాను. అప్పటికే అతడు బయటకు వెళ్లిపోయాడు - రెండు విషయాలిక్కడ -

1) నేను అతడి ఇంటికి వెళ్లడం

2) అతడు బయటకు వెళ్లిపోవడం. రెండూ past. అయితే అతడు వెళ్లిపోవడం ముందు జరిగింది. కాబట్టి had gone (had + pp - past perfect) వాడాం.

b) I came to know that he had cheated me = నన్ను అతడు మోసం చేశాడని నేను తెలుసుకున్నాను - రెండూ గతం - అయితే మోసం చేయడం ముందు, అందుకని had cheated (had + pp - past perfect).

**K. Rama Rao, Poluru (Prakasam).**

**Q.** I am not a teacher కు am I కరెక్టా? ఎందుకని?

**A.** I am not a teacher కు question tag 'am I?' is correct.

కింది వాటికి Question tag లు తెలుపండి.

**Q.** I am a teacher.

**A.** I am a teacher, aren't I?

**Q.** I am lucky.

**A.** I am lucky, aren't I?

**Q.** I am young.

**A.** I am young, aren't I?

**Q.** I am not a teacher.

**A.** I am not a teacher, am I?

**Q.** I am not hungry.

**A.** I am not hungry, am I?

**Q.** I am not a boy, am I?

**A.** I am not young, am I?

**M.A.K.Chakravarthi, Nadakuduru (East Godavari)**

**Q.** పౌర్ణమికి Fool Moon అనడం కరెక్టేనా? అసలు సమాధానం Full Moon అనుకుంటున్నాం. రెండింటిలో ఏది కరెక్టు?

**A.** Full Moon అనడం correct.

Fool moon అచ్చు తప్పు.

**Q.** Simple, Complex and Compound Sentences గురించి చెప్పండి.

**A.** 1) a) A clause: A group of words with a verb eg: If she comes here, ...

b) A main clause: A clause with complete meaning eg: She knows me = ఆమెకు నేను తెలుసు. meaning complete.

c) A subordinate clause eg: A clause without complete meaning eg: When he went there = అతనక్కడి వెళ్లినప్పుడు అర్థం పూర్తవలేదు. (మీకు 6 forms of verbs గుర్తున్నాయి కదా)

Imp: The number of clauses in a sentence = the number of verbs in the sentence.

He knows that I am here - ఈ sentence లో రెండు verbs ఉన్నాయి - knows, am కాబట్టి ఈ sentence లో 2 clauses -1) He knows

2) That I am here.

a) Simple sentence - A simple sentence has only one main clause. It may have a phrase = a group of words without a verb.

eg: He bought a big car - ఈ sentenceలో ఒకే verb ఉంది - bought. కాబట్టి ఇందులో ఒకే clause - He bought a big car - ఇక్కడ meaning complete కాబట్టి ఇదే main clause - ఇదే sentence - అందుకని ఇది simple sentence.

b) Complex sentence: A sentence with one main clause and one or more subordinate clauses. అంటే అందులో ఒకటి కంటే ఎక్కువ verbs ఉండాలి. ఎందుకంటే ఒక sentence లో ఎన్ని verbs ఉంటే అన్ని clauses కాబట్టి.

eg: The car which he bought is big. ఇక్కడ bought ఒక verb, is రెండో verb. అందుకని ఇందులో రెండు clauses: 1) The car which he bought = అతడు కొన్న car - Meaning not complete subordinate clause.

2) (The car) is big - పెద్దది - meaning complete - subordinate clause. కాబట్టి The car which he bought is big, complex sentence.

c) Compound sentence: A sentence with two or more main clauses. అంటే ఇందులో కూడా రెండు/ ఎక్కువ verbs ఉండాలన్నమాట. అన్ని calusesకూ పూర్తి అర్థం ఉండాలి.

eg: He bought a car and it is big.

i) He bought a car - అతడు car కొన్నాడు - meaning complete - main clause

ii) And it is big = అది పెద్దది - main clause. ఇలా ఒక type of sentence ను మిగతా two types of sentences గా మార్చవచ్చు కొన్ని standard forms of transformation ఉన్నాయి. వాటిని చూసే ముందు, ఈ పదం అర్థం తెలుసుకుందాం.

Inspite of/ despite = అయినప్పటికీ ఇది వస్తే simple sentence. Though/ although/ even though = అయినప్పటికీ - ఇది వస్తే complex.

But/ yet/ and yet = / కానీ/ అయితే/ అయినప్పటికీ - ఇవి వస్తే compound.

Inspite of his bad health, he works hard = అతడి ఆరోగ్యం బాగుండనప్పటికీ, అతడు కష్టపడి పని చేస్తాడు. Verb - works - only one - so only one clause - simple sentence.

Though/ although/ even though his health is bad, he works hard. దీనర్థం, పై sentence అర్థం ఒకటే. Verbs -1) is 2) works. Though his health is bad - subordinate clause - sentence - complex. His health is bad, but/ yet/ and yet he works hard = అదే అర్థం - అతడి ఆరోగ్యం బాగుండదు. కానీ/ అయితే అతడు కష్టపడి పనిచేస్తాడు. His health is bad - one main clause But/ yet/ and yet - second main clause.so - this is a compound sentence. Simple, compound, complex - వీటిని ఒక రకం నుంచి ఇంకో రకానికి మార్చేందుకు standard conventions ఉన్నాయి. ఇంకో విషయం i) Infinitive (to go, to come, to dance, etc), ii) ...ing form (going, coming, singing, having, etc) and iii) past participle (gone, seen, sung, given, etc) verbs కావు. అందువల్ల ఇవి ఉన్న groups of words, clauses కావు.

# ప్రతిభ



**Ch.V.Satyanarayana, Ravikampadu (W.G.Dt.)**

**Q.** Please clarify the following doubts.

Suggestion - Advice ఎప్పుడెప్పుడు వాడాలి?

**A.** Suggestion అంటే సూచన. Advice = సలహా suggestion, advice అంత strong కాదు.

a) Go ahead and buy that house; that's my advice to you = కానివ్వు. ఆ ఇల్లు కొనేయ్. అది నా సలహా.

ఇది ఒకపని చేయమని/ చేయొద్దని గట్టిగా చెప్పడం (advice ఒకరి నిర్ణయాన్ని ప్రభావితం చేయొచ్చు)

b) How about buying that house?

Why don't you buy it? Just think over it= ఆ ఇల్లు కొనొచ్చేమో చూడు. కొనకూడదా? - ఇది suggestion (సూచన)- కొంటే ఎలా ఉంటుందో చూడు, అని నిర్ణయాన్ని వారికే వదిలేయడం.

**Q.** Rather, Rather than అంటే అర్థం ఏమిటి? ఎలా వాడాలి?

**A.** Ratherకు Rather than కు సంబంధం లేదు.

Rather = (మనకు నచ్చని విషయం). కాస్త ఎక్కువే అనే భావం.

a) The movie is rather boring = ఆ సినిమా కాస్త విసుగే.

b) The place is rather distant = ఆ ప్రదేశం కాస్త దూరమే.

Rather than - ఒకదానికంటే - పోలికలు తెలిపేందుకు వాడతాం.

Rather than take the trouble of going to the cinema, I'd like to sit at home and watch the TV = Cinema hall కెళ్లే శ్రమ పడటం కంటే ఇంట్లో కూర్చుని TV చూడటానికే ఇష్టపడతా.

He would rather die than tell a lie = చావనైనా చస్తాడుగాని, అబద్ధం మాత్రం చెప్పడు.

**Q.** Home - House ఎలా ఉపయోగించాలి?

**A.** Home- మనం మన కుటుంబ సభ్యులతో నివసించే ఇల్లు home. At home = ఇంట్లో అంటే ఎవరిని గురించి మాట్లాడుతున్నామో వాళ్ల ఇల్లు అన్న మాట. My home, his home, etc అనవసరం.

a) He went home = అతడు వాళ్లింటికి వెళ్లిపోయాడు

b) I left my cell at home = నా cell (మా) ఇంట్లో మరిచిపోయాను.

House = నివసించేందుకు పనికొచ్చే ఏ ఇల్లయినా.

These houses were built a century ago = ఈ ఇళ్లు శతాబ్దం నాటివి.

**Q.** Indirect speechలోకి మార్చేటప్పుడు Direct speech లోని go అనే verb, Indirect speechలో come గా మారుతుంది. ఏ సందర్భంలో ఇలా జరుగుతుంది? ఎప్పుడు జరగదు?

**A.** Direct నుంచి Indirect కు మార్చినప్పుడల్లా come, go అవనక్కర్లేదు. Go ఎప్పుడూ కూడా come అవదు. Go, go గానే ఉంటుంది. Tense మారడం తప్ప. అర్థాన్ని బట్టి come, go అవ్వొచ్చు అదీ అప్పుడప్పుడే. అంతేగానీ, come వచ్చినప్పుడల్లా go అవ్వాలని లేదు. ఇక్కడ అర్థం ముఖ్యం grammar rule కాదు.

eg: Direct speech: "she told the beggar to go away," said he to me.

Indirect speech: He told me that she had told the beggar to go away. ఇక్కడా go, come అవ్వదు. Come ను అర్థం కోసం చాలా అరుదుగా go గా మారుస్తాం.

eg: Direct speech: "come here," he said to the child.

Indirect speech: He told the child to go there. ఇలా మార్చడం అర్థం కోసమే. To come there అని English లో అనం కదా. To go there అనే అంటాం. అది గమనించాల్సిన విషయం. Meaning is always more important than any grammar rule.

**Q.** Illegal - lawless - illegitimateల మధ్య తేడా ఏమిటి? ఎలా వాడాలి? Dictionaries లో వీటి అర్థం ఒకేలా ఉంటోంది.

**A.** Illegal= చట్టం ఒప్పుకోనిది Lawless = 1) చట్టం అమలుకాని ప్రదేశాలు - అక్కడ చట్టాలు పనిచేయవు, అక్కడి ప్రజలు చట్టాన్ని అసలు లెక్కచేయరు. 2) చట్టం అంటే లక్ష్యంలేని.

Group clashes are common there, as it is a lawless area= చట్టం పనిచేయని చోటది, అందుకని వర్గ సంఘర్షణలు అక్కడ సాధారణం.

(Lawless roads = చట్ట పరిరక్షణలేని, దారి దోపిళ్లు, హత్యలు ఎక్కువగా జరిగే రహదార్లు)

Illegitimate = సమాజం కట్టుబాట్లకు విరుద్ధమైన

An illegitimate child = వివాహేతర సంబంధం వల్ల పుట్టిన బిడ్డ.

**Q.** How to express the following dialogues in English.

ఎ) చూడకుండా రాయండి.

బి) గుంజీళ్లు తీయండి.

సి) వంగుని చదవండి.

డి) గోడకుర్చీ వేయండి.

**A.** They are not 'dialogues', but only sentences. A dialogue means a conversation.

a) Write without seeing/ from memory.

b) do sit - ups.

c) Bend and read.

d) Lean against the wall with bent knees.

**Q.** He comes on time కరెక్టేనా? లేదా He comes in time కరెక్టా?

**A.** In time = Time కు కాస్త ముందు వచ్చి ready గా ఉండటం.

On time = Time కు సరిగ్గా.

**P. Balu, Siddipet(Medak)**

**Q.** Englishను సడెన్‌గా ఉపయోగించాలంటే చాలా కష్టంగా ఉంటోంది? మార్గం ఏమిటి? English రావాలంటే మొదట ఏమి నేర్చుకోవాలి? Tense, Articles, Prepositions లో వేటిని సమగ్రంగా నేర్చుకుంటే కనీసం 50 శాతం మాట్లాడగలుగుతాం? ఇంగ్లిష్ నేర్చుకోవడానికి మంచి పుస్తకాలుంటే చెప్పండి.

**A.** మీరు మాట్లాడాలనుకుంటే చేయాల్సిన పనేమిటంటే బెరుకు లేకుండా, తప్పు చేస్తామేమో అనే భయం లేకుండా మాట్లాడేయటమే. అలా ఆత్మ విశ్వాసంతో మాట్లాడుతుంటే మనకు తెలియకుండానే improve అవుతుంది. English newspaper అర్థం అయినా, కాకపోయినా చదవడం చాలా ముఖ్యం. చిన్న చిన్న story books in English చదువుతూ ఉండటం కూడా సహాయ పడుతుంది.

**P.MuktheswaraRao,Gurajala (Guntur).**

**Q.** Please clarify my doubts. We use 'ing' form for some perceptional verbs. But it take an other meaning. We called these verbs as Emotional verbs.

Now would you please tell me how many Emotional verbs are there in English and explain me all of these Emotional verbs.

**A.** Like, dislike, love, hate, hope, wish, want, envy, etc., these verbs express feelings.

**Q.** What is the difference among below sentences.

a) We go to Madras for summer.

b) We are going to Madras for summer.

c) We are going to go to Madras for summer.

**A.** i) We go to Madras for summer = We go to Madras every summer.

ii) We are going to Madras for summer = We are going in the coming summer

iii) We are going to go to Madras for summer = Very soon we are starting for Madras to be there in summer.

**T.Bhaskar, Mandapeta.**

I have some doubts in English, explain me.

**Q.** ప్రేమిస్తే, ద్వేషిస్తే, తిడితే, కొడితే, ప్రేమైతే, స్వార్థమైతే- ఇలాంటి పదాలను Englishలో ఎలా చెప్పాలి? give + able = givable, giveకు, able add చేయడం ద్వారా తెలుగులో ఏవిధంగా అర్థం చేసుకోవచ్చు Lovable, forgivable పదాలను వివరించండి.

**A.** ప్రేమిస్తే= If/ when we love

ద్వేషిస్తే = If/ when we hate

తిడితే = If/ when we scold

కొడితే = If/ when we beat

ప్రేమైతే = If there is love

స్వార్థమయితే = If there is selfishness/ If we are selfish

able చేరిస్తే - తగిన

giveable / giveable = ఇవ్వదగిన

lovable = ప్రేమించదగిన

forgivable = క్షమించదగిన X unforgivable = క్షమించరాని

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపండి. సూర్యుడు తూర్పునే ఎందుకు ఉదయిస్తాడు? పడమరన ఉదయించకూడదా?

**A.** The sun rises only in the east, why not in the west?/ The sun rises only in the east, but not in the west, why?

**Q.** కింది ఇంగ్లిష్ వాక్యాలకు తెలుగు తెలుపండి.

**A.** ఇవన్నీ సామెతలు (proverbs)

★ Casts and dogs.

Cats and dogs = జడివాన కురుస్తోంది అనే అర్థంతో, It's raining cats and dogs అంటాం.

★ Make lay while the sun shines.

Make lay while the sun shines = ఎండ ఉన్నప్పుడే, గడ్డి ఎండేసుకోవాలి / ఎండబెట్టుకోవాలి - తెలుగులో 'దీపం ఉండగానే ఇల్లు చక్కపెట్టుకోవాలి' కి సమానం.

★ Slow and study wins the race.

Slow and steady wins the race = నిదానం, నిలకడ ఉన్నవాళ్లే పందెంలో గెలుస్తారు. తెలుగు సామెత - నిదానమే ప్రధానం.

★ Haste makes waste

Haste makes waste = తొందరపాటు వల్ల నష్టమే.

★ Sweet are the uses of adversity.

Sweet are the uses of adversity = కష్టాల ఉపయోగం తీయగా ఉంటుంది = కష్టాల వల్ల కూడా మేలు కలుగుతుంది.

★ The crown and glory of life is character.

జీవితానికి శోభ కూర్చేది శీలమే.

★ Prevention is better than cure.

వ్యాధి వచ్చిన తర్వాత నయం చేసేందుకంటే, రాకుండా ఆపడం/ నివారించడం మంచిది. చెడు జరిగిన తర్వాత ఫలితాలను ఎదుర్కొనే కంటే చెడు జరగకుండా చూడటం మెరుగు.

★ A friend indeed is a friend in deed.

Correct form of the proverb:A friend in need, is a friend indeed = అవసరంలో ఆదుకునే మిత్రుడే అసలైన మిత్రుడు. indeed = నిజం.

★ Every man is the architect of his own future.

Every man is the architect of his own destiny = ఎవరి కర్మకు వారే బాధ్యులు.

Uses: Politicians believe in making lay while the sun shines = దీపం ఉండగానే ఇల్లు చక్క బెట్టుకోవాలనే విషయాన్ని రాజకీయ నాయకులు నమ్ముతారు. So they make money while in power = అందుకని అధికారం ఉన్నప్పుడే, అందినంత సంపాదించుకుంటారు.

**A. Sridhar,Kadapa.**

**Q.** కింది పదాలను తెలుగులో వివరించగలరు.

★ Floor birds

Floor birds అనే మాట లేదు.

Floor board = చెక్కతో చేసిన నేల

★ Horror stricken

భయభ్రాంతులవడం - We were horror stricken at the sight of the man killing his wife.

★ Commercial aspects

వ్యాపార/ వాణిజ్య అంశాలు - వస్తువుల marketing లాంటివి.

★ Universal appeal

అందరినీ ఆకర్షించే/ అందరికీ ఆసక్తి కలిగించే - The story of the Ramayanam has a universal appeal.

★ Exposure

1) ఎండ, వాన, గాలి తగిలేట్లు ఆరు బయట ఉండటం, ఉంచడం.

Because of exposure to the sun, the door is cracking = ఎండ తగిలేట్టుండటం వల్ల, తలుపులో పగుళ్లొచ్చాయి.

2) ఏదైనా అనుభవమయ్యే పరిస్థితి.

Exposure to American culture has improved her English = అమెరికన్ సంస్కృతి అనుభవం వల్ల ఆమె English బాగా వృద్ధి చెందింది.

3) నిజం బట్టబయలు చేయడం: The paper's exposure of the scams of the ministers has made it the enemy of the govt = మంత్రుల కుంభకోణాలను బయటపెట్టడం వల్ల ప్రభుత్వానికి పత్రిక శత్రువైంది.

★ Holding hands

చేతులు పట్టుకోవడం.

★ Shut out

ఒక ప్రదేశంలోకి రానీయకుండా చేయడం/ ఏ విషయానికైనా దూరంగా ఉంచడం.

a) The Dalits in the olden days were shut out of temples = గతంలో దళితులను గుళ్లలోకి రానిచ్చేవారు కాదు.

b) Eversince he leaked out my secrets, I have been shutting him out of my thoughts = నా రహస్యాలను అతడు బయట పెట్టినప్పటి నుంచి, నా ఆలోచనలకు అతడిని దూరంగా ఉంచుతున్నాను/ అతడికి నా ఆలోచనలు చెప్పడం లేదు.

★ Go up

1) ధరల్లాంటివి పెరగడం. 2) ఎదగడం - He is going up the social ladder very fast = సమాజం నిచ్చెనలో పైకి వెళ్లిపోతున్నాడు = సమాజంలో అతడి స్థితి/ అతని సామాజిక స్థితి బాగా ఎదుగుతోంది. 3) Theatres లో తెర లేవడం.

# The crown and glory of life is character





M.SURESAN

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# She never shows off





M.SURESAN

**Nishant:** What I am saying is serious. What are you playing at? Why don't you listen?
(నేను చెప్పేది ముఖ్యమైన విషయం. నువ్వేం చేస్తున్నావు? వినవేంటి?)

**Nischal:** Don't hit the roof, buddy. I'm listening. Go ahead.
(అంతకోప్పడకు, మిత్రమా. నేను వింటున్నా. కానియ్.)

**Nishant:** Sobhith is coming to town tomorrow. He is an outstanding player of the guitar. He is performing at the Rotary auditorium tomorrow.
(రేపు శోభిత్ ఊళ్లోకి వస్తున్నాడు. అతడు గొప్ప గిటా(ర్) వాద్యకారుడు. Rotary ప్రాంగణంలో కచేరీ చేయబోతున్నాడు.)

**Nischal:** So what? (అయితే?)

**Nishant:** You know we went to school together. Let's meet him and ask him over to dinner.
(మేం ఇద్దరం ఒకే స్కూల్లో చదువుకున్నాం. అతడిని మనం కలిసి dinner కు పిలుద్దాం.)

**Nischal:** But why? (ఎందుకిదంతా?)

**Nishant:** We shall put across to him the idea of our starting a music school. We can ask him to give lessons once or twice a week in our school.
(మనం సంగీతం పాఠశాల start చేసే విషయం అతడికి చెప్పి వారానికోరోజో రెండు రోజులో మన పిల్లలకు సంగీతం నేర్పమని అడగొచ్చు)

**Nischal:** But isn't he very busy? He must be tied down with his own programmes.
(కానీ అతడు చాలా తీరిక లేకుండా ఉంటాడుకదా? అతడి programmes అతడికి సరిపోతాయి కదా?)

**Nishant:** He can't turn me down. We are that close.
(నన్ను కాదనలేడు వాడు. మేమంత సన్నిహితులం.)

**Nischal:** OK. Put forward the idea to him and see what he saying. A trial costs nothing. I'm with you.
(అతడికది చెప్పి చూడు ఏమంటాడో. ప్రయత్నించడం వల్ల పోయేదేం లేదు. నేను నీతో ఏకీభవిస్తున్నా.)

**Nishant:** Dad's trying to talk me out of the music school idea but I am going to keep at it.
(మా నాన్న music school పెట్టొద్దని నచ్చచెప్పేందుకు ప్రయత్నిస్తున్నాడు. కానీ నాకేమో పెట్టాలని ఉంది.)

**Nischal:** What kind of guy is this Sobhit.
(ఈ శోభిత్ ఎలాంటివాడు?)

**Nishant:** Quite nice. The only trouble is he shows off when girls are around. But when it comes to playing the guitar, he stands out from the other guitarists.
(మంచివాడే. కానీ చిక్కల్లా పక్కన అమ్మాయిలుంటే ఎచ్చులుపోతాడు. గిటార్ విషయంలో నైతే, మిగతా గిటారిస్టులను మించిపోతాడు.)

**Nischal:** Don't I know that? I have a CD or two of his.
(అది నాకు తెలియదా? అతడి CD లు ఒకటో రెండో నాదగ్గర ఉన్నాయి.)

**Nishant:** Well, I must be going. See you in the evening.
(సరే, నేవెళ్లాలిపుడు. సాయంత్రం కలుద్దాం.)

అందరికీ అర్థమయ్యే విధంగా మాట్లాడేందుకు వీలుగా కొన్ని కొన్ని expressions ఉన్నాయి. ఇవి మన Spoken English ను చాలా సరళంగా, సహజంగా ఉండేట్లు చేస్తాయి. అలాంటివి కొన్ని ఇప్పుడు చూద్దాం.

***Look at the following sentences:***

*1) What are you playing at?*
*2) He is an outstanding player of the guitar.*
*3) We went to school together.*
*4) We shall put across to him the idea.*
*5) He must be tied down with his own programmes.*
*6) Put forward the idea.*
*7) Dad's trying to talk me out of the music school idea, but I am going keep at it.*
*8) The only thing is he shows off when girls are around.*
*9) He stands out from the other guitarists.*

**1) be playing at something** = ఏదో చేస్తూ ఉండటం (చేయాల్సిన పని కాకుండా). ఇది చాలా ఉపయోగకరమైన expression. మనం చెప్పేది వినకుండా/ చేయాల్సిన ముఖ్యమైన పని వదిలేసి ఇంకేదన్నా చేస్తున్నా, కోపంగా, అసహనంగా అనే మాట. ఎప్పుడూ 'be' form + ing form రూపంలోనే వాడతాం.

a) He was playing at something when the discussion was going on = తీవ్రంగా చర్చ జరుగుతూంటే ఏదో చేస్తున్నాడతను, పట్టించుకోకుండా.

b) You are now asking me what he said? What's the idea? You were there, weren't you? What were you playing at when he was speaking? = అతనేం చెప్పాడని ఇప్పుడు నన్ను అడుగుతున్నావా? ఏంటి నీ సంగతి? నువ్వక్కడున్నావు కదా? అతడు మాట్లాడుతున్నప్పుడేం చేస్తున్నావు?

ఎవరన్నా పరధ్యానంగా ఉండి అసలు విషయం మీద దృష్టి ఉంచకపోతే, ఇలా మందలిస్తాం. మీ conversation లో practice చేయండి.

**2) Outstanding** = చాలా గొప్ప/ అద్భుతమైన

a) Sachin's 40 centuries in test cricket is an outstanding achievement = Test cricket లో సచిన్ కొట్టిన 40 శతకాలు అద్భుతమైన విజయం.

b) In diagnosis this doctor is outstanding = రోగనిర్ధారణలో ఈ doctor చాలా గొప్ప.
diagnosis = రోగ నిర్ధారణ.

c) MS Subbulakshmi was an outstanding exponent of Karnatic Music = కర్ణాటక సంగీతంలో ఎంఎస్ సుబ్బులక్ష్మి గొప్ప నైపుణ్యం కలిగినామె.

Exponent = ఏదైనా రంగంలో గొప్ప రాణింపు/ నైపుణ్యం ఉన్నవాళ్లు.

Ms Sobha Naidu is an exponent of Kuchipudi dance = శోభానాయుడు కూచిపూడి నాట్యంలో రాణింపు ఉన్న నర్తకి.

**3) Go to School/ College/ University together** - Spoken English లో Classmate, Schoolmate, Collegemate (సహ విద్యార్థి) అనే మాటల కంటే Go to school/ college/ university together అనే మాటనే ఎక్కువగా వాడతారు. అలాగే playmate అనేదానికంటే we played together అనే ఎక్కువగా అంటారు.

అంతేకాకుండా Spoken English లో I am/ He is a student అనడం కంటే I go/ He goes to school/ College అనే ఎక్కువగా అంటారు.

"What are your children" (మీ పిల్లలేం చేస్తారు?)

"One of them goes to school, and the other is doing B.Tech" (ఒకరు స్కూలుకు వెళుతున్నారు, ఇంకొకరు B.Tech చేస్తున్నారు.)

**4) To put across** - ఏదైనా విషయం వివరించడం, నచ్చజెప్పే ప్రయత్నంలో.

a) I tried to put across the idea of starting a business, but dad wouldn't agree = ఏదన్నా వ్యాపారం ప్రారంభిస్తాననే ఆలోచన మా నాన్నకు వివరించా. కానీ ఆయనందుకు ఒప్పుకోలేదు.

b) He is a great teacher. He can put across even difficult things in a very easy manner = ఆయన గొప్ప Teacher. అతి కష్టమైన విషయాన్ని కూడా చాలా సులభంగా అర్థమయ్యేట్లు వివరించగలడు.

c) Put this across to the minister. See what she says = ఈ విషయం మంత్రికి వివరించు. ఏం చెబుతుందో చూడు.

**6) Put forward** = ప్రతిపాదించడం

a) The minister put forward the idea that scarce items be sold through fair-price shops = కొరతగా ఉన్న వస్తువులను చౌక ధరల దుకాణాల ద్వారా అమ్మించాలని ఆయన ప్రతిపాదించాడు.

b) Einstein put forward the theory of relativity = సాపేక్ష సిద్ధాంతాన్ని ఐన్‌స్టీన్ ప్రతిపాదించాడు.

**5) Be tied down with/ tie somebody down** = బందీలవడం/ బందీ చేయడం.

a) I want to go places, but my children's studies tie me down/ but I am tied down by my children's studies = ఏదో నాలుగూళ్లు తిరిగి రావాలని కోరిక, కానీ మా పిల్లల చదువులు నన్ను కట్టిపడేస్తున్నాయి.

b) She wants to give up the job and practise dancing, but is tied down by family responsibilities = ఉద్యోగం వదిలేసి నాట్యం నేర్చుకోవాలనుందామెకు కానీ కుటుంబ బాధ్యతలు ఆమెను బందీ చేస్తున్నాయి.

**7) Talk somebody out of something** = ఒక పని చేయొద్దని నచ్చజెప్పే ప్రయత్నం/ వారించడం.

a) I tried to talk him out of playing video games, and succeeded = Video games మానేయమని అతడికి నచ్చజెప్పే ప్రయత్నం చేసి మాన్పించగలిగాను.

b) The opposition is trying to talk the government out of acquiring land for SEZs, but it is going ahead = ప్రత్యేక ఆర్థిక మండళ్లకు భూసేకరణ వద్దని ప్రతిపక్షాలు వారిస్తున్నా ప్రభుత్వం ముందుకెళ్లిపోతోంది.

**8) To show off** = ఎచ్చులు పోవడం/ గొప్పలు చూపడం.

a) For a person of her ability she is quite modest. She never shows off = ఆమెకున్న సామర్థ్యానికి ఆమె చాలా నిగర్వి. ఎప్పుడూ గొప్పలు చూపదు/ ఎచ్చులకుపోదు.

b) Tendulkar never shows off for all his greatness as a batsman = అంతగొప్ప batsman అయినప్పటికీ టెండూల్కర్ ఎప్పుడూ గొప్పలకు పోడు/ ఎచ్చులు పోడు.

అలా గొప్పలు చూపించుకునేవాళ్లను 'a show-off' అని కూడా అంటాం.

a) He is a great actor, OK, but he is a bit of a show off = అతడు గొప్ప నటుడే కానీ కాస్త ఎచ్చులెక్కువపోయేవాడే.

b) For the little talent he has, he is too much of a show off = అతడికున్న ప్రతిభేమో తక్కువ, కానీ ఎచ్చులేమో ఎక్కువ.

**EXERCISE**

**Practise the following in English**

**Sasi:** మనం picnic కు వెళితే ఎలా ఉంటుంది?

**Tara:** ఎందుకు వెళ్లకూడదూ? అయితే మా నాన్నను అడగాలి కదా? ఇలాంటి వాటికి ఆయన కాస్త వ్యతిరేకం.

**Sasi:** వివరించి చూడు (put across వాడండి)

**Tara:** కిందటిసారి నాకాయన ఎంత చెప్పాడో, వెళ్లొద్దని. చివరికి ఆయన్ను ఒప్పించాను. (Talk ... out of వాడండి)

**Sasi:** మా cousin జయను కూడా రమ్మని అడుగుతా. ఆమె college మొత్తానికి గొప్ప గాయని. (outstanding వాడండి)

**Tara:** తనకు కాస్త ఎచ్చులు కూడా ఎక్కువేగా? (show off వాడండి)

**Sasi:** అది నిజమే, అయితే అది తప్ప చాలా మంచిదే.

**Tara:** మేం కలిసి చదువుకున్నాం school లో. మీ cousin అయినప్పటికీ ఆమె గురించి నాకు బాగా తెలుసు.

**Sasi:** OK. మీ నాన్నతో మాట్లాడు.

**ANSWER**

**Sasi:** How about a picnic?

**Tara:** Why not? But I've to ask dad. He isn't very much for such things.

**Sasi:** Put it across to him and see what he says.

**Tara:** Last time he tried a lot to talk me out of it. somehow I was able to pursuade him.

**Sasi:** I will ask my cousin Jaya along too. She is an outstanding singer in the whole college.

**Tara:** She is a bit of a show off too/ she shows off a bit too.

**Sasi:** That's true. But for that she is very good.

**Tara:** We went to school together. Though she is your cousin, I know her better.

**Sasi:** OK. Talk to your father.



**A.Sridhar, Oripenta (Kadapa)**

**Q.** Promo preview అంటే ఏమిటి?

**A.** Promo preview- ఇందులో promo, promotion కు short form = ఒక వస్తువు/ సేవ అమ్మకం పెంచేందుకు చేసే ప్రకటనలు (advertisement), ముఖ్యంగా pop music (అధునాతన సంగీతం) CD ల అమ్మకాన్ని పెంచేందుకు.

Preview = ఒక చిత్రాన్ని/ TV show నూ, వాటి విడుదలకు ముందే కొంతమంది ప్రత్యేక ఆహ్వానితులకు మాత్రమే చూపడం/ ఒక pop music CD ని విడుదలకు ముందే, కొంతమందికి ప్రదర్శించడం, వినిపించడం.

Promo preview = ప్రచారం కోసం ఉద్దేశించిన CD/ Movie/ TV show లను (ముఖ్యంగా Pop music కు సంబంధించి) విడుదలకు ముందు కొంతమంది ప్రత్యేక ఆహ్వానితులకు చూపడం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






# To put the cart before the horse

**Madhu, Hyderabad.**

**Q.** I guess, I wonder, I am afraid ఎలా ఉపయోగించాలో ఉదాహరణలతో తెలుపగలరు.

**A.** I guess = అనుకుంటున్నాను/ ఊహించుకుంటున్నాను

I wonder = సందేహంగా ఉండటం

'Is your dad at home?' (మీ నాన్న ఇంట్లో ఉన్నారా? )

'I wonder' (సందేహమే)

I wonder who is in = లోపల ఎవరున్నారో (కచ్చితంగా చెప్పలేను)

I'm afraid = I doubt = నాకు సందేహమే. (ఏదయినా చెడు విషయం/ ఇష్టంలేని విషయం చెప్పేందుకు వాడతాం.)

'Has he passed? (వాడు pass అయ్యాడా? )

'I'm afraid no' (లేదనుకుంటా pass అవలేదని తెలుసు, కాని చెప్పేందుకు సంకోచం)

'Has he failed again?' (అతడు మళ్లీ fail అయ్యాడా? )

'I'm afraid yes.' (ఆ - అవుననుకుంటా- fail అయ్యాడని తెలిసి, ఆ విషయం చెప్పడం ఇష్టంలేక చెప్పే విధం.)

**Q.** నేను ఆ పని చేసి ఉండేవాడిని, ఆ పని నాతో చేయబడి ఉండేది. అనేవాటికి ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** నేను ఆ పనిచేసే ఉండే వాడిని = I would have done the job.

ఆ పని నాచేత చేయబడి ఉండేది = The job would have been done by him.

**Q.** I will say, I would say మధ్య తేడాను ఉదాహరణలతో వివరించగలరు.

**A.** I will say = నేను చెబుతాను, future లో.

If he asks me about it, I will say I don't know anything about it = అతడు నన్ను ఆ విషయం అడిగితే నాకేం తెలియదని చెబుతాను.

I would say = మనకు అనిపించిన విషయం చెప్పేందుకు, I would say... అంటాం.

I would say that on any day he is better than his brother = ఏనాటికయినా అతడి తమ్ముడి కంటే వాడే నయమని అంటా/ అని నా అభిప్రాయం.

**Q.** What is the reason, what could be the reason మధ్య తేడా ఏమిటి?

**A.** What is the reason? = కారణమేంటి?

What could be the reason? = కారణం ఏమై ఉంటుందబ్బా? !

**A. Penchalaiah, Rajampet**

**Q.** Voice లో I shall be writing a letter ను A letter shall be being written by me అని రాయొచ్చా?

**A.** I shall be writing a letter - ఇది future continuous tense, perfect continuous tenses కు సూత్ర ప్రకారం passive form ఉన్నా వాడరు. English usage లో అవి లేవు. అలాగే future continuous కు కూడా సూత్రం ప్రకారం, మీరు సూచించిన passive form ఉన్నా అది వాడుకలో లేదు. అది వాడనే వాడరు.

**Q.** I shall have eaten a mango ను A mango will have been eaten by me అనొచ్చా? కింది వాటిని తెలుపగలరు.

shall : helping verb have : helping verb

been : ఈ verb ను ఏమంటారు?

eaten: main verb. been గురించి వివరించి ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారో తెలుపండి.

**A.** The mango will have been eaten by me- ఇందులోని verb- will have been eaten. ఈ verb లో will have been మొత్తం, Helping verb; eaten - Main verb.

'been' కు ఒంటరిగా ఏ ఉపయోగం లేదు. Have/ has/ had/ shall have/ should have/ will have/ would have etc., తర్వాత been వస్తే be form అవుతుంది.

**D. Seshanna, Adoni**

**Q.** సి.పి.బ్రౌన్ డిక్షనరీలో words పక్కన v.n., n.s., v.a అని ఉంటాయి వీటి అర్థం ఏమిటి?

ఉదాహరణకు Relax (v.n), relaxation (n.s), to relax (v.a)

**A.** CP Brown Dictionary చాలా Editions ఉన్నాయి. నేను చూసిన Edition లో మీరుదహరించిన abbreviations కనిపించలేదు. మరో Edition చూసి చెప్పేందుకు ప్రయత్నిస్తాం.

**Q.** Delexical verbs వస్తే వాటికి sentence లో అర్థం ఉండదని చదివాను(live, have, make, take, do hold, keep, set, gave) వీటిలో ఏ verb ను ఏయే సందర్భాల్లో ఉపయోగించాలో తెలుసుకునేదెలా? ఇవి కాకుండా ముఖ్యమైన delexical verbs ఇంకా ఏమైనా ఉన్నాయా? వివరించండి.

**A.** Delexical verbs అంటే, ప్రత్యేక అర్థంలేని, వాక్య నిర్మాణానికి మాత్రమే ఉపయోగించే verbs.





M.SURESAN

eg: I take a walk in the park- ఇక్కడ 'take' delexical verb అవుతుంది. ఎందుకంటే I walk అనే బదులు, take a walk అని అంటాం. అలాగే Just have a look at it - ఈ sentence లో 'have' కూడా delexical verb. Don't make a habit of it లో make, Give it a push లో give, Do a favour లో do, ఇలాంటివన్నీ delexical verbs - అయినా English fluent గా మాట్లాడేందుకు (Spoken English improvement కు) ఇలాంటి technical విషయాలు తెలుసుకోవాల్సిన అవసరం లేదు కదా? English బాగా మాట్లాడగలిగేవాళ్లకివన్నీ తెలియవు. మనం కూడా అవి తెలియకుండానే బాగా మాట్లాడగలం. ఇలాంటి వాటిని పట్టించుకోకండి.

**P.V. Ramanarao, Visakhapatnam**

**Q.** మీరొకచోట since ను present perfect లో మాత్రమే వాడాలని చెప్పి ఒక్క ఉదాహరణ మాత్రమే ఇచ్చారు. Since ను present perfect, present perfect continuous, past perfect లలో వాడొచ్చు కదా.

1. He has been ill since yesterday (present perfect)
2. She has been suffering since monday (present perfect continuous)
3. He had not seen her since yesterday (past perfect)

**A.** Present Perfect లో మాత్రమే since వాడాలి అని చెప్పలేదు. Since వచ్చినప్పుడు present perfect వాడాలి అని చెప్పాం. అంటే Present Perfect Continuous లో వాడకూడదని కాదు కదా? Present perfect continuous లో కూడా వాడొచ్చు. Past perfect two past actions ఉన్నప్పుడుగానీ, సందర్భాన్నిబట్టి ఒక past action ముందరి past action అని స్ఫురించినప్పుడుగాని వాడతాం.

eg: Since their meeting last year, he had visited her just once before he left for the states = క్రితం సంవత్సరం వాళ్లు కలుసుకున్న తర్వాత, అతడు US కు వెళ్లేముందు ఆమెను ఒకసారే కలుసుకున్నాడు.

**K. Sanjeeva, Kishanguda (R.R. Dist)**

**Q.** Somebody have dual character in the world. ఈ వాక్యంలో somebody 3rd person కదా, 3rd person కు has రావాలి కానీ ఓ నవల్లో have అని ఉంది కరెక్టేనా?

**A.** Somebody ఎప్పుడూ singular- he/ she కి బదులు వాడతాం. Somebody have అని print తప్పుపడి ఉంటుంది. Somebody has - correct.

**P. Srinivasa Rao, Pithapuram**

**Q.** I have got some doubts in English. Kindly clarify the same.

1. The English words for left hand writing and right hand writing and also both hands writing persons.

**A.** No special words or expressions for left hand writing and right hand writing. Ambidextrons means capable of doing anything with both the hands.

**Q.** Difference and usage of words admit, allow, permit.

**A. Admit** = Agree, most unwillingly that something is true. "That was a mistake on my part, I admit."

**Allow:** Agree that something is true or correct.

"I allow that they have superior bating strength"

**Permit:** This is formal, official and legal: Cell phones are not permitted on the campus.

**Q.** What is the difference between cool and cold.

**A. Cool** = Fairly cold but pleasant - cool breeze, cool shade, etc.

**Cold** = having a temperature lower than the normal temperature and unpleasant.

**Q.** Difference and use for advice and suggest.

**A. Advice** = Telling a person that it will be good to do/ not to do something.

**Suggest** = To offer an idea/ propose a plan for somebody to think and if they find it good, to put into action.

**Q.** Difference and usage for excuse, pardon, apologise, forgive.

**A.** Excuse - to forgive, pardon is more formal and concerns very serious things.

Apologize= ask somebody to excuse - ask for forgiveness.

**Q.** Difference and usage of meals and meal.

**A.** Meal - singular, Meals- plural.

**Q.** What is the difference between kill and murder, funeral and cremation.

**A. Kill** - put an end to the life of any creature

**Murder** - ending the life of a human being.

**Funeral** = the religious ceremony followed for burying or cremating a dead person.

**bury** = laying a dead person underground/ in their grave

**Cremation** = the ceremony of burning a dead body.

**Q.** సచివాలయంలో నక్సల్స్ రెక్కీ. రెక్కీ spelling and meaning చెప్పండి.

**A.** Recce- Short form of reconnaissance - శత్రువుల/ వారి స్థావరాల గురించి సమాచారం సేకరించడం- విమానాలు, మనుషుల ద్వారా.

సచివాలయంలో రెక్కీ- సచివాలయంలో లక్ష్యంగా పెట్టుకున్న వ్యక్తులను/ ప్రదేశాలను గురించి సమాచారం సేకరించారని.

**Q.** '36 foot Ganesh idol' అని ఒక వాక్యంలో ఉంది. ఇక్కడ 36 feet అనాలి కదా.

**A.** 36-foot Ganesh idol అనడమే correct.

**Q.** Difference and usage for idioms and phrases.

**A.** Idioms - a group of words - ఇందులోని ఒక్కొక్క మాట అర్థానికీ మొత్తం అర్థానికీ సంబంధం ఉండదు- eg: Run short of = కొరతగా ఉండటం.

We are running short of time = మనకు time తక్కువగా ఉంది/ తగ్గిపోతోంది. చూశారు కదా? ఇక్కడ run అర్థానికీ, short అర్థానికీ run short of కలిపితే వచ్చే అర్థానికీ సంబంధంలేదు. అలాంటి expression - idiom.

Phrase అంటే a group of words. eg: Inspite of his wealth, because of his pride, etc.

**Q.** 'తిమ్మిరెక్కింది' (కాలు, చేయి) అనడానికి English లో సరైన పదం తెలుపండి.

**A.** benumbed = తిమ్మిరెక్కడం.

My legs are benumbed. Numbed అని కూడా అంటాం. A numbing pain = తిమ్మిరెక్కించే/ మొద్దుబారిపోయేంత బాధ.

**Q.** ఉదయం నుంచి కలుసుకోలేదని కొంతమంది సాయంత్రం Good Morning చెబుతారు. ఇది కరెక్టేనా?

**A.** కాదు. సాయంత్రం అయితే good evening అనే అంటాం.

**P. Srinivasarao, Pithapuram**

**Q.** Explain the kinds of conjunctions and their use.

**A.** Coordinating conjunctions: But, yet, so, therefore, etc.

Subordinating conjunctions: though, before, after, if, etc.,

**N.V.Krishna Rao, Hyderabad.**

**Q.** Man booked for attacking Indians - ఈ వాక్యానికి అర్థం ఏమిటి?

**A.** భారతీయుల మీద దాడిచేసినందుకు వ్యక్తిమీద case నమోదు.

**Q.** Plaintiff, Defendant ఈ పదాలకు అర్థం ఏమిటి?

Plaintiff = ఫిర్యాదు (court లో) చేసేవారు.

Defendant = ఫిర్యాదుకు గురైన వ్యక్తి.

**A.Sridhar, Oripenta (Kadapa Dist)**

**Q.** To put the cart before the horse - దీనిని తెలుగులో ఏమంటారు?

**A.** తలకిందులు చేయడం (గుర్రంముందు బండి పెట్టడం)

To start your meal with curds/ butter milk and not with curry or pappu is putting the cart before the horse = భోజనం కూర/ పప్పుతో ప్రారంభించకుండా పెరుగు/ మజ్జిగతో ప్రారంభించడం. ముందుది వెనకా, వెనకది ముందు చేయడమే.

**Q.** To play to the gallery - అంటే ఏమిటి?

**A.** ప్రజలను ఆకట్టుకునేందుకు ఎక్కువ మందికి ఇష్టమైన పనులు చేయడం/ విషయాలు చెప్పడం, అవి మంచివయినా కాకపోయినా.

The CM and the opposition leaders are only playing to the galleries by announcing welfare measures - CM, ప్రతిపక్షాలవాళ్లు సంక్షేమ పథకాలు ప్రకటించడం, ప్రజలను ఆకట్టుకోవడం కోసమే/ ఎక్కువ మందికి ఇష్టమైన విధంగా నడుచుకోవడమే, మంచీ, చెడూ గాలికి వదిలేసి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# I hardly like him

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 522

M.SURESAN



**A. Sudhakar, Nizamabad**

**Q.** కింది Adverbsకు తెలుగులో అర్థం తెలుపుతూ ఉదాహరణలివ్వండి.

Often, never, always, sometimes, generally, usually, just, almost, nearly, quite, hardly, scarcely, ever, scarcely ever, hardly ever, nearly always, seldom, rarely, occasionally, frequently, already.

**A.** Often = తరచుగా. He often visits me = అతడు తరచూ నా దగ్గరికొస్తుంటాడు.

- Never = ఎప్పుడూ లేదు/ కాదు/ ఎన్నటికీ కాదు. He never comes here = అతనిక్కడికి అసలు రాడు/ ఎప్పటికీరాడు.

Duryodhana never liked the Pandavas = దుర్యోధనుడికి పాండవులంటే అసలు గిట్టదు/ ఎప్పుడూ గిట్టేదికాదు.

- Always (X never) = ఎప్పుడూ/ అన్నివేళలా He is always in Vijayawada. He never goes out = అతనెప్పుడూ విజయవాడలోనే ఉంటాడు. విజయవాడ దాటి ఎప్పుడూ వెళ్లడు.
- Sometimes = కొన్నిసార్లు/ అప్పుడప్పుడు. The bus stops here sometimes and sometimes doesn't = కొన్నిసార్లు bus ఇక్కడ ఆగుతుంది, కొన్నిసార్లు ఆగదు.
- Generally = usually = సాధారణంగా/ మామూలుగా. Generally/ usually he comes here in the evenings = సాధారణంగా/ మామూలుగా అతనిక్కడికి సాయంత్రంపూట వస్తాడు.
- just = 1) ఇప్పుడే. He has just left = అతడిప్పుడే వెళ్లిపోయాడు.

2) మాత్రమే (ఎక్కువకాదు అనే అర్థంతో) - It's just Rs. 100/- = It's only Rs. 100/- = అది వంద రూపాయలు మాత్రమే. He left just five minutes ago = అతడు ఇప్పుడే ఐదు నిమిషాల క్రితమే వెళ్లాడు.

Just because you like apples don't say that they are the best of the fruits = నీకు apples నచ్చినంత మాత్రాన వాటిని పండ్లలో గొప్పవి అనలేవు.

3) Just = exactly = కచ్చితంగా 'Are you happy because you are elected? (నువ్వు ఎన్నికయినందువల్ల సంతోషపడుతున్నావా? )

'Just so' (కచ్చితంగా అంటే)

4) ఏదో అలా. Sachin isn't just a batsman like any other batsman = సచిన్ ఏదో ఇతర batsman లాంటి వాడు కాదు. (ప్రత్యేకత ఉంది అతనిలో)

- Almost = దాదాపు. It is almost 2 years since we met each other = అతడిని నేను కలిసి దాదాపు రెండేళ్లయింది.

He spent almost Rs. 10 Lakh on the house = ఆ ఇంటి కోసం దాదాపు రూ. పది లక్షలు ఖర్చు పెట్టాడు. Almost = nearly

- Quite = బాగానే

It's quite a big building = అది పెద్ద కట్టడమే (కాదనలేం)

She is quite beautiful = ఆమె అందగత్తే (సందేహం లేదు)

I am quite happy with what I have = నాకున్న దాంతో నేను సంతోషంగానే ఉన్నా.

- Hardly = scarcely = hardly ever = scarcely ever = దాదాపు లేదు/ లేనట్లే = seldom

I hardly like him = అతడంటే నాకిష్టం లేదు = I scarcely like him.

He hardly/ scarcely ever comes here = అతడిక్కడికి దాదాపు రాడు/ ఎప్పుడైనా వస్తాడు - రానట్లే.

- Rarely = అరుదుగా

They rarely meet each other = వాళ్లిద్దరూ ఒకరినొకరు అరుదుగా కలుసుకుంటారు.

Nearly always = దాదాపు ఎప్పుడూ = They are nearly always together = వాళ్లు దాదాపు ఎప్పుడూ కలిసే ఉంటారు.

- Ocassionally = అప్పుడప్పుడూ. We meet occasionally = మేం అప్పుడప్పుడూ కలుసుకుంటాం (ఎప్పుడూ కాదు)
- Frequently = often
- Already = ఇప్పటికే / అప్పటికే

I've already seen the movie twice = నేనిప్పటికే ఆ సినిమాను రెండుసార్లు చూశాను.

I went to station at 10. The train had already left = స్టేషన్‌కు 10 గంటలకు వెళ్లాను. అప్పటికే train వెళ్లిపోయింది.

**G.Shankar,Keshavapatnam, (Karimnagar).**

**Q.** తెలుగులో కింది పదాలకు, Phrasesకు వివరణలు ఇవ్వగలరు.

Straightforward, verbalism, pluralism, in the light of, flipside, holistic, social fabric, an optimal pathway, parameters, teleological, mundans, endogamons, ontology, miniature, strand, jurisprudence, entrenchment, slackened, cognisance, heralds, axiology, emulation, appraisal, mala adjust.

**A.** Straight forward = మనసులో ఉన్నది ఉన్నట్లుగా కపటం లేకుండా చెప్పడం/ ముక్కుసూటిగా పోవడం.

- verbalism = మాటకు మాట - మక్కీకి మక్కీగా - అనువాదంగానీ, ఒకరు అన్నమాటలనుగానీ, ఏవిధమైన మార్పులు లేకుండా ఇతరులతో చెప్పడం/ రాయడం.
- pluralism = సమాజంలో భాషా, సాంస్కృతిక, మత, రాజకీయ వైవిధ్యం.
- in the light of = దృష్ట్యా - In the light of the concessions announced = ప్రకటించిన సడలింపుల దృష్ట్యా.
- flip side = ఏదయినా ఆలోచనలో, పథకంలో, వాదంలో మనకు అనుకూలంకాని అంశం/ చెడు ఫలితాలు.

The flip side of the SEZs is that a number of farmers are rendered homeless = ప్రత్యేక ఆర్థిక మండళ్ల విషయంలో అసలు జరిగేది, మనకు అనుకూలంకాని అంశం - రైతులు నిర్వాసితులవడం.

The flip side of the medicine is that it weakens the patients = ఆ మందు చెడు ఫలితాలు ఏమిటంటే, రోగులు బలహీనులవడం.

- holistic = ఒక విషయాన్ని అర్థంచేసుకునే ప్రయత్నంలో ఆ విషయం మొత్తం పరిశీలించడం, ఆ విషయం వివిధ అంశాల్లో ఒక్కొక్కటిగా కాకుండా:

We should find a holistic solution to the problem of child labour = బాల కార్మికుల సమస్య పరిష్కారానికి దానిలోని వివిధ అంశాలన్నింటినీ మొత్తంగా పరిగణనలోకి తీసుకోవాలి.

- social fabric = సామాజిక వ్యవస్థ

an optimal pathway = అత్యుత్తమమైన మార్గం/ అత్యంత సుగమ మార్గం

- parameters = పరిమితులు/ అవధులు (limits)
- teleological = సంఘటనలు, ఘటనలు దేన్నో సాధించేందుకే జరుగుతాయి, అందువల్ల (మనం సాధించే విషయం కారణంగానే అవి జరుగుతాయనే తాత్విక సిద్ధాంతం -philosophical theory)
- mundane (మండెయిన్) = అనాసక్తికరమైన, అది 'mundans' కాదు, dull, very ordinary)
- endogamous = మన పరిసరాల్లో స్థానికులనే పెళ్లాడే పద్ధతి. మీరు రాసినట్లు 'endogamons' కాదు.
- ontology మన జీవితాన్ని ఉనికిని చర్చించే తత్వశాస్త్రం.
- miniature = సూక్ష్మమైన/ ఒక పెద్ద వస్తువు చిన్న నమూనా.
- strand = 1) పోగు (తాడులోని) 2) నది, సరస్సు, సముద్రం ఒడ్డు

3) ఎటూవెళ్లలేని స్థితిలో నిస్సహాయంగా ఎవరినయినా వదిలేయడం. The children were stranded in the forest.

jurisprudence = చట్ట, న్యాయ శాస్త్రం.

1) గట్టిగా పాతుకుపోవడం.

2) ఆత్మరక్షణకోసం సైనికులు తవ్వుకునే గుంటలు.

entrenchment = సడలించడం, ప్రయత్నాల్లాంటి వాటిని.

slackened = అవగాహన చేసుకోవడం, గుర్తించడం.

heralds = జరగబోయే సంఘటనలకు సంకేతం.

axiology = నైతిక విలువల సిద్ధాంతం/ ఆలంకారిక నైతిక విలువల నిర్ధారణ.

emulation = గొప్పవారిని అనుసరించి, వాళ్లకు సమానంగా, వాళ్లకంటే గొప్పగా ఎదిగే ప్రయత్నం.

Appraisal = విలువ కట్టడం

Maladjustment = Unsuitability = కుదరని పొత్తు

**V. Narasimha Rao, Ongole.**

**Q.** Please change these sentences into Indirect Speech.

- He said "I was a doctor."

He said that he had been a doctor.

- He said to me "They were in hyderabad.

He told me that they had been in Hyderabad.

**Q.** Pease tell me what are the meanings of the sentences in Telugu.

- Oh, I call it double - faced.

అది రంగులు మార్చే తత్వం.

- Neither of you cared to put up with me.

మీ ఇద్దరిలో ఎవరూ నాతో ఓర్పుతో ఉండటానికి ప్రయత్నించలేదు.

- He was seventy two a fortnight last sunday.

కిందటి ఆదివారానికి ఆయనకు 72 ఏళ్లకో పక్షం (15 రోజులు) తక్కువ/ కిందటి ఆదివారానికి ఆయనకు పక్షం తక్కువ 72 ఏళ్లు.

**Shankar, Adilabad.**

**Q.** Many a night as he lay in the dark, tired and hungry, he would unleash his imagination. ఇక్కడ many a night ఉపయోగం, అర్థం, వాడుక తెలుపండి.

**A.** Many a night = Many nights - ఈ రెండూ ఒకటే. అయితే Many a night, poetic అంటే కాస్త కవిత్వం. Many a night తర్వాత వచ్చే verb ఎపుడూ singular. Many a man is ruined because of his greed = చాలామంది మనుషులు దురాశ వల్ల నాశనమయ్యారు. చూశారుకదా, Many a man is, man తర్వాత verb, is singular.

**G. Durga Prasad, Tiruvuru.**

**Q.** Please explain the following:

- Birds of feather will fluck together.

ఒకే రకం రెక్కల పక్షులు ఒకేచోట చేరతాయి = ఒకే గుణం, వైఖరి కలవాళ్లు ఒకటిగా ఉంటారు.

- Don't rob peter to pay paul.

ఒకరి దగ్గర డబ్బు గుంజి ఇంకొకరికివ్వడం, ఏదో దానం చేసినట్లు అనిపించేందుకు.

- Every bird must hatch its own eggs.

ఎవరి పనులు వాళ్లే చూసుకోవాలి. ఇతరుల మీద ఆధారపడకుండా. (Hatch = పక్షులు గుడ్లు పొదగడం)

- Virtue is its own reward.

సుగుణానికి బహుమతి సుగుణమే - ఏదో ఆశించి మంచిగా ఉండటం కాదు కావాల్సింది, మంచి కోసమే మంచిగా ఉండాలి.

- Falsehood is idious.

Falsehood is hideous (idious కాదు - hideous = భయంకరమైన) = అబద్ధం భయంకరమైంది.

- A cracking door awakened the dog.

తలుపు కదలిక వల్ల అయిన చప్పుడు కుక్కను మేల్కొలిపింది.

- A burent child dreads the fire.

కాల్తున్న బిడ్డ నిప్పంటే భయపడుతుంది = కాలేంత వరకు బిడ్డకు నిప్పు విషయం తెలియదు.

- His tattle coat needs mending.

His tattered (tattle కాదు) coat needs mending = ఆయన చిరుగుల coat కు కుట్లు అవసరం.

- All are not saints to go to the church.

All are not saints that go to the church = గుళ్లకు వెళ్లేవాళ్లందరూ పవిత్రులు కారు.

Saints = పవిత్రులు/ రుషులు.

All are not saints to go to the church కాదనుకుంటా.

- He had his jest and they had his estate.

ఆయన చమత్కరిస్తూనే ఉన్నాడు, ఆయన ఆస్తిని వాళ్లు కాజేశారు.

- Sinologist కు అర్థం చెప్పండి.

దీనికి తొమ్మిదో తరగతి ఇంగ్లిష్‌లో Marks gainer matchingలో A person interested in Chinaఅని ఉంది. ఇది కరెక్టేనా?

Sino = చైనాకు సంబంధించిన/ Indo అంటే Indiaకు సంబంధి.

Glogy = అధ్యయనం/ విజ్ఞానం.

Sinology = చైనాను గురించి అధ్యయనం/ చైనాను గురించి విషయాలు తెలుసుకోవడం.

Sinologist = చైనాను గురించి పరిశోధించేవాళ్లు.

- Future Tense లో ఏ వాక్యం ఇచ్చినా దాని Passive Voice (P.V.) లో be form - will be వస్తుందా?

eg. A.V.: Ravi will marry sita.

P.V.: Sita will be married by Ravi.

Ravi (he) will marry Sita (she).

ఇక్కడ he and she ఒకే group కాబట్టి will, shall మార్పులుండవు.

Sita (she) will be married to (by రాదిక్కడ) Ravi.

- A.V: I shall buy a car.

P.V.: A car will be bought by me.

A.V: ఇక్కడ I shall వస్తోంది. PVలో, A car (it) subject అవుతుంది. కాబట్టి will వాడతాం.

PV: A car will be bought by me.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# You are deceiving yourself





M.SURESAN



**G. Shankar, Shankarapatnam.**

**Q.** My promise will come into effect from today itself. What is the reflexive pronouns indicate here. Even as mention the area of using of the reflex pronouns and when do we use this pronouns.

What is the difference between EMPHATIC Pronouns and REFLEXIVe Pronouns. How do we get an idea of whether it is Emphatic or Reflexive.

**A.** Today itself లో, itself, reflexive pronoun కాదు. ఇది emphatic pronoun.

He himself told her so (అతడే ఆమెకలా చెప్పాడు)- Here, himself is emphatic pronoun- అతడే అని నొక్కి చెబుతున్నాం కాబట్టి - emphatic ప్రాముఖ్యాన్ని సూచించే విధంగా నొక్కిచెప్పడం.)

The president himself came down the stage to congratulate him= President అంతటివాడే stage దిగివచ్చి అతడిని అభినందించాడు.

అతడే/ ఆమే/ నేనే- ఇలా అర్థం వచ్చేట్లు himself, herself, myself, etc- అని వాడితే, అప్పుడు, self చివర వచ్చే pronouns, emphatic pronoun.

అలా కాకుండా- He killed himself = అతడిని అతడే చంపుకున్నాడు - ఇలా అర్థం వస్తే reflexive pronoun.

You are deceiving yourself = నిన్ను నువ్వే మోసం చేసుకుంటున్నావు - ఇది reflexive (yourself)

He always talks about himself - అతడిని గురించి అతడే మాట్లాడుకుంటాడు- himself reflextive.

**Q.** కింది పదాలను తెలుగులో వివరించగలరు.

Ego, egocentric, egoism, egoist, egotist, altruist, introvert, extrovert, ambivert, ego maniac, ascetic.

**A.** Ego = అహం, egocentric = స్వార్థ చింతనం,

egoism= అహంభావం- నేనేగొప్ప/ నేనే ముఖ్యం అనే భావం ఉండటం,

egoist = అహంభావి,

egotist = ఎప్పుడు తనను గురించే మాట్లాడేవాడు,

altruist = త్యాగ, దానబుద్ధి కలవాడు,

introvert = అంతర్ముఖుడు- ముభావంగా తమ ఆలోచనలను బయటికి చెప్పుకోనివారు,

extrovert (X introvert) = బహిర్ముఖులు- అందరితో మాట్లాడుతూ కలుపుగోలుగా ఉండేవాళ్ళు,

ambivert = పై రెండు రకాలుగానూ ఉండేవాళ్ళు,

egomaniac = ఎప్పుడు తనను గురించి, తన ప్రాముఖ్యాన్ని గురించి గొప్పగా మరీ ఎక్కువగా అనుకొని, ఇతరులకు కాస్త ప్రమాదకరంగా ఉండేవాళ్ళు- ఇది కాస్త వికృత మనస్తత్వం,

ascetic = కనీస అవసరాలతో అతి నిరాడంబరంగా ఆదర్శాలతో బతికేవాళ్ళు/ విరాగులు/ ఋషులు. Gandhi was an ascetic.

**Dr. Sri., Tirupati.**

**Q.** 'అతడు ప్రవాహానికి వ్యతిరేక దిశలో వెళ్లడానికి పట్టే కాలం - ప్రవాహదిశలో వెళ్లడానికి పట్టే కాలానికి రెట్టింపు.' ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లోకి ఎలా మార్చాలో చెప్పగలరు.

**A.** The time the swimmer takes to swim against the current stream is twice the time he takes to swim along/ down the stream/ current.

**K.S.R., Martur (Prakasam)**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలో తెలుపగలరు.

- మా ఊళ్లో బజారుకొక లీడర్ ఉన్నాడు. ఎవ్వరికీ అక్షరం ముక్క రాదు.
  We have too many of them - a leader for a street, none of them, educated.
- చదువు సంధ్యా రానివారికి పదవులు ఉండటం వల్ల విద్యావంతుడికి విలువ లేకుండా పోయింది.
  As the uneducated corner all the positions, the educated have no value
- నాకులేని బాధ నీకెందుకు?
  When I am not worried, why should you?
- మేము కుక్కను పెంచుకుంటున్నాం.
  We are bringing up/ raring up a dog
- అవునంటే కాదనిలే, కాదంటే అవుననిలే, ఆడవారి మాటలకు అర్థాలే వేరులే.
  If they yes, they mean no, if they say no, they mean yes, women never mean what they say.
- Hammer in hammer throw అంటే ఏమిటి?
  గొలుసుకు కట్టిన బరువైన ఇనుప గుండు.
- కామ్రేడ్ అని పిలిపించుకోవాలని నాకు పెద్ద కోరిక
  My cherished wish is to be called a comrade

**M. Satyanarayana, Hyderabad**

**Q.** Power, current, light ఈ పదాలను ఎప్పుడు, ఎక్కడ, ఎలా వాడాలి?

**A.** Power = శక్తి విద్యుచ్ఛక్తి

current - ప్రవహించే విద్యుచ్ఛక్తి,

మనం నిత్యం వాడేది x static electricity = నిశ్చలంగా ఉన్న విద్యుత్ battery ల్లో ఉండేది.

current - అసలు అర్థం ప్రవాహం.

light = వెలుగు/ దీపం

**Q.** Power, Energy, strong ఈ పదాలను వివరించగలరు.

**A.** power = energy = శక్తి

strong = బలమైన.

**A. Saiprasad, Kusthapur.**

**Q.** మన దేశంలో అన్ని వర్గాలకు చెందినవారికి Sri/ Mr. అని సంబోధించవచ్చా? హిందువులు కానివారిని Sri/ Srimathi అని సంబోధించవచ్చా? Sri Manmohan singh అనడంలో తప్పేంలేదు కదా?

**A.** సంబోధించవచ్చు అయితే కాస్త హోదాలో ఉన్నవారిని, మనకంటే పెద్దవారిని Mr అనడం కాస్త మర్యాద తక్కువగా భావిస్తారు. అందువల్ల గారు చేర్చడం మంచిది. శ్రీ/ శ్రీమతి నిరభ్యంతరంగా ఎవరికైనా వాడవచ్చు కానీ అవివాహిత స్త్రీని శ్రీమతి అనలేం కదా? వివాహితా, కాదా అని తెలియడం అంత సులభం కాదుకదా? అలాంటప్పుడు గారు చేరిస్తే ఇబ్బంది ఉండదు.

**Q.** రోగ నిరోధక శక్తిని ఇంగ్లిష్‌లో ఏమంటారు? వైద్యశాస్త్ర పరిభాషలో ఏమంటారు?

**A.** Immunity.

**Q.** కోడి మాంసాన్ని చికెన్, మేక మాంసాన్ని మటన్, పంది మాంసాన్ని పోర్క్ అన్నట్టుగా నెమలి, పిట్ట, కుందేలు, చేప, ఎలుక, చిలుక, పాము, జింక, మనిషి తదితర జీవుల మాంసాలను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** ప్రత్యేకమైన మాటలులేవు. Flesh అంటే ఏ మాంసమైనా, ముఖ్యంగా మనిషి మాంసం.

**Q.** అబ్రివేషన్లకు సంబంధించి కొన్ని మంచి పుస్తకాలు, అవి దొరికే చిరునామాలు తెలియజేయండి.

**A.** ఏ General knowledge book అయినా మీకు ఉపయోగపడుతుంది.

**P. Srinivasa Rao, Hyderabad.**

**Q.** He had better go కు question form and negative form తెలుపగలరు.

**A.** He had better not go.

**Q.** కిందివాటికి అర్థాలు ఉదాహరణలతో వివరించగలరు. వీటన్నింటిని Spoken English లో వాడొచ్చా? లేదా? written English లో కూడా వాడేవి ఉన్నాయా? ఉంటే అవి ఏమిటి?

- by default
  విఫలమవడంవల్ల - ఒక వ్యక్తి చేయాల్సిన పని చేయకపోవడం వల్ల, ఇంకో వ్యక్తికి ఆ అవకాశం రావడం/ ఒక వ్యక్తి court లో సంజాయిషీ చెప్పకపోవడం వల్ల అవతలి పార్టీకి అనుకూలంగా తీర్పు ఇవ్వడం.
  He is a president by default = కొత్త president ను ఎన్నుకోకపోవడం వల్ల ప్రస్తుతం ఉన్న వ్యక్తే president గా ఉన్నాడు.
  Judgement by default = Case లో ఒక పక్షం వారు Court కు రానందున, అవతలి పక్షం వాళ్లకు అనుకూలంగా ఇచ్చే తీర్పు - ఇది చాలా formal, spoken English లో వాడం అంతగా.
- once in a while
  ఎప్పుడో ఒకప్పుడు/ అప్పుడప్పుడు - A peg or two once a while is OK - ఎప్పుడో ఒకప్పుడు/ అప్పుడప్పుడు, ఒకటో రెండో pegs మద్యం తీసుకోవడం, ఫరవాలేదు.
- on the contrary
  On the Contrary - ముందు చెప్పిందానికి వ్యతిరేకంగా/విరుద్ధంగా.
  'Have you finished?' (నువ్వు పని పూర్తి చేశావా? )
  'No. On the contrary, I haven't begun yet.' (లేదు. అసలు (అందుకు విరుద్ధంగా) నేనింకా ప్రారంభించనేలేదు)
- as & when
  అవ్వాల్సింది ఎప్పుడయితే అప్పుడు - As and when you pay the money you will get the papers- నువ్వెప్పుడు డబ్బులు చెల్లిస్తే అప్పుడే నీకు పత్రాలు వస్తాయి. అయితే as కానీ when కానీ వాడితే చాలు. As and when కలిపి వాడటం సరైన వాడకం కాదు.
- all this while
  అది జరిగినంతసేపూ. She was doing everything to cook for them, while all this while they were watching the TV= వాళ్లకు వండిపెట్టడాని కామె శ్రమిస్తూ ఉంటే అంతసేపూ వాళ్లు TV చూస్తూ కూర్చున్నారు.
- his days are numbered
  చావు సమీపించడం. When the cancer set in, he knew his days were numbered = Cancer రాగానే తన మరణం సమీపించిందని తెలుసుకున్నాడు.
- at large
  1) మొత్తంగా - The disease which affected only two in the beginning, spread to the whole village at large - ఒకరిద్దరికి సోకిన వ్యాధి ఆ తర్వాత ఆ మొత్తం గ్రామానికి వ్యాపించింది.
  2) At large = పరారీలో ఉన్న-
  The prisoner is at large- ఆ ఖైదీ పరారీలో ఉన్నాడు.
- from hand to mouth
  చాలీచాలని జీవితం- He leads a hand to mouth existence = చాలీచాలని డబ్బుతో జీవితం గడుపుతున్నాడు.
- At a stretch
  ఏకబిగిని/ విరామం లేకుండా - He taught us for 3 hours at a stretch మూడు గంటలపాటు ఏ విరామం లేకుండా మాకు ఆయన పాఠం చెప్పాడు.
- laps & bounds
  విపరీతమైన వేగంతో. The Company grew in leaps and bounds = ఆ Company చాలా/ విపరీతమైన వేగంతో అభివృద్ధి సాధించింది.
- last but not least
  ఆ వరుసలో చివరకానీ, గొప్పతనం, ప్రాముఖ్యంలో గాకుండా - Last but not least, I last but not least, I thank sri somaraju- చివరిగా అయినప్పటికీ, ప్రాముఖ్యంలో ఏం తక్కువకాని సోమరాజు గారికి నా వందనం.
- He made known his desires.
  తన కోరికలేవో తెలియజేశాడు- ఏదో చేయడం/ చెప్పడం వల్ల -
  By critisising the PM, he made known his desires- he wants to be the next PM = ప్రధానమంత్రిని విమర్శించడం ద్వారా తన కోరికను బయటపెట్టాడు - తను ప్రధాని కావాలని.

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

- నేను వెళ్లి ఉండేవాడినేమో.
  I might have gone.
- నేను వెళతానేమో.
  May be I will go/ Perhaps I will go/ I may go.
- నేను వెళ్లాలేమో.
  Perhaps/ May be I have to go.
- నేను వెళ్లి ఉండాల్సిందేమో.
  I should have gone, perhaps.
- నేను వెళ్లాల్సి వస్తుందేమో.
  Perhaps I will have to go.
- అన్నిసార్లు
  As often as that.
- ఇన్నిసార్లు
  This often/ so often.
- అంతసేపు
  So long/ that long.
- ఇంతసేపు
  So far.
- నేను వెళ్లి తీరాలి అంటే I must go. నేను వెళ్లి తీరుతాను అనాలంటే ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?
  I must go. I will (definitely) go.

**Q.** నేను వెళ్లాల్సి వచ్చింది - I had to go.
నేను వెళ్లాల్సి ఉంది - I have to go.
నేను వెళ్లాల్సి ఉంటుంది- I will have to go.
ఇవి కరెక్టేనా? నేను వెళ్లాల్సి వస్తోంది - ఈ వాక్యాన్ని ఎలా చెప్పాలి?

**A.** కరెక్టే.
నేను వెళ్లాల్సి వస్తోంది. I have to go.

**Q.** నేను వస్తుంటాను (regular గా అప్పుడప్పుడు)
నేను వస్తూంటాను (future లో regular గా అప్పుడప్పుడు).
నేను వస్తుంటాను (future లో ఒక టైమ్ వరకు మాత్రమే).
పై మూడు సందర్భాల్లో కూడా I will be coming అనే అంటుంటారు. అది కరెక్టేనా? కాకపోతే మొదటి, రెండో సందర్భాల్లో ఎలా చెప్పాలి?

**A.** I come/ will be coming.
I will be coming once a week, etc.
I will be coming till....
ఈ మూడు సందర్భాల్లోనూ I will be coming correct.

**Q.** కిందివాటికి పేర్కొన్న అర్థాలు సరైనవేనా? కాకపోతే తెలియజేయగలరు.
Unless sachin plays, India will not win.
సచిన్ ఆడకపోతే ఇండియా గెలవదు.

**A.** Correct.

**Q.** Unless Sachin plays, Sehwag will play.
సచిన్ ఆడకపోతే (నే) సెహ్వాగ్ ఆడతాడు.

**A.** ఇది సరికాదు. ఇక్కడ unless కు బదులు, If రావాలి.
If Sachin doesn't play, Sehwag will play.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# The eagle is the mascot of the US





M.SURESAN



**J.V. Jayaprakash, Proddatur**

**Q.** Please clarify the doubts in this sentence.

"I could not understand why my wife and I had to suffer".

Some teachers say 'why' is a conjunction and some teachers say 'had' is a verb. Some teachers say 'why' is a relative adverb and some teachers say 'had to' is a modal auxiliary and 'suffer' is the main verb.

**A.** Why - ఇక్కడ Adverb, It's not a conjunction. I could not understand the reason why ... అన్నప్పుడు, why, relative conjunction. had to suffer - 'had to' is modal, and 'suffer' is a main verb.

**G. Shylaja, Kusthapur**

**Q.** కింది పదాల అర్థాలను, వాటి భేదాలను వివరించగలరు. Trophy, cup, shield.

**A. Trophy** = ఒక పందెంలో గెలిచినందుకు గుర్తుగా విజేతలు తీసుకునే ఓడిపోయినవారి వస్తువును Trophy అనేవాళ్లు. కాలక్రమేణా అది విజయానికి గుర్తు, ఆ తర్వాత విజేతలకిచ్చే బహుమతి అయ్యింది. దీన్నే memento అని కూడా అనవచ్చు

**cup** = విజయానికి చిహ్నంగా, బహుమతిగా ఇచ్చే cup - ఇది చిన్న cup నుంచి, పెద్ద పాత్రగా ఉండొచ్చు

**shield** = ఇది కూడా పోటీలో విజేతలకిచ్చే బహుమతే - అయితే ఇది పూర్వం యుద్ధాల్లో సైనికులు వాడే డాలు రూపంలో ఉంటుంది.

**Q.** nonsense, bitch, stupid, rogue, idiot, rascal, scoundrel.

**A. Nonsense** - అర్థంలేని మాటలు/ పిచ్చి మాటలు/ సమయ సందర్భంలేని మాటలు - పిచ్చి చేష్టలు.

**Bitch** = ఆడకుక్క, అయితే ఇది ఎక్కువగా వేశ్య అనే అర్థంతో స్త్రీలను అవమానకరంగా సంబోధించేందుకు వాడతారు.

**Stupid = Idiot** = మూర్ఖులు

stupid movie/ stupid jokes, etc - ఇలాంటి వాటిల్లో stupid కు అర్థం - unintersting and dull అని, ఆసక్తికరంగా లేకుండా విసుగనిపించే.

**Rogue** = మోసగాడైన దుర్మార్గుడు

**Scoundrel** = దుర్మార్గుడు

**Rascal** = Rogue = దుర్మార్గపు మోసగాడు, అయితే rascal ను English లో తిట్టుపదంగా అనుకోరు. అభిమానంతో అనే పదంగా (మనం చిన్నవాళ్లను, దొంగ వెధవ) అన్నట్లు భావిస్తారు.

**Q.** logo, muscat, symbol, emblem, motto.

**A. Logo** = trade mark = ఓ కంపెనీ/ సంస్థ ఉపయోగించే చిహ్నం.

**Emblem**= ఇది కూడా చిహ్నమే. అయితే ఇది ఒక జాతి, దేశం, రాష్ట్రం, నగరపాలిక సంస్థలు తమ గుర్తుగా వాడే చిహ్నం.

The Asoka pillar with the three lions and the wheel is the national emblem of India = మూడు సింహాలూ, చక్రం ఉన్న అశోక స్తంభం భారత జాతి చిహ్నం.

**Mascot** (muscat కాదు) అదృష్టకరమైందిగా భావించే జంతువు, మనిషి ఏ బొమ్మయినా.

The eagle is the mascot of the US = అమెరికా mascot - గరుడపక్షి.

**Symbol** - ఏ చిహ్నమైనా

**Motto** - ఒక సంస్థ/ వ్యక్తి నమ్మే ఆదర్శం - ఒక చిన్న వాక్యం రూపంలో- సత్యమేవ జయతే లా. మామూలుగా ఇది logo, emblem లాంటి వాటిల్లో భాగంగా ఉంటుంది.

**Q.** quick, soon, urgent, immediately.

**A. Quick** - త్వరగా/ వేగంగా

**Soon** = వెంటనే. ఒక సంఘటన జరిగిన వెంటనే. (Quick అనేది, కదలికలో వేగం తెలుపుతుంది- Soon = తొందరగా, ఒక విషయం తర్వాత)

**urgent** = అవసరంగా/ అనుకున్న వెంటనే జరగాల్సిన

**immediate** = తక్షణం.

**Q.** scrutiny, checking, verification and observing.

**A. Scrutiny**= పరిశీలన **Checking**= తనిఖీ

**Verification** = సరిచూడటం (జరగాల్సిన విధంగా జరిగిందా లేదా అని)/ ధ్రువపరచుకోవడం- ఒకరు చెప్పింది నిజమా, కాదా అని.

**Observing**= గమనించడం; వ్యాఖ్యానించడం

**Q.** examine, search, scanning, testing, inspect.

**A. Examine** = పరీక్షించడం **search** = వెదకడం

**Scanning** = నిశితంగా పరిశీలించడం/ పరీక్షించడం

**Testing** = పరీక్షించడం

**Inspect** = తనిఖీ చేయడం

**Q.** staff, faculty, crew.

**A. Staff** = కార్యాలయాల్లోని సిబ్బంది

**Faculty** = College/ University లో బోధన సిబ్బంది.

**Crew** = వాహనాల సిబ్బంది - bus, ship, plane, etc.

**M. Satyanarayana, Hyd.**

**Q.** End, close, finish; hardware, iron, steel - ఈ పదాల గురించి తెలుపగలరు.

**A. End** = అంతం, చివరి దశ

**close** = మూయడం

**finish**= పూర్తిచేయడం/ తుదిమెరుగులు.

The match has ended = Match అయిపోయింది.

close అంటే ఒక్కోసారి పూర్తిచేయడం అనే అర్థం ఉంది/ ముగించడం.

Let's close this chapter as soon as possible = వీలయినంత త్వరగా ఈ chapter ముగిద్దాం.

Finish = పని పూర్తిచేయడం.

He has finished his home work.

Finish అంటే తుదిమెరుగు అనే అర్థం

The chair lacks finish = ఈ కుర్చీకి కాస్త మెరుగు/ ఆకర్షణ లేదు. (మిగతా విషయాలు సరిగా ఉండొచ్చు)

**Iron**= ఇనుము

**steel**= ఉక్కు (ఇంట్లో వాడే పాత్రలు- stainless steel)

**Hardware** - భవనాల కట్టడాలకు వాడే ఇనుప, ఇత్తడి, కంచు, ఉక్కు సామగ్రి- మేకులు, buckets, గడియలు లాంటివి.

**M.A.K. Chakravarthi, Nadakuduru**

**Q.** Simple, Complex and Compound Sentences గురించి చెప్పండి.

**A.** Simple, Compound and Complex sentences:

**Standard Conversions**

| Simple | Complex | Compound |
|---|---|---|
| *1) Inspite of/ despite*<br>*2) without/ but for*<br>*3) because of* | *Though/ although/ even though*<br>*If/ unless*<br>*becasuse* | *But/ yet/ and yet*<br>*or/ otherwise/ or else*<br>*so/ therefore* |
| **1.** A tallman was here (Tall man - phrase - దీన్నే clause చేయొచ్చు- A man who is tall అని) | A man who was tall was here. | A man was here and he was tall. |
| **2.** Inspite of/ Despite (అయినప్పటికీ) Inspite of/ Despite his wealth he spends little. | though/ although/ even though he is rich, he spends little | He is rich but/ yet/ and yet he spends little. |
| **3.** Without his telling me, I will not go. | only if he tells me, I will go/ unless he tells me, I will not go | He should tell me (to go); or else/ otherwise I will not go. |
| **4.** Because of his illness he is absent. | Because he is ill, he is absent. | He is ill, so he is absent. |

ఇంకా వివరంగా చూడండి.

a) After his death, his sons separated (అతడి మరణం తర్వాత కొడుకులు విడిపోయారు) - Simple (separated - ఒకే verb ఈ sentence లో)

b) After he (had) died, his sons separated (అతడు మరణించిన తర్వాత కొడుకులు విడిపోయారు) ఇక్కడ after తర్వాత (had) died, అనే verb రావడంతో separated తో రెండు verbs అవుతున్నాయి. After he had died- subordinate clause, so the sentence is COMPLEX.

c) He (had) died and then his sons separated.

ఇక్కడ కూడా రెండు verbs రెండు clauses =

1) He (had) died = చనిపోయాడు

2) And then his sons separated = తర్వాత అతడి కొడుకులు విడిపోయారు.

ఈ రెండు main clauses కాబట్టి ఇది COMPOUND sentence.

ఇలా అర్థం మారకుండా మార్పులు చేస్తుంటూ phrases ను clauses గా/ clauses ను/ phrases గా మార్చడం practice చేయడం అవసరం. దీనికి కొంత ఊహ కావాలి, కష్టం కాదు.

**P. Ravikumar, Aiza.**

**Q.** Who was the son of Dasaratha వాక్య నిర్మాణం ప్రకారం ఇది ప్రశ్న. దీని అర్థం: దశరథుడి కుమారుడెవరు? కానీ 'దశరథుడి కుమారుడైనటువంటి (రాముడు)' అని కొన్ని Spoken English పుస్తకాల్లో చూశాం. ఎలాంటి సందర్భాల్లో అలా రాయొచ్చు?

**A.** Who was the son of Dasaratha? ఈ sentence ఇలాగే ఉన్నట్లయితే దీనికి అర్థం దశరథుడి కుమారుడెవరు? అనే. అయితే Sri Rama, who was the son of Dasaratha, killed Ravana - ఇక్కడ who was the son of Dasaratha అనేది question కాదు. మొత్తం sentence లో అదో భాగం. ఇలా sentence లో భాగంగా వచ్చినప్పుడు 'దశరథుడి కుమారుడైన రాముడు' అనే అర్థం వస్తుంది.

**Q.** Which is being pulled down by them. ఇది ప్రశ్న కదా. కానీ 'ఏదైతే వాళ్లతో పడగొట్టబడుతూ ఉందో ఆ (కట్టడం)' అని అర్థం ఉంది. ఇది ఎలా సాధ్యం?

**A.** The building which is being pulled by them is 100 years old = ఇక్కడ కూడా 'వాళ్లతో పడగొట్టబడుతున్న' అనే అర్థమే వస్తుంది. వాళ్లతో పడగొట్టబడుతున్న building, 100 సంవత్సరాలది అని sentence అర్థం. అలా కాకుండా Which building is being pulled down by them? = ఏ building వాళ్లతో పడగొట్టబడుతోంది?

**Q.** Which is planting tree? ఏదైతే చెట్టను నాటుతూ ఉందో అని అర్థం కరెక్టేనా?

**A.** Which is planting tree? = ఏది చెట్టను నాటుతోంది - దీనికర్థం లేదు కదా.

**Q.** Who came a large city. ఎవరైతే ఒక పెద్ద పట్టణానికి వచ్చారో? అనే అర్థం సరిపోతుందా?

**A.** The man, who came to a large city .... = పెద్ద నగరానికి వచ్చిన ఆ మనిషి.

Who came to a large city?= ఎవరు వచ్చారు పెద్ద నగరానికి?

**Q.** Who travelled from here to there. ఎవరైతే ఇక్కడి నుంచి అక్కడకు ప్రయాణం చేశారో? అనే అర్థం వస్తుంది కదా?

Who travelled from here to there? = ఇక్కడి నుంచి అక్కడికి ఎవరు ప్రయాణించారు? కరెక్టేనా?

**A.** Passengers, who travelled from here to there = ఇక్కడి నుంచి అక్కడికి ఎవరైతే ప్రయాణించారో వాళ్లు = ఇక్కడి నుంచి అక్కడికి ప్రయాణించిన ప్రయాణికులు.... ఇలా who/ whose తో వచ్చే clauses sentence లో భాగం అయితేనే మీరనుకున్న అర్థం వస్తుంది. కరెక్టే.

**U.Hari, Tandoor.**

**Q.** Why the words THE, A pronounce in different ways like The - ద - ది, A - ఏ - అ.

**A.** We pronounce the as 'ది' before English words beginning with any of the Telugu sounds, అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ

The (ది) egg (ఎగ్), The (ది) ant, The (ది) idea (ఐ), The (ది) owl (ఔల్), etc.

Before English words beginning with other than the Telugu sounds from అ to ఔ, the is pronounced as ద.

The (ద) building, the (ద) tree, The (ద) University, etc.

A is mostly pronounced as అ, and only when we want to stress it (ఒక్కటే, ఏదో ఒక అనే అర్థంతో నొక్కి పలికేటప్పుడు), we pronounce it as, ఎ.

**Q.** What is exact meaning of 'Back drop of.' Kindly explain its usage with example.

**A.** Back drop= 1) The drop curtain at the back of a stage in a theatre (drama hall),

2) All that we can see around us when an event takes place.

The roaring Sea provided a back drop to the fight between the two = వారి పోట్లాటకు, హోరెత్తుతున్న సముద్రం నేపథ్యంగా సరిపోయింది.

3) ఒక సంఘటన జరుగుతున్నప్పుడు / జరిగేటప్పుడు, దానికి సంబంధించిన/ దానిక్కారణమయ్యే పరిస్థితులు.

eg: The communal clashes broke out against the backdrop of the comments the people of one community made against the other= ఒక వర్గానికి చెందినవారు, ఇంకో వర్గం మీద చేసిన వ్యాఖ్యల నేపథ్యంలో వర్గ సంఘర్షణ ప్రారంభమయింది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**





**G. Shankar, Keshavapatnam**

**Q.** Could you suggest material for JL of English and its titles. Even as where they can be had from.

**A.** Material for Junior Lecturers in English prepared by various writers is available in all good book stalls. The best thing is to have a thorough knowledge of the History of English Literature from spencer to the 20th century, various movements in Eng. Literature, and different forms of literature.

**Q.** What is / are the difference between the accent and stress.

**A.** Accent and stress, broadly speaking means more or less the same. However, Accent means the way a language is spoken and pronounced by different groups of the speakers of the language - for example, we have British accent of English - English as spoken and pronounced by the British, American accent - American way of speaking and pronouncing English language, Scottish (people of Scotland) accent, etc.

Stress is the extra force with which we pronounce a syllable in a word. eg : In the word, 'above', there are two syllables 1)a (ə) 2) bove (bʌv), In pronouncing this word, we stress the second syllable bʌv. That is, we use extra force while uttering 'bʌv'. The stress is on the second syllable. We also say that the accent is on the second syllable.

**Q.** Could you give me the meanings of phrases of the following in telugu.

**A.** ★ **In tune with**

In tune with = అనుగుణంగా.

In tune with the changing tastes of the customers, the company is designing new footwear = మారుతున్న customers అభిరుచులకు అనుగుణంగా, ఆ company కొత్త రకాల పాదరక్షలను రూపొందిస్తోంది.

★ **Underscores**

Underscore = underline = మనం మాట్లాడే/ రాసే విషయాల్లో ఏదైనా ముఖ్యం అని తెలపడం.

The frequent terrorist attacks underscores the need for tighter security = తరచూ జరుగుతున్న ఉగ్రవాదుల దాడులు పటిష్ఠ భద్రత అవసర ప్రాముఖ్యాన్ని తెలుపుతున్నాయి.

★ **Heralds**

Herald = జరగబోయే విషయం/ సంఘటనల సంకేతం.

To herald = జరగబోయే సంఘటనలకు సంకేతంగా ఉండటం/ శ్రీకారం చుట్టడం.

a) Viresalingam's Rajasekhara Charitam heralded the novel era in Telugu literature = కందుకూరి వీరేశలింగం రచించిన రాజశేఖర చరితం, తెలుగు సాహిత్యంలో నవలా శకానికి (era) ఆరంభం సూచించింది/ సంకేతమైంది.

b) Sri Sri's poetry heralded the age of free verse in Telugu = శ్రీశ్రీ కవిత్వం తెలుగులో ఛందోబద్ధం కాని కవితకు శ్రీకారం చుట్టింది.

**A.Sudhakar, Peddamallareddy.**

**Q.** C.I.E.F.L. లో M.Phil (Eng), P.G.D.T.E. చేయాలంటే కావాల్సిన విద్యార్హతలు తెలుపండి.

**A.** M.A. Degree in English Language and literature.

**Q.** P.G.D.T.E., C.I.E.F.L. లో చదివిన విద్యార్థులకు D.S.C.లో అవకాశం ఉందా? దయచేసి తెలుపగలరు.

**A.** అవకాశం ఉంది.

**P.Lingam, Nagapuram.**

**Q.** కోడిమాంసాన్ని చికెన్, మేక మాంసాన్ని మటన్, పంది మాంసాన్ని పోర్క్ అన్నట్లుగా నెమలి, పిట్ట, కుందేలు, చేప, ఎలుక, చిలుక, పాము, జింక, తదితర జీవుల మాంసాన్ని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** వాటికి ప్రత్యేకమైన మాటలు లేవు. అన్నింటికి general గా meat అంటాం.

**Q.** విద్రోహులు, ఉగ్రవాదులు, దుండగులు, నిందితులు, ఘాతుకులు ఈ పదాలకు సమానార్థానిచ్చే ఇంగ్లిష్ పదాలను తెలుపండి.

**A.** ఉగ్రవాదులు = terrorists

దుండగులు= hooligans/ miscreants/ ruffians

విద్రోహులు = ఘాతుకులు = saboters (pron: శాబటాజ్), Sabotage (pron: శాబటేజ్- 'జ్', measure లో 'జ' లా)

నిందితులు= The Accused.

**Q.** Define and explain the following about cricket stadium.

**A.** ★ **Pavilion**

# It was a success altogether

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 525

M.SURESAN

Sports ground కు దగ్గరలోనే ఉండే గుడారంలాంటి కట్టడాన్ని pavilion (పవిల్యన్ - 'వి' నొక్కి పలుకుతాం) అంటాం. ముఖ్యంగా players (జరుగుతున్న పోటీలో పాల్గొంటున్న క్రీడాకారులు), ఆహ్వానితులు కూర్చునే వసతి.

★ **Pitch**

Pitch (Cricket)= The area marked out between the two sets of stumps- the bowlers bowl on it and the bats men face the ball- Stumps కూ stumps కూ మధ్య bowlers తమ బంతిని bowl చేసేందుకు, bats men వాటిని ఎదుర్కొనేందుకు ప్రత్యేకంగా ఏర్పరచిన ప్రదేశం.

★ **Dressing room**

Dressing room = క్రీడాకారులు తమ బట్టలు మార్చుకునేందుకు, ఆట విరామ సమయంలో ఆహార పానీయాలు తీసుకునేందుకు, విశ్రాంతికి వాడే గది.

★ **Gallery**

1) ప్రేక్షకులు కూర్చునేందుకు మెట్లు మెట్లుగా నిర్మించిన స్థలం. ఈ వసతికి tickets ధర ఇతర తరగతుల కంటే తక్కువ.

2) చిత్ర/ శిల్ప వగైరా కళల ప్రదర్శన నిర్వహించే hall.

★ **Out field**

క్రీడా మైదానంలో boundary కి ఇవతల ఉన్న ప్రదేశం.

★ **Curator**

1) క్రీడా మైదానాన్ని ఆటకు అనువుగా ఉండేట్లు సిద్ధపరిచే అధికారి.

2) Museum, picture gallery లను సంరక్షించే అధికారి

★ **Ground**

క్రీడా మైదానం

★ **Grounds men**

curator కు సహకరించే క్రీడా మైదానాన్ని సిద్ధం చేసే పనివాళ్ళు.

★ **Stands**

ప్రేక్షకులు కూర్చునిగానీ, నిల్చునిగానీ ఆట చూసేందుకు ఏర్పరచిన వసతి (దాదాపు gallery)

**T. Siva, Nandikotkur.**

**Q.** Erect, Straight, Rotate, Revolve, Each, Every, Fight against, Fight with, Acronym , Palindrome, Rule, Rule over, Dumb, Following, All together, Same, Garments, Robes, Fabric, Now, Through, From the beginning, React పదాల అర్థాలను ఉదాహరణలతో వివరించండి.

**A.** **Erect** = vertical (నిట్టనిలువుగా)

★ **Straight** = వంకర లేకుండా/ వంపులు లేకుండా, ఇది నిట్టనిలువుగా ఉండవచ్చు, Horizontal గానూ (భూమికి సమాంతరంగా) ఉండవచ్చు, ఏ దిక్కులోనైనా ఉండవచ్చు కదలికలో, go straight అంటే మధ్యలో ఎక్కడా మలుపు/ ఆగడం లేకుండా నేరుగా ఒకచోటికెళ్ళడం.

ఏదైనా వస్తువు తన చుట్టూ తాను తిరగడం **Rotate** - బొంగరం - A top rotates. The earth rotates around its axis - భూమి తన చుట్టూ తాను తిరుగుతుంది.

★ **Revolve** - ఒక వస్తువు చుట్టూ ఇంకో వస్తువు తిరగడం - The earth revolves round the sun - సూర్యుడి చుట్టూ భూమి తిరుగుతుంది.

★ **Each** - రెండింటి కంటే ఎక్కువ ఉన్న వాటిల్లో ప్రతీది/ ప్రతివారు.

Each student paid Rs. 10/- head - ప్రతి student తలా పదిరూపాయలు చెల్లించారు.

దాదాపు 'ప్రతీ' అనే అర్థంతో, each అన్నా every అన్నా దాదాపు ఒకటే - అయితే కింద వివరించిన సున్నితమైన తేడా గమనించాలి. Each అంటే ఒక సమూహంలో ఉన్న ప్రతి వస్తువూ/ మనిషి అని.

★ **Every** అన్నప్పుడు ఆ సమూహమంతటికీ/ అందరికీ అనే అర్థం వస్తుంది.

Every Indian knows the story of the Bharatham = భారతం కథ ప్రతి భారతీయుడికీ (=భారతీయులందరికీ) తెలుసు. ఇక్కడ each వాడలేం కదా? each Indian... అనం.

ఇంకో తేడా each, every నే -- Every అన్నప్పుడు, కొంచెం పెద్ద సమూహం (group) లో అన్నీ/అందరూ. Each అంటే మనం మాట్లాడుతున్న ఫలానా సమూహం (group) లోని, ప్రతి ఒక్కటీ/ ఒక్కరూ అని.

Each student there got some prize or the other = అక్కడున్న ప్రతి విద్యార్థికీ ఏదో ఒక prize వచ్చింది. అక్కడ ఉన్న ప్రతి ఒక్కరికీ అని.

Every boy knows that two twos are four = రెండు రెళ్లు నాలుగని అందరు పిల్లలకూ తెలుసు.

★ **Fight against** = పోరాడటం.

**Fight with** = వాదించడం - దీన్ని గురించి మరింత వివరంగా, ఈ మధ్య lessons లోనే వివరించాం, చూడండి.

★ ఓ abbreviation లోని అక్షరాలన్నీ ఒక పదంగా ధ్వనిస్తే, అది **Acronym**.

eg: 1) WHO (World Health Organization)

2) AIDS (Acquired Immune Deficiency Syndrome)

★ **Palindrome** = A word that reads the same from the beginning to the end/ end to the beginning. eg: Madam - ఈ మాట ఎటు నుంచి చదివినా Madam అనే వస్తుంది కదా, తెలుగులో 'కిటికి' లా.

★ **Rule, Rule over** రెండూ దాదాపు ఒకటే పాలించడం. అయితే, పాలించే విస్తీర్ణం బాగా ఎక్కువయితే, Rule over అంటాం.

a) Ashoka ruled for 30 years (అశోకుడు 30 ఏళ్లపాటు పాలించాడు.) b) Ashoka ruled over a vast empire.

(అశోకుడు పెద్ద సామ్రాజ్యాన్ని పాలించాడు.)

c) The British ruled India for 200 years = భారత్‌ను బ్రిటిషర్లు 200 ఏళ్లు పాలించారు.

d) The British ruled over the largest empire in the World = ప్రపంచంలోనే అతిపెద్ద సామ్రాజ్యాన్ని బ్రిటిషర్లు పాలించారు.

★ **Dumb** అంటే మూగ - మాటరాకపోవడం / మాట్లాడలేకపోవడం వల్ల, మాట్లాడకుండా ఉండటం.

★ మామూలుగా వెంబడించడం/ అనుసరించడం **following**. Following him were his brothers- అతడిని వెంబడిస్తూ అతడి సోదరులున్నారు.

Following the advice of the doctor, he gave up smoking = Doctor సలహాను అనుసరించి అతడు smoking మానేశాడు.

The following = ఈ కింద చెప్పిన/ తెలిపిన.

★ **All together** = అందరూ కలిసి - The students, all together helped the teacher = విద్యార్థులందరూ teacher కు సాయపడ్డారు. అయితే all together బదులు, All of them, all the students better.

Altogether = పూర్తిగా, మొత్తం.

a) He gave up smoking altogether = అతడు smoking పూర్తిగా మానేశాడు.

b) There were sixty men altogether = ఎటొచ్చీ అక్కడ మొత్తం 60 మంది ఉన్నారు.

c) It was a success altogether = ఎటొచ్చీ/ మొత్తానికి అది పెద్ద విజయమే

★ **Same** = ఒకటే, the same

సాధారణంగా the లేకుండా same వాడే సందర్భాలు చాలా తక్కువ/ దాదాపు లేవు.

1) The brothers are the same in every respect = ప్రతి విషయంలోనూ ఆ అన్నదమ్ములొకటే (పోలికలున్నాయి).

2) He sent the same greetings to all = అందరికీ ఒకే అభినందనలు పంపాడాయన.

★ **Garments** = దుస్తులు/ వస్త్రాలు - ఈ మాట కాస్త పాండిత్యం. దీని బదులు clothes వాడటం మంచిది.

★ **Robes** = రాచరికానికీ, హోదాకూ చిహ్నంగా ధరించే వస్త్రం - భుజాల మీద నుంచి దేహాన్ని వదులుగా కప్పుతూ నేలను తాకే పెద్ద వస్త్రం.

★ **Fabric** = వస్త్రాలు, sofa covers, curtains కూ వాడే ఎలాంటి వస్త్రమయినా - Cotton/ Silk/ Polyester, etc.

★ **Now** = ఇప్పుడు, Right now= ఇప్పుడే/ ఉన్న పళాన్నే/ వెంటనే.

a) He is coming now= ఆయనిప్పుడు వస్తున్నాడు.

b) Do it right now= ఇప్పుడే చెయ్యాలి/ వెంటనే చెయ్.

★ **Through** = గుండా/ ద్వారా/ ఓ సమయం మొత్తం. He was here through the day= రోజంతా ఉన్నాడు.

★ **Right through** = మొదలు నుంచి చివరి వరకు (without a break).

Right through his stay here, he troubled every one = అతడిక్కడ ఉన్నంతసేపు అందరినీ ఇబ్బంది పెట్టాడు.

★ **From the beginning** - ఇది కూడా పైవాటిలానే = మొదటి నుంచి/ ప్రారంభం నుంచి Right from the beginning = మొట్ట మొదటి నుంచి/ ప్రారంభించిన క్షణం నుంచి.

★ **React** = Do something in response to something else - ఒకదానికి స్పందనగా ఏమైనా చేయడం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# He seems to be happy

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 526

M.SURESAN



**T. Sunil, Cheriyal.**

**Q.** Study, read వీటిని ఏయే సందర్భాల్లో ఉపయోగించాలో వివరించగలరు.

**A.** Read అంటే మామూలుగా చదవడం - Newspapers, Novels లాంటివి - We read Newspapers, novels, etc.

Study అంటే బాగా పరిశీలించి, ప్రతి విషయాన్ని అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తూ చదవడం.

a) Students study their text books, notes, etc.

b) He is studying maths now, and wants to study physics later - ఇప్పుడతను గణితం చదువుతున్నాడు, తర్వాత Physics చదువుతాడు.

ఒక class చదవడం కూడా study.

**Q.** The police has arrested a theif.

The police have arrested a thief.

ఈ రెండు వాక్యాల్లో ఏది కరెక్టో తెలుపగలరు.

**A.** The police have arrested, correct.

Police ఎప్పుడూ plural. Police కు singular number, A police man/ A police person (మహిళా పోలీస్ అయితే)

**Q.** The news are wrong.

The news is wrong.

ఈ రెండింటిలో ఏది కరెక్టు?

**A.** News ఎప్పుడూ singular గానే వాడతాం - దీనికి plural ఉండదు, దీని ముందు a/ an రాదు. అందుకని The news is wrong - correct.

**Q.** మోసగాడిని ఆంగ్లంలో cheater అనాలా? లేదా cheat అనాలా?

**A.** Cheater పదం English లో లేదు. Cheat = 1) మోసం చేయడం 2) మోసగాడు.

**Q.** Englishలో ఒక పదం noun నుంచి, verb నుంచి, adjective నుంచి adverb గా ఉంటాయి. ఇవి ఉదాహరణలతో వివరంగా ఉన్న పుస్తకాన్ని సూచించగలరు?

**A.** అలా తెలుసుకునేందుకు Oxford Advanced Dictionary of Current English, అలాంటి ఇతర standard dictionaries బాగా ఉపయోగపడతాయి.

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా రాయాలో తెలుపండి.

- సముద్రం మొత్తం ఇంగ్లిష్ అనుకుంటే, అందులో కనీసం నీటి బిందువు అంతకూడా నాకు రాదు.

If English were an ocean, my knowledge wouldn't be even be a drop in it.

- మనకు పరిస్థితులు అనుగుణంగా ఉండవు. మనమే పరిస్థితులకు అనుగుణంగా ఉండాలి/ మారాలి.

Not always do circumstances favour us. We should change according to circumstance.

- నాకు వచ్చిన కలలో మీరు ఏదో సమస్యతో బాధపడుతున్నారట.

I dreamt that some problem was troubling you/ My dream showed you having some problem.

**Q.** Please give me good advise to learn English in easy ways.

**A.** The best way to learn English is to start speaking it immediately, and read as much English as you can. Read the English newspaper regularly.

**G. Srinivas Rao, Email.**

**Q.** I will not let him see the movie.

As well as I will not take him to the movie.

ఈ వాక్యాల్లో him తరువాత to ఎందుకు వాడకూడదో చెప్పగలరు.

**A.** 'I will not let him see the movie' is correct. 'Let' in sentences like the above is never followed by the infinitive.

**T. Satyanarayana, Vempadu.**

**Q.** కిందివాటిని ఇంగ్లిష్‌లో తెలియజేయగలరు.

- మీరు వచ్చి ఎంతసేపయ్యింది?

How long is it since you came?

- నేనొచ్చి ఎంతసేపయ్యింది?

How long is it since I came?

- నేనొచ్చి ఇంతసేపయినా మీరు పట్టించుకోలేదు.

It is long since I came and you have taken no notice of me.

**Q.** I am doneకు, I have doneకు, He is goneకు, He has goneకు ఉన్న తేడాలను విశదీకరించండి.

**A.** I am done = నేను పనిపూర్తిచేశాను/ నా పని పూర్తయ్యింది.

I have done = నేను చేశాను. ఇది sentence కాదు. I have done - నేను చేశాను, దేనిని అనేది తెలియడంలేదు కాబట్టి ఇది sentence కాదు.

He is gone = అతను వెళ్లిపోయాడు = He has gone. అయితే He is gone అన్నప్పుడు, 'అతడు'కు ప్రాముఖ్యం. He has gone లో 'వెళ్లాడు'కు ప్రాముఖ్యం.

**Q.** He was going to schoolకు, He used to go to schoolకు ఉన్న తేడా ఏమిటి? ముఖ్యంగా నేను Past continuous tense కు, used to కు confuse అవుతున్నాను. ఏంచేయాలో చెప్పండి.

**A.** Past continuous కు, used to కు అసలు సంబంధమే లేనప్పుడు, మీరు confuse కావాల్సిన అవసరంలేదు.

Past continuous గతంలో ఒక నిర్దిష్ట సమయంలో జరుగుతూ ఉన్న పనిని తెలుపుతుంది. Used to 1st RDW ఎప్పుడూ గతంలో వాడుకగా జరిగే పనిని గురించి చెబుతుంది.

He was going to school = అతనప్పుడు school కు వెళుతున్నాడు. (Pastలో ఒక నిర్దిష్ట సమయంలో).

He used to go to school = అతడు schoolకు వెళ్లేవాడు, ప్రతిరోజూ/ ప్రతివారం/ ప్రతి శనివారం, etc.

**Q.** Past continuous tenseను ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారో వివరిస్తూ కొన్ని ఉదాహరణలివ్వగలరు.

**A.** was + ...ing/ were + .... ing = ఇది verb form in the past continuous.

I was walking down the street when it started raining = వర్షం వస్తున్నప్పుడు నేను roadపై వెళ్తున్నాను. (Road పై వెళుతున్న సమయంలో వర్షం పడుతూ ఉంది).

I used to go to movies often those days = ఆ రోజుల్లో నేను తరచూ సినిమాలకు వెళ్లేవాడిని. (Repeated action in the past).

**Q.** నేను వెళ్లాలి. ఇక నేను ఉంటాను. అని సెలవు తీసుకునేటప్పుడు I must be going. Bye Bye అంటున్నారు. I must go అనవచ్చా? లేదా I must go కు, I must be going కు ఉన్న తేడాను తెలియజేయండి.

**A.** I must go అనొచ్చు కానీ I must be going అనేది ఎక్కువ వాడుకలో ఉంది.

**Q.** Improbable condition కు,Impossible condition కు ఉన్న తేడా ఏమిటి?

**A.** Improbable condition అంటే ఇది జరిగే అవకాశం లేదు. జరగడం అంటూ అయితే దాని ఫలితం ఇలా ఉంటుంది అని.

Impossible condition అంటే అసాధ్యమని. ముఖ్యంగా గతంలో జరగనిదాన్ని, జరగకపోయుంటే, జరగనిది, జరిగుంటే ఎలా ఉండేది అని ఊహించుకునే పరిస్థితి.

**Q.** Adjectives, Adverbs కు చెందిన comparative forms ను than ప్రయోగం లేకుండా ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారు?

**A.** ముఖ్యంగా రెండింటిని/ ఇద్దరిని మాత్రమే పోల్చినప్పుడు, కింద తెలిపిన పరిస్థితుల్లో than రాదు.

eg: 1) He is the taller of the two.

(వాళ్లిద్దర్లో అతనెక్కువ పొడుగు.)

2) She is among the better dancers here - ఇక్కడున్న నర్తకుల్లో ఆమె ఒకరు.

2) రెండింటికి ఉన్న తేడా ఏ మేరకు అని తెలిపేందుకు, 'by' వాడతాం.

a) He is taller than her by 5 cms - ఆమె కంటే అతడు, 5 సెం.మీ. పొడుగు.

b) The price has been raised by ten rupees = ధర 10 రూపాయలదాకా పెంచారు.

3) Time విషయంలో ఒక time కు/అంతకు ముందే.

eg: a) He will be here by 6 O' clock = అతడు ఆరు గంటలకల్లా (6 గంటలకు/ అంతకుముందు - ఆరు దాటకుండా)

b) By then the damage was done - అప్పటికే నష్టం జరిగిపోయింది.

**M.Laxman, Kakinada.**

**Q.** నాకు ఇంగ్లిష్‌లో కొన్ని పదాలను ఎలా ఉపయోగించాలో తెలియడం లేదు. అవి: by, though, suppose, regard, tend, asto, apart, by means of, apart from, somehow, as of, even as, even then, even since, for all, and out of. ఈ పదాలకు తెలుగులో అర్థాలు కూడా చెప్పగలరు.

**A.** By - 1) passive లో object ముందు by వాడతాం - ఒకరిచేత అనే అర్థంతో.

eg: She was murdered by her husband (భర్త చేత చంపబడింది).

- Though = అయినప్పటికీ

Though it was difficult, he was willing to do it = అది కష్టం అయినప్పటికీ, అతడు దాన్ని చేసేందుకు ఒప్పుకున్నాడు.

- Suppose = if = అయితే/ ఆ పక్షంలో.

Suppose you win a crore rupees in a lottery what will you do? నువ్వు లాటరీలో కోటి రూపాయలు గెలిచావనుకో/ గెలిస్తే, నువ్వేం చేస్తావు? ఇలాంటి చోట్ల suppose బదులు if వాడవచ్చు

- Regard = 1) గౌరవం - Have/ Show. great/ some/ little regard for somebody = ఎవరిపైనయినా గొప్ప/ కొద్దిగా/ దాదాపు లేకుండా (little) గౌరవం చూపడం.

2) My regards to so and so = ఫలానావారికి నా అభివాదాలు. (మనం ఉత్తరాల్లో 'అడిగానని' చెప్పండి ఎలాగో ఆ విధంగా).

3) ఒక విధంగా పరిగణించడం - I regard (consider) Sachin is the greatest batsman in the world = సచిన్‌ను ప్రపంచంలోనే అతిగొప్ప batsmanగా పరిగణిస్తాను. అయితే గుర్తుంచుకోండి.

Regard తర్వాత as వస్తుంది, consider తర్వాత as రాదు.

In this/ that regard = ఈ విషయంలో/ ఆ విషయంలో As regards/ In regard to/ with regard to something/ somebody = దాని/ వాళ్ల విషయానికొస్తే.

In/ with regard to naxalism ... = నక్సలిజం విషయానికొస్తే...

- Tend = 1) ధోరణి చూపడం/ ఒక విధంగా చేసే తత్వం కలిగి ఉండటం.

We tend to postpone things = మనం ఎప్పుడూ వాయిదావేసే తత్వం కలిగి ఉంటాం/ ధోరణి కనపరుస్తాం. He tends to show off sometimes = కొన్నిసార్లు అతడు ఎచ్చులకు పోయే ధోరణి చూపిస్తాడు.

ప్రేమాభిమానాలు, అపేక్ష కలిగి ఉండటం Mothers tend their children = తల్లులు పిల్లలను ప్రేమతో చూసుకుంటారు.

- As to = 1) With regard to = ఆ విషయంలో 2) I do not know as to why he did it = అలా ఎందుకు చేశాడో నాకు తెలియదు. అయితే ఇక్కడ as to వాడకం అనవసర పాండిత్యం, వదిలేయడం మంచిది.

- Apart = 1) separately - keep the two apart = ఆ రెండింటినీ/ వాళ్లిద్దర్నీ వేరుగా ఉంచు.

Apart from = అంతేకాకుండా, Apart from being rich, he is well read (too) = ధనికుడే కాకుండా అతడు బాగా చదివినవాడు కూడా.

- By means of = ఆ పద్ధతి వల్ల, అందుమూలంగా

By means of his connections with those in high positions he can get anything done = పెద్ద పెద్ద వాళ్లతో తనకున్న సంబంధాలవల్ల అతడు ఏపనైనా చేయించుకోగలడు.

- Somehow = ఎందుకనో Some how I am not able to believe him = ఎందుకనో అతడిని నేను నమ్మలేకపోతున్నా.

Somehow or the other = ఎలాగోఒకలా Somehow or the other I should find him today, tell him of it = ఎలాగో ఒకలాగు/ ఎలాగైనా అతడిని ఈరోజు పట్టుకుని, అతడికి ఈ విషయం చెప్పాలి.

- As of = ఒక సమయం నుంచి ప్రారంభమై, కొనసాగే - As of today, tea will no more be served free to employees = ఈ రోజు నుంచి సిబ్బందికి tea ఉచితంగా ఇవ్వబడదు.

- Even as = ఒకటి జరుగుతుండగానే

Even as I was telling him not to smoke, he lit a cigarette = smoke చేయొద్దని చెబుతుండగానే / చెబుతూనే ఉన్నాను, అతడు cigarette ముట్టించాడు.

- Even then = అప్పటికీ/ అయినా / అయినప్పటికీ

I gave him all that he wanted. Even then he was not satisfied = అతడు కావాలన్నదల్లా ఇచ్చాను, అయినప్పటీ అతడు తృప్తిపడలేదు.

- Even Since - ఈ మాటలేదు, అదిEver since = అప్పటినుంచి

Ever since he came here, he has been troubling every one = అతడిక్కడికి వచ్చినప్పటి నుంచి ప్రతివాళ్లను ఇబ్బంది పెడుతున్నాడు.

- For all = అందరికీ, అన్నింటికీ - దీనికేం ప్రత్యేక అర్థంలేదు. once for all/ once and for all = చివరిసారిగా Let's settle it once for all = దీని విషయం ఏమిటో చివరిగా తేల్చేద్దాం.

- Out of = ఒకదాన్లోంచి /లో

Out of the 30 students in the class, 20 passed = class లోని 30 విద్యార్థుల్లో 20 మంది pass అయ్యారు.

**Q.** కిందివాటికి తెలుగులో అర్థాలు తెలియజేయగలరు.

- That man seems tired.

అతడు అలసిపోయినట్టు కనిపిస్తున్నాడు/ అలసిపోయినట్టున్నాడు

- He seems to be happy.

అతను సంతోషంగా ఉన్నట్లున్నాడు/ ఉన్నట్టు కనిపిస్తాడు.

- My fear is that he will fail.

అతడు fail అవుతాడేమోనని నా సందేహం/ భయం.

- He got the house repaired.

ఇల్లు మరమ్మత్తు చేయించాడు.

- He found him sleeping.

అతడు నిద్రపోతున్నప్పుడు/ పోతుండటం చూశాడు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






# Caste provides the mind block





M.SURESAN

**KSR, Martur.**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో వివరించగలరు.

పిల్లలూ నేనిప్పుడు రాష్ట్ర గవర్నర్‌గా విధులు, బాధ్యతలు చేపట్టబోతున్నాను. విధులు ఏమిటంటే -

**A.** Dear Children, I am about to assume office as Governor of the state. My duties and responsibilities are...

- విజ్ఞప్తులు స్వీకరించడం - విచారం వెలిబుచ్చడం.
  Accept representations/ Memoranda, Express regrets.
- వందనం స్వీకరించడం - ఉపన్యసించడం.
  Accept salutes - Make speeches.
- అతిథులకు స్వాగం పలకడం - సత్కరించడం.
  Welcoming and extending hospitality to visitors - honour people.
- శ్రద్ధాంజలి ఘటించడం - సంతాపం తెలియజేయడం.
  Paying homage - express condolences.
- తీవ్ర విభ్రాంతిని, విస్మయాన్ని వ్యక్తపరచడం.
  Expressing deep shock and surprize.
- సంభ్రమాశ్చర్యాలు - సంతృప్తిని వ్యక్తపరచడం.
  Expressing surprize and pleasure expressing satisfaction.
- కీర్తించడం - కృతజ్ఞతలు తెలియజేయడం.
  Appreciating and expressing gratitude.
- అభినందించడం - ఆలింగనం చేసుకోవడం.
  Congratulating and embracing.
- శ్లాఘించడం - సానుభూతి తెలపడం.
  Praising and sympathising
- విందులు వినోదాలకు హాజరవడం - కుశల ప్రశ్నలు అడగడం.
  Participating in dinners and banquets, and indulge in small talk.
- ఖండించడం - కలవరపాటుకు గురవడం.
  Condemning and being upset
- గర్హించడం - గార్డెన్‌లో సంచరించడం.
  Denouncing and moving about in the garden.

**K. Satyanarayana, Narsipatnam.**

**Q.** Delhi లో h ఎందుకు? Delli ఎందుకు కాకూడదు?

**A.** మొదటినుంచి English లో అలాగే spell చేస్తుండటం వల్ల అది అలాగే స్థిరపడిపోయింది.

**Q.** Enjoy తర్వాత yourself వస్తుందని ఎక్కడో చదివాను. కానీ అలా రాని సందర్భాలను చాలా గమనించాను. ఏయే సందర్భాల్లో వస్తుందో, ఎప్పుడు రాదో వివరించగలరు.

**A.** Enjoy తర్వాత - self అన్ని చోట్లా రాదు.

enjoy కి object ఉంటే - self/ selves అక్కరలేదు. object ఉందా లేదా అని తెలుసుకునేందుకు, enjoy what? అని question వేస్తే answer వస్తే దానికి object ఉన్నట్లు. అలాంటప్పుడు - Self/ selves అక్కరలేదు.

We enjoyed the dinner- ఇక్కడ enjoyed what అంటే, enjoyed the dinner అని answer వస్తుంది. కాబట్టి ఇక్కడ we enjoyed ourselves అనం.

We enjoyed during the vacation (సెలవుల్లో మేం సంతోషం అనుభవించాం) ఇక్కడ we enjoyed what during the vacation. సెలవుల్లో దేన్ని enjoy చేశాం? అంటే జవాబు రాదు. ఇక్కడ ourselves కచ్చితంగా వాడతాం.

We enjoyed ourselves during the vacation.

ఇంకా చూడండి.

a) He enjoys music
b) He enjoys himself when his father is away
c) We are leaving for Kashmir tomorrow. we are going to enjoy ourselves in Kashmir.
d) We are going to enjoy our stay in Kashmir.

**Q.** 2008ను 2000 and 8 అని అంటారెందుకు? అలాగే 103 ను 100 and 3, 104 ను 100 and 4, 105 ను 100 and 5 అని పలుకుతారెందుకు?

**A.** English లో ఒక జాబితా (list) లోని చివరి అంశం ముందు 'and' తప్పక రావాలి. అందువల్ల 2008 లో, 8 చివరి మాట/ సంఖ్య కాబట్టి, దానిముందు, and రావాలి. అలాగే 103 = a/ one hundred and three, etc.

అయితే, American usage, bank పరిభాషలో వందల విషయంలో తప్ప, వేల నుంచి, చివరి సంఖ్య ముందు 'and' వాడరు.

2008 - Two thousand and eight- British
- Two thousand eight - American

Rs. 15,680/- Rs. Fifteen thousand six hundred eighty only - Bank/ American (Rs. Fifteen thousand six hundred and eighty only - British)

**Q.** నేను చాలా తొందరగా ఉన్నాను అనడానికి ఏమనాలి? I am hurry burry or I am hurrily burrily. Which is the correct one .

**A.** I am in a hurry/ a great hurry అంటాం. Hurry burry అనేమాట english‌లో లేదు. అలాగే hurrily/ burrily అనేది కూడా English కాదు.

Hurly - burly అనే మాట ఉంది English లో. అయితే దానికీ hurry కీ సంబంధం లేదు. Hurly - burly అంటే గందరగోళంగా/ హడావిడిగా/ గొడవగొడవగా ఉన్న పరిస్థితి.

I can't take any decision in this hurly- burly= ఇంత గొడవగా ఉన్నప్పుడు/ ఈ హడావిడిలో/ ఈ పనులన్నీ జరుగుతుండగా నేనే నిర్ణయం తీసుకోలేను.

**M.P. Nageswara Rao, Hyderabad.**

**Q.** కింది తెలుగు వాక్యాలను ఇంగ్లిష్‌లో వివరించగలరు.

- నూతన గృహప్రవేశానికి శుభాకాంక్షలు.
  Congratulations on your entering your new home. Wish you all happiness and prosperity in your new home.
- కొత్త స్కూటర్ కొని నడిపిస్తున్నందుకు నీకు శుభాకాంక్షలు.
  Wish you a happy ride on your new vehicle.
- విదేశీయానం చేసి వచ్చినందుకు నీకు శుభాకాంక్షలు.
  Congratulations on your successful completion of foreign travel/ welcome home from abroad/ after your foreign travel.
- నీవు తల్లివి కాబోతున్నందుకు శుభాకాంక్షలు.
  Congratulations on you are going to be a mother.
- పదవీ విరమణ చేసినందుకు మా శుభాకాంక్షలు.
  Wish you a happy and peaceful retired life.
- నీవు అష్టఐశ్వర్యాలతో వర్ధిల్లాలని ఆ భగవంతుడిని ప్రార్థిస్తున్నాను.
  May god bless you with all prosperity.
- దీర్ఘాయుష్మాన్‌భవ.
  May you live long.
- ఎన్నికల్లో గెలిచినందుకు శుభాకాంక్షలు.
  Congrats on your victory in the elections.
- పరీక్షల్లో పాస్ అయినందుకు శుభాకాంక్షలు.
  Congrats on your success in the exam.

**A.V. Subba Rao, Oripenta.**

**Q.** కింది పదాలకు తెలుగులో అర్థాలను తెలుపగలరు.

Incorporation, Touch up, Mastermind, Mind block, Master piece, Pilot, Quilting, Pretermit, Block, Misorile, Neck to neck, Poaching, Puppet show, Bar testing book, Haul, Fellowship, pull out.

**A.**
- Incorporate ఒక పెద్దదానిలో కొన్ని చిన్న వాటిని భాగాలుగా చేర్చడం.
  We have incorporated the ideas of our customers in our new product - మేం కొత్తగా రూపొందించిన వస్తువులో మా ఖాతాదారుల అభిప్రాయాలన్నీ పొందుపరిచాం.
  Incorporation = విలీనం చేయడం/ అంతర్భాగమవడం. The incorporation of the social service group into the party = సాంఘిక సేవాసమితి పార్టీలో విలీనమవడం - పార్టీలో అంతర్భాగమవడం.
- Touch up - మెరుగులు దిద్దడం.
- Mastermind మేధావి (ముఖ్యంగా నేర పథకాలను రూపొందించి అమలుపరచడంలో)/ అలాంటి తెలివితేటలు చూపించడం.
  The Lashkar-e-toiba is the master mind behind the Mumbai blasts/ Masterminded the Mumbai blasts.
- Mind block = ఒకే ఆలోచనతో బుర్ర నింపుకుని, ఇంకే ఆలోచనను చొరనివ్వకపోవడం.
  Caste provides the mind block among many for mingling with others = ఇతరులతో కలిసేందుకు కులం ఆలోచన అడ్డొస్తుంది.
- Master piece - ఒకరి గొప్ప పని- Vyasa wrote many books, but the Bharatam is his master piece. (వ్యాసుడు రాసిన గ్రంథాల్లో భారతం అతి గొప్పది). అలాగే ఇతర రంగాల్లో కూడా.
- Pilot = విమానాలు నడిపేవాళ్లు.
- Quilting = Quilt (ఒక రకమైన బిళ్లలు బిళ్లలుగా కనిపించే పరుపు) తయారుచేయడం.
- Pretermit - ఈ మాట English కాదు.
- Block - అడ్డంకి/ అవరోధం.
- Misorile - ఒక file లో ఉంచాల్సిన paper ను ఇంకో file లో పెట్టడం.
- Neck to neck - పందెంలో సరిసమానంగా రావడం (ఇద్దరూ, అంతకంటే ఎక్కువమంది)
- Poaching- చట్టవిరుద్ధంగా/ దొంగతనంగా జంతువులను వేటాడటం.
- Puppet show - కీలు/ తోలు బొమ్మలాట.
- Bar testing book - Jail లో తనిఖీ నిర్వహణ వివరాల పుస్తకం.
- Haul = లాగడం/ ఈడ్చడం.
  A five wicket haul = 5 wickets లాగేయడం = పడగొట్టడం.
- Fellowship - American Universities లో course ఏదైనా చదివేందుకు research చేసేందుకు ఇచ్చే scholarship లాంటిది.
- Pull out - చేస్తున్న పని మానేయడం/ విరమించుకోవడం.

**Thahereem, Yellandu.**

**Q.** చేయలేకపోతున్నాను - దీనిని English లో ఎలా చెప్పాలి?

**A.** I am not able to do it.

**Q.** గతంలో నేను నా కారును అమ్మాను. ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో I sold my car అనాలా లేదా I have sold my car అనాలా?

**A.** I have sold my car. (ఎప్పుడు అమ్మిందీ time చెప్పనప్పుడు). I sold my car last week.

**Q.** Machine చెడిపోయింది లేదా కాలిపోయింది - ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** The machine is out of order / in repair/ has gone out of order/ something is wrong with the machine.

**Q.** So that అంటే ఏమిటి?

**A.** So that = అందుకు వీలుగా - Start early so that we can be there on time = మనం సమయానికి అక్కడ ఉండేందుకు వీలుగా త్వరగా బయలుదేరు.

**Q.** Even then వివరించగలరు.

**A.** Even then = అప్పుడు కూడా. I told him not to come. Even then he came = అతడిని రావద్దన్నాను, అప్పుడు కూడా (చెప్పినప్పటిక్కూడా) /అయినా వచ్చాడు.

**Q.** As well as అంటే ఏమిటి?

**A.** As well as = అదీ, ఇదీ కూడా/ ఇద్దర్లో, అతనూ, ఇతనూ కూడా.

Sri Rama as well as Sri Krishna is worshiped in India = భారత్‌లో శ్రీరాముడినే కాదు శ్రీకృష్ణుడిని కూడా కొలుస్తారు.

**Q.** As far as possible

**A.** As far as possible = సాధ్యమైనంతవరకు

I'll try to help you as far as possible = నాకు సాధ్యమైనంతవరకు నీకు సాయం చేయడానికే ప్రయత్నిస్తాను.

**Q.** Other than అంటే ఏమిటి?

**A.** Other than = అది కాకుండా/ తప్ప. Other than Ram, everyone passed = రామ్ తప్ప మిగతా వారందరూ pass అయ్యారు.

**Q.** I will have to be. ఈ వాక్యాన్ని ఎప్పుడు ఉపయోగించాలి?

**A.** I will have to be = నేనుండాల్సి వస్తుంది. (తప్పనిసరిగా). I will have to be there at 10 (future).

**Q.** అతడికి ఒక కారు ఉంది. దీన్ని ఇంగ్లిష్‌లో he has a car అనాలా లేదా he have a car అనాలా? ఇదే వాక్యాన్ని question form లో Does he has అనాలా లేదా Does he have a car అనాలా?

**A.** He has a car. Does he have/ has he a car?

**Q.** Could not have expected ఈ వాక్యాన్ని ఎప్పుడు ఉపయోగించాలి.

**A.** Could not have expected = ఆశించగలిగి ఉండేవాడు కాదు.

**Q.** డబ్బులు బయటకు తీయండి. దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి.

**A.** Take out the money/ Get the money out.

**Q.** I used to go to movies. ఈ వాక్యానికి question form ఉంటుందా? What do you used to do అనవచ్చా?

**A.** Did you use to go to movies? What did you use to do?

**Q.** Shall be had అంటే ఏమిటి?

**A.** A car shall be had by you = You shall have a car = నీకు కారుంది.

**Q.** నిన్న ఒకతను హాజరు కాలేదు. దీన్ని He was absent అనొచ్చా?

**A.** అనొచ్చు

**Saikiran, Srikakulam.**

**Q.** I am used to doing the shopping.

I am used to walking long distances. వీటి అర్థాలను తెలుగులో తెలుపగలరు.

**A.** be used to = చేసేవాడుక/ అలవాటు ఉండటం.

1) నాకు shopping అలవాటే/ చేసేవాడిని/ దాన్నే.
2) చాలా దూరాలు నడిచే అలవాటుంది నాకు.

**Spoken English** పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# It should have been decided by now



**M. Ratna Kishore, Hyderabad.**

**Q.** గుర్తుకొచ్చావు అని చెప్పడానికి remember, recollect, recall వీటిలో ఏది కరెక్టు?

**A.** Remember = గుర్తుకురావడం.

I remember seeing him somewhere = అతన్నెక్కడో చూసినట్టు గుర్తుకొస్తోంది.

**Remember** is something coming to our mind, without our attempt. (మన ప్రయత్నం లేకుండానే మన బుర్రలోకి వచ్చేది - remember)

**Recall/ Recollect** - గుర్తుకు తెచ్చుకోవడం (ప్రయత్నం చేసి)

He does not recollect the contents of the letter = ఆ ఉత్తరంలోని విషయాలు అతడికి గుర్తుకు రావడం లేదు (ప్రయత్నం చేసినా)

Try to recollect what he told you = నీకు అతడేం చెప్పాడో గుర్తుకు తెచ్చుకునేందుకు ప్రయత్నించు.

**Q.** Please explain the usage of the word 'concern'. I couldn't understand this sentences.

1. It is a matter of concern.
2. Cause for concern.

**A.** Concern = 1) Worry.

We are all concerned about the rise in the crime rate = పెరుగుతున్న నేరాలు మనకు ఆదుర్దా కలిగిస్తున్నాయి.

- It is a matter of concern = It (The matter) causes/ is causing us (serious) worry / we are seriously worried about it (The matter)
- cause for worry = reason for worry.

concern = 2) a Company or business.

Tata - Mcgraw Hill is a publishing concern (Book publishing company).

- Important matter - our concern now is to protect the country from terrorists = మనకిప్పుడు ముఖ్యమైన విషయం దేశాన్ని తీవ్రవాదుల నుంచి రక్షించటం.
- **Interest:** Teachers' concern for the progress of their students = Teachers' interest in their students' progress'.
- To be worried = I am concerned about his health = I am worried about his health.
- To be connected with = I am not concerned with my brother's affairs = I have no connection with my brother's affairs - it concerns all of us = It affects all of us.

**Shalini, Penugonda.**

**Q.** నిన్న జన్మభూమిలో పాల్గొనవలసిన చంద్రబాబు మీటింగుకు రాలేదు అనడానికి ఇంగ్లిష్‌లో The TDP president Chandrababu Naidu who was to participate yesterday in Janmabhoomi did not come to the meeting అనడం కరెక్టేనా? లేదా The TDP President Chandrababu Naidu yesterday who was to participate in Janmbabgoomi had not come to the meeting అనడం కరెక్టా? ఈ రెండింటిలో సరైనది ఏది?

**A.** Chandrababu who was to have participated in Janmabhumi programme yesterday did not turn up. ఇది correct. Who was to తర్వాత have రావడం ముఖ్యం.

Had not come సరికాదు.

**Q.** అతడు ఇంటికి తిరిగి వెళుతున్నందుకు సంతోషపడుతున్నాడు. He feels happy to be going back to home అంటాం. అయితే ఇదే వాక్యాన్ని past లో future లో తెలపాలంటే ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** He feels happy to be going back home to home కాదు.

Past: He felt happy to be going back home

Future: He will feel happy to be going back home.

**N.V. Krishna Rao, Hyderabad.**

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థాన్ని వివరించండి.

- I guess I would go for some one like 'Kiran Bedi'.

**A.** నేను కిరణ్‌బేడీనే ఎంచుకుంటాననుకుంటాను.

(I guess = నేననుకుంటున్నాను.)

- I guess if I had to make a choice it would be - someone like 'Kiran Bedi'.

**A.** ఎంపిక చేసుకోవాల్సి వస్తే, కిరణ్‌బేడీ లాంటివాళ్లకే మొగ్గుచూపుతాను.

**Q.** కింది వాక్యంలో 'come to' ఏ అర్థాన్నిస్తుంది?

He managed to loosen the wire and come to us.

**A.** come to us = మా దగ్గరికి రావడం.

come to = ఒకరి దగ్గరకు/ ఒక చోటికి.

**Q.** కింది వాక్యాల అర్థాలను, తేడాను వివరించగలరు.

- I saw a man who is going on a donkey.

**A.** I saw a man who is going on a donkey - తప్పు.

- I saw a man going on donkey.

**A.** I saw a man going on donkey. ఇది correct = I saw a man who was going on a donkey.





M.SURESAN

**A.V. Achari, Vizag.**

**Q.** కింది పదాలకు తెలుగులో అర్థాన్ని వివరించండి. ఏయేసమయాల్లో ఏ విధంగా వీటిని ప్రయోగించాలో తెలుపండి.

Tobe decided, will be decided, can be decided, shall be decided, may be decided, might be decided, have been decided, has been decided, had been decided etc.,

**A. To be decided** = నిర్ణయించాల్సి ఉంది-

The date is to be decided = ఆ తారీకు ఇంకా నిర్ణయించాల్సి ఉంది. (ఖరారు కాలేదు)

**will be decided** = future లో నిర్ణయించబడుతుంది. The date of the marriage will be decided soon =పెళ్లి తేదీ త్వరలో నిర్ణయించబడుతుంది.

**Can be decided** = నిర్ణయించబడగలదు.

It can be decided only by him = ఆ నిర్ణయం అతడి చేతనే తీసుకోబడాలి. (అతడే ఆ నిర్ణయం తీసుకోగలడు)

**Had been decided** = అంతకుముందే/ గతంలో ఇంకో సంఘటనకు ముందే నిర్ణయించబడింది - It had been decided before I reached the place = నేనక్కడికి చేరుకోకముందే నిర్ణయించబడింది.

**Shall be decided** = కచ్చితంగా నిర్ణయించబడుతుంది, in future.

It shall be decided only after receiving all the applications = అన్ని applications వచ్చిన తర్వాతనే అది నిర్ణయించాలి/ నిర్ణయించబడాలి.

**May be decided** = నిర్ణయించబడవచ్చు

It may be decided in a day or two = ఒకటి రెండు రోజుల్లో అది నిర్ణయించబడవచ్చు (నిర్ణయం తీసుకోవచ్చు)

**Might be decided** - దాదాపు may be decided కు సమానం (May కంటే ఎక్కువ సందేహం)

**Has/ Have been decided** - Time తెలియని గతంలో నిర్ణయించబడటం.

The name has been/ the names have been decided = నిర్ణయమైపోయింది/ నిర్ణయం అయిపోయాయి.

**Will have been decided** = future లో అప్పటికి నిర్ణయించబడి ఉంటుంది.

It will have been decided by this time tomorrow = రేపీపాటికి నిర్ణయించబడి ఉంటుంది.

**Should have been decided** = నిర్ణయించబడాల్సింది, కానీ కాలేదు.

It should have been decided by now = ఈ పాటికి నిర్ణయించబడాల్సింది కానీ కాలేదు.

**Would have been decided** = నిర్ణయింపబడేదే, కానీ కాలేదు.

**Can have been decided** = నిర్ణయించబడి ఉండగల్గుతుంది - ఇది అంతగా వాడుకలో లేదు

**It could have been decided** = గతంలో అది నిర్ణయించబడి ఉండగలదు, కానీ కాలేదు.

If he had been here, it could have been decided by now = అతనిక్కడ ఉండి ఉంటే, నిర్ణయం తీసుకోబడి ఉండగలిగేదే (నిర్ణయం తీసుకోగలిగేవారే) కానీ జరగలేదు.

**The team appears to have been decided** = జట్టు (లోని ఆటగాళ్ళు) నిర్ణయింపబడ్డట్టే ఉంది.

**A. Radha, K. Vasavi, Guntur.**

**Q.** కింది ఇంగ్లిష్ వాక్యాలకు తెలుగులో అర్థాన్ని సవివరంగా తెలుపగలరు.

She said while showing her chopped legs.

**A.** డొక్కుపోయిన తన కాళ్లను చూపిస్తూ/ చూపిస్తున్నప్పుడు, చెప్పింది

**Q.** She said, showing her chopped legs.

**A.** డొక్కుపోయిన తన కాళ్లను చూపిస్తూ ఆమె అంది.

**Q.** కింది రెండు వాక్యాల్లో ఏది కరెక్టో తెలుపగలరు.

Without notice of him I have done it.

Without notice of him have I done it.

**A.** రెండింటికీ అర్థం ఒకటే. అయితే without notice of him have I done it అనడం మెరుగు.

**A. Radha, Kovvur.**

**Q.** కింది ఇంగ్లిష్ వాక్యాలకు తెలుగులో ఇచ్చిన అర్థాలు కరెక్టేనా?

- He noticed her while she is weeping in her bedroom - ఆమె తన బెడ్‌రూమ్‌లో ఏడుస్తుండగా, ఏడుస్తున్నప్పుడు చూశాడు.
- He noticed her while she was crying = ఆమె ఏడుస్తూండగా అతను చూశాడు/ గమనించాడు.

**A.** He noticed her while she was (is కాదు) crying in her bedroom, He noticed her weeping in her bedroom - రెండూ correct.

He noticed her weeping in her bedroom = ఆమె ఏడుస్తుండటం అతను గమనించాడు.

**Q.** కింది వాక్యాల అర్థాలు సరైనవో కాదో తెలుపగలరు.

- We will help you prepare for the exam.
  We will help you in preparing for the exam.
  ఎగ్జామ్‌కు ప్రిపేర్ కావడంలో మేం సాయపడతాం.
- We will help you to prepare for the exam.
  ఎగ్జామ్‌కు ప్రిపేర్ కావడానికి మేం సాయపడతాం.
- To prepare for, In preparing for వీటిలో ఏది కరెక్టు?

**A.** We will help you prepare for the exam = మీరు exam కు సంసిద్ధం అవడంలో మేం సాయపడతాం = We will help you in preparing for the exam.

ఇదే అర్థంతో We will help you to దీన్ని omit చేయొచ్చు) prepare for the exam.

ఇవన్నీ correct, అన్నింటికీ ఒకే meaning కాబట్టి.

**Shaik Fayaz Pasha, Dharoor.**

**Q.** మీరొక చోట Does Suneetha have any friends in railway booking అన్నారు? అయితే Suneetha 3rd person అయినందువల్ల has రావాలి కదా. ఈ వాక్యంలో have ఎందుకు వచ్చిందో వివరించగలరు.

**A.** Does have అన్నా has అన్నా ఒకటే.

Has, goes, sings లాంటి verbs questions లోగాని, not తోగాని వచ్చినప్పుడు Does have/ does go/ does sing. etc అవుతాయి కదా. అయితే ఇది కూడా గమనించండి.

Does Sunitha have any friends... = Has Sunitha any friends... ఇది ఒక్క Have విషయంలోనే.

**Q.** Do you hear me? Are you hear me? రెండింటిలో ఏది కరెక్టు?

Do you understand? Are you understand?

Do you OK? Are you OK? వీటిలో ఏది కరెక్టో తెలుపగలరు.

**A.** ఒక్కసారి Six forms of verbs గుర్తు తెచ్చుకోండి, 'Be' forms (am, is, are, was, were, etc) పక్కన ఎప్పుడూ, 'ing' form గానీ, past participle గానీ వస్తుంది.

Hear, Sing etc లాంటి I Regular Doing Word (IRDW) రాదు.

కాబట్టి Are you hear me? అనం, Do you hear me? అనే అంటాం. అలాగే Are you understand? అని అనం కదా, Do you understand? అనే అంటాం. అలాగే

Is he know? అనం, Does he know? అంటాం.

**V. Pandu Ranga, Polamuru(E.G.Dist).**

**Q.** What is he like? అంటే అర్థం ఏమిటి? ఇక్కడ like స్థితి ఏమిటి?

**A.** What is he like? = అతడు ఎలా ఉంటాడు? ఇక్కడ like కు అర్థం, 'లా' (ఎలాలో). ఇది How does he look? (అతడెలా కనిపిస్తాడు?) కు సమానం.

**M. Nagarjun Babu, Pedavadlapudi.**

**Q.** Kumar what are you doing now?

What do you now? ఈ రెండింటిలో ఏది కరెక్టో వివరించగలరు.

**A.** Kumar, What are you doing now? - correct

Kumar, What do you now - ఇది sentence కాదు. What do you do now? అనడం correct = ఇప్పుడేం చేయబోతున్నావు?

**B. Sateesh, Nellore.**

**Q.** బ్రహ్మోత్సవాలు, ఉత్సవాలు, చీటీపేకలు వీటిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Major festival - బ్రహ్మోత్సవాలు అనే మాటకు దగ్గరి పదం.

ఉత్సవాలు = festivals.

పేకాట = playing cards.

**Q.** నువ్వు ఇంకో పెళ్లి చేసుకుంటే problem లో పడతావు అనడానికి కింది రెండు వాక్యాల్లో ఏది కరెక్టు?

If you marry again, you will fall in troubles.

If you married again, you will fall in troubles.

**A.** If you marry again you will fall into troubles correct.

**Q.** ఇంక ఎన్ని ఎపిసోడ్లు ఉన్నాయి అనడానికి How many episodes? How many episodes do we have? రెండింటిలో ఏది కరెక్టు?

**A.** How many more episodes do we have? / How many more episodes are there?

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# That's only one side of the coin

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 529


M.SURESAN

**Vineeth:** (Have you) heard the news? Sunil was quite lucky. The police caught a man red handed as he was lifting his hand to strike at Sunil.

ఈ వార్త విన్నావా? సునీల్ అదృష్టవంతుడే. ఎవరో అతడిని కొట్టడానికి చెయ్యెత్తబోతుంటే, police లు పట్టుకున్నారు.

**Sumanth:** But why should any body try to hit him? He is quite nice and minds his business. He is the harmless type.

అసలు ఎవరైనా సునీల్‌ను కొట్టే ప్రయత్నం ఎందుకు చేయాలి? మంచివాడే కదా, ఇత రుల జోలికి వెళ్లడు.

Mind his business= తన పని తాను చూసుకుంటాడు.

harmless = అపాయకరంకాని/ కీడు చేయని.

**Vineeth:** Things are not what they seem, buddy. Sunil is not that innocent. He is quite good to us, but that is only one side of the coin. He can be tough when toughness is needed.

మనకు కనిపించే విషయాలకూ, అసలు విష యాలకూ చాలా తేడా మిత్రమా. సునీల్ అంత అమాయకుడేం కాదు. మనపట్ల మంచిగానే ఉంటాడు, కానీ మనకు తెలియని ఇంకో విషయం ఉంది. గట్టిదనం అవసరమైతే గట్టిగా ఉండగలడు.

tough= గట్టిగా ఉండటం,

Innocent= అమాయకుడైన

**Sumanth:** What do you mean?

(ఏంటి నువ్వనేది? )

**Vineeth:** He is quite rich; born with a silver spoon in his mouth. His cousins envy him. He and they are at logger heads with each other. As they try often to harm him, he's become tough too. They had had him beaten some time ago, and he hit back by engaging some goons.

అతడు చాలా ధనవంతుడు పుట్టుకతోనే. అతడి cousins కు అతడంటే ఈర్ష్య. అత డికీ వాళ్ళకూ అసలు పడదు. తరచుగా వాళ్ల తడికి కీడు తలపెట్టడంవల్ల, అతడూ కరుగ్గా తయారయ్యాడు. అతడిని వాళ్ళు కొట్టించే ప్రయత్నం చేయడంవల్ల, తనూ ఎవరో rowdy లతో కొట్టించాడు.

goons = గూండాలు.

**Sumanth:** So you mean that the attack on him today was their cousins' desire to settle their old scores with him?

అంటే నువ్వనడం, ఇవ్వాళ అతడి మీద జరిగిన దాడి అతడి cousins పాతకక్ష తీర్చు కునేందుకు చేసిందేనా?

**Vineeth:** Exactly. But they are no match for Sunil. He is quite clever. He knows when to bide his time and when to attack. Perhaps this time he was off his guard.

కచ్చితంగా అంతే. కానీ వాళ్లు సునీల్‌కు సాటి రారు. అతడు తెలివిగలవాడు. ఎప్పుడు అణిగి ఉండాలో, ఎప్పుడు దాడిచేయాలో అత డికి తెలుసు. ఈసారి బహుశ ఏమారి ఉండొచ్చు

**Sumanth:** Any way, we are happy he is safe.

ఏదైనా సరే, అతడు క్షేమం అది సంతోషం.

**Vineeth:** I am sure he will come up with an ace up his sleeve very soon. He is quite clever at such matters.

ఏదో ఒక ఆలోచనతో మళ్లీ వస్తాడతడు. తెలివిగలవాడు అలాంటి విషయాల్లో.

**Sumanth:** But Sunil, all said and done, is the good sort and would go to any length to have a peaceful time. So he proposes to sell all his property with and settle in Bengaluru.

ఏదేమైనా Sunil మంచి రకం, ప్రశాంతమైన జీవితం గడపాలనుకుంటున్నాడు. అందుకని ఇక్కడ ఆస్తంతా అమ్మేసి, బెంగుళూర్లో స్థిరపడాలనుకుంటున్నాడు.

**Vineeth:** Is it going to be soon? We'll be missing him a lot if he goes away.

అది త్వరగా జరగబోతోందా? అతడు లేకపోతే మనకు వెలితిగా ఉంటుంది.

**Sumanth:** Disposing of property is not something that can be overnight. He expects to move out by this year-end, or the beginning of the next.

ఆస్తిని అమ్మేయడం ఒక్క రోజులో జరగదు కదా. ఈ ఏడాది చివరలోగానీ, వచ్చే ఏడాది ఆరంభంలోగానీ వెళ్లాలనుకుంటున్నాడు.

Dispose of = ఆస్తి లాంటివి అమ్మేయడం; settle చేసుకోవడం

Overnight = ఒక్కరోజులోనే

**Vineeth:** It's good for him, though we miss him. Let's pray for his peaceful life.

మనం అతడు లేకపోతే బాధపడొచ్చు. కానీ అతడికది మంచిది. అత డికి ప్రశాంత జీవితం ఉండాలని మనం కోరుకుందాం.

మనకొక భాష పూర్తిగా వచ్చేదెప్పుడు? అందులోని idioms బాగా తెలిసినప్పుడు, వాటిని మన conversation లో సందర్భాను సారంగా వాడగలిగినప్పుడు. Idioms అంటే తెలుసు కదా? జాతీయాలు. ఇవి ప్రతి భాష లోనూ ఉంటాయి. ఇవి కొన్ని మాటల సమూహం. అయితే ఆ మాటల సమూహం (group of words) మొత్తానికి వచ్చే అర్థానికీ, ఆ సమూ హంలోని ఒక్కొక్క మాట అర్థానికీ సంబంధం ఉండదు. Phrasal verb కూడా అంతేకదా? అయితే phrasal verb ను ఎప్పుడూ verb గా వాడతాం. Idiom verb కాన క్కర్లేదు. eg: to put up with = భరించడం/ సహిం చడం. ఇది phrasal verb, ఎందుకంటే దీనిని verb గా వాడతాం. ఇందులో put అనే verb ఉంది. Idiom లో verb ఉండక్కర్లేదు. అందుకని phrasal verbs తోపాటు idioms కూడా బాగా నేర్చుకుంటే మన spoken English సహజంగా సరళంగా ఉంటుంది. తెలుగులో idiom కు example, నడుంవాల్చడం- అర్థం తెలుసుకదా, విశ్రాంతి తీసుకోవడం/ పడుకోవడం. దీనికి నడుముకూ, వాల్చడానికి సంబంధం లేదుకదా? అందుకని ఇది idiom. అలాగే English లో In one's look/ In somebody's look= In somebody's opinion = ఒకరి అభిప్రాయం ప్రకారం అని. He is good in my look = నా అభిప్రా యంలో వాడు మంచివాడే. దీంట్లో look కూ అభిప్రాయా నికి సంబంధం లేదు కదా. idiom/ phrasal verb అర్థా లను వాటిలోని మాటల అర్థంవల్ల తెలుసుకోలేం అని తెలుస్తోంది కదా?

ఈ lesson లో English లో చాలా తరచూ వాడే idioms కొన్నింటిని చూద్దాం.

***Look at the following expressions from the conversation above.***

1) The police caught red handed a person/ caught a person red handed.
2) That's only one side of the coin.
3) He is borm with a silver spoon in his mouth.
4) He and they are at logger heads.
5) The attack on him today was their attempt to settle old scores.
6) He knows when to bide the time.
7) He was off his guard.
8) Come up/ Have an ace up his sleeve.

ఇప్పుడు ఒక్కొక్కటిగా వీటి విషయాలు తెలుసుకుందాం.

**1) Caught red handed-** Past tense of catch red handed = నేరం చేస్తుండగా పట్టుకోవడం.

a) I caught him red handed while he was trying to steel my books = నా పుస్తకాలు దొంగిలిస్తుండగా/ దొంగిలిస్తున్నపుడు వాడ్ని నేను పట్టుకు న్నాను.

b) The vigilance people caught him red handed while accepting a bribe from some one = ఎవరినుంచో లంచం తీసుకుంటు డగా నిఘావాళ్లు అతడిని పట్టుకున్నారు.

Catch some one red handed = catch someone in the act of.

He was caught in the act of snatching a chain around a woman's neck = ఒక స్త్రీ గొలుసు లాగేసుకుంటున్నప్పుడు అతడు దొరికిపో యాడు

**2) Born with silver spoon in one's mouth** = పుట్టడమే ధనికుడిగా/ ధనిక కుటుంబంలో పుట్టడం.

a) Jawaharlal Nehru was born with a silver spoon in his mouth = నెహ్రూ పుట్టుకతోనే శ్రీమంతుడు/ ఆగర్భ శ్రీమంతుడు

b) He was not born with a silver spoon in his mouth. His wealth is hard earned = అతడేం శ్రీమంతుడిగా పుట్టలేదు. అతడి సంపద అంతా కష్టపడి సంపాదించిందే.

**3) One side of the coin** = ఒకరి స్వభావం/ ఒక విషయంలో ఒక అంశం మాత్రమే. (ఇంకో అంశం కూడా ఉంది)

a) He makes donations to charities - That's only one side of the coin. The other side of the coin is he is a land grabber too = అతడు విరాళాలు (ధర్మకార్యాలకు) ఇస్తాడనేది ఒక అంశం. అయితే ఇంకో అంశం కూడా ఉంది- అతనో భూకబ్జాదారు.

b) What you know is just one side of the coin. There's the other side - that he is not the innocent you think he is = నీకు తెలి సింది అతడికి సంబంధించిన ఒక అంశం మాత్రమే. ఇంకో అంశం ఉంది, అతడి ప్రవర్తనలో, నువ్వనుకునేంత అమాయకుడేంకాదతడు.

**4) Be at logger heads** = ఇది చాలా తరచుగా విని పించే idiom - ఇద్దరి మధ్య తీవ్ర భేదాభిప్రాయాలు/ మనస్పర్థలతో ఒకరితో ఒకరికి పడకపోవడం/ వారి మధ్య పోట్లాట ఉండటం/ శతృత్వం ఉండటం.

a) YSR and Chandrababu are always at logger heads with each other = వాళ్లిద్దరికీ ఒక్క క్షణం పడదు.

b) India and Pakistan are at logger heads over the handing over of terrorists to India = భారత్‌కు ఉగ్రవాదులను అప్పగించే విష యంలో భారత్‌కు పాక్‌కూ పొత్తు కుదరడంలేదు.

c) The childless wife and the husband are at logger heads over adopting a child and are likely to separate = సంతానం లేని ఆ దంపతులకు దత్తత విషయంలో పొత్తు కుదరడం లేదు, విడాకులు తీసుకోవచ్చు

**5) Settle old scores/ Have a score to settle** = పాత కక్షలు తీర్చుకోవడం/ ఏదైనా అపరిష్కృతంగా ఉన్న విషయాలు పరిష్కరించుకోవడం.

a) Why should anyone attack him for nothing? Perhaps someone had an old score to settle (with him) = ఎవరైనా ఏం లేకుండా ఎందుకు అతడిమీద దాడి చేస్తారు? పాత కక్షలేవో ఉంటాయి.

b) He's cheated her, so she has a score to settle with him = అతడామెను మోసం చేశాడు. అందుకని ఆమె అతడి మీద కక్ష తీర్చుకోవాల్సి ఉంది.

c) We have a score to settle; when shall We meet? = మనం తేల్చుకోవాల్సిన విషయం ఉంది; ఎప్పుడు కలుసుకుందాం?

**6) To bide the time** = సరైన సమయం కోసం వేచి ఉండటం (ఏదైనా చర్య తీసుకునేందుకు)

a) Don't think he won't act. He is just biding the time = అతడేం చేయడనుకోకు. సరైన సమ యంకోసం ఎదురుచూస్తున్నాడు.

b) Bide your time. Your turn will come too = కాస్త ఓపిక పట్టు. నీ వంతు కూడా వస్తుంది.

**7) Off somebody's guard** = ఆదమరిచి ఉండటం/ కష్టాలనూ, ఆపదలనూ ఎదుర్కొనేం దుకు సిద్ధంగా లేకపోవడం.

a) He was off guard when his enemies threw bombs at him = అతడు ఆదమరచి ఉన్న ప్పుడు శత్రువులతడి మీద బాంబులు విసిరారు.

b) The Police caught the thief off guard = దొంగ ఏమరుపాటున ఉన్నప్పుడు police లు పట్టుకున్నారు.

Be on your guard = నీ జాగ్రత్తలో నువ్వుండు

**8) Have an ace up one's sleeve** = అవసరమైన సమయంలో వాడు గెలిచేందుకు వీలుగా మన దగ్గర రహస్యంగా ఉంచుకున్న ఆలోచన/ పథకం/ కీలకమైన సమాచారం.

a) I am surprised he is so calm. He must be having an ace up his sleeve = అతడంత ప్రశాంతంగా ఉండటం ఆశ్చర్యంగా ఉంది. ఏదో ఉందతడి దగ్గర, మనకు తెలియని మర్మం.

b) He is not afraid of his officer. He knows some of his secrets. That must be the ace up his sleeve = అతడు తన officer అంటే భయపడడు. ఆయన రహస్యాలేవో అతడికి తెలుసు. సరైన సమయంలో వాటిని బయటపెడ తాడతడు.



**K.Satyanarayana, Vizag.**

**Q.** For ను period of the time గా ఉప యోగిస్తున్నప్పుడు Present perfect tense లో రాయాలని చదివాను. కానీ కొన్నిసార్లు Simple pastలో కూడా వస్తున్నాయి. ఇది కరెక్టు అవునా? కాదా?

**A.** Simple past లో కూడా వాడవచ్చు అది correct కూడా.

eg: The British ruled India for 200 years = British వాళ్లు భారత్‌ను 200 ఏళ్లు పాలించారు. ఇక్కడ ruled, simple past కదా?

for, ఒక period of time కు ముందు వాడతాం, అది ఎప్పుడైనా, ఏ tense తోనైనా వాడవచ్చు కింది ఉదాహరణలు చూడండి.

a) I am going to Hyderabad. I will be there for three days (future)

b) He lived here for 10 years - 10 ఏళ్లు ఆయ నిక్కడ ఉన్నాడు గతంలో (past simple).

c) He has lived here for the past ten years = గత పదేళ్లుగా (పదేళ్ల క్రితం నుంచి ఇప్పటి వరకూ/ ఇంకా) అతనిక్కడ ఉన్నాడు (present perfect).

గమనిక: స్పోకెన్ ఇంగ్లిష్ ఇకపై ప్రతి ఆదివారం ప్రచురితమవుతుంది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# She is an avid dance student





M.SURESAN



**J.Anil Kumar, Tadpatri, Anantapur**

**Q.** I read in Newspapers that the population of India reached to one billion i.e. 100 crores. Asma Jahangir is the billionth baby of India. With this we can understand that the value of one billion is 100 crores.

But when I was going through the dictionary the other day to find out the meaning of some English words, accidentally I saw the meaning of billion. I was shocked to see that the meaning of billion is given as one lakh crores. In some other dictionaries it is said as a number which has 12 cyphers after 1. I request you to throw light on this matter and give the correct value for billion.

**A.** The correct amount of One billion is, One thousand million. A million = One thousand thousand. One billion = 1000 000 000 = One hundred crore. This is the correct figure.

**Mullakunti Sudhakar, Kurnool**

**Q.** On every monday in Chaduvu column you are giving some modern expressions to readers in Eenadu which have become the part of modern English usage now. As a reader of your column I am happy to know and to learn this kind of new expressions you have been giving. Please let me know how do you know that such sort of expressions/ words have come into use in present day English? For this, what kind of books you read and refer? Because I too want to know like you, that such expression/ words are becoming modern in the present usage. Suggest me what should I do for this. And also suggest me a simple and good thesaurus dictionary to improve my vocabulary as a learner at the beginning juncture.

**A.** To know the modern expressions in English, all that you have to do is read standard English magazines like the India Today, The week, and newspapers like the Times of India. Further browse the web for new additions to the English vocabulary. You'll find them. Once you see them, practise them by using them in sentences of your own. The other thing you've to do is read books of English fiction by novelists like Chase, Harold Robins, Geoffrey Ascher, etc.

Imp: You must be ready to spot a new expression and study its use in the book.

**A.V.Subba Rao, Onipenta, Kadapa.**

**Q.** కిందివాటి గురించి వివరించగలరు.

❍ 1) Introvert 2) Extrovert

**A.** 1) అంతర్ముఖులు - వాళ్ల ఆలోచనలు వాళ్లలోనే పెట్టుకుని, ఇతరులకు తెలుపకుండా, ఇతరులతో కలవకుండా ఒంటరిగా ఉండేందుకు ఇష్టపడే వాళ్లు

X 2) బహిర్ముఖులు- అందరితో కలుపుగోలుగా ఉండి, తమ ఆలోచనలను ఇతరులతో పంచుకునేవాళ్లు.

❍ Possessiveness

**A.** మన వస్తువుమీద మనకే అధికారం, మమత ఉండాలి అనే తత్వంతో, ఇతరులు దాన్ని అనుభవించడం/ దానితో సంబంధం పెట్టుకోవడం భరించలేనితనం.

తల్లికి తన ఒకే ఒక కొడుకు మీది మమకారం- అతడి భార్య (తన కోడలి)ను కూడా దగ్గరకు రానీయని తత్వం.

❍ Much more

**A.** చాలా ఎక్కువ- He has much more property than I have = His property is much more than mine = నా ఆస్తి కంటే చాలా ఎక్కువ.

❍ Counter

**A.** వ్యతిరేకం/ ప్రతికూలం

Argument X Counter argument

When I complained about it he countered me by saying the opposite

❍ హితోక్తి

**A.** Homily/ good advice

❍ Input

**A.** 1) యంత్రాల లాంటి వాటిలోకి ఎక్కించే విద్యుచ్ఛక్తి. 2) computer లోకి ఎక్కించే సమాచారం. 3) ఒక విషయాన్ని గురించి మనకు వచ్చే సమాచారం, ఆలోచనలూ, అభిప్రాయాలు. 4) ఒక course లోని subject లోని బోధనాంశాలు.

❍ Output

**A.** i) యంత్రాలు ఇవ్వగలశక్తి, కదలిక.

ii) Computer నుంచి మనకు తెలిసే సమాచారం.

iii) ఒక మనిషి/ సంస్థ/ యంత్రం ఒక నిర్ణీత కాలంలో చేయగల పని.

❍ Hang over

**A.** మద్యం/ మాదకద్రవ్యాల/ మత్తు పదార్థాల ప్రభావంలో మిగిలి ఉండేది.

❍ Commutators

**A.** Commutators అనే మాట లేదు. అది Commuter అయి ఉండొచ్చు అర్థం = రోజూ ఇంటి నుంచి చాలా దూరంగా ఉన్న ఉద్యోగం చోటికి bus/ train లలో ప్రయాణం చేసేవాళ్లు.

❍ Puttage

**A.** ఈ మాట లేదు English లో. బహుశా ఇది footage అయి ఉండొచ్చు అర్థం - ఒక సన్నివేశాన్ని చూపే చలనచిత్ర భాగం/ ప్రచారం కోసం అవస్థలు పడే రాజకీయ నాయకులను చూపించే చలనచిత్ర భాగం.

❍ Coastal Corridor

**A.** సముద్ర తీరం వెంబడి మార్గం/ రహదారి. Corridor = రెండు వైపుల ఉన్న గదుల వరసల మధ్యన ఉండే మార్గం/ నడవ.

❍ Shops పేర్ల ముందు M/s అని ఉంటుంది అంటే Messers అని అర్థమా?

**A.** అవును. అయితే M/s (Messrs), ఒకరి కంటే ఎక్కువ వ్యక్తుల పేర్లతో ఉండే Company పేర్లకే వాడతాం: M/s San and San (రెండూ వ్యక్తుల పేర్లే)/ M/s Rao and Naidu, etc. అంతేకానీ ఇతర పేర్ల ముందు వాడం. M/s Reliance Corporation Ltd., అనడం సరికాదు, అవి వ్యక్తుల పేర్లు కావు కాబట్టి.

❍ Messers అంటే?

**A.** Messrs, Mr (Mister) కు plural.

❍ General store, Medical store ల తరువాత అలా కాకుండా plural లో General stores, Medical stores అని ఉంటుంది? ఎందుకని?

**A.** ఒకే రకమైన వస్తువులను అమ్మే దుకాణాన్ని Stores అంటారు. Medical Stores - మందులు (మాత్రం) అమ్మే shop. General Stores - సామాన్యావసరాల వస్తువులమ్మే shop.

❍ Module

**A.** 1) ఏదైనా course (ముఖ్యంగా College/ University) లో ఒక భాగం. 2) రెండు మూడు భాగాలు కలిపి తయారయ్యే యంత్రంలోని ఆ భాగాలు, Modules. 3) ఒక ప్రత్యేకమైన లక్ష్యంతో చేసే Computer Programme లోని భాగం. 4) వ్యోమనౌకల్లో స్వతంత్రమైన భాగం.

❍ Concept school లో concept అంటే ఏమిటి?

**A.** ఇది అర్థం పర్థం లేని మాట. బహుశా భారత్‌లో అదీ ఆంధ్రప్రదేశ్‌లో తప్ప ఇంకెక్కడా వాడరు. ఇంకెక్కడా ఈ మాట అర్థం కాదు.

Concept Schools నిర్వాహకుల ప్రకారం Concept school అంటే అర్థం అక్కడి పిల్లలతో పాఠాలు బట్టీ పట్టించి, పరీక్షల్లో ఎక్కువ marks వచ్చేట్లు చదివించకుండా subjects లోని విషయాల పట్ల అవగాహన కలిగించే ఉద్దేశంతో బోధించే schools అని. Concept school కు ఇదీ అర్థం అని వాటి నిర్వాహకులకు తప్ప మరెవరికీ అర్థం కాదు.

Teach the student the concept of a subject, let them not mug up the subjects = విద్యార్థికి విషయం అవగాహన అయ్యేట్లు బోధించు; వాళ్లతో పాఠాల్ని బట్టీ పట్టించకు.

❍ Warmonger

**A.** యుద్ధాలు కోరుకునేవాళ్లు, శాంతికి బదులు/ కయ్యానికి కాలుదువ్వేవాళ్లు.

❍ Avid

**A.** దేని పట్లయినా బాగా ఉత్సాహం/ ఆతురత కల.

He is an avid watcher of the TV = అతడు TV ఆతురతగా/ ఉత్సాహంతో చూస్తాడు.

She is an avid dance student = ఉత్సాహం/ ఆతురతతో dance నేర్చుకుంటుంది/ Dance పట్ల ఆమెకు చాలా ఉత్సాహం/ ఆతురత.

❍ commit

**A.** ఒక పని చేయడం - ముఖ్యంగా చెడు. Commit suicide/ murder/ rape/ theft, etc.

❍ Commitment

**A.** Commitment to somebody = ఒకరికిచ్చిన మాటకు బద్ధులై ఉండటం.

Commitment to something = ఒక విషయానికి కట్టుబడి ఉండటం.

We all appreciate Loksatta's commitment to clean politics = నిష్కళంక రాజకీయాలకు లోక్‌సత్తా కట్టుబడి ఉండటాన్ని మనమంతా మెచ్చుకుంటాం.

There is no commitment on the part of the Govt to the welfare of the people = ప్రజల సంక్షేమం పట్ల ప్రభుత్వం కట్టుబడి లేదు.

**M. Laxman, Kakinada.**

కింది ఇంగ్లిష్ వాక్యాలకు తెలుగు అర్థం తెలుపగలరు.

**Q.** The judge ordered him to be punished.

**A.** న్యాయమూర్తి అతడిని శిక్షించాల్సిందిగా ఆజ్ఞాపించాడు.

**Q.** We have made him what he is.

**A.** ఈరోజు అతడిని ఇంతటివాడిని చేసింది మేమే.

Concept అంటే ఒక విషయం గురించి అవగాహన, మన మనసులో దానికున్న రూపం.

He is an orphan so he has no concept of parental love = అతడు అనాథ అందుకని తల్లిదండ్రుల ప్రేమ గురించి అవగాహన అతడికి లేదు.

Westerners can have no concept of our caste system = మన కులవ్యవస్థ పాశ్చాత్యులకు అవగాహన కాదు.

Though he is a Hindu, he has very clear concept of other religions too = అతడు హిందూ అయినప్పటికీ, ఇతర మతాల గురించి మంచి అవగాహన ఉంది.

ఒక engineer, ఒక bridge ను design చేస్తున్నప్పుడు, bridge పూర్తయిన తర్వాత అది ఎలా ఉంటుంది అనేది, పూర్తయిన bridge దృశ్యం, అతడి మనసులో మొదటే కనిపిస్తుంది - ఈ దృశ్యం, concept.

**Q.** He was not sorry for having been deceived.

**A.** మోసపోయినందుకు అతడేం విచారించడం/ బాధపడటం లేదు.

For having been deceived = మోసగించబడినందుకు.

**Q.** He is in the habit of taking exercise daily.

**A.** అతడికి రోజూ వ్యాయామం చేసే అలవాటు ఉంది.

of taking = (వ్యాయామం) చేసే.

కింది వాక్యాలను తెలుగులో చెప్పండి.

**Q.** She would see the books she read.

**A.** తను చదివిన పుస్తకాలను చూసేది (గతంలో).

**Q.** A writer has to avoid common things which are known to all.

**A.** రచయితలు అందరికీ తెలిసిన సామాన్యమైన విషయాలను వదిలేయాలి.

**Q.** i) Here are some rules given for good spelling.

ii) We witnessed a very good rush this year compared to last year.

వీటిలో given, compared ఏ అర్థాలనిస్తాయి?

**A.** i) Given = ఇవ్వబడిన;

are given = ఇవ్వబడినవి.

ii) compared = పోలిస్తే.

compared to last year = కిందటేడాదితో పోలిస్తే.

**K. Satyanarayana, Visakhapatnam**

**Q.** I am a teacher కు, question tag- Aren't I అవుతుంది. I am not teacher అనే negative statement కి Am I not a teacher అంటే సరిపోతుందా? లేకపోతే ఇక్కడ కూడా tag form లో లాగా Aren't I a teacher అనాలా?

**A.** Correct question tags:

I am a teacher, aren't I?

I am not a teacher, Am I

(Am not కు, am I - అనేది correct question tag)

**Q.** Ever, never లను కూడా present perfect లోనే ఉపయోగిస్తారని చదివాను. కాని కొన్నిసార్లు present simple లోనూ చెప్తున్నారు. Is it correct? Please explain.

**A.** Ever = ఎప్పుడైనా/ ఎల్లప్పుడూ- దీన్ని ఏ tense తోనైనా వాడవచ్చు అయితే ముఖ్యంగా questions లో కొన్ని కొన్ని expressions లో మాత్రమే వాడతాం.

a) All that he ever does is to complain = వాడు చేసేదంతా, complain చేయడమే. (Does - present simple)

b) Does he ever help you? (Question - does help - present simple - question) ఇలాగే, Did he ever ...? అని కూడా అంటాం simple past లో.

c) Has he ever helped you? - నీకెప్పుడైనా సహాయం చేశాడా? - Present perfect.

Never ను ఇంకా frequent గా అన్ని tenses లో వాడతాం.

a) He never comes here (Pr. simple)

b) He never came here when he was here (past simple)

c) I will never see you again (future) - ఇలా అర్థం సరిగా ఉంటే ఏ tense లోనైనా వాడవచ్చు

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm





**V. Narasimhamurthy, Chinnayyapalem (EGDt)**

**Q.** నిన్న టీచర్ మనకో assignment ఇచ్చారు కదా? ఎప్పుడు పూర్తిచేయమన్నారు మనల్ని? అనడానికి when did he ask us to complete it? అన్నారు. Assignment complete చేయమని ఆయన మనకు ఎప్పుడు చెప్పారు అనే అర్థం కూడా వస్తుంది కదా. When will be the assignment asked to complete us? అంటే అర్థం ఏమిటి? వివరించగలరు.

**A.** By the way, the teacher gave us an assignment yesterday. When does he want us to complete it? ఇలా అంటే ambiguity ఉండదు.

When did he ask us to complete it?

అంటే మీరన్నట్టు Assignment complete చేయమని ఎప్పుడు అడిగారు? అనే అర్థం కూడా వస్తుంది. పైన చెప్పినట్టయినా, when are we to complete the assignment అన్నా ఆ సందేహం ఉండదు.

**Sk. Wahed Ali, Adilabad.**

**Q.** To have, not to, unless వీటి ప్రయోగం వివరించగలరు. Was going, had been going ఈ రెండు continuous tence ల మధ్య తేడా తెలుపగలరు.

**A.** To have = కలిగి ఉండటం/ ఉండటం - ఏదన్నా, ఎవరికన్నా.

To have a car these days is not a big thing= ఈ రోజుల్లో car ఉండటం పెద్ద విషయమేమీ కాదు.

1) To have + pp - To have gone = (ఒకచోటికి) గతంలో వెళ్లడం.

To have gone there was my big mistake = నేనక్కడికప్పుడు వెళ్లడం నా పెద్ద పొరపాటు.

2) unless = అయితే తప్ప.

a) Unless you work hard you can't pass = నువ్వు కష్టపడి చదివితే తప్ప pass కావు.

b) How can I see him unless I know where he is = అతడెక్కడున్నాడో తెలియందే అతడిని నేనెలా కలుసుకోగలను?

3) was going = వెళుతూ ఉన్నాడు

He was going home when I saw him yesterday = అతడిని నేను నిన్న చూసినప్పుడు అతడు ఇంటికి వెళుతున్నాడు.

She was going to college when the accident took place = ప్రమాదం జరిగినప్పుడు ఆమె college కు వెళుతోంది (గతం).

Had been going = గతంలో ప్రారంభమై, ఇంకో పని జరిగే వరకు కొనసాగే పని.

He had been going to college until he got this Job = అతడు ఉద్యోగం వచ్చేవరకూ/ వచ్చేటప్పటికి (II past action) college కు వెళుతున్నాడు.

(చదువుతున్నాడు - ముందర ప్రారంభమై job వచ్చేవరకూ continue అయ్యింది)

was going - past continuous

had been going - past perfect continuous

**N. Chakradhara Rao, Agiripalli(Krishna Dt).**

**Q.** ఒక ఇంటర్వ్యూలో మాట్లాడుతూ హీరోయిన్ I was fair and had a small sharp nose like Muntaz did అంది. దీనిలో I am fair and have small, sharp nose like Muntaz had అని ఉండాలి కదా. ఇదే ఇంటర్వ్యూలో When you see me with jewellery, costumes on the sets. I look the character దీనిలో I look the character అనే expression కరెక్టేనా? అలాగే గతంలో మీరు Bike driving అని వాడారు, riding అంటే బావుంటుంది కదా, వివరించగలరు.

**A.** Interview లో మాట్లాడుతున్నప్పుడు ఆ heroine తను గతంలో Fair (అందంగా/ ఎరుపు/ తెలుపు colour) గా ఉన్నాను, ఇప్పుడు లేను, అనే ఉద్దేశంతో అంటే was, సరైనదేకదా? ఆమె రంగు ఇప్పుడు తగ్గి ఉండొచ్చు, ముక్కు తీరు మారి ఉండొచ్చు

I look the character - ఇది correct. నేను నటిస్తున్న పాత్రలానే కనపడతాను అనే భావంతో.

Driving a bike అని కూడా అనొచ్చు, తప్పులేదు.

**Vijaya, Mehaboobnagar.**

**Q.** As if అనే ప్రయోగాన్ని ఏ సందర్భంలో ఎలా ఉపయోగించాలో చెప్పగలరు.

**A.** As if = అయినట్టు, కానీ కాదు.

a) He speaks as if he were very rich = తనేదో ధనవంతుడయినట్టు మాట్లాడతాడు అతడు, (కానీ అతడు ధనవంతుడు కాదు)

b) She behaves as though/ as if she were clever = ఆమె తెలివికలది కాకపోయినా, తెలివి గలదానిలా ప్రవర్తిస్తుంది.

ఇక్కడ గమనించాల్సింది: As if తర్వాత clause లో verb ఎప్పుడూ were గా ఉంటుంది.

**Q.** కింది వాక్యం కరెక్టో కాదో చెప్పండి.

If she had been alive she would have felt happy.

**A.** Correct

**Zilani, Madanapalli.**

**Q.** While speaking English grammatically usage must be there. How to develop good communication skills in English. What are the activities we have to do to develop Spoken English. Give me necessary suggestions to develop fluent English skills.

**A.** To master usage read as much English as you can. Usage cannot be learnt as grammar can be.

We have to pick it up by reading, as we have little opportunity of listening to speakers of Enlgish.

Read English newspapers and magazines; short story books and novels. Listen to English news telecasts. Speak English whenever you get an opportunity.

Learn to add 'please' when you ask for others help. (Give me suggestions - Please give me suggestions - understand the difference).

**M. Chandu, Nalgonda.**

**కింది సామెతలను ఇంగ్లిష్‌లో వివరించగలరు.**

Q. కుక్కకాటుకు చెప్పు దెబ్బ.
A. Tit for tat.
Q. ముందుంది మొసళ్ల పండగ.
A. The worst is yet to come.
Q. ఇల్లు అలకగానే పండగ కాదు.
A. One swallow doesn't make summer.
Q. చెరపకురా చెడేవు.
A. You fall in the trap if you lay for others.
Q. కూటి కోసం కోటి విద్యలు.
A. All struggle for a morsel of food అనొచ్చు.
Q. ఐకమత్యమే బలం.
A. Unity is strength.
Q. ప్రతి మనిషికి ఒకరోజు(సమయం) వస్తుంది.
A. Every dog has his day.
Q. చూసుకుని మురవడం, చెప్పుకుని ఏడవడం.
A. దీనికి సరైన English వాక్యం లేదు.
Q. లోపల లొటారం, పైన పటారం.
A. All that glitters is not gold.

**కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఏమంటారు?**

Q. నేను అన్నం తినాలి.
A. I have to eat.
Q. నేను టాయిలెట్‌కు వెళ్లాలి.
A. I have to go to toilet/ I need to go to toilet.
Q. నేను స్నానం చేయాలి.
A. I have to have a bath.
Q. నేను బయటకు వెళ్లాలి.
A. I have to go out.
Q. నేను ఎగ్జామ్‌కు వెళ్లాలి.
A. I have to go to exam.

**Q.** Being with a winner you makes a winner.

**A.** దీని correct form :

Being with winner makes you a winner = విజేతతో సాంగత్యం, మనల్ని విజేతలుగా చేస్తుంది. (మనం జీవితంలో విజయం పొందినవాళ్లతో ఉంటే, మనమూ విజయం పొందుతాం)

**Q.** నేను బి.ఎస్సీ(బిజడ్‌సి) పూర్తి చేశాను. ఎం.ఎ. ఫిలాసఫీ చేయాలంటే డిగ్రీలో ఎంత పర్సంటేజ్ ఉండాలి. ఇంకా ఏ కోర్సు చేస్తే బావుంటుందో సలహా ఇవ్వండి.

**A.** MA Philosophy చేయాలంటే ఏ Degree అయినా సరిపోతుంది. MA Philosophy కి పెద్ద prospects లేవు. Lecturer అవ్వాలి, లేదా competitive exams కు తయారవ్వాలి. మీలాంటి science students, science PG/ BE.d/ Computers / MBA Course లు చేయడం Career కు better.

# All struggle for a morsel of food





M.SURESAN

**Q.** అరిసెలు, లడ్డూలు, కారప్పూస, మిఠాయి, బూరెలు, వడ, పెసర దోశ, ఉల్లిదోశ, గారెలు(పెసర, మినప, బొబ్బర) వీటిని ఇంగ్లిష్‌లో ఏమంటారో చెప్పండి.

**A.** ఇవన్నీ English వాళ్లకు తెలియని వంటకాలు. అందుకని English లో వీటికి వేరే పేర్లుండవు. వీటినే English spellings తో రాసుకోవాల్సిందే.

**R.Sangam Naidu, Jarajapupeta (vizayanagaram)**

**Q.** స్పోకెన్ ఇంగ్లిష్ చక్కగా మాట్లాడాలంటే Pronounciaton ముఖ్యం. చాలామంది సరిగ్గా ఉచ్చరించలేరు. దయచేసి ఇంగ్లిష్ పదాలను ఎలా ఉచ్చరించాలో, Oxford Dictionary ని ఎలా ఉపయోగించాలో తెలుపండి.

**A.** Oxford Dictionary తోబాటు CD కూడా వస్తుంది. ఆ CD మీకు pronunciation విషయంలో ఉపయోగపడుతుంది. అంతేకాకుండా Dictionary చివర ఉన్న symbols ( ʃ = ship - షిప్‌లో, ష, - ఇలా ఉదాహరణలు) అభ్యాసం చేయండి. ఇక stress సంగతికి వస్తే ఈ ఉదాహరణ చూడండి: Above - ∂'bΛV ఇందులో b పైన ' గుర్తు ఉంది కదా. ఇదే stress mark. Above, pronunciation: అబవ్- ఇందులో రెండు శబ్దాలున్నాయి. 1) అ 2) బవ్. Stress mark, 'బ' మీద ఉంది. కాబట్టి దాన్ని నొక్కి పలుకుతాం. 'అ' దాదాపు పలకం - ఇలా stress pattern తెలుసుకోవచ్చు ఇంకా కావాలంటే TV లోని English news bulletins, English వినండి. అలా వింటూంటే మనకూ అలవాటయిపోతుంది.

**A. Subba Rao, Oripenta(Kadapa).**

**కిందివాటికి అర్థాలు వివరించగలరు.**

Q. Dutch courage
A. తాగిన మైకంలో వచ్చే ధైర్యం.
Q. Dare Devil
A. సాహస చర్యలకు పూనుకునేవారు.
Q. నిధుల సేకరణ అనేదానికి Funds mobilization కరెక్టేనా?
A. Correct
Q. To worship the rising sun.
A. ఉదయ సూర్యుడిని ఆరాధించడం.
Q. A wishful thinking
A. మనకు అనుగుణంగా, మనం కోరుకున్న విధంగా, మనకు మేలు కలిగేలా జరుగుతుందని అనుకోవడం.

eg: To think that you can become a millionaire over night is wishful thinking = రాత్రికిరాత్రే కోటీశ్వరుడిని అవ్వగలననుకోవడం, మనం కోరుకున్నట్టు అన్నీ జరుగుతాయనుకోవడమే.

Q. A wet blanket
A. ఏ విషయంపైనా ఉత్సాహం చూపించకుండా, ఇతరుల ఉత్సాహాన్ని నీరుగార్చేవారు.
Q. A bird's eye view
A. విహంగవీక్షణం - ఎత్తయిన ప్రదేశం నుంచి కింది విషయాలన్నింటినీ వీక్షించడం - ఒక విషయానికి సంబంధించిన విషయాలన్నింటినీ ఆకళింపు చేసుకోవడం.
Q. To cut a sorry figure.
A. చేతకానివాడిలా/ అసమర్థుడిలా కనపడటం.
Q. A thankless task
A. మెప్పు/ ప్రతిఫలం/ ఇతరుల కృతజ్ఞత పొందని శ్రమ.

eg: Cooking everyday in a household is a thankless task = ఇంట్లో ప్రతిరోజు వంట చేయడం ఫలితంలేని శ్రమ.

Q. To save one's skin
A. ప్రమాదకర పరిస్థితి నుంచి రక్షించుకోవడం = I acted innocent to save my skin = నన్ను రక్షించుకునేందుకు అమాయకత్వం నటించాను.
Q. To sail in the same boat
A. ఒకే గడ్డు పరిస్థితిలో ఉండటం - They are both software men. Having lost their job, they are (sailing) in the same boat = ఉద్యోగాలు పోగొట్టుకున్న ఆ software వాళ్లిద్దరూ ఒకే గడ్డు పరిస్థితిలో ఉన్నారు.
Q. To rest on one's laurels.
A. గత వైభవంతో గడిపేస్తూ కొత్తవేమీ సాధించకపోవడం - He scored his only century years ago and is now resting on past laurels = ఏళ్ల కిందట చేసిన century నే గొప్పగా అనుకుంటూ ప్రస్తుతం అలాంటి ప్రయత్నాలేం చేయడంలేదు.
Q. Blood and Iron
A. దీనికి ప్రత్యేకమైన అర్థం ఏమీలేదు.
Q. To make way
A. దారివ్వడం/ మారిపోవడం - Account books have made way for computers (Account books కు బదులు Computers వాడకంలోకి వచ్చాయి.)
Q. Odds and ends.
A. అవీ, ఇవీ, అన్నీ - అంత ముఖ్యం కానివి - Among the things in the room was a box with odds and ends - ఆ గదిలోని వస్తువుల్లో అవీ, ఇవీ, అన్నీ వేసిన పెట్టె ఒకటుంది.
Q. To rise to the occassion
A. క్లిష్ట సమస్యను, విపత్తును ఎదుర్కొన్నప్పుడు మన శక్తి యుక్తులన్నీ కూడగట్టుకుని విజయులుగా నిలవడం, మనల్నించి ఆశించిన ఫలితాన్ని అందివ్వడం - Whenever India faced defeat Dravid rose to the occasion and saved the country. భారత్ ఓటమిని ఎదుర్కొన్నప్పుడల్లా, ద్రావిడ్ సమస్యకు తగ్గట్టు శక్తియుక్తులన్నీ వాడి దేశాన్ని ఆదుకున్నాడు.
Q. To look for trouble
A. వివాదానికి దౌర్జన్యానికి గురవడం/ కష్టాలు కోరి తెచ్చుకోవడం - If you don't pay the money you are looking for trouble - డబ్బులు కట్టకపోతే నీకు కష్టాలు తప్పవు/ బాధలు తప్పవు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# Live and let Live

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 532

M.SURESAN



**B.V.Satyanandam, Korukonda (E.G. Dt.)**

**Q.** Spoken English లో "I have a head ache" అని గతంలో చెప్పారు. Countables ముందు మాత్రమే a, an వస్తాయి కదా. 'Head ache' కు plural ఉండదు కదా. వివరించండి.

**A.** Head ache, cold (జలుబు), cough (దగ్గు), fever ఇవన్నీ countable singulars. అంటే వాటి ముందు (వాటిని మామూలుగా singular గానే వాడతాం) a వాడాల్సిందే.

**Q.** ఇంగ్లిష్‌లోని 26 అక్షరాలను ఎలా ఉచ్చరించాలి? పెదాల కదలిక ఎలా ఉంటుంది?

**A.** a, e, i and o వీటిని ఉచ్చరించేటప్పుడు శబ్దాలు గొంతులోంచి వస్తాయి. నాలుక వాడం. U pronounce చేసేందుకు నాలుక చివరి భాగాన్ని అంగిలికి బాగా తాకిస్తాం.

b = బీ, c = సీ, d = డీ (నాలుక flat గా పెట్టి కొనను పైపళ్ల చిగుళ్లకు తాకిస్తాం. f = ఎఫ్ (నాలుక వాడం) g = జీ, h = ఎయిచ్ j = జెయ్, k =ఖెయ్, l = ఎల్ , M = ఎమ్, n = ఎన్ (ఈ మూడింటికీ నాలుక వాడం) p = పి, q = క్యూ , r = ఆ(ర్) s = ఎస్ (నాలుకకు అంతగా పనిలేదు) t = టీ, v = వి (పైపళ్లను కింది పెదవికి తాకిస్తాం) w = వ (పెదవులు గుండ్రంగా తిప్పి పలుకుతాం) x = ఎక్స్, y = వై (wai), z = zed/ zee (US).

**Q.** When I reached the station, the train had left. అనే ఈ వాక్యాన్ని Before I reached the station the train had left గా రాయవచ్చా? వాక్యం ప్రారంభంలో preposition వాడకూడదా?

**A.** When I reached the station, the train had left = నేను station కు చేరేటప్పటికి train వెళ్లిపోయింది. Before I reached the station the train had left = నేను station కు చేరేముందే train వెళ్లిపోయింది.

రెండింటికి తేడా చాలా తక్కువ.

**Q.** ఒక ఇంగ్లిష్ వ్యాసంలో have you seen the film Mass? అనే వాక్యం ఉంది. దీనిలో article 'the' ఉపయోగించడం తప్పు కదా. Film name చెప్పేటప్పుడు the వాడం కదా? The P.M. Manmohan అనం కదా. The P.M. or P.M. Manmohan అంటాం కదా. కరెక్టుగా ఎలా అనాలో చెప్పండి.

**A.** The అనేది film కుగాని, Mass కు కాదు కదా? The film (చలన చిత్రం) common noun కాబట్టి, the వాడాలి. The P.M., Mr. Manmohan Singh అనడమే correct. అయితే Mr. Manmohan Singh, P.M. of India అంటాం.

**Pavani, Sudha, Matsyapuri (W.G. Dt).**

**Q.** To take stock/ stalk of the situation is అనే usage radio news లో వినిపిస్తుంది. అది stock లేదా stalk నా ఏది కరెక్టో తెలుపగలరు.

**A.** To take stock of the situation (stalk కాదు) = అసలు ఇంతవరకు జరిగిందేమిటి? ఎంత జరగాల్సింది, ఎంత జరిగింది? అని ఒకసారి అంచనా వేసుకోవడం.

**Q.** Pistle తో 'Point blank range' లో నుంచి కాల్చాడు అంటారు. ఈ Point blank range అంటే ఏమిటో అర్థం తెలుపగలరు.

**A.** Point blank range = చాలా దగ్గరగా, అంటే pistol మనిషి తాకేంత దూరంలో ఉంచి కాల్చడం.

**Q.** India levelled the three test match series = ఈ వాక్యంలో three test match series (object) అనేది singular అవుతుందా లేదా plural అవుతుందా తెలుపగలరు.

**A.** Level = సమం చేయడం

series - singular

**K.R. Achari, Vaikuntapuram**

**Q.** In staff selection, out of 17 questions from arithmetic, only one or two questions are giving from average chapter అని ఒకచోట చదివాను. Are giving తప్పేమో అనిపిస్తుంది. Are being given అని ఉండాలనుకుంటున్నా.

**A.** తప్పే. Are given - correct.

Are given = ఇవ్వబడతాయి.

**B. Nazeer, Ahmed Anantapur.**

**Q.** E-commerce లో 'one - off sales' అని ఇచ్చారు. దీని అర్థం ఏమిటి?

**A.** One - off sales = ఒకేసారి/ ఒక్కసారి మాత్రమే జరిగే అమ్మకం.

**Q.** What if, as with ఎలా ఉపయోగించాలో తెలుపగలరు.

**A. What if** = (అలా అయితే) ఏమవుతుంది?

What if the train is late =

Train late అయితే (ఒకవేళ)?

What if he comes here now? =

ఒకవేళ అతడిక్కడికి రావడం జరిగితే

**As with -** దీనికి ప్రత్యేకమైన అర్థం ఏమీ లేదు. అయితే ఇలా వాడొచ్చు:

As with children, so with the very old. They need a lot of care = పెద్దవాళ్లనూ చిన్న పిల్లల్లాగే చాలా జాగ్రత్తగా చూసుకోవాలి.

**Q.** బతుకు, బతికించు అంటే live - let live అని చూశాను. కానీ ఇక్కడ let అనవసరం కదా. Let గురించి కొంచెం వివరంగా తెలుపగలరు.

**A.** Let = allow = (ఒకపని) చేయనివ్వడం.

Let live అంటే బతికించు అని కాదు. బతకనివ్వు అని. Live and let Live = నువ్వు బతుకు, ఇంకొకరిని బతకనియ్యి.

Let him go = వాడిని వెళ్లనీ.

Let them know this = ఇది వాళ్లను తెలుసుకోనివ్వు

Let us go = వెళ్దాం పదా.

**Q.** Explosive, defensive, attractive, creative ఇలాంటి adjectives కు అర్థాలు తెలుపండి.

**A.** Explosive: 1) పేలే స్వభావం ఉన్న

2) పేలుడు పదార్థం

Defensive = సమర్థించుకునే, రక్షణలో ఉన్న.

attractive = ఆకర్షణీయమైన.

creative = సృజనాత్మక శక్తి ఉన్న.

ఇవన్నీ adjectives (వర్ణన మాటలు) - పరిస్థితులు, దృశ్యాలు, వ్యక్తులను వర్ణించేందుకు వాడతాం.

**Q.** మీరు ఒకచోట 'She is of Indian origin settled in U.S.A.' అని ఇచ్చారు. ఇక్కడ 'of' అనేది అవసరమా? be + of వీటి ఉపయోగం తెలుపండి.

**A.** అవసరమే. be of Indian origin = భారతీయ మూలానికి/ సంతతికి చెందిన (ఇక్కడ of = కి).

**Q.** ఒక న్యూస్ ఛానెల్‌లో to killing of acid అని చెప్పారు. దీని అర్థం ఏమిటి?

**A.** to killing of acid = దీనికి అర్థంలేదు. పూర్తి sentence ఇస్తే తప్ప అర్థం తెలుసుకోలేం. killing of acid అంటే మాత్రం అర్థంకాదు.

**Q.** Lead, term - ఈ పదాలకు అర్థాలను వివరించండి.

**A. Lead** = ముందుండి నడిపించడం/ అందరికంటే ముందుండటం/ నాయకత్వం వహించడం.

**Term** = 1) పదం

2) (plural లో) షరతులు.

Terms of appointment = ఉద్యోగానికి సంబంధించిన షరతులు (conditions)

3) నిర్ణీతకాలం - Period -

He will be the president for a term of 2 years = రెండేళ్ల కాలానికి ఆయన అధ్యక్షుడిగా ఉంటాడు.

**Q.** Gonna, gotta, wanna వీటిని ఎలా ఉపయోగించాలి?

**A.** Gonna = త్వరత్వరగా, అంతగా చదువుకోని వాళ్లు, Going to ను ఇలా అంటారు.

He's gonna kill ye (you) = అతడు నిన్ను చంపబోతున్నాడు, అలాగే Gotta = got to, wanna = want to.

**Q.** By selling, By seeing ఇలాంటి వాటిని వాక్యాల్లో ఉపయోగిస్తే ఎలాంటి అర్థం వస్తుంది?

By selling = అమ్మకం ద్వారా/ వల్ల

By seeing = చూడటం వల్ల/ ద్వారా

**P. Sankar Lingam, Warangal**

**Q.** కింది వాక్యాల అర్థ భేదం తెలుగులో తెలుపగలరు.

1) The Mango trees, which were given some of that new fertilizer, produced very good fruit.

2) The Mango trees which were given some of that new fertilizer produced very good fruit.

**A.** రెండింటికీ అర్థం ఒకటే. Comma ల వల్ల అర్థం మారేది కింది sentence లాంటి వాటిల్లో:

a) He rectified the trouble in the car which cost us a lot of money.

b) He rectified the trouble in the car, which cost us a lot of money.

a) (Comma లేదు) - ఎక్కువ ఖర్చయిన ఆ Car లోని repair ను అతడు సరిచేశాడు - అంటే car కు ఎక్కువ ఖర్చు యిందని.

b) (Comma తో) ఆ Car లోని ఖర్చయిన repair ను అతడు సరి చేశాడు - అంటే repair కు ఖర్చయిందని.

అయినా ఇలాంటి ambiguity (సందేహం) రాకుండా ఉండేందుకు, sentence వేరేగా రాస్తే clear గా అర్థం అవుతుంది.

a) He rectified the trouble and it cost us a lot.

b) He rectified the trouble in the car. The car cost us a lot

**Q.** కింది పదాలను ఎలా ఉపయోగించాలో తెలుపగలరు. Nevertheless and notwithstanding.

**A.** It was raining heavily. Nevertheless/ but/ yet he went out = వర్షం బాగా కురుస్తోంది. అయినా అతడు బయటికెళ్లాడు.

Notwithstanding/ Inspite of the heavy rain he went out = బాగా వర్షం కురుస్తున్నా అతడు బయటికెళ్లాడు.

**K. Satyanarayana, Visakhapatnam**

**Q.** Believe in Jesus Christ. Believe in me, him, his లు కరెక్టు అయితే believe it లో believe తర్వాత in ఎందుకు రాలేదు? అవసరం లేదా? Could you explain please.

**A.** Believe in కు believe కు అర్థంలో చాలా తేడా ఉంది.

Believe = ఒకరు చెబుతున్నది/ ఒక విషయం నిజమని నమ్మడం.

a) She believed he would marry her = అతడు తనను పెళ్లి చేసుకుంటాడని ఆమె నమ్మింది.

b) The Police did not believe his words/ what he said = అతడి మాటలను/ అతడు చెప్పింది Police లు నమ్మలేదు.

'He is rich' (అతడు బాగా ఉన్నవాడు)

I don't believe it! (నేనది నమ్మను)

**Believe in** = ఏదైనా ఉంది అని నమ్మడం

a) I believe in God = నేను దేవుడున్నాడని నమ్ముతాను.

b) Christians and Muslims do not believe in rebirths, whereas Hindus do = మరుజన్మ ఉందని క్రైస్తవులు, ముస్లింలు నమ్మరు, హిందువులు నమ్ముతారు.

Believe in Jesus Christ = క్రీస్తును స్వీకరించడం - ఆయనను, ఆయన చెప్పింది నమ్మి ఆచరించడం.

Believe in అంటే ఇంకో అర్థం, ఒక విషయం మంచిదనీ, అనుసరణీయమైనదనీ భావించడం.

a) Gandhi believed in peace = గాంధీ శాంతి మంచిదనీ, అనుసరణీయమైనదనీ భావించాడు.

b) Politicians don't believe in honesty = రాజకీయాల్లో ఉండే వాళ్లకు, నిజాయతీ మంచిదనే/ అనుసరణీయమైనదనే భావం లేదు.

Believe in a person = (him/ her etc) = ఒకరు మంచివాళ్లనీ, విజయం లాంటివాటిని సాధించగలరనే నమ్మకం.

Many believed in Gandhi and were ready for any sacrifice = చాలామంది గాంధీపై నమ్మకంతో (ఆయన్ను అనుసరించి) త్యాగాలకు సిద్ధపడ్డారు.

**Q.** దుబాయివాడు అనడానికి ఏమంటారు? ఫలానా ప్రాంతంవాడు అనడానికి ఎలాంటి suffix ను వాడాలి?

He is from vizag - He is vizagite.

He is local - He is localite.

He is from Saudi - He is ----?

**A.** Dubaiite = దుబాయివాళ్లు.

He is from Vizag = Vizag వాళ్లు = Vizagites (singular- Vizagite)

He is from Saudi = He is a Saudiite.

Localite అనే మాట English లో లేదు. స్థానికుడు అనేందుకు Local అనే అంటాం.

Local కు రెండు అర్థాలు:

1) స్థానికమైన - ఒకచోట ఉన్న

A Local School = స్థానిక పాఠశాల (మనం చెబుతున్న ప్రదేశంలో ఉన్న)

2) స్థానికులు:

They are locals here = వాళ్లిక్కడి స్థానికులు/ ఈ ప్రదేశానికి చెందినవాళ్లు.

ఒక ప్రదేశానికి చెందినవారు అనే అర్థం ఇచ్చే suffix, convenience ను బట్టి ఉంటుంది. ప్రదేశం పేరు చివర vowel (a, e, i, o, u తెలిపే శబ్దాలు) వస్తే - ite అంటాం, లేదా an అంటాం.

Bombaite/ Mumbaiite (Bombay/ Mumbai చివర vowel వస్తుంది కదా? ) (Delhiite/ Chennaiite, etc.)

ఒక్కొక్కసారి -an/ -n రావచ్చు

Indian, Kolkatan etc.

కొన్నిసార్లు, '-i' (ఇ) రావచ్చు - Irani, Iraqi, Hyderabadi etc.

ప్రదేశం పేరు, చివర consonant (హల్లు) వస్తే, '-er'/ '-r' రావచ్చు

Landoner/ Newyorker

ఇవన్నీ కూడా ఉచ్చారణా సౌలభ్యాన్ని (convenience of pronunciation) ను బట్టి ఉంటుంది. అంత strict గా పాటించాల్సిన rule అంటూ లేదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

# ప్రతిభ

# What he says makes sense

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 533

M.SURESAN

**Vasisht:** Hi Vasanth, what's wrong? You don't seem to be well at all.
(ఏంటి విషయం? నువ్వేం కులాసాగా ఉన్నట్టు కనిపించడం లేదు.)

**Vasanth:** You can say that. It's my heel. It's been playing me up for a week now.
(అవును. నువ్వలా అనడంలో తప్పేంలేదు. సమస్య నా మడమ. వారం రోజులుగా నన్ను బాధిస్తోంది.)

**Vasisht:** I see you walk with a limp. Haven't you seen a doctor yet?
(నువ్వు కుంటుతూ నడవడం గమనించా న్నేను. ఇంకా doctor ను చూడలేదా?)

(limp - కుంటడం)

**Vasanth:** Yea, that's been at the top of my agenda ever since I had the problem. But then mom with her home remedies and uncle with his physical exercises have been in the way. They seem to suggest that I see a doctor only as a last resort.
(ఈ సమస్య వచ్చినప్పటి నుంచి దానికే నేను ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాను. కానీ అమ్మ తన గృహ వైద్యం, మామయ్య తన exercise సూచనతో నాకు అడ్డుపడ్డారు. అన్నీ విఫలమైతేనే నేను డాక్టర్ దగ్గరకెళ్లాలనే ఆలోచన ఉన్నట్టుంది వాళ్లకు.)

Home remedies = గృహ వైద్యం

**Vasisht:** The sooner you see a specialist the better for you. If you delay any more the chances are that you may end up in a hospital.
(నువ్వెంత త్వరగా డాక్టర్‌ను సంప్రదిస్తే అంత మంచిది. ఇంకేమాత్రం ఆలస్యం చేసినా నువ్వు ఆస్పత్రిలో చేరే అవకాశాలు కనిపిస్తున్నాయి.)

**Vasanth:** I think that makes sense.
(అది తెలివైన పని అనుకుంటా.)

**Vasisht:** You'd better hurry up. You've delayed already. These things tend to get chronic. Even now I do not know how you are able to put up with this pain.
(నువ్వు తొందరపడు అయితే. ఇప్పటికే చాలా ఆలస్యం చేశావు. ఇలాంటివన్నీ అలాగే ఉండిపోతాయి. ఆ నొప్పి ఎలా భరించ గలుతున్నావో నాకు తెలియడం లేదు.)

**Vasanth:** I knew it did call for quick action but mom wouldn't let me.
(నాకు తెలుసు, ఇలాంటి సత్వర చర్యలు అవసరమని. కానీ అమ్మ ఒప్పుకోవడం లేదని ఆగిపోయా.)

**Vasisht:** Only specialists can deal with such complaints. Quackery leads you no where and is even dangerous.
(నిపుణులు మాత్రమే అలాంటి విషయాలను చూసుకోగలరు. మిడిమిడి జ్ఞానం వల్ల ఏమీ అవకపోగా, ప్రమాదం కూడా.)

Quackery = వైద్యం తెలియకుండా వైద్యం చేయడం.

Quack = వైద్యవిద్యార్హతలు, వైద్య పరిజ్ఞానం లేకుండా వైద్యం చేసేవాళ్లు.

**Vasanth:** I'll certainly talk mother into letting me see a specialist this evening. I can't bear this pain any more. It's hurting quite a lot.
(నిపుణుడైన doctor దగ్గరకు నేను వెళ్తానని మా అమ్మను ఒప్పిస్తా. ఈ బాధ నేనింక భరించలేను. చాలా నొప్పిగా ఉంది.)

**Vasisht:** Just put it across to her and take her with you to the doctor. You irritate her if you rubbish her or her treatment.
(నిదానంగా ఆమెకే విషయం అర్థం అయ్యేట్లు చెప్పు. అలాకాకుండా ఆమెను, ఆమె వైద్యాన్ని విమర్శిస్తే ఆమెకు కోపం తెప్పిస్తావు.)

**Vasanth:** Don't I know how to get my mother round?
(మా అమ్మను ఎలా ఒప్పించాలో నాకు తెలియదా?)

కొంతకాలం క్రితం వరకూ మనం చాలా phrasal verbs, idioms చూశాం. Phrasal Verbs అంటే మనకు తెలుసు. Verb తర్వాత preposition/ adverb లాంటి combination phrasal verb. ఇంకో విషయం ఏమిటంటే phrasal verb మొత్తం అర్థానికీ, అందులో ఉండే ఒక్కొక్క మాట అర్థానికీ ఏం సంబంధం ఉండదు.

e.g.: to put out - ఈ phrasal verb అర్థం, మంటలు/ దీపాలు ఆర్పేయడం. చూశారు కదా? ఆర్పేయ డానికీ, put/ out అర్థానికీ ఏం సంబంధం లేదు. ఇలాంటిది phrasal verb.

Idioms అన్నా దాదాపు అదే. అయితే idiom ఎప్పుడూ verb కానక్కరలేదు. ఉదాహరణకు up and coming అనే idiom తీసుకుందాం. దీనర్థం, పైకి వస్తున్న అని. An up and coming actor = బాగా పైకొస్తున్న నటుడు అని. 'పైకొస్తున్న' అనే భావానికి upకు, comingకుగానీ సంబంధం లేదు. ఇది idiom.

ఇప్పుడు పై సంభాషణలో వచ్చిన phrasal verbs/ idioms చూద్దాం. ఇవి Spoken Englishలో తరచూ వినిపించేవి, చాలా simple గా ఉండేవి. బాగా practice చేసి మీ సంభాషణలో వాడండి.

1) *It's been playing me up.*
2) *That's been at the top of my agenda.*
3) *As a last resort.*
4) *The chances are that you may end up in a hospital.*
5) *That makes sense.*
6) *I knew it did call for quick action.*
7) *I'll certainly talk mother into letting me see a doctor.*
8) *You irritate her if you rubbish her or her treatment.*
9) *Don't I know how to get my mother round?*

**1) Playing me up - Play somebody up** - ఒకరికి బాధ కలిగించడం/ సమస్యలు తెచ్చిపెట్టడం

a) Pakistan by sheltering terrorists is playing India up = ఉగ్రవాదులకు ఆశ్రయమిచ్చి పాకిస్థాన్ భారత్‌కు సమస్యలు తెచ్చిపెడుతోంది.

b) You've played me up enough. Don't ask for trouble from me. నువ్వు నాక్కలిగించిన బాధలు/ సమస్యలు/ ఇబ్బందులూ చాలు. నా వల్ల ఇబ్బందులు రాకుండా చూసుకో. (ఇక నన్ను ఇబ్బంది పెట్టడం ఆపు. ఇంకేమాత్రం నేను ఊరుకోను.)

ఇక్కడ 'Ask for' అనే phrasal verb చూడండి. Ask for, ముఖ్యంగా troubleతో వాడతాం. Ask for trouble అని అర్థం- ఇబ్బందులు కొనితెచ్చుకోవడం.

If you delay anymore, you are asking for trouble = ఇంకేమాత్రం ఆలస్యం చేసినా నువ్వు ఇబ్బందులు కొనితెచ్చుకోవడమే.

**2) At the top of somebody's agenda** = High on someone's agenda
ప్రణాళికల్లో/ పథకాల్లో/ ఒకరు చేయాలనుకొనే పనుల్లో అత్యంత ప్రాధాన్యం ఇచ్చే అంశం.

Agenda = సభలూ, సమావేశాల్లో చర్చించే అంశాల జాబితా.

a) To stay in power by whatever means is at the top of YSR's agenda/ high on YSR's agenda =
ఏ విధంగానైనా అధికారంలో కొనసాగడమే వైఎస్సార్ పథకంలో ప్రాధాన్యాంశం.

b) To prove it has nothing to do with the Satyam affair is high on/ at the top of the agenda of the government =
సత్యం కుంభకోణం విషయంలో తమకేం సంబంధం లేదని రుజువు చేయడమే ప్రభుత్వ ప్రధాన లక్ష్యం.

**3) The last resort** = చిట్టచివరి చర్య. మిగతా చర్యలన్నీ విఫలమైన తర్వాత చివరిగా తీసుకునే చర్య.

a) We treat strike only as a last resort = సమ్మె అనేది మేము చేపట్టే చివరి చర్య మాత్రమే. (మిగతా చర్యలన్నీ విఫలమైన తర్వాతే మా చివరి అస్త్రంగా సమ్మెకు దిగుతాం).

b) 'Don't worry' said the doctor. 'We will go for amputation only as a last resort' = 'బాధ పడకండి. మిగతా వైద్యాలన్నీ విఫలమైతేనే, చివరి పద్ధతిగా మేం amputationకు సిద్ధపడతాం' అన్నాడు డాక్టర్.

Amputation = శస్త్రచికిత్సతో septic అయిన అవయవాన్ని (కాలు/ చేయిలాంటి వాటిని) తీసేయడం.

**4) The chances are...** ఇది మీ conversation కు మంచి ఊతం. అర్థం = ఏదైనా జరిగే అవకాశాలుండటం.

If you continue to postpone things the chances are that you'll never do them
= ఇలా వాయిదా వేస్తూ పోతుంటే నువ్వా పని ఎప్పుడూ చేయలేని పరిస్థితి రావచ్చు

If land grabs and sale of govt. lands continue the chances are that there will be no land left for public purposes. = భూకబ్జాలూ, ప్రభుత్వ భూముల అమ్మకం జరుగుతూ ఉంటే ప్రజోపయోగాలకు భూమిలేకుండా పోయే అవకాశాలున్నాయి.

**end up** = మనం ఊహించని/ ఎదురుచూడని పరిస్థితిలో పడటం.

Whoever thought that Raju would end up in jail? = రాజు jail లో పడతాడని ఎవరన్నా అనుకున్నారా?

a) They had a chance meeting on train and ended up as wife and husband = Train లో అనుకోకుండా పరిచయమైన వాళ్లిద్దరూ చివరికి భార్యాభర్తలుగా మారారు (వాళ్లలా అవుతారని మొదట వాళ్లనుకోలేదు).

b) I thought she would do all the work, but I ended up doing it = అన్ని పనులూ ఆమే చేస్తుందనుకుంటే, వాటన్నిటినీ నేనే చేసే పరిస్థితి వచ్చింది.

**5) Make sense** = సబబుగా కన్పించడం/ సబబుగా ఉండటం/ అర్థవంతంగా కనిపించడం.

a) Government allotting all contracts to Maytas doesn't make sense at all = Maytas సంస్థకే ప్రభుత్వం అన్ని contracts ఇవ్వడం ఏం సబబుగా అన్పించటం లేదు/ సబబుగా లేదు.

b) What he says makes sense = అతడు చెప్పేది సబబుగానే ఉంది.

c) It always makes sense to invest in real estate
= స్థలాల్లో పెట్టుబడి పెట్టడం ఎప్పుడూ సబబయిన/ తెలివైన పనే.

**Make sense of something**
= దేన్నైనా అర్థం చేసుకోవడం.

a) I am not able to make sense of this letter
= ఈ ఉత్తరం నాకేం అర్థం కావడం లేదు.

b) Can you make sense of what he is saying?
= అతడు చెప్పేది నీకేమన్నా అర్థం అవుతోందా?

**6) Call for** = ఏదైనా చర్యకు అవసరం ఉండటం/ సూచించడం

a) The Satyam scam calls for better government supervision of corporate bodies
= సత్యం కుంభకోణం కార్పొరేట్ సంస్థలమీద మెరుగైన ప్రభుత్వ అజమాయిషీ అవసరాన్ని సూచిస్తోంది.

b) His condition calls for immediate medical attention
= అతడి పరిస్థితి తక్షణ వైద్యం అవసరమని సూచిస్తోంది/ అతడి పరిస్థితికి తక్షణ వైద్య అవసరం ఉంది.

**7) Talk somebody into something**
= ఒకరికి ఒక విషయాన్ని నచ్చజెప్పడం/ ఒప్పించడం.

a) I didn't like the bike but the sales-man there talked me into buying it
= ఆ bike నాకిష్టం లేదు కానీ, ఆ సేల్స్‌మేన్ దాన్ని కొనేందుకు ఒప్పించాడు/ నచ్చజెప్పాడు.

b) You can never talk me into voting for him
= నువ్వెప్పటికీ నన్నతడికి ఓటు వేసేందుకు ఒప్పించలేవు/ నచ్చజెప్పలేవు.

c) He talked the minister into giving him the contract
= తనకు ఆ కాంట్రాక్టు ఇచ్చేలా మంత్రికి అతడు నచ్చజెప్పాడు.

**8) Rubbish somebody/ something**
= ఒకరిని/ ఒక విషయాన్ని దుమ్మెత్తిపోయడం (తీవ్రంగా విమర్శించడం).

a) YSR and Chandrababu are rubbishing each other about their contacts with Satyam computers
= వైఎస్ఆర్, చంద్రబాబు సత్యం కంప్యూటర్స్‌తో ఒకరికున్న సంబంధాల విషయమై దుమ్మెత్తి పోసుకుంటున్నారు.

b) He rubbished all my attempts to help him as half hearted
= అతడికి సాయం చేసే ప్రయత్నాలన్నింటినీ అరకొర/ మనస్ఫూర్తిగా లేవని కొట్టిపారేశాడు.

**9) To get some one round** = ఒకరిని మన ఆలోచనా విధానానికి మార్చడం/ మనం చెప్పింది సరైందని అనిపించడం/ నచ్చజెప్పడం

a) He did not agree in the beginning to give up smoking but the doctor got him round
= మొదట సిగరెట్ మానేందుకు ఒప్పుకోలేదు, కానీ డాక్టర్ అతడికి నచ్చజెప్పాడు.

b) Try as I might, I am not able to get him round to my point
= ఎంత ప్రయత్నించినా అతడికి నేను నచ్చజెప్పలేకపోయాను.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# I'm far from pleased

**Pradeep:** Last night I went to your place but I couldn't find you there.
(నిన్న రాత్రి మీ ఇంటికి వెళ్లాను. నువ్వక్కడ కనిపించలేదు.)

**Sandeep:** You mean, to my old room? Don't you know I've moved out?
(అంటే నువ్వు నా పాత రూమ్‌కు వెళ్లావా?)
(నీకు తెలియదా నేను రూమ్ మారినట్టు.)

**Pradeep:** Is that why you are here now?
(అందుకనా నువ్విక్కడున్నావు?)

**Sandeep:** Yea. A few days ago I moved into this more spacious room. It's just a few hundred yards off from my office. Don't you see?
(అవును. రెండు మూడ్రోజుల కిందటే బాగా పెద్దదైన ఈ రూమ్‌కు మారాను. నా ఆఫీస్‌కు ఇది కొద్ది వందల గజాల దూరంలోనే ఉంది. అర్థం కావట్లేదా?)

**Pradeep:** This is a nice place. Well ventilated and airy. But why didn't I know?
(ఈ రూమ్ బాగానే ఉంది. వెలుతురు, గాలీ బాగా వస్తున్నాయి. అయితే నాకెందుకు తెలియలేదు?)

Ventilated = వెలుతురు బాగా వచ్చే

**Sandeep:** I just wanted to take you by surprise. That's all.
(నీకు ఆశ్చర్యం కలిగించేందుకు అలా చేశాను. అంతకంటే ఏం లేదు.)

**Pradeep:** I'm far from pleased.
(నాకు అంతేం నచ్చలేదది/ నాకు కోపంగా ఉంది.)

**Sandeep:** Sorry. That was the last thing on my mind. Don't take it amiss.
(సారీ. నీకు కోపం తెప్పించడం అస్సలు నా అభిమతం కాదు. నన్ను అపార్థం చేసుకోకు.)

**Pradeep:** But doesn't this room cost you more than that? If the room is bigger the rent must be higher as well.
(ఈ గది వల్ల నీకు ఖర్చు ఎక్కువ కదా? గది పెద్దదయితే, అద్దె కూడా ఎక్కువే కదా?)

**Sandeep:** The difference isn't much.
(అంత తేడా ఏంలేదు.)

**Pradeep:** But the colours don't fit in with the room. Further the south of the room opens on to the dirty back yard of the house at the back of the room.
(కానీ ఈ రంగులు గదికి అంత అమరికగా లేవు. అంతేకాకుండా గది దక్షిణం, వెనుక ఉండే ఇంటి చెత్త పెరడును చూస్తోంది.)

**Sandeep:** But they are going to clean it up in the next few days. That won't be a problem.
(రెండు మూడ్రోజుల్లో దాన్ని శుభ్రం చేయబోతున్నారు. అదంత పెద్ద సమస్య కాదు.)

**Pradeep:** I want to go to the railway station and book a ticket home next week. Coming with me?
(నేను రైల్వే స్టేషన్‌కు వెళ్లి ఇంటికి టికెట్ రిజర్వు చేసుకోవాలనుకుంటున్నాను. వస్తావా?)

**Sandeep:** I'm afraid no. I want to laze about for the rest of the day. (సారీ. లేదు. ఈ రోజంతా ఏ పనీ లేకుండా విశ్రాంతిగా గడపాలనుకుంటున్నా.)

**Pradeep:** I know it goes against your grain to move about even a little, you lazy bones.
(కదలడం, కాస్తయినా తిరగడం అనేది నీ స్వభావానికే విరుద్ధం అని నాకు తెలుసు, బద్ధకస్తుడా.)

**Sandeep:** I knew you'd say that, but you don't understand the pleasure you get when you are lazy! How sweet laziness is!
(నాకు తెలుసు నువ్వలా అంటావని, కానీ చేసేందుకు ఏమీ పనిలేకుండా ఉండటం ఎంత మధురమో నీకు తెలియదు.)

**Pradeep:** OK then. I'm off. See you.
(సర్లే. నేను వెళుతున్నా.)

ఈసారి మరికొన్ని phrasal verbs చూద్దాం.

***Look at the following sentences from the conversation above:***

1) Don't you know I have moved out?
2) I moved into this more spacious room.
3) I just wanted to take you by surprize.
4) I'm far from pleased.
5) That was the last thing on my mind.
6) Don't take it amiss.
7) But the colours don't fit in with the room.
8) I want to laze about for the rest of the day.
9) Lazy bones.
10) Go against (somebody's) grain.





M.SURESAN

**1 & 2) Move** (Past tense and Past Participle - Moved)- దీన్ని మనం ఎక్కువగా కదలడం అనే అర్థంలోనే వాడతాం. అయితే, ఇక్కడి అర్థం, ఇల్లు మారడం - ఒక ఇల్లు వదిలిపెట్టి ఇంకో ఇంట్లో చేరడం.

**IMP:** దీన్ని చాలామంది shift అంటుంటారు. Shift కు ఇల్లు మారడం అనే అర్థం English లో లేదు. 'Move' అనే అంటారు.

a) We are moving house next Monday = మేం వచ్చే సోమవారం ఇల్లు మారుతున్నాం.

b) This place is no good for me. I am thinking of moving = ఈ ఇల్లు నాకేం బాగాలేదు. ఇల్లు మారాలనుకుంటున్నా.

Move in = ఒక ఇంట్లో కొత్తగా చేరడం.

c) A: 'Why are you here?' (నువ్వెందుకున్నావిక్కడ? / నువ్వేంటి ఇక్కడున్నావు?)
B: 'Don't you see I have moved in?'
(నేను ఇల్లుమారి, ఈ ఇంట్లో చేరానని కనిపించడం లేదా?)

d) A: Isn't Mr.Naresh here any more?
(Naresh ఇప్పుడు ఇక్కడ ఉండటం లేదా?)
B: No. He moved out a week ago.
(లేరు. వారం కింద ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోయారు.)

e) My friends are no longer in Vijayawada. They have moved to Hyderabad.
(నా ఫ్రెండ్స్ ఇప్పుడు విజయవాడలో లేరు. వాళ్లు హైదరాబాద్‌కు మారారు.)

**3) to take (somebody) by surprise** = ఒకరికి ఆశ్చర్యం కలిగించడం.

a) Hei, When did you come? you took me by surprise really = హాయ్, నువ్వు ఎప్పుడొచ్చావు? నాకు ఆశ్చర్యం కలిగించావు.

b) He took me by surprise by suddenly changing his job = చెప్పాపెట్టకుండా ఉద్యోగం మారి నాకు ఆశ్చర్యం కలిగించాడు. / అతడు ఉన్నట్టుండి ఉద్యోగం మారడం నాకు ఆశ్చర్యం కలిగించింది.

c) His marrying her took me by surprize = అతడా అమ్మాయిని పెళ్లాడటం నాకు ఆశ్చర్యం కలిగించింది.

**4) far from** = almost no = దాదాపు లేదు. ఇది Spoken English లో తరచూ వాడే expression. మీరూ practise చేయండి. అనుకున్న దానికి వ్యతిరేకంగా/ దాదాపు లేదు అనే అర్థంతో.

a) She is far from happy in her new job = తన కొత్త ఉద్యోగంలో ఆమె ఏమీ సంతోషంగా లేదు.

b) A: Is he still supporting TDP?
(అతడు ఇంకా టి.డి.పి.ని బలపరుస్తున్నాడా?)
B: Far from it. He wants to join the PRP.
(అదేం లేదు. పి.ఆర్.పి.లో చేరాలనుకుంటున్నాడు?)

c) He, singing?! far from it.
(అతడు పాడటమా?! అలాంటిదేం లేదు.)
(far అంటే మామూలర్థం దూరం.)

My college is not far from the Bus stand = (మా college bus stand నుంచి దూరం కాదు.)

**5) The last thing on somebody's mind** = మనం అనుకోని/ మన ఆలోచనల్లో లేని విషయం.

a) Insulting him is the last thing on my friend
= అతడిని అవమానించడం అనేది, నా ఆలోచనలోనే లేదు/ నా ఉద్దేశం ఏమాత్రం కాదు.

b) A marriage now is the last thing on her mind.
= ఇప్పుడు పెళ్లి చేసుకోవడం అనేది ఆమె మనసులోనే లేదు/ పెళ్లి విషయం ఆలోచించడం లేదు.

c) Going with you is the last thing on my mind.
= నీతో వెళ్లడం నా అభిమతం ఏమాత్రం కాదు.

**6) Take something amiss** = ఓ విషయాన్ని తప్పుగా అర్థం చేసుకోవడం.

a) When I told him not to buy a car now, he took it amiss = అతడిని ఇప్పుడు కారు కొనొద్దంటే అది అపార్థం చేసుకున్నాడు.

b) Don't take my words amiss. I was just joking = నా మాటలను తప్పుగా అర్థం చేసుకోవద్దు. ఏదో జోక్‌గా అన్నా, అంతే.

c) She took it all amiss. My intention was never to hurt her = అంతా తప్పుగా అర్థం చేసుకుందామె. నాకెప్పుడూ ఆమెను నొప్పించాలనే ఉద్దేశం లేదు.

**7) Fit in with** = Suit అవడం/ అనుకూలంగా ఉండటం/ అనుగుణంగా ఉండటం.

a) Their plans to move into a new building fits in with their plans to expand their business = కొత్త భవనంలోకి మారాలనే వాళ్ల ఆలోచన, వ్యాపారాభివృద్ధి చేసుకోవాలనే వాళ్ల పథకానికి అనుగుణంగానే ఉంది.

b) Politicians' actions do not fit in with their words = రాజకీయనాయకుల చేతలు వాళ్ల మాటలకు అనుగుణంగా ఉండవు.

c) The story of the police does not fit in with what the relatives of the murdered man say = పోలీస్ కథనానికి, హతుడి బంధువులు చెప్పే దానికి ఏ పొంతనా లేదు.

**8) Laze about** = చాలా విశ్రాంతిగా మనకున్న తీరిక సమయాన్ని ఏ పనీ లేకుండా గడిపేయడం.

a) While the ant toiled all through the summer the grasshopper was lazing about = వేసవిలో చీమ శ్రమపడుతుంటే మిడత (grasshopper) మాత్రం సరదాగా సోమరిగా గడిపేసింది.

b) Why don't you study instead of lazing about the whole day? = రోజంతా సోమరితనంతో గడిపేబదులు ఏదైనా చదవకూడదు?

**9)** lazy bones = సోమరిపోతు.

a) You lazy bones, be up and about = ఏయ్ సోమరీ, లేచి అటూ ఇటూ తిరగొచ్చు కదా?

b) You lazy bones, get out of bed = ఏయ్ సోమరీ, నిద్రలే. (అయితే ఈ మాట మనకు బాగా సన్నిహితులైన వాళ్లతో ఎక్కువగా వాడతాం).

**10) Go against somebody's grain** = ఒకరి స్వభావానికి విరుద్ధమైన/ విరుద్ధంగా ఉండగా.

a) Serving the people goes against the grain of the politicians = ప్రజాసేవ రాజకీయ నాయకుల స్వభావానికి విరుద్ధం.

b) It goes against his grain to speak truth = నిజం చెప్పడం అతడి స్వభావానికే విరుద్ధం.



**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# She is like her mother





M.SURESAN

**A. Bungana, Munagalapadu (Kurnool)**

**Q.** Please let me know the three tenses of the verb 'LEAD' and the pronunciation and also of READ, BEAT.

**A.** Lead (లీడ్) - Present tense; led (Past tense and past participle).

**Q.** Let me know the synthesis of the two sentences.

She read some books. She will read them again.

**A.** She will read the same books she read.

**Q.** Please let me know if the following sentences are correct or not.

a. I remember having met him before.

b. I remember that I have met him before.

c. I remember to have met him before.

d. I remember meeting him before.

**A.** All are correct.

**Q.** No sooner did the teacher enter the class than all the students stood up. Please rewrite this by using 'Hardly.'

**A.** Hardly had the teacher entered the class <u>when</u> the students stoodup.

**Q.** We generally give the comparative degree in positive sense. e.g. : Savithri is taller than Sita. But I found it expressed in a negative sense. Aryan is not taller than some other boys in the class.

Can we say 'This box is less heavy than that.' Is it correct?

**A.** Aryan is not taller than some other boys = some other boys are at least as tall as Aryan.

This box is less heavy .... correct.

**A. Sridhar, Onipenta**

**Q.** కింది ఇంగ్లిష్ పదాలకు తెలుగు అర్థాలు చెప్పగలరు.

★venture

**A.** భారీ పెట్టుబడులతో ప్రారంభించే/ చేసే వ్యాపారం. (సాహసంతో కూడిన పని- ఆ సాహసం పెద్ద మొత్తంలో పెట్టుబడి పెట్టడం కావచ్చు).

★picket

**A.** 1) సమ్మె సమయంలో ఎవరినీ కార్యాలయం/ factory లోకి వెళ్లనివ్వకుండా అడ్డుతగిలే వ్యక్తి/ వ్యక్తులు (కార్మికులు/ సిబ్బంది). 2) సైనిక స్థావరాలను పరిరక్షించే సైనికుడు/ సైనికుల సమూహం/ శాంతి భద్రతలను కాపాడేందుకు ఒక ప్రదేశంలో ఉండే పోలీసులు. 3) కంచె వేసేందుకు వాడే గుంజలు (మొనదేలినట్లు చెక్కినవి).

★crystal clear,

**A.** చాలా స్పష్టం (స్ఫటికం- crystal లా)

★ cross check

**A.** మనకందిన/ మన దగ్గరున్న సమాచారాన్ని/ అంకెలను, ఇంకో విధంగా రెండోసారి సరిచూసుకోవడం. మనం మామూలుగా కూడిన అంకెల మొత్తాన్ని Calculator తో సరిచూసుకుంటాం- ఇది cross check. మనకు ఒకరు చెప్పిన విషయాన్ని మరొకరి ద్వారా రూఢి చేసుకోవడం.

★ countdown

**A.** పై సంఖ్య నుంచి ఒకటి వరకు కిందికి లెక్కించడం. Rockets లాంటి వాటిని ప్రయోగించేప్పుడు/ Time bombలాంటివి పేల్చేందుకు, సెకనుతో సహా సరైన timeకు జరిగేందుకు ఈcount down వాడుతూ ఉంటారు. పై అంకె నుంచి 1 (ఒకటి) వరకు లెక్కించగానే, rocket పైకెగసేలా లేదా time bomb దానంతట అదే పేలేలా ఏర్పాటు ఉంటుంది.

The count down for our exams has begun = మన పరీక్షల సమయం దగ్గరకొచ్చింది.

★ consortium,

**A.** ఒకే ఆశయంతో/ ప్రణాళికతో పనిచేసే వ్యక్తుల, సంస్థల దేశాల కూటమి.

Aid India consortium (భారత్‌కు సహాయం చేయాలనే ఉద్దేశంతో ఏర్పడిన దేశాల కూటమి. Pronunciation - కన్‌సోషియం.

★ late night

**A.** Late night రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత. Late night show = II show. A late night meeting = రాత్రి చాలా పొద్దుపోయాక జరిగే సమావేశం.

★ senser (సెన్సర్)

**A.** Senser అనే మాటలేదు. sensor = వెలుతురు, శబ్దం, అలికిడికి స్పందించి యంత్రాలను, పరికరాలను పనిచేయించే సాధనం. భద్రతకోసం బ్యాంకులు, సైనిక కార్యాలయాల్లాంటి వాటిల్లో వీటిని అమరుస్తారు, దొంగలు/ శత్రువుల ఉనికిని తెలిపేందుకు.

★ bunker

**A.** యుద్ధాల్లో సైనికులకు రక్షణ ఇవ్వటానికి ఫిరంగులు, తుపాకులు అమర్చుకోడానికి వీలున్న బలమైన దిమ్మె, మామూలుగా సిమెంట్ concrete తో నిర్మిస్తారు.

★ tempo

**A.** ఊపు/ వేగం- మనం చేసే పనుల్లో, సంగీతంలో ఊపు

★ network

**A.** 1) రోడ్ల, మార్గాల అల్లిక 2) కంప్యూటర్ల విషయంలో: అనుసంధానమై ఉన్న, ఒకదానితో ఒకటి సంబంధం ఉన్న కంప్యూటర్ల అల్లిక. 3) అంతస్సంబంధాలున్న వ్యక్తుల, సంస్థల సమూహం. (A Smugglers'/ thieves' network)

★ frustration

**A.** నిరాశ/నిస్పృహ

★ curtain raiser

**A.** ప్రారంభాన్ని సూచించే ఘట్టం, కార్యక్రమం

★ clear cut

**A.** స్పష్టమైన, నిర్దిష్టమైన

★ access

**A.** ప్రవేశం (ఒక చోటికి) /ఒకవ్యక్తిని సమీపించి మాట్లాడే అవకాశం

★ సీజ్ (spelling)

**A.** cease - ఆగటం/ ఆపడం; seize = లాక్కోవడం, స్వాధీనం చేసుకోవడం seige = (సైనిక స్థావరాలను) ముట్టడించడం

★ like-alike మధ్య తేడా ఏమిటి?

**A.** She is like her mother - ఆమె తన తల్లి లాగే ఉంటుంది. she and her mother are alike = ఆమె, ఆమె తల్లి ఒకేలా ఉంటారు.

★ places of tourist interest

**A.** పర్యటకులకు ఆసక్తి కలిగించే/వాళ్లను ఆకర్షించే స్థలాలు.

★ college bunk

**A.** College bunk అంటూ ప్రత్యేకమైన expression ఏదీలేదు. bunk అంటే 1) చిన్న దుకాణం అనే అర్థంతో మనదేశంలో వాడతాం; 2) పని/బడి ఎగ్గొట్టడం అనే అర్థం కూడా ఉంది.

★ free అనేదానికి O.C.అంటారు. O.C. అంటే ఏమిటి?

**A.** British East India Company మన దేశాన్ని పాలిస్తున్న రోజుల్లో, OC (OCS) = On Company Service - ఆ company సేవలో చేసే పనులన్నీ Company యే భరించాల్సివస్తే అది free. ఇది standard English abbreviation కాదు.

★ Intelligence special drive

**A.** భద్రతా సమాచారం సేకరించేందుకు ప్రత్యేక కార్యక్రమం

★ Hub

**A.** కేంద్రం/Central point

★ T.M.C లో C అంటే క్యూసెక్కులు T.M. అంటే ఏమిటి?

**A.** నీటి ఘన పరిమాణాన్ని తెలిపే కొలతలు - cusec - ఒక సెకనులో ప్రవహించే నీటి ఘన పరిమాణం TMC - Thousand million cusecs.

★ B.M.W. అంటే ఏమిటి?

**A.** Bavarian Motor Works అనే German automobile company ఉత్పత్తి చేసే car engine.

★ capture

**A.** స్వాధీనం/ కైవసం చేసుకోవడం

★ cocksure

**A.** మన సామర్థ్యంలో మనకుండే అతి నమ్మకం - ఇదిప్పుడంత వాడకంలో లేదు.

★ resort

**A.** విశ్రాంతి /క్రీడల నెలవులు -Ootyలా 2) ఒక చర్య చేపట్టడం/ పూనుకోవడం/ పాల్పడటం He resorted to cheating others - అతడు మోసానికి పాల్పడ్డాడు.

★ back water

**A.** నది సముద్రాన్ని కలిసేచోట, సముద్రపు తాకిడికి వెనక్కు మళ్లే నది నీళ్లు

★ data

**A.** సమాచారం

★ night out

**A.** రాత్రంతా మేలుకోవడం

★ zinc foods అంటే ఏమిటి?

**A.** Zinc foods కాదు, Junk food - కొవ్వును పెంచే అనారోగ్యకరమైన తిండి.

★ intellectual

**A.** మేధావి/ మేధస్సుకు సంబంధించిన

★ warmonger,

**A.** యుద్ధాన్ని కోరుకునేవాళ్లు

★ walk away with

**A.** ఏదైనా అవలీలగా తీసుకువెళ్లడం, Prize ల లాంటివి.

★ walk away from

**A.** ఒక చోటి నుంచి వెళ్లిపోవడం

★ walk over

**A.** సులభమైన గెలుపు

**E. Kondala Rao, Golagamudi (Nellore Dt.)**

**Q.** What are the meanings of underline words in the following sentences.

considering students today think <u>out-of-the-box</u> and aren't considering run of the mill courses at all.

With the limited <u>jing bang</u> that was invited for Aish and Abhi's wedding.

What are the meanings and English equivalent words for the following.

**A.** ఈ మాటలు ... 'out of the box, jing-bang' English లో లేవు.

**Q.** Blinge

**A.** Blinge అనే మాట కూడా Englishలో లేదు. బహుశా binge ఏమో. Binge కి అర్థం జల్సా చేసుకోవడం.. ముఖ్యంగా తింటూ, తాగుతూ.

**Q.** కింది పదాలకు ఇంగ్లిష్‌లో అర్థాలు తెలుపగలరు.

★ కారణజన్ముడు = (born with purpose అనేది సరైందేనా? )

**A.** Born for a purpose

★ పట్టువిడుపు

**A.** Flexibility

★ పచ్చెనగలు, ముడి శెనగలు

**A.** Bengal Gram

**Srinivasa Naik, Visakhapatnam**

**Q** 'Be' forms అంటే ఏమిటి? shall have been, would have been.. ఇలా వాటిని వాడుతూ ఉంటారు. వీటి గురించి వివరిస్తారా?

Was/ were లాంటి be forms ను ఎలా వాడాలి? verb లను ఎలా ఉపయోగించాలి?

నాకు ఈ Tenseలలో సందేహాలున్నాయి. Past continuous tense, past perfect tense, future continuous tense, future perfect tense వీటి గురించి తెలుగులో ఉదాహరణలతో వివరించగలరు.

**A.** 'Be' forms అంటే 'ఉండటం' అనే అర్థాన్ని-వివిధ రకాలుగా ఉండే స్థితులు - ఇప్పుడు, ఎప్పుడూ ఉండటం, గతంలో ఉండటం, భవిష్యత్‌లో ఉండటం, ఉండగలగడం, ఉండవచ్చు- ఇలా 'ఉండటం' అని అర్థం ఇచ్చే verbs, 'be' forms. ఈ కిందివన్నీ 'be' forms. అంటే వీటన్నిటినీ దేనితోనూ కలపకుండా వాడితే, 'ఉండటం' వివిధ రకాలుగా, వివిధ కాలాల్లో అనే అర్థం వస్తుంది.

Am, is, are
was, were

shall
should
will
would
can
could
may
might
must
have to
has to
had to
ought
need
dare
} **be**

might
ought
} **have been**

have
has
had
shall have
should have
will have
would have
can have
could have
must have
may have
} **been**

ఈ 'be' forms మూడు sets:

1) am, is, are, was, were

2) shall be, should be... ఇలా చివర 'be' వచ్చేవి.

3) have been, has been, had been, shall have been, should have been .... ఇలా చివర been ఉండేవి.

ఈ 'be' forms తో 'ing' form కానీ, Past participle (మీరనే V3) కలిపితే am going, was seen లా- మీకు పనులను తెలిపే verbs (Action Words) వస్తాయి (ఉండటం కాకుండా). వీటిని గురించి మీకు ఇంకా బాగా అర్థం కావాలంటే, spoken English lesson Nos. 2,3,4,12 and 20 చూడండి.

# ప్రతిభ

# How beautiful the rose is!





M.SURESAN



**A.Yesuratnam, Venkatayapalem (W.G.Dt.)**

**Q.** What is the meaning of 'Why not'?

**A.** 'Why not'? is a very common question in English. We use it usually to agree with some one.

**A:** Shall we go to a movie?

**B:** Why not?

It is used also as a short form of questions beginning with why.

Why not discuss the matter with him? = Why don't you/ we discuss the matter with him?

We use it some times to disagree with others too.

**A:** Why do you want to go now?

**B:** Why not?/ Why not, may I know?

**V. Kalyani, Jagitial (Karimnagar dt.)**

**Q.** Went off అంటే అర్థం ఏమిటి? off ను ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారు?

A. Went off = వెళ్లిపోయాడు. Went తర్వాత away/ off వస్తుంది. ఎవరైనా వెళ్లడం అయిపోయిందని కచ్చితంగా చెప్పేందుకు; సామాన్యంగా off/away లేకుండా went మాత్రమే వాడటం, ముఖ్యంగా వాక్యంలో లో ఒక భాగం చివర గానీ, వాక్యం చివర గానీ went వచ్చినప్పుడు.

**Q.** She tore up the letter without reading it. అనే ఈ వాక్యంలో up అనే పదం ఎందుకు ఉపయోగించారు? Up కూడా ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారు?

**A.** Tear up = Paper లాంటివాటిని ముక్కలు, ముక్కలుగా చించడం. Tear అంటే చించడం అని మాత్రమే.

**Q.** Apostrophe ని possessives తెలుపడానికి వాడతారు కదా? కానీ, మీరు గతంలో theirs, yours, hers, oursకి apostropheఎందుకు వాడలేదు? అసలు దీన్ని ఏయే సందర్భాల్లో వాడతారు? However అర్థం ఏమిటి?

**A.** Ours, yours, hers, and theirs, its- ఇవి possessive pronouns- వీటికి apostrophe and/s వాడనవసరంలేదు. ఎందుకంటే, apostrophe లేకుండానే, అవి possession తెలుపుతాయి. మిగతా nouns విషయంలో possession తెలిపేందుకు, apostrophe and s ఒకటే మార్గం.

Apostrophe and s వాడకపోతే confusion కు ఆస్కారం ఉంది.

Actor = నటుడు; Actor's = నటుడి/నటుడి యొక్క. ఇలా possession (ఒకరికి చెందిన విషయం తెలిపేందుకు) 's వాడతాం.

ఇంతేకాకుండా, ఏదైనా పదంలో ఒక అక్షరం/శబ్దం లోపిస్తే, దాన్ని తెలిపేందుకు కూడా apostrophe వాడతాం. Isn't = Is not; Don't = Do not (ఇలా చాలాచోట్ల notలో O లోపించడాన్ని తెలిపేందుకు apostrophe వాడతాం).

Ma'am = Madam - ఇక్కడ 'd' వదిలేస్తున్నాం. కాబట్టి, దాని బదులు apostrophe వాడాలి.

**Q.** నేను పీజీ చేశాను. సబ్జెక్టులో perfect అయినా Spoken Englishలో poor. నేను కళాశాలలో teach చేద్దామనుకుంటున్నాను. దీనికోసం స్పోకెన్ ఇంగ్లిష్ కోర్సు (రెండు నెలలు) చేశాను. అయితే, నేను చెప్పగలనో లేదో అని సందేహంగా ఉంది. కాబట్టి, ముందుగా ప్రైమరీ పాఠశాలలో ఇంగ్లిష్ బోధించాలనుకుంటున్నాను. నా ఆలోచన సరైందేనా? తగిన సలహా ఇవ్వగలరు.

**A.** సరైంది కాదు. కళాశాలలో teach చేసే విద్యార్హత మీకుంటే, ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో అక్కడే teaching ప్రారంభించండి. మీరు మనసు పెట్టి English improve చేసుకుంటే తప్పకుండా కొద్దికాలంలోనే English లో బాగా communicate చేయగలరు. ఇందుకోసం ప్రత్యేకంగా Elementary School లో English Subject చెప్పి సమయం వృథా చేసుకోవద్దు. దానికి బదులు, English Novels, English చందమామ లాంటివి బాగా చదవండి. English news telecasts రోజూ చూడండి. దీనివల్ల చాలా ప్రయోజనం ఉంటుంది.

**Md. Abdul Khuddus, Visakhapatnam**

**Q.** నేను ఒక గ్రామర్ పుస్తకంలో tensesకు సంబంధించిన కొన్ని వాక్యాలను అనువదిస్తున్నాను. నాకు కొన్ని వాక్యాలు అర్థం కావడం లేదు. దయచేసి వాటికి అర్థాలు వివరిస్తారా?

He writes a letter (present indefinite tense).

**A.** He writes a letter - writes - present simple tense - క్రమం తప్పకుండా జరిగే పనిని తెలుపుతుంది. అయితే, He writes a letter - ఈ sentenceకు అంత సరైన అర్థం రాదు. అదే He writes a letter once a week/ twice a month/ every day etc. లాంటి మాటలతో వాడితే, వారానికో సారి/నెలకు రెండుసార్లు/ ప్రతిరోజూ అని regularity (క్రమం తప్పని అనే అర్థం వచ్చేలా) తెలిపే మాటలు వాడితే, అప్పుడు sentenceకు అర్థం వస్తుంది. అతడు వారానికో సారి/ నెలకు రెండుసార్లు... ఉత్తరం రాస్తాడు అని.

**Q.** He wrote a letter yesterday (past indefinite tense).

**A.** He wrote a letter yesterday - నిన్న రాశాడు (పని గతంలో అయిపోయింది).

**Q.** He will do his home work (future indefinite tense).

**A.** He will do his home work - అతడు home work చేస్తాడు (ఇంకా చేయలేదు, చేయబోతాడు) - will do - future simple tense.

**Q.** He is writing a letter (present continuous tense).

**A.** He is writing a letter - ఇది ఇప్పుడు జరుగుతూ ఉన్న పని - అతడు ఉత్తరం రాస్తున్నాడు.

**Q.** He was reading a Novel (past continuous tense).

**A.** He was reading a Novel - గతం (past)లో ఒక సమయంలో కొనసాగుతున్న (Continuing at some time in the past) పనిని తెలుపుతుంది. (అప్పుడు అతడు Novel చదువుతున్నాడు)

**Q.** He will be doing his home work (future continuous tense).

**A.** He will be doing his home work - భవిష్యత్తులో ఒక సమయంలో కొనసాగుతుండే పని. (Home work చేస్తుంటాడు).

**Q.** He has completed his home work (present perfect tense).

**A.** He has completed his home work-

అతడు home work చేశాడు. (పని అయిపోయింది గతంలో. కానీ, ఎప్పుడు అనేది కచ్చితంగా తెలియడం లేదు).

పోల్చండి: He completed home work one hour ago = ఒక గంట క్రితం home work పూర్తి చేశాడు. (గతంలో కచ్చితంగా తెలిసిన సమయం- గంటక్రితం- జరిగిన పని).

**Q.** He had done his home work before he slept (past perfect tense).

**A.** He had done his home work before he went to bed - ఇక్కడ రెండు పనులను - రెండూ గతంలో జరిగినవే - గురించి చెబుతున్నాం. అయితే రెంటిలో ఒకటి ముందూ, ఒకటి తర్వాత జరిగాయి కదా - home work చేయడం ముందు, పడుకోవడం తర్వాత కదా. ముందు జరిగిన past action: had done - had+done (PP/V3)లో తెలుపుతున్నాం.

**Q.** I shall have read your book before I reach Hyderabad (future perfect tense).

**A.** ఇక్కడి verb shall have read- shall have + past participle of 'read' - ఇది భవిష్యత్తులో ఒక సమయంలోపల జరిగే పనిని తెలుపుతుంది. హైదరాబాద్‌కు చేరేముందే నేను నీ ఉత్తరాన్ని చదివేసి ఉంటాను.

**Q.** He has been doing his home work for two hours (present perfect continuous tense).

**A.** He has been doing his home work for two hours now - present perfect continuous tense ఎప్పుడూ గతంలో ప్రారంభమై ఇంకా జరుగుతున్న పనిని తెలుపుతుంది.

అతడు రెండు గంటలుగా home work చేస్తున్నాడు- రెండు గంటల క్రితం (pastలో) ప్రారంభించి ఇంకా చేస్తూనే ఉన్నాడు.)

**Q.** She had been living here from 1980 to 1990 (past perfect continuous tense).

**A.** She had been living here from 1980 to 1990 - ఇది అంత correct meaning వచ్చే sentence కాదు. దీన్ని కూడా past perfect లాగానే గతంలో జరిగిన రెండు పనులకు సంబంధించే వాడతాం.

He has been living here from 1980 - 1990 when he got a transfer = 1990లో అతడికి transfer అయ్యేటప్పటికి అతడిక్కడ 1980 నుంచి ఉంటున్నాడు. గతంలోని రెండు పనుల్లో ఒకటి ముందే ప్రారంభమై రెండో పని వరకు continue అయితే, ముందు పనికి past perfect continuous tense వాడతాం.

**Q.** By next March I shall have been completing 20 years of service (future perfect continuous tense).

ఈ వాక్యం ఎందుకు వాడుకలో లేదు?

**A.** By next March... ఈ sentenceకు సరైన అర్థం రాదు. ఇది future perfect continuous tense లో ఉంది. Futureలో ఒక సమయానికి ముందుగా ప్రారంభమై, ఆ సమయం వరకు కొనసాగే పనిని future perfect continuous tense లో చెబుతాం.

By this time next Sunday, I shall have been travelling to Hyderabad = వచ్చే ఆదివారం ఈ సమయానికి నేను హైదరాబాదుకు ప్రయాణం చేస్తూ ఉంటాను. (ఆదివారం ఈ సమయానికి ముందే ప్రయాణం ప్రారంభమై, ఈ సమయంతో కూడా కొనసాగుతుంది).

**P.J. Pranai Raj & S.K. Saifullah, Giddalur.**

**Q.** Please explain my doubts.

a) complete b) entire c) whole.

**A.** a) 'Complete' means, having every part something should have, every detail, and every fact that is necessary. e.g. : This book has complete information about the subject = the book has all information that is there about the subject.

'Complete' also means, as much as is possible.

e.g. : The work is complete (nothing undone) with this meaning, it is equal to 'whole'.

b & c) Entire = whole - The entire class/work/village = The whole class/work/village.

**Q.** a) Minimize b) Reduce c) Lower

**A.** a) Minimize = Make as small as possible- reduce something to as little as possible.

e.g. : We have tried to minimize the trouble to you = We have tried to make the least trouble for you. (It cannot be made less).

b) Reduce = Make something less or smaller in size.

e.g. : a) The manager reduced the salaries (Made the salaries less).

b) The trips have been reduced from five to three = Tripsను 5 నుంచి 3 కు తగ్గించారు.

c) 'to lower' also has the meaning of making something less or smaller.

They lowered the prices of their products = They reduced the prices...

'To lower' has another meaning = to make something go down (opposite of 'raise').

e.g. : He raised his hand but immediately lowered it (= brought it down).

'To lower' also means to do something that makes you less respected.

e.g. : Don't lower yourself by borrowing money (= If you borrow money, others respect you less).

**Q.** Advice, suggestion. Explain the difference in the usage of those words.

**A.** Suggest means to give somebody an idea, or put a thought in somebody's mind *indirectly.

Advice means an opinion you give others about what they should do. This is stronger than suggestion.

**Q.** What is the similar expression to the below given 'The Rose is very beautiful'.

a) How beautiful the Rose is!

b) How beautiful is the Rose!

**A.** Sentence a) is equivalent to 'the Rose is very beautiful'. b) is a question. When you say "How beautiful is the Rose?" You want to know how much its beauty is.

**Anjali, Karnataka**

**Q.** Helping words ఎలా ఉపయోగించాలో నాకు తెలియడం లేదు. ఎందుకంటే ఫలానా ప్రోగ్రాం ఫలానా ఛానల్‌లో వస్తుందని చెప్పడానికి 'only on POGO', 'only on DD1' అంటారు. On అంటే పైన/మీద అని అర్థం కదా? అలాంటప్పుడు 'only in POGO', 'only in DD1'అని రాయవచ్చు కదా! నా సందేహాన్ని తీర్చగలరు.

**A.** TV, Radio లాంటి visual (దృశ్య), Audio (శ్రవణ) media విషయంలో, TVలో, Radioలో అని తెలుగులో అంటాం. కానీ Englishలో, ఇలాంటి చోట్ల అంటే TVలో/ Radioలో/ ఫలానా Channelలో- ఇలా తెలుగులో వచ్చే వాటన్నిటికీ on అనే అంటాం.

e.g. : The programme went on/aired on the TV/ the Radio/ on Channel 10/ Channel 9/ ETV, etc. On ఎందుకు వాడాలనే ప్రశ్నకు ఇందువల్ల అనే rule ఏమీ లేదు. ఇది వాడుక (usage).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

# We could not figure out her intentions

**Suhrid:** Hi Pramod, Why do I see you alone? What's happened to Sasir? Didn't you tell me you'd bring him along?

(నువ్వు ఒంటరిగా కనపడుతున్నావేంటి? శశిర్‌కు ఏమైంది? శశిర్ ఏడీ? నీతోపాటు అతడినీ తీసుకొస్తానన్నావు కదా? )

**Pramod:** I did, but I waited and waited for him, saw no signs of him and started as I didn't want to be late.

(చెప్పాను నిజమే. అయితే అతడి కోసం చూసి చూసి, అతడి జాడలేమీ లేకపోయే సరికి, నేను ఆలస్యం కాకూడదని వచ్చేశాను.)

**Suhrid:** I just can't figure out what's wrong with him. He is never on time. I never bargained for this kind of disappointment when I wanted him here this evening.

(అతడి సమస్యేంటో నాకర్థంకావటం లేదు. అతడు దేనికీ సమయానికి రాడు. ఈ సాయంత్రానికి అతడిని ఇక్కడికి రమ్మన్నప్పుడు ఈ నిరాశ ఎదురవుతుందని నేను అనుకోలేదు.)

**Pramod:** I'm telling you now. I never count on him in matters like this.

(ఇప్పుడు నీకు చెబుతున్నా. ఇలాంటి విషయాల్లో నేనతడి మీద ఆధారపడను.)

**Suhrid:** It never dawned on me to consult you before I thought of calling him. Yea, you know better about him, and you have more experience of organizing such matters.

(అతడిని పిలిచేముందు నిన్ను సంప్రదించాలనే ఆలోచనే నాకు రాలేదు. అవును.. అతడి గురించి నాకంటే నీకే బాగా తెలుసు. ఇలాంటి విషయాలను నిర్వహించడంలో నాకంటే నీకు ఎక్కువ అనుభవం ఉంది.)

**Pramod:** Why don't you advise him? Why don't you tell him to be more reliable?

(అతడికి నీవెందుకు సలహా ఇవ్వకూడదు? కాస్త ఆధారపడగల వ్యక్తిగా ఉండమని చెప్పొచ్చుగా? )

**Suhrid:** I have, a number of times, but he just laughs it off.

(చాలాసార్లు చెప్పి చూశాను. కానీ, అతడు ఏం చెప్పినా నవ్వి సరిపెడతాడు.)

**Pramod:** OK. If he can let us down like this, he will miss out on the fun we're going to have at the party, though his songs won't be there.

(సర్లే. మనల్నిలా నమ్మించి వదిలేస్తే, అతడు కూడా ఇక్కడ జరిగే వినోదమంతా కోల్పోతాడు. ముఖ్యంగా అతడి పాటలు.)

**Pramod:** At least let us enjoy the party without thinking of him. Just don't worry. I am sure we can carry it off without Sasir's participation.

(ఇక అతడి గురించి ఆలోచించకుండా మనం పార్టీని ఆనందిద్దాం. ఏం ఫరవాలేదు. శశిర్ పాత్ర లేకుండానే మనం దీన్ని విజయవంతం చేయగలమనే నమ్మకం నాకుంది.)

**Suhrid:** Well, Sasir has taught us not to rely on the likes of him. We should try to find some one to fill his place.

(తనలాంటి వాళ్లమీద ఆధారపడకూడదనే పాఠం శశిర్ మనకు నేర్పాడు. అతడి బదులు మనం ఇంకెవరినైనా తీసుకోవాలి.)

**Pramod:** But, that will take sometime for us to break the new comer in.

(అయితే అతడికి/ కొత్తవాడికి అలవాటయ్యేందుకు సమయం పడుతుంది కదా? )

**Suhrid:** We have no other way. Sunil is worth a try. He has the talent in him, and the break in period will be short.

(అంతకంటే మార్గంలేదు. సునీల్ ప్రయత్నం చేయదగినవాడే. అతడిలో ప్రతిభ ఉంది. అందువల్ల శిక్షణ కాలం కూడా తక్కువే ఉంటుంది.)

**Pramod:** That is an idea, but what are we going to do for this party?

(అది మంచి ఆలోచనే. అయితే ఇపుడీ పార్టీకేంచేద్దాం? )

**Suhrid:** OK, then. Let's now sit and give some thought to the layout of the programme.

(సరే. ఇప్పుడు మనం కూర్చుని, మన కార్యక్రమ ప్రణాళికను సిద్ధం చేద్దాం).






M.SURESAN

Layout = Plan

మనం Phrasal Verbs తెలుసుకుంటున్న క్రమంలో భాగంగా daily life situationsలో తరచూ వినిపించే వాటిని ఇప్పుడు చూద్దాం.

***Look at the following Phrasal Verbs from the dialogue above:***

1) I just can't <u>figure out</u> what's wrong with him.
2) I never <u>bargained for</u> this kind of disappointment.
3) I never <u>count on</u> him in matters like this.
4) ... he just <u>laughs it off</u>.
5) If he can <u>let us down</u> like this...
6) ... he <u>will miss out</u> on the fun.
7) ... we can <u>carry it off</u> without Sasi's participation.
8) It will take some time for us to <u>break him in</u>.
9) Let's <u>give some thought</u> to it.

**1. Figure out** (Past tense and Past Participle - Figured out) = అర్థం చేసుకోవడం. (దేన్నైనా/ ఎవరినైనా). ఎక్కువగా అర్థం చేసుకోలేక పోవడం అనే దాన్ని not తో వాడతాం.

a) We could not <u>figure out</u> her intentions = ఆమె ఉద్దేశాలను మేం <u>అర్థం చేసుకోలేకపోయాం</u>.

b) I am unable to figure out what you want exactly = నీకసలేం కావాలో <u>నాకర్థం కావడంలేదు</u>.

c) Have you <u>figured out</u> the money you need for the journey? ప్రయాణానికెంత అవసరమో ఏమన్నా లెక్కేశావా? / తెలుసా?

2) Bargain for [Past Tense (PT) & Past Participle (PP) - Bargained for] = మనం, జరుగుతుందని అనుకోని విషయం/ ఏదో అనుకుంటే ఇంకేదో జరగడం.

a) When he played the game of dice, Dharmaraja never <u>bargained for</u> the loss of his kingdom = ధర్మరాజు జూదం ఆడేందుకు సిద్ధమైనపుడు రాజ్యం <u>పోగొట్టుకుంటాడనుకోలేదు</u>. (ఇది కూడా ఎక్కువ notతోనే వాడతాం అనే విషయం గమనించాలి.)

b) When I applied for the job here I <u>didn't bargain</u> for this kind of hard work = ఈ ఉద్యోగానికి దరఖాస్తు చేసుకున్నప్పుడు నేనిందులో ఇంత ఎక్కువ పని <u>ఉంటుందనుకోలేదు</u>.

c) A husband without understanding was not what <u>she bargained</u> for when she married him = అతడిని పెళ్లి చేసుకున్నప్పుడు, అర్థం చేసుకోలేని భర్తగా ఉంటాడని ఆమె అనుకోలేదు.

**3) Count on** (PT and PP counted on) = ఆధారపడటం/ జరుగుతుందని నమ్మడం.

a) She is <u>counting on</u> my taking her to the interview place = Interview చోటికి వెళ్లేందుకు ఆమె నా మీద ఆధారపడుతోంది/ నేను తీసుకువెళతాననే <u>నమ్మకంతో</u> ఉంది.

b) She is counting on her getting money on time and is planning to buy things = సమయానికి డబ్బు చేతికొస్తుందనే నమ్మకంతో ఆమె వస్తువులు కొనేందుకు సిద్ధమౌతోంది.

c) Don't <u>count on</u> my joining the picnic tomorrow. I've an exam coming = రేపు నేను picnicకు వస్తానని పూర్తి <u>నమ్మకం పెట్టుకోకు</u>. నాకో పరీక్ష వస్తోంది.

**4) Laugh something off =** అంత ప్రాముఖ్యం లేని విషయంగా నవ్వుతూ, కొట్టిపారేయడం, నవ్వి, సరిపెట్టడం.

a) Sure of a majority, he laughed all the objections off/ laughed off all objections = మెజారిటీ వస్తోందనే నమ్మకంతో, అన్ని అభ్యంతరాలనూ అతడో నవ్వుతో సరిపెట్టాడు.

b) When I asked him when he would repay me, he just laughed it off = నా డబ్బు ఎప్పుడు తిరిగిస్తావని అడిగితే నవ్వి చెల్లుబెట్టాడు (ఇంకా ఇవ్వడం ఏంటనే అర్థం వచ్చేలా).

c) Don't <u>laugh it off</u>. Just tell me clearly whether you passed or failed = <u>నవ్వి ఊరుకోవద్దు</u>. కచ్చితంగా చెప్పు. నువ్వు pass అయ్యావా, fail అయ్యావా?

**5) Let (somebody) down** (PT & PP: let ...) = అన్న మాట నిలబెట్టుకోకపోవడం (ముఖ్యంగా.. మాట ఇచ్చి సహాయం చేయకపోవడం).

a) She <u>let him down</u> in the last minute by voting against him = చివరి నిమిషంలో అతడికి వ్యతిరేకంగా ఓటువేసి అతడ్ని <u>ముంచింది</u>.

b) I am sure you won't <u>let us down</u> = నువ్వు నన్ను <u>భంగపరచవని</u> నమ్ముతున్నాను.

c) Many farmers feel that the Government has <u>let them down by</u> helping land grabber in the name of SEZ = ప్రత్యేక ఆర్థిక మండళ్లకు భూసేకరణ పేరుతో కబ్జాదారులకు సాయం చేసి <u>ప్రభుత్వం తమను ముంచిందని</u> చాలామంది <u>రైతులు</u> అనుకుంటున్నారు.

d) I told him I'd attend the party and I can't <u>let him down</u> in the last minute = అతడి పార్టీకి వస్తానని మాటిచ్చాను. చివరి నిమిషంలో వెళ్లకుండా నేనతడిని <u>నిరాశపరచలేను</u>.

**6) Miss out on something** = కోల్పోవడం.

a) The discount sale is just for one more day Hurry up or You'll <u>miss out on a</u> good bargain = Discount Sale ఇంకొక్కరోజు మాత్రమే. త్వరపడు. లేకుంటే మంచి బేరం <u>కోల్పోతావు</u>.

b) The traffic jam held me up and <u>I missed out</u> on the funny part of the movie = ట్రాఫిక్ రద్దీ నన్నాపడంవల్ల సినిమాలో హాస్య <u>సన్నివేశాన్ని కోల్పోయాను</u>.

c) We didn't have a TV when I was a child and I missed out-on a lot of fun = నా చిన్నతనంలో TV లేకపోవడంతో చాలా వినోదం కోల్పోయాను.

**7) Carry off** = విజయం/బహుమతులు పొందడం.

a) The Indian team carried off the Healthsurance trophy = భారత్ జట్టు Healthsurance trophyని గెలుచుకుంది.

b) They <u>carried off the</u> day winning all prizes = అన్ని prizeలూ <u>గెలుచుకుని</u> ఈ రోజంతా విజయంతో ఉన్నారు వాళ్లు.

c) Indian team <u>can't carry it off</u> without Dhoni = ధోనీ లేకపోతే భారత్ జట్టు <u>గెలవలేదు</u>.

**8) Break (something/ somebody) in** = ఏదైనా కొత్త పనికి ఎవరినైనా అలవాటు పడేలా చేయడం.

a) He was worried about starting the new job, but didn't take long to <u>break in</u> = కొత్త ఉద్యోగం ఎలా అలవాటు చేసుకోవాలి? అని అనుకుంది గానీ, త్వరగానే ఆమె దానికి అలవాటు పడింది.

b) I' am afraid I require some more time to break myself in = ఈ ఉద్యోగానికి అలవాటు పడేందుకు నాకు ఇంకాస్త సమయం అవసరమనుకుంటా.

Break in, కొత్త చెప్పులకు, కళ్లజోళ్లకు, కొత్త రకం బట్టలకూ కూడా వాడతాం- అవి అలవాటు పడేందుకు.

The shoes have a <u>break-in</u> period = ఆ చెప్పులు <u>అలవాటు అయ్యేందుకు</u> కాస్త సమయం పడుతుంది.

అలాగే జంతువులను (ఎద్దులూ, గుర్రాలలాంటివి) మచ్చిక చేసుకోవడాన్ని కూడా <u>break in</u> అంటాం.

It will take some more time for me to <u>break the horse in</u> = గుర్రాన్ని మచ్చిక చేసుకునేందుకు నాకు కాస్త సమయం పడుతుంది.



**M. Lakshmi, Hyderabad**

**Q:** For అనేది prepositionలో ఉంది. conjunctionలో కూడా ఉంది. Have+PP తో కూడా వస్తుంది. For అంటే 'కోసం, నుంచి' అని మాత్రమే నాకు అర్థమయింది. ఇంకా ఏమైనా అర్థాలున్నాయా? వివరించండి?

**A:** For అంటే మీరు రాసినట్టుగా 'కోసం' అనే అర్థం ఉంది. అయితే 'నుంచి' అని మాత్రం లేదు. Have/ has +PP వాడినప్పుడు, for కు అర్థం, ఇంతకాలంగా/ ఇంత కాలంపాటు అని.

He has worked here for 2 years now.

(అతడిక్కడ రెండేళ్ల పాటు పని చేశాడు/ అతడిక్కడ రెండేళ్లుగా పనిచేశాడు అని.) for అంటే because (అందువల్ల) అనే ఇంకో అర్థం కూడా ఉంది.

I like him for he is good = అతను మంచివాడవటం వల్ల అతడంటే నాకిష్టం.

**Q:** Up ఒక word తరువాత వస్తుంది. e.g. : Flared up, further up, slideit up ఇలా ఏయే సందర్భాల్లో వాడవచ్చు?

**A:** మీరిచ్చిన expressions లో up, ఆ expressions అర్థాన్ని కాస్త ఎక్కువ చేస్తుంది. up = ఇంకాస్త.

Flare up = ఉన్నట్టుండి (sudden గా) పెద్దగా ప్రకాశవంతంగా మండటం. flare = కాంతితో మండటం, తక్కువసేపు.

further up = ఇంకాస్త ముందుకు/ ఇంకాస్త దూరం వెళ్లడం/ జరగడం, etc., Further = ఇంకా

Move further up, please = ఇంకాస్త దూరం జరగండి.

Go further up and turn left = ఇంకా ముందుకు వెళ్లి ఎడమవైపు తిరగండి.

Slideit up = ఇది కూడా అంతే. ఇంకొంచెం (up) జార్చండి.

**Q:** Used to అంటే అర్థం ఏమిటి? దయచేసి తెలుపగలరు.

**A:** Used to - గతంలో వాడుకగా చేసే పనిని ఇలా అంటాం.

a) He used to meet me regularly = అప్పట్లో అతడు నన్నెప్పుడూ కలుసుకునేవాడు.

b) I used to take long walks those days = ఆ రోజుల్లో నేను చాలా దూరాలు నడిచేవాడిని.

c) He used to waste money on clothes = అతడు దుస్తుల మీద డబ్బు బాగా వృథా చేసేవాడు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



**A. Sridhar, Onipenta**

**Q:** ఈ పదాలకు అర్థాలను తెలుపగలరు. 1. Data base, 2. Energetic, 3. Cuttif, 4. Toned milk, 5. Pasteurized milk, 6. Portfolio, 7. Mission impossible, 8. Mind block, 9. Polyphonic ring tones, 10. Open cast (బొగ్గు గనులు), 11. Fire brand, 12. Tomboy, 13. Flameboyant, 14. Long last, 15. Last long (ఈ రెండింటికీ తేడా కూడా చెప్ప గలరు.), 16. Search light, 17. Spot light, 18. Lime light, 19. Profile, 20. Body language, 21. Roking, 22. Trekking, 23. Dam nonsense, 24. Struggle, 25. Special drive, 26. Enclave,27. Bullsheet, 28. Killer instinct, 29. Basic instinct, 30. Just like that, 31. Gallop poll, 32. Aggressive, 33. Derivative, 34. Joint venture, 35. Hard talk.

**A:** 1 = ఎప్పుడంటే అప్పుడు చూసేందుకు, వాడుకునేందుకు Computer లో నిల్వ ఉంచే సమాచారం.

2 = చురుకైన, ఉత్సాహవంతమైన, బలమైన.

3 = ఈ మాట English లో లేదు.

4 = కొవ్వు శాతం తగ్గించిన పాలు.

5 = పాలు, మద్యంలాంటి పదార్థాలు విరిగి పోకుండా/ పులిసిపోకుండా ఉండేందుకు చేసే ప్రక్రియ. Pasteurization (French శాస్త్రవేత్త Lewis Pasteur కనిపెట్టాడు). అలా చేసిన పాలే Pasteurized milk.

6 = ఎ) ముఖ్యమైన పత్రాలు, బొమ్మలు పెట్టు కునేందుకు వాడే case (పెట్టె).

బి) చిత్రకారులూ, కళాకారులూ, Photographers గీసిన/ తీసిన చిత్రాల సంపుటి.

సి) ఒక వ్యక్తికి ఉన్న business shares (వివిధ కంపెనీల్లో వాటాలు).

డి) ఒక మంత్రి నిర్వహించే మంత్రిత్వ శాఖ.

7) అసాధ్యమైన బాధ్యత.

8) మనకున్న ఆలోచనలే correct అనుకుని ఇంకో ఆలోచన మన బుర్రలోకి చొరబడనీయకపోవడం.

9) వివిధ రకాల సంగీత శబ్దాల సమ్మేళనంతో కూడిన ring tones.

10) ఎక్కువ లోతుకు వెళ్లకుండా భూమి ఉపరితలం (surface) కిందనే బొగ్గు ఉండే గనులు.

11) ప్రభుత్వం, చట్టాలకు వ్యతిరేకంగా ఇతరులను రెచ్చగొట్టి, తద్వారా, వాటిల్లో మార్పులకు ప్రయత్నించేవాళ్లు.

12) దీని Correct spelling: Zombie

ఎ) నీరసంగా తామేం పనిచేస్తున్నామో, ఎందుకు చేస్తున్నామో తెలియకుండా పనిచేసేవాళ్లు, మందకొడిగా, నిస్తేజంగా ఉండేవాళ్లు.

బి) కదిలే ప్రేతాలు (African, West Indies దేశాలవాళ్లు నమ్మే ప్రకారం).

13) చలాకీగా, ఆత్మవిశ్వాసంతో ఉన్న; (దుస్తులు) ముదురు రంగుతో gaudy గా కొట్టొచ్చినట్లుండే.

14) At long last = చిట్టచివరికి.

15) చాలాకాలం మన్నే.

16) రాత్రిపూట భద్రతకోసం అతి ప్రకాశవంతంగా ఉండి, అటూ ఇటూ తిప్పగలిగేందుకు వీలుగా ఉండే lights. ముఖ్యంగా శత్రువుల చొరబాటును చూసేందుకు వీలుగా.

17) ఒకే ఒక ప్రకాశవంతమైన కాంతిపుంజంతో మనం అనుకున్న వస్తువు మీదపడే దీపం.

18) To be in the limelight = ప్రజాదృష్టిలో పడటం, ప్రజల దృష్టిని పొందటం.

19) ఎ) Sideview of a person's face - వ్యక్తి ఎదురుగా కాకుండా, పక్క నుంచి చూసినప్పుడు, మనకు కనిపించే ముఖాకృతి.

బి) ఒకరిని/ Company ని గురించిన వివరాలు.

20) మనంనిల్చునే, కూర్చునే, చూసే, మన అవయవా లను కదిపే తీరును బట్టి, మన వైఖరిని, భావాలను, వ్యక్తపరచడం- దేహభాషలు అనవచ్చు

21) ఊపటం.

22) శ్రమతోకూడిన సుదీర్ఘమైన (చాల దూరం) నడక.

23) అర్థం, పర్థం లేని మాటలూ/ చేతలూ.

24) పోరాటం, శ్రమ.

25) ప్రత్యేక కృషి, ప్రయత్నం, ముఖ్యంగా కొంతమంది ప్రజలు కలిసి సమష్టిగా, లేదా సంస్థాగతంగా చేసేది.

26) ఒకదేశం/ నగరంలోని ప్రదేశం - ఈ ప్రదేశంలో నివసించే వారి మతం, భాషా సంస్కృతులు దేశం/ నగరంలోని మిగతావారి భాషా సంస్కృతు లకు భిన్నంగా ఉంటాయి.

27) Bull sheet కాదు, bull shit = ఇది దూషణ, తిరస్కారాన్ని తెలిపే పదం. మర్యాదస్తుల/ పెద్దవారి సమక్షంలో వాడకూడనిది. అర్థం- ఒకరు చెప్పేదంతా బూటకం, తెలివిలేనిది, చెత్త అని దూషించడం.

28) ముఖ్యంగా ఇది క్రీడాకారుల విషయంలో వాడతాం. ప్రత్యర్థిని ఓడించాలనే పట్టుదల- ఇది సహజ గుణంగా భావించినప్పుడు.

29) సహజ గుణం/ పుట్టుకతో వచ్చే ధోరణి.

30) అలానే/ ఊరకనే.

# They shall not come here again




SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 538


M.SURESAN

31) ఒక విషయాన్ని గురించి, ముఖ్యంగా ఎన్నికల విష యంలో నిర్వహించే ప్రజాభి ప్రాయ సేకరణ- ఏ పార్టీకి ఎంత విజయావకాశం ఉంది? అని తెలుసుకునేందుకు. Gallup అనే ఆయన ఈ అభిప్రాయ సేకరణ విధానాన్ని కనిపెట్టాడు.

32) దుడుకుగా ఉన్న.

33) మరో దాన్నుంచి పుట్టిన. తెలుగులోని మాటలు చాలావరకు, derivatives from Sanskrit. సంస్కృతం నుంచి వచ్చినవి.

34) సమష్టి వ్యాపారం.

35) ఉన్నది ఉన్నట్లు చెప్పడం.

**Sai kumar, Hyderabad.**

**Q:** మీరు పలు రకాలుగా ఇంగ్లిష్ గురించి వివరిస్తున్నం దుకు కృతజ్ఞతలు. కొత్తగా వాడుకలో ఉన్న Phrasal verbs గురించి మరిన్ని వివరాలను తెలుపుతారని ఆశిస్తున్నాను. నాకు వచ్చిన కొన్ని Doubts ను clarify చేయగలరు.

If I were the owner of that car, I would keep it cleaner than I would keep my own home... ఇక్కడ తన ఇంటిని already clean గా ఉంచు కున్నాడు. 'కారును అంతకంటే శుభ్రంగా ఉంచుకుం టాను' అంటున్నాడు. ఇక్కడ కారుకీ, హోమ్‌కీ రెండింటికీ I would keep అని రాశారు. వివరిం చండి.

**A:** If I were the owner అని వాడినప్పుడు, నేను ఇప్పుడు ఆ Car owner కాను, అయిన పరిస్థితిలో, (ఇప్పుడది జరగదు) ఇంటికంటే కారును ఎక్కువ శుభ్రతతో ఉంచుకుంటాను, అని. ఇక్కడ would ను జరగని విషయాన్ని జరుగుతున్నట్లుగా చెప్పేందుకు వాడతాం.

If I were the C.M., I would make you a minister = నేనిప్పుడు C.M. ను కాను. అవటం అంటూ జరిగితే, నిన్ను మంత్రిని చేస్తాను.

I would make you - ఇక్కడ మీరిచ్చిన వాక్యంలో మాదిరి would కు అర్థం 'ఇప్పుడు' అని కాదు. నేను సి.ఎం. 'అయినప్పుడు' అని.

**Q:** a) I don't have the money now = ఇప్పుడు నా దగ్గర డబ్బు లేదు. మరి 'ఇప్పుడు / రేపు నా దగ్గర డబ్బు ఉండదు' అంటే ఎలా రాయాలి?

b) He doesn't have a cell: అతడికి సెల్ లేదు. మరి 'అతడికి సెల్ ఉండదు' అంటే ఎలా రాయాలి?

**A:** a) I won't (will not) have the money.

b) He will not (won't) have a cell.

**Q:** Bunny makes Mahalaxmy fall head over heels for him = దీని meaning, phrasal verb తెలుపగలరు?

**A:** Headover heels = పూర్తిగా ప్రేమలో పడటం. Bunny మహాలక్ష్మిని తనతో పూర్తిగా ప్రేమలో పడేట్లు చేయగలడు.

**Q:** Our teacher hasn't explained to us to how we should do have to do it - ఈ వాక్యం చివర have to do it ఎందుకు వచ్చింది? దాని ఉపయోగం ఏమిటి?

**A:** Our teacher hasn't told us how we should have to do it - should do it = have to do it = చేయాలి. (విధిగా, తప్పనిసరిగా).

**Q:** a) పుణ్యం, b) దానం c) ధర్మం d) ఎంగిలి, ఎంగిలినీరు, ఎంగిలి అన్నం, ఎంగిలి రొట్టె - వీటికి ఇంగ్లిష్ పదాలు రాయగలరు.

**A:** a) పుణ్యం అనే మాటకు సరైన English మాట లేదు. Eternal bliss/ earn merit (పుణ్యం సంపాదించటం)/ merit - ఇలా వివిధ రకాలుగా చెబుతారు.

b) దానం, ధర్మం = charity.

c) ఎంగిలి - అంటే ఒకరు తినగా (కొరగ్గా) మిగిలింది, అనేందుకు సరైన English మాట లేదు. ఎవరైనా తిని ఒదిలి పెట్టిన ఆహారాన్ని left over(s) అంటారు.

**Q:** Pickup, Wakeup. ఇలాంటి ఎన్నో పదాలు కొన్నిసార్లు pick me up, wake me up, I woke up గా వస్తాయి. ఏ సందర్భాల్లో వీటి మధ్యలో pronoun వస్తుంది? రూల్స్ ఏమిటి?

**A:** వీటిని Phrasal Verbs అంటాం. వీటి మధ్య pronoun రావటానికి ఒక rule అంటూ ఏంలేదు. వాడుకకు సంబంధించిన విషయం అది. వాడగా వాడగా తెలుస్తుంది.

**K. Chandu, B.Y.Nagar, Sirisilla.**

**Q:** Why doctor? Why through Vishnu? లాంటి వాక్యాలను మీరు గతంలో ఇచ్చారు. వీటిలో verb ఏది? మీరేమో verb లేనిదే వాక్యాలు ఉండవని చెప్పారు. మరి పై వాక్యాల్లో verb లేదు కదా? Spoken English లో ఇలాంటివి వాడవచ్చు అనుకుంటే.. గతంలో మీరు He coming slowly అని ఉంటే తప్పని చెప్పారు. మరి పై వాక్యాలు ఎలా సరైనవో చెప్పగలరు.

**A.** Why doctor?/ Why through Vishnu? ఇలాంటివి conversational/ Spoken English లో చాలా common. ఇది why తోనే ఎక్కువ వాడతాం.

a) 'shall we watch the match?' (Match చూద్దామా?)

'Why not?' (ఓ, తప్పకుండా)- ఇది question కాదు.

b) Doctor: Have an X-ray taken (X-ray తీయించుకోండి).

Patient: Why, doctor? (ఎందుకండీ?)

- ఇక్కడ 'ఎందుకు' అని అడగటమే తప్ప, sentence కాదు.

c) Why through someone? = వాళ్ల ద్వారా ఎందుకు?

ఇలాంటి ప్రయోగం, సామాన్యంగా 'Wh' words తోనే వస్తుంది: Where?/ When?/ How?/ Why?/ Who? etc.,

He coming slowly లాంటి వాక్యాల విషయంలో, పై ప్రయోగం పనికిరాదు.

**Q:** Our office is open from 10 A.M. to 5 P.M. అని గతంలో మీరు రాశారు. ఈ వాక్యం తప్పు కదా?

**A:** Our office is open from 10 A.M. to 5 P.M. ఈ sentence లో verb 'is' - 'be' form. ఈ sentence లో open verb కాదు, adjective. 'తెరచి ఉన్న' అనే అర్థంతో.

It is opened by me everyday - ఈ sentence కు అర్థం, అది రోజూ నా చేత తెరవబడుతుంది అని. ఇక్కడ verb, is (be form) + opened (PP) - III form.

**Q:** 'ఎప్పటివరకు' అనే పదానికి సరైన ఇంగ్లిష్ పదాన్ని తెలుపగలరు?

**A:** How long/ till when/ till what time? = ఎప్పటి వరకు?

**D.R. Jagitial.**

**Q:** The word 'tense' comes from the Latin 'tempus' అని ఒక గ్రామర్ పుస్తకంలో చదివాను. Has come from (or) came from అనడానికి బదులుగా simple present tense నే ఎందుకు వాడతారు?

**A:** ఇక్కడ come/ comes from అంటే అర్థం అది దాన్లోంచి పుట్టిందని- ఇది ఎప్పుడూ ఉండే విషయమే/ ఇది idiom - దీనికి tense rules వర్తించవు.

**Q:** No preposition is used before some words- this, next, last etc., అని ఒక ఇంటర్మీడియట్ గైడ్‌లో చదివాను. మీరేమో in, on లను మాత్రమే వాడకూడదని తెలిపారు. ఏది కరెక్టో వివరించగలరు.

**A:** This ముందు ఎందుకు preposition రాదు? In this అంటాం కదా? Next, Last- ఇవి adjectives వాటికి prepositions రావు. ఇది భాష లక్షణం.

**Ch. Ramesh, Rekonda.**

**Q:** ఆ పుస్తకం తెలియదు. అనే సందర్భంలో don't know వాడతారా, లేదా haven't know ను వాడతారా? ముఖ్యంగా know అర్థం ఏమిటి?

Haven't known the book?

Don't know the book?

పై వాక్యాల్లో ఏది సరైంది?

**A:** I don't know about the book = నాకా పుస్తకం గురించి తెలియదు.

I haven't known about the book = ఇంతవరకు నాకా పుస్తకం గురించి తెలియదు.

**V. Koteswara Rao, Kotturu.**

**Q:** ఈ వాక్యాలను ఆంగ్లంలో ఎలా రాయాలో తెలుప గలరు. మన్మోహన్ 'ఎన్నో' ప్రధాని?

**A:** దీనికి English లో మామూలు conversation లో వాడే expression ఏదీలేదని ఇంతకుముందు చాలాసార్లు చెప్పాం.

**Q:** ఒకసారి మీరు will, shall గురించి రాసినప్పుడు You shall, He shall అని వాడారు. Shall అనేది I and We పక్కన మాత్రమే వాడాలని కాలేజీలో చెప్పారు.

**A:** a) You/ He పక్కన shall వాడితే, order (తప్పని సరిగా చేయాల్సిన పని), నిబంధనలను తెలుపుతుంది.

b) You/ He/ She/ it/ they + shall express orders, rules, duties, warnings and promises.

c) You shall complete the work before the evening = పని సాయంత్రంలోపు పూర్తి చేయాలి (order).

d) No one (he/ she) shall smoke here - (rule)

e) They shall not come here again = వాళ్ళు మళ్లీ ఇక్కడికి రాకూడదు (warning).

f) You shall have my support = నా support నీకు తప్పకుండా ఉంటుంది (promise).

ఇవీ you/ he/ she/ it/ they తో shall ఉపయోగాలు.

**Q:** Lord - feminine gender ఏమిటో తెలుపగలరు.

**A:** Lord కు feminine gender lady.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**





**A. Bunganna Munagalapadu (Kurnool Dist.)**

**Q.** Please let me know the past tense and past participle forms of 'read' and 'beat'.

**A.** Read - Past tense and Past Participle - Read (Pronounced 'Red'). Beat - Past tense: Beat (Pronounced same as the present tense form in pronunciation) Past Participle: beaten.

**K. Satyanarayana, Narsipatnam**

**Q.** Duration ను చెప్పేటప్పుడు వాడే for ను perfect tense లో మాత్రమే వాడాలని చదివాను. కొన్నిచోట్ల simple past లో కూడా రాస్తున్నారు. అది ఎంత వరకు సరైనది? I have waited here for one hour.

I waited there for one hour.

ఈ రెండింటిలో ఏది సరైనది?

**A.** For ను duration తెలిపేందుకు ఏ tense లోనయినా వాడతాం, వాడాల్సిందే.

e.g: I have waited here for two hours = నేనిక్కడ ఇప్పటివరకు రెండు గంటలుగా ఎదురు చూశాను. (ఇంకా చూస్తు న్నాను అని కూడా అర్థం వస్తుంది).

I waited there for one hour = గతంలో ఎప్పుడో ఒక గంటసేపు నేనిక్కడ ఎదురు చూశాను.

I will wait for you for 10 minutes = నేను నీ కోసం పది నిమిషాలు ఎదురుచూస్తాను (Future లో). India had to wait for more than a century to become free = భారతదేశం స్వాతంత్ర్యం పొందడానికి ఒక శతాబ్దం కంటే ఎక్కువకాలం ఎదురు చూడాల్సి వచ్చింది.

**G. Raju, Rajavommangi (E.G.Dist.)**

**Q.** నేను తెలుగు మీడియం విద్యార్థిని. Spoken English నేర్చుకోవాలనుకుంటున్నాను. ప్రస్తుతం SGT గా పనిచేస్తున్నాను. ఇంగ్లిష్ లెక్చరర్‌గా ఎదగాలనుంది. ఈ విషయంలో IIEFL ఎలా ఉపయోగపడుతుంది. ఇంకా ఎలాంటి కోర్సులు చేయవచ్చు కాల వ్యవధిని వివరించగలరు. ప్రస్తుతం M.A. English దూరవిద్య ద్వారా చేస్తున్నాను. ఇంగ్లిష్ అర్థం చేసుకోగలుగుతున్నాను. కానీ మాట్లాడలేకపోతున్నాను.

**A.** మీరు MA తర్వాత EFLU (IIEFL కాదు) Certificate Course in English, DTE (Diploma in Teaching English) లాంటి Courses చేయొచ్చు ముందుగా మీరు వీలయినపుడల్లా ఇంగ్లిష్ చదవడం, మాట్లాడటం, రాయడం చేస్తుండండి. మీరు మాకిప్పుడీ ఉత్తరం Englishలో రాసుండొచ్చు కదా.

**M. Satyanarayana, Hyderabad**

**Q.** More, over, excess వీటిని ఎప్పుడు, ఎక్కడ ఎలా వాడాలి?

**A.** More - ఇది ఎప్పుడూ పోల్చినప్పుడే వాడతాం. ఒక దాని కంటే, మిగతావాటికంటే ఎక్కువ అనే అర్థంతో.

She is more intelligent than he. (అతడి కంటే - పోలిక).

His salary is more than hers.

(ఆమె జీతం కంటే అతడి జీతం ఎక్కువ)

ఈ సందర్భాల్లో over/ excess వాడం.

Over - అధికం - సరైన దానికంటే ఎక్కువ - ఇక్కడ పోలిక లేదు కదా. అంతేకాకుండా over ను ఇంకో పదం ముందు చేర్చి వాడతాం - Over do, over act, over exercise etc.

Excess - అధికం/ అమితం/ మరీ.

He has excess of confidence = He has over confidence.

Police excesses - పోలీస్‌లు అతిగా ప్రవర్తించడం. They indulge in excess - మరీ అతిగా చేస్తున్నారు/ చేస్తారు. (indulge in = పాల్పడటం).

**Q.** Past, speed ఈ పదాలను ఎలా వాడాలి?

**A.** Past, speed - ఇవి రెండూ పూర్తిగా వేరు.

past = గతం; speed = వేగం.

బహుశా మీరు fast కు speed కూ తేడా తెలుసుకోవాలనుకున్నారేమో. Fast = వేగం ఉన్న/ వేగవంతమైన; speed = వేగం.

This is a fast train = ఇది వేగంగా ప్రయాణించేరైలు.

It travels fast = ఇది వేగంగా వెళుతుంది.

The speed of the train = రైలు వేగం.

**Q.** Dead, died, death ఈ పదాలను వివరించగలరు.

**A.** Dead = చనిపోయిన; (చట్టాల్లాంటివి) అమల్లోలేని.

Died = చనిపోయారు/ చనిపోయింది.

(Past tense of 'die').

Death = చావు.

**Q.** Proper, native పదాలను వివరించగలరు.

**A.** Proper = సరైన.

He comes from Nellore proper = అతడు నెల్లూరు నగరానికి (చుట్టుపక్కల ఊళ్లేం కాకుండా) చెందినవాడు.

Native = ఒక ప్రదేశానికి చెందినవారు.

4, 5, 6, 7, 8 అర్థాలకు dictionary చూడండి.

9. Measure up = అంచనాలకు తగినట్టు గొప్పగా ఉండటం.

10. పురోగతికి అడ్డంకి/ అవరోధం - His absence from the team is a serious set back to it = అతడు జట్టులో లేకపోవడం, జట్టుకు తీవ్ర అవరోధం.

11 & 12 : Refer to dictionary.

13. ద్వైపాక్షిక = రెండు వర్గాల మధ్య.

Bilateral relations between India and Pak = భారత్‌కు, పాక్‌కు - ఈ రెండింటి మధ్య సంబంధాలు.

14. అనుకున్న ప్రకారం జరిగేలా ఏర్పాటుచేయడం.

The President is scheduled to come here at 5 PM. - ప్రెసిడెంట్ ఇక్కడికి అయిదింటికి వచ్చేలా ఏర్పాట్లు జరిగాయి.

15. ఎక్కువగా వాడే అర్థం - కలుసుకోవడం.

# I put her under your wings





M.SURESAN

I am a native of Nellore = మాది నెల్లూరు.

**B. Chandini Nisar, Ananthapur**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలో వివరించగలరు.

★ 'కలలు కనండి'

A. Dream/ Dream on.

★ ఈ ఉంగరం నీ వేలుకు పెట్టుకో.

**A.** Wear the ring/ Put on the ring.

★ అక్రమ రవాణాపై అధికార యంత్రాంగం చూసీచూడనట్టు వ్యవహరిస్తోంది.

**A.** The official machinery is turning a blind eye to the illicit transport.

★ Have a nice day. Have a happy period.

**A.** Have a nice day = ఈ రోజు మీకు బాగుండాలని. Have a happy period = మీరు (ఒక చోట/ ఒక సందర్భం) సంతోషంగా గడపాలని మా కోరిక.

★ It can be of significant value అనేది కరెక్టేనా?

**A.** Correct. దానికి గొప్ప విలువ ఉండొచ్చు

★ Let 'R' be a relation.

**A.** 'R'ను బంధువు అనుకో/ అనుకుందాం.

★ Meanకి చాలా అర్థాలున్నాయని విన్నాను. వీటి గురించి తెలుపండి.

**A.** Mean 1) అర్థం 2) ఉద్దేశించడం 3) సగటు 4) నీచమైన

★ 'పంచభూతాల సాక్షిగా'

**A.** Englishలో ఇలాంటి సందర్భాలకు సరైన మాటలు లేవు. వాళ్లకు ఇలాంటి నమ్మకాలు లేవు కాబట్టి.

**N. Suresh Babu, Anantapur**

**Q.** కింది పదాలకు అర్థాలను వివరించగలరు.

1. referenced 2. referential 3. refer to 4.context 5. speed up 6. conclusive 7. exclusive 8. inclusive 9. measure up 10. set back 11. pointed to 12. commodity 13. bi-lateral 14. schedule (verb) 15. meet.

**A.** 1. Referenced = ఒక విషయం ప్రస్తావన ఉన్న పుస్తకాలను, పత్రాలను గురించి తెలియజేయడం.

Each section of his research paper is referenced.

2. Adjective form of reference.

3. ప్రస్తావించడం: He referred to you while we were discussing the matter - ఆ చర్చలో నీ విషయం ప్రస్తావించాడు.

క్రీడాపోటీ అనే అర్థమూ ఉంది.

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థాలు వివరించగలరు.

a) Value added services b) Make the most of now c) You may have to enter the password d) Coffee at its best e) Simple the best.

**A.** a) Value added services = అదనపు విలువతో ఇచ్చే సేవలు - అంటే, మామూలు సేవల కంటే కాస్త నాణ్యత ఉన్న సేవలు.

b) భవిష్యత్‌లో ఏమవుతుందో తెలియదు కాబట్టి ఇప్పటి పరిస్థితుల నుంచే అత్యంత లాభం పొందడం.

Let's make the most of the money we have now = ఇప్పుడున్న డబ్బును బాగా వాడుకుందాం.

c) మీరు computer లోని సమాచారం తెలుసుకునేందుకు password ను ఖాళీలో నింపండి.

d) బ్రహ్మాండమైన coffee = మంచి coffee అంటే ఇలా ఉండాలి.

e) ఇంకేం చెప్పక్కర్లేదు. ఇది ఉత్తమం - ఒక్క మాటలో చెప్పాలంటే.

★ అమ్మ కాకుండా ఇంకెవరు చెబుతారు?

**A.** Who will; if mother doesn't?

★ అతడితో నన్ను పరిచయం చేయించు. దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** Get/ Have me introduced to him.

★ చేతబడిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** చెడు ఫలితాలనిచ్చే అన్ని మాంత్రిక ప్రక్రియలనూ ఇంగ్లిష్‌లో black magic అంటారు.

**G. Rambabu, Tenali**

**Q.** Main film yet to be certified or censored. అది సెన్సార్ అయినట్టా? కాబోతుందా? తెలియ జేయండి.

**A.** Yet = ఇంకా, ఏదైనా అవలేదు/ ఇంకా కావాల్సి ఉంది అనే అర్థంతో వాడతాం.

He is yet to come = అతనింకా రావాల్సి ఉంది, అంటే రాలేదనే కదా.

Main film yet to be censored or certified = అసలు సినిమా ఇంకా censor/ certify అవాల్సి ఉంది; అంటే అవలేదనే కదా.

**P. Simhachalam, Vijayawada**

**Q.** Spoken English ఇంప్రూవ్ చేసుకోవడానికి మీరిచ్చే వ్యాసాలతోపాటు novels, short stories చదవాలి అన్నారు కదా? సరళమైన భాషలో ఉండే పుస్తకాలు ఎక్కడ లభిస్తాయి?

**A.** ఇంగ్లిష్‌లో చిన్న, చిన్న కథలు చదవడం, చిన్న, చిన్న story books (ఇవి book shopsలో దొరుకుతాయి - చిన్న Classesకు non-detailed booksగా ఉంటాయి). English Chandamama, Englishలో వస్తున్న Vidyabharathi మాసపత్రిక మొదట చదవండి. తరువాత పెద్ద novelsకు వెళ్లవచ్చు

**Q.** కిందివాటిని ఇంగ్లిష్‌లో తెలుపండి.

★ మట్టి కరిపించాడు, ఎద్దేవా చేయడం

**A.** Made him/ her bite the dust.

Ridicule/ scoff/ mock.

**Q.** కిందివాటిని తెలుగులో అనువదించండి.

★ He's head over heels in love.

**A.** అతడు ప్రేమలో తలమునకలుగా ఉన్నాడు.

★ I think they will tie the knot.

**A.** వాళ్లు పెళ్లి చేసుకుంటారను కుంటాను.

★ I don't want to steal his thunder.

**A.** అతడి గొప్పదనాన్ని నేను కొట్టేయాలనుకోవడం లేదు. (పని ఒకరిది, అందుకు మెప్పుపొందటం ఇంకొకరు) - ఇతరులు ఒక గొప్ప పని చేసేముందే మనం ఆ పనిచేసి మంచి పేరు సంపాదించడం.

★ I put her under your wings.

**A.** ఆమెను నీ సంరక్షణలో ఉంచుతున్నా.

★ It's three miles as the crow flies.

**A.** మామూలుగా రోడ్లను అనుసరించి వెళ్లకుండా, ఒక చోటికి పక్షివెళ్లే మార్గంలో దూరం.

★ She's no spring chicken.

**A.** ఆ అమ్మాయి అంత చిన్న పిల్లేం కాదు. - 'చిన్న బొప్పేం కాదు' అని తెలుగులో అంటుంటాం.

**Sreenu, Narasapuram**

**Q.** Sravani: Put down her books.

Pavani: Put away her books.

ఈ వాక్యాలకు అర్థాన్ని తెలుపండి.

Who is tidier? ఈ ప్రశ్నకు సమాధానం తెలుపండి.

**A.** Pavani is the tidier - put down books - table మీద పెట్టటం/ పడేయడం.

Put away = జాగ్రత్తగా ఒకచోట ఉంచడం/ దాయడం.

Tidy = శుభ్రంగా, అమరికగా ఉండటం.

**Q.** Sudha: You must have your shoes polished.

Sindhu: You must have polished your shoes.

Whose shoes are not cleaned? Need to be polished?

**A.** Sudha's shoes need polish. You must have your shoes polished = నీవు నీ shoes ను polish చేయించుకోవాలి - ఇంకా నువ్వు polish చేయించలేదు.

You must have polished your shoes = నువ్వు నీ shoes ను polish చేయించుకుంటావు. (అందుకనే అవి మెరుస్తున్నాయి)

**Q.** She said, "I go to church".

She said, "I go to church every Sunday". పై వాక్యాలు Indirect speech లో simple past కి మారతాయా?

**A.** రెండింటికీ Indirect speech లో simple present కు బదులు simple past వస్తుంది. అయితే ఒక్కోసారి future ను తెలిపేందుకు కూడా simple present వాడతాం. అలాంటి సందర్భాల్లో future ను తెలిపేందుకు Indirect speech లోకి మార్చేటప్పుడు would వాడతాం.

Direct speech: She said, "I start teaching from tomorrow."

Indirect speech: She said that she would start teaching from the next day.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# I put her under your wings





M.SURESAN



**A. Bunganna Munagalapadu (Kurnool Dist.)**

**Q.** Please let me know the past tense and past participle forms of 'read' and 'beat'.

**A.** Read - Past tense and Past Participle - Read (Pronounced 'Red'). Beat - Past tense: Beat (Pronounced same as the present tense form in pronunciation) Past Participle: beaten.

**K. Satyanarayana, Narsipatnam**

**Q.** Duration ను చెప్పేటప్పుడు వాడే for ను perfect tense లో మాత్రమే వాడాలని చదివాను. కొన్నిచోట్ల simple past లో కూడా రాస్తున్నారు. అది ఎంత వరకు సరైనది? I have waited here for one hour.

I waited there for one hour.

ఈ రెండింటిలో ఏది సరైనది?

**A.** For ను duration తెలిపేందుకు ఏ tense లోనయినా వాడతాం, వాడాల్సిందే.

e.g: I have waited here for two hours = నేనిక్కడ ఇప్పటివరకు రెండు గంటలుగా ఎదురు చూశాను. (ఇంకా చూస్తు న్నాను అని కూడా అర్థం వస్తుంది).

I waited there for one hour = గతంలో ఎప్పుడో ఒక గంటసేపు నేనిక్కడ ఎదురు చూశాను.

I will wait for you for 10 minutes = నేను నీ కోసం పది నిమిషాలు ఎదురుచూస్తాను (Future లో). India had to wait for more than a century to become free = భారతదేశం స్వాతంత్ర్యం పొందడానికి ఒక శతాబ్దం కంటే ఎక్కువకాలం ఎదురు చూడాల్సి వచ్చింది.

**G. Raju, Rajavommangi (E.G.Dist.)**

**Q.** నేను తెలుగు మీడియం విద్యార్థిని. Spoken English నేర్చుకోవాలనుకుంటున్నాను. ప్రస్తుతం SGT గా పనిచేస్తున్నాను. ఇంగ్లిష్ లెక్చరర్‌గా ఎదగాలనుంది. ఈ విషయంలో IIEFL ఎలా ఉపయోగపడుతుంది. ఇంకా ఎలాంటి కోర్సులు చేయవచ్చు కాల వ్యవధిని వివరించగలరు. ప్రస్తుతం M.A. English దూరవిద్య ద్వారా చేస్తున్నాను. ఇంగ్లిష్ అర్థం చేసుకోగలుగుతున్నాను. కానీ మాట్లాడలేకపోతున్నాను.

**A.** మీరు MA తర్వాత EFLU (IIEFL కాదు) Certificate Course in English, DTE (Diploma in Teaching English) లాంటి Courses చేయొచ్చు ముందుగా మీరు వీలయినపుడల్లా ఇంగ్లిష్ చదవడం, మాట్లాడటం, రాయడం చేస్తుండండి. మీరు మాకిప్పుడీ ఉత్తరం Englishలో రాసుండొచ్చు కదా.

**M. Satyanarayana, Hyderabad**

**Q.** More, over, excess వీటిని ఎప్పుడు, ఎక్కడ ఎలా వాడాలి?

**A.** More - ఇది ఎప్పుడూ పోల్చినప్పుడే వాడతాం. ఒకదాని కంటే, మిగతావాటికంటే ఎక్కువ అనే అర్థంతో.

She is more intelligent than he. (అతడి కంటే - పోలిక).

His salary is more than hers.

(ఆమె జీతం కంటే అతడి జీతం ఎక్కువ)

ఈ సందర్భాల్లో over/ excess వాడం.

Over - అధికం - సరైన దానికంటే ఎక్కువ - ఇక్కడ పోలిక లేదు కదా. అంతేకాకుండా over ను ఇంకో పదం ముందు చేర్చి వాడతాం - Over do, over act, over exercise etc.

Excess - అధికం/ అమితం/ మరీ.

He has excess of confidence = He has over confidence.

Police excesses - పోలీసులు అతిగా ప్రవర్తించడం. They indulge in excess - మరీ అతిగా చేస్తున్నారు/ చేస్తారు. (indulge in = పాల్పడటం).

**Q.** Past, speed ఈ పదాలను ఎలా వాడాలి?

**A.** Past, speed - ఇవి రెండూ పూర్తిగా వేరు.

past = గతం; speed = వేగం.

బహుశా మీరు fast కు speed కూ తేడా తెలుసుకోవాలనుకున్నారేమో. Fast = వేగం ఉన్న/ వేగవంతమైన; speed = వేగం.

This is a fast train = ఇది వేగంగా ప్రయాణించేరైలు.

It travels fast = ఇది వేగంగా వెళుతుంది.

The speed of the train = రైలు వేగం.

**Q.** Dead, died, death ఈ పదాలను వివరించగలరు.

**A.** Dead = చనిపోయిన; (చట్టాల్లాంటివి) అమల్లోలేని.

Died = చనిపోయారు/ చనిపోయింది.

(Past tense of 'die').

Death = చావు.

**Q.** Proper, native పదాలను వివరించగలరు.

**A.** Proper = సరైన.

He comes from Nellore proper = అతడు నెల్లూరు నగరానికి (చుట్టుపక్కల ఊళ్లేం కాకుండా) చెందినవాడు.

Native = ఒక ప్రదేశానికి చెందినవారు.

I am a native of Nellore = మాది నెల్లూరు.

**B. Chandini Nisar, Ananthapur**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలో వివరించగలరు.

★ 'కలలు కనండి'

A. Dream/ Dream on.

★ ఈ ఉంగరం నీ వేలుకు పెట్టుకో.

**A.** Wear the ring/ Put on the ring.

★ అక్రమ రవాణాపై అధికార యంత్రాంగం చూసీచూడనట్లు వ్యవహరిస్తోంది.

**A.** The official machinery is turning a blind eye to the illicit transport.

★ Have a nice day. Have a happy period.

**A.** Have a nice day = ఈ రోజు మీకు బాగుండాలని. Have a happy period = మీరు (ఒక చోట/ ఒక సందర్భం) సంతోషంగా గడపాలని మా కోరిక.

★ It can be of significant value అనేది కరెక్టేనా?

**A.** Correct. దానికి గొప్ప విలువ ఉండొచ్చు

★ Let 'R' be a relation.

**A.** 'R'ను బంధువు అనుకో/ అనుకుందాం.

★ Meanకి చాలా అర్థాలున్నాయని విన్నాను. వీటి గురించి తెలుపండి.

**A.** Mean 1) అర్థం 2) ఉద్దేశించడం 3) సగటు 4) నీచమైన

★ 'పంచభూతాల సాక్షిగా'

**A.** Englishలో ఇలాంటి సందర్భాలకు సరైన మాటలు లేవు. వాళ్లకు ఇలాంటి నమ్మకాలు లేవు కాబట్టి.

**N. Suresh Babu, Anantapur**

**Q.** కింది పదాలకు అర్థాలను వివరించగలరు.

1. referenced 2. referential 3. refer to 4.context 5. speed up 6. conclusive 7. exclusive 8. inclusive 9. measure up 10. set back 11. pointed to 12. commodity 13. bi-lateral 14. schedule (verb) 15. meet.

**A.** 1. Referenced = ఒక విషయం ప్రస్తావన ఉన్న పుస్తకాలను, పత్రాలను గురించి తెలియజేయడం.

Each section of his research paper is referenced.

2. Adjective form of reference.

3. ప్రస్తావించడం: He referred to you while we were discussing the matter - ఆ చర్చలో నీ విషయం ప్రస్తావించాడు.

4, 5, 6, 7, 8 అర్థాలకు dictionary చూడండి.

9. Measure up = అంచనాలకు తగినట్టు గొప్పగా ఉండటం.

10. పురోగతికి అడ్డంకి/ అవరోధం - His absence from the team is a serious set back to it = అతడు జట్టులో లేకపోవడం, జట్టుకు తీవ్ర అవరోధం.

11 & 12 : Refer to dictionary.

13. ద్వైపాక్షిక = రెండు వర్గాల మధ్య.

Bilateral relations between India and Pak = భారత్‌కు, పాక్‌కు - ఈ రెండింటి మధ్య సంబంధాలు.

14. అనుకున్న ప్రకారం జరిగేలా ఏర్పాటుచేయడం.

The President is scheduled to come here at 5 PM. - ప్రెసిడెంట్ ఇక్కడికి అయిదింటికి వచ్చేలా ఏర్పాట్లు జరిగాయి.

15. ఎక్కువగా వాడే అర్థం - కలుసుకోవడం. క్రీడాపోటీ అనే అర్థమూ ఉంది.

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థాలు వివరించగలరు.

a) Value added services b) Make the most of now c) You may have to enter the password d) Coffee at its best e) Simple the best.

**A.** a) Value added services = అదనపు విలువతో ఇచ్చే సేవలు - అంటే, మామూలు సేవల కంటే కాస్త నాణ్యత ఉన్న సేవలు.

b) భవిష్యత్‌లో ఏమవుతుందో తెలియదు కాబట్టి ఇప్పటి పరిస్థితుల నుంచే అత్యంత లాభం పొందడం.

Let's make the most of the money we have now = ఇప్పుడున్న డబ్బును బాగా వాడుకుందాం.

c) మీరు computer లోని సమాచారం తెలుసుకునేందుకు password ను ఖాళీలో నింపండి.

d) బ్రహ్మాండమైన coffee = మంచి coffee అంటే ఇలా ఉండాలి.

e) ఇంకేం చెప్పక్కర్లేదు. ఇది ఉత్తమం - ఒక్క మాటలో చెప్పాలంటే.

★ అమ్మ కాకుండా ఇంకెవరు చెబుతారు?

**A.** Who will; if mother doesn't?

★ అతడితో నన్ను పరిచయం చేయించు. దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** Get/ Have me introduced to him.

★ చేతబడిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** చెడు ఫలితాలనిచ్చే అన్ని మాంత్రిక ప్రక్రియలనూ ఇంగ్లిష్‌లో black magic అంటారు.

**G. Rambabu, Tenali**

**Q.** Main film yet to be certified or censored. అది సెన్సార్ అయినట్లా? కాబోతుందా? తెలియ జేయండి.

**A.** Yet = ఇంకా, ఏదైనా అవలేదు/ ఇంకా కావాల్సి ఉంది అనే అర్థంతో వాడతాం.

He is yet to come = అతనింకా రావాల్సి ఉంది, అంటే రాలేదనే కదా.

Main film yet to be censored or certified = అసలు సినిమా ఇంకా censor/ certify అవాల్సి ఉంది; అంటే అవలేదనే కదా.

**P. Simhachalam, Vijayawada**

**Q.** Spoken English ఇంప్రూవ్ చేసుకోవడానికి మీరిచ్చే వ్యాసాలతోపాటు novels, short stories చదవాలి అన్నారు కదా? సరళమైన భాషలో ఉండే పుస్తకాలు ఎక్కడ లభిస్తాయి?

**A.** ఇంగ్లిష్‌లో చిన్న, చిన్న కథలు చదవడం, చిన్న, చిన్న story books (ఇవి book shopsలో దొరుకుతాయి - చిన్న Classesకు non-detailed booksగా ఉంటాయి). English Chandamama, Englishలో వస్తున్న Vidyabharathi మాసపత్రిక మొదట చదవండి. తరువాత పెద్ద novelsకు వెళ్లవచ్చు

**Q.** కిందివాటిని ఇంగ్లిష్‌లో తెలుపండి.

★ మట్టి కరిపించాడు, ఎద్దేవా చేయడం

**A.** Made him/ her bite the dust.

Ridicule/ scoff/ mock.

**Q.** కిందివాటిని తెలుగులో అనువదించండి.

★ He's head over heels in love.

**A.** అతడు ప్రేమలో తలమునకలుగా ఉన్నాడు.

★ I think they will tie the knot.

**A.** వాళ్లు పెళ్లి చేసుకుంటారనుకుంటాను.

★ I don't want to steal his thunder.

**A.** అతడి గొప్పదనాన్ని నేను కొట్టేయాలనుకోవడం లేదు. (పని ఒకరిది, అందుకు మెప్పుపొందటం ఇంకొకరు) - ఇతరులు ఒక గొప్ప పని చేసేముందే మనం ఆ పనిచేసి మంచి పేరు సంపాదించడం.

★ I put her under your wings.

**A.** ఆమెను నీ సంరక్షణలో ఉంచుతున్నా.

★ It's three miles as the crow flies.

**A.** మామూలుగా రోడ్లను అనుసరించి వెళ్లకుండా, ఒక చోటికి పక్షివెళ్లే మార్గంలో దూరం.

★ She's no spring chicken.

**A.** ఆ అమ్మాయి అంత చిన్న పిల్లేం కాదు. - 'చిన్న బొప్పేం కాదు' అని తెలుగులో అంటుంటాం.

**Sreenu, Narasapuram**

**Q.** Sravani: Put down her books.

Pavani: Put away her books.

ఈ వాక్యాలకు అర్థాన్ని తెలుపండి.

Who is tidier? ఈ ప్రశ్నకు సమాధానం తెలుపండి.

**A.** Pavani is the tidier - put down books - table మీద పెట్టటం/ పడేయడం.

Put away = జాగ్రత్తగా ఒకచోట ఉంచడం/ దాయడం.

Tidy = శుభ్రంగా, అమరికగా ఉండటం.

**Q.** Sudha: You must have your shoes polished.

Sindhu: You must have polished your shoes.

Whose shoes are not cleaned? Need to be polished?

**A.** Sudha's shoes need polish. You must have your shoes polished = నీవు నీ shoes ను polish చేయించుకోవాలి - ఇంకా నువ్వు polish చేయించలేదు.

You must have polished your shoes = నువ్వు నీ shoes ను polish చేయించుకుంటావు. (అందుకనే అవి మెరుస్తున్నాయి)

**Q.** She said, "I go to church".

She said, "I go to church every Sunday". పై వాక్యాలు Indirect speech లో simple past కి మారతాయా?

**A.** రెండింటికీ Indirect speech లో simple present కు బదులు simple past వస్తుంది. అయితే ఒక్కోసారి future ను తెలిపేందుకు కూడా simple present వాడతాం. అలాంటి సందర్భాల్లో future ను తెలిపేందుకు Indirect speech లోకి మార్చేటప్పుడు would వాడతాం.

Direct speech: She said, "I start teaching from tomorrow."

Indirect speech: She said that she would start teaching from the next day.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# You must be out of your mind

**Satphala:** What's keeping you so busy? Not to be seen at all?
(ఎందువల్ల అంత తీరిక లేకుండా ఉన్నావు? అసలు కనిపించడం లేదు?)

**Suchitra:** Me? Busy? You must be out of your mind to say that.
(నేనా? తీరిక లేకుండానా? అలా అంటే నీకు బుర్ర లేనట్టే.)

**Satphala:** I say that again. I haven't seen you for a whole week now. What does that mean? Something must be keeping you busy.
(ఆ మాటే మళ్లీ అంటాన్నేను. నిన్ను వారంగా చూడలేదు నేను. దానర్థం ఏంటి? ఏదో నిన్ను తీరిక లేకుండా చేస్తున్నదనే కదా?)

**Suchitra:** True. We haven't met for a week, but that doesn't mean I am busy. In fact I've been quite idle and have been lazing about.
(idle = పనేంలేకుండా ఉండటం)

**Satphala:** Have you been on leave or what?
(సెలవేమైనా పెట్టావా?)

**Suchitra:** No. No need of that I am among those the company has laid off. Looking for another job.
(లేదు. ఆ అవసరం ఇంకేం లేదు. ఉద్యోగంలోంచి తొలగించిన వాళ్లల్లో నేనొక దాన్ని. ఇంకో ఉద్యోగం కోసం వెతుక్కుంటున్నా.)

**Satphala:** I'm really sorry to hear that. How's it I didn't know about it?
(నిజంగా బాధగా ఉంది వినడానికి. ఇంతవరకూ ఆ విషయం నాకు తెలియక పోవడమేంటి?)

**Suchitra:** Not a piece of happy news to share with others, is it? In fact I was hoping to get ahead in the company, when this news came as a bolt from the blue.
(ఇదేం సంతోషకరమైన వార్త కాదుగదా ఇతరులతో చెప్పేందుకు? అసలు ఈ కంపెనీలో బాగా పైకొస్తానని ఆశిస్తున్న సమయంలో పిడుగులాంటి ఈ వార్త వచ్చింది.)

share = భాగం అనే కాకుండా, సమాచారం, వార్తలూ లాంటివాటిని ఇతరులకు చెప్పడం.

**Satphala:** The company will be the poorer for loosing you. You were taking on more responsibility than you were asked to. They were even taken up with, you said the way you handled your responsibility.

**Suchitra:** Yea. I got the sack when I least expected it. Well, that's an experience too. Perhaps I can hope for a better thing.
(అవును. నేననుకోనప్పుడు ఉద్యోగం పోయింది. పోనీలే. ఇంతకంటే మంచి ఉద్యోగం వస్తుందేమో.)

**Satphala:** That's exactly the way to take it. But I must say I did not expect you to get the pink slip.
(అదీ నువ్వు అనుకోవాల్సిన తీరు. కానీ నేను చెప్పాలి, నిన్ను తొలగిస్తారని నేననుకోలేదు.)

**Suchitra:** No. It's got to do with the Chairman's laying down that 10% of the employees should go, following the economic slow down, and that starting from the junior most.
(అది కాదులే. ఇదంతా ఆర్థిక మాంద్యం వల్ల. కిందిస్థాయి ఉద్యోగుల నుంచి పైకి పది శాతం ఉద్యోగులను తొలగించాలని ఛైర్మన్ ఆదేశంతో ముడిపడిన విషయం.)

economic slow down = ఆర్థిక మాంద్యం

**Satphala:** What next then?
(అయితే తర్వాతి మాటేంటి?)

**Suchitra:** Nothing for the present. I have enough savings to last till this year end. In the mean time I'll sharpen my skills, update my knowledge and wait for an opportunity.
(ఇంతవరకేం అనుకోలేదు. నేను దాచుకున్న డబ్బు ఈ ఏడాదికి సరిపోతుంది. ఈలోపల నా నైపుణ్యాన్ని పెంచుకుంటూ, అవకాశం కోసం ఎదురుచూస్తా.)

కొద్దికాలంగా మనం English లో తరచూ వాడే అతి సరళమైన Phrasal Verbs గురించి తెలుసుకుంటున్నాం కదా? అలాంటి మరికొన్ని high frequency phrasal verbs ను (అవి మన conversation లో సందర్భోచితంగా వాడకపోతే మామూలు English కూడా తెలియనట్లే) ఇప్పుడు తెలుసుకుందాం. పై conversation అంతా ఉద్యోగం కోల్పోవడం, దానికి సంబంధించిన విషయాలను గురించి అని తెలుసుకున్నాం కదా.




M.SURESAN

***Look at the following dialogues from the conversation above.***

*1) You must be out of your mind to say that*
*2) I've been lazing about*
*3) I am among those the company has laid off*
*4) I was hoping to get ahead in the company when the news came as a bolt from the blue*
*5) You were taking on more responsibility than you were asked to*
*6) They were taken up with you, you said*
*7) I got the sack when I least expected it*
*8) I am in for trouble*
*9) I did not expect you to get the pink slip*
*10) ... The Chairman's laying down that 10% of the employees must go*

**1) Be out of one's mind** = తెలివిలేకుండా మూర్ఖంగా ప్రవర్తించడం, అర్థం లేకుండా మాట్లాడటం.

a) Quitting job now and starting a business? You must be out of your mind = ఏంటి, ఉద్యోగం వదిలేసి వ్యాపారం పెడతావా? నీకు నిజంగా పిచ్చెక్కింది (అది మూర్ఖత్వం).

b) I was out of my mind to have told him I'd help him. I didn't know he was the bad sort. = అతడికి సహాయం చేస్తాననడం నేను మతి తప్పి అన్న మాటగా ఉంది. అతడు దుర్మార్గుడని నాకు తెలియదు.

**2) Laze about/ laze around** = పనీపాటా లేకుండా సోమరితనంగా విశ్రాంతిగా సమయాన్ని గడపడం.

a) We lazed about/ around the first few holidays picknicking and watching the TV = మొదటి రెండు మూడు సెలవు రోజులూ విశ్రాంతిగా, పనీపాటా లేకుండా సోమరితనంగా గడిపేశాం.

b) He does nothing. He lazes around living off his father's property = అతడేపనీ చేయడు. వాళ్ల నాన్న ఆస్తిమీద బతికేస్తున్నాడు, విశ్రాంతిగా కాలం వెళ్లబుచ్చుతూ.

c) Don't laze around. Do something = సోమరితనంతో సమయం గడిపేయకు. ఏదైనా చెయి.

**3) To lay off** = సంస్థ నష్టాల ఫలితంగా ఉద్యోగులను, కార్మికులనూ తొలగించడం.

a) The workers are on strike against the company's decision to lay off workers = ఉద్యోగుల/ కార్మికుల తొలగింపునకు కంపెనీ నిర్ణయానికి వ్యతిరేకంగా, వాళ్లందరూ సమ్మె చేస్తున్నారు.

b) Following the economic slow down, at least, 2 million employees may be laid off in the next few months in the US and Europe = ఆర్థిక మాంద్యం కారణంగా అమెరికా, యూరప్‌లలో దాదాపు 20 లక్షల మందిని ఉద్యోగాల నించి తొలగించవచ్చు

c) Because of the losses, the workers fear a lay off = నష్టాల వల్ల ఉద్యోగుల ఉద్వాసన ఉండవచ్చని ఉద్యోగులు భయపడుతున్నారు.

ఈ lay off (ఉద్యోగులను తొలగించడం)కు సంబంధించినవే మరో రెండు expressions - 7) to get the sack, 9) to get the pink slip- ఈ రెండింటిని కూడా ఇప్పుడు చూద్దాం.

**7) To get the sack** (Past tense & past participle- got the sack) = ఉద్యోగం ఊడటం (ఉద్యోగం పోవడం)

a) A number of software engineers have already got the sack and a few more are likely to be sacked = ఇప్పటికే చాలామంది software (computer) ఉద్యోగులకు ఉద్యోగం పోయింది. ఇంకా కొంతమందికి పోవచ్చు

b) Because of the shoddy job she does, she got the sack = పనిసరిగా చేయకపోవడం వల్ల ఆమె ఉద్యోగం ఊడింది. (ఆమెను తొలగించారు)

shoddy = (పని) సరిగ్గా చేయకపోవడం

His repair of my car was shoddy = అతడు నా car ను సరిగా రిపేర్ చేయలేదు.

Her cooking is shoddy = ఆమె వంట సరిగా చేయదు. ఈ మాట చాలా ఎక్కువగా వాడుతుంటారు. మీరూ practice చేయండి.

దాదాపు ఉద్యోగం పోగొట్టుకోవడానికి సంబంధించిన ఇంకోమాట ..

**9) to get the pinkslip** = ఉద్యోగంలోంచి తొలగించడం/ ఉద్యోగం పోవడం.

a) following the recession, a number of employees are afraid they may get the pink slip = ఆర్థికమాంద్యం వల్ల చాలామంది ఉద్యోగులు తమ ఉద్యోగం పోవచ్చని భయపడుతున్నారు. (Recession = ఆర్థిక మాంద్యం - వ్యాపారాలు, సేవలకు గిరాకీ లేకపోవడం, నష్టాలు పొందడం)

b) The company has decided to give the manager the pink slip = మేనేజర్‌ను తొలగించాలని కంపెనీ నిర్ణయించింది.

**4) To get ahead** = చేస్తున్న ఉద్యోగంలో పైకిరావడం, త్వరత్వరగా promotion పొందడం.

a) Unless you work very hard and put in extra work, you cannot get ahead in the company నువ్వు బాగా శ్రమించి అదనంగా పని చేస్తే తప్ప ఈ కంపెనీలో పైకి రాలేవు.

b) The deserving certainly get ahead in the company. It encourages merit and industry= అర్హత ఉన్నవాళ్లు ఈ కంపెనీలో తప్పక పైకొస్తారు. ఈ సంస్థ ప్రతిభను, కృషిని ప్రోత్సహిస్తుంది.

To deserve = అర్హత ఉండటం

**To come as a bolt from the blue** = పిడుగుపాటు లాంటి వార్త/ ఘటన.

The news of his death came as a bolt from the blue= అతడిమరణవార్త పిడుగుపాటులా తాకింది.

Bolt = Thunder bolt = పిడుగు

Blue = sky = ఆకాశం

**6) Be taken up with** = ఆకర్షితులవడం

I am quite taken up with the little child. = ఆ చిన్న బిడ్డ నన్ను పూర్తిగా ఆకర్షించింది/ నాకు చాలా ముద్దుగా ఉంది.

**5) To take on** = బాధ్యత తీసుకోవడం.

The manager likes her because she is willing to take on any responsibility = ఆమె ఏ బాధ్యతనైనా స్వీకరించేందుకు సిద్ధంగా ఉంటుంది. కాబట్టి, మేనేజర్‌కు ఆమె అంటే ఇష్టం.

**8) Be in for** = ఏదో చెడు జరగబోవడం.

a) If you continue to be late any more, you are in for trouble = ఇంక ఏమాత్రం ఆలస్యంగా వచ్చినా నీ పని అయినట్లే/ నీకు శిక్ష పడుతుంది.

b) She never thought she would be in for punishment = తనకు శిక్ష పడబోతోందని ఆమె అనుకోలేదు.

---



**K. Achari, Vaikuntapuram**

**Q.** A. Applications shall be submitted in person to ......
B. Applications shall be produced by the candidate ....
C. Hall tickets will be despatched .....
D. Candidates shall be selected .....

అండర్‌లైన్ చేసిన verbs గురించి సందేహాలున్నాయి. మొదటి వాక్యంలో shall be submitted అంటే సమర్పించబడతాయి అని కదా అర్థం. సమర్పించబడాలి అనే అర్థం రావాలంటే should be submitted or shall have to be submitted అని రావాలి కదా. రెండో వాక్యంలో నిబంధనల ప్రకారం చేయాలి అనే దృష్టితో వాడాలి కాబట్టి, should be produced or shall have to be produced అని రావాలి కదా. వివరించగలరు.

**A.** 1) Shall be, shall be + PP with he, she, it and they - ఇక్కడ Applications (They) - ఎప్పుడూ నిబంధనలను తెలుపుతాయి.

Applications shall be submitted - అవి submit చేయబడాలి - Rule/ Order.

Should అన్నా కూడా Order/ Necessity ని తెలిపేది. Rules తెలిపేందుకు should అంతగా వాడరు.

Hall tickets will be issued - Hall tickets - they కాబట్టి They + will - future - ఇవ్వబడతాయి. ఇక్కడ rule ప్రసక్తిలేదు.

Candidates (they)shall be selected - ఎంపిక చేసుకోబడాలి/ తప్పక ఎంపిక చేసుకోబడతారు.

Shall have to be produced - ఇది అనవసర గ్రాంథికం/ పాండిత్యం. Shall be produced అంటే తక్కువ పటాటోపంతో అదే అర్థం వస్తుంది కదా?

A, B - లలో నిబంధనలు ఇక్కడ shall be + pp బదులు shall have to be + pp అనవసరం.

C, D లలో - Simple Future.

**JV Jayaprakash, Proddatur**

**Q.** Please clarify the following doubts.

ఒక ఇన్విజిలేటర్ 'papers are given' అన్నారు. కానీ ఇక్కడ papers have given అనాలి కదా. am/ is / are + $V_3$ దేనికి ఉపయోగిస్తారో వివరంగా తెలుపగలరు.

**A.** Am/ is/ are + pp - regular actions - passive.

1) Stars are seen at night. (చూడబడతాయి)
2) I am examined by the doctor once every month. (పరీక్ష చేయబడతాను)
3) He is paid Rs. 2000/- every month. (చెల్లించబడతాడు)

Papers have given = పేపర్లు ఇచ్చేశాయి - అంటే అర్థం లేదు కదా? Papers have been given = ఇవ్వబడ్డాయి (ఇవ్వడం అయిపోయింది).

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# It's thumbs up for Rehman's music





M.SURESAN

**Nipun:** What a relief! The officer has given the thumbs up for the proposals we sent for approval two weeks ago.

(అబ్బా పెద్ద బరువు నెత్తి నుంచి దింపినట్ల యింది. మనం రెండు వారాల కింద ఆఫీసర్ ఆమోదం కోసం పంపిన/ సమర్పించిన ప్రతిపాద నలను ఆమోదించారు.)

**Nishanth:** Why have you to wait so long for something that's for the public good? Why don't they give you a free hand in such matters?

(ప్రజా శ్రేయస్సు (public good) కోసం ఉద్దేశిం చిన వాటికి కూడా అంతకాలం ఎదురుచూడాలా? ఇలాంటి విషయాల్లో నీకు స్వేచ్ఛ ఇవ్వొచ్చు కదా?)

**Nipun:** That's red tape. Very common in all government offices. Some private organizations are no exception.

(అదే red tape. ప్రభుత్వ కార్యాలయాల్లో అతి సాధారణం. కొన్ని ప్రైవేటు సంస్థలూ మినహా యింపులేం కావు.)

**Nishanth:** But that only delays things unnecessarily. The file you put up today takes two days to go to the top official. It takes another two days to return to you. Then there's the usual time taken to put it into action.

(కానీ అందువల్ల అనవసర ఆలస్యం తప్ప ఏం లేదు కదా? నువ్వీరోజు సిద్ధం చేసి పైకి పంపే ఫైలు పై అధికారికి చేరేసరికి రెండ్రోజులు. మళ్లీ ఆ అధికారి సంతకం అయ్యి నీకు తిరిగి వచ్చేం దుకు ఇంకో రెండ్రోజులు పడుతుంది. ఆ తర్వాత దాన్ని ఆచరణలో పెట్టేందుకు మామూలు సమయం ఎలానూ అవుతుంది.)

**Nipun:** OK. I have my hands full now. (I have) very little hope of being free even for this weekend. Even if it means my working on Sunday, I will do it. I will wash my hands of it and be free the whole of the next week.

(సరే. ఇప్పుడు నా చేతులనిండా పని ఉంది. ఈ వారాంతానికైనా తీరిగ్గా ఉంటాననే ఆశ లేదు నాకు. ఆదివారం పని చేయాల్సి వచ్చినా చేస్తాను. ఈ పని వదుల్చుకుని వచ్చే వారమంతా తీరికగా ఉంటా.)

**Nishanth:** Yea. That's better. Finish off the work before it goes out of hand. I'm afraid you've taken on more than you can do. In future don't bite off more than you can chew.

(అవును. అదే మంచిది. ఏ పనైనా మనం చేయలేనంతగా పేరుకుపోయే ముందే చేసేయడం మంచిది. ఇకముందు నువ్వు చేయగలిగిన దానికంటే ఎక్కువ నెత్తినేసుకోకు.)

**Nipun:** I'll certainly keep that in mind. Infact I've been so tied up with the work here that it's months since I have been to a movie.

(అది గుర్తుంచుకుంటాను. అసలు ఇక్కడి పనితో తీరిక లేకపోవడంతో సినిమా చూసి నెల అయ్యింది.)

**Nishanth:** I understand that. The trouble is that you can't put on hold any part of the work. Whatever you deal with is to be done promptly.

(నేను అర్థం చేసుకోగలను. సమస్యేంటంటే నీ పనిలో ఏదీ కూడా ఆపలేవు. నువ్వు చేసే పనంతా అప్పటికప్పుడు చేయాల్సిందే.)

**Nipun:** That's right. You've put your finger on the problem. At least next March, I'll ask for a change of duty. This work is taking the life out of me.

(అవును. నువ్వు చాలా కరెక్టుగా సమస్యను అర్థం చేసుకున్నావు. వచ్చే మార్చికైనా నా విధులు మార్చాలని అడుగుతాను. ఈ పని నా ప్రాణాలు తోడేస్తోంది.)

**Nishanth:** You had better. OK. I must be leaving. I have a tennis match coming and need some practice. I haven't had any for a week now.

(ఆ పని చెయ్యి. సరే. నే వెళ్లాలిక. నాకు (త్వరలోనే) టెన్నిస్ మ్యాచ్ ఉంది. కొంత practice అవసరం. ఒక వారంగా practice లేదసలు.)

**Nipun:** How I wish I played Tennis too!

(నేనూ టెన్నిస్ ఆడితే ఎంత బాగుంటుంది.)

**Nishanth:** Who's stopping you? Have a go at it sometime next week. You're going to be free then.

(నిన్ను ఎవరాపుతున్నారు? వచ్చేవారం ఎప్పుడైనా ప్రయత్నించు. అప్పుడు నీకు కొంత ఖాళీ ఉంటుంది కదా?)

**Nipun:** Sure. I'll.

(తప్పకుండా.)

Phrasal Verbs/ Idioms practice లో భాగంగా ఈ వారం మరి కొన్నింటిని చూద్దాం. కాస్త శ్రద్ధ చూపిస్తే సులభంగా అలవాటుపడి మన conversation లో మనకు తెలి యకుండానే కరెక్టుగా వాడేస్తుంటాం. అంతేకాకుండా ఇవి ఇతరులకు చాలా సులభంగా అర్థమయ్యేవి కూడా. అందు కని బాగా practice చేద్దాం.

***Look at the following expressions from the conversation above.***

1. The officer has given the thumbs up for the proposal.
2. Why don't they give you a free hand in such matters?
3. That's red tape.
4. I have my hands full now.
5. I'll wash my hands of it and be free.
6. Finish off the work before it gets out of hand
7. In future don't bite off more than you can chew.
8. I am so tied up with the work here...
9. The trouble is that you can't put on hold any part of the work.
10. You've put your finger on the problem.

**1) Thumbs up** = ఆమోదం, అనుమతి

a) A good number of Railway projects from our state did not get the centre's thumbs up = మన రాష్ట్రం ప్రతిపాదించిన చాలా రైల్వే ప్రాజెక్టులు కేంద్రం ఆమోదం పొందలేదు.

b) It looks like his parents' thumbs up for his marrying the girl he loves = అతడు ప్రేమించిన అమ్మాయిని పెళ్లి చేసుకునేందుకు అతడి తల్లిదండ్రులు ఒప్పుకునేలా ఉన్నారు.

Thumbs up అంటే ఇంకో అర్థం సినిమాలు, పుస్తకా ల్లాంటి ఏ రకమైన ప్రదర్శనైనా ప్రజాదరణ/ ప్రజా మోదం పొందడం. అందరి మెప్పు పొందడం.

a) Really grand. It's thumbs up for A.R.Rehman's music in 'Slumdog Millionaire' = గొప్ప విషయమే. స్లమ్‌డాగ్ మిలియనీర్‌లో రెహ్మాన్ సంగీతం అందరి మెప్పు పొందింది.

అలాగే Thumbs down అంటే, ఆమోదం పొందక పోవడం, తోసిపుచ్చడం, ప్రదర్శన ప్రజల మెప్పు పొందలేకపోవడం.

a) The project was given the thumbs down because it costs too much = మరీ ఖర్చుయిందవడం వల్ల ఆ ప్రాజెక్టు ఆమోదం పొంద లేదు.

b) His action in the movie got the thumbs down = ఆ చిత్రంలో అతడి నటన మెప్పు పొందలేదు.

Thumb = చేతి బొటనవేలు కదా. బొటనవేలు బయటికుండేలా పిడికిలి మూయడం, బొటనవేలు పైకెత్తి చూపడం- Thumbs up = అంతా సవ్యంగా ఉంది/ ఆమోదించాం/ అని, అదే బొటన వేలిని కిందకుండేట్లు చూపితే thumbs down ఏమీ/ ఏదో సరిగా లేదు అని అర్థం.

**2) Give a free hand** = స్వేచ్ఛ ఇవ్వడం.

a) The Government doesn't always give a free hand to the police in dealing with law and order problems = చట్టం నిర్వహణ అమల్లో పోలీసులకు ప్రభుత్వం పూర్తి స్వేచ్ఛ ఇవ్వదు.

b) I will join your company if you give me a free hand in financial matters = ఆర్థిక విషయాల్లో నాకు స్వేచ్ఛనిస్తేనే నేను మీ కంపెనీలో చేరతాను.

**3) Red tape** = ఆఫీసుల్లో పనులు నిర్వహించేందుకు మరీ ఎక్కువగా చాదస్తంగా రూల్సు, పద్ధతుల ప్రకారం పోవడం, అందువల్ల కలిగే అనవసర జాప్యం.

a) Because of red tape getting a ration card or a certificate in government offices takes a lot of time = అమల్లో ఉండే నిబంధనలను మరీ చాదస్తంగా అనుసరించడం వల్ల రేషన్ కార్డులుకానీ, ప్రభుత్వ కార్యాలయాల్లో ఏదైనా సర్టిఫికెట్ పొందేందుకుకానీ చాలా కాలం పడుతుంది.

b) The old man died before he got his pension. The reason - the red tape in Govt. Offices = ఆ వృద్ధుడు పెన్షన్ రాకముందే చనిపోయాడు. కారణం - ప్రభుత్వ కార్యాలయాల్లో అనవసర చాదస్తపు నిబంధనల వల్ల ఆలస్యమే.

**4) Have one's hands full now** = తీరిక లేకుండా ఉండటం.

a) I have my hands too full to help you now = నీకు సహాయం చేయలేనంత తీరిక లేకుండా ఉన్నాను నేను.

b) With the elections announced, every politician has his hands full now = ఎన్నికలు ప్రకటించటంతో ప్రతి రాజకీయవేత్తా తీరిక లేకుండా ఉన్నాడు.

c) She has her hands already full with her own children. I don't want my child to be an additional burden= ఇప్పటికే ఆమెకున్న ముగ్గురు పిల్లల్తో ఆమె సతమతమవుతూ ఉంది. నా బిడ్డను కూడా ఆమె సంరక్షణకు వదిలి ఆమె బరువు పెంచలేను.

**5) Wash hands of =** సంబంధం వదులుకోవడం/ చేతులు దులుపుకోవడం/ వదుల్చుకోవడం

a) I am no longer interested in this old car. I want to wash my hands of it = ఈ పాత కారు మీద నాకేం ఆసక్తి లేదు. దీన్ని వదుల్చుకోవాలను కుంటున్నాను.

b) I've had enough of partnership business. I want to wash my hands of it and have a business of my own = భాగస్వామ్య వ్యాపారం నాకొద్దు. ఇంక (విసుగెత్తి పోయాను). దాన్ని వదిలించుకుని, నా సొంత వ్యాపారం పెట్టుకోవాలను కుంటున్నా.

c) Don't tell me any more. I want to wash my hands of you = ఇంకేం మాట్లాడకు. ఇక నీతో సంబంధం పెట్టుకోదలచుకోలేదు నేను.

**6) Get out of hand** = అదుపు తప్పడం/ అదుపులో పెట్టలేకపోవడం.

a) Following recession, unemployment is getting out of hand= ఆర్థికమాంద్యం వల్ల, నిరు ద్యోగ సమస్యను అదుపులో పెట్టలేకుండా ఉన్నాం.

b) As the crowd got out of hand the police started a lathi charge = అల్లరి మూకలు అదుపు తప్ప డంతో పోలీసులు లాఠీలు ప్రయోగించాల్సి వచ్చింది.

c) Prices are getting out of hand = ధరలు అదుపు తప్పుతున్నాయి/ నియంత్రించ లేకపోతున్నాం.

**7) To bite off more than one can chew** = అలవికాని పని చేయడానికి పూనుకోవడం. మనం చేయగలిగిందానికంటే ఎక్కువ బాధ్యత నెత్తిన వేసుకోవడం.

a) Mom is quite busy at home. Now she has taken up this job which is tiring. She has bitten off more than she can chew = అమ్మకు ఇంటిపనే సరిపోతుంది. ఇప్పుడేమో ఉద్యోగంలో చేరింది. బాగా అలిసిపోతోంది. తనకు వల్లకానిపని నెత్తినేసుకుంది (చేయలేదామె).

b) If you try to root out corruption in India, you will be biting off more than you can chew = భారత్‌లో అవినీతిని నిర్మూలించడం వల్లకాని/ సాధ్యంకాని పని నెత్తినేసుకోవడమే (చేయడం).

**8) Be tied up with = 4) Have one's hands full** = తీరిక లేకుండా ఉండటం

a) All officers are tied up with the elections now and are unable to attend to their usual duties = అధికార్లందరూ ఎన్నికలతో తలమున కలుగా ఉన్నారు. మామూలు విధులు పట్టించుకునే స్థితిలో లేరు.

b) I am tied up with my regular job and have no time for earning on the side = నాకున్న ఉద్యోగంతోనే తీరిక లేకుండా ఉన్నా. వేరే విధంగా డబ్బు సంపాదించే సమయం లేదు.

**9) Put on hold** = వాయిదా వేయడం. పని ఆపి ఉంచడం (అడ్డంకుల వల్ల)

a) The government has put on hold some of its projects for want of funds = నిధుల కొరత వల్ల ప్రభుత్వం కొన్ని ప్రాజెక్టులను ప్రస్తుతానికి ఆపి ఉంచింది.

b) His appointment has been put on hold for want of some information = ఏదో కొంత సమాచారం లేకపోవడంతో, అతడి నియామకాన్ని వాయిదా వేశారు.

**10) Put a finger on the problem** = సమస్యను, జబ్బును కచ్చితంగా గుర్తించడం.

a) I know he has some problem but I am not able to put my finger on it = వాడికేదో సమస్య ఉందని తెలుసు, కానీ అది కచ్చితంగా ఇదీ అని చెప్పలేకపోతున్నా.

b) The doctor put the finger on the problem when he said Kumar was over eating = అతిగా తినడమే కుమార్ సమస్యని, డాక్టర్ అతడి సమస్యను కచ్చితంగా చెప్పాడు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# She wishes she were rich





M.SURESAN



**K. Sambasiva Rao, Tanuku**

**Q.** Future plans ను తెలియజేయడానికి simple present, present continuous వాడతాం. ఆ రెండింటి మధ్య తేడా ఏమిటి?

**A.** Future plans ను తెలిపేందుకు కాదు కానీ, future ను తెలిపేందుకు simple present, present continuous వాడతాం. అయితే future లో పని ఎప్పుడు కచ్చితంగా జరుగుతుందో చెప్ప గలిగినప్పుడు అంటే time of future action తెలిసినప్పుడు future actions కు, present simple, present continuous వాడతాం. Will be/ shall be, will/ shall + 1st RDW బదులు.

I will go there soon/ next week. (అంత కచ్చితంగా కాదు)

I am going there tomorrow. (కచ్చితం) (Present continuous)

I meet him, next week. (కచ్చితం)

**Q.** I wish I had a car. ఇలా simple present, simple past కలిసి వస్తాయా?

**A.** I wish I had a car - ఇక్కడ I had a car అన్న ప్పుడు, నాకిప్పుడు car లేదు. Car ఉంటే ఎంత బావుం టుంది అని అనుకోవడం - ఇప్పటివరకూ తీరని కోరిక. ఇలాంటి తీరని కోరికలు తెలిపేటప్పుడు I/ we/ they wish, He/ she wishes అని ప్రారంభించి తర్వాత Past Doing Word (Past simple) వాడతాం.

I wish I attended the function. (ఆ Functionకు నేను వెళితే ఎంత బాగుండేది) - వెళ్లలేదు.

She wishes she were rich = తను ధనికురాలై ఉంటే ఎంత బాగుండేది. అని అనుకుంటోంది.

**Q.** Do forms అనేవి is/ was/ are / were/ am లతో పాటుగా వస్తాయా? What we did was not, perhaps, entirely sporting ఈ వాక్యంలో ఇలా వాడటం కరెక్టేనా?

**A.** What we did was ... ఇక్కడ do form (did)తో was (be form) రావడం లేదు. What we did was not, perhaps, entirely sporting - ఇక్కడ did కు, was కు ఏమీ సంబంధం లేదు. Did ఒక verb, was ఇంకొక verb.

What we did = మేం చేసింది.

Was perhaps not entirely sporting = అంత పూర్తిగా sporting కాదేమో. (Sporting = అంతగా పట్టించుకోకుండా ఉండే తత్వం - దేన్ని గురించయినా సులభంగా కోపం తెచ్చుకోకుండా)

**Q.** Neither ని వాడినప్పుడు Inversion form వస్తుందా రాదా? కింది వాక్యంలో దీని అర్థమేమిటి?

Neither were we. ఈ వాక్యంలో Neither ను subject గా treat చేస్తే we place లో దాని objective form us ఉండాలి కదా?

**A.** Neither ను sentence or clause beginning లో వాడితే Inversion వస్తుంది.

He is not here, neither is his wife (inversion)

They were not told, neither were we. అయితే Neither of అని వచ్చినప్పుడు మాత్రం Inversion రాదు. Neither were we లో, neither subject కాదు, we కదా.

**Q.** Primary purposes ను సూచించేటప్పుడు Post office, Bed, Bustand, Hospital, School, Church etc. లాంటి పదాల ముందు the వాడం. కానీ కింది వాక్యాల్లో వాడారు. ఇలా వాడటం కరెక్టేనా?

1. Why do we go to the Hospital? (for medical checkup).
2. Why do we go to the post office? (We go to the post office to buy stamps and covers).

**A.** ఇక్కడ Primary purpose అనేది కాదు ప్రశ్న. మీరిచ్చిన ప్రశ్నల్లో we అంటే patients అని మాత్రమే కాదు కదా? అయితే మీరు రాసిన sentences మూడూ కూడా సరైనవి కావు. Grammatical గా అవి ఉండాల్సిన విధం:

1) Why do we go to a hospital? (a = any)
 a) For a medical check up.
2) Why do we go to a post office (a = any)

**M. Bharat Kumar, Hyderabad**

**Q.** Which of the following is correct?

1. Suresh went to Hemanth's house (should I indicate time)
2. Suresh went to Hemanth's house yesterday/ day before yesterday.

**A.** Usually when you use the past simple tense for a past action at a definite time, unless it is indicated by the context.

I went to Hemanth's home Yesterday/ the day before yesterday - correct.

I have been to Hemanth's home (no time mentioned) - correct.

Usually 'have gone' is not used with, I, we or you. Instead 'have been' is used.

'Have gone' with I/ we/ you suggests that I am, we/ you are on the way to a place or at that place. Being there, it is impossible for me, us or you to tell people back at the place you've started from, that I/We/ you have gone. So we use 'have been to (a place)' in such circumstances.

**Q.** కింది వాక్యాల్లో ఏది కరెక్టో తెలుపండి.

1. Suresh came to my home.
2. Suresh came to my house.
3. Suresh was at my home.
4. Suresh spent whole of his holidays at my home.

**A.** Suresh came to my home/ my place - correct, and so is

Suresh was at my home (correct).

4) Correct.

**Q.** What is the meaning of below sentence?

My home is at Abids half a km off Grand trunk road.

Is the above sentence indicate Grand trunk road is half a km from Abids or My home is half a km from Grand trunk road.

**A.** My home is at Abids, half a Km distant from the Ground Trunk Road.

**Q.** If we are having visitors, the house will need a good cleaning. Is it correct?

**A.** If we are having visitors, the house will need a good cleaning - correct.

(House-any building where people can live. Home - a place/ house where we live with our family. However, house may sometimes mean the place we live in with our family when we refer to it in a General way.

e.g: We don't find a thing in the house just when we need it.

**Suresh, Devarapalli**

**Q.** As soon as ను ఏయే సందర్భాల్లో వాడవచ్చో వివరించగలరు.

**A.** As soon as = వెంటనే.

As soon as he saw the police he ran away = పోలీసును చూసిన వెంటనే అతడు పారిపోయాడు.

**Q.** Would, could ను ఎప్పుడు ఉపయోగించవచ్చు?

**A.** Would- గతం (Past) నుంచి future ను చెప్పేందుకు వాడతాం.

He said he would help her = ఆమెకు సాయం చేస్తానని అన్నాడు (గతంలో)

Could - Past Ability గతంలో సామర్థ్యాన్ని తెలిపే విధం.

He could be a CM because he had been an actor = అతడు నటుడిగా ఉండేవాడు. అందువల్ల ముఖ్యమంత్రి అవగలిగాడు (గతం - సామర్థ్యం)

**Q.** Might వాడుకను తెలుపగలరు.

**A.** Might - Past form of 'may' (గతంలో జరిగేదేమో - అనే అర్థంతో)

I thought that he might come = అతడు వస్తాడేమో అనుకున్నాను.

Might - ఇప్పుడు (Present లో) బాగా సందేహంగా ఉండే విషయం.

They might help you. Try = వాళ్లు నీకు సాయం చేస్తారేమో (చాలా సందేహం). ప్రయత్నించు.

**Ch. Spandana, Bonala**

**Q.** Conditional sentences Type-I, Type-II, Type-III వీటిని వివరించగలరు.

**A. I. Condition:**

**a) Probable present** If he comes here his mother will be happy = అతడిక్కడికి వస్తే వాళ్లమ్మ సంతోషిస్తుంది (అతడు వచ్చే అవకాశమూ ఉంది, వాళ్లమ్మ సంతోషించే అవకాశమూ ఉంది)- ఇది **Probable present** - ఇప్పుడుగానీ, future లోగానీ జరిగే అవకాశం ఉంది.

గమనించాల్సిన విషయం:

'If' clause/ conditional clause (If he comes here) లో Verb, 'comes', present tense, Main Clause (His mother will feel happy) లో Verb - will feel- future tense. ఇందులో మనం వాడగలిగే ఇతర verb forms.

| **If Clause** | **Main Clause** |
|---|---|
| (Conditional Clause శరతును తెలిపే clause) | (పూర్తి అర్థం ఉండే clause) |
| Am/ is/ are/ I RDW/ II RDW (go/ goes, take/ takes) | Shall/ will/ can/ may. |

**b) Improbable Present Conditional-** ప్రస్తుతం జరగనిది.

i) If he come here, his mother would be happy = అతనిప్పుడు రాడు/ వచ్చే అవకాశం లేదు, రావడం అంటూ జరిగితే, వాళ్లమ్మ సంతోషిస్తుంది (వాడు రానూరాడు, వాళ్లమ్మ సంతోషపడటమూ జరగదు)

ii) If I were a Minister, you would be my P.A. = నేను మంత్రిగా ఉండటం అంటూ జరిగితే (ఇప్పుడు), నువ్వు నా PA గా ఉంటావు/ నిన్ను నా PAగా చేసుకుంటాను (అదీ జరగదు, ఇదీ జరగదు - ఇప్పుడు.)

గమనించండి: If clause లో, 'I' singular అయినా, verb - were (plural). ఇలాంటి సందర్భంలో మనం వాడగలిగిన ఇతర verbs.

| **If Clause** | **Main Clause** |
|---|---|
| (Conditional) were/ PDW (Past doing word- took, went, sang, etc- Past tense forms) | Would/ should/ Could/ might be or Would/ should/ could/ might + 1st RDW (take, go, sing etc) |

**c) Impossible past -** ఇది అయిపోయిన విషయం. అయిపోకుండా ఉంటే ఎంత బాగుండేది, జరగని విషయం, జరిగుంటే ఎంత బాగుండేది - అనే పరిస్థితిలో వాడతాం.

i) If she had started earlier, he would have seen her = ఆమె కాస్త ముందుగా బయల్దేరి ఉంటే, అతడామెను చూసేవాడే. (ఆమె ఆలస్యంగా బయల్దేరింది - అతడామెను చూడలేదు)

ii) If I had been there, I wouldn't have allowed it = నేనక్కడ ఉండి ఉంటే, నేనది జరగనిచ్చేవాడిని కాను. (నేను లేను, అది జరిగిపోయింది). ఇక్కడ మనం వాడగలిగిన ఇతర Verbs.

| **If Clause** | **Main Clause** | |
|---|---|---|
| (Conditional Clause) Had been/ Had + PP (Past Participle) | Would / Should / Could / Might | have been or have + PP |

**Q.** Simple, compound, complex sentences ను గురించి తెలుపగలరు.

**A.** Simple, Compound and Complex sentences.

a) CLAUSE - a group of words with a verb.

eg. If he comes here - ఇది comes అనే verb ఉన్న group of words, కాబట్టి ఇది Clause.

b) Main Clause - పూర్తి అర్థం ఉన్న clause - He knows English.

c) Subordinate Clause- అర్థం పూర్తికాని clause- When he meets you next.

d) No of clauses in a sentence = No. of verbs in the sentence.

He knows that she is here = అతడికి తెలుసు ఆమె ఇక్కడుందని.

ఈ sentence లో రెండు verbs ఉన్నాయి కదా?

1) knows 2) Is అందుకని ఈ sentence లో రెండు clauses - 1) He knows 2) That she is here.

He knows = అతడికి తెలుసు - దీనికి పూర్తి అర్థం ఉంది- Main Clause.

that she is here = ఆమె ఇక్కడ ఉందని- meaning not complete - subordinate clause.

1) ఒకే ఒక main clause ఉన్న sentence - simple sentence అంటే ఒకే verb ఉన్న sentence- simple sentence.

eg: He has a beautiful car - ఇందులో has ఒకే verb కాబట్టి ఒకే clause- అదే main clause - కాబట్టి ఇది simple sentence.

He has a car which is beautiful. ఈ sentence లో రెండు verbs ఉన్నాయి.

-1) has, 2) is అంటే రెండు clauses-

1) He has = అతడికి ఉంది - Main Clause

2) a car which is beautiful - ఏ car అందంగా ఉంటుందో అది (అందమైన car)

- దీనికి అర్థం పూర్తవలేదు- subordinate clause- కాబట్టి ఇది complex sentence- అంటే, subordinate clause ఉన్న sentence complex అన్న మాట.

3) He has a car and it is beautiful - అతడికి car ఉంది. అది అందమైంది. రెండు verbs ఈ sentence లో- అవి, 1) has, 2) is. అంటే రెండు clauses.

a) He has a car = అతడికి car ఉంది. అర్థం పూర్తయింది - main clause.

b) and it is beautiful = అది అందమైంది. దీనికి అర్థం పూర్తయింది - ఇదీ main clause.

ఈ sentence లో రెండు main clauses రెండు అంతకంటే ఎక్కువ clauses ఉంటే అది compound sentence. చూడండి:

ఒకే Main Clause - Simple sentence.

One main Clause + 1 or more subordinate clauses - Complex sentence.

2 or more main clauses - Compound sentence.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# Think nothing of something






M.SURESAN

**Suyodh:** Hi you appear to be very busy.
(చాలా తీరిక లేకుండా ఉన్నట్టున్నావు? )

**Sukeerthi:** You can say that. I've been working at this problem tidying up since yesterday and still have a lot more to do.
(అవును నిజమే. ఈ సమస్య గురించి నిన్నటి నుంచి సతమతమవుతున్నా. ఇంకా చేయాల్సింది చాలా ఉంది.)

**Suyodh:** Certainly you are going all out to make the house look attractive, but you know, an old house is an old house.
(ఈ ఇంటిని అందంగా చేయాలని అన్ని ప్రయత్నాలూ చేస్తున్నావు. కానీ పాత ఇల్లు పాత ఇల్లే కదా? )

**Sukeerthi:** The house is old, true, but it is spacious and airy. No new building can match it in comfort and convenience.
(ఇల్లు పాతదే. అయితే చాలా విశాలమైంది, గాలీ వెలుతురు బాగా వచ్చేదీను. సౌఖ్యం, సౌకర్యాల్లో కొత్త కట్టడాలేవీ దీనికి సాటిరావు.)

**Suyodh:** You seem to be thinking a world of your place. You don't mind going to any length to keep it neat and tidy.
(మీ ఇల్లంటే నీకెంతో గొప్ప అభిప్రాయం ఉన్నట్టుంది. దాన్ని శుభ్రంగా, అమరికగా ఉంచేందుకు ఎంత శ్రమైనా పడేందుకు నీకభ్యంతరం లేదు.)

**Sukeerthi:** I find real pleasure in it. It's a labour of love for me.
(అవును. నిజమే. ఇల్లు సర్దడం నాకిష్టమైన శ్రమ.)

**Suyodh:** How different we are, though so close! You think nothing of it whereas I just can't even think of doing it.
(అంత సన్నిహితులమైన మనలో ఎంత తేడా! ఇల్లు సర్దడం నువ్వు చిటికలో చేసేపనిగా అనుకుంటావు. నాకేమో ఆ ఆలోచనేరాదు.)

**Sukeerthi:** It all depends on how you look at it. Your place looks spick and span as well. Your sister is there to do it up, even if you don't.
(ఏదైనా మనం దాన్ని గురించి అనుకునే దాన్నిబట్టి ఉంటుంది. (కష్టం అనుకుంటే కష్టం, సులభం అనుకుంటే సులభం.) మీ ఇల్లు కూడా అద్దంలా శుభ్రంగా ఉంటుంది. నువ్వు చేయకపోయినా మీ అక్క ఉంది కదా ఇల్లు శుభ్రంగా ఉంచేందుకు.)

**Suyodh:** You are right there. Sister some how squeezes it into her tight work. I am really surprised.
(నిజమే. ఎంత తీరికలేకున్నా, అక్క ఆ పనికి మాత్రం ఎలాగో ఒకలా కొంత సమయం ఇస్తుంది.)

**Sukeerthi:** That only shows 'where there is a will, there is a way.'
(అందువల్ల తెలిసేది ఏమిటంటే.. మన సుంటే మార్గం ఉంటుందని.)

**Suyodh:** She asks me to help her, but never find myself upto it. Just to please her, I put on an act of tidying up. She is too smart to be taken in and tells me off, and to get out.
(తనకు సాయపడమని నన్నడుగుతుంది, కానీ ఆపని మాత్రం చేసే ఓపిక నాకు లేదు. అందు కని ఏదో చేసినట్టు నటిస్తా, అంత మోసపోయేంత తెలివిలేనిది కాదు ఆమె. దాంతో నన్ను తిట్టి వెళ్లిపొమ్మంటుంది.)

**Sukeerthi:** That's really bad of you. You ought to help her.
(అది తప్పు. నువ్వామెకు సాయపడాలి.)

**Suyodh:** Oh, No. That's not my cup of tea, whatever you say.
(ఆ. నావల్లకాదు. నువ్వేమన్నా అను. నాకిష్టం లేని పని అది.)

**Sukeerthi:** Suit yourself.
(సరే. నీ ఇష్టం)

o o o

మన నిత్యజీవితంలో చాలామందికి అర్థమయ్యే Phrasal verbs/ idioms ను గురించి ఇప్పుడు తెలుసుకుందాం. వీటితో Spoken English చాలా సహజంగా, అప్రయత్నంగా మాట్లాడుతున్నట్టు అనిపిస్తుంది.

***Look at the following expressions from the conversation above:***

1) You certainly go all out to ....
2) You seem to be thinking a world of your place.
3) You don't mind going to any length ....
4) It's a labour of love for me
5) You think nothing of it.
6) Your place looks spick and span.
7) Your sister is there to do it up.
8) Sister somehow squeezes it into her tight work.
9) I never find myself up to it.

ఇప్పుడు పైన underline చేసిన Phrasal verbs/ idioms అర్థం, వాటి ఉపయోగం చూద్దాం:

మీరు గమనించే ఉంటారు. పై expressions అన్నీ కూడా పనికి, శ్రమకు, ఇంటి శుభ్రతకూ సంబంధించినవని. ఇప్పుడు చూద్దాం.

**1) Go all out to =** ఏదైనా సాధించేందుకు ఎంత శ్రమకైనా సిద్ధపడటం.

a) Gandhi would go all out to make peace even with the worst enemy = బద్ధ శత్రువుతో శాంతి కుదుర్చుకునేందుకు గాంధీ ఎంత శ్రమకైనా వెనుకాడేవారు కాదు.

He went all out to get his party ticket to stand for the election = ఎన్నికల్లో పోటీ చేసేందుకు తన party ticket పొందేందుకు ఎంతో శ్రమపడ్డాడు.

**2) Think a world of =** ఒకరిని గురించి, ఒకదాన్ని గురించి మనకు చాలా గొప్ప అభిప్రాయం ఉండటం.

a) He thinks a world of his son who isn't all that great = తన కొడుకును గురించి ఆయన ఎంతో గొప్పగా అనుకుంటాడు. అతనేం అంత గొప్పవాడు కాదు.

b) She thinks a world of her ability to dance = తన నాట్య ప్రతిభను గురించి ఆమెకు చాలా గొప్ప అభిప్రాయమే ఉంది.

దీనికున్న అర్థంతోనే ఇంకో expression 'think no end of' (చాలా గొప్పగా అనుకోవడం).

She thinks no end of her talent as a singer. గాయనిగా తన ప్రతిభను గురించి ఆమె ఎంతో గొప్పగా అనుకుంటుంది/ గర్వంగా అనుకుంటుంది.

**3) Go to any lengths/ go to great lengths =** మనం సాధించాలనుకున్నదాన్ని సాధించేందుకు ఎంత శ్రమకైనా సిద్ధపడటం.

a) Now a days parents go to any length/ great lengths to educate their children = తమ పిల్లల్ని చదివించుకునేందుకు నేటి తల్లిదండ్రులు ఎంత శ్రమకైనా వెనుకాడటం లేదు.

b) He did go to great lengths to make a mark as a film actor but could not succeed = చిత్ర (cinema) కళలో పేరు పొందేందుకు ఎంతో శ్రమపడ్డాడు కానీ విజయం పొందలేదు.

**4) Think nothing of something =** To find something very easy = ఏ పనినైనా చాలా సులభంగా అనుకోవడం.

a) Politicians think nothing of swallowing public funds = ప్రజాధనాన్ని మింగడం చాలా సులభమైందిగా/ అంత అసాధారణమైన విషయంగా అనుకోరు.

b) I find it difficult to travel long distances, whereas my sister thinks nothing of it = నాకేమో దూర ప్రయాణాలంటే కష్టం అనిపిస్తుంది, మా అక్కయ్య అది సులభంగా తీసుకుంటుంది.

**6) spick and span =** అత్యంత పరిశుభ్రమైన, ముఖ్యంగా ఇళ్లు, బిల్డింగులు లాంటివి. ఇది చాలా ఉపయోగకరమైన మాట (మీ సంభాషణలో వాడండి).

a) What if their house is small? They keep it spick and span = వాళ్ల ఇల్లు చిన్నదైతేనేంటి? చాలా చక్కగా అద్దంలా పరిశుభ్రంగా ఉంచుకుంటారు.

b) Everything about the studio is spick and span; not even a speek of dust anywhere = ఆ స్టూడియో చాలా పరిశుభ్రంగా ఉంటుంది. ఎక్కడా దుమ్ము కణం అనేది కనిపించదు.

speek = చాలా చిన్న ముక్క.

A speek in the ocean = మహా సముద్రంలో చాలా చిన్న వస్తువు.

**7) Do up =** ఇల్లు లాంటివి పరిశుభ్రంగా ఉంచేందుకు సర్దడం.

a) I cannot start now. I have to do up the home before I leave = ఇప్పుడే బయల్దేరలేను. బయల్దేరే ముందు ఇల్లంతా శుభ్రం చేయాలి.

b) The house hasn't been done up = ఇల్లు సర్దినట్లుగా కనపడటంలేదు. వస్తువులంతా చిందర వందరగా పడి ఉన్నాయి.

Do up the bed = పక్క సర్దడం. Do up hair = స్త్రీలు జుట్టు సవరించి neat గా జడవేసుకోవడం / అలంకరించుకోవడం.

a) Find oneself upto something = ఒక పని చేసేందుకు సంసిద్ధత/ మనసు ఉండటం.

b) I don't feel up to telling the parents that their child's condition is serious = ఆ తల్లిదండ్రులకు తమ బిడ్డ పరిస్థితి చాలా తీవ్రంగా ఉందని చెప్పేందుకు మనస్కరించడంలేదు.

c) I don't feel upto standing in the long queue for a movie ticket = సినిమా టికెట్ కోసం అంత పొడవైన క్యూలో నిలబడటం నావల్లకాదు.

ఈ feel up to ఎక్కువగా not తోనే వాడతాం - సిద్ధంగా లేకపోవడం/ ఇష్టంలేదనే అర్థంతో.



**Suresh, Devarapalli**

**Q.** Talk, said ల మధ్య తేడా ఏమిటి?

**A.** Talk = మాట్లాడటం
Say = చెప్పడం

**Q.** While ను ఎప్పుడు ఉపయోగించాలి?

**A.** While - 1) రెండు పనులను ప్రస్తావిస్తూ ఒకటి జరిగినప్పుడు ఇంకొకటి జరగడాన్ని తెలిపేందుకు వాడతాం.

a) While his parents toiled, he enjoyed himself= వాళ్ల తల్లిదండ్రులు కష్టపడుతున్నప్పుడు/ కష్టపడుతుంటే, అతడేమో జల్సా చేసుకునేవాడు. (Toil = కష్టపడి పనిచేయడం/ శ్రమించడం)

b) While they are putting themselves to such trouble, you are laughing at them = అంత ప్రయాస వాళ్లు పడుతుంటే/ పడుతున్నప్పుడు నువ్వు నవ్వుతున్నావు.

**Q.** Neither (or) nor అర్థాన్ని ఉదాహరణతో వివరించగలరు.

**A.** Neither... nor = అదీలేదు/ ఇదీలేదు.
Neither my friends nor I am interested in it = దానిలో ఆసక్తి నాకూ లేదు, నా స్నేహితులకూ లేదు.

**M.Chandrashekar, Srikalahasti**

**Q.** Will తో ఒక వాక్యం ఉన్నప్పుడు అది నిర్ణయమో, ఉద్దేశమో ఎలా తెలుసుకోవాలి? తేడాను తెలియజేయగలరు.

**A.** I/ we లో will వాడినప్పుడే నిర్ణయం/ ఉద్దేశాన్ని తెలుపుతుంది.
eg: I will buy the car whatever the price = ధర ఎంతైనా ఆ car ను నేను కొంటాను/ కొని తీరతాను (నిర్ణయం).
We will meet him (అతడిని మేం కలుసుకుంటాం.) - Intention (ఉద్దేశం) - మాకు అతడిని కలుసుకునే ఉద్దేశం ఉంది.

**B. Venkatesh, Kovvur**

**Q.** కింది వాక్యాలను తెలుగులో తెలుపగలరు. అలాగే వాక్యాలు సరైనవో, కావో వివరించగలరు.

- I will be happy to see him.

**A.** అతడిని కలుసుకునేందుకు/ చూడ్డానికి నాకు సంతోషం (కలుసుకోలేదు ఇంకా). కరెక్టే.

- He shall be here tomorrow.
అతడు రేపు ఇక్కడ కచ్చితంగా ఉంటాడు. కరెక్టే.
- When shall you come next week.
ఇది తప్పు. సామాన్యంగా you/ he/ she/ it and they తో shall questions లో వాడం.
- She shall help you.
ఆమె నీకు సాయం చేయాలి (అంత సరికాదు).
- When shall you be free?
When will you be free? అంటే correct
- I will come next week.
Correct
- I shall try it.
I shall try it - correct.
- We will meet again tomorrow.
ఇది కరెక్టే.
- It will not be sir.
(సందర్భాన్ని బట్టి) correct.
- She will have my help.
Correct.

Shall and will గురించి lessons 1-20 లో వివరించాం, చూడండి.

**K.L.N.Rao, Tenalai**

**Q.** Did you think su-do-ku easy?
ఈ వాక్యంలో Did వాడటం కరెక్టేనా?

**A.** కరెక్టే. సామాన్యంగా, అలా అనుకున్నావా? ఇది నీకు తెలుసా? అనే అర్థంతో. Did you think it was easy? Did you know.......? అని past form, 'did' వాడతాం. ఇది usage, దీనికి grammar rule apply కాదు.
'Did you know it?' - ఇది నీకు తెలుసా? అని challenge గా అడగటం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# There is zero tolerance in some countries





M.SURESAN



**T. Venkateswara Rao, Repalle**

**Q.** 1. Do, make ల మధ్య తేడాను తెలుపండి.

**A.** Do , make తేడా:

Do అంటే ముఖ్యంగా ఏదయినా పనిచేయడం.

e.g: Have nothing to do = ఖాళీగా ఉండటం, ఏం పనిలేక.

do a job = పని/ ఉద్యోగం చేయడం.

do cooking, cleaning etc (ఆ పనులు చేయడం).

make = ముఖ్యంగా తయారుచేయడం. Make Cement (సిమెంట్ కంపెనీలు)/ make chapathis (తయారుచేయడం)/ Make clear (స్పష్టం చేయడం)/ Make a noise (do noise అనం కదా? )/ make a decision (నిర్ణయం చేయడం/ తీసుకోవడం)

**Q.** Let we go అనవచ్చా? Let us go కు Let we go కు తేడా ఏమిటి?

**A.** Let we go సరికాదు. Let తర్వాత me/ us/ him/ her/ it/ them వస్తాయి. I/ we/ he/ she/ they రావు.

**Q.** Spoken English కు సంబంధించి ఏ dictionary మంచిది?

**A.** Spoken English dictionary అంటూ ప్రత్యేకంగా లేవు.

**L.S.N.Murthy, Hyderabad**

**Q.** అడ్రస్ చేసేటప్పుడు మగ వారికి chairman అంటాం. ఆడవారికి chairperson అంటాం. Chairwoman అని ఎందుకు అనకూడదు?

**A.** Chairwoman అనకూడదని ఏమీలేదు. అనవచ్చు తప్పేంకాదు. అయితే శతాబ్దాల తరబడి woman అంటే ఏ స్త్రీకైనా, lady అంటే ఉన్నత తరగతికి చెందిన, గౌరవనీయురాలైన స్త్రీ అనే భావం ఉన్నందున చాలా మంది Chairwoman బదులు Chairperson ఎక్కువగా వాడతారు.

**Q.** టైమ్ తెలుపుతున్నప్పుడు 4 a.m. అనాలా లేదా 4 A.M. అనాలా?

**A.** a.m. (రాత్రి 12 నుంచి పగలు 12 వరకు) British. A.M. - American. అయితే A.M. బదులు AM అని కూడా రాయొచ్చు

**B. Srinivasa Rao, Visakhapatnam**

**Q.** 'On' 'to' ఈ రెండు prepositions ను వెంట, వెంటనే ఎలాంటి సందర్భాల్లో ఉపయోగించవచ్చు?

**A.** on to - on + infinitive form లో ఎక్కువ వాడతాం.

e.g: He went on to describe something = ఇంకేదో చేసింతర్వాత, దాన్ని వర్ణించడం మొదలు పెట్టాడు.

She went on to sing, after making the speech = ఉపన్యాసం తర్వాత పాడటం మొదలు పెట్టింది.

First to Kolkata and then on to Guahati = మొదట కోల్‌కతాకు, ఆ తర్వాత గౌహతికి.

**K. Chandu, Sirisilla**

**Q.** Soon after, immediately after, at once లను ఏయే అర్థాలతో, ఏ విధంగా వాడతారో వివరించగలరు.

**A.** Soon after = ఒక పనయిన కొద్దిసేపట్లోనే.

Soon after he arrived here, he went to see his friend = ఇక్కడికి చేరిన కాస్సేపట్లోనే తన స్నేహితుడ్ని కలవడానికి వెళ్లాడు.

Immediately after = వెనువెంటనే/ తక్షణమే

Immediately after buying the car, he went to temple = car కొన్న వెంటనే/ తక్షణమే గుడికెళ్లాడు.

At once = immediately = వెనువెంటనే.

I gave him the money, at once he left = అతడికి డబ్బిచ్చాను వెంటనే వెళ్లిపోయాడు = I gave him the money and he left immediately.

**Q.** Dare, need, ought లకు past forms ఉన్నాయా? ఉంటే అవేంటో తెలుపగలరు. వీటి ఉపయోగాలను కూడా వివరించగలరు.

**A.** ఉన్నాయి. e.g: a) He did not dare to face her = ఆమె ఎదురుపడే ధైర్యం అతడికిలేకపోయింది. (ఇతర tenses లో కూడా ఇలా వాడవచ్చు)

b) I did not need to go to Chennai to meet him. He happened to be here when I wanted to see him = చెన్నైకి వెళ్లాల్సిన అవసరం లేకపోయింది. నేనతడిని కలవాలనుకున్నప్పుడు అతడిక్కడే ఉన్నాడు.

c) You ought not do such things = అలాంటి పనులు చేయడం సరికాదు/ నీతికాదు (Present Tense)

You ought not to have done it = నువ్వలాంటి పని చేసుండాల్సింది కాదు. (Past).

**K. Aravind, Kandukur**

**Q.** జీరో టాలరెన్స్ అంటే ఏమిటి?

**A.** ఎంతమాత్రం సహించకపోవడం, చట్టాల ఉల్లంఘనను/ చిన్నచిన్న తప్పుల్ని కూడా.

e.g: There is zero tolerance in some of the gulf countries = గల్ఫ్ దేశాలలో చట్టాల ఉల్లంఘనను ఏమాత్రమూ సహించరు - కఠిన శిక్షలు విధిస్తారు - చిన్నచిన్న తప్పిదాలక్కూడా.

**Janardhanara Rao, Bangalore**

**Q.** I had haven't money because I didn't study M.A. in English literature since 2003. 2003లో నా దగ్గర డబ్బులు లేనందున ఎం.ఎ. ఇంగ్లిష్ చదవలేకపోయాను. పై ఇంగ్లిష్ వాక్యానికి తెలుగు అర్థం కరెక్టేనా?

**A.** I haven't had enough money since 2003, so I didn't study M.A. English Literature - ఇదీ సరైన sentence మీ భావానికి.

**Q.** How are you వదిన? వదినను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** వదిన = sister-in-law

**Q.** I will have been studying an MLISC since 2007. Future perfect continuous లో since రాదా?

**A.** I will have been studying MA English since 2009, ఈ వాక్యం correct కావచ్చు కానీ అంత వాడుకలో లేదు.

**Q.** As soon as, no sooner than, as long as etc., వీటిని వివరించగలరు.

**A.** As soon as = No sooner than = వెనువెంటనే

As long as = ఒక విషయం జరుగుతున్నంతసేపూ/ జరిగినంతసేపూ.

a) As long as you stay here you can use my car = నువ్విక్కడున్నంతసేపూ నా car వాడుకో వచ్చు

b) As long as he was there we couldn't do anything = అతడక్కడున్నంతసేపూ మనమేం చేయలేకపోయాం.

**N. Pentaiah, Aliabad**

**Q.** కింది వాక్యాల్లో ఒకటో వాక్యం సరైనది అని తెలిపారు. భవిష్యత్తుకు am బదులు will వాడాలి కదా. దయచేసి వివరించగలరు

1. Don't worry if I am late tonight.
2. Don't worry when I am late tonight.
3. Don't worry when I will be late tonight.
4. Don't worry if I will be late tonight.

**A.** If I am late tonight అనేది conditional clause అవుతుంది.

clause - a group of words with a verb

conditional clause - A clause expressing a condition = ఒక షరతును తెలిపే clause - నేను రాత్రి ఆలస్యమైతే - ఇక్కడ అయిన పక్షంలో అని condition ను తెలుపుతోంది కాబట్టి ఇది conditional clause.

Rule: No future tense in conditional clause - conditional clause లో future tense, అంటే, will, shall లాంటివి రావు.

**J. Mahesh, Penta (Srikakulam)**

**Q.** I am a boy, aren't I? అన్నవాక్యానికి question tag ఒకచోట I am a boy, amn't I? అని మరో చోట I am a boy, aren't I? అని ఉంది. రెండింటిలో ఏది కరెక్టు ?

**A.** Am ఎప్పుడు question tag లో వచ్చినా Aren't I? అవుతుంది. కాబట్టి I am a boy, aren't I? అనడమే correct.

I am young, aren't I?

అయితే, 'I am not bad' అని stem (Question tag ఉండే senstence లో statement భాగం) ఉంటే, మళ్లీ question tag, 'Am I?' అనడమే correct.

I am not bad, am I?

I am not short, am I? ఇక్కడ are I? అనం.

**G. Padmavathi, Vizianagaram**

**Q.** నువ్విప్పుడు అతడిని కలుసుకోవడం మంచిది అతడు రాజీనామా చేయబోతున్నాడు. ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో You had better to meet him now, He is about to resign అని రాశారు. ఈ వాక్యం తక్షణ వర్తమానాన్ని సూచిస్తుంది. మీరు had better వాడారు. Had గతించిన విషయాలను సూచిస్తుంది కదా. పై వాక్యం ఎలా కరెక్టు అవుతుంది?

**A.** You had better meet him now (you had better to meet him now కాదు).

He is about to resign - ఇక్కడ had better, future ను సూచిస్తుందే కానీ, past ను కాదు - had అని ఉన్నప్పటికీ. ఏం చేస్తే బాగుంటుంది అనిగానీ, ఏం చేయాలి/ ఏం చేయాల్సిన అవసరం ఉంది అనిగానీ చెప్పేందుకు had better వాడతాం. ఇది భాషలో వాడుకకు (usage) కు సంబంధించిన విషయం. కాబట్టి tenses rules ఇక్కడ వర్తించవు.

**Q.** వాక్యాన్ని never, rarely, often, no sooner, hardly లాంటి మాటలతో ప్రారంభించినప్పుడు లేదా ఇలాంటి మాటలు వచ్చినప్పుడు inversions వస్తాయని తెలిపారు. ఉదా:

I rarely meet him
- Rarely do I meet him.

As soon as I come in
- No sooner do I come in.

I can never understand him
- Never can I understand him.

Inversion అంటే ఏమిటి? Inversion లో సూచించిన వాక్యాలు Affirmative, Interrogative sentences లో ఏవి అవుతాయి? Inversion లో పేర్కొన్న వాక్యాలకు తెలుగులో అర్థాలు తెలుపగలరు.

**A.** Inversion అంటే 'తలకిందులు' అని అర్థం. statement (Assertive sentence) లో, subject ముందు, తర్వాత verb (sub+vb) వస్తాయి.

అయితే statement ను మనం, No sooner... than, rarely, never లాంటి adverbs తో ప్రారంభించినప్పుడు, statement (Assertive sentence) లో ఉండే, subject + verb order తలకిందులై, verb + subject గా వస్తుంది. అయితే, ఇక్కడ verb ను ఒక్క verb గా కాకుండా, దాని Helping/ Auxiliary verb, Main verb గా విడదీసి వాటిమధ్యలో subject ఉంచుతాం.

a) No sooner did he come/ had he come here, Than he met the officer

(Did he come = He came)

b) Never does he lie = He never lies (lies = does lie)

c) Rarely did he meet her = He rarely meet her (met = did meet)

**Q.** Rather, rather than పదాల వాడకం తెలుపగలరు.

**A.** **Rather** - మనకు నచ్చని విషయం కాస్త ఎక్కువగానే ఉందనిపిస్తే rather అంటాం. కాస్త అనే అర్థంతో.

a) The movie is rather dull - ఆ సినిమా కాస్త విసుగే/ అంతేం బాగాలేదు.

b) The book is rather expensive = ఆ పుస్తకం కాస్త ఖరీదైందే.

c) I am rather tired = నేను కాస్త అలిసిపోయా.

**Rather than: Prefer to** = ఒకదానికంటే ఇంకోటి ఇష్టపడటం.

i) I'd rather watch the match on the TV than go to the play ground = క్రీడాస్థలికి వెళ్లి చూసేందుకంటే, ఇంట్లో టీవీలో చూసేందుకు నేను ఇష్టపడతాను.

ii) I'd rather die than tell a lie = చావనైనా చస్తాగానీ అబద్ధం చెప్పను.

**S.G.Syamsunder, Metpalli**

**Q.** 1. The C.M. will arrive Nellore.
2. The C.M. arrives Nellore.
3. The C.M. is arriving Nellore.
4. The C.M. is going to arrive Nellore.
5. The C.M. is about to arrive Nellore.

పై వాక్యాలన్నీ భవిష్యత్తును తెలుపుతాయి. వాటి మధ్య తేడా, ప్రత్యేకతలను వివరించగలరు.

**A.** 1. The CM will arrive in Nellore - ఇది indefinite future- అంత కచ్చితంకాని future action ను తెలుతుంది.

2. The CM arrives in Nellore - ఇది Newspaper head lines లలో మాత్రమే వాడతారు - ఇది దాదాపు ఎప్పుడూ immediate past action, అంటే ఇప్పుడే జరిగిపోయిన past ను తెలిపేందుకు journalism (Newspapers) లోనే వాడతారు. అయితే, The CM arrives tomorrow/ day after tomorrow/ coming wednesday అని time తెలుపగలిగితే అది future లో కచ్చితంగా జరుగుతుందని అనుకునే విషయానికి వాడతాం.

3. ...is arriving in Nellore= నెల్లూరుకు చేరుతున్నారు/ చేరబోతున్నారు- ఇప్పుడు జరుగుతున్న/ వెంటనే జరగబోయే విషయం.

4. The CM is going to arrive = వచ్చేస్తున్నారు- కచ్చితంగా జరగబోతున్న విషయం.

5. ...is about to arrive = ... దాదాపు వచ్చేశారు - వచ్చేస్తున్నారు - ఇక కొద్ది క్షణాల్లో జరిగే విషయం.

**Gowri Naidu, Anakapally**

**Q.** Gowri has been playing cricket since 7.00 am.

Gowri has been playing cricket from 7.00 am.

పై రెండు వాక్యాల మధ్య తేడా ఏమిటి? From, since లను ఏయే tenses లో ఉపయోగిస్తారో తెలుపగలరు.

**A.** Has been playing / Has played లాంటి present perfect continuous / present perfect tense లో ఉన్న verbs తో 'since' మాత్రమే వాడతాం, from వాడం. అంటే గతం (past) లో ఒక సమయం నుంచి అనేందుకు since మాత్రమేకానీ from వాడం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

ప్రతిభ

# I make coffee every morning



◆ **Jaypee Rao, Tirupati.**

**Q.** 'Admissions are open' ఇది ఏ tense? Simple present అయితే, sub + verb + ing + obj pattern ప్రకారం లేదు కదా? ఎందువల్ల?

**A.** ఇక్కడ open (జరుగుతున్న/ తెరచి ఉన్న) adjective, verb కాదు. కాబట్టి tense ప్రసక్తిలేదు.

They open shop at 9 every morning ఇక్కడ open (తెరవడం అనే అర్థంతో) verb అవుతుంది, Tense - simple present. అలాగే He opens shop లో opens, simple present. Simple present లో +ing form రాదు కదా? అలా వచ్చేది continuous tenses లోనే కదా?

◆ **N. రాధాకృష్ణ, ఏటుకూరు.**

**Q.** మీరు చెప్పిన కొన్ని వాక్యాలపై సందేహాలున్నాయి. వివరించగలరు.

1. Leela told me yesterday she had bought some sarees...
2. She told me the day before she had given away most of them.
3. Prasanth told me that you had bought a bike

మొదటి రెండు వాక్యాలూ past perfect లో చెప్పారు. కానీ, అవి indirect speech లో కూడా ఉన్నట్లే కదా? that ఎందుకు వాడలేదు? మూడో వాక్యం past perfect లోనే చెప్పవచ్చు కదా? that ఎందుకు వాడారు? ఏయే సందర్భాల్లో వాడాలి?

**A.** ఇలాంటి sentences లో that వాడినా ఒకటే, వాడకపోయినా ఒకటే. Spoken English లో అయితే, that దాదాపు వాడం.

◆ **Y. Raju, Kotapadu, Vizag**

**Q.** As if - As though ల మధ్య తేడా ఏమిటి? ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తాం? Lest ని ఎలా వాడతాం?

**A. As if** = As though = అయినట్లు, కానీ కాదు

a) He speaks as if/ as though he were clever = తనేదో పెద్ద తెలివైనవాడిలా (కానీ కాదు) మాట్లాడతాడు.

b) She behaves as if/ as though she knew everything = తనకే అంతా తెలిసినట్లు (ఏమీ తెలియనప్పటికీ) ప్రవర్తిస్తుందామె.

ఇక్కడ గమనించాల్సింది. As if/ as though తర్వాత, was/ were, past tense forms రావడం, were- British, was- American

**Lest** = అలా కాకుండా ఉండేందుకు (so that... not అనే అర్థంతో)

Start early lest you (should) miss the train = Train తప్పిపోకుండా ఉండేందుకు త్వరగా బయల్దేరు = Start early so that you may not miss the train.

Lest తర్వాత ఎప్పుడూ should వస్తే వస్తుంది, లేకుంటే రాకపోవచ్చు కానీ will/ may/ can లాంటివి రావు.

◆ **Srinivas Sangoju, Husnabad.**

Q. You have told 'The bus is come' is right. How can it be sir? In my view the sentence is in passive voice. But all the verbs do not have passive form. Only transitive verbs have passive form. 'Come' is intransitive verb. How can we change it into passive?

**A.** He is come/ They are come are, like He is gone/ they are gone.. is not uncommon in Spoken English. Here 'is come' is not in passive. 'Come' here is more or less indicative of the state in which 'he' is.

◆ **D.V. Narayana Rao, Gollapudi.**

**Q.** గతంలో మీరు ఒక సమాధానంలో take off your feet from on the table అని పేర్కొన్నారు. ఇక్కడ రెండు prepositions ఉండాలా? Take off your feet from the table అంటే సరిపోతుంది కదా? Shall we call it a day అంటే ఏమిటి?

**A.** From the table = table దగ్గర నుంచి.

From on the table = table మీదనుంచి.

Shall we call it a day? = ఇవాళ్టికి ఇక ముగించుదామా? / ఆపేద్దామా?

◆ **Tenali Parvathalu, Nagar Kurnool.**

**Q.** ఏదైనా సమావేశంలో ఇద్దరికంటే ఎక్కువమంది ఉన్నప్పుడు వారిని wish చేయాలనుకుంటే 'Good mornings sirs' అనాలా? లేదా 'sir' అనాలా?

**A.** Good Morning Sirs అనే అనాలి.

◆ **P. Rambabu, Kadapa.**

**Q.** ఆంగ్ల దినపత్రికలో కళ్లకు సంబంధించిన ఒక advertisment లో ఒక అమ్మాయి ఇలా అంటుంది..

'I never realised I had got used to seeing an unclear world. No more compromising on clear vision now'. ఈ వాక్యాలకు అర్థాన్ని వివరించగలరు.

**A.** అస్పష్టంగా ప్రపంచాన్ని చూస్తూ, అదంతేనేమోనని దానికలవాటుపడిపోయానన్న విషయం నేను గ్రహించలేదు. స్పష్టమైన చూపుకావాలనే విషయంలో రాజీపడే ప్రసక్తేలేదు.





M.SURESAN

◆ **P. Trimurthulu, Bhimavaram.**

**Q.** 1. Letters రాసేటప్పుడు సంబోధనలో 'Respected sir' అని రాయకూడదా?

2. నాకు శ్రద్ధ ఉంది అనడానికి I am interested అన్నారు. ఇది passive voice లో ఉంది కదా? I interested కి I am interested కి అర్థంలో తేడా ఏమిటి?

**A.** 1. Sir అనడంలో కావాల్సినంత respect ఉంది, అందుకని respected sir అనడం అనవసరం, సరైన English కూడా కాదు.

2. I am interested లో interested అనేది past participle అయినప్పటికీ దాన్ని మనం passive గా తీసుకోవడానికి కారణం- ఇక్కడ interested అంటే శ్రద్ధ ఉన్న అని అర్థం. ఆ అర్థంతో adjective గా వాడతాం. (I am interested = నేను శ్రద్ధ ఉన్నవాణ్నిగా ఉన్నాను) - I am tall లో tall లా. (అదీ adjective)

I interested = నేను శ్రద్ధకలుగజేశాను.

I interested him in maths = అతడికి maths లో శ్రద్ధ కలిగించాను. ఇక్కడ interest I Doing Word.

Her action interests me = ఆమె నటన నాకు శ్రద్ధ కలుగజేస్తుంది.

She interested him = ఆమె అతనిలో శ్రద్ధ కలుగజేసింది.

◆ **A. Krishna Gitarjuna, Nidadavolu.**

**Q.** Abide, awake, choose, come, give, hide, make, take, ate ఇలా మరెన్నో పదాల్లో చివర vowel - 'e' ఉన్నా, పొల్లుగానే ఉచ్చరిస్తున్నారు.

pen, lend, send, mend, tender లలో vowel 'e' వల్ల 'ఎ' కారంతో pe, le, se, me, te, nde ఉచ్చరిస్తున్నారు.

Temple లో మొదటి, చివరి 'e' లు పనులు వేర్వేరుగా ఉన్నాయి. మొదటి పదాల్లో vowel గా ఉన్నా, డ్, క్, జ్, మ్ లుగానే ఉన్నాయి తప్ప సిలబ్ల్ (syllable) కాలేదు. రెండో వరుస పదాల్లో vowel అదే e వల్ల సిలబ్ల్ అయింది. మరి ఇలా వేర్వేరు పనులు చేస్తున్నప్పుడు e ని పూర్తి స్థాయి vowel గా పరిగణించవచ్చా? vowel ప్రాధాన్యం లేనప్పుడు ముందు ఉదహరించిన పదాల్లో e రాయకపోతే తప్పుగా పరిగణించాలా లేక ఇవి స్టాండర్డ్ స్పెల్లింగ్‌లా? Temple లో t 'e' వల్ల syllable కాగలిగింది. కానీ, అదే పదంలో mple syllable కాలేకపోయింది కదా? దీనికి ఏదైనా రహస్య సూత్రం ఉందా? తెలుపగలరు.

**A.** మీరు ఇచ్చిన పదాల్లో చిట్టచివర 'e' ఉన్న పొల్లు రావడం, English వాళ్ళు వాళ్ళ భాషను ఉచ్చరించే అలవాటును బట్టి వచ్చింది. English లో అచ్చం English మాటలతో పాటు Latin, French లాంటి భాషల్లోంచి వచ్చినవి చాలా ఉన్నాయి. English వాళ్ళ అలవాటు మాటలోని మొదటి syllable ను ఎక్కువగా నొక్కి పలకడం. అందువల్ల మాట చివరి శబ్దం, బలహీనపడి, పొల్లుగా మారిపోతుంది. ఉదాహరణకు April ను Old English లో Aprille- ఏప్రిల అనే వాళ్ళు. అయితే 'ఏప్రిల'లోని 'ఏ' (First syllable) ను ఎక్కువ నొక్కి పలకడంతో అది April (ఏప్రిల్) అయిపోయింది. తెలుగులో కూడా చూడండి. పేట అని చివర వచ్చే స్థలాల పేర్లను, పేట అని కాకుండా, పేట్ అంటుంటాం (eg: Ameerpet, Amberpet, Governorpet, etc). మీరు చూపించిన పదం విషయంలో జరిగిందదే. ఉచ్చారణ మారింది, spelling అలాగే ఉండిపోయింది.

Temple మీరనుకుంటున్నట్లు, ఒకే syllable ఉన్న మాట కాదు. Temple లో రెండు syllables ఉన్నాయి. 1) Tem 2) Ple. Syllable ను spelling బట్టి కాకుండా pronunciation ను బట్టి నిర్ణయిస్తాం.

eg: Choose- ఒకే syllable. A syllable is an independent unit of sound. Spelling కూ, syllable కూ సంబంధంలేదు. ఒక మాటలో ఎన్ని శబ్దాలుంటే, అన్ని syllables ఉన్నట్లు. English లో spellings కంటూ ప్రత్యేకమైన సూత్రాలు లేవు.

◆ **K. Nagesh, Nidadavole.**

**Q.** 1. Make, made ఈ రెండు పదాలను ఏయే సందర్భాల్లో ఎలా ఉపయోగిస్తారు?

2. 'Concern' అంటే అర్థం ఏమిటి? దీన్ని ఎప్పుడు ఎలా ఉపయోగిస్తారు?

**A.** Make- Present Tense క్రమం తప్పకుండా (Regular) గా జరిగే పనులకు వాడతాం.

I make coffee every morning.

నేను ప్రతిరోజూ (Regular) coffee తయారుచేస్తాను.

అదే, he, she, it అయితే makes అంటాం.

She makes coffee everyday= ఆమె ప్రతిరోజూ కాఫీ తయారుచేస్తుంది.

Made- past tense - గతంలో తయారుచేయడం.

He made tea for me = అతను నాకు tea చేశాడు.

**Concern** = 1) ఆందోళన (worry).

It is a matter of concern for me = నాకది ఆందోళన (worry) కలిగించే విషయం.

2) సంబంధించిన.

a) It is something concerning you = అది నీకు సంబంధించిన (నిన్ను గూర్చిన) విషయం

b) How is it your concern? = నీకెందుకది?

3) A business company = వ్యాపార సంస్థ

It is a profitable concern= లాభాల్లో నడుస్తున్న సంస్థ.

4) ప్రాముఖ్యం. My main concern is to educate my children = నా పిల్లలను చదివించడం నాకు ప్రాముఖ్యం.

◆ **Doni Nagaraju, Kadapalem**

**Q.** "నువ్వు నన్ను రక్షించి ఉండకపోతే నేను పోయేవాడిని". ఈ వాక్యాన్ని ఆంగ్లంలో If you had not saved me, I would been killed అనొచ్చా? I would been killed బదులు I would have died అనొచ్చా? ఈ రెండింటి మధ్య తేడా తెలుపగలరు.

**A.** If you had not saved me, I would have been killed (correct) - ఇదీ correct, If you...., I would have died అనడం కూడా కరక్టే.

I would have been killed = చంపబడేవాడ్నే.

I would have died= చనిపోయేవాడ్నే.

◆ **K. Subba Rao, Dornakal**

**Q.** 1. 'నేను భవిష్యత్తులో అతడికి డబ్బులు ఇవ్వాల్సి ఉంటుంది' ఈ వాక్యాన్ని ఆంగ్లంలో ఎలా రాయాలి?

2. 'నేను బయటకు వెళ్లామనుకుంటున్నాను' దీనికి 'I would like to go' అనవచ్చా?

3. ఒక పాత్రలోని నీళ్లను మరో పాత్రలో పోయాలని ఆంగ్లంలో ఎలా చెప్పాలి?

4. Spoken English బాగా రావాలంటే మీ వ్యాసాలు perfect గా చదివితే సరిపోతుందా?

**A.** 1) I will have to pay him

2) I am thinking of going out.

I would like to go = వెళ్ళడానికి ఇష్టపడుతున్నాను.

ఇష్టపడేందుకు, వెళ్ళాలని అనుకునేందుకు తేడా ఉంది కదా. ఇష్టపడ్డంత మాత్రాన వెళ్లాలని అనుకోనక్కర్లేదు కదా. ఇష్టపడకుండా కూడా వెళ్లాలని అనుకోవచ్చు. అందుకని రెండూ వేర్వేరు.

3) Pour the water in that vessel (పాత్ర) into this vessel.

4) మాట్లాడగలరనే నమ్మకంతోనే ఇవి ప్రచురిస్తున్నాం. దీనికితోడు మీరు కూడా తరచూ మాట్లాడుతూ practice చేయడం అవసరం.

◆ **B. Vinod Kumar, Korutla**

**Q.** 1. Punch line, by line, Tag line అనే మాటలకు తెలుగులో అర్థాలేమిటి?

2. III Class, IIIrd Class లలో ఏది కరెక్టు?

3. I never saw this type of cinema. I never see this type of cinema. ఈ రెండు వాక్యాల్లో ఏది కరెక్టు?

4. నేను ఒక పుస్తకంలో దసరా స్పెల్లింగ్‌ను Dussehra గా చదివాను. దసరా స్పెల్లింగ్‌ను ఎన్ని రకాలుగా రాయవచ్చు?

**A.** 1) a) Punch line = ఒక joke లో కాని, కథలో కానీ, కీలకంగా, ముందు జరిగిన విషయాల ద్వారా తెలుసుకోలేని, అత్యంత హాస్యకరమైన (joke అయితే), ఉన్నట్టుండి తిరిగే మలుపును (కథ లయితే) తెలిపే చివరి వాక్యం/ పంక్తి.

b) By line = Newspapers/ Magazines లో వచ్చే వ్యాసాల రచయితల పేర్లుండే Line.

c) Tag line - నాకు తెలిసి ఈ మాటలేదు.

2) I, II, III - సంఖ్యలను ఇలా Roman numerals లో రాసినపుడు Ist, IInd, IIIrd అనం. ఇది వాడుక. (పోల్చండి: 1st, 2nd, 3rd, etc.)

3) I never saw this type of movie = Past లో ఎప్పుడూ నేనిలాంటి movie చూడలేదు.

Cinema అంటే సినిమాహాలు.

The Cinema = చిత్ర పరిశ్రమ/ చిత్రకళ.

సినిమాలో చూపించే చలనచిత్రం = Movie/ film/ picture.

అయితే మీ sentence లో I never saw this type of cinema when I was there (అక్కడ నేనున్నప్పుడు, గతంలో) అనడం better.

I never see this type of movie = ఇలాంటి చిత్రం నేనెప్పుడూ చూడను.

మీ sentences రెండూ correct, వేర్వేరు అర్థాలతో. అయితే మొదటి sentence కు గతంలో ఏ time లో అని కచ్చితంగా చెప్పగలిగితే బాగుంటుంది.

4. Dussehra, అనేది మనం British పాలనలో ఉన్నప్పుడు వాళ్ళిచ్చిన spelling, Kadapa కు Cuddapah లా. Dasara - ఇది best spelling, simplest కాబట్టి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**P. Ramajoga Rao, Visakhapatnam**

**Q.** Open the door అనే వాక్యానికి Let the door be opened అనేది passive form. అలాగే Walk fast అంటే ఒకచోట you are requested to walk fast అనేది passive form అని చదివాను. కరెక్టేనా? అయితే open the door కు కూడా you are requested to open the door అని అనాలి కదా. దయచేసి వివరించగలరు.

**A.** Walk fast కు passive form "You are asked/ requested to walk fast." ఇది మీరన్నట్లుగా ఏదో Passive Voice కోసం Passive అని చెప్పడమే. ఇది Grammar ఒక్కటే ముఖ్యం అనుకునేవారి విపరీత ధోరణి వల్ల వచ్చేదే. English బాగా మాట్లాడ్డానికి, చక్కగా రాయడానికీ Grammar ఒక మార్గం మాత్రమే. అంతేకానీ Grammar is all అనుకోవడం సమంజసం కాదు. Grammar కొంత కూడా తెలియకుండా English చక్కగా మాట్లాడేవాళ్లు చాలామంది ఉన్నారు. మనం రాసేటప్పుడు, మాట్లాడేటప్పుడు సరిగ్గా మన భావాల్ని తెలియజేయగలిగితే grammar తెలిసినా తెలియకపోయినా ఒకటే. అయితే తెలియడం కూడా ముఖ్యమే, పొరపాట్లు చేయకుండా ఉండేందుకు. ఎప్పుడో ఒకప్పుడు తప్ప మనం Let the door be opened అని అనం. చాలావరకు "Open the door" అనే అంటాం. You are asked/ requested to walk fast కూడా మనం చాలా అరుదుగా formal context లో అంటాం. అయితే మన schools, colleges exams లో ఇలాంటి sentences మార్కుల కోసం తెలుసుకోవాల్సిందే. ఇలాంటి ప్రశ్నలు పరీక్షల్లో ఇచ్చేవాళ్లకు అదో సరదా.

**Nasrin Nigar, Kurnool**

**Q.** I would like to learn English Idioms and usage for my improvement in English. But I don't know whether to start my learning first with Idioms or usage for achieving complete mastery over them. Is it good to learn English Idioms first, before starting to learn English usage? So please suggest me whether to keep my focus first either on Idioms or usage.

**A.** Try the following books:

1. A Book of English Idioms: by Mc mordie
2. Cambridge Book of Idioms (Cambridge University Press)

Knowledge of idioms is important, as important as that of usage. But the important point is, idioms are a part of usage so there is no question of which is important and which is not. Perhaps you are confused between use and usage. 'Use' is how we use a word/ Phrase in a sentence. 'Usage', on the other hand, is, with what meaning, in what context and how a certain expression is used. For example, 'With a view to' is followed always by a noun or an 'ing form and not by the plain infinitive. This is usage. We get all these by reading a lot. If we practice idioms, it is good up to an extent, but our reading will help us to know the proper use of idioms.

**Chandu Sivanjaneyulu, Chakrayapalem (Guntur Dist)**

**Q.** Not bad అంటే very good అన్నారు. మరి ఫర్వాలేదు/ ఓమాదిగా ఉంది అనడానికి ఏమనాలి?

**A.** Not so bad.

**Q.** భోజనం చేశాక క్లాస్‌కు వస్తావా? అని అడగడానికి will you come to class after you will have taken meals. ఈ వాక్యం సరైందేనా?

**A.** కాదు. Will you come to class after you take the meal?/ after you have taken the meal? ఇవి correct.

**Q.** It's a tail ను It is a tail (ఇది తోక) / It has a tail (దీనికి తోక ఉంది) అని రెండు విధాలుగా రాయవచ్చు కదా. ఎలా అర్థం చేసుకోవాలి?

**A.** It's అనే contraction ను సందర్భాన్ని బట్టి It is గా It has గా తీసుకుంటాం.

It's mine = It is mine.

It's gone = It has gone.

**Q.** Now it is at winning line ఈ వాక్యంలో winning అనేది present participle కాదు కదా. దాన్ని ఏమనాలి?

**A.** Now it is at the winning line - ఇక్కడ winning Present Participle, used as an adjective. అయినా మీరు దాన్ని correct గా వాడగలిగినప్పుడు, అది ఏ కోవకు చెందిన మాట అనేది అనవసరం కదా?

**Q.** He has been there a number of times. దీనిలో a అవసరం ఏమిటి?

few - a few, little - a little పదాల్లో a వల్ల అర్థంలో మార్పు ఉంటుందా?

**A.** Number అనేది countable singular. కాబట్టి దాని ముందు 'a' రావల్సిందే.

Few కు, a few కూ, little, a little కు చాలా తేడా ఉంది. Few (countables కు మాత్రమే వాడతాం) = Almost none (దాదాపు లేనట్లే- negative అర్థం వస్తుంది.)

# He has few friends here







M.SURESAN

He has few friends here = అతనికిక్కడ స్నేహితులు దాదాపు లేరు - లేనట్లే.

A few = ఏవో కొన్ని/ ఏదో కొంతమంది.

He has a few friends here = ఇక్కడతడికి (తక్కువ సంఖ్యలో) కొంతమంది స్నేహితులున్నారు.

అలాగే little కూడా. Little ను uncountables (లెక్క పెట్టనివి; milk, sugar, rice లాంటి వాటి)తో వాడతాం.

Little = దాదాపు లేదు/ లేనట్లే.

There is little milk in the glass = There is almost no, milk in the glass = ఆ glass లో పాలు దాదాపు లేవు - లేనట్లే.

There is little friendship between the two = వాళ్లిద్దరి మధ్య అంత స్నేహమేం లేదు - దాదాపు లేనట్లే.

I had a little milk in the morning = నేను ఉదయం కాస్త (కొద్దిగా) పాలు తీసుకున్నా.

**Q.** How about, What about ల మధ్య తేడా ఏమిటి?

**A.** How about = What about.

**Q.** భోజనం తయార్ (Meals ready) అని రాస్తారు. కానీ భోజనం singular కదా. Mealsకు singular form meal కదా. Meal ready అని రాయరెందుకు?

**A.** Meals Ready (భోజనం తయారు)- ఇది ఒకరు మాత్రమే తినే భోజనం కాదు కదా? అందరూ తినే భోజనాలు కదా? అందుకని Meals ఇక్కడ correct.

**Q.** 'They cut forests' అనే వాక్యంలో cut $V_1$ (అంటే simple past). $V_2$ ఎప్పుడూ verb కాదు. $V_2$ (past participle) ముందు be form గానీ, have, has, had వచ్చినప్పుడే verb అనీ మీరు గతంలో చెప్పారు. అసలు $V_1$ అంటే present verb, $V_2$ అంటే past verb, $V_3$ అంటే past participle కదా. పై వాక్యంలో $V_1$ కానీ, $V_2$ కానీ వస్తుంది కదా. $V_1$ అయితే ఆ వాక్యం 'వారు అడవులను నరుకుతారు' అనీ. $V_2$ అయితే 'వారు అడవులను నరికివేశారు'. అని అర్థం వస్తుంది కదా. $V_2$ ని past participle గా ఎందుకు చూపించారు?

**A.** They cut forests - ఇక్కడ 'cut' (subject they అయితే) $V_1$ (present simple) అవ్వొచ్చు, $V_2$ (past simple) అయినా అవ్వొచ్చు. $V_3$ ని past participle అంటాం - ఇది, $V_1$, $V_2$ మాదిరిగా Verb కాదు.

'He Sung' తీసుకోండి. మీ పరిభాషలో ఇక్కడ sung అనేది $V_3$. He sung అంటే అర్థం ఏం రావడం లేదు కదా. (పోల్చండి- He Sang - sang-$V_2$) అర్థం - అతడు పాడాడు అని.

The Song was sung (was + $V_3$) - ఇప్పుడు Was sung అనేది Verb. (అతని చేత పాట పాడబడింది) ఈ $V_1$ (Verb 1), $V_2$ (Verb 2), $V_3$ (Verb 3) అనే పదాలు వాడటం వల్ల $V_3$ ని కూడా Verb అనుకునే అవకాశం ఉంది. అలాగే చాలామంది పొరపడతుంటారు. దాన్ని $V_3$ అనకుండా Past participle అనంటే ఈ confusion ఏమీ ఉండదు. (నేను $V_2$ ను past participle గా చూపించి ఉంటే అది పొరపాటై ఉండవచ్చు).

**Q.** ఈ రోజు పేపర్ చదివారా? అనడానికి Have you read today's paper? అన్నారు. ఇక్కడ ఈ రోజు అని time తెలుసుకదా. Did you read today's paper? అనకూడదా? ఏది సరైందో వివరించగలరు.

**A.** Today's paper అన్నప్పుడు ఈరోజు paper, have you read? = చదవడం అయ్యిందా? అని. ఈ రోజు, ఎప్పుడు? అని కచ్చితంగా Time తెలపడం లేదు. కాబట్టి Have you...? అంటాం. (ఇంతవరకూ ఈరోజు అనే అర్థంతో) పోల్చండి: Did you read the paper this morning?- ఇక్కడ ఉదయం అని కచ్చితంగా time తెలుపుతున్నాం. అయితే, Did you read the paper? ను పెద్ద తప్పుగా అనుకోనక్కర్లేదు. అది కూడా మామూలే.

**Q.** మీరొకచోట అక్కడకు ఎప్పుడెళ్లావు? అనడాన్ని When did you go there అన్నారు. ఎదుటి వ్యక్తి ఒక ప్రదేశానికి వెళ్లి వచ్చిన తర్వాతే కదా అలా అనగలం. కాబట్టి ఆ వాక్యాన్ని When have you been there అనవచ్చా?

**A.** వెళ్లి వచ్చిన తర్వాతే అలా అడుగుతాం. అలా అడగడం (When did you go there?) అవతలి వ్యక్తి తిరిగి వచ్చిన తర్వాతే అనగలం కదా. ఇక్కడ Have you been there before? (అక్కడికి ఎప్పుడైనా వెళుతున్నావా? )- ఇదీ కరక్టే. (నీకా ప్రదేశం తెలుసా అనే అర్థంతో) కాబట్టి When did you go there? అనడం కూడా correct.

When have you been there? అక్కడికెప్పుడన్నా వెళుతున్నావా? అనే అర్థంతో correct.

**A. Penchalaiah, Rajampet.**

**Q.** కింది వాక్యాల్లో అండర్‌లైన్ చేసిన వాటికి అర్థం తెలుపుతూ వాక్యాన్ని వివరించగలరు.

His eyes are sore and running.

**A.** His eyes are sore and running = అతడి కళ్లు మంటతో (sore - బాధ, నొప్పి, etc) నీళ్లు కారుతున్నాయి. (running) sore eye = బాధగా ఉన్న కళ్లు (కళ్లకలక వల్ల) Running = కారుతున్న. (ఇక్కడ కళ్లనీళ్లు కారడం). అలాగే Running nose = కారే ముక్కు.

e.g: He can't attend school as his eyes are sore = కళ్లు మంటలుగా నీళ్లు కారటం వల్ల అతడు స్కూల్‌కు రాలేదు.

**Q.** The President came in the nick of time.

**A.** In the nick of the moment = చివరిక్షణంలో

a) The doctor arrived in the nick of the time and saved the patient = Doctor చివరి క్షణంలో వచ్చి, రోగిని కాపాడాడు.

b) Don't delay till the nick of the moment = చివరిక్షణం వరకూ ఆలస్యం చేయకు.





**Q.** We can see only few people who are free from the cold fever.

**A.** Be free from = ఏదైనా పొందకుండా ఉండటం.

**P. Mohan, Karimnagar**

**Q.** Located, situated ల మధ్య తేడా ఏమిటి? వీటిని ఏయే సందర్భాల్లో వాడాలి?

**A.** Located = situated = ఏదైనా ఓ ప్రదేశంలో ఉండటం, దాదాపు రెండూ ఒకటే.

Golconda is located / situated a few Km off H'bad = Golconda Hyderabad కు కొన్ని కి.మీల దూరంలో ఉంది.

**Q.** Climate కు weather కు భేదం ఏమిటి?

**A.** సంవత్సరం పొడవునా ఒక ప్రదేశపు శీతోష్ణస్థితి climate. ఒక ప్రదేశపు ఒకరోజు శీతోష్ణస్థితి weather.

**Q.** Come కు come on కు తేడా ఏమిటి?

**A.** Come = రా. come on = రా అని ఇంకా గట్టిగాచెప్పడం. Come on! We don't have much time left = రా (గట్టిగా అనడం), మనకెక్కువ time లేదు.

**Q.** News కు singular ఏది? Miss, Mrs, Mr కు plural ఏమిటి?

**A.** News ఎప్పుడూ singular. దానికి plural లేదు.

Miss కు plural Misses.

Mrs కు plural లేదు.

Mr కు plural messrs (M/s).

**Q.** Die కు ing form ఎలా రాయాలి?

**A.** die - dying

**Q.** Shopping అనే పదం ఎలా వచ్చింది?

**A.** Shop = దుకాణం. To shop = దుకాణంలో కొనడం = shopping.

**Q.** What is the difference between discovery and invention?

**A.** Discovery = ఉన్న విషయాన్ని చూడటం (Columbus discovered America), అర్థం చేసుకోవడం/ గ్రహించడం (Newton discovered the law of gravitation- భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని మొదట అర్థం చేసుకున్నాడు/ (గ్రహించాడు).

Invention = కొత్త విషయాన్ని సృష్టించడం, రూపొందించడం.

Baird invented television = Television ను Baird సృష్టించాడు/ రూపొందించాడు.

**Q.** అప్పుడప్పుడు తెలుగు దిన పత్రికల్లో కనిపించే కూంబింగ్ అనే పదానికి spelling ఏమిటి?

**A.** Combing = గాలింపు/ ఎక్కడా వదలకుండా ఒక ప్రదేశంలో వెదకడం (జుట్టులో దువ్వెన - comb - పేలు, మట్టి లాంటివాటిని పట్టుకున్నట్టు).

**Penchalaiah, Vathalur**

**Q.** My sone has hurt himself అంటే మా అబ్బాయి తనకుతానే బాధపడుతున్నాడు. లేదా తనకుతానే గాయపర్చుకున్నాడు అనే అర్థం వస్తుంది కదా. కానీ ఒకచోట మా అబ్బాయికి దెబ్బతగిలింది అని ఉంది. ఇది కరెక్టేనా వివరించగలరు.

**A.** He hurt himself- ఇక్కడ himself మీరన్నట్టు reflexive pronoun. అయితే మామూలు మన స్థితిలో ఉన్నవాళ్లెవరూ తమనుతాము గాయపరచుకోరు కదా? ఏదో ప్రమాదవశాత్తూ/ అజాగ్రత్త వల్ల తగిలిన దెబ్బయితే ఇలా అనడం english usage.

**Q.** తినడానికి ఏముంది? అని ఇంగ్లిష్‌లో ఎలా అడగాలి?

**A.** Is there anything to eat?

**Q.** నిజం నిలకడ మీద తెలుస్తుంది అనేదానికి ఏదైనా proverb ఉంటే తెలుపగలరు.

**A.** Truth will out (ఇది will తర్వాత be లేకపోయినా correct)- english saying, నిజం నిలకడ మీద తెలుస్తుంది అనే అర్థంతో.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# It's really boiling hot in here





M.SURESAN



**B. Sarada, Eluru**

**Q.** మీరొకచోట Why? what's (what has) he been upto? - అంటే- ఏం? ఏం చేశాడేమిటి? అని వివరించారు. అయితే చేశాడు అనే అర్థం ఉన్న పదం ఇందులో ఎక్కడ ఉంది? Upto ఎందుకు వచ్చింది? వివరించగలరు.

**A.** What's he been upto?- ఇక్కడ be upto కు idiomatic గా ఏం చేస్తున్నాడేమిటి? అనే అర్థం వస్తుంది. ఒక group of words లోని మాటలకు ఒక్కొక్కదాని అర్థానికీ, మొత్తం వాటి అర్థానికీ సంబంధం లేకపోవడమే idiom/ usage లక్షణం. తెలుగులో కూడా, నడుం వాల్చడం అనే మాటకూ విశ్రాంతి తీసుకోవడం అనేదాని అర్థానికి సంబంధం ఏంలేదు కదా? అది practice వల్ల మనకు అర్థం అవుతుంది, మనం కూడా మనకు తెలియకుండానే correct గా వాడేస్తుంటాం.

---

**K.Vijay, Sindhanur, Karnataka**

కింది వాక్యాలకు తెలుగులో అర్థాలను తెలియజేయగలరు.

**Q.** The two boxers did their best to knock each other out.

**A.** ఆ ఇద్దరు boxers (ముష్టియుద్ధాలు చేసేవారు) ఒకర్నొకరు ఓడించాలని చాలా ప్రయత్నించారు.

**Q.** I hope that you all enjoy each other company.

**A.** మీరిద్దరూ ఒకరితో ఒకరు సరదాగా గడుపుతారని ఆశిస్తున్నాను.

**Q.** They cannot stand one another's presence.

**A.** వాళ్లిద్దర్లో ఒకరితో ఒకరికి పడదు.

Stand ఇక్కడి అర్థం- సహించడం/భరించడం, ఎక్కువ not తో వాడతాం.

**Q.** I wish I lived in a big city. It is so boring in the country.

**A.** I wish I lived in a big city... = నేను పెద్ద నగరంలో ఉంటే ఎంత బాగుంటుందో! (ఇప్పుడు నేను పెద్ద నగరంలో లేను).

Country = దేశం మాత్రమే కాదు, గ్రామం/ గ్రామాలు అనే అర్థాలు కూడా ఉన్నాయి.

**Q.** I wish I was 55.

**A.** నాకిప్పుడు 55 ఏళ్లుంటే ఎంత బాగుంటుంది! (నా వయసిప్పుడు అదికాదు)

**Q.** I wish you'd learn to read and write.

**A.** I wish you'd = I wish you would ... = నువ్విది చేయాలని నా కోరిక.

**Q.** I wish I had planned things properly. I wouldn't have got into this mess now.

**A.** I wish I had planned things properly = సరిగా plan చేసుకునుంటే (గతంలో) బాగుండేది. సరిగా plan చేసుకోలేదు.

**Q.** I was in time to wave Tarun bye bye at the airport.

**A.** To wave bye bye = వీడ్కోలు చెప్పేటప్పుడు చేతు లూపడం

**Q.** Towards the evening -

**A.** సాయంత్రానికి- towards the evening.

Towards the end = చివరకు

**Q.** Thanks for your concern.

**A.** మీ ఆతురతకు (concern) (మమ్మల్ని గురించి) ధన్యవాదాలు

**Q.** We got to the airport in time to have a coffee before checking in.

**A.** లోపలికెళ్లేముందు (before checking in) coffee తీసుకునే time ఉండింది.

**Q.** I was about to close the door when just in time I remembered my key.

**A.** తలుపు మూయబోతుంటే (About to close the door) సమయానికి సరిగా తాళం చెవి గుర్తుకొచ్చింది.

**Q.** In turn

**A.** In turn = వంతుల వారీగా/ ఒకరి తర్వాత ఒకరు

**Q.** Come, do ముందు would వచ్చేట్టు కొన్ని ఉదాహరణలు ఇవ్వండి. I have planted six rose-bushes so far this morning. ఇందులోrose-bushes అర్థం ఏమిటి?

**A.** I hope you'd (you would) come.

She hopes he would do it.

Would you have a cup of coffee?

(coffee తీసుకుంటారా? అనడగడం మర్యాదగా)

Rose bushes - గులాబీ మొక్కలు/ పొదలు

**Q.** Present perfect continuous tense లో would ను ఎలా ఉపయోగిస్తామో వివరించగలరు.

**A.** Present perfect continuous tense లో would ఎలా వస్తుంది? -'would' ఎప్పుడూ, future from the past గా/ formal requests/ wishes/ past practices తెలిపేందుకు వాడతాం.

**Q.** Where has pooja been all these days? ఈ ప్రశ్నకు సమాధానం ఎలాగో తెలుపగలరు.

**A.** She has been here only.

She hasn't gone any where.

(మీ question కు అర్థం, ఇన్ని రోజులూ పూజ ఎక్కడ ఉంది అని. ఇక్కడే ఉంది, ఎక్కడికెళ్లలేదు అని జవాబు.)

**Q.** Wish ను past progressive తో వాడతారు. అదెలాగో కొన్ని ఉదాహరణలు ఇవ్వగలరు.

**A.** He was wishing to return home as soon as possible = వీలయినంత త్వరలో ఇంటికెళ్లాలని కోరుకుంటున్నాడు (గతంలో) అతడు- కానీ సాధారణంగా progressive tense లో వాడకపోవడమే మంచిది.

---

**R. Chaitanya, Nellore**

**Q.** నేను వెళ్లినప్పుడు అతడు ఇంటి వద్ద లేడు. దీన్ని ఇంగ్లిష్‌లో He had not at home, when I went for him అనొచ్చా?

**A.** Whenever I went for him place he was not at home/ not in/ out.

**Q.** చాలా బాగుంది కదా అనేదానికి మీరు ఒకచోట Isn't it really wonderful? అని ఇచ్చారు. Is it really wonderful? అంటే అర్థం ఏమిటి? అది నిజంగా బాగుందా అనేకదా? మరి Is it not really wonderful? అంటే బాగోలేదు అని కదా. తప్పయితే వివరించగలరు.

**A.** Is it really wonderful? అది నిజంగా గొప్పగా ఉందా? ఇలా అడిగినప్పుడు వచ్చే భావం అడిగేవాళ్లకు దాని గురించి తెలియదు. అది గొప్పగా ఉందా లేదా అని తెలుసుకునేందుకు వేసే ప్రశ్న అది.

అది నిజంగా గొప్పగా ఉంది కదా? అంటే అది గొప్పగా లేదా? అని అర్థం. అంటే మాట్లాడుతున్నవారికి అది గొప్పగానే ఉంది, వినేవాళ్లకు కూడా అది గొప్పగా ఉందా అని తెలుసుకునేందుకు వేసే ప్రశ్న అది.

**Q.** అతడి గురించి అతడు ఏమనుకుంటున్నాడు అనడానికి What he thinks about him? అనొచ్చా?

**A.** What he thinks of him? ఇది ప్రశ్నగా సరికాదు. English లో మీకు తెలుసు కదా? English లో questions లో, ఎప్పుడూ verb ముందొస్తుంది, ఆ తర్వాత subject వస్తుంది. లేకుంటే, Helping verb, Main verb రెండూ ఉంటే, Helping verb ముందూ, ఆ తర్వాత subject, దాని తర్వాత Main verb వస్తుంది. ఇక్కడి verb- thinks- ఇది 2nd Regular Doing Word. ఇది question లో వచ్చినప్పుడు, does think అవుతుంది. Not తో వచ్చినప్పుడు కూడా does think అవుతుంది. Does think లో does, helping verb. అందుకని-

ఇక్కడ ఈ వాక్యంలో - అతడి గురించి అతడేమనుకుంటున్నాడు? అనేందుకు,

What does
(Helping verb)

he (Subject) think (Main verb) of himself? అంటాం.

**Q.** నువ్వు నాకు గుర్తొచ్చావు అనే దాన్ని I got you అంటామా? లేదా I get you అనొచ్చా? తెలుపగలరు.

**A.** I got you = నాకు అర్థమయింది.

I get you = నాకు అర్థమవుతోంది.

నువ్వు నాకు గుర్తొచ్చావు = Now I remember you.

**Q.** ఆమె ఇప్పుడు ఇంటికి వెళ్లాలనుకుంటోందా? అనడానికి Does she want to go home now అనాలా? లేదా Does she think of going home now అనాలా?

**A.** Does she want to go home now? = ఆమెకు ఇంటికి వెళ్లాలనుందా? / ఆమె ఇంటికి వెళ్లాలని కోరుకుంటోందా?

Does she think of going home now? = ఆమె ఇంటికి వెళ్లాలనుకుంటోందా?

**Q.** నేను కాఫీ తీసుకుంటాను (ప్రతిరోజు). I take coffee అంటాం. I take the coffee అనకూడదా?

**A.** The వాడకం. ఒక మాట ముందు 'The' వాడాలా లేదా అని తెలుసుకునేందుకు, ఆ మాట ముందు, ఏ (which) అని question వేసుకుంటాం. దానికి answer వస్తేనే the వాడతాం. లేకపోతే వాడం.

I take coffee- ఇక్కడ ఏ (which)- coffee తీసుకుంటాను? ఇక్కడ సమాధానం లేదు కాబట్టి 'the' వాడం.

I like the coffee at that restaurant = ఆ restaurant లో coffee నాకిష్టం.

ఏ coffee నాకిష్టం? - ఈ ప్రశ్నకు జవాబు, ఆ restaurant లో coffee అని వస్తుంది. కాబట్టి ఈ sentence లో coffee ముందు, 'the.

Cotton grows in India = భారత్‌లో పత్తి పండుతుంది. ఏ (Which) cotton? - No answer. So no 'the' before 'cotton' in this sentence.

The cotton grown in India is not of good quality = భారత్‌లో పండే పత్తి అంత నాణ్యమైంది కాదు. ఏ పత్తి (Which cotton)? అనే ప్రశ్న వేసుకుంటే భారత్‌లో పండే పత్తి (grown in India) అని answer ఉంది కాబట్టి, ఇక్కడ the cotton అంటాం.

**Q.** A, An, the అనేవి ఎప్పుడెప్పుడు ఉపయోగించాలో వివరించగలరు.

**A.** లెక్కించే వస్తువులను/ విషయాలను countables అంటాం- book, pen, teacher, man, mother etc.- వీటన్నింటినీ ఇన్ని, ఇంతమంది అని సంఖ్యల్లో చెప్తాం. కాబట్టి ఇవి countables. లెక్కపెట్టని వాటిని అంటే కొలతలతోకానీ, బరువులతోకానీ చెప్పేవాటిని uncountables అంటాం- milk, rice, sugar లాంటివి.

countables కు మాత్రమే, singular number, plural number ఉంటాయి. uncountables ను ఎప్పుడూ singular గానే వాడతాం. వాటికి plural ఉండదు. వాటిముందు మాత్రం a/ an రావు.

Countables కు, singular, plural ఉంటాయి కదా? ఓ countable singular లో ఉన్నప్పుడు, దాని ముందు a కానీ an కానీ కచ్చితంగా వాడాల్సిందే.

He bought a pen yesterday. ఈ sentence లో, pen - countable. అది singular కదా? అందుకని 'a pen' అన్నాం.

He took an egg this morning.

ఇక్కడ egg కూడా countable, singular. అందుకని దానిముందు 'an'.

a = an = ఒక. అయితే అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ- ఈ శబ్దాలతో ప్రారంభమయ్యే English మాటల ముందు an వాడతాం. మిగతావాటి ముందు a వాడతాం.

a book, a girl, a tree etc.

an elephant, an ant, an idea etc.

Uncountable ముందు a/ an రాదు.

**Q.** జయం, అపజయాలకు సరైన అర్థం చెప్పగలరు.

**A.** జయం = success (ప్రయత్నంలో)

Victory/ conquest (యుద్ధాల్లో)

అపజయం - failure (ప్రయత్నాల్లో)

defeat = (యుద్ధం/ పోటీల్లో).

---

**P. Sujatha, Sindhanur, Karnataka**

కింది తెలుగు వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

**Q.** నేనూ ఆ అమ్మాయిలాగే ఉంటే ఎంత బాగుంటుంది.

**A.** I wish I was/ were like that girl.

**Q.** ఈత కావాలంటే నీటిలోకి దూకాలి. నీటిలోకి దిగనిదే ఈత రాదు.

**A.** Unless you get into water you can't learn swimming.

**Q.** రేపు పరీక్షలు ఏ క్లాసుకున్నాయి? / రేపు పరీక్షలు ఎవరికున్నాయి?

**A.** Which classes/ who have/ will have exams tomorrow?

**Q.** అల్లరి చేసిన వాళ్లంతా ఇలా రండి.

**A.** All those who made a noise, come here.

**Q.** మాది చదువుకు తగ్గ ఫీజు.

**A.** Our fees are in proportion to our education.

**Q.** It's really boiling hot in here. But we have no choice.

You see it is like an oven in here. It's really boiling hot outside.

ఈ రెండు వాక్యాల్లో in ఎందుకు ఉపయోగించారో తెలుపగలరు.

**A.** In here (here కు బదులు- ఇక్కడ అనే అర్థంతో) Out/ over there (there కు బదులు- అక్కడ అనే అర్థంతో) Spoken English లో సాధారణం.

**Q.** కింది వాక్యాలకు ప్రశ్నలు ఎలా రాయాలో తెలుపగలరు.

It has been very hot for the past two days.

She has worn the same saree for a week.

**A.** 1) How hot has it been here for the past two days

2) How long has she worn the same sari?/ What has she worn for a week?

**Q.** 1) Which class are you in?

2) Which class are you studying in?

ఈ రెండు ప్రశ్నలు కరెక్టేనా? వీటికి సమాధానంగా I am studying in 10th class అని రాయొచ్చా?

**A.** రెండూ correct. అయితే which class are you doing? అనడం Spoken English లో బాగుంటుంది. అలాగే I am doing 10th class, better.

**Q.** Hey, Oh, Yeah, Oh really, Hi, Oh yes, Ah, Hai ఈ పదాల pronunciation, meaning, usage తెలుపగలరు.

**A.** Hey/ Hai/ Hi = ఒకరిని పలకరించడం, ఒకరిని పిలవడం.

Yeah (యా) = Yes.

Oh, really? = నిజమా? ; Hi (హై).

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# Go easy on the youngsters





M.SURESAN

**Jagan:** So you failed to live up to your dad's expectations. Is that your worry?
(అయితే నువ్వు మీ నాన్న ఆశించినంత గొప్పగా చేయలేకపోయావు. అదేనా నీ బాధ?)

**Ratna:** That's right. I did my best and you know that.
(అవును. నా శక్తికొద్దీ నేను చేశాను. నీకూ తెలుసు.)

**Jagan:** By all accounts, of course. Perhaps your dad's expectations are too high.
( ఆ విషయం తప్పకుండా అందరూ అంటారు. బహుశ మీ నాన్న మరీ ఎక్కువ ఆశిస్తున్నారేమో.)

**Ratna:** Yea. That he does. He wants his children to have access to the best institutions in the country.
(అవును. అదే చేశాడాయన. దేశంలోని అత్యుత్తమ సంస్థల్లో తన పిల్లలకు ప్రవేశం ఉండాలని ఆయన అనుకుంటాడు.)

**Jagan:** That he has a right to, and there's no denying it. But nothing wrong if he goes easy on you. So long as you make your efforts sincerely, and don't take things easy, what's there to complain about?
(అలా అనుకునే హక్కు ఆయన కుంది. అది ఎవరూ కాదనలేరు. కానీ ఆయన మీ మీద అంత తీవ్రత చూపించకుండా ఉంటే పెద్ద తప్పేంకాదు. మీరు మన స్ఫూర్తిగా మీ ప్రయత్నాలు చేస్తున్నంతసేపూ, ఏమీ సడలించకుండా ఉన్నంతసేపూ, పెద్ద తప్పు పట్టాల్సిందేమీలేదు కదా?)

**Ratna:** That's my point too. He observes that we, especially me, are always on the go. There were occasions when he wanted me to relax too but I never let up.
(అదే నేననేదీనూ. ఆయన గమనిస్తూనే ఉంటాడు, మేం, ముఖ్యంగా నేను ఎప్పుడూ తీరిక లేకుండా పనిచేస్తూనే ఉండటం. ఇంకా ఆయన నన్ను కాస్త విశ్రాంతి తీసుకోమన్న సందర్భాలూ ఉన్నాయి. నేనే నా శ్రమ ఎప్పుడూ తగ్గించలేదు.)

**Jagan:** Take it easy. He will soon know. Some times there's no accounting for the results of our efforts. But be sure. Your hard work won't go waste. It will certainly stand by you in some other manner.
(బాధపడకు. ఆయనా తెలుసుకుంటాడు. కొన్నిసార్లు మన కృషికి వచ్చే ఫలితాలను గురించి మనం ఏం చెప్పలేం. నీ కృషి ఎప్పటికీ వృథా కాదు. అది నీకు ఇంకో విధంగా తోడ్పడుతుంది.)

**Ratna:** That's my hope too. If only dad looked at it so! I still feel that I've let him down when I look at him.
(నా ఆశా అదే. నాన్న కూడా ఆ విధంగా అనుకుంటే ఎంత బాగుంటుంది! ఆయన్ను చూసినప్పుడల్లా నాకనిపిస్తుంది ఆయన ఆశలు వమ్ము చేశానని.)

**Jagan:** The sooner you get over such a feeling the better for you and your dad too. Look to the future. Don't let the past weigh you down.
(ఆ భావం నువ్వెంత త్వరగా పోగొట్టుకుంటే నీకూ, మీనాన్నకూ అంత మంచిది. గతం నిన్ను కుంగిపోయేలా చేయకూడదు.)

**Ratna:** Thank you, uncle. Your words have argued me out of my lowly feeling. I will try to let my success in the next attempt speak for itself.
(చాలా థ్యాంక్స్, నీ మాటలు నన్ను నా న్యూనతా భావం నుంచి బయటపడేలా చేశాయి. వచ్చే ప్రయత్నంలో నా విజయమే నన్ను గురించి మాట్లాడేలా చేస్తుంది.)

lowly feeling = కుంగదీస్తున్న ఆలోచన

**Jagan:** That's the spirit, boy.
(అదీ ఇప్పుడు కావాల్సిన ఉత్సాహం.)

**Ratna:** By the way, uncle, did your friend's son get the scholarship amount he had been expecting?
(అదిసరేగానీ మామయ్యా, మీ స్నేహితుడి కొడుక్కి తను ఆశిస్తున్న స్కాలర్‌షిప్ వచ్చిందా?)

**Jagan:** He did of course, but that was too little, too late.
(రావడానికి వచ్చింది. అయితే అది అంతంత మాత్రమే, అదీ చాలా ఆలస్యంగా.)

**Ratna:** That's a pity. So what's he going to do about it?
(అది చాలా దురదృష్టం. తను ఏం చేయబోతున్నాడు?)

**Jagan:** He has accepted it. But whilst he was at it. he had the offer of another scholarship. That is going to be a good amount.
(తీసుకున్నాడు. అయితే అతడా పనిలో ఉన్నప్పుడు ఇంకో స్కాలర్‌షిప్ వచ్చిందతడికి. అది మంచి మొత్తమే.)

**Ratna:** That's good. OK. Uncle, I must be off. See you.
(మంచిది. నేను వెళ్లాలి. వస్తామరి.)

**Jagan:** Bye.

బాగా వాడుకలో ఉండి, మన సంభాషణను సరళతరం, సహజం చేసే మరికొన్ని Phrasal Verbs ను ఇప్పుడు చూద్దాం. వీటిని మీ సంభాషణలో వాడండి. ఇవన్నీ కూడా అందరికీ అంటే వాడేవారికీ, వినేవాళ్లకూ సులభంగా అర్థమయ్యేవే.

***Look at the following expressions from the dialogue above:***

*1) By all accounts*
*2) Have access to*
*3) No denying*
*4) Go easy on somebody*
*5) Be on the go*
*6) Let up*
*7) No accounting for*
*8) To get over*
*9) Weigh somebody down*
*10) Too little, too late.*

**1) By all accounts** = From all accounts = అందరూ ఒప్పుకునే విషయం/ అందరూ అనే మాట.

a) By (from) all accounts Sachin is the greatest batsman that Cricket has ever seen = క్రికెట్ చరిత్రలో సచిన్ అంత గొప్ప బ్యాట్స్‌మన్ లేడనే విషయం అందరూ అనేదే.

b) I've never been to Kashmir but it's a lovely place, by all accounts = నేనింతవరకూ కాశ్మీర్ చూడలేదు, కానీ అందరూ అంటారు అది చాలా సుందర ప్రదేశమని.

**2) Have access to** = ఒక ప్రదేశానికీ/ ఒక వ్యక్తిని కలుసుకునేందుకు, ప్రవేశం/ అనుమతి ఉండటం.

a) He has access to any place in the airport, as he is an airport employee = అతడు విమానాశ్రయం ఉద్యోగి కావడంతో అతడికి విమానాశ్రయంలో ఎక్కడికైనా ప్రవేశం ఉంది.

b) Not all have access to the chief minister = ముఖ్యమంత్రి దగ్గరకెళ్లేందుకు అందరికీ అనుమతి ఉండదు.

No access = Access barred/ Access denied = ప్రవేశానికి అనుమతి లేదు.

Computer లోని కొన్ని files ను చూసే వీల్లేకపోతే access denied/ access barred అని కనిపిస్తుంది.

**3) No denying** = కాదనేది లేదు (ఒక విషయం నిర్వివాదంగా ఒప్పుకోవడం)

a) There is no denying that Dr. Abdul Kalam is the father of the modern rocketry in India = డాక్టర్ అబ్దుల్ కలామ్ భారత్ ఆధునిక రాకెట్ విజ్ఞానానికి ఆద్యుడు అనేది కాదనలేం/ కాదనలేని విషయం.

b) There is no denying that a knowledge of English communication skills is essential to a good career = మంచి ఉద్యోగ వ్యాపకాలకు English communication skills చాలా అవసరం అనే విషయం ఎవరూ కాదనలేరు.

**4) Go easy on somebody** = (ఎవర్నయినా) అంత తీవ్రంగా ఒత్తిడి పెట్టకుండా ఉండటం.

a) Go easy on the youngsters. Don't put them in residential institutions and make them learning machines = పిల్లల మీద అంత ఒత్తిడి పెట్టకండి. Residential సంస్థల్లో వాళ్లను పడేసి చదివే యంత్రాలుగా చేయొద్దు.

b) He wants to go easy on his subordinates = తన కింది ఉద్యోగుల మీద అతడు అంతగా ఒత్తిడి పెట్టకూడదని అనుకుంటున్నాడు.

c) The Doctor advised him to go easy on his walking and other exercises = వాకింగ్ ఇతర వ్యాయామాల తీవ్రతను తగ్గించమని డాక్టర్ అతడికి సలహా ఇచ్చాడు.

**5) Be on the go** = Be on the move = తీరిక లేక పనులమీద తిరుగుతుండటం.

a) Ever since I joined here I've been always on the go = ఇక్కడ నేను చేరినప్పటి నుంచి అసలు తీరికలేకుండా ఉన్నా.

b) She is always on the move, so her dad finds no time to talk to her of her marriage = ఆమెకెప్పుడూ తీరికుండదు, అందుకని వాళ్ల నాన్నకు ఆమెతో ఆమె పెళ్లి విషయం గురించి మాట్లాడే సమయమే ఉండటం లేదు.

**6) Let up** = తగ్గడం/ తగ్గించడం (శ్రమలాంటి వాటిని)/ ఊరట చిక్కడం.

a) There has been no let up in the terrorist threat to India = తీవ్రవాదుల వల్ల ప్రమాదంలో భారత్‌కు ఏమాత్రం ఊరట చిక్కడం లేదు.

b) There has been no let up in the rain since yesterday = నిన్నటి నుంచి కురుస్తున్న వానతో తెరిపిలేకుండా ఉంది.

c) Pakistan hasn't let up its hate campaign on India = భారత్ మీద పాక్ ద్వేషోద్యమాన్ని తగ్గించడం లేదు.

**7) There's no accounting for (something)** = ఒక విషయానికి కారణం చెప్పలేకపోవడం.

a) There's no accounting for taste, is there? = ఒకరి అభిరుచులకు కారణం ఉండదు కదా? ఒక్కొక్కరికి ఒక్కొక్క దానిమీద ఇష్టం ఉంటుంది, దానికి కారణమేమీ ఉండదు అని అర్థం)

b) No accounting why people vote for a party = ఓ పార్టీకి ప్రజలు ఎందుకు ఓటేస్తారో చెప్పలేం.

c) There's no accounting for his presence there at that time, so the police picked him up = ఆ సమయంలో అతనక్కడ ఎందుకున్నాడో చెప్పలేం. అందుకని పోలీసులు అతడిని పట్టుకున్నారు.

**8) To get over** = మనలను వేధిస్తున్న సమస్యను/ భావాన్ని వదుల్చుకోవడం.

a) The father is unable to get over the feeling that he hasn't done enough for his son's future = తన కొడుకు భవిష్యత్తుకు తనేం చేయలేకపోయాననే భావం ఆ తండ్రిని వీడటంలేదు.

b) She finally got over the feeling of neglect at home= తనను తన కుటుంబం నిర్లక్ష్యానికి గురిచేస్తుందనే భావాన్ని ఆమె చివరికి పోగొట్టుకుంది.

**9) Weigh (somebody) down** = కుంగదీయడం

a) The feeling of loneliness is weighing her down = ఒంటరితనం ఆమెను కుంగదీస్తోంది.

b) He is always in high spirits. Nothing can weigh him down = అతనెప్పుడూ ఉల్లాసంగా ఉత్సాహంగా ఉంటాడు. ఏదీ అతడిని కుంగదీయలేదు.

**10) Too little, too late** = సహాయం/ న్యాయం లాంటివి అరకొరగా అందడం, అదీ ప్రయోజనం లేనంత ఆలస్యంగా.

a) The relief measures to the flood victims were too little and too late = వరద బాధితులకు అందిన సహాయక చర్యలు, చాలినంతగా లేకపోవడమే కాకుండా ఆలస్యంగా అందాయి.

b) Justice was done to the old couple, but it was too little and too late = వృద్ధ దంపతులకు న్యాయమైతే జరిగింది, కానీ అది చాలీ చాలనంత, చాలా ఆలస్యంగా.



**P. Sujatha, Sindhanur, Karnataka**

**Q.** In respect of అనే idiom అర్థాన్ని తెలుపగలరు.

**A.** In respect of = ఒకదానికి సంబంధించి/ ఆ సందర్భంగా.

In respect of your application for a job you will hear from us soon = ఉద్యోగం కోసం మీరు పంపిన application గురించి/ కు సంబంధించి మీరు మా దగ్గర నుంచి త్వరలోనే వింటారు.

**Q.** Formal, informal; formal words, informal words అంటే ఏమిటి? అలాగే formal language, informal language ల గురించి తెలుపగలరు.

**A.** Formal = కొన్ని కొన్ని పద్ధతులూ గౌరవ మర్యాదలూ, లాంఛనాలు పాటించాల్సిన పరిస్థితులు. సభలూ సమావేశాల్లో మనకంటే పైస్థాయిలో ఉన్న వాళ్లతో వ్యవహరించేటప్పుడూ, మనం గౌరవించాల్సిన వాళ్లతో మెలిగేటప్పుడూ పాటించాల్సిన పద్ధతులన్నీ formal. ఇంటికొచ్చిన వాళ్లను ఆహ్వానించి కూర్చోమనడం, మంచినీళ్లడగడం - ఇవన్నీ formalities. అలా మెలిగేటప్పుడు మనం formal గా ఉంటాం. అలాంటి సందర్భాల్లో వాడే భాష formal language.

అలాకాకుండా పద్ధతులు పాటించాల్సిన అవసరం లేకపోవడం informal. మన కుటుంబంలోని వాళ్లతో, స్నేహితులతో చనువుగా మసలుతున్నప్పుడు, మనం informal గా ఉంటాం. అప్పుడు వాడే మాటలు informal.

**Q.** వాక్యాల మధ్యలో in which అని వస్తూ ఉంటుంది. దీని అర్థాన్ని ఉదాహరణలతో తెలుపగలరు.

**A.** This is the city in which there is the temple of Kanaka Durga. (కనకదుర్గ గుడి ఏ ప్రదేశంలో ఉందో ఆ ప్రదేశం/ నగరం ఇదే). మామూలుగా అనే విధం - కనకదుర్గమ్మ గుడి ఉన్న ప్రదేశం ఇదే.

Maths is the subject in which I am weak = నేను సరిగా చేయలేని సబ్జెక్ట్ మ్యాథ్స్.

In which = ఎందులో అయితే ఉందో అది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# I missed you yesterday





M.SURESAN



**C. Janardhan, Nalgonda**

**Q.** You can count on me ఈ వాక్యానికి తెలుగులో అర్థం తెలుపగలరు.

**A.** You can count on me = నా మీద నువ్వు ఆధారపడవచ్చు (నీకు నేను తప్పకుండా సాయం చేస్తాను)

To count on = (ఒకరిమీద) ఆధారపడటం.

**Q.** మీరు నాకు ఇప్పించిన టీవీ పనిచేయడం లేదు. ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** The T.V. you got for me is not working/ Something is wrong with the T.V. you got for me.

**Q.** కింది పదాలకు అర్థాలు వివరించగలరు.

a) Ain't b) gonna c) gotta d) kinda

**A. Ain't** = am not (ఇది American blacks వాడుక- I ain't going there = I am not going there - educated వాడే మాటకాదు.)

**gonna** = going to

**gotta** = got to

I've gotta go there = I've got to go there = నేనక్కడికి వెళ్లాలి.

**kinda** = Kind of

It's a kinda fish = It's a kind of fish.

**Q.** Till, until ల అర్థం తెలుపగలరు.

**A.** till = until

**B. Sattibabu, Kadiam**

**Q.** ఇంగ్లిష్ భాషలో verb లేని వాక్యాలు ఉండవని ఒక చోట చదివాను. What about your food on the journey? ఈ వాక్యంలో verb ఏది?

**A.** What about your food on the journey?/ How about your food on the journey? - ఇలాంటివాటిని sentence అని అనలేం. మామూలుగా వీటిని English conversation (సంభాషణ) ఎవరితోనయినా ప్రారంభించేందుకు వాడతాం ఆ సంగతేమిటి అనే అర్థంతో.

How/ What about your friends? Are they coming? = మీ ఫ్రెండ్స్ సంగతేంటి? వాళ్లొస్తున్నారా?

**Q.** ఇంగ్లిష్ వాక్యాలకు తెలుగులో అర్థం చెప్పేటప్పుడు తెలుగు వాక్యాల చివర క్వశ్చన్ మార్క్ పెడుతున్నారు. ఇంగ్లిష్ వాక్యాల చివర పెట్టడం లేదు. ఎందుకని?

How about/ What about your new bike = నీ కొత్త బైక్ సంగతేంటి? (ఎలా ఉంది?)

**A.** తెలుగులో మనం కదా? కాదా? అని సర్వసాధారణంగా వాడతాం కదా? దీనికి English లో సమానమైనవి లేవు. (Question tags తప్ప). ఇప్పుడు ఈ కింది sentence చూడండి.

Why (do you) read the newspaper. You can watch the news on the TV. = Newspaper ఎందుకు చదువుతావు. వార్తలు టీవీ లో చూడొచ్చు- ఇలా అనే బదులు మనం మామూలుగా 'వార్తలు టీవీలో చూడొచ్చు కదా?' అనడం సహజంగా ఉంటుంది కదా?

ఒక భాషలోంచి ఇంకో భాషలోకి అనువదించేటప్పుడు ఎలా ఉంటే అలా అనువదిస్తే కాస్త కృత్రిమంగా ఉంటుంది. అంతేకాకుండా నువ్వు నిన్న మీటింగ్‌కు రాలేదు అనేందుకంటే ఎందుకు రాలేదు? అనడం ఎక్కువ అర్థాన్ని ఇస్తుంది.

Hi Priya you're not to seen = 'నువ్వు కనిపించడంలేదు' కంటే నువ్వేంటి కనిపించడం లేదు? / నువ్వు కనిపించడంలేదేం? అనడం తెలుగులో సహజంగా అనిపిస్తుంది అనే ఉద్దేశంతో Question mark (?) English లో లేకపోయినా తెలుగులో వాడతాం. '?' లేకుండా కూడా అనువదించవచ్చు. పెద్ద తేడా ఉండదు.

**Q.** a) He is through with his home work.

b) He has completed his home work.

పై రెండు వాక్యాల మధ్య ఉన్న తేడా ఏమిటి?

**A.** He has completed his home work.

He's through with his home work. మీరన్నట్లు, మొదటి sentence, రెండో sentence కంటే సులభంగా అర్థం అవుతుంది. అయితే conversation (సంభాషణ)లో variety కోసం ఎప్పుడూ ఒకేమాట వాడం. తెలుగులో కూడా అంతేకదా? అతడు home work పూర్తి చేశాడు - దీన్నే రకరకాలుగా చెప్పవచ్చు ఉదాహరణకు అతడి హోంవర్క్ పూర్తయ్యింది/ అతడి హోంవర్క్ అయ్యింది - ఇలా.

జనగణమన పాడదామా ఇక? అని కూడా అంటాం కదా, 'పూర్తిచేద్దామా' అనే అర్థంతో.

'Be through' (= complete) - ఇది idiom English లో. సందర్భాన్ని బట్టి సులభంగా అర్థం చేసుకోవచ్చు

**Q.** If I have any time left that day, I will go to your place.

If అనేది ఎప్పుడెప్పుడు ఉపయోగించాలి.

left లేకుండా వాక్యం రాయకూడదా? will go బదులు will come రాయకూడదా?

**A.** If = అలా అయితేనే/ ఆ పరిస్థితిలోనే.

If you pay the money, I will give you the books = నువ్వు డబ్బు కడితేనే నేను నీకు పుస్తకాలిస్తాను.

If you know English, you can get a good job = నీకు ఇంగ్లిష్ తెలిస్తే (తెలిసినట్టయితే), మంచి ఉద్యోగం తెచ్చుకోగలవు.

a) If I have any time = నాకేదైనా సమయం ఉంటే..

b) If I have any time left = నాకేదైనా సమయం మిగిలితే.

(left = మిగిలి ఉన్న)

sentence a, b ల మధ్య తేడా తెలుస్తోంది కదా?

c) మనం ఉన్నచోటికి ఎవరైనా రావడం = come

go = ఎవరైనా ఎక్కడికైనా వెళ్లడం. తెలుగులో మీ ఇంటికి నేను వస్తాను అనడం సహజం. ఇదే అర్థంతో ఇంగ్లిష్‌లో I will go to your place అనడం ఎక్కువ. అయితే నేను ఇప్పుడొస్తున్నాను అనేందుకు I am coming అంటాం.

**Q.** Being అనేది passive voice లో ఉపయోగిస్తాం కదా. కానీ కింది వాక్యంలో passive లో లేదు.

A jubilant union minister Sharad Pawar after being elected president of the board of control for cricket in India, in Kolkata on tuesday. దీన్ని ఎలా గుర్తించాలో వివరించగలరు.

**A.** ..... after being elected ... ఇక్కడ being elected (మీరన్నట్లు being + $v_3$) passive voice అవుతుంది, ఎన్నుకోబడ్డ తర్వాత అనే అర్థంతో.

Being seen [being + $v_3$ (PP)] there isn't good = అక్కడ చూడబడటం (passive) మంచిది కాదు. (అక్కడ కనిపించడం మంచిది కాదు).

**K. Srikala, Rayagada (Orissa)**

**Q.** 1. I miss you.

2. I am missing you. ఈ రెండింటికి తేడా ఏమిటి? ఏ tense లో ఉపయోగిస్తారు. I am missing you అసలు వాడొచ్చా లేదా?

3. నిన్న నేను నిన్ను మిస్ అయ్యాను. దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

4. ఒక పదిరోజులు మిస్ అయ్యి, పదకొండో రోజు కలిసి, పది రోజులు నిన్ను మిస్ అయ్యాను అని ఎలా చెబుతారో తెలుపండి.

**A.** i) I miss you = నువ్వు లేకపోవడం నాకు కొరతగా ఉంది = నువ్వులేని లోటు అనుభవిస్తున్నాను.

ii) I am missing you కు కూడా పై అర్థమే వస్తుంది. అయితే ఈ form (am missing / is missing / are missing) వాడకం చాలా తక్కువ.

I miss/ he (she) misses అనే ఎక్కువగా అంటాం.

iii) I missed you yesterday.

iv) 11వ రోజు ఇలా చెప్పండి: I have missed you for the past/ for the last ten days.

**P. Shyamson, Kotaiah Camp**

**Q.** Would, should, could, might ఏ సందర్భంలో వాడతారో తెలియజేయండి.

**A. Uses of would:**

i) Will కు past form గా would వాడతాం. అంటే గతంలో నుంచి భవిష్యత్తు తెలిపేందుకు.

He says he will meet me (He says = అత నిప్పుడంటున్నాడు, he will meet me = నన్ను కలుసుకుంటానని. ఇప్పటి (present) నుంచి future చెప్పేందుకు will (meet) వాడాం కదా. కింది వాక్యాన్ని చూడండి.

He said (అతనన్నాడు, గతంలో) he would meet me (నన్ను కలుసుకుంటానని) నన్ను కలుసుకుంటానని. అతడు గతంలో చెప్పాడు అంటే అతడు నన్ను కలుసుకోవడం, గతం నుంచి future లోకి, కాబట్టి would వాడాం.

ii) 'would' ను question form లో present (ఇప్పుడు)లో చాలా గౌరవంగా request కు/ permission కు/ offer (ఏదైనా ఇతరులు అడక్కుండా మనం ఇవ్వడం) కు వాడతాం.

a) Would you lend me your book for a day? ఒక రోజుకు మీ పుస్తకం ఇస్తారా? (request)

b) Would you let me sit here? = మీరు నన్నిక్కడ కూర్చోనిస్తారా? (permission)

c) Would you like some coffee? = కాస్త coffee తీసుకుంటారా? (తీస్కోండి) - (offer).

iii) Would ను past habit (గతంలో అలవాటుగా చేసినపనికి) వాడతాం.

Those days I would play cricket every evening = ఆ రోజుల్లో నేను ప్రతి సాయంత్రం క్రికెట్ ఆడేవాడిని.

iv) Would = wish = కోరుకోవడం. I would (wish to) buy such a car soon = త్వరలో అలాంటి కారు కొనాలనుకుంటున్నాను.

**Should** ను ఆజ్ఞ (order) ఇవ్వడానికి, విధిగా చేయాల్సిన పనికి, అవసరం తెలిపేందుకు వాడతాం.

a) You should be here at 10 every day = నువ్విక్కడ రోజూ 10కి ఉండాలి (order)

b) I should stay at office from 10 AM - 6 PM.= 10 నుంచి 6 వరకు నేను ఆఫీస్‌లో ఉండాలి (Duty).

c) I should start now or I will miss the train = నేనిప్పుడు బయల్దేరాలి, లేకుంటే ట్రైన్ తప్పిపోతుంది. (అవసరం)

**Could** - ఇది

i) Can కు past form - అంటే గతంలో సామర్థ్యాన్ని తెలిపేది.

Ramarao was an actor, so he could become a CM = రామారావు నటుడు కాబట్టి ముఖ్యమంత్రి కాగలిగాడు.

ii) ఏదైనా జరగొచ్చు అనే అర్థంతో వాడతాం, present లో.

Be careful with him. He could be dangerous = అతడితో జాగ్రత్త సుమా. అతడు ప్రమాదకారి కావచ్చు

It could rain = వర్షం రావచ్చేమో.

iii) Question form లో could ను అతి మర్యాదకరమైన అభ్యర్థనలకు వాడతాం.

Could you lend me Rs. 1000? = ఒక వేయి రూపాయలు అప్పిస్తారా? (Politest form of request)

**Might**- may కు past form 'might'. గతంలో ఏదైనా అయి ఉండొచ్చు అనే అర్థంతో వాడతాం.

i) I thought he might come = అతడొస్తాడేమో నని అనుకున్నా. (Past doubt)

ii) Might ను present లో సందేహాన్ని తెలిపేందుకు వాడతాం.

He might help you = అతడు నీకు సాయం చేయవచ్చేమో.

They might come = వాళ్లొస్తారేమో? (చాలా సందేహం)

**A. Raghupathi, Naidupet (Nellore Dist)**

**Q.** Simple present కు Simple future కు రెండింటికీ ఒకే రకమైన అర్థం వస్తుంది కదా.

ఉదా: I do నేను చేస్తాను. (Simple Present)

I will do. నేను చేస్తాను. (Simple Future)

తేడా తెలియజేయగలరు.

**A.** Tense ను బట్టి verb form ఇంగ్లిష్‌లో మారేంతగా తెలుగులో మారదు. తెలుగులో ఎప్పుడు ఒకపని జరిగేది time words (రేపు, రోజూ, ప్రతినెల, నిన్న, మొన్న)ను వాడి తెలుపుతాం.

English లో tense ను బట్టి verb రూపం మారుతూ ఉంటుంది, తెలుగులోలా కాకుండా.

I do it (regularly) = నేను (రోజూ వారానికోసారి/ నెలకు రెండుసార్లు etc) చేస్తాను.

I will do = నేను చేయబోతాను = త్వరలో చేస్తాను/ నా ఇష్టం వచ్చినప్పుడు చేస్తాను.

తెలుగులో పని జరిగే సమయాన్నిబట్టి verb రూపం మారదు కాని English లో పనిజరిగే సమయాన్నిబట్టి verb form మారిపోతూ ఉంటుంది. అందుకే మనకు English అంత confusing గా, కష్టంగా అనిపిస్తుంది.

ఒక్కోసారి future లో కచ్చితంగా జరుగుతుంది అని మనకు తెలిసినప్పుడు future కు simple present form కూడా వాడతాం.

She takes the exam next week = ఆమె వచ్చే వారం పరీక్ష రాస్తుంది = She is taking the exam next week (present continuous కూడా వాడవచ్చు) = She will take the exam next week. అయితే, will take - takes ... (next week)/ is taking (next week) అంత కచ్చితం కాకపోవచ్చు.

**V. Suresh Kumar, Mukurala**

**Q.** Have to, Should లకు మధ్య తేడా తెలుపగలరు. ఇవి ఒకే అర్థాన్నిస్తున్నాయి. కానీ, వీటిని ఏయే సందర్భాల్లో వాడారు?

We have to respect our constitution.

We should respect our constitution. వీటిలో సరైనదేది?

**A.** Should కూ, have to కు అంత తేడా లేదు. రెండింటినీ ఆజ్ఞలిచ్చేందుకు, మనం చేయాల్సిన అవసరం ఉండే పనులకు వాడతాం. అయితే నిబంధనలు తెలిపేందుకు should ఎక్కువగా వాడతాం.

Candidates should be at the exam hall by 10 = విధిగా ఉండాలి హాల్లో. ఇది rule ను తెలుపుతోంది.

Candidates have to be in the exam hall by 10 - ఉండాలి కచ్చితంగా, అని. rule తెలిపేందుకలా అనం.

We have to respect our constitution = రాజ్యాంగాన్ని మనం గౌరవించాలి (అది మన విధి).

We should respect our constitution = మనం రాజ్యాంగాన్ని గౌరవించాలి- ఇది మన కర్తవ్యం - మనం నిబంధన ప్రకారం కూడా చేయాల్సిన పని.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

# ప్రతిభ

# He felt blue on hearing the news




M.SURESAN



***Md. Yakub Ali, Yellandu***

**Q.** నేనిది చేయలేకపోతున్నాను ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** I am not able to do it.

**Q.** 'నేను గతంలో కారు అమ్మాను' అని చెప్పడానికి I sold, I have sold, I had sold లలో ఏది వాడాలో తెలుపగలరు.

**A.** మీరు మాట్లాడుతున్న సందర్భాన్ని బట్టి. I have sold the car, I sold the car రెండూ correct. అయితే 'I had sold the car' Independent sentence గా తప్పు.

I have sold the car- నేను car అమ్మేశాను (అమ్మడం జరిగింది అని). ఇక్కడ have sold (have + pp), time (ఏ రోజు/ ఏ నెల/ ఏ సంవత్సరం అని) చెప్పని past action. ప్రాముఖ్యం అమ్మడానికే కానీ, అమ్మిన time కు కాదు.

I sold the car. verb- sold (past doing word/ past simple). దీనర్థం కూడా నేను car అమ్మేశాననే. అయితే sold వాడినప్పుడు, ఎప్పుడమ్మిందీ (time/ month/ year, etc) కచ్చితంగా తెలపాలి.

I sold the car last week/ yesterday etc. అయితే ఇక్కడ కూడా సందర్భాన్ని బట్టి అమ్మిన time తెలిసినా కూడా time లేకుండా వాడతాం.

e.g. : Someone offered me very good price for the car yesterday. I sold the car. (ఎవరో నాకు మంచి ధర ఇచ్చేందుకు ముందుకొచ్చారు, నిన్న కారు అమ్మేశాను).

ఇలా ఇది correct.

had sold - had + pp - దీన్ని గతంలో రెండు పనులు జరిగి ఉంటే, మొదటి పనికి వాడతాం. I had sold the car - ఒకే పని కాబట్టి ఇలా అనం.

**Q.** As well as, so that అంటే ఏమిటి?

**A.** As well as = అదే కాకుండా ఇది కూడా/ దాంతో ఇది కూడా

a) Vijayawada as well as Guntur is hot during summer = వేసవిలో విజయవాడ ఒకటే కాకుండా గుంటూరు కూడా వేడిగానే ఉంటుంది.

b) My parents as well as my sister have come = మా అమ్మా నాన్నలే కాకుండా మా అక్క కూడా వచ్చింది.

As well as తో రెండు subjects ను పై sentences లోలా వాడితే verb మొదటి subject ను బట్టి ఉంటుంది.

a) He as well as his children has come = ఆయన, ఆయన పిల్లలూ వచ్చారు. ఇక్కడ He, his children - ఈ రెండు subjects నూ, as well as తో కలిపాం మొదటి subject 'he' కాబట్టి verb, has come. అదే subjects order మార్చామనుకోండి అప్పుడు sentence-

His children as well as he have come. ఇక్కడ మొదటి subject 'His children (they) కాబట్టి, verb 'have come' అవుతుంది.

So that అంటే అందుకు వీలుగా/ ఏదైనా జరిగేట్లు/ జరిగేందుకు/ అందుకు అని.

a) Study well so that you may pass = పాస్ అయ్యేందుకు వీలుగా బాగా చదువు.

b) He started early so that he might avoid the queue = క్యూలో నిలబడకుండా ఉండేందుకు అతడు ముందే బయల్దేరాడు.

So that బదులు 'to + 1st RDW' (Infinitive) వాడొచ్చు.

He started early to avoid the queue.

**Q.** I will have to be అంటే ఏమిటి?

**A.** I will have to be = should be = must be = ఉండాలి.

I will have to be there tomorrow = నేను రేపక్కడ ఉండాలి.

**Q.** 'వాళ్లు absent అయ్యారు' అనడానికి they were absent అనవచ్చా?

**A.** అనవచ్చు

**Q.** I used to go there ఈ వాక్యాన్ని ప్రశ్నగా అడగాలంటే what do you used to do అనవచ్చా?

**A.** I used to go there - ఈ జవాబు వచ్చే ప్రశ్న: Did you use to go there?/ Where did you use to go ? What did you use to do?

**Q.** Shall be had అంటే ఏమిటి?

**A.** Shall be had = ఇది Passive verb. ఒకరికేదైనా తప్పక ఉంటుంది. (కలిగి ఉండబడుతుంది) అని.

Whatever you want, it shall be had = నీకేదికావాల్సినా, నీవది కలిగి ఉంటావు (నీకది తప్పక ఉంటుంది futureలో).

Do you want a car? it shall be had (by you) = నీకు car కావాలా? అది నీకు తప్పక ఉంటుంది- futureలో.

**Q.** As far as అంటే ఏమిటి?

**A.** As far as = ఆ మేరకు/ అంతమటుకు

As far as I can see = నా కనుచూపు మేరలో/ నేను చూడగలిగినంతవరకు/ నాకర్థం అయినంత వరకూ.

a) As far as I can see, there isn't any car = నా కనుచూపుమేర దూరంలో ఏ కారూ లేదు.

b) His parents educated her as far as they could = ఆమె తల్లిదండ్రులు ఆమెను చదివించగలిగినంత వరకూ చదివించారు.

c) I will walk as far as I can, and after that take a bus = నేను నడవగలిగినంత దూరం నడుస్తాను, ఆ తర్వాత బస్ ఎక్కుతాను.

**Q.** 'మీ జేబులో బిస్కెట్ ప్యాకెట్ ఉంది కదా. దాన్ని బయటకు తీయండి.' ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** You have/ There is a biscuit packet in your pocket. Take it out.

**Q.** 'అది కాలిపోయింది' అనడానికి ఇంగ్లిష్‌లో It burnt అనాలా లేదా It was burnt అనాలా.

**A.** It is burnt.

**Q.** He was dead లేదా He died ఏది కరెక్టు?

**A.** He died = He was dead

He died = అతడు మరణించాడు = He is dead.

***D. Usha, Nandyala***

**Q.** The leaves are green in colour. దీన్ని ప్రశ్నలా అడగాలంటే What colour is the leaves? అనాలా What colour are the leaves? అనాలా?

**A.** What colour are the leaves? - Correct. ఇక్కడ leaves plural కదా? అందుకని 'are' correct. అయితే What is the colour of leaves? అంటాం colour singular కాబట్టి.

***A. Subba Rao, Onipenta***

**Q.** కింది ఇంగ్లిష్ వాక్యాల్లో గీతగీసిన భాగానికి అర్థం తెలుపగలరు.

- He was cast down at the sad news of his future.

**A.** Castdown = downcast = depressed = నిరాశా నిస్పృహలతో ఉండటం/ నిరుత్సాహంతో కుంగిపోవడం - ఏదైనా చెడు జరగడం వల్ల. He was cast-down/ downcast at the sad news of his future = తన భవిష్యత్తును గురించి చెడు/ విచారకరమైన వార్త విని అతడు కుంగిపోయాడు/ డీలా పడిపోయాడు.

- Nagarjuna sagar talepond.

**A.** అది talepond కాదు, tailpond - ఇది dam లకు సంబంధించిన Engineering పదం.

- Hitler followed the policy of blood and iron.

**A.** Blood and Iron = ఆగని హింస, దౌర్జన్యం, బల ప్రయోగం. అయితే ఈ expression ఇప్పుడు వాడుకలో లేదు.

- A work for which no one is grateful collecting taxes is a thankless task.

**A.** గుర్తింపు/ కృతజ్ఞత పొందని శ్రమ

Sanitation worker's job is a thankless job/ task = (Municipal) పారిశుద్ధ్యపనివారి శ్రమ ఎవరి గుర్తింపూ/ కృతజ్ఞతా పొందని పని.

- If you want to improve the situation you must take the bull by heart.

**A.** సమస్య నుంచి తప్పుకోకుండా, ధైర్యంగా ఎదుర్కోవడం.

He was losing in business, but he took the bull by the horns = అతడి వ్యాపారంలో నష్టాలొస్తుండేవి. అయినా ధైర్యంగా ఆ పరిస్థితిని ఎదుర్కొన్నాడు.

- The student looked blue on seeing the question paper.

**A.** look blue కాదు, feel blue. అర్థం నిరాశతో కుంగిపోవడం/ అధైర్యపడటం. He felt blue on hearing the news = ఆ వార్త వినగానే అతడు నిరాశపడ్డాడు.

- Raju is a good runner, the champion will have to look to his laurels.

**A.** పొందిన విజయాన్ని కాపాడుకోవడం, ఎక్కడా ఓడిపోకుండా. He looked to his laurels after the first victory as he wanted to reach the finals = finals కు చేరాలనే ఉద్దేశంతో తన విజయాన్ని కాపాడుకున్నాడు.

- Places of tourist interest అర్థం ఏమిటి?

**A.** పర్యటకులను ఆకర్షించే ప్రదేశాలు.

- Nodal వ్యవస్థ అర్థం ఏమిటి?

**A.** కేంద్రమైనట్టి.

***G. Pavani, Karimnagar***

**Q.** What is the difference among the following.

- Song and anthem

**A.** Song = Any song; Anthem = a religious or sacred (Holy) song.

- Scrutiny and checking

**A.** Scrutiny = a thorough examination to see how far something is true or correct.

Check = verify- to see if the information given is correct or not.

- Biodata and resume

**A.** Biodata = Information about oneself their qualifications, experience etc.,

Resume = A brief account of your qualification, experience etc.

Biodata (British) = Resume (American)

- Sound and noise

**A.** Sound = usually pleasant to hear

Noise = unpleasant sound.

- Commission and committee

**A.** Commission = A group of people appointed by the government and having powers to find out control/ make rules about something.

Committee = A group of people selected by anybody (Not necessarily government) to study a problem and suggest solutions.

- Craft and drawing

**A.** Craft = Any work done by hand (చేతి పని/ హస్తకళ)

Drawing = Draw pictures with pen, pencils, water colours, etc. (బొమ్మలు గీయడం).

- Helipad and airstrip

**A.** Helipad = A place for landing and taking off of helicopters.

Airstrip = A small place for landing and taking off of airplanes.

- Talent and performance

**A.** Talent = Ability to understand and do some thing / cleverness.

Performance = Doing of something, especially in public.

e.g. : Dance performance = Doing a dance in public.

- Stork and crane

**A.** Stork and crane = more or less the same kind of water birds. storks are black and white and build nests on tops of tall buildings. Cranes are mostly white and stay away from humans.

- Examination and test

**A.** Examination (exam) = a very formal test of one's ability.

Test = Not always so formal as an exam.

- Plan and idea

**A.** Plan = A detailed programme of what you want to do, to achieve/ do something.

Idea = The thought of doing something.

Idea - I Stage; Plan - II Stage

- Deputy and vice

**A.** Deputy = Vice

- Against and versus

**A.** Against = Opposite, used generally versus = used mostly in sports- almost the same as against.

***S.G. Syamsunder, Metpalli***

**Q.** How many brothers have you?

How many brothers do you have?

వీటిలో ఏది కరెక్టు?

**A.** How many brothers have you? = నీకెంతమంది సోదరులు = How many brother do you have? అయితే, How many brother have you? - British; How many brothers do you have?- American.

**Q.** Yet, so that, else, ago, before మొదలైన వాటిని ఎలా వాడాలో తెలుపండి.

**A.** Yet = ఇంకా/ ఇంతవరకూ = till now I haven't (have not) seen the movie yet = నేనింకా ఆ సినిమా చూడలేదు.

I have yet to see the movie = నేనింకా ఆ సినిమా చూడాల్సి ఉంది. (ఇప్పటి వరకూ చూడలేదు)

So that = అది జరిగేందుకు వీలుగా Reserve the tickets so that we can avoid the queue = టికెట్లు ముందే reserve చెయ్యి, క్యూలో నిలబడకుండా ఉండేందుకు.

He started early so that he may not be late = ఆలస్యం అవకుండా ఉండేందుకు, ముందే బయల్దేరాడు (అందుకు వీలుగా).

Else = ఇంకేంటి? / ఇంకెవరు? / ఇంకెప్పుడు? అనే భావంతో.

What else? (ఇంకేంటి? ) Who else? (ఇంకెవరు? ) When else? (ఇంకెప్పుడు? ) లాంటి expressions లో వాడతాం. or else = అది కాకపోతే.

Pay now or else you will lose the chance = ఇప్పుడు డబ్బు కట్టు, లేకపోతే అవకాశం కోల్పోతావు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# What do I call you?



**B. Sujatha, Tirupathi**

**Q.** He ordered me to keep the shop open until his purchases are complete. ఈ వాక్యంలో are complete స్థానంలో are completed ఉండాలి కదా. దయచేసి వివరించగలరు.

**A.** He ordered me to keep the shop open until his purchases were complete. This is the correct sentence. 'were completed' is correct too, but 'complete' is equally correct. 'complete' is an adjective like 'open'.

The shop was opened = The shop keeper opened the shop.

The shop was open = The shop was not closed.

similarly

My work is complete = over

My work is completed = My work is in a completed state.

**Q.** It must be complete in with all particulars - ఈ వాక్యంలో complete స్థానంలో completed ఉండాలి కదా.

**A.** You are correct. The correct expression is, 'complete with all particulars' .

**S.Satyanarayana Murthy, Kakinada**

**Q.** 'Be' forms ఎన్ని రకాలు? వాటిని ఉపయోగించి కొన్ని ఉదాహరణలు తెలుపండి.

**A.** 'Be' forms: 3 sets:

1) Am, is, are
was, were

2) చివర 'be' వచ్చేవి 3) 'been' చివర వచ్చేవి

| 2) | | 3) | |
|---|---|---|---|
| shall, should, will, would, can, could, may, might, must, have to, has to, had to | be | have been, has, had | |
| | | shall, should, will, would, can, could, may, might, must | have been |

1) a) I am in this room (verb - am ('Be' form) = ఉన్నాను- ఇప్పుడు)

b) I am sitting in the room (verb - am sitting - am + ing = నేను కూర్చుని ఉన్నాను - కూర్చోవడం - action)

2) a) She has been a teacher for the past two years (verb - has been - be form = ఆమె రెండేళ్లుగా teacher గా ఉంది)

b) She has worked/ has been working as a teacher for the past two years

(verb- has worked (has + PP)/has been working - has been (be form) + working (ing form) = ఆమె రెండేళ్లుగా teacher గా పని చేస్తున్నారు - action)

3) They should have been there yesterday (verb - should have been - 'be' form = వాళ్లు నిన్న ఇక్కడ ఉండాల్సింది, కాని లేరు)

4) They should have been studying yesterday (verb - should have been - be form + studying (ing form) = వాళ్లు నిన్న చదువుతూండాల్సింది, కాని చదవలేదు - action)

ఇలా ఎన్నైనా చెప్పవచ్చు. అలాగే, have /has/ had/ shall have/ should have/ will have/ would have, etc + past participle - action అర్థం వస్తుంది.

He would have been there - verb - would have been - be form = అతడక్కడ ఉండేవాడే. కానీ లేదు.

He would have gone there - verb would have gone - Should have + PP - అతడక్కడికి వెళ్లేవాడే, కానీ వెళ్ళలేదు.

ఇలా మీరేదైనా తీసుకుని, States of being (ఉండటం) తెలిపే verb forms, be form + ing/ PP - actions (పనులను) గురించి తెలిపే actions words form చేసుకోవచ్చు.

**V. Suryarao, Vizag**

**Q.** 'No' he said దీన్ని మరో విధంగా ఎలా చెప్పాలి?

**A.** He said no/ He denied it.

**Q.** It has been decided to issue identity cards to all persons above 18 before the end of November. మరో విధంగా ఎలా చెప్పొచ్చు?

**A.** All persons above 18 will be issued identity cards before the end of November.

**Vivek Satyanandam, Korukonda**

**Q.** Was any body injured in the accident?

Has anybody injured in the accident?

Which is correct, what is the difference between them.





M.SURESAN

**A.** Was any body injured in the accident?- Correct

Has any body injured in the accident - wrong.

Has anybody injured means if anyone has injured someone. Your idea is to find out if anybody has been injured = if because of the accident anybody has got injured.

**Q.** Please explain about the word 'Reference' with example in telugu.

**A.** Reference = 1) ప్రస్తావించడం. The reference here is to the Bharatham - ఇక్కడ ప్రస్తావన/ ఒక విషయాన్ని గురించి మాట్లాడటం భారతాన్ని గురించి.

2) సమాచారం పొందడం/ సంప్రదించడం Let us have a list of phone numbers for reference. Telephone numbers సులభంగా పొందేందుకు, వాటి జాబితా ఉంచుకుందాం.

3) సలహా పొందడం - He started doing it without reference to his elders = అతడు పెద్దవాళ్లను సంప్రదించకుండానే అది చేయడం మొదలు పెట్టాడు.

**Q.** Is 'never' used only sentence form in present perfect tense? Doesn't used in question form? Please explain. My mother has never travelled by air (మా అమ్మ ఎప్పుడూ విమానంలో ప్రయాణించలేదు అనే అర్థంతో) Has my mother never travelled by air? (question form).

**A.** It is better to avoid 'never' in the present perfect tense. 'Never' means, not at any time, in the past, present or future. Present perfect refers to the time till now. So 'My Mother has not travelled by air so far' is better than, 'My Mother has never travelled...' But people do use 'never' with the present perfect tense, and we can't say it is totally wrong.

**Q.** కింది పదాలకు తెలుగులో అర్థాలు తెలుపగలరు.

Diaspora, Laureate, vast talent, exaggerated, pursuit, mitigate, deployment, Intensity, perennial, Indigenously, convention, consumption.

**A. Diaspora:** The moving away of the people of one country to another. ఒక దేశానికి చెందిన ప్రజలు, ఆ దేశం విడిచి వెళ్లి ఇంకో చోట స్థిరపడటం- The Indian diaspora in the US.

**laureate:** గొప్ప సత్కారం/ పురస్కారం పొందే గొప్పవారు - A Nobel Laureate = Nobel పురస్కారాన్ని అందుకున్నవాళ్లు.

**vast talent** = a large number of people in a group/ a person having a lot of natural ability to do something. ఒక ప్రదేశంలో చాలా మందికి/ ఒక వ్యక్తికి బాగా ఎక్కువగా ఉన్న ప్రతిభ.

**exaggerate** = make too much of too little/ to make small things appear great. గోరంతలు కొండంతలు చేయడం/ అతిశయోక్తి.

**pursuit:** 1) searching/ quest (అన్వేషణ) for something. e.g.: pursuit of happiness = ఆనందానికి అన్వేషణ 2) Chasing the pursuit of the deer by the tiger - పులి జింకను వేటాడటం. 3) వ్యాపకం do something as a hobby.

**mitigate =** to reduce/ lessen suffering ఉపశమనం (బాధలాంటి వాటినుంచి) కలిగించడం.

**deployment** = 1) To move soldiers and weapons to important places for ready action.

2) To use something correctly and effectively.

**intensity** = severity = తీవ్రత

**perennial** = Continuous/ happening again and again - ఎడతెరిపిలేని. (నదుల విషయంలో perennial rivers = rivers which are never without water - e.g.: the Krishna, the Ganga etc.)

**indigenously** = produced/ born/ growing within the country, without being brought from other countries. = స్వదేశీ/ దేశీయంగా. Some brands of cars are indigenously produced in India = కొన్ని రకాల cars భారత్‌లోనే (విదేశాల నుంచి దిగుమతి చేసుకోకుండా) తయారుచేస్తారు.

**convention**= 1) A common practice(ఆనవాయితీ)
2) Conference (సమావేశం)

**consumption** = తినడం/ తాగడం; వినియోగం

**Q.** Please specify some good books for phrasal verbs, letter & essay writing.

**A.** Books for phrasal verbs: Cambridge guide to phrasal verbs. (Phrasal verbs in use - by Michael McCarthy and Felicity O'Dell). There are many good books on letter writing on the market.

**K. Konda Babu, Denduluru**

**Q.** కింది తెలుగు వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

ఈ పేపరు ఈ రోజుదేనా? లేదా ఎప్పటిది ఈ పేపరు (ఏ రోజుది)?

**A.** Is it today's paper?/ Is this today's paper?

**Q.** నాకు ముల్లు గుచ్చుకుంది. లేదా తీగ/ ఊచ గీసుకుని గాయమైంది.

**A.** A thorn has got/ is stuck in

**Q.** ఈ నిబంధనలు మీకూ వర్తిస్తాయి.

**A.** These rules apply to you also

**Q.** ఏమని పిలవాలి/ ఎలా పిలవాలి నిన్ను?

**A.** What do I call you?

**Q.** వీరందరూ ఆయనకు సంబంధించినవాళ్లు.

**A.** All these (people) are connected with him

**Q.** అతడి కారణంగానే నాకీ అవకాశం/ ఉద్యోగం వచ్చింది. లేదా నాకీ స్థితి రావడానికి అతడే కారకుడు.

**A.** I got this job opportunity only because of him.

My present position owes to him.

**Q.** నీవు ఎన్నో కుమారుడవు?

**A.** దీనికి English లేదు.

**S.Md. Ghouse Mohiuddin, Kadapa**

**Q.** కింది ఇంగ్లిష్ వాక్యాలను అనువదించగలరు.

The old man is too weak to walk.

The old man is so weak that he can not walk.

**A.** The old man is too weak to walk = ఆ పెద్దాయన నడవలేనంత బలహీనంగా ఉన్నాడు = The old man is so weak that he cannot walk = ఆ పెద్దాయన ఎంత బలహీనంగా ఉన్నాడంటే, ఆయన నడవలేడు.

**Q.** Very few kings of the world are as great as Akbar (positive degree)

Akbar is greater than most other kings of the world (comparative degree).

Akbar is one of the greatest kings of the world (superlative). మూడు డిగ్రీల్లోని వాక్యాలను తెలుగులో అనువదించ గలరు.

**A.** 1) Positive Degree - చాలా తక్కువ మంది రాజులు అక్బర్ అంత గొప్పవాళ్లు

2) Comparative - అక్బర్ చాలామంది రాజుల కంటే గొప్పవాడు.

3) Superlative - అత్యంత గొప్ప రాజుల్లో అక్బర్ ఒకడు.

**Q.** Exclamatory sentences కొన్ని what తో కొన్ని How తో ప్రారంభమవుతాయి. ఈ తేడా ఎందుకు? ఉదా: How beautiful the rose is!

What a beautify flower the rose is!

How తో మొదలయితే దాని అర్థం ఎలా ఉంటుంది. What తో మొదలయితే దాని అర్థం ఎలా ఉంటుంది.

**A.** Exclamatory లో what కీ how కీ తెలుగులో అంత తేడా లేదు. అయినా తేడా ఉందనుకుంటే ఇలా రావచ్చు.

How beautiful the rose is! = గులాబీ ఎంత అందమైన పువ్వో!

What a beautiful flower the rose is! = ఏమి అందమైన పువ్వు గులాబీ!

**Q.** Alas! అంటే అర్థం ఏమిటి? What a pity! అంటే ఏమిటి? తెలుగులో వివరించగలరు.

**A.** Alas = అయ్యో! (దుఃఖాన్ని తెలిపే ఆశ్చర్యార్థకం)

What a pity! = ఎంత దురదృష్టం!

**Ch.Venkata Ramana Reddy, Kareemnagar**

**Q.** This house belongs to me for a long time. This house has belonged to me for a long time. ఈ రెండు వాక్యాల్లో ఏది కరెక్టు?

**A.** This house belongs to me for a longtime - ఇది తప్పే. ఈ కింది రెండూ correct.

This house belongs to me = ఈ ఇల్లు నాది. ఇలా ఈ అర్థంతో ఇది correct.

This house has belonged to me for a long-time = ఈ ఇల్లు చాలాకాలంగా నాది.

Sentence (2)లో for a long time = చాలా కాలంగా అన్నప్పుడు, కొంతకాలం క్రితం నుంచి ఇప్పటి వరకూ/ ఇంకా - ఈ అర్థం రావాలంటే English లో present perfect మాత్రమే వాడతాం. అందువల్ల 'has belonged' correct.

**Q.** When I reached the meeting hall the president already had started his lecture. ఈ వాక్యం కరెక్టేనా?

**A.** When I reached the meeting hall the president had already started his lecture - correct.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# She has a musical voice



**T. Gangasingh, Adilabad**

**Q.** I have excellent command over English.
I have excellent command of English.
Which sentence is correct?

**A.** I have (an) excellent command of English - correct.

**Q.** మీరొకచోట elder తర్వాత than కానీ to కానీ వాడం అన్నారు. కానీ నేనొకచోట Elder is used to refer to relations with in the family and it is followed by to అని చదివాను. వివరించగలరు.

**A.** 'Elder' is not followed by to. 'Elder' is used only to refer to the members of the same family, and is used as follows:
a) He is the elder of the two sons of my friend/ of the two he is the elder.
b) My brother is my elder and my sister is his elder.

---

**G. Shankar, Kesavapatnam**

**Q.** I saw the following line on a reputed publisher's book.
Professor N.Krishnaswamy is one of India's leading experts on language and linguistics. Here when one of follows 'the' so that why did not use here 'the'?

**A.** Prof Krishnaswamy is one of India's leading experts on ...
Here, leading has 'India's' before is, so we don't use 'the' before 'India's' or 'leading'.
Look at this: Prof K is one of the leading experts ... Here 'the' is used before 'leading' because 'leading' is not qualified by any other word.

**Q.** Please give me detail explanation of simple, compound, complex some what difficult to me.

**A.** We have explained these more than once in these columns. Just the same, we are explaining once again.
A clause is a group of words with a verb. eg: If she asks for me ('asks' is a verb, so 'If she asks for me' is a clause). So are, groups of words each with a verb (underlined)
a) When the exams begin; b) He helps me a lot, etc.
A main clause has complete meaning.
eg: a) He is recovering fast b) He knows etc.
A clause without complete meaning is a SUBORDINATE CLAUSE
a) Wherever you are (verb)- meaning not complete- so a subordinate clause. So are clauses like, 'because they are here,' 'though India is progressing', etc.
The number of clauses in a sentence = the number of verbs in the sentence.
**Imp:** The infinitive (to go, to sing, to go - to + 1st RDW), the '...ing' form (going, coming, singing, etc.) and the Past Participle (given, sung, gone, talked, etc) are not verbs.
A simple sentence has only one main clause, that is, only one verb. eg: She has a musical voice- Has is the only verb here, and so the sentence has only one clause- the sentence itself- and as the meaning is complete, it is a main clause. So the sentence is a simple sentence. So is the following:
How can I walk on a hot day like this?
Only one verb, 'can walk' in the sentence- so only one clause- 'How can I walk' in the sentence, its meaning is complete, so it is a main clause. So, 'How can I walk on a hot day like this?' is a simple sentence.
A complex sentence has one main clause, and one or more subordinate clauses.
eg: How can I walk on a day like this which is hot?
Two verbs in the sentence: 1) Can walk, and 2) is.
So there are two clauses-
a) How can I walk?- This clause has complete meaning, so it is a main clause.
b) On a day like this which is hot (ఎండగా ఉన్న ఇలాంటి రోజున) - no complete meaning for this clause, so it is a subordinate clause. This sentence, therefore is a complex sentence.
A sentence with 2 or more clauses is a compound sentence.
The day is hot and how can I walk on such a day?-
Here again there are two clauses-
a) The day is hot- This clause has complete meaning, so it is a main clause.
b) And how can I walk on such a day?- this is another main clause, as it has complete meaning too.
So the sentence, 'The day is hot and how can I walk on such a day?' has two main clauses, so it is a compound sentence. This is the difference between the simple, the complex and the compound sentence.
How to change one kind of sentence to another? This is not so difficult. The most important thing is, when we change one kind of sentence into another, the meaning and the tense should not change. There are however some standard patterns.





M.SURESAN

**Look at the following:**
a) Inspite of the high price of it he bought it - simple sentence.
b) Though the price of the car was high, he bought it. - Complex
c) The price of the car is high, yet/ still/ but he bought it - compound.
Observe that all the sentences above has the same meaning, and of course, the verbs are in the same tense.
కింది table చూడండి. You find standard patterns of transformation.
eg: If a simple sentence has 'Inspite of/ despite' phrase, the complex sentence has, 'though/ although/ even though' clause (subordinate) and the compound sentence has but/ yet/ still/ nevertheless clauses.

| SIMPLE | COMPLEX | COMPOUND |
|---|---|---|
| 1. Inspite of noun/ ...ing form | Though/ although/ eventhough | But, yet, nevertheless |
| 2. Because of/ in view of/ on account of/ owing to/ Being + noun/ ...ing form | Because/ as/ since + verb | so/ and so/ and therefore |
| 3. Before/ After + noun/ ...ing form | Before/ after + verb | and then |
| 4. too... to | so that... not | very and so |

వీటితో కొన్ని ఉదాహరణలు:
1 a) Inspite of/ despite his bad health, he used to work hard- Simple
b) Though/ Although/ Even though his health was bad, he used to work hard - Complex
c) His health was bad, but/ and yet he worked hard - Compound.
2) a) Because of his bad health, he resigned - Simple
b) Because his health was bad, he resigned - Complex
c) His health was bad so he resigned/ and therefore he resigned - Compound
3) a) Before his joining this company, he was a student - Simple
b) Before he joined this Company, he was a student - Complex
c) He was a student and then he joined this company - Compound
4) a) After coming here, he earned a lot of money - Simple
b) After he came here he earned a lot of money - Complex
c) He came here and (then) earned a lot of money - Compound.
5) a) She was too weak to walk - Simple
b) She was so weak that she could not walk - Complex
c) She was very weak and so she could not walk - Compound.
ఇవీ simple, compound and complex కు సంబంధించిన మెళకువలు.
ముఖ్యంగా ఏది verb, ఏది కాదు, అని తెలుసుకోవడం, అర్థం, tense మారకుండా చూసుకోవడం important.

**G.Suresh, Varshakonda**

**Q.** What is the difference among the following.
1) Tempest, Tornado, Cyclone, Blizzard, Typhoon, Whirlpool, Thunderstorm, Hurricane.
2) Delete, Cancel, Dismiss, Remove, Suspend, Debar, Drop, Eliminate, Terminate.
3) Meeting, Discussion, Summit, Parishad, Convention, Conference, Interview, Seminar, Congress.
4) Centre, Bunk, Store, Market, Garage, Point, Company, Mill, Junction, Station, Cell, Depot, Emporium, Booth, Enterprise.

**A.** 1) Blizzard = హిమపాతంతో కూడిన తుపాను- చలి దేశాలలో కురుస్తుంది.
Cyclone = తెరలు తెరలుగా పెనుగాలులతో వీచే తుపాను - సమశీతోష్ణ మండలాల్లో ఎక్కువ/ ఉప్పెన.
Hurricane = పెనుగాలులతో సముద్రం మీద నుంచి తీర ప్రదేశాలకు ఎగిసే తుపాను - ముఖ్యంగా పశ్చిమ అట్లాంటిక్ తీరప్రాంతాల్లో.
Tempest = తీవ్రవేగంతో గాలులతో సముద్రం మీద నుంచి తీరప్రాంతాల మీదుగా కల్లోలాన్ని సృష్టించే తుపాను - పశ్చిమదేశాలలో ఎక్కువ.
Tornado - విపరీతమైన శక్తితో, చాలా వినాశం కలిగించగల సుడిగాలులతో కూడిన జడివాన - ఉత్తర అమెరికాలో సాధారణం.
Typhoon - సమశీతోష్ణ మండలాల్లో అతి వేగంతో కూడిన గాలులతో వీచే తుపాను.
Whirlpool = సుడిగుండం
Thunderstorm - ఉరుములు మెరుపులతో కూడిన జోరు వాన.
2) Delete = ఒక జాబితాలోంచి/ రచనలోంచి / computer లోంచి తొలగించడం = remove
cancel = రద్దు చేయడం
Dismiss = 1) పదవిలోంచి ఉద్యోగులను, విద్యాలయాల్లోంచి విద్యార్థులను తొలగించడం;
2) వాదనలు/ సిద్ధాంతాల్లాంటివి సరికాదని కొట్టిపారేయడం.
Remove = తొలగించడం, ఒక ప్రదేశం నుంచి వ్యక్తులను, వస్తువులను.
Suspend = తాత్కాలికంగా నిలిపివేయడం
Debar = అధికారికంగా అడ్డుకోవడం/ అనుమతించక పోవడం
Drop = వదిలేయడం /ఆపడం. (He dropped her name from the list. He dropped (discontinued) Engineering course.
Eliminate = తొలగించడం (కొన్నిసార్లు చంపడం ద్వారా)/ (పోటీల్లోంచి) తొలగించడం
Terminate = to put an end to = అంతం చేయడం
3) Meeting= సభ/ సమావేశం
Discussion = చర్చ; Summit - అసలర్థం పర్వతశిఖరం; అయితే summit meeting కు short form గా వాడుతున్నారు. Summit = అత్యంత ఉన్నతస్థాయిలో/ వివిధ దేశాల/ సంస్థల నాయకుల/ ముఖ్య అధికారుల సమావేశాలు/ చర్చలు.
Parishad - ఇది English మాటకాదు. తెలుగే - సంస్థ/ కూటమి, etc.
Conference = ఒక అంశాన్ని చర్చించేందుకు, ఆ అంశానికి సంబంధించిన వ్యక్తులు మాత్రమే పాల్గొనే సమావేశం.
convention = 1) ఒక వృత్తికి సంబంధించినవారి సమావేశం 2) ఆనవాయితీ.
Interview = ఒక అభ్యర్థి శక్తి సామర్థ్యాలను, వ్యక్తిత్వాన్ని అంచనా వేసేందుకు నిర్వహించే మౌఖిక (face to face/ oral) పరీక్ష.
Seminar = గోష్ఠి. ఒక అంశంపై, ఒకరి పరిశోధనపై (research) అధ్యయనం చేసేవారి గోష్ఠి. (ఈ మధ్య దీనిని ఒక సంస్థ, వాటి ఉత్పత్తుల సేవల ప్రచారానికీ, అమ్మకాల అభివృద్ధికి ఏర్పాటు చేసే సభగా తప్పుగా వాడుతున్నారు.
Congress: విధి, విధానాలు నిర్ణయించేందుకు, తీర్మానాలు చేసేందుకు ఒక సమాఖ్యకు చెందిన వివిధ వర్గాల ప్రతినిధుల సమావేశం, కూటమి.
Centre = కేంద్రం- వ్యాపారానికి సంబంధించి, వస్తువులు, సేవలు లభించే చోటు (దాదాపు shop)
Bunk = బడ్డీ- చిన్న చిన్న నిత్యావసరాలను అమ్మే చిన్న దుకాణం
Store = వస్తువులను పెద్ద మొత్తంలో నిల్వ చేసి అమ్మే పెద్ద దుకాణం/ వ్యాపారం
Market = విపణి- వివిధ రకాల/ ఒకేరకం వస్తువులమ్మే దుకాణాల ప్రదేశం
Garage = Car లాంటి వాహనాలను ఉంచుకొనే/ మరమ్మతు చేసే ప్రదేశం
Point = Shop (వ్యాపార విషయంలో)
Company = వ్యాపారం/ దుకాణం.
Mill = ధాన్యాన్ని పిండిచేసే, పొట్టు తీసే, వస్తువులను (Paper, Cotton లాంటివి) తయారుచేసే యంత్రాగారం.
Junction = రెండు మూడు మార్గాలు కలిసే కూడలి. Shop అనే అర్థంతో అరుదుగా వాడతారు.
Cell = 1) చిన్న ఇరుకు గది/ Jail గది.
2) ఒక ఉద్దేశంతో పనిచేసే రహస్య బృందం- పైన చెప్పిన shop సంబంధిత మాటలకూ, దీనికి ఏం సంబంధంలేదు.
Depot = 1) అవసరం వచ్చేవరకు సరకులను నిల్వ ఉంచే చోటు.
2) Bus ల లాంటి వాటిని మరమ్మతు చేసేందుకు వాడే చోటు- Bus Depot.
Emporium = పాతబడిన మాట- పెద్ద దుకాణం/ ఒకే రకమైన వస్తువులను అమ్మే దుకాణం
Booth = చిన్నకొట్టు- వస్తువులమ్మేందుకు, సేవలందించే దుకు- ఇది బలిష్ఠమైన కట్టడం కాకుండా, తాత్కాలిక వసతి మాత్రమే. Exhibitions లో stalls ను కూడా booths అంటారు.
Enterprise = పెద్ద పెట్టుబడితో నిర్వహించే పెద్ద వ్యాపారం.
ఒక్క cell తప్ప పైమాటలన్నీ, మన దేశంలో shop/ వ్యాపారం అని loose గా వాడుతుంటారు, వాటి తేడాలతో నిమిత్తం లేకుండా.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






***Arshiya Begum, Anantapur***

**Q.** 6 crores which were in the procession of Suryanarayana. అండర్‌లైన్ చేసిన భాగానికి అర్థం ఏమిటి?

**A.** In the possession of = ఒకరి అధీనంలో/ ఒకరి దగ్గర. (In the procession కాదు. procession = ఊరేగింపు)

Rs.6 Cr which was (were సరికాదు - డబ్బు ఎంత మొత్తమైనా singular) in the possession of Suryanarayana = సూర్యనారాయణ దగ్గరున్న/ స్వాధీనంలో ఉన్న 6 కోట్ల రూపాయలు.

**Q.** ఎవరి పిల్లలు వారి దగ్గర ఉంటే మంచిది. దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** It is better children are with their parents / (It's) better for a child to be with its parents.

**Q.** 'Be + of' గురించి అర్థం కావడం లేదు. దయచేసి వివరించగలరు.

**A.** Be of (ఇక్కడ 'be' బదులు, ఏ be form అయినా - am/ is/ are, was, were, etc.) వాడవచ్చు - 'be of' combination చాలా word combinations తో వస్తుంది.

1) She is of the opinion (ఆమె అభిప్రాయం)

2) ... the property is of the school = the property is the school's = అది స్కూల్ ఆస్తి.

3) They are of the same age = ఒకే వయసున్నవాళ్లు.

ఇలా ఎన్నయినా చెప్పుకోవచ్చు. సందర్భాన్ని బట్టి అర్థం ఊహించుకోవచ్చు.

**Q.** It has all fallen in the place. తెలుగులో దీని అర్థం ఏమిటి?

**A.** Fall in place - దీనికి ప్రత్యేకమైన అర్థమేం లేదు.

Fall into place = 1) ఒక విషయం మనకర్థం కాకుండా ఉండి, ఉన్నట్టుండి అర్థం కావడం మొదలు పెట్టడం.

a) First I was a bit confused, but soon things were beginning to fall into place = మొదట నాకు గందరగోళంగా ఉన్న విషయాలు, ఉన్నట్టుండి ఒక్కొక్కటీ అర్థం కావడం ప్రారంభమైంది.

రెండో అర్థం: పథకాలు, వ్యూహాల లాంటివి మనం అనుకున్న విధంగా జరగడం/ అమరిపోవడం.

b) As the writer began to write, words began to fall into place, without much effort = ఆ రచయిత రచించడం మొదలుపెట్టగానే, అప్రయత్నంగా రచనలో మాటలు అమరిపోసాగాయి/ ఉండాల్సినచోట పడిపోయాయి.

మీ వాక్యం, 'It has fallen into place' గా తీసుకుంటే, అప్పుడు దాని అర్థం, ఆ విషయం కరెక్టుగా అనుకున్నట్టుగానే జరిగింది.

**Q.** The agency on the charge apart from negligence. అండర్‌లైన్ చేసిన పదాల అర్థం ఏమిటి?

**A.** Apart from = అంతేకాకుండా/ అదేకాకుండా

a) Apart from giving me some money, he helped me in other ways too = నాకతడు డబ్బివ్వడమే కాకుండా మిగతా విషయాల్లో కూడా సాయం చేశాడు.

Apart from negligence, he has laziness too = అతడికి విషయాలమీద శ్రద్ధ లేకుండా పోవడమే కాకుండా (ఉదాసీనతే కాకుండా), బద్ధకం కూడా.

**Q.** కింది పదాల అర్థాలను వివరించగలరు.

a) Focus on b) war-footing c) respectively d) prior e) possession

**A.** a) Focus on = దృష్టి/ శ్రద్ధ కేంద్రీకరించడం, ప్రాముఖ్యం ఇవ్వడం.

b) On a war footing = యుద్ధప్రాతిపదికన - ఏ విషయానికైనా అత్యధిక ప్రాముఖ్యం ఇచ్చి దానికి సంబంధించిన పనులు అత్యంత వేగంగా చేయడం.

The construction of the dam is taken on a war footing = ఆ డ్యామ్ నిర్మాణం యుద్ధ ప్రాతిపదికన చేపట్టారు.

c) respectively = ఆ వరసలో.

A, B and C are respectively the sons of D, E and F = A, B, Cలు వరుసగా D, E, F ల కుమారులు (D కొడుకు A, E కొడుకు B, F కొడుకు C).

d) Prior = ముందరి.

Prior to joining IAS, she was a lecturer = ఐ.ఎ.ఎస్.లో చేరేముందు ఆమె లెక్చరర్‌గా ఉండేది.

e) Possession = ఒకరి అధీనంలో ఉన్న/ ఒకరికి చెందిన వస్తువు/ ఆస్తి.

This building is my possession = ఈ కట్టడం నాకు చెందింది/ నా ఆస్తి.

**Q.** ఒక వాక్యం చివర్లో the earliest అని ఇచ్చారు. ఇక్కడ దాని అర్థం ఏమిటి?

**A.** The earliest = అన్నిటికంటే ముందు At the earliest = వీలయినంత త్వరలో.

a) He was the earliest to come = అందరి కంటే ముందు అతడు వచ్చాడు.

b) I will meet you at the earliest = నిన్ను వీలైనంత త్వరగా కలుసుకుంటాను.

**Q.** Get గురించి వివరించగలరు.

**A.** Get = పొందడం, తేవడం, సాధించడం ఇలా ఇంకా చాలా అర్థాలున్నాయి.

***J. Veerraju, Jonnalapadu***

**Q.** కింది question tags లో సరైనవి తెలుపగలరు.

- Open the door, will you?

Open the door, won't you?

**A.** Open the door, will you? - correct.

Please open the door, won't you?- correct.

- Don't play the chess, will you? కరెక్టేనా?

**A.** Don't' play chess, will you? - correct.

- The tourists would like to have seen the ruins.

**A.** పర్యటకులు ఆ శిథిలాలను చూసి ఉంటే (గతంలో) బాగుండేదని అనుకుంటున్నారు.

- The mechanic was to repair the car today.

**A.** The mechanic was to repair the car today - ఇది తప్పు.

The mechanic is to repair the car today = మెకానిక్ కారును ఈరోజు రిపేర్ చేయాలి.

- The mechanic was to have repaired the car today.

**A.** The mechanic was to have repaired the car today = మెకానిక్ ఈ రోజు కారుకు మరమ్మతు చేసి ఉండాల్సింది.

- To have explained matters to him before he died was my duty.

**A.** ఆయన చనిపోకముందే ఆయనకి విషయం వివరించాల్సిన బాధ్యత నామీద ఉండింది (ఆయన చనిపోయాడు).

- To have been able to bless the couple would have given him great satisfaction.

**A.** ఆ పెళ్లయిన జంటను ఆశీర్వదించి ఉంటే ఆయనకు తృప్తిగా ఉండేది.

- Mr. Swamy is to be meet at the airport.

**A.** స్వామిని మనం విమానాశ్రయంలో కలుసుకోవాలి. (Is to be met, passive - తెలుగును వాదం passive form అంతసరిగ్గా ఉండదు)

# Kalidasa is the Shakespeare of India


SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 553

M.SURESAN

- Please open the door, will you?

Please open the door, could you? ఏది కరెక్టు?

**A.** Please open the door, won't you? నే correct, పైన చెప్పినట్టు.

**Q.** Pronoun లోని రకాలను వివరించగలరు.

**A.**

| Nominative pronoun | Objective pronoun | Possessive pronoun |
|---|---|---|
| I | me | mine |
| We | us | ours |
| You | you | yours |
| He | him | his |
| She | her | hers |
| It | it | its |
| They | them | theirs |

**Q.** కింది వాక్యాల్లో ఏది కరెక్టు?

1. Kalidasa is a Indian Shakespeare.
2. Kalidasa is the Shakespeare of India.
3. Kalidasa is a Shakespeare of India.
4. Kalidasa is the India Shakespeare.

**A.** Kalidasa is the Shakespeare of India - the only correct form.

***K.R.Reddy, Hyderabad***

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థాలు తెలుపగలరు.

- I would like to act in that play.

**A.** I would like to act in that play = ఆ నాటకంలో నటించాలని ఉంది నాకు - ఇప్పటికీ ఇందుకవకాశం ఉంది.

- I should like to have acted in that play..

**A.** I should like to have acted in that play = ఆ నాటకంలో నేను నటించి ఉంటే.. (నాటకం అయిపోయింది - నేను నటించలేదు).

- To help him would be a pleasure.

**A.** అతడికి సహాయం చేయాలని నా కోరిక.

- To have helped him would have been a pleasure.

**A.** అతడికి సహాయం చేసి ఉంటే (గతంలో సహాయం చేసే అవకాశం వచ్చుంటే) సంతోషపడేవాడిని.

- The tourists would like to see the ruins.

**A.** పర్యటకులు ఆ శిథిలాలను చూడటానికి ఇష్టపడుతున్నారు.

***K.S.R., Martur***

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థం వివరించగలరు.

- This meant a lot to me.

**A.** అది నాకు చాలా ముఖ్యమైన విషయం, గతంలో.

- It was unlikely that she was lying about her not going to Guntur.

**A.** ఆమె గుంటూరుకు వెళ్లని విషయంలో అబద్ధమాడి ఉండకపోవచ్చు/ నిజమే అయ్యుండొచ్చు.

- Is there no such thing as a gentleman?

**A.** పెద్ద మనిషి అనేవాళ్లే లేరా ఈ లోకంలో? (ప్రతి వాళ్లూ దుర్మార్గులేనా? )

- In order to have a well-rounded and complete the case.

**A.** ఈ sentence పూర్తికాలేదు. Well rounded = అన్ని సుగుణాలు/ నైపుణ్యాలు ఉన్న.

- How he pulled himself together in the face of what must have been a shock, when he found the wrong man dead!

**A.** పొరపాటున అసలు వ్యక్తి కాకుండా ఇంకెవరో చనిపోయి ఉండటం కలిగించిన దిగ్భ్రమ నుంచి అతడు ఎలా కోలుకున్నాడో?

- Excuse the admiration of a Connoisseur.

**A.** రసికుల మెప్పును క్షమించండి (రసికుడు కాబట్టి మెచ్చుకున్నాడు. అర్థం చేసుకోండి).

- I did not know about the projected divorce between her and her husband.

**A.** వాళ్లిద్దరూ - భార్యాభర్తలు విడాకులు తీసుకోబోతున్నారనే విషయం నాకు తెలియదు. Projected divorce = Planned divorce (divorce తీసుకోవాలనే ఉద్దేశం).

- I know from his voice that the man of iron was shaken to the soul.

**A.** అంత మనోధైర్యం ఉన్న వ్యక్తి కూడా పూర్తిగా చలించిపోయాడనే విషయం నాకు ఆయన కంఠాన్ని బట్టి తెలిసిపోయింది.

- One word now as to how I myself stood at that time.

**A.** నేను ఆ క్షణంలో ఏ పరిస్థితిలో ఉన్నానన్నదాన్ని గురించి ఒక్కమాట (చెబుతాను).

***Ch. Narasimha Rao, Gogannamatham (E.G.Dt.)***

**Q.** కింది Phrasal verbs ను ఉదాహరణలతో తెలుపగలరు.

see off, see out, see in , see of, pass out, pass down, pass as.

**A. See off** = send off = వీడ్కోలు/ వీడ్కోలు చెప్పడం/ సాగనంపడం.

I saw her off at the station = స్టేషన్‌కు వెళ్లి ఆమెకు వీడ్కోలు చెప్పాను.

**See in** = see (something) in (something) some body = దేన్లోనైనా/ ఎవరిలోనైనా ఏదైనా గొప్ప గుణం చూడటం.

a) Her father doesn't know what she sees in her lover to fall in love with him = ఆమె ప్రేమిస్తున్న అతడిలో ఏం గొప్పతనం చూసిందో వాళ్ల నాన్నకు అర్థం కావడం లేదు.

see in (somebody) = ఒకరిని లోపలికి తీసుకెళ్లడం

As soon as the car arrived with the new officer in it, the staff saw him in = కొత్తఆఫీసర్ ఉన్న కారు రాగానే, సిబ్బందంతా బయటకు వచ్చి ఆయనను లోపలికి తోడుతీసుకెళ్లారు.

**See out** = a) ఒకరిని గౌరవంగా సాగనంపడం

I saw my guest out and went back to my computer = నా అతిథిని సాగనంపి నా కంప్యూటర్ దగ్గరకు వెళ్లిపోయాను.

b) ఒకపని పూర్తయ్యేవరకు లేదా ఆ పనికున్న సమయం గడిచే వరకు కొనసాగడం.

I want to see this assignment out and leave for the U.S. = ఈ పని పూర్తయ్యే వరకు కొనసాగించి అమెరికా వెళ్లిపోతాను.

He saw out his last years of service in Delhi = తన ఉద్యోగంలోని చివరి సంవత్సరాలు ఢిల్లీలో పూర్తి చేశాడు.

**Sea of** - దీనికి ప్రత్యేక అర్థం ఏమీలేదు.

**Pass out** - 1) become unconscious = స్పృహ లేకపోవడం.

a) She nearly passed out when she saw the boy knocked down by a lorry = lorry ఢీకొట్టడంతో కిందపడి ఉన్న ఆ పిల్లాడిని చూసి ఆమెకు దాదాపు స్పృహ తప్పినంత పనైంది.

b) Britain లో సైనికులు/ పోలీసులు శిక్షణ పూర్తి చేసుకుని, శిక్షణా సంస్థల నుంచి బయటికెళ్లడం.

**Pass down** = ఆచార వ్యవహారాలు, చదువు లాంటివి తల్లిదండ్రులు పిల్లలకు నేర్పడం/ పిల్లలు పొందడం

a) The tradition is passed down in their family from the father to = ఆ సంప్రదాయం వాళ్లింట్లో ఒక తరం నుంచి ఇంకో తరానికి వస్తూంటుంది.

**Pass as = Pass for** = ఒకరు/ ఒక వస్తువు ఇంకొకరు/ ఇంకో వస్తువుగా పరిగణించడం.

Though a Tamilian, his telugu is so good that be can pass as an Andhra = అతడు తమిళుడైనప్పటికీ, అతడిని ఆంధ్రుడనుకునేంత బాగా తెలుగు మాట్లాడతాడు.

***V. Srinivas, Narasapuram***

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

a) నేను ఫొటో దిగేందుకు స్టూడియోకు వెళ్లాను.

b) ఫొటో తీయించేందుకు మా అమ్మను స్టూడియోకు తీసుకెళ్లాను.

**A.** a) I went to the studio to have my photo taken.

b) I took my mother to the studio to have her photo taken.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# How lovely the garden is!





M.SURESAN



***M. Rakesh, Hyderabad***

**Q.** ఇంటర్వ్యూలకు వెళ్లినప్పుడు tell me about yourself అంటుంటారు. అలాంటప్పుడు ఏ విధంగా చెబితే వాళ్లు satisfy అవుతారో దయచేసి తెలుపగలరు.

**A.** మీవన్నీ Interview skills కు సంబంధించిన చాలా సందర్భోచిత ప్రశ్నలు. మీరు చెప్పే సమాధానాలు మంచి body language తో, ఆత్మవిశ్వాసంతో, నిదానంగా ఉండాలి. ప్రతిమాటా Interviewer కు వినపడేంత స్పష్టంగా, మర్యాదగా చెప్పాలి. కంగారు ఎక్కడా కనిపించకూడదు. మనం తప్పు చెప్తామేమో అనే సందేహం ఎక్కడా రానివ్వకూడదు.

**Q.** ఇంటర్వ్యూలో తరచుగా అడిగే ప్రశ్నలకు ఎలా సమాధానం చెప్పాలో తెలుపగలరు.

**A.** Interview లో తరచూ అడిగే ప్రశ్నల సమాధానాలు:

Tell me about your self = మీగురించి మాకు చెప్పండి.

ఇది మీ పేరుతో, My name is/ I am so and so; తర్వాత, మీ age and qualification, మీరేదన్నా job లో ఉంటే ఆ job లో మీ experience చెప్పండి. ఇది మీ మొదటి interview అయితే, మీ qualifications తర్వాత ఎప్పుడు మీ degree తీసుకుందీ చెప్పండి. దీని తర్వాత మీ family background - మీ తల్లి, తండ్రి మీ siblings (అన్నతమ్ముళ్లు, అక్కచెల్లెళ్లు) గురించి చెప్పండి- వాళ్లేం చదువుతుంది, ఏం చేస్తుందీ వగైరా వివరాలు.

**Q.** Hobbies and strengths and weaknesses గురించి ఇంటర్వ్యూలో అడుగుతున్నారు. వీటి గురించి ఎలా చెబితే బాగుంటుంది?

**A.** మీ hobbies (తీరికవేళల్లో మీరు ఆసక్తిగా చేసే విషయాలు) చెప్పండి. ఇవి చెప్పేటప్పుడు కాస్త జాగ్రత్తగా చెప్పండి. మీరు My hobby is film music అన్నారనుకోండి, ఆ తర్వాత వచ్చే supplementary questions కు మీరు సిద్ధంగా ఉండాలి. మీ favourite singer, వాళ్లకు వచ్చిన పురస్కారాల గురించి తప్పుల్లేకుండా చెప్పగలగాలి.

ఆ తర్వాత మీ ambitions/ goals (మీరు జీవితంలో ఏమవ్వాలనుకుంటుంది) చెప్పాలి. ఆ తర్వాత మీ strengths and weaknesses (మీ బలాలు, బలహీనతలు) గురించి చెప్పాలి. ఇక్కడ కూడా జాగ్రత్త అవసరం. నా strengths ఫలానావి అని చెప్పినప్పుడు, దానికి ఉదాహరణలు, అవి మీకు ఉపయోగపడ్డ సందర్భాలూ అడుగుతారు. మీ weaknesses బలహీనతలు చెప్పినప్పుడు, ఆ బలహీనతలు పోగొట్టుకునేందుకు మీరు తీసుకున్న చర్యలేమిటో చెప్పమంటారు. అంతేకాకుండా మీ బలహీనతలవల్ల మీరే సందర్భాల్లో ఎలా నష్టపోయిందీ చెప్పమనవచ్చు.

అయితే hobbies, strengths and weaknesses మీద వచ్చే ప్రశ్నలు, మీరు మీ talking/ telling the interviewers about yourself తర్వాతే వేస్తారు. అందుకని Tell us about yourself మీరు వాళ్లిచ్చిన time (two to three minutes)లో ముగించేయాలి. Two to three minutes పై వివరాలన్నీ స్థూలంగా చెప్పడానికి సరిపోతాయి.

Hold a I class Bachelor's/ Master's degree in --- subject. I took my degree in the year ______. I am/ come from an agricultural/ business/ employee's/ rural family. My father is ______, and my mother is ______. I have a sister and/ a brother. I am the youngest/ younger/ eldest/ elder of the brother(s) and sister(s). My brother/ sister is a ______.

I had all my education in ____ city/ town.

My hobbies are ______. My aim is to be/ become a _______.

మిమ్మల్ని గురించి మీరు కింది విధంగా చెప్పవచ్చు (ఇది ఉదాహరణ మాత్రమే.)

I am Rajesh/ My name is Rajesh. (I am Rajesh అనడం, My name is .... కంటే better). I was born and brought up in _____ (మీరు పుట్టిన, పెరిగిన ఊరు). I had my schooling (ఇది I studied up to X class అనడం కంటే better spoken English form) and Intermediate education (in Medium) at Kothagudem. I hold a B.Tech Degree in ECE from JNTU, having taken the exam in 2006.

At present I am jobless/ unemployed. (jobless అనే పదం English లో కించపరిచే పదం కానే కాదు). I come from an agricultural/ business/ Govt employees'/ job holders family.

My father is ______; my mother is ______; I have an elder/ a younger brother/ sister. He/ She is ______, I want to be ------ (your ambition/ goal in life). I spend my leisure time ------ (your hobbies).

My strength is my interest in Engineering/ my self confidence/ my ability to mix freely with others/ to make friends easily, etc. (ఈ విషయంలో మీరొకసారి మీ గురించి ఆలోచించుకుని మీలో ఉన్న బలాలు ఏమిటో స్పష్టంగా తెలుసుకుని, దాన్నే మీ strength గా చెప్పండి. అంతేగానీ ఏదో చెప్పాలిగాబట్టి చెబితే interviewer లో అదంత నమ్మకం కలిగించేది (convincing) గా ఉండదు. ఇందుకు మీరు చేయాల్సిన పని- అంతరాయాలు (disturbances) ఏమీ లేకుండా కూర్చుని, ఏకాగ్రతతో ఆలోచించి, మీరనుకున్నట్టుగా మీ బలాలన్నింటిని కాగితం మీద రాసుకోండి. ఆ points అన్నింటిని మరోసారి పరిశీలించి, మీ father/ mother/ sister/ brother తో చర్చించండి. అలాగే మీ బలహీనతల విషయం కూడా. నిజంగా interview ను మీరు serious గా తీసుకుంటే ఏదో అప్పటికప్పుడు అనుకున్న విషయం అనేస్తే అందువల్ల మేలుగాకుండా కీడే జరుగుతుంది.)

ఆ తర్వాత మీ strengths మీకెలా ఉపయోగపడిందీ చెప్పగలగాలి.

e.g.: Suppose your strength is your ability to make friends. Explain then how in times of need your friends have helped you on many occasions- You can mention a specific example- when your brother needed medicine in an emergency about one o'clock in the morning, your friend, a medical shop owner open the shop, and got medicine for him- ఇలాంటి real personal experiences చెప్పడం బాగుంటుంది. అలా చెప్పడంవల్ల మీకు మంచి marks పడే అవకాశం ఉంది. అలాగే మీ weaknesses విషయంలో కూడా. Suppose మీ బలహీనత ఇతరులను సులభంగా నమ్మేయడం అని చెప్తారనుకోండి, అందువల్ల మీకు జరిగిన నష్టం చెప్పండి- specific and concrete instance- దీనికి ఉదాహరణ- మిమ్మల్ని నమ్మించి మీవల్ల సహాయం పొంది, సరిగ్గా మీకు అవసరమైన సమయంలో చేయగలిగిన సహాయం కూడా చేయకుండా US కు వెళ్లిపోయిన మీ so called friend సంగతి చెప్పండి. ఇలా మీ real life experience చెబితే మీకు marks పడతాయి. అయితే దీనికి ఇంకో supplementary question అడగవచ్చు మీ weakness ను అధిగమించేందుకు (to overcome your weakness) మీరేం ప్రయత్నం చేస్తున్నారు? అని. అప్పుడు అదికూడా మీ personal experience నుంచి చెప్పండి. తొందరపడి ఇతరులను ముఖ్యంగా friends ను గురించి ఏ అభిప్రాయానికి రానని. అయితే ఇవన్నీ English లో మీరు చెప్పగలగాలి- అదీ సంక్షిప్తం (brief) గా.

**Q.** Why did you take ECE? అని అడిగితే ఎలా?

**A.** Tell me/ us about yourself అనే question కు answer ఇచ్చేటప్పుడు, why did you choose/ why do you think you are fit for ECE? అనే questions సాధారణంగా అడగరు. అది తర్వాత అడుగుతారు.

ECE branch has better job/ career prospects than any other branch. ఇలా జవాబు చెబితే వెంటనే అయితే What about your suitability for the branch? అనే ప్రశ్న అడగవచ్చు అప్పుడు మీరు career prospects apart (career prospects మాత్రమే కాకుండా) I am specially interested in Electronics అని చెప్ప వచ్చు. అందుకు నిదర్శనంగా, you tell the interviewer of your marks in Physics in Intermediate exam. You can also talk of any piece of electronic equipment you have developed.

***Srinivas, Nizamabad***

**Q.** He runs very fast లో very, fast రెండూ adverbs అవుతాయా? లేదా very - adverb, fast - adjective అవుతాయా?

**A.** Very, fast ఈ రెండు కూడా adverbs. Adverbs 1) adjectives నూ 2) verbs నూ 3) ఇతర adverbs నూ కూడా modify చేస్తాయి. అంటే వాటి అర్థాన్ని ఎక్కువ చేస్తాయి/ వాటి గురించి చెప్తాయి. అయినా ఇవి correct forms అని తెలిసినప్పుడు Spoken English విషయానికి సంబంధించి అవి ఏ parts of speech అనే చర్చ అనవసరం కదా?

**Q.** రెండు adverbs వెంటవెంటనే వస్తాయా?

**A.** రెండు adverbs ఒకదానివెంట ఒకటి వస్తాయి.

***P.Johnson, Chinarikatla***

**Q.** మీరు నిన్న త్వరగా ఎందుకు వెళ్లారనడానికి what is the reason for your earlier going అంటాం. earlier went అని ఎందుకు అనకూడదు. దీన్ని మూడు tenses లలో వివరించగలరు.

**A.** What is the reason for your going earlier (than usual) అంటాం. Earlier going అనం. Earlier went అనం కదా? Question లో went బదులు did go అంటాం - Why did you go earlier? అనడం correct.

a) Why do you go early? (Present)

b) Why did you go early/ earlier? (Past)

c) Why will you go early/ earlier? (Future).

***M.V.Subrahmanyam, Chillakur***

**Q.** కిందివాటికి తెలుగులో అర్థాన్ని వివరించగలరు.

What though we happen to be late?

**A.** మనం ఆలస్యమైతే మాత్రం ఏం?

**Q.** What a lovely garden it is!

**A.** అది ఎంత అందమైన తోట! (చాలా అందమైంది)

**Q.** How lovely the garden is!

**A.** తోట ఎంత అందంగా ఉందో! (చాలా అందం)

**Q.** కిందివాటిలో అండర్‌లైన్ చేసిన పదానికి తెలుగులో అర్థాన్ని వివరించగలరు.

Shankar is timid student. <u>That is</u>, Shankar is shy.

**A.** That is = అంటే.

**Q.** The Professor spoke grimly to the student. <u>That is</u>, the professor spoke angrily.

**A.** ఇక్కడ కూడా అదే అర్థం.

**Q.** 'a cake walk' అంటే అర్థం ఏమిటి.

**A.** చాలా సులభం.

**Q.** He is kind to his subjects. ఈ వాక్యానికి అర్థం ఏమిటి?

**A.** అతడు (ఆ రాజు) తన ప్రజల పట్ల దయగా ఉంటాడు.

**Q.** Make the most of now ఈ వాక్యానికి అర్థం ఏమిటి?

**A.** ఇప్పుడున్న సమయాన్ని/ అవకాశాన్ని సద్వినియోగం చేసుకో.

**Q.** No less a person than the C.M. hoisted the flag.

**A.** సి.ఎం. అంతటి వ్యక్తి పతాకాన్ని ఎగరవేశాడు.

**Q.** What to speak of standing first, he can't even pass the exams.

**A.** What to speak of - ఈ expression సరైన English కాదు.

**Q.** I can do the sums (maths లో)

I can have done the sums. ఈ రెండు వాక్యాలకు అర్థాన్ని వివరించగలరు.

**A.** I can do the sums = ఆ లెక్కలు నేను చేయగలను.

I can have done the sums - ఈ sentence wrong. Can have done లాంటి verbs సాధారణంగా వాడరు.

I could have done the sums = నేనా లెక్కలు చేయగలిగేవాడినే (కానీ చేయలేదు)

**Q.** I could not help laughing.

She could not help scolding.

ఈ వాక్యాలకు తెలుగులో అర్థం తెలుపండి.

**A.** నేను నవ్వకుండా ఉండలేక పోయాను.

ఆమె తిట్టకుండా ఉండలేక పోయింది.

**Q.** Before hand I wish you a happy married life. ఈ వాక్యంలో Before hand అంటే ఏమిటి?

**A.** Beforehand = ముందస్తుగానే

A week beforehand = వారం ముందుగానే

అయితే Beforehand I wish you a happy married life లాంటి sentences వాడం. ఇలాంటిచోట్ల, In advance అంటాం.

**Q.** As of now కు తెలుగులో అర్థాన్ని ఉదాహరణతో వివరించగలరు.

**A.** As of now = ఇప్పటి పరిస్థితిలో/ ఇంతవరకూ/ ఇప్పుడు.

As of now the balance in your account is Rs. 12000.

ఇప్పుడు మీ ఖాతాలో balance రూ.12000.

**Q.** I want to buy a car.

I have to buy a car.

convert these A.V. sentences into P.V.

**A.** I want to buy a car - దీనికి PV లేదు.

I have to buy a car - PV: A car had to be bought (by me).

**Q.** But, as లను relative pronouns గా ఎలా ఉపయోగిస్తారో ఉదాహరణలతో వివరించగలరు.

**A.** But, as ను relative pronouns గా spoken English లో వాడం - వాడితే చాలా గ్రాంథికంగా, పాండిత్యంగా ఉంటుంది. Written, formal English లో కూడా ఇది చాలా bookish గా ఉంటుంది.

***V. Srinivas, Narasapuram***

**Q.** If we practice idioms, it is good upto an extent. ఈ వాక్యంలో practise అనే verb కు బదులు practice అనే noun వాడినా ఫరవాలేదా?

**A.** అలావాడటం సరికాదు. అయితే American English లో practice ను noun గా, verb గా కూడా వాడతారు. Practise as a verb, American English లో లేదు.

***G. Shankar, Kesavapatnam***

**Q.** Please clarify this in telugu.

"Material up to this point is for the use of the teacher. Please do not make students read the material, or use it for any other purpose."

**A.** ఇంతవరకూ/ ఈపైన చెప్పిన అంశాలు/ విషయం టీచర్ ఉపయోగానికి మాత్రమే. విద్యార్థులతో దాన్ని చదివించకండి, ఇంకే విధంగానూ దాన్ని వాడకండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






# They refused to be swayed





M.SURESAN

***P.Johnson, Podili***

**Q.** Am I right అనే question tag ఉపయోగిస్తాం. దీనికి వ్యతిరేకంగా చెప్పేటప్పుడు Am not I right? అని ఎందుకు అనకూడదు?

**A.** 'Am I right?' ఇది question, question tag కాదు. I am not right, aren't I? ఇక్కడ 'Aren't I? Question tag.

I am not right, am I? దీనిలో 'Am I'? అనేది question tag.

'Am I right'?, 'Am I not/ I not right'? ఇవి రెండూ questions మాత్రమే, question tags కావు.

'I am right' అనే sentence కు, correct question tag, 'Aren't I'?- 'Amen't I? రాదు.

***J.V. Jaya Prakash, Proddatur***

**Q.** Please be explained whether the word 'why' can be used as a conjunction or not as there is no such usage in dictionaries.

**A.** If the sentence is, 'The reason why he is here is...', 'why' is certainly a conjunction. If the sentence is 'I do not know why he is here', 'why' is an adverb, modifying 'know'.

**Q.** I would like to know more about Adjuncts, disjuncts and conjuncts. Please explain them in detail by giving examples.

**A.** Adjuncts, disjuncts and conjuncts are highly technical terms- we can still speak/ write correct without knowing what they are. Anyway, now that you want to know, here are they:

**Adjunct:** An adverb/ a phrase that adds to the meaning of a verb in a sentence.

a) I know him well - well - adjunct.

b) He replied in sorrow- In sorrow- adjunct.

Conjunct and disjunct are terms used in music.

***K.S.R. Marturu***

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థాన్ని తెలుపగలరు.

Artists were at the receiving end with the E.C.'s tough decision.

**A.** To be at the receiving end = to be the person to suffer, and not be the person to cause suffering.

EC కఠిన నిర్ణయంవల్ల కళాకారులు బాధితులయ్యారు. (బాధపడటం, కళాకారుల వంతయింది).

Receiving end (బాధ పడేవంతు)× Giving end (బాధించేవంతు)

Till now he has been at the giving end, but from now he will be at the receiving end = ఇంతవరకు బాధించేవంతు అతడిదయితే ఇప్పటి నుంచి బాధపడేవంతు (Receiving end) అతడిదవు తుంది. అయితే మీరిచ్చిన sentence లోని భావానికి 'be at the receiving end' వాడకం సరికాదు.

**Q.** Refusing to be swayed by the carrots held out to them.

**A.** Carrot and stick policy అనే phrase కు సంబంధించిన పదం ఇది.

Carrot and stick policy= నయాన్నో (మంచి మాటలు చెప్పో, ఆశ చూపో, ఏదో ఆకర్షణ చూపించో) భయాన్నో (భయపెట్టి) ఇతరులతో పని చేయించుకోవడం.

They refused to be swayed... them= వాళ్లకు చూపించిన ఆశలకూ/ ఆకర్షణలకు వాళ్లు లొంగలేదు.

**Q.** People are now up in arms against the government.

**A.** ప్రభుత్వం మీద తిరగబడే ధోరణిలో ఉన్నారు వాళ్లు.

**Q.** The world will withness an hour of darkness.

**A.** ప్రపంచం ఓ గంటపాటు చీకటిని అనుభవించబోతోంది.

**Q.** He left people in splits by talking about how his teeth chattered on the bumpy ride from Guntur to Ongole.

**A.** గుంటూరు నుంచి ఒంగోలుకు తన కుదుపుల ప్రయాణంలో పళ్లు ఎలా కొట్టుకుందీ వర్ణించి వాళ్లను పకపక నవ్వించాడు.

**Q.** She would not have loved him anyless if he was not rich.

**A.** అతడు ధనికుడు కాకపోయినా అతడిని ఆమె తక్కువ ప్రేమించేది కాదు.

మీరు రాసిన sentence లో పొరపాటు ఉంది. The correct form of the sentence-

She would not have loved him any the less (not any the less = తక్కువేం రాకుండా), even if he had not been rich.

**Q.** కింది వాక్యాల్లో ing form వాడకం సరైందేనా?

All these sigments having thousands of polling booths.

**A.** ఇది sentence కాదు phrase (group of words without verb) మాత్రమే.

Phrase గా తీసుకుంటే ఇందులో '...ing' form use సరైందే. Sigment అనేది సరైన మాటకాదు. దాని సరైన రూపం segment = విభాగం.

All these segments having thousand of polling booths = వేల polling booths ఉన్న (కలిగి ఉన్న) ఈ విభాగంలో.

ఇక్కడ having = కలిగి ఉన్న. ఇక్కడ, అంటే ఈ group లో verb లేదు. ఇది sentence కాదు.

**Q.** Ongole segment is experiencing a triangular contest.

**A.** Ongole విభాగం ముక్కోణపు పోటీని ఎదుర్కొంటోంది - ఇది sentence - ఎందుకంటే ఇది complete meaning ఉన్న group of words కాబట్టి. ఇక్కడ 'experiencing' ను విడిమాటగా తీసుకోకుండా, 'is experiencing' అనే verb లో భాగంగా తీసుకోవాలి. అలాంటప్పుడు '...ing' form ఇక్కడ correct.

***A.Sridhar, Onipenta***

**Q.** Economical, Financial - వీటి మధ్య తేడా ఏమిటి?

**A.** Economically = ఆర్థికంగా 1) ఒక సమాజంలోని వ్యాపార, వాణిజ్య, సంపదల అభివృద్ధికి సంబంధించి 2) వెచ్చించే డబ్బుకు, సమయానికి తగ్గట్టు సేవలు, విలువలు, వస్తువులు లభించే విధంగా.

Financially = డబ్బుకు, వ్యాపారాల్లో పెట్టుబడికి సంబంధించిన విధంగా.

**Q.** Red alert, High alert, Enclave, Saunt, Middle East countries, Oriental పదాల అర్థాలు వివరించగలరు.

**A. Red Alert** = పెను ప్రమాదం ఉందని తెలిపే హెచ్చరిక.

**High alert** = అత్యంత జాగరూకత

**Enclave** = ఒక ప్రదేశం మధ్యలో ఆ ప్రదేశానికి చెందినవారు కాకుండా పరులు సమూహంగా నివసించే చోటు = colony. Gova till 1961 was a Portugese enclave = 1961 వరకు గోవా Portugese వలస ప్రదేశంగా ఉండేది.

**Saunt** - ఈ మాట English లో లేదు.

**Saunter** - విశ్రాంతిగా, చీకూచింతా లేకుండా నిదానంగా నడవడం.

**Middle East Countries** = మధ్య ప్రాచ్యదేశాలు = ఆసియా నైరుతి, ఈశాన్య ఆఫ్రికా ఖండాల దేశాలు.

**Oriental** = తూర్పు దేశాలకు సంబంధించిన x **Occidental** = పడమర దేశాలకు సంబంధించిన

**Q.** ఆపద్ధర్మ ముఖ్యమంత్రిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** ఆపద్ధర్మ ముఖ్యమంత్రి = Interim CM

**Q.** Citizens' Interface counter అంటే ఏమిటి?

**A.** Citizens' Interface counter = పౌర ప్రభుత్వ సంబంధాల counter.

***S.D. Puri, Nirmal***

**Q.** A dog is a faithful animal (a dog means all dogs), The peacock is a beautiful bird - ఈ రెండు వాక్యాల్లో ఏది సరైందో వివరించగలరు.

**A.** A dog = Any/ every dog is a faithful animal (ఏ కుక్కయినా/ ప్రతి కుక్కా).

The dog = All dogs.

The peacock = All Peacocks.

ఇలాంటిచోట్ల 'a/ an' వాడినా, 'The' వాడినా అర్థం, చివరకు ఒకటే అవుతుంది.

To represent a class = To represent the whole class.

***B. Shabnam, Anantapur.***

**Q.** Exclusive profits, Building campaign- వీటి అర్థాలు తెలుపగలరు.

**A. Exclusive profits** = ఒకరికి మాత్రమే/ ఒక దాని వల్ల మాత్రమే ప్రత్యేకంగా వచ్చే లాభాలు. Exclusive = ఒకేదానికి సంబంధించిన. The trunk is exclusive to the elephant = తొండం ఏనుగు ఒక్కదానికి మాత్రమే ఉంటుంది.

**Building campaign** = ఉద్యమ నిర్మాణం.

**Q.** ఇష్టం ఉంటే చేయి లేకపోతే మానేయి. ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** As you like; do it or leave it.

**Q.** తినడానికి ఏముంది? దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా అడగాలి?

**A.** What's there to eat?

**Q.** 'Don't live on the edge; live off it.'

**A.** 'Live on the edge' - ఇది English idiom. అర్థం: ఎప్పుడూ ప్రమాదాలతో జీవితం గడపడం. On the edge (usually of danger) = (ప్రమాదపు) అంచున. Don't live on the edge; Live off it = ఈ bike ప్రకటన అర్థం: పర్వతపు అంచున ప్రమాదకరంగా bike నడపడం కాదు, పర్వతపు అంచుదాటి అవతలికి bike నడపండి. అంటే ఆ bike సామర్థ్యం పర్వత అంచు దాటేంత శక్తి కలదని.

**Q.** 'In response to' అంటే ఏమిటి?

**A.** అందుకు స్పందనగా/ స్పందిస్తూ.

**Q.** "ఎవరు కొడితే మైండ్ దిమ్మతిరుగుతుందో వాడే పండూ" దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** If your head reels when some one hits you, that's pandu for you. (దిమ్మతిరగడం = తల/ కళ్లు తిరగడం = head reels).

**Q.** Day-by-day కు day to day కు తేడా ఏమిటి?

**A.** Day by day = రోజు రోజుకూ;

Day to day = దైనిక/ దైనందిన = ఒక రోజుకు మాత్రమే సంబంధించిన/ నిత్యజీవితానికి సంబంధించిన.

**Q.** lay down కు అర్థం ఏమిటి?

**A.** చట్టాలు/ నిబంధనలు లాంటివి విధించడం.

**Q.** ఆమెకు కొడుకులు ఉన్నా లేకున్నా ఒకటే (తన కొడుకులు ఏమీ పట్టించుకోరనే అర్థంతో)

**A.** Son or no son makes no/ little difference to her./ Her having a son is as good as not having one.

**Q.** పచ్చిది, చేదు వీటిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Raw/ unripe = పచ్చి

bitter = చేదు.

***V. Srinivas, Narasapur***

**Q.** ఆందోళనకారులు ట్రక్‌ల టైర్లలోని గాలిని తీసివేశారు. దీన్ని ఇంగ్లిష్‌లో The agitators deflated the tyres of the trucks అంటే సరిపోతుందా?

**A.** సరిపోతుంది.

**Q.** An 108 ambulance attendant అని ఒకచోట చదివాను. ఇక్కడ 108 ముందు an వాడాలా?

**A.** A 108 Ambulance attendant, Correct; 'An' కాదు. (Hundred ముందు, a వస్తుంది; an రాదు).

***A. Prasanthi, Hyderabad***

**Q.** Business, trade వీటి మధ్య తేడా ఏమిటి?

**A.** Business = వస్తువులను అమ్మడం, కొనడం, తయారుచేయడం, సేవలను అందించడం ద్వారా డబ్బు చేసుకోవడం/ వ్యాపారం.

Commerce = వస్తువులను, సేవలను అమ్మడం, కొనడం లాంటివి నిర్వహించడం/ విపణి.

Trade = ఒకే దేశం లోపల గానీ, రెండు మూడు దేశాల మధ్యగానీ వస్తువుల క్రయ, విక్రయాల ప్రక్రియ/ వాణిజ్యం.

**Q.** Ballads, Chivalry, Viz, Revival, Insignia, Subdued - ఈ పదాల అర్థాలు తెలుపండి.

**A. Ballads** = జానపద గీతాలు (ఆంగ్లంలో).

**Chivalry** = సహృదయత, గౌరవ మర్యాదలతో కూడిన ప్రవర్తన, ముఖ్యంగా స్త్రీల పట్ల. (ఇది ముఖ్యంగా English/ European దేశాల సంస్కృతికి సంబంధించిన మాట.)

**Viz** = Namely = కింద తెలిపిన. e.g: I met the following officers, viz., (namely) the District Collector, the Joint Collector, and the Revenue Officer = నేను ఈ కింది అధికారులను అంటే జిల్లా కలెక్టర్‌ను, సంయుక్త కలెక్టర్‌ను, రెవెన్యూ ఆఫీసరును కలిశాను.

**Revival** = పునరుద్ధరణ = కొంతకాలంపాటు ఆచరణలో లేని చట్టాలను, సంప్రదాయాలను, పద్ధతులను పునరుద్ధరించడం (తిరిగి ప్రారంభించడం).

**Insignia** = ఒక సంస్థలో సభ్యులు అని సూచించే టటువంటి లేదా ఒకరి హోదాను తెలిపేటువంటి చిహ్నం (symbol or badge).

మూడు సింహాలూ అశోకచక్రం మన జాతి/ భారత జాతికి insignia.

**Subdued** = అణిగి ఉన్న/ అంత బిగ్గరగా లేని.

**Q.** What is the correct method while doing signature?

**A.** It should be in one's hand writing, not all letters in capitals but in the script alphabet. మామూలుగా మనం English లో రాసే అక్షరాల్లో (అన్నీ capitals కాకుండా. ఇంకో విషయం మన సంతకం ఎలాగయినా పెట్టొచ్చు అర్థంకాకపోతే bracketsలో దాని కింద మన పేరు రాయాలి.)

***G.Shankar, Kesavapatnam***

**Q.** Words can not be learnt <u>parrot-fashion</u>. What is the meaning of this word parrot-fashion.

**A.** Parrot fashion = Like a parrot; learning or repeating without thinking or understanding.

**Q.** I was come yesterday.

I had come yesterday.

What is the difference between them.

**A.** I was come yesterday - WRONG.

I had come yesterday - I arrived here yesterday, before something else happened.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



# Do anything with perseverance





**Md. Ghouse Mohiuddin, Kadapa**

**Q.** కిందివాటిని తెలుగులో తెలుపగలరు.

Shakespeare is greater than any other English poet. (Comparative)

**A.** ఆంగ్లంలో ఏ ఇతర కవి కన్నా Shakespeare గొప్పవాడు.

**Q.** Very few kings of the world are as great as Akbar. (positive)

**A.** ప్రపంచంలో చాలా తక్కువ మంది రాజులు అక్బరంత గొప్పవాళ్లు.

**Q.** Akbar is greater than most other kings of the world (comparative)

**A.** ప్రపంచంలో చాలా మంది రాజుల కన్నా అక్బర్ గొప్పవాడు.

**Q.** Akbar is one of the greatest kings of the world.(superlative)

**A.** ప్రపంచంలోని అత్యంత గొప్ప రాజుల్లో అక్బర్ ఒకడు.

**Q.** కింది exclamatory వాక్యాలను తెలుగులో వివరించగలరు. ఈ వాక్యాల్లో ఎప్పుడు how వాడాలో, ఎప్పుడు what వాడాలో తెలుపగలరు.

1. How beautiful the rose is!
2. What a beautiful scene this is!
3. What a wonderful creature an elephant is!

**A.** 1. ఆ గులాబీ ఎంత అందంగా ఉందో! (ఎంతో అందంగా ఉంది)

2. ఈ దృశ్యం ఎంత అందంగా ఉందో! (చాలా అందంగా ఉంది)

3. ఏనుగు ఎంత అందమైన ప్రాణి! (చాలా అందమయింది)

Exclamations how తో వాడినా, what తో వాడినా తెలుగులో అంత తేడా లేదు. అయితే, what తో ప్రారంభమయ్యే exclamations లో, what తర్వాత noun కానీ adjective + noun కానీ వస్తుంది.

What a leader Gandhi was!

What + a leader (noun)

Exclamation how తో begin అయితే, How తర్వాత adjective/ adverb వస్తుంది.

How great he is!

How + great (adjective)

How slowly he walks!

How + slowly (adverb)

**Q.** Don't you know English? దీనికి affirmative, negative answer వివరించగలరు.

**A.** Yes, I know. అయితే spoken English లో Don't you know English? అనే question కు,

a) No, I don't (negative) (తెలియదు అనేందుకు)

b) Yes, I do (affirmative) (తెలుసు అనేందుకు) అంటాం.

**Q.** Don't you know this news? దీనికి affirmative, negative answer తెలుపగలరు.

**A.** పై question లో లాగానే-

Negative - No, I don't (know)

Affirmative - Yes, I do (I know)

**Q.** Improve, develop వీటి మధ్య తేడా తెలుపగలరు.

**A.** Develop= వృద్ధిచెందడం, పరిణామం (మార్పు) చెందడం.

Improve= వృద్ధిచెందడం, మెరుగవడం, ఎక్కువవడం.

***A.Sudhakar, Bhiknur***

**Q.** Please define these words- Phonology, Syntax, Phonetics, Semantics, Sociolinguistics, Psycholinguistics, Language Acquisition, Language Lab, Morphology, Typology of Indian Languages, Linguistic Phonetics.

**A. Phonology** = The study of speech sounds (the sounds of the words in our speech) of a language.

**Syntax** = The way words are arranged to form a sentence and the rules of grammar connected with it. (The rules of the construction of sentences). Computer - the rules telling us how words and phrases must be used in a computer language.

**Phonetics** = The study of speech sounds and how they are formed.

**Semantics** = The study of the meanings of words in a language - how the meanings of some words change over a period and how words develop different meanings.

**Sociolinguistics:** The study of the way language is affected by the differences in social classes, places and sex (Male/ female)

**Psycholinguistics** = studying how the human mind produces and processes language.

**Language acquisition** = learning a language.

**Language Lab =** విజ్ఞానాన్ని పెంపొందించుకునేందుకు, కంప్యూటర్ ద్వారా, సీడీల్లో pronunciation, grammar, conversational language లాంటివి నేర్చుకునే వసతి. (a facility which helps us to learn a language through computers).

**Morphology** = A branch of linguistics dealing with words, their structure and meanings.



M.SURESAN

**Typology of Indian Languages =** The study of the languages spoken in various parts of India and how the culture and other aspects of the areas affect the people of the area.

**Linguistic Phonetics** = phonetics = the study of speech sounds and how they are produced.

***R.Rajasekhar, Lingasamudram.***

**Q.** కిందివాటిని వివరించగలరు.

1) with a view to 2) with regard to 3) with respect to 4) In view of 5) Here with, here in, hereby, hereafter 6) Therewith, thereby, thereafter, therein 7) for the time being

**A.** 1) ఆ ఉద్దేశంతో - **with a view** to getting good marks he is studying hard

2) దాన్ని గురించి, ఆ విషయానికొస్తే **with regard to** her behaviour, it is very good = **with respect to** (3)

4) In view of = because of

In view of the bad weather, the match will be cancelled.

5) Herewith = దీనితో; Herein = ఇందులో; Hereby = ఇందుమూలంగా; Hereafter = ఇప్పటినుంచి.

6) Therewith = దాంతో; thereby = అందువల్ల; thereafter = ఆ తర్వాత; therein = అందులో.

7) for the time being = ప్రస్తుతానికి.

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో వివరించగలరు.

నేను ఒకపక్క చెయ్యొద్దని చెబుతూనే ఉన్నాను. వాడు చేశాడు.

**A.** Even as I was telling him not to (do it) he did it.

**Q.** తెలుగు నేర్చుకోవడం ఎంత అవసరమో, ఇంగ్లిష్ నేర్చుకోవడం కూడా అంతే అవసరం.

**A.** It's as important to learn English, as it's to learn Telugu.

**Q.** ఇంకా ఎవరైనా, ఇంకా ఏమైనా చెబుతావా. ఇంకా అనేదానికి ఇంగ్లిష్ పదం.

**A.** Anything more you wish to say? (ఇంకేదైనా చెబుతావా?)

Anything more/ Any more = ఇంకా

Anybody else = ఇంకా ఎవరైనా

**Q.** అన్నం పెట్టు, కూర వెయ్యి.

**A.** Serve (the) rice and (the) curry.

**Q.** అబ్బాయికి అన్నం తినిపించాలి, స్నానం చేయించాలి, స్నానం చేయించు.

**A.** I/ You, etc., have to feed him, bathe/ wash him. Bathe him/ wash him.

**Q.** ఏమీలేదు. ఊరికే కూర్చున్నాను.

**A.** Nothing. I am idle.

**Q.** చనిపోయిన ఆయన ఆత్మకు శాంతి కలగాలని మనం అందరం కలిసి అయిదు నిమిషాలు మౌనం పాటిద్దాం.

**A.** Let's observe five minute silence (silence for 5 minutes) so that his soul may rest in peace.

**Q.** నువ్వు వచ్చి ఉంటే బాగుండేది.

**A.** If you had come, it would have been good.

**Q.** వాడు నన్ను కొట్టించాడు.

**A.** He had/ got me beaten.

**Q.** కాలుకు దెబ్బ తగిలింది.కాలుకు తిమ్మిరి పట్టింది.

**A.** My leg is hurt/ I've hurt my leg.

My leg is benumbed.

**Q.** ఎందుకనో మరి తెలియడం లేదు.

**A.** Don't know why.

**Q.** బాగా మత్తెక్కుతున్నట్లు ఉంది (ఆల్కహాల్ తాగినప్పుడు).

**A.** He seems to be drunk/ He seems to be intoxicated/ He seems to be on the horse.

**Q.** నా దృష్టిలో ఇది తప్పు.

**A.** In my view it is wrong.

**Q.** వెళ్లి పడుకో.

**A.** Go and lie down/ take rest.

**Q.** ఏ పని అయినా పట్టుదలతో చేయాలి.

**A.** Do anything with perseverance.

**Q.** కల్తీ సారా తాగి పది మంది మృతి.

**A.** 10 die after consuming adulterated liquor.

**Q.** నేను అది చేయాల్సి వచ్చింది.

**A.** I had to do it.

**Q.** రానురాను తెలుసుకుంటారు.

**A.** By and by they will know.

**Q.** వాడు చెడు అలవాట్లకు అలవాటు పడ్డాడు.

**A.** He got into bad habits.

**Q.** కొత్త పరిస్థితులకు అలవాటు పడాలి.

**A.** You must get used to new circumstances.

**Q.** వాడు ఆ విధంగా అలవాటు పడ్డాడు.

**A.** He is used to it.

**Q.** ఉదయాన్నే కాలకృత్యాలు తీర్చుకో, తీర్చుకోవాలి.

**A.** Have your wash and other things in the morning itself.

**Q.** సుడిగాలి పర్యటన.

**A.** Whirlwind tour.

***K.L.N.Rao Tenali***

**Q.** Begin, start, commence మధ్య తేడా ఎలా తెలుస్తుంది?

**A.** Begin, start దాదాపుగా ఒకటే.

Commence అన్నా ప్రారంభించడమే. అయితే commence గ్రాంథికం. Spoken English లో అరుదు. Spoken English లో start ఎక్కువ వాడతాం. Written లో begin వాడతాం.

**Q.** John said, 'I eat mutton' ను indirect speech లో రాస్తే John said that he ate mutton అవుతుంది. కానీ direct speech లో speaker present indefinite లో చెప్పింది report speech లో simple past tense గా మారడంతో correct version అవుతుందా?

**A.** ఇలాంటప్పుడు Indirect speech కి మార్చినప్పుడు, past లో regular action తెలిపేందుకు would వాడతాం. అప్పుడు He said he would eat mutton (regularly) అనొచ్చు.

***G.Shankar, Keshavapatnam***

**Q.** Please explain the meanings of these words: 1) sorcerer 2) exorciser 3) strapped 4) trellised balconies

**A.** 1) = మాంత్రికుడు;

2) = దయ్యంపట్టిన వాళ్లల్లోంచి దయ్యాన్ని పారదోలేవాళ్లు.

3) Strapped = డబ్బు తక్కువగా ఉండటంగానీ, అసలు లేకపోవడంగానీ.

4) Trellised balcony = లతలు అల్లుకునేందుకు ఏర్పాటు చేసే చెక్కల వల ఉండే balcony (Balcony మేడ మీద నుంచి బయటికి చూసేందుకు వీలున్న వరండా).

***P. Sujatha, Sindhanur, Karnataka***

**Q.** కింది వాక్యాల అర్థ భేదాన్ని తెలుపండి.

I am very happy today.

I am so happy today.

**A.** I am very happy (British) = I am so happy (American) - నాకెంతో సంతోషంగా ఉంది/ నాకెంత సంతోషంగా ఉందో!

**Q.** కింది మాటల మధ్య తేడా ఏమిటో తెలుపగలరు.

1) Money - wealth - treasure

2) Children - kids

3) Process - method - way

**A. 1) Money** = డబ్బు- ముఖ్యంగా నగదు/ Bank ఖాతాల రూపంలో.

**Wealth** = సంపద - డబ్బుతోపాటు స్థిర, చర ఆస్తులు- ఇల్లు, పొలాలు, కార్లు లాంటి వాటితోసహా.

**Treasure** = నిధి- ముఖ్యంగా రహస్యంగా గుట్టగా పోసి ఉంచిన డబ్బు, నగలు వగైరా.

**2) Children = Kids.** అయితే Kids వ్యావహారికం (Spoken form లో ఎక్కువ వాడతాం).

**3) Process** = ప్రక్రియ- ఒక ఫలితం కోసం/ ఫలితాన్నాశించి దాని సాధన కోసం దశలవారీగా అనుసరించే విధానాలు.

**Method** = పద్ధతి- ఒకే విషయాన్ని వివిధ పద్ధతుల్లో చేయొచ్చు. ఇక్కడ దశలకు అంత ప్రాముఖ్యం లేదు.

**Way** = విధానం. ఒక విషయం ఎలా చేయాలనే ఆలోచన.

**Q.** She fell and fractured her arm. He fell down and broke his leg. మొదటి వాక్యంలో fell down అని రావాలి కదా. ఎందుకు రాలేదు? He called me up last night ఈ వాక్యంలో call up అంటే ఏమిటో తెలుపగలరు.

**A.** She fell down and fractured her arm అనడమే better. Fall తర్వాత down వాడటం, కిందపడటం అనే అర్థాన్నిస్తుంది. Fall (down లేకుండా) అంటే పతనం/ దిగజారడం/ అధ్వానమవడం అనే అర్థం ఎక్కువ స్ఫురిస్తుంది.

Call up a person/ Call a person up = ఒక వ్యక్తికి ఫోన్ చేయడం.

He called me up last night = అతడు నాకు నిన్న రాత్రి ఫోన్ చేశాడు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# Do you read the news paper?





M.SURESAN



***A.Upendar, Khammam.***

**Q.** గతానికి (Past) సంబంధించిన ప్రశ్నలను did, was, were లను ఉపయోగించి అడుగుతారు. అయితే వీటిని ఏయే సందర్భాల్లో ఉపయోగించాలో తెలుపగలరు.

**A.** మీ ప్రశ్నలోనే సమాధానం ఉంది- 'గతానికి' (past) సంబంధించి అని. అదే వాటి, అంటే- was, were, did ల ఉపయోగం. అయితే was, were గతంలో ఉండటం అనే అర్థంతో, was, singular subjects తో 'ఉండేవాడు/ ఉండేది/ ఉన్నాడు/ ఉంది' (అన్నీ గతంలో), అన్న అర్థాలతో, were, plural subjects తో 'ఉండేవాళ్లు/ ఉండేవి/ ఉన్నవి/ ఉన్నారు- గతంలో) అనే అర్థంతో వాడతాం.

He was here yesterday- అతడు నిన్న ఇక్కడ ఉన్నాడు.

The book was on the table last night (నిన్న రాత్రి ఆ పుస్తకం table మీద ఉంది.)

The students were happy- విద్యార్థులు సంతోషంగా ఉన్నారు (గతంలో).

**Q.** ప్రస్తుతానికి (present) సంబంధించిన ప్రశ్నలను do, is, are, has, have లను ఉపయోగించి అడుగుతారు. వాటిని ఏయే సందర్భాల్లో ఉపయోగించాలో తెలుపగలరు.

**A.** am, is, are questions లో వాడతారు, statements లోనూ వాడతారు. Am/ is/ are మాత్రమే, (ఇంక, '...ing' form/ past participle తో కలపకుండా) వాడితే, ఇప్పుడూ/ ఎప్పుడూ ఉండటం అనే అర్థం వస్తుంది.

Are you there? (నువ్వక్కడ ఇప్పుడు ఉన్నావా? )/ (మీరక్కడ ఉన్నారా? )

Is he happy? (అతడు సంతోషంగా ఉన్నాడా? )

Where is the book? (ఆ పుస్తకం ఎక్కడ ఉంది? - ఇప్పుడు)

**Q.** కింది వాక్యాల అర్థాన్ని తెలుపగలరు.

What should I do

What have I to do

What must I do.

**A.** మూడింటి అర్థం ఒకటే - ఇప్పుడు నేనేం చేయాలి?

***A.Sudhakar, Peddamallareddy.***

**Q.** What is the difference between Idiom, Phrase and Proverb. Please clarify.

**A. Phrase** = A group of words without a verb.

eg: In the evening; on his advises etc.

**Idiom:** A group of words the meaning of which has no connection with the any word in the group.

eg: To drive someone up the wall = to make a person very angry.

**Proverb** = A wise saying, usually a well-known phrase/ sentence which gives advice or says something generally true.

eg: All that glitters is not gold.

**Q.** Imagery, diction, syntax, figures of speech, rhythm and theme. Please explain these words with example of a poem.

**A. Imagery** = words or expressions used by poets/ writers in their poems to create in readers' minds, pictures of places and persons. This includes figures of speech, description, etc.

**Diction** = The choice and use of words in literature; the way a person pronounces words.

**Syntax** = The construction/ structure of a sentence and the rules of grammar connected with it.

**Figures of speech:** A word/ phrase used with a meaning different from its usual meaning, to create a picture in the mind.

eg: As dry as dust - This figure of speech = very dry.

**Rhythm** = A strong regularly repeated sounds of music.

**Theme** = Subject matter

The theme of Paradise Lost is the fall of man.

***M. Satyanarayana, Hyderabad.***

**Q.** Yes, right, correct, real, fact ఈ పదాలను ఎప్పుడు, ఎక్కడ, ఎలాంటి సందర్భాల్లో వాడాలి?

**A. Yes** = అవును.

Do you read the news paper?

(వార్తాపత్రిక చదువుతావా? )

yes = (అవును)

**Right = Correct** = సరైన.

That is the right/ correct answer = అది సరైన జవాబు.

**Real** = నిజమైన/ వాస్తవమైన/ యదార్థమైన.

In real life = నిజ జీవితంలో.

Though he plays the villain in movies, he is a good man in real life = సినిమాల్లో దుర్మార్గుడి పాత్ర వేసినా, నిజ జీవితంలో అతడు మంచివాడు.

**Fact** = నిజం/ యదార్థం.

It is a fact that he was here yesterday అతడు నిన్న ఇక్కడున్నాడనేది వాస్తవం/ నిజం.

**Q.** Full, all, total, net ఈ పదాల వాడుకను వివరించగలరు.

**A. Full** = పూర్తిగా, నిండుగా.

The bottle is full = ఆ సీసా నిండుగా ఉంది.

I don't know the full story = పూర్తి కథ నాకు తెలియదు.

**All** = అన్నీ/ అందరూ.

All these books are mine = ఈ పుస్తకాలన్నీ నావే.

All are here = ఇక్కడ అందరూ ఉన్నారు.

**Total** = మొత్తం.

The total amount he gave me is just this = అతడు నాకిచ్చిన మొత్తం ఇదే.

**Net** = అన్నీ తీసివేతలుపోనూ.

Net salary = అన్ని మినహాయింపులూ పోగా, చేతికొచ్చే జీతం.

***P.Lingam, Nagapuram.***

**Q.** Chess board పైన chess & draught board అని ఉంటుంది. Draught అంటే అర్థం ఏమిటి?

**A.** Draught (డ్రాఫ్ట్) కూడా, chess లా ఒక ఆట.

**Q.** ఎన్నికలు, సర్వేలు అధ్యయనం చేసే శాస్త్రం సెఫాలజీ స్పెల్లింగ్ ఏమిటి?

**A.** Psephology ('P' silent)

**Q.** What is the difference among the discount, off, subsidy, rebate.

**A. Discount** = ప్రకటించిన ధరలో కొంత శాతం తగ్గింపు.

**Off** = కోత (ధరలో ) = దాదాపు discount.

**Subsidy** = వస్తువుల ధరల్లో కొంత శాతం ప్రభుత్వం/ సంస్థ భరించడం.

**Rebate** = 1) discount 2) ప్రభుత్వానికి మనం చెల్లించాల్సిన సొమ్ముకంటే ఎక్కువ చెల్లించి ఉంటే, ముఖ్యంగా పన్ను పడే ఆదాయం రూపంలో, ఆ అదనపు సొమ్ము ప్రభుత్వం మనకు తిరిగి ఇవ్వడం (Tax rebate).

**Q.** What is the different among the Bogus, Dummy, Duplicate, Fake.

**A.** మీ question What is the difference... (different కాదు) అని ఉండాలి.

**Bogus** = అసలైన వస్తువుగా/ వ్యక్తిగా చలామణి అయ్యే నకిలీ వస్తువు/ వ్యక్తి మోసగించే ఉద్దేశంతో.

Bogus currency (నకిలీ డబ్బు నోట్లు);

Bogus doctor = డాక్టర్ కాకుండానే డాక్టర్‌గా ఇతరులను నమ్మించేవారు;

Bogus injury = లేని గాయం ఉన్నదిగా చూపడం (మోసగించే ఉద్దేశంతో.)

**Dummy=** 1) బట్టల shops లో బట్టలు తొడిగి ప్రదర్శనకు పెట్టే మనిషి బొమ్మ.

2) నకిలీ వస్తువు - dummy pistol - Pistol ఆకారం కలిగి, నిజంకాని pistol.

3) బొమ్మ

4) పిల్లలు ఏడవకుండా నోట్లో ఉంచే పీక.

**Duplicate** = copy (ఒక వస్తువు/ వ్యక్తిలాంటి పోలికలున్న వస్తువు/ వ్యక్తి). పత్రాల copies.

**Fake = bogus** = నకిలీ (మోసం చేసే ఉద్దేశంతో)

**Q.** What is the difference between stare - glance, soap - detergent, global - international, clothes - cloths, parliament - assembly, plot - house, stand by captain - stand in captain, register - registration, increase - enhance, opera - orchestra, journal- magazine, publishing - printing, pub - club, cartoon - caricature, trainer - coach, president - chairman, among - inter - between, army - military, tenure - period.

**A. Stare** = ఉరిమి చూడటం; glance = ఓ క్షణం సేపు మాత్రం చూడటం.

**Soap**= సబ్బు; detergent= బట్టలు/ వస్తువులు శుభ్రంచేసేందుకు వాడే పొడి/ ద్రవం.

**Global** = ప్రపంచవ్యాప్తమైన, అన్ని దేశాలకు సంబంధించిన;

**International** = అన్ని దేశాలకు సంబంధించింది కాకుండా కొన్ని దేశాలకు మధ్య (రెండు దేశాల మధ్య కూడా) సంబంధించిన

**Clothes** = బట్టలు; cloths - ఈ మాట English లో లేదు. cloth - గుడ్డ (a piece/ pieces of a sheet/ sheets of cloth, etc)

**Parliament; Assembly** - రెండూ ఒక దేశపు చట్టాలను చేసే చట్టసభలు. అయితే మామూలుగా దేశం మొత్తానికి చట్టాలు చేసేది, Parliament. Assembly: ఒక రాష్ట్రానికీ, ఒక ప్రదేశానికీ చట్టాలను చేసేది, చట్ట సభ.

**Plot** = ఒక తోటకు/ నిర్మాణానికి (building) కేటాయించే స్థలం. House plot/ garden plot/ vegetable plot, etc.

**Stand by-** అవసర సమయాల్లో ఉపయోగపడే- ఇది సాధారణంగా వస్తువులకు వాడతారు, మనుషులకు కాదు.

Standby generator = విద్యుత్ సరఫరా నిలిచిపోయినప్పుడు అవసరానికి వాడే generator.

Stand by captain- సరికాదు.

Stand in captain = captain, తన బాధ్యత వహించలేనప్పుడు, captain గా వ్యవహరించే వ్యక్తి.

**Register-** 1) నమోదు చేయడం/ నమోదవడం 2) నమోదు చేసే పుస్తకం.

Registration= నమోదు

**Increase = enhance**. అయితే enhance ను ఎక్కువగా abstract ideas తో వాడతాం.

This enhanced his reputation = ఇది అతడి ప్రతిష్ఠను పెంచింది.

**Opera** = సంగీత నాటకం, **Orchestra** = వాద్య సమ్మేళనం.

**Journal-** ఒకే వృత్తికి/ ఒకే subject కు సంబంధించిన విషయాలు ఉండే పత్రిక journal. Medical Journal, Computer Journal etc.

**Magazine=** అన్ని రకాలవారికి ఆసక్తి కలిగించే పత్రిక.

**Publishing=** ఓ పుస్తకం/ రచన ముద్రణ దగ్గర నుంచి market లోకి విడుదల చేసేవరకు వహించే బాధ్యత.

**Printing=** ముద్రించడం.

**Pub-** మామూలు ఆహార పదార్థాలతోపాటు మద్యం సరఫరా చేసే Restaurant.

**Club-** క్రీడ, ఇతర కార్యకలాపాలు నిర్వహించేవారి సంఘం, దాని building- cricket, Golf club, foot-ball club, walkers' club, Book Lovers' club, etc.

**Cartoon-** వినోదం కోసం వార్తా పత్రికల్లాంటి వాటిల్లో వ్యక్తుల/ వస్తువుల రూపాల్లోని ప్రముఖ లక్షణాలు/ ముఖ కవళికలను ఎక్కువ చేసి చూపించే బొమ్మలు. Cartoon movie= అలాంటి కదిలే చిత్రాలతో కూడిన చలనచిత్రం.

**Caricature=** 1) వ్యక్తుల ప్రముఖ దేహ లక్షణాలను, ముఖ కవళికలను బాగా ఎక్కువ చేసి చూపే బొమ్మ. 2) అపహాస్యం చేసే ఉద్దేశంతో వ్యక్తుల గురించి హాస్యకర రచన.

**Trainer= Coach**. అయితే Coach ను ఎక్కువగా క్రీడారంగంలో వాడతాం.

**Chairman = President.**

**Among=** ఇద్దరికంటే/ రెండింటికంటే ఎక్కువ ఉన్న వాటి మధ్య.

**Between-** ఇద్దరికి/ రెండింటికి మధ్య

**Inter=** అంతర్, (International= అంతర్జాతీయ)

**Army** = భూసేన- భూమ్మీద పోరాడే సైనికులు (విమానాల/ ఓడల నుంచి కాకుండా)

**Military=** సాయుధ సైనికులందరికి సంబంధించి.

**Tenure= period.** (విద్యాసంస్థల్లో మాత్రం period అనే అంటాం)

**Q.** పదవి ఊడటం, ఉద్యోగం పోవడం లాంటి వాటికి వాడే పదం ఊస్టింగ్, దీని స్పెల్లింగ్ ఏమిటి?

**A.** Ousting (ఔస్టింగ్, ఊస్టింగ్ కాదు).

**Q.** Senior, super senior అన్నట్లు super junior అనొచ్చా?

**A.** Super junior బదులు sub junior అంటాం.

**Q.** ఒక కవరు పైన This is a bio-degradable cover అని రాసి ఉంది. దీని అర్థమేమిటి?

**A.** Biodegradable= గాలి, ఎండ, వాన, మట్టి, నీళ్లు లాంటి ప్రకృతి శక్తులవల్ల క్షీణించిపోయే.

మామూలు కాగితం biodegradable క్షీణించి మట్టిలో కలిసిపోతుంది.

Plastic- కాదు (చాలా రకాలు)

మాసపత్రిక మీద ఉన్న plastic, biodegradable అంటే కాలక్రమేణా క్షీణించి మట్టిలో కలిసిపోతుందని.

**Q.** C.C. Camera లో C.C పూర్తి పేరేమిటి?

**A.** C.C.= Closed Circuit = పరిమిత ప్రదేశంలో జరిగే విషయాలను మాత్రమే చూపించే TV Camera.

**Q.** What is the difference among - Block, Desk, Unit, Section, Class, Pool, Chapter, Category, Classification, Segment, Zone, Department, Rank Grade, Sector, Ward, Constituency, Series, Group.

**A.** Block = సముదాయం, Desk = రాతబల్ల, Unit = ఒకే లక్షణాలున్న వస్తువుల, ఒకదానికొకటి సంబంధం ఉన్న వస్తువుల సమూహం/ వరస. ఒకే విషయానికి సంబంధించిన వ్యక్తుల సమూహం, Section = విభాగం, Class = తరగతి/ శ్రేణి/ వర్గం. Pool = నీళ్ల మడుగు, వస్తువుల సముదాయం, Chapter = పుస్తకంలోని అధ్యాయం, Category = విభాగం, Classification = విభజన, Segment = భాగం/ విభాగం, Zone = మండలం, Department = కార్యాలయ/ కళాశాలలోని శాఖ. Rank= ప్రతిభనుబట్టి నిర్ణయించే స్థానం, Grade= ప్రతిభాశ్రేణి/ నాణ్యత. Sector= విభాగం= Ward/ (నగరాల్లోని ప్రదేశాలు), Constituency = నియోజకవర్గం, Series = ఒకదానితో ఒకటి సంబంధం ఉన్న వస్తువులు/ చర్యలు, Group = వర్గం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

**Anindya:** What are you driving at, Sampurna? (Do) you mean you aren't upto doing all that work yourself?
(ఏంటి నువ్వంటుంది? ఈ పనంతా నువ్వొక్కదానివీ చేయలేవనా?)

**Sampurna:** Yea, nor do I know quite well how to go about this kind of work.
(అవును. అంతేకాకుండా ఇలాంటి పని ఎలా చేయాలో నాకు సరిగా తెలియదు.)

**Anindya:** My problem is I don't know at all how to do it. I think we need advice on this matter.
(నా సమస్య ఏమిటంటే నాకీ పని అసలు తెలియదు. ఈ విషయంలో ఎవరి సలహా అయినా అవసరం అనుకుంటా.)

**Sampurna:** Why don't we approach Prasuna?
(ప్రసూనను అడిగి తెలుసుకోకూడదా?)

**Anindya:** She is out of town on business and will not be back until tomorrow evening.
(తను పని మీద ఊరెళ్లింది రేపటిదాకా రాదు.)

# What are you driving at?

**Sampurna:** Isn't it the third time in a week she is out? What's keeping her so busy?
(ఏంటీ, వారంలో ఇది మూడోసారి ఆమె బయటికెళ్లడం. ఏ పనిమీద అంత తీరిక లేకుండా ఉంది తను?)

**Anindya:** Don't you know she has a job now? she is working for a company dealing in furniture; I think she has a share in it too.
(నీకు తెలియదా తనిప్పుడు ఓ furniture company లో ఉద్యోగం చేస్తోందని? దాన్లో తనకు భాగం కూడా ఉందనుకుంటా.)

**Sampurna:** Oh, that's news to me. She never told me of it. How long has she been in it?
(ఇది నాకు కొత్త వార్త. నాకెప్పుడూ చెప్పలేదామె. ఎంతకాలంగా పనిచేస్తోంది?)

**Anindya:** Why, it's already two months since she started it. Perhaps you know she worked earlier for a company promoting herbal products.
(అవునూ, అంతకుముందు వనమూలికల వస్తువుల తయారీల company కి పనిచేసిందని నీకు తెలుసు కదా.)

**Sampurna:** Yes. She keeps herself busy same way or the other. The most important product was the one for hair.
(అవును. ఏదో ఒక విధంగా ఎప్పుడూ పని చేస్తూనే ఉంటుంది. వాళ్ల ముఖ్యమైన తయారీ తల వెంట్రుకలకు సంబంధించింది.)

**Anindya:** She is good at gathering information about jobs that pay. She's made quite a lot of money too.
(మంచి ఆదాయం వచ్చే పనుల గురించి సమాచారం సేకరించడంలో తను గొప్పదే. చాలా సంపాదించింది కూడా.)

**Sampurna:** I think we've to wait till she is back for us to do this work. In the mean time let's note down on paper what we have to do.
(మనం ఆమె తిరిగి వచ్చేంత వరకు కాచుకోవాల్సిందే ఈ పనయ్యేందుకు. ఈ మధ్యలో మనం ఏం చేయాలో కాగితం మీద రాద్దాం.)

**Anindya:** Ok. That suits me fine.
(సరే. నాకేం అభ్యంతరం లేదు.)

ఈ lesson నుంచి మనం Spoken English లో మొదట నేర్చుకున్న అంశాలను కాస్త పునశ్చరణ (Revise) చేసుకుందాం. అంతకుముందు ఈ phrasal verbs అర్థం, ఉపయోగం తెలుసుకుందాం.

1) drive at 2) go about.

**Drive at:** try to say = చెప్పాలనుకుంటున్న విషయం.

Though I tried my best I could not see what they were driving at = ఎంత ప్రయత్నించినా వాళ్లేం చెబుతున్నారనేది/ చెప్పాలనుకుంటున్నదీ నేనర్థం చేసుకోలేకపోయా.

'Driving at' ను ముఖ్యంగా "నువ్వేమంటున్నావో నాకర్థం కావట్లేదు/ ఇంతకీ నీవనేదేంటి?" అని ధ్వనించేట్లు వాడతాం.

He spoke for 20 minutes without any one understanding what he was driving at = అతనేమంటున్నదీ/ ఏం చెప్పాలనుకుంటున్నదీ ఎవరికీ అర్థం కానట్లు 20 నిమిషాలు మాట్లాడాడు.

**2) To go about** = ఏదైనా పని మొదలుపెట్టడం.

a) Now that you have a chance to do it how do you go about it? = ఇప్పుడు నీకాపని చేసే అవకాశం వచ్చింది కదా? ఎలా ప్రారంభించబోతున్నావు?





M.SURESAN

b) I know what is to be done but I do not know how to go about it = ఏం చేయాలో తెలుసు, కానీ ఎలా చేయాలి అనేదే తెలియడం లేదు.

ఇప్పుడు ఈ కింది విషయాలు గమనిద్దాం: countables అంటే మనం లెక్కపెట్టగలిగినవి 1, 2, 3 ... ఇలా. Book, Pen, Teacher, Child, Tree- ఇవన్నీ countables - వీటిని మనం numbers లో అంటే సంఖ్యల్లో one book, 2 books, 10 teachers, 4 children - ఇలా చెబుతాం.

Uncountables అంటే మనం లెక్కపెట్టలేనివి - అంటే ఒకటి, రెండు, పది అని చెప్పలేనివి- eg: sugar, milk, rice, etc.

English కు సంబంధించినంతమటుకు మనం తెలుసుకోవాల్సింది- countables కు, singular number (ఒక వస్తువు, ఒక మనిషిని గురించి తెలిపితే), plural number (ఒకటి కంటే / ఒకరి కంటే ఎక్కువ వస్తువులను, విషయాలను గురించి మాట్లాడితే) ఉంటాయి. Uncountables కు plural ఉండదు. అయితే తెలుగులో countables అనుకునేవి English లో చాలావరకు uncountables . అంటే వాటికి Englishలో plurals ఉండవు. వాటిముందు 'a'/ 'an' రాదు. అలాంటి వాటిని మనం ఈ lesson లోని conversation లో వాడాం.

Uncountables వాడిన ఈ కింది sentences ను (అన్నీ పై conversation లోనివే) గమనించండి.

1) I think we need advice on this matter - advice - uncountable (U)
2) She is working for a company dealing in furniture- furniture (U)
3) Oh, that's news to me - news (U)
4) The most important product was the one for hair- Hair (U)
5) She is good at gathering information- information (U)
6) Let's note down on paper what we have to do- paper (U)

చూశారు కదా. పై మాటలన్నీ uncountables అంటే, వాటిల్లో వేటికీ plurals లో వాడం. వాటిముందు a/ an వాడం.

1) advice - సలహా, No plural - advices wrong. An advice/ a good advice/ a useful advice/ an important advice - all wrong- వీటన్నింటి ముందూ a/ an తప్పు. అయితే a piece of advice/ a few pieces of advice అనొచ్చు.

2) అలాగే furniture కూడా uncountable కాబట్టి a furniture/ two or three furnitures వాడటం కూడా సరికాదు. An item/ a piece of furniture, two or three items/ pieces of furniture అంటాం. Furnitures మాత్రం అనం.

3) The same applies to the word 'news' (వార్త/ వార్తలు). చివరి s వల్ల news ను plural అనుకునే ప్రమాదం ఉంది. కానీ news ఎప్పుడూ singular. దానిముందు a/ an రాదు.

This is good news - Correct.
The news is bad - Correct.
a good news/ an important news, etc. wrong.

I have a news for you - Wrong
I have news for you - Right.

4) Englishలో hair (వెంట్రుక/ వెంట్రుకలు) uncountable అంటే hairs ఉండదు.

a) She has beautiful dark hair - Right.
b) There is a hair in the tea - Wrong.
There is hair/ a piece of hair in the tea - Right
(Hairs, Science లో ముఖ్యంగా జంతువుల, మొక్కల లక్షణాల గురించి చెప్పేటప్పుడు వాడతారు)

5) Information (సమాచారం)- ఇది కూడా 'news' లాగే uncountable. అంటే an information/ a useful information ఇలాంటి వాడకాలేవీ సరికావు. A piece of information/ pieces of information అనొచ్చు.
We are waiting for a piece of information - OK.
Informations (plural of information) కూడా సరికాదు.

6) Paper - మామూలుగా రాసేందుకు, ముద్రించేందుకు వాడే paper - uncountable - అంటే ఈ అర్థంతో, a paper/ two or three papers అనడం సరైన English కాదు.

A sheet of/ sheets of paper; a slip/ slips of paper; a piece of/ pieces of paper అనొచ్చు - అలాగే అంటుంటాం. అయితే paper కున్న ఇతర అర్థాలతో paper ను countable గానే వాడతాం. ఆ ఇతర అర్థాలు: 1) document పత్రాలు - మన ఆస్తి హక్కులను, ఒప్పందాలను రాసుకునే కాగితాలు, 2) మన certificates; 3) పరిశోధనా పత్రాలు (Research papers) ఈ అర్థాలతో paper countable అవుతుంది. అంటే ఈ అర్థాలతో paper ముందు a/ an వాడొచ్చు. Papers అని plural కూడా వాడతాం.

a) Here is an important paper about my right to the property = ఈ ఆస్తి మీద నాకున్న హక్కును తెలిపే ముఖ్యమైన పత్రం ఇదిగో.

b) His papers on the effects of smoking won him an award = Smoking ప్రభావం గురించి ఆయన పరిశోధనా పత్రాలకు బహుమతి వచ్చింది.

Paper/ The papers = News papers. ఈ అర్థంతో కూడా paper, countable.

a) His photo appeared in a local paper this morning = ఒక స్థానిక (వార్తా) పత్రికలో అతడి photo వచ్చింది.

b) All the papers published this news = అన్ని వార్తాపత్రికలూ ఈ విషయాన్ని ప్రచురించాయి.




*C.Bharath Kumar, Kodumur.*

**Q.** కింది పదాల గురించి వివరించగలరు.
Injure, Produce, Melodious, Community, Constitution, Glide, Mere, Opportunity, Scythe, Lime, Honourable.

**A. Injure** = hurt; harm; damage = గాయపరచడం/ కీడు చేయడం.

**Produce** = to cause the birth of (పుట్టించు); to make (తయారుచేయు), to show (చూపించు) to create (సృష్టించు) etc.

**Melodious** = (of music) sweet (మధురమైన - సంగీతం విషయంలో)

**Community** = a group people living in the same area and having the same beliefs, customs and way of life. In India it is often used with the meaning of 'a religion' or 'caste'.

**Constitution:**
1) The laws and principles which a government of a country should follow (రాజ్యాంగం)
2) A person's health and the ability of their body to fight illness. (ఒక వ్యక్తి దేహ స్థితి ఆరోగ్యానికి సంబంధించి)
3) the parts that form something (ఒక వస్తువును/ వ్యవస్థను రూపొందించే భాగాలు)

**Glide** = move smoothly and quietly - The wheels of a train glide on the rails (ఒరిపిడి, శబ్దం లేకుండా కదలడం)

**Mere**= Only. He gave me a mere ten rupees (He gave me only ten rupees - complaining)
She is a mere child. What does she know? (ఆమె పసిబిడ్డే. ఆమెకేం తెలుసు?)

**Opportunity** = a chance (అవకాశం).
In this school you have an opportunity to learn music = ఈ బడిలో సంగీతం నేర్చుకునే అవకాశం ఉంది.

**Scythe** = a long curved knife fixed to a long wooden handle used to cut grass - గడ్డిని నిలబడి కోసేందుకు వీలుగా పొడవైన కర్ర చివర్న అమర్చిన పొడవాటి వంకర కత్తి.

**Lime** = 1) సున్నం (గోడలకు వేసే)
2) పచ్చి నిమ్మకాయ (lemon)

**Honourable** = Respectable = గౌరవనీయులైన - The honourable (Hon'ble) CM of A.P.

*G. Rambabu, Tenali.*

**Q.** Kool, cool వీటిలో ఏది సరైంది?

**A.** Kool - English కాదు. Cool, correct.

**Q.** Smash, damage, spoil, ruin - వీటికి అర్థాలు తెలుపగలరు.

**A. Smash** = ముక్కలు ముక్కలుగా పగలగొట్టడం- విపరీతమైన శబ్దంతో.
He smashed the bottle = ఆ సీసాను బద్దలు/ ముక్కలు, ముక్కలయ్యేట్టు పగలగొట్టాడు.

**Damage** = చెడగొట్టడం/ ధ్వంసం చేయడం/ హాని కలిగించడం/ దెబ్బతగిలేట్టు చేయడం.
He damaged the car by his reckless driving = అజాగ్రత్తగా నడపడంవల్ల అతడు car చెడిపోయేలా/ car కు దెబ్బతగిలేలా చేశాడు.

**Spoil** = చెడగొట్టడం. He spoiled all my plans = నా పథకాలన్నింటినీ అతడు చెడగొట్టాడు.

**Ruin** = నాశనం/ నాశనమవడం.
His drinking ruined his health = అతడి తాగుడు అతడి ఆరోగ్యాన్ని నాశనం చేసింది.
His carelessness led to his ruin = అతడి అజాగ్రత్త అతడి నాశనానికి దారితీసింది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm

ప్రతిభ

**Nishanth:** Hi, Visisht, You didn't attend college yesterday. Why?

(నిన్న నువ్వు college కి రాలేదు, ఎందుకని?

**Visisht:** I had work at home. I thought I could finish it before college time, but that took longer than I had thought.

(ఇంట్లో పనుండింది. College time కంటే ముందే పూర్తి చేయొచ్చుననుకున్నా. కానీ నేననుకున్నదానికంటే ఎక్కువే పట్టింది.)

**Nishanth:** You missed an interesting demo on how soap is made. There was a man from Washwell Soap Company. The chemistry association had invited him to give us the demo.

(సబ్బు ఎలా తయారుచేయొచ్చో తెలిపే ప్రదర్శనను నువ్వు కోల్పోయావు. మన కళాశాల Chemistry Association వాళ్లు 'Washwell' సబ్బుల Company ని ఆ ప్రదర్శన నిర్వహించాల్సిందిగా ఆహ్వానించారు.)

Demo = Demonstration = ప్రదర్శన, ముఖ్యంగా ఏదైనా ప్రక్రియ/ పని ఎలా చేయాలో చూపించేందుకు.

**Visisht:** I had known about it but I couldn't help giving it the miss. The work at home was important.

(నాకు దాన్ని గురించి తెలుసు. కానీ వదులుకోవడం తప్పలేదు.)

**Nishanth:** But you went to temple as usual perhaps.

(కానీ మామూలుగా గుడికి మాత్రం వెళ్లావనుకుంటా.)

**Visisht:** That I did of course. By then I had finished my work.

(తప్పకుండా వెళ్లా. అప్పటికి నా పని పూర్తి చేసేశా.)

**Nishanth:** There's some thing more you should know. In the chemistry lab, acid fell in Sai's eyes. Very unfortunate, you know. They rushed him to hospital. Fortunately the doctor there assured us that his sight would be normal soon.

(నువ్వు తెలుసుకోవాల్సింది ఇంకా ఉంది. Chemistry lab లో సాయి కంట్లో acid పడింది. అతడిని ఆస్పత్రికి తీసుకెళ్లారు. అదృష్టవశాత్తు అక్కడి doctor చూపు త్వరలోనే మామూలుగా వస్తుందని భరోసా ఇచ్చారు.)

**Visisht:** That's good news. I feel relieved.

(అది శుభవార్త. అది నాక్కాస్త ఊరటగా ఉంది.)

**Nishanth:** His mom vowed that she would perform poojas at temple if he became normal.

(వాడికి నయమైతే గుళ్లో పూజలు చేయిస్తానని వాళ్లమ్మ మొక్కుకుంది.)

Vow = ప్రతిజ్ఞ చేయడం/ మొక్కుకోవడం.

**Visisht:** I saw him this morning. He is progressing.

(ఇవాళ ఉదయం అతడిని చూశాను. కోలుకుంటున్నాడు.)

**Nishanth:** I'll see him tomorrow.

(నేను రేపు చూస్తానతడిని.)

# Teachers take class




M.SURESAN

కిందటిసారి మనం Countables, uncountables గురించి మళ్లీ తెలుసుకున్నాం. Uncountables కు plural ఉండదని, వాటిముందు a/ an వాడకూడదనీ తెలుసుకున్నాం. అలాంటి uncountables మరికొన్ని ఇప్పుడు తెలుసుకుందాం.

Look at the following from the dialogue above:

1) I had work at home.

2) You missed an interesting demo on how soap is made.

మిగతా uncountables కు లాగానే soap (సబ్బు), work (పని) కూడా uncountables. అంటే వాటికి plurals ఉండవు. వాటిముందు a/ an రాదు.

మనం shop లో కొనే సబ్బు బిళ్లను A cake of soap అంటాం, paper ను, a sheet/ sheets of paper; a slip/ slips of paper అన్నట్లు.

a) We use about three to four cakes of soap a month = మనం నెలకు 3, 4 సబ్బు బిళ్లలను వాడతాం. (3 or 4 soaps అనం)

b) Please give me soap. (Please give me a soap సరికాదు) = నాకు సబ్బివ్వండి.

c) Please give me some soap అని కూడా అనొచ్చు.

Work (= పని) కూడా English లో uncountable. (ఒక పనుంది, రెండు మూడు పనులు పూర్తిచేయాలి అని తెలుగులో అన్నట్టు English లో కుదరదు).

He has gone out on work/ on some work = అతడు పని/ ఏదో (some) పనిమీద బయటికెళ్లాడు.

A lot of work అనొచ్చు. అయితే work బదులు ఒక్కోసారి job వాడతాం. 'Job' మామూలుగా మనం ఉద్యోగం అనే అర్థంతో వాడతాం. అయితే job కు ఒకరు చేయాల్సిన పని అనే అర్థం కూడా ఉంది.

Taking care of the guests is his job = అతిథులను చూసుకోవడం అతడి పని. ఇక్కడ గమనించాల్సిన విషయం, work (uncountable) = job (countable) అంటే a job/ an urgent job/ two or three jobs అనొచ్చు.

I have two or three jobs to do before I go to bed = పడుకోబోయేముందు చేయాల్సిన పనులు రెండు మూడున్నాయి.

I am going out on an important job = ఓ ముఖ్యమైన పనిమీద బయటికెళుతున్నాను.

ఇంకో విషయం: వేర్వేరు అర్థాలున్న ఒకే మాట, ఒక అర్థంతో countable అవుతుంది, ఇంకో అర్థంతో uncountable అవుతుంది.

Work కు మామూలు అర్థం పని కదా? ఈ అర్థంతో work, uncountable అని తెలుసుకున్నాం. అయితే work కు ఇంకో అర్థం 'గ్రంథం'/ 'రచన' అని కూడా ఉంది. ఈ అర్థంతో work countable, అప్పుడు work ముందు a/ an రావచ్చు. Works (గ్రంథాలు) అని plural వాడొచ్చు.

a) Hamlet is a work by Shakespeare = Hamlet, Shakespeare గ్రంథం/ రచన.

b) The works of Shakespeare are great = Shakespeare రచనలు గొప్పవి.

c) His works will soon be published = అతడి రచనలు త్వరలో ప్రచురితమవుతాయి.

అలాగే Iron. Iron = 1) ఇనుము - ఈ అర్థంతో Iron, uncountable. అంటే ఈ అర్థంతో వాడినప్పుడు, a/ an Iron, Irons అని వాడం.

Iron = 2) ఇస్త్రీ పెట్టె- (Iron box అని English లో అనం). ఈ అర్థంతో Iron countable.

a) He bought an iron yesterday = నిన్న అతడొక ఇస్త్రీ పెట్టె కొన్నాడు.

b) He bought iron yesterday = నిన్న అతడు ఇనుము కొన్నాడు.

Now look at the following sentences from the conversation between Nishanth and Visisht.

1) You didn't attend college yesterday.

2) You went to temple as usual.

3) They rushed him to hospital.

మామూలుగా మాట్లాడేవాళ్లకూ, వినేవాళ్లకూ తెలిసిన విషయమైతే, అది countable/ uncountable అయినా 'the' వాడతాం.

Where is the post office here? = ఇక్కడ post office ఎక్కడుంది? (Post Office అడిగేవాళ్లకూ, చెప్పేవాళ్లకూ ఇద్దరికీ తెలిసిన విషయం కాబట్టి, the Post Office. అలాగే The railway station/ the bus station/ the MRO's Office etc.)

అయితే కొన్ని చోట్లు, ప్రదేశాలు కొన్ని ప్రత్యేకమైన పనులకు నిర్దేశించినవిగా ఉంటాయి. అలాంటిచోట్లకు ఆ పనులకు వెళ్లేటప్పుడు వాటి ముందు the రాదు.

eg: Students and teachers go to school/ college (the school/ the college కాదు)

The devout (భక్తికలవాళ్లు) go to temple/ church/ mosque (మసీదు) (The temple/ the church/ the mosque కాదు).

Students attend class (the class కాదు)

Teachers take class (the class కాదు)

Judges/ Advocates/ Litigants go to court (the court కాదు).

**P. Srinivasa Rao, Pithapuram**

**Q.** I would like to know the clarifications of the following questions.



The difference between moral values and ethical values.

**A. Moral Values** = Beliefs a society has about what is moral and what is not.

**Ethical values** = Beliefs the members of a profession (doctors/ teachers/ priests/ lawyers, etc) have about what is right or wrong in their profession.

eg: A doctor with ethical values does not use their knowledge to harm their patients.

**Q.** He knows telugu as well as English. This is a complex sentence. Please analyse the main clause and subordinate clause in the sentence.

**A.** He knows Telugu as well as English - This is a compound sentence, because 'as well as' is a conjunction meaning 'and'

The complex sentence for this is:

He knows Telugu while he knows English. But this sentence is rather odd and had not better be used. It is turning a sentence into complex just for the sake of turning.

**Q.** The difference between bribe and corrupt.

**A.** 1) Bribe' is the cash or anything given to a person to make him do something illegal (లంచం); 2) To bribe means to give cash or kind given to some one to make them do illegal things.

Corrupt: Immoral; A corrupt person is immoral and does illegal things- by accepting bribes, by doing bad things to please important people, and by earning money in bad ways.

**Q.** Please define concept school.

**A.** There is no such thing as 'a concept school. In Andhra Pradesh certain institutes use the expression to mean, a school where students are taught to understand a subject, as different from a school which makes students learn by mugging up (బట్టీ). 'Concept' actually means the actual idea or a principle behind something. Teaching means teaching the concept and not, as most residential/ public schools do, train student in mugging up lessons. A good school is always a concept school.

**Q.** What is synergy school? and please define synergy.

**A.** Synergy is a technical word. The meaning is, the extra energy, power, success etc that we can get when two or more people or companies working together- Combinedly.

Synergy school = Two or more schools combining with one another.

**Q.** What is the usage of As to?

**A.** As to = about/ regarding.

As to spoken English, the simpler your language is, the better it is = Talking about/ Referring to spoken English, the simpler the language is, the better it is.

**Q.** In the dictionary 'pull up' is given such a way pull up (pull something up) to (cause to) come to a stop. Here what is the meaning of cause to?

**A.** To cause to = to make/ to be the cause of.

To pull up (a car, etc) = To cause to (To make) stop a vehicle that a person is driving.

eg: He pulled up by the side of road = He brought his car to a stop/ stopped his car by the side of the road.




**ఎల్.ఐ.సి.**

లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ (ఎల్.ఐ.సి.) ఆర్థికంగా వెనుకబడిన (ఇ.బి.సి.) విద్యార్థులకు ఎల్ఐసీ గోల్డెన్ జూబ్లీ స్కాలర్‌షిప్ స్కీమ్‌ను ప్రకటించింది.

ఈ పథకంలో భాగంగా దేశవ్యాప్తంగా 1000 మంది విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లను మంజూరు చేస్తారు.

**అర్హతలు:** 2008-09 విద్యా సంవత్సరంలో ఇంటర్‌లో కనీసం 60 శాతం మార్కులు పొంది ఉండాలి. వీరి తల్లిదండ్రుల కుటుంబ ఆదాయం సంవత్సరానికి రూ.60000 దాటకూడదు.

**దరఖాస్తు:** ఆన్‌లైన్‌లో మాత్రమే దరఖాస్తు చేయాలి. దరఖాస్తు, అర్హతలు తదితర వివరాలను ఎల్.ఐ.సి. వెబ్‌సైట్‌లో చూడవచ్చు లేదా తమ సమీప ఎల్.ఐ.సి. బ్రాంచీలో సంప్రదించవచ్చు

**వెబ్‌సైట్: www.licindia.in**

దరఖాస్తుకు **చివరితేది: ఆగస్టు 16.**

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# You look run down

**Hem:** Hi Prem, (I have) not seen you for days. You look run down too. What's the matter?
(చాలా రోజులైంది నిన్ను చూసి. నీరసంగా కూడా కనిపిస్తున్నావు. ఏమిటి విషయం?)

**Prem:** I've been in bed for the past week. I am just out.
(గతవారంగా నేను మంచానపడ్డాను. ఇప్పుడే కాస్త బయటకొచ్చాను.)

**Hem:** But why? (ఏమయింది?)

**Prem:** I had an accident, not major though. I escaped with just sprains and bruises, but they were enough to keep me in bed. Thank God, I had no fractures.
(నాకు accident అయింది, చిన్నదే అనుకో. బెణుకులు, డొక్కుపోవడంతో తప్పించుకున్నాను. కానీ అవే నన్ను మంచాన పడేశాయి. దేవుడి దయవల్ల ఎముకలు/ కీళ్లు విరగలేదు.)

**Hem:** But how didn't I know it? No one told me of it.
(అయితే నాకెలా తెలియలేదీ విషయం? ఎవరూ నాతో చెప్పలేదే?)

**Prem:** The doctor wanted me to do with the fewest visitors. He didn't want me to be disturbed. He said the fewer visitors I had the earlier would I be out of the hospital. So my people alone knew about it.
(డాక్టర్ వీలైనంత తక్కువమంది సందర్శకులు వచ్చేలా చూసుకోమన్నాడు. ఎంత తక్కువమంది వస్తే అంత త్వరగా నేను బయటపడతానని చెప్పాడు. అందుకని మా వాళ్లకు తప్ప ఇంకెవరికీ తెలియలేదు.)

**Hem:** How serious was it?
(ఎంత సీరియస్ ఏమిటి?)

**Prem:** Not very. I had bruises, and an ankle sprain. There were cuts and scratches too.
(అంత తీవ్రమైనవేం కావు. డొక్కుపోవడం, చీలమండ బెణుకు. కోతలూ, గీతలూ కూడా.)

**Hem:** What exactly happened?
(అసలేం జరిగింది?)

**Prem:** While I was walking along the road, a bike hit me from behind and I fell on the road, fortunately I rolled to a side of the road and hit the pavement. Otherwise I would have been run over by a lorry.
(నేను రోడ్ వెంబడి నడుస్తుంటే వెనక నుంచి బైక్ ఢీకొట్టింది. నేను కిందపడిపోయాను. అదృష్టవశాత్తూ రోడ్డుకొకవైపు దొర్లి పేవ్‌మెంట్ దగ్గర ఆగాను. లేకుంటే లారీ కింద పడేవాణ్ని.)

**Hem:** Thank your stars.
(నీ అదృష్టం బాగుంది.)

**Prem:** You can say it again and again. My head was in a bandage and both my cheeks were in plaster. My ankle was in a plaster cast. I had an injection twice every day.
(ఆ మాట నువ్వెన్నిసార్లైనా అనొచ్చు/ మళ్లీ మళ్లీ అనొచ్చు తల చుట్టూ కట్టు. చెంపలమీద plaster. నా చీలమండ - కాలూ, పాదం కలిపే కీలు - plaster కట్టులో ఉండిపోయింది.)

**Hem:** (Are) you able to walk normally now?
(మామూలుగా నడవగలుగుతున్నావా?)

**Prem:** No. I limp a little even now. The doctor told me not to mind it but just keep walking like that.
(లేదు. ఇప్పుడు కూడా కాస్త కుంటుతూ నడుస్తా. డాక్టరు దాన్నంత పట్టించుకోకుండా, అలాగే నడుస్తూ ఉండమన్నాడు.)

**Hem:** Good for you. Hope you'd be normal soon.
(మంచిదే. త్వరలోనే మామూలు స్థితికి వస్తావని ఆశిస్తున్నా.)





M.SURESAN

***Now look at the following expressions from the conversation above.***

*1) You look run down.*
*2) I escaped with just sprains and bruises.*
*3) Thank God, I had no fractures.*
*4) The doctor wanted me to do with the fewest visitors.*
*5) There were cuts and scratches too.*
*6) I would have been run over by a lorry.*
*7) My head was in a bandage and my cheeks were in plaster.*
*8) My ankle was in a plaster cast.*
*9) I limp a little even now.*

ఈ expressions అన్నీ కూడా ఇదివరలో తెలుసుకున్నవే. మరోసారి గుర్తుచేసుకుందాం by way of revision.

1) be/ look run down = నీరసించి, నిరుత్సాహంగా కనిపించడం.
a) After the bout of jaundice, he still looks run down = కామెర్ల తర్వాత కూడా, అతడింకా నీరసంగా/ బలహీనంగా/ అలసినట్లు కనిపిస్తున్నాడు. (Bout = వ్యాధి చేసే దాడి)
b) In spite of the heavy work at home, she is never run down = ఇంట్లో అంతపని ఉండికూడా ఆమె నీరసంగా/ అలసిపోయినట్లుండదు.

4) To do with - ఇది చాలా సాధారణంగా కనిపించే phrasal verb, spoken English లో దీనిని రెండర్థాలతో వాడతాం.
i) చాలడం (To be enough)/ చాలనుకోవడం/ సరిపెట్టుకోవడం.
a) I can do with Rs. 15000 a month, but certainly not with less than that. = నెలకు 15000 రూపాయలు చాలు నాకు/ అంతటితో సరిపెట్టుకోగలను. అంతకంటే తక్కువతో నావల్ల కాదు.
b) In these days of rising prices no body can do with anything less than Rs.5000 a month. = ధరలు పెరుగుతున్న ఈ రోజుల్లో నెలకు 5000 రూపాయలు ఏమాత్రం చాలవు/ ఎవరూ నెలకు 5000 రూపాయలతో సరిపెట్టుకోలేరు.
ii) To do with కు రెండో అర్థం- to be connected with = సంబంధం ఉండటం.
a) The Court concluded that he had nothing to do with the murder = అతడికీ ఆ హత్యకూ ఏ విధమైన సంబంధం లేదనే కోర్టు నిర్ధారించింది.
to do with ను ఎక్కువగా not తో, nothing తో సంబంధం లేదనే అర్థంతో వాడతారు.
b) I am a heart specialist. I have nothing to do with skin diseases = నేను Heart specialist ను. నాకు చర్మరోగాలతో సంబంధం లేదు.
c) She is a maths lecturer. What has she to do with English. ఆమె Maths lecturer. ఆమెకూ English కూ సంబంధం ఏమిటి?
ఇప్పుడు accidents లాంటివి జరిగినప్పుడు కలిగే బాధలు, దానికి సంబంధించిన మాటలు English లో చూద్దాం.

2) Sprain= బెణుకు. బాగా తగిలిన దెబ్బవల్ల, పైకి కనిపించకుండా, కదిలితే కలిగే నొప్పి, ఒక్కొక్కప్పుడు వాపుతో.
a) There is a sprain in my neck = మెడ బాగా బెణికింది.
b) Sprain of the knee joint = మోకాలి కీలు బెణుకు.

2) Bruise= ఏదైనా రాసుకోవడంవల్లగానీ, వేగంగా వెళుతున్నప్పుడు కిందపడటంవల్లగానీ చర్మం లేచిపోవడం/ డొక్కుపోవడం/ రాచుకుపోవడం.
When the bike brushed past him he had bruises on his sides = బైక్ అతడిని రాసుకుంటూ వెళ్లడంవల్ల, అతని పక్కలు డొక్కుపోయాయి/ రాచుకున్నాయి.
(Bruises అయినప్పుడు చర్మం లేచిపోయి మంటగా ఉండి, కొద్దిరోజుల తర్వాత నల్లబడుతుంది).

5) Cuts and scratches = కోతలు, గీసుకోవడం, చాకుల్లాంటి వాటివల్ల, వాహనాల రేకులు తగలడం వల్ల కలిగే కోతలు, గీసుకుపోవడాలు. వీటిమీద వేసే band aid లాంటివి. plaster = పట్టీ.

3) Fracture = ఎముక (bone) గానీ, కీలు (joint) గానీ విరగడం.
a) he had a fracture in the leg/ His leg was fractured = అతడి కాలు విరిగింది.
b) He had multiple fractures = అతడి ఎముకలు చాలాచోట్ల విరిగాయి.
Bandage = ఎముకలు, కీళ్లు విరిగినా, బెణికినా గాయాలైనా వేసే కట్టు.
Plaster cast = ఎముక విరిగినప్పుడు, ఆ అవయవం కదలకుండా ఉండేందుకు వేసే పట్టీ (Plaster of Paris తో- దీన్నే POP cast అంటారు.)
Sling = చేయి Bandage/ POP cast లో ఉన్నప్పుడు చేతిని మెడచుట్టూ వేలాడదీసేందుకు వేసే గుడ్డ.

6) To be run over = ఏదైనా వాహనంకింద పడటం.
a) The child was run over by the car = ఆ కారు కింద బిడ్డ పడిపోయింది/ బిడ్డమీదనుంచి కారు వెళ్లిపోయింది.
వాహనాల యాక్సిడెంట్లకు సంబంధించిన మాటలు.
Hit/ knock down = వాహనం ఢీ కొట్టడం.
b) A lorry hit him/ knocked him down as he was crossing the street = రోడ్ దాటుతుండగా లారీ అతణ్ని ఢీకొట్టింది.
c) A lorry ran over him = లారీ అతడి మీద నుంచి వెళ్లిపోయింది.
d) The bike rammed (into) the car = కారును వెనకనుంచి బైక్ ఢీకొట్టింది.
e) The lorry rammed (into)/ hit the car head on = లారీ ఎదురుగా వచ్చి కార్‌ను ఢీకొట్టింది.



***G. Ashok, Godhur***

**Q.** దయచేసి కింది ప్రశ్నలకు సమాధానాలు తెలుపగలరు.
Cash book లో credit ను Cr అని, debit ను Dr అని abbreviate చేస్తున్నాం. కానీ Dr లో r అనే అక్షరాన్ని ఎక్కడినుంచి తెచ్చుకున్నాం?

**A.** Debit అంటే drawn amount కాబట్టి Dr అంటారు. ఇది Accounts, Commerce, Banking కు మాత్రమే పరిమితమైన abbreviation. మామూలు language లో ఇది వాడరు.

**Q.** What is Green Field Airport?

**A.** Green field airport: ఓ విశాలమైన ప్రదేశం, దాని దరిదాపుల్లో ఏ నిర్మాణాలూ, కట్టడాలూ జరగనిచోట్ల నిర్మించే విమానాశ్రయం. ఇందులో గాలి, వెలుతురు వచ్చేందుకు ప్రాధాన్యమిస్తారు. వీలైనంత తక్కువ విద్యుత్ వాడేట్లు, ఎక్కువ సూర్యకాంతి, సహజ వెలుతురు వచ్చేట్లు చూస్తారు.

**Q.** అమృతను Amrutha అని కాకుండా Amritha అని రాస్తారెందుకు?

**A.** అమృతం - దీన్ని అమ్రుతం అని రాయం. మృ- ఇది పూర్తిగా, మ్రు లా పలకం - 'మ్రి'కి, 'మ్రు'కు మధ్య శబ్దం, కృష్ణలో, 'కృ'లా - ఇలా వట్రసుడి ఉన్న శబ్దాల న్నింటికి, 'i' రాయడమే correct.

**Q.** Put off, put up, put on, put in- వీటిని తెలుగులో ఉదాహరణలతో వివరించగలరు.

**A.** **Put off** = Postpone (వాయిదా వేయడం)
Don't put off till tomorrow what you can do to day.
**Put up** = ప్రదర్శించడం (నైపుణ్యాన్ని, పోరాటాన్ని, etc)
a) The enemy did not put up any fight.
b) The Indian team put up a great performance.
**Put on** = బట్టలు వేసుకోవడం.
He put on his shirt and went out.
**Put in** = దీనికి చాలా అర్థాలున్నాయి. అన్నిట్లో ఎక్కువగా వాడే అర్థాలు వాడటం, శ్రమించడం.
a) She has put in a lot of work, so that she can get a good score = మంచి marks సంపాదించుకోవచ్చనే ఉద్దేశంతో ఆమె చాలా శ్రమపడింది.
b) He has already put in 10 years experience = అతడిప్పటికే పదేళ్ల అనుభవం పొంది ఉన్నాడు.

**Q.** What is the difference among ship, boat, steamer, launchi.

**A.** **Boat** = పడవ (మామూలు తెడ్డతో నడిపేది)
**Ship** = ఆవిరిశక్తి/ diesel తో నడిచే యంత్రం ఉన్న చాలా పెద్ద నావ - Steamer - ఆవిరిశక్తి ఆధారంగా నడిచే నావ.
**Launch** = Diesel/ Petrol తో నడిచే చిన్న నావ (Launchi కాదు.)

**Q.** Do you know, did you know గురించి వివరించగలరు.

**A.** Do you know = నీకు తెలుసా? (ఇప్పుడు)
Did you know = ఇంతకుముందే నీకు తెలుసా?
(Do - present; did - past కదా?)

**Q.** If Raju had been honest, he would have returned the money. ఈ వాక్యంలో have ఉన్న చోట has ఎందుకు రాకూడదో వివరించగలరు.

**A.** Will, would, shall, should, can, could, may, might, must, need తర్వాత ఎప్పుడూ 'has' రాదు. Have మాత్రమే వస్తుంది. 'has' వాడటం సరికాదు.

**Q.** What is the difference between map-picture, divide-bifurcation, caution-warning, advice-suggestion, cool-cold, heat-hot.

**A.** **Map** - The outline of the earth's surface or of a country or a place.
**Picture** = any drawing – ఏ బొమ్మైనా.
**Bifurcate** = to divide into two parts (Roads, rivers etc).
**Divide** = to separate into two or more parts.
**Caution** = **Warning**.
**Advice** = సలహా; **Suggestion** = సూచన
**Cool** = చల్లని; **Cold** = చలిగా ఉన్న
**Heat** = వేడి; **Hot** = వేడిగా ఉన్న.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**S.Satyanarayana Murthy, Kakinada**

**Q.** Can, could, will, would, shall, may, might, have, has - వీటిని ప్రశ్నల్లో వాడినప్పుడు వీటి తర్వాత ఎప్పుడూ $V_1$ వస్తుందన్నారు. ప్రశ్నల్లో కూడా Past, Present perfect tenses లో has వచ్చినప్పుడు ఇలాగే ఉంటుందా, వివరించగలరు.

**A.** Shall, should, will, would, can, could, may, might, must, need (not), ought తర్వాత, 1st Regular Doing Word (మీరనే $V_1$ వస్తుంది). అంతేకాకుండా, have to, has to, had to తర్వాత కూడా 1st Regular Doing Word వస్తుందని చెప్పాం. గమనించండి. 1st Regular Doing Word వచ్చేది have, has, had తర్వాత కాదు have to, has to, had to తర్వాత. (Have, has, had ల తర్వాత to వస్తే, దాని తర్వాత I RDW వస్తుంది).

Perfect tenses లో వచ్చే have/ has/ had తర్వాత ఎప్పుడూ past participle వస్తుంది.

eg: They have to go (verb: have to + 1st RDW)

They have gone (verb: have + Past participle (PP)

She has to go (verb: has to + 1st RDW)

She has gone (verb: has + pp)

They had to pay (verb: had to + 1st RDW)

They had paid (verb: had + PP)

**Q.** Verbs లో finite, non-finite కాకుండా వేరే ఏమైనా ఉన్నాయా? తెలుపగలరు.

**A.** Finite, non finite verbs కాకుండా మరే రకమైన verbs లేవు.

**Finite verbs have 6 forms:**

i) 'be' forms (am/ is/ are/ was/ were/ shall be, etc)

ii) 'be' form + '...ing' form (am going/ will be dancing, etc)

iii) 'be' form + past participle (Is seen, shall be done, etc) (Passive voice)

iv) shall, should / will, would / can, could / may, might / must, need / have to, has to / had to, ought to } + 1st RDW (shall go, have to meet, etc)

v) The Doing Words:

| | The I Regular Doing Word (RDW) | II RDW | Past doing word |
|---|---|---|---|
| eg: | go | goes | went |
| | sing | sings | sang |
| | kill | kills | killed |
| | like | likes | liked |
| | smell | smells | smelt |

vi) have / has / had / shall have / should have / will have / would have / can have / could have / may have / might have / must have } + PP.

పైవన్నీ finite verb forms.

**Non finite verbs:**

i) The infinitive (to + 1st RDW):

to go, to come, to sing, etc. (ఒక్కోసారి 1st RDW ముందు, to లేకుండా కూడా వస్తాయి. అప్పుడది plain infinite అవుతుంది)

ii) the '...ing' form (going, coming, walking, etc. గమనించండి- ఇవి కేవలం '...ing' forms మాత్రమే. మళ్లీ దీనిముందు 'be' form వస్తే, 'be' form, 'ing' form కలిపి finite verb అవుతుంది.

eg: a) Going home - ఇక్కడ going కేవలం '...ing' form మాత్రమే. కాబట్టి finite verb కాదు.

b) I am going home- ఇక్కడ 'going' ముందు, 'am' - be form ఉంది- am going- ఇక్కడ verb.

కేవలం '...ing' form ను present participle అంటాం.

iii) Past participle (PP) ఇంకో non-finite verb. taken, written, seen, loved, etc. ఇవి కూడా finite verbs కావు. వీటిముందు 'be' form వాడితే, అప్పుడు 'be' form + PP, verb అవుతుంది Passive Voice లో.

Taken into custody by police-

ఇక్కడ 'taken' కేవలం PP మాత్రమే. finite verb కాదు.

He was taken into custody - ఇక్కడ was taken - taken ముందున్న 'be' form (was)తో కలిపి was taken verb అవుతుంది.

**Q.** Hat కు cap కు మధ్య తేడా ఏమిటి?

**A. Hat** - మందం ఎక్కువగా ఉండటమే కాకుండా గట్టిగా ఉండి తల మీదనే కాకుండా, నుదురుతో పాటు తల పక్కల, వెనుకకు ఎండ తగలకుండా అంచులు ఉంటాయి.

**Cap** - మెత్తగా ఉండి, నుదుటికి మాత్రమే ఎండ తగలకుండా ఉంటుంది. Dictionary లో బొమ్మలు చూడండి.

**Q.** Chatting, chit chat ఒకటేనా?

**A.** ఒకటే.

**Q.** ఆలస్యం అమృతం విషం. నిదానమే ప్రధానం. ఈ సామెతలను ఇంగ్లిష్‌లో చెప్పగలరు.

**A.** వీటికి సరిగ్గా సరిపోయే వాక్యాలు ఇంగ్లిష్‌లో లేవు.

**Q.** మనసుంటే మార్గముంటుంది. ఈ సామెతను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

**A.** Where there is a will, there is a way.




**Convent** - ఈ పదాన్ని మన దేశంలో English Medium School అనే తప్పు అర్థంతో వాడుతున్నాం. Convent కు సరైన అర్థం Christian nuns (మతం/ దేవుడి సేవకు అంకితమైపోయి, జీవితాంతం కన్యలుగా ఉండేవాళ్లు; Mother Theresa కూడా ఒక nun; వారిని sisters అని పిలుస్తాం.) నివసించే చోటు. Convent కూ, school కూ ఏ సంబంధం లేదు. దేశంలో మొదటి English Medium Schools, ఈ convents లోని sisters నిర్వహించడం వల్ల వాటిని convent schools అనేవాళ్లు. రాను రాను, schools అనే మాట పోయి, convent school అనే అర్థంలోకి వచ్చింది.

**Techno School** - ఇది ప్రత్యేక అర్థం ఉన్న మాటేం కాదు. ఈ schools లో కూడా ప్రత్యేకతేం ఉండదు.

# Where there is a will there is a way






M.SURESAN

ఓ sentence కు కచ్చితంగా finite verb ఉండాలి. దాంతో పాటు meaning complete కావాలి. అప్పుడే అది sentence అవుతుంది.

He came here yesterday.

ఇందులో came అనే finite verb ఉంది. అర్థం పూర్తయ్యింది కాబట్టి ఇది sentence.

When he came here yesterday- ఈ group of words లో, 'came' finite verb కానీ, అర్థం పూర్తవ లేదు. ఇది sentence కాదు, దీన్ని clause అంటాం. (A clause is a group of words with a verb) లెక్క ప్రకారం Non finite verbs, verbs కావు.

**A.V.Subba rao, Onipenta**

**Q.** కిందివాటిని ఉదాహరణలతో వివరించగలరు.

In any case, in that case, in the case of, in case of.

**A. In any case** = ఏదేమైనా

In any case he will be here tomorrow = ఏదేమైనా అతడు రేపిక్కడుంటాడు.

**In that case** = ఆ పక్షంలో/ అలా జరిగితే

A: I can not go with you (నీతో నేను రాలేను)

B: In that case I'll go alone (ఆ పక్షంలో నేను ఒంటరిగా వెళతా)

**In the case of** = ఆ విషయానికొస్తే/ ఆ విషయంలో

In the case of imported goods, there are taxes = దిగుమతి చేసుకునే వస్తువుల విషయంలో పన్నులుంటాయి.

**In case of** = అలా జరిగితే;

In case of rain, the meeting will be put off = వర్షం వస్తే సమావేశం వాయిదా పడుతుంది.

**Q.** What next, what is next - ఈ రెండింటిలో ఏది కరెక్టు?

**A.** What next = What is next?

**Q.** Now అంటే ఇప్పుడు మరి right now అంటే ఏమిటి?

**A.** Now = ఇప్పుడు; right now = ఇప్పుడే

**Q.** Fullers earth అంటే ఏమిటి? దాన్ని ఎందుకు ఉపయోగిస్తారు?

**A.** వస్త్రాన్ని శుభ్రపరచి దాన్ని మందంగా చేయడానికి వాడే ఒక రకమైన బంకమట్టి.

**Q.** Peripherals అంటే ఏమిటి?

**A.** Computer తో కలిపివాడే ఇతర సాధనాలు Monitor, Printer, Fax లాంటివి.

**Q.** ఆర్థికమాంద్యం అంటే ఏమిటి? ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Economic depression - తయారైన వస్తువులకు, సేవలకు ప్రజలవద్ద డబ్బు లేనందున గిరాకీ పడిపోయి, వ్యాపారం మందగించడం. నిరుద్యోగం ఎక్కువ కావడం లాంటివి.

**Q.** Sub prime అంటే అర్థం ఏమిటి?

**A.** Sub prime - దీన్ని sub prime lending అని ఎక్కువగా వాడతారు. అర్థం: సరైన guarantee (security) లేకుండా, ఎక్కువ వడ్డీకి, ఎక్కువ మొత్తంతో, ఇచ్చిన రుణం తిరిగి చెల్లించగలరో లేదో అనే విషయం పూర్తిగా తెలుసుకోకుండా ఇచ్చే high risk రుణాలు/ తాకట్లు.

**Q.** Wide spread అంటే అర్థం ఏమిటి?

**A.** ఎక్కువగా వ్యాపించి ఉన్న

**Q.** Bringing out

**A.** చాలా అర్థాలున్నాయి. ఎక్కువగా వాడే అర్థం: ఒక విషయాన్ని సులభంగా కనిపించేట్లు, అర్థమయ్యేట్లు చేయడం.

The job brings out the efficiency in him = ఆ ఉద్యోగం అతడిలోని సామర్థ్యాన్ని బయటపెడుతోంది.

**Q.** State wide అంటే అర్థం తెలుపగలరు.

**A.** రాష్ట్రవ్యాప్తంగా.

**Q.** That is it అర్థం ఏమిటి?

**A.** అదీ సంగతి.

**Q.** ప్రయోజకుడు- ఈ మాటను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A.** Worthy Guy/ man.

**Q.** By the way, by the by ఒకటేనా?

**A.** ఒకటే.

**Alexander G.G., Hyderabad.**

**Q.** Model school, convent, techno school, play school ... వీటి గురించి వివరించగలరు.

**A. Model School** = గతంలో B.Ed. Colleges/ Secondary School Teachers' Training Schools కు అనుబంధంగా నడిపే schools ను Model Schools అనేవారు. ఉపాధ్యాయ శిక్షణ పొందేవారు ఇక్కడ బోధించాల్సి వచ్చేది, practical experience కోసం. ఇప్పుడు ఆదర్శవంతమైన పాఠశాల అనే అర్థంతో schools పేర్లలో వాడుతున్నారు.

బహుశా 6th standard నుంచి EAMCET/ IIT JEE, etc. పరీక్షలకు శిక్షణ ఇచ్చే school అని నిర్వాహకుల అర్థం కాబోలు.

**Play school** = pre school = బడిలో చేర్పించతగ్గ వయసు లేని చిన్నారులను ఆడించే సంస్థలు. LKG/ UKG కంటే ముందు పిల్లలకు ఈ schools. (British English - Play Group)

**Q.** Company, corporation, enterprise, organisation, limited company, private limited company, holding company .. అర్థాలు తెలుపగలరు.

**A.** Corporation, Enterprize, Limited Company, Private Limited Company, Holding Company ఇవన్నీ కూడా company కిందకు వస్తాయి. ఏ వ్యాపార సంస్థనైనా company అనే అంటాం.

**Corporation** = చాలా పెద్ద company/ ఒక పెద్ద company నడిపే company ల సమూహం.

**Enterprize** = company/ వ్యాపార కార్యకలాపాలు/ పెద్ద వర్తకం.

**Private Limited company** = ఇందులో భాగస్తులు పరిమితంగానే ఉంటారు. ఇందులోని వాటాలు Public (ప్రజలు) పొందే వీలులేదు.

ఒక Private Limited Company వాటాలు stock market లో కొనేందుకు మామూలు ప్రజలకు వీలుండదు. భాగస్వాములందరి సమ్మతితోనే కొత్త భాగస్వాములను తీసుకుంటారు.

**Holding company** = ఇతర company లను తన పూర్తి/ పాక్షిక పెట్టుబడితో నడుపుతూ, తన సొంత వ్యాపారాన్ని నిర్వహించుకునే వ్యాపార సంస్థ.

**Organization** = ఏ సంస్థ అయినా. వ్యాపార సంస్థే కానక్కరలేదు. Associations, Clubs, ప్రజాహిత కార్యకలాపాలు నిర్వహించే వ్యక్తుల సమూహం, ఇలాంటివన్నీ సంస్థలే.

**Q.** Lesbian, gay, bisexual, transsexual - వీటి అర్థాలు తెలుపగలరు.

**A.** Lesbian = ఇతర స్త్రీలతో స్వలింగ సంపర్కం జరిపే స్త్రీ. (ఇతర స్త్రీల పట్ల sexual గా/ లైంగికంగా ఆకర్షితురాలయ్యే స్త్రీ) (Homo sexual)

**Gay** = స్వలింగ సంపర్క ధోరణి ఉన్న పురుషుడు (Homo sexual)

**Bisexual** = ఇతర పురుషులు/ స్త్రీల పట్ల ఆకర్షితులయ్యే పురుషులు/ స్త్రీలు. (Biology లో అయితే స్త్రీ, పురుష లక్షణాలు ఉన్నటువంటి ప్రాణి.)

**Trans sexual** = స్త్రీగా ఉండాలని కోరుకునే పురుషుడు, శస్త్రచికిత్స ద్వారా స్త్రీగా మారే పురుషుడు/ పురుషుడిగా ఉండాలని కోరుకుని శస్త్ర చికిత్స ద్వారా పురుషుడిగా మారే స్త్రీ.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**

ప్రతిభ

# An individual is their own master





M.SURESAN



***N. Siva, Ananthapur***

**Q.** ముందు preposition తర్వాత verb వచ్చే పదాల అర్థాలు ఎలా ఉంటాయి? ఉదాహరణకు offtake, offbeat ఈ పదాల అర్థాలను వివరించండి.

**A.** అలాంటి మాటలకు వచ్చే అర్థాలు ముందున్న preposition ను బట్టి ఉంటాయి.

e.g.: off = అవతలికి, దూరానికి ఇలా చాలా అర్థాలున్నాయి కదా. అయితే offtake అనే మాట లేదు. ఇక offbeat విషయం - beat (beaten) అంటే కొత్తదనంలేని/ పాతది అని. off = అవతలికి/ ఆవల అని అర్థం. కాబట్టి offbeat = పాతబడిన దానికి దూరంగా = కొత్తదనం ఉన్న/ మామూలు కాని - ఇలా వస్తాయి, ఇలాంటి మాటల అర్థాలకు మరో ఉదాహరణ Intake. In = లో/ లోపల కదా. కాబట్టి Intake = లోపలికి తీసుకునే అనే అర్థం (ఆహారం/ ఒక సంస్థలో ఏటా చేర్చుకునే విద్యార్థుల సంఖ్య etc.) వస్తుంది.

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

- ఢిల్లీకి నేనొక్కడినీ వెళ్లలేక నిన్ను వెంటబెట్టుకుని పోవడం లేదు, నీతో అవసరం వచ్చి పిలుచుకుపోతున్నాను.

**A.** I am taking you to Delhi not because I can't go on my own, but because I need you on the journey/ in Delhi.

- నేను బట్టలు కుట్టించాను.

**A.** I had some clothes stitched.

**Q.** కింది వాక్యాలను తెలుగులో తెలుపగలరు.

- It would be lovely to go to U.S.A.

**A.** అమెరికా వెళ్లడం ఎంత సరదానో!

- He took the friday off to get the work done.

**A.** (ఏదో) పని పూర్తి చేయించుకునేందుకు శుక్రవారం డ్యూటీ నుంచి సెలవు తీసుకున్నాడు.

- In addition to

**A.** దానికి తోడు.

- We did not call it a festival for nothing.

**A.** ఊరకనే దాన్ని పండగ అనడం లేదు. (పండగ అనేందుకు బలమైన కారణం ఉంది.)

**Q.** Individual కు ఎన్ని అర్థాలున్నాయి.

**A.** 1) (ఒక) వ్యక్తి 2) వ్యక్తిగతమైన

a) An individual is their own master = ఒక వ్యక్తి తనకు తానే యజమాని.

b) Individual freedom is the important aspect of a democracy = వ్యక్తిగత స్వాతంత్ర్యం ప్రజాస్వామ్యంలో ముఖ్యాంశం.

***K. Srikumar, Bapatla***

**Q.** కింది వాక్యాలను కరెక్ట్‌చేసి తెలుపగలరు.

- I do not know that she will pass.

**A.** I do not know whether/ if she will/ pass.

- She prays the goddess.

**A.** She prays to the goddess.

- Open page 150.

**A.** Open at page 150.

- I believe God.

**A.** I believe in God. (Believe = ఒకరు చెప్పింది/ ఒక విషయం నమ్మడం; Believe in = ఒక దాని ఉనికి/ మంచితనం మీద విశ్వాసం ఉండటం)

- This tastes well.

**A.** This tastes good.

- Flowers smell sweetly.

**A.** Flowers smell sweet.

- She told the truth.

**A.** She spoke the truth.

- He had only few rupees left.

**A.** He had only a few rupees left.

- She had a little sense.

**A.** She had a little sense - OK.

- Draw map of India.

**A.** Draw the map of India.

- She is a M.L.A.

**A.** She is an M.L.A.

- The foot ball is a good game.

**A.** Football is a good game.

- Do not make noise.

**A.** Do not make a noise.

- Let him finish the work ( Passive voice లోకి మార్చి తెలుపగలరు).

**A.** Let the work be finished (by him).

***M. Ratna Kishore, Kotabommali***

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.

- నిజంగా అతడి జన్మ ధన్యం.

**A.** His life is blessed.

- ఇప్పటితో పోలిస్తే వచ్చే పది సంవత్సరాల్లో వైజాగ్ జనాభా పది రెట్లు పెరుగుతుంది.

**A.** The population of Vizag in ten years from now will be ten times its present population.

- చేసేసి ఉంటాడు - కచ్చితంగా చేసి ఉంటాడు, చేసి ఉండాల్సింది - అడిగి ఉండాల్సింది - అడిగి ఉంటాడు - అడిగేసి ఉండాల్సింది.

**A.** చేసేసి ఉంటాడు = కచ్చితంగా చేసి ఉంటాడు.

= He must have done it.

చేసి ఉండాల్సింది (కానీ చేయలేదు) = He should have done it.

అడిగి ఉండాల్సింది (కానీ అడగలేదు) = He should have asked అడిగి ఉంటాడు (సందర్భాన్నిబట్టి) = He might have asked = Perhaps he has asked.

- He must have stolen the amount. దీని అర్థం ఏమిటి?

**A.** He must have stolen the amount = అతడా సొమ్మును కచ్చితంగా దొంగిలించే ఉంటాడు.

- You must have informed me. ఈ వాక్యానికి తెలుగులో అర్థం తెలుపగలరు.

**A.** You must have informed me = నువ్వు నాకు చెప్పే ఉంటావు (కానీ, నేను మర్చిపోయానేమో) అనే సందర్భంలో.

**Q.** Direct speech నుంచి Indirect speech లోకి మార్చేటప్పుడు ప్రశ్నలో ఉండే verbs వాటి correspondence past tense లోకి మారతాయి. Need, dare, ought to, must వీటి విషయం తెలుపగలరు.

**A.** Need, dare లను helping verb గా వాడితే వాటిని ఎక్కువగా not తోనే వాడతాం. అప్పుడప్పుడు questions లోనూ వాడతాం. అలాంటప్పుడు did + not + need గా వాడతాం.

e.g. : a) DS: He said, 'she need not come here'.

IS: He said that she did not need to come there.

b) DS: He said, 'she dare not come here'.

IS: He said that she did not dare to come there.

c) ought to (DS)/ must - had to (IS)

***V. Ashok, Kareemnagar***

**Q.** We are all indebted to him for holding not only high moral values but also rendering dedicated service. ఈ వాక్యంలోని తప్పును తెలుపగలరు.

**A.** We are all indebted to him not only for holding high moral values but also for rendering dedicated service (ఇక్కడ not only, but also ఉపయోగించడంలో, 'for' placement లో తప్పు ఉన్నాయి.)

**Q.** కింది పదాలను ఉదాహరణలతో వివరించగలరు.

To lose face, To make a long face, it pours cats and dogs.

**A.** To lose face = అవమానపడటం/ పరాభవం చెందడం. If I withdraw from the contest now, I shall lose face = ఇప్పుడు నేను పోటీ నుంచి విరమించుకుంటే అవమానంగా ఉంటుంది/ పరువు పోతుంది.

Make/ pull a long face = కోపంగా/ అసహనంగా చూడటం.

When asked to wait for a few minutes he pulled/ made a long face = కాసేపు ఉండమనేసరికి అతడు కోపంగా చూశాడు.

It pours cats and dogs = కుండపోతగా వర్షం కురుస్తుంది.

**Q.** It has been boon for the last 7 years. Present Perfect Continuous Tense ing form తో పూర్తవ్వాలి. (has been + ing)ఈ వాక్యంలో అలా కాలేదు. దయచేసి వివరించగలరు.

**A.** It has been a boon for the last 7 years = గత ఏడేళ్లుగా అదో వరంలా ఉంది. ఇక్కడ verb, 'has been' - ఇది 'be' form - 'ఉండటం' అనే అర్థం వస్తుంది.

Has been + ... ing - has been working/ has been singing ఇది present perfect tense - ఇది 'పనిని' తెలుపుతుంది. - 'ఉండటం' అనే అర్థం కాకుండా Has been ('be' form) కూడా present perfect గానీ, present perfect continuous tense గానీ అవుతుంది.

**Q.** Betray, appraises, deplate, prosperity, adversity, mars, extol, voluminous, penetrative, salubrious ఈ పదాలను ఉదాహరణలతో వివరించగలరు.

**A. betray =** ద్రోహం చేయడం/ ఒకరి రహస్యాలు వారి శత్రువులకు చెప్పడం.

**appraise =** ఒక సంఘటన/ పరిస్థితిని గురించి వివరాలు తెలపడం.

The constable appraised the S.I. of the facts of the case = ఎస్.ఐ.కి ఆ కేసు గురించి యదార్థాలను కానిస్టేబుల్ వివరించాడు/ తెలిపాడు.

**deplete** (deplate కాదు) - తగ్గిపోవడం/ క్షీణించడం- The water in the tank is depleting = tankలోని నీళ్లు తగ్గిపోతున్నాయి.

**prosperity =** వైభవం/ సంపద/ అభివృద్ధి. America is a country of prosperity = అమెరికా సంపన్నమైన దేశం/ సంపద ఉన్న దేశం X Adversity (కష్టాలు).

**mar =** నాశనం చేయడం. The cyclone has marred the farmers = తుపాను రైతులను నాశనం చేసింది.

**extol =** శ్లాఘించు, పొగడు.

People extolled his performance in the movie = సినిమాలో అతడి నటనను అందరూ మెచ్చుకున్నారు.

**voluminous =** బాగా పెద్దదైన 1) పుస్తకం 2) గిన్నె/ పాత్ర 3) మన పరిమాణం కంటే బాగా పెద్దగా ఉండే దుస్తులు.

**penetrate =** చొచ్చుకుపోవడం.

No arrow could penetrate Karna's armour - కర్ణుడి కవచాన్ని ఏ బాణమూ ఛేదించలేదు.

**salubrious -** ముఖ్యంగా ఒక ప్రదేశపు ఆరోగ్యకరమైనవాతావరణం.

Ooty has a salubrious climate.

***S. Anukrishna, Anantapur***

**Q.** కింది వాక్యాల్లో అండర్‌లైన్ చేసిన పదాలను ఉదాహరణలతో వివరించగలరు.

- She gave me a knowing wink.

**A.** 'విషయం తెలుసు' అని తెలిపేందుకు కన్నుకొట్టడం.

- They are often on the receiving end of verbal amuse from angry customers.

**A.** On the receiving end of verbal abuse (amuse కాదు) = చాలాసార్లు కష్టమర్ల తిట్లు భరించే పరిస్థితిలో ఉండటం.

As/ on the receiving end (of something) = ఓ (ముఖ్యంగా చెడు) పరిస్థితిని భరించే స్థితిలో ఉండటం.

verbal = మాటలతో, abuse = తిట్లు/ బూతులు తిట్లు ఎప్పుడూ మాటల్లోనే ఉంటాయి కాబట్టి verbal abuse అంత సరైన మాట కాదు.

('మోత బరువు'లా - మోత అన్నా బరువు అన్నా ఒక్కటే కదా? ) abuse అంటే చాలు.

- He was quoted as seeing.

**A.** He was quoted as saying (seeing కాదు) = ఆయన ఆ మాటలు అన్నట్లుగా చెప్పారు.

- I hold a degree in B.Com. from S.K.U. having taken the exam in 2007.

**A.** I hold a degree in B.Com సరికాదు. I hold a B.Com degree అనాలి, లేదా I hold a Bachelor's degree in Commerce అనైనా అనాలి. I hold a degree in Commerce, having taken the exam in 2007 = 2007న జరిగిన పరీక్ష రాసి, B.Com degree పొందాను.

- He sealed his first ever open french title.

**A.** తన జీవితంలో మొదటిసారి French open title (Tennis match)లో విజయం సంపాదించుకున్నాడు.

**Q.** కింది పదాలను ఉదాహరణలతో వివరించగలరు.

- In the first place

**A.** 1) మొదటిగా/ మొదటి విషయం/ అసలు.

a) I like him for more than one reason. In the first place, he helps everyone. In the second place, he is quite simple, etc. (అతనంటే ఇష్టపడేందుకు చాలా కారణాలే ఉన్నాయి. మొదటిది అతడు అందరికీ సాయపడతాడు; రెండు...)

b) In the first place, how a man in jail could get a cell phone? (అసలు జైలులో ఉన్న వ్యక్తికి సెల్‌ఫోన్ ఎలా వచ్చింది? )

- Under review

**A.** under review = సమీక్షలో ఉండటం.

The implementation of the Rajiv Arogyasri Pathakam is under review = రాజీవ్ ఆరోగ్యశ్రీ పథకం సమీక్షలో ఉంది. (ఎంతవరకూ సరిగా అమలవుతోంది, లోసుగులేంటి, మెరుగుపరిచేందుకు తీసుకోవాల్సిన చర్యలు - వీటిపై చర్చ = review)

- So called

**A.** So called = అనబడే. The so called leader of the poor has earned a lot of money = బీదవాళ్ల నాయకుడిగా పిలవబడే (so called) అతడు చాలా డబ్బు సంపాదించుకున్నాడు (అతడిని నాయకుడంటారు. నిజంగా కాకపోవచ్చు/ అర్హత లేకపోవచ్చు).

- In response to

**A.** In response to - దానికి స్పందనగా. I did not get any reply in response to my enquiry = నా విచారణకు స్పందనగా నాకు ఏ బదులూ రాలేదు.

- approach

**A.** 1. సమీపించడం; 2. సాయం కోసం ఒకరి దగ్గరకు వెళ్లడం; 3. వైఖరి.

The car approached the post offfice and stopped = కారు పోస్టాఫీసును సమీపించి (దగ్గరకొచ్చి) ఆగింది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



**G. Shankar, Keshavapatnam.**

**Q.** Which article is suitable for represent whole nationality?
eg: The elephant is a huge animal.
Dog is a faithful animal.

**A.** 'The' before a countable singular represents a whole class, as in the sentence.
The elephant is a huge animal
A before a countable singular means 'any' - A dog is a faithful animal = Any dog is a faithful animal.
So as in the examples above, a or the before a countable singular can be used to refer a whole class in general. In effect they mean the same. However, not to use either 'a' (an) or 'the' before a countable singular is wrong.

**Q.** Recently I have passed M.A.(Eng). I want to do a course at EFLU in Hyderabad. Which course shall I do? Could you suggest me.

**A.** The best thing for you to do will be Diploma in Teaching English (DTE) at the University of English and Foreign Languages.

**Q.** ఈ సమస్యను అతడే సృష్టించాడు అనడం కంటే ఈ సమస్యే అతడిని సృష్టించింది అనడం సమంజసంగా ఉంటుందేమో?

**A.** It would be correct to say/ wouldn't it be correct to say that the problem created him rather than to say he created the problem (?)

**Q.** నన్ను తిట్టించాలని ప్రయత్నించకు.

**A.** Don't try to make me scolded.

**Q.** నువ్వు అడ్డం ఉన్నావు కాస్త పక్కకు తప్పుకో.

**A.** You are in my way. Please step aside.

**P. Aruna Ramesh, Julapally.**

**Q.** Please explain in detail, which sentence is correct?
1) I am requesting you to kindly grant me one day leave (present continuous)
2) I request you to kindly grant me one day leave (simple present)

**A.** Both are correct, but I request you to is used more frequently. However, as 'to kindly grant me' is a split infinite, some people do not accept it, but it is not so much an error now a days.

This is its tail - ఇక్కడ its - possessive adjective.
This tail is its - ఇక్కడ Its - possessive pronoun.
(పోల్చండి - This is his book - 'his' ఇక్కడ possessive adjective; This book is his - ఇక్కడ 'his' possessive pronoun)
I was born in 1979 - ఇక్కడ, born, was born, verb లో భాగం- to be born కు finite రూపం- was born. అయితే born ఎప్పుడూ passive లోనే వాడతాం.
He is a born actor - ఇక్కడ born adjective.
కాబట్టి, born అనేది, verb, adjective - రెండూ correct.

**K.Ganesh, Komatipally**

**Q.** Please explain below words.
That's what, that's how, whosoever.

**A.** **That's what** = అదే, (అదే అని నొక్కి చెప్పడం)
That's what I am saying = నేను చెప్తున్నదీ అదే.
(That's what = That is what)




# He is a born actor

**R. Lakshmi, Mandapeta.**

**Q.** కింది తెలుగు వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.
మా అబ్బాయి పుట్టిన తర్వాత మాకు బాగా కలిసి వచ్చింది.

**A.** Our son's birth augured well for us/ Our son's birth turned our fortunes (for the better)

**Q.** మా అమ్మాయి పుట్టిన తర్వాత మాకు దరిద్రం పట్టింది.

**A.** Our daughter's birth augured ill for us/ the birth of our daughter turned our fortunes for the worse.

**Q.** Backroom boys అంటే ఏమిటి?

**A.** ఒక వ్యక్తి/ సంస్థ/ ప్రదర్శన గొప్పతనానికి కారకులై వెనకనుంచి నడిపేవాళ్లు. వాళ్ల కృషి ప్రజలకు తెలియకపోవచ్చు. ఉదాహరణకు ఓ సినిమా ప్రజాదరణకు తెరపై కనిపించే నటీనటులే కారణం కాదు కదా? తెర వెనక ఉండే ఫొటోగ్రాఫర్లు, గీత రచయితలు, సంగీత దర్శకులు కూడా ప్రజలకు తెలియకుండా కారణం అవుతారు. వీళ్లందరూ backroom boys. అంతే కాకుండా ఓ వ్యాపార సంస్థ గొప్పతనానికి తమ వ్యూహ రచన ద్వారా బయటకు తెలియకుండా కారకులయ్యే వారు backroom boys.

**Q.** రాధ మనసు పారేసుకుంది.

**A.** Radha has lost her heart. (to some one)

**Q.** పోలింగ్ ఏకపక్షంగా సాగింది.

**A.** The poling was one-sided.

**Q.** విజయం వారిద్దరి మధ్య కాసేపు దోబూచులాడింది.

**A.** Victory swayed between the two for a while.

**Q.** అడక్కుండానే దేవుడు నాకు వరం ఇచ్చాడు.

**A.** God has offered it to me (without my asking for it)

**Q.** మాంసం రుచి మరిగిన పులి గడ్డి తింటుందా?

**A.** Does a tiger having tasted flesh go for grass?

**Q.** ఆగ్రా అనగానే మనకు వెంటనే గుర్తుకొచ్చేది తాజ్ మహల్.

**A.** The mention of Agra brings the Tajmahal to our mind.

**Q.** ప్రమాదం నాకే ఎందుకు జరగాలి? మరెవరికైనా జరిగుండొచ్చుకదా?

**A.** Why should I alone face all this (trouble/ danger, etc)? Why not others?






M.SURESAN

**Ch. Govardhan, Pidathapolur.**

**Q.** I can speak English - ఈ వాక్యం structure పరంగా ఏ tense కిందికి వస్తుంది? Will, shall కాకుండా మిగతా modals ఏ tense కిందికి వస్తాయో తెలుపగలరు.

**A.** Can, may, must - ఇవి present tense కిందకే వస్తాయి. అయితే ఇవి simple present tense verbs లాగా definite future ను కూడా తెలుపుతాయి.

**Q.** I can speak English.
I can speak in English వీటిలో ఏది కరెక్టు?
I can speak English - (ఇప్పుడు) నేను ఇంగ్లిష్ మాట్లాడగలను.
She can reach here tomorrow - ఆమె ఇక్కడికి రేపు చేరగలదు (future)
అలాగే They may be there now
వాళ్లక్కడ ఉండొచ్చు ఇప్పుడు (Present)
They may come tomorrow- వాళ్లు రేపు రావచ్చు (future)
'Must' కూడా అంతే.
He must come here at 6 everyday. (ప్రతిరోజూ అతడిక్కడికి ఆరింటికి రావాలి)- Present కావచ్చు/ future కావచ్చు- దీన్నికూడా present tense కింద వాడతాం.

| present | past |
|---|---|
| can | could |
| may | might |
| must | had to |
| will | would |
| shall | should (old fashioned) |

వీటిని వేరే అర్థాలతో present లో కూడా వాడతాం.
I can speak English = నాకు ఇంగ్లిష్‌వచ్చు.
I can speak in English = నేను ఇంగ్లిష్‌లో మాట్లాడగలను (మీకు తెలుగు అర్థం కాకపోతే)

**Q.** Its అనే possessive pronoun ఉన్నట్లు చెప్పారు. Its ను కేవలం possessive adjective గానే వాడతారు కదా. దయచేసి వివరించగలరు.

**A.** Its - possessive pronoun గానూ, possessive adjective గానూ రెండు విధాలుగా వాడతాం.

**That's how** = అలానే.
That's how he makes money = అతడు డబ్బు సంపాదించేది అలానే/ అతడు అలానే డబ్బు చేసుకుంటాడు. (That's how = That is how)
ఇలాంటి ఇతర expressions:
**That's why = That is why** = అందుకనే
That's why I like him = అందుకనే అతడంటే నాకిష్టం.
That's where we can meet him = అతడిని మనం కలుసుకోగలిగేది అక్కడే.
**That's when** = అప్పుడే
That's when we met each other = మేమిద్దరం కలుసుకున్నదప్పుడే.
**whosoever** = ఎవరైనా సరే/ ఎవరికైనాసరే/ ఎవరినైనాసరే (whoever అనీ వాడొచ్చు)
whosoever (whoever) crosses the line will be punished = ఎవరైనా (సరే) గీత దాటితే శిక్ష పడుతుంది.
whosoever (whoever) = ఎవర్నైనాసరే
Whosoever he taught liked his teaching = అతడు ఎవరికి బోధించినా వాళ్లతడి బోధన ఇష్టపడ్డారు.
Whosoever he met here told him the same thing = అతడిక్కడ ఎవరిని కలిసినా అదే చెప్పారు.
అయితే whosoever సాధారణంగా/ ఎప్పుడూ చట్ట పరిభాష (Legal language) లోనూ, official communications లోనూ మాత్రమే వాడతారు. మామూలుగా అయితే whoever అనే రాస్తాం/ అంటాం.

**Q.** I do swear, I do believe దీనికి బదులు I swear, I believe రాయొచ్చు కదా.

**A.** I do swear = నేను (తప్పక) ప్రమాణం చేస్తున్నాను.
I do believe = నేను (కచ్చితంగా) నమ్ముతాను.
I swear, I believe కంటే, I do swear, I do believe అనడం కచ్చితంగా/ తప్పకుండా అనే అర్థం వస్తుంది.
I did see him here yesterday = నిన్న నేను అతడినిక్కడ కచ్చితంగా చూశాను.

**K.Ramakrishna, Ongole.**

**Q.** కింది వాక్యాల్లో appear, seem మధ్య తేడాను వివరించగలరు. వాక్యాలను తెలుగులో తెలుపగలరు.
1. He appears to be coming from the hotel.
2. He appears to have come from the hotel.
3. He appears to have been coming from the hotel.
4. He seems to be coming from the hotel.
5. He seems to have come from the hotel.
6. He seems to have been coming from the hotel.
7. He appeared to be coming from the hotel.
8. He appeared to have come from the hotel.
9. He appeared to have been coming from the hotel.
10. He seemed to be coming from the hotel.
11. He seemed to have come from the hotel.
12. He seemed to have been coming from the hotel.

**A.** I appear = seem
1) He appears to be coming from the hotel = అతడు హోటల్ నుంచి వస్తున్నట్లున్నాడు = 4) He seems to be coming from the Hotel.
2) He appears to have come from the hotel = అతడు హోటల్ నుంచి వచ్చినట్లున్నాడు = He seems to have come from the hotel.
3) He appears to have been coming.... =
6) He seems to have been coming... = అతడు hotel నుంచి (గతంలో) వస్తున్నట్లు కనిపించాడు.
7) He appeared to be coming... =
10) He seemed to be coming... = అతడు (గతంలో ఎప్పుడో) హోటల్ నుంచి వస్తున్నట్లు కనిపించాడు.
8) He appeared/ seemed .... = (11) to have come from the hotel = అతడు (గతంలో ఎప్పుడో) హోటల్ నుంచి వచ్చినట్లు కనిపించాడు.
9) He appeared/ seemed .... = (12) to have been coming from the hotel = హోటల్ నుంచి (గతంలో) వస్తున్నట్లు కనిపించాడు.
Appear = seem = కనపడటం/ అనిపించడం
He appears/ seems tired = అతడు అలిసిపోయినట్లు కనిపిస్తున్నాడు.
She appears/ seems to know the truth = నిజం తెలిసినట్లే అనిపిస్తోంది ఆమెకు.

**K.R.Achari, Vykunthapuram**

**Q.** Unless you work hard, you can't pass. ఈ వాక్యం అర్థమయ్యింది. కానీ ఒక గ్రామర్ బుక్‌లో 'Unless' expresses a condition. It means if not. Unless is negative in sense. So, it should never be followed by not అని ఉంది. దయచేసి వివరించగలరు.

**A.** 'Unless' should not be followed by not అంటే, unless ఉండే clause లో not రాకూడదని. అంతే కానీ, unless ఉన్న sentence లో not రాకూడదని కాదు.
Unless you work hard, you can't pass
- ఈ sentence లో 'unless clause' ఏది? Unless you work hard కదా - ఈ clause లో not రాదు. అదీ rule అర్థం.

**N.Samson, Kamdlagunta.**

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.
❖ నువ్వు ఏమీ అనుకోకుంటే నేను నిన్ను ఒక విషయం అడగదలుచుకున్నాను.

**A.** If you don't mind, I wish to ask you one thing.
❖ ఇలాంటివి నాకు అసలు నచ్చవు.

**A.** I don't like at all such things/ I don't like such things at all.
❖ మాది పల్లెటూరు. లేదా మేము పల్లెటూరి నివాసులం.

**A.** We are villagers/ we are from the village side.
❖ కబుర్లు చెప్పవద్దు.

**A.** Stop all this such useless talk.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






**A.Thirupathi, Manchiryala**

Q. I saw a ---- cat.
1) big fat black
2) big black fat
3) fat black big
4) black fat big
పై ఆప్షన్స్‌లో ఏది కరెక్టో వివరంగా తెలుపగలరు.

A. I saw a big fat black cat. మామూలుగా adjective order. 1) size and then 2) colour.

Q. Choose the correct order of adjectives.
1) I rent a furnished large old house.
2) I rent an old large furnished house.
3) I rent a large old furnished house.
4) I rent a furnished old large house.

A. అలాగే ఈ sentence కూడా I rented an old large furnished house. ఇక్కడ, old ముందు వస్తుంది - దాని పరిస్థితి తెలిపేందుకు.

**A.V.Subbarao, Onipenta**

Q. కింది పదాల అర్థాలు వివరించగలరు.
1. Automotives 2. Polyphonic 3. Mono.

A. 1) Motor vehicles కు సంబంధించిన
2) ఇది సంగీతానికి సంబంధించింది - వివిధ స్వరాల

Q. Agenda, Manifesto అర్థాలు, తేడా తెలుపగలరు.

A. Agenda = ఓ కార్యక్రమంలోని అంశం/ ఓ చర్చలోని చర్చాంశం. ఒక రాజకీయ పార్టీకి / ఒక వర్గానికి ఉన్న ప్రాధాన్యాంశం.
Manifesto = ఒక రాజకీయ పార్టీకుండే ప్రణాళిక/ ప్రజాసేవాంశాలు.

Q. Billion అంటే వందకోట్లా లేదా పదివేల కోట్లా తెలుపగలరు.

A. 100 కోట్లు.

Q. Trillion అంటే ఏమిటి?

A. 10,000 కోట్లు.

Q. Arcade, Casino, Scenario అర్థాలు తెలుపగలరు.

A. వరసగా ఉన్న shops/ ఇతర కట్టడాల ముందు అర్ధచంద్రాకారం (Arch) కప్పుతో ఉన్న నడవ (Passage). Casino = జూదశాల.
Scenario - అసలర్థం = చలనచిత్రం తీసే ముందు తయారుచేసుకునే కథాక్రమం/ order of scenes in a movie/ drama - ఇప్పుడు దీన్ని screen play అంటున్నారు. 2) ఇప్పుడు scenario ను ఎక్కువగా వాడే అర్థం - భవిష్యత్‌లో జరగబోయే సంఘటనల క్రమం, మన ఊహలో. What will be the scenario if suddenly Pak hands over terrorists to India? = తీవ్రవాదులను పాక్ భారత్‌కు అప్పగిస్తే, పరిస్థితులెలా ఉంటాయి.

Q. Choice, option, alternate. వీటి అర్థాన్ని తెలుపగలరు.

A. Choice = Option, Alternate = రెండు విషయాలు మొదటి దాని తర్వాత రెండోది, మళ్లీ రెండోదాని తర్వాత మొదటిది జరిగే పద్ధతి; Alternate days = రోజు మార్చి రోజు.

Q. పాము పుట్టను, గుట్టను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

A. Snakepit = పాముపుట్ట; mound = గుట్ట.

Q. Endoment అంటే అర్థమేమిటి?

A. విద్యాలయాలు, ఆస్పత్రులలాంటి ప్రజోపయోగ సంస్థలకిచ్చే భారీ విరాళాలు, ముఖ్యంగా స్థిరవనరుల రూపంలో.

Q. నిమ్మకాయను lime, lemon అంటారు, ఏది కరెక్టు?

A. Lime = పచ్చి నిమ్మకాయ. Lemon = నిమ్మపండు.

Q. Scavenger, safaiwala, chowkidar వీటి అర్థాలు తెలుపగలరు.

A. Scavenger (English) = Safaiwala (Hindustani) = పారిశుద్ధ్య పనివారు.
Chowkidar (Hindi) - Watchman (English).

# I lead, you are to follow

సమ్మేళనంతో కూర్చిన సంగీతం. (Poly = ఒకటి కంటే ఎక్కువ, phone/ phonic = శబ్దానికి సంబంధించిన)
3) Mono = ఒకటి/ ఒకటిగా ఉన్న

Q. Vowels లేకుండా పదాలు రావంటారు, sky, fly, try ఇలాంటివి వస్తాయి కదా.

A. ఈ శబ్దాల్లో y, ai (ఐ)తో సమానం. Vowels, consonants అనేవి శబ్దాలు. అక్షరాలు కాదు. Sky లాంటి పదంలో y అనే అక్షరం, ai (ఐ) శబ్దం తెలుపుతుంది. ఐ (ai) మరి vowel/ diphthong (combination of two vowel sounds) కదా.

Q. మాజీ అనే అర్థంతో est అంటే ఏమిటి?

A. మీరు రాసింది Erst అనుకుంటున్నాను. ఇది erstwhile (మునుపటి = former) కు కుదించిన రూపం.

Q. Polygraph test అంటే ఏమిటి?

A. Polygraph (test) = lie detector = ఒకరి మాటల్లోని అబద్ధాలను గుర్తించే సౌకర్యం.

Q. Super, superb వీటి అర్థాల మధ్య తేడా తెలుపగలరు.

A. Super = గొప్ప/ మేలైన - అయితే దీని వాడకం Modern English లో మెల్లగా తగ్గుతోంది. Super ను ఇతర పదాలతో కలిపివాడితే మెరుగైన, మేలైన అనే అర్థం వస్తుంది.
He is super rich = చాలా గొప్ప ధనికుడు.
Super human = మానవులకతీతమైన.
superb = excellent = చాలా గొప్ప

Q. ఘెరావ్‌కు ఇంగ్లిష్ స్పెల్లింగ్, అర్థం తెలుపండి.

A. Gherao - అయితే ఇది English మాట కాదు. Bandh (బంద్)లా హిందూస్థానీ మాట- English వాళ్లకర్థం కాదు.

Q. Floating area అంటే ఏమిటి?

A. Floating area కు అర్థం ప్రత్యేకంగా ఏమీ లేదు. సందర్భాన్ని బట్టి అర్థం చేసుకోవాల్సిందే. Floating = 1) తేలుతున్న 2) కదులుతూ ఉన్న (ఒకచోట స్థిరంగాలేని) 3) మారే.

Q. పంచేంద్రియాలు, పంచభూతాలను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

A. Five senses (sight, hearing, taste, smell and touch). పంచేంద్రియాలు వేరు, పంచభూతాలు వేరు. పైన చెప్పిన అయిదూ పంచేంద్రియాలు. పంచభూతాలంటే భూమి, అగ్ని (నిప్పు), నీరు, గాలి, ఆకాశం - భారతీయుల ప్రకారం. English లో వీటిని elements అంటారు. అయితే English లో four elements మాత్రమే - Earth, air, fire and water.






M.SURESAN

Q. మనసుంటే మార్గం ఉంటుంది అనేదానికి ఇంగ్లిష్‌లో Where there is a will, there is a way కరెక్టేనా?

A. correct.

Q. బూజును ఇంగ్లిష్‌లో ఏమంటారు?

A. బూజు = cobweb, చెదలు

Q. Higgin Bokhans అంటే ఏమిటి?

A. వ్యక్తి పేరు.

Q. No bar అంటే ఏమిటి?

A. No bar = పట్టింపులేదు/ అడ్డంకాదు

Q. Abstract అర్థం తెలుపగలరు.

A. Abstract = మన పంచేంద్రియాలకతీతమైన మనం ఊహించుకోగలిగిందే - Intelligence = తెలివి- దీన్ని మనం చూడలేం, వినలేం, తాకలేం, వాసన చూడలేనిది. ఇంకో అర్థం- summary / సంక్షిప్తం చేసింది.

Q. G.O.M.S. లో M.S. అంటే ఏమిటి?

A. G.O.= Government order.
M.S = Manuscript.

Q. Specially, Especially అంటే ఏమిటి?

A. Specially = ప్రత్యేకంగా - This book is specially for those who want to take EAMCET exam. (ఈ పుస్తకం ప్రత్యేకంగా ఎంసెట్ రాసే విద్యార్థులకు).
Especially = ఒకరికంటే ఇంకొకరికి ఎక్కువగా/ ఒక దానికంటే ఇంకోటి ఎక్కువగా/ ముఖ్యంగా youngsters now a days like to be fashionable especially girls = ఇప్పటి యువతీ యువకులు ఫ్యాషనబుల్‌గా ఉండేందుకు ఇష్టపడతారు, ముఖ్యంగా ఆడపిల్లలు (మగపిల్లల కంటే ఆడపిల్లలు ఎక్కువగా).

Q. Motel అంటే ఏమిటి?

A. Motel = కార్లో ప్రయాణం చేసేవారికి బస, వాళ్లు తీసుకున్న గది దగ్గరే కారు పార్కు చేసుకునే వసతితో (motor inn/ motor park నుంచి motel combination తో motel వచ్చింది)

Q. Test, exam వీటి మధ్య తేడా ఏమిటి?

A. Test = ఒకే ఒక పరీక్ష- ఇది Degree/ Diploma పొందేందుకు కాకపోవచ్చు
Exam = పరీక్ష/ పరీక్షలు- ఇది Degree/ Diploma పొందేందుకు రాస్తాం.

Q. రచ్చబండ, అరుగును ఇంగ్లిష్‌లో ఏమంటారు?

A. అరుగును Raised platform అనొచ్చు. రచ్చబండ = village bench అనొచ్చు న్యాయస్థానం అనే అర్థం వచ్చేట్లు

Q. Patron, Dean అర్థాలు తెలుపగలరు.

A. Patron = ఒక సంస్థకు ఆర్థిక సహాయం ఇచ్చి ప్రోత్సహించేవాళ్లు.
Dean = 1) కొంతమంది priests (క్రిస్టియన్ మతగురువులు)పై ఆధిపత్యమున్న మతగురువు.
2) Universities లో ఒక శాఖాధిపతి/ విద్యార్థుల క్రమశిక్షణ విషయం చూసుకునేప్రొఫెసర్.

**K.S.R. Markapur**

Q. కింది వాక్యాలను తెలుగులో తెలుపగలరు.
His eyes closed in what would have seemed to be sleep had it not been for turmoil of the struggle.

A. అప్పుడు జరుగుతున్న కల్లోలమే లేకపోతే అతడు కళ్లు మూసుకోవడం నిద్ర అనిపించేది.

Q. Hajipur has been synonymous with bananas and Ramvilas Paswan. But now it is the bananas that have nothing to worry about.

A. హాజీపూర్ అంటే మనకు గుర్తొచ్చేది అరటిపండ్లు, రాంవిలాస్ పాశ్వాన్. కానీ ఈ రోజుల్లో అరటిపండ్లు మాత్రమే గుర్తొస్తున్నాయి.

Q. She was at her wits end.

A. ఆమెకేం చేయాలో పాలుపోలేదు.

Q. Who is the picture of composure?

A. నిశ్చింత (composure) కు చిహ్నంగా ఉన్నదెవరు?

Q. Mr. K.S.R. tongue lashed the scheme.

A. కేఎస్ఆర్ ఆ పథకాన్ని తీవ్రంగా విమర్శించారు.

Q. His fate hangs in the balance.

A. అతడి పరిస్థితి అటోఇటో తేలకుండా ఉంది.

Q. కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో తెలుపగలరు.
నడిపించేది నేను, నడిచేది నీవు.

A. I lead, you are to follow.

Q. నువ్వు తింటే నేను తిన్నట్లే.

A. If you eat, I have eaten/ your eating is my eating.

Q. అతడిని దగ్గరకు రానివ్వడం అంటే పామును పక్కన పెట్టుకున్నట్లే.

A. Having him near you is having a snake by your side.

Q. ఆ చెప్పే విషయం ఏదో పెద్దగా చెప్పొచ్చుగా?

A. You can say aloud whatever you want to say.

**L. Mallika, Chilakaluripet**

Q. కింది వాక్యాలకు తెలుగులో అర్థాన్ని తెలుపగలరు.
I am yet to come to terms with the reality of having done it.

A. ఆ పని నేనే చేశానన్న వాస్తవాన్ని జీర్ణించుకోలేకపోతున్నాను/ అలాంటి పరిస్థితితో రాజీపడలేకపోతున్నాను.

Q. His fate hangs in the balance with the congress.

A. Congress లో అతడి పరిస్థితి ఎటూ తేలకుండా ఉంది.

Q. L.T.T.E. conducted its training in two legs.

A. L.T.T.E. తన శిక్షణను రెండు దశలుగా నిర్వహించింది.

Q. Reshuffling is going on.

A. మార్పులూ, చేర్పులూ జరుగుతున్నాయి.

Q. When dust settles on one case of ragging another one rears it ugly head in quick.

A. ఒక ర్యాగింగ్ కేసు విషయం పూర్తయ్యీ అవకముందే/ పూర్తవగానే ఇంకో ర్యాగింగ్ కేసు వికృత రూపం మన ముందుకొస్తోంది.

Q. They tried to down play it.

A. వాళ్లు దాని తీవ్రతను తగ్గించి చూపాలని ప్రయత్నిస్తున్నారు/ అంత తీవ్రమయిందేమీ కాదనే అభిప్రాయాన్ని కలిగించే ప్రయత్నం చేస్తున్నారు.

Q. He flexed his muscles once again.

A. అతడు మళ్లీ కయ్యానికి కాలుదువ్వుతున్నాడు/ పోట్లాటకు సిద్ధమవుతున్నాడు.

Q. The management came to take charge of situation.

A. యాజమాన్యం పరిస్థితిని తమ అదుపులోకి తెచ్చుకునేందుకు వచ్చింది.

Q. You have to have adequate resources to run them properly.

A. వాటిని నిర్వహించేందుకు నీకు సరైన వనరులు/ సదుపాయాలు ఉండాలి.

Q. I ought to have known better.

A. నేనది ఇంకా బాగా అర్థం చేసుకునుండాల్సింది. (సరిగా అర్థం చేసుకోలేకపోయాను.)

**Srinu, Narasapuram.**

Q. కింది వాక్యాలకు question tags తెలుపగలరు.
1) You needn't spend money, ......?
2) You need to bring a sweater, ......?
3) Someone is coming, .....?
4) Everyone comes with a different style, ....?
5) She needs a lot of help, .....?
6) She needs to do it now, .......?

A. 1) You needn't spend money, do you?
2) You need to..., don't you?
3) Someone is coming, isn't he/ she? (సందర్భాన్నిబట్టి). అయితే ఇప్పుడు, someone (ఎవరో) అంటే ఆడా, మగా అని clear గా తెలియదు కాబట్టి, మాట మాటకీ he/ she అనే బదులు, 'they' అంటున్నారు. Someone is coming, aren't they? అని.
4) Every one comes with a different styles, don't they? ఇక్కడ కూడా, (3)లో లానే, doesn't he/ she? అనే బదులు, don't they వాడుకయిపోతోంది.
5) She needs a lot of help, doesn't she?
6) She needs to do it now, doesn't she?

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






**A. Sudhakar, Peddamallareddy**

**Q.** You told that clause means a group of words with a verb. 'I believe him honest' - in this sentence 'him honest' is a clause? Why ? It is without a verb. Please clarify this.

**A.** In the sentence, 'I believe him honest' 'him honest' (another way of saying, 'him to be honest') is NOT a clause, because there is no verb. Even if the sentence is 'I believe him to be honest', 'believe him to be honest' is not a clause for there is no verb in that group of words. There can be no clause without a verb. You know the verb has six forms:

i) The 'be' forms (am/ is/ are, was/ were, all forms having, 'be' in the end, like shall be, should be, will be, would be, etc., and all having 'been in the end, like have/ has/ had been, should/ would have been, etc.)

ii) be forms +... ing forms - am going, was dancing, will be coming, has been acting, etc.

iii) be forms + past participle - am seen, was done, will be completed, etc.

# He will get the brunt of the attacks

iv) Doing words:

| see | sees | saw |
|---|---|---|
| take | takes | took |
| like | likes | liked etc |

v) Have/ has/ had/ shall have/ should have/ will have, etc + PP

Have done, has seen, will have gone, etc.

vi) shall/ should/ will/ would, etc + 1st Regular doing word.

eg: shall go, will see, would find etc. If in a group of words, if there is any of the six forms above, that becomes a clause; not otherwise

**V. Srinivas, Narasapuram**

**Q.** 'She didn't attend the party today'. 'She has not attended the party today'. Which one is correct?

**A.** 'She did not attend the party today'- correct. Party అయిపోయింతర్వాత, అయిపోయిన party కి ఆమె రాలేదని అర్థం. Party జరుగుతూ ఉంటే, ఆమె రాలేదని చెప్పేందుకు, 'she has not attended the party' అంటాం. 'today' అని చేర్చకుండా ఈ సందర్భంలో, she hasn't come yet అనడం సరిగ్గా ఉంటుంది.

**Q.** We have lived there for 10 years. ఏ సందర్భంలో ఇలా has/ have + $v_3$ వాడొచ్చో వివరించగలరు.

**A.** మనం ఒకచోట గత పదేళ్లుగా/ పదేళ్ల క్రితం నుంచి ఇప్పటివరకు/ ఇంకా ఉంటే, ఆ సందర్భంలో, we have lived there for 10 years అంటాం.

**Q.** I hereby declare that the benefit under spouse category was not been availed of by me for the last eight years. ఇక్కడ was ఉపయోగించడం సరైనదేనా? has not been వాడాలా?

**A.** Correct కాదు. has not been availed of by me (for the last eight years), correct.

**G. Govinda Rao, Visakhapatnam**

**Q.** Employment కు, Gainful employment కు తేడా ఏమిటి?

**A. Employment** = ఉద్యోగం (దీనికి మంచి జీతం ఉండకపోవచ్చు)

**Gainful employment** = మంచి జీతం తెగలిగే ఉద్యోగం.

Gainful = డబ్బు వచ్చే, ముఖ్యంగా ఉద్యోగానికి సంబంధించి.

**Q.** Miss, miss out, to give it a miss.. తేడా ఏమిటి?

**A. Miss** = కోల్పోవడం/ ఒక సందర్భానికి వెళ్లలేకపోవడం/ ఏదైనా, ఎవరైనా మనతో లేని లోటువల్ల బాధపడటం.

**Miss out** = omit/ drop - రాయాల్సిన, మాట్లాడాల్సిన విషయాల్లో దేన్నైనా వదిలేయడం.

He missed out a few important points in his speech = అతడు తన ఉపన్యాసంలో కొన్ని ముఖ్యాంశాలను వదిలేశాడు.

He missed her speech = ఆమె ఉపన్యాసాన్ని వినే అవకాశాన్ని అతడు కోల్పోయాడు.

**Give it (something) a miss** - ఇది ఇంతకు మునుపు రెండుసార్లు వివరించాం. మళ్లీ వివరిస్తున్నాం. కావాలని మనం ఏ సందర్భానికైనా వెళ్లకపోతే, వదిలేస్తే అది miss out.

a) I've eaten a heavy lunch. I will give the dinner a miss tonight = మధ్యాహ్న భోజనం బాగా ఎక్కువయింది. రాత్రి భోజనం చేయను (వదిలేస్తున్నా)

b) He gave the meeting a miss = అతడు సభకు (కావాలనే) రాలేదు.

**Q.** Reach, Reach out .. తేడా ఏమిటి?

**A. Reach** = చేరడం.

She reached here yesterday = ఆమె ఇక్కడికి చేరింది (ఒకచోటికి చేరడం)





M.SURESAN

**Reach out** = సాయంచేయడం/ ఒకరి బాగోగుల్లో ఆసక్తి చూపించడం.

The late leader succeeded mostly in reaching out to the poor = దివంగత నేత పేద ప్రజలకు సాయంచేయడంలో/ చేరువవడంలో చాలావరకు సఫలమయ్యాడు.

**Q.** These canned apricots taste awful

The weather was awful

Their concert was really awesome

**A. awful** = అసహ్యమైన/ చెడు (భరించలేనంత)-

**awesome** = i) చాలా ఆహ్లాదకరంగా ఉన్న, మంచి అనుభూతిని కలిగించే ii) దిగ్భ్రమ సంభ్రమాశ్చర్యాలను కలిగించే. Sri krishna's revelation of his real form must have been an awesome sight = శ్రీకృష్ణుడి విశ్వరూపదర్శనం, దిగ్భ్రమ సంభ్రమాశ్చర్యాలను కలిగించి ఉండాలి.

Their concert was really awesome = వాళ్ల కచేరి/ ప్రదర్శన చాలా ఆహ్లాదకరంగా (బాగా) ఉంది.

**Q.** They are healthy & They are in good health & doing well - తేడా ఏమిటి?

**A.** ఒక్కటే.

**Q.** Poaching కి, Hunting కి తేడా ఏమిటి?

**A.** Poaching = వేట నిషేధించినచోట, చట్టవ్యతిరేకంగా దొంగతనంగా వేటాడటం.

Hunting = వేటాడటం.

**Q.** Milieu కి, Background కి తేడా ఏమిటి?

**A.** Milieu (మిల్యూ) = Background సామాజిక పరిస్థితులు, ఒకవ్యక్తి పుట్టుక, పెరుగుదలకు సంబంధించి.

**Q.** Elite అంటే ఏమిటి?

**A.** Elite = సమాజంలో ధనిక, బలమైన మేధావి వర్గం. (ఉన్నతవర్గం - అనొచ్చు)

**Q.** under privileged అంటే ఏమిటి?

**A.** under privileged = అవకాశరాహిత్య (వర్గాలు)

**Q.** Person & Persona & Personality- వీటి మధ్య తేడాల గురించి వివరించగలరు.

**A.** Person = వ్యక్తి

Personality = వ్యక్తిత్వం; వ్యక్తిశీలం, నడవడి కలిపి.

Persona = మనం నలుగురి మధ్య ప్రవర్తించే తీరు, అది వాళ్లలో మన నడవడిని గురించి కలిగించే అభిప్రాయం.

Narayan's public persona is that of a helpful man, but in private he is selfish = బయట నారాయణ్ అందరికీ సాయపడే వాడులా కనిపిస్తాడు, నిజానికి/ స్వభావంలో అతడు స్వార్థపరుడు.

**Q.** Legend అంటే ఏమిటి?

**A.** Legend = గాథ- తరతరాలుగా ప్రజలు నమ్మే కథలు- వీటిలో కొంత యదార్థం, కొంత కాకపోవచ్చు- (రామాయణం, భారతం లాంటివి)

ఒక మనిషి గొప్పతనం యదార్థమైనప్పటికీ, అది నమ్మలేనంత (నిజమైనప్పటికీ) అయితే, అప్పుడు ఆ వ్యక్తి legend అవుతాడు.

Gandhi has become a legend = గాంధీ గొప్పతనం గాథలుగా చెప్పుకుంటారు/ అంత గొప్ప వాడు నిజంగా ఉండేవాడా అనిపిస్తుంది.

Tendulkar is a batting legend = Tendulkar batsmanship అంత గొప్పదా అనిపిస్తుంది/ నిజమేనా అనిపిస్తుంది.

**Ayesha Begum, Anantapur.**

**Q.** ఈ వాక్యాలను తెలుగులో ఎలా చెప్పాలో తెలుపగలరు. To bring the knives out

**A.** To bring the knives out = కత్తులు/ చాకులు బయటకు తీయడం. అయితే The knives are out for somebody = ఏదైనా చెడు ఫలితానికి అందరూ కలిసి ఒకరిని బాధ్యులుగా చేయడం/ ఒకరి మీద నిందమోపడం.

The knives are out for DGP = అందరూ DGP ని బాధ్యులుగా చేస్తున్నారు.

**Q.** He will get it wrong sometime

**A.** He will get it wrong some times = కొన్నిసార్లు అతడు తప్పుగా అర్థంచేసుకుంటాడు/ సరిగ్గా అర్థం చేసుకోడు.

**Q.** He will get the brunt of the attacks

**A.** దాడిలో ఎక్కువ భాగం అతడి మీదే ఉంటుంది (లేదా) అతడే భరిస్తాడు. (దాడివల్ల ఎక్కువ బాధ అతడే పడతాడు).

Brunt = ఎక్కువ భాగం

**Q.** ఈ వాక్యాల్లోని సందేహాలు తీర్చగలరు.

On the basis of proposal - cum - preference

**A.** అతడి ప్రతిపాదన ఎంపిక ఆధారంగా

**Q.** India and China get underway

**A.** ప్రారంభం అయ్యాయి/ జరుగుతున్నాయి. (చర్చలు/ సభలు/ exams లాంటివి)

**Q.** Mixed response to VHP bandh call

**A.** మిశ్రమ స్పందన - కొందరికి నచ్చడం, ఇతరులకు నచ్చకపోవడం, కొందరు బంద్ పాటించడం మరి కొందరు పాటించకపోవడం.

**Q.** I want to get operated, I want to be operated - రెండు వాక్యాల మధ్య తేడా ఏమిటి?

**A.** తేడా ఏమీలేదు.

**Q.** "They would to a village fair" ఈ వాక్యంలో would to అంటే ఏమిటి?

**A.** They would, to a village fair - ఇక్కడ would పక్కన comma అవసరం. అర్థం - 1) వాళ్లు ఆ పల్లె సంతకు వెళ్లేందుకు ఇష్టపడుతున్నారు. 2) (సందర్భాన్ని బట్టి) వెళ్తూండేవాళ్లు.

**Q.** కింది పదాలు/ పదబంధాలకు తెలుగులో అర్థాలు తెలుపగలరు.

Ouster, in favour of, edge out, play-off, tip off, alternative

**A. Ouster** = తొలగింపు (పనిలోనుంచి)

**in favour of** = అనుకూలంగా

**edge out** = నెట్టేయడం

**play off-** play off Mr. A against Mr. B - ఇద్దరికి పోటీ/ పోట్లాట పెట్టడం, స్వలాభం కోసం.

The US some times plays off India and Pakistan (for its own selfish interests) = కొన్నిసార్లు అమెరికా భారత్‌కు, పాక్‌కు పోట్లాట పెడుతుంది తన స్వలాభం కోసం.

**tip off** = ఉప్పందించడం (ఒకరిని గురించి రహస్య సమాచారం వారికి హానికలిగించేలా ఇంకొకరికి అందించడం)

The villagers tipped off the presence of a Maoist in the village = గ్రామంలో మావోయిస్ట్ ఉన్న సమాచారం, గ్రామస్తులు పోలీసులకు రహస్యంగా అందించారు.

**Alternative** = 1) ప్రత్యామ్నాయం. ఒకదాని బదులు వాడగల ఇంకో వస్తువు 2) మార్గాంతరం.

a) There is no alternative to this medicine = ఈ మందుకు ప్రత్యామ్నాయం లేదు.

b) There is no alternative to walking for slimming = లావు తగ్గేందుకు నడకకంటే ప్రత్యామ్నాయం లేదు.

**Q.** based, based on లకు అర్థం తెలపండి.

**A. based** = ఆధారమైన **based on** = ఆధారపడిన

a) Dosa is a rice flour based preparation = దోశ బియ్యప్పిండి ఆధార వంటకం

b) My decision is based on the information I got = నాకొచ్చిన సమాచారం ఆధారంగా/ సమాచారాన్ని బట్టి నా నిర్ణయం తీసుకున్నాను.

**A. Sridhar, Onipenta**

**Q.** Tension free travel, Tensionless travel - తేడా ఏమిటి?

**A.** తేడా ఏమీలేదు.

**Q.** కింది పదాలకు తెలుగులో అర్థాలు వివరించగలరు.

Free from, Carry off, Pinny language, Soft skills, Automotives, Boarding, Enclave, Avenue.

**A. free from** = లేకుండా

I am now free from all trouble and worries = ఏ చీకూ చింతా లేకుండా ఉన్నానిప్పుడు.

**Carry off** = Take away = తీసుకెళ్లిపోవడం/ గెలుచుకోవడం.

She carried off the I prize = ఆమె మొదటి బహుమతి తీసుకెళ్లిపోయింది/ గెలుచుకుంది/ పొందింది.

**Pinny language -** ఈ మాట English లో లేదు.

**Soft skills-** Personality Development (వ్యక్తిత్వ వికాసం - సంపూర్ణ వ్యక్తిగా ఎదగడం), Inter personal relations (వ్యక్తికి, వ్యక్తికి మధ్య సంబంధాలు), communication skills (పరస్పర సమాచార అవగాహన) ఇలాంటివన్నీ soft skills.

**Automotives-** మోటార్ వాహనాలకు సంబంధించిన

**Boarding-** 1) ఆహార సదుపాయం/ భోజనం 2) గోడలు/ నేలలు/ కిటికీల లాంటివి మూసేస్తూ చెక్కలమర్చడం (చలి దేశాలలో ఇది అవసరం)

**Enclave-** ఒకే ఆచార వ్యవహారాలున్న కొంతమంది (ఒక నగరం/ దేశం, etc లో) నివసించే స్థలం.

**Avenue -** రెండు వైపులా చెట్లున్న విశాలమైన వీధి.

**Q.** ఆడవారి మాటలకు అర్థాలే వేరులే. దీనిని ఆంగ్లంలో ఎలా అనాలి?

**A.** Women say one thing but mean another/ women do not mean what they say/ women's words do not mean what they seem to mean.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# Sorry I couldn't place you



**Addanki prasad, Ongole**

**Q.** నేను ఈ మధ్యే ఒక ఇంటర్వ్యూకి హాజరయ్యాను. అక్కడ నాకు కొన్ని words చెప్పారు. అవి: know, knowledge, write, bomb, calm మొదలైనవి. వీటిలో వరుసగా k, k, w, b, l ఎందుకు silent అవుతున్నాయని అడిగారు. దానికి నేను followed by consonants అని చెప్పాను. ఇలా చాలా words లో కొన్ని అక్షరాలు silent అవుతున్నాయి. ఎందుకు? వీటికేమైనా rules ఉన్నాయా? తెలుపగలరు.

**A.** మీరు చెప్పిన పదాల్లోని కొన్ని letters ను పలకక పోవడమనేది అవి ఏయే భాషల నుంచి English లోకి వచ్చాయనేదాన్నిబట్టి ఉంటుంది. 'k' silent గా (పలక్కుండా ఉండే) మాటలు చాలామటుకు Latin భాష నుంచి English లోకి వచ్చినవి. అలాగే 's' silent గా ఉండే మాటలు French నుంచి English లోకి వచ్చినవి. ఇలాంటి ప్రశ్నలకు సమాధానం: "It depends on the Language the word is derived from."

**Q.** Simple present tense sentence లో subject singular లో ఉంటే verb కి s, es, ies వస్తాయి. ఇలా ఏయే verbs కు వస్తాయో తెలుపగలరు.

**A.** సాధారణంగా p, t, k, b, d, g, l, m, n శబ్దాలు చివర వచ్చే verbs కు, s చేరుస్తాం. s/ ch లాంటి శబ్దాలు చివరవచ్చే verbs కు + es చేరుస్తాం. Stresses, Reaches, teaches, etc. (a/e/i/o/u) శబ్దాలు ముందర లేకుండా, y తో అంతమయ్యే verbs కు, y తీసేసి, + ies చేరుస్తాం. Hurry - hurries. (ఇది మీకు అలవాటు ప్రకారం తెలిసిపోతుంది)

**Q.** Residential spoken English institutions ఉన్నాయా? తెలుపగలరు.

**A.** నాకు తెలిసి లేవు.

**Q.** Present perfect tense లో, present perfect continuous tense లో since, for ను ఉపయోగిస్తారు. వాటిని ఏయే సందర్భాల్లో వాడాలో తెలియజేయగలరు.

**A.** గతంలో ఒక సమయం నుంచి అనేందుకు, 'since' అంటాం. Sachin has played/ has been playing since 1989. (1989 నుంచి సచిన్ ఆడాడు/ ఆడుతున్నాడు)

గతంనుంచి ఇన్నేళ్లుగా, ఇన్ని నెలలుగా, ఇన్ని రోజులుగా, ఇన్ని గంటలుగా అనేందుకు 'for' అంటారు. Sachin has played/ has been playing for the past 20 years = సచిన్ (గత) 20 ఏళ్లుగా ఆడాడు/ ఆడుతున్నాడు.

**Q.** Simple future tense లో will, shall లను ఏయే subjects కు వాడాలి? ఒక గ్రామర్ పుస్తకంలో I, we లకు మాత్రమే shall వాడాలని ఉంది. నిజమేనా?

**A.** I/ We shall
You/ he/ she/ it/ they will } Simple/ indefinite (కచ్చితంకాని) future

I/ We will - Determination (నిర్ణయం)/ Intention (ఉద్దేశం)/ Promise (మాటివ్వడం)

**Q.** సాధారణంగా సంభాషణల్లో teacher అనే పదాన్ని వాడుతుంటాం. లింగభేదం తెలిసేలా చెప్పాలంటే ఎలా?

**A.** Teacher- common gender- doctor/lawyer లా- అంటే మగయినా కావచ్చు, ఆడయినా కావచ్చు.

ఇప్పటి English లో అన్ని వృత్తులకు ఒకే మాట వాడేస్తున్నారు- మగ/ఆడ అనే తేడాలేకుండా. ఇదివరలో Songstress (గాయని), Poetess (కవయిత్రి), Actress (నటి) అని వాడేవారు. ఇప్పుడు ఇలాంటి మాటల బదులు, ఆడవాళ్లయినా, singer, poet, actor అనేస్తున్నారు.

**Q.** Has had, have had ల అర్థం ఏమిటి? వాటిని ఏ tense లో వాడాలి?

**A.** Has had- ఈ verb form, has + Past Participle of have; అలాగే Had had- ఈ verb form had + PP of have.

Has + PP- ఇంతవరకు ఏదైనా వస్తువు ఒకరికి ఉండటం/ గతంలో ఒకప్పుడు (time చెప్పనప్పుడు) ఉండటం.

He has had this car for the past 2 years = అతడికి ఈ car రెండేళ్లుగా ఉంది.

She has had two cups of coffee so far = ఆమె ఇంతవరకు రెండు cups coffee తీసుకుంది.

**Q.** Had, had అని కూడా ఉందా?

**A.** Had had - గతంలో ఎవరికైనా రెండు వస్తువులు, ఒకదానిముందు ఇంకొకటి ఉంటే అది చెప్పడానికి had had అంటాం.

I had had a bike before I bought this car = ఈ car కొనేముందు నాకు bike ఉండేది.

The tests showed she had had an attack of this disease earlier = ఆమెకు అంతకుముందే ఈ జబ్బు ఉండేదని పరీక్షలు తేల్చాయి.

had had ఉపయోగం పైన ఉదాహరణలు తెలుపుతున్నాయి గదా. అలాగే had to - గతంలో విధిగా ఒక పని చేయాల్సి రావడం, తప్పనిసరిగా.

I knew that she had had to resign her job, and resigned. = తను ఉద్యోగానికి రాజీనామా చేయాల్సి వచ్చి (గతంలో) చేసిందని, నాకు తెలిసింది (ఇది కూడా గతంలోనే).





M.SURESAN

**Q.** She has had to endure అంటే అర్థం ఏమిటి?

**A.** She has had to endure = ఆమె అది భరించాల్సి వచ్చింది. (ఫలానా time అని తెలియని గతంలో)

**Q.** We'll find that out quickly enough అంటే ఏమిటి?

**A.** We'll (we will) find that out quickly enough = చాలినంత (తగినంత) త్వరలోనే మనం దాన్ని కనుక్కుంటాం.

**Q.** 'మీరు ఇక్కడికి వస్తానని చెప్పినట్లున్నారు!' ఈ వాక్యాన్ని English లో ఎలా చెప్పాలి?

**A.** You seem to have said that you will come here.

**Q.** In fact, of death, of course అనే వాటికి అర్థాలు వివరించగలరు.

**A.** **In fact** = యదార్థానికి, ఆ మాటకొస్తే, అసలైతే.

Sachin is a great batsman. In fact he is the greatest batsman in the world = సచిన్ గొప్ప batsman. ఆ మాటకొస్తే/ అసలైతే ప్రపంచంలోనే అతడందరిలో గొప్ప batsman.

**of death** - దీనికి ప్రత్యేకమైన అర్థమేమీలేదు.

**of course** = అవును (ఆ విషయం చెప్పనవసరం లేదు/ కచ్చితంగా)

"Do you like coffee?" (నీకు coffee ఇష్టమా? )
"of course; I do" (ఆ విషయం చెప్పనక్కరలేదు. కచ్చితంగా ఇష్టమే.)

**Q.** Who woke him up? ని Who woke up him అని ఎందుకు అనకూడదు? అసలు ఈ up కి అర్థం ఏమిటి? దీన్ని ఎక్కడ, ఎలా ఉపయోగించాలి?

**A.** Who woke him up? - ఇలాంటి prepositional phrases లో him లాంటి objects, verb కు, preposition కూ మధ్యలోనే వస్తాయి. అయితే Who woke up him? తప్పులేదు, కాని వాడుక మాత్రం woke him up.

**Q.** ఈ మధ్య India Newzealand tour వెళ్లినప్పుడు India Newzealand ని 'White wash, Brown wash చేస్తాం' అని చెప్పింది. వాటి అర్థాలేమిటి? ఇలా wash తో ఇంకా ఏమైనా పదాలున్నాయా?

**A.** White wash = తెల్లవాళ్ల (Newzealanders తెల్ల వాళ్లు కదా? ) హవా/ ఆధిక్యత. వాళ్లు match గెలిస్తే.

Brown wash (చాలా మటుకు Asians- ఆసియా వాసుల) శరీరపు రంగు, brown - మనమంతా brown race (గోధుమ వర్ణం జాతి).

Brown wash =
గోధుమ వర్ణం వారి హవా/ ఆధిక్యత - మనం గెలిస్తే.

**Q.** Mail trains అంటే ఏమిటి? వీటి ప్రత్యేకత ఏమిటి? mail trains- express - super fast trains మధ్య తేడాలేమిటి?

**A.** Mail = Post (ఉత్తరాలూ, Reg. post లాంటి వాటిని) తీసుకెళ్లే ప్రత్యేకరైళ్లను mail trains అనేవాళ్లు.

Express = వేగంగా వెళ్లే
Super fast = అతి వేగంగా వెళ్లే

**Q.** ISO 1900 or 2000 అని చాలాచోట్ల రాసి ఉండటం చూశాను. దయచేసి దాని అర్థం తెలుపగలరు.

**A.** ISO = International Standards Organization (అంతర్జాతీయ ప్రమాణాల సంస్థ- 1946లో స్థాపితం)- శాస్త్రీయ, పారిశ్రామిక, వ్యాపార సంస్థల ఉత్పత్తుల నాణ్యత ప్రమాణాలను కొలిచే సంస్థ. ఈ సంస్థ certify చేస్తే నాణ్యత ప్రమాణం ఉన్నతమైందని భావిస్తారు.

**Q.** Phrasal verbs అంటే ఏమిటి? వీటిని ఎలా form చేయాలి? వీటికి సంబంధించి మంచి పుస్తకం ఉందా? ఏదైనా మంచి Grammar పుస్తకాన్ని తెలియజేయగలరు.

**A.** Phrasal verb - ఒక verb దాని తర్వాత preposition/ adverb ఉంటే అది phrasal verb అవుతుంది. అయితే, phrasal verb అర్థానికీ, అందులో ఉండే, ఒక్కొక్క మాట అర్థానికీ సంబంధం ఉండదు.

eg: Put out = (మంట, దీపం లాంటి వాటిని) ఆర్పేయడం- put అర్థానికీ, out అర్థానికీ, put out మొత్తం అర్థానికీ ఏం సంబంధం లేదు కదా? కాబట్టి ఇది phrasal verb. అలాగే, put off = postpone, go through= read (చదవడం) లాంటివన్నీ. Essential English Grammar by Raymond Murphy మీకు బాగా ఉపయోగపడుతుంది.

**Omkar, Narsipatnam**

**Q.** Well and good అనొచ్చా? తెలుపగలరు.

**A.** Well and good = మంచిదే/ సరి

If he comes here, well and good.

If he doesn't I will have to force him to come = అతడిక్కడికి వస్తేసరి/ మంచిదే. లేకుంటే నేనతడిని బలవంతాన రప్పించాల్సి ఉంటుంది.

**Q.** Other than, None other than ల usage ని వివరించగలరు.

**A.** **Other than** = అది/ అతడు/ ఆమె తప్ప.

I Like any place other than Hyderabad = హైదరాబాద్ తప్ప నాకు ఏ ఊరయినా ఇష్టమే.

Other than Ramesh all students are present = రమేష్ తప్ప అందరూ ఉన్నారిక్కడ.

**None other than** = ఇంకేదీ/ ఇంకెవరూ కాదు.

None other than Ramesh can do it = రమేష్ తప్ప ఇంకెవరూ ఆ పని చేయలేరు.

None other than sachin can do it = సచిన్ తప్ప ఇంకెవరూ అది చేయలేరు.

**Q.** 'వాడు ఎవరికీ అర్థం కాకుండా మాట్లాడతాడు' ఈ వాక్యాన్ని English లో ఏమంటారు? He speaks for not being understood for any body అనొచ్చా?

**A.** What he says none understands/ None understands what he says.

**Q.** 'గుర్తు పట్టనందుకు sorry' అనడానికి Thanks for not identified అనొచ్చా?

**A.** Thanks for not identified అంటే మీ భావం? అయినా పై వాక్యం తప్పు.

Thanks for not identifying me = నన్ను గుర్తించనందుకు Thanks. అయినా ఇలా అనం కదా?

గుర్తుపట్టనందుకు sorry = Sorry I couldn't identify/ place you.

**Q.** I'm going home అనే వాక్యంలో going తరువాత to వస్తే ఎందుకు తప్పవుతుంది? చాలాసార్లు going తరువాత to వస్తుంది కదా?

**A.** Home ముందు ఎప్పుడు కూడా 'to' వాడం.

**Q.** Cat, bat, rat, bank లను క్యాట్, బ్యాట్, ర్యాట్, బ్యాంక్‌లుగా ఎందుకు చదువుతాం?

**A.** Cat, Bat, Bank లాంటి మాటల్లో 'a' సూచించే శబ్దం, తెలుగులో 'వెల్లాడు'లో 'ల్లా' తెలిపే శబ్దం. దీనికి 'య' వత్తు దగ్గర.

**Raju, AB Palle**

**Q.** కింది వాక్యాలకు తెలుగు అర్థం తెలుపగలరు.

If two animals wish to tighten their bond of friendship they groom one another even if the condition of their fur hardly warrants it.

**A.** రెండు జంతువులు ఒకదాని దేహాలు ఇంకొకటి నిమరడం ద్వారా తమ సాన్నిహిత్యాన్ని/ స్నేహాన్ని తెలియజేసుకుంటాయి, వాటి ఉన్ని మెత్తగా ఉండి, నిమరడం అవసరం లేనప్పటికీ.

**Q.** Social grooming activities appear to have become almost independent of their original stimuli.

**A.** Groom = బట్టలూ, జుట్టూలాంటివి పరిశుభ్రంగా ఉండి అందంగా కనిపించడం.

Social grooming... stimuli= సామాజికంగా వ్యక్తులు ఒకరినొకరు స్పర్శించుకోవడం, నిమరడం లాంటివి, మొదట అవి ఉద్దేశించిందానికంటే భిన్నమై పోయాయి.

**Q.** He might as well have committed the crime in the broad day light.

**A.** అతడా నేరాన్ని పట్టపగలే చేసుండొచ్చు (రాత్రే కాకుండా).

**Q.** I do not think you will be prepared to admit the possibility of mistake.

**A.** పొరబాటు సాధ్యమే అనే విషయం ఒప్పుకోనేందుకు నువ్వు సిద్ధంగా ఉన్నావనుకోను.

**Q.** It was all as easy as that.

**A.** అది అంత సులభం.

**Q.** If you had reported as many murder trails as I have known before hand what line he would take.

**A.** నాకు ముందే తెలిసినన్ని హత్యల జాడలు నువ్వు report చేసి ఉంటే, అతడు ఏ పంథా తీసుకునేవాడు? - ఈ sentence structure సరిగాలేదు. అందుకని ఈ వాక్యానికి సరైన అర్థం లేదు.

**Q.** I could not make out what he was at.

**A.** అతడు ఏం చేయాలనుకుంటున్నాడో నేనర్థం చేసుకో లేకపోయాను.

**Q.** The stormy petrel who had earlier denied of a move to the congress also criticised the T.D.P. at an impromptu media meet.

**A.** ఈ Sentence లో ఏదో దోషం ఉంది. సందర్భం తెలిస్తే అర్థం ఊహించగలం.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



G. Satyanarayanamurthy, Kakinada

**Q.** Be forms అంటే చేతలను తెలిపే పదాలేనా? Spoken English No.5 లో తెలిపిన be forms 3 sets-

1. Am, is are, was, were.
2. Shall be, should be...
3. Have been, should have been...

దేనికిందకు వస్తాయో తెలుపగలరు. అలాగే Be' forms తెలిపేది చేతలనా, స్థితులనా ? వీటి గురించి వివరించగలరు.

**A.** 'Be' forms అంటే Action words (చేతలను తెలిపే పదాలు) కావు. మీరు రాసిన 3 sets of 'be' forms Spoken English No.5 లో తెలిపిన 'A' కిందకే వస్తాయి. అంటే మీరు రాసిన 3 sets 'be' forms ఇంక దేనితో కలపకుండా వాడితే ఉండటాన్ని మాత్రమే తెలుపుతాయి.

I will be there tomorrow - ఇక్కడ will be, be form (ఉండటాన్ని తెలిపే verb) = నేను రేపక్కడ ఉంటాను (ఉండటం).

# I will be there tomorrow

I will be going there tomorrow = రేపు నేనక్కడికి వెళతున్నాను (Action - చేత) (Verb will be + going - will be + .....ing)

They will go there = వాళ్ళక్కడికి వెళతారు (verb- will go - action word)

She is a singer (verb - is - 'be' form - ఆమె గాయని (గా ఉంది- ఇలా తెలుగులో అనం అనుకోండి). She sings (ఆమె పాడుతుంది - sings – action).

She has been a teacher for the past two years (verb - has been - 'be' form - ఆమె రెండేళ్లుగా teacher గా ఉంది.)

She has taught/ has been teaching for the past two years (verb - has taught) (has + pp)/ has been teaching (has been + ing) - action word = రెండేళ్లుగా ఆమె Teach చేస్తోంది (Action - చేత)

అన్నీ ఇలా అర్థం చేసుకుంటే మంచిది- అంతకంటే ముఖ్యం, వాటిని మీ సంభాషణలో వాడటం.

మళ్లీ తెలుపుతున్నాం - గుర్తుంచుకోండి - కేవలం 'be' forms ను వాడితే మాత్రమే 'ఉండటం.' 'be' form తో ఇంకేదైనా ('....ing' form/ Past participle) చేరిస్తే అది, action word (చేతలను తెలిపే verb అవుతుంది)

**Padma, Ongole**

**Q.** కింది పేరాల అర్థం తెలుగులో వివరించగలరు.

He who has been denied the spectacle of busy Manhattan broker during a rush of business is handicapped for the profession of anthropology. The poet sings of the crowded hour of glorious life.

**A.** బాగా రద్దీగా ఉండే Manhattan (New York లో ఒక భాగం) లో క్షణం తీరిక లేకుండా ఉండే దళారీ (busy broker) దృశ్యాన్ని చూడలేకపోవడం Anthropology చదవటం పూర్తయినట్టు కాదు. (అంటే ఈ దళారీ దృశ్యం మానవుల పుట్టు పూర్వోత్తరాలు, నాగరికతా పరిణామాలు తెలిపే Anthropology లో ఒక ముఖ్యమైన అంశం. అది చూడలేకపోయినప్పుడు, ఆ ముఖ్యమైన అంశాన్ని కోల్పోయినట్లే అని, రచయిత భావం)

**Q.** In the midst of this growing and important stress the broker became suddenly aware of a high-rolled fringe of golden hair under a nodding canopy of velvet and ostrich tips an imitation sealskin sack and a string of beads as large as nuts, ending near the floor with a silver heart. There was a self-possessed young lady connected with these accessories, and Mr. Pitcher was there to construe her.

**A.** కదులుతున్న Velvet, ostritch tips కప్పు (roof/ canopy) కింద ఒత్తుగా పైకి దువ్వి ఉన్న బంగారు వర్ణం జుత్తు, sealskin సంచి, పెద్దపెద్ద పూసల దారంతో, వెండిలాంటి హృదయంతో నేలపైన ఉండటం, ఆ broker గమనించాడు, ఇంతముఖ్యమైన పెరుగుతున్న ఒత్తిడిలో పై వస్తువులు కలిగి ఉన్న యువతి అక్కడ ఉంది. Mr. Pitcher ఆమెను పరిశీలించేందుకు అక్కడున్నాడు- ఈ translation paras సందర్భం తెలియదు కాబట్టి ఈ translation పూర్తిగా సరికాకపోవచ్చు అర్థం మాత్రం స్థూలంగా ఇది.

**A. Sudhakar, Peddamallareddy**

**Q.** Please clarify whether the following sentence belongs to the simple or complex sentence.

Ramu wants the ruling party to dismiss two ministers.






M.SURESAN

**A.** 'Ramu wants the ruling party to dismiss two ministers' - This is a simple sentence. 'Wants' is the only verb in the sentence. A sentence having only one verb is always a simple sentence. To dismiss two ministers' is a phrase, because it is a group of words without a verb.

To dismiss (like to go, to come, to sing, to eat, etc), is only an INFINITIVE and not a verb:

[Remember 1) To + I st Regular Doing Word to go, to come; 2) '........... ing' form (going, coming, singing, etc) and 3) Past Participles (gone, taken, eaten, etc.,) are not verbs.

Be form + ...ing form - (am going, is going, are coming, etc), Be form + Past participle (are taken, is seen, etc) are verbs.]

So the sentence, 'Ramu wants..... two ministers', has only one clause and so it is a SIMPLE SENTENCE.

**J.V. Jayaprakash, Proddatur**

**Q.** Please turn the following sentences expressing a condition 'if'

a) As it was raining heavily, we decided against going out.

b) They asked him to leave the dining-room because he was not wearing a shirt.

**A.** a) If it had not been raining, we would not have decided against going out

b) If he had been wearing a shirt, they would not have asked him to leave the room.

**Q.** Please turn the following sentences into indirect speech.

a) They wrote "it is time we thought about settling this matter."

b) "We wish we had brought our guitars." said the students.

**A.** a) They wrote that it was time they had thought about settling that matter.

b) The students said that they wished that they had brought their guitars.




**Q.** Please clarify whether the following sentence is correct or not.

He walks as though he is slightly lame.

**A.** He walks as though he was/ were slightly lame.

**Q.** Please translate the following sentences into telugu explaining how the adverbs 'luckily' and 'honestly' function in them.

a) Luckily, he escaped unhurt.
He escaped unhurt luckily.

b) Honestly, he did not get the money.
He did not get the money honestly.

**A.** a) అదృష్టవశాత్తూ గాయమేం తగలకుండా తప్పించుకున్నాడు. This is the translation. As you yourself say 'luckily' in both the sentences function as adverbs modifying the verb, 'escaped'

b) This sentence is another way of saying, 'To tell you honestly/ Honestly speaking' (నిజం చెప్పాలంటే) అతడికా డబ్బు రాలేదు. Here 'honestly' modifies 'to tell/ speaking'.

He did not get the money honestly = అతడికా డబ్బు నిజాయతీగా రాలేదు/ మోసం వల్ల వచ్చింది. Here 'honestly', modifies 'get'

**K. Krishnakanth, Aswaraopet**

**Q.** Please tell me which is the correct sentence in the following? why?

1. From today I shall speak in English only.
2. From today I shall speak only in English.

**A.** రెండు వాక్యాలకు అర్థం ఒకటే. ఇవాళ్టి నుంచి నేను ఇంగ్లిష్‌లోనే మాట్లాడుతా అని.

**A.V. Subbarao, Onipenta**

**Q.** Vowels అంటే a,e,i,o,u కదా. ఇవి లేకుండా మిగిలిన 21 అక్షరాలు consonants తోనే పదాలు రావు అంటారు. sky, spy, why, fly, try ఈ పదాలు వచ్చాయి కదా వివరించగలరు.

**A.** Vowels, Consonants - ఇవి శబ్దాలేకాని, అక్షరాలు కావు. శబ్దాలను తెలిపేందుకు మనం వాడే గుర్తులు అక్షరాలు. sky, why, etc., లాంటి మాటల్లో y, consonant గుర్తే అయినప్పటికీ, ఈ శబ్దాల్లో 'ai' (ఐ) అనే vowel ను సూచిస్తుంది.

**Q.** Awesome అంటే అర్థం ఏమిటి?

**A.** Awesome = సంభ్రమాశ్చర్యాలను కలిగించే; అందమైన, ఆకర్షణీయమైన.

**Q.** కింది పదాల అర్థాలు తెలుపగలరు.

Cutlet, agenda, much more, just do, just like that, vote of thanks, each other, each and every- other(ఈ రెండూ ఒకటేనా? ) each and everyone.

**A.** Cutlet: మాంసపు ముక్కలు (చిన్న చిన్న వాటితో) చేసే ఫలహారం

agenda: సభలూ/ సమావేశాల్లో చర్చించాల్సిన అంశం/ పార్టీ ప్రణాళికలో భాగం.

much more: చాలా ఎక్కువ (ఇంకొక దానికంటే)

just do: ముందు చెయ్యి.

just like that: అదలాగే/ అదంతే/ దానిలాగే

vote of thanks: Meetings చివర వందన సమర్పణ

each other: ఒకరినొకరు/ ఒకరికొకరు

each and other: అలాంటివి, ఇతరమైనవి

each and everyone: ప్రతివారూ.

**Q.** అసెంబ్లీకి సంబంధించి ఫ్లోర్ లీడర్ అంటే ఏమిటి?

**A.** అధికార పక్షానికి చెందినవారై, అసెంబ్లీ కార్యక్రమాల నిర్వహణ బాధ్యత కలవారు.

**Q.** Enquiry తర్వాత about అనే పదం తప్పకుండా వస్తుందా?

**A.** వస్తుంది.

**Q.** Notional Increment అంటే ఏమిటి?

**A.** ఊహామాత్రమైన పెంపు - జీత భత్యాలు పెంచేటప్పుడు, ప్రస్తుత మూలవేతనం (Basic pay) మీద ఇచ్చే పెంపు - ఈ మొత్తాన్ని భత్యాలు (allowances) లెక్కించేందుకే వాడతారు.

**Q.** Fee - Fees తేడా ఏమిటి?

**A.** ఇంతకుముందు చాలాసార్లు వివరించాం- Fee - రుసుము - ఇది countable, కాబట్టి దీనికి plural- fees = రుసుములు. fee ముందు ఎప్పుడూ, 'a' వాడాలి. The doctor charges a fee to treat you.

**Q.** Cassorole అర్థం ఏమిటి?

**A.** Correct spelling - casserole = 1) లోతుగా ఉండే పాత్రలో ద్రవంలో మెల్లిగా ఉడికించే మాంసం లాంటి ఆహారం 2) అలా ఉడికించేందుకు మూత ఉన్న లోతైన పాత్ర.

**Q.** Carry off అంటే ఉదాహరణతో వివరించగలరు.

**A.** Carry (something) off = ఏదైనా గెలుచుకోవడం.
He carried off the I prize.

**Q.** Hosieries అర్థమేమిటి?

**A.** ఈ మాట ఎక్కువగా పెద్ద పెద్ద బట్టల దుకాణాల్లో, socks, stockings (మోకాళ్ల దాకా వచ్చే socks), బనీన్లు, underwear అమ్మే విభాగానికి వాడతారు.

**Q.** Power point presentation అంటే ఏమిటి?

**A.** ఏదయినా విషయాన్ని computer, slides తో వివరించడానికి ఏర్పాటు చేసే సభ - Cinema Screen లాంటి తెరమీదగానీ, తెల్లటి గోడమీదగానీ పడేవిధంగా బొమ్మలు, వివరాలు కూర్చి తయారు చేసిన ప్రదర్శన, వివరణ.

**Q.** Kudos అంటే అర్థం ఏమిటి?

**A.** మెప్పును తెలిపేమాట - Kudos to Indian space scientists for finding water on the moon = చంద్రుడి ఉపరితలం మీద నీరు ఉనికిని కనుగొన్న భారతీయ శాస్త్రజ్ఞులకు అభినందనలు (మెప్పు, గౌరవం)

**G.Venugopal, Karimnagar**

**Q.** I rent a large old furnished house.
I rent an old large furnished house.
Which sentence is the correct?

**A.** I rent an old, large, furnished house.

**Q.** Jame's back is worse than his bite.

**A.** James' (Jame's కాదు) bark (back కాదు) is worse than his bite = james వన్నీ వట్టి బెదిరింపులే. అంత ప్రమాదరమైన వాడేంకాదు. (వాడి బెదిరింపులకు మనం భయపడక్కర్లేదు)

**Gurram Shankar, Kasavapatnam**

**Q.** ఇందిరాగాంధీ చెప్పిన ఈ కొటేషన్‌కు అర్థాన్ని తెలుపగలరు.

"Education is a liberating force, and in our age it is also a democratising force, cuttings across the barriers of cast and class smoothing out inequalities imposed by birth and other circumstances."

**A.** విద్య ఒక విమోచనాశక్తి. మన రోజుల్లో అది కుల మత వర్గాలకతీతంగా అసమానతలను తొలగించే ప్రజాస్వామ్యానికి దోహదపడే శక్తి కూడా.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm






**ROL Sarma, Nellore**

**Q.** సాఫ్ట్‌వేర్ ఉద్యోగాల కోసం చేసే ఇంటర్వ్యూల్లో సాధారణంగా కింది ప్రశ్నలు అడుగుతుంటారని విన్నాను. దయచేసి వీటికి ఎలా సమాధానం చెప్పాలో తెలుపగలరు. ఇవి ఎందరికో ఉపయోగపడతాయని నా ఉద్దేశం.

**1.** Tell me about yourself.

**A. Tell me about yourself.** ఈ ప్రశ్నకు జవాబిచ్చేందుకు ముందరే బాగా plan చేసుకోవాలి. కింది క్రమంలో చెప్పొచ్చు: (అయితే ఇలాంటి సమాధానాలు చెప్పేందుకు, మంచి communication skills అవసరం)

1. మన పేరూ, ఊరు: I am Sarma from Nellore, PS Nellore Dt; AP.
2. (a) మీ family background, parentage, and siblings (తోబుట్టువులు):

   Ours is an agricultural/ business family/ family of employees - My father is Mr (Name) and he is a farmer/ businessman/ employee, etc; and my mother is Mrs (Name), employed/ home maker etc.

**Q. What are your strengths and weaknesses?** (మీ బలాలూ, బలహీనతలు)

**A.** Strengths are: 1) My willingness to work hard and the determination to succeed. 2) I have the willingness to learn too, and always look for opportunities to improve my knowledge. 3) I can make friends easily and that helps to interact with others. 4) I have a zeal for life and wish to see the best of it.

బలాలు: 1) కష్టపడేందుకు సంసిద్ధత, విజయం సాధించాలనే నిశ్చయం. 2) నేర్చుకునేందుకు సుముఖత, నా విజ్ఞానాన్ని పెంపొందించుకునే అవకాశాలకు చూడటం. 3) ఇతరుల స్నేహం పొందగలిగే స్వభావం, తద్వారా మానవ సంబంధాలను పెంచుకోవడం. 4) జీవితం చక్కగా అనుభవించాలనే కోరిక.

My weaknesses: 1) I trust others too easily and too much, and that often lands me in trouble. 2) I get angry easily but as easily forget it. 3) I think I am a little careless with money but am trying to set myself right.

**Q. What do you think will be your job profile?** (మీరు చేయబోయే ఉద్యోగ స్వభావ స్వరూపాలెలా ఉంటాయను కుంటున్నారు? )

**A.** I think it's going to be responsible and highly demanding, but at the same time highly rewarding as well. It is going to be a test of what I have so far learnt. I think it will be a job that will give me job satisfaction. I will have a good pay. It will help me to lead a respectable life.

బాధ్యతతో కూడి నా శక్తులకు సవాలుగా ఉండే ఉద్యోగం అనుకుంటున్నాను. అయితే నేను దానివల్ల చాలా ఫలితాలను పొందేదిగా ఉంటుందనుకుంటున్నా, ఇంతవరకు నేను తెలుసుకున్న దానికి సవాలుగా ఉంటుందనుకుంటున్నా. నాకు ఈ ఉద్యోగం వల్ల సరైన కృషి చేసే అవకాశం వచ్చి, నాకు పని విషయంలో సంతృప్తికరంగా ఉంటుందనుకుంటున్నా. జీతం కూడా బాగుంటుంది. అందువల్ల గౌరవనీయమైన జీవితం గడపగలననుకుంటున్నా.

# What motivates you?

b) Your position among your siblings: I am the eldest/ youngest / the second, etc of the two/ three children in the family. Your siblings' occupation, etc.

3. a) Your educational qualifications - starting from your highest qualification - university/ college, year of getting the qualification, your specialisation etc

   b) Your schooling, if there is the time for you to talk of it.

4. Your present job/ occupation, if any. (మనం ఇప్పుడేం చేస్తున్నదీ, ఏమన్నా చేస్తుంటే)

ఇవీ Tell me about yourself అన్నప్పుడు మీరివ్వవలసిన వివరాలు. పైన తెలిపిన క్రమం నమూనా మాత్రమే. సందర్భాన్నిబట్టి ఆ క్రమాన్ని మార్చుకోవచ్చు కానీ తెలిపాల్సిన వివరాలివి.

**Q. What are your career objectives?**

(మీ ఉద్యోగ వ్యాపకాల విషయంలో మీరేం సాధించాలనుకుంటున్నారు? )

**A.** దీనికి సమాధానం మీరెంచుకునే career ను బట్టి కదా ఉంటుంది.

మీకు ఏ profession కు సంబంధించిన విద్యార్హత ఉంటే, ఆ profession లో రాణించడం (occupying/ rising to the top position in the profession) is my objective (ధ్యేయం) అని చెప్పొచ్చు.

ఇంకా ఇది కూడా చెప్పడం ముఖ్యం. Enriching my knowledge through my association with an esteemed company/ organization like yours and gaining valuable experience.

**Q. Where do you see yourself in five years?**

(నువ్వు వచ్చే అయిదేళ్లలో ఎలా (ఏ స్థాయిలో) ఉంటాననుకొంటున్నావు? )

**A.** I hope I will get this job. If I do, I will do my best to be of use to the company and gain a knowledge of my work and valuable experience. I hope it will help me to rise to some good position in this company. In the coming five years, I see myself as a very useful and competent middle level executive in the organization.

నాకీ ఉద్యోగం వస్తుందనే ఆశిస్తున్నాను. వస్తే కంపెనీకి ఉపయోగపడేలా ఉండేందుకు ప్రయత్నిస్తాను. ఈ ఉద్యోగానికి సంబంధించిన అన్ని విషయాలూ తెలుసుకుని, విలువైన అనుభవం సంపాదించుకుంటాను. వచ్చే అయిదేళ్లలో ఈ company లోనే మంచి స్థితి పొందగలననుకుంటున్నాను. వచ్చే అయిదేళ్లలో ఈ company లోనే, యాజమాన్య నిర్వహణాధికారినవుతాను.






M.SURESAN

నా బలహీనతలు: 1) ఇతరులను సులభంగా మరీ ఎక్కువగా నమ్మడం, దానివల్ల చిక్కుల్లో పడటం. 2) నాకు త్వరగా కోపం వస్తుందీ, అంత త్వరగానూ తగ్గిపోతుంది. 3) డబ్బు విషయంలో నాకు జాగ్రత్త తక్కువనుకుంటా, ఈ విషయంలో నన్ను నేను మెరుగుపరచుకునే ప్రయత్నం చేస్తున్నా.

**Q. What motivates you?**

(నీకు ప్రేరణ ఏది? )

**A.** My desire to be somebody in life. I have a few role models too. My uncle is in an eminent managerial position, and I want to follow in his footsteps. I want to contribute something to society.

జీవితంలో అతడు/ ఆమె ఫలానా అని ఇతరులు అనే స్థితికి రావడం. నాకు కొంతమంది ఆదర్శ వ్యక్తులున్నారు. మా మామయ్య మంచి యాజమాన్య స్థాయిలో ఉన్నారు. ఆయన అడుగుజాడల్లో నడవాలని నా ఉద్దేశం. సమాజానికి ఏదయినా సేవ చేయాలనేది నా కోరిక.

**Q. What are your achievement?**

(నీవింతవరకు ఏం సాధించావు? )

**A.** ఇందుకు సమాధానంగా చదువులో మీ విజయాలూ, చదువులో, ఇతర విషయాల్లో మీరు పొందిన బహుమతులూ పురస్కారాల గురించి వివరించండి. ఉద్యోగస్థులయితే, ఆ ఉద్యోగంలో ఏం చేశారో పేర్కొనండి.

**Q. Why are you interested in our organization?**

**A.** Yours is organization of great international repute with its presence in a number of countries. I think it a matter of pride to be associated with an organization of the type. I can learn a lot from you and widen my career opportunities. The working conditions in your organization are very attractive, and the pay is quite good. Your company can provide me a good job relevant to my qualifications.

అంతర్జాతీయ ఖ్యాతితో చాలా దేశాల్లో ఉన్న సంస్థ మీది. మీ సంస్థలాంటిదానితో అనుబంధం నాకు గర్వకారణం. మీనుంచి నేను చాలా నేర్చుకోగలను. మీ కంపెనీలో కృషికి తగ్గ ఫలితం, పని వాతావరణం చాలా బాగుంటుంది ఆకర్షణీయంగా. జీతం కూడా బాగుంటుంది. నా విద్యార్హతలకు తగిన ఉద్యోగం మీ కంపెనీలో నాకు రాగలదు.

గమనించండి - ఇక్కడ ఇచ్చిన సమాధానాలు నమూనాలు మాత్రమే. మీ విద్యార్హతలూ, మీరు పొందబోయే ఉద్యోగాలను బట్టి వివరాలను మార్చుకోండి. ఇక్కడ మేం MBA Qualification ఉన్నవారికి సరైందిగా రాశాం. మీ విద్యార్హతకు తగినట్లుగా మీరు మార్చుకొండి అంతేకాకుండా ఇలాంటి ప్రశ్నలు ఎదుర్కోవాల్సిన interviews కు వెళ్లే ముందు చాలా practice అవసరం. అందుకని practice చేయండి.

**Omkar K, Visakhapatnam.**

**Q.** Could you kindly clarify the following? 1. Princes (రాకుమారుడు), Princess (రాకుమార్తె) లకు బహువచనాలు తెలుపగలరు.

**A.** Princes అంటే రాకుమారులు, రాకుమారుడు కాదు.

రాకుమారుడు = Prince (Singular)

రాకుమారులు = Princes (Plural)

Princess = రాకుమార్తె (Singular)

Princesses = రాకుమార్తెలు (Plural)

**Q.** వ్యభిచరించడం అనే అర్థంతో dating అంటున్నారు. Dating అంటే అర్థం ఏమిటో తెలుపగలరు.

**A.** Dating అంటే వ్యభిచరించడం కాదు; ఒకరితో ప్రేమ వ్యవహారం ఉండటం.

వ్యభిచరించడం = వివాహేతర సంబంధం ఉండటం; ఎక్కువ మందితో లైంగిక సంబంధం ఉండటం = adultery.

వ్యభిచరించడం = Commit adultery

Adulterer = వ్యభిచారి; Adulteress = వ్యభిచారిణి.

**Q.** Tempo అంటే అర్థం ఏమిటి?

**A.** Tempo = ఒక పని జరుగుతున్నప్పుడు ఉండే ఊపు.

The campaign has acquired tempo = ఆ ఉద్యమం ఊపందుకొంది.

**Q.** Truth, purity and unselfishness wherever these are present, there is no power below or above the sun to crush the person there off. దీని అర్థం ఏమిటి?

**A.** సత్యం, పరిశుద్ధత, నిస్వార్థత ఉన్నంతవరకు/ ఇది ఉన్న వ్యక్తిని ఈ విశ్వంలో (సూర్యుడి కింద/ సూర్యుడి పైనా = below or above the sun) ఏశక్తీ అణచి వేయలేదు.

**Q.** క్యాట్, బ్యాట్, ర్యాట్, ఫ్యాన్‌లలో ' ్య ' ఎందుకు?

**A.** ఈ పదాలలో a పలికే శబ్దాన్ని తెలిపే సరైన అక్షరం తెలుగులో లేకపోవడంవల్ల.

**Q.** Standard spoken C.D.'s ను suggest చేయండి. Vocabulary కోసం కూడా సూచించగలరు.

**A.** UEFL (University of English and Foreign Languages), Hyderabad వారివి చూడండి.

**Shaheen nisar, Anantapur**

**Q.** కింది పదాలకు అర్థాలను తెలుపగలరు. derive, addition to, subject to, liable to, criteria, round up

**A. Derive** = ఒకదానినుంచి ఇంకొకదాన్ని పొందడం. Ghee is derived from butter = వెన్న నుంచి నెయ్యి తీస్తారు (తీయబడుతుంది)

Duryodhana derived happiness by troubling the Pandavas = పాండవులకు కష్టాలు కలిగించి దుర్యోధనుడు సంతోషం పొందాడు.

Some Hindi words are derived from Arabic and Persian = కొన్ని హిందీ మాటలు, అరబ్బీ పర్షియన్ భాషల నుంచి వచ్చాయి. (The Telugu word రోజు is derived from the Persian, రోజ్, through Hindi)

**Addition** = కూడిక, చేరిక.

In addition to = అందుకు తోడుగా, అంతేకాకుండా.

**Subject to** = (నిబంధనలకు) లోబడి.

Subject to rules, you will be allowed to play = కొన్ని నిబంధనలకు లోబడి నువ్వాడేందుకు అనుమతిస్తారు.

**Liable to** = శిక్షకు/ చర్యకు బాధ్యులయ్యే అవకాశం. You are liable to prosecution if you trespass = మీరు హద్దుమీరితే శిక్షకు/ చర్యకు బాధ్యులయ్యే అవకాశం ఉంది.

**Criteria** = ప్రమాణాలు. What are the criteria for deciding the goodness of a person = ఒక వ్యక్తి మంచితనాన్ని నిర్ణయించేందుకు ప్రమాణాలేమిటి? (దేన్నిబట్టి ఒకరి మంచితనం నిర్ణయిస్తాం). Singular - Criterion

**Round up** = మనుషులను/ జంతువులను ఏదైనా ఉద్దేశంతో ఒకచోట చేర్చడం, ముఖ్యంగా నేరస్థులుగా భావించేవాళ్లను అదుపులోకి తీసుకోవడం.

**Q.** కింది తెలుగు పదాల అర్థాలను ఇంగ్లిష్‌లో వివరించగలరు. పాచిపట్టడం లేదా బూజుపట్టడం, కోపిష్ఠి.

**A.** be mossy = పాచిబట్టడం; బూజుపట్టడం = cobweb; A cob webbed room = బూజుపట్టిన గది.

కోపిష్ఠి = po-faced

**Q.** న్యూస్‌పేపర్‌లో చదివిన కింది వాక్యం అర్థాన్ని తెలుగులో తెలుపగలరు.

Patients with complex blocks in blood vessels with no other option but to undergo open heart surgery can now be treated with Angioplasty.

**A.** Open- heart surgery (గుండెను తెరిచి చేసే operation) కి ప్రత్యామ్నాయం లేకున్న రోగులకు ఇప్పుడు ఆంజియోప్లాస్టీతో చికిత్స చేయవచ్చు.

**Q.** నేను అతడిని అడిగానని చెప్పు. దీనికి ఇంగ్లిష్‌లో సరైన expression ఉందా?

**A.** Convey my enquires to him.

**Q.** News Channel లో moving on అంటూ తర్వాత హెడ్‌లైన్స్‌లోకి వెళ్లిపోతారు. దీని అర్థం ఏమిటి?

**A.** తర్వాత విషయం.

**Q.** హాయిగా సాగిపోతుందనుకున్న నావ ఒకవైపు ఒరగడం ప్రారంభమైంది.

**A.** The smooth sailing ship began to tack/ tilt.

**Q.** పదానికి చివర వచ్చే ive, able వీటికి తేడా ఏమిటి? ఉదా: effective & effectable. చెయ్యగల, అవ్వగల అనే అర్థంలో వస్తుంది కదా. దీని గురించి వివరించగలరు.

**A.** effectable అనే మాట లేదు. ఏదైనా మాటకు -able చేరిస్తే 'తగిన'/ కలిగిన అనే అర్థం వస్తుంది.

walkable distance - నడవగలిగిన దూరం

salable = అమ్మదగిన

'-ive' ఏ పదానికైనా చేరిస్తే, ఆ స్వభావంగల అనే అర్థం వస్తుంది.

effective = effect (ప్రభావం) + ive (కల) = ప్రభావంగల.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# That book on philosophy is beyond me

**Prabhat:** What was Charan driving at? He spoke for about an hour and I couldn't make head or tail of what he was trying to say. I didn't know what he was talking.
(చరణ్ ఏం చెప్పాలని ప్రయత్నించాడు? అతడు గంటసేపు మాట్లాడినా అతడేం చెప్పేందుకు ప్రయత్నిస్తున్నాడో తలాతోకా తెలుసుకోలేకపోయాను.)

**Pramod:** Neither did I. All that I could make of it was that he would be away for some days from the coming Monday.
(నాకూ ఏం అర్థం కాలేదు. నాకర్థమయిందల్లా, వచ్చే సోమవారం నుంచి కొన్ని రోజులు ఇక్కడ ఉండడని.)

**Prabhat:** No, it wasn't just that. He talked about his buying something next week too. He talked so much for so long and so fast that I could not keep up with what he wanted us to see.
(ఆ విషయంలో నేను నీతో ఏకీభవిస్తా. అతడు చాలా త్వరగా చాలా చెబుతాడు. అతడు చెప్పింది అవతలి వాళ్లకు అర్థమైందా లేదా అని పట్టించుకోడు. చెప్పింది పూర్తి కాగానే క్షణం కూడా ఆగడు.)

**Prabhat:** Unfortunately age hasn't improved his communication abilities. I always wonder if I can do anything to improve him, but I realize it's beyond me.
(వయసు పెరిగినా అతడి భావవ్యక్తీకరణ శక్తి మాత్రం పెరగలేదు. అతడిని మెరుగు పరిచేందుకు ఏమన్నా చేయగలనా అని ఆలోచిస్తా ఎప్పుడూ, కానీ, అది నేను చేయలేనిదని గ్రహిస్తాను.)

**Pramod:** I still hope he will improve. I wish to have a good talk with him about it.
(అతడు మెరుగుపడతాడనే ఆశిస్తున్నా. అతడితో ఆ విషయం మాట్లాడాలను కుంటున్నా.)

**Prabhat:** Wish you all success.
నువ్వందులో సఫలమవాలనే నా కోరిక.

(అది మాత్రమే కాదు. వచ్చేవారం ఏదో కొనే విషయం కూడా మాట్లాడాడు. మనం ఏం అర్థం చేసుకోవాలనే విషయం మనం తెలుసుకోలేనంత ఎక్కువగా, ఎక్కువసేపు అంత వేగంగా మాట్లాడాడు.)

**Pramod:** All that I could grasp was that he would surprise us with something. He explained too what that something was, but I found it over my head.
(నాకర్థమయిందల్లా తను మనకేదో ఆశ్చర్యం కలిగించబోతున్నాడని. అది కూడా ఏదో చెప్పాడు కానీ, నాకర్థం కాలేదు.)

**Prabhat:** That's always the case with him. He just says something and we have to rack our brains to understand what he has said.
(అతడెప్పుడూ అంతే. ఏదో మాట్లాడతాడు, అది అర్థం చేసుకునేందుకు మనం బుర్ర గోక్కోవాల్సిందే.)

**Pramod:** I'm with you there. He says too much and too fast. He just doesn't care whether he is intelligible or not and doesn't stay once he's finished what he has to say.





M.SURESAN

పై సంభాషణలో 'అర్థం చేసుకోవడం (understand)' అనే అర్థంతో ఎన్ని, ఎలాంటి మాటలు వాడొచ్చో చూద్దాం:

***Look at the following expressions from the conversation above:***

*1) Make head or tail of*
*2) Make of*
*3) Keep up with (what he wanted us to see)*
*4) Grasp*
*5) To be over somebody's head*
*6) Rack one's brains*
*7) Intelligible*
*8) It's beyond me*

**1. Make head or tail of something** = ఒక విషయాన్ని సరిగా అర్థం చేసుకోగలగడం. అయితే ఈ Phrase ను ఎప్పుడూ, 'ఏమీ అర్థం కాలేదు' అనే అర్థంతో not తో వాడతాం, తలాతోకా తెలియడం లేదనే భావంతో.

a) He is such a poor teacher that the students cannot make head or tail of what he teaches
= అతడు ఉత్త చెత్త టీచర్. అతడు బోధించేది విద్యార్థులకు తలాతోకా అర్థం కాదు.

b) I could not make head or tail of what he was driving at = అతడేం చెప్పేందుకు ప్రయత్నించాడో ఏమోకానీ, నాకు తలాతోకా అర్థం కాలేదు.

Drive at = ఏ విషయమైనా చెప్పేందుకు ప్రయత్నించడం.

What are you driving at? = ఏం చెప్పాలనుకుంటున్నావు నువ్వు?
ఏమిటి నువ్వు చెప్పాలనుకుంటున్నది?

**2) Make of** = అర్థం చేసుకోవడం

a) What I make of his words is that he does not like to go
= అతడి మాటలను బట్టి నాకర్థమవుతోంది అతడికి వెళ్లడం ఇష్టం లేదని.

b) What do you make of this letter? = ఈ ఉత్తరాన్ని బట్టి నువ్వర్థం చేసుకుంటున్నదేమిటి? / నీకర్థమవుతున్నదేమిటి?

c) Sundar did not know what to make of the information = ఆ సమాచారాన్ని ఎలా అర్థం చేసుకోవాలో సుందర్‌కు తెలియలేదు.

అయితే 'make of' కూడా ఎక్కువగా not తోనే వాడతాం, అర్థం కావడం లేదనే అర్థంతో.

**3) Keep up** = ప్రయత్నించి అర్థం చేసుకోవడం.

a) Listen to him with concentration if you want to keep up = నీకర్థం కావాలంటే కాస్త ఏకాగ్రతతో విను.

b) Learn good English to keep up with some of the greatest writers in English = English లోని గొప్ప రచయితల్లో కొందరిని అర్థం చేసుకునేందుకు English బాగా నేర్చుకో.

**4) Grasp** = అర్థంచేసుకోవడం/ విషయాన్ని గ్రహించడం.

a) The girl is intelligent enough to grasp even complicated matters = సంక్లిష్టమైన విషయాలను కూడా అర్థం చేసుకోగలిగినంత తెలివైందా అమ్మాయి.

b) The problem is too difficult to grasp = ఆ సమస్య సులభంగా అర్థం కానిది.

**5) Over somebody's head** = ఒకరి మేధాశక్తికి/ తెలివికి అందని విషయం.

a) Some parts of the Mahabharatam are over children's heads = మహాభారతంలోని కొన్ని అంశాలు పిల్లల మేధాశక్తికి/ తెలివికి అందవు/ అవి వాళ్లకర్థం కావు.

b) The lecturer goes over the heads of the students = ఆ లెక్చరర్ చెప్పేది విద్యార్థులకు అర్థంకాదు.

**6) Rack one's brains** = ఒక విషయాన్ని అర్థం చేసుకునేందుకు ఎంతో ప్రయత్నించడం/ సమస్యకు పరిష్కారం తోచకపోవడం.

a) The Central Government is racking its brain over the Telangana issue = తెలంగాణ విషయంలో కేంద్ర ప్రభుత్వానికేం తోచడంలేదు/ తెలంగాణ విషయం ఎంత ప్రయత్నించినా అర్థం కావడం లేదు/ దిక్కుతోచని స్థితిలో ఉంది.

b) The doctors are racking their brains over the prevention of Swineflu = స్వైన్‌ఫ్లూను ఎలా నివారించాలో డాక్టర్లకు అంతుపట్టడంలేదు

**7) Intelligible** = మాటలు/ రాత సులభంగా అర్థం కావడం

a) Though he is still a child, he is quite intelligible = వాడు పసిపిల్లవాడే అయినా వాడి మాటలు సులభంగా అర్థమవుతాయి.

b) Why do you complain about her handwriting? It is quite intelligible = ఆ అమ్మాయి చేతిరాత గురించి మాటలెందుకంటావ్? బాగానే అర్థం అవుతుంది కదా?

**8) Beyond somebody** = ఒకరు అర్థం చేసుకోలేని విషయం.

a) That book on philosophy is beyond me = ఆ వేదాంతం/ తత్వశాస్త్రం పుస్తకం నేనర్థం చేసుకోలేకపోతున్నాను/ నా అవగాహనకు అందనిది.

b) What the politician spoke was beyond the gathering = ఆ రాజకీయవేత్త ఏం మాట్లాడాడో వాళ్ల ఊహకందలేదు/ అర్థం కాలేదు.

---



***G.G. Rao, Visakhapatnam***

**Q.** కింది వాక్యాల్లో under line చేసిన పదాలకు తెలుగులో సమానార్థకాలను తెలపగలరు.

1. All legislators from Telangana cutting across the party lines are prepared to resign.
2. The reservations issue came to the fore on the side lines of Parliament sessions.
3. With the resignation of Mr.Reddy, other MLAs followed the suit.
4. Prajarajyam does a flip-flop on Telangana.
5. Political/ Religion/ Militant etc., outfit (Literal గా చూస్తే outfit ఎలా apply అవుతుంది? )
6. This new operation was an unchartered territory for surgeons.
7. He chronicled the events.
8. Hilarious entertainer.
9. A star in journalistic firmament.
10. Mr.Rao spearheaded the campaign.
11. The stand-off between the students and the Vice-chancellor was hijacked.

**A. 1.** Cutting across = సంబంధంలేకుండా/అతీతంగా/ తారతమ్యం లేకుండా.
Cutting across party lines = పార్టీ విభేదాలు లేకుండా.

**2.** Come to the fore = ప్రాముఖ్యం పొందడం/ బయటపడటం అందరూ గుర్తించేలా.
On the sidelines = ప్రాముఖ్యం లేని వర్గాల్లో.

**3.** Follow suit = అనుసరించడం.
The leader resigned from the assembly and the others followed suit = నాయకుడు రాజీనామా చేయడంతో, ఇతరులూ అతడిని అనుసరించారు (followed the suit కాదు).

**4.** Flip flop = నిలకడలేని మాటలు/ అభిప్రాయాలు/ వైఖరి.
తెలంగాణ విషయంలో నిలకడలేని ప్రజారాజ్యం వైఖరి.

**5.** Outfit = 1) సంస్థ. రాజకీయ/ మతపరమైన (RSS/ Muslim League లాంటి)/ తీవ్రవాద (Maoist/ Lashkar-e-Thoiba లాంటి) సంస్థలు.
2) సందర్భానికి తగినట్లు వేసుకునే దుస్తులు = The brides outfit was expensive = పెళ్లి కూతురు దుస్తులు ఖరీదైనవి.

**6.** Uncharted territory = ఏమీ తెలియని విషయం (unchartered కాదు).

**7.** సంఘటనలను అవి సంభవించే క్రమంలో (జరిగిన వరసలో) రాయడం

**8.** Hilarious = కడుపుబ్బ నవ్వించే.

**9.** Firmament = ఆకాశం.
(A star in the journalistic firmament = పత్రికాకాశంలో తార).

**10.** To spearhead = (ఉద్యమంలాంటి వాటిని) ముందుండి నడిపించడం

**11.** Stand off = ప్రతిష్టంభన - వివాదం/ పోట్లాటలో ఎవరూ పట్టు విడవకుండా ఉండటం.
ఈ sentence కు సరైన అర్థం రాదు. సందర్భం తెలిస్తే కానీ, అర్థం చెప్పలేం.

**Q.** కిందివాటికి shades of difference వివరించగలరు.

1. Time limit - Time frame.
2. Mind set - Frame of mind.
3. He gave them generously - He gave them liberally.
4. Douse fire - Extinguish fire.
5. Well recorded - Well documented.

**A. 1.** Time limit = కాలపరిమితి, Time frame = ఒక పనికి ఉన్న కాలవ్యవధి. (ఓ పని ఎంత సేపట్లో జరగాలనేది).

**2.** Mindset = మారని అభిప్రాయాలు/ వైఖరి
frame of mind = ఒక సమయంలో మనకుండే ఆలోచనా సరళి/ వైఖరి
In his frame of mind now cannot understand the problem we face
= ఇపుడతడి ఆలోచనా సరళిలో/ ఇప్పుడతడు ఆలోచిస్తున్న పరిస్థితిలో మన సమస్య అతడికి అర్థం కాదు.

**3.** Generously = ఉదారంగా (ఇవ్వాలనే కోరికతో ఇచ్చే మనస్తత్వం).
Liberally = ధారాళంగా (బాగా ఎక్కువగా ఇవ్వడం)

**4.** Douse (Dowse) = నీళ్లలాంటి ద్రవపదార్థాలతో బాగా తడపడం.
Douse fire with water = నీళ్లతో/ నీళ్లు పోసి మంటనార్పడం.
Extinguish = మంటను/ దీపాన్ని ఆర్పడం
We douse water over fire to extinguish it.

**5.** అవసరమైన పత్రాల ఆధారంగా నమోదు చేయడం, (రాసిన విషయాన్ని పత్రాలద్వారా నిరూపించగలగడం).

**Spoken English** పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. **URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



*A. Sudhakar, Peddamalla Reddy*

**Q.** Sir, Please define these words: Linguistics, Phonetics, Discourse analysis and text linguistics, Historical linguistics, Bilingualism, Language planning, The Indian linguistic tradition, Philosophy of language, Language testing, Stylistics, Phonemes, Allophones, Allomorphy, Morphemes.

**A.** మీరడిగినవన్నీ భాష (Language) కు/ భాషా పరిశోధనకూ సంబంధించిన technical విషయాలు. మీరు వివరణ అడిగిన పదాలన్నీ కూడా ఒక భాష పుట్టుక, పరిణామం, దాని చరిత్రలోని వివిధ దశలలో ఆ భాష పొందిన మార్పులు, (మాటల్లోనూ, రాతలోనూ), దాని వ్యాకరణం, ఉచ్చారణ మొదలైనవాటికి సంబంధించినవి. ఇవి చాలా technical విషయాలు, మామూలుగా grammar కూడా దాదాపు ఇంతేకదా? నాకు చేతనైనంతవరకూ, ఈ technical విషయాలను, వీలయినంత సులభంగా అర్థమయ్యే విధంగా వివరిస్తున్నాను.

e.g.: praised (praist)
buzzed - (buzd)

పై ఉదాహరణలో praised లో 't' శబ్దం, buzzed లో d శబ్దం allomorphs. ఈ ప్రక్రియను allomorphy అంటాం.

**Discourse analysis:** దీన్నే discourse study అంటారు. written (రాసే), spoken (మాట్లాడే) భాషనుగానీ, సంజ్ఞలతో కూడిన భాషనుగానీ విశ్లేషించే విధానాన్ని Discourse Analysis అంటారు. చర్చ, రాత, సంభాషణ వంటి వాటిల్లో భాషా ప్రయోగం ఎలా ఉంటుందో పరిశీలించడం దీని ముఖ్యోద్దేశం.

**Text linguistics:** Communication కు వాడే Texts ను analyse చేయడం (విశ్లేషించడం), అంటే texts (పుస్తకాల, మాటల్లోని భాష) లోని మొత్తం విషయాన్ని grammar point of view లో పరిశీలించడం.

**Historical linguistics:** The study of the changes in the spoken and written from of a language during its use from the beginning, and finding out to which group the language(s) belong(s).

భాషా ప్రయోగాలను అధ్యయనం చేసే విషయం. అయితే literature లో stylistics అంటే అర్థం కొంత తేడాగా వస్తుంది. This includes the style of writing, choice of words by the writer/ speaker, the use of figures of speech and words, etc.




*KK Reddy, Hyderabad*

**Q.** Sir, కిందివాటికి తెలుగులో అర్థాన్ని తెలిపి Grammar పరంగా వివరించగలరు.

Would rather/ sooner and prefer/ would prefer; Rather than - would - infinitive; would care - would like; Would have cared (for)/ would have liked; If, even if; Whether.. or - If.. or; Hardly/ scarcely... when... no sooner... than; No matter, however.

# Would you care for some coffee?

**Linguistics:** ఒక భాష తీరుతెన్నులూ, స్వభావాల అధ్యయనం. (The scientific study of a language). ఇందులో వ్యాకరణం (grammar), study of the meanings of words (ఏ మాట ఎలా పుట్టి, ఎలా అర్థాలు పొందిందనే అంశం), syntax (వాక్య నిర్మాణం), and phonology (study of the sounds in a language) భాగాలుగా ఉంటాయి.

**Phonetics:** Phonetics is the study of speech sounds. మాట్లాడేటప్పుడు, మనం భాషా శబ్దాలను ఏయే అవయవాలు (organs) ఉపయోగించి ఉచ్చరిస్తామో, ఆ శబ్దాలు ఎలా వస్తాయో తెలిపే శాస్త్రం. ఉదా: English లో P అనే అక్షరం తెలిపే శబ్దాన్ని (తెలుగులో 'ప' శబ్దం), పై పెదవి, కింది పెదవిని కలిపి చేస్తాం. ఇలాంటి విషయాలను చర్చించే subject phonetics.

**Phonemes:** A group of similar sounds in a language. అంటే దాదాపు ఒకే శబ్దంగా వినిపించే శబ్దాలన్నింటినీ ఒక phoneme అంటాం. e.g.: In English, take the pronunciation of 'P' in 'pin' and in 'spin'. Pin లో 'P' ని ఫి గా ఉచ్చరిస్తాం; spin లో p ని పి గా ఉచ్చరిస్తాం. అయితే ఈ భేదాన్ని అంతగా పట్టించుకోరు English మాట్లాడేవాళ్లు. ఇక్కడ pin లో p (ఫి), spin లో p (పి) రెండూ ఒకే వర్గానికి చెందిన శబ్దాలుగా భావిస్తాం. ఇలా పోలికలుండే శబ్దాల group ను phoneme అంటాం. ఫి, పి కూడా 'p' phoneme కు చెందినవి. Phoneme ను / / - ఈ చిహ్నం వాడి చూపిస్తాం. P in pin and in spin ను /p/ లా చూపిస్తాం. Phone అంటే శబ్దం. ఒకే రకంగా వినిపించే శబ్దాలన్నింటిలో ఒక్కొక్కదాన్నీ Phoneme అంటాం.

**Morpheme** భాషలో అర్థం తెలపగల అతి చిన్న శబ్దాన్ని Morpheme అంటాం. It is the smallest linguistic unit having meaning అయితే morpheme కు, word కు తేడా ఉంది. Morphemes అన్నింటికీ అర్థం ఉన్నప్పటికీ, వాటిలో ప్రతి morpheme నూ word (పదం)గా వాడలేం. e.g.: unbeatable - ఈ మాటలో మూడు morphemes ఉన్నాయి - 1) un, 2) beat 3) -able. వీటిలో beat కు మాత్రం స్వతంత్రంగా అర్థం ఉంది - కాబట్టి అది, morpheme మాత్రమే కాకుండా, word కూడా. అయితే, 'un-', '-able' - ఇవి రెండూ మనం independent గా వాడం - 'bear' లాంటి మాటల అర్థాన్ని మార్చేందుకు వాడతాం. కాబట్టి, 'un-', 'able', morphemes మాత్రమే, words కావు.

**Allomorph:** శబ్దంలో మాత్రమే తేడా ఉండి అర్థంలో తేడా లేని morphemes ను allomorphs అంటాం. ఉదా: Past tense form చేయడానికి, verb కు '-ed' చేరుస్తాం. దీన్ని కొన్ని సమయాల్లో 'ed' గా, కొన్ని సమయాల్లో 't' గా ఉచ్చరిస్తాం.

SPOKEN ENGLISH
ఆంగ్లభాషణ 584


M.SURESAN

**Bilingualism** 1) The ability to communicate effectively in two languages - రెండు భాషలు మాట్లాడగలగడం, అనర్గళంగా. 2) రెండు భాషలు ఉపయోగించడం ఏ పనికైనా.

**Language planning:** మారే సాంఘిక అవసరాలు, ప్రయోజనాలకు అనుగుణంగా ఒక భాష నిర్మాణంలో, బోధనలో, ఉపయోగంలో, ప్రయత్నించి మార్పులు తేవడం language planning- ఇది ఎక్కువగా ప్రభుత్వం చొరవతో జరిగేది. Language planning is an effort to cause changes in the function, structure or the way it is taught with the goal of effective communication. (ఉదా: తెలుగు భాషలో కొన్ని మాటలు కొన్ని English మాటలకు సమానమైనవిగా ప్రభుత్వ పరిభాషలో వాడటం. అంతేకాకుండా ఆధునిక తెలుగు లిపిలో ఋ, ౠ లాంటి అక్షరాల తొలగింపు కూడా.)

**The Indian linguistic tradition:** The origin, growth and evolution of the languages of India - their structure, grammar, the study of meaning and sentence construction.

The philosophy of language deals with the nature, origin and use of language. It is also the study of the nature of meaning, the use of language, the understanding of language, and how language is connected with reality. (భాషా స్వభావం, దాని మూలం, దాని ఉపయోగం, అర్థం స్వభావం, భాష ఎలా అర్థం అవుతుంది, వాస్తవికతకు ఉన్న సంబంధం లాంటివి అధ్యయనం చేయడం)

**Philosophy of language** అంటే 4 ముఖ్యమైన అంశాలను, 1) అర్థం స్వభావం (The nature of meaning) 2) భాషోపయోగం (use of language) 3) భాషలోని మాటలను మాట్లాడేవారు గుర్తించే ప్రక్రియ (దీనిని cognition of language అంటారు), 4) భాషకు వాస్తవానికి ఉన్న సంబంధం (the relationship between language and reality)- వీటిని అధ్యయనం (study) చేయడం.

**Language testing:** భాషా పరిజ్ఞానం పరీక్షించడం.

**Sytlistics:** A branch of linguistics dealing with the varieties of a language its properties, dialogue, accent, etc - భాషలోని వైవిధ్యాలు, భాషా స్వభావం, సంభాషణలోని

**A. Would rather/ sooner/ prefer/ would prefer-** ఇవన్నీ మన ఇష్టాలను, అంటే preferences ను తెలిపే expressions.

I prefer starving to eating in that restaurant = I would rather starve than eat in that restaurant = I would sooner starve than eat in the restaurant

= నేను పస్తుయినా ఉంటానుగానీ ఆ హోటల్లో మాత్రం తినను. (పస్తుండటానికి ఎక్కువ ఇష్టపడతాను అక్కడ తినేందుకంటే)

He prefers death to slavery

= అతడు బానిసత్వానికంటే మరణాన్నే ఎక్కువ ఇష్టపడతాడు.

Rather than travel by that over crowded bus, let us walk/ We had better walk

= ఆ జనంతో నిండిన బస్‌లో ప్రయాణం కంటే మనం నడవడం మేలు.

ఇలాంటిచోట్ల would తర్వాత infinitive రాదు. Would like తర్వాత infinitive వస్తుంది.

I am tired. I would like to have some sleep. Would like to have = would like + infinitive (to have) = ఇష్టం/ నిద్రపోవాలని అనిపిస్తోంది.

Would care = would like

= ఇష్టపడటం/ కోరుకోవడం.

I would like to have some coffee

= నాకు coffee తాగాలనుంది.

అయితే would care అనేది నీకిష్టమేనా? అని questions లోనే వాడతాం.

Would you care for some coffee?

= కాస్త coffee తీసుకుంటారా? (offer- coffee, offer చేసే భావంతో) ఇక్కడ care = like

Would have cared = Would have liked = ఇష్టపడటం జరిగేదే (గతంలో)

I was so tired that I would have liked some coffee = అప్పుడు (గతంలో) చాలా అలసిపోయాను. coffee ఉంటే బాగుండేది (coffee లేదు)

**If** = అయితే

If you smoke like this, you will lose health = నువ్విలా సిగరెట్ తాగితే, ఆరోగ్యం కోల్పోతావు.

Even if = అయినా (ఏది జరిగినా)/ అయినా కూడా Even if you fly, you cannot reach there before 10 o' clock = నువ్వు విమానంలో వెళ్లినా/ వెళ్లడం జరిగినా/ వెళ్లినా కూడా అక్కడికి 10 గంటల ముందు చేరలేవు.

**Whether... or** = అయినా, అవకపోయినా/ జరిగినా, జరగకపోయినా.

Whether he allows me or not I will go = నన్నతడు అనుమతించినా అనుమతించకపోయినా నేను వెళతాను.

Whether... or = If ... or = అవుతుందో/ అవదో.

Nobody knows whether (if) he is there or not

= అతడక్కడ ఉన్నాడో లేడో ఎవరికీ తెలియదు.

She has not told me whether (if) she likes it or not

= ఆమె దాన్నిష్టపడుతుందో లేదో నాకు చెప్పలేదు.

**Hardly** = scarcely = Almost not/ never = దాదాపు లేదు/ లేకపోవడం.

He hardly/ scarcely comes here

= అతడిక్కడికి రాడు.

**Hardly when** = Scarcely when = no sooner... than = ఏదైనా జరిగీ జరగకముందే. అయితే sentence construction కాస్త complicated గా ఇలా ఉంటుంది.

Hardly/ Scarcely had we entered (had + subject + past participle) the room when the phone rang = No sooner had we entered the room than the phone rang

= మేం గదిలోకి వెళ్లీవెళ్లకముందే phone మోగింది.

అయితే ఒక్కోసారి, Hardly/ Scarcely/ No sooner తో కాకుండా, subject తోనే sentence ను ప్రారంభించవచ్చు ఇలా:

We had hardly/ scarcely entered the room when the phone rang = We had no sooner entered the room than the phone rang.

ఇక్కడ గమనించాల్సిన విషయం, Hardly/ Scarcely/ No sooner తో ఉన్న clause లో Verb past perfect tense (had + past participle) లో ఉండటం.

**No matter** = ఏదేమైనా, ఎంతైనా

No matter where you search you cannot find such a book

= నువ్వెంత/ ఎక్కడ వెదికినా, అలాంటి పుస్తకం నీకు దొరకదు.

No matter how you try you cannot change him = నువ్వెంత ప్రయత్నించినా అతడిని నువ్వు మార్చలేవు.

**However:** సరైన writing/ speaking లో sentence ను but తో ప్రారంభించం. అలా ప్రారంభించాల్సి వస్తే, However వాడతాం.

He was here, but did not see me = He was here. However he did not see me.

*G.Shankar, Kesavapatnam*

**Q.** Dear Sir, I saw a sentence in a work book (VI class English medium) "Ajit kept the soap in a box. There was already a soap in it".

Soap is uncountable noun. But here why did use 'a soap'? It is a government text book and prepared by CIEFL. If there is an exception please clarify it.

**A.** 'A soap' is certainly wrong, even if it appears in a Government publication. As you have said, 'soap' is uncountable, and so, has no 'a'/ 'an' before it. You can point out the error to the CIEFL (now EFLU) Editors of the book. Perhaps it is an oversight/ printer's error.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# He saw the movie yesterday





M.SURESAN



***A. Sudhakar, Pedda MallaReddy***

**Q.** What are the differences among the simple present, the simple future the present perfect, the past perfect and the simple past tenses?

**A. Simple present/ Present simple** - e.g.: come, (with I, we, you and they), comes (with he, she and it) - used for regular actions of any type- habits, facts of science, universal truths, repeated actions with words like frequently, often, etc.

**Simple future -** verb form- shall/ will come, shall/ will go, etc.

**Uses:** future actions - I shall see him tomorrow/ He will come here in a few days, etc.

**The present perfect-** verb form- (I, we, you, and they) have + past participle; (he, she, it) has + past participle- e.g.: Have gone/ has gone; have/ has seen, etc.

**uses:**

1) Past actions, time not stated:

She has seen the movie - action over (past), time of action not known.

2) Action starting in the past and continuing till now

i) They have lived here for the past/ last ten years (they started living here ten years ago and have lived till now)

ii) She has sung for 100 movies so far/ till now/ until now. (Right from the time she started singing to this day)

iii) He has not seen the movie yet (ఇంత వరకూ/ ఇంకా అతడా సినిమా చూడలేదు- చూడకపోవడం ఇంతవరకూ జరిగింది)

**The past perfect tense** - verb form - had + past participle- e.g.: had seen, had gone, had bought, etc.

**Uses:** The first of two part actions (గతంలో జరిగిన రెండు పనుల్లో మొదటిది)

i) He said that he had bought a car. (తను కారు కొన్నానని చెప్పాడు)- buying is the first past action, and saying is the second action. so 'buying' is in the past perfect tense.

ii) I went to his room but by then he had left (అతడి గదికి నేను వెళ్లాను, కానీ అతడప్పటికే వెళ్లిపోయాడు)

వెళ్లిపోవడం ముందు జరిగిన first past action- అందుకని had + past participle (past perfect tense)

**The simple past/ past simple-** eg: came, went, saw, loved etc.

**Use:** For a past action at a definite time/ time known.

I bought the car last year

(నేను క్రితం సంవత్సరం కొన్నానా కారును)- ఇక్కడ last year అని time చెబుతున్నాను - జరిగిపోయిన action కు.

Past simple ఎప్పుడూ గతంలో ఫలానా సమయం (Definite time) లో జరిగిన పనిని తెలుపుతుంది.

Present perfect కూడా, Past action నే తెలుపుతుంది, అయితే present perfect వాడినప్పుడు time చెప్పం.

He has seen the movie (అతడా సినిమా చూశాడు)- verb: has seen- present perfect- చూడటం, past లో. కానీ past లో ఫలానా సమయం అని చెప్పడం లేదు.

He saw the movie yesterday (అతడు ఆ సినిమా నిన్న చూశాడు)- Verb- saw- past simple tense- ఇది కూడా past action. అయితే ఇక్కడ yesterday అని action జరిగిన time చెబుతున్నాం. ఇదీ present perfect కు, Past simple కు తేడా.

He has come (అతడొచ్చాడు- verb- has come- present perfect- వచ్చిన time చెప్పడం లేదు)

He came last night (అతడు నిన్న రాత్రి వచ్చాడు)- verb- came- past simple- నిన్న వచ్చాడు, అని వచ్చిన time తెలుపుతున్నాం)

These are the important differences among the various tenses.

***P. Simhachalam, Vijayawada***

**Q.** కింది పదాలను తెలుగులో అనువదించి, వాటి గురించి వివరించగలరు. 1. పునరుద్ఘాటించడం 2. చిలవలు పలవలుగా 3. ఆవేదన వ్యక్తం చేయడం 4. నూతనోత్సాహం పెల్లుబికింది 5. నిరసన వ్యక్తం చేయడం 6. స్పష్టం చేయడం 7. నర్మగర్భంగా 8. సంఘీభావం వ్యక్తం చేయడం 9. పావులు కదపడం 10. అడుగులకు మడుగులొత్తడం 11. జోస్యం చెప్పడం 12. చర్నాకోలా 13. క్షంతవ్యం 14. వెంపర్లాడటం 15. ఔచిత్యం 16. ఆరోపించడం 17. దిగజారుతోంది 18. మద్దతు ఇవ్వడం 19. కలకలం రేపింది 20. కునారిల్లుతున్నారు 21. తేటతెల్లం చేసింది 22. ఆంక్షలు విధించింది 23. తీవ్రంగా ఖండించడం 24. తల్లడిల్లి పోతున్నారు. 25. కసరత్తు 26. సమీక్షించారు 27. అనివార్యం 28. క్రమబద్ధీకరించాలని 29. ఆదేశించింది 30. వ్యాఖ్యానించారు 31. కర్కశంగా.

**A.** 1. Reiterate 2. Embellish 3. Express anguish 4. A new enthusiasm surged 5. Express protest 6. Make clear 7. Indirectly 8. Express solidarity 9. Making moves 10. Toadying 11. Predict/ Foretell/ Prophesy 12. Whip 13. Excusable/ Pardonable 14. Long for 15. Propriety 16. Complain 17. Deteriorating 18. Support 19. Cause flutter 20. Languishing 21. Lay bare 22. Imposed restrictions 23. Condemn Strongly 24. Seriously worried/ upset 25. Exercise 26. Reviewed 27. Inevitable/ Unavoidable 28. Regularise 29. Ordered/ Directed 30. Commented 31. Cruelly.

**Q.** కిందివాటిని ఉదాహరణలతో వివరించగలరు.

is+suspected + to+have+ past participle

was+suspected+to+have+ past participle

be form (is was)+ understood+to+have+p.p.

**A.** a) His relatives are + suspected (be from) to have + committed + the murder (past participle)

b) She is suspected to have (be) stolen the necklace. (Past Participle)

**Q.** వార్తాపత్రికల్లో రిపోర్టులను ing form past participle తో ప్రారంభిస్తారు కదా? వీటిని ఎలా అర్థం చేసుకోవాలి?

**A. 1** a) Prime Minister visiting AP today

= ఈ రోజు AP కి వస్తున్న ప్రధానమంత్రి

b) India signing pact with the US

= యూఎస్ తో ఒప్పందం కుదుర్చుకుంటున్న భారత్ ఇలాంటిచోట్ల '...ing' form కు అర్థం, జరుగుతున్న/ చేస్తున్న/ వస్తున్న ... ఇలా వస్తుంది.

**2** a) New bridge inaugurated (PP)

= ప్రారంభించబడిన కొత్త వంతెన.

b) House site pattas distributed (PP)

పంపిణీ చేయబడిన ఇళ్లస్థలాల పట్టాలు. English లో Past Participle కు అర్థం, 'చేయబడిన' అని వస్తుంది.

**Q.** English to Telugu, Telugu to English Translator గా పని చేయదలుచుకున్నాను. ఇందుకు కోచింగ్ అవసరం లేకుండా ఎలా ప్రిపేర్ కావాలి? ఇలా ప్రాక్టీస్ అవడానికి సహకరించేందుకు అవసరమయ్యే పుస్తకాల గురించి తెలపగలరు.

**A.** మీరు English నవలల తెలుగు అనువాదాలు, English newspapers లోని reports, తెలుగు వార్తాపత్రికల్లోని report - ఒకే విషయం మీద ఉండేవి పోల్చుకుని, గ్రహించాలి. అయితే ఇందుకు మీరు చాలా కృషి చేయాల్సి ఉంటుంది. English లో ఉన్న matter తెలుగులో translate చేసి, దాన్ని మళ్లీ మీరే English లోకి translate చేసుకోవాలి. మీ English translation ను, Original English Passage తో పోల్చి చూసుకుంటూ ఉండాలి. ఇలా చేయడం ఉత్తమమైన మార్గం.

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థం తెలపగలరు.

1. Chiru strikes a chord with people
2. En masse
3. U - Turn అంటే ఏమిటి?
4. ఆంగ్ల వార్తాపత్రికల్లో పెద్ద వాక్యాలను ఎలా అర్థం చేసుకోవాలి? ముఖ్యంగా కామాలు పెట్టిన వాక్యాలు చాలా పెద్దవిగా ఉంటాయి. అలాగే past participle ను వాక్యంలో వాడే తీరు అర్థం కావడంలేదు. దయచేసి వీటన్నిటినీ ఎలా అర్థం చేసుకోవాలో తెలపగలరు.

**A.** 1) చిరు ప్రజల్లో స్పందన కలిగించాడు.

2) మూక ఉమ్మడిగా (అందరూ కలిసి ఒకేసారి)

3) ఒక వైపు ముందుకు వెళ్లి, కుడివైపు తిరిగి అదే మార్గంలో వెనక్కి రావడం - ఇలా చేసేందుకు వీలున్న Road భాగం - ఇది English అక్షరం U ను పోలి ఉంటుంది.

4) చదువుతూ ఉంటే, కొంతకాలానికి మెల్లగా అర్థమవడం మొదలవుతుంది. ముఖ్యంగా మీరు English పద జ్ఞానం పెంచుకోవాలి. మంచి Dictionary అవసరం - Paper మొత్తం చదివిన తర్వాత, చదివేటప్పుడు కాకుండా, మీకు గుర్తుండే కఠిన పదాలూ, వాటి వాడుకా చూడండి. Dictionary లో. తరచూ TV లో English News casts కూడా చూస్తూ ఉండండి. ఎక్కడ English కనిపిస్తే అక్కడ చదవండి.

***Raja, Yellandu.***

**Q.** Please clarify the following doubts and you are requested not to ask me to refer to a dictionary, as I am not understood. 1. Experiment 2. Practical 3. Law 4. Rule 5. Regulation 6. Ordinance 7. Instruction 8. Orient 9. code 10. Society 11. Association 12. Analysis 13. Institute 14. Organisation 15. Restriction 16. Finance 17. Economic.

**A. Experiment:** 1) Usually a scientific test to find out what happens when we try out something new or to know what is correct. 2) An activity/ method we try out to find out what happens in a particular situation.

**Practical:** Connected with real life rather then with ideas or theories. For example, an experiment is conducted to get practical experience - to find out if a theory or idea is correct or not.

**Law:** A rule enforced by a government in connection with a particular situation.

**Rule:** A Government organisation/ an institution/ a private organisation's statements about what a person should do, should not do, may do, may not do, etc.

**Regulation:** A regulation is also a rule, but a regulation is more about what we should not do rather than what we should do.

**Ordinance:** A law a government enforces/ an act which a government makes without it being passed by an Assembly/ Parliament when they are not in session. It has, however, to be approved by the Assembly/ Parliament later.

**Instruction:** Stating what we should/ should not do - an instruction may not have then force of a rule, regulation or a law.

**Orient:** 1) East (direction) 2) guide or direct

**Code:** 1) A set of rules that the people in a group or society have to follow they may not have the power of a rule/ law. 2) A code language is a kind of secret language used by a group of people.

**Society:** 1) A group of people living in the same area and following the same customs, traditions and patterns of behaviour. 2) A number of persons forming into a group for same common purpose. e.g.: A teachers' society/ A scholars' society.

**Association:** A group of persons of the same profession/ occupation. An association is usually formed to take care of the interests/ rights of its members.

**Analysis:** Studying something very thoroughly to understand it completely. This is done usually by studying each part of a thing/ each aspect of a situation and thus to understand the whole of it.

**Institute:** An organization with a particular purpose- especially an educational institution- or a group of people of a particular profession.

**Organization:** A group of people forming a business, a club to achieve some thing in any field- business, politics, social service etc.

**Restriction:** A rule not allowing you to do some thing.

**Finance:** Money and connected with money.

**Economic:** Connected with the acquiring, spending, investing and the availability or lack of money, etc.

**Q.** Why don't we say 'Economic Minister' instead of saying 'Finance Minister'?

**A.** We say mostly finance minister because it is the responsibility to provide money for the country's plans and programmes.

We do not say an economic minister- Economic here means the study of the generation, spending and availability or the lack of it. However, some countries have Ministers for economic affairs which may mean a finance minister.

Lastly please note this: understand the difference between, 'you are requested' (as you wrote in your letter) and, 'I request you'. 'You are requested' is almost an order, while, 'I request you' is a proper request/ plea. Or you can say, 'Please/ kindly do not ask me to refer to a dictionary'.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# He came up by dint of hard work



***A. Saiprasad, Kusthapur.***

**Q.** What is the difference among Advocate, Barrister, Pleader, Lawyer.

**A.** Advocate = Lawyer. అయితే court వ్యవహార పరిభాషలో Advocate అనే ఎక్కువగా వాడతారు. ఒకరి తరఫున వకాల్తా పుచ్చుకున్న lawyer ను, వారి తరఫున advocate అంటారు. ఇది మన దేశంలో ఎక్కువ.

Barrister = England లో న్యాయశాస్త్రం అభ్యసించినవాళ్లు.

Pleader = ఇంతకుముందు (గతంలో) భారతదేశం లోని లాయర్లను (Law degree లేకుండానే కోర్టుల్లో వాదించేందుకు అనుమతించే రోజుల్లో) pleader అనే వాళ్లు. ఇప్పుడీ పదం అధికారికంగా వాడుకలో లేదు.

**Q.** What are the full forms of various bank accounts given below:

S.B. A/C, C.A. A/C, R.D. A/C, A.C.C. A/C, O.D. A/C, C.C. A/C.

**A.** SB A/C = Savings Bank Account (పొదుపు ఖాతా)

CA A/C = Current Account

RD A/C = Recurring Deposit Account

ACC A/C = ఇది లేదు.

OD A/C = Over Draft Account

CC A/C = Cash Credit Account

**Q.** క్రికెట్‌లో double century. Triple century అన్నట్లే 400, 500, 600 రన్స్ చేస్తే ఏమంటారు?

**A.** 400 - Quadruple (century)

500 = Quintuple (century)

600 = Sextuple (century)

**Q.** Blood - దీన్ని బ్లడ్ అంటారు. Foot- దీన్ని ఫుట్ అంటారు. అలాగే But, Put... ఇలాంటివి ఎన్నో ఉన్నాయి. కొత్త అభ్యాసకులకు ఎలా పలకాలో అర్థం కాని ఈ తికమక ఏమిటి? ఇలాంటి పొంతన లేని ఉచ్చారణలు ఎలా ఆవిర్భవించాయి? పాఠశాలల్లో విద్యార్థులు అడిగే ఇలాంటి సందేహాలకు ఉపాధ్యాయుడిగా ఎలా సమాధానమివ్వాలి?

**A.** ఇది చాలా పాత ప్రశ్నే కదా? ఇది English Spelling, Pronunciation కు సంబంధించిన విషయం. దీనికి ప్రత్యేకమైన పద్ధతి అంటూ లేదు. అది అంతే అని చెప్పండి.

**Q.** Explain these words concerned Finance and Salaries. Bonus, Stifund, Increment, Time Scale, Master Scale, Pay, Divident, Fitment, Commutation, Pension, Basic, Relief, Allowance, Gratuity.

**A.** Bonus = పనిని సమర్థంగా చేసి లాభాలను పెంచినందుకు కానుకగా కార్మికులకు యాజమాన్యం ఇచ్చే నగదు పారితోషికం.

Stipend (Stifund కాదు) = శిక్షణ కాలంలో శిక్షణ పొందేవారికి చెల్లించే డబ్బు.

Increment : జీతంలో ఏడాదికేడాదికి పెంచే మొత్తం

Time Scale : 1) (జీతాల విషయంలో) ఒక నిర్ణీత కాల వ్యవధిలో ఉద్యోగుల ప్రారంభ వేతనం. (Starting Salary), ప్రతి సంవత్సరం ఇచ్చే increment తో కాల వ్యవధి చివర వచ్చే గరిష్ఠ వేతనం. ఇది ఇలా ఉండొచ్చు 15000 2000 35000 = రూ. 15000 తో ప్రారంభమై, ఏడాదికి రూ. 2000ల పెంపుతో 10 ఏళ్లలో రూ. 35000 అవుతుందని. ఇది time scale.

2) ఓ నిర్ణీత కాల వ్యవధి.

Master Scale = నాకు తెలిసి ఇలాంటి మాట లేదు.

Pay = జీతం

Dividend (Divident కాదు) - ఓ company తనకు వచ్చిన లాభంలో వాటాదార్లకు వారి వాటాల నిష్పత్తి ప్రకారం పంపిణీ చేసే సొమ్ము.

Fitment - ఓ ప్రదేశ స్వభావాన్ని బట్టి అక్కడ వాడే furniture/ ఇతర సామగ్రి- e.g. : Bathroom fitment = Bathroom లో అమర్చే Wash basin, bathing stool, etc. (మన దేశంలో fitment ను తప్పుగా, ఒక Pay Scale నుంచి ఇంకో pay scale కు ఉద్యోగి మారేటప్పుడు కొత్త scale లో ఇచ్చే మూల వేతనం level ను fitment అంటుంటారు).

Commutation = ఒక లెక్క ప్రకారం ఇస్తున్న జీతాన్ని ఇంకో రకమైన లెక్కలోకి మార్చడం.

Commutation of Pension = Retire అవుతున్నపుడు పొందుతున్న జీతాన్ని బట్టి pension లెక్కగట్టడం.

Basic = మూలవేతనం. జీతంలో కలిపే కరువు భత్యం (Dearness Allowance - DA), House Rent.

Relief = ధరలు పెరిగినప్పుడు, ఉద్యోగులకు ఊరటగా ఇచ్చే సొమ్ము సహాయం.

Allowance = HRA - (ఇంటి అద్దె భత్యం) లాంటివి కలపకుండా.

Gratuity = ఉద్యోగి అందించిన సేవలకు, వారు retire అయేటప్పుడు (పదవీ విరమణ చేసేటప్పుడు) ఏక మొత్తంగా ఇచ్చే సొమ్ము.

**Q.** Bhuvaneswar ను Bhubaneshwar అని రవీంద్రనాథ్ ఠాగూర్‌ను Rabindranath Tagore అని ఎందుకు రాస్తారు?







**A.** ఒరియా, బెంగాలీ భాషల్లో 'వ' కు బదులు, 'బ' పలుకుతారు.

**Q.** What is the difference among yard, Storage, Plant, Stall, Shed, Exchange, Cafe.

**A.** Yard = An open place for a special purpose/ stocking something/ business (దొడ్డి).

Storage = నిల్వ ఉంచడం.

Plant = Machinery used in industries = పరిశ్రమల్లో వాడే యంత్రం/ యంత్రాలు.

Stall = వస్తువులమ్మే దుకాణం/ చోటు.

Shed = కప్పుతో ఉన్న విశాలమైన గది, ముఖ్యంగా పరిశ్రమలు నిర్వహించేందుకు/ వస్తువులు నిల్వ ఉంచేందుకు ఈ గోడలు, ఇటుకలతోనే కాకుండా, ఇతర వస్తువులతో నిర్మించి ఉండొచ్చు

Exchange = మార్పిడి; మార్పిడి జరిగే చోటు (Shares లాంటివి).

Cafe = ఆహార పదార్థాలు, పానీయాలు కొని, తిని తాగేందుకు వీలుండే చోటు = Restaurant.

**Q.** కింది ఆంగ్లపదాలను తెలుగులో ఏమని చెప్పవచ్చు? Hotel, Tailors, Gazetted, Xerox, Cabinet, Check book, Auditorium, Classical, Round figure, Indian ink.

**A.** Hotel, Tailor - English - Telugu dictionary చూడండి.

Gazetted - Gazette (గజెట్) ప్రజలకు సమాచారం తెలిపేందుకు ప్రభుత్వం అధికారికంగా గవర్నర్ పేరుతో ప్రచురించే పత్రిక. ఇందులో ప్రచురించిన విషయం అయితేనే ప్రామాణికం.

ఒకస్థాయి ప్రభుత్వ అధికారుల నియామకాలు (హోదాను బట్టి), బదిలీలు, retirement లాంటి వాటిని Gazetteలో ప్రకటిస్తుంది ప్రభుత్వం. అలాంటి అధికారులను Gazetted Officers అంటారు.

Xerox = పత్రాల నకళ్లు తయారు చేసే పద్ధతి = Photocopy, Cabinet, Cheque (Check కాదు) book, Auditorium, Round figure, Indian ink వీటికోసం English - Telugu Dictionary చూడండి.

**Q.** What is the difference among - Institute, Academy, Association, Wing, Society, Panel, Camp, Federation, Alliance, Front, Committee, Organisation, Forum, Union, Party, Council, Assembly, Firm, Group, League, Club, Bureau, Institution,

**A.** Institute, Institution, Association, Society, Organisation, Assembly-- వీటి గురించి ఇటీవలే వివరించాం.

Academy = విద్యా, కళా, శాస్త్ర విషయాల్లో ప్రత్యేక శిక్షణ ఇచ్చే సంస్థ లేదా వాటిని ప్రోత్సహించే సంస్థ.

Wing = విభాగం; Panel = Committee

Camp = విడిది/ ఉద్యోగులు/ అధికారులు తమ విధి నిమిత్తం వెళ్లేచోటు

Federation = సమాఖ్య - a group of organisations with similar purposes.

Alliance = కూటమి - యుద్ధాల్లో, రాజకీయాల్లో కొన్ని దేశాలు/ వర్గాలు కలిసి ఏర్పడేవి.

Forum = వేదిక - ప్రజలు తమకున్న అభిప్రాయాలను ఒకరికొకరు తెలియపరచుకునేందుకు/ అందుకు ఏర్పాటు చేసే సభ.

Union = ఒకేవృత్తి/ వ్యాపకంలో ఉన్నవారి సంఘం

Council = మండలి - పాలనాపరమైన విషయాలు చూసుకునే ప్రజల/ అధికారుల మండలి - ప్రభుత్వపరమైన లేదా సంస్థల పరమైన.

Firm = వ్యాపార సంస్థ

Group = బృందం- ఎలాంటి ప్రజాబృందమైనా.

League = ఒక ఉద్దేశ సాధనకు ఏర్పడే ప్రజల, సంస్థల, దేశాల సంఘం..

Club = ఒకే ఉద్దేశంతో, ఒకే ఆశయ సాధనకు క్రమంతప్పకుండా సమావేశమయ్యే ప్రజల బృందం.

Bureau = ప్రభుత్వ కార్యాలను నిర్వహించే సంస్థ; సమాచారం ఇచ్చే కార్యాలయం.

**Q.** What is the difference between-

Crimson - Red, Courtesy - Source, Tender - Auction, Guidance - Counselling, Tribunal - Commission, Insurance - Exgratia, Views - Ideas, Cancel - Delete, Moratorium - Prohibition, Panic - Disaster, Quotation - Invoice/ Estimate, Motto - slogan, Scrutiny - Verification, Jail- Prison, Suspend - Dismiss, Xerox- Photostat, Gift-Presentation, Altimatum - Warning

**A.** ⊙ Crimson = deep/ dark red

⊙ Tender = వేలంలో పాల్గొనేవాళ్లు పాడేపాట; ఇచ్చేందుకు ఒప్పుకునే మొత్తం;

Auction - వేలం వేయడం/ వేలం

⊙ Tribunal= ఒక సమస్యను పరిశీలించే/ వివాదాలను పరిష్కరించే అధికారం ఉన్న న్యాయస్థానం;

Commission = ఒక సమస్యకు పరిష్కారం కనుక్కునేందుకు, నివారించేందుకు, సమాచారం సేకరించేందుకు, అధికారం ఉన్న ప్రభుత్వ సంస్థ.

⊙ View = అభిప్రాయం; Idea = ఆలోచన.

⊙ Moratorium = పరస్పర ఒప్పందంతో ఏదైనా చర్యలు, కార్యకలాపాలను తాత్కాలికంగా నిలిపేయడం;

Prohibition = ప్రభుత్వాలూ/ సంస్థలు విధించే నిషేధం.

⊙ Quotation = ఒక వస్తువు అమ్మేందుకు/ సేవలను అందించేందుకు ఒక సంస్థ చెప్పే ధర;

Invoice = చేసిన పనికీ, సరఫరా చేసిన వస్తువులకు, కొనుగోలుదారుడు చెల్లించాల్సిన సొమ్ము వివరాలను తెలిపే పత్రం;

Estimate = వస్తువుల/ సేవల సరఫరాకయ్యే ఖర్చు అంచనా.

⊙ Scrutiny = తెలిపిన వివరాలు సరైనవా కావా, తప్పులేమైనా ఉన్నాయా అని చూడటం;

Verification = ఒక విషయం నిజమైందా, కాదా, సరైందా, కాదా, మనం అనుకున్నట్లు ఉందా, లేదా అని నిర్ధరించుకోవడం.

⊙ Suspend = తాత్కాలికంగా విధులకు హాజరుకాని వ్వక పోవడం, ఉద్యోగి మీద ఫిర్యాదులను విచారించేందుకు;

Dismiss = ఉద్యోగం నుంచి తొలగించడం.

⊙ Gift = presentation.

⊙ Ultimatum (altimatum కాదు) - చివరి హెచ్చరిక, దీని తర్వాత మళ్లీ హెచ్చరిక ఉండదు, చర్యే;

Warning = హెచ్చరిక - ఇవి ఎన్నైనా ఉండొచ్చు

⊙ Courtesy = మర్యాద; సౌజన్యం; ఒకరికి చెందిన వస్తువులను, విషయాలను ఇతరులు వాడుకునేందుకు ఇచ్చే అనుమతి;

Source = మూలం.

⊙ Guidance = మార్గదర్శకత్వం - ముఖ్యంగా పెద్దవాళ్లూ, అనుభవజ్ఞులూ, చిన్నవాళ్లకిచ్చే సలహాలు, సూచనలు, సమస్యల పరిష్కారమార్గాలు;

Counselling = సమస్యలను ఎదుర్కొంటున్న వారి సహాయార్థం, వారికి ధైర్యం కలిగించి, వారి సమస్యలకు పరిష్కారం చూపే ప్రయత్నం - ముఖ్యంగా ఇది ఒక వృత్తిలో ఉన్న గొప్పవాళ్లు, ఆ వృత్తిలోనే ఇతరుల సమస్యకు పరిష్కారం చూపే ప్రయత్నం, సహృదయతతో.

⊙ Insurance = బీమా;

Exgratia = బాధపడుతున్నవారికి, ప్రమాదాల బారిన పడినవారికి దయతో, సానుభూతితో (హక్కులా కాకుండా) ఇచ్చే డబ్బు, సహాయం.

⊙ Cancel = రద్దు చేయడం;

Delete = omit = తొలగించడం; ఓవిషయాన్ని కానీ, కొంతభాగాన్ని కానీ.

⊙ Panic = ప్రమాదంవల్ల/ ప్రమాదం జరగబోతోందనే ఆలోచన వల్ల ఆలోచించే శక్తి కోల్పోయేలా చేసే అతి భయం;

Disaster = విపత్తు.

⊙ Motto = ఒకసంస్థ/ దేశం/ వ్యక్తి ఆశయాలను తెలిపే చిన్నవాక్యం, పదాలు;

Slogan = నినాదం (ముఖ్యంగా Political Parties తమ కోరికలు, ఆశయాలను, వ్యతిరేకతను తెలిపేందుకు, ప్రకటించేందుకు వాడే, సులభంగా ఉచ్చరించగల వాక్యం/ పదాలు etc... Zindabad, Down, Down లాంటివి).

⊙ Jail = Prison.

⊙ Xerox = Photostat

***G. Rambabu, Nandyal***

**Q.** Sir, కింది వాక్యానికి అర్థం వివరించగలరు.

We are on good terms.

**A.** మామధ్య సంబంధాలు బాగున్నాయి.

**Q.** కింది వాక్యాల మధ్య తేడా తెలపగలరు.

i) He is a member on the committe

ii) He is a member in the committe

**A.** He is a member of the committee.

**Q.** కిందివాటికి అర్థం తెలపగలరు.

abrode, bay, inlieu of, by u dint of (or) by dint of.

**A.** Abroad (Abrode కాదు) = విదేశాలలో

bay = మూడువైపులా నేల ఉన్న సముద్రభాగం- the Bay of Bengal

In lieu of = అందుకు బదులు

a) They paid him 2 days' wages in lieu of the work he did on 2 Sundays = రెండు ఆదివారాలు పనిచేసినందుకుగానూ అతడికి రెండ్రోజుల వేతనాలు ఎక్కువ ఇచ్చారు.

b) He took cash in lieu of the prize he won = తనకు వచ్చిన బహుమతికి బదులు అతడు నగదు తీసుకున్నాడు.

By dint of = అందువల్ల;

He came up by dint of hard work = అతడి కృషివల్ల/ మూలంగా పైకొచ్చాడు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# I haven't had my grub yet..





M.SURESAN

**Subodh:** (Have you) had your grub? I have yet to eat, and if you haven't I shall have company.
(నీ భోజనం అయిందా? నేనింకా తినాల్సి ఉంది, నువ్వూ భోంచేయకపోతే నాకు company ఉంటుంది.)

**Susmitha:** I haven't yet, and that makes two of us. Where shall we eat?
(ఇంకా లేదు - అందువల్ల నీకు నేను జోడీ. ఎక్కడ భోంచేద్దాం?)

**Subodh:** I'd opt for snacks instead of a regular meal. I can't think of a restaurant that can give us a good fare; I mean a place where it pays to eat.
(మామూలు భోజనం కాకుండా ఏదన్నా ఫలహారం చేద్దామనుంది నాకు. ఇక్కడెక్కడా మంచి భోజనం దొరికే చోటు నాకు తట్టడం లేదు - అంటే మన డబ్బుకు తగ్గ భోజనం దొరికే చోటు.)

**Susmitha:** That's right, but if you can hold out for a while and are game for a little walk I can show you a place you can eat to your heart's content.
(అది నిజమే. అయితే కాస్త దూరం నువ్వు నడవటానికి సై అంటే, నీ మనసారా తినగలిగిన చోటికి తీసుకువెళ్తా.)

**Subodh:** Mom is good at cooking and that keeps me off outside food. Today she is out of town. Otherwise she would have served me up the special food today.
(అమ్మ వంటలు బాగా చేస్తుంది. అందువల్ల నాకు బయట తినే అవకాశం లేదు. ఇవాళ ఆమె ఊళ్లో లేదు. లేకుంటే నాకీరోజు ప్రత్యేక వంటకాలతో అన్నం పెట్టేదే.)

**Susmitha:** Just don't worry. I grew up like that too. When I was young, my grandmother used to feed me with choice sweets and biscuits. She was good at cooking that kind of stuff. Can I ever forget that?
(ఏం పరవాలేదులే నేనూ నీలాగే పెరిగాను. నా చిన్నతనంలో మా అమ్మమ్మ/ బామ్మ నాకు మంచి స్వీట్లు, బిస్కెట్లు చేసి పెట్టేది. అలాంటి వాటిల్లో ఆమె దిట్ట. నేనది ఎప్పటికీ మరచిపోలేను.)

**Subodh:** Then come, let's go.
(రా, పోదాం.)

**Note:** 1) heart's content = మనసారా/ సంతృప్తిగా
2) out of this world. అపూర్వమైన, ఎక్కడాలేని
3) game for = సిద్ధంకావడం/ 'సై' అనడం.

1) That makes two of us = ఆ విషయంలో మనిద్దరం ఒకటే/ మనం జోడీ.

a) Oh, you've lost your certificates too? That makes two of us = నువ్వూ certificates పోగొట్టుకున్నావా? అయితే ఇంకేం? నువ్వు నాకు తోడు/ మనిద్దరం ఒకటే.

b) Has he failed two? That makes two of them = అతడూ fail అయ్యాడా? అయితే ఆ విషయంలో వాళ్లిద్దరూ ఒకటే.

3) Hold out = నిలదొక్కుకోవడం/ ఓపిక పట్టగలగడం/ పట్టు కోల్పోకుండా ఉండటం.

a) Inspite of the enemy being stronger they held out for quite a long time = శత్రువు బలశాలి అయినప్పటికీ, వాళ్లు చాలాసేపు నిలదొక్కుకున్నారు/ ప్రతిఘటించారు.

b) If they can hold out for another ten minutes, they will win the match = ఇంకో 10 నిమిషాలు నిలదొక్కుకోగలిగితే, వాళ్లు గెలుస్తారు.

a) I can never forget the delicious dinner he served as on his birthday = అతడి పుట్టినరోజు సందర్భంగా అతడిచ్చిన అతి రుచికరమైన విందు నేనెన్నటికీ మరువలేను.

b) The mango is among the most delicious of fruits. అత్యంత రుచికరమైన పండ్లలో మామిడి పండు ఒకటి.

7) Delicacy = ఒక ప్రాంతానికి పేరుతెచ్చిపెట్టే వంటకం.

a) Biriyani is a Hyderabadi delicacy. = హైదరాబాద్ బిరియానీకి పెట్టింది పేరు./ బిరియానీ హైదరాబాదీ వంటకం

b) Sandesh is a delicacy. Bengal is famous for = బెంగాల్ 'సందేశ్' వంటకం చాల ప్రసిద్ధి చెందింది.

6) Cuisine (Pronunciation - క్విజీన్ - జీ, size లో 'z' లా పలకాలి) = a) వంట విధానం; Andhra Cuisine = ఆంధ్ర పద్ధతి వంటకం; North Indian Cuisine = ఉత్తర భారతానికి ప్రత్యేకమైన వంటకం.

b) ఏదైనా Restaurant తయారుచేసి వడ్డించే వంటకాలు, ముఖ్యంగా ఖరీదైనవి.

multi-cuisine restaurant = రకరకాల, వివిధ ప్రాంతాల వంటకాలను అందించగల restaurant.

a) She is an adept at cooking, and can cook multi-cuisine fare = ఆమె వంటలో దిట్ట. రకరకాల, వివిధ ప్రాంతాల వంటకాలను ఆమె వండగలదు.

b) Chinese Cuisine is in demand now a days = చైనీ వంటకాలకు ఈ రోజుల్లో మంచి గిరాకీయే ఉంది.

8) Feed = 1) తినిపించడం, తిండి పెట్టడం. 2) జంతువుల మేత; జంతువులను మేపడం.

a) The child care home feeds its children well = ఆ శిశు సంరక్షణ కేంద్రంలో పిల్లలకు మంచి తిండే పెడతారు.

b) In most oldage homes, the old people are not fed well = చాల వృద్ధాశ్రమాల్లో వృద్ధులకు తిండి సరిగా పెట్టరు.

(Are not fed. ఇది feed కి passive voice)

c) Who feeds you? Your parents, of course = నీకు తిండి పెట్టేదెవరు? మీ తల్లిదండ్రులేకదా?

d) Cows and buffaloes feed on grass = ఆవులూ, గేదెలూ గడ్డి తింటాయి.

Look at the word 'Grub' in the first sentence in the dialogue. 'Grub' also means food. అయితే ఇదికాస్త informal. అర్థం భోజనమే, అయినా మనకు బాగా పరిచయం ఉన్న వ్యక్తులతోనే ఈ మాట వాడతాం. తెలుగులో అయితే, తిండి/ కూడు అనే మాట 'grub' కు సరిపోతుంది.

I haven't had my grub yet = ఇంకా నేనివాళ తిండి తిన్లేదు.

**Subodh:** (Are) you sure of that? Hope I won't be disappointed. I'm really starving.
(నిజమేనా? అంత దూరమూ వెళ్లి నాకు నిరాశ కలగదనుకుంటున్నా. నిజంగా చాలా ఆకలిగా ఉంది.)

**Susmitha:** The place is famous for its specialty stuff. The fried rice there is really delicious. It serves Chinese cuisine too which is out of this world. The place is famous for its North Indian delicacies too.
(నిన్ను నేను తీసుకువెళ్లే చోటు కొన్ని వంటకాలకు ప్రత్యేకత ఉన్నది. అక్కడి Fried rice చాలా రుచిగా ఉంటుంది. ప్రపంచంలో ఇంకెక్కడా దొరకని చైనా వంటకాలు కూడా అక్కడ దొరుకుతాయి. అంతేకాకుండా North Indian వంటకాలకు కూడా అది పెట్టింది పేరు.)

**Subodh:** Take me there at once. I can't wait any longer.
(వెంటనే నన్నక్కడికి తీసుకెళ్లు. ఇంక నేను ఓపిక పట్టలేను.)

**Susmitha:** I'm surprised that having been here so long you don't know about this restaurant.
(ఇంతకాలం ఇక్కడ ఉండి కూడా ఈ హోటల్ నీకు తెలీదంటే నాకాశ్చర్యంగా ఉంది.)

(పై వాటిల్లో (2) & (3) గతంలో చాలా సార్లు వివరించాం)

4) Keep somebody off something = ఒకర్ని ఒకటోటికి వెళ్లనీయకపోవడం/ అవకాశం లేకపోవడం.

e.g.: The police action kept the students off the campus = పోలీస్ చర్య విద్యార్థులను విద్యాలయ ఆవరణలోనికి వెళ్లనివ్వలేదు.

5) Starve = పస్తుండటం; అయితే 'బాగా ఆకలేస్తోంది' అనే అర్థంతో కూడా వాడుతూఉంటాం.

***Now look at the following expressions from the conversation above:***

*1) That makes two of us*
*2) I'd opt for snacks, instead of a regular meal*
*3) If you can hold out for a while*
*4) The place is famous for its specialty stuff.*
*5) The fried rice is really delicious*
*6) It serves Chinese Cuisine*
*7) The place is famous for its North Indian Delicacies too.*
*8) ... my grandmother used to feed me with choice sweets...*

ఇక 2) Snacks, 4) Specialty, 5) Delicious 6) Cuisine 7) Delicacy 8) Feed - ఇవన్నీ ఆహార, ఆహార పదార్థాలకు సంబంధించినవి. వీటిని చూద్దాం.

2) Snacks అంటే భోజనం కాకుండా అల్పాహారం అని, మనం Tiffin అంటుంటాం. కానీ Tiffin అనే మాట English లో లేదు. దాని బదులు Snacks లేదా refreshments (plural లోనే వాడతాం), అల్పాహారం అనే అర్థంతో. ఫలహారం అని కూడా అనుకోవచ్చు అలాంటి ఫలహారశాలలను Snackbar/ Refreshments stall అని కూడా అంటారు. (మనం మామూలుగా వాటిని Tiffin Centres అంటుంటాం)

4) Specialty (Speciality అని కూడా అంటారు)/ Specialty food = ఫలహారశాలలు/ Hotels/ Restaurants కొన్ని, కొన్ని రకాల వంటకాలకు ప్రసిద్ధి పొందుతుంటాయి. అలాంటి ప్రత్యేక వంటకాలే Specialty foods/ Specialty.

a) I like to enjoy the Specialty food of that restaurant = ఆ ఫలహారశాల ప్రత్యేక వంటకాన్ని ఆనందించేందుకు ఇష్టపడతాను.

b) Prawns are the specialty item of the sea side restaurant, 'Sun-n-sand' = సముద్ర తీరంలో ఉన్న Sun-n-sand ప్రత్యేక వంటకం రొయ్యలు/ ఆ ఫలహారశాల రొయ్యల వంటకాలకు పేరు.

5) Delicious = రుచికరమైన

***S. Satyanarayana Murthy, Kakinada***

**Q. 1)** I think that the following be forms are used in the passive voice only.
1. is, am, are being + $V_3$ - Present continuous
2. was, were being + $V_3$ - Past continuous
3. has, have been + $V_3$ - Present perfect
4. had been + $V_3$ - Past perfect



being, been లను passive voice లో వచ్చినప్పుడు వాడతాం. ఈ Verbs ను passive లో మాత్రమే వాడతారనుకుంటున్నాను. Active voice లో వాడితే ఎలా వాడాలి?

గతంలో 'be' కి past tense been అని రాశారు. 'be' అంటే ఉండటం అని తెలిపారు. 'be' రూపాలే is, was అని రాశారు.

ఇంకో సందేహం. is, am, are, was, were వగైరా verbs అన్నింటినీ passive voice కింద పరిగణించాలా? దయచేసి వివరించగలరు.

**2)** Verb 'is' రెండు విధాలుగా ఉపయోగపడుతుందని గతంలో రాశారు. 1) ఉండటం 2) action చేయడం. ఈ విషయం ఇంగ్లిష్ భాషకు ఆయువుపట్టు అని భావిస్తున్నాను. దీనిమీద వివరణలు మళ్లీ తెలిపితే బాగా అర్థమవుతుంది.

**A. 1)** Yes, they are passive forms.

Being + PP (Past Participle/ $V_3$), been + PP, are always passive. అయితే, been తర్వాత, '...ing' form కూడా వస్తుంది. అప్పుడది active voice.

a) He is being given an injection = అతడికి injection ఇవ్వబడుతోంది (ఇప్పుడు) - ఇది passive (మామూలు తెలుగులో అయితే, అతడికి injection ఇస్తున్నారు అంటాం) - ఇక్కడ Verb - is being given - is being + PP (Passive)

b) He has been given an injection = అతడు injection ఇవ్వబడ్డాడు (మామూలు తెలుగు - అతడికి injection ఇచ్చారు) - ఈ sentenceలో verb, has been + PP (Passive)

అయితే has been/ have been/ had been తర్వాత '...ing' form కూడా వాడతాం. అప్పుడు అది active voice మాత్రమే అవుతుంది. అయితే Am/ is/ are/ was/ were being తర్వాత PP యే వస్తుంది. అందుకని 'being' ఎప్పుడూ passive form లోనే వస్తుంది.

Be అంటే ఉండటం అనే అర్థం ఉంది. Be here. I'll talk to you again = ఇక్కడ ఉండు. నేన్నీతో మళ్లీ మాట్లాడతా. Be ని ఉండటం అనే అర్థంతో ఇలాంటి చోట్లలోనే వాడతాం, independent గా.

Am, is are, was, were తర్వాత PP ($V_3$) వస్తేనే అవి PP తో కలిసి passive verbs అవుతాయి. వాటి తర్వాత PP లేకపోతే, అవి 'be' form కు వివిధ రూపాలై, ఇప్పుడు ఉన్నాను (I am), ఇప్పుడు ఉన్నాడు (He is...), ఇప్పుడు ఉంది (She is; It is); గతంలో ఉండేవాడిని (I was), గతంలో ఉండేవాడు/ ఉన్నాడు (he was), గతంలో ఉంది (She/ It was), గతంలో ఉన్నావు/ ఉన్నారు (You were); గతంలో ఉన్నారు ఉండేవి/ ఉన్నాయి (They were) అనే అర్థానిస్తాయి- ఈ అర్థంతో వీటికి ఏ voice ఉండదు.

**2)** All 'be' forms-

| | | | | |
|---|---|---|---|---|
| am<br>is<br>are<br>was<br>were | shall<br>should<br>will<br>would<br>can<br>could<br>may<br>might<br>must<br>need<br>ought | be | have<br>has<br>had | been |
| | | | shall<br>should<br>will<br>would<br>can<br>could<br>may<br>might<br>must | have been |

పైవన్నీ 'be' forms. ఇవి 'వివిధ రకాల ఉండటాన్ని' తెలుపుతాయి. పై 'be' form లతో ఇంకేం కలిసినా ఏదో పని చేయడం అనే అర్థం వస్తుంది. కాబట్టి, అవి Action Words అవుతాయి. ఇంతకుముందు చాలాసార్లు తెలిపిన forms of verbs చూడండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Subodh:** I haven't seen you for ages. Have you been tied up at work or what?
(చాలాకాలమయ్యింది నిన్ను చూసి. పనితో తీరిక లేకుండా ఉన్నావా ఏం?)

**Pranav:** You can say that again. I haven't had breathing space this whole week. Perhaps I have to keep at it for another three or four months to come. Well, to get ahead in the job I have to.
(నువ్వు సరిగానే అన్నావు. ఈవారమంతా ఊపిరి సలపనంత పనిలో ఉన్నా. ఇలా ఇంకో మూడునాలుగు నెలలు కొనసాగించాలి. నా ఉద్యోగంలో పైకిరావడానికి.)

**Subodh:** When they first took you on, they didn't tell you that you had to slog away like this, did they?
(వాళ్లు మొదట నిన్ను ఉద్యోగంలోకి తీసుకున్నప్పుడు నువ్వింత శ్రమపడాల్సి వస్తుందని చెప్పలేదుగా.)

**Pranav:** I turned a new leaf in my life as soon as I left college. My sister's words before she left for the Sates did the trick. That changed me completely.
(నా జీవితంలో నేను కొత్త పేజీ తెరిచాను, కాలేజీ వదలగానే. మా అక్క అమెరికాకు వెళ్లేముందన్న మాటలు నాలో ఈ మార్పు తెచ్చాయి. నేను ఇప్పుడు పూర్తిగా మారిపోయా.)

**Subodh:** So thank your sister for the change in you. What about your plans of going abroad?
(మీ అక్కయ్యకు నువ్వు రుణపడి ఉన్నావు. నీవు విదేశాలకు వెళ్లే ఆలోచన ఏమయింది?)

**Pranav:** I have second thoughts about it. The job I am in now is a plum job and promises quick growth. Any way I want to run it by my parents and good friends like you. I have to think through it.

# Fasting for a day did the trick

**Pranav:** They didn't of course, but I don't mind it. I am learning you know, and I am rather happy about it.
(చెప్పలేదనుకో, కానీ నాకేం అభ్యంతరం లేదు. పని నేర్చుకుంటున్నా ఆ విధంగానైనా. అది నాకు సంతోషంగా ఉంది. (తీరికలేకుండా కష్టపడుతున్నప్పటికీ)

**Subodh:** It's amazing to hear you say that. I wonder if you are the same guy who at college never seemed to bother about your future.
(నువ్విలా అనడం నాకు నిజంగా ఆశ్చర్యంగా ఉంది. కాలేజీ రోజుల్లో భవిష్యత్తు గురించి పట్టించుకోని నువ్వేనా ఇలా అంటున్నదని నాకు సందేహంగా ఉంది.)





M.SURESAN

(దాన్ని గురించి మళ్లీ ఆలోచనలు వచ్చాయి. నేనిప్పుడు చేస్తున్న ఉద్యోగం చాలా మంచిది, మంచి వృద్ధి కలిగించేదనే నమ్మకం ఉంది. ఏదైనా సరే మా అమ్మానాన్నలూ, నీలాంటి స్నేహితుల సలహా తీసుకోవాలనుకుంటున్నా. దాన్ని గురించి తీరికగా ఆలోచించాలి.)

**Notes:** Turn a new leaf = జీవితం అనే పుస్తకంలో కొత్త పేజీ తిప్పడం/ మారిపోవడం
plum job = మంచి ఉద్యోగం

Slog away = శ్రమపడటం పట్టుదలగా
Second thoughts = కొత్త ఆలోచనలు

***Look at the following expressions from the dialogue above:***

*1) Tied up at work.*
*2) Keep at it for another three to four months.*
*3) When they first took you on*
*4) My sister's words did the trick.*
*5) Run by my parents and good friends like you.*

**1) Be tied up at work** = తీరికలేనంత పనిలో ఉండటం.

a) Dad is too tied up at arrangements for my sister's marriage to bother about my marks = నా మార్కుల గురించి పట్టించుకోలేనంతగా మా చెల్లి పెళ్లి ఏర్పాట్లలో తీరికలేకుండా ఉన్నారు మా నాన్న.

b) I expected you to be tied up at your exams but I'm surprized that you are watching TV = నీ పరీక్షలతో తలమునకలై ఉంటావని అనుకున్నాగానీ నువ్వు టీవీ చూస్తుండటం నాకాశ్చర్యంగా ఉంది.

**2) Keep at something** = continue to do something.

a) He keeps at smoking against doctor's advice = డాక్టర్ సలహాకు వ్యతిరేకంగా అతడు సిగరెట్ తాగుతూనే ఉన్నాడు.

b) Keep at (practising) music. You are sure to become a great singer one day = సంగీతం అభ్యసిస్తూనే ఉండు. వదలకు. ఏదో ఒకరోజు గొప్ప గాయకురాలివవుతావు.

**3) To take somebody on** = ఉద్యోగం ఇవ్వడం/ నియమించడం.

a) They took me on, offering a salary of Rs.20000/- a month = రూ. 20000 ల జీతంతో నన్ను ఉద్యోగంలోకి తీసుకున్నారు.

b) They did not take her on, in spite of her high qualifications = ఉన్నత విద్యార్హతలు ఉన్నప్పటికీ ఆమెకు వాళ్లు ఉద్యోగం ఇవ్వలేదు.

**4) To do the trick** = అనుకున్న ఫలితాన్నివ్వడం

a) The doctor's medicines were no use. Fasting for a day did the trick = డాక్టరిచ్చిన మందులేం పనిచేయలేదు. ఒక్కరోజు పస్తుండేసరికి ఆ రోగం తగ్గింది (ఆశించిన ఫలితాన్నిచ్చింది)

b) The officer was delaying my file. I paid him a bribe or Rs. 2000/- and that did the trick = ఆ ఆఫీసర్ నా ఫైలును పాస్ చేయకుండా తాత్సారం చేస్తుంటే 2000 రూపాయలు లంచమిచ్చా. దాంతో పనయింది. (ఆశించిన ఫలితం వచ్చింది)

**5) To run by somebody** = to take somebody's advice = ఒకరి సలహాను తీసుకోవడం/ సంప్రదించడం.

a) He bought the house only after running it by his uncle = వాళ్ల బాబాయి సలహా తీసుకునే/ బాబాయిని సంప్రదించిన తర్వాతే ఆ ఇల్లు కొన్నాడతడు.

b) I have to run it by my parents before I decide on my marriage = నా పెళ్లి విషయం ఏ నిర్ణయమైనా, మా తల్లిదండ్రులను సంప్రదించాల్సి ఉంటుంది/ సలహా తీసుకోవాల్సి ఉంటుంది.



***T.Siva, Nandikotkur***

**Q.** కిందివాటికి సరైన సమాధానాలను సూచించగలరు.

1) It suits --- me.
(a) to (b) no word
2) It suits --- my needs
(a) to (b) no word
3) It is suitable --- me
(a) to (b) for
4) It is suitable --- my needs
(a) to (b) for
5) He is studying --- Class V
(a) in (b) no word
6) A person who lives in London is ----- of London
(a) a resident (b) a dweller (c) an inhabitant

**A.** 1 - 5 Oxford Advanced Learner's Dictionary చూడండి.
6. A resident

**Q.** కిందివాటికి **Antonyms** తెలుపగలరు.
1) Refuse, 2) Reject, 3) Mourn, 4) Overcome, 5) Famous, 6) Notorious, 7) Prosperous, 8) Appreciate, 9) confident, 10) Trust.

**A.** 1) refuse x agree, 2) reject x accept 3) mourn x rejoice, 4) overcome x surrender 5) famous x obscure 6) notorious x famous (కొన్ని సందర్భాల్లో మాత్రం) 7) prosperous x indigent 8) appreciate x depricate 9) confident x diffident 10) trust x doubt.

**Q.** కింది వాటి అర్థం, ఉపయోగాలను వివరించగలరు.
1) Mystery - Miracle, 2) Mutiny - Revolt, 3) Primitive - Ancient, 4) Round - Around, 5) Lament - Mourn, 6) Also - Too, 7) Each - every, 8) Dumb - Mute, 9) Avenge - Revenge,

**A. Mystery** = something that is very difficult to explain or understand.

His death is a mystery = How he died or why he died cannot be explained. = మనకర్థం కాని, ఎంత ప్రయత్నించినా ఏమీ తెలియని విషయం.

The end of Subhas Chandra Bose is still a mystery = సుభాష్‌చంద్రబోసు అంతం ఎవరికీ తెలియని/ అంతుచిక్కని విషయం.

**Miracle** = అద్భుతం - An act or an event that does not follow the laws of nature = ప్రకృతి సిద్ధాంతాలకు అనుగుణంగా జరిగే వింత- eg: Baba and such others curing patients by mere touch of their hands; their creating things out of nothing, etc.

**Mutiny** = Refusing to obey the orders of superiors, especially soldiers and sailors refusing to obey the orders of their superiors = పై అధికారుల ఆజ్ఞలను ధిక్కరించడం, ముఖ్యంగా సైనికులూ, నావికులూ అధికారుల ఆజ్ఞలను పాటించడానికి నిరాకరించడం.

**Revolt** = Rising against authority especially government - చట్టప్రకారం ఏర్పడ్డ ప్రభుత్వానికి అవిధేయత ప్రకటించి వ్యతిరేకించడం.

Mutiny, revolt - synonyms గా తీసుకోవచ్చు.

**Primitive** = Of the early stages of human development/ Of the undeveloped stages in civilization, old fashioned - నాగరకత పరిణామంలో అభివృద్ధి చెందని దశకు సంబంధించిన (దాదాపు అనాగరకమైన) eg: Primitive tribes = ఆదిమజాతి తెగలు. (మిగతా సమాజంతో పాటు నాగరకతాభివృద్ధి చెందని)

Even today there are some parts of the world where primitive people live.

**Ancient** = of the long past - ప్రాచీనమైన - ఇది ప్రాచీనమైనప్పటికీ అభివృద్ధి చెందిన మానవ జీవన సరళిని సూచిస్తుంది.

Marriage is an ancient custom = వివాహం చాలా ప్రాచీన సంప్రదాయం.

**Ancient x Modern.**

**Round (adj) = Around**

There is a wall round (around) the temple. Around is used more in American English.

**Lament** = to express sadness or sorrow = విషాదాన్ని, విచారాన్ని వ్యక్తపరచడం-

We all lament the loss of morals among political leaders = రాజకీయ నాయకులలోని నైతిక పతనానికి మనం విచారిస్తున్నాం/ మనకది విషాదాన్ని కలుగజేస్తుంది.

**Mourn** = weep over the death of a person = ఒకరి మృతిని గురించి విలపించడం.

January 30th is a day of national mourning = జనవరి 30 దేశంలో జాతీయ సంతాపదినం. (స్వాతంత్ర్యంకోసం ప్రాణాలర్పించిన వారిపట్ల సంతాపం వ్యక్తపరుస్తాం.)

**Also = too,** but 'also' is 'formal', whereas 'too' is 'informal'

**Too** కంటే also కాస్త గ్రాంథికం. మామూలుగా Spoken English లో too ఎక్కువ వాడతాం.

I also like the movie - గ్రాంథికం, (నాకూ ఆ సినిమా నచ్చింది)

I like the movie too ఇది వ్యావహారికం; అయితే I like the movie too కు రెండర్థాలు రావచ్చు - 1) నాకూ ఆ సినిమా ఇష్టం 2) నాకు ఆ సినిమా కూడా ఇష్టమే అని. సందర్భాన్నిబట్టి అర్థం చేసుకోవాల్సి వస్తుంది.

**Each-** refers to the people or things, in a group separately- ఒక బృందంలోని మనుషులను, వస్తువులను, ప్రతివారినీ, ప్రతిదాన్నీ గురించి మాట్లాడేటప్పుడు, each/ each of them అంటాం- 'ప్రతి' అనే అర్థంతో.

Each/ each of the students has a book in their hand = ఆ విద్యార్థులలో ప్రతివారి చేతిలో ఓ పుస్తకం ఉంది.

**Every-** refers to all the members in a group.

Every car has a steering wheel = కార్లన్నింటికీ steering wheel ఉంటుంది.
(కారన్నదానికి steering wheel ఉంటుంది)

Every worker there is well trained = అక్కడి పనివాళ్లంతా (ప్రతీ పనివాడూ) సుశిక్షితులే.

**Dumb**= unable to speak (మాట్లాడలేని) ముఖ్యంగా మూగ.

He was born dumb = అతడు పుట్టుకతోనే మూగ. అయితే మూగవాళ్లను dumb అనడం సరైనప్పటికీ, అలా అనడం వాళ్లను అవమానించడం. Speech impaired అంటాం.

**Mute**= silent (మాట్లాడగలిగి కూడా మాట్లాడకుండా ఉండటం)

They were mute in fear = భయంతో మాట్లాడకుండా ఉండటం.

**Avenge** = to punish or hurt some one for the wrong they have done to you, your friends or relatives. (మీకు, మీవాళ్లకు, మీ స్నేహితులకు జరిగిన అన్యాయానికి పగతీర్చుకోవడం/ ప్రతీకారం తీర్చుకోవడం)

Parasurama avenged his father's death by killing all Kshatriyas. (క్షత్రియులిందర్నీ చంపి పరశురాముడు తన తండ్రి హత్యకు ప్రతీకారం తీర్చుకున్నాడు)

Avenge - verb

**Revenge** - పగ/ ప్రతీకారం. ఇది noun.

He took revenge on his political rivals by defeating them in the elections = తన రాజకీయ ప్రత్యర్థులను ఎన్నికల్లో ఓడించి ప్రతీకారం తీర్చుకున్నాడు.

Avenge ని ఎక్కువగా మనకే కాకుండా, మనకు సంబంధించిన వాళ్లకు జరిగిన అన్యాయానికి కూడా ప్రతీకారం తీర్చుకోవడం అనే అర్థంతో వాడతాం.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# The magic feats were spell binding





M.SURESAN

**Rao:** I find time hanging heavy on my hands. It's really boring to have nothing to do, you know.

(సమయం ఎలా గడపాలో తెలియడంలేదు. చేసేందుకేం లేకపోతే విసుగే.)

**Sita:** Agreed, but you can find your time fleeting if only you have the will. Why don't you make reading a habit, now that you have all the time in the world for yourself?

(నేను ఒప్పుకుంటా. కానీ, మనసుంటే time చాలా త్వరగా గడిచిపోవడం గమనిస్తావు. చదవడం ఓ అలవాటుగా చేసుకో. Time ఎంతో సరదాగా గడపవచ్చు.)

**Rao:** I know there are authors and novels, but I haven't the faintest idea how interesting they can be, I believe books can never hold your attention.

(రచయితలూ, నవలలూ ఉన్నట్లు నాకూ తెలుసు, కానీ, అవెంత ఆసక్తికరంగా ఉంటాయో నాకు ఇసుమంతకూడా తెలీదు. పుస్తకాలు అంత ఆసక్తికరంగా ఉండవని నా నమ్మకం.)

**Sita:** On the contrary. Some novels can be really very absorbing. James Hadley Chase's Cade, for example, is one. It's really compelling. Some of the novels of Sidney Sheldon are engrossing. They are really page turners. You can't wait to finish them.

(అదేం కాదు. కొన్ని నవలలు మన మనసును పూర్తిగా ఆకట్టుకొనేలా ఉంటాయి. James Hadley Chase నవల Cade ఒక ఉదాహరణ. అది మన దృష్టిని దానిమీదే ఉండేలా చేస్తుంది. Sidney Sheldon నవలలు మన మనసును ఆకర్షించేవే. అవి నిజంగా పేజీ తర్వాత పేజీ తిప్పుతూ చదివేట్టుంటాయి. ఎప్పుడెప్పుడు పూర్తిచేస్తామా అనిపిస్తూ ఉంటుంది.)

**Rao:** Have you any of them that you can lend me? I'll start on them and see if they can help me pass time.

(నీ దగ్గర అవి కొన్నేమన్నా ఉన్నాయా నాకివ్వేందుకు. నేను నవలలు చదవడం ప్రారంభిస్తా. సమయం గడిపేందుకు అది తోడ్పడుతుందేమో చూస్తాను.)

**Sita:** I have a good collection of novels by Chase, Jeffrey Archer, John Grisham, Stephen King, etc. Most of them are crime stories that are rivetting. Some of them have been made into fascinating movies. Just read them and you hardly know how time passes.

(Chase, Jaffrey Archer, John Grisham, Stephen, King రాసిన నవలలు నా దగ్గర, నేను సేకరించినవి ఉన్నాయి. మన దృష్టిని మరల్చలేనంత ఆసక్తి కలిగించే నేరాధారిత నవలలు అవి. వాటిలో కొన్నింటిని సినిమాలుగా తీశారు. అవన్నీ చాల ఆకర్షణీయమైనవి. వాటిని చదువు. Time ఎలా గడుస్తుందో నీకే తెలీదు.)

**Rao:** I have seen some of the English movies based on the books that I never read. There is never a dull moment and you are glued to your seat and just keep watching them.

(నేను చదవని నవలల ఆధారంగా తీసిన కొన్ని English సినిమాలు చూశాను. ఒక్క క్షణం కూడా విసుగనిపించవు. కుర్చీకి అతుక్కుపోయి అలా చూస్తూనే ఉంటాం.)

**Sita:** So they are. The performance of the actors is really spell-binding. You will really enjoy them.

(అవి అలాగే ఉంటాయి. నటుల ప్రదర్శన మంత్రముగ్ధులుగా చేస్తుంది. వాటిని నిజంగా ఆనందిస్తాం మనం.)

**Rao:** Ok, I'll try. (ప్రయత్నిస్తాను.).

**Notes:** (Time) hanging heavy on somebody = చేసేందుకు పనేం లేక సమయం ఎలా గడపాలో తెలియక విసుగనిపించడం.

fleeting = త్వరగా గడచిపోవడం

Have the faintest idea = ఎలాంటి అవగాహనా లేకపోవడం.

Collection = సేకరణ/ సేకరించిన వస్తువులు.

Look at the following expressions from the conversation above.

**1) ... hold your attention.**
**2) ... absorbing.**
**3) ... compelling.**
**4) ... engrossing.**
**5) They are really page turners.**
**6) Most of them are stories that are rivetting.**
**7) They have been made into fascinating movies.**
**8) There is never a dull moment.**
**9) The performance of the actors really spell binding.**

పైవన్నీ కూడా Interesting (ఆసక్తికరమైన/ ఆసక్తి కలిగించే) అనే భావానికి సంబంధించిన మాటలు. అన్నిటికీ స్థూలంగా అర్థం, 'ఆసక్తికరమైన'. అయినప్పటికీ, వాటి వాడకంలో కాస్త తేడాలుంటాయి. అలా వాటి అర్థం, వాటి వాడకం తెలుసుకోవడం ముఖ్యం. అవి ఇప్పుడు చూద్దాం.

**1) Hold somebody's attention** = ఒకరి దృష్టిని ఆకట్టుకోవడం/ దృష్టి మరలకుండా చూసే.

a) His speech held the attention of the audience till his last word = ఆయన ప్రసంగం చివరి మాట వరకు శ్రోతల మనస్సును/ దృష్టిని ఆకట్టుకునేలా ఉంది.

b) Her dance couldn't hold the attention of the spectators even for a shortwhile = కాసేపు కూడా ఆమె నాట్యం ప్రేక్షకులను ఆకట్టుకోలేకపోయింది.

**2) Absorbing** = very interesting = చాలా ఆసక్తికరంగా/ ఇంకే విషయం ఆలోచించలేనంతగా ఉండటం.

a) The movie 'Titanic' was so absorbing that none stirred in their seats till the end = చివరి వరకు ప్రేక్షకులెవ్వరూ కూర్చున్నచోటి నుంచి కదలలేనంత/ కదలనివ్వనంత ఆసక్తికరంగా సాగింది. Titanic చిత్రం.

b) Sachin's double century innings the other day was absorbing = సచిన్ మొన్న ఆడిన double century ఆటతీరు ఎంతో ఆసక్తికరంగా ఉంది.

c) The drama festival promises an absorbing fare = ఆ నాటకోత్సవం ఆసక్తిభరితంగా ఉండే నమ్మకం కలిగిస్తోంది.

[Absorb = పీల్చడం, Sponge absorbs water స్పాంజ్ నీళ్లను పీలుస్తుంది, అలాగే మనల్ని ఆకట్టుకునేది ఏదయినా absorbing అవుతుంది కదా? ]

**3) Compelling** = దీని అర్థం కూడా పై పదాల్లాగే 'చాలా ఆసక్తి కలిగించే' అని. సినిమాలకు, పుస్తకాలకు వాడతాం.

Compel అంటే తెలుసు కదా? 'బలవంతం చేయడం' అని. Compelling అంటే 'బలవంతం చేసే' అని.

Novel/ Movie ని Compelling అనడంలో భావం: ఆ novel/ movie మన ఆసక్తిని తమవైపు బలవంతంగా తిప్పుకుంటాయి. అంటే వాటిని చదవాలని, చూడాలని బలమైన కోరికను కలిగిస్తాయి. అంటే 'వాటి నుంచి దృష్టి మరల్చలేనంత బాగుంటాయి' అని.

a) Sri Sri's poetry is compelling/ compellingly readable = శ్రీశ్రీ కవిత్వం మన దృష్టిని ఆకట్టుకోవడమే కాకుండా, మన మనసును కట్టిపడేసేలా ఉంటుంది.

b) Some of the scenery in the movie are compellingly attractive = ఆ సినిమాలోని కొన్ని ప్రకృతి దృశ్యాలు దృష్టిని కట్టిపడేసేంత ఆకర్షణీయంగా ఉన్నాయి.

**4) Engrossing** = దీని అర్థం కూడా 'దృష్టి/ మనసు మరల్చుకోలేనంత ఆసక్తికరంగా ఉన్న' అని.

a) Even today Mayabazar remains an engrossing movie. = ఇవాళ్టికి కూడా మాయాబజార్ మన మనసును మరల్చలేనంత ఆసక్తికరమైన చిత్రంగా ఉంటుంది.

b) The music concert yesterday was an engrossing fare.

నిన్నటి సంగీత కచ్చేరి మనసును ఆకట్టుకునే విందుగా ఉంది. fare = విందు.

**5) Page turners** = ఈ మాట ఆసక్తిని రేకెత్తించే పుస్తకాలకు వాడతాం.

అర్థం: తరువాతి పేజీలో ఏమవుతుందో అనే ఉత్కంఠ కలిగించి, గబగబా పేజీలు తిప్పి చదివేంత ఆసక్తికరమైన పుస్తకాన్ని 'A page turner' అంటాం.

a) The novels of James Hadley Chase are real page turners = James Hadley chase నవలలు ఉత్కంఠభరితంగా గబగబా చదవాలనిపించేవిగా ఉంటాయి.

b) My novels so far, I know, haven't been very good, but let me promise you my next one will be a page turner = నేనింతవరకూ రాసిన నవలలు అంత బాగాలేవని నాకు తెలుసు. కానీ చెప్తున్నాను, ఈసారి నవల మాత్రం చాలా ఆసక్తికరంగా ఉంటుంది.

**6) Rivetting** - దీని అర్థం కూడా 'దృష్టి మరల్చనివ్వని' అని.

a) The Mahabharatam is absolutely rivetting from the start to the finish = ఆద్యంతం దృష్టి మరల్చుకోలేనంత ఆసక్తికరంగా ఉంటుంది మహాభారతం.

b) It is rivetting story about a child's sacrifice to save its mother = ఆ కథ తల్లికోసం త్యాగంచేసే బిడ్డను గురించిన దృష్టిమరల్చనివ్వని కథ.

ఇదే అర్థంతో ఇంకో మాట, 'gripping'

The novel has a gripping narration = ఆ నవల కథాసంవిధానం దృష్టి మరల్చనివ్వని ఆసక్తితో ఉంటుంది.

**7) Fascinating** - అత్యాకర్షణీయమైన.

The feats of the child circus artists were really fascinating = శిశు కళాకారుల విన్యాసాలు సంభ్రమాశ్చర్యాలు కలిగించేవిగా ఉన్నాయి.

**e.g. :** The music in the movie is really fascinating = అద్భుతం తెలిసిందిగా.

He told us a fascinating story.

**8) There is a never a dull moment** = ఒక్క క్షణం కూడా విసుగనిపించకపోవడం.

There is a never a dull moment in the movie 'Missamma' = మిస్సమ్మ చిత్రంలో ఒక్క క్షణం కూడా విసుగనిపించదు.

**9) Spell binding** = మంత్రముగ్ధుల్ని చేయడం.

a) That scene in the movie is really spell binding = సినిమాలో ఆ సన్నివేశం నిజంగా మంత్రముగ్ధుల్ని చేసేదిగా ఉంది.

b) The magic feats were spell binding = ఆ ఇంద్రజాలం మంత్రముగ్ధుల్ని చేసేదిగా ఉంది.



**E. Anil T.N.Palem (Prakasham Dt.)**

**Q:** Sir, Be form గురించి వివరించేటప్పుడు am, is, are లను, Be - ని verbs గా ఏయే సందర్భాల్లో, ఎక్కడ ఉపయోగిస్తారు?

Should be can be would be may be
will be might be could be shall be

వీటిలో be చేర్చడంవల్ల వాటి అర్థాలు ఎలా మారతాయో వివరించగలరు.

**A: To be** = ఉండటం; ఉండేందుకు be = ఉండు

(Am, Is, Are, Was, Were... ఇవన్నీ కూడా to be కి వివిధ రూపాలు.

He is here to be our leader = అతడు మన నాయకుడిగా ఉండేందుకు ఇక్కడ ఉన్నాడు (is).

To be here is dangerous = ఇక్కడ ఉండటం ప్రమాదకరం.

(you) Be here till 10 = పది వరకు (నువ్వు) ఇక్కడ ఉండు.

**Should be** = ఉండాలి. (Order)/ అవసరం

**Would be** = ఉంటాను/ ఉంటాడు/ ఉంటాం/ ఉంటారు/ ఉంటుంది (గతం నుంచి భవిష్యత్తు తెలిపేటప్పుడు).

He said he would be here = (గతంలో) అతడు నాతో చెప్పాడు, తనిక్కడ ఉంటానని (Would be).

**Will be** = భవిష్యత్తులో ఉండటం.

**Could be** = గతంలో ఉండగలగడం/ ఉండవచ్చు (ఇప్పుడు కూడా).

She could be a great singer because her mother was a singer = ఆమె తల్లి గాయనిగా ఉండేది (was) కాబట్టి, ఆమె గాయనిగా ఉండగలిగింది (Could be).

The car a beauty. It could be expensive = ఆ కారు చాలా అందంగా ఉంది (is). అది చాలా ఖరీదై ఉండవచ్చు (could be = ఇప్పుడు).

**Can be** = ఉండగలగడం (ఇప్పుడు/ future లో).

She can be here in 10 minutes = ఆమె పది నిమిషాల్లో ఇక్కడ ఉండగలదు.

They can be great = వాళ్లు గొప్ప వాళ్లుగా ఉండగలరు.

**May be** = ఉండవచ్చు (ఇప్పుడు - సందేహం)

They may be there now = వాళ్లిప్పుడు అక్కడ ఉండవచ్చు (ఉన్నారేమో - సందేహం).

**Might be** = ఉండి ఉండవచ్చు- గతంలో.

I thought they might be good = నేననుకున్నాను (గతంలో) వాళ్లు మంచివాళ్లుగా ఉండొచ్చని (Might be).

**Shall be** = future లో ఉండటం.

I shall be there tomorrow = రేపు నేనక్కడ ఉంటాను.

I/ We shall be = He/ She/ It/ They will be.

పైవాటికన్నింటికీ be చేర్చడం వల్ల ఉండటం అనే అర్థాలు వస్తాయి. వాటి పక్కన be కి బదులు, go, sing, walk లాంటివి వస్తే ఆయా పనులు చేయడం అనే అర్థం వస్తుంది.

**ఈనాడు ప్రతిభ ఆన్‌లైన్ ఎడిషన్‌లో నేడు**

★ పదోతరగతి సైన్స్ (ఎన్.ఎస్.)

పోషణ - ఆరోగ్య సేవాసంస్థలు

(రచయిత్రి: డాక్టర్ పి.ఎస్.రజని)

★ Junior Inter Zoology

– Locomotion and Reproduction in Protozoa

(Writer: Sriram Ravindra)

http://www.eenadu.net/pratibha_intro/pratibhassc.htm

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



***R. Lakshmi***

**Q.** Sir, Go, Come ల తరువాత participle వస్తుందని ఒక గ్రామర్ బుక్‌లో చదివాను. దాని ప్రకారం I am going telling you a new lesson అనడం కరెక్టేనా?

**A.** There are two participles - 1) The present participle - The '...ing' form - coming, going, etc. 2) The past participle - formed mostly by adding '-ed' (talked, raided), '-d' (Raised, loved, etc.) or '-t' (smelt, learnt, etc), and some times irregularly (sung, given, taught, etc)

సందర్భాన్నిబట్టి, go, come తర్వాత present/ past participle వస్తుంది. అంతేకాని ఎప్పుడూ రాదు.

eg: i) He came running

(came + running - present participle)

ii) They go satisfied (go + satisfied - past participle)

అయితే, ఈ participles go, come తర్వాతనే కాకుండా ఏ verb తర్వాతయినా రావచ్చు అయినా ఏం చెప్పాలి/ రాయాలనుకుంది clear గా ఉంటే, ఇలాంటి సందేహాలు రావు.

c) I have got to/ have to see a doctor this evening = ఈ సాయంత్రం నేను doctor ను చూడాలి. (నా అవసరం)

దీనికి past tense, had got to/ had to (గతంలో విధి/ అవసరం)

**Q.** We have got to get the horse.

**A.** దీనికి కూడా పైన చెప్పిన అర్థమే వస్తుంది కదా? (ఆ గుర్రాన్ని తెచ్చుకోవాలి మనం)

**Q.** "Who said anything about stealing a horse?" he said. "Any how" I said.

**A.** గుర్రాన్ని దొంగిలించిన విషయాన్ని గురించి ఎవరన్నా ఏమన్నా అన్నారా? అన్నాడతడు. 'ఏదేమయినా' అన్నాను నేను.

**Q.** But if we are foundout, that's what you are to say. I don't want both of us to be liars.

**A.** మనం దొరికితే (వాళ్లు మనల్ని పట్టుకుంటే) నువ్వు చెప్పాల్సిన విషయం అదీ. మనం ఇద్దరం అబద్ధాలు చెప్పేవాళ్లుగా అవడం నాకిష్టంలేదు.

**Q.** Nevertheless, I hoped in time to learn to ride the way my cousin rode.

**A.** అయినప్పటికీ/ కానీ, కాలక్రమేణా నేనూ మా cousin లా స్వారీ చేయడం నేర్చుకోవాలని (అంతనేర్పు సంపాదించాలని) ఆశించాను.

3. Why the girl still sat there?

4. Why did the girl still sit there?

5. With whom did the girl travel?

6. With whom the girl travelled?

**A.** 1. ఎవరు ఆ అమ్మాయిని చేతుల్లోకెత్తుకున్నారు?

2. ఆ అమ్మాయి ఎవర్ని చేతుల్లోకెత్తుకుంది?

3. ఇది question గా తప్పు. అంటే question ఇలా ఉండదు. Why the girl still sat there = ఆ అమ్మాయి ఇంకా అక్కడెందుకు కూర్చుందో.... ఇది ఒక sentence లో (question కాదు) భాగం కావచ్చు

Why the girl still sat there I don't know = I don't know why the girl still sat there = ఆ అమ్మాయి అక్కడ ఇంకా ఎందుకు కూర్చుందో నాకు తెలియదు.

4. ఆ అమ్మాయి అక్కడ ఇంకా ఎందుకు కూర్చుంది? (గతంలో) - ఇది question.




***V V Ramakrishna, Rajahmundry***

**Q.** Sir, కొన్ని సందేహాలను తీర్చగలరు.

Secular India has undergone several convulsions during the past 60 years, so much so that doubts about its survival were entertained by many.

ఒక మేగజైన్‌లో చదివిన పై వాక్యంలో has undergone ఉంది. కాబట్టి, are entertained by many అని ఉండాలి కదా.

**A.** మీరు తెలిపిన sentence లో '.... were entertained' తప్పుకాదు. అలా అని సరైన sentence అనీ కచ్చితంగా చెప్పలేం.

'so much so,' 'so' లాగ conjunction. When two clauses are joined by a conjunction, the tenses of the verbs in these clauses can be different, so long as we get a meaning.

ఈ sentence చూద్దాం. అప్పుడు దాని correctness తెలుస్తుంది. లౌకిక భారతదేశం (Secular India) ఇంతవరకూ ఎన్ని ఒడిదుడుకులను చూసిందంటే దాని మనుగడే కొంతమందిచే గతంలో సందేహించబడింది (were entertained). దీన్ని సరైన తెలుగులో: గతంలో కొంతమంది దాని మనుగడే సందేహించేంతగా కూడా లౌకిక భారతదేశం తన 60 ఏళ్ల చరిత్రలో ఎన్నో ఒడుదొడుకులను చూసింది. ఈ parallel sentence చూడండి.:

He has stolen money on several occasions so much so that my money was stolen last week.

అయితే ఆ sentence ను ఈ విధంగా improve చేయొచ్చు

a) '.. so much so that doubts were entertained by many on several occasions in the past. In the past చేర్చి ఉంటే sentence కొంత మెరుగ్గా ఉండేది.

b) ... so much so that doubts have been entertained by many ఇది చక్కగాసరిపోతుంది.

**Q.** Sentence patterns గురించి క్లుప్తంగా అయినా వివరించగలరు.

**A.** Sentence patterns చాలానే ఉన్నాయి కదా? ఎంత క్లుప్తంగా వివరించినా ఇప్పుడున్న స్థలం చాలదు. వీలు వెంబడి త్వరలోనే వివరించగలం.

**Q.** The BSP, which has been losing its Brahmin support base to the Congress, would welcome whatever upper-cast support it can get in order to add to its Dalit vote base. Amarsingh and his newly launched Lokmanch could come in handy.

పై వాక్యంలో ఏ tense ను ఉపయోగించారో తెలుసుకోవడం ఎలా?

**A.** Has been losing present perfect tense.

Would welcome - this is an example of the use of 'would' in the present too. 'Would' ను present tense లో 'Wish to/ like to' అనే అర్థంతో వాడతాం.

can get - can, present tense కదా? అయితే, ability in the future తెలిపేందుకు కూడా can వాడతాం.

They can sing well = వాళ్లు పాడగలరు (ఇప్పటి (present) సామర్థ్యం)

He can earn a lot in 3 years from now = మూడేళ్లకు అతడు బాగా సంపాదించగలడు (future ability)

కాబట్టి 'can' present tense అయినప్పటికీ, future తెలిపేందుకు వాడతాం.

# It is up to you to take it or leave it

**Q.** Keep someone waiting, working, standing లను తెలపడానికి present participle వాడాలని ఉంది. దీని గురించి కొన్ని ఉదాహరణలు ఇవ్వగలరు.

**A.** మీ ప్రశ్నలోనే మీకు సమాధానం ఉంది, గమనించండి. Keep someone waiting/ working/ standing అనే expressions లో, waiting, working, standing - ఇవన్నీ present participles కదా?

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థం తెలపగలరు.

I could not believe the horse had anything to do with my cousin.

**A.** ఆ గుర్రానికీ, మా cousin కు ఏదైనా సంబంధం ఉందని నమ్మలేకపోయాను. ఇక్కడ phrasal verb, to do with = సంబంధం ఉండటం.

a) Has he anything to do with the crime? = అతడికీ ఆ నేరానికీ ఏమైనా సంబంధం ఉందా?

b) I have nothing to do with the book = నాకూ ఆ పుస్తకానికీ ఏ సంబంధం లేదు.

c) Why are you here? Have you anything to do with any body here?

ఎందుకున్నావిక్కడ? నీకిక్కడ ఎవరితోనైనా, ఏదైనా పనుందా? / సంబంధం ఉందా?

**Q.** We let the horse run as long as it felt like running.

**A.** ఆ గుర్రానికి పరుగెత్తాలనిపించినంతసేపూ దాన్ని మేం పరుగెత్తించాం.

Felt like - past tense of feel like = ఏదైనా చేయాలనిపించడం

I feel like (having) a good cup of coffee = నాకు మంచి coffee తాగాలనిపిస్తోంది.

She felt like hitting him = ఆమెకతడ్ని కొట్టాలనిపించింది.

**Q.** That is up to the horse.

**A.** అది ఆ గుర్రం ఇష్టం

upto somebody = ఒకరిష్టం

I can give you only ten rupees. It is up to you to take it or leave it = నీకు పది రూపాయలే నేనిచ్చేది. తీసుకుంటావో, వదులుకుంటావో నీ ఇష్టం.

**Q.** You have got to let me try to ride alone.

**A.** నువ్వు నన్ను ఒంటరిగా స్వారీ చేయనివ్వాలి.

have/ has got to = have to/ has to = must/ should = ఒక పని విధిగానో, అవసరానికిగానో చేయాల్సి రావడం.

a) They have got to/ have to finish the work by the evening = సాయంత్రానికల్లా వాళ్లు పని పూర్తిచేయాలి.

b) She has got to/ has to report for duty by 10 everyday = ఆమె రోజూ పదింటికల్లా విధులకు హాజరవ్వాలి (must/ should)






M.SURESAN

***U. Rajkumar, Darsi***

**Q.** కింది ఇంగ్లిష్‌కు తెలుగులో అర్థం తెలపగలరు.

There are, I think several factors that contribute to wisdom of these I should put first a sense of proportion to the capacity to take account of all the important factors in a problem and to attach to each its due weight. This has become more difficult than it used to be owing to the extent and complexity of the specialize knowledge required of various kinds of technicians. Knowledge surpasses mall aspects but there has been no correlative increase in wisdom. But, agreement ceases as soon as we attempt dedfind wisdom and consider means of promoting it.

**A.** నేననుకోవడం జ్ఞానాన్ని పెంపొందించే అంశాలు కొన్ని ఉంటాయని. వాటిల్లో ప్రాధాన్యం ఇవ్వవలసిందీ, ఏది ఎంతవరకు ఉండాలనే విషయానికీ (A sense of proportion), ఒక సమస్యకు సంబంధించిన అన్ని అంశాలూ పరిగణనలోకి తీసుకోవడం, వాటిల్లో వేటికి వ్వాల్సిన ప్రాముఖ్యం వాటికివ్వడం అనేవి ముఖ్యం. ఈ విషయాలు ఇంతకు ముందుకంటే కష్టమౌతున్నాయి, వివిధ సాంకేతిక నిపుణులకు ఉండవలసిన ప్రత్యేక పరిజ్ఞానం, ఏమేరకు ఈ పరిజ్ఞానం ఉండాలనేది, దాని సంక్లిష్టతవల్ల.

విజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందవచ్చు అన్ని అంశాల్లోనూ. కానీ, జ్ఞానం అందుకు సరిపోయేంతగా ఎదగలేదు.

అయితే జ్ఞానం అనే పదాన్ని నిర్వచించే విషయంలో, దాన్ని పెంపొందించే విషయంలో, ఏకాభిప్రాయం కుదరడం లేదు.

(మీరు రాసిన passage లో రచయిత వ్యక్తీకరణలో స్పష్టత (Clarity of expression) అంతగా కనిపించడంలేదు. దానికితోడు మీరు దాన్ని copy చేయడంలో కొన్ని punctuation errors ఉన్నాయి. అందువల్ల నాకర్థమయినంతవరకూ తెలుగులోకి అనువాదం చేశాను.)

***Srinivas, Nirmal***

**Q.** కింది వాక్యాలమధ్య భేదాలు తెలపగలరు. ఏ వాక్యాలు తప్పో వివరించగలరు.

1. Who lifted the girl in her arm?

2. Who did the girl lift in her arm?

5. ఆ అమ్మాయి ఎవర్తో ప్రయాణించింది? (అయితే Modern English లో Whom వాడకం లేదు. Whom బదులు Who నే వాడుతున్నాం. అప్పుడు, with అనే preposition, question చివరవస్తుంది. Who did the girl travel with?- దీన్ని మీ 2nd question తో పోల్చండి.

6. Sentence 3 లాగే, ఇది question కాదు. With whom the girl travelled = ఆ అమ్మాయి ఎవరితో ప్రయాణం చేసిందో.... ఇది వాక్యంలో భాగమేకదా? దీన్ని నాకు తెలీదు/ ఎవరికీ తెలీదు/ నువ్వెందుకు తెలుసుకోవాలనుకుంటున్నావు? లాంటి వాక్యాల్లో పూర్తి చేయవచ్చు చూడండి: With whom the girl travelled = Who the girl travelled with (Modern Expression).

Can you tell me with whom the girl travelled? = can you tell me who the girl travelled with? (ఆ అమ్మాయి ఎవరితో ప్రయాణం చేసిందో చెబుతారా? / చెప్పగలరా? )

I don't know with whom the girl travelled = I don't know who she travelled with = ఆ అమ్మాయి ఎవరితో ప్రయాణించిందో నాకు తెలీదు.

***Gurram Shankar, Karimnagar.***

**Q.** Dear Sir, I am a teacher of English for primary section I came across a sentence in VII English text of Govt. of A.P. At page no: 64 (English medium) by CIEFL 'Mizoram with an area of 21,087 sq kms, is one of the India's border states'. When Apostrophe, follows "one of" Article 'the' is not used but here why did use. Please comment on in a wide scope. How to rectify the errors in the Govt. Text books.

**A.** 'One of the India's border states' is certainly wrong. It should be '...... one of India's border sates.' The use of the article 'the' before 'India's' is wrong in any way. Your point that 'one of' should not be followed by 'the' is not correct either. No connection between 'One of' and 'the'. Look at the following sentences.

It is one of the country's border states - This is OK.

She is one of the 'teacher's favourites = ఆమె, తమ టీచర్ అభిమానించేవాళ్లలో ఒకరు. '...one of the India's border states' - In this sentence, 'the' before 'India's' may be a printer's mistake.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# As a token of my gratitude





M.SURESAN



**E. Anil, Bapatla**

**Q.** Sir, ఒక వాక్యాన్ని నిర్మించేందుకు sub+verb+obj అవసరమా? అవి లేకుండా sentence ని form చేయలేమా?

**A.** Subject, verb లేకుండా వాక్యం ఉండదు. object ఉన్నా లేకపోయినా ఫర్వాలేదు. సందర్భాన్ని బట్టి object అవసరం ఉంటుంది.

eg: She sings- ఇక్కడ 'she', subject, 'sings', verb. ఆమె పాడుతుంది. అనే అర్థంతో ఇది sentence అవుతుంది కదా.

She sings film songs - ఇక్కడ subject: she, Verb: sings; Object: film songs (ఆమె సినిమా పాటలు పాడుతుంది)

The child can walk- ఇది ఇంకో sentence object లేకుండా (ఆ బిడ్డ నడవగలదు). Subject - The child, verb - can walk. కాబట్టి sentence ఉండేందుకు object అవసరం లేదు.

**Q.** Be, to be, has/ have తరువాత past participle కాకుండా ఇంకా ఏమైనా adjectives, nouns రావచ్చా? వస్తే ఏ సందర్భంలో?

**A.** Be/ to be = am/ is/ are; was/ were; చివర 'be' ఉండే verbs (shall be, should be, can be, etc), చివర been వచ్చే verbs, (have been, has been, would have been could have been, etc)- ఇవన్నీ 'be/ to be' వివిధ రూపాలు. వీటి పక్కన past participle మాత్రమే రావాలని లేదు. Noun, adjective, present participle (... ing form) లాంటివేమైనా రావచ్చు మీరు తెలపాలనుకునే భావాన్ని బట్టి అసలు మీరు English మాట్లాడాలను కున్నా, రాయాలనుకున్నా ఈ ఆలోచనలన్నీ అనవ సరమే కాకుండా, మీ free flow of speech/ writing (ధారాళంగా మాట్లాడ్డానికీ/ రాసేందుకు) అడ్డంకి కూడా. మాట్లాడేటప్పుడు, రాసేప్పుడు, ఏం చెప్పాలి/ రాయాలనుకున్నదీ వ్యక్తపరచండి. ఈ ఆలోచనలు పెట్టుకుని, మనం 'be' form తర్వాత noun వాడుతు న్నామా, objective/ PP/ ...ing form వాడు తున్నామా, అని ఆలోచిస్తూ భావాన్ని వ్యక్తపరచరు కదా? మీరు తెలుగు మాట్లాడేపుడు ఏ verb (క్రియ) తర్వాత ఏ part of speech వస్తుందో ఆలోచిస్తూ మాట్లాడ్తారా?

మీరు గుర్తుంచుకోవాల్సింది- 'be' form తర్వాత, మీరు పైకి తెలిపిన 'be' forms తో వీలైనన్ని sentences రాయండి. వాటిల్లో 'be' forms తర్వాత part participle మాత్రమే కాకుండా ఎలా ఇతర పదాలు కూడా వాడవచ్చో తెలుస్తుంది. అలాగే have/ hasతో కూడా వాక్యాలు చేసి చూడండి. మీ ప్రశ్నకు సమాధానం మీకే తెలుస్తుంది.

'Be' form తర్వాత past participle వస్తే verb, passive voice అవుతుంది. అప్పుడది తెలుగులో 'బడు', 'బడటం' అనే అర్థాలతో ఉంటుంది.

This song is sung at our school everyday.

ఈ sentence లో verb- is sung- is- be form + sung- past participle of sing- ఇక్కడ verb, 'be' form + part participle కాబట్టి, verb passive voiceలో ఉంది. Sentence అర్థం: ప్రతి రోజూ ఆ పాట స్కూల్లో పాడబడుతుంది (is sung)

ఇదే Active voice లో అయితే, We (The students) sing this song at our school every day = ప్రతిరోజూ ఈ పాటను మేం (విద్యార్థులు) schoolలో పాడతాం: అని వస్తుంది.

Many have seen the movie (Active Voice- Verb: have seen) = The movie has been seen by many.

Active Voice అర్థం: చాలామంది ఆ సినిమా చూశారు. Passive Voice అర్థం: ఆ సినిమా చాలా మందిచే చూడబడింది.

మరిన్ని వివరాలకోసం Website లో ఉన్న పాత వ్యాసాలు చూడండి.

(i) He gave (AV) - అతడు ఇచ్చాడు = He was given (అతడు ఇవ్వబడ్డాడు) అవును. Object లేదు. దానికి సందర్భాన్ని బట్టి అతడేమిచ్చాడో (AV). అతడేం ఇవ్వబడ్డాడో (PV) ఈ sentence మాట్లాడేవాళ్లు తెలపాలి కదా? అలా తెలిపితే sentence complete అవుతుంది కదా?

**Q.** Passive voice లో 'ఇవ్వబడటం' అనే అర్థం తప్పని సరిగా ఉండాలా?

**A.** ఉండాలి.

To be (am, is, are, etc...) ఎలా అయినా వాడవచ్చు మీరే రాసి, మాట్లాడి practice చేయండి. బాగా అర్థం అవుతుంది.

ఇవన్నీ కూడా 'be' forms - will be - future లో ఉంటుంది/ ఉంటాడు/ ఉంటారు/ ఉంటాయి.

Can be- ఉండగలదు (ఇప్పుడు, future లో)

Should be - ఉండాలి.

Would be - గతం నుంచి futureలో ఉండటం

May be - ఉండొచ్చు ఇప్పుడు, ముందుముందు

Might be - ఉండొచ్చు ఇప్పుడు, ముందుముందు

**G. Shankar, Keshavapatnam**

**Q.** Dear Sir, I have studied a phrasal verb in a Grammar book. That is.. "With a view to settle the dispute amicably he offered Rs. 10,000 to the party". Why they didn't use 'ing' form after this phrase? Is there any exception? Please clarify.

**A.** It should have been, "with a view to settling the dispute..", and not "with a view to settle the dispute". Phrasal verbs like, with a view to, object to, looking forward to (That is, phrasal verbs ending with the preposition 'to') should be followed by a noun or an ...'ing' form and not by the to + 1st Regular doing word ($V_1$) form.

**Q.** What methods to be followed for Nursery, LKG, UKG kids to acquire quick response and mention some teaching tools for them.

**A.** First of all, make them talk. Make them practice simple and short sentences like.. 'this is a pen', etc. That's for a beginning. No space here to explain it in full.

**C.G.Rao, Visakhapatnam.**

**Q.** కింది వాటికి అర్థాల్లో తేడాలను తెలపగలరు.

A sikh 'devotee' & A 'devout' sikh.

**A.** Sikh devotee = A devout sikh; but 'a devout sikh' is more religious than 'a sikh devotee'.

**Q.** Recite & Recite from memory.

**A.** Recite = read from memory.

Recite from memory is not correct, as recite it self means to read from memory.

**Q.** Renamed & Rechristened

**A.** Renamed = Rechristened

**Q.** Address (an issue) & Solve (an issue).

**A.** Address an issue = Try to solve a problem.

Solve = Find a solution to a problem.

**Q.** Determine & resolve

**A.** Determine = resolve

**Q.** కింది మాటలను తెలుగులో అనువదించగలరు.

A veteran actor

**A.** చాలా అనుభవజ్ఞుడైన నటుడు.

**Q.** A veteran cars

**A.** A Vintage car = A veteran car = Car made during the period 1917-1930 and known for its style and interest it creates because of its age; generally a car of the distance past and is known for its style.

**Q.** A Liquor Baron

**A.** A person who has become rich and influential by doing liquor business. (By manufacturing and selling alcoholic drinks- e.g. : Vijay Malya)

Baron = Something like a Zamindar (A rich landlord)

**Q.** A Flamboyant youngster

**A.** Flamboyant = చలాకీగా ఉత్సాహంగా, ఇతరులకంటే భిన్నంగా కనిపించడం వల్ల ఆకర్షణీయంగా ఉండే.

**Q.** Vizag Vignette

**A.** Vizag Vignette (Pronunciation విన్యట్) Vizag ను గురించి తెలిపే చిన్న రచన/ చిత్రం

**Q.** A Galaxy of dignitaries

**A.** ప్రముఖ హోదాలో ఉన్న వ్యక్తుల సమూహం. (Galaxy = A thick cluster/ group of stars).

**Q.** Raw deal

**A.** Raw deal = సరైన న్యాయం జరగకపోవడం.

**Q.** Lady luck.

**A.** అదృష్టదేవత.

**Q.** Lady love

**A.** ప్రేయసి (Lady love- Old fashioned. Modern expressions- Love = the girl a man loves; lover = A man/ boy a girl loves)

**Q.** కింది పదాలకు అర్థాలను ఉదాహరణలతో తెలపగలరు.

Comes under the scanner

**A.** నిశితంగా పరిశీలింప/ పరీక్షింపబడటం

**Q.** Albeit

**A.** Although (Albeit old fashioned)

**Q.** Galore

**A.** Galore = ఎక్కువ సంఖ్యలో ఉండటం

**Q.** Take the backseat

**A.** ప్రాముఖ్యం కోల్పోవడం

**Q.** Take the centre stage

**A.** ప్రాముఖ్యం పొందడం.

**M. Anjaneyulu & K. Nageswara Rao, Molagavalli, Kurnool (Dt.).**

**Q.** Love ! When you come with the burning lamp of pain in your hand, I can see your face and know you as bliss.

దీనికి తెలుగులో అర్థం తెలపగలరు.

**A.** ప్రేయసీ, బాధ అనే వెలుగుతున్న దీపంతో నువ్వు వచ్చినప్పుడు, నీ మోహం చూసి, నిన్ను 'ఆనందం' రూపంగా గుర్తిస్తాను.

**A.V. Subbarao, Onipenta, Kadapa(dt.)**

**Q.** Sir కిందివాటికి తెలుగులో అర్థాలు తెలపగలరు.

'ప్రజలచేత, ప్రజల కొరకు, ప్రజల వల్ల'

**A.** Of the people, by the people, for the people.

**Q.** ఎక్కువ సిగరెట్లు తాగేవారిని chainsmoker అంటారు కదా? అలాగే ఎక్కువగా మద్యం తాగేవారిని ఏమంటారు?

**A.** Chainsmoker అంటే ఎక్కువ సిగరెట్లు తాగేవారని కాదు; అంతకన్నా ఇంకా ఎక్కువ - విరామం ఇవ్వ కుండా, సిగరెట్ వెంట, సిగరెట్ ముట్టించుకుని తాగే వాళ్లు.

నిరంతరాయంగా మద్యం తాగేవారు - always on the horse/ boozer/ sponge.

**Q.** ★ L.K.G., U.K.G. కి ముందు Nursery నుంచి అంటారు. మేం చదివేటప్పుడు అలా లేదే?

★ Kinder garten అంటే ఏమిటి?

**A.** తల్లిదండ్రులిద్దరూ ఉద్యోగులై రెండేళ్ల నుంచి అయిదేళ్ల వరకు ఇంట్లో పిల్లలను చూసుకొనే పరిస్థితి లేనపుడు, ఈ nurseryలు, LKG (Lower Kindergarten) నుంచి నాలుగేళ్ల పిల్లలకు UKG (Upper Kinder Garten) లకు ఆ బాధ్యత అప్పగిస్తారు. మనదేశంలో English Medium Schools ఎక్కువైన తరువాత ఇవి మామూలైపోయాయి. England లో అయితే అయిదేళ్ల వరకు పిల్లలను చూసుకునే వసతి, అమెరికాలో అయితే అయిదేళ్ల నుంచి పిల్లల బాధ్యతను వహించే వసతిని Kindergarten (KG) అంటారు.

**Q.** సారా, బ్రాందీలకు సంబంధించి wines కాకుండా belt shop లు అంటే ఏమిటి?

**A.** ప్రభుత్వ Licence లు లేకుండా, Licence ఉన్న మద్యం దుకాణాల్లో సరకు కొని చిల్లరగా, అనధికారంగా, Licensed Shops లేనిచోట విక్రయించే Shops, Belt Shops.

**Q.** Natty Boy

**A.** Natty Boy = Neat and fashionable చక్కగా శుభ్రంగా ముస్తాబైన కుర్రాడు.

**Q.** నిరుద్యోగిని unemployee అనకూడదా?

**A.** నిరుద్యోగి = Unemployed; unemployee కాదు.

**Q.** కొబ్బరిబోండాను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Coconut.

**Q.** Cab service అంటే ఏమిటి?

**A.** Taxi Service (Cab = Taxi)

**Q.** 1 ని Single అని, 2 ను Double అని, 3 ను Triple అని అంటాం కదా? మరి 4, 5, 6 తది తరాలను ఏమంటారు?

**A.** 4 రెట్లు = Quintuple

5 రెట్లు = Pentuple

6 రెట్లు = Sextuple

**Q.** Sit up అంటే అర్థం బింగీలు అనేనా?

**A.** అవును. కొన్ని చోట్ల గుంజీలు అంటారు.

**Q.** Aerobics అన్నా, యోగా అన్నా ఒకటేనా?

**A.** Aerobics = హృదయం, ఊపిరితిత్తులను బలోపేతం చేసే వ్యాయామం.

**Q.** మన దేశంలో పీజీని ఎం.ఎ., ఎం.ఎస్‌సి. అంటారు కదా? విదేశాల్లో పీజీని MS అంటారు. దాని Abbreviation తెలపగలరా?

**A.** మనం M.Sc లో Sc ని Science కు abbreviation గా వాడితే, విదేశాల్లో S వాడతారు. అందుకని M.Sc (Master of Science) in India = M.S. in America.

**Q.** కలింగర కాయను watermelon అంటారు. మరి కర్బూజ పండును ఏమంటారు?

**A.** Melon

**Q.** Intake అంటే?

**A.** లోపలికి వెళ్లేది - మనం తీసుకునే ఆహారం; ఒక బడిలో చేర్చుకొగల పిల్లల సంఖ్య, etc.

**Q.** పెళ్లిచూపులను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** English లో లేదు.

**Q.** Vote on account Budget అంటే ఏమిటి?

**A.** Budget ను శాసనసభ/ పార్లమెంట్‌లో ప్రవేశపెట్ట లేని పరిస్థితిలో తాత్కాలికంగా ప్రవేశపెట్టే జమాఖ ర్చుల పద్దు.

**Q.** పాము కుబుసం.

**A.** Hood.

**Q.** As a token of gratitude.

**A.** As a token of my gratitude.

**Q.** Hobby, Habit ఈ రెంటి మధ్యా తేడా ఏమిటి?

**A.** Hobby = తీరిక సమయాల్లో మన సరదా కోసం చేసే పని. తీరిక సమయంలోని వ్యాపకం.

Habit = అలవాటు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**




# We keep talking about..





M.SURESAN



*P. Srinivasa Rao, Hyderabad*

**Q.** కిందివాటిని English లోకి ఎలా అనువదించాలో తెలియజేయగలరు.

1. ఫోన్ కలవకపోతే ఇంకో నెంబర్‌కి ప్రయత్నించు.
2. నిజం చెప్పాలంటే
3. ఉన్నంతలో
4. చెప్పుకుంటూ ఉంటాం
5. తెప్పించు, ఇప్పించు; ఏమయితే అది, ఎప్పుడయితే అప్పుడు, ఎవరైతే వారు, ఎక్కడైతే అక్కడ, ఎలా అయితే అలా, ఎంతయితే అంత

**A.** 1. If you are not able to get the number, try another number.

2. To tell you the fact/ to speak the fact
3. To the extent possible/ to the extent available
4. We keep talking about
5. Get it, See Some one is given something.

whatever it is for, whenever, whoever, wherever, in whatever way, as much as possible... అయితే ఇవన్నీ కూడా సందర్భాన్ని బట్టి మనం వాడే sentences ను బట్టి ఉంటుంది.

**Q.** కింది మాటలకు తెలుగులో అర్థాలు తెలపగలరు.

1. I am literally talking.
2. By means of, By all means, By no means
3. Failing which
4. As many as
5. Made an appearance
6. In terms of
7. As a case may be
8. In cursion (అర్థం, ఉపయోగం తెలపండి)
9. One to one కలిసినప్పుడు
10. Came to stop
11. Out right minority minister
12. Chemistry (కొన్ని T.V. Channels లో మీ Chemistry బాగుంది, వాళ్లిద్దరి Chemistry Match అయ్యింది అని అంటూంటారు) Chemistry కి ఇక్కడ అర్థం ఏమిటి?

**A.** 1. నేను వాడిన మాటల అర్థం వచ్చేలా మాట్లాడుతున్నాను.

ఉదా: అహర్నిశలు కృషిచేశాను - నిజంగానే (కచ్చితంగా) రాత్రీపగలూ పనిచేశాను నిద్ర లేకుండా - ఇలా మాట్లాడటం literally speaking.

రక్తం ఓడ్చి పనిచేయడం - నిజంగానే రక్తం కారేలా పనిచేయడం, అంటే రక్తం కారినంత వరకు నిజంగానే పనిచేస్తే, దాన్ని literally speaking అంటాం.

2. By means of - తద్వారా

By means of hardwork = శ్రమపడటం ద్వారా

By all means = నిరభ్యంతరంగా

a: How about giving me the book? (ఆ పుస్తకం కాస్త ఇస్తారా?)

b: By all means (తప్పకుండా/ నిరభ్యంతరంగా) ఇస్తాను.

By no means = కానేకాదు/ ఏవిధంగానూ కాదు.

He is by no means my friend = నాకతడు ఏవిధంగానూ స్నేహితుడు కాదు.

3. Failing which = అలా జరక్కపోతే/ లేకపోతే

Pay the amount by next month, failing which I will take action against her = వచ్చే నెలలోగా డబ్బు చెల్లించు. లేకపోతే (అలా జరక్కపోతే) నేను చర్య తీసుకుంటాను.

4. As many as = అన్నీ/ అంతమంది (ఆశ్చర్యం వ్యక్తం చేసేందుకు వాడతాం)

As many as 100 people lost their lives = వందమంది (అంత ఎక్కువ సంఖ్యలో) తమ ప్రాణాలు పోగొట్టుకున్నారు.

As many as 11 buses were burnt down = 11 బస్సులు (ఆశ్చర్యకరంగా చెప్పడం) తగలబెట్టారు. (అన్ని బస్సులు - అని ఆశ్చర్యంగా చెప్పడం)

5. కనిపించడం, హాజరుకావడం.

6. మనం ఒక విషయం చెప్పే విధం-

In terms of the lives lost, at least 10 have been killed, and in terms of money more than 10 lakh rupees might have been spent = పోయిన ప్రాణాల సంఖ్య గురించి చెప్పాలంటే కనీసం పది ప్రాణాలైనా పోయాయి. డబ్బు విషయంగా చెప్పాలంటే రూ.10 లక్షల కంటే ఎక్కువే ఖర్చై ఉంటుంది.

7. Send me either the books or the CDs as the case may be = అదేదే. Books అయితే, Books, CDs అయితే CDs, ఏదయితే అది/ ఏది వీలయితే అది (As the case may be) పంపు.

8. In cursion కాదు - Incursion (ఒకే మాట) = దండయాత్ర, దాడి (Invasion)

9. One to one = రెండు విభాగాల్లో ఒక్కొక్కటి తీసుకుంటే.

One to one కలిసినప్పుడు = వాళ్లిద్దరూ ఒకరికొకరు ఎదురు పడ్డప్పుడు (ఇంకెవరూ లేకుండా).

Difficult to find one to one similarity between the members of the two groups = ఆ రెండు జట్లలో ఒక జట్టులో ఒకరికీ, ఇంకో జట్టులో ఒకరికీ పోలిక కష్టం.

10. ఆపించడం/ మానిపించడం.

11. దీనికి సందర్భం తెలిస్తే కానీ అర్థం చెప్పలేం.

Out right = పూర్తిగా, బాహాటంగా.

12. వాళ్లిద్దరి భావాల, తలపుల కలయిక, మేళవింపు చక్కగా కుదిరింది.

**Q.** కిందివాటికి Clarification ఇవ్వగలరు.

1. Sachin had to play -ఆడాల్సి ఉంది/ ఆడాడో లేదో తెలియదు. Which is correct?
2. నీవు రావాల్సి వస్తే - If you have/ had to come. Which is correct.
3. అతడిక్కడ లేడు - He is no here/ He is not here/ He is not available here - which is correct?
4. Spoken English లో Simple (Basic) English వాడటం కరెక్టా? Advanced English వాడటం మంచిదా?
5. Spoken English లో కొత్తగా వాడుకలోకి వచ్చే మాటలు అన్ని రాష్ట్రాల్లోని దేశాల్లో కూడా వాడతారా? ఒకచోట పుట్టిన కొత్తమాట India/ World అంతటా ఉపయోగించవచ్చా? అవి అందరికీ అర్థం అవుతాయా?
6. I could walk అంటే నడవగలిగాను/ నడవగలిగే వాడిని/ నడిచే వాడిని (used to) వీటిలో ఏది Correct?
7. I would go అనేది కేవలం Future & Regular & willing actions కే వాడతారని తెలుసు. అయితే మీరు కొన్ని Lessons లో Past tense కి కూడా వాడారు. e.g. : వెళ్లే వాడిని/ వెళ్తూండే వాడిని (used to)
8. మీరు చూసే ఉంటారు/ వినే ఉంటారు అనే అర్థంతో you would have seen/ heard అని వాడుతుంటారు. అది కరెక్టేనా? కాకపోతే ఎలా చెప్పాలి. అలాగే మీకు తెలిసే ఉంటుంది అనే అర్థంలో You would have known అని అంటుంటారు. అది కరెక్టేనా? కాకపోతే ఎలా చెప్పాలి.
9. Put-keep, Bring-Get-fetch వీటికి తేడా ఏమైనా ఉందా? అన్ని సందర్భాల్లో వీటిలో దేన్నైనా వాడవచ్చా?

**A.** 1. ఏదైనా కావచ్చు.

2. If you have to come (ఇప్పుడు/ భవిష్యత్‌లో రావాల్సి వస్తే)
3. He is not here.
4. ఎంత simpleగా ఉంటే అంత మంచిది.
5. మాటలు కొత్తగా వాడుకలోకి రావడమంటే, English మాతృభాషగా ఉన్న ప్రాంతాల్లో ప్రచారమై, ప్రజలు వాటిని ఎక్కువగా వాడటం. తరువాత media ద్వారా, books ద్వారా మిగతా చోట్ల కూడా వాడుకలోకి వస్తాయి.
6. I could walk = గతంలో నడవగలిగేవాడిని/ (ఇప్పుడు) నడవగలిగేవాడినే కదా (కాని అలాజరిగే వీలులేదు).
7. వెళ్లేవాడిని/ వెళ్తూండేవాడిని (used to - a repeated action in the past కు) కూడా వాడతారు.
8. You might have seen/ heard = మీరు చూసే ఉంటారు/ వినే ఉంటారు.

You would have seen/ heard = నువ్వు చూసుండేవాడివే/ వినుండేవాడివే కానీ, చూడలేదు/ వినలేదు.

You would have seen him if you had been here =నువ్విక్కడ ఉంటే అతని చూసి ఉండేవాడివి (నువ్విక్కడ లేవు, చూడలేదు).

If you had been here, you would have heard it (నువ్విక్కడ ఉంటే, నువ్వది వినుండే వాడివే, కానీ, నువ్విక్కడ లేవు, వినలేదు)

9. put = దేన్నైనా ఒకచోటికి తెచ్చి అక్కడ పెట్టడం. Put the books on the table. (Table మీద పెట్టు). ఈ అర్థంతో Put అన్నా, keep అన్నా ఒకటే. అయితే ఒకరి దగ్గర, ఉంచుకోవడం అన్నప్పుడు, keep వాడతాం. Keep the books with you = నీదగ్గర ఉంచుకో, ఇక్కడ keep బదులు put వాడలేం కదా? keep కు ఇంకా చాలా ఇతర అర్థాలున్నాయి, put కు సంబంధంలేనివి.

Bring = ఒక వస్తువును/ మనిషిని అది/ వారున్న చోటునుంచి తీసుకురావడం.

Fetch = ఒకచోటికి వెళ్లి, అక్కడి నుంచి తీసుకు రావడం.

Fetch the boy here = నువ్విప్పుడు ఆ కుర్రాడు న్నచోటికి వెళ్లి ఇక్కడికి తీసుకురా.

(Bring the boy here = నువ్వా కుర్రాడిని - ఇప్పుడు నువ్వు, అతడు ఒకేచోట ఉన్నారు - తీసుకురా). Get = Bring/ fetch.

*S.Md. Ghouse Mohiuddin, Kadapa*

**Q.** కింది వాక్యాలను ఆంగ్లంలోకి అనువదించగలరు.

1) వెల్లకిలా పడుకో
2) బోర్ల పడుకో
3) కాళ్లు చాపు
4) కాళ్లు ముడుచుకో
5) ముఖ్యమంత్రి బస్సు ప్రమాదంలో గాయపడిన ప్రయాణికులను పరామర్శించారు.
6) నీవు చాలాకాలం నుంచి కనిపించలేదు.
7) నీవు ఇంతకాలం ఎక్కడికి వెళ్లావు?
8) నీవు నీచుడవు

**A.** 1. Lie supine/ on your back.

2. Lie prostrate/ on your stomach.
3. Stretch your legs.
4. Hold your legs.
5. The CM visited the bus accident victims and enquired about their condition.
6. You haven't been seen/ You haven't been around for a long time.
7. Where have you been all these days?
8. You are mean.

**Q.** కింది తెలుగు పదాలు/ వాక్యాలను ఆంగ్లంలో అనువదించగలరు.

1) కాస్త సంయమనం పాటించండి
2) ప్రతిష్ఠాత్మక
3) సృజనాత్మక
4) ఆనవాయితీ
5) విడ్డూరం
6) ఆర్థికమాంద్యం
7) రాజకీయ ప్రతిష్టంభన
8) ప్రతిఘటన
9) తన కోపమే తన శత్రువు
10) కాస్త ఓపిక వహించండి
11) శాంతం సముద్రం కంటే గొప్పది
12) సమన్వయంతో వ్యవహరించండి
13) ఆధ్యాత్మిక
14) ధార్మిక విద్య
15) పరామర్శించడం
16) పునరాలోచన

**A.** 1. Observe some restraint

2. Prestigious
3. Creative
4. Convention/ Practice
5. Strange/ Ridiculous
6. Recession
7. Political deadlock.
8. Resistance
9. Your wrath/ anger is your energy
10. Be patient awhile/ Have some patience.
11. Peace is mightier than the sea.
12. Have some restraint.
13. Spiritualism.
14. Moral/ Spiritual education.
15. Enquire about someone's health.
16. Rethinking.

**Q.** 1)
- <u>Coming</u> together is a beginning
- <u>Keeping</u> together is a progress
- <u>Working</u> together is a success.

Coming, Keeping, Working అనే పదాలు Gerund కు చెందినవా లేదా past participle కు చెందినవా?

2) I have gone to Delhi

I have been to Delhi

**A.** 1) ఈ sentences (1-3)లో keeping, working, అన్నీ Gerunds.

2) I have gone to Delhi - WRONG - Have gone/ has gone - వెళ్లారు/ వెళ్లాం/ వెళ్లాను/ వెళ్లాడు/ వెళ్లింది.

I have gone to Delhi = నేను ఢిల్లీ వెళ్లాను. (అంటే నేనిప్పుడు ఢిల్లీకి వెళ్తూ అయినా ఉండాలి, ఢిల్లీ చేరయినా ఉండాలి అని కదా? ఈ పరిస్థితిలో ఢిల్లీకి వెళ్లిన విషయం ఎవర్తో చెప్పగలం? వెళ్లి, తిరిగి వచ్చిన తర్వాతే గదా చెప్పగలం. అందుకని I/ Weతో have gone అని వాడం. I have been to Delhi/ We have been to Delhi అనే అంటాం. అలాగే Have you gone to Delhi? అనం. Have you been to Delhi? అంటాం.

గమనిక: ఈ నెల 21వ తేదీన Spoken English సమాధానాల్లో పాము కుబుసాన్ని Hood అంటారని పొరపాటున ప్రచురితమయింది. 'Hood = పాము పడగ, Sloughing = కుబుసం విడవడం' అని గమనించగలరు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



# Hope things will look up for him





M.SURESAN

**Rishabh:** Things haven't been going well for Harish. Of late his company has been going under.

(హరీష్ పరిస్థితులేం బాగుండటం లేదు. అతడి వ్యాపారం దివాలా మార్గంలో ఉంది.)

**Mithun:** I'm sorry to hear that. But throughout last year he was on buying spree; acquiring property after property.

(వినేందుకు బాధగా ఉంది. కానీ క్రితం సంవత్సరం మొత్తం అతడు విపరీతంగా కొనడమే, ఇళ్లు, స్థలాలు సమకూర్చుకుంటూ)

**Rishabh:** But he is brave. He says whatever the setbacks, he will pull through. Hope he will. He is the good sort, you know.

(కానీ ధైర్యంగానే ఉన్నాడతడు. ఎన్ని సమస్య లెదురయినా అధిగమించగలనని అంటున్నా డతడు. ఆశిద్దాం అలా జరుగుతుందని. పాపం అతడు మంచివాడు.)

**Mithun:** I think it's all a case of plans going awry most of investment has been in real estate, and the whole of last year it was down. Now that it is looking, his hopes of pulling through may be justified.

(పథకాలన్నీ విఫలమైపోవడమే అంతటికి కారణం, అనుకుంటా. అతడి పెట్టుబడి ఎక్కువ స్థిరాస్తిలో పెట్టాడు. క్రితం సంవత్సరం మొత్తం, స్థిరాస్తి వ్యాపారం అంతా క్షీణదశలో ఉంది. ఇప్పుడది పుంజుకుంటుండటంతో తను గట్టెక్కుతాననే నమ్మకం సమర్థనీయం కావచ్చు)

**Rishabh:** But the trouble is he drew too much on his reserves, and that is telling on his ability for reinvestment .

(కానీ చిక్కేమిటంటే నిల్వ నిధులను ఎక్కువ ఉపయోగించాడు. అది అతడి మళ్లీ పెట్టుబడి పెట్టే శక్తిని దెబ్బతీస్తోంది.)

**Mithun:** He built up from scratch. Days were when he had to make do with food that was about to go off.

(అతడు చేతిలో ఏం లేకుండా ప్రారంభించాడు. అతడు చెడిపోబోతున్న తిండితో కూడా తృప్తిపడ్డ సందర్భాలూ ఉన్నాయి.)

**Rishabh:** I know. Hope things will look up for him.

(తెలుసు. అతడి పరిస్థితి మెరుగవుతుందని ఆశిస్తున్నాను.)

**Notes:** Spree = మనం ఇష్టపడేపని అదే పనిగా చేయడం.

Buying spree = విపరీతంగా వస్తువులు కొని ఆనందించడం. దీనిని నేరాల విషయంలో కూడా వాడుతుంటారు.

Killing spree = అదేపనిగా చంపడంలో ఆనందించడం. The terrorists are on a killing spree = టెర్రరిస్టులు ఆనందంతో అందర్నీ చంపేస్తున్నారు.

Setbacks = అవరోధాలు. sort = kind = రకం = type.

***Look at the following expressions from the conversation above:***

*1) His business is going under:*

*2) ... he will pull through*

*3) Now that it is looking up*

*4) ... a case of plans going awry*

*5) Now that it is showing up, his hopes of pulling through may be justified...*

*6) He drew too much on his reserves and that it is telling on his ...*

**1) To go under** = క్షీణించడం/ తరిగిపోవడం, ముఖ్యంగా వ్యాపారాలూ, లాభాలు.

a) They've accepted the merger offer they had from the other company, as their company was going under = వాళ్ల వ్యాపారం క్షీణిస్తుండటంతో అవతలి కంపెనీ నుంచి వచ్చిన విలీనం ప్రతిపాదనను అంగీకరించారు. (merge = విలీనమవడం/ కలిసిపోవడం)

b) The company will certainly go under unless it prunes its staff = తమ సిబ్బందిని తగ్గించుకోకపోతే, ఖచ్చితంగా దివాలా తీస్తుంది.

(Prune= అవసరానికి సరిపోయేంతగా తగ్గించుకోవడం, మొక్కలు బాగా ఎదిగేందుకు కత్తిరించడం)

**2) Pull through** = నష్టాలనుంచి కోలుకోవడం/ ఆరోగ్యం కోలుకోవడం.

a) with the software industry going under, it is doubtful if the company can pull through = software పరిశ్రమ మాంద్యంవల్ల, ఆ company నష్టాలనుంచి కోరుకోగలగడం సందేహమే.

b) Thanks to some incentives assured by the government. The company is able to pull through = ప్రభుత్వం ప్రకటించిన కొన్ని ప్రోత్సాహకాల పుణ్యమా అని, ఆ కంపెనీ కష్టాలనుంచి గట్టెక్కగలిగింది.

c) The patient has been able to pull through, largely because of the doctor's attention and is about to be discharged = ముఖ్యంగా డాక్టరు శ్రద్ధ వల్ల ఆ రోగి కోలుకోగలిగింది, త్వరలోనే discharge కాబోతోంది.

**3) look up** = పరిస్థితులు మెరుగవడం

a) Real Estate business is again looking up = స్థిరాస్తుల వ్యాపారం మళ్లీ పుంజుకుంటోంది/ మెరుగవుతోంది.

b) His health hasn't shown any signs of looking up = అతడి ఆరోగ్యం మెరుగయ్యే సూచనలేం కనిపించలేదింతవరకు

**4) Going Awry** = (Awry అరై) మన పథకాలు, ఆలోచనల్లాంటివి తలకిందులవడం/ మనం అనుకున్నట్టు జరగకపోవడం.

a) My plans for starting a business have gone awry = నేను వ్యాపారం ప్రారంభించాలను కున్న ఆలోచనలు తలకిందులయ్యాయి.

b) The government's efforts to improve rural literacy by 12% last year went awry = గ్రామీణ అక్షరాస్యతను 12 శాతం పెంచేందుకు ప్రభుత్వం చర్యలు ఫలించలేదు.

ఈ నాలుగు Phrases - 1) go under 2) pull through 3) Look up and 4) go awry - సర్వ సాధారణంగా వినిపించే phrasal verbs - వీటిని బాగా practise చేద్దాం.



***G.G.R., Visakhapatnam***

**Q.** Albeit ను ఎలా వాడతారో తెలియ జేయగలరు.

**A.** Albeit = although/ though/ even though = అయినప్పటికీ

He agreed to help me, albeit unwillingly = నాకు సహాయం చేసేందుకతడు ఒప్పుకున్నాడు, అయిష్టంగా అయినప్పటికీ. Albeit చాలా గ్రాంథికమే కాకుండా పాతవాడుక.

**Q.** Upbeat film etc., గురించి వివరించగలరు.

**A.** up beat = భవిష్యత్తును గురించి ఆశావహంగా ఉత్సాహంగా ఉండటం. (Optimistic. An up beat mood = ఆశావహమైన మనస్థితి.)

An up beat atmosphere = ఆశావహమైన వాతావరణం. (మంచే జరగబోతుందన్న ఉత్సాహకరమైన వాతావరణం) అయితే up beat film అనేది సరైన expression కాదు. ఆశావహమైన సినిమా ఉండదు కదా? ఇంకా ఇలా అనొచ్చు The movie ends on an upbeat note = ఆశావహమైన/ ఉత్సాహకరమైన సూచనతో సినిమా ముగుస్తుంది.

The govt employees are up beat following the revision of pay scales = వేతన సవరణవల్ల ప్రభుత్వోద్యోగులందరూ ఉత్సాహంతో ఉన్నారు.

**Q.** కింది వాక్యాలను తెలుగులో వివరించగలరు.

The symptoms may disappear spontaneously.

**A.** Spontaneously = without any preparation/ something that comes naturally మన ప్రయత్నమేం లేకుండా సహజంగా మనకు కలిగే భావోద్రేకాలు.

His song received spontaneous response = అతడి సంగీతానికి సహజ స్పందన లభించింది = శ్రోతలు అనుకోకుండానే స్పందించారు.

Poetry comes spontaneously to her = కవిత్వం ఆమెకలా సహజంగా వచ్చేస్తుంది.

Brahmanandam's comedy is spontaneous = బ్రహ్మానందం హాస్యం చాలా సహజంగా (ప్రయత్నం ఉన్నట్టే కనిపించదు) ఉంటుంది.

**Q.** The police were assisted by contingents of paramilitary forces.

**A.** Contingent = దళం (ఒక జట్టుగా, సమూహంగా ఉండేవాళ్లు) A contingent of police= police దళం.

**Q.** He is instrumental for the development of the institute (Instrument అంటే ఏదైనా పరికరంకదా? )

**A.** Instrumental = కారణభూతుడవటం. అయితే Instrumental తర్వాత వాడాల్సిన preposition, 'for' కాదు, 'in'.

**Q.** Equating Hinduism with Hindutva is sinister.

**A.** హిందూ ధర్మం, హిందూత్వాలను ఒకటిగా చేయడం ప్రమాదాన్ని సూచిస్తోంది (Sinister)

**Q.** కిందివాటిని ఇంగ్లిష్‌లో ఎలా వ్యక్తీకరించాలో తెలియ జేయగలరు.

అధిష్ఠానం జరిగిన నష్టాన్ని పూడ్చాలని తలచింది.

**A.** The high command is trying to cover up the damage.

**Q.** దుండగుల ఆగడాలు మితిమీరిపోయాయి.

**A.** The misdeeds (ఆగడాలు) of miscreants (దుండగులు) have crossed all limits.

**Q.** 'కుత్సిత రాజకీయాలు' అనే అపప్రథ నుంచి రాజకీయ ముఖచిత్రాన్ని మార్చగల శక్తి యువతకే ఉంది.

**A.** The youth alone has the power to change the profile of the present vile politics.

**Q.** స్థిరాస్తి కంపెనీలు ప్రకటనలు గుప్పిస్తున్నాయి.

**A.** Real estate companies are on an advertisement spree.

**Q.** తమను చక్రబంధంలో బిగించేందుకు అధికార పార్టీ కుట్ర పన్నుతోంది.

**A.** The party in power is plotting to have us in its grip.

**Q.** భారత్ తిరుగులేని ఆధిపత్యం సాధించింది.

**A.** Bharat has gained irreversible supremacy.

**Q.** కాంగ్రెస్ పాలనకు చరమగీతం పాడాలి.

**A.** Let's sing the funeral song of the congress rule.

**Q.** పకడ్బందీ వ్యూహంతో పోలీసులు బస్తీని దిగ్బంధం చేశారు.

**A.** The police with their fool proof strategy have made the city inaccessible.

**Q.** రైతులు ఆందోళనపథంలో కదం తొక్కారు.

**A.** The agitated ryots staged a protest march.

**Q.** ప్రభుత్వ ఆగడాలకు భరతవాక్యం పలకాలి.

**A.** We should put an end of the misdeeds of the government.

**Q.** ప్రతీ సంప్రదాయంలోనూ ఆరోగ్య భావనలు అంతర్లీనంగా ఇమిడివున్నాయి.

**A.** There is an undercurrent of health principles in all religious traditions.

***A.V. Subba Rao, Onipenta***

**Q.** దయచేసి ఈ సందేహాలను తీర్చగలరు.

White goods.. అంటే..

**A.** మన ఇళ్లల్లో వాడే Refrigerator, Washing machine, Air conditioner లాంటి పెద్ద పెద్ద విద్యుత్ పరికరాలను White goods అనీ, TV, Radios, Tape recorder, Video లాంటి చిన్న చిన్న విద్యుత్ పరికరాలను Brown goods అనీ అంటారు.

**Q.** Above all - All above

**A.** Above all - అన్నిటికంటే ముఖ్యంగా

All above - పైన తెలిపినవన్నీ.

**Q.** All over - over all

**A.** All over - (ఒక స్థలం) అంతటా

Overall - మొత్తం/ మొత్తానికి

**Q.** say - tell; speak - talk

**A.** Say - tell; Speak - talk : వీటి తేడాల గురించి ఇంతకుముందు చాలాసార్లు వివరించాం. చూడండి.

**Q.** Laureate

**A.** Laureate = సన్మాన/ పురస్కార గ్రహీత

**Q.** Poet Laureate

**A.** Poet Laureate = ఆస్థానకవి.

**Q.** Name sake - For the name sake of

**A.** name sake - 1) పేరుకు మాత్రం, 2) మీపేరే ఇంకొకరికుంటే మీ namesake

**Q.** Caste no bar

**A.** కులం పట్టింపులేదు/ అడ్డం కాదు.

**Q.** కాళ్లకు వేసుకునే గజ్జెలు లేదా పట్టీలను ఏమంటారు?

**A.** Anklet

**Q.** కండ్లకలక

**A.** Conjunctivitis.

**Q.** Spoken English - speak English - spoke English

**A.** Spoken English = సంభాషణల్లో/ మామూలుగా మాట్లాడేటప్పుడు వాడే English.

Speak English = English మాట్లాడు

Spoke English = అతడు/ ఆమె, etc English మాట్లాడారు.

**Q.** నేను లెటర్ రాశాను.. ఇంగ్లిష్‌లో ఏమనాలి?

I wrote a letter (or) I written a letter?

**A.** I wrote a letter, correct.

(I Written a letter లో verb లేదు, కాబట్టి అర్థం పూర్తవదు. కనుక sentence కాదు. I have written a letter, correct.)

**Q.** Fourth Estate అని Media ను అంటారు. మరి మిగతా మూడింటిని- శాసన నిర్మాణ, కార్యనిర్వాహక, న్యాయవ్యవస్థలను ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** 1) The Legislature 2) The Executive, and 3) The Judiciary.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**






*E. Anil, Bapatla*

**Q.** Sir, కింది సందేహాలు తీర్చగలరు.
He has had this car for the past 2 years
*Or*
He has this car for the past 2 years
అని రాయవచ్చు కదా. ఇక్కడ 'కలిగి ఉన్నాడు' అనే అర్థంలో Had వాడతాం కదా! అయితే Has + pp తప్పనిసరా? ఒక దినపత్రికలో 'కలిగి ఉన్నాడు' అనే అర్థంలో Has వాడి దాని పక్కన $V_3$ వాడలేదు. Has తరవాత మిగతా Adj, Adv, Noun etc. ఏమైనా వస్తాయా? వస్తే వాటి అర్థం ఎలా ఉంటుంది? God has many forms అని చదివాను. Has తరవాత pp ఉండాలి కదా?

**A.** He has this car for the past 2 years సరికాదు. అతడికి రెండేళ్లుగా ఈ car ఉంది అని కదా చెప్పాల్సింది. రెండేళ్లుగా అంటే, Past లో start అయి, ఇప్పటివరకూ/ ఇంకా అని చెప్పేందుకు అతడికి (he) కాబట్టి has + past participle of have (had) అని రావాలి కదా? అందుకని He has had the car for the past two years అంటాం.

**Q.** ఎబ్బెట్, ఎలర్జీ అనే మాటలకు అర్థాలను spelling తో సహా వివరించగలరు.

**A.** అబెట్ (ఎబ్బెట్) కాదు = నేరంలో సాయపడటం Abet.

Allergy = ఏదైనా శరీరతత్వానికి పడకపోవడం. (Allergy to dust - దుమ్ము పడకపోవడం. గాలి వీస్తేటప్పుడు, దుమ్ము కూడా లోపలికి పోయి చికాకు కలిగిస్తుంది.)

**Q.** Feedback అంటే ఏమిటి? దాని usage ను ఉదాహరణతో తెలపగలరు.

**A.** Feedback = స్పందన; మనం ఎవరికైనా ఏదయినా చేస్తే, దాని గురించి వాళ్ల అభిప్రాయం.

Her music performance got a good feedback = ఆమె సంగీత ప్రదర్శన గురించి మంచి అభిప్రాయాలే వచ్చాయి.

*B. Dasarath, Konasamudram.*

**Q.** Sir, please kindly clarify following doubts, meanings, explanations and usage.
Counter, Counterpart, Counterfile, Despite, Being, Atmost, Itself, Apart from that, He finds himself, vis-a-vis, Yet, Notat, Let - Lets, He has helped a number of people, but now he finds himself poor = అతడు చాలామందికి సాయం చేశాడు, కాని ఇప్పుడేమో తను పేదవాడయ్యానని తెలుసుకున్నాడు.

**Vis-a-vis** (వీజావీ- జా size లో జ్ లా) = రెండింటిని పోల్చి చూస్తే.

Indian democracy vis-a-vis Pakistan's rule = భారత ప్రజాస్వామ్యాన్ని పాకిస్థాన్ పాలనతో పోలిస్తే...

**Yet** = ఇప్పటికీ లేదు- He has not yet come (అతడిప్పటికీ రాలేదు) = He has yet to come (అతడిప్పటికీ రావాల్సి ఉంది)

Not at కాదది, Not yet, పైన తెలిపిన విధంగా.

**Let** = (I, We, You, They తో) సమ్మతించడం = lets (He, she, it తో)

**Even** = కూడా - Even Gandhi made mistakes = గాంధీ కూడా పొరపాట్లు చేశారు.

5) Determination
In spite of my advice she would buy the car. (నా సలహా పట్టించుకోకుండా, ఆమె కారు కొనాలనే నిశ్చయించుకుంది)

6) Polite Offers/ Invitations/ requests:
a) Would you have a cup of coffee? (offer చేయడం)
b) Would you have dinner with me today? (పిలుపు)
c) Would you wait for a few minutes (విజ్ఞాపన)

7) With verbs of option: I would like/ love/ hate/ prefer, etc in the statement form.
I would like to have a swim.

8) I would rather go home than attend the boring class. (మన ఎంపిక తెలియజేయడం)

**Q.** Obstinacy
**A.** మొండితనం

**Q.** Refusal
**A.** అసమ్మతి/ ఒప్పుకోకపోవడం

**Q.** Reported 'will' (intention), Reported 'will' (future)

**A.** 'Reported 'will' అంటే నాకు అర్థం కావడం లేదు. అవును, will ను ఉద్దేశం తెలిపేందుకు, future తెలిపేందుకు వాడతాం, ఇలా!
I will buy a car soon (నేను త్వరలో కారు కొంటాను- ఉద్దేశం - intention)
He will reach here tomorrow. ఇది future - అతను రేపిక్కడికి చేరతాడు.

# She will have been singing





M.SURESAN

Has (he, she, it) తో అర్థం- ఇప్పుడు/మామూలుగా కలిగి ఉండటం

He has a car = అతడికి కారుంది.

He has had a car = అతడికి రెండేళ్లుగా కారుంది.

Compare: He sings for movies = అతడు సినిమాలకు పాడతాడు.

He has sung for movies for the past 2 years = అతడు రెండేళ్లుగా సినిమాలకు పాడాడు/ పాడుతున్నాడు.

Has తర్వాత కలిగి ఉన్నాడు అనే అర్థంతో, noun మాత్రమే (వస్తువులను/ మనుషులనూ సూచించే పదాలు) వస్తాయి.

He has a son (son - noun) = అతడికో కొడుకు ఉన్నాడు.

He has a car (car - noun) = అతడికి కారుంది.
'has' తర్వాత pronoun వస్తుంది. (Noun వాడే చోట్లంతటా pronoun వస్తుంది.)

He has it (a car బదులు)

Has తర్వాత adjectives, ఒక్కటిగా రావు. Has + adjective + noun రావచ్చు

He has a <u>beautiful</u> <u>car</u>
adj noun

Has తర్వాత adverb రానే రాదు.

God has <u>many</u> <u>forms</u>
adj noun.

'has' రెండు విధాలుగా వాడతాం. ఒకటి కలిగి ఉండటం అనే అర్థంతో; రెండోది, has + past participle (has been, has gone, has known) లో భాగంగా. Has + past participle లో 'has' verb లో భాగం మాత్రమే. ఇక్కడి has కూ, కలిగి ఉండటం అనే అర్థంతో వాడే 'has' కూ సంబంధం ఏం లేదు.

*K. Omkar, Visakhapatnam.*

**Q.** Sir, కింది పదాలను English లో ఏమంటారు?
చిటికెలు, తపస్సు, గుర్తుచేయడం అనే main verb, ఆడపడుచు, నిరాడంబరత, నిరాడంబరుడు, మూపురం (ఒంటెపై ఉన్న దిమ్మెలాంటి భాగం)

**A.** Snapping the fingers = చిటికలు;
penance = తపస్సు; remind = గుర్తుచేయడం,
Modesty = నిరాడంబరత,
modest person = నిరాడంబరుడు,
hump = మూపురం.

**Q.** Note down the points
Note the points down
వీటిలో ఏ వాక్యం కరెక్ట్?

**A.** రెండూ correct.

Even - evenif, whether - if, Reason(s) - Ground(s) - Factor(s), Either - or, Neither - nor, Among - Between.

**A.** **Counter** - Refer to a dictionary; it has a number of meanings

**Counterpart** = people in the same position in two different organisations.

eg: The principal of one college is the counterpart of the principal of another college. The Prime Minister of one country is the counterpart of the Prime minister of another country.

**Counterfoil** (Not counterfile) = one of the two parts of a cheque/ receipt/ bill/ ticket which we keep with us, when we give the other part to others.

**Despite** = (Modern usage) In spite of. In spite of the ban on smoking, people continue to smoke = There is a ban on smoking, but people continue to smoke = Though/ Although/ Eventhough there is a ban on smoking, people continue to smoke

**Being** = అలా ఉండటం (వల్ల)

Being rich he can buy a car = ధనవంతుడుగా ఉండటం వల్ల అతడు కారు కొనగలడు.

**At most** = At the most = మహా అయితే/ అంతగా అయితే

It may cost at (the) most Rs. 20/- = మహా అయితే దానికి 20 రూపాయలుకావచ్చు

**Itself** = దానంతట అదే, అదే, అది మాత్రమే

a) A spring door closes itself = స్ప్రింగ్ తలుపు దానంతట అదే మూసుకుంటుంది.

b) The TV itself costs Rs.30,000. Other things are extra = TV మాత్రం 30,000 రూపాయలు. మిగతావి అదనం.

**Apart from** = అదే కాకుండా; అంతేకాకుండా.

Apart from the jewels, some cash was also stolen = నగలే కాకుండా కొంత డబ్బు కూడా దొంగతనంలో పోయింది (దొంగతనం చేశారు).

**He finds himself** = తన పరిస్థితిని అర్థం చేసుకోవడం-

He speaks English even better than English people = English వాళ్లకంటే కూడా ఆయన English బాగా మాట్లాడతాడు.

**If** = Whether = అదా, ఇదా/ అవునా, కాదా అని, ఎంపిక తెలిపేందుకు వాడతాం.

I don't know if/ whether it is right or wrong = అది సరో తప్పో నాకు తెలియదు.

Ask him if he/ whether he will come or not = అతడు వస్తాడా, రాడా (అని) అడుగు.

**Reasons** = కారణాలు; **Grounds** = ఆధారాలు; factors = కారణాంశాలు.

**Either, or** = అదైనా, ఇదైనా

**Neither, nor** = అదీకాదు (లేదు), ఇదీ కాదు (లేదు)

**Among** = రెండింటికన్నా, ఇద్దరికన్నా ఎక్కువలో. They discussed among themselves = వాళ్లల్లో వాళ్లు (ఇద్దరికన్నా ఎక్కువమంది వాళ్లు) చర్చించుకున్నారు.

**Between** = They divided the property between them (వాళ్లిద్దరూ ఆస్తి పంచుకున్నారు- ఇద్దరూ/ రెండింటిమధ్య)

**Q.** In official letters, they writes (someone) "have/ have been requested" inspite of "has/ has been requested" is this correct? If so, how it is possible sir?

**A.** I, we, you, they తో have been వస్తుంది. He, she, it తో has been వస్తుంది.

*K.K. Reddy, Hyderabad.*

**Q.** Modal verb - Would - గురించి వివరంగా తెలపగలరు.

**A.** Would:

1) Future form of will from the past. He said that he would help me
(Compare: He says that he will help me.)

2) To express the improbability of an action (అసంభవం)in the present.
If he asked for my help, I would help him (Neither would he ask for my help, nor would I help him. Neither of the two is likely to happen).

3) 'would' expresses a past habit.
Those days I would see every movie on the day of its release.

4) For expressing a wish in the present
I wish he'd (he would) come.

**Q.** Habitual

**A.** He will smoke cigarette after cigarette while at serous work - Habit (ముఖ్యమైన పని చేస్తున్నప్పుడు, సిగరెట్ తర్వాత సిగరెట్ అలా కాలుస్తూనే ఉంటాడు)

**Q.** Polite request

**A.** Will you explain this to me once again, (please)? - request = ఇదీ మళ్లీ ఇంకోసారి వివరిస్తారా?

**Q.** Probability

**A.** Is he coming? That will be trouble again - probability - జరిగే అవకాశం ఉండటం (అర్థం - వాడొస్తున్నాడా? అయితే మళ్లీ ఇబ్బందే కావచ్చు)

**Q.** Plain stem 'have' + ed

**A.** She will have started (will + have + start + ed) by this time tomorrow - రేపీపాటికి ఆమె బయల్దేరి ఉంటుంది. ఇది భవిష్యత్‌లో ఒక సమయం ముందుకానీ, సమయానికి కానీ అయిపోయి ఉంటుంది అనుకునే చర్యను తెలుపుతుంది.

**Q.** Plain stem 'have' + been + ing

**A.** She will have been singing (will + have been + ing) at the function by this time tomorrow = రేపీ సమయానికి ముందే ప్రారంభించి, ఈ సమయానికి ఆమె ఇంకా పాడుతూ ఉంటుంది. కచేరిలో future లో ఓ సమయానికి ముందు ప్రారంభమై, ఆ సమయంలో కూడా సాగుతూ ఉండే చర్య.

**Q.** 'would rather'

**A.** 'would rather' - shows preference (మన ఇష్టాన్ని తెలియపరుస్తుంది)
I'd rather (I would rather) walk than travel by the crowded bus = ఆ గుంపుతో ఉన్న city bus లో వెళ్లేకంటే నడవటానికి ఇష్టపడతాను- నడవడమే నాకు (ఎక్కువ) హాయి.

**Q.** 'would rather' + 'have' + ed (preference)

**A.** ఇది గతంలో మనం ఇష్టపడి జరగనిదాన్ని తెలియపరుస్తుంది.
I'd rather have gone home than listen to his boring lecture = ఆయన విసుగెత్తించే ఉపన్యాసం వినకుండా ఇంటికెళ్లిపోయి ఉంటే నాకు హాయిగా ఉండేది. (అలా చేసేందుకు ఇష్టపడి ఉండేవాడిని)- కానీ వెళ్లలేదు. ఆయన ఉపన్యాసంతో విసిగిపోయా.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Ravali:** I'm really delighted that you topped the list of successful candidates. Well, how do you feel?
(విజయం పొందిన అభ్యర్థుల్లో నువ్వు అగ్రస్థానంలో నిలిచినందుకు చాలా సంతోషంగా ఉంది. నీకెలా ఉంది?)

**Manogna:** Oh, thrilled of course. It's heartening to know that my hard work has paid off, and I am going to join a top B. School.
(ఎలా ఉంటుంది? ఒళ్ళు గగుర్పొడిచేంత సంతోషంగా ఉంది. నా కృషి ఫలించినందుకు, ఉత్తమ B. School లో చేరబోతున్నందుకు చాలా సంతృప్తిగా ఉంది.)

**Ravali:** The result this time in general is good. A number of our friends made it to some of the reputed B. Schools.
(మొత్తానికి ఈసారి ఫలితాలు బాగానే ఉన్నాయి. మన స్నేహితుల్లో చాలామంది పేరున్న B. Schoolsలో చేరే అర్హత పొందారు.)

**Ravali:** They could not disguise their glee at my low score either, I mean, last year. I just can't understand how people could be so jealous. But their euphoria is shattered now. They are not even among the top ten.
(నాకొచ్చిన తక్కువ మార్కుల గురించి కూడా వాళ్ళు తెగ సంతోషపడిపోయారు. మనుషులు అంత అసూయతో ఎలా ఉండగలరనేది నాకర్థం కాదు. అయితే వాళ్ల సంతోష భావం ఇప్పుడు పటాపంచలైంది. కనీసం ఉత్తమ పదిమందిలో కూడా వాళ్లలేరు.)

**Manogna:** Let's celebrate the occasion by going to a movie. How about 'Nenu Nuvvu'? I hear it is a feel good movie.
(ఈ సందర్భాన్ని మనం పండుగ్గా చేసుకుందాం. 'నేను నువ్వు' సినిమాకెళ్దామా? అంతా సంతోషం కలిగించే సినిమా అని విన్నాను నేను.)

**Ravali:** That suits me fine. (నాకిష్టమే.)

# She delighted him with the news

**Manogna:** That should raise the spirits of our parents surely. The trainers at our institute must be jubilant about it too. They had been down over the poor showing of the coaching institute last year.
(అది మన తల్లిదండ్రులకు సంతోషాన్ని కలిగించాలి. మన సంస్థలోని శిక్షకులు కూడా చాలా ఉత్సాహంతో ఉంటారు తప్పకుండా. కిందటేడాది మన సంస్థ పేలవమైన ప్రదర్శనతో డీలాపడిపోయింది.)

**Ravali:** Your dad must have felt very happy about it.
(మీ నాన్న చాలా సంతోషపడి ఉంటారు.)

**Manogna:** Happy? He is ecstatic about it and so is my mother. They have waited for this hour all along. You remember, last year I could not score so high, and Neela and Aruna were gloating over my not making it to the top.
(సంతోషమా? పరవశించిపోయేంత ఆనందంలో ఉన్నారాయన. మా అమ్మ కూడా. ఈ క్షణం కోసమే వాళ్లింతకాలం వేచి ఉన్నారు. నీకు గుర్తుందా పోయిన సంవత్సరం నేనంత ఎక్కువగా మార్కులు తెచ్చుకోలేనందుకు, నీలా, అరుణ, చాలా సంతోషపడి పోయారు.)





M.SURESAN

**Notes:** B School = MBA College, Make it to something = దేన్నైనా సాధించడం Poor showing = మంచిస్థానం పొందకపోవడం, disguise = 1) మారువేషం 2) మన భావాలను బయటపడకుండా ఉంచడం (ఇక్కడ) Pay off = ఫలించడం.

***Now look at the following expressions from the conversation above:***

| | |
|---|---|
| 1) Delighted | 2) Heartening |
| 3) Raise spirits | 4) Jubilant |
| 5) Ecstatic | 6) Gloat over/ at |
| 7) Glee | 8) Euphoria |

పై మాటలన్నీ కూడా సంతోషం/ ఆనందానికి సంబంధించిన అర్థాలనిస్తాయి. వాటి వాడకం ఇప్పుడు చూద్దాం.

**1) Delight** = సంతోషం/ సంతోషం కలిగించడం.

a) His delight knew no bounds when he won the first prize = మొదటి బహుమతి వచ్చినప్పుడు అతడి సంతోషం అవధులు దాటింది (Knew no bounds)

b) She delighted him with the news that she loved him too, and was willing to marry him = తను కూడా అతడిని ప్రేమిస్తున్నానని, అతడిని పెళ్లిచేసుకోవడానికి ఇష్టమేనన్న మాటలతో అతడికానందం కలిగించింది.

c) He was delighted on hearing that his application for a scholarship has been accepted = తను scholarship కు పెట్టుకున్న అప్లికేషన్ వాళ్లు స్వీకరించడం అతడికానందాన్ని కలిగించింది.

**Delightful** = ఆనందకరమైన

The starnight was really delightful with all the stars turning out in their best appearance = అందరు (సినిమా) తారలూ తమ గొప్ప దర్శనంతో ప్రత్యక్షంకావడంతో ఆ Starnight చాలా ఆనందదాయకంగా ఉంది.

**2) Heartening** = సంతోషంకలిగించే, ప్రోత్సాహకరమైన.

a) It's heartening to see girls equalling or even proving better than boys in a good number of areas = చాలా రంగాల్లో బాలికలు, బాలురతో సమానంగా ఉండటమే కాకుండా, వాళ్ళ కంటే మెరుగ్గా ఉండటం సంతోషకరం.

b) Inspite of his illness during the exam, he passed. That's really heartening = పరీక్షల్లో అతడికి జబ్బుగా ఉన్నప్పటికీ, అతడు ఉత్తీర్ణుడయ్యాడు. అది సంతోషకరం.

**Hearten X Dishearten**

a) He was disheartened that none of his sons came up to his expectations = తన కొడుకులెవరూ తను ఆశించిన స్థాయికి ఎదగకపోవడం అతడిని నిరుత్సాహపరిచింది.

b) When we think of the levels of corruption in India we all feel disheartened = దేశంలోని అవినీతిస్థాయి చూస్తుంటే నిరుత్సాహంకలుగుతుంది.

**3) Raise somebody's spirits** = lift somebody's spirits = ఎక్కువ సంతోషవంతులుగా/ ఎక్కువ ఆశావహులుగా చేయడం.

a) The thought of the vacation after the exams raised/ lifted the students' spirits - పరీక్షల తర్వాత సెలవులొస్తాయనే ఆలోచన విద్యార్థులను ఎక్కువ సంతోషపరులుగా చేసింది/ వారి ఉత్సాహాన్ని ఎక్కువ చేసింది.

b) After days of loneliness, the sight of her children raised/ lifted her spirits = రోజుల తరబడి ఒంటరితనం తరువాత తన పిల్లల దృశ్యం (పిల్లలు కనిపించడం) ఆమెకు ఉత్సాహాన్ని కలిగించింది.

c) There was nothing in the game of the Indian Team to raise/ lift our spirits = భారత జట్టు ఆటలో మనకు సంతోషం కలిగించేదేమీ లేకపోయింది.

**4) Jubilant** = అమితోత్సాహంతో ఉండటం

a) His supporters were jubilant when he won the elections = అతడు ఎన్నికల్లో గెలిచినప్పుడు అతడి మద్దతుదారులు ఎంతో సంతోషం/ ఉత్సాహం పొందారు.

b) The team with its three victories in the series is jubilant and is hopeful of making it to the finals = మూడు విజయాలతో ఉత్సాహంగా ఉన్న ఆ జట్టు ఫైనల్స్‌కు చేరగలమని ఆశతో ఉంది. (Jubilation = ఉత్సాహం)

**5) Ecstatic** = పరవశించి/ మైమరచిపోయేంత ఆనందంతో ఉన్న

a) Annamayya was ecstatic even at the thought of Lord Venkateswara = వెంకటేశ్వర స్వామిని తలచుకుంటేనే అన్నమయ్య పరవశించిపోయేవాడు.

b) She is ecstatic about her new job as an IAS Officer = IAS Officer గా తన కొత్త ఉద్యోగం ఆమెను అమితానందకరంగా చేస్తోంది.

**6) Gloat over/ at** = మనకు జరిగిన మంచికి ఇతరులకు జరిగిన చెడుకు సంతోషం.

a) The Kauravas gloated over/ at their victory over the Pandavas in the game of dice = జూదంలో పాండవుల ఓటమిని కౌరవులు ఆనందించారు.

Dice = పాచికలు (Plural), Die = పాచిక (singular)

b) It was shocking to see her gloating over her cousin's misfortunes = తన cousin దురదృష్టాన్ని చూసి ఆమె మురిసిపోవడం దిగ్భ్రమ కలిగించింది.

**7) Glee** - ఇది కూడా దాదాపు gloat లాగానే ఇతరుల బాధలు మనకు సంతోషం కలిగించడం.

a) He laughed in glee when his colleague was fired from job = తన సహోద్యోగిని ఉద్యోగం నుంచి తొలగించినప్పుడు అతడు సంతోషంతో నవ్వాడు.

b) She was gleeful, when she heard that he who teased her had failed = తనను ఏడిపించిన అబ్బాయి తప్పాడని విని ఆమె చాలా సంతోషించింది.

**8) Euphoria** = మనకేం చెడు జరగదు అనే భరోసా.

a) Nehru's euphoria was shaken when the Chinese attacked India = భారత్ మీద చైనా దాడి నెహ్రూకున్న భరోసాను దెబ్బతీసింది.

b) When somebody is drunk they are full of euphoria = ఎవరన్నా బాగా తాగినప్పుడు వాళ్లు చాలా భరోసాగా ఉంటారు.



***D.Srinivas Reddy, Narsapur.***

**Q.** Sir, please give the meanings of these words in detail.

Reportedly, Allegedly, One Rambabu, Babus, Full-pledged, Resort, Pull a surprise, Hangs in the balance, Hang by a fast fraying thread, Buck, Tweet, Level-playing, Have a bull run, Age-old, Cascade, Power point presentation, Back drop, Off-campus.

**A.** Reportedly = అందరూ చెప్పుకుంటున్నట్లుగా

Allegedly = ఆధారం లేకుండా నిజం అనబడుతున్న (ఏదైనా విషయం, నిజమే అంటున్నారు, కానీ, దానికాధారం లేదు, రుజువు చేయాల్సి ఉంది)

One Rambabu = ఎవరో రాంబాబు అనే అతడు

Babus = ప్రభుత్వ అధికారులు

Full fledged (full-pledged కాదు) = పూర్తిగా ఎదిగిన/ స్వతంత్ర ప్రతిపత్తి ఉన్న.

India is now a full fledged space technology state = భారత్ ఇపుడు పూర్తిగా ఎదిగిన అంతరిక్ష పరిజ్ఞానం ఉన్న దేశం.

Resort = 1) విడిది (సెలవుల్లో, వేసవి సమయాల్లో, విశ్రాంతి వేళల్లో సరదాగా గడపగల ప్రదేశం)

Ooty is a summer resort

2) ఏదైనా పనికి పాల్పడటం some people resort to theft when they need money = డబ్బు అవసరమైనపుడు కొందరు దొంగతనానికి పాల్పడతారు.

Pull a surprise = ఆశ్చర్యం కలిగించడం

Hangs in the balance = అటో ఇటో తేలకుండా సందిగ్ధ పరిస్థితిలో ఉండటం.

Hang by a fast fraying thread = త్వరగా/ ఏ క్షణాన్నైనా తెగిపోయే తాడుకు వేలాడుతూ ఉండటం (ఏ క్షణాన్నైనా ప్రమాదం/ ముప్పు జరిగే విధంగా)

Buck = 1) మగజింక/ మగ కుందేలు/ దుప్పి

2) వ్యావహారికంగా - డబ్బు - రూపాయి/ డాలరు, etc.

How many bucks? = ఎన్ని రూపాయలు? / డాలర్లు?

Tweet = 1) పక్షుల అరుపు 2) Internet ద్వారా ఒక బృందంగా ఏర్పడిన వాళ్ల సంభాషణ.

Level-playing = పోటీలో పాల్గొనే వారందరికీ సమానావకాశం

Have a bull run = share market లో ధరలు పెరిగే కాలం.

Age-old = ప్రాచీనమైన/ చాలాకాలంగా వాడుకలో ఉన్న

Cascade = చిన్నజలపాతం/ విశాలంగా పాయలుగా పడే జలపాతంలో ఒక పాయ; ఏదైనా పైనుంచి కిందికి ప్రవాహంలా పడేది. స్త్రీ జడ పాయలు బాగా వత్తుగా ఉంటే కూడా a cascade of hair అంటాం.

Power point presentation = ఏదైనా విషయం వివరంగా తెలిపేందుకు computer సహాయంతో తెల్లటి గోడ/ తెరమీద బొమ్మలు, వివరాలను (సినిమా హాల్స్‌లో slides లా) ప్రదర్శించడం.

Back drop = background = నేపథ్యం.

1) ఒక సంఘటన చోటుచేసుకునే పరిస్థితులు.

2) నాటకశాలల్లో రంగస్థలం వెనుక curtain

3) సినిమాల్లో ఒక సంఘటన జరుగుతున్న స్థలం వెనుక దృశ్యం.

Off-campus = విద్యాలయాల ఆవరణ బయట. correspondence courses అన్నీ కూడా off-campus courses.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# Hello, who is this please?

**Subodh:** Hello... ?

**Susmitha:** Hello, who is speaking?
(హలో ఎవరు మాట్లాడేది?)

**Subodh:** I am Subodh here/ This is Subodh. Am I speaking to Susmitha?
[నేను సుబోధ్‌ను (మాట్లాడుతున్నా). నేను సుస్మితతో మాట్లాడుతున్నానా? (మామూలు తెలుగులో, సుస్మితేనా మాట్లాడుతోంది?)]

**Susmitha:** Yes, you are. How are you Subodh?/ Good morning/ Good evening/ Good Afternoon, etc., Subodh. What's the matter?
(అవును, నువ్వు సుస్మితతోనే మాట్లాడుతున్నావు (మామూలు తెలుగు- ఆ నేను సుస్మితనే) Good morning, etc., ఏమిటి విషయం?)

**Subodh:** We thought of meeting this evening. Remember? Where and when exactly we'll that be?
(మనం ఈ సాయంత్రం కలుసుకుందామనుకున్నాం. గుర్తుందా? ఎక్కడ, సరిగ్గా ఎప్పుడు కలుసుకుందాం?)

**Susmitha:** I do of course. How about 7 in the evening at Ruchi Restaurant?
(నాకు గుర్తుందిలే. సాయంత్రం ఏడింటికి రుచి హోటల్లో కలుసుకుందామా?)

**Subodh:** OK. That suits me fine.
(అలాగే. నాకూ అది సౌకర్యంగానే ఉంటుంది.)

* * * * *

**Suprabhat:** Hello, who is this please?

**Pranav:** I am Pranav here. Can I speak to Suprabhat? (నేను ప్రణవ్‌ను. సుప్రభాత్‌తో మాట్లాడొచ్చా) Is it Suprabhat? (ఇది సుప్రభాతేనా?)

**Suprabhat:** Speaking. (మాట్లాడుతున్నాను) What's it about? (ఏమిటి విషయం?)

**Pranav:** You should tell me. You wanted me to give you a ring at this time. Yea. That's why I am calling.
(నువ్వు చెప్పాలి. ఈ సమయానికి నువ్వు నన్ను ఫోన్ చేయమన్నావు. అవును. అందుకని ఫోన్ చేస్తున్నా).

**Suprabhat:** Oh, I am sorry I forgot. I want to talk to you about our trip to Tirupathi. Do come down here so we can fix the matter.
(సారీ. నేను మరచిపోయా. మనం తిరుపతికి వెళ్లే విషయం మాట్లాడాలనుకున్నా. సరే ఇప్పుడొచ్చేయ్. అన్నీ తేల్చేసుకుందాం)

* * * * *

**Krishna:** Who are you calling?
(ఎవరికి ఫోన్ చేస్తున్నావు?)

**Nikhila:** Karthik. I have something important to tell him.
(కార్తీక్‌కు. అతడికి ఓ ముఖ్యమైన విషయం చెప్పాలి)

**Krishna:** Oh, I remember. Isn't it about the function?
(గుర్తొచ్చింది. ఫంక్షన్ విషయం కదా?)

**Nikhila:** Yea. I am unable to get him. His phone has been busy for 10 minutes now. Wonder who he is talking to.
(అవును. అతడితో ఫోన్లో మాట్లాడలేకపోతున్నా. 10 నిమిషాలుగా బిజీగా ఉంది వాడి ఫోన్. ఎవరితో మాట్లాడుతున్నాడబ్బా ఇంతసేపు?)

**Krishna:** Try Vidya and tell her about it, she will pass on the message to him. Or at least she will ask him to talk to you.
(విద్యకు ఫోన్ చేసి తనతో చెప్పు, తను కార్తీక్‌తో చెప్తుంది, లేదంటే వాడితో మాట్లాడిస్తుంది.)

**Nikhila:** A good idea. Have you/ Do you have her number? I don't exactly remember it.
(మంచి ఆలోచనే. తన నంబరు నీ దగ్గరుందా? నాకది సరిగ్గా గుర్తులేదు.)

**Krishna:** She is on this number. Try it.
(ఆమెది ఈ నంబరు. చేసి చూడు.)

**Nikhila:** Thank you.

* * * * *

పై మూడు సంభాషణలు టెలిఫోన్‌కు సంబంధించినవే అని తెలుస్తుంది కదా? టెలిఫోన్‌లో మాట్లాడటానికి కూడా ఓ పద్ధతి, దానికి సంబంధించిన expressions (మాటలు) వేరేగా ఉంటాయని అందరికీ తెలుసు. మనం ఫోన్లో మాట్లాడే విధానాన్నిబట్టి, అవతలివాళ్లు ఫోన్లో మాట్లాడినప్పుడు ఎలా స్పందిస్తాం అనేదాన్నిబట్టి, మన నడవడి, వ్యక్తిత్వాన్ని సులభంగా అంచనా వేయవచ్చు





M.SURESAN

ఇప్పుడు దాని గురించి తెలుసుకోబోతున్నాం.

ముఖ్య విషయం: ఇది తెలుసుకున్నంత మాత్రాన ప్రయోజనం లేదు. ఇది ఫోన్లో ఇలా English లో మాట్లాడుతూ practice చేస్తేనే, మనం సహజంగా, అలవాటుగా correct గా మాట్లాడగలిగి మన communication skills ను మెరుగుపరచుకోగలం. మళ్లీ చెప్తున్నాం. తెలుసుకోవడంతో ఆగకుండా ఫోన్ వాడినప్పుడల్లా, practise, practise and keep practising. మనం ఫోన్లో English లో మాట్లాడితే/ పలకరిస్తే మన తప్పులు చూసి ఇతరులు నవ్వుతారేమోననే భయంతో చాలామంది English లో మాట్లాడరు. అలాంటి భయాలన్నీ వదిలేసి English లో మాట్లాడటం నియమంగా పెట్టుకుని మీ communication skills ను పెంచుకోండి.

కింది వివరాలను జాగ్రత్తగా గమనించి గుర్తుంచుకుందాం.

**Phone:** ఇది Telephone కు short form. ఎక్కువగా వాడుకలో ఉన్న మాట. మనం దూరప్రాంతంలోనివారితో సంభాషించడానికి వాడే యంత్రం. Telephone ఇప్పుడంత ఎక్కువగా వాడుకలో లేదు. (He has a phone at home)

Phone అంటే ఇంకొకరికి phone చేయడం. ఈ అర్థంతో కూడా ఇప్పుడు Telephone వాడుకలో లేదు. Phone some one= ఒకరితో phone లో మాట్లాడటం.

Phone లో మాట్లాడటం: Phone someone (Phone to some one సరికాదు) = to ring someone = to call some one. American English లో ఎక్కువగా Call somebody/ Phone somebody అంటారు. British English లో Call/ Phone somebody అని మాత్రమే కాకుండా ring somebody అని కూడా అంటారు.

**Ramesh:** How late is the train?
(Train ఎంత ఆలస్యం?)

**Naresh:** I phoned/ called/ rang (only British English) the railway enquiry. The Train is an hour late.
(నేను రైల్వే ఎంక్వైరీకి ఫోన్ చేశాను. రైలు గంట ఆలస్యం)

ఒక్కోసారి ఫోన్ చేసేందుకు 'dial' అని కూడా అంటారు.

Dial 108 for Ambulance. (Ambulance కావాలంటే 108 కి phone చేయండి.)

I called you/ phoned you/ rang you at least three times but there was no response.
(నీకు నేను కనీసం మూడుసార్లు ఫోన్ చేశాను కానీ స్పందన లేదు)

Phone చేయడం అనేందుకు ఇంకా make/ give a call అని కూడా అంటారు give a ring తో బాటు.

a) He made a number of calls yesterday, I don't know who to = నిన్న అతడు చాలా ఫోన్లు చేశాడు, ఎవరికో నాకు తెలియదు.

b) Give him a call/ ring to remind him of the programme = programme ను వాడికి గుర్తుచేయడానికి, ఒకసారి phone చెయ్.

Phone back/ call back/ ring back = మనకు ఎవరైనా ఫోన్‌చేసినప్పుడు మనం బదులు ఇవ్వలేనప్పుడు/ ఏదైనా సమాచారం కనుక్కొని తర్వాత ఫోన్ చేసేటప్పుడు ఇలా అంటాం, phone చేయడం కూడా ఇదే.

**Jagadish:** (Over phone) Do you have any idea of it?
(దాని గురించి నీకేమైనా తెలుసా?)

**Sekhar:** I am not so sure. I'll find out and phone you back/ call you back/ ring you back.
(అంత కచ్చితంగా నేను చెప్పలేను. కనుక్కుని మళ్లీ ఫోన్ చేస్తాను.)

Phone ringing = Phone మోగడం.

Give a call (phone చేయడం) X

Take/ receive a call (phone రావడం/ phone ఎత్తడం)

**Anup:** I called your home yesterday. You were out?
(నేను నిన్న మీ ఇంటికి ఫోన్ చేశాను. నువ్వు బయటకు వెళ్లావు)

**Anil:** Who took the call?
(ఎవరు ఫోన్ ఎత్తారు?)

**Anup:** I think your cousin received the call.
(మీ cousin ఎత్తాడనుకుంటా.)

Phone ఎత్తడాన్ని lift the phone అని కూడా అనవచ్చు. Answer the phone అని కూడా అంటాం.

Phone back/ call back/ ring back అంటే మనకు Phone చేసిన వాళ్లకు, కాసేపయింతర్వాత మనం phone చేయడం కదా? దీనికి ఇంకోమాట 'Return a Call'.

**Chandana:** Please give me a call if you have any more information about this.
(దీని గురించి నీకింకా ఏమన్నా తెలిస్తే నాక్కాస్త ఫోన్ చెయ్యి)

**Sugandha:** I won't. Why should I? You have bad phone manners. You never return my calls/ call me back/ ring me back.
(నేను చెయ్యను. ఎందుకు చెయ్యాలి? నీకు ఫోన్ మర్యాదలు తెలియవు. నా ఫోన్లకు స్పందనగా నీకుగా నువ్వెప్పుడూ నాకు చేయవు)

Be on phone= (ఒకరికి) phone ఉండటం.

a) Madhu: How can I get Madan?
(మదన్‌తో ఎలా మాట్లాడటం?)

Kiran: Why? He is on phone. I can give you his number.
(ఏం? వాడికి ఫోనుంది. వాడి నంబరు నేనివ్వగలను)

b) During vacation I am on phone no...
సెలవుల్లో నేను ఈ ఫోన్ నంబరులో ఉంటా.

మనం phone చేసినప్పుడు అవతలివ్యక్తి phone ఎత్తకపోతే, అప్పుడు, no response (స్పందన లేదు) అంటాం.

I called you a number of times yesterday but there was no response/ I couldn't get any response.
(నేను నిన్న నీకు ఎన్నిసార్లు phone చేసినా ఎవరూ ఎత్తలేదు/ స్పందన లేదు)

మనం phone చేసిన వ్యక్తి ఇంకెవరితోనైనా మాట్లాడుతుంటే, అప్పుడు వాళ్ల phone engaged/ busy అవుతుంది.

When I phoned him an hour ago, his phone was engaged/ busy = గంట క్రితం నేనతడికి phone చేస్తే అతడెవరితోనో మాట్లాడుతున్నాడు/ ఇంకెవరో అతడితో మాట్లాడుతున్నారు.)

అలాంటప్పుడు మనకు వినిపించే శబ్దం: engaged tone/ busy tone.

అయితే engaged వాడకం రానురాను తగ్గిపోయి, busy వాడకం పెరుగుతోంది.

Youngsters are almost always on the phone. Try their phones at any time, and you are sure to hear the busy (engaged) tone = ఈ చిన్నవాళ్లు (యువతీయువకులు) ఈ రోజుల్లో దాదాపు ఎప్పుడూ phone మాట్లాడుతూనే ఉంటారు. వాళ్లకెప్పుడు phone చేసినా, మనకు busy/ engaged tone మాత్రమే వినిపిస్తుంది.

మనకు phone calls receive చేసుకోవడం విసుగ్గా ఉండి, ఎవరి దగ్గరనుంచీ phones రాకుండా ఉండేందుకు, receiver ను తీసి పక్కన పెట్టేయడం = leave the phone off the hook.

a) He must have left the phone off the hook. We have been getting the busy tone since the morning = అతడు phone receiver పక్కన పెట్టేసి ఉంటాడు. పొద్దున్నుంచి busy (engaged) tone వస్తోంది.

Hangup the phone = సంభాషణ అయిపోయిన తర్వాతగానీ/ సంభాషణ కొనసాగించడం ఇష్టంలేనప్పుడు గానీ, receiver ను phone మీద పెట్టేసి సంభాషణ ఆపేయడం.

a) I no longer wanted to hear his complaints and hungup (the phone) = అతడి బాధలు/ నేరారోపణలు వినడం ఇష్టంలేక phone పెట్టేశా.

b) He has bad manners. He hangs up the phone in the middle of a conversation = అతడికి మర్యాద తెలియదు. సంభాషణ మధ్యలో phone పెట్టేస్తాడు.



**S.P. Nirmal.**

**Q.** Sir, please clarify these sentences.
If I find, I will give it to you.
If I found, I would give it to you.

**A.** If I find it, I will give it to you. (If I find, I will give it to you - this sentence is incomplete. If I find, - find what?) = There are chances of my finding it, and once I find it, you will get it. If I found (it), I would return it to you = There is no chance of my finding it, and if at all I find it, I would return it. (Neither am I going to find it, nor is there a chance of my giving it to you)

**Q.** We must go now.
We have to go now.

**A.** We must go now = We have to go now = వెళ్లాలి మనం.

**Q.** While Naveen was cooking, Jyothi was having a bath.

**A.** Naveen's cooking and Jyothi's having a bath were taking place at the same time in the past.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**I.**

**Rao:** Hello, is this 282264642 please?
(హలో, ఇది 282264642 యేనాండీ? )

**Sita:** Yes, and who is this please?
(అవునండీ. మీరెవరండీ? )

**Rao:** I am/ This is Rao (here). Can I speak to Mr. Gopal?
(నేను రావు/ నాపేరు రావు. నేను గోపాల్‌తో మాట్లాడవచ్చా? )

**Sita:** Yes, of course. Please hold on while I call him.
(తప్పకుండా. లైన్లో ఉండండి. పిలుస్తాను.)

**Rao:** This is urgent. Could you make it fast?
(ఇది చాలా urgent. కాస్త త్వరగా పిలుస్తారా? )

**Sita:** Certainly. It won't be a minute
(తప్పకుండా, ఒక్కక్షణం కూడా పట్టదు)

**Prasad:** Perhaps she is busy. Shall I tell her to call you back after she comes or shall I take a message?
(బహుశ busy గా ఉందేమో? రాగానే మీకు phone చేయమని చెప్పనా? లేకుంటే మీరేమన్నా చెప్పేదుంటే నాకు చెప్పండి. నేనామెకు చెప్తాను)

**Pranav:** Just tell her that I called and to call me back.

మనం ఇక్కడ చూడాల్సింది:

i) Shall I tell her to call you back? = రాగానే మీకు ఫోన్ చేయమని చెప్పనా? Call back అనేది ఈ అర్థంలో వాడతాం. practise చేయండి.

ii) Shall I take a message? = మీరేమన్నా చెప్పాల్సి ఉంటే నాతో చెప్పండి. మీరు మాట్లాడాలనుకున్న వ్యక్తితో చెప్తాను.

I will tell her/ him you've called = మీరు ఫోన్ చేశారని ఆమెతో/ అతడితో చెప్తాను.

(నేను మళ్లీ ఫోన్ చేస్తా న్లెండి. ఈ number లోనే కదా ఆయన దొరికేది? )
(Get = phone లో దొరకడం.)

**Krishna:** Yea. This is the number, but call him on extension no. 234. The Operator will put you through/ connect.
(నంబర్ ఇదే, అయితే మీరు extension no. 234 అడగండి. Operator వెంటనే మీ ఫోన్‌ను ఆయనతో నేరుగా కలుపుతారు.)
(Operator: పెద్ద పెద్ద సంస్థల్లో ఉన్న ముఖ్యులను Company phone కు కలిపేవారు.
Extension no.: ఇలాంటి సంస్థల్లో Company phone కు ముఖ్యులను కలిపే phone line)

# Can I speak to Narmada, please?

మనం Telephone skills ను గురించి, దానికి సంబంధించిన మాటల గురించి కొంత తెలుసుకున్నాం గదా? ఇప్పుడు Telephone లో అసలు ఎలా సంభాషించాలో తెలుసుకుందాం. గుర్తుంచుకోండి. తెలుసుకున్నంత మాత్రాన సరిపోదు. దీన్ని phone లో మాట్లాడేటప్పుడు వాడటం బాగా అలవాటు చేసుకోండి. మీ communication skills కు పదును పెట్టండి.

a) ప్రారంభంలో ఉన్న సంభాషణ చూశారు కదా! ఎవరి Phone నంబరైనా సరిగా తెలియనప్పుడు, సందేహంగా ఉన్నప్పుడూ నిర్ధారణ చేసుకునేందుకు ఇలా ప్రారంభిస్తాం. Is this .... (number) please? please మరచిపోకండి.

b) మన phone number అదే అయితే, Yes/ yes, please అంటాం. మనకు phone చేస్తున్నదెవరో తెలియనప్పుడు/ వాళ్ళ కంఠం గుర్తుపట్టలేనప్పుడు పైన అన్నట్లుగా, 'who is this please?' అంటాం. లేకుంటే May I know who this is please?/ May I know who is speaking please? అంటాం.

c) ఇలాంటి ప్రశ్నలకు సమాధానంగా మనం, I am/ this is అని మన పేరు చెప్తాం. (my name is అని సామాన్యంగా అనం. అదంత సరికాదు)

ఆ తర్వాత మనం మాట్లాడాలనుకున్నది phone ఎత్తినవాళ్లతో కాకుండా, ఇంకెవరితోనైనా అయితే, can I speak/ may I speak to Sri/ Mr/ Mrs/ Miss name (ఏ పేరైతే అది)? అనాలి. అయితే మన వయసువాళ్లూ/ మనకన్నా చిన్నవాళ్లూ/ మనతో బాగా చనువూ స్నేహంగా ఉన్నవాళ్లయితే, అప్పుడు, Sri/ Mr/ Mrs/ Miss లాంటివి వాడనక్కరలేదు.

d) Phone మనం receive చేసుకుని, phone ఎవరి కొచ్చిందో వాళ్లను పిలవాల్సివచ్చినప్పుడు, మనం తెలుగులో సామాన్యంగా, 'లైన్లో ఉండండి, పిలుస్తాను' అంటాం కదా? దీనికి English లో, 'Please hold on/ hold the line; I'll call him అనిగాని, while I call him అనిగాని అంటాం. (Be on the line సరికాదు). ఇది బాగా practise చేయండి.

**II.**

**Prasad:** (Lifting the phone) Hello!

**Pranav:** Can I speak to Narmada, please?
(నర్మదతో మాట్లాడవచ్చా? / నర్మద ఉందాండీ? )

**Prasad:** I'm afraid, no. She's gone out.
(లేదండి. బయటికెళ్లింది.)
I'm afraid = I'm sorry. ఇలాంటిచోట్ల, afraid ను, sorry అర్థంతో వాడతాం.

**Pranav:** When will she be back?/ When is she expected back?
(మళ్లీ ఎప్పుడుంటుంది ఇంట్లో? / మళ్లీ ఎప్పుడు తిరిగొస్తుందనుకుంటున్నారు? )

**Prasad:** No idea. Why don't you try her cell? Do you have the number?
(తెలియదు. మీరామె cell కి phone చేసి చూడండి. మీ దగ్గర నంబరుందా? )

**Pranav:** I tried it but no use.
(నేను ప్రయత్నించానుగానీ ఫలితం లేకపోయింది)





M.SURESAN

**III.**

**Sourabha:** (lifting the phone = మోగుతున్న ఫోన్ ఎత్తుతూ) Hello!

**Sukumar:** Am I speaking to Ms Sourabha?
(సౌరభతో మాట్లాడుతున్నానా? ) మామూలుగానైతే- సౌరభయేనా మాట్లాడేది?

**Sourabha:** Yes, you are. What's it about?
(అవును, దేని గురించి మీరు ఫోన్ చేస్తున్నది? )

మనకంతగా పరిచయంలేని వ్యక్తులకు ఫోన్ చేసినపుడు సంభాషణ పై విధంగా ఉంటుంది. మీరు ఇలాంటి సందర్భాల్లో ఫోన్ చేసినప్పుడు Am I speaking to ...? అనడం చాలా సహజంగా ఉంటుంది, Is it Ms Sourabha అనడంకంటే! (Ms అంటే తెలుసు కదా- పెళ్లయిన స్త్రీలను సామాన్యంగా Mrs అంటాం. అయితే ఈ రోజుల్లో పెళ్లయిందీ, లేనిదీ తెలియనివాళ్లను, పెళ్లయి Mrs అని పిలిపించుకోవడం ఇష్టంలేనివాళ్లను Ms (Miss) అని సంబోధిస్తాం. అవివాహిత స్త్రీలను మాత్రం రాసేటప్పుడు Miss అనే రాస్తాం.)

**IV.**

**Ramesh:** (Lifting the phone) Hello!

**Umesh:** Can I speak to Mr Ramesh.
(రమేష్‌తో మాట్లాడవచ్చా? అసలు పరిచయం లేకపోతే, may I speak to...? అనడం మంచిది).

**Ramesh:** Speaking. What can I do for you?
(నేనే రమేష్‌ను మాట్లాడుతున్నాను, ఏంటి సంగతి? )

ఇక్కడ practice చేయాల్సింది, మనకెవరయినా ఫోన్ చేసి, మీతో మాట్లాడవచ్చా? అని అడిగినప్పుడు, నేను మాట్లాడుతున్నాను (speaking) అనడం.

What can I do for you (please)? ఇది చాలా formal. అంటే మనకంత పరిచయం లేని వ్యక్తుల ఫోన్ కాల్స్‌కు స్పందన.

**V.**

**Nikhila:** (As the phone rings - మోగుతుండగా) Some one is calling; take the call. I am busy writing something.
(Phone ఎత్తు. ఎవరో ఫోన్ చేస్తున్నారు...)

**Krishna:** (Lifting the phone) Hello, who is it please?

**The caller** (Phone చేస్తున్న వ్యక్తి): Can I speak to the manager please?

**Krishna:** I'm afraid you've to wait or call again after sometime. He is busy on another phone.
(sorry. మీరు కాస్త వేచి ఉండండి, లేకుంటే మళ్లీ ఫోన్ చేయండి. ఆయన ఇంకో ఫోన్‌లో మరెవరితోనో మాట్లాడుతున్నారు).

**The caller:** I'd rather call again. This is the number on which I can get him, isn't it?

**VI.**

**Sekhar:** Hello, is this Ram Corporation (please)?

**Receptionist:** Yes. Who do you want please?
(అవును. మీకెవరు కావాలి? )

**Sekhar:** Can you put me through to Mr Murthy Senior Manager?
(సీనియర్ మేనేజర్ మూర్తికి కలుపుతారా? )

**Receptionist:** Sorry, He is in a meeting and won't be in for another hour, can I take a message please?
(Sorry, ఆయన meeting లో ఉన్నారు. ఇంకో గంటవరకు రారు. ఏమన్నా చెప్ప మంటారా? ).

**Sekhar:** No Message, I am Sekhar. I am a personal friend of his. I lost his personal phone no. Just tell him I called and would like him to call me back.
(చెప్పాల్సిందేం లేదు. నేనతడి స్నేహితుడ్ని. అతడి ఫోన్ నంబర్ ఎక్కడో పోగొట్టుకున్నా. నేను ఫోన్ చేశానని చెప్పండి. తనను నాకు phone చేయమని చెప్పండి.)

**Receptionist:** Sure, I Will. (తప్పకుండా)

**Sekhar:** Thank you.

★ ★ ★

పై సంభాషణల్లోని expressions గమనించారు కదా? వీటిని మీరు వాడటమే ఇక మిగిలిందంతా. ఆ expressions ను మరోసారి చూద్దాం:

1) Phone చేసినప్పుడు, phone conversation ప్రారంభానికి/ మనం సరైన phone కి చేశామా అని నిర్ధారించుకునేందుకు అనే మాటలు.
Hello, is this... (no) please?
దీనికి జవాబు: Yes/ yes, please; who do you want? who is this?/ May I know who this is/ May I know who is speaking?
దీనికి మళ్లీ స్పందన: I am (మీ పేరు) Can I/ May I speak to ... (మీకు కావాల్సినవారి పేరు)
అది మీరే గనుక అయితే: Yes, speaking అనేది జవాబు. దీంతోపాటు, What's it about?/ What can I do for you అనొచ్చు

2) Suppose you take the call, and the called person is different (మీరు phone ఎత్తి, phone మీకు కాకుండా, మీ ఇంట్లో/ office లో ఇంకెవరికన్నా అయితే, అంటే called person మీరు కాకుండా ఇంకెవరన్నా అయితే, called person దగ్గరే ఉంటే) please hold on/ hold the line (లైన్లో ఉండండి) అని phone చేసిన వ్యక్తికి చెప్పి, Here's is a call for you/ someone is calling you/ you have a call అని called person తో అంటాం. called person = phone ఎవరికొస్తుందో వారు)

3) Called person లేకపోతే, అప్పుడు phone అందుకున్నవారు అనేమాట:
I'm afraid/ I'm sorry he/ she is not here, I'll tell him/ her to call you back/ ring you back/ phone you back as soon as he/ she comes అంటాం. లేకుంటే, He/ she is quiet busy now/ in a meeting now, He/ She can't answer your call. Can I take a message? అంటాం.

4) Called person, extension లో ఉంటే, అప్పుడు ఇలా అంటాం:
Yes, please (ఆయన/ ఆమె ఉన్నారు). I'll pass the call to him/ her (Phone ఆమెకు/ ఆయనకు పంపిస్తున్నాను.)

ఇవీ Telephone సంభాషణలో మెళకువలు.
ఇది కూడా చూడండి.

**Ankith:** Hello, is it 098662513456, please?

**Archana:** Could you repeat the number please? (మరోసారి ఆ నంబర్ చెప్పండి)

**Ankith:** Isn't is 098662513456?

**Archana:** Sorry, You've got the wrong number. (అది wrong number)

అలా అని Archana hangs up/ hooks up the phone. (Phone పెట్టేసింది)

★ ★ ★

**Arjun:** Try sahadev once again.
(మళ్లీ సహదేవ్‌కు phone చేసి చూడు)

**Nakul:** (Dialling the number- నంబర్ నొక్కిన తర్వాత) I don't here the dial tone. The phone is dead.

Dial tone = మనం phone చేయగానే మనకు వినపడే beep, beep శబ్దం- phone ring అవుతున్నట్లు.
Phone is dead: మనం phone చేసినప్పుడు మనం చేసిన phone నుంచి ఏ శబ్దమూ వినపడకపోవడం అంటే phone పనిచేయడం లేదన్నమాట.
Hang up అంటే తెలుసుకదా phone పెట్టేయడం, phone లో మాట్లాడ్డటం అయిపోయినా, మధ్యలో ఆపేసినా. Hook up = Ring off అన్నా అదే అర్థం.
She hooked up/ rang off in the middle of the conversation = మాట్లాడటం ముగియకుండా, మధ్యలోనే phone పెట్టేసింది.

**EXERCISE**

ఇప్పుడు ఈ phone సంభాషణను English లో బిగ్గరగా practise చేయండి.

**Lakshman:** హలో, ఎవరండీ?

**Hanumanth:** నేను హనుమంత్ మాట్లాడుతున్నాను. రాంగారున్నారా?

**Lakshman:** లేరండి (I'm afraid తో ప్రారంభించండి). ఆయన వాళ్లావిడ సీతతో బయటికెళ్లారు.

**Hanumanth:** ఎప్పుడు తిరిగిరావచ్చనుకుంటున్నారు? (when is he...)

**Lakshman:** తెలియదు (...idea వాడండి) ఏమన్నా చెప్పమంటారా? (...message వాడండి)

**Hanumanth:** అక్కర్లేదులెండి. మళ్లీ నేను phone చేస్తాను. హనుమంత్ phone చేశాడని చెప్పండి చాలు.

**Lakshman:** అలాగే. (అని phone పెట్టేశాడు = He rang off/ He hooked up/ He disconnected.)

**ANSWER**

**Lakshman:** Hello who is this please?

**Hanumanth:** I am Hanumanth here. Can/ may I speak to Sri Ram?

**Lakshman:** I'm afraid he isn't in. He has gone out with his wife sita.

**Hanumanth:** When is he expected back?/ when will he be back?

**Lakshman:** No idea. Can I take a message?

**Hanumanth:** That won't be necessary. I will call back. Just tell him Hanumanth called.

**Lakshman:** OK.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




# Can I be any help please?

**I.**

**Sasir:** Hello, may I speak to Mr. Vasanth? (వసంత్‌గారితో మాట్లాడవచ్చా? )

**Anjani:** May I know who is speaking (Please)? (ఎవరు మాట్లాడుతున్నారో తెలుసుకోవచ్చా? )

**Sasir:** I am Sasir here. Mr. Vasanth is expecting my call. Please put me through. (నేను శశిర్, వసంత్‌గారు నీ ఫోన్ కోసమే చూస్తున్నారు/ నన్ను ఫోన్ చేయమన్నారు)

**Anjani:** Please hold. I'll put the call through (కాస్త ఆగండి. మీకు కలుపుతాను)

Dialling to Vasanth - వసంత్‌కు ఫోన్ చేస్తూ Sir, Mr. Sasir is on line for you. (మీకోసం శశిర్‌గారు లైన్లో ఉన్నారు).

**Vasanth:** Put him through. (Connection ఇవ్వండి). To Sasir: Hello, Mr. Sasir, I Appreciate your punctuality you are on the dot. (శశిర్‌తో: శశిర్‌గారూ, మీ సమయపాలన బాగుంది. చెప్పిన టైమ్‌కు ఫోన్ చేశారు)

**Sasir:** Good morning, Mr. Vasanth, When shall we meet then? Miss Varsha said she would be along soon. You fix the time and I'll pass the message to her. (అయితే ఎప్పుడు కలుసుకుందాం? వర్షగారు త్వరలోనే వస్తానన్నారు. మీరు టైమ్ చెబితే, ఆ విషయం ఆమెకు అందిస్తాను.)

**Vasanth:** Sorry. I'm unable to hear you properly. Could you repeat it please? (Sorry. మీరు చెప్పేది సరిగా వినిపించడం లేదు. మళ్లీ ఒకసారి చెబుతారా? )

**Sasir:** I am an my car, though not driving. I'll call you again in five minutes. (నేను కారులో ఉన్నాను. Drive చేయడం లేదులెండి. మళ్లీ అయిదు నిమిషాలకు ఫోన్ చేస్తాను)

**Vasanth:** Please do. Or shall I call you? (అలాగే చేయండి. లేకుంటే నేను చేయనా? )

**Sasir:** Either way it doesn't matter (ఎలా అయినా ఫర్వాలేదు)

**Vasanth:** Sorry, I'm not able to get you. (మీరన్నది వినిపించలేదు)

**Sasir:** I was saying, 'Either way it doesn't matter'. ('ఎలా అయినా ఫర్వాలేదు' అంటున్నా).

**Vasanth:** OK.

ఇంతకుముందు సంభాషణలతో బాటు ఇది కూడా చూడండి.

ఇంతకుముందే చూశాం మనం. Put somebody through/ put a call through: Calling person నూ (Phone చేస్తున్నవాళ్లనూ), called person నూ (Phone వచ్చిన వ్యక్తినీ) కలపడం.

Could you put me through to Sekhar) = శేఖర్‌తో కలుపుతారా, కాస్తా?

ఇదెప్పుడంటాం, మనం ఎవరితో మాట్లాడాలనుకుంటున్నామో, వాళ్లకూ, మనకూ మధ్య, Office Receptionist/ Operator గానీ ఉండి, బయటి Phone Callsను లోపలి వ్యక్తులకు కలపాల్సి వస్తే.

**II.**

**Purandhar:** Hello, is it Dhanwantari Medical Services please?

**Yugandhar:** At your service. What can we do for you? (మీ సేవలో, ఏం చేయగలమో చెప్పండి)

**Purandhar:** This is an emergency. A ten year old accident victim needs to be rushed to hospital. None to give her even first aid. Rush your ambulance, could you? (ఇది అత్యవసరం. ప్రమాదంలో ఉన్న పదేళ్ల అమ్మాయిని వెంటనే ఆస్పత్రికి తరలించాలి. ఇక్కడ ఆ పాపకు ప్రథమ చికిత్స చేసేవాళ్లు కూడా ఎవ్వరూ లేరు. మీ ambulance ను వెంటనే పంపించండి).

**Yugandhar:** Certainly. It'll be on the move in a few minutes. Address, please. (తప్పకుండా, కొద్ది క్షణాల్లో బయల్దేరుతుంది. Address చెప్పండి).

**Purandhar:** 21/42 Gandhi Road, Left off the Main Road, next to the Ganganamma temple. 21/42 గాంధీ రోడ్డు, మెయిన్ రోడ్డుకు ఎడమవేపు, గంగానమ్మ గుడిపక్క.

**Yugandhar:** It'll be there in five minutes. If you need anything more, feel free to call us. (అయిదు నిమిషాల్లో అక్కడుంటుంది. ఇంకేమన్నా కావాలన్నా, ఫోన్ చేసేందుకు సంకోచించకండి.)





M.SURESAN

మీరు ప్రజాహిత సంస్థల తరఫునగానీ, సేవాసంస్థల తరఫునగానీ మాట్లాడుతున్నప్పుడు, అవతలివారికి ఊరట కలిగించేలా మాట్లాడాలి కదా? అలాంటప్పుడు, ముఖ్యంగా phone రాగానే, మన స్పందన: At your service (please) (మీ సేవలో మేం ఉన్నాం)/ What can we do for you? (మేం మీకేం చేయగలం? ) అని అనడం చాలా ముఖ్యం. అలాగే మన అవసరాలను తెలపడం కూడా చాలా మర్యాదగా, విపత్కర పరిస్థితి ధ్వనించే స్వరంతో, నిదానంగా, స్పష్టంగా అవతలివారికి వినపడేలా చెప్పడం practise చేయండి. Emergency లో త్వర త్వరగా మాట్లాడటం సహజమే. అయితే అందువల్ల, అవతలివారికి అర్థం కాకపోవడం, వాళ్లు మళ్లీ మనల్ని ఇంకోసారి చెప్పమనడం - వీటివల్ల విలువైన సమయం వృథా అయి, కాపాడాల్సిన వ్యక్తి ప్రాణం పోయే పరిస్థితి రావచ్చు చాలా నిదానంగా (slowly), స్పష్టంగా (clearly) మాట్లాడటం practise చేయండి. ప్రాణాపాయ పరిస్థితుల్లో అయితే, This is an emergency please అనడం మరచిపోకండి. చాలా ముఖ్యం.

**III.**

**Subhankar:** Hello, is this Dravyanidhi Bank please? (ద్రవ్యనిధి బ్యాంకేనాండీ? )

**Rudrani:** Yes, it is What is it please? (అవును. దేన్ని గురించి ఫోన్ చేస్తున్నారండీ? )

**Subhankar:** I wish to speak to the Manager please. (మేనేజర్‌తో మాట్లాడాలి)

**Rudrani:** Sorry. She is out on business. Not expected back/ may not be back till after 12 noon. (Sorry. ఆమె పనిమీద బయటికి వెళ్లారు. 12 దాటేదాకా ఆమె తిరిగివస్తారనుకోవడం లేదు.)

**Subhankar:** That's disappointing really. This is something important (నిరాశపడుతున్నాను. ఈ విషయం చాలా ముఖ్యమైంది) May I know who is speaking please? (ఎవరండీ, మాట్లాడటం? )

**Rudrani:** I am Rudrani, her assistant can I be any help please? (నేను రుద్రాణి మీకేమన్నా సాయపడగలనా? )

**Subhankar:** Not much, I'm afraid. This is something personal. Thank you very much just the same. (లేదనుకుంటా. మీ మాటకు చాలా thanks)

**Rudrani:** You are welcome. Is this the phone on which I can get you? As soon as she comes back I will tell her you called. Can I take a message, at least.

You are welcome - ఇది Thank you very much కి స్పందన.

(మీకు ఫోన్ చేయాలనుకుంటే ఇదే కదా మీ number? ఆమె రాగానే మీరు ఫోన్ చేశారని చెబుతాను. కనీసం ఆమెతో ఏమన్నా చెప్పమంటారా)

**Subhankar:** No, she doesn't know me. I will call her again in the afternoon. Thank you. (లేదు లెండి. నేనామెకు తెలీదు. నేను మళ్లీ సాయంత్రం ఫోన్ చేస్తాను. Thank you.

**Rudrani:** Not at all, Bye.

ఇక్కడ మనం గమనించాల్సింది- 'can I be any help?'- నేను మీకేమన్నా సాయపడగలనా? / నేను చేయగలిగిందేమన్నా ఉంటే చెప్పండి. మనకు ఫోన్ చేసిన వాళ్లు నిరాశచెందకుండా ఉండేందుకిలా అనవచ్చు అలా కాకపోతే, can I help you?/ can I be of help? అని కూడా అనవచ్చు.

ఇప్పుడు ఇది Englishలో బిగ్గరగా practise చేయండి.

**చైత్ర:** హలో, శ్రావణిగారున్నారండీ?

**రోహిణి:** ఎవరండీ మాట్లాడేది?

**చైత్ర:** నేను చైత్ర. శ్రావణిగారేనాండీ?

**రోహిణి:** కాదండీ (Sorry). నాపేరు రోహిణి. శ్రావణిగారు ప్రస్తుతం అందుబాట్లోలేరు. నేనేమన్నా సాయపడగలనా?

**చైత్ర:** Thank you; ఆమె ఎప్పుడుంటుందండీ?

**రోహిణి:** ఇంకో రెండు గంటలు పట్టొచ్చు

**చైత్ర:** ఈ విషయం ఆమెతో చెప్పగలరా? (Message వాడండి)

**రోహిణి:** చెప్పండి. నేనామెకు చెబుతాను.

**చైత్ర:** నేనీ ఊళ్లో రేపు మధ్యాహ్నం వరకూ ఉంటాను. మేం ఇద్దరం ఎక్కడ, ఎప్పుడు కలుసుకోగలమనే వివరాలను నాకు phone చేయమని చెప్తారా?

**రోహిణి:** తప్పకుండా. మీ phone no ఇదేకదా?

**చైత్ర:** ఆమె దగ్గర నా phone no ఉంది. Thank you.

**రోహిణి:** (Thank you కు స్పందన రాయండి.)

**ANSWER:**

**Chaitra:** Hello, can I speak to Sravani?

**Rohini:** May I know who this is/ who is this, please?/ who is speaking, please?

**Chaitra:** I am Chaitra. Is it Sravani.

**Rohini:** Sorry, no. I am Rohini. Sravani isn't near at hand/ out. Can I be of any help?/ Can I help you?/ May I help you?

**Chaitra:** Thank you. When can I get her?/ When will she be available?

(ఇది కొంచెం formal).

**Rohini:** In another two hours/ likely 2 hours.

**Chaitra:** Could you take this message for her?

**Rohini:** Certainly. Go ahead please. I'll pass on the message to her/ pass her the message.

**Chaitra:** Please tell her I'll be in town till tomorrow after noon, and ask her to tell me over phone when and where we could meet.

**Rohini:** Certainly/ Oh surely. You are on this phone, aren't you?

**Chaitra:** She has my phone no. Thank you.

**Rohini:** (You are) welcome/ My pleasure.

---

***U. Srinivasarao, S.Konda***

**Q.** Englishలో సరైన వాక్యాన్ని చదవకముందు wrong sentences కూడా సరైనవిగానే అనిపిస్తాయి. ఉదాహరణకు Suresh and Geetha both are students. అనేది సరైన వాక్యం కాదు. Both Suresh and Geetha are students అని ఉండాలట. అలాగే He is so week to walk (ఇది తప్పు) He is too week to walk లేదా He is so week that he could not walk అనాలి. ఇలాంటి చిన్న చిన్న తప్పులను ఎలా సరిచేసుకోవాలి? తెలపగలరు.

**A.** ఇలాంటి అనుభవం అందరికీ ఉంటుంది. wrong sentence right అనిపించడమే కాకుండా, ఇచ్చిన sentence, right అయినా ఇందులో ఏదో దోషం ఉన్నట్లు కూడా అనిపిస్తుంది. అందుకే correct the following sentences/ choose the correct sentence లాంటి exercises భాష నేర్చుకునేందుకు సాయపడవు. అందుకు భిన్నంగా confusion కలిగిస్తాయి. అయితే బాగా ఎక్కువగా మంచి మంచి రచనలు చదవడం వల్ల సరిగా ఉన్న sentence ను పట్టేసే సామర్థ్యం వస్తుంది. Both Geetha and Suresh are students అనే విషయం correct అనేది, correct English కు అలవాటు పడితే వెంటనే గుర్తించగలం. (అయితే ఇక్కడ both ఉన్నా లేకపోయినా ఒకటే అనేది వేరే విషయం) Too... To = So that... not - ఇలాంటి sentence transformation కూడా అలవాటు, exposure ద్వారా (correct English చదవడం/ వినడం ద్వారా) ఎక్కువగా తెలుస్తుంది. ఇలాంటి exercises అదే పనిగా చేయడం వల్ల తెలుస్తుంది. ఇంతకంటే సులభమైన మార్గం reading as much English as possible.

***E. Anil, Prakasham (Dt.)***

**Q.** 'The weather does play an important role in airports on the West Coast'. ఇక్కడ does ను ఎందుకు ఉపయోగించారో తెలియజేయగలరు. Oxford advanced learners 7th edition చూస్తే do, does, did అనేవి questions, negative statements లో వాడతారని ఉంది. ఇలాంటి cases లో do, does, did ల వాడుక గురించి వివరించండి.

**A.** ఇలాంటిచోట్ల plays బదులు does play వాడితే దానిమీద కొంచెం stress ఎక్కువగా ఉన్నట్లు. 'అవును, కచ్చితంగా' అన్నట్లు. అలాగే do, did కూడా.

I know him = ఆయన నాకు తెలుసు.

I do know him = ఆయన నాకు కచ్చితంగా తెలుసు. (తెలియకపోవడం ఏమిటి? అని.)

He bought a car = ఆయన కారు కొన్నాడు.

He did buy a car = ఆయన కారు కచ్చితంగా కొన్నాడు.

ఇలా గట్టిగా నొక్కిచెప్పడంకోసం do, does, did ఈ విధంగా వాడతారు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm**



**U.Srinivasarao, Singarayakonda.**

**Q.** Verb కి to infinitive కి తేడా వివరించగలరు. ఒక్కోసారి to infinitive ని verb అని, verb ని to infinitive అని అంటుంటారు. ఈ తేడాను ఉదాహరణలతో వివరించగలరు.

**A.** Verb - Sentence లో Subject తర్వాత ఏమాట/ మాటలు లేకుంటే sentence ఉండదో అది verb. She sings well. ఈ sentence లో She, subject (sentence 'She' గురించి చెప్తోంది కాబట్టి). She తీసేస్తే, ... sings well. ఈ భాగంలో 'sings' లేకపోతే, She well దీనికి అర్థం పూర్తవలేదు కాబట్టి, అది sentence కాదు- అంటే subject (She) తర్వాత, 'sings' లేకపోతే, sentence ఉండదు. కాబట్టి sings, verb. అలాగే, They sing only Hindi songs అనే sentence లో, sing, verb అవుతుంది. He is playing cricket- ఈ sentence లో He, subject. He తర్వాత, is లేకపోయినా (He playing cricket), playing లేకపోతే (He is cricket) sentence ఉండదు. కాబట్టి ఇందులో 'is playing' అనేది verb. Sing, play, walk, talk, write, go, come, sit, stand- ఇవన్నీ verbs.

ఇవి Present simple tense. వీటిని, I, we, you and they తోనే వాడతాం. ఇలాంటి verbs, (sing, play, walk, talk, write, go, etc.) ముందు, to పెడితే, అవి Infinitives అవుతాయి.

**Verbs:** Go, walk, talk, write, etc.

**Infinitives:** to go, to walk, to talk, to write, etc.

Infinitives కు సందర్భాన్నిబట్టి మూడర్థాలుంటాయి.

1) ఒక పని చేయడం అనే అర్థంతో. To speak English is easy = ఇంగ్లిష్ మాట్లాడటం తేలిక.
   To walk such a distance is difficult = అంత దూరం నడవడం కష్టం.
2) Infinitive కు రెండో అర్థం- ఒక పనిచేసేందుకు అని (కోసం).
   He is here to help me = అతడు నాకిక్కడ సాయం చేసేందుకు ఉన్నాడు.
   I need money to buy books = పుస్తకాలు కొనేందుకు నాకు డబ్బులు అవసరం.
3) Infinitive కు మూడో అర్థం- 'అని'. He wishes to go home = అతడు ఇంటికి వెళ్లాలని కోరుకుంటున్నాడు.

He wants to sing = అతడు పాడాలనుకుంటున్నాడు.

Infinitive, verb కాదు. చూడండి:

go - verb; To go - infinitive;
sing - verb; To sing - infinitive.

ఒక్కోసారి, to లేకుండా infinitive వస్తూంటుంది.

eg: I saw him (to) escape.

[అతడు తప్పించుకొని పోతూండటం (to escape- ఈ sentence లో, to తీసేసి కేవలం escape వాడాం- అది plain infinitive. Sentence అర్థం: అతడు తప్పించుకుని పోతుండటం నేను చూశాను). అయితే correct గా మాట్లాడేందుకు, to infinitive (to go, to sing, etc) కూ, verb కూ తేడా తెలియనక్కరలేదు.]

**Q.** వాక్యాలను నిర్మించడానికి అవసరమయ్యే, సాధారణంగా వాడే ముఖ్యమైన కొన్ని structures తెలియజేయగలరు.

**A.** ముఖ్యమైన కొన్ని structures:

1. Subject (Sub.) + Verb + Direct Object

| | | |
|---|---|---|
| She | knows | English |
| He | cut | his finger |
| The teacher | did (not) explain | the chapter |

2. Subject + Verb + Infinitive

| | | |
|---|---|---|
| The student | tried | to score high |
| The teacher | wishes | to help us. |

3. Sub Verb Object (Noun/ Pronoun) Infinitive

| | | | |
|---|---|---|---|
| Sunil | wants | me | to help him |
| Chandana | advised | Geeta | to study well |

4. Sub Verb Indirect object Direct object

| | | | |
|---|---|---|---|
| He | told | me | a story |

ఇలా చాలా structures ఉన్నాయి. ఇలా వీటి సాయంతో కాకుండా English చదవడంవల్ల (Newspapers, Magazines, etc) త్వరగా, బాగా నేర్చుకోవచ్చు.

**G.Shankar, Kesavapatnam**

**Q.** Sir, I saw a sentence in a standard publication. That is in 3rd class English text book. 'Shivaji will soon be shifting here with his family'. Here why did not use 'moving'.

**A.** ఇల్లు మారడం, నివాసం/ office లాంటివి ఒకచోటి నుంచి ఇంకోచోటికి మారడం/ మార్చడం అనే అర్థంతో 'shift' వాడటం సరికాదు. 'Move' అనే అనాలి.

Shivaji will soon be shifting అనడం సరికాదు. Moving అనే అనాలి.

**Q.** In the same publication in 4th class text book..

"Are we going by taxi then?"

Before taxi we use 'in' but here why did use by taxi if there is any exception please clarify.

**A.** Would rather = ఎక్కువ ఇష్టం/ కోరుకోవడం.

I would rather you went by air = నువ్వు విమానంలో వెళ్ళడమే నాకిష్టం/ నేను కోరేది.

They would rather you paid them by cheque = నువ్వు చెక్ ద్వారా చెల్లించడమే వాళ్లకు ఇష్టం/ వాళ్లు కోరుకునేది.

**Q.** It is time we started

It is time they completed

It is time he came. తెలుగులో వివరించగలరు.

**A.** It is time we started - ఇలాంటిచోట్ల It is time... అంటే అర్థం, ఆ సమయం దాటిపోయిందని, ఇప్పుడయినా తొందరపడమని.

It is time we started = బయలుదేరాల్సిన సమయం దాటిపోయినా ఇంకా మనం బయలుదేరలేదు.

It is time they completed- (ఇది పూర్తికాలేదు)

It is time they completed the work = పని ఎప్పుడో పూర్తి చేయాల్సింది, ఇంకా చేయలేదు.




# It is time he came





M.SURESAN

**A.** By taxi అనడమే correct. In taxi సరికాదు. By bus/ car/ taxi/ lorry/ plane/ ship అంటాం. On cycle/ bike/ horse back అని top లేని వాహనాలకంటాం.

**ఒక పాఠకుడు**

**Q.** కిందివాటికి తెలుగులో అర్థాన్ని తెలపండి. ఇక్కడ but అంటే అర్థం ఏమిటి?

There is no man but wishes to live.

There is no rose but has some thorn.

**A.** ఈ sentences లో no man but = every man; no rose but = every rose. ఇలాంటి సందర్భాల్లో no... but = every (ప్రతి)

No man but wishes to live = Every man wishes = ప్రతి మనిషీ బతకగోరతాడు.

No rose but has a thorn = Every rose has a thorn = ప్రతి గులాబీకీ ముల్లుంటుంది. కానీ ఈ వాడకం చాలా గ్రాంధికం.

**Q.** Such as, the same as, the same that వీటి usage ని తెలుగులో వివరించండి.

**A.** Such as = అలాంటి/ ఇలాంటి.

Books such as the Bhagavadgita teach us the right way to live = భగవద్గీతలాంటి పుస్తకాలు సరైన జీవన విధానాన్ని బోధిస్తాయి.

The same as = అలాంటివారే/ అలాంటిదే.

A is the same as B = A, B లాంటివాడే/ B లాంటిదే.

The same that... sentence ను బట్టి దీనర్థం ఉంటుంది.

**Q.** It cannot be true

It may not be true

పై రెండు వాక్యాలకూ తేడా ఏమిటి?

**A.** It cannot be true = ఇది నిజం కాజాలదు, అసాధ్యం.

It may not be true = ఇది నిజం కాకపోవచ్చు (సందేహం)

**Q.** I would rather you went by air.

They would rather you paid them by cheque.

ఈ వాక్యాలకు అర్థం ఏమిటి?

It is time he came = అతడు రావాల్సిన సమయం ఎప్పుడో దాటిపోయింది/ ఎప్పుడో రావాల్సింది, ఇంకా రాలేదు.

**Q.** Though known as the smallest continent Australia is actually the largest Island in the World.

ఇందులో అండర్‌లైన్ చేసిన phrase కు అర్థం ఏమిటి?

**A.** అతి చిన్న ఖండంగా అందరికీ తెలిసినప్పటికీ

**Q.** Precipitate, precipitation ఈ పదాలకు అర్థాన్ని ఉదాహరణలతో వివరించగలరు?

**A. Precipitate**= 1) ప్రమాదం/ సమస్య అనుకున్నదాని కంటే ముందే సంభవించే పరిస్థితులు కల్పించడం.

a) The company's dismissal of the union leader precipitated a strike by the workers = యూనియన్ నాయకుడిని పనిలోంచి తొలగించడం సమ్మెకు దారి తీసింది/ సమ్మె పరిస్థితిని కల్పించింది.

b) His entering politics precipitated his brother's demand for a division of property = ఆయన రాజకీయ ప్రవేశం ఆయన సోదరుడు ఆస్తి పంపకం చేసే పరిస్థితి కల్పించింది/ దారి తీసింది.

2) (Science లో) ఒక మిశ్రమంలోని ద్రవ, ఘన పదార్థాలు వేరుకావడం. (ఉప్పు మిశ్రమాన్ని మరిగిస్తే ఉప్పు తేలి వేరయిపోవడం, ఉదాహరణ)

**Precipitation** = 1) పైన తెలిపిన చర్యలు జరిగే పరిస్థితి కల్పించడం.

The leader's death caused the precipitation of a leadership problem = నాయకుడి మరణం నాయకత్వ సమస్యకు దారితీసింది.

2) వర్షపాతం, హిమ(మంచు)పాతం.

There was a sudden precipitation leading the streets to be covered with rain water, ఉన్నట్టుండి వర్షపాతం వల్ల రోడ్లన్నీ జలమయమయ్యాయి.

**Q.** Past participle ని adjective గా ఉపయోగించే సందర్భాలను వివరించండి.

**A.** The torn book = ఇక్కడ torn, tear కు past participle. Torn book= చినిగిన పుస్తకం. Torn (PP) పుస్తకాన్ని గురించి తెలుపుతోంది, కాబట్టి, ఈ past participle, adjective గా ఉపయోగించడానికి ఉదాహరణ. అలాగే the deadman లో dead, the closed factory ల్లో, dead, closed past participles used as adjectives.

**Q.** To be + ing form; To be + PP- వీటిని తెలుగులో ఉదాహరణలతో వివరిస్తారా?

**A.** To be + ing -- To be going, to be wasting time, to be sleeping, etc = ఆయా పనులు చేస్తూ ఉండటం.

a) To be going there every morning is difficult = రోజూ ఉదయం అక్కడికెళ్తూండటం కష్టం.

b) To be wasting time is not good = సమయం వృథా చేస్తుండటం మంచిదికాదు.

c) To be spending money like him is not possible for all = అతడిలా డబ్బు ఖర్చుపెడుతుండటం అందరికీ సాధ్యం కాదు.

To be + PP = to be appointed, to be elected, to be seen, to be taken, etc = ఆయా పనులు చేయబడటం.

To be appointed to the post is his luck = ఆ పదవికి నియమితుడవడం అతడి అదృష్టం.

To be elected president of a country is not easy = ఒక దేశానికి అధ్యక్షుడుగా ఎన్నికవడం సులభం కాదు.

**Q.** I could have written.

ఈ వాక్యాన్ని తెలుగులో చెప్పాలంటే..

1) నేను రాయగలిగి ఉండేవాడిని

2) నేను రాసి ఉండవచ్చు. వీటిలో ఏది కరెక్ట్?

**A.** I could have written దీనికి సరైన అర్థం, మీరిచ్చిన మొదటిది. అయితే, అది పూర్తిగా సరికాదు. సరైన అర్థం: నేను రాయగలిగి ఉండేవాడినే, కానీ రాయలేదు.

**Q.** కింది ఉదాహరణలు present participle prepositions అని చదివాను. వీటి అర్థాలు వాడుకలను తెలపగలరు.

1) Considering his good method of teaching, the fees is not high
2) Barring bad thoughts, he will lead a good life hereafter.
3) Regarding your book publication, we are ready to help you.
4) Respecting the idea given by you, I shall act there.
5) Concerning last month's murder, he did not take step so far.
6) Touching her matter, I could not take any step.
7) Pending another call from chennai, we stay here itself.

**A.** మీరు మాటల grammatical names తెలుసుకోనక్కర్లేదు సరిగా మాట్లాడేందుకు/ రాసేందుకు. వాటిని మీరు సరిగా అర్థం చేసుకుని వాడటానికి, అవి participle prepositions అని తెలుసుకోనక్కరలేదు. దానివల్ల మీకు confusion తప్ప ఏం ఉండదు. వాటి అర్థం తెలుసుకుని వాడండి.

1) అతడి మంచి పద్ధతులను పరిశీలిస్తే
2) చెడు ఆలోచనలు తప్పిస్తే/ లేకుంటే; కానీ ఇక్కడ barring వాడకం సరికాదు.
3) Regarding = ఆ విషయానికి సంబంధించి/ ఆ విషయానికొస్తే
4) నువ్విచ్చిన ఆలోచనకు గౌరవమిస్తూ/ దాన్ని పరిగణనలోకి తీసుకుంటూ
5) దానికి సంబంధించి
6) ఆ విషయానికొస్తే/ సంబంధించి
7) చెన్నై నుంచి ఇంకోసారి phone వచ్చేవరకు. pending = పూర్తికాని.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm




**Chandana:** How is the new lecturer? Find him OK?
(కొత్తగా వచ్చిన లెక్చరర్ ఎలా ఉన్నాడు? )

**Charchita:** Top class. Lucky we have such a teacher. A sea of difference between him and the one he replaces. He is knowledgeable and can put things across well enough for even the slow learners to understand.
(అత్యుత్తమం. అటువంటి లెక్చరర్ మాకుండటం మా అదృష్టం. ఆయనకూ, అంతకు ముందున్నాయనకు ఎంతో తేడా. విషయం బాగా తెలిసినవాడూ, ఎంత మందమతులకైనా చక్కగా అర్థం అయ్యేట్లు వివరించగలడు.)
(మాకూ అలాగే అనిపించింది. ఏ సందేహమైనా అడుగు, వెంటనే తీరుస్తాడు. విషయం బాగా ఉంది, చాలా సూక్ష్మంగా వివరించగలడు. ఇంకోటి- కొత్త విషయాల్ని వెంటనే తెలుసుకుంటాడు.)

**Chandana:** My brother further says that even as a student he was clued up on the latest computer systems.
(ఆయన విద్యార్థిగా ఉన్నప్పుడే కంప్యూటర్ విషయంలో కొత్తదేదయినా వస్తే వెంటనే తెలుసుకొనేవాడని మా అన్న చెప్పాడు.)

**Charchita:** You can say that again. He appears to be determined to get to the bottom of the subject.
(అది చాలా కరెక్ట్. కంప్యూటర్ గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలనే నిశ్చయంతో ఉన్నట్టు కనిపిస్తాడు.)

# He knows the subject inside out

**Chandana:** How many classes have you had of his? Just a few, aren't they? How could you form an opinion so soon?
(ఆయన క్లాసులు మీకు ఎన్నయ్యాయి? కొన్నే కదా? నువ్వు అంత త్వరగా అభిప్రాయం ఎలా ఏర్పరచుకోగలవు? )

**Charchita:** Why, he has taught us a whole week. During this period he has convinced us that he knows the subject inside out.
(అదేంటి? ఆయన మాకు వారంపాటు చెప్పాడింతవరకు. ఈ కాలంలో ఆయనకు సబ్జక్టు బాగా తెలుసనే విషయాన్ని మాకు తెలియచేశాడు.)

**Chandana:** My brother is acquainted with him; he says this lecturer is a computer buff and can do almost anything on the computer.
(మా అన్నకు ఆయనతో పరిచయం ఉంది. ఆయనకు కంప్యూటర్ అంటే చాలా ఆసక్తి, ఇష్టం అని, దాని మూలంగా కంప్యూటర్‌తో దాదాపు ఏదయినా చేయగలడని మా అన్న చెప్తుంటాడు.)

**Charchita:** So have we found him. Raise a doubt and he has a clarification. He is well up abreast on the subject, and can explain things in a very simple way. And the other thing is he keeps himself abreast of the subject.





M.SURESAN

**Chandana:** The college management has to be congratulated on their choice of such a good lecturer.
(ఇలాంటి లెక్చరర్‌ను ఎంపిక చేసుకున్న యాజమాన్యాన్ని అభినందించాల్సిందే.)

***Look at the following expressions from the conversation above:***

*1) He is knowledgeable.*

*2) Put things across.*

*3) .... that he knows the subject inside out*

*4) My brother is acquainted with him.*

*5) .... he is a computer buff.*

*6) He is well up on the subject.*

*7) He keeps himself abreast of the latest in the subject.*

*8) He was clued up on the latest.*

Knowledgeable, know something, inside out, be acquainted with, buff, be well up on, keep oneself abreast of, be clued up on - ఇవన్నీ కూడా ఒక విషయం తెలిసి ఉండటం అనే అర్థంతో ఎక్కువ తక్కువ అనే తేడాతో వాడే words and Phrases. ఇప్పుడు వీటి గురించి వివరంగా తెలుసుకుందాం.

**1) Knowledgeable** = ఒక విషయం బాగా తెలిసి ఉండటం/ ఒక విషయానికి సంబంధించి పరిజ్ఞానం ఉండటం.

a) She is not a professor far of Physics nothing. She is quite knowledgeable about the subject = ఆమె నామమాత్రంగా ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా ఉండటం లేదు. ఆమెకు ఫిజిక్స్ బాగా తెలుసు.

b) Let's consult this doctor. He is knowledgeable about the latest in the treatment of this complaint = మనం ఈ డాక్టర్ను కలుద్దాం. ఈ వ్యాధి చికిత్సలో ఆధునిక విషయాలు బాగా తెలిసినవాడు.

**3) Know something inside out** = ఒక విషయం పూర్తిగా/ క్షుణ్ణంగా/ లోతుపాతులు బాగా తెలిసి ఉండటం.

a) Having been a finance minister for long, Mr. Rosaiah knows the state finances inside out = చాలా కాలం ఆర్థికమంత్రిగా ఉన్నందువల్ల రోశయ్యకు రాష్ట్ర ఆర్థిక విషయాలు పూర్తిగా తెలుసు.

b) You cannot be any use to your students if you don't know your subject inside out = నీ సబ్జక్టు గురించి పూర్తిగా తెలిస్తేగానీ నువ్వు నీ విద్యార్థులకేం ఉపయోగపడలేవు.

**5) Buff** = ఒక విషయంలో బాగా ఆసక్తి (interest) ఉండి ఆ విషయాన్ని పూర్తిగా తెలుసుకునేవాళ్లు.

a) An electronics buff, he surprized his professors and friends at college by designing a cell phone with the latest features = ఎలక్ట్రానిక్స్ అంటే అతడికి ప్రాణం. అదేపనిగా దాన్ని అధ్యయనం చేస్తాడు. అత్యాధునిక లక్షణాలతో సెల్‌ఫోన్ రూపొందించి వాళ్ళ ప్రొఫెసర్లనూ, స్నేహితులనూ ఆశ్చర్యపరచాడు.

b) She is a movie buff. Ask her anything about movies and she has an answer = ఆమెకు సినిమాలంటే ప్రాణం/ ఆసక్తి. వాటి గురించి అదే పనిగా అధ్యయనం చేస్తుంది. ఏ సినిమా విషయమైనా చెప్పేయగలుగుతుంది.

**4) Be acquainted with** = విషయం/ మనుషులతో పరిచయం ఉండటం.

a) Having retired from the profession, I am not acquainted with the latest in the subject = పదవీ విరమణ చేసినందువల్ల, ఆ సబ్జక్టులోని కొత్త కొత్త విషయాల గురించి నాకు తెలియదు.

b) Who doesn't like to be acquainted with a movie star? = సినిమా తారలతో పరిచయం ఎవరి కిష్టం ఉండదు?

**6) Be well up on a subject = 8) be clued up on the subject**= ఒక విషయం బాగా తెలిసి ఉండటం.

a) Though a Bengali, having been born and bred in Hyderabad, she is well up on/ clued up on Telugu language and Telugu culture = ఆమె బెంగాలీ అయినప్పటికీ, హైదరాబాద్‌లో పుట్టి పెరగడంవల్ల తెలుగు భాషా, సంస్కృతీ బాగా తెలుసు.

b) We had better be clued up on/ about the new computer system before we start using it = ఈ కొత్త కంప్యూటర్ సిస్టం వాడటం మొదలుపెట్టక ముందు దాని గురించి బాగా తెలుసుకోవడం మంచిది.

**7) To keep oneself abreast of something** = ఒక విషయానికి సంబంధించిన నూతన పరిణామాలు తెలిసి ఉండటం.

a) Though he is in the US, he keeps himself abreast of the goings on in AP = ఆయన అమెరికాలో ఉన్నప్పటికీ, ఆంధ్రప్రదేశ్‌లో ఏం జరుగుతున్నదీ ఎప్పటికప్పుడు తెలుసుకుంటుంటాడు.

b) What's the latest here? I having been abroad for a few weeks, I couldn't keep myself abreast of the happenings here = ఏమిటి కొత్త విశేషాలిక్కడ? కొద్దివారాలుగా విదేశాల్లో ఉండటంవల్ల, ఇక్కడ జరుగుతున్న విషయాల గురించి ఎప్పటికప్పుడు తెలుసుకోలేకపోయాను.

**2) Put things across** - విశదీకరించడం/ అర్థమయ్యేలా వివరించడం.

a) A good communicator, Arun Jaitley can put across even very complex ideas = మంచి communicator (చక్కగా ఇతరులకర్థమయ్యేట్లు మాట్లాడగలవాళ్లు) అరుణ్‌జైట్లీ సంక్లిష్టమైన విషయాలను కూడా చక్కగా వివరించగలడు.

b) The syllabus is above the standard of this class. (It is) difficult to put it across to the students of this age group = ఈ class standards కంటే ఎక్కువగా ఉంది syllabus. ఈ వయసు విద్యార్థులకిది వివరించడం కష్టం.

పైవన్నీ కూడా spoken English లో తరచూ వాడే expressions. మన సంభాషణల్లో సొంతం చేసుకుందాం.



***K. Omkar, Visakhapatnam.***

**Q.** 'కొద్దిరోజులు గడిచాయి' అనడానికి కింది రెండింటిలో ఏది కరెక్ట్?
1. A few days passed
2. A few days are passed

**A.** A few day's passed అనడం correct. (are passed = అందించబడతాయి. All the letters are passed (on) to the boss = ఉత్తరాలన్నీ boss కు అందించ/ పంపబడతాయి. మామూలు తెలుగు - (అందిస్తాం/ పంపిస్తాం)

**Q.** నీ skintone fantastic అని hero, heroin తో అన్నాడు. అంటే ఏమిటి?

**A.** skintone = చర్మపు మెరుగు/ చర్మ సౌందర్యం

**Q.** ఒంటెపైన దిమ్మెలాంటి భాగాన్ని మూపురం అంటాం. దీన్ని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Hump

**Q.** ఆడపడుచు కు English ఏమిటి?

**A.** Sister-in-law (వదిన/ ఆడపడుచు)

**Q.** Some what more అంటే ఏమిటి?

**A.** Somewhat more = కాస్త ఎక్కువ

**Q.** నిరాడంబరతను English లో ఏమంటారు?

**A.** Humility/ modesty/ simplicity

**Q.** A English master అనడానికి బదులు A master in English అనొచ్చా?

**A.** English master = English teacher
Master of (in కాదు) English = English పైన బాగా పట్టున్నవాడు.

**Q.** బంగారులంక మాస్టర్ అనడానికి master at Bangaru lanka అనొచ్చా?

**A.** అనవచ్చు

***U. Srinivasarao, S.Konda (Prakasam Dt.)***

**Q.** విద్యార్థులు ఖాళీలు పూరించేటప్పుడు correct tense verb form ఎలా పెట్టాలి? ఉదాహరణకు He ....... (complete) his work. ఈ వాక్యంలో verb ఏ form లో వాడినా రైటే కదా? అంటే, completed, has completed, was completed, will be completed, .... ఆ వాక్యం భావం ఏమిటో తెలియకుండా correct form ఇదీ అని ఎలా నిర్ణయిస్తాం?

**A.** He ..... (Complete) his work. ఇలాంటి sentence ల విషయంలో కాస్త ఆలోచిస్తే తెలిసిపోతుంది. ఏది correct అనే విషయం. Complete- ఇది regular action ను తెలిపేది కదా! అది regular అని తెలిపే పదం- eg: on time/ promptly/ late every day లాంటివి. ఈ sentence లో లేవు కాబట్టి complete correct కాదు. Completed (Past simple) అని పెట్టాలనుకుంటే past లో ఏ time లో complete అయిందీ తెలిపే పదం- Yesterday/ Two days ago/ half an hour ago లాంటి expressions లేవు కదా? కాబట్టి completed సరికాదు. Time చెప్పని past action గా ఉంది ఇది. అందుకని- He has completed the work, correct. He was completed (అతను పూర్తి చేయబడ్డాడు)- ఇలా అనం కదా. ఇది తప్పు. He completed అనే అంటాం. time చెప్పే. He will complete the work అనొచ్చు కానీ future లో ఏ time- tomorrow/ in an hour/ by the evening లాంటి మాటలేం లేవు కదా? కాబట్టి, ఇది సరికాదు. He will be completed (=వాడు పూర్తిచేయబడతాడు) - ఇలా అనం.

***M.Satyanarayana, Hyderabad.***

**Q.** కింది పదాలను ఎప్పుడు, ఎక్కడ, ఎలా వాడాలి?
1. Lunch, Rice, Food.
2. Nice, Good, Fantastic, Fine.
3. First, Before.

**A. Lunch** = మధ్యాహ్న భోజనం. పొద్దున అల్పాహారం (breakfast) తీసుకున్న తర్వాత 3, 4 గంటల వ్యవధిలో చేసే భోజనం/ మధ్యాహ్నం 1 - 3 గంటల మధ్య.

**Rice** = బియ్యం/ అన్నం (ఉడికించిన బియ్యం/ వండిన బియ్యం)

**Food** = ఆహారం, ఏ ఆహారమైనా, ఘన, ద్రవ పదార్థాల రూపంలో (భోజనం పానీయాల్లాంటివి, ముఖ్యంగా శక్తికోసం తీసువాలి)

**Nice, Good, Fantastic, Fine** = ఈ నాలుగు పదాలూ దేన్నయినా మెచ్చుకునేందుకూ, ఏదైనా చాలా బాగుంది/ ఆకర్షణీయంగా/ అందంగా/ ఆహ్లాదకరంగా/ మంచి అనుభవం కలిగించేలా ఉంది అనేందుకు వాడతాం. అలా వాడినపుడు వీటిల్లో ఒకదానికి, ఇంకో దానికీ అర్థంలో తేడా లేదు. అసలు అర్థాలు అయితే, Nice = అందమైన Fine = నాజూకైన, ఆకర్షణీయమైన.

**First** = అన్నింటిలో మొదటిది/ ముందున్న.

**Before** = జరిగిన సంఘటనల్లో, దేనికన్నా (అన్నిటికన్నా కాదన్కరలేదు) మొదటిది.

His first business was fruits = అన్నిటికన్నా అతడి మొట్టమొదటి వ్యాపారం పండ్లు.

I studied there before I joined here = ఇక్కడ చేరేముందు అక్కడ చదివాను.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



*P.Simhachalam, Bhimadolu*

**Q.** Sir, కిందివాటిని తెలుగులో ఉదాహరణలతో వివరించగలరు.

The be-all and end-all; Where abouts; Ferrari; Brown nosing; Stealth call; Break the bank; Graduand; Formal ceremony; Drop the ball; Soap Grafting; Wither on the vine; Frown upon; Perspicuous; Two to tango; Nothing to write home about; Hung upon; Yada yada yada; Put a hex on someone; Go hay wire; Impersonate; Scrimp and save; Shoulder surfing; Stalking horse; Vidiot; Approval from corporate; Herding cats; Round up; Get to; bucket list; Vitiate; Splitsville; Double entendre; Double whammy; Embark on; Have a beef with someone (grudge); Cahoots with; Fouled (sb) own nest.

**frown upon** = కోపంతో చూడటం/ అసమ్మతి తెలపడం. He frowned upon his son's idea of marrying a girl of his choice.

**perspicuous** = సులభంగా అర్థమయ్యే/ సరళమైన రచనా శైలి/ సంభాషణా శైలి.

The perspicuous writing made his books very popular. అయితే ఈ మాట అంత వాడుకలో లేదు.

**two to tango** = రెండు చేతులు కలిస్తేనే కానీ చప్పట్లుండవు. (అంటే జరిగినదానికి ఇద్దరూ కారణమని.)

Don't blame me for our defeat. It takes two to tango = ఓటమికి నన్ను మాత్రమే నిందించకు. మనం ఇద్దరం కారణమే. (ఇద్దరి తప్పుల వల్ల ఓడిపోయాం.)

**nothing to write home about** = ఇతరులతో చెప్పుకోవాల్సినంత గొప్పగా లేకపోవడం.

Sudhir is only a stalking horse. The real contender is Srinath = సుధీర్ పైకి మాత్రమే కనిపించే పోటీదారుడు. శ్రీనాథ్ అసలు పోటీదారుడు. (అవతలి వ్యక్తి శక్తిని తెలుసుకునేందుకు శ్రీనాథ్ సుధీర్‌ను పోటీకి నిలబెట్టాడు.)

**vidiot** = Electronic gadgets తో ముఖ్యంగా video సామగ్రితో కాలం గడిపేవాళ్లు. ఇది ఇంకా standard English usage లోకి రాలేదు.

**approval from corporate** = సంస్థ నుంచి పొందే సమ్మతి.

**herding cats.** Herding cats కాదు, herding cattle = పశువులను మందగా చేర్చి తోలుకెళ్లడం.

# He brown noses and gets on

**A.** ఇవన్నీ కూడా చాలా ఉపయోగకరమైన, తరచుగా వాడే phrases.

**The be all and end all** (of life) = జీవిత పరమావధి.

Eating and sleeping are not the be all and end all of life, is it? = తినడం, నిద్రపోవడం జీవిత పరమావధి కాదుకదా?

Most people think that amassing wealth is the be all and end all of life. = సంపద సమకూర్చుకోవడమే జీవిత పరమావధి అనుకుంటారు చాలామంది.

**where abouts** = ఎక్కడ/ ఏ చోట ఉన్నది: Try as it might, the US has no idea about the whereabouts of Bin Laden = ఎంత ప్రయత్నించినా అమెరికాకు బిన్‌లాడెన్ ఎక్కడ ఉన్నదీ/ ఆచూకీ తెలియడం లేదు.

**ferrari** = ఇది English పదం కాదు. చాలా ప్రసిద్ధమైన రేస్ కార్ల పేరు. ఖరీదైన non racing car brand కూడా ఉంది.

**brown nosing** = అధికారంలో ఉన్నవారి మెప్పు పొందేందుకు, వారిపట్ల అతి మర్యాద చూపడం.

He doesn't know work, so he brown noses the manager and gets on = అతడికి పని తెలియదు. Manager ను కాకా పట్టి గడుపుకొస్తున్నాడు.

**stealth call** = రహస్యంగా ఫోన్ చేయడం/ రహస్యంగా ఎవరినైనా కలుసుకోవడం.

The Minister had a stealth call from the mafia leader = మంత్రిని మాఫియా నాయకుడు రహస్యంగా కలుసుకున్నాడు/ రహస్యంగా ఫోన్ చేశాడు.

**break the bank** = బ్యాంకును దోచుకోవడం. They broke the bank around 2 AM = పొద్దున రెండు గంటలకు వాళ్లు బ్యాంకును దోపిడీ చేశారు.

**graduand:** ఇది English మాటకాదు.

**formal ceremony** = సాంగోపాంగంగా (అన్ని లాంఛనాలతో) జరిగే శుభకార్యం/ తంతు- సంప్రదాయ బద్ధంగా జరిగే శుభకార్యాలు/ అశుభ కార్యాలు.

**drop the ball:** దీనికి ప్రత్యేకమైన అర్థం ఏదీ లేదు. సాధారణ అర్థంలో బంతి కింద పడేయడం.

**soap grafting** = బాగా అరిగిపోయినప్పటికీ పారేయలేని సబ్బు ముక్కను, కొత్త సబ్బుకు అతికించడం. అయితే ఇది standard English కాదు.

**wither on the vine** - ప్రారంభ దశలోనే క్షీణించడం/ ఆగిపోవడం- The metro rail project withered on the vine with the Satyams going bankrupt = సత్యం కంపెనీ దివాలా తీయడంతో హైదరాబాద్ మెట్రో రైలు ప్రాజెక్టు ఆదిలోనే ఆగిపోయింది.







M.SURESAN

India's game in the match against Zimbabwe has nothing to write home about = జింబాబ్వేతో భారత్ ఆడిన తీరు చెప్పుకోవాల్సిన గొప్పేం కాదు.

**hung up** = phone పెట్టేసి సంభాషణ ఆపేయడం. He hung up when I asked him about the money = డబ్బు గురించి అడగ్గానే ఫోన్ పెట్టేశాడు.

**yada yada yada** = వగైరా, వగైరా, వగైరా- ఏవైనా చాలా విషయాలు, వాటిల్లో కొన్ని ప్రాముఖ్యం లేనివైతే, వాటిని చెప్పే ఓపికలేక yada, yada, yada అంటాం.

According to him, his favourite movie hero is tall, handsome, bright, kind, yada yada yada.

**put a hex on someone** = ఇతరుల మీద హానికరమైన మంత్రశక్తులు ప్రయోగించడం- In old stories we see magicians putting hex on others.

**go hay wire** = పథకాలు ప్రణాళికలు అదుపు తప్పడం/ మనం అనుకున్నట్టు జరగకపోవడం.

The company's plans to open branches abroad went haywire because of the economic recession there = ఆ కంపెనీ విదేశాల్లో తన శాఖలు తెరవాలనుకున్న పథకం విదేశాల్లోని ఆర్థికమాంద్యంవల్ల అదుపు తప్పింది/ విఫలమయింది.

**impersonate** = ఒకరు ఇంకొకరుగా చలామణి కావడం/ ఒకరు ఇంకొక వేషమెత్తడం. Thieves impersonated as police and threatened the villagers = పోలీసుల రూపంలో దొంగలు వచ్చి గ్రామస్థులను బెదిరించారు.

**scrimp and save** = అత్యవసరమైనవి కూడా మానుకుని డబ్బు కూడబెట్టడం- అత్యంత పొదుపుగా ఉండటం. అలా వచ్చిన డబ్బుతో ఇంకేదయినా చేసేందుకు/ భవిష్యత్ అవసరాల కోసం పైసా పైసా కూడబెట్టడం. They scrimped and saved to give their children a good education = పిల్లలను మంచి చదువులు చదివించేందుకు పైసా పైసా కూడబెట్టారు వాళ్లు.

**shoulder surfing:**

Surfing = సముద్రపుటలల మీద తేలుతూ ఆడే ఆట.

shoulder surfing: సందర్భాన్నిబట్టిగానీ చెప్పలేం.

**stalking horse** = మనకున్న అసలు ఉద్దేశం తెలియకుండా ఉండేందుకు మనం వాడుకునే వ్యక్తులు. ముఖ్యంగా రాజకీయాల్లో ఒక నాయకుడి సత్తా తెలుసుకునేందుకు అతడికి పోటీగా నిలబెట్టే ప్రాముఖ్యం లేని వ్యక్తి.

Shepherds spend time in the morning and the evening herding cattle = పశువులను మందగా చేర్చి తోలుకెళుతూ పశువుల కాపర్లు కాలం గడుపుతారు.

**round up** = గుంపుగా ఒకచోట చేర్చడం/ అదుపులోకి తీసుకోవడం- The police rounded up the gamblers- జూదరులందరిని పోలీసులు ఒకటిగా చేర్చారు/ అదుపులోకి తీసుకున్నారు.

**get to.** ఇలాంటి 'phrase' ప్రత్యేకంగా ఏమీలేదు.

**bucket list:** ఈ మాట standard English వాడకంలోకి రాలేదు. అయితే ఈ మాట ఒక సినిమా పేరుగా వాడారు, ఒక వ్యక్తి చనిపోయేముందు పూర్తిచేయాలనుకునే పనుల జాబితా అనే అర్థంతో.

**vitiate** = To Spoil or reduce the effect of some thing = పాడుచేయడం, ఆశించిన ఫలితం రాకుండా అడ్డుకోవడం. Politics vitiate welfare programmes.

**splits ville** = ఇది కూడా standard English మాట కాదు. అయితే దీన్ని సాధారణంగా దంపతులు విడాకులు కోరుకోవడం అనే అర్థంతో వాడుతుంటారు. Bucket list, Splitsville అందరికీ అర్థం కాకపోవచ్చు, ఇంకా వాడుకలోకి రాలేదు కాబట్టి.

**double entendre** = దీని pronunciation: డబుల్ ఆటాండ్ర = మామూలు అర్థంతోపాటు బూతు అర్థం కూడా స్ఫురించేటువంటి పదం.

**double whammy** = రెట్టింపు బాధ/ భారం/ ఒక బాధకు తోడు ఇంకో బాధ.

**embark on** = పెద్ద ఎత్తున ప్రారంభించడం.

The company has embarked on an ambitious plan of expansion = ఆ కంపెనీ విస్తరణ పథకాలను పెద్దఎత్తున ప్రారంభించింది.

**have a beef with someone (grudge).** Have a beef with someone- ఇది correct expression కాదు. Beef about something = Complain about something = దేనిగురించైనా అసంతృప్తి వ్యక్తం చేయడం.

I have a beef about the way he treats me = నన్ను అతడు చూసుకోవడంలో నేను అసంతృప్తిని వ్యక్తం చేస్తున్నాను/ నన్నతడు చూసే విధం (అతిథి/ స్నేహితుడిగా) సరిగా లేదు.

**cahoots with.** To be in cahoots with = లాలూచీ పడటం. The forest guards are in cahoots with the timber smugglers = కలప దొంగలతో అటవీశాఖవాళ్లు లాలూచీ పడుతున్నారు.

**fouled (sb) own nest.** foul somebody's own nest = Ruin oneself = తమను తామే నాశనం చేసుకోవడం.

By spending money recklessly he is fouling his own nest = డబ్బు విచ్చలవిడిగా ఖర్చుపెట్టి తనసుతానే నాశనం చేసుకుంటున్నాడు.





*Suma, Nirmal*

**Q.** Sir, కింది వాక్యాలు వాటి ఆంగ్ల అనువాదం కరెక్టేనా?

1) నువ్వు ఫోన్లో ఎవరితో మాట్లాడుతున్నావు?
= With whom you are talking on phone?

2) నువ్వు ఎవరితో కలిసి హైదరాబాద్‌లో ఉంటున్నావు?
= With whom you are living in Hyderabad?

3) నువ్వు ఏ క్లాస్‌లో చదువుతున్నావు?
= In which class you are studying?

**A.** 1) With whom you are talking on the phone? - ఇది correct question form కాదు కదా? Question లో ఎప్పుడూ Subject ముందు Verb ఉంటుంది, లేకుంటే Helping verb కు, Main Verb కు మధ్య Subject ఉంటుంది. ఒక Verb లో రెండు మూడు మాటలుంటే, మొదటి మాటను Helping Verb అనీ, మిగతా మాటలను Main Verb అనీ అంటాం. (మీ Sentence లో are talking verb. ఇందులోని మొదటిమాట 'are', helping verb, తర్వాతి మాట, talking, Main Verb.) అందుకని correct question form- With whom are (helping verb) you (subject) talking (Main Verb) over (on కాదు) the phone? అనేది correct question అవుతుంది. అయితే Modern English లో Whom బదులు Who కూడా వాడుతున్నారు, అంతకుముందుండే preposition, to/ with verb తర్వాత వస్తుంది. అప్పుడు సరైన question- Who are you talking to over the phone?

2) ఇక్కడ కూడా, సరైన question- With whom are you living in Hyderabad? (Question కాబట్టి, Subject- you, helping verb 'are', main verb 'living' మధ్య రావాలి.) అయితే ఇక్కడ కూడా, Whom బదులు Who వాడి preposition 'with' ను Verb తర్వాత పెడితే, అప్పుడు correct question- Who are you living with in Hyderabad? అవుతుంది.

3) ఇక్కడ కూడా correct form, In which class are you studying?

**Q.** మీరు గతంలో Question tag లో helping verb ఉపయోగించాలని తెలిపారు. ఒక వాక్యంలో ఏది helping verb అని తెలుసుకోవాలి?

**A.** ఒక Verb లో రెండు మూడు మాటలున్నప్పుడు, మొదటి మాట, helping verb, మిగతా మాటలు Main Verb అవుతాయి.

I am not going - ఇక్కడ Verb, am going. మొదటిమాట, 'am', helping verb, 'going', main verb అవుతుంది.

She has been sleeping - ఇక్కడ has been sleeping verb. 'Has been' helping verb, sleeping - main verb.

Question tag లో ఎప్పుడూ helping verb/ అందులోని మొదటి మాట వస్తుంది.

She is sleeping, isn't she?

Question tag: is (helping verb) + n't + subject.

అయితే, sentence లోని verb, sleep అయితే, దాన్ని do sleep గా తీసుకుంటాం.

They sleep well- ఇక్కడ question tag form చేసేందుకు, sleep = do sleep. అప్పుడూ, question tag లో don't (do + not) వస్తుంది.

They sleep well, don't they? అలాగే, sleeps = does sleep; slept = did sleep. Question tags కూడా, doesn't + subject, didn't + subject గా వస్తాయి.

She sleeps well, doesn't she?

She slept well, didn't she?

well కు, won't., shall కి shan't- ఇలా వస్తాయి question tags లో.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/spoken/spoken.htm



***E.Anil, T.N.Palem (Prakasam Dist.)***

**Q.** Sir, నేను తెలుగుమీడియంలో చదివాను. ఇప్పుడేమో Class లో చెప్పినవి బట్టీపట్టి రాయాలంటే చాలా ఇబ్బందిగా అనిపిస్తోంది. Sentence ను అర్థం చేసుకుంటాను. కానీ, రాసేటప్పుడు would, would be, should, should be, can, can be, could, could be, must, must be, to, to be ల మధ్య తేడా తెలియడంలేదు. వీటి గురించి వివరిస్తారా?

**A.** Shall, should, will, would, can, could, may, might, must, have to, has to, had to వాటంతటవే Verbs కావు. వాటి తర్వాత 'be' అయినా రావాలి (అప్పుడవి be forms అవుతాయి), లేకుంటే actions ను తెలిపే go, come, walk, talk, (shall go, will come, should do etc) లాంటి మాటలయినా రావాలి. (Shall, should, will, would, etc... లను మాత్రమే వాడం అని అర్థం.) వీటిని 'be' తో వాడితే (shall be, should be, will be, would be etc.) వివిధ రకాల ఉండటం అనే అర్థం వస్తుంది.

Shall, should, will, would, etc... పక్కన 'be' గానీ, go, come, take, give లాంటి పనులను తెలిపే పదాలుగానీ లేకుండా వాడం, short answers లో తప్ప.

**eg:** **A:** Will you do it?

**B:** Yes, I will - ఇక్కడ కూడా will ను will do కు బదులు short గా వాడతాం. ఇలాగే shall, should, can, could etc లకు. అలాగే to be = ఉండటం, to + action word (come, go etc.) = to come = రావడం, to go = వెళ్లడం etc.

**Q.** 1. Every sentence that he spoke was listened to with great attention.

2. All these proposals are good.

వీటి గురించి వివరించగలరు.

**A.** 1. Every sentence that he spoke was listened to with great attention = అతడు చెప్పిన ప్రతి వాక్యం చాలా శ్రద్ధతో విన్నారు. ఇక్కడ was listened to - passive voice. అర్థం = ఆలకించబడింది అని

2. ఈ ప్రతిపాదనలన్నీ మంచివే.

As a verb, 'travel' is more used than 'journey'. For example, 'He travelled to a number of places' is more frequent than 'He journeyed to a number of places'.

***D. Laxman, Suryapet.***

**Q.** కిందివాటికి అర్థాలు తెలపగలరు.

1. Happiness is not pleasure. It is victory?
2. All are not stains, that go to Church?
3. You are what you eat, and what you think.
4. Life is not always easy, but it can be rewarding.
5. If I know what love is, it is because of you. (ప్రేమంటే ఏమిటో నాకు తెలుసు కాబట్టి అందువల్ల ఇది నీది? కరెక్టేనా?)




# He is no great singer





M.SURESAN

shall / will } be = future లో ఉండటం

a) shall / will } go = future లో వెళ్లడం

b) can be = ఇప్పుడు, future లో ఉండగలగడం.

She can be here in 10 minutes = ఆమె 10 నిమిషాల్లో ఇక్కడ ఉండగలదు (Ability)

She can do it = ఆమె అది చేయగలదు.

c) could be = గతంలో (past) ఉండగలగడం.

NTR could be the CM = NTR ముఖ్యమంత్రిగా ఉండగలిగాడు (గతంలో).

NTR could act any role = NTR ఏ పాత్రనైనా చేయగలిగేవాడు.

d) May be = ఉండవచ్చు, ఇప్పుడైనా future లోనైనా.

He may be there = అతడక్కడ ఉండొచ్చు

He may go there = అతడక్కడికి వెళ్లవచ్చు

e) Might be = గతంలో ఉండి ఉండవచ్చు

She thought her husband might be there = ఆమె తన భర్త అక్కడుండొచ్చనుకుంది.

Might go = గతంలో వెళ్లుండొచ్చు

They might go there, I thought = వాళ్లక్కడికి వెళ్లొచ్చని నేననుకున్నా.

f) Should be / must be / have to be / has to be } ఉండాలి (ఆజ్ఞ, అవసరం) ఇప్పుడు, future లో

He should be/ must be/ has to be there = అతడక్కడ ఉండాలి (ఆజ్ఞ/ అవసరంబట్టి అతడక్కడ ఉండాలి)

should go / must go / have to go / has to go } వెళ్లాలి (ఆజ్ఞ/ అవసరం)

They should go/ must go/ have to go there = వాళ్లక్కడికి వెళ్లాలి (ఆజ్ఞ, వాళ్ల అవసరంబట్టి చేయాలి ఆ పని).

g) had to be = (గతంలో) ఉండాల్సి రావడం (ఆజ్ఞ, అవసరాన్ని బట్టి)

had to go = వెళ్లాల్సి వచ్చింది (ఆజ్ఞ, అవసరాన్ని బట్టి).

He had to be here at 10 = అతడు పదింటికి ఇక్కడ ఉండాల్సి వచ్చింది.

He had to go at 10 = అతడు పదింటికి వెళ్లాల్సి వచ్చింది.

ఒకటే గుర్తుంచుకోండి.

shall, should, will, would పక్కన 'be' మాత్రమే వస్తే పైన తెలిపిన దశల్లో ఉండటం అనే అర్థం; అలాకాకుండా వాటి పక్కన పనులను తెలిపే పదాలు (go, come, sing, walk, etc) వస్తే ఆయా దశల్లో చేసే పనులని అర్థం వస్తుంది.

***S.Ananda Rao, MVK Varma, Uddandapuram***

**Q.** Sir, I would like to know the use of 'no' and 'not' in a sentence.

**A:** Usually 'no' is used as a negative response at the beginning of a sentence and 'not' in the middle of a sentence.

**eg:** Is he a singer?

No, he is not a singer.

Sometimes, 'no' is also used in the middle of a sentence for emphasis and in comparisons.

He is no singer like you/ He is no great singer. (Note the omission of 'a' before great singer. When you use 'not', 'a' has to be used before 'great singer')

**Q.** Can we change the voice of ... 1. Birds fly, 2. He works, 3. You loves.

**A.** The verbs in sentences 1) and 2), 'fly' and 'works' have no objects. That is, you don't get answer to the questions, fly/ works... what? (What do they birds fly?/ What does he work?) So they have no passive forms. Sentence 3) 'you loves' is wrong. The correct sentence is 'you love'. Even then the sentence is wrong because the meaning is incomplete.

- You love... what?/ whom?

suppose the answer is:

You love your parents..

Then you have the passive form:

Your parents are loved by you.

**Q.** As, Since... Is there any difference in usage of the above words?

**A.** As and since have more than one meaning each.

As = 1) because, 2) like

Since = 1) because, 2) from some time in the past. With the meaning of 'because' there is no difference in their use.

As/ since he is tall he can bowl well.

**Q.** What is the difference between 'Journey - Travelling'?

**A.** The difference is in the use of the words, but not in their meaning. We say safe/ happy/ long, etc. Journey; We don't use these words with travel.

**A.** Sentence 1 and 2 questions కావు కదా, మరి వాటిచివర question marks ఎందుకు?

అర్థాలు:

1. సంతోషం అంటే అర్థం, సరదా అని కాదు, విజయం అని.
2. ఈ sentence లో stains కాదు, saints. Correct form: All are not saints that go to church = Church/ గుడికెళ్లే వాళ్లందరూ రుషులు/ భక్తులు కారు.
3. నువ్వెలాంటి వాడివో, నువ్వు తినే తిండిని బట్టి, నీ ఆలోచనలను బట్టే ఉంటుంది.
4. జీవితం అంత సులభం కాదు, కానీ అది సత్ఫలితాలను ఇవ్వగలదు.
5. నాకు ప్రేమ అంటూ తెలిసిందంటే అది నీవల్ల.

**Q.** కిందివాటికి ఇంగ్లిష్ పదాలు, అర్థాలు తెలపగలరు.

1. కొలీగ్స్ 2. కార్బొనేటెడ్ సోడా 3. వేల్ 4. ఆర్కుట్ 5. న్యూడ్ 6. బ్లాగ్ 7. అట్టర్ 8. ఇంపాక్ట్

**A.** ఇవన్నీ English పదాలే కదా?

1) Colleagues = సహోద్యోగులు/ (ఓ సంస్థలో కలిసి పనిచేసే సిబ్బంది)

2) Carbon వాయువు కలిపిన సోడా

3) Vale = Valley = లోయ

4) Orkut = email ద్వారా సంభాషించుకుంటూ ఫొటోలు మార్పిడి చేసుకుంటూ ఒకరికొకరు సన్నిహితమయ్యే బృందం.

5) Nude = దిగంబరమైన/ నగ్నమైన

6) Blog = ఇది కూడా Internet ద్వారా సంభాషించుకుంటూ సమాచార ప్రసరణ చేయడం.

7) Utter = పూర్తిగా.

There was utter confusion at the meeting = ఆ సభలో పూర్తి గందరగోళం నెలకొంది.

8) Impact = ప్రభావం

The streets were flooded because of the impact of the cyclone = తుపాను ప్రభావం వల్ల వీధులన్నీ జలమయమయ్యాయి.

***G. Ashok, Godhur (Karimnagar Dist.)***

**Q.** Sir, what is the difference among these words?

1. General Knowledge, General Awareness, General Aptitude.
2. Rates, Prices, Charges, Fares.
3. Temporary, Adhoc, Tentative, Provisional
4. Portal, Website, Google, Twitter, Yahoo, Web, Blog, Browsing, Online, Data base.

**A. 1) General knowledge =** సాధారణ విజ్ఞానం- భౌగోళిక, చారిత్రక, సాంకేతిక, శాస్త్రీయ, రాజకీయ విషయాల పరిజ్ఞానం, ఇప్పుడు జరుగుతున్న ప్రముఖమైన సంఘటనలతో సహా.

**General awareness =** పైవాటి గురించి అవగాహన- ఎప్పటికప్పుడు కలిగే పరిణామాలతో సహా.

General knowledge = General awareness

**General aptitude -** General aptitude అనే మాట సరికాదు- దీనికి అర్థం లేదు.

**Aptitude =** ఒక విషయంలో ఆసక్తితో కూడిన ప్రతిభ.

**2) Rate =** Price per unit = ఇన్ని వస్తువులకు/ ఇంత పరిమాణానికి ఉండే ధర. Rs. 100 per dozen. (డజనుకు 100 రూపాయల చొప్పున); Rs. 250 per meter (మీటరుకు రూ.250 చొప్పున); Rs.20 per Kg (కిలోకు రూ.20 చొప్పున)- ఇవన్నీ rate. ఇంత కొలతకు/ పరిమాణానికి/ బరువుకు ఇంత ధర అంటే అది rate.

I bought these mangoes at Rs. 200 per dozen. (నేను ఈ మామిడి పండ్లను డజన్‌కు రూ. 200 చొప్పున కొన్నాను- ఇక్కడ ఎన్ని పండ్లను కొన్నదీ, ఎంత మొత్తం చెల్లించిందీ తెలియడం లేదు)- కాబట్టి ఇది rate.

**Price =** మనం కొన్న వస్తువు/ వస్తువులకు చెల్లించే మొత్తం ధర.

కిలో రూ.20ల ప్రకారం (ఇది rate) 3 కిలోలు రూ. 60లకు కొన్నాను (ఇది price).

**Charges =** వస్తువులకు, సేవలకు, వాహనాల మీద ప్రయాణాలకూ చెల్లించే రుసుము.

**Fares =** ప్రయాణ ఖర్చు/ టిక్కెట్ ధర.

**3) Temporary =** తాత్కాలికమైన

**Adhoc =** అప్పటికప్పుడు జరగాల్సిన పని తాత్కాలికంగా చేయడం/ ముందస్తు ప్రణాళిక, పథకం, ఏమీలేకుండా అప్పటికప్పుడు అమలుచేసే పరిష్కారం/ ఏర్పాటు.

**Tentative =** తాత్కాలికమైన - ప్రణాళిక తయారయ్యేంతవరకు చేసే ఏర్పాటు.

**Provisional = temporary =** తాత్కాలికమైన.

**4) Portal =** మనం ఆసక్తి కనబరచే విషయాన్ని (business/ news/ science/ shopping లాంటివి) గురించి సమాచారాన్ని తెలిపే website లోకి internet ద్వారా మనం ప్రవేశించే సమాచారకేంద్రం (Computer లో).

**Website =** Internet ద్వారా ఎవరైనా తెలుసుకునేందుకు వీలుగా ఓ Company/ సంస్థ తనకు సంబంధించిన సమాచారం మొత్తం Computer లో అందుబాటులో ఉంచే చోటు. (మనం Tata Company గురించి తెలుసుకోవాలనుకోండి. ఆ సమాచారం మనకు ఆ Company website లో ఉంటుంది, internet ద్వారా)

**Google-** Google Company వారు మనకే సమాచారం కావాలన్నా తెలిపే website. ఇది ఒక search engine.

**Twitter =** Internet ద్వారా మన సన్నిహితులతో, కొత్త పరిచయస్తులతో సంభాషించే ఏర్పాటు.

**Yahoo-** Internet ద్వారా ఇతరులతో సంభాషించేందుకు, letter రాయడానికి వీలుకల్పించే company లేదా service provider లలో ఒకటి. ఇలాంటివే, Hotmail, Gmail, etc.

**Web =** Website

**Blog =** ఎవరైనా తమకు సంబంధించిన సమాచారాన్ని ఇతరులకు Internet ద్వారా తెలిపే పద్ధతి.

**Browsing =** సమాచారం కోసం, Internet లో వెదకడం/ చదవడం.

**Online =** సమాచారం ఇచ్చిపుచ్చుకునేందుకు internet వాడటం.

**Database =** ఒక విషయానికి సంబంధించి Computer లో నిల్వచేసిన మొత్తం సమాచారం.

**Spoken English** పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish



***E. Anil, TN Palem***

**Q.** Sir, Grammar book లో clause and phrases గురించి చదివినప్పుడు i. Noun clause ii. Adjective clause iii. Adverb clause లను చూశాను. Sentence formation లో వీటి ప్రాముఖ్యాన్ని, usage ని తెలపగలరు. Noun phrase, Adjective phrase, Adverb phrase లను గురించి కూడా వివరించగలరు.

**A. Noun clause:** Noun చేసే పనిని, ఒక clause చేస్తే అది Noun clause of a sentence అవుతుంది. Noun ను మనం 1) Subject of a sentence 2) object of a verb 3) Object of a preposition 4) Complement గా వాడతాం. ఓ clause ను ఇలాగే వాడామనుకోండి. అది noun clause అవుతుంది.

eg: 1) What he says is true. ఇక్కడ What he says అనే clause (says అనే verb ఉండే group of words కాబట్టి అది clause) subject of the sentence కాబట్టి అది noun clause.

2) She knows where he is. ఇందులో where he is అనే clause, knows అనే verb కు object కాబట్టి 'where he is' is a noun clause.

2) I ate the food in the fridge. 'The food in the fridge' అనేది object of the verb 'ate' కాబట్టి, అది noun phrase.

అలాగే adjective phrase కూడా. పై sentenceలో 'in the fridge', food అనే noun ను గురించి చెప్తుంది కాబట్టి, అది adjective phrase.

3) He earned to help others. 'to help others' - adverb phrase, 'earned' అనే verb ను గురించి చెప్తోంది కాబట్టి.

**Q.** Compliment అనేది verb గురించి తెలుపుతుంది కదా? కానీ, ఒక సందర్భంలో subject గురించి తెలుపుతుందని మీరు అన్నారు. ఈ రెండింటినీ గురించి వివరించగలరు.

**A.** Complement, subject complement/ verb complement is used to complete the sentence.

The tiger is an animal. ఇక్కడ animal - subject complement. Tiger (subject) ను గురించి చెప్తుంది కాబట్టి.

He became angry. ఇక్కడ angry verb complement - verb meaning ను complete చేస్తుంది కాబట్టి.

***Pavan Kumar Reddy, Hyderabad***

**Q.** a) The man seen near the school

b) The book given to him

seen, given అనేవి past participle అని తెలుసు. కానీ verb రూపం tense గురించి వివరించగలరు. Verbs 6 forms లో ఇవి లేవుకదా?

**A.** The man seen near the school, (స్కూల్ దగ్గర చూడబడిన వ్యక్తి), The book given to him (అతడికి ఇవ్వబడిన పుస్తకం) ఈ రెండింట్లో ఉన్న seen, given past participles అని అన్నారు గదా? 6 Forms of verbs లో కేవలం past participle లేదుకదా? Be form + pp - verb; Have/ has/ had/ shall have/ should have, etc + PP - verb. కేవలం past participle verb కాదు. కాబట్టి the man seen near the school, the book given to him - ఈ రెండూ కూడా groups of words without verbs, so they are phrases.




# This is what she gave him

3) It depends on when he leaves (అది అతడెప్పుడు వెళ్తాడు అనే దానిమీద ఆధారపడి ఉంటుంది)

When he leaves అనే clause, 'on' preposition కు object కాబట్టి 'when he leaves' is a noun clause.

4) This is what she gave him ఇక్కడ what she gave him అనే clause complement (sentence ను complete చేసేది)గా వాడాం కాబట్టి ఇది కూడా noun clause.

**Adjective clause:** ఒక clause, adjective చేసే పనిని చేస్తే అది Adjective clause అవుతుంది. Adjective ఎప్పుడూ noun గురించి చెప్తుంది. (ఎటువంటి అనే ప్రశ్నకు సమాధానంగా) అలా noun ను గురించి చెప్పేందుకు ఒక clause వాడితే అది adjective clause.

eg: 1) The boy who stood first in the class is my cousin. ఇక్కడ 'who stood first in the class' అనే clause 'boy' అనే noun ను గురించి చెప్తోంది కాబట్టి, 'who stood first in the class' అనేది adjective clause.

2) The place where he lives is very near here. ఇక్కడ కూడా where he lives అనేది adjective clause.

**Adverb clause:** A clause acting as an adverb is an adverb clause. Adverb, Verb ను గురించి చెప్తుంది, adjective ను/ ఇంకో adverb ను గురించి చెప్తుంది. ఈ పనులను ఒక clause చేస్తే అది adverb clause అవుతుంది.

1) She carries the box wherever she goes. ఇందులో 'Wherever she goes' అనే clause, 'carries' (తీసుకెళుతుంది) అనే verb ను గురించి చెప్తుంది (వెళ్లినచోటికల్లా తీసుకెళుతుంది) కాబట్టి, wherever she goes, adverb clause అవుతుంది.

2) She is so good that everyone likes her; ఇక్కడ so... that everyone likes her అనే clause, well అనే adverb ను గురించి చెప్తోంది కాబట్టి అది adverb clause.

3) He is so tall that he can touch the ceiling ఇక్కడ so... that he can touch the ceiling అనే clause, tall అనే adjective ను గురించి చెప్తోంది కాబట్టి, అది adverb clause. అలాగే, noun phrase, adjective phrase and adverb phrases కూడా.

Phrase = a group of words without a verb.

1) The book on the table is mine. The book on the table, subject of the sentence కాబట్టి అది 'Noun Phrase'.






M.SURESAN

***S.P., Nirmal***

**Q.** Raghu likes tomatoes and so does Madhu. దీన్నే Raghu likes tamatoes and Madhu too అని రాయవచ్చా?

**A.** Raghu likes tomatoes and Madhu does too అనాలి. Does ఉండాలి కదా? లేకుంటే రఘు టొమోటోలనూ, మధును కూడా ఇష్టపడతాడు అని అర్థం రావచ్చు

**Q.** a) Since I haven't much strength, I can't lift this luggage.

b) As I haven't much strength, I can't lift this luggage.

పై వాక్యాల్లో అర్థాల్లో తేడా ఏమిటి? Since, As లను ఇలాంటి వాక్యాల్లో వాడేటప్పుడు ఏ నిబంధనలు పాటించాలి?

**A.** Since = as = because. రెండూ ఒకటే.

**Q.** Spastic అర్థం ఏమిటి?

**A.** Spastic = మెదడు జబ్బువల్ల కండరాల కదలిక సరిగా లేకపోవడం- ఈ లోపం ఉన్నవాళ్ల చేతులూ, కాళ్లను సరిగా కదల్చలేరు. అయితే ఇప్పుడీమాట వాడుకలో లేదు. అలాంటి జబ్బున్న వాళ్లను spastic అనడం కూడా తప్పుగా అనుకుంటారు.

**Q.** Articles, verbs, prepositions మొదలైన అంశాల గురించి మరోసారి వివరించగలరు.

**A.** వీలునుబట్టి వివరిస్తాం.

***K. Sri Krishna Kumar, Bapatla***

**Q.** 'They would rather you paid them by cheque'- ఈ వాక్యంలో would rather ఏ part of speech? paid, verb అయితే past form, past participle వివరించగలరు.

**A.** Would- Helping Verb

rather - adverb

ఈ sentence లో paid అనేదే verb. ఇది past tense, అయినప్పటికీ usage (వాడుక) ప్రకారం, Present/ Future situations ను తెలుపుతుంది. (నువ్వు cheque ద్వారా చెల్లించడం, వాళ్లు ఇష్టపడుతున్నారు/ పడతారు అని)

They'd (ఇలాంటిచోట్ల Would పూర్తిగా రాయరు) rather you left immediately = నువ్వు వెంటనే వెళ్లిపోవడమే వాళ్లకు కావలసింది. ఇది ప్రస్తుత విషయమైనా, Past tense మాత్రమే వాడతాం.

**Q.** Is it beautiful? - అందంగా ఉందా? Isn't it beautiful? - అందంగా లేదా? అందంగా ఉంది కదా? - అని రెండు అర్థాలు ఉన్నాయా? వివరించండి.

**A.** అందంగా ఉందికదా? = It is beautiful, isn't it?. ఏ sentence అర్థం దానిదే - రెండు అర్థాలూ, ఒకదానికొకటి వ్యతిరేకం కదా? అవి ఒకే sentence లో ఎలా వస్తాయి?

***T. Kaasi Annapurna, Kesavadasupalem***

**Q.** కింది వాక్యాలను తెలుగులో వివరించగలరు.

I have written a letter

I could have written a letter

I could write a letter

**A.** 1. నేనో ఉత్తరం రాశాను.

2. నేను ఉత్తరం రాయగలిగేదాన్నే (కానీ రాయలేదు)

3. i) ఉత్తరం రాయగల సామర్థ్యం ఉండేది నాకు గతంలో.

ii) నేను ఉత్తరం రాస్తానేమో.

***K.V. Narender, Jagtial.***

**Q.** Hats off పదం ఎలా ఆవిర్భవించింది? దీని అర్థం ఏమిటి? ఏయే సందర్భాల్లో ఉపయోగించవచ్చు?

**A.** English వాళ్లు hats పెట్టుకుంటారు కదా? ఎవర్నన్నా మెచ్చుకొనేందుకు, అభిమానం చూపేందుకూ, గౌరవ సూచకంగా, hat ఒక చేత్తో పైకి తీస్తారు (They take off their hats) అందుకని hats off అంటే మెప్పు తెలపడానికి సంకేతంగా వాడతాం.

**Q.** Barrage పదం P. Sankar Narayana డిక్షనరీలో లేదు. Barrage - Reservoir - Dam వీటి మధ్య తేడా ఏమిటి?

**A.** Barrage = ప్రవాహానికి అడ్డంగా కట్టేగోడ, నీరు వృథా కాకుండా నిల్వ చేసేందుకు.

Reservoir = జలాశయం (సరస్సు). దీనిలోని నీరు పొర్లిపోకుండా అడ్డంగా నిర్మించేది, dam. Reservoir సహజంగా (Natural) గానీ, మానవ నిర్మితమైంది (artificial) గానీకావచ్చు. Dam నీరు నిల్వచేయడానికే గాకుండా, విద్యుదుత్పత్తికి (power generation) కూడా వాడవచ్చు. Dam వల్ల నీటిని పైపుల ద్వారా, కాలువల ద్వారా వదిలే అవకాశం ఉంటుంది. Barrage ఒక అడ్డుగోడ మాత్రమే.

**Q.** Anthem - Song వీటి మధ్య తేడా ఏమిటి?

**A.** Anthem = ప్రబోధాత్మక, సందేశాత్మక గీతం. (నీతి బోధ, సందేశాన్ని తెలిపే పాట)

Song = ఏ పాటయినా.

**Q.** థియేటర్లు మొదలైనచోట్ల No Smoking అని ing form లో రాస్తారెందుకు? ఇది ఏ tense కిందికి వస్తుంది? 'Do not smoke here' అంటే సరైన అర్థం వస్తుంది కదా!

**A.** Smoking = పొగతాగడం, no = కూడదు. Do not Smoke here అన్నా, అదే, అయితే, No Smoking, Do not Smoke here కంటే simple కదా? ఇది English కు ఉన్న ప్రత్యేకత.

***K. Divya, Banavasi.***

**Q.** Sir, English లో కొన్ని Verbs తరువాత off, away, up వంటి పదాలను ఎందుకు వాడాలి? ఉదాహరణకు go అంటే వెళ్లు అని అర్థం. 'ఆమె వెళ్లింది' అనడానికి She went అంటే సరిపోతుంది కదా? అలాకాకుండా She went away అని ఎందుకు వాడాలి? అలా వాడకపోయినా పరవాలేదా?

Peel అనే verb కు off అనే పదం ఎందుకు వాడాలి? I will peel off your skin, if you do it again. Be careful. ఈ వాక్యంలో off తప్పనిసరిగా వాడాలా? తెలుగులో 'నీ చర్మం వలుస్తాను' అంటాం కదా! మరి ఇంగ్లిష్‌లో peel అనే verb సరిపోతుంది కదా! దానికి off ఎందుకు?

Fling (verb) తరువాత away ని వాడతారు. 'ఆమె కుళ్లిన టమోటాలను పారవేసింది' అనడానికి She flung away rotten tomatoes అని ఎందుకు అనాలి? దయచేసి వివరిస్తారా?

**A.** ఇవన్నీ కూడా Usage (వాడుక) వల్ల భాషలోకి చేరే expressions. వీటికి ఇలా వాడాలి, వాడకూడదు అనే నిబంధనలుండవు. తెలుగులో కూడా ఇలాంటి మాటలున్నాయికదా?

వాళ్లు వెళ్లారు - వాళ్లు వెళ్లిపోయారు.

వచ్చారు - వచ్చేశారు

తిన్నాడు - తినేశాడు (తిని వేశాడు)

ఏ భాషలోనైనా కొన్ని మాటలు మామూలుగా వాటిని ఉన్నవి ఉన్నట్టుగా వాడితే అంత effective గా ఉండదేమో అన్న భావనతో కొంత గట్టిగా అనాలనే ఉద్దేశంతో మాట్లాడటంవల్ల ఇవి వాడుకలోకి వస్తాయి.

Peel the potatoes - Peel off the potatoes

చెక్కు తియ్యి - చెక్కు తీసేసెయ్.

Go - go away వెళ్లు - వెళ్లిపో

fling - fling away విసురు - విసిరేయ్

ఎక్కువ effect కోసం ఈ particles (మీరు చెప్పిన verbs తర్వాత వాడిన off, away లాంటి prepositions, adverbs) వాడుకలోకి వచ్చాయి. ఇవి usage (వాడుక). వీటికి logic, grammar rules వర్తించవు.

***J. Mounika, Amalapuram***

**Q.** How about going to the movie Black? ఇందులో How about అంటే అర్థమేమిటి? Do we go to the movie Black? అనొచ్చా?

అలాగే How about some coffee before going to a movie? అని మీరు గతంలో తెలిపారు. దీనిని Do we take coffee before going to a movie? లేదా Shall we take coffee before going to a movie? అనొచ్చా?

**A.** How about = దాని విషయం/ సంగతి ఏంటి = వాటి విషయం/ సంగతి ఏంటి? = What about.

How about a movie this evening? = సాయంత్రం సినిమా సంగతేంటి? (వెళ్దామా?)

What about your brother? = మీ అన్న సంగతేంటి?

English లో conversation (సంభాషణ) ప్రారంభించేందుకు, How about....?/ What about.....? చాలా తరచుగా వాడతారు.

How about some coffee? = కాఫీ తాగుదామా? / కాఫీ ఏమన్నా ఉందా?

What about the money you owe me? = నా అప్పు సంగతేంటి?

How about some coffee before going to a movie? = Shall we take coffee before going to a movie.

Do we take coffee before going to a movie? = మనం కాఫీ తీసుకుందామా? (అలాంటి ఆలోచనేమన్నా ఉందా? ).

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# Please attend on our guests





M.SURESAN

**Intention** = ఉద్దేశం- మనం ఒక పనిని, దేనిని దృష్టిలో పెట్టుకుని చేస్తున్నాం అనే విషయం.

**Opinion** = అభిప్రాయం.



***S.Naresh, Khammam***

**Q.** దయచేసి కింది పదాల మధ్య తేడాలను వివరించగలరు.

House - Home, say - tell, speak - talk, in time - on time, can - able to, should - must, intention - opinion.

**A. House-** ఏ ఇంటినైనా/ నివాసయోగ్యమైన ఏ కట్టడాన్నైనా House అంటాం.

The Post Office is in the lane next to the row of houses on the street = ఆ వీధిలోని ఇళ్ల వరస తర్వాత ఉండే సందులో ఆ Post Office ఉంది.

**Home-** మన కుటుంబసభ్యులతో మనం ఉండే ఇల్లు. నా పుస్తకం ఇంట్లో ఉంది = My book is at home. (in my house కాదు). సాధారణంగా Home ముందు my, his, her, their- అంటే 'ఎవరి?' అని చెప్పాల్సిన అవసరం లేదు. అలాగే చాలావరకు home ముందు 'to' (ఇంటికి అనే అర్థంతో) రాదు.

a) I am going home = నేను ఇంటికి వెళుతున్నాను (I am going to my home- సరికాదు)

b) He left his bother at home = అతడు వాళ్ల తమ్ముడ్ని ఇంట్లో వదిలి వచ్చాడు (His home అనాల్సిన పనిలేదు, తప్పు కూడా)

Home అంటే సొంత ఊరు/ స్వదేశం అని కూడా. My home is Vijayawada/ India.

**House** అంటే వ్యాపార సంస్థ అనే అర్థం కూడా. This is the latest product from the house of Tatas = Tata సంస్థ నుంచి...

| Say | Tell |
|---|---|
| 1) Say తర్వాత వ్యక్తి object గా రాదు.<br>He said me/ him/ Ram (X) | 1) Tell తర్వాత వెంటనే (to లేకుండా) వ్యక్తి (ఏ వ్యక్తితో చెప్పింది) కచ్చితంగా వస్తుంది.<br>He told me/ her/ Ram, etc (√)<br>He told to me/ to Ram, etc (X) |
| 2) Say తర్వాత (ముఖ్యంగా) ఒకరన్న మాటలను ఇంకొకరితో చెప్పేందుకు వాడతాం.<br>a) 'All right', she said<br>b) She said, 'let's wait'<br>c) She said that it was not true<br>(say తర్వాత 'that' clause రావడం గమనించండి.<br>d) She said to me that it was true | 2) Tell తర్వాత వ్యక్తి object గా వచ్చి ఆ తర్వాత 1) ఒకరన్న మాటలను ఇంకొకరికి చెప్పేందుకు, 2) సమాచారం ఇచ్చేందుకు వాడతాం. Quotations ముందుగానీ, తర్వాతగానీ, tell రాదు. అంతేకాకుండా tell వెంటనే ఎవరితో చెప్పేదీ రావాలి.<br>She told me/ her/ Ram that it was true. |
| 3) say తర్వాత infinitive (to go, to come, to sing లాంటివి) రాదు. She said (to) him to go (x) | 3) Tell తర్వాత వ్యక్తి object గా వచ్చి తర్వాత infinitive రావచ్చు.<br>She told him to go (√) |
| 4) Say తర్వాత, anything, something, nothing, everything, so, hello & good bye.<br>She didn't say anything.<br>She said something/ everything/ so (అలా చెప్పింది)/ hello/ goodbye. | 4) Tell తర్వాత ఎవరితో అనేది (object) me/ him/ Ram లాంటిది వచ్చిన తర్వాత మాత్రమే something/ nothing/ everything వస్తాయి. Hello/ goodbye రాదు. |
| 5) She said a story/ lie/ joke/ truth అని అనం. ఇది తప్పు. | 5) Tell తర్వాత ఎవరితో అని చెప్పకుండానే she tell a stroy/ joke/ lie/ joke వస్తాయి. |

| Speak | Talk |
|---|---|
| 1. Formal- అంటే ముఖ్యమైన విషయాన్ని ప్రస్తావించేటప్పుడు- Speak to the manager about it = మేనేజర్‌తో మాట్లాడి తెల్పుదాం- ఒక ధ్యేయాన్ని మనసులో పెట్టుకుని మాట్లాడటం. | 1. Talk- informal- అంత ముఖ్యమైన విషయం కానప్పుడు- పలకరింపులు, కబుర్లు, సంభాషణలు చేస్తున్నప్పుడు Talk అంటాం. They were talking politics. |
| 2. భాషలు తెలియడం/ మాట్లాడగలగడం speak. She speaks two or three languages | 2. ఇతరులకు సమాచారం తెలపడం- talk |
| 3. ఉపన్యాసం ఇవ్వడం- 3 or 4 speakers spoke on the occasion. | 3. Talk ఈ అర్థంతో వాడం |
| 4. Phone సంభాషణ ప్రారంభానికి: Can I speak to Sriram? | 4. Talk ఈ సందర్భంలో వాడం. అయితే She talked on the phone to him అంటాం. |

**In time** = అనుకున్న సమయానికంటే ముందు

He was intime at the station and caught the train without any tension = స్టేషన్‌కు కాస్త ముందుగానే చేరుకున్నాడు, ఏ ఆదుర్దా లేకుండా train ఎక్కాడు.

**On time** = correct గా time- The match began on time = Match అనుకున్న సమయానికి సరిగ్గా మొదలయింది.

**Can = able to.** అయితే Can అంటే చేయగల సామర్థ్యం ఉంది, చేశారా, లేదా అని తెలియదు.

He can sing = అతడు పాడగలడు. ఎప్పుడు పాడాడు/ పాడటం జరిగిందా లేదా అనేది తెలియదు.

He is able to sing = అతడు పాడగలుగుతున్నాడు- పాడుతూ ఉన్నాడు కదా, అనే అర్థం రావచ్చు

**should = must** 1) Orders (ఆజ్ఞలు) 2) Duties (విధులు); (3) Necessity (అవసరం) తెలుపుతాయి.

1. You should/ must finish the work today (Order)
2. I should be/ must be at office from 10 AM - 5 PM (Duty)
3. I should be at station by 10, or I will miss the train (నేను పదింటికి స్టేషన్‌లో ఉండాలి, లేకుంటే రైలు తప్పిపోతుంది)- Necessity.

**Q.** Here we go అంటే ఏమిటి?

**A. Here we go** = ప్రారంభిస్తున్నాం/ ఏదో ప్రారంభం అవుతోంది.

1) Here we go. Take the pen and start writing = (ప్రారంభిస్తున్నాం. పెన్ తీసుకుని రాయడం మొదలు పెట్టు)

2) Here we go. The match has begun = అదిగో, match ప్రారంభం అయింది.

**Q.** HTTP, URL అంటే ఏమిటి?

**A. HTTP** = ఇది Computer పదం- Hypertext Transfer Protocol = Computer Language లో రాసిన విషయాన్ని నియంత్రించేందుకు (to control) వాడే ప్రమాణాలు/ నిబంధనలు.

**URL** = ఇది కూడా computer కు సంబంధించిందే. Uniform Resource Locator = Computer web page- WWW (World Wide Web) అని అంటుంటాం. దాని address.

***M.Venkata Reddy, Tanuku***

**Q.** I will go to Hyderabad in next week- I will go to Hyderabad next week- ఈ రెండింటిలో ఏది సరైంది? in, on ఏయే సందర్భాల్లో వాడతారు?

**A.** I will go to Hyderabad next week. Correct. Day/ month/ week/ year/ hour లాంటి వాటిముందు, This, that, every, next and last వస్తే వాటి ముందు in/ on వాడం.

i) a) There are twelve months in a year
b) He comes here once every year.

ii) a) This happens twice (in) a week.
b) This happened last week.
c) We may go there next week.

**Q.** a) Send me the details about the commission you give to us.

b) Send me the details about the commission you give us. ఈ రెండింటిలో ఏది సరైంది? ఏయే సందర్భాల్లో వాడతారో వివరించగలరు?

**A.** Sentence b: Send me the details of (about కాదు) the commission you give us.

Give తర్వాత ఏదయినా object, it, the book, etc లాంటివి వస్తే, అప్పుడు give తర్వాత 'to' వస్తుంది. Give it/ the pen/ the details, etc. to us.

**Q.** Who is the producer of that picture? Who is the producer for that picture? ఈ రెండింటిలో ఏది సరైంది? of, for ఏయే సందర్భాల్లో వాడతారు?

**A.** Producer of the picture, correct. For అంటే కోసం, ఆ ఉద్దేశంతో అనే అర్థం వస్తుంది. He produced the movie for children. He is responsible for this trouble.

***A.Satyanarayana, Jannaram.***

**Q.** We write 'Yours faithfully,' etc. in letters. "Yours" is not an adjective, but we use it as above. How could it happen kindly clarify it in detail.

**A.** Yours is usually a pronoun. The expression, "Yours faithfully/ sincerely", etc evolved from the original expression "Your faithful servant/ friend", etc. It's a matter of usage, and can't be explained by grammar rules, as in the case of the question tag: "Aren't I?" [I am an Indian, aren't I- actually it should be- amn't I, shouldn't it?]

***T. Emmanuel, Nellore***

**Q.** Let's (let us) లో apostrophe (')s ఎలా ఏర్పడింది? 'u' omit చేయడం కరెక్టేనా?

**A.** Let's (= Let us), That's (that is) ఇలాంటిచోట్ల, Apostrophe (') ని మనం omit చేసే శబ్దానికి/ అక్షరానికి బదులు వాడతాం. అంటే apostrophe (') ఎక్కడయినా వాడితే అక్కడ శబ్దాన్ని (శబ్దాలను)/ అక్షరాలను వదిలేసినట్టు.

Don't = Do not (n't = not)

Hon'ble = Honourable.

Apostrophe వాడటం మనం మాట్లాడేటప్పుడు pronunciation ను బట్టి ఉంటుంది. త్వరగా మాట్లాడేటప్పుడు అన్ని శబ్దాలు సరిగా ఉచ్చరించం కదా. That is అనేందుకు, త్వరగా మాట్లాడేటప్పుడు (In hurried speech) That's అంటాం. రాతలో ఇక్కడ శబ్దం వదిలేసినట్టు తెలిపేందుకు apostrophe వాడతాం.

**Q.** Exclusive showroom లోని exclusive కు exclusively అనే పదాలకు సరైన భావం ఏమిటి?

**A. Exclusive** = ప్రత్యేకమైన/ ప్రత్యేకంగా ఒకరికోసం/ ఒకదానికోసం ఉద్దేశించిన, అని.

This class of accommodation is exclusive to ministers = ఈ రకం వసతి ప్రత్యేకంగా మంత్రులకు మాత్రమే.

Exclusive show room = ఏదో ఒకే company కి చెందిన ఉత్పత్తులకు ఉద్దేశించిన showroom. కానీ ఈ అర్థంతో కాకుండా కొన్ని కంపెనీలకు Exclusive show room అనడంలో అర్థం లేదు. Exclusive అంటే ఒకే ఒకరికి/ ఒక్కదానికి మాత్రమే అని.

**Q.** Attend, Attend to ల గురించి తెలుపగలరు.

**A. Attend** = హాజరవడం/ to be present.

**Attend to** = బాధ్యతగా ఒక పనిచేయడం/ చూసుకోవడం.

He is attending to the construction of the house = ఆ ఇల్లు కట్టడం పని అతడు చూసుకుంటున్నాడు/ బాధ్యతగా చూసుకుంటున్నాడు.

She has to attend to her children in the morning = ఆమె ఉదయంపూట తన పిల్లల విషయం చూసుకుంటుంది.

**Attend on** = రోగులకు, అతిథులకు సపర్యలు చేయడం.

Please attend on our guests while I am away = నేను లేనప్పుడు మన అతిథుల విషయం చూసుకో.

In government hospitals, doctors do not attend on patients properly = ప్రభుత్వ ఆసుపత్రుల్లో రోగులను డాక్టర్లు సరిగా చూడరు.

**Q.** The student is expected to attend school on time కరెక్టేనా? లేదా intime కరెక్టా?

**A. 'On time'** - correct. పైన ఇలాంటి ఉత్తరానికిచ్చిన సమాధానం చూడండి.

**Q.** How is the world with you?

Good so far. Thanks - అన్నప్పుడు Thank you అనకుండా Thanks అంటే సరిపోతుందా?

**A.** సరిపోతుంది.

***K.V.S. Sireesha, Jangareddygudem***

**Q.** ఇంగ్లిష్‌లో ఏదైనా date, month, year చెప్పేటప్పుడు... eg: "12 August, 1919" లేదా "1 June, 1940" ఇలా ఉంటుంది. ఇక్కడ Twelve August, one June అనాలా? లేదా Twelfth August, First June అనాలా? Twelfth, First అంటే మరి 12th, 1st అని పుస్తకాల్లో ఉండదేమిటి?

**A.** Date చెప్పేటప్పుడు, the 12th August/ the 1st June అనే అనాలి, 12 August 1919, 1 June, 1940 అని రాసినప్పటికీ.

**Q.** ఆఫీసర్స్ - సర్క్యులర్స్ మొదలైనవి జారీచేసేటప్పుడు ఇంగ్లిష్‌లో Present: ఇక్కడ Issue చేసినవారి పేరు రాస్తారు. eg: Present: RamaRao, M.A.: B.L. కానీ తెలుగులో Present కి అనువాదం - ప్రస్తుతం అని రాస్తారు. కానీ Present అంటే సమర్పించినవారు అనే అర్థం కదా?

**A.** Circulars లో present కు అర్థం, జారీ (issue) చేసినవారు అక్కడ present (హాజరై ఉన్నారు) అని. అంటే ఆ అధికారి సమక్షం (presence) లో ఆ సర్క్యులర్ జారీ అయిందని. Present అంటే ఇక్కడ ప్రస్తుతం అనికాదు.. హాజరై ఉన్నారు అని.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# He is hell-bent on a settlement

**Pradhan:** Oh, this work is really tiring. We are working overtime. The work is really killing us. When will the boss let us off?

(ఈ పని అలసిపోయేలా చేస్తోంది. సమయం మీరి చేస్తున్నాం. ఈ పని నిజంగా చంపేస్తోంది మనల్ని. మన బాస్ ఎప్పుడు వదులుతాడు?)

**Pramukh:** Not certainly until the work is finished and it is to be finished by tomorrow evening. The boss is hell-bent on the target date, that is, the day after tomorrow.

(పని పూర్తయ్యేదాకా మాత్రం కాదు, అది రేపు సాయంత్రానికల్లా అయిపోవాలి. నిర్ణీత గడువుకు అయిపోవాలని బాగా పట్టుదలగా ఉన్నాడు. ఆ నిర్ణీత సమయం ఎల్లుండి.)

**Pradhan:** Why is he so intent on it? What difference does a week make? I've heard that the date set is next Monday.

(అంత పట్టింపేమిటో ఆయనకు? ఒక వారమైతే మాత్రం పోయేదేమిటి? అసలు మనం పూర్తి చేయాల్సింది వచ్చే సోమవారం అని విన్నాను.)

**Pramukh:** That's true, but the boss is determined to get a pat from his higher-ups by being the first to get it done, by finishing it ahead of schedule.

(అది నిజమే. కానీ నిర్ణీత సమయంకంటే ముందే, అదీ అందరికంటే ముందే పని పూర్తి చేయించి, అధికారులతో భుజం తట్టించుకోవాలనే కృతనిశ్చయంతో ఉన్నాడు మన బాస్.)

**Pradhan:** But we don't find that kind of resolve in him to reward our efforts suitably. Good for him to be so set on climbing up the ladder. But does it mean that he should so trouble us? Why doesn't he set his mind on pleasing us too?

(కానీ, అదే నిశ్చయం మన శ్రమకు కూడా తగిన ప్రతిఫలం ఇవ్వాలనే విషయంలో మాత్రం ఉండదు ఆయనకి. ఆయన పైకి రావాలనే కృతనిశ్చయం చాలా మంచిదే. అందుకోసమని మనల్ని ఇలా ఇబ్బంది పెట్టడం సబబేనా? మనకూ సంతోషం కలిగించాలనే విషయంలో ఆ నిశ్చయత్వం ఉండదా?)

**Pramukh:** That he should, of course. That apart, he is very tenacious. He came up the hard way. Though he doesn't reward us, he is not the one to harm us. Then he is good at his work too. (He is) quite capable of setting an example for us.

(అది కరక్టే. ఉండాలి కానీ అది తప్పిస్తే ఆయన చాలా పట్టుదల గలవాడు. కష్టపడి పైకొచ్చాడు. మనకు ప్రతిఫలం ఇవ్వకపోయినా, మనకు కీడు చేయడు. అంతే కాకుండా ఆయన పనిలో దిట్ట. మనకు తను ఆదర్శంగా నిలబడగలడు.)

**Pradhan:** Might be he is strong willed. That doesn't mean he should lack the human touch. After all, there is a difference between humans and machines. It is this that makes all the difference to others' estimate of him.





M.SURESAN

(అంత పట్టుదల గలవాడే కావచ్చు. అయితే దానర్థం మానవత్వం లేకుండా ఉండాలని కాదుగదా? ఏదేమైనా మనుషులకూ, యంత్రాలకూ తేడా ఉంటుంది కదా? అందులోనే ఉంది, ఇతరులు ఆయనను గురించివేసే అంచనాలో తేడా.)

**Note:** 1. Target - (టార్గెట్) = లక్ష్యం. 2. To get a pat = మెప్పు పొందడం. pat = భుజం తట్టడం. 3. Higher-ups = పై అధికారులు. 4. Ahead of schedule = నిర్ణీత సమయం (Schedule) కు ముందుగా (ahead) 5. To let off = వదిలేయడం/ పని నుంచి విడుదల చేయడం 6. That apart = అది తప్పించి 7. Human touch = మానవీయత

***Now look at the following expressions from the conversation above.***

*1) The boss is hell-bent on the target date.*

*2) Why is he so intent on it?*

*3) The boss is determined to get a pat from his higher-ups.*

*4) But we don't find that kind of resolve in him.*

*5) Good for him to be so set on climbing up the ladder.*

*6) Why doesn't he set his mind on pleasing us too?*

*7) ... he is very tenacious.*

పై expressions అన్నీ గట్టి నిశ్చయానికీ, నిర్ణయానికీ సంబంధించినవి. దాదాపు అన్ని expressions కూ అర్థం - గట్టి నిర్ణయంతో ఉండటం/ కృతనిశ్చయంతో ఉండటం, అని. ఇవి చాలా ఉపయోగపడేవి. conversation లో, writing లో కూడా.

1) To be hell-bent on = చాలా గట్టి నిర్ణయంతో ఉండటం, ఫలితం ఏదైనా.

a) Jagan is hell-bent on going ahead with his consolation visits (ఓదార్పుయాత్ర)= ఫలితాలేమైనా సరే తన ఓదార్పు యాత్ర కొనసాగించాలనే కృతనిశ్చయంతో/ పట్టుదలతో ఉన్నాడు జగన్.

b) Some of the dissidents are hell-bent on pulling down the government = అసమ్మతిదారుల్లో కొంతమంది ప్రభుత్వాన్ని పడగొట్టాలనే (తీవ్రమైన) పట్టుదలతో ఉన్నారు.

2) Be intent on = ఇది కూడా be hell-bent on కు దాదాపు సమానం. కానీ, కాస్త తీవ్రత తక్కువ.

a) He is intent on marrying the girl of his choice whatever his parents might say = వాళ్ల తల్లిదండ్రులేమన్నప్పటికీ, తను అనుకున్న అమ్మాయినే పెళ్లి చేసుకోవాలనే నిర్ణయంతో ఉన్నాడతడు.

b) They are intent on getting the CM for the inauguration = ప్రారంభోత్సవానికి ముఖ్యమంత్రిని పిలవాలనే నిర్ణయంతో ఉన్నారు వాళ్లు.

గమనించండి: Hell-bent on, intent on తర్వాత.. ing form కానీ noun కానీ వస్తుంది.

a) He is hell-bent on a settlement (noun)/ getting it settled soon (..ing form)

b) They are intent on a new car (noun)/ buying a new car (..ing form)

3) Be determined గట్టి నిర్ణయంతో ఉండటం (Hell-bent on/ intent on లాగే)

a) Kumar is determined to contest the elections = ఎన్నికల్లో పోటీచేయాలనే గట్టి నిర్ణయంతో ఉన్నాడు కుమార్.

b) Unless you are determined you can't achieve anything = నీకు గట్టినిర్ణయం ఉంటేనే గానీ, నువ్వేం సాధించలేవు.

4) Resolve = నిశ్చయం

My resolve is to climb up everest = ఎవరెస్ట్ శిఖరాన్ని ఎక్కాలనేదే నా నిశ్చయం.

5) To be set on something = గట్టి పట్టుదల కలిగి ఉండటం.

a) The Naxalites are set on to creating anarchy = అరాచకాన్ని సృష్టించాలనే కృతనిశ్చయంతో ఉన్నారు నక్సలైట్లు.

b) Srilanka is set on winning the tri series on their home soil = తమ సొంతగడ్డ మీద జరుగుతున్న ముక్కోణ పోటీలో గెలవాలనే కృతనిశ్చయంతో ఉన్నారు శ్రీలంకవాళ్లు.

6) Set your mind on = మనం ఏదైనా కచ్చితంగా చేయాలని/ పొందాలని కృతనిశ్చయంతో ఉండటం/ ఎంత శ్రమపడైనా సాధించుకోవాలనుకోవడం.

a) He has set his mind on IAS and nothing can stop him = ఎంత శ్రమకోర్చి అయినా IAS లో చేరాలనే గట్టిపట్టుదలతో ఉన్నాడతడు. అతడిని ఏదీ ఆపలేదు.

b) Setting his mind on 'Indian Idol' Sri Ram really sweated for it = Indian Idol సాధించాలనే పట్టుదలతో శ్రీరాం చాలా శ్రమపడ్డాడు/ కృషి చేశాడు.

7) Tenacious = పట్టుదల ఉన్న; Tenacity = పట్టుదల = Perseverance.

a) Indira Gandhi was tenacious in her attempt to capture power = అధికారం చేజిక్కించుకునే ప్రయత్నంలో ఇందిరాగాంధీ చాలా పట్టుదలఉన్నది.

b) Tenacious practice alone led him to victory = పట్టుదలతో చేసిన సాధనే అతడికి విజయాన్ని తెచ్చిపెట్టింది.

Practise these expressions and improve your word power.

---



***D.Srinivas Reddy, Narsapur.***

**Q.** Sir, please clarify these doubts 1. Bring down the curtain on, 2. In the wake of, 3. Put his paper, 4. The gods laughed their way to the bank, 5. It is learnt, 6. Stock of the situation, 7. Malafide, 8. Development, 9. Base, 10. stake holders.

**A.** ఇవన్నీ చాలా ఉపయోగకరమైన idioms/ phrasal verbs. వీటి అర్థం, ఉపయోగం తెలుసుకోవడం మంచి English నేర్చుకునేందుకు సులువైన మార్గం.

1) Bring down the curtain on = ముగించడం

The defeat of the ruling party has brought down the curtain on six years of misrule and corruption = ఎన్నికల్లో అధికారపక్ష ఓటమి ఆరేళ్ల దుష్ట పాలనకూ, అవినీతికి అంతం పలికింది.

Bring the curtain down - నాటకం అయిపోయినప్పుడు తెర దించడం

2) a) In the wake of = వెంబడే/ దరిమిలా

There have been loud protests in the wake of the Emmar Properties scam = Emmar Properties కుంభకోణాలు వెలుగులోకి వచ్చిన వెంటనే గట్టి నిరసనలు వినిపించాయి.

b) A number of arrests were made in the wake of the bomb blast = బాంబు పేలుడు వెంబడే చాలా అరెస్టులు జరిగాయి.

3) Put his papers - No such expression with any special meaning

4) The gods laughed their way to the bank: Laugh all the way to the bank అనే Idiom ఉంది. అర్థం: సులభంగా/ శ్రమలేకుండా కావలసినంత సంపాదించి సంతోషపడటం.

Once he started his business, he laughed all the way to the bank = వ్యాపారం మొదలు పెట్టగానే విపరీతమైన డబ్బు సునాయాసంగా సంపాదించేశాడు. సంతోషపడ్డాడు.

Time was when software people laughed all the way to the bank = ఒకప్పుడయితే software వాళ్లు బ్రహ్మాండంగా డబ్బు సంపాదించి సంతోషించేవాళ్లు.

The gods laughed all the way to the bank అర్థం సందర్భాన్ని బట్టి గానీ చెప్పలేం.

5) It is learnt = తెలుస్తోంది.

It is learnt that the Congress High Command is against Jagan's 'Odarpu Yatra'. = Congress అధిష్ఠానం జగన్ ఓదార్పు యాత్రకు వ్యతిరేకమని తెలుస్తోంది.

It is learnt that there might soon be changes = త్వరలోనే మార్పులుండొచ్చని తెలుస్తోంది.

6) Take stock of the situation (Stock of the situation కాదు) = ప్రస్తుత పరిస్థితిని సమీక్షించడం - ఏ విషయం ఎంతవరకు వచ్చిందీ వగైరా.

The government took stock of the anti-Maoist actions so far at a meeting with police yesterday = నిన్న పోలీసులతో జరిపిన సమావేశంలో ప్రభుత్వం మావోయిస్ట్ వ్యతిరేక చర్యలను సమీక్షించింది. (ఇంతవరకు తీసుకున్న చర్యల ఫలితాలు, ఇకముందు ఏం చేయాలిలాంటి వాటి గురించి ఆలోచన)

7) Malafide (Pron: మాలఫైడి) = దురుద్దేశపూరితమైన/ దురుద్దేశంతో కూడిన

He invited us to the party with malafide intentions. He wanted to poison us = దురుద్దేశాలతోనే మమ్మల్ని పార్టీకి ఆహ్వానించాడు. మామీద విషప్రయోగం చేయాలనుకున్నాడు.

8) Developments = పరిణామాలు/ మార్పులు.

The police are carefully watching the developments in the troubled area = గొడవలుగా ఉన్న ఆ ప్రదేశంలోని పరిణామాలను పోలీసు వర్గాలు జాగ్రత్తగా పరిశీలిస్తున్నాయి.

9) base = మూలం/ ఆధారం.

a) Industry is the base of a good career = మంచి ఉద్యోగం/ వ్యాపకానికి మూలం మంచి కృషి.

b) Flour is the base of many eatables = చాలా తినుబండారాలకు మూల పదార్థం పిండి/ చాలా తినుబండారాలు పిండితోనే తయారవుతాయి.

c) Elections form the base of democracy = ప్రజాస్వామ్యానికి ఆధారం ఎన్నికలు.

10) Stake-holder - ఒక project/ వ్యాపారసంస్థ/ system లో పెట్టుబడి పెట్టడంవల్ల ఆ వ్యాపార సంస్థ/ Project/ system తో ప్రమేయం ఉన్న వ్యక్తి లేదా Company.

a) The government is a stake holder in Air India and Indian Airlines = Air India, Indian Airlines విమానసంస్థల్లో భారత ప్రభుత్వం పెట్టుబడి పెట్టడంవల్ల, వాటి బాగోగులతో ప్రభుత్వానికి ప్రమేయం ఉంది.

b) The students are stake holders in the institution they study in = విద్యార్థులు తాము చదివే సంస్థలతో ప్రమేయం ఉన్నవాళ్లు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish**



***Raju, Kurnool***

**Q.** We should arrive before dark అంటే మనం చీకటిపడకముందే చేరాలి అని అర్థం కదా. కానీ, Advanced Oxford Learner's Dictionary లో మనం చీకటి పడకముందే చేరుతాం (future) అని అర్థం వచ్చేలా ఉంది. వివరించగలరు.

(a) We should arrive before dark
(b) We would arrive before dark.
(c) We shall arrive before dark.

ఈ మూడింటికీ తేడాను, అర్థాలను తెలపగలరు.

**A.** We should arrive before dark =

1) మనం చీకటి పడేముందే చేరాలి - ఇది necessity ని తెలిపేట్లయితే కూడా future నే కదా తెలుపుతుంది. 'చీకటి పడకముందే' అంటే future కదా?

***Rama Rao, Aswaraopeta***

**Q.** Sir, కిందివాటిని వివరించగలరు.

1) A) I am having home work in addition to office work and other work.
   B) I have home work in addition to office work and other work.
2) He is having home work in addition to office work and other work.
   He has home work in addition to office work and other work.
3) He was having home work in addition to office work and other work.
   He had having home work in addition to office work and other work.
4) I will be having home work in addition to office work and other work.

'We have been lived here for 10 years' is incorrect. దీనికి సరైన అర్థం రాదు. ['Have been lived' (is a passive form which has no meaning) మేం నివసించబడ్డాం - దీనికి అర్థం లేదు కదా]

Tenses గురించి వివరణ Lessons 4 to 15 లో ఉంది. చూడండి.

**Q.** Please translate the following sentences.
విద్యార్థుల కోరిక మన్నించతగినదే.

**A.** The students' request is reasonable

**Q.** విద్యార్థుల కోరికను అనుసరించి పాఠశాలకు సెలవు ఇవ్వవచ్చు.




# He replied indifferently

2) ఇంకో అర్థం: (అన్నీ మనం అనుకున్నట్లు జరిగితే) అక్కడికి చీకటి పడేముందే చేరతాం- ఇది certainty, but in future. రెండూ correct. రెండూ కూడా future నే తెలుపుతాయి

a) We should arrive before dark = చీకటి పడేముందే చేరుకోవాలి.

b) We would arrive before dark =
   1) చీకటి పడేముందే చేరాలని మా కోరిక
   2) (ఎప్పుడో గతంలో- అలవాటుగా) మేం చీకటి పడకముందే చేరేవాళ్లం (A past habit)

c) We shall arrive before dark = చీకటి పడక ముందే చేరతాం (Indefinite future- అను కుంటున్నాం- చేరతామని కచ్చితంగా చెప్పలేం)

**Q.** a) It should be snowing now, according to the weather forecast.
b) It would be snowing now, according to the weather forecast.

ఈ రెండింటికి అర్థాలను, తేడాలను తెలపండి.

**A.** a) వాతావరణ అంచనానుబట్టి ఇప్పుడక్కడ మంచు కురుస్తుండాలి- కచ్చితం
b) వాతావరణ అంచనానుబట్టి ఇప్పుడక్కడ మంచు కురుస్తుంటుంది. (అనుకోవడమే- కచ్చితంగా తెలియదు)

**Q.** a) I should have finished the book by Friday.
b) I would have finished the book by Friday.
c) I shall have finished the book by Friday.

ఈ మూడింటికి అర్థాలను, తేడాలను వివరించగలరు.

**A.** (a) నేనా పుస్తకాన్ని (గత/ పోయిన) శుక్రవారానికల్లా పూర్తి చేసుండాల్సింది- కానీ చేయలేదు.
(b) పూర్తి చేసుండేవాడినే కానీ చేయలేదు.
(c) శుక్రవారానికల్లా (అంటే వచ్చే శుక్రవారానికల్లా) పుస్తకాన్ని పూర్తి చేసుంటాను- future లో పూర్తయి ఉంటుందనుకోవడం.

**Q.** (a) The roads should be crowded today.
(b) The roads would be crowded today.

ఈ రెండింటికి తేడాను, అర్థాలను తెలుపగలరు.

**A.** (a) రోడ్లన్నీ జనసందోహంతో ఉండాలి ఈ రోజు- (మంత్రో/ సినిమా తారో వచ్చారు/ రాబోతారు కాబట్టి)
(b) జనసందోహంతో ఉంటాయి- (a) అంత కచ్చితం కాదు.

**Q.** (a) Hope there will be no classes today.
(b) Hope there would be no classes today.

ఈ రెండింటికి తేడాను, అర్థాలను తెలపండి.

**A.** Hope there would be no classes today =
Hope there will be no classes today = ఇవాళ క్లాసులు ఉండవని ఆశిస్తున్నాను. అయితే, Hope there would be no classes, వాడుక ఎక్కువ.





M.SURESAN

They will be having home work in addition to office work and other work.

ముఖ్యంగా నా సందేహం ఏమిటంటే... am తో having రావడం, is తో, was తో, Had తో, will be తో having రావడం. Present tense తో past tense తో future tense తో కలిగి ఉండటం అనే అర్థంతో పై వాక్యాలు రాయొచ్చా?

**A.** 'Have' ను 'కలిగి ఉండటం' 'ఏదైనా వస్తువు ఒకరికి ఉండటం' అనే అర్థంతో, continuous tense [Present continuous- am/ is/ are having; Past continuous- was/ were having; Future continuous- shall be/ will be having] లలో సాధారణంగా వాడం కాబట్టి

I am/ He is/ He was having/ I will be having a lot of home work సరికాదు. ఎందుకంటే 'have' కు ఇక్కడ అర్థం, కలిగి ఉండటం. ఒకరికి ఉండటం కాబట్టి.

I/ We/ You/ They have homework.

He/ She has home work అనడం correct.

I/ We/ You/ They/ He/ She had homework- Correct. I/ We... was having home work- incorrect.

I will have home work, I will be having home work- రెండూ వాడుకలో ఉన్నప్పటికీ, I will have home work, better.

Have/ has/ had తో am/ is/ are/ was/ were having రాదు- తప్పు.

I will have a car in a week = ఓ వారంలో కారుంటుంది నాకు/ కారును కలిగి ఉంటాను.

***G. Sumanth, Adilabad.***

**Q.** Sir, కింది వాక్యాలను ఆంగ్లంలోకి అనువదించగలరు.
a) నీవు దినపత్రిక చదువుతావా?
b) నీవు దినపత్రిక చదివావా?

**A.** 1. a) Do you read any daily?
b) Have you read the newspaper today?/ today's newspaper?

**Q.** కింది వాక్యాల్లోని అర్థాల్లో తేడాలను తెలపగలరు. ఏ వాక్యం ఏ tense లో ఉంది? అన్ని tenses కు structures తెలపగలరు.
a) We have lived here for ten years.
b) We have been living here for ten years.
c) We have been lived here for ten years.

**A.** We have lived here for 10 years is almost the same as we have been living here for 10 years = మేం పదేళ్లుగా ఇక్కడున్నాం/ ఇక్కడుంటున్నాం.

**A.** We can close the school/ The school can be closed as per the students' wishes.

**Q.** విద్యార్థుల కోరిక ఆమోదయోగ్యమే.

**A.** The students' request is acceptable.

**Q.** విద్యార్థుల కోరికను నేను బలపరుస్తున్నాను.

**A.** I support the students' request

**Q.** విద్యార్థుల కోరిక సమంజసమే.

**A.** The students' request is reasonable

**Q.** విద్యార్థుల కోరిక సముచితమే.

**A.** The students' request is proper

**Q.** విద్యార్థుల కోరిక సమంజసం కాదు.

**A.** The students' request is unreasonable

**Q.** విద్యార్థుల కోరిక మన్నించదగింది కాదు.

**A.** The students' request is not acceptable/ unacceptable

***G.K. Rao, Vizag***

**Q.** Sir, కింది పదాల అర్థాలను, వాటి మధ్య తేడాలను వివరించగలరు.

Literateur & Literati; Credentials & Testimonials; (Well) Poised & (Well) Balanced; Wear (a shirt) & Don a shirt; Articulation & Diction; Give a rejoinder & Give a retort & give a befitting reply; Threshold & Doorway; Physical exercise & Workout; Behaviour & Demeanour; (One's) Reservation & (One's) Sensitivities; Indifferent & Insensitive; Option & Choice

**A.** **Literateur** = సాహితీవేత్త - సాహిత్యాన్ని గురించి బాగా తెలిసినవారు, రచయిత కావచ్చు - Singular number Literati - Plural - సాహితీప్రియులు. సాహిత్యం అంటే అభిమానించేవాళ్లు, పండితులు.

**Credentials** = ఒక పని నిర్వహించేందుకు/ ఒక పదవికి అర్హత కల్పించే విద్య, శిక్షణ (Training), అనుభవం మొదలైనవి.

a) She has all the credentials for the job = ఆ ఉద్యోగానికి తగిన అర్హతలన్నీ ఆమెకున్నాయి.

b) Have you verified his credentials? = అతడి అర్హతలు సరిచూశావా?

**Testimonials** = పై అర్హతలను తెలిపే పత్రాలు/ ఆధారాలు.

**Well-poised** = Well balanced. Poise = Balance. ఆవేశానికి, ఉద్రేకానికి లోనుకాకుండా ఉండే స్వభావం, ప్రవర్తన.

**Wear = Don** = ధరించడం; Don కాస్త పాండిత్యం. మామూలు సంభాషణలో వాడం.

**Articulation** = మనసులోని భావాలను స్పష్టంగా చెప్పగలగడం.

**Diction** = భాషలోని మాటలు, వాటి ఉచ్చారణ, రచనలో ప్రసంగంలో వాటి వాడకం.

**Rejoinder** = మన మీద ఇతరులు చేసిన వ్యాఖ్యకు, ఘాటుగా/ కాస్త కోపంగా/ చలోక్తిగా ఇచ్చే సమాధానం.

**Retort** అన్నా కూడా rejoinder, అయితే Retort ఇంకొంచెం ఎక్కువ ఘాటుగా/ కోపంగా/ హాస్యంగా ఇచ్చే సమాధానం. Retort is stronger than rejoinder.

Give a befitting reply కాదు, give a fitting reply = తగిన రీతిలో సమాధానం చెప్పడం. ఇందులో కోపం, హాస్యం లాంటివి ఉండకపోవచ్చు.

**Threshold** = The floor/ ground under a doorway = దర్వాజా/ ద్వారబంధరం (Doorway) కింది నేల Threshold

**Physical exercise** = వ్యాయామం, తెలుసు కదా.

**Workout** = A period of physical exercise = వ్యాయామానికి వెచ్చించే సమయం/ కాలం.

He never misses his twenty minute workout every morning = ఏరోజూ కూడా అతడు తన 20 నిమిషాల వ్యాయామ సమయాన్ని వదులుకోడు.

**Demeanour** = The way a person appears and behaves = ఒకరు తమ హావభావాలు ప్రదర్శించే తీరూ, నడవడి.

**Behaviour** = నడవడి

His demeanour was totally professional = అతడి హావభావాల ప్రదర్శన, నడవడి పూర్తిగా అతడి వృత్తిని తెలిపేదిగా ఉంది.

**Reservations** = feelings of doubt about some thing - a plan/ an idea/ success.

'He seems to have reservations about the project = ఆ ప్రాజెక్టును గురించి అతడికేవో సందేహాలున్నట్లున్నాయి.

**Sensitivity** = Ability to understand others' feelings (ఇతరుల భావాలను సున్నితత్వంతో అర్థం చేసుకోవడం)

In her speech she spoke with sensitivity about the condition of the poor = పేదవారి స్థితి పట్ల ఆమె తన ప్రసంగంలో చాలా సున్నితత్వంతో/ అవగాహనతో మాట్లాడింది.

**Indifferent** = నిర్లక్ష్యం చూపడం/ నిర్లక్ష్యంగా వ్యవహరించడం.

He replied indifferently = చాలా నిర్లక్ష్యంగా సమాధానం ఇచ్చాడు. 2) శ్రద్ధ చూపకపోవడం - Some doctors are indifferent to their patients (శ్రద్ధ చూపరు)

**Insensitivity** = ఇతరుల భావాలను, మనస్థితిని పట్టించుకోకపోవడం/ దెబ్బతీసేలా ప్రవర్తించడం.

I was shocked at the insensitivity of parents to their girl child = ఆడపిల్ల అయిన కూతురి మనసును గాయపరిచేలా ప్రవర్తించిన ఆ తల్లి దండ్రులను చూసి దిగ్భ్రాంతి కలిగింది.

**Option = Choice**

**Q.** He looked at me every other minute. (every minute అనవచ్చు గదా, other ఎందుకు వాడతారు?

**A.** Every other = ఒకటి మార్చి ఒకటి (alternate) [1st, 3rd, 5th, 7th etc.] Every other minute = క్షణం మార్చి క్షణం [Usage లో దాదాపు ప్రతిక్షణం అనే అర్థంలో వాడతాం)

**Q.** You don't worry అనేచోట don't you worry అంటుంటారు. ఇది ప్రశ్నార్థకంతో వస్తుంది. ఈ రెండింటి ప్రయోగంలో, అర్థంలో భేదం ఉందా?

**A.** You don't worry = Don't you worry. Usageలో Don't you worry ప్రశ్న కాదు. అయితే స్వరాన్ని బట్టి ఇది హామీ ఇచ్చే Statement/ question అనేది తెలుస్తుంది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish






**R.Sangamnaidu, Jarajapupeta.**

**Q.** కిందివాటికి question tags ను వివరించగలరు.

a) I am a boy b) I amn't a boy
c) I used to drink milk d) Let's go to a picture
e) Please give me your pen

**A.** a) I am a boy, aren't I? - గమనించండి. ఇక్కడ verb, 'am' అయినప్పటికీ, Amn't I? అని question tag రాదు. Aren't I? అనే వస్తుంది. సాధారణ నియమానికి ఇదో మినహాయింపు.

b) I amn't a boy, am I? - ఇది చూడండి మళ్లీ. ఇక్కడ Question tag లో 'am' మాత్రమే వస్తుంది. అంటే statement లో not లేకపోతే, Q.tag లో వచ్చేది 'Aren't I?' అనే. మళ్లీ statement లో 'not' ఉంటే Q.tag లో 'Am I?' అనే వస్తుంది. అంటే Q.tags లో Amn't? అని రానే రాదు.

b) She has been singing (has been + ing) for the past one hour గంటసేపుగా (గంట క్రితం ఆరంభించి ఇంకా) పాడుతూనే ఉంది.

**G.Satyanarayana, Ethakota.**

**Q.** David Green Grammar book లో in గురించి తెలుపుతూ In denotes a state of rest or being inside something అని, ఉదాహరణగా He is in bed అని ఇచ్చారు. కానీ, అతడు inside bed లో లేడు కాబట్టి He is on bed అనాలి కదా?

**A.** 'Bed' అంటే సరైన అర్థం, మంచం/ మంచం పరుపు కలిపి. కేవలం పరుపు మాత్రం కాదు. పరుపును English లో mattress అంటారు. బిళ్లలుగా కుట్టిన పల్చటి పరుపు quilt.

In bed, on bed రెండూ correct, వేర్వేరు అర్థాలతో.

**N.Raja Rao, Vijayawada.**

**Q.** కింది వాక్యాలను అనువదించగలరు.

If the food is served early then invitees would have had a relaxed meal.

**A.** ఈ sentence సరికాదు.

సరైన sentence:

If the food is served early the invitees will have relaxed meals = భోజనం కాస్త ముందుగా వడ్డిస్తే, ఆహ్వానితులు విశ్రాంతిగా భోంచేస్తారు.

**Q.** "The whole ambiance is wonderful and I couldn't have asked for more" she says.

**A.** ఈ వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది. ఇంత కంటే నేనెక్కువ కోరుకోగలిగింది లేదు.

# Let's go to a movie, shall we?

c) I used to drink milk, didn't I? (used = did use. కాబట్టి Q.tag లో Helping verb, did వస్తుంది)

d) Let's go to a movie, shall we?

Let's = Let us. ఇలాంటి సందర్భాల్లో Q.tag ఎప్పుడూ 'shall we?' ఇది usage.

e) Please give me your pen, won't you?

**Q.** The ని ఒక్కోసారి 'ది' అని, ఒక్కోసారి 'ద' అని చదువుతాం. 'ది, ద'లలో దేన్ని ఎప్పుడు వాడాలి?

**A.** తెలుగు శబ్దాలు, అ, ఆ, ఇ, ఈ, ఎ, ఎయ్, ఒ, ఔ ఈ శబ్దాలతో (sounds మాత్రమే అక్షరాలు కావు) ప్రారంభమయ్యే English మాటల ముందు, The 'ది' అంటాం. మిగతా శబ్దాలతో ప్రారంభమయ్యే మాటల ముందు 'ద' అంటాం.

The (ది) umbrella (అం)
The (ది) author (ఆ)
The (ది) ant (æ)
The (ది) Indian (ఇం)
The (ది) eagle (ఈ)
The (ది) end (ఎ)
The (ది) aisle (ఎయ్ - Aisle - రెండు సీట్ల వరుస మధ్యదారి)
The (ది) idea (ఐ)
The (ది) only book (ఓ)
The (ది) owl (ఔల్)

మిగతా శబ్దాల ముందు 'ద' అంటాం:

The (ద) university (యూ 'అ' నుంచి 'ఔ' వరకు ఉండే శబ్దాల్లో 'యూ' లేదు)

The (ద) book, the (ద) tree, etc.

**Q.** Hotel కు ముందు article A/ An లలో ఏది ఉండాలి? ఎందుకు?

**A.** Hotel - correct pronunciation: హోటెల్- 'టె' నొక్కి పలుకుతాం - దాదాపు 'టే' లా: హొటేల్. 'హో' తో మొదలైంది కాబట్టి a hotel అనే అంటాం. అ, ఆ, ఇ, ఈ, ఎ, ఎయ్, ఒ, ఔ శబ్దాలతో మొదలయ్యే English words ముందు మాత్రమే 'An' వాడతాం. మిగతా శబ్దాలతో మొదలయ్యే మాటల ముందు 'a'. An umbrella (అం); A university (యూ)

**Q.** ఒక వాక్యంలో 'For' period of time ని తెలుపుతూ వాడితే, ఆ వాక్యంలో క్రియారూపం has/ have+v2 form ఉండాలా? లేదా has been/ have been + ing form ఉండాలా? వివరించగలరు.

**A.** గతంనుంచి ఇప్పటివరకూ/ ఇంకా అనే అర్థం వచ్చేందుకు Have/ has + past participle, (v2 కాదు మీరన్నట్లు, v3) కానీ, Have been/ has been + ... ing కానీ వాడినప్పుడు, period of time తెలిపే మాటల ముందు for వాడతాం.

a) She has sung (has + past participle of sing) for the past one hour (గంట క్రితం ప్రారంభించి ఇప్పటివరకూ పాడింది) ఇంకా పాడుతోందా, లేదా అనేది తెలియదు.






M.SURESAN

In bed = దుప్పటి కప్పుకొని పడుకోనుండటం పరుపు మీద. దుప్పటిలో పడుకునుండటం అనే అర్థంతో ఇది correct.

On bed = దుప్పటి లేకుండా పరుపు మీద పడుకునుండటం

**Q.** a) రమ్మన్నానా రా! వస్తున్నావా లేదా (Commanding గా), b) నేను నిన్ను రమ్మన్నానా? (Question గా) - వీటిని ఆంగ్లంలో ఎలా చెప్పాలి?

**A.** a) I told you to come. Come on. Are you coming or not?

b) have I told you to came?

**Q.** God లోని G ని ఒక్కోచోట capital letter గా, ఒక్కోచోట small letter గా రాస్తున్నారు. ఏది కరెక్ట్?

**A.** దేవుడొక్కడే అనే నమ్మకంతో దేవుడిని ప్రస్తావించేటప్పుడు, God (G capital) అని రాస్తాం.

God will reward you = దేవుడు నీకు ప్రతిఫలమిస్తాడు.

God created the universe = దేవుడు విశ్వాన్ని సృష్టించాడు.

అయితే చాలామంది దేవుళ్లను గురించి మాట్లాడేటప్పుడు, God of rain (వరుణ దేవుడు) god of fire (అగ్ని) ఇలా చెప్పేటప్పుడు, G కాకుండా g వాడతాం. The gods of the Hindus = హిందువులు ఆరాధించే దేవుళ్లు. Lord Venkateswara is a Hindu god; ఇలా.

**Q.** Provided that ను ఎలా ఉపయోగించాలో తెలపగలరు.

**A.** Provided that = If = అలా అయితేనే/ ఆ షరతుతో.

We will admit you provided that you pay the fees in full = నువ్వు fees మొత్తం కడితేనే నిన్ను మేం చేర్చుకుంటాం.

**Q.** Spoken English నేర్పుకునేటప్పుడు అసలు తెలుగు పదాలను రానివ్వకుండా English to English నేర్చుకోవాలంటారు. కానీ, మీరు vocabulary లో తెలుగు అర్థాలు ఇస్తున్నారు. దీనిపై మీ అభిప్రాయం రాయగలరు.

**A.** చాలా మంచి question. నేను రాస్తున్న sentences మొత్తం English కదా? దానికి తెలుగు అనువాదం ఇస్తున్నాను, మీలాంటి పాఠకులు తెలుగు మాటలకు సరైన English మాటలు తెలుసుకుని, వాటినే వాడేందుకు.

**Q.** Smith got to kiss Depp in a scene.

**A.** ఒక scene లో Smith, Depp ను ముద్దుపెట్టుకునే అవకాశం వచ్చింది.

**Q.** I want to have the chance to release things that might not necessarily get released otherwise. ఒక మంచి English - Telugu Dictionary ని (paper words కూడా) సూచించండి.

**A.** ఇంకే విధంగానూ విడుదలకానివాటిని విడుదల చేసే అవకాశం నాకుండాలని అనుకుంటున్నాను.

(Eng- Telugu Dictionary, paper words ను గురించి మీరు రాసింది నాకర్థం కాలేదు)

**Q.** I have got three years left.

**A.** నాకింకా మూడేళ్లు మిగిలున్నాయి.

**Q.** కిందివాటికి అర్థాలు తెలపగలరు.

a) Hails from b) Is all set to direct

**A.** Hails from = ఆయన/ ఆమెఊరు/ స్వస్థలం

He hails from Nellore = ఆయనది నెల్లూరు/ ఆయన నెల్లూరుకు చెందినవాడు/ నెల్లూరు ఆయన స్వస్థలం

b) ఆయన దర్శకత్వం వహించేందుకు అన్నీ సిద్ధంగా ఉన్నాయి/ ఏర్పాట్లన్నీ జరిగాయి (all set).

**Q.** A senior Chinese official said the boy and his family were living a normal life, but would not say where.

**A.** ఆ అబ్బాయి, అతడి కుటుంబసభ్యులూ మామూలు జీవితం గడుపుతున్నారని, ఓ ముఖ్య చైనా అధికారి చెప్పాడు. అయితే వాళ్లెక్కడుంటున్నదీ ఆయన చెప్పేందుకిష్టపడలేదు (would not say where)

**Q.** Has done, Had done లు రెండూ (టైమ్ చెప్పకపోతే) ఒకటేనా?

**A.** ఎలా అవుతాయి? Has done = చేశాడు/ చేసిందిగతంలో ఎప్పుడు అని తెలియదు/ చేయడం అయింది, కానీ ఎప్పుడు అని తెలియదు.

She/ He has done it = ఆమె/ అతడు (ఆ పని) చేసింది/ చేశాడు.

Had done = గతంలో జరిగిన రెండు పనుల్లో మొదటి పని అయింది అని తెలిపేందుకు వాడతాం.

He told me he had done it = తను అది చేశానని నాతో చెప్పాడు. (అతడా పని చేయడం, నాతో చెప్పడం, రెండూ గతం. అయితే, పనిచేయడం ముందు, కాబట్టి had done.

**L. Sravya, Laddagiri.**

**Q.** Adjectives కి Dictionary లో definition ఇచ్చేటప్పుడు ing form sentence తో మొదలు కావడం గమనించాను. ఉదాహరణకు a) destructive = causing damage b) suspicious = making you feel that sth is wrong or dishonest c) colourful = interesting or exciting d) muddling = causing confusion, difficult to understand. ఈ నాలుగు నిర్వచనాలు ing form తో మొదలయ్యాయి కదా! అయితే వీటిలో ఉన్న ing form ని 'present participle' అనాలా? లేక Gerund అనాలా? లేక ing clauses sentences అనాలా? తెలపగలరు.

**A.** తెలుగులో Adjectives కు, ఉన్న/ ఉన్నటువంటి/ అయిన/ అయినటువంటి అనే అర్థం వస్తుంది.

Beautiful = అందంగా ఉన్న/ ఉన్నటువంటి/ అందమైన/ అందమైనటువంటి.

'...ing' form ను present participle అంటాం. దీనికి కూడా చాలా సమయాల్లో adjectives కు లాగే అయిన/ ఉన్న, అయినటువంటి/ ఉన్నటువంటి అని అర్థాలు వస్తాయి కదా. అప్పుడవి adjectives తో సమానం. The singing girl suddenly stopped = ఆ పాడుతున్న అమ్మాయి ఆగిపోయింది.

The walking men = నడుస్తున్న మనుషులు.

Past participle ను కూడా adjective గా వాడతాం.

We saw only murdered people = చంపబడ్డ వ్యక్తులనే చూశాం మేం.

ఇలా present/ past participles ను adjective లా noun ను గురించి చెప్పేందుకు వాడితే అవి participle adjectives అవుతాయి.

present participle కు చేయడం/ తినడం, ఇలా 'డం' అని చివరవచ్చే పదాలుగా అర్థం వచ్చినప్పుడు, దాన్ని noun గా వాడతాం. అప్పుడు దానిని gerund అంటాం. Gerund = verbal noun. అంటే present participle ను ఒక sentence subject/ object/ object of a preposition గా వాడితే అది Gerund. Sitting in class for 5 hours a day is not a joke = రోజూ 5 గంటలసేపు class లో కూర్చోవడం, తమాషా కాదు. ఇక్కడ sitting, present participle ను noun గా వాడాం. కాబట్టి అది gerund. అలాగే I like walking = నడవడం నాకిష్టం) - walking - gerund.

I object to smoking - ఇక్కడ 'smoking' to అనే preposition కు object. So, 'smoking' is a gerund.

ఇప్పుడు మీరు ఇచ్చిన words చూద్దాం.

a) Destructive = వినాశకరమైన = causing damage = వినాశాన్ని కలిగించే (causing) - adj.

b) Making you feel = అలా భావించేట్లు చేసే (Making) - Adj.

c) Colourful = వినోదం కలిగించే (Entertaining) or ఉత్సుకతను కలిగించే (exciting)

d) muddling = గందరగోళం కలిగించే (causing) - Adj.

**N. Nagesh, Rajahmundry.**

**Q.** Resign letter ఎలా రాయాలో తెలపగలరు.

**A.** For purely personal reasons, I hereby tender my resignation and request you to relieve me of responsibilities in your organization immediately/ at the end of the notice period. (మన నియామక నిర్ణయాలనుబట్టి, వెంటనే కానీ, లేకుంటే, ఇన్ని నెలల తర్వాత కానీ అని తెలిపేందుకు- దీన్ని బట్టి)

yours faithfully,
XXXX

**L.B.S. Kumar, Machilipatnam.**

**Q.** మిమ్మల్ని (నిన్ను) ఇంతకుముందు ఎక్కడో చూసినట్లు గుర్తు. ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?

**A.** a) I remember to have seen you somewhere.

b) Could I have see you before

c) Where could I have seen you before.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish**

# APPSC GROUP IV EXAMINATION - 2010

## GENERAL STUDIES MODEL GRAND TEST

MAX. MARKS : 150
TIME : 150 MINUTES




**81.** అంకురచ్ఛదం ఉండే విత్తనానికి ఉదాహరణ-
1) ఆముదం 2) చిక్కుడు
3) బఠానీ 4) శనగ

**82.** కామా ఆకారంలో ఉండే ఏ జీవి లార్వాను టంబ్లర్ అంటారు?
1) ఈగ 2) తేనెటీగ
3) దోమ 4) కప్ప

**83.** డ్రాసిరా, నెపెంథిస్, యుట్రిక్యులేరియా మొక్కలు చూపే ప్రత్యేకత-
1) ఇవి నత్రజనిని స్థాపిస్తాయి
2) వీటినుంచి జీవ ఇంధనాలు లభిస్తాయి
3) ఔషధాలనిస్తాయి
4) ఇవి కీటకాహార మొక్కలు

**84.** ఏ కణాంగంలో డి.ఎన్.ఎ. ఉంటుంది?
1) రైబోజోమ్ 2) మైటోకాండ్రియా
3) లైసోజోమ్ 4) రిక్తిక

**85.** కిందివాటిలో ఆమ్లవర్షాలను కలిగించే వాయువు ఏది?
1) కార్బన్ డై ఆక్సైడ్ 2) సల్ఫర్ డై ఆక్సైడ్
3) కార్బన్ మోనాక్సైడ్ 4) మీథేన్

**86.** జంతువుల్లో ఏ కణజాలం నుంచి గోళ్లు, వెంట్రుకలు వంటివి ఏర్పడతాయి?
1) ఉపకళా కణజాలం 2) సంయోజక కణజాలం
3) కండర కణజాలం 4) చర్మకణజాలం

**87.** పిండి పదార్థానికి అయోడిన్ కలిపితే ఏ రంగు వస్తుంది?
1) ఎరుపు 2) పసుపు
3) నీలం 4) ఆకుపచ్చ

**88.** జంతువుల్లో సీలెంటరేటాకు చెందిన హైడ్రాలో చలనానికి ఉపయోగపడే నిర్మాణాలు-
1) టెంటకిల్స్ 2) రెక్కలు
3) ముందరికాళ్లు 4) కశాభాలు

**89.** కిందివాటిలో భిన్నమైన విటమిన్ ఏది?
1) విటమిన్-ఎ 2) విటమిన్-డి
3) విటమిన్-సి 4) విటమిన్-ఇ

**90.** పరిధీయ నాడీ వ్యవస్థలో మెదడు, వెన్నుపాము నుంచి వెలువడే నాడుల సంఖ్య-
1) 43 జతలు 2) 12 జతలు
3) 31 జతలు 4) 23 జతలు

**91.** వాతావరణంలో ఎక్కువగా ఉండే ఏ వాయువు మొక్కకు పరోక్షంగా లభ్యమౌతూ పెరుగుదలకు ఉపయోగపడుతుంది?
1) కార్బన్ డై ఆక్సైడ్ 2) నైట్రోజన్
3) ఆక్సిజన్ 4) మీథేన్

**92.** శ్వాసక్రియలో ఎక్కువ చర్యలు దేనిలో జరుగుతాయి?
1) హరిత రేణువు 2) మైటోకాండ్రియా
3) ఉపిరితిత్తులు 4) రక్తం

**93.** అన్ని సిరల్లో చెడు రక్తం ప్రవహిస్తుంది. అయితే మంచి రక్తం ప్రవహించే సిరలేవి?
1) పుపుస సిర 2) కాలేయ సిర
3) వృక్క సిర 4) బృహత్ సిర

**94.** విత్తనాలు, దుంపల్లో ఆహార పదార్థాలను నిల్వ చేసేందుకు ఉపయోగపడే ప్లాస్టిడ్లు-
1) క్రోమోప్లాస్టులు 2) క్లోరోప్లాస్టులు
3) ల్యూకోప్లాస్టులు 4) హరితరేణువులు

**95.** రసాయనిక కార్సినోజెనిక్ ఏజెంట్లకు ఉదాహరణ-
1) మస్టర్డ్ గ్యాస్ 2) అఫ్లోటాక్సిన్
3) ఆస్‌బెస్టాస్ 4) పైవన్నీ

**96.** మొక్కల పెరుగుదలను గుర్తించే పరికరం-
1) సిస్మోగ్రాఫ్ 2) డెస్మోగ్రాఫ్
3) క్రెస్కోగ్రాఫ్ 4) బారోగ్రాఫ్

**97.** లైపేజ్, మాల్టేజ్, సుక్రేజ్ అనే ఎంజైమ్‌లు దేనిలో ఉంటాయి?
1) ఆంత్రరసం 2) పైత్యరసం
3) క్లోమరసం 4) లాలాజలం

**98.** ఏ జంతువు నోటిలో ఆహారణ సేకరణకు ఉపయోగపడే రాడ్యులా అనే నిర్మాణం ఉంటుంది?
1) బొద్దింక 2) పీత
3) నత్త 4) తేలు

**99.** ఉత్పత్తిదారుల నుంచి వినియోగదారులకు శక్తి ప్రవహించేటప్పుడు ప్రతిదశలో ఏ ప్రక్రియ ద్వారా కొంత నష్టపోతుంది?
1) జీర్ణక్రియ 2) విసర్జనక్రియ
3) నిర్మాణక్రియ 4) శ్వాసక్రియ

**100.** డి.టి.పి. వ్యాక్సిన్ ఇవ్వడం ద్వారా ఏయే వ్యాధులు రాకుండా నివారించవచ్చు?
1) కోరింత దగ్గు 2) డిఫ్తీరియా
3) ధనుర్వాతం 4) పైవన్నీ

**101.** హెచ్.ఐ.వి. సోకిన వ్యక్తి రక్తంలో వైరస్‌లు ఎక్కువ సంఖ్యలో ఉండి కూడా ప్రతిరక్షకాలు కనిపించని దశను ఏమని పిలుస్తారు?
1) ప్రతికూలదశ 2) అనుకూలదశ
3) విండో పీరియడ్ దశ 4) అననుకూల దశ

**102.** కిరణజన్య సంయోగక్రియలో ఆక్సిజన్ వెలువడుతుందని ఏ ప్రయోగం ద్వారా నిరూపించవచ్చు?
1) హైడ్రిల్లా ప్రయోగం 2) లైట్‌స్క్రీన్ ప్రయోగం
3) అయోడిన్ ప్రయోగం 4) బ్రోమిన్ ప్రయోగం

**103.** టస్సార్ పట్టును ఉత్పత్తి చేసే పట్టుపురుగు ఏయే మొక్కలపై పెరుగుతుంది?
1) మల్బరీ 2) ఆముదం
3) టేకు, తుమ్మ 4) ఓక్, ఫిగ్

**104.** వేరుపురుగులాంటి కీటకాలను నివారించడానికి పొలంలోని నేలలో చల్లవలసింది-
1) గంధకం పొడి 2) ఎండోసల్ఫాన్
3) వేపపిండి 4) అగ్రిమైసిన్

**105.** నేత్రపటలానికి ముందుగా ప్రతిబింబం ఏర్పడితే ఆ దృష్టిలోపాన్ని ఏమంటారు?
1) దీర్ఘదృష్టి 2) హ్రస్వదృష్టి
3) ఆస్టిగ్మాటిజం 4) వర్ణాంధత

**106.** ప్రస్తుతం భారతదేశంలో మాట్లాడే భాషల సంఖ్య-
1) 22 2) 18
3) 1256 4) 1652

**107.** 2001 జనగణన ప్రకారం భారతదేశం మొత్తంలో హిందూ జనాభా శాతం దాదాపు ఎంత?
1) 80.5 శాతం 2) 84.5 శాతం
3) 89.6 శాతం 4) 75.6 శాతం

**108.** రాజ్యపాలనలో మత ప్రమేయం లేకపోవడాన్ని ఏమంటారు?
1) ప్రజాస్వామ్యం 2) సామ్యవాదం
3) లౌకికవాదం 4) సౌభ్రాతృత్వం

**109.** ప్రపంచంలో పెద్దభాషల్లో తెలుగుభాష స్థానం ఏది?
1) 4వ 2) 6వ 3) 16వ 4) 12వ

**110.** ప్రాథమిక హక్కులను రక్షించే హక్కును ఏమని పిలుస్తారు?
1) సమానత్వ హక్కు 2) మత స్వాతంత్ర్య హక్కు
3) స్వేచ్ఛా హక్కు 4) రాజ్యాంగ పరిహార హక్కు

**111.** 2009లో లోక్‌సభకు జరిగిన ఎన్నికలు ఎన్నో సార్వత్రిక ఎన్నికలు?
1) 12వ 2) 13వ 3) 14వ 4) 15వ

**112.** డెమోక్రసీ అనే పదం ఏ భాషనుంచి ఉత్పన్నమైంది?
1) లాటిన్ 2) గ్రీకు 3) ఫ్రెంచ్ 4) ఇంగ్లిష్

**113.** 2001 జనగణన ప్రకారం దేశంలోని మొత్తం నిరక్షరాస్యుల సంఖ్య దాదాపు ఎన్ని కోట్లు?
1) 25 2) 32 3) 34 4) 37

**114.** భారత రాజ్యాంగంలోని ఏ ప్రకరణ అల్ప సంఖ్యాక వర్గాలవారికి తమ భాషను, మత సంస్కృతిని పరిరక్షించే హక్కును ప్రసాదిస్తుంది?
1) 25 2) 27 3) 29 4) 32

**115.** ఆంధ్రరాష్ట్రం ఏ తేదీన అవతరించింది?
1) 1956 నవంబర్ 1 2) 1953 అక్టోబర్ 1
3) 1947 ఆగస్టు 15 4) 1950 జనవరి 26

**116.** భూమిపుత్రులవాదం దేన్ని సూచిస్తుంది?
1) ప్రాంతీయతత్వం 2) భాషాతత్వం
3) మతతత్వం 4) పైవన్నీ

**117.** అస్పృశ్యత నేర నిరోధక చట్టం ఏ సంవత్సరంలో రూపొందింది?
1) 1950 2) 1955 3) 1958 4) 1960

**118.** వరకట్న నిషేధ చట్టం ఎప్పుడు తెచ్చారు?
1) 1961 2) 1964 3) 1968 4) 1972

**119.** కిందివాటిలో వేటిని మాదక ద్రవ్యాలు అంటారు?
1) మార్ఫిన్ 2) హషిష్
3) హెరాయిన్ 4) పైవన్నీ

**120.** ఐక్యరాజ్యసమితిలోని సభ్యదేశాల సంఖ్య ఎంత?
1) 192 2) 196 3) 186 4) 198

**121.** ఆంధ్రప్రదేశ్ సముద్రతీర రేఖ పొడవెంత?
1) 972 కి.మీ. 2) 675 కి.మీ.
3) 856 కి.మీ. 4) 1256 కి.మీ.

**122.** భారతదేశంలో భౌగోళిక విస్తీర్ణ పరంగా ఆంధ్రప్రదేశ్ ఏ స్థానంలో ఉంది?
1) 3వ 2) 4వ 3) 5వ 4) 6వ

**123.** బంగ్లాదేశ్ సరిహద్దులో ఉన్న భారత రాష్ట్రాలు ఎన్ని?
1) 3 2) 4 3) 5 4) 6

**124.** ప్రపంచంలో అత్యంత ఎత్తైన పర్వత శిఖరమైన 'ఎవరెస్ట్' ఏ దేశంలో ఉంది?
1) ఇండియా 2) నేపాల్
3) టిబెట్ 4) ఆఫ్ఘనిస్థాన్

**125.** గోదావరి నది పరీవాహక ప్రాంతం ఏ రాష్ట్రాల్లో విస్తరించి ఉంది?
1) మహారాష్ట్ర 2) ఛత్తీస్‌గఢ్
3) ఆంధ్రప్రదేశ్, ఒడిషా 4) పైవన్నీ

**126.** ప్రపంచంలోనే అత్యధిక వర్షపాతం ఉన్న మౌసింరామ్ అనే ప్రదేశం ఏ రాష్ట్రంలో ఉంది?
1) అస్సాం 2) మేఘాలయా
4) మణిపూర్ 4) త్రిపుర

**127.** భారతదేశంలో నైరుతీ రుతుపవనాలు ఏ కాలంలో వస్తాయి?
1) జూన్ నుంచి సెప్టెంబర్
2) జులై నుంచి అక్టోబర్
3) అక్టోబర్ నుంచి డిసెంబర్
4) జనవరి నుంచి మార్చి

**128.** భారతదేశంలో అడవుల విస్తీర్ణం అత్యధికంగా ఉన్న రాష్ట్రం ఏది?
1) అరుణాచల్‌ప్రదేశ్ 2) మిజోరాం
3) మహారాష్ట్ర 4) మధ్యప్రదేశ్

**129.** తేమను ఎక్కువగా నిల్వ ఉంచుకునే సామర్థ్యాన్ని కలిగి ఉన్న మృత్తిక ఏది?
1) ఒండ్రుమట్టి మృత్తిక 2) నల్లరేగడి మృత్తిక
3) ఎర్ర మృత్తిక 4) ఎడారి ఇసుక మృత్తిక

**130.** 2001 జనగణన ప్రకారం ఆంధ్రప్రదేశ్ జనసాంద్రత చదరపు కిలోమీటరుకు ఎంత?
1) 324 మంది 2) 275 మంది
3) 340 మంది 4) 904 మంది

**131.** భారతదేశంలో అత్యధిక నగర జనాభా ఉన్న రాష్ట్రం-
1) మహారాష్ట్ర 2) తమిళనాడు
3) పంజాబ్ 4) హర్యానా

**132.** చెరువుల ద్వారా సాగయ్యే భూమి అత్యధికంగా ఏ రాష్ట్రంలో ఉంది?
1) ఆంధ్రప్రదేశ్ 2) ఒడిషా
3) మధ్యప్రదేశ్ 4) మహారాష్ట్ర

**133.** కిందివాటిలో భారీ నీటిపారుదల ప్రాజెక్టు సామర్థ్యం ఎంత?
1) 1000 హెక్టార్లకు మించి
2) 5000 హెక్టార్లకు మించి
3) 10,000 హెక్టార్లకు మించి
4) 1,00,000 హెక్టార్లకు మించి

**134.** రామ్ గంగా పథకం ఏ రాష్ట్రంలో ఉంది?
1) ఉత్తరప్రదేశ్ 2) మధ్యప్రదేశ్
3) పశ్చిమబెంగాల్ 4) బీహార్

**135.** కిందివాటిలో భారతదేశంలో గోధుమను అత్యధికంగా పండించే రాష్ట్రం-
1) పంజాబ్ 2) హర్యానా
3) ఉత్తరప్రదేశ్ 4) రాజస్థాన్

**136.** 'నీలి విప్లవం' అని దేనికి పేరు?
1) చేపల పెంపకం 2) పాల ఉత్పత్తి
3) సముద్ర కాలుష్య నివారణ
4) నదుల కాలుష్య నివారణ

**137.** భారతదేశంలో లిగ్నైట్‌ను అత్యధికంగా ఉత్పత్తిచేసే రాష్ట్రం ఏది?
1) జార్ఖండ్ 2) ఒడిషా
3) ఆంధ్రప్రదేశ్ 4) తమిళనాడు

**138.** మోనోజైట్ నిక్షేపాలు అత్యధికంగా ఉన్న రాష్ట్రం ఏది?
1) కేరళ 2) ఆంధ్రప్రదేశ్
3) మధ్యప్రదేశ్ 4) ఒడిషా

**139.** భారతదేశంలో పట్టు ఉత్పత్తిలో గుత్తాధిపత్యం ఉన్న రాష్ట్రం ఏది?
1) గుజరాత్ 2) జమ్మూకాశ్మీర్
3) ఒడిషా 4) కర్ణాటక

**140.** బొకారో ఉక్కు కర్మాగారం ఏ దేశ సహకారంతో స్థాపితమైంది?
1) పూర్వపు సోవియట్ యూనియన్ (ప్రస్తుత రష్యా)
2) పూర్వపు పశ్చిమ జర్మనీ
3) బ్రిటన్ 4) ఆస్ట్రేలియా

**141.** ఒక రూపాయి నోటును ముద్రించే వారు ఎవరు?
1) ప్రణాళికా సంఘం 2) ఆర్థిక మంత్రిత్వశాఖ
3) ప్రణాళికా మంత్రిత్వశాఖ 4) రిజర్వ్‌బ్యాంక్

**142.** ప్రస్తుతం రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ ఎవరు?
1) వై. వేణుగోపాలరెడ్డి
2) మాంటెక్‌సింగ్ అహ్లూవాలియా
3) దువ్వూరి సుబ్బారావు 4) సి. రంగరాజన్

**143.** ఉత్పత్తి కారకాల దృష్ట్యా జాతీయోత్పత్తి-
1) జాతీయాదాయం 2) జాతీయవ్యయం
3) స్థూలజాతీయోత్పత్తి 4) జాతీయసంపద

**144.** కిందివాటిలో రాష్ట్ర ప్రభుత్వం విధించే పన్ను-
1) వార్తా పత్రికలపై అమ్మకం పన్ను
2) సంపదపై పన్ను
3) టర్మినల్ డ్యూటీలు
4) వ్యవసాయ ఆదాయంపై పన్ను

**145.** రైల్వే బడ్జెట్‌ను ఎవరు ప్రవేశ పెడతారు?
1) ప్రధానమంత్రి 2) రైల్వే శాఖ మంత్రి
3) ఆర్థిక మంత్రి 4) రైల్వేశాఖ ముఖ్య కార్యదర్శి

**146.** ఎవరి ఆమోదంతో ప్రణాళికలు అమల్లోకి వస్తాయి?
1) రాష్ట్రపతి 2) ప్రధానమంత్రి
3) జాతీయాభివృద్ధి మండలి 4) పార్లమెంట్

**147.** పని - ఆహారం - ఉత్పాదకతలకు ఏ ప్రణాళికలో ప్రాధాన్యమిచ్చారు?
1) 8వ ప్రణాళిక 2) 7వ ప్రణాళిక
3) 9వ ప్రణాళిక 4) 10వ ప్రణాళిక

**148.** రబీ పంటకాలంలో ప్రధానమైన పంట కానిదేది?
1) గోధుమ 2) జొన్న
3) ధనియాలు 4) చెరకు

**149.** ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పేదరిక నిర్మూలనా పథకాలను కలిపి ఏ పథకంగా అమలు చేస్తోంది?
1) రాజీవ్ క్రాంతి పథకం 2) వెలుగు పథకం
3) ఇందిర క్రాంతి పథకం 4) ఇందిరమ్మ

**150.** పి. ఇండెక్స్ అనే భావనను ప్రవేశ పెట్టినవారు-
1) అమర్త్యసేన్ 2) దండేకర్- నీలకంఠరాథ్
3) ప్రణాళికా సంఘం 4) లక్డావాలా.

పోటీపరీక్షల శిక్షణలో అనుభవజ్ఞులైన నిపుణులు ఈ నమూనా ప్రశ్నపత్రాన్ని రూపొందించారు.

రేపటి సంచికలో...
**సెక్రటేరియల్ ఎబిలిటీస్ మోడల్ గ్రాండ్ టెస్ట్**

## సమాధానాలు

1)2 2)3 3)1 4)4 5)1 6)2 7)3 8)4 9)2 10)2 11)1 12)3 13)4 14)1 15)3 16)4 17)4 18)3 19)1 20)2 21)1 22)1 23)3 24)3 25)2 26)4 27)2 28)4 29)2 30)3 31)3 32)3 33)2 34)4 35)4 36)1 37)2 38)3 39)1 40)3 41)1 42)2 43)4 44)2 45)4 46)4 47)2 48)3 49)2 50)4 51)3 52)4 53)3 54)1 55)1 56)2 57)2 58)1 59)4 60)4 61)3 62)2 63)2 64)2 65)3 66)4 67)2 68)3 69)3 70)1 71)4 72)2 73)2 74)2 75)3 76)1 77)3 78)1 79)4 80)2 81)1 82)3 83)4 84)2 85)2 86)1 87)3 88)1 89)3 90)1 91)2 92)2 93)1 94)3 95)4 96)3 97)1 98)3 99)4 100)4 101)3 102)1 103)4 104)3 105)2 106)4 107)1 108)3 109)3 110)4 111)4 112)2 113)4 114)3 115)2 116)1 117)2 118)1 119)4 120)1 121)1 122)2 123)2 124)2 125)4 126)2 127)1 128)4 129)2 130)2 131)1 132)1 133)3 134)1 135)3 136)1 137)4 138)1 139)4 140)1 141)2 142)3 143)1 144)4 145)2 146)3 147)2 148)4 149)3 150)1.

**Nirankar:** The judgement delivered yesterday, I feel, is fair to all concerned. What do you feel?
(నిన్న ఇచ్చిన తీర్పు సంబంధితులందరికీ న్యాయంగా ఉందని నేను భావిస్తున్నాను. మరి నువ్వేమనుకుంటున్నావు? )

**Alankar:** I don't doubt it the least. How impartial the judge was! Even as he was reading the judgement every one felt that it was a very objective view of the situation. Very rarely do we come across such judgements and such judges
(నాకసలు సందేహం లేదు. న్యాయమూర్తి ఎంత నిష్పాక్షికం! ఆయన తీర్పు చదువుతున్నప్పుడే ప్రతివారూ అనుకున్నారు, పరిస్థితిని రాగద్వేషాలకు అతీతంగా చూశాడని. అలాంటి తీర్పులు, న్యాయమూర్తులూ అరుదుగా కనిపిస్తారు.)

(మా స్కూల్లో మోసెస్ అనే టీచర్ ఉండేవారు. ఆయన ఎప్పుడూ చెప్తుండేవారు- ఏ విషయంలోనైనా న్యాయంగా వ్యవహరించాలని. తాము చెప్పే నీతులను ఆచరించే బహు కొద్ది మందిలో ఆయన ఒకడు. ఆయన ఎప్పుడూ న్యాయంగా ఉండేవాడు.)

**Nirankar:** Lucky that you had such a teacher. I remember your telling me of him some time ago. You told me how unbiassed he was whenever the occasion demanded it.
(నీ అదృష్టం నీకలాంటి టీచర్ ఉండటం. కొంతకాలం క్రితం నువ్వు ఆయనను గురించి చెప్పటం నాకు గుర్తుంది. సందర్భం వచ్చినప్పుడు ఆయనెంత నిష్పాక్షికంగా ఉండేవాడో నని.)

ఈ expressions అన్నీ కూడా నిష్పాక్షికత, ధర్మం, న్యాయ సమ్మతమైన అనే మాటలకు సంబంధించి తరచూ వాడే పదాలు (High frequency words). ఇవి మన నిత్య జీవితంలో ఇతరులతో వ్యవహరించేప్పుడు తరచుగా వాడే పదజాలమిది. నేర్చుకొని వాడుదాం. ఈ పదాల గురించి ఇప్పుడు వివరంగా చూద్దాం.




**1) fair** = న్యాయమైన, ధర్మమైన
a) This umpire has always been fair in giving decisions/ His decisions have always been fair = ఈ umpire ఎప్పుడూ న్యాయంగా వ్యవహరిస్తాడు.

# Very few media are unbiassed

**Nirankar:** Even the parties to the case, Mrinmoy and Manoj could not point a finger at the judgment. Both were convinced of the disinterested attitude the judge took in the case. Though it was a bit to the disadvantage of Mrinmoy, he said he had no reason to complain.
(కేసులో పార్టీలయిన మృణ్మయ్, మనోజ్ కూడా ఏ లోపాన్నీ వేలెత్తి చూపలేకపోయారా తీర్పులో. న్యాయమూర్తి వైఖరి నిష్పాక్షికమైనదేనని వాళ్లకు నమ్మకం కలిగింది. ఆ తీర్పు మృణ్మయ్‌కు కొంత నష్టం కలిగించేదయినా, తనకు దాని గురించి బాధేం లేదన్నాడు.)

**Alankar:** Among the most difficult tasks for a person is to be fair-minded. Only a few like Gandhi are capable of being impartial.
(నిష్పాక్షికంగా ఉండటమనేది అతికష్టమైన విషయాల్లో ఒకటి. అలా ఉండగలవాళ్లు గాంధీలా చాలా తక్కువ మంది.)

**Nirankar:** The judge's assessment of the situation was fair and reasonable. Anyone believing in justice and fair-play can never fault the judgement.
(పరిస్థితిని అంచనావేయడంలో న్యాయమూర్తి చాలా న్యాయసమ్మతంగా, యుక్తంగా వ్యవహరించాడు. న్యాయం, ధర్మంలో నమ్మకం ఉన్న ఎవరైనా సరే ఈ న్యాయమూర్తిని తప్పు పట్టలేరు.)

**Alankar:** At school I had a teacher Moses. He always used to advise us to play fair on any issue. He was one of those rare people who practiced what he preached. He was always fair.





M.SURESAN

**Alankar:** Yes; none could complain of the marks he awarded to them. So fair he was in judging the students.
(అవును. ఆయన ఇచ్చే మార్కులను గురించి ఎవరూ ఫిర్యాదుచేసేవారుకాదు. విద్యార్థులను అంచనావేయడంలో ఆయన అంత న్యాయంగా ఉండేవారు.)

**Notes:** delivered - Past tense. (PT) of deliver = తీర్పుల్లాంటివి వెలువరించడం; come across = తారసపడటం/ తెలియడం; Point a finger = వేలెత్తిచూపడం; convince = నచ్చజెప్పడం; be convinced = నమ్మకం కలగడం; fault = తప్పు/ తప్పుపట్టడం.

*Now look at the following sentences from the conversation above.*
1) *The judgement, I feel, was fair to all concerned.*
2) *How impartial the Judge was!*
3) *They were ....... of the disinterested attitude the judge took to the case.*
4) *Among the most difficult tasks for a person is to be fair-minded.*
5) *Only a few like Gandhi are impartial*
6) *..... assessment was fair and reasonable*
7) *Anyone believing in Justice and fair play can never fault the judgement.*
8) *He always advised us to play fair on any issue*
9) *You told me how unbiassed he was!*

b) Whatever you do it should be fair to all concerned = నువ్వేంచేసినా, దానితో సంబంధం ఉన్న వాళ్లందరికీ న్యాయం కలిగేదిగా ఉండాలి.
c) To be fair to Karna, he became what he was, mainly because of the secret of his birth = కర్ణుడి విషయంలో న్యాయంగా చెప్పాలంటే, అతడి జన్మరహస్యం వల్ల అతడలా అయ్యాడు. (స్వతహాగా దుర్మార్గుడు కాదు)
d) He did not get his fair share of the property = న్యాయసమ్మతంగా ఆస్తిలో రావాల్సిన భాగం అతడికి రాలేదు.

**2&5) Impartial (× Partial)** = నిష్పాక్షికమైన, పక్షపాతంలేని
a) An impartial referee is a good referee = నిష్పాక్షికమైన referee (umpire) మంచి referee
b) In any issue between India and Pak, the US is never impartial, though it says it is = భారత్, పాక్‌కు వచ్చే ఏ సమస్యలోనైనా, అమెరికా నిష్పాక్షికంగా ఉంటానని చెప్పినప్పటికీ, అది నిష్పాక్షికంగా ఉండదు

**3) Disinterested** = Not interested in any one side in a dispute/ Not interested in self/ free from prejudice (దురభిప్రాయం) or favour (అభిమానం)= ఒక వివాదంలో ఏ పక్షంమీదా అభిమానం లేకుండా నిష్పాక్షికంగా ఉండటం (Dispute = వివాదం) స్వార్థ చింతన లేకుండా ఉండటం/ దురభిప్రాయాలకు అతీతంగా ఉండటం.
a) In the Gita Lord Krishna tells us to do our duty in a disinterested manner = గీతలో శ్రీకృష్ణుడు, ఫలితం మీద దృష్టిలేకుండా, మనం చేయాల్సినదాన్ని చేయాలంటాడు.
b) Gandhi served the Nation in a totally disinterested manner = ఏ స్వార్థచింతనా/ స్వలాభాపేక్ష లేకుండా గాంధీ దేశానికి సేవ చేశాడు.

**4) fair-minded**= తన అభిప్రాయాలకే కాకుండా ఇతరుల అభిప్రాయాలకు తగినంత ప్రాధాన్యం ఇచ్చే/ న్యాయచింతన ఉన్న.
a) The boss is fair-minded and is open to suggestions = బాస్ తను మాత్రమే కరెక్ట్ అనుకోకుండా ఇతరుల అభిప్రాయాలకు కూడా విలువిస్తాడు/ న్యాయచింతన ఉన్నవాడు.
b) Sukumar is fair-minded enough to share his profits with his employees = తన నౌకర్లతో తన లాభాలు పంచుకునేంత న్యాయ చింతన ఉన్నవాడు.

**6) fair and reasonable** = వీటిని ఎక్కువగా కలిపి వాడతారు. fair= న్యాయమైన; reasonable= సబబైన.
a) A fair and reasonable settlement will be to divide his property between his son and daughter equally
b) The workers' demand for a rise in bonus, because of a rise in profits is fair and reasonable = లాభాల్లో పెరుగుదల ఉన్నందువల్ల బోనస్ కూడా పెంచాలనే శ్రామికుల డిమాండ్ న్యాయమైనదే.

**7) Justice and fair play**= న్యాయమూ, చట్టసమ్మతమూ
a) Anybody believing in justice can never accept social inequalities = న్యాయం చట్టం మీద నమ్మకం ఉన్నవాళ్లెవరూ/ అనుసరించే వాళ్లెవరూ సాంఘిక అసమానతలు ఒప్పుకోలేరు
b) Justice and fair play demand that all people should have equal opportunities = అందరికీ సమానావకాశాలుండాలని న్యాయం, చట్టం కోరుతున్నాయి/ న్యాయం చట్టం ప్రకారం అందరికీ సమానావకాశాలుండాలి.

**Fair play** = 1) దేన్నైనా న్యాయంగా చట్టబద్ధంగా నిబంధనలననుసరించి చేయడం
2) ఏ ఆటనైనా నిబంధనలు తప్పకుండా ఆడటం.

**8) Play fair** = 1) నిబంధనలకు అనుగుణంగా న్యాయ సమ్మతంగా, ఆట ఆడటం 2) ఇతరులతో న్యాయంగా వ్యవహరించడం.
a) Winning a game any how is not important. Playing fair is important = ఆట గెలవడం ముఖ్యం కాదు. నిబంధనల ప్రకారం, న్యాయంగా ఆడటం అనేది ముఖ్యం.
b) I won't be his partner anymore because he doesn't play fair = అతడితో ఇంకేమాత్రం నేను భాగస్వుడిగా ఉండను, ఎందుకంటే అతడు న్యాయంగా వ్యవహరించడు.

**9) unbiassed**= impartial= నిష్పక్షపాతంగా ఉండటం. (Bias = పక్షపాతం/ దురభిప్రాయం)
Very few media in India are unbiassed in their news programmes and comments = భారత్‌లో మీడియాలో కొద్దిమంది మాత్రమే వార్తా వ్యాఖ్య కార్యక్రమాల్లో నిష్పాక్షికంగా ఉంటున్నారు.

---

Q&A

***S. Naresh, Kothagudem.***

**Q.** Sir, కిందివాటికి తెలుగులో అర్థాలను వివరించగలరు.
Bluffing, Rather, Here we go, I gotta go college, House - Home, Should - Must - Had to, As - like, Till - Until, Alien - Monster.

**A. Bluffing** = తెలియనివి తెలిసినట్లు, చేయలేని, చేయాలనుకోని పనులు చేయగలిగినట్లు, చేసేటట్లు అబద్ధాలు చెప్పడం.
He does not know how to do it. He is bluffing = అదెలా చేయాలో అతడికి తెలియదు. తెలుసని అబద్ధాలు చెప్తున్నాడు.

**Rather** = 1) కొంతమటుకు/ కాస్త. మనకిష్టంలేని/ మనకు నచ్చని విషయాల గురించి చెప్పేటప్పుడు.
The day is rather hot= ఇవాళ కాస్త ఎండగానే ఉంది.
The train is rather slow = ఈ train కాస్త నిదానమే.
2) మన ఎంపిక తెలిపేందుకు వాడతాం.
I'd rather walk than go by bus = బస్సులో వెళ్లడం కంటే నడచి వెళ్లేందుకు ఇష్టపడుతున్నాను.

**Here, we go** = ఏదైనా ప్రారంభం అయ్యేటప్పుడు అనేమాట. 'ఆ! ఇక మొదలవుతోంది' అన్నట్టుగా 'Here we go', said Ram, 'Sachin is going to bat'. = ఆ! ఇక ప్రారంభం అయింది. సచిన్ బ్యాట్ చేయబోతున్నాడిక.

**I gotta go = I got to go** = నేను వెళ్లాలి.

**House - home** - వీటి గురించి ఇటీవలే వివరించాం. చూడండి.

**should = must = have to** - ఏదైనా 1) విధిగా 2) మన అవసరాన్నిబట్టి 3) ఒకరి ఆజ్ఞానుసారంగా చేయాల్సి రావడం.
I should go = I must go = I have to go = నేను వెళ్లాలి.
He should do it/ He must do it/ He has to do it = అతడది చేయాలి (అవసరం/ ఆజ్ఞ/ విధి)
Had to - past tense of should/ must/ have to and has to.

**As** = వలె = **like.** అయితే like తర్వాత clause (verb తో కూడిన పద సముదాయం) రాదు. As తర్వాత clause మాత్రమే వాడతాం.
a) He walks like his father = అతడి తండ్రి లాగా నడుస్తాడతడు. గమనించండి.
like తర్వాత 'father' (noun) వస్తుంది.
b) He walks as his father does = అతడు తన తండ్రి నడిచేలాగానే నడుస్తాడు.
as + his father does (clause)
(అయితే modern usage లో like తర్వాత కూడా clause వాడుతున్నారు. He cannot sing like I do = అతడు నాలా పాడలేడు. Correct గా అయితే, He cannot sing as I do అనాలి. ఇప్పుడు like I do కూడా, English వాళ్లే అనేస్తున్నారు. రాతలో మాత్రం (formal writing లో) ఇది సరికాదు.)
He is tall like his father = He is tall as his father is.

**Till = until**

**Alien** - విదేశీయుడు, విదేశీ (foreign); గ్రహాంతరవాసి. (వేరే గ్రహానికి చెందిన)
**Monster** = భూతం, రాక్షసప్రవృత్తి కలవాళ్లు.
Alien కు, monster కూ ఏం సంబంధంలేదు.

**Q.** కిందివాటికి English లో అర్థాలు తెలపగలరు.
కొత్తిమీర, ధనియాలు, కరివేపాకు, పల్లీలు.
**A.** కొత్తిమీర = coriander leaves.
ధనియాలు = coriander.
కరివేపాకు = curry leaves.
పల్లీలు = ground nuts;

**Q.** కిందివాటికి Abbreviations తెలపగలరు.
HTTP, URL, .Com, USB
**A.** HTTP = Hyper Text Transfer Protocol
URL = Uniform/ Universal Resource Locator
.Com - Internet మీద వ్యాపారాన్ని నిర్వహించే వ్యాపార సంస్థ పేరులో భాగం.
USB = Universal Serial Bus.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# How on earth did he become so rich?





M.SURESAN

**Tushar:** (I) heard you were fined Rs.250/- for violation of some traffic rule. Were you?

(ఏదో Traffic rule ఉల్లంఘించినందుకు నీకు రూ.250 జుల్మానా పడిందని విన్నాను నిజమేనా?)

**Dhaval:** I was, of course. It was in the old town area. I didn't know I was driving the wrong way. So I got booked and paid the fine.

(నిజమే. అది old townలో. తప్పుదారిన తోలుతున్నానన్న విషయం తెలీలేదు నాకు. అందుకని నేను పట్టుబడ్డాను. జుల్మానా కట్టాను.)

**Tushar:** We've to comply with the rules, you know. Sometimes a one-way traffic road may be a short cut. It may save us some time and fuel. But we've to pay more than we save if we are caught.

(Road rules పాటించాలిలే మనం. కొన్నిసార్లు One way traffice మార్గాలు అడ్డదార్లయి దూరం తగ్గొచ్చు. దానివల్ల కొంత సమయం, ఇంధనం ఆదా కావచ్చు కానీ పట్టుబడితే మాత్రం ఆదా చేసే దానికంటే ఎక్కువే చెల్లించాల్సి వస్తుంది.

**Dhaval:** I didn't intend to break any rule, and I usually don't. The trouble was I wasn't familiar with the area. Whatever I might say, the traffic cop insisted that I pay the fine. He was saying, 'ignorance of the law is no excuse.'

(కానీ, Rules అతిక్రమించడం నా ఉద్దేశం కాదు. మామూలుగా అలాచేయను కూడా. అసలు చిక్కంతా ఆ ఏరియా నాకు పరిచయం లేకపోవడమే. నేనేం చెప్పినా Traffic police వినిపించుకోకుండా fine కట్టాల్సిందేనని పట్టుబట్టాడు. 'చట్టం తెలీకపోవడం క్షమార్హం కాదని ఒకటేవాదం.)

**Tushar:** I know you are a law-abiding citizen and have respect the law. But I feel you could have got away by bribing the constable. That'd have cost you less than the fine.

(నాకు తెలుసు నువ్వు చట్టాన్ని పాటించే పౌరుడివని, చట్టం అంటే నువ్వు గౌరవిస్తావని, కానీ, ఆ పోలీసతనికి ఏదైనా మామూలిచ్చి బయట పడుండొచ్చుకదా. ఆ విధంగా fine కంటే తక్కువయేది.)

**Dhaval:** True. I could have done that. In fact the constable was expecting it. But in no time I made him understand that I would go by the book.

(నిజమే ఆ పని నేను చేసి ఉండొచ్చు అసలా పోలీసతను అదే ఆశిస్తున్నాడు. కానీ నేను చట్ట ప్రకారమే పోతానని అతడు అర్థం చేసుకునేలా చేశాను త్వరలోనే.)

**Tushar:** That's a good thing you did. Sometimes observing rules may be expensive but violating them may prove more expensive. That is, in terms of time and money. Most road users don't understand this simple point. After all, the rules are for us and our safety.

(మంచి పని చేశావు. కొన్నిసార్లు చట్టాన్ని పాటించడం ఖర్చుతో కూడుకున్నదైనా, ఉల్లంఘించడం అంతకంటే ఖరీదు కావచ్చు అంటే సమయం, డబ్బు రూపంలో. ఈ చిన్న విషయం చాలా మందికి అర్థం కాదు. ఏదేమైనా నియమనిబంధనలు మన క్షేమానికే గదా?)

**Dhaval:** Conforming to rules is always the best thing for any one.

(ఎవరికైనా చట్టాన్ననుసరించి పోవడం మంచి పద్ధతి.)

**Notes:** 1. Got (was) booked: Past Tense (PT) of 'get booked' = పట్టుబడటం (నేరానికి); 2. Short cut = అడ్డదారి (దూరం తక్కువచేసే); 3. fuel = ఇంధనం; 4. Intend = ఉద్దేశించడం/ ఉద్దేశం కలిగి ఉండటం; 5. familiar (with) = పరిచయం ఉండటం; 6. cop = constable; 7. Insist = పట్టుబట్టడం.; 8. Ignorance = తెలీకపోవడం/ అజ్ఞానం; 9. expensive = ఖరీదైన; 10. Interms of = రూపంలో.

***Look at the following expressions from the conversation above:***

*1) you were fined Rs.250 for violation of some traffic rule*

*2) So I got (was) booked*

*3) We have to comply with the rules*

*4) I didn't want to break any rule*

*5) I know you are a law-abiding citizen*

*6) ... that I would go by the book*

*7) Sometimes observing rules may be expensive....*

*8) Conforming to rules is always the best thing*

పైన underline చేసిన మాటలన్నీ చట్టాలను అనుసరించడం ఉల్లంఘించడం అవే వాటికి సంబంధించినవి కదా? వాటిని ఇప్పుడు వివరంగా చూద్దాం.

**1) Violation:** Rules (నిబంధనలు), చట్టాలు (Law) ను ఉల్లంఘించడం/ అతిక్రమించడం.

a) Any violation of this law will be viewed seriously = ఈ చట్టం ఉల్లంఘన/ అతిక్రమణ తీవ్రంగా పరిగణించబడుతుంది. (మామూలు తెలుగు: తీవ్రంగా పరిగణిస్తారు)

b) Kumar was jailed for three months for the violation of the act = ఆ చట్టాన్ని ఉల్లంఘించినందుకు కుమార్‌కు మూడు నెలల జైలు శిక్ష పడింది.

**2) I was booked** - ఇది (was booked), booked కు passive voice - to book = ఏదైనా చట్టం ప్రకారం కేసు నమోదు చేయడం.

a) The police have booked him/ booked a case against him for cheating = మోసం చేసినందుకు, పోలీసులు అతనిమీద కేసు పెట్టారు.

b) They have booked a case against him under anticorruption act = అవినీతి నిరోధక చట్టం కింద అతని మీద వాళ్ళు case పెట్టారు.

3) To comply with law/ rules/ order/ resolution (తీర్మానం) = చట్టం/ నిబంధన /ఆజ్ఞ/ తీర్మానాలను అనుసరించడం/ అమల్లో పెట్టడం.

a) A subordinate has to comply with the orders of the superior = కిందివాళ్ళు పై అధికారి ఆజ్ఞలను పాటించాలి.

b) Complying with the law is a sign of culture = చట్టప్రకారం నడచుకోవడం సంస్కారానికి చిహ్నం.

3) Comply × violate/ break (4)

4) Breaking rules will be punished severely = నిబంధనలు ఉల్లంఘిస్తే తీవ్ర శిక్ష పడుతుంది.

5) Violate law × abide by law.

Abide by law/ rules, etc = చట్టాలు, నిబంధనలకు లోబడి నడచుకోవడం.

Abide by the rules of the club or else you cease to be a member of the club = club నిబంధనల ప్రకారం నడుచుకోండి లేకుంటే మీరు సభ్యులుగా కొనసాగరు.

He refused to abide by the law of the land and was expelled = ఆ దేశానికి చెందిన చట్టాన్ని అనుసరించేందుకు అతడు ఒప్పుకోకపోవడంతో అతడిని బహిష్కరించారు. Expel = వెళ్లగొట్టడం.

**Law abiding** = చట్టప్రకారం నడుచుకోవడం- దీన్ని ముఖ్యంగా, Law - abiding citizen = చట్ట బద్ధులుగా ఉన్న పౌరులు అనే expressionగా వాడతాం.

Law abiding citizens have no reason to fear anything = చట్టబద్ధులుగా ఉండే పౌరులు దేనికీ భయపడనక్కరలేదు.

The police did not suspect him in the beginning because of his record as a law-abiding citizen = చట్టబద్ధంగా వ్యవహరించే పౌరుడుగా చరిత్ర ఉండటంవల్ల పోలీసులు మొదట అతడిని అనుమానించలేదు.

6) To go by the book = నిబంధనలు, నియమాల ప్రకారం నడుచుకోవడం.

a) Our officer always goes by the book; favours none, ill-treats none = మా Officer ఎప్పుడూ నియమనిబంధనలననుసరించి పోతాడు, ఎవర్నీ అభిమానించడు, ఎవర్నీ అవమానించడు.

b) You cannot always go by the book; at times you have to use your discretion = ఎప్పుడూ చట్టాన్ననుసరించి ముక్కుసూటిగా వెళ్లలేం; మన విచక్షణ జ్ఞానాన్ని కూడా వాడాలి.

(Discretion = విచక్షణ)

7) **Observe** (Rules) = (నిబంధనలను) పాటించడం.

Observe rules and you won't have trouble = Rules పాటించు, నీకే బాధా ఉండదు.

**8) Conform** = follow (rules) etc.

a) conforming to rules is always good = నిబంధనలకు లోబడి ఉండటం ఎప్పటికీ మంచిది.

b) His behaviour conforms to a pattern = అతడి నడవడి ఒక పద్ధతి ప్రకారం ఉంటుంది.

---



***Simhachalam, Vijayawada***

**Q.** Sir, కిందివాటిని తెలుగులో ఏ సందర్భంలో, ఎలా పలకాలో ఒక ఉదాహరణ ఇస్తూ వివరించగలరు. yummy, hmn, oh shucks, yup, um, suppose, well, shut the hell up, nope, anyway, noway, wow, solong then, oh! my gosh, sure as hell, come off it, that's so mean, not really, hold on blokes, How on earth, hell, How come, what are you upto today.

**A. Yummy** = చాలా రుచిగా ఉన్న/ నోరూరించే

**Hmn-** మన సంభాషణలో ఎవరైనా ఏదయినా చెబితే, 'ఊ' కొడతాం కదా? దానికి English = um

**Oh shucks** = విసుగు, చిరాకు తెలియపరిచేపదం, మనం తెలుగులో 'అబ్బా' అన్నట్లు. అయితే దీన్ని అన్ని సందర్భాల్లో వాడటం bad manners.

**Yup** = Yes

**Suppose** = అనుకో = if

suppose/ If you get the money, what will you do? = నీకు డబ్బొచ్చిందనుకో/ నీకు డబ్బొస్తే నువ్వేం చేస్తావు?

I suppose it will rain today= ఈ వాళ వర్షం వస్తుందనుకుంటా.

**well...,** = ఇది ఎవరితోనైనా సంభాషణ ప్రారంభించేప్పుడు, వాడే ఊతపదం, తెలుగులో 'మరి'లా. మనం మాట్లాడే ముందు, 'మరి' అని అంటూ ఉంటాం కదా, అలా. (అసలర్థం well = బాగా. He is well = ఆయన బాగా ఉన్నాడు)

**Shut the hell up** = Shut up. Shut the hell up బాగా కోపం/ విసుగుతో అంటాం.

**Hell** = నరకం. కానీ ఇది Englishలో తరచుగా విసుగు కోపం, నిరాశ, నిస్పృహగా ఉన్నప్పుడు వాడతారు.

**Nope** = No.

**Anyway** = 1) ఎలాగూ/ ఏదైతేనేం.

1) I don't have the money to buy the car, anyway, I don't like the colour = ఆ కారు కొనేందుక్కావల్సిన డబ్బు నా దగ్గర లేదు. ఏదేమైనా/ ఎలాగూ నాకీ Colour ఇష్టం లేదు. (అందుకని నేను కొనను).

2) subject మార్చేందుకు వాడతాం. Anyway, let's drop the matter. (సరేలే, ఇక ఆ విషయం ఆపేద్దాం)

3) మనం చెప్పిన విషయాన్ని కొద్దిగా మార్చుకునేందుకు. He has a house; anyway he was living in his own house when I last met him = అతడికి ఇల్లుంది. ఏదేమయినా నేనతడిని చివర కలుసుకున్నప్పుడు అతడి సొంత ఇంట్లో ఉంటున్నాడు.

4) అయినప్పటికీ- It was very costly, but I bought it anyway = అది చాలా ఖరీదు, అయినా నేనది కొన్నా.

**No way** = అసాధ్యం (Impossible)

Are you buying that house?

'No way, with the money I have'

**Wow** = ఆహా!/ ఓహో! అని మెచ్చుకునేందుకు వాడే మాట.

**Solong** = bye (Goodbye); then = ఆ తర్వాత

**Oh! my gosh** = Oh! my God.

**Sure as hell** = కచ్చితంగా/ నిస్సందేహంగా/ (ముఖ్యంగా చెడు విషయం గురించి).

A = Are the police here? (పోలీసులున్నారా ఇక్కడ?)

B = Sure as hell (కచ్చితంగా, మనకర్మకొద్దీ)

**Come off it** = గద్దిస్తూ ఒకరిని నిజం ఒప్పుకోమని గానీ, వాళ్ల చెప్పింది మనం నమ్మడంలేదనిగానీ దబాయిస్తూ చెప్పేందుకు వాడతాం.

a) Oh! Come Off it! You know everything about it. (దీన్ని గురించి నీకంతా తెలుసు. నిజం చెప్పు- నీకు తెలీదని నేన్నమ్మను.)

b) Oh, Come off it. It's not that cheap. (అదేం కాదులే. అంత చవకేం కాదది).

**That's so mean of you:** నువ్వు మరీ నీచంగా ప్రవర్తిస్తున్నావు. (పిసినారిగా ఉన్నావు)

**Not really!** = అవునా? (నమ్మకం కలగడంలేదని చెప్పేందుకు)

A: She has passed in I Class

B: Not Really? (నిజమా? / అవునా? ) నమ్మేందుకు సిద్ధంగా లేనట్టు.

**Hold on, blokes:** Bloke = guy = వ్యక్తి

He is a nice bloke = అతను మంచివాడు. ఒకొక్కప్పుడు మన friendsను కూడా ఇలా అంటాం.

Holdon, blockes = ఆగండ్రా (friendsను) (Holdon = ఆగడం)

**How on earth** = ఎలా? ఏదయినా విషయం నమ్మలేనిదిగా ఉంది అని తెలిపేందుకు.

How on earth did he become so rich? = అంత ధనవంతుడెలా అయ్యాడబ్బా, అతడు?

**Hell:** చెడుమాటవిన్నా, చెడు సంఘటన జరిగినా అనే మాట. Hell, how does he know I am here? = ఛ, వాడికెలా తెలుసు నేనిక్కడున్నానని?

**How come?:** = అదెలా జరిగింది?

How come you are here at this time = నువ్విప్పుడు ఇక్కడ ఉండటం ఎలా జరిగింది?

**What are you upto?:** ఏమిటి మీ ఉద్దేశ్యం? / ఏం చేయాలనుకుంటున్నారు?

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# What else should I write?





M.SURESAN



***Imran, Yellandu***

**Q.** కింది వాక్యాలు సరైనవో కావో తెలియజేయండి.
1) He is too weak to run
2) He is very weak to run
3) He is much weak to run
4) He is so weak to run

**A.** 1) He is too weak to run (= He is so weak that he cannot run = He is very weak, so he cannot run) - correct.
2) He is very weak to run,
3) He is much weak to run, and
4) He is so weak to run - all wrong

**Q.** What is the difference among (a) Factory (b) Company (c) Industry- Please clarify in Telugu.

**A.** a) Factory = A place where goods are produced on a large scale = కర్మాగారం - పెద్ద సంఖ్యలో వస్తువులను తయారుచేసే చోటు
b) Company = i) A place where things are sold; ii) The office of a business = వస్తువులు అమ్మే చోటు, iii) ఒక వ్యాపారానికి సంబంధించిన కార్యాలయం.
c) Industry = పరిశ్రమ - పెద్దఎత్తున వస్తువులను తయారు చేయడం/ సేవలందించడం. Industry ఉత్పత్తులన్నీ factories లో జరుగుతాయి.
ఇలా తయారైన వస్తువులను/ అందించే సేవలను అమ్మే, వాటికి సంబంధించిన లావాదేవీలను జరిపే చోటు company.

**Q.** What is the easiest way of learning 'Simple' 'Compound' and 'Complex' sentences. Please suggest a grammar book.

**A.** Simple, complex, compound sentences చక్కగా అర్థం కావాలంటే ముందు verb కున్న ఆరు రూపాలు తెలుసుకోండి. దీనికోసం గతంలో ప్రచురితమైన Spoken English 1 - 20 lessons చూడండి. ఆ తరువాత ఈ విషయాలు గుర్తుంచుకోండి.
1) Verb లేని మాటల కూర్పు - phrase
2) verb ఉండే మాటల సమూహం - clause
3) పూర్తి అర్థం ఉన్న clause - Main clause
4) అర్థం పూర్తికాని clause - subordinate clause

Simple sentence - sentence with one main clause, and phrases or no phrase. అంటే ఒకే verb ఉండే sentence, simple sentence.

2 or more clauses ఉండే sentences, complex కానీ, compound కానీ కావచ్చు subordinate clause ఉంటే అది complex.

Spoken English ఇదివరకటి lessons చూడండి. మీరు పైన తెలిపిన విషయాలు అర్థం చేసుకోగలిగితే, ఏ మంచి grammar book అయినా సాయపడుతుంది. Raymond Murphy Grammar book చూడండి.

**Q.** నేను ఈ dress ఆ Tailor దగ్గర కుట్టించాను. (Please translate into English)

**A.** I got this dress made by the tailor

**Q.** నేను ఆ book మా తమ్ముడికి అమ్మాను (Please translate into English)

**A.** I sold the book to my brother

**Q.** What is the difference between (i) effect (ii) affect

**A.** **Affect** = ప్రభావం కలిగి ఉండటం/ ప్రభావం చూపడం

Rain affects crops = వర్షం పంటలను ప్రభావితం చేస్తుంది/ వాటి స్థితిని మారుస్తుంది.

**effect** = ప్రభావం/ ఫలితం

Rain has an effect on crops = పంటల మీద (on crops) వర్షానికి (rain) has an effect (ప్రభావం కలిగి ఉంటుంది)

**Q.** Please give the meanings of (a) Predicate (b) Phrase (c) Clause and how can we identify the above words.

**A.** Predicate - Subject ను గురించి తెలిపే sentence భాగం predicate.

<u>Delhi</u> <u>is the capital of India</u>
subject predicate

clause, phrase పైన వివరించాం కదా?

When he was there - ఇది 'was' అనే verb ఉన్న group of words - clause

Inside the box - verb లేని group of words - phrase.

***S.Naresh, Kothagudem***

**Q.** కింది ప్రశ్నల Formation Correct అవునో కాదో వివరించగలరు.
1. What else should I write?
2. Where else should all go?
3. How often/ far/ long should each one meet?
4. For/ To/ Whom should the Police?
5. Whose should I take help?

**A.** 1. What else should I write? - correct = నేను ఇంకేం రాయాలి? (else - ఇదికాక ఇంకేమన్నా)
2. Where else should all go? - correct = ఇంకెక్కడికి అందరూ వెళ్లాలి?
3. How often? = ఎన్నిసార్లు? How far? ఎంత దూరం? How long = ఎంతసేపు

How often/ far/ long should each one meet? ఇది అంత సరిగా form చేసిన question కాదు.

meet = కలుసుకోవడం కదా? ఇక్కడ - ఈ question లో ఎవరు, ఎవర్ని కలుసుకోవాలి అనే విషయం తెలియడం లేదు కదా.

ఈ question ను మూడు questions గా తీసుకోండి.
1) How often should each one meet? = ఎన్నిసార్లు ప్రతివారూ కలవాలి? ఇందులో ఎవర్ని కలవాలి అని తెలియడం లేదు కదా- ప్రశ్న అసంపూర్తిగా ఉంది. సరికాదు.
How often should each one meet him అంటే, అప్పుడు question పూర్తయి sentence సరవుతుంది- ప్రతివారూ అతడిని ఎన్నిసార్లు కలవాలి? అనే అర్థంతో.
2) How far should each one meet? = ఎంతదూరం ప్రతివారూ కలవాలి? - ఇది అర్థం లేని ప్రశ్న. ఇన్నిసార్లు కలవడం అంటాంగానీ, ఇంతదూరం కలవడం అనం కదా?
3) How long should each one meet? = ఎంతసేపు ప్రతివారూ కలవాలి? - ఇదీ అర్థంలేని ప్రశ్నే. ఒకర్ని ఇంకొకరు ఇంతసేపు కలవడం ఉండదు కదా? కాబట్టి ఈ ప్రశ్న సరికాదు.
4. ఈ ప్రశ్న ఏవిధంగానూ సరికాదు. అసలిది sentence కాదు, verb లేదు కాబట్టి.
5. Whose help should I take? = నేనెవరి సాయం తీసుకోవాలి? - ఇది correct form of the question.

**Q.** కిందివాటి differences తెలపగలరు.
1. Should - Must
2. Should I come? - Shall I come?
3. Shouldn't I go there? - Don't I have to go there?

**A.** **1.** Should = must = విధిగా/ ఒకరి ఆజ్ఞ/ మన అవసరం మేరకు చేయాలి (తప్పదు) అనే అర్థంతో.
**2.** Should I come? = నేను రావాలా?
Shall I come? = నేను రానా? (నన్ను రమ్మంటావా అనే అర్థంతో)
**3.** Shouldn't I go there? నేనక్కడికి వెళ్లకూడదా?
Don't I have to go there? = నేనక్కడికి వెళ్ల నవసరం లేదా?

***Gurram Shankar, Keshavapatnam***

**Q.** ఈ కింది phrase/ sentence లో 'Native place' ప్రయోగం గురించి వివరించండి. మీరు ఇదివరలో ఈ ప్రయోగం లేదన్నారు. కాని ఆరో తరగతి పాఠ్య పుస్తకంలో ఇలా ఉంది.
"He wrote a letter to one of his best friends at his <u>Native Place</u>". వివరించగలరు.

**A.** We don't find the expression, native place. You can say native country/ land/ city. Home (= a place of somebody's birth and where somebody lives) is preferable to native place.

**Q.** William went to the school by bus. The boy went to the market to buy oranges. Both sentences are referred to in connection with their primary purpose. No article is used before them. Please clarify it.

**A.** If William, as a student went to his school, there is no need to use 'the' before it, though it is found in a standard text book. Similarly, no need of 'the' before market as the purpose of his going there is to buy something.

***E Anil, TN palem***

**Q.** Noun clause లోని types (కిందివాటిని) వివరించగలరు.
Noun Clause
I) The Subject of a Verb
II) The Object of a Verb
III) The Complement of a Verb
IV) The Complement of an Adjective
V) In apposition to the noun before it
VI) Wh - Clauses as Noun Clauses
(1) Subject (2) In apposition
(3) Object (4) Adjective/ Complement
(5) Object of Preposition
VII) If/ Whether Clauses as noun clauses

**A.** I) That he knows the truth makes me happy
ఇక్కడ "That he knows the truth", is a noun clause and subject of the verb 'makes'.
II) She knows that you are here
'that you are here' is the object of the verb, 'knows'.
I forgot everything except that he is here (అతడిక్కడున్నాడనే విషయం తప్ప మిగతావన్నీ మరచిపోయాను)
'That he is here' - noun clause, object of the preposition, 'except'.
III), IV) This is all that I know
= నాకు తెలిసిందంతా ఇంతే.
All that I know, noun clause; complement of the verb, is.
Adjective complement ఉండదు.
V) Robo, a movie Rajani has produced, is really good (మామూలుగా ఒక clause, put in apposition to a noun రాదు. అలా వాడాలంటే ఆ clause, adjective clause అవుతుంది. పై sentence లో లా. Rajani has produced, movie ని describe చేస్తోంది కాబట్టి adjective clause అవుతుంది)
VI) 1) What he knows is very little ('wh' clause compliment)
2) What he has said has made me angry ('wh' clause - end of 'has made')
3) I know when he will come. ('wh' clause, object of 'know'.)
4) I doubt if/ whether he will allow it.
5) I am interested in what he is going to do ('wh' clause, object of the prep 'in')

***K.Srinivas, Anuradha, Pedamaddali.***

**Q.** మంచి pronunciation కు phonetics నేర్చుకునేందుకూ, మంచి CD సూచించగలరు.

**A.** EFLU (English and Foreign Languages University) తయారుచేసిన pronunciation CDలు బాగా ఉపయోగపడతాయి.

***Srinivas, Visakhapatnam***

**Q.** Pros and Cons - అర్థమేమిటి?

**A.** Pros and Cons = The advantages and disadvantages of an action = ఒక చర్య వల్ల ఉత్పన్నమయ్యే మంచిచెడులు
Think of the pros and cons before buying the car = ఆ car కొనేముందు మంచి చెడులు ఆలోచించు. (ముందు వెనుకలు ఆలోచించడం)

**Q.** Blessed is who has a hobby అనేందుకు బదులు He who has a hobby is blessed అనకూడదా?

**A.** Blessed is he who has a hobby = He who has a hobby is blessed. Blessed is he who has a hobby కాస్త కవిత్వం. ఇలాంటి expressions ను poetic inversion అంటాం.

**Q.** Ever, never లను ఒకే వాక్యంలో వాడి, అర్థం తెలుపగలరు.

**A.** Never, ever tell this secret to any one else = ఇంకెవ్వరికీ ఈ రహస్యం ఏనాటికీ/ ఎప్పటికీ చెప్పకు. Never ever - అసలెప్పటికీ లేదు.

**Q.** గొప్పవారి గురించి your excellency అనకుండా his excellency అనెందుకంటారు?

**A.** వారి సమక్షంలో లేదా పరోక్షంగా సంబోధించినప్పుడు His excellency అంటాం. వారితోనే మాట్లాడేటప్పుడు your excellency అనే సంబోధించాలి.

***Simhachalam, Vijayawada***

**Q.** How did you come to know about Mohan?
How did know about Mohan? ఈ రెండు వాక్యాల మధ్య తేడా వివరించగలరు.

**A.** How did you come to know about Mohan? = నీకు మోహన్‌ను గురించి తెలియడం ఎలా జరిగింది?
= How did you know about Mohan? = మోహన్‌ను గురించి నీకెలా తెలుసు?

**Q.** కింది Idiom ని ఉదాహరణతో వివరించండి.
We are usually bursting at the seams on saturday.

**A.** Bursting at the seams = సంచుల/ బస్తాల కుట్లు పిగిలిపోవడం (వాటిని ఎక్కువగా నింపడంవల్ల). (seam = రెండు వస్త్రాలను కలిపి కట్టేటప్పుడు వేసే కుట్టు). అయితే Bursting at the seams ను ఎక్కువగా- ఒక గది/ ప్రదేశంలో పట్టే జనంకంటే ఎక్కువ జనం ఉండటం అనే అర్థంతో వాడతాం.
Indian cities are bursting at the seams = భారత నగరాల జనసమ్మర్దం వాటి విస్తీర్ణతను మించి ఉంది.
We are bursting at the seams on Saturday = ఇక్కడ 'We' అంటే ఏదయినా restaurant, hotel కావచ్చు అప్పుడు దాని అర్థం శనివారాలు మా ప్రదేశం (Restaurant/ Hotel/ Cinema) ఖాళీ ఉండదు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish





*Simhachalam, Vijayawada*

**Q.** కింది Idioms ని తెలుగులో ఉదాహరణతో వివరించండి.

Barking up the wrong tree.

**A.** Barking up the wrong tree = అసలు వాళ్లను కాకుండా ఇంకెవర్నో కోప్పడటం.

I didn't take away your book. You are barking up the wrong tree = నువ్వు కోప్పడాల్సింది నన్ను కాదు. నేనేం నీ పుస్తకం తీయలేదు.

**Q.** Make (sb) mind up about (sb)

**A.** Makeup somebody's mind about something = దేని విషయమైనా ఒక నిర్ణయం తీసుకోవడం.

She has made up her mind about her marriage. She is going to marry the young man she loves = పెళ్లి విషయమై ఒక నిర్ణయానికి వచ్చిందామె. తాను ప్రేమిస్తున్నతడిని పెళ్లి చేసుకోబోతోంది.

**Q.** Nelson's eye

**A.** Turn the Nelson's eye = ఆందోళన పడకుండా ఉండటం. He turned a Nelson's eye to the problem

**Q.** Order of the day

**A.** Order of the day = నేటి తీరు

**Q.** Hand in glove with

**A.** Hand in glove with = కుమ్మక్కవడం.

**Q.** Bee in one's bonnet

**A.** Bee in one's bonnet = ఒకే విషయానికి ప్రాధాన్యం ఇచ్చి దాని గురించి ఆలోచించడం.

Saving money is the bee in his bonnet now = డబ్బు పొదుపే అతడి ధోరణి.

*N. Ranga Rao, Guntur*

**Q.** You have not seen the movie yet!- నీవు చూడలేదా అని ఆశ్చర్యం వ్యక్తపరచడానికి Question tag వాడాలి లేదా ప్రశ్న వేయాలి కదా!

ఇది Regular action కావచ్చు

The college is closed every summer

Shops are closed on sundays

ఇది పూర్తయిన action కావచ్చు

The college has been closed - మూసేశారు. సెలవో/ సమ్మె వల్లనో, etc.

Shops have been closed = మూసేశారు - పై కారణాల వల్ల.

ఇలా అతిగా ఆలోచిస్తే అసలు రాయడం, మాట్లాడటం కూడా మధ్యలో ఆగిపోవచ్చు వినేదాన్నిబట్టి, చదివేదాన్నిబట్టి, మాట్లాడుతుండాలి.

**Q.** If, whether లను ఎప్పుడు ఉపయోగించాలి?

**If** = 1) అయితే.

# Where there is a will there is a way

**Q.** Step on

**A.** Stepon - ఇది Independent గా వాడరు. Step on it = (car) వేగం పెంచాలని ఆజ్ఞాపించడం. He told me to step on it = (car) వేగం పెంచాలని ఆజ్ఞాపించాడు.

**Q.** Your wish is my command

**A.** మీరడిగింది తప్పకుండా చేస్తాం/ మీరడిగితే చాలు, అది జరిగిపోతుంది, అని చెప్పడం.

**Q.** Tooth and nail

**A.** Tooth and nail - ఇది ముఖ్యంగా To fight tooth and nail/ to oppose tooth and nail లో భాగంగా వస్తుంది. అప్పుడు దాని అర్థం

To fight tooth and nail = శక్తి కొద్దీ పోరాడటం.

Gandhi fought the British Govt tooth and nail.

To oppose tooth and nail = శక్తికొద్దీ వ్యతిరేకించడం. Gandhi opposed foreign goods tooth and nail = గాంధీ విదేశీ వస్తువులను శక్తికొద్దీ వ్యతిరేకించాడు.

**Q.** Call a spade a spade

**A.** Call a spade a spade = ఉన్నది ఉన్నట్టుగా చెప్పడం, నిర్మొహమాటంగా.

Let me call a spade a spade. Your clothes are not to my liking = ఉన్నది ఉన్నట్టుగా చెబుతున్నా. నీ దుస్తులు నాకేం నచ్చలేదు.

**Q.** Tongue in cheek

**A.** Tongue in cheek = పైకి కనిపించని హేళనతో.

He said my speech was good, but I knew it was the tongue in cheek = అతడు హేళన స్వరంతో, నా ఉపన్యాసం బాగుందన్నాడు. (హేళన పైకి కనిపించకుండా)

**Q.** Maiden speech

**A.** Maiden speech = ప్రప్రథమ ఉపన్యాసం. Maiden అంటే ఎవరి జీవితంలోనైనా మొదటిది.

Maiden Movie, Maiden Century, etc. (Maiden = కన్య)

**Q.** Live from hand to mouth

**A.** Live from hand to mouth = చాలీచాలని సంపాదనతో బతకడం.

With his low salary he lives hand to mouth = తనకొచ్చే తక్కువ జీతంతో చాలీచాలని జీవితం గడుపుతున్నాడు.

**Q.** buried the hatchet

**A.** Bury the hatchet = పాత కక్షలు మరచిపోవడం

**Q.** Pandora's box

**A.** (Open) the Pandora's Box = ఏదైనా మొదలుపెట్టడంవల్ల మనం పరిష్కరించలేని చాలా ఇతర సమస్యలు ఉత్పన్నం కావడం.

The case may open a Pandora's box = ఈ case వల్ల మనం అనుకోని, పరిష్కరించలేని సమస్యలు ఎదురుకావచ్చు







**A.** You haven't (have not) seen the movie yet!- ఇది ఆశ్చర్యం వ్యక్తపరిచేందుకు సరిపోతుంది. ప్రశ్న రూపంలోగానీ, question tag కానీ అవసరం లేదు

**Q.** The villagers tried to sell their surviving livestock, but no one could pay a high price for a skinny, starving goat or cow.

ఇక్కడ No one could pay అంటే చెల్లించలేదు అని అర్థం కదా! No one would pay అర్థం తెలపండి.

**A.** Could pay = చేయలేకపోయారు (అంత శక్తి లేనివారయ్యారు)

No one would pay = ఎవరూ చెల్లించరు (వాళ్ల ఇష్టపడరు/ ఒప్పుకోరు అనే అర్థంతో). మీరిచ్చిన sentence లో would pay అనడం, could pay కంటే సరైనది.

**Q.** సినిమా బాగుంటుందట, వెళదామా- దీనిని ఇంగ్లిష్‌లో ఎలా అంటాం?

**A.** The movie seems to be good/ They say the movie is good, shall we go?

**Q.** పెన్నునే తీసుకురా, పెన్సిల్ వద్దు - దీనిని ఇంగ్లిష్‌లో ఎలా అంటాం?

**A.** Get only the pen, not the pencil.

*S. Naresh, Kothagudem*

**Q.** "The work is done" అంటే- పని పూర్తిచేయబడిందని అన్నారు. కాని- "The work has been done" అనేది సరైన ప్రయోగం కదా? రెండూ సరైనవే అయితే ఏయే సందర్భాల్లో వాడతారో వివరించగలరు. Simple present tense యొక్క passive voice ఎప్పుడు Present perfect tense కు సమానమవుతుంది?

**A.** The work is done = The work (పని) done (చేయబడినదై) is (ఉంది)

ఈ sentence లో పని ఏ స్థితిలో ఉంది అనేదానికి ప్రాధాన్యం. చేయబడినదై ఉంది - అయిపోయింది.

The work has been done

The work (పని) has been done (చేయబడింది)

ఈ sentence లో పనిపూర్తయ్యి కొంతకాలం అయింది, అని సమయానికి ప్రాధాన్యం.

ఈ కొద్దిపాటి తేడా తప్పించి రెండూ దాదాపు ఒకే అర్థాన్నిస్తాయి.

The college is closed = మూసి ఉంది = మూతబడి ఉంది - సెలవుల్లో ఉంది.

The college has been closed = మూయబడింది - మూసేశారు, సెలవులకు.

ఈ రెండింటి మధ్య తేడా ఏముంది? దాదాపు ఒకటే కదా?

If you work hard, you will come up = నువ్వు శ్రమ పడినట్లయితే పైకొస్తావు.

If you start now you will reach there at 10 = నువ్విప్పుడు బయలుదేరితే, పదింటికి చేరతావు.

**If** = 2) Whether. అవునోకాదో అనే అర్థంతో వాడతాం.

i) No body knows if/ whether he comes or not - అతడొస్తాడో రాడో ఎవరికీ తెలియదు.

ii) Ask him if/ whether he likes it or not = దానిని అతడు ఇష్టపడుతున్నాడో లేదో అడుగు.

**Q.** Conditional sentences గురించి వివరించగలరు.

**A.** Conditional sentences అంటే conditions (= షరతులు) తెలిపే sentences. వీటిని గురించి ఇదివరకటి Lessons లో (25-40) విపులంగా ఉంది. మరోసారి క్లుప్తంగా వివరిస్తున్నాం.

Conditional sentences సాధారణంగా If, unless, when, where, before, after, suppose, provided లాంటి మాటలతో ఉండే clauses ను కలిగి ఉంటాయి.

Conditional sentences కు అర్థం ఎప్పుడూ అది జరిగితేనే/ జరిగినప్పుడే ఇది జరుగుతుంది, అది జరగకముందు ఇది జరగదు, అది జరిగి ఉంటేనే ఇది జరిగి ఉండేది- లాంటి అర్థాలు వస్తుంటాయి.

If he comes home, his mother will be happy = అతడు ఇంటికొస్తే వాళ్లమ్మ సంతోషపడుతుంది. ఇందులో 'If he comes home- ఇది conditional clause- అతడు ఇంటికొస్తే, అనే షరతును తెలుపుతోంది కాబట్టి. ఇలాంటి clause ఉన్న sentence conditional sentence అంటాం. ఇదే అర్థాన్ని కింది విధాలుగా చెప్పొచ్చు

Unless he come home, his mother will not be happy = అతడు ఇంటికొస్తేగాని/ తప్ప వాళ్లమ్మ సంతోషపడదు.

When he comes home, his mother will be happy (అతడు ఇంటికొచ్చినప్పుడు వాళ్లమ్మ సంతోషిస్తుంది)

Before you pay the fees, you will not be admitted = ఫీజు కట్టకముందు/ కట్టకుంటే నిన్ను చేర్చుకోరు = After you pay the fees you will be admitted = ఫీజు కట్టిన తర్వాతే నిన్ను చేర్చుకుంటారు - (ఇదే అర్థం వచ్చేట్టు If, unless లు వాడవచ్చు)

Where there is a will there is a way = మనసుంటే మార్గముంటుంది.

Provided he takes treatment, he will improve = వైద్యం చేయించుకుంటే అతడు మెరుగవుతాడు.

ఇవీ conditional sentences అంటే. ముఖ్యంగా మూడు రకాల conditional sentences ఉంటాయి.

1) If he comes home, his mother will be happy = అతడు ఇంటికొస్తే వాళ్లమ్మ సంతోషిస్తుంది. ఇక్కడ అతడు ఇంటికొచ్చే అవకాశమూ ఉంది, అందువల్ల వాళ్లమ్మ సంతోషించనూవచ్చు. ఇది ప్రస్తుతం జరిగే అవకాశం ఉంది కాబట్టి, ఇది Probable present.

2) If he came home, his mother would be happy = అతడు ఇప్పుడు/ ప్రస్తుతం ఇంటికొచ్చే అవకాశం లేదు; వస్తే వాళ్లమ్మ సంతోషపడుతుంది. (ఇది ప్రస్తుతం జరగదు- అతడు రానూ రాడు. వాళ్లమ్మ సంతోషపడటమూ లేదు. ఇది Improbable present - ప్రస్తుతం జరగనిది)

3) If he had come home, his mother would have been happy = అతడు ఇంటికి వచ్చుంటే (గతంలో) వాళ్లమ్మ సంతోషించేదే- అతడు రాలేదు, వాళ్లమ్మ సంతోషించలేదు. ఇది Impossible past. ఇంకా వివరాలు కావాలంటే, Spoken English Lessons 25-40 చూడండి.

**Q.** I have to go = I have got to go = I got to go = I gotta go = నేను వెళ్ళాలి - అని చెప్పారు. వీటి గురించి వివరించగలరు.

**A.** I have to go = I have got to go = I got to go = I gotta go.

ఇందులో I have to go - American;

I have got to go - British

I gotta go - ఇది త్వరత్వరగా మాట్లాడేటప్పుడు వినపడే వాక్యం.

**Q.** కిందివాటి గురించి తెలుపగలరు.

Broil - roast; alone - lonely;

admire - appreciate; alternate - alternative;

have to - need.

**A. Broil** = పొయ్యి మంట కిందగానీ/ మీదగానీ ఇనప చువ్వల మీద మాంసం/ chicken కాల్చడం.

**Roast** = పొయ్యిమంట మీద మాంసం direct గా కాల్చడం.

**Alone** = ఒంటరిగా/ ఇంకెవరి సాయం లేకుండా

**Lonely** = బాధ కలిగించే ఒంటరితనం. Alone అంటే ఒంటరిగా అని మాత్రమే. ఒంటరితనం వల్ల వచ్చే బాధ, ఇబ్బంది alone లో స్ఫురించదు. అదే lonely అంటే ఒంటరితనం వల్ల వచ్చే బాధ/ ఇబ్బందిని ఎక్కువగా తెలుపుతుంది.

She lives alone in that big house and feels lonely = ఆమె ఆ పెద్ద ఇంట్లో ఒక్కతే ఉంటుంది. ఆ ఒంటరితనం ఆమెను బాధిస్తోంది.

**Admire** = ఒక వ్యక్తి గొప్పతనం వల్ల/ ఒక సంస్థ గొప్పతనం వల్ల మనలో వారి/ వాటి పట్ల కలిగే గొప్ప గౌరవభావం, అభిమానం.

We admire Gandhi for his truthfulness = ఆయన నిజాయతీ ఆయన పట్ల గొప్ప గౌరవ భావాన్ని, మెప్పును, అభిమానాన్ని కలిగించడం.

**Appreciate** = ఒకరి/ ఒక విషయం మంచి గుణాలను, మంచి లక్షణాలను గుర్తించి ఆనందించడం.

I appreciate her patience = ఆమె ఓర్పును నేను గుర్తించగలిగి హర్షిస్తున్నాను.

You cannot appreciate my difficulties = నా కష్టాలు నువ్వర్థం చేసుకోలేవు/ నువ్వు గుర్తించలేకపోతున్నావు.

**Alternate** = ఒకటి మార్చి ఒకటి

He comes here on alternate days = అతడిక్కడికి రోజు మార్చి రోజు వస్తాడు.

**Alternative** = ప్రత్యామ్నాయం - ఒకదాని బదులు వాడే ఇంకొకటి.

There is no alternative to hardwork = కృషికి ప్రత్యామ్నాయం లేదు. కష్టపడి పనిచేయడానికి మారు ఇంకోటి లేదు.

**Have to** = ఏదైనా చేయాల్సి రావడం

I have to go = నేను వెళ్లాలి (తప్పదు)

**Need** = అవసరం. ఇది అన్నివేళలా have to లా తప్పనిసరి అనే అర్థం రాదు.

I need to go = నేను వెళ్లాల్సిన అవసరం ఉంది. (ఇది నా అవసరం, ఎవరి ఆజ్ఞా కాదు).

**Spoken English** పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# He had a windfall in horse races





M.SURESAN



***A. Sridhar, Onipenta***

**Q.** కింది Idioms, Phrases గురించి వివరించగలరు.

To be in his low spirits:

e.g. : After his failure in the examination, he is in his low spirits

**A.** ఈ expressions లో కొన్ని Phrasal Verbs, కొన్ని idioms. అన్నీ కూడా చాలా తరచుగా వినిపించే, రాతల్లో కనిపించే expressions. తెలుసుకోవడం మంచిది.

To be in low spirits: నిరుత్సాహంగా నిరాశగా ఉండటం; పరీక్ష తప్పడం వల్ల అతడు నిరాశా నిస్పృహల్లో ఉన్నాడు.

**Q.** Blood and Iron:

e.g. : Hitler followed the policy of blood and iron.

**A.** ఈ Phrase లేదు. బహుశ, Blood and guts అనే Phrase ను పొరపాటున ఇలా రాసి ఉండొచ్చు. అర్థం - హింస (రక్తపాతం)తో కూడిన.

Policy of blood guts: హింస, దౌర్జన్యంతో కూడిన పద్ధతి.

**Q.** Cast down:

e.g. : He was cast down at the sad news of his failure.

**A.** Cast down = దుఃఖంతో ఉండటం. తన వైఫల్యాన్ని గురించి విని అతడు దుఃఖపడిపోయాడు.

**Q.** To come of age:

e.g. : He was married when he come of age.

**A.** To come of age = యుక్త వయసు రావడం; పరిణతి చెందడం. యుక్త (సరైన) వయసు రాగానే అతడు పెళ్లాడాడు.

**Q.** To catch tartar:

e.g. : Germany caught a tartar in Russia when she tried to frighten her.

**A.** To catch a tartar- ఈ Phrase లేదు. Tartar (ఇది కూడా ఈ సందర్భంలోని అర్థంతో వాడుకలో లేదు, ఈ రోజుల్లో, పాతబడిపోయింది).

Tartar కు ఇక్కడి అర్థం- కఠినంగా ఉండే యజమాని. (My boss is a tartar). (Tartar కు ఎక్కువగా వాడే అర్థం. పళ్లమీద ఏర్పడే గట్టి పెంకులాంటి పదార్థం). మీ Sentence కు అర్థం - జర్మనీ రష్యాను భయపెట్టే ప్రయత్నంలో రష్యా ఒక కఠినమైన యజమానిగా కన్పించింది. అర్థం సరిగ్గా రావడం లేదు.

**Q.** A Damocle's sword

**A.** Damocle's Sword = వదలని ఆందోళన, భయం కలిగించే విషయం.

In Private companies the fear of losing the job is like a Damocle's sword = ప్రైవేట్ కంపెనీల్లో ఉద్యోగం పోతుందనే భయం క్షణక్షణం/ ఎప్పుడూ మనల్ని వెంటాడుతూ ఉంటుంది.

**Q.** Forgood

**A.** Forgood = permanently (శాశ్వతంగా)

She has left India forgood = ఆమె భారత్ వదలి వెళ్లింది, మళ్లీ రాదు. I give it to your forgood = నీకు నేనది ఇచ్చేస్తున్నాను, పూర్తిగా. ఉంచుకో.

**Q.** To get the upper hand

**A.** To get the upper hand = పైచేయి కావడం. India has got the upper hand in the current series = ఇప్పుడు జరుగుతున్న పందేల్లో, భారత్‌ది పైచేయిగా ఉంది - ఆధిక్యతలో ఉంది.

**Q.** To give the cold shoulder

**A.** To give the cold shoulder = సరైన గౌరవం, స్నేహం చూపకపోవడం. He gave me the cold shoulder/ cold shouldered me at his wedding = అతడి పెళ్లిలో నన్నతడు సరిగ్గా చూడలేదు/ పలకరించలేదు.

**Q.** Heals of Achhiles

**A.** Achilles' heel (Heals of Achhiles కాదు) = ఒకరికున్న బలహీనత

Corruption is the Achilles' heel of our politicians = మన రాజకీయ నాయకుల బలహీనత అవినీతి.

**Q.** To look blue

**A.** To look blue = నిరాశచెందడం

**Q.** To look one's laurels

**A.** Look to one's laurels = (To look one's laurels కాదు) = పొందిన ఘనతను నిలబెట్టుకోవడం/ పోగొట్టుకోకుండా ఉండటం.

Sachin should look to his laurels and score another century = తను సాధించిన ఘనతను కాపాడుకునేందుకు సచిన్ మరో century కొట్టాలి.

**Q.** To play the gallery.

**A.** To play to the gallery (to play the gallery కాదు) = ప్రజల/ ప్రేక్షకుల మన్ననలు పొందేందుకు ఏదైనా (మంచైనా, చెడైనా) చేయడం/ చెప్పడం

When he made those dirty jokes he was playing to the gallery = ప్రేక్షకుల/ ప్రజల ముఖ్యంగా చవకబారు jokes కు ఆకర్షితులయే ప్రజల మెప్పు కోసం ఆయన ఆ jokes చెప్పాడు.

(అంతగా ఆలోచించలేని, మంచి చెడుల తారతమ్యం అంతగా పట్టించుకోనివారిని మెప్పించడం కోసం ఏదైనా చెప్పడం/ చేయడం)

**Q.** To rub (some one) (up) the wrong way

**A.** To rub some one the wrong way = కోపం కలిగించడం

You rub him the way if you talk of his failure = అతడి వైఫల్యాల గురించి మాట్లాడితే అతడికి కోపం వస్తుంది.

**Q.** To take the bull by the horns

**A.** To take the bull by the horns = ఏదైనా సమస్యను ధైర్యంగా ఎదుర్కోవడం

He decided to take the bull by the horns and faced the police bravely.

**Q.** To take one's life in one's hands (To run a great risk) e.g. : I took my life in my hands and asked for a rise in salary

**A.** Take life in your own hands = ప్రమాదంలో పడటం/ ప్రమాదం కొనితెచ్చుకోవడం

You take life in your hands when you swim across in floods = వరదలో ఉన్న నదిలో ఈదడం ప్రమాదం కొనితెచ్చుకోవడమే.

మీ sentence = జీతం పెంచమని అడిగి ప్రమాదం కొనితెచ్చుకున్నాను.

**Q.** A windfall (Unexpected good fortune).

**A.** Windfall income = అనుకోకుండా పెద్దమొత్తంలో డబ్బు పొందడం (Lottery లాంటి వాటి ద్వారా)

He had a windfall in horse races last year = కిందటేడాది అతడికి గుర్రప్పందాల్లో పెద్దమొత్తంలో డబ్బు వచ్చింది.

**Q.** Yes men (A person who obeys).

**A.** పైవాళ్లు చెప్పింది చెప్పినట్లు విధేయతతో చేసేవాళ్లు, Yes men. All congressmen are 'yes men' to Mrs. Sonia Gandhi.

***D. Aruna Ramesh, Choppadandi.***

**Q.** కింది తెలుగు పదాలకు సరైన English పదాలను తెలపగలరు.

1. పుణ్యం
2. మట్ట (అరిచేయి వెనుకభాగం)

**A.** 1. Virtue (Virtue కు ఇంకో అర్థం సుగుణం)

2. Back of the hand

**Q.** I saw a little brown mouse

దీనిలో mouse - Noun, brown - adj, little - adv కదా? కానీ, little అనేది adj అని పదోతరగతికి సంబంధించిన ఒక గైడ్‌లో ఉంది.

**A.** ఇక్కడ little, adjective కదా? ఒక మాట ఒక adjective అర్థాన్ని ఎక్కువ చేసినప్పుడు అది adverb. ఇక్కడ little, brownను గురించి చెప్పడం లేదు. అది, mouse నే వర్ణిస్తోంది. కాబట్టి, అది adjective మాత్రమే అవుతుంది.

***E. Anil, Bapatla.***

**Q.** వార్తాపత్రికల్లో కొన్ని వాక్యాలు (కొటేషన్స్) చదివేటప్పుడు త్వరగా అర్థం చేసుకోలేకపోతున్నాను. ఉదాహరణకు..

1. A man wonders what the future holds in store, a woman wonders what the stores hold in future.
2. Everyone needs someone who knows their dreams by heart.

ఇలాంటివాటిని ఎలా అర్థం చేసుకోవాలి? Grammatical గా ఏవైనా పద్ధతులు పాటించాలా? వివరించగలరు.

రెండో sentence లో their అనేది ఏ subject కి సంబంధించింది?

**A.** 1. ఇక్కడ 'wonder' అంటే ఏదైనా విషయాన్ని ఆలోచించి అర్థం చేసుకునే ప్రయత్నం చేయడం.

What the future holds in store = ముందు ముందు జరగబోయే విషయాలు

What the stores hold = ఇక్కడ hold కు అర్థం కలిగి ఉండటం.

ఈ వాక్యం చాలా చమత్కారంగా ఉంది. అర్థం: మగవారు ముందుముందు తమకు జరగబోయేదేంటో అని ఆలోచిస్తే, స్త్రీలు stores (షాపుల)లో మనకేం దొరుకుతుందో అని ఆలోచిస్తారు (మగవాళ్లు భవిష్యత్‌ను గురించి, ఆడవాళ్లు store లో ఏవి ఎంత ధరకు దొరుకుతాయో అని ఆలోచిస్తారు)

2. ప్రతివాళ్లకూ తమ కలలను బాగా తెలిసినవాళ్లు కావాలి అని, అయితే sentence అర్థం, అంత స్పష్టంగా లేదు. దీనికి రెండో అర్థం. తమ కలల గురించి బాగా తెలిసినవాళ్లు ప్రతివాళ్లకూ అవసరం.

Every one, one, each one, some one - ఇలాంటి వాటికి ప్రత్యామ్నాయంగా he/ she అని వాడకుండా they, their లు వాడుతున్నారు. లింగ వివక్ష చూపకుండా ఉండేందుకు.

A good actor is happy when the audience praise their action.

ఇక్కడ their 'an actor' కు ప్రత్యామ్నాయం. గతంలో their కు బదులు his వాడేవాళ్లు. ఇది పురుషాధిక్యత ప్రదర్శించినట్లవుతుంది కాబట్టి, his/ her అని వాడేవాళ్లు. కానీ మాటిమాటికీ, he/ she అనడం కష్టం కాబట్టి they, them, their అంటున్నారిప్పుడు.

***Vasundhara, Mahaboobnagar.***

**Q.** Please translate the following sentences into English.

1. నేను ఇంటికి వెళ్లి వచ్చాను.
2. మమ్మల్ని వీధిపాలు చేశారు.
3. నీ రుణం ఎలా తీర్చుకోను?

**A.** 1. I have been to home/ I have returned from home

2. They have put us out on the street

3. How can I requite you?/ How can I recompense you?

**Q.** a) He gave speach on the dais/ from the dais/ over the dais.

b) Literally correct- Please give the meaning.

**A.** a) He made (not 'gave') the speech from on the dais, is correct.

b) Literally correct. exactly (నిజంగానే)

There are literally a lakh people - నిజంగానే లక్ష మంది ఉన్నారు. మామూలుగా బాగా ఎక్కువగా అనే అర్థంతో, లక్ష అంటాం. Literally a lakh అంటే చాలా ఎక్కువ అనే అర్థం కాకుండా, నిజంగానే (అంటే మనం లెక్కపెట్టి చెప్పడం) అని.

**Q.** Is the following sentence correct?

The teacher should make the students to sit in proper places.

I think the preposition 'to' is not necessary- explain.

**A.** The teacher should make the students to sit in proper places - This sentence is wrong. In such sentences, 'make' is not followed by 'to'- what you think is correct, but here 'to' is not a preposition, but a part of the infinitive, to sit.

***N. Pentaiah, Secunderabad.***

**Q.** a) What will be the next position if you go there?

b) What would be the next position if you go there?

**A.** Correct sentences.

1) What will be the position if you go there? (next position కాదు) - మీరక్కడికి వెళ్తే పరిస్థితి ఎలా ఉంటుందో- correct

What would be the position (next position కాదు) - దీనికర్థం లేదు) If you went there? (go there కాదు) = నువ్వు వెళ్లడం అంటూ జరిగితే (నువ్వు వెళ్లే పరిస్థితి లేదు) అక్కడి పరిస్థితి ఎలా ఉంటుంది? - పై అర్థాల తేడాతో, మార్పులతో రెండు వాక్యాలూ correct.

**Q.** a) Why you people are doing the something again?

b) Why are you people doing the something again?

**A.** a) Wrong as a question - not the correct form of a question. b) correct.

**Q.** What necessary steps do you want to take? What, do ల మధ్య necessary steps (Noun) ఉంది ప్రశ్న ఎలా అవుతుంది?

**A.** ప్రశ్న కాక మరేమవుతుంది? English Questions లో, verb లో రెండు మూడు మాటలుంటే- ఇక్కడి verb, 'do want'), questionలో ఎప్పుడూ, verb లోని మొదటి మాట (ఇక్కడ do) ముందు, దాని తర్వాత Subject (ఇక్కడ subject, you), ఆ తర్వాత verb లోని ఇతర మాట(లు) వస్తాయి. ఆ విధంగా What necessary steps do you want to take? సరైందే కదా?

**Q.** Why would it be considered I know. వరుసగా Why, would లు ఎందుకు వచ్చాయి (ప్రశ్నా? స్టేట్‌మెంటా? )

**A.** Why, would లు వరుసగా ఎందుకు రాకూడదు?

e.g. : Why would he do it? (వాడెందుకు చేస్తాడది? ) అయితే మీ sentence: 'Why would it be considered, I know'. ప్రశ్న కాదు. statement (విషయాన్ని తెలిపే sentence). Statementలో verb (ఇక్కడ would be considered), subject (ఇక్కడ it) తర్వాత వస్తుంది. కాబట్టి ఈ sentence correct form.

Why it would be considered, I know = అది ఎందుకు పరిశీలించబడుతుందో నాకు తెలుసు.

**Q.** What your opinion is on this ?

What is your opinion on this?

**A.** What your opinion is on this = తప్పు వాక్యం.

What is your opinion on this? - correct.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish



# He ended up as the dark horse




M.SURESAN

**Ram:** That surprises me very much. I never knew he was capable of such an achievement. Did he really stand first in the University? Is it true?

(నన్నది చాలా ఆశ్చర్యపరుస్తోంది. అంత ఘనకార్యం సాధిస్తాడని నాకు తెలీదు. నిజంగానే యూనివర్సిటీలో మొదటివాడుగా వచ్చాడా? నిజమేనా?)

**Syam:** The news certainly took me by surprize too. He ended up as the dark horse.

(నన్ను కూడా ఈ వార్త ఆశ్చర్యంలో ముంచెత్తింది. అతడు ఎవరూ ఊహించని రీతిలో విజేతగా నిలిచాడు.)

**Ram:** You know something? Even his father said he had not expected it. He was amazed as well at his son's distinction

(ఈ విషయం తెలుసా నీకు? వాళ్ల నాన్న కూడా తానిది ఊహించలేదని చెప్పాడు. తన కొడుకు సాధించిన ఈ విశిష్టతకు ఆశ్చర్యపోతున్నాడు.)

**Syam:** That doesn't surprize me. Bye the bye how is Sadanand? The news of his serious heart condition startled me. I never even imagined that he was ill at all, as he himself did not know about it.

(అదేం నన్ను ఆశ్చర్యపరచలేదు. అదిసరే కానీ, సదానంద్ ఎలా ఉన్నాడు? అతడి గుండె సంబంధిత సమస్య నాకు భయాందోళన కలిగించింది. అతడికా జబ్బుందని అతడికి కూడా తెలీదు.)

**Ram:** I was, as well. I am unable yet to get over the shock of the news. He looked so robust and healthy you know.

(ఆ వార్త కలిగించిన దిగ్భ్రమనుంచి నేనింకా తేరుకోలేదు. అతడు అంత దృఢంగా, ఆరోగ్యంగా కనిపించేవాడు కదా?)

**Syam:** So did he, infact. I was lost for words, in fact, when I heard it.

(అవును. అలా ఉండేవాడు. అది వినగానే నాకు మాటలు రాలేదు.)

**Ram:** It is incredible that a few days before he joined hospital he had returned from a long trip abroad and had had no trouble whatever.

(ఆస్పత్రిలో చేరడానికి రెండు, మూడు రోజుల ముందే అతడు సుదూర విదేశీ ప్రయాణం నుంచి తిరిగొచ్చాడు, అప్పుడేం బాధ లేదు.)

**Syam:** The change in his condition is really shocking. Hope he will recover soon.

(అతడి పరిస్థితిలో మార్పు నిజంగా ఆశ్చర్యకరం. త్వరలోనే కోలుకుంటాడని ఆశిద్దాం.)

**Ram:** His father had had the same problem but had had an astounding recovery. Do you remember?

(వాళ్ల నాన్నకు కూడా ఇదే సమస్య ఉండేది, కానీ ఆయన ఆశ్చర్యకరంగా కోలుకున్నాడు. గుర్తుందా?)

**Syam:** I certainly do. Hope there would be as sudden turn around in Sadanand's condition too.

(గుర్తుంది. అలాంటి మలుపే సదానంద్ ఆరోగ్యం విషయంలో కూడా ఉంటుందని ఆశిద్దాం.)

**Notes: 1)** Achievement = సాధించిన ఘనత.

**2)** Dark horse - emerge as a dark horse అనే expression గా వాడతాం.

అర్థం: గెలుస్తారని కలలో కూడా అనుకోనివాళ్లు గెలిచి, అందర్నీ ఆశ్చర్యపరచడం.

In the last elections, she emerged as the dark horse = గత ఎన్నికల్లో ఆమె ఎవరూ ఊహించని విధంగా గెలుపొంది అందర్నీ ఆశ్చర్యపరిచింది.

**3)** Robust = దృఢంగా (ఆరోగ్యం విషయంలో) ఉండటం

**4)** A turn around = మలుపు/ మార్పు

*Now look at the following sentences from the conversation above:*

1) That surprises me very much
2) The news took me by surprize too
3) The news of his serious heart condition startled me
4) I am unable to get over the shock
5) I was lost for words when I heard about it.
6) It is incredible that a few days before he joined the hospital...
7) He had had an astounding recovery

ఈ వాక్యాల్లో Underline చేసిన మాట లన్నీ ఆశ్చర్యం, దిగ్భ్రమ లాంటి వాటిని తెలిపే మాటలు. వాటిని గురించి ఇప్పుడు వివరంగా తెలుసుకుందాం.

**1)** Surprise = ఆశ్చర్యం/ ఆశ్చర్యపరచడం

a) His coming here at that time was a surprise = అతడక్కడికి ఆ సమయంలో రావడం ఆశ్చర్యమే.

b) My passing the test in the first attempt is a surprise even to me = మొదటి ప్రయత్నంలోనే నేను ఉత్తీర్ణుడిని కావడం నాకే ఆశ్చర్యంగా ఉంది.

c) His sudden arrival surprised everyone = అతడి ఆకస్మిక రాక అందర్నీ ఆశ్చర్యపరిచింది.

d) Her decision to divorce him gave us a surprise = అతడికి విడాకులివ్వాలనే ఆమె నిర్ణయం మా అందరినీ ఆశ్చర్యపరిచింది.

**2)** Take somebody by surprise అన్నా కూడా ఆశ్చర్యం కలిగించడమే.

a) I want to take him by surprise by sending a present = ఒక కానుక పంపడం ద్వారా అతడికి ఆశ్చర్యం కలిగించాలనుకుంటున్నా.

b) His sudden resignation took every one by surprise = ఉన్నట్టుండి అతడు రాజీనామా చేయడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

**3)** Startle: అనుకోకుండా జరిగే చెడు వల్ల కలిగే భయం/ ఉలిక్కిపడేట్టు చేయడం.

a) The noise of the door opening at the dead of the night startled me = అంతరాత్రివేళ తలుపు తెరుచుకున్న చప్పుడు నాకు భయం, ఆశ్చర్యం కలిగించింది/ నన్ను ఉలిక్కిపడేలా చేసింది.

b) God! you startled me by your sudden appearance as if from nowhere = ఎక్కడ్నుంచో నువ్వు ఉన్నట్టుండి ఊడిపడ్డట్టు కనిపించడం నన్ను ఉలిక్కిపడేలా చేసింది.

c) The child was startled at the sudden peal of thunder = ఉరుము శబ్దానికి బిడ్డ ఉలిక్కిపడింది.

**4)** Get over = దిగ్భ్రమ/ Shock లాంటి వాటినుంచి తేరుకోవడం - దాదాపు ఎప్పుడూ not తోనే తేరుకోవడం లేదు అనే అర్థంతో వాడతాం/ కోలుకోవడం.

a) She is still unable to get over the shock of her child's sudden death = తన బిడ్డ ఆకస్మిక మృతివల్ల కలిగిన దిగ్భ్రాంతి నుంచి ఆమె ఇంకా కోలుకోలేకపోతోంది.

b) She can't get over how much her husband spends = తన భర్త పెట్టే ఖర్చు కలిగించే ఆశ్చర్యంలోంచి ఆమె తేరుకోలేకపోతోంది.

**5)** Be lost for words/ be at a loss for words = మాటలు రానంత ఆశ్చర్యపోవడం/ దిగ్భ్రమ కలగడం - అవాక్కవడం.

a) When she heard of the accident involving her father, she was at a loss for words/ was lost for words: తన తండ్రికి జరిగిన ప్రమాదం గురించి వినగానే ఆమెకు మాటలు రాలేదు/ అవాక్కయింది.

b) I was lost for words/ at a loss for words when he offered me such a huge sum of money = అంత పెద్ద మొత్తం నాకాయన ఇస్తుంటే, నాకు మాటలు రాలేదు/ నేను అవాక్కయ్యాను.

**6)** Incredible = నమ్మశక్యంకాని (అయినా నిజం)

a) Sachin's record as a batsman is incredible = Batsman గా సచిన్ ఘనత నమ్మశక్యం కానిది (కానీ నిజం)

b) Her story of the loss of her jewellry and its recovery intact is incredible = ఆమె నగలు పోగొట్టుకోవడం, తిరిగిపొందడం గురించి ఆమె చెప్పే కథ నమ్మశక్యంగా లేనంత నిజం.

**7)** Astounding = greatly surprising/ stunningly surprising - సంభ్రమంతో/ దెబ్బతిన్నంత భావం కలిగించే ఆశ్చర్యం - ఆశ్చర్యాలకు వాడే English మాట లన్నిటిలో ఇది ఎక్కువైంది. - అబ్బుర పరిచేంత

a) Tendulkar's feat of 49 best centuries is really astounding = టెండూల్కర్ 49 best centuries test లలో సాధించిన ఘనత అబ్బురపరిచేదిగా ఉంది.

b) The company has earned and astounding 50% increase in profits = ఆ కంపెనీ ఆశ్చర్యంగొలిపే/ అబ్బురపరిచే 50 శాతం పెంపును సాధించింది లాభాల్లో.

(Arjuna's/ Karna's astounding skill at archery) (archery = విలువిద్య)



*T. Siva, Nandikotkur.*

**Q.** కిందివాటిలో సరైన వాక్యాలను (a/ b) సూచించి, వివరించగలరు.

1. (a) He was happy to see his son grow up strong and brave.
   (b) He was happy to see his son growing up strong and brave.
2. (a) I take it as a privilege ...
   (b) I take it a privilege ...
3. (a) He is stronger than me.
   (b) He is stronger than I.
4. (a) He arrived home.
   (b) He arrived at home.
5. (a) I met an old friend at a dinner party.
   (b) I met with an old friend at a dinner party.
6. (a) He is studying V class.
   (b) He is studying in V class.
7. (a) In case of working hard, you will pass.
   (b) In case of your working hard, you will pass.
8. (a) She is a 5 feet 3 inch girl.
   (b) She is a 5 feet and 3 inches girl.
9. (a) I heard someone laugh in the next room.
   (b) I heard someone laughing in the next room.
10. Eating and sleeping are not the be all and end all of life.
    Question tag: (a) Is it? (b) Are they?

**A.** 1. Both (a) & (b) are correct. see, hear, water, notice లాంటి verbs తర్వాత .. ing form గానీ, I Regular doing word కానీ రావచ్చు
2. (a) is correct
3. (b) is formal, (a) is informal. Rule ప్రకారం (formal గా) అయితే, (a) correct. కానీ రాను రాను, (b) కూడా వాడుతున్నారు. పూర్తిగా తప్పనలేం.
4. (a) - American; (b) British both are correct
5. (a)- British; meet with - American = to meet somebody especially for discussions.
6. (a) is correct. (b) is old - fashioned
7. (a) and (b), both are wrong
   The correct sentence is: In case you work hard you will pass.
8. (a) is correct
9. (a) and (b) both are correct. Refer to explanation given for your I question
10. The verb is 'are', so the question tag is: aren't they?

**Q.** కింది వాటికి (full forms కు) contracted forms, వాటి pronunciations తెలపగలరు.

1) She will 2) We shall 3) This is 4) I have 5) will not 6) Shall not.

**A.** 1) She'll 2) No contraction 3) No Contraction 4) I've 5) I won't 6) Shan't

**Q.** కింది వాటికి antonyms తెలియజేయగలరు.

1) Suddenly 2) Modesty 3) Simplicity 4) Ignorant 5) Worry 6) Frightened 7) Entire 8) Wonderful 9) Pious 10) Melodious 11) Tolerance 12) Sacred

**A.** 1) Gradually 2) Immodesty/ Pride 3) Complexity 4) Wise/ enlightened 5) Delight 6) Reassured 7) Partial 8) Ordinary 9) Impious 10) Raccous/ grating 11) Intolerance 12) Profane.

*Srinu, Darsi.*

**Q.** కింది వాక్యాలను తెలుగులో ఎలా రాయాలో తెలపగలరు.

★ The union government had to eat humble pie and reinstate N.T.R.

**A.** To eat humble pie = చేసిన తప్పు వల్ల సిగ్గుపడే పరిస్థితిలో ఉండటం.

కేంద్ర ప్రభుత్వం చేసిన తప్పుకు సిగ్గుపడి N.T.R.ను తిరిగి పదవిలో నియమించాల్సి వచ్చింది.

**Q.** Freedom can't be absolute

**A.** పరిపూర్ణ (ఆంక్షలు ఏమాత్రం లేని) స్వాతంత్ర్యం అనేది లేదు.

**Q.** It ought to be the place where the imagination is fired.

**A.** మన ఊహా శక్తిని రేకెత్తించే (fire our imagination) ప్రదేశంగా ఉండాలి అది.

**Q.** Children do not have their own opinions and they should not be forced to parrot their parents political beliefs. The exposer to physical danger not withstanding.

**A.** పిల్లలకు తమకంటూ ఏ అభిప్రాయాలూ ఉండవు. భౌతిక/ శారీరక ప్రమాదం ఉన్నప్పటికీ, తల్లిదండ్రులు, తమ రాజకీయ అభిప్రాయాలను పిల్లలచేత చిలక పలుకుల్లా బలవంతంగా పలికించకూడదు.

(Parroting others' opinions = ఇతరుల అభిప్రాయాలను మనం వినిపించడం (చిలకపలుకుల్లా), సొంత ఆలోచన లేకుండా) అయితే మీ sentence కు అర్థం సరిగ్గా రావడం లేదు. ఇందులో not with standing వాడుక సరిగ్గా లేదనిపిస్తోంది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# There's nothing wrong in trying





M.SURESAN



***K. Venkanna, Khammam.***

**Q.** నేనొక ఉపాధ్యాయుడిని. Lower classes కు English నేర్పే టప్పుడు correct pronunciation తో నేర్పాలా? మామూలుగా నేర్పాలా? ఒకవేళ pronunciation తో పాటు నేర్పడం మంచిదైతే ఏ దేశ pronunciation నేర్పాలి?

| | |
|---|---|
| **e.g. :** Lock | lɒk - లాక్ - బ్రిటిష్; |
| | lɑ:k - లాక్ - అమెరికా |
| Dog | dɒk - dok - డాగ్ - బ్రిటిష్; |
| | dɔ:k - డాగ్ - అమెరికా |

ప్రస్తుతం అమెరికా pronunciation కు ఆదరణ పెరుగుతున్న దృష్ట్యా ఏ pronunciation నేర్పాలి. దయచేసి తెలుపగలరు.

**A.** Lower Classesకు English నేర్పేటప్పుడు Correct pronunciation నేర్పడం మంచిదే, కానీ పట్టు బట్టకుండా ఎంత వీలయితే అంతమటుకు నేర్పితేచాలు. British pronunciation నేర్పడమే మంచిది. ఎందుకంటే మనదేశంలో ఎక్కువ అనుసరిస్తున్నది దీన్నే కాబట్టి. American pronunciation కు ఆదరణ పెరగడం అంటూ ఏంలేదు, మనం అనుకోవడమే. మన English News Channels, AIR News Bulletins అన్నింట్లో British English and pronunciation నే వాడతారు.

***O.Veerraju, Guntur.***

**Q.** I have just visited your room, you are not available there, your phone is ringing but not answering. Me waiting at Raju. ఈ వాక్యానికి తెలుగు అర్థం తెలపగలరు.

**A.** నేను నీగదికిప్పుడే వచ్చాను. నువ్వులేవు. నీ phone మోగుతోంది కానీ బదులేం రావడంలేదు. నేను రాజు వాళ్లింట్లో నీకోసం కాచుకుని ఉన్నాను.

ఇలా అని మనం అర్థం చేస్కోవాల్సిందే కానీ, కచ్చితంగా ఈ అర్థం వస్తుందని చెప్పలేం.

Me/ I am waiting at Raju's (Raju కాదు) అన్నపుడు 'నేను రాజు ఇంట్లో ఎదురు చూస్తున్నాను', అంటే మీరు ఎవరింటికి వెళ్లారో అక్కడినుంచి తిరిగి వెళ్లిపోయి నట్లే/ ఇంకెక్కడలేరనే కదా? అలాంటప్పుడు Phone is ringing అనం. The phone was ringing అంటాం. అలాగే you are not available (ఇప్పుడు నువ్వక్కడ లేవనికదా? ) ఇదీ సాధ్యం కాదు. మొత్తం Sentenceను ఇలా మారిస్తే అర్థం సరిగా ఉంటుంది.

'I had visited your room and you were not there; Your phone was ringing but not answering. Me waiting at Raju's'. ఇందులో కూడా అంత సరైన భావం రావడం లేదు. మీరు అనుకున్న భావం ఏంటో స్పష్టంగా తెలిపితేగానీ, sentence ను correct చేయలేం. ఇప్పుడున్న sentence అయితే మాత్రం సరిగా లేదు.

**Q.** On అనే preposition గురించి ఒక పుస్తకంలో ఇలా ఉంది. Supported by sb/sth: She was standing on the foot. e.g. : Try lying on your back. e.g. : Hang your coat on that hook.

**A.** On = Supported by somebody (sb)/ something (sth) - అంటే ఒకరిమీద/ ఒకదానిమీద ఆనుకుని (= supported by) ఉన్న అని.

1) She was standing on the foot = పాదం మీద నిలబడి ఉంది.

2) మీ coat ను వంకీమీద (తెలుగులో వంకీకి అంటాం) తగిలించండి.

**Q.** By అనే preposition గురించి > near sb/ sth. At the side of sb/ sth. Beside sb/ sth: a house by the river. e.g. : The Telephone is by the window. come and sit by me. అర్థాలు తెలుపగలరు.

**A.** By = 1) సమీపంలో [Near somebody (sb)/ something (sth)] = ఒకరి, ఒకదాని సమీపంలో/ దగ్గర. 2) ఒకవైపు.

3) Beside somebody (sb)/ something (sth) = ఒకరి పక్కన/ ఒకదాని పక్కన. ఎక్కువ 'by'ను మూడో అర్థం (పక్కన)తో ఎక్కువగా వాడతాం.

A house by the river = నది పక్కన - నది ఒడ్డున/ నది సమీపంలో/ నదీ తీరాన ఉన్న ఇల్లు.

The telephone is by the window = ఆ telephone కిటికీ పక్కన/ కిటికీకి దగ్గర్లో ఉంది.

***G. Ashok, Godhur.***

**Q.** This is my uncle Kishan లో This is ను వస్తువును చెప్పడానికి వాడతాం. వ్యక్తి గురించి చెప్పడానికి 'He is' వాడాలి కదా!

**A.** 1) ఇక్కడ 'this is ...' అనడమే correct, English usage (వాడుక) ప్రకారం, ఒకర్ని పరిచయం చేసేటప్పుడు, ఒకరిని గురించి, ఆయన ఫలానా అని చెప్పడానికి, 'He is ..' అనికూడా అంటాం.

**Q.** 4th లో 'th' ను కొంచెం పైకి ఎందుకు రాయాలి?

**A.** 4 సంఖ్య (number), 'th' దీనికి చేర్చే అక్షరాలు. 4 అనే సంఖ్యలో 'th' భాగం కాదు కాబట్టి.

**Q.** ఆఫ్టాల్ (After all) అంటే ఏమిటి?

**A.** After all = 1) ఏదేమయినా. Indians won the match, after all. 2) ఏదైనా వివరించే విధంగా, దేనికైనా కారణం తెలిపే విధంగా. You complete it, you started it, after all = దాన్ని నువ్వు పూర్తిచేయి, ఆరంభించింది నువ్వు కాబట్టి.

**Q.** 'ప్రయత్నం చేయడం మంచిదే కదా' కు Try to best అనేది కరెక్టేనా?

**A.** There's nothing wrong in trying = ప్రయత్నించడంలో తప్పులేదు కదా. (= Trial costs nothing = ప్రయత్నంవల్ల పోయేదేంలేదు.)

**Q.** Enrollment, Enrolment- which is correct?

**A.** Enrolment (British)/ Enrollment (American)

**Q.** ఈ శీర్షికలో పేరు రాయని పాఠకులను 'ఒక పాఠకుడు' అని ప్రచురిస్తున్నారు. 'ఒక పాఠకుడు' మాటను ఆంగ్లంలో చెప్పడం సాధ్యం కాదా?

**A.** A reader అంటాం.

**Q.** Convener, Convenor, Convenior - Which is correct?

**A.** Convener, Convenor - Correct.

**Q.** కిందివాక్యాలను తెలుగులోకి అనువదించగలరు.

conditions rendering nomination invalid, Value Added Service

**A.** 1. నామినేషన్ అనర్హమవడానికి కారణమైన పరిస్థితులు.

2. అధిక విలువతో కూడిన సేవలు.

**Q.** His excellency Sri K. Rosaiah లో ' His Excellency' అనే మాట తప్పనిసరా? దీని అర్థమేమిటి?

**A.** అక్కరలేదు. ఇది ఆంగ్లపాలన వారసత్వం. అంతేకాకుండా His excellency అనేది గవర్నర్‌కు మాత్రమే. ముఖ్యమంత్రికి కాదు. ముఖ్యమంత్రిని Hon'ble (Honourable) C.M. అంటాం. His Excellency ని Ambassador కు కూడా వాడతాం. అర్థం- 'గొప్పవారైన' అనుకోవచ్చు కానీ, ఇవన్నీ పాతబడిపోయిన ఆచారాలు.

**Q.** What is 'Power Point Presentation'?

**A.** Computer (MS Power Point) సాయంతో మనం తయారు చేసి అమ్ముజూపే వస్తువులను గురించి అధ్యాపకులు ఏవైనా దృశ్యాలతో బోధించేందుకు, తెరమీద బొమ్మలు, వివరాలతో చూపే ప్రదర్శన.

**Q.** What is Functional English?

**A.** వివిధ సందర్భాల్లో మన సంభాషణల్లో వాడే English ముఖ్యంగా నిత్యజీవితంలో

**Q.** What is the meaning of 'Cell' in cell phone?

**A.** Cell అనేది Cellular కు short form/ abbreviation - వైర్ల (Wires) ఉపయోగంతో కాకుండా రేడియో సంకేతాల ద్వారా సంభాషణలు జరపడం/ సమాచారం తెలపడం లాంటి సదుపాయం.

**Q.** కొన్ని సంవత్సరాలుగా ప్రచురిస్తున్న ఈ ఫీచర్‌లో కొన్నిసార్లు పాఠకుల సందేహాలు - సమాధానాలు repeat అవుతున్నాయి. అలా కాకుండా జాగ్రత్తలు తీసుకొండి.

**A.** అలాగే.

**Q.** డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ విద్యార్హతలను ఒక్కొక్కదాన్ని వివరించండి. M.A., Ph.D., D.Sc., LL.D., D.LiH., J.P., Bar - at - Law.

**A.** M.A.. Master of Arts; Ph.D = Doctor of Philosophy, D.Sc = Doctor of Science; LL.D = Doctor of Laws, D.Litt = Doctor of Literature. J.P. = Justice of the peace (Britainకు పరిమితం). Bar-at-Law = England లో law degree.

***P. Brahmanandam, Kapileswarapuram.***

**Q.** 'Shall'ను permission అడిగేటప్పుడు ఉపయోగించవచ్చా? ఉదా: shall I come in, sir?

Shall I come in, May I come in లలో ఏది కరెక్టు?

**A.** ఉపయోగించవచ్చు. I/ Weతో. అయితే, May I come in? అనడం, Shall I come in? కంటే ఎక్కువ మర్యాదకరంగా అనుమతి అడగటం.

**Q.** Vowel Phonemes లలో 'ə' యొక్క pronunciation ఏమిటి? Pronunciation dictionary 'ə' as in 'potato', 'upper' అని ఇచ్చారు. వాటిని ఎలా పలకాలి?

**A.** ə- ఈ గుర్తు; Common అనే మాట ఉదాహరణగా తీసుకుందాం. ఇందులో చివరి భాగం 'mon' Pronunciationలో 'o' ను ఉచ్చరించే తీరు ə - ఇది 'అ' (ʌ) కాదు. ఇది వివరించడం కష్టం. నోరు తెరిచి, నాలుక ఎత్తకుండా, దీర్ఘం లేకుండా ఉచ్చరించే శబ్దమే, ə ఈ శబ్దాన్ని సూచించే తెలుగు అక్షరం లేదు.

***Mastan Rao, T.P.Palli.***

**Q.** Mercifully, the buffalo was saved just intime, but even now we have only a minute remant of the millions of animals that used to thunder magnificently over the north American Prairies.

**A.** మీరు రాసినదానికి ఏంకావాలో చెప్పలేదు. మీక్కావల్సింది. మీరు రాసినదానికి అనువాదం అనుకుంటా. ఇదిగో..'దేవుడి దయవల్ల సమయానికి మనం దున్నపోతులు అంతరించి పోకుండా రక్షించుకున్నాం. అయినా మనకిప్పుడున్న దున్నలు ఒకప్పుడు ఉత్తర అమెరికా గడ్డి భూముల్లో ఉరుమంత బ్రహ్మాండంగా రంకె వేస్తూ సంచరించిన లక్షలాది దున్నపోతుల సూక్ష్మమైన అవశేషం (అంటే చాలా తక్కువ సంఖ్య) మాత్రమే.'

**Q.** It seems that the motto of the whaling industry is "Get rich today, and to hell with tomorrow"

**A.** 'ఈ రోజుకు సంపాదించుకోగలిగినంత సంపాదించుకుందాం, రేపటికేమయినా సరే' అనేది తిమింగలాల వేట అనే పరిశ్రమ ఆశయంగా అనిపిస్తోంది. ఈనాటికి కూడా మనుషుల్లో ఎక్కువమంది మనం నివసిస్తున్న ఈ భూమిని ఎలా నాశనం చేసుకుంటున్నామనే కారణంతో ఆవద చలించిపోవడం కనిపించింది.

**Q.** He was visibly shaken by this, because even today the majority of people do not realize the extent to which we are destroying the world we live in. We are like a set of idiot children, let loose with poison, saw, sickle, shotgun and rifle, in a complex and beautiful garden that we are slowly but surely turning into a barren and infertile desert.

**A.** విషం, రంపాలు, కొడవళ్లు, తుపాకుల్లాంటి విధ్వంసక ఆయుధాలతో, వైవిధ్యంతో కూడిన అందమైన వనం లాంటి ఈ ప్రపంచంలో విచ్చలవిడిగా తిరుగుతూ, కనబడినదాన్నంతా ధ్వంసం చేసి ఈ ప్రపంచాన్నొక చవిటి భూమిలా, ఎడారిలా మార్చేస్తున్న విచక్షణ జ్ఞానం లేని మూర్ఖపు చిన్నపిల్లల్లా ఉన్నాం మనం.

***Jhansi & Mallika, Deepalapadu.***

**Q.** మీ స్పోకెన్ ఇంగ్లిష్ పాఠాలు క్రమం తప్పకుండా చదువుతున్నాం. అయినా ఇంగ్లిష్‌లో మాట్లాడలేకపోతున్నాం. కారణం కొన్ని వాక్యాలను నిర్మించలేకపోతున్నాం. ఉదాహరణకు

ought to have been, that of, to have, to have been, being.. లాంటి పదాలు వచ్చినప్పుడు వాటి అర్థం తెలియడం లేదు. ఇంగ్లిష్ పేపర్ చదువుతున్నాం. కానీ, ఇలాంటి పదాలు వచ్చినప్పుడు వాటి అర్థం తెలియడం లేదు. వీటి గురించి బాగా వివరించగలరు.

**A.** మీరు English లో మాట్లాడాలంటే అవకాశం వచ్చినప్పుడల్లా, తప్పుగానైనా బెరుకు లేకుండా మాట్లాడండి. అలా చేయడంవల్ల English లో మాట్లాడగలరు. దీంతోపాటు వీలయినప్పుడల్లా TV లో English News అర్థం కాకపోయినా, ఏకాగ్రతతో వినండి. ఛానల్ అడుగున వచ్చే Scrolling ను కూడా చదవండి. ఇవీ మీరు చేయాల్సినవి.

Ought to have been = ఇక్కడ ఉండి ఉండాల్సింది, గతంలో.

She ought to have been affectionate to her sister = ఆమె తన చెల్లిపట్ల ప్రేమతో ఉండాల్సింది (గతంలో), కానీలేదు

He ought to have been polite to his uncle = తన బాబాయిపట్ల అతడు మర్యాదగా ఉండాల్సింది (గతంలో) కానీ లేదు.

మనం ఏదైనా నీతిప్రకారం ఉండాల్సినపుడు/ చేయాల్సినపుడు, (గతంలో) Ought to have been అంటాం.

She ought to have helped the old woman = ఆ పెద్దావిడకు ఆమె సహాయం చేసి ఉండాల్సింది (కానీ చేయలేదు)

2) To have - She wishes to have a necklace = ఆమె necklace కావాలని కోరుకుంటోంది.

3) To have been - ఇందులోని 'have' కు, to haveలోని 'have'కు సంబంధం లేదు అర్థంలో. To have = కలిగి ఉండటం.

To have been = గతంలో ఉండటం- ఇక్కడ 'have' verb లో భాగం, అర్థం- beenతో కలిపి, గతంలో ఎప్పుడో ఉండటం, ఇంతవరకూ ఉండటం లాంటి అర్థాలు వచ్చేందుకు సాయపడుతుంది.

He seems to have been happy = అతడు సంతోషంగా ఉన్నట్లు (గతంలో), కనిపించింది.

She seems to have been selected = ఆమె ఎంపిక కాబడినట్లుంది (మామూలు తెలుగు: ఆమె ఎంపికయినట్లుంది) ఇలా passive voice form చేసేందుకు కూడా to have been (+ past participle) వాడతాం).

Being = 1) ఉండటం.

a) Being a Cheif minister is an honour = ముఖ్యమంత్రిగా ఉండటం గౌరవప్రదం

b) Being a teacher makes me happy = Teacher గా ఉండటం నాకు సంతోషాన్ని కలిగిస్తోంది.

2) Being = ఉండటంవల్ల

being rich, he can easily buy a car = ధనవంతుడుగా ఉండటంవల్ల, అతడు సులభంగా car కొనగలడు.

Newspaper (English) మానకుండా చదవండి. కొంతకాలం తర్వాత మీకు తెలీకుండా మీరే English మాట్లాడేస్తుంటారు.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish**






# I am altogether a stranger here





M.SURESAN

***T. Siva, Nandikotkur.***

**Q.** Attributive Adjectives, Predicative Adjectives and Participial Adjectives ను సోదాహరణంగా వివరించగలరు.

**A.** Attributive Adjectives సాధారణంగా ఇవి ఏ nouns గురించి చెబుతాయో వాటి ముందు వస్తాయి.

Hanuman is a clever guy. ఇక్కడ adjective clever కదా? ఇది, guy అనే noun ను గురించి చెబుతూ, ఆ noun ముందు వస్తోంది కదా? కాబట్టి, ఇది attributive adjective.

Sita has a beautiful sari. ఈ sentence లో కూడా beautiful అనే adjective, అది qualify చేసే noun, 'sari' ముందు వస్తోంది కాబట్టి, ఇది attributive adjective. Attributive adjective, a/ an/ the లాంటి determiners కు, noun కు మధ్యరావడం గమనించండి.

a) Sita is beautiful
b) Vandana is tall

పై రెండు sentences లో adjectives,
a) beautiful, b) tall. ఇవి, Sita, Vandana లాంటి subjectsను గురించి తెలిపే- Predicate లో భాగం కాబట్టి, అవి predicative adjectives.

The story is short - short - predicative adjective.

Participial adjectives = Adjectives in the form of the present participle and the past participle.

e.g. : a) Working women lead busy lives ఇక్కడ working అనే present participle women అనే noun ను గురించి చెబుతోంది. అంటే అది adjective చేసే పనిని చేస్తోంది, కాబట్టి 'working', participial adjective.

b) It was a drawn match
c) The stolen cash was found in his room

In (b) drawn (past participle of 'draw') qualifies the noun, 'match' - so 'drawn' is a participial adjective.

In (c), the 'stolen' (Past participle of 'steal') qualifies the noun 'Cash'. So 'stolen' is the past participle of 'steal'.

**Q.** He was tired. He felt tired. He got tired. వీటి అర్థాన్ని, ఏ సందర్భాల్లో (be) P.P./ (feel)/ P.P/ (Get) P.P. లను ఉపయోగిస్తారో వివరించగలరు.

**A.** He was tired = Hew felt tired = He got tired. వీటిల్లో దేన్నైనా ఏ సందర్భంలో అయినా వాడవచ్చు - అర్థం ఒకటే కదా?

**Q.** కిందివాటికి antonyms తెలపగలరు.

1) Menotony 2) Meagre 3) Fickle
4) Frank 5) Marvellous 6) Meek (Mild)
7) Generous 8) Straight 9) Ample
10) Praise 11) Offer 12) Quiet
13) Regret 14) Sacrifice

**A.** 1) Variety 2) Ample/ Fat/ Rich
3) Constant 4) Secretive/ durious
5) Ordinary/ Commenplace 6) Arrogant
7) Mean 8) Crooked
9) Meagre/ Scanty 10) Condemn
11) Withhod 12) Noisy/ loud/ disturbed
13) Gloat 14) Gain/ Acquire

**Q.** కిందివాటి అర్థం, ప్రయోగాలను వివరించగలరు.

1) Joyous - Joyful
2) Committee - Commission
3) Wail - Weap
4) Recover - Restore
5) Rid of - Get rid of
6) Attraction - Attractiveness
7) Altogether - All together
8) Specially - Especially
9) Business - Trade 10) Cool - Cold
11) Site - Cite 12) Illness - Disease
13) Pitiful - Pitiable 14) Camp - Campaign

**A. 1) Joyous, Joyful:** దాదాపు ఒకే అర్థం ఉన్న మాటలు. అయితే, Modern English లో joyful వాడకం ఎక్కువ. అంతే కాకుండా festivals, occasion లను ఎక్కువగా joyous అనే అంటాం. A joyous festival/ occasion. A person's moodను కూడా joyous mood అంటాం, joyful mood కంటే ఎక్కువగా.

**2) Committee** = ఏ సంస్థ అయినా కొంతమంది వ్యక్తులతో ఏదైనా సమస్య/ పరిస్థితిని పరిశీలించి, దానికి పరిష్కారం తెలిపేందుకు ఏర్పరచే సమూహం, ఇది ప్రభుత్వానికి సంబంధించి కావచ్చు ఏ ఇతర సంస్థ ఏర్పరిచేదైనా కావచ్చు. Committee చేసే సిఫార్సులను ఆచరణలో పెట్టాలనే నిబంధన ఉండదు.

e.g. : Justice Srikrishna Committee చేసే సిఫార్సులను ప్రభుత్వం అమలు చేయాలనే నిబంధనేంలేదు.

**Commission:** ఇది ముఖ్యంగా ప్రభుత్వం, ఏర్పరిచే వ్యక్తుల బృందం. ఈ బృందానికి elected bodies (ప్రజలు ఎన్నుకునే సంస్థలకు) ఉండే అధికారాలు లేనప్పటికీ commission కు కూడా కొన్ని అధికారాలుంటాయి.

**Commission విధులు:**

1) ఏదైనా చట్టం సరిగ్గా అమలవుతుందా లేదా అని పరిశీలించడం;
2) చట్ట ఉల్లంఘనలను ప్రభుత్వ దృష్టికి తేవడం, అలాంటి ఉల్లంఘనలకు బాధ్యులైన వారికి శిక్ష సూచించడం. వీటికి చట్టపరమైన అధికారాలు కూడా ఉంటాయి.

ఉదాహరణలు: 1) Human Rights Commission (మానవ హక్కుల కమిషన్)
2) Minority Rights Commissions
3) Central Water and Power Commission (కేంద్ర జల విద్యుచ్ఛక్తి Commission) etc.

**3) Wail** - రోదన ధ్వనితో (దుఃఖకరమైన గొంతుతో ఏడవటం. Weep = ఎలా అయినా ఏడవటం

**4) Recover:** 1) కోలుకోవడం 2) ఇచ్చిన వస్తువు/ డబ్బు లాంటి వాటిని తిరిగి రాబట్టుకోవడం. Restore = పునఃప్రతిష్ఠ/ పూర్వపు స్థితికి తేవడం.

e.g. : 1) He recovered from a fever a few days ago. కోలుకున్నాడు.
2) India is unable to recover its territory under chinese occupation = చైనా ఆక్రమణలో ఉన్న తన భూభాగాన్ని భారత్ తిరిగి రాబట్టుకోలేకపోతోంది.

**Restore:** 1) Democracy was restored in Pakistan after 12 years పాక్‌లో ప్రజాస్వామ్యం 12 ఏళ్ల తర్వాత మళ్లీ నెలకొంది
2) The Court Judgement has Restored their property to them = కోర్టు తీర్పు వాళ్ల ఆస్తిని వాళ్లకు తిరిగి వచ్చేలా చేసింది
3) The Police Action Restored calm in the area = పోలీస్ చర్య ఆ ప్రాంతానికి మళ్లీ ప్రశాంతతను చేకూర్చింది.

**5. Be rid of** = ఏదైనా చెడు వదలిపోవడం. Iam rid of his trouble/ my illeness= వాడి బాధ/ నా వ్యాధి వదిలింది నాకు/ వదుల్చుకున్నాను

**Get rid of** = వదుల్చుకోవడం.

Get rid of your laziness = నీ బద్ధకాన్ని వదుల్చుకో, Duryodhana wanted to get rid of all the Pandavas = పాండవులను వదిలించుకోవాలనుకున్నాడు దుర్యోధనుడు

**6) Attractive** = ఆకర్షణ.

**Attractiveness** = ఆకర్షించే స్వభావం

The Attractiveness of Natural Scenary has great attractive for poets = ప్రకృతి దృశ్యానికి ఉన్న ఆకర్షించే స్వభావం, ప్రకృతి పట్ల కవులకు ఆకర్షణ కలిగిస్తుంది.

**7) Altogether** =
1) Completely (పూర్తిగా)
2) Totally (మొత్తంగా)

He has stopped coming here altogether = ఇక్కడికతడు రావడం పూర్తిగా మానేశాడు.

I am altogether a stranger here = నేనిక్కడ పూర్తిగా కొత్తదాన్ని

Totally = మొత్తం Altogether there were 50 passengers in the compartment = మొత్తం ఆ compartment లో 50 మంది ప్రయాణికులున్నారు.

All together = అందరూ/ అన్నీ కలిసి

All together they went to see the CM. = వాళ్లందరూ కలిసి CM ను కలుసుకునేందుకు వెళ్లారు.

**8) Specially** = ప్రత్యేకంగా

a) This book is specially useful for students = ఇది ప్రత్యేకంగా విద్యార్థులకుపయోగపడే పుస్తకం (ఇంకెవరికీ కాదు)

Especially = ముఖ్యంగా/ ప్రధానంగా

b) This book is useful, especially for students = ఈ పుస్తకం ఉపయోగకరం. ముఖ్యంగా విద్యార్థులకు (ఇతరులకూ ఉపయోగం, కానీ విద్యార్థులకెక్కువగా)

**9) Business** = వ్యాపారం/దుకాణం (పెద్దఎత్తున/ చిన్న ఎత్తున)

Trade = వాణిజ్యం (భారీ వ్యాపార కార్యకలాపాలు)

**10) Cool** = చల్లగా ఉన్న/ చల్లటి (ఇది మనకు హాయినీ, సౌఖ్యాన్నీ కలిగించేది)

**Cold** = చలిగా ఉన్న/ చల్లబడిన దీనివల్ల మనకు అసౌకర్యం.

The day is cool = చల్లగా హాయిగా ఉంది.
The day is cold = చలిగా ఉంది.

**11) Site** = ఇంటిస్థలం/ ఇళ్లు కట్టుకొనేందుకు, వీలుగా ఉన్న స్థలం. She bought the site near her Office = వాళ్ల Office దగ్గర ఉన్న స్థలాన్ని ఆమె కొన్నది.

Cite = ఉదాహరణలాంటివి ఇవ్వడం

He cited Karna as a man of generosity = దాతృత్వంఉన్న మనిషి. ఉదాహరణకు కర్ణుడిని గురించి చెప్పాడాయన.

**12) Illness** = జబ్బు/ ఏ జబ్బైనా/ అనారోగ్యం.

Illness is rampant in slums = మురికివాడల్లో జబ్బులు/ అనారోగ్యం విపరీతంగా ఉంది.

Disease = ఒక జబ్బు. Cancer is a deadly disease. (Cancer- ఒక జబ్బు - మరణకారకమైంది)

**13) a) Pitiful** = దయగల. జాలితలిచే.

A Pitiful person cannot bear the sight = దయగల వ్యక్తి ఆ దృశ్యాన్ని భరించలేడు.

**b) Pitable** = దయనీయమైన /జాలి కలిగించే

His condition was pitable = అతడి పరిస్థితి దయనీయంగా/ జాలి కలిగించేదిగా ఉంది.

**14) Camp** కు, **Campaign** కు ఏమీ సంబంధం లేదు కదా? Camp = విడిది/ బస చేయడం/ తాత్కాలికంగా వేరే చోట పనిమీద ఉండటం.

a) This is their camp in summer = ఇది వారి వేసవి విడిది.
b) The officer is on camp = అధికారి పనిమీద తాత్కాలికంగా వేరే ఊర్లో ఉన్నారు)
c) The Collector is camping here tonight = Collector ఈ రాత్రి ఇక్కడ బస చేస్తారు.

Campaign = ఉద్యమం/ ఎన్నికలకు/ వస్తువులకు ఇచ్చే ప్రచారం.

a) The campaign for women's rights = స్త్రీల హక్కుల ఉద్యమం.
b) The Election campaign here begun = ఎన్నికల ప్రచారం ప్రారంభమయింది.
c) The company has launched a campaign for this product = Company ఈ వస్తువు ప్రచారం ప్రారంభించింది.

***A. Sudhakar, Peddamalla Reddy.***

**Q.** A phrase is a group of words without a verb. So, "Sashan wants the ruling party to dismiss two ministers" in this sentence, 'to dismiss two ministers' is a phrase, thus it is a simple sentence.

But I have seen in a modern grammar and usage book. 'to dismiss two ministers' is regarded as a infinitive clause, so it is a complex sentence. (two clauses) I have doubt whether it is a simple sentence or complex sentence. please clarify.

**A.** 'To dismiss two ministers' is not at all a clause, not even an infinitive clause. It is just a phrase. An infinitive is not a verb, so 'to dismiss' in 'to dismiss two ministers' is only an infinitive and therefore, 'to dismiss two ministers' is only a phrase. So 'Seshan wants the ruling party to dismiss two ministers', has only one finite verb 'wants' That means it has only one main clause and a phrase so it is undoubtedly a SIMPLE SENTENCE.

***Y. Gayathri, Asifabad.***

**Q.** కిందిపదాలకు తెలుగులో అర్థాలు వివరించగలరు.

1. Freeze frame 2. Ditty 3. Telltale
4. Philately 5. Tantalize 6. Fuzzy
7. Mainstay 8. Purloined
9. Despondency 10. Inmost
11. Courtsan 12. Embrassing.

**A. 1. Freeze Frame** = సినిమాల్లో, TV ల్లో ఏదైనా scene లో ఒకసంఘటనను నిశ్చలంగా (కదలకుండా) కాసేపు చూపించే చిత్రం (మామూలు photo లోలా)

**2. Ditty** = చిన్న గీతం (పాట) అంతగా గొప్పది కానిది.

**3. Tell tale** = కళ్లకు కనిపిస్తున్నా (దాచలేని. Tell tale signs = కళ్లకు కనిపిస్తున్న గుర్తులు (దాచలేనివి)

**4. Philately** = Postal Stamps సేకరించే hobby

**5. Tantalize** = ఒకరు కావాలనుకునే వస్తువును వారికిచ్చేలా ఆశ చూపించి ఇవ్వకుండా ఉండటం/ ఒకరు బాగా ఆశిస్తున్న విషయం అందినట్టే కనిపించి, అందకపోవడం

Success Tantalized him = విజయం అతడికి అందినట్టే కనిపించి, అందకుండా పోయింది.

**6. Fuzzy** = 3, 4 అర్థాలున్నాయి ఈ మాటకు. ఎక్కువగా వాడే అర్థం- మసక మసకగా ఉన్న/ స్పష్టంగా లేని. (Fuzzy logic - Computers ను మానవ మెదడు లాగా పనిచేయించగలిగే computer ప్రక్రియ)

**7. Main Stay** = ఆధారం. He is the mainstay of the company = ఆ Company కి అతడే ఆధారం (ముఖ్యుడు)

**8. Purloin** = తస్కరించటం/ దొంగిలించడం (అనుమతి లేకుండా ఒకరి వస్తువులను తీసుకుని, వాడేయటం)

**9. Despondency** = నిరాశ, నిస్పృహ.

**10. Inmost** = అంతరాళాల్లో- అన్నిటికంటే లోపల ఉన్న.

**11. Courtesan** = వేశ్య/ పాతకాలంలో రాజుల ఆస్థానాల్లోని దేవదాసీ

**12. Embarrasing** = ఇబ్బందిపెట్టే. It is embarrassing for a police inspector to arrest a minister's son.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# He is driving us to streets





M.SURESAN



***Rajanikanth, Mahaboobabad.***

**Q.** Please explain the following underlined word whether it is past tense or present tense.

A creative person <u>would</u> be an extraordinary.

**A.** This sentence is wrong. Extraordinary is an adjective. We don't use 'a/ an and the' before an adjective. The correct from of the sentence is:

A creative person would be extraordinary/ A creative Person would be an extraordinary person.

**Q.** Didn't I have been to home/ house? - is this sentence correct.

**A.** Wrong. The correct form is:

Haven't I been (to) home? (నేనింటికి వెళ్లలేదా? ) (You don't use, 'did and have been' in the same sentence)

**Q.** Can we use the verb 'is' after the abstract noun?

e.g. : I like her agreeableness and it <u>is</u> very good or

e.g. : My goodness <u>is</u> to help them.

**A.** Why not? Even an abstract noun can be the subject of a sentence and any verb can follow it if it can give meaning.

e.g. : Goodness (Abs. noun) <u>is</u> rare (మంచి తనం అరుదు). Here 'Goodness' is an abstract noun, and it is followed by 'is'.

'It is very good' is correct. My goodness is to help them, is also correct.

**Q.** He ate the <u>mango</u>

Is the above underlined word predicate or object?

In the book Essential English Grammar by Raymond Murphy- it is said that 'persons' shouldn't be used- Explain.

**A.** 'Mango' in the sentence is the object of the verb. It is a part of the predicate 'the mango'. Predicate = What the sentence says about the subject. It usually consists of the verb, and the object.

'... persons shouldn't be used' - The meaning of this sentence is not clear. Any noun/ noun-phrase/ noun-clause can be used as the object of a verb in a sentence.

***S. Rana Suxena, Yellandu.***

**Q.** Please clarify the following doubt.

The dog could easily have been half a mile- What is the meaning of the sentence.

**A.** The correct form of the sentence- The dog could have been half a mile away = It is possible that/ possibly the dog was half a mile away = May be the dog was half a mile away = ఆ కుక్క అర మైలు దూరంలో ఉందేమో/ ఉండ వచ్చు

**Q.** He has been dead twenty five years- is this sentence correct? as no 'for the past' or 'since' mentioned.

**A.** No. It is not. The correct form is = 'for the past twenty five years' and not 'since 25 years'.

**Q.** Please translate the following sentences into English.

1) గిల గిలా కొట్టుకొను (చేప)

2) అతడు మమ్మల్ని వీధులపాలు చేస్తున్నాడు

**A.** 1) Wriggling (రిగ్లింగ్) - Wriggle (రిగుల్) = గిలా గిలా కొట్టుకోవడం.

2) He is driving us to streets.

**Q.** I have been to home how do we make question like have you been to home?

Is the above sentence correct?

**A.** 'Have you been to home?' is not correct. 'Have you been home?' is the correct form = నువ్వింటికి వెళ్లొచ్చావా?

***A. Sudharkar, Peddamallareddy.***

**Q.** Please clarify whether these are Simple/ Complex/ or Compound- sentences.

1) A man and his partner, both plumbers, were voicing irritation at the construction site of hospital.

2) Sure enough there was a leak but they couldn't say where.

3) It would be a major job to break up the floor.

4) Just then a doctor dropped by to see how things were progressing.

5) Crawling along the floor, he soon located the leak.

**A.** 1. This is a simple sentence because there is only one main clause - 'were voicing ... hospital.'

2. Compound sentences - 2 main clauses: 1) There was a leak, 2) they could not stay there, joined by the conjunction, 'but'.

3. Simple - only one main clause - It would be a major job.

4. Complex: One main clause: Just then a doctor dropped by: + One subordinate clause - to see how things were progressing.

5. Simple: Just one main clause - He located the leak.

***K.V. Rao, Visakhapatnam.***

**Q.** కింది పదాలతో meanings లో shade of difference ను వివరించగలరు.

Difference between-

★ Don't' misunderstand me & Don't take me amiss.

★ Wear a dress & don a dress.

★ Trendy & Fashionable.

★ Modest & Humble.

★ Violent & Severe.

★ Many times & Many a time.

★ What's up & What's happened?

★ Enroute & On the way.

★ Green & Verdant.

★ Behaviour & Demeanour.

**A.** ★ Don't misunderstand me = Don't understand me wrongly

Don't take me amiss - This is not correct. The correct expression is:

Don't take <u>it</u> amiss if I give you advice = Don't misunderstand my giving you advice.

Note that 'take amiss' is followed always by 'some thing' and not by any personal pronoun/ noun indicating a person.

Please don't take <u>me</u> amiss if I don't reply immediately ( × ) ('Amiss' followed by a person)

Please don't take amiss my not replying immediately. ('amiss' followed by an idea) (✓) = నేను వెంటనే జవాబు ఇవ్వకపోవడాన్ని అపార్థం చేసుకోకు.

Please don't take <u>it</u> amiss if I don't reply immediately = నేను వెంటనే జవాబు ఇవ్వకపోతే అపార్థం చేసుకోకు (✓)

అంటే Misunderstand తర్వాత వ్యక్తి పేరు (Noun)/ He, she, it లాంటి pronouns రావచ్చు. Amiss తర్వాత వ్యక్తి పేరు/ Personal.

★ Wear a dress and don a dress

First of all, 'a dress' is for women and sometimes for children; for men it is clothes.

'Wear' something is conversational and is more common than 'don'. 'Don' is very formal and is rarely used in conversation.

(తెలుగులో దుస్తులు 'వేసుకోవడం', 'ధరించడం'- ఈ రెంటికున్న తేడానే wear కు, don కూ)

★ Trendy = <u>Very</u> fashionable. 'Trendy' is <u>informal</u>, that is, not used on official and important occasions; and in respectable circles.

★ Humble = Not proud = Modest - but there is some important difference.

When a person is humble, they are not proud, and are aware of (know)/ their weaknesses and defects <u>which they may have</u>.

When a person is <u>modest</u>, they are not proud, though they are great and <u>do not have</u> any weaknesses or defects.

(Humble గా ఉన్నవాళ్లకు తమ గొప్పతనం పట్ల గర్వం ఉండదు. అంతేకాకుండా తమకున్న అసమర్థతలు, లోపాలను వారు ఎరిగి ఉంటారు.)

Modest గా ఉన్నవాళ్లు తమ గొప్పతనం గురించి గర్వ పడరు. అంతేకాకుండా వీళ్లకేమీ అసమర్థతలూ, లోపాలూ ఉండకపోవచ్చు)

★ Violent = Using force to cause injury = హింసాత్మకమైన, దౌర్జన్యకరమైన

Severe = harsh (కఠినమైన) or strict (తీవ్రమైన)

★ Many times = Many a time = చాలాసార్లు, Many times is conversational (వ్యావహారికం). Many a time is bookish (గ్రాంథికం) and poetic.

మామూలు రచనల్లో సంభాషణల్లో many a time వాడం.

★ What's up? = What is going on?

What is happening = ఏం జరుగుతోంది?

What is (What has) happened? = ఏం జరిగింది?

★ Enroute (Pronounced on root) = on the way. Enroute is formal - కాస్త గ్రాంథికం/ పాండిత్యం

★ Green = of green colour of <u>anything</u>.

Verdant = Being green due to the colour of trees, plants and grass.

All 'green' need not be due to their being verdant (చెట్ల, మొక్కల పచ్చదనం - verdant- ఏ రకమైన పచ్చదనమైనా green)

★ Behaviour = the way a person behaves = నడవడి

Demeanour = The behaviour of a person as seen by others

= ఒకరి నడవడి ఇతరులకు కనపడే తీరు. (నడవడి కనిపించే విధం)

He maintained a dignified <u>demeanour</u> = హుందాగా ఉన్న <u>నడవడిని ప్రదర్శించాడు</u>/ చూసే వాళ్లకు అతడు హుందా <u>నడవడితో</u> కనిపించాడు.

**Q.** 'Inhibitions' అంటే ఏమిటి?

I have no inhibitions

I have no reservations

(My) 'Reflections' అంటే ఏమిటో వివరించగలరు

**A.** Inhibitions = బిడియం/ బెరుకు. మనసులో ఉన్న దాన్ని బయటికి చెప్పలేకపోవడం, ముఖ్యంగా మనకున్న బలహీనతల్లాంటిది.

The presence of their teacher caused inhibitions in them = వాళ్ల teacher సమక్షంలో వాళ్లు చెప్పాలనుకున్నది చెప్పలేకపోయారు బెరుకుతో. చేయాలనుకున్నది చేయలేకపోయారు (బిడియం, బెరుకువల్ల)

Reservations = A feeling of doubt about certain persons/ things/ plans.

= కొంతమంది వ్యక్తులు/ వ్యవహారాలపట్ల మనకున్న సందేహాలు.

I have <u>reservations</u> about the success of the unique ID Card = ప్రత్యేక గుర్తింపు కార్డు విజయం గురించి నాకు <u>సందేహాలున్నాయి</u>.

***K. Srikrishna Kumar, Bapatla.***

**Q.** I have my own Philosophy <u>about</u> such things

పై వాక్యంలో 'about' adverb/ preposition తెలప గలరు.

'about'ను adverbగా ఎలా వాడతాం, preposition గా ఎలా వాడతామో తెలపగలరు.

**A.** 'About' ఇక్కడ preposition కదా. such things ముందువాడింది. Things (noun) ముందు వచ్చింది. దాని తీరును గురించి చెబుతోంది కాబట్టి.

Adverb use of 'about' - adverb అంటే verb తెలిపే పనిని గురించి చెబుతుంది కదా?

a) He went <u>about</u> asking everyone for help. ఇక్కడ about = around = అటూ ఇటూ అనే అర్థంతో

b) The book costs <u>about</u> Rs. 100/- = ఆ పుస్తకం దాదాపు 100 రూపాయలు చేస్తుంది.

**Q.** 1. Now-a-days poor parents are facing troubles to get their daughters married due to dowry system.

2. Now a days poor parents are facing troubles to marry off their daughters due to dowry system.

పై రెండు వాక్యాల్లో ఏది correct ?

**A.** 1. Now a days poor parents are facing trouble (troubles కాదు) to get their daughters married because of/ owing to (due to కాదు) the dowry system = Now a days poor parents are facing trouble (troubles కాదు) marrying off (to marry off కాదు) their daughters, owing to/ because of the dowry system.

***Srinu, Darsi***

**Q.** M.I.M. too is keeping its cards close to it's chest.

A. M.I.M. తను ఏం చేయబోతోందీ చాలా రహస్యంగా ఉంచుతోంది. ఇక్కడి Idiom: keeping cards close to one's chest - ఎవరైనా ఏదయినా విషయాన్ని రహస్యంగా ఉంచుకోవడం - (పేకాటలో, cards (పేకల)ను ఇతరులకు కనిపించనివ్వకుండా మన రొమ్ముకు దగ్గరగా పెట్టుకోవడం)

**Q.** There is no denying that his stock had plummeted since 26/ 11.

**A.** 26/ 11 సంఘటన జరిగినప్పటినుంచి అతడి పరపతి (stock) బాగా పడిపోయింది (plummeted) అనే విషయం కాదనలేనిది.

**Spoken English** పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish






*R. Lakshmi, Darsi.*

**Q.** There are five factors which contribute to wisdom.

1. Sense of proportion.
2. Certain awareness of ends of human life.
3. Choice of ends to be pursued.
4. Emancipation from personal prejudice
5. Emancipation from the tyranny of the here and now

పై వాక్యాలకు తెలుగు అర్థం తెలపగలరు.

**A.** జ్ఞానాన్ని పెంపొందించే కీలకాంశాలు అయిదున్నాయి.

1. ఏది ఎంతవరకూ చేయాలి అనే జ్ఞానం (ఎక్కువ, తక్కువ కాకుండా తగినంత చేయడం)
2. మానవ జీవిత లక్ష్యాల అవగాహన
3. సాధించాలనుకునే లక్ష్యాలను ఎంచుకోగలగడం
4. వ్యక్తిగత దురభిప్రాయాలను త్యజించడం
5. ఇప్పటికిప్పుడు (తాత్కాలికంగా) మాత్రమే అవసరమై, తర్వాత పనికిరాని వాటిని వదిలేయడం (క్షణికమైన వాటిని త్యజించటం)

**Q.** The capacity to take account of all the important factors in a problem and to attach to each its due weight. This has become more difficult than it used to be owing to the extent and complexity of the specialized knowledge required of various kinds of technicians

పై వాక్యాలకు తెలుగు అర్థం తెలపగలరు.

**A.** వివిధ సాంకేతిక నిపుణులకు అవసరమైన ప్రత్యేక పరిజ్ఞానం ఇంతకు ముందుకంటే ఇప్పుడు ఎక్కువగా కావాల్సినందువల్ల, అదీ సంక్లిష్టం కావడంవల్ల, ఒక సమస్యకు సంబంధించిన అన్ని అంశాలను పరిగణనలోకి తీసుకుని, దేనికివ్వాల్సిన ప్రాముఖ్యం దానికివ్వడం ఇప్పుడు కష్టమైపోయింది.

(Then it used to be = ఇంతకు ముందుండే దానికంటే. Owing to = ఆ కారణంగా/ అందువల్ల)

*Srinivasa Rao, Visakhapatnam.*

**Q.** Please clarify the following doubts

Styly- stylish రెండూ adjectives కదా! రెండింటి మధ్య భేదమేమిటి? ఒకే పదానికి adjectives రెండు ఉంటాయా?

**A.** Style - English కాదు, Stylish మాత్రమే ఉంది.

**Q.** I am 25 years old

I am 25 year old ఈ రెండింటిలో ఏది కరెక్ట్?

**A.** I am 25 year old- Wrong.

**Q.** Infinitive to తరువాత ఎప్పుడూ $V_1$ మాత్రమే రావాలని చదివాను. మా సర్ చెప్పారు కూడా. మరి $V_4$ (ing form) forms ఎప్పుడు వస్తాయి? to getting/ to sketching/ to colouring ఎలా కరెక్ట్ అవుతాయో వివరించండి.

**A.** To తర్వాత మీరనే $V_4$ (...ing form) వస్తే అది infinitive కాదు. To + 'ing' form వచ్చినప్పుడు, '...ing' farm, gerund అవుతుంది. ఈ to తర్వాత 'ing' 'form' వాడటం కొన్ని verbs తర్వాతే జరుగుతుంది. అవి:

1. Look Forward to (ఆతృతతో ఎదురు చూడటం)
2. With a view to (ఆ అభిప్రాయంతో)
3. Prefer to (ఎక్కువ ఇష్టపడటం, ఒకదాని కంటే ఇంకొకదాన్ని)
4. Object to (ఆక్షేపించడం)-

ఇలాంటి verbs తర్వాత noun కానీ/ 'ing' form కానీ వస్తుంది. To + $V_1$ రాదు.

**Q.** Are you unmarried? కి బదులుగా Did you get married? అనడం కరెక్టేనా?

**A.** Are you unmarried? = Haven't you/ Have you got married? (Did you get married = ఆ రోజు/ ఆ సంవత్సరం... మీరు పెళ్లి చేసుకున్నారా? ).

**Q.** ప్రతివాక్యాన్నీ Action, verb తో కాకుండా 'Be' verb తో కూడా చెప్పొచ్చా?

**A.** చాలామటుకు చెప్పవచ్చు

Are you a cricketer? = Do you Play Cricket?

Were you a student of that college? = Did you Study in that college?

*K. Srinivasa Rao, Martur.*

**Q.** I did not know it was important. I did not write down the number. ఈ వాక్యాన్ని కింది విధంగా రాయవచ్చా?

a) If I had known it had been important I would have written down the number.

b) if I had known it was important I would have written down it.

**A.** b) is correct. (It was important, it had been important కాదు).

**A.** Verb - 'be' form + Past participle (PP) అయితే, passive.

The school was closed yesterday = బడి నిన్న మూయబడింది. (మామూలు తెలుగు: బడి నిన్న మూసేశారు/ సెలవు)

మీరు రాసిన sentence no.1లో verb 'are' ('be'-form) - ఇది passive కాదు కదా? పనిని తెలిపే verbs (అంటే ఉండటాన్ని తెలిపే verbs - 'be' forms కాకుండా)కు మాత్రమే active voice, passive voice ఉంటాయి. అందులో కూడా, object ఉన్న verbs కు మాత్రమే passive ఉంటాయి, ఒక్క imperative sentences (ఆజ్ఞలు, అడగటం, కోరికలు తెలిపే sentence)కు తప్ప.

మీ 1st sentence కు అర్థం మీకు వైద్యం చేస్తున్న డాక్టరు సలహాకు వ్యతిరేకంగా కూడా మీరు ఆస్పత్రి వదలి వెళ్లవచ్చు

మీ 2nd sentence, "you will be asked to sign the 'Discharge against medical advice 'form' " - ఇందులో verb, will be ('be' form) asked (PP) - ఇది passive voice = అడగబడతారు.

మీరు, డాక్టరు సలహాకు వ్యతిరేకంగా discharge 'form' లో సంతకం పెట్టమని అడగబడతారు.

మామూలు తెలుగు:

'డాక్టరు సలహాకు వ్యతిరేకంగా విడుదల' అనే పత్రం మీద మీరు సంతకం చేయాల్సి ఉంటుంది.

English Papers చదువుతూ ఉంటే ఇంకా బాగా మెరుగవుతుంది మీ English.

# Where on earth is he?





M.SURESAN

**Q.** it seems that the match is postponed ఈ వాక్యాన్ని కిందివిధంగా రాయవచ్చా తెలపగలరు.

a) The match seems to be postponed

b) The math seems to have postponed

**A.** The match seems to have been postponed ( to be postponed/ to have postponed కాదు)

**Q.** He is believed to have got the maximum marks. ఈ వాక్యాన్ని ఇలా రాయవచ్చా?

It is said that he had got the maximum marks.

**A.** It is said/ believed that he has got (had got కాదు. It was said అయితే had got, correct) the maximum marks.

**Q.** "If the state must choose between keeping all just men in prison or giving up war and slavery, the state will not hesitate which to choose"

**A.** ఈ Sentence, 'If the state must choose between keeping... and (or కాదు) ... Choose' అని ఉండాలి = న్యాయవంతులందరినీ జైల్లో పెట్టడమో; యుద్ధాన్ని, బానిసత్వాన్ని వదిలిపెట్టడమో - ఈ రెండింటిలో ప్రభుత్వం ఏది ఎంచుకోవాలనే విషయంలో ఏ సందేహమూ ఉండదు. (ఈ sentence భావం సరిగ్గా ఉన్నట్లనిపించడం లేదు. మీరు మరో సారి ఆ sentence సరి చూడండి. అర్థం మాత్రం పైన తెలిపిందే.

**Q.** You must have your hands full in that L.K.G. with Charless.

**A.** LKG classలోని Charles (కుర్రాడి పేరు)తో నీకు అసలు తీరిక లేకుండా ఉండుండాలి. (Charles అల్లరి పిల్లాడు కదా? అని అర్థం) Have hands full = చేతినిండా పని ఉండటం.

**Q.** Bound to be people like charless in the world. Might as well meet them now as later.

**A.** Charles లాంటి మనుషులు ప్రపంచంలో ఉండకుండా ఉండరు. అందుకని వాళ్లతో తర్వాత వేగడం కంటే ముందే వేగడం మంచిది.

*E. Anil, Bapatla.*

**Q.** ఇటీవల ఒక దినపత్రికలో వచ్చిన కింది వాక్యాలు passive voice లో ఉన్నాయి. కానీ అర్థం చేసుకోవడానికి confuse గా ఉన్నాయి. 'బడు' అనే అర్థంతో ముఖ్యంగా. వీటి అర్థాలు, Passive voice వివరించగలరు.

1. You are free to get discharged even against the advice of the treating doctor.
2. You will be asked to sign the "Discharge against Medical Advice form"

*M. Chandrasekhar, Srikalahasthi.*

**Q.** Please clarify these doubts

Veda stayed away preparing for the examinations.

a) Why did veda stayed away? The question is asking a reason. So preparing is 'adverb'.

b) When did veda stayed away? The question is asking time. So preparing is 'adverb'.

c) What did Veda stayed away? The question is asking some thing. So preparing is gerund.

Preparing qualify the examination. Therefore the preparing is adjective. Actually what parts of speech is preparing?

**A.** 'Preparing' in the sentence, 'Veda stayed away preparing for the exam' is a gerund.

Since it answers the question 'Why?' it is a gerund, with the future of an adverb, modifying the verb,'stayed'.

We don't ask questions like

a) When did veda stayed

b) Why did veda stayed

c) What did veda stayed...

these questions are wrong- They should be:

When/ Why did veda stay away?

Question c) has no meaning.

We don't need to know all these, to be able to speak/write English.

**Q.** i) I objected to being treated as a stranger?

ii) I will object to being treated as a stranger

iii) I object to being treated as a stranger

to being (చూడ్డానికి) ఏ purpose కింద తీసుకోవాలి. (Future purpose, Fast purpose, general purpose)

iv) begin, start, continue, cease, intend, advise, wants permit. These verbs lacking infinitive or gerund without change of meaning

పై verbs infinitive, gerund లో వాడినప్పుడు అర్థంలో భేదం ఎందుకు లేదు. వివరించండి.

e.g. : I intend to sell it. I intend selling it

**A.** i) I objected to being stranger.

= I was treated as a stranger, and I objected to it - PAST

ii) I will object to being a stranger = If I am treated as a stranger, I will object to it - Future.

iii) I object to being treated as a stranger = I am being treated as a stranger (Now) and I object to it - Now/ Present.

iv) ఈ verb తర్వాత gerund కానీ, infinitive కానీ వాడితే భేదం రాదు అర్థంలో. కారణం, Infinitive ను gerund ను రెంటినీ కొన్నిచోట్ల noun కు బదులు వాడొచ్చు కాబట్టి.

**Q.** i) She is fond of climbing

ii) I am against saying anything

iii) I am sorry for keeping you waiting

In these sentences the gerund form say what tense (present meaning, future meaning, general meaning)

**A.** i) She is fond of climbing - usually/ Now-she likes climbing

ii) I am against saying any thing- Now or in future.

iii) I am sorry for keeping you waiting - Now

**Q.** i) I want letter typed

ii) I want to typed a letter

అర్థభేదం తెలపండి

**A.** i) I want the letter typed = ఈ జాబు/ ఉత్తరం type చేయించడం కావాలి నాకు.

ii) I want to typed the letter - ఇది సరికాదు కదా (want to typed ×)

I want to type the letter = Letter ను type చేయాలనుకుంటున్నాను

*Jhansi, Seenu.*

**Q.** Tillseed oil కు తెలుగు పదం తెలుపగలరు.

**A.** Tillseed oil - ఈ మాట నాకు తెలిసి English లో లేదు.

**Q.** బత్తాయిని ఇంగ్లిష్‌లో ఏమంటారు?

**A.** Sweet lime.

**Q.** Boy: Take me to school! quick

Mother: Take you to school.. what on earth do you mean?

పై వాక్యంలో earth కు అర్థం తెలపగలరు.

**A.** What on earth - Englishలో అసలేంటి సంగతి? అని కాస్త చికాగ్గా అడగేందుకు అంటారు.

'Where on earth is he?' - అసలెక్కడున్నాడు వాడు? (చికాగ్గా/ విసుగ్గా అడగటం)

**Q.** Well, if it was not a hammer, I should be attending an eye specialist and not a dentist. ఈ వాక్యానికి తెలుగు అర్థం తెలపగలరు.

**A.** అది సుత్తి కాకుంటే, నేనిప్పుడు పళ్ల డాక్టర్‌ను కాకుండా, కళ్ల డాక్టర్‌ను చూడాల్సి వచ్చేది = సుత్తితో తగిలిన దెబ్బే కాబట్టి, నేను పళ్ల డాక్టర్ దగ్గరకొచ్చాను, లేకుంటే కళ్ల డాక్టరు దగ్గర ఉండాల్సివచ్చేది.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish**

# Do you know what I saw?



***O. Veeranjaneyulu, Guntur***

**Q:** ఇంగ్లిష్ మాట్లాడేందుకు 'పని జరిగే కాలం' (time of action) ను అనుసరించి ఉపయోగించాల్సిన verb రూపం (verb form) తెలుసుకుంటే చాలని 'ఆంగ్ల భాషణ - 10'లో తెలిపారు. ఒక verb తో -

1) plays,
2) is playing,
3) has played,
4) has been playing;
5) played,
6) was playing,
7) had played,
8) had been playing;
9) will play,
10) will be playing,
11) will have played,
12) will have been playing.

వీటిని ఉపయోగిస్తూ, 'be' forms (am, is, are, was, were, shall be, should be లో be చివర ఉండే పదాలు; 'been' చివర వచ్చేవి); ఇప్పుడు, ఎప్పుడూ; గతంలో; భవిష్యత్తులో; గతం నుంచి ఇప్పటి వరకు, ఇంకా కానివాటి గురించి తెలిపే వాక్యాలు; I, We, You, She, They, It లను ఉపయోగించి 'పని జరిగే కాలాన్ని' తెలియజేస్తూ ఇంగ్లిష్, తెలుగు వాక్యాలు తెలపండి.

**A:** 1) He plays cricket = అతడు cricket ఆడతాడు -
a) క్రమం తప్పకుండా,
b) అతడికి cricket ఆడటం మామూలు,
c) అప్పుడప్పుడూ ఆడుతుంటాడు.

2) He is playing cricket = అతడు ఇప్పుడు cricket ఆడుతున్నాడు.

3) He has played cricket
a) అతడు గతంలో cricket ఆడి ఉన్నాడు - పని జరిగిపోయింది, time చెప్పడం లేదు ఫలానా రోజు/ సమయం etc అని.
b) అతడికి cricket ఆడిన అనుభవం ఉంది. (cricket గురించి అతడికి తెలుసు - కొత్తేం కాదు.)
c) గతంలో ఎప్పుడో ప్రారంభించి ఇప్పటివరకూ ఆడాడు. He has played cricket since his childhood (బాల్యం నుంచి).

4) He has been playing cricket = అతడు కొంత కాలంగా cricket ఆడుతూ ఉన్నాడు.

★ Sachin has been playing cricket since 1989/ for the past 21 years = 1989 నుంచి/ గత 21 ఏళ్లుగా సచిన్ cricket ఆడుతూ ఉన్నాడు. (గతంలో ప్రారంభమై ఇంకా జరుగుతున్న action - has been + ... ing).

5) He played cricket yesterday/ last Sunday/ when he was a boy = అతడు నిన్న/ కిందటి ఆదివారం/ కుర్రాడిగా ఉన్నప్పుడు (గతంలో ఒక కచ్చితమైన సమయంలో) అతడు cricket ఆడాడు.

**తేడా గమనించండి:**
i) He has played cricket = అతడు క్రికెట్ ఆడాడు - గతంలో, ఎప్పుడు అని time చెప్పడం లేదు.
ii) He played cricket yesterday = అతడు నిన్న cricket ఆడాడు - గతంలో ఫలానా సమయంలో (కచ్చితంగా తెలుసు) cricket ఆడాడు.

6) He was playing cricket at yesterday evening (When I passed that way) = నిన్న నేనటుగా వెళ్తున్నపుడు (గతంలో ఒక సమయంలో) అతడు cricket ఆడుతున్నాడు.

7) He said he had played cricket = తను (గతంలో) cricket ఆడానని నాతో చెప్పాడు.

(గతంలో) - verb - had played (had + past participle (pp) of play) - గతంలో జరిగిన రెండు పనుల్లో ముందరి పనిని, had + pp form లో చెబుతాం. (Cricket ఆడటం ముందు, నీతో చెప్పటం తర్వాత - అందుకే మొదటి action - ఆడటం - had + pp form లో ఉంది.

8) Had been playing - Had been + ....ing form - ఇది గతంలో ముందు ప్రారంభమై, గతంలోనే మరో పని వరకు జరిగిన పనికి చెబుతాం.

★ She had been working as a teacher till she got married = తన పెళ్లయ్యేదాకా ఆమె teacher గా పని చేస్తూండేది - Teacher గా పనిచేయడం గతంలో ప్రారంభమై ఆమె పెళ్లయ్యే వరకూ కొనసాగింది.

★ He had been playing cricket for his team until he moved to Hyderabad = అతడు హైదరాబాద్‌కు (గతంలో) వెళ్లేవరకూ, అతడు ఇక్కడ cricket ఆడుతూనే ఉన్నాడు.

9) He will play cricket = (భవిష్యత్‌లో) అతడు cricket ఆడతాడు.

★ Dhoni will play in the next mach
- ధోనీ వచ్చే match లో ఆడతాడు. (future).

10) Dhoni will be playing in the World Cup 2011 = 2011 World Cup match లో ధోనీ ఆడుతుంటాడు.

Future లో ఒక సమయంలో continue అయ్యే action - కానీ తెలుగులో మనకీ ప్రయోగం లేదు.

**SPOKEN ENGLISH**
ఆంగ్లభాషణ 631


M.SURESAN

11) Will have played

Future లో మనం అనుకున్న సమయానికి పూర్తయ్యి ఉంటుంది అనుకునే actions కు ఇది ఉపయోగిస్తాం.

★ By this time next year he will have played a hundred matches = వచ్చే సంవత్సరం ఈపాటికి అతడు 100 క్రికెట్ matches ఆడి ఉంటాడు. (100 పూర్తయ్యి ఉంటాయి).

12) Will have been playing -

Future లో మనం అనుకున్న సమయానికి ముందే ప్రారంభమై, మనం అనుకున్న సమయం వరకూ కొనసాగే action కు ఇది వాడతాం.

★ By this time next year, he will have been playing his hundredth match -
వచ్చే సంవత్సరం ఈ వేళకు అతడు వందో match ఆడుతూ ఉంటాడు. వచ్చే సంవత్సరం ఈ సమయానికి ముందే ప్రారంభమై ఇంతవరకూ కొనసాగే action.

★ I am, we/ you/ they are, He/ she/ it is = ఇప్పుడు ఉండటం, ఎప్పుడూ ఉండటం, అప్పుడప్పుడు ఉండటం

1) I am / He/ She/ It is / We/ You/ They are } in Vijayawada =
ఇప్పుడు/ ఎప్పుడూ/ అప్పుడప్పుడు/ క్రమం తప్పకుండా ఉండటం/ చేసే ఉద్యోగాలూ/ వృత్తులూ.

2) I/ He/ She/ It was / We/ You/ They were } గతంలో ఉండటం

3) I/ We/ You/ They have been / He/ She/ It - has been } గతంలో ఎప్పటినుంచో ఇంకా/ఇప్పటివరకూ ఉండటం

4) I/ We shall be / He/ She/ It/ They will be } భవిష్యత్‌లో ఉండటం

5) Should be / Must be / Have to be / Has to be } ఉండాలి (ఆజ్ఞ/అవసరం/ విధిగా)

6) Can be - ఉండగలగడం, ఇప్పుడూ/ముందు
could be - ఉండగలగడం - గతంలో

7) May be - ఉండొచ్చు - Present/ Future
Might be - ఉండి ఉండొచ్చు - Past.

8) Would have been - ఉండేదే (గతంలో) కానీ లేదు.
Should have been - ఉండాల్సింది (గతంలో) కానీ లేదు.
Could have been - ఉండగలిగేదే (గతంలో) కానీ లేదు
Might have been - ఉండి ఉండవచ్చు (గతంలో).
Must have been - కచ్చితంగా ఉండే ఉంటుంది.




***K. Srikrishna Kumar, Bapatla***

**Q:** 1) 'due to' ను ఏ సందర్భంలో వాడవచ్చో, ఎప్పుడు వాడకూడదో తెలపండి.

**A:** Due to = Because of = అందువల్ల.

★ His failure was due to his laziness = అతడి సోమరితనం అతడి వైఫల్యానికి కారణం.

అయితే Due to ను వాక్యం ప్రారంభంలో లేదా verb తర్వాత వాడటం సరికాదని కొందరి వాదన. అలాంటి సందర్భాల్లో Owing to/ Because of వాడటం మేలని భావిస్తారు.

Due to his laziness he failed అనడం కంటే Owing to/ Because of his laziness he failed అనడం మెరుగని భాషావేత్తల అభిప్రాయం.

**Q:** 2) 'Despite' ఏ సందర్భంలో వాడాలి? ఎప్పుడు వాడకూడదో వివరించండి.

**A:** Despite = In spite of = అయినప్పటికీ.

★ Despite his ill health, he continues to work = In spite of his ill health he continues to work = Though/ Although/ Even though he is ill he continues to work = He is ill, but/ yet he continues to work = అనారోగ్యంతో ఉన్నప్పటికీ అతడు పనిచేస్తూనే ఉన్నాడు.

***A Reader, Adilabad***

**Q:** What is the meaning of these sentences and when we can use these sentences?
1) Do you know what I saw in the sky last night?
2) Did you know what I saw in the sky last night?
3) Are you know what I saw in the sky last night?
4) Did you know what I see in the sky last night?

**A:** 1) Do you know what I saw in the sky last night - correct = I saw something in the sky last night. Do you know about it?
(నేను నిన్న రాత్రి ఆకాశంలో ఏం చూశానో నీకు తెలుసా?)

2) Did you know what I saw in the sky last night? = I saw something in the sky last night. Did you know (even before now) about it?
(నేను నిన్న రాత్రి ఆకాశంలో ఏం చూశానో నీకు తెలిసిందా? (ఇంతకు ముందే)).
1) ఇప్పుడు నీకు తెలుసా?
2) ఇంతకు ముందే నీకు తెలిసిందా? /నువ్వు తెలుసుకున్నావా?

3) Are you know ......? - Wrong. Not at all correct because there is no verb in this group of words.

4) Did you know what I see in the sky last night - Wrong again because, last night is past, and see is present tense.

***B. Dayanandam, Kothapalli***

**Q:** 1) English movie లో 'ain't' అని వాడతారు. దీని అర్థం ఏమిటి?

**A:** Ain't = aren't = are not,
(సామాన్యంగా అమెరికా నల్లజాతీయులు ఇది ఎక్కువగా వాడుతుంటారు).

**Q:** 2) I am n't suppose to do it. అంటే నేను ఇది చేయకూడదని. మరి 'I don't suppose to do it' అంటే ఏమిటి? ఈ రెండూ ఒకటేనా? వివరించండి.

**A:** I'm not (I amn't కాదు) supposed (suppose కాదు) to do it = నేనది చేయకూడదు.

I don't suppose to do it - ఇది sentence కాదు, అర్థం లేదు.

**Q:** 3) He may have to go లో 'May have to' ని ఎప్పుడు వాడతాం?

**A:** He may have to go.
అతడు వెళ్లాల్సి రావచ్చు - May have to - రావచ్చు/ రాకపోవచ్చు అనే అర్థం.

**Q:** 4) 'He went to Hyderabad' కు, 'He had gone to Hyderabad' ఉన్న తేడా ఏమిటి? ఎప్పుడు వాడతాం?

**A:** He went to Hyderabad.
అతడు హైదరాబాద్ వెళ్లాడు.

He had gone to Hyderabad - ఇది అంత కరెక్ట్ కాదు, independent sentence గా. Past లో ఇంకో పనికి ముందు ఇది జరిగి ఉంటే ఇలా చెప్పొచ్చు దీనికి అర్థం- అప్పటికే/ అంతకుముందే అతడు హైదరాబాద్‌కు వెళ్లాడు.

★ I went to his place, but he had gone to Hyderabad.
నేను వాళ్లింటికి వెళ్లాను. అంతకు ముందే అతడు హైదరాబాద్ వెళ్లిపోయాడు.

**Q:** 5) 'Could' ని మనం Past tense లో వాడతాం. అయితే కొందరు Future tense లో కూడా వాడతారు. ఎందుకు, ఎప్పుడు? వివరించండి.

**A:** Could ను 1) Past లో ఉపయోగిస్తారు.
i) I thought that he could do it
= అతడు చేయగలుగుతాడని నేననుకున్నాను.
ii) Present లో ఉపయోగిస్తారు.
★ Could you help me please?
= మీరు నాకు కాస్త సాయం చేయరా?
iii) Future లో/ Present లో
★ He could be here any moment
= ఆయన ఏ క్షణంలో అయినా ఇక్కడ ఉండవచ్చు/ ఉండగలడు. (Present/ Future)

**Q: 6)** 'As if' ను ఎప్పుడు ఉపయోగిస్తారు. దీని అర్థం ఏమిటి?

**A:** As if = అయినట్టు, కానీ కాదు.
★ He speaks as if he knew everything.
= అతడు అన్నీ తెలిసినట్లు మాట్లాడతాడు (కానీ అతడికి అన్నీ తెలియవు).

As if తర్వాత వచ్చే verb, Past tense లో ఉంటుంది. అంతేకాకుండా, singular subject (I, he, she, it లాంటివి) తర్వాత వచ్చే 'be' form 'were'/'had been' వాడతాం.

**Q: 7)** He has been laid down అంటే అర్థం ఏమిటి?

**A:** ఈ sentence కు అర్థం లేదు.

**Q:** 8) As and when, As and where? వివరించండి.

**A:** As and when (As and Where లేదు) - అది జరిగినప్పుడంతా.
★ I gave him money as and when he needed it
= అతడికి అవసరమైనప్పుడల్లా నేను డబ్బిచ్చాను. అయితే 'As and when' బదులు When ever వాడటం మంచిది.

**Q: 9)** Have had, had had ఒకే వాక్యంలో ఎప్పుడు వాడతాం?

**A:** I have had the fever since yesterday.
= నిన్నటి నుంచి (గతం నుంచి ఇప్పటివరకు/ ఇంకా) నాకీ జ్వరం ఉంది.
★ He had had a bike before he bought this car
= ఈ car కొనకముందు అతడికి bike ఉండేది.

**Q: 10)** Take-off, fly off, blow-off ఇలా verb పక్కన 'off' ను ఎందుకు వాడతాం?

**A:** 'Off' ను సాధారణంగా వెళ్లిపోవడం/ వచ్చేయడం అనే అర్థంతో వాడతాం.

అయితే take off, blow off - ఇవన్నీ Phrasal verbs - వాడుకలో ఉన్న expressions - వీటికి ఎందుకు? అంటే సమాధానం రాదు.




# You are not a child to be cajoled

**Sunayana:** So what's new? Are you coming for the excursion?
(ఏంటి విశేషాలు? Excursion కు వస్తున్నావా? )

**Sulochana:** No. Dad wouldn't allow me. I tried to persuade him but gave up. He is quite affectionate, but is no pushover. I'm sorry.
(లేదు. నాన్న ఒప్పుకోవడంలేదు. ఒప్పించాలని ప్రయత్నం చేశా. విరమించుకున్నా. నేనంటే ఆపేక్షే కానీ, అలాగని సులభంగా ఒప్పుకునే రకంకాదు. చాలా బాధపడుతున్నా)

**Sunayana:** That's really disappointing. We'll miss you very much. I was able to get my dad around to sending me.
(అది నిరాశాజనకంగా ఉంది. నువ్వు లేకపోవడం మాకు లోటే. మా నాన్నను ఒప్పించగలిగాను, నన్ను పంపేందుకు)

**Sulochana:** I was able to get mom to agree to my going. She is so nice. I told her to put dad up to sending me for the trip, but that was no use. She tried to sweet-talk him into it, but she failed too.
(మా అమ్మను ఎలాగో ఒప్పించగలిగాను. పాపం మంచిది. మా నాన్నను ఒప్పించాలని చెప్పాను. కానీ, ప్రయోజనం లేకపోయింది. ఏదో తియ్యటి మాటలు చెప్పి ఒప్పించాలని ప్రయత్నించింది గానీ, నిష్ఫలం)

**Sunayana:** Talking dad into my line of thinking was cake walk. I told him how it would benefit me, and he saw the point in it. You should have put more pressure on your dad. This is going to be a wonderful experience, you know.
(మా నాన్నను ఒప్పించడం చాలా తేలికయింది నాకు. అది నాకెంత ఉపయోగమో చెప్పాను నేను, ఆయన ఒప్పుకున్నారు. కొంచెం మీ నాన్నమీద ఒత్తిడి తేవాల్సింది నువ్వు. ఇది చాలా గొప్ప అనుభవం కదా? )

**Sulochana:** No denying it, but dad was more concerned about my safety. He lectured me about the insecurity girls face now a days. He tried to cajole me into my dropping it on my own.
(కాదనను. కానీ, మా నాన్న నాకే మౌతుందోనని భయపడ్డారు. అమ్మాయిలకు ఈ రోజుల ఉన్న అభద్రత గురించి ఉపన్యాసమిచ్చారు. నన్ను బుజ్జగించి, నా అంతట నేనే వద్దనేంతవరకు వదల్లేదు)

**Sunayana:** In my case mom was against my going, but I won her over to my side. I talked about her new sari and how gorgeous she looked in it. That did the trick. That's all it took me to convince her.
(నా విషయంలో మా అమ్మ ఒప్పుకోలేదు నేవెళ్లేందుకు. కానీ, ఒప్పించా. ఆమె కొత్త చీర గురించి, దాన్లో ఆమె ఎంత అందంగా ఉంటుందో చెప్పాను. అది బాగా పని చేసింది. ఆమెను ఒప్పించేందుకు నేను చేసిందల్లా అదే)

**Sulochana:** My dad could have been tempted if I had told him that it would add to my marks in the exam, but I got the idea too late and that was that.
(మా నాన్న కొంచెం లొంగేవాడే, నేను ఈ excursion నా మార్కులకు కలుస్తుందని చెప్పివుంటే. కానీ, ఆ ఆలోచన నాకు మరీ ఆలస్యంగా వచ్చింది)





M.SURESAN

**Notes:** 1. What's new? = ఏంటి విశేషాలు? (పలకరింపు మాట)
2. Line of thinking = ఆలోచనా సరళి.
3. Cake walk = చాలా సులభం.
4. Affectionate = ఆపేక్ష ఉన్న.

**Look at the following expressions from the dialogue above:**

1) I tried to persuade him.
2) He is ... no pushover.
3) I was able to get my dad around.
4) I was able to get my mom to agree to my going.
5) I was able to put dad up to sending me.
6) Talking dad into my line of thinking wasn't easy.
7) He tried to cajole me into my dropping it.
8) ..... but I won her over to my side.
9) That's all it took me to convince her.

All the expressions underlined above mean to make somebody agree with you. పైన underline చేసిన మాటలన్నిటికీ నచ్చజెప్పడం/ ఒప్పించడం అనే అర్థం వస్తుంది. వాటన్నిటికీ అర్థం ఒకటే అయినా, వాటి use లో చాలా తేడా ఉంటుంది. వాటిని ఇప్పుడు వివరంగా చూద్దాం:

1) Persuade = Make someone agree with you, especially by telling them how you are right = నచ్చజెప్పడం/ ఒప్పించడం.
a) Try as the doctor might, he was unable to persuade the patient to have the operation = ఎంత ప్రయత్నించినా, డాక్టర్ ఆ రోగిని ఆపరేషన్‌కు ఒప్పించలేక పోయాడు/ ఆపరేషన్ అవసరమని నచ్చజెప్పలేకపోయాడు.
b) Can you persuade your dad to buy you a bike? = నీకు bike కొనేందుకు మీ నాన్నను ఒప్పించగలవా?

2) Pushover - ఎక్కువగా 'no' తో వాడతాం. అర్థం:
1) ఏది చెప్పినా/ దేనికైనా సులభంగా ఒప్పుకొనే వాళ్లు.
2) సులభంగా ఓడిపోయేవాళ్లు/ జట్టు.
a) He is a patient listener, but mind you, he is no pushover = అతడు మనం ఏది చెప్పినా, ఓపికతో వింటాడు. అయితే, అలా అని మనం చెప్పిందంతా ఒప్పుకునేవాడు కాదని తెలుసుకో.
b) The Bangladesh team is not among the good team of the world, but it is not a push over, either = బంగ్లాదేశ్ జట్టు మంచి జట్లలో ఒకటి కాకపోవచ్చు కానీ, అంత సులభంగా ఓడిపోయే జట్టు కూడా కాదు.

3) To get somebody around to something = to convince = ఏదో ఒకవిధంగా ఒప్పించడం.
a) Dad was particular that I do engineering, but I got him around to my doing graphics = నేను ఇంజినీరింగ్ చదవాలని నాన్న పట్టుబడ, కానీ నాకిష్టమైన graphics కోర్సు చేయడానికి ఎలాగో ఒప్పించాను.
b) Jagan was unable to get the congress High Command round to making him the CM = తనను ముఖ్యమంత్రిగా చేసేందుకు అధిష్ఠానాన్ని జగన్ ఒప్పించలేకపోయాడు.
c) I got him round to my point of view = అతడిని నా ఆలోచనా సరళికి నేను ఒప్పించాను.

4) Get somebody to do something = make somebody agree to do something = దీని అర్థం కూడా ఒప్పించడం.
a) I got him to take me home on his car అతడి కార్లో నన్ను ఇంటికి తీసుకువెళ్లేందుకు ఒప్పించాను.
b) You can never get them to accept a bribe = వాళ్లను లంచం తీసుకునేలా చేయలేవు/ వాళ్లకు లంచం ఇవ్వజూపలేవు.

5) Put somebody upto something = Convince = ఒప్పించడం.
a) He could not put her upto marrying him = తనను పెళ్లాడేందుకు అతడు ఆమెను ఒప్పించలేకపోయాడు.
b) She put her mother up to buying the expensive dress for her = ఆ ఖరీదైన dressను కొనేందుకు వాళ్లను ఒప్పించింది.

6) Talk someone into something =
a) I talked him into joining the picnic.
b) Enough. you can't talk me into the partnership = చాలు. నేను partner గా చేరేందుకు నువ్వు ఒప్పించలేవు.

7) Cajole కూడా ఇదే అర్థం - బుజ్జగించి ఒప్పించడం.
a) You are not a child to be cajoled = బుజ్జగించేందుకు నువ్వు చిన్న పిల్లవు కావు.
b) No amount of cajoling would do. He wouldn't listen to her = ఎంత బుజ్జగింపు కూడా ఏం పని చేయలేదు. అతడు ఏమీ వినలేదు.

8) Win somebody over = మన పక్కకు మరల్చుకోవడం.
a) Jagan claims he could win over all congress MLAs to his side = Congress MLA లను అందరినీ తన వైపు తిప్పుకోగలనని జగన్ చెప్పుకుంటున్నాడు.
b) Three of them have been Won over = వాళ్లలో ముగ్గురు మన వైపునకు వచ్చేశారు.

9) Convince = నచ్చజెప్పడం.
He convinced me about the soundness of his scheme = తన పథకం ఎంత సబబో నాకు నచ్చ జెప్పగలిగాడతను.

గమనిక: **Usage point:**
1) Get somebody around, 2) Put somebody upto, 3) Talking somebody into వీటి తర్వాత ఎప్పుడూ noun కానీ, '.... ing' form కానీ వస్తుంది. Infinitive (to go, to come లాంటివి) రావు. చూడండి:
1) I got him around to the trip (noun)/ joining the trip (Joining - 'ing' form)
2) She put him up to the game (noun)/ playing (... ing form) the game.
3) She talked him into the marriage (noun)/ marrying (.... ing form) her.



***S.Md. Ghouse Mohiuddin, Kadapa.***

**Q.** కింది వాక్యాలను తెలుగులో అనువదించగలరు.
1) Coming together is a beginning.
2) Keeping together is a progress.
3) Working together is a success.

**A.** 1) Coming together is a beginning = అందరం కలవడం ప్రారంభం.
2) Keeping together is progress (a progress కాదు) = కలిసి ఉండటం ప్రగతి.
3) Working together is success (a success కాదు) = కలిసి పనిచేయడం విజయం.

**Q.** కింది వాక్యాన్ని ఆంగ్లంలో అనువదించగలరు.
ఇదే స్ఫూర్తిని కడదాకా కొనసాగించండి.

**A.** ఇదే స్ఫూర్తిని కడదాకా కొనసాగించండి = Keep up/ Continue/ Maintain this spirit till the end.

***K. Sri Krishna Kumar, Bapatla.***

**Q.** కింది Phrases కు అర్థాలు, వాక్యప్రయోగాలను తెలపగలరు.
1. be in the red
2. look blue
3. in a blue moon
4. born in the purple
5. see red
6. black in the face
7. the yellow press
8. give somebody the green light.

**A.** 1) Be in the red = ఖర్చులో ఉండటం, ఆస్తులను మించి. (అప్పుల్లో ఉండటం)
The Company has Rs.30 lakh in the red = ఆ company తన ఆస్తులను మించి రూ.30 లక్షల ఖర్చు (నష్టం)లో ఉంది.
The company is in the red = Company అప్పుల్లో ఉంది.
2) Look blue = hard without success till you are tired = ప్రయాస పడటం, ఫలితం లేకుండా, అలసటతో. You can argue till you look blue, but you cannot change my mind = అలసి పోయేంతగా ప్రయాసపడి నువ్వు వాదించవచ్చు కానీ, నా మనసు మార్చలేవు.
3) In a blue moon = Very rarely = చాలా అరుదుగా. He comes here once in a blue moon = అతడిక్కడికి అరుదుగా వస్తాడు.
4) Born in the purple - నాకు తెలిసి ఈ Phrase లేదు.
5) See red = Look angry - కోపంతో చూడటం. He saw red when I said it = నేనా విషయం చెప్పినప్పుడు అతడు కోపంగా చూశాడు.
6) Black in the face = సందర్భాన్ని బట్టి గానీ అర్థం చెప్పలేం.
7) The yellow press = సంచలనాత్మక వార్తలు ప్రచురించే పత్రికలు.
8) Give somebody the green lights = అనుమతించడం. The government has given us the green lights for the scheme = ఆ పథకానికి ప్రభుత్వం అనుమతి ఇచ్చింది.




**49080 కానిస్టేబుళ్లు**

స్టాఫ్ సెలక్షన్ కమిషన్ 49080 కానిస్టేబుల్ (జనరల్ డ్యూటీ) పోస్టుల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది.
**కేటగిరీలు:** బోర్డర్ సెక్యూరిటీ ఫోర్స్, సెంట్రల్ రిజర్వ్ పోలీస్ ఫోర్స్, సెంట్రల్ ఇండస్ట్రియల్ సెక్యూరిటీ ఫోర్స్, సశస్త్ర సీమాబల్ విభాగాలకు చెందిన పోస్టులున్నాయి. వీటికి స్త్రీ, పురుషులు దరఖాస్తు చేయవచ్చు
**అర్హతలు:** పదో తరగతి లేదా తత్సమానం.
**వయసు:** 18 నుంచి 23 సంవత్సరాలు.
**ఎంపిక:** జూన్ 5న జరిగే రాత పరీక్ష ద్వారా. ఫిజికల్ స్టాండర్డ్స్ టెస్ట్, ఫిజికల్ ఎఫిషియెన్సీ టెస్ట్, వైద్య పరీక్షలు కూడా ఉంటాయి.
రాత పరీక్ష విధానం, దరఖాస్తు ప్రక్రియ, రిజర్వేషన్లు తదితర వివరాలకు వెబ్‌సైట్ చూడవచ్చు
**చివరి తేదీ:** మార్చి 4.
**వెబ్‌సైట్:** http://ssc.nic.in




# Nothing is more beautiful than virtue





M.SURESAN



***S. Naresh, Kothagudem.***

**Q.** Present Perfect Tense అనేది Simple Present Tense కు ఎప్పుడు సమానమవుతుంది? ఉదాహరణకు It has gone = It has gone అని విన్నాను.

ఈ మధ్య ఆర్య-2 అనే సినిమాలో "My love is gone" అనే పాట విన్నాను. ఇక్కడ My love has gone అనేది correct అవుతుంది కదా?

**A.** Present perfect tense ఎప్పుడు కూడా Present simple tense కు సమానం కాదు.

It has gone = It has gone కాక మరేమవుతుంది?

It's = It is gone ఇక్కడ 'gone' అనేది past participle - past participle ను కొన్ని సార్లు adjective గా వాడతాం. ఇక్కడ past participle 'gone' కు అర్థం, వెళ్లినదై అని. It is gone = అది వెళ్లినదై ఉంది = అది వెళ్లింది = It has gone. It is gone లో verb 'is'; It has gone (= అది వెళ్లిపోయింది) - దీనిలో verb 'has gone' - present perfect.

It has gone అన్నప్పుడు వెళ్లింది/ వెళ్లిపోయింది - ఇక్కడ జరిగిన పనికి ప్రాధాన్యం. It is gone - ఇందులో It కు ప్రాధాన్యం. My love is gone - ఇక్కడ కూడా 'my love' (నా ప్రేయసి)కి ప్రాధాన్యం. He is gone - అతడు వెళ్లిపోయాడు - అతడు ఇక్కడ లేడు.

He has gone = అతడు వెళ్లిపోయాడు

**Q.** మీరు would ని మన అభీష్టాన్ని, కోరికను తెలియజేయడానికి ఉపయోగిస్తారని చెప్పారు. మరి want to ను ఎప్పుడు ఉపయోగిస్తారు? would - want to కి తేడా తెలియజేయగలరు.

e.g. : I would like to go to college

I want to go to college

**A.** I would like to go = వెళ్లాలనుకుంటున్నా - వెళ్లేందుకు ఇష్టపడుతున్నా.

I want to go -వెళ్లాలనుకుంటున్నా - ఇక్కడ ఇష్టమా లేదా అనే ప్రసక్తిలేదు. Would like మనం ఇష్టపడే అంశాన్ని తెలుపుతుంది, want కావాలనుకునేదాన్ని, చేయాలనుకునేదాన్ని తెలియజేస్తుంది.

***K. Siva, Nandikotkur.***

**Q.** కింది తెలుగు పదాలకు సరైన ఇంగ్లిష్ పదాలను తెలియజేయగలరు.

1) శరణ్యం 2) మొక్కుబడిగా
3) (మత్తు నుంచి) తేరుకోవడం
4) తూ, తూ మంత్రంగా
5) మీనమేషాలు లెక్కించడం 6) ఆడంబరంగా
7) అపర (అభినవ) భగీరథుడు 8) కారణజన్ముడు
9) సార్థకనామధేయుడు 10) మృత్యుంజయుడు
11) యాదృచ్ఛికంగా 12) ఆగంతకుడు
13) కుంభకోణాలు 14) భేషజాలు (పట్టింపులు)

**A.** 1. శరణ్యం = a) ప్రమాదం నుంచి రక్షణ - refuge.

b) అది తప్పవేరేమార్గంలేదు - last resort/ only alternative.

Some Tibetans are seeking refuge in India = కొందరు టిబెటన్లు భారత్‌లో శరణు పొందుతున్నారు.

That appears to be the only alternative/ last refuge = అదే శరణ్యంగా కనిపిస్తోంది.

2) మొక్కుబడిగా = 4) తూ,తూమంత్రంగా = perfunctorily/ go through the motions of.

The conduct of the exam was perfunctory = ఆ పరీక్ష ఏదో జరిగిందనిపించారు/ తూతూ మంత్రంగా/ మొక్కుబడిగా =

The just went through the motions of conducting the exams.

3) Regain consciousness/ come to/ recover
5) Hesitate to do s^th/ dither
6) Ostentatiously
7) A modern Bhagiradha
8) Born for a purpose (దీనికి ఒకే మాటలేదు)
9) He lived up to his name (ఒకే మాట లేదు)
10) One who has overcome death (ఒకే మాట లేదు)
11) By accident/ Chance.
12) Intruder.
13) Scams/ scandals.
14) Being finicky/ fastidious/ fussy.

**Q.** కింది వాక్యాలను ఆంగ్లంలోకి అనువదించగలరు.

1) సంకల్పం మంచిదైతే శక్తి వెతుక్కుంటూ వస్తుంది.
2) మోక్ష సాధనకి పరీక్ష తాళం, నిష్కల్మష భక్తి తాళం చెవి.
3) ఒక్కోసారి చిన్న నిర్లక్ష్యమే జీవితాన్ని నాశనం చేస్తుంది.
4) విజ్ఞానం లేని జీవితం నూనెలేని దివ్వెలాంటిది.
5) అర్జునుడు విలువిద్యలో సవ్యసాచి.
6) ఉడుములు గోడలకు గట్టిగా అతుక్కుంటాయి.
7) పాములు కుబుసాన్ని, కొన్ని జంతువులు కొమ్ములను విసర్జిస్తాయి.
8) సద్గుణాన్ని మించిన సౌందర్యం లేదు.
9) నెమళ్లు పురివిప్పి నాట్యం చేస్తాయి.
10) పాపం పండనిదే దేవుడు కూడా ఏమీ చేయలేడు.

**A.** 1) Have the will, energy will come searching- ఇది అసంపూర్తిగా ఉంది, దేన్ని వెతుక్కుంటూ వస్తుంది?

2) Test is the lock to salvation, faith/ devotion is the key.
3) A little negligence sometimes ruins the whole life
4) Life without knowledge is like a lamp without oil.
5) Arjuna is ambidextrous in archery.
6) Bengal monitors stick to walls.
7) Snakes slough off their dead skin and some other animals shed their horns.
8) Nothing is more beautiful than virtue.
9) Peacocks spread out their plumes as they dance.
10) Even God can't punish a sinner until their sins ripen. అయితే ఈ భావం English వాళ్లకు అంతగా లేదు

***E. Anil, T.N.Palem.***

**Q.** (i) Nowhere else

(ii) Nothing else ల usage వివరించగలరు.

**A.** i) Nowhere else = ఇంకెక్కడా లేదా (ఇక్కడే ఉంది)

ii) Nothing else = ఇంకేదీకాదు/ మరొకటి కాదు (ఇదే)

**Q.** కింది వాక్యాన్ని అర్థం చేసుకోవడానికి కొద్దిగా Confuse గా ఉంది.

I was paid Rs.36 and with that I left Madras.

I was paid Rs.36 = నేను చెల్లించాను (లేదా) నాకు చెల్లించారు.

మొదట 'నేను చెల్లించాను' అని అర్థం చేసుకున్నాను. కానీ, sentence లను పరిశీలిస్తే అర్థం మార్పును గమనించాను. ఇలాంటివి ఎలా అర్థం చేసుకోవాలో tips తెలియజేయగలరు.

**A.** I was paid Rs.36 = నేను రూ. 36 చెల్లించబడ్డాను, అంటే 'నాకు చెల్లించారు' అనే కదా?

ఇక్కడ Verb: Was (be form) + paid (PP of Pay) - voice - passive - అంటే 'బడు' అని అర్థం వస్తుంది కదా. Verb, 'be' form + Past participle అయితే passive voiceలో ఉంటుంది. అప్పుడు అర్థం, 'బడు' (రాయబడును, చేయబడును.. ఇలా) అని అర్థం వస్తుంది.

The snake killed (the boy) = పాము చంపింది.

The snake was killed (was-'be' form + killed - PP of kill) = పాము చంపబడింది. (ఎవరో పామును చంపేశారు)

***S. Kiran Kumar, Anakapalli.***

**Q.** Sir, మీరు గతంలో I could write a letter కి 'నేను ఉత్తరం రాస్తానేమో' అని అర్థం ఇచ్చారు. మీరు చెప్పిన విధంగానే: could అంటే past tense లో సామర్థ్యాన్ని తెలిపేది కదా! మరి ఈ అర్థం future సామర్థ్యాన్ని తెలిపే విధంగా ఉంది. వివరించగలరు.

**A.** I could write a letter = 1) నేను గతంలో ఉత్తరం రాయగలిగాను. 2) నేను ఉత్తరం రాయవచ్చు/ రాసే అవకాశం ఉంది. (Futureలో) ఈ రెండు అర్థాలూ ఉన్నాయి. Could వాడినపుడు సందర్భాన్ని బట్టి అర్థం చేసుకోవాలి.

1) He could buy the car as he had enough money = కావలసినంత డబ్బు అతడి దగ్గర ఉండటంవల్ల కారు కొనగలిగాడు. చూడండి ఇది Past కదా?

2) He could buy a car one of these days - ఏదో ఒకరోజు అతడు కారు కొనేయవచ్చు - ఆ అవకాశం ఉంది, ఇప్పుడు కానీ, Future లో కానీ.

**Q.** a) They would rather you paid them by cheque = నువ్వు cheque ద్వారా చెల్లించడం వారు ఇష్టపడుతున్నారు.

b) we would like to inform you:

ఇక్కడ a, b లలో 'would' కి తెలుగు అర్థం ఏమిటి?

would అంటే: i) గతంలో అలవాట్లను

Future from past నుంచి తెలియజేయడానికి ఉపయోగిస్తారు కదా! మరి a, b లలో 'would' ని ఏ విధంగా అర్థం చేసుకోవాలి.

**A.** a) They would rather you paid them by cheque. ఇక్కడ would = wish. వాళ్లకు మీరు చెక్ ద్వారా చెల్లించడమే ఎక్కువ ఇష్టం.

b) We would like to inform you = We like to inform you. అయితే would like to inform you అనేది like to inform you కంటే ఎక్కువ మర్యాదను, ఎక్కువ formality (లాంఛనాన్ని) సూచిస్తుంది.

ఇక్కడ Would ను Wish అని అర్థం చేసుకోవాలి. గతంలో అలవాటుగా కానీ, Future from the past కానీ కాదు.

***Suresh Lahoti, Mahabad.***

**Q.** Please explain where the Comma, Semicolon, Colon, Dash, Slash etc. are used. I am unable to learn till now.

**A.** **Comma:** used 1) After each word on a list; Pen, paper, books, notebooks etc. (చాలా వస్తువులను, మనుషులను ఏకరువు పెట్టే జాబితా లాంటి వాటిల్లో ప్రతి మాట పక్కన వాడతారు.)

2. Between a person's name and his designation, official position, title etc.

Mr. Singh, PM of India; Mr. Basu, Collector Krishna Dt. etc.

3. To separate clauses/ phrases in a sentence

a) He came here, discussed the matter, with us, told us what he would do and left.

b) The book, published 30 years ago, is out of sale now, and

c) After yes and no if they are followed by a clause. Yes, he knows English. No, he doesn't know English.

In 'speech' a short pause is indicated by comma.

మాట్లాడేటప్పుడు స్వల్ప విరామాన్ని (కొద్దిగా ఆగడాన్ని) సూచించేందుకు కూడా (అంటే మాట్లాడిందాన్ని రాసేపుడు) కామా వాడతాం. చదివేటప్పుడు కూడా కామా వచ్చినప్పుడు కొద్దిగా ఆగుతాం.

★ **Semi colon (;)** - comma కంటే ఎక్కువ విరామాన్ని, full stop/ period (.) కంటే తక్కువ విరామాన్ని సూచించేందుకు **(;)** వాడతాం - a longer pause than is indicated by a comma, and a shorter pause than indicated by a full stop.

He was not happy; he was surprised.

(అతడు సంతోషపడలేదు; ఆశ్చర్యపోయాడు)

In sentence like this, 'but' and 'and' have to be used in place of the semicolon.

★ **Colon (:):** Used to introduce a list. (ఒక జాబితా ప్రారంభించే ముందు)

e.g. : 1) The parts the body are: The head, the face, the hands etc.

2) To introduce a summary - ఒక సారాంశం ప్రారంభించే ముందు. What the Mahatma said in brief: / Said in brief was: Let us always speak the truth and never use violence.

మహాత్ముడు చెప్పిన దాని సారాంశం:/ సారాంశం ఏమిటంటే: ఎప్పుడూ నిజాన్ని పలకాలని, హింస మానాలని

3) To introduce an explanation: (వివరణ ఏదయినా ప్రారంభించే ముందు)

This is what happened there: (అక్కడ జరిగింది ఇదీ:) అని ఏం జరిగింది వివరిస్తాం.

4) Before reporting what somebody has said (ఒకరు చెప్పిందాన్ని వాళ్లు చెప్పినట్లుగానే చెప్పే ముందు)

The doctor said: 'Give up smoking and half your problems are solved.'

డాక్టరుగారన్నారు; 'సిగరెట్ మానెయ్యి. నీ సమస్యలు సగం తీరతాయి'.

(ఇలాంటి చోట్ల కొంతమంది, Colon (:) కు బదులు, Comma (,) కూడా వాడ్తారు).

★ **Dash __** : used 1) often instead of a semi-colon to separate the parts of a sentence. (Semi colon బదులు sentence లోని భాగాలను విభజించేందుకు).

e.g.: He came here - not when I was here. (వాడిక్కడికి వచ్చాడు - నేను లేనప్పుడు)

2) In place of brackets (Brackets కు బదులు)

e.g.: This leader - if he is fit to be a leader - is corrupt. (ఈ నాయకుడు - అతడు నాయకుడుగా ఉండే అర్హత ఉంటే - అవినీతి పరుడు) In this sentence you can use brackets in place of the pair of dashes.

★ **Slash ( / ):** Used 1) with the meaning of or ('లేదా' అనే అర్థంతో)

e.g. : This is possible with a computer/ a cell phone or a computer = ఇది Computer తో గానీ, Cell Phone తో గానీ సాధ్యం. అయితే Slash (/) ను formal writing (నియమాల ప్రకారం రాసేటప్పుడు ఉపయోగించం).

2) Fraction (భిన్నాన్ని) చూపేందుకు: $^2/_3$ (Two by three)

**Q.** Please let me know the difference between the two words 1) among 2) amongst.

**A.** Among = Amongst.

■

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish**




# She has the potential of a great singer!





M.SURESAN



***SriniasaRao, Visakhapatnam.***

**Q.** Seating arrangements అనే Phrase లో seat అనే పదం noun కదా! దానికి ing కలపడం ఎలా సాధ్యం?

**A.** 'Seat' noun మాత్రమేకాదు. Verb కూడా. అందువల్ల Seating తప్పుకాదు. [Seat (vb) = to make some body sit]

**Q.** Please be seated అనకుండా please sit అంటే సరిపోతుందా?

**A.** Please be seated బదులు, Please sit down అని మర్యాద ధ్వనించే విధంగా అనొచ్చు

**Q.** Past simple, past continuous tense కు సమానమవుతుందా?

చిన్నపిల్లల కథల పుస్తకాల్లో ఎక్కువగా ఈ అర్థంలోనే వాక్యప్రయోగం జరుగుతుంది. దయచేసి clarify చేయండి.

**A.** అవదు. చిన్నపిల్లల కథల పుస్తకాల్లో సందర్భాన్ని బట్టి అలా వాడి ఉంటారు.

a) He came here yesterday - 'came' - past simple - నిన్న అతడిక్కడికి వచ్చాడు - గతంలో ఫలానా time లో పూర్తయిపోయిన action.

b) He was coming here yesterday = నిన్న అతడిక్కడికి వస్తూ ఉన్నాడు - గతంలో మనకు తెలిసిన సమయానికి కొనసాగుతున్న చర్య - When I went to him he was reading the news paper = నేను నిన్న అక్కడికి వెళ్లినప్పుడు (past simple - వెళ్లడం జరిగిపోయింది) అతడు వార్తా పత్రిక చదువుతూ ఉన్నాడు. (చదవడం కొనసాగుతోంది.) - was reading - past continuous.

While he was singing (గతంలో అతడు పాడుతూ ఉన్నప్పుడు), she was dancing (ఆమె నాట్యం చేస్తూ ఉంది).

***Gurram Shankar, Keshavapatnam***

**Q.** Sir, I heard on a radio, a phrase in 'Current Affairs' programme.

"In my mind reading it is correct". Please clarify its meaning.

**A.** Mind reading = Understanding what is going on in somebody's mind/ understanding the thoughts of others = ఇతరుల ఆలోచనలను పసిగట్టడం.

In my mind reading it is correct = నేను అర్థం చేసుకున్న ప్రకారం అది సరైందే = My understanding of what somebody is thinking it is correct.

**Q.** I saw a sentence in standard publication "S.Chand" for 4th standard English Text.

"I am having Dasara holidays on 4th of October", "I have Dasara holidays"

Between them what is the difference please clarify it.

**A.** I am having Dasara Holidays - Wrong.

I have Dasara holidays - Correct.

We use 'have' in the present continuous tense with the meaning of eating/ drinking only. We can use it for 'bath'. We can sometimes say am having/ is having/ are having a problem.

***Uday, Yellandu.***

**Q.** Please translate the following sentence into telugu.

I had been upto in England.

**A.** I had been upto in England - ఇది sentence లో ఒకభాగం మాత్రమే. upto = ఏదో చెయ్యబోతున్న స్థితిలో ఉండటం/ చేసే ఉద్దేశం కలిగి ఉండటం.

He is upto something = అతడేదో చేసే ఉద్దేశంతో ఉన్నాడు.

I had been upto in England అన్నప్పుడు upto తర్వాత something/ it లాంటిదేదైనా ఉండాలి. లేకుంటే - I had been upto...., ముందు ఇంకేదన్నా ఉండాలి. **e.g. :** He did not know what I had been upto in England = England లో నేను చేయాలనుకున్నది/ నేనేం చేసే ఉద్దేశంలో ఉన్నానో అతడికి తెలీదు.

**Q.** Please give the meanings of the following words with one example for each word.

1) Potential 2) Effect 3) Affect 4) Raise 5) Rise 6) Much 7) Element

**A. Potential** = ఏదైనా ముందుముందు జరిగే శక్తి/ అవకాశం - India has the potential of becoming a great nation = భారత్ గొప్ప జాతిగా అయ్యే అవకాశం ఉంది/ అలాంటి శక్తి దానికుంది. (Future లో).

She has the potential of a great singer = గొప్ప గాయనిగా తయారయ్యే శక్తి/ ప్రతిభ/ అవకాశం ఆమెకుంది.

China is a potential danger to India = చైనా భారత్‌కు ముందుముందు ముప్పుగా మారే ప్రమాదం ఉంది.

**Effect** = ప్రభావం; **Affect** = ప్రభావం చూపడం, effect - noun; affect - verb.

Rain has an effect on crops = వర్షం ప్రభావం పంటల మీద ఉంటుంది.

Rain affects crops - వర్షం పంటలను ప్రభావితం చేస్తుంది.

**Raise** - past tense raised; past participle - 'raised' = lift = ఎత్తడం, లేపడం, పైకి తీసుకురావడం ఎక్కువచేయడం- He raised his hand = చేయి ఎత్తాడు. The Vijaya dairy has raised the price of milk = ధరను పెంచింది.

**Rise** = grow (పెరగడం)/stand (నిలబడటం)/ సూర్యుడు ఉదయించడం/ ఎదగడం.

a) Prices rise in times of scarcity = కొరత ఉన్నప్పుడు ధరలు పెరుగుతాయి

b) students rise when the teacher enters the class = Teacher class లోకి రాగానే విద్యార్థులు నిలబడతారు.

c) The Sun rises in the east

d) He rose to an important position in the party = అతడు పార్టీలో ముఖ్యమైన పదవికి ఎదిగాడు.

**Much** = A large quantity of uncountable things

= లెక్కపెట్టని వస్తువులు (పాలు, నీళ్లు, బియ్యం, పంచదార, time లాంటివి) ఎక్కువ/ ఎక్కువ మొత్తంలో అనేందుకు.

అయితే ముఖ్యవిషయం.. much ని ఎక్కువ లేదు అనే అర్థంలో 'not' తో గానీ; ఎంత/ ఎంతెక్కువ అనే అర్థం లో question తో గానీ వాడతాం

A: How much milk is there?

B: Not much. (ఎక్కువేం లేదు)

She is not much interested in music = ఆమెకు సంగీతంలో అంత ఆసక్తిలేదు. ఎక్కువ/ చాలా ఉంది అనేందుకు a lot of/ lotsof అంటాం.

A lot of milk (చాలాపాలు) was wasted.

Lotsof water (చాలా నీళ్లు) flowed into the streets

లేకుంటే, a good deal of/ a great deal of (ఎక్కువగా అనే అర్థంతో uncountables కు వాడతాం)

A good deal/ A great deal of = a lot of/ lots of.

With a good/ great deal of energy he completed the project = with a lot/ lots fo energy he completed the project.

**Element** =

1) మూలకం (Chemistry)

2) Four elements (earth, air, fire and water) లో ఏదైనా.

**Q.** There is a lot of difference between/ among the students- Please clarify which word should be used weather 'between' or 'among'

**A.** Difference between only two persons/ things. There is a difference between him and his brother (only two)

ఇద్దరిలో/ రెంటిలో తేడా అనేటప్పుడు difference between.

ఇద్దరికంటే/ రెండు కంటే ఎక్కువ తేడాలు ఉన్నప్పుడు difference among అంటాం.

a) The difference between him and his brother .... (only two)

b) The differences among the incomes of people in the society ... = సమాజంలోని వ్యక్తుల ఆదాయాల్లో తేడాలు (ఇద్దరికంటే ఎక్కువ)

**Q.** Please explain simple, compound and complex sentences in Telugu.

**A. Simple, compound and complex sentences:** Verb ఉన్న group of words ను clause అంటారు.

**e.g. :** If she sings well- ఈ group of words లో sings అనే verb ఉంది కాబట్టి ఇది clause. ఒక sentence లో ఎన్ని verbs ఉంటే అన్ని clauses ఉన్నట్టు.

**If she sings well, she will get a prize** - ఆమె బాగా పాడితే, బహుమతి వస్తుంది. ఈ sentence లో 1) sings, 2) will get అనే రెండు verbs ఉన్నాయి కాబట్టి, ఈ sentence లో రెండు clause లు ఉన్నాయి.

1) If she sings well;

2) She will get a prize.

మొదటి clause, if she sings well కు అర్థం: ఆమె బాగా పాడితే- ఇది అర్థం పూర్తిగా లేని clause. ఇలాంటి అర్థం పూర్తిగా లేని clauses ను subordinate clause అంటాం.

పై sentence లో రెండో clause:

She will get a prize = ఆమె బహుమతి పొందుతుంది- ఇక్కడ అర్థం పూర్తయింది. ఇలా అర్థం పూర్తిగా ఉన్న clause ను main clause అంటాం.

ఒకే verb ఉండే sentence ఉందనుకోండి. అప్పుడదే sentence అవుతుంది. అదే main clause అవుతుంది.

**The books on the table is mine.**

ఈ sentence లో ఒకే verb 'is' ఉంది. ఇదే sentence, ఇదే main clause. ఇలా ఒకే ఒక clause (main) ఉన్న sentence ను simple sentence అంటాం.

**The boy came here after his class.**

ఇది కూడా ఒకే verb ఉన్న sentence. కాబట్టి ఇది కూడా simple sentence.

**COMPOUND SENTENCE:** ఒకటి కంటే ఎక్కువ main clauses ఉన్న sentence లను compound sentence లు అంటాం.

The boy attended class and then came here.

ఇందులో రెండు verbs. 1) attended 2) came అంటే దీంట్లో రెండు clause లున్నాయని కదా? అవి: The boy attended class- దీనికి పూర్తి అర్థం ఉంది. ఇదొక main clause.

And then (he) came here = ఆ తర్వాత ఇక్కడికి వచ్చాడు. దీనికి కూడా అర్థం పూర్తయింది. కాబట్టి, ఇది కూడా main clause. ఇది రెండు main clauses ఉండే compound sentence అన్నమాట.

**She bought the car, used it for four years and sold it off.**

ఇందులో 3 verbs - 1) bought 2) used and 3) sold అంటే ఈ sentence మూడు main clause ల compound sentence.

**He came here after he had attended class.**

ఈ sentence లో రెండు verbs- 1) came and 2) had attended. అంటే ఈ sentence లో రెండు clauses ఉన్నాయన్నమాట. 1) He came here 2) After he had attended class. ఇందులో He came here (అతడిక్కడికి వచ్చాడు)- అర్థం పూర్తిగా ఉంది, కాబట్టి ఇది main clause. After he had attended class- క్లాసుకు వెళ్లిన తర్వాత- అర్థం పూర్తవలేదు. కాబట్టి, ఇది subordinate clause. ఇలా కనీసం ఒక main clause, ఒకటి గానీ అంతకు మించిగానీ subordinate clauses ఉంటే అది **COMPLEX SENTENCE** అవుతుంది.

**The book on the table is mine** - Only one verb, so one clause and That is a main clause- so this is a simple sentence.

**The book which is on the table is mine.** - ఇక్కడ రెండు verbs ఉన్నాయి. 1) is 2) is. అంటే రెండు clauses-

1) The book which is on the table = Table మీదున్న పుస్తకం - దీనికి పూర్తి అర్థం లేదు. So, it is a subordinate clause- Subordinate clause ఉంది కాబట్టి ఇది complex sentence. మరి ఇందులో main clause?

The book ... is mine = నాది - ఇది main clause.

**There is a book on the table and it is mine.** ఇక్కడా రెండు verbs ఉన్నాయి.

i) is ii) is - రెండు clauses. There is a book on the table = Table మీద పుస్తకం ఉంది. పూర్తి అర్థం ఉంది. So, main clause.

2) And it is mine = అది నాది - దీనికి పూర్తి అర్థం ఉంది. ఇదీ main clause-

There is a book on the table and it is mine - ఈ sentence లో రెండూ main clauses. కాబట్టి ఇది compound sentence.

**Simple:** The book on the table is mine.

**Compound:** There is a book on the table and it is mine.

**Complex:** The book which is on the table is mine.

ఈ మూడు sentences మూడు రకాలయినప్పటికీ అర్థం ఒకటే. ఇదీ simple, compound, and complex sentences ని ఒక రకం నుంచి ఇంకో రకానికి మార్చే విధానం. ఇంకా వివరంగా కావాలంటే పాత lessons ను చూడండి.

**Q.** Please translate the following sentences in English.

I don't like to be treated me as a stranger.

I don't like being treated me as a stranger.

**A.** I don't like to be treated as a stranger

= I don't like being treated as a stranger -

ఈ రెండు కూడా ఒకే ఒక verb- (do like) ఉన్న sentences కాబట్టి ఇవి simple sentences.

To be treated - ఇది infinitive - verb కాదు. Being treated (sentence 2) - ఇదీ verb కాదు. gerund. దీన్ని complex & compound లోకి మార్చవచ్చు కానీ, అది కృతకంగా ఉంటుంది.

**Q.** నేను ఈ iron rods పాత ఇనుపకొట్టు వాడికి అమ్మను.

**A.** I don't sell the iron rods to scrap iron dealer.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish**




# Disinterestedness is certainly a rare virtue

**Pranav:** It's a fair distribution of work, you know. Our lecturer in charge of the organization of the college day has given every one an equal share of work. No one has to do more than the others.

(పని అందరికీ సమానంగా పంపిణీ అయ్యింది కదా? college day నిర్వహణ విషయాలు చూస్తున్న మన lecturer ప్రతివాళ్లకూ పని సరి సమానంగా ఇచ్చారు. ఎవరూ ఇతరుల కంటే ఎక్కువ చేయాల్సిన అవసరం లేదు.)

**Subodh:** Yea. If only everyone does their allotted work, the college day will be a grand success. She is always just in her dealings with her students, isn't she?

(అవును. ప్రతివాళ్లూ ఎవరికి కేటాయించిన పని వాళ్లు చేస్తే college day విజయవంతం అవుతుంది. ఆమె విద్యార్థుల విషయంలో చాలా న్యాయంగా ప్రవర్తిస్తారు కదా?)

**Pranav:** You are certainly right. No other lecturer can be impartial like her. In valuing our papers too, she is very objective - neither favour nor prejudice can be seen in her valuation.

(అవును. నువ్వు కరెక్ట్. అంత నిష్పాక్షికంగా ఉండగల లెక్చరర్ ఇంకెవరూ లేరు. మన పేపర్లను దిద్ది, మార్కులు వేయడంలో కూడా తన ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా అర్హతను బట్టి వేస్తారు. పేపర్లు దిద్దడంలో అభిమానం లేదా దురభిప్రాయానికి తావివ్వరు.)

**Subodh:** It is difficult for people to be as unbiased. No person is free from prejudices. I feel it's rather human to have them. One should be superhuman to rise above them.

(నిష్పక్షపాతంగా ఉండటం ఎవరికైనా చాలా కష్టమే. దురభిప్రాయాలు లేకుండా ఉండే వ్యక్తులు లేరు. అది మానవసహజం అనుకుంటా. దురభిప్రాయాలకు, దురభిమానాలకూ అతీతంగా ఉండటం మానవాతీతం అనుకుంటా.)

**Pranav:** I do agree with you. Disinterestedness is certainly a rare virtue. Though some other lecturers are as good as her, she takes the cake for being evenhanded. She believes in fair play and justice in all her dealings.

(నేను నీతో అంగీకరిస్తున్నాను. ఇష్టాయిష్టాలకు అతీతంగా వ్యవహరించడం అనేది చాలా అరుదు. ఇతర లెక్చరర్లు ఆమెలాగే మంచి వాళ్లయినా, అంత నిష్పాక్షికంగా ఉండరు. ఆవిడ సమతౌల్యం, న్యాయం చూపిస్తారు. తన వ్యవహారాలన్నింటిలో.)

**Subodh:** True. In all fairness, she is the best in that respect.

(నిజం. న్యాయంగా చెప్పాలంటే, ఆ విషయంలో ఆమె అందరిలో మిన్న.)

**Look at the following expressions from the conversation above:**

1) A **fair** distribution of work.
2) She is always **just**.
3) No other lecturer can be **impartial** like her.
4) ..... she is very **objective.**
5) Neither **favour** nor **prejudice**.
6) It is difficult for people to be **unbiased**.
7) **Disinterestedness** is a rare virtue.

పైన underline చేసిన మాటలన్నీ న్యాయం, ధర్మం, నిష్పాక్షికత, రాగద్వేషాలకు అతీతంగా ఉండటం అనే భావాన్ని తెలియజేసే మాటలే. నిత్యజీవితంలో వాటిని మనం తరచూ వాడాల్సిన సందర్భాలు ఎక్కువ. కాబట్టి వాటిని తెలుసుకోవడం చాలా అవసరం.

**1. Fair** = న్యాయమైన/ న్యాయసమ్మతమైన/ ధర్మమైన/ అందరినీ సమానంగా చూడటం.

◆ The success of democracy lies in free and fair elections.

(ప్రజాస్వామ్య విజయానికి మూలం స్వేచ్ఛగా, న్యాయబద్ధంగా (పౌరులందరికీ సమానమైన ప్రాముఖ్యం ఇచ్చే) జరిగే ఎన్నికలే.)

◆ Everyone of his children, including his daughters got a fair share of his property.

(ఆయన పిల్లలందరూ, కూతుళ్లతో సహా, ఆస్తిలో తమకు న్యాయంగా రావాల్సిన భాగం పొందారు.)

fair × unfair

◆ Duryodhana was unfair in denying the Pandavas their fair share of the property.

(పాండవులకు న్యాయ సమ్మతంగా చెందాల్సిన రాజ్య భాగం వాళ్లకు కాదనడంలో దుర్యోధనుడు అన్యాయంగా వ్యవహరించాడు.)

fair, unfair చాలా తరచుగా వినిపించే మాటలు. ఇవి బాగా practice చేయాలి.





M.SURESAN

◆ The umpire's decision was unfair to our team.

(అంపైర్ నిర్ణయం మనకు అన్యాయం చేసింది.)

**2. Just** = fair = న్యాయమైన, ఎక్కువగా just ను only అనే అర్థంతో (e.g.: just a minute) వాడుతుంటారు. Just లోంచి justice (న్యాయం) అనే మాట వచ్చింది.

✪ The demands of the workers are just

( = There is justice in the workers' demands.)

(కార్మికుల డిమాండ్లు న్యాయమైనవే ( = workers కోరికలో న్యాయం (justice) ఉంది).

✪ How just are you in asking for a major share in the property?

(ఆస్తిలో ఎక్కువ భాగం నీకే రావాలని అడగడం ఎంత న్యాయంగా ఉంది?)

**Sripad:** Let me tell you that whatever Rama did was just.

(రాముడు చేసినదంతా న్యాయమైందే అంటున్నాను నేను.)

**Srikar:** Was he just in shooting arrows from behind a tree at Vali? (చెట్టు చాటునుంచి వాలి మీదికి బాణాలు వదలడం న్యాయమా?)

just × unjust (అన్యాయమైన)

**3. Impartial** = నిష్పాక్షికమైన.

❖ In any dispute between India and Pak, China is never impartial.

(భారత్ పాక్‌ల మధ్య ఏ వివాదం (dispute) లో కూడా, చైనా నిష్పాక్షికంగా ఉండదు.)

❖ The umpire is known for his impartiality.

(ఆ అంపైర్ నిష్పాక్షికతకు పెట్టింది పేరు.)

❖ "In all international cricket matches we have neutral umpires, why?"

(అంతర్జాతీయ క్రికెట్ మ్యాచుల్లో తటస్థ (ఆడుతున్న రెండు దేశాలకూ చెందని) అంపైర్లు ఉంటారు. ఎందుకు?)

"So that they can be impartial"

(వాళ్లు నిష్పాక్షికంగా ఉండటానికి.)

**4. Objective** = మన ఇష్టాయిష్టాలకు అతీతమైన. ఇది చాలా ముఖ్యమైన, ఉపయోగకరమైన మాట.

Objective opinion = మన ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా వ్యక్తం చేసే అభిప్రాయం.

Courts లో Judges, తీర్పులు ఇచ్చేటప్పుడు objective గా ఉండాలి. అంటే ముద్దాయిలు తమకు తెలిసిన వారైనా, తమ కులంవారైనా, తమ ప్రాంతం వారైనా ఇవేమీ పట్టించుకోకుండా, సాక్ష్యాధారాలను బట్టి తీర్పు ఇవ్వాలి. అప్పుడే ఆ judge చాలా objective. అంటే రాగద్వేషాలకు అతీతంగా ఉండటం objective.

Judges, Umpires, Police Officers, Teachers లాంటి వాళ్లు objective గా ఉండాలి.

★ Interview board members/ selection committee members should be objective.

(ఉద్యోగాలకు అభ్యర్థులను ఎంపికచేసే interview board members/ selection committees సభ్యులు వారి ఇష్టాయిష్టాల ప్రభావానికి లోనుకాకుండా/ నిష్పాక్షికంగా ఉండాలి.

★ To be objective, our rivals have played certainly better than us.

(నిష్పాక్షికంగా, నా ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా చెప్పాలనుకుంటే, మన పోటీదారులు మనకంటే బాగా ఆడారు.)

**A:** 'I don't think my son didn't do anything wrong'.

(మా అబ్బాయి తప్పు చేశాడని నేను అనుకోవడం లేదు.)

**B:** 'That's unfortunate. You are not being objective. Whatever the provocation, you cannot justify violence'.

(అది దురదృష్టకరం. నువ్వు మీవాడి మీద మమకారంతో అలా మాట్లాడుతున్నావు (not objective). కవ్వింపు ఏదైనా దౌర్జన్యాన్ని సమర్థించలేం కదా?)

అంటే ఇక్కడ A, సంఘటనను objective గా చూడటం లేదన్నమాట. వాళ్ల అబ్బాయి మీద అనురాగం సంఘటన మీద అతడి అభిప్రాయాన్ని ప్రభావితం చేస్తోంది. అంటే, A, objective గా (నిష్పాక్షికంగా) ఆలోచించడం లేదన్నమాట.

## Difference between Objective and Subjective

పరీక్షల్లో objective type questions అంటూ ఉంటారు కదా? అంటే objective questions కు correct answer ఒక్కటే ఉంటుంది. ఎవరు రాసినా అదే answer రాస్తారు. ఆ జవాబు రాస్తే examiner తన ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా దానికి కేటాయించిన మార్కులు ఇవ్వాల్సిందే.

**e.g.:** Andhra Pradesh రాజధాని ఏది? ఇది objective question. దీనికి ఎవరి సమాధానమైనా ఒక్కటే. హైదరాబాద్ అని. ఈ సమాధానం రాసిన వారికి మార్కు ఇవ్వాల్సిందే. అలాగే ప్రస్తుతం రాష్ట్రంలో అధికారంలో ఉన్న పార్టీ ఏది? దీనికి సమాధానంగా మనకు Congress అంటే ఇష్టం ఉన్నా లేకపోయినా Congress అనే రాయాలి కదా? ఈ సమాధానం ఇస్తే మార్కులిచ్చే వాళ్లు కూడా తప్పక ఇవ్వాల్సిందే, వాళ్లకూ అది ఇష్టం ఉన్నా లేకపోయినా.

Objective కు వ్యతిరేకం Subjective = మన ఇష్టాన్ని బట్టి ఉండేది. ఉన్న పార్టీల్లో ఏది గొప్పది? అంటే ఎవరి ఇష్టాన్ని బట్టి వాళ్లు సమాధానం ఇస్తారు. మార్కులు ఇచ్చేవాళ్లు కూడా తాము అభిమానించే పార్టీని బట్టి మార్కులిచ్చే అవకాశం ఉంది. వారి ఇష్టాయిష్టాన్ని బట్టి- కాబట్టి ఇది subjective. ఇంకా చూడండి: భారత్‌లో ఎన్ని పార్టీలు న్నాయి? ఇది objective question. వాటిల్లో ఏది గొప్పది? ఇది subjective - అంటే మన ఇష్టాన్ని బట్టి ఉంటుంది కాబట్టి. Written test, objective గా ఉండవచ్చు. Interview ఎప్పుడూ subjective. అందులో అడిగే questions objective అవ్వచ్చు, కానీ selection కి వచ్చేటప్పటికి అందరు Interviewers ఒక అభ్యర్థికి ఒకే మార్కులు ఇవ్వక పోవచ్చు, ఎందుకంటే అన్ని questions objective గా ఉండవు కాబట్టి. ఇదీ objective కూ subjective కూ తేడా.

**5. i) Favour** = favour - సరైన కారణం అంటూ లేకుండా ఒకరిని/ ఒక విషయాన్ని అభిమానించడం.

♦ Politicians favour people of their parties only.

(రాజకీయవాదులు తమ పార్టీ వాళ్లనే అభిమానిస్తారు.)

♦ Former Minister Raja favoured only one company in the 2G spectrum affair.

(2 జీ స్పెక్ట్రమ్ విషయంలో మాజీ మంత్రి రాజా ఒక కంపెనీనే అభిమానించారు/దానిపై అభిమానం చూపారు.)

♦ 'Why does the minister favour that particular company?'

(ఆ మంత్రి ఆ కంపెనీ మీద ఎందుకంత అభిమానం చూపిస్తాడు?)

'Because it offers him kickbacks'.

(అది లంచాలు ఇస్తుంది కాబట్టి.)

kickbacks = అనైతిక ప్రతిఫలాలు

☆ 'How good is the examiner?'

(Examiner (పరీక్ష నిర్వహించేవారు) ఎంత మంచిది?)

☆ 'Very objective. She hasn't shown any favour to any body'.

(చాలా నిష్పక్షపాతంగా ఉందామె. ఎవరి పట్లా ఏవిధమైన అభిమానం చూపలేదు.)

favour × prejudice

**ii) prejudice** = కారణం లేకుండా ఒకరి/ ఒక విషయం పట్ల మనకుండే దురభిప్రాయం.

objective = free from favour or prejudice.

మనదేశంలో చాలా prejudice ఉన్నాయి కదా?

1) Caste prejudice (కుల దురభిప్రాయం - ఒక కులం వారికి ఇంకో కులం వారు పడకపోవటం);
2) Religious prejudice (మత దురభిప్రాయం- ఇతర మతాల పట్ల దురభిప్రాయం)
3) Regional prejudice (ప్రాంతీయ దురభిప్రాయం) అలాగే వ్యక్తిగతంగా కూడా మనకు దురభిప్రాయాలు ఉంటాయి.

colour prejudice (కొన్ని రంగులు గిట్టకపోవడం), food prejudice (కొన్ని ఆహారాలు గిట్టకపోవడం), etc.

★ Every person has their prejudices and favours.

(ప్రతి వ్యక్తికీ దురభిప్రాయాలూ, దురభిమానాలూ ఉంటాయి.)

★ The human being is a bundle of prejudices.

(ప్రతి వ్యక్తీ దురభిప్రాయాల పుట్ట = దురభిప్రాయాలు లేని వ్యక్తి ఉండరు అని.)

దీనికి సంబంధించిందే bias (బయస్) = ఒకరి/ ఒక విషయం/ ఒక జాతి పట్ల/ ఒక వర్గంపట్ల అభిమానం చూపడం/ మరొకరి/ మరో వర్గం పట్ల అయిష్టత.

**6. Biased** = ఒకరికి అనువుగా మరొకరికి వ్యతిరేకంగా ఉండటం.

✱ There is a caste bias in whatever he does.

(అతడు చేసే ప్రతిదాంట్లో కుల వివక్ష ఉంటుంది.)

✱ My poor marks are due to the teacher's prejudice.

(టీచర్ దురభిప్రాయం వల్ల నాకీ తక్కువ మార్కులు.)

✱ The judgement is biased.

(ఆ తీర్పు పక్షపాతంతో కూడింది (ఒక పక్షాన్ని అభిమానించేదిగా అవతలి పక్షం మీద వివక్ష చూపేదిగా ఉంది.)

**7. Disinterested** = నిష్పక్షపాతమైన/ స్వలాభాపేక్ష లేకుండా/ నిస్వార్థంగా

✲ Gandhi rendered disinterested service to the nation.

(గాంధీ జాతికి నిస్వార్థ సేవ చేశాడు.)

Render = అందించడం

✲ It is difficult to be disinterested when it concerns your family.

(మన కుటుంబానికి సంబంధించిన విషయాల్లో నిస్వార్థంగా ఉండటం కష్టం.)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# To beard a lion in his den




M.SURESAN



***B. Narasinga Rao, Vizag***

**Q.** i) The police were chasing the thief (పోలీసులు దొంగ వెంట పడ్డారు)

ఇక్కడ were chased అని రావాలనుకుంటున్నాను. were chasing కి అర్థం ఏమిటి.

గతంలో జరిగిన పనికి $V_2$ రావాలి కదా!

The police were chased the thief అంటే అర్థం ఏమిటి?

ii) You were planning to go home, when are you leaving?

ఇంటికి వెళ్లానుకున్నావు కదా, ఎప్పుడు వెళుతున్నావు!

ఇక్కడ కూడా Were Planned రాదా? leaving అంటే 'వెళుతున్నావు' అని కదా, మరి Were planning గతంలో ఆలోచించుకుంటున్నావు అని వస్తుందేమో?

పై రెండు వాక్యాల్లో were chasing, were planning గురించి వివరించగలరు.

V+ing form (ప్రస్తుతం జరుగుతున్నప్పుడు కాకుండా ఇంకో సందర్భంలో వస్తుందా? వస్తే ఏ సందర్భంలో? తెలియజేయగలరు.

**A.** i) The police were chasing the thief = పోలీసులు దొంగను వెంబడిస్తూ ఉన్నారు. (గతంలో ఒక సమయంలో- మనం చూసినప్పుడు అనుకుందాం - an Action continuing at a point of time in the past)

The police chased the thief = పోలీసులు దొంగను వెంబడించారు. (వెంబడించడం అయిపోయింది) He was playing cricket = అతడు cricket ఆడుతూ ఉన్నాడు. He played cricket = అతడు క్రికెట్ ఆడాడు)

They were chased the thief - ఇక్కడ verb, were ('be' form) + chased (past participle) - Passive voice - అర్థం: వెంబడించబడ్డారు. The police were chased = పోలీసులు వెంబడించబడ్డారు. The police were chased the thief = police లు వెంబడించబడ్డారు దొంగ - అర్థం లేదు, sentence కాదు.

The police were chased by the thief = పోలీసులు తరమబడ్డారు దొంగచేత - విపరీతార్థం. గుర్తుంచుకోవాల్సిన విషయం: verb, 'b' form + past participle అయితే, passive voice అవుతుంది.

ii) You were planning to go home, when are you leaving? లో you were planning = నువ్వు ఇంటికి వెళ్లాలనుకుంటున్నావు (గతంలో) - ఎప్పుడు వెళ్తున్నావు? (you were planned = మీరు plan చేయబడ్డారు - అర్థం లేదు కదా? )

Please remember always. When the verb is a 'be' form + past participle, the voice is passive - తెలుగులో 'బడు' అని అర్థం వస్తుంది.

Was/ were + ... ing = గతంలో పని జరుగుతూ ఉండినది.

***M. Nagaraju.***

**Q.** Please translate these Telugu sentences into English

★ కూతవేటు దూరంలోనే Police Station ఉంది. అయినా ఇలాంటి సంఘటన జరగడం ప్రజలను భయాందోళనకు గురి చేసింది.

**A.** An incident like this at a stone's throw from the police station has filled the people with shock and fear/ fear and concern.

★ కనుచూపు మేరలో ఒక్క Police Station కూడా లేదు.

**A.** (There is) not a single police station as far as one can see.

★ ప్రజలను మభ్య పెట్టడం.

**A.** Misleading people.

★ ఆస్తులను కూడ బెట్టుకోవడం/ వెనకేసుకోవడం

**A.** Amassing wealth.

★ 1990 లో మీ ఆస్తి ఎంత? ఇప్పుడు ఎంత? is (or) was?

**A.** What was your property worth in 1990? What is it now?

★ 'పాత సీసాలో కొత్త సారా' అన్న సామెత గుర్తు కొస్తుంది, వాళ్లు చెప్పింది వింటుంటే.

**A.** When we hear what they say we are reminded of the saying, 'old wine in a new bottle'

★ పలాయనం చిత్తగించడం

**A.** To take to heels

★ సెంచరీలు చెయ్యడాన్ని సచిన్ తన అలవాటుగా చేసుకున్నాడు/ మార్చుకున్నాడు.

**A.** Sachin has made a habit of scoring centuries.

★ నూనుగు మీసాల వయసులో

**A.** An age when he hardy had a mustache.

★ పాల బుగ్గల పసి ప్రాయంలో

**A.** As a very tender baby.

★ పసికూన బంగ్లాదేశ్‌పై ఇండియా పది వికెట్ల ఘన విజయం సాధించింది.

**A.** India scored a ten wicket over the minnow Bangladesh.

★ సచిన్ 'భారతరత్న'కు ఎంపికయ్యాడు.

**A.** Sachin has been selected/ named for 'Bharath Ratna'.

***P. Srinivasa Rao, Hyderabad.***

**Q.** Sir, కిందివాటికి తెలుగులో అర్థాలు తెలియజేయగలరు.

**1.** Slipped into debts. **2.** On a tip off. **3.** Strike a deal **4.** Went missing **5.** Rock bottom **6.** Month long, week long, year long, day long. **7.** For failing to check **8.** Rolling a carpet **9.** In a bid to **10.** In turn **11.** In tune with **12.** Close aide **13.** To a tune of Rs.5,000 Crores **14.** After they failed to purchase **15.** At times **16.** As of now **17.** As a whole

**A. 1.** అప్పుల్లో పడిపోవడం **2.** ఇచ్చిన సమాచారంతో (రహస్య విషయాన్ని గురించి) **3.** ఒప్పందం/ బేరం కుదుర్చుకోవడం **4.** Went missing - Past tense of go missing = తప్పిపోవడం/ కనపడక పోవడం **5.** Rock bottom = అత్యంత తక్కువ స్థాయి (ధరలూ, నైతిక ప్రమాణాల్లాంటివి). **6.** నెల/ వారం/ సంవత్సరం రోజుల పాటు. Day long = రోజంతా **7.** సరిచూసుకోకపోవడం/ తనిఖీ చేయకపోవడం వల్ల **8.** హార్దిక స్వాగతం పలకడం **9.** ఆ ప్రయత్నంలో **10.** దానికి ప్రతిగా **11.** దానికి తగ్గట్టు **12.** ఆంతరంగికుడు **13.** రూ.5000 కోట్ల మేరకు **14.** కొనేందుకు విఫలమైన తర్వాత **15.** అన్నివేళలా **16.** ప్రస్తుతానికి **17.** మొత్తం మీద.

**Q.** కింది వాటిని English లో ఎలా పలకాలో తెలియజేయగలరు. నేను రాను – I don't come

★ నేనైతే రాను – ?

★ నేనసలే రాను – ?

★ నేను రానేరాను – ?

**A.** a) If it is me, I won't come.

b) I won't come at all

c) No question of my coming.

★ బట్టలు ఆరేయడం

**A.** Drying clothes

★ బట్టలు ఆరేసుకునే తీగ/ దండెం

**A.** Clothesline

★ ఇంతకే, అసలింతకే

**A.** So, is that all?

★ మాట మాత్రంగానైనా

**A.** Not a word

★ అంతే కదా / ఇంతే కదా

**A.** That's/ This is all, isn't it?

★ అంతే కాని (అంతే కాని నువ్వు రావన్నమాట)

**A.** So, you won't come.

★ ఎంతకీ (ఎంతకీ రాడు)

**A.** No matter, how long

★ అంతకంతకీ

**A.** Gradually

★ ఓ పట్టాన

**A.** Whatever it is

★ అటూ-ఇటూ, అటో-ఇటో

**A.** That side and this side

★ ముందూ-వెనకా, ముందో-వెనకో

**A.** Pros and cans, before and after

★ ఎటొచ్చీ

**A.** Whatever the case

★ అంతగా (అంతగా పట్టించుకోను)

**A.** So much

★ అందుబాటూ (అందుబాటులోనే ఉంది)

**A.** Within reach

★ దొరికింది

**A.** Found

★ ఇటు నుంచి ఇటే - అటు నుంచి అటే

**A.** From here this way, from there the other way.

★ మాట వరసకి

**A.** Suppose

★ మాట్లాడితే (మాట్లాడితే అలుగుతాడు)

**A.** Under the slightest pretext (మాట్లాడితే = ఏ చిన్న కారణంగానైనా అనే అర్థం తీసుకుంటే)

e.g. : He sulks under the slightest pretext. (అతడు మాట్లాడితే అలుగుతాడు)

★ మరయితే

**A.** So. (మన స్వరాన్ని బట్టి అర్థం ఉంటుంది).

**Q.** కింది తెలుగు పదాలకు English మాటలు కరెక్టేనా?

1. అన్నివిధాలా - By all means

2. ఏ విధంగానైనా - By any means

3. ఏ విధంగానూ - By no means

**A.** Correct.

***Y. Gayathri, Asifabad.***

**Q.** కింది పదాలకు అర్థాలు తెలుపగలరు.

Supple, maship, mashup, brio, corollary, impeccable, despotic, strode, thwart, naivete (ఈ పదం ఉచ్చారణ, అర్థం తెలుపగలరు), Cryptologic, calabryss, Ignoramuses, Genesplied fish, Educare.

**A. Supple** = Soft and easy to bend = మెత్తగా, ఎలా కావలిస్తే అలా వంగేలా ఉన్న. A dancer's body must be supple.

Maship కాదు **Mishap** = accident (ప్రమాదం)

Mashup కాదు. **Mash up** = (ఆహార పదార్థాలు ముఖ్యంగా) - cook a food stuff until it is soft and smooth - మెత్తగా paste లాగ అయ్యేవరకు ఉడికించడం/ చేయడం - eg: Mash up potatoes.

**Brio** = enthusiasm and individual style = ఉత్సాహం, ఒక వ్యక్తికున్న పద్ధతి (ఏదైనా చేసేటప్పుడు)

Carollary = ఉప సిద్ధాంతం = ఒక వాదం/ అంశం నుంచి కలిగే eg: Statement: people like this leader.

**Corollary** = They support him

**Impeccable** = Spotless = తప్పుపట్టలేని.

Few politicians are impeccable = తప్పుపట్టలేని రాజకీయ నాయకులు దాదాపు లేరు.

**Despotic** = Tyrannical = నిరంకుశ ధోరణి ఉన్న.

**Strode** = past tense of stride = walk with long steps = పెద్ద పెద్ద అంగలతో నడవటం

**Thwart** = prevent somebody from doing something - ఒకరి ప్రయత్నాలకు అడ్డుపడటం/ వమ్ముచేయడం

The people thwarted the politician's attempts to occupy government land. ప్రభుత్వ స్థలాన్ని కాజేయాలనే రాజకీయ నాయకుల ప్రయత్నాన్ని వమ్ముచేశారు.

**Naivete** = నయీవెటెయ్ = అందరూ మంచి/ అన్నీ మంచి అనే నీ అమాయకత్వం - To think that Your enemies will not harm you is naivete = నీ శత్రువులు నీకు కీడు కలిగించరనుకోవడం నీ అమాయకత్వం.

**Cryptography** = రహస్య లిపి రాయడం, అర్థం చేసుకోవడం - computer సంకేతాల అధ్యయనం.

**Calabryss** = ఒక రకమైన బచ్చలి.

**Ignoramuses** = మూర్ఖులు/ ఒక విషయాన్ని గురించి ఏమీ తెలియని అజ్ఞానులు.

**Genesplied fish**, (ఇది general word కాదు. Scientific term.

**Educare** = మాట కాదు, email లాంటి వాటికి వాడేది.

**Q.** ఒక పుస్తకంలో Restorationists అని ఉపయోగించారు. అలా ఉపయోగించవచ్చా?

**A.** Restorationists = పునరుద్ధరణ ఒక ఉద్యమంగా చేపట్టేవాళ్లు.

**Q.** 'నాకు ఈ రోజు చాలా చిరాగ్గా ఉంది, నేనీరోజు పని చేయలేను' దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా రాస్తారు?

**A.** I am off my mood. Don't disturb me

**Q.** కింది వాటిలో ఉపయోగించిన Idioms & Phrases కరెక్టేనా?

a) He beard the lion in his den darely.

b) Please bring home to understand a thing.

c) The problem is in a mess I could not understand.

**A.** a) To beard a lion in his den = ఒకరి స్థావరానికే వెళ్లి వాళ్లకు వ్యతిరేకత వ్యక్తపరచడం, మనం అనుకున్నది నిర్మొహమాటంగా చెప్పడం.

b) To bring home something to a person = To make a person understand something. (especially something important)

Bring home = to understand somebody = ఈ expression లేదు.

c) The problem is in a mess కాదు.

The problem is a mass - ఇది కూడా అంత సరికాదు. Make a mess of a thing = దేన్నయినా పూర్తిగా పాడుచేయడం. The work made a mess of the painting job = ఆ పని వాడు పెయింట్ పనంతా పాడుచేశాడు.

**Q.** a) He trampled upon the issue very cleverly.

b) I wedred of hearing the Telangana issue since my childage.

c) I tired so I have to repose on some time.

పై వాక్యాల్లో ఉపయోగించిన Prepositions, వ్యాక్య నిర్మాణాన్ని కరెక్టుగా తెలియజేయగలరు.

**A.** a) Trampled upon = step (while walking) heavily on something = తొక్కేయడం.

Trampled upon - ఇది హక్కులు, పిల్లలు, మనుషుల లాంటి వాటిని/ వాళ్లని తొక్కేయడం.

Trample upon the issue - అర్థం లేదు. Trample upon the issue very cleverly - అసలర్థం లేదు. తెలివిగా సున్నితంగా తొక్కేయడం ఉండదు కదా? తొక్కేయడం ఎప్పుడూ మొరటుగా ఉంటుంది.

b) Wedred = ఈ మాట లేదు English లో ఈ sentence నాకు అర్థం కావడం లేదు.

c) I tired to I have to repose on time - ఈ sentence, I am tired so I have to repose for some time = (on some time కాదు) = నేను అలసిపోయాను. కాసేపు విశ్రాంతి తీసుకోవాలి.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish**




# When did you receive the message?

**Anjan:** When do you want me to start?
(నన్నెప్పుడు బయల్దేరమంటావు?)

**Abhai:** Immediately. Pack up as soon as you can.
(వెంటనే. నీవు సామాన్లు ఎంత త్వరగా సర్దుకో గలిగితే అంత త్వరగా.)

**Anjan:** What's so urgent about it? The earliest I can go is by the overnight train or the early morning flight.
(ఏంటంత అవసరం? రాత్రి ట్రెయిన్‌లోగానీ, లేకపోతే రేపొద్దున్న విమానంలోగాని నేను వెంటనే వెళ్లగలను.)

**Abhai:** Well, make it as soon as you can, but not later than tomorrow morning. Why don't you take the company car, so you can start right away.
(అయితే రేపు ఉదయం దాటకుండా ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా, కంపెనీ కారు తీసుకుని, వెంటనే వెళ్లవచ్చుగా.)

**Anjan:** I think I'll do that. I'll go about it right now. How long do you think I'll have to be there? Can I return soon after I deliver the papers there?

**Abhai:** As soon as you get there and deliver the papers call me to confirm it. I took a lot of trouble to get the papers together. If they don't reach on time all my trouble will be a waste.
(అక్కడికి వెళ్లి ఆ పేపర్లు ఇచ్చేయగానే నాకు ఫోన్ చెయ్యి. ఆ పేపర్లన్నీ సేకరించేందుకు నేను చాలా శ్రమ పడ్డాను. సమయానికి సరిగ్గా పేపర్లు చేరకపోతే శ్రమంతా వృథా అవుతుంది.)

**Anjan:** When did you receive the message?
(ఎప్పుడొచ్చింది నీకా సందేశం?)

**Abhai:** I got it late last evening, and I lost no time in getting them ready.
(నాకు నిన్న పొద్దుపోయిన తర్వాత వచ్చింది అంతే, ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా వాటిని సిద్ధంచేశా.)

**Anjan:** What are the papers about?
(ఆ పేపర్లు దేన్ని గురించి?)

**Abhai:** The latest figures for the sales and profits of our branch down to the day before. In fact they wanted me to pass the information over phone, but as I had been on leave for some days last week, I could not give them off the top of my head.

**Anjan:** So you took out print outs of the documents. You could have sent them by e-mail.
(అందుకని ఆ పత్రాల printouts-computer మీద copies తీశావన్నమాట. mail లో పంపి ఉండొచ్చు కదా?)

**Abhai:** I thought of that too. But that would take longer, as I had to type a lot.
(అది కూడా ఆలోచించాను. అయితే వాటి నన్నింటినీ కాపీ చేయడం చాలాసేపు పడుతుంది కదా?)

**Anjan:** I see that what you have prepared gives all details at a glance.
(నువ్వు తయారుచేసిన పత్రాల వివరాలను ఒక్కసారి చూస్తే చాలు, అర్థమయిపోతాయి అనేది తెలుస్తోంది.)

**Abhai:** They will certainly be useful for them to take an instant decision.
(కచ్చితంగా వాటిని చూడగానే తక్షణ నిర్ణయం తీసుకునేందుకు సాయపడతాయి.)

**Anjan:** OK, then. Take care.
(సరే అయితే. జాగ్రత్త.)

Look at the following sentences from the conversation above:

- Immediately. Pack up as soon as you can.
- Why don't you take the company car so you can start right away.
- As soon as you get there and deliver the papers.
- ... I lost no time getting them ready.
- I could not give them off the top of my head.
- I see that what you have prepared gives all details at a glance.
- They will be certainly useful for them to take an instant decision.

పైన underline చేసిన expressions అన్నీ కూడా వెంటనే, తక్షణం, అప్పటికప్పుడే, అక్కడికక్కడే, ఆలస్యం ఏం లేకుండా అనే భావాల్ని తెలిపేవే అని తెలుస్తోంది కదా. వీటిని నిత్యజీవితంలో చాలా తరచుగా వాడే అవసరం ఎప్పుడూ ఉంటుంది. వీటి వాడకం తెలుసుకుందాం:

- **Immediately -** ఇది అందరికీ తెలిసిందే- అర్థం, వెంటనే.





M.SURESAN

Immediately after knowing that he got a job, he started for Tirupathi.
(ఉద్యోగం వచ్చిందని తెలిసిన వెంటనే అతడు తిరుపతికి బయల్దేరాడు.)

b) He received the order of appointment and immediately he started for Tirupathi.
(అతడికి ఉద్యోగం ఆర్డరు వచ్చింది, వెంటనే అతడు తిరుపతికి బయల్దేరాడు.)

The result of the meeting were not immediately known. (ఆ సమావేశ ఫలితం వెంటనే తెలియలేదు.)

c) I offered him a bribe of Rs.1000/- and the response was immediate.
(అతడికి నేను రూ.1000 లంచం ఇచ్చాను - స్పందన తక్షణం/ అతడు తక్షణం స్పందించాడు.)

Immediately = At once.

d) The actor hardly got down from his car, and at once his fans mobbed him.
(ఆ నటుడు కారు దిగాడోలేదో అభిమానులు ఆయనను వెంటనే చుట్టుముట్టారు).
mob = మూక, చుట్టుముట్టడం

e) I offered him a bribe of Rs.1000, and at once there was a response.
(అతడికి నేను రూ.1000 లంచం ఇచ్చాను. అతడు తక్షణం స్పందించాడు.)

- **Right away =** At once = immediately

a) The boss wants you to see him right away.
(బాస్ మిమ్మల్ని వెంటనే (at once/ immediately) తనను కలుసుకోమన్నాడు.)

b) The fire service men proceeded right away to the site of the fire.
(ఫైర్ సర్వీస్‌వాళ్లు తక్షణం అగ్ని ప్రమాదం జరిగిన చోటికి వెళ్లారు.)

- **As soon as =** వెనువెంటనే/ ఒక విషయం జరిగీ జరగక ముందే.

a) As soon as he saw the police he ran away.
(పోలీసులను చూసిన వెంటనే అతడు పారిపోయాడు.)

b) As soon as I get my first salary, I will go to Tirupathi.
(నా మొదటి జీతం అందిన వెంటనే నేను తిరుపతి వెళతాను.)

As soon as possible = సాధ్యమైనంత త్వరగా

As soon as somebody can = ఎవరైనా చేయగలిగినంత త్వరగా

a) Please return the book as soon as you can = నువ్వు తిరిగి ఇవ్వగలిగినంత త్వరగా ఈ పుస్తకాన్ని తిరిగివ్వు.

As soon as అర్థంతోనే No sooner... than వాడతాం.

As soon as he saw the police, he ran away = No sooner did he see the police he ran away.

గమనిక: No sooner... than వాడినప్పుడు, As soon as లోని past tense, verb saw ను, did see గా మార్చాం. అంతేకాకుండా subject, 'he', did కు 'see' కు మధ్య వస్తుంది. దీంతోపాటు, రెండో clause 'he ran away' ముందు, 'than' వాడతాం.

b) As soon as he entered the room he turned on the TV = No sooner did he enter the room, (he entered = did he enter), than he turned on the TV.
(గదిలోకి ప్రవేశించిన వెంటనే అతడు టీవీపెట్టాడు.)

As oon as తో, past tense verb పై sentence లో saw లా వచ్చినప్పుడు, did + present tense గా మార్చినట్లే, present tense వచ్చినప్పుడు do/ does + present tense వాడవచ్చు

As soon as he comes home, he turns on the TV.

No sooner does he come home, than he turns on the TV.

b) As soon as you finish the book, please return it = No sooner do you finish than you please return it.

- **Lose no time =** act immediately = వెంటనే చేసేయడం.

a) When knew that she had come he lost no time in meeting her.
(ఆమె వచ్చిందని తెలియగానే ఒక్కక్షణం కూడా వృథా చేయకుండా ఆమెను కలుసుకున్నాడు.)

గమనించండి, 'lose no time' తర్వాత infinitive (to + 1st Regular Doing Word (IRDW) కాకుండా in + '.....ing' form వస్తుంది.

b) Once I reach there, I will lose no time in phoning you about the position there.
(నేనక్కడికి చేరిన వెంటనే అక్కడి పరిస్థితిని, ఒక్క క్షణం కూడా వృథా చేయకుండా నీకు తెలుపుతాను.)

c) When he became a minister he lost no time in grabbing as much land as he can.
(మంత్రికాగానే, ఒక్కక్షణం కూడా వృథా చేయకుండా భూకబ్జా మొదలుపెట్టాడు.)

- **Off the top of my head =** ఉన్నపళాన (ఆలోచన అవసరం లేకుండా) ఏ ప్రశ్నకైనా సమాధానం చెప్పడం/ సమాధానం ఇవ్వగలగడం.

a) When exactly Gandhi returned to India and joined the Freedom Movement, I can't answer off the top of my head.
(గాంధీ కచ్చితంగా ఎప్పుడు స్వదేశానికి తిరిగి వచ్చిందీ, స్వాతంత్ర్యోద్యమంలో చేరిందీ, నేను వెంటనే చెప్పలేను. నాకు వెంటనే గుర్తుకు రావడంలేదు కాస్త ఆలోచించుకోవాలి).

b) How much it will cost I can't tell off the top of my head. I need some time.
(అది ఎంత ఖర్చు అవుతుందనేది నేను వెంటనే చెప్పలేను. నాక్కాస్త సమయం కావాలి.)

ముఖ్యమైన విషయం: "Off the top of my head' ఎక్కువగా 'not'తోనే వాడతాం.

- **At a glance -** ఇది తెలుసుకుని వాడాల్సిన పదం - ఒక్కసారి చూడగానే తెలిసే సమాచారం.

a) The daily carries a column which shows train services at a glance.
(రైళ్ల రాకపోకలు, రిజర్వేషన్‌ల సంగతి చూడగానే తెలిపే పట్టిక దిన పత్రికలో ఉంటుంది.)

b) This booklet gives you at a glance all information you need.
(ఈ చిన్న పుస్తకం మీకు కావలసిన సమాచారం ఒకసారి చూడగానే తెలుపుతుంది.)

- **Instant =** తక్షణ.

Instant decision = తక్షణ నిర్ణయం. Instant Coffee = తక్షణం తయారయ్యే కాఫీ. Instant Mix = ఆహార పదార్థాలు - నానబెట్టడం, కలపడం లాంటి శ్రమలేకుండా వంటకు సిద్ధంగా ఉండేవి.

Instant Gulabjam mix = నిమిషాల్లో గులాబ్‌జామ్ తయారుచేసుకునేట్టుగా ఉండే పదార్థం.

The retaliation was instant = వెంటనే దెబ్బకు దెబ్బ తగిలింది.

The members of one group attacked the other group. This met with an instant retaliation. (ఒకవర్గంవారు మరోవర్గం మీద దాడి చేశారు. వెంటనే రెండో వర్గం ఎదురుదెబ్బ తీసింది.

ఇవన్నీ 'తక్షణం' అనే అర్థంతో వాడిన expressions.



***A. Bunganna, Kurnool***

**Q.** In the lesson 'KNOWLEDGE AND WISDOM' of X Class English, the author Bertrand Russel, while speaking about the importance of impartiality in the teaching of Wisdom he gives the illustration of the parable of GOOD SAMARITAN. I could not get the connection between the parable and the concept of impartiality.

**A.** Samaritans in the days of christ were the people of Samaria, who the Jews, the followers of Christ, treated as sinners.

This parable (a moral story) refers to a samaritan who helped a Jew lying injured on the road. A fellow Jew and even a priest had earlier seen the injured Jew but they had not done any thing to help him. this samaritans, though hated by Jews took pity on the suffering Jew and attended on him.

Jesus told his followers of this samaritan to make them understand that the Samaritan, though in the view of the Jews was a sinner, did help a fellow human being, and thus the samaritan though thought a sinner by the Jews was a better than them, said Jesus Christ, Christ's idea was to tell the Jews that mere worship of God without helping fellow humans was useless.

**Q.** In the lesson of X class English book 'VINOBA A PORTRAIT SKETCH' by Hallam Tennyson; the author says that VINOBA refused to attend his mothers funeral, because, it is said, the funeral pyre would be lit by a brahmin. This explanation is vague, not lending itself to reasoning. Please clarity.

**A.** Vinoba Bhave refused to attend his mother's funeral because he was against the social evil of caste system which allowed only Brahmin to lit the funeral pyre and not others. Further, Vinoba Bhave was a sanyasin, and as a sanyasin he could not have any relationship with others including the members of his own family.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# It's time that he got married





M.SURESAN



***Srinivasa Rao, Marturu.***

**Q.** Dangling participle అంటే ఏమిటి?

**A.** First of all there are two participles-

1) The present participle or the '..ing' form.

**e.g. :** going, coming, etc.

2) The past participle: gone, seen, did, killed, etc.

**Now look at the sentence:**

Walking along the street, a car knocked him down- ఇక్కడ walking (down the street) present participle కదా? అర్థం రోడ్డు వెంబడి నడుస్తూ walking down the street, a car = రోడ్డు వెంబడి నడుస్తూ ఓ కారు, knocked him down = ఢీ కొట్టింది. అంటే దీనికి అర్థం ఏం వస్తుంది? 'రోడ్డు వెంబడి నడుస్తూ ఆ కారు అతడిని ఢీ కొట్టింది' అని కదా? కార్లు రోడ్డు వెంబడి నడవవు కదా. కానీ మనం, ఈ present participle, walking down the road, a car అని రాయడంవల్ల, రోడ్డువెంబడి నడిచే/ నడుస్తున్న car అనే విపరీతార్థం వస్తుంది. ఇలా వాడినప్పుడు, ఇక్కడి participle dangling participle/ unrelated participle అంటాం. అలాంటి dangling participle తో sentence రాయడం/ మాట్లాడటంవల్ల తప్పు అర్థం వస్తుంది. ఇక్కడ నడుస్తున్నది 'he' కాబట్టి, ఆ walking down the car ను, he కి దగ్గరగా పెడితే సరైన అర్థం వస్తుంది- ఇలా:

While he was walking down the street (అతడు రోడ్డు వెంబడి నడుస్తున్నప్పుడు), a car knocked him down (car అతడిని ఢీ కొట్టింది). ఇది ఒక విధం. రెండో విధం, passive voice లో వాడటం. ఇలా:

Walking down the street, he was knocked down by the car - ఇక్కడ participle, walking down the road, he కి దగ్గరగా ఉండటంవల్ల, 'రోడ్డు వెంబడి నడుస్తూ అతడు' అనే సరైన అర్థం వస్తుంది.

Dangling participle కు మరికొన్ని examples, వాటి corrections:

Running away with the stolen money, a policeman caught him - ఇలా రాస్తే వచ్చే అర్థం! A policeman running away with the stolen money. (దొంగిలించిన డబ్బుతో పారిపోతున్న పోలీస్) caught him (అతడిని పట్టుకున్నాడు - తప్పు కదా?

**Correction:**

While he was running with the stolenmoney, a policeman caught him/ Running away with the stolen money he was caught by a policeman/ A policeman caught him running away with the stolen money.

**Q.** Due to, owing to ల గురించి వివరించగలరు.

**A.** Due to = Owing to = because of = అందువల్ల.

Most of our problems are due to our corrupt politicians (మన సమస్యలన్నీ కూడా మన అవినీతి రాజకీయవాదుల వల్ల).

The school was closed owing to rain (వర్షం వల్ల బడి మూయబడింది/ మూసేశారు).

అయితే చాలమంది, due to ను ఒక sentence ప్రారంభంలో కానీ, ఓ verb తర్వాతగానీ వాడటాన్ని ఆక్షేపిస్తారు.

Due to the rain the school was closed - wrong - due to తో sentence ప్రారంభించాం కాబట్టి.

The school was closed due to the rain - wrong - due to, was closed అనే verb తర్వాత వచ్చింది కాబట్టి.

**Correct:** Owing to the rain the school was closed/ The school was closed owing to the rain.

అయితే present day usage లో due to ను పై విధంగా వాడటం సాధారణమైపోయింది, అందువల్ల అంతపెద్ద తప్పుగా అనుకోవాల్సిందేంలేదు అంటారు కొందరు.

**Q.** Present participle ను preposition గా ఎలా ఉపయోగించాలో తెలపగలరు.

**A.** Present participle as preposition is not very common. However, in the sentence, she is busy cooking dinner.

Cooking, the present participle is used as a preposition, governing the nouns 'dinner'

**Q.** Antecedent, adjuncts అంటే ఏమిటి?

**A. Antecedent** = ముందర వచ్చేది అని అర్థం.

Sentence లోని వెనుక మాట, ముఖ్యంగా ఒక pronoun ఏ ముందరి మాటను గురించి చెబుతుందో అది antecedent అవుతుంది.

He bought a car and it is fine.

ఇక్కడ 'it', దాని ముందున్న car ను గురించి చెబుతోంది. కాబట్టి, car is the antecedent of it.

This is a book which is very useful- 'book' is the antecedent of 'which'.

**Adjunct:** An adverb/ a phrase which adds to the meaning of the verb.

a) He came here last night - ఇందులో 'last night' is the adjunct of 'came'.

b) She listened to him patiently - 'patiently' is the adjunct of 'listened'.

**Q.** Her being elected the president of the party, the ministers congratulated her. ఈ వాక్యాన్ని The Ministers congratulated her to have been elected the president of the party అని చెప్పడం కరెక్టేనా?

**A.** Her being elected to the party the president, the minister congratulated her-

The sentence is not correct.

'The minister congratulated her to have been elected to the party', is not correct either.

The correct form of the sentence is:

The minister congratulated her on her having been elected president of the party/ on her election as president of the party. ఇంకా round about గా ఇలా చెప్పొచ్చు

Her having been elected president of the party, the minister congratulated her- కానీ, ఇది చాలా సంక్లిష్టం.

***K.S.R, Marturu.***

**Q.** కింది ప్రతి వాక్యంలో being ఉంది. అయితే అన్ని వాక్యాల్లో ఒకే అర్థంతో ఉపయోగించలేదు. Being ను ఇంకా ఎన్ని అర్థాలతో ఉపయోగించవచ్చో వివరించగలరు.

★ The U.S.S.R. collapsed without being a bullet shot.

**A.** ఈ word group లో 'being' ఉపయోగం సరికాదు- అందువల్ల అర్థం రాదు. ఇలా అర్థం చేసుకోవాలి- తుపాకీగుండు లేకుండా, USSR కుప్పకూలింది- అంటే అర్థం రావడం లేదు కదా.

'without firing a bullet shot' అంటే ఒక తుపాకీ గుండు కూడా పేల్చకుండా USSR కుప్పకూలింది. అంటే 'ఏ ప్రతిఘటనా లేకుండా USSR కుప్పకూలింది' అని అర్థం చేసుకోవచ్చు

★ This being a violation of the code.

**A.** This being a violation of the code - ఇది నియమావళి ఉల్లంఘన కావడంవల్ల - ఇది sentence కాదు, అర్థం పూర్తి కానందువల్ల. ఇక్కడ Being = ఉండటం వల్ల.

★ He came with a reputation of being tough officer.

**A.** మామూలుగా being = ఉండటం/ ఉండగా/ ఉండటం వల్ల.

The reputation of being a tough officer = Strict officer గా ఉంటాడనే పేరుతో

★ The other member, being it's president Mr. Rao.

**A.** being its president = అధ్యక్షుడిగా ఉంటూ

★ The officials dismissed the possibility of fuel adulteration or stones being put in the oil tank.

**A.** Being put = కలపబడి ఉండటం

★ He is being mischievous.

A. Is being = ఉంటున్నాడు.

He is being mischievous (అతడు చిలిపిగా ఉంటున్నాడు/ ఉన్నాడు - ఈ క్షణం)

★ Her tonsured head, chopped legs were indicators of this being case of human sacrifice.

**A.** .... this being a case of human sacrifice = ఇది నరబలికి సంబంధించిందిగా ఉందని.

★ The recent case of an airhostess being molested.

**A.** An airhostess being molested = చెరపబడి ఉండటం

ఈ పైన తెలిపిన అర్థాలన్నీ 'Being' కు ఉన్నాయి.

Being మాత్రమే అయితే, అర్థం - ఉండటం/ ఉండటం వల్ల/ ఉంటూ/ ఉండగా

Being + past participle - a) being + put (pp of put) = ఉంచబడి ఉండటం

b) being molested (being + past participle of molest) = చెరపబడి ఉండటం - ఇలా

being + pp పైన చెప్పినట్లు passive form అవుతుంది.

It being a holiday, we were at home (సెలవు కావడంవల్ల, మేం ఇంట్లో ఉన్నాం).

Being ill, he was weak (జబ్బుతో ఉండటం వల్ల, అతడు నీరసంగా ఉన్నాడు).

Being seen here (ఇక్కడ చూడబడటం - Being + pp of see) is not good = మంచిది కాదు

ఇవీ being, being + pp కి అర్థాలు.

Being తర్వాత noun/ adj వస్తే అలా ఉండటం వల్ల/ ఆ గుణాలు కలిగి ఉన్నందువల్ల అనే అర్థాలు వస్తాయి.

Being a minister (minister -- noun; మంత్రిగా ఉన్నందువల్ల), he has a lot of influence (ఆయనకు చాలా పలుకుబడి ఉంది)

Being tall, (tall - adj - పొడుగ్గా ఉన్నందువల్ల) she can play well (ఆమె బాగా ఆడగలదు)

***T. Siva, Nandikotkur.***

**Q.** Your hair is too long. It's time you trimmed them. ఈ structure ను explain చేయగలరు.

**A.** Your hair is too long. It's time you trimmed it. (నీ జుత్తు మరీ పెరిగింది. దాన్ని ఎప్పుడో కత్తిరించి ఉండాలి. - 'ఇప్పటిదాకా ఆగావేం?' అనే భావంతో)

(The car is too expensive. How can I buy it? = కారు ధర మరీ ఎక్కువ - నేను కొనలేనంత. ఎలా కొనగలను? )

It's time/ It's high time/ time (that) you trimmed it = దాన్ని (జుత్తును) ఎప్పుడో కత్తిరించి ఉండాల్సింది. ఇలాంటి structure తో,

It's time/ It's high time/ time తర్వాత ఎప్పుడూ past tense వస్తుంది.

It's time/ time/ It's time that he got married = అతనెప్పుడో పెళ్లి చేసుకుని ఉండాల్సింది.

**Q.** 1) Meet your grand father. He will feel happy 2) He switched off the refrigerator. It would defrost వీటిని so as ఉపయోగించి combine చేసే విధానాన్ని తెలపగలరు.

**A.** If you meet your grand father he will feel happy = నువ్వు మీ తాతను కలుసుకుంటే ఆయన సంతోషిస్తాడు = Meet your grand father so as to make him happy.

He switched off the refrigerator so as to defrost it. So as to = అలా అయ్యేందుకు = ఆ ఉద్దేశంతో.

అయితే so as వాడకం అంత సహజంగా ఉండదు. దాని బదులు so that/ to వాడటం మెరుగు.

Meet your grand father so as to make him happy = Meet your grand father so that he can be happy/ to make him happy = Meet your grand father to make him feel happy (ఈ చివరిది కొంత అర్థం తేడాతో ఉంది.)

He switched off the refrigerator so that it would defrost.

**Q.** కిందివాటికి Antonyms తెలపగలరు.

1) Precious 2) Pious 3) Wonderful 4) Simplicity 5) Patience 6) Entire (whole) 7) Sacred 8) Melodious 9)Fame 10) Prompt 11) Enough 12) Severe 13) Sacrifice 14) Auspicious

**A.** 1. Precious × Worthless/ Trivial

2. Pious × Impious
3. Wonderful × Ordinary/ Common place
4. Simplicity × Complexity
5. Patience × Fretful/ Restless/ Nervous/ Impatient
6. Entire × Partial
7. Sacred × Profane/ Unholy
8. Melodious × Rancour
9. Fame × Obscurity
10. Prompt × Delayed
11. Enough × Short/ Scarce
12. Severe × Mild
13. Sacrifice × Gain
14 Auspicious × Inauspicious

***M.S.N. Hareesh, Kurnool.***

**Q.** కింది ఆంగ్ల వాక్యాలను తెలుగులో తెలుపగలరు.

You have been able to convince him.

**A.** You have been able to convince him = నువ్వతడికి నచ్చజెప్పగలిగావు.

**Q.** Mr. Uma Maheswara Rao must have been able to incite Savithri to that crime.

**A.** ఉమామహేశ్వరరావు సావిత్రిని ఆ నేరానికి పురిగొల్పి ఉంటాడు/ ఉండాలి (సందేహం లేదు).

**Q.** Miss Rehana might have been able to pass the C.A. exam last year.

**A.** రెహానా పాసై ఉండొచ్చు (సందేహం).

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# Please come up the dais!





M.SURESAN



***A. Sudhakar, Bhiknur.***

**Q.** Please divide into Tense and time given below sentences.

★ I shall write another letter.
★ I wrote the letter.
★ I am writing the letter now.

**A.** I shall write another letter.

Shall write- future simple (నేను మరో జాబు రాస్తాను.)

Wrote - Past simple - రాసేశాను.

am writing - Present Continuous - రాస్తున్నాను (ఇప్పుడు).

**Q.** She would rather we stayed till tomorrow.

**A.** Would rather.... stayed - present tense - refers to an improbable situation in the present - ఇప్పుడు జరగనిది, కానీ మనం జరగాలని కోరుకునేది.

**Q.** It has been raining all night.

**A.** Has been raining - present perfect continuous - వాన గతంలో కొంతసేపటి నుంచి ఇంకా కురుస్తూనే ఉంది.

**Q.** My uncle is arriving tomorrow.

**A.** is arriving - present continuous referring to definite future - రేపు వస్తున్నాడు.

**Q.** I have finished my work just now.

**A.** Have finished just now - Present Perfect Tense - ఇప్పుడే (నాపని) పూర్తిచేశాను.

**Q.** I received his letter a week ago.

**A.** Received..... (a week ago) - Past simple - గతంలో కచ్చితమైన సమయంలో జరిగిన పని (ఆయన ఉత్తరం నాకు వారం క్రితం చేరింది.)

**Q.** When I reached the station the train had started (So I couldn't get into the train)

**A.** Reached - past tense - గతంలో జరిగిన పని - When I reached the station - నేను station చేరేటప్పటికి (గతం), the train had started (train బయల్దేరిపోయింది) - had started - Past perfect tense - గతంలో జరిగిన రెండు పనుల్లో, మొదటి పనిని Past Perfect (had + Past participle) లో తెలుపుతాం. (Train బయల్దేరడం - గతంలో ముందు. అందుకని the train had started తర్వాత జరిగింది. When I reached - నేను చేరేటప్పటికి - reached - Past Simple).

**Q.** I won't go out if it rains.

**A.** I won't go = will not go - future simple; rains = present simple if it rains - conditional clause (వానవస్తే)

**Q.** This time tomorrow I will be sitting on the beach in Singapore.

**A.** Will be sitting - future continuous tense - భవిష్యత్తులో కొనసాగుతూ ఉంటుందనుకునే విషయం.

**Q.** I will be staying here till Sunday.

**A.** will be staying - future continuous tense; use - ఇది కూడా భవిష్యత్తులో కొనసాగుతూ ఉంటుందనుకునే విషయమే.

**Q.** I shall have written my exercise by three.

**A.** Shall have written - future perfect tense - భవిష్యత్తులో ఒక సమయానికి పూర్తయి ఉంటుందనుకునే విషయం. అర్థం: (by three = మూడు గంటల కల్లా) నేనా ఉత్తరం రాసి ఉంటాను.

**Q.** The school opens on 12th June.

**A.** Opens - Present simple tense, indicating a definite action in future - భవిష్యత్తులో ఒక సమయానికి జరుగుతుందనే విషయం.

**Q.** When does the next train leave for Hyderabad?

**A.** Verb - does start = starts - Present simple - denoting an action in the immediate future.

**Q.** Can I have some milk before I go to bed?

**A.** Can have - present tense - request in the present, go - Present simple.

***Dileep Tahil, Yellandu.***

**Q.** Sir, clarify the following doubts.

i) exchange (ii) Interchange. Please give the meanings of the above mentioned words.

**A. Exchange** = మార్పిడి = give something to someone and at the same time take from them the same type of things/ ఇచ్చిపుచ్చుకోవడం.

a) They exchange rings = వాళ్లు ఉంగరాలు మార్చుకున్నారు/ ఇచ్చిపుచ్చుకున్నారు.

b) The two countries exchanged prisoners = ఆ రెండు దేశాలు ఖైదీలను మార్పిడి చేసుకున్నాయి.

**Interchange** = 1) to share ideas/ information etc = భావాలను, సమాచారాన్ని ఒకరికొకరు ఇచ్చిపుచ్చుకోవడం - ఈ అర్థంతో, ఇది దాదాపు Exchange తో సమానమవుతుంది. There was an interchange of ideas between the two groups during the discussion = చర్చా సమయంలో ఇరుపక్షాలవారూ వారి భావాలను, సమాచారాన్ని పరస్పరం ఇచ్చి పుచ్చుకున్నారు. అయితే ఈ అర్థంతో ఈ పదం - interchange - వాడకం తక్కువ.

ఎక్కువగా interchange ని ఈ అర్థంతో వాడతారు - to change the positions of two things/ persons with that of each other = రెండు వస్తువుల/ ఇద్దరు వ్యక్తుల స్థానాలను పరస్పరం మార్చడం.

a) The ministers' portfolios were interchanged = ఆ ఇద్దరు మంత్రులు చూసే వ్యవహారాలను, ఒకరిది ఇంకొకరికి మార్చారు.

b) The time tables of Monday and Tuesday have been interchanged = సోమవారం, మంగళవారం time tables ఒకదానికొకటి మార్చారు

**Q.** As if. దీన్ని ఉదాహరణలతో వివరించగలరు.

**A.** As if = as though = అయినట్లు. కానీ, కాదు = appearing to be, but not really. He behaves as if/ as though he were the cleverest boy in the class = తనేదో అందరిలో అత్యంత తెలివిగలవాడైనట్లు (కానీ కాదు) ప్రవర్తిస్తాడు.

**Imp:** Note that as if/ as though are always followed by was/ were, but refer to the present.

It is as if/ as if he were giving/ was giving his money = తన డబ్బేతో ఇచ్చినట్లుంది/ ఇచ్చినట్లనిపిస్తున్నాడు (కానీ కాదు).

**Q.** You are not supposed to do it. ఈ వాక్యాన్ని ఉదాహరణలతో వివరించగలరు.

**A.** You are not supposed to do it = you are not expected/ you must not to do it (according to rule/ orders from Superiors) = నిబంధనలు, ఆజ్ఞలను గురించి చేయకూడని పని.

Boys are not supposed to tease girls = Boys must not tease girls = అబ్బాయిలు, అమ్మాయిలను వేధించకూడదు.

**Q.** 'Gerund' please give meaning with one example.

**A.** 'Gerund' has been explained a number of times before. However, we are explaining it again:

A present participle (the '... ing' form) - **e.g.:** going, walking, writing etc- used as a noun is a gerund.

That is, if you use an '... ing' form as

1) the subject of a sentence,
2) the object of a verb or
3) the object of a preposition, the '...ing' for becomes a gerund. (అంటే, '... ing' form ను, ఒక sentence కు subject గా గానీ, ఒక verb కు object గా గానీ, ఒక preposition కు object గా గానీ వాడితే అది gerund అవుతుంది.

**e.g.:** a) Walking is good for health. (నడవడం ఆరోగ్యానికి మంచిది) - ఈ sentence కు walking అనే '... ing' form subject కాబట్టి అది gerund.

b) I like walking - ఇక్కడ 'walking' అనే '... ing' form, like అనే verb కు object కాబట్టి, అది gerund.

c) with a view to having some exercise, I started walking - ఈ sentence లో walking, to అనేది preposition కాబట్టి, అదీ gerund అవుతుంది.

**Q.** Ravi is taller than Krishna.
Krishna is as tall as Ravi.
మొదటి sentence లో Ravi Krishna కంటే పొడవు. మరి రెండో sentence లో Krishna Ravi మాదిరిగా పొడవు. ఈ వాక్యాలను వివరించగలరు.

**A.** Ravi is taller than Krishna- రవి, కృష్ణ కంటే పొడవు ఒకదానికంటే ఇంకోటి ఎక్కువ అనే అర్థంతో - ఇక్కడ 'taller' అని వాడాలి కాబట్టి, అది 'comparative' degree. (కంటే అని అర్థం కాబట్టి)

Krishna is not as tall as Ravi - కృష్ణ, రవి అంత పొడవు కాదు. ఇక్కడ 'tall' వాడాం కాబట్టి, ఇది positive degree.

**Q.** Please translate the below sentences into English.

నీవు నాకు అడ్డంగా నిలబడ్డావు. పక్కకు జరుగు.

**A.** You are blocking my way/ You are in my way. Please stand aside.

**Q.** ఇతడిని నేను కావాలని తోశానని వాళ్ల నాన్న నన్ను అపార్థం చేసుకుంటాడు.

**A.** His father will misunderstand me. He will think that I pushed him intentionally (కావాలని).

***Raju, Atukulapalli.***

**Q.** Please clarify the following doubts

★ Even huge mountains would be like tiny particles of sand.

underline చేసిన పదం Past Tense or Present Tense?

**A.** 'Would here indicates improbable present - అంటే ప్రస్తుతం జరగని/ జరిగే వీల్లేని విషయాన్ని తెలుపుతుంది.

అర్థం: పెద్దపెద్ద పర్వతాలు కూడా చిన్న ఇసుక రేణువుల్లా ఉంటాయి. (దేనితోనయినా పోల్చినప్పుడు మాత్రమే - వాస్తవం కాదు) ఇది చూడండి.

If I were you, I would do it - నేను నువ్వయితే (నేను నువ్వయే విషయం అసంభవం - అయిన పక్షాన) అది నేను చేస్తాను.

ఇలాంటి చోట్ల 'would' improbable present.

**Q.** He says that he would help me what is the meaning of the underlined word is it Past Tense or Present Tense? Please explain.

**A.** He says that he would help me - ఇక్కడ would ఉపయోగం సరికాదు. He says he will help me - correct. కాబట్టి ఇక్కడ 'would' a tense అనే ప్రశ్నే లేదు.

He said that he would help me - ఇక్కడ 'would future from the past (గతంలోనుంచి భవిష్యత్)

**Q.** సంవత్సరం, వారం, రోజుల పేర్లు (Sunday... Saturday) పూటలు Morning... Night. ఈ పదాలన్నింటికీ మొదటి letter capital రాయాలా?

**A.** English లో సంవత్సరాలకు, సంఖ్యలేకానీ, పేర్లుండవు కదా? కాబట్టి capital letter తో ప్రారంభించాలనే ప్రశ్నే లేదు.

వారాలు (Monday, Tuesday etc) నెలల పేర్లు January, February, etc) మాత్రం capitals తోనే ప్రారంభించాలి. పూటలు (morning/ evening, etc) మాత్రం మామూలుగానే రాయాలి, capital తో ప్రారంభించకూడదు.

**Q.** అతడు bank లో money deposit చేశాడు. He deposited the money in the bank/ with the bank - which one is correct?

**A.** Deposited in the bank - correct.

**Q.** Please come on to the dais or I request him to come on to the dais. Which one of the above sentences is correct?

**A.** Please come on to the dais, correct కాదు. మనం stage మీద ఉండి, ఇతరులను stage మీదికి ఆహ్వానించేందుకు, please come up the dais అంటాం. Announcers/ Anchors etc. stage పక్కనే నిల్చుని అతిథులను ఆహ్వానించేటప్పుడు, please go up the dais అంటారు.

**Q.** He addressed his speech from on the dais.

**A.** He addressed his speech from on the dais- This sentence is wrong.

A person addresses an audience/ a gathering/ a meeting, etc. but not a speech/ a meeting.

Address: ఒకర్లను ఉద్దేశించి ప్రసంగించడం. You can say, 'He addressed the gathering/ the audience from the dais - correct.

***Y. Gayathri, Asifabad.***

**Q.** కింది పదాలకు తెలుగులో అర్థాలు తెలపగలరు.

★ **Indologist**

**A.** భారతీయ చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలపై ఆసక్తి ఉండి, వాటిని అధ్యయనం చేసేవాళ్లు.

★ **Indological**

**A.** భారతీయ సంస్కృతి, చరిత్రకు సంబంధించిన.

★ **Crusader - saint**

**A.** Crusader = ఒక మంచి విషయాన్ని సాధించేందుకు, ఓ చెడు ఆపేందుకు తీవ్ర, సుదీర్ఘ ప్రయత్నం పోరాటం చేసేవాడు.

Crusader - saint = అలాంటి ఉద్యమం జరిపే మహనీయులు. Gandhi was a crusader- saint for peace and non-violence = శాంతి, అహింసల కోసం తీవ్ర ప్రయత్నం/ పోరాటం జరిపిన మహనీయుడు గాంధీ.

★ **Female-Foeticide**

**A.** గర్భస్థ ఆడ శిశుహత్య (పుట్టబోతున్నది ఆడపిల్ల అని తెలిసి, బిడ్డ పుట్టకుండా గర్భస్రావం చేయించడం)

★ **Pandora**

**A.** Pandora అనికాకుండా, ఎక్కువగా, opening a Pandora's box అంటారు. అర్థం చాలా చెడు పరిణామాలు కలిగించే ఓ చెడుపని చేయడం.

The govt has opened a Pandora's box by making caste based reservations = కులం ఆధారంగా రిజర్వేషన్లను అమలు చేయడంవల్ల ప్రభుత్వం చెడు పరిణామాలకు తెరలేపింది.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# I am tired of his company



***K. Srinivasa Rao, Martur.***

**Q.** Sir, The choice lies between the three candidates అని B.B.Jain గ్రామర్ బుక్‌లో ఉంది. among సరైన పదం కాదని కూడా ఉంది. వివరించగలరు.

**A.** The choice lies between the three candidates - ఇక్కడ 'Three candidates' గురించి ప్రస్తావిస్తున్నప్పటికీ choice is between సరైందే.

The choice lies among the three, అన్నప్పుడు అర్థంలో కూడా కాస్త తేడా రావచ్చు. three ని, మూడు వస్తువులుగా కాకుండా, ముగ్గురు వ్యక్తులనే అర్థం తీసుకున్నపుడు. The choice lies among the three (men) అనుకుంటే అప్పుడు 'వాళ్ల ముగ్గురూ ఎంపిక చేసుకోవాల్సిన విషయం అది' అనే అర్థం వస్తుంది.

**Q.** అతిథులను వేదిక మీదకు ఆహ్వానించేటపుడు beloved, august, distinguished, honourable, respected లాంటివే కాకుండా, ఇంకా ఏమైనా పదాలుంటే తెలపగలరు.

**A.** ఇంకా ఇతర మాటలు కూడా వాడవచ్చు. Celebrated, esteemed, eminent, renowned, highly renowned, etc మాటలు కూడా వాడవచ్చు.

**Q.** కింది వాక్యానికి తెలుగులో అర్థం తెలపగలరు.

If I had a son of daughter possessed of one accomplishment it should be that of speech

**A.** నా కుమారుడికి/ కుమార్తెకు ఏదైనా ఘనత ఉండాలని నేను కోరుకుంటే అది ఉపన్యాస ప్రతిభ/ వక్తృత్వశక్తి.

**Q.** He behaved cowardly

We did nothing but complained

పై రెండు వాక్యాల్లోని తప్పును వివరించగలరు.

**A.** He behaved cowardly- ఇది correct sentence కాదు - cowardly, adjective. correct sentence. He behaved in a cowardly manner- correct. లేకపోతే He behaved like a coward.

We did nothing but complain (complained కాదు)

**Q.** Her air of pomposity was tactless and offensive.

ఈ వాక్యంలో air అర్థం తెలపగలరు.

**A.** ఆమె డాంబికం (Air of pomposity; air = ఇక్కడ ప్రవర్తన)తో కూడిన నడవడి, బాగా కనిపిస్తూ, ఇతరులకు కోపం తెచ్చేదిగా ఉంది.

**Q.** Antonio had no ready money. So, he had to borrow it from Shylock.

ఈ వాక్యాన్ని కింది విధంగా రాయవచ్చా?

If Antonio had had ready money he would not have had to borrow it from Shylock.

**A.** రాయవచ్చు Correct.

***V. Sreedhar, Nandalur.***

**Q.** Competitive Exams లో అడిగే synonyms, antonyms, comprehension, spotting errors, ordering of sentences లాంటివి ఉండే మంచి పుస్తకాన్ని సూచించగలరు.

Bank tests, staff selection commission కు పైన చెప్పిన సిలబస్ ఉంటుంది.

**A.** Competitive exams కు కావాల్సిన vocabulary lists with antonyms and synonyms lists ఏ మంచి Guide to competitive exams లోనైనా దొరుకుతాయి. అయితే అలాంటి Listsలోని Words ను కంఠస్థం చేయడం వల్ల అవి అంతగా గుర్తుండక పోగా, చాలా confusing గా కూడా ఉంటుంది. అందుకని మీరు అలాంటి guides లోని మాటలకు, వాటి antonyms, synonyms ను ముందు చూసుకుని, Oxford Advanced Learner's Dictionary of current english లో, ఆ మాటల అర్థాలను మళ్లీ చూసుకుని, వాటిని వాడిన sentence లను చూడండి, ఆ Dictionary లో. దాంతో పాటు, మంచి English News paper (Hindu లాంటిది) ప్రతిరోజూ అరగంట లేదా ముప్పావు గంట చదవండి. ఇంకా ప్రతిరోజూ English News telecast కనీసం morning ఒకసారీ, రాత్రి ఒకసారీ చూడండి. మీరిలాచేస్తే రెండు మూడు నెలల్లో మీ vocabulary లో చాలా improvement ఉంటుంది.

***T. Siva, Nandikotkur.***

**Q.** Attributive Adjectives, Predicative adjectives, Participial adjectives ను సోదాహరణంగా వివరించగలరు.

**A.**

| Attributive Adjectives | Predicative Adjectives |
|---|---|
| The blue sky | The sky is blue |
| The beautiful girl | The girl is beautiful |
| The great player | The player is great |

చూశారు కదా పైన. Noun (sky, girl, player) కు

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 640


M.SURESAN

ముందు adjective (blue, beautiful, great) వాడితే అది, attributive use of the adjective. అలా కాకుండా రెండో column లో చూపినట్లు, noun (sky, girl, great) తర్వాత adjective వాడితే (blue, beautiful, great) అప్పుడది, predicative use of the adjective అవుతుంది. గమనించండి: Adjective ను predicative adjective గా వాడితే, అది సామాన్యంగా verb తర్వాత వస్తుంది.

The blue sky - blue, attributive adjective

అర్థం: నీలాకాశం.

The sky is blue - blue, predicative use of the adjective

అర్థం: ఆకాశం నీలంగా ఉంది.

Participial adjective: Present participle/ past participle ను, adjective గా (వాడితే - to qualify a noun), అప్పుడది participial adjective అవుతుంది.

e.g. : The moving train.

'moving'- present participle, train అనే - noun ను qualify చేస్తోంది కాబట్టి, అది adjective. అయితే అది present participle కాబట్టి, participial adjective అవుతుంది.

అలాగే look at the expression:

The stolen money.

'stolen'- past participle of steal, qualifies the noun, 'money'. So here 'stolen' is an adjective. అయితే అది past participle కూడా కాబట్టి అది, participial adjective.

Some more examples:

Walking stick, looking glass, boiling water, etc., and also, printed matter, the murdered person, selected candidates etc. All the underlined present/ past participles are, participial adjectives.

**Q.** He was tired. He felt tired. He got tired. వీటి అర్థాన్ని ఏయే సందర్భాల్లో (be) P.P./ (feel) P.P./ (get) P.P. లను ఉపయోగిస్తారు?

**A.** He was tired - 'was' here expresses the condition of the person. Was tired అన్నప్పుడు, అతడున్న పరిస్థితి. (అలసిపోయిన పరిస్థితిలో ఉన్నాడు)

He got tired = అతడు అలసిపోయాడు. ఏదో ఎక్కువ శ్రమపడటం వల్ల/ విసుగు చెందడంవల్ల.

He felt tired = అతడికి అలసట అనిపించింది/ అలసిన భావం వచ్చేసింది. ఏది ఎక్కడ వాడాలనేది సందర్భాన్ని బట్టి ఉంటుంది. ఇలా:

He was tired, as he had worked the whole day = రోజంతా పనిచేశాడు, కాబట్టి అల సిపోయిన స్థితిలో ఉన్నాడు. (అలసట పొందాడు)

He got tired of telling his friend not to smoke = తన మిత్రుడిని సిగరెట్ మానేయమని చెప్పి చెప్పి అలసిపోయాడు/ విసిగిపోయాడు.

He felt tired after the day's work = ఆ రోజు పద్ద శ్రమవల్ల అలసట అనిపించిందతడికి.

**ముఖ్య గమనిక:**

1) పైన చెప్పిన తేడాలు అంతగా పాటించక్కరలేదు. మూడింటిలో ఏదయినా ఎక్కడయినా వాడొచ్చు.

2) 'Tire' ను ప్రస్తుతం ఎక్కువగా విసిగించడం అనే అర్థంతో వాడుతున్నారు.

a) You tire me with your silly jokes = నీ పిచ్చి jokes తో నన్ను విసిగిస్తున్నావు.

b) I am tired of his company = అతడితో ఉండటం విసుగు కలిగిస్తోంది.

**Q.** కిందివాటికి Antonyms తెలపగలరు.

★ Monotony **A.** Variety
★ Meagre **A.** Abundant/ plenty
★ Tickle **A.** Constant/ steady
★ Marvellous **A.** Ordinary
★ Meek (Mild) **A.** Rebellious (Mild X harsh)
★ Generous **A.** Mean
★ Straight **A.** Crooked/ dishonest/ artful
★ Ample **A.** Scanty
★ Praise **A.** Blame
★ Offer **A.** Reject/ deny/ withdraw
★ Quiet **A.** Loud
★ Regret **A.** Satisfaction (noun)/ gloat (verb)
★ Sacrifice **A.** Gain

**Q.** కిందివాటికి అర్థం, ప్రయోగాన్ని వివరించగలరు.

★ Joyous - joyful

**A.** Joyous and joyful = తేడా లేదు అయితే joyous అనేది, poetic- అంటే poetry లో, poetic language లో ఎక్కువగా వాడతారు. joyous - ఎక్కువగా సందర్భాలకు, joyous occasion (సంతోష సందర్భానికి) వాడతారు. persons కు అంతగా వాడరు.

joyful, persons కూ, occasions కూ రెండింటికీ వాడతారు.

★ Committee - commission

**A.** Committee- ఏదైనా వ్యవహారాన్ని నిర్వహించేందుకు లేదా విషయనిర్ధారణ చేసి, పరిష్కారాన్ని సూచించేందుకు ఏర్పడ్డ వ్యక్తుల సమూహం

Commission- కొంత మంది వ్యక్తుల సమూహం- ముఖ్యంగా ప్రభుత్వ ఆజ్ఞలు, నిర్ణయాలు, విధానాలు సరిగ్గా అమలవుతున్నాయా? లేదా? అని పరిశీలించేందుకు.

Commission కు చట్టబద్ధమైన అధికారాలుంటాయి. Commission నిర్ణయాలను కాదనడం చట్ట రీత్యా నేరం. Committee కి ఇలాంటి చట్టబద్ధత, అధికారాలుండవు.

★ Wail - weep

**A.** Wail = మూలుగు ధ్వనితో ఏడవడం - రోదించడం.

Weep = ఏ విధంగానైనా ఏడవడం.

★ Recover - Restore

**A.** Recover = 1) మనం పోగొట్టుకున్న వస్తువును తిరిగి పొందడం

2) జబ్బు నుంచి కోలుకోవడం.

Restore = 1) ఇంకెవరికైనా చెందిన వస్తువు/ పోగొట్టుకున్న విషయాలు వారికి తిరిగి వచ్చేలా చూడటం.

2) కోల్పోయిన హక్కులను పునరుద్ధరించడం.

★ Rid of - Get rid of

**A.** To get rid of = to be rid of = వదల్చుకోవడం.

He got rid of/ is rid of his troubles = వదుల్చుకున్నాడు / విముక్తి పొందాడు.

★ Altogether - All together

**A.** Altogether = On the whole = మొత్తంమీద.

a) It was a great party altogether = It was a great party on the whole = మొత్తంమీద ఆ party గొప్పగానే జరిగింది.

b) His visits here had become irregular and stopped altogether = అతడిక్కడికి రావడం కొంతకాలం సక్రమంగాలేదు. తర్వాత పూర్తిగా ఆగిపోయింది.

All together = అన్నీ/ అందరినీ కలిపి - There were fifty students all together.

★ Specially - especially

**A.** Specially, especially - ఇది ఇంతకు ముందు చాలాసార్లు వివరించాం.

★ Business - Trade

**A.** Business - వస్తువులు తయారుచేయడం, అమ్మడం, కొనడం, వస్తువుల నమూనాలు రూపొందించడం, వ్యాపారం చేయడం.

ఇవి రకరకాల వస్తువుల లావాదేవీలు కావచ్చు. వివిధ రకాల వస్తువుల క్రయ విక్రయం- టోకు/చిల్లర అవచ్చు. చిన్నరకం వ్యాపారమైనా, భారీ వ్యాపారమైనా కావచ్చు. Company ల మధ్య లేదా వ్యక్తుల మధ్య కావచ్చు.

Trade = భారీ వ్యాపారం, ముఖ్యంగా టోకువర్తకం. అదీ ఒకేరకానికి చెందిన వస్తువుల్లో, అందులో కూడా భారీ వ్యాపార సంస్థల మధ్య, ఎగుమతి - దిగుమతుల రూపంలో కూడా ఉండవచ్చు దేశ విదేశాలమధ్య.

Business లో Trade చేరి ఉంటుంది. Trade కార్యకలాపాలన్నీ business లో భాగమే. కానీ business కార్యకలాపాలన్నీ Trade లో ఉండకపోవచ్చు.

ఉదా: Tradeలో చిల్లర వ్యాపారం, సామాన్యమైన లావాదేవీలూ ఉండకపోవచ్చు.

★ Site - cite

**A.** Site - ఇంటి స్థలం - ఇల్లు కట్టుకునేందుకు నిర్దేశించిన స్థలం.

Cite = ఉటంకించడం - ఉదాహరణలూ, ఇతరుల మాటలు. (చెప్పుకోవడం).

We cite the example of the lion for courage = సాహసానికి ఉదాహరణగా సింహాన్ని చెప్పుకుంటాం.

★ Illness - disease

**A.** Illness = disease = వ్యాధి/ జబ్బు

★ Pitiful - Pitiable

**A.** Pitiful = దయతోకూడిన/ జాలిపడే గుణమున్న

Dharmaraja was a pitiful man = దయగలవాడు.

Pitiable = జాలిగొలిపే/ జాలిపడదగిన The condition of the child who lost its mother is pitiable = తల్లిని కోల్పోయిన ఆ బిడ్డ స్థితి జాలిగొలిపేది/ దయనీయంగా ఉంది.

★ Camp - Campaign

**A.** Camp 1) బస.

The collector's Camp = కలెక్టర్ బస/ విడిది.

2) బస చేయడం The minister is camping here tonight = ఈ రాత్రి మంత్రిగారిక్కడ బస చేస్తున్నారు.

Campaign = ఉద్యమం/ ఉద్యమించడం

Literacy campaign = అక్షరాస్యతా ఉద్యమం.

Abraham Lincon campaigned for the abolition of slavery = బానిసత్వ నిర్మూలనకు లింకన్ ఉద్యమించాడు/ ఉద్యమం నడిపాడు.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish





***G. Shankar, Keshavapatnam.***

**Q.** Dear sir, I am a teacher of English for Primary section. When I was teaching to my students I came across a phrase at Page No.38 "<u>Native place</u>". I think we don't find this expression in standard english. But here there in 6th standard text book E/M by (EFLU).

I want not to be found in next Re-print edition this expression. How I can take to its editor for this purpose to remove from the text. Please clarify it.

**A.** You can write to the author, if the author's address is given, or C/o the publisher (S.Chand & Co.), pointing out the error and asking them to see that it is not repeated in the next edition.

**Q.** In S.Chand's Text book for 5th standard, I found a doubt at Page No.81. Regarding present perfect tense: "The museum has stood there for <u>hundred years</u>". When time adverbial follows we use simple past but how it can be possible here. Please clarify it.

**A.** 'The museum has stood there for hundred years'- the use of the present perfect tense here is correct because the verb refers to an action starting 100 years ago and continuing till now. Here the adverbial does not refer to a definite point of time in the past but to a period of time over which the museum has continued to exist.

Compare: a) The museum <u>has stood</u> there <u>for a hundred years</u>.

b) A museum <u>stood</u> there <u>a hundred years ago</u>.

In (a) the adverbial refers to a period of time, continuing till the present- so the tense to be used is the <u>present perfect</u>.

In (b) the adverbial refers to a <u>point</u> of time in the past. So the tense to be used is the past simple.

However, 'hundred years' is wrong. It should be 'a hundred years/ one hundred years/ 100 years (read one hundred years)'. 100 is a countable singular, so 'a'/ one is a must before it.

# The book which is on the table is mine





M.SURESAN

***Usha, Yellandu.***

**Q.** Please clarify the following doubts.

'C' follows E. 'E' is followed by 'C' (CE) is this correct?

**A.** C follows E (Active voice) = E is followed by C (Passive voice)- Correct.

**Q.** In the previous Spoken English lesson you wrote a sentence while you were clarifying a doubt. The sentence is- The SP, who was to have <u>attended</u> as the chief guest didn't come yesterday.

I have a doubt in the underlined word. Because '<u>attend</u>' should have been written. Please clarify.

**A.** To have <u>attended</u> is correct. You know have/ has/ had/ would have, etc., is followed by the past participle (in this case, atten<u>ded</u>, the PP of 'attend') and never by the (1st Regular Doing Word 'attend')

**Q.** The S.I. follows the C.I.- C.I. is followed by the S.I. అంటే S.I., C.I. ని follow అవుతున్నారు. - is this correct?

**A.** Correct- అవును.

***Y. Gayathri, Asifabad.***

**Q.** కింది వాక్యాల్లో ఏది సరైందో తెలపగలరు.

He un-buttoned of his coat/ shirt

or

He un-buttoned his coat/ shirt

**A.** He unbottened his coat/ shirt- Correct

**Q.** Please explain principles to be followed while analysing simple, complex and compound sentences.

**A.** First of all, six forms of the verb:

1) 'be' form 2) 'be' form + ...ing form 3) 'be' form + past participle 4) Have/ has/ had/ shall have etc + past participle 5) The doing words (The two present simple forms- without '-s' and with '-s'), and 6) Shall/ should/ will/ would/ can/ could etc + 1st Doing Word (will go, can see, etc)- గుర్తుంచుకోండి.

Clause- a group of words with a verb <u>Main clause</u> - a clause with complete meaning; <u>Subordinate clause</u>- a clause without complete meaning.

Simple sentence- a sentence with just one main clause- అంటే ఒకే verb ఉన్న sentence అయితే అది simple sentence.

ఒక sentence లో ఒకటికంటే ఎక్కువ verbs ఉంటే, ఆ sentence లో ఒకటికంటే ఎక్కువ clauses ఉన్నట్లు - అప్పుడది compound sentence గానీ, complex sentence గానీ కావచ్చు. Sentence లో ఉన్నవన్నీ main clauses అయితే అది compound sentence. One main clause, one or more subordinate clauses ఉంటే అది complex sentence.

చూడండి: The book on the table is mine- ఈ sentence లో 'is' ('be' form) ఒకే verb- ఇది simple sentence.

The book which is on the table is mine - ఇక్కడ, 'is', and 'is' రెండు verbs - కాబట్టి రెండు clauses-

1) The book .... is mine - meaning complete- కాబట్టి Main clause.
2) The book which is on the table = Table మీదున్న పుస్తకం - meaning incomplete - So, Subordinate clause.

So 'The book which is on the table is mine' is a complex sentence.

There is a book on the table and it is mine - two verbs, 'is' and 'is'- two clauses: 1) There is a book on the table = Table మీద పుస్తకం ఉంది- Meaning complete- Main clause.

and it is mine- అది నాది - Main clause too.

So, the sentence is a compound sentence.

1) Usually, a sentence with just one verb is a <u>simple sentence.</u>
2) A sentence with 'and', 'but', 'yet', 'so', 'or', 'or else', 'either ... or', 'not only ... but also' - are compound sentences.
3) As sentence with, 'as', 'because', 'since', 'after + clause/ before clause', 'though/ although/ even though' etc are all complex sentences.

For more details refer to the old lessons.

**Q.** Bhagavatgita and Nuclear Policy అనే పుస్తకంలో ఒకవాక్యంలో 'my having approached' అని ఉంది. అలా వాడవచ్చా? వ్యాకరణ దోషం ఉందా? ఈ వాక్యం మొత్తం ఇలా ఉంది..

Inspite of my having approached it with earnestness and reading it with care, I found my self repelled by it.

**A.** My having approached - correct- There is nothing wrong

My approaching it = దాన్ని సమీపించడం (ఇక్కడి అర్థం - దృష్టితో దాన్ని అవగాహన చేసుకోవడం) (ఇప్పుడు) My having approached it (గతంలో) దాన్ని సమీపించడం మొత్తం అర్థం - చిత్తశుద్ధితో దాన్ని అవగాహన చేసుకోవాలనే ప్రయత్నం చేసినప్పటికీ, జాగ్రత్తగా చదివినప్పటికీ, అది నాలో విముఖత్వం కలిగించింది. (ఆకర్షించలేకపోగా, అసహ్యం కలిగేలా చేసింది).

# సరళమైన ఆంగ్లం మాట్లాడదాం ఇలా..

పుస్తకాల్లో మనం చదివే English కూ, సంభాషణల్లో, నిత్య జీవితంలో మామూలు వ్యక్తులతో (పరిచయం ఉన్న/ లేని) సంభాషించేటప్పుడు వాడే English కు చాలా తేడా ఉంటుంది.





తెలుగు కూడా అంతే కదా? గ్రంథాల్లో కనిపించే తెలుగుకు, మామూలుగా సంభాషించేటప్పుడు వాడే తెలుగుకూ తేడా ఉంటుంది కదా? సంభాషణకు వాడే English (Spoken English) చాలా సరళం (simple)గా, సూటి (direct) గా ఉంటుందని మనకు తెలుసు. కానీ, మనలో చాలామంది ఇలాంటి English మాట్లాడలేరు. మనకు English లో సంభాషించే అవకాశాలు చాలా తక్కువ కాబట్టి. అయితే అలాంటి English చాలా అవసరం. ఇది చాలా సందర్భాల్లో ఎలా వాడతారనేది ఇప్పుడు తెలుసుకుందాం.

**పలకరింపులు (Greetings)**

ఇవి రెండు రకాలు - 1) Formal and 2) Informal. మనకంతగా పరిచయంలేని వాళ్లను, కొత్తవాళ్లను, మన పై అధికారులను, మనం చాలా గౌరవించే వాళ్లను పలకరించే తీరు - Formal. మనతో బాగా చనువున్న వాళ్లను, బంధువులను, మన కుటుంబంలోని వాళ్లనూ పలకరించే తీరు - Informal. ఇవి గుర్తుంచుకుందాం.



Informal greeting: బాగా పరిచయం ఉన్న వాళ్లను పలకరించే విధం: Hello

## FUNCTIONAL ENGLISH

**Kumar:** Hello Rajesh, What are you doing?

Hello కు సమాధానం/ స్పందన Hello నే.

**Rajesh:** Hello Kumar, I'm (I am) on my way to college.

American English అయితే, Hi (హై) అందుకు స్పందన కూడా 'Hi' నే

**Ramesh:** Hi Naresh, How are you?

**Naresh:** Hi Ramesh, I'm fine. Thank you. How are you.

**Ramesh:** Fine too. Thank you.

ఇవి తెలిసినవే కదా! మనం ఎవరినయినా మధ్యాహ్నం లోపు కలుసుకుంటే Good morning, మధ్యాహ్నం నుంచి సాయంత్రంలోపు అయితే Good afternoon, సాయంత్రం నుంచి రాత్రి చివరిగా కలుసుకునే వరకు Good evening, రాత్రి సెలవు తీసుకునేటప్పుడు Good night అంటాం.

సంభాషణ పూర్తయ్యాక, Bye/ Good bye/ bye bye/ Have a nice day అనడం బాగుంటుంది.

Formal greeting: మనకు తెలిసిన వాళ్లను, పాత మిత్రులనూ కలుసుకున్నప్పుడు పలకరించే విధం

a) **Priya:** Hi Madhavi, How are you?

**Madhavi:** Fine, thank you; How are you?/ and you?/ How about you?/ what about you? (కులాసానే. Thank you. నువ్వెలా ఉన్నావు? / నువ్వు/ నీ సంగతేంటి? )/ OK/ All right

**Priya:** Fine too. Thank you. (కులాసానే. Thanks)/ OK too/ Same here, thank you.



b) మన స్నేహితుల యోగక్షేమాలను విచారించడం.

**Karim:** How are you? How's everybody at home? (ఎలా ఉన్నావు? ఇంట్లో అందరూ ఎలా ఉన్నారు? / How are your parents?/ How are the children? (your children అనం) How are your brother and sister?

**Kiran:** Everybody's OK. Thank you. How is it with you? (అందరూ కులాసా. Thank you. నీ సంగతేంటి? )

ఇలా కూడా అనవచ్చు

**Mukesh:** Hi Suman, How are you <u>getting on</u>? How's (How is) everybody getting on at home? (నువ్వెలా ఉన్నావు? / ఇంట్లో అందరూ ఎలా ఉన్నారు? )



**Suman:** Quiet all right/ fine/ Thankyou. What about you?

**Mukesh:** Fine too/ Ok too/ All right too, Thank you.

**Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish**






***Anil, Bapatla***

**Q.** 1) Telugu Movies would not get released in Chennai
2) Telugu Movies would not be released in Chennai

పై రెండు వాక్యాల మధ్య Difference ను వివరించ గలరు.
మొదటి వాక్యంలో 'Get' Importance తెలియ జేయగలరు.

**A.** Sentence గా Telugu movies would not get/ be released in Chennai సరికాదు. sentence ఉండాల్సిన తీరు: Telugu movies do not get/ are not released in Chennai = చెన్నైలో తెలుగు చిత్రాలు విడుదలకావు = రెండింటికి దాదాపు ఒకే అర్థం. (get released = విడుదలయ్యే అవకాశం పొందవు - ఇది కూడా పూర్తిగా సరైంది కాదు. తెలుగులో దానికి (get released లాంటి వాటికి) correct equivalent లేదు.

Bring somebody up = పెంచడం
His grand parents brought him up = అతడి తాత, అమ్మమ్మ/ బామ్మ అతడిని పెంచారు.

2) Blighter = ఇది rascal లాగా తిట్టు పదం, అయితే ఇది తిట్టేందుకు కాకుండా మన అభిమానం/ ఆపేక్ష/ మెప్పు చూపేందుకు వాడతాం. (తెలుగులో కూడా 'ఓరి దొంగ వెధవా' అని తిట్టేందుకు కాకుండా మెప్పు/ ఇష్టం తెలిపేందుకు అంటుంటాం కదా? )

'you lucky blighter, so you got the seat in medicine (ఓరి దొంగ వెధవా, మొత్తానికి medicine లో seat సంపాదించావన్నమాట) మీరు రాసిన రెండో పదానికి అర్థం: ఆ వెధవని పళ్లురాల గొట్టేందుకంటే ఇది నయం.

**Q.** The education bill was thrown - by the assembly (out, off, up)
**A.** The education bill was thrown out

**Q.** వికలాంగులు, దిక్కూ మొక్కులేని వాళ్లు అడుక్కోవడంలో అర్థం ఉంది. అన్ని అవయవాలు సక్రమంగా ఉండి శ్రమ చేయగలిగే స్థితిలో ఉన్న వారు అడుక్కోవడం, బద్ధకం కాక మరేమిటి?
ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలో తెలపగలరు.

**A.** We can understand the disabled and the destitute begging, but the able bodied who can work, begging- what else is it, if not laziness?

**Q.** Thank you very much to have saved me.
Thank you very much for having saved me
పై రెండు వాక్యాల మధ్య తేడాను వివరించగలరు.
**A.** 'For having saved me' is correct.

**Q.** ప్రభుత్వ ఉద్యోగులు, నిజాయితీగా ఉంటున్నారా అంటే, లేదు అనే సమాధానమే సర్వత్రా వినిపిస్తుంది.
పై వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలో తెలుపగలరు?
**A.** Are government employees honest? The only answer you always get is 'No'

# His grand parents brought him up

***Rajkumar, Darsi***

**Q.** 1. It'll do the lad good. Bring 'em up natural, I always say.
2. Better than letting that blighter take your teeth out, anyway.
పై రెండు వాక్యాలకు తెలుగు అర్థం తెలపగలరు.

**A.** 1) నేనెప్పుడూ అంటుంటాను. అది పిల్లాడికి మంచి చేస్తుంది - పిల్లల్నెప్పుడూ సహజ వాతావరణంలో పెంచమని.
lad = అబ్బాయి, lass = అమ్మాయి
Bring 'em up = Bring them up





M.SURESAN

***K.Srikrishnakumar, Bapatla.***

**Q.** ఈ కింది పదాల అర్థాన్ని, వాటిని ఉపయోగించే సందర్భాన్ని తెలుగులో వివరించగలరు.
1. Lawless 2. Illegal 3. Illicit 4. Unlawful 5. Discharge 6. Exonerate 7. Pardon 8. Release 9. Acquit 10. Illegitimate

**A. Lawless** = a situation in which law is not at all respected or followed - చట్టాలు పనిచేయని పరిస్థితి - నేరగాళ్లు యథేచ్ఛగా నేరాలు చేయగలిగిన పరిస్థితి - చట్టం పనిచేయని స్థితి.

**Illegal = unlawful.** కోర్టు ఇచ్చే తీర్పులకు విరుద్ధంగా ఉంటే illegal. Illegal occupation of a place = కోర్టు తీర్పునతిక్రమించి అధీనంలో ఉన్న స్థలం.

**Unlawful** = కోర్టు తీర్పేమీ లేకుండా, కోర్టు ప్రమేయం లేకుండా, చట్టానికి వ్యతిరేకంగా ఉండటం. ఉదా: ప్రభుత్వ స్థలం ఎవరి అనుమతి లేకుండా ఒకవ్యక్తి అధీనంలో ఉండటం unlawful. ఆ విషయమే court ధ్రువీకరించి, ఆ వ్యక్తిని ఆ స్థలం వదులుకోవాలని ఆదేశించిన తర్వాత కూడా అక్కడే కొనసాగుతుంటే అది illegal.

**Illicit:** ఇది ముఖ్యంగా స్త్రీ, పురుషుల అక్రమ సంబంధాలకు వర్తిస్తుంది. అంతేకాకుండా చట్ట వ్యతిరేకంగా, గోప్యంగా జరిగే పనులకూ వర్తిస్తుంది. e.g.: 1) Illicit relationship between a man and a woman (స్త్రీకి, పురుషుడికీ ఉన్న అక్రమ సంబంధం)
2) Illicit distillation of liquor = చట్టం అనుమతి లేకుండా మద్యం తయారీ; అక్రమ తవ్వకాలు = Illicit mining, etc.

**Discharge** = ద్రవ పదార్థాల విడుదల
1) Discharge of blood 2) Discharge of drainage water 3) Discharge of water/ River water into the sea.
Discharge from hospital/ prison = ఆస్పత్రి/ జైలు నుంచి వ్యక్తుల విడుదల.
Discharge of duties = విధుల నిర్వాహణ
Discharge from duties = విధుల నుంచి ఉద్యోగి తొలగింపు.

**Exonerate** = వ్యక్తిపై మోపిన ఆరోపణలు రుజువు కానందువల్ల ఆ వ్యక్తి ఆ నేరాలు చేయలేదని తీర్పు ఇవ్వడం (కోర్టు)

**Pardon** = నేరం చేసినప్పటికీ క్షమించి వదిలేయడం Pardon

**Release** - 1) జైలు లాంటి వాటి నుంచి శిక్ష పూర్తయిన తర్వాత విడుదల చేయడం.
2) నీళ్లు మొదలైన వాటిని వదలడం
3) ఆజ్ఞలు, సినిమాల్లాంటివి విడుదల చేయడం

**Acquit** = నేరాలు రుజువుకాని పరిస్థితిలో, అంటే exonerate అయిన వ్యక్తిని కోర్టు విడుదల చేయడం

**Illegitimate** = Illicit - అక్రమ సంబంధం వల్ల పుట్టిన సంతానం illegitimate.

***Y. Gayathri, Asifabad.***

**Q.** నేను ఒక పుస్తకంలో కింది పదాలు చూశాను. వాటి సరైన అర్థాలు నా దగ్గర ఉన్న డిక్షనరీలో దొరకలేదు. దయచేసి ఆ పదాలను గురించి వివరించండి.
Prayest; shalt; Hast; Seeth.

**A. Prayest, Shalt, hast, seeth**
ఇవన్నీ archaic forms = old English పదాలు వీటికి modern English రూపాలు (equivalents) వరుసగా.. **pray, shall, has, see**

**Q.** కింది పదాలకు అర్థాలు తెలపగలరు.
a) Saporito b) Paro c) Kyle d) Eric
e) Uncharacteristic

**A.** (a) నుంచి (d) వరకు ఉన్నవి పేర్లు. పదాలు కావు.
(e) uncharacteristic = లక్షణం కానిది
To be honest is uncharacteristic of Indian politicians = నిజాయితీగా ఉండటం భారత రాజకీయ వాదుల లక్షణం కాదు.
It is uncharacteristic of a dog not to bark = మొరగకుండా ఉండటం కుక్క లక్షణం కాదు.

**Q.** కిందివాటిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?
★ మహాత్ముల సాంగత్యం చాలా మంచిది.
**A.** Associating/ mixing with the great is always good.
★ తోటి మానవుడికి సహకరించు.
**A.** Help your fellow human beings.
★ మన తాళపత్ర గ్రంథాల్లో ఎన్నో అమూల్యమైన విషయాలున్నాయి.
**A.** Our palm leaf books contain invaluable information.

# *What a pleasure meeting you!*

కిందటిసారి మనకు తెలిసినవాళ్లను ఎలా పలకరించాలో తెలుసుకున్నాం కదా? ఇప్పుడు.
1) మనం మనల్ని ఇతరులకు ఎలా పరిచయం చేసుకోవాలో
2) మనం, మనకు తెలిసినవాళ్లను ఒకరికొకరిని ఎలా పరిచయం చేయాలో చూద్దాం. (ఇవన్నీ కూడా మనం నిత్యజీవితం (real life situations) లో practise చేస్తేనే బాగా అలవాటై సహజంగా అప్రయత్నంగా మనం మాట్లాడేస్తుంటాం. కాబట్టి అవకాశం వచ్చిన పుడల్లా practise చేద్దాం.

**I. Self introduction** (స్వపరిచయం):
a) Formal (పూర్తిగా కొత్తవాళ్లతో/ పై అధికారులతో/ మనం వ్యవహారం నడపబోయేవాళ్లతో)
'Excuse me, I am Narayana, May I know/ have your name please? (My name is అనవచ్చు అయితే అంతకంటే 'I am....' అనడం మెరుగు - ఇలా అనేటప్పుడు ఆత్మవిశ్వాసంతో, స్పష్టంగా, నిదానంగా, మర్యాదగా, మొదటిమాట ఎంత clear గా ఉంటుందో చివరి మాట కూడా అంత clear గా ఉండేలా మాట్లాడటం practise చేయండి)




అవతలివాళ్లు మనం అనుకున్న వాళ్లేమో అనే సందేహం ఉన్నప్పుడు ఇలా అంటాం:
Excuse me. I am Narayana. Am I (by any chance అని ప్రారంభించవచ్చు) speaking to Mr/ Sri Raghav? (మీరు రాఘవ్‌గారాండీ? )

ఇలాంటి పరిస్థితిలో (ఇంకెవరైనా తమను తాము పరిచయం చేసుకున్నప్పుడు) మన స్పందన
1) I am Achyuth. What can I do for you? (నాతో ఏమన్నా పనుందా)
2) Yes, I am (Am I speaking to Raghav? అని ఎవరన్నా అడిగితే). Anything I can do for you? (నాతో పనేమన్నా ఉందా? )
b) Informal: (మనతో సమానమైన వాళ్ళతో) I am Srinivas, Your name please?
దీనికి స్పందన:
I am Anand. What's the matter? (నేను ఆనంద్/నాపేరు ఆనంద్ ఏంటి సంగతి? మర్యాద ధ్వనించేలా/ (What can I do for you?




గమనిక: Myself Srinivas అని మాత్రం అన కూడదు. ఎప్పుడూ My name is/ అంతకంటే మెరుగ్గా I am Srinivas అనడం సరి.

## FUNCTIONAL ENGLISH

II. Introducing two of our friends to each other (మన స్నేహితులనిద్దరిని ఒకరికొకరికి పరిచయం చేయడం:
You are introducing Jagdish to Satish
a) You (మీరు): Hi Satish, This (he అనకండి) is my class-mate Jagdish and.....




**Satish:** Hi Jagdish, how do you do?/ Glad to meet you/ Pleased to meet you/ (so) nice to meet you./ Happy to meet you.
(గమనిక: How do you do కు స్పందన How do you doనే. I am fine లాంటివి అనం. 'How do you do?' formal. మిగతావన్నీ informal).
**You:** Jagdish, this is, Satish, my playmate/ neighbour, etc.
**Jagdish:** Hi Satish, How do you do?/ Equally glad/ pleased/ (so) nice to meet you/ happy to meet you.
పై మాటలనేప్పుడు, తెలుసు కదా, కరచాలనం (Shakehand) చేస్తాం.
Glad to/ nice to meet you అనే బదులు, Glad/ nice/ pleasure meeting you అని కూడా అంటాం.
కొన్ని కొన్ని సందర్భాల్లో పరిచయమైన ఇద్దరు వ్యక్తులూ, Hi, Hi తో సరిపెట్టుకోవచ్చు ఇలా.
**Sekhar:** Praksh, meet my friend Bhanu. Bhanu, this is Prakash, my cousin.



**Prakash:** Hi
**Bhanu:** Hi
ఇంకో విధం:
**Rama:** Hi Sheriff, you haven't met Sasikanth, have you?
(శశికాంత్‌ను షరీఫ్‌కు పరిచయం చేస్తూ) నువ్వింతకు ముందు శశికాంత్‌ను కలుసుకోలేదు కదా?
**Sheriff:** Oh, no, I haven't had the pleasure. Hi Sasikanth.
**Rama:** (Pointing to Sheriff) Sasikath, Sheriff, my friend.
**Sasikanth:** What a pleasure meeting you! (కలుసుకున్నందుకెంత సంతోషంగా ఉందో!)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish






*A.Yakaiah, Nellikudur.*

**Q.** I wonder if you could clarify many of my doubts in English.

Differentiate between anomalous & Non anomalous Verbs

**A.** Anomalous verbs - their correct name is 'Anomalous finites' are:

* am, is, are, was and were
* have, has and had
* do, does and did
* shall, should, will, would, can, could, may, might, must, need, ought, dare, and used to.

They are also called, auxiliary or defective verbs. Except am, is, are, was, were, have, has, do, the other verbs can't be used independently. Negatives, however, can be formed with them - in the contracted form - n't'. (won't, can't shan't, etc)

# The college is named after him






M.SURESAN

**Q.** Finite & Non finites

**A.** The other kinds of verbs, called finite verbs (not non-anomalous) can form tenses - give, gave, given and indicate the number and person of subjects.

e.g: I do (Ist person, singular), He does (IIIrd person, singular), etc.

**Q.** Defective verb.

**A.** Defective verbs = auxiliary verbs = anomalous finites

**Q.** What do we call the given words in English?

a) సైకత శిల్పం b) సైకత శిల్పి

**A.** Sand sculpture; sand sculptor.

**Q.** Speaker & Narrator & Author..

**A.** Speaker = A person who makes a speech on any subject/ A person who speaks (వక్త, మాట్లాడేవారు)

Narrator = One who narrates (tells a story, reports an event, etc) (కథకుడు)

author = writer

**Q.** As we know that when reporting verb is in past tense the corresponding reported clause/ verbs if it is in simple past tense converted in to past perfect. Sometimes, simple past remains as it is.

e.g.: Raju said, 'I went to movie yesterday.'

Raju said that he went to movie yesterday.

is it correct? if so

Please explain in which context simple past is changed into past perfect tense.

- In which context simple past tense remains as it is.

**A.** 'Raju said that he went to a movie yesterday' is not the correct reported form of Raju said, 'I went to a movie yesterday'.

The correct reported form is: Raju said that he had gone (past perfect) to a movie the day before. Look at the following example:

D.S. : Kamala said, 'I meet (simple present) my friend often.'.

I.S. : Kamala said that she met (simple past) often.

A reported verb in the simple past in direct speech remains as it is even in the indirect speech, only if the reporting verb (verb outside the quotations) is in the present/ the future tense

D.S.: Kamala says, 'I went there yesterday'.

Here the reporting verb 'says' is in the present tense. So the tense of the reported verb, 'went' (simple past) remains as it is.

I.S.: Kamala says that she went out yesterday.

If the reporting verb is in the past tense the tense of the reported verb must be changed and the simple past must be changed into past perfect, whether it is an immediate past action or distant past action. ('long past' as you say)

e.g. : The constable said to the inspector, 'We arrested him ten minutes ago' (Ten minutes ago- not distant/ long past). Even then the I.S. is:

The constable told the inspector that they had arrested him ten minutes before

It is not question of near/ immediate past or distant past/ long past. If is depends on whether the reporting verb is in the present or the past tense.

**Q.** (i) I read in a book (DGP publications) that long past actions changed from D.S to I.D.S simple past - Past perfect tense.

e.g.: He said, 'Rama Killed Ravana'

He said that Rama had killed Ravana.

(ii) He said, 'I lived many years in England.'

He said that he lived many years in England.

Please explain above example.

**A.** (i) D.S. : The teacher is saying, 'Rama killed Ravana'.

I.S. : The teacher is saying (Reporting verb - present tense) that Rama killed Ravana. (Correct). Here, we don't say, Rama had killed Ravana.

(ii) Similarly: D.S. : He says, 'I lived many years in England'.

I.S.: He says that he lived many years in England.

D.S.: He said, 'I lived many years' in England.

I.S.: He said that he had lived... in England.

**Q.** In Non-detailed lessons many times

The sentences in the past perfect tenses and sometimes with time references.

**A.** Please understand the use of the past perfect tense correctly. The past perfect is used for the earlier of two past actions.

He told me that he had seen the movie. There are two past actions here - 1) His telling me, and 2) his seeing the movie. Both are past actions. However, his seeing the movie is the earlier, and his telling me about it is the later past action. So, his seeing the movie - must be in the past perfect tense.

Also look at the following:

He slowly got up from bed. He remembered what had happened the night before. Two strangers had entered his room about 6 in the evening yesterday. They had hit him hard on the head. That was all that was able to recollected. He now looked around. His wrist watch and rings he had kept on the table were no longer there. He understood that the strangers had taken them away.

Observe that his getting up slowly is a past action. all the other events had taken place 'yesterday', that is, they are all earlier past actions. So they are in the past perfect tense. So the use of past perfect has no connection with time of happening.

*Banti Balo, Gandhinagar*

**Q.** Translate the following sentences into Telugu.

* The college is named after him.

(కళాశాలకు అతడి పేరు పెట్టారు.)

**A.** To name after somebody.(ఒకరి పేరు పెట్టడం.)

His parents named him after his grandfather. (అతడి తల్లిదండ్రులు అతడికి అతడి తాత పేరు పెట్టారు.)

Nellore district is named after Potti Sri Ramulu. ( నెల్లూరు జిల్లాకు పొట్టి శ్రీరాములు పేరు పెట్టారు.)

# Who do I see here?

కొందటిసారి మనల్ని మనం ఇతరులకెలా పరిచయం చేసుకుంటామో, మనకు తెలిసినవాళ్లను ఒకరికొకరిని ఎలా పరిచయం చేస్తామో చూశాం కదా. ఇది మనకు గుర్తుండాలంటే సందర్భం వచ్చినప్పుడల్లా English లో మాట్లాడితే బాగా practice అయి, రోజూ వాడే మాటల్లో భాగమైపోతుంది. వీలున్న సందర్భాలన్నింట్లో ఈ English మాటలు మాట్లాడేస్తే అది మీకు మామూలైపోతుంది.




ఇప్పుడు మన స్నేహితులను, పరిచయం ఉన్నవాళ్లను, తెలిసినవాళ్లనూ కలుసుకున్నప్పుడు ఎలా పలకరించాలో చూద్దాం. (మర్చిపోకండి - practice is important)

**Pradeep:** Hi Jagdish, how are you?
(ఎలా ఉన్నావు? )

**Jagdish:** Fine, Pradeep. Thank you. How are you?/ How about you?
(బాగానే ఉన్నాను. Thank you. నువ్వెలా ఉన్నావు? / నీ సంగతేంటి? ) ఇంకా ఇలా కూడా అనవచ్చు

**Anjana:** Hi Sujee, how goes life?/ How's life?
(ఎలా ఉన్నావు? )

Students అయితే, How are your studies?/ How about your studies?
(నీ చదువెలా ఉంది? / నీ చదువెలా సాగుతోంది? )

**Sujee:** Fine. Thanks. How about you?/ How are your studies?/ How about your studies?
(బాగానే ఉంది. Thanks. నీ సంగతేంటి? / నీ చదువెలా ఉంది? )

**Anjana:** Fine too/ Same here/ Thank you.
(బాగానే ఉంది/ నాదీ అంతే. Thank you.)

o పరిచయస్తులను కలుసుకున్నప్పుడు ఇంకా ఇలా కూడా పరామర్శించుకోవచ్చు

**Subodh:** Hi Pranav, how are you?

**Pranav:** Fine/ OK. (బాగానే ఉన్నా) Can't complain (ఏ బాధాలేదు)/ No regrets (చింత పడాల్సిందేం లేదు. అంతా బాగానే ఉంది)/ Never better (ఇంతకంటే బాగా ఎప్పుడూలేను). Thank you. What about you? (నీ సంగతేంటి? )




**Subodh:** Same here.
(నా సంగతి అంతే.) Thanks.

o ఇంకా ఇవి కూడా చూడండి.

## FUNCTIONAL ENGLISH

**Pranav:** Hi Subodh, How are you and how is every body?
(ఎలా ఉన్నావు. మనవాళ్లంతా బాగున్నారా? )/
How are you getting on? (ఎలా గడుస్తోంది? )/ How are things going? (విషయాలెలా జరుగుతున్నాయి? ) How's (How is) life? (జీవితం ఎలా ఉంది? )



**Subodh:** Everybody/ everything is fine/ very well.

o ప్రత్యేకంగా ఎవరిని గురించయినా అడిగేటప్పుడు:

How are/ How about your parents?/ your brother (s) and sister (s)/ your kids (పిల్లలు)/ your parents?/ How is your wife?, etc.

o చాలా కాలం తర్వాత మన సన్నిహితులు, స్నేహితులు, బంధువులు, పరిచయస్తులను కలుసుకున్నప్పుడు,

**Susmitha:** Hi Neeraja, long since We met/ ages (యుగాలు) since we met/ long time, no see (చాలా కాలం మనం కలుసుకోలేదు); Where have you been all these days? (ఇన్ని రోజులూ ఎక్కడున్నావు? ); is everybody OK? (అందరూ కులాసానా? )

**Neeraja:** It's a real pleasure meeting you after such a long time/ How nice meeting you after all these days! How goes life?
(ఇంతకాలం తర్వాత కలుసుకోవడం ఎంత సంతోషంగా ఉందో! జీవితం ఎలా గడుస్తోంది? )

o ఇంకా ఉద్వేగంతో పలకరించాలనుకుంటే ఇలా కూడా అనవచ్చు చాలాకాలం తర్వాత కలుసుకున్నప్పుడు.

**Sritej:** Hei, Who do I see here? Srikar?
(హెయ్, ఎవరి క్కడ కనపడుతున్నది నాకు? శ్రీకరేనా? )



What a Surprise! (ఎంత ఆశ్చర్యం! Hope I am not mistaken (నేను పొరపడటంలేదు కదా? ) (ఇవన్నీ మన ఆశ్చర్యం తెలిపేందుకు అంటాం)

**Srikar:** Make no mistake. I am Srikar of course. Enough.
(నువ్వేం పొరపడలేదు. నేను శ్రీకర్నేలే. ఇంక ఆపు.)

ఇవన్నీ మీరు నిత్యజీవితంలో సమయం వచ్చినప్పుడల్లా Practise చేయండి. అలాచేస్తే సులభంగా అలవాటవుతుంది.




# Why he has shouted?





M.SURESAN



***A. Sudhakar***
***Peddamalla Reddy***

**Q.** I have seen the following sentence in a book. 'I will come tomorrow'. Here will is present. So, this is present tense. But action will complete in future. Please clarify about this example of Time & Tense.

**A.** 'I will come tomorrow', will come refers to an action that will be completed in future. 'will come' refers to an action of the future. This is simple.

Don't worry too much about these things. All that we should aim at is, speaking English correctly. Let us not worry about form and meaning, and other final points like semantics. 'Semantics is the study of the meanings of words - how the meaning of a word changes in course of time.

When you know 'will' indicates future, verbs like will come, will go, etc., indicate only future actions, so they are in the future. That's all we need to know. If you are not satisfied with this explanation, please make express your doubt more clearly.

***Joshi Malhotra, Hanamkonda***

**Q.** Please clarify the following doubts.

1) He sang with great care (ఇక్కడ underlined చేసిన పదాలు phrase అని ఒక పుస్తకంలో చదివాను. కానీ ఇది subject 'He' గురించి చెబుతుంది కదా.

**A.** Phrase = a group of words without a verb. 'With great care' is a group of words without a verb (verb లేని మాటల కూర్పు) కదా. కాబట్టి అది phrase. Noun గురించి Phrase చెప్ప కూడదని ఎక్కడన్నా ఉందా? subject ను గురించి చెప్పే phrase, adjective phrase అవుతుంది. కానీ ఇక్కడ 'with great care', subject ను గురించి చెప్పడం లేదు కదా? Verb, sang ను గురించి చెబుతోంది. కాబట్టి అది, adverb phrase.

The book, written ten years ago, is still in demand.

ఇక్కడ, written 10 years ago (పదేళ్ల క్రితం రాసిన) is a phrase (written, verb కాదు, past participle మాత్రమే) describing the subject, 'the book'

**Q.** He worked with great enthusiasm ఇక్కడ underlined చేసిన పదాలు clause అని ఒక పుస్తకంలో చదివాను. కానీ He sang with great care వాక్యానికి, He worked with great enthusiasm ఈ వాక్యానికి తేడా ఏమిటి? ఈ రెండో వాక్యంలో verbs ఏమిటి? అంటే underlined చేసిన పదాల్లో verbs ఏమీ లేవు కదా? Please explain.

**A.** 'With great enthusiasm' is a group of words without verb, so it is a phrase, not a clause. ఈ group of words లో verb లేనప్పుడు అది clause ఎలా అవుతుంది?

With great care (చాలా జాగ్రత్తగా), with great enthusiasm (చాలా ఉత్సాహంతో) - ఈ రెండూ కూడా phrases.

**Q.** I don't know why he has shouted (ఇక్కడ underlined చేసిన పదాలు phrase అని ఒక పుస్తకంలో అన్నారు. కానీ ఇక్కడ underlined words లో 'has' 'shouted' అనే verbs ఉన్నాయి కదా? Then why is it said as phrase?

**A.** Why he has shouted - ఇది clause, ఇక్కడ 'has shouted' అనే verb ఉంది కాబట్టి అది clause అని ఏ పుస్తకంలోనూ ఉండదు. మీకున్న సందేహంతోనే ఇలా చెబుతున్నారు అనిపిస్తోంది.

'Why he has shouted' - ఈ clauseలో has ఒక verb, shouted రెండో verb కాదు. 'Has shouted' ఒకే verb.

**Q.** The boy sat at the window. Here the underlined part is called 'clause', though it has not any verbs - Please explain.

**A.** 'at the window' is only a phrase. No good book calls it a clause, as there is no verb there.

***Suresh Singhal, Warangal***

**Q.** Which one of the following sentences is corect?

1. I am an Indian 2. I am Indian

**A.** Both 'I am an Indian' and 'I am Indian' are correct. In 'I am an Indian', Indian is a noun, like 'student' in 'I am a student'. In 'I am Indian' 'Indian' is an adjective, like 'tall' in 'I am tall'. 'Indian' in the sentence 'I am Indian' talks about the person's quality of belonging to India. Look for example at the sentence, 'This custom is Indian'. In 'I am Indian' Indian means 'of or belonging to India'.

Look at the sentences: 'He is a German' and 'He is German'. In 'He is a German' German is a noun, and in the second sentence, German is adjective.

**Q.** Please clarify the following doubts.

I don't know whether he is coming or not. The above underlined group of words is phrase or clause.

**A.** 'Whether he is coming or not' is a clause because it is a group of words with the verb, 'is coming'. It is NOT a phrase.

**Q.** I don't know why he has not come. The underlined group of words is phrase or clause.

**A.** 'Why he has not come' is a clause too, because it is a group of words with the verb, 'has come'.

**Q.** He doesn't know how to dance.The underlined group of words is phrase or clause.

**A.** He doesn't know how to dance. 'How to dance' is only a phrase because there is no verb in the group of words, 'How to dance'. 'To dance' is an infinitive, and an infinitive (to go, to sing, etc to 1st Regular Doing Word), like the '.....ing' form, and the past participle (gone, seen, etc) are NOT verbs.

**Q.** I don't know whether he fought in a brave manner or not. Is it phrase?

**A.** 'Whether he fought in a brave manner or not' is a clause, because there is a verb, 'fought' in this group. But, 'In a brave manner or not' is only a phrase, because there is no verb, in the group of words.

**Q.** If you study hard, you will succeed. Is it clause?

**A.** "If you study hard,' is a clause because it is a group of words with the verb, 'study'.

***Rekha Pallavi, Warangal.***

**Q.** చనిపోయిన వాళ్ల గురించి చెప్పేటప్పుడు 'of' వాడాల్సిన అవసరం ఉందా?

For example: a) The wisdom of Solomon is great.

b) The daughter of Nehru.

**A.** 1) No such rule. You can either use 'of' or apostrophe and s('s).

a) Wisdom of Solomon = Solomon's Wisdom.

b) Daughter of Nehru = Nehru's daughter.

**Q.** Rivers, oceans, seas - వీటికి పేర్లు ఉంటే ఆ పేర్లు చెబితే సరిపోతుందా?

e.g.: The Krishna, the Indian (ocean), the Bay of Bengal, the Nagarjuna Sagar (canal).

**A.** 'The' must be used before names of rivers, seas and oceans.

The Krishna (river), The Arabian sea, The Indian Ocean, The Bay of Bengal, The Nagarjuna sagar canal, etc.

# Where do you come from?

వ్యావహారికంగా మాట్లాడాల్సి వచ్చినప్పుడు మన భాష ఎంతో సరళంగా, సహజంగా ఉండాలి. ఒక్కోసారి మాట్లాడేటప్పుడు వాక్యం పూర్తవకపోవచ్చు కూడా. అలాంటప్పుడు clipped sentences కూడా వాడుతుంటాం. వీటిని మనం బాగా Practise చేయాలి. మన నిత్య జీవితంలో ఇలాంటి సందర్భాల్లో ఎప్పుడు అవకాశం వస్తే అప్పుడు మాట్లాడేస్తూ ఉండాలి. అలాచేస్తే కొద్ది రోజులకు అప్రయత్నంగానే కరెక్ట్‌గా మాట్లాడేస్తాం.

- కొన్ని సందర్భాల్లో కొత్త వ్యక్తులు/ పరిచయస్తుల వివరాలు తెలుసుకుంటుంటాం. అలాంటివి కొన్ని ఇప్పుడు చూద్దాం.
- మనకు పరిచయమైనవాళ్లు ఎక్కడి వాళ్లు? ఏ భాష మాట్లాడతారు? వృత్తి ఏమిటి? ఇలాంటి వివరాలు తెలుసుకునే సందర్భాలు చాలా ఎదురవుతుంటాయి. వాటిని ఇప్పుడు తెలుసుకుందాం.

**Shaiz:** Hi Arshad, how are you?
(ఎలా ఉన్నావు? )

**Arshad:** Fine, how about you?
(కులాసానే, మరి నువ్వు? )

**Shaiz:** Fine too, thank you. (కులాసానే)

**Arshad:** How is your hostel life going?
(హాస్టల్ జీవితం ఎలా ఉంది? )

**Shaiz:** Ok, though I can't say everything is all right, for one thing, the food can't be as good as home food, you know.
(బాగానే ఉంది. మొత్తం అంతా బాగుంది అనలేననుకో. ఒక విషయం, భోజనం ఇంటి భోజనంలా ఉండదు కదా? )



**Arshad:** I can see that. Where are you from?
(అది అర్థం చేసుకోగలను. మీ ఊరేది? )

**Shaiz:** We are from Vissannapeta. We own some property there. Dad is a professor in a Vijayawada college.

## FUNCTIONAL ENGLISH

(మాది విస్సన్నపేట. మాకేదో కొంత ఆస్తి ఉందక్కడ. మానాన్న విజయవాడ కాలేజీలో ప్రొఫెసర్)

Where do you come from?
(మీదే ఊరు? )




**Arshad:** We belong here/ we are of this place. (మేమిక్కడ వాళ్లమే)

Belong = చెందటం.

చూశారు కదా? Where are you from?/ where do you come from?
(మీదే ఊరు? / మీరెక్కడి వాళ్లు? )

- కొంచెం తెలీని వాళ్లనయితే, May I know where you are from? అంటాం.

అలాగే I am from AP/ I come from AP.
(మాది ఆంధ్రప్రదేశ్/ మేం ఆంధ్రప్రదేశ్ వాళ్లం.)

Where do you come from?
(మీరెక్కడివాళ్లు? (అంతేకానీ మీరెక్కడి నుంచి వస్తారు? / వస్తున్నారు అనికాదు)

I am from/ I come from Nellor = మాది నెల్లూరు.
(అంతేకానీ, నేను నెల్లూరు నుంచి వస్తున్నానని కాదు)

తేడా గమనించండి:

Where do you come from? = మీదే ఊరు?

Where are you coming from? = మీరెక్కడ్నించి వస్తున్నారు (ఇప్పుడు)

- ఈ ప్రశ్నల స్పందనలో తేడా గమనించండి.

1. Where are you/ do you come from?
(మీదే ఊరు? / మీరెక్కడి వాళ్లు? )








**A.** I am from Ongole/ AP/ Nizamabad, etc., (మా ఊరు ఒంగోలు/ మాది AP/ మా ఊరు నిజామాబాద్, etc)

2. Where are you coming from?
(మీరెక్కడ్నించి వస్తున్నారిప్పుడు? )







**A.** (I am coming) from home/ college/ the cinema, etc.
(నేను ఇల్లు/ కాలేజ్ / సినిమా నుంచి వస్తున్నా.)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish






*S. Tulasiram, Nandikotkur*

**Q.** కింది పదాలకు (adverbs) తెలుగు, ఇంగ్లిష్ అర్థాలు తెలియజేయండి.

1) Thereabouts 2) thereafter 3) Thereby 4) Therefore 5) Therein 6) Therein after 7) Therein before 8) Therein to 9) Thereof 10) Thereon 11) Thereout 12) Thereto 13) Theretofore 14) There Under 15) Thereupon 16) Therewith 17) Therewithall 18) alongside 19) Hereby 20) Hereafter.

**A.** i) Thereabouts = a) ఆ దరిదాపుల్లో - near some place;

b) ఉజ్జాయింపుగా (approximately/ nearby).

★ He lives in Nandikotkur or thereabouts = అతడు నందికొట్కూర్ దరిదాపుల్లో ఉంటాడు.

★ The price of the dictionary is Rs.500/- or thereabouts = ఆ డిక్షనరీ ధర అయిదువందలు

into, thereof, thereon, thereto, theretofore, thereunder, therewith, therewithall - ఇవన్నీ కూడా చట్ట (law and courts) పరిభాషలోనే వాడతారు. సాధారణంగా spoken Englishలో వీటిని వాడం - తెలుసుకోవాల్సిన అవసరం లేదు.

Alongside = 1) at the side of something = ఒక దాని పక్కనే - the ambulance stopped alongside the patient lying on the road = రోడ్డు మీద పడి ఉన్న రోగి పక్కనే/ పక్కన అంబులెన్స్ ఆగింది.

2) తో/ తోపాటే = At the same time as something else - Alongside his fight for freedom Gandhi was busy with his experiments with food - స్వాతంత్ర్య పోరాటం తోపాటే గాంధీ ఆహార విషయాల్లో తన ప్రయోగాలు ప్రారంభించాడు.

Hereby = Through this = దీని ద్వారా - I hereby declare the bridge inaugurated = ఇలా చెప్పడం ద్వారా నేనీ వంతెన ప్రారంభమైందని ప్రకటిస్తున్నా.

Hereafter = ఇప్పటి నుంచి. I will not smoke

# It is likely to rain

గానీ, దాదాపు అంతగానీ ఉంటుంది.

ii) Thereafter = ఆ తర్వాత. He met me last in December 2010. Thereafter I have not seen him. (అతడు చివరిసారిగా నన్ను డిసెంబర్ 2010లో కలుసుకున్నాడు. ఆ తర్వాత నేనతడిని చూడలేదు.)

iii) Thereby = Because of that/ As a result of that = ఆ కారణంగా/ దాని ఫలితంగా

He did not prepare well for the interview, thereby losing the chance of selection - ఇంటర్వ్యూకతడు సరిగా ప్రిపేర్ అవ్వలేదు, ఆకారణంగా ఎంపికయ్యే అవకాశం పోగొట్టుకున్నాడు.

iv) Therefore = So/ As a result. (అందువల్ల). He was late and therefore he missed the bus - ఆలస్యం అయినందువల్ల అతడికి బస్ అందలేదు.

Therein, Therein after, therein before, there-





M.SURESAN

hereafter (from now on) - ఇప్పటి నుంచి నేను పొగ పీల్చను.

**Q.** Get + pp (past participle) పదాల గురించి తెలియజేయండి.

**A.** Get + pp = a) అయ్యేలా చూడటం/ చేయించడం.

i) He got repairs done to his car = కారుకు రిపేర్లు చేయించాడు/ అయ్యేలా చూశాడు.

ii) He got the thief taken to police = ఆ దొంగను పోలీసుల దగ్గరికి తీసుకెళ్లేలా చేశాడు.

iii) She got the room cleaned = ఆమె గదిని శుభ్రం చేయించింది.

b) ఇలా కూడా వాడతాం:

He got dismissed from the job = అతడు ఉద్యోగం కోల్పోయాడు.

**Q.** Direct speech and Indirect speech లో 'let' వాడకాన్ని, వీలైనన్ని ఉదాహరణలతో వివరించండి.

**A.** Imperative sentences (ఆజ్ఞలు, విజ్ఞప్తులు తెలిపే వాక్యాలు) లో verb కు object ఉన్నప్పుడు, Indirect speech 'let' తో ప్రారంభం అవుతుంది.

Clean the room. (ఇది ఆజ్ఞ/ అడగటం. అడగటం కాబట్టి Imperative sentence. Verb, 'clean' కు 'room' object. అందుకని Indirect speech,

i) Let the room be cleaned అని 'let' తో ప్రారంభిస్తాం.

ii) Complete the work (Direct speech).

Let the work be completed (Indirect speech).

iii) Please show me the way (D.S.).

Let the way be shown please (I.S).

**Q.** I) Likely that II) Unlikely that వాడకం తెలియజేసి, కొన్ని ఉదాహరణలతో వివరించండి.

**A.** Likely = జరిగే అవకాశం ఉంది.

a) Anand: Will he come? (అతడొస్తాడా?)

Aparna: Likely (అవకాశం ఉంది)/ Quite likely/ very likely (అవకాశం బాగా ఉంది)

b) It is likely that he will come this evening = అతడు ఈ సాయంత్రం వచ్చే అవకాశం ఉంది.

c) It is likely to rain/ that it will rain = వర్షం వచ్చే అవకాశం ఉంది.

Unlikely = జరిగే అవకాశం లేదు.

He is unlikely to help you = నీకతడు సాయంచేసే అవకాశం లేదు (చేయకపోవచ్చు).

d) It is unlikely that he will be selected = అతడు ఎంపిక కాకపోవచ్చు/ అయేట్టు లేదు (అవకాశంలేదు)

**Q.** ఆంగ్ల దినపత్రికల్లో ఇచ్చే ఫొటో క్యాప్షన్ Simple Present tence లో ఉంటుంది, ఎందువల్ల? ఉదాహరణకు:Union Home Minister P. Chidambram greets U.S secretary of homeland security Janet Napolitan after a press conference in new Delhi on Friday on the homeland security dialog between Indian and the United States.

**A.** News Paper reporting లో, ముఖ్యంగా Headlines , photo captions లో, simple present expresses immediate past - simple present ను (meets, visits, wins, etc.,) అప్పుడే జరిగిన సంఘటనలకు వాడతారు.

e.g.: 20 die in Mumbai bomb blast - ఇక్కడ die (simple present) ను అంతకు క్రితమే జరిగిన (immediate past) సంఘటనకు వాడతారు.

**Q.** Rainbow కు అర్థాన్నిచ్చి అది adjective అవుతుందా వివరించండి. There is also likelihood of the rainbow alliance that the AIADMK chief rode back to power on coming undone. ఈ వాక్యం లోని on coming, undone గురించి తెలియజేయండి.

**A.** Rainbow alliance = alliance (కూటమి) of different political parties (వివిధ రాజకీయ పక్షాలతో) ఇతర చిన్నచిన్న రాజకీయ పక్షాలతో ఏర్పడిన కూటమి. మొత్తం వాక్యం అర్థం. మిగతా చిన్న చిన్న రాజకీయ పక్షాలతో ఏర్పడిన కూటమి (Rainbow alliance) AIADMK అధికారానికి రావడంతో విడిపోయే అవకాశం కూడా ఉంది.

*K. Biksham, Khammam*

**Q.** Please translate these telugu sentences in to English with examples.

- నేను జవాబులు అప్పజెప్పించుకోవాలి.

**A.** I have to get the students to recite answers.

- నేను జవాబులు అప్పజెప్పించుకుంటున్నాను.

**A.** I am getting the students to recite answers.

- పుస్తకం చూసి జవాబులు చెప్పొద్దు.

**A.** Don't give answers looking into the book/ Don't read the answers from the book.

- రాము పుస్తకం చూస్తూ జవాబులు చెబుతున్నాడు.

**A.** Ramu is giving answers looking into the book/ Ramu is taking the help of the book to answer/ Ramu is reading answers from the book.

- పుస్తకం చూస్తూ జవాబులు చెబుతున్నావా?

**A.** Are you giving the answers from the book?/ taking the help of the book to answer?/ reading answers from the book?

- పాలు పొంగుతున్నాయి.

**A.** The mill is boiling over.

- కాలకృత్యాలు తీర్చుకో.

**A.** Finish off your ablutions. (But 'ablutions' is old fashioned). We can say, finish off your bath etc.

- What is language? Why study it?

ఈ వాక్యంలో Why పక్కన helping verb లేకుండా V1 వాడటం సరైనదేనా? ఎందువల్ల?

**A.** Why study it? - correct - ఇది వ్యావహారికం - తప్పులేదు.

Why study grammar? Why take the trouble? Why waste time? etc., - correct.

# I'm afraid, no

**1) Susmitha:** Can I have your book for a day, please?

(ఒక్కరోజుకు నీ పుస్తకం తీసుకోనా?)

**Subodh:** Oh, sure. (తప్పకుండా)

**Susmitha:** Thanks a lot.




**Subodh:** That's all right. But be sure to return it the day after. (ఏం ఫరవాలేదు. కానీ ఎల్లుండి మాత్రం తప్పకుండా తిరిగి ఇవ్వు).

**Susmitha:** Certainly (తప్పకుండా).

★ ★ ★

**2) Sahil:** Can you lend me your bike for an hour.

(నీ bike ఓ గంటపాటు నాకిస్తావా?)

**Manas:** I'm afraid, no. I have a lot of things to do today. Without the bike I can't just manage.

(నేనివ్వలేను. ఏమనుకోవద్దు. ఇవాళ నేను చేయాల్సిన పనులు చాలా ఉన్నాయి. Bike లేకపోతే కుదరదు.)

**Sahil:** Oh, I can understand. Thanks just the same.

(నేనర్థం చేసుకోగలను. అయినా Thanks)

**Mans:** That's OK.

పై రెండు సంభాషణల్లో 'can' ఉపయోగం గమనించండి. దీన్ని questions form లో requests (అభ్యర్థనల) కు వాడతాం. ఇది కూడా polite behaviour లో మనం రోజూ చేసే సంభాషణల్లో భాగమే కదా? Practice చేయండి.

## FUNCTIONAL ENGLISH

Request (అభ్యర్థన) చేసేందుకు మిగతా మాటలు కూడా ఉన్నాయి. అయితే 'can' question form లో Informal requests - అంటే మన ఇంట్లోవాళ్లను, మనకు బాగా పరిచయం ఉన్న వాళ్లను, మన సన్నిహితులను request చేసేందుకు వాడతాం.

నేను question formలో Informal request ఇ.

can

Can you...?

Oh sure

certainly

Why not

Can you...?/ can I ...? request కు వాడినప్పుడు, requests కు సుముఖంగా స్పందించేందుకు వాడే expressions.

Oh sure/ certainly/ why not/ By all means/ of course. (తప్పకుండా/ ఎందుకు కాదు?) - ఇలా ఎవరన్నా, ఏదన్నా అడిగితే మనం ఇవ్వలేని/ ఏదన్నా సాయంచేయలేని పరిస్థితిలో.




a) I'm afraid, no

b) Sorry/ I'm sorry, no

c) I am afraid I can't, sorry

d) I regret, no (ఇది కాస్త formal)

★ ★ ★

**3) Prabodh:** Can you give me a lift upto my place?

(కాస్త మా ఇంటి దాకా lift ఇస్తావా?)

**Prasanth:** That'd be a pleasure; come along. (సంతోషంగా, రండి)

ఇది కాస్త formal

ఇవన్నీ బాగా practice చేయండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish






**K. Sri krishna Kumar, Bapatla**

**Q.** కింది వాక్యాలకు తెలుగులో అర్థాన్ని తెలిపి, నిర్మాణాన్ని వివరించగలరు.

- He would rather have no land at all than land given merely as a sop to public opinion.

**A.** He would rather have no land at all than land given merely as a sop to public opinion.

పై వాక్యానికి అర్థం: ఏదో కేవలం ప్రజాభిప్రాయాన్ని మన్నించేందుకు (అందరూ ఏమన్నా అనుకుంటారేమో నన్న భయంతో) తనకిచ్చే భూమి తీసుకునేందు కంటే, భూమి అసలు లేకుండా ఉండేందుకే ఇష్ట పడతాడాయన.

ఇక్కడ ముఖ్యంగా గమనించాల్సింది, the use of 'rather', ఇక్కడ rather ... than/ rather thanకు అర్థం 'బదులుగా' అని. ముఖ్యంగా రెండు భిన్నమైన విషయాల్లో మనం దేన్ని ఎక్కువ ఇష్టపడతామో అది తెలిపేందుకు వాడతాం.

I'd rather die than tell a lie/ rather than tell a lie, I'd die = అబద్ధాలు ఆడేబదులు చనిపోవడానికే ఇష్టపడతాను (చావనైనా చస్తానుగానీ అబద్ధం ఆడను అని అర్థం.)

English లో చాలా తరచుగా Rather ను వాడతారు. 'What do you wish to have, coffee or something else?'

'I'd (I would) rather have a cold drink than coffee' (కాఫీ కంటే ఏదైనా శీతల పానీయమే నా కిష్టం.)

**Q.** If you would give up class hatred and truly work for the good of all, I would be the first to join you.

**A.** If you would give up class hatred and truly work for the good of all, I would be the first to join you = వర్గ విద్వేషాన్ని మానుకుని అందరి శ్రేయస్సుకూ నువ్వు పాటుపడేందుకు ఇష్టపడితే, నీతో కలిసేవాళ్లలో నేనే మొదటివాడిని.

If you would give up = If you wish to give up, Give up = Stop having.

**Vishal Sahani, Nizamabad**

**Q.** కింది సందేహాలను తీర్చగలరు.

- He has got the bike by convincing his parents.
- He has got the bike convincing his parents.

What is the difference between the above mentioned sentences - please explain in Telugu.

**A.** Neither (1) nor (2) is correct. The correct form of the sentence is:

a) He got the bike after convincing his father.

b) He convinced his father to buy him a bike.

# I'd rather die than tell a lie





M.SURESAN

**Q.** He stood before me/ infront of me - which one is correct?

**A.** He stood in front of me = He stood before me; but 'before me' is formal, used when somebody stands before people in positions of authority.

**Q.** Verb complement - means what?

**A.** Verb complement is the word, usually an adjective/ noun/ past participle etc., coming after the object and completing the meaning of the verb.

e.g.: a) I found him angry.

I (subject) + found (verb) + him (object) + angry (verb complement - adjective)

b) They elected him captain.

They (subject) + elected (verb) + him (object) + captain (noun)

c) The police saw the house locked.

The police (sub) + saw (verb) + the house (obj) + locked (verb complement - past participle)

**Q.** Please translate the following sentences into English.

- అరుగు మీద కూర్చో

**A.** Sit on that platform.

- అతడు నన్ను నవ్వులపాలు చేశాడు.

**A.** He made me a laughing stock.

- నేను ఆయన దగ్గర చదువు నేర్చుకుంటున్నాను.

**A.** I am being taught by him.

- ఎవరు నువ్వు? మా సార్ వచ్చే టైమ్‌లో వచ్చావు?

**A.** Who are you that have come just when our teacher comes?

- నేను వెళ్లి ఆయన్ను చూసి వస్తాను.

**A.** I will go see him and come back.

**E. Anil, Bapatla**

**Q.** Clarify the following doubts.

i) Positions of Adverbs

ii) These days people care too much for manners

iii) Don't be too anxious of the matter.

In the above (ii) and (iii) sentences used 'too' as adverb. But too - to rule is not followed. What is the difference between too - to and above sentences.

**A.** The position of the adverb in a sentence depends on what you wish to emphasize.

He walked slowly towards the hospital.

Here slowly placed after the verb gives importance to the way he walked.

Immediately he rushed to the hospital. Here immediately stresses the time of action.

Though as a rule the adverb takes some position after the verb, it can be placed sometimes even at the beginning of a sentence and sometimes before the verb.

a) She slowly raised her face and looked at her reflection in the mirror.

b) I strongly wish to see her at once is more effective, I wish to see her strongly.

In the two expressions, 'care too much' and 'be too anxious' mean that 'the caring' and 'the anxiety' are more than is good. The results of so much 'caring' and being 'so anxious' can be bad, instead of being good. In such cases, 'too' is not and need not be followed by the 'so that ...... not' clause. Too always has a negative meaning.

The mother is too caring - She shows more care than is good for the child. The effect on the child is bad.

The difference between sentences of this kind, and 'too-to' sentences: in this kind of sentences, the 'to part' is understood.

She is too tall = She is very tall and that may be a disadvantage for her/ make certain things difficult for her. The underlined part is indirectly stated by the sentence without the 'to...' part.

**Ramji Sahani, Yellandu**

**Q.** Please translate the following sentences into English.

- వాళ్లు ఎవరు మా నాన్న వచ్చే టైంలో వచ్చారు?

**A.** Who are they that have come just when my father comes?

- నేను మీ అల్లుడిని కావలసిన వాడిని కాను అని వాళ్లకు ఎన్నోసార్లు చెప్పాను.

**A.** I have told them often/ a number of times that I am not the one to be their son-in-law.

- ఆ పాఠశాల గేట్లు ఏ రోజైతే తెరవబడ్డాయో ఆరోజు నుంచే ఈ సమస్య మొదలైంది.

**A.** The whole problem started the day on which the gates of the school were opened.

- మనమే కావాలని ఈమెను అక్కడికి పంపించామని వీళ్ల నాన్న మనల్ని అపార్థం చేసుకుంటాడు.

**A.** Her father will mistake us for sending her there intentionally.

**Q.** He would make the agitators silence. ఈ వాక్యంలో would వాడకం కరెక్టేనా?

**A.** 'Would' here refers to the result of an imaginary action - మనం ఊహించుకునే చర్య ఫలితాన్ని తెలిపేందుకు 'would' వాడతాం.

He would silence the agitators = ఆందోళనకారులను అతడు నోరు మూసుకునేట్లు చేస్తాడు; అతడి క్కడికి వస్తే/ అతడికిది తెలిస్తే - అయితే అతడిక్కడికి వస్తే/ అతడికిది తెలిసే పరిస్థితి లేదిప్పుడు. రావడం/ తెలియడమంటూ జరిగితే అతడు ఆందోళనకారులను శాంతపరుస్తాడు. ఇదీ ఇక్కడ 'would' వాడటంలోని భావం.

# I'll be waiting for your call

**FUNCTIONAL ENGLISH**

**a) Prasen:** Will you do me a help please? (మీరో సాయం చేస్తారా నాకు?)

**Yashwanth:** With pleasure. What's it. (సంతోషంగా. ఏంటది?)




**Prasen:** On your way to your shop, please hand over my leave letter at my office. Sorry for the trouble. (మీ shop కు వెళ్లేదారిలో నా leave letter ను మా office లో అందజేయండి.)

**Yashwanth:** Of course I will. Where is it? (తప్పకుండా, అదెక్కడ?)

**Prasen:** Here you are. Thanks a lot. (ఇదిగోండి. చాలా thanks.)

**Yashwanth:** Oh, not at all. (అదేం పరవాలేదు)

**Look at:** Will you do me a help/ a small help please? Can లాగానే will ను కూడా Question form లో Request చేసేందుకు (అభ్యర్థించేందుకు) వాడతాం. అయితే Requestsకు వాడేటప్పుడు Can కు Will కు కొంచెం తేడా ఉంది. Can for requests is very informal. Can ను Question form లో informal requests కు, అంటే మనకు బాగా పరిచయమున్న వాళ్లు, ఇంట్లోవాళ్లు, స్నేహితులను Request చేసేందుకు వాడతాం.

'Will' in the question form is used for more formal requests than 'can'. మనకంటే పెద్దవాళ్లను, మనకంత పరిచయంలేనివాళ్లను Request చేసేందుకు 'will' వాడతాం.

**b) Bharani:** Will you let me know when to start? I'll be waiting for your call. (ఎప్పుడు బయల్దేరాలో తెలుపుతారా?/ తెలుపుతారు కదా? మీ Phone కోసం చూస్తుంటాను.)

**Rohini:** Oh, Certainly. (తప్పకుండా)

ఎవరి Request నైనా ఒప్పుకున్నప్పుడు, మన స్పందన: Oh, Surely/ Certainly/ You can take my word for it (నేను మీకు మాటిస్తున్నాను)/ of course (కచ్చితంగా)

**c) Yashwin:** I don't know my way about in this place will you lead me, Please? (నాకీ ఊరిలో దారులు తెలియవు. కాస్త మీరు చూపించండి.)

**Aswin:** Will do certainly. (తప్పకుండా చూపిస్తాను)

ఏదైనా అభ్యర్థనకు సుముఖంగా ఉన్నప్పుడు అంటే ఎవరి Request నైనా మనం ఒప్పుకుంటే, 'will do' (అంటే I will do) అనవచ్చు 'Will do' వాడకం ఇప్పుడు బాగా సాధారణమై పోయింది.

**d) Kapil:** Take me home on your bike, will you? (నీ bike మీద నన్నింటికి తీసుకెళతావు కదా?)




**Arun:** I'm afraid no/ not. You'll (You will) excuse me for today. I am not going the usual way today. (ఓ, నేను తీసుకెళ్లలేను. Sorry ఈవాళ్టికి ఏం అనుకోకు. నేను మామూలు దారిలో వెళ్లడం లేదు.)

**Kapil:** Just don't worry. It's OK. (ఏం ఫర్వాలేదులే)

Kapil request గమనించండి. Will కు Question tag form లో ఉంది. ఇలా కూడా formal requests చేయవచ్చు.

మరో ఉదాహరణ చూడండి. "You will help me in the matter, will you?/ Won't you?" = మీరీ విషయంలో నాకు సహాయం చేస్తారు గదా?/ చేయరా? అని అభ్యర్థించడం (Requesting)

ఇలా Two types of question tags (Positive and negative) ను Request కు వాడవచ్చు

పై సంభాషణలో Arun request ను గమనించండి - You will excuse me (please) = మీరు నన్ను క్షమించగలరు - ఇలా will ను statement form లో కూడా Request కు వాడతాం. అయితే ముఖ్యమైన విషయం... 'Will' in the statement form for requests is more formal than will in question form - Question form లో 'will' కంటే, Statement form లో 'will' Request కు ఎక్కువ మర్యాద పూర్వకంగా (more formal) ఉంటుంది.

You will kindly wait for 10 minutes please = మీరు పది నిమిషాలు వేచి ఉండాలని మా కోరిక. (Will in the statement for request) బాగా Practice చేయండి.




# He is a bold man



*Sunaina, Kaikalore*

**Q.** Clarify the following doubts.

★ He goes on talking.

★ He is going on talking - What is the difference between the above mentioned sentences.

**A.** ★ He goes on talking - That's what he usually does - That is his regular practice.

అతనెప్పుడూ/ మామూలుగా అలా మాట్లాడుతూనే ఉంటాడు.

★ He is going on talking - That's what he is doing now.

అతనిప్పుడు అలా మాట్లాడుతూ ఉన్నాడు.

**Q.** He poses as if he were/ was a collector - is it correct sentence?

**A.** He poses as if he were a collector - is the correct form, though, now a days, 'as if he was a collector' is also being used.

**Q.** He came here after writing the exam.

He came here after he had written the exam.

Explain the difference.

**A.** He came here after writing the exam = He came here after he had written the exam. No difference in meaning between the two.

**Q.** He quenched the fire pouring water.

He quenched the fire by pouring water.

Translate in Telugu and give explanation.

**A.** 'He quenched the fire by pouring water.' - Correct. Mearing - నీళ్లుపోసి మంటలను ఆర్పాడు. 'By' తప్పకుండా ఉండాలి = అలా చేయటం ద్వారా (నీళ్ల పోయడం ద్వారా).

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లోకి అనువదించగలరు.

★ ఇప్పట్లో నేను కైకలూరు విడిచి ఎక్కడికీ వెళ్లను. అందరినీ సంతోషపెడుతూ నేనూ సంతోషంగా ఉంటాను.

**A.** I am not leaving Kaikalur now or in the near future. I am going to be here feeling happy and making others happy as well.

*Priyanjali, Vijayavada*

**Q.** కింది సందేహాలను తీర్చగలరు.

★ Eating mangoes wouldn't harm her లో would probability ని చెబుతుందని మీరోచోట తెలిపారు. అయితే I would come tomorrow అని అనవచ్చా? అలాగే I would meet you there. I would play. I would talk to him - అని అనవచ్చు కదా? వివరించగలరు.

**A.** Eating mangoes wouldn't harm her.

ఈ sentence లో would, probability ని సూచిస్తుంది. అంతేకాకుండా imaginary (ఊహించుకునే) విషయాన్ని కూడా తెలుపుతుంది - అంటే ఆమె mangoes తినేట్టయితే అనే అర్థం వస్తుంది.





M.SURESAN

I would come tomorrow లో, probability (సంభవించే అవకాశం) / imaginary (ఊహించుకునే) ఆస్కారం లేదు కదా. అంటే I would come tomorrow అని independent గా అనడం సరికాదు. Independent గా అయితే Modern English లో I will come tomorrow అంటారు. Connected sentence ఏదైనా ఉంటే అప్పుడు I would come tomorrow అనవచ్చు. Look at the following conversation:

Chandra: The meeting might be held tomorrow. (రేపు మీటింగ్ పెట్టవచ్చు.)

Surya: I would come then. (అయితే నేను వస్తాను)- అంటే meeting జరిగే పక్షంలో. Meeting జరగటం కచ్చితం కాదు. ఇలాంటి చోట్ల మాత్రమే, connected situations లో మాత్రమే, would ను present లో future కు వాడవచ్చు.

Independent sentence గా

- I would play; I would talk to him are WRONG.

**Q.** Subject complement, object complement, noun complement, verb complement, adverb complement, adjective complement అంటే ఏమిటి?

**A.** Subject complement అంటే subject ను గురించి చెప్పేది. Sentences లో ముఖ్యంగా 'be' forms తర్వాత వస్తుంది. ఇది subject ను గురించిన సమాచారాన్ని ఇస్తుంది.

a) She is a singer.

ఇక్కడ sentence కు subject 'She'. A singer' subject అయితే 'she' ను గురించి చెబుతోంది కాబట్టి 'singer' subject complement. ఈ subject complement, ఒక noun.

Subject complement, adjective గా కూడా ఉండొచ్చు.

b) Hemanth was tall.

Subject of the sentence - Hemanth. 'Tall' tells us about and gives information about the subject, Hemanth.

కాబట్టి 'tall' subject complement అయితే ఇక్కడ 'tall' adjective.

కాబట్టి, subject complement, noun/ adjective కావచ్చు.

**Object complement:** Object meaning ను అధికం చేసేది object complement. Object complement, noun/ adjective/ past participle కావచ్చు.

a) They named their child Prabhat.

ఇక్కడ object, 'their child'. 'Prabhat' object అర్థాన్ని పూర్తి చేస్తోంది. అందువల్ల Prabhat object complement. Prabhat, noun. So, here is a sentence in which the object complement is a NOUN.

b) They found the computer useful.

**Verb:** found; object - computer. 'Useful', an adjective, adds to the meaning of the object, so, 'useful' is object complement. And 'useful' is an adjective.

c) They had the machine replaced. Object - the machine (of the verb, 'had') Replaced - past participle - object complement.

d) Noun complement; objects - direct and indirect are all noun complements. Nouns part in apposition to another noun is also a noun complement. MS.Dhoni, Captain of the Indian team - here captain is a noun complement.

e) Adverb complement. Adverb అర్థాన్ని అధికం చేసేది, adverb complement.

The book is on the table. ఇక్కడ ' on the table', adverb పని చేస్తుంది. కాబట్టి, ఇది, adverb complement.

The book on the table is mine. ఇక్కడ on the table కూడా adverb complement.

Adjective complement - ఇది Adjective అర్థాన్ని అధికం చేస్తుంది. Everyone is afraid of snakes. ఇక్కడ 'afraid' adjective. దేనికి భయపడతారు? - పాములకు (of snakes) - ఇది adjective complement. They are proud of their achievement. Proud - adjective of their achievement - adjective complement.

**Q.** 'Attribute' అంటే ఏమిటో వివరించగలరు.

**A.** Attribute అంటే ఒకరిని/ ఒక వస్తువుని వర్ణించే మాట. He is a bold man. ఇక్కడ bold, man ను వర్ణిస్తుంది కాబట్టి bold అనేది attribute.

English చక్కగా మాట్లాడేందుకు ఈ వివరాలన్నీ పూర్తిగా అనవసరం. వీటిని గురించి తెలుసుకోవాల్సిన అవసరం లేదు. అసలు, Grammar లో Complement అంటే ఏమీ తెలియనివాళ్లు కూడా ఎంతో చక్కగా English మాట్లాడగలరు, రాయగలరు. కాబట్టి వీటిని గురించి తెలుసుకోవాల్సిన అవసరం ఏమాత్రం లేదు. తెలుసుకున్నకొద్దీ confusion ఎక్కువ అవుతుంది.

**నోట్:** 31.07.2011నాటి Spoken English (Lesson No.651)లో verb complement కు బదులు పొరపాటున object complement వివరణ ప్రచురితమైంది. Verb complement కు సరైన వివరణ - Verb complement అంటే verb అర్థాన్ని పూర్తిచేసేది. ఇది, అంటే verb complement, verb కు direct object/ indirect object గా ఉంటుంది.

a) She saw the movie last night. ఇందులో verb, saw; దానికి direct object movie, verb complement అవుతుంది.

b) The teacher taught us the lesson.

verb - taught, Direct object - lesson, Indirect object, us, both the Direct object 'the lesson' and the Indirect object 'us' are verb complements.

c) The complement can sometimes be an infinitive (to come, to go, etc)

d) Hari wants to go - The infinitive 'to go' in this sentence is the object of the verb, and it is the verb complement.

e) Suguna likes singing - Here the object 'singing' of the verb 'likes' is the verb complement. ' Singing' here is a gerund.

These are the examples of the verb complement.

## How do I get to that place please?

**Sreyas:** Excuse me, I am a stranger in the town. Could you tell me how I can go to Premier Institute of Technology please ?



(నేనీ ఊరికి కొత్త. Premier Institute of Technology కి ఎలా వెళ్లాలో కాస్త చెబుతారా? )

**Anusha:** It's (It is) a bit far off from here. If you want to go by bus, you have to change bus, and then walk a little. Why don't you take an auto? (అది ఇక్కడికి కాస్త దూరం. బస్‌లో వెళ్లాలనుకుంటే బస్‌లు మారాలి, తర్వాత కాస్త నడవాలి. ఆటోలో వెళ్లకూడదా? )

**Sreyas:** I'd rather go by bus. The auto may charge too much. Let me know the buses I've to take please.

(బస్‌లోనే వెడతాలెండి. ఆటోవాళ్లు చార్జ్ మరీ ఎక్కువ తీసుకోవచ్చు. బస్‌లను గురించి చెప్పండి.)

**Anusha:** OK. Take bus No.13 here. Get off at the Govt. College bus stop and there take bus No.15A. Get down at Tristar Hotel Stop. Walk 100 meters further. Turn left and then take the right turn again. You will find the college.

(సరే 13వ నెంబరు బస్సు ఎక్కండి. Govt college bus stop దగ్గర దిగండి. అక్కడ 15ఎ ఎక్కండి. ట్రైస్టార్ హోటల్ దగ్గర దిగండి. కాస్తదూరం ముందుకు నడిచి కుడివైపు తిరగండి. అక్కడ మీకు College కనిపిస్తుంది)

● కొత్త ప్రదేశంలో దారి తెలియనప్పుడు, దారి తెలుసుకునే విధం, దారి తెలియనివాళ్లకు దారి చూపేటప్పుడు వాడాల్సిన expressions చూడండి.

### FUNCTIONAL ENGLISH

a) How can I/ do I go to place 'X' from here, please? (ఎలావెళ్లడం / వెళ్లాలి)

b) How do I get to that place please? (ఎలా వెళ్లాలి? )

c) Could you guide me / direct me to that place, please? (అయితే, direct, guide (దారి చూపడం) కాస్త పాండిత్యం.



● దారి చూపడం : ఫలానా, ఫలానా బస్సెక్కడం.




= take/ catch bus no, .... catch కంటే 'take' సాధారణం. 'Get into' bus no ....' అని కూడా అనవచ్చు

● Bus దిగడం = Get off/ get down from the bus.

● కుడివైపు/ ఎడమ వైపు తిరగడం

Turn right/ left; Take the right/ left turn.

● బస్ దిగి కాస్త ముందుకు నడవడం = Get off the bus and walk a little further/ walk further down.

(ఇంకా ముందుకెళ్లడం)




● వీధికి ఎడమవైపు / కుడివైపు 5వ / 6వ .... ఇల్లు = The 5th / 6th building on the left/ the right.

ఇవి బాగా Practice చేయండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# He walked with great care





M.SURESAN



***Y. Gayatri, Adilabad***

**Q.** కింది Direct, In-direct వాక్యాలు కరెక్టేనా? వివరించగలరు.

★ Teacher asked 'what are you doing now?' - (Direct)

Teacher enquired, what he was doing then? - (Indirect)

**A.** Correct.

★ She asked 'Who has built the house'- (Direct)

She enquired that who built the house? - (Indirect)

**A.** 'She enquired who had built the house?' is the correct Indirect Speech. When a passage with 'wh' questions is changed into the indirect speech, we remove the quotation and begin with the 'wh' questions, and don't use 'that'.

★ The fox told the crow, 'you sang very sweetly' - Direct

The fox said to the crow that it sung very sweetly- Indirect

**A.** 'The fox told the crow that it had sung very sweetly' is the correct indirect speech. The past simple 'sang' in direct speech is changed into the past perfect (had sung) in indirect speech.

★ The owner said 'There are two bed rooms in the house' - Direct

The owner told that there are two bed rooms in the house - indirect

**A.** 'The owner said that there were two bed rooms in the house'. When it is not clear to whom something is said, we don't use tell/ told etc. 'Tell' should always be followed by the person to whom something is said. (e.g.: tell him/ her/ them etc).

The present tense 'are' in direct speech is changed into 'were' in indirect speech.

★ Prasad told 'he had caught fish' - Direct

Prasad told, that he caught fish - Indirect

**A.** Prasad told, 'he had caught fish' (Direct). Here 'told' is wrong because the person to whom it is said is not mentioned. It should be, 'Prasad said, 'he had caught fish'. The passage in the direct speech itself is wrong. It should be,Somebody said, 'Prasad said he had caught fish'. The indirect speech for it would then be,

Somebody said that Prasad had said that he had caught fish. 'He had caught fish' as direct speech is wrong, because, the past perfect, 'had caught' cannot be used when referring to a single past actions.

★ Janardhan informed 'He will go to Hyderabad tomorrow' - Direct

Janardhan informed that he would go to Hyderbad next day - Indirect

**A.** Correct.

**Q.** Co-ordinate conjunction and sub-ordinate conjunction అంటే ఏమిటో తెలిపి, వాటి ఉపయోగాన్ని వివరించగలరు.

**A.** Co-ordinate conjunctions join 1) two words of the same parts of speech: Noun and Noun, adjective and adjective, adverb and adverb, verb and verb etc.

2) two main clauses, and 3) two sub-ordinate clauses.

Examples of co-ordinating conjunctions are: and, but, as well as, for, either or, neighter nor, otherwise, so, etc.,

Sub-ordinate conjunctions join sub-ordinate clauses with the main clauses. They are: although, though, since, after, till/ until, as, because, before, after, whether, so that, etc.

**Q.** కింది వాక్యాలు వ్యాకరణరీత్యా కరెక్టేనా? తెలుపగలరు.

a) Each of the boys gets a different prize.

b) Either of the methods is good.

c) Either of them has permission to go.

**A.** Each of the boys అన్నప్పుడు 'ఆ బాలురలో ప్రతి బాలుడూ' అని కదా - అందుకని subject, singular. కాబట్టి, verb కూడా singular అవుతుంది.

అందుకని each of the boys (he) <u>gets</u> అంటాం.

అలాగే either of = రెండిట్లో ఏదైనా

b) either of the methods = రెండిట్లో ఏ పద్ధతైనా - పద్ధతి అనేది singular కాబట్టి, verb కూడా singular - అందుకని <u>is good</u>.

c) దీనికి కూడా పై సూత్రం వర్తిస్తుంది.

**Q.** What is syntax, please explain? How far it is useful?

**A.** Syntax is the rules to be followed in sentence construction = వాక్య నిర్మాణంలో పాటించాల్సిన నిబంధనలు - ఏ మాట ముందు, ఏది తర్వాత, use of words, phrases in the proper order. ఇది చాలా useful. అయితే grammar తెలిస్తేనే syntax correct గా ఉంటుందనడం సరికాదు. భాష అనేది practiceతో వస్తుంది. ఎంత తరచుగా మాట్లాడితే, syntax కూడా అంత బాగుంటుంది.

**Q.** వ్యాకరణ దోషాలు లేకుండా ఇంగ్లిష్ రాయాలంటే ఏంచేయాలో సూచించగలరు.

**A.** ఏదో ఒక విషయాన్ని ఎంచుకుని దాని గురించి ముందుగా రెండు, మూడు వాక్యాలు రాయడం practice చేయండి. అది English బాగా తెలిసినవారికి చూపించండి. వాళ్ల సలహా మేరకు రాత మెరుగు పరుచుకోండి. అలాగే ఏదో ఒక subject మీద 100 - 150 పదాలతో పేరా రాయడం practice చేయండి. తెలిసినవాళ్ల సలహాలు పాటించండి. ఎవరి సహకారం లేకపోతే మీరే ఒక చిన్న para చదివి, దాని సారాంశాన్ని ఒక పేరాగా రాసి రెండింటినీ పోల్చి చూసుకుని, ఎక్కడ తేడాలున్నాయో గమనించండి. అలా improve చేసుకోవచ్చు

***Sneha Agarwal, Nizamabad***

**Q.** కింది సందేహాలను తీర్చగలరు.

★ He has a ring of gold.

★ He has a ring <u>made of gold</u>.

★ I sat on a wall.

★ The man sat <u>at the window</u>.

★ He walked with great care.

★ I don't know, <u>why he has done it</u>.

★ <u>If you work hard</u>. You will succeed.

ఇవి clauses కదా కానీ ఒక Grammar book లో- పై వాక్యాల్లో underline చేసిన వాక్యాలను గుర్తుపట్టండి అని ఇచ్చారు. మొదటి వాక్యం clause అని అన్నారు అయితే underline చేసిన వాక్యంలో subject లేదు కదా - అంటే ఒక వాక్యంలో clause/ phrase లను గుర్తుపట్టడానికి sentence మొత్తం పరిగణనలోకి తీసుకోవాలా? రెండో underlined sentence ను phrase అన్నారు. అప్పుడు వాక్యం మొత్తం పరిగణనలోకి తీసుకుంటే - అది clause అవుతుంది కదా. అలాగే మూడో వాక్యం phrase అన్నారుగానీ అది he అనే subject గురించి చెబుతుంది కదా - please explain

**A.** A Clause is a group of words with a verb. Verb ఉన్న group of words, clause అవుతుంది. (He has a ring made of gold) లో made of gold, clause కాదు. ఎందుకంటే ఇక్కడ 'made of gold' లో verb లేదు. Made ఇక్కడ past participle. Past participle, verb కాదు. కాబట్టి 'made of gold' is not a clause but a phrase = a group of words without a verb.

★ I sat on a wall = this is a sentence because, it is a group of words with complete meaning. It is also a clause. because it is a group of words with the verb 'sat'

★ at the window - a phrase, because there is no verb in this group of words.

★ 'with great care' also phrase because there is no verb in the group.

★ Why he has done it - 'has done' is a verb, and so 'why he has done it' is a clause.

★ If you work hard - also a clause because, it is a group of words with the verb 'work'.

ఇవి గుర్తు పెట్టుకోండి.

**Sentence:** A group of words with complete meaning.

**Clause:** A group of words with a verb.

**Phrase:** A group of words without a verb

***Avinash, Mukundapuram***

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లోకి అనువదించగలరు.

★ గుండె ఆగినంత పని అయ్యింది.

**A.** My heart almost stopped beating/ skipped a beat.

★ వాడికీ నాకూ పడదు.

**A.** We/ he and I don't agree with/ don't get on with/ don't take to each other.

## Where does this road lead to?

**Kiran:** Excuse me, does this road <u>lead</u> to the railway station?

(ఈ రోడ్ రైల్వే స్టేషన్‌కు వెళుతుందా?)

**Kranthi:** Yes, it does. Go straight along. You'll (You will) find the station.

(అవును. తిన్నగా/ నేరుగా/ సరాసరి ఈ రోడ్డు వెంబడే వెళ్లండి. రైల్వే స్టేషన్ వస్తుంది.)




**Kiran:** How far is it from here?

(ఎంత దూరం?)

**Kranthi:** Not very far. Just a Kilometer. It shouldn't take more than 10 to 15 minutes. (ఎంతో దూరం లేదు. కిలో మీటరు మాత్రమే. 10, 15 నిమిషాల కంటే పట్టదు.)

**Kiran:** Oh, Thank you.

**Kranthi:** You're (you are) welcome.

❖ ఎవరైనా అపరిచితుల నుంచి సమాచారం పొందాలంటే, 'excuse me' అని ప్రారంభించడం మర్యాద. (Excuse me = క్షమించండి)

❖ ఏ దారి ఎటు వెళుతుంది? అనే విషయానికి సంబంధించిన, వాడవలసిన expressions:

**Jagadish:** Excuse me, Where does this road <u>go</u>?/ Where does this road <u>lead to</u>?

(ఈ రోడ్డు ఎటు వెళుతుంది?)

**Ramesh:** Oh, straight to the Collector's Office.

(తిన్నగా Collector's Office కు వెళుతుంది.)

**Jagadish:** Is the Govt. Guest House also on this road?

(ప్రభుత్వ వసతి గృహం కూడా ఈ దారిలోనే ఉందా?)

**Ramesh:** Oh, no. This road leads off to the right at 'Famous Book Centre'. The Govt. Guest House is on that road.

(లేదు. Famous Book Centre దగ్గర ఈ రోడ్డు నుంచి కుడివైపు తిరిగే రోడ్డు ఉంటుంది. Govt. Guest House ఆ రోడ్‌లో ఉంది.)

**Jagadish:** Is it walking distance?/ Walkable distance? (నడవగలిగిన దూరమేనా?)

**Ramesh:** No. I suggest that you take an auto.

(కాదు. మీరు ఆటో తీసుకుంటే మంచిది.)

### FUNCTIONAL ENGLISH

❖ గమనించండి. ఏ రోడ్డయినా ఎక్కడికయినా వెళ్లడం - go/ lead/ takes someone to. This is Grand Trunk Road on NH.5. It <u>goes</u>/ <u>leads you</u>/ <u>takes you</u> from Chennai to Kolkata.

(ఇది Grand Trunk Road/ N.H.5. ఇది చెన్నై నుంచి కోల్‌కతా వెళుతుంది.)

❖ ఎంత దూరం? - How far. చాలా దూరం = far off/ very far.




**Syam:** How far is this college of yours from the bus stand?

(మీ college, Bus stand నుంచి ఎంత దూరం?)

Ram: Quite <u>far off</u>, I should say.

(బాగా దూరమనే అనాలి.)




far off/ very far/ quite far off = దూరం/ చాలా దూరం/ బాగా దూరమే

X near/ close, very near/ close, nearby/ closeby = దగ్గర/ చాలా దగ్గర/ (అక్కడికి) దగ్గరే. Quite near = quite close = బాగా దగ్గర. ఒక రోడ్డు నుంచి ఇంకో రోడ్డు చీలడం = lead off/ take off. About 10 kms along this road, another road <u>leads off/ takes off</u> to the right/ left, etc = ఈ రోడ్డు వెంబడి 10 కి.మీ. తర్వాత ఇంకో రోడ్డు దీని నుంచి కుడికి/ ఎడమకు చీలుతుంది.




**Vijay:** How do I go to the Jollyland Park? (Jolly land పార్క్‌కు ఎలా వెళ్లాలండీ?)

**Amruth:** Drive along this road for 5 km. A street <u>takes off/ leads off</u> to the left. Take the street and go straight for a kilometer. You'll find the place.(ఈ రోడ్ వెంబడి 5 కి.మీ. వెళ్లండి (మీ car లో). అక్కడ ఎడమవైపు వెళ్లే వీధి కనిపిస్తుంది. ఆ వీధిలో ఒక కి.మీ. వెళితే మీకు ఆ పార్క్ కనిపిస్తుంది.)

**Vijay:** Thank you.

ఈ expressions బాగా practice చేసి Conversation కు పదును పెట్టండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish






**S.Thulasiram, Nandikotkur**

**Q.** It is desirable not to use radial and bios tyres on the same vehicle. If you have to, use radials on the rear axle.

పై వాక్యంలో If you have to వివరించి must, should, can and could ఉపయోగించి sentences తయారుచేసి తెలుగు అనువాదం చేయండి. Rear పక్కన 'a' article రావాలి కదా. కానీ, 'The' Article వచ్చింది. For instance - a full fledged (adj) personality.

**A.** ఒకే వాహనానికి రెండు రకాల tyres వాడకుండా ఉండటం మంచిది. ఒకవేళ వాడాల్సివస్తే/ వాడటం తప్పకపోతే = If you have to;

I/ we/ you/ they have to, he/ she/ it has to = must = should - all these express, order/ duty/ necessity. (ఆజ్ఞ/ తప్పకచేయాల్సిన/ విధిగా చేయాల్సిన/ అవసరానికి చేయాల్సిన వాటిని గురించి తెలుపుతాయి.

You have to be/ should be/ must be here at 9 everyday = నువ్విక్కడ రోజూ తొమ్మిదింటికి ఉండాలి (ఆజ్ఞ).

She has to / must/ should/ do it if she wants the job = ఆ ఉద్యోగం ఆమెకు కావాలంటే అది ఆమె చేయాల్సిందే (నిబంధన, అవసరం)

Axle = ఇరుసు, వాహనాలకు రెండు వైపులా ఉన్న చక్రాలను కలిపి ఉంచే భాగం.

Rear axle = వెనుక ఇరుసు.

ఇక్కడ 'The rear axle' correct. ఎందుకంటే ఏదో ఒక rear axle కాకుండా బండికి అమర్చిన rear axle ను గురించి చెబుతున్నాం కాబట్టి.

**Q.** 'Could you a lend a hand...' పరిచయస్తుడితో అంటే బాగా తెలిసిన వ్యక్తి లేదా స్నేహితుడితో informal వాక్యాన్ని ఇలా వాడవచ్చా? వివరించండి.

**A.** పరిచయస్తుడితో అయినప్పటికీ, అడగలేని సందర్భాలు (ముఖ్యంగా గది సర్దడంలో సాయపడమనడం) ఉంటాయి కదా. అలాంటప్పుడు 'could' వాడటం అవసరం.

**Q.** ఆంగ్ల దినపత్రికలో కింది వాక్యం చదివాను. If the place is not crowded, finding seats is easy and you would only say 'I find a couple of seats near the corner'.

పైన Subordinate clause (if clause) కాకుండా, Main clause లో... and you would only say బదులు You will say. అని ఉండాలి కదా, corner దగ్గర 'the' article, couple of seats దగ్గర 'a' article వాడకం గురించి తెలియజేయండి.

**A.** 'Would' present situations లో వాడటం గురించి ఈమధ్య చాలాసార్లు వివరించాం. Present లో మనం ఊహించుకునే సంఘటనలు ఏమైనా ఉంటే అప్పుడు కూడా "would" వాడతాం.

Janakiram: What would he do, if I applied for leave.

(నేను సెలవంటూ పెట్టను. పెట్టిన సందర్భంలో అతడేమంటాడు?

Jayaram: He would say no.

(అతడు కుదరదనే అంటాడు.)

'Would' వివరాలు ఇంకా కావాలంటే గత సంచికల్లో చూడండి.

**Q.** కింది వాక్యాన్ని తెలుగులో అనువదించగలరు.

Asked about his having gone to the airport, along with four other cabinet ministers, to hold dialogues with Baba Ramdev, he said the situation the center faced was akin to a double edged sword.

Situation దగ్గర 'the' article, double edged దగ్గర 'a' article వాడకం తెలియ జేయండి.

**A.** నలుగురు cabinet మంత్రులతో కలిసి, బాబా రాందేవ్‌తో చర్చలు జరిపేందుకు విమానాశ్రయానికి వెళ్లడం గురించి అడగబడినప్పుడు (మామూలు తెలుగులో 'ఎవరో అడిగినప్పుడు'), ఆయన కేంద్రం ఎదుర్కొంటున్న సమస్యను రెండు వైపులా పదునున్న కత్తిలా వర్ణించారు.

ఎలాంటి situation? అని ప్రశ్న వేసుకుంటే, కేంద్రం ఎదుర్కొంటున్న పరిస్థితి అని సమాధానం వస్తోంది. 'ఫలాని పరిస్థితి' అని - కాబట్టి the situation అనాలి.

A double edged sword- ఇక్కడ double edged sword అంటే which (ఏ) double edged sword అంటే ఫలాని sword అని సమాధానం రావడం లేదు. అందుకని a double edged sword అనాలి..

# He is the senior most teacher







**Q.** ఒక న్యాయ వేలం ప్రకటనలో ఇలా ఉంది. Whereas complaint has been made that.... ఈ వాక్యం ప్రారంభంలో 'whereas' అని ఉంది. 'whereas' అంటే అందువల్ల అని ఒక సందర్భంలో మీరు చెప్పారు. ఇక్కడ whereas బదులుగా As, for, since కూడా వాడవచ్చా?

**A.** వాడవచ్చు కానీ న్యాయ/ చట్ట పరిభాషలో కుదరదు.

**Q.** Last month all news channels and newspapers were dominated by the news of Osama bin laden's elimination by a special US task force.పై వాక్యంలో a special US task force పక్కన 'by' Preposition వాడకాన్ని గురించి వివరించండి.

**A.** Passive voice లో 'by' వాడతాం. ఉదాహరణకు Ravana was killed by Rama. ఎవరిచేత అని చెప్పేందుకు, passive లో 'by' వాడతారు.

***K. Pavanisri, Mogalturu***

**Q.** Senior most అనే పదం వాడకాన్ని ఉదాహరణలతో తెలుపగలరు.

**A.** Senior most = having the longest experience of all.

a) He is the senior most teacher in the school = ఆ స్కూల్లో ఆయన అత్యంత అనుభవమున్న ఉపాధ్యాయుడు.

b) Anjali Devi is the senior most actor on the Telugu screen = తెలుగు సినిమా రంగంలో అంజలీదేవి అత్యంత అనుభవం ఉన్న నటి.

**Q.** నా Cycle Patch పడింది. అందుకే ఆలస్యంగా వచ్చాను. ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లోకి అనువదించగలరు.

**A.** I am late because my cycle tyre has punctured/ my cycle tyre had a puncture/ was punctured.

**Q.** నేను Cycle/ Bike మీద రోజూ కళాశాలకు వెళతాను. ఈ వాక్యంలో on cycle/ bike అని రాయలా లేదా by cycle/ bike అని రాయాలా? తెలుపగలరు.

**A.** I go to College on cycle (By cycle కాదు).

**Q.** Head master అనే word ను ఒకే word గా రాయాలా, లేదా విడివిడిగా రాయాలా? తెలియజేయగలరు.

**A.** Headmaster (Rarely Head-master), Head Master అని విడివిడిగా రాయకూడదు.

***Srinivasa Rao, Darsi***

**Q.** My foot, By thunder ఈ పదాలకు అర్థం తెలుపగలరు.

**A.** My foot! = నా/నీ బొంద అని మనం విసుగ్గా/ అవతలివాళ్ల మాటను తేలిగ్గా తీసిపారేసేందుకు వాడే మాట.

By thunder - ఈ expression లేదు.

'Getout' he thundered = 'వెళ్లిపో' అని గట్టిగా అరిచాడతను (= Thundered)

***P. Srinivas, Mahaboobnagar***

**Q.** Point by point, Step by step, By and by, By and by, Day by day వీటి అర్థాలు వివరించగలరు.

**A.** Point by point = అంశాలవారీగా/ ఒక అంశం తర్వాత ఇంకో అంశం - ఇలా.

Step by step = అంచెలంచెలుగా - ఒక అడుగు తర్వాత ఇంకో అడుగు/ క్రమక్రమంగా.

By and by = Before long - ఎక్కువ సమయం గడవక ముందే (త్వరలోనే)

By and by it was clear to her that he was not good = త్వరలోనే ఆమెకు అర్థమైంది అతడు మంచి వాడు కాదని - By and by - Old use.

By = ఒకదాని తర్వాత ఒకటి.

Day by day = రోజురోజుకీ

ఈ అర్థంతో By కి ముందూ వెనక ఒకే Part of speech కి చెందిన మాటలు వాడతారు.

**Q.** As per, As per the rules, As above, As to, Just then ఈ పదాలకు తెలుగులో అర్థం తెలుపగలరు.

**A.** As per = ప్రకారం, As per the rules = నిబంధనల ప్రకారం.

★ As above = పైన చెప్పిన/ తెలిపిన విధంగా

★ As to = as regards = about. 'About' వాడటం ఉత్తమం. As to - అర్థంలేని పాండిత్యం.

★ Just then = అప్పుడే; Just then his father came = అప్పుడే వాళ్ల నాన్న వచ్చారు.

## you look off colour

**Prakash:** You look tired. Aren't you well?
(నీరసంగా కనిపిస్తున్నావు. ఒంట్లో బాగా లేదా?
(Tired - మామూలు అర్థం = అలసిపోవడం)

**Sekhar:** I'm afraid so. I think I've (I have) a fever. (అలాగే ఉంది. జ్వరంగా ఉందనుకుంటా.)




**Prakash:** Haven't you checked your temperature? (Temperature చూసుకోలేదా?)

**Sekhar:** It started last night. I thought I would be well by the morning after a good sleep. I didn't sleep well either.
(నిన్న రాత్రి ప్రారంభమైంది. రాత్రి బాగా నిద్రపోతే సరిపోతుందనుకున్నా. ఆ నిద్ర కూడా సరిగ్గా పోలేదు.)

**Prakash:** Why don't you see a doctor?
(Doctor ను కలవకపోయావా?)

**Sekhar:** I am going to in half an hour. Waiting for my brother to go with me.
(అరగంటలో వెళతాను. మా తమ్ముడు నాతో వస్తాడని చూస్తున్నాను.)

**Prakash:** The earlier, the better.
(ఎంత త్వరగా అయితే అంత మంచిది.)

**Sekhar:** Of course. (నిజమే.)

○ ఆరోగ్యానికి సంబంధించిన పై సంభాషణ గమనించారు కదా. ఆరోగ్యాన్ని గురించి అడిగేందుకు వాడే expressions...

Aren't you well?
(ఏం ఒంట్లో బాగాలేదా? / కులాసాగా లేదా?)

You look tired/ you look ill/ you look dull/ you look off colour, what's the matter?
(చాలా నీరసంగా/ జబ్బుగా/ ఉత్సాహం లేకుండా/ నీరసంగా కనిపిస్తున్నావు. ఏంటి సంగతి?

**Eswar:** You look ill. Anything wrong?
(వ్యాధిబారిన పడినట్టు కనిపిస్తున్నావు. ఆరోగ్యం ఏమన్నా బాగాలేదా?)

**Gopal:** Oh, nothing of the sort. I am OK.
(అదేం లేదు. ఆరోగ్యంగానే ఉన్నా.)

○ మనం ఆరోగ్యంగానే ఉన్నప్పటికీ, ఎవరన్నా 'ఏంటి కులాసాగా లేదా?' అని అడిగినప్పుడు ఈ expressions వాడవచ్చు

**FUNCTIONAL ENGLISH**

Do I look ill? No. I am all right.
(వ్యాధిబారిన పడినట్టు కనిపిస్తున్నానా? అదేం లేదు. ఆరోగ్యంగానే ఉన్నా.)

○ ఇంకా మరి కొన్నిచూడండి:

**Madam:** You look off colour today. Any thing wrong.
(ఈవేళ నీరసంగా కనిపిస్తున్నావు. ఆరోగ్యంలో ఏమన్నా తేడా ఉందా?)




**Mohan:** No such thing. In fact, today, I feel very fit.
(అదేం లేదే. అసలు చెప్పాలంటే ఈవాళే ఆరోగ్యంగా ఉన్నా.)



Be fit/ feel fit = ఆరోగ్యంగా ఉండటం = be all right/ feel all right.

○ ఆరోగ్యం సరిగా లేకపోతే...

**Srinivas:** Yea, I haven't been well since last night. Should see my doctor.
(నిన్న రాత్రి నుంచీ బాగాలేదు. డాక్టర్ని కలవాలి.)

**Krishna:** You appear quite weak. Not well, I suppose?
(చాలా నీరసంగా ఉన్నావు. కులాసాగా లేవనుకుంటా.)



**Mukund:** You are right. I am as ill as I appear.
(నిజమే ఎంత నీరసంగా కనిపిస్తున్నానో, అంతే జ్వరంతో ఉన్నాను.)

**Krishna:** See a doctor, then.

**Mukund:** I am on my way. (అక్కడికే వెళుతున్నా.)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# Virtue is the greatest ornament



***M. Chandra sekhar, Srikalahasti***

**Q.** He may/ might tell his wife. Perhaps he tells his wife. Perhaps express doubt in the sentence.

What is different in between doubt - possibility.

**A.** Doubt is uncertainty about something happening. You are not sure that it will happen/ will not happen.

Possibility means the fact that something perhaps will happen or exist- in certain circumstances. Not so certain there is difference between the two, but very little. In the case of a doubt, there is the chance of something not happening more than happening. In the case of a possibility there is the chance of something happening, more than its not happening.

**Q.** What is general possibility?

**A.** General possibility = something being likely to happen.

**Q.** He advised me to apply at once.

He advised to applying at once.

What is the difference between the two sentences?

**A.** He advised me to apply at once = I was advised to apply.

He advised applying (Not, 'to applying') immediately = His advice was that we (anybody in general) apply immediately.

**Q.** Tom insisted on reading the letter.

Tom insisted on my/ me reading it.

పై వాక్యాలు కరెక్టేనా?

**A.** Tom insisted on reading the letter = Tom insisted that he read the letter.

Tom insisted on my reading the letter = Tom insisted that I read the letter.

'Tom comple the reading or not' - Not English.

**Q.** Transitive verb, complex transitive verb, double transitive verb వీటిని గురించి వివరించగలరు. వాక్య నిర్మాణం అంటే ఏమిటి?

**A.** వాక్య నిర్మాణం అంటే వాక్యంలోని పదాలు ఉండవలసిన తీరు, వాటి అమరిక. ఏ మాట ముందు, ఏ మాట తర్వాత రావాలనే నిబంధనల్లాంటివి. Case (nominative, objective etc) difference సరిగా సూచించడం లాంటివి. ఇవి సరిగా ఉంటేనే, వాక్యానికి సరైన అర్థం వస్తుంది.

Transitive verb, compound transitive verb and double transitive verb - వీటికి చాలా సున్నితమైన తేడాలున్నాయి. అవి తెలుసుకున్నందువల్ల ఉపయోగం లేకపోగా తికమక పడతారు.






M.SURESAN

***T. Siva. Nandikotkur***

**Q.** కింది వాక్యాలను ఇంగ్లిష్‌లోకి అనువదించగలరు.

★ సంకల్పం మంచిదైతే శక్తి వెతుక్కుంటూ వస్తుంది.

**A.** If your intention is good, the power to realise it comes searching for you.

★ మోక్ష సౌధానికి పరీక్ష తాళం, నిష్కల్మష భక్తి తాళం చెవి.

**A.** Testing is the lock unadulterated piety is the key to salvation.

★ ఒక్కోసారి చిన్న నిర్లక్ష్యమే జీవితాన్ని నాశనం చేస్తుంది.

**A.** Sometimes a little negligence ruins the whole life.

★ విజ్ఞానంలేని జీవితం నూనెలేని దివ్వె లాంటిది.

**A.** A life without knowledge is like a lamp without oil.

★ అర్జునుడు విలువిద్యలో సవ్యసాచి.

**A.** Arjuna is ambidextrous in archery.

★ ఉడుములు గోడలకు గట్టిగా అతుక్కుంటాయి.

**A.** The iguana sticks to the wall. / The iguana grips the wall tightly.

★ పాములు కుబుసాన్ని, కొన్ని జంతువులు కొమ్ములను విసర్జిస్తాయి.

**A.** Snakes slough their skin, and some animals shed their horns.

★ సద్గుణాన్ని మించిన సౌందర్యం లేదు.

**A.** There is no beauty other than virtue (Virtue is the greatest ornament)

★ నెమళ్లు పురివిప్పి నాట్యం చేస్తాయి.

**A.** Peacocks spread their plumes and dance.

★ పాపం పండనిదే దేవుడు కూడా ఏమీ చేయలేడు.

**A.** Even God can't do anything until one's sins are complete. (దీనికి సరైన అనువాదం రాదు; ఎందుకంటే English వాళ్ల నమ్మకం ఇది కాదు కాబట్టి.)

**Q.** కింది పదాలకు సమానార్థమున్న ఇంగ్లిష్ పదాలను తెలియజేయండి.

★ మత్తు నుంచి తేరుకోవడం **A.** To come to/ regain consciousness

★ దాఖలాలు **A.** Proofs/ evidences

★ మొక్కుబడిగా **A.** perfunctorily

★ శరణ్యం **A.** The only way out/ the resort

★ మీనమేషాలు లెక్కించడం **A.** Hesitate/ dither

★ ఆడంబరంగా **A.** Ostentatiously

★ అపర (అభినవ భగీరథుడు) **A.** Bhagiratha of the modern times/ Bhagiratha incarnate

★ కారణజన్ముడు **A.** Born for a purpose

★ సార్థకనామధేయుడు **A.** One who lives upto his name

★ మృత్యుంజయుడు **A.** One who overcomes death

★ యాదృచ్ఛికం **A.** Coincidence

★ ఆగంతకుడు **A.** The stranger

★ కుంభకోణాలు **A.** Scams

★ భేషజాలు (పట్టింపులు) **A.** Show (భేషజం అంటే పట్టింపు కాదు. పైకి కనిపించే తీరు.)

**Q.** కింది పదాల pronunciation వివరించగలరు.

★ Xebec **A.** జీ (Zee) బెక్

★ Xenophobia **A.** జె (Ze) నఫోబియ

★ Xylophone **A.** జై (Zai)లఫోన్

★ Xiphias **A.** జీ (Zee) ఫియస్

★ martyr **A.** మాట

★ enmasse **A.** అమాస్ ('మా' manలో 'మా'లా)

★ ukulele **A.** యూకలైలీ

★ jeopardy **A.** జెపడి

★ menace **A.** మెనస్

★ faeces **A.** ఫీసీజ్ (feeseez)

★ obsequies **A.** అబెసక్విజ్

★ obstetrics **A.** అబ్‌స్టెట్రిక్స్

★ bereaved **A.** బిలీవ్డ్

★ benign **A.** బినైన్

★ endeavour **A.** ఎన్‌డెవ

***K. Varalakshmi, Rajahmundry***

**Q.** Of the American and British pronunciations, which one should be used? Which one carries more importance?

**A.** In India, British pronunciation is preferred to American pronunciation. There is no question of the one being more important than the other.

**Q.** I have come across the word Reuters in some newspapers. What does it mean?

**A.** 'Reuters', like the 'press trust of India' (PTI) is the name of a very famous European News Agency. It gathers news and sells it to all the news media.

***Avinash, Mukundapuram***

**Q.** Prejudice అనే పదాన్ని ఉదాహరణలతో వివరించగలరు.

**A.** దురభిప్రాయం. ఏ కారణం లేకుండా ఒకరిని/ ఒక విషయాన్ని గురించి మనకు కలిగే దురభిప్రాయం/ అయిష్టత.

Caste prejudices = కుల దురభిప్రాయాలు

Regional prejudices = ప్రాంతీయ దురభిప్రాయాలు మొదలైనవి.

## I'am afraid, I can't

FUNCTIONAL ENGLISH

**Anirudh:** You look tired. (Are) you ok? (నువ్వు నీరసంగా కనిపిస్తున్నావు. కులాసానా?)

**Susanth:** Not in the best of health, I'm afraid. (కులాసాగా లేను అనిపిస్తోంది.)

**Anirudh:** What's wrong? (ఏంటి? బాధ)

**Susanth:** I am running at temperature, that I am sure of. Being new to the place, I don't know any doctor here. Could you take me to one. (ఒళ్లు మాత్రం వెచ్చగా ఉంది. ఆమాత్రం చెప్పగలను. ఇక్కడ నేను కొత్త కదా. ఏ డాక్టరూ తెలియదు. నువ్వు ఎవ్వరి దగ్గరకైనా తీసుకెళ్లవా?)

**Anirudh:** I haven't been much longer here either, but I do know two or three doctors here. (I) wonder who I should take you to. (నేను కూడా నీకంటే ఎక్కువకాలం లేనిక్కడ. కానీ ఇక్కడ ఇద్దరు, ముగ్గురు డాక్టర్లు తెలుసు. ఎవరి దగ్గరికి తీసుకెళదామా అని ఆలోచిస్తున్నా.)

**Susanth:** Do take one to the best. I'm afraid, I'm getting worse by the hour.(అందరిలో మంచి డాక్టర్ దగ్గరికి తీసుకెళ్లు. గంటగంటకీ పరిస్థితి అధ్వాన్నమవుతోంది.)

**Anirudh:** That's what I am unable to decide. I just wonder who among them is the best. My cousin is a safe best. Let me call him. (అదే నేనూ కచ్చితంగా చెప్పలేకపోతున్నా. మా కజిన్ ఈ విషయంలో సరైనవాడు. అతడికి ఫోన్ చేద్దాం.)

**Susanth:** The earlier the better. (ఎంత త్వరగా అయితే అంత మంచిది)

English conversation (సంభాషణ) లో afraid ( I'm afraid), I wonder అనే expressions చాలా తరచుగా వాడుతుంటారు. ఇవి conversation ను చాలా సహజంగా ఉండేట్లు చేస్తాయి. Afraid - ఎక్కువగా వాడే అర్థం భయపడటం. I'm (I am) afraid అనే expression మనం ఇతరులకు ఏదైనా చెప్పేందుకు 'చింతిస్తున్నాను' అనిగానీ, వాళ్లను నిరుత్సాహపరిచే విషయం చెప్పేందుకుగానీ వాడతాం.

**Puneeth:** I need some money urgently. Can you help me? (నాకు కొంత డబ్బు అవసరం. నువ్వు సాయం చేయగలవా?)

**Snehith:** I am afraid, I can't, though I wish very much to. (నేను సాయం చేయలేను అనేందుకు చింతిస్తున్నా, సాయం చేయాలని చాలా కోరిగ్గా ఉన్నప్పటికీ.)

**Pranab:** Can't you call off your fast? (మీ నిరశన విరమించలేరా?)

**Hazare:** I'am afraid I can't. (నేను విరమించలేనని చెప్పేందుకు చింతిస్తున్నా.)

Afraid
భయపడటం
చింతించడం

ఇలాంటి సందర్భాల్లో I am afraid = I am sorry.

**Praveen:** Shall I be getting the scholarship? (నాకు స్కాలర్‌షిప్ వస్తుందా?)

I am afraid (I am sorry)

**Priyanka:** I'm afraid no. (నీకు రాదు - ప్రవీణ్‌కు నిరుత్సాహం కలిగించే వార్త.)

అలాగే wonder కు ఎక్కువ వాడుకలో ఉన్న అర్థం ఆశ్చర్యపోవడం. అయితే conversation/ spoken english లో 'I wonder' -expression ను మన సందేహం వ్యక్తపరచడానికి గానీ, మనకు తెలియని విషయం చెప్పేందుకు గానీ వాడతాం.

**Govind:** Shall we go ahead and buy the car? (అయితే అనుకున్నట్టు ఆ కారు కొందామా?)

**Krishna:** I wonder if the money we have is enough. (మన దగ్గరున్న డబ్బు సరిపోతుందా? అని ఆలోచిస్తున్నా.)

Wonder
ఆశ్చర్యం
సందేహం

ఒక్కోసారి సందేహం తీర్చేందుకు వాడతాం.

**Santhosh:** Has Harika passed? (హారిక పాసైందా?)

**Samyuktha:** I wonder (సందేహమే).

వీటిని ఉపయోగించి మీ conversation సహజంగా ఉండేట్లు చేసుకోండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish






*V. Rajkumar, Hyderabad*

**Q.** What is the difference between the below mentioned words.

★ Chance - Opportunity

**A.** Chance = opportunity. But chance implies luck/ something/ an opportunity arising out of luck, whereas opportunity is not always a lucky happening but caused by human actions.

★ King - Emperor

**A.** Emperor - King of Kings

★ Establishment - Foundation

**A.** Establishment = founding/ the starting of an institution/ a kingdom, etc.,

Foundation: The base for a building

★ Mess - meal

**A.** Mess = a place where meals are cooked and served for a group of people sharing the expenses

Meal = food.

★ Tariff - Duty

**A.** Tariff = List of rates, taxes, charges, etc.,

Duty = Tax that you pay on things that you buy, especially that you bring into a country

★ Premium - Installment

**A.** Premium = An extra amount paid in addition to the price of something.

Installment = a regular part payment of the price of something or a loan.

★ Jogging - Running

**A.** Running = a short period of doing something in a particular way.

Jogging = Running slowly and steadily, especially for exercise.

★ Fine - Penalty

**A.** Fine = money paid as punishment (for breaking a rule/ law)

Penalty = punishment for breaking a rule/ law.

★ Post - Mail

**A.** Mail = post. But 'post' is not used for message sent or received on a computer.

★ Living room - Drawing room

**A.** Living room = a room in which people sit together talk and relax.

Drawing room = Almost the same as living room where visitors are received - this expression is old fashioned not much in use now.

★ Map - Picture

**A.** Map = Drawing/ plan of earth's surface/ part of it. Plan of cities, countries, towns, revers, seas, streets etc.,

Picture = figure

# Smile ... laugh gently and silently





M.SURESAN

★ Co-operation- Collaboration

**A.** Co-operation = working together for a common purpose

collaborate = working together, especially for some literary (writing books etc) and scientific work, co-operate with the enemy.

★ Criteria - Standards

**A.** Criteria = Standards

★ Muslim - Islam

**A.** A Muslim is the follower of Islam religion.

★ Drought relief - Dearness relief

**A.** Drought relief = Relief (help) given to people suffering as a result of lack of timely rain.

Dearness relief = Relief (help) given to people because of rise in prices.

★ Conversation - Dialogue

**A.** Conversation = Two or more people talking to one another.

Dialogue = Conversation in a play (drama), novel, or movie.

★ Toilet - Lavatory

**A.** Lavatory is the old fashioned word, used especially in Britain for toilet.

★ Smile - Laugh

**A.** Smile = laugh gently and silently.

★ Quit - Leave

**A.** Quit = to leave (go away) from a place; to stop doing a job, or give up a habit.

Leave = to go away from a place.

*S. Tulsi Ram, Nandikotkur*

**Q.** కింది వాక్యాల్లో Underline చేసిన Prepositions కు అర్థం తెలియజేయండి.

★ Buddha once told his disciples that they should be delighted unto themselves.

**A.** Unto - old use (Not used in present day english) = to/ towards/ upto a point of time/ event.

... should be delighted unto themselves = they should give joy to themselves.

★ Once upon a time there lived a king by name Brahma datta.

by name = having that name/ పేరుతో

'by' also means 'beside/ by the side of' = పక్కన.

★ There, by a dim lamp and in a wooden cradle, cushioned by straw lay a baby.

**A.** There by a dim lamp ... అక్కడ ఓ గుడ్డి దీపం పక్కన.

★ By the stable, where lay the holy child.

**A.** By the stable = గుర్రపుశాల పక్కన.

*M. Ratna Kishore, Guntur*

Q. కింది పదాల ఉచ్చారణ, అర్థాలు తెలియజేయగలరు.

★ Giant

**A.** Giant = జయంట్

1) కథల్లో పెద్ద దేహంతో క్రూరంగా కనిపించే రాక్షసుడు 2) చాలా పెద్ద దేహం ఉన్న మనిషి.

★ Counselor – Counsellor

**A.** Counselor (American) = Counsellor (British) = వ్యక్తిగత విషయాలపై సలహాలిచ్చేందుకు శిక్షణపొందిన సలహాదారు.

★ Councilor – Councillor

**A.** Councillor (British) = Councilor (American) = Council (మండలి) సభ్యులు (man/ woman)

★ Cloth – ఈ పదానికి Plural form ఉందా?

**A.** 'cloth' వస్త్రం అని అర్థం. Uncountable – ఆ అర్థంతో దానికి plural form లేదు. అయితే table cloth, dish cloth (గిన్నెలను తుడిచేందుకు వాడే వస్త్రం) లాంటి expressions లో, a table cloth, a dish cloth అనవచ్చు. కానీ modern dictionaries లో ఎక్కడా cloth కు plural form cloths అని లేదు. (Different kinds of cloth/ pieces/ sheets of cloth అంటారు)

*U.Venkat, Cherukupalli*

Q. కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో అనువదించగలరు.

★ అన్నం ఉడుకుతుంది. **A.** Rice is boiling.

★ పంపులో నీళ్లు వస్తున్నాయి.

**A.** Water is flowing/ running/ coming through the pipe.

**Q.** కింది రెండు వాక్యాలు కరెక్టేనా?

★ He died. ★ He was died.

**A.** He died = He is not alive/ చనిపోయాడు.

He was died - this is wrong - not a sentence. You can say 'He was dead' = చనిపోయాడు. (ప్రాణం పోయింది - గతంలో జరిగిన విషయం.)

**K.Rajesh, Anakapalli.**

**Q.** ఇంగ్లిష్ పూర్తిగా రావాలంటే వ్యాకరణంలోని సుమారు 295 structures పూర్తిగా నేర్చుకోవాల్సిందేనా?

**A.** Structures అంతగా ఉపయోగపడవు. Structures అయినా grammatical approach అయినా సరే, practice లేనిదే ఏదీరాదు. Structure practice చేయాలనుకుంటే మీకు grammar లోని parts of speech, word functions లాంటివి తెలియాలి. 295 structures లో అన్నీ spoken english లో వాడం. వాటన్నింటికంటే కూడా మామూలుగా english వినడం, తర్వాత చదవడం, వీలైనప్పుడల్లా మాట్లాడటం చేయండి. ఇలాచేస్తే తక్కువ శ్రమతో మీరు english చక్కగా మాట్లాడగలరు.

*Radha, Martur*

**Q.** కింది పదాల అర్థాలు తెలుపగలరు.

apes, reinforce, social grooming, lip smacking

**A.** apes = తోకలేని వానరాలు (Gorilla లాంటివి)

reinforce = దృఢపరచడం

social grooming = (ముఖ్యంగా apesలో) ఆడా మగా apes తమ పరస్పర ప్రేమ తెలుపుకునేందుకు ఒకదాన్నొకటి తాకడం, నిమరడం.

Intriguing = ఆసక్తికరం

lip smacking = పెదవులు తడుపుకోవడం.

## It's half past nine

**Ganesh:** What time is it now?/ What's the time now? (Time ఎంతైంది? )

**Kumar:** It's 8.15 by my watch, but why do you want to know? (ఇప్పుడు 8.15; అయినా నీకెందుకిప్పుడు time ఎంతో? )

**Ganesh:** You know, my sister and brother-in-law are coming by Howrah Mail at 9.00. I've to receive them at the station. (మా అక్కాబావా హౌరా మెయిల్లో తొమ్మిదింటికి వస్తున్నారు. Stationకు వెళ్లి వాళ్లను తీసుకురావాలి.)

**Kumar:** It's usually late. You had better find out the exact time of arrival of the train. (మామూలుగా అది ఆలస్యంగా నడుస్తుంది. నువ్వు అది చేరే సమయం సరిగ్గా తెలుసుకోవడం మంచిది.)

**Ganesh:** It's late by half an hour. That means its due at 9.30. But you can't be sure of these trains. You know, sometimes they do make up and arrive on schedule. So I want to be there at 9. (అది అరగంట ఆలస్యం. అంటే అది 9.30కు రావచ్చు అయితే ఈ trains విషయం ఏమీ చెప్పలేం. ఒక్కోసారి ఆలస్యాన్ని తగ్గించుకుని సరైన సమయానికి వస్తాయి. అందుకని నేను stationలో తొమ్మిదింటికే ఉంటాను.)

**Kumar:** Yea. That's better.

**Ganesh:** I'm (I am) off. Bye. (నేను వెళ్లిపోతున్నా. Bye.)

● Time అడగటం, చెప్పడం:

a) What's the time now?/ What time is it now?

**గమనించండి:** What's the time? The time కు, time కు తేడా: The time = సమయం ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, రాత్రి, గంటలు, నిమిషాల్లో తెలిపే సమయం - the time. Time = కాలం.

**సమయాన్ని తెలియజేసే విధానం:** Past = దాటి. It is past 10 already. I feel sleepy = ఇప్పుడే 10 దాటింది. నిద్రొస్తోంది.

**Students:** When should we be here tomorrow, sir, for starting for the excursion? (రేపు మేమిక్కడ ఎన్నింటికి ఉండాలండీ, excursion కు బయలుదేరడానికి? )

**Lecturer:** (I have) told you. Be here by 7 sharp in the morning. (చెప్పాను కదా? ఉదయం Correct గా ఏడింటికుండాలని.) Sharp = exactly.

The meeting began at 6 sharp in the evening.

గమనిక: AM, PM మామూలు సంభాషణలో వాడం. Formal communicationలోనే వాడతాం. దానికి బదులు morning, noon, afternoon, evening వాడతాం- లేకపోతే సందర్భాన్నిబట్టి తెలుసుకుంటాం.



'What's the time now?' 'It's half past nine (9.30)/ Quarter past nine (9.15)/ Quarter to 10 (9.45). Half fast - అరగంట దాటింది. Quarter past - పావుగంట దాటింది. Quarter to - పావుగంట తక్కువ. పూర్తయిన గంటకు మాత్రమే, O' clock వాడతాం. 'What time is it now?' 'It's 9 O' clock/ 10 O' clock, etc. వీటికి బదులు 9 లేదా 10 అని కూడా అంటారు. It's 9 now. It's 9 to the minute (కచ్చితంగా తొమ్మిదైంది.




**Nikil:** When did he come yesterday? (అతడు నిన్న ఎప్పుడొచ్చాడు? )

**Kapil:** I didn't notice exactly, but it was beyond 10 in the night. (నేను కచ్చితంగా గమనించలేదు, కానీ రాత్రి 10 దాటింది.)

(Beyond 10 = Past 10;)

By the time we went to bed, it was past midnight. (మేం పడుకునేసరికి, అర్ధరాత్రి దాటింది.)

● పావుగంట, అరగంట, ముప్పావుగంట, పూర్తిగా గంటకానప్పుడు, గంటలు, నిమిషాల్లో చెబుతాం. 9.10, 9.25, 9.40 etc. అలాగే కొన్ని సమయాలను ఇలా కూడా చెబుతాం. 8.55 = 5 to 9; 8.50 = 10 to 9.

The early/ the small/ the wee hours of the morning = అర్ధరాత్రి దాటిన తర్వాత సమయం - వేకువ జామున 2, 3 గంటల నుంచి.



## FUNCTIONAL ENGLISH

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish



# He is good, isn't he?





M.SURESAN



***Thakur Baldev Singh, Balharsha***

**Q.** Clarify the following doubts.

Verb/ Subject/ Object Complement - means what? Please explain. అసలు 'Complement' అంటే ఏమిటో వివరించగలరు.

**A.** Complement = A word/ a phrase necessary to complete the meaning of a sentence. An object complement is a word or a phrase adding to the meaning of the object and necessary to complete the meaning of the sentence.

Verb + subject + object complement - ఇది sentence structure (verb pattern). sentenceలోని మాటల అమరిక (structure)ను తెలిపేది. ఉదాహరణకు He saw her - ఈ sentence structure: He (subject) + saw (verb) + her (object). అలాగే verb + subject + object complement కూడా sentence structure. అయితే ఇలాంటి structure ఉండే sentence English లో లేవు. ఎందుకంటే, object లేకుండా object complement ఉండదు కదా? అంతేకాకుండా, verb + subject + complement - ఇది question అవుతుంది. అయితే ఈ structure లో verb + subject కాకుండా, Helping verb + subject + Main verb + object + object complement అయితే ఈ కింది sentence మాదిరిగా ఉంటుంది. ఇక్కడ

Did - Helping verb

they - Subject

elect - Main verb

him - object

President? - object complement

**Q.** I have read in a book the following underlined words are demonstrative adjectives, they are:

a) This boy is stronger than that boy.

b) That book is mine.

c) These books are yours.

d) Those pens are his.

But in the other grammar book I saw that the above underlined words are called demonstrative determiners. And also they are called demonstrative pronouns. How can we understand whether they are demonstrative pronouns/ adjectives/ determiners - please explain.

**A.** a, b, c and d sentences లో this, that, these, those అనే మాటలు ఈ, ఆ అనే అర్థంతో, boy, books, pens ను సూచిస్తాయి (demonstrate) కాబట్టి అవి demonstrative adjectives = boy, books, pens అనే nouns ను గురించి చెప్పే మాటలు కాబట్టి this, that, these, those (adjectives).

ఇవేకాకుండా some, the, my, etc., - ఇవన్నీ కూడా nouns ను గురించి 'ఫలానా' అని చెబుతాయి. అందుకని వాటిని determiners అని కూడా అంటారు. అన్ని demonstrative adjectives, determiners. కానీ అన్ని determiners, demonstrative adjectives కావు.

This book - ఇక్కడ this ఈ అనే అర్థంతో adjective ను చూపించేది కాబట్టి ఇది demonstrative adjective.

This is a book. - ఇక్కడ this (ఇది అనే అర్థంతో) demonstrative pronoun.

These men - these - demonstrative adjective.

These are the men who ....... ఇందులో these demonstrative pronoun.

ఇది/ అది/ ఇవి/ వీళ్లు/ అవి/ వాళ్లు అర్థం వచ్చే this/ that/ these/ those- demonstrative pronouns.

ఈ/ ఆ అని అర్థం వచ్చే this/ that/ these/ those - ఇవి demonstrative adjectives.

***Prakash Panday, Sudimalla***

**Q.** మీరొకసారి His father will misunderstand me. He will think that I 'Pushed' him intentionally అని రాశారు. ఇక్కడ వాళ్ల నాన్న అలా అనుకుంటాడు - ఈ వాక్యం future tense లో ఉంది కదా, Pushed ఎందుకు వాడారో వివరించగలరు.

**A.** His father will think that I pushed him intentionally = నేను అతడిని కావాలనే/ ఉద్దేశ పూర్వకంగానే తోశానని వాళ్ల నాన్న అనుకుంటాడు - future లో కదా? కాబట్టి 'will think' అని అంటాం. 'తోయడం' జరిగిపోయింది - కాబట్టి ఇది past. అందుకని, pushed.

ఇక్కడ మనం తెలుసుకోవాల్సింది: Sequence of tense rules. అవి తెలుసుకోవడానికి Main clause, subordinate clause లను గురించి తెలుసుకోవాలి.

clause - a group of words with a verb.

Main clause - a clause with complete meaning.

Subordinate clause - a clause without complete meaning.

Rule 1: If the verb in the main clause is in the present/ future tense, the subordinate clause verb- can be in any tense.

His father will think that I pushed him.

Main clause - His father will think.

Verb - will think - Future tense.

Sub clause - that I pushed him.

Verb - pushed - past tense.

So the sentence is correct.

ఈ rule ప్రకారమే కాకుండా, అర్థం కూడా సరిగానే వస్తుంది కదా?

Rule 2: Main clause - past tense. Sub clause - also past tense.

(అయితే దీనికి మినహాయింపులున్నాయి.)

***G. Anil Kumar Reddy, Hyderabad***

**Q.** Question - tags అంటే ఏమిటి?

**A.** తెలుగులో వాక్యం చివర 'కదా?' / కాదా? / అవునా? / లేదా అని అంటుంటాం. వీటినే English లో Question tags అంటారు.

He is good, isn't he? (అతడు మంచివాడు కదా?)

ఈ Sentence లో Isn't he? Question tag.

**Q.** is - వచ్చినప్పుడు verb, ing లోను, have వచ్చినప్పుడు ed లోనూ ఉండాలన్నారు. కొన్నింటిలో is - ed use చేశారు. వివరించగలరు.

**A.** English verb forms లో ఒకరూపం is + ing / am + ing/ are + ing ఇంకో రూపం, be form (am/ is/ are/ was/ were, etc) + ed (Past Participle)

Merit is praised - Verb: is + praised (Past Participle of praise - ed form) verb here is, is + ed form passive form (పొగడబడుతుంది)

verb మరో రూపం, Have/ has/ had/ shall have etc, + Past Participle.

They have/ He has worked here.

ఇక్కడ Verb: Have worked/ has worked. have/ has + ed.

**Q.** పెళ్లైన పురుషులు/ స్త్రీలు, పెళ్లికాని అబ్బాయి/అమ్మాయి, చిన్నపిల్లలను, aged persons, widows ను ఎలా పిలవాలి? Invitations cards మీద ఎలా రాయాలి? eg: Mr/ Mrs.

**A.** పెళ్లయినా కాకపోయినా మనకు సమాన వయసున్న, మన కంటే చిన్నవాళ్లను Mr/ Sri అనవచ్చు. పెద్ద వాళ్లయితే Sri అనాల్సిందే, తర్వాత 'గారు' చేర్చనవసరం లేదు. 'గారు' చేర్చేట్టయితే 'శ్రీ' అనవరం.

పెళ్లికాని ఆడవాళ్లను, Miss + Name తో సంబోధిస్తాం, లేకపోతే 'Miss' అనవచ్చు.

పెళ్లయిన ఆడవాళ్లయితే Mrs + name తో సంబోధిస్తాం. అయితే ఈరోజుల్లో పెళ్లయిన స్త్రీలను కూడా వాళ్లకు Mrs అన్నమాట ఇష్టం లేకపోతే Miss తో పిలుస్తున్నారు. వీళ్లకు Miss రాసేటప్పుడు మాత్రం Miss అని కాకుండా Ms అని రాస్తారు.

Aged persons మగవాళ్లయితే Sri + name/ garu అని,

Widows అయితే వారి వయసును బట్టి Mrs/ Ms అనిగానీ రాయవచ్చు.

**Q.** How to write an invitation card to a person, like companies 'MD, V.C, M.L.A'S, M.P' etc., designations. తెలుగులో పేరుకు ముందు 'శ్రీ', చివర్లో 'గారు' తో సంబోధిస్తాం. ఇంగ్లిష్‌లో ఎలా రాయాలో తెలుపగలరు.

**A.** MD, MLA, MP, VC etc., లాంటి వాళ్లకు, వ్యక్తిగతం (Personal)గా కాకుండా, వారి అధికారిక (Official) position ను (స్థానాన్ని) బట్టిరాస్తే Designation (హోదా)తోనే ప్రారంభిస్తాం ఇలా:

To (ఉన్నా, లేకపోయినా ఒకటే) (To తర్వాత కామా ఉండకూడదు)

The MD, Hon'ble VC, Hon'ble MLA, Hon'ble MP.

(Hon'ble – Short for Honourable) అని రాసి 'Sir' అని సంబోధిస్తాం.

## When is the train due here?

**Sandeep:** (Are you) preparing to go any where? (ఎక్కడికైనా వెళ్లడానికి తయారవుతున్నావా?)

**Prabhat:** Don't you see that I am packed? Didn't I tell you? My brother and I are leaving for Hyderabad in a few hours. (సామానంతా సర్దుకున్నా కనిపించడంలేదా? నేను నీకు చెప్పలేదా? మా అన్నా, నేను కొన్ని గంటల్లో హైదరాబాద్ బయల్దేరుతున్నాం.)

**Sandeep:** Oh, are you? you haven't told me of it at all. By bus or by train? (అవునా? ఇంతవరకూ నువ్వు నాతో చెప్పలేదు. Train లోనా bus లోనా?)

**Prabhat:** By train. The train arrives here at 9.10 and the time of departure is 9.20. It arrives in Hyderabad tomorrow morning by 5.15. (Train లోనే. అదిక్కడికి 9.10 గంటలకు వస్తుంది. 9.20కి బయల్దేరుతుంది. రేపు ఉదయం 5.15కు హైదరాబాద్ చేరుతుంది.)

**Sundeep:** Those may be scheduled times of arrival and departure I know. This train is always late, but it makes up and reaches Hyderabad on time. (చేరేందుకు, వదిలేందుకు, నియమిత వేళలు ఇవే కావచ్చు కానీ ఈ ట్రెయిన్ ఎప్పుడూ ఆలస్యమే. అయితే అది ఆలస్యాన్ని కవర్ చేసుకుని హైదరాబాద్‌కు సరైన సమయానికే చేరుకుంటుంది.)

**Prabhat:** Hope so. (అలానే అని ఆశిద్దాం.) Let me first catch the train. (ముందు బండి ఎక్కనీ.)

Look at the following expressions:

a) The train arrives/ departs

b) Catch a train/ bus

c) Leaves, reaches

d) Scheduled times of arrival/ departure

⊙ ప్రయాణానికి సంబంధించిన పదాలను ఇప్పుడు తెలుసుకుందాం.

Arrival = ఒకచోటికి చేరడం

Departure = ఒకచోటి నుంచి బయల్దేరడం

Arrive = reach

'Arrive' ఎక్కువగా trains/ planes/ buses విషయంలో వాడతాం.

### FUNCTIONAL ENGLISH

**Venkat:** When does the train arrive there? (ఆ train అక్కడికెప్పుడు చేరుతుంది.)

**Kranthi:** At 5.00 in the morning.

**Venkat:** (Is) anyone coming to receive you? (ఎవరన్నా నిన్ను తీసుకెళ్లేందుకు స్టేషన్‌కు వస్తున్నారా?)

**Kranthi:** Yes, my brother is. (అవును. మా అన్న వస్తున్నాడు.)

**Venkat:** When is the train due here? (ఇక్కడికి train ఎప్పుడొస్తుంది?)

**Kranthi:** Evening 5.

a) 'When is the train due here? = When is the train due to arrive here? = What is the scheduled arrival time here? = Train నిర్ణీత సమయం ప్రకారం ఇక్కడికి ఎప్పుడొస్తుంది?

b) The train is due in an hour and you are yet to pack = ఇంకో గంటలో train ఇక్కడికి వస్తోంది. ఇంకా నువ్వు ready అవలేదు.

To be due = రావలసి ఉండటం

My luggage is packed = నా సామాన్లు సర్దుకున్నాను = I'm (I am) packed.

Due అనేది వ్యక్తులకూ వాడతాం.

a) They are due in an hour = ఒక గంటలో వాళ్లిక్కడికి వచ్చేస్తున్నారు.

b) The programme is due to start in five minutes = కార్యక్రమం 5 నిమిషాల్లో ప్రారంభం కావాలి/ అవుతుంది.

Departure = బయలుదేరడం.

అయితే ఇది కాస్త formal. దీని బదులు leave = బయల్దేరడం, వాడటం conversational.

We travel by train/ by bus/ by plane = ఇలాంటి వాహనాల్లో ప్రయాణానికి 'by' అంటారు.

Train లో/ bus లో/ car లో = on the train / on the bus/ on the car ('in' కాదు). ప్రయాణాల్లో ఈ పదాలను వాడి మీ సంభాషణను ఆసక్తికరంగా మార్చుకోండి.

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish






# She recounted her experiences





M.SURESAN

***Suri Babu, Rajol***

Clarify the following doubts.

★ They went to a movie after they had had lunch.

★ They went to a movie after having lunch.

★ They went to a movie after lunch.

Which one of the above sentences is correct - and why?

**A.** All the three sentences are correct, with the same meaning, but with different structures. That's all. Grammatically all sentences are correct.

**Q.** But you wouldn't tell on me if I told you, would you?(please translate into Telugu.)

**A.** నీకే విషయం నేను చెబితే నా మీద చెప్పవు కదా? (నీకు నేను చెప్పానని చెప్పవు కదా? )

**Q.** ★ He got treatment.

★ He got treatment done.

Which one of the above two sentences is correct? and why? please explain.

**A.** The correct form of the sentence is...

He got the treatment = అతడు చికిత్స పొందాడు.

He got the treatment done = అతడు చికిత్స చేయించుకున్నాడు.

Both the sentences, with the corrections shown, are correct.

**Q.** Please let me Know the difference between Abstract noun and Material noun in telugu.

**A.** Abstract nouns = Names of things, we can only imagine - మనం కంటితో చూడలేని, చేత్తో ముట్టుకోలేని వస్తువుల పేర్లు.

e.g: Beauty (అందం) - 'అందం' అంటే ఇలాగే ఉంటుందని చెప్పలేం కదా. అది ఊహించుకోగలిగేది. (అందమైన మనుషులు, విషయాలు, వస్తువులను చూడగలం. కానీ 'అందం' అనే పదార్థం ఉండదు. అది మనం ఊహించుకునేదే). Courage, Kindness, Goodness etc. (గుణాల పేర్లు)

Material nouns are the names of things that are not counted as one, two, three etc. They are the names of things which we measure or weigh. మనం తూకంవేసే, కొలిచే వస్తువుల పేర్లు. Rice, Sugar, Iron, Steel, Gold, Milk, Oil etc., (వీటి ముందు a/ an రాదు)

**Q.** ★ Let him has the book.

★ Let him have the book.

Which one of the above two sentences is correct?

**A.** 'Let him have the book' is correct.

let him = allow him to (let him go = allow him to go = అతడిని వెళ్లనివ్వు.)

let him = allow him to; to తర్వాత ఎప్పుడూ present tense form లో, +s/ +es లేని, has రాని verbs వస్తాయి. అందుకని 'let him have' is correct.

**Q.** ★ Seeing the snake he went away.

★ He went away by seeing the snake.

Please let me know which one of the two sentences is correct and also please translate them into Telugu.

**A.** Seeing the snake he went away = పామును చూసి అతడు వెళ్లిపోయాడు = He went away, (on) seeing the snake.

He went away by seeing the snake - wrong. పామును చూడటం ద్వారా (by) అతడు వెళ్లిపోయాడు, అనం కదా?

**Q.** He can have been going there.

Can we use this form? please explain

**A.** He can have been going there is grammatically possible, but a bit confusing. అందుకని ఇలాంటి sentence వాడటం మంచిది కాదు.

***K. Sri Krishna Kumar, Bapatla***

**Q.** కింది phrases అర్థాలను తెలుగులో తెలపగలరు.

★ Not until this morning at any rate.

**A.** ఈ వాళ ఉదయం వరకూ లేదు/ కాదు.

I did not see him here, at least/ certainly not until this morning = అతడిని నేను ఇక్కడ చూడలేదు. కనీసం/ కచ్చితంగా ఈరోజు ఉదయం వరకూ. (తర్వాతేమన్నా వచ్చాడేమో!)

★ At any rate.

**A.** ఏదేమైనా. It will cost thousands, at any rate not less than a thousand. (అది కొన్ని వేల రూపాయల ఖరీదవుతుంది. ఏదేమైనా వేయి రూపాయలకు మాత్రం తక్కువ కాదు.)

★ Ofcourse not.

**A.** కానేకాదు.

'Are you a supporter of Congress?' 'ofcourse not.'

★ In six months at the latest.

**A.** మహా ఆలస్యమైతే/ బాగా ఆలస్యమైతే?

'How long will you take to complete the building? (ఈ నిర్మాణం పూర్తిచేయడానికి ఎంతకాలం తీసుకుంటావు? )

(In) Six months at the latest.

(ఆరు నెలలు దాటకుండా/ మహా అయితే ఆరు నెలలు.)

★ Lay lost in thought.

**A.** ఏదో ఆలోచిస్తూ/ పరధ్యానంగా పడుకున్నాడు/ పడుకుంది.

★ Over and over

**A.** Over and over - ఇది ఎక్కువగా over and over again గా వాడతారు.

again and again = మళ్లీ మళ్లీ.

Don't say it over and over again = ఆ విషయాన్ని మళ్లీ మళ్లీ చెప్పకు.

★ కింది పదాలకు తెలుగులో అర్థాలు తెలపగలరు.

Apparel, attire, outfit, dress, garb, garment, clothes.

**A.** Apparel = attire = outfit = garb = garment = clothes.

అన్నింటికీ 'దుస్తులు' అనేదే అర్థమైనా, వాటిని వాడే సందర్భాలను బట్టి, అర్థాల్లో చిన్నచిన్న తేడాలున్నాయి.

Apparel = Clothes sold in shops/ దుకాణాల్లో అమ్మే దుస్తులు. దీనికి Plural ఉండదు. అయితే మనం ధరించే దుస్తులను 'Apparel' అనడం ఇప్పుడు వాడుకలో లేదు, పైగా ఇది పాండిత్యం కూడా.

Attire = దీని అర్థం కూడా దుస్తులనే. ఇదీ పాండిత్యమే. మామూలుగా మనం తొడుక్కునే దుస్తులకిది వాడం.

Outfit = ప్రత్యేక సందర్భాలకు, దేహంపై భాగం (Tops), దేహం కింది భాగానికి - నడుం నుంచి పాదాల వరకు (bottoms) - ప్రత్యేకమైన Combinations తో ఉండేవి. A Soldiers out fit, (సైనికుల దుస్తులు), Workers out fit, uniform లాంటి ప్రత్యేకమైన బట్టలు.

Garb = (గ్రాంథికం, ఎగతాళిగా వాడేమాట)

(ఆ ముసుగులో - In the garb of a Policeman = పోలీసు దుస్తుల ముసుగులో - అంటే మోసం చేయాలనే ఉద్దేశంతో వాళ్ల దుస్తులు వేసుకోవడం.) ప్రత్యేకమైన దుస్తులు - The Prisoner's garb.

Garment = ఇదీ bookish (పాండిత్యం). వస్త్రం - మనం సంభాషణలో బట్టలు (clothes) అంటాం, కానీ వస్త్రాలు అనం కదా?

Clothes - ఇదీ మనం వాడాల్సిన మాట - మామూలుగా 'బట్టలు' అనే అర్థంతో, ఏ సందర్భానికైనా, ఎప్పుడైనా.

Dress = బట్టలే, అయితే ఆడవాళ్లు వేసుకునే బట్టలు, అదీ మోకాళ్ల కింది వరకూ వచ్చే Gowns - లాంటివి. (మగవాళ్ల బట్టలను సాధారణంగా Dress అనం)

Costume = నాటకాలు, సినిమాలు, Stage shows లో వాడే బట్టలు.

★ Recount

**A.** recount = ఏదైనా వ్యవహారాన్నీ/ సంఘటనను/ అనుభవాలను వివరించడం.

She recounted (explained) her experiences of her journey into Space = ఆమె అంతరిక్ష ప్రయాణ అనుభవాలను వివరించింది.

★ Afford – i) Afford = ఖర్చుపెట్టగల స్థితి.

She can not afford such a dress = అలాంటి dress ను ఆమె కొనగలిగిన స్థితిలో లేదు.

అయితే 'afford' ను ఎక్కువగా 'not'తో గానీ (కొనగలిగిన స్థితిలో లేదు అనే అర్థంతో) Question లో గానీ వాడతాం.

Can he afford such a car? = అలాంటి Car కొనగలిగే స్తోమత అతడికి ఉందా?

ii) Afford = (ఏదైనా) చేయగల స్థితి. అయితే దీన్నెప్పుడూ not తో/ Question తోనే వాడతాం.

a) At this stage, he can not afford to neglect his health = ఈ దశలో అతడు తన ఆరోగ్యాన్ని ఉపేక్షించే స్థితిలో లేడు.

b) We can not afford any more waste of time = ఇక సమయం ఏమీ వృథా చేయలేని స్థితిలో ఉన్నాం.

## Will you explain this, please?

**Ekambar:** Mind passing that book here?
(ఆ పుస్తకాన్ని కాస్త ఇలా అందిస్తారా? )

**Dinakar:** Oh, not all. Here you are.
(తప్పకుండా. ఇదిగోండి.)

**Ekambar:** I have a little difficulty understanding this part of the lesson. Will you explain it, please?
(పాఠంలోని ఈ భాగం నాకు అర్థం కావట్లేదు. కాస్త వివరిస్తారా? )

**Dinakar:** That'd (That would) be a pleasure. Don't worry. Let me have a look at it first.
(సంతోషంగా. ముందుగా నన్ను దాన్ని చూడనివ్వు.)



English లో manners కు చాలా ప్రాధాన్యం ఉంది. Please, Thank you లాంటివి మనకు అక్కడి నుంచి వచ్చినవే కదా.

- ఇప్పుడు కొన్ని Polite expressions తెలుసుకుందాం.

Look at the following expressions from the conversation above:

1) Mind passing the book to me?

2) Will you explain this, please?

- Mind ....?/ Would you mind ....? - వీటిని మన కంటే పెద్దవాళ్లనూ, అంతగా పరిచయం లేనివాళ్లనూ, మనకంటే ఉన్నత స్థితిలో ఉన్నవాళ్లనూ అభ్యర్థించడానికి (request చేయడానికి), permission కు వాడతాం. ఇది చాలా formal.

a) Would you mind/ Mind explaining it once again? = మరోసారి ఈ విషయం వివరిస్తారా? (Request - very formal and polite)

b) Would you mind/ mind helping me with the

**FUNCTIONAL ENGLISH**

luggage?
(ఈ సామాను విషయంలో కాస్త సహాయపడతారా? )




c) Would you mind/ mind dropping me home? మీ వాహనంలో నన్ను మా ఇంట్లో దింపుతారా? (Very polite request.)

ఇలాంటి requests కు స్పందన:

Oh, not at all/ certainly not. (అదేంలేదు. నిరభ్యంతరంగా)/ That'd be a pleasure (సంతోషంగా).




- Mind/ would you mind ....? (Question form), చాలా మర్యాదగా permission కు వాడతాం.

a) Would you mind/ mind my using your phone?
(నేను మీ ఫోన్ వాడటం మీకేమన్నా అభ్యంతరమా? )

- ఎవరైనా (permission) కోరినప్పుడు మనమిచ్చే Response:

Oh, not at all, please go ahead/ suit yourself/ please do. (Go ahead = కానివ్వండి) suit your self = మీ ఇష్టం.

b) Would you mind/ mind if I go with you?
(మీతో నేనూ రావచ్చా? మీకేమన్నా అభ్యంతరమా? ) (Permission)

దీనికి response:

Oh, not at all/ certainly not/ you are welcome.



# I have seen him just now



*Vishal Patekar, Miryalguda*

**Q.** Please clarify the following doubts.

✪ Does the verb 'Have/ has' have the meaning of swallow too. For example:

He swallowed two tablets.

(Have/ has కి మింగడం అనే అర్థం కూడా ఉందా? )

**A.** Have/ has = eat/ drink/ smoke - ఈ మూడు అర్థాలు మాత్రమే have/ has కు ఉన్నాయి. Swallow (మింగడం) అనే అర్థం లేదు. మింగడం అనేది అంత తరచుగా వాడం, ఏదైనా చెడు ఫలితాలు జరిగాయని చెప్పేందుకు తప్ప. మాత్రలు వేసుకోవడం/ తీసుకోవడం లాంటి వాటికి - Take tablets/ pills/ medicine అని అంటాం.

✪ During the last few years...

I have seen the above sentence in a news paper. There should have been written for the past/ for/ for the last a few years - Please explain.

**A.** During the past few years = గత కొద్ది సంవత్సరాల్లో - ఇది కరెక్ట్.

During the past few years I have seen just two movies = గత కొన్నేళ్లల్లో నేను రెండు సినిమాలే చూశాను.

For the past/ last few years = గత రెండు సంవత్సరాలుగా - ఈ అర్థంతో ఇదీ కరెక్టే.

For the past/ last few years we have been together in this room = గత కొన్నేళ్లుగా మేము ఈ గదిలో కలిసి ఉంటున్నాం.

During the past few years అంటే... గత కొన్నేళ్లలో విరామం లేకుండా (continuous) అని కాకుండా, గత కొన్నేళ్లకాలంలో అప్పుడప్పుడూ అని అర్థం.

For the past/ the last few years = గత కొన్నేళ్లుగా విరామం లేకుండా (continuous గా) అని.

వేర్వేరు అర్థాలతో During the past/ last few years, for the past/ last few years రెండూ కరెక్టే.

✪ Say పక్కన about or of వాడొచ్చా?

e.g: This Tense says the action/ about/ of the action that was completed at a certain time in the past.

**A.** Say తర్వాత 'about' రాదు. Tell తర్వాత వస్తుంది. అయితే 'Tell' తర్వాత ఎవరితో చెప్పిందీ వచ్చి, ఆ తర్వాత 'about' వస్తుంది.

He said to me about it/ He said about it - wrong.

He told me/ him/ her/ them/ you/ Mr.X about it - correct.

✪ How can identify Prepositions or Nouns in sentences.

**A.** Nouns = Names of persons, places, things, animals, qualities, etc., - A noun is always the subject of a sentence/ object of a verb or of a preposition etc.





M.SURESAN

A preposition is usually a word like in, from, to, at, out of, etc., used before a noun to indicate place, position, time, or method.

a) Let us go there after class (Time).

b) She is in the College (place).

c) They climbed up the tree (position).

d) The packet arrived by post (method).

ఏ మాటనైనా మనం sentence కు subject గా/ verb/ preposition కు object గా వాడితే అది NOUN.

*V.N.B.K. Mohana Rao, Eluru.*

**Q.** మీరు గత సంచికల్లో ఇచ్చిన Functional Englishలో ఒక చోట Where do you live అనే ప్రశ్నకు I (live) in Jeedimetla అని ఇచ్చారు. Live = జీవించడం, కాబట్టి Reside in Jeedimetla అనడం appropriate గా ఉంటుంది కదా? వివరించగలరు.

**A.** Live = బతకడం/ జీవించడం అనే కాకుండా నివసించడం/ నివాసం ఉండటం అనే అర్థం కూడా ఉంది. 'Reside' also means 'live' but 'reside' is formal (కాస్త పాండిత్యం). Please refer to Oxford Advanced Learner's Dictionary for further clarification. Live doesn't mean merely 'exist' but also 'reside' in a place - 'reside' is formal and not conversational.

*Umadevi Agarwal, Warangal*

**Q.** Please clarify the following doubts.

✪ 'Having' కలిగి ఉండటం (possession) అనే అర్థంతో వాడవచ్చా

e.g. The house must be a fecilitate one of having a well and varanda.

**A.** Having = కలిగి ఉండటం అనే అర్థంతో వాడవచ్చు

a) Having a car makes life comfortable = కారు కలిగి ఉండటం జీవితాన్ని సుఖవంతం చేస్తుంది.

b) Having a house of your own is always good - నీకంటూ ఓ ఇల్లు ఉండటం మంచిది.

Am/ is/ are having కు తినడం, తాగడం అనే అర్థం కూడా వస్తుంది.

1. I am having a car.
2. He/ she/ it is having a car.
3. We/ you/ they are having a car.

ఈ మూడు వాక్యాలూ తప్పే.

**Q.** Varanda/ ground - అనే పదాలు వచ్చినపుడు వాటి పక్కన on వాడాలా? in వాడాలా?

eg. He is in/ on varanda/ ground.

**A.** Varanda - English మాటకాదు; దీన్ని standard Englishలో వాడరు. దీన్ని corridor అంటారు. Along the corridor అంటారు.

Ground ముందెప్పుడూ on వస్తుంది.

He is on the ground/ on the play ground.

✪ Please translate the following into English.

నేను ఇప్పుడు Train/ Bus/ Car/ Auto లో ఉన్నాను.

**A.** I am on the train/ on the bus/ in the car/ on the auto. (ఇక్కడంతా on/ in పక్కన a/ an/ the ముఖ్యం). ఇలా ఎందుకు రావాలి అంటే ఇది English usage (వాడుక).

✪ Please say whether the following sentence is correct or not.

It will be good if they are taught by you instead of by me/ I.

**A.** It will be good if they are taught by you instead of by me - The sentence is correct.

*Suman Saxena, Mahaboobabad.*

**Q.** He get to keep అంటే ఉంచుకోగలగడం, He can keep = He is able to keep కరక్టేనా?

**A.** He get కాదు, He gets to keep = ఉంచుకోగలుగుతాడు/ ఉంచుకునే పరిస్థితిలో ఉంటాడు.

If he answers five more questions correctly he gets to keep the cup = ఇంకో అయిదు ప్రశ్నలకు సరిగా సమాధానాలిస్తే cup అతడు ఉంచుకోగలుగుతాడు = He can keep = He is/ will be able to keep.

✪ బట్టలు ఉతకడం పూర్తయిన తర్వాత మనం విదిలిస్తాం - దీన్ని English లో ఏమంటారు?

**A.** Shake out the shirt/ pants/ towel, etc., dry.

Shake out the shirt dry after washing it = ఉతికిన తర్వాత shirt ను విదిలించు.

✪ నా చేయి వాచింది - Please translate into English.

**A.** My hand is swollen (swell = వాయడం) (swelling = వాపు)

✪ If I want to learn simple, compound and complex sentences, 'Living English Structure' by stannard Allen suggested by you is useful?

**A.** 'Living English Structure' by stannard Allen will do.

*T. Lakshmaiah, Warangal*

**Q.** కింది వాక్యాలు సరైనవేనా తెలుపగలరు.

✪ I saw him just now.

**A.** I saw him just now - American English.

I have seen him just now - British English.

✪ By walking and begging rides I reached Richmond.

**A.** Correct. By walk - wrong, as in the sentence. He came by walk. (use on foot instead of 'by walk')

✪ Admission open.

**A.** Admissions are on/ in progress. ('open' is wrong here)

✪ Our school have a vast play ground.

**A.** Our school has a vast play ground - is correct.

✪ Does he have any hobbies?

**A.** Does he have any hobbies? = Has he any hobbies?

# Buy all means

**Balaram:** Can you do me a favour?
(నాకోసాయం చేస్తావా? )

**Krishna:** Oh, sure. How can I help you?
(తప్పకుండా, నీకు నేనేం సాయం చేయగలను? )

**Balaram:** I want some details about your cousin in the states - his address, his phone number and an introduction to him over phone.
(USలో ఉన్న మీ cousin వివరాలు కావాలి. అతడి address, phone number, అలాగే ఫోన్ ద్వారా పరిచయం కావాలి.)

**Krishna:** Is that all? No problem at all. But I don't have the details on me. Just wait till I get home. I'll call you and let you know.
(అంతేనా? ఏం ఫరవాలేదు. అయితే ఆ వివరాలు ఇప్పుడు నా దగ్గర లేవు. ఇంటికెళ్లేదాకా ఆగు. Phone లో చెబుతా.)



**Balaram:** Thanks a lot.

**Krishna:** Oh. not at all.

○ Formal గా (అంటే మనం చనువు తీసుకోలేని వారితో) Permission (అనుమతి) పొందడానికి, అభ్యర్థించడానికీ (request) mind? would you mind వాడతాం అని ఇంతకుముందు తెలుసుకున్నాం కదా.

ఇప్పుడు informal (మనకు బాగా పరిచయమున్నవాళ్ల) Permissions తీసుకునేందుకూ, request (అభ్యర్థన) చేసేందుకు వాడే పదాలు తెలుసుకుందాం.

'Can' with I and we is used for seeking permission informally.

**Surendra:** Can I use your bike for a day?
(నీ bike ఓ రోజంతా వాడుకోనా? )

- permission - informal (మనకు బాగా పరిచయస్థుల/ కుటుంబ సభ్యుల/ స్నేహితుల అనుమతి)

**Nagaraj:** Wait. Let me see how busy I am today? um... No, not so busy. Yes, you can have it.
(ఉండు. కాస్త ఆలోచించుకోని, నాకేమున్నా పనుందేమో. ఊ... లేదులే. తీసుకో.)

**FUNCTIONAL ENGLISH**

**Ramesh:** How about lending me your bike for an hour or two?
(ఓ గంటో, రెండు గంటలో నీ bike నాకిచ్చే వీలుందా? / ఇవ్వగలవా? / ఇస్తావా? )

**Tarun:** By all means. Have it. Here's the key. But it is short of oil.
(తప్పకుండా. తీసుకో. ఇదిగో తాళం చెవి. కానీ oil తక్కువగా ఉంది.)

**Ramesh:** I'll take care of it. Thank you.
(అది నేను చూసుకుంటాలే. Thank you.)

**Tarun:** It's all right.




○ How about...? అలాగే What about...? వాడకం చూడండి. ఇది కూడా మనం బాగా పరిచయం ఉన్నవాళ్ల, మన కుటుంబ సభ్యులు, మనం స్వతంత్రంగా వ్యవహరించగలవాళ్లను request (Informal request) చేసే విధానం.

'How about something to eat? Have you any?' - తినేందుకేమన్నా ఉందా?

ఈ పదాలను practice చేసి, మీ Englishను మరింత సహజంగా ఉండేలా చేసుకోండి.

○ అలాగే నిరభ్యంతరంగా/ తప్పకుండా/ దానికేముంది/ తీసుకోండి - అని భరోసాగా అనేందుకు వాడే మాట - Buy all means. (తప్పకుండా/ నిరభ్యంతరంగా)

'Will you recommend my case to the Minister?
(నా విషయం మంత్రికి recommend చేస్తావా? )

'Oh, by all means. Don't worry' (తప్పకుండా. దాని గురించేం దిగులుపడకు.)

Spoken English పాత వ్యాసాలకోసం క్లిక్ చేయండి.. URL: http://www.eenadu.net/chaduvu/chaduvuinner.asp?qry=spokenenglish




# It will be Good to Stop Smoking!



***Adisankaracharyulu, Bhimaaram***

**Q.** While India would make the Orbiter and Rover, Russia would contribute the Lander - Explain the meaning of the above underlined word as well as translate into Telugu.

**A.** Here meaning of 'while' = at the same time as (అప్పుడు)

భారత్ Orbiter and Rover (Satellites పేర్లు) చేస్తే, (అదే సమయంలో) రష్యా, Lander ను అందించింది.

**Q.** He gave me the pen and the book/ as well as the book/ the book as well - Which one is correct?

**A.** All are correct.

**Q.** The accused who was sentenced to two years' imprisonment. - Is it necessary to use apostrophe here?

**A.** .... two years' imprisonment - Correct. The apostrophe is necessary (You may write also "a two-year imprisonment").

**Q.** He is appaled at the suggestion - Explain the meaning of underlined word.

**A.** Appaled = Very shocked (దిగ్భ్రమ చెందడం)

**Q.** "Post-lunch press conference" - Explain meaning in Telugu.

**A.** మధ్యాహ్న భోజనం తర్వాత పత్రికా విలేకర్ల సమావేశం.

Post (తర్వాత) × Pre (ముందర)

**Q.** "Persuade someone of the merits of" - Explain the meaning in Telugu.

**A.** Persuade (నచ్చజెప్పు) some one (ఎవరికైనా) of its merits (దాని మంచి గురించి)

Persuade some one of the merits (మేళ్లను/ మంచిని) of something = దేని మంచి గురించైనా నచ్చజెప్పు.

***Anthati Penchalaiah, Rajampet.***

**Q.** All of the sights of the hill and the plain fly as thick as driving rain - దీని అర్థం వివరించి, ఇక్కడ as thick as అనే Adjective ను ఎందుకు ఉపయోగించారో తెలియజేయండి.

**A.** Train లో వెళుతుంటే కొండలూ, నేల, జోరుగా కురిసే వర్షం అంత వేగంతో పరుగెత్తుతుంటాయి (Rush).

As thick as = అంత జోరుగా.

***Sneha Pallavi, Mulugu***

**Q.** In one of the previous lessons (No. 191) you have written the following sentence: "Promod told Vinod that Vinod's college and home was far off to get any information" - Here "to get any piece of information" should be written. Explain.





M. SURESAN

**A.** You can say 'information' or 'a piece of information, what you should not say is: an information.

**Q.** Don't show your answers to others even if you are offered with/ by/ to a chocolate or biscuits - Which usage is correct?

**A.** ... even if you are offered a chocolate/ biscuit - correct. (Offer is not followed by with, by or to)

**Q.** She prepared so delicious food that every one should praise her - Is this correct.

**A. The correct sentence:** She prepared such delicious food that every one praised her (A single past event of the past - మెచ్చుకున్నారు)

Would praise her: A regular past action = A regular past event = మెచ్చుకునేవాళ్లు.

***A. Ramanaiah, Rajampet***

**Q.** i) To err is human, To forgive is divine

ii) I went to forest to live in

iii) She is too young to join the college.

Above underlined words are considered as phrases - What type of parts of speech are they belong to?

**A.** A phrase is a group of words without a verb.

**e.g.:** In the evening, walking down the road, a number of boys etc.

To go, to sing, to walk - these are, to + base form of the verb/ to+V1/ to+1st Doing Word - such word combinations are called infinitives. Infinitives are not verbs. Since they are groups of words without a verb, they are phrases.

In to err is human, to forgive is divine - 'To err' and 'to forgive' are both infinitives. In the sentence, 'to err is human...', 'To err', and 'to forgive' are both infinitives used as nouns. In 'To err', and 'to forgive', 'err' and 'forgive' cannot be separated from 'to', without 'to' they are not any part of speech. Same is the case with 'to live', and 'to join'.

**Q.** In intermediate Jr. English Text book "a fly and A spider" is a poem by Don Marquie. It has not been punctuated, reason is not known. As an English teacher, If any student rise this doubt? How do I answer?

**A.** A poet has the freedom to write in any way they like, if they can convey proper meaning. They write in such special ways for producing the effect they want.

**Q.** Toward, towards differentiate them with contextual usage.

**A.** Towards (British) = Toward (American)

**Q.** Suggestion, advice - Give some examples.

**A.** Suggestion is just giving a hint, and not so strong as advice.

(Advice = సలహా, Suggestion = సూచన)

a) "Stop smoking. It is bad for health" - Advice

b) "Try to stop smoking." / "It will be good to stop smoking." } **Suggestion**

**Q.** Is it right to mark with "?" at the end of polite suggestion?

**e.g.:** Shall we go temple?

**A.** At the end of a suggestion, there should be a question mark.

Shall we go the temple? - Correct

# Can I use your phone?

**Gokul:** How much will be the cost of the flat you're building?

(మీరు కడుతున్న ఫ్లాట్ ఒక్కోదాని ఖరీదు ఎంత? )

**Badri:** No idea as yet. It will take some time for me before I can give a rough idea. We're in the initial stages of the building you know. (ఇంకా కచ్చితంగా ఒక అవగాహన లేదు. ఉజ్జాయింపుగా చెప్పడానికి కాస్త టైమ్ పడుతుంది. ప్రారంభ దశలోనే ఉన్నాం కదా!)

**Gokul:** Can I see the plan? Can I have your calculator too, please? (ప్లాన్ చూడవచ్చా అదేవిధంగా కాస్త మీ క్యాలిక్యులేటర్ కూడా ఇస్తారా?)

**Badri:** Oh, certainly. Here you are. In the mean time can I have your card, so I may have your phone number? (తప్పకుండా. ఇదిగోండి మీ విజిటింగ్ కార్డ్ ఇస్తారా, మీ ఫోన్ నెంబర్ తెలుసుకోవడానికి.)

**Gokul:** By all means. Here's the card. According to my calculations the cost of each flat can be around Rs. 60 Lakh. (తప్పకుండా, ఇదిగోండి నా కార్డ్. నా లెక్క ప్రకారం, ఫ్లాట్ ఒక్కోటీ రూ.60 లక్షల దాకా ఉండొచ్చు)

**Badri:** Yea, that's for the present. It can go up depending on the availability and changes in the prices of cement and sand. (అవును. అయితే అది ప్రస్తుత రేట్ల ప్రకారం. అయితే సిమెంట్, ఇసుక దొరికే విధానం, వాటి ధరల మార్పును బట్టి కూడా ఉండొచ్చు)

**Gokul:** Depends on the kind of interiors you wish to have too, doesn't it? (లోపల మీరు కోరుకునే అలమార్ల లాంటి వాటిని బట్టి కూడా ఉంటుంది కదా.)

**Badri:** It does, of course. Can I have an idea when you can pay the advance for the booking? (అవును. మీరు బుక్ చేసుకోవడానికి అడ్వాన్స్ ఎప్పుడు చెల్లిస్తారో చెబుతారా? )

**Gokul:** Not more than a week. Bye then.

(ఒక వారం దాటకుండా. వస్తామరి.)

***Look at the following expressions..***

1) It will take some time before I can give a rough idea

2) Can I see the plan?

3) Can I have your card?

4) .... the cost of each flat can be around Rs. 60 lakh

5) If can go up

6) Can I have an idea when you can pay the advance




We have seen some uses of 'can' in the last lesson:

**1) It expresses a person's ability**

వ్యక్తి సామర్థ్యాన్ని తెలుపుతుంది.

**2) It expresses what is possible**

ఏది సాధ్యమవుతుంది అనే విషయాన్ని తెలుపుతుంది. అంతే కాకుండా ముందు lessonలో can కు pastform గా వాడే could ఉపయోగాన్ని చూశాం. ఇప్పుడు can కి ఉన్న మరికొన్ని ఉపయోగాలు చూద్దాం:

**1) Can I see the plan?**

'Can' here is used in the question form. ఇలా ప్రశ్నల్లో can ను మనం అనుమతి (permission) అడగడానికి వాడతాం.

**a) Subba Rao:** Can I use your phone (Please)? (మీ ఫోన్ వాడొచ్చా)

**Kishore:** Please do (వాడండి)

**b) Deepika:** Can I attend the celebrations too? If so how can I have a ticket? (ఆ సంబరాలకు నేనూ రావచ్చా? / రానా? వస్తే టిక్కెట్ పొందడం ఎలా?) - **Permission.**

**Darsika:** I'm afraid you can't (cannot). They are only for a small circle of friends (నువ్వు రాకూడదనుకుంటా ఈ సంబరాలు చిన్న మిత్ర బృందానికి మాత్రమే.) - **No permission.** చూశాం కదా!-



Can ను ఇలా permission కు ఉపయోగిస్తాం.

**Question form లో:**

3) Can I have your calculator too, please?

(మీ క్యాలిక్యులేటర్‌ను ఓసారి ఇస్తారా? )

ఇక్కడ, can, question లో Request ను (అభ్యర్థనను) (permission కాకుండా) తెలుపుతుంది.

అలాగే Can I have your card?

(మీ visiting card ఇస్తారా? )

**a) Nataraj:** Can you lend me your book for a few days?

(can, question లో - మీ పుస్తకం నాకు కొద్దిరోజులపాటు ఇస్తారా? - అభ్యర్థన - **Request.)**

**Niranjan:** Oh, by all means . But can you return it the day after tomorrow?

(నిరభ్యంతరంగా. కానీ మీరు దాన్ని నాకు ఎల్లుండి తిరిగివ్వగలరా? - 'can' in question - for a request)

**b) Mahima:** Can't you help me finish my record? (Record పూర్తి చేయడంలో సాయపడవా? - 'can't' (can not) in the question form for request)

**Sahithi:** Oh sure, if only you can help me do this sum. (తప్పకుండా. కానీ ఈ లెక్క విషయంలో సాయం చేస్తేనే.)

Can కి ఉన్న ఉపయోగాల్లో ఇప్పటివరకూ మనం చూసినవి: 1) ability (సామర్థ్యం - 'గల' అనే అర్థంతో) 2) Question form లో a) Permission b) Request. ఇప్పుడు 'can' కు ఉన్న మరో ఉపయోగం - possibility = ఏదైనా జరగవచ్చు అనే అర్థంతో:

The cost of each flat can be Rs.60 lakh.

ప్రతి ఫ్లాట్ ధర రూ.60 లక్షలు **ఉండవచ్చేమో** (Possibility - సాధ్యత.)

**a) Rahamatulla:** Can't we walk the distance? We have to wait along time for the bus and the auto may cost us a lot. (ఆ దూరం మనం నడవలేమా? Bus కోసం చాలాసేపు చూడాలి. Auto కు ఎక్కువ ఖర్చు కావచ్చు)

**Nazeer:** It can be very tiring - walking such a distance (అంత దూరం నడవడం వల్ల మనం చాలా అలసిపోవచ్చు)

It can be tiring - అలసట కల్గించవచ్చు possibility.

**b) Kamalakanth:** Suppose we discuss the matter with Sreedhar (ఈ విషయం శ్రీధర్‌తో చర్చిస్తే.)

**Tanmai:** Don't breathe a word about it to him. That can be dangerous. (ఈ విషయం అతడితో పొరపాటున కూడా అనవద్దు. చాలా ప్రమాదం అవ్వొచ్చు. (Possibility)

ఇవీ can కి ఉన్న ఇతర ఉపయోగాలు. మరికొన్ని వచ్చేసారి.




**యూనియన్ బ్యాంకులో 1636 ఖాళీలు**

యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా 1636 సింగిల్ విండో ఆపరేటర్- ఎ/ క్లర్క్ పోస్టుల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది. వీటిలో ఆంధ్రప్రదేశ్‌కు 112 పోస్టులు కేటాయించారు.

**అర్హత:** ఏదైనా డిగ్రీ. వయసు 20 నుంచి 28 మధ్య.

**ఎంపిక:** ఐబీపీఎస్ సీడబ్ల్యూఈలో కనీసం 173 మార్కులు సాధించినవారికి ఇంటర్వ్యూ నిర్వహిస్తారు.

**ఆన్‌లైన్ రిజిస్ట్రేషన్: జూన్ 19 నుంచి జులై 3**

**వెబ్‌సైట్:** www.unionbankofindia.co.in

Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... www.eenadupratibha.net



# I like to think I'm broad minded!



***B. Raghu, Hyderabad***

**Q.** "A shooter is a person who shoots a gun" - Explain the meaning.

**A.** A shooter is a person who shoots a gun - ఇది సరికాదు. 'A shooter is a person who shoots with a gun' - Right = తుపాకీతో కాల్చేవాడే షూటర్.

***Ashok Singhal, Warangal***

**Q.** The Bofors issue rocked "Parliament" - I have seen this sentence in a newspaper. Here the definite article "The" is not written before the word "Parliament". - **Explain.**

**A.** The Parliament is correct, but in journalism (Newspaper language) a/an and the are sometimes omitted.

**Q.** This is the answer of the question/ to the question - Which one is correct?

**A.** This is the answer <u>to</u> the question - Correct.

**Q.** I will answer to the/ of the question - Which one is correct?

**A.** I will answer the question - Correct.

**Q.** "Miss. Valarmathi was cordoned off by a media totally sold on celebrating her rise from her humble Aryahur origins, to head me of ISRO'S a flagship satellite launches" - Explain the meaning in Telugu.

**A.** వలర్మతిని చుట్టు ముట్టిన మీడియా, ఆమె నిరాడంబర ఆర్యహూరే మూలాల నుంచి ఇస్రోలో అతి ముఖ్యమైన/ గొప్పదైన ఉపగ్రహ ప్రయోగం వరకూ ఎదిగిన తీరును ప్రశంసించడమే పనిగా పెట్టుకుంది.

***P. Abhishek raj, Kothapalli, KMR***

**Q.** There, over there, right there. వీటి మధ్య తేడా ఏమిటి?

**A.** There = Over there = అక్కడ, ఆ Right there = కచ్చితంగా అక్కడే.

**Q.** "For time being" - అర్థం ఏమిటి?

**A.** For the time being = for the present = ప్రస్తుతానికి.
For the time being I am not going anywhere = ప్రస్తుతానికి నేనెక్కడికీ వెళ్లడం లేదు.

**Q.** 'నేను US లో ఆరు నెలలు ఉన్నాను'. అని తెలపడానికి కిందివాటిలో ఏది సరైంది?
i) I was in US for 6 months
ii) I have been to US for 6 months.

**A.** i) I was in the US for six months = నేను గతంలో US లో ఆరు నెలలు ఉన్నాను.
ii) I have been to the US for six months - WRONG - No meaning.





M. SURESAN

I have been <u>in</u> the US for six months = గత ఆరు నెలలుగా నేను US లో ఉన్నాను. (నేను US లో **ఆరు నెలల కిందటి నుంచి ఇప్పటివరకూ** ఉన్నాను.)

I have been to the US = నేను US కు వెళ్లి వచ్చాను.

**Q.** నేను ప్రస్తుతం హైదరాబాద్‌లో ఉన్నానని తెలపడానికి I am in HYD అనాలా? I am at HYD అనాలా? వివరించండి.

**A.** I am in Hyderabad - Correct. ('In' is used before big and important places. 'At' is used before small places - At Mangalagiri, at Kesireddypalli etc.) ***M.K.Rao, Visakhapatnam***

**Q. Explain the meaning in Telugu.**

❖ I <u>like to</u> think I'm broad-minded

**A.** నేను విశాల హృదయం కలవాడినని అనుకోవడం నాకిష్టం/ నేను ఇష్టపడతాను.

❖ I <u>can only think/ suppose/ assume</u> (That) it was a mistake.

**A.** I can only think = I can only suppose = I can only assume that it was a mistake = నేను అది పొరపాటనే (తెలిసి చేసింది కాదు) అనుకుంటున్నాను.
Assume = 1) Think
2) To believe something.

❖ I "only think" that she is good.

**A.** నేను ఆమె మంచిదనే అనుకుంటున్నా.

❖ I 'think' that she is good.

**A.** ఆమె మంచిదని నేననుకుంటున్నా.

**Q. Translate into English.**

✪ ఇంకా చాలామంది ఈ Course లో join అవుతారని ఆశిస్తున్నాం.

**A.** We hope that many more will join the course.

✪ ఎక్కువ మంది ఈ Course లో Join కావాలని కోరుకుంటున్నాం.

**A.** We wish that a <u>good number</u> will join this course.

**Q.** The past continuous tense can be used instead of the simple past for a definite action when we wish to simply that the action in question is not common. "I was talking to the P.M. the other day I was buying some diamonds yesterday" implies that it if not unusual for the speaker to talk to the P.M. and to buy diamonds respectively. - ఈ వాక్యాన్ని తెలుగులోకి అనువదించి, Definite action ఏవిధంగా ఉందో వివరించండి. ఇక్కడ Simple past tense ను ఎందుకు use చేయకూడదో తెలపండి.

**A.** అంత అసాధారణం కాని, కచ్చితమైన పనిని తెలిపడానికి Past simple కు బదులుగా Past continuous వాడవచ్చు
మొన్న ఒకరోజు, నేను PM తో మాట్లాడుతూ ఉన్నా. నిన్న నేను కొన్ని వజ్రాలు కొంటున్నా - ఇవి అసాధారణ పనులు కాకుండా సాధారణంగా జరిగేవే.
PM తో మాట్లాడటం/ వజ్రాలు కొనడం - కచ్చితమైన (definite actions) పనులే కదా!
I <u>spoke</u> to him about it yesterday (spoke - simple past) = దాని గురించి నిన్న నేను అతడితో మాట్లాడాను. - A definite action at a point of time in the past (yesterday)
I <u>was speaking</u> to him about it yesterday (was speaking - past continuous) = దాని గురించి నేను నిన్న అతడితో **మాట్లాడుతూ ఉన్నాను.** action continuing at a definite point of time in the past - yesterday when some other action also was going on.
While he <u>was playing</u> she was <u>studying</u> - అతడు ఆడుతున్నప్పుడు, ఆమె చదువుకుంటోంది.

***Sitaramachari, Mangalagiri***

**Q.** "I am not have any other work" - This means "I don't have any other work" or "I have no other work" - Clarify.

**A.** I am not have any other work - Wrong.
I don't have any other work = I have no other work - Correct.

**Q.** "If the students are taking the exams" - Is this correct?

**A.** Not correct as a sentence, because it is not complete.
If the students are taking the exams = వాళ్లు పరీక్షలు రాస్తుంటే/ రాస్తే - meaning not complete, so it is not a sentence. It is a clause, because it is a group of words with a verb.

**Q.** If students are taking the exams, then can we say to them "Write the answers to the questions which are Known to you"?

**A.** We can say (It is correct).

**Q.** పరీక్ష రాయడం పూర్తిచేసినవారు తమ జవాబు పత్రాలను క్షుణ్ణంగా పరిశీలించగలరు
Those who have finished their writing of exam can scrutinize their answer sheets.
Is this translation correct?

**A.** ....... (can) check/ go through once again, their answers, is better than scrutinize their answers- scrutinize గ్రాంథికం (వాడకపోవడం మంచిది).

## Something Could be Seriously Wrong!

**Gopika:** I thought I could meet the minister today, but he was too busy. Inspite of the appointment he had given me I could not make it.
(ఇవాళ నేను మంత్రిని కలుసుకో గలుగుతానని అనుకున్నా, కానీ ఆయన మరీ తీరిక లేకుండా ఉన్నారు. వారు నాకు కలుసుకోవడానికి సమయం ఇచ్చినా, నేను కలవలేకపోయాను.)

**Vasanthi:** How come? He had given you the appointment, but did not see you. So, what are you going to do?
(ఎలా? సమయం కేటాయించారు, అయినా నిన్ను చూడలేదు. అయితే ఏం చేయబోతున్నావు?)

**Gopika:** I just don't know. The matter is urgent. Could you suggest any alternative, Vasanthi?
(ఏం తెలియడం లేదు. విషయం అత్యవసరమైంది. ఏదైనా ప్రత్యామ్నాయం చెప్పగలవా, వాసంతీ?)

**Vasanthi:** You could ask the Secretary to the minister, couldn't you? If you want dad can talk to him. Dad knows him well.
(నువ్వు మంత్రి కార్యదర్శిని అడిగి ఉండొచ్చు కదా! నీకు అవసరమైతే, మా నాన్న అతడితో మాట్లాడగలరు. అతడు నాన్నకు బాగా తెలుసు.)

**Gopika:** Could you tell your dad to help me in the matter?
(నువ్వు మీ నాన్నతో నాకు సాయం చేయమని చెప్పకూడదూ?)

**Vasanthi:** Oh, certainly. But I have to watch his moods. If he is out of the mood, he could refuse. But don't worry. I'll talk to him to night itself.
(తప్పకుండా, కానీ నేను ఆయన మనస్థితి చూడాలి. మూడ్ బాగాలేకపోతే, తను అంగీకరించకపోవచ్చు బాధపడకు. నేను ఈరోజు రాత్రి తప్పకుండా నాన్నతో మాట్లాడతాను.)

**Gopika:** That's very nice of you. By the bye, I haven't seen Raashi for some time now. The last I've heard of her was that she was ill. Something could be seriously wrong. Or she wouldn't be silent so long.
(అది నీ మంచితనం. సరేగానీ, మనం రాశిని చూసి చాలా రోజులైంది. చివరిసారిగా నాకు తన ఆరోగ్యం బాగాలేదని తెలిసింది. ఏదో అయ్యుండొచ్చు లేకపోతే ఇంతగా పలకరించకుండా ఉండదు.)

**Vasanthi:** Shall we call her?
(మనం ఫోన్ చేద్దామా?)

**Gopika:** We'd better (చేయడం మంచిది)




✪ I thought I <u>could meet</u> the minister today.
✪ <u>Could you suggest</u> an alternative?
✪ You <u>could ask</u> the Secretary to the minister, couldn't you?
✪ <u>Could you tell</u> your dad to help me in the matter?
✪ If he is out of the mood, he <u>could</u> refuse.
✪ Something <u>could be</u> seriously wrong.

***Look at the use of 'could' in the expressions above...***

**1)** I thought I <u>could meet</u> the minister
(నేను మంత్రిని కలుస్తానని అనుకున్నాను.)
మనం ఇంతకు ముందు Can ఉపయోగాలను తెలుసుకున్నాం. అందులో మొదటిది: Present లో లేదా Future లో సామర్థ్యాన్ని తెలపడం. అంటే గల/గలిగి ఉండటం.
ఇప్పుడు 'could' ఉపయోగం చూద్దాం..
Could is the past form of 'can'. అంటే could = చేయగలిగి ఉండటం - గతంలో (a past ability).

could
can

**a)** He <u>could walk</u> 10 kms an hour those days.
(ఆ రోజుల్లో అతడు గంటకు 10 కి.మీ. **నడవగలిగేవాడు**)

**b) Krishna:** What games did you play at school? (స్కూల్లో నువ్వు ఏ ఆటలు ఆడావు?)

**Lakshman:** I <u>could play</u> many games, but I liked Football most (చాలా ఆటలు **ఆడగలిగేవాడిని**. కానీ, నాకు ఫుట్‌బాల్ అంటే ఎక్కువ ఇష్టం).

**c) Mahesh:** Why <u>couldn't</u> (could not) you came earlier? (ఇంతకు ముందే ఎందుకు **రాలేకపోయావు**?)

**Madhu:** Because I couldn't (could not) catch the 8 'O' clock bus. (8 గంటల బస్ **అందుకోలేకపోవడం** వల్ల).

గతంలో చేయగలిగే సామర్థ్యం ఉండటం 'Could'. లేకపోవడం "Could not".

**గమనిక: Could = చేయగలిగి ఉండటమే, కానీ చేశారా, లేదా అనే విషయం తెలియదు.**

He could play Football.
ఫుట్‌బాల్ ఆడగలిగేవాడు
(ఆడాడా లేదా అనే విషయం లేదు).
He could sing well = అతడు పాడగలిగేవాడు
(పాడేవాడా లేదా తెలియదు)
He was able to sing well = అతడు పాడగలిగేవాడు, పాడుతుండేవాడు కూడా.
మరిన్ని విషయాలు వచ్చేవారం..

Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... www.eenadupratibha.net





*Y. Ramesh Babu, Nagar Kurnool*

**Q:** అడ్మిషన్లు ప్రారంభమైనవి అనడానికి - admissions are open/ opened ఏది సరైంది?

**A:** Admissions are open/ Admissions are on/ Admissions open/ Admissions (are) in progress - All are correct.

**Q:** Prepositionsను సరిగా వాడటానికి ఏ పుస్తకాలు ఉపయోగకరంగా ఉంటాయి? Phrasal verbsను గుర్తుంచుకోవడానికి సులభమైన టెక్నిక్‌లను తెలపండి.

**A:** ఏ grammar పుస్తకమైనా సరిపోతుంది. Prepositions అనేవి వాడుక వల్ల వచ్చేవి. వాటికి సూత్రాలేం ఉండవు. English చదివేకొద్దీ, మాట్లాడేకొద్దీ, రాసేకొద్దీ అలవాటవుతాయి.

Phrasal verbs కూడా అలవాటు, వాడుక ఆధారంగానే వస్తాయి. ఇంగ్లిష్ మన మాతృభాష కాదు కదా! అందువల్ల ఎంత చదివితే (News papers, Magazines, Stories లాంటివి) అంత బాగా వస్తాయి.

*K. Sitaramaiah, Bhimavaram*

**Q:** Explain whether the following sentences are correct or not.

★ Since when has he been working here? (అతడు ఇక్కడ ఎప్పటి నుంచి పని చేస్తున్నాడు? )

**A:** Correct

★ Milk is rotten/ Milk has become bad (పాలు విరిగాయి)

**A:** The milk has turned sour/ curdled - ఇది correct expression.

**Q:** Explain the meaning of 'Engage' with examples.

**A:** 'Engage' has a number of different meanings.

1) Getting somebody's attention = ఒకరి దృష్టిలో ఉండటం. /to cause interest.

**eg:** The child engaged my attention = ఆ పాప నా దృష్టిని ఆకర్షించింది.

2) To have somebody to do a job = కుదుర్చుకోవడం.

**eg:** I engaged a porter to carry my luggage = నా సామాను మోసేందుకు కూలీని కుదుర్చుకున్నాను.

3) A part of a machine getting fixed with another part = ఒక యంత్ర భాగం ఇంకో యంత్ర భాగాన్ని పట్టుకోవడం.

**eg:** The clutch in a car/ bike engages the vehicle with the engine. (కార్/ బైక్‌లో clutch, engine కు వాహనాన్ని తగిలిస్తుంది.)

4) Be engaged in/ on something = be busy with something = పనిలో ఉండటం.

**eg:** She is engaged in a conversation with her friend = తన friend తో మాట్లాడుతోంది.

5) To have a marriage fixed.

**eg:** She is engaged to him = ఆమెకు అతడితో పెళ్లి నిశ్చయమైంది.

**Q.** Explain in Telugu

✪ Don't expose that pickle to moisture.

**A:** ఊరగాయకు తడి, తేమ తగలనివ్వకు.

✪ Judge but not you will be judged.

**A:** The sentence is not correct. The correct sentence is 'Judge not lest you be judged' = Don't express your opinion about others - others may express their opinion about you as well = ఇతరుల గురించి వ్యాఖ్యలు చేయవద్దు. మన గురించి కూడా ఇతరులు వ్యాఖ్యలు చేస్తారు.

✪ Born to win

**A:** గెలవడానికే పుట్టినట్లు - ప్రతి ప్రయత్నంలోనూ విజయం పొందేవారిని, He/ she is born to win అంటారు.

✪ Ten members died following the accident.

**A:** Following the accident = ఆ ప్రమాదం కారణంగా/ జరగడంతో పదిమంది మరణించారు.

✪ He pays life with.

**A:** He pays life with కాదు, He pays with life = ప్రయత్నంలో ప్రాణాలు కోల్పోవడం.

*Pradeep Chourasia, Kazipet*

**Q:** Explain whether the following sentences correct are not.

★ How many minutes is left for the completion of your class?

**A:** Correct

★ All of them are his students/ All of them are the students of him.

**A:** All of them are his students.
All of them are students of his. - Both are correct.

★ She is getting her braid done/ twisted by her mother.

**A:** She has her braid done by her mother - Correct. (is getting - wrong here)

**Q:** I have bought 'Oxford Advanced Lerner's Dictionary of Current English'. But I have a doubt, whether it is an original one or not. How to know?

**A:** If the author is As Hornby and if the book has the words, "Oxford University Press", It is original.

**Q:** Stair/ Floor/ Balcony - Clarify.

**A: Stair:** Not used in the singular. Always used in the plural, as, 'stairs' = మేడపైకి మెట్లు = a set of steps (మెట్ల వరస) between two floors (అంతస్తులు) in a building.

**Balcony:** A platform with a short wall at the end of it, and built on the upstairs, outside the walls of a building = భవనం గోడల మీద కాస్త ముందుకు కట్టి, పిట్టగోడ అమర్చితే అది balcony.

**Q:** Multi storied building/ A building which has three floors - Explain the difference.

**A:** Multistoreyed building = Any building with more than on storey. (ఒకటి కంటే ఎక్కువ అంతస్తులున్న భవనం).

✴ A building which has three floors = మూడంతస్తుల భవనం.

✴ A building which has three floors is also a multi storeyed building (Floor = అంతస్తు = storey)

**Q.** Sonia Gandhi's son/ Son of Sonia Gandhi - Which is correct?

**A:** Both are correct.

*Rayan Pataudi, Warangal*

**Q:** 'I am a 2011 pass out. I am willing to pursue higher studies in the US for the fall of 2012' - Explain the meaning in Telugu.

**A:** I passed the exam in 2011 (2011 లో పాసయ్యాను. 2012 సంవత్సరం, fall (Autumn = ఆకురాలే కాలం) August, September నెలల్లో అక్కడ ఉన్నత విద్య చదవడానికి సిద్ధంగా ఉన్నాను.

**Q:** 'The curse of the Baskervilles' - Explain in Telugu and explain why 'the' is written before the word 'Baskervilles', as it is noun?

**A:** 'The' should be used before a family name (వంశం/ ఇంటిపేరు). తెలుగులో మనం ఒక వంశం వాళ్లను, ఫలానా వంశం వాళ్లు అంటాం కదా! అదేవిధంగా English లో వంశం గురించి చెప్పడానికి The + ఇంటి/ వంశం పేరు, plural తో వాడతారు.

✳ The Baskervilles = Baskerville వంశం వాళ్లు.

✳ The Richards = Members of the Richard family

**Q:** Explain the meaning in Telugu.

✳ The hound of the Baskervilles.

**A:** బాస్కర్ విల్ వంశానికి శాపమైన వేటకుక్క.

✳ The Stapletons of Merifit house.

**A:** Merifit House (ఇంటికి పెట్టుకున్న పేరు) లో నివసిస్తున్న Stapleton కుటుంబీకులు.

✳ We ran into Sir Henry himself.

**A:** Sir Henry ని అనుకోకుండా కలుసుకున్నాం/ ఆయన మాకు ఎదురయ్యాడు = Ran into

**Q:** I have a visiting visa to US/ to the US - Which is correct?

**A:** To the US - correct

# 'Judge not lest you be judged'






M. SURESAN

**Q:** ఆ ధనాన్ని హుండీలో వేయండి - Explain in English.

**A:** Drop the money in the hundi.

# It was a gala affair, wasn't it?

**Krishna:** Hi, weren't you there at the function yesterday? It was a gala affair, wasn't it? (నిన్న ఆ ఫంక్షన్‌లో నువ్వు ఉన్నావా? అది చాలా సరదాగా, గొప్పగా ఉంది కదా!)

**Arjun:** I was, of course, but how could you know? (నిజమే నేనున్నాను. కానీ నువ్వెలా తెలుసుకోగలిగావు? )



**Krishna:** Because I was there too, but could not meet you because I left a few minutes after the party has started. (నేనూ అక్కడే ఉన్నాను కాబట్టి. కానీ, పార్టీ ప్రారంభమైన కొద్ది నిమిషాలకే నేనక్కడ నుంచి వెళ్లిపోయాను. అందువల్ల నిన్ను కలవలేకపోయాను.)

**Arjun:** We have another party next week. It could be a much grander affair than yesterday's. You know who is giving it. It's going to be his birthday bash. (మనకు వచ్చేవారం ఇంకో పార్టీ ఉంది. నిన్నటి దాని కంటే అది గొప్పగా ఉండవచ్చు నీకు తెలుసు అది ఎవరిస్తున్నారో. అది అతడి పుట్టినరోజు సంబరం.)

Bash = A grand party

**Krishna:** Too many parties these days! They could be very tiring and you could be left with no time to attend to your personal matters. (ఈ మధ్య పార్టీలు ఎక్కువయ్యాయి. ఇది మరీ విసుగ్గా ఉంది. వ్యక్తిగత విషయాలకు సమయం ఉండటం లేదు.)

**Arjun:** Something happened yesterday. I must tell you. Mrinal came to me and said, 'Could you do me a small favour?'. I asked him what it was. He said, 'Could you take me home on your car and bring me back?' He was talking as though his place was just a stone's throw from the venue of the party! (నిన్న ఒక సంఘటన జరిగింది. అది నీతో చెప్పాలి. మృణాల్ నా దగ్గరకొచ్చి 'చిన్న సాయం చేయగలవా?' అని అడిగాడు. ఏంటని అడిగాను. నన్ను మా ఇంటికి తీసుకెళ్లి, మళ్లీ తీసుకురాగలవా అన్నాడు. తన ఇల్లేదో అక్కడికి (పార్టీ జరుగుతున్న ప్రదేశానికి) చాలా దగ్గరగా ఉన్నట్టు.)

At a stone's throw = Very near = చాలా దగ్గర.

**Krishna:** Did you? (తీసుకెళ్లావా? )

**Arjun:** Do you think I am a fool? Just then some one was going that way and I put him on to him. ( నేను అంత తెలివితక్కువ వాడిని అనుకున్నావా? అప్పుడే అటువైపు ఎవరో వెళుతున్నారు. అతడిని వాళ్లకు అంటగట్టాను.)




***Look at the following sentences from the conversation above.***

1) How could you know?
2) ... but could not meet you because I left a few minutes...
3) It could be a much grander party than yesterday's.
4) They could be very tiring
5) could you do me a small favour?

కిందటిసారి మనం కొన్ని 'could ఉపయోగాలు చూశాం. వాటిలో ముఖ్యమైంది, 'could' is the past form of 'can' - ఏదైనా గతంలో చేయగలిగి ఉండటం, సామర్థ్యం ఉండటం.

**Pranab:** What games could you play at school? (స్కూల్లో ఏ ఆటలు ఆడగలిగేవాడివి? )

**Prasanna:** I could play quite a few games (నేను ఏవో కొన్ని ఆటలు ఆడగలిగేవాడిని), but my favourite was hockey (కానీ నాకు ఇష్టమైంది మాత్రం hockey)

ఇదే అర్థంతో కింది sentence చూడండి.

✪ How could you know? = నువ్వెలా తెలుసుకోగలిగావు? 'Could' గతంలో చేయగలిగి ఉండటమే కానీ, చేసినట్లు కాదు అని కిందటిసారి మనం చూశాం.

✪ చేయగలగడంతోపాటు చేసి ఉంటే అప్పుడు was able to/ were able to అంటాం.

**Note:** Couldను past కే కాకుండా present కు కూడా వాడతాం. Present/ Future possibility (సాధ్యమయ్యే విషయం/ జరగవచ్చు)ని తెలియజేస్తుంది.

a) It could be a much grander party = అది ఇంత కంటే గొప్ప పార్టీ కావొచ్చు - (Possibility)

b) They could be very tiring = అది చాలా విసుగు కలిగించవచ్చు/ విసుగు కలిగించే అవకాశం ఉంది (ఇప్పుడు- present)

**Srinivas:** When do you expect them here? (వాళ్లు ఇక్కడికి ఎప్పుడు రావొచ్చనుకుంటున్నావు? )

**Venu:** They could be here any moment (వాళ్లిక్కడ ఏ క్షణంలోనైనా ఉండవచ్చు - Possibility - సాధ్యం)

**Inspector:** How about taking the minister's son into custody, sir? (మంత్రి కుమారుడిని అదుపులోకి తీసుకుంటే, sir)

**S.P:** What are you talking? We could be playing with fire (నువ్వు ఏం మాట్లాడుతున్నావు? అది నిప్పుతో చెలగాటం కావచ్చు - Present)



**Pratibha:** Shall we start? (బయలుదేరదామా? )

**Kruthi:** The sky is overcast. It could rain any moment. (ఆకాశం మేఘావృతమైంది. ఏ క్షణాన్నయినా వర్షం రావొచ్చు)

**May** కు, **Could** కు **తేడా:**

✪ He may go there = వాడక్కడికి వెళ్లొచ్చు/ వెళతాడేమో.

✪ He could go there = వాడక్కడికి వెళ్లే అవకాశం ఉంది (వెళితే మనం చేయగలిగింది ఏం లేదు)

Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... www.eenadupratibha.net



# I don't at all like his buying...




M. SURESAN



***Afreen Sultana, Janagaon***

**Q:** "The meeting is round the corner" - Explain the meaning in Telugu.

**A:** Round the corner = Very near/ very shortly = దగ్గర లోనే/ త్వరలోనే.

**Q:** "Man is a social animal" - Can we change the above sentence into complex and compound sentences?

**A:** The sentence (simple) is quite clear. Changing it into complex and compound sentences can only cause confusion, and the meaning will not be clear. This is an example of studying grammar for the sake of grammar and not for the improvement of our speech/ writing.

**eg:** i) Man is an animal that lives in a society - (complex)

ii) Man is an animal and he lives in society - (compound)

**Q:** He has given me money as well as his bike/ He has given me money and his bike - Which is correct?

**A:** Both are correct.

**Q:** Can we change the bellow sentences into simple, complex and compound? Explain.

i) I saw a tree which was laden with apples.

**A:** Yes. They can be.

✪ I saw a tree which was laden with apples - Complex.

✪ I saw a tree and it was laden with apples - Compound.

ii) He gave me a pen and a book

**A:** He gave me a pen in addition to a book - Simple

✳ While he gave me a pen, he gave me a book too - Complex.

iii) I met him and he gave me a book

**A:** On my meeting him, he gave me a book - Simple.

✺ When I met him, he gave me a book - Complex.

***Senapathi, Bhimavaram.***

**Q:** Explain whether the following translations are correct or not.

i) ఏం చేసినా ఈ సేనాపతి ఈ రాము స్థాయికి ఎదగలేడు = This Senapathi cann't reach this Ramu's level though whatever he does.

**A:** Whatever he <u>might</u> do Senapathi <u>could</u> never rise to the status of Ramu (Past).

✣ Whatever Senapathi <u>may</u> do he <u>can</u> never rise to the status of Ramu (Present).

ii) మీ వాడిని లోపలికి (Jail) పంపించి నన్ను బయటికి తీసుకొచ్చావు, నీ రుణం ఎలా తీర్చుకోను = You had sent your man and got me come out of the jail. How can I repay you.

**A:** You sent your man in,/ to jail and got me out (of it). I don't know how I can repay your debt/ you.

iii) అతడు ఎప్పటి నుంచి లాయర్‌గా పని చేస్తున్నాడు = Since when has been practising as a layer here.

**A:** Since when has he been practising as a lawyer?

iv) అతడు ఆ Palace కొనడం నాకెంత మాత్రం ఇష్టం లేదు, ఎందుకంటే అతడు దాన్ని కొంటే ఆపద అతడికి మాత్రమే కాదు, అతడిని చేసుకోబోయే మా అమ్మాయికి కూడా = I will never agree his buying the palace because if he buys it, then not only he to face problems but also our daughter who is to marry him.

**A:** I don't <u>at all</u> (ఎంత మాత్రమూ) like his buying the palace/ site because it is dangerous/ not safe for him or the girl going to marry him.

***T. Siva, Nandikotkur***

**Q:** What are the appropriate Question tags for following statements.

✱ I am informed of his arrival, ...

**A:** aren't I ?

✱ I haven't intimated of her departure, ....

**A:** have I?

✱ Don't stop singing, ....

**A:** will you?

✱ Soldiers must obey orders, ....

**A:** mustn't they?

✱ He dares me to fight, ....

**A:** doesn't he?

✱ There used to be some trees in this field, ....

**A:** weren't there?

✱ That's the postman, ....

**A:** isn't it?

✱ Let's go now, ...

**A:** shall we?

✱ You needn't spend money, ....

**A:** need you?

**Q:** Power Point Presentation - Explain .

**A:** Showing or explaining a new product, idea, a piece of work, to a group of people with the help of pictures, figures and statistics in the form of slides. (Computer సాయంతో slides రూపంలో ఒక కొత్త విషయాన్ని, తయారీని, ఉత్పాదనను బృందానికి వివరించడం.)

# How could I, when you couldn't sir?

**Bharat:** Could you follow what he said? As for myself I could not understand him at all. (అతడు చెప్పినదాన్ని మీరు అర్థం చేసుకోగలిగారా? నామటుకు నేను అతడు చెప్పిందేమీ అర్థం చేసుకోలేకపోయాను.)

**Sundar:** How could I, when you could not, sir? (మీరే అర్థం చేసుకోలేకపోయినప్పుడు, నేనెలా అర్థం చేసుకోగలిగేవాడినండీ? )

**Bharat:** All that I was able to make out was that he would soon go abroad and could meet a number of our classmates there. (అతడు చెప్పినదాంట్లో నేను అర్థం చేసుకోగలిగినదంతా అతడు త్వరలోనే విదేశాలకు వెళ్లబోతున్నాడని, అక్కడ మన సహాధ్యాయులను చాలామందిని కలుసుకోవచ్చునని.)

**Sundar:** Any way I am happy that he has given you the book we need. Could you give it to me after you are done with it? (ఏదేమైనా మనకు అవసరమైన పుస్తకం ఇచ్చాడు. నాకు సంతోషంగా ఉంది. మీరు పూర్తిచేసిన తర్వాత నాకోసారి ఇస్తారా? )

**Bharat:** Certainly I will. But then do return it by the weekend so that we could give it back to him the next week. (తప్పకుండా. అయితే దాన్ని నువ్వు మళ్లీ వారాంతంలో నాకు తిరిగి ఇచ్చేయాలి, మనం అతడికి దాన్ని వచ్చే వారం తిరిగి ఇచ్చేవిధంగా.)

**Sundar:** Could I keep it for the week-end too, sir? I'm not as fast as you are at reading. (నేను దాన్ని ఈ వారాంతం వరకూ ఉంచుకోవచ్చా? మీ అంత త్వరగా నేను చదవలేను.)

**Bharat:** Ok then. But be sure to return it by the coming Tuesday the latest. (సరే. అయితే వచ్చే మంగళవారానికైనా దాన్ని నాకివ్వు.)

కిందటిసారి మనం కొన్ని *Could* ఉపయోగాలను చూశాం...

1) <u>Could</u> is the past form of can - it expresses the ability somebody had in the past.

**Important:** The difference between 'Could' and 'was/ were able to': could statements means having the ability to do something, but not stating whether someone actually 'did' what they were able to.

గతంలో సామర్థ్యాన్ని కలిగి ఉండటం మాత్రమే 'Could' = చేయగలిగి ఉండటమే. చేయగలిగీ చేశారా లేదా అనేది 'Could' తెలియజేయదు. చేయగలిగీ, 'చేశారు' అనడానికి "was/ were able to" వాడతాం.



✪ He could do it = అతడు చేయగలిగేవాడే (చేశాడో లేదో తెలియదు)

✪ He was able to do = అతడు చేయగలిగాడు

***Now look at the following expressions from the conversation.***

1) <u>Could</u> you <u>follow</u> what he said?

2) I <u>could not understand</u> him at all.

3) How <u>could</u> I, when <u>you couldn't</u> sir?

4) He <u>could meet</u> a number of our classmates there.

ఈ Sentences లో 'Could' is the past form of can.

5) <u>Could</u> you give it to me?

6) Could I keep it for the weekend too?

ఈ sentence లో 'could' ను చాలా మర్యాదపూర్వకంగా అభ్యర్థించడానికి (Very polite request) ఉపయోగించారు, Present లోనే (ప్రస్తుతం మాట్లాడుతున్నప్పుడు)

**Ananth:** So you know my uncle well. What can I do for you? (అయితే నీకు మా మావయ్య బాగా తెలుసన్నమాట. నేనేం చేయగలను నీకు? )

**Asray:** You know the local MP very well. Could you put in a word to him about a job in his company for me? (మీకు స్థానిక MP బాగా తెలుసుకదా. ఆయన కంపెనీలో నా ఉద్యోగం గురించి ఒక మాట చెప్పగలరేమోనని.)

✪ A very polite request (చాలా మర్యాదపూర్వక అభ్యర్థన)

**Ajay:** <u>Could you</u> please step aside? You are in my way. (కాస్త అడ్డుతప్పుకుంటారా? నాకు అడ్డంగా ఉన్నారు)

**Bhanu:** Could you please wait a moment? I am trying to go out too. (దయచేసి ఒక్క క్షణం ఆగండి. నేనూ బయటికి వెళ్లే ప్రయత్నంలోనే ఉన్నాను)

Could మరో ఉపయోగం, Present లోనే Asking for permission in a very polite manner. చాలా మర్యాదగా అనుమతి అడగడం.

✪ Could I keep the book for the weekend? = నేను వారాంతంలో (శని, ఆది) ఈ పుస్తకం ఉంచుకోనా? (Very polite form of request)

**Vinod:** Yes, what do you want? (నీకేం కావాలి? )

**Vikram:** Excuse me, could I use your phone? (ఏమనుకోకండి మీ phone వాడుకోవచ్చా? )

**Vinod:** By all means, go ahead (తప్పకుండా, వాడుకోండి)

**Student:** Tomorrow we have a function at home, sir <u>could I come a little late?</u> (సర్, రేపు మా ఇంట్లో ఫంక్షన్ ఉంది. కొంచెం ఆలస్యంగా రావొచ్చా?)

**Teacher:** Of course, but get a letter from your dad about it. (సరే, కానీ మీ నాన్న దగ్గర నుంచి దానికి సంబంధించి ఓ ఉత్తరం తీసుకురా.)

These are important uses of ***'COULD'***. వీటిని బాగా Practise చేయండి..

**Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... www.eenadupratibha.net**

# ప్రవేశాలు

## ఓయూ - పీజీ, డిగ్రీ కోర్సులు

హైదరాబాద్‌లోని ఉస్మానియా యూనివర్సిటీకి చెందిన ప్రొఫెసర్ జి.రామ్ రెడ్డి సెంటర్ ఫర్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్ పీజీ, డిగ్రీ, డిప్లొమా కోర్సుల్లో ప్రవేశానికి దరఖాస్తులు కోరుతోంది.

**మూడేళ్ల ప్రొఫెషనల్ కోర్సులు:** ఎంబీఏ, ఎంసీఏ.

**అర్హత:** ఏదైనా డిగ్రీతోపాటు ఐసెట్‌లో అర్హత.

**పీజీ కోర్సులు:** వ్యవధి: రెండేళ్లు.

**1)** ఎంఏ: ఇంగ్లిష్, హిందీ, తెలుగు, సంస్కృతం, ఉర్దూ, వేదిక్ ఆస్ట్రాలజీ, ఫిలాసఫీ, సోషియాలజీ, పబ్లిక్ పర్సనల్ మేనేజ్‌మెంట్, జర్నలిజం అండ్ పబ్లిక్ రిలేషన్స్, ఎకనమిక్స్, పొలిటికల్ సైన్స్, హిస్టరీ, సైకాలజీ, పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్.

2) ఎంకామ్ 3) ఎంఎస్సీ (మ్యాథ్‌మెటిక్స్/ స్టాటిస్టిక్స్)

**అర్హత:** డిగ్రీ ఉండాలి.

**యూజీ కోర్సులు (వ్యవధి మూడేళ్లు):** బీఏ, బీఏ (మ్యాథ్‌మెటిక్స్ అండ్ స్టాటిస్టిక్స్), బీకామ్ (జనరల్/ కంప్యూటర్స్), బీబీఏ, బీఎస్సీ (ఏవియేషన్).

**అర్హత:** ఇంటర్/ తత్సమానం.

**పీజీ డిప్లొమా కోర్సులు (వ్యవధి సంవత్సరం):** మ్యాథ్‌మెటిక్స్, ఇంగ్లిష్ లాంగ్వేజ్ టీచింగ్, బిజినెస్ మేనేజ్‌మెంట్, బయోఇన్‌ఫర్మాటిక్స్, టెలికమ్ సాఫ్ట్‌వేర్, కంప్యూటర్ అప్లికేషన్స్. **అర్హత:** సంబంధిత విభాగంలో డిగ్రీ.

**దరఖాస్తు:** ఓయూ దూర విద్యా కేంద్రాలు/ వెబ్‌సైట్ నుంచి పొందవచ్చు.

**ఫీజు:** దరఖాస్తుతోపాటు Director, PGRRCDE, OU, Hyderabad పేరుతో తీసిన రూ.150 డీడీని పంపాలి.

దరఖాస్తుల విక్రయం ప్రారంభం: **జులై 16**

ప్రొఫెషనల్, పీజీడీసీఏ కోర్సులకు చివరితేదీ: **సెప్టెంబరు 10**

పీజీ, ఇతర డిప్లొమా కోర్సులకు చివరితేదీ: **అక్టోబరు 10**

బయోఇన్‌ఫర్మాటిక్స్‌లో డిప్లొమా కోర్సుకు చివరితేదీ: **జులై 25**

డిగ్రీ కోర్సులకు చివరితేదీ: **అక్టోబరు 18**

వెబ్‌సైట్: **www.oucde.ac.in**

## APPSC GROUP-II పేపర్ – I జనరల్ స్టడీస్ 'కీ'

శనివారం నిర్వహించిన గ్రూప్ – II పేపర్ – I జనరల్ స్టడీస్ రాత పరీక్షకు నిపుణులు రూపొందించిన 'కీ' ని అందిస్తున్నాం. అభ్యర్థులు తమ అవగాహన కోసం దీన్ని ఉపయోగించుకోవచ్చు. ప్రభుత్వం విడుదల చేసే జవాబులను మాత్రమే అంతిమంగా పరిగణించాలి.

| Q.No. | A | B | C | D | Q.No. | A | B | C | D |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | 2 | 3 | 2 | 3 | 76. | 2 | 3 | 2 | 4 |
| 2. | 4 | 1 | 2 | 4 | 77. | 1 | 2 | 3 | 4 |
| 3. | 3 | 2 | 2 | 2 | 78. | 1 | 1 | 2 | 4 |
| 4. | 4 | 2 | 2 | 2 | 79. | 4 | 2 | 3 | 2 |
| 5. | 1 | 1 | 2 | 3 | 80. | 1 | 2 | 2 | 2 |
| 6. | 1 | 2 | 2 | 1 | 81. | 2 | 4 | 3 | 2 |
| 7. | 4 | 2 | 1 | 2 | 82. | 3 | 2 | 1 | 1 |
| 8. | 4 | 1 | 2 | 1 | 83. | 2 | 3 | 4 | 4 |
| 9. | 2 | 4 | 1 | 1 | 84. | 3 | 2 | 1 | 3 |
| 10. | 1 | 2 | 1 | 3 | 85. | 4 | 4 | 2 | 2 |
| 11. | 4 | 3 | 1 | 3 | 86. | 3 | 4 | 4 | 1 |
| 12. | 3 | 2 | 2 | 4 | 87. | 1 | 1 | 3 | 1 |
| 13. | 3 | 3 | 2 | 1 | 88. | 2 | 4 | 2 | 4 |
| 14. | 3 | 1 | 3 | 2 | 89. | 2 | 2 | 1 | 1 |
| 15. | 2 | 4 | 2 | 2 | 90. | 3 | 1 | 3 | 4 |
| 16. | 1 | 2 | 4 | 2 | 91. | 2 | 2 | 3 | 3 |
| 17. | 2 | 3 | 4 | 1 | 92. | 2 | 4 | 4 | 4 |
| 18. | 1 | 2 | 4 | 1 | 93. | 2 | 3 | 2 | 3 |
| 19. | 1 | 3 | 2 | 4 | 94. | 2 | 4 | 2 | 3 |
| 20. | 3 | 2 | 2 | 1 | 95. | 2 | 1 | 3 | 1 |
| 21. | 4 | 3 | 2 | 2 | 96. | 2 | 1 | 1 | 1 |
| 22. | 2 | 1 | 1 | 3 | 97. | 1 | 4 | 2 | 3 |
| 23. | 1 | 4 | 4 | 2 | 98. | 2 | 4 | 1 | 2 |
| 24. | 1 | 1 | 3 | 3 | 99. | 1 | 2 | 1 | 3 |
| 25. | 4 | 2 | 2 | 4 | 100. | 1 | 1 | 3 | 2 |
| 26. | 1 | 4 | 1 | 3 | 101. | 1 | 4 | 3 | 2 |
| 27. | 4 | 3 | 1 | 1 | 102. | 2 | 3 | 4 | 1 |
| 28. | 1 | 2 | 4 | 2 | 103. | 2 | 3 | 1 | 4 |
| 29. | 4 | 1 | 1 | 2 | 104. | 3 | 3 | 2 | 2 |
| 30. | 1 | 3 | 4 | 3 | 105. | 2 | 2 | 2 | 2 |
| 31. | 3 | 3 | 2 | 3 | 106. | 4 | 1 | 2 | 3 |
| 32. | 4 | 4 | 4 | 1 | 107. | 4 | 2 | 1 | 2 |
| 33. | 3 | 2 | 3 | 2 | 108. | 4 | 1 | 1 | 1 |
| 34. | 3 | 2 | 4 | 2 | 109. | 2 | 1 | 4 | 2 |
| 35. | 1 | 3 | 1 | 1 | 110. | 2 | 3 | 1 | 2 |
| 36. | 1 | 1 | 1 | 2 | 111. | 2 | 4 | 2 | 4 |
| 37. | 3 | 2 | 4 | 2 | 112. | 1 | 2 | 3 | 2 |
| 38. | 2 | 1 | 4 | 1 | 113. | 4 | 1 | 2 | 3 |
| 39. | 3 | 1 | 2 | 4 | 114. | 3 | 1 | 3 | 2 |
| 40. | 2 | 3 | 1 | 2 | 115. | 2 | 4 | 4 | 4 |
| 41. | 2 | 3 | 4 | 3 | 116. | 1 | 1 | 3 | 4 |
| 42. | 1 | 4 | 3 | 2 | 117. | 1 | 4 | 1 | 1 |
| 43. | 4 | 1 | 3 | 3 | 118. | 4 | 1 | 2 | 4 |
| 44. | 2 | 2 | 3 | 1 | 119. | 1 | 4 | 2 | 2 |
| 45. | 2 | 2 | 2 | 4 | 120. | 4 | 1 | 3 | 1 |
| 46. | 3 | 2 | 1 | 2 | 121. | 3 | 2 | 3 | 2 |
| 47. | 2 | 1 | 2 | 3 | 122. | 1 | 2 | 4 | 4 |
| 48. | 1 | 1 | 1 | 2 | 123. | 2 | 2 | 3 | 3 |
| 49. | 2 | 4 | 1 | 3 | 124. | 2 | 2 | 3 | 4 |
| 50. | 2 | 1 | 3 | 2 | 125. | 1 | 2 | 1 | 1 |
| 51. | 4 | 2 | 4 | 3 | 126. | 2 | 2 | 1 | 1 |
| 52. | 2 | 3 | 2 | 1 | 127. | 2 | 1 | 3 | 4 |
| 53. | 3 | 2 | 1 | 4 | 128. | 1 | 2 | 2 | 4 |
| 54. | 2 | 3 | 1 | 1 | 129. | 4 | 1 | 3 | 2 |
| 55. | 4 | 4 | 4 | 2 | 130. | 2 | 1 | 2 | 1 |
| 56. | 4 | 3 | 1 | 4 | 131. | 3 | 1 | 2 | 4 |
| 57. | 1 | 1 | 4 | 3 | 132. | 2 | 2 | 1 | 3 |
| 58. | 4 | 2 | 1 | 2 | 133. | 3 | 2 | 4 | 3 |
| 59. | 2 | 2 | 4 | 1 | 134. | 1 | 3 | 2 | 3 |
| 60. | 1 | 3 | 1 | 3 | 135. | 4 | 2 | 2 | 2 |
| 61. | 3 | 3 | 3 | 2 | 136. | 2 | 4 | 3 | 1 |
| 62. | 4 | 4 | 1 | 2 | 137. | 3 | 4 | 2 | 2 |
| 63. | 2 | 3 | 2 | 2 | 138. | 2 | 4 | 1 | 1 |
| 64. | 2 | 3 | 2 | 2 | 139. | 3 | 2 | 2 | 1 |
| 65. | 3 | 1 | 1 | 2 | 140. | 2 | 2 | 2 | 3 |
| 66. | 1 | 1 | 2 | 2 | 141. | 3 | 2 | 4 | 4 |
| 67. | 2 | 3 | 2 | 1 | 142. | 1 | 1 | 2 | 2 |
| 68. | 1 | 2 | 1 | 2 | 143. | 4 | 4 | 3 | 1 |
| 69. | 1 | 3 | 4 | 1 | 144. | 1 | 3 | 2 | 1 |
| 70. | 3 | 2 | 2 | 1 | 145. | 2 | 2 | 4 | 4 |
| 71. | 3 | 2 | 3 | 1 | 146. | 4 | 1 | 4 | 1 |
| 72. | 4 | 1 | 2 | 2 | 147. | 3 | 1 | 1 | 4 |
| 73. | 1 | 4 | 3 | 2 | 148. | 2 | 4 | 4 | 1 |
| 74. | 2 | 2 | 1 | 3 | 149. | 1 | 1 | 2 | 4 |
| 75. | 2 | 2 | 4 | 2 | 150. | 3 | 4 | 1 | 1 |

హైదరాబాద్‌లోని కెరీర్ ఐఏఎస్ ఇన్‌స్టిట్యూట్ డైరెక్టర్ ఎ.ఎం.రెడ్డి, RICE డైరెక్టర్ సీహెచ్ కృష్ణప్రసాద్, డాక్టర్ బి.నరేశ్, జేబీఎస్ రావు, వాసం శ్రీనివాస్, డి.అనంతరామకృష్ణ ఈ 'కీ'ని రూపొందించారు.

ప్రశ్నపత్రం, 'కీ' కోసం క్లిక్ చేయండి: www.eenadupratibha.net







***B. Adiseshaiah, G. Yerragudi***

**Q.** What is the difference between **"had to"** and **"was to"**? i.e., I had to ask money; I was to ask money.

**A:** I had to ask for money ('ask money' is incorrect) = 1) I needed money very much;

❊ Some one forced me to ask for money.

❊ I was to asked for money = somebody ordered me to ask for money.

***G. Venkata Rao, K.P. Puram***

Q. "A knowledge is superior to money". ఈ వాక్యంలో knowledge అనే పదానికి Consonantal sound వస్తుంది కాబట్టి article "A" వాడారు. ఇది abstract noun, మీరు Countable nouns కు మాత్రమే A, An వాడాలన్నారు - వివరించండి.

**A:** Knowledge - Uncountable కాబట్టి, సాధారణంగా దీని ముందు 'a' వాడం. అయితే వాడుక (usage) ప్రకారం, knowledge of (ఒక విషయం తెలిసి ఉండటం) అని వాడినప్పుడు a knowledge of something అంటాం.

★ She has a good/ sound/ deep etc. knowledge of the subject.

knowledge ని జ్ఞానం అనే అర్థంతో వాడినప్పుడు దాని ముందు a/ an రాదు.

☆ knowledge is power

☆ Knowledge once acquired is never lost.

***A. Ramanaiah, Pulivenduala***

**Q:** Mr. A asked Mr. B to come/ go/ move to Hyd - Which is correct?

**A:** i) Mr. A asked Mr B to come to Hyderabad - Correct.

ii) Mr. A asked me to go over to Hyderabad. (Mr. A to Mr. B go - over here) - Correct

iii) The meaning is different: Mr. A asked Mr. B to change his residence to Hyderabad.

**Q:** As for as the punctuation marks concerned: In a poem of Junior Inter English text Book named "A Spider and a Fly" By Don Marquis, The letter 'I' is used as small (i), like this no where else. The poem has not been Punctuated. - What is the reason?

**A:** It is 'poetic license' = The freedom a poet enjoys in matters of penetration, and on quiet a few occasions in matters of grammar as well. So long as they can make their meaning clear, they are free to change whatever they like. The use of 'i' in the poem is an example, perhaps he used it for some effect.

# Knowledge once acquired is never lost!





M. SURESAN

**Q:** In order to enrich the written English structures are more useful. Are there any exclusive books on structures other than Horn By?

**A:** The study of structures, in my opinion, does not necessarily help us to 'enrich' our written English. What is more important is practising speaking and writing as much as possible. However, if you still are interested the books you can follow are: 1) English structure by AS Horn By - Oxford Publishing House, 2) Contemporary English Grammar and Composition by David Green - Orient Longmans LTD.

**Q:** What is etymological derivation? Which book would be referred to know about it?

**A:** **Etymological Derivation:** I do not know exactly what this means. However, Etymology means the study of the origin of words. Derivation is forming a new word by adding a prefix (eg. 'un+' as in unfit,) or a suffix, (eg: 'ly-' as in slowly)

**An example of etymology:** The word 'farmer' comes from 'farm' which in the beginning had the meaning of 'rent'- later it came to mean, a piece of agricultural land, and 'farmer' came to have the meaning, a person who paid rent (కౌలు) for the land he cultivated or a person who owned a farms. This perhaps is the meaning of etymological derivation.

***K. Chandu, Sirisilla***

**Q:** There is a Bus కు Question tag తెలపండి. ఇలాంటి వాటిలో Subject ఏది?

**A:** There is a bus, isn't there? - There, it తో ప్రారంభమయ్యే sentences, question tags లో verb తర్వాత there/ it మాత్రమే వస్తుంది. **Eg:** It was her property, wasn't it?

ఈ విధంగా there/ it తో ప్రారంభమయ్యే sentences లో సాధారణంగా subject, verb తర్వాత వచ్చేదే ఉంటుంది.

✣ There is a bus లో - Subject: bus.

✣ It is a useful book - Subject: book.

**Q:** The book given to him, the man seen near the school మీరు చెప్పిన ఆరు రూపాల్లో ఇది ఏ రకానికి సంబంధించిన వాక్యం? వివరించండి.

**A:** The book given to him, the man seen near the school - ఇవి phrases. Sentences కావు. Phrases లో verb ఉండదు కదా? Phrase is a group of words without a verb. అందువల్ల ఇవి ఆరు రూపాల్లో దేనికీ చెందవు.

# He might help us get it!



**Ashray:** May I borrow your book for a few days? It can be very useful for me for the coming interview. I will certainly return it promptly. (కొద్ది రోజులు మీ పుస్తకం నేను తీసుకోవచ్చా వచ్చే interview కు నాకు అది ఉపయోగపడగలదు. కచ్చితంగా మీకు సమయానికి తిరిగి ఇచ్చేస్తాను.)

**Amrutha:** Why not? I may not be in town for the coming four days, and you can have it during the time. May I have it back on Friday? (ఎందుకివ్వను? వచ్చే నాలుగు రోజులు నేను ఊర్లో ఉండకపోవచ్చు ఆ నాలుగు రోజులూ మీరు దాన్ని ఉంచుకోవచ్చు నేను దాన్ని తిరిగి శుక్రవారం తీసుకోవచ్చా?)

**Ashray:** Oh, certainly and thank you very much. Where may we get the book? I like to have a copy of it for myself. (తప్పకుండా. చాలా thanks. ఈ పుస్తకం ఎక్కడ దొరకవచ్చు? నాకు దాన్ని కొనుక్కోవాలనుంది.)

**Amrutha:** May be it is available in Knowledge Book Centre. But I am not sure. I bought this in a book store in Kurnool, and there too, I found only this copy. You might find it in Chennai or in Hyderabad. (అది నాలెడ్జ్ బుక్ సెంటర్లో దొరకవచ్చు. కానీ, నాకంత నమ్మకం లేదు. దీన్ని కర్నూల్లో ఒక పుస్తకాల షాపులో కొన్నాను. అక్కడ కూడా ఇదొక్కటే ఉంది. చెన్నైలో గానీ, హైదరాబాద్‌లో గానీ దొరకవచ్చు.)

**Ashray:** I thought I might get a copy of it in Vizag when I went there last week, but I was disappointed. (క్రిందటి వారం వైజాగ్ వెళ్లినప్పుడు అక్కడేమైనా దొరుకుతుందేమోనని అనుకున్నా. కానీ, నిరాశే ఎదురైంది.)

**Amrutha:** Wait. I remember now. My cousin is in Chennai. He might help us get it. (ఆగండి. గుర్తొచ్చింది. మా cousin చెన్నైలో ఉన్నాడు. ఈ విషయంలో అతడు మనకు సాయం చేయవచ్చు.)




***Look at the following sentences from the conversation above:***

1) May I borrow your book?
2) I may not be in town for the coming few days
3) May I have it back on friday?
4) Where may We get the book?
5) You might find it in Chennai
6) I thought I might get a copy of it
7) He might help us

***Let's study the uses of may and might***

ఇప్పుడు 'may' వాడకాన్ని గమనిద్దాం...




I may not be in town = నేను ఊర్లో ఉండకపోవచ్చు

1) 'May' expresses probability జరగవచ్చు/ ఉండవచ్చు అనే అర్థంతో వాడతాం. May, ఇప్పుడు (present) గానీ, భవిష్యత్ (future)లో గానీ:

**Dhanush:** When may he be here? (అతడు ఇక్కడ ఎప్పుడు ఉండవచ్చు?)

**Kiran:** He may be on the way. We may see him here in a few minutes. (దారిలోనే ఉండవచ్చు. మనం కొద్ది క్షణాల్లో ఇక్కడ అతణ్ని చూడవచ్చు)

**Sukumar:** When may you start? (మీరెప్పుడు బయల్దేరవచ్చు?)

**Sowrabh:** May be in ten minutes (10 నిమిషాల్లో ఉండవచ్చు)

may not(be) జరగకపోవచ్చు ఉండకపోవచ్చు

ఇది 'May'కు ఉన్న మొదటి ఉపయోగం.

అదేవిధంగా may not (be) = జరగకపోవచ్చు/ ఉండకపోవచ్చుకూ వాడతాం.




**Priyanka:** What are the chances of his success? (అతడి విజయావకాశాల మాటేమిటి?)

**Anusha:** He may not be successful (అతడు విజయవంతంగా ఉండకపోవచ్చు)

**Charith:** Where may we find him at this time of the day? (ఈ సమయంలో అతడు మనకెక్కడ కనపడవచ్చు)

**Harindra:** You may find him at office or at some client's place (అతడు Officeలోగానీ Clients దగ్గరగానీ ఉండవచ్చు)

ఇదీ first use of 'May'. మిగతా వచ్చేవారం..

Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... www.eenadupratibha.net





*Vishal Singam, Warangal.*

**Q:** He was watching the T.V. during five/ for five hours -ఈ రెండు sentences ల అర్థాలు చెప్పండి.

**A:** He was watching TV during five hours - WRONG - No meaning.

He was watching TV for five hours = అతడు 5 గంటలపాటు TV చూస్తూ ఉన్నాడు.

**Q:** He watching the T.V. during the interval - దీన్ని తెలుగులో ఏమనాలి?

**A:** Interval time లో అతడు TV చూస్తున్నాడు- ఆ విరామ (Interval) సమయంలో అతడు TV చూస్తున్నాడు.



**Q:** He was having biscuits during watching the movie - Explain in Telugu.

**A:** This sentence is wrong. The correct sentence is:

He was having (eating) biscuits while (during - wrong) watching the movie.

**Q:** ఆవిడ anklets తొడిగి ఉంది (ఇప్పుడు) - దీన్ని English లో ఎలా చెప్పాలి?

**A:** She had her anklets on

**Q:** Class start అయ్యి అయిదు నిమిషాలు కూడా కాలేదు. - Say in English.

**A:** It is hardly five minutes/ not even five minutes since the class began.

**Q:** She is gone/ she has gone - say the difference.

**A:** She is gone = She has gone

**Q:** develop/ dlvelop/ ఇది rising టోనా? లేక వత్తక్షరమా? - అంటే 'డ్వెలప్' - Explain.

**A:** dlvelop - దీంట్లో ' గుర్తు v మీద ఉంది కాబట్టి, v నొక్కి పలకాలి.

డివెలప్ - 'వె' నొక్కి పలకాలి. (వత్తక్షరం కాదు).

**Q:** as per / according to - Explain.

**A:** As per = According to = ఆ ప్రకారం

As per the orders of the Govt. = ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం

**Q:** She was super when I was having problems -I saw this example in Oxford Dictionary.

**A:** You can use, 'have' in the continuous tense with 'problem'.

*Veera Pratap Chaturvedi, Vijayawada.*

**Q:** A car had hit him and knocked him into his friend - Translate into Telugu.

**A:** A car hit him. He fell on his friend (But the sentence is not correct. The correct sentence is the one above)

**Q:** ఆయన చాలా పట్టుదల గల మనిషి - Say in English.

**A:** He is a man of determination.

**Q:** కొంతమంది ఆకలిని తట్టుకోలేక ఏడుస్తూ ఉంటారు - Say in English.

**A:** Some cry unable to bear hunger.

**Q:** Unlikely - means what?

**A:** Unlikely = may not happen/ జరిగే అవకాశం లేదు.

**Q:** :, :- For example conjunction: / conjunction:-

Explain when the above underlined are used.

**A:** : , :– , ఏదైనా వాడవచ్చు అయితే ఈ రోజుల్లో ఎక్కువగా ':' వాడుతున్నారు.

**Q:** Neither he has come to see nor has he made a call to me - Can't we say/ write nor he has made a call to me?

**A:** The correct sentences are:

Neither has he come to see me nor has called me. OR

He has neither come to see me nor has called me.

(The sentence you've written is wrong)

**Q:** ఆయన కాలు విరిగింది - His leg broke/ His leg was broken - Say the correct one.

**A:** Both are OK. You can also say, He broke his leg.

*Y. Gayatri, Asifabad.*

**Q:** కిందివాటి అర్థాలు వివరించండి.

Triathlons, Outlive, Profound crisis, Predatory career, Wind surfing,

**A:** Triathlon = మూడు క్రీడల్లో, ముఖ్యంగా ఈత, సైక్లింగ్, పరుగు - ఈ మూడు పందేల్లో కలిపి, ఒక్కొక్క జట్టు నుంచి ఒకరే పోటీ చేయడం.

Outlive = ఒకరి మరణం తర్వాత వారికి సంబంధించిన వాళ్లు బతికి ఉండటం (survive).

He outlived his wife by two years = ఆయన భార్య మరణం తర్వాత ఆయన రెండేళ్లు బతికాడు.

Profound crisis = ఘోర విపత్తు (Profound - అసలు అర్థం, గాఢమైన / ప్రగాఢమైన).

Predatory career = నిస్సహాయులను ధనార్జనకూ, లైంగిక అవసరాలకు వాడుకోవడం పనిగా పెట్టుకోవడం.

(Predatory - ఇంకో అర్థం- ఇతర జంతువులను తినే జంతువులు - సింహం, పులి, తోడేలు లాంటివి).



Wind surfing = సముద్రపు అలల మీద పాదాలకు చెక్క పలకలు కట్టుకుని తేలియాడే క్రీడ.

**Q:** కింది ఆంగ్ల అనువాదాలు కరక్టేనా?

1. భోజనం ఇక్కడే దొరుకుతుందా?
   How about Meals.
2. అతడు నాతో రావడానికి నిరాకరించాడు.
   He refused to come with me.
3. వారు దాన్ని తీసుకోవడానికి నిరాకరించారు.
   They refused to take it back.
4. ఆమె నాట్యమాడ నిరాకరించింది.
   She refused to dance.
5. అతడు లోపలికి రావడానికి నిరాకరించాడు.
   He refused to come inside.
6. నేను ఆస్ట్రేలియా నుంచి వస్తున్నాను.
   I am from Australia.
7. నేను రేపు మా స్నేహితుడిని తీసుకురావడానికి రైల్వే స్టేషన్ వెళ్లవలసి వస్తుంది.
   Tomorrow I will have to go to Rly. station to receive our friend.
8. దయచేసి నాకు ఆ ఉత్తరం చదివి వినిపించండి.
   Please read out this letter to me.
9. ఉత్తమాటలు వద్దు, చేతల్లో చూపించు.
   Don't say but act.
10. అతడు నోరు మూసుకొని నిలబడ్డాడు.
    He stood speechless.
11. మిమ్మల్ని కలవడం నాకు చాలా సంతోషంగా ఉంది.
    I am very glad to meet you.
12. ఆ బస్సు మార్కెట్‌కు వెళుతుందా?
    Is this bus goes to market?

**A:** 1. Do we get meals there?/ How about meals there?

2 to 5: correct.

6. నేను ఆస్ట్రేలియా నుంచి వస్తున్నాను = I am coming from Australia.

I am from Australia = మాది ఆస్ట్రేలియా.

7 & 8: correct.

9. Don't talk, but do

10. He stood silently. (Speechless - used only when some one is unable to speak because of shock/surprise).

11. correct

12. Does this bus go to market?

# *Does* this bus go to market?







M. SURESAN

*Sana, Saleem Khureshi, Kazipet.*

**Q:** ఈ పుస్తకం మూడు సంవత్సరాల క్రితంది. Translate into English.

**A:** This book is three years old.

**Q:** White coloured clothes/ white colour clothes- which one correct?

**A:** White coloured clothes.

**Q:** He is understood/ I am understood/ Are you understood?

వీటికి అతడు అర్థం చేసుకొని ఉన్నాడు/ చేసుకొన్నాడు, నాకు అర్థం అయ్యింది. నీకు అర్థం అయ్యిందా? అని చెప్పొచ్చా? ఎందుకంటే... మీరు Previous lessons లో He is determined - అతడు నిర్ణయించుకొని ఉన్నాడు అని చెప్పారు. వివరించండి.

**A:** He is understood = Somebody/ he/ she understands/ I/ you/ we/ they understand him.

is / am / are } understood = passive voice - అతడు/ నేను అర్థం చేసుకోబడతాను.

నువ్వు అర్థం చేసుకోబడతావా? మామూలు తెలుగు - అంటే ఇతరులు అతడిని/ నన్ను అర్థం చేసుకుంటారు/ నిన్ను ఇతరులు అర్థం చేసుకుంటారా?

He is determined - నిర్ణయంతో ఉన్నాడు అనే అర్థం వస్తుంది. Determined ఇక్కడ verb కాదు, Adjective; అర్థం- గట్టి నిర్ణయంతో ఉండటం. అందుకని He is determined - ఇందులో determined, verb లో భాగం కాదు. ఇక్కడ verb, 'is'. He is determined = గట్టి నిర్ణయంతో ఉన్నాడు (He is tall లో tall లా - tall Adjective కదా. అలాగే determined, adjective) Determine, verb గా కూడా వాడవచ్చు

**Q:** He is better than any other/ any student in the class- translate above in Telugu.

**A:** He is better than any other student = అతడు ఏ ఇతర విద్యార్థికన్నా మెరుగు. (ఈ sentenceలో 'అతడూ' student ఇతరులూ students. He is better than any student = ఏ విద్యార్థికన్నా కూడా అతడు మెరుగు. (అతడు student కాదు)

## All that you *need to do is...*

FUNCTIONAL ENGLISH

**Tulasi:** Do you need any money? If you do, please let me know. (నీకేమన్నా డబ్బు అవసరమా? అయితే నాకు తెలియపర్చు.)

**Sanjana:** I don't need any, right now. What I need most now is a steady job. (ప్రస్తుతం డబ్బేం అవసరం లేదు. నాకిప్పుడు అవసరమైందల్లా నిలకడగా ఉండే ఉద్యోగం.)



**Tulasi:** Is there anything I can do? (నేను నీకు చేయగలిగిందేమన్నా ఉందా?)

**Sanjana:** Yea. All that you need to do is just introduce me to your cousin in Softech Company. Don't worry. You need not recommend me. (ఉంది. నువ్వు చేయాల్సింది Softech company లో ఉన్న మీ cousin కు పరిచయం చెయ్యి. భయపడకు. నువ్వు నన్నేమీ సిఫారసు చేయనక్కరలేదు.)

**Tulasi:** What need I to recommend you? I know you deserve any job they can offer. (నిన్ను సిఫారసు చేయాల్సిన అవసరం ఏముంది? వాళ్లివ్వగలిగిన ఏ ఉద్యోగానికైనా నువ్వు అర్హురాలివే.)

**Sanjana:** Thank you for the high opinion of me. Do that and I don't ask for anything more. (నీకు నామీదున్న అభిప్రాయానికి thanks. అది చెయ్యి. అంతకంటే నేనేమీ అడగను.)

★ ★ ★

ఇప్పుడు మనం 'need' ఉపయోగం చూద్దాం.

***Look at the following sentences from the conversation above:***

1) Do you need any money?

2) I don't need any, right now.

3) All that you need to do is, just introduce me to your cousin.

We study here the uses of need as a verb ('need'కు verb గా ఉండే ఉపయోగాలు తెలుసుకుందాం).

Need = చేయాల్సిన అవసరం ఉన్న. (Needను రెండు విధాలుగా వాడతాం - ఒకటి, main verb గా, ఇంకోటి, helping verb గా) Now look at the following:

**a) Lalith:** Why do you need anybody's help? You can do it yourself. (ఇతరుల సాయం నీకేమ వసరం? నువ్వే చేసుకోగలవు కదా? )

**Lakshman:** If I can do it on my own, why do I need others' help? Only because I need it, I am looking for it. (నేను చేసుకోగలిగితే ఇతరుల సహాయం అవసరం ఏం ఉంది? అది అవసరపడింది కాబట్టే నేను దానికి చూస్తున్నాను.)

'Need' ఈ ఉదాహరణలో అవసరం కలిగి ఉండటం అనే అర్థంతో వాడాం.

**b) Mahitha:** We should not have allowed him to go. We can't find him again. (మనం అతడిని వెళ్లనివ్వాల్సింది కాదు. మళ్లీ అతడిని కనుక్కోవడం కష్టం.)

**Snehitha:** Regretting the past is not what is needed now. What is needed now is a clear idea of what we should do. (గతం గురించి చింతించడం కాదు ఇప్పుడు అవసరం. ఇప్పుడు అవసరమైంది, మనమేం చేయాలనే విషయంలో స్పష్టత.)

గమనిక: Example (b) లో need passive form లో అంటే 'be' form + past participle form లో వాడాం.

'Need' ప్రత్యేకత, మనం needను main verb గానూ వాడతాం, Helping verb (Auxiliary verb/ modal) గానూ ఉపయోగిస్తాం. Modal verb గా need వాడకం మన సంభాషణకు మంచి శక్తినిస్తుంది. వచ్చేసారి అది చూద్దాం.



**M.K.Rao, Visakhapatnam.**

**Q:** కింది వాక్యాలను ఇంగ్లిష్ లోకి అనువదించగలరు.

1. నీకు మంచి ఎకడమిక్ ఎక్సలెన్స్ ఉంటే, నీకు ఉద్యోగం వచ్చేసినట్లే!
2. నేను నీకు phone చేస్తే, నేను నీతో స్నేహం కొనసాగిస్తున్నట్లు, phone చేయకపోతే మన మధ్య స్నేహం లేనట్లు/ లేనట్లే!
3. నీకు మంచి గాత్రం గాని ఉంటే గనక, నీకు... మరి... మంచి పేరు ప్రఖ్యాతులు వచ్చేస్తాయనుకో.
4. ఆమె చాలా అందంగా ఉంది - అందం అంటే అందం కాదనుకో.
5. అందం అంటే అందం కాదు.
6. ప్రణబ్‌ముఖర్జీ ఎన్నో రాష్ట్రపతి?
7. అమెరికా వెళ్లడానికి ముందు రోజు నాకు ఇక్కడ మంచి ఉద్యోగావకాశం వచ్చింది - అంటే... రేపు అమెరికా వెళతాననగా ఈ రోజు నాకు ఉద్యోగం వచ్చింది.
8. మా ఇంటి ముందు ఒక కొండ ఉంది - కొండ అంటే కొండ కాదు గాని... చిన్న గుట్ట అన్నమాట.
9. ఆయన మొత్తం కథ అంతా చెప్పుకొచ్చాడు.
10. పేదవారికి చేతనైతే మేలు చేయి అంతేగానీ వారిని మోసం చేయకు.

**A: 1.** If you have an excellent academic sense, you've got the job.

**2.** If I call you again, we are still friends and if I don't, we are no longer friends/ you can assume we aren't friends any more.



**3.** If you have a good voice, you can take it for granted you are going to get name and fame.

**4.** She is really beautiful - not just beautiful, even more than that.

**5.** ... not just beauty.

**6.** ఈ question గతంలో చాలామంది అడిగారు. దీనికి English లేదు. A rough translation: Where does Pranab came in the line of Presidents?

**7.** A day before - just the day before I was to leave for America, I had got a job here.

**8.** Our place faces a hill, not exactly hill, you can call it a hillock.

**9.** He took me through the whole course of the story/ He set about narrating the whole story.

**10.** Help the poor if you can, but don't cheat them.

# The school day is *coming up*





M. SURESAN

**A Reader, Vijayawada.**

**Q:** కింది expressions ను తెలుగులో ఒక ఉదాహరణతో వివరించండి.

1. Last straw
2. Hits nail on the head
3. Vice like grip of
4. On the wane
5. Dichotomy 6. Cast in stone

**A: 1.** Last straw = చివరి కారణం

a) The last thing that causes something: a) The company had already been making losses, and the fire accident was the last straw = ఆ కంపెనీ అంతకు ముందే నష్టాల్లో ఉంది, ఆ అగ్నిప్రమాదంతో దాని పతనం పూర్తయ్యింది.

b) I lost my books, and now I've lost my hall ticket. This is the last straw. (అసలే నా పుస్తకాలు పోయాయి. ఇప్పుడేమో నా హాల్‌టికెట్ పోయింది. దీంతో నా కష్టాలు పూర్తి - Last straw).

**2.** Hits nail on the head = Do/ say the right thing. You hit the nail on the head when you say that most Indians are corrupt.

**3.** Vice-like grip = Hold something strongly = ఉడుంపట్టు /గట్టిగా పట్టుకోవడం - He held her neck in a vice-like grip = ఆమె మెడను అతడు గట్టిగా పట్టుకున్నాడు.

**4.** On the wane = decreasing. His influence is on the wane = ఆయన పలుకుబడి క్షీణిస్తోంది.

**5.** The separation/ The diffence between two opposite things = వైరుధ్యం - The dichotomy between what our ministers say and what they do, is really shocking = మన మంత్రుల మాటలకూ చేతలకూ ఉండే వైరుధ్యం మనకు దిగ్భ్రాంతి కలిగిస్తుంది.

**6.** Cast in stone = carved in stone = figure out in stone = (శిల్పాల్లాంటివి) రాతితో చెక్కిన. అయితే Cast అసలు అర్థం, పోత పోయడం, విగ్రహాల్లాంటివి. రాతితో మలిచేదైతే, Carved in stone అంటాం.



# ప్రతిభ

**P. Srinivas, Karimnagar.**

**Q:** SET అనే పదానికున్న అర్థాలను ఆయా సందర్భాల్లో ఉదాహరణలతో వివరించండి.

**A:** Refer to a good dictionary.

**Q:** 'Beat the heat with prolyte' దీని అర్థం ఏమిటి?

**A:** Use 'Prolyte' and feel cool - ప్రొలైట్ వాడి వేడిని జయించండి.

**Q:** What is the difference among - Talent school, Corporate school, Grammar school, Heritage school, Public school, Digital school?

**A:** Talent school, corporate school, Grammar school, Heritage school, Public school - all private management schools run for profit - లాభార్జన కోసం నడిపే ప్రైవేట్ పాఠశాలలు - ప్రభుత్వ/ జిల్లా పరిషత్/ పంచాయతీ పాఠశాలలు కానివి.

Digital schools - System of teaching, in which electronic devices like TV, computer, Email etc are used. (ఎలక్ట్రానిక్ పరికరాల సాయంతో బోధనా పద్ధతి - digital school).

**Q:** What is the difference among - Beautiful, cute, pretty, nice, handsome?

**A:** Beautiful = Pretty (Small things that are beautiful) = Cute = Very attractively beautiful, specially girls and children (ముద్దొచ్చే) - but used for anything that is attractive; = Nice (beautiful in appearance and good at behaviour).

Handsome - Good looking (అందంగా ఉన్న) ముఖ్యంగా పురుషుల విషయంలో వాడతాం ఇది. Beautiful for women, and 'handsome' for men. We sometimes use 'handsome' for women too, meaning a woman who is beautiful but looks strong and large rather than small and attractive.

**Q:** What is the difference between M.S. and M.D. in doctor's qualification?

**A:** M.S. = Master of surgery - a doctor specially trained in doing operations.

M.D. = Doctor of Medicine - One who usually does not do operations.

**Q:** Up, Out, Off, On, Over పదాలకు అర్థాలు తెలపండి. కింది Phrasal verbs ను తెలుగులో వివరించగలరు.

Coming up, Play on, Dress up, Dress on,

**A:** Refer to the dictionary for the meaning and use of these words. I am explaining only the phrases here:

1) Coming up = (Of an event, ముఖ్యమైన సందర్భాల్లాంటివి - School day, College day, Inauguration, లాంటివి) = Going to happen soon.

**e.g.:** The school day is coming up = స్కూల్ వార్షికోత్సవం త్వరలోనే జరగబోతోంది.

2) Play on - continue to play

3) Dress on - ఈ మాట లేదు

4) Dress up = to wear clothes - ప్రత్యేక సందర్భాలకు - ప్రత్యేకమైన దుస్తులతో ముస్తాబవడం

# I know him *fairly well...*

**Jaideep:** (Would you) mind joining us for breakfast? (మాతో break fast కు రావడానికే మన్నా అభ్యంతరమా? )

**Pramod:** Where are you going? (ఎక్కడికెళ్తున్నారు? )

**Jaideep:** A place where you get the best of breakfasts. Every thing to your choice and taste (మంచి ఫలహారాల్లో ఉత్తమమైంది దొరికే చోటది. నువ్వు ఎంచుకున్నదీ, నీ రుచికి తగిందీ).



**Pramod:** I'd certainly go with you. Where is it? (నేను మీతో వస్తా. ఎక్కడుందది? )

**Jaideep:** Fairly near, just a kilometre off. Walking that distance will do us good, especially in the morning. (కాస్త దగ్గరే, ఒక కిలోమీటర్ మాత్రమే.)

**Pramod:** I'd (I would) rather not then. I am in no position to walk any more. I've (I have) walked enough for the day this morning on my morning walk. (అయితే నేను రానులే. నేనింక నడిచే స్థితిలో లేను. ఈ రోజుకు చాలినంత నడిచా, పొద్దున నడకలో)

**Jaideep:** Yea. You do look rather tired but fairly hungry too. But join us for breakfast you must. Go to the place on bike and wait for us there. (అవును. నువ్వు కాస్త అలసినట్టుగా, అయితే కొంచెం ఆకలిగా కనిపిస్తున్నావు. కానీ మాతో breakfast తీసుకోవాల్సిందే. నీ bike మీద అక్కడికి వెళ్లి, మా కోసం ఉండు).

**Pramod:** How long might you take? (ఎంతసేపు పట్టొచ్చు మీకు? )

**Jaideep:** Pretty soon. We are quite fast walkers you know. (త్వరలోనే. మేం మంచి వేగంగా నడిచేవాళ్లమే కదా? )

✪ ✪ ✪ ✪ ✪

**Notes:** 1) to somebody's choice and taste = ఒకరి ఎంపికకు తగినట్టుగా, అభిరుచి/ రుచికనుగుణంగా.

**e.g.:** You didn't like that movie, I know. But this is to your taste = ఆ సినిమా నీకు నచ్చలేదు. నాకు తెలుసు, కానీ ఇది నీకు నచ్చేదే/ నీ అభిరుచికి తగిందే.

2) Place = మామూలు అర్థం - చోటు. ఇతర అర్థాలు: ఒకరి ఇల్లు/ నివాసం (One's place), Hotel/ restaurant లాంటివి.

3) How long = ఎంతసేపు? 4) How far = ఎంత దూరం? 5) How good? = ఎంత మంచి? /ఎంత ఉపయోగం? (useful)

***Now look at the following sentences from the conversation above:***

1) Fairly near
2) I'd (I would) rather not then
3) You do look rather tired but fairly hungry too
4) We are quite fast walkers
5) Pretty soon

మన conversation (సంభాషణ)లో చాలా తరచూ fairly, quite and rather వాడుతుంటాం. వాటి ఉపయోగం తెలుసుకుందాం.

ముఖ్యంగా తెలుసుకోవాల్సింది: fairly and rather. ఈ రెంటికీ అర్థం చాలావరకు, అని. అయితే చాలా ముఖ్యమైన తేడా, 'fairly' మంచి విషయాలకూ, 'rather' భావ్యంకాని వాటికీ వాడతాం.

**e.g.:** He is fairly tall X He is rather short (అతడు పొడుగే, ఫర్వాలేదు) × (అతడు పొట్టే)

**a) Prajval:** How did he do in the exam yesterday? (నిన్న అతడు పరీక్ష ఎలా రాశాడు? )

**Udai:** Fairly well. (బాగానే రాశాడు. ఫర్వాలేదు).

**b) Ahmed:** You know him, don't you? (నీకతడు తెలుసు కదా? )

**Devanand:** I know him fairly well but I can't say we are close. (ఫరవాలేదు. అతడు బాగానే తెలుసు నాకు, కానీ మేం సన్నిహితులమని అనలేను).

ఏదైనా మంచి విషయం కాస్త బాగానే ఉంది అనేందుకు fairly వాడతాం.

His chances of winning are fairly good = అతడు గెలిచే అవకాశాలు కాస్త బాగానే ఉన్నాయి.

## FUNCTIONAL ENGLISH

fairly - some కు ఎక్కువ, very కి తక్కువ.

Rather - కాస్త - fairly ని మంచివాటికి వాడినట్టు, rather మనకిష్టంలేని విషయాలకు, కాస్త ఎక్కువే అనే అర్థంతో వాడతాం.

'fairly' refers to a positive or pleasant idea; 'rather' for a negative or unpleasant idea.

**a) Peter:** I hope the exam will be fairly easy (పరీక్ష కాస్త సులభంగానే ఉంటుందని ఆశిస్తున్నా).

**Bhaskar:** No, I am sure it's going to be rather tough (ఏంలేదు. అది కాస్త కష్టంగానే ఉంటుందని నా నమ్మకం).

**b) Vinod:** How is your father now? (మీ నాన్న గారెలా ఉన్నారు? )

**Rafi:** Still rather ill. (ఇంకా కాస్త జబ్బుగానే ఉన్నాడు).

**c) Irfan:** What are you complaining about? (దేని గురించి నసుగుతున్నావు? )

**Zaheer:** The food in the restaurant you took me to was rather badly cooked. My stomach is upset. (నువ్వు నన్ను తీసుకెళ్లిన హోటల్‌లో భోజనం అంత బాగా వండలేదు. నా కడుపు తిప్పు తోంది.)

మన conversation లో fairly, rather సరిగా వాడదాం.



*Chandana Malhothra, Srikakualm.*

**Q:** All the students are fortunates for having a teacher like you - Say whether the above sentence is correct or not.

**A:** All the students are fortunate to have a...

**Q:** ఆ Stapler ఆమెది కాదు అందుకే ఆమె దాన్ని పాడు చేస్తోంది = It is not her stapler thats why she is spoiling it- Say whether above correct or not.

**A:** It ........ her stapler. That's why.... it.

**Q:** ఆ బండిలో (bike) petrol పోయించు - How to say this in English?



**A:** Fill the vehicle.

**Q:** Did you see them/ Had you seen them when/ at the time of your closing your shop/ when you were closing your shop - Say the correct one.

**A:** Did you see them when you were closing your shop?/ at the time of your closing your shop?

**Q:** He is going on/ He goes on smoking/ He will be going on smoking - Explain.

**A:** Both are correct.

He goes on smoking - Regular/ now.

He will be going on smoking - some time in future.

*Brajeshwar Lal Bhatia, Hyderabad*

**Q:** You have to go to market to bring some vegetables after completion of your exam tomorrow - can this be said?

**A:** You have to go to market after your exam/ after your exam is over.

**Q:** Come fast - Say the question tag.

**A:** Won't you?

**Q:** Having their/ they gone, I feel relief - Is this correct?

**A:** They have gone and I feel relieved/ I feel relieved they have gone.

**Q:** ఆ class కి English ఎవరు బోధిస్తారు? - Say in English.

**A:** Who teaches that class English?

**Q:** ఆయన వచ్చి ఎంతసేపయ్యింది? - Say in English.

**A:** How long is it since he came?

**Q:** I won't stop you from entering the class - Is this correct?

**A:** Correct.




# What are *French Windows?*




M. SURESAN

*Mayuri Natarajan, Rajahmundry.*

**Q:** Are you understood/ Do you understand? - Please explain.

**A:** Are you understood = మీరు/ నువ్వు అర్థం చేసుకోబడ్డావా? (ఇది Passive. మామూలు తెలుగు - నిన్ను/ మిమ్మల్ని అర్థం చేసుకున్నారా వాళ్లు).

**Q:** In a programme the announcer announces: This programme (of 10th class) is followed by the programme of 9th class - అంటే 10th class programme అయిపోయిన తర్వాత 9th class programme ఉంటుంది. - Is the announcer right?

**A:** Right

**Q:** Subject - Please explain the uses of the underlined word with examples in Telugu.

**A: Subject:** 1) The subject of a sentence - వాక్యం దేన్ని గురించి చెబుతుందో అది ఆ వాక్యం subject.

2) The person/ a thing being discussed - మనం చర్చించే విషయం and

3) The subject of studies in school/ college - **e.g.:** Maths, Physics, Social Studies, etc.,

**Q:** We will be having exams - can this be used?

**A:** Correct.

*Sreeja Goyal, Hyderabad.*

**Q:** Ashok went from Lucknow to Chennai - Is this correct? If it is not, please say the correct one. Can we write the above sentence like Ashok went to Chennai from Lucknow?

**A:** Both are correct



**Q:** ఆ పేపర్‌లో exam రాయండి - How to say in English?

**A:** Write your answer on that paper/ on that sheet of paper/ on those sheets of paper.

**Q:** First of all you decide your place/ room where to be seated/ to be sitting - Say the correct one.

**A:** What you want to say is not clear from your sentence. The correct form of your sentence is:

First of all decide where/ in which room to sit/ to be seated.

*Gadepalli Subrahmanyam, Vizianagaram.*

**Q:** What exactly are French Windows? Are there English windows too?

**A:** A french window, is NOT exactly a window. It is a doorway leading into a garden around a house or a yard.

2) There is no 'English window'.

*P. Srinivas, Ammakkapet, Karimnagar.*

**Q:** కింది Phrasal verbs ను తెలుగులో వివరించగలరు.

Take off, Send off, Close up, Brings up, Hurry up, Set up, Carry on, Carry out, Cut off, Lock out, Get out, Put up, Open up, Sum up, Thumbs up, Wake up, Bind over, Over come.

**A:** Refer to the dictionary for the meaning and use of these words. I am explaining only the phrases here:

1) Take off = తీసేయడం, ముఖ్యంగా దుస్తులు. ఇంకా చాలా అర్థాలున్నాయి, వివిధ సందర్భాల్లో వాడేవి. అవి ఇక్కడ వివరించడం వీలుకాదు.
2) Send off = వీడ్కోలు పలకడం
3) Close up = సమీపించడం
4) Bring up = పెంచడం (పిల్లల్ని)
5) Hurry up = రా త్వరగా
6) Set up = arrange = ఇంకా ఇతర అర్థాలు చాలా ఉన్నాయి
7) Carry on = continue
8) Carry out = నిర్వర్తించడం (Carry out orders)
9) Put up = to lodge/ బస చేయడం/ to stay
10) Sum up = సారాంశం చెప్పడం
11) Thumbs up = OK అంతా సరిగా/ సిద్ధంగా ఉంది.
12) Bind over = బాధ్యులుగా చేయడం
13) Overcome = కష్టాల్లాంటివి అధిగమించడం

ఇక్కడ ఇవ్వని మాటలు, చాలా సులభమైనవి, Dictionary చూసి తెలుసుకోండి, దయచేసి.

*A Reader, Vijayawada.*

**Q:** కింది expressions ను తెలుగులో ఒక ఉదాహరణతో వివరించండి.

1. Coaxes 2. Distort
3. Hit the deck tracks
4. Stormy weather
5. Put the pieces together
6. Taboo
7. Parochial mindset
8. Sacred cow 9. Half baked
10. Tread the trodden path
11. Called stumps on (in cricket)
12. Push the envelope (in cricket)
13. On song (in cricket)
14. Paradigm shift
15. Back to back runs
16. Laughs off
17. Take on 18. London dream
19. Rubkin's cube
20. Mere 21. Attributed
22. Cribbed barred and moored
23. Play one's cards well
24. Big clout 25. Settle one's score
26. Patronage 27. Scoffing at
28. French Kiss.

**A: 1.** Coaxes = Persuade = బుజ్జగించడం. He coaxed me into going to a movie with him = నన్ను బుజ్జగించి సినిమాకి తీసుకెళ్లాడు.




The mother coaxes the child into eating.

**2.** Distort = Spoil out of shape = రూపుమారేంతగా పాడు చేయడం (తెలుగు slangలో షేపు మార్చేయడం అంటారు).

The media often distorts truth = మీడియావాళ్లు నిజాన్ని వక్రీకరిస్తారు.

**3.** No such expression

**4.** Stormy weather = Cyclonic weather

**5.** No such expression as a phrase/ phrasal verb (Put something together = collect all parts of a thing and join them)

**6.** See the dictionary

**7.** Parochial mindset = Interested in only in your area, giving importance only to it. (eg: People of a state in India showing interest only in their state).

**8.** Sacred cow = Innocent person

**9.** Half baked = Not properly thought of = సరైన ఆలోచనలేని.

**10.** Tread the trodden path = Following old methods/ thinking like all others/ No new ideas

**11.** Called stumps on (in cricket) = Call stumps on = retire from cricket

**12.** Push the envelope (in cricket) = Try to do more than what people think can be done. (అసాధ్యమనుకున్నవి చేసేందుకు ప్రయత్నించడం)

**13.** On song (in cricket) = Making good progress (Not only in cricket but in any other activity)

**14.** Paradigm shift = Change of model

**15.** Back to back runs = singles

**16.** Laughs off = Not take seriously (పట్టించుకోకపోవడం/ తేలిగ్గా తీసుకోవడం)

**17.** Take on = See dictionary

**18.** No such expression

**19.** Rubkin's cube = రంగు రంగుల చదరాలతో ఎటు కావాలంటే అటు తిప్పడానికి వీలుండే చిన్న చిన్న ఘనాల (Cubes) తో కూడి ఉండే ఆట. మీరు చూసే ఉంటారు.

**20 and 21:** See the dictionary

**22.** Cribbed barred and moored = Not given freedom

**23.** Play one's cards well = Make good use of what a person has

**24.** Big clout = A lot of influence

**25.** Settle one's score = Take revenge

**26, 27.** See dictionary

**28.** French Kiss. = Lips open and only tongues kiss

*Rajeshwar Ithihas, Adilabad.*

**Q:** By and large - Explain

**A:** By and large = Mostly/ generally

By and large the food in the restaurant is good (ఆ హోటల్ మొత్తం మీద బాగానే ఉంటుంది).

**Q:** నా బండిలో petrol పోయించు - You get my bike petrol poured - Is this translation correct?

**A:** Have my bike filled/ fill the bike.

**Q:** I insisted that he come/ comes/ came out with truth- Say the correct one.

**A:** I insist that he come out with the truth.

**Q:** I have to have my son an injection given - Can't this be said instead of saying - I have to have my son given an injection?

**A:** I have to have my son given an injection.

**Q:** In a lesson you wrote "Before Baird made it there was no T.V." Here "had been" - should have been there instead of the above underlined - Clarify.

**A:** When you use 'before' and the earlier verb is a 'be' form, 'was' is OK.

*John Philips, Kakinada*

**Q:** The rooms were dirty and had practically no light except the light of the candle - Say the meaning of the above underlined.

**A:** Practically = almost (దాదాపు)

**Q:** Our certificates show what we have studied but they don't show what our knowledge is - Can it be said? If it is wrong please correct it.

**A:** "... how much knowledge we have" is better than, 'what our knowledge is'.

**Q:** Say the difference between 'Knowledge' and 'Wisdom' in Telugu.

**A:** Knowledge = విజ్ఞానం. ప్రపంచంలో చదవడం వల్ల, ఇతర సాధనాల వల్ల మనం తెలుసుకునే విషయాలు.

Wisdom = మనకున్న విజ్ఞానంతో, అనుభవంతో తెలివైన నిర్ణయాలు తీసుకునే శక్తి.



***Surya, Amalapuram***

**Q:** Link verb - అర్థం ఏమిటి? ఉదాహరణలతో వివరించగలరు.

**A:** Refer to previous lessons.

**Q:** మీరు ఈ కారులో రండి. నేను ఆ కారులో వస్తాను - Say in English.

**A:** You come by this car, and I'll come by that/ the other car.

**Q:** Australia plays the best/ Australia plays the best of all other teams. Australia plays the best of all teams/ Australia plays the best than any other team - Say the difference among the all above sentences.

**A:** Australia plays the best of all (teams) - correct. The other sentences are all wrong.

**Q:** A.P. is the bigger than any state/ than any other state - Please say the difference.

**A:** AP is bigger than any other state in India - correct - 'bigger than any state' is wrong.

**Q:** Cricket is a/ the costlier game/ play/ sport than any other game/ games / play / plays/ sport/ sports - please clarify the difference.

**A:** Game - a sport in which two teams contest - cricket/ football/ tennis, etc.



Sport - an event in which any number can participate - running race, high jump, long jump etc.

Play - the act of playing eg: Play some game.

Cricket is costlier than any other game.

***Fateh Khan, Kazipet***

**Q:** I refuse to accept the cynical notion that nation after must spiral down a militaristic stairway into the hall of thermonuclear destruction - Say in Telugu.

**A:** ప్రపంచ జాతులన్నీ ఒకదాని తర్వాత ఒకటి అణు ఉత్పాదిత ఉష్ణం వల్ల కలిగే వినాశనానికి మెట్టు మెట్టుగా దిగాలనే వాదాన్ని నేను అంగీకరించను.

**Q:** Whose struggles with and for his people, are still met with the most brutal expression of man's in humanity to man - Translate into Telugu.

**A:** తన వారితో తన వారికోసం తను చేసిన పోరాటాలను మానవుల పట్ల మానవులకున్న అమానుషంతో ఎదుర్కొంటున్నారో... (మీది పూర్తి వాక్యం కాదు).

**Q:** So many hotels resemble each other/ one another which is the right one?

**A:** One another - correct, because 'so many' means more than two.

**Q:** Cynical - say the meaning.

**A:** Cynical means not hoping for any good happening.

**Q:** I am seeing a doctor.

The words like see, look, understand, etc are not used in present progressive tense then how is the above sentence correct?

**A:** Here 'see' means 'meet', and not something appearing to us, so it is correct.

# I am *seeing* a doctor





M. SURESAN

***Sunaina, Pooja, Rajahmundry.***

**Q:** They mounted/ rode/ climbed the horse - Say the correct one.

**A:** 1) They mounted the horse = They climbed the horse.

They rode on the horse = They went riding.

**Q:** They rode almost neck to neck - Say in Telugu.

**A:** They rode nearly at the same speed. (దాదాపు సరిసమానమైన వేగంతో గుర్రాలను దౌడు తీయించారు).

**Q:** ఆయన చేయి/ కాలు విరిగింది.

**A:** He broke his hand/ leg

**Q:** ఆయన Shirt కి దుబ్బు అంటింది/ అంటుకుంటుంది/ అంటుకుంటది.

**A:** His shirt has/ will have dirt marks on it.

**Q:** నా చేయి/ కాలు తిమ్మిరి పట్టింది/ పడుతున్నది/ పడుతది - Translate into English

**A:** My hand/ leg is benumbed/ it getting benumbed/ will be benumbed.

**Q:** Father reads news paper - can the above underlined word be used without an article before it?

**A:** When the speaker refers to their own father, they can say, 'father'

**Q:** Has a ghost entered his body - ఆయనకు దయ్యం పట్టిందా? is this right?

**A:** Is he possessed?

**Q:** His friend tried to reason with him - Say in Telugu.

**A:** His friend tried to make him understand what was wrong/ right by talking to him logically.

***R. Pitchaiah Sastry, Khammam.***

**Q:** He must have known I have got my cell repaired/ I did know the answer - Say if the above can be/ are used in Spoken English.

**A:** They can be/ are used in Spoken English.

**Q:** Say the Indirect speech of the following sentence "I am to go", He said

**A:** He said he was to go.

**Q:** You can have it said by him - ఆయన దగ్గర మీరు చెప్పించుకోవచ్చు - అంటే మీకు నేను చెప్పిన Grammar అర్థం కాకపోతే మీరు ఆయన దగ్గర చెప్పించుకోవచ్చు - Say whether the above one is correct?

**A:** You can have it taught by him (not said by him).

***Raahela Parveen, Narkatpally.***

**Q:** Please say the difference between Adjectives of Quantity/ Adverbs of Quantity.

**A:** Adjective of quantity - Words of number or quantity before / after a noun, are adjectives of quantity. eg: Some students, many books, etc.

Adverbs of quantity - Words of quantity before /after a verb / adjective.

He played a lot better today.

**Q:** Is the word backward(s) adverb or adjective? - Clarify.

**A:** It can be both: Backward movement - Backward - Adj.

He moved backward - backward- Adv.

**Q:** Explain about "Link Verbs".

**A:** Refer to previous lessons.

**Q:** Hardly she studies/ She studies hardly - say the difference.

**A:** Hardly she studies - wrong.

Hardly does she study = She studies hardly

**Q:** He is very well - is the underlined word adverb?

**A:** Yes.

**Q:** He therefore left school - Say in Telugu.

**A:** అందువల్ల school మానేశాడు.

**Q:** Explain Be-forms and please let me know all the 'Be-forms'.

**A:** Refer to the earliest lessons on spoken English. Lesson No. 1 to 20, available on the web.

**Q:** He is not the greatest of all musicians - please write other degrees and their use.

**A:** Many other/ most other musicians are as great as he - comparative.

Some other musicians are as great as he. (Positive)

## *Need I do it now itself?*

**Uma:** Nagaraj needed some money and I gave it to him (నాగరాజ్‌కు డబ్బు అవసరమైంది, నేనిచ్చాను అది అతడికి).

**Jagadish:** Why did he need the money? Just the other day he drew some money from the bank. (అతడికి డబ్బెందుకు అవసరమైంది? ఆ రోజే పుడో bank నుంచి డబ్బు తీసుకున్నాడు కదా? )

**Uma:** You need not worry. He will repay it promptly. (నువ్వు ఆందోళన పడనక్కరలేదు. అన్న సమయానికే/ సకాలానికే తిరిగిచ్చేస్తాడు).

**Jagadish:** I am not worried. My point is, need he borrow at all? His dad sends him plenty of money. (నాకేం బాధ లేదు. అసలు అప్పు చేయాల్సిన అవసరం లేదు కదా, అని నా ప్రశ్న. వాళ్ళ నాన్న బాగానే డబ్బు పంపిస్తాడు కదా? )

**Uma:** He is prompt, I told you. You don't need to remind him at all (అతడు సకాలానికి చెల్లిస్తాడు. నువ్వ తడికి గుర్తుచేయాల్సిన అవసరం కూడా లేదు).

**Jagadish:** Uma, you need to understand the point that the more the money he has, the more will he waste it. You need not have lent him the money if only not to let him waste it (ఎంత ఎక్కువ డబ్బుంటే అంత వృథా చేస్తాడనే విషయం అర్థం చేసుకోవాల్సిన అవసరం ఉంది. అతడు డబ్బు వృథా చేయకుండా ఉండేదుకైనా నువ్వు డబ్బు ఇవ్వాల్సిన అవసరం లేదు).

**Uma:** OK. I will make a note of it (సరే. అది గుర్తుంచుకుంటాను).

✪ ✪ ✪

'Need' has two uses- 1) as a main verb, and 2) as a helping verb.

We have seen the uses of need as a main verb in one of our last lessons. Some examples are:

a) I need your help (నీ సహాయం నాకవసరం)

b) He needed some books, and I told him where he could get them (అతడికి కొన్ని పుస్తకాలు అవసరమయ్యాయి. నేను చెప్పాను అవి ఎక్కడ దొరుకుతాయో)

Why did he need your help? (అతడికి నీ సహాయం ఎందుకు అవసరమైంది? )

In all the sentences above, need is a 'main verb'.

***Look at the following sentences from the conversation above:***

1) You need not worry.

2) Need he borrow at all?

3) You don't need to remind him

4) You need to understand the point...

5) You need not have lent him the money

Now study the difference between the following sentences.

a) I need your help (నాకు నీ సాయం అవసరం)

b) I need not take any body's help (నేను ఎవరి సాయమూ తీసుకోనవసరంలేదు)

In sentence (a), the verb is need.

ఇక్కడ 'need' main verb.

In (b), the verb is, 'need take' and 'need' here is a helping verb/ Auxiliary verb / modal verb.

It is important for us to know the uses of 'need' as a main verb, and also as a helping verb. We have already seen the uses of 'need' as a main verb. Let's now know the uses of 'need' as a helping/ auxiliary verb/ modal.

**a) Sankar:** Please stay for some more time here. We need your help (ఇంకాసేపు ఉండండి మీరు. మీ సహాయం మాకవసరం).

**Sekhar:** I need to go home immediately. People are waiting for me. (నేనింటికి వెళ్లాల్సిన అవసరం ఉంది. కొంతమంది నా కోసం చూస్తున్నారు).

We need your help - ఇక్కడ 'need' ఒక్కటే verb. ఇదిక్కడ finite verb.

## FUNCTIONAL ENGLISH

I need to go home- ఇక్కడ 'need' మాత్రమే verb కాదు. need to go కలిపి మొత్తం verb - need, have to/ has to/ had to/ ought to లా verb లో ఒక భాగం మాత్రమే. కాబట్టి ఇక్కడ need to, helping verb మాత్రమే. ఇలాంటి సందర్భాల్లో need to దాదాపు 'must' అర్థాన్ని ఇస్తుంది.

**a) Sagar:** You must do it. (నువ్వది చేయాలి)

**Krishna:** Need I do it now itself? (ఇప్పుడే చేయాల్సిన అవసరం ఉందా? / ఇప్పుడే చేయాలా? )

ఇలా need ను helping verb గా వాడితే must అర్థం వస్తుంది.

**b) Prakash:** Need I (= must I) do it now itself? (ఇప్పుడే చేయాల్సిన అవసరం ఉందా? / చేయాలా? )

**Ganesh:** You need not, now itself. (ఇప్పుడే చేయాల్సిన అవసరం లేదు).

మీరు గమనించే ఉంటారు.

Must X need not.

I must go (నేను వెళ్లాలి) - దీనికి opposite (వ్యతిరేకం) X I need not/ do not need to go (నేను వెళ్లవలసిన అవసరం లేదు)

దీనిగురించి మరికొంత సమాచారం వచ్చే lessonలో.



*Pratibha Mayuri, Khammam.*

**Q:** The song is mixed with/ in the air - please say the correct one.

**A:** The song mixed/ got mixed in the air.

**Q:** ఆయనకు ఆకలేస్తుంది. అంటే ఆయనకు ఆకలిగా ఉంది. - He is hungry/ hunger/ He feels hungry/ hunger - Say the correct one.

**A:** 1) He is/ He feels hungry.

**Q:** Is the word 'whose' used for plural nouns/ pronouns? for e.g. 'The students whose exam is over/ completed are asked to submit their answer sheets.

**A:** Whose - both singular and plural

**Q:** "Where are you?" They asked me - should the underlined capital or small.

**A:** In the sentence, 'Where are you? they asked me, 't' in they should not be a capital letter.

**Q:** మీరు ఇంక exam రాయండి. అంటే వాళ్లిప్పుడు exam రాస్తున్నారు You write/ take your exam now - is this translation correct?

**A:** You can say, 'start writing (your answers)/ start answering'.

**Q:** Please explain the uses of the words 'during' and 'Link verbs' - without asking me to refer to the earlier lessons.

**A:** During - all through a whole period/ at some point of time in the period.

**Eg:** During 2012 - from Jan 1st 2012 to Dec 31st 2012/ at some point(s) of time in the year 2012.

a) He studied here during 2012 - May be the whole of the year/ at some point of time, in the year.

b) He attended the college during 2011-2012: He was a student here during the whole of 2011-12.

### Link Verbs

A link/ linking verb does not add much to the meaning of a sentence. Link verb కు వాక్యం అర్థం మీద అంత ప్రభావం ఉండదు. అది తీసేస్తే sentence ఉండదు. కానీ ఆ group of wordsను మనం అర్థం చేసుకోగలం. Eg: He is a minister. ఇక్కడ 'is' link verb. అది తీసేసి చదివినా- He a minister ఆయన మంత్రి అనే అర్థం మనకు బోధపడుతుంది. ఇలాంటి verbs ను link verbs అంటాం. అన్ని 'be' forms కూడా link verbs అవుతాయి. ఎందుకంటే అవి లేకపోయినా, sentence అర్థం మనకు తెలుస్తుంది.

She was a great singer- ఇక్కడ was ('be' form) లేకపోయినా, అర్థం తెలుస్తుంది.

ii) 'be' forms కాని link verbs కూడా



ఉన్నాయి. అవి, 'appear, seem, become, go, feel, look, prove, remain, taste, smell, etc- ఇవి link verbs గా కాకుండా, action verbs గా కూడా పని చేస్తాయి. appear, seem తప్ప.

He looks angry- He angry- (కోపంగా కనిపిస్తున్నాడు)- looks తీసేసినా అర్థం స్ఫురిస్తుంది.

He looked at the scenery- ఇక్కడ looked, action verb, ఎందుకంటే, looked తీసేస్తే అర్థం ఏం స్ఫురించదు- He at the scenery - meaningless.

The biriyani tastes good - Taste ఇక్కడ link verb, ఎందుకంటే, The biriyani good, అంటే అర్థం ఉంది.

He tasted the biriyani - ఇక్కడ, taste, link verb కాదు. ఎందుకంటే అది లేకపోతే- He biriyani, అర్థం లేదు. ఇక్కడ taste, action verb అవుతుంది.

అలాగే మిగతా verbs కూడా.

**సూచన:** మీరు English సరిగా మాట్లాడేందుకు, link verbs తెలియాల్సిన అవసరం ఏం లేదు కదా? ఇలాంటివి grammar మీద research చేసేవారికి అవసరం.

*Sumanjali Pallavi, Guntur.*

**Q:** "I will do it", he/ He said - ఇక్కడ "he" అనే పదం మొదటి అక్షరం (H/h) capital లో రాస్తారా? లేదా small లోనా? ఎందుకంటే కొన్ని పుస్తకాల్లో 'he' capital లో (He) ఉంది. మరికొన్నింట్లో small (He) ఉంది.

**A:** 'h' in 'he' here should be small and not capital, in your sentence.

**Q:** Is/ are the difination of clause and sentence same? Here 'and' is there so, what is the first word of the above? And also please say whether the two definations are same (i.e.,) clause and sentence) or not.

**A:** 'clause' and 'sentence' are two different things. So the verb should be in plural. The correct question:

*Q:* Are the definitions (not 'definations') of the clause and the sentence the same?

*Ans:* No. A sentence is a group of words with a complete meaning.

A clause is a group of words with a verb.

**Q:** If a person translates Telugu (stories, matters, passages of Telugu language) to English, will his knowledge (English) improved?/ increased?

**A:** Yes. It will.

**Q:** చెట్టుకు కాయలు కాస్తాయా/ ఆకులు కాస్తాయా. దీన్ని English లో ఎలా చెప్పాలి?

**A:** Does a tree bear fruit? (కాయలు కాస్తాయా? )/Put on leaves? (ఆకులు తొడుగుతుందా? )

**Q:** His hand was broken/ broke - say the correct one.

**A:** His hand was broken/ He broke his hand.




**Feroze Shah Zafar, Vizag**

**Q:** Feroze makes Zafar does the work/ do the work. Which is correct?

**A:** 1) Feroze makes Zafar do the work.

**Q:** Comprise/ consisting - Explain.

**A:** Comprise = Consisting of

**Q:** We are taught discipline, punctuality and some other good things besides education - please say if it is correct or not.

**A:** We are taught discipline, punctuality and some other good things besides our subjects of study- correct. ('Teach education' is wrong. You can say impart education but that is a bit scholarly (పాండిత్యం).

**Q:** నేను ఆయన్ను చూసి మా అన్నయ్య అనుకున్నాను - I have mistaken him by my brother. Is it correct or not?

**A:** Correct.

# She has *a* good knowledge of..







*Pavitra Singhania, Dilsuknagar.*

**Q:** I have a knowledge / knowledge - say the correct one.

**A:** 'Knowledge' in the general sense of knowing something is uncountable, so 'a knowledge' is incorrect. However when we talk of knowing some subject, we say, 'a knowledge'.

He is a man of knowledge ('knowledge' used with the meaning of knowing something/ something in general). But when we talk of somebody knowing some branch of education/ subject, we say a knowledge.

a) He has a wide knowledge of dance.

b) She has a good knowledge of art and painting.

**Q:** 'They are as follows' - Is the underlined letter added to the verb 'follow'? Such as we add the letter 's' to $V_1$ (Knows)

**A:** ..... as follows - correct.

**Q:** He is looking great - say in Telugu.

**A:** అతడు గొప్పగా కనిపిస్తున్నాడు. అతడి తీరులో/ వేసుకున్న దుస్తుల్లో/ నటించడానికి వేసుకున్న వేషంలో.

**Q:** Let me know the meaning of the grammatical form 'Link verbs' with a few examples.

**A:** ఈ లెసన్‌లోనే Link verbs గురించి వివరించాం. చూడండి.

**Q:** మీరు lessons ను ఒకరోజే చెప్పకుండా చాలా రోజులు చెప్పాలి (అంటే చాలా class లు తీసుకోవాలి/ classes ని పొడిగించాలి ఎక్కువ రోజులు) How to say this in English?

**A:** Do/ teach the lesson for some days.

**Q:** Watch/ look / stare - Explain.

**A:** Refer to the earlier lessons.

**Q:** She shook her hand to me - Is this correct?

**A:** She shook hands with me.



## *Should I see* the secretary?

**Divakar:** I didn't go there yesterday because I thought I didn't need to. (నిన్న నేను అక్కడికి వెళ్లే అవసరం ఉండదు అనుకున్నాను కాబట్టి వెళ్లలేదు.)

**Bhaskar:** Yea. You did the right thing. Ramesh needed to go there, and he did. (అవును. నువ్వు సరైన పనే చేశావు. రమేష్ వెళ్లాల్సిన అవసరం ఉండింది, అతడు వెళ్లాడు.)

**Divakar:** But I need to find out when I must be there. Otherwise the boss may get angry. (అక్కడ నేనెప్పుడుండాలో తెలుసుకోవాల్సిన అవసరం నాకుంది. లేకుంటే మన boss కు కోపం రావచ్చు.)

**Bhaskar:** Do you have to go there now itself to find that out? (నువ్విప్పుడే వెళ్లాలా అది తెలుసుకునేందుకు? )

**Divakar:** Of course I need not. But go there I must, sooner or later. Better sooner than later. (అదీ నిజమే. ఇప్పుడే వెళ్లనవసరంలేదు. కానీ ముందరైనా తర్వాతైనా వెళ్లాల్సిందే కదా? అందువల్ల తర్వాత కంటే ముందర వెళ్లడం మేలు కదా? )

***Look at the following sentences from the conversation above:***

1) I didn't go there yesterday because I didn't need to.

2) Ramesh needed to go there, and he did.

3) I need to find out when I must be there.

4) Of course I needed not, but go there I must.

We are now going to know some more uses of 'need'.

We have so far seen that 'need' is both a main verb, and a helping verb.

**eg:** He needs money ('need' here is a main verb).

she needs to earn money ('need' here is a helping verb, because it forms a part of the verb, 'need to earn').



**Hasith:** When must/ should/ have I to go there? (నేనక్కడికి ఎప్పుడు వెళ్లాలి? )

**Giri:** You need not go there at all. (నువ్వక్కడికి వెళ్లాల్సిన అవసరం లేదు.)

మనకు తెలుసుకదా - must/ should/ have to/ has to - ఇవన్నీ duty (విధిగా చేయాల్సిన పని)/ command (ఆజ్ఞ)/ necessity (అవసరం కొద్దీ) చేయాల్సిన పనులను తెలుపుతాయి.

వీటన్నిటికీ opposite, need not/ not have to = చేయనవసరం లేదు.

must = should = have to/ has to అయితే must not = should not - ఈ రెండు మాత్రం ఒకటే. ఒక పని చేయకూడదు అని - negative command = నిషిద్ధం.

**Yaswanth:** Should I see the secretary? (నేను secretary ని చూడాలా? )

**Jaisankar:** No, you should not = లేదు. నువ్వు చూడకూడదు.

**గమనించండి:**

**a)** You must do it/ should do it/ have to do it = నువ్వది చేయాలి. (Duty/ command) X you must not/ should not do it (చేయకూడదు - negative command.

**b) Prasanth:** You have to send it now (= You must/ should send it now)

**Sudhakar:** I think I don't have to/ I need not = నేను పంపనవసరం లేదనుకుంటా).

Don't/ Doesn't have to = need not/ do not (don't) need to/ don't have to/ doesn't have to (చేయనవసరం లేదు).

'Not' లేకపోతే need = must = should = have to/ has to. You must go = You should go = You have to go = You need to go.

Need I finish it before tomorrow? = Must I finish it before tomorrow = నేనది రేపటిలోగా పూర్తి చేయాల్సిన అవసరం ఉందా? చేయాలా? ఇవీ 'need' ఉపయోగాలు.

Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... www.eenadupratibha.net

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net



*- P. Srinivas, Ammakkapet*

Explain the difference between the following:

**Q:** Fortune - Luck

**A:** Fortune = Getting more than what we expect = మనం ఆశించిన దాని కంటే ఎక్కువ పొందడం.

His fortune got him a better job than he had expected = అతడి అదృష్టం, అతడు ఆశించిన దానికంటే మెరుగైన ఉద్యోగం వచ్చింది.

Luck = A good thing that happens to us without our effort = మన ప్రయత్నం లేకుండా మనకు కలిగే మంచి.

He had the luck of finding a job without any effort = ఏ శ్రమ లేకుండానే ఉద్యోగం పొందగలిగిన అదృష్టం అతనిది.

**Q:** Farewell party - Valediction function

**A:** Farewell party = A party arranged on the occasion of a person/ group of persons leaving their friends/ organisations to say good bye to them = తమ స్నేహితులను/ సంస్థలను వదిలి వెళ్ళిపోతున్న వ్యక్తులకు/ వ్యక్తికి, వీడ్కోలు చెప్పేందుకు ఏర్పాటు చేసే విందు.

Valediction/ Valedictory function = A function arranged to say good bye, especially in a formal speech, to a person/ persons leaving = సహచరులు/ సంస్థలను వదిలి వెళ్ళిపోతున్న వ్యక్తులకు వీడ్కోలు తెలిపేందుకు ఏర్పాటు చేసే ఉపన్యాసాలతో కూడిన సభ (విందు లేకపోవచ్చు).

**Q:** Secret - Confidential

**A:** Secret = Known only to a very few people and kept hidden from others = కొంతమందికి మాత్రమే తెలిసి ఇతరులకు తెలియకుండా దాచి ఉంచటం.

They kept their love affair a secret from their parents = తమ ప్రేమను తమ తల్లిదండ్రుల నుంచి రహస్యంగా ఉంచారు (This is only spoken).

Confidential = Spoken / written in secret and meant to be kept secret = ఏదైనా విషయం (రాతలో గానీ/ మాటలో గానీ) రహస్యంగా ఉంచేది.

Confidential is usually official. Secret may be both official and non-official.



# Secret, Confidential మధ్య తేడా ..?

*- Raadha Mohini Jaiswal, Vijayawada*

**Q:** She asked him to explain Polya - Shouldn't the word 'to' be there after the above underlined word?

**A:** Yes. Explain is always followed by 'to'.

**Q:** Study the answers and recite them to me - ఆ answers చదివి నాకు అప్పచెప్పండి - Is this correct?

**A:** Right

**Q:** మీ అమ్మచేత నన్ను తిట్టిస్తావు కదూ - Say in English.

**A:** You had your mother scolding me, didn't you?/ You made your mother scold me, didn't you?

**Q:** If we don't know the pronunciation of an English word, can we write it in a phonetic manner? Explain.

**A:** When you don't know the pronunciation of a word, how can you write it in the phonetic script?

**Q:** aptitude/ rustle - Explain in Telugu.

**A:** Aptitude = natural ability/ skill, especially in learning = ఏదైనా నేర్చుకునేందుకు సహాయపడే సహజసిద్ధమైన/ పుట్టుకతో వచ్చే సామర్థ్యం/ నైపుణ్యం.





M. SURESAN

rustle = గాలి వీచినప్పుడు వచ్చే చెట్ల ఆకుల గలగల / పట్టుచీరల శబ్దం.

**Q:** When 'as well as' is equal to 'and', why can't we say: Radha as well as her parents are here?

**A:** That is usage - వాడుక. ఎన్ని పాలు? అని ఎందుకంటాం, పాలు లెక్కపెట్టే వస్తువు కాదు కదా? కానీ వాడుక అలా అనటం. English కూడా As well asకు వాడుక (usage) అది.

**Q:** Explain 'during' and link verb

**A:** Link verbs - See lesson No. 729

During - See in the same lesson.

**Q:** "He is here", they said / They said - Say the correct one.

**A:** See the answer to question No. 1 in lesson 732.

*- Padmapuri Veda, Nellore.*

**Q:** K.V.P.R. is subjected to eight hours long questioning by a CBI team - Say the meaning of above underlined word.

**A:** CBI బృందం చేత KVPR 8 గంటల సుదీర్ఘ విచారణకు గురిచేయబడ్డాడు (subjected to). మామూలు తెలుగు: CBI బృందం KVPRను 8 గంటల విచారణకు గురిచేసింది.

**Q:** Does it apply? / Is it applied? - Say the correct one.

**A:** Does it apply? = అది వర్తిస్తుందా?

Is it applied? = అది వర్తింపబడిందా?

Both correct, but note the difference in meaning.

**Q:** Applied Sciences - means what?

**A:** Applied Sciences = Sciences which have practical uses = నిత్య జీవితంలో ఉపయోగపడే శాస్త్రం.

**Q:** Apply the cream sparingly to your face - Say the meaning of the above underlined.

**A:** ఆ creamను పల్చగా (sparingly) ముఖానికి రాయండి.

**Q:** I am saying applies only to you - Say in Telugu.

**A:** What I am saying (I am saying కాదు) applies only to you = నేను చెప్తున్నది నీకే/ నీకు మాత్రమే వర్తిస్తుంది.

**Q:** I am tired of having to pretend all the time - Say in Telugu

**A:** having to pretend = నటించాల్సి రావటం.

I am tired of = నాకు విసుగ్గా ఉంది.

**Q:** being/ having been - Say the uses of the above in past/ present.

**A:** Being a minister, he can get any thing = మంత్రిగా ఉండటం వల్ల (ఇప్పుడు) ఆయన ఏదైనా పొందగలడు.

Having been a minister for five years, he earned a lot = గతంలో మంత్రిగా ఉండడంతో చాలా డబ్బులు సంపాదించుకున్నాడు.

*- Suraj Singh Chopra, Machilipatnam*

**Q:** He has been here in the past four days - translate into Telugu. Say the use of 'in the past' as 'for the past' should have been there, shouldn't it have?

**A:** He has been here (some time) in the past four days = గడిచిన నాలుగు రోజుల్లో అతడు ఇక్కడ ఉన్నాడు (అప్పుడప్పుడు/ ఒకటి రెండు రోజులపాటు etc).

He has been here for the past four days = గత నాలుగు రోజులుగా అతడు (అన్ని రోజులూ) (నాలుగు రోజుల కింద నుంచి ఇప్పటివరకూ) ఇక్కడ ఉన్నాడు.

## ..... *either side of* the road



**Sekhar:** See if either of these books is yours (చూడు, ఈ రెండిట్లో ఏదైనా నీ పుస్తకమేమో? )

**Ravikanth:** Neither (రెండిట్లో ఏదీ కాదు).

**Sekhar:** It isn't anywhere here. Perhaps it is in your desk. Check. (అది ఇక్కడెక్కడా లేదు. బహుశా నీ deskలో ఉందేమో)

**Ravikanth:** It isn't there either. I've checked. (అదక్కడా లేదు. నేను చూశాను.)

**Sekhar:** Did anyone borrow it from you? Try to remember. (నీ దగ్గర నుంచి ఎవరన్నా తీసుకున్నారా? గుర్తుతెచ్చుకో).

**Ravikanth:** None, I am sure. (ఎవరూ తీసుకోలేదు. నాకు నమ్మకం ఉంది).

**Sekhar:** Does it bear your name on it? దాని మీద నీ పేరుందా? (English మాటకర్థం: అది (ఆ పుస్తకం పైన) నీ పేరుందా? )

**Ravikanth:** No, it doesn't. (లేదు)

**Sekhar:** Any other marks on the book that can help you to know it is yours? (ఇంకేదైనా గుర్తు ఉందా ఆ పుస్తకం మీద, అది నీదని తెలుసుకునేందుకు)

**Ravikanth:** None, I'm afraid. Wait. There's an oil mark on the face of the book. I remember now. (ఏం లేదనుకుంటా. ఉండూ. పుస్తకం అట్టమీద నూనెమరక ఉంది. ఇప్పుడు గుర్తొస్తోంది)

**Sekhar:** Yes, so do I. I haven't lost a single book so far, you know? (అవును. నాకూ గుర్తొస్తోంది. ఇంతవరకూ నేను ఒక్క పుస్తకం కూడా పోగొట్టుకోలేదు, తెలుసా? )

**Ravikanth:** Neither had I, till I lost the book. I haven't given up yet. I think I'll find it when I search for some other thing. (నేను పోగొట్టుకోలేదు, ఈ పుస్తకం పోయే వరకు. ఇంకా నేను ఆశ వదులుకోలేదు. ఇంక దేనికోసమో వెదుకుతున్నప్పుడు ఇది దొరుకుతుంది.)

★ ★ ★

క్రితంసారి మనం a number of contractions (చాలా కురచ రూపాలను) చూశాం కదా, not బదులు, n't వాడేవి. ఇప్పుడు మరికొన్ని contractions, spoken/ Functional Englishలో వాడేవి చూద్దాం. ముఖ్యంగా ఇప్పుడు మనం చూడబోయే contractions, is, are, have, has, hadకు సంబంధించినవి (గుర్తుంది కదా. గతంలో మనం చూసిన contractions అన్నీ not కు వచ్చేవి, n't రూపంలో)

1. 's = is/ has - సందర్భాన్ని బట్టి.
   It's here = It is here.
   He's done it = He has done it.
2. 're = are.
   We're sure he will be there = We are sure he will be there.
3. 'll = will.
   I'll go tomorrow = I will go tomorrow.
4. 'd = would.
   I'd do it if I were you = I would do it if I were you.
5. 've = have. I've seen it = I have seen it.

ఈ contractions అన్నీ formal written Englishలో వాడకూడదు. Spoken Englishలో, అంటే English మాట్లాడేటప్పుడుగానీ, మనం మాట్లాడే సంభాషణను, ఉన్నదున్నట్లుగా రాయడానికి మాత్రమే వాడతాం.

**ఇంకో విషయం:** రెండు contractionsను ఒకేసారి పక్కపక్కనే వాడం. It's n't (It is not) తప్పు.

**Look at the following expressions from the conversation above:**

1) See if either of these books is yours/ Neither.
2) It isn't there either
3) None, I am sure
4) Yes, so do I
5) Neither had I.

Study the above. Understand the use of 'either' / Neither / either of / Neither of / any of / none of.

ఈ expressionsకు Englishలో, ముఖ్యంగా spoken Englishలో చాలా ప్రాముఖ్యం ఉంది.

Either/ either of = One of only two = రెండిట్లో ఏదైనా/ ఇద్దర్లో ఎవరైనా

(Any / Any of = రెంటికన్నా ఎక్కువ / ఇద్దరికన్నా ఎక్కువ ఉన్న వాటిల్లో/ వారిలో ఏదైనా, ఎవరైనా)

a) Prasen: Which do you want? The one with the button down collars or the one with full sleeves? ( ఆ రెండిట్లో- collar దగ్గర button ఉండే షర్టు, లేకుంటే ఆ full shirt- ఈ రెండిట్లో ఏది కావాలి? )

Dilip = Either/ either (of them) is OK for me. (రెండిట్లో ఏదైనా సరే)

b) Subba Rao: You can keep one of the two books. Which one do you want? (ఆ రెండు పుస్తకాల్లో ఒకటి నువ్వు ఉంచుకోవచ్చు. ఏది కావాలి? )




Ramana: Either (of them) is OK. (రెండిట్లో ఏదైనా సరే).

Eitherకు ఇంకో అర్థం - రెండిట్లో / ఇద్దరిలో ప్రతి ఒక్కటీ/ ప్రతి ఒక్కరూ)

a) There are trees on either side of the road = రోడ్డుకు రెండువైపులా చెట్లున్నాయి.

b) Arjun: Which way could the thief have escaped (ఏ దారిలోంచి దొంగ పారిపోయి ఉండొచ్చు? )

Bharath: Can't say. There is a door on either side of the building (చెప్పలేం. ఆ buildingకు రెండువైపు ద్వారం ఉంది).

Any = One of more than two = రెండు/ ఇద్దరి కన్నా ఎక్కువ ఉన్న వాటిల్లో/ వాళ్లలో ఎవరైనా.

a) Charumathi: Did any movie that you saw last year interest you? (నువ్వు కిందటేడాది చూసిన సినిమాల్లో నీకు ఏది బాగుంది? )

Saritha: Any of the movie that we saw last year was OK.

Either/ either of/ any/ any of - వీటన్నిటినీ singularగానే అనుకోవాలి. verb కూడా singular.

b) Sravani: Which of these saris (more than two) do you want? (ఈ చీరల్లో రెంటికన్నా ఎక్కువ) ఏవి కావాలి నీకు?

Vatsala: Any three of them (వాటిల్లో ఏ మూడైనా)

c) Charumathi: These are all the candidates who have made the grade. Who do you want among them.

Saritha: Any five of them (వాళ్లల్లో ఏ ఐదుగురైనా)

Either/ either of/ any/ any of - వీటన్నిటికీ verb ఎప్పుడూ singular.




# Declare, Announce మధ్య తేడా..?





M. SURESAN



*Rakshitha Singhal, Vijayawada.*

**Q:** Declare/ announce - Say difference

**A: Declare =** to make people know something in an official manner = ఏదైనా సాధికారికంగా ప్రజలకు తెలియజేయడం.

**Announce =** ఇంతకుముందు తెలియని విషయాన్ని, ప్రజలకు ఆసక్తిని కలిగించే విషయాన్ని తెలియజేయడం. (to declare for the first time something of interest to the people.)

Announcing the election results, the Presiding officer declared the winning candidate. ఎన్నికల ఫలితాలను తెలియపరుస్తూ ఎన్నికల అధికారి గెలిచిన అభ్యర్థిని ప్రకటించాడు.

**Q:** As the children/ children play and sit under a/ the tree. Hence it makes/ make the poet thinks/ think that the tree/ tree love children/ - Say the correct one.

**A:** As the children play they sit under the tree. Hence it makes the poet thinks that the tree loves the children - Correct.



**Q:** చెట్టు పూలు అవుతున్నాయి (అంటే చెట్టుకు పూలు పూస్తున్నాయి) కాయలు కాస్తున్నాయి. How can these be said?

**A:** The tree is blossoming and is bearing fruit.

**Q:** 'Rope in' - Means what?

**A:** Rope in = To make somebody join to help you in doing something = మనంతట మనం చేయలేని/ సాధించలేని విషయంలో ఇతరులను కలుపుకోవడం, ఒక్కోసారి వాళ్లకి ఇష్టం లేకపోయినా.

He roped in some of his seniors to demand a pay rise = అతడు జీతం పెంచమని అడిగేందుకు తన seniors ని కూడా కలుపుకున్నాడు.

**Q:** Architect based - Means what?

**A:** Based on the knowledge of architecture.

**Q:** When a leave letter has to be written, is it needed to write / put the heading 'Leave Letter' in the Leave letter?

**A:** Nothing wrong in having the heading, 'Leave Letter'.

*P. Srinivas, Karimnagar.*

**Q:** Please explain the following.

1. Basics - Elements
2. Inclusive - Mixing
3. Lay Out - Enclave
4. Arrest - Custody

**A: 1) Basics =** Elements = The first and most necessary things of a subject = ఒక విషయానికి సంబంధించిన ప్రాథమికాంశాలు.

**2. Inclusive =** including = కలిపి/ చేర్చి

The salary he gets is inclusive of basic pay and allowances = అతడు పొందే జీతంలో మూలవేతనం, భత్యాలు కలిపి ఉంటాయి.

**Mixing =** Combining - putting two/ more things together so that they cannot be separated = కలపడం.

Mixing milk with water is common = పాలతో నీళ్లు కలపడం మామూలే.

**3. Layout =** The arrangement/ plan of the parts of a building / a group of buildings / a garden / matter to be printed on a page = ఒక కట్టడం (భవనం)/ కట్టడాల సమూహం/ తోటలాంటి వాటి ప్రణాళిక (ఏయే గదులు ఎక్కడెక్కడ ఉన్నతీరు/ తోటలోని చెట్ల, మొక్కల వరుసల అమరిక, కాగితం మీద ముద్రించే విషయం ఉండేతీరు.)

**Enclave =** Within a large area, a smaller area where the people of a particular group live = నగరం/ పట్టణం/ దేశం లాంటి విశాలమైన ప్రదేశంలో, ఒకే జాతి/ సంస్కృతికి చెందిన ప్రజలు కలసి కట్టుగా నివసించే చిన్నచోటు.

There is a Marwadi enclave in the north of the city = ఆ నగర ఉత్తరంలో మార్వాడీలు మాత్రమే నివసించే ప్రదేశం ఉంది.

కానీ మనదేశంలో ఈ రెండు మాటలను ఎక్కువగా ఒకేచోట ఉన్న ఇళ్ల స్థలాలకు/ భవన సముదాయాలకు/ ప్రత్యేకించిన స్థలాలకు వాడుతుంటారు. Standard Englishలో ఈ అర్థం లేదు.

**4. Arrest =** Take a person to the police station and keep them under their control.



**Custody =** 1) Arrest a person and keep them in jail till they are taken to court.

2) The responsibility of keeping a child, or the records of an office.

*Ahalya Vasundhara, Rajole.*

**Q:** Offer/ give, chance / opportunity, deduce / presume / assume / suppose - Clarify.

**A: Offer =** Give something to others without their asking for it.

**Give =** To hand something to somebody whether they ask for it or not.

**Chance =** Opportunity, but chance is always unexpected (మనం అనుకోకుండా వచ్చే అవకాశం). Opportunity is not always unexpected. (Opportunity అన్నివేళలా తనంతట అది వచ్చేది కాదు. కొన్నిసార్లు మనం కల్పించుకోవాలి.)

**Deduce =** draw a conclusion/ form an opinion about something = ఒక విషయాన్ని గురించి ఒక అభిప్రాయానికి రావడం.

**Presume =** Assume = to think that something is true without proof of it ( ఆధారాలు లేకుండా ఏదైనా విషయం నిజమని నమ్మడం.)

Suppose = Think.

**Q:** When are the following symbols used? :, :-, i.e for e.g.

Pollution: / pollution :- Explain

**A:** 1) : ... before you begin a list.

There are four directions : east, west, south and north.

2) ie = That is;

Making something clearer. The PM, ie., Mr. Manmohan Singh = మన ప్రధానమంత్రి, అదే, మన్మోహన్ సింగ్.

**eg:** (for eg కాదు) = for example = ఉదాహరణకు.

## *Neither* of us will be...




**Narayana:** Which of the two ... Mallik and Prasanth .. is here? (మల్లిక్, ప్రశాంత్ ఇద్దరిలో ఎవరున్నారిక్కడ? )

**Roy:** Neither is. ((ఇద్దరిలో) ఏ ఒక్కరూ లేరు.)

**Narayana:** Then when are you going to tell them of this? Will you meet them or call them? (అయితే ఈ విషయం వాళ్లకి ఎప్పుడు చెప్తావు నువ్వు? నువ్వు వాళ్లని కలుస్తావా, ఫోన్ చేస్తావా? )

**Roy:** Neither. I'll send my brother with the message. If they respond, it's OK. If they don't respond it's OK too. (మా తమ్ముడికి విషయం చెప్పి వాళ్లకు చెప్పమని పంపిస్తా, వాళ్లు స్పందిస్తే సరే, స్పందించకపోయినా సరే.)

**Narayana:** That's being irresponsible. That they get the message is important. You may not be in trouble, but I will be. (అది బాధ్యతారాహిత్యంగా మాట్లాడటం. వాళ్లకి ఆ వార్త చేరడం అనేది చాలా ముఖ్యం. నువ్వు ఇబ్బందుల్లో పడకపోవచ్చు ఇబ్బంది పడేది నేను.)

**Roy:** Neither of us will be, don't worry. My brother will ensure that they get the message. (ఎవరం (మనిద్దరిలో) ఇబ్బందిపడం, ఆందోళన పడకు. మా తమ్ముడు చూసుకుంటాడు వాళ్లిద్దరికీ వార్త అందేట్టు.)

**Narayana:** The trouble with you is, you don't make things clear. Nor do you act in time. Why don't you yourself go to them or call them? Is it that you don't like them? Which of the two don't you like? (ఏదీ స్పష్టంగా చెప్పవు. నీతో చిక్కదే. పోనీ సకాలానికి చర్య తీసుకుంటావా అంటే అదీ చెయ్యవు. నువ్వే వాళ్ల దగ్గరికి ఎందుకు వెళ్లవు? లేకుంటే ఎందుకు phone చెయ్యవు. అంటే వాళ్లంటే నీకు ఇష్టం లేనందువల్లేనా? వాళ్లిద్దరిలో ఎవరంటే ఇష్టం లేదు నీకు? )

**Roy:** I like neither of them. In fact none of our friends like them except you. And neither do you always. (ఇద్దరూ ఇష్టంలేదు. అసలు మన స్నేహితుల్లో వాళ్లంటే ఎవరికీ ఇష్టం లేదు. నీకు తప్ప. నీకూ వాళ్లంటే అన్నివేళలా ఇష్టం ఉండదు).

**Narayana:** But I do, of course. You don't understand people properly, nor do you try to. (అదేంలేదు. వాళ్లంటే నాకెప్పుడూ ఇష్టమే. నువ్వు ఇతరులను సరిగా అర్థం చేసుకోవు. ప్రయత్నించవు కూడా).

**Note:** Ensure = make sure = (ఖరారు చేసుకోవడం).

***Look at the following sentences from the conversation above:***

1) Neither is.
2) Neither. I'll send my brother with the message.
3) Neither of us will be.
4) I like neither.
5) Nor do you act in time.
6) And neither do you always.
7) ... nor do you.

In the last lesson, we've seen the importance of 'either' which means one of only two. Now we are going to see how to use 'neither' which means 'not one of only two'.

గతవారం lesson లో 'either' అర్థం, దాని ఉపయోగం చూశాం కదా? 'either' అంటే రెండిట్లో/ ఇద్దరిలో, ఏదైనా, ఎవరైనా అని.

అలాగే Neither/ Neither of = రెండిట్లో ఏదీ లేదు/ ఇద్దరిలో ఎవరూ లేరు/ కారు అనే అర్థంతో వాడతాం. English సంభాషణలో, Either, Either of, Neither, Neither of చాలా తరచుగా వాడతారు. అలా వాడితేనే సంభాషణ సహజంగా ఉంటుంది. అదే ఇద్దరి కంటే/ రెంటి కంటే ఎక్కువగా ఉన్నట్లయితే 'None'/ 'None of' అంటాం.

Neither is here = ఆ రెంటిలో ఏదీ లేదు/ ఆ ఇద్దరిలో ఎవరూ లేరు.

None is here = వాటిల్లో (రెంటికంటే ఎక్కువ)/ ఏదీ లేదు/ వాళ్లల్లో (ఇద్దరికంటే ఎక్కువ) ఎవరూ లేరు.

None of the books is interesting = ఆ పుస్తకాల్లో (రెంటికంటే ఎక్కువ) ఏదీ ఆసక్తికరంగా లేదు.

None of our students failed = మా విద్యార్థుల్లో (ఇద్దరికంటే ఎక్కువ) ఎవరూ తప్పలేదు.

**1. a) Prasanna:** Where do you come from, Vijayawada or Hyderabad? (మీది ఏ ఊరు, విజయవాడా/ హైదరాబాదా? )

**Rajeswari:** From neither. I come from Nellore. (రెండిట్లో ఏదీ కాదు. నెల్లూరు.)

**b) Abhijith:** Which of your two uncles is an MP? (మీ ఇద్దరు బాబాయిల్లో ఎవరు MP?)

**Venkat:** Neither is. (ఇద్దరిలో ఎవరూ కారు.)

**2. a) Prabhakar:** Which one of the two shirts do you want?

**Sudheer:** Neither suits me, I am afraid. (ఆ రెంటిలో ఏదీ నాకు సరిపోదని నా అనుమానం)

Neither suits me,
I am afraid.

**b) Srikanth:** Which team has a better chance of winning, yours or theirs? (ఏ జట్టుకి గెలిచే అవకాశాలు ఎక్కువ ఉన్నాయి, మీదా, వాళ్లదా? )

**Chandra:** I don't have an idea. (నాకేం తెలియట్లేదు.)

**Srikanth:** Nor do I (నాకూ తెలియడం లేదు.)

**Important:** 'Neither/ Neither of/ nor' always takes a singular verb.

a) Neither (of them) is here.

b) Neither (of them) knows the answer.

c) Neither (of them) has been selected.

పై sentences అన్నింటిలో neither (of) .. రెండిట్లో ఏదీ లేదు/ ఇద్దరిలో ఎవరూ లేరు.

★ None (of): Not even one of more than two (రెంటికంటే ఎక్కువగా ఉన్నవాటిల్లో ఏదీలేదు/ కాదు/ ఇద్దరికంటే ఎక్కువగా ఉన్న వాళ్లల్లో ఎవరూలేరు/ కారు.)

**a) Sana:** Did any policemen come to the scene of the accident? (పోలీసులెవరైనా ఆ ప్రమాదస్థలానికి వచ్చారా? )

గుర్తుంది కదా, Any = One of more than two.

**Ranganath:** None (ఇద్దరికంటే ఎక్కువ - ఎవరూ రాలేదు.)

**Compare:** a) Neither is here (ఇద్దరిలో ఎవరూ, లేరు/ రెండిట్లో ఏదీలేదు.)

None is here = రెండిటికంటే ఎక్కువ వాటిల్లో/ ఇద్దరి కంటే ఎక్కువ వాళ్లల్లో, ఏదీలేదు/ ఎవరూలేరు.

None of them = Same as above - వాటిల్లో (రెంటికంటే ఎక్కువ) ఏదీ లేదు /వాళ్లల్లో (ఇద్దరికంటే ఎక్కువ) ఎవరూలేరు.)

a) Either (of) = one of only two

Any (of) = One of more than two.

b) Neither (of) = Not even one of only two.

None (of) = Not even one of more than two.



## పురాతన విషయాలకు...

# Dates back...



K.V. Rao, Vizag.

**Q:** కింది synonyms లో ఉన్న స్వల్ప భేదాలను వివరిస్తూ, ఏ సందర్భంలో ఏది వాడాలో (appropriate) తెలియజేయగలరు.

1) Prophylactic (treatment) & Preventive (treatment)
2) Classified (information) & Privileged (information)
3) Susceptibility & Vulnerable

**A:** 1) Prophylactic is a technical term used mostly in medicine = medicine/ treatment for preventing a disease.

'Preventive' is the same as prophylactic (Prophylactic ఎక్కువగా డాక్టర్లు/ వైద్యగ్రంథాల్లో వాడే మాట. మామూలు (మనలాంటివాళ్ల) భాషలో preventive అంటాం.)

**2) Classified information** = ప్రభుత్వ నిబంధనల ప్రకారం రహస్యంగా ఉంచబడి, అధికారం ఉండి, అనుమతి పొందిన వారికి మాత్రమే తెలిసే సమాచారం.

Privileged information = (చట్టానికి సంబంధించిన) ఇది చట్టానికి సంబంధించిన విషయం. చట్ట ప్రకారం బహిరంగ పరచాల్సిన అవసరం లేని, ఆ సమాచారానికి సంబంధించిన వారు మాత్రమే తెలుసుకోగలిగిన సమాచారం.

Classified information ను బహిరంగపరచాల్సిన అవసరం రావొచ్చు కానీ court అనుమతిలేనిదే privileged information బయట పెట్టాల్సిన అవసరం లేదు.

**3) Susceptible** = be in a position to be affected by some illness or a problem = ఏదైనా వ్యాధికి గానీ, సమస్యకు గానీ సులభంగా గురయ్యే స్వభావం.

People in Nalgonda Dist. are susceptible to fluorosis = నల్గొండ జిల్లా ప్రజలకు fluorosis వ్యాధి కలిగే అవకాశముంది.

**Vulnerable** = Weak and easily hurt physically or mentally = ఏదైనా బలహీనత మనలో ఉండేది.

We are vulnerable to attack by the Chinese in the Ladakh area = మనం లడఖ్‌లో చైనీయుల దాడిని ఎదుర్కోలేం. అది మన బలహీనత.

M. SURESAN

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 737

Susceptible మనిషి/ ప్రదేశ తత్వాన్ని గురించి చెబుతుంది. Vulnerable మనిషి బలహీనతలను, ఇతర విషయాల బలహీనతల గురించి తెలియజేస్తుంది.

**Q:** కింది వాక్యాల్లో underline చేసిన పదాల అర్థాలను తెలుగులో అనువదించి, విశదీకరించండి.

1. The plants' native of Mexico.
The plants' indigenous to Mexico.
2. The church dates back to 12th century.
3. Legend has it that the deity here manifested himself.

**A: 1) Native** = Indigenous, but 'indigenous' stresses more the nature of belonging to a place, more of having no connection at all with anything foreign. (Native కంటే indigenous కాస్త ఎక్కువగా తెలుపుతుంది, ఒక ప్రాణి పుట్టుక స్థలాన్ని గురించి).

అంతేకాకుండా indigenous ను ముఖ్యంగా వృక్షజాతులు, పశుపక్ష్యాదులు, మానవ జాతులు, తెగలకే ఎక్కువగా వాడతాం. ఒక మనిషి ఫలానా దేశానికి చెందిన వాడు అనేందుకు, native మాత్రమే వాడతాం, indigenous వాడం.

**2. Dates back to** = belongs to (a point/ period of time) = ఆ సమయానికి/ కాలానికి సంబంధించిన, ముఖ్యంగా ఇది పురాతన విషయాలకు వాడతారు.

The church dates back to 12th century = ఆ చర్చ్ 12వ శతాబ్దానికి చెందింది.



**3. Legend has it** = According to legend = ఇక్కడి గాథ ప్రకారం.

Manifested = appeared in a different form = (ఇంకో విధంగా) కనిపించాడు, అవతరించాడు.

దశావతారాలు = The ten manifestations of Lord Vishnu.

## Hoary Past అంటే...

**Q:** కింది phrases అర్థాలను సోదాహరణంగా వివరించి, ఏ సందర్భంలో వాడితే బాగుంటుందో తెలపండి.

1) State - of - the - art (like state - of - the - art technology)
2) Paradigm shift
3) Incidence of a disease
4) A bout of cough / drinking bout
5) An episode of the
6) Hoary past 7) Night out

**A: 1) State of the art** = అత్యాధునిక పరిస్థితుల్లో ఉండగలిగినంత గొప్పగా ఉన్న.

State of the art facilities = ప్రస్తుత/ అత్యాధునిక పరిస్థితుల్లో ఉండగలిగినంత గొప్పగా ఉన్న వసతులు.

State of the art technology = అత్యాధునిక, అత్యుత్తమ సాంకేతిక పరిజ్ఞానం.

**2) Incidence of a disease** = జబ్బులు ఎంత తరచుగా వస్తాయనే విషయం.

Incidence of Malaria is high in agency areas = మలేరియా తరచుగా రావడం ఏజన్సీ ప్రాంతాల్లో ఎక్కువ.

Incidence of Crime = నేర తీవ్రత

**3) Paradigm shift - Paradigm** = పద్ధతి/ సరళి - ఒక పని జరిగే/ జరిపే తీరు (shift = మార్పు)

Paradigm shift = మనం ఒక విషయం గురించి ఆలోచించే, దాన్ని ఆచరణలో పెట్టే విధంలో ముఖ్యమైన మార్పు.

A paradigm shift in our present education system is the need of the hour = మన ప్రస్తుత విద్యా విధాన రూపకల్పన, అమలులో మార్పు చాలా అవసరం.

**4) Bout of cough** = an attack (దెబ్బ) of cough = దగ్గు పొర/ దగ్గు ఒక్కసారిగా రావడం

Drinking bout = ఇక్కడ 'bout' = a short period in which something is done actively = ఒక కార్యకలాపాన్ని చురుగ్గా నిర్వహించడం.

Bout of drinking = తాగుడు కార్యక్రమం

**5) Episode** = వృత్తాంతం = incident in a novel/ drama.

The Ekalavya episode in the Bharatam is really moving = భారతంలో ఏకలవ్య వృత్తాంతం మనసుని కదిలిస్తుంది

Episode = A part of a serial on TV.

**6) Hoary past** = very old, famous and interesting past - but the word, 'hoary' is not much used in modern English

Hoary Past - వైభవోపేతమైన గతం.

**7) Night out** = Doing night out = keeping awake the whole night = రాత్రంతా మేలుకుని ఉండటం, పని ఉన్నప్పుడు.

# Janaki *can sing* well...

FUNCTIONAL ENGLISH

**Vinay:** I always find Pavan interfering in others' affairs. (పవన్ ఇతరుల విషయాల్లో కల్పించుకోవడమే తరచూ చూస్తాను నేను).

**Sankar:** So do I. He doesn't just mind his business but he must butt in matters that don't concern him. (నేనూ అదే చూస్తాను. తన పని తాను చూసుకోకుండా తనకు సంబంధించని విషయాల్లో తలదూరుస్తాడు.)

**Vinay:** That can be a big nuisance. I don't like such people. (అది చాలా చికాకుగా ఉంటుంది. నాకు అలాంటివాళ్లు ఇష్టం లేదు.)

**Sankar:** Nor do I. We are one in this respect. I'm not so nosy nor are you. (నాకూ ఇష్టం లేదు- ఈ విషయంలో మనిద్దరం ఒకటే. నేనూ ఇతరుల విషయాలు పట్టించుకోను. నువ్వూ అంతే.)

**Vinay:** He is a nuisance, all right, but his brother isn't so. He is much better behaved. I find him quite likable. (అతడు చికాకే కానీ అతడి తమ్ముడు అలా కాదు. అతడి ప్రవర్తన బాగా ఉంటుంది. అతడు అభిమానించదగ్గవాడుగా అనిపించాడు.)

**Sankar:** So do I. In fact he is the nicest guy among our friends. OK, talking to other things, I didn't buy that book we need for the exam. (నాకూ అలాగే అనిపించాడు. మన స్నేహితుల్లో అతడు అత్యంత మంచివాడు. సరే, ఇతర విషయాలకు వస్తే, పరీక్షకు కావలసిన పుస్తకం నేను కొనలేదు.)

**Vinay:** I didn't either. How about buying in this evening? I think we can find copies of it in the second hand market. (నేనూ కొనలేదు. ఇవాళ సాయంత్రం కొందామా? పాత పుస్తకాల దుకాణాల్లో దొరుకుతుందనుకుంటా.)

**Sankar:** We can, of course. (నిజమే.)

గత కొన్ని వారాలుగా మనం మాట్లాడే English కు సహజత్వాన్నిచ్చే, అంటే మనం మాట్లాడే English చాలా సహజంగా వినపడేలా చేసే, short responses (క్లుప్త స్పందనలు)ను గురించి తెలుసుకుంటున్నాం కదా. ఈ short responses లో ఎక్కువగా so, neither, nor, either, but లాంటి వాటిని తరచుగా వాడుతుంటాం.

మరికొన్ని short responses ఇప్పుడు చూద్దాం:

1) So do I 2) Nor do I
3) I didn't either 4) We can, of course.

**Important:** Spoken English లో 'also' వాడకం చాలా తక్కువ. దీని బదులు కింద తెలిపినట్టు మనం, too, as well, so లాంటి చిన్నచిన్న మాటలను వాడతాం.

**Karim:** I play cricket (నేను cricket ఆడతాను).

**Salim:** So do I (నేనూ ఆడతాను).

గమనించారు కదా: సలీం, నేను కూడా cricket ఆడతాను అనేందుకు, I also play cricket అని అనడం లేదు, 'so do I' అని అంటున్నాడు. ఇదీ Spoken English లో 'also' వదిలేసే విధం. అయితే ఇలాంటి responses ఇచ్చేటప్పుడు Helping (Auxiliary) verbs వాడే విధం బాగా తెలియాలి. అంటే ఈ కిందివి గుర్తుంచుకోవాలి:

*1st Doing Words* - go, come, sing, walk etc. = do go, do come, do sing, do walk etc. (ఇలాంటి forms ను మనం 'not'తో, questions లో వాడతాం). అలాగే, He, she, it తో వాడే II Doing Words - ($V_1$) goes, comes, sings, walks etc. = does go, does come, does sing, does walk, etc. (వీటిని కూడా మనం 'not' తో, questions లో వాడతాం).

ఇలాంటివే Past Doing Word ($V_2$) కు కూడా వస్తాయి.

Went, came, sang, walked = did go, did come, did sing, did walk (వీటినీ మనం 'not' తో question లో వాడతాం.) Short form responses (క్లుప్త స్పందనలు) ఇచ్చేటప్పుడు ఇవే వాడతాం. వీటితో పాటు, shall, will, should, would, can, could, may, might, must, need కూడా వాడుతుంటాం Short responses లో.

**Look at the following...**



**a) Pramod:** I like the mango.

**Vinod:** So do I (నాకూ ఇష్టమే). (ఇక్కడ I also like the mango అని ఎక్కువగా అంటుంటాం. అది తప్పు కాదు, కానీ spoken form మాత్రం కాదు). Like = do like కదా. అందుకని so do I అని response వస్తుంది. 'నాకూ ఇష్టమే' అని పైవిధంగా చెప్పకుండా, 'అందరికీ ఇష్టమే' అనో, 'ఎవరికి ఇష్టం లేదు?' అనో అనాలనుకుంటే:

**Vinod:** So does everybody. Who does not? (ప్రతివాళ్లకూ ఇష్టమే. ఎవరికిష్టం ఉండదు?) Everybody = He/ she. అందుకని, 'does'.

Look at the following short responses when you agree with somebody (ఇతరులతో మనం ఏకీభవించినప్పుడు వాడే short responses.)

**Madhu:** Chandan is quite clever unlike his brothers (అతడి brothers లా కాకుండా చందన్ తెలివైనవాడు.)

**Santhi:** Yes, he is./ So is his cousin Meena. (అవును/ అతడి cousin మీనా కూడా తెలివైందే).

**b) Ramana:** Our college insists on uniform (మా కళాశాల యూనిఫాం విషయంలో కచ్చితంగా ఉంటుంది.)

**Krishna:** So does our college, though we protested (మేం వ్యతిరేకించినప్పటికీ, మా college కూడా అంతే.) insists = does insist (our college also అనం.

**c) Kalyan:** Kiran played well yesterday (నిన్న కిరణ్ బాగా ఆడాడు) (played = did play).

**Madhav:** So did Prakash. (ప్రకాష్ కూడా బాగా ఆడాడు.) Prakash also రాదు, spoken form లో.

పై సంభాషణల్లో ఎక్కడా 'also' (= కూడా) రాకపోవడం గమనించాల్సిన విషయం.

**d) Charan:** Janaki can sing well (జానకి బాగా పాడగలదు).

**David:** So can Chitra (చిత్ర కూడా - Chitra can also, కాకుండా)

**e) Wesley:** I will buy a house soon (నేను త్వరలో ఇల్లు కొంటాను).

**Sasikanth:** So will I, if you can help me with some money. (నేనూ కొంటా, నువ్వు నాకు కాస్త డబ్బు సాయం చేస్తే).

ఇలా So మనం 'also'కు బదులు వాడవచ్చు ఇది Spoken English లో చాలా ముఖ్యం. ఇది బాగా అలవాటు చేసుకుంటే మన English speech will sound natural.

Some more spoken forms in the next lesson.

Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... www.eenadupratibha.net

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net

## FUNCTIONAL ENGLISH

**Sharif:** I joined this college hoping this would be a good college, but I don't find it so. (ఇదేదో మంచి కళాశాల అని ఆశించి నేనిక్కడ చేరా, కానీ అలా అనిపించడం లేదు.)

**Jayanth:** Nor do I. I am not very happy the way things are going on in this college. (నాకూ అనిపించడం లేదు. ఇక్కడ జరుగుతున్న తీరు పట్ల నాకంత సంతోషంగా లేదు.)

**Sharif:** I am not either. Isn't it too late now to think of another college? (నేనూ సంతోషంగా లేను. కానీ ఇంకో కళాశాల గురించి ఆలోచించడానికి ఇప్పుడు బాగా ఆలస్యమైపోయింది కదా?)

**Jayanth:** So it is certainly. We have to make do with it. Even if it were possible dad wouldn't agree to it. (అది కచ్చితంగా నిజమే. ఇలా సర్దుకుపోవాల్సిందే. ఇంకోచోట చేరడం సాధ్యమైనా, మా నాన్న ఒప్పుకోడు.)

**Sharif:** My dad wouldn't either, and he has good reason too. In almost all colleges once we pay the fees, they won't be refunded. (మా నాన్నా ఒప్పుకోడు, అయితే ఆయన కారణాలు మంచివే. దాదాపు అన్ని కళాశాలల్లో ఒకసారి చెల్లించిన fees refund ఇవ్వరు.)

**Jayanth:** So is it with this college too. Dad won't be prepared to forgo such a huge amount I have paid. (ఈ కళాశాలా అంతే. అంత పెద్ద మొత్తంలో కట్టిన సొమ్ము వదులుకునేందుకు ఆయన సిద్ధపడరు.)

**Sharif:** Neither would my dad be. Who would be, for that matter? (మా నాన్నా ఒప్పుకోరు. ఎవరు ఒప్పుకుంటారు, ఆ మాటకొస్తే?)

**Jayanth:** Did you speak to your father about it? (మీ నాన్నగారితో మాట్లాడావా ఈ విషయం?)

**Sharif:** Yes, I did. What did your father say about it? (ఆ మాట్లాడా. మీ నాన్నగారేమన్నారు?)

**Jayanth:** He would have none of it. Either I study here or don't study at all. (ఆ మాటేం విననంటున్నారు ఆయన. చదివితే ఇక్కడే లేకుంటే మానేయమన్నారు ఆయన.)

**Sharif:** Your dad said that? (అలా అన్నారా మీ నాన్న?!)

**Jayanth:** He did, of course. (అలాగే అన్నారు.)

**Notes:** 1. Make do - (చాలా ఉపయోగకరమైన expression) = ఉన్నదాంతో సరిపెట్టుకోవడం.
When we can't get the best, we have to make do with what we have = మనకు అత్యంత మంచిది దొరకనప్పుడు, దొరికిన దాంతో సరిపెట్టుకోవాలి.
2. refund = return (money paid)
3. forgo = be prepared to lose = వదులుకోవడానికి సిద్ధపడటం.
4. for that matter = ఆ మాటకొస్తే
5. Would have none of it = refuse to hear/ accept = అస్సలు వినకపోవడం.

***Look at the following from the conversation:***
1) **Sharif:** .... I don't find it so.
**Jayanth:** Nor do I.
2) My dad wouldn't either. 3) So it is
4) Neither would my dad be
5) He did, of course.



# He did, of course..

In the past few lessons we have discussed short responses to questions. ఇప్పటివరకు మనం చూసింది:

**Positive responses:** ఇవి సరిగా ఇవ్వాలంటే do, does, did, all be forms ఉపయోగం బాగా వచ్చి ఉండాలి అని తెలుసుకున్నాం కిందటి lesson లో.

M. SURESAN

**eg: a) A:** I am at home (నేనింట్లో ఉన్నా)
**B:** So am I, and so is dad. (నేనూ ఇంట్లోనే ఉన్నా, అలాగే నాన్న కూడా).
**b) Pramod:** Sudha knows the subject thoroughly. (Sudha కు ఆ విషయం పూర్తిగా తెలుసు.)

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 738

**Subodh:** So does everyone in the class. The teacher has taught the subject so well. (ఆ class లో ప్రతివాళ్లకూ అది తెలుసు. ఆ విషయాన్ని teacher అంత బాగా బోధించారు.)

ఇది బాగా practice చేయాలి మనం. అందుకు do, does, did, shall, should, etc వాడకం తెలియాలి.

***ఇంకో ఉదాహరణ***

**Sarada:** If you do that, his parents may get a bad opinion on you. (నువ్వది చేస్తే అతడి తల్లిదండ్రులకు నీ మీద దురభిప్రాయం రావచ్చు.)

**Eswar:** So may any one who hears about it. (అది విన్న ఎవరికైనా అదే అభిప్రాయం రావచ్చు.)

పైవన్నీ రెండూ ఒకేలా ఉండే positive responses. ఇప్పుడు negative statement కు response చూద్దాం:

**Gopal:** I do not like such things. (అలాంటివి నాకిష్టం లేదు.)

దీనికి స్పందనగా, 'నాకూ ఇష్టం లేదు' అనేందుకు, I do not also like it అనం. Not తో also వాడటం, wrong English. దాని బదులు ఇలా అంటాం.

**Kesav:** Nor do I,/ Neither do I/ I don't either అంటాం. ఇది Spoken English లో, అంటే correct Spoken English లో సర్వసాధారణం. అలాకాకుండా not తో also వాడటం సరైన English కాదు.

మరికొన్ని ఉదాహరణలు ఈ lesson ప్రారంభంలోని సంభాషణలో ఉన్నాయి చూడండి:

**a) Sharif:** ....... but I don't find it so./ .... but I do not find it so. (కానీ అది అలా ఉండటం నేను చూడలేదు.)
**Jayanth:** Nor do I (నేనూ అలా ఉండటం చూడలేదు.)

గమనించండి: I do not (don't) also find it so, అనకపోవడం. ఎందుకని? Not తో also రాదు కాబట్టి. ఇక్కడ, 'nor' బదులు 'Neither' కూడా వాడతాం.

**a) Jayanth:** Dad won't be prepared to forgo such a huge amount. (నాన్న అంత పెద్ద మొత్తాన్ని వదులుకునేందుకు సిద్ధపడరు.)
**Sharif:** Neither will my dad be. (మా నాన్న కూడా సిద్ధపడరు) (My dad will also not be - Wrong)

Nor/ neither తోబాటు, not either అని కూడా అంటాం - అది కూడా కాదు, లేదు అనే అర్థంతో.

**c) Jayanth:** ...... my dad wouldn't agree to it (మా నాన్న అందుకు ఒప్పుకోరు.)
**Sharif:** My dad wouldn't (would not) either. (మా నాన్నా/ నాన్న కూడా ఒప్పుకోరు).

ఇప్పుడు కిందివాటికి short responses మీరు ప్రయత్నించండి, కింది ఉదాహరణ సాయంతో:

**a) Anand:** నేను ఆ party కి వెళ్లకపోవచ్చు (I may not attend the party)
**Bhargav:** నేనూ వెళ్లకపోవచ్చు (Neither may I/ Nor may I/ I mayn't (I may not) either).

గమనిక: Anand sentence లో Helping verb, 'may' కాబట్టి, response లో కూడా 'may' వాడాం.

**b) Farid:** స్నేహ బాగా పాడలేదు (జాలదు) (Sneha can not sing well) - ఇక్కడ helping verb, 'can' కదా? కాబట్టి, response లో కూడా, 'can' వస్తుంది.




**Govind:** ప్రీతీ అంతే. (ప్రీతి కూడా బాగా పాడలేదు). (Nor can Preethi/ Neither can Preethi/ Preethi can't either).

**c) Lavanya:** Dilip hasn't seen the movie, but comments on it. (దిలీప్ ఆ సినిమా చూడలేదు, కానీ దాన్ని గురించి వ్యాఖ్యానిస్తాడు.)
**Sameera:** We haven't seen it either, but we don't comment. (మేమూ చూడలేదు, కానీ వ్యాఖ్యానించం.) (Dilip, 'he' కాబట్టి, hasn't వాడాం. We కి haven't వస్తుంది కదా?)

**d) Rajasri:** Suseela is not interested. (సుశీలకు ఆసక్తిలేదు) (Suseela she కాబట్టి, verb, is)
**Vinaya:** Nor are we/ Neither are we/ we aren't either. (మాకూ ఆసక్తి లేదు.)

Response లో, 'we' plural కాబట్టి, 'are' వాడాం.

---



***D. Krish, Bandhamcharla.***

**Q:** 'ఓడిపోయిన' అనే పదానికి సరైన English word ఏది? ఉదాహరణకి 'ఓడిపోయిన ప్రేమికుడు' అని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?
**A:** Disappointed lover/ Star-crossed lover.

***D. Krishna, Kukatpally***

**Q:** 'భారత జెండా సగర్వంగా రెపరెపలాడింది' దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?
**A:** The Indian flag fluttered proudly.



**Q:** భూతద్దం, అంతర్యుద్ధం అనే పదాలకు సరైన English పదాలు ఏవి?
**A:** భూతద్దం - Magnifying lens
అంతర్యుద్ధం - Civil War.

***P. Manikyam, Rajole.***

**Q:** Manikyam went to Chennai from Rajole / Manikyam went from Rajole to Chennai – Say the correct one.
**A:** Manikyam went from Rajole to Chennai = Manikyam went to Chennai from Rajole.
**Q:** I have been here in the past three years - Say if the underlined (above) word is used or not?
**A:** I have been here for sometime during/ in the past three years - Correct..
**Q:** Does the word people have its plural form as in Oxford peoples is written on the page no. 1779, while giving the meaning of the word 'world' it is written that "the earth, with all its countries, peoples and natural features".
**A:** The plural of people, 'peoples' means the people of more than one country.
**eg:** The peoples of India and the US = The people of India and the people of the US.
**Q:** Why are the words stars, planets called the stars and the planets, as there are more stars than one as well as there are more planets than one. Clarify and also the worlds.
**A:** They are called just 'stars' and 'planets', and not 'the stars' and 'the planets'. No 'the' before stars and planets if you talk about them generally.



The sky is full of stars (Not 'the' stars).
Planets (not the planets) are much smaller than stars (not, the stars).
Read the dictionary carefully once again.
The Worlds = Not only the world we live in, but the other worlds, not known to us, in God's creation.

**Q:** Explain with a few examples the meaning of the words 'navigate', 'universe', 'world', 'nature' in Telugu.
**A: Navigate =** to steer a ship in the sea = to take the ship in whichever direction we want.
The pilot of a ship navigates the ship.
**Universe =** The whole creation. The world we live in, the sky, the stars and all the other things = విశ్వం.
**World =** the earth on which we live = ప్రపంచం.
**Nature =** What the earth naturally has - the trees, the seas, the sky, the rivers, mountains etc. = ప్రకృతి.

***P. Srinivas, Karimnagar.***

**Q:** Please explain the following.
1. Ton - Thousand
2. Delete - Eliminate
3. Hike - Increase
4. Pace bowler - Medium Pacer

**A:** 1) Ton, thousand - no need for confusion, is there? 'Ton' is a unit of weight equal to 1000 kg, where as 'thousand' is just a number. (British Ton is different from Metric ton = 1000 kg. British Ton = 1016 Kg. Metric ton is a French unit of weight.)
**2) Delete =** to remove something written/ printed/ stored in a computer. (రాసిన, అచ్చయిన విషయాన్ని తీసేయడం, కంప్యూటర్ నుంచి సమాచారమంతా తొలగించడం).
**Eliminate =** Remove or get rid of something, especially something unwanted/ unnecessary. (అనవసరమైన/ అక్కర్లేని విషయాన్ని తొలగించడం.)
Google eliminates the need for a dictionary = గూగుల్ dictionary అవసరాన్ని తొలగిస్తుంది.)
**3)** Hike = Increase, especially prices, taxes, etc. Increase = Increase anything in general.
**4)** Pace bowler = One who bowls very fast.
A medium pacer = A bowler who is not very fast, but just fast. (Neither too fast nor too slow). pace = speed.

**For some weeks now, we have been practising short responses (క్లుప్త స్పందనలు) which are an important aspect of spoken / conversational English. The expressions, 'I'm afraid not', 'I think so', etc., are some more such responses.**
**(కొంతకాలంగా క్లుప్త స్పందనలు నేర్చుకుంటున్నాం కదా. మరికొన్ని ఇప్పుడు చూద్దాం.)**

# I don't think **so**..

**Sampath:** Is there time for one more game? (ఇంకో ఆట ఆడే సమయం ఉందా?)

**Prem:** I'm afraid not. (లేదనే అనుకుంటున్నా.)

**Sampath:** Your game is better than mine. Will my practising with you improve my game? (నీ ఆట నా ఆట కన్నా మెరుగ్గా ఉంటుంది. నీతో practise చేస్తే నా ఆట మెరుగవుతుందా?)

**Prem:** I believe so. Well, you can give it a try. (అని నమ్ముతున్నా. ప్రయత్నించి చూడు.)

**Sampath:** Will it be possible for you to play atleast two sets with me every evening? (రోజూ సాయంత్రం నాతో రెండు sets ఆడటం నీకు సాధ్యమేనా?)

**Prem:** I don't think so (కాదనుకుంటా).

**Sampath:** Then what do you suggest (that) we do?

**Prem:** We can play longer during the weekends, when I have plenty of leisure. It must suit you, if I am not wrong. (వారాంతాల్లో మనం ఎక్కువసేపు ఆడవచ్చు అప్పుడైతే నాకు విరామ సమయం ఎక్కువగా ఉంటుంది. నేను పొరపడకపోతే, అది నీకు వీలేననుకుంటా.)

**Sampath:** I hope so. (అలానే ఆశిస్తున్నా.)

**Prem:** Can't you get your friend Sekhar to join us? He is a good player too and some practice with him will be of help to me, won't it? (మీ స్నేహితుడు శేఖర్‌ను మనతో ఆడేందుకు తీసుకురాకూడదూ? అతను మంచి ఆటగాడు. అతనితో కొంత practise నాకు సాయపడుతుంది కదా?)

**Sampath:** I hope not. He isn't a steady player. (నేనలా అనుకోటం లేదు. అతను నిలకడ ఆటగాడు కాదు.)

**Prem:** OK, then. I believe we are going to have a steady practise from the weekend. (సరే అయితే, ఈ వారాంతం నుంచి మనం నిలకడగా practise చేద్దాం అని నమ్ముతున్నాను.)

**Sampath:** I believe so too.

## FUNCTIONAL ENGLISH

**Look at the following expressions from the conversation above:**

1) I'm (I am) afraid not
2) I believe so 3) I don't think so
4) I hope so 5) I hope not
6) I believe so too.

**ఈసారి మనం చూడబోయే క్లుప్త స్పందనల్లో ఎక్కువగా వాడే మాటలు: think, believe, hope, afraid, wonder and suppose.**

ఈ responses మన spoken Englishకు చాల సహజత్వాన్నీ, సరళత్వాన్నీ ఇస్తాయి.

**Look at the following:**

**1.** a) Bharadvaj: Is there enough time for us to finish this work? (ఈ పనిపూర్తి చేసేందుకు చాలినంత సమయం ఉందా?)
Sulekha: I think so. (అనే అనుకుంటున్నా.)
b) Charan: Will he help us in the matter? (అతను మనకు ఈ విషయంలో సహాయం చేస్తాడా?)
Ekambar: I don't think so (నేనలా అనుకోటం లేదు.)
c) Gangadhar: Is there time for another cup of tea? (ఇంకో కప్పు టీ తాగే సమయం ఉందా?)
Sudheer: I think so (ఉందనే అనుకుటున్నా.) అదే లేదని అనుకుంటున్నా, అనేందుకు I don't think so. We must rush అలా..)

**2.** a) Sunayana: We are going to have holidays from 5th June, aren't we? (మనకు June 5 నుంచి సెలవులు ఉంటాయి కదా?)
Praveena: I believe so ( నా నమ్మకం అదే.)
b) Pakash: He is the same guy who cheated us last time, isn't he? (పోయినసారి మనల్ని మోసం చేసింది వీడే కదా?).
Praveena: I believe so. (అనే నమ్ముతున్నాను.)

**3.** a) Naresh: Perhaps Jagdish will help us in the matter. (బహుశా మనకి ఈ విషయంలో జగదీష్ సహాయం చేస్తాడేమో).
Ramesh: I hope so (అనే ఆశిస్తున్నా.)
b) Divakar: We will be able to meet him, shan't we? (మనం అతన్ని కలుసుకోగలం కదా?)
Suman: I hope not. (నేనాశించటం లేదు.)

**4.** a) Damodar: Perhaps he will be behind the bars soon. (త్వరలోనే వాడు కటకటాల వెనుక ఉంటాడనుకుంటా.)
Vinai: I am afraid so (అలానే అనుకుంటున్నా.)

Afraid - మామూలు అర్థం - భయపడటం, కానీ ఇలాంటి చోట I'm afraid వాడకం: అవతలివాళ్లకు ఇష్టం లేని / నిరాశ కలిగించే/ చికాకు కలిగించే విషయం, కాస్త మర్యాదపూర్వకంగా చెప్పేందుకు అంటాం.

b) Anand: Is your father coming?
Bhaskar: I'm afraid not (రారండి.)




c) Chandra: Do you think it will rain? (వర్షం వస్తుందనుకుంటున్నావా?)
Surya: I'm afraid so (అనే అనుకుంటున్నా) (కొంత సందేహంగా/ మర్యాదగా చెప్పటం).
d) Leela: Is there enough money for the bike? (బైక్ కొనేందుకు తగినంత డబ్బు ఉందా?)
Manohar: I hope not (లేదనే నా భావం).

గమనిక: Positive responses అన్నింటికీ చివర 'so' వస్తుంది.

I think / believe / suppose / hope / afraid so.

Negative response: Hope, afraid కు తప్ప మిగతావాటికి కూడా 'so' వస్తుంది.

I don't think / believe / suppose so.

Hope, afraid కు మాత్రం negative response తేడాగా ఉంటుంది, ఇలా: I'm afraid not / I hope not.

---

**- Nimisha Patekar, Warangal.**

**Q:** గోడకి అనుకొని చదవకూడదు. You should not depend against the wall while studying - Is this correct?

**A:** Don't study, leaning against the wall. OR Don't lean against the wall when you study. Depend on = Look for others' help = ఆధారపడటం, lean = ఆనుకోవటం.

**Q:** You should study lonely - Is this right?

**A:** You should study alone - Correct. 'Lonely' also means alone, but it refers to the suffering caused by being alone. (ఒంటరితనం బాధించేదైతే, loneliness. ఒంటరిగా ఉండటం = Alone.




**Q:** These activities will be done next week / in next week / by next week - Say the correct one.

**A:** These activities will be done next week - Correct.

No 'the' before, every / this / that / next / last week.

These activities will be done ( = Completed) by next week - Correct.

**Q:** Don't forget sending me your cell no. / Don't forget to send me your cell no. - Clarify.

**A:** Don't forget sending me your cell no = Don't forget that you have sent me your cell no. (నువ్వు నాకు cell no పంపించావన్న సంగతి మర్చిపోకు.)

Don't foget to send me your cell no. = Please remember to send me your cell no. = నీ సెల్ నంబరు మర్చిపోకుండా పంపించు.

**Q:** I will lodge a complaint against you to the police - is this correct?

**A:** Correct.




**Q:** The children are playing on / in the ground - Which is correct?

**A:** The children are playing on the ground - Correct.

**Q:** They are made do / doing - Is this correct?

**A:** 'They are made to do it' ( = They are forced to do it) is correct.

**Q:** I have to pay special attention towards you - is this correct?

**A:** I have to pay special attention to you - Correct.

**Q:** Give / offer - Explain the difference.

**A:** Give = to hand something to some one = ఇవ్వటం (అడిగినా, అడగకపోయినా).

Offer = Give something to somebody without their asking for it = అడగకుండా ఇవ్వటం, Offer.

**Q:** చెట్టు ఎండి పోయింది. The tree is dried / the tree dried.

**A:** The tree has dried up / withered.

---



## on, upon తేడా ఏమిటి?

**- Ramulu, Mahabubnagar**


M. SURESAN




**Q:** When to use in, into, and on, upon?

**A:** For the uses of these prepositions (In, into, on and upon) refer to any good grammar book / dictionary. వీటికి ఉన్న చాలా ఉపయోగాలు ఇక్కడ చెప్పడం కష్టం. ఇవి మాత్రం ముఖ్యమైన అర్థాలు వాటికి:

In = లో / లోపల, Into = లోనికి. He sat in the room (గదిలో కూర్చున్నాడు). He came in and sat down = అతను లోపలికి వచ్చి కూర్చున్నాడు.

On = మీద / పైన. There are some books on the table = table మీద పుస్తకాలున్నాయి. upon అన్నా కూడా దాదాపు 'on'.

**Q:** Difference between 'Do I give you water' and 'Shall I give you water'.

**A:** Do I give you water? = మీకు నేను నీళ్లు ఇస్తానా? ఇలాంటి ప్రశ్న అడగం కదా? ఇది తప్పు.

Shall I give you water? = మీకు నీళ్లివ్వనా? (offer).

**Q:** 1st brother, 2nd brother, 3rd brother, 4th sister, నేను, 6th brother, 7th sister, 8th brother. ఇందులో నేను మిగతా వాళ్లనెలా పిలవాలి?

**A:** ఎవర్నైనా, Englishలో మన సొంత అన్నదమ్ములను, అక్కచెల్లెళ్లను brother / sister అని పిలవం. తెలుగులోలా / మనదేశంలో అన్నలనైనా, అక్కలనైనా పేర్లతోనే పిలుస్తారు. అయితే మొదటి పేరును పొట్టిచేసి చివర 'y' (ఇ) వచ్చేట్టు పిలుస్తారు. Eg: John - Johnny ; Elizabeth - Liz / Lizzy .

**- Papa Raidu, Irsulapuram.**

**Q:** Long, a long, the long - are these words used like few, a few and the few?

**A:** No. These three words have no negative meaning, unlike 'few'.

**Q:** They have come here on the car / in the car / by the car - which one is correct?

**A:** i) They have come here by car - the best.

ii) While travelling, "on the car" - They quarrelled with each other on the car - while in motion.



In the car - Only when you say that somethings are in the car. Eg: My suitcase is in the car.

**Q:** Reportedly - explain.

**A:** Reportedly = according to reports = according to what some people say = కొంతమంది / ఎవరో అన్నదాని ప్రకారం / అందిన సమాచారం ప్రకారం.

Reportedly the thief is hiding some where in the town = అందిన సమాచారం ప్రకారం దొంగ ఈ నగరం / పట్టణంలోనే ఎక్కడో దాక్కొని ఉన్నాడు.

---

**- Usha Kiran Malhothra, Vizianagaram.**

**Q:** I fought with him/ to him/ him- Say the correct sentence here.

**A:** a) I fought with him/ I fought him - Correct. I fought to him - Wrong.

**Q:** Let me know how the following words are pronounced.
1) procession 2) Government
3) Model 4) Eleven 5) Material
6) Early 7) Airport
8) Development 9) Relative
10) Representative 11) Engineer
12) Seven 13) Honourable
14) Eight

**A:** We don't have letters in Telugu that can show these English sounds. How do you want me to let me know the pronunciation of these words? If you know phonetic symbols you can know their pronunciation from any good dictionary. There are CDs which give the pronunciation too.

**Q:** If a student/ pupil/ has to ask permission from the teacher / has to get a favour from a teacher, then what is the polite form / what is the polite request to be asked? Ex: Shall I go there, sir?

**A:** Sir, can I go to the washroom? (Permission to go to the toilet) / can you explain / could you explain the point once more, sir? (could you....? - very polite)

**Q:** He is living at the city centre.

If the above sentence is taken from 'He..... living, is it called a clause? or if the sentence is taken from 'is' to 'centre' is it called a predicate? or if the sentence is taken from 'at.... centre', is it called a phrase? Clarify.

**A:** i) He - (subject)

is living at the City centre - (predicate). The part of the sentence talking about the subject is predicate.

'At the city centre' - phrase (A group of words without a verb.)

**Spoken English** పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... ***www.eenadupratibha.net***

ప్రతిభ

FUNCTIONAL ENGLISH

మనం కిందటి **lesson** లో చూశాం– **'afraid'/ 'wonder'** మామూలు అర్థాలతో కాకుండా, వేరే అర్థాలతో వాడటం. **'Afraid'** మామూలు అర్థం భయపడటం/ భయంగా ఉండటం. కానీ మనం కిందటి **lesson**లో **'afraid'** ను చెడు విషయాన్ని/ కోపం/ అసహనం కలిగించే విషయాన్ని చెప్పేందుకు వాడటం చూశాం. గుర్తుంది కదా. ఈ రెండింటి ఇతర ఉపయోగాలను చూద్దాం.

# I *wonder* what he is..

**Lakshmi:** Where are our guests - I mean your uncle and aunt? They left in the morning and haven't returned so far. I wonder where they are. (మన అతిథులు, అదే మీ బాబాయి, పిన్నివాళ్లు ఎక్కడున్నారు? పొద్దున వెళ్లారు, ఇంతవరకు తిరిగిరాలేదు. ఎక్కడున్నట్టు వీళ్లు?)

**Kishore:** I wonder too mom. It is raining heavily. They must have got caught in the rain and are perhaps waiting for it to stop. (నాకూ అదే తెలియకుండా ఉందమ్మా. జోరుగా వర్షం కురుస్తోంది. దాన్లో చిక్కుకుపోయారేమో. ఇది ఆగేందుకు ఎదురుచూస్తున్నారేమో).

**Lakshmi:** I'm (I am) afraid she may catch a cold. She is of delicate health you know. (ఆమెకేమన్నా జలుబు చేస్తుందేమో అని నా అనుమానం. తన ఆరోగ్యం అంతంత మాత్రమే కదా.)

**Kishore:** I wonder when this rain will stop, and if it will stop at all. (ఈ వానెప్పుడు ఆగుతుందా, అసలు ఆగుతుందా లేదా అని సందేహంగా ఉంది.)

**Lakshmi:** Do they know their way back home at all. I wonder if you could reach them on the mobile. (ఇంటికి దారైనా తెలుసా వాళ్లకు. మనం ఏమైనా వాళ్లకు phone చేయగలమా?)

**Kishore:** I wonder whether he hasn't changed his number. I remember vaguely his telling me so. (ఆయన phone number మార్చకుండా ఉన్నారా అని? మారుస్తున్నానని ఆయన చెప్పినట్టు నాకు గుర్తు.)

**Lakshmi:** Ah! Here they are, soaked to the bone. They have come at last. What a relief? (ఆ, వచ్చారు వాళ్లు, పూర్తిగా తడిసిపోయి. ఎలాగైతేనేం వచ్చారు. నెత్తిన బరువు దించినట్టుంది.)

★ ★ ★

***Look at the following sentences from the conversation:***

1) I wonder where they are
2) I wonder too.
3) I'm afraid she may catch cold.
4) I wonder when this rain will stop.
5) I wonder if you could reach them on the mobile.
6) I wonder whether he hasn't changed his number.

**a) Bhanu:** Hope he hasn't failed the exam. (అతడు పరీక్ష తప్పలేదని ఆశిస్తున్నా.)

**Vidur:** I'm afraid he has. (Fail అయ్యాడనే అనుకుంటున్నా - బాధ కలిగించకుండా చెప్పడం.)

**b) Suneeta:** Has she married that good for nothing fellow, after all? (చివరికి ఆ పనికిరాని వాడిని పెళ్లాడిందా?)

**Sasi:** I'm afraid so (అదే అయిందనుకుంటున్నాను.)

ఇదీ 'afraid' ను ఉపయోగించే విధం. ఇది కిందటి lesson లోనూ చూశాం కదా?

ఇప్పుడు 'wonder' కూడా దాని మామూలు అర్థాలతో (ఆశ్చర్యపడటం/ ఆశ్చర్యం/ అద్భుతం) కాకుండా conversational English లో వాడే విధం చూద్దాం.

ఈ lesson సందర్భంలో 'wonder' ను, మనకేదైనా ఇదమిద్ధంగా తెలియనప్పుడు, మన సందేహాన్ని/ మనం అనుకునే తీరును వ్యక్తపరిచేందుకు వాడతాం.

**1** **a) Ashok:** Will he be at home now? (వాడిప్పుడు ఇంట్లో ఉంటాడంటావా?)




**Maneesh:** I wonder (నాకు సందేహమే.)

**b) Bahadur:** Hello, is it Mukund? (హలో, ముకుందేనా మాట్లాడుతోంది.)

**Mukund:** Yes, it is. (అవును.)

**Bahadur:** Thank God. I was just wondering if I could get you over the phone. I am happy. (బతికిపోయాను. నువ్వు phone లో దొరుకుతావో లేదో అని సందేహపడుతున్నా. దొరికావు. సంతోషం.)

**2** 'Wonder' ను ఇలాంటి పరిస్థితుల్లో, అనుకోవడం (think seriously) అనే అర్థంతో కూడా వాడతాం.

**a) Prasad:** You appear absent minded. Why? (ఏదో పరధ్యానంగా ఉన్నావు. ఎందుకు?)

**Sravan:** I have been searching for my bike key since morning. I was wondering where I could have put it. (పొద్దుటి నుంచి నా bike key కోసం వెతుకుతున్నా. ఎక్కడ పెట్టానబ్బా అని ఆలోచిస్తున్నా.)

**b) Jayaram:** So you are going to meet Sai today, are you? (అయితే నువ్వు సాయిని కలుసుకోబోతున్నావన్నమాట, అవునా?)

**Mahesh:** So I am, but I wonder if I can recognize him after all these years (అవును. కానీ ఇన్నేళ్ల తర్వాత అతణ్ని నేను గుర్తుపట్టగలనా అని ఆలోచిస్తున్నా.)

**3** Wonder ను guess (ఊహించడం) అనే అర్థంతో కూడా వాడతాం.







**a) Bharat:** The tax people are after Nataraj for non payment of tax. I've been warning him again and again. He is in real trouble. (ఆదాయపన్నువాళ్లు నటరాజ్ కోసం వెతుకుతున్నారు, పన్ను చెల్లించనందుకు. నేను హెచ్చరిస్తూనే ఉన్నాను అతడిని. నిజంగా ఇబ్బందుల్లో ఉన్నాడతను.)

**Chakri:** I wonder what he is going to do now? (ఇప్పుడతడు ఏం చేయబోతున్నాడో అని ఆలోచిస్తున్నా.)

**b) Nischal:** Do you think he will pay you back the money before this month end? (ఈ నెలాఖరులోగా నీ డబ్బు నీకు తిరిగి చెల్లిస్తాడా?)

**Chari:** I wonder where he can get the money from. (అతడు ఆ డబ్బు ఎక్కడ పొందగలడా అని ఆలోచిస్తున్నా.)

**4** 'Wonder' ను మర్యాదగా ఏదైనా అడిగేందుకు (Request) అభ్యర్థనకు వాడతాం.

**a) Anand:** What brings you here Raju? Long time no see. (ఏమిటిలా వచ్చావు? చాలారోజులైంది నిన్ను చూసి.)

**Raju:** I wonder if I might borrow some money from you. (నీ దగ్గర కాస్త డబ్బు అప్పేమైనా దొరుకుతుందా అనుకుంటున్నా/ డబ్బేమైనా అప్పివ్వగలవా అని అడిగేందుకు వచ్చా)- Polite request.

**b) Pratap:** I wonder if I could borrow your book for a few days. (నీ పుస్తకం కొన్నిరోజుల పాటు నేను అరువు తీసుకోవచ్చా?)

**Venkat:** I'm afraid I can't just now. (ఇప్పుడిప్పుడే ఇవ్వలేనేమో అనుకుంటున్నా.)

**One more example:**

**Ram:** I was wondering if I could borrow your car for a day? (నీ కారు ఓ రోజు నేను అరువు తీసుకోవచ్చా (అని ఆలోచిస్తున్నా).

**Rahim:** Have it by all means. (నిరభ్యంతరంగా తీసుకో.)

# Mates, fellows మధ్య తేడా...?



***Gemini Manvothi, Khammam.***

**1.** i) నేను M.P.C. group తీసుకున్నాను.
ii) నేను M.P.C. course చేస్తున్నాను. - Which is correct?

**A:** i) తీసుకున్నాను = Choose/ selected (ఎంపిక చేసుకున్నాను).
ii) చేస్తున్నాను = doing/ studying (చదువుతున్నాను)

**2.** i) ఆయన English Language చెప్పాడు.
ii) ఆయన English subject బోధిస్తాడు. వీటిలో language కి, subject కి ఉన్న తేడా ఏమిటి? - Explain.

**A:** i) English Language - language of English = ఇంగ్లిష్ భాష.
ii) English Subject - బోధించే విషయం (Subject) English. రెండింటికీ అర్థం ఒకటే.
The English subject = English language.

**5.** I am an English teacher/ I am a teacher of English. - Which is correct?

**A: I am an English teacher =** I am an English person, working as a teacher.




**I am a teacher of English =** I am a teacher (Indian/ English/ American, etc.) teaching English.

But this difference need not be listed upon. ఈ తేడా అంత పాటించక్కర్లేదు. We can say either to mean, 'one who teaches English'.

***Ajay, Mahabad.***

**1.** If you want me to get scolded then you can be here - నేను తిట్టించబడాలని నీవు అనుకుంటే నీవు ఇక్కడ ఉండొచ్చు- If the above sentence correct.. say whether the above translation is correct or not.

**A:** Both the sentence and the translation are correct. అయితే తెలుగులో తిట్టించుకోబడాలంటే అని అనం కదా? 'నేను అతడితో తిట్లు తినాలనుకుంటే' అంటే బాగుంటుంది.

**2.** He had seen me talking to others and went away - Say in Telugu.

**A:** నేను ఇతరులతో మాట్లాడటం చూసి అతడు వెళ్లిపోయాడు. అయితే 'He saw me talking to others and went away" is better.

**3.** Material Noun/ Uncountable Noun - explain.

**A: Material noun -** The names of matter/ substance things are mode of: Iron, gold, silver, clay, etc.

**Uncountable noun -** Names of things we can not count - wood, goodness, beauty, advice, etc.

All material nouns are uncountable, but not all countable nouns are material nouns.

**eg:** Goodness is uncountable, but it is not a material noun. It is an abstract noun.

**4.** Reflexive pronoun/ Emphatic pronoun - say the difference.

**Reflexive:** He killed himself - Here 'himself' is a reflexive pronoun, because the verb, 'killed' says that the subject, 'He' did something to 'himself'. So a pronoun which talks of something done to itself is a reflexive pronoun.

An "emphatic' pronoun emphasizes (నొక్కి చెబుతుంది) the other pronoun it refers to.

I myself saw it. (నేనే అని నొక్కి చెబుతుంది కాబట్టి) 'myself' here is an emphatic pronoun. Usually reflexive pronoun comes at the end of the sentence:

I hurt myself (Myself - reflexive)

She herself saw it/ she saw it herself - Look at the position of the emphatic pronoun - It may come immediately after the subject, or at the end of the sentence, after the object.

***Pratigna Gupta, Yellandu.***

**1.** ఇండియాను విడిచి నేను ఎక్కడికీ వెళ్లను.

**A:** I will never leave India for any other place.

**2.** ఆయన దెయ్యంగా మారాడు.

**A:** He has turned into a ghost.

**3.** ఆయన ముసలివాడయ్యాడు.

**A:** He has become old.

**4.** పురావస్తు పరిశోధనాశాఖ వారి తవ్వకాల్లో బయటపడ్డ అవిటి శిల్పంలా ఎలా నిల్చున్నాడో చూడు. - Translate the above sentences in English.

**A:** See, how he stands like a maimed statue unearthed in the diggings of the archeological department.

**5.** They went to the exhibition along with their children/ with their children - which one is right?

**A:** They went to the exhibition along with their children = ...... with their children - both are right. 'Along with' is more emphatic.

**6.** Please sign on this paper/ in this paper/ this paper - which is correct?

**A:** Sign this paper - Correct.

**7.** Mates/ Colleagues/ fellows/ companions. - Clarify.

**A: Mates -** friends; **Colleagues =** People who work in the same profession/ the same company/ institute.

**Fellows =** People working in the same position = ఒకే వృత్తిలో / ఒకే హోదాలో ఉండేవాళ్లు.

**Companions =** Persons travelling together/ persons having same interests/ tastes/ persons who share pleasures and joys (సహచరులు).

**Spoken English** పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... ***www.eenadupratibha.net***

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net

# FUNCTIONAL ENGLISH




**Satish:** There is a nice restaurant near the temple. The meals and snacks are really delicious. (ఆ గుడిదగ్గర ఒక మంచి హోటల్ ఉంది. అక్కడ భోజనం, ఫలహారాలు నిజంగా రుచిగా ఉంటాయి).

**Pramod:** It is funny to hear you talk of a restaurant. Since when have you started eating out? (నువ్వు ఫలహారశాలను గురించి మాట్లాడటం తమాషాగా ఉంది. బయట తినడం ఎప్పటి నుంచి ప్రారంభించావేంటి? )

**Satish:** Funny or not, I find the food good there. Oh, It's (it has) started raining. Let's find some cover. (తమాషానో కాదో కానీ, అక్కడ ఆహారం మాత్రం బాగుంటుంది. ఓ, వర్షం మొదలైంది. ఎక్కడైనా తడవకుండా ఉండొచ్చేమో చూద్దాం.)

**Pramod:** There is a tea stall next to the tree. Let's stand there for some time.(చూడూ, ఆ చెట్టుపక్కన tea stall ఉంది. అక్కడికెళ్లి నిలబడదాం).

**Satish:** There are already a number of people there. I'm (I am) afraid it is difficult to find room there. (ఇప్పటికే చాలామంది జనం ఉన్నారక్కడ. అక్కడ మనకు చోటు దొరుకుతుందా అని సందేహం).

**Pramod:** The rain is getting heavy. Let's hurry. There is no time to waste. (వర్షం ఎక్కువవుతోంది. పదపద, వృథాచేసేంత సమయంలేదు).

**'There' మామూలు అర్థం - అక్కడ.**
**'It' మామూలు అర్థం - అది / ఇది.**
**అయితే There / it ను వాటి మామూలు అర్థాలతో కాకుండా, sentence ప్రారంభించేందుకు మాత్రమే కొన్ని సందర్భాల్లో వాడతాం. ఇది తెలుసుకోవడంతోపాటు చివరలో ఇచ్చిన అభ్యాసాన్ని సాధన చేయడం ద్వారా ఏ మేరకు అర్థం చేసుకున్నారో పరీక్షించుకోండి.**

# *It has* started raining..

**Now look at the following expressions:**

1) There is a nice restaurant near the temple.
2) It is funny to hear you talk about a restaurant.
3) It has started raining.
4) There is a tea stall next to the tree there.
5) There are already a number of people there.
6) It is difficult to find room there.
7) There is no time to waste.

పై sentences అన్నీ, 'There'తో కానీ, 'It 'తో కానీ ప్రారంభం అవడం గమనించారు కదా? ఇదే There, it కు ఉన్న గమ్మత్తయిన ఉపయోగం Englishలో.

'There' మామూలు అర్థం - అక్కడ.
'It' మామూలు అర్థం - అది/ ఇది.

అయితే పై sentences అన్నింటిలో There/ it ను వాటి మామూలు అర్థాలతో కాకుండా, sentence ప్రారంభించేందుకు మాత్రమే వాడతాం. ఇది తెలుసుకోవడం చాలా ముఖ్యం.

చూడండి... 'రెండు పుస్తకాలు ఆ table మీద ఉన్నాయి' అనేందుకు, Englishలో అనాల్సిన తీరు: Two books are on the table. అయితే, grammaticalగా ఇందులో దోషం లేనప్పటికీ, Englishలో చాలా అరుదుగా వింటాం. అందుకు బదులు, ఇలా అంటాం మామూలుగా.

There are two books on the table. గమనించే ఉంటారు. ఈ sentence లో 'There' కు ఉండే మామూలు అర్థం ఇక్కడ రాదు. ఇంకా ఇలా కూడా అంటారు.

There are thirty students there. చివరి 'there' కు మాత్రమే అర్థం ఉంది. మొదటి 'there'ను వాక్యం ప్రారంభించేందుకు మాత్రమే వాడతాం. This is an important aspect of English usage.


M. SURESAN

హైదరాబాద్‌లో 30 Engineering Colleges ఉన్నాయి. Thirty Engineering Colleges are in Hyderabad - Very rare.

The usual and correct form: There are Thirty Engineering colleges in Hyderabad. (thereకు మామూలు అర్థం 'అక్కడ' అని వాడామనుకుంటే, ఈ sentence కు అర్థం: 'అక్కడ హైదరాబాద్‌లో 30 కళాశాలలున్నాయి' అనే విపరీతార్థం వస్తుంది. అంటే ఇక్కడ 'there'ను sentence ప్రారంభించేందుకే వాడుతున్నామన్న మాట.




'There'ను ఇలా వాడితే, అప్పుడు దాన్ని 'Introductory there' అంటాం. అంటే ఏ అర్థం లేకుండా, వాక్యాన్ని ప్రారంభించేందుకు మాత్రమే దాన్ని వాడతాం.

Look at the following too:

a) Prasad: Are there good schools in the town? (ఇక్కడ మంచి schools ఉన్నాయా? )
Subba Rao: Plenty (చాలానే ఉన్నాయి).

Questionలో కూడా 'there' వాడకం గమనించండి. ఇది sentence ను అనేందుకు మాత్రమే వాడతాం.

ఇంకా interesting - ఇది చూడండి.

b) Suman: Are there any good theatres here? (ఇక్కడ మంచి theatres ఉన్నాయా? )
Lasya: Very few (చాలా తక్కువ).

'There', 'here' (అక్కడ, ఇక్కడ) ఒకే చోట రావడం గమనించండి. ఇదికూడా Correct: There aren't any good theatres here. (ఇక్కడ మంచి theatres ఏం లేవు).

పై sentence లో 'there', 'here' ఒకే sentence లో రావడం గమనించారు కదా?

## Exercise

ఈ కింది sentencesలో 'there' వాడండి.

1. ఆంధ్రప్రదేశ్‌లో 23 జిల్లాలున్నాయి.
2. ఎందుకంతమంది పోలీసులున్నారిక్కడ?
3. ఇక్కడ ఇరవై మంది విద్యార్థులున్నారు.
4. ఆ ప్రశ్నపత్రంలో 15 ప్రశ్నలున్నాయి.
5. ఆ గ్రంథాలయంలో ఆసక్తికరమైన పుస్తకాలున్నాయా?

ప్రతి sentence లో 'there' వచ్చేలా ప్రయత్నించండి.

**జవాబులు వచ్చేవారం.**

**Note:** 1) Restaurant = ఫలహారం, భోజనం దొరికే చోటు.

Restaurant కు Hotel కూ తేడా ఉంది. Hotel అంటే, Lodge (బస చేసే సదుపాయం)తో ఉండే భోజన ఫలహారశాల.

Restaurant: భోజన ఫలహారశాల మాత్రమే, lodge లేకుండా.




ఈ మధ్య restaurantను 'eatery' అని కూడా అంటున్నారు.

2. Delicious = tasting very good = రుచికరమైన.
3. Funny = తమాషాగా ఉన్న; fun = తమాషా.
4. Cover = ఎండ, వాన నుంచి తలదాచుకునే చోటు; ప్రమాదం నుంచి కూడా.

---

# ఇంగ్లిష్‌లో commercial hero ఉంటాడా?



**- E. Anil, *T.N.Palem, Prakasam Dist.***

**Q:** Amarpreet Singh being treated in a hospital - ఇక్కడ being ఏ Tense లో ఉంది? ఇలాంటి సందర్భాల్లో being ఎందుకు వాడారు? being అనేది Passive voiceలో ఉపయోగిస్తారు. ఇది Passive voice కాదు కదా? ఎందుకంటే is / are + being ఉండాలి కదా? కేవలం being ను ఉపయోగిస్తూ examples ఇస్తూ, being ఎక్కడవాడాలో తెలుపగలరు.

**A:** 'Being'కు tense ఉండదు, ఎందుకంటే అది finite verb కాదు.

Being hungry, he is prepared to eat anything. (ఆకలిగా ఉండటంతో, ఏది తినేందుకు అయినా సిద్ధంగా ఉన్నాడు.)

Being = ఉండటం - దీనికి Tense లేదు కదా. పై Sentence లో అయితే దాన్ని present tenseలో అన్నాడు.

Being hungry he was ready to eat. (ఆకలిగా ఉన్నందువల్ల అతను తినేందుకు సిద్ధంగా ఉన్నాడు - గతంలో)

అలాగే ఉత్త '....ing' forms (going, coming, walking etc.) కు tense ఉండదు.

Be + 'ing' form (am going, is coming, was working - verbs) కు tense ఉంటుంది, '....ing' form ముందుండే 'be' form (am/ is/ are, etc) ను బట్టి.

Am going - Present tense
Was going - Past tense
Will be going - Future tense

కేవలం beingతో వచ్చే group of words, phrase మాత్రమే (a group of words without a verb) అవుతాయి.

Being rich, (ధనికుడిగా ఉండటం/ ఉన్నందువల్ల)
Being tall, (పొడుగ్గా ఉండటం/ ఉన్నందువల్ల)

Being వాడే సందర్భాలు కొన్ని:

Being tall, he can play well. (పొడుగ్గా ఉన్నందువల్ల, బాగా ఆడగలడు.)

Being tall is an advantage = పొడుగ్గా ఉండటం లాభం.

Being an Indian is a great fortune = భారతీయుడిగా ఉండటం గొప్ప అదృష్టం.

**- Rasi Chourasiya, *Bhongir.***

**Q:** *Say the meaning and whether they are grammatically correct or not.*

1. I am getting the answers recited.
2. I get/ have the answers recited.
3. She does get her room cleaned.
4. She did get/ have her room cleaned.
5. She does get/ have her say/ way in the matter.
6. I am getting / having my hair cut done.

**A:** Sentences 1 to 6 - Correct. All of them have the meaning - ఏదైనా పని చేయించడం అని వస్తుంది.

Eg: I am getting the answers recited = అప్పచెప్పించుకుంటున్నా.

అలాగే మిగతా వాటికి కూడా. Get/ have to do something = ఏదైనా చేయించడం.

**Q:** I do getting my bicyle repaired.
**A:** I do getting - Wrong
I do get - Correct.

**Q:** I am getting my bicyle repaired.
**A:** OK.

**Q:** Would she got her room cleaned if she reached there yesterday itself.
**A:** Would she have got her room cleaned if she had reached there yesterday? - Correct.

**Q:** She took no notice/ she did take no notice.
**A:** She took no notice/ she did not take any notice - Correct.

**Q:** She does back her husband up.
**A:** Correct - ఆమె తన భర్తను కచ్చితంగా సమర్థిస్తుంది.

**Q:** I do at it.
**A:** Wrong. I do it - Correct = నేను చేస్తాను.

**Q:** She did give me understand that she was not interested in music.
**A:** She did give me to understand .... = తనకు సంగీతంలో ఆసక్తిలేదని నాకర్థం అయ్యేలా చేసింది.

**Q:** She does go ahead with her plans.
**A:** Correct - తన పథకాలతో తప్పకుండా ముందుకెళ్తోంది.

goes, వెళ్లడం; does go = తప్పక వెళ్లడం.

Not లేకుండా, did go, does go వాడటం, ఆ పనులను నొక్కి చెప్పడం.

She helps me = సాయం చేస్తుంది.




She does help me = సాయం చేస్తుందే. (ఎందుకు చేయదు? అనే ధోరణిలో).

He does smoke = వాడు సిగరెట్ తాగకపోవడం ఏమిటి? - కచ్చితంగా తాగుతాడనే అర్థంతో.

**- Sneha Kolhapuri, *Kothagudem***

**Q:** Dinner / Supper - Explain in Telugu.

**A:** Dinner - the main meal of the day eaten in the evening- రోజులో భోంచేసే ముఖ్యమైన భోజనం, అతిపెద్ద భోజనం- భారతీయులకు ఇది రాత్రి భోజనం కావచ్చు ఎందుకంటే ఉద్యోగాలూ, వ్యాపారాలు చేసుకునేవాళ్లు మధ్యాహ్న భోజనం అన్ని పదార్థాలతో భుజించే సమయం ఉండదు కాబట్టి.

Western countriesలో ఇది సాయంత్రం భోజనం. వాళ్లు తీసుకునే ముఖ్యమైన భోజనం.

Supper, పాశ్చాత్యులకు regular mealకాదు; అంటే రోజూ తీసుకునేది కాకపోవచ్చు సాయంత్రమే Dinner తీసుకుంటారు కాబట్టి, రాత్రి ఎక్కువసేపు మేల్కొని ఉంటే, ఆకలేస్తే, అప్పుడేదైనా స్వల్పంగా తీసుకుంటే, అది supper. Supper స్వల్పంగా తీసుకునే ఆహారమే. మనకైతే రాత్రి భోజనమే dinner కాబట్టి, ఇక supper ఉండదు.

**Q:** Can we say or write the word "about" after the word 'explain'?

**A:** Explain, describe, discuss, remark, state తర్వాత 'about' వాడం.

**Q:** Commercial hero / movie - means what?

**A:** Commercial hero/ movie - There are no such expressions in English. ఇలాంటి మాటలకు అర్థం లేదు. వ్యాపార (commercial) ధోరణితో లాభాలే ముఖ్యంగా (కళాత్మకంగాలేని) తీసిన చిత్రాన్ని మనం మామూలుగా commercial movie అంటుంటాం. అలాగే అలాంటి చిత్రాల్లోని heroను commercial hero అంటాం మనం. కానీ ఈ expressions standard English కాదు.

**Q:** Let me know the difference between Material noun and Uncountable nouns with examples as well as Reflexive Pronoun and Emphatic Pronoun with examples.

**A:** See Lesson No.745.




# It *is believed* that he knows a lot

**Ramakrishna:** It is generally believed that he is responsible for all the trouble in the company. (కంపెనీలో ఈ సమస్యలన్నిటికీ అతను కారణమని చాలామంది చేత నమ్మబడుతోంది - మామూలు తెలుగు.. అందరూ నమ్ముతున్నారు)

**Gopal:** It is hoped that he will soon leave the company and all will be well. (అందరూ ఆశిస్తున్నారు, అతను కంపెనీ వదిలి వెళ్లిపోతున్నాడని, అన్నీ ఆ తర్వాత సవ్యంగా ఉంటాయని).

**Ramakrishna:** It is supposed that once he leaves the company, Virat will take control. (అతను వెళ్లిపోయిన తర్వాత విరాట్ కంపెనీ పగ్గాలు చేపడతారని అనుకుంటున్నారు).

**Gopal:** The company will be back on rails. (కంపెనీ మామూలు పరిస్థితికి వస్తుంది).

## FUNCTIONAL ENGLISH

**Look at the following expressions:**

1) It is generally believed that he is responsible for all the trouble.
2) It is hoped that he will soon leave the company.
3) It is supposed that once he leaves, Virat will take control.

you see that the sentences above begin with 'it' - the introductory 'it'. The verbs are all in the passive voice. ('be' + Past Participle).

★ It is believed (is + Past Participle of 'believe'); It is hoped (is + pp) and It is supposed (is + pp) - అంటే ఇవన్నీ Passive voiceలో ఉన్నాయన్నమాట.

It is believed = నమ్ముతున్నారు (ఇక్కడ 'it'కు అర్థం ఉండదు, తెలుసుకదా అది Introductory it).

ఇప్పుడు 'it' is believed that he knows a lot - దీని అర్థంలో అతనికి చాలా తెలుసు అని నమ్మబడుతోంది' అంటే, మామూలు తెలుగులో, చాలా మంది నమ్ముతున్నారు అతనికి చాలా తెలుసని.

★ అలాగే 'it is hoped' = ఆశించబడుతోంది = అందరూ ఆశిస్తున్నారు.

★ It is supposed : అనుకోబడుతోంది = అందరూ అనుకుంటున్నారు.

ఇలాంటి expressions Englishలో సర్వసాధారణం. ముఖ్యంగా ఎవరు అనుకుంటున్నారో, నమ్ముతున్నారో చెప్పడం సాధ్యం కానప్పుడు, ఇలా 'It + passive voice verb's తో ప్రారంభిస్తాం.

It is said that he is the greatest cricketer = people say that he is the greatest cricketer. (Is said - Passive - చెప్పబడ్డున్నాడు = అందరూ చెప్పున్నారు/ అంటున్నారు).

a) **Sagar:** It is expected that all staff should be at office by 10. (సిబ్బంది అందరూ ఇక్కడ 10కి ఉండాలని ఆశించబడుతోంది). (అధికారులు ఆశిస్తారు సిబ్బంది ఇక్కడ 10కి ఉండాలని).

b) **Kumar:** We have been told we can be an hour late once a week. (మేం చెప్పబడ్డాం = మాకు చెప్పారు, వారానికోసారి గంట ఆలస్యం అవచ్చని).

It was believed that she was the greatest dancer of her time (ఆమె గొప్ప నర్తకి అని నమ్మబడేది = అందరు నమ్మేవారు/ అనుకున్నారు ఆమె గొప్ప నర్తకి) = people believed that she was a great dancer.

### Exercise

ఈ కిందివాటిని, It + Passive voice లో రాయండి.

1. ఆమె గొప్పగాయనిగా అందరూ చెప్పుకొనేవాళ్లు.
2. రాముడ్ని అన్ని కాలాల్లోని రాజుల్లో అతిగొప్ప రాజుగా పరిగణిస్తారు. (పరిగణించడం = consider).
3. ఇంతవరకూ అనుకున్నారు ఆమె అది కనిపెట్టిందని.
4. మూడు తరాల వాళ్లు అంటారు, సచిన్ అంత గొప్ప batsman లేడని.
5. అతడే ఈ హత్య చేశాడని కనుక్కున్నారు.
6. అందరూ నమ్మారు Columbus, India ను కనిపెట్టాడని, కానీ అతను కనిపెట్టింది, ఇప్పటి West Indies (The American Continent).

(గతవారం, ఈవారం exercises కు answers next lesson లో...)

**- Ramji Singhal, *Kothagudem.***

**Q:** The meeting is round the corner - Means what?

**A:** Going to take place soon. Round the corner = about to happen.



**Q:** I was surprised with his goodness / by his goodness - Which one is correct?

**A:** I was surprised at his goodness - Correct.

**Q:** What is the difference between Emphatic Pronoun and Reflexive Pronoun - Explain with examples.

**A:** Refer to Lesson No.744.

**Q:** If a student has to get a favour done by his teacher then how should he ask. e.g. Shall I go there, sir?

**A:** Shall / can/ May/ I go there, Sir? 'May' is the most formal, and Can the least formal.

***- Gemini Manvothi.***

**Q:** You aren't supposed to make noise/ You shouldn't make noise - వీటిలో దేనికి ఎక్కువ force ఉంటుంది - వివరించగలరు.

**A:** You aren't supposed to make a noise = You shouldn't make a noise.

**- Sirisha Sneha, *Komararam.***

**Q:** You are supposed to do it/ you should do it - Which sentence has a power?

**A:** You are supposed to do it = You should do it.

**Q:** They will be going to get their/ to have their houses white washed - Is this correct?

**A:** They will be going to get their houses cleaned = They will be going to have their houses cleaned. (But 'They are going to' is better than, 'They will be going to...')

**Q:**. For fear of being trampled (I found this sentence in 'Gullivers Travels' - here my doubt is instead being, 'having been' should have been written. As this sentence is used to say the completed action in the book - Then once you said that being is used for saying present actions and having been is used for saying Past Actions. - please clarify.

**A:** For fear of being - 'for fear of' is a phrase, meaning, 'because of their fear'. The phrase is always followed by either a noun or an '...ing' form, but not by 'having been'.



## The meeting is *round the corner*

**- S. Chintabhatla, *Asifabad.***

**Q:** కింది ఆంగ్ల పదాల అర్థాలు, వాటి ఉపయోగం ఎలాగో తెలుపగలరు.

1. Outlist 2. Accountal
3. Prespending 4. Custmermind
5. Operandi 6. Contaguous
7. Handier 8. Scuffled.

**A:** Outlist, Accountal, Prespending, Contaguous - నాకు తెలిసినంత వరకూ ఈ మాటలు English లో లేవు. అయితే, మీరు Outlast ను Outlist గా, Accountable ను Accountal గా, Contiguous / Contageous ను Contaguous గా పొరబడ్డారేమో అన్పిస్తోంది. అలాగే Customermind ను Custmermind గా పొరపడ్డారు.

M. SURESAN

SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 747

★ **Outlast** = last longer than some other thing = ఇంకదేనికన్నా ఎక్కువకాలం ఉండటం.

Ex: Great People's Names outlast them = గొప్పవాళ్ల పేర్లు, వాళ్లుపోయిన తర్వాత కూడా నిలిచి ఉంటాయి.

Ex: Sachin has outlasted most other players that began with him = తనతో ప్రారంభించిన వాళ్లందరూ వెళ్లిపోయిన తర్వాత కూడా సచిన్ ఇంకా ఉన్నాడు.

★ **Accountable** = being responsible = జవాబుదారీగా ఉండటం.

Ex: You are accountable if anything goes wrong = ఏదైనా పొరపాటు జరిగితే నువ్వే జవాబుదారి / నీదే బాధ్యత.

★ Contiguous = Touching of next to something = ఆనుకుని ఉన్న.

Ex: Tamilnadu and Orissa are contiguous to Andhra Pradesh = తమిళనాడు, ఒరిస్సా ఆంధ్రప్రదేశ్‌ను ఆనుకుని ఉంటాయి.

★ Contageous = Spreading by touching = స్పర్శ (తాకడం) వల్ల వ్యాపించే.

Ex: Contageous diseases = తాకటం వల్ల వ్యాపించే వ్యాధులు.

★ **Customer mind** - The correct form is customer's mind = కొనుగోలుదారుడి/ కొనేవాళ్ల ఆలోచనా సరళి.

Ex: A clever businessman knows customer's mind = తెలివైన వ్యాపారికి కొనేవాళ్ల ఆలోచన తెలుస్తుంది.

★ **Operandi** - ఇది latin phrase (పద సముదాయం) Modus Operandi లో భాగం - ఎవరైనా ఏదైనా పనిచేసే విధం.

Ex: The modus operandi of the murderer is to stab his victim = ఆ హంతకుడి పద్ధతి తన బాధితుడ్ని పొడవడం. (అతను చంపేవాళ్లందర్నీ కత్తిపోటుతోనే చంపుతాడని).

★ Handier - ఇది handy కి comparative degree. Handy = Convenient = సౌకర్యంగా ఉండే.

Ex: A cell phone is handy = సెల్‌ఫోను చాలా సౌకర్యంగా ఉంటుంది.

Handier = A laptop is handier than a desktop = Desk (Table) మీద పెట్టుకునే computer కన్నా, laptop (ఒళ్లో పెట్టుకునే) computer ఎక్కువ సౌకర్యంగా ఉంటుంది.




★ Scuffled = Past tense of scuffle = పెనుగులాడుకోడం/ లాక్కోడం/ తోసుకోవడం.

Ex: They scuffled with one another for the money = అక్కడున్న డబ్బు కోసం వాళ్లు పెనుగులాడుకున్నారు.

**- Mayuri Singhal, *Yelgur Colony, Khammam***

**Q:** Normal Procurement at MSP (Minimum Support Price) would become difficult as the cartels would ensure it. Hence the Government would be left two options. The second option would upset the Government's budget - Is the using of the underlined word i.e. 'would' correct here?

**A:** 'Would' is used in this sentence to refer to a situation likely to happen ('జరుగుతుంది' అని అనుకునే విషయాన్ని తెలిపేందుకు, would ఇలా వాడతాం.)

వ్యాపారులు ముఠా (Cartel)గా చేరి, MSP లో సేకరణ జరగకుండా ఉండేలా చేస్తారు అనే పరిస్థితిలో (ఇది మనం అనుకునే/ ఊహించే విషయం - future ను గురించి). In such cases 'would' is used.

**Q:** The book is belgnged to him.

**A:** The book is belonged to him - WRONG.

The book belongs to him - Correct (= He owns the book/ The book is his).

**Q:** Does the book belong to him - Is this sentence correct?

**A:** Does the book belong to him? (Correct as a question).

**Q:** Emphatic pronoun / Reflexive pronoun- Explain with some examples.

**A:** Refer to Lesson No.745.

**- Daya Shetti.**

**Q:** ఎన్ని పాఠాల్లో ఎన్ని ఆన్సర్స్ చదివారు - దీన్ని Englishలో ఎలా చెప్పాలి?

**A:** How many answers have you learnt and in how many lessons?

**Q:** ఎన్ని meanings ఆ lessonలో ఉన్నాయో నాకు చెప్తావా? - Will you tell me how many meanings are there/ there are - Say if any one of the translations of above two is right.

**A:** Can you/ will you tell me how many answers there are?

**Q:** We have books with us.

**A:** We have books (with is not necessary).

**Q:** He will go and come/ and will come - Which of the above is right.

**A:** He will go and come back - correct.

**Q:** While writing a leave letter is it necessary to write 'leave letter'- as a heading?

**A:** Not necessary.

**Q:** ఆమె బొట్టు పెట్టుకొంటోంది- She is putting religious dot on her forehead - Say if the above right.

**A:** Correct (Religious - not necessary).

**Q:** Objection overruled - Say in Telugu.

**A:** Objection overruled - అభ్యంతరం / ఆక్షేపణ తోసిపుచ్చబడింది.

**Q:** Either of the two is/ are in this town.

**A:** Either of the two is in this town - Correct.

**Q:** Neither his friends or he go/ goes there.

**A:** Neither his friends nor he goes there - Correct.

**FUNCTIONAL ENGLISH**

**Basheer:** How far are you going? (ఎందాక వెళ్తున్నావు? - How far అసలర్థం - ఎంత దూరం? )

**Chakri:** Not very far. But why are you asking? (ఇక్కడికే. ఏం? - Why are you asking? అసలర్థం, ఎందుకడుగుతున్నావు? )

**Basheer:** If it is somewhere a long way off, I can give you a lift. I am going the same way. (ఎక్కడికైనా చాలాదూరం అయితే, నేను నీకు lift ఇస్తాను. నేను అటువైపే వెళ్తున్నాను.)

**Chakri:** So good of you. It isn't far off. Just walking distance. I prefer to walk. (Thanks. అదేం అంతదూరం కాదు. నడవగలిగినంత దూరమే.)

**Basheer:** What happened to your bike? (నీ bike ఏమయ్యింది? )

**Chakri:** On my way back from a camp, it broke down on the way. It is at the mechanic's. It's a major trouble. (Camp నుంచి తిరిగి వస్తుండగా అది ఆగిపోయింది. అదిప్పుడు మెకానిక్ దగ్గర ఉంది. అది కొంచెం పెద్ద రిపేరే).

**Basheer:** When was this? (అదెప్పుడు? )

**Chakri:** Not so long ago - the day before yesterday. (ఎంతోకాలం అవలేదు. మొన్ననే.)

**Basheer:** It's an old bike, time you changed it, isn't it? (అది పాత bike. ఎప్పుడో మార్చుండాల్సింది దాన్ని.)

**Chakri:** It isn't as old as you seem to think. Still I think I had better change it. The day isn't far off when you will see me on a new one (నువ్వు అనుకుంటున్నంత పాతదేం కాదది. అయినా అది మార్చడమే మంచిదనుకుంటున్నా. నువ్వు నన్ను కొత్త bike మీద చూసే రోజు ఎంతో దూరం లేదు.)

**Basheer:** The sooner you do it the better. You can save on the repairs. (నువ్విది ఎంత త్వరగా చేస్తే అంత మంచిది. రిపేర్ల మీద పెట్టే డబ్బు ఆదా అవుతుంది.)

* * *

**We have seen earlier that 'much' (= a large amount of) and many (a large number of) are used, only with not, in questions and in comparatives. ఇంతకు ముందు మనం చూశాం కదా: much, many లను, ఎక్కువ లేదు అని not తో/ questions లో/ Comparative degree లో మాత్రమే వాడతామని, affirmative sentences లో ఉపయోగించం అని. ఇప్పుడు 'దూరం' గురించి చూద్దాం..**

**ప్రతిభ**

# It isn't *far off*

***Look at the following expressions from the conversation above:***

1. Not <u>very far</u>
2. If it somewhere <u>a long way</u> off....
3. It <u>isn't far off</u> (It is not far off)
4. Not <u>so long ago</u>
5. The day <u>isn't far off</u>.

Spoken English లో far (దూరమైన = distant) ను 'not' తో లేదా (దూరం కాదు అనే అర్థంతో) question లో మాత్రమే వాడతాం. (far కి comparative- farther, superlative - farthest). అలాగే 'distant' (దూరమైన) అనడానికి బదులు ఎక్కువగా a long way/ a long way off/ a long way away ఉపయోగిస్తారు.




a) **Hemanth:** How far is the railway station? Have I to go <u>a long way?</u>

**Krishna:** <u>Not far off</u>. It's just a kilometer from here, a little <u>farther off</u> from the Post Office there. (దూరమేం కాదు. ఇక్కడి నుంచి ఒక కి.మీ. దూరం. పోస్టాఫీసుకు కొద్దిగా అవతల.)

b) Kolkata is <u>a long way off</u> from Hyderabad (హైదరాబాద్ నుంచి కోల్‌కతాకు చాలా దూరం.)

c) **Dinesh:** Excuse me. Which bus should I take to Ameerpet crossroads? (అమీర్‌పేట చౌరస్తాకు ఏ బస్ ఎక్కాలి? )

**Ganesh:** No need to take a bus. <u>It isn't far off</u>. You can walk the distance. Go straight for half a kilometer and you are there. (బస్ అవసరం లేదు. <u>అదంత దూరం కాదు</u>. మీరా దూరం నడవచ్చు. తిన్నగా అరకిలోమీటర్ నడవండి, మీరక్కడ ఉంటారు.)

***Important points:*** far/ far off/ far from - వీటికి అర్థం, దూరమైన అని. అయితే వీటిని not తో (దూరం కాదు అనే అర్థంతో)/ questions లో మాత్రమే ఉపయోగిస్తాం. దూరం అనేందుకు ఎక్కువగా 'a long way off' అని వాడతాం distant కి బదులు. Distant వాడటం <u>తప్పుకాదు.</u>

## Answers to the Exercises

### Lesson No.746

1. <u>There</u> are twenty three districts in Andhra Pradesh.
2. Why are <u>there</u> so many police persons here?
3. <u>There</u> are twenty students here.
4. <u>There</u> are fifteen questions in the question paper.
5. Are <u>there</u> interesting books in the library?

### Lesson No.747

1. <u>It used to be said</u>/ It was said that she was a great singer.
2. It <u>is considered</u> that Sri Rama is the greatest king of all time.
3. <u>It has so far been thought</u> that she has invented it.
4. <u>It is said that</u> no other batsman of the past three generations is as great as Sachin.
5. <u>It was found</u> that he had committed the murder.
6. <u>It was believed</u> that Columbus had discovered India, but what he discovered is the West Indies.

---

*Usha Srirekha, Kothuru.*

1. Rekha is not supposed to take the money/ Rekha shouldn't take the money.

**A:** Rekha is not supposed to ... = Rekha shouldn't ...

2. ఆయన నన్ను పిలిపిస్తాడు/ పిలిపించాడు - ఈ వాక్యాన్ని English లోకి అనువదించగలరు.

**A:** ఆయన నన్ను పిలిపిస్తాడు = He <u>will send for</u> me.

ఆయన నన్ను పిలిపించాడు = He <u>has sent for</u> me.

3. If anyone is found violating the rules then they will be punished by the court of law (తెలుగులోకి అనువదించగలరు). ఈ తరహా sentences వాడొచ్చా? వివరించగలరు.

**A:** ఎవరైనా ఈ నిబంధనలను ఉల్లంఘించినట్టు తెలిస్తే వాళ్లు న్యాయస్థానంలో శిక్షకు గురవుతారు. ఇలాంటి sentences వాడొచ్చు

4. 'To have'- Explain.

**A:** To have = కలిగి ఉండటం.




**Ex:** I wish to have a car = నాకు కారు ఉండాలని కోరుకుంటున్నాను.

5. Translate the following into English.

i) ఆయన తన చేతికున్న మరకలు నా బ్యాగుకి అంటిస్తున్నాడు.

**A:** He is staining my bag with the stains on his hand (stains = మరకలు)

ii) ఆయన పౌడర్ రాసుకుంటున్నారు (ముఖానికి).

**A:** He is <u>dabbing</u> (పౌడరు లాంటివి అద్దుకోవడం/ అంటించడం) powder on his face.

iii) ఆమె బొట్టు పెట్టుకుంటుంది.

**A:** She is applying a dot on her forehead.



# He ***has sent for*** me

*Uttam Goel, Warangal.*

1. In Oxford Grammar book it is written that certain words are not used in the Present Continuous Tense. And an exception is also given i.e., some of or all of those words can be used in Progressive tense. It is said that some words imply deliberate use of the senses and can be used in progressive tense - Let me know what deliberate use is meant by. The words are as follow: gaze, listen, loot, observe, stare and watch.

And let me know the meaning of "deliberate action".

**A: Deliberate use of the senses:** Our five senses are - Sight, hearing, smell, taste and touch (feeling).

The verbs related to the senses are: see, hear, smell, taste and touch.

**See =** what appears to us when we keep our eyes open. This is <u>NOT</u> a deliberate action, because things 'appear' to you if your eyes are open. With this meaning of 'see' (something appearing to you = (కనిపించడం), we don't use, am/ is/ are seeing.


M. SURESAN


SPOKEN ENGLISH 748

When we turn over eyes towards something deliberately (ఉద్దేశపూర్వకంగా), it is, look at.

***So we can say:***

am/ is/ are/ have been/ has been looking at ..... correct. But we cannot say, am/ is/ are/ have been/ has been seeing as they are progressive tenses.

However, see <u>also</u> means = meet = కలుసుకోవడం = a deliberate action, <u>with the meaning of 'meet'</u>, therefore, <u>we can say</u>, am/ is/ are/ have been/ has been seeing.

Hear - What reaches our ears, without our trying. Our ears are always open and all kinds of sounds enter our ears, without our trying. So we cannot use 'hear' in the progressive tenses.

Compare 'hear' with 'listen'. 'Listen' is what <u>we try to get into our ears</u> - That is, it is a deliberate action.

**So we can say:** am/ is/ are/ have been/ has been listening (progressive tenses).

Taste, smell and feel (touch) - If we refer to the taste, smell and feel that things have, we don't use them in the progressive tenses (am/ is/ are/ have been/ has been + ... ing form).

But if we taste/ smell/ feel something, we do it deliberately, so we can use taste/ smell/ feel in the progressive tenses.

**Observe:**

The mango tastes sweet (It <u>has</u> a sweet taste) - So no progressive form.

I <u>am tasting</u> a mango. (a deliberate action - So continuous progressive) tense is correct.

The same applies to smell, and feel.

The rose <u>smells</u> sweet.

She <u>is smelling</u> a rose (A deliberate action)

The <u>flower</u> feels soft (మెత్తగా ఉంటుంది).

I <u>am feeling</u> the flower (తడిమి చూడటం) - Deliberate action.

---

*M. Suresh Madhavan, Hyderabad*

1. కింది వాక్యాలను తెలుగులో ఎలా చెప్పాలో తెలపండి.

a. I did it so that you should be above work.

b. Here is the boy who is looking at me as he ate and drank.

**A:** a) నీకు పనిపెట్టకుండా ఉండేందుకు, నేనది చేశాను.

b) తను తింటూ, తాగుతూ ఉన్నప్పుడు నన్ను చూస్తున్న కుర్రాడితనే.

2. I am happy to be studying in this school/ to study in this school - which is correct?

**A:** Both are correct.

*Saif Ali Khureshi, Warangal.*

1. It didn't last long with Ramu succeeding in luring the other legislators to his side though Mr. Reddy led a four member anti - government faction of legislators - Translate into Telugu.

**A:** రెడ్డి నలుగురు శాసనసభ్యుల ముఠాకు నాయకత్వం వహించినప్పటికీ, రాము ఇతర శాసనసభ్యులను తనవైపునకు లాక్కోవడంలో కృతకృత్యుడవడంతో రెడ్డి ముఠా ఎక్కువకాలం నిలవలేదు.

2. PTI stands for please turn in/ The abbreviation of PTI is please turn in.

- Which one of the above two sentences is correct?

**A:** PTI stands for = The abbreviation of PTI - Both are correct.

3. Is the word <u>as</u> used after the 'pronounciation'?

**A:** Pronounced/ pronounced as - Both are correct.

**Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... *www.eenadupratibha.net***

**Spoken English లో మనం అడగాలనుకున్న, చెప్పాలనుకున్న వాటికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి, మిగతా వాటికి తక్కువ ప్రాధాన్యం ఇవ్వడానికి, sentence లోని కొన్ని మాటలను నొక్కి పలుకుతాం, ఇతర మాటలను మామూలుగా పలుకుతాం. అలా నొక్కి పలకడాన్ని, తక్కువ శక్తితో పలకడాన్ని Intonation అంటారు.**




## FUNCTIONAL ENGLISH

★ Kumar sells books (కుమార్ పుస్తకాలు అమ్ముతాడు). Suppose you want to give importance to Kumar. Then you say 'Kumar' with greater force than you say the other words.

★ Kumar sells books (కుమార్ - ఇంకెవరో కాదు - పుస్తకాలు అమ్ముతాడు).

★ Kumar sells books (కుమార్ పుస్తకాలు అమ్ముతాడు)

★ Kumar sells books (కుమార్ పుస్తకాలు అమ్ము తాడు - ఇంకేదో చేయడు)

అలాగే Questions లో కూడా.

★ Who will do this? (ఇదెవరు చేస్తారు - మనం తెలుసుకోవాలనుకునేది, ఎవరు? - అందుకని The stress is on 'who').

★ Who will do this? (ఇదెవరు చేస్తారు? ) (ఇక్కడ మనకు ముఖ్యం, ఈ పనిని (ఎవరు చేస్తారు? ) అది సరే, నేను చేస్తాను, ఇదెవరు చేస్తారు అని).

ఇలా కొన్ని విషయాలకు ప్రాముఖ్యం ఇవ్వడానికి కొన్నికొన్ని పదాలను వాడతాం English లో. అవేంటో కింద చూడండి.

*Compare:* a) Who told you so? (నీకెవరు చెప్పారు అలా? )




b) Whoever told you so? ఎవరది నీకు చెప్పింది? - కోపంతో గానీ, విసుగుతో కానీ, చెప్పిందెవరో తెలుసుకునేందుకు, Whoever అంటాం, who బదులు.

*ఇది కూడా చూడండి:*

a) He does anything badly (ఏదైనా సరిగా చేయడతడు)

b) Whatever he does, he does badly అతడేది చేసినా, సరిగా చేయడు - ఇది విసుగుతో/ కోపంతో అనడం.

ఇలాంటివి మన Spoken English లో భాగమై పోయి వాడుకగా మాట్లాడేయాలి. అప్పుడే మన Spoken English బాగుంటుంది.

# *Whoever* told you so?

***Akhilesh, Warrangal.***

**1.** i) Maintain/ manage, (ii) Rotate/ revolve - Say the difference among the above.

**A:** The correct way of putting the question is: What is the difference between the pairs of words above?

**i) Manage =** to direct/ control - when you manage a business/ manage an institution, you are in control of it/ you decide how it should be run, and who are to be appointed to work there.

**Maintain =** to continue something in the same way - when you maintain a company/ institution, you make it continue in the same way as it has been before - పాడవకుండా ఉన్నది ఉన్నట్టు చేయడం.

You don't make any changes/ try to improve it/ take important decisions to change it.

'Maintain' has other meanings too, which have no connection with 'manage'.

**ii) Rotate =** a thing turning around itself (about a central point in it).

The earth rotates (around itself) = The earth turns around itself (తన చుట్టూ తాను తిరగడం).

**Revolve =** move in a circle around some object. The earth revolves around the sun.




**2.** Let me know the following with examples. 1) Stress 2) Rising mark 3) Falling mark 4) Rhythm 5) Rhyme.

**A: Stress -** An extra force with which we pronounce one or more syllables in a word. (Syllable = an independent sound in a word - usually containing a vowel sound.

**eg:** Separate - pronounced

seprət (సెప్రట్) - two syllables: sep and rət. In this word, 'sep' is stressed - that is, we pronounce 'sep' with greater force than 'rət'.

Rising mark and falling mark- In a sentence, we utter some words with greater force than other words. If the force is on the first words and the other words with less force then it is 'falling intonation/ falling mark! On the other hand, if the latter parts of a sentence are uttered with greater force than the earlier part, we have 'rising mark/ intonation'.

**eg:** Where are you going? - Suppose you ask this question, if you wish to know the place somebody is going to, you stress 'where' more than the other words in the sentence, there is falling intonation. Suppose you want to know where somebody is going, then you stress 'you' more than the other words before it. This is rising intonation.

Where are you going? (Where- spoken with more force on 'where' than on the other words - falling mark.)

Where are you going? (you- The speaker is interested more in 'you' than on other things - rising mark/ intonation).

**Rhythm** = Best/ Strong regular pattern of sound.

Twinkle, twinkle, little star - When you say this line aloud, you find some regular pattern of sound - like: tuk, tuk, tuk, tuck, this is rhythm. (తెలుగు - తాళం)

**Rhyme:** Two words ending in the same sound - Star - are, sky - high (only pronunciation).



# We *used to meet* everyday!

***Khan, Nellore.***

**1.** He is used to have raw food/ He gets used to have raw food - Say the difference.

**A:** He is used to have raw food/ He gets used to have raw food - Both the sentences are wrong.

**The correct sentences:** He is used to having (1)/ He gets used to having raw food (2).

**Be used to/ get used to =** Having experience of something, and so not feel new about it/ Having the habit of/ practice of.

He is used to walking long distances = He has the experience/ Practice of walking long distances.

'Be used to' is always followed by a noun or an '-ing' form and never by the 1st DW (take/ go/ sing, etc).

a) He is used to the heat of Vijayawada (The heat of Vijayawada is not new to him - heat (noun).

b) She is used to speaking in public. (She has the experience of speaking in public, so 'it is not new to her) 'Speaking' - 'ing' form.

**Correct form of your sentences:** He is used to having raw food/ He is used to raw food (noun) = Raw food, he has taken for a long time, and it is not new to him).




Instead of 'be used to' we can use 'get used to' as well.


M. SURESAN




He gets used to raw food/ to eating raw food = He will have the experience of eating raw food.

**2.** He did use to get his lorry repaired - Say if the above one is used in Spoken English and also say the question form of the above sentence.

**A:** Used. Did he use to get his lorry repaired? - Question.

Note difference between 'used to' and 'be used to'.

**Used to =** repeated action in the past.

We used to meet everyday - A repeated past action - కలుసుకునే వాళ్లం.

'Used to' is followed by 1st DW.

'Be used to' (Be = any 'be' form) is always followed by a noun or an 'ing' form (See examples above).

**3.** దెబ్బలు తింటూ అక్కడే ఎందుకు ఉన్నారు? - Say in English.

**A:** Why are you there, even after receiving blows?

**4.** Have you got me - Say in Telugu.

**A:** నన్నర్థం చేసుకున్నారా? / నేను చెప్పింది అర్థం అయ్యిందా?

**5.** ఆ book చిరిగిపోతూ ఉంది (అంటే చిరిగిపోయే దశలో ఉంది) - Say in English.

**A:** The book is getting torn.

**6.** Being there, he was happy/ Having been there, he was happy - which is correct ?

**A:** Being there he was happy = అక్కడున్నందుకు/ ఉన్నందువల్ల అతడు సంతోషంగా ఉన్నాడు.

Having been there, he was happy = కొంతకాలంగా అక్కడున్నందువల్ల/ ఉండటంతో అతడు సంతోషంగా ఉన్నాడు.

***M.K. Rao, Visakhapatnam.***

**Q:** Originally a ballad was a song with a strong narrative substance sung to the accompaniment of dancing. The minstrel or the bard 'would' sing the main parts, and the dancers 'would' sing the refrain or certain lines which were frequently repeated. Often it was in the form of a dialogue. Thus the popular ballad had a strong dramatic element, the audience were not merely passive listeners, they danced and sang along with the bard. There was thus a strong sense of participation.

పై paragraph లో రెండు వాక్యాల్లో 'would' ఉపయోగించారు. తర్వాతి వాక్యాల్లో Simple Past వాడారు. ముఖ్యంగా 'danced' and 'sang' అని Simple Past use చేశారు. 'would' స్థానంలో Simple Past use చేయకూడదా? లేదా Simple Past స్థానంలో would use చేయకూడదా? ఇక్కడ apply చేసిన 'rule' ఏమిటో వివరించండి.

**A:** 'Would' in sentences like these indicates a regular/ repeated past action. It is the equivalent of 'used to'.

Ballad originally, as you are aware, was oral. The minstrel or the bard (The singer or the poet) would sing the refrain = He used to sing the refrain.

They danced/ They would dance, both mean a repeated/ regular action in the past.

Those days, he would get up at 5 in the morning and go for a walk = He used to get up at..

In this sense, would get up = got up = used to get up.

You can say, 'He went out for walk every morning.

would + 1st DW = PDW (Simple past)

If you still have a doubt, feel free to write.

***Naveen Chopra, Rajole.***

**1.** Often he walked/ He walked quite often - Explain.

**A:** Often he walked = He walked on a number of occasions/ a number of times.

He walked quite often = He walked very often. Quite often is more often than often (Quite often = more number of times than 'often') indicates.

**2.** Your advice is to read English News papers, stories, novels, etc. If we go on reading them, we will be used to pronounce the English words in Indian style as we can't pronounce every word in a Phonetic manner for example: Original - ఒరిజినల్, Olympiad - ఒలింపియాడ్, Police - పోలీస్, - These are pronounced in the above manner - How can this problem be overcome?

**A:** Understanding the meaning and use of a word is the first step. Pronunciation comes next, doesn't it? Once you clear the first step, you can go to the next step.

You can improve your pronunciation by listening to English news telecasts. There are English pronunciation CDs too. Listen to them too. They are available in book shops.

**3.** You hardly ever have to remind him - Say in Telugu.

**A:** You need not remind him.

Hardly = (almost) no. (దాదాపు లేదు).

He hardly comes here = అతడిక్కడికి రాడు.

**Spoken English పాత వ్యాసాల కోసం క్లిక్ చేయండి... *www.eenadupratibha.net***

## FUNCTIONAL ENGLISH

సినిమాలంటే ఆసక్తి ఉండటం సహజమే. ఏ థియేటర్‌లో ఏ సినిమా ఆడుతోంది? హీరో హీరోయిన్లు ఎవరు? ఇతర ముఖ్యపాత్రలు ఎవరు పోషించారు.. సినిమా ప్రత్యేకత ఏమిటి? మొత్తంగా సినిమాపై మన అభిప్రాయం ఏమిటి? Spoken English లో ఇలాంటి విషయాలు తెలుసుకోవడానికి ఎలాంటి పదాలు ఉపయోగించాలో ఈ వారం తెలుసుకుందాం..




# The movie *features* NTR...

**Ashish:** Where were you yesterday? I couldn't find you or get at you at all. (నిన్న సాయంత్రం ఎక్కడున్నావు? నువ్వెక్కడా కనిపించలేదు, phone కు కూడా అందలేదు).

**Saketh:** I went to an English movie. What a movie! It held the audience's attention till the end. (నేనో English సినిమాకెళ్లాను. ఎంత గొప్ప సినిమానో! అది ప్రేక్షకుల దృష్టిని చివరిదాకా దానిమీదే నిలిపి ఉంచింది).

**Ashish:** What was the movie? Benhur, wasn't it? (ఏ సినిమా అది? బెన్‌హర్ కదా?)

**Saketh:** That's the only English movie showing in the town, isn't it? (అదొక్కటే కదా నగరంలో ఆడుతున్న English సినిమా?)

**Ashish:** Yea, ofcourse.

**Saketh:** I tell you, a real good movie. I needn't tell you I enjoyed every minute of it. (చెప్పానుగా. నిజంగా మంచి చిత్రం. దాన్ని నేను ప్రతి క్షణం ఆస్వాదించానని చెప్పక్కరలేదు).

**Ashish:** I missed it in its first run and I'm afraid I have to miss it now too. Was it good? (మొదటిసారి అది వచ్చినప్పుడు చూసే అవకాశం కోల్పోయా. మళ్లీ కోల్పోవాల్సి వస్తుందనే అనుకుంటున్నా. అది బాగుందా?).

**Saketh:** You can say that again and again (బాగుందా? ఆ మాట నువ్వు మళ్లీ మళ్లీ అనొచ్చు).

**Ashish:** Who were the cast? (తారలు ఎవరు?)

**Saketh:** It features Charlton Heston, Stephen Boyd, Jawk Hawkins and other great actors. (అందులో షాల్టన్ హెస్టన్, స్టీఫెన్ బాయ్డ్, జాక్‌హాకిన్స్ లాంటి తారాగణం ఉన్నారు.)

**Ashish:** You haven't mentioned the women actors (నువ్వు నటీమణులను గురించి చెప్పలేదు).

**Saketh:** Haya Harareet and Martha Scott.

**Ashish:** Any special feature of it? (ఆ సినిమా ప్రత్యేకత?)




**Saketh:** There's the chariot race - The highlight of the movie. (అందులో రథాల పందెం - ఆ చిత్రానికి ముఖ్య ఆకర్షణ).

**Ashish:** OK. I'll watch it on the CD (CDలో చూస్తాలే).

**Saketh:** You'll enjoy it.



English లో సినిమాకు సంబంధించిన మాటలు చూద్దాం.

1) A real good movie
2) I enjoyed every minute of it.
3) The cast
4) Feature
5) Highlight

Cinema- movie. English లో సినిమా అంటే సినిమా హాల్/ Theatre మాత్రమే. చలనచిత్రం కాదు. చలన చిత్రం అనేందుకు, movie/ picture/ film అంటాం.

There are about 50 cinemas in Vijayawada (విజయవాడలో దాదాపు 50 హాళ్లు ఉన్నాయి).

be showing - సినిమా హాల్లో ఆడుతున్నది.

What is showing in that cinema? = ఆ సినిమా హాల్లో ఏ చిత్రం ఆడుతోంది?

Movie లోని తారాగణం = The cast = నటవర్గం.

The cast in the movie includes = తారాగణంలోని తారలు.

The movie features NTR and Sri Devi in the lead roles = ఆ చిత్రంలో ముఖ్య పాత్రలు (Lead roles), NTR, శ్రీదేవి.

Supporting actors = ఇతర పాత్రలు

Which movie is showing? = Which movie is running = ఏ చిత్రం ఆడుతోంది?

### Exercise

ఈ Exercise మీరు Englishలో రాయండి.

**Omkar:** ఈవాళ సాయంత్రం సినిమాకెళ్దామా?

**Sanjay:** ఏ హాల్లో ఏం ఆడుతోందో తెలియదు మరి (No idea వాడండి).

**Omkar:** 'అత్తారింటికి' వెళ్దామా? (ఆ మొత్తం title English లో చెప్పండి.)

**Sanjay:** ఎంతకాలంగా ఆడుతోంది? నటీనటులు ఎవరు? అందులో ముఖ్యపాత్రలెవరివి?

**Omkar:** ఇవన్నీ చెప్పే ఓపిక నాకు లేదు. వస్తే రా, సాయంత్రం. లేకుంటే లేదు.

**Sanjay:** వస్తాలే.

*Answer, next week.*

### Answer to the Exercise (Lesson-759)

| Telugu | English |
|---|---|
| **Sampath (Over Phone):** Hi, Jagadish! నేనిప్పుడే సికింద్రాబాద్ స్టేషన్‌లో దిగాను. ఎలా రావాలి మీ ఇంటికి. నువ్వు రాలేనన్నావుగా పనేదో ఉందని. | **Sampath (Over Phone):** I have just got down at Sec'bad station. How do I get to your place? You told me you wouldn't be able to come to the station as you have some work. |
| **Jagadish:** నేను రాలేకపోయినందుకు బాధగా ఉంది. స్టేషన్‌లో బస్ నెం. 10 ఎక్కి లాల్ బంగళా stop అడుగు conductorను. బస్‌స్టాప్ నుంచి కొంచెం దూరం నడిస్తే ఎదురుగా ధరమ్ కరమ్ రోడ్ వస్తుంది. ఆ రోడ్ తిన్నగా నడిస్తే Food Plaza వస్తుంది. ఇంకా ముందుకు నడు. గణేష్ సూపర్‌బజార్ వస్తుంది. ఎదురుగా సందులో ఎడమ పక్క 5వ flats రతన్ Apartments. అందులో Flat No. 302. | **Jagadish:** I am (I'm) sorry. I couldn't come. Take bus No. 10 at the station and ask the conductor for Lal Bungla stop. Get off/ get down from the bus there. Walk a little forward. Just across the road you find Dharam Karam Road. Walk along the road upto Food Plaza. Walk further on. You find Ganesh Super Bazar. In the lane across the road, the fifth set of apartments in Ratan flats,. My flat NO. 302. |

# Find, find out మధ్య తేడా?

*Amreen, Arsheen,* ***Warangal.***

**Q:** 'Shoeb, the lion' - We have seen this sentence in a newspaper, can "the" be used/ written/ said after a person's name? Manmohan Singh, the Prime Minister/ the Prime Minister Manmohan Singh.

**A:** Shoeb, the lion, 'The' must be used here, because, 'lion' here is not a designation (Name of a post, like Collector, Manager, etc) or a position (Like Prime Minister, Chief Minister, etc). Moreover, lions and animals don't have names. Unless we say, the lion, the meaning will not be clear.

**Q:** A station master minds the trains. A teacher trains the minds - Is this one correct?

**A:** Correct.



A station master's job is to deal with trains. A teacher- by their teaching, train the minds of their students.

**Q:** That noise was a person having a tooth out - Please translate into English.

**A:** That noise was a person having his tooth out - This sentence has no meaning.

The sentence perhaps is, 'That noise was that of a person having his tooth taken out = That was the noise a person having his tooth taken out was making = పళ్లు పీకించుకుంటున్న ఒకాయన చేస్తున్న గొడవ అది.






M. SURESAN

**Q:** I have seen a house - If we are asked (in the exam) to identify the part/ parts of speech of the above underlined; can we say adjective as articles do not come under parts of speech, as well as I have seen the house, I have seen an elephant - Clarify.

**A:** We can say that 'a/ an and the' are demonstrative adjectives. They are among determiners.

**Q:** They are having their dreams done - Is this correct?

**A:** This is not a sentence because it has no meaning.

They have their dreams realised = వాళ్ల కలలను నెరవేర్చుకుంటున్నారు.

**Q:** మంచి వాళ్లకు మంచే జరుగుతుంది - Translate into English.

**A:** Only good will happen to the good.

*Ahalya Goyal,* ***Rajahmundry***

**Q:** Once you said that the word 'tell' shouldn't be used without an object, but in Oxford Dictionary the following meaning is given for the word 'honest' on the page no. 746. Honest = always tell the truth and never stealing or cheating - Explain.

**A:** 'Tell' should be followed by an object (you, me, etc) if it is followed by a 'that' clause. But we can say 'tell' without an object only in the following case: Tell the truth/ a story/ the difference/ lies, only.

**Q:** Municipal authorities/ Municipality authorities - Let me know the right one.

**A:** Municipal authorities = officials of the municipality. We don't say, Municipality authorities - it is wrong.

**Q:** The rich/ the poor/ the rich people/ the poor people - Let us know the difference among the above.

**A:** 'The' before adjectives (words telling us about the nature/ quality of persons) has the meaning of people of that quality or nature.

**Rich =** Having a lot of money. The rich = rich people, The poor = poor people. The weak = weak people.

**Q:** To find/ to find out - Say the difference.

**A: Find =** See, know, discover, observe, feel = చూడటం (మనకు కనిపించడం), తెలుసుకోవడం, కనుక్కోవడం, గమనించడం.

a) I find him here every morning = ప్రతిరోజూ ఉదయం నాకిక్కడ కనిపిస్తాడు.

b) He found (past tense of find) new method = కొత్త పద్ధతి కనుక్కున్నాడు.

**Find out =** get to know = తెలుసుకోవటం.

The police are trying to find out who he is = అతడెవరో తెలుసుకునేందుకు పోలీసులు ప్రయత్నిస్తున్నారు.

**Q:** How are you feeling? Can this be used in continuous tense?

**A:** It is OK in American English.

**Q:** Now it (building) had collapsed - Let me know if the above is correct or not.

**A:** If you are talking about two past events, one before the other, you can say, 'Now, the building had collapsed! But you must add another sentence which followed it.

Now, the building had collapsed. They were without a home. (When you are talking about a series of past events, you can use, 'now' to refer to the result of something. (గత సంఘటనలు, ఒక్కొక్కటిగా ఒకదాని తర్వాత ఇంకొకటి చెబుతున్నప్పుడు, now వాడవచ్చు)

**Eg:** The river was in floods. The flood waters washed away their huts. They now found themselves homeless.

*Raibahadur Saxena,* ***Vizag***

**Q:** Don't keep your finger into/ in your mouth my dear son - Which one is correct here?

**A:** Don't put your fingers in your mouth.

**Q:** He saved them from committing more sins - Is this right?

**A:** Right.

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net




మీరు ఏదైనా సినిమాకు వెళ్లారనుకోండి.. దానికి సంబంధించి ఛాయాగ్రహణం, సంగీతం, దర్శకత్వం, నటీనటులు, డైలాగులు.. ఇలా వివిధ అంశాలపై ఏదో ఒక అభిప్రాయం ఏర్పడటం సహజం.. సినిమా చూశాక దానిపై మీ అభిప్రాయాలను పంచుకోవాలంటే ఎలాంటి పదాలు ఉపయోగించాలో ఈ వారం తెలుసుకుందాం..

# FUNCTIONAL ENGLISH

# One song especially is haunting!

**Haritha:** How was the movie last night? (నిన్న రాత్రి సినిమా ఎలా ఉంది? )

**Samyuktha:** Not so bad. The first half was tolerable. The second half was tedious. (ఫర వాలేదు. (తెలుసు కదా? Not bad = Very good. Not so bad = అంత బాగాలేనిది కాదు) మొదటి సగం ఫర్వాలేదు. రెండో సగం విసుగు. (Tedious = Boring, too long and uninteresting - మరీ పొడుగ్గా, మందకొడిగా సాగే).

**Haritha:** What else? (ఇంకేంటి? )

**Samyuktha:** The camera work was excellent. Some of the long shots were eye catching (ఛాయాగ్రహణం బాగుంది. కొన్ని దూరంగా తీసిన దృశ్యాలు కళ్లను ఆకట్టుకునేవిగా ఉన్నాయి).

**Haritha:** What about the music? (సంగీతం ఎలా ఉంది? )



**Samyuktha:** The score was by the leading music director Sangeeth Kumar. Some tunes were really melodious. One song especially is haunting. (స్వరకల్పన చేసింది ముందంజలో ఉన్న గొప్ప సంగీత దర్శకుడు, సంగీత్ కుమార్. కొన్ని రాగాలు చాలా మధురంగా ఉన్నాయి. ముఖ్యంగా ఒక పాట ఇంకా చెవిలో మోగుతూనే ఉంది)

**Haritha:** What else? (ఇంకేంటి? )

**Samyuktha:** The dialogues lacked punch. (సంభాషణల్లో పస లేదు).

**Haritha:** What about the actors? You haven't said anything about them? (నటుల మాటేంటి? వాళ్లను గురించి ఏం చెప్పలేదు? )

**Samyuktha:** There was no scope for action. Four duets in foreign locales and three stunts were all that the movie showed. I don't say the actors lacked talent. They had no chance to show it. (నటనకు అవకాశం లేదు. విదేశ స్థలాల్లో నాలుగు డ్యూయెట్స్, మూడు fights తో సినిమా అయిపోయింది. నటులకు ప్రతిభ లేదని కాదు. అవకాశం లేదు అది చూపేందుకు).

**Haritha:** The average Indian movie is just that. (సగటు భారతీయ సినిమా అంతే).

***Answer to the Exercise (Lesson-760)***

| Telugu | English |
|---|---|
| **Omkar:** ఈవాళ సాయంత్రం ఏ సినిమాకెళ్దాం? | **Omkar:** Shall we go to a movie this evening?/ How about a movie this evening? (రెండిట్లో, How about...? better). |
| **Sanjay:** ఏ హాల్లో ఏం ఆడుతోంది, మరి? | **Sanjay:** No idea which picture is showing in which hall/ Where? |
| **Omkar:** 'అత్తారింటికి దారేది? ' వెళ్దామా? | **Omkar:** Shall we go to 'Which way to the in-laws'? |
| **Sanjay:** ఎంత కాలంగా ఆడుతోంది? నటీ నటులు ఎవరు? ముఖ్యపాత్రలెవరు? | **Sanjay:** How long has it been showing? What is the cast? Who are in the lead roles? |
| **Omkar:** అవన్నీ చెప్పే ఓపిక నాకు లేదు. వస్తే రా, సాయంత్రం, లేకుంటే లేదు. | **Omkar:** I don't have the patience to tell you all that. You either come or don't. |
| **Sanjay:** వస్తాలే. | **Sanjay:** OK. I'll come. |

## *Exercise*

Translate the following into English.

**Sumana:** నువ్వు నిజంగా మంచి సినిమా కోల్పోయావు. గుర్తుంచుకోదగిన చిత్రమది.

**Manorama:** ఏ చిత్రం అది?

**Sumana:** అల్లుడి కోసం వేట.

**Manorama:** ఎవరు నటీనటులు?

**Sumana:** అత్యంత ప్రజాభిమానం పొందిన హీరో, హీరోయిన్లు: నిశాంత్, నందిత.

**Manorama:** ఏంటా సినిమాలో అంత గొప్ప?

**Sumana:** అన్నీ గొప్పే. నటన, దర్శకత్వం, ఛాయాగ్రహణం, సంగీతం... అన్నీ బాగున్నాయి.

**Manorama:** నన్ను చూడమంటావా?

**Sumana:** నిస్సందేహంగా.

*Answer* వచ్చే వారం



# Nitty - gritty అంటే ఏమిటి?






M. SURESAN

*Ravi, **Vijayawada.***

**Q:** సర్, నేను Collocations నేర్చు కోవాలనుకుంటున్నాను. వాటికి సంబంధించిన మంచి పుస్తకాలు సూచించండి.

**A:** 'English Collocations in Use - Advanced' by O'Dell and McCarthy - Cambridge University Press - A useful book on collocations.

**Q:** కింది పదాలను తెలుగులో వివరించగలరు.

i) Booed and Jeered ii) Bent upon
iii) Took exception to iv) Tone and tenor
v) Heckled vi) Nitty-gritty

**A: i) Booed and jeered =** Past tense of 'boo and jeer' = వేదిక మీద మాట్లాడేందుకు వచ్చిన వక్తలను, మాట్లాడనివ్వకుండా, నటులను నటించనివ్వకుండా (శ్రోతలు, ప్రేక్షకులు కేకలూ, ఈలలూ, చప్పట్లతో అవహేళన చేయడం.

**ii) Bent upon =** be determined to do something- especially <u>something bad</u> - ఏదైనా (ముఖ్యంగా చెడుపని) చేయాలనే నిర్ణయంతో ఉండటం.



Duryodhana was bent on ruining the Pandavas = పాండవులను <u>ఎలాగైనా సరే నాశనం చేయాలనే నిశ్చయంతో</u> ఉన్నాడు దుర్యోధనుడు.

**iii) Took exception to =** Past tense of take exception to = To object strongly to something - తీవ్రమైన అభ్యంతరం తెలపడం/ తీవ్రంగా ఆక్షేపించడం.

We <u>take exception</u> to his remarks about the people of our country = మన దేశ ప్రజలను గురించి ఆయన చేసిన వ్యాఖ్యలకు మేం <u>తీవ్ర అభ్యంతరం</u> తెలుపుతున్నాం.

**iv) Tone and tenor =** ఈ expression, 'Standard English' లో ఉన్నట్లు లేదు. ఏ Dictionary లోనూ ఈ expression చేర్చలేదు. అయితే, దీన్ని ఎక్కువగా, మనం మాట్లాడేటప్పుడు మన భావోద్రేకాలను తెలిపే మన కంఠధ్వని/ మన గొంతు అనే అర్థం (The quality/ sound of somebody's voice expressing a particular emotion)తో వాడుతుంటారు.

The <u>tone and tenor</u> of his speech showed his anger at the recent happenings = ఆయన ఉపన్యాసం, ఈమధ్య జరిగిన సంఘటనల పట్ల, ఆయన కున్న కోపాన్ని తెలియపరిచేలా ధ్వనించింది.

**v) Heckled =** Past tense of 'heckle' = To interrupt a speaker/ actor by shouting questions/ making rude comments = వేదిక మీద ప్రసంగిస్తున్న వక్తలకు/ నటిస్తున్న నటులకు, అరుపులు, కేకలు, ప్రశ్నలు వేసి అంతరాయం కలిగించడం- boo and jeer లాగే.

**vi) Nitty - gritty =** The most important/ practical facts of a situation/ problem = ఒక పరిస్థితి/ సమస్యకు సంబంధించిన అతి ముఖ్యమైన, కీలకమైన విషయం.

The Chief Minister's complaint is that the GoM did not get down to the nitty-gritty of the division of AP = ఆంధ్రప్రదేశ్ విభజన గురించిన అసలు, కీలకమైన విషయాలను మంత్రుల బృందం పట్టించుకోవడం లేదని ముఖ్యమంత్రి ఆరోపణ.

*T. Satyanarayana, **Bhimavaram.***

**Q:** <u>How many of each kind be sold?</u> ఇలాంటి ప్రశ్నల్లో ఏ విధమైన Model Verb లేకుండా Directగా <u>be sold</u> ఎలా ఉపయోగించారు?

**A:** How many of each kind be sold? - This is wrong. 'be' is <u>not a finite verb</u>. How many of each kind can be/ may be/ could be/ should be, etc sold? - is correct. There can be no sentence without a finite verb. (Can be/ could be/ may be/ might be, etc are finite verbs.

**Q:** Could you lend me your pen? - ఇలాంటి సందర్భాల్లో Answer, '<u>Here you are</u>' అని ఉంటుంది. దీనికి అర్థం 'మీరు ఇక్కడ ఉన్నారు' అని కదా? దీనికి బదులు <u>Here it is</u> అనవచ్చు కదా? వివరించగలరు.

**A:** Here you are/ Here you go also = Take this. When you are giving something to somebody, you use these expressions (వీటి అర్థం 'ఇదిగో తీసుకోండి' అని మనం ఏదైనా ఇతరులకు ఇచ్చేటపుడు అంటాం.)

**Q:** i) Festival beckoned him, <u>so did</u> death.

ii) Your presence made a big difference to many of our lives and <u>so does</u> your absence. ఇలాంటి సందర్భాల్లో <u>so did</u>, <u>so does</u> ల అర్థం వివరించండి. ఇక్కడ <u>so</u> ఏ Part of speech కింద పని చేస్తోందో తెలపండి.

iii) Order of words ప్రకారం death did so అని, your absence does so అని ఉండాలి కదా? వివరించండి. Order of words మారే సందర్భాలను ఉదాహరణలతో వివరించగలరు.

**A:** i) <u>The</u> festival beckoned him, <u>so did</u> death.

**Beckon =** To sign/ make a sign to somebody with your hand to call them towards you = దగ్గరకు రమ్మని చేత్తో/ వేలితో సంజ్ఞ చేయడం.

The festival beckoned him, so did death = అతడిని పండుగ పిలిచింది, అలాగే మరణం కూడా పిలిచింది (అతడు పండగకెళ్లే ప్రయత్నంలో ఉన్నప్పుడే చనిపోయాడు).

**So did =** అంతకు ముందు ఎవరు ఏం చేశారో, ఇంకొకరు కూడా అలాగే చేశారు అని చెప్పడం.

I <u>bought</u> a car, so <u>did</u> he = I bought a car, he also bought a car (అయితే usage లో ఇలా అనరు, అంటే వాడుకగా మాట్లాడేటప్పుడు ఇలా అనరు) 'So did he' అనే అంటారు.




**eg: Ram:** మామిడి పండంటే నాకిష్టం (I like the mango).

**Shyam:** నాకూ ఇష్టమే. (ఇలా అనేందుకు, 'I also like the mango' అనరు. ఇది grammatical గా correct. కానీ వాడుకలో అలా అనరు) So <u>do</u> I/ I like it too, అంటారు. సామాన్యంగా వ్యావహారిక భాషలో 'also' అంతగా వాడరు.

ii) So did/ so does = As explained above, these expressions mean, 'also'.

The meaning of the sentence, 'your presence ... absence' = మీరు ఇక్కడ ఉండటం మాలో చాలా మంది జీవితాలను ఎంత ప్రభావితం చేసిందో <u>అలాగే</u> మీరు లేకపోవడం కూడా అంతే ప్రభావాన్ని చూపిస్తుంది.

**ex:** His father <u>helped</u> everybody, so <u>does</u> the son now - అతడి తండ్రి ప్రతివాళ్లకు సాయం చేశాడు, అతడు కూడా అంతే (ఇప్పుడు).

Death did so, your absence does అనేందుకు బదులు, Death <u>did too</u>; your absence <u>does too</u> అనవచ్చు.

సామాన్యంగా order of words అనేది, Adverbial phrasesతో sentence ప్రారంభించినప్పుడు మారుతుంది. <u>No sooner did</u> .... - ఇది తెలుసు కదా?

Never once <u>did he meet</u> me = He did not meet me even once.

ఇలాంటి చోట్ల inversion వస్తుంది- sub+ verb order కాకుండా, verb/ HV + sub + MV order వస్తుంది.

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net




ఒక సినిమా బాగా ప్రజాదరణ పొందింది అని చెప్పడానికి ఏమంటారో తెలుసా? తప్పనిసరిగా చూడాల్సిన చిత్రమని ప్రశంసించడానికి, అలాగే ఏదైనా సినిమాకు సంబంధించిన విశేషాల గురించి ఎవరికైనా చెబుతున్నపుడు లేదా తెలుసుకోవాలని అనుకున్నప్పుడు ఎలాంటి పదాలు ఉపయోగించాలో ఈ వారం తెలుసుకుందాం.

# The movie was a *crowd puller*

## FUNCTIONAL ENGLISH

**Madhuri:** What kind of movie is your friend going to make? (మీ స్నేహితుడు తీయబోయే చిత్రం ఎలాంటిది? )

**Sachin:** Why going to make? He has started it already. A month since they started. The script work is complete and they are ready to go on sets. In fact all the actors have been told to be on the set by tomorrow morning. (తీయబోవడం ఏంటి? ఎప్పుడో ప్రారంభం అయ్యింది. నెలయ్యింది. Script పని కూడా పూర్తయ్యింది. చిత్రీకరణకు వెళ్లనున్నారు. అసలు నటీనటులందరినీ రేపు set కి రమ్మన్నారు.) (set = కథ జరిగే చోటును సూచించే కట్టడం).

**Madhuri:** How did he take to movie making? (అతడు చిత్రనిర్మాణంలోకి రావడం ఎలా జరిగింది? )

**Sachin:** Don't you know? The producer of the famous movie, 'Sreyassu' is his uncle. The movie was a quite hit. (ప్రముఖ సినిమా 'శ్రేయస్సు' నిర్మాత అతడి మేనమామ అని తెలియదా నీకు? ఆ చిత్రం చాలా ప్రజాదరణ పొందింది.)

**Madhuri:** How can anybody forget such a movie. Everything about it was great.



**Sachin:** Most importantly it was a crowd puller. Every one felt it was a must see movie. (ముఖ్యంగా అది జనబాహుళ్యాన్ని బాగా ఆకర్షించింది. అందరూ అనుకున్నారు అది చూడదగిన చిత్రమని).

**Madhuri:** Yea, Anindya made her impressive debut in the movie. Now she is in great demand. (అవును. అనింద్య ఆ చిత్రంతోనే కదా తన ప్రేక్షకులను మెప్పించేటట్టు సినీరంగంలో ప్రవేశించింది.)

**Sachin:** Yes, so was the moving portrayal of the old man by the veteran actor Rao. (అవును. అలాగే వృద్ధుడి పాత్రను అనుభవజ్ఞుడు రావు పోషించాడు).

**Madhuri:** Yea. They lived their roles. (అవును. వారి పాత్రల్లో జీవించారు).

★ ★ ★

సినిమాకు సంబంధించిన మాటలు మరికొన్ని చూద్దాం.

**Script =** సంభాషణలతో తెరపై మనకు కనిపించే కథ రచన.

**Crowd puller =** జనబాహుళ్యాన్ని ఆకర్షించగలిగిన

**Hit =** మంచి ప్రజాభిమానం పొందిన చిత్రం/ పాట/ నాటకం. etc.

**A must see movie =** చూడాల్సిన చిత్రం.

**Debut** (Pronunciation = డెబ్యూ/ డెయ్‌బ్యూ) = ప్రప్రథమ రంగప్రవేశం

### Answer to the Exercise (Lesson-761)

| Telugu | English |
|---|---|
| **Sumana:** నిజంగా మంచి సినిమా కోల్పోయావు నువ్వు నిన్న. గుర్తుంచుకోదగిన చిత్రమది. | **Sumana:** You really missed a good movie yesterday. It was a memorable movie. |
| **Manorama:** ఏం చిత్రం అది? | **Manorama:** What was the movie? |
| **Sumana:** 'అల్లుడి కోసం వేట' | **Sumana:** 'Hunt for a sun-in-law'. |
| **Manorama:** ఎవరు నటీనటులు? | **Manorama:** Who is the cast?/ Who does the cast included? |
| **Sumana:** అత్యంత ప్రజాభిమానం పొందిన హీరో, హీరోయిన్లు, నిశాంత్, నందిత. | **Sumana:** The most popular hero and heroine Nishanth and Nandita. |
| **Manorama:** ఏంటా సినిమాలో అంత గొప్ప? | **Manorama:** What is so great about the movie? |
| **Sumana:** అన్నీ గొప్పే. నటన, దర్శకత్వం, ఛాయాగ్రహణం, సంగీతం -అన్నీ బాగున్నాయి. | **Sumana:** Everything. Action, direction, photography, music- everything. |
| **Manorama:** నన్నూ చూడమంటావా? | **Manorama:** (Do) you want me to see it too?/ So you recommend it to me too. |
| **Sumana:** నిస్సందేహంగా. | **Sumana:** Undoubtedly. |

### Exercise

***Now translate the following into English.***

**Pranuthi:** నువ్వు నిన్న చూసిన సినిమా ఏ కోవకు చెందింది?

**Saranya:** అది ఉత్కంఠతో ఒళ్లు గగుర్పొడిచే కథను చూపిస్తుంది. క్షణక్షణానికి అనూహ్య పరిణామాలతో.

**Pranuthi:** స్వరకల్పన ఎవరు?

**Saranya:** ఇంకెవరు? ఎంతో మధురమైన, మన స్మృతులను వెంటాడే పాటలను కూర్చగల లయశ్రీ.

**Pranuthi:** మిగతా విషయాల సంగతేంటి? ఛాయాగ్రహణం ఎవరు? ఎలా ఉంది?

**Saranya:** చాలా మనోహరంగా, కనులకింపుగా ఉంది. దూరదృశ్యాలు, సమీప దృశ్యాలు సమపాళ్లలో ఉన్నాయి.

**Pranuthi:** సంభాషణలు?

**Saranya:** అవొక్కటే నిరుత్సాహపరిచాయి. పట్టు లేదు. దర్శకుడి ప్రతిభకు తగ్గట్టు లేవు.

**Pranuthi:** నన్ను చూడమంటావా?

**Saranya:** చూడు. విసుగు పుట్టించేది మాత్రం కాదు.

*Answer next week.*

---

*Hari Chaitanya,* ***Hyderabad.***

**Q:** <u>Have had</u> lunch?
<u>Has had</u> lunch? ఇలా అడగొచ్చా? ఇలాంటి Wordsను వివరించగలరు.

**A:** Where is the subject in the groups of words here? 'Have had lunch?' 'Has had lunch?' అని ఎవరిని అడుగుతున్నారు మీరు? Correct forms:
Have <u>you</u>/ <u>they</u> had lunch?
Has <u>he</u>/ <u>she</u> had lunch? } Correct

**Q:** Appreciate - పదానికి Increase, ప్రశంసించు అని రెండు అర్థాలున్నాయా?




**A:** ఉన్నాయి.
a) I <u>appreciate</u> her courage - ఆమె ధైర్యాన్ని నేను మెచ్చుకుంటున్నా/ ప్రశంసిస్తున్నా.
b) The price of gold has <u>appreciated</u> = బంగారం ధర <u>పెరిగిపోయింది</u> (increased).

**Q:** Agree <u>to</u>, Agree <u>with</u> ఈ రెండిటికీ తేడా ఏంటి? అర్థం ఏంటి?

**A: Agree to =** ఏదైనా ప్రతిపాదనకు, చేయడానికి ఒప్పుకోవడం.
He <u>agreed to</u> pay the money = డబ్బు చెల్లించేందుకు ఒప్పుకున్నాడు.
**Agree with =** ఒక వ్యక్తితో ఏకీభవించడం.
I <u>agree with</u> you that this <u>is expensive</u> = ఇది చాలా ఖరీదైందని <u>నేను</u> నీతో ఏకీభవిస్తున్నాను.

**Q:** "Bob was never born" దీని correct తెలుగు అర్థం ఏంటి?

**A:** Bob అనే అతడు అసలు పుట్టనేలేదని.



## Agree *to*, Agree *with* తేడా..?






M. SURESAN

*Nyalapally Pentaiah,* ***Dharmajipet.***

**Q:** సర్, కింది ప్రయోగాలను తెలుగులో ఎలా రాస్తారో తెలుపగలరు.

i) Why Dharmajipet village <u>have not been</u> developed?
ii) Why Dharmajipet village <u>has not been being</u> developed?
iii) Why Dharmajipet village has <u>not being</u> developed?
iv) Why are all these developments have not been developed?
v) Why are you so much interested about the developments of Dharmajipet?
vi) Why has he been torture me?
vii) Why is broken leg being been repaired?
viii) Why MLA is not taking developmental activities in his area?

**A:** All the sentences from S.No. (i) to S.No. (viii) are wrong. They are all supposed to be questions but not in the question structure. In a question the <u>verb is before the subject</u>, or the <u>subject is in between the helping verb and the main verb</u>.

Secondly most of the sentences do not have the proper verb form.

**i)** 'Dharmajipet' is III person, singular (it), so the verb form to be used here is '<u>has</u> been' and not 'have been'. So the correct form of the question is:

Why has Dharmajipet village been/ why hasn't (has not) Dharmajipet been developed? = ధర్మాజీపేట <u>గ్రామాన్ని</u> <u>ఇంతవరకు</u>/ <u>ఇంకా</u> ఎందుకు వృద్ధిపరచలేదు?

**ii)** This sentence is wrong. There is no such verb as 'has not been being developed'. Though this is the <u>passive form</u> of the present perfect continuous (have/ has been + ing form) it is almost never used.

మీ $1^{st}$ sentence ఏం అర్థం ఇస్తుందో ఈ sentence కూడా దాదాపు అదే అర్థం ఇస్తుంది.

**iii)** There is no such verb as 'has not being developed'. So this one is wrong. దీనికి బదులు కింది రెండింటిలో ఏదైనా చెప్పొచ్చు

Why has not Dharmajipet been developed - Same as the corrected form of sentence No.(i) OR

Why <u>is</u> not Dharmajipet village <u>being</u> developed? - ధర్మాజీపేట గ్రామాన్ని ఎందుకు అభివృద్ధి చేయడం లేదు (<u>ఇప్పుడు</u>) - Present continuous - passive voice.

**iv)** The sentence is wrong. అర్థం - ఈ అభివృద్ధులన్నీ ఎందుకు అభివృద్ధి చేయడం లేదు? అభివృద్ధులను అభివృద్ధి చేయం కదా? ఇక్కడ idea- తప్పు.

**v)** Why are you so much interested <u>in</u> (not <u>about</u>) the development (not <u>developments</u>) of Dharmajipet? (ధర్మాజీపేట అభివృద్ధి పట్ల నీకెందుకంత ఆసక్తి, శ్రద్ధ? )

**vi)** Why has he been tortured me?

- This is not a sentence, because this group of words has no meaning.

ఈ రెండిట్లో ఏదైనా అనవచ్చు:

Why has he tortured me? = అతడు నన్నెందుకు బాధించాడు?

OR

Why has he been tortured? (Passive) = అతడెందుకు బాధించబడ్డాడు?

**vii)** ఎందుకు విరిగిపోయిన కాలును సరిచేస్తున్నారు? (ఇక్కడ leg మనిషిదైతే 'repair' అనం, bandaged అంటాం. కుర్చీ/ టేబుల్ కాలైతే 'repair' అంటాం).



**Q:** Meeting లో address చేసేటప్పుడు సంబోధనలో Good evening to everybody - లాంటివి ఏవి ఉపయోగించాలి - మొదలుపెట్టినప్పుడు, ఉపసంహారం చేటప్పుడు ఏం చెప్పాలి? ఉపన్యాసంలో మంచి పద్ధతులు చెప్పండి.

**A:** You can say things like this:
a) 'With this we come to the end of the evening's programme. Thank you for your presence. Good night.
b) Well, ladies and gentlemen, that brings us to the end of the programme today. Good night.

ఉపన్యాసంలో మంచి పద్ధతులు - ఇది ఎవరిచ్చే ఉపన్యాసం, శ్రోతలెవరు, సందర్భం ఎలాంటిది? అనే వాటిపై ఆధారపడి ఉంటుంది కదా? వివరాలన్నీ తెలపండి. ఏయే రకమైన ఉపన్యాసాలనే దాన్ని బట్టి ఉపన్యాస పద్ధతులు వివరిస్తాం.

'స్పోకెన్ ఇంగ్లీష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net




స్నేహితులు, బంధువులతో మాట్లాడుతూ పేరు తెలియని వాళ్ల గురించి ప్రస్తావించాల్సి వచ్చినప్పుడు... రంగు, ఎత్తు, ఆకారం లాంటి అంశాలను ఉపయోగిస్తాం కదా? ఉదాహరణకు ఎత్తుగా / పొట్టిగా, తెల్లగా / నల్లగా ఉన్నారనో.. ఆమె / అతడు చాలా అందంగా ఉన్నారనో చెబుతాం. Spoken English లో అలాంటి సంభాషణల్లో ఎలాంటి పదాలు ఉపయోగిస్తారో తెలుసుకుందాం...

# Handsome woman అనొచ్చా..?

## FUNCTIONAL ENGLISH

**Dinakar:** Who was the guy you were talking to this morning? (నువ్వు మాట్లాడుతున్నది ఎవరితో ఇవాళ పొద్దున? )

**Subhash:** You mean the tall and bright complexioned guy? Oh, that's Sudhakar. He was my schoolmate. (నువ్వనేది ఆ పొడుగ్గా, ఎర్రగా ఉన్న తనా? అతడూ నేనూ schoolmates. Guy = మామూలు సంభాషణలో manకు బదులు వాడే మాట.)

**Dinakar:** Wait. I'm not talking about him. I know Sudhakar. I mean the other man - black-haired and in whites. By him was a fair young woman with shoulder length hair. (ఉండు. అతడి గురించి కాదు నేను మాట్లాడటం. నాకు సుధాకర్ తెలుసు. నేననేది ఇంకొకరు- నల్లటి జుట్టు, తెల్లదుస్తుల్లో, అతడి పక్కనే ఓ అందమైన ఆవిడ భుజాల దగ్గరకొచ్చే జుట్టుతో ఉంది.)

**Subhash:** Oh, you mean Vindhya and Mohan, don't you? Vindhya was our neighbour when we were children, and Mohan her husband. (నువ్వనేది వింధ్య, మోహన్‌ను గురించా? మా చిన్నతనంలో వింధ్య మా పొరుగమ్మాయి, మోహన్ తన భర్త.)

**Dinakar:** Mohan is handsome, isn't he? (మోహన్ అందంగానే ఉంటాడు కదా? )



**Subhash:** Does it mean that Vindhya isn't? They make quite a pair. She is quite beautiful. (అంటే వింధ్య అందంగా లేదనా? వాళ్లు ఈడూ జోడూగా ఉంటారు. ఆవిడా మంచి అందమైందే.)

**Dinakar:** His pointed nose adds to his good looks. (అతడి ముక్కుతీరు - కూచుగా ఉండటం అతడి అందాన్ని ఎక్కువ చేస్తోంది.)

**Subhash:** Can't we talk about something else? We needn't (need not) waste our time on them. (ఇంక దేన్ని గురించైనా మాట్లాడుకోలేమా? వాళ్లను గురించి మన సమయం వృథా చేసుకోవాల్సిన అవసరం లేదు.)

✪ ✪ ✪

***Now look at the following expressions from the conversation above.***

1) You mean the tall and fair-complexioned guy?
2) I mean the other man - black-haired and in whites.
3) By him was a fair young woman with shoulder length hair.
4) Mohan is handsome
5) His pointed nose adds to his good looks.






M. SURESAN

తెలుస్తూనే ఉంది కదా? పై sentences అన్నీ కూడా వ్యక్తుల (స్త్రీ/ పురుషుల)ను వర్ణించేవిగా ఉన్నాయని.

ఈసారి మనం వ్యక్తుల ఆకారాలకు సంబంధించిన మాటలు తెలుసుకుందాం.

**1) Complexion** = skin colour = చర్మపు రంగు.

**2) Black-haired** = జుట్టును వర్ణించేందుకు వాడతాం.

**3) A fair young woman** = అందమైన అమ్మాయి.

**4) Handsome** = Good looking

**a) Mahesh:** Why are Europeans and Americans so fair? (ఎందుకు ఐరోపా/ అమెరికా వాళ్లు అంత తెల్లగా ఉంటారు? )

**Hemanth:** The climate there is cold (అక్కడి శీతోష్ణస్థితి చాలా చల్లగా ఉంటుంది.)

**b) Bhavana:** Our friend Sanjana is very fair complexioned) (మన స్నేహితురాలు సంజన చాలా ఎర్రగా ఉంటుంది.)

**Karuna:** No wonder. She is a Kashmiri, and so are all Kashmiris. (ఆశ్చర్యమేముంది? ఆమె కాశ్మీరీ. అందరు కాశ్మీరీలు ఎర్రగానే ఉంటారు.)

**Complexion (చర్మపు రంగు) తెలిపేందుకు వాడే మాటలు తెలుసుకుందాం...**

✪ Bright complexioned/ Bright skinned = ప్రకాశవంతమైన చర్మపురంగు ఉన్న

✪ Dark complexioned/ Dark skinned = ముదురు రంగు ఉన్న (Most Indians).

✪ Whitish complexion = తెలుపు, ముఖ్యంగా పాలిపోయినట్లుండే.

✪ Black complexioned = నలుపు వర్ణం ఉన్న - Africans.

✪ **Handsome** = అందమైన. ఇది పురుషులకు మాత్రమే వాడతాం.

✪ **Beautiful -** స్త్రీలకు. అయితే కొంచెం ఒడ్డూ, పొడుగూ ఎక్కువగా ఉండి అందంగా ఉండే స్త్రీలను, handsome woman అనొచ్చు కానీ beautiful పురుషులకు వాడం.

**a) Vishal:** Who do you think is the most handsome on the Indian screen? (భారతీయ చలన చిత్ర నటుల్లో అత్యంత అందంగా ఉండే నటుడెవరు? )

**Sumanth:** Difficult to say. There are some four or five who are equally handsome (చెప్పడం కష్టం. నలుగురైదుగురు దాదాపు సమానమైన అందగాళ్లే.)

**b) Sarath:** Who is the most beautiful actor on the Telugu screen? (తెలుగు తారల్లో అత్యంత అందమైందెవరు? )

**Madan:** They say beauty lies in the beholder's eyes. (సామెత ఉంది. అందం అనేది చూసేవాళ్ల కళ్లను బట్టి ఉంటుంది అని. - దీనర్థం: ఒకరికి అందంగా కనిపించేది ఇంకొకరికంత అందంగా కనిపించకపోవచ్చు అని.)

### *Answer to the Exercise (Lesson-762)*

| Telugu | English |
|---|---|
| **Pranuthi:** నువ్వు నిన్న చూసిన సినిమా ఏ కోవకు చెందింది? | **Pranuthi:** What was the type of movie that you saw yesterday? |
| **Saranya:** అది ఉత్కంఠతో ఒళ్లు గగుర్పొడిచే కథను చూపిస్తుంది, క్షణక్షణానికి అనూహ్య పరిణామాలతో. | **Saranya:** It's (It is) a suspense thriller, with unexpected turns every moment. |
| **Pranuthi:** స్వరకల్పన ఎవరు? | **Pranuthi:** Who was the music director? / Who scored/ composed the music? |
| **Saranya:** ఇంకెవరు? ఎంతో మధురమైన మన స్మృతులను వెంటాడే పాటలను కూర్చగల లయశ్రీ. | **Saranya:** Who else? Layasri who can compose melodious (sweet) and haunting (మన స్మృతులను వెంటాడే) tunes. |
| **Pranuthi:** మిగతా విషయాల సంగతేంటి? ఛాయాగ్రహణం ఎవరు? ఎలా ఉంది? | **Pranuthi:** What about the other things? How was the photography? (Cinematography) Who was the director of photography? / Who wielded the camera? |
| **Saranya:** చాలా మనోహరంగా ఉంది. కనులకింపుగా, దూరదృశ్యాలు, సమీప దృశ్యాలు సమపాళ్లలో ఉన్నాయి. | **Saranya:** Very impressive- a real feast to the eyes. The long shots and the close-up shots are evenly balanced. |
| **Pranuthi:** సంభాషణలు? | **Pranuthi:** Dialogues? |
| **Saranya:** అవొక్కటే నిరుత్సాహపరిచాయి. పట్టులేదు. దర్శకుడి ప్రతిభకు తగ్గట్టు లేవు. | **Saranya:** That was the only disappointing thing/ That alone disappointed. They did not match up to the director's skill. |
| **Pranuthi:** నన్ను చూడమంటావా? | **Pranuthi:** Do you advise me to see it?/ Do you recommend it to me? |
| **Saranya:** చూడు. విసుగు పుట్టించేది కాదు. | **Saranya:** See it. It doesn't bore/ tire you. |

### *Exercise*

ఈ సంభాషణను Englishలో రాయండి.

**Srinath:** అందరు గొప్ప నటులు అంత అందగాళ్లు కారు కదా?

**Sai:** ఆకారం, ముఖం అందం అంత ముఖ్యం కాదు కదా? నటన, భావాలు తెలిపే ప్రతిభా ఉండాలి కదా?

**Srinath:** ఎవరెవరికి రెండూ ఉన్నాయి?

**Sai:** గతించిన ఎన్టీ రామారావు రెండూ ఉన్న నటుడు. ఒడ్డూ పొడుగూ, నటనా అన్నీ ఉండేవి ఆయనలో.

**Srinath:** నేను ఒప్పుకుంటానీ విషయం. నటీమణుల విషయంలో?

**Sai:** చెప్పడం కష్టమే. మరీ ఎక్కువమందే ఉన్నారు. అయితే నటన విషయానికొస్తే అంత గొప్పగా ఎవరూ ఉన్నట్టు లేరు. అందంతో అలా వచ్చేస్తున్నారు.

*Answer next week ...*



# More tasty than '*tasty*'

*KV Rao, **Vizag***

**Q:** కింది సమానార్థక పదాల మధ్య సూక్ష్మభేదాలు తెలిపి, ఏ సందర్భంలో లేదా ఏ భావంలో దేన్ని ఉపయోగించాలో ఉదాహరణలతో వివరించండి.

1. Seizures & Syncope & Unconsciousness
2. Tasty, Delicious, Flavour, Savour
3. Tradition, Custom, Convention & Prescription
4. Condition (legal) & Stipulation
5. (Medical) Episode, Bout, Spell
6. Over there, Out there, Up there

**A: 1. Seizure** = Any illness of the brain at times causing fits = ఫిట్స్ వచ్చే అవకాశం ఉన్న మెదడు సంబంధిత వ్యాధి.

**Syncope** = ఇది జబ్బు కాదు. While uttering a word, dropping a syllable in hurried speech = త్వరత్వరగా మాట్లాడేటప్పుడు పదంలోని ఒక syllable (శబ్దం) వదిలేయడం. Superintendent అంటున్నప్పుడు 'superindent' అనడం.

**Unconscious** = Be/ go out of senses = స్పృహ తప్పిపోవడం

**2. Tasty** = Having a good taste (of food) without being sweet (తీపి కాకుండా మిగతా విధంగా రుచిగా ఉన్న)

**Delicious** = Very tasty, having a pleasant taste or smell and enjoyable - More tasty than 'tasty' చాలా రుచికరమైన ఘన, ద్రవపదార్థాలు - 'tasty' కంటే ఎక్కువ.

**Flavour** = Taste and smell of a food item, especially of a drink = ఏదైనా తినే పదార్థం రుచి, వాసన.

**Savour** = Pleasant taste or smell = ఆహ్లాదకరమైన రుచి/ వాసన.

**3. Tradition** = A belief/ custom/ way of life/ being practised by a society for a long time - usually religious = సామాజిక సంప్రదాయం - మామూలుగా మత సంబంధమైంది.

**eg:** Celebrating a festival is a tradition.



**Custom** = A part of a tradition = సంప్రదాయం ప్రకారం అనుసరించే ఆచారం - దీపావళి రోజు టపాకాయలు పేల్చడం.

**Prescription** = In this context, a rule. ఈ సందర్భంలో, విధి (పాటించాల్సిన విషయం).

**Convention** = The way something that most people do in a society = చాలామంది దేన్నైనా చేసే పద్ధతి. It is the convention in the Indian society for the bride to live in her in-laws after marriage (భార్య అత్తమామల ఇంటికి వెళ్లడం ఆచారం.)

**4. Condition** = Contract = ఒప్పందం (Agreement) = ఏదైనా కావాలనుకున్నప్పుడు, మనం ఒప్పుకునే షరతు.

**Stipulation** = Something that must be done as part of an agreement = నిబంధన.

**5. Episode** = a period of anxiety during illness = జబ్బుతో ఉన్న రోగి పరిస్థితి కొద్దిగా గాభరా కలిగించే సంఘటన.

**Bout** = An attack/ period of illness = వ్యాధి సోకడం / వ్యాధికాలం

**Spell** = Period = వ్యాధికాలం.

**6. Over there** = out there = there.

# FUNCTIONAL ENGLISH

ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకునే సందర్భంలో అక్కడ లేని వ్యక్తి ఆకారం గురించి చెప్పాల్సి వచ్చినప్పుడు, మన స్నేహితులకు తెలియని వ్యక్తి ఎలా ఉంటాడో వర్ణించడానికి కొన్ని పదాలు ఉపయోగిస్తాం కదా? ఎత్తుగా, బలిష్ఠంగా/ గుండ్రటి మొహం లేదా కోలమొహం.. ఇలా వ్యక్తుల వర్ణనలో తోడ్పడే వివిధ పదాల గురించి ఈ వారం Spoken English లో తెలుసుకుందాం...

ప్రతిభ

# He is *tall* and *well-built*

**Kiran:** Is that the guy you are talking about- the tall and well built one with the round face. (ఆ పొడవైన, మంచి ఒడ్డూ, పొడుగూ ఉండి గుండ్రటి మొహం ఉన్నతని గురించేనా నువ్వు మాట్లాడుతున్నది? )

**Mahesh:** Oh, no. How you get me wrong! It is the other man, short and stocky. Look - the one in the light blue shirt. (కానే కాదు. ఎలా తప్పుగా అర్థం చేసుకుంటావో! నేను మాట్లాడేది ఆ ఇంకో అతడి గురించి - పొట్టిగా దృఢంగా ఉన్నతని గురించి. చూడు అతడు లేత నీలం షర్ట్‌లో).



**Kiran:** Yea, I know him. He is Manoj, quite pleasant and very good at human relations. (అవును, నాకు తెలుసు. అతడు మనోజ్- చాలా ఆహ్లాదకరంగా మాట్లాడతాడు. ఇతరులతో చాలా బాగా ఉంటాడు. మానవ సంబంధాల విషయంలో చాలా గొప్ప).

**Mahesh:** That's the one I am talking about. (అతడి గురించే నేను మాట్లాడుతున్నా).

**Kiran:** On the whole he has a charming personality. (మొత్తం మీద అతడిది ఆకర్షణీయమైన వ్యక్తిత్వం).

* * *

***Now look at the following expressions from the conversation above:***

1) ... the tall and well-built one with the round face.

2) It is the other man- short and stocky.

3) He is quite pleasant and good at human relations.

4) He has a charming personality.

అర్థమైంది కదా... పురుషులను వర్ణించడానికి పై మాటలు ఉపయోగిస్తాం.

a) Tall and Well-built = పొడుగ్గా ఉన్న, దృఢ కాయుడైన

**i) Pramod:** Look, what a figure he has/ How tall he is! (చూడు, అతడిదెంత మంచి ఆకారమో! మామూలు తెలుగు- ఎంత అందంగా ఉన్నాడో/ ఎంత పొడుగో!)

**Suman:** You can say that again and again. He is well built (మళ్లీ మళ్లీ అనొచ్చు నువ్వా మాట. అతడు దృఢకాయుడు- బలిష్ఠమైన శరీరం ఉన్నవాడు).

He is well-built = He has a good build.

Most Hollywood heroes are tall and well-built.

అంత పొడుగూ, పొట్టి కాకుండా దృఢశరీరులైన మగ వాళ్ల గురించి చెప్పడానికి... He is of medium height and has a good build అంటాం.

అలాగే, fat = లావైన, stout = rather fat = plump కొద్దిగా లావుగా ఉన్న/ బొద్దుగా ఉన్న.

★ Slim = Thin in an attractive way = నాజూగ్గా, సన్నగా ఉన్న.

★ Thin = బక్కపల్చగా ఉన్న.

ఇవన్నీ కూడా మనుషులను వర్ణించడానికి వాడతాం. ఇంకా చూద్దాం.

★ Round face = గుండ్రటి మొహం

★ Oval face = కోలమొహం.

### *Answer to the Exercise (Lesson-763)*

| Telugu | English |
|---|---|
| **Srinath:** అందరు గొప్పనటులు అంత అందగాళ్లు కారు కదా? | **Srinath:** Not all great actors are handsome, are they? (All great actors are not అని కూడా అనొచ్చు కానీ వాడుక: Not all...) |
| **Sai:** ఆకారం, అందం అంత ముఖ్యం కాదు కదా? నటన, భావాలు తెలిపే ప్రతిభా ఉండాలి కదా? | **Sai:** Appearance/ Physique and beauty are not that important, are they? Action and expression are important, aren't they? |
| **Srinath:** ఎవరెవరికి రెండూ ఉన్నాయి? | **Srinath:** Who has both? |
| **Sai:** గతించిన ఎన్టీ రామారావు రెండూ ఉన్న నటుడు. ఒడ్డూ పొడుగూ నటనా అన్నీ ఉండేవి ఆయనలో. | **Sai:** The late NTR had both. He had a grand physique and expression/ an expressive face. |
| **Srinath:** నేను ఒప్పుకుంటాను. కానీ, నటీమణుల విషయంలో? | **Srinath:** I agree. What about our actresses? |
| **Sai:** చెప్పడం కష్టమే. మరీ ఎక్కువమందే ఉన్నారు. అయితే నటన విషయానికొస్తే అంత గొప్పగా ఎవరూ ఉన్నట్టు లేరు. అందంతో అలా వచ్చేస్తున్నారు. | **Sai:** Difficult to say. There are too many of them. But if you take expression, there don't seem to be many. They just manage with their glamour. |

### *Exercise*

*Translate the following into English.*

**Ganesh:** మీ Physics lecturer ఎవరు?

**Sundar:** ఇంతవరకూ చూశేదా? చూడు కాస్త ముదురు రంగుతో పొడుగ్గా ఉన్నాయన.

**Ganesh:** అంటే నువ్వనడం, అక్కడున్న అందరిలో కాస్త ఒడ్డూ పొడుగూ ఉన్నతనా?

**Sundar:** అతడు కాదు. కాస్త దృఢ శరీరుడాయన.

**Ganesh:** ఆ పొట్టిగా కాస్త లావుగా ఉన్నాడు కదా, మన Chemistry lecturer. ఆయన పక్కతనా?

**Sundar:** ఆయన్ను నువ్వు గమనించకుండా ఉండలేవు. కాస్త నెరసిన చారలు కూడా ఉన్నాయి ఆయన జుట్టులో.

**Ganesh:** అవున్లే. కనిపించాడు.

*Answer Next Week*



## Canvass, campaign.. తేడా?

*Zubeida Khanum,* ***Vijayawada.***

**Q:** నా వల్ల ఎవరు బాధపడకూడదు/ ఎవరికి అన్యాయం జరగకూడదు - How to say in English?

**A:** No one/ None should suffer because of me. No injustice shall be done to any one because of me.

**Q:** "For example"- the short of these words are written as "e.g."- Is this correct?

**A: e.g:** This is the abbreviation of the Latin language word, 'exempli gratia', meaning, for example = ఉదాహరణకు.

**Q:** I drilled the students on important answers.

**A:** I drilled the students in (not on) important answers.

**Q:** If too many people cooked broth, they would get in each other's way - Say the meaning of the above underlined in Telugu.



**A:** If too many people cook a single item of food, they will get in each other's way = They will be obstructing (అడ్డు తగులుతారు) each other.

**Q:** What is the difference between the words 'meaning' and 'synonym'?





**A:** 'Meaning' of a word is just one word, or more than one word giving an explanation of the word. It is a definition of the word.

**Eg:** Success - meaning: Achieving what a person wants.

A synonym is a 'word' (only one word) having the same meaning as another word.

**Success** - Synonym: Victory. Another point about synonyms is though they have the same meaning they are not used in the same context.

'He had success in the exam'- We can't use, 'victory' here. Such words are synonyms.

**Q:** Ground control told him to keep circling until the fuel gauge registered almost empty - Say in Telugu.

**A:** ఇంధన సూచిక (పెట్రోల్ ఎంత ఉందో తెలిపే మీటర్) దాదాపు సున్నా చూపించే వరకు, ఆ విమాన చోదకుడి (Pilot)ని, గాలిలోనే చక్కర్లు కొడుతూ ఉండమని, భూమి మీద నుంచి విమానాలను నియంత్రించేవారు (Ground control) ఆదేశాలిచ్చారు. (విమానంలో ఏదో సాంకేతిక లోపం కారణంగా).



M. SURESAN

*T. Lakshmaiah,* ***Gollapalli.***

**Q:** Sir, I found these sentences in the book "Tales for children" by Leo Tolstoy.

i) When they were gone... ii) I lifted the coat the bread was gone. Are these correct? If so, what is the tense? And previous voice?

**A:** When they were gone/ The bread was gone.

In these expressions, were/ was gone are in the 'be' form + past participle form. Unlike all other verbs in 'be' form + Past participle form, was/ were gone is NOT in the passive form. 'Go' has no passive form as it is an intransitive verb (a verb without an object).

'Gone' in expressions like is/ are/ was/ were gone means, of a person having left a place (మనిషి వెళ్లిపోయారనే అర్థంతో), and of a thing, not to be seen where it was last seen (వస్తువు విషయంలో అయితే కనిపించడం లేదు, ఏమైపోయిందో అనే అర్థంతో).

He/ she/ it is gone = He/ she/ it had gone.

They are gone = They have gone.

In 'is/ are/ was/ were gone', the importance is for the fact that somebody/ something is not seen in the place they were before.

**Q:** Which word is used for a school advertisement?

Canvassing or Campaigning. Explain the difference.

**A:** Going round places and asking people there to admit their children in a school/ college is to canvass.

**'Canvass'** has the meaning of going to people to try to get their support for something. In this sense, 'canvass' is the right word.

**'Campaign'** means a planned activity or a series of activities for achieving a goal. This does not apply to private schools meeting people and canvassing for students.

**Canvass** = ప్రచారం **Campaign** = ఉద్యమం.

*Rishika,* ***Kakinada.***

**Q:** Please clarify the following doubts.

i) Have you visited your sick aunt?

ii) Stand in a queue - Say the subjects of the above two sentences.

**A:** The subject of the sentence (i) is, 'you', because the sentence talks about you.

ii) Stand in a queue = You stand in a queue = This sentence talks of you too, so the subject is 'you'. (What a sentence talks about is its subject).

**Q:** How many hours since she came here - ఆమె వచ్చి ఎన్ని గంటలు అయ్యింది/ ఎంతసేపయ్యింది. - Is this correct?

**A:** How many hours is it since she came here? దీనికి మీరనుకున్న అర్థం correct = How many hours has passed since she came here?

**Q:** Carefully = కేయఫులి, beautifully = బ్యూటిఫులి - Are the above correct?

**A:** Carefully - Pronunciation - కెఅఫ్లి

Beautifully - బ్యూటిఫ్లి




ఎన్నికలు, ఓటు హక్కు కలిగి ఉండటం, ఓటు నమోదు చేయించుకోవడం, ఓటు హక్కు ఉన్నా వినియోగించుకోకపోవడం, రిగ్గింగ్ జరగడం, హంగ్ అసెంబ్లీ లేదా పార్లమెంట్.. ఇలాంటి విషయాలు మన సంభాషణలో ప్రస్తావనకు వచ్చినప్పుడు ఎలాంటి పదాలు ఉపయోగించాలో ఈ వారం తెలుసుకుందాం.




# Have you *cast* your *vote*?

ఎన్నికలకు సంబంధించిన కింది సంభాషణను చదవండి..

**Niranjan:** Have you cast your vote? (నువ్వు ఓటు వేశావా? )

**Sampath:** No, I haven't yet. I don't have the franchise here. I am on the voter list of Ward 23. I enrolled myself as a voter in that area, as I was there last year. (ఇంకా లేదు - ఇక్కడ నాకు ఓటు లేదు. 23వ వార్డు ఓటర్ల జాబితాలో ఉంది నా పేరు. నేనక్కడ నమోదు చేయించుకున్నా ఓటరుగా).

**Niranjan:** That isn't (is not) very far from here, is it? Why don't you go and vote? (అదేం పెద్ద దూరం కాదు కదా? ఎందుకు వెళ్లి ఓటే యకూడదు? )

**Sampath:** Have you? Who did you vote for? (నువ్వేశావా? ఎవరికి? )

**Niranjan:** Know this is secret ballot, don't you? You shouldn't ask, and I shouldn't tell you. (ఇది రహస్య ఎన్నిక కదా? నువ్వడగకూడదు, నేను చెప్పకూడదు).

**Sampath:** Oh, I'm sorry. But I can guess (అలాగా. సారీ, కానీ నేనూహించగలను).

**Niranjan:** Don't worry. I was just joking. I've voted... (ఏం బాధపడకు, నేను తమాషాకు అన్నా, నేను ఓటు వేసింది...)

**Sampath:** Please, don't tell me. Let that alone. I am afraid this time it's going to be a hung assembly. (చెప్పొద్దు. వదిలేసెయ్. ఈసారి ఏ పార్టీకీ మెజారిటీ రాని పరిస్థితి వస్తుందే మోనని నా అనుమానం).

**Niranjan:** That means we are in for a coalition government. There might be alliances. (అంటే మనం సంకీర్ణ ప్రభుత్వాన్ని చూడబోతున్నామన్న మాట. పార్టీల భాగస్వామ్యం ఉండొచ్చు).

**Sampath:** But will those alliances work? The ruling party which had a landslide victory last time will bite the dust this time. (అయితే ఆ భాగస్వామ్యాలు పనిచేస్తాయా అని. కిందటిసారి అతి గొప్ప విజయం పొందిన అధికార పార్టీ ఈసారి మట్టికరుస్తుంది).

**Niranjan:** Sure. Anyway let's wait and see.

★ ★ ★

***Look at the following expressions from the conversation above.***

1) Have you cast your vote?
2) I don't have the franchise here
3) I enrolled myself in that area.
4) Know this is a secret ballot
5) It's going to be a hung assembly

## వివరణ...

**1) Cast your vote =** to vote = ఓటు వేయడం

Have you voted? = Have you cast your vote?

'to vote' అంటే ఓటు వేయడమే. అయితే, ఎవరైనా vote వేయడం అనేందుకు, I/ We etc... voted అనం. ఇది కాస్త అసంపూర్తిగా అనిపిస్తుంది. ఇలాంటి సందర్భాల్లో, cast vote వాడటం మంచిది. అయితే questionsలో ఎవరికి, ఎప్పుడు, ఎక్కడ ఓటు వేశారు? అని అడిగేందుకు, 'to vote' వాడవచ్చు.

**a) Ravindra:** There seems to be a good voter turn out this time. Have you cast your vote? (Better than 'Have you voted?') (ఈసారి ఓటర్లు పెద్ద సంఖ్యలోనే వచ్చినట్టున్నారు. నువ్వు ఓటు వేశావా? - ఇలాంటి చోట్ల, Have you voted? అనం).

**Sai:** No. I have yet to. (లేదు. వేయాల్సి ఉంది).

**2) Franchise =** The right to vote = ఓటు హక్కు. Exercise franchise = ఓటు హక్కు వినియోగించుకోవడం/ ఓటు వేయడం - అయితే ఇది కాస్త పాండిత్యం.

**Ramana:** A good number of voters in India do not exercise their franchise. Mumbai in the last elections was an example. (మన దేశంలో చాలామంది వాళ్ల ఓటు హక్కు వినియోగించుకోరు. గత ఎన్నికల్లో ముంబయి నగరం దీనికి ఉదాహరణ).


M. SURESAN




**Hemanth:** That's because of a number of malpractices and rigging. (చాలా అక్రమాలు, ఓటింగ్ విధానాన్ని కొంతమంది అభ్యర్థులు, కొన్ని పార్టీలు అక్రమంగా తమకు అనుకూలంగా పడేట్లు చేసుకోవడం వల్ల).

**Rigging =** అక్రమంగా ఓట్లను తమకు పడేట్లు చేసుకోవడం.

I don't have the franchise here = I don't have the right to vote here = My name is not in the voter list here = ఇక్కడి ఓటర్ల జాబితాలో నా పేరు లేదు.

**3) Enroll Oneself =** జాబితాలో పేరు చేర్పించుకోవడం = Having one's name included in the list of voters.

**4) Secret ballot =** రహస్య ఎన్నిక.

Secret voting అనం. రహస్య ఓటింగ్ పద్ధతిని secret ballot అంటాం.

The secret ballot system makes us free to vote for whoever we like. (రహస్య ఎన్నికల విధానం, మనం స్వేచ్ఛగా - ఎవరికి కావాలంటే వాళ్లకు ఓటేసేలా వీలు కల్పిస్తుంది).

**5) Hung assembly/ Parliament =** ఏ పార్టీకీ ప్రభుత్వం ఏర్పాటు చేయగలిగినంత మెజారిటీ (More than 50%) రాకపోవడం. ఈ మధ్య 'ఢిల్లీ ఎన్నికల్లా'. ఇది అసెంబ్లీ, పార్లమెంట్, రెండు ఎన్నికలకు వర్తిస్తుంది.

**Subhadra:** Which party, do you think, will be voted to power in the next elections? (వచ్చే ఎన్నికల్లో ఏ పార్టీ అధికారంలోకి వస్తుందని అనుకుంటున్నావు? )

**Sucharitha:** I am sure it is going to be a hung Parliament. (ఏ పార్టీకీ ప్రభుత్వం ఏర్పాటు చేయగలిగేటన్ని సీట్లు వస్తాయనుకోవడం లేదు.)

**Subhadra:** A coalition government is likely then. (అయితే సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడే అవకాశం ఉందన్నమాట).

**Coalition =** రెండు అంతకంటే ఎక్కువ పార్టీలు కలవడం వల్ల, ఆ కూటమికి ఉండే మెజారిటీతో ఏర్పాటయ్యే ప్రభుత్వం - coalition government.

## Now do the following exercise...

**Satrughna:** ఈసారి ఎక్కువమంది ప్రజలు ఏ పార్టీకి ఓటు వేస్తారనుకుంటున్నావు?

**Nataraj:** ఇప్పటి అంచనాల ప్రకారం అధికార పార్టీకి వేయకపోయే అవకాశాలే కనిపిస్తున్నాయి. ముఖ్యంగా సీమాంధ్రలో.

**Satrughna:** దేశంలో కూడా కాంగ్రెసును ఎన్నుకునే వారు తక్కువే. వాళ్ల ప్రభుత్వం అంత అధ్వానంగా ఉంది.

**Nataraj:** ఎన్నికలెప్పుడు జరగవచ్చు?

**Satrughna:** దేశం అంతా ఒకేసారి మే నెలలో ఎన్నికల్లో పాల్గొంటారని అంచనా.

(Go to polls = ఎన్నికల్లో పాల్గొనడం, దేశం మొత్తం లేదా కొంతమంది ప్రజల సమూహం.)

**Nataraj:** BJP కి అవకాశాలేమైనా ఉన్నాయా?

**Satrughna:** ఎక్కువమంది ఓటు వేస్తే BJP కి అవకాశాలు బాగానే ఉంటాయి.

**Nataraj:** సమస్యేమిటంటే నగరాల్లో చాలామంది వాళ్ల ఓటు హక్కు వినియోగించుకోరు.

**Satrughna:** వాళ్లు చురుగ్గా పాల్గొంటే మంచి ప్రభుత్వం రావచ్చు.

## Answer To Exercise In Lesson: 769

| తెలుగు | English |
|---|---|
| **Varun:** నువ్వు పడుకునేటప్పుడు లైట్ ఆర్పెయ్. నిన్న కూడా లైట్లు అలాగే ఉంచి నిద్రపోయావు. | **Varun:** When you go to bed turn the lights off/ switch off/ put out the lights. Yesterday you forgot that and slept. |
| **Nagaraj:** నీ సంగతేంటి? నువ్వు నిన్న పంపు తిప్పేసి వెళ్లిపోయావు. | **Nagaraj:** What about you? Yesterday you left the tap on when you went out. |
| **Varun:** ఇక అలా చేయన్లే. నువ్వు ఈ రోజు మాత్రం లైట్లలాగే వేసి ఉంచకు. | **Varun:** I won't do it again. But today you don't leave the lights on. |
| **Nagaraj:** ఇవాళ అన్నింటి నిండా నీళ్లు నింపి ఆ తర్వాత పంపు కట్టెయ్. ఆ drum, barrel కూడా నిండనివ్వు. | **Nagaraj:** Turn off the tap after all the containers are filled. Let that drum and barrel be filled. |
| **Varun:** ఇవాళ ఏదో channelలో మంచి ప్రోగ్రాం ఉంది. TV switch on చేసి ఉంచు. ఏ ఛానెలో తర్వాత పట్టుకుందాం. | **Varun:** There's an interesting/ good programme on one of the channels. Keep the TV turned on/ keep the TV on. We will surf for the channel/ We will tune in the channel later (Keep it tuned in అని కూడా అనొచ్చు) |
| **Nagaraj:** అలాగే. త్వరగా వచ్చెయ్. | **Nagaraj:** OK. Hurry up. |



## Sweat equity అంటే అర్థం ఏమిటి?

*D.Srinivas Reddy, **Narsapur.***

**Q:** Please clarify the following doubts. Sweat equity అంటే అర్థం వివరించగలరు.

**A: Sweat equity = i)** A share in the increased worth of a business/ property due to the physical or mental effort of the Directors/ Shareholders/ Partners/ Employees. (డైరెక్టర్లు, వాటాదారుల తెలివితేటలు/ శ్రమ వల్ల పెరిగిన వ్యాపార విలువ/ లాభాల్లో భాగం పంపిణీని, Sweat equity అంటారు.)

**ii)** వ్యాపారంలో కంపెనీ షేర్ల విలువ పెరిగినప్పుడు.. కానుకగా తక్కువ ధరకు, కంపెనీ డైరెక్టర్లకు, ఉద్యోగులకు కేటాయించే షేర్లు.

**iii)** యజమాని శ్రమ వల్ల పెరిగిన ఆస్తి విలువ (Increased value of a property created by the hard work of the owner.)

**iv)** ఒక్కొక్కప్పుడు అద్దెకున్న వాళ్లు తమ శ్రమ వల్ల ఆస్తి విలువను పెంచితే వారికి ఇచ్చేవి.

**Q:** Who is who & What is what - అంటే ఏమిటి?

**A: Who's who and What's what =** ఎవరు, ఎవరు, ఏది, ఏది? ఒక సంస్థ/ దేశంలో ప్రముఖ వ్యక్తులు, వారి స్థానాలు, పదవులు, హోదాలు - Who's (Who' is) who. అదే విధంగా ఒక విషయం గురించి అన్ని వివరాలు - What's (What is) what.

**Q:** I have phoned your home three times yesterday - Is this a correct sentence? Time తెలిపినప్పుడు Present perfect వాడరు కదా?

**A:** I have phoned you three..... yesterday - Wrong.



I phoned you three or four times yesterday - Correct.

Have + Past participle/ has + Past participle (PP) is used for actions of the past, time not stated - అంటే time చెప్పని past actionsకు మాత్రమే have/ has + PP వాడతాం.

Time తెలిపే past actions కు, past simple (3rd doing word) వాడతాం.

**Q:** You look quite smart in your new clothes. దీనికి అర్థం నువ్వు కొత్త దుస్తుల్లో అందంగా కనిపిస్తున్నావు - అని ఒకచోట చదివాను. కానీ are looking అనే verb లేదు కదా? Lookని progressive tenseలో వాడకూడదా?

**A:** 'Are looking' అనే verb ఎందుకు లేదు? 'Look'ని am + ing/ is + ing/ are + ing form లో ఇప్పుడు smartగా కనిపిస్తున్నావు అనే అర్థంతో వాడవచ్చు 'కనిపించడం'/ 'చూడటం' అనే అర్థంతో am seeing/ is seeing/ are seeing అని వాడం. 'Look'కు progressive tense ఉంది.

**Q:** I sat there like a stone image in the flesh. గీత గీసిన దానికి అర్థమేమిటి?

**A:** ఆ వెలుగులో, నేనొక శిల్పంలా కూర్చున్నాను - ఇది I sat there like a stone image (శిల్పం/ విగ్రహం)కు అర్థం. అయితే ఇది సరికాకపోవచ్చు ఈ sentence ఏ సందర్భంలో రాసిందో తెలిస్తే కానీ సరైన అర్థం చెప్పలేం.




అల్పాహారమైనా, విందు భోజనమైనా కొందరికి మసాలాలు, నూనెలో వేయించిన ఆహార పదార్థాలంటే చాలా ఇష్టం... మరికొందరు ఇష్టమైనా ఆరోగ్యాన్ని దృష్టిలో ఉంచుకుని అలాంటి పదార్థాలకు దూరంగా ఉంటారు. Spoken English లో ఇలాంటి అంశాల ప్రస్తావన వచ్చినప్పుడు ఎలాంటి పదాలు ఉపయోగించాలో ఈ వారం తెలుసుకుందాం...




# You don't mind *pungent* food..

*అల్పాహారానికి సంబంధించిన కింది సంభాషణను చదవండి...*

**Hanuman:** What are you having for breakfast? Idli, as usual, isn't it? (పొద్దున అల్పాహారం ఏమిటి? ఇడ్లీయేనా, అది మామూలే కదా?)

**Sashikanth:** Yea. It is fat free and healthy. Like to join me? (అవును. అందులో కొవ్వు పదార్థాలేమీ ఉండవు. నువ్వూ తీసుకుంటావా.)

**Hanuman:** Thank you. I have had breakfast. It was Vada with Sambar. I don't fancy the same thing everyday. (నాది అయిపోయింది. వడ, సాంబార్ తీసుకున్నాను. రోజూ ఒకేరకం నాకంత ఇష్టం ఉండదు.)

**Sashikanth:** You prefer variety, I know. You don't mind, for the sake of variety, even greasy food. (నాకు తెలుసు, నువ్వు variety ఇష్టపడతావని, అందుకోసం నూనె ఓడే పదార్థాలు కూడా ఇష్టమని).

**Hanuman:** But mind you, I avoid junk food. That certainly isn't to my taste. I must admit my weakness for delicious food. Spicy food also goes well with me. (కానీ ఒకటి గుర్తుంచుకో. మరీ నూనె ఎక్కువ పీల్చే వస్తువులు, తీపి వస్తువులు నాకిష్టం లేదు. రుచికరమైన పదార్థాల పట్ల నా బలహీనతను నేను కాదనలేను. కొంచెం మసాలా దినుసులు ఎక్కువగా ఉండే పదార్థాలంటే నాకు చాలా ఇష్టం).

**Sashikanth:** You don't mind pungent food, do you? (ఘాటుగా ఉండేవి కూడా నీకు అభ్యంతరం లేదు కదా?)

**Hanuman:** I don't of course, but once a way. (అప్పుడప్పుడు ఫర్వాలేదు).

**Sashikanth:** I had a friend who was particular about hot food. (నాకో స్నేహితుడు ఉండేవాడు. అతడు కారంగా ఉండే ఆహారం కోసం పట్టుదలగా ఉండేవాడు).

**Hanuman:** OK. Go ahead and have your breakfast. We can talk of these things later. (సరే, మొదట నీ breakfast కానివ్వు. ఈ విషయాల గురించి తర్వాత మాట్లాడుకుందాం!

## వివరణ...

1) Fat free food.
2) You don't mind even greasy food.
3) I avoid junk food.
4) I must admit my weakness for delicious food.
5) Hot food = కారంగా, ఘాటుగా ఉండే ఆహారం = food that contains chilli/ chilli powder, pepper (మిరియాలు), etc.

***You see above the different kinds of food we eat. Let's discuss them one by one:***

**1) Fat-free food =** Food containing little or no oil. Eg: Idli = అంతగా/ అసలు కొవ్వు పదార్థం లేని ఆహారం - నూనె, నెయ్యి లేకుండా తయారయ్యే ఆహార పదార్థాలు. ఉదా: ఇడ్లీ.

**Pramod:** I observe you always like Idli. Don't you get bored? (నువ్వు ఎప్పుడూ ఇడ్లీ తినడం గమనిస్తాను నేను. విసుగనిపించదా?)

**Vijay:** That's (That is) healthy food. It's fat-free, as it is steam cooked. (అది ఆరోగ్యకరమైన ఆహారం. నూనెలాంటి కొవ్వు పదార్థం ఉండదు, ఆవిరితో వండుతాం కాబట్టి).


M. SURESAN

**2) Greasy food:** నూనె, నెయ్యిలాంటివి ఎక్కువగా పీల్చుకునే వంటకాలు = food items that are made of excess of oil, ghee etc.

**a) Chandra:** Greasy food in small quantities may be harmless (నూనె/ నెయ్యి ఎక్కువగా ఉండే పదార్థాలు కొద్దిగా తీసుకుంటే అంత హానికరం కాకపోవచ్చు).

**Mahesh:** But unfortunately they are the tastiest you know. An example is Arisa = (కానీ దురదృష్టం ఏమిటంటే అవే అత్యంత రుచిగా ఉంటాయి, ఉదాహరణకు అరిసె).



'Greasy' ని 'oily' అని కూడా అనొచ్చు.

**b) Bhaskar:** The Gare at the dinner was excellent. It was quite tempting. (విందులో గారె చాలా బాగుంది. ఊరించింది.)

**Dayakar:** So it was, but wasn't it oily? That, I think, accounts for its taste. (అవును, కానీ మరీ నూనెతో ఉంది. అందువల్లే అంత రుచికరమేమో.)

**3) Junk food =** unhealthy food as it contains too much of fat and sugar = కొవ్వు పదార్థాలు, పంచదార చాలా ఎక్కువగా ఉన్న ఆహారం. **Eg:** Fast foods = అతి త్వరగా తయారు చేయగల పదార్థాలు.

**a) Rahim:** I had my breakfast in that fast food restaurant. Something is stirring in my stomach. (నేను ఇవ్వాళ ఆ fast food restaurant లో టిఫిన్ తీసుకున్నా. కడుపులో తిప్పుతోంది).

**Rashmi:** Don't you know they serve junk food? (నీకు తెలియదా, వాళ్లు చెత్త పెడతారని?)

Oily food, మామూలుగా junk food అవుతుంది. ఎందుకంటే oil (తైలాలు) ఎక్కువగా ఉన్న ఆహారం ఆరోగ్యానికి చెరుపు కాబట్టి.

**4) Delicious =** tasty = రుచికరమైన = very pleasant to taste and smell = రుచి, వాసన చాలా ఆకర్షణీయంగా ఉన్న.

**Anil:** The restaurant in the road leading to the theatre serves delicious food. (సినిమాహాలు దారిలో ఉన్న ఆ హోటల్లో మంచి రుచికరమైన ఆహారం వడ్డిస్తారు.)

**Tarun:** Yea, I had been there last week. It's really good. (అవును. కిందటి వారం అక్కడికి వెళ్లాను. బాగుంది.)

**5) Hot food =** food containing hot stuff like chillies, pepper, etc. = కారం, మిరియాలు ఎక్కువగా ఉండి, కారంగా ఉండే ఆహారం.

Hot = మామూలు అర్థం, వేడి; 'hot' అంటే కారంగా ఉన్న అని కూడా.

★ Andhras prefer hot food whereas Tamils like mild food. (ఆంధ్రులు కారం ఎక్కువ ఇష్టపడతారు. తమిళులు కారం లేని ఆహారం తింటారు).

**Spicy food =** మసాలా దినుసులు/ సుగంధ ద్రవ్యాలు ఎక్కువగా ఉన్న ఆహారం- యాలకులు, లవంగాలు, దాల్చిన చెక్కలాంటివి.

★ The biriyani was too spicy = బిరియానీలో సుగంధ ద్రవ్యాలు మరీ ఎక్కువగా ఉన్నాయి.

సుగంధ ద్రవ్యాలు: లవంగం = Clove
దాల్చిన చెక్క = Cinnamon
యాలకులు = Cardamom (ఎక్కువగా ఇలాచీ అంటుంటారు. ఇది English మాట కాదు).
గసగసాలు = Poppy;

★ Frozen food = Refrigerator/ fridge లో నిల్వ ఉంచిన ఆహారం.

★ Spicy food, ఒక్కొక్కప్పుడు ఘాటుగా (Pungent గా) కూడా ఉండొచ్చు.

*Answer to Excercise in Lesson No.770 - Next week*



## Remind కి Recall కి తేడా ఏమిటి?

*Sony Sargam,* ***Warangal.***

Please clarify the following doubts.

**Q:** They stopped talking seeing the teacher - అంటే వారు teacher ని చూసి మాట్లాడటం ఆపేశారా? లేదా చూస్తూ (teacher ని) మాట్లాడటం ఆపేశారా?

**A:** Correct, though 'on seeing' the teacher is better. (You can say, 'Seeing the teacher they stopped talking) = ... చూసి మాట్లాడటం ఆపేశారు.

**Q:** Horizontal, perpendicular, tentatively - వీటికి అర్థాలేమిటి?

**A:** You can get the meanings from a dictionary, can't you?

**Horizontal =** Parallel to the ground/ నేలకు సమాంతరంగా ఉన్న/ flat and level = బల్లపరుపుగా ఉన్న - A table top is horizontal.

**Perpendicular** = లంబం - నిట్టనిలువుగా $90^o$ ల కోణంలో ఉన్న - Walls of houses are perpendicular.

**Tentatively** = Not definite (కచ్చితం కాని) = provisional.

**Q:** "How I wish I had given shelter to the old woman", the prince said to himself (DS) - Please say (IDS).

**A:** The prince exclaimed that he had wished very much he had given shelter to the old woman.

**Q:** 'I am sorry. I forget to wish you', he said to me - ఈ వాక్యానికి IDS తెలుపగలరు.

**A:** He told me that he was sorry that he forgot to wish me.

**Q:** i) 'What! You have painted a painting', he said.
ii) 'Hush! Don't disturb me', he said. Please say IDS for the two.

**A:** i) He wondered I had painted a painting.
ii) Asking me to be quiet, he told me not to disturb him.

*Neha Parveen.*

**Q:** We're sending Anna off to try though - Say the meaning in Telugu..

**A:** ఏది ఏమైనా మేం అన్నాను పంపిస్తున్నాం - ఇది Conversational (Note that the sentence is not complete).

**Q:** i) She is not concerned with the dimension of the work but the work itself.
ii) She is a unique person in the world today, it is not in the vulgar celebrity sense of having neon lighting about her head. Rather in the opposite sense of someone who has merged herself in the common face of mankind. - Say in Telugu.

**A:** i) ఆమె ఎంత పని చేశానని కాకుండా, చేసిన పనిలోనే ఆసక్తి చూపింది.
**ii)** ఆమెలాంటి వాళ్లు ఆమె ఒక్కటే, అలా అనడం, మనం మామూలుగా విశిష్ట వ్యక్తులను అనే విధంగా కాదు. దానికి వ్యతిరేకమైన విధంలో- మానవ బాహుళ్యంలో ఆమె కూడా ఒకటిగానే (అలా ఉంటూనే ఆమె గొప్ప వ్యక్తిలా భావించబడుతోంది.)

*Zia Khan,* ***Hyderabad.***

**Q:** i) Remember ii) Memorize iii) Remind iv) Recall - Please say the difference.

**A:** i) Remember = to get something past into your mind/ memory (జ్ఞాపకం తెచ్చుకోవడం/ రావడం).
ii) Memorize = to learn something carefully so as not to forget it (కంఠస్థం చేయడం/ బట్టీ పట్టడం.)
iii) Remind = Make others remember (గుర్తు చేయడం).
iv) Recall = Try to recollect = ప్రయత్నించి జ్ఞాపకం తెచ్చుకోవడం.

★ Let me recall what happened that day (ఆ రోజేం జరిగిందో గుర్తుతెచ్చుకోనివ్వు).

**Q:** I want to clarify the doubts of 7th class students other than the students of other classes - Please say if it is correct or not.

**A:** Wrong. I want to clarify the doubts of students other than those of the 7th class ones - Correct.



**Q:** మీరు (students) ఇరుకు ఇరుకుగా ఎందుకు కూర్చుంటున్నారు? (As there are a lot of benches) - Please let me know how the above is said in English?

**A:** Why are you crowding yourself on the bench?/ Why do you scramble when there are so many benches to sit on?

**Q:** He says to me/ He tells me - Say the difference.

**A:** He says to me = He tells me.

**Q:** The shop is open between / from 9 to 10 / is opened 9 to 10 - Which one is correct?

**A:** Refer to the answer to an earlier letter.

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net




చాలామంది ఏదైనా పని మీద వెళ్లాల్సి వస్తే భోజనం లేదా అల్పాహారం గబగబా మింగేస్తూ ఉంటారు. చిన్నపిల్లలు ఐస్‌క్రీమ్‌లు, చాక్లెట్లు లాంటివి చప్పరిస్తూ తింటారు. ఆహారం తినడానికి సంబంధించిన ఇలాంటి పదాలను Spoken English లో ఏమంటారో ఈ వారం తెలుసుకుందాం. ఇవన్నీ మన సంభాషణ సహజంగా ఉండేందుకు ఉపయోగపడతాయి.




# He *gulped down* two idlis..

*తినడానికి సంబంధించిన కింది సంభాషణ చదవండి.*

**Bharath:** What's the hurry Gowtham? Why are you gulping down the food? (ఏంటా తొందర గౌతమ్? గబగబా మింగేస్తున్నావేంటి?)

**Gowtham:** What do you know? I have to rush to college to get my certificates. The office will close in half an hour. (నీకేం తెలుసు? నా certificates తెచ్చుకోవడానికి college కి వెళ్లాలి. ఆఫీస్ అరగంటలో మూసేస్తారు.)

**Bharath:** Don't you worry. No hurry. As they say in science, chew and then swallow. The college is closed today. (ఏం బాధపడకు. సైన్స్‌లో చెప్పినట్టు బాగా నమిలి తిను, ఆ తర్వాత మింగు. ఇవాళ కాలేజీ మూసేశారు.)

**Gowtham:** You should have told me earlier. I was eating so fast that I choked almost to death. (ముందే చెప్పుండాల్సింది నువ్వు. పొలమారి/ పొరబోయి చచ్చేంత పని అయ్యింది).

**Bharath:** Come on. Have some more of this. It's (It is) very tasty. You will relish it, with the pickle to go with it. (చూడు ఇది ఇంకాస్త వేసుకో. చాలా రుచిగా ఉంది. ఇది చాలా ఆస్వాదిస్తావు/ ఇష్టపడతావు నువ్వు, ఈ ఊరగాయతో.)

**Gowtham:** No drink to go with it? Don't you have any? I envy you. How leisurely you are eating! You really enjoy your meal. (పానీయం ఏం లేదా దీనితో? నువ్వంటే నాకు ఈర్ష్యగా ఉంది. ఎంత తీరిగ్గా తింటున్నావు నువ్వు! నీ భోజనం ఎంత హాయిగా తింటున్నావు!)

**Bharath:** Here, you wanted a drink. Take a sip of it, and if you like it, have the whole of it. (ఇదిగో, పానీయం తీసుకో. ఒక గుక్క తాగు. ఇష్టమైతే మొత్తం తీసుకో.)

**Gowtham:** What about you? (నువ్వేం చేస్తావు?)

**Bharath:** I'll (I will) have a chocolate and ice cream instead. I can suck the chocolate and ice cream. (నేను chocolate, ice cream తీసుకుంటాను. అవి చప్పరించడం నాకిష్టం.)

**Gowtham:** Go ahead then (అయితే కానివ్వు.)

✪ ✪ ✪

***Look at the following expressions from the conversation above:***

1) Why are you <u>gulping</u> down the food?
2) <u>Chew</u> and then <u>swallow</u>.
3) I was eating so fast that <u>I choked</u> almost to death.
4) Take a <u>sip of it</u>.
5) I can <u>suck</u> the chocolate.

M. SURESAN

మామూలుగా అయితే, ఏదైనా <u>తినడం</u>, తాగడానికి వాడే మాటలు: eat, have, take. వీటన్నింటిలో Spoken English లో ఎక్కువగా వాడేది, 'have'. మన సంభాషణ సహజంగా ఉండాలంటే, 'have', ఆ తర్వాత 'take' (తినేదుకు, తాగేందుకు), 'eat' (తినేందుకు) వాడతాం.

**a) Hemanth:** What do you have/ take in the mornings/ for breakfast? (నువ్వు మామూలుగా ఉదయం ఏం తీసుకుంటావు?)

**Manu:** My breakfast is idli with chutney, most of the days. Now and then I <u>have</u> dosa with coffee. (నా breakfast చాలా light. మామూలుగా ఇడ్లీ, చట్నీ ఎక్కువ రోజులు. అప్పుడప్పుడు దోసె, కాఫీ.)

**b) Anand:** What do we <u>have</u> for dinner, mom? (భోజనంలోకి ఏంటమ్మా?)

**Saraswathi:** As usual son. (మామూలే).

ఆహారం ఏదైనా తినడానికి, తాగడానికి 'have' వాడటం చాలా సహజంగా ఉంటుంది. దాని తర్వాత 'take'. మనకు బాగా పరిచయస్తులతో '<u>eat</u>' వాడవచ్చు

**Jagadish:** What's making you so angry? (ఏంటంత కోపం తెప్పించేది నీకు?)

**Ram:** What do you know? I <u>haven't eaten</u> for hours. I am starving. (నీకేం తెలుసు? గంటలు

## FUNCTIONAL ENGLISH

గడిచిపోయింది నేనేదైనా తిని. పస్తున్నట్టుంది).

**1) Gulp =** మింగేయడం (ఒక గుక్కలో)

**a) Gopal:** Has Balu gone to college? (బాలు college కి వెళ్లాడా?)

**Vasantha:** He got up very late. So he gulped down two idlis and rushed to college. (చాలా ఆలస్యంగా లేచాడు. అందుకని రెండు ఇడ్లీలు <u>మింగేసి</u> కాలేజ్‌కి పరుగు పరుగున వెళ్లాడు).



**Gulp =** Swallow = మింగడం, అయితే swallow కంటే gulp ఎక్కువ పరిమాణంలో మరింత <u>హడావిడిగా</u> మింగడం.

a) He <u>swallowed</u> poison and committed suicide (విషం <u>మింగి</u> ఆత్మహత్య చేసుకున్నాడు).

b) He <u>gulped</u> down the milk and ran off.

మాత్రలు మింగడం = swallow pills/ tablets/ capsules.

అవమానం భరించడం = <u>Swallow insults</u>

**2) Chew =** నమలడం

a) Don't <u>chew</u> nut powder, it is bad for health. (వక్కపొడి <u>నమలకు</u>, అది అనారోగ్యం).

b) He <u>chews</u> killis and spits all around. (అతడు కిళ్లీ నమిలి ఎక్కడపడితే అక్కడ ఉమ్మేస్తాడు).

<u>Chewing gum</u> తెలుసు కదా? నములుతూ ఉంటాం కాబట్టి దానికా పేరు.

✪ "Munch" అంటే కూడా నమలడమే, కానీ Munch = <u>chew</u> <u>making a noise</u> = శబ్దం చేస్తూ నమలడం.

She was <u>munching</u> peas all through the class = ఆమె క్లాసు మొత్తం బఠాణీలు <u>నములుతూనే ఉంది శబ్దంతో</u>.

**4) Sip =** చప్పరిస్తూ గుక్కగుక్క తాగడం.

a) When coffee/ tea, etc is hot we sip it. (వేడిగా ఉన్న coffee/ tea లను <u>చప్పరిస్తూ కొద్దికొద్దిగా తాగుతాం</u>).

b) <u>Take a sip of it</u>, and you won't leave even a drop of it = ఒక్కసారి దాన్ని <u>కొద్దిగా తాగి రుచి చూడు</u>, ఒక్క చుక్క కూడా మిగల్చవు.

**5) Suck =** (మామూలు అర్థం పీల్చడం) ఇక్కడి అర్థం, చప్పరించడం - Chocolate, ice cream లాంటివి.

a) This tablet is sweet, <u>suck</u> it = ఈ మాత్ర తీయగా ఉంటుంది. <u>చప్పరించు.</u>



b) He was <u>sucking</u> chocolate while his dad was talking to him seriously = వాళ్ల నాన్న ఏదో ముఖ్యమైన విషయం మాట్లాడుతున్నప్పుడు, వాడు ఆ చాక్లెట్‌ను <u>చప్పరిస్తూనే</u> ఉన్నాడు.

### *Exercise*

*Translate the following into English.*

**Radha:** ఈ సాయంత్రం కాస్త చలిగా ఉంది. ఏదైనా వేడిగా ఉన్నదాన్ని తిని, కాస్త కాఫీ తీసుకుందామా?

**Lalitha:** తప్పకుండా. వేడి వేడి చిప్స్, పొగలు చిమ్మే కాఫీతో తీసుకుంటే బాగుంటుంది కదా.

**Radha:** అవును. మనం కావాలనుకుంటున్న కరకరలాడే తినుబండారం ఇదిగో.

**Lalitha:** చాలా బాగున్నాయి ఈ chips. ఇంకో packet కొందాం. ఇవాళ మధ్యాహ్నం నుంచి నేనేం తినలేదు. మందులు మింగడంతోనే సరిపోయింది.

**Radha:** నాకు కూడా మాత్రలున్నాయి. అవి హోమియో మాత్రలు, చప్పరించవచ్చు.

**Lalitha:** నువ్వు చతురను గమనించావా? ఎప్పుడూ ఏదో ఒకటి నములుతూనే ఉంటుంది.

**Radha:** మొన్న ఉన్నట్టుండి teacher అడుగు పెట్టేసరికి నీళ్లు గబాగబా తాగి నములుతున్నది మింగేసింది.

**Lalitha:** పొరబోయింది/ పొలమారింది కూడా కదా!

**Radha:** అవును. దానికి బుద్ధిరాదు.

*Answer next week..*

### Answer to Exercise in Lesson - 770

**Satrughna:** Which party, do you think, a large number of people will vote for?

**Nataraj:** According to present estimates not many are likely to vote for/ not much likelihood of many voting for the party in power, especially in Seema Andhra area.

**Satrughna:** So is it with the rest of the country/ Even across the country only a few people may vote for congress/ may (likely to) vote congress to power/ vote for congress.

**Nataraj:** When may the elections be?/ When are elections likely?

**Satrughna:** I think the whole country will go to polls in May.

**Nataraj:** Has the BJP any chance?

**Satrughna:** If a large number of people exercise their franchise the BJP has good chances.

**Nataraj:** The problem is not many in cities vote/ Cast their vote in general elections.

**Satrughna:** If they participate/ vote/ cast their vote we may get a good government.



## Golden.. బంగారంతో చేసింది కాదు!

*K. Pavan,* ***Bhimavaram.***

**Q:** "<u>Never</u>" అనే word ని ఏయే సందర్భాల్లో ఎలా వాడాలి? వివరించగలరు.

**A:** Never = Not at any time/ At no time = ఎప్పుడూ లేదు / కాదు.

**Q:** "ఇది అందరికీ కష్టం కాకపోవచ్చు"
- ఈ వాక్యాన్ని Englishలో కరెక్ట్‌గా చెప్పడానికి కిందివాటిలో ఏది సరైంది? వీటి మధ్య తేడా ఏమిటి?

i) It <u>need not to be</u> difficult to all.
ii) It <u>doesn't have to be</u> difficult to all.
iii) It <u>may not be</u> difficult to all.

**A:** i) It need not to be difficult to all - WRONG.

ii) It doesn't have to be difficult <u>for</u> all = It needn't be difficult for all - Correct.

iii) Not all may find it difficult.

*Sony Kaur,* ***Warangal.***

**Q:** The fairy gave him both a silver and a gold/ golden axes/ the fairy gave him both a silver and gold/ golden axes - Say the correct one.

**A: Gold =** బంగారం/ బంగారంతో తయారైన.

**Golden =** బంగారం లాంటి = అతి విలువైన, కానీ బంగారంతో తయారు చేసిన అని కాదు.

అయితే Poetryలో / సాహిత్యంలో "Golden" ను బంగారంతో తయారు చేసిన అని ఉపయోగిస్తారు.

The fairy gave him both a silver and <u>gold axes</u> - Correct (Golden axe - కాస్త కవిత్వం).

Gold ring = బంగారు ఉంగరం; Golden opportunity = బంగారం లాంటి అవకాశం; <u>Golden</u> memories = మధుర స్మృతులు

'Golden', బంగారంతో చేసిన అని కావ్యాల్లో వాడొచ్చు కానీ, 'Gold'ను బంగారం లాంటి / అతి విలువైన అనే అర్థంతో ఉపయోగించరు. "Gold chance" అనరు (బంగారం లాంటి అవకాశం అనే అర్థంతో).

**Q:** Hotel - హోటల్, similarly can we pronounce the following words?

Chose - ఛోవ్‌జ్ (Z-sound), Chosen - ఛోవ్‌జెన్ (Z-Sound), hose -హోవ్‌జ్ (Z-sound)?

**A:** H<u>o</u>tel, ch<u>o</u>se, ch<u>o</u>sen and h<u>o</u>se - The 'O' in these words is pronounced ఓ ఉ - దీన్ని మనం 'ఓవ్'లా (ఛోవ్‌జ్, హోవ్‌టెల్, ఛోవ్‌జన్) కాకుండా 'ఎ'కు, 'ఒ'కు మధ్య శబ్దంతో పలకాలి. ఈ శబ్దాన్ని తెలుగు అక్షరాల్లో చూపించడం కష్టం.

H<u>o</u>tel, Ch<u>o</u>se, etc మాటల్లోని 'O' ఎకు ఒకు మధ్య ఉంటుంది. 'వ్' రాదు. మనం అంత కచ్చితంగా pronounce చేయనక్కర్లేదు. మామూలుగా 'హోఏటల్' గా పలకవచ్చు అలాగే మిగతా శబ్దాలు కూడా.

*Syed Zafar,* ***Hanmakonda.***

**Q:** Sir, please clarify the following doubts: Go to bed here/ sleep here - Which one is correct? And what is the difference?

**A:** Sleep here - Correct. Go to bed here - Wrong.

Go to bed = lie-down to sleep.

Sleep - the actual act of sleeping.

So we ask someone to sleep at some place, but not to 'go to bed'.

**Q:** Please <u>tender</u> change - ఈ వాక్యంలో <u>underline</u> చేసిన పదం అర్థం ఏమిటి?

**A:** Tender = give

**Q:** To protect you with my life - Say in Telugu.

**A:** నా ప్రాణం పోగొట్టుకుని అయినా, నిన్ను రక్షిస్తాను.

'స్పోకెన్ ఇంగ్లీష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net



## వీటి మధ్య తేడా..?




*Ch. Ramaiah,* **Nellore.**

**Q:** i) I want to go to temple.
ii) I have to go to temple.
iii) I am to go to temple.
పై మూడు వాక్యాల మధ్య అర్థభేదాలను వివరించండి.

**A:** I want to go to temple = గుడికి వెళ్లాలని అను కుంటున్నాను.
I have to go to temple = వెళ్లాలి (తప్పదు) (విధి/ ఆజ్ఞ etc).
I am to go to temple = వెళ్లాలి/ బయల్దేరబోతున్నాను

**Q:** Does anybody have a doubt? ఈ వాక్యం కరక్టేనా?

**A:** Correct.

**Q:** What could be the reason అంటే 'కారణం ఏమై ఉంటుందబ్బా' అని చదివాను. అయితే,
i) What would be the reason?
ii) What should be the reason?
iii) What might be the reason?
పై మూడింటికి తెలుగులో అర్థం వివరించండి.

**A:** i) What would be the reason?
Would be the reason = 'Would be' here is the future from the past, meaning, కారణం ఏమిటిగా ఉంటుంది? (If you took it home, what would be your reason = Suppose you took it home (past future) what reason would you give? నువ్వు దాన్ని తీసుకెళ్లిన పక్షంలో, ఏం కారణం/ ఏది కారణంగా ఉంటుంది?)
ii) What should be the reason? = కారణం ఏమై ఉండాలి?
iii) What might be the reason? = ఏమై ఉండొచ్చు (Probabilityకి Englishలో could, might రెండూ వాడతాం).

*Soha Ali Khan,* **Warangal.**

**Q:** Please clarify the following doubts.
A thorn pierced/ poked his finger - ఆయన చేతి వేలికి ముల్లు గుచ్చుకుంది - Is this correct?

**A:** A thorn pricked అంటాం, pierced అనం. Prick = గుచ్చుకోవడం; pierce = గుచ్చుకుని, బాగా లోపలికి దిగిపోవడం.

**Q:** నేను మీ answer sheetsని న్యాయంగా దిద్దాను. - How can this be said in English?

**A:** I have valued your answer sheets very fairly.

**Q:** Do you know where Kochi is? - Is the question mark necessary to be written here?

**A:** Question mark is necessary because it is a question (Do you know?)
Only the part of the sentence, 'Do you know...?' is in the question form and the rest of it is a statement. But the main clause being a question, the sentence has to be taken as a question.

**Q:** Rolling and wearing spectacle is the style of the hero Rajinikanth and he has no equals - అంటే ఆ styles ఆయనకే suitable - Is this correct?

**A:** Spectacle కాదు, spectacles (spectacle = దృశ్యం). Sentence మొత్తం అర్థం - అది ఆయన శైలి - ఆయన పద్ధతి.



M. SURESAN

వేసవి వచ్చిందంటే కరెంటు కోత, ఉక్కపోత తప్పవు. చిన్న జల్లు పడితే వాతావరణం మరింత వేడెక్కుతుంది.. బయట పడుకుందామంటే దోమల బాధ.. ఇలాంటి అంశాల గురించి స్నేహితులతో సంభాషించేటప్పుడు ఎలాంటి పదాలు ఉపయోగించాలో తెలుసుకుందాం.




# Don't you feel *stuffy!*

## FUNCTIONAL ENGLISH

*వాతావరణం గురించి స్నేహితుల సంభాషణ...*

**Anand:** It's (It is) very sultry in here. Why don't we sit out? (ఇక్కడ బాగా చెమటగా ఉంది. బయట కూర్చోకూడదా మనం?)

**Giridhar:** It certainly is. Let's sit out. Last night I couldn't sleep at all. The room was very stuffy/ It was very stuffy inside and added to it there was power cut. I spent a sleepless night. (కిందటి రాత్రి నేను అసలు నిద్ర పోలేకపోయాను. గదంతా చాలా వేడిగా, ఉక్కపోతగా ఉంది. దానికి తోడు కరెంట్ లేదు. నిద్ర లేని రాత్రి గడిపాను.)

**Anand:** You could have slept in the open (ఆరుబయట పడుకుని ఉండొచ్చు కదా?)

**Giridhar:** The mosquitoes wouldn't allow me. Further there was a drizzle on and off (దోమలు బయటికి రానివ్వలేదు. దానికితోడు పదేపదే జల్లు పడుతూ ఉంది).

**Anand:** My room is far better. It's very cool inside. There are trees all around and lot of open place too. A cool breeze blows about. (నా గది చాలా మెరుగు. చాలా చల్లగా ఉంటుంది లోపల. చుట్టూ చెట్లూ, ఖాళీ ప్రదేశం. చల్లటి గాలి వీస్తుంది).

**Giridhar:** Yea I know. Strong winds blow sometimes as well, as it is very near the sea. (అవును నాకు తెలుసు. సముద్రానికి దగ్గర ఉండటంతో బలమైన గాలులు కూడా వీస్తుంటాయి).

**Anand:** Only, in the afternoons the atmosphere is humid, and the body has some moisture. On rainy days blasts of wind snap the power lines. (ఒక్కటే. మధ్యాహ్నం పూట, గాలి కొంచెం తేమగా ఉంటుంది. మన ఒంటి మీద కూడా తేమ ఉంటుంది వాన రోజుల్లో.)

**Giridhar:** Nothing is an unmixed blessing (ఏది కూడా మనకు పూర్తిగా సుఖప్రదం కాదు).




*Look at the following expressions...*
1) It is very sultry in here.
2) The room was very stuffy
3) There was a drizzle on and off
4) A cool breeze blows about
5) Strong winds blow
6) The atmosphere is humid
7) Blasts of wind snap the power lines

## వివరణలు..

**1) Sultry** = వేడి కలిగించే చెమట (hot air that causes sweat)
Sweat = చెమట.

**a) Divya:** It's been a hot and sultry day. (ఇవాళ చాలా వేడిగా ఉండి చెమట పోస్తోంది).

**Jamuna:** No movement of air at all. Not a leaf is stirring (గాలి లేదు అసలు. ఒక ఆకు కూడా కద లడం లేదు).

**b) Vinod:** What a day to be moving around on! How I wish I were in an A/C room! (ఇదేం రోజు బాబూ! తిరగాల్సి వచ్చింది ఇలాంటి రోజున. AC roomలో ఉంటే బాగుండేది).

**Murari:** You can say that. It is very sultry. (నువ్వు సరిగానే చెప్పావు. నిజంగానే చెమటగా ఉంది.)

**2) Stuffy** = Lack of fresh air in a room/ a building (గాలి ఆడని గదులు/ భవనాలు).

**Praful:** How you are sweating? What is wrong with you man? (ఏమిటంత చెమట పోస్తోంది నీకు? ఏమైంది?)

**Nataraj:** Don't you feel stuffy! Why don't you open the windows and turn the fan on? (చెమటపోయడం లేదా నీకు, గాలి ఆడకపోవటం వల్ల. కిటికీలు తెరిచి, fan వేయవేం?)

**3) Drizzle** = తుప్పర (కొద్దిగా చలితో)

**a) Kumar:** You seem to have got wet. How come! (మీరేదో తడిసినట్టున్నారు. ఎలా?)

**Shanmukh:** I am surprized that there isn't a drop of rain here. But when I started at home, it started drizzling. (ఇక్కడ వర్షం లేకపోవటం ఆశ్చర్యంగా ఉంది. కానీ నేను ఇంట్లో బయలుదేరినప్పుడు తుప్పర ప్రారంభమైంది).

*Breeze, wind, blast of wind:* ఇవి గాలికి సంబంధించిన మాటలు.

**Breeze:** మనసుకు హాయిని కలిగించే చల్లటి పిల్లగాలి.

**Wind:** ఈదురుగాలి.

**Blast of wind** = ఒక్కసారిగా వీచే పెద్ద గాలి.

## SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 773

### Now do the following exercise

*Translate this into English..*

**Ramakanth:** పొద్దున్నుంచి కాస్త చెమటగా ఉంది. వేసవి ప్రారంభమైనట్లుంది.

**Subhakar:** కరెక్టే. రాత్రి మొత్తం గదిలో గాలాడ లేదు. కాసేపు బయట పడుకున్నా ఆరుబయట.

**Ramakanth:** పొద్దున వాన కురిసింది కదా. అప్పుడే అనుకున్నా ఎండలు ముదరవచ్చని.

**Subhakar:** పొద్దున వాన వెలిసిన తర్వాత అసలు గాలాడలేదు, కిటికీలన్నీ తెరిచి పెట్టినా.

**Ramakanth:** ఇప్పుడేమో ముసురు/ తుప్పర.

**Subhakar:** అదొక్కటే మన అదుపులో లేనిది.

*Answer next week...*

### Answer to the exercise in Lesson No. 772

| తెలుగు | English |
|---|---|
| **Radha:** ఈ సాయంత్రం కాస్త చలిగా ఉంది. ఏదైనా వేడివేడిగా ఉన్నదాన్ని తిని, కాస్త కాఫీ తీసుకుందామా? | **Radha:** The evening is cold. Shall we have/ how about having/ eating/ having a bite of something hot and some/ a sip of hot coffee? |
| **Lalitha:** తప్పకుండా. వేడివేడి చిప్స్ పొగలు చిమ్మే కాఫీతో తీసుకుంటే బాగుంటుంది కదూ? | **Lalitha:** Certainly. Hot and crisp (కరకరలాడే) chips with piping hot coffee would be nice. |
| **Radha:** అవును. మనం కావాలనుకున్న కరకర లాడే తినుబండారం ఇదిగో. | **Radha:** Here you are. The crunchy stuff we've wanted is here. |
| **Lalitha:** చాలా బాగున్నాయి ఈ chips. ఇంకో packet కొందాం. ఇవాళ మధ్యాహ్నం నుంచి నేనేం తినలేదు. మందులు మింగడంతోనే సరిపోయింది. | **Lalitha:** These chips are excellent. Let's buy another pocket. Haven't eaten anything since afternoon, except swallowing medicines. |
| **Radha:** నాకు కూడా మాత్రలున్నాయి. అవి హోమియో మాత్రలు. చప్పరించవచ్చు. | **Radha:** I have pills too, but they are homeo medicines. We can suck them. |
| **Lalitha:** నువ్వు చతురను గమనించావా? ఎప్పుడూ ఏదో ఒకటి నములుతూనే ఉంటుంది. | **Lalitha:** Have you observed Chatura? She always keeps munching something or the other. |
| **Radha:** మొన్న classలో ఉన్నట్టుండి teacher అడుగు పెట్టేసరికి నీళ్ల గబగబా తాగి నములు తున్నది మింగేసింది. | **Radha:** The other day when the teacher entered the class suddenly, she gulped down some water and swallowed what she was eating. |
| **Lalitha:** పొరబోయింది/ పొలమారింది కూడా. | **Lalitha:** She choked too. |
| **Radha:** అవును. దానికి బుద్ధిరాదు. | **Radha:** Yea, she never learns. |

**Notes:** 1) a) Having a bite - ఏదైనా కొరికి తినే వస్తువును తినడం.
b) అయిష్టంగా తినడం = ఎంగిలిపడటం. Her mind was else where. She did sit to eat but had just a bite = ఆమె మనసు ఇంకెక్కడో ఉంది. తినేందుకు కూర్చుంది కానీ, ఏం తినలేదు, కాస్త ఎంగిలిపడింది.
2) Crisp/ crispy = కరకరలాడే = crunchy
Pills = గుండ్రంగా ఉండే మాత్రలు. Tablets = బిళ్లల రూపంలో ఉండే మందులు.





M. SURESAN

కొన్ని ప్రదేశాల్లో ఎండాకాలంలో విపరీతమైన వేడి.. చలికాలంలో ఎముకలు కొరికే చలి.. ఏదైనా భరించలేనంత తీవ్రంగా ఉంటాయి. స్నేహితులతో ఇలాంటి అంశాలను చర్చించేటప్పుడు ఉపయోగపడే పదాల గురించి ఈ వారం తెలుసుకుందాం..




# ...it is really *scorching*

*చలి, వేడి గురించి స్నేహితుల సంభాషణ...*

**Ratnakar:** Oh, what a day! It's been raining since morning. Add to it it has been very cold. No going out today. (ఏం రోజో ఇది! పొద్దుట్నుంచి కురుస్తూనే ఉంది. దానికితోడు చాలా చలిగా కూడా ఉంది. బయటికెళ్లే వీల్లేదు).

**Srinath:** Yesterday was even worse. It was quite chill and drizzling too. (నిన్న ఇంతకంటే అధ్వానం. విపరీతమైన చలి, దానికి తోడు ముసురు).

**Ratnakar:** We have extremes of climate here. If winter here is very cold, the summer is really scorching. It is then quite hot and humid (ఇక్కడి శీతోష్ణస్థితి విపరీతం. శీతాకాలం మరీ చలి, వేసవి విపరీతమైన వేడి. అప్పుడు వేడితోపాటు గాల్లో తేమ ఎక్కువై, చెమట పోస్తూ ఉంటుంది).




**Srinath:** When is it bearable then? (అయితే భరించగలిగేది ఎప్పుడు? )

**Ratnakar:** Only during August and September it is temperate. In December it is freezing cold. (ఆగస్టు, సెప్టెంబర్‌లలో మాత్రమే అంత వేడీ, అంత చలీ కాకుండా ఆహ్లాదంగా ఉంటుంది. మళ్లీ డిసెంబరులో నీళ్లు గడ్డకట్టే చలి).

**Srinath:** Our place that way is much better. Almost all through the year, it is quite warm and comfortable (మా ఊరు ఆ విధంగా చాలా మెరుగు. దాదాపు సంవత్సరం అంతా వెచ్చగా ఉంటుంది.)

**Ratnakar:** I was there last year during July and August. It is the rainy season there, isn't it? Most of the time, the sky was overcast. (కిందటేడు నేను అక్కడ ఉన్నా, జులై, ఆగస్టులలో. అక్కడది వర్షాకాలం కదా? చాలావరకు ఆకాశం మేఘావృతమై ఉంది).

**Srinath:** Let's go in and have a bite of something hot - (లోపలికెళ్లి వేడిగా ఏదైనా తిందాం).

★ ★ ★

***Now look at the following sentences from the dialogue above:***

1) It has been very cold
2) Yesterday was quite chill
3) We have extremes of climate here.
4) In summer it is really scorching, and quite hot and humid.
5) Only during August and September it is temperate
6) Freezing cold
7) Almost all through the year it is warm

**Climate =** ఏడాది మొత్తం మీద ఒక ప్రదేశపు శీతోష్ణస్థితి

**Weather =** ఒకరోజు/ రెండు మూడు రోజుల వాతావరణం.

**వివరణలు..**

**1)** It has been very cold, yesterday was quite chill.

Cold అంటే అందరికీ తెలిసిందే - చలిగా ఉన్న.

విపరీతమైన చలికి వాడే మాటలు: Severely cold, bitterly cold, and biting cold.

Severely cold = తీవ్రమైన చలి

Bitterly cold = బాధించే చలి

Biting cold = (ఎముకలు) కొరికే చలి

Chill = very cold = బాగా చలిగా ఉన్న.

**a) Ramana:** Where had you been all these days? And you look fairer than when I saw you last. (ఇన్ని రోజులెక్కడున్నావు? / ఎక్కడికి వెళ్లావు? నీ చర్మపు రంగు నేను నిన్ను కిందటిసారి చూసినప్పటి కంటే బాగుంది).

**Prabhath:** I was posted in Kashmir for two months and that too at the wrong time. It was very cold there and the weather was very chill. (నన్ను కాశ్మీర్లో రెండు నెలలు నియోగించారు, అది కూడా సరికాని సమయంలో. అక్కడ చాలా చలిగా ఉండేది, ముఖ్యంగా మరీ చలి వాతావరణంలో).

**b) Varun:** How cold the day is! How can we go out? (ఎంత చలిగా ఉందో ఇవాళ! మనం ఎలా బయటికి వెళ్లగలం? )

**Sameer:** Going out? In this chill weather? We will certainly fall ill if we move out. (బయటికెళ్లడమా? ఇంత చలిగా ఉన్నప్పుడా? కచ్చితంగా జబ్బు పడతాం).

**2) Extremes of climate:** విపరీత శీతోష్ణస్థితి, మరీ ఎండలుగా కొంతకాలం, మరీ చలిగా కొంతకాలం (very hot for sometime and very cold for the rest of the year).

**a) Yaswanth:** How do you find Delhi? I think you are almost settled there. (ఎలా ఉంది ఢిల్లీ నీకు? నువ్వు అక్కడ దాదాపు స్థిరపడిపోయినట్లే కదా? )

**Goutham:** Yea. That's for certain. I have a job there that gets me a cool sixty thousand per month. But the only trouble is it is a place of extremes of climate. Part of the year it's very hot, almost scorching, and the rest of the biting cold. (దాదాపు అంతే, అక్కడ నాకు నెలకు దాదాపు రూ. 60,000 ల ఉద్యోగం ఉంది. కానీ ఒక్కటే, శీతోష్ణస్థితి మాత్రం విపరీతం. సంవత్సరంలో కొంత విపరీతమైన వేడి, మిగతా రోజులు ఎముకలు కొరికే చలి.

**b) Ram:** Vijayawada has a hot climate. It is never severely cold even in winter. (విజయవాడ శీతోష్ణస్థితి వేడి/ ఉష్ణోగ్రత ఎక్కువగా ఉంటుంది. శీతాకాలంలో కూడా అంత తీవ్రమైన చలి ఉండదు.)

**Eswar:** Add to it, it is humid, being near the sea. We sweat a lot. (దానికి తోడు, గాల్లో తేమ ఎక్కువ. సముద్రానికి కాస్త దగ్గరవడం వల్ల చెమట బాగా పోస్తుంది).

**3) Temperate:** సమశీతోష్ణస్థితి/ అంత ఎండ/ వేడి ఎక్కువ కాకుండా అంత చలి లేకుండా సమంగా ఉండటం.

**a) Mohan:** Where do you plan to spend this summer? (ఈ వేసవి ఎక్కడ గడపాలనుకుంటున్నావు? )

**Eswar:** My brother lives in Madanapalle. That's where I wish to go. It has a temperate climate and summer is very cool there. (మా అన్న మదనపల్లెలో ఉంటాడు. అక్కడికి వెళ్లాలని అనుకుంటున్నాను. అది సమశీతోష్ణస్థితి ఉన్న ప్రదేశం. వేసవి చాలా చల్లగా ఉంటుంది.)

## Do the following exercise..

*Translate this into English..*

**Naresh:** ఎంత ఎండ/ వేడిగా ఉందో ఇక్కడ? ఈ వేసవిలో ఏదైనా చల్లటి ప్రదేశానికి వెళ్లాలనుకుంటున్నా.

**Jayanth:** ఎక్కడికి వెళ్లాలని నీ ఆలోచన?

**Naresh:** ఊటీ చాలా చల్లగా, హాయిగా ఉంటుంది. కానీ చాలా ఖర్చవుతుంది. అందుకని విశాఖ దగ్గర గుడిలోవకు గానీ, తిరుపతి దగ్గర మదనపల్లెకు గానీ వెళ్లాలనుకుంటున్నాను.

**Jayanth:** అయితే నీవు మంచి చలి రోజుల్లో ఊటీ వెళ్లావు కదా కిందటేడు?

**Naresh:** ఆ తప్పు మళ్లీ చేయను. అబ్బో అదేం చలో! ఎముకలు కొరికే చలి. మదనపల్లె వెచ్చగా ఉంటుంది.

**Jayanth:** అయితే వెళ్లిరా. Happy journey!



*Answer next week...*

## Answer to the exercise in Lesson No. 773

| తెలుగు | English |
|---|---|
| **Ramakanth:** పొద్దుట్నించి కాస్త చెమటగా ఉంది. వేసవి ప్రారంభమైనట్లుంది. | **Ramakanth:** It has been slightly sultry since the morning. Summer seems to have started. |
| **Subhakar:** కరెక్టే. రాత్రి మొత్తం గదిలో గాలాడలేదు. | **Subhakar:** That's right / You are right. The room was stuffy the whole night. I slept for a while in the open air. |
| **Ramakanth:** వాన కురిసింది కదా. అనుకున్నా ఎండలు ముదరవచ్చని. | **Ramakanth:** It has rained, hasn't it? I thought that the sun might get hotter. |
| **Subhakar:** పొద్దున వాన వెలిసిన తర్వాత అసలు గాలాడలేదు, కిటికీలన్నీ తెరిచి పెట్టినా. | **Subhakar:** Even after the rain stopped, there was no air circulating, though the windows were open. |
| **Ramakanth:** ఇప్పుడేమో ముసురు/ తుప్పర. | **Ramakanth:** We now have these slight showers/ this drizzle. |



## Situated / located.. తేడా?

*K. Pavan,* **Hyderabad.**

**Q:** వధువు ఆమె కాకపోయుంటే (వేరే ఎవరైనా అయితే), నేనిప్పటికీ పెళ్లి చేసుకునేవాణ్ని కాదు (bachelor గా ఉండేవాడిని) - దీన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A:** If she had not been the bride, I would never have married.

**Q:** "మా స్నేహితుడు ఆ కంపెనీకి సెలెక్ట్ అయ్యాడు" అని ఇంగ్లిష్‌లో చెప్పడానికి a) My friend has been selected b) he is selected - వీటిలో ఏది కరెక్ట్?

**A:** (a) and (b) both are correct.

**Q:** ఒక పుస్తకంలో ఇలా ఉంది. 'The ideas preached by us were presented as the teachings of Bob. But Bob the person was never born'. అండర్‌లైన్ చేసిన పదానికి అర్థం ఏమిటి?

**A:** Bob అనే వ్యక్తి పుట్టనే లేదు/ లేనే లేడు.

**Q:** అతడు ఇంటికి రాగానే నాకు ఫోన్ చెయ్యి - How can we say this in English?

**A:** As soon as he comes home, phone/ call/ give me a ring.

**Q:** కిందివాటి మధ్య తేడా, అర్థం వివరించగలరు.
a) I think you are good.
b) I think you were good.
c) I thought you are good.
d) I thought you were good.

**A:** a) ఇప్పుడు అనుకుంటున్నాను, నువ్వు మంచివాడివని.
b) అనుకుంటున్నా మంచివాడివిగా ఉండేవాడివని.
c) Wrong
d) అనుకున్నా (గతంలో) మంచివాడివని.

Question లకు please చేర్చండి - good manners.

*Surya,* **Warangal.**

**Q:** The Taj is situated/ located in Agra వీటిలో ఏది సరైంది? పైన underline చేసిన పదాల అర్థం తెలుగులో వివరించగలరు.

**A:** Situated and located - Both are synonyms (Having more or less the same meaning) and either can be used.

Situated / located = ఉండటం

The Taj is situated / located in Agra = అది ఆగ్రాలో ఉంది.

Q: Sir, కింది వాక్యాలు సరైనవేనా కాదా? వివరించండి.
i) The answer sheets are issued to the students.
ii) All the students should be seen writing or reading.
iii) He is crazy about/ for cricket.

**A:** Sentences i) and ii) are correct.
iii) He is crazy about cricket - Correct.



'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net





M. SURESAN

ఏదైనా ప్రమాదం జరిగిందని తెలియగానే అది ఎలా జరిగింది? ఎంతమంది చనిపోయారు? గాయాలు తగిలినవారి పరిస్థితి ఏమిటి? లాంటి అనేక ప్రశ్నలు అడుగుతూ ఉంటాం. వీటినే ఇంగ్లిష్‌లో ఎలా వ్యక్తీకరిస్తారో ఇప్పుడు తెలుసుకుందాం.




# The bus *ran into* a..

*కింది సంభాషణ చదవండి...*

**Anindya:** (Do you) know this? Our dear Manyasri is no more. She died in an accident. (ఇది తెలుసా నీకు? మన ప్రియమైన మాన్యశ్రీ ప్రమాదంలో చనిపోయింది.)

**Sandilya:** When was that? I am really shocked. She is no more? (I am) unable to believe it. (అదెప్పుడు? నాకు నిజంగా దిగ్భ్రాంతి కలిగిస్తోంది. చనిపోయిందా? నమ్మశక్యంగా లేదు.)

**Anindya:** On their way back from Tirupati their car crashed into a lorry from behind. She and her mom were spot dead. Her dad succumbed to injuries in a hospital. (తిరుపతి నుంచి వస్తూ వాళ్ల కారు లారీని వెనుక నుంచి ఢీ కొట్టింది. తనూ, వాళ్లమ్మ అక్కడికక్కడే చనిపోయారు. వాళ్ల నాన్న గాయాలతో ఆస్పత్రిలో చనిపోయారు.)

**Sandilya:** None survived? (ఎవరూ మిగల్లేదా? )

**Anindya:** Her uncle and aunt escaped with minor injuries. Their child was fatally injured and it died too. (వాళ్ల బాబాయి, పిన్ని స్వల్ప గాయాలతో బయటపడ్డారు. వాళ్ల పాప కూడా మరణకారకమైన గాయాలతో చనిపోయింది.)

The bodies of the dead were thrown out and lay in a pool of blood. The driver had a miraculous escape. He had only minor injuries. Just a few bruises on the knees, that was all. (చనిపోయిన దేహాలు రోడ్డుమీద పడ్డాయి, నెత్తుటి మడుగులో. డ్రైవర్ ఆశ్చర్యంగా తప్పించుకున్నాడు; ఏదో చిన్నచిన్న దెబ్బలు - మోకాలు డోక్కుపోవడం తప్ప.)

**Sandilya:** Accidents are on the increase. In another accident yesterday a lorry knocked down a man while he was crossing the road. It didn't stop there; it hit a child standing on the road side and killed it too. The child fell down bleeding. Blood was spilled on the road. (ప్రమాదాలు పెరిగిపోతున్నాయి. నిన్న ఇంకో ప్రమాదంలో ఒక లారీ మనిషిని ఢీ కొట్టింది, రోడ్ మీద. అక్కడితో ఆగలేదది. రోడ్ పక్కనే నించున్న పాపను గుద్దేసింది. రక్తం కారుతూ పక్కనే పడిపోయిందా పాప రక్తపుమడుగులో.)

**Anindya:** Yah, the bodies have been brought home. Shall we go and see them? (దేహాలను ఇంటికి తీసుకొచ్చారు. మనం వెళ్లి చూద్దామా? )

**Sandilya:** Immediately (వెంటనే).

◆ ◆ ◆

The conversation here is about traffic accidents, isn't it? Let's see the words used in connection with it. Look at the following expressions:

**1)** Be <u>no more</u>.
**2)** Their car <u>crashed into</u> a lorry from behind.
**3)** She and her mom were <u>spot dead</u>.
**4)** None <u>survived?</u>
**5)** Their child was <u>fatally</u> injured.
**6)** The bodies lay in <u>a pool of blood</u>.
**7)** A <u>miraculous escape</u>.
**8)** A lorry <u>knocked down</u> a man.
**9)** It <u>hit</u> a child and killed it too.
**10)** The bus <u>ran into</u> a lorry from behind.

## FUNCTIONAL ENGLISH

**1. Crash** = (of a vehicle) hitting another vehicle, a person or an object and getting involved in an accident (often used as 'crash into').

**a) Prasad:** What's the huge crowd there? (ఏంటి అక్కడ ఆ గుంపు? )

**Harsha:** A car <u>crashed into the tree</u> and the driver is unable to get out of the car. (Car చెట్టును ఢీకొంది, డ్రైవరు బయటపడలేకుండా ఉన్నాడు.)

**b) Bhaskar:** His driving is rash. I am sure he will certainly <u>meet with an accident</u>. (అతడు కారు చాలా అజాగ్రత్తగా, వేగంగా నడుపుతాడు. ఏదో ఒకరోజు <u>ప్రమాదానికి గురవుతాడు</u>.)

**Yaswanth:** He has already had an accident. Last week he <u>ran into</u> another car and paid a huge sum as a compensation. (ఇప్పటికే ఒక ప్రమాదం జరిగింది వాడికి. కిందటివారం ఇంకో car ను ఢీ కొని, వాళ్లకు నష్టపరిహారంగా చాలా పెద్ద మొత్తం చెల్లించాడు.)

**Crash into** = run into = ఢీ కొనడం (వాహనాలు)

**Run over** = knock down = Cars, lorries, etc hitting persons = వాహనాలు మనుషులను ఢీ కొనడం.

**2. a) Purushotham:** Our friend Hitesh is <u>no more</u>. A car ran over him on his way to college. (మన స్నేహితుడు హితేష్ <u>ఇకలేడు</u>. నిన్న Collegeకెళ్లే దారిలో కారు అతడిని <u>ఢీ కొంది</u>.)

**Ramesh:** I am sorry to hear it. He was a brilliant student. (నాకు చాలా బాధగా ఉంది. చాలా తెలివైన విద్యార్థి అతడు.)

★ **No more** = Die, pass away లాంటి మాటల కంటే, ఎవరైనా చనిపోయారని చెప్పేందుకు, సున్నితమైన, బాధ అంతగా కలిగించని మాట 'No more'.

**Survive :** బతికి ఉండటం (సంబంధించిన వాళ్లు చనిపోయిన తర్వాత.)

The doctor is dead. His wife and two children <u>survive</u> him. (ఆ డాక్టర్ చనిపోయాడు. ఆయన భార్య, ఇద్దరు పిల్లలు <u>మిగిలి ఉన్నారు</u>.)

### Answer to the exercise in Lesson No. 774

| తెలుగు | English |
|---|---|
| **Naresh:** ఎంత ఎండ/ వేడిగా ఉందో ఇక్కడ? | **Naresh:** Oh my! How hot it is here! |
| **Jayanth:** ఎక్కడికి వెళ్లాలని నీ ఆలోచన? | **Jayanth:** Where do you want/ Where are you thinking of going? |
| **Naresh:** ఊటీ చాలా చల్లగా ఉంటుంది. హాయిగా ఉంటుంది. కానీ చాలా ఖర్చవుతుంది. విశాఖపట్నం దగ్గర గుడిలోవకు కానీ, తిరుపతి దగ్గర మదనపల్లెకు కానీ వెళ్లాలనుకుంటున్నాను. | **Naresh:** Ooty will be very cool. It will be very comfortable but it will be very expensive/ going and staying there will be expensive. So I am thinking of going to Madanapalle near Tirupati or Gudilova near Vizag. |
| **Jayanth:** అయితే కిందటిసారి నువ్వు మంచి చలి రోజుల్లో వెళ్లావు కదా ఊటీకి. | **Jayanth:** But last time you went to Ooty when it was very cold/ You were in Ooty when it was very cold. |
| **Naresh:** ఆ తప్పు మళ్లీ చేయను. అబ్బో అదేం చలో! ఎముకలు కొరికే చలి. మదనపల్లె వెచ్చగా ఉంటుంది. | **Naresh:** I won't make that mistake again. Oh God, how cold it was! Really biting cold. |
| **Jayanth:** అయితే వెళ్లిరా. Happy Journey to you. | **Jayanth:** OK then. Go ahead. Happy journey to you. |

### Try the following exercise

*Translate the following into English..*

**Pramod:** ఆ భయంకర దృశ్యం చూశావా? లారీ, car ఢీ కొనడం.

**Sumanth:** చూశాను. చాలా భయానక దృశ్యం. ఒక college విద్యార్థి ఆ రెండింటి మధ్య నలిగిపోయాడు. (Crushed = నలిగిపోవడం).

**Pramod:** అక్కడంతా రక్తపుమడుగు. కానీ పక్కనే నిలబడి ఉన్న చిన్నపిల్ల విచిత్రంగా తప్పించుకుంది.

**Sumanth:** డ్రైవర్ల దుస్తులన్నీ రక్తపు మరకలతో నిండి ఉన్నాయి.

**Pramod:** ఇంకెవరు మిగిలారు?

**Sumanth:** కార్లోని అయిదుగురు ప్రయాణికుల్లో ఇద్దరు చనిపోయారు. ముగ్గురు గాయాలతో మిగిలారు.

**Pramod:** డ్రైవర్లే కారణం రోడ్డు ప్రమాదాలన్నింటికీ.

*Answer next week..*



# He made no reference..

***K.V. Rao, Visakhapatnam.***

ఈ కింది ఆంగ్ల వాక్యాల్ని తెలుగులోకి అనువదించి, Underline చేసిన పద సముదాయాలను దయచేసి విశదీకరించగలరు.

**Q:** You should do it <u>in the first place</u>.

**A:** Of a number of things you have to do, the first thing = <u>నువ్వు చేయాల్సిన వాటిలో మొట్ట మొదటిది</u>.

**Q:** He claimed himself as a saint <u>in his own right</u>.

**A:** In his own right = On his own = సొంతంగానే/ తనంతట తానే.

<u>తనంతట తానే</u> తానొక పవిత్రమూర్తిగా <u>చెప్పుకుంటున్నాడు</u>.

**Q:** The much <u>touted</u> delights of England in the spring.

**A:** Touted = Past tense/ past participle of 'tout' = Praise something to make people buy/ accept it = ఇతరులు కొనేట్టు కానీ, తీసుకునేట్టుగా కానీ చేసేందుకు దేన్నైనా పొగడటం.

★ Much touted delights of England in the spring = Joys of the England in the spring season praised too much by people = అందరూ <u>ఏదో పెద్ద గొప్పగా చెప్పుకునే</u> వసంత రుతువులో Englahd అందాలూ, ఆనందాలు.

**Q:** Despite all the <u>hype</u>, the movie disappointed.

**A:** Hype = ఏదైనా గొప్పదని ప్రచారం చేయడం/ దేన్నైనా అతిగా చెప్పుకోవడం/ Try to make somebody/ something is great or important.




Despite all the <u>hype</u> the movie disappointed = అదేదో <u>గొప్ప చిత్రమని ప్రచారం జరిగినా</u> ఆ సినిమా నిరాశ పరిచింది.

**Q:** They all want to <u>get their hands on</u> my money.

**A:** They all want to get their <u>hands on my money</u> = ...... want to take away my money = వాళ్లందరూ నా <u>డబ్బు కాజేయాలని</u> చూస్తున్నారు/ నా డబ్బు మీద కన్నేశారు.

**Q:** Don't count on me =

**A:** Don't <u>count on me</u> = Don't depend on me = నా మీద <u>ఆధారపడొద్దు</u>.

**Q:** He did not make any reference/ He made no reference.

**A:** He did not make any reference = He made no reference = He did not refer = ఆ <u>ప్రస్తావన చేయలేదు</u> అతడు/ అది అతడు <u>ప్రస్తావించలేదు</u>.

**Q:** Larger than life.

**A:** Larger than life = Looking or behaving more interestingly or attractively than others = (వ్యక్తులు) (ఇతరుల కంటే) ఆకర్షణీయంగా, మరిచిపోలేనంత గొప్పగా కనిపించడం, ఇతరుల కంటే.

★ The characters in the novel appear larger than life = ఆ నవలలోని పాత్రలు చాలా ఆసక్తికరంగా, ఆకర్షణీయంగా కనిపిస్తాయి.

**Q:** I <u>included</u> many examples in the book.

**A:** For everything I <u>gave</u> many examples in the book = ఆ పుస్తకంలో ప్రతిదానికి చాలా ఉదాహరణలు <u>చేర్చాను</u>.

**Q:** The process <u>involving</u> many massages were <u>cultivated</u> to strengthen the organs.

**A:** చాలా మర్దన (massage)లతో కూడిన ఆ ప్రక్రియను అవయవాలు బలపరచడానికి practice (అభ్యసించడం) చేశారు.

**Cultivate =** practice.

**Involving =** needing.

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net

# FUNCTIONAL ENGLISH

*Some more expressions connected with accidents* (రోడ్డు ప్రమాదాలకు సంబంధించిన కొన్ని మాటలు కిందటిసారి చూశాం. మరికొన్ని ఇప్పుడు...)

**Mahesh:** What a ghastly sight it was! I am unable to forget it. A bus rammed into a car and all the occupants in the car were killed. (ఎంత భయంకర/ భయానక దృశ్యమో! మర్చిపోలేకుండా ఉన్నా. ఒక బస్ కారును ఢీకొనడంతో, కార్లోని వాళ్లందరూ చనిపోయారు).

**Dharma:** Accidents occur quite frequently on that road. Vehicles often skid on the road and plough into the other lane. (ఆ రోడ్డులో ప్రమాదాలు తరచుగా జరుగుతుంటాయి. వాహనాల చక్రాలు పక్కకు జారుతుంటాయి తరచుగా, దాంతో పక్క lane లోకి దూసుకెళ్తాయి.)

**Mahesh:** Too many fatalities on this road. (మరీ ఎక్కువ మరణాలు సంభవిస్తుంటాయి ఈ రోడ్డు మీద).

**Dharma:** Just this day last week there was a head-on collision between two vehicles on the other highway. (కరెక్టుగా కిందటి వారం ఈ రోజున రెండు వాహనాలు ఎదురెదురుగా ఢీకొన్నాయి, ఇంకో Highway (రెండు ఊళ్లను కలిపే రోడ్డు) మీద).

**Mahesh:** Overspeeding is of course the cause, but most drivers get their driving licenses for money. They are not trained or tested properly. (అతి వేగం ప్రమాదాలకు కారణం నిజమే. కానీ డ్రైవింగ్ లైసెన్స్‌లు కూడా డబ్బుతో పొందుతున్నారు. కాబోయే డ్రైవర్లను సరిగా పరీక్షించరు).

★ ★ ★

**1) A ghastly sight =** భయంకర/ భయానక దృశ్యం

Ghastly = horrible (భయకంరమైన)/ terrible (భయాన్ని కలిగించే).

**Harish:** What is troubling you? Why the tears in your eyes? (ఏంటి నీకు బాధ కలిగిస్తున్నది? నీ కంట్లో ఎందుకా నీళ్లు? )

**Divya:** I am unable to forget the sight of the five year old child crushed under the lorry. It was very ghastly. (ఆ అయిదేళ్ల పాప లారీ కింద పడి నలిగిపోయిన దృశ్యం మరిచిపోలేకుండా ఉన్నాను. అది చాలా భయంకరంగా ఉంది).

Ghastly ని చాలా ఇతర సందర్భాల్లో, ఇతర పదాలతో వాడతాం. ఇవి చూడండి.

A ghastly (భయంకర/ భయానక) —
- crime/ murder
- weather
- mistake
- person (విసుగెత్తించే, అసహ్యం పుట్టించే వ్యక్తి)
- colour (అసహ్యామైన రంగు)
- appearance (జబ్బుపడ్డ వ్యక్తి రూపం - Pale = పాలిపోయిన)

**2) Ram =** బలంగా ఢీకొనటం; మామూలుగా Ram into అని వాడతారు.



M. SURESAN

భయానక దృశ్యాలు.. ఒక వాహనం మరొకదాన్ని ఢీకొట్టడం.. రైలు/ బస్ అతి వేగంతో వచ్చి నేరుగా ఢీకొనడం.. ఇలాంటి అంశాల గురించి Spoken English లో మాట్లాడాల్సి వచ్చినప్పుడు ఉపయోగించే పదాలేమిటో తెలుసుకుందాం.




# How the lorry *ploughed into..*

**a) Dileep:** What are the bruises I see on your face? (ఏమిటా డొక్కుపోవటం నీ మొహమంతా? )

**Bhanu:** That's what I was about to tell you. A number of other passengers and I were injured when a truck rammed into our bus from behind. (నేనదే చెప్పబోతున్నా. నేనూ, చాలా మంది ఇతర ప్రయాణికులు గాయపడ్డారు. వెనుక నుంచి ఒక లారీ మా బస్‌ను ఢీకొట్టినప్పుడు).




**b) Charan:** Heard about this accident on the Chennai - Vijayawada highway? (చెన్నై - విజయవాడ రోడ్‌లో జరిగిన ప్రమాదం విన్నావా? )

**Karim:** A truck driver lost control of his truck and rammed into a van. (లారీ డ్రైవరు వాహనం మీద అదుపు కోల్పోవడంతో అతని లారీ, వ్యాన్‌ను గుద్దేసింది).

**Ram into =** ప్రమాదవశాత్తు గుద్దుకోవడం.

**Ram =** కావాలని ఎవరినైనా చంపాలని ఢీకొట్టడం.

In a number of movies we see villain's men ramming the hero's/ heroine's car (చాలా సినిమాల్లో మనం చూస్తుంటాం. విలన్ మనుషులు తమ లారీలతో హీరో/హీరోయిన్ కార్లను ఢీకొట్టడం).

Lorry (British English) = Truck (American English)

**3) Skid =** తడిగా/ బురదగా ఉన్న నేల మీద వాహనాలు జారిపోవడం, ప్రమాదకరంగా.

**a) Gangadhar:** We had a lucky escape from an accident. (ప్రమాదాన్ని అదృష్టవశాత్తు తప్పించుకున్నాం మేం).

**Manohar:** Yea, I heard it from your uncle. Your bus skidded on the slippery road connecting the bus stand road to the highway. (మీ బాబాయి చెప్పగా విన్నాను. మీ బస్, బస్‌స్టాండ్ రోడ్‌ను హైవేకి కలిపే రోడ్ మీద జారిందని).

**b) Nagesh:** The lorry is bent to one side. What could have happened? (లారీ ఒకవైపు ఒరిగి ఉంది. ఏం జరిగుండొచ్చు? )




**Neeraj:** Haven't you heard? Last night because of the heavy rain, as the lorry driver applied brakes the lorry went into a long skid. (నువ్వు వినలేదా? నిన్న రాత్రి ఆ పెద్ద వర్షంలో లారీ డ్రైవరు ఉన్నట్టుండి బ్రేకులు వేసేసరికి, లారీ చాలా దూరం జారిపోయింది).

**4) Plough into =** మామూలు అర్థం, దున్నడం. ప్రమాదాల సందర్భంలో, వాహనాలు నడిపేవాళ్ల అజాగ్రత్త వల్ల బలంతో ఇతర వాహనాలను/ మనుషులను ఢీకొనటం. (to crash violently into something).

**a) Ramanath:** What a terrible accident it was! These careless drivers! Look at the scene. How the lorry ploughed into the back of the bus (ఎంత ఘోరమైన ప్రమాదమో! ఈ అజాగ్రత్త డ్రైవర్ల వల్ల! ఆ దృశ్యాన్ని చూడు. ఆ లారీ బస్‌ని వెనక నుంచి ఎలా ఢీకొందో!)

**Sundar:** How violent should it have been! Five of the passengers died on the spot. (ఎంత హింసాత్మకంగా ఉందో అది. అయిదుగురు ప్రయాణికులు అక్కడికక్కడే చనిపోయారు.)

**5) Fatalities =** deaths = మరణాలు.

★ The number of fatalities was quite high in the recent train accident = ఈ మధ్య జరిగిన రైలు ప్రమాదంలో మరణాల సంఖ్య ఎక్కువే.

Fatalities ముఖ్యంగా ప్రమాదాల వల్ల, అంటువ్యాధులు ప్రబలటం వల్ల సంభవించే మరణాలకు వాడతారు.

Fatality rate = rate of fatality = మరణ శాతం/ నిష్పత్తి.

**Raju:** The fatality rate because of cancer is still high = Cancer వల్ల కలిగే మరణాల శాతం ఎక్కువగానే ఉంది ఇంకా.

**Ravi:** The fatality rate in road accidents is high too (రోడ్డు ప్రమాదాల మరణ నిష్పత్తి కూడా ఎక్కువే.)

Fatalities కు ఇంకో మాట casualties.

**6) Head-on collision:** collision = crashing into one and other = ఢీకొనటం.

**Head-on collision =** (వాహనాలు ఎదురెదురుగా ఢీకొనటం).

a) The train moving into the station hit head-on the other train standing on the line = స్టేషన్‌లోకి వస్తున్న రైలు ఆగి ఉన్న రైలును నేరుగా ఢీకొంది.

b) The speeding train collided with/ hit/ crashed/ rammed into a stationary train = వేగంగా వచ్చిన ఆ రైలు, స్టేషన్‌లో ఆగి ఉన్న రైలును ఎదురుగా/ నేరుగా ఢీకొంది.

**Collide =** hit = ఢీకొనటం

**Stationary =** not moving = కదలకుండా ఉన్న.

★ Collideతో with ఎప్పుడూ వస్తుంది. అయితే 'collide', 'stationary' కాస్త పాండిత్యం. మామూలు సంభాషణలో వాడం.

A stationary job = బదిలీలు లేని ఉద్యోగం.

Stationery = రాతకు వాడే pen, paper, etc)

**7) Overspeeding =** అతి వేగం.

## Now do the Exercise

*Translate the following into English.*

**Tarun:** ఎంత భయానకమైన ప్రమాదమో! ఆ దిగ్భ్రమ నుంచి నేనింకా తేరుకోలేకపోతున్నా. అది నా కళ్లారా చూడకపోయుంటే ఎంత బాగుండేదో అనుకుంటున్నా.

**Vikas:** నేను విన్నాను. నువ్వు చెప్పేది వేగంగా వస్తున్న రైలు స్టేషన్‌లో ఆగి ఉన్న రైలును ఎదురుగా ఢీకొంది. మరణాల సంఖ్య ఎక్కువగానే ఉంది కదా?

**Tarun:** మొన్న వర్షం వల్ల జారిన లారీ రోడ్డు మీద ఆగి ఉన్న బస్‌ను వెనక నుంచి ఢీకొంది. ఎనిమిది మంది ప్రయాణికులు అక్కడికక్కడే చనిపోయారు.

**Vikas:** మన రోడ్లు ఎప్పటికైనా క్షేమకరం అయ్యేనా? ద్విచక్ర వాహనదారులు కూడా చాలా నిర్లక్ష్యంతో వ్యవహరిస్తుంటారు. మొన్నొకరోజు ఒక బైక్ చిన్నపాప మీదికెక్కిపోయింది.

**Tarun:** కిందటి నెల బస్ అదుపు తప్పి రోడ్ పక్కనున్న shop లోకి దూసుకెళ్లింది. ముగ్గురు చనిపోయారు.

**Vikas:** మన జాగ్రత్తలో మనం ఉంటే ప్రమాదాలు తగ్గుతాయి, పూర్తిగా కాకపోయినా.

*Answer next week..*

## Pooch..?

*S. Chintabhatla,* ***Asifabad.***

**Q:** Please give meanings of the following.

i) Tentamounts    ii) Emblish
iii) Shibbileth    iv) Pooch
v) Marone

**A:** i) Tantamounts to (Not, 'tentamounts) = (of actions, suggestions) the same as/ equal to (especially 'of something bad').

Cutting off air to a person is tantamount to/ tantamounts to murder.

ii) Embellish (Not, Emblish) = a) make something more beautiful/ decorate- Inside the temple the seat of God was embellished with flowers.




b) Make a statement/ lies more interesting by adding details which are not true (చిలవలు, పలవలు చేర్చి చెప్పడం).

(iii) Shibboleth (Not, 'Shibbileth) = an idea/ custom/ tradition which has no importance now (something like 'nonsense').

(iv) Pooch = a funny name for a dog.

(v) Maroon (Not, 'marone') = 1) dark, brownish, red colour; 2) To leave a person all alone in a lonely place from where they can't come away.

## Answer to the exercise in Lesson No. 775

| తెలుగు | English |
|---|---|
| **Pramod:** ఆ భయంకర దృశ్యం చూశావా? లారీ కారు ఢీకొనటం? | **Pramod:** Did you see the horrible sight - the lorry and the car running into each other/ crashing into each other/ hitting each other. |
| **Sumanth:** చూశాను. చాలా భయానక దృశ్యం. ఒక college విద్యార్థి ఆ రెంటి మధ్య నలిగిపోయాడు. | **Sumanth:** A terrible sight indeed. A college student was crushed between the two. |
| **Pramod:** అక్కడంతా రక్తపు మడుగు. కానీ పక్కనే ఉన్న చిన్నపిల్ల విచిత్రంగా తప్పించుకుంది. | **Pramod:** There was a pool of blood/ The spot was a pool of blood. But strangely a little girl on the spot had a miraculous escape. |
| **Sumanth:** డ్రైవర్ల దుస్తులన్నీ రక్తపు మరకలతో నిండి ఉన్నాయి. | **Sumanth:** The drivers' clothes were all blood-stained/ stained with blood. |
| **Pramod:** ఇంకెవరు మిగిలారు? | **Pramod:** Who else survived? |
| **Sumanth:** కారులోని అయిదుగురు ప్రయాణికుల్లో ఇద్దరు చనిపోయారు. ముగ్గురు గాయాలతో మిగిలారు. | **Sumanth:** Two of the five passengers in the car/ occupants of car died/ were killed. Three survived with injuries. |
| **Pramod:** డ్రైవర్లే కారణం రోడ్డు ప్రమాదాలన్నింటికీ. | **Pramod:** Drivers alone are responsible for/ the cause of all road accidents. |

FUNCTIONAL ENGLISH




పెళ్లికి సంబంధించిన ఈ సంభాషణ చదవండి...

**Jagannath:** The engagement will be on the 27th of this month, and the marriage on the 16th June. (పెళ్లి నిశ్చితార్థం ఈ నెల 27 న, పెళ్లి జూన్ 16 న.)

**Mallesh:** It has been a long wait for the young couple- more than 2 months. (ఆ యువ జంటకు దీర్ఘ నిరీక్షణన్నమాట- రెండునెల్లపైనే) Isn't it a love marriage? (ప్రేమ పెళ్లి కదా అది?)

**Jagannath:** Yea. It is a long way off certainly but that's the only date that suits the horoscopes of the bride and the groom. (అవును. అది చాలా దూరమేకాని వధువు, వరుడి జాతకాలకు సరిపోయే తేది అదే.)

**Mallesh:** What is the auspicious moment when the bridegroom Subhash ties the knot? (కల్యాణ ముహూర్తం ఎప్పుడు?)

**Jagannath:** That I don't ask Subhash when I saw him last.

**Mallesh:** It seems your dad took the initiative to bring about this marriage alliance? (ఈ పెళ్లి సంబంధం కుదిరేందుకు మీ నాన్నగారు చొరవ చూపారట కదా?)

**Jagannath:** He did, of course. He is close to both the families and he felt that the couple would make a perfect match. (అవును, నిజమే. రెండు కుటుంబాలకూ ఆయన సన్నిహితుడు. మా నాన్నకు అనిపించింది, ఈడూజోడూ బాగుందని.)

**Mallesh:** The bridegroom's sister's marriage had been on the rocks and it ended in a divorce. His other sister hasn't married. They are looking for an eligible bachelor. Once they are able to find one, they want to perform both the marriages together. (పెళ్లికొడుకు అక్క వైవాహిక జీవితం కొంతకాలంగా ఇబ్బందుల్లో ఉంది, తర్వాత విడాకులతో అంతమయింది. అతడి చెల్లికి కూడా పెళ్లవలేదు. సరైన సంబంధం కోసం చూస్తున్నారు. అది కుదిరితే రెండు పెళ్లిళ్లూ ఒకేసారి చేయాలని వాళ్ల ఉద్దేశం.)



M. SURESAN

పెళ్లికి సంబంధించిన విషయాలు తెలుసుకోవడం అందరికీ ఆసక్తి కలిగించే అంశం. పెళ్లికొడుకు, పెళ్లికూతురు, ముహూర్తం, ఈడూజోడూ, ఒకరికోసం ఒకరు.. మొదలైనవాటిని ఇంగ్లిష్‌లో ఎలా చెప్తాం, వాటి సరైన వాడుక ఎలాగో ఇప్పుడు తెలుసుకుందాం.




# Engagement... ఎన్ని రకాలు?




**Jagannath:** May they succeed. (వాళ్లు విజయం పొందాలని నా కోరిక.)

***Look at the following expressions from the conversation above:***

1) The engagement will be on the 27th of this month.

2) ..... the only date that suits the horoscopes of the bride and the groom.

3) What is the auspicious moment when the bridegroom ties the knot?

4) It seems your dad took the initiative to bring about the alliance.

5) And he felt they would make a perfect match.

తెలుస్తూనే ఉంది కదా, పై మాటలన్నీ పెళ్లి సంబంధాలకూ, పెళ్లికి సంబంధించినవేనని.

★ ★ ★

1) **Engagement = i)** An agreement of a marriage between a man and a woman;

**ii)** The period from the agreement till marriage = **(i)** నిశ్చితార్థం, **ii)** నిశ్చితార్థం నుంచి పెళ్లి వరకు ఉన్న కాలం.

a) **Manoj:** How do you know that the engagement has taken place? (నిశ్చితార్థం జరిగిందని నీకెలా తెలుసు?)

**Subba Rao:** The bride's father is well known in the town. The engagement was announced in the local papers. (పెళ్లికూతురు తండ్రి నలుగురికీ తెలిసినతను. ఊళ్లో స్థానిక పత్రికల్లో ఈ నిశ్చితార్థం ప్రచురితమైంది.)

b) **Sumanth:** How do you know that they are engaged? (వాళ్లిద్దరికీ పెళ్లి కుదిరిందని నీకెలా తెలుసు?

**Kumar:** I attended the engagement. (నేను నిశ్చితార్థానికి వెళ్లాను.)

★ Everybody knows about their engagement = Everybody knows they are engaged.

గమనిక: మనం ఒక నిర్దిష్ట సమయంలో మన వృత్తికి లేదా సమాజానికి సంబంధించి చేయాల్సిన పనిని కూడా engagement అంటాం. అయితే వాటిని official engagement అని కానీ, social (సామాజిక) engagement అని కానీ అంటాం.

★ ఉత్త Engagement అన్నా, Engaged అన్నా పెళ్లి నిశ్చితార్థం, పెళ్లి నిశ్చయమైందని మాత్రమే అర్థం. ఈ కింది sentenceల మధ్య తేడా గమనించండి.

a) He is engaged. Don't disturb him = ఆయన పెళ్లి నిశ్చయమైంది, ఆయన్ని disturb చేయొద్దు.

b) He is engaged in important official work/ social activities = ఆయన ఏదో అధికారిక/ సాంఘిక కార్యకలాపాల్లో పాల్గొంటున్నాడు.

c) He has a number of social engagements this week = ఆయనకు ఈ వారం చాలా సామాజిక కార్యకలాపాలున్నాయి.

2) Horoscope = Astrology = Study of the position of stars and planets at somebody's birth and their influence on the person's life. (జాతకం). Astrological chart = జాతకచక్రం.

a) **Hemanth:** Though they wished to marry each other, their horoscopes did not match. (వాళ్లు ఒకరినొకరు ఇష్టపడ్డా వాళ్ల జాతకాలు కుదరలేదు.)

**Hanuman:** What a pity! Won't the marriage come off then? (ఎంత దురదృష్టం! ఇక వాళ్ల పెళ్లి జరగదా?)

**Hemanth:** They want to go ahead, but their parents are against it. (వాళ్లు పెళ్లి చేస్కోవాలనే అనుకుంటున్నారు. కానీ వాళ్ల తల్లిదండ్రులు వ్యతిరేకిస్తున్నారు.)

b) **Ratnam:** What are the chances of their getting married? (వాళ్ల పెళ్లి జరిగే అవకాశాలు ఎలా ఉన్నాయి.)

**Raghu:** Their horoscopes have tallied and the marriage is certain (వాళ్ల జాతకాలు కలిశాయి. పెళ్లి తథ్యం.)

**Match** = tally = agree = సరిపోవడం.

**Marriage alliance** = Marriage match = పెళ్లి సంబంధం.

3) **Auspicious** = శుభకరమైన. Englishలో ముహూర్తానికి సరైన మాటలేదు. పెళ్లి ముహూర్తం అనేందుకు అతిదగ్గర మాట Auspicious time/ moment = శుభకర సమయం/ క్షణం అనవచ్చు

★ Among the Hindus a man and a woman become husband and wife if at the auspicious moment the bridegroom ties the Mangala Sutram round the neck of the bride. (హిందువులలో పురుషుడు స్త్రీ మెడలో శుభసమయాన (ముహూర్తం) మంగళ సూత్రం (తాళిబొట్టు) కడితే వారికి పెళ్లయినట్లు- అంటే పెళ్లికొడుకు పెళ్లికూతురు మెడలో)

★ Tie the Knot = ముడి కట్టడం - అయితే మన వివాహ ఆచారానికి ఇది సరైన అర్థం అయినప్పటికీ, అసలు అర్థానికి మూలం వేరే.

★ A perfect match = ఈడూజోడు- వధూవరులు ఒకరికొకరు సరిపోయినట్లుగా ఉంటే.

**Pradyumna:** Did you attend the marriage yesterday? (నిన్న నువ్వు పెళ్లికి వచ్చావా?)

**Tarun:** I did of course. The bride and the groom were a perfect match. They appeared made for each other. (కచ్చితంగా వచ్చాను. పెళ్లికూతురు, పెళ్లికొడుకు ఈడూజోడూగా ఉన్నారు. ఒకరి కోసం ఒకరు పుట్టినట్టున్నారు.)

## Now do the exercise...

***Translate the following into English***

**Anand:** ఎక్కడి నుంచి వస్తున్నావు?

**Santosh:** మా స్నేహితుడి అక్క పెళ్లి నిశ్చితార్థం నుంచి వస్తున్నాను.

**Anahd:** ఎప్పుడు పెళ్లి?

**Santosh:** వచ్చే నెల మొదటివారం. బహుశా 4, 5 తేదీల్లో కావచ్చు. అయితే అది అర్ధరాత్రి ముహూర్తం.

**Anand:** జంట ఎలా ఉంది?

**Santosh:** పెళ్లికూతురు దాదాపు పెళ్లికొడుకంత ఎత్తు ఉంది. అదికాకపోతే వాళ్లిద్దరూ ఒకరికి తగినవారొకరు. సమాన విద్యార్హత, అందంలో ఒకరినొకరు తీసిపోరు.

**Anand:** పూర్తిగా పెద్దవాళ్లు కుదిర్చిన పెళ్లా, ప్రేమ వివాహమా?

**Santosh:** అవును. అయితే వాళ్లు సహోద్యోగులు. అన్నీ సరిపోయాయి.

**Anand:** ముహూర్తం ఎన్నింటికి?

**Santosh:** 4 నో, 5 నో అవుతుంది, వచ్చే నెల.

**Anand:** OK. Wish them good luck.

*(Answer next week...)*



## Doubt, Suspect... తేడా ఏమిటి?




*Gita Sumanjali, **Warangal.***

**Q:** Do you suspect/ doubt me? ఈ రెండిటికి తేడా ఏమిటి? వివరించగలరు.

**A: Doubt** = సందేహించడం.

**Suspect** = అనుమానించడం

★ I doubt his ability to pass the exam = అతడు pass అవడం నాకు సందేహమే.

★ Rama never suspected Sita's character = సీత శీలాన్ని రాముడెప్పుడూ శంకించలేదు/ అనుమానించలేదు.

★ Do you suspect me? = నన్ను అనుమానిస్తున్నావా? / (ఏదో తప్పు చేస్తున్నానని/ చేశానని?)

★ Do you doubt my words? = నా మాటలను సందేహిస్తున్నావా?

We suspect a person; we doubt somebody's words / actions.

**Q:** ఆయన అప్పుడప్పుడు T.V. చూస్తాడు. How can we say in English?

**A:** He watches the TV now and then / occasionally.

**Q:** He is making us play/ played - Which one is right?

**A:** He is making us play - Correct.

**Q:** Half of the group/ Half the group went there - Which one is right?

**A:** Half of the group = Half the group

## Answer to the exercise in Lesson No. 776

| తెలుగు | English |
|---|---|
| **Tarun:** ఎంత భయానకమైన ప్రమాదమో! ఆ దిగ్భ్రమ నుంచి నేనింకా తేరుకోలేకపోతున్నా. అది నా కళ్లారా చూడకపోయుంటే ఎంత బాగుండేదో అనుకుంటున్నా. | **Tarun:** What a ghastly/ horrible/ horrid accident it was! I haven't yet recovered/ I am not able to recover from the shock yet. How I wish I hadn't seen it! |
| **Vikas:** నేను విన్నాను. నువ్వు చెప్పేది వేగంగా వస్తున్న రైలు స్టేషన్‌లో ఆగి ఉన్న రైలును ఎదురుగా ఢీకొంది. మరణాల సంఖ్య ఎక్కువగానే ఉంది కదా? | **Vikas:** I've (I have) heard of it. You are saying that a train entering the station at great speed hit head on a train standing at the station. The number of deaths were quite high. |
| **Tarun:** మొన్న వర్షం వల్ల జారిన లారీ రోడ్డు మీద ఆగి ఉన్న బస్‌ను వెనక నుంచి ఢీకొంది. ఎనిమిది మంది ప్రయాణికులు అక్కడికక్కడే చనిపోయారు. | **Tarun:** A truck that skidded the otherday in the rammed into a bus from behind. Eight persons died on the spot. |
| **Vikas:** మన రోడ్లు ఎప్పటికైనా క్షేమకరం అయ్యేనా? ద్విచక్ర వాహనదారులు కూడా చాలా నిర్లక్ష్యంతో వ్యవహరిస్తుంటారు. మొన్నొకరోజు ఒక బైక్ చిన్న పాప మీదికెక్కిపోయింది. | **Vikas:** Can our roads be ever safe? Even two wheeler riders are rash/ careless. The other day a bike ran over a child. |
| **Tarun:** కిందటి నెల బస్ అదుపు తప్పి రోడ్ పక్కనున్న shop లోకి దూసుకెళ్లింది. ముగ్గురు చనిపోయారు. | **Tarun:** Last month, bus of which the driver lost control erashed into a roadside shop. Three died. |
| **Vikas:** మన జాగ్రత్తలో మనం ఉంటే ప్రమాదాలు తగ్గుతాయి, పూర్తిగా కాకపోయినా. | **Vikas:** If we are on our guard accidents will be reduced, though not completely. |

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net

# FUNCTIONAL ENGLISH

*కింది సంభాషణ చదవండి ...*

**Manohar:** When was the wedding? (పెళ్లెప్పుడయింది? )

**Nataraj:** When exactly we have no idea, because the couple eloped and got married. It was last Monday perhaps at the registrar's office. (కరెక్ట్‌గా ఎప్పుడు జరిగిందో తెలీదు, ఎందుకంటే ఆ జంట పారిపోయి పెళ్లి చేసుకున్నారు కాబట్టి. గత సోమవారం బహుశా, రిజిస్ట్రార్ పెళ్లి అయింది.)

**Manohar:** How did the elders take it?

**Nataraj:** It was ok for the groom's parents, but the bride's parents are yet to be reconciled.

**Manohar:** I got an invitation for wedding dinner from the groom's parents. (పెళ్లి విందుకు నాకు ఆహ్వానం అందింది, పెళ్లికొడుకు తల్లిదండ్రుల నుంచి.)

**Nataraj:** So did I. Let's wish them a happy married life. (వాళ్ల వైవాహిక జీవితం సంతోషంగా ఉండాలని కోరుకుందాం.)

***Now look at the following words from the conversation above:***

1) When was the wedding?
2) The couple eloped.
3) Wedding dinner.

★ ★ ★

**1)** Difference between wedding and marriage - (marriage కి, wedding కు తేడా.)

★ Marriage = A social bond / institution = ఇది సాంఘిక కట్టుబాటు / సామాజిక వ్యవస్థ- పెళ్లయిన రోజు నుంచి జీవితాంతం ఉండే బంధం - భార్యాభర్తలుగా కలిసి జీవించడం.

★ Wedding = The ceremony / act / event of getting married = పెళ్లితంతు / పెళ్లి ముహూర్తాన స్త్రీ పురుషులను భార్యాభర్తలుగా చేసే కార్యక్రమం.

**2)** 'పెళ్లిపిలుపు' అనే అర్థంతో Marriage Invitation కంటే Wedding Invitation అనడం సబబు. అయితే Marriage invitation అనడం పూర్తిగా తప్పుకాదు.

★ అలాగే 'Wedding dinner' better and more appropriate than marriage dinner = 'పెళ్లి విందు' అనే అర్థంతో Marriage dinner కంటే Wedding dinner అనడం సబబు. Wedding feast అనొచ్చు కానీ కాస్త పాండిత్యం.

**3)** Elope = పెద్దలకు ఇష్టం లేనప్పుడు ప్రేమించుకున్న జంట పారిపోయి పెళ్లి చేసుకోవడం.

Unwilling to marry the girl of his parents' choice, the boy eloped with the girl he loved and married her in a temple / at the office of the registrar = వాళ్ల తల్లిదండ్రులు చూసిన సంబంధం ఇష్టం లేకపోవడంతో, ఆ అబ్బాయి తాను ప్రేమించిన అమ్మాయితో పారిపోయి Register పెళ్లి చేసుకున్నాడు.


M. SURESAN

**Marriage, Wedding ల మధ్య తేడా ఏమిటి? 'పెళ్లి పిలుపు' ను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పవచ్చు? 'Wedding dinner', 'marriage dinner' లో ఏది వాడాలి? సాంప్రదాయ కర్మకాండ అంటే ఏమిటి? ఈ వారం స్పోకెన్ ఇంగ్లిష్‌లో వీటి గురించి తెలుసుకుందాం.**




# He has *married off*..




★ Register marriage = Civil marriage. × Traditional marriage (సాంప్రదాయిక వివాహం).

**4)** A live-in relationship = పెళ్లికాకపోయినా, భార్యాభర్తలుగా కలిసి జీవించడం / సహజీవనం గడపడం.

They haven't been married. They are on a live-in relationship = వాళ్లు పెళ్లి చేసుకోలేదు కానీ సహజీవనం గడుపుతున్నారు.




తల్లిదండ్రులు పిల్లలకు పెళ్లి చేయడం = Marry off his daughter/ son to.

**a)** He has married off (married కాదు) two of his daughters / performed the marriage of two of his daughters. అయితే perform (a marriage) కాస్త పాండిత్యం.

Their marriage was performed strictly according to the rites / ritual of their religion = They got married according to the procedure prescribed by their religion = వాళ్ల మతం నిర్దేశించిన క్రమం ప్రకారమే జరిగింది.

★ Rites / ritual = మతం నిర్దేశించిన పద్ధతి. Yagnas, Yagas are Vedic rites / ritual = యజ్ఞయాగాదులు వేదాలు నిర్దేశించిన / వైదిక క్రమం.

The traditional procedure of a marriage prescribed by a religion. = మతం నిర్ణయించిన పద్ధతి = Rites / ritual.

★ Rites / ritual = సాంప్రదాయ కర్మకాండ.

## 'Nellore' ఏ Part of speech?

*Ch. Ramaiah, **Naidupet.***

**Q:** Sir, Nellore corporation లో Nellore అనేది ఏ Part of speech కి చెందుతుంది?

**A:** Nellore corporation లో, Nellore అనేది adjective, ఎందుకంటే అది corporation అనే ఇంకో noun గురించి చెబుతోంది కాబట్టి (మామూలుగా అయితే Nellore - proper noun).

**Q:** Will - would, Shall - should, Can - could, May - might వీటిని మూడు Tense (Present - Past - Future) లలో ఎలా ఉపయోగిస్తారో ఉదాహరణలు, అర్థాలతో వివరించగలరు.

**A:** He says he will come -అతనంటున్నాడు (ఇప్పుడు) తను వస్తానని. (future from present).

He said that he would come (అతనన్నాడు అతను వస్తానని - future from the past) - Would, I/ we తో - future from the past.

★ Shall, should (I / we / you / he / she / it / they తో) future from the past.

**Q:** i) You get it done.

ii) We have to get adjusted.

పై వాక్యాల్లో Past - Participle ఎందుకు ఉపయోగించారు? దీని అర్థం, వ్యాకరణ విశేషాలను ఉదాహరణలతో వివరించండి.

**A:** i) you get it done - నువ్వది చేయించు. ఇక్కడ past participle (done), object complement. అంటే object అయిన 'it' అర్థం అది complete చేస్తుంది.

ii) We have to get adjusted - ఇక్కడ get = become = అవడం.

## He is back అంటే...?

*Ramuji Siddhanthi, **Warangal.***

**Q:** Please clarify the following doubts.

Have you been to a lawyer / the lawyer / lawyer - మీరు లాయర్‌ని కలుసుకున్నారా / lawyer దగ్గరికి వెళ్లి వచ్చారా? Can the above be correct? Can we use the word 'lawyer' without any article?

**A:** "Have you been to a lawyer?" - Correct, if you are referring to any lawyer.

Have you been to the lawyer? - Correct, if you are referring to a particular lawyer.

**Q:** He is back అంటే అర్థం ఏమిటి?

**A:** He is back = He has come back / He has returned.




**Q:** On the last Deepavali festival I met him - Is this right?

**A:** During the last Deepavali festival / On the Deepavali (festival) day, I met him - Correct.

## ache, pain... ఒకటేనా?

*Soha Ali Khan, **Warangal.***

**Q:** Please clarify the following doubts.

The king ordered that the old elephant be taken to - Please let me know the meaning of the above underlined.

**A:** ఆ ఏనుగును తీసుకెళ్లమని రాజు ఆజ్ఞాపించాడు.

**Q:** Friendship is built upon love. Only when you love, can you make true friend - Is the question mark necessary to be kept after above underlined?

**A:** Not necessary. Usually when a sentence begins with an adverb, in this case, 'only' is the verb placed before the subject, but that should not be mistaken for a question.

**Q:** My hand is paining - Is this right?

**A:** My hand is aching (ache - నొప్పి); pain = బాధతో కూడిన నొప్పి).

## naughtiest *of all*...

*Rehan Khan, **Narsampeta.***

**Q:** The English - means the English people similarly the Indian - does it mean - the Indian people?

**A:** The Indian- 1) A particular Indian (మనం ఇంతకు ముందే మాట్లాడిన భారతీయుడిని గురించి ఉండొచ్చు). 2) Indians in general (భారతీయులు).

**Q:** Rahul is the naughtiest of all / among his brothers - Which one is right? Can't we use 'among'.

**A:** Either can be used/ Both are correct.




## ఈ అనువాదం సరైనదా? కాదా?

*S.Chintabhatla, **Asifabad.***

**Q:** కింది తెలుగు - ఇంగ్లిష్ అనువాదం సరైనదో కాదో తెలుపగలరు.

అంతర్‌రాష్ట్ర జల వివాద చట్టం 1956 ప్రకారం కౌన్సిల్ లేదా గోదావరి, కృష్ణానది యాజమాన్య బోర్డులను ఏర్పాటు చేసే అధికారం కేంద్రానికి లేదని, భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 3, ఆర్టికల్ 262 అతిక్రమించదని పేర్కొంది.

As per Inter State Waters Dispute Act 1956, there is no power to central to form / council or Godavari, Krishna Water Management Boards and it can not transgress Article 3, Article 262 of Constitution of India.

**A:** As per the Interstate River Waters Disputes Act 1956 the Central Govt. has no power/ is not empowered to form / constitute councils / Krishna Godavari Management Boards, shall not violate Article 3 and Article 262 of the Constitution of India.

## Answer to the exercise in Lesson No. 777

| తెలుగు | English |
|---|---|
| **Anand:** ఎక్కడి నుంచి వస్తున్నావు? | **Anand:** Where are you coming from? |
| **Santosh:** మా స్నేహితుడి అక్క పెళ్లి నిశ్చితార్థం నుంచి వస్తున్నాను. | **Santosh:** I am coming from my friend's sister's engagement. |
| **Anand:** ఎప్పుడు పెళ్లి? | **Anand:** When is the marriage? |
| **Santosh:** వచ్చే నెల మొదటివారం. బహుశా 4, 5 తేదీల్లో కావచ్చు, అయితే అది అర్ధరాత్రి ముహూర్తం. | **Santosh:** It may take place on the 4th or the 5th of next month, but it is a midnight Muhurtham. |
| **Anand:** జంట ఎలా ఉంది? | **Anand:** How does the couple match each other? |
| **Santosh:** పెళ్లికూతురు దాదాపు పెళ్లికొడుకంత ఎత్తు ఉంది. అదికాకపోతే వాళ్లిద్దరూ ఒకరికి తగినవారొకరు. సమాన విద్యార్హత, అందంలో ఒకరినొకరు తీసిపోరు. | **Santosh:** The bride is nearly as tall as the (bride) groom. But for that they are a perfect match/ made for each other. |
| **Anand:** పూర్తిగా పెద్దవాళ్లు కుదిర్చిన పెళ్లా, ప్రేమ వివాహమా? | **Anand:** Is it an alliance fixed by the elders or a love marriage? |
| **Santosh:** అవును. అయితే వాళ్లు సహోద్యోగులు. అన్నీ సరిపోయాయి. | **Santosh:** Yea. Elders have fixed it, but the bride and the groom are colleagues. Everything's matched. |
| **Anand:** ముహూర్తం ఎన్నింటికి? | **Anand:** When is the auspicious moment/ Muhurtham? |
| **Santosh:** 4 నో, 5 నో అవుతుంది, వచ్చే నెల. | **Santosh:** Perhaps the 4th or the 5th next month. |
| **Anand:** OK. Wish them good luck. | |

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net



## Engaged with అంటే..?

*B. Narasinga Rao, **Anakapalli.***

**Q:** సర్, కింది వాక్యానికి తెలుగు అర్థం వివరించండి.

"Observing that the military, (1) without invitation, engaged with the civilian population, (2) Mr. Samparthan said this involvement had continued even after that election was announced, (3) and had strayed well into election related activists".

i) Engaged with → అంటే అర్థం ఏమిటి? (Engage with)

ii) పై వాక్యంలో 'Comma'లు వాడిన తీరును (ఎందుకు, ఎలా వాడారో) ఉదాహరణలతో వివరించగలరు.

**A:** సైన్యం, ఎవరి పిలుపూ లేకుండానే, ప్రజలతో సంబంధం పెట్టుకుందని చెబుతూ, శ్రీ సంపర్తన్ ఇంకా ఇలా అన్నారు: ఎన్నికలు ప్రకటించిన తర్వాత కూడా ఈ ప్రమేయం కొనసాగిందనీ, అది ఎన్నికల ప్రక్రియలో కూడా తన సంబంధాన్ని అలాగే కొనసాగించిందనీ.

**Engaged with =** ఒకరితో సంబంధం పెట్టుకోవడం.

సామాన్యంగా comma, ఒక phrase ను మరొక phrase/ clause నుంచి విడగొట్టేందుకు వాడతారు- పై sentenceలో, 'Observing that.... invitation, ఈ phrase ను తర్వాత వచ్చే clause 'engaged... population' విడదీయడానికి, comma వాడారు. అలాగే మిగతా commas కూడా. Sentence చివర రెండు clauses మధ్య comma ఉపయోగించారు.

**Q:** 'Resort to' అనే Phrasal verb అర్థం ఏమిటి?

**Resort to =** ఇంకే మార్గం లేనప్పుడు చెడు పనికి పాల్పడటం.




He resorted to stealing because he found no other way of earning money = డబ్బు సంపాదనకు ఇంకో మార్గం లేకపోయేసరికి, దొంగతనానికి పాల్పడ్డాడు.

**Q:** "Single Window" అంటే ఏమిటి?

**A: Single window =** The system of granting permits, licenses, collection of the necessary fee, sanction of the government at a single point in a govt. office for those who wish to start an industry = పెద్దపెద్ద పరిశ్రమలు ప్రారంభించాలనుకునేవారు, వివిధ ప్రభుత్వాధికారులను కలుసుకోకుండా, వివిధ ప్రభుత్వ శాఖలకు వెళ్లకుండా వారికి కావలసిన అనుమతులు, లైసెన్సులు లాంటివి అన్నీ ఒకేచోట జారీ అయ్యే విధానం.

## నేనొచ్చి మూడు గంటలైంది...

*Anil Tapasya, **Vijayawada.***

**Q:** First of all complete writing the answers. - Is this right?

**A:** Correct.

**Q:** ఆడుకునే వయసు మీ బాబుది. అప్పుడే వాడిని బడిలో వేస్తే వాడు ఏం చదువుతాడు?

**A:** Your boy is still at a playing age. If put him to school now, what can he learn?

**Q:** నేనొచ్చి మూడు గంటలు/ మూడు రోజులు అయ్యింది - Please say in English.

**A:** It is three hours/ three days since I came.

**Q:** 'Being' and 'having been' - Please let me know the uses of the above both in the past/ present tenses.

**A:** Refer to the answers to the same question in the previous lessons.

*K.S. Kumar, **Bapatla.***

**Q:** When will you eat are you not hungry? - ఇందులో తప్పు ఎక్కడ ఉందో వివరించగలరు.

**A:** When will you eat? Are you not hungry? This is the correct form.

**Q:** Errors and Rectifications కు సంబంధించిన మంచి పుస్తకం సూచించగలరు.

**A:** 'Common Mistakes in English' by Fitikides (pub.) is a very useful book.




## Appreciate, Admire తేడా?




*Deepika, Sonam, Vijayawada.*

**Q:** Please explain appreciate/ admire with the meanings 'to increase in value', to look at with admiration.

**A: Appreciate =** Express your praise for something/ someone on the basis of their/ its merits = ఒకరి/ ఒకదాని మంచిని/ గొప్పతనాన్ని జాగ్రత్తగా అంచనావేసి చూసి మెచ్చుకోవడం.

**Admire =** Praise/ have respect for someone for the great things they have done = ఎవరైనా గొప్ప పనులను చేసేవాళ్లను మెచ్చుకోవడం - నిజంగా వాళ్లలో గొప్పతనం ఉందా అని అంతగా ఆలోచించకుండా.

(Appreciate - II meaning - increase in value/ price.)

Land value is <u>appreciating</u> = Land value is <u>increasing</u>.

## Sit there alone/ lonely...


M. SURESAN

*Sohel Patan, **Adilabad.***

**Q:** They wish today were a working day/ They wish they had a working day today - Let me know the difference between above two.

**A:** Both are correct. No difference between the two sentences. They both express a wish that cannot become real (తీరని కోర్కెను తెలిపే విధం).

**Q:** నా books ఎవరో పోగొట్టారు - Say in English.

**A:** Someone took <u>my books and lost them</u>.

**Q:** Sit there alone/ lonely - Say the difference.

**A:** Sit alone = sit by yourself = ఒంటరిగా కూర్చోవడం. Sit lonely = ఇంకెవరూ లేక ఒంటరిగా ఉన్నామనే బాధతో ఏకాకిగా కూర్చోవడం.

**Q:** i) You are transferred to Adilabad. ii) He is shooting at birds - Are the above two sentences right?

**A:** i) and ii) - Correct.

**Q:** All his muscles seemed to be in his thighs - Say in Telugu.

**A:** అతడి కండలన్నీ అతడి తొడలోనే ఉన్నట్టు కనిపిస్తున్నాయి = అతడి తొడలు బలమైనవి.

**Q:** They have told me that you have come - Is this right?

**A:** Correct.

**Q:** Once you wrote: I might not be home - Shouldn't '<u>at</u>' be there before the word '<u>home</u>'?

**A:** I might not be at home (British English) = I might not be home (American English) - Both are right.

## The men who *was* taken away..

*S. Chintabhatla, **Asifabad.***

**Q:** Please clarify whether the following sentences are correct.

a) Take an interest in books.
b) Take rest.
c) There are fifty congressmen in the assembly of seventy.
d) The museum attached to the town library is open.
e) The people gave chosed and gone a chase to the murdered.
f) We ought to cryhalt to further urbanization of Delhi.
g) The higher you go, the greater is the corruption.
h) Training the fishermen proved the difficult.
i) USA is a great country.
j) The father as well as the son has been suffered from tuberculous.
k) They hate us, because of the incident.
l) One of the men who was taken away was a cripple.
m) Compared with Gujarat, Maharashtra less trouble.
n) He does not visit me nowadays.
o) How has long it been raining?
p) One thousand children between 6-13 age group.
q) One person was killed and two were injured.

**A:** (a) and (b) correct.
(c) ... in an assembly of seventy.
(d) Correct.
(e) The meaning is not clear.
(f) and (g) correct.
(h) Training the fisherman proved to be difficult.
(i) Correct.
(j) The father as well as the son has suffered from tuberculosis.
(k) They hate us because of the incident (No comma after 'us').
(l) One of the men who <u>were taken</u> away... (The verb after 'who' is plural because, the word 'men' before 'who' is plural).
(m) Compared with Gujarath, Maharashtra <u>has</u> less trouble/ is less <u>troublesome</u>.
(n) Correct.




(o) How long <u>has it been raining</u>?
(p) The expression (which is a phrase) is correct; but it is not a sentence.
(q) Correct.

## Infinite Verb లేదు!

*Vijayasimha, **Vizianagaram.***

Please clarify the following doubts.

**Q:** Wanted <u>Professors, Associate Professors</u> in the following <u>disciplines</u> - Please say the meanings of the above underlined words as well as <u>Assistant</u> Professors.

**A:** A learned person, knowing his subject very well, and teaches in a college/ university, does and guides research is a Professor.

An Associate Professor knows the subject as well as a professor, guides and does research, but next in rank to a professor.

Asst. Professor may be less qualified and less experienced than an Professor/ Associate Professor, and may be less qualified. May or may not be qualified to guide research.

**Discipline** - మామూలు అర్థం- క్రమశిక్షణ. ఇక్కడి అర్థం- Subject of study.

**Q:** How can I write without having a pen - Is this correct?

**A:** Correct.

**Q:** Finite verb/ infinite verb - Please let's know.

**A:** Finite verb- a verb which has tenses, person (I, II & III) and number - singular and plural.

**eg:** go - It has the three tenses. It's different forms, goes, is/ am/ are going etc - indicate its tenses, number and person (<u>goes</u> - III person singular).

Infinite Verb లేదు. Non-finite verbs అంటారు. ఈ verbs కి (వాటిని verbs అని అనలేం) tense గానీ, person గానీ, number గానీ ఉండవు.

**Nonfinite verbs:**

1. Present Participle - 'ing form' - giv<u>ing</u>, com<u>ing</u> etc.
2. Past Participle - sung, given, taken etc. ($V_3$ అంటూ ఉంటారు ఎక్కువగా- కరెక్ట్ కాదు.)
3. The Infinitive - the basic form of the verb; **eg:** go, sing etc. or the 'to infinitive' <u>to</u> go, <u>to</u> sing etc.

**Q:** "Shastri, the lion" - ఇది ఒక మూవీ పేరు. తెలుగులోకి అనువదించగలరు.

**A:** ఇది చాలా చిన్న విషయం కదా, మీరే అనువదించండి. Shastri - పేరు, the lion అంటే తెలుసు కదా?

## Is who dead? ఏ సందర్భంలో...

*Tripathi, **Machilipatnam.***

**Q:** He said, "If I fall asleep wake me up" (DS) - Please say (IDS).

**A:** He requested me to wake him up if he fell asleep.

**Q:** I am unable to get your school - Please say in Telugu.

**A:** I am unable to get your school = మీ స్కూల్‌కు phone చేస్తే ఎవరూ ఎత్తడం లేదు.

**Q:** Please explain the following.
Is who dead?

**A:** When we want to be sure we've heard somebody correctly, we say this:

**eg:** ***Suneel:*** I'm (I am) sorry to give you the news. Our dear friend Prakash is dead.
**Sameer:** Is who dead? (ఎవరు చనిపోయింది?)

# FUNCTIONAL ENGLISH

ఇద్దరు స్నేహితుల సంభాషణ...

**Ramana:** Where had you been? I couldn't see you the whole of the last week. (ఎక్కడికెళ్లావు? పోయిన వారం మొత్తం నిన్ను కలుసుకోలేకపోయాను).

**Eswar:** I had been on a pilgrimage to Kasi with all my people. I returned only yesterday. (మా వాళ్లందరితో కాశీ యాత్రకు వెళ్లాను. నిన్ననే తిరిగొచ్చాను).

**Ramana:** Surely you had been to Allahabad too where you had a dip in the Triveni Sangamam. (తప్పకుండా అలహాబాద్ కూడా వెళ్లి అక్కడ త్రివేణి సంగమంలో స్నానం చేసుంటావు).

**Eswar:** Sure, I did. I performed the rituals there to enable the souls of our dead dears to rest in peace. (అలాగే చేశాను. అంతేకాకుండా మా చనిపోయిన వాళ్ల ఆత్మలకు శాంతి కలిగేందుకు చేయవలసిన విధులన్నీ చేశాను).

**Ramana:** What did you do next?

**Eswar:** Then I left for Kasi where I had a dip in the Ganga and offered worship to Lord Viswanath. (ఆ తర్వాత కాశీకి బయల్దేరి వెళ్లి అక్కడ గంగలో మునిగి కాశీ విశ్వనాథుడికి పూజలు చేశాను).

**Ramana:** The Lord of Kasi and his consort are not on the same premises, are they? (కాశీనాథుడు, ఆయన సతీమణి ఒకే ఆవరణలో ఉండరు కదా? )

**Eswar:** No. OK. It's time I left. More about Kasi when we meet next. (ఉండరు. సరే, నేను వెళ్లాల్సిన టైం ఎప్పుడో వచ్చింది. మనం మళ్లీ కలుసుకున్నప్పుడు కాశీని గురించి మరింత చెబుతా).

**వివరణలు**

1) a) Pilgrimage b) Pilgrim
2) A dip in the Triveni/ in the Ganga
3) Perform rituals
4) Offer worship

పైవన్నీ తీర్థయాత్రలకు, భక్తులకు సంబంధించిన మాటలే.

**1) Pilgrim =** పుణ్యస్థలాలకు వెళ్లే యాత్రికులు.

**Suman:** A <u>pilgrimage</u> to Tirupati is not such a pleasant thing nowadays. (ఈ రోజుల్లో తిరుపతి యాత్ర అంత ఆహ్లాదకరమైంది కాదు.)

**Dharma:** Yea, while the <u>rush of pilgrims</u> can't be managed easily the TTD makes it all the more difficult by their special treatment of VIPs. (అవును, యాత్రికుల తాకిడిని నియంత్రించటం కష్టమైతే, దేవస్థానం వాళ్లు ముఖ్యులకిచ్చే ప్రాముఖ్యం మన కష్టాలనెక్కువ చేస్తుంది.)

**2) పుణ్యనదుల్లో స్నానం =** A dip in a sacred/ holy river.




★ A ***dip in*** the Ganga washes away all your sins. (గంగాస్నానం మన పాపాలన్నింటినీ కడిగేస్తుంది)

**3) Perform rituals =** do religious ceremonies = పుణ్యతీర్థాలలో మనం చేసే విధులు/ కర్మకాండలు.

★ Most religions prescribe <u>rituals</u> of one kind or the other. (చాలా మతాలు ఏదో విధమైన కర్మకాండలను/ విధులను నిర్దేశిస్తాయి).

**4) Worship =** ఆరాధన, పూజ/ ఆరాధించడం, పూజించడం/ కొలవడం = offer worship

★ Hindus <u>worship</u> a number of gods, whereas Christians and Muslims believe in a single God. (హిందువులు చాలా దేవుళ్లను కొలుస్తారు, కానీ క్రైస్తవులు, ముస్లింలు ఒక దేవుణ్నే కొలుస్తారు).

★ The Governor and wife <u>offered worship</u> at Bhadrachalam on Srirama Navami (శ్రీరామ నవమి రోజున గవర్నర్, ఆయన సతీమణి దేవుడికి పూజలు చేశారు.)





M. SURESAN

పుణ్యక్షేత్ర పర్యటన, నదీస్నానాలు, మరణించినవారికి చేసే కార్యక్రమాలు, దేవుళ్లకు పూజలు చేయడం లాంటివి తరచూ సంభాషణల్లో వస్తుంటాయి కదా.. Spoken English లో వీటికి సంబంధించిన పదాల ప్రయోగాల గురించి ఈ వారం తెలుసుకుందాం.




# You *should* see this film

*Ram,* ***Hyderabad.***

**Q:** Sir, please explain the following in Telugu. After <u>should</u>

a) probability - This key should <u>fit</u>.
b) In Rhetorical questions: How should I <u>know</u>?
c) Recommendation (= 'ought') You should <u>see</u> this film.
d) Moral obligation (= 'ought') He should <u>help</u>.
e) In subordinate clauses: rather meaningless (of purpose)
I spoke slowly so that there should <u>be</u> no mistake.
f) In subordinate clauses: rather meaningless (of time)
I waited until he should <u>finish</u>.
g) In subordinate clauses: after verbs of feeling
I was worried lest he should get lost.
h) In subordinate clauses: reported 'shall' or 'will'.
He said I <u>should</u> be paid.
i) After expressions of surprise or regret
I am surprised you should <u>think</u> so.
I am sorry you should have been troubled.
j) In conditional clauses:
I should take it, if I were you
k) '+ have + ..ed' in conditional clauses:
If you should have finished tell him to go.
*l*) In subordinate clauses: rather meaningless (of time)
I waited until he should have finished.

**A:** The most important point about '<u>should</u>': In the present day English 'should' is mostly used to tell somebody what they 'have to do' (more or less in the sense of 'must' - ఏదైనా <u>చేయాలి</u> - విధిగా అని చెప్పేందుకే.)

Even in indirect speech, 'should' is no longer used for 'shall' and only 'would' is used.

మీరు రాసిన sentences అన్నింటిలో 'should' వాడిన విధంగా ఈనాటి Englishలో వాడటం లేదు.

<u>ప్రస్తుత English</u>లో, Reported / Indirect Speechలో / Conditionsలో (If you <u>should need</u> my help లాంటి sentencesలో)/ feelings and emotions తెలిపేందుకు (I <u>should be</u> happy if that happens) 'should' వాడటం లేదు/ చాలా అరుదు.

ఇలాంటి సందర్భాల్లో 'should' పూర్తిగా omit చేయటం కానీ, should బదులు simple present / past గానీ వాడతాం, <u>సందర్భాన్ని</u> బట్టి.

a) This key <u>should</u> fit = ఆ తాళం సరి<u>పోవాలి</u> (సరిపోవచ్చు అనే అర్థంతో) - ఈ వాడుక ఇంకా ఉంది.

b) How should I know? = How do you / does anybody expect me to know? (నాకెలా తెలుస్తుంది).

How <u>should I know</u>? కంటే <u>ప్రస్తుత English</u>లో How do I know? / How do you expect me to know? వాడకం ఎక్కువ.

c) You should see this film = మీరీ సినిమా <u>తప్పక చూడాలి</u> / ఇది తప్పక చూడాల్సిన చిత్రం.
(ఇతరులకు recommend చేయటం) - ఇది ఇంకా useలో ఉంది.




d) అతను సాయం <u>చేయాలి</u>. (He should help)
**eg:** ఇంతకు ముందు మన దగ్గర పొందిన సాయానికి ప్రతిగా - ఇదీ వాడుకలో ఉంది.

e) 'Use of should' here is outdated - ఇప్పుడిది వాడుకలో లేదు. ఇక్కడ 'should' బదులు 'could' /'might' వాడుతున్నారు.

f) I waited until he 1) finished / 2) could finish (depend upon the situation - పరిస్థితిని బట్టి. 1) = అతను పూర్తి చేసే వరకు / 2) అతను పూర్తిగా చేయగలిగేవరకు. ('should' ఇక్కడ outdated).

g) The use of 'lest' here followed by 'should' - ఇది కూడా పాతబడిపోయింది.

**1)** 'lest' (so that not అనే అర్థంతో) మామూలు Spoken Englishలో అరుదు. చాలా గ్రాంథికం.




**2)** Lest తర్వాత 'should' అసలు వాడటం లేదు.

I started early lest <u>I miss</u> the train - Present day English.

I started early lest <u>I should miss</u> the train - గ్రాంథికం, పాత ప్రయోగం.

h) He said I <u>should be</u> paid = నేను <u>చెల్లింపబడాలని</u> అతడు చెప్పాడు. (నాకు డబ్బులు <u>చెల్లించాలని</u> అతడు <u>చెప్పాడు</u>) - ఇక్కడ should = must obligation.

i) I am surprised you think so - present day usage; I am surprised you should think so - old usage - <u>రెంటికీ</u> అర్థం = నువ్వలా అనుకోవడం / ఆలోచించటం నాకు ఆశ్చర్యంగా ఉంది.

'I am sorry you have been troubled' is the <u>current usage</u> ( <u>not</u> you should have been troubled) = మీకు ఇబ్బంది కలిగినందుకు / ఇబ్బందిపడ్డందుకు విచారిస్తున్నాను.

j) I should take it if I were you - <u>old usage</u>.

I <u>would</u> / <u>I'd take</u> it if I were you = నేను నువ్వు/ మీరు అయితే దాన్ని నేను తీసుకుంటాను. (Improbable present).

k) If you should have finished - <u>Wrong</u>.

If <u>you have finished</u> tell him to go = నువ్వు దాన్ని <u>పూర్తి</u> చేస్తే అతన్ని వెళ్లమను.

*l*) I waited until he should have finished - <u>Wrong</u>.

I waited until he had finished = అతను పూర్తి చేసేంతవరకు నేను వేచి ఉన్నాను.

***గుర్తుంచుకోవాల్సిన విషయం:***

In the present day English 'should' is used for

**1) Orders:** You <u>should do</u> it at once
**2) Duties/ obligations:** I <u>should be</u> at office by 10 / we should help those who help us.
**3) Necessity:** I <u>should</u> start now or I'll miss the train.

*K.V. Rao,* ***Visakhapatnam.***

**Q:** కింది పదాల అర్థ (భావ) భేదాలను వివరించండి.

1) Literateur & Literati
2) Marriage alliance & Marital relation
3) Wear a shirt & Don a shirt
4) Give a rejoinder & Give a befitting reply; Rejoinder & Repartee & Retort.

**A:**1) **Literateur -** no such word in English.

**Literati =** a group of persons interested in / sharing interest in Literature.

2) **Marriage alliance =** An agreement/ a proposal for a marriage between a man and a woman.

**Marital relation =** A couple being a wife and husband = వైవాహిక బంధం.

3) **Wear =** a piece of clothing / jewel etc, that we <u>have on</u> our body = ధరించడం.

**Don =** put on = దుస్తులు వేసుకోవటం.

Wear = ఎప్పుడూ ధరించేవి.



## He always *wears* white..

a) He always <u>wears</u> white = అతనెప్పుడూ తెల్ల దుస్తులే <u>ధరిస్తాడు</u>.

b) He <u>put on</u> his shirt and went for a walk = చొక్కా వేసుకుని నడకకు వెళ్లాడు.

★ Put on = Don - అయితే 'Don' కాస్త పాండిత్యం/ గ్రాంథికం (bookish)

**4) Rejoinder =** Repartee = తడుముకోకుండా వెంటనే ఇచ్చే సమాధానం, ఇతరులు మనల్ని ఏదైనా అన్నప్పుడు, కాస్త చతురతతో, వాళ్లు మనల్నేమీ అనలేనట్లుగా.

Befitting reply = Proper or suitable reply = తగిన సమాధానం. అయితే 'Befit' = ఒకరికి తగిన/ సరైన అనే అర్థంతో వాడే ఈమాట కాస్త గ్రాంథికం.

'Befitting reply' అనేది Indianism. Standard Englishలో ఇది వాడుకలో లేదు.

**★ ఇలా వాడతారు:**

As ***befits*** a man of his status he was given a




grand welcome = అతడి <u>అంతస్తు/ స్థితికి</u> తగిన విధంగా అతడికి స్వాగతం పలికారు.

**Retort =** Reply very quickly angrily/ humourously = వెంటనే మన మీద మాటపడక ముందే సమాధానం చెప్పడం కోపంగా కానీ/ చతురతతో కానీ, (తడుముకోకుండా సమాధానం చెప్పగలగటం)

★ Rejoinder, repartee, retort -దాదాపు ఒకే అర్థం కలవి, అయితే Retort కొంచెం ఘాటు.

# FUNCTIONAL ENGLISH

ఇద్దరు మిత్రుల మధ్య సంభాషణ..

**Eeswar:** See, how the crops have withered! Farmers are likely to face loss again this year. (చూడు, పంటలెలా ఎండిపోయాయో. రైతులు ఈ యేడు కూడా నష్టాలు ఎదుర్కోవాల్సి వస్తుంది.)

**Viswa:** If it was floods last year, it is drought this year. The farmer never has any relief from these extremes. (కిందటేడాది వరదలైతే, ఈసారి వానలు లేకపోవడం. ఉంటే అతివృష్టి లేకుంటే అనావృష్టి అన్న మాట. రైతుకు ఏ విధమైన ఊరట లేదు).

**Eeswar:** You remember how the rain lashed the coastal areas for three days without any let up, don't you? The rivers overflowed their banks, and the low lying areas were all flooded. Trees were uprooted and buildings in the old town collapsed. (ఎడతెరపి లేకుండా కిందటి సంవత్సరం మూడు రోజులు ఒకటే వాన. నదులు కట్టలు తెంచుకుని ప్రవహించడంతో లోతట్టు ప్రాంతాలన్నీ జలమయమయ్యాయి. చెట్లు వేర్లతో సహా కూలిపోయాయి. పాత బస్తీలో ఇళ్లు కూలిపోయాయి.)

**Viswa:** We had to wade through knee deep water in strong winds. (మోకాటి లోతు నీళ్లలో, వేగంగా వీస్తున్న గాలిలో మనం నడవాల్సి వచ్చింది.)

**Eeswar:** Fortunately the collector and other officials took up relief measures promptly and the victims were rehabilitated on a war footing. (అదృష్టవశాత్తు కలెక్టర్, ఇతర అధికారులు సహాయ కార్యక్రమాలను సకాలంలో ప్రారంభించి, బాధితులకు వెంటనే పునరావాసం కల్పించారు).

**Viswa:** Well, the loss was minimised. There was no loss of life, fortunately. (కనీస నష్టమే జరిగింది. ప్రాణనష్టం ఏం జరగలేదు, అదృష్టవశాత్తు).


M. SURESAN

వరదలు, కరవు, పంట నష్టాలు, అతివృష్టి / అనావృష్టి వాటి వల్ల కలిగే ఫలితాలు లాంటి అంశాలను సంభాషించేటప్పుడు ఎలాంటి పదాలు ఉపయోగించాలో ఈ వారం Spoken English లో తెలుసుకుందాం.




# Crops *wither* if there is..

వివరణలు...

1) How the <u>crops</u> have <u>withered</u>!
2) ... it is <u>drought</u> this year.
3) How the rain <u>lashed</u> the coastal areas!
4) The <u>low lying</u> areas were flooded.
5) We had to <u>wade through knee deep waters</u>.

**1)** <u>Withering</u> of crops = పంటలు <u>ఎండిపోవడం</u>, ముఖ్యంగా వర్షాలు లేకపోవటం వల్ల.

a) Crops <u>wither</u> if there is drought = వర్షాలు లేకపోతే, పంటలు ఎండిపోతాయి.

b) Because the farmer used the wrong fertilizer the crop in over half an acre has <u>withered</u> = రైతు తప్పు ఎరువును వాడినందువల్ల అర ఎకరానికి పైగా పంట ఎండిపోయింది.

Wither (ఎండిపోవడం) × thrive (బాగా పండటం)

★ Paddy <u>thrives</u> in a hot climate = వరి ఉష్ణ ప్రదేశాల్లో బాగా <u>పెరుగుతుంది.</u>

**2) Drought** = lack of rain (వర్షాభావం) causing dry weather.

**Kumar:** In regions like India the farmer has no comfort any way. (భారత్ లాంటి ప్రాంతాల్లో రైతుకు ఏ విధమైన సుఖమూ లేదు).

**Pramod:** Yes. It is either <u>drought</u> or cyclones and floods. (అవును. ఉంటే <u>అనావృష్టి</u> లేకుంటే <u>తుపానులు, వరదలు</u>).

**3)** The rain <u>lashed</u> the <u>coastal area</u> = <u>తీర ప్రాంతాన్ని</u> వర్షం తీవ్రమైన <u>దెబ్బకొట్టింది</u>




**Lash** = hit with great force = శక్తంతా కూడగట్టుకుని దెబ్బకొట్టడం.

**Whip lash** = కొరడా దెబ్బ

**4) Low lying areas** = areas at a lower level than other places = లోతట్టు ప్రాంతాలు.

★ Low lying areas were <u>flooded</u> = low lying areas were under water/ flood waters = లోతట్టు ప్రాంతాలు మునిగిపోయాయి, నీళ్లల్లో/ వరద నీళ్లల్లో = submerged = inundated.




**Wade through** = తక్కువ లోతున్న నీళ్లల్లో కాళ్లీడ్చుకుంటూ నడవటం.

a) He <u>waded up to a point</u> in the sea and then started swimming = సముద్రంలో కొంత దూరం <u>నడుస్తూ వెళ్లి</u> ఆ తర్వాత ఈదటం మొదలుపెట్టాడు.

ఇది, అంటే 'wade' అనే మాటను, ఏదైనా భారంగా చేసే పనులకు కూడా వాడతాం.

**eg: Karuna:** I went to the university yesterday for my degree certificate. (నిన్న నా degree certificate కోసం universityకి వెళ్లాను).

**Rukmini:** Did you get it? (తెచ్చుకున్నావా?)

**Karuna:** No. The clerk <u>waded through</u> the files for half an hour, but could not find it. He told me to come tomorrow. (ఆ గుమస్తా ఆ files అన్నీ అరగంట వెతికాడు, కానీ అది అతనికి కనపడలేదు. రేపు రమ్మన్నాడు.)

## I have work at/ in..?

*Sultana,* ***Warangal.***

Please clarify the following doubts.

**Q:** Once you wrote the following sentence: If one feels thirsty they wet their <u>whistle</u> - Shouldn't the underlined word be in plural form?

**A:** 'One' in the sentence refers to one person who may be either a man or a woman, in the <u>singular</u> (any person in general). In old fashioned English, when 'one' was used, the pronouns used in the other cases were: One, one's, oneself etc.

**eg:** a) <u>One</u> doesn't know when what happens to <u>one.</u>
b) <u>One</u> should be careful about <u>one's</u> money.
c) <u>One</u> should respect <u>oneself</u>.

However, the use of <u>one</u>, <u>one's</u>, <u>oneself</u> etc are old fashioned. Further one may either refer to a man or a woman, so instead of using he/ she, him/ her, himself/ herself, we now use they, them, themselves and their.

So if <u>one</u> (<u>one</u> man/ <u>one</u> woman) feels thirsty they wet <u>their</u> (only one person here) <u>whistle</u>.

**Q:** I have an urgent piece of work at/ in a bank/ in <u>T</u>he <u>S</u>tate <u>B</u>ank of <u>H</u>yderabad - Please say the right one.

**A:** I have an urgent piece of work (better still, a piece of urgent work) in the SBH - Correct.

**A better sentence:** I have urgent work in the SBH.

**Q:** Please complete <u>yesterday's</u> work - Is the underlined word (above) adjective/ adverb? Please clarify.

**A:** Yesterday's - Adjective, qualifying the noun 'work'.



## 'inferential' బదులు 'by inference'

*Irshad Ali,* ***Hyderabad.***

**Q:** ఆమెకు చాలా పొగరు - She is very pride/ proud - Say the right one.

**A:** She is very haughty/ arrogant. (Proud = గర్వం కల; pride = గర్వం)

**Q:** He failed in the exam/ He failed the exam- say if the above are correct or not.

**A:** He failed the exam - Correct.

**Q:** Fall in అంటేనే line లో నిలబడటం అని Dictionaryలో ఉంది. మరి Fall in lines -అన కుండా All of you fall in - అంటే సరిపోతుంది కదా? Please clarify.

**A:** అవును. fall in = order soldiers etc to stand in a line. Fall <u>in a line</u> - Not correct.

**Q:** Inferential - Is this word there in English language? If it is there please say the meaning in Telugu.

**A:** There is. మన దగ్గర ఉన్న సమాచారాన్ని బట్టి మనం నిర్ధారణకు (inferenceకు) వచ్చే విషయం, 'inferential'.

**eg:** That he has stolen the money is only inferential. There is no proof = అతను ఆ డబ్బు దొంగిలించాడని పరిస్థితులను/ సమాచారాన్ని బట్టి నిర్ధారణకు రావడమే. ప్రత్యక్షమైన రుజువేమీ లేదు. అయితే 'inferential' అనే మాట తర్కం (logic) లాంటి విషయాల్లో వాడతారు. Conversational English/ మామూలు written Englishలో 'inferential' బదులు 'by inference' అంటారు.

**Q:** నీవు చెడిపోయిందే కాకుండా మా అబ్బాయిని కూడా చెడగొడుతున్నావు - How to say in English?

**A:** Not only are you spoilt but you are spoiling my son too.

## on/ in/ about difficult matters..?

*Ramji Suman,* ***Godavarikhani.***

**Q:** The minister advised the king on difficult matters/ in difficult matters/ about difficult matters - Say the right one.

**A:** .... <u>on</u> difficult matters - Correct.

**Q:** The office will function tomorrow to compensate the holiday given on last Friday - Is this sentence correct?

**A:** The office will function ... to compensate for the holiday given last Friday (<u>on</u> last Friday wrong).

**Q:** మేము bus, railలో లేదా lorry, shipలో ప్రయాణం చేస్తున్నాం.. ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా రాయాలి?




- We are travelling in/ on the bus/ rail. Is this correct?

**A:** We are travelling <u>by</u> train/ rail etc - Correct.

## 'The' must be used..

*Shoeb Khan,* ***Warangal.***

**Q:** Fire-crackers/ fire-works/ cracker - Please say the meanings in Telugu.

**A:** A fire cracker - a fire work which explodes - పేలే (టపాకాయలు) సామగ్రి. Fire works = పేలే (టపాకాయలు) మందుగుండు కావచ్చు, మతాబులు, కాకరపూవత్తుల్లాంటి వెలిగేవి కావచ్చు (వెలిగేవి - sparkles).

**Q:** Should 'the' be used before the names of trains? Example - <u>The</u> Intercity Express.

**A:** Yes, 'The' must be used before the names of trains.

**Q:** Oblation - నైవేద్యం - Is this right?

**A:** Oblation - Right, but outdated - no longer in use.

**Q:** The train might be caught/ might have been caught - Say the difference.

**A:** ...... might be caught - Future.
... might have been caught - Past.

## a word ends with ed/ ted..

*Usha, Mayuri,* ***Gajuwaka.***

**Q:** Each book is a window that opens out a world that one <u>would never have visited</u> - Is the underlined one correctly written here?

**A:** Each book is ... one <u>might never have visited</u> - Correct.

**Q:** I am reading these books to pass/ spend my time - Is this correct?

**A:** I am reading these books to spend time. (... my time - OK, but time - better).

**Q:** Completed - కంప్లీటిడ్, Transported - ట్రాన్స్‌పోర్టిడ్, etc- wherever a word ends with ed/ ted is it pronounced as ఇడ్ or టిడ్ - Please let us know.

**A:** 'i' in English is not exactly 'ఇ' of Telugu. It is somewhat between 'ఇ' and 'ఎ'.



## Why 'chicken shop'?

*B. Bhagya,* ***Dharmasagaram.***

**Q:** Why do we call 'chicken shop' instead of hen shop?

**A:** People usually eat chickens = Both cocks and hens.

**Q:** i) No student should be seen sitting lazily in the class.

ii) All the students should be seen doing grammar - Please translate the above into Telugu.

**A:** i) Class లో ఏ విద్యార్థీ సోమరిగా కూర్చుని కనిపించకూడదు.

ii) అందరు విద్యార్థులూ వ్యాకరణం అభ్యసిస్తూ కనిపించాలి.

**Q:** Plants take in air through special holes found in leaves - Is it necessary to write or say the above underlined word?

**A:** Not necessary.

## Marry, marry off తేడా..

*K. Lohith,* ***Kothapally.***

**Q:** Lesson no-767 లో మీరు "You want to marry her off" అనే వాక్యానికి అర్థం 'మీరు ఆమెకు పెళ్లి చేయాలనుకుంటున్నారు' అని ఇచ్చారు. మరి I want to marry you అంటే అర్థం ఏమిటి? 'నేను నీకు పెళ్లి చేయాలనుకుంటున్నా', 'నేను నిన్ను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నా' ఈ రెంటినీ English లో ఎలా చెప్పటం?

**A:** I want to marry you = నేను నిన్ను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నా.




I want to marry you off = నేను నీకు పెళ్లి చేయాలనుకుంటున్నా.

## A baby grows into..అనొచ్చా?

***Veerender, Manchiriyal.***

**Q:** He could meet one visitor for three minutes in every seven months/ in seven months - Please say the right one.

**A:** For three minutes in every seven months - He meets them once every seven months for three minutes = ప్రతి ఏడు నెల్లో, మూడు నిమిషాల పాటు).

He meets them for three minutes in seven months = In one period of seven months, he meets them for 3 minutes.

**Q:** A baby grows into a man - Is this sentence correct? Are there any grammar/ grammatical mistakes?

**A:** It is, though, 'a man or a woman' is better. Grammar mistakes = grammatical mistakes.

## A baby grows into..అనొచ్చా?

*K.V. Rao,* ***Visakhapatnam.***

**Q:** (Physical) exercise & Workout - Explain.

**A: (Physical) exercise =** Physical activity we do to keep ourselves healthy and active = వ్యాయామం.

**Work out =** a period of physical exercise (వ్యాయామ సమయం).

**eg:** He has a twenty minute work out every morning = 20 నిమిషాల సేపు వ్యాయామం.



M. SURESAN

గతుకులతో నిండిన రహదారులు ప్రతి చోటా కనిపిస్తాయి.. వాటి వల్ల వాహనదారులు ఎన్నో ఇబ్బందులకు గురవుతుంటారు. అధ్వాన్న స్థితిలో ఉన్న రోడ్ల గురించి సంభాషించేటప్పుడు ఎలాంటి పదాలు ఉపయోగించాలో ఈ వారం తెలుసుకుందాం.




# Main **thoroughfares** passing..

### FUNCTIONAL ENGLISH

రహదారుల పరిస్థితిపై ఇద్దరు యువకుల సంభాషణ..

**Sanjay:** Remember, the road is under repair. Drive slowly (గుర్తుంచుకో, రోడ్ రిపేర్లో ఉంది. నిదానంగా పోనీ).

**Praveen:** Thank God. At last. It was full of pot holes and ditches. This is one of the main thoroughfares passing through the city. (బతికిపోయాం. ఈ రోడ్డంతా గుంటలతో, కంతలతో నిండి ఉండేది. ఈ నగరం మీదుగా వెళ్లే ముఖ్య రహదారుల్లో ఇదొకటి).

**Sanjay:** Our civic bodies, like our governments are indifferent to the needs of the people. They do collect road taxes and vehicle licenses but hardly use them for proper maintenance of roads. (మన పౌర సంస్థలు, మన ప్రభుత్వాల్లాగే ప్రజావసరాల పట్ల నిర్లక్ష్యంగా ఉంటాయి. రోడ్డు పన్నులు, వాహనం లైసెన్సులు వసూలు చేస్తారు కానీ వాటిని రహదారుల నిర్వహణకు వాడవు).

**Praveen:** Bad roads lead to waste of fuel and time, accidents and increased maintenance costs of vehicles. (సరిగా లేని రోడ్ల వల్ల ఇంధన వృథా, ప్రమాదాలు, వాహన నిర్వహణ ఖర్చులు పెరుగుతాయి).

**Sanjay:** Just yesterday an accident led to the death of a three year old baby girl. (నిన్ననే ఓ ప్రమాదం మూడేళ్ల పాప మృతికి దారి తీసింది).

**Praveen:** The traffic lights are most of the time out of order. The police can't control traffic manually. That results in traffic jams for long periods. (Traffic lights చాలా మటుకు పనిచేయవు. పోలీసువాళ్లు చేతులతో రాకపోకలు నియంత్రించాల్సి వస్తుంది. అందువల్ల రాకపోకలు ఆగిపోతుంటాయి).

**Sanjay:** I am happy. A beginning has been made. (ఏదో ఇప్పటికైనా ప్రారంభించారని సంతోషం).

**వివరణలు...**

Most of the words above are related to roads and traffic. (పై మాటలన్నీ రోడ్లు, రాకపోకలకు సంబంధించినవని తెలుస్తోంది కదా..)




**1)** The road is full of pot holes and ditches = లోతైన గుంటలు, పల్లాలు - ditch - గుంట; pot holes = పెద్ద పెద్ద గుంటలు).

**Suman:** In spite of being the capital Hyderabad roads are bad. (రాష్ట్ర రాజధాని అయినప్పటికీ, హైదరాబాద్ రోడ్లు చాలా అధ్వాన్నంగా ఉంటాయి).

**Ramana:** Yea. A spell, of heavy rain can put them out of action; pot holes and ditches are common. (అవును. ఒక మంచి వాన రోడ్లను నిరుపయోగం చేయగలదు. గుంటలు సర్వసాధారణం.)

**2) Civic bodies =** నగర/ పురపాలక సంస్థలు.

**a) Ramesh:** In spite of the high taxes they collect, most civic bodies are starving for funds. (నగర/ పురపాలక సంస్థలు పెద్ద మొత్తంలో పన్నులు వసూలు చేస్తున్నప్పటికీ అవి నిధుల కొరతతో బాధపడుతున్నాయి.)

**Yashwanth:** That's because they are all corrupt (అదంతా అవినీతి వల్ల).

b) In spite of the high taxes they collect most of them provide poor civic amenities = నగర/ పురపాలక సంస్థలు పెద్ద మొత్తంలో పన్నులు వసూలు చేసినా, వాటిలో చాలా, అధ్వాన్నమైన వసతులు కల్పిస్తున్నాయి పౌరులకు.

Civic amenities = పౌర సౌకర్యాలు.

**3) Thoroughfares =** The main/ important roads in a city or town = నగరాల్లోని ముఖ్య వీధులు.

★ The college is a little off the main thoroughfare = నగరంలోని ముఖ్య వీధి నుంచి కాస్త దూరంలో ఉంది ఆ కళాశాల.

'No thoroughfare' అనే board చాలా చోట్ల రాసి ఉంటారు. అంటే అది రహదారి కాదు, ఇతర వాహనాలకు ప్రవేశం లేదు అని.

**4) Manual =** without the help of machines = దైహిక/ శారీరకమైన (మనుషులు చేసే).

Manual (శారీరకమైన) X Mechanical (యాంత్రికమైన) (done by machines)

## Co-ordinate, collaborate diference..?

*Usha Kiran,* ***Gopalapuram.***

**Q:** He has not made a final call - Please explain this.

**A:** He has not taken a final decision.

**Q:** Co-ordinate, collaborate - Explain.

**A: Co-ordinate =** Organize so as to make different activities and the people involved in them work for a common result. (ఒక సంస్థలో వివిధ కార్యకలాపాలను, వాటిని చేసే వ్యక్తులను అనుసంధానం చేయడం, గందరగోళం లేకుండా.)

**Collaborate =** ఇద్దరు అంతకంటే ఎక్కువమంది కలిసి ఒక పనిని నిర్వహించడం - Two/ more people working together for a common purpose.

**Eg:** ఇద్దరు కలిసి పుస్తకం రాయడం.

**Q:** Please let's know about "syllables".

**A:** Syllable = an independent unit of sound in a word - A part of a word with a vowel sound (not letter) and one/ more consonant sounds.

Vowel శబ్దం ఉన్న పదభాగాన్ని Syllable అంటారు.

**Eg:** sentence = ఇందులో రెండు vowel sounds (అక్షరాలు కావు) ఉన్నాయి.

1) సెన్, 2) టన్స్- (1. sen 2. təns) కాబట్టి ఈ పదం (sentence) లో రెండు syllables ఉన్నాయి.

**Q:** Corporate schools - means what?

**A:** Corporate schools = Schools run by companies (Corporate) - different from Govt/ Municipal/ ZP/ Govt. aided schools.




## Made up of.. no meaning

*Bindu,* ***Balasamudram.***

**Q:** My hand is paining/ aching - Please say the right one.

**A:** My hand is aching - Correct.

**Q:** Made of/ Made up of - Say the difference.

**A:** Made of - To be made of something - material of which we make something. A table is made of wood.

Made up of - No such expression/ Meaningless.

**Q:** Why do food grains get spoiled - Please let's know the use of the above underlined i.e. get + $V_3$ and why get +$V_3$ is used in the above sentence?

**A:** Get spoiled = are spoiled.

In the fight he got wounded = In the fight he was wounded.

In such sentences 'get' is used in place of 'be' forms.

**Q:** Smother/ suffocate /throttle - Say the difference.

**A: Smother =** Covering something, especially a person's face so that they can't breathe; cover something/ somebody thickly (usually to kill).



**Suffocate =** to kill somebody by stopping their breathing.

When smothered, they are suffocated.

Smother = suffocate = throttle.

## Structure, structural తేడా?

*Sujatha,* ***Khazipet.***

**Q:** In the lesson no. 773 you said that the sentence i.e. "Rolling and wearing spectacles is the style of Rajnikanth, a hero" - Shouldn't "are" be there instead of the above underlined?

**A:** As both 'rolling and wearing' refer to a single act the verb is singular.

**Q:** Structure / structural - Say difference.

**A:** Structure (noun) = రూపం/ నిర్మాణం.

Structural (adj) = రూపానికి సంబంధించిన

Structural changes = రూపం/ నిర్మాణానికి సంబంధించిన (రూపం/ నిర్మాణంలో) మార్పులు.

**Q:** ఈ pen పడట్లేదు - How can we say the above in English?

**A:** The pen is not writing.



M. SURESAN

అందచందాలు, హావభావాలు, తాడో పేడో లాంటి పదాలు మన సంభాషణల్లో తరచూ వస్తూనే ఉంటాయి కదా? ఇవన్నీ జంట పదాలు. Spoken English లో కూడా ఇలాంటి మాటలు ఉంటాయి. On and off, to and fro, pick and choose, sooner or later etc. పదాలు అలాంటివే. ఈ మాటల జతల గురించి ఈ వారం తెలుసుకుందాం. ముఖ్యమైన విషయమేమిటంటే.. ఈ జంట మాటలు ముందు వెనుకలు మారవు.

**ప్రతిభ**

# meeting *on and off*

జంట పదాలతో సంభాషణ...

**Trivikram:** How is your brother? He was rather run down when I was at your place last week. (మీ తమ్ముడు ఎలా ఉన్నాడు? కిందటి వారం నేను మీ ఇంటికి వచ్చినప్పుడు నీరసంగా కనిపించాడు.)

**Naresh:** Much better now, but the worry is he is getting a temperature on and off. (చాలా మెరుగుపడ్డాడు, కానీ ఆందోళన కలిగించే విషయమేమిటంటే అప్పుడప్పుడు temperature వస్తోంది.)

**Trivikram:** The trouble I think is that he often travels to and fro to Chennai on work. (నేను నుకోవడం తరచుగా అతను ఇక్కడి నుంచి చెన్నైకి తిరుగుతుండటం వల్ల అనుకుంటా ఈ కష్టం అంతా.)

**Naresh:** I often tell him to give up the job and take some other job but he says in the present job market you can't pick and choose. You have to take what you get. (నేను తరచూ చెప్తాను వాడికి, ఈ ఉద్యోగం వదిలి వేరే ఉద్యోగం చూసుకోమని. కానీ వాడనేది ప్రస్తుత ఉద్యోగ పరిస్థితుల్లో మనకు నచ్చిన ఉద్యోగం చూసుకోలేమని, వచ్చింది తీసుకోవడమేనని.)

**Trivikram:** What he says is true too. (అతడు చెప్పేదీ నిజమే కదా.)

**Naresh:** I hope sooner or later he will get a better job. (కాస్త ముందో వెనుకో అతడికి మెరుగైన ఉద్యోగం వస్తుందని ఆశిస్తున్నాను).

**Notes:**

1) be run down = to be weak / sickly / tired = నీరసంగా ఉండటం.

2) Give up = discontinue = మానేయటం.

**FUNCTIONAL ENGLISH**




**వివరణలు..**

1) ... he is getting temperature on and off.

2) He often travels to and fro

3) You can't pick and choose

4) I hope sooner or later he will get a better job.

**1) On and off =** Occasionally (over a long period) = కొంతకాలం పాటు అప్పుడప్పుడు.

**a) Jayakar:** How do you know Seenu? Have you known him for long?

(నీకు శీను ఎలా తెలుసు? చాలా కాలంగా తెలుసా?)

**Bhagavan:** We are colleagues in the different branches of the same company. We have the opportunity of meeting on and off.

(మేం ఇద్దరం ఒకే company శాఖల్లో పని చేస్తాం. అలా మేం అప్పుడప్పుడూ కలుసుకునే అవకాశం ఉంది.)

**b) Bhaskar:** Is Prabhakar a regular visitor here?



SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 783

(ప్రభాకర్ క్రమం తప్పకుండా వస్తుంటాడా ఇక్కడికి?)

**Kesav:** No. We have meetings here on and off. He comes here on those occasions.

(లేదు. ఇక్కడ అప్పుడప్పుడు సమావేశాలు జరుగుతాయి. ఆ సందర్భాల్లో వస్తాడతను.)

**2) To and fro:** అటూ ఇటూ, తిరుగాడుతుండటం.

**a) Prakash:** I heard that the candidates in your room were free to copy.

(మీ రూంలో అభ్యర్థులు స్వేచ్ఛగా చూసి రాసుకున్నారని విన్నాను.)

**Tarun:** Invigilators, excepted to move to and fro in the room sat all the time, so the candidates felt free.

(అటూ ఇటూ తిరగాల్సిన పర్యవేక్షకులు ఒకే చోట కూర్చుండటంతో అభ్యర్థులు స్వేచ్ఛగా ప్రవర్తించారు.)

**b) Raman:** I want to see your dad. When is he at leisure? (మీ నాన్నగారిని కలుసుకోవాలనుకుంటున్నా. ఎప్పుడు తీరికగా ఉంటారు?)

**Damodar:** Only on Sundays. The other days he keeps moving to and fro Vijayawada and Hyderabad.

(ఆదివారాలే. మిగతా రోజులు ఆయన హైదరాబాద్ - విజయవాడ మధ్య తిరుగుతుంటారు.)

**3) Pick and choose:** Choose the best = మనకు నచ్చిన/ ఉత్తమమైన దాన్ని ఎంపిక చేసుకోవడం.

**a) Prahlad:** Where can we get the best of fruit here?

(మంచి పండ్లు ఎక్కడ దొరుకుతాయి?)

**Rasheed:** You speak as if you had a lot of time to pick and choose. Take what you can get. The train leaves in half an hour.

(ఏదో నీకు చాలా time ఉన్నట్టు మాట్లాడుతున్నావు. నీకు నచ్చిన, మంచివాటిని ఏరుకునేందుకు. ట్రెయిన్ అరగంటలో బయల్దేరుతుంది.)

**b) Gopal:** Here is a wide range of goods to choose from.

(ఇక్కడ విస్తృత శ్రేణి వస్తువులున్నాయి, ఎంచుకునేందుకు).

**Swamy:** Yea. I have time enough too, to pick and choose.

(అవును. నాకు టైం కూడా ఉంది, మంచివి, నాకు నచ్చినవి ఎంచుకునేందుకు.)

**4) Sooner or later:** Sure to happen but when exactly not certain

(ఎప్పుడో ఒకప్పుడు జరిగేదే, కాస్త అటూ ఇటూగా).

a) The bifurcation of AP was bound to happen sooner or later.

(ఆంధ్రప్రదేశ్ విభజన కాస్త ముందు వెనుకలుగా జరిగి ఉండేదనేది వాస్తవం.)

b) Sooner or later the brothers are sure to fall out.

(ఆ అన్నదమ్ములు విడిపోవటం జరిగే విషయమే, కానీ కాస్త ముందు వెనుకలవచ్చు అంతే.)



# Cousin brother అనొచ్చా?

*Akash Saxena,* ***Warangal.***

**Q:** Sir, please clarify the following doubts.

I was turned to stone - నేను రాయిగా మార్చబడ్డాను. Can this one be right?

**A:** Right.

**Q:** He wished he had been anywhere but there at that moment - How to say this in Telugu?

**A:** ఆ క్షణంలో అతనికి అక్కడ తప్ప ఇంకెక్కడున్నా బాగుండునని చెప్పాడు.

**Q:** The door opened into darkness, it was an outer room with one wall facing the darkness, in the light of the lamp I sat like a stone image in the flesh, I didn't know anything for certain, I was no mere image cut in granite, I was suddenly a man of flesh and blood - Please translate the above into Telugu.

**A:** తలుపు తెరుచుకోగానే చీకటి, ఆ చీకట్లో నాకు బయటి గది, చీకటిని ఎదుర్కొంటున్న గోడ కనిపించాయి. ఆ దీపం వెలుతురులో, రక్తమాంసాలున్న శిలలో మలిచిన విగ్రహంలా నేను కూచున్నా. నాకేం కచ్చితంగా తెలియలేదు. ఇంకెంత మాత్రమూ నేను రాతిలో మలిచిన విగ్రహం కాదు, రక్తమాంసాలున్న మనిషినని తెలిసింది.

**Q:** Cousin brother/ sister.

- Can the above be used in standard spoken English?

**A:** Standard spoken Englishలో 'cousin' అని మాత్రమే అంటాం. Cousin brother/ Cousin sister లేదు.

**Q:** Are/ [a:(r)], is 'r' pronounced here? As it is in between vowels, forum - ఫోరమ్.

**A:** ఇలాంటి ప్రశ్నకు చాలాసార్లు సమాధానం ఇచ్చాం. Vowel అంటే, a, e, i, o and u అనే అక్షరాలు కావు, అవి తెలిపే శబ్దాలు - అ, ఆ, ఇ, ఈ లాంటివి. ఇంతకు ముందు ఈ ప్రశ్నకు ఇచ్చిన సమాధానాలు చూడండి.

*K. Murthy,* ***Hyderabad.***

**Q:** కింద పేర్కొన్న 'Will' ఉపయోగాలను తెలిపి, వాటికి తెలుగులో అర్థం వివరించగలరు.

a) Expressing the wish or consent of the subject.

Will you do this for me?

b) A form of imperative - You will do as I say.

c) Expressing determination - You will do it. You won't go unless I say so.

d) Characteristic habit - She will sit for hours knitting.

e) Natural Tendency - Boys will be boys.

f) Statement of fact: The road will bring you to the railway station.

g) Indicating probability - This will be the house.

h) Making an assumption: You will understand my position.

i) Indicating Future- I'll come tomorrow.

j) Plain stem of have + ed (future).

You will have finished by ten.

k) Plain stem of 'have' + ed (assumption).

He will have arrived by now.




**A:** a) Will you do this for me? = ఇది కాస్త చేసిపెడతారా?

ఇక్కడ subject, 'you' అయినప్పుడు, ఇది 'you' (మనం మాట్లాడుతున్నవాళ్ళు) wish కానీ, consent (సమ్మతి) కాని కాదు. ఇది speaker చేస్తున్న request అవుతుంది.

b) You will do as I say - ఇది, a form of imperative అవుతుంది. (Imperative = ఆజ్ఞ) ఇది మర్యాదపూర్వకంగా ఆజ్ఞాపించడం.

c) You will do it - This expresses determination but that of the speaker - నువ్వది చేస్తావు (చేయాలి) - మాట్లాడేవాళ్లు నిశ్చయంగా చెప్పడం.

You won't go unless I say so - ఇది clear order (స్పష్టమైన ఆజ్ఞ).

d) She will sit for hours knitting - ఇది ఒకరు క్రమం తప్పకుండా (Regular గా)/ ఇష్టంతో చేసే పనిని తెలుపుతుంది. అయితే, she sits for hours knitting, ఎక్కువ వాడతారు, characteristic habit తెలిపేందుకు.

e) Boys will be boys - ఎప్పటికీ పిల్లలు పిల్లలే - అంటే పిల్లల్లో ఉండే సహజ ధోరణి (natural tendency) తెలిపేందుకు వాడతాం.

f) వాస్తవం - The road will bring you/ takes you to the railway station. ఈ రోడ్డు railway station కు వెళ్తుంది (యథార్థం).

g) This will be the house = This may be the house, ఈ ఇల్లై ఉండొచ్చుసంభవం (గట్టిగా చెప్పలేం).

h) You will understand my position - నా పరిస్థితి అర్థం చేసుకోగలవు - చేసుకుంటావనే అనుకుంటున్నాను. (ఇది assumption- అనుకోవడం). కానీ ఇది కూడా request గా తీసుకోవచ్చు.

i) I will come tomorrow = రేపొస్తాను - భవిష్యత్తులో జరిగే విషయం - ఇదీ will అసలు ఉపయోగం.

j) You will have finished by ten - నువ్వు పదింటికంతా ముగించి ఉంటావు.

- భవిష్యత్‌లో ఒక సమయంలో పూర్తయి ఉంటుందనుకునే విషయం.

k) Same as (j).

*Pitchaiah Sastry,* ***Girnibavi.***

**Q: i)** Probe into FEMA violations in forex derivative contracts. Please translate.

**A: i)** విదేశీ మారకానికి సంబంధించిన contractsలో జరిగిన విదేశీ మారకపు చట్ట ఉల్లంఘనల విచారణ. (Probe = enquiry = విచారణ).

FEMA = Foreign Exchange Management Act కు abbreviation.

**Q:** How many chairs do you want me to get placed in/ on the ground? - Say if the above sentence is right or wrong.

**A:** Right.

**Q:** How many pupils are present?

Say the Indirect Speech (IDS) of the above.

**A:** He asked me/ somebody how many pupils were present.


M. SURESAN

**ఒక వ్యక్తివైపు కోపంగా చూడటాన్ని English లో ఏమంటారో తెలుసా?**

**నచ్చని విషయం ఏదైనా ప్రస్తావనకు వస్తే మొహం చిట్లిస్తారు చాలామంది. స్నేహితులను ఆటపట్టించడం కొందరికి సరదా. వారి హావభావాలను అనుకరించి చూపిస్తారు. ఇంకొందరు ఎదుటివారు ఏం చెప్పినా తీసిపారేసినట్లు మాట్లాడతారు. ఇలాంటి సందర్భాల్లో Spoken English లో ఎలాంటి పదాలు వాడతారో ఈ వారం తెలుసుకుందాం..**

ప్రతిభ

# This is a *mockery*..

**ఇద్దరు స్నేహితుల సంభాషణ..**

**Damodar:** When are you going to finish reading the newspaper?
(వార్తాపత్రిక చదవటం ఎప్పుడు ముగిస్తావు?)

**Sudhakar:** Now don't frown at me for reading the newspaper. You seldom do that and so are short of general knowledge.
(వార్తాపత్రిక చదువుతున్నందుకు నన్ను కోపంగా చూడకు. నువ్వు వాటిని పూర్తిగా చదవనందువల్ల లోకజ్ఞానం తక్కువ.)

**Damodar:** You need not mock me for not reading the useless news about silly politicians who are stinking rich and don't understand our problems.
(నన్ను నువ్వేం ఎగతాళి/ గేలి చేయనక్కరలేదు, మన సమస్యలను అర్థం చేసుకోని, డబ్బు బాగా మురుగు తుండే రాజకీయవేత్తల గురించి, మన బాధలు పట్టన టువంటి వారిని గురించి చదవనందుకు.)

**Sudhakar:** I agree with you that most politicians we elect are corrupt and selfish. But we should get to know how they dupe us.
(మనం ఎన్నుకునే చాలామంది రాజకీయనాయకులు అవినీతిపరులు, స్వార్థపరులు అని నీతో నేను అంగీక రిస్తాను. కానీ ఎలా వాళ్లు మనల్ని మోసం చేస్తారో తెలుసుకోవాలి కదా?)

**Damodar:** They know they can buy votes. They have nothing but scorn and contempt for voters.
(వాళ్లు ఓట్లు కొనవచ్చని వాళ్లకు తెలుసు. వాళ్లకు ఓటర్లంటే ఏహ్యత, అసహ్యం.)

**Sudhakar:** This is a mockery of democracy.
(ఇది ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేయటమే.)




FUNCTIONAL ENGLISH

***Now look at the following expressions from the dialogue above.***

1) You don't <u>frown</u> at me.
2) You need not <u>mock</u> me.
3) They have nothing but <u>scorn</u> and <u>contempt</u> for voters.

**వివరణలు..**

**1) Frown =** 1) Look angrily, unhappily or in a confused manner. 2) An angry, unhappy or confused look. (కోపంతో/ అసహనంతో మొహం చిట్లించటం.)

**a) Sharif:** Why are you <u>frowning at me</u>?
(ఎందుకంత కోపంతో చూస్తున్నావు, మొహం చిట్లించి?)

**Sasikanth:** Because you are going to vote for the party whose leader has swindled the state of lakhs of crores of rupees.
(రాష్ట్రానికి చెందిన లక్షల కోట్ల రూపాయలు స్వాహా చేసిన పార్టీ నాయకుడ్ని ఎన్నుకోబోతున్నావు కాబట్టి.)

**Swindle =** టోకరా పెట్టడం/ నిధులు స్వాహా చేయటం.

**b) Somesh:** What are you worried about?
(దేన్ని గురించి ఆందోళన పడ్తున్నావు?)

**Sarath:** I can't forget the frown on my late dad's face at my mentioning the girl I am going to marry.
(నేను పెళ్లాడబోతున్న అమ్మాయి గురించి చెప్పినప్పుడు చనిపోయిన మా నాన్న మొహం చిట్లించడం మరచిపో లేకుండా ఉన్నాను కనుక.)

**2) Mock =** make fun of = గేలి చేయటం/ అప హాస్యం చేయటం (especially by imitating- అను కరించటం ద్వారా).

**a) Sandeep:** You remember Vighnesh, our school mate, don't you?

**Niranjan:** Yea, I do. But why talk of him now? We used to mock him a lot.
(గుర్తుంది. ఇప్పుడు వాడి ప్రసక్తి ఎందుకు? మనం వాడిని గేలి చేసేవాళ్లం కదా?)

**Sandeep:** He is now an IAS officer. We can no more <u>mock</u> him, can we?
(అతనిప్పుడు IAS officer. ఇంక అతణ్ని ఆటపట్టిం చలేం కదా?)

**b) Vinayak:** He has proved right, after all. We didn't take his words seriously.
(చివరకు అతనే correct అని రుజువైంది. మనం అతని మాటలను పట్టించుకోలేదు.)

**Giridhar:** Why say 'we'? It's you who mocked him when he said he would win the game.
('మనం' అంటావేం? తను ఆట గెలుస్తానని చెప్పిన ప్పుడు నువ్వే అతన్ని <u>అపహాస్యం</u> చేసింది.)

✪ Mock కు ఇతర అర్థాలు కూడా ఉన్నాయి.
1) గేలి చేయటం, ఇది మనం పైన చూశాం కదా.
2) Imitation = అనుకరణ.

★ **Mock Parliament =** Schools/ Colleges లో ఇవి జరుగుతుంటాయి, విద్యార్థులకు Assembly, Parliament గురించి అవగాహన కలిగించడానికి.

అలాగే Mock EAMCET - EAMCET కు practice ఇచ్చేందుకు, colleges లో EAMCET తీరులో నిర్వహించే పరీక్ష.

**3) Scorn =** A feeling that somebody is stupid or foolish; to try to show somebody is foolish or stupid = ఇతరులను/ వారి మాటలను, అభి ప్రాయాలను పనికిరానివిగా / తగనివిగా తీసిపారే యటం/ హేళన భావం.

**a) Jayanth:** Why don't you like him?
(అతడంటే నీకెందుకిష్టం లేదు?)

**Mahendra:** He scorns my <u>views and words.</u>
(నా అభిప్రాయాలన్నా మాటలన్నా అతడికి <u>విలువ లేదు. ఏం చెప్పినా పనికిరానిదిగా తీసిపారేస్తాడు.</u>)

**b) Sashank:** Parashuram is very likable.
(పరశురాం అభిమానించదగ్గవాడు.)

**Manohar:** You can say that. Though rich he never scorns the poor.
(అది నిజమే. ధనికుడైనా బీదవాళ్ల పట్ల <u>ఏహ్యభావం లేదతనికి.</u>)

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి.... www.eenadupratibha.net


SPOKEN ENGLISH ఆంగ్లభాషణ 784

*N. Balakrishna,* ***Naidupeta.***

**Q:** <u>The</u> Godavari District / Godavari District - Which one is correct?

**A:** The Godavari District - Correct, అయితే the లేకపోయినా ఫర్వాలేదు.

**Q:** Are all the first letters of Nouns written capital?

**e.g.** <u>C</u>oconut oil, <u>G</u>rammar <u>B</u>ook, <u>L</u>iril <u>S</u>oap, <u>P</u>riya <u>P</u>ickle, <u>A</u>rmy, <u>C</u>hocolate... etc.

**A:** Only if they are proper nouns, that is, if they are the names of particular persons, places, things or animals. The first letter of the names of oils like coconut oil etc should not be in capitals.

**Q:** The tops <u>of the mountains</u> were covered with snow - Here the underlined is said <u>phrase</u>. But the underlined part - says about the subject "<u>Mountains</u>". So isn't it called a "Clause"?

**A:** A <u>phrase</u> is a group of words <u>without</u> a verb. A clause is a group of words <u>with a verb</u>. The subject of a sentence is a clause, only if the subject is a group of words with a verb.

**e.g.:** <u>That he walks very fast</u> is known to every one.

Here, 'that he walks very fast' is a group of words with a verb (walks), so it is a <u>clause</u>. 'Mountains' in your sentence is just a <u>word</u>.

**Q:** I don't understand <u>what you mean</u> - Is the above underlined part a <u>phrase</u> or a <u>clause</u>? - Please explain.

**A:** 'What you mean' is a group of words with the verb, 'mean' - So it is a <u>clause</u>.



## Whims and fancies అంటే..?

*K. Ravi,* ***Madanapalle.***

**Q:** Sir, what are the meaning of following words?
1. Commissions and Omissions.
2. Whims and Fancies.
3. For one reason or the other.
4. At one point or the other.
5. He is allegedly involved.
6. Today ***happens*** to be holiday.
7. Your are <u>supposed</u> to do that.
8. He is learnt to have understood.
9. He is <u>said</u> to be.

**A: 1. Commissions and omissions -** Part of the phrase, "Acts of commissions and omissions = Doing things which we shouldn't have done and not doing what we should have done = చేయకూడనివి చేయడం, చేయాల్సినవి చేయకపోవడం.

**2.** Whims and fancies = ఇష్టం వచ్చినట్టు చేయడం.

★ A government officer cannot act according to their <u>whims and fancies</u> = ప్రభుత్వాధికారులు వాళ్ల ఇష్టం వచ్చినట్లు చేయలేరు (అంటే నిబంధనల ప్రకారమే చేయాల్సి ఉంటుందని).

**3.** For one reason or the other/ for some reason or the other = because of a reason = ఏదో ఒక కారణంతో.

★ For some reason or the other, he avoids the meetings = <u>ఏదో ఒక కారణంతో</u> మీటింగ్‌లకు రాడు.

**4.** At one point or another = at one stage or another = ఏదో ఒక దశలో.

★ He will realise his mistake <u>at one point or another</u> = <u>ఏదో ఒక దశలో</u> తన పొరపాటును అతను గమనిస్తాడు.

**5.** He is allegedly involved = అతనికి దాంతో సంబంధం ఉన్నట్లు <u>చెప్పబడుతోంది, ఆధారమేం లేదు.</u>
= People allege he is involved = అతనికి సంబంధం ఉందని అంటున్నారు, ఆధారం లేదు.

**6.** ఈ రోజు సెలవుగా ఉండటం <u>జరిగింది/ తటస్థించింది/ సంభవించింది.</u>




**7.** You are supposed to do that = You should/ must do that because the rule says so.

★ Candidates <u>are supposed to</u> maintain strict silence in the exam hall = Candidates <u>must</u> maintain strict silence....

**8.** He is learnt to have understood = We learn (= understand) that he has understood.

**9.** He is said to be = People say he is = అంటున్నారు అతను ఏదో చేశాడని.

---

*Akash,* ***Hanmakonda.***

**Q:** Wash / <u>wɒʃ</u>; <u>NAmE</u> ; <u>wɔːʃ</u>
A B C
- Please say which of the above underlined words is taken (i.e. a & c) to pronounce the word 'wash' and also please explain the above mentioned underlined symbols (from A to C).

**A:** Wash - <u>British</u> pronunciation - Wɒʃ;
<u>American</u> pronunciation - wɔːʃ
In British pronunciation, w ɒʃ - ɒ is short (హ్రస్వం) 'అ'.
In American, ɔː is long (దీర్ఘం) - 'ఆ'.

**Q:** Population / pɒpju'leɪsn; NAmE pɑːp/ - Please explain as above and also say why '<u>eI</u>' is written? Is it meant that the word is pronounced as below?
'పాప్యులెయిషన్'.

**A:** Population కూడా పై సమాధానం మాదిరిగానే.
British English - పప్యులెయ్‌షన్.
American English - పాప్యులెయ్‌షన్.
మీరు రాసినట్లు s కాదది, అది ʃ = <u>ష</u>.





M. SURESAN

మనం ఇంతవరకు Meetings/ Gatherings/ Functions లో President (అధ్యక్షులు), Chief Guest (ముఖ్య అతిథి) లాంటివాళ్లు ఎలా మాట్లాడాలో, ఎలా తమ విధులు నిర్వహించాలో, వందన సమర్పణ ఎలా ఉండాలో తెలుసుకున్నాం.

# Anchor గా వ్యవహరించేటప్పుడు..

FUNCTIONAL ENGLISH

సభను నిర్వహించేది అధ్యక్షులైనప్పటికీ, కొన్ని కొన్ని సమావేశాలు/ సభలు నిర్వహించేందుకు, సభా కార్యక్రమాన్ని తెలిపేందుకు (announce చేసేందుకు) ప్రత్యేకంగా Anchor/ Compere/ Master of Ceremonies (MC) ని నియమిస్తారు. అంశం తర్వాత అంశాన్ని ప్రకటిస్తూ సభను సక్రమంగా నిర్వహించే బాధ్యత వీరిపై ఉంటుంది. ముఖ్యంగా వినోద/ సాంస్కృతిక కార్యక్రమాల్లో ప్రతి అంశాన్ని ప్రకటించటం, అయిపోయిన అంశం గురించి వ్యాఖ్యానించడం ఈ Anchors/ Comperes/ Masters of Ceremonies చేస్తుంటారు. ఈ బాధ్యత స్వీకరించే వారు మంచి సమయస్ఫూర్తి, అప్పటికప్పుడు వ్యాఖ్యానించే శక్తిగల వాళ్లై ఉంటే కార్యక్రమం రక్తికడుతుంది. వీరు తమ విధులు ఎలా నిర్వహించగలరో ఇప్పుడు తెలుసుకుందాం.

☆ **Most Important:** కార్యక్రమం ప్రారంభానికి ముందే, కార్యక్రమ నిర్వాహకులను సంప్రదించి సభ/ సాంస్కృతిక/ వినోద అంశాల క్రమాన్ని correct గా తెలుసుకుని paper మీద note చేసుకోవడం, కరపత్రాన్ని క్షుణ్ణంగా పరిశీలించడం చాలా ముఖ్యం. ప్రాధాన్యతను (order of priority) బట్టి ఏది ముందు, ఏది తర్వాత అని నిర్వాహకులను సంప్రదించి రాసుకోవడం కూడా అంతే ముఖ్యం. అది రెండుమూడుసార్లు పరిశీలించుకుని, సవరణలేమైనా ఉంటే చేసుకోవాలి.



వేదిక మీదికి పిలవాల్సిన వాళ్లెవరు, ఏ క్రమంలో వాళ్లని పిలవాలి, వాళ్లను ఎవరు వేదిక మీదికి తోడ్కొని తీసుకువస్తారు, పుష్పగుచ్ఛాలూ, మాలలతో ఎవరు సత్కరిస్తారు అనేది ముందే రాసి పెట్టుకుని వాళ్లతో ముందే చెప్పాలి. అలాగే సాంస్కృతిక/ వినోద కార్యక్రమాలు ఏ వరసలో ఉంటాయో రాసి పెట్టుకోవాలి. వీటితోపాటు printed programme sheet కూడా దగ్గరుంచుకోవడం మంచిది.

ఇక సభ నిర్వహణ: ఒక అంశం అయిపోయిన వెంటనే, దాన్ని క్లుప్తంగా సంగ్రహించి చెప్పడం, దానిమీద ఎవరి మనసూ నొప్పించని విధంగా అప్పుడప్పుడు jokes విసరడం కూడా చేయవచ్చు. ఇలా వందన సమర్పణ దాకా సభను నిర్వహించి, ఆ తర్వాత అవసరమైతే జనగణమన ప్రకటించాలి.

ఇవన్నీ English లో ఎలా చేయాలో వచ్చే వారం తెలుసుకుందాం.



# How long *has* he *been* here?




*N. Pentaiah, Dharmajipeta.*

**Q:** Have been/ has been, had been గురించి వివరించగలరు.

**A:** కిందటి వారం తరువాయి...

Have/ has/ had/ shall have been/ should have been/ will have been/ would have been/ could have been/ might have been/ must have been - వీటిని మనం independent గానూ వాడతాం, లేకుంటే వీటన్నింటికీ past participle (PP/$V_3$) చేర్చి కూడా ఉపయోగిస్తాం.

Independent గా వాడితే, అంటే వీటి చివర been వచ్చేలా వాడితే అవి 'be' forms అవుతాయి. అంటే అవి వివిధ రకాల/ వివిధ కాలాల్లో ఉండటాన్ని తెలుపుతాయి.

**ఉదా:** ఇప్పుడు/ ఎప్పుడూ/ గతంలో/ గతం నుంచి ఇప్పటి వరకు/ ఇంకా/ భవిష్యత్‌లో ఉండటాన్ని, ఉండాల్సిదాన్ని (తప్పనిసరిగా), ఉండగలగడాన్ని, etc. తెలుపుతాయి.

అంటే 'ఉండటం' అనే అర్థం వచ్చే verbs పైన తెలిపిన 'be' forms ('be' = ఉండటం. Be here, I will come again = ఇక్కడ ఉండు. నేను మళ్లీ వస్తాను.)

పై 'be' forms కు past participles ($V_3$) చేర్చి వాడితే వివిధ రకాల/ కాలాల్లో జరిగే పనులను తెలుపుతాయి. వాటిని గత వారం తెలుసుకున్నాం.

ఇప్పుడు have/ has/ had been ఉపయోగాలు చూద్దాం. ఇవి 'be' forms. ఇవి వివిధ రకాల/ కాలాల్లో ఉండటాన్ని తెలుపుతాయి.

I/ we/ you/ they have been, He/ she/ it has been - ఇవి గతం నుంచి ఇప్పటి వరకు/ ఇంకా ఉండటాన్ని తెలుపుతాయి.

**Eg:** a) I have been in Vijayawada since 2011/ for the past three years (నేను విజయవాడలో 2011 నుంచి/ గత మూడు సంవత్సరాలుగా ఉంటున్నాను- ఉండటం, 2011 (గతంలో) ప్రారంభమై, ఇంతవరకూ/ ఇంకా జరుగుతోంది.)

b) We have been friends since our college days (మేం college రోజుల నుంచి స్నేహితులుగా ఉన్నాం.)

c) Where have you been all this time? (నువ్వింత సేపూ ఎక్కడ ఉన్నావు? / ఇప్పటి వరకూ ఎక్కడ ఉన్నావు? )

d) They have not been here for the past two years (రెండేళ్లుగా వాళ్లిక్కడ లేరు - వాళ్లిక్కడ లేకపోవడం రెండేళ్ల కిందటి నుంచి ఇంతవరకు/ ఇంకా జరుగుతోంది.)

I/ we/ you/ they తో have been వాడితే, He/ she/ it తో has been వాడతాం కదా?

**Eg:** 1) My dad has been in Bangalore for the past one week. (మా నాన్న (He) గత వారంగా - వారం కిందట ప్రారంభమై, ఇంతవరకూ/ ఇంకా బెంగళూరులో ఉన్నారు.

2) Sumithra (She) has been a teacher for the past two years. (గత రెండేళ్లుగా సుమిత్ర టీచర్‌గా ఉంది.)




3) How long has he been here? (అతనెంత కాలంగా ఉన్నాడిక్కడ? (గతంలో నుంచి ఇంతవరకు/ ఇంకా).

ఎక్కడ since, ఎప్పుడు for వాడాలి? ఇది చాలా ముఖ్యం - since = from sometime in the past = గతంలో ఒక సమయం నుంచి; for = over a period of time = గత కొంత కాలంగా.

Since August 15, 1947 = ఆగస్టు 15, 1947 నుంచి.

ఇదే for తో చెప్పాలనుకుంటే, ఇప్పుడు 2014 కదా, 1947 నుంచి 2014 వరకు ఎంతకాలమైంది, 67 years - దీని ముందు 'for' వాడతాం.

**చూడండి:** India has been independent since 1947/ for the past/last 67 years. ఈ తేడా చాలా ముఖ్యం.)

**Had been** = గతంలో ఒకదాని కంటే ఇంకొకటి ముందైతే had been వాడతాం. అంటే ఇది వాడాలంటే రెండూ past states of being గా ఉండాలి, లేకుంటే ఒక past action కు ముందున్న past being (గతంలో ఉండటం) ఉండాలి.

**Eg:** India had been under Mughal rule before it was came under British rule. (భారత్ బ్రిటిష్ పాలనకు ముందు మొగలుల పాలనలో ఉండేది. రెండూ గతంలో ఉన్నవే - అయితే ఒక ఉండటం (మొగలుల పాలనలో) రెండో ఉండటానికి (బ్రిటిష్ పాలనలో ఉండటం)/ బ్రిటిష్ పాలనలోకి రావడం - action) ముందు. అందుకని ఆ ముందుండటాన్ని 'had been' లో చెబుతాం. ఈ ఉదాహరణలు కూడా చూడండి:

★ Who told you that I had been a teacher here? (నేనిక్కడ టీచర్‌గా ఉండేదాన్ని అని మీకెవరు చెప్పారు? ) - టీచరుగా ఉండటం, చెప్పడం రెండూ గతం. అయితే టీచర్‌గా ఉండటం ముందు, చెప్పడం తర్వాత. అందుకని (ముందుండటం కాబట్టి) had been. So 'had been' for the earlier of two past states of being (ఉండటం), or a past state of being before a past action.

★ I had been worried until you came here. (మీరిక్కడకు వచ్చే వరకు నేను ఆందోళనతో ఉన్నాను).

ఇవీ Have been/ has been, had been ఉపయోగాలు. మిగతావాటిని వచ్చేవారం చూద్దాం.

*– U. Srinivasarao, Prakasam.*

**Q:** మా స్కూల్ పిల్లలకు (6 నుంచి 10 తరగతులు) ఇంగ్లిష్ నేర్పించడానికి కొన్ని సూచనలు ఇవ్వండి. Verb, Tenses, Structure... ఇలా Spoken Language కి కావాల్సినవి ఏ విధంగా నేర్పించాలో వివరించగలరు.

**A:** మీ స్కూల్ పిల్లలకు spoken English నేర్పించేందుకు, ముఖ్యంగా fundamentals నేర్పించండి.

1st am/ is/ are, was, were ఉపయోగాలు, తర్వాత ముఖ్యంగా అవి వాడి, questions ఎలా అడగాలో నేర్పించండి.

ఆ తర్వాత వాళ్ల చుట్టూ, అంటే class లో, ఇంటి దగ్గర ఉండే వస్తువులు, విషయాలు, వాటి గురించిన పదాలు (Vocabulary), వాటి గురించి questions అడగటం, answers చెప్పడం నేర్పండి. Daily life లో ఎక్కువగా వాడే వాటికి సంబంధించిన మాటలు, questions, negatives నేర్పండి.

Regular actions, actions taking place now గురించిన verb forms, వాటి questions కు వాడే do and does, past actions, వాటి questions కు వాడే did నేర్పండి.

మీరు answer చెప్పి, ఆ answer వచ్చే question వాళ్లను అడగమనండి. ఇదీ మీరు మొదట చేయాల్సింది.

*– Seethu Saxena, Warangal.*

**Q:** *They have come by road - Is this correct?*

**A:** *Correct.*

**Q:** *It has not been ruled out till now that the complaint has been filed/ lodged to/ with the police - Please let me know the meaning of the above underlined one in Telugu, is the above sentence correct?*

**A:** పోలీస్ complaint ఇచ్చారు అనే విషయం మనం కొట్టేయలేం/ కాదనలేం/ అవకాశం లేదనలేం.

*The sentence is correct.*

*– Priya, Khammam.*

**Q:** నేను ఒక ఆంగ్ల చిత్రంలో కింది sentences చూశాను.

i) They/ you are gone } Be form +
ii) He/ She/ it is gone } Past participle (PP)

Be form + PP = Passive voice కదా! అంటే - వాళ్లు వెళ్లబడ్డారు/ వాడు/ అతడు/ అది వెళ్లబడింది అని కదా అర్థం! అలా అనడం ఏంటి? దానికి బదులు They/ You have gone (or) He/ She/ It has gone అనొచ్చు కదా!

**A:** ★ Go విషయంలో is gone/ are gone - ఇలా 'be' form + gone వస్తే passive voice (వెళ్లబడ్డారు, వాడు వెళ్లబడ్డాడు అనే) అర్థం రాదు. ఇది వ్యావహారికంగా, అంటే Usage (వాడుక) ప్రకారం వెళ్లారు, వెళ్లాడు, వెళ్లింది అని అర్థం. ఇక్కడ grammar rule for passive voice apply చేయకూడదు.

★ ఇంతకు ముందు చాలాసార్లు చెప్పాం. I/ we/ you కు have gone రాదు - నేను/ మేం/ మీరు/ నువ్వు వెళ్లాను/ వెళ్లాం/ వెళ్లారు/వెళ్లావు అనే అర్థంతో.

Have you gone to Mumbai? - Wrong.




Have you been to Mumbai? (మీరు ముంబై వెళ్లొచ్చారా? / ఎప్పుడైనా వెళ్లారా? అని).

I/ we have gone to Mumbai - Wrong (No have gone with I/we).

I/ we have been to Mumbai (నేను/ మేం ముంబై వెళ్లి వచ్చాను/ వచ్చాం అని).

**Q:** i) What could have caused this.

ii) Who could have opened the door. ఇలాంటి వాక్యాలకు meanings ఎలా ఉంటాయి? explain చేయగలరు.

**A:** What could have caused this? = దీనికి కారణం ఏమై ఉండొచ్చు? / ఉండగలదు?

Who could have opened the door? = తలుపెవరు తెరిచి ఉండొచ్చు? (ఎవరై ఉండొచ్చు అనే అర్థంతో).

**Q:** "That" అనే మాటను 'అది' (Pronoun), 'ఆ' (Adjective), అని (Conjunction) - ఈ మూడు కాకుండా ఇంకా ఎన్ని రకాల అర్థాలతో వాడతారు?

**A:** That కు ఆ మూడు అర్థాలే ఉన్నాయి.

**Q:** "Past participles" కు ఎలాంటి అర్థాలు వస్తాయి (తెలుగులో)?

**A:** ఇది చాలాసార్లు వివరించాం. Past participles కు ముఖ్యంగా 'బడిన' అని అర్థం. a) The stone thrown (PP) at him hit him on the face (అతని మీద విసరబడిన రాయి, మొహానికి తగిలింది.)

b) The picture seen by a lot of people won an international award = చాలామందిచే చూడబడిన ఆ చిత్రం అంతర్జాతీయ పురస్కారం గెలుచుకుంది.

So, past participles కు బడు, బడిన అనే అర్థాలు వస్తాయి.

మరో **example:** The book written by him sold well. (అతనిచే రాయబడిన పుస్తకం బాగా అమ్ముడుపోయింది.)

**Q:** They went into the garden. ఈ sentence లో ఏది adverb, ఏది preposition తెలుపగలరు. అలాగే ఇక్కడ "The" అనే word ఏ Parts of speech? Please explain.

**A:** ఈ sentence లో Adverb లేదు, 'into' preposition, 'the', article.

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net




*J. Rajesh, **Vadlamuru.***

**Q:** Negative question - Don't they drink milk? (వారు పాలు తాగరా? ). Tag question - i) They drink milk, don't they? ii) They don't drink milk, do they? అర్థం వివరించగలరు.

**A:** They don't drink milk, do they? = వాళ్లు పాలు తాగరు కదా?

★ They drink milk, don't they? = వాళ్లు పాలు తాగుతారు కదా?

**Q:** ఒక లెసన్‌లో ఇచ్చిన సంభాషణలో:

**Roja:** ఆశ్చర్యంగా ఉంది! అది మూడు వారాలుగా ఆడుతోంది నువ్వు చూడలేదా? (You haven't seen it) అని రాశారు. Haven't you seen it (have you not seen it) అని ఉండాలి కదా?

**A:** Have you not seen it = Haven't you seen it? (Haven't you - సంభాషణల్లో వాడతాం).

**Q:** No ifs and buts, young man, you must speak out your mind.

- దీనికి తెలుగు అర్థం ఏమిటో వివరించగలరు.

**A:** అయితే గియితే లేదు (No ifs and buts) నీ మనసులో ఏం ఉందో చెప్పు.







కిందటి వారం మనం anchor గా శ్రోతలను/ ప్రేక్షకులను ఎలా ఆకట్టుకోవాలో చూశాం కదా. ప్రేక్షకులకు విసుగు పుట్టించకుండా anchor తమ విధులను ఎలా నిర్వహిస్తే బాగుంటుందో అంశాలవారీగా తెలుసుకుందాం..




# సమయస్ఫూర్తితో సభ విజయం..

వేదిక మీద మాట్లాడేటప్పుడు ఒక్క విషయం గుర్తుంచుకోవాలి - Anchor/ Compere (కాంపిఅ)/ Master of ceremonies (MC) తమ ప్రకటనల్లో ఎంత వైవిధ్యం (Variety), Spontaneity (సమయస్ఫూర్తి) చూపిస్తే అంత బాగా programme రక్తికడుతుంది. (ఇక్కడ తెలిపే వివరాలు TV programmes కు వర్తించకపోవచ్చు.)

ఇప్పుడొక practical example చూద్దాం.

మొదటగా సభా ప్రారంభానికి ముందు, ఆహూతులను వేదిక మీదికి పిలిచే ముందు, compere/ anchor calls the meeting to order. అంటే అందరూ సావధానులు కమ్మని - ఇలా:

Good evening ladies and gentlemen (General gathering అయితే)/ Good evening everybody (కళాశాల/ ఇతర విద్యాలయాల function అయితే)- ఇది బిగ్గరగా చెప్పాలి ఎందుకంటే అందరూ మాట్లాడుకుంటూ అటూ ఇటూ చూస్తూ/ తిరుగుతూ ఉంటారు కాబట్టి. (Good evening one and all - సరైన సంబోధన కాదు - అనకపోవడం మంచిది. Your attention please. This is so and so (మీ పేరు చెప్పండి) welcoming you all/ extending a warm welcome to you to the ....... celebrations (occasion/ సందర్భం చెప్పండి). In a few minutes from now we are going to start our meeting and may I request all of you to be kindly seated.

## FUNCTIONAL ENGLISH

(Wait till everybody has been seated and the place is quiet).

1. A warm welcome to all of you to the ...... celebrations/ meeting/ on the occasion of ...... (ఇక్కడ ఏ సభ జరుగుతుందో చెప్పండి).
2. First of all, on behalf of ....... (సంస్థ పేరు), I have great pleasure in inviting sri so and so, who is going to preside over the function (అధ్యక్షత వహించేవారు). ఇలా ముఖ్య ఆహ్వానితులను, వారి ప్రాధాన్యతా క్రమంలో వేదిక మీదికి ఆహ్వానించి, ఆసీనులుకమ్మని చెప్పండి. While welcoming the persons up the dais you can use a variety of expressions as follows.



★ We shall now have the pleasure of having sri/ smt so and so up the dais.

★ Sri/ Smt so and so will give us the pleasure of taking his/ her seat on the dais.

★ We shall now be happy to have sri/ smt so and so on the dais.

★ Sri/ smt so and so will grace the dais with his/ her presence, ఇలా call all those who are to be seated on the dais, and also mention the capacity they are in there - President/ Chief guest/ Guest of honour/ Special invitee etc.

★ After everybody is seated on the dais, call the concerned to garland/ honour them with a garland/ bouquet etc.

Like this go on announcing item by item with spontaneous comments/ jokes between item and item.

Anchor ముఖ్యంగా గమనించాల్సిన విషయం: సమయస్ఫూర్తిగా వ్యాఖ్యానించగలగడం, ప్రేక్షకులు/ శ్రోతలకు, విసుగు పుట్టకుండా వినోదపరుస్తూ ఉండగలగడం.

కార్యక్రమం మరీ పెద్దదైతే ఇద్దరు ముగ్గురు anchors ఉండటం, సభను/ కార్యక్రమాన్ని సజీవం (Enliven) చేస్తుంది, ఎందుకంటే అప్పుడు variety/ వైవిధ్యం ఉంటుంది.

ఒక అంశం పూర్తికాక ముందే తదుపరి అంశంలో పాల్గొనేవాళ్లను సమాయత్తపరచాలి. అంశాల మధ్య విరామం లేకుండా చూసుకుంటే ప్రేక్షకుల నుంచి గొడవ ఉండదు. మిగతా వివరాలు వచ్చేసారి...

*SK. Nazma, **Hyderabad.***

**Q:** Wisdom is needed in the choice of ends to be pursued and in emancipation from personal prejudice. Even an end which it would be noble to pursue if it were attainable may be pursued unwisely if it is inherently impossible of achievement. Many men in past ages devoted their lives to a search for the philosopher's stone and the elixir of life. No doubt if they could have found them, they would have conferred great benefits upon mankind, but as it was, their lives were wasted. I have said that, in some degree, wisdom can be taught. I think that this teaching should have a larger intellectual element than has been customary in what has been thought of as moral instruction.

- ఈ పేరాను తెలుగులోకి అనువదించి చెప్పగలరు.

**A:** మనం సాధించేందుకు ఎంచుకునే ఆశయాల్లో, మన దురభిప్రాయాల నుంచి విముక్తి పొందటంలో ఎంతో విజ్ఞత అవసరం. మన ఆశయాలు అసాధ్యం అయితే, వాటిని సాధించేందుకు మనం చేసే ప్రయత్నం ఎంత గొప్పదయినప్పటికీ, అది అవివేకం కావచ్చు/ తెలివిలేని ప్రయత్నం అవచ్చు. గతంలో చాలామంది తమ జీవితం మొత్తం పరుసవేది (Philosopher's stone = విలువలేని/ తక్కువ విలువ ఉండే లోహాలను బంగారంగా మార్చగల ప్రక్రియ) కోసం, అమృతం (Elixir of life) కోసం తమ జీవితమంతా వెచ్చించారు/ ప్రయత్నించారు. వాళ్లు వాటిని సాధించి ఉంటే, మానవాళికి చాలా మేలు కలిగించిన వాళ్లయ్యేవాళ్లు, కానీ, నిష్ఫలమైన ప్రయత్నంతో వాళ్ల జీవితాలు వృథా చేసుకున్నారు.

కొంత మేరకు విజ్ఞతను బోధించవచ్చు. నేననుకునేది నీతిబోధ అనుకునే ఈ విషయంలో మనం ఇంతవరకూ చూపిన దానికంటే ఎక్కువ మేధో స్వభావం ఉండాల్సిన అవసరం ఉంది.

Mail your comments to
pratibhadesk@eenadu.net



# Who *dropped* them?

*G. Venu Madhav, **Kakinada.***

**Q:** Sir, let me know the exact Telugu meaning of the following sentences.

a) I love b) I am loving
c) I have loved d) I have been loving
e) I loved f) I was loving
g) I had loved h) I had been loving
i) I shall love j) I shall be love
k) I shall have love
l) I shall have been loving
m) I am loved n) I am being loved
o) I have been loved p) I was loved
q) I was being loved r) I had been loved
s) I should be loved
t) I shall have been loved

**A:** 'Love' మనసుకు, అంటే భావానికి సంబంధించిన విషయం. కాబట్టి దాన్ని, చివర '-ing' వచ్చే tense forms లో వాడం. అలాగే వీటి passive forms అయిన 'being + pp' forms లో కూడా వాడం. అంటే..

**Active Voice**

am/ is are
have been
has been
was/ were
had been
shall be/ will be
shall/ will have been
} + ing forms లో వాడం

అలాగే *Passive Forms*

am/ is/ are, was/ were } being + pp (past participle - $V_3$) forms లో కూడా వాడం.

**మిగతా వాటికి అర్థాలు**

a) I love = ప్రేమిస్తున్నాను/ ప్రేమిస్తాను.

c) ఇంతకు ముందెప్పుడో (గతంలో ఏ సమయంలో అని తెలపకుండా)/ ఇప్పటి వరకు ప్రేమించాను.

e) గతంలో ప్రేమించాను.

g) గతంలో ఒక సంఘటన జరగకముందు ప్రేమించాను. (I had loved her before she got married).

i) భవిష్యత్తులో ప్రేమిస్తాను.

★ m, o, p, r, t - all passive forms.

m) నేను ప్రేమించబడుతున్నాను.

o) ప్రేమించబడ్డాను.

r) నేను ఒక సంఘటన (గతంలో) జరగకముందు ప్రేమించబడ్డాను.

s) నేను ప్రేమించబడతాను, future లో.

t) Future లో ఒక సమయానికి ముందు నేను ప్రేమించబడతాను. ఇది కూడా 'love' కు వర్తించదు. (I shall have got the job by then = future లో మనం అనుకున్న సమయానికి ఉద్యోగం పొంది ఉంటాను).

మీరు ఈ tenses అన్నీ take, see, look లాంటి verbs తో try చేయండి.

**Q:** You should have been to a / the doctor - Please say in Telugu and also explain which article is correct?

**A:** నువ్వు డాక్టర్ దగ్గరికి వెళ్లుండాల్సింది. ఇక్కడ 'a' వస్తుందా 'the' వస్తుందా అనేది, మనం ఇంతకు ముందు ఏ డాక్టర్ దగ్గరికి వెళ్లకుండా, ఏ doctor అయినా సరే, 'a' doctor, మనం ఫలానా డాక్టర్ అని చెప్పాలన్నా, మనం ఎప్పుడూ వెళ్లే doctor అయినా 'the' వాడతాం.

**Q:** అతడు ఎంత తిట్టినా పట్టించుకోడు, వాడికి సిగ్గు లేదు. ఒక్కసారి చెబితే అర్థం కాదా నీకు. Please translate into English.

**A:** He doesn't bother however much you scold him. He has no sense of shame.

OR

Scold him any number of times, he doesn't just bother. He has no sense of shame.

*Roshini, **Ananthapur.***

**Q:** He was looking straight over at them/ He was looking over at them/ He was looking straight at them/ He was looking over straight at them - Say difference.

**A:** He was looking straight over at them = He was looking straight at them = అతను తిన్నగా వాళ్ల వైపే చూస్తున్నాడు (Past).

★ He was looking over at them, He was looking over straight at them - no meaning.




**Q:** ఆ బుక్స్ ఎవరు పడేశారు. - Please say in English.

**A:** Who threw the books down? (కావాలని పడేస్తే)/ who dropped them? (ఎవరు కింద జార విడిచారు? )

**Q:** i) మీరు మీ దుస్తులకు అత్తరు పూశారా? (రాశారా? )

ii) మీరు మీ మొహానికి పౌడరు రాస్తారా/ రాశారా?

- Please say the above in English.

**A:** i) Do you spray your clothes with scent/ perfume (పూస్తారా? )/ Did you... (పూశారా? )

ii) Do you apply powder to your face?

**Q:** The pen can't be Rs.15/-. It'd be much less (It'd = It would) - Please let me know why the word would is used here?

**A:** It would be - probability (ఉండవచ్చు/ ఉంటుందేమో).

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

## శ్రోతలను విసిగించకుండా..

కిందటి వారం Anchor గా వ్యవహరించేవాళ్లు సభను ఎలా నిర్వహించాలో కొంతవరకు చూశాం కదా. మిగతాది ఇప్పుడు చూద్దాం.

### FUNCTIONAL ENGLISH

Anchor/ Compere/ Master of ceremonies గా వ్యవహరించేవాళ్లు, ఒక అంశం (item) అయిపోగానే వేదిక మీదికి వచ్చి, అయిపోయిన అంశం గురించి చాలా క్లుప్తంగా వ్యాఖ్యానిస్తే బాగుంటుంది. ఇలా:

We have just heard Sri/ Smt so and so giving his/ her experiences (అనుభవాలు)/ views (అభిప్రాయాలు)/ reflections (ఆలోచనలు) on the topic of........

We assure you, sir/ madam that we have benefited a lot from your speech. Thanks a lot sir/ madam.

ఇప్పుడొక speaker అయిపోయారు కదా. ఇంక next speaker ను పిలవాలి anchor.

It will now be our privilege to listen to sri/ smt so and so on this topic. He/ she will tell us now his/ her views/ experiences/ reflections on the topic. ఇలా పేరు పేరునా పిలవడం, వాళ్ల ఉపన్యాసాలు ముగిసిన తర్వాత, వారి ఉపన్యాస సారాంశం తెలపడం, తర్వాతివారిని ఆహ్వానించడం చేయాలి. మధ్యమధ్యలో ఎవరి మనసూ నొప్పించని విధంగా ఒకటి రెండు jokes కూడా వేస్తుంటే శ్రోతలకు విసుగు పుట్టకుండా ఉంటుంది.



ఉపన్యాసాలు మాత్రమే ఉన్న (వినోద కార్యక్రమాలు లేని) కార్యక్రమాన్ని రక్తి కట్టించగలగడం, anchors కు నిజమైన సవాలు. అందుకే ఇలాంటి serious programmes లో anchor మంచి jokes తో సిద్ధంగా ఉంటే శ్రోతలకు విసుగు రాకుండా ఉంటుంది. అలా చేయాలంటే బాగా prepare అవడమే మార్గం. అంతేకాకుండా సమయస్ఫూర్తితో వ్యవహరించాల్సి ఉంటుంది. ఎవరైనా మంచి anchor గా ఎదగొచ్చు, శ్రద్ధ, పట్టుదల ఉంటే.

ఇవన్నీ English లో ఎలా చేయాలో, వినోద కార్యక్రమాలు ఉన్నప్పుడు, కార్యక్రమంలోని అంశాలు కలిగించే వినోదాన్ని మనం anchor గా మరింత ఎక్కువ ఎలా చేయవచ్చు లాంటివి వచ్చే వారం చూద్దాం.

ఇవన్నీ చేయాలంటే మనకు ముఖ్యంగా కావాల్సింది English communication skills మీద పట్టు. ఇది మనం చేసే practice ను బట్టి ఉంటుంది.

*Rudrama Naidu, **Balasamudram.***

**Q:** Germs will cause us/ will make us ill/ sick - Say the right one.

**A:** Germs make us (not will make us) sick/ ill = correct = Germs will cause us to be sick/ ill.

**Q:** For/ During a while, For/ During a pause - Please let me know the correct ones.

**A:** For a while, during a pause - Correct.




# 'News' is uncountable..




*Pratibha, **Venkatayapalem.***

**Q:** By whom was the bell rung?/ the book taken by?/ Who was the bell rung by?/ was the book taken by? - Which one is correct?

**A:** By whom was the bell rung/ the book taken by? - This is old usage, and not modern English. In present day English, 'Whom' is no longer used. 'who' is used, with the passive preposition 'by' coming in the end. So who was the bell rung by/ taken by? is correct.

**Q:** Ambrosia/ Nectar/ Manna/ Elixir - Do all these words give the same meaning?

**A:** **Ambrosia =** రోమన్ పురాణాల్లో - In Roman Mythology, the food of the gods = Nectar (Greek/ Roman Mythology).

However, Nectar has other meanings too:

a) the sweet juice in flowers that bees collect to make honey b) Any sweet and delicious liquid.

**Manna =** (in the Bible) food miraculously given to the Israelites (people who followed Moses).

**Elixir =** a magic liquid which people of ancient times believed could cure any disease/ a sweet and tasty drink.

So there are differences among them.

**Q:** Who were called Indir and by whom/ who? - Which is correct?

**A:** Who were called Indir by and by whom? (old fashioned).

Who were called Indir and who by? (Present day English).

**Q:** In which state the sun rises first?/ Which state the sun rises in first - Which one is correct? And also please say whenever we write the unique like Sun/ Moon/ Earth - then do we have to write the first letter of them as capital?

**A:** Both are correct.




No, the first letter of unique things like the sun/ the moon, etc. should not be in capitals.

**Q:** I have heard a good news/ a good piece of news - Which one is correct?

**A:** 'News' in English is uncountable, so we don't use 'a' before 'news' and we don't use it in the plural.

**eg:** This is a news/ a good news/ an important news - Wrong. News/ good news/ important news - Right.

A piece of news - Right.

*Pooja Pallavi, **Nehrunagar.***

**Q:** Please clarify the following doubts:

★ Not only is he foolish, but also obstinate/ He is not only foolish, but also obstinate - Which is correct?

**A:** Not only is he foolish, but also obstinate = He is not only foolish, but also obstinate. (If you begin the sentence with 'not only' the verb is before the subject - is (verb), he (subject)).

**Q:** No sooner did the peon ring the bell than the pupils went away/ No sooner when the peon rang the bell than the pupils went away - Which is correct?

**A:** No sooner did the peon ring the bell, than the pupils went away - Correct. The other sentence is wrong.

**Q:** Please translate the following into English.

a) ఆ museum open అయి మూడు రోజులైంది.

b) ఆ lesson చెప్పి నాలుగు రోజులైంది/ ఒక నెల అయ్యింది.

**A:** (a) It is three days since the museum opened.

b) It is four days/ a month since the lesson was taught/ done.

**Q:** He feels as if he is jumping/ he were jumping - Which is correct?




**A:** ....... as if he were jumping - Correct.

**Q:** Please explain the following.

★ She wants/ wanted the Law to have come/ to have meet him/ to had meet him.

**A:** She wanted the... (I am not able to understand the word here) to come and meet him - Correct.



## Ramesh did kill అంటే..

*Anil Kumar Reddy, **Hyderabad.***

**Q:** I have seen in Hindu paper:

★ Ramesh was killed in early hours - In this sentence why they write Ramesh has killed/ Ramesh did kill.

★ And "They were killed/ Four person were killed".

Please clarify - Why they are using were/ was?



M. SURESAN

**A:** Ramesh was killed in the early hours = నిన్న అర్ధరాత్రి తర్వాత (అంటే తెల్లారితే ఇవాళ) రమేష్ చనిపోయాడు (Accident అయితే)/ హత్యకు గురయ్యాడు (హత్య అయితే).

★ Ramesh did kill అనడం, Ramesh was killed కు పూర్తి వ్యతిరేకం - Ramesh did kill = Ramesh killed = రమేష్ చంపాడు (ఎవరినో).

★ Ramesh - singular; so Ramesh was; They - plural, so They were.

*Sravani, **Nandyal.***

**Q:** ఇంగ్లిష్‌లో passive voice లో కాకుండా 'Been', 'Being' పదాలు ఇంకా ఏ విధంగా వాడవచ్చో వివరించగలరు. ఈ కింది భావాలను తెలపడానికి నేను రాసిన వాక్యాల్లో Been, Being లను ఉపయోగించిన తీరు సరైనదేనా?

1) Being their faithful servant, finally he cheated them.
2) Being she is very intelligent, she succeeded in dealing the situation.
3) Being it is one of the best products of WIPRO, today it is known to every consumer.
4) Being she was disgraced by him, she's decided not to Ravi from now on.
5) Being my watch is damaged, I returned it to the shop.
6) Been beaten by master, Ravi didn't go to school today.

**A:** 1) Having been their faithful servant for years, he finally cheated them = ఏళ్లతరబడి, వాళ్లకు విశ్వాసపాత్రుడైన సేవకుడిగా ఉండి, చివరకు వాళ్లను మోసగించాడు.

2) Being she is very intelligent - Wrong.

★ She being very intelligent succeeded in dealing with the situation/ Being very intelligent, she succeeded.... - Right.

3) Being it is one of .......

4) Being she was disgraced by, ..... 5) Being..... 6) ..... - All incorrect.

*The correct statements are:*

3) It being one of the best products,.....
4) She having been disgraced by him, ... decided not to meet Ravi from now on.
5) The watch having been damaged....
6) Beaten by his master...

(3–6: Correct)

*SK. Siraj, **Nellore.***

**Q:** Sir, X class lesson లో ఒక sentence ఈ విధంగా ఉంది:

"I call it my chicken drumstick" joked Nick. Who was born in Melbourne, Australia, but now lives in Los Angeles, 'I'd be lost without it'. - Underline చేసిన వాటికి అర్థం వివరించి, sentence పూర్తి అర్థం చెప్పండి.

**A:** **Chicken drumstick =** The lower part of chicken's leg, cooked and eaten. (కోడి కాలు కింద భాగం, వండి తింటారు).

*I'd be lost without it:*

Be lost without something = be unable to live/ work without something.

I'd be lost without it = I can't live without eating the lower part of the chicken's leg (cooked).

మొత్తం sentence: దాన్ని నేను కోడికాలని పిలుస్తాను. అది తిననిదే నేను బతకలేను.

**Q:** మెట్లు దిగి కిందికి రండి - Please say in English.

**A:** Come down the steps and come here.

**Q:** ఆ school మా ఇంటికి అవతల ఉంది - అంటే మా ఇల్లు దాటితే / దాటి వెళ్తే ఆ school వస్తుంది. - Please translate into English.

**A:** The school is past our home.

**Q:** మిమల్ని విడదీస్తున్నందుకు ఏమి అనుకోవద్దు - అంటే ఇక్కడి ఉద్దేశం వాళ్లు విడివిడిగా కూర్చుంటే చదువుతారని - Please translate into English.

**A:** Sorry for troubling you.

**Q:** He is to go/ He to go - Please explain in Telugu.

**A:** He is to go = He should go = అతను వెళ్లాలి.

He to go = No meaning, not a sentence.

**Q:** We will have painted the house by tomorrow - Please say the passive voice.

**A:** The house will have been painted by us tomorrow.

# FUNCTIONAL ENGLISH

**Anchor/ Compere ఎలా ప్రేక్షకులను విసిగించకుండా ఉత్సాహపరుస్తూ ఉండాలో గత వారం వివరించాం. ఒక వినోద కార్యక్రమానికి anchor గా వ్యవహరించడం ఎలాగో ఇప్పుడొక ఉదాహరణ చూద్దాం.**

Hi friends (formal అయితే)/ Hi guys (informal అయితే), get ready to be entertained.

First of all, we are going to see a group dance (బృంద నృత్యం) by ....... (so and so) - be prepared to carried off your feet by the dance. Here it is (Dance follows).

After dance, the anchor: I'm (I am) sure that you all enjoyed the dance - Here are the members of the dance troup - ఇది నాట్య బృందంలోని సభ్యులను వేదిక మీదికి పిలవడం.



Bring your hands together (చప్పట్లు చరచండి), dear friends, they deserve your cheers.

Next, we are going to listen to the lilting tunes of the music of so and so (కళాకారుల పేరు) playing the guitar. He/ She is going to be accompanied on the drums by so and so, and so and so will accompany him on the keyboard (వాయిద్యం). Don't miss a single moment of it. Let me not make you wait any longer.

*(Music)*

That was so and so (Guitarist పేరు) entertaining us by his wonderful skill on the guitar. I am sure you have enjoyed it.

Next, here is something that you can't miss. So and so will entertain you with a breakdance item. Let me not stand between you and the artiste - welcome her/ him with a big hand (కరతాళ ధ్వనులతో).

ఇలా ఒక్కో అంశాన్ని ప్రకటిస్తూ అంశం ముగియగానే క్లుప్తంగా మన వ్యాఖ్యలు చేసి, తర్వాతి అంశాన్ని ప్రకటించాలి. ముఖ్యమైన విషయం: ప్రేక్షకులకు విసుగు కలగకుండా jokes చాలా అవసరం. ఇంకా కళాకారులను వారి ప్రదర్శనకు ముందు పరిచయం చేయాలి. ఇది క్లుప్తంగా ఉండాలి.

*More next week.*

*– Sravani,* ***Nandyal.***

**Q:** సర్! కింది వాక్యాల్లో been ఉపయోగించిన తీరు సరైనదేనా?

i) Mr. Nirmal has improved been learning English for /since six months.

ii) Been our companion since six months, now she is not coming to us as she has become a famous T.V. anchor.

iii) Been it was hot sunny they didn't attend the meeting yesterday.

**A:** i) Mr. Nirmal has improved, having been learning English for the past six months.

ii) Having been our companion for six months, she is however not coming to us.... Correct.

iii) It/ the day being hot and sunny, they... Right.

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

*Rudrama Naidu,* ***Balasamudram.***

**Q:** We should not eat the food sold/ which is sold by roadside vendors - Please say the right one.

**A:** We should not eat the food sold by roadside vendors = We should not eat the food which is sold by roadside vendors.

**Q:** Write a para on the lion - Is this correct?

**A:** Correct.

# ప్రతిభ

# I *would* do it if..

*G.M. Jelani,* ***Visakhapatnam.***

**Q:** Sir, please explain the usage of should and would with examples.

**A: Should** = must - expresses 1) Order (ఆజ్ఞ) 2) Duty (విధిగా చేయాల్సిన పని 3) Necessity (అవసరం కొద్దీ, తప్పని పని).

a) You should finish the work in an hour = గంటకంతా ఆ పని పూర్తి చేయాలి (Order).

b) I should be at office from 10 to 5 (10 నుంచి 5 వరకు నేను ఆఫీస్‌లో ఉండాలి) (Duty).

c) I should be at station by 10 or I will miss the train. (స్టేషన్‌లో పదింటికంతా ఉండాలి, లేకుంటే బండి వెళ్లిపోతుంది. (Necessity).

**Would:** a) Would is the past form of will - ఇప్పటి నుంచి భవిష్యత్తుకు will ఎలా వాడతామో, గతం నుంచి భవిష్యత్‌కు would వాడతాం.

★ They said that they would meet me soon (వాళ్లు త్వరలోనే నన్ను కలుసుకుంటామని అన్నారు - అన్నది past, past నుంచి త్వరలోనే అనేది, future. అది తెలిపేందుకు "Would") అంటే will కు past, would.

**Compare:** i) He says he will go (future from present)

ii) He said he would go (future from past)

b) 'Would' expresses wish (కోరిక), especially with I.

★ I would (wish) he were here. (అతనిక్కడ ఉంటే ఎంత బాగుండేది!)

c) In the question form 'would' expresses a polite request.

# SPOKEN ENGLISH
## ఆంగ్లభాషణ 803

★ Would you help me in this matter? (ఈ విషయంలో కాస్త సాయం చేస్తారా? )

d) A past habit/ habitual action (గతంలో అలవాట్లు/ క్రమం తప్పకుండా జరిగిన పనులు).

★ Those days I would get up at 4 in the morning and go for a long walk. (ఆ రోజుల్లో నేను పొద్దున నాలుగింటికి లేచి చాలా దూరం నడిచేవాడిని.) ఈ ఉపయోగంలో ఇది 'used to' తో సమానం.




e) పై లాంటిదే మరో ఉపయోగం - I did try my best, but the car wouldn't (would not) start. (నేను శాయశక్తులా ప్రయత్నించాను, అయినా car start అవదే.)

f) With the meaning of 'wish to'.

★ I would do it if I were not busy (నేను busy కాకపోతే నేను చేస్తానది/ చేయాలని ఉంది - కానీ నేనిప్పుడు busy, చేసే పరిస్థితి లేదు).

g) 'Would' expresses preference. (రెండింట్లో ఏది ఎక్కువ ఇష్టమో చెప్పేందుకు) - would rather తో.

★ I would rather walk than go by the bus. (బస్‌లో వెళ్లడం కంటే నడవటమే నాకిష్టం).

**Q:** మీరు ఒక లెసన్‌లో Having been usage ను వివరిస్తూ కింది వాక్యాలను ఉదహరించారు.

i) Having been deceived by him once, I don't trust him any more.

ii) Having been selected, he is happy. ఈ వాక్యం మొదటి భాగం Past tense లో ఉంది కదా? మరి తర్వాతి sentence కూడా అలాగే ఉండాలి కదా? అప్పుడు Having been deceived by him once, I won't trust him any more, Having been selected he was happy కరక్టేనా? వివరించగలరు.

**A:** Having been = అయినందున/ ఆ విధంగా ఉన్నందున (గతంలో)/ ఇంతవరకూ ఉన్నందున.

★ Having been hit by a lorry, he is seriously injured = Lorry అతన్ని ఢీకొనటంతో/ వల్ల అతను తీవ్రంగా గాయపడ్డాడు.

ఇలాంటి sentences లో having been phrase, sentence లో తర్వాత జరిగిన విషయానికి కారణం.

'Having been' ఇక్కడ గతాన్నే (past ను) సూచిస్తుంది. అంత మాత్రాన Main clause లోని verb past tense లో ఉండాలని లేదు.

Rule ఏంటంటే, Main clause verb past అయితే, subordinate clause verb కూడా past tense లో ఉండాలి. అదే, Main clause verb, present/ future అయితే, subordinate clause verb ఏ tense లో అయినా ఉండవచ్చు - అర్థం చెడనంతవరకు.



# Staff కి Crew కి తేడా ఏమిటి?

*G.V. Venkat,* ***Chowlamaddi.***

**Q:** Sir let me know the difference between..

a) Commission and Tribunal
b) Staff and Crew
c) Photostat and Xerox
d) Moratorium and Prohibition
e) Quotation and Estimate
f) Scrutiny and Verification
g) Suspend and Dismiss
h) Gift and Presentation
i) Altimatum and Warning
j) Guidence and Counselling

**A:** a) **Commission** = A group of people a government chooses to control something or study a problem, its causes and the solution.

**Eg:** The Election Commission = A group of people having the power to control all things connected with general elections.

**Tribunal** = A type of court like group of people with the powers of a court, to settle a particular dispute (వివాదం). Eg: River Waters Tribunal. (To act like a court to settle disputes about river waters.)

b) **Staff** = Group of people working in an organization = సంస్థలో పనిచేసే సిబ్బంది.

**Crew** = The group of people working on a ship/ plane/ train/ bus/ any transport vehicle = ఓడలు/ విమానాలు/ రైళ్లు/ బస్‌లులాంటి వాహనాల్లోని సిబ్బంది.


M. SURESAN

c) **Photostat** = a photocopy of a document/ paper, etc.

**Xerox** = a photocopy made by Xerox company photostat machine. (Xerox is the first and the most famous of all photostat companies and so, photocopies are called xerox.)

d) **Moratorium** = Stopping something temporarily with the agreement of the parties concerned (సంబంధించిన అందరి సమ్మతితో ఏదైనా కొంతకాలం/ తాత్కాలికంగా ఆపడం).

**Prohibition** = నిషేధం/ Ban (for an indefinite period/ నిరవధికంగా.)

e) **Quotation** = The amount a person says they will charge for a particular piece of work/ an article (ఏదైనా పని చేసేందుకు/ ఏ వస్తువైనా సరఫరా చేసేందుకు ఒక సంస్థ వసూలు చేసే మొత్తం.)

**Estimate** = Assessing how much is needed of something (ఏది ఎంతకాలం పాటు ఎంతకావాలో అంచనా వేయడం.)

f) **Scrutiny** = a close examination of something to get information/ know about it = నిశిత పరీక్ష.

**Verification** = try to find out if something is true/ correct = ఏదైనా విషయం నిజమో కాదో తెల్సుకోవడం.

g) **Suspend** = stop something temporarily/ stop a person temporarily from working = (తాత్కాలికంగా ఆపడం/ తాత్కాలికంగా విధులు నిర్వర్తించకుండా చేయడం.)

**Dismiss** = Remove someone from their job = విధుల నుంచి తొలగించడం పూర్తిగా.

h) **Gift** = Present (కానుక)

**Presentation** = Occasion/ Ceremony when presents (gifts) are given - (బహూకరణ ఉత్సవం).

i) **Ultimatum** (Altimatum కాదు) = Final warning after which there will be no more warnings and only action (చివరి హెచ్చరిక - దీని తర్వాత ఇంకేం హెచ్చరికలూ ఉండవు, చర్య మాత్రమే.)

**Warning** = 1) Cautioning about approaching danger (ప్రమాద హెచ్చరిక).

2) Indication of action being taken against doing something (హెచ్చరిక చర్యలను గురించి.)




*j)* ***Guidance*** *(Guidence కాదు) = Help or advice older or more experienced people give somebody (తెలియని విషయాలు తెలియజేసే పెద్దల/ అనుభవజ్ఞుల సలహాలు, సహకారం.)*

***Counselling*** *= Professional advice/ advise or help given by qualified/ trained people about a problem. (ఒక రంగంలో నైపుణ్యం/ శిక్షణ ఉన్నవాళ్లు ఇతరులకిచ్చే సలహాలు/ మార్గదర్శకాలు.)*






*Roshni,* ***Kakinada.***

**Q:** We bear cold in winter/ We bear cold during winter.

**A:** We bear the cold in winter - Correct. (During = at any time in a particular period). Winter is cold throughout and so 'in winter' is correct.

**Q:** Cool/ cold - Let me know the difference. **e.g.** Cold water/ cool water.

**A:** Cold is uncomfortable/ inconvenient - We don't like it.

Cool - Cold in a pleasant way - ఆహ్లాదకరంగా, చల్లగా ఉన్న.

**Q:** Huge/ big/ mighty/ broad - Explain.

**A: Huge =** big/ large in size or amount = పరిమాణంలో గానీ/ కొలతలో గానీ పెద్దదైన.

★ Huge building/ crowd/ debt/ amount of money etc. = Big = large in size/ appearance, etc.

**Mighty =** Powerful and strong - a mighty fighter/ mighty blow (పెద్ద దెబ్బ).

**Broad =** Having breadth = Wide = వెడల్పైన. (పొడవు, వెడల్పులకు సంబంధించి.)

**Q:** Peculiar/ Exclusive - Please explain.

**A: Peculiar =** Odd/ different from the usual = విచిత్రమైన/ మామూలు కంటే భిన్నమైన/ unusual.

**Exclusive =** Special/ limited to one person/ one group/ of only one variety.

★ Travelling by air force plane is the exclusive privilege of the PM. (ప్రధానమంత్రికి మాత్రమే పరిమితమైన ప్రత్యేక అవకాశం.)

**Q:** He is quite at home with Maths/ He is at home with Maths/ He is good at Maths.

**A:** Be at home = 1) not feel difficult = be easy (of subjects of study).

2) feel comfortable and happy.

★ Be at home in, not with.

**Q:** She is married to him/ She is married with him.

**A:** ..... married to him - Correct.

**Q:** While/ When - Explain. Please translate the following into Telugu.

a) ఆమె పుస్తకం చదువుతూ నిద్రపోయింది.

b) ఈ పోరాటంలో నేను వాళ్లను కాపాడతానో లేక నన్ను నేనే కోల్పోతానో తెలియదు.

**A: While =** When. While, however, refers to a continuous action.




a) (While) reading the book, she fell asleep.

b) I don't know if in this fight I am going to save them or lose myself.

**Q:** He went to bed watching / by watching /on watching the T.V./ T.V.

**A:** ....... to bed watching the TV - Correct.

**Q:** She must be cooking/ She is cooking.

**A:** a) She must be cooking = You do not see her cooking, but you are sure that at the time of your saying this she is cooking.

b) She is cooking = You see her cooking (She is doing the cooking).

*Vishal,* ***Ongole.***

**Q:** Sir please say how the following are said in English.

i) ఆయన నాలుగు రోజులుగా college కి రావడం లేదు.

ii) మీరు school కి ఎన్ని రోజులు present అయ్యారు/ absent అయ్యారు?

**A:** i) He has not been attending college for the past four days.

ii) For how many days have you attended/ have you been absent from college?

# She is married *to* him

*Srimannarayana,* ***Srikakulam.***

**Q:** Sir, please clarify the following doubts.

i) They are stood = వారు ఇప్పుడు నిలబడి ఉన్నారు.

ii) They have been stood = వారు కొంత కాలం నుంచి ఇప్పటి వరకు నిలబడి ఉన్నారు.

Are the above translations correct?

**A:** They are stood - Verb: are (be form) + stood (Past Tense (PT)/ Past participle (PP /$V_3$).

a) English లోని six verb forms లో be form + Past tense form లేదు. కాబట్టి is stood అనే verb ఉండదు.




b) ఒకవేళ are stood - are + PP అనుకుంటే అది Passive Voice అవుతుంది; అయితే stand లాంటి verbs కు passive voice ఉండదు, ఎందుకంటే stand = నిలబడటం. ఎవరిని/ దేన్ని నిలబడటం? అనే ప్రశ్నకు, answer రాదు కాబట్టి, stand, walk, go లాంటి verbs కు Passive Voice ఉండదు. కాబట్టి They are stood - WRONG (Not a sentence).

They stood - OK. Meaning, వాళ్లు నిలబడ్డారు.

అలాగే They have been stood కూడా sentence కాదు. ఎందుకంటే have been stood కూడా have been + Past tense/ Past participle. పైన చెప్పినట్టు ఇది కూడా 'be' form + (have been) + PT అనుకుంటే అలాంటి verb form English లో లేదు - కాబట్టి ఇది తప్పు. Stood, PP అనుకుంటే, stand కు పైన చెప్పినట్టు passive లేదు. కాబట్టి They are stood/ They have been stood సరైన English కాదు.

**Correct:** 1) They stood

2) They have been standing.

They stood = వాళ్లు నిలబడ్డారు.

They have been standing = వాళ్ల కొంత కాలం నుంచి ఇంకా నిలబడి ఉన్నారు.

**Q:** Contract పని మీద రాజు నెల్లూరు వెళ్తానంటే ఎందుకు వద్దంటున్నావు = Why are you obstructing/ not allowing/ permitting Raju to go to Nellore on contract work? - Is this correct?

**A:** When Raju wants to go to Nellore on contract work, why are you asking him not to? (వద్దంటున్నావు కదా? Obstructing = అడ్డగించడం, not permitting అనుమతించకపోవడం - ఇక్కడ సరికాదు.)

**Q:** పట్టుదలతో సాధిస్తే రాని విద్యంటూ లేదు = There is no art which can't be got if it is tried determinatively.

**A:** There is no art which can't be learnt if you try with determination.

**Q:** If he were taking the exam then he will finish it in one hour.

**A:** If he were taking the exam, he would finish it in time.



## Glance: take a quick look


M. SURESAN

*G.V. Venkat,* ***Chowlamaddi.***

**Q:** Sir let me know the difference between..

a) Insurance and Exgratia
b) Cancel and Delete
c) Panic and Disaster
d) Motto and Slogan
e) Jail and Prison
f) Gaze and Glance
g) Drought and Famine
h) Scarcity and Scanty
i) Courtesy and Source

**a) Insurance =** Payment of costs and damages against the regular payments by customers (బీమా).

**Exgratia =** (Usually an amount of money) given as a gift/ favour according to law (చట్టం ప్రకారం ఎక్కువగా డబ్బు రూపంలో చెల్లించే/ కానుకగా ఇచ్చే సౌకర్యం).

**b) Cancel =** Order/ decide that something due to happen should not (రద్దు చేయడం).

**Delete =** Remove (తొలగించడం, ఏదైనా విషయాన్ని ఒక జాబితాలోంచి).

**c) Panic =** Great fear caused by a disaster (విపత్తు). (విపత్తు వల్ల లేదా విపత్తు జరుగుతుందనే భయం వల్ల కలిగే విపరీతమైన భయం/ దడ.)

**d) Motto =** A short sentence/ phrase expressing the aims and beliefs of a person/ an organization / a group of persons (ఒక వ్యక్తి/ సంస్థ/ వ్యక్తుల సమూహం ఉద్దేశాలు, నమ్మకాలు తెలిపే వాక్యం/ పద సముదాయం.)

**eg:** 'ప్రజల కోసమే మేం' అన్నది AP Police Motto. (ఆదర్శం/ నమ్మకం/ ఉద్దేశం.)

**Slogan =** An easy to remember word/ phrase used by political parties/ by ads to attract people's attention. (ప్రజలను ఆకర్షించేందుకు రాజకీయ పార్టీలు/ ప్రకటనల్లో వాడే ఆకర్షణీయమైన నినాదాలు.)

**e) Jail =** Prison

**f) Gaze =** Look fixedly at something/ someone for a long time in admiration/ wonder (మెచ్చుకోలుతోకానీ/ ఆశ్చర్యంతోకానీ ఒకరిని/ ఒక వస్తువును కళ్లు తిప్పుకోకుండా అలాగే చూడటం.)

**Glance =** Take a quick look (దేన్నైనా/ ఎవర్నైనా క్షణకాలంపాటు చూడటం.)

**g) Famine** (Scarcity of food = క్షామం/ కరవు) is the result of drought (వర్షాలు లేకపోవడం/ వర్షాభావం.)

**h) Scarcity =** Lack of sufficient quantity of something/ something not being available (కొరత/ లేమి.)

**Scanty =** Too little (చాలా తక్కువ).

**i) Courtesy =** 1) Politeness (మర్యాద).

2) With the permission of (అనుమతితో).

**Source =** Place/ person/ thing that we get, something from (మూలం/ ఆధారం).

★ The Samskrita Mahabharatam is the source of the Telugu Mahabharatam.




**కిందటిసారి మనం anchor గా ఎలా programme ను నడిపించాలో తెలుసుకోవడం ప్రారంభించాం కదా. ముఖ్యంగా entertainment programme ను (వినోద కార్యక్రమాన్ని) నడపటంలో Anchor/ Compere/ Master of ceremonies ఎంత ఉత్సాహంగా ఉంటారో ప్రేక్షకులు అంత సరదాగా ఉంటారు. కళాకారుల ప్రదర్శనా కార్యక్రమం ఆహ్లాదకరంగా సాగుతుంది.**

## FUNCTIONAL ENGLISH

The last article the item announced was a break dance item. As the item ends, and before the next item goes on the stage, the anchor can interact directly with the audience (ప్రేక్షకులతోనే నేరుగా సంభాషించే ప్రయత్నం చేస్తే, వాళ్లకు విసుగు లేకుండా ఉంటుంది) and that gives them a sense of participation and ensures their involvement in the proceedings. The anchor can say something like this:

So how was our friends' break dance, guys? Wonderful, wasn't it? That carried you off your feet, didn't it? (మిమ్మల్ని గాలిలో తేలిపోయేట్టు చేసింది కదా? ). So what are you waiting for? Give the artists a big hand (ఘనంగా చప్పట్లు కొట్టి కళాకారులను మెచ్చుకోండి.)

ఇప్పుడు break dance కళాకారులను పరిచయం చేయాలి. Solo (ఒక్కరే చేసిన) dance అయితే కళాకారుడు/ కళాకారిణిని వేదిక మీదికి పిలుస్తాం. అదే బృందనాట్యం (group dance) అయితే బృందంలోని వారందరినీ, అది recorded music కాకుండా live music అయితే సంగీత కళాకారులను పేరు పేరునా వేదిక మీదికి పిలిచి పరిచయం చేస్తాం, ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో.



వారికి వాయిద్య సహకారం అందించినవారి విషయం ఇలా చెప్పొచ్చు: Here are the members of the orchestra.

The keyboard by ........, so and so played the guitar, ఇలా ప్రతి వాయిద్య కళాకారుడినీ పరిచయం చేస్తాం, to the clapping of the audience. ఈ పరిచయాల్లో కూడా భాషలో వైవిధ్యం ఉంటే బాగుంటుంది.

మిగతా వచ్చేసారి.

★ To download previous lessons of 'Spoken English' visit: www.eenadupratibha.net

Mail your comments to pratibhadesk@eenadu.net






M. SURESAN

We were discussing last time the difference between house and home, weren't we? We knew the correct use of house - any building where humans live. We have seen 'house' has other meanings too.




# English లో.. Native place లేదు!

*Let us go over what we have seen:*

**House =** 1) a place for people, usually of a family to live in - మనుషులు, ముఖ్యంగా ఒకే కుటుంబానికి చెందిన వాళ్లు నివసించే కట్టడం.

2) కుటుంబం - all the people living in a house.

3) Building used for a particular purpose - a hen house/ dog house, etc. కోళ్లు/ కుక్కల్లాంటివి ఉండే చోటు.

4) A business company - The Tata house, the Birla house, etc., A banking house, publishing house, etc.

5) Legislative Assembly/ Parliament.

6) కళా ప్రదర్శనశాలలు - నాట్యం, నృత్యం లాంటివి ప్రదర్శించే halls.

ఇవీ ముఖ్యంగా house కున్న అర్థాలు, వాడకం. ఇప్పుడు, Home గురించి తెలుసుకుందాం...

Home కూ house కూ చాలా తేడా ఉంది.

**Akash:** Where is your home? (మీ ఇల్లు ఎక్కడ? )

**Prakash:** Walk along this street, turn right, and the third house on the left of the street is where I live. (ఈ వీధి వెంబడి నడువు. కుడివైపు తిరుగు. రోడ్డుకు ఎడమ వైపున మూడో ఇల్లే మాది).

✪ Where is your home? ఈ question గమనించండి - ఇక్కడ వాడిన మాట, home కదా - అంటే అర్థం - మీ ఇల్లు ఎక్కడ? అని. తెలుగులో 'ఇల్లు' అంటే నివాసయోగ్యమైన ఏ కట్టడమైనా.

English లో అలా కాదు. ఒకరి సొంత ఇల్లయినా కాకపోయినా వారు వారి కుటుంబంతో ఉంటున్న ఇల్లే home అవుతుంది. నివాసయోగ్యమైన ఏ కట్టడమైనా house.

అందుకనే సామాన్యంగా home అంటే... మాట్లాడుతున్న వాళ్లు తాముంటున్న ఇల్లు అనేందుకు, my/ our home వాడరు. మాట్లాడుతున్నవాళ్లు home అంటే చాలు. అది వాళ్ల ఇల్లు అనే అర్థం. అలాగే ఎవరితో మనం మాట్లాడుతున్నామో, వాళ్ల ఇల్లు అనేందుకు కూడా your home అనక్కరలేదు.

## FUNCTIONAL ENGLISH




**Sampath:** Have you a computer at home? (మీ ఇంట్లో computer ఉందా అనేందుకు, ఇక్కడ your home అనాల్సిన అవసరం లేదు, సామాన్యంగా అనరు కూడా. అనడం అంత సరికాదు - home అనే అంటాం).

**Manoj:** Yes I do, not one but two - The desktop, I use at home, and this laptop, I carry with me (ఉంది- ఒకటి కాదు, రెండు. Desktop నేమో ఇంట్లో వాడతా, ఈ laptop ను నాతో తీసుకెళ్తా).

*Look at the following:*

1) a) **Jagdeesh:** When does he leave home for office? (ఆయన ఎప్పుడు తన (నివాసం ఉన్న) ఇంటి నుంచి office కి వెళ్తాడు? )

**Vasanth:** He leaves home at 9 every day. (ఆయన తొమ్మిదింటికి ఇంటినుంచి బయలుదేరతాడు.)

b) **Bhaskar:** When is your father (at) home? I wish to see him. (మీ నాన్న ఎప్పుడు ఇంట్లో ఉంటారు? నేనాయన్ను కలుసుకోవాలనుకుంటున్నాను.)

**Jayakar:** He is at home usually in the evenings. He is back home / (at) home by 4.30 and doesn't (does not) move out. (మామూలుగా సాయంత్రం పూట ఇంట్లోనే ఉంటారు. నాలుగున్నరకంతా ఇంటికి తిరిగి వచ్చేస్తారు, ఆ తర్వాత బయటికి వెళ్లరు.)

చూశాం కదా, పై సందర్భాల్లో ఎక్కడ కూడా house అనే మాట రాలేదు. Home మాత్రమే వాడాం.

ఇప్పుడు ఇది చూడండి:

2) a) **Maruthi:** Throughout the movie you were silent, why? (సినిమా చూస్తున్నంతసేపూ నిశ్శబ్దంగా ఉన్నావు, ఏం? )

**Abhiram:** Some of the scenes in it took me to my friends back home. (దాన్లో కొన్ని సీన్లు మా ఊళ్లో మా స్నేహితులను గుర్తు చేశాయి).

b) **Nataraj:** Where do you come from? You speak Telugu very well. (మీ ఊరేది? నువ్వు తెలుగు బాగా మాట్లాడతావు.)

**Deepak:** What do you mean? Nellore is my home where I grew up till I was twenty. How can I forget Telugu? (ఏంటి నువ్వనేది? మావూరు - నేను పుట్టి పెరిగిన ఊరు - నెల్లూరు. నాకు ఇరవై ఏళ్ల వరకూ నేనక్కడే పెరిగాను. తెలుగు ఎలా మర్చిపోగలను? )

పై సంభాషణల వల్ల మనకు తెలిసిందేమిటి?

✪ **Home =** a place where one is born and brought up - అంటే పుట్టి పెరిగిన ప్రదేశం కూడా Home.

c) India is my home = నా స్వదేశం/ పుట్టింది, పెరిగిందీ, భారతదేశంలో.

3) ఆశ్రమాలను, అంటే, తమను తాము చూసుకోలేని, పోషించుకోలేని వారికి ఆసరాగా ఉండే ఆశ్రమాలను కూడా 'home' ( a place where people care for old people and orphans cannot take care of themselves) అంటారు.

a) **Anand:** What is the crowd there? (ఏంటా గుంపు అక్కడ? )

**Balaram:** A child was found abandoned on the roadside, and some social workers are taking it to the children's home nearby (ఎవరో బిడ్డను రోడ్డు మీద దిక్కులేకుండా వదిలేశారు, కొంతమంది సంఘ సేవకులు ఆ బిడ్డను, శిశు శరణాలయానికి తీసుకెళ్తున్నారు.)

b) **Dayakar:** Why are Sukhram's parents in an old age home? (సుఖ్‌రాం తల్లిదండ్రులు వృద్ధాశ్రమంలో ఎందుకున్నారు? )

**Ekambar:** That shows how much he cares for his old parents. He is ungrateful. (దాన్ని బట్టి తెలుస్తోంది, అతనికి వాళ్ల మీదున్న ప్రేమ. అతడికి కృతజ్ఞత లేదు.)

అలాగే Home for the mentally ill = మతి స్థిమితం లేని వారికి ఆశ్రయం ఇచ్చే చోటు - ఆశ్రమం.

4) వృక్ష, జంతుజాతులు సహజంగా, బాగా పెరిగే చోటును కూడా Home అంటాం - నెలవు అనే అర్థంతో.

✪ The Gir forests in Gujarat is the home of lions, and the Sunderbans in Bengal is the home of the Royal Bengal Tigers = గుజరాత్‌లో గిర్ అడవులు సింహాలకూ, బెంగాల్లోని సుందర్బన్, పులులకు నెలవులు.



✪ The Kolleru Lake is the home of a variety of birds (రకరకాల పక్షులకు నెలవు కొల్లేరు సరస్సు).

5) **Home =** పుట్టినిల్లు - అంటే ఏదైనా మొట్టమొదటిగా ప్రారంభమైన చోటు.

✪ Tanjore is the home of Bharatha Natyam (= భరతనాట్యానికి తంజావూరు పుట్టినిల్లు) and so is Kuchipudi for Kuchipudi dance form (అలాగే కూచిపూడి నాట్యానికి కూచిపూడి పుట్టినిల్లు.)

**Important:** English లో Native place (= పుట్టిన ఊరు/ స్వస్థలం అనే అర్థంతో) అనే మాట వాడరు.

ఫలానా ఊరు ఒకరి పుట్టిన ఊరు అయితే, He/ She is a native of Vijayawada (అతను/ ఆమె పుట్టిన ఊరు/ స్వస్థలం విజయవాడ) అంటారు. His/ her native place is Vijayawada - Wrong. ఈ వాడుక (Native place) English లో లేదు. He/ she is a native of Vijayawada అనవచ్చు.

Gandhi was a native of Gujarat (గాంధీ స్వస్థలం గుజరాత్).

---

*V.L.G. Raju, **Srikrishnapatnam.***

**Q:** Sir, please let me know the following sentences in English.

i) అది అతను ఎంగిలి చేశాడు. తినవద్దు/ తాగవద్దు.

ii) నిన్నటి నుంచి మంచు కురుస్తూనే ఉంది.

iii) నిన్నటి నుంచి దగ్గుతునే ఉన్నాడు.

iv) Unreserved అంటారు. Not reserved అని ఎందుకు అనరు?

**A:** i) He has bitten it off, don't eat it.

He has taken it, don't drink it.

కరెక్ట్‌గా చెప్పాలంటే English లో ఒకరు ఎంగిలి చేసింది అనేందుకు సరైన మాట లేదు. వాళ్లకు ఎంగిలి నిషిద్ధం లేదు, మనకు లాగా, ఎంగిలి చేసిన మనిషి అంటు వ్యాధులతో బాధపడుతుంటే తప్ప.




ii) It has been snowing since yesterday.

iii) He has been coughing since yesterday.

iv) Unreserved is just one word, so it is preferred to 'not reserved' - two words.



## Not reserved అనకూడదా?

*Radha Madhavi, **Khammam.***

**Q:** సర్, కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలో తెలుపగలరు.

1. నిన్ను చూడకుండా ఒక్కక్షణం కూడా ఉండలేకపోతున్నాను.
2. ఎంత కాదనుకున్నా నిన్ను మర్చిపోలేకపోతున్నాను.
3. తెలుగింటి ఆడపడుచు ఎలా ఉండాలో అలాగే ఉంది ఆ అమ్మాయి.
4. నాకు ఇవ్వాల్సిన డబ్బులు ఇవ్వకపోగా మరింత డబ్బులు అడుగుతున్నాడు.
5. నీలాంటి అదృష్టం అందరికి దక్కుతుందా?
6. నువ్వు 10 రోజుల్లో సాధించలేనిదాన్ని నేను ఒక్కరోజులో సాధించాను.
7. అసలేం గుర్తుకురాదు నువ్వు నా కళ్లముందు ఉండగా.
8. నాతో పలకడం ఇష్టం లేనప్పుడు నా పుస్తకం ఎందుకు తీసుకున్నావు?

**A:** 1. I can't be without seeing you even for a moment.

2. However much I try, I am unable to forget you.




3. She is like a typical Telugu girl.
4. Without repaying what he owes me, he is asking for still more money.
5. Can all be as lucky as you?
6. I achieved in one day what you could not, in ten days.
7. As long as you are in my presence, I don't remember anything.
8. When you don't like to talk to me, how could you take my book?

*Raj, **Darsi.***

**Q:** Sir, కింది వాక్యాలను ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

1. అతడు ధనికుడు అయినందు వల్ల విలాసవంతమైన జీవితాన్ని గడుపుతున్నాడు.
2. కష్టపడి చదవడం వల్ల అతడు మంచి ఫలితాన్ని పొందాడు.
3. నేను కట్టబడుతూ... ఉన్న బిల్డింగ్‌ను చూశాను.
4. నిరక్షరాస్యులుగా ఉండటం చాలా విచారకరం.
5. మంటలు పెద్దవి కాకుండా ఉండటానికి పిల్లలు వాటి మీద ఇసుక పోశారు.
6. నీ స్నేహితులందరినీ ఆహ్వానించు, మమ్మల్ని ఆహ్వానించలేదని ఎవరూ కామెంట్ చేయకూడదు.
7. తన విజయానికి తన తల్లిదండ్రులే కారణమని ఆమె తెలిపింది.

**A:** 1. Being rich, he is leading a luxurious life.

2. Having worked/ studied hard, he is able to reap the fruits of his labour/ he is able to enjoy the benefits of his hard work.
3. I saw a building being built/ under construction.
4. Being illiterates is regrettable.
5. Children threw sand on the fire to control it.
6. Invite all your friends, so nobody can complain you haven't (have not) invited them.
7. She told us that her parents were the cause/ behind her success.

Mail your comments and suggestions to pratibhadesk@eenadu.net




# ఉత్తరం రాద్దాం!

**ఈసారి Functional English లో మనం Letter Writing గురించి తెలుసుకుందాం. Letter Writing, is of two kinds depending on who we write to, and what we write about.**

మనం చాలా రకాల ఉత్తరాలు రాస్తుంటాం కదా? కుటుంబ సభ్యులకు, ఆత్మీయులకు, స్నేహితులకు రాసేవి, ఒక్కోక్కప్పుడు మనకు తెలియనివాళ్లకు కూడా, వాళ్ల దగ్గర్నుంచి మనం ఏదైనా సమాచారం పొందాలన్నా, మనం వాళ్లకేదైనా సమాచారం ఇవ్వాలన్నా- ఇలాంటి సందర్భాల్లో రాసేవి Personal letters (వ్యక్తిగతమైన ఉత్తరాలు.)

ఇవి కాకుండా అంటే వ్యక్తులకు, వ్యక్తిగతమైన విషయాల గురించి కాకుండా, సంస్థలకు, ఆ సంస్థల్లో వివిధ హోదాల్లో ఉన్నవారికి, మనపై అధికారులకు, మన కింది హోదాల్లో ఉన్నవారికి, ప్రభుత్వ అధికారులకు కూడా ఉత్తరాలు రాస్తుంటాం - సమాచారం ఇవ్వడానికి, పొందడానికి. ఇవన్నీకూడా Formal Letters- ఒక నిర్ణీత పద్ధతి ప్రకారం, గౌరవ మర్యాదలు పాటిస్తూ రాసే ఉత్తరాలు.






Personal letters (వ్యక్తిగత ఉత్తరాలు) విషయానికి వస్తే ప్రస్తుత cell phone (చరవాణి) రోజుల్లో ఇవి చాలా వరకు తగ్గిపోయాయి, చాలా అరుదు కూడా. చరవాణితో మాట్లాడటం త్వరగా అయిపోతుంది. అంతేకాకుండా అవతలి వాళ్ల స్పందన కోసం ఎక్కువసేపు వేచి ఉండనక్కరలేదు. అందుకే ఇప్పుడు Personal Letters ప్రాముఖ్యం బాగా తగ్గిపోయింది. అయినా ఎప్పుడైనా రాయాల్సి వస్తే, ఎలా రాయాలనేది తెలుసుకుని ఉంటే మంచిది కదా? అందుకని కాస్త టూకీగా తెలుసుకుందాం.

- వ్యక్తిగత ఉత్తరాలు ఎక్కువగా మనతో బాగా సాన్నిహిత్యం ఉన్నవాళ్లకే రాస్తాం కదా? అందువల్ల మన address వాళ్లకు మామూలుగా తెలిసి ఉంటుంది. కాబట్టి ఉత్తరం రాసే కాగితం (letter paper) కుడివైపు పైన (Right top corner) మనం రాస్తున్న ఊరిపేరు, దాని పక్కన comma (కామా), దాని కింద తేదీ వేయాలి. తేదీ పక్కన comma/ full stop ఉంచం.
- ఆ తర్వాత ఒక line వదిలి, మనం ఎవరికి రాస్తున్నామో, వాళ్లను సంబోధిస్తాం. మనం ఎవర్ని ఎలా సంబోధించాలి అనేది వాళ్లతో మనకున్న సంబంధ బాంధవ్యాలను బట్టి ఉంటుంది. ఇలా సంబోధించడాన్ని English లో <u>salutation</u> అంటాం.
- చివర్లో మన సంతకంపైన వాడే expression (Yours lovingly, etc.) ను <u>subscription</u> అంటాం. Personal letters లో ఇది కూడా మనకూ, మనం ఉత్తరం రాస్తున్నవారికీ ఉన్న సంబంధ బాంధవ్యాలను బట్టి మారుతూ ఉంటుంది. ఆ సంబోధనలు ఎలా ఉంటాయో, సంబంధాలను బట్టి మారే ముగింపు (subscription) ఎలా ఉంటుందో, personal letters ప్రారంభం ఎలా ఉంటుందో వచ్చేసారి తెలుసుకుందాం.

*- V.L.G. Raju,* ***Srikrishnapatnam.***

**Q:** Sir, please let me know the following sentences in English.
i) నేను birthday చేసుకోవడం మానేసాను.
ii) నిండుకుండ తొణకదు.

**A:** i) I've (I have) stopped celebrating my birth/ I no longer celebrate my birth day.
ii) దీనికి సరైన English idiom లేదు. Empty vessels make much noise (ఖాళీ పాత్రలు గొడవెక్కువ చేస్తాయి, అనేది దీనికి దగ్గర.)




**Mail your queries to pratibhadesk@eenadu.net**



## కాలాలు మూడు... కాదు రెండే..!

*- Yaswanth,* ***Narasaraopet.***

**Q:** Sir, since our childhood we have been taught that Tenses are 3 (Present, Past & Future), but modern grammar says that tenses are 2 only (Present & Past). Which one is correct? Please clarify.



**A:** Some modern grammarians argue that there are only two tenses - the present and the past.

Their point is that the difference in the tense of a verb should be shown by a change in the form of the verb, and not by adding another word (for example, shall/ will) which we add to form the future tense.

| eg: | Present | Past |
|---|---|---|
| | Sing/ sings | Sang |
| | Talk/ talks | Talked |
| | Smell/ smells | Smelt |

The second point of these modern grammarians is, the simple present/ present continuous can also be used for future actions. **eg:** She comes / is coming here tomorrow.

We cannot however use the present simple/ continuous for a future action, without mentioning the time of action (tomorrow/ next week, etc). In such cases <u>we have to use</u> shall/ will to indicate future. This clearly shows that <u>there are three tenses</u> - the present, the past and the future.


M. SURESAN

If we teach beginners that there are only two tenses, they will be confused, so it is better to teach them that there are three tenses.

Our aim in teaching English in India is to help the learners communicate fluently in English and to be able to write English. A <u>research</u> on English <u>grammar</u> on the number of tenses is <u>NOT</u> our aim. Let grammarians break their heads over such topics.

## ఇంగ్లిష్‌లో... 'జన్మజన్మల బంధం'

- Kolli Kishore, **Visakhapatnam.**

**Q:** సర్, దయచేసి కిందివాటిని English లో ఏమంటారో తెలియజేయగలరు.

1) ఊతపదం 2) ఆస్వాదించడం
3) యజ్ఞం 4) యాగం
5) శకం 6) చిరస్మరణీయం
7) పూర్వజన్మ సుకృతం
8) జన్మజన్మల బంధం 9) ఇదివరకు
10) అప్పట్లో 11) నాంది
12) ఊతకర్ర (ఆధారం) 13) ఇప్పుడిప్పుడే
14) వ్యాజ్యం 15) సంజాయిషీ
16) అవినాభావ సంబంధం

**A:** 1) Catchword / Byword / Watchword
2) Take in / absorb
3) యజ్ఞం 4) యాగం: No corresponding English words.
5) Era / Epoch / Age
6) Memorable
7) The good result of a good deed in an earlier birth.
8) Bond transcending successive births
9) In the past / earlier
10) Then / Those days
11) Prologue 12) Prop
13) Just now / Right now
14) Litigation / suit 15) Explanation
16) Inexplicable bond.

Please note: పూర్వజన్మ సుకృతం, జన్మజన్మల బంధం లాంటి మాటలకు English లో సరైన మాటలు ఉండవు. ఎందుకంటే వాళ్ల మతంలో ఇలాంటి నమ్మకాలుండవు కాబట్టి.

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

*- Gurram Raju,* ***Karimnagar.***

**Q:** Can I use the below idiom/ phrase, in the situation like interviews for unable to recall the answer for a question? "Right now it's not on top of my head" - Is this sentence usage correct or not? And also please mention some alternatives for that situation.

**A:** The answer is right or wrong depending on what question you are answering.

Right now it's not on the top of my head = That is not the most important thing for me <u>now</u>/ That's not my priority now.

Suppose you are asked in the interview a question like, 'When do you want to get married?', and suppose you are right now interested only in getting a good job, you can say, 'Right now that is not on the top of my head'.

Alternative sentences:
1) That's (That is) not among my priorities now.
2) That is not upper most in my mind right now.
3) That is among my least priorities.
4) That is not important for me now.
5) That's among my least priorities now.
You can say any of the above.

*- P. Khaleelulla Khan,* ***Rayachoti.***

**Q:** Sir, please translate the following sentences in Telugu.
1) Sugar prices are vulnerable to a setback in the short term.
2) Sugar prices are vulnerable to a setback in the near future.
3) Sugar prices are vulnerable to a setback in the near to medium term.
4) The downward potential of sugar prices.
5) Please explain the short term/ near term/ near to medium term/ potential with an example.

**A:** First you know the answer to Q - 5.
a) Term = period = వ్యవధి/ కాలం
Short term = స్వల్ప వ్యవధి
Near term = సమీప వ్యవధి (ఇది అంతగా వాడరు)
Near to medium term = సమీప మాధ్యమిక వ్యవధిలో
Potential = ఏ విధంగా అయినా తయారవగల శక్తి ఉన్న

*Look at the following:*

b) Cheating may be profitable for a businessman in the <u>short term/ near term</u>, but it has the <u>potential</u> of causing big losses in the <u>long term</u> = మోసం చేయడం వ్యాపారి స్వల్పకాల ప్రయోజనాలనే కాపాడగలదు, కానీ దీర్ఘకాలికంగా చూస్తే అతనికి పెద్ద నష్టమే కలిగించే శక్తి (Potential) దానికి ఉంది/ దీర్ఘకాలిక ప్రయోజనాల దృష్ట్యా అతనికి పెద్ద నష్టం కలిగించే శక్తి దానికి ఉంది.

1) స్వల్పకాలిక వ్యవధిలో పంచదార ధరలు పతనమయ్యే ప్రమాదం ఉంది. (Vulnerable = ప్రమాదానికి గురయ్యే బలహీనత).
2) సమీప భవిష్యత్‌లో పంచదార ధరలు పడిపోయే ప్రమాదం ఉంది.
3) స్వల్ప, మాధ్యమిక వ్యవధిలో పంచదార ధరలు వెనక్కి తగ్గే ప్రమాదం ఉంది.
4) పంచదార ధరలు పడిపోయే ప్రమాదం ఉంది.
5) Vulnerability = ప్రమాదాన్ని కల్పించగల బలహీనత.

- India is vulnerable to Chinese attacks = చైనా దండయాత్ర ప్రమాదం భారత్‌కి ఉంది/ భారత్ చైనా దండయాత్రకు గురయ్యే ప్రమాదం ఉంది.

*- Oruganti Rajasekhar,* ***Khammam.***




**Q:** English sir gets a note written by Anu - Is this sentence correct?

**A:** <u>The</u> English sir gets a note written by Anu.

**Q:** i) I am getting my children eaten.
ii) I have got a hair cut by barber/ Ravi - Are these correct?

**A:** i) ఇది తప్పు. దీని అర్థం: నేను నా పిల్లలను ఎవరైనా తినేట్లు చేస్తాను/ నా పిల్లలు ఎవరి చేతనైనా తినబడేట్లు చేస్తాను.

బహుశా మీరు చెప్పాలనుకున్నది, నా <u>పిల్లలు</u> తినేట్లు చేస్తాను అని కదా? దానికి English, I will get my children to eat/ I will have my children eat (Eaten అంటే ఇంకెవరైనా మీ పిల్లలను తినేట్లు చేయడం.)

ii) Correct.




**Last week we discussed the procedure for writing personal letters in general - the salutation (సంబోధన), the subscription (ముగింపు). Now we are going to see how we write letters to our brothers and sisters (siblings).**




# I am doing well here..

### అక్కకో ఉత్తరం....

మన అన్నలకు, అక్కయ్యలకూ రాసేటప్పుడు, <u>My</u> dear brother / <u>My</u> dear sister అని రాస్తాం. ఇక్కడ 'My' చాలా ముఖ్యం; అది వదిలేసి ఉత్త Dear brother / sister అని రాస్తే, వాళ్లు మన సొంత అన్నయ్య / అక్కయ్య కాకుండా, మనం అన్నయ్య / అక్కయ్య అని భావించే సన్నిహితులకు రాసినట్లు అవుతుంది.

★ అదే తమ్ముళ్లకు, చెల్లెళ్లకు రాయాల్సి వస్తే My dear <u>name</u> (of the younger brother / sister రాసి, comma పెడతాం. కుడి వైపు పైభాగాన మనం ఏ ఊరు నుంచి రాస్తున్నామో ఆ ఊరి పేరు, comma, దాని కింద తేదీ (దాని తర్వాత no comma, no full stop) రాస్తాం. వీటికీ subscription (ముగింపు) parentsకు రాసే lettersకు మాదిరిగానే yours / yours with love / with love / love అని రాస్తాం.




★ ఇదీ salutation and subscription తీరు. ఇప్పుడు beginning of the text of the letter చూద్దాం. సామాన్యంగా క్షేమ సమాచారాల విచారణతో ప్రారంభిస్తాం కదా? వీటినిప్పుడు చూద్దాం:

★ చాలావరకు I am safe here and hope the same with / from you అని రాస్తుంటారు. ఇదంత సరి కాదు.

1) Safe అంటే క్షేమం / కులాసా అనే అర్థం రాదు - ఏదైనా ప్రమాదం నుంచి బయటపడి క్షేమంగా ఉన్నామనికానీ / మనకు వచ్చే ప్రమాదం ఏమీలేదనీ అర్థం. అందువల్ల 'safe' అని ప్రారంభించడం సరికాదు.

2) and hope the same with you - ఇదీ తప్పే. దీని అర్థం, నీ దగ్గర్నుంచి / నీ విషయం కూడా అనే అర్థం కాదు. 'నేను క్షేమంగా ఉన్నానని' అనే అర్థమే వస్తుంది. కాబట్టి ఈ sentence వాడకపోవడం మంచిది.

**సామాన్యంగా ఇలా రాయొచ్చు...**

**a)** I am doing well here, and hope you are too.

**b)** All the well here, and so it is there, I hope / I am sure.

**c)** We are all ok here / I am ok here and hope so you are / so you and all the others there are / and you and all the others there too, I hope.


M. SURESAN

**d)** Hope this finds you all in sound / good health and the best cheer. (Hope this finds you... = ఈ ఉత్తరం మిమ్మల్ని మంచి ఆరోగ్యం, సంతోషాలతో చూస్తుందని ఆశిస్తున్నా)

**e)** Hope you are keeping good health / you are in the best of health.

ఇలా ఉంటుంది all personal, informal letters

## FUNCTIONAL ENGLISH

ప్రారంభం.

★ మనం మన దగ్గరి బంధువులకు - uncles, aunts, cousins, etc లకు రాసేటప్పుడు కూడా పై ప్రారంభం వాడొచ్చు. అయితే salutation (ప్రారంభం), subscription (ముగింపు) కాస్త తేడా ఉంటుంది.

★ బాబాయిలు / పెదనాన్నలు / మామలు / పిన్నులు / అత్తలు - వీళ్లకు రాసేటప్పుడు, My dear uncle / aunt అని రాస్తే చాలు. అదే cousins (పైవాళ్ల పిల్లల)కు రాసేటప్పుడు, My dear (మన సాంప్రదాయం ప్రకారం - మనకంటే పెద్ద వాళ్లయితే brother / sister, etc; మన కంటే చిన్నవాళ్లయితే వాళ్ల పేరు, రాస్తాం.

★ వీటన్నిటికీ ముగింపు - Yours most affectionately / Yours affectionately, అంటే సరిపోతుంది. గుర్తుంచుకోవాల్సిన విషయం... subscription లో ఎప్పుడూ, Yoursలో Y, capital. Lovingly, affectionately, etc., small letter తో ప్రారంభించాలి. Subscription పక్కన తప్పకుండా comma ఉండాలి.

వచ్చేవారం మరిన్ని వివరాలు చూద్దాం...

*Amar*

**Q:** It is half past ten / It is a quarter past ten. Why the indefinite article (a) is not used before half?

**A:** A very good question.

Half past one - In all cases where 'half' is used, especially before time - eg: half a minute, half an hour, half past ten, etc- 'a' is omitted according to idiomatic usages whereas before 'quarter, as we refer to '<u>one</u>' quarter (quarter - countable singular) - 'a' is a must. 'Half' is a countable singular too, but 'a' is habitually omitted before 'half' in the expressions above.

*G. Prasad*, ***Prakasam.***

**Q:** You should treat me as your equal.

You must treat me as equal.

Sir, please clarify my doubt in the usage of must and should. What is the difference in the above two sentences in meaning?

**A:** 1) The verb treat should <u>always</u> be followed by 'as'. So you should treat me as your equal is correct.

**eg:** Indians <u>treat</u> Gandhi as a Mahatma.

So, you should treat me as your equal is correct.

2) Must and should both express order, duty and necessity.

**eg.** a) You <u>must</u>/ <u>should</u> finish the work by the evening (Order).

b) I <u>must be</u>/ <u>should be</u> at office by 9 (Duty).

c) I/ you/ they etc <u>must</u>/ <u>should</u> start immediately or they will miss the train (Necessity).

However, 'must' for orders, etc., is a stronger form than 'should'.

***- Kolli Kishore,*** *Visakhapatnam.*

**Q:** Sir, కింది వాటిని English లోకి translate చేసి చెప్పగలరు.

1) ఎవరు ఎవరితో చెప్పారు?

2) నీవు ఎవరికి / ఎవరితో చెప్పాలి / చెప్పావు?

3) నీవు ఎప్పుడు ఎవరితో మాట్లాడుతున్నావో నేను చెప్పలేను.

4) నీవు ఎప్పుడు ఎవరికి money ఇస్తున్నావో నేనెలా చెప్పగలను?

5) నాకు ఎవరితో ఎప్పుడు ఎలా మాట్లాడాలో బాగా తెలుసు.

6) అది ఏయే factors మీద ఆధారపడి ఉంది?

**A:** 1) Who told whom? / Who?

2) Who should you tell?/ Who have you told?

3) I can't say who you were speaking to and when.

4) How can I say who you are giving money and when?

5) I know very well how to talk to people when I have to talk to them.

6) What factors does it depend on?

**Mail your queries to**
pratibhadesk@eenadu.net

**'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..**
www.eenadupratibha.net

# Whom బదులు who..?

***- Amar Kumar Das***

**Q:** What is the plural form of sky? The photograph is taken from the skies. is the word skies in the above sentence plural form of sky.- Pls explain it sir.

**A:** 'The skies', the plural form of 'the sky' is used only in poetic language or when we refer to the part of the sky above a particular area.




**Eg:** Though it was 12 noon the <u>skies</u> above <u>the city</u> were overcast (= covered with clouds). However, there seems to be no correct rule for the use of skies.

***- Yuvraj Kamala,*** Bengaluru.

**Q:** Could you please let me know the usage of "to be" in various contexts.

**A:** The different forms of 'to be' are called 'be' forms too. They mean being at different times (ఉండటం). There are three sets of 'be' forms. They are:

1. am/ is/ are; was/ were
2. All forms <u>ending in 'be'</u>: shall be/ should be, will be/ would be; can be/ could be, etc.
3. All forms ending in 'been': have/ has/ had been; shall/ should have been; will/ would have been, etc.

For a detailed explanation of all the 'be' forms, refer to lesson 1 to lesson 20 of Spoken English on www.eenadupratibha.net.

**- Soujanya Kusuma**

**Q:** Sir, Stereotypical, nausea, frog in the well: I am confused with the usage of the above mentioned words and idioms, please explain with examples.

**A:** 1) Stereotypical = not different from the usual and therefore boring = ఏ విలక్షణత (Speciality) లేకుండా, మామూలుగా ఉన్న/ in no way different from what we have seen very often, so dull and unexciting.

Telugu movies are stereotyped - boy meeting girl, a few duets and fights - that's all. ఒకేమూసలో పోసినట్లనిపించే.

2) Nansea = a vomitting sensation = కడుపు తిప్పినట్లుండి డోకులు రావటం.

In their early stages of pregnancy women have <u>nausea</u> = గర్భం ధరించిన కొత్తల్లో స్త్రీలకు <u>వాంతులు, డోకులు</u> వస్తాయి.

**- Veera Raghavulu**

**Q:** Please translate the following telugu proverbs in english.

1. శ్రమ నీ ఆయుధం అయితే విజయం నీ బానిసవుతుంది.
2. ప్రళయం వచ్చినా, కొండచరియలు విరిగిపడినా, లక్ష్యం వైపే నీ ప్రయాణం సాగించాలి.

**A:** 1. If industry is thy (your) weapon, success shall be thy slave. (thy = 'poetic' for you)

2. Neither a cataclysm (ప్రళయం) nor landships (కొండచరియలు) shall deter you you from proceesing towards your goal.

***- Kotesh Puli***

**Q:** How to use these words - WHO, WHOM and when to use in a sentence? I , ME - how to use and when to use these in a sentence? - Please explain.

**A:** 'Who' = ఎవరు?

a) Who tells the truth? = నిజం ఎవరు చెప్తారు?

b) Who is the Prime Minister of India? = భారత ప్రధాని <u>ఎవరు</u>?

'Who' is also used to connect two clauses.

★ Kumar is the boy who helped me = నాకెవరైతే సాయం చేశాడో, ఆ అబ్బాయి కుమార్. మామూలు తెలుగు: 'నాకు సాయం చేసిన అబ్బాయి కుమార్.'

★ Whom = ఎవరిని, ఎవరికి? Whom did Rama defeat? = రాముడు <u>ఎవరిని</u> జయించాడు?

<u>Whom</u> do you want to help? = నువ్వు <u>ఎవరికి</u> సాయం చేయాలనుకుంటున్నావు?

**Important:** అయితే 'Present day' English లో whom బదులు 'Who' నే వాడ్తున్నారు?

a) <u>Who</u> did 'Sri Rama kill? = రాముడు ఎవర్ని చంపాడు? (గతంలో 'who' బదులు 'whom' వాడే వాళ్లు.)




b) Who (whom కాదు) do you want to meet? = నువ్వు <u>ఎవర్ని</u> కలుసుకోవాలనుకుంటున్నావు?

c) Who did you give it to? (To <u>whom</u> did you give it to? కు బదులు) = ఎవరికిచ్చావు నువ్వు దాన్ని.






M. SURESAN

*- Imran Khan*

**Q:** i) Get out of the class.
ii) Get out from the class - Kindly explain which one of them is grammatically correct sentence.

**A:** Get out of the class (correct). 'Out' is always followed by 'of' and not 'from'.




# 'Your good name' అనొచ్చా?




**- S. Rajesh**

**Q:** Sir, I would like to know the difference between 'May I know your name' and 'Your good name'.

What I should say when somebody asks for 'self introduction'?.

**A:** 'Your good name' is wrong English. There is no such thing as good/ bad name in English.

'May I know your name?' is correct English.



You begin your self-introduction with the words, My name is so and so/ I am so and so, from..... (your place) and then go on to say, what you are, a few important details of your family, your present position [student/ employed, etc), and then what you want to be/ achieve.

**- B.Srinivas**

**Q:** Sir, please explain 'so as' usage in Telugu with example.

**A:** So as = so that

**eg:** 1) We started early so as to be there on time. (ఆ ఉద్దేశంతో = so as)

2) So as not to trouble anyone, I did it myself = ఇతరులెవరినీ ఇబ్బంది పెట్టకుండా ఉండేందుకు, ఆ పని నేనే చేశాను.

3) So as not to confuse him, I explained everything clearly.

**- D. Sunil**

**Q:** Sir, how can we give positive answer for negative 'yes' or 'no' answer question?

**Eg:** Don't you speak English?

No, I don't. (This is negative answer for negative question)

What is the positive answer?

**A:** i) If the question is affirmative and the answer is affirmative too, the answer is, 'yes' and if the answer is negative, the answer is negative too.

**Q:** Are you coming? (Affirmative Question)

**Ans:** Yes, I am (Affirmative answer)

ii) If the question is negative, and the answer is negative too, we begin with, 'No'.

**Q:** Are you not an Indian
**Ans:** No, I am not an Indian. } Negative

iii) If the question is negative, and the answer is affirmative, the answer still is 'yes'.

**Q:** Don't you speak English?

**Ans:** Yes, I do. (Affirmative)

No, I don't. (Negative)

# I am excited అంటే..?




***- D. Kartheek, Armoor.***

**Q:** Sir, we use present simple in various contexts.

i) He is dead: What is the meaning here?

He has been dead or he was dead అనొచ్చు కదా?

ii) I am excited - I was excited,

I am shocked - I was shocked,

He is surprised - He was surprised ఇలాంటివి simple లోనే ఎందుకు ఉపయోగిస్తాం? వివరించగలరు.

**A:** Present simple sometimes refers to immediate past.

He is dead - అతను చనిపోయి ఉన్నాడు.

He has been dead - చనిపోయినవాడై ఉన్నాడు - కొంత కాలమైంది.

Very little difference between the two. However, when we refer to the state/ fact of the person's death, we say, 'He is dead', when you want to stress the fact that it is sometime since he died, you say, he has been dead.

**eg:** He is dead (not alive - state of being dead.)

★ He has been dead for a year now = He died a year ago.

మనం చెప్పాలనుకున్నదాన్ని బట్టి రెండూ correct.

★ I am excited - ఇప్పుడు (Present)

★ I was excited - అప్పుడు (Past)

Same is the case with, 'I am shocked' (now), and 'I was shocked' (Past).

The same applies to He is surprised (ఇప్పుడు), and He was surprised - (గతం).

**Q:** Please say 'would' uses. Most of the TV channels use 'would'. వాళ్లు దాన్ని future లో polite గా లేక indirect speech లో వాడుతున్నారా?

**Ex:** Exams would be conducted on 9th March.

ఇక్కడ exams will be conducted on 9th March అనొచ్చు కదా?

**A:** Exams will be conducted on the 9th March - Correct.

'Exams would be conducted' is correct when it is a part of indirect speech, as you said, in place of will.

But 'would' has a number of other uses too. See the answer to the same in one of the recent spoken English lessons, that is, from lesson No.803 onwards.

**Q:** 'He is to work or say'

'He has to work'.

'He is to have....' - Please explain.

**A:** He is to work = He has work to do and has the duty to do it.

He has to work - duty/ order/ necessity.

**eg:** a) He has to work from 10 to 5 (order/ duty)

b) He has to pay the money to get back the book - necessity.

c) He is to have work - Duty.

**Q:** i) Having deceived by him, people lost their money.

ii) Having been deceived by him, people lost their money. What is the difference?

**A:** Having deceived by him - WRONG.

Having been deceived by him - అతని చేత మోసగించబడటం / అతని చేత మోసగింపబడి/ మోసగింపబడటం వల్ల - Passive form.

**Q:** Please say about all 'infinitives'

He seems to be...

He is said to have been...

Jagan seemed to have had a lot of money.

They were said to be ......... etc.

Explain when and how to use them in active and passive voice?

**A:** The infinitive is in the form of to be/ to + 1st Doing verb ($V_1$) - to go/ to to come/ to walk/ to talk, etc.

a) To be here is not good (ఇక్కడ ఉండటం...)

★ To go out in the dark is dangerous (చీకట్లో బయటికి వెళ్లడం ప్రమాదకరం).

b) He has gone out to buy some books.

ఇక్కడ 'to buy' is infinitive కదా. అయితే అర్థం కాస్త తేడా - to buy (ఇక్కడ) = కొనడానికి/ కొనేందుకు అనే ఉద్దేశం/ purpose ను తెలియజేస్తుంది. - ఇది infinitive రెండో ఉపయోగం.

c) ఇక మూడో ఉపయోగం/ అర్థం, infinitive కు:




i) I wish to buy a house = ఇల్లు కొనాలని కోరుకుంటున్నా.

ii) She wants to sing = ఆమె పాడాలని అనుకుంటోంది.

ఇవీ infinitive కున్న అర్థాలు, ఉపయోగాలు.

★ Jagan seems to have had a lot of money - ఇక్కడ infinitive 'to have had' - perfect infinitive - ఒకప్పుడు ఉండేది (చాలా డబ్బు).

They seemed to have told them of it. వాళ్లు వాళ్లతో చెప్పినట్టు (past) (past infinitive) కనిపిస్తోంది.

★ I have a lot of work to do - చేయాల్సిన పని చాలా ఉంది (Active infinitive).

There is a lot of work to be done (Passive infinitive) - చేయబడాల్సిన పని చాలా ఉంది. (చేయబడాల్సిన - సహజమైన తెలుగు కాదు).

**Q:** i) How do you feel?

How you feel? - What is the difference?

**A:** i) How do you feel? - ఎలా ఉంది/ ఎలా అనిపిస్తోంది?

How you feel - Wrong. Not the correct question form.

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

Mail your queries to
pratibhadesk@eenadu.net




**Formal letters రాసేటప్పుడు ఏయే అంశాలు తప్పనిసరిగా గుర్తుంచుకోవాలో ఈ వారం చూద్దాం.**

Formal letters (అన్ని గౌరవ మర్యాదలూ పాటించాల్సిన letters) ఎప్పుడు కూడా Business letters (మనకు, వ్యాపార సంస్థలకూ మధ్య, ఒక వ్యాపార సంస్థకు, మరో వ్యాపార సంస్థకు మధ్య, ఒక వ్యాపార సంస్థకు, వినియోగదారుడికి మధ్య జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలు), Official letters (మనకు, ప్రభుత్వ కార్యాలయాలకు మధ్య జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలు) రూపంలో ఉంటాయి.



వ్యక్తిగత (personal) ఉత్తరాలకు లాగా కాకుండా, ఈ formal (business and official) letters కు మన కచ్చితంగా పాటించాల్సిన నియమావళి ఉంటుంది. అవేంటో ఇప్పుడు చూద్దాం:

Formal letters అన్నిటికీ, left top corner (పేజీ ఎడమవైపు) పైన మన పేరు, పూర్తి చిరునామా కచ్చితంగా ఉండాలి. దాని కింద, రెండు పంక్తుల చోటు వదిలి, మళ్లీ left margin నుంచి ప్రారంభిస్తూ, date వేయాలి. మళ్లీ ఒకటి రెండు పంక్తుల స్థలం వదిలి, మనం ఎవరికి/ ఏ కంపెనీకి/ ఏ హోదా ఉన్న అధికారికి రాస్తున్నామో, ఆ కంపెనీ/ కంపెనీ అధికారికైతే ఆ కంపెనీలో వారి హోదా, పూర్తి address రాయాలి. అయితే ఈ పద్ధతిలో రాస్తున్నప్పుడు address lines కు పక్కన commas లేదా fullstops ఉండవు. ఆ తర్వాత, company పేరున రాసే ఉత్తరం అయితే, సంబోధన, 'Dear Sirs'/ Sirs, దాని తర్వాత comma, ఉండాలి.

మిగతా వచ్చేవారం.

***- V. Raju***

**Q:** How to use would be in spoken English ?

**A:** 'Would be', 'will be' కి past form అంటే 'would be', 'will be' కి past tense form. 'Will be', ఇప్పటి (present) నుంచి future తెలిపితే, 'would be' గతం (past) నుంచి future తెలుపుతుంది.

**eg:** He says she will be here tomorrow. (రేపామె ఇక్కడ ఉంటుందని అతను చెబుతున్నాడు. దీన్ని ఈ కింది sentence తో పోల్చండి:

a) He said she would be here tomorrow = రేపామె ఇక్కడ ఉంటుందని అతను చెప్పాడు).

b) I was sure he would not do it (అతను చేయడని నేనెప్పుడో (గతంలో) నమ్మకంతో ఉన్నాను).

c) 'Would be' in the question form expresses polite and formal request (మర్యాదకరంగా/ లాంఛనప్రాయంగా అభ్యర్థించేందుకు 'would be' వాడతాం).

a) Would you be here tomorrow, please? (రేపిక్కడ ఉంటారా దయచేసి? )

b) Would you be on the committee? (కమిటీలో ఉంటారా - Request).

మరికొన్ని ఉపయోగాల కోసం పాత lessons చూడండి.

**FUNCTIONAL ENGLISH**

# Yours faithfully



M. SURESAN

**గతవారం మనం Formal Letters- అంటే Business / official letters ప్రాథమికాంశాలు కొంత చర్చించాం. From address రాయడంలో వివిధ నమూనాలు, మరికొన్ని వివరాలు ఇప్పుడు తెలుసుకుందాం.**




కిందటి వారం మనం చూసిన ముఖ్యమైన విషయం, Sender's (రాసేవాళ్ల) address, date, Receiver's (ఉత్తరం పొందేవాళ్ల) address అన్నీ పేజీ ఎడమవైపు నుంచే ప్రారంభిస్తాం అనీ, ఈ Name and address లలో, line చివర Commas / full stops ఉండవనీ.

★ (గతవారం దొర్లిన పొరపాటు: సంబోధన తర్వాత Comma ఉండాలని చెప్పాం. ఇది సరికాదు; సంబోధనల తర్వాత కూడా, అంటే Dear sir / Dear sirs తర్వాత Commas ఉండకూడదు.)

★ British / Indian, ముఖ్యంగా Indian format (నమూనా)లో, from address, ఉత్తరం పైన ఎడమ మూల (left corner)లో ఉండాలని. అయితే US formatలో ఎక్కువగా from address Right top corner గానీ / పేజీ మధ్య (Center) లోగానీ ఉంటుంది. అయితే మనదేశంలో ఎక్కువగా British format- అంటే from address కూడా ఎడమ వైపు ఉంటుంది.

**కింది నమూనా - మనదేశంలో ఎక్కువగా వాడేది...**

K. Vamana Rao
2-12-18 Prakasam Road
Vijayawada 520002
14-12-2014

Dear Sir / Madam

Re / Sub: ఇక్కడ మనం ఏ విషయం గురించి రాస్తున్నదీ క్లుప్తంగా రాయాలి.

Matter / విషయం

ముగింపు:
Yours faithfully
K. Vamana Rao

**గమనిక:** పేర్లు, address లూ అన్నీ కల్పితం / ఎవరికి చెందినవీ కావు.







★ Formal letters అన్నీ చాలా క్లుప్తంగా, Direct గా, విషయానికి (content of the letter కు) సంబంధించిందైనది మాత్రమే ఉండాలి. ఎంత క్లుప్తంగా ఉంటే అంత త్వరగా స్పందన ఉంటుంది.

★ ముగింపు (Subscription) గురించి ముఖ్యమైన విషయం - అన్ని business/ official అంటే అన్ని formal letters కూ, Yours faithfully అని రాయాలి. దాని చివర comma ఉండదు.

★ అయితే ఈ మధ్య వాడుకలోకి వస్తున్న ఒరవడి ప్రకారం, ముగింపులో Yours faithfully లో, Yours వదిలేసి, క్లుప్తంగా faithfully అని కూడా రాస్తున్నారు. కానీ ప్రస్తుతానికి మనం Yours చేర్చటం అన్ని విధాలా మంచిది.

★ రెండోది, paragraph ప్రారంభంలో మనం మామూలుగా left margin నుంచి కాస్త స్థలం వదిలి ప్రారంభిస్తాం. కానీ ఇప్పటి పద్ధతిలో దీన్ని పాటించకుండా, paragraph కూడా స్థలం వదలకుండా ప్రారంభిస్తాం.

★ US formatలో అయితే from address ఎప్పుడూ, ఉత్తరం కుడివైపు పై భాగంలోకానీ, page మధ్యలో కానీ ప్రారంభిస్తారు.

**ఈ తేడాల గురించి మరికొన్ని వివరాలు వచ్చేవారం...**

# అతన్ని కలుసుకోకపోవటం...

*- M. Swati*

**Q:** Explain meanings of bellow sentences:
1) Pasta is being made by Raji.
2) He can / could / will / would / may / might / must be finished it.
a) Explain gerund past form?
b) Give examples of v-o and v-o-o word orders?
c) 'Thank you for inviting me here' what kind of sentence it is?

**A:** Pasta is being made by Raji = Raji is making pasta.

★ Pasta is being made by Raji (PASSIVE VOICE) = Raji is making Pasta (ACTIVE VOICE)

★ He can / could / will / would / may / might / must be finished it - WRONG SENTENCE. Englishలో can / could / will / would / may / might / must తర్వాత 'finish' అని past tense (V2) form రాదు. ఎప్పుడూ 'finish' (V1) present tense form మాత్రమే వస్తుంది. Shall / should / have to / has to / had to తర్వాత కూడా 'finish' మాత్రమే వస్తుంది.

a) He can finish it = అతను అది పూర్తిచేయ గలడు - can = గల (ఇప్పుడు - present)

b) He could finish it = అతను అది పూర్తి చేయగలిగేవాడే (Past- గతంలో) - అతనికా సామర్థ్యం ఉండేది, గతంలో. అయితే పూర్తి చేశాడా లేదా అనేది తెలీదు.

c) He will finish it = అతను అది పూర్తి చేస్తాడు, future లో.

d) He would finish it = అతను దాన్ని పూర్తిచేయాలనుకుంటున్నాడు. Wouldకు ఇంకా చాలా ఉపయోగాలూ / అర్థాలూ ఉన్నాయి. కిందటి వారం Spoken English చూడండి.

e) He may finish it = అతనది పూర్తి చేయవచ్చు/ చేస్తాడేమో (may = సందేహం - అవచ్చు / చేయవచ్చు)

f) 1) He might finish it - He may finish it కంటే ఎక్కువ సందేహం.

ii) He might finish it అనేది Indirect speechలో భాగం కూడా కావచ్చు.

★ Somebody said that he might finish it (ఎవరో - ఆమెనో/ అతడో అన్నారు- అతడది పూర్తిచేయవచ్చని)

a) The past gerund form - Having + past participle (V3) - eg: Having seen / having gone etc., - is the past form.

★ Not having met him made me sad. (అతన్ని కలుసుకోకపోవటం (గతంలో) నన్ను విచారించేలా చేసింది.)

★ Having seen the movie changed his life = ఆ సినిమాను చూడటం (గతంలో) అతని జీవితాన్ని మార్చివేసింది.

★ I liked having gone there = అక్కడికి వెళ్లడం (గతంలో) నాకిష్టమైంది.

b) V-O = Verb + Object = I like movies. ('Like' here is a verb, and movies, its object).
V-O-O = Verb + Object + Object

★ I (Sub) + gave (verb) + him (object) + a book (object)

★ Thank you for inviting me here = I thank you for inviting me here - Assertive sentence.

**Mail your queries to**
pratibhadesk@eenadu.net




**Q:** Sir, please explain briefly about tenses dividing into twelve parts by taking a word example. *- Srinivas Bijja*

**A:** There are three tenses - Present, past and future. Each tense again has four divisions - simple / indifinite, continuous, perfect and perfect continuous.

## Active & Passive Tense Forms (Tense For The Verb 'Take')

There are twelve active and only eight passive tense forms. No passive forms for all perfect continuous and future continuous tenses

| TENSES | SIMPLE / INDEFINITE | | CONTINUOUS / PROGRESSIVE | | PERFECT | | PERFECT CONTINUOUS | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ACTIVE | PASSIVE | ACTIVE | PASSIVE | ACTIVE | PASSIVE | ACTIVE | PASSIVE |
| PRESENT | I / we / you / they *take*<br>He / she / it *takes* | I *am taken*<br>he/ she/ it *is taken*<br>We/ you/ they *are taken* | I *am taking*<br>He/ she /it *is taking*<br>We/ you/ they *are taking* | I *am being taken*<br>He/ she/ it *is being taken*<br>We/you/they are being taken | I / we / you / they *have taken*<br>He/ she/ it *has taken* | I/we /you/ they *have been taken*<br>He / she / it *has been taken* | I/ we/ you/ they *have been taking*<br>He/ she/ it *has been taking* | No passive form |
| PAST | *Took* for all subjects | I/ he/ she/ it *was taken*<br>We/ you / they *were taken* | I/ he/ she/ it *was taking*<br>We/ you /they *were taking* | I/ he/ she/ it *was being taken*<br>We/ you/ they *were being taken* | I/ he/ she/ it *had taken*<br>We/ you/ they *were taken* | *Had been taken* for all subjects | *Had been taking* for all subjects | No passive form |
| FUTURE | ★ I/we *shall take*<br>★ You / he / she / it / they *will take* | I/we *shall be taken*<br>You /he/ she/it/ they *will be taken* | I/we *shall be taking*<br>You/ he/ she /it *will be taking* | No passive form | I/we *shall have taken*<br>You / he / she / it *will have taken* | I / we *shall have been taken*<br>You / he/ she/it *will have been taken* | I / we *shall have been taking*<br>You/ he/ she/ it *will have been taking* | No passive form |

★ **In the present day English even for the subjects I and We, *will* is more common than *shall* in the future tense.** *Shall* is almost not used even with I and we.

# పదోతరగతి

జీవశాస్త్రం

## శ్వాసక్రియ - శక్తి ఉత్పాదక వ్యవస్థ

### AS1 - విషయావగాహన

ప్ర: గాలి మిశ్రమాలపై ప్రయోగాలు చేసిన శాస్త్రవేత్తలు ఎవరు? *(1 మార్కు)*

జ: లావోయిజర్, ప్రీస్ట్లీ గాలి మిశ్రమాలపై ప్రయోగాలు చేశారు.

(ఈ పాఠంలో ప్రస్తావించిన ఇతర శాస్త్రవేత్తల గురించి కూడా చదివి, వారి ప్రయోగాల గురించి తెలుసుకోండి)

ప్ర: కిరణజన్యసంయోగక్రియ, శ్వాసక్రియల సమీకరణాలు రాయండి. *(1 మార్కు)*



కె. విజయ భాను

జ: సమీకరణాలు:

కిరణజన్యసంయోగక్రియ:



$$6\,CO_2 + 12\,H_2O \xrightarrow[\text{క్లోరోఫిల్}]{\text{కాంతి}} C_6H_{12}O_6 + 6\,O_2 + 6\,H_2O$$

శ్వాసక్రియ:



$$C_6H_{12}O_6 + 6\,O_2 \longrightarrow 6\,CO_2 + 6\,H_2O + 686\text{ K.cal}$$

★ పాఠంలో ఇచ్చిన అన్ని సమీకరణాలు, ప్రయోగాలపై పట్టు ఉండాలి.

★ ప్రతి పాఠం చివర ఇచ్చిన ముఖ్యాంశాలు తప్పనిసరిగా చదవండి. వీటి వల్ల ఒక మార్కు ప్రశ్నలకు సమాధానాలు రాయడం సులువవుతుంది.

(విషయావగాహనకు సంబంధించిన ప్రశ్నలు పాఠ్యాంశాల ఆధారంగా ఉంటాయి. పాఠ్యాంశాలను క్షుణ్నంగా అర్థం చేసుకుంటేనే ఈ ప్రశ్నలకు సమాధానాలు రాయగలం.)

### AS 2 - ప్రశ్నించడం, పరికల్పనలు చేయడం

ప్ర: మీరు ఒక సైన్సు సెంటరుకు వెళ్లినప్పుడు అక్కడి శాస్త్రవేత్తను వేర్లతో శ్వాసక్రియ గురించి తెలుసుకోవడానికి ఏ ప్రశ్నలు అడుగుతారు? *(2 మార్కులు)*

జ: నేను వేర్లలో శ్వాసక్రియ గురించి కింది ప్రశ్నలను అడుగుతాను.

1. మొక్కల వేర్లు గాలిని ఎలా తీసుకుంటాయి?
2. వేర్ల మూలకేశాలు గాలిని తీసుకోవడంలో ఎలాంటి సహాయం చేస్తాయి?
3. నీటి మొక్కల వేర్లలో గాలి ఉంటుందా?
4. బోలుగా ఉండే కాండం వల్ల లాభం ఏమిటి?
5. మడ అడవుల్లోని మొక్కలు / చెట్ల వేర్లలో గాలి గురించి నేను తెలుసుకోవచ్చా?

ప్ర: భోజనం చేస్తున్నప్పుడు మాట్లాడకూడదు అని పెద్దలు ఎందుకు సలహా ఇస్తారో నీ సందేహాన్ని తీర్చుకోవడానికి డాక్టరును ఏ ప్రశ్నలు అడుగుతావు? *(2 మార్కులు)*

జ: 1. ఏదైనా తినేటప్పుడు ఎందుకు మాట్లాడకూడదు?
2. తినేటప్పుడు మాట్లాడితే ఏమి జరుగుతుంది?
3. గాలి గొట్టంలోకి ఆహార పదార్థాలు చేరితే ఏమి జరుగుతుంది?
4. మన శరీరంలో ఆహారానికీ, గాలికీ వేరు వేరు గొట్టాలు ఎందుకు ఉన్నాయి?

ప్ర: విభాజకపటలం అంటే ఏమిటి? **AS1** *(1 మార్కు)*

జ: ఇది ఉరఃకుహరానికి కింద ఉండే కండరయుత నిర్మాణం. దీని కదలిక వల్ల ఉరఃకుహరంలో పీడనం మారి, బయటి గాలి లోపలికి, లోపలి గాలి బయటకు ప్రవేశిస్తుంది. పురుష శ్వాస కదలికలో విభాజకపటలం కీలక పాత్ర వహిస్తుంది.

# ప్రతిభ

# తినేటప్పుడు ఎందుకు మాట్లాడకూడదు?

(ఇలాంటి ప్రశ్నలకు జవాబుగా కనీసం 5 ప్రశ్నలు రాయండి. అడిగిన అంశాన్ని ముందుగా బాగా అర్థం చేసుకుని, ప్రశ్నలను ఆలోచించండి. తర్వాత మీ ప్రశ్నల్లో తార్కికత, కారణం ఉన్నాయో లేదో సరిచూసుకోండి. అప్పుడు ప్రశ్నలు రాయండి.)

### AS 3 - ప్రయోగాలు, క్షేత్ర పరిశీలనలు

ప్ర: చక్కెరను మండించే ప్రక్రియలో నీవు గమనించిన అంశాలు ఏమిటి? *(4 మార్కులు)*

★ మన శరీరంలో ఉష్ణం ఎప్పుడూ ఒకేలా ఉత్పత్తి అవుతుందా?

★ ఈ ప్రయోగంలో కార్బన్ డై ఆక్సైడ్, నీరు ఎలా ఏర్పడతాయి?

జ:




$CO_2$ - శక్తి విడుదలలో అదనపు ఉత్పన్నం

★ **లక్ష్యం:** చక్కెర మండినప్పుడు జరిగే మార్పులను గమనించటం.

★ **కావాల్సిన సామగ్రి:** చెక్క స్టాండు, టెస్ట్ ట్యూబులు (పరీక్ష నాళికలు), రబ్బర్ బిరడా, డెలివరీ ట్యూబు, గ్లూకోజు లేదా సుక్రోజు పొడరు, సున్నపు తేట.

★ **విధానం:** ఒక చిన్న పరీక్ష నాళిక తీసుకుని, అందులో కొంచెం గ్లూకోజు వేయండి.

★ పరికరాలన్నీ పైన చిత్రంలో చూపినట్లు అమర్చండి.

★ బున్సెన్ బర్నర్‌తో పరీక్ష నాళికను వేడి చేయండి.

★ గ్లూకోజు మండే వరకూ వేడి చేయండి.

★ **పరిశీలన:** పరీక్ష నాళికలోని గ్లూకోజు మండటం మొదలైనప్పుడు, కార్బన్ డై ఆక్సైడ్, నీరు విడుదల కావడం గమనిస్తాం.

★ ఉష్ణం రూపంలో శక్తి విడుదల అవుతుంది.

★ అత్యధిక ఉష్ణోగ్రత వద్ద గ్లూకోజును మండించడం వల్ల అది శక్తిని విడుదల చేస్తుంది.

★ ఒక్కసారి గ్లూకోజు మండటం మొదలుపెడితే ఆ ప్రక్రియను సులువుగా ఆపలేం.

★ మండుతున్న చక్కెరకు నీరు కలిపితే మండటం ఆగుతుంది.

★ ఈ ప్రక్రియలో విడుదలైన కార్బన్ డై ఆక్సైడ్, సున్నపు తేటను పాలలాగ మారుస్తుంది.

★ **నిర్ధారణ:** ప్రయోగశాలలో గ్లూకోజు మండినప్పుడు, కార్బన్ డై ఆక్సైడ్, నీరు, ఉష్ణం విడుదలవుతాయని ఈ ప్రయోగం ద్వారా తెలుస్తుంది.

★ ఈ ప్రయోగంలో విడుదలైన కార్బన్ డై ఆక్సైడ్, సున్నపుతేటను పాలలాగ మారుస్తుంది.

★ మన శరీరం విడుదల చేసే ఉష్ణం ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉండదు. మనం విశ్రాంతిగా ఉన్నప్పుడు సాధారణంగా ఉంటుంది. శ్రమ ఉన్న పనులు చేసినప్పుడు ఉష్ణ ఉత్పత్తి పెరుగుతుంది.

★ చక్కెర మండినప్పుడు, ఆక్సిజన్‌లోనూ, చక్కెరలోనూ ఉన్న పరమాణువుల్లో అణువులను బంధించి ఉంచిన బంధనాలు విడిపోయి, అణువులు కార్బన్ డై ఆక్సైడ్, నీరుగా ఏర్పడతాయి.

(ఈ పాఠంలో వేరే ప్రయోగాలు కూడా ఉన్నాయి. పాఠంలో 2, 5, 6 కృత్యాలు చూడండి. పైన చూపించిన విధంగానే జవాబులు తయారు చేయండి)

### AS 4 - సమాచార సేకరణ నైపుణ్యాలు, ప్రాజెక్టు పనులు

ప్ర: సముద్రమట్టానికి బాగా ఎత్తుగా వెళ్లేవారు తమ భుజాలకు ఆక్సిజన్ సిలిండరు ఎందుకు తగిలించుకుని వెళ్తారో మీకు తెలుసా? *(2 మార్కులు)*

★ మనకు సరిపడినంత ఆక్సిజన్ అందకపోతే నష్టం ఏమిటి?

జ: సముద్రమట్టానికి పదమూడు కిలోమీటర్ల పైన ఆక్సిజన్ తక్కువగా ఉంటుంది. ఇంత తక్కువ ఆక్సిజన్ మన శరీరానికి సరిపోదు. మనకు సరిపడినంత ఆక్సిజన్ అందనప్పుడు, అందిన కొంచెం ఆక్సిజన్ హీమోగ్లోబిన్‌ను సంతృప్తం చెయ్యలేదు. అప్పుడు రక్త సరఫరాలో తేడా వస్తుంది. ఊపిరి సరిపోనప్పుడు ఎక్కువగా, వేగంగా శ్వాస తీసుకోవడానికి ప్రయత్నిస్తాం. హృదయ స్పందన కూడా బాగా పెరుగుతుంది. ఒక్కోసారి రక్తకేశ నాళికల నుంచి ద్రవం విడుదలై, ఊపిరితిత్తుల్లోకి లేదా మెదడులోకి చేరవచ్చు. సరిపడినంత ఆక్సిజన్ అందక ఒక్కోసారి మనిషి ప్రాణం పోవచ్చు

★ **సూచన:** మీరు సేకరించిన సమాచారాన్ని ఒక పట్టికలో రాయండి. పట్టికను స్వయంగా తయారుచెయ్యడం నేర్చుకోండి. ప్రశ్నకు, సమాచారానికి అనుగుణమైన పదాలను పట్టికలో రాయండి. ప్రాజెక్టు పని చేసినప్పుడు మీకు కలిగిన అనుభవాలను కూడా రాయండి)

### AS 5 - బొమ్మలు గీయడం, నమూనాలు తయారుచేయడం

ప్ర: మానవ శ్వాసవ్యవస్థ పటం కింద ఇచ్చాము. పటానికి భాగాలు గుర్తించండి. అడిగిన ప్రశ్నకు సమాధానం రాయండి.

★ **సూచన:** ఇలా పటాలను ఇచ్చి భాగాలు గుర్తించమని మిమ్మల్ని అడగవచ్చు లేదా పటాలు గీయమని అడగవచ్చు. ఒక్కోసారి పటంతోపాటు కొన్ని అదనపు ప్రశ్నలు ఇచ్చి జవాబులు రాయమనొచ్చు. అలాంటప్పుడు మీ తార్కికశక్తిని ఉపయోగించి జవాబులు రాయండి.

ప్ర: ఊపిరితిత్తులలో వాయుగోణులు లేకపోతే ఏమి జరుగుతుంది?

జ: ఊపిరితిత్తులలో వాయుగోణులు లేనట్లయితే వాయు మార్పిడి జరగడంలో చాలా ఇబ్బంది ఉంటుంది.

★ **సూచన:** ఈ పాఠంలో ఇచ్చిన మైటోకాండ్రియా, డయాఫ్రాం పటాలను కూడా సాధన చేయండి. ఈ పటాలతోపాటు ఏ ప్రశ్నలు అడగవచ్చో ఊహించి, కొన్ని ప్రశ్నలు తయారుచేయండి.

ప్ర: శ్వాసకోశ వ్యాధుల గురించి సమాచారాన్ని సేకరించండి. (కాలుష్యం, పొగాకు మొదలైన వాటి వల్ల కలిగేవి) మీ స్నేహితులతో చర్చించండి. **AS 4** *(4 మార్కులు)*

జ: మనం చాలా మందిని శ్వాసకోశ వ్యాధులతో బాధలు పడటం చూస్తూ ఉంటాం. వాళ్లు శ్వాసించడంలో ఇబ్బందులు పడుతుంటారు. ఊపిరితిత్తులలో సమస్యలతో బాధపడుతూ ఉంటారు. మనకు చాలా కారణాల వల్ల శ్వాసకోశ వ్యాధులు వస్తుంటాయి. నేను నా స్నేహితులతో కలిసి మేము నివాసం ఉంటున్న ప్రాంతంలోని ప్రజల దగ్గరకు వెళ్లాను. వారికి కలిగిన శ్వాసకోశ వ్యాధుల గురించి వారిని సమాచారం అడిగి తెలుసుకున్నాము.

★ మేము 50 మందిని ప్రశ్నించి, వివిధ రకాల శ్వాసకోశ వ్యాధుల గురించి తెలుసుకున్నాం. ఊపిరితిత్తుల వ్యాధి స్పెషలిస్టు అయిన పల్మనాలజిస్టును కూడా కలిసి ఈ వ్యాధుల గురించి సమాచారాన్ని సేకరించాం. దీనికి సంబంధించిన వివరాలు కింది పట్టికలో ఉన్నాయి.

| వ్యాధి పేరు | కారణాలు | చికిత్స |
|---|---|---|
| ఆస్తమా | కాలుష్యం, అలర్జీ, పొగాకు, పర్యావరణ కారకాలు, ఊబకాయత్వం, ఒత్తిడి, అనువంశికత మొదలైనవి. | ఇన్హేలర్, మందులు, విటమిన్ డి ఇవ్వడం, జాగ్రత్తలు పాటించడం. |
| టి.బి. (క్షయ) | బ్యాక్టీరియా | మందులు |
| దగ్గు | అలర్జీ, వ్యాధి సంక్రమణ, సైనసైటిస్ | మందులు |
| న్యుమోనియా | బ్యాక్టీరియా వల్ల ఊపిరితిత్తులకు సోకిన ఇన్ఫెక్షన్ (వైరస్ వల్ల కూడా) | యాంటిబయాటిక్స్, యాంటీవైరల్ మందులు |
| ఊపిరితిత్తుల క్యాన్సర్ | కార్సినోజెన్లు, పొగాకు, అనువంశికత వల్ల అధిక కణజాలాభివృద్ధి | సర్జరీ, కీమోథెరపీ, రేడియేషన్ |
| బ్రాంకైటిస్ | జలుబు, పొగ, కాలుష్యం | ఫ్లూయిడ్స్, ఆస్పిరిన్, ఒక్కోసారి హ్యూమిడిఫయర్ |
| ఎంఫిసెమా | పొగాకు, పొగ, కాలుష్యం | బ్రాంకొడిలేటర్స్, స్టెరాయిడ్స్, యాంటీ బయాటిక్స్, పల్మనరీ రిహాబిలిటేషన్, సప్లిమెంటరీ ఆక్సిజన్, సర్జరీ. |

ప్ర: అవాయు శ్వాసక్రియకు, వాయుసహిత శ్వాసక్రియకు మధ్య భేదాలు రాయండి. AS-1 *(4 మార్కులు)*

| జ: అవాయు శ్వాసక్రియ | వాయుసహిత శ్వాసక్రియ |
|---|---|
| ★ $C_6H_{12}O_6 \longrightarrow 2\,C_2H_5OH + 2\,CO_2 + 56\text{ K.Cal}$ | ★ $C_6H_{12}O_6 + 6O_2 \longrightarrow 6\,CO_2 + 6\,H_2O + 686\text{ K.Cal}$ |
| ★ ఆక్సిజన్ అవసరం లేదు. | ★ ఆక్సిజన్ అవసరం. |
| ★ $CO_2$ ఏర్పడుతుంది. కానీ $H_2O$ ఏర్పడదు | ★ $CO_2$, $H_2O$ రెండూ ఏర్పడతాయి. |
| ★ అతి తక్కువ శక్తి ఉత్పన్నమవుతుంది. | ★ ఎక్కువ శక్తి ఉత్పన్నమవుతుంది. |
| ★ మైటోకాండ్రియాతో సంబంధం ఉండదు. | ★ మైటోకాండ్రియాతో సంబంధం ఉంటుంది. |
| ★ క్రెబ్స్ వలయం, ఎలక్ట్రాన్ రవాణా జరగదు. | ★ క్రెబ్స్ వలయం, ఎలక్ట్రాన్ రవాణా జరుగుతాయి. |
| ★ 2 ATP అణువులు ఏర్పడతాయి. | ★ 38 ATP అణువులు ఏర్పడతాయి. |

**సూచన:** భేదాలు రాసినపుడు, చదివినపుడు మీకు వచ్చే లాభం తెలుసుకదా? వేర్వేరుగా అడిగినా, మీరు రెండు అంశాలకు సంబంధించిన నిర్వచనాలు, రెండు ఎస్సేలు రాయగలరు. రెండు మార్కుల ప్రశ్నలకు కూడా జవాబులు రాయగలరు.







## Ravi, he and I..

*- Vishal,* ***Ongole.***

**Q:** Myself, Ravi and he went there - Is this correct?

**A:** Ravi, he and I went there.




**Q:** If they are going there, they will feel happy / If they were going there, they would feel happy - Are these two sentences correct?

**A:** a) If they go there they will feel happy, and
b) If they went there, they would feel happy - Correct.

**Q:** What are they doing to him - Is this correct? I have heard the above sentence in a movie - Please clarify.

**A:** Correct.

**Q:** The hero fights with the vilans/ fights the vilan - Please say the correct one.

**A:** ...... villains (not vilans) - both are correct.

## నెమలి నాట్యం .. ఇంగ్లిష్‌లో?

*- Usha Kiran,* ***Machilipatnam.***

**Q:** Once there was living a good king ruling Simhapuri. All the people of the town were satisfied with the ruling of the king. The king didn't have any proudness.

Whenever the people came to his court with problems, he used to listen to them patiently and solved their problems wisely. He didn't do injustice to anyone.

One day some people went to the king and brought the problem to his notice - Is this story correct? If there are any mistakes please correct them.

**A:** Almost correct - Except the following sentences-

★ Once there was living a good king - This should be: Once there was a king / a good king ....

★ All the people of the kingdom were happy with (satisfied with - not wrong, but happy with - better).

★ Whenever people came ... he used to listen to them patiently and attended to them. (NOT solve them).

★ One day some people went to the king and brought their problem to his notice.

*- T. Siva,* ***Nandikotkur.***

**Q:** నెమలి పురివిప్పి నాట్యం చేస్తుంది- ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా రాయాలో తెలపండి.

**A:** The peacock is dancing with its feathers / plumes spread out.

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

*- M. Nagarjun,* ***Pedavadlapudi.***

**Q:** i) I have finished my work. (నా పని పూర్తి చేశాను.)
ii) I am reading a book. (నేను ఒక పుస్తకం చదువుతున్నాను.)
ఈ వాక్యాలు ఏ tense లో ఉన్నాయో గుర్తించడం ఎలా?

**A:** I / we / you have / He / she / it has + PP($V_3$) is present perfect.
Am / is / are + ing - Present continuous.

## FUNCTIONAL ENGLISH

# 'Respected' అనవసరం..!

Formal (official / business) letters format (నమూనా) కిందటి వారం చూశాం. Formal letters అంటే తెలుసు కదా? రాసేటప్పుడు పాటించాల్సిన కొన్ని పద్ధతులుంటే అవి formal letters అవుతాయి. గతవారం మనం తెలుసుకున్న విషయాలు క్లుప్తంగా...

1) 'from' address, 'to' address కచ్చితంగా ఉండాలి ఈ తరహా ఉత్తరాలలో.
2) పై రెండు addresses కూడా ఉత్తరం రాసే కాగితంలో ఎడమవైపు మార్జిన్ నుంచి ప్రారంభిస్తాం.
3) from address కు కింద date ఉండాలి.
4) ఈ పద్ధతుల్లో అయితే ఏ address పంక్తి తర్వాత కూడా, comma ఉండకూడదు.
5) అన్నీ letters కూ ముగింపు Yours faithfully.



M. SURESAN

**Formal letters లో ముఖ్యంగా గమనించాల్సిన విషయం:**

మనం రాస్తున్నది ఒక company / office లో ఉన్న వ్యక్తిపేరునా, లేదా వారి హోదాపేరునా అనేది చాలా ముఖ్యం. మనం ఆ company / office కు చెందని వాళ్లమైతే దాదాపు అన్నిసార్లూ వారి హోదాపేరునే రాస్తాం కాబట్టి, మనం letter లో salutation, మగవాళ్లని తెలిస్తే, Dear Sir, అని, ఆడవాళ్లయితే Dear Madam అని, అది అంత కచ్చితంగా తెలియకపోతే, Dear Sir / Madam అని రాయాలి.

★ అలా కాకుండా ఒకరి పేరున ఉత్తరం రాస్తున్నప్పుడు (కొన్నిసార్లు, వ్యక్తి పేరు, కింద వారి హోదాను రాస్తుంటాం). Dear Sri / Dear Mr (మగవాళ్లయితే),



Dear Ms (పెళ్లయిన ఆడవాళ్లయితే) / Dear Miss (పెళ్లికానివాళ్లయితే) అని రాసి కింద line లో వారి హోదాను రాస్తాం. Ms అనేది ఎలాంటి మహిళకైనా (పెళ్లయినా / కాకపోయినా) రాయవచ్చు.

★ (ముఖ్యంగా రాయకూడనిది: Respected Sir / Madam - ఎందుకంటే Sir / Madam అంటేనే బోలెడంత respect చూపిస్తున్నట్టు. ఇంక మళ్లీ respected అనవసరం.

★ హోదా (Designation) తో సంబోధిస్తే Yours faithfully, subscription అవుతుంది. వ్యక్తి పేరు, తర్వాత హోదా రాస్తే, subscription, Yours sincerely అవుతుంది.

పక్కన ఇచ్చిన Model formal letter చూడండి:

★ Letter లో para ప్రారంభంలో margin నుంచి కొంత స్థలం వదిలాం. ఇలా వదలకుండా రాయటం కూడా ఒక పద్ధతి.

★ (Letter లోని పేర్లూ, address లూ కల్పితం. ఎవరికి చెందినవీ కావు).

### Sample Business Letter

M. Chandrasekhar
20/370 East Mada Street
Tirupati (PIN CODE)

Dec 3, 2014
The Chief Executive Director
Prayan Tours & Travels
14/7 Temple Street
BENGALURU

Sir

**Re / Sub:** Incomplete coverage of tour - request for refund of part of charges.

Our family of four members, one of them a boy under 12 years, started on a package tour which included a two day stay in Ooty.

However, we regret that we were allowed to be in Ooty only for one day. Even the hotel room was not comfortable.

I therefore request you to refund a part of the money equivalent to a day's family expenses in Ooty.

I look forward to your prompt response.

Yours faithfully
*Mcsekhar* (Signature)

# get తో ఎన్నో అర్థాలు...

*- Priyanka,* ***Warangal.***

**Q:** He is getting busy - Please translate into Telugu, and say why the underlined word is used here?

**A:** అతనికి తీరిక ఉండటం లేదు. Get అసలు అర్థం పొందటం. (అయితే get ను చాలా అర్థాలతో వాడతాం.)




**eg:** Get sick / ill / a fever, etc., get somebody on the phone / get angry / get to know (తెలియడం మొదలవడం), etc. ఇవన్నీ idiomatic uses of 'get'.

**Q:** Manikyam is not better than some other teachers.
★ Manikyam is not the best of all teachers.
★ Some other teachers are at least as good as Manikyam.
★ Manikyam is not better than any teacher / than any other teacher.
★ Manikyam is not better than most / many other teachers - Please say which one is correct?

**A:** మొత్తం correct.

*- M. Suresh Babu,* ***Nirmal.***

**Q:** In a lesson you have written the following. Bhavan asked Mohan which of the two was that weekend (IDS).
Can't we write the above as follows.. Bhavan asked Mohan which of the two that weekend was? And also in the above sentence you haven't put the question mark at the end of the sentence - Please clarify.

**A:** ....... Which of the two was that weekend = .... Which of the two that weekend was. As either of the above is not a question, we don't add a question mark in the end. In indirect speech there are no questions.

*- Mahesh,* ***Sabbavaram.***

**Q:** Please clarify the following doubts.
i) Practically - ప్రాక్టీలీ,
ii) Physically- ఫిజిక్లీ - Are these correct?

**A:** i) Practically - ప్రాక్టిక్లి - Correct
ii) Physically - ఫిజిక్లి

**Q:** We are to request you / We request you - Please say the difference.

**A:** We are to request you = We have to/ must request you.
We request you = We are making a request to you.

Mail your queries to
pratibhadesk@eenadu.net

*- Bharath Kumar,* ***Hyderabad.***

**Q:** Sir, how to say the following in English? "నేను ఫోన్ చేశాను అతడికి yesterday".

**A:** 1) I phoned / called / rang him up yesterday.




**Q:** Please give me suggestion in various conversation topics book or any websites.

★ Book of Conversations on various topics - Refer to the FUNCTIONAL ENGLISH part of the Eenadu Spoken English lessons.

*- Rajesh,* ***Narsampet.***

**Q:** Once you wrote that, "Is who dead", is correct, can we write/ say Is where he is/ he going? Is what he doing, Is when it completed? Are where they going? Are when they coming? - Please clarify.

**A:** 'Is who dead?' - This is conversationally correct. In the course of a conversation, when someone says, "so and so is dead," and when we want to be sure, who is dead, we say.

'Is who dead?' This is not strictly grammatical, but purely conversational. The correct form however is: "Who is dead?" All the other forms you have written are wrong.

**Q:** You are a grown up child - Is this right?

**A:** You are a grown up person (not child) - Correct.




ప్రతిభ

## ఏప్రిల్ 16



61వ జాతీయ చలనచిత్ర అవార్డుల్లో తెలుగు చిత్రం 'నా బంగారు తల్లి' మూడు పురస్కారాలను గెలుచుకుంది. తెలుగులో ఉత్తమ ప్రాంతీయ భాషా చిత్రంగా నిలవడమే కాకుండా ఉత్తమ నేపథ్య సంగీతం (శాంతను మొయిత్రా) అవార్డు దక్కించుకుంది. చిత్రంలో కీలకపాత్ర పోషించిన అంజలి పాటిల్‌కు స్పెషల్ జ్యూరీ అవార్డు లభించింది. ఈ చిత్ర దర్శకుడు - రాజేష్ టచ్‌రివర్.

## జనవరి 20

హైదరాబాద్‌లోని అసెంబ్లీ ఆవరణలో రాజ్యాంగ నిర్మాత, భారతరత్న బాబాసాహెబ్ అంబేడ్కర్ విగ్రహాన్ని గవర్నర్ నరసింహన్ ఆవిష్కరించారు. జాతిపిత మహాత్మా గాంధీ విగ్రహం పక్కనే ఈ విగ్రహాన్ని నెలకొల్పారు.

## ఫిబ్రవరి 19

రాష్ట్ర విభజనను నిరసిస్తూ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి రాజీనామా చేశారు. ఆయన తన సీఎం పదవితో పాటు కాంగ్రెస్ పార్టీకి, ఎమ్మెల్యే పదవికి కూడా గుడ్‌బై చెప్పారు.

## మే 25

రాష్ట్రానికి చెందిన మలావత్ పూర్ణ, సాధనపల్లి ఆనంద్ కుమార్ ప్రపంచంలోనే ఎత్తైన ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించి రికార్డు సృష్టించారు. పూర్ణ నిజామాబాద్ జిల్లాకు చెందిన విద్యార్థిని. ఆనంద్ ఖమ్మం జిల్లాకు చెందిన విద్యార్థి.

## జులై 24

బతుకమ్మను తెలంగాణ రాష్ట్ర పండుగగా ప్రకటించారు. తెలంగాణ సంస్కృతి, సంప్రదాయాల్లో ఈ పండుగకు ఉన్న ప్రాధాన్యాన్ని దృష్టిలో ఉంచుకుని ప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకుంది.

## ఆగస్టు 23

ఆంధ్ర రాష్ట్ర తొలి ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశం పంతులు జయంత్యుత్సవాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అధికార పండుగగా ప్రకటించింది. రాజమండ్రి విమానాశ్రయానికి, ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటు చేయనున్న ఎయిమ్స్ స్థాయి వైద్య సంస్థకు ఆయన పేరు పెట్టనున్నారు.

## అక్టోబరు 12

హుద్‌హుద్ తుపాను విలయం సృష్టించింది. కనీవినీ ఎరుగని రీతిలో వీచిన ఈదురుగాలులు, అంతకంటే తీవ్రమైన కుంభవృష్టి విశాఖపట్నం జిల్లాను అతలాకుతలం చేశాయి. హుద్‌హుద్ అనేది ఇజ్రాయెల్ దేశ జాతీయ పక్షి.

## డిసెంబరు 20

'జాతీయ వారసత్వ పట్టణ అభివృద్ధి, పునరుత్తేజిత యోజన - హృదయ్'కు దేశవ్యాప్తంగా ఎంపికైన 12 పట్టణాల్లో ఆంధ్రప్రదేశ్‌లోని అమరావతి, తెలంగాణలోని వరంగల్ చోటు దక్కించుకున్నాయి.



### జనవరి

**10.** హైదరాబాద్ ఈసీఐఎల్‌లోని టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసెర్చ్ (టీఐఎఫ్ఆర్) బెలూన్ ఫెసిలిటీ విభాగం చేపట్టిన పాలిథిన్ ప్రయోగం విజయవంతమైంది. 'హై ఆల్టిట్యూడ్ అసెంట్-3 ప్రాజెక్టు' పేరుతో జరిపిన ఈ ప్రయోగంలో బెలూన్ 2 గంటల 9 నిమిషాల్లో 51.661 కి.మీ. ఎత్తు పయనించింది.

**22.** రాష్ట్ర విభజన ప్రక్రియలో భాగంగా రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులను రెండు రాష్ట్రాలకు పంచేందుకు కేంద్ర హోంశాఖ సి.ఆర్. కమల్‌నాథన్ కమిటీని నియమించింది.

**26.** ఆంధ్రప్రదేశ్ మొత్తం అప్పులు రూ. లక్షా 94 వేల కోట్లుగా ఆర్‌బీఐ వెల్లడించింది. దీన్ని రాష్ట్ర జనాభా 8.46 కోట్లకు విభజిస్తే తలసరి అప్పు రూ. 22,938గా తేలింది.

**30.** ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ బిల్లును శాసనసభ, శాసనమండలి తిరస్కరించాయి.

### ఫిబ్రవరి

**17.** 2012-13 సంవత్సరానికి ఉత్తమ వారసత్వ నగరంగా (హెరిటేజ్ సిటీ) కేంద్ర ప్రభుత్వం తిరుపతిని ఎంపిక చేసింది.

**18.** 2012-13 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ 6 జాతీయ పర్యటక పురస్కారాలను గెలుచుకుంది. మధ్యప్రదేశ్‌తో కలిపి ఆంధ్రప్రదేశ్ అయిదో ఉత్తమ పర్యటక రాష్ట్రం పురస్కారాన్ని దక్కించుకుంది. ఉత్తమ వారసత్వ నగరంగా తిరుపతి, అత్యుత్తమ విమానాశ్రయంగా హైదరాబాద్‌లోని రాజీవ్‌గాంధీ అంతర్జాతీయ విమానాశ్రయం నిలిచాయి. వికలాంగులకు అనువుగా నడకదారి నిర్మించిన గోల్కొండ కోట ఉత్తమ కోటగా ఎంపికైంది. ఇంకా బెస్ట్ ఫిల్మ్ ప్రమోషన్, ఫ్రెండ్లీ స్టేట్ విభాగాల్లో రాష్ట్రానికి పురస్కారాలు దక్కాయి.

**27.** ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న మొత్తం 18,594 గిరిజన ఆవాసాల్లో కేవలం 9,859 ఆవాసాలకు మాత్రమే తాగునీరు అందుబాటులో ఉందని కేంద్ర ప్రభుత్వం వెల్లడించింది.

**28.** ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలనకు కేంద్ర మంత్రివర్గం ఆమోదముద్ర వేసింది.

### మార్చి

**1.** ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ బిల్లు-2014, ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన అనే రెండు ముఖ్య అంశాలకు రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ ఆమోదముద్ర వేశారు. ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన విధించడం ఇది రెండోసారి. జై ఆంధ్ర ఉద్యమ సమయంలో 1973 జనవరి 11 నుంచి డిసెంబరు 10 వరకు రాష్ట్రపతి పాలన విధించారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడక ముందు ఆంధ్ర రాష్ట్రంలో 1954 నవంబరు 15 నుంచి 1955 మార్చి 29 వరకు రాష్ట్రపతి పాలన విధించారు.

**7.** రాష్ట్ర విపత్తు స్పందనా దళం (ఎస్‌డిఆర్ఎఫ్) కార్యాలయాన్ని హైదరాబాద్‌లో ప్రారంభించారు.

**11.** వరంగల్‌లోని కాకతీయ విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న కాత్యాయని విద్మహేకు 2013 సంవత్సరానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారాన్ని ప్రదానం చేశారు. ఈమె రచించిన 'సాహిత్యాకాశంలో సగం' పుస్తకానికి ఈ అవార్డు లభించింది.

### ఏప్రిల్

**15.** సంఘ సంస్కర్త కందుకూరి వీరేశలింగం జయంతిని రాష్ట్ర ప్రభుత్వం తెలుగు నాటక రంగ దినోత్సవంగా అధికారికంగా ప్రకటించింది.

**16.** కాగితం తయారీలో వినియోగించే సరుగుడు మొక్కలను ఉత్పత్తి చేసే అతిపెద్ద కేంద్రాన్ని ఇంటర్నేషనల్ పేపర్ ఏపీపీఎం (ఆంధ్ర పేపర్స్) విశాఖ జిల్లాలో ఏర్పాటు చేసింది.

**24.** ప్రపంచ ప్రఖ్యాత రామోజీ ఫిల్మ్‌సిటీలో 'వింగ్స్' పేరిట పక్షుల ప్రపంచాన్ని ఏర్పాటు చేశారు.

**28.** ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీని రద్దు చేసి, రాష్ట్రపతి పాలన కొనసాగించాలన్న కేంద్ర మంత్రివర్గ నిర్ణయానికి రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ ఆమోదముద్ర వేశారు.

### మే

**10.** ఆంధ్రప్రదేశ్ పునర్విభజన నేపథ్యంలో తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు సంబంధించిన తలసరి ఆదాయ వివరాలను ప్రణాళికా శాఖ వెల్లడించింది. తెలంగాణ సరాసరి తలసరి ఆదాయం రూ. 73,930. ఆంధ్రప్రదేశ్ సరాసరి తలసరి ఆదాయం రూ. 66,754.

**13.** దక్షిణ మధ్య రైల్వే మొట్టమొదటి డబుల్ డెక్కర్ రైలు కాచిగూడ - గుంటూరు మధ్య ప్రారంభమైంది.

**28.** ఖమ్మం జిల్లాలోని పోలవరం ముంపు మండలాలను ఆంధ్రప్రదేశ్‌లో చేర్చడానికి కేంద్ర ప్రభుత్వం పంపిన ఆర్డినెన్స్‌ను రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ ఆమోదించారు.

**30.** తెలంగాణ ప్రభుత్వ కొత్త అధికార చిహ్నానికి గవర్నర్ నరసింహన్ ఆమోదం తెలిపారు. కాకతీయ తోరణం, దానిపై నాలుగు సింహాల జాతీయ చిహ్నం, మధ్యభాగంలో చార్మినార్, తెలుగు, ఉర్దూ, ఆంగ్ల భాషల్లో తెలంగాణ ప్రభుత్వం పేరును ఈ చిహ్నంలో పొందుపరిచారు. తెలంగాణ రాష్ట్ర గీతంగా జయజయహే తెలంగాణ, రాష్ట్ర పక్షిగా పాలపిట్ట ప్రతిపాదనలకు కూడా గవర్నర్ ఆమోదం తెలిపారు.

### జూన్

**2.** భారతదేశంలో 29వ రాష్ట్రంగా తెలంగాణ ఆవిర్భవించింది. తెలంగాణ ప్రజల చిరకాల కాంక్షను నిజం చేస్తూ 10 జిల్లాలతో తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా అవతరించింది. తొలి ముఖ్యమంత్రిగా కె. చంద్రశేఖరరావు బాధ్యతలు చేపట్టారు.

**3.** రాష్ట్ర విభజన నేపథ్యంలో జూన్ 1 అర్ధరాత్రి నాటికి ఉమ్మడి రాష్ట్ర ఖజానాలో ఉన్న రూ. 6,100 కోట్లను భారతీయ రిజర్వ్ బ్యాంక్ జనాభా ప్రాతిపదికన రెండు రాష్ట్రాలకు పంపిణీ చేసింది. దీని ప్రకారం ఆంధ్రప్రదేశ్‌కు 58.32 శాతం చొప్పున, తెలంగాణకు 41.68 శాతం చొప్పున నిధులు పంపిణీ అయ్యాయి.

**8.** నూతన రూపు సంతరించుకున్న ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రిగా తెలుగుదేశం అధినేత చంద్రబాబునాయుడు బాధ్యతలు చేపట్టారు.

**10.** తెలంగాణ తొలి సభాపతిగా సిరికొండ మధుసూదనాచారి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

**20.** నవ్యాంధ్రప్రదేశ్ తొలి స్పీకర్‌గా కోడెల శివప్రసాదరావు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

**27.** తూర్పు గోదావరి జిల్లా మామిడికుదురు మండలం నగరం గ్రామంలో గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్ (GAIL - గెయిల్) పైప్‌లైన్ విస్ఫోటం చెందిన ఘటనలో 20 మంది మరణించారు.

### జులై

**2.** తెలంగాణ శాసనమండలి తొలి ఛైర్మన్‌గా కె.స్వామిగౌడ్ ఎన్నికయ్యారు.

**11.** ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు రాష్ట్రానికి 'సన్‌రైజ్ స్టేట్' అనే బ్రాండ్‌నేమ్‌ను ఎంపిక చేశారు.

**23.** విశాఖపట్నం సమీపంలోని ఎర్రమట్టి దిబ్బలను కేంద్ర ప్రభుత్వం, 'భూ విజ్ఞాన వారసత్వ ప్రదేశం' (జియోలాజికల్ హెరిటేజ్ సైట్)గా గుర్తించింది.

**24.** మెదక్ జిల్లా వెల్దుర్తి మండలం మాసాయిపేటలో కాపలాలేని రైల్వే క్రాసింగ్ వద్ద స్కూలు బస్సును నాందేడ్ ప్యాసింజర్ రైలు ఢీ కొట్టింది. ఈ ప్రమాదంలో 16 మంది పాఠశాల విద్యార్థులు సహా 18 మంది దుర్మరణం చెందారు.

### ఆగస్టు

**7.** హైదరాబాద్ మెట్రో రైలును ప్రయోగాత్మకంగా పరీక్షించారు. నాగోల్ - మెట్టుగూడ మార్గంలో మెట్రోరైలు తొలిసారిగా పరుగులు తీసింది.

**17.** రాష్ట్ర గవర్నర్ నరసింహన్ సమక్షంలో హైదరాబాద్‌లోని రాజ్‌భవన్‌లో జరిగిన ఉన్నత స్థాయి అధికారిక సమావేశంలో ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాల ముఖ్యమంత్రులు చంద్రబాబునాయుడు, కె.చంద్రశేఖరరావు పాల్గొన్నారు. ఇరు రాష్ట్రాల మధ్య వివాదాస్పద అంశాల పరిష్కారానికి గవర్నర్ నరసింహన్ ఈ సమావేశాన్ని ఏర్పాటు చేశారు.

**19.** తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన సమగ్ర కుటుంబ సర్వే విజయవంతంగా జరిగింది. రాష్ట్రవ్యాప్తంగా సుమారు కోటి కుటుంబాలు సర్వేలో పాల్గొన్నాయి.

**20.** విభజన అనంతరం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర తొలి బడ్జెట్‌ను ఆర్థికమంత్రి యనమల రామకృష్ణుడు రూ. 1,11,824 కోట్ల మొత్తంతో శాసనసభలో ప్రవేశపెట్టారు.

### సెప్టెంబరు

**1.** ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖ, విజయవాడల్లో తలపెట్టిన మెట్రోరైలు ప్రాజెక్టు నిర్మాణ బాధ్యతలను రాష్ట్ర ప్రభుత్వం ఢిల్లీ మెట్రో రైల్ కార్పొరేషన్ (డీఎంఆర్‌సీ)కి అప్పగించింది. డీఎంఆర్‌సీ ముఖ్య సలహాదారు ఇ. శ్రీధరన్‌ను ఏపీ మెట్రో రైల్ ప్రాజెక్టు సలహాదారుగా నియమించింది.

**4.** ఆంధ్రప్రదేశ్‌కు కొత్త రాజధానిగా విజయవాడ పరిసర ప్రాంతాలను ఎంపిక చేసినట్లు సీఎం చంద్రబాబు శాసనసభలో ప్రకటించారు.

**9.** కాళోజీ శతజయంతి వేడుకలను తెలంగాణ ప్రభుత్వం ఘనంగా నిర్వహించింది. కాళోజీ జయంతిని ఏటా తెలంగాణ భాషా దినోత్సవంగా నిర్వహిస్తామని సీఎం కేసీఆర్ ప్రకటించారు.

**12.** హైదరాబాద్ మెట్రోరైలు మస్కట్‌గా 'నిజ్'ను ఎంపిక చేశారు. నగరానికి ఉన్న నాలుగు వందల ఏళ్ల ఘన చరిత్రను, సంస్కృతిని, వారసత్వాన్ని ప్రతిబింబించేలా, నాటి నిజాం ప్రభువుల రాజసం ఉట్టిపడేలా 'నిజ్'ను తీర్చిదిద్దారు.

**27.** హైదరాబాద్ దూరదర్శన్ కేంద్రం 'సప్తగిరి' రెండుగా విడిపోయింది. ప్రస్తుత 'సప్తగిరి' ఛానల్ అదే పేరుతో విజయవాడ కేంద్రంగా కార్యకలాపాలు ప్రారంభించింది. తెలంగాణ ప్రజల కోసం దూరదర్శన్ 'యాదగిరి' పేరిట సరికొత్త ఛానెల్ ప్రారంభమైంది.

### అక్టోబరు

**6.** ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రూపొందించిన ఏడు మిషన్లలో మొదటిదైన ప్రాథమిక రంగ మిషన్ (ప్రాథమిక రంగం విధాన పత్రం)ను అనంతపురం జిల్లా కళ్యాణదుర్గం నియోజకవర్గంలోని గరుడాపురంలో సీఎం చంద్రబాబునాయుడు, మాజీ రాష్ట్రపతి అబ్దుల్‌కలాం సంయుక్తంగా ప్రారంభించారు.

**8.** ఆదిలాబాద్ జిల్లా కెరమెరి మండలం జోడేఘాట్‌లో కొమురం భీమ్ 74వ వర్ధంతి సభను తెలంగాణ ప్రభుత్వం అధికారికంగా నిర్వహించింది.

**13.** మెదక్ జిల్లా సిద్దిపేట మార్కెట్‌యార్డులో రూ. 5కే భోజనం అందించే 'సద్దిమూట'; మాతా శిశు సంరక్షణ, ప్రాంతీయ ఆసుపత్రుల్లో రోగుల సహాయకులకు ఇచ్చే 'భోజనామృతం' కార్యక్రమాలను తెలంగాణ ప్రభుత్వం ప్రారంభించింది.

**20.** దక్కన్ గ్రామీణ బ్యాంక్ పేరును తెలంగాణ గ్రామీణ బ్యాంక్‌గా మారుస్తూ కేంద్ర ప్రభుత్వం నోటిఫికేషన్ జారీ చేసింది. ఏపీ గ్రామీణ వికాస్ బ్యాంక్ పరిధిలో ఉన్న అయిదు తెలంగాణ జిల్లాలను తెలంగాణ గ్రామీణ బ్యాంక్ పరిధిలోకి తెచ్చింది.

### నవంబరు

**5.** తెలంగాణ తొలి బడ్జెట్‌ను ఆర్థికమంత్రి ఈటెల రాజేందర్ రూ. 1,00,637.96 కోట్ల మొత్తంతో శాసనసభలో ప్రవేశపెట్టారు.

**7.** వ్యవసాయాభివృద్ధి కోసం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హరిత (హార్మోనైజ్డ్ ఇన్ఫర్మేషన్ ఆఫ్ అగ్రికల్చర్, రెవెన్యూ, ఇరిగేషన్ ఫర్ ఎ ట్రాన్స్‌ఫార్మేషన్ ఎజెండా) పేరుతో కొత్త పథకానికి రూపకల్పన చేసింది.

**17.** తెలంగాణ రాష్ట్ర జంతువుగా జింక, రాష్ట్ర వృక్షంగా జమ్మిచెట్టు, రాష్ట్ర పుష్పంగా తంగేడు పువ్వును సీఎం కేసీఆర్ ఖరారు చేశారు.

### డిసెంబరు

**5.** ఆంధ్రప్రదేశ్‌లో కాలువపై తొలి సౌర విద్యుత్ ప్రాజెక్టును పశ్చిమ గోదావరి జిల్లా గొల్లవానిపిప్ప సమీపంలో లోసరి కాలువపై ఏర్పాటు చేసేందుకు కేంద్రం ఆమోదం తెలిపింది.

**15.** తెలంగాణ ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షులుగా సింగిరెడ్డి నిరంజన్‌రెడ్డి నియమితులయ్యారు.

**17.** తెలంగాణ తొలి పబ్లిక్ సర్వీస్ కమిషన్ (టీఎస్‌పీఎస్సీ) ఛైర్మన్‌గా ఆచార్య ఘంటా చక్రపాణి నియమితులయ్యారు.

# FUNCTIONAL ENGLISH

## Full Block Form లో Letter ఎలా..?

**కిందటిసారి చూసిన letter format లో ప్రతి para కు indentation అంటే left side margin నుంచి కొద్దిగా స్థలం వదిలి paragraph ను ప్రారంభించాం. అలాకాకుండా paragraph ప్రారంభానికి కూడా ఏమాత్రం స్థలం వదలకుండా ఎడమ మార్జిన్ నుంచి రాసేస్తే అది full block form అంటారు.**

Suppose, we have to write to a business company about the damaged condition in which the goods have been received and asking the company to replace them.

★ మనం order చేసిన వస్తువుల్లో కొన్ని పాడైపోయిన స్థితిలో (damaged condition) మనకు చేరితే దాన్ని గురించి ఉత్తరం ఎలా రాయాలో చూద్దాం.

★ ఈ ఉత్తరాన్ని full block form లో చూద్దామా! మీరిప్పటికే గమనించి ఉంటారు - ఇక్కడ ఈ model లో from address పైన From కానీ, to address పైన 'To' కానీ ఉండవు.

★ మనం కంపెనీలో ఏదైనా హోదాలో ఉన్నవారికి కాకుండా (అంటే కిందటి వారం letter లోలా) company పేరనే ఉత్తరం రాస్తే అప్పుడు సంబోధన Dear Sirs / Gentlemen ఉంటుంది. ఎందుకంటే Company అనేది కొంతమంది బృందం. ఇప్పుడు ఈ letter చూద్దాం, full block form లో

M. Padmanabh ★
2-8-12, Konetimitta,
Mulapet,
Nellore - 524003.

Dec 12 2014

Ranjan Home Appliances
27 Karol Bagh
New Delhi - 110001

Sirs / Gentlemen (ఏదో ఒకటి)

**Re:** Damaged condition of goods received - replacement - request for

I regret that of the four articles I ordered, I have received two of them - 1) an idly cooker and 2) a chopper - in a damaged and unusable condition.

I am returning them to you with a request that you would so good as to replace them immediately.

Thank you. I look forward to your immediate response.

Yours faithfully
Padmanabh (Signature)
**Encl:** The two damaged articles.

★ పేర్లు, address లూ కల్పితం, ఎవరికీ చెందవు.

### ఇప్పుడు మీరు ఈ letter try చేయండి:

మీకు కావలసిన రెండు మూడు పుస్తకాలు మీ ఊళ్లో shops లో దొరకలేదు. మీకవి అవసరం. అందుకని ఆ పుస్తకాల ప్రచురణ కర్తలు (Publishers) కు రాయండి, ఆ పుస్తకాలు మీకు Courier ద్వారానో, VPP ద్వారానో (పుస్తకాలు వాళ్లు మీకు పంపితే, చేరినప్పుడు మీరు Postman కు చెల్లించే పద్ధతి) పంపమని, courier ద్వారా అయితే ముందే డబ్బు పంపాలి, DD ద్వారా/ MO ద్వారా, అది ప్రయత్నించండి - ప్రచురణకర్త. (Publishers): Vidyalok Publishers, No.5, Arobindo Marg, New Delhi.

★ వచ్చే వారం ఈ పేజీలో ఇచ్చే జవాబుతో సరి చూసుకోండి. Full block form లో రాయండి.

---

*- Usha Kiran Naidu, **Machilipatnam.***

**Q:** Is he and you wanted the property? / Does he and you wanted the property? / Was he and you were there? / Were you and she were there? / Were they and you were there? / Were we and he were there - Please clarify.

**A:** Did he and you want the property? ★ Were you and she there? ★ Were you and they there? ★ Were he and we there?






*- Kusbu Kohili, **Tekulpally.***

**Sir, please clarify the following doubts:**


M. SURESAN

**Q:** 'Moreover' అంటే not only that / not only అని అర్థమా?

**A:** Moreover = not only that / in addition to = అంతే కాకుండా.

★ He told me how to prepare for the exam. Moreover he clarified some doubts I had = పరీక్షకెలా సిద్ధమవాలో చెప్పటమే కాకుండా నా సందేహాలు కొన్ని తీర్చాడు.

**Q:** You are not supposed to tease her / You should not tease her. - ఇవి రెండూ ఒకే అర్థాన్ని ఇస్తాయా?

**A:** You are not supposed to tease her = you should not tease her.

★ Supposed to do = must do (according to rule / order, etc.)

**Q:** Can we say, "that is the difference between boys and girls".

**A:** Yes, we can.

**Q:** మీరు ఒక Lesson లో 'He did himself' - అనే sentence 'He himself did' కు సమానం అని అన్నారు. కానీ Wren and Martin book లో He did himself అంటే Reflexive Pronoun అని, 'He himself did' అంటే Emphatic Pronoun అని ఇచ్చారు. 'Reflexive Pronoun' కి 'Emphatic Pronoun' కి మధ్య తేడాను వివరించగలరు.

## 'Moreover' అంటే అర్థం..?



**A:** Please observe carefully.

**a.** He did it himself = అతనే (స్వయంగా) చేశాడు = He himself did it - పై రెండు sentences లో, himself, emphatic pronoun. Emphatic అంటే ఏదైనా నొక్కి చెప్పడం - ఇక్కడ He himself = అతనే (ఇంకెవరో కాదు).

**b. i)** He did it to himself = అది అతను అతనికే (అతని కోసమే) చేసుకున్నాడు. ఎవరు ఏ పని చేస్తారో దాని ఫలితం వారికే అయితే అది 'Reflexive' pronoun అవుతుంది.

**ii)** She looked at herself in the mirror - ఇక్కడ 'herself' reflexive కదా - ఆమె ఆమెనే చూసుకుంది అద్దంలో.




| Emphatic | Reflexive |
|---|---|
| 1. The officer himself helped me = ఆఫీసరే స్వయంగా నాకు సాయం చేశాడు. | ★ The officer helped himself and no one else = ఆఫీసర్ తనకు తాను సాయం చేసుకున్నాడు (ఇంకెవరికో కాదు). |
| 2. The father himself killed his son = తండ్రి తన కొడుకును చంపాడు. | ★ The father killed himself = తండ్రి తనను తానే చంపుకున్నాడు. |

★ సామాన్యంగా (ఎప్పుడూ కాకపోవచ్చు) subject పక్కన 'self' pronoun వస్తే అది emphatic sentence, చివర వస్తే అది reflexive pronoun.

**Q:** కింద ఇచ్చిన పదాలు Material Noun/ 'Uncountable Noun' లో దేనికి చెందినవో తెలుపగలరు.

a) Rice b) Water
c) Coal d) Iron
e) Cotton f) Copra

**A:** అవన్నీ material nouns. సామాన్యంగా material nouns are all uncountable.

'స్పోకెన్ ఇంగ్లీష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

## Ever - never.. difference?

*- Vijay Singhal, **Kothagudem.***

**Sir, please clarify the following doubts:**

**Q:** Neither / Either he nor / or I am / I are present - Please explain.

**A:** Neither he nor I am present = అతను కానీ నేను కానీ అక్కడ లేము.




★ Either he or I am present = అతను కానీ, నేను కానీ (ఇద్దర్లో ఒకరు) అక్కడ ఉన్నాం.

★ In the case of 'neither... nor' / 'either... or' the verb always agrees with the second subject.

★ Neither he nor I (second subject) am there.

★ Either he or I (second subject) am there.

★ Suppose you place 'I' first and he next (second subject). The verb then will be 'is'.

★ Neither I nor he (second subject) is present. But, when we join I / we with any other subject, I / we should always come last, so it is wrong to say,

Neither I nor he is present. It should always be,

★ Neither he nor I am present.

***Order to be followed in English:***

You and I / we
You, he / she/ they and I / we
You and he / she / they
He / she / they and I

**Q:** He makes / will make him do / does the work. - Please explain.

**A:** He makes him do the work - Correct = He (often / regularly) makes him do the work.

★ The teacher (he / she) makes the student do the work.

★ He will make him do (does - wrong. 'Do' here is a part of the infinitive, to do. 'Make' in this kind of use is not followed by 'to'.

**Q:** Can we say "There isn't any water in the glass"?

**A:** Yes, we can.

**Q:** Express your doubts clearly / Make express your doubts clearly - Please explain.

**A:** Express your doubts clearly - Correct. Make express ... Wrong.

**Q:** They shouldn't be here / They aren't supposed to be here - Please say the difference.

**A:** They shouldn't be here = They are not supposed to be here.

Mail your queries to
pratibhadesk@eenadu.net

*- B. Mallikarjuna, **Kurnool.***

**Q:** So and so - Meaning తెలపండి.

**A:** So and so = ఫలానా

★ Why don't you say so and so came to dinner? = ఫలానా వాళ్లు విందుకొచ్చారని ఎందుకు చెప్పవు?




**Q:** Ever - never మధ్య difference ఏమిటి?

**A:** Ever = ఎప్పటికైనా, never = ఎప్పుడూ లేదు

**Q:** కింది పదాల మధ్య తేడా ఏమిటి?

★ night - tonight ★ words - towards
★ wait - await - awaiting
★ live - alive

**A:** night = రాత్రి, tonight = ఈ రాత్రి
★ wait for = await
★ live = బతకటం, alive = బతికి ఉన్న

★ మీరు Spoken English మొదటి lessons లోని six verb forms చూడండి.

**Q:** Please let me know how the following words are pronunced / pronounced.

i) Iron ii) Relative iii) Material
iv) Model v) Early
vi) Concentration
vii) Parlour viii) Lose ix) Engineer
x) Economics xi) Engine

**A:** They were explained in the earlier lessons. see them.

# FUNCTIONAL ENGLISH

# Letter of enquiry..

**మనం రాస్తున్న business letter ఆ company లో ఒక హోదాలో (Designation లో) ఉన్నవారికి, వారి హోదా పేరున (వ్యక్తి పేరుతో కాకుండా) రాస్తే ఎలా ఉంటుందో ఈ వారం తెలుసుకుందాం.**


M. SURESAN

గుర్తుంది కదా, letter ను మనం Full block form లో గానీ, Semi block form లోగానీ Indented form లోగానీ రాయొచ్చు. Full block form కిందటి సారి చూశాం: ఉత్తరానికి పైభాగాన from address నుంచి చివర సంతకంతో సహా మొత్తం ఎడమవైపు నుంచి ప్రారంభిస్తాం. పేరా రాసేటప్పుడు స్థలం వదలం.

ఇప్పుడు Semi block form లో రాసే ఉత్తరం ఎలా ఉంటుందో చూద్దాం: Semi block form లో From address, To address రెండూ left margin నుంచి ప్రారంభిస్తాం. Date మాత్రం ఈ రెండిటి మధ్యలో కుడివైపు రాస్తాం.

Para లకు left margin నుంచి స్థలం వదలొచ్చు (5 spaces) లేదా అక్కర్లేదు. ఇప్పుడు అది ఎలా ఉంటుందో sample చూద్దాం:

★ ఇంకొక విషయం: Semi block letters లో కొంతమంది సంతకం letter మధ్య నుంచి కుడివైపుకు పెడతారు. మన పేరు కుడివైపు పైన రాయం.

మనం రాయాల్సిన విషయం:

★ ఒక furniture company మనకు కావాల్సిన furniture items ను supply చేస్తుందా? అలా అయితే వాటి ధర ఎంత? అవి పంపించేందుకు డబ్బు ముందే పంపించాలా? లేక delivery తర్వాత అంటే మనకు సామాన్లు చేరిన తర్వాత పంపాలా అనే ప్రశ్నలతో letter రాయాలి..

★ మన subscription (ముగింపు) ఏ letter అయినా కూడా, Yours faithfully బదులు faithfully yours, అలాగే yours sincerely బదులు sincerely yours అని కూడా రాయొచ్చు.

SEMI- BLOCK FORM

23-12-15, V Street
Prakash Nagar
Ongole 525812

Jan 2 2015

Comfort Furnitures Ltd
12- 14-15 Jubilee Hills
II Road
Hyderabad.

Sirs/ Gentlemen

Re: Supply of furniture - enquiry

We need the following items of furniture for the office we propose to start very soon. We wish to know if you supply those items and if you do, their prices too. Our requirement is as follows:

1. Computer tables with chairs - 10 sets
2. Officer tables with drawers - 4 and
3. Sofa sets for the Reception Lounge - 3

We shall appreciate your immediate response.

Yours faithfully
for Divya Enterprises
Pramod
Manager

**Encl:** A plan of our company.




Mail your queries to... pratibhadesk@eenadu.net



# I *didn't* go there...

***- Rukmini Dasari.***

**Q:** Sir, I won't, can't, didn't, don't and he/ she/ it doesn't - Please explain with examples.

**A:** I won't = I will not (refusing to do something in future) = నేనది చేయబోవటం లేదు.

★ I can't = I can not = I am not able = నేనది చేయలేను.

★ I didn't = I did not = నేనది చేయలేదు (గతంలో).

★ I don't = I do not = నేనది ఇప్పుడు/ మామూలుగా చేయను.

a) I won't = I will not:

★ I will not go to Bangalore = నేను బెంగళూరు వెళ్లను/ వెళ్లబోవటం లేదు. (I won't go).

b) I can't = I can not = చేయలేను (సామర్థ్యం).

★ I can't (I cannot) understand Hindi = నేను హిందీ అర్థం చేసుకోలేను.

★ I can't (I can not) sing = పాడలేను.

c) Didn't = (గతంలో) చేయలేదు.

★ He/ I didn't go there yesterday = అతను/ నేను నిన్న అక్కడికి వెళ్లలేదు.

d) Don't = do not = చేయను/ చేయం/ చేయరు.

★ We/ I/ You/ They don't (do not) smoke = మేము/ నేను/ నువ్వు/ మీరు/ వాళ్లు సిగరెట్ తాగరు/ Smoke చేయరు - అసలు.










# 'Instant' is outdated!

***- Varun.***

**Q:** Sir, I want to know the Telugu meaning of this sentence "Did you found it hard to wind down?"(it is a stress related question).

**A:** 'Wind down' - the original meaning of 'wind down' is for a mechanism/ machine to lose power gradually, slow down and finally stop.

By extension, in ordinary language, it means to slow down an activity and stop it completely.




**Eg:** The company wants to wind down its business in this area = The company wants to reduce its business in this area step by step and finally close it.

In psychology it means a person reducing gradually their activity which is causing them a lot of strain and finally stopping it.

Point No.2: Did you found it hard? is wrong. It must be, 'Did you find it hard?'

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

***- N. Kanaka Murthy.***

**Q:** Sir, please explain the meaning of the following sentences which are in passive voice in Telugu and the usage of such sentences may be explained briefly.

1. The shop is closed.
2. The shop was closed.
3. The shop has been closed.
4. The shop had been closed.

**A:** 1) The shop is closed = The shop is not open = దుకాణం మూసి ఉంది - ఈ వాక్యంలో shop తెరిచి లేదు అనే దానికి ప్రాధాన్యం.

2) The shop was closed = గతంలో shop మూయబడి ఉంది/ అప్పుడు shop మూయబడింది.

3) The shop has been closed = దుకాణం కట్టేశారు/ మూసేశారు (ఎప్పుడో time తెలియదు/ కొంతకాలంగా మూసి ఉంది.)

4) The shop had been closed - గతంలో ఏదో జరగకముందు, shop మూయబడి ఉంది/ మూసేశారు.

✪ I went there yesterday. The shop had been closed = నిన్న నేనక్కడికి వెళ్లాను. అప్పటికే దుకాణం మూయబడి ఉంది/ మూసేశారు (నేను వెళ్లేసరికే).

✪ Had been closed, అంతకు ముందు జరిగిన విషయం చెప్పకుండా, The shop had been closed - Wrong.

***- P. Satyanarayana.***

**Q:** Sir, what is the difference between the two types sentences while writing the address: To

The Superintendent of Police

To

Superintendent of Police - Which one is correct?

**A:** The Superintendent of Police - Correct. 'The' is necessary before all designations.

**Eg:** The District Collector, The Inspector General of Police, etc.

***- Bandi Venkateswarlu.***

**Q:** Sir, please clarify the difference between advice and advise.

**A:** 'Advice' is a noun, whereas 'advise' is a verb. Advice (సలహా) means opinion or suggestion that you give someone about something/ how to do something (సలహా). Advise is giving advice to somebody (సలహా ఇవ్వడం.)




✪ He often gives advice to others. (అతను తరచుగా ఇతరులకు సలహా ఇస్తుంటాడు) = He often advises others (ఇతరులకు సలహా చెబుతుంటాడు.)

***- Udaya Kumar, Tadipatri.***

**Q:** Sir, నువ్వు మీ డాడీకి ఎన్నవ కుమారుడవు? ఈ వాక్యాన్ని ఇంగ్లిష్‌లో ఎలా చెప్పాలి?

**A:** There is no correct equivalent for this question. 'Ennava' doesn't have an exact equivalent in English.

***- K. Kameswar rao.***

**Q:** He will be here on 29 instant. (for one day - singular)

He will be here on 29th and 30th instants (for two days - plural)- Please clarify whether 'instant' or 'instants' is correct.

**A:** 'Instant' means of this month, but it is not used in the present day English. It is outdated. We use now, 'of this month' instead of 'instant'. Instant has no plural.

***- Siripurapu Pavani.***

**Q:** Sir! You explained in recent lesson about self introduction. Please explain it with some brief examples. అలాగే ఇంటర్వ్యూకి వెళ్లినప్పుడు మనం కూర్చోవడానికి ఏమని అడగాలి? "Can I take my place" is this correct?

**A:** i) You can be even briefer, but when you introduce yourself, you have to give at least very important details about yourself like your name, your qualifications, the place you come from, your goal in life, and why you are applying for the job for which you have been asked to attend the interview - You can't be briefer than this.

You are asked to introduce yourself in an interview, more to test your communication ability (Your ability to speak English correctly, and clearly) than to get information about you. If they (the interviewers) feel your English is good, they may not even wait till you complete your answer and go on to the next question.

ii) May I sit down?/ May I be seated?

***- Swathi.***

**Q:** Sir, please give the meanings of below sentences:

1. Ramya could have attended the party.
2. Ramya may have attended the party.
3. Ramya must have attended the party.
4. Ramya would have attended the party.
5. Ramya should have attended the party.
6. Ramya should not have attended the party.

**A:** 1. a) రమ్య పార్టీకి హాజరవగలిగేదే కానీ హాజరవలేదు. OR

b) రమ్య పార్టీకి హాజరై ఉండవచ్చు/ గలదు. (Possibility -హాజరైందేమో).

2. రమ్య పార్టీకి హాజరై ఉండొచ్చు/ వెళ్లుండొచ్చు (Could = గల; may = సందేహం.)

3. రమ్య పార్టీకి హాజరయ్యే ఉంటుంది (సందేహం లేదు.)

4. రమ్య పార్టీకి హాజరయ్యేదే కానీ అవలేదు.

5. రమ్య పార్టీకి హాజరై ఉండేదే, కానీ అవలేదు.

6. రమ్య పార్టీకి హాజరై ఉండాల్సింది కాదు (కానీ హాజరైంది).




Mail your queries to...
pratibhadesk@eenadu.net

*- D. Appalaswamy, Bheemunipatnam.*

**Q:** Kindly clarify which one is the correct answer to the following question:

Q. What does the listener hear?

A: 1. The listener heard the sound of a rabbit. or

2. The listener hears the sound of a rabbit.

**A:** The listener hears the sound of a rabbit is correct, because the question is = What does the listener hear?

*- B. Mallikarjuna, Kurnool.*

**Q:** Children has been break the window. / Children has been breaken the window. / Children has been breaking the window. - Which one is correct?

★ Children have been break the window. / Children have been breaken the window. / Children have been breaking the window. - Which one is correct?

★ Children had been break the window. / Children had been breaken the window. / Children had been breaking the window. - Which one is correct?

పై వాక్యాలు ఏ టెన్స్‌లో ఉన్నాయి? అలా form చేయడం కరెక్టేనా? వాటి అర్థాలు తెలపండి.

**A:** మీరు మీ first question లో రాసిన groups of words ఏవీ sentences (వాక్యాలు) కావు. ఒకటి, వీటిల్లో మీరు underline చేసినవి ఏవీ verbs కావు.

ఈ కింది మూడూ తప్పు: అందులో మొదటిది ఆ group కు సరిపోని verb:

1) Children has been breaking the window - Children కు బదులు వాడే మాట 'they' (plural) కాబట్టి, Children have been breaking the window అంటాం = పిల్లలు కిటికీని కొంతసేపటి నుంచి బద్దలు కొడుతున్నారు.

మిగతా రెండింట్లో, Children have been breaking the window, పైన చెప్పిందే - correct - ఇది Present Perfect Continuous Tense.

★ Children had been breaking the window = గతంలో ఇంకేదో జరగకముందు కొద్దిసేపుగా పిల్లలు కిటికీ బద్దలు కొడుతున్నారు. - Past Perfect Continuous Tense. మిగతా groups of words ఏవీ సరికావు.

*- S. Mahesh.*

**Q:** Dear sir, please clarify the following doubts.

1) నేను వాళ్లతో పని చేస్తాను

2) నేను మా sister కు marriage చేశాను - How to say these sentences in English?




**A:** 1. I work with them.

2. I performed my sister's marriage - అయితే ఇది గ్రాంథికం/ పాండిత్యం. వ్యవహారికమైతే I got/ had my sister married అంటాం.

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

*- Sahadev, Hyderabad.*

**Q:** I wish I could continue it or I would continue - Is this correct?

**A:** I wish I could continue it - Correct.

**Q:** Recently I got appreciation from client. And reply back that "I am glad to be part to the team" - Is it correct?

**A:** I am glad to be part of the team/ I am glad to be a member of the team - Correct.




# She is *much taller*...

*- K. Srikrishna Kumar, Bapatla.*

**Q:** Also, Either, As well లను ఏయే సందర్భాల్లో వాడాలో వివరించగలరు.




**A:** Also = in addition to/ besides = కూడా = as well.

★ He gave me a pen and also a pencil = He gave me a pen and a pencil = He gave me a pen; He gave me a pencil as well.

★ అయితే 'also' కొంచెం formal. కాస్త పాండిత్యం. మామూలు సంభాషణా సందర్భాల్లో too ఎక్కువగా వాడతాం. Too = as well = also.

a) He gave me advice and some money too = He gave me advice and some money as well.

b) He wants to go there and she also wants to go there. ఇది పాండిత్యం. ఇదే మామూలు సంభాషణలో అయితే,

a) He wants to go there, and she wants to go as well.

or

b) He wants to go there and she wants to go too.

★ ఇంకా Conversational అయితే,

He wants to go there and so does she..

**Q:** Sir, much ఏ సందర్భంలో ఉపయోగించాలో వివరించగలరు.

**A: Much =** a large quantity - uncountables కి వాడతాం, ఎక్కువ మొత్తంలో అనే అర్థంతో. అయితే ముఖ్యమైన విషయం: much ను not తోనే వాడతాం, ఎక్కువ లేదు/ కాదు అనే అర్థంతో. ఎక్కువగా ఉంది అనాలనుకుంటే, (not లేకుండా), very/ quite/ a lot వాడతాం.

a) He is much tall (X)

He is very tall/ He is quite tall ( ✔ )

b) She has much wealth (X)

She has a lot of wealth. ( ✔ )

అయితే not తో much వాడతాం.

★ I am not much interested in Telugu movies.

Comparatives తో కూడా much వాడతాం.

★ She is much taller than her sister (taller - Comparative Degree)

కొన్ని proverbs (సామెత) ల్లో వాడతాం - not లేనప్పటికీ.

★ Much water has flown under the bridge since you were here = నువ్విక్కడున్నప్పటికీ ఇప్పటికీ చాలా మార్పు ఉంది.






# MLA ముందు an...?

*- Ajay, Nizampeta*

**Q:** Sir please clarify the following doubts.

★ This forest swarms with elephants - Can we write the above sentence in the Indirect speech as in the following manner?

That forest swarmed with elephants.

**A:** The forest swarms with elephants - దీనికి, reporting verb, అంటే, inverted commas బయట ఉండే verb, Past Tense అయితే అప్పుడు Indirect speech: The forest swarmed with elephants - Correct. (Reporting verb, said అయితే పైది correct.

★ He said (Past Tense), 'The forest swarms with elephants.' దీనికి Indirect speech, He said that the forest swarmed with... - Correct.

అలా కాకుండా He says, (Present Tense)/ He will say (Future Tense) అని ఉంటే అప్పుడు Indirect speech, He says/ will say that the forest swarms with elephants, correct.

**Q:** ఆ certificates చెల్లవు/ చట్టప్రకారం చెల్లవు - Please translate into English.

**A:** Those certificates are invalid.

**Q:** Neither/ Either he or I am/ I are here - Which one is correct? Please explain.

**A:** Neither/ Either he or I am here - Correct.

When we use, Neither.. nor/ either... or, the verb agrees with the second subject- here the second subject is I, so the verb must be 'am'. But remember always - When other subjects like you, he, she, and they and I are separated by, either... or, neither...nor, not only.. but also, I is placed last, and the verb agrees with I. It should be:

M. SURESAN

Neither/ either a) You or I/ We

either b) You, he/ she/ they or I/ We

either c) You or he/ she/ they.

★ This applies to 'and' too:

You and I; You, he/ she/ they and I, you and he/ she/ they, He/ she/ they and I.

**Q:** Can we say the following ones?

a) Neither he nor they are going.

b) Neither of the things shouldn't take - Neither/ Either -ఏవైనా రెండు వస్తువులు/ మనుషుల గురించి మాత్రమే వాడాలా?

c) He or I am going/ He or I are going.

d) You are not supposed to wear those clothes/ You shouldn't wear those clothes.

**A:** (b) Neither... nor, Either.. or ఎప్పుడూ two things/ persons, or two groups of things/ persons కు మాత్రమే వాడతాం.

c) పైన చెప్పాం కదా, or వస్తే రెండో subject ను బట్టి verb ఉంటుంది. పైన వివరణ చూడండి.

d) You are not supposed to = You should not.

*- Sneha, Kottoor.*

**Q:** Sir, please clarify the following doubts.

★ The paternal grandfather is not supposed to take the child/ The paternal grand father shouldn't take the child - Is there any difference between the above two mentioned sentences?

**A:** The paternal grandfather is not supposed to take the child = The paternal.... should not take...

**Q:** She is materially/ physically present- Is there any difference?

**A:** Both are same.

Q: I did see him getting his cycle repaired - Is this sentence correct?

**A:** Correct.

**Q: i)** She will have got/ had her clothes ironed.

ii) She will have been getting/ having her clothes ironed.

iii) She must have been able to have her clothes ironed. Please say whether the sentences from, the mentioned above sentence, i) to iii) are correct or not.

**A: i)** She will have got/ have had her clothes ironed = By a point of time in future, the ironing of her clothes will have been complete = భవిష్యత్‌లో మనం అనుకుంటున్న సమయానికి, ఆమె తన దుస్తులను ఇస్త్రీ చేయించుకుని ఉంటుంది. (అప్పటికి ఇస్త్రీ అయిపోయి ఉంటుంది.)

ii) She will have been getting/ having her clothes ironed = భవిష్యత్తులో ఒక సమయానికి ఆమె దుస్తులు ఇస్త్రీ చేయించుకుంటూ ఉంటుంది.

iii) Future లో అనుకున్న సమయానికి ఆమె కచ్చితంగా తన దుస్తులను ఇస్త్రీ చేయించుకుని ఉంటుంది.

**Q:** She herself washed the clothes/ She washed the clothes herself - Please translate into Telugu.

**A:** She herself washed the clothes = She washed the clothes herself = తన దుస్తులను తానే ఉతుక్కుంది.

*Anil, Vijayawada.*

**Q:** ఆడుకునే వయసు మీ బాబుది. అప్పుడే వాడిని బడిలో వేస్తే వాడు ఏం చదువుతాడు?

**A:** Your boy is still at a playing age. If put him to school now, what can he learn?

**Q:** నేనొచ్చి మూడు గంటలు/ మూడు రోజులు అయ్యింది - Please say in English.

**A:** It is three hours/ three days since I came.

*- Haritha Potluri.*

**Q:** Sir, can "an" be used before M.L.A. Also please give the usage of "an".

**A:** అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ - ఈ శబ్దాలు (అక్షరాలు)గా ఉచ్ఛరించే English మాటల ముందంతా an వాడతాం.

★ M.L.A. = ఎం.ఎల్.ఏ.లో ఎం, ఎ శబ్దంతో ప్రారంభమవుతుంది కాబట్టి, an MLA అనే అనాలి. అలాగే an M.P. అలాగే She is an M.Sc. in Maths.

*- J. Hitaishini.*

**Q:** Sir, is the sentence "writing for writing sake" is correct? If no, then what is the best alternative can be used instead? Please let me know.

**A:** 'Writing for writing sake' is WRONG.

Writing for writing's sake - CORRECT.




Mail your queries to...
pratibhadesk@eenadu.net


M. SURESAN

Letter Writing లో భాగంగా ఈ వారం మనం Official Correspondence (ప్రభుత్వ అధికారులకు/ కార్యాలయాలకు, మనకూ మధ్య జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలు) తీరు ఎలా ఉంటుందో చూద్దాం. ఇవి కూడా full block/ semi block/ indented form లో ఉండవచ్చు.

ప్రతిభ

*- N. Pentaiah, Dharmajigudem.*

**Q:** Sir please explain the following. Not only - తర్వాత, But also తర్వాత కూడా Past Tense Verb మాత్రమే వాడాలా? వివరించగలరు - ఇలాంటివి ఇంకేమైనా ఉన్నాయా? వ్యవహార, వ్యాకరణ విరుద్ధంగా ఉండే కొన్ని వాక్యాలను వివరించండి.

**A:** When 'not only... but also' is used in a sentence with only one verb, the verb comes immediately after the subject. అంటే మనం not only ... but also వాడే sentences లో ఒకే ఒక verb ఉంటే ఆ verb ను subject పక్కనే రాస్తాం.

★ He sang not only film songs but also Annamayya krithis. (ఆయన సినిమా పాటలే కాకుండా, అన్నమయ్య కృతులు కూడా పాడాడు).




★ గమనించాల్సిన విషయం - ఇక్కడ ఒకే verb ఉంది - Sang. కాబట్టి దాన్ని subject 'he' పక్కనే వాడాం. (He not only sang film songs but also Annamayya krithis - Wrong).

Not only... but also వచ్చిన sentence లో రెండు verbs ఉన్నట్లయితే, అప్పుడు మొదటి verb ను not only తర్వాత, రెండో verb ను but also తర్వాత వాడతాం.

★ She not only sang but also danced. ఇక్కడ రెండు verbs ఉండటం గమనించండి.

దీన్నే Inverted form అంటే subject నూ, not only, but also ను తిరగ రాసినప్పుడు, verb ను Helping verb, Main verb form లో రాస్తాం.

**eg:** a) Not only is he a great poet but also a singer. (Not only తో ప్రారంభించాం కదా, అందుకే, verb 'is' ను subject 'he' కి ముందే రాస్తాం, question కాకపోయినా).

b) Not only did he go there but also met the minister (అక్కడికి వెళ్లటమే కాకుండా, మంత్రిని కూడా కలుసుకున్నాడు) - ఇక్కడ కూడా not only తో sentence ప్రారంభించినందువల్ల not only did he go అన్నాం. అలా కాకుండా subject 'he' తో sentence ప్రారంభిస్తే అప్పుడు, He not only went there but also met the minister (Past Tense).

★ మరికొన్ని egs: a) He is not only a director but also an actor. (= Not only is he a director but also an actor).

b) She not only sings but also writes poetry = not only does she sing, but also writes.

*- B. Ramakrishna, South Mopur.*

**Q:** Sir, what is the difference between games and sports?

**A:** Games are played between two teams/ two individuals, each forming a team. Football, Hockey, Tennis, etc are all games as they are played between two teams.

★ Sports on the other hand are played by a number of teams/ individuals (more than two). **Eg:** Running races, Walking races, Javelin throw, etc.

*- Ajay Mamidi.*

**Q:** Sir, what is the difference between
i) He is at sleep. ii) He is in sleep.

**A:** He is at sleep - No such expression - ఇలాంటిది English లో లేదు - తప్పు కింద లెక్క.

★ He is asleep = నిద్రపోతున్నాడు

# Permission కోరుతూ ఉత్తరం..

గుర్తుంది కదా... full block form అంటే మన from address తో సహా, date, మనం రాస్తున్న వారి to address, వాళ్ల సంబోధన, రాస్తున్న విషయం (subject), ఉత్తరం మొత్తంలో ఉన్న పేరాలూ, ముగింపు అన్నీ కూడా ఎడమ మార్జిన్ నుంచి ప్రారంభించే పద్ధతి.

FUNCTIONAL ENGLISH



Semi block form లో from, to addresses, salutation (సంబోధన), sub/ Re: (Subject/ Regarding) అన్నీ left margin నుంచి ప్రారంభం అవుతాయి. అయితే date, ముగింపు (Subscription) పేజీ మధ్య నుంచి కుడివైపునకు రాసి, దానికింద సంతకం పెడతాం.

ఇకపోతే Indented format - ఇది మనం మామూలుగా రాసే పద్ధతి - ఇప్పుడిది మెల్లిమెల్లిగా పాతబడిపోతోంది. ఇందులో, రాసేవాళ్ల పేరు లేకుండా పూర్తి address మాత్రం పేజీ మధ్య నుంచి కుడివైపునకు రాస్తాం, ప్రతి line చివరా comma పెడతాం, from address లో చివరి line చివర తప్ప - దాని పక్కన comma గానీ full stop గానీ పెట్టం. దీనికింద వెంటనే తారీఖు వేస్తాం.

ఆ తర్వాత left margin నుంచి ప్రారంభిస్తూ, మనం రాస్తున్న అధికారి హోదా (సామాన్యంగా official letters రాసేటప్పుడు Officer హోదా పేరనే రాస్తాం, వ్యక్తి పేర రాయం), దానికింద వారి address, అందులో ప్రతి line చివర comma పెడతాం. చివరి line చివర comma/ full stop వాడం. ఆ తర్వాత సంబోధన, దానికింద పేరాలా స్థలం వదిలి, విషయం (subject) - సంక్షిప్తంగా దేన్ని గురించో రాసి, తర్వాత para నుంచి body of the letter and matter paragraph వారీగా రాస్తాం. తర్వాత కాస్త స్థలం వదలి, మళ్లీ page మధ్య నుంచి కుడివైపు చివరికి, మన subscription (ముగింపు - మామూలుగా అన్ని Official letters ముగింపూ - yours faithfully అవుతుంది) ఉంటుంది.

ఇప్పుడొక official letter చూద్దాం, ఉదాహరణకి.

జిల్లా police అధికారికి (superintendent of police కు), మనం జరుపబోతున్న బహిరంగ సభకు, దానికి mike, loud speaker వాడేందుకు permission కోసం ఉత్తరం రాద్దాం:

★ Re: Regarding. ఇది subject కు బదులు రాయొచ్చు. పేర్లు, address లూ కేవలం కల్పితం.

# 402, Kailas Flats,
29-13-14, Narayana Street,
Prakasam Nagar,
Ongole - 520 846

Jan 8, 2015

The Superintendent of Police,
Prakasam District,
Ongole

Sir,

★ **Re:** Holding of a Public meeting on 15th Jan 2015 on local PWD Grounds - Permission - request for

We, the members of the local college students' associations propose to holding a public meeting at 5 PM on Thursday, the 15th Jan, 2015 at the local PWD grounds.

Dr. Pandit, Professor of Political Science, Banaras Hindu University, will be the Chief speaker.

We request to grant us the permission to hold the meeting. We have paid the necessary fee for the permission.

We assure you that the meeting will be peaceful and will not cause any law and order problem or disturbance to the neighbourhood.

Yours faithfully,
Vinay,
Secretary
Federation of Local Students' Unions,
Ongole.

**Encl:** 1) Copy of the challan for fee
2) Invitation to the meeting



# Games.. Sports తేడా..?

'స్పోకెన్ ఇంగ్లిష్' పాత సంచికల కోసం చూడండి..
www.eenadupratibha.net

*- E. Rajendra Prasad.*

**Q:** Sir, please explain the usage of causative verbs in Active & Passive voice with examples.

**A:** Causative verbs are verbs which indicate actions which somebody does because others make them do it.




★ In English Let, make, have and get are Causative verbs. We can use them both in the active and the passive voices.

★ Their meanings: Let = allow somebody to do something. (ఎవరినైనా ఏదైనా చేయనివ్వటం).

★ Let him go = Allow him to go.

**2) Make** somebody do something = force somebody to do something (ఎవరితోనైనా ఏదైనా చేయించడం).

**3) Have** - Have somebody do something = to give somebody the responsibility of doing something. (ఒకరితో బాధ్యతగా చేయించడం).

**4) Get =** to convince somebody to do something (నచ్చజెప్పి చేయించడం).

Their use in Active and Passive voice →

## Causative Verbs

| Active Voice | Passive Voice |
|---|---|
| **1. Let =** Allow somebody to do something (ఒకరితో చేయించడం)<br>**Eg:** a) Let him do it (అతణ్ని దాన్ని చేయనీ)<br>b) Let him take it (అతణ్ని దాన్ని తీసుకోనీ) | **1.** a) Let it be done by him (అతని చేత అది చేయబడనీ - ఈ వాడుక తెలుగులో చాలా కృతకంగా ఉంటుంది).<br>b) Let it be taken by him (దాన్ని అతని చేత తీసుకోబడనీ). |
| **2.** Make somebody to do something = force somebody to do something (ఒకరితో ఏదైనా చేయించడం బలవంతంగా)<br>a) The teacher made the student do the assignment (టీచర్ విద్యార్థితో ఆ పని చేయించాడు).<br>b) She made him come here (అతనిక్కడికి వచ్చేట్టు ఆమె చేసింది.)<br>**Note:** 'Make' as a causative verb in the active voice is not followed by 'to'. | **2.** a) The student was made to do the assignment (by the teacher) (Teacher చేత విద్యార్థి assignment చేయించబడ్డట్టు చేశాడు - తెలుగులో ఇలా అనం).<br>b) He was made to come here (by her) (అతనిక్కడికి వచ్చేట్టు చేయబడ్డాడు.)<br>★ be + pp (of make) in the passive is followed by 'to'. |
| **3. Have =** Have somebody do something = give somebody a responsibility = బాధ్యత అప్పగించటం<br>**eg:** a) He had his brother clean the room (అతను తన తమ్ముడికి గది శుభ్రపరిచే బాధ్యత అప్పగించాడు/ శుభ్రం చేయించాడు). | **3.** Give somebody some responsibility.<br>★ He had the room cleaned by his brother (తన గది శుభ్రం చేసే బాధ్యత తమ్ముడికి అతనిచే అప్పగించబడింది). |
| **4.** Get somebody to do something = Persuade somebody to do something.<br>**Eg:** Somehow I got the Principal sign the certificate. (ఎలాగోలా ప్రిన్సిపల్‌ను సర్టిఫికెట్ పై సంతకం పెట్టించగలిగాను). | **4.** ఒక పని ఒకరిని చేయమని నచ్చజెప్పటం అయితే Have somebody do something = Get somebody do something (దాదాపు) కూడా అవుతుంది.<br>★ Somehow I got the certificate signed by the Principal, (ఎలాగో సర్టిఫికెట్ Principal చేత సంతకం చేయబడేట్లు చేశాను.) |

